


- శ్రీ పురిపండా అప్పలస్వామి

# వ్యావహారికాంధ్ర మహాభారతం

# పురిపండా అప్పలస్వామి

13.11.1904 - 18.11.1982



భారత, భాగవత, రామాయణాలు వాడుక భాషలో రాశారు. 'సత్యవాణి' పత్రిక నడిపారు. 'రాట్నపద్యం' తొలిరచన. ఇంగ్లీషు, హిందీ, ఒరియా, బెంగాలీ, సంస్కృతం నుండి అనువాదాలు చేశారు. మట్టిమనుషులు, ఒరియా సాహిత్య చరిత్ర, బెంగాలీ సాహిత్య చరిత్ర, విశ్వకళావీధి, మహమ్మద్ చరిత్ర వంటి రచనలు చేశారు.

te.wikipedia.org/wiki/పురిపండా_అప్పలస్వామి

ప్రాచీన గ్రంథావళి

సంపాదకుడు పురిపండా అప్పలస్వామి

# వ్యావహారికాంధ్ర

# మహాభారతం

ఆది, సభా పర్వాలు

సంపుటం 1


పురిపండా అప్పలస్వామి

కవితాసమితి అధ్యక్షుడు





ప్రాచీన గ్రంథావళి

రాజమహేంద్రవరము

# విషయసూచిక

## ఆదిపర్వం

### మొదటి ఆశ్వాసం 1-19



### రెండో ఆశ్వాసం 20-53



### మూడో ఆశ్వాసం 54-86



### నాలుగో ఆశ్వాసం 87-126



### ఐదో ఆశ్వాసం 127-165



### ఆరో ఆశ్వాసం 166-214



పురిపండా అప్పలస్వామి

# అంకితం

మామ్మ!

అమ్మా, అని నిన్ను నోరారపిలిచీ,
చివరిసారి నీ దర్శనం చేసీ,
వెళ్ళివస్తానని నోరారా చెప్పీ
ఇవాళకి
ఎనిమిదేళ్ళు దాటుతున్నాయి.
భారతం సంపూర్ణంగా నానోట వినకండానే
వెళ్ళిపోయావు.
తీర్చుకోలేని ఈలోపం నిరంతరం
వేధిస్తూనే వుంది నన్ను.
ఏం చెయ్యనూ!
నాకు తెలుసు
ఎక్కడవున్నా నన్ను వింటావు నువ్వు.
ఇదిగో
తెలుగు భారతం.
ఆశీర్వదించు.

*•*

# విన్నపం

పెద్ద ఉద్యానవంటివాడు వ్యాసముని. ఆ ఉద్యానంలో మహోదాత్తం కల్పవృక్షం. ఆ కల్పవృక్షం తెచ్చి, తిర్చి, దిద్ది తెలుగువారి పెరటి చెట్టుగా నాటారు మన నన్నయ్యా, ఎర్రాప్రెగ్గడా, తిక్కనలు. మూలంకంటే ముచ్చటగా చిగురువేసి, పూలుపూసి పళ్లుపండింది.

ఆంధ్రప్రజానీకం అంతటికీ అది అనువాదాలన్న ఆకాంక్షతో ఆరంభించిన వ్యాస హరికాంధ్ర మహాభారత విరాట ఉద్యోగాల సంపుటం వెలువడగానే దేశం నాలుగు మూలల నించీ ఆశకు మించిన ఆదర ప్రోత్సాహాలు లభించాయి. రాష్ట్రప్రభుత్వం, ఆకాశవాణీ, అవకాశాల్లో ఎన్నెన్నో సన్మానాలూ, సత్కారాలూ జరిగాయి. పిన్నలూ పెద్దలూ ప్రముఖులూ సదభిప్రాయాలు పంపారు. ఇంకా ఎందరో ఎన్నోవిధాల ఉత్సాహపరిచారు.

ఈ సన్మానాలూ, సత్కారాలూ వ్యక్తిపరంగా నావి కావని నాకు తెలుసు. ఇదంతా మహాభారతం మహాకావ్యానివి. ఆ భావంతోనే నతమస్తకుణ్ణవుతున్నాను. ఇతోధిక మైన ప్రోత్సాహానికి సవినయంగా దోయిలిస్తున్నాను.

మహాభారతం ఆమూలాగ్రంగా అవగాహన కావాలంటే అష్టాదశ పురాణాలూ, స్మృతులూ, శ్రుతులూ, వివిధశాస్త్రాలూ-ఇవన్నీ అవలోకించడం అవసరం. అందుకనే పాఠకుల సౌకర్యం కోసం వివరణాలు సంగ్రహంగా ఉదహరించాను. ఆవశ్యకత ననుసరించి అనేక చోట్ల సంస్కృతం మూలం సహాయం తీసుకున్నాను. చివర పేర్లసూచిక జతపరిచాను. పాఠకులకివి ఏమాత్రం ఉపకరించినా నా ప్రయత్నం సార్థకమవుతుంది.

ఈ సంపుటం ముద్రణలో ప్రూఫులు దగ్గరనుండి ఎంతో శ్రమించి తోడ్పడ్డారు సోదరులు శ్రీ చిరుమామిళ్ల సింహాచలముగారు. ఎన్నోప్రూఫులు చూశారు మిత్రులు శ్రీ సున్నం వీరరాజకవిగారు. ఎన్నో సలహాలిచ్చారు నేస్తం శ్రీ జయంతి సుబ్బారావుగారు. ఇది స్వంతపనే మా పి. బి. యస్. ముద్రణాలయానికి. ఈ సహృదయు లందరికీ నా వినయాంజలి.

విశాఖపట్టణం
జయ: శ్రావణం

పురిపండా అప్పలస్వామి

# ఆదిపర్వం

## మొదటి ఆశ్వాసము

### ప్రస్తావన

పుణ్యక్షేత్రమైన నైమిశారణ్యంలో పెద్దపెద్ద మునులంతా •వేశమయ్యారు. కులపతి* శౌనకముని లోకకల్యాణం కోసం ండేళ్ళ సత్రయాగం† చేస్తున్నాడు. సూతుడు♦ ఉగ్రశ్రవసుడూ -డికి వచ్చాడు. కథకచక్రవర్తి ఆయన. వ్యాసముని శిష్యు రోమహర్షణుడి కుమారుడు. పురాణాలు యావత్తూ ఆయన క చివర నాట్యమాడు తుంటాయి. అతణ్ణి చూడడంతోనే వన్నలందీ అతడిచుట్టూ మూగారు. అనేకవిధాల గౌరవించారు. మంచి పుణ్యకథలు ఏవన్నా వినిపించమన్నారు. మునులంద నమస్కరించాడు సూతుడు. "నాకురాని కథలంటూ లేవు. చెప్పండి, ఎలాంటి కథ కావాలి మీకు? మీరు ఏది మంటే అదే చెపుతాను" అన్నాడు.

"అపూర్వమైన కథ కావాలి మాకు" అన్నారు మునులు. ద్యంగా వుండాలి. అది వినడంవల్ల చక్కని జ్ఞానం కలగాలి. లు పోవాలి" అన్నారు.

---

* పదివేలమంది మునుల్ని పోషిస్తూ వేదం చదివించేవాడు కులపతి.

† అందరూ యజమానులుగానూ, అందరూ ఋత్విజులుగానూ వుండి జేస్తూం సత్రయాగం.

♦ పురాణాలూ అవీ కంఠస్థం చేసి యజ్ఞాలూ అవీ జరిగేటప్పుడూ, ర్వాదల్లోనూ చెప్పేవాడు సూతుడు. ఈ. వాయుపురాణం.

"బావుంది. మీకు నచ్చినకథ – మహాభారతం చెపుతాను. వినండి," అంటూ ఉపక్రమించాడు సూతుడు.

"ఆదికాలంలో వేదాలన్నీ వొక్కదగ్గిర కలగాపులగంగా వుండేవి. ఏది ఏదో చెప్పడానికి వీలుపడేదికాదు. అవన్నీ విడ మర్చినవాడు వ్యాసముని. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం – ఇలా నాలుగు వేదాలుగా విభాగించాడు. పైలుడూ వైశంపాయనుడూ సుమంతుడూ జైమినీ – ఈ నలుగురు శిష్యులికీ చెప్పి వరసగా ఆ నాలుగింటికీ సూత్రాలూ రాయించాడు. వేద వ్యాసు డయాడు. ఆ వేదవ్యాసుడు రాసిన పుణ్యకథ మహాభారతం.

"తన తపశ్శక్తివల్ల పద్ధెనిమిది పురాణాలూ*, ధర్మశాస్త్రాల అర్థాలూ, వేదాల వేదాంతాల తాత్పర్యాలూ, ధర్మార్థ కామ మోక్షాలికి సంబంధించిన కథలూ, ఇతిహాసాలూ, ప్రసిద్ధులైన మహామునులూ మహారాజులూ వంశచరిత్రలూ, వర్ణాశ్రమాల ధర్మ క్రమాలూ, శ్రీకృష్ణ మహాత్మ్యమూ, భారతవీరుల మహాగుణాలూ– ఇవన్నీ నిర్మలమూ, విజ్ఞానమయమూ ఐన తన వాగ్దర్పణంలో ప్రతి ఫలించేటట్టు మహాభారతం రాశాడు వ్యాసముని. అదేపనిగా కూచుంటే ఇది ముగించే సరికి మూడేళ్లు పట్టింది ఆయనకి.

"ధర్మతత్వం తెలిసినవాళ్లు ధర్మశాస్త్రమని పొగిడారు దీన్ని. వేదాంతవేత్తలు వేదాంత మన్నారు. నీతికోవిదులు నీతిశాస్త్ర మన్నారు. మహాకవులు మహాకావ్య మన్నారు. లాక్షణికులు లక్షణశాస్త్ర మన్నారు. చరిత్రకారులు ఇతిహాస మన్నారు. పౌరాణికులు పురాణాల సంపుటీకరణ మన్నారు.

---

* పద్ధెనిమిది పురాణాలు . బ్రహ్మపురాణం, పద్మపురాణం, విష్ణుపురాణం, శివపురాణం, శ్రీమద్భాగవతం, నారదపురాణం, మార్కండేయ పురాణం, అగ్నిపురాణం, భవిష్యపురాణం, బ్రహ్మవైవర్తపురాణం, లింగ పురాణం, వరాహపురాణం, స్కాందపురాణం, వామనపురాణం, కూర్మపురాణం, మత్స్యపురాణం, గరుడపురాణం, బ్రహ్మాండపురాణమూ. [illegible]

"విశ్వకర్త చేసిన భూప్రపంచంలో ఉపద్వీపాలూ, మహాద్వీపాలూ వున్నట్లు మహాభారతంలో ఉపపర్వాలూ, మహాపర్వాలూ వున్నాయి. అవీ చెపుతాను వినండి.

అ ను క్ర మ ణి క

"పౌష్యుడి చరిత్రా, పులోముడికథా, ఆస్తీకుడికథా, ఆది వంశం పుట్టుకా, పాండవులూ వాళ్లూ పుట్టడం, లక్క-ఇల్లుకాల్చడం, హిడింబి కథా, బకాసురవధా, అంగారపర్ణుడికథా, ద్రౌపది స్వయం వరం, ద్రౌపది పెళ్ళి, విదురుడిరాకా, అర్ధరాజ్యప్రాప్తీ, అర్జునుడి తీర్ధయాత్రా, సుభద్రపెళ్ళీ, అరణం తేవడం, ఖాండవవన దహనం, మయుడు కనిపించడం, సభానిర్మాణం, మంత్రాలోచనా, జరా సంధుడి వధా, దిగ్విజయం, రాజసూయం, అర్ఘ్యం అర్పించడం, శిశుపాలవధా, జూదం, మళ్ళీజూదం, అరణ్యప్రవేశం, కిమ్మీర వధా, ఇంద్రకీలపర్వతానికి వెళ్లడం, శివుడు కిరాతుడై రావడం, ధర్మరాజు తీర్ధయాత్రా, జటాసురుడి వధా, యక్షుడితో యుద్ధం, భీముణ్ణి అజగరంపట్టుకోవడం, మార్కండేయముని కథా, సత్యభామా ద్రౌపదుల సంవాదం, దుర్యోధనుడు గొల్లపల్లెలికి వెళ్లడం, ప్రాయో పవేశం, ముద్గలుడు కుంచెడు వడ్లతో అతిథిసత్కారం చెయ్యడం, ద్రౌపదిని ఎత్తుకుపోవడం, కర్ణుడికుండలాలు ఇంద్రుడు పట్టుకుపోవడం, అరణి కథా, పాండవులు విరాటరాజు కొలువు చేరడం, కీచక వధా, గో గ్రహణం, అభిమన్యుడి వివాహం, యుద్ధప్రయత్నం, సంజయ రాయబారం, ధృతరాష్ట్రుడి జాగరణం, సనత్సుజాతీయం, సంధిప్రస్తావనా, కృష్ణరాయబారం, యుద్ధయాత్రా, ఉలూకరాయ బారం, రథికుల్ని లెక్కించడం, కర్ణుడి సహాయనిరాకరణం, అంబకథా, జంబూద్వీపనిర్మాణం, భూపరిమాణం, భీష్ముడి అభిషేకం, భగవద్గీతా, భీష్మవధా, ద్రోణుడిఅభిషేకం, సంశప్తకులవధా, అభిమన్యుడి వధా, అర్జునుడి ప్రతిజ్ఞా, జయద్రథుడివధా, ఘటోత్కచుడి వధా, ద్రోణుడివధా, నారాయణాస్త్రప్రయోగం, కర్ణవధా, శల్యుడివధా

దుర్యోధనుడు మడుగులో దూరడం, గదాయుద్ధం, సరస్వతినదీ మొదలైన తీర్థాలప్రశంసా, నిద్రిస్తున్నవాళ్లని అశ్వత్థామ చంపడం, అశ్వత్థామ నహీకాస్త్రం ప్రయోగించడం, ధర్మరాజు తిలోదకాలివ్వడం, స్త్రీలవిలాపం, అపరకర్మలునిర్వర్తించడం, ధర్మరాజు రాజ్యాభిషేకం, చార్వాకవధా, గృహవిభాగం, శాంతిపర్వం, రాజధర్మాల వివరణా, ఆపద్ధర్మాల వివరణా, మోక్షధర్మాల వివరణా, భీష్ముడు ధర్మరాజుకోరిన ధర్మాలు వివరించడం, భీష్ముడి మరణం, అశ్వమేధం, అనుగీతా, ధృతరాష్ట్రుడూ మొదలైనవాళ్ళు ఆశ్రమవాసంచెయ్యడం, పాండవులు వెళ్ళి చూడడం, నారదుడిరాకా, యాదవకులంలో ముసలం పుట్టడం, మహాప్రస్థానం, స్వర్గారోహణం, హరివంశం, భవిష్యత్పర్వం - ఇవి వందా ఉపపర్వాలు.

"ఆదిపర్వం, సభాపర్వం, అరణ్యపర్వం, విరాటపర్వం, ఉద్యోగపర్వం, భీష్మపర్వం, ద్రోణపర్వం, కర్ణపర్వం, శల్యపర్వం, సౌప్తికపర్వం, స్త్రీపర్వం, శాంతిపర్వం, అనుశాసనికపర్వం, అశ్వమేధపర్వం, ఆశ్రమవాసపర్వం, మౌసలపర్వం, మహాప్రస్థానికపర్వం, స్వర్గారోహణపర్వం - ఈ పద్దెనిమిదీ మహాపర్వాలు.

"పెద్ద ఉద్యానవనం వంటివాడు వ్యాసముని. ఆ ఉద్యానంలో మహాభారతం కల్పవృక్షం. కథలు కొమ్మలు. వేదార్థాలు నీడపట్టులు. ధర్మార్థకామమోక్షాలు పువ్వులు. కృష్ణార్జునగుణకీర్తనం పళ్ళు. పండితులనికాదు, పామర్లనికాదు, పిల్లలనికాదు, వృద్ధులనికాదు, మానవమాత్రులు అందరికీ ఆశ్రయదాయకమైంది మహాభారతకల్పవృక్షం.

"తదేకదీక్షలో మూడేళ్లు కూచుని మహాభారతం ముగించాడు మహాముని. * దీనిప్రచారంకోసం నారదుణ్ణి దేవలోకం పంపాడు.

---

* వ్యాసుడు భారతం చెపుతూ వుంటే విఘ్నేశ్వరుడు రాస్తూవుండేవాడని వొక కథ వుంది. ఆగకుండా చెపుతూ వుండమని విఘ్నేశ్వరుడు కోరాడట! అర్థం చేసుకుంటూ రాయమని వ్యాసుడన్నాడట! కథ ఆలోచించుకోవలసివచ్చినప్పుడు, అర్థం కానిఘట్టాలు చెప్పేవాడట వ్యాసుడు. సులభంగా అర్థం కాని వాటిని వ్యాసఘట్టాలు అంటారు పండితులు.

దేవలుణ్ణి పితృలోకానికీ, శుకుణ్ణి గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస లోకాలికీ, సుమంతుణ్ణి నాగలోకానికీ పంపాడు. నరలోకంలో ప్రచారం చెయ్యడం కోసం వైశంపాయనుణ్ణి నియమించాడు. వైశంపాయనుడు జనమేజయుడికి చెపుతూవుంటే విని వచ్చాను నేను.

"కృతయుగం చివర దేవాసురయుద్ధంలా, త్రేతాయుగాంతంలో రామరావణయుద్ధంలా, ద్వాపరంతుదిని కురుపాండవయుద్ధం జరిగింది. అందులో భీష్ముడు పదిదినాలు పోరాడాడు. ద్రోణుడు ఐదుదినాలూ, కర్ణుడు రెండుదినాలూ, శల్యుడు ఒకపూటా, దుర్యోధను డొకపూటా యుద్ధం చేశారు. ఏడు అక్షౌహిణీల సేన పాండవులిది. కౌరవులిది పదకొండు అక్షౌహిణీలు ఈ పద్దెనిమిది అక్షౌహిణీల సేనా శమంతకపంచకంలో హోరాహోరి పోరాడింది. ఆ పద్దెనిమిది దినాలూ భూమండలం గజగజా వణికిపోయింది.

"మనస్సుపెట్టి మహాభారతం వొక్కటేవింటేచాలు. నాలుగు వేదాలూ, పద్దెనిమిది ధర్మశాస్త్రాలూ*, పద్దెనిమిది పురాణాలూ, మోక్షశాస్త్రాల రహస్యాలూ అన్నీ అవగతమౌతాయి" అన్నాడు.

"ఐతే మహాభారతమే వింటాం. వివరంగా చెప్పు," అన్నారు మునులు. "శమంతకపంచకమంటే ఏమిటి? అక్షౌహిణీ అంటే ఎంత?" అనీ అడిగారు.

"త్రేతా ద్వాపరయుగాల సంధినాటి మాట," అంటూ ఎత్తుకున్నాడు సూతుడు. క్షత్రియులమీద ఆగ్రహించాడు పరశురాముడు. ఇరవైవొక్కమార్లు దండయాత్రచేశాడు. క్షత్రియుడన్నవాణ్ణల్లా తన గండ్రగొడ్డలితో నరికిపారేశాడు. రాజులరక్తంతో ఐదు మడుగులుచేశాడు. ఆ రక్తంతోనే పితృతర్పణం చేశాడు.

* స్మృతులే ధర్మశాస్త్రాలు మనుస్మృతి, బృహస్పతిస్మృతి, దక్షస్మృతి, యమస్మృతి, విష్ణుస్మృతి, శంఖస్మృతి, గౌతమస్మృతి, అంగిరసస్మృతి, అత్రిస్మృతి, ఆపస్తంబస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, శాతాతపస్మృతి, పరాశరస్మృతి, ప్రాచేతసస్మృతి, సంవర్తస్మృతి, ఔశనస్మృతి, లిఖితస్మృతి, హారీతస్మృతి

పితృదేవతలు వచ్చి ప్రార్థించిన మీదట ఆయన కోపం శమించి రక్తంతో అలా ఆయన మడుగులు చేసిన ప్రదేశం శమంతక పం మైంది. అదే కురుక్షేత్రం.

"ఇక అక్షోణీ సంఖ్య. ఒక రథం, ఒక ఏనుగూ, మూడు గు లూ, ఐదుగురు భటులూ వున్న సైన్యం పత్తి అంటారు. అ టివి మూడు పత్తులు ఐతే వొక సేనాముఖ మవుతుంది. మూ సేనాముఖాలు వొక గుల్మం. మూడు గుల్మాలు వొక గ మూడు గణాలు వొక వాహిని. మూడు వాహినులు వొక పృత మూడు పృతనలు వొక చమువు. మూడు చమువులు వొక అనీకి పది అనీకినులైతే వొక అక్షౌహిణి. అంటే ఇరవై వొక్క వేల ఎనిమి వందల డబ్బయి రథాలూ, అన్ని ఏనుగులూ, అరవై ఐదు వేలా ఆ వందల పది గుర్రాలూ, లక్షా తొమ్మిది వేల మూడు వందల యా మంది భటులూ వున్న సైన్యం వొక అక్షోణీ అవుతుంది.

| సేనల పేర్లు | రథాలు | ఏనుగులు | గుర్రాలు | భటులు |
|---|---|---|---|---|
| పత్తి | 1 | 1 | 3 | 5 |
| సేనాముఖం | 3 | 3 | 9 | 15 |
| గుల్మం | 9 | 9 | 27 | 45 |
| గణం | 27 | 2 | 81 | 135 |
| వాహిని | 81 | 81 | 243 | 405 |
| పృతన | 243 | 243 | 729 | 1,215 |
| చమువు | 729 | 729 | 2,187 | 3,645 |
| అనీకిని | 2,187 | 2,187 | 6,561 | 10,935 |
| అక్షౌహిణి | 21,870 | 21,870 | 65,610 | 1,09,350 |
| పాండవసేన7అక్షో | 1,53,090 | 1,53,090 | 4,59,270 | 7,65,450 |
| కౌరవసేన 11 ,, | 2,40,570 | 2,40,570 | 7,21,710 | 12,02,850 |
| మొత్తం 18 ,, | 3,93,660 | 3,93,660 | 11,80,980 | 19,68,300 |

"ఇలాంటి పద్ధెనిమిది అక్షౌహిణీల సైన్యం పద్ధెనిమిది దినాలు ఘోరంగా పోరాడింది కురుక్షేత్రంలో.

"ఆ కురుక్షేత్రంలోనే కొన్నాళ్ళకిందట జనమేజయ చక్రవర్తి గొప్ప యజ్ఞమొకటి చేస్తున్నాడు. యజ్ఞశాలముందు కులాసాగా తిరుగుతూ వో కుక్కపిల్ల కనపడిం దొకనాడు. జనమేజయుడి తమ్ముళ్లు శ్రుతసేనుడూ భీమసేనుడూ ఉగ్రసేనుడూ కొట్టి తరిమారు దాన్ని. కుక్కపిల్లపేరు సారమేయుడు. దేవత ఐన ఆడకుక్క సరమ కుమారుడది. దెబ్బలు తిని అరుచుకుంటూ వెళ్ళి తల్లితో మొరపెట్టాడు సారమేయుడు మండిపడింది సరమ. జనమేజయుడి దగ్గిరికి వచ్చి అనవలసిన నాలుగు మాటలూ అని వెళ్ళింది. 'అక్రమంగా నా కుమారుణ్ణి కొట్టారు నీ తమ్ముళ్లు. ఇంతైనా వివేకం లేక పోయింది వాళ్ళకి ఏ అపరాధమూ చెయ్యలేదు నా చిట్టితండ్రి. పసికూన. మంచీచెడ్డా లేకుండా పేదవాళ్ళని, నోరూ వాయీ లేనివాళ్ళని బాధించే దుష్టులమీద మబ్బులేని పిడుగు పడు తుంది' అంది. నిశ్చేష్టుడైపోయాడు జనమేజయుడు.

"యజ్ఞం ముగిసింది. హస్తినాపురం వచ్చేశాడు చక్రవర్తి. ఐనా సరమ మాటలు మనస్సులో మెలుగుతూనే వున్నాయి. అందుకు అవసరమైన శాంతులూ అవీ జరిగించాలి. తగిన పురోహితుడి కోసం వెదకడం మొదలుపెట్టాడు. ఎన్నో మునిపల్లెలు వెదికి సోమశ్రవసుడనే తపస్విని తీసుకు వచ్చాడు. శ్రుతశ్రవసముని కుమారుడాయన. ఒక నాగకన్య శ్రుతశ్రవసుడి శుక్రంపానంచేయడం వల్ల ఆమెకి పుట్టినవాడు సోమశ్రవసుడు. మంచి తపస్సంపన్నుడూ, పుణ్యవంతుడున్నూ. అతడు కోరినవన్నీ ఇచ్చి అతణ్ణి పురోహి తుణ్ణి చేసుకున్నాడు జనమేజయుడు.

"పురోహితుడు చెప్పిన ప్రకారం నడుచుకుంటూ ఎన్నో శాంతులు చేశాడు చక్రవర్తి. ఎన్నెన్నో యజ్ఞాలు చేశాడు. హోమాలు చేసి దేవతల్ని తృప్తిపరిచాడు. దానాలుచేసి

బ్రాహ్మల్ని సంతోషపెట్టాడు. పూర్వమహారాజుల మల్లేనే ధర్మం తప్పకుండా నిత్యకల్యాణం పచ్చతోరణంగా రాజ్యమేలుతూ వుండేవాడు. దేశం సుభిక్షంగా వుండేది."

### ఉదంకుడి కథ

ఇలా వుండగా ఉదంకుడని వోకముని వుండేవాడు. పైల ముని శిష్యుడాయన. మహాతపశ్శాలి. గురుకులవాసం చేసి అపారమైన గురుశుశ్రూష చేశాడు. నిష్ఠాపరుడై విజ్ఞానవంతు డయాడు. గురువు దయవల్ల అష్టసిద్ధులూ* సంపాదించాడు. తల్లో నాలికలాగ మసులుకుంటూన్న శిష్యుడు కావడంచేత ఇల్లూ, ఇల్లాలూ అతని పరంచేసి వోసారి ప్రవాసం వెళ్లాడు పైలుడు. ఇంతలో ఋతుస్నానం చేసింది గురుపత్ని. ఉదంకుడి దగ్గిరికి వచ్చి తన్ను పరిగ్రహించమంది. సాహసించకుండా వూరుకున్నాడు ఉదంకుడు. కొన్నాళ్ళకి గురువువచ్చి శిష్యుణ్ణి మెచ్చుకున్నాడు. "నీ గురుకులవాసం పూర్తయింది. వెళ్లు, ఒక ఇంటివాడవై సుఖపడు" అన్నాడు. "గురుదక్షిణ సెలవియ్యండి" అన్నాడు శిష్యుడు. "వద్దు, నీశుశ్రూషే చాలు నాకు" అన్నాడు గురువు. "అంతగా ఇవ్వాలనే నీకు వుంటే, మా ఆవిణ్ణే అడుగు" అన్నాడు. "పౌష్యమహారాజు. రాణీ చెవుల్లో మంచి బంగారం కుండలాలజత వుంది. వాటిమీాద ఎన్నాళ్ళయో వుంది నాకు. చేతనయితే అవి తెచ్చిపెట్టు. నాలుగురోజుల్లో కావాలి" అంది గురుపత్ని.

'చిత్త' మని బయల్దేరాడు ఉదంకుడు. ఒక్కడూ అడవిలో పడి వెళుతున్నాడు. ఎదురుగుండా పెద్ద ఎద్దుమీాద వో దివ్యపురుషుడు తారసిల్లాడు. అతడు చెప్పినప్రకారం ఆ ఎద్దుపేడ తిన్నాడు ఉదంకుడు. దివ్యపురుషుడి అనుగ్రహం సంపాదించాడు. అక్కడ

---

* అష్టసిద్ధులు . అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం.

నుండి తిన్నగా పౌష్యమహారాజు దగ్గిరికివెళ్ళి దీవించాడు. సగౌరవంగా సత్కరించాడు పౌష్యుడు. "మహారాజా, నీ దగ్గిర యాచన కోసం వచ్చాను" అన్నాడు ఉదంకుడు. "నీ రాణీచెవుల్లోని కుండలాలు కావాలి నాకు. అవి గురుదక్షిణగా అర్పించు కుంటాను" అన్నాడు.

"కృతార్థుణ్ణయాను" అన్నాడు పౌష్యుడు. "మహాత్ముడివి నువ్వు. నీ అంతటి వాడికి ఇవ్వగలిగే భాగ్యం ఎలా దొరుకుతుంది మాకు! వెళ్ళు. నీకు అడ్డేముంది! నా మాటగా చెప్పి నా భార్య దగ్గిర కుండలాలు పుచ్చుకో" అన్నాడు. అంతఃపురానికి వెళ్ళాడు ఉదంకుడు. ఎక్కడా కనపల్లేదు రాణి. తిరిగి వచ్చేశాడు. "రాణివాసంలో ఆమె లేదు. ఎక్కడ వుందో మరి! నువ్వే తెప్పించి ఇయ్యి" అన్నాడు.

"అదేమిటి? లోగిలి లోనే వుందామె. ఐతే ఆమె మహాపతివ్రత. పవిత్రురాలు. అశుచులైన వాళ్ళకి కనపడదు. నువ్వా త్రిలోకపావనుడివి. అశుచి వని ఎలా అనేది నిన్ను!" అన్నాడు పౌష్యుడు. "ఓహూ, ఐతే కావచ్చు" అనుకున్నాడు ఉదంకుడు. పేడ తిని ఆచమించుకోలేదు నేను. ఆ అశుచిత్వం వల్లే ఆవిడ కనపళ్ళేదు" అని స్థిరపరుచుకున్నాడు. తూర్పుదిక్కుగా కూర్చుని కాళ్ళూ, చేతులూ, మొహం కడుక్కున్నాడు. ఆచమనం చేసుకుని అంతఃపురానికి వెళ్ళాడు. ఎదురువచ్చి నమస్కరించింది రాణి. కుండలాలు తీసి చేతిలో పెట్టింది. "తక్షకుడు వీటికోసం కనిపెట్టుకు కూచున్నాడు. అభేద్యుడు వాడు. మాయావి. ఏమాత్రం వీలుచిక్కినా ఎగరేసుకు పోతాడు. జాగ్రత్త" అని మరీమరీ చెప్పింది. "పరవా లేదు. అప్రమత్తుణ్ణయి వుంటాను" అన్నాడు ఉదంకుడు. రాజు దగ్గిరకు వచ్చి "వెళ్ళివస్తాను" అన్నాడు. "అదేమన్నమాట, అపూర్వంగా వచ్చిన అతిథివి నువ్వు. భోజనం చేసి వెళ్లు" అని ప్రార్థించాడు పౌష్యుడు. ఒప్పుకున్నాడు ఉదంకుడు.

భోజనసమయంలో ఉదంకుడికి వెంట్రుక కనపడింది. మండిపడ్డాడతను. "చూడకుండా అపవిత్రమైన అన్నం పెట్టావు. అంధుడవైపోతావు" అని శపించాడు. "ఈపాటి చిన్న తప్పుకి ఇంతపెద్ద శాపం పెట్టావు. సంతానం లేకుండా పోతుంది నీకు" అని ప్రతిశాపం పెట్టాడు పౌష్యుడు. "ఆహా, అలా వీల్లేదు. గొడ్డువాణ్ణి కాలేను. శాపం ఉపసంహరించు" అన్నాడు ఉదంకుడు. "అది సాధ్యం కాదు నాకు. నువ్వే ఉపసంహరించు" అన్నాడు పౌష్యుడు. "మనస్సు వెన్నలా వుంటుంది, మాట పిడుగులా వుంటుంది బ్రాహ్మలికి. రాజుల్లో సరిగ్గా ఇది విపరీతం. అంచేత శాపం మరల్చగలుగుతాడు బ్రాహ్మడు. శాంతుడయిన్నీ క్షత్రియుడు మరల్చలేడు. కనక అనుగ్రహించు" అని ప్రార్థించాడు. కనికరించాడు ఉదంకుడు. "కొద్ది దినాల్లో నీ దృష్టి నీకు వస్తుంది" అన్నాడు.

"ఎలా ఐతేనేం, గురుపత్ని కోరిన కుండలాలు సంపాదించాను. దక్షిణ చెల్లించి గురువుగారి ఋణం తీర్చుకుంటాను" అనుకుంటూ తిరుగుముఖం పట్టాడు ఉదంకుడు. దారిలో వో మంచినీళ్ళ మడుగు కనపడింది. ఆగాడు. కుండలాలు వొడ్డునే పెట్టాడు. ఆచమనం కోసం నీళ్ళలోకి వెళ్ళాడు.

ఇంతవరకూ దిసమొలతో తన వెనకాలే వస్తున్నాడొక వ్యక్తి. అదే సమయమని కుండలాలు చపాయించి పరిగెత్తాడు. చూశాడు ఉదంకుడు. వేగలాగ వెంటపడ్డాడు. పట్టుమని పదడుగులు పోలేదు దిగంబరుడు. పట్టుకున్నాడు ఉదంకుడు. పట్టుకోవడమే తడువు, పామైపోయాడు దిగంబరుడు. కుండలాలతోసహా వొక పుట్టలో దూరిపోయింది పాము. పాతాళానికి వెళ్ళిపోయింది. పామే తక్షకుడని గ్రహించాడు ఉదంకుడు. వెంబడించాడు. తానూ పుట్టలో ప్రవేశించాడు. నాగలోకం వెళ్ళాడు. తక్షకుడి పత్తా కనపడలేదు. నాగరాజుల్ని స్తోత్రంచేశాడు.

"కొండలూ, వనాలూ, నదులూ, నదాలూ, సరస్సులూ, సముద్రాలూ — ఇన్నింటితో సహా భూమండలం వెయ్యిపడగలతో మోస్తున్నావు. పాలసముద్రంలో విష్ణుమూర్తికి పరుపుగా వుంటున్నావు. ఓ అనంతుడా, ఆదిశేషుడా, అనుగ్రహించు" అన్నాడు.

"రాక్షసబాధ లేకుండా నాగలోకం రక్షరేకలా కాపాడావు. తపశ్శాలివి. దేవతలూ, రాక్షసులూ, పాదాభివందనం చేసే పరమశివుడికి కంఠాభరణంగా వున్నావు. సర్పరాజా, ఓ వాసుకీ, అనుగ్రహించు" అన్నాడు.

"దేవలోకంలోనూ, మానవలోకంలోనూ నిర్భయంగా సంచరిస్తారు మీరు. ప్రతాపవంతులు. మీ విషాగ్ని తట్టుకునే విరోధులు లేరు మీకు. మహానుభావులు. ఐరావతవంశస్థులైన కోటానుకోట్ల నాగరాజులారా, అనుగ్రహించండి" అన్నాడు.

"కులపర్వతాల లతామందిరాల్లో కుమారుడైన అశ్వసేనుడితో స్వేచ్ఛావిహారం చేస్తావు. ఘోరారణ్యాలలోనూ కురుక్షేత్రంలోనూ కులాసాగా సంచారంచేస్తావు. దర్పశాలివి. పరాక్రమవంతుడివి. శూరుడివి. తక్షకుడా, అనుగ్రహించు" అన్నాడు.

ఇలా స్తోత్రం చేస్తూవుంటే వో చిత్రమైన దృశ్యం కనపడింది అతడికి. ఇద్దరు స్త్రీలు తెలుపూ నలుపూ దారాలు పడుగూ పేకా చేసి బట్ట నేస్తున్నారు మరో ఆరుగురు కుమాళ్లు పన్నెండు రేకుల చక్రం తిప్పుతున్నారు. అదయాక, ఒక పెద్ద గుర్రం, గుర్రం మీద ధగధగా మెరిసిపోతూ వొక దివ్యపురుషుడూ కనిపించారు. దివ్యపురుషుణ్ణి మంచి అర్థవంతమైన మంత్రాలతో స్తోత్రంచేసాడు ఉదంకుడు. "సంతోషించాను" అన్నాడు దివ్యపురుషుడు. "నీ స్తోత్రంలో అతిశయోక్తీ, అసత్యమూ లేదు. కల్మషంలేని చరిత్ర నీది. చెప్పు. ఏం కావాలి ?" అన్నాడు.

"నాగలోకమంతా నా వశం కావాలి" అన్నాడు ఉదంకుడు. "అదే నీ అభీష్టమైతే, ఇదిగో చూడు, ఈ గుర్రం గుహ్యా

ప్రదేశంలో వున్నాడు" అన్నాడు దివ్యపురుషుడు. ఊదాడు ఉదంకుడు. ఊదడమే తడువు, గుర్రం నవరంధ్రాలనుండీ అగ్నిజ్వాలలు బైల్దేరాయి. ఘోరంగా వుంది అగ్ని. పాతాళలోకమంతా భయంకరంగా విజృంభించాయి మంటలు. సందుసందునా మూలమూలలా అంటుకుంటున్నాయి. కల్పాంతంలోని బడబాగ్నిలా వుంది. నాగలోకానికి అకాలప్రళయం వచ్చినట్లుంది. వాసులన్నీ ప్రాణభయంతో జజ్జరిల్లిపోతున్నాయి. తక్షకుడూ అదిలిపోయాడు. ఏమిటీ కొత్త ఉపద్రవం! ఉదంకుడి కోపాగ్ని కాదు కదా!" అంటూ నిలువునా వడికిపోయాడు. కుండలాలు పట్టుకు వచ్చి దండం పెట్టాడు.

కుండలాలేమో చేతికి వచ్చాయి. కాని, పాతాళంనుండి బైటపడడం ఎలాగ? నాలుగోనాటికి కావాలంది గురుపత్ని. ఇవాళే నాలుగో రోజు. ఇదే ఆమె కుండలాలు తొడగవలసిన దినం. ఏమిటి సాధనం? ఇవాళ తప్పితే ఇంత ప్రయత్నమూ బూడిదలో పోసిన పన్నీరౌతుంది. ముకుకుల్లో తలపెట్టుకు కూచున్నాడు ఉదంకుడు.

"ఎందుకలా అధైర్యపడతావు" అన్నాడు దివ్యపురుషుడు. "నీ విచారం నాకు తెలుసు. భయపడకు. లే. ఈ గుర్రం మీద కూచో. గాలికంటే, మనస్సుకంటే వేగం పోతుందిది. రెప్పపాట్లో చేరుకుంటావు" అన్నాడు. "బతికిపోయాను" అంటూ గుర్రంమీద కూచున్నాడు ఉదంకుడు. కన్ను మూసి కన్ను తెరిచాడో లేదో, గురువుగారి వాకిట్లో విడిచిపెట్టింది గుర్రం.

అప్పటికే శుచిస్నానం చేసింది గురుపత్ని. కొత్తచీర కట్టుకుంది. కుండలాలకోసం కనిపెట్టుకు కూచుంది. ఉదంకుణ్ణి చూసి వాకిట్లోకి పరిగెత్తింది. కుండలాలు చేతిలో పెట్టి నమస్కరించాడు ఉదంకుడు.

"ఏమోయ్, ఇదిగో అన్నంత దగ్గిరలో వుందికదా పౌష్యుడి పట్నం, ఇంత ఆలస్యం చేశావేం?" అన్నాడు గురువు.

"అవును, ఆలస్యమే అయింది. ఏం చెప్పేది!" అన్నాడు ఉదంకుడు. జరిగిందంతా వివరించి చెప్పాడు. "దార్లో దివ్య పురుషుడు కనపడడ మేమిటి? ఎద్దుపేడ తినిపించడ మేమిటి? నాగ లోకంలో అంత గుర్రమూ దివ్యపురుషుడూ ఏమిటి? స్త్రీ ఎవరు? తెలుపు నలుపు దారాల వస్త్రమేమిటి? ఆరుగురు కుమార్లూ, ఆ చక్రమూ ఏమిటి? ఇదంతా అగమ్యగోచరంగా వుంది నాకు" అన్నాడు.

"అదృష్టవంతుడివి" అన్నాడు గురువు. "ఎద్దుమీద కన పడ్డవాడు దేవేంద్రుడు. ఎద్దు ఐరావతం. పేడ అంటున్నావే, పేడ కాదది అమృతం. ఇంద్రదర్శనం చేశావు. అమృతం సేవిం చావు. అంచేతే అడ్డు లేకుండా సాధించుకు వచ్చావు పాతాళం లోని స్త్రీ లిద్దరూ ధాతా విధాతాను. తెలుపు నలుపు దారాలు పగలూ, రాత్రిన్నీ. వస్త్రం రోజు. చక్రం సంవత్సరం. రేకులు పన్నెండూ, పన్నెండు మాసాలు. కుమార్లు ఆరుగురూ ఆరు రుతు వులు. గుర్రం అగ్నిహోత్రుడు. గుర్రంమీది దివ్యపురుషుడు ఇంద్రుడి నేస్తం మేఘుడు. నీ గురుభక్తే ఇంతవాణ్ణి చేసిందినిన్ను. బ్రహ్మానందంగా వుంది నాకు. కోరిన కుండలాలు తెచ్చావు. గురువు రుణం తీర్చుకున్నావు. ఇక వెళ్లు. ఒక ఇంటివాడవై సుఖ పడు" అన్నాడు.

గురువుకి పాదాభివందనం చేసి సెలవు తీసుకున్నాడు ఉదం కుడు. వెళ్ళి ఎంతోకాలం తపస్సు చేశాడు. ఐనా, తక్షకుడు చేసిన మోసం గుండెల్లో రగులుతూనే వుంది. వాడు చేసినదానికి ప్రతి క్రియ చేస్తేనేగాని శాంతి కలగదు. ఆలోచించాడు. తిన్నగా జనమేజయుడి దగ్గిరికి వచ్చాడు. "మహారాజా, మీతండ్రి పరీ క్షిన్మహారాజు ధర్మప్రభువు. ప్రజలంటే కన్నబిడ్డలకంటె గారా బంగాచూసేవాడు. అలాంటి ప్రజారంజకుడైన మహారాజుని విషపు కోరలతో కరిచి చంపాడు దుర్మార్గుడు తక్షకుడు. అదిన్నీ వొక

బ్రాహ్మడి మాటమీద. వీడే లోగడ మాగురువుగారి భార్యకోసం కుండలాలు తెస్తుంటే ఎత్తుకుపోయాడు ముప్పతిప్పలూ పెట్టి ఏడి పించాడు అకారణంగా. అపకారం చెయ్యడమే వాడి స్వభావం. నీ తండ్రిని చంపిన వాడికి తగిన ప్రాయశ్చిత్తం చెయ్యాలి నువ్వు. దానికి వొక్కటే వుంది మందు. సర్పయాగం! ఈ పాపజాతి పాములు భూలోకంలోనుండి నాశన మైపోవాలి. తక్షకుడితో సహా హోమకుండంలో దగ్ధమైపోవాలి. కులంలో దుష్టు వొక్కడైతే ఏంగాక, కులమంతా నశించవలిసిందేమరి'' అన్నాడు.

ఉదంకుడి ప్రయత్నం ఊరికేపోలేదు. ఆ దెబ్బతో సర్ప జాతి నామరూపాలు నాశనం కావలసిందే. కాని, అదృష్టవశాత్తూ ఆ స్తీకుడు అడ్డుపడిపోయాడు. లోగడ రురుడూ ఇలాగే పాములు చంపడానికి బయల్దేరాడు: సహస్రపాదుడివల్ల సాగలేదది. రురుడి కథా ముందు చెపుతాను వినండి.

రురుడి కథ

రురుడు భృగువంశం వాడు. అసాధారణ ప్రజ్ఞావంతుడు భృగుడు. అతడి భార్య పులోమ. గర్భవతి ఐన ఆమెని వొకనాడు "అగ్నిహోత్రాలూ అవీ చూస్తూవుండు'' అని చెప్పి స్నానా నికి నదికి వెళ్ళాడు భృగుడు. ఇంతలో పులోముడు అనే రాక్ష సుడు వచ్చి ఆమెని చూశాడు. చూడడంతోనే కామోద్రేకం కలి గింది వాడికి "ఇంత అందంగా ఉంది, ఎవరీమె? నేనే పెళ్ళా డదా మనుకున్న పులోమ కాదుకదా!'' అని సంశయంలో పడ్డాడు. ఎవరిని అడగడం? అగ్నిహోత్రుణ్ణే ప్రశ్నించాడు.

ధర్మసంకటంలో పడిపోయాడు అగ్ని. నిజం చెప్తే ఎత్తుకు పోతా డీమెని. ఎందుకు చెప్పావని శపిస్తాడు భృగుడు. కాదం టూనా, అసత్యదోషం చుట్టుకుంటుంది. ఏంచారి! శాప మన్నా సయించుకుంటాను. అబద్ధమాడి పాపం తెచ్చుకోలేను'' అని తర్కించుకున్నాడు. "భృగుడి భార్య పులోమ'' అని చెప్పేశాడు.

"అనుకుంటూనే వున్నాను, ఈమె పులోమే అని. నా పెళ్లాం కావలసిం దిది. ఆలోచించకండా పెళ్లాడేశాడు భృగుడు" అన్నాడు పులోముడు. ఓ పందిరూపం ధరించి ఆమెని ఎత్తుకు పరిగెత్తాడు. గోలు గోలు మంది పులోమ. కంటికీ మంటికీ ఏక ధారగా ఏడ్చింది. దారికడాకూ ఆమెకన్నీళ్లు కారి పెద్దనదిగా ప్రవహించింది. అదే వధూసరనది. రాక్షసుడి దౌర్జన్యం పులోమ కడుపులోని శిశువుకి కోపం కలిగించింది. గర్భచ్యుతుడై పైకి వచ్చాడు శిశువు. గర్భచ్యుతుడు కావడంవల్ల చ్యవను డన్నారు అతణ్ణి. వెయ్యి సూర్యబింబా లంత ప్రకాశంతో ప్రకాశించాడు చ్యవనుడు. ప్రళయాగ్నిలా భగభగ మంటున్నాడు. చ్యవనుడు కింద పడడమూ పులోముడు భస్మం కావడమూ వొక్కసారి జరిగి పోయాయి. కొడుకుని ఎత్తుకుని ఇంటికి వచ్చేసింది పులోమ.

స్నానం ముగించి ఆశ్రమానికి వచ్చాడు భృగుడు. పక్క నుండి ప్రవహిస్తోంది వధూసర. చూచి తెల్లబోయాడు. ఇంట్లో అడుగు పెట్టేసరికి కొడుకుతో భార్య ఎదురయింది జరిగిం దంతా చెప్పింది. "ఐతే, నువ్వు ఫలానా అని ఎలా తెలిసింది వాడికి?" అన్నాడు పళ్ళు కొరుకుతూ భృగుమహర్షి. "నన్ను చూడ్డంతోనే వెర్రెత్తింది వాడికి. అగ్ని దగ్గిరికి వెళ్ళి ఏదో గుసగుస లాడాడు. అగ్నే చెప్పేశాడు మెల్లిగా. దాంతో పందిలా లోపల చొరపడ్డాడు వాడు" అంది పులోమ. అగ్నిమీద మండిపడ్డాడు ముని. "దురాత్ముడివి. సర్వభక్షకుడివికా" అని శపించాడు.

"ఏమిటీ అన్యాయం! అన్నాడు అగ్ని. నిజం చెపితే నిష్ఠూరమా! తెలిసినవిషయం అడిగితే చెప్పనివాడూ; నిజం దాచిన వాడూ నరకానికి పోతారు. అసత్యదోషానికి భయపడి నిజం చెప్పాను నేను. ప్రపంచ మంతటికీ కర్మసాక్షిని. అబద్ధమెలా ఆడేది? సత్యానికే శపించావు నన్ను. ఋషివి కనక చెల్లిపోయింది నీకు. లోకసేవకుణ్ణి నేను. నన్ను శపించి లోకానికే అపకారం

చేశావు. నిత్యములూ, నైమిత్తికములూ ఐన పూజ లన్నింటి లోనూ దేవతల హవ్యాలన్నా, పితృదేవతల కవ్యాలన్నా నాలోనే వేలుస్తారు. నా మూలంగానే వాళ్లు అవి అందుకుంటారు. నేను సర్వభక్షకు ణ్ణయితే అపవిత్రు ణ్ణవుతాను. నేనే అపవిత్రు ణ్ణయితే లోకంలో కర్మలన్నీ నిలిచిపోతాయి కర్మలు నిలిచిపోతే లోక యాత్ర ఆగిపోతుంది. అదే నీ యభిప్రాయమైతే అలాగే కానీ మరి" అన్నాడు. చప్పున తన నిజస్వరూపం ఉపసంహరించుకు కూచున్నాడు. లోకమంతా లోపించిపోయింది అగ్గి.

ఇంకేముంది? ప్రపంచంలో దీపాలన్నీ ఒక్కసారి ఆరి పోయిన ట్టయింది. అగ్గినిప్పు కరువైంది. యజ్ఞాలూ అవీ ఆగి పోయాయి. హోమకుండాల్లో పొగన్నాలేదు మరి. వంటలూ పెంటలూ — వొకటేమిటి, అగ్గితో అయ్యే అన్ని పనులికీ ఆటవిడు పయి పోయింది ప్రజలంతా బెంబేలుపడి మునిపల్లెలికి పరిగెత్తారు. మునుల పనీ అలాగే వుంది. మునులంతా కలిసి దేవతల దగ్గిరికి వెళ్లారు. దేవతల పనీ పరగడుపు గానే వుంది. వాళ్ళూ వీళ్ళూ కలిసి బ్రహ్మ దగ్గిరికి వెళ్ళారు. ఈ ఉపద్రవాని కంతా భృగు మహర్షి శాపమే కారణం అని తెలుసుకున్నాడు బ్రహ్మ. అగ్ని హోత్రుణ్ణి పిలిపించాడు. "ప్రపంచాలు నిలిచి పోతున్నాయి. ప్రసన్నుడివి కా" అన్నాడు. "ప్రాణి కోటి కంతటికీ ప్రాణం నువ్వు. చరాచరాల ప్రవృత్తికి కారణభూతుడివి. దేవతలకి నోరు వంటి వాడివి. ప్రపంచరక్షకుడివి నువ్వే పెడమొహంపెడితే ఇహ దిక్కే ముంది! సర్వభక్షకుడివి కమ్మన్నాడు భృగుమహర్షి నిన్ను. నిజమే. ఐనా, పవిత్రుడివే అవుతావు నువ్వు. మునివాక్యం వ్యర్థం కాదు. నీ శుచిత్వానికీ లోపంరాదు. శుచివంతులలో అగ్ర తాంబూలం నీది. యోగ్యులలో పరమయోగ్యుడివి నువ్వు. ప్రసన్నుడివి కా" అన్నాడు. ప్రార్థించాడు. యథాపూర్వంగా నిజస్వరూపంతో ప్రకాశించాడు అగ్ని. పోయిన ప్రాణ లేచివచ్చిన

ట్టయింది లోకానికి. అంత బ్రహ్మదేవుడున్నూ అగ్నిహోత్రుణ్ణి సముదాయించాడే కాని భృగుమహర్షి వాక్యం తిప్పలేకపోయాడు. అలాంటి భృగుమునికి మునిమనుమడు రురుడు.

భృగుడి కుమారుడు చ్యవనుడు కదా! చ్యవనుడికీ శర్యాతి రాజు కూతురు సుకన్యకీ పుట్టినవాడు ప్రమతి. ప్రమతికీ అప్సరస ఘృతాచికీ పుట్టినవాడు రురుడు. ప్రమద్వర అనే చిన్నదాన్ని ప్రేమించాడతడు. ప్రమద్వర తల్లి మేనక. తండ్రి గంధర్వరాజు విశ్వావసుడు. ప్రమద్వరని కని అడవిలో వొదిలిపెట్టి వెళ్ళిపోయింది మేనక. స్థూలకేశుడనే ముని తెచ్చి తన ఆశ్రమంలో పెంచాడామెని. తన ఈడు పిల్లలందరిలోనూ, చుక్కల్లో చంద్రుడిలా వుండేదామె. అంచేతే ప్రమద్వర అని పిలిచేవాళ్ళు. రురుడి ప్రేమ తెలుసుకుని ప్రమద్వరని తెచ్చి పెళ్ళిచేయాలని నిశ్చయించాడు ప్రమతి. స్థూలకేశుడూ అంగీకరించాడు ముహూర్తంసహా నిశ్చయమైపోయింది.

చెలికత్తెలతో వోనాడు ఆడుకుంటోంది ప్రమద్వర. పొరపాటున వో పాముమీద కాలు పడింది. కస్సుమని కాటువేసింది పాము. ప్రాణం విడిచిపెట్టింది ప్రమద్వర. 'అమ్మయ్యో' అని పారిపోయారు చెలికత్తెలు. మునిపల్లెలనిండా ఉత్తరక్షణంలో అల్లుకుందీ వార్త. కంట తడిపెట్టనివాళ్లు లేరు. గౌతముడూ కణ్వుడూ కుత్సుడూ కౌశికుడూ శంకపాలుడూ భరద్వాజుడూ వాలఖిల్యులూ ఉద్దాలకుడూ, శ్వేతకేతూ మైత్రేయుడూ — యీవన్మంది మహామునులూ వచ్చి విచారించారు. ప్రమతీ రురుడూ కూడా వచ్చారు. చచ్చిపోయినా నిద్రిస్తున్నట్టే వుంది ప్రమద్వర. అప్పుడే తుంచి పడవేసిన పువ్వులా వుంది.

అక్కడ నిలవలేకపోయాడు రురుడు. హృదయం చెక్కలైపోతూ వుంది. అడివిలోకి వెళ్ళిపోయాడు. "ప్రమద్వరా, నా ప్రమద్వరా" అంటూ కేకలు వేసి ఏడుస్తున్నాడు. అతడి దుఃఖం

చూసి రాళ్లుకూడా చెమ్మగిల్లుతున్నాయి. "అయ్యో, నా ప్రియురాలు, నా ప్రాణం, నా ప్రమద్వరని బతికించే మహాత్ములు లేరా? మంత్రవేత్తలు, మహావైద్యులు ప్రమద్వరని బతికించండి. నా తపస్సంతా ధారపోస్తాను. నా పుణ్యమంతా ఇచ్చుకుంటాను" అంటూ వెర్రివాడిలా ఆక్రోశించాడు "మరణించకూడదు నా ప్రమద్వర. బతికిపోవాలి నా ప్రమద్వర. నేనే తపోనిధినైతే లేచి వస్తుంది ప్రమదర్వ. నేనే గురువుల్ని సేవించి వుంటే నా ప్రాణం, నా ప్రమద్వర నాకు దక్కుతుంది" అంటూ ప్రతీదేవతనీ ప్రార్థించాడు. ఆ స్థితిలో ఆకాశంమీద వొక దేవదూత కనిపించా డతడికి. "తెచ్చుకున్న ఆయుర్దాయ మెంతో అంతకాలం బతికింది ప్రమద్వర. కాలం తీరాక కర్తవ్య మే ముందిక! ఐతే, వొక్క ఉపాయం లేకపోలేదు. అది నీ చేతిలోనే వుంది. చెయ్యగలిగితే బతుకుతుందామె. నీ ఆయుర్దాయంలో సగం ఆమెకి ధారపోయాలి. అంతే" అని అంతర్థాన మయాడు దేవదూత.

సంతోషంతో సమ్మతించాడు రురుడు. తన ఆయుస్సులో సగం ధారపోసి బతికించుకున్నాడు ప్రమద్వరని. ముందటికంటె కలకలలాడుతూ లేచి కూర్చుందామె. అనుకున్న ప్రకారం పెళ్ళి చేసుకున్నాడు రురుడు. ఐతే, పాములమీద మాత్రం పట్టరాని పగ పట్టాడు. "పువ్వులాంటి పిల్లని కరిచిన పాపజాతి పాముల్ని వంశనాశనం చేస్తాను" అని పంతం పట్టాడు. యమదండంలాంటి దుడ్డుకర్ర పుచ్చుకుని కనపడ్డ పాముసల్లా బాదడం మొదలుపెట్టాడు. పుట్టపుట్టా, పొదపొదా వెదికి వెదికి మరీ చంపుతూ వచ్చాడు.

ఒక పొదలో రెండుతలల పెద్ద డుండుభసర్పం కనిపించిందొకనాడు. దుడ్డుకర్ర మీదికెత్తాడు రురుడు. క్షణంలో తునకలౌతుంది పాము. మనిషిలా "హరిహరీ" అని అరిచింది డుండుభం. ఆగాడు రురుడు. "ఏం మహాశయా, మునీశ్వరుడిలా వున్నావు. పాముల మీద ఎందుకీ పగ? ఏం చేశామని!" అంది పాము.

"ఏం చేశామంటావా!" అని వురిమాడు రురుడు. "నా ప్రమద్వరని కరిచి నా కొంపకి ఎసరు పెట్టారు. ఇంకేం చెయ్యాలి? ప్రపంచంలో ఈ పాపజాతి బతకకూడదు. సర్పనాశనం చెయ్యడానికే కంకణం కట్టుకున్నాను నేను. ఇదిగో, ఈ దెబ్బతో నీ నోరూ కట్టుబడుతుంది" అంటూ కొట్టబోయాడు. దెబ్బ పడే లోపున మునిగా మారి ఎదట నుంచుంది పాము. చకితుడయాడు రురుడు. "ఎవ్వరునువ్వు? పామై ఎందుకున్నావు?" అని అడిగాడు.

"సహస్రపాదు డంటారు నన్ను" అన్నాడు ముని. "నవ్వుతాలుకి కొని తెచ్చుకున్నాను ఈ సర్ప జన్మ. ఖగముఖుడని నాకో సహాధ్యాయు డుండేవాడు. అత డొకనాడు అగ్నిహోత్రాలు చేసుకుంటున్నాడు. తమాషాకని వెనకాలే వెళ్ళి గడ్డిపాము కటి అతడి మీదికి విసిరాను తుళ్ళిపడ్డాడు ఖగముఖుడు. పక పకా నవ్వాను నేను. ఎక్కడలేని కోపం తెచ్చుకున్నాడు వాడు. 'విషంలేని పామైపోవాలి నువ్వు' అని శపించాడు నన్ను. 'హాస్యమాడినంత మాత్రానికే కోపం తెచ్చుకున్నావు. పోనీ, నాది పొరపాటే అనుకో. ఇంత దారుణమైన శాపం న్యాయమేనా? క్షమించు' అన్నాను. 'నోరు జారిపోయింది. నా మాటకి తిరుగులేదు. కొంతకాలం డుండుభంగా వుండక తీరదు నువ్వు. కొన్నాళ్ళకి రురుడని వొకాయన కనిపిస్తాడు. దాంతో శాప విముక్తి కలుగుతుంది' అన్నాడు విచారిస్తూ ఖగముఖుడు. ఇంత కాలమూ పాముజన్మ అనుభవించాను. ఇప్పుడు నీ దర్శనం కలిగింది. ధన్యుణ్ణయాను. సరేకాని మహాత్మా, భృగుమహాముని వంశంలో పుట్టావు. మహామునివి. జీవహింస దారుణం. క్షత్రియులికే కాని ఈ నిష్ఠురవృత్తి మనకి తగదు. అయిందేదో అయింది. నా ప్రార్థన మన్నించి, ఇహనైనా విరమించు" అన్నాడు.

సహస్రపాదుడి ప్రార్థన వూరికే పోలేదు. అవాళనుండీ పాముల్ని చంపడం విరమించుకున్నాడు రురుడు.

# ఆదిపర్వం

## రెండో ఆశ్వాసం

రురుడికథ విన్నారు మీరు. అసలు జనమేజయుడి సర్ప యాగంలో పాములు ఆహుతి కావడానికి కేవలం ఉదంకుడే కారణం కాదు. పాములతల్లి కద్రువ. ఆమె శాపమే దీనికి మూలకారణం. కన్నతల్లి శాపం కట్టికుడిపింది పాములిక. ఆ వివరాలు కూడా చెప్తాను వినండి ముందు.

### నాగుల పుట్టుక

ఆదియుగంనాటి కథ ఇది. ఆ దినాల్లో, కశ్యప ప్రజాపతికి అనేకమంది భార్యలుండేవాళ్లు. అందులో వినతా, కద్రువ — ఈ ఇద్దరూ కొడుకులకోసమని అనేక సంవత్సరాలు భర్తని ఆశ్రయించారు. చివరికి ప్రసన్నుడయాడు ప్రజాపతి. "ఏమిటి కావాలో కోరుకోండి. వరమిస్తాను" అన్నాడు.

"దీర్ఘదేహులూ, అగ్నితునకల్లాంటివాళ్ళూ మంచిబలవంతులూ వెయ్యిమంది కొడుకులు కావాలి" అంది కద్రువ.

"కద్రువ కుమాళ్ళని మించినవాళ్ళూ, వీర్యవంతులూ ఇద్దరు కొడుకులైతే చాలు నాకు" అంది వినత. అంతకుముందే ఎంతో కాలం తపస్సు చేసి, పుత్రకామేష్టి అదీ చేశాడు ప్రజాపతి. అంచేత, కోరినవరాలు అనాయాసంగా ఇచ్చాడు భార్యలికి. "మీ గర్భాలుమాత్రం భద్రంగా కాపాడుకోండి" అని హెచ్చరించాడు. సంతోషించారు వినతా కద్రువలు. గర్భవతు లయారు. కొన్నా

ళ్ళకి కద్రువ గర్భంలోంచి వెయ్యి గుడ్లూ, వినత గర్భంలోంచి రెండు గుడ్లూ బైటపడ్డాయి. వాటిని నేతికుండల్లో పెట్టి భద్రపరి చారు వాళ్ళు. ఐదువందల ఏళ్ళ తరవాత కద్రువ పెట్టినగుడ్లు వొక టొకటీ పగిలాయి. వాట్లోంచి శేషుడు వాసుకి ఐరావతుడు తక్షకుడు కర్కోటకుడు ధనంజయుడు కాళీయుడు మణినాగుడు ఆపూరణుడు పింజరుడు ఏలాపుత్రుడు వామనుడు నీలుడు అనీలుడు కల్మాషుడు శబలుడు ఆర్యకుడు ఉగ్రకుడు కలశపోతకుడు సురా ముఖుడు దధిముఖుడు విమలపిండకుడు ఆప్తుడు కోటరకుడు శంఖుడు వాలిశిఖుడు నిష్ఠానకుడు హేమగుహుడు నహుషుడు పింగ ళుడు బాహ్యకర్ణుడు హస్తిపదుడు ముద్గరపిండకుడు కంబలుడు అశ్వ తరుడు కాళీయకుడు వృత్తుడు సంవర్తకుడు పద్ముడు శంఖముఖుడు కూష్మాండకుడు క్షేమకుడు పిండారకుడు కరవీరుడు పుష్పదంష్ట్రుడు బిల్వకుడు బిల్వపాండురుడు మూషకాదుడు శంఖశిరుడు పూర్ణ భద్రుడు హరిద్రకుడు అపరాజితుడు జ్యోతికుడు శ్రీవహుడు కౌరవ్యుడు ధృతరాష్ట్రుడు శంఖపిండుడు వీర్యవతుడు విరజుడు సుబాహుడు శాలిపిండుడు హస్తిపిండుడు పిఠరకుడు సుముఖుడు కౌణ పాశనుడు కుఠరుడు కుంజరుడు ప్రభాకరుడు కుముదుడు కుముదా క్షుడు తిత్తిరి హాలికుడు కర్దముడు బహుమూలకుడు కర్కరుడు అకర్కరుడు కుండోదరుడు మహోదరుడు — ఇలా గొప్ప గొప్ప నాగుపాములు వెయ్యి పుట్టాయి.

కుమాళ్ళని చూసి మురిసిపోయింది కద్రువ. చిన్నపోయింది వినత. తనగుడ్లు పగలకపోవడం చిన్నతనమనిపించిం దామెకి. ఎన్నా ళ్ళని వోపిక పట్టడం? ఆగలేకపోయిం దిక. ఒక గుడ్డు తీసి బల వంతాన పగలగొట్టింది. పాపం అందులో సగం శరీరంతోనే వున్నాడు కుమారుడు పక్షి. మీది భాగం మాత్రం తయారైంది. తొడలూ కాళ్ళూ ఏర్పడలేదింకా, అతడే అరుణుడు, అనూరుడు. నొచ్చుకుంది వినత. చేతులు పిసుక్కుంది. మొత్తుకుంది. ఏం లాభం!

"ఎంతపని చేశావు!" అని తల్లిమీద చిరాకుపడ్డాడు అనూరుడు. "సవతిసంతానం చూసి మచ్చరించుకున్నావు. పూర్ణశరీరం రాకుండా నా గుడ్డుచిదక గొట్టావు. చేసుకున్న దాని ఫలం అనుభవిస్తావు. ఐదువందల ఏళ్లు సవతికి దాసిగా వుంటావు" అని శపించాడు. "అయిందేదో అయింది. మిగిలిన గుడ్డయినా భద్రంగా చూడు. దానంతట అదే పగుల్తుంది అందులోంచి మహావిక్రమశాలి పుడతాడు. వాడేతొలిగిస్తాడు నీ దాసీత్వం" అని చెప్పాడు. తల్లి సెలవు తీసుకుని సూర్యుడి రథానికి సారథిగా వెళ్ళిపోయాడు. అప్పటి నుండీ ఇప్పటికీ ఎప్పటికీ కూడా అరుణుడే సూర్యుడి సారథి. అరుణోదయం ఐతేనే కాని సూర్యోదయం కాదు.

### సముద్రమథనం

ఇంతలో పాలసముద్రం మథించి, అమృతం తీయడంకోసం దేవతలూ రాక్షసులూ యావన్మందీ మేరుపర్వతం మీద పెద్ద సమావేశం జరిపారు. దేవేంద్రుడు సభాధిపత్యం వహించాడు "ఎలా చిలకడం పాలసముద్రం? దీనికి కవ్వం ఎక్కడినుండి తేవడం ఆకవ్వం నిలపడానికి కుదురెక్కణ్ణుంచి వస్తుంది? కవ్వం తాడు దారేమిటి? ఏమిటి సాధనం?" ఇలా అందరూ ఇదయిపోతున్నారు. ఎవరికీ ఏమీ పాలుపోవడంలేదు. "సరే. ఈ భారమంతా మామీద వొదిలిపెట్టండి" అన్నారు బ్రహ్మ, విష్ణువునూ. 'అదంతా మేం చూసుకుంటాం. మేం చెప్పినట్టు మాత్రం మీరు వినండి" అన్నారు. కార్యభారమంతా తమ మీద వేసుకున్నారు.

ఇద్దరూ ఆలోచించారు. కవ్వానికి అన్నివిధాలా తగింది మందరపర్వతం. దానికోసం ఆదిశేషుణ్ణి పంపారు. పదకుండువేల యోజనాల పొడవూ, అంతే పాతూ వుంది మందరపర్వతం అనంతమైన బలవంతుడు కనక పెకలించుకు వచ్చాడు శేషుడు. మందరం కవ్వం చేశారు. అది మునిగిపోకుండా దానికింద ఆదికూర్మాన్ని కుదురు చేశారు. వాసుకిసర్పాన్ని కవ్వంతాడు చేశారు.

ఇది బావుందంటే బావుందన్నారు దేవతలు. భళీ అన్నారు రాక్షసులు. వాసుకి తోకతట్టు పట్టుకున్నారు దేవతలు. తలతట్టు పట్టుకున్నారు రాక్షసులు మేమంటే మేమంటూ మథించారు పాల సముద్రం. విష్ణుమూర్తి ప్రోత్సాహమువల్ల ఎక్కడలేని బలమూ వచ్చింది వాళ్ళకి. ఉత్సాహంతో కేకలు వేస్తున్నారు దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి భూమండలం జవజవలాడిపోతోంది. విషం కక్కుకున్నాడు వాసుకి. విషాగ్ని పొగలు కారుమేఘాల్లాగ కమ్ముకున్నాయి. భూమ్యాకాశాలు చిమ్మచీకట్లు కమ్మాయి.

చిలకగా చిలకగా గరళం పుట్టుకువచ్చింది ముందు. లోకాలన్నీ వొక్కసారి దహించుకుపోతాయా అన్నట్టున్నాయి మంటలు. విశ్వప్రపంచమంతా భయంతో వణికిపోయింది. చప్పున దాన్ని కంఠంలో పోసుకున్నాడు శివుడు. కంఠంలోనే వుంచుకున్నాడు గరళం. అంచేతనే ఆయన గరళకంఠు డయాడు. తరవాత పైకి వచ్చింది అమృతం. దాని వెనక లక్ష్మీ ధన్వంతరీ ఉచ్చైశ్రవం కౌస్తుభమణీ మొదలైనవి ఎన్నో పుట్టాయి. లక్ష్మినీ, కౌస్తుభాన్నీ విష్ణుమూర్తి పుచ్చుకున్నాడు. గుండెలమీద పెట్టుకున్నాడు. ఉచ్చైశ్రవం దేవేంద్రుడు తీసుకున్నాడు ఈ సందడిలో అమృతం మాత్రం రాక్షసులు స్వాధీనం చేసుకున్నారు. ఇంత కష్టపడీ నోట్లో మన్ను పడ్డట్టయింది దేవతలకి.

మించివచ్చిందని జగన్మోహినీవేషం వేశాడు విష్ణుమూర్తి. రాక్షసుల మనస్సులలో మోహం రేకెత్తించాడు. ఒయ్యారంగా వాళ్ళ చేతుల్లోంచి అమృతభాండం తీసేసుకున్నాడు. ఒడుపు చూసి మెల్లగా దేవతలచేతిలోపెట్టి కూచున్నాడు. పంచుకు తినడం ప్రారంభించారు దేవతలు. దేవతల్లాగే వేషం వేసుకుని పంక్తిలో వచ్చి కూచున్నాడు రాహువు అనే రాక్షసుడు. అందరితోపాటు అతడికీ అందింది అమృతం. తీరా తాగబోయేసరికి సూర్యచంద్రులు వాణ్ణి కనిపెట్టేశారు. విష్ణుమూర్తికి సైగచేశారు. అమృతం

నోట్లో పోసుకుంటున్నాడు రాహువు కంఠంలో దిగకముందే చక్రంతో తల తెగవేశాడు విష్ణువు నోట్లో అమృతం పడడంచేత తల మాత్రం బతికిపోయింద రాహువుది. మృతిలేదు దానికి. అవాళ నుండీ చంద్రుడన్నా సూర్యుడన్నా చెప్పరానిపగ రాహువుకి.

దేవతలు అమృతం అపహరించడంతో ఓ విప్లవం లేవతీశారు రాక్షసులు. బలిచక్రవర్తి నాయకత్వం కింద పెద్దసమావేశం జరిపారు. "దేవతలు మోసం చేశారు. వాళ్ళతో ఇవాళనుండీ ఏ సంబంధమూ పెట్టుకోకూడదు మనం" అని తీర్మానించారు. రథాలూ ఏనుగులూ గుర్రాలూ వేసుకుని భారీఎత్తుని తిరుగుబాటు చేశారు. ఉద్రేకంతో ఘోరంగా దేవతల్ని ముట్టడించారు. కాళ్ళూ చేతులూ కదల్లేదు దేవతలకి. గుండెదడ పట్టుకుంది దేవేంద్రుడికి. రాక్షసులు వేస్తున్న లక్షలాది బాణాల్లో కప్పుకుపోయి నట్టున్నారు దేవతలు. రాక్షసులిదే పైచేయిగా వుంది.

ఇంతలో తుఫానులా వచ్చిపడ్డారు నరుడూ నారాయణుడున్నూ. ఉగ్రమూర్తులై రాక్షసుల్ని ఎదిరించారు. కళ్ళల్లో చింత నిప్పులు కురుస్తూ ధనుస్సు సంధించాడు నరుడు. చక్రాయుధం ప్రయోగించాడు నారాయణమూర్తి. పర్వతశిఖరాలమీద జడివానలాగ రాక్షసులమీద బాణపరంపర కురిపించాడు నరుడు. ఎడతెరిపిలేకండా చక్రంతో రాక్షసుల శిరస్సులు తెగనరుకుతున్నాడు నారాయణుడు. కింద రాలుతూన్న తలకాయలతో అదిరిపడుతోంది భూమి. జేగురుసెలవళ్ళ పర్వతాలవలె, వరదలు కడుతూన్న రక్తాలతో గుట్టలు పడుతున్నాయి కళేబరాలు నరనారాయణుల ముందు నిలువలేకపోయింది రాక్షససేన. చావగా మిగిలినవాళ్ళు సముద్రంలో చొరబడ్డారు. విజయభేరీ మోయించారు దేవతలు. ముక్కోటి దేవతలూ నర నారాయణులికి జేజేలు పెట్టారు. మందరపర్వతం యథాస్థానంలో పెట్టివచ్చారు. అమృతం భద్రపరచవలిసిన బాధ్యత దేవేంద్రుడిమీద పెట్టారు. అమరావతి చేరింది అమృతం.

## స వ తు ల పం దెం

అమృతంతో పాటు ఉచ్చైశ్రవమూ పుట్టిందని చెప్పానుకదా ! అది వొకనాడు సముద్రతీరంలో మేస్తూ తిరుగుతోంది. వినతా కద్రువా ఆక్కడికే వచ్చారు చల్లగాలికి. సముద్రంలో నీలి నీలి తరంగాలు కొండంత ఎత్తుని లేస్తున్నాయి. దొర్లుకుంటూ వచ్చి వొడ్డుని ముత్యాలరాసులు కుమ్మరిస్తున్నాయి. చల్లని తుంపుర్లు గాలిలో ఎగిరి వస్తున్నాయి. గంభీరంగా, గంభీరానికి తగినంత మనోహరంగా వుంది సముద్రం. అవన్నీ చూసుకుంటూ, చల్లగాలి అనుభవిస్తూ ఎంతో దూరం వచ్చారు వినతా కద్రువలు. అల్లంత దూరంలో చూశారు ఉచ్చైశ్రవం సముద్రం నురుగు కంటే కూడా తెల్లగా వుందది.

" చూడవే, ఎంచక్కటి గుర్రమోను. తెల్లగా మల్లిపువ్వులా వుందే " అంది కద్రువ "కానైతే, చంద్రుడిలో కళంకం లాగ తోకమాత్రం నల్లగా వుంది. ఏమంటావు ?" అంది

"అదేమిటి ! సులోచనాలు కావాలా ఏమిటమ్మా నీకు !" అంది వినత, "ఎక్కడయినా వెదుకుదామన్నా చిన్న మచ్చయినా లేదు దీనికి. మహాపురుషుల కీర్తిలాగ నిర్మలంగా, తెల్లగా వుంటే, తోకనలు పంటా వేమిటి ?" అంటూ నవ్వింది.

పకాలున విరగబడి మరీ నవ్వింది కద్రువ. "ఏమిటీ ! నాకే కన పళ్లే దంటున్నావూ ! పందెం వేద్దామా ?" అంది.

పందెం అంటే పందెం అనుకున్నారు సవతు లిద్దరూన్నూ. "దాని తోకేగాని నల్లగా లేకపోతే నీదగ్గిర దాసీపని చేస్తాను నేను. నల్లగా వుంటేమాత్రం నువ్వే దాసీగా వుండాలి నాదగ్గిర" అంది కద్రువ. "సరే, అలాగే కానీ. రా. దగ్గిరికి వెళ్ళి చూద్దాం" అంది వినత. "అప్పుడే ఎందుకూ" అంది కద్రువ. "పొద్దుపోయింది. ఏం మించిపోయిందని ? పందెం మనకి ఖాయం. రేపు పొద్దున్నే వచ్చి చూద్దాం" అంది. ఇద్దరూ ఇంటికి వచ్చేశారు.

నిద్ర పట్టలేదు కద్రువకి. కుమాళ్ళని పిలిచింది. "అబ్బాయిలూ, వొక ఆపదలో చిక్కుపోయాను నేను. ఆదుకోవాలి మీరు. కామచారు లైన మీకు అసాధ్యమంటూ లేదు. ఇవాళ నేనూ మీ పిన్నీ సముద్ర పొడ్డుకి వెళ్ళాం. ఓ తెల్లటిగుర్రం మేస్తోం దక్కడ. నిజానికి చిన్న మచ్చనాన్న లేదు దానికి. ఐతే - తోక మాత్రం నల్లగా వుందన్నాను నేను. నవ్వింది వినత. మాట మీద మాట పెరిగింది. పందేం వేసుకున్నాం. నల్లగా వుంటే నాకు దాసీగా వుంటా నంది వినత. నల్లగా లేకపోతే నేను దాసీగా వుంటా నన్నాను. అప్పుడే వెళ్ళి చూద్దా మందది. కాదు రేపు చూద్దా మని ఖాకరించుకు వచ్చేశాను. తెల్లవారితే రమ్మంటుం దది. వెళ్లానా వోడిపోతాను. దాసీనైపోతాను దానికి. అంచేత, ఎలాఐనా గుర్రంతోక నలుపు చెయ్యాలి మీరు" అంది.

ఆలోచనలో పడ్డాయి పాములు. "ఇది అధర్మం" అని నిశ్చయించు కున్నాయి. "ఇది మాచేతకాదు" అని నిక్కచ్చిగా తల్లితో చెప్పేశాయి. కళ్ళెర్రచేసింది కద్రువ. "ఎన్నికష్టాలు పడో కన్నాను మిమ్మల్ని. ప్రాణం పెట్టి పెంచాను. పెద్దవాళ్ళని చేశాను. ఈ మాత్రం మాట చెల్లించారు కారు మీరు. ముందు ముందు జనమేజయుడు సర్పయాగం చేస్తాడు. అందులో పడి చస్తారు మీరు" అని శాపనాకారాలు పెట్టింది. సర్పయాగంలో సర్పజాతి భస్మం కావడానికి అదే కారణ మైంది.

ఏమన్నా వినుకోలేదు పాములు. కర్కోటకుడు మాత్రం తల్లి శాపానికి భయపడ్డాడు. ఆమె చెప్పిన ప్రకారం వెళ్ళి ఉచ్చైశ్రవం తోకని పట్టుకున్నాడు. నల్లగా కనపడింది తోక. వినతని పిలుచుకుని ఉదయాన్నే బైల్దేరింది కద్రువ. వెళ్ళి చూస్తే నల్లగానేవుంది గుర్రం తోక. ఓడిపోయింది వినత. కద్రువ గెల్చుకుంది. వినత దాసీ ఇప్పుడు కద్రువ యజమానురాలు.

## గ రు త్మం తు డి క థ

అనూరుడు చెప్పిన ఐదువందల సంవత్సరాలూ గడిచాయి. వినత పెట్టిన రెండోగుడ్డు పగిలింది. అందులోంచి మహా తేజశ్శాలి, గరుత్మంతుడు పుట్టాడు. రెక్కలు విదళించి తల్లికి నమస్కరించాడు. అతడి రెక్కల గాలికి కొండలే అల్లాడినట్టయాయి. సముద్రాలు కలగుండుపడ్డాయి. రెక్కలు కట్టుకున్న పెద్ద కొండలాగ వున్నా డతడు. తల్లికి మొక్కి వోసారి ఆకాసానికి ఎగిరి వచ్చాడు. భయంకరంగా వున్నాయి అతడి జవసత్వాలు. చూడ శక్యం కావడంలేదు తేజస్సు ప్రళయకాల మహావాయువులతో పైకిలేచిన ప్రళయాగ్ని జ్వాల లని భ్రమపడ్డారు దేవతలూ మునులున్నూ. అంజలిబంధం గీలించి, అగ్నిసూక్తాలతో స్తోత్రం చేశారు.

వినత సంతోషానికి మేర లేకండా వుంది. కౌగిలించుకుంది కొడుకుని. శిరస్సు నిమిరింది. ఆశీర్వదించింది. కద్రువకీ నమస్కరించాడు గరుత్మంతుడు. కంట్లో కొరివి పెట్టినట్టయింది ఆమెకి. తన పనిమనిషికొడుకు ఇంత ఇదిగా వుండడ మేమిటి? "ఇలా రారా అబ్బాయీ" అని అధికార కంఠంతో పిలిచింది. "మా బాబుల్ని ఎత్తుకు తిప్పుతూ వుంకు. చెప్పినపని చేస్తూ బుద్ధిగా మసులుకో. వినపడిందా!" అంది. తల్లి బానిస. అంచేత కొడుకూ బానిసే అయాడు.

కద్రువ చెప్పిందల్లా కాదనకుండా చేసేవాడు గరుత్మంతుడు. పాముల్ని వీపుమీద ఎక్కించుకుని దేశదేశాలు తిప్పి తెచ్చేవాడు. కొండలూ కోనలూ, పల్లెలూ పట్టణాలూ చూపించేవాడు. సప్త వాయువేగంతో ఎగిరి వొకనాడు సూర్యమండలం దాకా తీసుకు వెళ్ళాడు. సూర్యుడి వేడి తగిలి భరించలేక పోయాయి పాములు. వీపు మీంచి జారి కిందపడ్డాయి. మూర్ఛపోయాయి. నెత్తి నోరూ కొట్టుకుంది కద్రువ. ఇంద్రుణ్ణి ప్రార్థించి కుమాళ్ళను బతికించుకుంది. నోటికిరాని తిట్లన్నీ చెడామడా తిట్టింది గరుత్మంతుణ్ణి.

ఇలా ఎంతో కాలం గడిచింది. వినత వినయంగా వుంటున్న కొద్దీ కద్రువ గర్వం పెచ్చుతూ వుండేది. తమ బానిసత్వానిక కారణ మేమిటా అని ఆలోచించాడు గరుత్మంతుడు. ఏమీ పాలు పోలేదతడికి. తల్లిని ప్రశ్నించాడు. "తలుచుకుంటే, నా ముక్కు తోనూ, రెక్కలతోనూ కులపర్వతాలైనా గుండచేస్తాను. నా కున్న బలంలో సహస్రాంశంలేదు కద్రువ కుమార్లకి. ఐనా, ఈ పాములు ఎత్తుకు తిప్పడం ఖర్మమేమిటి నాకు ? నీకీదాకీ గతేమిటి ?" అని అడిగాడు.

"ఇదంతా నేను చేసుకున్న కర్మేరా బాబూ !" అంది వినత. కద్రువకీ తనకీ జరిగిన పందెం, అంతకు ముందే అనూరుడు పెట్టిన శాపం వివరించింది. "నీ మూలంగా నా బానిసత్వం తప్పుతుం దన్నాడు మీ అన్న. ఆ ఆశతోనే బతుకుతున్నాను. నీ మొహం చూస్తే బండెడు దుఃఖమూ మరుపు వస్తుంది నాకు. ఏం చెయ్యా నోయి చిట్టితండ్రీ, నానుండి నువ్వూ అవస్థల పాలయావు పాపం !" అని కంట తడి పెట్టుకుంది.

గరుత్మంతుడూ కళ్ళు తుడుచుకున్నాడు. తనకంటే తల్లి దుర వస్తే హృదయ శల్యమైంది. ఓనాడు కద్రువ కుమాళ్ళతో అన్నాడు. "మీరు ఏది కావాలంటే, అది తెచ్చి ఇస్తాను. మా బానిసత్వం మానిపించండి" అని. తల్లితో ఆలోచించి, కూడబలుక్కున్నాయి పాములు. "అలా ఐతే అమృతం తీసుకురా" అన్నాయి. "సరే" అన్నాడు గరుత్మంతుడు. వచ్చి తల్లితో చెప్పాడు. ఆమెకి పాదాభి వందనం చేసి వెళ్ళివస్తానన్నాడు.

ఆనందంతో ఆశీర్వదించింది తల్లి. "వెళ్ళి రా నాన్నా" అంది. "నాకు తెలుసు. నీవల్లే ముక్తి నాకు. నీ రెక్కలు గాలి రక్షిస్తుంగి. శిరస్సు అగ్ని రక్షిస్తుంది. శరీరం సూర్యుడు కాపాడు తాడు. కోటానుకోట్ల దేవతలు నీకోర్కె నేరవేరుస్తారు. జయించుకువస్తావు. తల్లిసంకెళ్ళు విప్పిన కీర్తి దక్కుతుందినీకు" అంది.

"ఆకలిగా వుంది," అన్నాడు గరుత్మంతుడు. "అమృతం కోసం వెళ్లేముందు బ్రహ్మాండమైన బలం కావాలి. ఆకలి తీరేట్టు ఆహార మేదైనా చూపెట్టు" అన్నాడు.

"సముద్రంమధ్య లక్షలాది నిషాదు లున్నారు. ప్రజలమీద దండెత్తి బాధపెడుతుంటారు వాళ్లు వాళ్ళని తిని ఆకలి తీర్చుకో" అంది వినత. "ఐతే మరోమాట. పొరపాటైనా వాళ్ళలో బ్రాహ్మ డుంటూ వుంటేమాత్రం తినబోకు" అంది "బ్రాహ్మడని ఎలా తెలుస్తుంది నాకు!" అన్నాడు గరుత్మంతుడు. మింగేటపుడు తెలిసి పోతుంది గొంతుకలో దిగకుండా బాధపెట్టేవాడే బ్రాహ్మడనుకో" అంది వినత.

రెక్కలు ఝాడించి బయల్దేరాడు గరుత్మంతుడు. సముద్ర మధ్యంలో వాలాడు. నిషాదుల్ని మింగడం ప్రారంభించాడు వినత చెప్పినట్టే వాళ్ళలో వొకడు గొంతుకలో చిక్కుకున్నాడు. "బ్రాహ్మ డిలా వున్నావు. పైకి వచ్చెయ్యి" అన్నాడు గరుత్మంతుడు. "అవును మహాప్రభో, బ్రాహ్మణ్ణే నేను. ఐతే, నా భార్య నిషాదస్త్రీ, దాన్ని వొదిలి ఎలా వచ్చేది?" అని అరిచాడు బ్రాహ్మడు. "సరే నీ కోసం దాన్నీ వొదిలేస్తున్నాను. మీ ఇద్దరూ వొచ్చెయ్యండి" అన్నాడు గరుత్మంతుడు వాళ్ళిద్దరినీ వొదిలి తక్కిన నిషాదులందరినీ తిని జీర్ణం చేశాడు. అయినా ఆకలి తీరలేదు. ఆకాశం మీది కెగిరాడు. గంధ మాదన పర్వతానికి వెళ్ళాడు.

గంధమాదనంమీద తపస్సు చేసుకుంటున్నాడు కశ్యపుడు. చూసి నమస్కరించాడు గరుత్మంతుడు. "అమ్మదాస్యం విడిపించాలి. అమృతంకోసం వెళుతున్నాను. ఆకలి తీరడంలేదు. ఆహార మేదన్నా ఇవ్వండి" అన్నాడు. కుమారుణ్ణి మెచ్చుకున్నాడు కశ్యపుడు. "ఇలాంటి కొడుకు కావాలనే కోరుకుంది మీ అమ్మ. బావుంది. ఈసమీపంలోనే వొక ఏనుగూ, తాబేలూ వున్నాయి. ఏను గంటే ఏనుగు కాదు. దాని పట్టువ ఆరు యోజనాలుంటుంది. పొడవు

పన్నెండు యోజనాలు. తాబేలూ అలాంటిదే. దాని వెడల్పు మూడు యోజనాలు. పొడవు పది యోజనాలు. ఈ రెండూ ఐతే సరిపోతాయి నీకు. లోగడ, విభావసుడూ సుప్రతీకుడూ అని ఇద్దరు బ్రాహ్మలుండే వాళ్లు. ఇద్దరూ అన్నదమ్ములు ఉన్న ఆస్తంతా విభావసుడు కాజేశాడు. చిల్లిగవ్వయినా చూపలేదు సుప్రతీకుడికి. 'పిత్రార్జితం, న్యాయంగా నావంతు నాకు రావాలి. పంచిపెట్టు' అని నిలదీశాడు సుప్రతీకుడు. దాంతో ఎక్కడలేని కోపమూ వచ్చింది విభావసుడికి. ఏనుగువై పొమ్మని శపించాడు. 'ఐతే నువ్వు తాబేలువై పో' అని శపించాడు సుప్రతీకుడు. వాళ్ళే ఇప్పుడు నేను చెప్పిన ఏనుగూ తాబేలున్నూ. అలా పరస్పరం శపించుకొని ఏనుగూ తాబేలూ అయ్యారు. అడవుల్లోనూ, పెద్ద పెద్ద సరస్సుల్లోనూ తిరుగుతున్నారిప్పుడు. పూర్వ వైరంవల్ల తటస్థపడ్డప్పుడల్లా పోట్లాడుతుంటారు. వెళ్ళు. వాళ్ళని భక్షించు. జయించుకువస్తావు" అన్నాడు కశ్యప ప్రజాపతి. కొడుకుని దీవించాడు.

క్షణంలో ఏనుగూ, తాబేళ్ల దగ్గిర వాలాడు గరుత్మంతుడు. చెరొక చేత్తో రెంటినీ పెనవేసి పట్టుకున్నాడు. మేఘాల మీదుగా అలంబతీర్థానికి బైల్దేరాడు. ఏనుగూ తాబేలూ పట్టుకుని ఉధృతమైన వేగంతో అతడు వెళుతూ వుంటే ఆ దారిని వస్తూ పోతూ వున్న దేవవిమానాలు తల్లకిందులై పోయాయంటే నమ్మండి.

బంగారం తీగెలు పెనవేసుకున్న శిల్పవృక్షాలతో ఎంతో అందంగా వుంది అలంబతీర్థం. నూరేసి యోజనాల పొడవయిన పెద్దపెద్ద కొమ్మలతో వొక మహా వృక్షముంది. రోహిణం దానిపేరు. గరుత్మంతుణ్ణి చూసి ఆహ్వానించింది రోహిణం. "నా కొమ్మమీద కూచుని ఆరగించు వాటిని" అంది. ఇట్టే కాలు పెట్టాడో లేదో గరుత్మంతుడు, అంత నూరుయోజనాల కొమ్మా ఫెళ ఫెళా విరిగి పోయింది. దాన్ని పట్టుకుని తలకిందులుగా తపస్సు చేస్తున్నారు

వాలఖిల్య మహామునులు. సూర్య కిరణాలు మాత్రమే వాళ్లకి ఆహారం. తపస్సే వాళ్ళకి లోకం. *

వాళ్ళని చూచి గతుక్కుమన్నాడు గరుత్మంతుడు. కొమ్మ కింద పడిందా ఇంతమందికీ ప్రమాదం. చప్పున ముక్కుతో పొడిచి పట్టుకున్నాడు కొమ్మని. ఒకచేతిని ఏనుగూ, వొకచేతిని తాబేలూ, ముక్కుని నూరు యోజనాల రోహిణం కొమ్మా. ఆకాశం మీదికి ఎగిరాడు. ఎక్కడ దించటం కొమ్మని? పాలుపోలేదు తనకి. గంధమాదనం వెళ్ళి మళ్ళీ తండ్రికి కనిపించాడు ఎగురుతూ. చూచి, సంగతంతా గ్రహించాడు ప్రజాపతి. వాలఖిల్యుల్ని ప్రార్థించాడు.

"మీరు సంకల్పించిన కుమారుడు వీడు, గరుత్మంతుడు. అవాళ నా పుత్రకామేష్టినాడు దేవేంద్రుణ్ణి మించినవాడు కలగాలన్నారు మీరు. వీడే ఆ వరప్రసాదుడు. జగదుపకారి. మీకు ప్రమాదం రాకుండా కొమ్మపట్టుకు తిరుగుతున్నాడు. అనుగ్రహించండి" అన్నాడు.

ప్రజాపతి ప్రార్థన విన్నారు వాలఖిల్యులు. కొమ్మ విడిచి పెట్టారు. హిమాలయపర్వతానికి వెళ్ళిపోయారు "ఈ కొమ్మ ఎక్కడ పడ్డా జననాశన మవుతుంది. వెళ్లు. ఇక్కడికి లక్ష యోజనాల్లో నిష్పురుషపర్వతం వుంది. దాని గుహాముఖా లెప్పుడూ మంచుతోనే నిండివుంటాయి మనిషన్నవాడు కనిపించ డక్కడ. ఈశ్వరుడన్నా అడుగు పెట్టలేనంత అగమ్యంగా వుంటుందది. అక్కడ పడవెయ్యి దీన్ని" అన్నాడు కశ్యపుడు.

నిమిషాలమీద నిష్పురుషపర్వతానికి వెళ్ళాడు గరుత్మంతుడు. రోహిణంకొమ్మ వొదిలిపెట్టా డక్కడ. అక్కణ్ణుంచి హిమాలయానికి వెళ్లాడు. హిమాలయంమీద కూచుని ఏనుగూ తాబేలూ తిన్నాడు. బ్రహ్మాండమైన బలం వచ్చింది. ఇహ ఇంద్రలోకానికే

* వాలఖిల్యులు వేలెడంతలేని శరీరం కల అరవై వేలమంది మునులు. క్రతువు అనే ముని వీరితండ్రి. తల్లి సన్నతి. చూ. బ్రహ్మాండపురాణం అ ౧.

ప్రయాణం. ఒక్కసారి రెక్కలు ఝాడించాడు. హిమాలయ పర్వతంమీద చెట్ల పువ్వులన్నీ జలజలా రాలాయి. దేవతల్ని గెలవడానికి వెళుతూన్న గరుత్మంతుడికోసం పూలవాన కురిసినట్టయింది.

ఇక్కడ హిమాలయం మీంచి బయల్దేరాడు గరుత్మంతుడు. అక్కడ ఇంద్రసభలో అగ్నివర్షం కురిసింది. వజ్రాయుధం వాడి మొద్దుపారినట్టయింది. దిగ్గజాలికి వణుకు పట్టుకుంది. దిక్పాలకుల గుండెల్లో రాళ్ళు పడ్డట్టయింది. "ఏమిటీ అపశకునం?" అన్నాడు దేవేంద్రుడు "అమృతంకోసం గరుత్మంతుడు వస్తున్నాడు" అన్నాడు బృహస్పతి. "పూర్వం మీ తండ్రి కశ్యపుడు పుత్రకామేష్టి చేశాడు కదా! నువ్వూ, వాలఖిల్యులూ సహాయం చేశారుగా! జ్ఞాపకం చేసుకో. ఆ వాళ, నీ బలానికి తగినట్టు నువ్వు మోసుకు వస్తున్నావు సమిధలు. వాలఖిల్యులూ తెస్తున్నారు. అసలే వేలెడంతటివాళ్ళు వాళ్లు. పైపెచ్చు నిత్యోపవాసాలతో కృశించి కృశించి వున్నారు. ఈనెపుల్లలలా ఊగులాడుతున్నారు. రెండేసి దర్భలూ, చిన్న మోదుగురెమ్మా — అవే బ్రహ్మాండమైపోయాయి వాళ్లకి. మొయ్యలేక మొయ్యలేక నడుస్తున్నారు. చూచి నవ్వావు నువ్వు. పాపం సిగ్గుపడి పోయారు వాళ్ళు. ఆ క్రోధం మనస్సులో పెట్టుకున్నారు. కశ్యపుడి పుత్రకామేష్టి యజ్ఞంలో 'ఇంద్రుణ్ణి మించినవాడు కలగాలి. వాడు రెండో ఇంద్రుడు కావాలి' అంటూ గట్టిగట్టి మంత్రాలతో హోమం మొదలుపెట్టారు. అది తెలిసి కశ్యపుడితో చెప్పుకున్నావు నువ్వు. కశ్యపుడు ప్రార్థించి శాంతపరిచాడు వాళ్లని. 'ఈయన దేవేంద్రుడిగా వున్నాడంటే, బ్రహ్మదేవుడి నిర్ణయమది. అది తప్పించడం అన్యాయం. రెండో ఇంద్రుడైతే ద్వంద్వప్రభుత్వమవుతుంది. ప్రపంచానికి అరిష్టమది. కనక కరుణించండి. పుట్టబోయేవాడు ఇంద్రుడు కావాలని కదా మీ సంకల్పం. మీ మాట నిలుస్తుంది.

చిన్న మార్పుకి అంగీకరించండి. దేవేంద్రుడికి బదులు పక్షీంద్రు డవుతాడు వాడు' అన్నాడు. ఎలాగో ఒప్పించాడు. గండం గట్టెక్కించాడు. ఆ పక్షీంద్రుడే యీ గరుత్మంతుడు. తల్లిని విడిపించాలని తంటాలు పడుతున్నాడు. అమృతం కావా లన్నారు కద్రువ కొడుకులు. అందుకనే వస్తున్నాడు. అంత ఏనుగునీ, తాబేలునీ, నూరు యోజనాల రోహిణం కొమ్మనీ మోసుకుని వాయువేగంతో ఎగిరి వెళ్ళిన మహాబలుడు. కామరూపి. కామ గమనుడు. నీకు తమ్ముడే ఐనా అతణ్ణి గెలవలేవు నువ్వు" అన్నాడు.

మరింత కంగారుపడ్డాడు దేవేంద్రుడు. కాపలా జవాన్లని హెచ్చరించాడు. ప్రాణాలు అడ్డువేసి ఐనా అమృతం రక్షించా లన్నాడు. లక్షలాది రక్షకభటుల్ని పెట్టాడు. రకరకాల రూపాల వాళ్ళూ, దారుణమైన ఆయుధాలవాళ్ళూ, రంగురంగుల కవచాల వాళ్ళూ అమృతంచుట్టూ పెట్టనికోటలా నుంచున్నారు. యావన్మందీ అప్రమత్తులుగా వున్నారు.

ఇంతలో ఒకలక్ష పిడుగులూ, వొకలక్ష ఉల్కలూ వొక్కసారి పడ్డట్టయింది. వచ్చి పడ్డాడు గరుత్మంతుడు. దూదిపింజెల్లా తునాతునకలై పోయాయి మేఘాలు. సరాసరి అమృతం దగ్గిరే వాలాడు. ఇలా వాలాడో లేదో, వొక్కసారి మీద పడింది కాపలాసైన్యం. చేతికి వచ్చిన ఆయుధంతో యుద్ధంచేశారు సైనికులు. ఏనుగు మీద ఎలకలు పడినట్టయింది గరుత్మంతుడికి. రెండు రెక్కలూ వొక్కసారి ఝాడించాడు. స్వర్గలోకంనిండా బ్రహ్మాండమైన ధూళి రేగింది. దేవతలకళ్ళల్లో గుప్పెడేసి దుమ్ము పడింది. ముందూ వెనకా కనపళ్లేదు వాళ్ళకి. గాలి వచ్చి చెదర గొట్టేదాకా కరచరణాలు ఆడలేదు, దేవేంద్రుడికి.

భౌమను డనే దేవకింకరుడు వో పెద్దసైన్యం వేసుకువచ్చాడు. గొడ్డళ్ళూ, గుదియలూ, కత్తులూ, కటార్లూ, బల్లేలూ, బాణాలూ - ఇలా లెక్కలేనన్ని ఆయుధాలు పట్టుకున్నారు సైనికులు. వచ్చాడో

లేదో, గరుత్మంతుడి ముందు అంత సైన్యంతోనూ మంటలో పడ్డ మిడతలా చచ్చిపూరుకున్నాడు భౌమనుడు.

సాధ్యులు వచ్చి ఎదిరించారు. తూర్పుదిక్కు తరిమాడు గరుత్మంతుడు. వసువులూ రుద్రులూ వచ్చారు. దక్షిణదిక్కు తరిమాడు. ఆదిత్యులు వచ్చారు. పడమటిదిక్కు తరిమాడు. అశ్వినీ దేవతలు వచ్చారు. ఉత్తరానికి తరిమాడు. అగ్నీ వాయువూ యముడూ కుబేరుడూ వరుణుడూ – ఎవరు వచ్చినా అదే పని ఐంది. దేవసైన్యం యావత్తూ రక్తాలు కార్చుకుంటూ పరుగెత్తింది. దేవేంద్రుడి వెనకని తల దాచుకుంది.

రేణుకుడూ క్రథనుడూ ప్రలిహాకుడూ ప్రరుజుడూ అశ్వ కుంతుడూ పదనఖుడూ – వీళ్ళంతా అమృతరక్షకుల సర్దార్లు. వీళ్ళందరినీ వజ్రాయుధంలాంటి తన గోళ్ళతో చెండాడాడు గరుత్మంతుడు. ఒక్కడూ లేకండా పారిపోయారు కావలి వాళ్ళు.

అమృతభాండం దగ్గిర ప్రవేశించాడు గరుత్మంతుడు. దాని చుట్టూ మహాగ్ని ఘోరంగా మండుతోంది. ఆకాశం అంటుతున్నాయి మంటలు. చూశాడు గరుత్మంతుడు. ప్రపంచంలోని నదుల నీళ్ళన్నీ పుక్కిటిలో పట్టుకువచ్చాడు. మహాగ్నిమీద కుమ్మరించాడు. ఆరిపోయింది మహాగ్ని. దేవతలు పెట్టిన యంత్రచక్ర మొకటి అమృతకలశం చుట్టూ తిరుగుతూ కనిపించింది. చిన్నక్రిమిలా సూక్ష్మదేహం ధరించాడు గరుత్మంతుడు. చక్రం రేకుల్లోంచి దూరి లోపల ప్రవేశించాడు. భయంకరమైన మహాసర్పాలు రెండు కలశాన్ని చుట్టుకుని కనిపించాయి. బుస్సుమని పైకిలేచాయి. రెక్కలు ఝాడించి వాటి కళ్ళల్లో దుమ్ముకొట్టాడు గరుత్మంతుడు. చెరోపాదం వేసి రెండింటి శిరస్సులూ తొక్కిపెట్టాడు. అమృత కలశం తీసుకుని ఆకాశం మీది కెగిరాడు.

ఇదంతా ఓ పక్కనుంచి కనిపెడుతున్నాడు మహావిష్ణువు. "అన్నప్రకారం అమృతం తీసుకు వెళుతున్నాడు. చవి చూద్దామ

నైనా చాపల్యం లేదు వీడికి. ఎంత బలవంతుడో అంత నీతిమంతుడు'' అని మెచ్చుకున్నాడు. ఎదురుగుండా ప్రత్యక్షమయ్యాడు. వర మిస్తాను కోరమన్నాడు.

తల వాంచి నమస్కరించాడు గరుత్మంతుడు. "నిరంతరం నీ సాన్నిధ్యం అనుగ్రహించు'' అన్నాడు. "పురుషోత్తముడివి నువ్వు. నీ సాన్నిధ్యంకంటే కావలసిందేముంది! అంతకీ నీ అనుగ్రహ ముంటే అమృతం లేకండా అమరత్వం ప్రసాదించు. జరా మరణాలు దుర్భరం. అవిమాత్రం లేకండా చెయ్యి'' అన్నాడు.

"తథాస్తు'' అన్నాడు విష్ణువు. "నాకు వాహనంగానూ, నా రథానికి పతాకంగానూ వుండు'' అన్నాడు.

ఇంతలో వజ్రాయుధం విసిరాడు దేవేంద్రుడు. నిప్పులు కక్కుకుంటూ వస్తోంది వజ్రాయుధం చూసి నవ్వాడు గరుత్మంతుడు. "ఎందు కలా నిప్పులు కక్కుతావు? నీ ప్రతాపం నా దగ్గిర చెల్లదు. ఐతే, మునిసంతానం గనక వ్యర్థం కాకూడదు నువ్వు. ఇదిగో, నా రెక్కనుండి చిన్న ఈకముక్క కదిలించుకువెళ్లు'' అన్నాడు. ముక్కోటి దేవతలూ ముక్కుమీద వేలు పెట్టుకున్నారు. ఇక లాభం లేదను కున్నాడు దేవేంద్రుడు. మంచి చేసుకోవడమే కర్తవ్య మనుకున్నాడు. "తమ్ముడూ, మనలో మనకి విరోధ మెందుకూ'' అన్నాడు. "నీ బలపరాక్రమాలు చకితుణ్ణి చేశాయి నన్ను. నాకు తగిన తమ్ముడివి నువ్వు. ఇవాళనించీ స్నేహంగా వుందాం మనం. జరామరణాలు లేవు నీకు. నిన్ను గెలిచేవాడు ముల్లోకాల్లో లేడు. ఇంత గొప్పవాడివి. అమృత మేం అవసరం వచ్చింది? పరాయివాళ్ళ చేతిలో పడితే మనల్ని మించిపోతారు. నువ్వేది చెపితే అదే చేస్తాను. అమృతం మాత్రం ఇచ్చెయ్యి'' అన్నాడు. ఎంతో ఆదరం చూపించాడు.

"అసలు, నా కోసం కానే కా దిది!'' అన్నాడు గరుత్మంతుడు. "మా అమ్మ దాసీనత్వం పోగొట్టించాలి నేను. అమృతం

తెమ్మన్నారు కద్రువ కొడుకులు. తెస్తానని వొప్పుకు వచ్చాను. తీసుకు వెళ్ళక తీరదు. ఐతే నిజమే, పాముల చేతిలో అమృతం పడితే ప్రపంచానికి ఉపద్రవం తప్పదు. దీనికో ఉపాయం చెపు తాను. అమృతం ఇచ్చి అమ్మని విడిపించుకుంటాను నేను. వాళ్లు అనుభవించకుండా ఎత్తుకురా నువ్వు" అన్నాడు.

"లక్షలు విలువ చేసిన సలహా చెప్పావు" అన్నాడు ఇంద్రుడు. "నీ బలపరాక్రమాలు ప్రత్యక్షంగా చూశాము. నీ ఉదారబుద్ధి పరికించాము. బ్రహ్మానందంగా వుంది నాకు. చెప్పు, నా వల్ల ఏది కావలసినా చెయ్యడానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు. "అన్నా, కద్రువవల్ల కలగని కష్టమంటూ లేదు మాకు. మా అమ్మని మోసం చేసి దానిస చేసుకుంది. అంచేత, ఆమె సంతానం — పాములు ఆహారం కావాలి నాకు. ఆమాత్రం అనుమతించు. వాళ్ళేమో నన్ను మించిపోతారని కాదు. ప్రపంచాలు పాలిస్తున్నవాడివి నువ్వు. నీ అనుమతి తీసుకోవడం ధర్మం నాకు" అన్నాడు. సమ్మతించాడు దేవేంద్రుడు. "అడ్డేముంది నీకు! అలాగే కానీ" అన్నాడు.

ఇలా అఖండవిజయంతో అమృతం పట్టుకువచ్చాడు గరుత్మంతుడు. కద్రువకుమాళ్ళని వెయ్యిమందినీ పిలిచాడు. దర్భలు ఆసనం వేసి అమృతకలశం పెట్టాడు. "ఇదిగో, ఒప్పందం ప్రకారం అమృతం తెచ్చాను. ఇవాళనుండీ మా అమ్మ దానిసత్వం తీరిపోయింది. ఇప్పుడు మేం స్వతంత్రులం. దీనికి అగ్నీ, వాయువూ, సూర్య చంద్రులూ సాక్షులు. వెళ్ళండి. స్నానమూ అదీ చేసుకుని శుచిగా రండి. అమృతం అనుభవించండి" అన్నాడు. తల్లిని వీపుమీద మోసుకుని బైటికి వచ్చేశాడు.

గరుత్మంతుడి వెనకాలే వచ్చాడు దేవేంద్రుడు. పాములికి కనపడకుండా నుంచున్నాడు. సందడిగా పాములన్నీ స్నానానికి వెళ్ళాయి. అమృతకలశం తీసుకుని అదృశ్యుడయ్యాడు దేవేంద్రుడు.

స్నానం చేసి చక్కా వచ్చాయి పాములు. అమృతమూ లేదు కలశమూ లేదక్కడ. నెత్తీ నోరూ లబోలబో కొట్టుకున్నాయి. దర్భలు మాత్రం నాకడం మొదలుపెట్టాయి, దర్భల వాడికి చీలికలయాయి నాలికలు. అవాళనుండే పాములికి రెండు నాలుకలు. అమృతం వుంచబట్టే దర్భలకి ఇవాళ ఇంత ప్రాముఖ్యం. *

శేషుడి వైరాగ్యం

"తల్లీ, తమ్ముల్లూ అధర్మానికే నెట్టుకున్నారు. అందుకనే ఆఖరికి అమృతమూ అందకుండా పోయింది. వీళ్ల దగ్గిర బతకడం కంటే ఇల్లు వొదిలి పోవడం మంచిది" అని ఖేదపడ్డాడు ఆదిశేషుడు. వైరాగ్యంతో ఇంటినుండి లేచిపోయాడు. గంధమాదనం, బదరీవనం, గోకర్ణం, హిమాలయం మొదలైన పుణ్యక్షేత్రాల్లో బ్రహ్మని ధ్యానిస్తూ, వేలాది సంవత్సరాలు తపస్సు చేశాడు. చివరికో నాడు ప్రత్యక్షమయాడు బ్రహ్మ. వరం కోరమన్నాడు.

"ఏ వరమూ వద్దు నాకు" అన్నాడు శేషుడు. "నా తల్లీ తమ్ముల్లూ ఏకమయారు. అధర్మంగా ప్రవర్తించారు. వినతనీ గరుత్మంతుణ్ణీ మోసం చేశారు. మా వంతు అయింది. ఇక వాళ్ళవంతు వస్తుంది. అంచేత మా వాళ్ల పొత్తు వొదిలి వచ్చేశాను. ఇలా తపస్సు చేసుకుంటూ శరీరం వొదిలేస్తాను" అన్నాడు.

"నువ్వే ఇలా అంటే ఇక దిక్కేముంది" అన్నాడు బ్రహ్మ. భూమిని మొయ్యడానికి పుట్టిన పుణ్యాత్ముడివి నువ్వు. సత్యవ్రతుడివి. ధర్మాత్ముడివి. లే. ప్రాణం వొదిలే ప్రయత్నం విడిచిపెట్టు. అనంతకాలం భూభారం వహించు. గరుత్మంతుడు నీ తమ్ముడు. అమిత బలవంతుడు. అతడితో స్నేహం శ్రేయస్సు నీకు" అన్నాడు. బ్రహ్మ మాట ప్రకారం అవాళనుండీ భూమండలం మోస్తున్నాడు ఆదిశేషుడు. అనంతకాలం మోస్తునే వుంటాడు.

* గరుత్మంతుడి కథ ఐతరేయబ్రాహ్మణంలో సోమాహరణమని మరో విధంగా వుంది

తల్లి శాపమూ, జనమేజయుడి సర్పయాగమూ తెలుసుకుంటూ భయపడుతూ వుండేవాడు వాసుకి. బంధువుల్నీ ఐరావతుడూ మొదలైన సోదరుల్నీ ఒకనాడు సమావేశపరిచాడు. "తపస్సు చేసి భూమిని మోస్తున్నాడు అన్న ఆదిశేషుడు. పాముల వూసే పట్టలేదతడికి. ఒక్కనాడూ రాబోయే ప్రళయంమాట తలంచడు. సముద్ర మథనంలో కష్టంతోడయ్యాను కదా నేను. అందుకని, నాకష్టం చూచి కనికరించారు దేవతలు. భయమూ నాశనమూ లేకండా వరమిచ్చారు నాకు. ఐనా, వంశనాశనం తెలుసుకుంటే జలదరిస్తుంది హృదయం. తల్లిశాపం తప్పే సాధనమేమిటి ? ఏం చేద్దామో చెప్పండి" అని ప్రస్తావించాడు.

"సర్పయాగం సాగకండా చేద్దాం" అన్నాయి కొన్ని కోడెత్రాచులు. "ధర్మ మంటే లొంగిపోతాడు జనమేజయుడు. బ్రాహ్మల వేషంలో వెళ్ళి ఈ యాగం అధర్మమని వాదిద్దాం" అన్నాయి కొన్ని. "కొందరం వెళ్ళి అతడి మంత్రులుగా కుదురుకుందాం. ఇహ పరాలికి రెంటికీ ఇది నష్టహేతువని నచ్చచెప్పుదాం" అన్నాయికొన్ని. "అన్న పానీయాల మీదా, పిండివంటలమీదా, యాగానికి వచ్చిన బాపనవాళ్ళమీద పాకుదాం. బుసలు కొట్టి భయపెడదాం. పరుగుచ్చుకున్నట్టు చేద్దాం" అన్నాయి కొన్ని పెంకిపాములు. "వీరు రను కున్నట్టు మన ఆట లేవీ సాగ వక్కడ" అన్నాయి కొన్ని బుద్ధిగల పెద్దపాములు. "మంత్రాలు పలుకుతూ వుంటే, హోమకుండం మండుతూ వుంటే, భయంకరమైన ఆ మంటల్లో పడిపోవడమే తప్ప ఈ శమభిమ లేవీ పనిచెయ్యవు" అన్నాయి. ఐతే, ఏమిటి దారి ?

అందరినీ ఆగండని ముందుకు వచ్చాడు ఏలాపుత్రుడు. "శాపం పెట్టిననాడు, అమ్మవొడిలో నిద్రపోతున్నట్టే వుండి, బ్రహ్మ, దేవతలూ మాట్లాడుకున్న మాటలు విన్నాను. ఆ రహస్యం చెపుతాను వినండి," అన్నాడు. "ఇంత బలవంతులూ, వీర్యవంతులూ

ఐన కుమార్ళని అన్యాయంగా దారుణంగా శపించింది కద్రువ. మీరూ ఇది చూస్తూ వూరుకున్నారు. మరి దీనికి ప్రతీకారమేలేదా ?'' అని అడిగారు దేవతలు. "క్రూరస్వరూపం కలవాళ్ళనీ, జగత్తుకి అప కారం చేసేవాళ్ళనీ భరించలేదు భూదేవి. అందుకని చెడ్డపాములు నాశనంకావడం అవసరం. కనకనే వూరుకున్నాను నేను. వాసుకి చెల్లెలు జరత్కారువుని జరత్కారుడనే ముని వివాహమాడతాడు. వాళ్ళకి ఆస్తీకుడనే మహాముని పుడతాడు. అతడే సగంలో ఆపు తాడు సర్పయాగం. లోకానికి అవసరమయిన గొప్పగొప్ప పాములు బతికిపోతాయి అన్నారు బ్రహ్మ. నేను స్పష్టంగా విన్నాను. నమ్మండి'' అని చెప్పాడు.

ఈ వార్త పరమానందమైంది పాములికి. అవాళనుండీ జర త్కారు డెప్పుడు వస్తాడా, జరత్కారువుని ఎప్పుడు పెళ్ళాడతాడా అని రోజులు లెక్కపెడుతూ కూచున్నాడు వాసుకి.

## జ ర త్కా రు డి క థ

జరత్కారుడు* యాయావర వంశస్థుడు. బ్రహ్మచర్యమే వ్రతంగా పెట్టుకున్నా డతడు. పెళ్ళి మానుకున్నాడు. తపస్సు చేసు కుంటూ అడవుల్లో తిరిగేవాడు. రుషుల శుశ్రూష చేసి జ్ఞానం ఆర్జించేవాడు. అడివిలో తిరుగుతూ వుండగా వొకనాడు వొక వింత కనపడిం దతడికి. ఒక సీటిగుంటా, గుంట వొడ్డుని వొక అవురు గడ్డిమొక్కా, అవురుమొక్కని ఆధారం చేసుకుని తలకిందుగా గుంట లోకి వేలాడుతూన్న కొందరు మునులూ కనిపించారు. సూర్య కిరణాలు తప్ప మరో ఆహారం లేదు వాళ్ళకి. అవురు మొక్క వేళ్ళన్నీ చుట్టూ ఎలక కొరికివేసింది. ఒక్క కుంకుడు వేరుమాత్రం మిగిలింది. అదీ ఏ నిమిషం ఎలక కొరికినా సీటిగుంటలో పడి పోతారు మునులు.

*జరత్కారుడు కృశించిన శరీరం కలవాడు.

అదీ ఒక తపస్సే అనుకున్నాడు జరత్కారుడు. దగ్గిరికి వెళ్ళాడు. "నాకూ ఈ తపస్సు నేర్పండి" అన్నాడు. "ఆయుష్మా, ఇదేం తపస్సు, మా ఖర్మ" అన్నారు మునులు. "పాపాత్ములం. సంతానం లేనివాళ్ళం. వంశాంకురం లేకపోయి అధోలోకందారి పట్టి వేలాడుతున్నాం. మా ఖర్మ ఇలా కాలిపోయి, మా వంశంలో జరత్కారుడనే పాపాత్ముడు పుట్టాడు. పెళ్ళీ పెడాకులూ మానుకున్నాడు. గొడ్డుపోయి కూచున్నాడు. వాడి తండ్రీ, తాతలం మేం వాడు ఒక్కడే మా వంశానికల్లా వున్నవాడిప్పుడు. ఈ అవురుమొక్క మా వంశ వృక్షం. కూకటి వేరే జరత్కారుడు. ఎలుక యముడు. కొరికినవేళ్ళు తరతరాల మా వంశపురుషులు. నీటి గుంట అధోలోకం. జరత్కారుడు సంతానం లేకుండా మరణిస్తే కూకటివేరూ కొరికివేస్తుంది ఎలుక. మేమంతా అధోలోకంలో పడిపోతాం. జరత్కారుడు సంతానవంతుడైతే మాత్రం ఊర్ధ్వలోకాలు లభిస్తాయి మాకు. నువ్వెవ్వరో ఆప్తబాంధవుడిలా కనిపించావు. జరత్కారుణ్ణి ఎరిగివుంటే దయచేసి మా దుస్థితి చెప్పి పుణ్యం కట్టుకో" అన్నారు. *

హృదయం బద్దలైనట్టయింది జరత్కారుడికి. "క్షమించండి" అంటూ చేతులు జోడించాడు. "నేనే జరత్కారుణ్ణి. నా అపరాధం అర్థమైంది నాకు. వివాహం చేసుకుంటాను" అన్నాడు. "నువ్వేనా? ఐతే బతికిపోయాం," అన్నారు మునులు. "బాబూ, జరత్కారూ, ఎన్ని తపస్సులు చేసినా, పుత్రుణ్ణి కనకపోతే పుట్టుగతులుండవోయ్. వెళ్ళు. పెళ్ళాడు. కుమారుని కను. అధోగతి పట్టకుండా ఆదుకో మమ్మల్ని" అన్నారు. "మీ ఆదేశం శిరోధార్యం. తప్పకుండా వివాహం చేసుకుంటాను. ఐతే, నా పేరూ ఆమె పేరూ ఒక్కటే ఐ వుండాలి. అలాంటి కన్యనే కట్టుకుంటాను" అన్నాడు జరత్కారుడు.

* చూ : మత్స్యపురాణమని హరిభట్టు తెనిగించిన దానిలో [illegible]కథ.

ఆ క్షణం మొదలు తన పేరింటి కన్యకోసం వెదకడం ప్రారంభించాడు. దేశ దేశాలు తిరిగాడు. కనపడ్డవాడితో అల్లా ప్రసంగించాడు. భూలోకం మీద ఎక్కడా తన పేరింటికన్య కనపల్లేదు. దినాలు గడిచిపోతున్నాయి సంవత్సరాలమీద సంవత్సరాలూ వెళ్ళిపోతున్నాయి. అసలే వ్రతాయాసంతో కుషి్కంచిన శరీరం. దానికితోడు వార్ధక్యమూ వచ్చిపడింది. పితృవర్గాన్ని ఉద్ధరించాలె నన్న చింతా బాధిస్తోంది. ఏం లాభం! తనపేరింటి పిల్ల నరలోకంలో కరువై పోయింది.

చారులవల్ల అంతా విన్నాడు వాసుకి. తన చెల్లెలు జరత్కారువుని నాగలోకంనుండి వెంటపెట్టుకు వచ్చాడు. ఎలా ఐతేనేం కోరినకన్య దొరికింది జరత్కారుడికి. పెళ్ళిచేసుకున్నాడు జరత్కారువుని. ఐతే శోభనంనాటి రాత్రే ఆమెతో వొక షరతు పెట్టాడు. "ఎన్నడూ అవమానించకూడదు నన్ను. ఎప్పుడు అవమానిస్తే అప్పుడు వొదిలిపెట్టి పోతాను నిన్ను" అన్నాడు. పాపం, కత్తిమీద సాములా నడుచుకునేది జరత్కారువు. రాత్రనకా పగలనకా అప్రమత్తురాలై వుండేది. భర్తకి ఏ లోపమూ రానీయకండా సేవ చేసేది. కొన్నాళ్ళకి గర్భవతి అయిందామె.

ఒకనాడు భార్యతొడమీద తలపెట్టుకుని జింకతోలుమీద నిద్రపోతున్నాడు జరత్కారుడు. పొద్దుపోయింది. ఆశ్రమంలో వాళ్ళంతా సాయంకాలకృత్యాలకోసం సిద్ధపడుతున్నారు. ఏం చెయ్యడమో తోచలేదు జరత్కారువుకి. భర్తని లేపడమా? మానెయ్యడమా? లేపితే నిద్రాభంగమైందని కోప్పడతాడు. లేపకపోతే సంధ్యావిధులు నశిస్తాయి. ధర్మలోప మవుతుంది. లేపలేదేమని కోపగిస్తాడు. ఏం చెయ్యాలి? "నిద్రాభంగానికి కోపగిస్తే సయిస్తాను. ధర్మహాని సయించరానిది" అంటూ భర్తని లేపింది జరత్కారువు. లేచి మండిపడ్డాడు జరత్కారుడు. "ఏం, ఏం వచ్చిందని నిద్ర చెడగొట్టావు" అని వురిమాడు.. సూర్యాస్త మైపోతూ

వుంది'' అంది భార్య భయపడుతూ. "నేను లేవకండా ఎలా అవుతుంది సూర్యాస్తం ?'' అని గద్దించాడు జరత్కారుడు. "ఏమనుకున్నావు నన్ను ! చవటకింద కట్టేశా వన్నమాట ! ఇంతకంటే అవమాన మే ముంటుంది ? తొలినాడే చెప్పాను, ఎప్పుడు అవమానిస్తే అప్పుడు వొదిలి పోతా నని. ఇవాళ అవమానించావు. ఇహ నీతో సంబంధం తీరిపోయింది. మరి నీ మొహాం చూడను. వెళుతున్నాను'' అన్నాడు. పాపం, కాళ్ళా వేళ్ళా పడింది జరత్కారువు. వినలేదు జరత్కారుడు. "నీ గర్భంలో అగ్నిహోత్రుడిలాంటి కుమారుడున్నాడు. మన ఉభయకులాలూ ఉద్ధరిస్తాడు వాడు. విచారించకు నువ్వు. మీ అన్న దగ్గిరికి వెళ్ళిపో'' అని చెప్పి వెనక్కి చూడకుండా తపోవనానికి వెళ్ళిపోయాడు.

నిరాశ్రయురా లై పోయింది జరత్కారువు. వాసుకి దగ్గిరికి నాగలోకం వచ్చేసింది. కొన్నాళ్ళకి సూర్యబింబంలాంటి కుమారుడు కలిగాడామెకి. అతడే ఆస్తీకుడు. శుక్లపక్షం చంద్రుడిలా పెరిగాడు. పెద్దవా డయాడు. చ్యవనముని కొడుకు ప్రమతీ ఆస్తీకుడూ సహాధ్యాయులు. ఉభయులూ కలిసి శాస్త్రాలూ, వేదాలూ, వేదాంగాలూ - యావత్తూ చదువు కున్నారు. సాత్వికుల్లో మహాసాత్వికు డయాడు ఆస్తీకుడు.

పరీక్షిత్తు మరణ గాథ

ఇక, జనమేజయ చక్రవర్తి దగ్గిరికి ఉదంకుడు వచ్చి పరీక్షిత్తుని తక్షకుడు చంపాడని చెప్పాడు కదా ! ఉదంకుడు చెప్పిందంతా విన్నాడు జనమేజయుడు. ప్రశ్నార్థకంగా మంత్రుల్ని చూశాడు. "అవును మహారాజా, తక్షకుడివల్లే బాబయ్యగారు కాలంచేశారు'' అన్నారు మంత్రులు. "కౌరవవంశం పరిక్షయించినపుడు - అంటే, నాశనమైన కాలంలో, అభిమన్యులవారికీన్నీ ఉత్తరాదేవికీన్నీ జన్మించారు బాబయ్యగారు. అంచేతే పరీక్షిత్తు అన్నారు వారిని. అరవై ఏళ్ళు ధర్మ పరిపాలన చేశారు. ప్రజల్ని

కన్నబిడ్డల్లా చూసుకున్నాడు. పరీక్షిత్తులవారంటే పరాయి రాజులికి సింహస్వప్నం. మీ ముత్తాత పాండుమహారాజులుంగారి మల్లేనే వేట అంటే వెర్రిసరదా వారికి. ఓనాడు మహారణ్యంలో వేటాడుతూ వో లేడిని కొట్టారు. దెబ్బతిని, బాణంతో సహా పారిపోయిందది. యజ్ఞమృగంవెంట పడ్డ శివుడిలా దాని వెంటపడ్డారు బాబయ్యగారు. ఒక్కరే. వెంట మరొకరు లేరు. వెంటాడి, వెంటాడి అలిసిపోయారు. అపరిమితమైన దాహంగానూ వుంది. ఇలా వెళ్ళగా వెళ్ళగా వొక చోట శమీకముని ఏకాంతంగా తపస్సు చేసుకుంటున్నాడు. "అయ్యా, నేను కొట్టిన లేడి బాణంతో ఇలా వచ్చింది. ఎటు వెళ్ళిందో చెపుతావా ?" అని అడిగారు బాబయ్యగారు. మౌనవ్రతంలో వున్నాడు శమీకముని. పలుకూ వులుకూ లేదు. కోపం వచ్చింది మహారాజుకి. పక్కనే చచ్చిన పామొకటి పడివుంటే, ధనుస్సు కొనతో తీసి మునిమెళ్ళో వేశారు. ఐనా, కదల్లేదు ముని. హస్తినాపురం వచ్చేశారు బాబయ్యగారు.

"శమీకమునికి శృంగి అని వొక కుమారుడున్నాడు. కృశుడనే మునివల్ల తండ్రిమెళ్ళో మహారాజు పాము వేసినవార్త విన్నాడు శృంగి. తోక తొక్కిన కోడె తాచులా కస్సుమని లేచాడు.

"ఏమిటీ ? - నిర్జనారణ్యంలో, అందులోనూ మౌనంగా తపస్సు చేసుకుంటూన్న మహావృద్ధు నా తండ్రి. దూడలు కుడిశాక పొదుగులో మిగిలిన పాలనురుగు తప్ప ఇంకో ఆహారం లేదాయనికి. అలాంటి మహామునికా అవమానం ?" అంటూ చర్రున శాపజలం చేత్తో పుచ్చుకున్నాడు. "ఇదిగో —— ఈ పరీక్షిత్తుని ఇవాళనుండి ఏడోరోజయ్యేసరికి తక్షకసర్పం కరిచి చంపాలి" అని శపించాడు. వెంటనే తండ్రి దగ్గిరికి పరిగెత్తాడు. మెళ్ళో చచ్చినపాం వేలాడుతూన్న సంగతే తెలియదు శమీకమునికి. పాం తీసి పారేశాడు శృంగి.

"కొడుకు వచ్చాక కళ్ళు విప్పాడు శమీకుడు. కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు శృంగి. తలవాంచి తండ్రికి నమస్కరించాడు జరిగినదంతా వివరించి చెప్పాడు. విని నొచ్చుకొన్నాడు శమీకుడు. మౌనం విడిచిపెట్టాడు. "అన్నా, ఎంతపని చేశావు!" అన్నాడు. "ఇంత క్రోధం తగునా మనకి! క్రోధం తపస్సుకి హాని. క్రోధం అష్టసిద్ధుల నాశన హేతువు. క్రోధం సమస్త ధర్మాలికి చెదపురుగు. తాపసులం మనం. అంచేత, క్రోధం కాదు, క్షమ కావాలి మనం. క్షమలేని వాడి తపస్సూ, గర్వపోతైన ధనికుడి ధనమూ, ధర్మంలేని రాజు రాజ్యమూ పగిలిన కడవలోని నీళ్ళలా వ్యర్థం. విడవరాని క్షమ విడిచి పెట్టావు. ఇహపరాలికి దూరంచేసే క్రోధం చేపట్టావు. మంచీచెడ్డా మరిచిపోయావు. చక్రవర్తిని శపించావు. చక్రవర్తి వుంటేనే కదా, మన తపస్సు నిర్విఘ్నంగా సాగుతుంది. మన పరిపాలకుణ్ణి మనం శపించడం పాతకంకాదా! పోనీ, ఏమంత సామాన్యుడా పరీక్షిత్తు! వేళ్ళమీద లెక్కించదగ్గ ధర్మప్రభువు. రాముడూ మాంధాతా భగీరథుడూ ఇంత చల్లగా పరిపాలించారో లేదో మరి! — వేట తమకంలో వున్నాడు చక్రవర్తి. అలిసిపోయాడు. దాహంతోనూ వున్నాడు. అలాంటి స్థితిలో తెలీక ఏదో చిన్న పొరపాటు చేశాడు. అంత మాత్రానికి దారుణమైన శాపం పెట్టావు. నేను సయించినప్పుడు నువ్వు మాత్రం సయిస్తే ఏం పోయేదంటా! ఐందేదో ఐంది. లే, ఇప్పుడైనా శాపం మళ్ళించు" అన్నాడు.

తల వంచుకున్నాడు శృంగి. "కోపంతో అనవలసిందేదో అనేశాను. నా మాటకి తిరుగుండదు. ఈ సరికే సిద్ధపడుతుంటాడు తక్షకుడు. ఏం చెయ్యనూ!" అన్నాడు. ఏం చెయ్యాలో పాలుపోలేదు శమీకమునికి. గౌరముఖుడనే శిష్యుణ్ణి పిలిచాడు. బాబయ్యగారి దగ్గిరికి పంపాడు. విషయమంతా చెప్పి తక్షకుడి వల్ల ప్రమాదం రాకుండా ఏదన్నా ఉపాయం చూసుకొమ్మన్నాడు.

"విని ఎంత విచారించాలో అంతా విచారించారు బాబయ్య గారు. మా అందరితోనూ చెయ్యవలిసిన ఆలోచ నంతా చేశారు. వేలాది శిల్పుల్ని, సమర్థులైన వాళ్ళని నియోగించారు. దిట్టమైన వొంటి స్తంభంమేడ కట్టించారు. చీమసహా దూరిందికి వీలుపడకండా కాపలా పెట్టించారు. మంత్రతంత్రాల్లో ఆరితేరిన విషవైద్యుల్ని, నమ్మకమైన సేవకుల్నీ, మంత్రుల్నీ మాత్రం దగ్గిరపెట్టుకుని ఆ మేడలో నివాసం పెట్టారు. మే మంతా కంటిమీద రెప్ప వెయ్యకండా వెయ్యి కళ్ళతో కాసుక్కూచున్నాం.

"ఒంటి స్తభం మేడలో ఎలా దూరడమా అని మన హాస్తినా పట్టణం పరిసరాల్లో కనిపెట్టుకు తిరగడం మొదలుపెట్టాడు తక్షకుడు. ఇలా ఆరురోజులూ గడిచిపోయాయి. ఏడో రోజు — ఆ రోజే అంత ఘోరమూ జరిగిపోయింది. అవాళ ఎంతో దూరంనుండి వొకాయన మన పట్టణం వస్తున్నాడు. దార్లో అతణ్ణి చూశాడు తక్షకుడు. ఓ ముసిలిబ్రాహ్మడి వేషంలో అతణ్ణి కలుసుకున్నాడు. "అయ్యా, ఎవరు మీరు? ఎక్కడికీ ప్రయాణం?" అని ప్రశ్నించాడు. 'సర్ప వైద్యుణ్ణి నేను' అన్నాడు కొత్తమనిషి. 'మంత్రవేత్తని, కాశ్యపుణ్ణి. హాస్తినాపురం వెళుతున్నాను. ఇవాళ పరీక్షిత్తులవారిని తక్షకుడు కాటువేస్తాడని విన్నాను. నా మంత్ర ప్రభావంతో మహారాజుని బతికిస్తాను. భూలోకంలో ప్రాణుల్ని పాములు విషంకోర్లతో చంపడం చూసి, కశ్యప ప్రజాపతికి విరుగుడు మంత్రాలు ఉపదేశించాడు బ్రహ్మ. ప్రజాపతి దగ్గిర నేర్చుకు వచ్చాను నేను. మహారాజుని బతికిస్తాను, దరిద్రమన్నా తీరుతుంది నాకు' అన్నాడు.

"పక్కమని నవ్వాడు ముసలి బ్రాహ్మడు. 'ఇంత వెర్రివాణ్ణి నిన్నే చూశాను,' అన్నాడు. 'పిసుగుక్కైనా మంత్రం వుంటే వుంటుంది కాని, తక్షకుడి కాటుకి మంత్రమేమిటి? తంత్రం. నేనే తక్షకుణ్ణి. నీ మందులూ మాకులూ నామీద పనిచెయ్యవు. ఎందుకు వ్యర్థంగా

శ్రమపడతావు? వచ్చిన దారిని వెళ్ళిపో. కాదంటావా, ఇదిగో చూడు, ఈ మర్రిచెట్టుని కరుస్తాను నేను. నా విషమంటే ఏమిటో అర్థమౌతుంది నీకు. చెట్టుని తిరిగీ బతికించావా, పరీక్షిత్తునీ బతికిస్తావని నమ్ముతాను' అంటూ పక్కనే వున్న మర్రిచెట్టుని కరిచాడు. బ్రహ్మాండమైన మర్రిచెట్టది. కాటు పడిందో లేదో, అంత చెట్టూ మచ్చుకన్నా లేకండా మండిపోయింది. బుగ్గయిపోయింది.

"ఆ బుగ్గంతా పోగుచేశాడు కాశ్యపుడు. మంత్రం వేశాడు. ఉత్తరక్షణంలో ఎలాంటి మర్రిచెట్టు అలాగే కలకల్లాడుతూ నుంచుంది. ముక్కుమీద వేలు పెట్టుకున్నాడు తక్షకుడు. నాలిక కరుచుకున్నాడు. 'మహామాంత్రికుడివి. జోహారు నీకు' అన్నాడు. 'ఎంతకన్నా సమర్థుడివి. కాని మహానుభావా, శృంగిశాపం వ్యర్థం కాకూడదు, నీకు కావలిసింది ధనం కదా! ఎంత కావాలో అంతా ఇస్తాను నేను. పుచ్చుకుని తిరిగిపో' అన్నాడు.

"అవును, విషం తప్పిస్తాను కాని శాపం తప్పించలేనుకదా!' అన్నాడు కాశ్యపుడు. తక్షకుడి దగ్గిర అమితమైన ధనం పుచ్చుకున్నాడు. ఇంటిముఖం పట్టి వెళిపోయాడు. ఐతే, పిట్ట మనిషి లేని అడివిలో జరిగిన విషయం మీ కెలా తెలిసిం దనవచ్చు ప్రభువులు. పట్నంలోని బ్రాహ్మ ణ్ణొకడు కట్టెలకోసం వెళ్ళాడు. ఆ మర్రిచెట్టు మీదే వున్నాడు. తక్షకుడి కాటుకి చెట్టుతోసహా భస్మమైపోయాడు. కాశ్యపుడి మంత్రంతో తిరిగి చెట్టుతోనే బతికాడు. అతడే వచ్చి అందరికీ చెప్పాడు.

"కాశ్యపుణ్ణి మళ్ళించి, నాగకుమార్లని పిలిచాడు తక్షకుడు. 'మీరంతా బ్రాహ్మణకుమార్ల వేషం వెయ్యండి. మంచి పళ్ళూ పువ్వులూ మోదుగుదొప్పల్లో పట్టుకుని పరీక్షిత్తు దగ్గిరికి వెళ్ళండి' అని నియోగించాడు. తానుకూడా అదృశ్యంగా వాళ్ళతో బయుల్దేరాడు. చక్కని బ్రాహ్మణ యువకులుగా తయారయ్యారు నాగ

కుమాళ్లు. వేదరుక్కులు వల్లిస్తూ వచ్చారు. ఒంటి స్తంభం మేడముందు నుంచున్నారు. చూసి ఎదురు వెళ్ళారు బాబయ్యగారు. వాళ్ళిచ్చిన వన్నీ పుచ్చుకున్నారు. అందరినీ సత్కరించారు. ఎంతటివాళ్ళకైనా కాలం తప్పించుకోవడం కష్టం మహాప్రభూ! సాయంకాలం కావచ్చింది. ఘడియకో క్షణానికో అస్తమిస్తాడు సూర్యుడు. హస్తినాపురానికే సాయంకాలమది.

"నాగకుమాళ్లు తెచ్చినపళ్లు తినాలని బుద్ధిపుట్టింది బాబయ్యగారికి. దగ్గిరున్న వాళ్లని చూసి 'పొద్దు గూకిపోతోంది. శాపం సమయం గడిచిపోయినట్టే ఇక. రండి, ఈ పళ్లు తిందాం' అన్నారు. అందరికీ పంచారు. వారూ వొక పండు తినబోయారు. అందులో నలకలాంటి చిన్న క్రిమి నల్లగా కనపడింది మొదట. చూస్తూ వుండగానే ఎర్రగా రెండింతలైంది. క్రమంగా రెండింతలు, నాల్గింతలు, పదింతలు పెరిగింది. బ్రహ్మాండమైన పామై ప్రత్యక్షమయాడు తక్షకుడు. విషం కక్కుతూ బుసకొట్టాడు. బాబయ్యగారిని కాటువేసి మాయమయ్యాడు. పిడుగు పడితే పరిగెత్తినట్టు పారిపోయింది పరివారం. ఒంటి స్తంభంమేడ బాబయ్య గారితో సహా భస్మమై పూరుకుంది. పురోహితుడూ వాళ్ళూ పరలోక క్రియలు నిర్వర్తించారు.

"ఈ దారుణం జరిగిన సమయానికి బాల్యం వదలలేదు ప్రభువులికి. చిన్నతనంలోనే అభిషేకం జరిగింది. రాజ్యభారం మీదపడింది. నిజమే, వొక బ్రాహ్మడి కోపగొట్టు మాటమీద ఇంత ఘోరానికి నెట్టుకున్నాడు తక్షకుడు. తప్పకండా సర్పయాగం చెయ్యవలిసిందే ప్రభువులు. తక్షకుణ్ణే వాడి వంశాన్నీ మలమలా మాడ్చినా పాపం లేదు" అన్నారు.

సర్పయాగం

తండ్రి మరణవృత్తాంతం దారుణ మనిపించింది జనమేజయుడికి. దుఃఖంతోనూ, కోపంతోనూ రెండుకళ్ళూ చెమ్మగిల్లీ, ఎర్రపడ్డాయి.

వెంటనే పురోహితుల్ని కబురుచేశాడు. ఋత్విజుల్ని పిలిపించాడు. "విషాగ్నిచేత బాబయ్యగారిని ఎలాగైతే తక్షకుడు దహించాడో, అలాగే వాణ్ణీ, వాడివంశాన్నీ, బంధుమిత్రులతో సహా భస్మం చెయ్యాలి మనం. స్వర్గంలో బాబయ్యగారూ సంతోషిస్తారు. ఈ ఉదంక మునీ తృప్తిపడతాడు. అంచేత, సర్పయాగమంటూ శాస్త్రాల్లో వుందో లేదో చూడండి" అన్నాడు.

"ఉంది మహారాజా, - ఇది పురాణప్రసిద్ధి అనికూడా వినికిడి. ఐతే, ఇంతవరకూ ఈ యజ్ఞం చేసినవారంటూ లేరు. ఇదే ఓం ప్రథమం. మీకోసమే ఏర్పాటు చేశారేమో దీన్ని దేవతలు!" అన్నారు ఋత్విజులు.

సర్పయాగం జరపడానికి సర్వసన్నద్ధుడయ్యాడు జనమేజయుడు. కాశీరాజు సువర్ణవర్మ కుమార్తె వపుష్టదేవి ధర్మపత్ని. ఆమెతోసహా యజ్ఞదీక్షితుడయాడు. మహావిద్వాంసులైన శిల్పాచార్యులు వచ్చి యజ్ఞశాల నిర్మించారు. పూతికపుల్లయినా లోపం లేకండా ఎక్కడచూస్తే అక్కడ యజ్ఞసంభారాలతోనూ, ధనధాన్యాలతోనూ పరిపూర్ణంగా వుంది యజ్ఞశాల. ఎవళ్లకి నియమించిన పనుల్లో వాళ్లు తిరికలేకండా వున్నారు. లెక్కలేనంత మంది బ్రాహ్మలు సమావేశమయారు. స్వయంగా అన్నీ చూస్తున్నాడు జనమేజయుడు. ఇంతలో వాస్తుశాస్త్రం తెలిసిన లోహితాక్షుడనే పౌరాణికుడొకడు యజ్ఞశాల కట్టడంలో ఏదో లోపం కనిపెట్టి, రాజుదగ్గిరికి వచ్చాడు. "మహారాజా, ఈ యాగం సలక్షణంగానే జరుగుతుంది. ఐతే, సగంలోమాత్రం ఆగిపోతుంది" అన్నాడు. అతడి మాటలు వినిపించుకున్నట్టే లేదు రాజు.

అనుకున్న సమయానికి ఆరంభమైంది యజ్ఞం. చ్యవన వంశస్థుడైన చండభార్గవుడు హోత పింగళుడు అధ్వర్యుడు. శార్ఙ్గరవుడు బ్రహ్మ. కౌత్సుడు ఉద్గాత. వ్యాసుడూ వైశంపాయనుడూ పైలుడూ జైమినీ సుమంతుడూ శుకుడూ శ్వేతకేతుడూ

మౌద్గల్యుడూ ఉద్దాలకుడూ మాండవ్యుడూ కౌశికుడూ కౌండిన్యుడూ శాండిల్యుడూ క్రామరుడూ కోహాలుడూ అసితుడూ దేవలుడూ నారదుడూ పర్వతుడూ మైత్రేయుడూ ఆత్రేయుడూ కుండజఠరుడూ కాలఘటికుడూ వాత్స్యుడూ శ్రుతశ్రవుడూ దేవశర్మా శర్మదుడూ గౌతముడూ కౌశికుడూ హారితుడూ రురుడూ పులోముడూ సోమశ్రవసుడూ – ఈ మొదలైన మహామును లంతా సదస్యులు.* మహారాజు నిర్ణయం ప్రకారం ఎవళ్ళస్థానాల్లో వాళ్లు కూచున్నారు. నల్లని వస్త్రాలు కట్టుకుని అగ్ని రగిలించారు యాజ్ఞికులు. పొగతో ఎర్రపడుతూన్న కళ్ళతో హోమం ప్రారంభించారు. అగ్నిశిఖ తీర్చి మండుతోంది, గింగురుమంటున్నాయి మంత్రాలు.

మంత్రాలు వినపడుతూన్నకొద్దీ పాములు కనపడుతున్నాయి. ఒక్కొక్కటీ వచ్చి, హోమకుండంలో పడిపోతున్నాయి. పెద్ద పెద్ద పాములు కుప్పలు కుప్పలుగా వచ్చి పడుతున్నాయి. భయంతో వొకదాన్నొకటి పిల్చుకుంటున్నాయి. విషం కక్కుకుంటున్నాయి. తెల్లటివి, నల్లటివి, పచ్చటివి, ఎర్రటివి – రంగురంగుల పాములు, రకరకాల పాములు, కళ్ళంబడి నోటంబడి రక్తాలు కక్కుతున్నాయి. యోజనాల తరబడి పొడవైనవి, స్థూలాతిస్థూలమైనవి వొక్కుమ్మగిని వచ్చి పడుతున్నాయి. వందలూ, వేలూ, పదివేలూ, లక్షలూ, పదిలక్షలూ హోమాగ్నిలో పడి మాడిపోతున్నాయి. అలా పడుతూ వుంటే, పడి కాలుతూ వుంటే, కాలి పగులుతూ వుంటే – దారుణంగా వుంది ధ్వని. దుస్సహంగా వుంది దుర్గంధం.

కోటిశుడు మానసుడు పూర్ణశలుడు పాలుడు హలీమకుడు పిచ్ఛలుడు కౌణపుడు చక్రుడు కాలవేగుడు ప్రకాలనుడు హిరణ్య

హోత : ఋగ్వేదం చదివేవాడు. దేవతల్ని పిలిచేవాడు. అధ్వర్యుడు : యజుర్వేదం చదివేవాడు. యజ్ఞం అంతా నడిపేవాడు. బ్రహ్మ : నాలుగు వేదాలూ చదివేవాడు. అన్నీ ఎరిగి పనులు సరి చూసేవాడు. ఉద్గాత : సామవేదం చదివేవాడు. సదస్యులు : సభ్యులు.

బాహుడు శరణుడు కక్షకుడు కాలదంతకుడు మొదలైన వాసుకి సంతతి నాగులూ, పుచ్ఛాండకుడు మండలకుడు పిండసేక్తృడు రభేణకుడు ఉచ్ఛికుడు శరభుడు భంగుడు బిల్వతేజుడు విరోహణకుడు శిలీశలకరుడు మూకుడు సుకుమారుడు ప్రవేపనుడు ముద్గరుడు శిశురోముడు సురోముడు మహాహనుడు మొదలైన తక్షకవంశం నాగులూ, పారావతుడు పారిజాతుడు పాండరుడు హరిణుడు కృశుడు విహంగుడు శరభుడు మోదుడు ప్రమోదుడు సంహతాపనుడు మొదలైన ఐరావతసంతతి నాగులూ, ఏరకుడు కుండలుడు వేణీ వేణీస్కంధుడు కుమారకుడు బాహుకుడు ధూర్తకుడు శృంగబేరుడు పాతుడు రాతకుడు మొదలైన కౌరవ్యకులం నాగులూ, శంకుకర్ణుడు పిఠరకుడు కుఠారుడు సుఖసేచకుడు పూర్ణాంగదుడు పూర్ణముఖుడు ప్రహాసుడు శకునీ దర్యుడు మాహాతుడు కామఠకుడు సుషేణుడు మానసుడు అవ్యయుడు భైరవముండుడు వేదాంగుడు పిశంగుడు చోద్రపారకుడు ఋషభుడు వేగవతుడు పిండారకుడు మహాహనుడు రక్తాంగుడు సర్వసారంగుడు సమృద్ధుడు పరుడు వాసకుడు వరాహకుడు వీరణకుడు సుచిత్రుడు చిత్రవేగికుడు పరాశరుడు తరుణకుడు మణిస్కంధుడు అరుణి - ఈ మొదలైన ధృతరాష్ట్రసంతతి నాగులూ కట్టలు కట్టలుగా ఱట్లు ఱట్లుగా వచ్చి స్వాహా ఐపోయాయి.

సర్ప ప్రళయంగా వుంది సర్పయాగం. సర్పచక్రవర్తులంతా జజ్జరిల్లిపోయి మతిపోయినట్టున్నారు. నాగలోకంలో ఏడుపులూ మొత్రలూ తప్ప ఇంకోటి వినపడదు. తక్షకుడి గుండెల్లో దడ పట్టుకుంది. వెర్రెత్తినట్టు పరిగెత్తాడు నేస్తం దేవేంద్రుడిదగ్గరికి. రక్షించు, రక్షించమంటూ కాళ్ళమీద పడ్డాడు. బ్రహ్మదగ్గిర విని, జరగబోయేదంతా ముందే తెలుసు దేవేంద్రుడికి. "భయపడకు" అని అభయమిచ్చాడు. చేరదీసి దగ్గిర పెట్టుకున్నాడు.

ఇలా తనసంతతీ తమ్ములసంతతీ దగ్ధమైపోతూ వుంటే భరించలేకపోయాడు వాసుకి. ఏడుస్తూ పరిగెత్తాడు చెల్లెలు జరత్కా

రువు దగ్గిరికి. "చెల్లీ, మరొక్క నిమిషం ఆలస్యమైతే, మన జాతి జాతి యావత్తూ చల్లారిపోతుంది. నీ కొడుకుని పరిగెత్తించు. జరత్కారుడికి ఈ ఆశతోనే పెళ్ళిచేశాను నిన్ను. అవాళ ఏలాపుత్రుడు చెప్పింది నువ్వూ విన్నావు కదా!" అన్నాడు. "బాబూ, మామగారి మాట మన్నించు. పరిగెత్తు సర్పయాగానికి. వంశం రక్షించు" అంది, కొడుకుని చూసి జరత్కారువు.

## ఆస్తీకుడు

"ఇప్పటికి గతించిన వాళ్ళేమో గతించారు ఇహ వొక్కర్నీ చావనివ్వను. భయపడకండి" అంటూ పయనమయ్యాడు ఆస్తీకుడు. వేద వేదాంగ పారంగతులైన బ్రాహ్మల్ని వెంటపెట్టుకున్నాడు. వచ్చి యజ్ఞశాలలో జనమేజయుడి ముందు నుంచున్నాడు. స్వస్తి వాక్యాలతో చక్రవర్తిని స్తోత్రంచేశాడు. "మహారాజా, పవిత్రమైన చంద్రవంశంలో పుట్టావు. భూలోక చక్రవర్తివి. రాజరుషివి. మాంధాతా, భగీరథుడూ, దశరథుడూ, శ్రీరాముడూ, ధర్మరాజూ, అర్జునుడూ — ఈ మహామహుల్ని మరిపించిన ధర్మప్రభువ్వి. ప్రజల నోములు పండి పాండవకులంలో ప్రభవించావు. విశాలమైన రాజ్యలక్ష్మిని వరించావు. అఖండమైన యజ్ఞాలూ చేశావు. చేతికి ఎముక లేకండా అడిగినవాళ్ళకి ఐశ్వర్యం పంచిపెట్టావు.

"నలచక్రవర్తి చేసిన యజ్ఞం, ధర్మరాజు రాజసూయం, ప్రయాగలో ప్రజాపతి చేసిన యాగం, వరుణుడూ చంద్రుడూ వ్యాసమునీ జరిపిన మహాయజ్ఞాలూ ఎంత గొప్పవో, అంత గొప్పది నీ యజ్ఞం. ఇది నడిపిస్తూన్న రుత్విజులు బ్రహ్మతో సమానమైన వాళ్లు. యజ్ఞకార్యాల్లో హేమాహేమీలు. తపోధనులు. పండితులు. విద్యానిధీ, త్రిలోకపూజ్యుడూ, వ్యాసముని శిష్యులతో సహా సదస్యుడుగా వచ్చాడంటే ఇంతకంటే గొప్పవిషయం ఏముం

టుంది! నిజానికి రాజుల్లో విష్ణు వంతవాడివి నువ్వు. కనకనే అగ్ని దేవుడు స్వయంగా జ్వాలాహస్తాలతో హవిస్సు లందుకుంటున్నాడు. కోర్కెలు చెల్లిస్తున్నాడు'' అన్నాడు.

ఆస్తీకముని మాటలు చక్రవర్తినీ, సదస్యుల్నీ ఆనందంలో వోలలాడించాయి. అతడి తేజస్సూ, వాగ్ధోరణీ అద్భుతంగావున్నాయి. సమ్మోహనం కలిగిస్తున్నాయి.

"ఏం కావాలి ఋషీ, నువ్వు ఏదంటే అదే ఇస్తాను. చెప్పు, సంకోచించక'' అన్నాడు జనమేజయుడు.

"సత్యవాక్కు నీది, ఆడి తప్పనివాడివి. సర్పయాగం విరమించు'' అన్నాడు ఆస్తీకుడు. "ఇదే నాకు కావలిసింది. అనుగ్రహించు. ఇంతతో శాంతించు. మిగిలిన నా బంధువులికి ప్రాణదానం ప్రసాదించు'' అన్నాడు.

యజ్ఞశాల నిండా వొక్కసారి వెయ్యి కంఠాలు వినిపించాయి. "కాదనకు మహారాజా, అతడికోర్కె చెల్లించు'' అన్నారు సదస్యులు. దాటరాని గీటు అయింది జనమేజయుడికి. తప్పనిసరిగా సర్పయాగానికి స్వస్తి చెప్పాడు.

ఆస్తీకుడు యజ్ఞం దగ్గిరకి వచ్చేసరికి హోమాగ్నిలో పడడానికి సిద్ధంగా వున్నాడు తక్షకుడు. అతడు ఇంద్రుడి మరుగు చొచ్చాడని చెప్పానుకదా! "ఎన్ని పాములు వచ్చినా, అసలు శత్రువు తక్షకుడు రాలేదేమ''ని ఋత్విక్కుల్ని అడిగాడు రాజు. ఆలోచించి, "వాడు ఇంద్రుడి దగ్గిర దాగున్నాడు'' అన్నారు ఋత్విక్కులు. "ఐతే ఇంద్రుడితో సహా ఈడ్చుకు రండి'' అన్నాడు రాజు. ఆహ్వాన మంత్రాలు చదివారు ఋత్విక్కులు. "స ఇంద్ర తక్షకాయస్వాహా'' అనీ అనబోతున్నారు. తక్షకుణ్ణి దిగవిడిచి పారిపోయాడు ఇంద్రుడు. ఆకాశంలో విమం కక్కుకుంటున్నాడు తక్షకుడు. సుడిగాలిలోలాగ తిరుగుతూ తన్నుకుంటున్నాడు. "తక్షకాయస్వాహా'' అనడమే తరవాయి. ఆ దేసమయానికి ఆగిపోయింది

యజ్ఞం, "బతికిపోయావు. భయపడకు" అంటూ తక్షకుణ్ణి మళ్ళించాడు ఆ స్త్రీకుడు. బతికిపోయాడు తక్షకుడు.

ఇటు నాగవంశమూ, అటు యాయావర వంశమూ ఉద్ధరించాడు ఆ స్త్రీకుడు. పాముల్ని ప్రళయంనుండి బతికించడం చేతనే అతడి పేరు చెపితే సర్పభయ ముండదని విశ్వసించారు ప్రజలు.



# ఆదిపర్వం

## మూడో ఆశ్వాసం

ఇదంతా అయ్యాక వొకనాడు పండితగోష్ఠిలో కూచున్నాడు జనమేజయుడు. కవులూ పండితులూ మునులూ సభనిండా పిక పిక లాడుతున్నారు. ఎత్తయిన రత్నాల పీటమీద కూచున్నాడు వ్యాస మహర్షి. ఎవళ్ళ స్థానాల్లో వాళ్ళున్నారు శిష్యులు, అర్ఘ్యమూ పాద్యమూ ఇచ్చి పూజించాడు చక్రవర్తి. చేతులు జోడించాడు. "ఎన్నాళ్ళనించో అడగా లనుకుంటున్నాను. మీరూ, భీష్మ పితామహులూ రాజ్యం పంచిపెట్టారు కదా, మా తాతలికి! ఎవళ్ల వంతుతో వాళ్ళు ఎంచక్కా జీవనం చెయ్యవలసింది. అది మాని, వాళ్ళని వీళ్ళూ, వీళ్లని వాళ్ళూ చంపుకుని, అంత జనక్షయం చెయ్యడంలో ఆంతర్యం అర్థంకావడం లేదు నాకు. మీరన్నా కుటుంబ కలహం మాన్పించలేక పోయారా మరి?" అని ప్రశ్నించాడు.

శిష్యుడైన వైశంపాయనుడి దిక్కు చూశాడు వ్యాసముని. "మన మహాభారతం మహారాజుకి వినిపించు" అన్నాడు. గురువు గారికి పాదాభివందనం చేశాడు వైశంపాయనుడు. పండితుల దిక్కు తల వాంచాడు. వాళ్ల అనుమతీ తీసుకున్నాడు.

భారతజాతి ఇతిహాసం మహాభారతం. విష్ణుకల్పుడు వ్యాస ముని హిమాలయం సానువులమీద మూడేళ్ళు శ్రమించి విరచించిన వీరగాథ, రసబ్రహ్మం, పంచమ వేదం. అలాంటి మహాభారతం జనమేజయ చక్రవర్తి సభలో వినిపించాడు వైశంపాయనుడు.

"ఈ మహాభారతం లక్షశ్లోకాలలో రాశారు మా గురువులు. ఆయన మేధస్సు మహాసముద్రం. అందులోంచి ఉదయించిన

మహాభారతం చంద్రబింబం. కృష్ణార్జునుల గుణకీర్తనం పండువెన్నెల. భావాలు చంద్రకిరణాలు. ఇది వింటే అజ్ఞానం అనే చీకటి పటాపంచలౌతుంది'' అంటూ అందుకున్నాడు కథ. గ్రంథారంభానికి ముందు గ్రంథకర్త వ్యాసముని చరిత్రా, అతడి పుట్టు పూర్వోత్తరాలూ చెప్పాడు.

వసుచరిత్ర

చేదిదేశం పూర్వం వసు వనే రాజు పాలిస్తూ వుండేవాడు. వేట కని అడివిలోకి వెళ్లి వొక రుషి ఆశ్రమం చూశాడాయన. అక్కడి మునీశ్వర్లని చూసి వైరాగ్యం కలిగిందతడికి. ధనుస్సూ బాణాలూ వొదిలేసి అక్కడే తపస్సులో కూచున్నాడు. కొన్నాళ్లకి సపరివారంగా ఆయన దగ్గిరికి దేవేంద్రుడు వచ్చాడు. "అంత రాజ్యమూ, ప్రభుత్వమూ విడిచిపెట్టి తపస్సు చేస్తున్నావు. రాజ్యం ఎంత ధర్మంగా పరిపాలించావో, తపస్సు అంత నిష్టతోనే చేస్తున్నావు. సంతోషంగా వుందినాకు. నీతో స్నేహం చెయ్యాలని వచ్చాను. నీ కో రత్నవిమానం ఇస్తాను. దానిమీద నాదగ్గిరికి వస్తూ వెళుతూ వుండు. ఇదిగో, కలవపువ్వుల దండ. ఇంద్రమాల. ఎన్నడూ వాడ దిది. ఇది మెడలో వుంటే, ఎలాంటి ఆయుధమైనా శరీరానికి తగలదు. ఇంకా ఇదిగో, ఈ వెదురు బెత్తం. చెడ్డవాళ్లని శిక్షింస్తుం దిది. మంచివాళ్లని రక్షిస్తుంది. ఇవి పెట్టుకుని సుఖంగా రాజ్యపాలనం చెయ్యి'' అని మించి వొక రత్నవిమానమూ, ఇంద్రమాలా, వెదురు బెత్తమూ ఇచ్చి వెళ్ళాడు. అదిమొదలు విమానం మీద ఉపరివీథిని సంచరించేవాడు వసురాజు. అందుచేతే అతణ్ణి ఉపరిచరవసువు అన్నారు. ఇంద్రమాలికా, వెదురుబెత్తం — ఈ రెంటి ప్రభావంవల్ల ఇంద్రవైభవంగా రాజ్యమేలుతూ వుండేవా డతడు. ఇంద్రుడితో స్నేహంగా వుండి ఇంద్రలోకం వెళ్ళి వచ్చే

కుశుడికీ విదర్భరాజ కన్యకీ పుట్టిన నాలుగో కుమారుడు వసురాజు అని వాల్మీకి రామాయణం బాలకాండ.

వాడు. ప్రతీ ఏడూ ఇంద్రోత్సవం చేసేవాడు. అప్పటినుండే రాజులంతా ఇంద్రోత్సవం మొదలుపెట్టారు.

ఇంద్ర ప్రసాదం వల్లనే బృహద్రథుడూ, మణివాహనుడూ, సౌబలుడూ, యదుడూ, రాజన్యుడూ అని ఐదుగురు కుమార్లని కన్నాడు వసురాజు. ఐదు దేశాలికి రాజులుగా అభిషేకించాడు వాళ్లని. వాళ్ళు అయిదు రాజవంశాలికి మూలపురుషు లయారు.

చేదినగరం సమీపంలోనే వొక పెద్దనది ప్రవహిస్తోంది. దాని పేరు శుక్తిమతి. ఆ పక్కనేవుంది కోలాహల పర్వతం. శుక్తిమతిని ప్రేమించాడు కోలాహలుడు. ఆమె ప్రవహించకండా మధ్యని అడ్డుకున్నాడు. నదీప్రవాహం నిలిచిపోయింది. అది చూశాడు వసురాజు. తన పాదంతో పక్కకి తోశాడు కోలాహలపర్వతం. పర్వత సంగమం వల్ల వసుపదుడు అనే కుమారుడూ, గిరిక అనే కూతురు కలిగారు శుక్తిమతికి. కృతజ్ఞతా సూచకంగా వాళ్ళిద్దరినీ వసురాజుకి కానుక పెట్టింది శుక్తిమతి. వసుపదుణ్ణి సేనా నాయకుడిగా చేసుకున్నాడు వసురాజు. గిరికని వివాహ మాడాడు.

ఒకనాడు రుతుమతిగా వుంది గిరిక. ఆమెకి లేడిమాంసం పెట్టమన్నారు పితృదేవతలు. వేటకి బైల్దేరాడు వసురాజు. అడివిలో వున్నాడేకాని అతడి మనస్సంతా గిరికమీదే వుంది. కదుర్రైన ఆమె స్తనాలూ, బిగువైన యవ్వనం, వొయ్యారం, సౌకుమార్యం తలుచుకుని మనస్సు మనస్సులో లేదతడికి. తలుచుకుని తలుచుకుని తుదకి వీర్యస్ఖలనమూ ఐపోయింది. అమోఘమైన తన వీర్యం వ్యర్థంపోకూడదు. దాన్ని ఒకదట్టమైన ఆకుదొన్నెలో భద్రపరిచాడు రాజు. ఒక డేగచేత పెట్టి గిరిక దగ్గిరికి పంపించాడు. ఆకు దొన్నె నోట కరుచుకుని ఆకాశమార్గంలో వస్తోంది డేగ. దార్లో మరో డేగ చూసింది. అది మాంస మేమో అనుకుని కలబడింది. రెంటికీ పోరాటం జరిగింది. ఆ పోరాటంలో రెండోదాని చుంచు తగిలి చీలికలైంది ఆకుదొన్నె. వసురాజు వీర్యం కిందపడింది. గాలికి

చెదిరి అందులోంచి రెండు చుక్కలు యమునానదిలో పడ్డాయి. అప్సరస అద్రిక చేపఅయి యమునలో తిరుగుతోంది. వీర్యం రెండు చుక్కలూ ఆ చేప మింగింది. గర్భమూ దాల్చింది. పదిమాసాలూ నిండాయి.

ఒకనాడు జాలారివాళ్ళ వల్లో చిక్కుకుంది ఆ చేప. వాళ్లు దాన్ని కోసేటప్పటికి దానికడుపులో ఇద్దరు మనిషిపిల్లలు బైటికి వచ్చారు ఒకటేమో మగపిల్ల. రెండోది ఆడపిల్ల. ఇద్దరినీ తీసుకువెళ్ళి దాశరాజు కిచ్చారు జాలర్లు మనిషిపిల్లలు కనడంతో ఈ బ్రహ్మవాక్యం ప్రకారం శాపవిముక్తి కలిగింది అద్రికకి. యథాపూర్వంగా దేవలోకానికి వెళ్ళిపోయిందామె.

మత్స్యగంధి

చేపకి పుట్టిన పిల్లవాణ్ణి మత్స్యరాజన్నారు. పెరిగి ప్రయోజకుడై మత్స్యదేశానికి రాజయాడతడు. పిల్లదాన్ని సత్యవతిఅన్నారు. ఆమె శరీరం చేపలకంపు. అంచేత, మత్స్యగంధి అనీ అన్నారు.*
ఆమెని కూతురుగా పెంచుకున్నాడు దాశరాజు. తండ్రి నియమించిన ప్రకారం యమునలో పడవ నడిపేది మత్స్యగంధి.

ఒకనాడు, పరాశరముని తీర్థయాత్ర వెళుతూ యమున దారిన వచ్చాడు. తెప్ప రేవులో మత్స్యగంధిని చూశాడు. తెప్పమీద వొంటరిగా వుందామె. వొంటిచీరెమాత్రం కట్టుకుంది. బాటసార్ల కోసం ఎదురుచూస్తోంది. ఇంకో పిట్టమనిషి లేదు రేవులో. పరాశరు డొక్కడే బాటసారి.

పడవమీద కూచున్నాడు పరాశరుడు. పక్కని పడుచుపిల్ల పడవ నడుపుతోంది. ఉయ్యాల లూగుతూ నడుస్తోంది పడవ. తొలి చూపుల్లోనే చలించాడు ముని. పడవమీద మనస్సు మనస్సులో లేదు. ఆమె కదిలిన ప్రతీకదలికకీ గిజగిజ లాడిపోతున్నాడు. తెడ్డుపట్టి ఆమె చెయ్యెత్తి నప్పుడల్లా విలవిల లాడిపోతున్నాడు. ఎంత ముని

* ఈమెకు కాళి అని మరో పేరుకూడా వుంది.

ఐతేంగాక ! ఏకాంతం. చల్లగాలి. పడుచు పిల్ల. ఎలా భరించడం ?

'కామాతురాణాం న భయం న లజ్జా' అన్నారు. లొంగి పోయాడు ముని. మనసులోని మాట మత్స్యగంధితో అననూ అనే శాడు చివరికి. భయపడిం దామె. కాదంటే శపిస్తాడేమో ! "తండ్రి చాటు కన్నెపిల్లని" అంది. "జాతిలో జాలారిదాన్ని. శరీరం చేపల కంపు. ఇలాంటి నామీద మనసుపడుతున్నావు. నువ్వు చూస్తే ఋషివి. ఏం చెయ్యనూ ? కన్నెరికం భంగ మైతే, ఇంటిమొహం ఎలా చూసేది ?" అంది.

"కన్నెరికం కలుషితం కాకుండా చేస్తాను" అన్నాడు పరా శరుడు. "భయపడకు. నువ్వు అనుకుంటున్నట్టు జాలారిదానివి కావు నువ్వు. వసురాజు వీర్యంతో అద్రిక గర్భంలో పుట్టావు. చేపలవాసనా లేకండా చేస్తా. యోజనాల తరబడి పరిమళిస్తావు" అన్నాడు. అతడి నోట్లోమాట నోట్లోనే వుంది. అంత కంపూ ఏమయిందో - సువాస నతో గుబాళించిందామె. ఆ క్షణంనుండీ మత్స్యగంధి యోజనగంధీ, గంధవతీ అయింది. చూస్తూవుండగానే ఆమె పొట్టికోక మాయ మైంది. దివ్యవస్త్రాలూ, దివ్యాభరణాలూ ఆమె శరీరంమీదికి వచ్చాయి.

యమునానది మధ్య వొక ఇసుకదిబ్బ చేరుకుంది పడవ. "చుట్టూ ఇంత ఒయలుగా వుంది" అని తలవంచుకుంది సత్యవతి. తెరలు వేసినట్టు చుట్టూ కమ్ముకున్నాయి చీకట్లు. యోజనగంధి కౌగిటిలో పారవశ్యం పొందాడు పరాశరుడు.

## వ్యాసముని

ప్రజాపతి సమానుడు పరాశరుడు. అతడి సంగమంవల్ల సద్యోగర్భంలో పుత్రోదయమైంది సత్యవతికి. కోరిన వరా లిచ్చి తన దారిని తాను వెళ్లాడు ముని. సత్యవతి కుమారుడే వ్యాసుడు. కృష్ణద్వైపాయనుడు; మహాభారత గ్రంథకర్త. పుట్టుకతోనే కపిల

జడలు వేలాడుతున్నాయి వ్యాసమునికి. జింకచర్మం వస్త్రంగావుంది. కమండలమూ, యోగదండమూ చేతిలో వున్నాయి. నమస్కరించి తల్లిముందు నుంచున్నాడు కుమారుడు. "అమ్మా, అవసరం వచ్చి నపుడు తలుచుకో నన్ను. తలిచీ తలవడంలో మీ ముందు నుంచుం టాను" అని తపోవనానికి వెళ్ళిపోయాడు. వెళ్ళి, ఘోరమైన తపస్సు చేశాడు. లోకోత్తరు డయాడు. వేదాలు విడమర్చాడు పంచమ వేదమైన మహాభారతమూ రాశాడు.

భారతయుద్ధంలో పాల్గొన్న భారతవీరు లంతా దేవ, రాక్షస, యక్ష, పక్షి, గంధర్వాదుల అంశల్లో పుట్టినవాళ్ళే. వాళ్ళ అందరి వివరాలూ చెప్పాలంటే, నిజానికి వెయ్యినోళ్ళయినాచాలవు. లోగడ పరశురాముడు దండెత్తి, ఇరవయ్యొక్కమార్లు క్షత్రియు డన్న వాణ్ణల్లా చంపాడు. భర్తలులేని క్షత్రియస్త్రీలు ధర్మం తప్పకండా తిరిగీ మునుల ప్రసాదంవల్ల సంతానవతు లయారు. కొడుకుల్నీ, కూతుళ్ళనీ కన్నారు. క్షత్రియసంతతి మళ్ళీ దేశవ్యాప్త మయింది. ప్రతీచోటా రాజు లేర్పడ్డారు. ధర్మమార్గంలో రాజ్యాలూ పాలిం చారు. జారభయం, చోరభయం లేకండా ప్రజాశాంతి ఏర్పడింది. యథాపూర్వంగా వర్ణాశ్రమాలు నడిచాయి. ఎక్కడ పడితే అక్కడ యజ్ఞాలూ అవీ సాగాయి ఇంద్రుడి ధర్మమంటూ కోరినప్పుడు వర్షాలు కురిశాయి. పాడీ పంటలతో దేశాలు సుభిక్షమయాయి. జనసంఖ్య కోట్లనుండి అర్బుదాలికి పెరిగింది. ప్రజల ఆయుః ప్రమాణమూ హెచ్చింది.

ఈ భారం మోయలేకపోయింది భూదేవి. వెళ్ళి బ్రహ్మ, విష్ణూ, మహేశ్వర్లతో మొరపెట్టుకుంది. ప్రజాక్షయముతో కాని సమస్య పరిష్కారం కాలేదు త్రిమూర్తులికి. ప్రజాక్షయం కావా లంటే వొక మహాయుద్ధం జరగాలి. అంచేత బ్రహ్మ మాట

"స్త్రీలూ బ్రాహ్మలు కానివాళ్ళూ వేదం వినకూడదు" అనడంచేత అలాంటివాళ్ళకోసం ఈ పంచమవేదం రాశాడని భాగవతం. ప్రస్కం.

ప్రకారం, విష్ణువూ, ఇంద్రుడూ వాళ్ళూ తమతమ అంశల్లో భూలోకం మీద అవతరించారు. రాక్షసులూ, యక్షులూ వాళ్ళవాళ్ళ అంశల్లో పుట్టి ప్రజాకంటకు లయారు. దేవతల అంశల్లో పుట్టినవాళ్లు పాండవులపక్షం. రాక్షసుల అంశల్లో పుట్టినవాళ్ళు కౌరవుల పక్షం ఇలా రెండు పక్షాలై పరస్పరం పోట్లాడి మరణించారు. లెక్కలేనంత జనక్షయం జరిగింది. బరువు తేలికయింది భూదేవికి.

దేవతలూ మొదలైనవాళ్ళ పుట్టుక

ఈ ప్రపంచాల పుట్టుక కంతటికీ కారణభూతు డైనవాడు బ్రహ్మ. ఆ బ్రహ్మకి మరీచీ, అంగిరసుడూ, అత్రీ, పులస్త్యుడూ, పులహుడూ, క్రతువూ అని ఆరుగురు మానసపుత్రులు. అందులో మరీచికి కశ్యపుడు పుట్టాడు. కస్యపప్రజాపతి వల్లనే చరాచరమైన ఈ భూతసంతతి యావత్తూ పుట్టింది. ఎలా అంటారా వినండి. బ్రహ్మ కుడి బొటనవేల్లో దక్షప్రజాపతీ, * ఎడమ బొటనవేల్లో భూదేవీ పుట్టారు. వీళ్ళిద్దరికీ వెయ్యిమంది కుమాళ్ళూ యాభై మంది కూతుళ్ళూ పుట్టారు. కుమాళ్ళలో వొక్కడూ గృహస్థు కాలేదు. అందరూ సాంఖ్యయోగ మభ్యసించారు. ఇంద్రియాలికి వశపడకండా జీవన్ముక్తు లయారు. పుత్రులు కలిగిన్నీ అపుత్రకు డయాడు దక్షుడు. అంచేత కూతుళ్ళని పుత్రీకరణం† చేసుకున్నాడు. వాళ్ళలో కీర్తీ లక్ష్మీ ధృతీ మేధా పుష్టీ శ్రద్ధా క్రియా బుద్ధీ లజ్జా మతీ. ఈ పదిమందినీ బ్రహ్మ కుడిరొమ్ములో పుట్టిన ధర్ము డనే మనువు కిచ్చాడు. అశ్వినీ భరణీ కృత్తికా రోహిణీ మృగశిరా ఆర్ద్రా పునర్వసువూ పుష్యమీ ఆశ్లేషా మఘా పూర్వఫల్గునీ ఉత్తరఫల్గునీ హస్తా చిత్తా స్వాతీ విశాఖా అనూరాధా జ్యేష్ఠా మూలా పూర్వా

---

* దక్షప్రజాపతి దగ్గిరనుండే స్త్రీ పురుషుల సంయోగక్రియ ఆరంభమైంది అని విష్ణుపురాణం 1. 15. 79

† పుత్రీకరణం . కూతుళ్ళకి పుట్టేకొడుకులు తన కొడుకులు కావాలని ముందే ఏర్పాటు చేసుకోవడం.

షాఢా ఉత్తరాషాఢా శ్రవణా ధనిష్ఠా శతభిషం పూర్వాభాద్రా ఉత్తరాభాద్రా రేవతీ – ఈ ఇరవైఏడుగురినీ చంద్రుడికిచ్చాడు. అదితీ దితీ దనువూ కాలా అనాయువూ సింహికా మునీ కపిలా (సురభి) వినతా క్రోధా ప్రాధా క్రూరా కద్రువా – ఈ పదముగ్గురినీ కశ్యప ప్రజాపతి కిచ్చాడు.

కశ్యపప్రజాపతికి అదితి గర్భంలో పన్నెండుగురు సూర్యులు – ఇంద్రుడూ విష్ణువూ అర్యముడూ ధాతా త్వష్టా పూషుడూ వివస్వతుడూ సవితృడూ మిత్రుడూ వరుణుడూ అంశుడూ భగుడూ కలిగారు. అదితి సంతానం గనక ఈ పన్నెండుగురూ ద్వాదశాదిత్యులయారు.

దితి గర్భంలో హిరణ్యకశిపుడు పుట్టాడు. హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడూ సంహ్లాదుడూ అనుహ్లాదుడూ శిబీ బాష్కళుడూ అని ఐదుగురు కుమాళ్లు కలిగారు. అందులో ప్రహ్లాదుడికి విరోచనుడూ కుంభుడూ నికుంభుడూ అని ముగ్గురు పుట్టారు. విరోచనుడికి బలీ, బలికి బాణాసురుడూ పుట్టారు. దితి సంతానం గనక వీళ్ళంతా దైత్యులయారు.

దనువు గర్భంలో విప్రచిత్తి శంబరుడూ నముచీ పులోముడూ లోముడూ అసిలోముడూ కేశీ దుర్జయుడూ అయశ్శిరుడూ శ్వాశిరుడూ అయశ్శంకుడూ గగనమూర్ధుడూ వేగవతుడూ కేతుమతుడూ స్వర్భానుడూ అశ్వుడూ అశ్వపతీ వృషపర్వుడూ అజకుడూ అశ్వగ్రీవుడూ సూక్ష్ముడు తుహుండుడు ఏకచక్రుడు విరూపాక్షుడు నిచంద్రుడు నికుంభుడు కుపథుడు శరభుడు సూర్యుడు చంద్రముడు ఏకాక్షుడు మృతపుడు ప్రలంబుడు నరకుడు వాతాపి శత్రుతపనుడు శరుడు గవిష్ఠుడు వనాయువూ దీర్ఘజిహ్వుడు —— ఈ నలభైమందీ పుట్టారు. కోటుకులూ మనుమలూ, మునిమనుమలూ అయి లెక్కలేనంత మంది పెరిగారు. వీళ్ళంతా దనువుసంతతి కనక దానవులయారు.

కాలగర్భంలో వినాశనుడు క్రోధుడు మొదలైనవాళ్ళు ఎనమండుగురూ, కాలకేయులూ పుట్టారు.

అనాయువు గర్భంలో విక్షరుడు బలుడు వీరుడు వృత్రుడు, ఈ నలుగురూ కలిగారు.

సింహిక గర్భంలో రాహువు పుట్టాడు. ముని గర్భంలో భీమసేనుడు ఉగ్రసేనుడు వరుణుడు గోపతీ ధృతరాష్ట్రుడు సూర్యవర్చస్సుడు సత్యవాక్కుడు అర్కపర్ణుడు ప్రయుతుడు విశ్రుతుడు భీముడు చిత్రరథుడు శాలిశిరుడు పర్జన్యుడు కలీ నారదుడు అని పదహారుగురు గంధర్వులు కలిగారు.

కపిల (సురభి) గర్భంలో ఆవులూ అమృతమూ బ్రాహ్మలూ ఘృతాచీ మేనకా మొదలైన దేవవేశ్యలూ పుట్టారు.

వినత గర్భంలో అరుణుడు గరుత్మంతుడు కలిగారు. అరుణుడికీ శ్యేని అనే దానికీ సంపాతీ జటాయువూ పుట్టారు.

క్రోధ గర్భంలో క్రోధవశగణమూ, ప్రాధ గర్భంలో సిద్ధుడు పూర్ణుడు బర్హీ పూర్ణాయువూ బ్రహ్మచారీ రతిగుణుడు సుపర్ణుడు విశ్వావసుడు భానుడు సుచంద్రుడు అని పదిమంది గంధర్వులూ అనవద్యా మనువూ వంశా అసురా మార్గణప్రియా అనూపా సుభగా భాసీ అనే కుమార్తెలూ, హాహా హూహూలు, తుంబురుడు పుట్టారు.

క్రూర గర్భంలో సుచంద్రుడు చంద్రహంత్రుడు మొదలైనవాళ్ళు పుట్టారు.

కద్రువ గర్భంలో శేషుడు వాసుకీ తక్షకుడు కర్కోటకుడు మొదలైన పాములు పుట్టాయి.

అంగిరసుడికి ఉతథ్యుడు బృహస్పతీ సంవర్తుడు అని ముగ్గురు కుమారుళ్ళూ, యోగసిద్ధ అని ఒక కూతురూ కలిగారు. వీళ్ళలో బృహస్పతి దేవగురువయ్యాడు. అత్రికి తపోధనులైన మునులు పుట్టారు. పులస్త్యుడికి రాక్షసులూ పులహుడికి కిన్నరులూ, కింపురుషులూ క్రతువుకి వాలఖిల్యులూ పుట్టారు.

ధర్ముడికి ప్రజాపతి పుట్టాడు. అతడికి ధూమ్రా బ్రహ్మవిద్యా మనస్వినీ రతా శ్వాసా శాండిలీ ప్రభాతా అని ఏడుగురు భార్యలు. ధూమ్రకి ధరుడు, బ్రహ్మవిద్యకి ధ్రువుడు, మనస్వినికి సోముడు, రతకి అహుడు, శ్వాసకి అనిలుడు, శాండిలికి అగ్ని, ప్రభాతకి ప్రత్యూషుడు, ప్రభాసుడు పుట్టారు. ఈ ఎనమండుగురూ అష్టవసువులు. అందులో ధరుడికి ద్రవిణుడు హుతహవ్యవహుడు పుట్టారు. ధ్రువుడికి కాలుడు పుట్టాడు. సోముడికి మనోహర అన్న దాని గర్భంలో వర్చసుడు శిశిరుడు ప్రాణుడు రమణుడు అని నలుగురు కొడుకులూ పృథ అని వొక కూతురూ కలిగారు. పృథకి పదిమంది గంధర్వరాజులు పుట్టారు. అహుడికి జ్యోతి పుట్టింది. అనిలుడికీ శివ అనేదానికీ మనోజవుడూ, అవిజ్ఞాతగతీ పుట్టారు. అగ్నికి కుమారుడు ప్రత్యూషుడికి దేవలుడు ప్రభాసుడికీ బృహస్పతి చెల్లెలు యోగసిద్ధకీ విశ్వకర్మ పుట్టారు. దేవతలకి విమానాలూ, ఆభరణాలూ అవీ తయారుచేస్తూ శిల్పప్రజాపతి అయాడు విశ్వకర్మ

బ్రహ్మకి ఇంకో మానసపుత్రుడు స్థాణుడు. అతడికి మానస పుత్రులై మృగవ్యాధుడు, శర్వుడు, నిరృతీ, అజైకపాదుడు అహిర్బుధ్న్యుడు, పినాకీ, వామదేవుడు, దహనేశ్వరుడు, కపాలీ, స్థాణుడు, భర్గుడు అని పదకొండుమంది రుద్రులు పుట్టారు.

ధర్ముడికి శముడు, కాముడు, హర్షుడు అని మరి ముగ్గురు కుమాళ్లు కలిగారు. వాళ్ళకి వరసగా ప్రాప్తీ, రతీ, నందా భార్యలయారు.

ఆదిత్యులలోని సవితృడికీ, ఆడగుర్రం రూపం ధరించిన త్వాష్ట్రికీ అశ్వినీదేవతలు పుట్టారు.

బ్రహ్మ హృదయంలో భృగుడు పుట్టాడు. భృగుడికి కవిపుట్టాడు. కవికి శుక్రుడు పుట్టాడు. రాక్షసులికి కులగురువయాడు శుక్రుడు. అతడికి చండుడు, అమర్కుడు, త్వష్టృడు, ధరాతుడు, అత్రీ అని నలుగురు కుమాళ్ళు కలిగారు. భృగుడి మరో కుమారుడు చ్యవనుడు.

చ్యవనుడి భార్య మనువు కూతురు ఆరుషి. ఆమె తొడలోంచి పుట్టాడు జౌర్వుడు.* ఔర్వుడికి రుచీకుడు మొదలైనవాళ్లు నూరుమంది కుమారుళ్ళు కలిగారు. అందులో రుచీకుడికి జమదగ్ని పుట్టాడు. జమదగ్నికి నలుగురు కుమారుళ్ళు. వాళ్ళలో కడసారివాడు పరశురాముడు, అవతారమూర్తి.

మనువుకి సహాయంగా, బ్రహ్మ ధాతా, విధాతా అని మరి ఇద్దరు పుట్టారు. వాళ్లతో నే పుట్టింది లక్ష్మి. లక్ష్మికి ఎందరో మంచి మానసపుత్రులు.

వరుణుడికీ జ్యేష్ఠకీ బలుడు అని ఒక కుమారుడు, సుర అని కూతురూ కలిగారు. సురకి అధర్ముడు పుట్టాడు. అధర్ముడికీ నిరృతికీ భయం, మహాభయం, మృత్యువూ అని ముగ్గురు కుమారుళ్ళు కలిగారు.

తామ్రకి కాకీ, శ్యేనీ, భాసీ, ధృతరాష్ట్రీ, శుకీ అని ఐదుగురు కూతుళ్ళు కలిగారు. అందులో కాకికి గుడ్లగూబలూ, శ్యేనికి డేగలూ, భాసికి రాంబందులూ, ధృతరాష్ట్రికి హంసలూ చక్రవాకాలూ, శుకికి చిలకలూ పుట్టాయి.

క్రోధుడికి మృగీ, మృగమందా, హరీ, భద్రమనసా, మాతంగీ, శార్దూలీ, శ్వేతా, సురభీ, సురసా అని తొమ్మండుగురు కూతుళ్ళు పుట్టారు. అందులో మృగికి లేళ్ళు పుట్టాయి. మృగమందకి ఎలుగుబంట్లూ చమరీమృగాలూ పుట్టాయి. హరికి కోతులూ, హనుమంతులూ పుట్టాయి. భద్రమనసకి ఐరావతం పుట్టింది. ఐరావతానికి దేవతల ఏనుగులు పుట్టాయి. మాతంగికి ఏనుగులు పుట్టాయి. శార్దూలికి సింహాలూ, పులులూ పుట్టాయి. శ్వేతకి దిగ్గజాలు♦ పుట్టాయి.

---

* చూ. ఏడో అశ్వాసంలో ఔర్వుడికథ.

♦ దిగ్గజాలు. ఐరావతం, పుండరీకం, వామనం, కుముదం, అంజనం, పుష్పదంతం, సార్వభౌమం, సుప్రతీకం, (ఇవి మగవి) అభ్రమువూ, కపిలా, పింగళా. అనుపమ, తామ్రపర్ణి, శుభదంతి, అంగనా, అంజనావతీ, (ఇవి ఆడవి.)

సురభికి రోహిణీ గంధర్వీ అనలా అని ముగ్గురు కలిగారు. రోహిణికి పశువులూ, గంధర్వికి గుర్రాలూ, అనలకి కొండలూ చెట్లు చేమలూ అవీ పుట్టాయి. సురసకి పాములు పుట్టాయి. ఇది భూతకోటి పుట్టు పూర్వోత్తరాల వివరణ. ఇక దేవతలూ, దానవులూ మొదలైన వాళ్ళ అంశల్లో నరలోకంలో పుట్టినవాళ్ళ వివరం చెపుతాను.

దే వ దా న వు ల అ వ తా ర క థ

మహావిష్ణువు అంశలో దేవకీ వసుదేవులికి జన్మించాడు శ్రీకృష్ణుడు. విష్ణువు అంశతోనే రోహిణీ వసుదేవులికి బలరాముడై జన్మించాడు ఆదిశేషుడు. లక్ష్మీదేవి అంశలో రుక్మిణీ, సనత్కుమారుడి అంశలో ప్రద్యుమ్నుడూ, అప్సరసల అంశలో కృష్ణుడి పదారు వేల అంతఃపురస్త్రీలూ పుట్టారు. మరిన్ని ఆయా దేవతల అంశల్లో వృష్ణి, యాదవ, భోజ, అంధక వంశాల వీరులంతా పుట్టారు.

ఎనిమిదో వసువు ప్రభాసుడి అంశలో భీష్ముడూ, బృహస్పతి అంశలో ద్రోణుడూ, కామమూ క్రోధమూ మొదలైనవాటి ఏకత్వంలో అశ్వత్థామా, ఏకాదశరుద్రుల అంశలో కృపుడూ, సూర్యుడి అంశలో కర్ణుడూ, ద్వాపరుడి అంశలో శకునీ పుట్టారు.

అరిష్టకొడుకు హంసుడనే గంధర్వరాజు ధృతరాష్ట్రుడై పుట్టాడు. మతి గాంధారి ఐ పుట్టింది. కలి అంశలో దుర్యోధనుడు పుట్టాడు. పౌలస్త్యుడి సోదరులు దుర్యోధనుడి తమ్ములయారు.

హిరణ్యకశిపుడు శిశుపాలు డయాడు. సంహ్లాదుడు శల్యుడయాడు. అనుహ్లాదుడు ధృష్టకేతుడయాడు. శిబి ద్రుమసేనుడయాడు. బాష్కలుడు భగదత్తు డయాడు. విప్రచిత్తి జరాసంధు డయాడు. అయశ్శిరుడు అశ్వశీర్షుడు అయశ్శంకుడు గగనమూర్ధుడు వేగవంతుడు కేకయరాజులై పుట్టారు. కేతుమంతుడు అమితౌజుడూ, స్వర్భానుడు ఉగ్రసేనుడూ, జంభుడు విశోకుడూ, అశ్వపతి కృతవర్మా, వృషపర్వుడు దీర్ఘప్రజ్ఞుడూ, అజరుడు మల్లుడూ, అశ్వగ్రీవుడు రోచ

మానుడూ, సూత్ర్మ్మడు బృహద్రథుడూ, దుహగు సేనాబిందుడూ, ఏకచక్రుడు ప్రతివింధ్యుడూ, విరూపాక్షుడు చిత్రధర్ముడూ, హరగు సుబాహువూ, అహరుడు బాహ్లికుడూ, చంద్రవక్త్రుడు ముంజకేశుడూ, నికుంభుడు దేవాపీ, శరభుడు సోమదత్తుడూ, చంద్రుడు చంద్రవర్మా, సూర్యుడు రుషికుడూ, మయూరుడు విశ్వుడూ, సుపర్ణుడు కాలకీర్తీ, రాహువు క్రాథుడూ, చంద్రహంత శునకుడూ, అశ్వుడు అశోకుడూ, భద్రహస్తుడు నందుడూ, దీర్ఘజిహ్వుడు కాశీరాజూ, చంద్రవినాశనుడు జానకీ, వీరుడు పౌండ్రమత్స్యుడూ, వృత్రుడు మణిమంతుడూ అయారు.

కాల కుమారుళ్ళు ఎనమండుగురూ జయత్సేనుడు అపరాజితుడు నిషదాధిపుడు శ్రేణిమంతుడు మహౌజసుడు అభీరుడు సముద్రసేనుడు బృహత్తుడు అయారు. క్రోధవశులు మద్రకుడు కర్ణవేష్టుడు సిద్ధార్థుడు కీటకుడు సువీరుడు సుబాహువూ మహావీరుడు క్రథుడు విచిత్రుడు సురథుడు నీలుడు చీరవాసుడు భూమిపాలుడు దంతవక్త్రుడు శ్రీమంతుడు రుక్మి జనమేజయుడు ఆషాఢుడు వాయువేగుడు భూరితేజుడు ఏకలవ్యుడు సుమిత్రుడు వాటధానుడు కారూషకుడు క్షేమధూర్తి శ్రుతాయువూ ఉద్వహుడు బృహత్సేనుడు క్షేమూడు అగ్రతీర్థుడు కుహరుడు మతిమతుడు ఈశ్వరుడు ఐ జన్మించారు. కాలనేమి కంసుడయాడు.

స్త్రీ పురుష రూపుడైన గుహ్యకుడు శిఖండి అయాడు. గాలి అంశలో పాండురాజూ, వాయువుల అంశలో ద్రుపదుడూ సాత్యకీ విరాటరాజూ పుట్టారు. యముడు విదురుడై పుట్టాడు. సిద్ధీ బుద్ధీ ఇద్దరూ కుంతీ మాద్రీ అయారు.

యముడి అంశలో ధర్మరాజూ, వాయువు అంశలో భీముడూ ఇంద్రుడి అంశలో అర్జునుడూ, అశ్వినీదేవతల అంశలో నకుల సహదేవులూ పుట్టారు. లక్ష్మి అంశలో ద్రౌపది పుట్టింది. అగ్ని అంశలో ధృష్టద్యుమ్నుడు పుట్టాడు. ఇది దేవదానవుల అవతారకథ.

## కౌరవవంశం

కశ్యపప్రజాపతికి అదితి గర్భంలో కలిగిన ద్వాదశాదిత్యుల్లో వివస్వతుడికి వైవశ్వతమనువూ యముడూ శనైశ్చరుడూ యమునా తపతీ పుట్టారు. మనువుకి బ్రాహ్మలూ, రాజులూ, కోమట్లూ, శూద్రులూ వాళ్ళూ పుట్టారు. అంతేకాదు, వేనరాజూ మొదలైన యాభైమంది రాజులూ పుట్టి వాళ్ళలో వాళ్ళు దెబ్బలాడుకుని కాలం చేశారు. అతడికి ఇళ అని కూతురూ వుండేది * ఇళకీ చంద్రుడి కొడుకు బుధుడికీ పురూరవుడు పుట్టాడు. పదమూడు ద్వీపాలు పరిపాలించిన చక్రవర్తి పురూరవుడు. బ్రాహ్మలమీదికి దండెత్తాడీయన. వాళ్ళ డబ్బంతా దోచుకునేవాడు. అది ఆపించడానికి సనత్కుమారుణ్ణిపంపాడు బ్రహ్మ. ఎంతోమంది మునులతో కూడా వచ్చాడు సనత్కుమారుడు. అసలు వాళ్ళకి దర్శనమే ఇచ్చాడు కాదు పురూరవుడు. పైగా వెక్కిరించాడు. కోపం వచ్చి పిచ్చివాడివి కమ్మని శపించారు మునులు. దాంతో గంధర్వలోకానికి వెళ్ళాడతడు. అక్కడ దేవవేశ్య ఊర్వశితో క్రీడిస్తూ వుండేవాడు. అతడికి ఊర్వశి గర్భంలో ఆయువూ ధీమంతుడూ అమావసువూ దృఢాయువూ అనాయువూ శతాయువూ అని ఆరుగురు కుమాళ్ళు కలిగారు. వాళ్ళలో ఆయువుకీ, స్వర్భానవి అన్న దానికీ నహుషుడు వృద్ధశర్మ రజీ గయుడు అనేనసుడు అని ఐదుగురు పుత్రులు పుట్టారు. అందులో పెద్దవాడు నహుషుడు రాజయ్యాడు. నాలుగు సముద్రాలమధ్య వున్న భూమండలం యావత్తూ, అడవులూ కొండలూ ద్వీపాలతో

ఇళ కొంత కాలం పురుషుడుగానూ కొంత కాలం ఆడదిగానూ వుండేదట. కొడుకుకోసం మనువు మిత్రావరుణములని రెండు యజ్ఞాలు చేశాడు. హోత విపరీత సంకల్పంవల్ల కొడుకుకి బదులు కూతురు కలిగింది. ఆమే ఇళ. ఆమెని బుధుడు ప్రేమించాడు. వాళ్ళిద్దరికీ పురూరవుడు కలిగాడు. ఇళ పురుషుడుగా వున్నప్పుడు అతడి పేరు సుద్యుమ్నుడన్నారు. సుద్యుమ్నుడికి ఉత్కలుడూ గయుడూ, వినతుడూ ముగ్గురు కుమాళ్ళని విష్ణుపురాణం.

సహా పరిపాలించాడాయన. నూరు యజ్ఞాలు చేశాడు. తుదకి ఇంద్ర పదవికూడా అనుభవించాడు.

నహుషుడికి ప్రియంవద గర్భంలో యతీ యయాతీ సంయాతీ యాయాతీ అయతీ ధ్రువుడూ అని ఆరుగురు కుమాళ్లు. వీళ్ళల్లో యయాతి మహారాజయాడు. ఎన్నో యజ్ఞాలూ అవీ చేశాడు. శుక్రాచార్యుడి కూతురు దేవయాని గర్భంలో యదుడు తుర్వసుడు అని ఇద్దరు కుమాళ్ళనీ, రాక్షసరాజు వృషపర్వుడి కూతురు శర్మిష్ఠ గర్భంలో ద్రుహ్యువూ అనువూ పూరుడు అని ముగ్గురు కుమాళ్ళనీ కన్నాడు. శుక్రుడి శాపం వల్ల ముసిలివాడయాడు. తండ్రి ముసిలితనం తాను పుచ్చుకుని తనయవ్వనం తండ్రికిచ్చాడు పూరుడు. అంచేత, కడసారివాడైనా, అతణ్ణే రాజుచేశాడు యయాతి. యయాతి చరిత్ర వినదగ్గది. చెప్తాను వినండి.

## మృతసంజీవని

రాక్షసరాజు వృషపర్వుడి దగ్గిర ఆచార్యుడుగా వుండేవాడు శుక్రుడు. ఎన్నోవిధాల మాయోపాయాలూ అవీ చేస్తూ రాక్షసులికి మేలుచేస్తూ వుండేవాడు. దేవతలకీ రాక్షసులికీ జరిగిన యుద్ధంలో చచ్చిన రాక్షసుల్ని ప్రతీదినం మృతసంజీవనీ విద్యతో బతికించేసేవాడు. ఎల్లప్పుడూ తరుగూ విరుగూ లేకండా వుండేది రాక్షససైన్యం. దేవతల సైన్యం క్షీణిస్తూ వుండేది. అది కనిపెట్టి బెంగపెట్టుకున్నారు దేవతలు. "మనమూ సంపాదించాలి మృతసంజీవని. లేకపోతే లాభంలేదు" అని నిశ్చయించారు. బావుంది, కాని అది సంపాదించడ మెలాగ? శుక్రుడి దగ్గిరికి వెళ్ళి అది తేగల శక్తిమంతు డెవరు? అందరూ కలిసి బృహస్పతి కొడుకు కచుడి దగ్గిరికి వెళ్లారు.

"దేవకార్యం చేసి పుణ్యం కట్టుకో" అన్నారు. "యుద్ధంలో చచ్చికూడా బతికేస్తున్నారు రాక్షసులు. శుక్రుడి మృతసంజీవని

వాళ్లకుంది. మన కది లేదు మన సేనలు తరిగిపోతున్నాయి. ఇలా మరి కొన్నాళ్ళు జరగనిస్తే సర్వనాశనం తప్పదు మనకి. శుక్రుడి దగ్గిర మృతసంజీవని నేర్చుకు రావాలి. దీనికి అన్ని విధాలా నువ్వే సమర్థుడివి. యువకుడివి. బుద్ధిమంతుడివి. నిన్ను చూస్తేనే అనురాగం కలుగుతుంది శుక్రుడికి. అతడికి కొక కూతురూ వుంది. దేవయాని * అదంటే ప్రాణంపెడతా డతడు. అది ఎంత చెపితే అంత. నీ చాకచక్యం యావత్తూ వినియోగించి, దాన్ని వశపర్చుకున్నావా, కోట్లో పాగా వేశా వన్నమాటే, వెళ్ళు. ఈ మహోపకారం చెయ్యి. మా ప్రాణాలు రక్షించు'' అన్నారు.

''మహాప్రసాదం'' అని వృషపర్వుడి పట్నానికి బయల్దేరాడు కచుడు.

కచుడు వచ్చేసరికి రాక్షస పిల్లలికి చదువు చెపుతున్నాడు శుక్రాచార్యులు. దండప్రణామం చేశాడు కచుడు, ''బృహస్పతులవారి కుమారుణ్ణి, కచుణ్ణి. మీ శిష్యరికానికి వచ్చాను. అనుగ్రహించండి'' అన్నాడు. అతడి వినయం, వర్చస్సూ, మాటలూ ఆకర్షించాయి శుక్రుణ్ణి. ''బావుంది, బృహస్పతి కొడుకువంటే, బృహస్పతి అంతవాడి వన్నమాట! అన్నాడు. అతణ్ణి పూజిస్తే బృహస్పతిని పూజించినట్టే అని అభ్యాగత పూజలతో ఆదరించాడు. శిష్యుడిగా ఇంట్లో పెట్టుకున్నాడు.

అదే మొదలు, ఇంత మంచి శిష్యుడు లేడనిపించాడు కచుడు. చెప్పిన పని క్షణాలమీద చేసుకు వచ్చేవాడు. ఏమన్నా సరే ఎదురు చెప్పేవాడు కాడు. గురువుకంటే, గురువు కూతురు దేవయానికి మరీ విధేయుడుగా వుండేవాడు. ఆమె కనుసన్నల్లో మసులుకుండేవాడు. దగ్గిర కూచుని మంచి మంచి కబుర్లు చెప్పే

* ఇంద్రుడి కూతురు జయంతి గర్భంలో శుక్రుడికి కలిగిన కూతురు దేవయాని. చూ. జయంతి శుక్రుల ప్రేమకథ బ్రహ్మాండపురాణం.

వాడు. అడివంతా తిరిగి మంచిమంచి పళ్లూ, మంచి మంచి పువ్వులూ తెచ్చిపెట్టేవాడు. ఇలా ఎన్నో సంవత్సరాలు శుశ్రూష చేశాడు. కచుడు వొక నిమిషం లేకపోతే గడిచేదికాదు శుక్రుడికి. కచుడే కళ్ళ వెలుగు దేవయానికి.

ఇదంతా చూసి సయించలేకపోయారు రాక్షసులు. కచుడంటే కడుపుమంట వాళ్ళకి. ఒకనాడు గురువుగారి ఆవులు కాస్తున్నాడు కచుడు. అడివిలో వొంటరిగా దొరికాడు. కనపడ్డమే తడువు, కలియబడ్డారు రాక్షసులు. చంపేశారు కచుణ్ణి. శవాన్ని నో చెట్టు మొదలుకి కట్టివేసి, ఎవళ్ళదారిని వాళ్ళు వెళ్ళిపోయారు.

పశువులు వచ్చేవేళ అయింది. కచుడికోసం కనిపెట్టుకు కూచుంది దేవయాని. ఆవులు వచ్చేశాయి వాటి వెనక కనపల్లేదు కచుడు. కడుపులో దేవేసినట్టయింది దేవయానికి. పొద్దుగూకింది. చీకటిపడింది. ఆశ్రమంలో అగ్నులూ ఆరంభమైనాయి. కచుడి జాడ కనపడదు. జీవితమే చీకటిపడినట్టయింది దేవయానికి. తండ్రిదగ్గిరికి పరిగెత్తింది. "కచుడు రాలేదండీ నాన్నగారూ," అంది. "ఇంత రాత్రయింది. ఆవులేమో వచ్చేశాయి. అడివిలో పులే తినేసిందో? పామే కరిచిందో! రాక్షసులే ఏమన్నా చేశారో!" అని బావురుమంది. దివ్యదృష్టితో చూశాడు శుక్రుడు. మృత సంజీవని పంపాడు. ఉత్తరక్షణంలో బతికి వచ్చాడు కచుడు.

మరోనాడు అడివిలో పువ్వులేరుతున్నాడు కచుడు. మళ్ళీ చంపేశారు రాక్షసులు. ఈసారి కాల్చి బూడిద చేశారు. అదంతా కల్లులో కలిపి శుక్రాచార్యుడి కిచ్చారు. తెలియకుండా తాగేశాడు శుక్రాచార్యులు.

పువ్వులకోసం వెళ్ళిన కచుడు పొద్దెక్కి, మధ్యాహ్నమయినా ఇంటికి రాలేదు. మళ్ళీ మతిపోయింది దేవయానికి. తండ్రితో చెప్పింది. మాంచి నిషాలో వున్నాడు తండ్రి. "పోనిస్తూ

అమ్మా, కచుడంటే కళ్లుకుడుతున్నాయి వీళ్ళకి. మళ్ళీ చంపేసే వుంటారు. వచ్చి స్వర్గానికే పోతాడు వాడు. పోనీ. మధ్యని నీ కెందుకూ విచారం! ఊరుకో" అన్నాడు. "ఎలా వూరుకో మన్నారు నాన్నా?" అంది దేవయాని. "దేవగురు వంశవాడి కొడుకు. మీకు తల్లోనాలికలాంటి శిష్యుడు. అందగాడు. బ్రహ్మచారి. అన్నిటికంటే ఇప్పుడు మనవాడు. మీ రేమన్నా అనండి. కచుడు వచ్చేదాకా పచ్చి మంచినీళ్ళయినా ముట్టను నేను" అంటూ ఏడుస్తూ కూచుంది.

కొంతసే పయాక నిషా తగ్గింది శుక్రుడికి. యోగదృష్టితో చూశాడు. పద్నాలుగు లోకాల్లో ఎక్కడా కనపళ్ళేదు కచుడు. తుదకిచూస్తే తన గర్భంలోనే బూడిదరూపంలో వున్నాడు. ఇదంతా కల్లుచేసిన అనర్థమని గ్రహించాడు. "ఎన్నో జన్మలెత్తి సంపాదించిన జ్ఞానమంతా క్షణంలో నాశనం చేస్తుంది కల్లు. తాగడమే కాదు, తాకనన్నా కూడదు దీన్ని. ఇవాళనుండీ మనిషన్నవాడు మద్యపానం చెయ్యకూడదు. ఇది నా శాసనం. కాదని తాగినవాడు ఘోరమైన నరకంలో పడతాడు" అని శాసించాడు. మృతసంజీవని ప్రయోగించి కడుపులోని కచుణ్ణి బతికించాడు.

కడుపులోంచే ప్రార్థించాడు కచుడు. "ప్రాణంపెట్టి బతికించారు. పైకి వచ్చే మార్గం ప్రసాదించండి" అన్నాడు. ఏందారి? కడుపు చీలిస్తే కాని బైటికి రాడు కచుడు. చీలిస్తే తన గతేంగాను? ముందు నుయ్యి, వెనక గొయ్యి అయింది ఆచార్యుడిపని. ఆలోచించాడు కచుడికి మృతసంజీవని ఉపదేశించాడు. "కడుపు చీల్చుకు బైటికిరా. తిరిగి నన్ను బతికించు" అన్నాడు. ఉదయపర్వతం గుహలోంచి ఉదయించుకు వచ్చిన సూర్యబింబంలా శుక్రుడి కడుపు చీల్చుకు పైకి వచ్చాడు కచుడు. చచ్చి పడివున్న గురువుని మృతసంజీవనితో బతికించాడు. ఎలాఐతేనేం, వచ్చినపని సాధించాడు కచుడు. మృతసంజీవని పట్టుబడింది.

కచుడూ దేవయాని

కొన్నాళ్ళయాక గురువుగారి సెలవు తీసుకున్నాడు కచుడు. దేవలోకానికి ప్రయాణమయాడు. బయల్దేరేముందు దేవయాని దగ్గిరికి వచ్చాడు. స్నేహంగా పిలిచాడు. "వెళ్ళొస్తా" నన్నాడు. గుండెల్లో రాయిపడ్డట్టయింది దేవయానికి. కళ్ళనీళ్ళు తిప్పుకుంటూ నాలింది. "ఎక్కడికి వెళ్ళిపోతావు?" అంది దీనంగా. "నన్ను వొదిలేసినా ప్రయాణం?" అంది. "వొద్దు. నే చెప్పేది విను. బ్రహ్మచారివి నువ్వు. కన్యని నేను. తొలిచూపులనాడే దంపతులమై పోయాం మనం. మృత సంజీవనితో నన్నుకూడా పరిగ్రహించు. సుఖపడదాం. నాన్నగారూ సంతోషిస్తారు" అంది.

చెవులు మూసుకున్నాడు కచుడు. "చెల్లెలివి. ఇలా అనవచ్చా నువ్వు? గురుపుత్రివి కదా" అన్నాడు. ఈ నిరాకరణం సయించలేక పోయింది దేవయాని. దెబ్బతిన్న తాచులా లేచింది. శపించింది. "నా కోర్కె నిరాకరించావు. కాల తన్నుకు పోతున్నావు నన్ను. వెళ్ళు. నీవు నేర్చుకున్న మృతసంజీవని పనిచెయ్యకుండా వుండాలి నీకు" అంది. "అక్రమంగా శపిస్తున్నావు నన్ను. మృతసంజీవని నాకు పని చెయ్యకపోతే పోయింది. నావల్ల ఉపదేశంపొందిన వాళ్ళకి చేస్తుంది" అన్నాడు కచుడు. "అధర్మం కోసం అక్రమానికి నెట్టుకున్నావు. బ్రాహ్మడన్నవాడు పెళ్ళాడ కూడదు నిన్ను" అని ప్రతిశాపం పెట్టాడు. ఇక ఓ క్షణం కూడా నుంచోకుండా దేవలోకం వచ్చేశాడు. వచ్చి, తండ్రి బృహస్పతికి మృతసంజీవని ఉపదేశించాడు.

శర్మిష్ఠ

రాక్షసరాజు వృషపర్వుడికి శర్మిష్ఠ అనే కూతురుండేది. ఆమె వొకనాడు వెయ్యిమంది చెలికత్తెలతో వనవిహారానికి బైల్దేరింది. ఆమె వెంట దేవయాని కూడా వుంది. అందరూ కలిసి వొక సరస్సు దగ్గిరికి వెళ్ళారు. చీరెలు విప్పి వొడ్డుమీద పెట్టి జల

క్రీడలు ప్రారంభించారు. ఇంతలో సుడిగాలి వచ్చింది. చీరె లన్నీ ఎగరవేసి కలగాపులగం చేసింది. చూసి, అంతా గొల్లుమని పరిగెత్తుకు వచ్చారు. ఎవళ్ళకి దొరికిన చీర వాళ్ళు తీసి కట్టుకున్నారు. ఆ గందికలో దానిచీర దీనికీ దీనిచీర దానికీ — ఇలా తారుమారయింది. దేవయానిచీర శర్మిష్ఠ కట్టుకుంది. శర్మిష్ఠచీర దేవయానికి దొరికింది. ఐతే, దాన్ని ముట్టుకోలేదు దేవయాని. అసహ్యించుకుంది. "బ్రాహ్మణపిల్లని నేను గురువుగారి కుమార్తెని. నాకు దండంపెట్టవలసిన దానివి నువ్వు. నీ మైల చీరా, నేను కట్టుకుంటాను!" అంటూ ధుమ ధుమ లాడింది. "మా దగ్గిర పనిచేసుకు బతుకుతున్నాడు మీ అయ్య. నువ్వు నా దగ్గిర గీర్వాణాలు తీస్తున్నావు. పై పెచ్చు సిగ్గూ సెరమూ లేకండా మాట్లాడుతున్నావు. ఇంతకీ, నా చీరెలాంటి చీర నీకు దొరకడమెలాగ!" అంటూ చర్రుమంది శర్మిష్ఠ. అంతతో వూరుకో లేదు. పక్కనే వున్న పాడు నూతిలో దేవయానిని పడదోసి, చెలికత్తెలతో కూడా ఇంటికి వెళ్ళిపోయింది.

### యయాతి

దిసమొలతో నూతిలోనే వుండిపోయింది దేవయాని. కొంతసేపటికి దైవికంగా, వేటాడుతూ అక్కడికే వచ్చాడు యయాతి. బాగా అలిసిపోయి వున్నాడాయన. నీళ్ళకోసం నూతిలోకి తొంగి చూశాడు. గతుక్కు మన్నాడు. ఒక తీగె మాత్రం పట్టుకుని లోపల వుంది దేవయాని. స్తనాలమీద కన్నీళ్ళు పడుతున్నాయి. సహాయంకోసం ఎదురు చూస్తూనూ వుంది. "ఎవరు నువ్వు! నూతిలో ఎలా పడ్డావు!" అన్నాడు యయాతి. ఆయన వేటకి రావడం ఎన్నోసార్లు చూసే వుంది దేవయాని. మహారాజని పోల్చుకుంది. "శుక్రాచార్యుల కుమార్తెని. దేవయానిని. ప్రమాదవశాత్తూ పడిపోయాను. సహాయం చెయ్యండి" అంది.

చెప్పిన కుడిచెయ్యి అందించాడు యయాతి. భద్రంగా పైకి తీశాడు దేవయానిని.

యయాతి వెళ్ళిపోయాక కొంతసేపటికి దేవయానిని వెదుక్కుంటూ వచ్చింది ఆమె పరిచారిక ఘూర్ణిక. శర్మిష్ఠ సంగతంతా ఆమెతో చెప్పింది దేవయాని. "వెళ్ళు. నేను వృషపర్వుడి పట్నంలో అడుగు పెట్టను మరి. శర్మిష్ఠ నాకు చేసిన పరాభవం నాన్నగారితో చెప్పు" అంది.

ఘూర్ణిక చెప్పడంతోనే పరిగెత్తుకు వచ్చాడు శుక్రాచార్యులు. ఏడుస్తూ కూర్చున్న కూతుర్ని ఓదార్చాడు. "నీకంటే చిన్నది శర్మిష్ఠ. పైపెచ్చు రాజకూతురు. దాంతో పంతమేమిటిమనకి? రా శాంతించు. కోపం కూడదు. వెయ్యి యజ్ఞాలు చేసినవాళ్ళకంటే కోపం తెచ్చుకోనివాళ్లు గొప్పవాళ్ళు. ఒకరు తిడితే తిరిగి తిట్ట కూడదు నిందిస్తే వినిపించుకో కూడదు. ఒకరివల్ల కష్టపడ్డా వాళ్ళకి చెడ్డ తలచ కూడదు. బుద్ధిమంతురాలివి. నీకు చెప్పాలా?" అన్నాడు. "అది కాదు నాన్నా," అంది దేవయాని. "స్నేహంతోనూ, ఉపకారంతోనూ మసులు కుంటున్నవాళ్లని ఊరికే నూలనాడు తూంటే — అలాంటి చోట వుండడం కంటే అగుడుక్కు తినడం మంచి దంటాను. మన మేమంత చేతకానివాళ్లమా! పోనీ 'అమ్మా, నీ ప్రసాదమే గతి' అని పడి వుండడానికి! ఉంహూం, వృషపర్వుడి పట్నంలో మాత్రం పాదం పెట్టను. కావలిస్తే మీరు వెళ్లండి నేను ఎక్కడి కన్నా పోతాను" అంటూ భీష్మించుకు కూచుంది. "అదేమిటి తల్లీ, నువ్వు వెళ్ళక పోతే నేనుమాత్రం వెళతానా? నీ తోనే నేనూనూ. నాకుమాత్రం ఎవరున్నా రసీ" అన్నాడు శుక్రుడు.

ఈ సంగతంతా చారులవల్ల విన్నాడు వృషపర్వుడు. వెంటనే వచ్చి ఆచార్యుడి కాళ్ళావేళ్ళా పడ్డాడు. "అపరాధం క్షమించండి" అన్నాడు. "ఈ ఆస్తీ పాస్తీ, ఈ రాజ్యం, ఈ

ప్రజా, అంతా మీరు పెట్టిన భిక్ష. మీరే లేకపోతే, ఏనాడో మమ్మల్ని ఆపోశనం పట్టేసేవాళ్లు దేవతలు. మీవల్లే వో ఇంటి వాళ్ళమై బతుకుతున్నాము. లేకుంటె, ఏ సముద్రాల్లోనో దూక వలిసింది. అమ్మాయిగార్ని శాంతించ మనండి. ఆమె ఏది కోరితే అది ఇచ్చుకుంటాను'' అన్నాడు. "ఐతే, తన వెయ్యిమంది చెలి కత్తెలతోనూ శర్మిష్ఠని దాసీగా చెయ్యి నాకు'' అంద దేవయాని. "తప్పకుండా'' అన్నాడు వృషపర్వుడు. నుంచున్న పాటుని కూతుర్ని తెప్పించాడు. దేవయానికి దాసీగా సమర్పించాడు. తండ్రి మాట ప్రకారం వెయ్యిమంది చెలికత్తెలతోనూ దేవయాని చెప్పిన పను లన్నీ చేస్తూ వుండేది శర్మిష్ఠ

ఈసారి దేవయాని బైలుదేరింది వనవిహారానికి శర్మిష్ఠతో సహా అంతమంది చెలికత్తెలూ వెంటవున్నారు. అంతమంది స్తనాలికీ కుంకుమం, చందనం రాసుకున్నారు. జడల్లో రకరకాల పువ్వులు ముడుచుకున్నారు మంచిమంచి కర్పూర తాంబూలాలు వేసుకున్నారు. ముస్తాబైన దుస్తులికి సుగంధద్రవ్యాలు ధూపాలు వేశారు. ఈ అన్నింటి వాసనా మోసుకుని వెర్రిపరుగులు పరిగెడు తున్నాది అడివిగాలి. అడివంతా గుప్పుమంటోంది.

అందరూ కలిసి వొక సెలయేరు దగ్గిరికి వెళ్ళారు. అక్కడ తియ్యమామిళ్ళూ, గోరింటచెట్లూ అశోకవృక్షాలూ, తమాల వృక్షాలూ పూసి, గుమగుమ లాడుతూవుంది వనం. పువ్వులేరుతూ, నవ్వుతూ, కేరుతూ ఆ చెట్లనీడని కేళీవినోదాలతో విహరిస్తున్నారు దేవయాని, శర్మిష్ఠా, చెలికత్తెలూను.

అవాళా వేటకి వచ్చాడు యయాతి. ఇటు రమ్మని పిలిచి నట్టయింది, ఈ యవ్వనవతుల పరిమళాలతో వెళ్ళి తనని తాకిన అడివిగాలి, సువాసన పసికడుతూ అక్కడికే వచ్చేశాడతడు. వెయ్యి మంది కన్యలకళ్ళూ వొక్కసారి పడ్డాయి రాజుమీద. పద్మాక్షి

షేకం ఐనట్టయింది అతడికి పరివార మందరితోనూ కలిసి అత్నణ్ణి పూలతో పూజ చేసింది దేవయాని.

యయాతికి తెలిసినపిల్లే దేవయాని. ఐతే, అందరిలోకీ అందంగా వుంది శర్మిష్ఠ. అతడి కళ్ళన్నీ ఆమె మీదే వున్నాయి. ఆమె ఎవరో తెలుసుకోవాలి. "మీరంతా ఎవరైనట్టు?" అని ప్రశ్నించాడు మెల్లగా. "మరిచిపోయారేమో మహారాజా, అవాళ నూతిలోంచి చెయ్యిచ్చి తియ్యలేదూ నన్ను?" అంది దేవయాని. "ఈ పిల్ల నా దాసీది, శర్మిష్ఠ. రాక్షసరాజు వృషపర్వుడు లేడూ, ఆయనకూతురు. ఎప్పుడూ కనిపెట్టుకుని వుంటుంది నన్ను."

"అవాళనుండీ మళ్ళీ మీరెప్పుడు కనిపిస్తారాఅని చూస్తూన వున్నాను. రాజ్యలక్ష్మిని చేపట్టిన మీ కుడిచేత్తోనే నా చెయ్యి పట్టి పైకితీశారు నన్ను. అపుడు సూర్యనారాయణమూర్తే సాక్షి మనకి. ఇక వేదోక్తమైన బాహ్యకర్మే తరవాయి. అదీ పూర్తిచేసి పరిగ్రహించండి నన్ను. ఈ వెయ్యిమంది కన్యలూ శర్మిష్ఠతో సహా నాకు మల్లేనే మీకూ దాసీ లౌతారు. దేవేంద్రుడి లాగ దివ్యభోగా లనుభవిస్తారు" అంది. "అదెలాగ?" అన్నాడు యయాతి. "బ్రాహ్మణపిల్లవి నువ్వు. ధర్మరక్షణ చేస్తూన్న రాజుని నేను. ధర్మ భంగ మెలాచేసేది?" అన్నాడు. "ఐతే పోనీ. మా నాన్నగారు వచ్చి ఇది అధర్మం కాదంటే వొప్పుకుంటారా?" అంది దేవయాని. "ధర్మా ధర్మాలు తెలిసి నడుపుతూన్న మహామునీశ్వరు డాయన. ఆయనే చెపితే అభ్యంతర మేమిటి!" అన్నాడు యయాతి.

తండ్రికి కబురుచేసింది దేవయాని. వెంటనే బయలుదేరి వచ్చాడు శుక్రుడు. పాదాభివందనం చేశాడు యయాతి. "అవాళ నూతిలో ఈయనే నా చెయ్యి పట్టుకున్నారు నాన్నా!" అంది దేవయాని. "ఈయన కందించిన చెయ్యి ఇంకొకరి కెలా ఇచ్చేది చెప్పండి! అంచేత, ఈ జన్మలో ఈయనే నా భర్త. ధర్మ

విరుద్ధ మేమో అని సందేహిస్తున్నారు మహారాజు. మీరు చెపితే వినుకుంటా నంటున్నారు. చెప్పండి నాన్నా, అధర్మం లేకండా అనుగ్రహించండి" అంది. "మీ ఇద్దరి వివాహం అధర్మం కాకుండా శాసిస్తున్నాను నేను" అన్నాడు శుక్రాచార్యులు

ఇంటికి తీసుకు వెళ్ళాడు యయాతిని. దేవయాని నిచ్చి దివ్యవైభవంగా వివాహం చేశాడు. అంపకా లప్పుడు శర్మిష్ఠని చూపాడు. "వృషపర్వమహారాజు" కూతు రిది. ఎండకన్నెరగని పిల్ల. దీని సంరక్షణ విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి ఐతే, మంచం పొత్తు మాత్రం పరిత్యజించాలి" అన్నాడు. సపరివారంగా భార్యని వెంటపెట్టుకుని రాజధానికి వచ్చేశాడు యయాతి. అంతః పురంలో అందమైన అద్దాలమేడలో వుంచాడు దేవయానిని. ఆమె చెప్పిన ప్రకారం శర్మిష్ఠనీ, వెయ్యిమంది కన్యల్నీ అశోక వనంలో పెట్టాడు. దేవయానితో ఇష్టభోగా లనుభవిస్తున్నాడు. కొన్నాళ్ళకి ఆమె గర్భంలో యదుడూ, తుర్వసుడూ అని ఇద్దరు కుమాళ్ళు కలిగారు.

పాపం, అలా నిండుయవ్వనంతో అశోకవనంలో వుంటూ వుండేది శర్మిష్ఠ. రుతుమతిగా వుంది వొకనాడు. తల్లో అనేక భావాలు పరిగెడు తున్నాయి. "ఎందుకూ కాకుండా ఐపోయింది నా యవ్వనం. కారడవిలో పూసిన పువ్వులా ఈ రుతుకాలం కూడా వ్యర్థ మవుతుంది."

"కోరినభర్త దొరికాడు దేవయానికి. బంగారంలాంటి కొడుకులు కనింది. ఎంత అదృష్టం! ఏం నోములు నోచిందో, బ్రాహ్మణ పిల్ల మహారాణీ అయి కూచుంది."

"నన్నెప్పుడూ సాకూతంగానే చూస్తాడు రాజు. నా మనస్సూ ఆయనమీదే వుంది. దేవయానిలా ఆయనభార్య నయ్యే భాగ్యం లేనేలేదు కాబోలు!"

ఇలా తలపోసుకుంటూ కూచుంది పుణ్యంపండినట్టు అదే సమయానికి అశోకవనానికి వచ్చాడు యయాతి. ఒంటిపాటుని కంట పడింది యవ్వనవతి శర్మిష్ఠ. చిరునవ్వుతో ఎదట నుంచున్నాడు యయాతి. తడబడుతూ లేచింది శర్మిష్ఠ. అంజలి బంధం గుండెకి తగిలించి నమస్కారంచేసింది. ఇలాంటి అవకాశం కోసమే ఎదురు చూస్తోం దామె. సంకోచించి అవకాశం జారవిడవకూడ దనుకుంది. సాహసించింది. "భార్యా, పరిచారికా, కుమారుడూ - వొద్దన్నా వదలనిసొత్తు వీళ్ళు. మా యజమానురాలి భర్తలు మీరు. అంచేత, మహారాజా, నాకూ మీరే భర్తలు. మీకు తెలీని ధర్మ మేముంది గనక! దేవయానిని పరిగ్రహించి నపుడే మేమంతా మీవాళ్ళ మయాము. ఋతుమతిగా వున్నాను. పరిగ్రహించండి" అంది.

"నిజమే నువ్వన్నది. కానైతే, పడకపొత్తు వద్దన్నారు మామ గారు. అంగీకరించాను నేను. అది అతిక్రమించి అసత్యదోష మెలా తెచ్చుకోనూ!" అన్నాడు యయాతి. "ప్రాణంమీదికీ, ధనంమీదికీ వచ్చినప్పుడూ, పరిహాసాల్లోనూ, స్త్రీలని బతిమాలి నప్పుడూ, పెళ్ళిళ్ళలోనూ అబద్ధ మాడవచ్చన్నారు పెద్దలు. పెళ్ళిలో వొప్పుకున్నారు మీరు. అది అంత పట్టించడ మెందుకూ!" అంది శర్మిష్ఠ. కౌగిటిలోకి లాక్కున్నాడు యయాతి.

గర్భవతిఐంది శర్మిష్ఠ. పదిమాసాల్లో చక్కని కొడుకుని కంది. నివ్వెరపోయింది దేవయాని. "కన్నెపిల్లవి. చెడునడతలూ లేవు నీకు. కొడుకు నెలా కనేశావు?" అనిఅడిగింది. సిగ్గుతో ముడుచుకుపోయినట్టయింది శర్మిష్ఠ.

"ఋతుస్నానం చేసి కూచున్నా నొకనాడు. ఎక్కడినుండో వచ్చాడొక ఋషి. పుత్రభిక్ష పెట్టి చక్కాపోయాడు" అంది.

యయాతి శర్మిష్ఠల సంయోగం గోప్యంగా అనేక సంవత్సరాలు సాగింది. వరసగా ద్రుహ్యూ, అనుహ్యూ, పూరుడూ అని

ముగ్గురు కుమాళ్లు కలిగారు. ఒకనాడు ముగ్గురూ కూచున్నారు తండ్రిదగ్గిర. ముగ్గురూ యజ్ఞంముందు పెట్టిన మూడు అగ్నిహోత్రాల్లా ప్రకాశిస్తున్నారు. గాలికి కదలాడుతున్న వాళ్ళ కపిల జడలు మండుతూన్న మంటలలా వున్నాయి. రత్నాభరణాలతో శరీరకాంతులు వెలుగుతూన్న అగ్ని తేజస్సులా వున్నాయి.

ఇంతలో అక్కడికే వచ్చింది దేవయాని. శర్మిష్ఠా, వెయ్యిమంది చెలికత్తెలూ వెంట వున్నారు. దేవతల రాణిలా వుంది దేవయాని. కుమాళ్ళని చూసి గతుక్కుమంది ముగ్గురూ పోత పోసినట్టు అచ్చంగా యయాతిలాగే వున్నారు. "ఎవరి పిల్లలండీ, వీళ్ళు ? అని గుచ్చి గుచ్చి అడిగింది యయాతిని. పలుకూ, ఉలుకూ లేదు యయాతి. కుమాళ్ళనే అడిగింది, "మీ అమ్మా, నాన్నా, ఎవరబ్బాయిలూ ?" అని. లేత చేతులెత్తి శర్మిష్ఠనీ యయాతినీ చూపించారు కుమాళ్లు. వెయ్యిమంది చెలికత్తెల మొహాలూ వెయ్యి పద్మాలు వికసించినట్టయాయి. తల వంచుకుంది శర్మిష్ఠ. దేవయాని మొహంలో చిక్కితే నెత్తురు లేదు. ఒక్క మాటలో అంతా తెలిసిపోయిందామెకి. గిరుక్కున వెనక్కి తిరిగిపోయింది. క్షణమన్నా ఆగకండా తండ్రి ఇంటికి వెళ్ళిపోయింది. సమజాయిస్తూ వెంట వెళ్లాడు యయాతి. తండ్రిని చూడగానే గోలు గోలు మంది దేవయాని సంగతంతా విన్నాడు శుక్రాచార్యులు. అమాంతంగా నిప్పులు కురిశాడు యయాతిమీద. "యవ్వన గర్వంతో కళ్లు కనపళ్ళేదు నీకు. ముసిలివాడివై ముగ్గి పోతావు. వెళ్ళు" అని శపించాడు. పాదాల మీద పడ్డాడు మహారాజు. "వద్దు మహాత్మా, వద్దు. ముసిలితనం దుర్భరం. శాపం మళ్ళించు. దేవయానిమీద విషయవాంఛ తీరనే లేదు నాకు. ఋతుమతి

మూడు అగ్నిహోత్రాలు (త్రేతాగ్నులు) అహవనీయం, దక్షిణాగ్ని, గార్హ్యపత్యమూ. ఇవి యజ్ఞవేదికి తూర్పు, దక్షిణం, పశ్చిమంగా వుంటాయి.

ఐనస్త్రీ పుత్రభిక్ష కావాలంటే, నిరాకరించినవాడు భ్రూణహత్య చేసిన ట్టన్నారు పెద్దలు. అందుకని లొంగిపోయాను. శర్మిష్ఠకి క్షమించు" అని బతిమిలాడాడు. కనికరించాడు శుక్రుడు. "నీ ముసిలితనం నీ కొడుకుల్లో వొకడి మీద పెట్టు. వాడి యవ్వనం నువ్వు పుచ్చుకో. భోగవాంఛలు తీరాక తిరిగి వాడి యవ్వనం వాడి కిచ్చి, నీ ముసలితనం నువ్వు తీసుకో. కానైతే, నీ ముసిలితనం పుచ్చుకున్న కొడుకే నీ తరవాత నీ రాజ్యానికి రాజవుతాడు" అన్నాడు. "మహాప్రసాదం" అన్నాడు యయాతి. దేవయానిని తీసుకుని రాజధానికి వచ్చేశాడు.

కోటలో అడుగు పెట్టాడో లేదో, శుక్రుడి శాపం మీద పడింది. ముసిలితనం ఆవరించింది. ఇంద్రియాల పటుత్వం తప్పింది. తల వణుకు పట్టుకుంది, అవయవాలు వొడిలిపోయాయి. శరీరం ముడతలు పడింది. తలంతా ముగ్గుబుట్టలా ఐంది. వగర్పూ, దగ్గూ, తల పోటూ - అన్నీ వచ్చాయి.

ఇలా శతవృద్ధయి కూచున్నాడు యయాతి. కుమాళ్ళు ఐదుగుర్నీ దగ్గిరికి పిలిచాడు. "శాపంవల్ల ముసలాణ్ణయి పోయాను. ఐతే, విషయవాంఛలేమో అలాగేవున్నాయి; తీరలేదు. మీలో ఎవరైనా వొక్కరు మీ యవ్వనం నా కివ్వండి. నా ముసిలితనం పుచ్చుకోండి" అన్నాడు. "అదేమన్న మాట" అన్నారు యదుడూ, తుర్వసుడూ, ద్రుహ్యూ, అనుపూన్నూ. "వెంట్రుకలు కాస్త తెల్లబడ్డాయంటే, మన్మథు ణ్ణయినా అసహ్యించుకుంటారు స్త్రీలు. కుబేరుడంత ధనవంతు డయినా, ముసిలితనంవస్తే సుఖముండదు. చావన్నా, ముసిలితన మైనా, సహజంగా వస్తే అనుభవిస్తాం. అంతేకాని, కోరి తెచ్చుకునే వెర్రివా డెవడు ?" అంటూ మొహం ముడుచుకున్నారు.

కోరగాని కుమాళ్ళని పళ్ళుకొరికాడు యయాతి. శపించాడు. "నీ వంశంవాళ్ళు రాజ్యానికి అర్హత లేకుండా పోతారు" అన్నాడు

యదుణ్ణి, "నీ సంతతి సంకరజాతుల కిరాతదేశానికి పాలకులై ధర్మా ధర్మ వివేకం లేనివాళ్ళవుతారు" అన్నాడు తుర్వసుణ్ణి, "తెప్పల మీద తప్ప దారీ తెన్నూ లేని దేశానికి నీ వంశస్థులు రాజు లవుతారు" అన్నాడు ద్రుహ్యుని. "నీ వంశంవాళ్ళు నగంలోనే చల్లారి పోతారు" అన్నాడు అనువుని.

శర్మిష్ఠ చిన్నకొడుకు పూరుకుమాత్రం తండ్రిమాట పాలించాడు. తాను అనుభవించ వలసిన యవ్వనం తండ్రి కిచ్చాడు. తండ్రి ముసలితనం తనమీద వేసుకున్నాడు. దాంతో నవయవ్వనుడయాడు యయాతి. ఎన్నో సంవత్సరాలు మనసారా ఇష్టసుఖాలు అనుభవించాడు. తృప్తిపడింది మనస్సు. వైరాగ్యోదయ మైంది పూరుడి యవ్వనం పూరుడి కిచ్చివేశాడు. తన ముసిలితనం తాను పుచ్చుకున్నాడు. రాజ్యంలోని ప్రజల్ని సమావేశ పరిచాడు. మంత్రులూ, పురోహితులూ, సామంతులూ – అందరి ఎదటా తన సామ్రాజ్యానికి చక్రవర్తిగా పూరుణ్ణి అభిషేకించాడు. మంత్రులూ, సామంతులూ వాళ్ళూ తమ అసమ్మతి ప్రకటించారు. "కూడదన డానికి సాహసం చాలడం లేదు. మహారాజా, ధర్మాధర్మాలు ప్రభువులికి తెలియవని కాదు. పెద్దబ్బాయిగారు బుద్ధిమంతులు. వారంటూ వుండగా, చిన్నబ్బాయి గారిని రాజు చెయ్యడం ధర్మం కాదు" అన్నారు.

"మీ రన్నది నిజమే. పెద్దవాడు యదుడే రాజు కావలి సింది. కాదనను. కానైతే; తండ్రిమాట తప్పి నడిచిన కొడుకు కొడుకూకాడు. తండ్రి ఆస్తికి వారసుడూ కాడు. పెద్దవాళ్లు నలుగురూ నా మాట వినలేదు. పూరుడు చిన్నవాడే ఐనా బుద్ధిమంతుడు. నే చెప్పింది వినుకున్నాడు. మహారాజు కావడానికి అవసరమైన మంచిగుణాలన్నీ వున్నాయి వాడి దగ్గిర. అంతే

యదువు వంశమే కృష్ణుడు పుట్టిన యాదవవంశం. యదు, తుర్వసు, ద్రుహ్యు, అనువు వంశాల వివరం చూ. విష్ణుపురాణం, బ్రహ్మాండపురాణం మొ.

కాదు. నాముసలితనం పుచ్చుకున్నవాడే రాజ్యానికి అర్హుడనీ, వాడే వంశకర్త కావాలనీ మామ శుక్రాచార్యుల ఆజ్ఞ" అని నచ్చజెప్పాడు యయాతి. తన శాపవచనం ప్రకారం యదుడూ మొగలైన వాళ్ళని దేశాంతరం పంపివేశాడు. తాను వానప్రస్థాశ్రమం స్వీకరించాడు. వేదపండితులైన బ్రాహ్మల్ని వెంటపెట్టుకుని తపోవనానికి వెళ్ళిపోయాడు. అడివిలో పళ్ళూ, దుంపలూ ఆహారం చేసుకున్నాడు. వానప్రస్థాశ్రమ నియమం ప్రకారం శిలవృత్తీ * ఉంఛవృత్తీ ♦ అవలంబించాడు. అతిథులికి పెట్టగా మిగిలిందే తినేవాడు. హవ్యకవ్యాలతో అగ్నిదేవుణ్ణీ, పితృదేవతల్నీ తృప్తి పరిచేవాడు. మనోనిగ్రహమూ అలవరచుకున్నాడు. అరిషడ్వర్గాలు జయించాడు.

ఇలా ఎన్నో ఏళ్ళు తపస్సు చేశాడు యయాతి. సర్వసంగ విముక్తుడయాడు, సర్వద్వంద్వాలూ సాధించాడు. ముప్ఫయిఏళ్ళు నిరాహారంగా తపస్సు చేశాడు. గాలిమాత్రం ఆహారం చేసుకున్నాడు. పంచాగ్నులమధ్య సంవత్సరం నుంచున్నాడు. ఏడాది నీటిలో ఒంటికాలుమీద నుంచున్నాడు. ఈ ఘోరమైన తపస్సుకి ముక్కుమీద వేలుపెట్టుకున్నారు దేవతలు. దివ్య విమానం పంపారు. దానిమీద దేవలోకం తీసుకుపోయారతణ్ణి. దేవరుషులు పూజించా రక్కడ. అక్కణ్ణుంచి బ్రహ్మలోకం వెళ్లాడు. బ్రహ్మరుషులూ గౌరవించారు. అక్కణ్ణుంచి ఇంద్రలోకం వెళ్ళాడు. స్వాగతం చెప్పి సత్కరించాడు దేవేంద్రుడు.

ఎంతోకాలం స్వర్గలోక సౌఖ్యాలనుభవించాడు యయాతి. ఒకనాడు ప్రసంగవశాత్తూ ప్రశ్నించాడు దేవేంద్రుడు. "కొడుకు యవ్వనం పుచ్చుకున్నావు. విషయభోగాలనుభవించావు. బాగానే

* శిలవృత్తి - పొలాల్లో కోతకోయగా రాలిన కంకులూ అవీ ఏరుకుబతకడం.

♦ ఉంఛవృత్తి లేకిబతుకు, రాలినగింజలు ఏరుకు బతకడం. ఉంఛవృత్తి మహిమ చూ. శాంతిపర్వం.

వుంది. ఐతే, అతగాడికి రాజ్యభారం సమర్పించినప్పుడు ఏమిటి నేర్పావు ?'' అని అడిగాడు.

"జ్ఞానవంతుల చరిత్రలు తెలిసికో మన్నాను,'' అన్నాడు యయాతి. "సజ్జనగోష్ఠిలో వుండి ధర్మం నేర్చుకో మన్నాను. పాత్రఎరిగి తగినవాడికి దానం చెయ్యమన్నాను. పరాయివాళ్ళని యాచించవద్దన్నాను. యాచించినవాణ్ణి వ్యర్థంగా పంపివేయ వద్దన్నాను. నలుగురికీ నచ్చిన మాట, మంచిమాట, మధురమైన మాట సభల్లో చెప్పమన్నాను. కఠినంగా మాటాడే దుర్మార్గుల దగ్గిర చేరవ ద్దన్నాను. కరుణా, నిష్కపటం, ఇంద్రియ నిగ్రహం, సత్యం, శమం, శౌచం - ఇవి మనస్సులో నిలపమన్నాను. కామం, క్రోధం, లోభం, మదం, మాత్సర్యం - ఈ అంతశ్శత్రువుల్ని గెలిచినవాడే బహిశ్శత్రువుల్ని గెలుస్తాడనీ చెప్పాను'' అన్నాడు.

"అదృష్టవంతుడివి'' అన్నాడు ఇంద్రుడు. ఇహసౌఖ్యాల అంతం చూశావు. స్వర్గసౌఖ్యాలూ అనుభవిస్తున్నావు. ఎంత తపస్సు చేశావో మరి ! ఎన్నో అన్ని సంవత్సరాలు స్వర్గభోగాలు భోగించావు ! !'' అన్నాడు.

"నేనా, నేను చేసిన తపస్సు ఇంతా అంతా అని ఎలా చెప్పేది,'' అన్నాడు యయాతి సగర్వంగా. "దేవతలూ, రాక్షసులూ, ఖేచరులూ, సిద్ధులూ, మానవులూ, మహామునులూ — వీళ్ళంతా చేసిన తపస్సు లన్నీ, నా తపస్సు దగ్గిర దిగదుడుపే అంటాను'' అన్నాడు.

తేరిచూశాడు దేవేంద్రుడు. "అన్నీ విడిచిపెట్టి, తపస్సు చేశావు నిజమే. ఐతే, 'అన్నీ విడిచిపెట్టాను' అన్న గర్వం మాత్రం విడవలేదు నిన్ను. తపోగర్వంచేత నిందించరాని మహాపురుషుల్ని నిందించావు. అంచేత, స్వర్గంలో సుఖపడే యోగం తీరిపోయింది నీకు. వెళ్ళు, మళ్ళీ నరలోకంలో జీవించు. నీ దురభిమానం నిన్నింత చేసింది'' అన్నాడు.

పొరపాటు తెలుసుకున్నాడు యయాతి. పశ్చాత్తాపపడ్డాడు. చేతులు జోడించాడు. బతిమి లాడాడు. "నరలోకం నరకప్రాయం. వెళ్ళలేను ప్రభూ, అన్నాడు. "పోనీ, అంతరిక్షంలోనే సత్పురుష లోకంలో వుండేటట్టు అనుగ్రహించు" అన్నాడు. చివరికి 'సరే, అన్నాడు' దేవేంద్రుడు.

స్వర్గభ్రష్టుడై దిగి వస్తున్నాడు యయాతి. దేదీప్యమానంగా వెలుగుతోంది అతడి కాంతి. ఏమిటీ తేజస్సని ఆశ్చర్యపోయింది సత్పురుషలోకంలోనివాళ్ళు. ఆ లోకంలోనే వున్నారు యయాతి కూతురైన మాధవికుమాళ్ళు వసుమనస్సుడూ, ప్రవర్దనుడూ, శిబీ, అష్టకుడున్నూ. * యయాతిని చూసి, ఎవరో మహాపురుషు డని స్వాగతమిచ్చారు. అభ్యాగత పూజలూ అవీ చేసి సత్కరిం చారు. "దివ్యపురుషుడిలా వున్నావు. ఎవరు మహాత్మా, నువ్వు ? ఏ లోకంనుండి రాక ? దేనికోసమని ?" అంటూ ప్రశ్నల మీద ప్రశ్నలు వేశారు. "యయాతి అంటారు నన్ను" అన్నాడు యయాతి. "పుణ్యమూర్తి నహుషమహారాజు మా తండ్రిగారు. మర్త్యలోకం సామ్రాట్టు పూరుడు నా కుమారుడు. తపోభాగ్యంవల్ల బ్రహ్మలోకం మొదలైన పుణ్యలోకాలు తిరిగాను. దేవేంద్ర లోకంలో వుండి దివ్యభోగాలు అనుభవించాను. ఇవాళ నా దుర దృష్టం, నా తపస్సువిషయం ప్రసంగించారు దేవేంద్రులు. పొర పాటున గర్వించి మాటాడాను. దురభిమానం పతనహేతువైంది. అధోలోకానికి పొమ్మన్నాడు ఇంద్రుడు. కాళ్ళావేళ్ళా పడ్డాను. మీ లోకంలో మీ సాంగత్యం కోరుకుని వచ్చాను" అన్నాడు.

తమ తాతగారే అని సంతోషించారు అష్టకుడూ వాళ్ళూను. ఆయన్ని అడిగి తమకున్న సందేహాలూ అవీ తీర్చుకుందా మను కున్నారు. ధర్మా ధర్మాల రహస్యమూ, సుగతీ, దుర్గతీ – వీట్ల

* చూ. మాధవికి కుమాళ్ళు కలిగిన వివరం, ఉద్యోగపర్వం మూడో ఆశ్వాసంలో గాలవుడూ నల్లచెవుల తెల్లగుర్రాలూ కథ.

స్వరూపమూ, జీవుల గర్భోత్పత్తి క్రమమూ, – ఇవన్నీ అడిగాడు. అడిగిన ప్రతివిషయమూ వివరించి చెప్పాడు యయాతి.

"ప్రాణు లన్నిటిమీదా దయ కలిగి వుండడం, అబద్ధం ఆడ కండా వుండడం – ఇదే ఉత్తమధర్మం ఇతర్లకి నొప్పి కలిగించడమే పెద్ద అధర్మం.

"ధర్మంగా నడవడమే సుగతి మార్గం. అధర్మమే దుర్గతి మార్గం. సుగతి మోక్షం. దుర్గతి నరకం.

"గర్భయోనిలో ఋతుపుష్పరసంతో కూడిన రేతస్సు గాలితో ప్రేరితమయి కలిస్తే, పంచతన్మాత్రలు అంటే శబ్దమూ, స్పర్శమూ, రూపమూ, రసమూ, గంధమూ ఒక ఆకారానికి వస్తాయి. క్రమంగా దానికి అవయవాలు ఏర్పడతాయి. ప్రాణమూ వస్తుంది. అప్పుడది గర్భంలోంచి బయటికి జన్మిస్తుంది. అలా ఉత్పత్తి ఐన జీవులు చెవులతో శబ్దమూ, కళ్ళతో రూపమూ, ముక్కుతో వాసనా, నాలికతో రుచులూ, చర్మంతో స్పర్శమూ తెలుసుకుంటారు. మనస్సుతో మాత్రం అన్నీ గ్రహిస్తారు. ఇలా తెలుసుకుంటూ పూర్వజన్మలోని కర్మల వాసనచేత పాపపుణ్యాలు చేస్తారు. పాపం అధికమైతే పుణ్యం క్షీణిస్తుంది పుణ్యం క్షీణిస్తే బుద్ధిలేని పశువుల గర్భంలోనో, పక్షుల కడుపులోనో పుడతారు. పుణ్యమే అధికమైతే పాపం క్షీణిస్తుంది బుద్ధి కలిగిన మనుష్యయోనిలో పుడతారు. మంచి మనుగడకలవాళ్ళూ, తత్వం తెలిసిన వాళ్ళూ అవుతారు. వాళ్ళే దేవత్వం పొందుతారు. విజ్ఞానవంతులై ముక్తులూ అవుతారు.

"మంచి మనుగడ కలవాళ్ళంటే . గురుశుశ్రూషచేస్తూ, అధ్యయనమూవాట్లో అప్రమత్తులై వుండి అంతరింద్రియాలినీ, బహిరింద్రియాలినీ నిగ్రహించి పరిశుద్ధులుగా వుండే బ్రహ్మచారులు. పాపానికీ, పరులికి అపకారం చెయ్యడానికీ భయపడుతూ, న్యాయం తప్పకండా ధనం గడిస్తూ, అతిథుల్ని పూజిస్తూ, యజ్ఞాలూ అవీ

చేస్తూ, ఇవ్వందే పై వాళ్ళ ధనం పుచ్చుకోకండా జీవిస్తూ, నిత్యానుష్ఠానపరులైన గృహస్థులు. నియమం ప్రకారం భోజనం చేస్తూ ఆశలు వొదిలిపెట్టి, గ్రామాల్లోని వస్తువులు ఉపయోగించ కుండా అడివిలో వుండి జితేంద్రియులైన వానప్రస్థులు పల్లెలో వుంటూ, శరీరధారణంకోసంమాత్రం తగుమాత్రంగా తింటూ, పట్టణాల్లో ప్రవేశించకండా, కామం క్రోధం మొదలైనవాటికి వశంకాకుండా, లోకాచార క్రియలు విడిచిపెట్టి, వొంటరిగా తిరుగుతూ, ఇల్లూ వాకిలీ లేకండా జీవించే యతులు.

"ఇలాంటి వీళ్ళు తమతమ పుణ్యాచారాలప్రకారం ఇటు కింద పదితరాల వాళ్ళనీ, అటు మీాద పదితరాల వాళ్ళనీ ఉద్ధరిస్తారు. తమ్ము తాము కూడా ఉద్ధరించుకుంటారు.

"మానాగ్నిహోత్రమూ, మానాధ్యయనమూ, మానమౌనమూ, మానయజ్ఞమూ అని ఈ నాలుగూ వ్యర్థకర్మలు. అంటే గొప్పకోసం చేసే అగ్నిహోత్రం మానాగ్నిహోత్రం. అలాగే గొప్పకోసం చేసే అధ్యయనం మానాధ్యయనం. గొప్పకోసం చేసే మౌనవ్రతం మానమౌనం. గొప్పకోసం చేసే యజ్ఞం మానయజ్ఞం. వీటివల్ల వ్యర్థమైన ఆయాసం తప్ప ఫలమేమీా దక్కదు."

తాతగారు చెప్పిన తాత్విక విషయాలు విని బ్రహ్మానందం అనుభవించారు మనమలు. "సకల ధర్మాలూ ఎరిగినవాడివి. సర్వలోకాల సమాచారాలూ తెలుసునీకు" అన్నారు. "ఐతే మహాత్మా, పుణ్యలోకాలు మాకు వున్నాయా లేవా?" అని అడిగారు. "ఉన్నాయి" అన్నాడు యయాతి. "మేము మీా దౌహిత్రులం. ఈయన వసుమనస్సుడు, ఈయన ప్రవర్ధనుడు. ఈయన శిబి. నేను అష్టకుణ్ణి" అన్నాడు చిన్న మనమడు.

సత్పురుషలోకంలో సత్సాంగత్యంవల్ల తిరిగి మనమలతో కూడా స్వర్గలోకానికి వెళ్ళాడు యయాతి.

——*——

# ఆదిపర్వం

## నాలుగో ఆశ్వాసం

యయాతి కొడుకు పూరుడు చక్రవర్తి అయాడు. అతడే పూరువంశానికి మూలపురుషుడు. అతడి భార్య కౌసల్య. ఆమె గర్భంలో పుట్టిన జనమేజయుడు రాజై మూడు అశ్వమేధయాగాలు చేశాడు. అతడి భార్య అనంత. కుమారుడు ప్రాచీన్వంతుడు. అతడు ఉదయాచలం వరకూ దిగ్విజయం చేశాడు. అంచేత, అతణ్ణి ప్రాచీశుడు — అంటే తూర్పురాజు అన్నారు

ప్రాచీన్వంతుడి భార్య అశ్మకి వీళ్ళ కుమారుడు సంయాతి. సంయాతి భార్య వరాంగి. వీళ్ళ కుమారుడు అహంయాతి, అహం యాతి భార్య కృతవీర్యుడి పుత్రిక భానుమతి. వీళ్ళ కుమారుడు సార్వభౌముడు అతడి భార్య కేకయరాజు కూతురు సునంద. కుమారుడు జయత్సేనుడు. అతడి భార్య విదర్భరాజు కూతురు సుశ్రవస కుమారుడు సురాచీనుడు. సురాచీనుడి భార్య మర్యాద. కుమారుడు అరిహుడు. అరిహుడి భార్య ఆంగి. కుమారుడు మహాభౌముడు. మహాభౌముడి భార్య ప్రసేనజిత్తు కూతురు సుయజ్ఞ. కుమారుడు అయుతానాయి. అయుతానాయి భార్య పృథుశ్రవసుడి కూతురు కామ. కుమారుడు అక్రోధనుడు. అక్రోధనుడి భార్య కళింగరాజు కూతురు రంభ. కుమారుడు దేవాతిధి. దేవాతిథి భార్య విదేహరాజు కూతురు మర్యాద. కుమారుడు రుచీకుడు. రుచీకుడి భార్య అంగదేశంరాజు కూతురు సుదేవ. కుమారుడు రుక్షుడు. రుక్షుడి భార్య దక్షుడి కూతురు జ్వాల. వాళ్ళ కుమారుడు మతినారుడు.

సరస్వతీనది వొడ్డున పన్నెండేళ్లు సత్రయాగం చేశాడు మతినారుడు. అతణ్ణి వలచి భార్యగా వచ్చింది సరస్వతీనది. సరస్వతి కుమారుడు త్రసుడు. త్రసుడి భార్య కాళింది. కాళింది కుమారుడు ఇలీనుడు. ఇలీనుడి భార్య రథంతరి. రథంతరి కుమారుడే దుష్యంతమహారాజు.

దుష్యంతుడి కథ

అనన్య సామాన్యమైన గుణవంతుడూ, బలవంతుడూనూ దుష్యంతుడు. చిన్నతనంలోనే మహారణ్యాల్లో సింహాలూ, పులులూ, ఏనుగులూ, శరభమృగాలూ మొదలైనవాటిని వేడి పిల్లల్ని తరిమినట్టు తరిమి పట్టుకునేవాడు. యవ్వనం వచ్చాక అతణ్ణి పట్ట పగ్గాలే వుండేవి కావు. కొండ పెకిలి కొండమీద వేసి కొట్టేవాడు. భుజపరాక్రమంవల్ల భూమండలం యావత్తూ పరిపాలించాడు. సూర్యరశ్మి, గాలీ చొరలేని కీకారణ్యాలు సహా అతడి పరిపాలనకి తల వొగ్గాయి. అతడి రాజ్యంలో ఆపద లంటూ వుండేవి కావు. రోగం, దుఃఖం, భయం, నాశనం – ఇవేవీ లేకండా హాయిగా వుండేవాళ్లు ప్రజలు. ప్రజాసమృద్ధితో కలకల్లాడుతూ వుండేది భూదేవి. పూర్వచక్రవర్తుల పద్ధతిని తొణుకూ బెణుకూ లేకండా నడిచేది ధర్మం.

ఒకనాడు వేటకి బయల్దేరాడు మహారాజు. సూర్యుడి గుర్రాల్లాగ ఆకాశమేఘాల్లో ఎగిరిపోయే గుర్రాలు పూన్చారు రథానికి. అలాంటివే మంచి మంచి గుర్రాలమీద సవారీవచ్చారు ఎంతోమంది రౌతులు. కత్తులూ, కరాళ్లూ, బల్లేలూ, బాణాలూ పట్టుకుని వెంట పడ్డారు వీరభటులు.

అలా వెళ్ళి మహారణ్యం చుట్టవేశాడు దుష్యంతుడు. డప్పులూ, కేకలూ, ఈలలూ వేసి జంతువులు రొప్పారు వేటగాళ్లు. మందరపర్వతంతో సముద్రం కలిచినట్టు అడవంతా అల్లకల్లోలం చేశారు. అకస్మాత్తుగా వచ్చిపడ్డ ఈ ఉపద్రవానికి అడిలిపోయాయి

అడివిమృగాలు, అడివిపందులూ, సింహాలూ, శరభమృగాలూ, పెద్ద పులులూ, మదపుటేనుగులూ ఎటుపడితే అటు పరిగెత్తాయి.

వేటలో తన పరాక్రమ మంతా చూపెట్టాడు దుష్యంతుడు. పట్టుపట్టి బాణాలతో పడగొట్టాడు కొన్ని జంతువులు. తరిమి తరిమి పైనబడి పట్టుకున్నాడు కొన్ని. కలియబడి కత్తివేసి తునకలు చేశాడు కొన్ని. ఇలా వేటతమకంలో ఎన్ని జంతువులు చంపాడో లెక్కా జమా లేకపోయింది.

వెనకచూపు లేకండా ఎంతో దూరం వెళిపోయాడు ఉతడు. అతడి రథవేగాన్ని అనుసరించలేకపోయారు భటులు. దాహం తోనూ ఆయాసంతోనూ అలిసిపోయారు. పీలైన చోటల్లా చదికిల బడ్డారు. కొద్దిపాటి పరివారం మాత్రం అనుసరించింది మహా రాజుని. ఇలా వెళ్ళగా వెళ్ళగా మాలినీనదీ, నదివొడ్డుని వొకవనమూ ఎదురయాయి. పువ్వులతోనూ, పళ్ళతోనూ, నిండి వుంది వనం. "దేవేంద్రుడి ఖాండవవనమూ' కుబేరుడి చైత్రరథమూ దీని ముందు టీసికట్టు" అంటూ తలపంకించాడు దుష్యంతుడు. చివురుపెట్టిన గోరింటలూ, పూతపట్టిన అశోకాలూ, పొన్నలూ, సురపొన్నలూ, గేదంగులూ, పళ్ళతో వొంగిపోతున్న తియ్యమామిళ్ళూ, గెలలు వేసిన అరటిచెట్లూ — ఇవన్నీ చూస్తూ, చిలకల పలుకులూ కోయి లల కూతలూ ఆలిస్తూ లోపల ప్రవేశించాడు.

అందమైన అతిథి మహారాజు. అతడికి ఆనందం కలిగేట్టు, ముసురుతూన్న తుమ్మెదపడుచుల పాటలతో ఆశీర్వదిస్తూ గాలి రాలుస్తూన్న పువ్వులతో తలంబ్రాలు చల్లారు లతాకన్యలు. వేట ఆయాసం తీరిపోయేట్టూ, హృదయం చల్లబడేట్టూ వింజామరలు వీచింది పటిగాలి. మరింత ముందుకి వెళ్ళేక నేయివాసనా, హావి స్సుల పరిమళమూ కలిసిన పొగలతో అల్లుకున్న చెట్లకొమ్మలూ, పువ్వులు లేకపోయినా ఆ వాసనకి కొమ్మలు వొదలకండా వున్న

తుమ్మెదలూ కనిపించాయి. దాంతో అది తపోవనమనీ, దగ్గిరే మహామునుల ఆశ్రమం వుంటుందనీ తెలిసిపోయింది దుష్యంతుడికి.

మనస్సు ఆకర్షిస్తూ హాయిగా వుంది తపోవనం. మరి రెండడుగులు వేసే సరికి ఉత్తములైన బ్రాహ్మణులు పదక్రమంతో చదువుతూన్న వేదధ్వనులూ, అవిచ్ఛిన్నంగా జరుగుతూన్న అగ్నిహోత్రకర్మల్లోని స్వాహాశబ్దాలూ, మునీశ్వర్ల వాక్యాల్లో పరస్పర విరుద్ధంగా కనపడే క్లిష్టవిషయాలు విడమర్చి నిర్ణయం తేల్చడంలో సమర్థులైన విద్వాంసులు చేస్తూన్న సంభావణలూ, ఎదిరి పక్షం వాళ్ళని నోరెత్తకండా రుజువు చూపిస్తూ వేదార్థాలు వివరించ గలిగిన మీమాంస పండితులు చేస్తున్న వాద ప్రతివాదాలూ విని పించాయి. యజ్ఞాలు నడిపించడంలో ప్రవీణులైన ఋత్విక్కులూ, శాస్త్రోక్తంగా ఆచరించడంలో తీసిపోని అనుష్ఠాతలూ, అధికమైన తపస్సుమీదే ఆసక్తి పెట్టుకున్న తపోధనులూ నివసిస్తున్న కణ్వముని ఆశ్రమమూ కనపడింది.

గంగాతీరంలో నరనారాయణాశ్రమంలాగ ఎంతో మనోజ్ఞంగా వుంది కణ్వముని ఆశ్రమం. శ్రవణానందంగా సామగానం చదువు తున్నాయి చిలకపిట్టలు. వాటిని కదలకండా వింటున్నాయి ఏనుగులు. అవి తొండాలతో చిమ్ముతూన్న తుంపుర్లతో కలిసి వీస్తున్న చల్ల గాలికి ఆనపడి, నీడపట్టుని హాయిగా కళ్ళుమూస్తున్నాయి సింహాలు. వైశ్వదేవం మొదలైన కర్మలు చేసి బ్రాహ్మలు భూతబలులు వేసే వరిఅన్నం పిండాలు తినడంకోసం వచ్చి కలిసి ఆడుకుంటున్నాయి పిల్లులూ ఎలకలున్నూ. చూసి, "ఇదంతా మునుల ప్రభావంకదా!" అని ఆశ్చర్యపోయాడు దుష్యంతుడు. పరివారాన్నంతా అక్కడే ఆగమన్నాడు. "కణ్వమునికి నమస్కరించి వస్తాను" అంటూ వొక్కడే ఆశ్రమంలోకి బయల్దేరాడు.

---

కణ్వముని ఆశ్రమం పేరు నాకసిద్ధము. చూ. కాణ్వాశ్రమపథం.

శ కుం త ల

ఆశ్రమం వాకిట్లో అడుగు పెట్టాడో లేదో, తన కళ్ళనే తాను నమ్మలేక పోయాడు రాజు. చక్కని చుక్కలాంటి అమ్మాయి కంట పడింది. తామర రేకుల్లాగ చేరడేసి కళ్ళు. తుమ్మెద రెక్కల్లాంటి జుత్తు. పిడికిట్లో ఇమిడిపోతుంది నడుం. మిసమిస లాడుతోంది యవ్వనం. తొలిచూపుల్లోనే ఆకర్షించిందామె. జయంత కుమారుడిలాగ మాంచి విలాసంగా వున్నాడు రాజు. చూడగానే మహారాజని పోల్చుకుందామె. తత్తరపడుతూ లేచింది. ఆసనమూ, అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి గౌరవించింది. కుశలప్రశ్నలు వేసి కూచోబెట్టింది.

"వేటకి వచ్చాను. ఆశ్రమం చూసి, కణ్వమునీశ్వరుల దర్శనం చేసి వెళ్లాలని ఇలా వచ్చాను. వారు ఆశ్రమంలో లే నట్టుంది. ఎక్కడికి వెళ్ళారో!" అన్నాడు రాజు.

"ఇప్పుడే పళ్ళకోసం అడివికి వెళ్లారు. మీరు వచ్చారనడంతోనే వచ్చేస్తారు. అందాక వోక్షణం ఆగండి" అంది ఆమె.

ఆమె తీరూ అదీ చూచి ఆమె కన్యఅని తెలుసుకున్నాడు రాజు. అనాఘ్రాతమైన ఆ పుష్పంకోసం చలిస్తోంది హృదయం. ఆమె అవయవాల పొంకం మించి చూపులు మరల్చుకోవడమూ కష్టంగా వుంది. "ఐతే, ఎవరి అమ్మాయివి నువ్వు? ఇక్కడి కెలా వచ్చావు?" అన్నాడు.

"నేనా? — కణ్వుల కుమార్తెని. శకుంతలఅంటారు నన్ను" అందామె. ఆలోచనలో పడిపోయాడు రాజు. "చిత్రం! ముని కన్యే అయితే, నా మనస్సు ఈమె మీదికి పరిగెడుతున్న దేం? ఊఁహూఁ, నమ్మలేను. అదీకాక, కణ్వముని జితేంద్రియుడు కదా! అతడికి కూతు రేమిటి?" మళ్ళీ అడిగాడు. "మరి, కణ్వమునులు నైష్ఠికాశ్రమం గడుపుతున్నారు కదా! జితేంద్రియులు కూడాన్నూ ఆయనకి సంతానమంటే – అర్థం కావడం లేదు" అన్నాడు.

"ఐతే, వినండి," అంది శకుంతల. "ఒకనాడు ఎవరో వొక రుషి మా ఇంటికి వచ్చారు. మీలాగే ఆయనా మా నాయన గారిని అడిగారు. 'ఈ అమ్మాయి ఎవ' రని. ఆయనతో నాయనగా రిలా చెప్పారు.

"రాజరుషి విశ్వామిత్రులు తపఃప్రభావం వల్ల బ్రహ్మరుషి అయాక వొకసారి, ఘోరమైన తపస్సులో కూచున్నాడు. ఆ తపస్సు చూసి ఎక్కడలేని భయం పట్టుకుంది దేవేంద్రుడికి. ఎలా ఐనా భంగం కలిగించాలని ఆలోచించాడు. అప్సరసలలో కల్లా అందకత్తె మేనకని పిలిచాడు. 'వెళ్ళు, విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యి. నా దేవరాజ్యం రక్షించు' అన్నాడు. ఈ మాట వినడంతోటే గుండెల్లో రాయిపడింది మేనకకి. చేతులు జోడించింది. 'బ్రహ్మదేవుడంత ప్రభావం కల వశిష్ఠుల వారిని మూడు చెరువుల నీళ్ళు తాగించి పుత్రశోకంలో ముంచాడు విశ్వామిత్రుడు. నీతో సహా ముక్కోటి దేవతలూ అతడి పేరంటే గడగడ లాడతారు. అతడి కళ్ళు ఎర్రపడితే చాలు, కులపర్వతాలు పగిలినట్టవుతాయి. సముద్రాలు ఆర్చుకుపోతాయి. ముల్లోకాలూ గిరగిర తిరుగుతాయి. గాలికూడా కదలడానికి భయపడుతుంది. అలాంటి ఉగ్రస్వభావుడి దగ్గిరికి ఆడదెలా వెళుతుంది ? ఐనా, నన్ను పంపుతున్నావు. ఏం చెయ్యనూ ! దేవాజ్ఞ. వెళ్ళి వస్తాను. నా నేర్పంతా వినియోగిస్తాను. తరవాత నా అదృష్టం" అంటూ పరివారంతో సహా బయల్దేరింది మేనక.

"హిమాలయ ప్రదేశంలో తపస్సు చేస్తున్నాడు విశ్వామిత్రుడు. ఆ తపోవనంలో చెలికత్తెలతో ప్రవేశించింది మేనక. ఆమె పూసుకున్న పరిమళద్రవ్యాలూ, కొప్పులోని పువ్వులూ తోటంతా వొక్కసారి గుబాళించాయి. ఈ సుగంధం మోసుకుపోయి రుషిమీద కుమ్మరించాయి దక్షిణవాయువులు. తన ముస్తాబుకితోడు కొత్తపువ్వులు ముడుచుకుంటూ, వొయ్యారంగా విహరిస్తూ, మెల్ల

మెల్లగా రుషిని సమీపించింది మేనక. ఏ వికారమూ లేకండా నిశ్చలమైన తపస్సులో వున్నాడతడు. అంజలిబంధం హృదయం దగ్గిర చేర్చి తలవాంచి నమస్కరించిందామె. పువ్వులు ఏరే మిష మీద అక్కడే తారాడింది. అలిసిపోయినట్టయి ఎదురుగ్గా నుంచుంది. ఇంతలో చిన్న గాలివీచి పైటకొంగు సడిలించింది. దాంతో ఉన్నతమైన వక్షస్థలమూ అవీ కనపడడమూ, వాటిమీద రుషి చూపులు నాటుకోవడమూ జరిగిపోయింది. అదే సమయమని పూలబాణాలు ప్రయోగించాడు మన్మథుడు. సరి. మేనక వెంట పడ్డాడు విశ్వామిత్రుడు.

"ఇద్దరూ ఎంతో కాలం కామభోగా లనుభవించారు. చివరికి ఈ అమ్మాయి పుట్టింది. ఈమెని మాలినీనది వొడ్డుని విడిచి దేవ లోకం వెళ్ళిపోయింది మేనక. తపోవనానికి వచ్చేశాడు విశ్వా మిత్రుడు. తల్లీ తండ్రీ అలా వొదిలేసి పోయారు. పాపం, వొంట రిగా ఏడుస్తూ వుంది పిల్ల. ముని ప్రభావం వల్ల అడివిమృగాలు మాత్రం ఏవీ దగ్గిరికి రాకండా శకుంతాలు (పక్షులు) రెక్కలతో కప్పి కాపాడాయి.

"సమిధలూ, పళ్ళూ వాటికోసం తిరుగుతూ శిష్యులతో అక్కడికే వెళ్ళాను నేను. మాలిని ఇసకపర్రమీద చంద్రవంకలా పడివున్న దీన్ని చూశాను. తీసుకు వచ్చాను. శకుంతాలు కాపా డుతూ వుండడం చేత శకుంతల అని పిలుస్తున్నాము. కన్నవాడూ, అన్నం పెట్టినవాడూ, భయపడుతూవుండగా రక్షించినవాడూ—ఈ ముగ్గురూ తండ్రులే అవుతారు స్త్రీలకి. అంచేత ఈమె నాకుమార్తె' అన్నారు. కనక మహారాజా, వారి కుమార్తెనే నేను. నమ్మండి" అంది.

ముడుచుకుంటున్న ఆశాలత మళ్ళీ చివురించినట్టయింది దుష్యంతుడికి. మునికన్య అని నిరాశపడుతూన్న హృదయంలో కామాంకుర మైంది. తుమ్మెద వాల్తే కంపించిపోయే పద్మంలా

విలవిల లాడిపోయింది మనస్సు. శకుంతలా ఇదే అవస్థలో వుండడం గమనించాడు. మెల్లగా మళ్ళీ మాటల్లోకి దింపాడు.

"ఏతే చూడూ, శకుంతలా, నువ్వుచూస్తే ఇంత అందకత్తెవి. బుద్ధిమంతురాలివిన్నీ. నీలాంటి పిల్లకి ఈ నార గుడ్డలూ ఈ లేడి చర్మాలూ ఏమిటి చెప్పూ! ఈ పూరిగుడిసెలూ, ఈ మునిపల్లె నిజంగా నీకు తగ వంటాను.

"నిన్ను మహారాణి చేస్తాను. ప్రేమతో అంగీకరించు. నా రాజ్యలక్ష్మివై బంగారంమేడల్లో చంద్రకాంతవేదికల మీాద రాజ భోగా లనుభవించు. విను బ్రాహ్మమూ, దైవమూ, ఆర్షమూ, ప్రాజాపత్యమూ, ఆసురమూ, గాంధర్వమూ, రాక్షసమూ, పైశాచమూ అని వివాహం ఎనిమిది విధాలు కదా! * నీకు మాత్రం తెలియందేముంది? ఇందులో గాంధర్వమూ, రాక్షసమూ రాజులికి ప్రశస్తం. అదృష్టవశాత్తూ మన ఉభయులికీ ప్రేమాంకురమైంది. అంచేత, గాంధర్వం అనుకూలంగా వుంది" అన్నాడు.

సిగ్గుతో ఎర్రపడింది శకుంతల మొహం. తల వంచుకుంది. "నాన్నగా రిప్పుడే వస్తారు. వారు వచ్చేక —" ఆమె నోట్లో మాట నోట్లోనే వుంది. "అలాకాదు"అంటూ అందుకున్నాడు రాజు. "గాంధర్వానికి వొకరి అంగీకారం అక్కర్లేదు. మంత్రాలూ అవీ పనిలేదు. కన్య తనకు తానే కర్త అయి వరించడమే గాంధర్వం" అన్నాడు. ఒప్పించాడు చివరికి.

"కానైతే వొక్క వరంమాత్రం కావాలి" అంది శకుంతల. "మనకి కలిగే కుమారుణ్ణి యువరాజుగా అభిషేకించాలి. ఆమాత్రం వాగ్దానం చేస్తేచాలు" అంది. ఒప్పుకున్నాడు రాజు. గాంధర్వంగా ఆమెని అనుభవించాడు. "రాజధానికి వెళ్ళి నీకోసం మంత్రుల్నీ వాళ్ళనీ కణ్వుల దగ్గిరికి పంపిస్తాను" అని నమ్మించి వొచ్చేశాడు.

---

* మహా. అనుశాసనిక పర్వం రెండో అధ్యాయం.

తన ప్రవర్తనకి తండ్రి ఏ మంటాడో అని బెంగతో కూచుంది శకుంతల. ఇంతలో పళ్ళూ, కందమూలాలూ అవీ పట్టుకుని అడివి నుండి వచ్చాడు కణ్వుడు. శృంగారం గుర్తులతో వున్న కూతుర్ని చూశాడు. సిగ్గుతో తల వంచుకుం దామె. భయంతో వొణికి పోతూనూ వుంది. అంతా తెలిసిపోయింది తండ్రికి. రాజులికి గాంధర్వం రాసిపెట్టిందే అనుకున్నాడు. జరిగిం దానికి సంతోషించాడు. "అదృష్ట వంతురాలివి" అన్నాడు. "తగిన వరుణ్ణే సంపాదించావు. దానికి అనుగుణ్యంగా గర్భవతివీ అయావు. నీ గర్భంలో వొక మహాచక్ర వర్తి పెరుగుతున్నాడు. సంతోషంగా వుంది నాకు. నీ ఇష్టంవచ్చిన వరం కోరుకో. ఇస్తాను" అన్నాడు.

"నా కొడుకు ఆయుష్మంతుడూ, ఆరోగ్యవంతుడూ, ఐశ్వర్య వంతుడూ, వంశకర్తా అవాలి" అంది శకుంతల. "తథాస్తు" అన్నాడు కణ్వముని. చూలాలికి చేయవలసిన సంస్కారాలూ, విధులూ, ఎప్పటి కప్పుడు చేయిస్తూ వచ్చాడు. మూడేళ్ళు నిండాక గుమ్మడిపండులాంటి కొడుకుని కంది శకుంతల. అతడే భరతుడు.

భరతుడి జాతకర్మలూ అవీ సక్రమంగా జరిగించాడు కణ్వుడు. దిన దిన ప్రవర్ధమానంగా పెరుగుతున్నాడు భరతుడు. అరిచేతిలో చక్రరేఖా, సుదీర్ఘమైన బాహువులూ, అనంతమైన జవసత్వాలూ, సలక్షణమైన అవయవాలూ అత డొక చక్రవర్తి కాబోతున్నా డని చెప్పకనే చెప్పుతున్నాయి. బాల్యంలోనే తండ్రిని మించిన కొడు కనిపించాడు. పెద్దపులులూ, సింహాలూ, అడివిపందులూ, పెద్ద పెద్ద పాములూ అడివిలో పట్టుకుని ఆశ్రమం చెట్లకి కట్టేసే వాడు. వాటితో ఆడుకునేవాడు. పెద్ద పెద్ద ఏనుగుల మీద సవారీ చేసి పరిగెత్తించేవాడు. ఎంత బలమైన మృగాన్నయినా తన బలంతో లొంగదీసుకునేవాడు. అందుకని ఆశ్రమంవాళ్ళంతా అతణ్ణి సర్వదమనుడని పిలిచేవాళ్ళు. అత డంటే కళ్ళవేడుకగా వుండేది కణ్వమునికి.

ఇలా కొంతకాలం గడిచింది. దుష్యంతుడి కబురు లేదు. భరతుడికి యువరాజయ్యే వయస్సు వచ్చింది. ఒకనాడు శకుంతలని దగ్గిరికి పిలిచాడు కణ్వుడు. "అమ్మాయీ, ఎంత మంచి ఇల్లాలైనా, ఆడది పుట్టింట ఎంతో కాలం వుండకూడదు. పతే సతికి గతీ ముక్తీనీన్నీ. అత్తవారిల్లే ఆమెకి సర్వస్వం. అంచేత, కొడుకుని తీసుకుని భర్తఇంటికి బైల్దేరు నువ్వు" అన్నాడు. కొంతమంది శిష్యుల్ని తోడిచ్చి ప్రయాణం చేశాడు.

దుష్యంతుడి దగ్గిరికి వచ్చింది శకుంతల. మంత్రులూ, సామంతులూ వాళ్ళతో కొలువులో వున్నాడతడు. తిన్నగా అక్కడికే వచ్చిందామె. పక్కని కుమారుడూ, వెంట మునులూ వున్నారు చూసినీన్నీ ఎవరో అపరిచితులరా లన్నట్టు వూరుకున్నాడు రాజు అవాళ ఆశ్రమంలోని అపూర్వమైన అనురాగమూ, ఆదరణా, అనగ్రహమూ, ఆతురతా - ఇవేవీ లేవు ఇవాళ. దెబ్బతిన్నట్టయిం శకుంతల. "ఏమిటిది? ఎరగడా? ఎరిగీ ఎరగనట్టు నటిస్తున్నాడా ఇన్నాళ్ళయిందని మరిచిపోయాడా? వింతేమిటి! రాజ్యగర్వం ఏనా, తనకి ఇది వొకటేపని గనకనా? ఇంతకీ అవాళ చేసిన వాగ్దాన కాదనాలనే వుందేమో! కాకపోతే చూపుల్లో ఈ కరుకుద మేమిటి? అవును, కొత్త వింత, పాత రోత రాజులికి. తియ్యగా మాటాడినంత మాత్రాన నమ్మకూడదు. వాళ్ళని. మరుపై జ్ఞాపకం చెయ్యవచ్చు. తెలియకపోతే చెప్పనూవచ్చు. కా తెలిసీ తెలియనట్టు నటించే మోసగాడైతే ఏం దారి?" ఇల ఆలోచనమీద ఆలోచన పరిగెడుతోంది తల్లో. "ఏనా, చ వచ్చి ముంతదాచడమెందుకు? అదేదో తేల్చుకోవడమే మంచి వచ్చి వూరక పోవడమేమిటి? జరిగిందంతా చెప్పిచూస్తా కొడుకునీ చూపుతాను" అని చొరవ చేసుకుంది. "మహారాజా ఈ చిరంజీవి నీ కుమారుడు. వేట మిష మీద నువ్వు కణ్వాశ్రమ వచ్చిన నాటి సంగతి జ్ఞాపకం చేస్తున్నాను. సంతోషంగా ఇచ్చిన వరమూ దివ్య చిత్తానికి తెమ్మంటున్నాను" అంది. విన్నా

దుష్యంతుడు అంతా తెలిసీ, తెలియనట్టు మాట్లాడాడు. "ఏమిటీ అసంగత ప్రలాపాలు! అసలు నిన్ను ఇదివరకెన్నడూ ఎరగను నేను! ఎవరు నువ్వు? వెళ్లు వెళ్లు. ఎక్కడినుండి వచ్చావో అక్కడికే వెళ్లు" అన్నాడు.

మీద పిడుగు పడ్డా ఇంతకంటే బావుండేది. తెల్లపోయింది శకుంతల. నిట్టూర్చింది. నిశ్చేష్టురాలైంది. కోపం - దుఃఖం - ఎర్ర తామర రేకుల్లోంచి రాలుతున్న నీటిబొట్లలాగ, ఎరుపెక్కిన నేత్రాల్లోంచి కన్నీళ్ళు రాలుతున్నాయి. తల వంచుకుంది. కోర చూపులతో రాజుని చూసింది. తనకి తానే సంబాళించుకుంది. ఆలోచించుకుంది. మళ్ళీ ఇలా అందుకుంది.

"తెలిసిన్నీ తెలియనివాడిలా ఎరగనంటున్నావు. ధర్మం తెలిసిన వాడివి. నాకు తప్ప ఇతర్లకి తెలియదు కదా అని అసత్యమాడేస్తున్నావు. మనం చేసే ప్రతీపనీ ధర్మం కనిపెడుతూనే వుంటుంది. పంచభూతాలూ చూస్తూనే వుంటాయి. అంతరాత్మ పరిశీలిస్తూనే వుంటుంది. ఉదయం సాయంత్రం, పగలూ రాత్రీ, సూర్యుడూ చంద్రుడూ, వేదాలూ - ఇవన్నీ వుండనే వున్నాయి. ఇన్నిటి ఎదటా తాను చేసింది కప్పిపుచ్చడమంటే అది ఆత్మవంచనే అవుతుంది. నువ్వు చేసిన వాగ్దానం నాకెంత తెలుసో వీటన్నిటికీ అంతే తెలుసు. అంచేత రాజా, తిరస్కరించకు. అవాళలాగే అనుగ్రహించు.

"పతిన్నీ, అనుకూలవతిన్నీ, సంతానవతిన్నీ ఐన భార్యని తిరస్కరించినవాళ్ళకి ఇహమూ, పరమూ కూడా దక్కవు. తగిన భార్య కలవాడు సర్వకర్మలూ చెయ్యగలుగుతాడు. జితేంద్రియుడూ, పుత్రవంతుడూ అవుతాడు. గృహస్థాశ్రమంలో పొందగల ఫలం యావత్తూ పొందుతాడు. భార్య పురుషుడి అర్ధశరీరం. అంచేత, భార్యని అవమానించడం తన్ను తాను అవమానించుకోవడమే అవుతుంది.

"చూడు, వీడు నీ కుమారుడు. పౌరవ వంశానికి అలంకారం వంటివాడు. పురుషుడు తానే భార్యయందు ప్రవేశించి గర్భంలో కుమారుడై జన్మిస్తున్నాడు. అందుకనే 'అంగాదంగాత్సంభవసి' * అన్నాయి వేదాలు. తన స్వరూపమే నీళ్లలో చూసుకున్నట్టు కొడుకులో తన రూపం చూసి ఆనందిస్తాడు మానవుడు. దీపంతో ఇంకో దీపం వెలిగినట్టు నీ శరీరం నుండే ఈ పుత్రుడు కలిగాడు. 'పున్నామ్నో నరకాత్ త్రాయత ఇతి పుత్రః' † అని వేదాలు చెప్తున్నాయి. పుణ్యాప్రవర్తన కల కుమారుడు ఇటు తండ్రి వంశమూ, అటు తల్లి వంశమూ ఉద్ధరిస్తాడు.

"ఇదిగో, ఈ కన్నతండ్రిని కౌగిలించుకో. నీకే అర్థమౌతుంది. ముత్యాలహారం, పచ్చకర్పూరం, మలయచందనం, పండువెన్నెలా — కొడుకు కౌగిలి కంటే చల్లదనమూ, హాయీ కలిగించవు. వీడు వంశోద్ధారకుడవుతాడని ఆకాశవాణి చెప్పింది. నూరు అశ్వమేధాలూ చేస్తాడంది. నేనే కాదు, ఆశ్రమంలోని మునులు యావన్మందీ విన్నారీ మాట.

"వంద నూతులు తవ్వించడం కంటే ఒక కోనేరు గొప్పది. వంద కోనేళ్లకంటే ఒక యజ్ఞం గొప్పది. వంద యజ్ఞాలకంటే ఒక కుమారుడు గొప్ప. వంద కుమాళ్ళకంటే కూడా ఒక సత్యవాక్యం గొప్పది. తక్కెడలో వెయ్యి అశ్వమేధాలు ఒకపక్కా, ఒక్క సత్యవాక్యం ఒకపక్కా వేసి తూస్తే సత్యం వైపే మొగ్గు తూగుతుంది. వేదాలన్నీ అధ్యయనం చేసినా, తీర్థాలన్నీ సేవించి వచ్చినా - సత్యం ముందు సరిపోవు. ధర్మాలన్నిటిలోకీ సత్యమే తలమానికం. అంచేత, సత్యంమీద మనస్సు పెట్టి కణ్వాశ్రమంలో నువ్వు చేసిన వాగ్దానం తెలుసుకోమంటాను. కొడుకుని చూసైనా జాలిపడమంటాను.

---

* శరీరంనుండి పుడుతున్నావు.

† పుత్ అనే నరకంనుండి ఉద్ధరించేవాడు పుత్రుడు.

"రాజరుషి విశ్వామిత్రుడికీ పవిత్రురాలు మేనకకీ పుట్టిన కూతుర్ని అబద్ధ మాడవలిసినంత అవస్థ ఏం వచ్చిందినాకు!" అంది.

ఏమిటీ గోల అన్నట్టు చూశాడు దుష్యంతుడు. "నే నెక్కడ! న వ్వెక్కడ? అసలు నిన్ను చూ సన్నా ఎరుగుదునా నేను! ఆడవాళ్లు అబద్ధాల పుట్టలు. అందుకు తగినట్టే మాటాడుతున్నావు నువ్వు. ఈ కుర్రాడికీ నాకూ ఎందులో సాటి చెప్పూ? నీ మాటలికి మా వాళ్లంతా నవ్వుతున్నారు. ఇలాంటి మాట లంటేనే కిట్టదు మాకు. ఈ అసందర్భాలు వినలే నిక. కట్టిపెట్టు బుద్ధిమంతురాల్లాగ ఆశ్ర మానికి వెళ్ళిపో" అన్నాడు.

కాలికింద భూదేవి కూలిపో తున్న ట్టుంది శకుంతలకి. సిగ్గూ, దుఃఖం-వీటితో కుంగిపోతూవుంది. "పుట్టినపుడే తల్లీ తండ్రీ పారేసి పోయారు. కట్టుకున్న భర్తా పొమ్మంటున్నాడిపుడు. గత జన్మలో ఏం నోములు నోచానో మరి! ఎవరికి చెప్పుకోనూ!!" అంటూ బావురుమంది. రాళ్ళు కరిగేట్టు ఏడ్చింది.

కంటికీ మంటికీ ఏకధారగా వున్నాయి కన్నీళ్ళు. కొడుకు చెయ్యి పట్టుకుంది. వెళ్ళిపోవడానికి వెనక్కి తిరిగింది. ఇంతలో "శకుంతల చెప్పింది సత్యం" అంటూ వినపడింది ఆకాశవాణి. "రాజా, శకుంతల పతివ్రత; నీ భార్య. భరతుడు నీ కుమారుడు. ఆదరించు వీళ్ళని" అంది.

కొలువు కొలువంతా ఆశ్చర్యంతో విన్నారు ఆకాశవాణి పలుకులు. ఎక్కడ లేని సంతోషం తాండవ మాడింది దుష్యంతుడి మొహంలో. "అవును, నిజమే," అన్నాడతను. "అవాళ వేటకి వెళ్ళినప్పుడు కణ్వముని ఆశ్రమంలో గాంధర్వ వివాహం చేసుకున్నాం మేము. ఈ రహస్యం మా ఇద్దరికీ తప్పించి మూడో మనిషికి తెలీదు. అందుకనే లోకనిందకు భయపడ్డాను. ప్రేమని అట్టేపెట్టాను. ఎరగ నని బొంకాను. నిజం దాగదు. ఆకాశ వాణి మాటలు అందరూ విన్నారు కదా!" అంటూ దిగ్గున

లేచాడు. రెండుచేతులతోనూ కుమారుణ్ణి కౌగిలించుకున్నాడు. శిరస్సు ముద్దాడాడు. ప్రేమతోనూ, గౌరవంతోనూ ఆదరించి శకుంతలని అంతఃపురంలోకి తీసుకువెళ్ళాడు. భరతుడికి యువరాజపట్టం కట్టాడు. ఎంతోకాలం రాజ్యసుఖా లనుభవించాక రాజ్యభారం కొడుకుమీద వేసి తపోవనానికి వెళ్ళిపోయాడు.

మహారా జయాడు భరతుడు. గంగ వొడ్డునా, యమున వొడ్డునా ఎన్నో యజ్ఞాలు చేశాడు. భరతవంశానికి మూలపురుషు డయాడు. ఇదీ భరతుడి కథ.

భరతుడి భార్య కేకయరాజు కూతురు సునంద. సునంద కొడుకు భుమన్యుడు.* భుమన్యుడి భార్య దశార్హరాజు కూతురు విజయ. విజయ కొడుకు సుహోత్రుడు. సుహోత్రుడి భార్య ఇక్ష్వాకరాజు కూతురు సువర్ణ. సువర్ణ కొడుకు హస్తి.

హస్తి పేరనే కౌరవరాజధాని హస్తినాపుర మయింది. హస్తిమహారాజు భార్య త్రిగర్తరాజు కూతురు యశోధర. ఈమె కొడుకు వికుంఠనుడు. వికుంఠనుడి భార్య దశార్హరాజు కూతురు వసుదేవ. ఈమె కొడుకు అజమీఢుడు. అజమీఢుడి భార్యలు కైకేయీ, గాంధారీ, ఋక్షా అని ముగ్గురు. ఈ ముగ్గురికీ నూటాఇరవైనలుగురు కుమారుళ్ళు కలిగారు. అనేక దేశాలికి రాజు లయారు.

---

* భరతుడికి ముగ్గురు భార్య లుండేవాళ్ళనీ, వాళ్ళకి చెరో ముగ్గురు చొప్పున తొమ్మండుగురు కుమారుళ్ళు కలిగారనీ, వాళ్ళెవళ్ళూ తండ్రిని పోలిన వాళ్ళు కాకపోవడంవల్ల తల్లులు ఆ తొమ్మండుగురినీ చంపివేశారనీ, సంతానంకోసం భరతుడు మరుత్స్తోమ మనే యజ్ఞం చేశాడనీ, మరుద్గణం వచ్చి ఉతథ్యుడి భార్య మమతకీ ఆమె మరిది బృహస్పతికీ పుట్టిన భరద్వాజుణ్ణి తెచ్చి యిచ్చారనీ, భరద్వాజుడు యజ్ఞం చేయించాక భరతుడికి సంతానం కలిగిందనీ, భరతుడి సంతతిలోనే గర్గుడి సంతానం బ్రాహ్మ ణయారనీ హరివంశం, విష్ణుపురాణం, బ్రహ్మపురాణం, భాగవతం మొదలైన వాట్లో భరతుడి సంతానవిషయం వేరు వేరు విధాలుగా వుంది.

వాళ్లలో సంవరణుడు చక్రవర్తి అయ్యాడు. సంవరణుడి భార్య సూర్యకుమారి తపతి * తపతి కుమారుడు కురుమహారాజు. కౌరవ వంశానికి మూలపురుషు డితడు. కురుమహారాజు పేరనే శమంతక పంచకం కురుక్షేత్ర మయింది.

కురుడి భార్య దశార్హరాజు కూతురు సుభాంగి. సుభాంగి కుమారుడు విదూరథుడు. విదూరథుడి భార్య సంప్రియ. సంప్రియ కుమారుడు అనశ్వుడు. అనశ్వుడి భార్య మగధరాజు కూతురు అమృత. అమృత కుమారుడు పరీక్షితుడు. పరీక్షితు భార్య సుయశ. సుయశ కుమారుడు భీమసేనుడు. భీమసేనుడి భార్య కేకయరాజు కూతురు కుమారి. కుమారి కుమారుడు ప్రతిశ్రవసుడు. ప్రతిశ్రవసుడి కుమారుడు ప్రతీపుడు. ప్రతీపుడి భార్య శిబి. కూతురు సునంద సునందకి దేవాపీ, శంతనుడూ, బాహ్లీకుడూ అని ముగ్గురు కుమాళ్ళు.

అందులో పెద్దవాడైన దేవాపి బాల్యంలోనే తపోవనానికి వెళ్ళిపోయాడు. † అపుడు శంతనుడు మహారా జయాడు. శంతనుడికి

* చూ. ఏడో ఆశ్వాసం తపతీ సంవరణుల కథ

† శంతనుడు రాజయాక పన్నెండేళ్ళు వర్షాలులేక రాజ్యంలో కరువు పట్టింది "న్యాయంగా ఈరాజ్యం మీ అన్న దేవాపిది అది నువ్వు అనుభవించడం చేత ఈ అనర్థం వచ్చింది మీ అన్న అధర్మంగా ప్రవర్తించి, పతితుడయ్యేవరకూ అతడే రాజ్యాధికారి అందుచేత అతడి రాజ్యం అతడికి ఇచ్చివేస్తే దేశం బాగుపడు తుంది" అని శంతనుడికి పండితులు సలహాచెప్పారు ఆ ప్రకారం అన్నగారిని పిలుచుకు రావడానికి ఉద్యుక్తుడయ్యాడు శంతనుడు

ఇంతలో ఇదంతా విన్న శంతనుడి మంత్రి అస్మసారి వేదాలికి విరుద్ధంగా బోధించే వాళ్ళని దేవాపి దగ్గిరికి పంపాడు. వాళ్ళ ఉపదేశంవల్ల వేదాల్ని నిందించేవాడిగా మారిపోయాడు దేవాపి.

శంతనుడు పండితుల్ని వెంటపెట్టుకుని దేవాపి దగ్గిరికి వెళ్ళాడు. వేదాల్ని దూషిస్తూ తూలనాడాడు దేవాపి అది విని "మీఅన్నకి రాజ్యార్హత పోయింది ఇక అనావృష్టిదోషం వుండదు, అతడు అధర్మంగా ప్రవర్తించి పతితుడయాడు" అంటూ పండితులు శంతనుణ్ణి రాజ్యానికి తీసుకువచ్చేశారు. దేశంలో వర్షాలుపడి సుభిక్ష మేర్పడిందట ! చూ. విష్ణుపురాణం. ( 4 అం. 20. అ, )

గంగాదేవి గర్భంలో దేవవ్రతుడైన భీష్ముడూ, యోజనగంధి గర్భంలో చిత్రాంగదుడూ విచిత్రవీర్యుడూ కలిగారు. బాల్యంలోనే గంధర్వులచేత కాలం చేశాడు చిత్రాంగదుడు. విచిత్రవీర్యుడు రాజయాడు.

విచిత్ర వీర్యుడికి అంబా, అంబాలికా అని ఇద్దరు భార్యలు అందకత్తె లయిన వాళ్ళిద్దరితోనూ క్రీడిస్తూ క్షయరోగంతో మరణించాడు విచిత్రవీర్యుడు. దాంతో భరతవంశం నశించే అవస్థ వచ్చింది యోజనగంధి మాటప్రకారం దేవరన్యాయంగా విచిత్రవీర్యుడి భార్యలికి పుత్రదానం చేశాడు వ్యాసుడు. అంబకి ధృతరాష్ట్రుడూ, అంబాలికకి పాండురాజూ, అంబిక పరిచారికకి విదురుడూ పుట్టారు.

ధృతరాష్ట్రుడికి వందమంది కుమాళ్ళూ, వొక కూతురూ కలిగారు. పాండురాజుకి కుంతీగర్భంలో ధర్మరాజూ భీముడూ అర్జునుడూ, మాద్రి గర్భంలో నకుల సహదేవులూ కలిగారు. పాండురాజు కుమాళ్లు ఐదుగురూ ద్రౌపదిని వివాహం చేసుకున్నారు. ఆమె గర్భంలో ధర్మరాజుకి ప్రతివింధ్యుడూ, భీముడికి శ్రుతసోముడూ, అర్జునుడికి శ్రుతకీర్తి, నకులుడికి శతానీకుడూ, సహదేవుడికి శ్రుతసేనుడూ కలిగారు. వీళ్లయిదుగురూ ఉపపాండవులు.

ధర్మరాజుకి స్వయంవరంలో లభించిన భార్య దేవిక. ఆమె కుమారుడు యౌధేయుడు. భీమసేనుడి మరోభార్య జలంధర. ఆమె కుమారుడు సర్వగుడు. అర్జునుడి ఇంకో భార్య సుభద్ర. సుభద్ర కుమారుడు అభిమన్యుడు. నకులుడి భార్య చేదిరాజు కూతురు రేణుమతి. ఈమె కుమారుడు నిరమిత్రుడు. సహదేవుడు స్వయంవరంలో పెళ్ళాడిన భార్య విజయ. ఈమె కుమారుడు సుహోత్రుడు. ఈ పదిమందీ కాక భీముడికి హిడింబ గర్భంలో ఘటోత్కచుడూ, అర్జునుడికి నాగకన్య ఉలూపి గర్భంలో ఇలావంతుడూ. చిత్రాంగద గర్భంలో బభ్రువాహనుడూ కలిగారు. ఈ పదముగ్గురిలోనూ అభిమన్యుడు వంశకర్త అయాడు. అభిమన్యుడి భార్య ఉత్తర. ఆమె గర్భంలోనే జన్మించాడు మీ తండ్రి పరీక్షిత్తు. అయినా,

పుణ్యశీల మీ అమ్మ మాద్రవతీ చేసిన పుణ్యఫలంగా జన్మించావు నువ్వు. జనమేజయమహారాజా, నీకు నీభార్య వపుష్ట గర్భంలో శతానీకుడూ, శంకుడూ, కర్ణుడూ కలిగారు. శతానీకుడికి విదేహ రాజు కూతురు గర్భంలో అశ్వమేధదత్తు కలిగాడు. ఇది నీ వంశచరిత్ర. మీరంతా పౌరవులూ, భారతులూ, కౌరవులూ, పాండవులూ అయారు

ఇక, దేవనది ఐన గంగ శంతను భార్యలా వరించిందీ, ఆమెకి భీష్ముడెలా కలిగిందీ, మీ తాత ముత్తాతలు కౌరవులూ, పాండవులూ ఎలా ఎలా జన్మించి ఏమేమి చేసిందీ వివరిస్తాను విను" అంటూ మళ్ళీ అందుకున్నాడు వైశంపాయనుడు.

### మహాభిషుడూ గంగా

పూర్వం ఇక్ష్వాకువంశంలో మహాభిషుడని వొక రాజు వుండేవాడు. మహాధర్మశీలుడాయన. వెయ్యి అశ్వమేధయాగాలు చేశాడు. వంద రాజసూయాలూ చేశాడు. దేవేంద్రుడూ మొదలైన ముక్కోటి దేవతల్ని సంతోషపరిచాడు. పుణ్యబలంవల్ల దేవలోకానికీ అక్కడనుండి బ్రహ్మలోకానికీ వెళ్ళాడు. దేవతలతోపాటు బ్రహ్మదేవుడి సభలో సకలసౌఖ్యాలు అనుభవిస్తూ వుండేవాడు.

ఒకనాడు, బ్రహ్మదేవుడి కొలువు జరుగుతూవుంది. గంగానది స్త్రీరూపంలో వచ్చింది. గాలి వేసి ఆమె తొడమీంచి బట్ట జారింది. పెడమొహం పెట్టుకున్నారు దేవతలు. మహాభిషుడు మాత్రం అభిలాషతో చూశాడు. అది కనిపెట్టాడు బ్రహ్మ. కోపం తెచ్చుకున్నాడు. "మళ్ళీ నరలోకంలో జన్మించు" అని గద్దించాడు. సాష్టాంగపడ్డాడు మహాభిషుడు. క్షమించమన్నాడు. "నీ శాపం అమోఘం అనుభవిస్తాను. కానైతే, వొక్కటి మాత్రం వేడుకుంటున్నాను. నరలోకంలో పుణ్యచరిత్రుడు ప్రతీపుడు. అతడి పుత్రుణ్ణయినట్టు అనుగ్రహించు" అన్నాడు. కానిమ్మని కరుణించాడు బ్రహ్మ.

తనకోసమే ఇలా అయ్యాడు కదా, అనుకుంది గంగ అతడి మానవభావాలూ ఆమెలో [illegible]. [illegible] పెనవేసుకునే చలించిపోయింది. అలా మొదటిసారి ప్రేమ, బ్రహ్మ శాపానికి అతడు గురికావడంతోనే మరింత కొనలు సాగింది. మహాభిషుడు వెళ్లేక తానూ బయల్దేరింది నరలోకానికి. దార్లో వసువులు ఎనమండుగురూ ఆమెని కలిశారు. దేవలోకం వొదిలిపోతూ దీనంగా వున్నారు వాళ్ళు. చూసి జాలిపడింది గంగ. "ఇంత దీనంగా ఎక్కడికీ ప్రయాణం?" అని ప్రశ్నించింది. "నరలోకానికి" అన్నారు వసువులు జాలిగా. "వశిష్ఠముని శాపంవల్ల మనుష్య యోనిలో పుట్టడానికి వెళుతున్నాము. అన్యస్త్రీ గర్భంలో పుట్ట డానికి మనస్కరించడం లేదు. నీ సంగతి విని నీ దగ్గిరికి వచ్చాము. మహాభిషుడు ప్రతీపుడికి శంతనుడై పుడతాడు. శంతనుడికీ నీకూ సమాగమ మౌతుంది. నువ్వు అనుగ్రహిస్తే అతడు కారణంగా నీ కడుపులో పుడతాం మేము" అన్నారు.

"సంతోషం. మీ అభిలాష నెరవేర్చడం కంటే కావల్సిం దేమిటి నాకు!" అంది గంగ. "ఐతే, ఇంకో ప్రార్థన మాత్ర ముంది" అన్నారు వసువులు. మా ఎనమండుగురమూ వొకళ్ళ తరవాత వొకళ్ళం నీ కడుపులో పుడతాం. పుట్టగానే నీళ్ళలో పడవెయ్యాలి నువ్వు. ఆలస్యం లేకుండా నరజన్మలోంచి ముక్తుల మవుతాం మేము. వశిష్ఠుల ఆదేశం కూడా ఇదే" అన్నారు.

"కానీండి. కాని, మీ రందరూ పుట్టగానే కాలంచేస్తే చిరం జీవి అయిన కొడుకు వొక్కడన్నా దక్కవద్దా నాకు?" అంది గంగ.

"మాలో ఎనిమిదో వసువు దక్కుతాడు నీకు. మా ప్రతీ వొక్కరినుండీ ఎనిమిది వంతుల్లో వొకవంతు చొప్పున పుచ్చుకొని దీర్ఘాయుష్మంతుడవుతాడు. ఇక సమ్మతమే కదా!" అన్నారు వసువులు. గంగా వసువులూ ఇలా కూడబలుక్కుని భూలోకం వచ్చారు.

హస్తినాపురంలో రాజ్యం చేస్తూ న్నాడు ప్రతీపుడు. అత డొకనాడు గంగ వొడ్డుని తపస్సులో వున్నాడు వచ్చి అతడి ఎదట నుంచుంది గంగ. పూలతీగెలాగ నవనవ లాడుతోంది దామె. బంగారం లాగ మెరిసిపోతోంది శరీరం. కలువరేకుల్లాగ వున్నాయి కళ్ళు. బిగువైన బంతుల్లాగ వున్నాయి స్తనాలు. దివ్యసుందర విగ్రహం. అనురాగం తొణికిస లాడుతూన్న చూపులతో చూసింది ప్రతీపుణ్ణి. వొయ్యారంగా వెళ్ళి అతడి కుడితొడమీద కూచుంది. ముసి ముసి నవ్వులతో మురిపించింది.

ఉలికిపడ్డాడు ప్రతీపుడు. "ఏమిటిది ? నా తొడమీద కూచు న్నావేమిటి ? ఎవరు నువ్వు ?" అన్నాడు. "నిన్ను వలచి వచ్చాను. నీ భార్యగా వుంటాను" అంది గంగ. "అదేలాగ ?" అన్నాడు ప్రతీ పుడు. "అగ్నిసాక్షిగా కట్టుకున్న సునందని తప్ప అన్యస్త్రీని కన్నెత్తి చూడను నేను. ఇలాంటివాణ్ణి వరించా వేమిటి ? నిష్ఫలం. అదీకాక, భార్య కూచోదగ్గది ఎడమతొడ. బిడ్డలు కూచోదగ్గది కుడితొడ. కుడితొడ మీాదే కూచున్నావు నువ్వు. అంచేత, భార్యవి కావు. కోడలి వవుతావు" అన్నాడు. "ఐతే అలాగే కానీ" అంటూ అదృశ్య మైంది గంగ.

ప్రతీపుడు కుమాళ్ళు దేవాపీ శంతనుడూ బాహ్లీకుడు - వీళ్ళ ముగ్గురిలో దేవాపి తపోవనానికి వెళ్ళిపోయాడని చెప్పాను కదా ! శంతనుణ్ణే రాజుచేసి తపోవనం చేరుకున్నాడు ప్రతీపుడు. వెళ్ళేముందు శంతనుణ్ణి పిలిచి హితోపదేశం చేశాడు. "గంగాతీరంలో అందమైన అమ్మాయి కనబడుతుంది నీకు. ఆమెని వివాహం చేసుకోవాలి నువ్వు. ఆమె కులగోత్రాలు గాని, ఆమె ఎవ్వరని కాని అడగవద్దు. ఆమె ఏది చెపితే అది అంగీకరించు" అన్నాడు.

ఒకనాడు వేట కని బయల్దేరాడు శంతనుడు. ధనుర్బాణాలు తీసుకుని వొక్కడే అడివిలో తిరగడం మొదలుపెట్టాడు. తిరిగి తిరిగి గంగాతీరానికి వచ్చాడు. పిల్లగాలులు వీస్తున్నాయి. తరం

గాల తుంపుర్లు చల్లగా ఇసకతిన్నెలమీద పడుతున్నాయి. ఒక ఇసకపర్ర మీద అందాలరాణి, వోక వయసయినపిల్ల ఎవరికోసమో ఎదురుచూస్తోంది. సోగకళ్ళతో బెదిరి బెదిరి చూస్తోంది. శరీరం వెలుగులు చిమ్ముతోంది. దేవతలు కట్టుకోవలిసిన పాంమీాసంలాంటి సన్న చీరె కట్టుకుంది. కళ్ళు జిగేలు మంటున్నాయి. రత్నాల వస్తువులు. ఎంతో నాజూకైన ముస్తాబు చేసుకుని నుంచుంది గంగ.

చూసి గతుక్కు మన్నాడు శంతనుడు. రెండుకళ్ళూ అప్పగించి నిలిచిపోయాడు "వనలక్ష్మా? నాగకన్యా? దేవతాస్త్రీయా గంధర్వకాంతా? ఎవరీమె? చిత్రం! మానవకన్య వొంటరిగా ఈ ఈ అడివిలోకి ఎలా వస్తుంది?

"ఎవరికోస మీా ప్రతీక్ష? ఆ కళ్ళు నన్నే పిలుస్తున్నాయి. ఏ జన్మలోనో చూసినట్టే వుంది ఈ చిరునవ్వు! ఏ స్వప్న పరిచిత మిది! నాన్నగారు చెప్పిన పిల్ల కాదుకదా! ఆమే. సందేహమేమిటి?"

"నువ్వేనా?" అని అందా మనుకున్నాడు. నాలిక చివరిదాకా వచ్చింది. ఆగిపోయాడు. అదే సమయ మని మన్మథుడు తన పూలబాణాలికి పని కల్పించాడు. ఇద్దరూ చూపులతోనే పలకరించుకున్నారు. చూపులతోనే కలుసుకున్నారు. "నీకోసమే ఎన్నాళ్ళనుండో చూస్తున్నాను" అంది గంగ. "అవును, అందుకే వచ్చాను" అన్నాడు శంతనుడు. "నేను చేసిన దానికి కాదన కూడదు. నువ్వు" అంది గంగ. "మా నాన్నగారి ఆదేశమే అది" అన్నాడు శంతనుడు. "అలా వున్నంతవరకే మన కాపరం. కాన వ్వాడు నా దారి నేను చూసుకుంటాను. సమ్మత మైతేనే మాట ఇయ్యి" అంది గంగ. "అక్షరాలా అంగీకరిస్తున్నాను" అన్నాడు శంతనుడు.

గంగా, శంతనుడూ చిలకా గోరువంకల్లాగ కాపరం చేస్తున్నారు. అతడితోనే లోకంలా వుంది ఆమెకి. ఆమె లేంది క్షణం

నీళ్ళాడింది గంగ. వరహాలమూటలాంటి కొడుకు పుట్టాడు. తిన్నగా తీసుకువెళ్ళి నదిలో వేసి వచ్చిం దామె. నోరు మెదపలేదు శంతనుడు. ఇలా ఒకరి తరవాత ఒకరు, ఏడుగురు కొడుకులు పుట్టారు. ఏడుగుర్నీ నదిలో వేసి వచ్చింది గంగ. బాధపడేవాడు శంతనుడు. ఎదురాడితే ముప్పు. వెళ్ళిపోతుం దామె. ఏమిటీ రాక్షస ప్పని ? ఎన్నాళ్ళని సయించడం ? పుట్టినవాళ్ళ నందర్నీ గంగపాలు చెయ్యవలసిందేనా ?

ఎనిమిదోమారు నీళ్ళాడింది గంగ. నిక్షేపంలాంటి కొడుకు పుట్టాడు. యథాప్రకారంగా నదిలో వెయ్యడానికి బయలుదేరింది గంగ. పనికిరా దన్నాడు శంతనుడు. "బంగారు తండ్రుల్ని ఏడు గుర్ని పొట్టలో పెట్టుకున్నావు. నీ ప్రేమ కోసమని, విషం మింగినట్టు సహించుకు వచ్చాను. జాలన్నా లేకండా వుంది నీకు ఏమైనా సరే, వీణ్ణి వొదిలిపెట్టను" అని అడ్డుకున్నాడు.

నిలిచిపోయింది గంగ. ఆమె మొహంలో చిరునవ్వు మొలక లెత్తుతోంది. "మంచిది. మన ఒప్పందం ప్రకారం ఇవాళతో మన సంబంధం తీరిపోయింది. ఐతే, వెళ్ళే ముందు విషయం కాస్త చెప్పే వెళతాను" అంది ఆమె. "నన్నేదో మానవస్త్రీ అనే అనుకుంటున్నావు. కాదు. గంగాదేవిని నేను. ఈ కుమాళ్ళు ఎనమండుగురూ అష్టవసువులు. వశిష్ఠముని శాపంవల్ల నరజన్మ ఎత్తారు. 'ఇంకో స్త్రీకి జన్మించలేం. నీ కడుపులో పుడతాం' అని అర్థించారు నన్ను. 'పుట్టిన వెంటనే నీళ్ళలో వేసి ముక్తి కలిగించు' అనీ ప్రార్థించారు. దేవకార్యం కోసం స్త్రీరూపం ధరించాను నేను. వసువులు కుమాళ్ళు కావడంవల్ల నీకున్నూ పుణ్యాలోకాలు లభిస్తాయి. వీడు ఎనిమిదోవాడు. భూమ్మీద ఎంతోకాలం వుండవలసిన యోగం వుంది వీడికి. అందుకనే ఇవాళ నీకీ బుద్ధిపుట్టింది. సర్వధర్మాలూ తెలిసినవా డవుతాడు వీడు. లోక కళ్యాణం కోసం జీవిస్తాడు" అంది.

"వసువులా ?" అని తెల్లబోయాడు శంతనుడు. "వసువులు దేవతలు కదా! చీకూ చింతా లేనివాళ్ళు. లోకవంద్యులు. వాళ్ళకి నరజన్మా! వశిష్ఠుడి శాపమా! మరి, ఏడుగురూ స్వర్గానికి పోయి అష్టమ వసువు నిలిచిపోవడమా ? అయోమయంగా వుంది నాకు" అన్నాడు.

"అవును," వశిష్ఠుడి శాపమే దీ నంతటికీ కారణం" అంటూ అందుకుంది గంగ. "వరుణపుత్రుడు వశిష్ఠముని మేరుపర్వతం గుహాలో ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటూ వుండేవాడు. దక్షప్రజాపతి కూతురూ, కశ్యపుడి భార్యా ఐన సురభికి పుట్టిన గోవుల్లో నందిని అనేది వశిష్ఠుడి హోమధేనువుగా వుండేది. కామధేనువులాగ కావలసిన వన్నీ సమకూర్చేది నందిని.

"ఒకనాడు వసువులు ఎనమండుగురూ తమ భార్యలతో మేరు పర్వతం లోయల్లో విహరించడానికి వచ్చారు. వశిష్ఠాశ్రమంలో నందిని వాళ్ళ కంటపడింది. దాని విశేషం విని ఆశ్చర్యం కలిగింది వాళ్ళకి. అష్టమవసువు ప్రభాసుడి భార్య యోగసిద్ధ మరీ ముచ్చట పడింది చూసి. "ఏమండీ, దీని పాలు తాగిన మనుష్యులు పది వేల సంవత్సరాలు బతుకుతారట. ముసిలితనం కాని రోగం కాని వుండదట. నిజంగా ఈ ఆవు ఎవళ్ళ దగ్గిర వుంటే వాళ్ళే గొప్ప వాళ్ళు. చూడండీ, నరలోకంలో ఉశీనర రాజు కూతురుందే జిత వతి, అది నా నేస్తం. దాని కేదన్నా మేలు చేయాలనే అను కుంటాను నేను. ఈ ఆవు పట్టుకెళ్ళి ఆమెకి ఇస్తే బావుండును" అని భర్తతో అంది. పట్టుకుపోదా మంటే పట్టుకుపోదా మన్నారు తక్కినవాళ్లు. ఇంకేముంది, ఆవు పట్టుకుపోయాడు ప్రభాసుడు.

"నందిని కనపడకపోవడంతోనే అడివంతా వెదికాడు వశిష్ఠుడు. తుదకి యోగదృష్టితో చూసి వసువులు పట్టుకుపోయారని తెలుసుకున్నాడు. కళ్ళెమొయ్యా కోపం వచ్చింది. 'వాళ్ళి మనుష్యయోనిలో పుట్టండి' అని శపించాడు. తెలిసి పరిగెత్తుకు

వచ్చారు వసువులు. క్షమించండని ప్రాథేయపడ్డారు. 'తెలియక తప్పు చేశాం, ధర్మమూర్తివి నువ్వు. నరలోకంలో ఎంతోకాలం వుండ కండా అనుగ్రహించు' అన్నారు.

"కనికరించాడు వశిష్ఠుడు. 'మీ ఇష్టమే కానియ్యండి. వెంటనే నరదేహం విడిచిపెట్టండి. కాని మీలో ఈ ఎనిమిదో వాడున్నాడే ప్రభాసుడు, ఇంతా వీడే చేశాడు. అంచేత వీడు మాత్రం ఎంతో కాలం భూలోకంలో వుంటాడు. సంతానం సహా వుండదు వీడికి' అన్నాడు. ఆ ప్రభాసుడే ఈ కుమారుడు దేవవ్రతుడు. ఇదీ ఇందులో వున్న దేవరహస్యం. ఇక నేను వెళతాను. ప్రయోజకు డయ్యేవరకూ దేవవ్రతుడు నా దగ్గిరే వుంటాడు" అని చెప్పి కొడుకు నెత్తుకుని వెళ్ళి పోయింది.

అంతా స్వప్నంలా అనిపించింది శంతనుడికి. ఎంతోసేపయితే కాని మనిషి కాలేదతడు. గంగతో గడిపిన కాల మంతా క్షణాల్లా అనిపించింది.

కొంతకాలం గడిచింది. ప్రపంచం నాలుగు దిక్కులా వ్యాపించింది శంతనుడి రాజ్యం. శంతనచక్రవర్తి అంటే దేశదేశాల రాజులు తల వొగ్గుతున్నారు. జగత్తంతా ధర్మప్రభువని జేజేలు చేస్తున్నారు.

వేట నెపంమీద మళ్ళీ వొకనాడు గంగాతీరానికి వెళ్ళాడు శంతనుడు. చిన్న పాయ ప్రవహిస్తోంది గంగ. తన వియోగం వల్ల శుష్కించిపో లేదు కదా! ఒడ్డునే నడుస్తూ మరింత ముందుకి వెళ్ళాడు. పెద్ద ఇసకపర్ర. ఇసకపర్రమీద దివ్యసుందరమూర్తి వొక రాజకుమారుడు విలువిద్య నేర్చుకుంటున్నాడు. బాణాలతో గంగా నదికి సేతువుకట్టాడు. అందుకనే గంగ సన్నని పాయమాత్రం పారుతోంది. మూడుమూర్తులా శంతనుడిలాగే వున్నాడు రాజకుమారుడు. ఏమీ అర్థం కావడం లేదు శంతనుడికి. కాని, చూస్తూన్నకొద్దీ ఏదో తెలీని వాత్సల్యం కలుగుతోంది మనస్సులో. రాజకుమారుడూ

చూశాడు శంతనుణ్ణి. అపరిచితుడే ఆయన. ఐనా, ఈ అనురాగమూ, గౌరవమూ ఎందుకు కలుగుతున్నాయి !

ఇంతలో గంగాదేవి వచ్చి ఎదట నుంచుంది. కుమారుడి కుడి చెయ్యి పట్టుకుని శంతనుడి దగ్గిరికి తీసుకు వచ్చింది. "రాజా, వీడు నీ కుమారుడు" అంది, "వేదాలూ అవీ వశిష్ఠుడిదగ్గిర కూలంకషంగా చదివాడు. ధర్మశాస్త్రాలూ, మొదలైనవి యావత్తూ శుక్రుడిలాగా, బృహస్పతిలాగా నేర్చుకున్నాడు. అస్త్రవిద్యలో పరశురాముడంతవా డయాడు బ్రహ్మజ్ఞానంలో సనత్కుమారుడే అనవచ్చు. ఇక నా పని పూర్తయింది. నీ కొడుకుని నువ్వు తీసుకు వెళ్ళు" అని అంతర్ధాన మైంది.

పెన్నిధి దొరికిన పేదలాగ కుమారుణ్ణి తీసుకుని హస్తినా పురం వచ్చాడు శంతనుడు. మంత్రుల్నీ, సామంతుల్నీ, రాజ్యంలోని ప్రముఖులు యావన్మందినీ సమావేశపరిచాడు. అందరి ఎదటా కుమారుడికి వైభవంగా యువరాజపట్టం కట్టాడు.

## శంతనుడూ సత్యవతీ

నాలుగేళ్ళు గడిచాయి. ఒకనాడు వేటాడుతూ వచ్చి యమున వొడ్డుకి వెళ్ళాడు శంతనుడు. వెళ్ళి వెళ్ళడంతోటే, యమున కెరటాలమీంచి అపూర్వమైన సుగంధం వీచి చకితుణ్ణి చేసింది చల్లగాలి. సువాసన పసికడుతూ ముందుకి వెళ్ళాడు మహారాజు. వెళ్ళగా వెళ్ళగా పడవరేవూ, రేవులో పడవమీద యోజనగంధి సత్యవతీ కనపడింది. ఆమెదే ఆ సుగంధం.

రెప్ప వెయ్యకండా నుంచున్నాడు మహారాజు. సుగంధమే సుగంధం, దాన్ని మించినట్టుంది అందం. పదారోవన్నె బంగారం పనికిరా దంటున్నది శరీరకాంతి. పూలతీగలా నవనవ లాడుతోంది దేహం. బెదిరిన లేడిపిల్లకళ్ళలా వున్నాయి నేత్రాలు. చిరునవ్వుతో వెన్నెల కాస్తోంది మొహం.

మతిపోయి నట్టయింది మహారాజుకి. దగ్గిరికి వెళ్ళాడు. ప్రేమ వొలికిస్తూ ప్రసంగంలోకి దించాడు. "ఏవూరు నీది ? ఇలా వొంటరిగా పడవ నడుపుతున్నావు ! చిత్రంగావుంది" అన్నాడు.

ముసిముసి నవ్వుతో మహారాజుని చూసింది సత్యవతి. "దాశరాజు కూతుర్ని. మా బాబు మాటప్రకారం ధర్మంకోసం పడవ నడుపుతాను" అంది.

సత్యవతి సౌందర్యం వినే వున్నాడు శంతనుడు. ఇవాళ ప్రత్యక్షంగా చూశాడు. తిన్నగా దాశరాజు దగ్గిరికి వెళ్ళాడు. సత్యవతిని తన కిచ్చి వివాహం చెయ్య మన్నాడు. సంతోషించాడు దాశరాజు. గౌరవ మర్యాదలతో సత్కరించాడు మహారాజుని. "పుట్టినప్పుడే ఆడపిల్లని తగిన వరుడికి ఇవ్వా లనుకోవడం లోకాచారం. మహారాజువి నువ్వు. నువ్వు అల్లుడివి కావడ మంటే మేము ధన్యుల మయా మన్నమాట. ఇంతకంటే మాకేం కావాలి ? కానైతే, వొక్కమాట మనసులో వుంది. అడుగుతాను. ఇస్తానంటే సత్యవతి నిస్తాను" అన్నాడు.

"ఇయ్యతగ్గదే ఐతే తప్పకండా ఇస్తాను. చెప్పు ఏం కావాలో" అన్నాడు రాజు. "ఏమీ లేదు, సత్యవతికి పుట్టిన బిడ్డ మహారాజు కావాలి అంతే" అన్నాడు దాశరాజు. విషమ సంధిలో పడ్డాడు శంతనుడు. అప్పటికే దేవవ్రతుడు యువరాజు. మరి, సత్యవతి కొడుకు రాజవుతాడని ఎలా అంగీకరిస్తాడు ! "ఈ వొక్కటీ కాదు. ఇంకేదైనా కోరు" అన్నాడు. ఎంతో బోధపరిచాడు. ఎన్నోవిధాల చెప్పాడు. ససేమిరా పనికిరా దంటూ కూచున్నాడు దాశరాజు.

హతాశుడై హస్తినాపురం వచ్చేశాడు శంతనుడు. అవాళనించీ మనస్సు మనస్సులో లే దతడికి. ఎటుచూసినా సత్యవతి కళ్ళకి కట్టినట్టుంది. ఏ పనీ మనస్కరించడం లేదు. ఇతర ప్రసక్తి లేకండా వొంటరిగా కూచోవడం మొదలుపెట్టాడు.

తండ్రి విచారం చూసి తోచలేదు దేవవ్రతుడికి. ఒకనాడు వెళ్ళి అడిగాడు. "మనకి శత్రువులా అంటే, కలికాని కయినా కన పళ్లేదు. ప్రజలా సుఖంగా నిక్షేపంలా వున్నారు. దేశ దేశాల రాజులా అడుగులికి మడుగు లొత్తుతున్నారు. మరి, మీకీ విచార మెందుకో తెలీక బాధపడుతున్నాము" అన్నాడు. ఎంతో సేపు వూరుకుని జవాబు చెప్పాడు తండ్రి. "ఒక్క కొడుకు కొడుకు కాడు. ఒక్క కన్ను కన్ను కాదు. 'ఒక్క కొడుకు వుండ డమూ, కొడుకు ల్లేకపోవడమూ వొక్కటే' అని ధర్మశాస్త్రం. నువ్వా, అస్త్రవిద్యా పండితుడివి. యుద్ధవీరుడివి. సాహసివి. ఎప్పు డేమవుతావో! ఎలా నమ్మడం? అగ్నిహోత్రాలూ, వేదాలూ, సంతానం - ఉత్తమవంశస్థులు వీటిని వొదిలిపెట్టకూడ దన్నారు పెద్దలు. అంచేత నీకు వెనక సాయంగా కుమాళ్ళని కనాలని వుంది నాకు" అన్నాడు.

ముసిలి మంత్రులతోనూ వాళ్ళతోనూ ఆలోచించాడు దేవ వ్రతుడు. తండ్రి మనస్సు యోజనగంధి మీద వుందని తెలుసు కున్నాడు. పెద్ద పరివారంతో దాశరాజు దగ్గిరికి వెళ్లాడు. శంతన మహారాజుకోసం సత్యవతిని ఇమ్మన్నాడు. దేవవ్రతుణ్ణి గౌరవించి కూచోపెట్టాడు దాశరాజు. ధర్మశీలుడివి నువ్వు. అర్థమూ అనర్థమూ రెండూ తెలిసినవాడివి. సమర్థుడివి. తండ్రిగారి పని మీద వచ్చావు. నువ్వే రావడంవల్ల సంతోషంగా వుంది నాకు. రాజర్షి ఉపరిచరవసువు వీర్యంవల్ల కలిగిందీ అమ్మాయి. ఆయనే చెప్పాడు శంతనమహారాజుకే ఈమె నిమ్మని. అందుకనే దేవ లుడు అడగ వస్తే నిరాకరించాను. ఏ మంటే, శంతన డంత వరుడు దొరకడం సామాన్యమా మరి! ఐతే, వున్న లోప మంతా వొక్కటే; సవతిసంతానం; అంటే, నువ్వే. నా బిడ్డకన్నా, దాని బిడ్డలకన్నా నువ్వే శత్రువులా వున్నావు. అందులోనూ నువ్వు సామాన్యుడివి కావు. మహాశక్తిమంతుడివి. నువ్వు కనుబొమలు

ముడివేస్తే చాలు కాలరుద్రుడైనా గడగడ లాడతాడు. విన్నావూ, అంచేత, ఈ చిక్కు తీరే ఉపాయమూ నువ్వే ఆలోచించాలి. అంతే. మరో అభ్యంతరం లేదు" అన్నాడు.

భీష్మప్రతిజ్ఞ

దాశరాజు అభిప్రాయం తెలిసిపోయింది దేవవ్రతుడికి. తక్షణమే తన కర్తవ్యమూ నిశ్చయించుకున్నాడు. "ఇదిగో, ఇంతమంది ఎదటా శపథం చేస్తున్నాను. రాజుకావడానికి నాకు వుండుకుండే సర్వహక్కులూ వొదులుకుంటున్నాను నేను. సత్యవతీదేవికి కలిగే కుమారుడే రాజ్యార్హుడు. అతడే మా అందరికీ రాజు. మా వంశకర్త" అన్నాడు. విన్నవాళ్ళంతా నిర్విణ్ణులయారు.

"నిజమే, నువ్వేమో ధర్మమూర్తివి. అన్నంతా చేసి తీరతావు. కాని'—" అంటూ మళ్ళీ అందుకున్నాడు దాశరాజు. "నువ్వు చేసిన నిర్ణయం నీ కొడుకులు అంగీకరిస్తారని నమ్మకమేముంది ?" అన్నాడు.

"సందేహించకు. వివాహమే చేసుకోను నేను. ప్రమాణంచేసి చెప్తున్నాను. శాశ్వతంగా బ్రహ్మచారినై వుంటాను. సంతానం లేకపోయినా పుణ్యగతికి దారి లేకపోలేదు నాకు" అంటూ ప్రతిజ్ఞ చేశాడు దేవవ్రతుడు.

దేవవ్రతుడి ఈ భీష్మప్రతిజ్ఞకి పూలవర్షం కురిపించారు దేవతలు. 'భీష్ముడు' "భీష్ముడు" అని పొగడారు "భీష్ముడు" "భీష్ముడు" అని జేజేలు పెట్టారు ప్రజలు. భూమీ ఆకాశమూ వొకటే ప్రతిధ్వని - భీష్ముడు, భీష్ముడు. అవాళనించీ దేవవ్రతుణ్ణి భీష్ముడనే వ్యవహరించింది లోకం.

అన్నంతా సాధించాడు దాశరాజు. యోజనగంధిని తెచ్చి భీష్ముడి చేతిలో పెట్టాడు. బంగారం రథంమీద ఆమెని హస్తినాపురం తెచ్చాడు భీష్ముడు. ఆమాంతంగా కొడుకుని కౌగిలించుకున్నాడు

శంతనుడు. "మానవ మాత్రుడికి సాధ్యంకాని పని చేశావోయి, కన్న తండ్రి !" అంటూ శిరస్సు ముద్దుపెట్టుకున్నాడు. "నీ ఇష్టం లేందే మృత్యువు నీ దగ్గిరికి రాకూడదు" అని అతడికి స్వచ్ఛంద మరణం కలగాలని వర మిచ్చాడు.

సత్యవతీ శంతనుల వివాహం ఘనంగా జరిగిపోయింది. చిత్రాంగదుడూ, విచిత్రవీర్యుడూ అని ఇద్దరు కుమాళ్లు కలిగారు సత్యవతికి. వాళ్ళు ప్రయోజకులు కాకండానే కాలంచేశాడు శంతనుడు. తండ్రికి పరలోకక్రియలూ అవీ చేశాడు భీష్ముడు. సకాలంలో చిత్రాంగదుడికి రాజ్యాభిషేకం చేశాడు.

బాల్యంనుండి చపలచిత్తుడు చిత్రాంగదుడు; గర్విష్టి. ఎవ్వరినీ లక్ష్యపెట్టేవాడు కాడు. ఎవళ్ళతో పడితే వాళ్ళతో తగ్వాయి తెచ్చేవాడు. దేవతలనీ గంధర్వులనీ తూలనాడేవాడు. అది సయించలేక చిత్రాంగదుడనే గంధర్వరాజు దండెత్తుకు వచ్చాడు. కురుక్షేత్రంలో పెద్ద యుద్ధ మైంది. హిరణ్వతి నది మైదానంమీద గంధర్వులూ కౌరవులూ హోరాహోరి పోట్లాడారు. కౌరవ చిత్రాంగదుడూ, గంధర్వచిత్రాంగదుడూ ఆభోతుల్లాగ కలియబడ్డారు. మాయ యుద్ధంలో దేవాంతకులు గంధర్వులు. కౌరవ చిత్రాంగదుణ్ణి కడతేర్చి వెళ్ళారు.

విచిత్రవీర్యుణ్ణి రాజుచేశాడు భీష్ముడు. అతడికి పెళ్ళియీడు వచ్చేక పిల్లని కూడా వెదకడం మొదలుపెట్టాడు. అదేసమయానికి కాశీ రాజు తన కూతుళ్ళు అంబ, అంబికా, అంబాలికలకి స్వయంవరం చాటించాడని చారులు వచ్చి చెప్పారు. వెంటనే బయల్దేరాడు భీష్ముడు. రథం వేసుకుని వొక్కడే కాశీ చేరుకున్నాడు. చేతిలో ధనుర్బాణాలు మాత్రం వున్నాయి.

దేశదేశాల రాజులు స్వయంవరంలో కిటకిట లాడుతున్నారు. అందరినీ తప్పించుకుంటూ ముందుకి వురికాడు భీష్ముడు. అందరూ తెల్లబోయి చూస్తూనే వున్నారు. రాజకూతుళ్ళు ముగ్గురినీ. రథం

మీద ఎక్కించుకున్నాడు "ఇదిగో, నా తమ్ముడు విచిత్రవీర్యుడి కోసం ఈ కన్యల్ని తీసుకుపోతున్నాను. చేతనైతే రండి. అడ్డుకోండి" అంటూ రంకె వేశాడు "వివాహాల్లో రాక్షసం, గాంధర్వం రాజులికి శ్రేష్ఠం. అందులోనూ స్వయంవరంలో గెలుచుకు వెళ్ళడం మరీ గొప్ప. అందుకని ఇక్కడ సమావేశమైన రాజులందరినీ గెలుచుకునే వెళతాను" అన్నాడు కాశీరాజుతో. కవ్వించినట్టయింది రాజులికి. అందరూ ఏకమై కత్తుకట్టారు. ఉప్పెన వచ్చినట్టు తిరగబడ్డారు భీష్ముడి మీదికి. జడివానలాగ బాణాలు వేసి ముంచెత్తారు. స్వయంవర ప్రదేశమంతా రణస్థలంగా మారిపోయింది.

ప్రళయ రుద్రుడి అవతార మెత్తాడు భీష్ముడు. ధనుస్సూ బాణాలూ పట్టుకుని పెచ్చురేగిపోయాడు. అంతమంది బాణాలూ ఆపుకుంటూనే అందరినీ పచ్చడికింద కొట్టాడు. అతడి దెబ్బ తగలనివా డంటూలేడు. దాంతో యావన్మందీ కాళ్లకి బుద్ధి చెప్పారు. ఒక్కడూ మిగలకండా పరారీ ఐపోయారు.

వచ్చేస్తున్నాడు భీష్ముడు. ఇంతలో వెనకనించి పటాటోపంగా పరిగెత్తుకు వచ్చాడు సౌంభపురంరాజు సాళ్వుడు. "వీళ్ళని గెలిచినట్టు కాదు. ఆ మగతన మేదో నా ముందు కనపర్చు" అంటూ హుంకరించాడు. రథం వెనక్కి తిప్పాడు భీష్ముడు. యముడిలాగ తిరగబడ్డాడు సాళ్వుడిమీదికి. "సాళ్వుడి సాహసం చూడండి. గాలిలా పరిగెడుతూన్న మదపుటేనుగుని ఎదిరించిన ఏనుగుగున్నలాగ భీష్ముడిరథం మళ్ళిస్తున్నాడు!" అంటూ నిచ్చెరపోయి మెచ్చుకున్నారు జనం.

వందలూ, వేలూ, లక్షలూ, పదిలక్షలూ ఏకటాకీగా బాణాలు వేశాడు సాళ్వరాజు. అన్నీ మధ్యలోనే ఖండించాడు భీష్ముడు. చెవి కొనదాకా లాగి వొక్క బాణం వేశాడు. తారుమన్నాడు సాళ్వుడి సారథి రెండో బాణంతో గుర్రాలు చచ్చాయి. మూడో దాంతో రథం ముక్కలైంది. దాంతో పలాయనం

చిత్తగించాడు సాళ్వుడు. వెనకచూస్తే వొట్టు. బతికి బైటపడ్డా కన్ను లొట్టపోయినట్టయింది అతగాడి పని.

సరాఘాటంగా రాజపుత్రికల్ని తీసుకుని హస్తినాపురం వచ్చేశాడు భీష్ముడు. అలా తీసుకువచ్చి ముగ్గురు కన్యల్ని సత్యవతి ముందు పెట్టాడు. ముగ్గురిని విచిత్రవీర్యుడికి పెళ్ళిచెయ్యాలని ప్రయత్నించింది సత్యవతి. వాళ్ళలో పెద్దది అంబ అభ్యంతరపెట్టింది * "సాళ్వుణ్ణి ప్రేమించాను నేను. ఆయనా నా మీద అనురాగంతో వున్నాడు. మా ప్రేమకి అంతరాయం కలిగించడం న్యాయం కాదు. ధర్మం విచారించండి" అంది భీష్ముడితో. సత్యవతి, భీష్ముడూ ఆలోచించారు. ధర్మశాస్త్రపండితుల సలహాప్రకారం తగిన వృద్ధజనం వెంటనిచ్చి సాళ్వుడి దగ్గిరికి పంపివేశారు అంబని. * అంబికని అంబాలికని విచిత్రవీర్యుడికి పెళ్ళిచేశారు.

వివాహమైతే దివ్యంగా జరిగిపోయింది. కాని, విచిత్రవీర్యుడు మాత్రం అప్పటినుండీ పూర్తిగా మారిపోయాడు. అంతవరకూ చక్కగా రాజ్యవ్యవహారాలు చూస్తున్నవాడల్లా ఇప్పుడు భార్యలే లోకంగా వున్నాడు. అందకత్తెలూ, యవ్వనవతులూ ఐన వాళ్ళిద్దరితోనే షష్టిఘడియలూ కాలక్షేపం. కాముకుడైన వాడికి కళ్ళు మూసుకుపోవడంలో వింతేముంది? మేడలూ, మండపాలూ — తోటలూ, వనాలూ, పచ్చిక బయళ్ళూ, ఇసుక దిబ్బలూ—ఎక్కడ పడితే అక్కడ భార్యలూ, తానూ, కామక్రీడలూను, అంతే. ఇలా అతి కాముకుడై శుష్కించిపోయాడు. విచిత్రవీర్యుడు. చివరికి దానివల్లే ఏడేళ్ళలో ప్రాణాలూ వొదులుకున్నాడు.

ఈ తమ్ముడికీ పరలోకక్రియలు తానే నిర్వర్తించాడు భీష్ముడు. ఆశలన్నీ అడుగంటిపోయాయి. పుత్రశోకంతో కుసిల్లిపోతోంది తల్లి సత్యవతి. మరదళ్ళు, తల చెడి మొత్తుకుంటున్నారు. రాజ్యమూ

* చూ. ఉద్యోగపర్వం అంబకథ

అరాజకమైంది. ముందుకన్నా వెనుకన్నా తాను వొక్కడే మిగిలాడు. తల్లికి ధైర్యం చెప్పాడు. మరదళ్ళని వోదార్చాడు. రాజ్యరక్షణ భారమూ తనమీదే వేసుకున్నాడు.

ఒకనాడు భీష్ముణ్ణి దగ్గిరికి పిలిచింది సత్యవతి. "బాబూ, శంతనుమహారాజు సర్వస్వమూ నీ మీదే ఆధారపడి వుందిప్పుడు. తండ్రికి పిండోదకా లివ్వాలన్నా, సంతాన మని చెప్పుకోవా లన్నా, ఆయన కీర్తి నిలబెట్టాలన్నా, రాజ్యం రక్షించా లన్నా — నువ్వే ఆధారం మరి. ధర్మా లన్నీ తెలిసినవాడివి నువ్వు. నీతో వొకమాట చెప్పా లని పిలిచాను.

"నే నన్నది కాదనకు నాయనా! చూడూ, కురువంశ మంతటికీ నువ్వు వొక్కడవే దీపానివి. అంచేత కౌరవరాజ్యం నువ్వే రాజువై పరిపాలించాలి. అంతేకాదు, వంశం నిలబెట్టాలి. సంతానవంతుడివి కావాలి. బ్రహ్మదగ్గిర ఆరంభించి ఇంతవరకూ అవిచ్ఛిన్నంగా వచ్చింది మన వంశం. నీ అంతవాడు వుంటూ వుండగా ఇంతతో ఆగిపోవడం కూడునా మరి!" అంది.

"ఇలా ఆదేశించడం న్యాయమేనా, అమ్మా?" అన్నాడు భీష్ముడు. "నా ప్రతిజ్ఞ నీకు తెలియంది కనకనా! చంద్రుడు చల్లదనమూ, సూర్యుడు వేడీ వొదిలిపెట్టవచ్చు నేమో. నాన్నగారి కోసం చేసిన ప్రతిజ్ఞ మాత్రం నేను వొదిలిపెట్టడం జరగదు. ఐతే, నీ అభిలాషా పూర్తి కావాలి. శంతనుమహారాజు సంతానం చిలవలూ, పలవలూ వేయాలి. మన వంశం నిర్వంశం కాకూడదు. దీనికి ఆపద్ధర్మంగా ఉపాయం లేకపోలేదు. నా ప్రతిజ్ఞ భంగం చేసుకో నక్కరలేదు. సనాతనంగా వస్తూన్న క్షత్రియధర్మమే చెపుతాను. నేను చెప్పినదానిలో ధర్మాధర్మాలు నిరూపించ గలిగిన పండితుల తోనూ వాళ్ళతోనూ ఆలోచించాకనే ఆచరించవచ్చు" అన్నాడు.

వెంటనే పండితుల్నీ, మంత్రుల్నీ, పురోహితుల్నీ సమావేశపరిచి ఆలోచన సాగించాడు. "లోగడ పరశురాముడి తండ్రిని కార్త

వీర్యార్జునుడు చంపిన కథ మీాకు తెలుసుకదా! ఆ కోపంతో కార్త వీర్యుణ్ణి చంపినా శాంతించలేదు పరశురాముడు. కడుపులో పిల్లలతో సహా క్షత్రియుల్ని చంపాడు.* భర్తలు లేకా, మగపురుగన్న క్షత్రియుడు లేకా ఉత్తమ బ్రాహ్మణులవల్ల తిరిగీ వంశం నిలుపుకున్నారు క్షత్రియస్త్రీలు. నిజమేనా! ఈ సందర్భంలో మరో పురాణ కథా చెపుతాను వినండి.

### దీర్ఘతముడి కథ

"దేవగురువు బృహస్పతి అన్న ఉతథ్యుడు. అతడి భార్య మమత. ఒకనాడు అన్నగారి ఇంటికి వచ్చాడు బృహస్పతి. వదినెగారిని చూసి మనసుపుట్టింది అతడికి. మరిది గనక ఆమెతో సంగమమూ చేశాడు. అప్పుడామె గర్భవతిగా వుంది. గర్భంలో వున్న శిశువు బృహస్పతి చేసిన పనికి కోపించి అరిచాడు. "ఈ గర్భంలో నేను పెరుగుతున్నాను. నీ రేతస్సుకి మరి స్థలం లేదిక్కడ" అంటూ బృహస్పతి రేతస్సు కాళ్ళతో పైకి తోసి వేశాడు. ♦ దానికి కోపం తెచ్చుకున్నాడు బృహస్పతి. "నా పనికి అడ్డువచ్చావు. చిరకాలం చీకటు వుంటుంది నీకు" అని శపించాడు.

"అంచేత, పుట్టుగుడ్డిగా పుట్టాడు మమత కొడుకు. చిరకాలం చీకటి గనక దీర్ఘతముడన్నారు అతణ్ణి. కళ్ళు లేకపోయినా వేదాలూ, వేదాంగాలూ, శాస్త్రాలూ, అన్నీ అభ్యసించాడు దీర్ఘతముడు. తన

---

* చూ. ఆరణ్యపర్వం మూడో ఆశ్వాసమూ, శాంతిపర్వం రెండో ఆశ్వాసమున్నూ.

♦ అలా పైకి తోసివేసిన బృహస్పతి వీర్యంవల్ల మమతకి భరద్వాజుడు పుట్టాడు. పుట్టిన శిశువుని "మన ఇద్దరికీ పుట్టాడు నువ్వే భరించు" అంటూ బృహస్పతీ, "నువ్వు భరించు" అంటూ మమతా కలహించుకుని తుదకు ఇద్దరూ వొదిలిపెట్టి వెళ్ళారు, అంచేతే అతడి పేరు భరద్వాజుడన్నారు. వి. పు. 41. 9. 18.

విద్యాధనం వల్లనే కొన్నాళ్ళకి ప్రద్వేషిణి అనే కన్యని వివాహ మాడాడు. గౌతముడూ మొదలైన కుమాళ్ళనీ కన్నాడు. కామ ధేనువైన సురభి కొడుకు సౌరభేయుడిదగ్గిర గోధర్మం నేర్చుకున్నాడు. జంకూగొంకూ లేకండా ఆ గోధర్మం పాలిస్తూవచ్చాడు. * అతడి ప్రవర్తన చూసి ఆశ్రమంలోవాళ్ళంతా అసహ్యించుకునేవాళ్లు. అతణ్ణి బహిష్కరించాలనీ ప్రయత్నించేవాళ్ళు. ప్రద్వేషిణీ అతణ్ణి ద్వేషించేది. ఎందు కిలా ద్వేషిస్తున్నా వని భార్యని అడిగాడు దీర్ఘతముడు. 'భరించేవాడు భర్త. భరించబడేది భార్య. మన విషయంలో ఇది విపరీతంగా వుంది. కళ్ళులేని కపోతివి. తొలినుండీ నేనే భరిస్తున్నాను నిన్ను. ఎన్నాళ్ళీ వ్యాపారం. ఇహ చాలు. నా తరం కాదు. ఇహనైనా ఎవైనా వేంచేయి' అంటూ ధుమధుమ లాడింది ప్రద్వేషిణి. ఈసడించింది.

"ఆడవాళ్లు కఠినాత్ములు" అంటూ క్షోభపడ్డాడు దీర్ఘతముడు. "మగడు లేని ఆడది మంగళసూత్రాలూ, ముస్తాబూ లేకండా వుండాలి" అంటూ శాపంపెట్టాడు. దాంతో మరింత మండిపడింది ప్రద్వేషిణి కుమాళ్ళని పిలిచింది. "ఈ ముసలాణ్ణి యీడ్చుకుపోయి

* గోధర్మం వావీ వరసా లేకండా తోచిన స్త్రీలతో సంగమించడం, ఇది తినవచ్చూ, ఇది తినరాదూ అనకుండా ఇష్టంవచ్చింది తినడం గోధర్మమని బ్రహ్మాండపురాణం గోధర్మం పాలించడంవల్ల కామధేనువు ప్రసన్నమై దీర్ఘతముడికి దృష్టి ప్రసాదించిందట అగ్ని ప్రసాదించినట్టు ఋగ్వేదం (మం1సూ147)

జైమిని బ్రాహ్మణం [2 1 13] అపస్తంబశ్రౌతసూత్రం [22. 13. 1 మొదలైనవాట్లో గోసవమనే యజ్ఞం వివరాలున్నాయి అదే గోధర్మం గోస యజ్ఞం చేసేవాడు ఏకసంవత్సరంపాటు పశువులాగే ప్రవర్తించాలి. తల్లీ, అక్కాచెల్లీ, కూతురూ అని విచక్షణ లేకండా, ఏ స్త్రీతో అయినా సంభోగించడానికి సంకోచించకూడదు. పశువులాగే గడ్డి గాదా తినడం, కుడితీ అదీ తాగడం, పశువులాగే ఎక్కడబడితే అక్కడ మలమూత్రాలు విసర్జించడం చెయ్యాలి.

ఎక్కడన్నా పడేసి రండి" అంది. తండ్రి అంటే కుమాళ్ళకీ అలాగే వుండేది. పైపెచ్చు మదాంధులు కూడాన్నూ వాళ్లు. పాపం, వృద్ధుడూ, పుట్టుగుడ్డీ ఐన దీర్ఘతముణ్ణి కట్టెలతో కట్టకట్టి అమాంతంగా గంగలో పారవేశారు.

"గంగా ప్రవాహంలో తేలుతూ ఎంతో దూరం కొట్టుకుపోయాడు దీర్ఘతముడు. ఒకచోట బలిరాజు * గంగాభిషేకం చేస్తున్నాడు. ఉదాత్త అనుదాత్త స్వరాలతో వేదరుక్కులు వల్లిస్తూ గంగ కెరటాలమీద తేలివస్తూన్న దీర్ఘతముణ్ణి చూశాడు. వెంటనే వొడ్డుకి తెచ్చి కట్లు విప్పాడు. మునీశ్వరుడని పోల్చుకుని నమస్కరించాడు. "నా అదృష్టంవల్ల మీ దర్శనమైంది. ఎక్కడనుండి వస్తున్నారు? సంతానం లేకండా దుఃఖపడుతున్నాను నేను. నాకు సంతానదానం చేసి కృతార్థుణ్ణి చేయండి" అంటూ ప్రార్థించాడు. సగౌరవంగా తన కోటకి తీసుకువెళ్ళి రుతుమతిగా వున్న తన భార్య సుధేష్ణని అతడికి సమర్పించాడు.

"పుట్టుగుడ్డీ, ఛాందసుడూ, పూతికంపు వేస్తున్నవాడున్నూ ఐన దీర్ఘతముణ్ణి చూసి అసహ్యించుకుంది రాణి సుధేష్ణ. అందంలోనూ, యవ్వనంలోనూ తనవంటిదే ఐన దాదికూతుర్ని ఉసిజని ముని దగ్గిరికి పంపింది పడకకి. దాదికూతురు గర్భంలో కాక్షీవంతుడూ మొదలైన పదకొండు మంది కుమాళ్లని కన్నాడు ముని. ఒకనాడు రాజు ముని దగ్గిరికి వచ్చి "పిల్లు నా కుమాళ్ళేనా" అని అడిగాడు. "కాదు" అన్నాడు ముని. "పిల్లు నీ భార్య దాది కూతురు కొడుకులు. ఐనా, ధర్మపరులు. సత్యవంతులు" అన్నాడు. నొచ్చుకున్నాడు బలి. తిరిగి రుషిని ప్రార్థించాడు. భార్యని వొప్పించి మునిదగ్గిరికి పంపించాడు.

---

* బలి : యయాతి పుత్రుడయిన అనువు సంతతిలో సుతపుడు అనే వాడి కుమారుడు

"ఈసారి బాగా ముస్తాబై తానే వచ్చింది రాణి. ఆమె అవయవాలన్నీ ముట్టి చూశాడు దీర్ఘతముడు. "వంశోద్ధారకులూ, సత్యసంపన్నులూ ఐన కొడుకులు పుడతారు" అని దీవించాడు. అతడి సంగమం వల్ల సుధేష్ణకి అంగరాజు పుట్టాడు. *

"ఇలాగే ఉత్తమక్షత్రియుల భార్యలికి ఎంతోమందికి సంతానం కలిగి వంశం నిలబడుతూవచ్చింది. ఏమంటారు? అంచేత, ఈ సనాతనాచారం ప్రకారం తమ్ముడి భార్యలికి సంతానం కలిగించే మహాత్ముణ్ణి చూడమంటూ నిపుడు" అన్నాడు. అందరూ ఇది ధర్మసమ్మతమే అన్నారు.

"బావుంది, నాకూ సమ్మతమే" అంది సత్యవతి. 'నేను కన్యగా వున్నప్పుడు పరాశరముని ప్రసాదంవల్ల నా కన్యాత్వం చెడకండా వ్యాసుడు కలిగాడు నాకు. అవసరం కలిగినప్పుడు తలుచుకుంటే చాలు వస్తానని తపోవనానికి వెళ్ళాడు. లోకపూజ్యుడూ, ధర్మాత్ముడూ, సత్యమూర్తీన్నీ అతడు. దేవరన్యాయంగా అతడే దీనికి తగినవాడు" అంది.

వ్యాసముని మాట విని తపోవనందిక్కు తిరిగి నమస్కరించాడు భీష్ముడు. "ఆయన మా కురువంశం నిలబెట్టడం మా అందరికీ అభిమతమే" అన్నాడు. లోగడ తనకి చేసిన వాగ్దానం జ్ఞాపకం చేస్తూ వ్యాసుణ్ణి స్మరించింది సత్యవతి. ఉత్తరక్షణంలో తల్లిముందు

* దీర్ఘతముడు వైదికఋషులలో సుప్రసిద్ధుడు మహా విద్వాంసుడు, ఋగ్వేదంలో ఇతడి సూక్తాలనేకం. ఒక సూక్తంలో దాసులు తన్ను గట్టిగా కొట్టారనీ, తాళ్ళతో కట్టి బోరగిలా పడదోశారనీ, త్రైతనుడనే దాసుడు తన తలమీదా, గుండెలమీదా, భుజాలమీదా, గండ్లు పెట్టాడనీ, దీర్ఘతముడే చెప్పుకున్నాడు. [మం 1, అను 27. సూ 158]

మత్స్యపురాణం, భాగవతం, బ్రహ్మాండపురాణం, విష్ణుపురాణం మొదలైన వాటిల్లోనూ దీర్ఘతముడికథ కనిపిస్తుంది. దీర్ఘతముడివల్ల బలిభార్య సుధేష్ణకి అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్ర, ఆంధ్రులు ఆరుగురు కొడుకులు కలిగారని భాగవతం.

నుంచున్నాడు వ్యాసుడు. పాపం, పుట్టిన తరవాత పెద్దకొడుకుని తిరిగి ఇదే చూడడం ఆమె.

నల్లటి కొండశిఖరంమీద బంగారంతీగెల్లాగ తలమీద కపిల జడలూ, ఇంద్రనీలమణి కాంతులు విరజిమ్ముతూన్న నల్లటి శరీరం - అపూర్వంగా వున్నాడు వ్యాసముని. అమాంతంగా కౌగిలించుకుంది తల్లి. శిరస్సు ముద్దాడింది ఆనందబాష్పాలతో తడిపింది. తల్లికి నమస్కరించాడు వ్యాసుడు. కన్నీళ్ళు తుడిచి కుశలప్రశ్న చేశాడు. అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి గౌరవించాడు భీష్ముడు.

కులాసాగా కూచున్నాక "బాబూ, తండ్రితరవాత తల్లికే అధికారముంది కొడుకుల్ని ఆజ్ఞాపించడానికి" అంటూ ఆరంభించింది సత్యవతి. "సంతానం లేకండానే కాలంచేశాడు నీ తమ్ముడు విచిత్రవీర్యుడు. కౌరవవంశం నిర్వంశం కాబోతున్నది. రాజ్యం అరాజక మయ్యేస్థితిలో వుంది. ఇదిగో, ఇతనూ నీ తమ్ముడే భీష్ముడు. శంతనుమహారాజు పెద్దకొడుకు. రాజ్యానికి రాజు కాదగ్గ వాడు. వంశమూ నిలుప దగ్గవాడు. ఐతే, తండ్రికోసం ప్రతిజ్ఞ చేశాడు. రాజ్యం వొదులుకున్నాడు. బ్రహ్మచర్యం అవలంబించాడు. సర్వజ్ఞుడివి. నీకుమాత్రం తెలియందేముంది? ఇహా, ఆశలన్నీ నీమీదే పెట్టుకున్నాం. నీవల్లే మా కౌరవవంశం మళ్ళీ తామరతంపర కావాలి. అరాజకభయం తప్పి రాజ్యం స్థిరపడాలి. అంబికా, అంబాలికా నీ మరదళ్ళు. నువ్వే వాళ్ళకి సంతానదానం చెయ్యాలి. మా అందరి కోరికానూ ఇదే" అంది.

"అమ్మా, నీ ఆజ్ఞకి అడ్డేముంది? అన్నాడు వ్యాసుడు. నీ ఆదేశం ధర్మసమ్మతమైంది. శ్రుతులూ, పురాణాలూ కూడా అంగీకరిస్తున్నాయి దీన్ని. ఐతే, నీ కోడళ్ళు వొక సంవత్సరం నేను చెప్పిన వ్రతం చెయ్యాలి. అలాఐతే మహోత్తమమైన సంతానం కలుగుతుంది" అన్నాడు. "ఆలస్యానికి వ్యవధి లేదు తండ్రీ"

మాత్రం సయించలేరు. అరాజకంవల్ల అన్నిధర్మాలూ నశిస్తాయి. అనావృష్టి, కరువూ, ధరలతారుమారూ అన్నీ ముంచుకొస్తాయి. నువ్వు కన్న కుమాళ్ళు ప్రయోజకు లయ్యేవరకూ భీష్ముడు రాజ్యం రక్షిస్తాడు" అంది. "ఇదే ని ఆదేశమే కానీ" అంటూ ఒప్పుకున్నాడు వ్యాసుడు.

తరవాత అంబిక దగ్గిరికి వెళ్ళింది సత్యవతి. అవాళ రుతు స్నానం కూడా చేసివుంది అంబిక "చూడూ, అమ్మాయీ అంబికా, వంశం నిలబెట్టడం కంటే మించిన ధర్మం లేదు లోకంలో. మాణిక్యం లాంటి కొడుకుని కని మన వంశం నిలబెట్టాలి నువ్వు. కుమాళ్ళలో క్షేత్రజుడు–అంటే భార్యకి ఆపద్ధర్మంగా ఇతర్లవల్ల కలిగినవాడు — ఉత్తము డన్నారు పెద్దలు. అబ్బాయి విచిత్ర వీర్యుడి క్షేత్రానివి నువ్వు. ని కడుపులో కలిగిన కుమారుడు అతడికి పుణ్యలోకాలు కలిగించడానికి కారణ మవుతాడు.

"ఇవాళరాత్రి నీ దగ్గిరికి మీ బావ వ్యాసుడు వస్తాడు. అతడికోసం సిద్ధంగా వుండాలి నువ్వు" అంది. కోడలిచేత 'ఊఁ' అనిపించింది. దేవతలకి పూజలూ అవీ చేయించింది. బీదలకీ బ్రాహ్మలికీ సంతర్పణలూ చేయించింది.

ముస్తాబు చేసుకుని రాత్రి పడకగదిలో సిద్ధంగా వుంది అంబిక. గదిలో అడుగుపెట్టాడు వ్యాసుడు. సన్నంగా, పొడవుగా, నల్లగా వున్నాడు మనిషి. కవిలగెడ్డం, కవిలజడలూ, కవిలకన్నులూ వికారంగా వున్నాయి. చూసి కళ్ళు మూసుకుంది అంబిక. మరి తెరిచిన పాపానపోలేదు పక్కమీాద. ఆ రాత్రి ఆమెతో గడిపి వచ్చాడు వ్యాసముని.

"ఈమెకి మంచి బలవంతుడైన కొడుకే పుడతాడు. ఐతే, మాతృదోషంవల్ల పుట్టుగుడ్డి అవుతాడు" అన్నాడు. విని విచారించింది సత్యవతి. మళ్ళీ చెప్పి చిన్నకోడలు అంబాలికకి మంచి కొడుకుని ప్రసాదించ మంది.

రెండోనాటి రాత్రి చిన్నమరదలు దగ్గిరికి వెళ్ళాడు వ్యాసుడు. ఆ వికారరూపం చూసి తెల్లపోయి వూరుకుందామె. "ఈమెకీ మంచి బలవంతుడూ, పరాక్రమవంతుడూ, రూపవంతుడూ పుడతాడు. కాని తల్లిదోషంవల్లనే పాండుదేహంవా డౌతాడు" అని చెప్పి తపోవనం వెళ్ళిపోయాడు వ్యాసుడు.

అతడు చెప్పినట్టే పదివేల మదపుటేనుగుల బలంతో పుట్టాడు అంబిక కొడుకు. కానైతే కళ్ళుమాత్రం లేవు. ధృతరాష్ట్రుడని నామకరణం చేశారు అతడికి. అంబాలికకి లక్షణవంతుడైన కొడుకే కలిగాడు. ఐతే, శరీరంమాత్రం పాండువర్ణం. అందుకనే అతణ్ణి పాండు రాజన్నారు. ఇద్దరు కుమాళ్ళకి శాస్త్రోక్తంగా జాతకర్మాలూ అవీ చేయించాడు భీష్ముడు.

అంబిక కొడుకు అంధుడు కావడంతో ఎంతో ఖేదించింది సత్యవతి. మళ్ళీ వ్యాసుణ్ణి తలుచుకుంది. యథాప్రకారం ప్రత్యక్ష మయాడు వ్యాసుడు. "మళ్ళీ ఏం పని వచ్చింది? సెలవియ్యి" అన్నాడు. "అంబిక కొడుకు పుట్టుగుడ్డి ఐపోయాడు. అలాకాకండా అందమైనవాణ్ణీ గుణవంతుణ్ణీ మరొకణ్ణి ప్రసాదించు దానికి" అంది సత్యవతి. "అది నన్ను కల్మషం లేకండా కలిస్తే నువ్వు అన్నట్టే జరుగుతుంది" అన్నాడు వ్యాసుడు.

ఎన్నోవిధాల కోడలికి బోధపర్చింది సత్యవతి. కాని అంబికకి మాత్రం మనస్కరించలేదు. అత్త ఎదట సరే అంది. తీరా సమయానికి దాసీని పంపింది పడకగదికి. నాజూకుగా ముస్తాబైంది దాసి. వ్యాసుణ్ణి అన్నివిధాలా సంతోషపెట్టింది. ఆ రాత్రి ఆమెతో ఇష్ట భోగాలు అనుభవించి వెళ్ళాడు ముని.

మంచి తేజోవంతుడైన కొడుకు పుట్టాడు దాసికి. విదురు డని పేరుపెట్టారు అతడికి. లోగడ మాండవ్యముని శాపంవల్ల యముడే ఇలా విదురుడై పుట్టాడు.

మాండవ్యముని కథ

మాండవ్యుడు బ్రహ్మర్షి. అతడు వొంటరిగా బయలుదేరి భూలోకంలో వున్న తీర్థాలు యావత్తూ సేవించాడు చివరికి వొక పట్నం చేరువగా వున్న అడివిలో ఆశ్రమం కట్టుకున్నాడు. ఆశ్రమం వాకిట చెట్టుకింద మౌనవ్రతంతో, చేతులు మీది కెత్తి తపస్సు ప్రారంభించాడు.

ఒకనాడు ఆ పట్నంరాజు కోటలో దొంగలు పడ్డారు. ఖజానా ధనం ఎత్తుకుపోతూంటే రాజభటులు వెంటతరిమారు. దొంగలు పారివచ్చి మాండవ్యుడి ఆశ్రమంలో దాక్కున్నారు. భటులు వచ్చి వాకిట్లో మాండవ్యుణ్ణి గద్దించారు. "ఇలాగే వచ్చారు. దొంగలు. ఎక్కడున్నారో చెప్పు" అన్నారు. మౌన వ్రతంలో వున్నాడు ముని. మాటాడ లేదు. ఆశ్రమంలో చూస్తే దొంగలు దొరికిపోయారు. "వీడే వీళ్ళకి సంధానకర్త. అంతా తెలిసీ దొంగ వేషం వేస్తున్నాడు. మన మింతా గొంతుకు చించుకుంటే పలకడూ వులకడూ" అంటూ దొంగలతో మునినీ కట్టి రాజు దగ్గిరికి పట్టుక పోయారు.

రాజు విచారణచేసి దొంగల్ని చంపించివేశాడు. మాండవ్యుడికి ప్రత్యేకశిక్ష వేశాడు. "మునివేషంలో వున్న దొంగ వీడు. వీడికి వూరిబయట కొరత వేయండి"అని ఆజ్ఞాపించాడు.

కొరతమీద వుండికూడా శాంతచిత్తంతో తపస్సు చేసుకుంటున్నాడు మాండవ్యముని. తిండీ తిప్పలూ లేకండా ఎంతోకాలం బతికాడు. అతణ్ణి చూసి ఆశ్చర్యపోయారు మహర్షులు. పక్షుల రూపంలో రాత్రిళ్ళు వచ్చి ప్రశ్నించారు. "ఇంత తపశ్శాలివి నువ్వు, మునీంద్రా, నీకు ఈ దుఃఖం తెచ్చిపెట్టినవా ళ్ళెవరు ?" అన్నారు. "తెలిసి తెలిసీ నన్ను అడుగుతా రేం ?" అన్నాడు మాండవ్యుడు. "సుఖ మన్నా, దుఃఖ మన్నా తన కర్మే తనకి తెచ్చి

పెడుతుంది. దేని కన్నా తనకి తానే కర్త దీనికి పైవాళ్ళని అనడం దేనికి ?'' అన్నాడు.

ఈ మాటలు నగర రక్షకులు విన్నారు. వెళ్ళి రాజుకి చెప్పారు. రాజు వచ్చి సాష్టాంగపడ్డాడు మునికి. "తెలియక పొరపాటు చేశాను. నా అజ్ఞానం క్షమించండి" అంటూ ప్రార్థించాడు. కొరతనుండి దింపించబోయాడు. కాని శూలం వూడి రాలేదు. అప్పుడు చేసేదిలేక కొర్రు మొదలు నరికివేశారు. మిగిలిన కొర్రు కంఠంలో అలాగే వుండిపోయింది మునికి. అంచేత అవాళనించీ మణిమాండవ్యుడు అన్నారతణ్ణి.

తరవాతకూడా ఘోరమైన తపస్సుచేశాడు మణిమాండవ్యుడు. లోకాలు యాత్రావత్తూ నిరాఘాటంగా తిరిగి వచ్చేవాడు. ఒకనాడు యమలోకానికి వెళ్ళాడు. "ఏం పాపం చేశానని కొరతమీద అంత కఠినశిక్ష విధించావునాకు ?'' అని అడిగాడు యముణ్ణి. "చిన్నప్పుడు తూనీగలు పట్టి ముల్లు గుచ్చావు. దాని ఫలమే అనుభవించావు. చేసిం దెలా తప్పుతుంది ?'' అన్నాడు యముడు.

"ఆ మాత్రం దానికి ఇంత కఠినశిక్షా ?'' అంటూ ఉగ్రుడయాడు మాండవ్యుడు. "బాల్యంలో, అజ్ఞానంలో చేసినదానికి తగని శిక్ష వేశావు. అందుకని నరలోకంలో శూద్రయోనిలో పుడతావు'' అంటూ శాపం పెట్టాడు యముణ్ణి. "ఇదిగో, ఇవాళనించీ పద్నాలు గేళ్ళు దాటని పసివాళ్ళు ఏం చేసినా పాపం తగలకూడదు వాళ్ళకి. అంతవరకూ వాళ్ళకి ఎవరు ఏం నష్టం కలిగించినా పాపం చుట్టుకుంటుంది. ఇది నా శాసనం'' అన్నాడు. ఆనాటి మాండవ్యముని శాపంవల్లనే విదురుడై పుట్టాడు యముడు.

—*—

# ఆదిపర్వం

## ఐదో ఆశ్వాసం

ధృతరాష్ట్రుడూ పాండురాజూ భీష్ముడి రక్షణకింద ప్రయోజకులౌతున్నారు. ఉపనయనం జరిగింది. విద్యాభ్యాసం ముగిసింది. రాజవిద్యలూ పూర్తయాయి. విదురుడూ విద్యావంతుడై కలిసివచ్చాడు. ఏ కొరతా లేదు వాళ్ళకి.

భీష్ముడి ఆధిపత్యం కింద దేదీప్యమానంగా వుంది రాజ్యం. ఉత్తరకురుభూములకంటే సుభిక్షంగా వుంది కురుదేశం. ధర్మం నాలుగు కాళ్ళమీద నడిచింది. అదునికి వానలు కురిశాయి పాడీ పంటా సమృద్ధిగా వుంది. నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుంది దేశం. ఈతిబాధలు లేనేలేవు ప్రజల్లో పరస్పరసహాయమూ, సహృదయతా అధికమయాయి. ఆచారవంతులయిన బ్రాహ్మల ఇళ్ళల్లోనూ, పుణ్యప్రదేశాల్లోనూ వేదాధ్యయనమూ, వషట్, స్వాహా, స్వధా, స్వస్తి శబ్దాలూ, మంగళవాద్యాలూ, ఉత్సవాల కలకలాలూ వినపడుతూ వుండేవి. చెప్పేదేముంది, భూలోక స్వర్గంగా వుండేది హస్తినాపురం.

ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి కావడంచేత పాండురాజే రాజు. భీష్ముడి ధనుర్బాణాలూ, విదురుడి విద్యాబుద్ధులూ పెట్టనికోటలా వున్నాయి రాజ్యానికి. శత్రురాజులు అడుగులికి మడుగు లొత్తుతూ వుంటే దేవేంద్రవైభవంగా వుండేది హస్తినాపురం సింహాసనం.

### గాంధారి

ధృతరాష్ట్రుడికి పెళ్ళి ఈడు వచ్చింది. విదురుడితో ఆలోచించాడు భీష్ముడు. "కౌరవవంశం నాశనం కాకండా నిలబెట్టాడు

సోదరుడు వ్యాసుడు. ఇది తామరతంపరగా వృద్ధిపొందడం కళ్ళ వేడుకగా చూడా లని వుంది నాకు. కుమారుడు ధృతరాష్ట్రుడి పెళ్ళి కావాలిప్పుడు. గాంధార దేశం రాజు సుబలుడు. అతడి కూతురు గాంధారి మనవాడికి తగినపిల్ల అని వింటున్నాను. వందమంది కుమాళ్ళు కలిగేట్టు వరంకూడా పొందిందట ఆ పిల్ల. సుబలుడు మనతో సంబంధానికి తగినవెయ్యి" అన్నాడు. "చక్కని ఆలోచన" అని తలవూపాడు విదురుడు.

అనుభవం కల వృద్ధజనాన్ని గాంధార దేశం పంపారు. కౌరవ రాజులతో సంబంధంకంటే కావలిసిం దేముంది" అంటూ అంగీకరించాడు సుబలుడు. వెంటనే వాగ్దానమూ చేశారు. గాంధారం రాజబంధువులుమాత్రం గుసగుసలాడారు. "రత్నంలాంటి పిల్లని పుట్టుగుడ్డికి కట్టిపెట్టడ మేమిటి?" "శరీర మంతటికీ శిరస్సు ప్రధానం. శిరస్సంతటికీ కళ్ళే ముఖ్యం. అలాంటి కళ్ళు లేవు. ఈ వొక్కటీ తప్పిస్తే ఇంతటి వరుడు దొరకడం దుర్లభం"అన్నారు.

ఇవన్నీ ఆ నోటా, ఈ నోటా వింది గాంధారి. తండ్రి "అవును" అన్నప్పుడే తాను ధృతరాష్ట్రుని భార్య నయిపోయా నను కుంది. అతణ్ణే తప్ప మరొకర్ని పెళ్ళాడ నసీ, భర్తకి లేని దృష్టి తనకి మాత్రం ఎందుకనీ నిశ్చయించుకుంది. అవాళనుండీ రెండుకళ్ళకీ గంతలు కట్టుకుంది. కళ్ళుండీ అంధురాలయింది.

మంచిరోజు చూసి గాంధారి సోదరుడు శకుని ఆమెని తీసు కుని హస్తినాపురం వచ్చాడు. గాంధారీ ధృతరాష్ట్రుల వివాహం దివ్యంగా జరిగిపోయింది. ఆమెతో పాటు ఆమె చెల్లెళ్ళు సత్యవ్రతా సత్యసేనా సుధేష్ణా సంహితా తేజశ్శ్రవా సుశ్రవా నికృతీ శుభా సంభవా దశార్ణా అని మరి పదిమంది కన్యల్ని ఒకే లగ్నంలో పెళ్ళిచేసుకున్నాడు ధృతరాష్ట్రుడు. అంతతోనూ ఆగిపోలేదు. దేశంలో అందమైన కన్యల్ని ఎంచి ఎంచి తీసుకొచ్చాడు భీష్ముడు. ఇలా వందమందిని పెళ్ళాడాడు ధృతరాష్ట్రుడు.

అంతలో పాండురాజుకూడా చక్కని బుద్ధిమంతుడై ప్రయోజకుడయాడు. వేదాలూ, వేదాంగాలూ, శాస్త్రాలూ, పురాణాలూ కూలంకషంగా అభ్యసించాడు. కత్తీ, ఈటే, ధనుస్సూ-ఆయుధవిద్యలన్నింటిలోనూ గడితేరాడు. గుర్రం, ఏనుగూ—వీటిమీద స్వారీ చేయడంలో మొనగాడనిపించుకున్నాడు. విశాలమూ, ఉన్నతమూ ఐన వక్షస్థలమూ, కండలుతిరిగిన దీర్ఘబాహువులూ—అతడి మిసమిసలాడుతున్న యవ్వనం చూసి తలపంకించేవాడు భీష్ముడు. "మావంశం ఇతడివల్లే వన్నె కెక్కాలి" అనుకునేవాడు. అతడికోసం పిల్లనీ వెదకడం ప్రారంభించాడు.

## కుంతి

ఇంతలో కుంతిభోజుడు తన పెంపుడు కూతురు పృథకి స్వయంవరం చాటించాడు. పృథ యాదవరాజు శూరసేనుడి పెద్దకూతురు. వసుదేవుడి చెల్లెలు. కుంతిభోజుడు శూరుడి మేనత్తకొడుకు. అతడికి సంతానం లేక పృథని పెంచుకున్నాడు. కుంతిభోజుడు పెంచుకోవడం చేత పృథకి కుంతి అనీ పేరువచ్చింది. కుంతిభోజుడి ఇంట పెరుగుతూ ఆయన ఆదేశం ప్రకారం బ్రాహ్మలకీ అతిథులికీ సంతృప్తిగా భోజనాలూ అవీ సమకూరుస్తూ వుండేది కుంతి.

ఒకనాడు దూర్వాసముని అతిథిగా వచ్చాడు. ఆయన కోరిన పిండివంటలతోనూ వాటితోనూ సుష్టుకృతుగా భోజనంపెట్టి సేవ చేసింది కుంతి.ఎంతో సంతోషించాడు ముని. దానికి ప్రతిఫలంగా వొక మహామంత్రం ఉపదేశించాడు. "ఈ మంత్రంవల్ల ఆపద్ధర్మంగా, ఏ దేవతని కోరితే ఆ దేవత వస్తాడు నీ దగ్గిరికి. నువ్వు ఎలాంటి కొడుకు కావాలంటే అలాంటి కొడుకుని ప్రసాదిస్తాడు" అని చెప్పి వెళ్ళాడు.

**కుంతి వసుదేవుల తల్లి మారిష.**

మంత్రశక్తి పరీక్షించాలని కుతూహలపడింది కుంతి. నదికి వెళ్ళింది. స్నానం చేసింది. మంత్రం జపించింది. సూర్యుడికి అర్ఘ్యమెత్తింది. "నీలాంటి కొడుకు కావాలి" అంటూ మొక్కింది. తిరుగు లేంది మునిమంత్రం. నవయువ్వనుడై వచ్చి ఎదట నుంచున్నాడు సూర్యుడు. కన్యాచాపల్యం వల్ల పిలిచిందే కాని చూసి తెల్లపోయింది కుంతి. భయం, తొట్రుపాటూ, సిగ్గూ, ఆశ్చర్యం — సతమతమైపోతూ వుంది. "భయపడకు" అన్నాడు నవ్వుతూ సూర్యుడు. "నీ కోరిక తీర్చడానికే వచ్చాను" అన్నాడు. సిగ్గుతో ముడుచుకుపోతోంది కుంతి. "అజ్ఞానంవల్ల అపరాధం చేశాను. క్షమించండి" అంటూ తలవంచుకుంది. "మహారుషి మంత్రం పరీక్షించాలని ఉబలాటపడ్డాను. ఆడది అపరాధం చేసినా ఆదరించడం ధర్మం" అంటూ చేతులు జోడించింది. "అవును, రుషి మంత్రం అమోఘమైంది. నా రాక వృథ కాకూడదు. నీ కోర్కె తీర్చే వెళతాను" అన్నాడు సూర్యుడు. "వద్దు. తెలియక కోరరాని కోర్కె కోరాను. కన్యని. నేను గర్భవతినే ఐతే తల్లిదండ్రులికి తలవంపులు. చుట్టాలలో నగుబాట్లు" అంటూ వేడుకుంది కుంతి. "ఆ సంకోచం అక్కరలేదు. నీ కన్యాత్వం చెడకండా వర మిస్తాను" అంటూ ఆమెని సందిటిలోకి లాక్కున్నాడు సూర్యుడు. *

తేజోవంతుడైన కొడుకు పుట్టాడు. కుంతీకన్యకి. అతడే కర్ణుడు. శరీరానికి సహజమైన కవచమూ, చెవులికి కుండలాలూ కలిగి రెండో సూర్యుడిలా ప్రకాశిస్తున్నాడు కర్ణుడు. కొడుకుని చూసి సంతోషంకంటే దుఃఖమే హెచ్చయింది కుంతికి. "దూర్వాసుడు రావడమేమిటి? వచ్చినా వరమివ్వడ మేమిటి? కన్యకి నాకు కొడుకు పుట్టడ మేమిటి? అయ్యో, ఏం దారి?" చివరికి కుమారుణ్ణి

కుంతిని సూర్యుడు కలిసినదినం మాఘ శుక్ల పౌర్ణమి,

వారత్నాల పెట్టెలో పెట్టింది వెళ్ళి నదీప్రవాహంలో విడిచి పెట్టింది. నదీప్రవాహంతో ఆమె కన్నీళ్ళూ ప్రవహించాయి.

నదిలో కొట్టుకుపోతున్నాడు కర్ణుడు చంపానగరంలో సూతుడు అతిరథుడు ♦ భార్యతో నదికి వచ్చి కర్ణుణ్ణి చూశాడు. పెట్టెతో కూడా పట్టుకుపోయి తన భార్య రాధ చేతిలో పెట్టాడు. నిరుపేదకి నిక్షేపం దొరికింది. కన్న తల్లిలా చన్నులూ చేపాయి రాధకి కుంతి కడుపులో పుట్టి రాధ కొడుకై సూతుడింట పెరిగాడు కర్ణుడు వసువు లతో అంటే రత్నాలతో రావడంచేతా, వసువర్మం అంటే బంగారు కవచం వుండడంచేతా వసుషేణుడని పేరు పెట్టారు.

ఇది కుంతి కన్యనాటి కథ. ఇప్పుడామె స్వయంవరం చాటించాడు కుంతిభోజుడు. దేశదేశాల రాజులూ వచ్చారు. పాండురాజూ వెళ్ళాడు. అందరిలోనూ పాండురాజునే వరించింది కుంతి. కుంతీ పాండురాజుల వివాహం ఎంతో వైభవంగా జరిగింది. తరవాత మద్ర దేశంరాజు శల్యుడి చెల్లెలు మాద్రినికూడా తెచ్చి పాండురాజుకి పెళ్ళిచేశాడు భీష్ముడు.

## పాండురాజు

పాండురాజు ప్రతాపానికి పట్టపగ్గాలు లేవిప్పుడు. వీరుడన్న వాణ్ణి ఎవణ్ణీ లక్ష్యపెట్టడాయన. చతురంగ బలాలు వెంటవేసుకుని దిగ్విజయానికీ బయల్దేరాడు. అతడి సైన్యాల బరువుకి భూమిని మోస్తున్న ఆదిశేషుడి పడగలమీది మణులు చెదిరిన ట్టయాయి. మదపు టేనుగులమీద రెపరెప లాడుతున్న పతాకాల గాలికి మేఘాలు పటాపంచలై నట్టయాయి.

అతిరథుడు దర్ఘ్యమనుడవల్ల బలరాజారాణి గర్భంలో కలిగిన అంగుడి పద్నాలుగో తరంవాడు జయద్రథుడు, ఇతడు బ్రాహ్మణ స్త్రీకి క్షత్రియుడికీ పుట్టిన ఒక కన్యని పెళ్లాడాడు. (బ్రాహ్మణస్త్రీకి క్షత్రియుడికీ పుట్టిన వాళ్ళని సూతులంటారని మనుస్మృతి.) ఈ సూతకన్యకి పుట్టిన మున్మనమడి కొడుకు సత్యకర్ముడు. సత్యకర్ముడికొడుకు అతిరథుడు. వి. పు.

ఇలా దండెత్తి తూర్పు పడమర్లూ, ఉత్తర దక్షిణాలూ-అన్ని దిక్కులా రాజుల్ని జయించుకు వచ్చాడు పాండురాజు. అతడి ధాటికి గడగడ లాడని రాజు లేడు. అతడి అనుగ్రహంకోసం కానుకలతో కాళ్ళమీద పడనివాడూ లేడు. ఏనుగులూ, గుర్రాలూ, అందమైన ఆడవాళ్ళూ, మేకలూ, గొర్రెలూ, ఆవులూ, గేదెలూ - వేలకొలదీ నజరానా లిచ్చారు దేశదేశాల రాజులు. ఈ దిగ్విజయంవల్ల వెండి, బంగారం, నవరత్నాలూ వొక లక్ష ఏనుగుల మీద హస్తినాపురం వచ్చాయి. కౌరవులంటే గజగజలాడింది ప్రపంచం. పాండురాజు పేరు చెబితే సింహస్వప్నం.

ఇలా తెచ్చిన ధనరాసులు అన్నగారి ముందు పెట్టాడు పాండురాజు. భీష్ముడికీ, సత్యవతికీ, తల్లులికీ, విదురుడికీ, తదితర స్నేహితులికీ రకరకాల విలువైన వస్తువులు పంచిపెట్టాడు. తమ్ముడు తెచ్చిన ధనంతో వంద అశ్వమేధాలు చేశాడు ధృతరాష్ట్రుడు.

అడకువతో అన్నగారినీ, అడిగిందల్లా చేసిపెట్టి బంధువుల్నీ, ఆనుకూల్యంతో స్నేహితుల్నీ ఆకర్షించాడు పాండురాజు. యోగ్యత వల్ల విద్వాంసుల్ని మెప్పించేవాడు. దయతో దీనుల్ని సంతోష పెట్టేవాడు. అభయ మిచ్చి ప్రజల్ని రంజింపజేసేవాడు. పూర్వ చక్రవర్తీ భరత సార్వభౌముడూ కురుమహారాజూ మొదలైన వాళ్ళతో సమానుడని అతణ్ణి పొగిడింది లోకం.

అంతేకాదు, రకరకాల వేడుకల్లో పాల్గొనేవాడు పాండురాజు. కామవిలాసాల్తో కాలక్షేపం చేసేవాడు. వేటంటే ఇహ చెప్పనే అక్కర్లేదు. చెవి కోసుకునేవాడు. ఓసారి హిమాలయం దక్షిణలోయల్లో విహారానికి బయల్దేరాడు. కుంతినీ, మాద్రినీ వెంటపెట్టుకున్నాడు. రెండు ఆడఏనుగుల మధ్య మదపు టేనుగులాగ వాళ్ళతో క్రీడిస్తూ, అడవిమృగాలు వేటాడుతూ కాలక్షేపం చేస్తున్నాడు. కావలసిన వన్నీ హస్తినాపురంనించి తమ్ముడికి పంపుతూ వుండేవాడు ధృతరాష్ట్రుడు. భోజనసామగ్రీ, తెల్ల

మతలూ, పూలమాలలూ, చందనం మొదలైన పరిమళద్రవ్యాలూ అవీ సకాలంలో అందుతూ వుండేవి. ఏ లోపమూ లేకండా స్వేచ్ఛగా వనవిహారం చేస్తున్నాడు పాండురాజు. తెల్లవారితే ఎన్నో మృగాలు చంపుతూ వుండేవాడు. వేటలో విసుపూ, విరామం వుండేదికాదు.

ఒకనాడు వేటలో ఏ జంతువూ కనబడలే దతడికి. తిరిగి తిరిగి విసిగిపోయాడు. తమకమూ హెచ్చయింది. ఉత్తిచేత్తో రావడంకంటె వేటగాడికి మరో అవమానం లేదు. ఇంతలో జత కడుతూ పారవశ్యంలో వున్న లేడిజంట కంటపడింది కనపడడమే తరవాయి. ఐదు బాణాలు వేసి రెంటిని పడగొట్టాడు పాండురాజు. చిత్రం! పోతూపోతూవున్న ప్రాణాలతో మనుష్యభాషలో మాటాడింది మగలేడి. "ఆః! ఎంతపని చేశావయ్యా!" అంది. "ఋషి దంపతులం మేము కిందము డంటారు నన్ను. లేళ్ళసంభోగంచూసి అలాంటి సంభోగానికి కుతూహలపడ్డాము. లేళ్ళరూపం ధరించాము. రాజువి నువ్వు. వేటలో జంతువుల్ని చంపడం పాపంలేదే అనుకో నీకు. ఐనా, పరిగెత్తలేనివాటినీ, సంభోగంలో శరీరం తెలీనిస్థితిలో వున్నవాటినీ, ప్రసవిస్తూ వున్నవాటినీ, రోగంతో వున్నవాటినీ కొట్టకూడదుకదా! అబ్బా! మాంసాహారమే వృత్తిగా పెట్టుకున్న ఎరకలవాళ్ళుసహా ఇంత నిష్ఠురానికి తెగించరే! ధర్మం తప్పని మహారాజులు భరతుడూ మొదలైనవాళ్ళు పుట్టిన వంశంలో పుట్టావు. ఈమాత్రం తెలుసుకోలేక పోయావు. ఏ మనాలి నిన్ను!" అంటూ మూల్గింది.

"అదే మన్న మాట!" అన్నాడు కించపడుతూనే పాండురాజు. "నమ్మించి చంపకూడదు. మోసంచేసి చంపకూడదు. అంతేకానీ, వేటకి వచ్చి మృగాన్ని చూసి వొదిలిపెట్టడం ఎలాగ? శత్రువునన్నా విడిచిపెడతాడు, కాని కంటపడ్డ జంతువు వొదిలి పెట్టలేడు క్షత్రియుడు.

"లోగడ అగస్త్యముని రోజూ లేడిమాంసంతోనే తద్దినం పెట్టేవాడు. అంచేత లేడిని చంపితే పాపం లేదని శాసించాడాయన. ఇందులో నా దోషమేముందని వూరికే నిందిస్తావు నన్ను!" అన్నాడు.

బాణాలు ఇటునుండి అటు దూసుకుపోయి వున్నాయి కిందముడికి. దుర్భరంగా వుంది మరణవేదన. "ప్రాణు లందరికీ సంగమం సహజమైంది, ఇష్టమైంది. అలాంటి సంగమ సుఖంలో వున్నప్పుడు, మమ్మల్ని నిరపరాధుల్ని నిష్కారణంగా సంహరించావు. అంచేత నువ్వూ నీ భార్యతో సంగమించినప్పుడు మరణిస్తావు. నీ వెనక నీగతే నీ భార్యకీ పడుతుంది" అని శాపంపెట్టి మరణించాడు.

కొయ్యబారిపోయి నుంచుండిపోయాడు పాండురాజు. శల వంచుకున్నాడు. ధనుర్బాణాలు కింద పడవేశాడు. దుఃఖం కంఠాగ్రమైంది. నిస్పృహా వైరాగ్యమూ మొలకలెత్తాయి. "ఎంత వాళ్ళమైతేమాత్రం ఏం లాభం! చేసినకర్మ అనుభవించవలసిందే" అనుకున్నాడు. "కామలాలసత్వం వల్లనే అకాలమరణం పాల బడ్డాడు మా తండ్రి. వ్యాసముని లేకపోతే మా వంశమే నిలిచేది కాదేమో! ఆ మహాత్ముడికి జన్మించాను. వేళ్ళమీద గణింప వలసిన వాణ్ణనిపించుకున్నాను. ఎంతయినా ఇవాళ ఈ ఆపకీర్తి మెడ చుట్టుకుంది" అంటూ దుఃఖపడ్డాడు. "ఇక ఈ వైభవాలతో ఏం ప్రయోజనం! నా పనేదో ఇవాళతో ఐపోయింది. సర్వసంగపరిత్యాగం చేస్తాను మునివృత్తి అవలంబిస్తాను. ధనుర్బాణాలు వొదిలిపెడతాను. హింసకి స్వస్తి చెపుతున్నాను. ఇకముందు అహింసే నా వ్రతం. రోజుకో చెట్టుదగ్గిర ఒక్క పండుమాత్రం భిక్షగా పుచ్చుకుంటాను. దొరకనిరోజు ఉపవాసం చేస్తాను చెట్టుకిందే నా నివాస మిక. నేల మీది ధూళే నా వస్త్రం. నిందా స్తుతీ, సంతోషం దుఃఖం, చలీ ఉష్ణం, చావూ బతుకూ — ఇవన్నీ ఏం చేస్తాయి నన్ను!" అని నిశ్చయించుకున్నాడు.

భార్యల్ని పిలిచి "హస్తినాపురం వెళ్ళిపొండ" న్నాడు. "నాతోకూడా మీరూ ఎందుకు బాధపడతారు? ఇంటికి పోయి సుఖపడండి. నేను తపస్సుకు వెళ్ళిపోయానని అన్నగారితో చెప్పండి. తల్లులతోనూ, భీష్ముడు బాబయ్యగారితోనూ, తమ్ముడు విదురుడితోనూ నా సంకల్పం చెప్పండి. విచారించకండి" అన్నాడు.

గోలుగోలు మన్నారు కుంతీ, మాద్రిన్నీ "వద్దు ఇంత నిష్ఠురానికి పూనుకోకండి" అంటూ కాళ్ళమీదపడ్డారు. "మమ్మల్ని వొదిలి వెళితే మీ ఎదటే ప్రాణాలు వొదిలిపెడతాము. మీరు లేకండా బతకలేము. మునివృత్తే కావాలంటే ఆశ్రమం కట్టుకుందాం అందులో తపస్సు చేసుకోవచ్చు మీరు మేము కనిపెట్టుకు జీవిస్తాము. ఈ మాత్రం సేవచేయడానికి అనుగ్రహించండి" అన్నారు. జాలిగా ఏడ్చారు

ఆలోచించాడు పాండురాజు. "సరి,ఐతే అలాగే కానియ్యండి" అన్నాడు. "వానప్రస్థాశ్రమం గడుపుతాను. చెట్టునారలు కట్టుకుంటాను. కందమూలాలతో కడుపునింపుకుంటాను" అన్నాడు. తన దగ్గిర వున్న ధనమూ, రత్నాభరణాలూ, ఏనుగులూ, గుర్రాలూ, ఆవులూ, ధాన్యాలూ సీదాగా తగినవాళ్ళని పిలిచి దానంచేశాడు. అన్నగార్కి పంపవలిసిన వస్తువులు హస్తినాపురం పంపివేశాడు. భార్యలూ, తానూ నారలు కట్టుకున్నారు. సన్యాసి వేషాలతో ఉత్తరంగా కాలినడకని బయల్దేరారు.

నాగపర్వత మెక్కారు. కుబేరుడితోట చైత్రరథం గడిచారు. హిమాలయం దాటారు. గంధమాదన పర్వత మెక్కారు. దేవతలూ, సిద్ధులూ నివసించే ఆ పర్వతంమీద కొంతకాల మున్నారు. అక్కడనుండి ఇంద్రద్యుమ్న సరోవరం వెళ్ళారు. అది దాటి హంసకూటం వెళ్లారు. అక్కడినుండి మునులతో కలిసి శతశృంగపర్వతం వెళ్ళాడు. దాని ఉత్తరభాగంలో ఘోరమైన తపస్సు చేశాడు పాండురాజు. మహామునులుపహా ,ఆయనతపస్సుకి ముక్కుమీద

వేలు పెట్టుకున్నారు. ఆ తపస్సులో ఆయన బ్రహ్మర్షులతో సమానుడయాడు.

విమానాలమీద దేవతలు వస్తూపోయే మార్గంలో వుంది శతశృంగం. ఆ దారిని వొకనాడు వేలాది మునులు అనాయాసంగా ఉత్తరాభిముఖులై ఊర్ధ్వలోకానికి పోతున్నారు. చూసి, "ఎక్కడికి మీ ప్రయాణం ?" అని ప్రశ్నించాడు పాండురాజు. "బ్రహ్మలోకానికి" అన్నారు మునులు. "ఇవాళ అమావాస్య కదా ! మహర్షులూ, పితృదేవతలూ బ్రహ్మకొలువుకి వెళ్లే దిన మిది" అన్నారు. వాళ్ల వెంట సమ విషమ ప్రదేశాల్లోపడి తానుకూడా భార్యలతో ప్రయాణమయాడు పాండురాజు.

"పువ్వులాంటి లేతవాళ్ళు వీళ్ళు. మానవమాత్రులు అడుగుపెట్టలేని మార్గమిది. దేవతలుమాత్రం సంచరించదగ్గ దారులు. మీరు రాకూడదు. అందులోనూ సంతానం లేనివాడివి నువ్వు. స్వర్గాని కెలా బయల్దేరావు ?" అంటూ నిరాకరించారు మునులు.

"అవును, మునులైనా సంతానం లేనివాళ్లకి స్వర్గంలో ప్రవేశం లేదు. అందుకనే కొడుకులు లేనివాళ్లకి గతుల్లే వన్నాయి వేదాలు. నా కేమో సంతానయోగ్యత లేదు. ఏందారి ?" అని విచారిస్తూ కూచున్నాడు పాండురాజు. చూసి జాలిపడ్డారు మునులు. యోగదృష్టితో భవిష్యత్తు చూశారు. "నిరాశ చేసుకోకు. లోకోత్తరులైన కొడుకులు కలుగుతారు. యముడూ, వాయువూ, ఇంద్రుడూ, అశ్విని దేవతలూ—వీళ్ల దయవల్ల అక్షయమైన పుణ్యలోకా లున్నాయి నీకు. ప్రయత్నించు. విచారించకు" అని చెప్పారు.

మునులైతే చెప్పారు, కాని అది జరగడమెలాగ ? పరిపరి విధాలా పోతున్నది పాండురాజు మనస్సు. "దేవరుణం, రుషిరుణం, పితృరుణం, మనుష్యరుణం ఈ నాలుగు రుణాలూ తీర్చుకుని శైటభడాలి జేపి. యథాకాలంలో చెయ్యవలసినవి చేసి,

ఈ రుణాలు వొదిలించుకోనివాడికి పుణ్యలోకాలు లేవు. యజ్ఞాలూ వాటివల్ల దేవరుణం తీరుతుంది. తపస్సూ, వేదాధ్యయనం, బ్రహ్మ చర్యం — వీటివల్ల ఋషుల రుణం తీరుతుంది నిజం చెప్పడం, న్యాయంగా ధనార్జన చెయ్యడం - వీటివల్ల మనుష్యరుణం తీరుతుంది. తద్దినాలవల్లా, కుమాళ్ళని కనడంవల్లా పితృరుణం తీరుతుంది. వీటిలో పితృరుణం తప్ప తక్కిన మూడూ తీర్చుకున్నాను నేను. నా శరీరంతోనే ఈ మూడురుణాలూ నశిస్తాయి. ఒక్క పితరుల అప్పుమాత్రం వొదలదు నన్ను. కిందముడి శాపంవల్ల సంతానయోగ్యత లేదు నాకు. ఏమిటి సాధనం ?" ఎప్పుడూ ఇదే విచార మతడికి. ఒకనాడు కుంతితో ఆలోచించాడు. "దాన ధర్మాలూ, తపస్సులూ, యజ్ఞాలూ - ఏం చేసినా సంతానం లేని వాళ్ళకి స్వర్గం లేదు. సంతానం లేనప్పుడు చచ్చినా బతికినా వొకటే నేను. ఇహమూ వుండదు, పరమూ వుండదు నాకు. అంచేత, ధర్మం చెడకండా మనకి సంతానం కలిగే మార్గం చూడాలి. నా ధర్మానికి తోడైన దానివి నువ్వు. నువ్వే ఏదన్నా ఉపాయ మాలోచించాలి.

"ఔరసుడూ, క్షేత్రజుడూ, దత్తుడూ, కృత్రిముడూ, గూఢోత్పన్నుడూ, అపవిద్ధుడూ, అని కొడుకులు ఆరువిధాలు. తనకి ధర్మపత్ని గర్భంలో పుట్టినవాడు ఔరసుడు. ఏర్పాటు ప్రకారం ఇతర్లవల్ల భార్యకి పుట్టినవాడు క్షేత్రజుడు. తలిదండ్రులు పెంపకం ఇచ్చినవాడు దత్తుడు. అభిమాన పుత్రుడు కృత్రిముడు. తనకి తెలియకండా భార్యకి ఇతర్లవల్ల పుట్టినవాడు గూఢోత్పన్నుడు. కన్నవాళ్ళు వొదిలిపెడితే వచ్చి చేరినవాడు అపవిద్ధుడు. ఈ ఆరు గురూ ఆస్తికీ, బంధుత్వానికీ అర్హులు. వీళ్ళుకాక కానీనుడూ, సహోఢుడూ, క్రీతుడూ, పౌనర్భవుడూ, స్వయందత్తుడూ, పార

* సూ. పుత్రా ఔరస క్షేత్రజ దత్త కృత్రిమ గూఢోత్పన్న పవిద్ధా రిక్థభాజ. గౌతమ ధర్మసూత్రాలు,

శవుడూ అని మరి ఆరువిధాల కుమాళ్ళున్నారు. * పెళ్ళికాని కన్యకి రహస్యంగా పుట్టినవాడు కానీనుడు. అంటే, ఆ కన్యని పెళ్ళాడిన వాడికి వీడు కానీనపుత్రుడవుతాడు. వివాహకాలానికే భార్యగర్భంలో వుండి తరవాత పుట్టినవాడు సహోఢుడు. కొని తెచ్చినవాడు క్రీతుడు. భర్త వొదిలిపెట్టినదానికి గాని, విధవకి గాని పుట్టినవాడు పౌనర్భవుడు. అంటే, ఎవళ్ళకి పుడితే వాళ్ళకి పౌనర్భవకుమారుడవుతాడు. తనంతట తాను వచ్చి పెంపుడుకొడుకైనవాడు స్వయందత్తుడు. బ్రాహ్మడికీ శూద్రస్త్రీకీ పుట్టినవాడు పారశవుడు. ఐతే, వీళ్ళు ఆరుగురూ బంధుకోటిలో చేరతారు. అంతే. దాయాదులు కాలేరు. అంటే ఆస్తిలో వీళ్ళకి హక్కు-భుక్తాలు వుండవు.

"ఔరసుడి తరవాత క్షేత్రజుడే ఉత్తముడు. అందులోనూ బావ మరదులవల్ల కలిగినవాడైతే మరి చెప్పనే అక్కరలేదు. ఇంతకీ చెప్పవచ్చిం దేమంటే, క్షేత్రజుడైన కుమారుణ్ణి నువ్వు కనాలి. దాంతో, పున్నామనరకంనుండి తరించి పుణ్యలోకానికి వెళతాను నేను. జన్మతరిస్తుంది.

"నీ చెల్లెలు శ్రుతసేన ♦ భర్త, కేకయరాజు శారదండాయని వెంటేశాడు! సంతానం కలిగించే శక్తి తనకి పోయింది. అప్పుడు మీ చెల్లెల్ని నియోగించి ఉత్తములవల్ల దుర్జయుడూ మొదలైన ముగ్గురు క్షేత్రజుల్ని కన్నాడు. ధర్మసమ్మతమైన ఈ ఆచారం అనాదినుండీ వస్తూనే వుంది మనకి. ఏమంటావు?" అన్నాడు. "మీ అనుగ్రహం వుంటే సంతానానికి కొరత ఏమిటి మాకు" అంది కుంతి. "భరతవంశంలో మణిపూసవంటి మహారాజులు మీరు.

---

* చూ. అనుశాసనిక పర్వం రెండో ఆశ్వాసం.

♦ పృథా (కుంతి), శ్రుతదేవా, శ్రుతసేనా (శ్రుతకీర్తి), రాజాధిదేవి, శ్రుతశ్రవా ఈ ఐదుగురూ అక్కచెల్లెళ్ళు. శ్రుతదేవ దంతవక్త్రుడి తల్లి. శ్రుతసేన కేకయుల తల్లి. రాజాధిదేవి వింద, అనువిందుల తల్లి. శ్రుతశ్రవ శిశుపాలుడి తల్లి.

మీ అంత మహనీయుడి భార్యలం మేము. పరపురుషుణ్ణి కల్లోఐనా ఎలా తలుస్తాము! ఈ సందర్భంలో వొక పురాణకథ జ్ఞాపకం వస్తున్నది. చెపుతాను వినండి.

భ ద్ర క థ

"పూర్వం మన పౌరవవంశంలో వ్యుషితాశ్వుడు అని వొక రాజు వుండేవాడు. మంచి పరాక్రమవంతుడు దక్షుడు. దండయాత్రలు చేసి ప్రపంచమంతా జయించాడు. నూరు అశ్వమేధాలూ చేశాడు. అతడి అశ్వమేధయాగంలో దేవేంద్రుడితో కూడా దేవతలు స్వయంగా వచ్చి అందుకునేవారట హవ్యాలు. అతడి భార్య కాక్షీవంతుడి కూతురు భద్ర. భద్ర అంటే వ్యుషితాశ్వుడికి లోకం కనపడేది కాదు రాత్రింబగళ్లు ఆమెతోనే కామ క్రీడల్లో గడిపేవాడు. అతికామంవల్ల తుదకి క్షయరోగం అంకురించింది అతడికి. ఆ రోగంతోనే అతడు మరణించాడు.

"అప్పటికి సంతానం లేదు భద్రకి. తీరా భర్త మరణించడంతోనే జీవితమే అంధకారమైంది ఆమెకి. 'భర్తలేని బతుకు కంటే చావు నయం. నేనూ నీతోటే వస్తాను. లేదంటావా, నీ దేహంతో నాకు సంతానమైనా కలిగించు' అంటూ భీష్మించుకు కూచుంది. దర్భలతో పక్క పరిచింది. భర్తశవం పట్టుకుని పడుకుంది.

"కొంతసేపటికి వ్యుషితాశ్వుడి శవంలోంచి వొక దివ్యవాణి వినపడింది. 'విచారించకు. గుణవంతులైన కుమాళ్ళు కలుగుతారు నీకు. నీ. ఋతుమతివైన ఎనిమిదోదినం, లేదా పద్నాలుగోదినం శుచిస్నానం చేసి నన్ను తలుచుకుంటూ పడుకో.'

అలాగే చేసింది భద్ర. ముగ్గురు సాల్వులూ, నలుగురు మద్రులూ-ఇలా ఏడుగురు కొడుకులు కన్నదామె. అదేవిధంగా మీ అనుగ్రహం వల్లనే సంతానం కలగాలి మాకు. అంతేకాని మీకోసం సమర్పించిన ఈ శరీరం పరాయి మనిషిని ముట్టనివ్వడం మాత్రం జరగదు" అంది.

### శ్వేతకేతు శాసనం

"అలా కాదు" అంటూ మళ్ళీ అందుకున్నాడు పాండురాజు. "పూర్వం స్త్రీలకి వొక అడ్డూ ఆపూ వుండేది కాదు. ఒక భర్త అని నియమం లేదు. ఎవళ్ళతో ఒడితే వాళ్ళతో సంభోగిస్తూ స్వేచ్ఛగా సంచరించేవాళ్ళు. ఉత్తర కురుభూముల్లో ఇప్పటికీ ఈ ఆచారమే అమల్లో వుంది.

"ఆ దినాల్లో ఉద్దాలకుడని వొక రుషి వుండేవాడు. అతడి కుమారుడు శ్వేతకేతు, మహాతపశ్శాలి. ఒకనాడు వాళ్ళ ఆశ్రమానికి వొక బ్రాహ్మడు వచ్చాడు. రుతుస్నానం చేసి కూచున్న శ్వేతకేతు తల్లిని * చూచి కామించాడతడు. కుమారుడూ, భర్తా చూస్తూ వుండగానే ఆమెని గుంజుకుపోయి ఆమెతో సంగమించాడు. చూసి సయించలేకపోయాడు శ్వేతకేతు. 'ఇందులో తప్పేముంది? ఇది సనాతనధర్మమే కదా!' అని సమర్థించాడు తండ్రి. 'కాదు దురాచారం' అన్నాడు శ్వేతకేతు. 'సనాతనమే ఐనా సవరించాలి. ఇవాళనుండీ నేను వ్యవస్థ చేస్తున్నాను. పరపురుషుడితో పోయే స్త్రీ పాపాత్మురాలౌతుంది. ఒక స్త్రీకి ఒకడే భర్త. భర్తని వొదిలి అన్యపురుషుడితో సంగమించే భార్యా, భార్యని వొదిలి అన్యస్త్రీతో పోయే భర్తా భ్రూణహత్య చేసిన పాపానికి పాల్పడతారు. ఐతే, సంతానంకోసం ఇంకో పురుషుడి దగ్గిరికి వెళ్ళమని భర్త ఆదేశిస్తే భార్య అంగీకరించాలి. అలా అంగీకరించని భార్యకికూడా భ్రూణహత్య చేసిన పాపం వస్తుంది. ఇది నా శాసనం' అంటూ శాసించాడు. సామర్థ్యంకల మహాపురుషుడు గనక శ్వేతకేతు శాసనం చిరస్థాయి ఐంది. భర్త నియోగించినపుడు భార్య కాదనకూడదు. భర్త అనుమతి లేనిపని చెయ్యడం, చెప్పింది చెయ్యక పోవడం - ఈ రెండూ దోషాలే అన్నాడు మనువు. అందుకనే, సుదాసు కుమారుడైన కల్మాషపాదుడి భార్య మద

* శ్వేతకేతుతల్లి కుశిక సుత.

యంతి భర్త చెప్పిన ప్రకారం వశిష్ఠుడి దగ్గరికి వెళ్ళింది. అశ్మకుణ్ణి కంది. నేనూ, మా అన్నయ్యా ఇలా పుట్టినవాళ్ళమే కదా మరి! అంచేత, విన్నావూ, కాదనకు. నా మాట మన్నించు" అంటూ బతిమాలాడు. దీనంగా రెండుచేతులూ దోయిలించాడు. ప్రాధేయపడ్డాడు.

మరి కాదనలేక పోయింది కుంతి. లోగడ దూర్వాసుడిచ్చిన మంత్రంమాట చెప్పింది. స్వర్గం వొళ్ళో పడ్డట్టయింది పాండురాజుకి. "ఆ మంత్రానికి పని కలిగిందిప్పుడు. చెప్పండి. ఏ దేవతని కోరేది?" అంది కుంతి. "దేవతల్లో ధర్మదేవత ప్రధానదేవత. ధర్మంమీదే లోకాలన్నీ ఆధారపడి వున్నాయి. అంచేత ధర్మదేవతని పిలు." అన్నాడు పాండురాజు.

ధర్మరాజు

సిద్ధపడింది కుంతి. శుచిస్నానం చేసింది. భర్తకి ప్రదక్షిణం చేసింది. స్థిరచిత్తంతో దూర్వాసముని మంత్రం జపించింది. ధర్మదేవతని స్మరించింది. చిరునవ్వుతో ఎదట నుంచున్నాడు ధర్మదేవత. ఆమె అభిలాష ప్రకారం పుత్రదానం చేసి వెళ్ళాడు. గర్భవతి అయింది. కుంతి. ఒక సంవత్సరం నడిచింది.

అవాళ అష్టమి. జ్యేష్ఠానక్షత్రం. రవి మొదలైన గ్రహాలు మాంచి ఉచ్చలోనూ, శుభస్థానాల్లోనూ వున్నాయి. పగలు సరిగ్గా రెండు జాములపుడు సింహలగ్నంలో కుమారుడు కలిగాడు కుంతికి. ఆ ముహూర్తంలో జగత్తులోని సర్వభూతాలూ సంతోషించినట్టయింది. పాండురాజు ఆనందానికి మేర లేదింక. శతశృంగం మీది ఋషులు వచ్చి సంతోషంగా జాతకర్మలూ అవీ నిర్వహించారు. "కురువంశంలో* రాజవుతాడు ఇతడు. ధర్మరక్షణ చేస్తాడు" అంటూ పలికింది ఆకాశవాణి. యుధిష్ఠిరుడు అని నామకరణం చేసింది. యుధిష్ఠిరుడే ధర్మరాజు.

---

* చూ: ఏడో ఆశ్వాసం కల్మాష పాదుడి కథ.

ఇక్కడ ఇలా వుంది. అక్కడ హస్తినాపురంలో గాంధారి చూలాలై రెండేళ్ళయింది. ఎప్పుడు ప్రసవిస్తానా, ఎప్పుడు కొడుకుల్ని చూస్తానా అంటూ తహతహ పడుతూ వుంది ఆమె. ఇంతలో కుంతికి కొడుకు పుట్టాడన్న వార్త వచ్చింది. మరి భరించలేకపోయింది గాంధారి. రెండుచేతులతోనూ కడుపు బాదు కోవడం ప్రారంభించింది. దాంతో గర్భపాత మైపోయింది. తెలిసి పరిగెత్తుకు వచ్చాడు వ్యాసముని. "ఎంత బుద్ధిమాలినపని చేశావు? కడుపుదించుకోవలసినంతగతి ఏం పట్టింది నీకు?" అన్నాడు. "సరే, ఏందేదో అయిపోయింది. ఈ మాంసఖండంలో వందమంది కుమాళ్ళు కలుగుతారు. నా మాట నమ్ము. ఇప్పుడైనా దీన్ని భద్రంగా కాపాడు" అన్నాడు. ఆ మాంసపిండం నూట వొక్క ముక్కలుగా కోసాడు. "వీటిని విడివిడిగా నేతికుండల్లో పెట్టు. చన్నీళ్ళతో తడుపుతూ వుండు. వందమంది కొడుకులూ వొక కూతురూ పుడతారు" అని చెప్పి వెళ్ళిపోయాడు. వ్యాసుడు చెప్పినట్లు చేస్తూ కొడుకులకోసం రోజులు లెక్కపెడుతూ కూచున్నారు గాంధారీ, ధృతరాష్ట్రుడున్నూ.

భీముడు

కుంతిని మరో కుమారుణ్ణి కనమన్నాడు పాండురాజు. "ఈ కుమారుడు మాంచి బలవంతుడు కావాలి. అందుకని ఈసారి వాయుదేవుణ్ణి పిలు", అన్నాడు. మంత్రం జపించి వాయుదేవుణ్ణి పిలిచింది కుంతి. తత్క్షణంలో ప్రత్యక్షమయాడు వాయువు. యథాప్రకారం గర్భవతి అయింది కుంతి. సంవత్సరం నిండే సరికి పుక్కగుండులాంటి కొడుకు పుట్టాడు. భీమసేనుడని అతణ్ణి పిలిచింది ఆకాశవాణి.

పదోనాడు కొడుకు నెత్తుకొని దేవాలయానికి బయల్దేరింది కుంతి. వెంట పాండురాజు నడుస్తున్నాడు. చేతిలోని బిడ్డ జారిపడిపోయింది... దారిపక్క గుహాలోంచి వొక పెద్దపులి. అమాం

తంగా మీాదికి వురికింది. "అమ్మో" అని కేకవేసింది కుంతి. తెలివి తప్పి పడి పోయింది. చేతిలోంచి జారి రాళ్ళమీాద పడ్డాడు పది దినాల పసిపాప భీమన్న దగ్గిరికి వచ్చే లోపున మూాడు బాణాలతో పులిని పడగొట్టాను పాండురాజు చప్పున వచ్చి భార్యనీ, కొడుకునీ లేవనెత్తాను. చూాస్తే భీముడు పడ్డ బండరాళ్ళు గుండపిండయివున్నాయి. చెక్కు చెదరలేదు భీమన్న. చూాచి నాలిక కరుచుకున్నారు తల్లీ తండ్రీనీ.

దు ర్యో ధ ను డు

ఇక్కడి భీముడు పుట్టినరోజే అక్కడ మాాంసఖండాల్లో కలి అంశలో దుర్యోధనుడు పుట్టాడు గాంధారికి. ఇటు దుర్యోధనుడు పుడుతూావుంటే అటు క్రూారమృగాలు వికృతంగా అరిచాాయి. నక్కలు వూళవేశాయి. పులుగుపిట్టలు ఘూాంకారాలు చేశాయి. గాడిదలు వోండ్రపెట్టాయి. దిక్కులు అదిరాయి. ఆకాశంమీాద సూార్యుడి తేజస్సు మాాసినట్టయింది. రాజ్య మంతటా రక్తవర్షం కురిసింది. గడ గడ లాడారు ప్రజలు.

గాంధారి గర్భవతిగా వున్న దినాల్లో కోమటి పడుచు వొకామె ధృతరాష్ట్రుడి వుంపుడు కత్తెగా వుండేది. దుర్యోధనుడు పుట్టాక ఆమెకూ వొక కొడుకు పుట్టాడు. అతణ్ణి యుయుత్సు అని పిలిచాడు ధృతరాష్ట్రుడు.

దుర్యోధనుడు పుట్టిన మర్నాడు గాంధారి మాాంసఖండాల్లో దుశ్శాసనుడు పుట్టాడు. మర్నాడు దుస్సహుడు. ఆ మర్నాడు దుశ్శలుడు ఇలా రోజుకి వొక్కడు వరసగా జలసంధుడూా సముడూా సహుడూా విందుడూా అనువిందుడూా దుర్ధర్షుడూా సుబాహుడూా దుష్ప్రధర్షణుడూా దుర్మర్షణుడూా దుర్ముఖుడూా దుష్కర్ణుడూా కర్ణుడూా వివింశతీ వికర్ణుడూా శలుడూా సత్వుడూా సులోచనుడూా చిత్రుడూా ఉపచిత్రుడూా చిత్రాక్షుడూా చారుచిత్రుడూా శరాశనుడూా దుర్మదుడూా దుర్విగాహుడూా వివిత్సుడూా వికటాననుడూా ఊర్ణనాభుడూా సునా

భుడూ నందుడూ ఉపనందకుడు చిత్రబాణుడూ చిత్రవర్మ సువర్మ దుర్విమోచనుడు అయోబాహువు మహాబాహుడు చిత్రాంగదుడు చిత్రకుండలుడు భీమవేగుడు భీమబలుడు బలాకి బలవర్ధనుడు ఉగ్రాయుధుడు సుషేణుడు కుండధారుడు మహోదరుడు చిత్రాయుధుడు నిషంగీ పాశీ బృందారకుడు దృఢవర్మ దృఢక్షత్రుడు సోమకీర్తి అనూదరుడు దృఢసంధుడు జరాసంధుడు సదుడు సువాక్కూ ఉగ్రశ్రవుడు ఉగ్రసేనుడు సేనానీ దుష్పరాజయుడు అపరాజితుడు కుండశాయీ విశాలాక్షుడు దురాధరుడు దృఢహస్తుడు సుహస్తుడు వాతవేగుడు సువర్చుడు ఆదిత్యకేతూ బహ్వాసీ నాగదత్తుడు ఉగ్రయాయీ కవచీ క్రథనుడు కుండుడు ధనుర్ధరుడు ఉగ్రుడు భీమరథుడు వీరబాహుడు అలోలుపుడు అభయుడు రౌద్రకర్ముడు దృఢరథాశ్రయుడు అనాధృష్యుడు కుండభేదీ విరావీ ప్రమథుడు ప్రమాథీ దీర్ఘరోముడు దీర్ఘబాహుడు వ్యూఢోరుడు కనకధ్వజుడు కుండాశీ విరజసుడు అని వందమంది కుమాళ్ళూ దుస్సల అని వొక కూతురూ పుట్టారు.*

ఇల్లంతా పిల్లలతో కలకలలాడుతూ వుంటే బ్రహ్మానందంగా వుంది ధృతరాష్ట్రుడికి. కూతురు కలగడంతోటే దౌహిత్రులవల్లా ఉత్తమ గతులు కలుగుతాయికదా, అని మరింత సంతోషించాడతడు.

ఐతే, దుర్యోధనుడు పుట్టినపుడు పుట్టిన అపశకునాలు బంధువుల మనస్సులు కలతపెడుతూనే వున్నాయి. ఒకనాడు భీష్ముడూ విదురుడూ మొదలైన ముఖ్యబంధువులూ వాళ్ళూ వచ్చి ధృతరాష్ట్రుడితో ఏకాంతంగా సమావేశ మయ్యారు. మన దుర్యోధనుడు పుట్టినపుడు ఎన్నో దుర్నిమిత్తాలు పుట్టాయి. తెలిసినవాళ్ళంతా ఇతడివల్ల జననాశనం జరుగుతుందని చెపుతున్నారు. కులానికీ, లోకానికీ నాశనహేతువు ఐనవాణ్ణి వొదులుకోవడం మంచిది. అవసరం వస్తే, కులం కోసం వొకణ్ణి త్యజించడానికి వెనకాడకూడదు.

* ఒడియా భారతకర్త సరళాదాసు ఈ వందమంది పేర్లకీ మొదటిఅక్షరం

అలాగే గ్రామం కోసం వొక కుటుంబాన్నయినా త్యజించాలి. తన వల్ల ప్రపంచానికి నష్టం కలుగుతుందంటే తానే ప్రపంచం వొదిలి పెట్టాలి. ఇదీ పెద్దల నిర్వచనం. అంచేత దుర్యోధనుణ్ణి పరిత్యజించాలని మా అభిప్రాయం. వీడు లేకపోయినా, ఎట్లాగూ నూరుమంది కుమాళ్ళు వుండనే వుంటారు నీకు" అన్నారు. ఈ సలహా నచ్చలేదు ధృతరాష్ట్రుడికి. పుత్రవ్యామోహం బంధువుల హితోపదేశం వినకండా చేసింది. చేసేదిలేక తిరిగి వచ్చారు బంధువులు. అంతటితో ఆ ప్రయత్నం ఆగిపోయింది.

అ ర్జు ను డు

"అన్నగారికి వందమంది కొడుకులు" ఈ వార్త విన్నాడు పాండురాజు. మనస్సు మనస్సులో లేదు. మళ్ళీ ఏకాంతంగా పిలిచాడు కుంతిని. "ధనమూ, సంతానమూ, విద్యా - ఇవి ఎంతవున్నా తృప్తికలగదు. ఇంకా కొడుకులు కావాలనే వుంది నాకు" అన్నాడు. "ఈ మారు దేవేంద్రుణ్ణి పిలు. దేవతలకి రాజు అతడు. అతణ్ణి మించిన కొడుకు కావాలి నాకు. వాడే మన వంశం నిలిపినవాడూ అవుతాడు" అన్నాడు. మళ్ళీ మంత్రం జపించింది కుంది. దేవేంద్రుణ్ణి పిలిచింది. నవమన్మథుడిలా వచ్చి నుంచున్నాడు దేవేంద్రుడు. ఆమెతో ఇష్టభోగా లనుభవించి వెళ్ళాడు. గర్భం నిలిచింది కుంతికి

ముల్లోకాలూ జయించే కొడుకు పుట్టాలి ఇదే తపన పాండురాజుకి మునీశ్వర్లని ప్రార్థించాడు. దివ్యమైన మంత్రోపదేశం పొందాడు. ఇంద్రుణ్ణి ధ్యానిస్తూ వొంటికాలుమీద తపస్సు చేశాడు. కుంతిచేత వ్రతాలూ అవీ చేయించాడు. తుదకి దేవేంద్రుడు ప్రత్యక్షమయాడు పాండురాజుకి. "నీ కోర్కె సఫలమౌతుంది. సందేహించకు" అంటూ చెప్పి వెళ్లాడు.

ఉత్తరఫల్గుని నాలుగో పాదంలో అపర దేవేంద్రుడు లాంటి కొడుకు పుట్టాడు కుంతికి. పూలవాన కురిసింది. స్వర్గదుందుభులు మోగాయి. అప్సరసలు నృత్యం చేశారు. కిన్నెర పడుచులూ,

కింపురుషస్త్రీలూ పాటలు పాడారు. సిద్ధులూ, విద్యాధరులూ వీణలు వాయించారు, పిల్లనకగ్రలు వూదారు, మృదంగాలు మోయించారు రుషులు ఆశీర్వాదాలు చేశారు. మరీచీ మొదలైన ప్రజాపతులూ, ధాతా మొదలైన పన్నెండుగురు సూర్యులూ, మృగవ్యాధుడూ మొదలైన రుద్రులూ, వరుణుడూ మొదలైన ఎనమండుగురు వసువులూ, భరద్వాజుడూ మొదలైన మహారుషులూ, భీమసేనుడూ మొదలైన గంధర్వులూ, శేషుడూ మొదలైన మహానాగులూ, గరుత్మంతుడూ మొదలైన పక్షులూ, మేనకా మొదలైన అప్సరసలూ, అశ్వినీదేవతలూ, విశ్వదేవతలూ, * స్వర్గంలోని మహారాజులూ - యావన్మందీ బాలుణ్ణి చూడాలని దిగి వచ్చారు. మూడు లోకాల భూతరాసులూ వొకచోట సమావేశం కావడం చేత విశ్వనిర్మాణం జరిగిన తొలిరోజులా వుంది శతశృంగపర్వతం.

"పుట్టినవాడు అర్జునుడు" "కార్తవీర్యార్జునుణ్ణి మించిన వీరుడు." "ఇంద్రుణ్ణి గెలుస్తాడు." "ఖాండవం కాలుస్తాడు." "రాజులందరినీ వోడిస్తాడు" "ధర్మరాజుచేత రాజసూయం చేయిస్తాడు." "దేవతలచేత దివ్యాస్త్రాలు పుచ్చుకుంటాడు." "శత్రువులు లేకండా చేస్తాడు."

ఇలా మేఘగంభీరంగా వినిపిస్తోంది ఆకాశవాణి. ఇహ పాండురాజు సంతోషానికి అంతమే లేదు. త్రిమూర్తుల్లాంటి కొడుకులు ముగ్గురినీ చూస్తూ మురిసిపోయేవాడు. ముల్లోకాల రాజ్యాధికారమూ తనదే అనుకునేవాడు.

---

* విశ్వదేవతలు (విశ్వేదేవతలు) శ్రాద్ధసమయాల్లో పూజింపబడే దేవతలు. క్రతువూ దక్షుడూ వసువూ సత్యుడూ కాలుడూ కామ్యుడూ శుచీ రుచీ పురూరవుడూ ఆర్ద్రవుడూ అని వీళ్ళు పదిమంది.

ఇష్టి శ్రాద్ధాల్లో క్రతు దక్షుల్ని అష్టకశ్రాద్ధాల్లో కాలకామ్యుల్ని నాందీశ్రాద్ధాల్లో శుచి రుచుల్ని పార్వణశ్రాద్ధాల్లో (తద్దినాల్లో) పురూరవ ఆర్ద్రవుల్ని ఆవాహనిస్తారు.

ఇదంతా చూసి మాద్రమాత్రం చిన్నబుచ్చుకునేది. "ముచ్చట తీరిన ముగ్గురు కుమాళ్ళు కుంతికి. గాంధారి కడుపుపంట వందమంది నా ఖర్మమే కాలిపోయింది. గోడ్రాలు బతుకు నాది" అంటూ బాధ పడేది. ఒకనాడు వొంటరిగా వున్నప్పుడు మెల్లగా తన మనో వేదన చెప్పింది భర్తకి. "అవును. నేనూ అలాగే అనుకుంటాను." అన్నాడు పాండురాజు. "కుంతి తలుచుకుంటేనే కాని ఇది సాధ్యంకాదు నీకు" అని కుంతిని పిలిచాడు. మాద్రి అభిలాష చెప్పాడు. "దూర్వాసముని మంత్రం ఈమెకీ ఉపదేశించు. లోక కళ్యాణకారులు అశ్వినీ దేవతలు. * దేవతల వైద్యులు. ఆ మంత్రంతో వాళ్ళని పిలుస్తుంది" అన్నాడు.

### నకుల సహాదేవులు

మాద్రికి మంత్రోపదేశం చేసింది కుంతి. మంత్రం జపించింది మాద్రి. అశ్వినీ దేవతలని ఆహ్వానించింది. సంతానదానం చేసి వెళ్ళారు అశ్వినీదేవతలు. సకాలంలో సంతానవతి ఐంది మాద్రి. సూర్య చంద్రుల్లాంటి కవలబిడ్డలు పుట్టారు వాళ్ళిద్దరికీ నకులుడూ, సహాదేవుడూ అని నామకరణం చేసింది ఆకాశవాణి.

పాండురాజుకి కొడుకులు పుట్టారన్న కబురు విన్నాడు కుంతి అన్న వసుదేవుడు. బావమరిదినీ, చెల్లెలినీ, మేనల్లుళ్ళనీ, చూసి రమ్మని కశ్యపుడనే తన పురోహితుణ్ణి పంపాడు. మేనల్లుళ్ళ కని ఎన్నో వస్తువులూ, రత్నభూషణాలూ, అవీ పంపాడు. కశ్యపుడు శత శృంగం వచ్చి పాండురాజుని చూశాడు. వసుదేవుడు చెప్పి పంపిన కుశల ప్రశ్నలు వినిపించాడు. వెంట తెచ్చిన సామగ్రి సమర్పించాడు. అక్కడే వుండి కుమాళ్ళకి చౌలకర్మా, ఉపనయనమూ అదీ జరిగించాడు. వేదమూ, శాస్త్రాలూ, అవీ చదివించాడు.

---

* అశ్వినీ దేవతలు . నాసత్యుడూ, దస్రుడూ, నకులుడుతండ్రి నాసత్యుడు సహాదేవుడితండ్రి దస్రుడు

ఇంతలో వసంతకాలం వచ్చింది. అశోకాలు పుష్పించాయి. సంపెంగలు వికసించాయి. మోదుగులు పూశాయి. శతశృంగమంతా పూలకొండలా వుంది. పూలకోసం మూగుతున్నాయి తుమ్మెదలు. ఝుమ్మని రొద చేస్తున్నాయి. మామిడి చిగుళ్లు తిని కోయిలలు కుహూ కుహూ కూస్తున్నాయి. చందనంచెట్లమీదా, అగరువృక్షాల మీదా, తమాలవనాలమీదా, అరటితోటలమీదా, తామరచెరువులమీదా మెల్లమెల్లగా వీస్తున్నాది చల్లగాలి. ప్రజల హృదయాల్లో కొత్త కొత్తభావాలు రేకెత్తుతున్నాయి. ప్రియులు దగ్గరలేని పడుచులూ, భార్యలికి దూరంగావున్న భర్తలూ మాత్రం బాధపడుతున్నారు.

పాండురాజు మరణం

ఇలా సమ్మోహనంగా వున్న వసంతంలో మాద్రిమీద మనసు పెట్టుకున్నాడు పాండురాజు. వెయ్యికళ్ళతో కనిపెడుతూనే వుండేది కుంతి. అవాళ ఆశ్రమంలో అతిథుల భోజనాల ప్రయత్నంలో వుందామె. ముచ్చటగా ముస్తాబైంది మాద్రి. అపూర్వమైన శృంగారంతో వొయ్యారంగా వుంది. ఒంటిపాటుని చిక్కింది భర్తకి. జరగవలిసిందంతా జరిగింది.

కిందముడి శాపం మరిచిపోయాడు పాండురాజు. కామానికి లొంగిపోయాడు. వద్దంటూనే వుంది మాద్రి. తప్పించుకుపోవాలని పెనగులాడుతూనే వుంది. బలవంతంగా ఆమెతో సంభోగించాడు పాండురాజు. ఐపోయింది; నిండుప్రాణాలు నిలువునా ఎగిరిపోయాయి.

గోలుగోలు నుంది మాద్రి. కుమారుళ్ళూ, కుంతీ పరిగెత్తుకు వచ్చారు. ఒక్కసారి గొల్లుమన్నారు. ఈ ఏడుపులు విని శతశృంగం మీది మునులంతా మూగారు. విచారించారు. "లే. నువ్వు తప్పుకో. భరించలేను నేను. పిల్లవాళ్ళని కనిపెట్టు నువ్వు. భర్తగారి ననుసరిస్తాను నేను" అంటూ భర్తశవం మీద పెుత్తు

తెలిసీ భర్తని కాపాడుకోలేని దాన్ని. పిల్లల్నెలా కాపాడుతాను ? మహారాజుని నేనే పొట్టలో పెట్టుకున్నాను. నా కొడుకులు నీ కొడుకులు. వద్దనకు. నన్ను మన్నించు. నేనేవెళతాను'' అంటూ ఏడ్చింది మాద్రి. కుమాళ్ళని ముద్దుపెట్టుకుంది. కుంతికి నమస్కరించింది. మునులికి పాదాభివందనం చేసింది. భర్త శవంతో చితి మీద కూచుని సహగమనం చేసింది. దంపతుల్ని నిమిషాలమీద భస్మీభూతం చేసింది చితాగ్ని.

ఉభయుల అస్తులూ తీసి జాగ్రత్త పరిచారు మునులు. కుంతినీ కుమాళ్ళనీ ఓదార్చారు. "ప్రజనీ, పరిజనాన్నీ, భార్యానీ, పిల్లలినీ, బంధువులినీ విడిచి వెళ్ళాడు పాండురాజు. మనమధ్యే తపస్సు చేసుకుంటూ, మనమే అంతా అని నమ్ముకున్నాడు పాపం! బిడ్డల్ని మన చేతుల్లో పెట్టి కాలం చేశాడు. వీళ్ళని భద్రంగా హాస్తినాపురం చేర్చాలి మనం. ఇదే మన కర్తవ్యం'' అంటూ తమలో తాము నిశ్చయించుకున్నారు.

కుంతినీ, కుమాళ్ళనీ తీసుకుని హాస్తినాపురం వచ్చారు మునులు. క్షణంలో పట్టణమంతా పాకింది వార్త. చూడాలని గుంపులు గుంపులుగా విరగబడ్డారు జనం. సింహం కొదమల్లా వున్నారు పంచపాండవులు. "దేవతలవల్ల కాక ఇలాంటి కుమాళ్ళు ఎలా కలుగుతారు!'' అంటూ చెప్పుకున్నారు ప్రజ. కోటలో గుప్పుమంది కబురు. దేవిడీ చేరే సరికి వందమంది తమ్ములతోనూ మంత్రుల తోనూ ఎదురు వచ్చాడు దుర్యోధనుడు. మునులతో సహా సగౌరవంగా లోపలికి వెళ్ళారు పాండుకుమారులు. భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ, సత్యవతీ, అంబికా, అంబాలికా, గాంధారీ మొదలైన వాళ్ళు యావన్మందీ మునులికి నమస్కరించారు. పాండుకుమాళ్ళని ఆదరంగా ఎత్తుకున్నారు. కుంతిని ప్రేమపూర్వకంగా కుశల మడిగారు. పాండురాజు మృతికి పనివి పనివి దుఃఖించారు.

కొంతసేపయాక మునుల్లోకల్లా వొక ముసలాయన అందరినీ వోదారుస్తూ ఇలా అందుకున్నాడు. "నిజంగా బహుదొడ్డమనిషి పాండురాజు. వేళ్ళమీద లెక్కించ దగ్గవ్యక్తి. శతశృంగంమీద ఆయన తపస్సు చూసి ముక్కుమీద వేలుపెట్టుకునేవాళ్ళం మేము. అంతటి తపశ్శాలి కనకనే ధర్మదేవతా, వాయుదేవుడూ, దేవేంద్రుడూ, అశ్వినీదేవతలూ అనుగ్రహించారు. వజ్రాల్లాంటి కుమాళ్ళు కలిగారు. పాండురాజు పంచత్వం పొంది ఇప్పటికి పదిహేను దినాలైంది. మాద్రీ మహాదేవి సహా ఆయనతోనే సహగమనం చేసింది. ఇదిగో వాళ్ళ ఇద్దరి అస్తులున్నా ఇవి. శాస్త్రోక్తమైన సంస్కారం చేయండి వీటికి. కుంతీదేవి సహా సహగమనంకే సిద్ధపడింది. మేమంతా అడ్డుపడ్డాం. మా మాట విని, పిల్లల మొహం చూసీ బొందెమాత్రం నిలుపుకుని బదికి వచ్చింది.

"ఈ కుమాళ్ళు ఐదుగురూ వంశోద్ధారకులు దేవమూర్తులు. పెద్దవాడు ధర్మరాజు. పదహారేళ్ళు నిండుతున్నాయి. ఇతడు భీముడు. ఇతడు అర్జునుడు. వీళ్ళిద్దరూ నకుల సహదేవులు. ఈ పేళ్ళు దేవతలే పెట్టారు వీళ్ళకి. బ్రహ్మఋషుల చేత ఉపనయనాలు జరిగాయి. వేదాలూ వేదాంగాలూ * అభ్యసించారు. వీళ్ళని న్యాయబుద్ధితో పెంచి ప్రయోజకుల్ని చేయాలి. ఈ బాధ్యత కురువృద్ధులైన మీ అందరిమీదా వుంది" అన్నాడు. కుంతిని కుమాళ్ళనీ అప్పగించి వెళ్ళిపోయారు మునులు.

శాస్త్రప్రకారం తమ్ముడి అపరక్రియలు జరిగించాడు ధృతరాష్ట్రుడు. అస్తికలు గంగానదిలో కలిపించాడు. హోమాలతోనూ, తర్పణాలతోనూ గొప్పగా జరిగింది శ్రాద్ధకర్మ. బ్రాహ్మలికి అగ్రహారాలు దొరికాయి. వేలాది జనానికి అన్నదానం జరిగింది. ఏది ఎంత చేసినా విచారం మాత్రం పోదల్లేదు రాజపరివారానికి.

---

* వేదాంగాలు : షడంగో వేదః ఛందః కల్పో వ్యాకరణం జ్యోతిషం నిరుక్తం శిక్షా చందో

ఒకనాడు వ్యాసముని వచ్చాడు "ఏదేదో ఐంపోయింది. ఇహా విచారించిమాత్రం ఏం ప్రయోజనం!" అంటూ ఓదార్చాడు. తల్లి సత్యవతిని ఏకాంతంగా పిలిచాడు. "అమ్మా, సంసారం చంచలమైంది. ఎండమావులవంటిది. సంపదలు క్షణికమైనవి. రాబోయే దానికంటే గతించిన కాలమే మంచిది. ధృతరాష్ట్రుడి కొడుకులు దుర్మార్గులు. పాపభీతి లేదు వాళ్ళకి. ఇంటిమీాద రాయి విసిరి వెన్నుపడతారు. వాళ్ళు వున్నచోట పట్టపగలే చుక్కలు దూరతాయి. వీళ్ళవల్లే కౌరవకులంలో కలహం పుడుతుంది. తాను చేసుకున్న దాన్ని తానే అనుభవిస్తాడు నీ మనుమడు ధృతరాష్ట్రుడు. తల్లీ, ఆ దారుణం నువ్వు చూడలేవు కోడళ్ళని తీసుకుని తపోవనానికి వెళ్ళిపో" అంటూ బోధపరచి వెళ్ళిపోయాడు.

వ్యాసుడు చెప్పినదంతా భీష్ముడితోనూ, విదురుడితోనూ చెప్పింది సత్యవతి. వాళ్ల అనుమతి తీసుకుంది. కోడళ్లని వెంటపెట్టుకుని అడివికి వెళ్ళిపోయింది. అత్తా కోడళ్ళూ అడివిలో తపస్సు చేస్తూ చివరిబతుకు వెళ్లబుచ్చారు.

తన కొడుకులూ, తమ్ముడి కొడుకులూ అని భేదం లేకండా పాండవుల్ని చూశాడు ధృతరాష్ట్రుడు. తండ్రి దగ్గిరకంటే అతడి దగ్గిర వినయంగా మసులుకునేవాళ్ళు పాండవులు. దుర్యోధనుడూ మొదలైనవాళ్లతో ఆడుకునేవాళ్లు. ఐతే, ఏొక కొత్త ఆట వచ్చినా, దేన్నయినా కొట్టవలసి వచ్చినా, ఏొక పరిగెత్తవలిసి వచ్చినా, పోట్లాటవచ్చినా, ఏొక బలం చూపవలిసి వచ్చినా భీముడిదగ్గిర వీగిపోయేవారు కౌరవులు. అన్నిటిలోనూ అతడిదే పైచేయి. పదేసి మందినీ, పదిహేనేసి మందినీ ఒొక్కసారే పడగొట్టేవాడు. వీపులు తొక్కలూడేటట్టు కిందవేసి గొరగొరా ఈడ్చేవాడు. ఎంతమంది వచ్చినా పడపడా బజాయించేవాడు. జలక్రీడలపుడు ఒహాటి రెండూ మూడూ అంటూ పదేసి మందిని భుజాల మీాద ఎక్కించుకుని నిలువెత ఈదుతూ మధ్యకి పోయేవాడు. వాళ్ళని నీళ్ళల్లో ముంచుతూ

తేలుస్తూ బాగా అలిసిపోయాక వొడ్డుకి తెచ్చి పడేసేవాడు. పళ్ల కోసం జట్లు జట్లుగా చెట్టెక్కడం చూశాడో, పరిగెత్తుకు వచ్చి మొదళ్లుపట్టుకు ఊపేవాడు. పళ్లతో కూడా వాళ్లని కింద రాల్చే వాడు. దాంతో, భీముడంటే వొకవిధమైన మచ్చరం, భయం ఏర్పడింది కౌరవకుమారులకి. అది కారణంగా 'పాండవులమీద పగ తీర్చుకోవాలి' అన్న ద్వేషభావమూ అంకురించింది. అదే చివరికి చిలికి చిలికి గాలీవానా అయింది.

తమ్ములూ, తానూ వొకనాడు రహస్యంగా ఆలోచించాడు దుర్యోధనుడు. "ఈ భీముణ్ణి ఎలాఐనా వొదుల్చుకోవాలి మనం. వల్లమాలిన బలం వీడిది. వీణ్ణి కాస్తా కడతేర్చామా తక్కినవాళ్ళు పీలపిండి మనకి; తుక్కు. ధర్మరాజు దద్దమ్మ; జైల్లో వేద్దాం. మొత్తంమీద పాండవపురుగు లేకండా చేసుకుంటేనే, మన భవిష్యత్తు బాగుపడుతుంది. ఈ పీడ వదిల్తే ఈ విశాల రాజ్యంలో అడ్డుండదు మనకి. అంతామనమే ఏలుకోవచ్చు" అన్నాడు. బావుం దంటే బావుం దని అన్నమాటకే తాళంవేశారు తమ్ములు. భీముణ్ణి రహస్యంగా చంపాలి. భీష్ముడికీ, విదురుడికీ ఈ ఆచోకీ అన్నా అందకూడదు. సమయం కోసం కనిపెట్టుకు వున్నాడు దుర్యోధనుడు.

ప్రమాణకోటి అనే చోట గంగానది మడుగులో వొకనాడు ఈతలాటకి వెళ్లారు కుమాళ్ళు. వందమందినీ వొక్కడే నీళ్లలో వీగగొట్టాడు భీముడు. అందరినీ అలిసిపోయినట్టు చేశాడు. తుదకి తానూ అలిసిపోయాడు. నదివొడ్డున చల్లగాలిలో వొళ్ళు మరిచి నిద్రపోయాడు. ఇదే సమయ మన్నాడు దుర్యోధనుడు. దిట్టమైన తీగెలు తెప్పించాడు. కాళ్ళూ చేతులూ, గట్టిగా కట్టించాడు. అమాంతంగా తీసుకువెళ్ళి గంగ మడుగులో పడవేయించాడు. మడుగులో అడుక్కి వెళ్ళాక తెలివి వచ్చింది భీముడికి. ఇట్టే వొళ్ళు విరుచుకునేసరికి కట్లన్నీ పుటుకు పుటుకు మన్నాయి. కర్మబంధాలు తెగి

పోయి పుణ్యలోకానికి తేలిపోయే పుణ్యపురుషుడిలాగ, కట్లు తెంపు కుని పైకి వచ్చేశాడు భీముడు.

మరో మారూ యిలాగే నిద్రపోతున్నాడు భీముడు. తాచు పాము లిచ్చి సారథిని పంపాడు దుర్యోధనుడు. పాములు మీాద వేసి కరిపించాడు సారథి. వజ్రశరీరం భీముడిది. మీాది చర్మాన్నే ఛేదించ లేక పోయాయి పాముకోరలు. మేలుకున్నాడు భీముడు. పాదా లతోరాసి పాముల్ని చంపేశాడు. పెడచేత్తో సారథిని ఫడేలు మని పించాడు. ముక్కంటా నోటంటా నెత్తురు కక్కుకుని హారీ అన్నాడు సారథి.

ఇంకోసారి అన్నంలో విషం పెట్టించాడు దుర్యోధనుడు. ఈ విషయం తెలిసి ముందుగా భీముడి చెవిలో వూదాడు యుయు త్సుడు. కౌరవుల్లో కోమటిస్త్రీ కొడుకు, ఈ యుయుత్సుడే కొంచెం న్యాయంగా వుండేవాడు. తెలిసిన్నీ విషాన్నం కడుపార తినేశాడు భీముడు. పిసరంత చెక్కు చెదర లేదు. విషమూ అమృ తమే అయిం దతడికి. ఇలా దుర్యోధనుడి ప్రతీ ప్రయత్నమూ బూడి దలో పోసిన పన్నీరై పోయేది. దాంతో సిగ్గూ, మరింత పగా హెచ్చుతూ వచ్చాయి అతడికి. "పాండవుల పని పట్టించందే నిద్ర పోకూడదు" అంటూ పిడికిలి బిగించేవాడు.

## కృ పా చా ర్యు డు

ఇలా వుండగా, కుమాళ్ళందరికీ విలువిద్య నేర్పడానికి కృపాచార్యుణ్ణి నియమించాడు భీష్ముడు. కృపాచార్యుడి తండ్రి శరద్వంతుడు. * శరములతో కలిసి పుట్టడంచేత శరద్వంతు డన్నా రతణ్ణి. అందరి రుషికుమాళ్ళ మల్లే వేదాలూ అవీ చదవడం మనస్కరించ లేదు శరద్వంతుడికి. తపస్సు చేసి ధనుర్వేదం తనది

---

* శరద్వంతుడు (సత్యధృతి) అహల్యమనుమడు, జనకుడి పురోహితుడైన శతానందుడి కుమారుడు

చేసుకున్నాడు. ఆయుధ మన్నది ఏ దైనా సరే, తాను చెప్పినట్టు వినవలిసిందే. అలాంటి ప్రావీణ్యాం సంపాదించాడు.

ఒకసారి అసాధారణమైన తపస్సులో వున్నాడు శరద్వాంతుడు. చూసి దిగులు పట్టుకుంది దేవేంద్రుడికి. ఎలా ఐనా అతడి తపస్సు భగ్నం చెయ్యాలి. లేకుంటే శాంతి లేదు మరి. జలవతి అనే అప్సరసని పంపించాడు. వచ్చి శీసిపోసి శృంగారచేష్ట లెన్నో చూపించింది జలవతి. ఆమె కడకంటి చూపులతో మనస్సు పట్టు తప్పిపోయింది శరద్వాంతుడికి. చేతిలో వున్న ధనుస్సూ, బాణాలూ జారిపోయాయి. వెంటనే ఇంద్రియస్ఖలనమూ అయి, కింద పడింది. అప్పుడు తెలిసి వచ్చింది అతడికి. ఉత్తరక్షణంలో అక్కడనుండి పరిగెత్తుకు పోయాడు. ఇంకో అడివిలో తపస్సు ప్రారంభించాడు. తన దారిని తాను పోయింది జలవతి.

కింద పడిన శరద్వాంతుడి వీర్యం వొక రెల్లుపుడక మీద పడింది. రెండు బిందువులయింది. ఒక బిందువునుండి మగశిశువూ, రెండో బిందువునుండి ఆడపిల్లా పుట్టారు. ఆ ప్రాంతానికే వేటకి వచ్చాడు శంతనుమహారాజు. పిల్లలిద్దరూ వొక భటుడి కంట పడ్డారు. మహారాజుకి చూపాడు భటుడు. "ఇక్కడ పడివున్న ధనుర్బాణాలూ, ఈ జింకతోలూ చూస్తే, వీళ్లెవ్వరో ధనుర్విద్యలో గడితేరిన బ్రాహ్మడి పిల్లలై వుంటారు" అంటూ చెప్పాడు. చూసి జాలి కలిగింది శంతనుడికి. ఇద్దరినీ హస్తినాపురం తెచ్చి పెంచాడు. కృపతో అతడు పెంచడం చేత కుర్రాడి పేరు కృపుడూ, కుర్రదానిపేరు కృపీ అన్నారు.

తన కొడుకూ, కూతురూ హస్తినాపురంలో వున్నారని తెలుసుకున్నాడు శరద్వాంతుడు. వచ్చి నేనే వీళ్ళ తండ్రిని అని శంతనుడితో చెప్పాడు. కృపుడికి సకాలంలో ఉపనయనం చేశాడు. పండితులదగ్గిర వేదాలు చెప్పించాడు. ధనుర్వేదం తానే చెప్పాడు. ఏనుగూ, గుఱ్ఱం, రథం, నేలా - ఈ నాలుగు విధాల

విలువిద్యా నూరిపోశాడు. తనకి తెలిసిన ఆయుధవిద్య యావత్తూ నేర్పాడు. అంతటి ధనుర్విద్యా పండితుడు ఆనాటికి లేడనిపించాడు.

అలాంటి కృపుణ్ణి తన మనుమలికి ఆచార్యులుగా ఏర్పరిచాడు భీష్ముడు. కృపాచార్యులదగ్గిర నేనంటే నేనంటూ విలువిద్య నేర్చుకుంటున్నారు పాండవులూ, కౌరవులూ, యాదవులూ మొదలైన రాజకుమార్ళు.

## ద్రో ణా చా ర్యు లు

ఒకనాడు వూరిబయట బంతాట ఆడుకుంటున్నారు రాజకుమార్ళు. ప్రమాదవశాత్తూ నూతిలో పడిపోయింది బంతి. ప్రతిబింబిస్తూన్న నక్షత్రంలాగ అది నూతిలో కనబడుతూనే వుంది. కానైతే, దాన్ని పైకి తీయడ మెలాగ? ఉపాయం తోచక వొకరి మొహం వొకరు చూస్తున్నారు కుమార్ళు.

ఇంతలో ఎక్కడినుండి వచ్చాడో, వొక నల్లటి బక్కపల్చటి ముసిలాయన అక్కడికి వచ్చాడు. రకరకాల బాణాలూ, అమ్ముల పొదులూ అవీ తగిలించుకున్నాడు. మాంచి పొడవైన ధనుస్సు పట్టుకున్నాడు. చూసి, విషయమంతా తెలుసుకున్నాడు. "రాజకుమార్ళు మీరు; భారతీయులు. పైగా ధనుర్విద్యలో ఘనుడనిపించుకున్న కృపాచార్యుల శిష్యులు కూడాన్నూ. ఇలాంటి మీకు నూతిలో బంతిని తీయడం చేతకాకపోయిందీ! చూస్తూ నుంచున్నారా!" అంటూ చిరునవ్వు నవ్వాడు. "చూస్తారూ, బాణాలు వేసి పైకి తీస్తాను నేను" అంటూ వొక బాణం తీసి మంత్రించాడు. గురి చూసి నూతిలోకి కొట్టాడు. బంగారంబంతికి నాటుకుంది బాణం. ఆబాణం మొదలుకి నాటుకున్నట్టు మరోబాణం వేశాడు. దానికి మరొకటి. అతడు బాణం వొదుల్తూ వుంటే, అతడి ముష్టీ, అతడి దృష్టీ చకితుల్ని చేశాయి రాజకుమార్ళని. అలా బాణానికి బాణం తగిలిస్తూ బాణాలతాడు తయారుచేశాడు ముసిలాయన. దాంతో పైకి తీశాడు బంతి. రాజకుమార్ళ చేతిలో పెట్టాడు.

ఆశ్చర్యపోయారు రాజకుమారుళ్ళు. ముసిలాడి చుట్టూ మూగారు. భీష్ముడి దగ్గిరికి తీసుకు వెళ్ళారు. సంగతంతా చెప్పారు. "నన్ను ద్రోణుడంటారు" అన్నాడు ముసిలాయన. ఉత్సాహంగా లేచి నమస్కరించాడు భీష్ముడు.

ద్రోణుడు భరద్వాజముని కుమారుడు. భరద్వాజుడు హరిద్వారంలో తపస్సు చేస్తూ వుండేవాడు. ఒకనాడు స్నానానికని గంగానదికి వెళ్ళేసరికి అప్సరస ఘృతాచి జలక్రీడ లాడుతూ వుంది. ఆమె అవయవాలూ అవీ చూసి కామోద్రేకం కలిగింది మునికి. వెంటనే రేతస్ఖలనమూ అయింది. అది వ్యర్థం కాకండా తన దగ్గిరి ద్రోణంలో (కుండలో) భద్రపరిచాడు అతడు. కుండలోని వీర్యంలో బృహస్పతి అంశని కుమారుడు కలిగాడు భరద్వాజుడికి. ద్రోణంలో పుట్టడం చేత ద్రోణు డన్నారు కుమారుణ్ణి.

ద్రోణుడి ప్రతిభ వింటూనే వున్నాడు భీష్ముడు. "వెదక బోయిన తీగె కాళ్ళకి తగిలింది." అనుకున్నాడు. ఆసనమూ అదీ ఇచ్చి గౌరవించాడు. "ఎక్కడనుండి వస్తున్నారు ? ఎందాక ప్రయాణం" అని అడిగాడు. "ఇక్కడికే వచ్చాను" అన్నాడు ద్రోణుడు. "పాంచాలం * రాజు ద్రుపదుణ్ణి ఎరుగుదువు కదా ! అతడి తండ్రి పృషతుడు ♦ మా తండ్రిగారి స్నేహితుడు. పృషతుడు

---

* పాంచాలం : హస్తిపుత్రుడైన అజామీఢుడి కుమారుళ్ళలో వొకడు నీలుడు. అతడి ముమ్మనమడు భర్మ్యాశ్వుడు (ఇతణ్ణి భద్రాశ్వుడూ, హర్యశ్వుడూ, బహ్వశ్వుడూ అనీ అంటారు) ఇతడికి కంపిలుడూ క్రిమిలాశ్వుడు? యవీనరుడూ బృహదిషుడూ సృంజయుడూ ముద్గలుడూ అని ఐదుగురుకుమారుళ్ళు. తండ్రి ఆదేశం ప్రకారం ఈ ఐదుగురూ అతడి రాజ్యం పాలించడం చేత అది పాంచాలం అయిందని విష్ణుపురాణం, వాయుపురాణం, బ్రహ్మపురాణం, మత్స్యపురాణం, హరివంశం మొదలైనవి చెపుతున్నాయి.

♦ పృషతుడు ♦ సృంజయుడి సంతతిలోని సోమకుడి వందమంది కొడుకుల్లో చివరివాడు అని హరివంశం. ఇతడి వివరం విష్ణుపురాణం, భాగవతం మొద

తపస్సు చేసుకుంటూ వుంటే మేనక వచ్చిం దక్కడికి. బండిగురువింద పువ్వులు కోస్తూ వుంటే దాన్ని చూశాడతడు. కామోద్రేకం కలిగి ఇంద్రియ పతనమైంది అతడికి. అది పైకి కనబడకండా తన పాదం కింద అడిచిపెట్టాడు.

"ఆ పాదంకింది వీర్యంలో మరుత్తుల అంశని జన్మించాడు ఈ ద్రుపదుడు. పాదం కింద దాచబడడం చేత ద్రుపదు డన్నారతణ్ణి. కొడుకుని మా ఆశ్రమంలో వొదిలిపెట్టాడు. పృషతమహారాజు. * ద్రుపదుడూ, నేనూ వొక్కదగ్గిరే పెరిగాం. ఒక్కదగ్గిరే చదివాం. ఒక్కదగ్గిరే వేదాలూ అవీ నేర్చుకున్నాం. విలువిద్యా అభ్యసించాం. ఇద్దరమూ అరమరలు లేని స్నేహితులమై తిరిగాం.

" 'నేను పాంచాలానికి రాజు నయాక నా దగ్గిరికి రావాలి నువ్వు' అని పదే పదే అనేవాడు ద్రుపదుడు. 'నాతోపాటు నా రాజభోగాలు అనుభవించడానికి నీకూ హక్కుంది' అంటూ నొక్కి చెప్పేవాడు. ఇంతలో పృషతుడు కాలం చేశాడు. పాంచాలదేశం రాజయాడు ద్రుపదుడు.

---

లైనవాట్లో వేరువేరుగా కనిపిస్తుంది సోమకుడు తన తొలికొడుకు జంతువుని యజ్ఞపశువుగ చేసి వందమంది కొడుకుల్ని కన్నకథ చూ॥ అరణ్యపర్వం మూడో ఆశ్వాసంలోని పుత్రయాగం.

* శంతనుడు హస్తిన ఏలుతున్న కాలంలో పాంచాలంలో జ్ఞాతులకలహం రేకెత్తి పెద్ద యుద్ధాలయినాయి యవీనరసంతతిలోని ఉగ్రాయుధుడు పృషతుడి తండ్రిని చంపి అతడిరాజ్యం తీసుకున్నాడు. కుమారుడైన ద్రుపదుడితో సహా పృషతుడు అడవుల్లో గడపవలసివచ్చింది అప్పుడే ద్రుపదుడు ద్రోణుడితో సహాధ్యాయిగా వున్నాడు

శంతనుడు మరణించగానే ఉగ్రాయుధుడు భీష్ముడిమీదికి వచ్చాడు, "మీ పినతల్లి సత్యవతిని నేను కామించాను. బతుకుమీద ఆశవుంటే వెంటనే ఆమెని నా పరం చెయ్యి" అంటూ భీష్ముడికి వర్తమానం చేశాడు తండ్రి దినవారాలు తీరేవరకూ కబుర్లతో కాలక్షేపం చేశాడు భీష్ముడు, తరవాత ఉగ్రాయుధుణ్ణి చంపి అడవుల్లో వున్న పృషతుణ్ణి విశాలపాంచాలానికి రాజుచేశాడు. చూ. హరివంశం ఉగ్రాయుధోపాఖ్యానం

"నేను మా గురువుగారు అగ్నివేశ్యముని దగ్గిర విలువిద్య పూర్తి చేశాను. ఆగ్నేయాస్త్రం మొదలైన ఎన్నో దివ్యాస్త్రాలూ సంపాదించాను. మా తండ్రిగారి ఆదేశం ప్రకారం మీ కృపాచార్యుల చెల్లెలు కృపిని వివాహం చేసుకున్నాను. ఆమె గర్భంలో అశ్వత్థామ కలిగాడు. దారిద్ర్యం వల్ల సంసారం గడవడం కష్టంగా వుంది. పరశురాముడు ధనం పంచిపెడుతున్నాడని విన్నాను. మహేంద్రం వెళ్ళి ఆయన దర్శనం చేశాను. 'ఉన్నదంతా బ్రాహ్మలకి పంచేశాను. భూమి యావత్తూ కశ్యపుడికి ధారపోశాను. * ఇక మిగిలిందంతా నా శరీరం, శస్త్రాస్త్రాలూను. వీటిలో ఏది కావలిస్తే అది తీసుకో' అన్నాడు రాముడు. ధనంలో ఉత్తమధనం కదా ఆయుధాలు అవే అర్థించాను. ప్రయోగరహస్యాలు విప్పి చెప్పి మంత్రపూర్వకంగా మహాస్త్రాలు అనుగ్రహించాడాయన.

"ఆయుధాలతో ఆకలి తీరదు కదా! పేదరికం పేదరికంలాగే వుంది. ఏం చెయ్యను? మనిషి విలువ తెలుసుకోలేని మొత్తలు రాజులు. వాళ్ళని ఆశ్రయించడం, వాళ్ళదగ్గిర దాస్యం పుచ్చుకోవడం కిట్టదు నాకు. ధర్మంగా నడిచినా దరిద్రం వదలదు కదా! డబ్బున్న వాళ్ళ పిల్లలు పాలు తాగడం చూసి తనకీ కావాలని కింక పెట్టాడు పసిపాప అశ్వత్థామ. దేహీ అనడం కంటే హీనం లేదు. ఐతే చెడి స్నేహితుడి దగ్గిరికి వెళ్ళమన్నారు పెద్దలు. బాల్యస్నేహితుడు కదా ద్రుపదుడు. అతడి దగ్గిరికే వెళదామని బయల్దేరాను. 'ధనమివ్వక పోయినా నాలుగైదు ఆవులన్నా ఇవ్వకపోడు. కుర్రాడి పాలబాధ తీరుతుంది' అని ఆశపడ్డాను. గంపెడంత ఆశతో కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళాను. ద్రుపదమహారాజులుంగారి దర్శనం చేశాను. జరిగిన గౌరవం ఏమని చెప్పను!

అపరిచితుణ్ణి చూసినట్టు చూశాడు ప్రభువు. 'నీ బాల్యస్నేహితుణ్ణి' అన్నాను. 'సహాధ్యాయిని మరిచిపోయావా?' అన్నాను.

---

* అందుకనే భూమికి కాశ్యపి అని వొక పేరు.

వికారంగా నవ్వాడతడు. నడినెత్తిని పిడుగు పడ్డట్టయింది నాకు. 'తలకు మించిన కూతలు కూస్తున్నావు' అన్నాడు. 'పేదబాపనయ్యకీ మహారాజుకీ స్నేహమట ! మతిలేని మాటలు ! అవతలికి నడు' అన్నాడు. 'శ్రీమంతుడికీ నిరుపేదకీ, పండితుడికీ పామరుడికీ, వీరుడికీ పిరికివాడికీ, మంచివాడికీ చెడ్డవాడికీ స్నేహమెలా కలుస్తుంది ! ఏనాగానీ, స్నేహమూ, విరోధమూ కార్యకారణ సంబంధం వుంటేనే కలుగుతుంది రాజులికి. నీవంటి ముష్టిగాడితో మాకు అవసరమే ముంటుంది గనక స్నేహానికి ?' అంటూ తూలనాడాడు. కల్లెర్ర చేశాడు. కసిరాడు.

"అవమానంతో వెయ్యి ముక్కలైంది హృదయం. ఉసూరుమంటూ నెత్తిని గుడ్డ వేసుకుని భార్యా బిడ్డలతో వచ్చేశాను. ఆ రావడం రావడం తిన్నగా పాంచాలం నుండి హస్తినాపురం వచ్చాను" అంటూ ఆమూలాగ్రంగా తన వృత్తాంతం వివరించి చెప్పాడు ద్రోణుడు.

" మేమంతా మీవాళ్ళం. ఇక్కడ ఏ అరమరా పెట్టుకో వద్దు" అంటూ చేతులు జోడించాడు భీష్ముడు. "మీ రిలా అనుగ్రహించడం మా భాగ్యం. ధనుర్విద్యలో పరశురాముణ్ణి కాదనగల మహాచార్యులు మీరు. ఇదిగో వీళ్ళు నా మనమలు. ఇప్పటి నించీ వీళ్ళంతా మీ శిష్యులు. మహాస్త్రవిద్యలన్నీ నేర్పి తరిబీదు చెయ్యండి వీళ్ళని" అని కుమాళ్ళని అప్పగించాడు. కావలసిన ధనమూ, ధాన్యాలూ అవీ యిచ్చి సంతోషపరిచాడు.

రాజకుమాళ్ళని శిష్యులుగా చేసుకున్నాడు ద్రోణాచార్యులు. అందర్నీ దగ్గిరికి పిలిచాడు. "అబ్బాయిలూ, మీరంతా నా శిష్యులు. బావుంది. ఐతే, మీ విద్యయావత్తూ పూర్తయాక నేను కోరిన కోర్కె మీలో ఎవరు తీరుస్తారో చెప్పండి" అని అడిగాడు. ఒక్కడూ లేవలేదు. కౌరవకుమాళ్ళయితే పెడమొహాలే పెట్టుకున్నారు. పలుకూ వులుకూ లేదు. ఇంతలో "నేను తీరు

స్తాను'' అంటూ అందరిలోనూ ముందికి వచ్చాడు అర్జునుడు. గురువు కళ్ళల్లో ఆశాజ్యోతులు మిలమిల లాడాయి. దగ్గిరికి తీసి కౌగిలించుకున్నాడు అర్జునుణ్ణి. అప్పటినుండీ అర్జును డంటే అమితాభిమానం ఆచార్యుడికి.

హస్తినాపురంలో ధనురాచార్యులుగావున్నాడు ద్రోణుడు. ఈ వార్త తెలిసి దేశదేశాల రాజకుమార్ళ్ళు వచ్చారు. అతడిదగ్గిర విలువిద్య నేర్చుకోవడం మొదలుపెట్టారు. రాజకుమార్ళ్ళ అస్త్రశిక్షాశాలలా వుంది హస్తినాపురం.

అందరిలోకీ చురుకుగా వుండేవాడు అర్జునుడు. గురువు మాటమీదే గురి అతడికి. పష్టిఘడియలూ ధనుర్బాణాలతోటే అతడి వ్యాసంగం. గురుపుత్రుడు అశ్వత్థామకి మాత్రం అత డంటే స్పర్థగా వుండేది. "ఏ మన్నా, చీకటిలో అర్జునుడికి గురి కుదరకండా వుంటే కొంత నయం'' అనుకునేవా డతడు. దానికి అనుగుణ్యంగా వొక ఎత్తు వేశాడు. అర్జునుడికి భోజనం పెట్టే వంటవాడితో చిన్న కుట్రపన్నాడు. "ఇదిగో, అర్జునుడికి చీకట్లోమాత్రం ఎన్నడూ అన్నం పెట్టకు'' అని చెప్పాడు.

వంటవా డేమో అప్రమత్తుడుగానే వున్నాడు. కా నైతే వొకనాడు, రాత్రి అర్జునుడు భోజనం చేస్తున్నాడు. గాలి వేసి దీపం ఆరిపోయింది. అభ్యాసంవల్ల చీకటిలో కూడా నిరాటంకంగా భోంచేసి లేచాడు అర్జునుడు. అభ్యాసం కూసువిద్య. "అభ్యాసం వుంటే ఏదన్నా ఇంతే కదా!'' అని తట్టిం దతడికి. అప్పటినుండీ చీకటిలో కూడా బాణం గురిచూసి వెయ్యడం ప్రారంభించాడు.

రాత్రి. చీకటి. ధనుష్టంకారం విని పరిగెత్తుకు వచ్చాడు ద్రోణుడు. చూసి ఆలింగనం చేసుకున్నాడు అర్జునుణ్ణి. అతడి పట్టుదలకి మెచ్చుకున్నాడు. "నిన్ను మించిన విలుకాడు లేడు అన్నట్టు తయారుచేస్తాను నిన్ను'' అంటూ భుజం తట్టాడు. అంతటి నించీ అనేకమైన రహస్యాలు నేర్పాడు అర్జునుడికి. ద్వంద్వయుద్ధంలో

ఎలాంటి మెళుకువలు * ఉపయోగించాలో, సంకుల యుద్ధంలో ఎలాంటి కిటుకులు పాటించాలో, రథం మీాంచి, ఏనుగు మీాంచి, గుర్రం మీాంచి, నేల మీాంచి ఎలా ఎలా యుద్ధం చెయ్యాలో, చిత్ర యుద్ధంలో ఎలాంటిగతులు † చూపాలో, రకరకాల వ్యూహాలు ♦ ఎలా భేదించాలో, ఏ లక్ష్యం ‡ ఎలా వెయ్యాలో, ఏ ధనుస్సు ఎలా ఉపయోగించాలో, ఏ అస్త్రం ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహరించాలో – ఇలాంటి వన్నీ పట్టి పట్టి నేర్పేవాడు. అన్నిటిలోనూ అర్జునుడే అందెవేసిన చెయ్యి అనిపించేవాడు.

తక్కిన కుమారుళ్ళకీ గదా, కత్తీ, తోమరం, పరుశువూ, ప్రాసం, ముద్గరం, ఈటే, శక్తీ, ముసలం, పట్టిసం, విల్లూ – ఎవళ్ళకి

* మెళుకువలు జంకించడం, కలియబడడం, దూకడం, దగ్గిర నిలవడం, పక్కకి తప్పుకోవడం, ఉరకడం, కదిలాఘుటం మొదలైనవి పన్నెండు రకాలు

† గతులు గజగతీ, పిచ్చుకగతీ, జంబుకగతీ, తాండవగతీ, పిట్టగతీ, మర్కటగతీ, మహిషగతీ, మార్జాలగతీ, పులిగతీ, హరిగతీ, నారిణగతీ అని గతులు పదకుండు రకాలు

♦ వ్యూహాలు దండవ్యూహం, మకరవ్యూహం, వజ్రవ్యూహం, ధ్వజవ్యూహం, శకలవ్యూహం, శ్యేనవ్యూహం, ఈ మొదలైనవి ప్రధాన వ్యూహాలు పద్మవ్యూహం, కూర్మవ్యూహం, శృంగాటకవ్యూహం, గరుడవ్యూహం ఈ మొదలైనవి అవాంతర వ్యూహాలు.

‡ లక్ష్యాలు · చాల్యలక్ష్యం, [కొండలూ మొదలైనవి దొలుచుకు పోయేట్టు వేలక్ష్యం] గురులక్ష్యం (రాక్షసుల్నీ, పెద్ద పెద్ద ఏనుగుల్నీ తూట్లుపడేటట్టు వేసేలక్ష్యం,) సుకుమారలక్ష్యం (నీటికుండలూ అవీ కన్నాలుపడేటట్టు వేసే లక్ష్యం). సూక్ష్మలక్ష్యం (తలవెంట్రుకకి ఏదన్నా వేలాడదీసి ఆ వెంట్రుకకి తగిలేటట్టు వేసేలక్ష్యం), శబ్దలక్ష్యం (శబ్దాన్నిపట్టి వేసేలక్ష్యం), ప్రతిబింబ లక్ష్యం (అద్దంలోనో, నీటిలోనో ప్రతిబింబం చూసి వేసేలక్ష్యం), రసలక్ష్యం, గంధలక్ష్యం, చలనలక్ష్యం భ్రమణలక్ష్యం, దూరలక్ష్యం, పృష్ఠలక్ష్యం, స్పర్శలక్ష్యం, దుర్నిరీక్షణలక్ష్యం, స్థిరలక్ష్యం, – ఇలా లక్ష్యాలు అనేకవిధాలు

ఎందులో అభిరుచి వుంటే వాళ్ళకి అందులో కౌశలం కుదిరేట్టు నేర్పే వాడు. తన శిష్యుల్లో ఒకడూ అప్రయోజకుడు కాలేదు.

ముఖ్యంగా రథయుద్ధంలో ప్రవీణు డయ్యాడు ధర్మరాజు. భీముడూ, దుర్యోధనుడూ గదాయుద్ధంలో మొనగాళ్ళయ్యారు. నకులుడూ, సహదేవుడూ కత్తియుద్ధంలో ఘనులు అనిపించుకున్నారు. అన్నిటిలోనూ మంచి ప్రవేశం సంపాదించాడు అశ్వత్థామ. అర్జునుణ్ణీ భీముణ్ణీ చూస్తేనూ మాత్రం కడుపుమంటగా వుండేది కౌరవులకి సూతుడింట్లో పెరుగుతూ విలువిద్యలో మెళుకువలు తెలుసుకున్నాడు కర్ణుడు. అర్జునుడంటే అసహ్యించుకునేవాడతను. అతడి మొగ్గంతా దుర్యోధనుడి దిక్కే వుండేది.

## ఏకలవ్యుడు

ఇలా వుండగా, హిరణ్యధన్వుడు అని ఒక ఎరుకలరాజు వుండేవాడు. అతడి కొడుకు ఏకలవ్యుడు ద్రోణాచార్యుల ప్రసిద్ధి విన్నాడు. "నాకూ విలువిద్య నేర్పండి" అంటూ వచ్చి ప్రార్థించాడొకనాడు. "ఎరకలవాడివి, నీకా అర్హత లేదు" అంటూ నిరాకరించాడు ఆచార్యుడు. నిరాశపడ లేదు ఏకలవ్యుడు. "పోనీ మీ మూర్తినే గురువుగా భావిస్తాను. అనుమతించండి" అంటూ ప్రాధేయపడ్డాడు. "అది నీ ఇష్టం" అన్నాడు గురువు. పాదాభివందనం చేసి సెలవు తీసుకున్నాడు ఏకలవ్యుడు.

అడివిలో మట్టితో ద్రోణుడి విగ్రహం తయారు చేశాడతను. దానికే రోజూ ప్రదక్షిణం చేసేవాడు. సాగిలపడేవాడు. పూజించేవాడు. ఏకదీక్షతో విల్లూ, బాణాలూ పుచ్చుకుని అభ్యాసం చేసేవాడు. మహాస్త్రాల రహస్యాలన్నీ వాటంతటఅవే తెలిసి వచ్చేవి తనకి. కొద్దికాలంలోనే గొప్ప గొప్ప విలుకాళ్ళని మించిపోయాడు.

గురువుగారి అనుమతి మీద ఒకనాడు వేటకని బయలుదేరారు రాజకుమారుళ్ళు. కుక్కలూ అవీ వెంటపెట్టుకుని అడివిలోకి వెళ్ళారు. వేటలో ఒకకుక్క ఎలాగో తోవ తప్పి

పోయి ఏకలవ్యుడు బాణాభ్యాసం చేస్తూన్న చోటికి వెళ్ళింది అల్లంత దూరంలో అతణ్ణి చూసి మొరగడం ప్రారంభించింది. అది విన్నాడు ఏకలవ్యుడు. వెంటనే దూరంనించే వొక్కసారిగా ఏడు శబ్దవేధి బాణాలు వేశాడు. మొరగకుండా దాని నోరు కట్టివేశాడు. దాంతో రాజకుమారుల దగ్గిరికి పరిగెత్తుకు వచ్చింది కుక్క. చూసి నివ్వెరపోయారు రాజకుమారులు. "ఇంత చిత్రంగా బాణాలు వేసిన విలుకాడు ఎవడై వుంటాడు?" అంటూ వెదుక్కుంటూ ఏకలవ్యుడి దగ్గిరికి వచ్చారు.

విలువిద్యలో పరిపూర్ణుడులా కనిపిస్తూనే వున్నాడు ఏకలవ్యుడు. మాంచి పొడవాటి ఏపైన మనిషి. నల్లజునపరాయి లాగ నిగనిగ లాడుతోంది శరీరం. ఒంటినిండా దుమ్ము. జంకతోలే వస్త్రం. చేతిలో పాం నాలికలులాంటి పదునుపెట్టిన బాణాలు. కైరిపోతులాంటి ధనుస్సూ విలుకాడన్నవాడికి ఎవడికన్నా మచ్చరం వేస్తుంది ఆ దృష్టీ, ఆ ముష్టీనీన్నీ, అతణ్ణి కళ్ళల్లోకళ్ళు పెట్టి చూడలేకపోయారు రాజకుమారులు.

"ఎవరు నువ్వు ?" మీ గురువెవ్వరు ?" అని అడిగారు. "ఏకలవ్యుణ్ణి. ద్రోణాచార్యుల శిష్యుణ్ణి" అన్నాడు ఏకలవ్యుడు. ఒకరి మొహాలు వొకరు చూసుకున్నారు రాజకుమారులు. మాట్లాడకుండా తలవొంచుకు ఇంటికి వచ్చేశారు.

ఎవ్వరూ లేని వేళ చూసి గురువుగారితో చెప్పాడు అర్జునుడు. 'అవాళ నిన్ను మించిన విలుకాడు లేడు అన్నట్టు తయారు చేస్తాను నిన్ను' అన్నారు మీరు. ఆడి తప్పరు. నాకు తెలుసు. కానైతే, నన్నే కాదు, ముల్లోకాలినీ, మిమ్మల్నీ మించినట్టున్న మీ ఎరకల శిష్యుణ్ణి చూశాం మరి" అన్నాడు. అదిరిపడ్డాడు ఆచార్యుడు. ఉన్నపాటుని లేచాడు. "ఏమిటి ? నిజంగానే ? ఐతే పద. చూసివద్దాం వాణ్ణి" అన్నాడు. గురుశిష్యు లిద్దరూ ఆపాళాన్ని బయల్దేరారు.

గురుదక్షిణ

కనుచూపు దూరంలో చూశాడు ఏకలవ్యుడు. పరిగెత్తుకు వచ్చాడు గురుదేవుడి పాదాలముందు సాగిలబడ్డాడు. "ఏకలవ్యుణ్ణి. మీ శిష్యుణ్ణే మిమ్మల్నే ఆరాధిస్తున్నాను. మీ దయవల్లే విలువిద్య నేర్చుకున్నాను. నా వున్నదంతా మీదే. ఏమిటాజ్ఞ ?" అంటూ చేతులు జోడించాడు. "నాకు కావలసిందల్లా గురుదక్షిణ వొక్కటే" అన్నాడు ద్రోణుడు. "ధన్యుణ్ణి. ఇదిగో, ఇది నా శరీరం. ఇవి నా ఆయుధాలు. ఇది నా సంపత్తి. ఇది నా పరివారం. ఆదేశించండి ఏమిటి సమర్పించుకునేది ?" అన్నాడు ఏకలవ్యుడు. "నీ కుడిచేతి బొటనవేలు" అన్నాడు ద్రోణుడు. "మహా ప్రసాదం" అన్నాడు ఏకలవ్యుడు. నవ్వు మొహంతో కత్తి తీశాడు. కుడిబొటనవేలు నరికి గురుదక్షిణ పెట్టాడు.

ఐపోయింది. బొటనవేలు పోవడంతో టే విలువిద్యలో ఏకలవ్యుడి సామర్థ్యం సన్నగిల్లింది. * ఈ విధంగా అన్నమాట నిలుపుకున్నాడు ఆచార్యుడు. ద్రోణుడి శిష్యకోటిలో అర్జునుడే అగ్రగణ్యుడిపుడు.

పరీక్ష

శిష్యుల విలువిద్య పరీక్ష చేయాలని నిశ్చయించాడు ద్రోణాచార్యులు. ఒక గెద్దబొమ్మ తయారు చేశాడు. గురి కోసం వొక చెట్టు చివర కట్టాడు దాన్ని. శిష్యుల నందరినీ పిలిచాడు. మీ మీ ధనుస్సులూ బాణాలూ పట్టుకోండి అన్నాడు. "నేను పిలిచిన వాళ్ళు ముందుకి రండి. నేను 'ఊఁ' అనేసరికి, అదిగో - ఆ గెద్దతల బాణంతో కొట్టి పడవెయ్యాలి" అన్నాడు.

ముందు ధర్మరాజుని పిలిచాడు. "ఇదిగో గెద్ద. చూడు. దాని తల కనిపిస్తోందా ?" అని అడిగాడు గురువు. "కనిపిస్తోంది"

* కొన్నాళ్ళకి పౌండ్రక వాసుదేవుడితో కలిసి ఏకలవ్యుడు ద్వారక మీదికి దండెత్తినట్టు హరివంశం చెపుతున్నది.

అన్నాడు ధర్మరాజు. "చెట్టూ, నేనూ, నీ తమ్ముళ్లూ కనిపిస్తున్నారా ?" అని అడిగాడు గురువు. మీరూ, తమ్ముళ్లూ, చెట్టూ, పిట్టా అన్నీ కనిపిస్తున్నాయి" అన్నాడు ధర్మరాజు "ఊహూఁ, నీ దృష్టి చెదురుతోంది. కొట్టలేవు నువ్వు. తప్పుకో" అన్నాడు గురువు ఇలాగే కౌరవకుమాళ్ళని అందరినీ, భీముణ్ణీ నకుల సహదేవుల్నీ, నానా దేశాల రాజకుమాళ్ళని పిలిచి ప్రశ్న వేశాడు. అందరూ ధర్మరాజులాగే జవాబు చెప్పారు. అందరినీ అలాగే "తప్పుకోండి" అని తూలనాడాడు గురువు.

చిట్టచివర అర్జునుణ్ణి పిలిచాడు. అవే ప్రశ్నలు అతణ్ణీ అడిగాడు. "గెద్దతల మినహాయించి నాకు మరేమీ కనపడలేదు" అన్నాడు అర్జునుడు. "లక్ష్యశుద్ధి కుదిరింది నీకు. నువ్వు కొట్టగలవు" అన్నాడు గురువు గురువు "ఊఁ" అనడమూ, అర్జునుడి బాణం రయ్యిమని వెళ్ళడమూ, గెద్దతల కింద పడడమూ వొకేసారి జరిగిపోయాయి. ప్రియశిష్యుణ్ణి అమాంతంగా ఎత్తి కౌగిలించుకున్నాడు గురువు.

మరో నాడు శిష్యులతో వెళ్ళి గంగలో స్నానం చేస్తున్నాడు ద్రోణుడు. మొసలి వచ్చి అతడి కాలి పిక్క పట్టుకుంది. తలుచుకుంటే తానే దాన్ని చంపగలడు. పరీక్షకి ఇదీ వొక అవకాశమే అనుకున్నాడు. మొసలిని చంపండని కేకలు వేశాడు శిష్యుల్ని. ఒక్కడూ సాహసించలేదు. భయంతో దూరంపోయి నుంచున్నారు. మెరుపులా ఉరికాడు అర్జునుడు. నీటిలో కనపడకండానే వుంది మొసలి. గురువు కాలికి తగలకండా ఐదు బాణాలు వేసి నీటిలోని మొసలిని నీటిలోనే చంపాడు అర్జునుడు.

బ్రహ్మానంద మైంది ద్రోణుడికి. శిష్యుణ్ణి పొగడకండా వుండలేకపోయాడు. కౌగిలించుకున్నాడు. దివ్యాస్త్రాలు ఉపదేశించాడు.



# ఆదిపర్వం

## ౧వ ఆశ్వాసం

### రాజకుమారుల అస్త్రవిద్యాప్రదర్శనం

రాజకుమారులు యావన్మందీ అస్త్రవిద్యలో ప్రవీణు లయారు. వాళ్ళ ప్రావీణ్యం భీష్ముడూ విదురుడూ కృపుడూ బాహ్లీకుడూ సోమదత్తుడూ మొదలైన పెద్దలు ఎదుట మహాసభలో ప్రదర్శించాలి. అందుకని ధృతరాష్ట్రుడి కొలువుకి వచ్చాడు ద్రోణాచార్యుడు. "మహారాజా, కుమారుల విద్య పూర్తయింది వాళ్ళ ప్రవీణత పరికించి పరీక్షించాలి మీరు" అన్నాడు. "మంచిది" అన్నాడు ధృతరాష్ట్రుడు. "ప్రదర్శనానికి మంచి రంగస్థలం ఏర్పాటు చెయ్యి" అంటూ ఆదేశించాడు విదురుణ్ణి.

శాస్త్రోక్తమైన కొలతలతో విశాలమైన ప్రదర్శనరంగం తయారు చేయించాడు విదురుడు. రాయీ రప్పా, తుప్పా దుబ్బా, చెట్టూ పుట్టా, లేకండా ప్రదేశమంతా బాగుచేయించాడు. ఎత్తూ పల్లాలు లేకండా, దుమ్మూ ధూళీ లేకండా సమం చేయించాడు. తూర్పునా ఉత్తరానా దార్లు వేయించాడు. వేలాది జనం పట్టేటట్టు ప్రేక్షాగారాలూ, గడమంచెలూ ఎన్నెన్నో కట్టించాడు. రంగురంగుల జెండాలూ, పచ్చతోరణాలూ, అరటి స్తంభాలూ, చిత్రవిచిత్రంగా అలంకరించిన వాకిలి ద్వారాజాలూ — ఓ! చూసేందుకి రెండుకళ్ళు చాల వనిపిస్తోంది ప్రదర్శనరంగం. శాంతీ, శుభం కలిగించే పూజలూ అవీ రంగస్థలం నాలుగు దిక్కులా నిర్వర్తించారు బ్రాహ్మలు. అంతా సిద్ధమైంది.

పంచాంగం చూసి మంచిరోజు నిర్ణయించారు. శుభ ముహూర్తాన్ని బయలుదేరాడు ధృతరాష్ట్రుడు. గాంధారీ మొదలైన వందమంది భార్యలూ వెంట వచ్చారు. రకరకాల ముస్తాబు

లతో ఎంతోమంది విలాసవతులూ అనుసరించారు మహారాజుకీ, రాణులికీ ప్రత్యేకించిన ప్రేక్షాగారం ఇంద్రసైభవంగా వుంది. కదంబ పుష్పాలంతలేసి ముత్యాలు దండలు కట్టి వేలాడదీశారు పచ్చలూ, పగడాలూ, వజ్రాలూ, వైడూర్యాలూ, నీలాలూ, కెంపులూ, గోమేధికాలూ, పుష్యరాగాలూ రంగురంగుల నక్షత్రాల్లాగ మెరుస్తున్నాయి అంతటా బంగారుమయమై ఝగేలు మంటున్నది

దేవేంద్రుడిలాగ వచ్చి కూర్చున్నాడు ధృతరాష్ట్రుడు. నవరత్నాలతో మిలమిల లాడిపోతూన్న మేరుపర్వతంగుహల్లో సమావేశమైన దేవతాస్త్రీలలాగ కూచున్నారు రాజస్త్రీలు ధృతరాష్ట్రుడి పక్క కళ్ళకి కట్టుతోటే కూచుంది గాంధారి. కుమాళ్ళ విద్యాప్రావీణ్యం చూడాలని వెయ్యి కళ్ళతో వచ్చి కూచుంది గాంధారి పక్కని కుంతి

భీష్ముడూ విదురుడూ కృపుడూ శకుని శల్యుడూ సోమదత్తుడూ మొదలైన పెద్దలూ, స్నేహితులూ సామంతులూ, మంత్రులూ, మండలాధిపతులూ — ఎవళ్ళకి తగ్గ ఆసనాల్లో వాళ్ళు వచ్చి కూర్చున్నారు. ఒక ఉన్నతమైన ఆసనం మీద వ్యాసమునీ, అతడి చుట్టూ ఎంతోమంది బ్రాహ్మణులూ కూచున్నారు. కవులూ, గాయకులూ, వైతాళికులూ వాళ్ళవాళ్ళకి ఏర్పాటైన స్థలాల్లో సర్దుకున్నారు. జాతి మత భేదం లేకండా, చిన్నా పెద్దా తారతమ్యం లేకండా లక్షలాది జనంతో కిటకిట లాడుతోంది ప్రదర్శనరంగం. ఢంకా నగారాలు మోగుతున్నాయి. ప్రజల కోలాహలం, వాద్యాల ధ్వనీ కలిసి ప్రళయంనాడు ఉప్పొంగిన సముద్ర ఘోషలా వుంది.

సరిగా వేళకి రంగస్థలంలో అడుగు పెట్టాడు ఆచార్యుడు ద్రోణుడు హంస రెక్కల్లాంటి తెల్లటి వస్త్రాలు కట్టుకున్నాడు. తెల్లటి పూలమాలలు. తెల్లటి ఆభరణాలు. తెల్లటి గంధపు పూత. తెల్లటి యజ్ఞోపవీతం. తెల్లటి పండు జుత్తు. తెల్లటి మీసాలు. తెల్లటి గెడ్డం. శ్వేతమూర్తిలా వున్నాడతడు. వెంట కుమారుడు

అశ్వత్థామ. నిర్మలాకాశంమీద అంగారక గ్రహంతో వున్న సూర్యుడి లాగ రంగమధ్యంలో నుంచున్నాడు ద్రోణుడు.

వందలకొద్దీ బ్రాహ్మలు మంగళవచనాలు చదువుతున్నారు. ద్రోణాచార్యుల వెనక వచ్చి వరసతీరి నుంచున్నారు రాజకుమాళ్ళు అందరికంటే ముందు ధర్మరాజు వయస్సు వారీగా పెద్దవాళ్ళు ముందూ తరవాతివాళ్ళు తరవాతా వున్నారు. పిండలు తిరిగిన గండలు. ఉడుం చర్మం చేతి కవచాలు. బాణాలు నిండిన తూణీరాలు. మంచి మంచి ధనుస్సులు. అందమైన శరీరకవచాలు అంతా ఇలా వీరవేషాలతో ముచ్చటగా వున్నారు ద్రోణశిష్యులు. అందరూ ఎర్రటి రక్తచందనం పూసుకున్నారు. ఎర్రటి బట్టలు కట్టుకున్నారు. ఎర్రటి పూలమాలలు వేసుకున్నారు. ఎర్రటి ఆభరణాలు ధరించారు. అందరి కళ్ళలోనూ ఎర్ర జీరలే వున్నాయి. అందరివీ ఎర్ర జండాలే. అదంతా ఒక ఎర్ర సైన్యంలా వుంది.

అనుకున్న సమయానికి సంజ్ఞచేశారు ఆచార్యులు. ఆరంభమైంది అస్త్రవిద్యాప్రదర్శనం. ఎవళ్ళవిద్య వాళ్ళు చూపెడుతున్నారు రాజకుమాళ్ళు. తమ పేర్లు చెక్కిన బాణాలు గురిపెట్టి వేశారు కొందరు. కత్తీ, డాలూ కౌశలం చూపెట్టారు కొందరు. గుర్రాల మీద, రథాల మీద, ఏనుగులమీద తమతమ ప్రావీణ్యం చూపెడుతున్నారు కొందరు. ఈటెలతో కొందరూ, బల్లేలతో కొందరూ, శక్తులతో కొందరూ, చిల్లకోలలతో కొందరూ, గదలతో కొందరూ, తోమరాలతో కొందరూ — ఇలా పాండవులూ, కౌరవ కుమాళ్ళూ, దేశదేశాల రాజపుత్రులూ ఎవళ్ళు నేర్చిన విద్య వాళ్ళు ప్రదర్శిస్తున్నారు. అద్భుతంగా వుంది ప్రదర్శనం.

మెచ్చుకుంటున్నారు ప్రేక్షకులు. చప్పట్లు కొడుతున్నారు. కేకలు వేస్తున్నారు. కోలాహలంగా వుంది. జరుగుతున్న దంతా గాంధారీ ధృతరాష్ట్రులికి దగ్గిరవుండి చెప్తున్నాడు విదురుడు.

చప్పున చల్లబడ్డట్టయింది ప్రేక్షకలోకం. అందరి చూపులూ ఒకే దిక్కు తిరిగాయి.

అదిగో, భీముడూ దుర్యోధనుడూ గదాయుద్ధం ఉపక్రమించారు. ఇద్దరి చేతుల్లోనూ మాంచి భారీవైన గదలున్నాయి. ఇద్దరూ రెండు కొండల్లాగ వున్నారు. గద చేతిలో వుంటే ఇద్దరూ నువ్వా అంటే నువ్వా అనేవాళ్ళే. ఇద్దరూ వొకరంటే ఒకరికి పడనివాళ్ళే. వచ్చి రావడం తోటే, ఆడేపనుగుకోసం పోట్లాడే మదపుటేనుగుల్లాగ ఇద్దరూ కలబడ్డారు. కుడీ ఎడమా అనకుండా ఫిరాయిస్తున్నారు గదలు. జంకించీ, మండలాకారంగా తిరిగీ, కత్తెరదాటు వేసీ, గతిభేదాలు చూపెడుతూ ఎవళ్ళచేవ వాళ్ళు కనబరుస్తున్నారు. చిత్ర చిత్రములైన దెబ్బలు. ఖణేలు మంటున్నాయి గదలు. కళ్లు మూసుకుపోతున్నాయి విసుళ్ళు. అడుగులికి భూమి గడగడలాడుతోంది. హుంకారాలకి ఆకాశం బద్దలైనట్టుంది. గుండెల్లో దిగులు పుట్టిస్తున్నాయి చూపులు. ప్రాణాలు బిగబట్టుకు కూచున్నారు ప్రేక్షకులు.

ఇద్దరూ వొకలాగే వున్నారు. ఒకరూ వెనకాడలేదు. కోపం, పంతం, ఈర్ష్య – క్షణక్షణానికీ హెచ్చుతూ వుంది. అంత కంతకీ ఘోరంగా వుంది గదాయుద్ధం. ముందు ముందు జరగబోయే కురు పాండవ మహాయుద్ధానికి నాందీప్రస్తావనలాగా వుంది.

ప్రేక్షకులు కూడా రెండు పక్షాలైపోయారు. కొందరు భీముణ్ణి భళీ అంటున్నారు. కొందరు దుర్యోధనుణ్ణి. పంతాలు పెరిగిపోతున్నాయి. పందాలు హెచ్చిపోతున్నాయి. కావేషాలు రగులుకుంటున్నాయి. గోల గోల. పరిస్థితి విషమించి నట్టుంది. శ్రుతి మించి రాగాన పడుతున్నారు జనం. ఇహ అదుపులోకి తేవడం కష్టం. చప్పున అశ్వత్థామకి సైగ చేశాడు ఆచార్యులు. చంగున వెళ్ళాడు అశ్వత్థామ. మధ్యపడి భీముణ్ణీ దుర్యోధనుణ్ణీ విడదీశాడు. ఆగింది గదాయుద్ధం.

చెవులు చిల్లులు పడుతున్నట్లు మోగుతున్న వాయిద్యాలు నిమిషం నిలుపు చేయించాడు ఆచార్యులు. "సావధానంగా వుండండి. ఇంతవరకూ భీమ దుర్యోధనుల గదాయుద్ధం చూశారు మీరు. ఇపుడు నా ప్రియశిష్యుడు అర్జునుడు ధనుర్విద్య చూపుతాడు చూడండి" అన్నాడు.

గురువు ఇసారా ఇవ్వడంతోటే రంగం మధ్యకి వచ్చి నుంచున్నాడు అర్జునుడు. నల్లకలువల వంటి చక్కని శరీరం. దాని మీద నవరత్నాల బంగారం కవచం. చేతిలో తళతళ లాడుతూన్న ధనుస్సు. వీపున తూణీరం. హరివిల్లూ, మెరుపూ — వీటితో కలిసి వున్న నల్లమేఘంలా వున్నాడతడు. అందరి కళ్ళూ ఒక్కసారి అతడి మీదే మెరిశాయి.

"ఓహో, ఇతడండీ విలుకాడంటే" "ఇతడికి తెలీని విద్యంటూ లేదు" "భరత వంశం మణిపూస" "కుంతీదేవి కడుపుపంట." "పాండవ సింహం."

ఇలా ప్రేక్షకులంతా పొగుడుతున్నారు. వింటోంది కుంతి. కడుపు నిండి పోతున్నట్టుంది. రెప్ప వెయ్యకండా చూస్తోంది కొడుకుని. హృదయంలోని సంతోషం ప్రవాహమైనట్టుంది. నాలుగు కొమ్ములూ విరిగి పారినట్లయింది. చన్నులు చేపాయి. చనుబాలు ప్రవహించాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. ఆనంద బాష్పాలు ధారలు కట్టాయి.

ఆవేశంతో అర్జునుణ్ణి ఇంకా పొగుడుతున్నారు ప్రజలు. పట్టపగ్గాలు లేనట్టున్నాయి కేకలు. "ఏమిటీ కోలాహలం ?" అంటూ అడిగాడు ధృతరాష్ట్రుడు. "అర్జునకుమారుడు అస్త్రవిద్య చూపెట్టబోతున్నాడు. అతణ్ణి చూసి సంతోషంతో కేకలు వేస్తోంది జనం" అని చెప్పాడు విదురుడు. సంతోషించాడు ధృతరాష్ట్రుడు. "చెవులున్నందుకు తమ్ముడి కుమాళ్ళ విద్యాబుద్ధులు విన గలిగాను.

అంతే చాలు నాకు. నిజానికి అరణి * వంటిది కుంతి. ఆమె కడుపులో పుట్టిన ముగ్గురు కొడుకులూ మూడు అగ్నులు. వీళ్ళే మన వంశంలో పాపమన్నది లేకండా దహిస్తారని నా నమ్మకం" అన్నాడు.

అర్జునుణ్ణి చూసి "కానీ" అన్నాడు ఆచార్యులు. ధనస్సులో బాణాలు సంధించాడు అర్జునుడు. ఆగ్నేయాస్త్రం వేసి భయంకరమైన అగ్ని పుట్టించాడు. వారుణాస్త్రం వేసి వర్షం కురిపించాడు. మేఘాస్త్రం వేసి మేఘాలు కల్పించాడు. వాయవ్యాస్త్రం వేసి గాలి పుట్టించాడు. భౌమాస్త్రం వేసి భూమిలోకి వెళిపోయాడు. పర్వతాస్త్రం వేసి పర్వతరూపం ధరించాడు. అంతలో అంతర్ధానాస్త్రం వేసి కనబడకండా ఐపోయాడు.

క్షణంలో మరుగుజ్జులా కనిపించేవాడు. క్షణంలో తాటిచెట్టంత కనిపించేవాడు. క్షణంలో సూక్ష్మరూపం ధరించేవాడు. క్షణంలో కొండంత కనబడేవాడు. చిత్రం, అంతలోనే గుర్రం మీద వుండేవాడు. మరుక్షణంలో రథంమీద. మళ్ళీ చూస్తే నేల మీద.

పరిగెడుతూన్న పెద్దపులినీ, సింహాన్నీ, అడివి పందినీ చిత్రంగా వొకటేబాణం వేసినట్టు ఐదేసి బాణాలు వేసి కోళ్లు కుట్టేసేవాడు. దారంతో వేలాడదీసిన ఎద్దుకొమ్ముని వరసగా ఇరవైకొక్క బాణాలు నాటేట్టు కొట్టాడు. చిత్ర విచిత్రాలైన విలువిద్య చూపెట్టాడు. గదా, కత్తీ — వీట్లలో కూడా సెబాసనిపించాడు

ఇలా అర్జునుడు తన అస్త్రవిద్య ప్రదర్శిస్తూనే వున్నాడు. ద్వారం దగ్గిర పిడుగుల్లా చప్పుడైంది. వీరత్వంగా జబ్బలు చరుచుకుంటూ ఎవరో వస్తున్నారు. తుళ్ళిపడింది జనం. ఆచార్యుడి వెనక్కి వెళ్ళారు పాండవులు. దుర్యోధనుడి చుట్టూ చేరుకున్నారు కౌరవకుమారుళ్ళు. అందరూ ద్వారం దిక్కే చూస్తున్నారు.

జనాన్ని వొత్తిగించుకుంటూ లోపలికి వస్తున్నాడు కర్ణుడు. మాంచి పొడుగైన మనిషి. పదహారోవన్నె బంగారంలా వుంది శరీరం.

---

*అరణి అగ్ని పుట్టించడంకోసం రావి కర్రతో చేసింది.

దేహానికీ చెవులికీ సహజమైన కవచ కుండలాలు ధగధగా మెరుస్తున్నాయి. బాలసూర్యుడిలా ప్రకాశిస్తున్నాడు. చేతిలో ధనుస్సూ, నడుంని కత్తీ వున్నాయి. కొదమ సింహంలా నడిచి వచ్చి రంగస్థలం మధ్య రీవిగా నుంచున్నాడు. తలఎత్తి వోసారి నాలుగు దిక్కులా తేరిచూశాడు. ద్రోణాచార్యుడికీ, కృపాచార్యుడికీ నమస్కరించాడు. అర్జునుణ్ణి చురచురా చూశాడు. ఆ చూపులో ఆక్షేపణా, నిరసనా, ఈర్ష్యా అన్నీ కనిపిస్తున్నాయి.

"నువ్వే మహా మొనగాణ్ణనుకోకు. నీకు వచ్చిన ఈ మాత్రం విద్య మాకూ కొంచెం చేతనవును మరి" అన్నాడు గంభీరంగా. సభంతా నిశ్శబ్దం.

తెల్లపోయి చూస్తోంది జనం. చురుక్కుమంది అర్జునుడికి. ఎర్రపడ్డాయి కళ్ళు. చందనం పులుముకున్నట్టుంది దుర్యోధనుడికి. "ఐతే అదేదో కానీ మరి" అన్నాడు ద్రోణుడు. అర్జునుడు చూపెట్టిన అస్త్రవిద్య లన్నీ అనాయాసంగా చేసి చూపెట్టాడు కర్ణుడు. కళ్ళలో గర్వరేఖలు మెరుస్తున్నాయి.

నూరుమంది తమ్ములతోనూ ఉబ్బెత్తుగా లేచాడు దుర్యోధనుడు. వెళ్ళి గాట్టిగా కౌగిలించుకున్నాడు కర్ణుణ్ణి. "ఈ క్షణం నుండి ప్రాణస్నేహితులం మనం. నాకూ, నా వాళ్ళకీ ఆసరా నువ్వు. నే నొకటీ నువ్వొకటీ కాదు. నాతోపాటు నా రాజ్య భోగాలూ అనుభవిస్తావు నువ్వు" అన్నాడు. "మహాభాగ్యం" అంటూ సంతోషించాడు కర్ణుడు. ఈ రంగస్థలంలో ఇంతమంది ఎదటా అర్జునుడితో ద్వంద్వయుద్ధం చేయాలని వుంది" అన్నాడు.

ఆపుకోలేక పోయాడు అర్జునుడు. "పిలవని పేరంటంగా సభలోకి వచ్చావు. బలవంతంగా పులుముకుని మాట్లాడుతున్నావు. దీని ఫలమేదో ఇప్పుడే అనుభవిస్తావు. నీ విలవా, ఎదటివాడి విలవా తెలుసుకోలేక పోతున్నావు" అన్నాడు. "పిరికి వాళ్ళని దబాయించినట్టు దబాయించకు నన్ను" అన్నాడు కర్ణుడు. "ఆ

లవ ఏదో బాణాలతో చూపెట్టు. అస్త్రవిద్య తెలిసిన వాళ్ళంద కీ ఈ రంగస్థలంలో ప్రవేశ ముంటుంది. సర్వసాధారణమైన విషయ ంది. వీళ్ళు రావొచ్చు, వీళ్ళు రాకూడదూ అని అడ్డేమిటి ;” ంటూ డెకారించాడు. ఇదే సమయమని కన్నుకొట్టి ప్రోత్సా హించాడు దుర్యోధనుడు. దాంతో ద్వంద్వయుద్ధానికి కాలు దువ్వాడు కర్ణుడు.

దుర్యోధనుడూ, తన తమ్ముళ్లూ కర్ణుడి దిక్కు కాశారు. ష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, ధర్మరాజూ, అతడి తమ్ముళ్లూ ర్జునుడి పక్షం వహించారు. “ఆ సరదా ఏదో తీర్చుకునే వెళ్ళ మను అతణ్ణి” అన్నారు భీముడూ అతడి అన్నదమ్ములూను అర్జు ణ్ణి. ద్రోణుడూ “కానీ” అన్నాడు.

ఐతే కాసుకో అన్నాడు అర్జునుడు. మాట్లాడకండా మేఘాస్త్రం విడిచిపెట్టాడు కర్ణుడు. కిందా మీదా ముంచెత్తాయి కట్లు. చీకట్లలో కనపడలేదు అర్జునుడు. మెచ్చుకున్నాడో న్నట్టు కర్ణుడి మీద కిరణాలు కుమ్మరించాడు సూర్యుడు. కుమా ద్దరూ కలబడుతూంటే భయపడుతూనే వుంది కుంతి. అర్జునుడు నపడకపోయే సరికి కెవ్వున కేక వేసింది. మూర్ఛపోయింది. చన్నీళ్ళు ల్లాడు విదురుడు. చందనమూ అదీ రాసీ, ఉపచారాలుచేసీ మూర్ఛనుండి లేవదీశాడు.

ఉత్తరక్షణంలో వాయువ్యాస్త్రం వేశాడు అర్జునుడు. పటా ంచలైపోయాయి మేఘాలు. మబ్బులు విడిపోయిన సూర్య ంబంలా ప్రకాశించాడు అర్జునుడు. కర్ణుణ్ణీ, అర్జునుణ్ణీ, కళ్ళారా చూసింది కుంతి. “అమ్మయ్యా” అంటూ పెద్ద నిట్టూర్పు విడిచింది.

చప్పునవెళ్ళి కర్ణుడికీ అర్జునుడికీ మధ్య నుంచున్నాడు కృపా చార్యులు. ద్వంద్వయుద్ధం మర్యాదలు యావత్తూ తెలిసిన పండితు డాయన. “ఆగు” అన్నాడు కర్ణుణ్ణి. “అర్జునుడు రాజపుత్రుడు. పాండుమహారాజు కుమారుడు. కుంతీదేవి ముద్దుకొడుకు. కౌరవ

వంశంలో పుట్టినవాడు. ఇతడితో ద్వంద్వయుద్ధం చెయ్యాలంటే, నీ వంశ మేమిటో ముందు చెప్పాలి నువ్వు. నీ తండ్రి ఎవరో, నీ తల్లి ఎవరో చెప్పు. ఇతడితో సమానుడవైతేనే ద్వంద్వయుద్ధానికి అర్హత నీకు" అన్నాడు.

కులం మాట ఎత్తేసరికి మొహం వేలవేశాడు కర్ణుడు. మాట పెగల్లేదు. చప్పున అందుకున్నాడు దుర్యోధనుడు. "రాజవంశంలో పుట్టినవాడూ, ప్రతాపవంతుడూ, పెద్ద సైన్యం కలవాడూ ఈ — ముగ్గురూ రాజు అనిపించుకుంటారు. ఏం, అంతేనా? సరే, అర్జునుడు రాజపుత్రుడు. కర్ణుడు రాజు కాడు. అంచేత అతడితో ఇతడికి ద్వంద్వయుద్ధానికి అర్హత లేదు. ఇదే కదా మీ వాదన. అలాగే ఐతే, ఇదిగో, అంగరాజ్యానికి రాజుగా, అభిషేకిస్తున్నాను ఇతణ్ణి" అన్నాడు. భీష్ముణ్ణి, ధృతరాష్ట్రుణ్ణి ప్రార్థించాడు. వాళ్ళ అంగీకారం తీసుకున్నాడు. రాజు తలిస్తే దెబ్బలకేం కొదవ! నుంచున్నపాటుని అభిషేకానికి అవసరమైనవన్నీ సమకూర్చాడు. వెయ్యిమంది బ్రాహ్మలికి గోదానం చేశాడు. "అంగరాజ్యానికి ఈయన అర్హుడు" అంటూ బ్రాహ్మలంతా ఆశీర్వదించారు కర్ణుణ్ణి. బంగారం పీట మీద కూచోపెట్టారు ఇతణ్ణి. శాస్త్రోక్తంగా అంగరాజ్యానికి అభిషేకించారు.

రాజతిలకం పెట్టుకున్నాడు కర్ణుడు. మణికిరీటం ధరించాడు. భుజకీర్తులు ధరించుకున్నాడు. రత్నాల హారాలు వేసుకున్నాడు. ఇలా మహారాజువేషంతో వచ్చి దుర్యోధనుడి ముందు నుంచున్నాడు. "ఇంతమందిలోనూ, ఈ రాజాధిరాజులముందు రాజుని చేశావు నన్ను. ఇంత గౌరవం చేశావు. ఏమిచ్చి నీ ఋణం తీర్చుకునేది నేను?" అన్నాడు. "నీ స్నేహం" అన్నాడు దుర్యోధనుడు. "మనసిచ్చి నాతో స్నేహంగావుండు. అంతే కావాలి నాకు." అన్నాడు. "ధన్యుణ్ణి" అన్నాడు కర్ణుడు.

సభలోంచి ఇదంతా చూస్తున్నాడు సూతుడు. తన కళ్ళ ందు మహారాజైపోయాడు కొడుకు. సంతోషం పట్టలేకపోయాడు. ం దిగి కొడుకు దగ్గరికి వచ్చాడు. తలవంచి తండ్రికి నమస్కారం శాడు కర్ణుడు. గుచ్చి కౌగిలించుకున్నాడు సూతుడు. శిరస్సు ద్దాడాడు. అంగరాజ్యాభిషేకంతో తడిసివున్న తలమీద ఆనంద ష్పాలు వర్షించాడు.

కర్ణుడు సూతుడి కొడుకని తెలిసిపోయింది పాండవులికి. లాలు మని నవ్వాడు భీముడు "కులానికి తగినట్టు కొరడా చ్చుకు రథం నడుపుకో," "అన్నాడు. అర్జునుడితో యుద్ధమేమిటి ు! ఉత్తమ క్షత్రియులు అనుభవించ దగ్గది అంగరాజ్యం. సోమ గాజి తినవలసిన పురోడాశం కుక్క ముట్టుకోవచ్చా?" అన్నాడు.

తల కొట్టేసినట్టయింది కర్ణుడికి. జవాబు తోచలేదు. పెద్ద శ్వాస వొదిలాడు. ఆకాశం మీదికి సూర్యుడి దిక్కు చూస్తూ రుకున్నాడు. స్నేహితుడు చిన్నబుచ్చుకోవడంతో ఘరు న్నాడు దుర్యోధనుడు. "ఏమిటీ దురుసు మాటలు! కులమే లేక తే ఈ తేజస్సెలా వస్తుంది? పులి కడుపుని లేడి పుడుతుందా! పల పుట్టుకా, ఏరుల పుట్టుకా ఎరగడం కష్టం. దధీచి దుమ్ములో జాయుధం పుట్టింది. కుమారస్వామి పుట్టుక విషయం ఎవడికి చింది వాడు చెపుతాడు. గీటిలో పుట్టాడని వొకడంటే, అగ్గిలో ట్టాడని వొకడంటాడు. కృత్తికలికి పుట్టాడని వొకడంటే, ద్రుడికి పుట్టాడని ఒకడంటాడు. కాదు, రెల్లుగడ్డిలో పుట్టాడని రొకడంటాడు. మన కృపాచార్యులు రెల్లుగడ్డిలోనే పుట్టాడట! న గురువుగారిమాటేమిటి! కుండలో అట ఆయన పుట్టుక! ఎంత ంది రాజులు ఆ రుషికీ ఈ రుషికీ పుట్టినట్టు చెప్పుకుంటారు! తెంగుకు, మీ పుట్టుక మాత్రం వొక వారసా వాడీ వుండా ంటాను. అంచేత, కులమూ గొట్టూ తడవడ మెందుకంటాను. దివ్యలక్షణాలు చూడు. కనపడలేదూ కవచకుండలాలు! ఎంత

సహజంగా వున్నాయని!! అవే చెపుతున్నాయి ఆయన మహాపురుషుడని. ఒక్క అంగరాజ్యమే అన్నమాటేమిటి, తన బాహుబలం వల్ల ప్రపంచం యావత్తూ పాలించగల డీయన" అన్నాడు.

ఇంతలో పొద్దు గూకింది. అస్త్రప్రదర్శనం అంతమైంది. కలకలాలుగా చెప్పుకుంటూ రంగస్థలం విడిచిపెట్టారు ప్రజలు. స్త్రీ జనంతో కూడా రాజమందిరానికి వెళ్ళాడు ధృతరాష్ట్రుడు. వేలకొద్దీ దివిటీలతో, కర్ణుడి చెయ్యి పట్టుకుని తనమేడకి వెళ్ళాడు దుర్యోధనుడు. భీష్ముడూ, విదురుడూ, కృపుడూ - వీళ్ళందరితో కలిసి తమ మందిరానికి వెళ్ళారు పాండవులు.

పెద్దకొడుకు కర్ణుణ్ణి కళ్ళారా చూసింది కుంతి. పుత్రస్నేహం మాత్రం బయటపడకుండా నిగ్రహించుకుంది. కానైతే మనస్సేమో మనస్సులో లేదు.

కర్ణుడంతటి విలుకాడు దొరికాడు కౌరవులికి. అర్జునుడి వల్ల మరి భయమేమిటి? గుండెలమీద చెయ్యిపెట్టుకొని రాత్రి నిశ్చింతగా నిద్రపోయాడు దుర్యోధనుడు.

ద్రుపదుడి పరాభవం

మర్నాడు తెల్లవారింది. కాలకృత్యాలు తీర్చుకున్నాడు ద్రోణుడు. శిష్యులందరినీ పిలిచాడు. "గురుదక్షిణ ఇవ్వండి" అన్నాడు. చేతులు జోడించి నుంచున్నారు శిష్యులు. "మీ కోరిక ఏమిటో సెలవియ్యండి" అన్నారు. "ఐశ్వర్య గర్వంతో మంచీ చెడ్డా కానడం లేదు పాంచాలంరాజు ద్రుపదుడు. వెళ్ళండి. అతణ్ణి వోడించి పట్టుకురండి. ఇదే నేను కోరిన గురుదక్షిణ" అన్నాడు ఆచార్యుడు.

"చిత్తం" అంటూ సిద్ధపడ్డారు శిష్యులు. "ఇదెంతలో మాట" అన్నారు కౌరవులు. "నిమిషాలమీద పట్టుకు వస్తాం ద్రుపదుణ్ణి" అన్నారు. అవి కత్తులు కావు. అవి ధనుస్సులు కావు. ఎవళ్ళ దగ్గిర వున్న ఆయుధాలు వాళ్ళు పట్టుకున్నారు. [illegible]

సైన్యం వెంటవేసుకున్నారు. అడావుడిగా బయల్దేరారు, రథాలు పరిగెత్తించుకుంటూ, సింహనాదాలు చేసుకుంటూ వెళ్ళి పాంచాల రాజధాని ముట్టడించారు.

వాళ్ళ వెనక రథాల మీద ద్రోణాచార్యులూ, పాండవులూ బయల్దేరారు. "మేమంటే మేం" అంటూ ముందు పరిగెత్తారు కౌరవులు. "ద్రుపదుణ్ణి పట్టడం అంటే ఏదో ఆటలా వుంది వీళ్ళకి" అని నవ్వుకుంటూ నడిచాడు అర్జునుడు. పాండవులు పొలిమేర చేరే సరికి దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్ళూ, తక్కిన రాజకుమారుళ్ళూ పట్టణం ముట్టడించడం, ద్రుపదుడు తిరగబడడం జరిగిపోతున్నది తన చతురంగ బలాలన్నీ వేసుకు వచ్చి కౌరవుల్ని కకావికలు చేస్తున్నాడు ద్రుపదుడు. వానకారు వర్షధారలు పద్మవనంమీద పడ్డట్టు ద్రుపదుడి బాణాలు ముంచెత్తుతున్నాయి కౌరవుల్ని.

అకారణంగా తమమీద పడ్డందుకు పట్టణములోని ప్రజలంతా సలిరేగిపోయారు. కత్తీ, కర్రా, గొడ్డలీ, రోకలి—ఏది దొరికితే అది పట్టుకుని తిరగబడ్డారు. కౌరవు డన్నవాడు కనబడ్డ చోటల్లా చిదగ పొడిచారు. దుర్యోధనుడూ, తనవందమంది తమ్ముళ్లూ శాయశక్తులా పోరాడారు. ఇన్నూ మిన్నూ కనబడకండా ఎన్నో బాణాలు వేశారు. వా టన్నిటినీ తుక్కు-కింద కొట్టి పా రేశాడు ద్రుపదుడు. మాంచి మాంచి బాణాలు కొట్టి వాళ్ళ దేహాలు మంటలుచ్చుకున్నట్లు చేశాడు. బహువిధాల, బహుముఖాల, ఎక్కడ పడితే అక్కడ తానే అయి రకరకాల బాణాలు గుప్పించాడు.

దాంతో "ద్రుపదుడంటే బహురూపిరా బాబూ" అంటూ భయపడిపోయారు కౌరవులు ఇహ, పిక్క-బలం చూపడం తప్ప మరో గతి లేకపోయింది. కుమారస్వామి దెబ్బకి పారిపోయే రాక్షస యువకుల్లాగ పరుగుచ్చుకున్నారు వస్తూవున్న పాండవుల దగ్గిరికి.

చూసి చిరునవ్వు నవ్వాడు అర్జునుడు. విల్లూ, అమ్ములూ తీసుకున్నాడు. గురువుకీ, అన్నగారికీ నమస్కరించాడు. "మీరంతా

23

ఇక్కడే వుండండి'' అన్నాడు. తన సైన్యానికి సంజ్ఞ చేశాడు. సేన ముందు భీముణ్ణి నడవమన్నాడు. నకుల సహదేవుల్ని చక్రరక్షకులుగా * పెట్టుకున్నాడు. ఏనుగుమంద మీదికి పరిగెత్తే సింహం కొదమలాగ సముద్రంలాంటి పాంచాలసేన మీదికి పరిగెత్తాడు.

వెళ్ళడంతోటే ద్రుపదుడి ఏనుగుసేన మీద పడ్డాడు భీముడు. వజ్రాయుధంలాంటి తన గద ఎత్తి అదే మోదడం మొదలుపెట్టాడు. కుంభస్థలాలూ, దవడలూ, తొండాలూ, దంతాలూ, పక్కలూ, మక్కలూ, మొహాలూ - విరిగి పచ్చడి పచ్చడి ఐ పోతున్నాయి ఏనుగులు. జేగురు సెలవెళ్ళ నడగొండలు వజ్రాయుధంతో కూలిపడ్డట్టు రక్తాలు కార్చుకుంటూ మావటివాళ్ళతో సహా కిందపడుతున్నాయి మదగజాలు. పడినకొద్దీ అదే రెచ్చిపోతున్నాడు భీముడు. ఏనుగులే కాదు - రథాలూ, గుర్రాలూ గుండపిండి చేస్తున్నాడు. మావుట్యాలు వాళ్ళని చంపడ మెందుకన్నాడు. గొల్లవాడు మునకాలు కర్రతో ఆవులు తోలుకుపోయినట్టు, గదఎత్తి రొప్పుకుపోయాడు వాళ్లని.

భీముడి పక్కనే బాణాలతో తరుముకుంటూ వచ్చాడు అర్జునుడు. సూర్యుడిముందు చీకట్లలా పటాపంచలవుతున్నాయి ఏనుగులు; మంచుతెరలా మాయమవుతున్నాయి గుర్రాలు; చుక్కల మల్లే తెలతెల్లపోతున్నాయి పదాతిదళాలు. అది చూసి సహించలేకపోయాడు ద్రుపదుడి తమ్ముడు సత్యజిత్తు. అర్జునుడి మీదికి తన రథం పరిగెత్తించాడు. ఎంచి ఎంచి వంద బాణాలు వేశాడు. అవన్నీ సగంలోనే ముక్కలు చేశాడు అర్జునుడు. అతడి గుర్రాల్నీ సారథినీ కొట్టాడు. రథం తునకలు చేశాడు. దాంతో అదే పరుగుపెట్టి పారిపోయాడు సత్యజిత్తు.

అర్జునుడి బాణాలికి విడుపూ, విరామం లేకుండా వుంది. బాణంమీద బాణం వొదులుతూంటే ధనుస్సు చక్రంలా కనిపిస్తోంది. ఇంతలో యముడిలా వచ్చిపడ్డాడు ద్రుపదమహారాజు. ఇద్దరూ బల

---

* చక్రరక్షకుడు. యుద్ధంలో రథచక్రాలని రక్షిస్తూవుండే వీరుడు.

వంతులే. ఇద్దరూ విలువిద్యలో హేమాహేమీలే. మరింత విజృంభించాడు అర్జునుడు. ఇద్దరి ద్వంద్వయుద్ధం ఘోరంగావుంది. ఇద్దరి బాణాలతో భూమీ, ఆకాశమూ చిమ్మచీకటి కమ్మింది.

మాంచిదొక బాణం వేసి అర్జునుడి ధనుస్సు రెండు ముక్కలు చేశాడు ద్రుపదుడు. ఉత్తరక్షణంలో కత్తి తీసుకుని మెరుపులా వురికాడు అర్జునుడు. కొండమీదికి గెంతే సింహంపిల్లలాగ ద్రుపదుడి రథంమీదికి లంఘించాడు. రెప్పపాటులో ద్రుపదుణ్ణి పట్టుకున్నాడు. రథం ఇరుసుకి వేసి కట్టాడు.

హాహాకారాలు చేస్తోంది పాంచాలసైన్యం. తిన్నగా ద్రుపదుణ్ణి తెచ్చి ద్రోణుడి ఎదుట పెట్టాడు అర్జునుడు. "గురుదక్షిణ స్వీకరించండి" అంటూ నమస్కరించాడు. ద్రుపదుణ్ణి చూసి ముసిముసి నవ్వులు నవ్వాడు ద్రోణుడు. "ఓహో, ఎవరండోయి! ద్రుపదమహారాజులుంగారా ఏమిటి? ఇదేం, దిక్కు లేనట్టు ఇలా కట్టబడ్డారేం? ఇప్పుడైనా గీర్వాణం కసింత దిగుముఖం పట్టిందా? ఇకనైనా మేం కనిపిస్తున్నామా కళ్ళకి?" అంటూ ఎత్తిపొడిచాడు. అర్జునుడి కేసి చూసి "ఇహ చాలు, కట్లు విప్పు" అన్నాడు. సిగ్గుతో తలవంచుకున్నాడు ద్రుపదుడు.

ద్రుపదుడు ద్రోణుడి స్వాధీనం కావడంతోటే పాంచాల రాజ్యమూ ద్రోణుడి స్వాధీనమయింది. బాల్యస్నేహితుడు కావడం చేతా, తన ప్రభుత్వం అంగీకరించడంచేతా సగం రాజ్యం తిరిగి ఇచ్చివేశాడు ద్రోణుడు. అప్పటినుండీ దక్షిణపాంచాలం, ఉత్తర పాంచాలం అని విశాలపాంచాల దేశం రెండుభాగాలైంది. గంగానదికి దక్షిణభాగం, అవతలచర్మణ్వతీనది సరిహద్దుగా ద్రుపదుడూ, ఉత్తర భాగం ద్రోణుడూ పుచ్చుకున్నారు దక్షిణపాంచాలానికి కాంపిల్య నగరమూ, ఉత్తరభాగానికి అహిచ్ఛత్రమూ రాజధానులయాయి. *

---

* విపులమైన పాంచాలం వివరం కోసం చూ. కీ. శే. పరవస్తు లక్ష్మీనరసింహస్వామిగారి History of Panchala in the Vedic Period.

ద్రుపదుడి హృదయంలో ఈ పరాభవం ఆరని చిచ్చులా మండుతూ వుండేది. ద్రోణుణ్ణి హతమార్చే కుమారుడు కావాలి. అంత పరాక్రమశాలి అర్జునుడు - తనకి అల్లుడు కావాలి. ఈ రెండు కోర్కెలూ సాధించే వరకూ నిద్రపోనని నిశ్చయించుకున్నాడతడు.

యువరాజా ధర్మరాజు

కుమార్ళందరిలోకీ గుణవంతుడూ, పెద్దవాడున్నూ ధర్మరాజు. అంచేత, భీష్ముడితోనూ విదురుడితోనూ ఆలోచించాడు ధృతరాష్ట్రుడు. మంచిరోజు చూసి ధర్మరాజుని రాజ్యానికి యువరాజుగా అభిషేకించాడు.

పేరుకి యువరాజే ఐనా, ప్రాభవంచేత [illegible] చక్రవర్తిలా వున్నాడు ధర్మరాజు. నలుగురు తమ్ముళ్ళూ నాలుగు దిక్కులా వెళ్ళి గెలుస్తూ వచ్చారు. [illegible] రాజుల్ని స్వాధీనం చేసుకున్నారు. గెలుచుకున్న ధనం దేశ దేశాలనుండీ రాసులు రాసులుగా తెచ్చి అన్నగారి ముందు పోశారు. పాండవుల పేరు ప్రపంచమంతటా మార్మోగుతోంది.

"గదాయుద్ధంలోనూ, మల్లయుద్ధంలోనూ భీముణ్ణి మించిన వాడు లేడు." "ధనుర్విద్యలో అర్జునుడే అగ్రగణ్యుడు." "అన్నలికి తగిన తమ్ముళ్ళు నకుల సహదేవులు." — ప్రపంచమంతటా ఏమూల చూసినా ఇదే మాట.

అర్జునుడి గురుభక్తికీ, వీరత్వానికీ మెచ్చి ప్రయోగ ఉపసంహారాలతో బ్రహ్మశిరం అనే మహాస్త్రం ఉపదేశించాడు ద్రోణుడు. "ఇది అగస్త్యముని మా గురువు అగ్నివేశ్యులికిచ్చారు. ఆయన నాకు అనుగ్రహించారు. నా శిష్యులందరిలోకీ నువ్వే తగినవాడివి దీనికి. అందుకని నీకే ఉపదేశించానిది. సామాన్యుల మీద ప్రయోగించకు దీన్ని. తగనివాడిమీద వేస్తే జగత్తునే దహిస్తుంది. అలాంటి అవసరం వస్తేనే, ఎదటివాడు నిన్ను మించిన వాడైతేనే ఇది ప్రయోగించు.

"ఇదిగో, అన్నంతా చేశాను నేను. ఇహ నిన్ను మించిన విలుకాడు లేడు మరి. ఇపుడు ప్రత్యేకమైన గురుదక్షిణ అడుగుతున్నాను నిన్ను. ఏమంటావు?" అన్నాడు. "సెల విప్పండి" అంటూ చేతులు జోడించాడు అర్జునుడు "ఏ దన్నా యుద్ధంలో గ్రహచారంచాలక నీకూ నాకూ పడిందనుకో, అప్పుడు గురువు అని ఉపేక్షించకండా నాతో సమానంగా యుద్ధం చెయ్యాలి నువ్వు. ఇదే నీ నుండి నేను కోరిన ప్రత్యేక గురుదక్షిణ" అన్నాడు ఆచార్యులు. కాదనలేకపోయాడు అర్జునుడు. పాదాభివందనం చేసి కన్నీళ్ళతో గురుదేవుడి పాదాభిషేకం చేశాడు.

ధర్మరాజు యువరాజయాడు. పదిమంది నోళ్ళల్లోనూ పాండవుల గొప్ప వినిపిస్తోంది. కడుపులో తేళ్ళూ జెర్రులూ పాకుతున్నాయి దుర్యోధనుడికి. కర్ణుడూ, శకునీ, దుశ్శాసనుడూ-ఎప్పుడూ వీళ్ళతోటే ఏకాంతంగా ఏదో ఆలోచన. "ఆయుధాల్లోనూ వాళ్ళే ఆగితేరారు. దురుసువాళ్ళని అసలే భయం నాకు, ఇప్పుడు ధర్మరాజుని యువరాజు చేశారు బాబయ్య. ఏమిటి సాధనం? ఏమీ పాలుపోకండా వుంది నాకు. దీనికి విరుగుడు రాజనీతి ఏమన్నా వుంటే చెప్పండి మీరు" అన్నాడు వొకనాడు దుర్యోధనుడు. "నేనూ ఎప్పుడూ అదే అనుకుంటాను" అంటూ అందుకున్నాడు మేనమామ శకుని. నా ఆప్తమంత్రి కణికుడున్నాడు. నీతిశాస్త్రంలో శుక్రుణ్ణి మించిన వాడు. అతడి దగ్గిర రాజనీతి నేర్చుకోవడం ఎంతైనా అవసరం నీకు" అన్నాడు.

కణికనీతి

సావకాశంగా దుర్యోధనుడికి రాత్రింబగళ్ళు రాజనీతి నూరిపోశాడు శకుని ఆప్తమంత్రి కణికుడు.

"రాజన్నవాడు సరైన దండన అవలంబించాలి. ప్రజలు ధర్మం తప్పకండా చూడాలి. తన నడవడిలో మచ్చ కనబడనివ్వకూడదు. శత్రువుని ఎలా చూడాలో మిత్రుణ్ణీ అలాగే చూడాలి. దండం

దశగుణం భవేత్ అన్నారు. సంఘం ఉంటేనే రాజశాసనం సాగుతుంది, ప్రజలు వర్ణాశ్రమ ధర్మాలు పాలిస్తారు. దురాచారం చేసేవాడు గురువైనా సరే - బహిరంగంగా ఖండించాలి వాణ్ణి. ఏ కార్యం చేసినా, ముందు వృద్ధమంత్రులతో ఆలోచించాలి. విచారించి కార్యం చేస్తే విఘ్న యింటూ వుండదు.

"మృదుత్వం చేతనో, కఠినత్వం చేతనో ఎలాగైనా సరే, తన్ను తాను కాపాడుకోవడం ముఖ్యం రాజుకి. అపాయం లేకుండా వుంటేనే ఏదన్నాను. దానికి మించిన ధర్మం లేదు గురి. తన లోపాలు పై వాళ్ళకి తెలియనివ్వ కూడదు. పైవాళ్ళ లోపాలు మాత్రం వారికి పుగా గ్రహించాలి. దేశమూ, కాలమూ, పాత్రా తెలుసుకుని స్నేహితుల్ని సంపాదించాలి.

"శత్రువు అవుకుగా వున్నప్పుడే వాణ్ణి కడతేర్చాలి. కాలూని స్థిరపడ్డాక కొట్టడం కష్టం. శత్రువుల పనులూ తన పనులూ వేగుల వాళ్ళవల్ల వింటూ వుండాలి. పరదేశాల వార్తలు తెలుసుకు రావడానికి రకరకాల మనుష్యుల్ని పంపుతూ వుండాలి. ఉద్యానవనాలూ, తీర్థస్థలాలూ, దేవాలయాలూ, సభలూ, అడవులూ-వీట్లకి వెళ్ళేటపుడు జాగ్రత్తగా చాటిని ముందు పరిశోధించాలి. వీళ్ళని నమ్మవచ్చు, వీళ్ళని నమ్మరాదూ అని చెట్టుకో కూడదు. రాజన్న వాడు ఎవళ్ళనీ నమ్మకూడదు. అప్రమత్తుడుగా వుండాలి. మంత్రాలోచన రహస్యాలు పైకి పొక్కకుండా కాపాడుకోవాలి. రహస్యం గుప్పెట్లో వున్నప్పుడే కార్యసిద్ధి. రహస్యం బయటపడ్డ కార్యం బృహస్పతి లాంటివాడైనా సాధించ లేడు.

"మాటిమాటికీ ఒట్లు వేసుకోవడం, వొంగి వొంగి దండాలు పెట్టడం, చేతులు నులుపుకు మాట్లాడడం, ఇచ్చకాలాడడం, పొక్కులు చిక్కడం, నక్కవినయాలు వేయడం — ఇవన్నీ దుర్మార్గులైన నీచుల లక్షణాలు. అవకాశం దొరికే వరకూ అప్పుడులాగే వుంటారు, దుష్టులు. సందు దొరికిందో, పాములాగ విషపు కాటు వేస్తాడు.

"పిడుగు పడ్డప్పుడే పడిందని తెలుస్తుంది. గాలి వేసినప్పుడే వేసిందని తెలుస్తుంది. ముందుగా తెలీదు. అలాగే, కోపంగాని, దయగాని అది ఫలించినప్పుడే తెలియాలి. ముందు తెలీనివ్వ కూడదు. బంధువవనీ, పైవాళ్ళవనీ శత్రువు శత్రువే. సమయం చిక్కే వరకూ శత్రువుని గౌరవించినట్టే నటించాలి. సమయం చిక్కగానే రాతిమీద కుండ పగలగొట్టినట్టు కొట్టి చంపాలి.

"అపకారం చేసినవాడు అల్పుడైనా ఉపేక్షించ కూడదు. పాదంలో గుచ్చుకున్న ముల్లు చిన్నదైనా నడవనివ్వదు కదా! శత్రువు బాగుపడ పోనివ్వ కూడదు. రవంతే ఐనా అడివి అడివంతా కాలుస్తుంది అగ్గిరవ్వ. చెట్టు చివరి కొమ్మని నిద్రపోయిన వాడూ, శత్రువుని - బంధువుడైనా దగ్గర పెట్టుకున్న వాడూ మూర్ఖుడు. ఎంత దూరం తెలివితేటలున్నా మరో గతి వుండదు.

"సామ, దాన, భేద, దండోపాయాల చేత శత్రువుని సాధించాలి. నమ్మింప గొంతుకోయాలి. వంచించి వంచించి వధించాలి ఎలా అన్నా శత్రువు లేకండా చేసుకోవడమే శుక్రాచార్యుల మతం. బంధువులని పోనివ్వకూడదు. అపకారుల్ని అంతంచేసి ఆత్మరక్షణ చేసుకోవాలి. బుద్ధిబలంవల్ల ఎంతైనా సాధించవచ్చు.

నక్క కథ

"లోగడ ఒక అడివిలో ఒక నక్క వుండేది. పులీ, తోడేలూ, ముంగీ, ఎలకా - ఈ నాలుగూ దాని స్నేహితులు. ఆ అడివిలోనే తన పరివారంతో ఒక జింకా వుండేది. జింకని చూసినప్పుడల్లా నక్కకి నోరూరేది. మాంచి కొవ్వెక్కి ఇదిగా వున్న దాని మాంసం ఎలా అన్నా తినాలని ఆలోచించేది. కాని ఎలాగ? తుదకి ఒక మంచి ఉపాయం ఆలోచించింది. తన స్నేహితులతో సంప్రదించింది. ఎలక కేసి చూసి 'జింక నిద్రపోతున్నప్పుడు నువ్వు మెల్లగా వెళ్ళు. దాని కాళ్ళు కొరుకు. దాంతో అది పరిగెత్తలేదు. ఇహ నేముంది. మన పులిగారు వెళ్ళి దెబ్బతో

చంపుతారు. దాంతో, మనమంతా మాంచి విందు చేసుకుందాం' అంది. సంయ్యే అంటే సంయ్యే అన్నారు తక్కిన నేస్తులు

"ఎలక వెళ్ళి జింక కాళ్ళు కొరికింది. పులి వెళ్ళి దెబ్బతో చంపింది. నేస్తులందరూ నోళ్ళు చప్పరిస్తూ జింకచుట్టూ చేరారు. 'ఇదిగో,. మన మంతా స్నానం చేసి వచ్చి జింకమాంసం తినాలి. ముందు మీరు వెళ్ళిరండి అందాకా నేను కాసుకు కూచుం టాను' అంది నక్క. సరే, అని స్నానానికి వెళ్ళాయి. పులీ, తోడేలూ, ముంగీ, ఎలకాను.

"స్నానం చేసి ముందు వచ్చింది పులి. వచ్చేసరికి మొహం వేలవేసుకుని విచారంగా కూచుంది నక్క. 'ఏం నేస్తం, ఇంతలోనే విచారంగా వున్నా వేం?' అంటూ అడిగింది పులి. 'ఏం లేదూ, ఎలక మాట విని విచారిస్తున్నాను. ఏమందో విన్నావా ? 'ఈ పులి ఏదో గొప్ప దనుకున్నాం. నేను కొరికిన జంతువుకి ఆసపడు తోంది. ఎంత నీచం!' అంది. ఇంతఅవమానం నువ్వు సయించ వలిసి వచ్చింది కదా ! అని విచారంగా వుంది నాకు' అంది. దాంతో 'ఛీ, ఇలాంటి నీచపు కూడు నేను ముట్టను. నా భుజబలంతో వేటాడుకొనే తింటాను' అంటూ అలిగి చక్కా పోయింది పులి.

"తరవాత ఎలక వచ్చింది. 'ఇదిగో, ఇప్పుడే ముంగి వచ్చి వెళ్ళింది. జింకని వాసనచూసి, 'ఇది విషప్రాయంగా వుంది' అని అసహ్యించుకుంగి 'జింకమాంసం వద్దు నాకు. ఎలకని తింటాను నేను. అది చాలు నాకు. నువ్వు మాత్రం అడ్డుపెట్టకు' అంటూ చెప్పి 'మళ్ళీ ఇప్పుడే వస్తా నని చెప్పి వెళ్ళింది.' అంది నక్క. 'అమ్మోయ్' అంటూ తుర్రుమంది ఎలక. కన్నంలో అదేదూరడం దూరింది. తలన్నా ఎత్తలేదు మరి.

"ఎలక వెనక తోడేలు వచ్చింది. 'అన్నా, ఎంచేతో, నువ్వంటే కారాలూ మిరియాలు నూరుతోంది పులి. తన వున్న వాళ్ళని, .లేనివాళ్ళనీ వెంటవేసుకుని నీమీదికి ఇప్పుడే వస్తానని

వెళ్ళింది'' అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది నక్క. "బాబో, ఐతే ఈ మాంసమూ వద్దూ గీంసమూ వద్దూ నాకు'' అంటూ పరుగుచ్చుకుంది తోడేలు. మరి ఆతట్టు తొంగిచూస్తే వొట్టు.

చివార్న ముంగి వచ్చింది. "ఏయ్ ముంగీ, పులీ, తోడేలూ నాతో యుద్ధంచేసి వోడిపోయారు. ఇహ నువ్వో వున్నావు యుద్ధం చేస్తావా? ఐతే, బప్పురిసంగా, రా మరి'' అంటూ పళ్ళిగిలించింది నక్క. "ఓరి నాయకో, పులీ, తోడేలూ పీగిపోతే నేనా చాల్తాను ?'' అంటూ అదే దౌడు ముంగి. చూశావా, బుద్ధిబలం చేత అంతమందినీ వెళ్ళగొట్టింది నక్క అందరూ పోయాక నిశ్చింతగా, తాను ఒక్కర్తే కూచుని జింకమాంసం కడుపార తిని సుఖపడింది అలాగే నువ్వూ బుద్ధిబలం ప్రయోగించి శత్రువులు లేకండా చేసుకో'' అంటూ ఉపదేశించాడు

## తండ్రీ కొడుకులు

కణికుడి నీతి బాగా వొంట పట్టింది దుర్యోధనుడికి. ఒకనాడు ఏకాంతంగా తండ్రి దగ్గిరికి వెళ్ళి కూచున్నాడు. ఆ మాటా, ఈ మాటా అని అసలుసంగతి అందుకున్నాడు "పాండవు లంటే అసలే పక్కబెదురు నాకు. దానికి తోడు ధర్మరాజుని యువరాజు చేశారు మీారు. ఇంకేముంది, మంత్రులూ, సామంతులూ — ముఖ్యంగా ప్రజలూ పాండవులంటే పడి చస్తున్నారు. ధర్మరాజుని రాజుచెయ్యాలని కుట్ర పన్నుతున్నారు. మీారు అంధులట! అంచేత అర్హత లేదట! భీష్ముడు తాతయ్యా మొదలే వొద్దన్నారు. ధర్మరాజు కేవలం ధర్మరాజే నట! వయుస్సులో యువకుడైనా, బుద్ధిలో వృద్ధుడట! తమ్ముళ్లూ నరాంతక దేవాంతకులు మరి! అన్నగారి మాట జవదాటరట! ధర్మరాజు రాజైతే, రాజ్యం రామరాజ్యమవుతుం దట! చిన్నా, పెద్దా అందర్నీ చేరదీస్తా డట! భీష్ముణ్ణీ, మిమ్మల్నీ పువ్వుల్లో పెట్టి పూజిస్తా డట!

"ఎక్కడ చూసినా ఇవే గుసగుసలు. ఇద్దరు కలిసిన చోటల్లా ఇవే కుట్రలు. విదురుడూ దీనికి తాళం వేస్తున్నాడు. విన లేక పోతున్నాను నేను. చెవులు చిల్లులు పడిపోతున్నాయి. ఈ మూర్ఖుల నోటికి తాళం లేకండా వుంది. పాండవుల్ని వూళ్ళోంచి బైటికి పంపి తేనే గాని బతకలేం మరి" అన్నాడు.

"నీకు తెలియ దోయ్ బాబూ, ఏదీ యిలారా," అంటూ కుమారుణ్ణి దగ్గిరగా లాక్కున్నాడు ధృతరాష్ట్రుడు. "రాజన్న వాడు తన రాజ్యం తానే స్వయంగా చూసుకోవాలి. షడంగాల తోనూ వేదం చెప్పించుకున్నాను. బలంలో నా కొరత లేదు. ఐతే, ఏం లాభం? అంధుణ్ణయిపోయాను. శత్రు రాజ్యాలు వేసే ఎత్తుకి పై ఎత్తులు వెయ్యలేను కదా! రాజ్యార్హత ఎలా వుంటుంది నాకు! ఐనా, నన్నే రాజులా చూశాడు — చచ్చి ఏ స్వర్గాన వున్నాడో — తమ్ముడు పాండురాజు. ఎన్ని జన్మలెత్తినా అలాంటి తమ్ముడు దొరకడు నాకు. నే సంటే లోకం కనపడేది కాదు తనకి. పేరుకు నేను పెద్ద. అంతే. అన్ని కష్టాలూ తనే పడేవాడు. ఎంత పరాక్రమశాలి! దిగ్విజయం చేశాడు. ధనం రాసులు రాసులు మోసుకు వచ్చి నా కాళ్ళముందు పోశాడు. నాచేత ఎన్నో యజ్ఞాలూ అవీ చేయించాడు. అలాంటి తమ్ముడి కుమాళ్ళు పాండవులు. చెప్ప వలిసి వస్తే పాండురాజుకంటేనూ బుద్ధిమంతులు. అలాంటి వాళ్ళని, తండ్రి లేని వాళ్ళనీ, ఎలా పొమ్మనేది చెప్పూ!" అన్నాడు అతడి కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఐతే, మాగతి ఇంతే అన్నమాట," అంటూ మళ్ళీ సాగ దీశాడు దుర్యోధనుడు. తాత తండ్రులనుండి వచ్చిన రాజ్యం పాండు రాజు దయిందీ! పాండురాజు నుండి ఇప్పుడు తన కొడుకు ధర్మరాజు దయిందీ!! ఇకముందూ ధర్మరాజు కొడుక్కి సంక్రమిస్తుంది. ఇలా పాండవవంశస్థులే రాజులౌతారు. మేమూ, మా కుమాళ్ళూ వంశ పారంపర్యంగా మట్టిగొట్టుకు పోతాం.

"ఊఁ హూఁ, బాబయ్యగారూ, అలా జరగనివ్వకండి. పై వాళ్ళ అడుగులికి మడుగు లొత్తి మాత్రం బతకలేం మేము. తమ్ముడి మీద ప్రేమే చూసుగుంటున్నారు మీరు. అతడి కుమాళ్ళు అని జాలి పడుతున్నారు. మా వందమంది గతీ ఏంగానూ మరి!

"మరిచిపోవాలి మీరు అదంతా. ఈ రాజ్యం మొదటి నుండీ మీది. కాదన్నవా డెవడు? నిజమే, పాండురాజు బాబయ్య మంచివారే. కనకనే అతడి కుమాళ్ళ మీద అభిమానం చూపెడు తున్నారు ప్రజలు ధర్మరాజు రాజు కావా లంటున్నారు. ఈ కిటుకు నాకూ తెలుసు. అందుకనే మంత్రులుకీ వాళ్ళకీ బహుమానాలు అవీ ఇచ్చి మంచి చేసుగుంటున్నాను నేను.

"పాండవపక్షపాతుల కుతంత్రాలు సాగనివ్వకూడదు దీనికి వొకటే ఉపాయం వుంది పాండవుల్నీ, వాళ్ళ అమ్మని పరివారంతో సహా వారణావతం పంపివేద్దాం. మంత్రులూ వాళ్ళూ మొదట మనకి లొంగనట్టు కనబడ వచ్చు. భయం లేదు. క్రమంగా వాళ్ళే దారికి వస్తారు. రాజ్యం సంపూర్ణంగా మనగుప్పిటిలోకి వచ్చేక, కావలిస్తే వాళ్ళని తిరిగి తీసుకురావచ్చు" అన్నాడు.

"నాకు మాత్రం లే దంటావా?" అన్నాడు ధృతరాష్ట్రుడు. "నీ మనసులో వున్నదే ఎల్లప్పుడూ నా మనస్సులోనూ బాధిస్తు న్నది ఐతే, ఇది అన్యాయం. దారుణం. అంచేత, పైకి అనడానికి భయపడతాను పాండవుల్ని పంపెయ్యడం సాధ్యంకాని పని. ఎలా కుదురుతుం దిది! భీష్ముడు వూరుకుంటాడా? విదురుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కృపుడూ తిరగబడతారో ఏమో! వద్దు. ఈ ఆలో చన విడిచిపెట్టు" అన్నాడు.

"మీ మాట కాదనే పాటివా డెవడంటాను," అంటూ మళ్ళీ ప్రసతివేశాడు దుర్యోధనుడు. "మీ రన్న పెద్దలు పైకి ఎలా వున్నా, సమయం వస్తే వాళ్ళంతా నావాళ్ళే అని నమ్మండి. దీనికి కారణం కూడా చెపుతాను వినండి. అర్జును డంటే అశ్వత్థామకి

కిట్టదు. నాతోటే వుంటాడతడు. కొడుకుమీది ప్రేమచేత ఆచార్యులూ అటువెళ్ళడు. మేనల్లుణ్ణీ, బావగారినీ కృపాచార్యులు మాత్రం విడిచిపెడతాడా? ఇహ భీష్ముడు తాతయ్య. మేమన్నా వాళ్ళన్నా వొకటే ఆయనకి. కనక పరవా లేదు. ఇక విదురుడు మాత్రమున్నాడు. అతడు పాండవ పక్షపాతే ఐనా నాకు మాత్రం ద్రోహం చెయ్యడు. అంచేత ఆ భయమేమీ అక్కరలేదు మీకు. "నా ప్రార్థన ఈ మాత్రం మన్నించండి. వీళ్ళు వున్నంత వరకూ అన్నహారాలు రుచించవు నాకు. రాత్రి కంటిమీద రెప్ప పడకండానూ వుంది" అంటూ వెళ్ళబోశాడు. ఎలా ఐతే నేం, చివరికి ఊఁ" అనిపించాడు తండ్రిని.

అంతటితో వూరుకో లేదు దుర్యోధనుడు. తనంటే ఇష్టపడేకొందరు మంత్రుల్ని పిలిచాడు. పాండవులదగ్గిర వారణావతం అంటే మనసు పుట్టేట్టు కబుర్లు చెప్పండన్నాడు. అవకాశం దొరికినప్పుడల్లా అదేపని చేశారు వాళ్ళు. "వారణావతంలో మంచి మంచి పళ్ళ తోటలూ, పూలవనాలూ వున్నాయి. ఈత లాడడానికి గంగా నదీ, బంతులాటకి మైదానాలూ, వేటలికి అడవులూ మొంచి అనుకూలమైనవి వున్నాయి. తెల్లటి మేడలవల్ల చీకటిరాత్రుళ్ళూ వెన్నెల లాగే వుంటుందక్కడ. రత్నాల బజార్లూ, విశాలమైన వీధులూ— నిజంగా అలాకాపట్నమే అలకాపట్నమది వారణావతానికీ వరుణపట్నానికీ తేడావే లేదు" ఇలా పొగడడం లంకించుకున్నారు. ఈ విధంగా జరపవలసిన తతంగమంతా జరిపాడు దుర్యోధనుడు.

బంధువులు నలుగురితోనూ వొకనాడు కొలువు తీర్చాడు ధృతరాష్ట్రుడు. పాండవులూ వచ్చి కూర్చున్నారు పక్కని. అందరి ఎదటా తమ్ముణ్ణి తలుచుకుని కంట తడిపెట్టుకున్నాడు అంధరాజు. "తమ్ముడు పోయాక కుడిభుజమే పడిపోయింది నాకు" అన్నాడు. పాండవులకేసి చూసి. "నేనంటే ఎంత ఇది మీ నాన్నకి. అతనికంటే వెయ్యిరెట్లు భక్తి చూపుతున్నారు మీరు. అంచేతే

మిమ్మల్నీ మీ అమ్మనీ వారణావతం పంపాలని బుద్ధిపుట్టింది నాకు. ఇది మీ మంచికే అని నమ్మండి. గంగ వొడ్డునే వుంది వారణావతం. విశ్వేశ్వరుడున్న పుణ్యక్షేత్రం. భూలోకకైలాసం మీ నాన్న కోసం అక్కడ గోదానం, సువర్ణదానం — ఇలాంటి మహాదానాలూ అవీ చెయ్యండి. బ్రాహ్మణ సంతర్పణలు పెట్టండి. మీ పరివారం యావత్తూ వెంట తీసుకు వెళ్ళండి. కొన్నాళ్ళు సుఖంగా కాలక్షేపం చేసి రండి'' అన్నాడు. మంచి దంటూ ప్రయాణం కోసం సన్నాహ మయారు పాండవులు.

లక్క ఇల్లు

తన పాచిక పారుతోంది. సంతోషంగా వుంది దుర్యోధను డికి. ఇంకా చెయ్యవలిసిం దంతా ముందే వుంది. అప్పుడు కాని తాను వేసిన ప్రణాళిక పూర్తికాదు. తనకి నమ్మకమైనవాడూ, సమర్థుడైన శిల్పిన్నీ పురోచనుడు. అతణ్ణి రహస్యంగా పిలిచాడు. "ఇదిగో, పాండవుల్ని వారణావతం పంపిస్తున్నారు బాబయ్యగారు. మనకి మంచి అవకాశం దొరికింది. నువ్వు వెంటనే అంచీలమీద వాళ్ళకంటే ముందు వెళిపోవాలి వారణావతం. అక్కడ వాళ్ళకోసం వొక అపూర్వమైన భవంతి కట్టాలి. నీ నేర్పంతా చూపించాలి. నీ కంటే నమ్మకమైనవాడు లేడు నాకు. అందుకనే నిన్ను నియమిస్తు న్నాను ఈ పనికి ఇంకొకడికి చేత కాదు. నువ్వే చెయ్యాలిది.

"ఆయుధశాల పక్కని లక్కయిల్లు - రెండోవాడికి రహస్యం తెలీకండా — కట్టాలి. లక్క, మద్దిబంకా మట్టిలో చేర్చాలి. నెయ్యా, నూనే బాగా వేసి కలపాలి. దానితోనే భవనమంతా తయారు కావాలి విశాలంగా, అందంగా ఆకర్షిస్తూ వుండాలి. లోపలి లక్క అదీ కనపడకండా దట్టంగా సున్నంపూత వెయ్యాలి.

"పాండవుల్ని అందులో దించి, కొన్నాళ్ళయేక—వాళ్లు బాగా యాదమరచి వున్నప్పుడు—పిట్టమనిషికి తెలియకండా — సమయం కని పెట్టి - ఆ ఇంటికి అగ్గిపెట్టెయ్యాలి. లక్కఇంటిలో వాళ్ళు కాలి

వచ్చేక - చావుకబురు చల్లగా నాకు చేరవెయ్యాలి. తెలిసిందా? వెళ్ళు. నీకూ నాకూ తప్ప వారి బ్రహ్మదులికి తెలియ కూడదు. ఇది జయమయిందా - జయమవక ఏ మవుతుంది - కౌరవరాజ్య మంతా అడ్డు లేకండా ఏలుకున్నా మన్నమాటే నేను రాజు నైతే స్నేహితుడివి నువ్వుమాత్రం వూరికే పోతావా!" అన్నాడు వార ణావతం వెళ్ళి లక్క ఇల్లు ప్రారంభించాడు పురోచనుడు.

ప్రయాణానికి సర్వమూ సిద్ధం చేసుకున్నారు పాండవులు. గాంధారీ ధృతరాష్ట్రులికి పాదాభివందనం చేసి సెలవు తీసుకున్నారు. దుర్యోధనుడూ మొదలైన కుమారుళ్ళనందరినీ సంతోషంతో సంభా వించారు. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, కృపుడూ—ఈ మొద లైన పెద్దలికినమస్కరించారు. బ్రాహ్మలికి నమస్కారంచేసి ఆశీస్సులు పొందారు. ధనుర్బాణాలు చేత్తో పుచ్చుకున్నారు. తల్లి కుంతీదేవితో సహా రథాలెక్కి బయల్దేరారు.

పురజనులంతా కన్నీళ్ళతో సాగనంపుతున్నారు. శతశృంగం నించి వచ్చేసరికి ధర్మరాజుకి పదహారేళ్ళు భీముడికి పదిహేను, అర్జునుడికి పద్నాలుగు. నకుల సహదేవులికి పదమూడు. హస్తినా పురంలో వున్న కాలం పదమూడు సంవత్సరాలు. ఈ పదమూడేళ్ళ తరవాత తమ మధ్యనించి వెళ్ళిపోతూ వుంటే గోలుగోలు మన్నారు ప్రజలు యావన్మందిన్నీ.

రథాలు హస్తినాపురం దాటిపోతున్నాయి. పట్నంలో విచా రించనివాళ్ళు లేరు. "అయ్యో, ఏం వచ్చిం దని వీళ్ళని పంపేస్తు న్నాడు ధృతరాష్ట్రుడు. అన్యాయమని తెలిసిన్నీ వూరుకున్నారేం భీష్ముడూ వాళ్ళూను? తాత తండ్రుల నుండి సంక్రమించిన రాజ్యం. ధర్మరాజుని రాజు చేయకపోవడ మేమిటి? అధర్మం నిండిపోయింది హస్తినాపురంలో, ఇక్కడేముంది మనకి? పాండవులతోటే మన మూనూ. పదండి. వాళ్ళెక్కడ వుంటే అక్కడేవుందాం" అంటూ ఇళ్ళూ వాకిళ్ళూ వొదిలి పాండవుల వెంట వచ్చారు పురజనులు.

వారించాడు ధర్మరాజు. మంచిమాటలు చెప్పి శాంతపరిచాడు. "తండ్రిమాట వినకపోవడం ధర్మం కాదు మాకు. త్వరలోనే మళ్ళీ తిరిగి వచ్చేస్తాం" అంటూ నచ్చచెప్పాడు అందరినీ ఎవళ్ళ ఇళ్ళకి వాళ్ళని పంపివేశాడు

అందరితోపాటు విదురుడూ వెంట వెళ్ళాడు. మరింత దూరం సాగనంపి వచ్చాడు. ఎన్నో భాషలు తెలిసినవాడు ధర్మరాజు. ఇతర్లకి తెలియని భాషలో అతడితో ఏవేవో చెప్పాడు విదురుడు. కుమాళ్ళయిదుగురినీ కౌగిలించుకున్నాడు కుంతికి నమస్కారం చేశాడు. పాండురాజుని తలుచుకుని కంటతడిపెట్టుకుంటూ ఇంటికి వచ్చాడు.

విదురుడు వెళ్లేక వొంటరిగా ధర్మరాజు దగ్గిరికి వచ్చి అడిగింది కుంతి. "విదురుడూ, నువ్వూ ఏదో మాటాడారు కదా బాబూ! మేం విన్నా మా కేమీ బోధపడ లేదు. ఆయ నేదో చెప్పాడు. నువ్వేదో తలవూపావు. ఏమిటది?" అంటూ అడిగింది. "ఏమీ లేదమ్మా, జాగ్రత్తగా మసులుకో మంటాడు" అన్నాడు నవ్వుతూ ధర్మరాజు. "మీాకు తెలియనిదంటూ లేదు ఐనా, నాకు తెలిసింది చెప్పాలికదా! పనిలేందే వూరికే మంచివాడిలా పంపుతున్నాడు మిమ్మల్ని ధృతరాష్ట్రుడు వెనక నించి హాని చేస్తాడు. అంచేత వారణావతంలో వున్నన్ని దినాలూ విషమూ అగ్నీ—వీటివిషయంలో జాగ్రత్తగా వుండాలి. దుర్యోధనుడు పన్నే కుట్రలు తెలుసుకుని చెయ్యవలసిన ప్రతీకారం ఎప్పటి కప్పుడు చెప్పి పంపుతూ వుంటాను' అనీ చెప్పాడు" అన్నాడు. విదురుడి బుద్ధికీ తమమీాద అభిమానానికీ సంతోషించింది కుంతి. కొడుకులికి ఏ ఆపదా వుండకూడదని ఏ వెయ్యి దేవుళ్ళకో మొక్కింది.

మజిలీలు వేసుకుంటూ రాజలాంఛనాలతో వారణావతం వస్తున్నారు పాండవులు. ముందే ఈ వార్త గుప్పుమంది. పట్టణంలో చెప్పరాని సంతోషంగా వుంది. పట్టణమంతా అలంకరించారు. వీధులు మంచిగంధంతోనూ, కస్తూరితోనూ కళ్లాపులు చల్లారు.

వాకిళ్ళలో కర్పూరం ముగ్గులు పెట్టారు మేడలమీంచి కలవ పువ్వుల దండలు వేలాడదీశారు. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ వేసుకుని ఎదురు వెళ్ళారు.

మేడలూ, మిద్దెలూ ఎక్కి స్త్రీజనం ప్రతీక్షిస్తున్నారు బ్రాహ్మలు స్వస్తివచనాలు చదువుతున్నారు అనాడు ఫాల్గున మాసం; శుక్లపక్షం; అష్టమి, రోహిణీ నక్షత్రం. వారణావతంలో ప్రవేశించారు పాండవులు. అందంగా అలంకరించి వున్న రాజమందిరంలో విడిది పెట్టారు.

ఇంతలోకే తయారైంది పురోచనుడు కట్టిన నాలుగిళ్ళభవనం. మాంచి విశాలంగా వుంది. చూసిందికి కళ్ళవేడుకగానూ వుం తీసుకు వెళ్ళి చూపించాడు పురోచనుడు. మెచ్చుకున్నారు పాండవులు. మంచిరోజు చూసి గృహప్రవేశమూ చేశారు

ఆవులిస్తే పేగులు లెక్కపెడతాడు ధర్మరాజు. కృత్రిమంగా వున్న దాని అందచందాలు చూడ్డంతోటే గ్రహించాడు. భీముడి చెవిలో మెల్లగా వూదాడు. "మాయకొంప ఇది. ఈ గోడలు లక్కగోడలు. చూడు, నేయివాసనా, నూనెవాసనా వేస్తున్నాయి. అగ్గి తగిల్తే చాలు, భగ్గు మంటుంది. ఆయుధాగారం దగ్గిరసానూ వుంది. ఇది తెలిసినట్టే చెప్పాడు విదురుడు, విషమూ, అగ్గీ భద్రం అని. కనక ఈ కొంపని నమ్మకూడదు ఎప్పుడో ఒకప్పుడు ఆకస్మికంగా అగ్నిభయం తప్ప దిక్కడ" అన్నాడు.

"ఐతే ఇక్కడెందుకూ వుండడం?" అన్నాడు భీముడు. మరో చోటికి వెళ్ళిపోదాం. ఈ ఇంటి మీద వేసి పురోచనుణ్ణీ తగలబెడదాం" అన్నాడు. "అలా కాదు. నే చెప్పేది విను." అన్నాడు ధర్మరాజు. "దీని సంగతి తెలిసింది కదా? తెలియనట్టే నటిద్దాం. అసలు ఈ పురోచనుడు ఏం చేస్తాడో .ముందు కని పెడదాం. ఈ పాపాలకొంప మనం కనిపెట్టేశామని తెలిస్తే తొందరపడి అగ్గి పెట్టెయ్యవచ్చు పురోచనుడు. అది వాస్తవా

పురంలో తెలిస్తే భీష్ముడూ, విదురుడూ కోపం ఆపుకోలేరు. దాంతో కుటుంబ కలహం ముట్టుకోవచ్చు. లేదూ, భయపడి మనం మరో చోటికి వెళ్ళిపోయామే అనుకో, మన గుట్టుమట్టులు వెదికి మరేదన్నా అపాయం తేవచ్చు దుర్యోధనుడు. ఏ మంత్రాంగా, రాజ్యబలమూ, సహాయబలమూ, ధనబలమూ అన్నీ అతడి దగ్గిర వున్నాయి. మనకి ఇందులో ఇక్కడ ఏదీ లే దిపుడు. సమయం చూసి మనల్ని నాశనం చెయ్యడమే నీతిగా పెట్టుకున్నాడతడు. అందుకని ఏమీ తెలియనట్టు గమ్మున వుందాం'' అన్నాడు.

అలాగే నటించారు పాండవులు. పగలంతా వేటలతోనూ వాటితోనూ గడిపేవాళ్ళు. రాత్రిళ్ళు ఆయుధాలు పట్టుకుని అప్రమత్తులుగా వుండేవాళ్ళు. లక్క ఇల్లు కనిపెట్టినట్టు పురోచనుడికి ఏ మాత్రమూ తెలియకండా వంచిస్తూ వచ్చారు.

అక్కడ దుర్యోధనుడి దురాలోచన యావత్తూ జాగ్రత్తగా కనిపెట్టాడు విదురుడు. తనకి నమ్మకమైనవాణ్ణి — బాగా తవ్వడమూ అదీ తెలిసినవాణ్ణి — మంచి చాకచక్యమైనవాణ్ణి వొకణ్ణి జాగ్రత్త చేశాడు. చెప్పవలసిన వన్నీ చెప్పి వారణావతం పంపాడు. వాడు వచ్చి రహస్యంగా పాండవుల్ని కలుసుకున్నాడు. విదురుడు చెప్పిన సాంకేతికాలు చెప్పి, తాను ఫలానా అని నమ్మకం కలిగించాడు. "ఈ కృష్ణచతుర్దశి నాటి రాత్రి పురోచనుడు లక్క ఇల్లు ముట్టిస్తాడు. మీరు తప్పించుకు పోవడానికి రహస్యమార్గం తవ్వమని నన్ను పంపాడు విదురమహారాజు'' అని చెప్పాడు. లక్క ఇంటి నుండి బైటికి పోవడానికి సొరంగం తవ్వి చూపించాడు బాగా పరిశోధించి, ఆ సొరంగం చక్కగా తెలుసుకున్నాడు భీముడు.

దానాలూ, ధర్మాలూ అవీ చేస్తూ ఆరుమాసాలు వారణావతంలో వున్నారు పాండవులు. ఈలోగా పాండవుల గుట్టుమట్టులు తెలుసుకోవడం కోసం వొక బోయస్త్రీని ఏర్పాటుచేశాడు పురోచనుడు. ఆమె ఎప్పటి కప్పుడు పాండవుల కబుర్లు పురోచనుడికి

రవేస్తూ వుండేది. ఆదీ, దాని ఐదుగురు కొడుకులూ అడివిలోంచి ంపలూ అవీ తెచ్చి ఇస్తూ, కుంతీదేవి సేవచేస్తూ కనిపెట్టుకు వుండే ారు. అవాళ కృష్ణచతుర్దశి. మృత్యువు వాళ్ళ నెత్తిని తాండవ మాడుతోంది. తల్లీ, కొడుకులూ మితిమీరిన కల్లు తాగారు. లక్క ంటి పంచని వొళ్లుమరిచి నిద్రపోయారు.

అర్ధరాత్రి. గాఢాంధకారం. సిద్ధంగానే వున్నారు పాండ లు. పురోచనుడు తన గదిలోనే వున్నాడు. అతడి కంటే బందే జల్లుకున్నాడు భీముడు. ముందు పురోచనుడి కొంపకే ప్పంటించాడు. తక్షణం ఆయుధాగారమూ, లక్క ఇల్లూ ముట్టించాడు. ద్ద మంట లేచి నిమిషాలమీద మండి పూరుకుంది లక్క ఇల్లు. యుధశాలా, పురోచనుడి కొంపా భస్మమైపోయాయి.

తెల్లవారింది. తీర్థప్రజలా విరగబడ్డారు జనం. పాండవులేరీ ? ాలిన బూడిద కుప్పలు కెలికి చూశారు. ఘోరం. ఒక స్త్రీ, ఐదు రు పురుషులూ కాలి బొగ్గయి వున్నారు. "అయ్యో, పాండవులూ, ంతీ చచ్చిపోయారు" అంటూ హాహాకారాలు చేశారు. కంట తడి పెట్టనివారు లేరు. "ఎంతపని జరిగిపోయింది! అంత బలవంతులూ పాపం, అగ్గిలో కాలిపోయారు. దురాత్ముడు దుర్యోధనుడే ఇంత ఘోరానికి నెట్టుకున్నాడు" అంటూ దుఃఖించారు.

ఈ దారుణవార్త అంచెలమీద హస్తినాపురం వచ్చింది. ఆ సమయానికి దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీ మొదలైన వాళ్ళతో కొలువులో వున్నాడు ధృతరాష్ట్రుడు. పాండవుల మరణవార్త విని బావురు మని ఆ వరిచినట్టు ఏడ్చాడు. గాంధారీ మొదలైన రాణుల ఏడ్పులతో అంతఃపురం గోలు గోలు మంది. భీష్ముడూ మొదలైన కురువృద్ధులూ మంత్రులూ, సామంతులూ, పురోహితులూ ఏడవనివాళ్ళంటూ లేరు. హస్తినాపురంలో అవాళ ఏడుపులేని కొంపలేదు. కుమాళ్ళతో కలిసి కుంతీకీ, పాండవులకీ తిలోదకాలు ఇచ్చాడు ధృతరాష్ట్రుడు.

అగ్నిసంస్కారం మొదలైన ఉత్తరక్రియలకోసం ఏర్పాటుచేశాడు. ఎంతో ధనమూ అదీ ఇచ్చి గంగాతీరానికి బ్రాహ్మల్ని పంపాడు.

పాండవుల చావుకబురు చల్లగా విన్నాడు దుర్యోధనుడు. "సుంకు వొదిలిందిరా దేవుడా అని సంతోషించాడు. నమ్మిన మిత్రుడు పురోచనుడు గతించినందుకు మాత్రం దుఃఖపడ్డాడు.

లక్క ఇల్లు ముట్టించేముందు తల్లినీ అన్నదమ్ముల్నీ భద్రంగా సొరంగంలో చేర్చాడు భీముడు. తమ కుశలవార్త సొరంగం తవ్వే వాడితో చెప్పాడు. మర్నాడు బూడిద తొలిగించే మిషమీద సొరంగంద్వారం కప్పివచ్చాడు తవ్వినవాడు. హస్తినాపురం వచ్చి జరిగిందంతా విదురుడికి చెప్పాడు "పాండవులూ, కుంతీదేవీ క్షేమంగా తప్పుకు వెళ్ళారు. బోయదీ, దాని ఐదుగురు కొడుకులూ కాలి చచ్చారు. వాళ్ళనే పాండవులని అనుకుంటున్నారు ప్రజలు" అంటూ చెప్పాడు. సంతోషించాడు విదురుడు. పైకిమాత్రం అందరితో పాటు విచారం నటించాడు.

## ప లా య న ం

నిప్పంటించి చప్పున తల్లినీ, అన్నదమ్ముల్నీ కలుసుకున్నాడు భీముడు. సొరంగంనుండి అందరూ బైటపడ్డారు. కానైతే అక్కడ నిలవకూడదు. పారిపోవాలి. వేగం నడవాలి. చీకటి. నిద్ర మత్తు. నడవలేకపోతున్నారు కుంతీ, ధర్మరాజూ వాళ్ళూనూ. చూశాడు భీముడు. తల్లిని మూపుమీద వేసుకున్నాడు. ధర్మరాజునీ, అర్జునుణ్ణీ భుజాలమీద ఎక్కించుకున్నాడు. నకుల సహదేవుల్ని వొళ్లో పట్టుకున్నాడు. పరుగు వేగంతో నడుచుకు పోతున్నాడు. రాళ్ళని లక్ష్యం లేదు. ముళ్ళని చూడడం లేదు. కటికచీకటిలో, దారి లేని దారిలో పట్టపగలు నడిచినట్టు తోసుకుపోతున్నాడు. అతడికి

పాండవులు లక్క ఇంట్లో కాలిపోయారని విని శ్రీకృష్ణుడు ద్వారకనుంచి వారణావతం వెళ్ళాడని హరివంశం, విష్ణుపురాణం చెపుతున్నాయి.

విరిగిన చెట్టు కింద పడుతోంది. పాదంకిందపడ్డ రాయి గుండపిండవుతోంది. అడ్డంటూ లేనట్టుంది అతడికి.!

గంగానది దాటి అలా దక్షిణాభిముఖంగా వెళ్ళారు పాండవులు. చుక్కలు చూసి దిక్కులు నిశ్చయించుకుంటూ నడిచారు. రాత్రి గడిచింది. పగలు పగలంతా నడుస్తూనే వున్నారు. వెళ్ళి వెళ్ళి గాలీ, ఎండ వెలుగూ దూరనంత దట్టమైన కీకారణ్యంలో ప్రవేశించారు. ఆకలి, దాహం. నడవలేని తల్లిని, అన్నదమ్ముల్ని మళ్ళీ మోసుకు నడిచాడు భీముడు.

సాయంకాలం కావస్తోంది. ఒక మర్రిచెట్టుకింద చల్లని నీడని అందరినీ దించాడు భీముడు. చెట్టుమీదికి వెళ్ళి నీళ్ళకోసం నలు దిక్కులా చూశాడు. దగ్గరనే ఒక చెరువుంది. పద్మాల పరిమళంతో చల్లగాలి వీస్తోంది. తుమ్మెదలూ, చక్రవాకాలూ, హంసలూ రొదచేస్తున్నాయి. రమ్మని పిలుస్తున్నట్టున్నాయి. చెట్టు దిగి వెళ్ళాడు భీముడు. చెరువులో దిగి హాయిగా స్నానం చేశాడు. కడుపునిండా నీళ్ళు తాగాడు. తామరాకులు దొప్పకట్టి మంచినీళ్ళు పట్టుకువచ్చాడు.

ఎడతెగని ప్రయాణంతో అలిసిపోయిన సూర్యుడు, దిక్కులికి చాచుకున్న కిరణాలచేతులు ముడుచుకుంటూ, పడమటిపర్వతం గుహాల్లోకి పడకకి పోతున్నాడు. పొద్దు గూకడంతోనే తమ తమ గూళ్ళకి పోతున్నాయి పిట్టలు. పచ్చగడ్డి మేతకని కొండగుహాల్లోంచి పైకి వస్తున్నాయి ఏనుగుమందలు.

నీళ్ళతో భీముడు వచ్చేసరికి మర్రిచెట్టుకింద తల్లీ, అన్నదమ్ములూ ఒళ్ళుమరచి నిద్రపోతున్నారు. ఉత్తరీయాలు కింద పరుచుకున్నారు. చేతులే తలగడలుగా పెట్టుకున్నారు. చూసి కడుపు దేవుకు వచ్చినట్టయింది భీముడికి. "అయ్యో," అంటూ నిట్టూర్పు విడిచాడు. "మూడులోకాలికీ ప్రభువు కాదగ్గవాడు అన్నయ్య. ఒక బిక్షారిలాగ ఈ కటిక నేలని నిద్రపోతున్నాడు!

కుంతిభోజమహారాజు కూతురు. వసుదేవుడి చెల్లెలు. విచిత్ర వీర్యుల కోడలు. పాండురాజు పట్టమహాదేవి. మహామహులు ఐదు గురు కొడుకులున్న తల్లి. హంసతూలికా తల్పంమీద శయనించినా నిద్రపోని సుకుమారి. పాపం, అలిసిపోయి ఆకలితో పాడునేలని పడుకుంది అమ్మ. రాళ్ళు పొత్తుతున్నాయన్నైనా కాదు. తల్లిని మించి కుమాళ్ళు. అడివి మృగాలమాటగా మరిచిపోయారు.'' అంటూ దుఃఖపడ్డాడు.

వాళ్ళకి నిద్రాభంగం కాకూడ దనుకున్నాడు. "తెలివి ఎచ్చేకే నీళ్ళు తాగుతారు'' అని నిశ్చయించాడు. పక్కని నీళ్ళదొప్ప భద్రపరిచాడు. కళ్ళనీళ్ళు తుడుచుకున్నాడు. మనస్సు మనస్సులో లేదు. "దుర్మార్గుడు ధృతరాష్ట్రుడు. కొడుకులతో కుట్రచేశాడు. మమ్మల్ని ఇల్లువెళ్ళగొట్టాడు. లక్కకొంపలో పెట్టాడు. ఘోరా నికే నెట్టుకున్నాడు. బాధపెట్టే బంధువులతో వున్నవాడికంటే, వూళ్ళో చెట్టులాగ వొంటరిగా వున్నవాడే అదృష్టవంతుడు. పరోప కారం, కలుపుగోలుతనం అడవిలో చెట్లకుంది ఇంకా. అంతమంచి వాళ్ళయితే మనుషులూ ఇలా హాయిగా వుండవచ్చు.'' ఇలా ఎన్నో భావాలు కలతపెడుతున్నాయి.

అంతకంతకీ చీకట్లు దట్టంగా కమ్ముకుంటున్నాయి. దిక్కులు చూస్తూ నుంచున్నాడు భీముడు. కొద్దిదూరంలోనే ఏదో మను ష్యుల కలకలంలా వినపడింది. "దగ్గిరే ఏదో వూరు వున్నట్టుంది. వీళ్ళు లేచేవరకూ జాగ్రత్తగా వుండాలి'' అనుకుంటూ కాపలా కాసుకు కూచున్నా డతడు

## హి డి ం బ

సమీపంలోనే పెద్ద మద్దిచెట్ల జీబు. దాంట్లోంచి లేచాడు హిడింబాసురుడు. పాండవుల్ని చూసి పెదవులు చప్పరించాడు. శరీరం పెంచాడు. తుప్పలాంటి జుత్తు దులుపుకున్నాడు. ఒళ్ళు విరుచుకున్నాడు. ఆవలించాడు. "చచ్చు అడవిమృగాల మాంసం.

తినితిని జిహ్వ రుచి చచ్చింది. విసుగెత్తిపోతోంది. ఏ మదృష్టం! ఇవాళ! మనిషిమాంసం వంటపడుతుంది" అంటూ తన చెల్లెలు హిడింబని పిలిచాడు. "వంటింట్లో కుందేలు చొరబడింది. చూడవేం!" అన్నాడు. "ఎప్పుడన్నా మన తోటకి మనుష్యులు రావడమంటూ వుందా? వచ్చినా, ఇలా ఝుడుపూ గిడుపూ మాని పడుకుంటారా? చూడు, మర్రికింద. ఊఁ, వెళ్ళు. వాళ్ళపని నులిమి పట్టుకురా. మనిషి మాంసం. పెద్ద పెద్ద ముక్కలుకోసి, మాంచికూరవండి పెట్టు" అన్నాడు

గబగబా వచ్చింది హిడింబ. కాపలా కాస్తున్నాడు భీముడు. జంకింది. ఒక చెట్టు మరుగుని నుంచుంది. చూస్తోంది భీముణ్ణి. మన్మథుడులాంటి మగవాడు. తామరరేకుల్లాగ చేరెడేసి నేత్రాలు. వెడల్పాటి బలిసిన వక్షస్థలం. మాంచి కమ్ముచ్చులు తీసినట్టున్న వజ్రాయుధంలాంటి దండలు. చూస్తూంటే మతిపోయింది హిడింబకి. అతడిమీద మనసుపోయింది.

అసలే కామరూపి హిడింబ. వెంటనే మనుష్యరూపం ధరించింది. చక్కని మక్కలా తయారైంది. రత్నాలంకారాలతో ముస్తాబైంది. ప్రతీ అంగమూ యవ్వనంతో పికపిక లాడుతోంది. అప్పుడే పుష్పించి కదులుతూన్న పుష్పలతలా వుంది హంసనడకలతో మెల్లగా భీముడి దగ్గిరికి వచ్చింది.

అన్న పెత్తాయించిం దొకటి. చెల్లెలు చేస్తున్న దొకటి. నిజమే. ఆడదానికి వలిచిన మగవాడిమీద వున్న మక్కువ మరి ఎవళ్ళమీదా వుండదు.

చూశాడు భీముడు. "ఎవరివది" అంటూ గద్దించాడు. "ఇంత రాత్రప్పుడు ఇలా వచ్చేవేం? ఎక్కడికెళతావు? ఇటుమాత్రం అడుగు పెట్టకు. అటుపో" అంటూ తూలనాడాడు. "నేనేనా!" అంది మృదువుగా హిడింబ. "నేను—హిడింబుడి చెల్లెల్ని. ఇక్కడే మాయిల్లు. నిన్ను చూచి ప్రేమించాను. నాకు మగడివైతే నిన్నేమీ చెయ్యాడు మా అన్న. నిజం. చెప్తున్నా - ఈ - ఈ జన్మకి నువ్వే మగడివి నాకు.

"దేవేంద్రుడు లక్ష్యంలేదు మా అన్నకి. అతడికి భయపడని వాడంటూ లేడు అంత బలశాలి. పాపం, వీళ్ళకి తెలియలేదు. తెలిస్తే, ఇలా వచ్చి స్వంతఇంట్లోలాగ ఆదమరచి నిద్రపోతారా? చాలా ప్రమాదమైనపని చేశారు. ఇది హిడింబవనం. ఇక్కడికి వచ్చి బయటపడ్డవాళ్ళూ, యముడి గుప్పెట్లోంచి తప్పించుకున్న వాళ్ళూ ఇంతవరకూ కనపడలేదు. ఇంతలోనే వచ్చేస్తాడు మా అన్న. వీళ్ళతో పనేముంది నీకు! రా, నన్ను పెళ్ళాంగా చేసుకో. నీ ప్రాణాలు నువ్వు రక్షించుకో. కళ్ళలో పెట్టుకు సుఖపెడతాను నిన్ను. అందులోనూ కామచారిణ్ని నేను నువ్వు ఎక్కడికంటే అక్కడికి తీసుకు వెళతాను. లే" అంది.

"మతి లేనట్టుంది నీకు!" అన్నాడు భీముడు. "ఎంత నీచుడైనా మానసం చంపుకుని, తల్లినీ తోబుట్టువుల్నీ వొదిలి, క్షణికమైన సుఖంకోసం ఆడదానివెంట పడతాడా?" అన్నాడు. "పోనీ, వీళ్ళని వొదులుకోవడం ఇష్టంలేకపోతే, లెమ్మను. మా అన్న రాకముందే అందరినీ ఎత్తుకు వెడతాను. చూస్తావేం?" అంది హిడింబ.

"అన్న అన్న అంటూ అదే అడలగొడుతున్నావు" అంటూ హుంకరించాడు భీముడు. "అన్న వచ్చేదీ వాడి అయ్య వచ్చేదీ నిద్ర పోతున్న వాళ్ళని లేపను నేను. నా సంగతేమిటో తెలీదు నీకు. ఒక్క హిడింబుడు కాదు, వెయ్యిమంది రానీ, - ప్రపంచంలోని దేవతలూ, రాక్షసులూ యావన్మందీ వచ్చినా నీ కళ్ళయెదటే వాళ్ళ పనిపట్టిస్తాను. అంతేకాని పాపం, వొళ్ళుమరిచి వున్న వీళ్ళకి నిద్రాభంగం కానివ్వను" అన్నాడు.

"ఇంతసేపయింది. మనుషులూ లేరు, మనిషి మాంసమూ లేదు. ఏం చేస్తోంది హిడింబ?" అని మండిపడుతూ లేచాడు హిడింబుడు. కాలమేఘంలాగ నల్లటి పెద్ద కళేబరం. మెరుపుల్లాగ ఎనిమిది కోరపళ్ళు. గాలికి రెపరెప లాడుతూ ఈతతుప్పలాంటి బిరుసుజుత్తు. కోపంతో పళ్ళు పటపట కొరుకుతున్నాడు. గుండ్రటి

చింతనిప్పుల్లాంటి గుడ్లు కిందామీదా తిప్పుతున్నాడు. కాలయముడిలా వచ్చి చురచురా చూశాడు చెల్లెల్ని. "నేను చెప్పిం దేమిటి ? నువ్వు చేస్తూన్న దేమిటి ? అంటూ వురిమాడు. గజగజ లాడుతూ భీముడి వెనక్కి వెళ్ళింది హిడింబ.

## హిడింబుడి వధ

"భయపడకు" అంటూ వుబ్బెత్తుగా లేచాడు భీముడు. "మీా అన్ననీ నన్నూ చూస్తూ వుండు" అంటూ హిడింబుడి మీాదికి వెళ్ళాడు. "తొందరపడకు. నిన్ను చంపుతాను. ఈ వనం భయంలేకండా చేస్తాను" అన్నాడు. "అంతపాటి వాడివా ? ఏదీ చూస్తాగా "అని జబ్బ చరుచుకుంటూ కొట్టవచ్చాడు హిడింబుడు.

పోట్లాటవల్ల పడుకున్న వాళ్ల నిద్ర భంగం కాకూడదు. జబ్బతోకూడ హిడింబుణ్ణి అడిచి పట్టుకున్నాడు భీముడు. చిన్న జంతువుని సింహం ఈడ్చుకుపోయినట్టు ఎనిమిది బారల దూరం గొర గొరా ఈడ్చుకు పోయాడు. అక్కడ ఇద్దరూ మల్లయుద్ధం ఆరంభించారు. ఇద్దరూ అరవయ్యేళ్ళపడిలో వున్న మాంచి మదపు ఏనుగుల్లాగ పోట్లాడుతున్నారు. వాళ్ల కాళ్లకింద చెట్లూ చేమలూ విరిగి నలిగిపోతున్నాయి. పాదాలకింద రేగిన ధూళి వొంటిమీాద పడి ఇద్దరూ మంచుకప్పిన కొండల్లా కనపడ్డారు. రెండు చేతుల తోనూ భీముణ్ణి బిగించి పెడబొబ్బలు పెట్టాడు హిడింబుడు. అడివి అడివంతా జజ్జరిల్లిపోయింది. తుళ్ళిపడి లేచారు ధర్మరాజూ వాళ్ళూనూ. పక్కని దివ్యసుందరమూర్తి నుంచుని వుంది. ఎవరిది ? వనదేవతా ? దేవకన్యా ! తెల్లబోయారు చూసి. నెమ్మదిగా అడిగింది కుంతి "ఎవరమ్మా, నువ్వు" ఇలా వచ్చావేం ?'' అని.

"అదిగో నల్లగా మబ్బులా కనిపిస్తూందే అది హిడింబా సురుడి ఇల్లు. అతడి చెల్లెల్ని నేను. హిడింబ అంటారు నన్ను. మిమ్మల్ని చూసి చంపి తెమ్మన్నాడు మా అన్న. నేను వచ్చి మీా అబ్బాయిని ప్రేమించాను. మాట్లాడుతూ మసలడంచూసి కోపంతో

వచ్చాడు అన్నయ్యా. మిమ్మల్నీ నన్నూ కలిపి మింగబోయాడు. అందుకని మీ అబ్బాయి మా అన్నతో అదిగో పోట్లాడుతున్నాడు. మా అన్నపని పట్టించి ఇప్పుడే వస్తాడు'' అని చెప్పింది హిడింబ.

చప్పున లేచి అందరూ వెళ్ళారు భీముడి దగ్గిరికి. మాంచి ఇదిలో వుంది మల్లయుద్ధం. "తూర్పు ఎర్రసడుతోంది,'' అంటూ హెచ్చరించాడు అర్జునుడు. "ఉదయసంధ్య రాక్షసుల బలం హెచ్చు తుంది. వీడి పనేదో ఇంతతో కానీ, ఆలస్యం చెయ్యకు'' అన్నాడు.

గ్రహించాడు భీముడు. మల్లవిద్యలో పేచీలువేసి అలిసి పోయేట్టు చేశాడు రాక్షసుణ్ణి వాడి రెండుపాదాలూ పట్టు కున్నాడు. గిరగిరా గిరగిరా నూరుమార్లు తిప్పాడు. ముక్కంటా నోటంటా రక్తం కక్కుకున్నాడు హిడింబుడు. మరుక్షణంలో ప్రాణం వొదిలిపెట్టాడు. చచ్చినవాణ్ణి రెండుచేతులా పట్టుకు విరి చాడు భీముడు. వెన్నుపూస ముక్కలుచేశాడు. నడుం రెండు ముక్కలు చేశాడు. దూరంగా విసిరివేశాడు.

అన్నదమ్ములూ, తల్లీ ఈ చిత్రవధ చూసి నిచ్చెరపోయారు. భీముణ్ణి మెచ్చుకున్నారు. తెల్లవారింది. మళ్ళీ అక్కడనుండి బయ ల్దేరారు. హిడింబ సహా వెంటపడింది. పనికిరాదన్నాడు భీముడు. "రాక్షసివి నువ్వు. మాయలమారివి. సమయంచూసి పగసాధిస్తావు. నమ్మలేం నిన్ను. మాతో రావద్దు. లేదంటే, మీ అన్నదగ్గిరికే నిన్నూ పంపుతాను చూడు'' అన్నాడు.

రావిఆకులా వడవడ లాడిపోయింది హిడింబ. చూసి జాలి కలిగింది ధర్మరాజుకి. "చంపవలసినవాణ్ణి చంపనే చంపావు. అది బాగానేవుంది, ఇగి ఆడది. దీనిమీదకోపించడం అధర్మం. ధార్మికుడైన వాడికి ఆత్మరక్షణకంటే ధర్మరక్షణే ముఖ్యం. ఆపద వచ్చిందే అనుకో, ఐనా ధర్మాన్నే రక్షించాలి. ఎంచేతనంటే, ధర్మహానివల్ల కలిగే పాపం జన్మాంతరంలో కూడా వెంటబడుతుంది. కనక తెలిసిన వాళ్ళు అధర్మమే ఆపద అని భావిస్తారు. అదీకాక, దీన్నిచూస్తే ఏదో

ఆత్మబంధువనే అనిపిస్తోంది మాకు రాక్షసి అన్న భావం పెట్టుకోకు దీనిమీద" అన్నాడు.

ఊరుకున్నాడు భీముడు. కృతజ్ఞత తెలుపుతూ ధర్మరాజుకి నమస్కరించింది హిడింబ. కుంతీదేవికి సాగాభివందనం చేసి ఏకాంతంగా తనవిషయం చెప్పుకుంది. "కామానురాగం సకలప్రాణులకీ సామాన్యం. ఐనా స్త్రీలకది మరీఅధికం. నేను మీఅబ్బాయి భీముణ్ణి ప్రేమించాను. అన్నని చంపుకున్నాను. చుట్టాల్నీ స్నేహితుల్నీ వొదులుకున్నాను. ఇంక నాకు వున్నదల్లా భీముడొక్కడే. నాకోర్కె నెరవేరకపోతే ఏ నుయ్యో. గొయ్యో చూసుకుంటాను. అమ్మన్నా, అత్తన్నా మీరే ఇహ నాకు. రక్షించండి.

"నన్ను పరిగ్రహిస్తే మీరు చెప్పిన పనల్లా నిమిషాలమీద చేసి పెడతాను. మీకు ఇబ్బందిగా వుంటే, మీరు చెప్పినచోటికి మీ అందరినీ ఎత్తుకు వెళతాను. నా మాట నమ్మండి. జరిగిపోయిందీ, జరగబోయేదీ, జరుగుతున్నదీ — ఈ మూడు కాలాల వర్తమానాలూ తెలుసు నాకు. కావలిస్తే జరగబోయేది చెపుతాను చూడండి. మనం వెళుతున్నామే, ఈ దారిలో ముందు ఒక సరోవరం వుంటుంది. అక్కడ వొక మర్రిచెట్టూ వుంటుంది. ఆ రెండూ శాలిహోత్రముని తపోమహిమవల్ల ఏర్పడ్డవి. ఆ సరోవరం నీళ్ళు తాగినవాళ్ళకి ఆకలిదప్పులుండవు. ఆ చెట్టు చలీ, గాలీ, ఎండా, వానా—వీటి బాధ లేకండా కాపాడుతుంది. అక్కడ వ్యాసముని వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాడు; హితోపదేశం చేసి వెళతాడు" అంది.

ఈ మాటలలో దేవతలా అనిపించింది హిడింబ. దాని నడవడి చూస్తున్న కొద్దీ చిత్రంగానూ వుంది. వినయం, వినయంకి తగిన సుగుణం—బాగా ఆకర్షించాయి కుంతిని. భీముణ్ణి చాటుగా పిలిచి బోధించిందావె. "అబ్బాయీ, మీ అన్న మొహం నా మొహం చూడు. మే మన్నది ధర్మమని నమ్ము. మా మాట విను. హిడింబ

సాధ్వి. ఇంకోలాగ భావించకు. దీన్ని పరిగ్రహించు. నాకు తెలుసు కొడుకు పుడతాడు మీకు. స్వర్గంలో మీనాన్నా సంతోషిస్తారు" అంది. ఎలా ఐతేనేం చివరికి కొడుకుని "ఊ" అనిపించింది. "సరే, వొక సంతానం కలిగేవరకూ దీంతో వుంటాను" అన్నాడు భీముడు. తరవాత హిడింబని పిలిచింది కుంతి. "శుచివై, ఉత్తమ స్త్రీగుణాలతో అబ్బాయిని మెప్పించు. పగలంతా మీ ఇష్టంవచ్చిన చోట తిరగండి. రాత్రిళ్ళుమాత్రం మా దగ్గిరికి వచ్చెయ్యాలి" అని చెప్పింది. తల వొంచుకుంది హిడింబ.

హిడింబ చెప్పినట్టే నిజంగా దారిలో శాలిహోత్రముని ఆశ్రమం కనపడింది. ఉదయాన్నే ఆ సరోవరంలో స్నానంచేశారు పాండవులు. సంధ్యావందనాలూ అవీ ముగ్గించారు. కడుపారా సరోవరం నీళ్ళు తాగారు మర్రిచెట్టు నీడని విశ్రమించారు. చూసి సగౌరవంగా సత్కరించాడు శాలిహోత్రముని.

ఇంతలో పుణ్యం మూర్తీభవించినట్టు వ్యాసముని వచ్చి సాక్షాత్కరించాడు. అందరూ లేచి పాదాభివందనం చేశారు. ఆసనం, అర్ఘ్యం, పాద్యం ఇచ్చి పూజించారు. మనమల్నీ, కోడల్నీ చూసి జాలిపడ్డాడు వ్యాసుడు. "కొడుకుమాట విని కూడనిపనికి నెట్టుకున్నాడు ధృతరాష్ట్రుడు. రాజ్యం వెళ్ళగొట్టాడు. దుష్టు. దుర్మార్గుల్ని నమ్మి ఏమరుపాటు కూడదు. ఇది తెలిసే మీకు నాలుగుమాటలు చెప్పి వెళదామని వచ్చాను. అన్ని ధర్మాలూ ఎరిగినవాళ్ళు మీరు. ఈ బంధువిరోధం పురాకృతం వల్లనే వచ్చింది మీకు. దీనికి దుఃఖించకండి. కొన్నాళ్ళకి మళ్ళీ అందరూ కలుసుకుంటారు. ఎప్పటిలాగే సుఖంగా రాజ్యంచేస్తారు.

"ఇది శాలిహోత్రుడి తపఃప్రభావంవల్ల ఏర్పడ్డ సరోవరం. దీనినీళ్ళు తాగినవాళ్ళకి ఆకలిదప్పులుండవు. ఈ చెట్టు చలీ, గాలీ, ఎండా, వానా–వీటి బాధ లేకండా చేస్తుంది. ఇక్కడ ఎవళ్ళకీ తెలియకండా కొన్నాళ్ళు గడపండి. తరవాత ఏకచక్రపురం వెళ్ళండి.

అగ్రహార ముంది అక్కడ బ్రాహ్మణ వేషాలతో బ్రాహ్మలమధ్య కాలక్షేపం చేస్తూ వుండండి. సమయానికి నేను కలుసుకుంటాను" అంటూ చెప్పాడు. చేతులు జోడించుకు నుంచున్న మనమల్ని దీవించాడు. కన్నీళ్ళతో పాదాభివందనం చేసిన కోడల్ని ఓదార్చాడు. "నీ కొడుకులు ధర్మం తప్పనివాళ్ళు విష్ణుమూర్తి భుజాలవంటి నలుగురు తమ్ములతో రాజులందరినీ జయిస్తాడు ధర్మరాజు. సార్వభౌము డౌతాడు. రాజసూయం, అశ్వమేధం అవీ చేస్తాడు. తాత తండ్రుల నుండీ సంక్రమించిన స్వరాజ్యం సంపాదిస్తాడు. అఖండ రాజ్యలక్ష్మి అనుభవిస్తాడు. కౌరవవంశం ఉద్ధరిస్తాడు. విచారించకు" అంటూ ధైర్యం చెప్పాడు. హిడింబకేసి చూసి "దీనిపేరు కమలపాలిక. ఇది భీముడికి అనుకూలవతిగా వుంటుంది. సందేహంలేదు. మంచిబలశాలి అయిన కొడుకుని కంటుంది. పనిపడ్డప్పుడు పనికివస్తాడు వాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు. వ్యాసుడు చెప్పిన ప్రకారం శాలిహోత్రముని ఆశ్రమంలో కొన్నాళ్లు గడిపారు పాండవులు.

## ఘటోత్కచుడు

కమలపాలికతో కామభోగా లనుభవిస్తున్నాడు భీముడు. ఒక్కొకరోజు ఒక్కొక చోటికి తీసుకుపోయే దామె. మంచి మంచి పూలతోట్లకి ఇవాళైతే, రేపు ఏటివొడ్డు ఇసకదిబ్బలికి. మర్నాడు సరోవరతీరాలికైతే, ఆమర్నాడు కొండలోయల్లోకి యిలా.

గర్భవతి అయింది కమలపాలిక. సద్యోగర్భంలో భయంకరుడైన కొడుకు పుట్టాడు. చూస్తేనే భయంవేస్తుంది మొహం. పెద్ద శంఖాల్లా వున్నాయి చెవులు. వికారంగా వున్నాయి మిడిగుడ్లు. వికటంగా వున్నాయి పళ్ళు. కుండమసిలా వుంది శరీరం. వెంట్రుకలు ఏమీ లేకండా నున్నటి కడవలాంటి పెద్ద తలకాయ. అంచేత ఘటోత్కచు డన్నారు వాణ్ణి. తల్లి కామరూపి. కొడుకూ కామరూపుడే అయాడు. పుట్టగానే యవ్వనం వచ్చింది. ఎన్నో

అస్త్ర శస్త్రాలు వాటంతట అవే వాళ్ళకొచ్చాయి. లెక్కలేనంత రాక్షస బలం, పిశాచసేనా వచ్చింది.

పాండవుల పెద్దకొడుకు ఘటోత్కచుడు. అంచేత అందరూ అరిచేతి నిమ్మపండులా చూశారతణ్ణి. కొన్నాళ్ళయాక వాడు తండ్రులముందు చేతులు జోడించుకు నుంచున్నాడు ఘటోత్కచుడు. "నా రాక్షస సేనతోనూ, పిశాచబలంతోనూ నా మానాన్ని నే నుంటాను. పని పడ్డప్పుడు తలచండి. మరుక్షణంలో రెక్కలు కట్టుకు వాల్తాను" అంటూ సెలవు తీసుకున్నాడు. తల్లినీ వెంటపెట్టు కుని ఉత్తరదిక్కు వెళ్ళిపోయాడు.

భి క్షా ట న ం

శాలిహోత్రముని దగ్గిర ఎన్నో ధర్మశాస్త్రాలూ నీతిశాస్త్రాలూ అవీ నేర్చు కున్నారు పాండవులు. అక్కడినుండి విదర్భదేశం, మత్స్య దేశం, త్రిగర్తదేశం, కీచకరాజ్యం - ఇవన్నీ దాటి ఏకచక్రపురం అగ్రహారం వెళ్ళారు. అక్కడ వొక బ్రాహ్మణ గృహంలో కాపరం పెట్టారు. బ్రాహ్మణ బ్రహ్మచారుల వేషాలు వేసుకున్నారు. జడలు పెట్టుకున్నారు. దర్భలూ, జింకతోళ్ళూ, నారబట్టలూ అవీ ధరించారు. వేదాలు వల్లించేవారు. మౌనంగా వెళ్ళి అగ్రహారంలో భిక్షాటనం చేసుకునేవాళ్ళు.

వాళ్ళ మంచిగుణం చూసి వెళ్ళిన ప్రతీబ్రాహ్మణగృహం లోనూ కాదనకండా భిక్ష వేసేవాళ్ళు. చూసి జాలిపడేవాళ్ళు ప్రజలు. "పాపం, రాజకుమాళ్ళవంటి వీళ్ళకి భిక్షాటనం రాసి పెట్టాడు పాడు దేవుడు" అంటూ విచారించేవాళ్ళు.

అన్నదమ్ములు ఐదుగురూ రోజూ పాత్రలు పట్టుకు వెళ్ళేవాళ్లు. బిచ్చమెత్తి పాత్రలనిండా అన్నమూ, పిండివంటలూ అవీ తెచ్చే వాళ్ళు. తల్లిముందు పెట్టేవాళ్ళు. అదంతా రెండువంతులు చేసేది తల్లి. ఒక వంతు భీముడికి పెట్టేది. రెండోది నలుగురు కొడుకులికీ పెట్టి, తానూ తినేది.

ఒకనాడు భీముడు ఇంట్లో వున్నాడు. తక్కిన నలుగురూ భిక్ష కోసం వూళ్ళోకి వెళ్ళారు. ఇంతలో వాళ్ళున్న బ్రాహ్మణకొంపలో వొక్కపెట్టుని ఏడుపులూ మొర్రలూ వినపడ్డాయి. కడుపులో కలిచినట్టయింది కుంతికి. "ఏమయిందో పాపం, ఈ బ్రాహ్మడికి!" అంది భీముడితో. "ఇన్నాళ్లూ వీళ్ళ ఇంట్లో సుఖంగా వున్నాం. పరాయివాళ్లకి మన పత్తా తెలియలేదు. ఎందుకు ఏడుస్తున్నారో, ఏం వచ్చిందో తెలుసుకోవాలి. చేతనయిన ఉపకారం చేద్దాం. తలదాచుకుందికి కొంప ఇచ్చారు. ఇంత ఉపకారం చేశారు. ఏం చేసి వీళ్ల ఋణం తీర్చుకోనా అనుకుంటాను నేను. ఏదో గట్టి ఆపదే వచ్చినట్టుంది. నా మనసు కలిచి పట్టవుతోంది.

"ఉపకారంపొంది కృతజ్ఞత చూపడం సామాన్య ధర్మం. ప్రత్యుపకారం చెయ్యడం మధ్యరకం. ఉపకారానికి మించిన ప్రత్యుపకారం చెయ్యడం ఉత్తమ ధర్మం. అంచేత, వీళ్ల కేం వచ్చిందో తెలుసుకుని సాయం చెయ్యాలి" అంటూ విచారపడింది.

"ఏది వచ్చినా నే నున్నానమ్మా, ఎందుకలా విచారిస్తావు!" అంటూ లేచాడుభీముడు. "వెళ్లు. కనుక్కురా. ఎవరివల్ల ఏం వచ్చినా సరే, నేను తీరుస్తాను. సరేనా!" అన్నాడు.

లేచి వెళ్ళింది కుంతి. చూసి నోట మాట రాలే దామెకి. నుంచుండిపోయింది. భార్యాబిడ్డల్ని పట్టుకుని అదే ఏడుపు ఏడుస్తున్నాడు బ్రాహ్మడు. "గడ్డిపరక కంటే నిస్సారమైంది సంసారం. భయంకరమైంది. దుఃఖదాయకమైంది. చంచలమైంది. పరాధీనమైంది. దీనికి నమ్మక మేముంది? సంయోగ వియోగాలు పూర్వజన్మ కర్మవల్ల కలుగుతూ వుంటాయి. ఎంతవాణ్ణీ కర్మ ఫలం వొదిలిపెట్టదు. ఏం చెయ్యనూ!" అంటూ మొత్తుకుంటు న్నాడు. "చెవిలో గూడుకట్టుకు పోరాను. 'ఎక్కడికన్నా పోదాం, ఈ వూళ్ళో వుండొద్దని. చెవినిపెట్టింది కాదు మా ఆవిడ.

ఖర్మం. ఖర్మని కాదనడం ఎవరితరం? ఇంతదారుణం నుదుట వ్రాసి వుంటే, దానికిమాత్రం వినాలని మంచిబుద్ధి ఎలా పుడుతుంది? ఏమిటి సాధనం! పెళ్ళాం, పిల్లలూ, నేనూ ఈ గండంనుండి ఎలా బైట పడడం?

"అగ్నిసాక్షిగా చెయ్యిపట్టుకు పెళ్ళాడాను. సంతానవతి. ఎదు రాడి ఎరగదు-రాక్షసుడి తిండికి దీన్నెలా పంపనూ! కూతురు, లోకం తెలీని పసిపాప. చేతులెలా వస్తాయి నాకు రాక్షసుడి ముందు వెయ్య డానికి! ఇహ, కొడుకు – ఒక్కడుగాక వొక్క గుడ్డు. ఇంటి దీపం- తిలోదకాలకన్నా లేకండా వీణ్ణిమాత్రం ఎలా పంపనూ! అయ్యో, ఇంతటి కటికిగుండా నాది!! ఊహూఁ, వీల్లేదు. వీళ్ల నెవళ్లనీ వొదులు కోలేను. నేనే వెళతాను" అన్నాడు.

"వద్దు వొద్దు. మీరుమాత్రం వెళ్ళకండి" అంది ఇల్లాలు. మీరు లేకపోతే వొక్కనిమిషం ప్రాణాలు పెట్టుకు బతకలేను నేను. నేను వెళతాను. తప్పని ఆపదలోనే ధైర్యం వుండాలి మనిషికి. మీ రిలా అధైర్యపడితే మాగతేం గానూ! వినండి. భార్యవల్ల కలగవలసిన ఫలం సంతానం. అది మీకు కలగనే కలిగింది. నేనూ రుణం తీర్చుకున్నాను. ప్రాణం ఇచ్చి అయినా భర్తకి మేలు చేసిందే భార్య. ఎంతో పుణ్యం చేస్తేనే కాని పునిస్త్రీచావు దొర కదు. ఎంత పతివ్రత ఐతేమాత్రం ఏం లాభం? తలచెడ్డదాని బతుకు దమ్మిడీ చెయ్యదు. మాంసంముక్క కోసం పరుగెత్తుకు వచ్చే కుక్క ల్లాగ మగడులేనిదాని వెంట పడతారు మగవాళ్ళు. భార్యపోయిన మగవాడు మరో భార్యని కట్టుకుంటాడు. భర్తపోయిన ఆడది మరో భర్తకి వెళితే సయించదు లోకం.

"మీరు లేకండా ఈ పిల్లలితో వేగలేను నేను. సంసారం మొయ్యలేను. కులం తక్కువవాళ్ళు వచ్చి కూతుర్ని కావాలంటే కాదనే శక్తివుండదు నాకు. నేను వెళతాను. నా తరవాత పెళ్ళి చేసుకోండి మీరు. అబ్బాయిని ప్రయోజకుణ్ణి చెయ్యండి తగిన

సంబంధం చూసి అమ్మాయికి మూడు ముళ్ళూ వేయించండి" అంటూ కళ్ళు తుడుచుకుంది.

"నువ్వు వెళ్ళవొద్దే అమ్మా" అంటూ బావురుమందికూతురు. "ఎన్నటికన్నా నేను పరాయివాళ్ళ ఇంటికి పోవలిసిన దాన్నే. ఎవళ్ళకన్నా నన్ను ఇచ్చెయ్యవలసిందేకదా! ఆ ఇవ్వడం రాక్షసుడికే ఇవ్వండి. 'తండ్రిచేసిన తర్పణాలూ అవీ చచ్చిపోయిన కూతురికి అందుతాయి' అని నువ్వే చెప్పావు అవాళ. కూతురు పెడితే తండ్రికి చేరవు. దాని భర్తకి చేరతాయి. నేను బతికి మీకు దౌహిత్రుణ్ణి కనడమంటారా, సందోరాజా భవిష్యతి. నువ్వూ, నాన్నా బతికి బావుంటే వంశం పెరుగుతుంది. అందుకని రాక్షసుడి తిండికోసం నేనే వెళతాను" అంది.

"అయ్యో నా చిట్టితల్లీ" అంటూ కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చారు తల్లీ తండ్రీని. "ఎందు కల్లా ఏడుత్తాలు!" అంటూ కన్నీళ్లు తుడిచాడు కుర్రాడు. "మీ లిక్కడే వుండండి. రాచ్చసున్ని చంపేసి వొత్తాను" అంటూ చిన్న కర్ర పుచ్చుకు బయల్దేరాడు. "మా బాబే, బాబే" అంటూ ఎత్తుకుంది తల్లి. బుగ్గలు నొక్కి మెటికలు విరిచింది.

"అసలు మొదలేమిటమ్మా, దీనికి?" అంటూ ప్రశ్నించింది కుంతి. "రాక్షసు డంటున్నారు. ఎవడు వాడు? వాడి తిండికి మీరు వెళ్ళడమేమిటి? ఏమిటి సంగతి? మీకు ఆపద వస్తే మాకు వచ్చినట్లే. సందేహించకండి. చెప్పండి. చేతనైతే తీరుస్తాను" అంది.

బకాసురుడు

"ఏం చెప్పేది తల్లీ" అన్నాడు బ్రాహ్మణుడు. "మనుష్యులవల్ల తీరేది కాదమ్మా, మా కష్టం. వినండి. మా వూరికి ఆమడదూరంలో యమునానది వొడ్డుని బకాసురుడిగుహా వుంది. అందులో వున్నాడు బకాసురుడు. పూర్వం వూళ్ళోవాళ్ళని అందరినీ వొరసన పెట్టి మింగేస్తూ వుండేవాడు. అప్పుడు వూళ్ళోవాళ్ళంతా ఆలోచించారు. జపాలూ,

హోమాలు అవీ చేసి వొకదారికి తెచ్చారు. బకాసురుడితో వొక వొడంబడిక చేసుకున్నారు. రోజుకో ఇంటి చొప్పున, ప్రతీదినం వొక మనిషీ, రెండుపోతులతో బండెడు అన్నం, పిండివంటలూ, మాంసం కూరా అదీ కలిపి యివ్వడానికీ, వాకు వూరిమీద పగక్కంజా వుండడానికీ నిశ్చయమైంది. అప్పటినించీ రాక్షసుడు ఇదే జీవనంగా పెట్టుకు బతుకుతున్నాడు. పరాయివాళ్ళ బాధలేకండా మాత్రం అగ్రహారం కాపాడుతున్నాడు. మా. దేశం రాజుకి అంతబలం లేదు. అందుకని రాక్షసుణ్ణి ఏమీ చేయలేకపోతున్నాడు.

"రాజు సమర్థుడై వుండాలి. ధర్మం రక్షించగలిగి వుండాలి. అలాంటి దేశంలో ఐతే పెళ్ళాం పిల్లలతో కాపరం చెయ్యవచ్చు. రక్షణలేని దేశంకంటే అడివి నయం. ఎలాంటి రాజూకూడా బ్రాహ్మణులదగ్గిర చిల్లి గవ్వయినా కప్పం పుచ్చుకోడు. ఈ పాపాత్ముడు తిండికని మనుష్యుల్నే కప్పం పుచ్చుకుంటున్నాడు ఏం చెయ్యనూ, ఇంతకాలానికి మావంతు వచ్చిందివాళ. చూసి చూసి పెళ్ళాం పిల్లల్ని పంపలేను. నేనే వెళతాను" అంటూ కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు.

"విచారించకండి. దీనికో ఉపాయం చెపుతాను." అంది కుంతి. "మీకు వొక్కడే కొడుకు. వాడైనా పసివాడు. బలి అన్నం పట్టుకు వెళ్ళడానికైనా పనికిరాడు. ఐదుగురు కొడుకులునాకు. మీకోసం వాళ్ళల్లో వొక్కణ్ణి పంపుతాను. వాడు బలి పట్టుకు వెళతాడు బకాసురుడికి" అంది. "శివ శివా" అంటూ చెవులు మూసుకున్నాడు బ్రాహ్మడు. "నా ప్రాణంకోసమని, అతిథిగా వచ్చిన బ్రాహ్మణ్ణి రాక్షసుడి మొహాన వెయ్యనా! అతిథిని అవమానించడమే పాపం. అందులోను చావమనడం — శివశివా – పాతకాలన్నిటిలోకీ పాతకం. యాచకుణ్ణీ, అతిథినీ, అభ్యాగతుణ్ణీ, భయస్థుణ్ణీ, శరణన్నవాణ్ణీ చంపజూస్తే పుట్టుగతులుండవు. అయితే, ఆత్మవధా మహాపాతకమే. ఏలా వొప్పుకుంటున్నా వంటా వేమో. ఇది

తప్పనిసరి పైవాడి బలవంతం మీాద జరుగుతోంది. ఆ పాపం నాది కాదు. చేసిన వాళ్ళది. విన్నావూ అమ్మా, అంచేత బ్రాహ్మణ హింసకి సమ్మతించలేను'' అన్నాడు

"అవును, అది జరగకూడదనే నేనూ చెపుతున్నాను'' అంటూ మళ్ళీ అందుకుంది కుంతి. "అందుకనే నా కొడుకుని పంపుతా నన్నాను అసలు, నా కొడుకుసంగతి తెలీదుమీాకు. మహాబల శాలి వాడు మంత్రసిద్ధుడు ఒక్కడు కాదు. ఇలాంటి బకాసురులు పదిమందినైనా చంపేస్తాడు. అలా కాకపోతే – వందమందిని కన్న తల్లికైనా కన్నకొడుకు చేదు కాదు కదా! మీారే గూర్ధురు గాని. ఇది కొత్తకాదు మాకు. ఇంతకి ముందు ఎందరో రాక్షసులు చచ్చారు వీడిచేత'' అంటూ భీముణ్ణి కేకవేసి పిలిచింది. విషయ మంతా చెప్పింది. "బలి అన్నం పట్టుకుని బకాసురుడి గుహకి వెళ్ళు నువ్వు. ఆపదలో ఆదుకోవాలి మనం'' అంది.

ఉత్సాహంతో సిద్ధపడ్డాడు భీముడు. "ఐతే కడుపునిండా తిండి లేదు. అర్ధాకలితో కంటికి కునుకులేదు రాత్రిళ్ళు. నీరసంగావుంది. చెయ్యగలిగితే మంచి భోజనం ఏర్పాటు చెయ్యండి. తిని బలం తెచ్చు కుంటాను. బకుడి పని పట్టేస్తాను. అగ్రహారానికి ఆపద లేకండా చేస్తాను'' అన్నాడు.

క్షణాలమీాద పంచభక్ష్య పరమాన్నాలతో భోజనంతయారు చేసిపెట్టాడు బ్రాహ్మడు. రకరకాల పిండివంటలూ, బెల్లం దిమ్మలూ, పెరుగుకుండలూ తెచ్చి ముందు పెట్టాడు. అన్నీ సుష్టుగ్భృత్తుగా తిని పరిషించాడు భీముడు. గ్రుస త్రేన్చి లేచాడు.

ఇంతలో భిక్షాన్నం పట్టుకుని ఇంటికి వచ్చారు ధర్మరాజూ అర్జునుడూ వాళ్ళూను. మాంచి వుషారుగా వున్నాడు భీముడు. చూసి చకితులయారు అన్నదమ్ములు. "ఏమిటి, భీమన్న ఇంత హుషారీగా వున్నాడు?'' అంటూ తల్లిని అడిగాడు ధర్మరాజు. "ఎక్కడన్నా కుస్తీ గిస్తీ ఏదన్నా జతపడిందా ఏమిటి? ఇతడి

వైఖరి చూస్తే యుద్ధానికి బయలుదేరుతున్నట్టే వుంది. నువ్వే ఎక్కడికన్నా పంపుతున్నావా, తానే సిద్ధపడుతున్నాడా? భిక్షానికి కూడా వెళ్ళినట్టు లే దివాళ" అన్నాడు.

విషయమంతా విడమర్చి చెప్పింది తల్లి. "ఎంతపని చేశావమ్మా," అంటూ నొచ్చుకున్నాడు ధర్మరాజు. "పయివాళ్ళ కోసం కన్నకొడుకుని వొదులుకుంటారా అమ్మా! లోకంలో ఎక్కడన్నా వుందా ఇది! అందులోనూ భీమన్న వొదులుకోవలిసిన కొడుకేనా పోనీ! ఇతడే లేకపోతే లక్కఇంట్లో ఏమయేది మన పని? అడివిలో మనల్ని కాసుకు కూచున్నాడు మనకి నిద్రాభంగం అవుతుంది కామోసని, దూరం లాక్కు వెళ్లాడు హిడింబుణ్ణి. ఇతడి బలానికి భయపడే కదా నిద్రాహారాలు మానుకుంటున్నారు కౌరవులు. అలాంటి కొడుకుని ఏదో వొక బ్రాహ్మడి కోసమని, రాక్షసుడి యదాన వెయ్యడమా? మా కష్టాలు చూసి మతి చలించినట్టుంది నీకు!" అన్నాడు.

"నే నంత తెలివితక్కువ దాన్నటోయి వెర్రితండ్రీ," అంటూ అందుకుంది కుంతి. "వీడి శక్తి నాకు తెలుసు. పిడుగులాంటి దేహం నా భీమన్నది. వీడు పుట్టిన పదోనాడు, శతశృంగపర్వతంమీద నా చేతిలోంచి జారి కిందపడ్డాడు. చెప్పేవుంటాను మీకు. అప్పు డేమయిందో తెలుసా? వీడి శరీరంపడి కొండ రాళ్ళు పిండి పిండై పోయాయి. అలాంటి వీడికి రాక్షసుడొక లెక్కేమిటి? వీడికోసం విచారించ నక్కరలేదు. సందేహంలేదు. నామాట విను. లిప్తలో బకుణ్ణి హాతమార్చి వస్తాడు భీమన్న. ఇవాళనించీ ఏకచక్రపురం హాయిగా వుంటుంది.

"మనం ఇమ్ముగా తలదాచుకుందికి ఇంత వసతి కలిగించాడు బ్రాహ్మడు. ప్రత్యుపకారానికి అవకాశం చిక్కింది మనకి. ఇతర్ల ఆపద ఆదుకోవడానికే పుడతాడు క్షత్రియుడు. ఈ బ్రాహ్మణ్ణి బతికిస్తే పుణ్యమూ, పురుషార్థమూ రెండూ దక్కుతాయి మనకి.

కాదనకు. వెళ్ళనీ వాణ్ణి" అంటూ వొప్పించింది ధర్మరాజుని. తల్లి ఉదారహృదయానికీ ఉపకారబుద్ధికీ సంతోషించాడు ధర్మరాజు.

బకాసురుడికోసం అన్నమూ, కూరలూ వాటితో నిండిన పోతులబండీ తయారైనది. బండి తోలుకుంటూ దక్షిణందిక్కు బయల్దేరాడు భీముడు. ఎముకల గూళ్ళతోనూ కుళ్ళుమాంసం తోనూ కంపుకంపుగా వుంది బకాసురుడి గుహ. అందాకా వెళ్ళకుండా యమునానది వొడ్డుని బండి విప్పాడు భీముడు. పెద్ద కేకలు వేసి బకాసురుణ్ణి పిలిచాడు. వాడు వచ్చేదాకా వూరికే ఎందుకుండాలి? యమునలో దిగి కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. చక్కగా ఆచమనం చేసుకున్నాడు. తిన్నగా వచ్చి బండిలో అన్నం అదేపనిగా తినడం ప్రారంభించాడు.

"ఇంత పొద్దెక్కింది. భోజనం తేవడం లేదు — సరికదా, కేకలు వేస్తున్నాడు. ఎంత పొగరుగా వుంది వీడికి?" అంటూ పెదివి కరుచుకు లేచాడు బకాసురుడు. ఒక వంక ఆకలి. ఒకవంక కోపం. ఉగ్రుడై బయల్దేరాడు. భయంకరంగా ఆకాశమంత ఆకారం పెంచాడు. అంగలు వేసుకుంటూ బండిదగ్గిరికి వస్తున్నాడు. జంకలేదు భీముడు. పెద్ద పెద్ద ముద్దలు తింటూనే వున్నాడు. చూశాడు బకుడు. అరికాళ్ళమంట నెత్తికెక్కినట్టయింది. "నా కోసం తెచ్చింది నువ్వు తినేస్తున్నావేమిటి?" అంటూ అరిచాడు. "ఒళ్ళు కొవ్వెక్కింది. మే మంటే అంత చులకనగా వుందో ఏకచక్రపురంవాళ్ళకి!" అంటూ వచ్చి వీపు మీద గుద్దేడు భీముణ్ణి. ఊహూఁ, బెదరలేదు భీముడు. వాడుదిక్కు చూడనైనా చూడలేదు. ధీమాగా తింటూనే వున్నాడు. "పీడివాటం వింతగానేవుంది" అని పళ్ళు కొరుక్కుంటూ వెళ్ళాడు బకాసురుడు. పెద్దచెట్టు వూడపీకి గిరగిరా తిప్పుకుంటూ వచ్చాడు భీముడి మీదికి.

బండిలో వున్నదంతా తినేశాడు భీముడు. మాంచి బలంతో శరీరం పొంగించాడు. జబ్బలు చరుచుకుంటూ బండిమీించి కిందికి

పురికాడు. "రా, ప్రజల్ని తింటూన్న పాపాల భైరవుడివి. మనిషి మాంసం తిని మదించి వున్నావు. తిన్నదంతా కక్కిస్తాను. కొవ్వు కరిగిస్తాను. నీ ప్రాణాలు పుచ్చుకుని మరీ వెళతాను నిలబడు" అన్నాడు. పక్కనే వున్న పెద్ద మద్దిచెట్టు వూడబెరికాడు. మరు క్షణంలో రాక్షసుడి మీద వేసి కొట్టాడు. తగలకండా తనచేతి చెట్టుతో కాసుకున్నాడు బకుడు.

ఇద్దరూ చెట్లతోనే కొట్టుకుంటున్నారు. ఒక చెట్టు విరిగి పోతే మరొకటి. అది విరిగితే ఇంకొకటి. చుట్టుపట్ల చెట్లన్నీ పెరికివేశారు. ఇలా కొంతసేపు చెట్లయుద్ధం జరిగింది. ఆ దగ్గిరలో చెట్టన్నది లేదు మరి. దాంతో మల్లయుద్ధం ప్రారంభించారు. బాహాబాహీ. ముష్టాముష్టి. గుద్దుమీద గుద్దు. తోపుమీద తోపు. ఒకరినొకరు అదిమి పట్టుకున్నారు. ఒకరినొకరు జంకిస్తు న్నారు. ఒకరి నొకరు ఈడ్చుకుంటున్నారు. ఒకరి నొకరు గెలవా లని పట్టుదల. హూమ్ అంటే హూమ్ అంటున్నారు. వాళ్ళ అడుగులికి భూమి కదిలిపోతోంది. రాళ్ళూ రప్పలూ, చెట్టూ పుట్టా పిప్పి పిప్పి – పిండి పిండి ఐపోతున్నాయి. భుజాలు తట్టు కుంటున్నారు. పిడి గుద్దులు దభీదభీ గుద్దుకుంటున్నారు. పడ పడా కొట్టుకుంటున్నారు. ఆ ధ్వనికి చుట్టు పక్కల వాళ్ళంతా భయపడి పారిపోయారు.

బకాసురుణ్ణి కిందపడదోశాడు భీముడు. గుండెల మీద ఎడమకాలితో పిడుగులా తన్నాడు. తాపు తిని చప్పున లేచాడు బకాసురుడు. ఒక్కనెట్టు నెట్టాడు భీముణ్ణి. మేరుపర్వతంలాంటి అతడి రొమ్ముమీద తీసిపెట్టి గుద్దేడు. ఆ గుద్దుతో తెలిసిపోయింది బకుడి బలం. ఐరావతం తొండంలాంటి తన చేతులతో వాడి మొలా మెడా మెలివేసి పట్టుకున్నాడు భీముడు. మోకాలితో వీపు విరగబొడిచాడు. నవరంధ్రాలనుండీ రక్తమాంసాలు చిమ్ముకు వచ్చాయి బకుడికి. ఆ ప్రదేశమంతా మాంసం బురదతో రక్తం

నదిలా పారింది. పెడబొబ్బలు పెట్టి ప్రాణం వొదిలేశాడు. బకాసురుడు.

పెడబొబ్బలు విని పరిగెత్తుకు వచ్చారు బకాసురుడి బంధువులు. వాళ్ళని చూసి "మీరూ మనుష్యుల్ని ఎప్పుడైనా చంపారా, ఇదిగో, మీ వాడిగతే పడుతుంది మీకున్నూ. జాగ్రత్త" అంటూ భయపెట్టాడు భీముడు. గడగడ వడికారు వాళ్ళు. "ఎన్నడూ మనుషులజోలికి వెళ్ళ"మని వొట్టుపెట్టుకున్నారు. అప్పటినించీ ఏకచక్రపురానికి రాక్షసభయం లేదు.

బకాసురుడి కళేబరం ఈడ్చుకువచ్చి వూరు పొలిమేరని పడవేశాడు భీముడు. ఊళ్ళోకి వెళ్ళి అందరితోనూ చెప్పాడు ఇంటికి వెళ్ళి తల్లికీ, అన్నగారికీ నమస్కరించాడు. తమ్ముళ్ళని కౌగిలించుకున్నాడు. బ్రాహ్మడి ఇంట సంతోషమే సంతోషం.

"ఇతడెవరో మంత్రసిద్ధికల బ్రాహ్మడు. అసాధ్యుడు. బ్రహ్మాండమైన బలశాలి. బకాసురుణ్ణి చంపేశాడు. మన పాలి రక్షకుడు" అంటూ భీముణ్ణి చూసిపోవడంకోసం ఆబాలగోపాలం విరగబడ్డారు వూళ్ళోవాళ్ళు.

—*—

# ఆదిపర్వం

## ఏడో ఆశ్వాసం

ఒకనాడు పాండవులున్న బ్రాహ్మడి ఇంటికి అతిథిగా వొక బ్రాహ్మడు వచ్చాడు. భోజనాలూ అవీ అయాక, కుంతీ, కుమాళ్లూ వచ్చి అతడిదగ్గిర కూచున్నారు ఆమాటా, ఈమాటా ఆడి, "ఎక్కడనుండి వస్తున్నారు మీరు? ఏ యే దేశాలు చూశారు? ఏ యే దేశాలు మంచివి? ఏ యే దేశాలరాజులు మంచివాళ్ళు?" అంటూ అడిగారు. "ఇంచు మించు అన్ని దేశాలూ తిరిగాను," అన్నాడు బ్రాహ్మడు. "గొప్పగొప్ప రాజుల్ని అందరినీ ఎరుగుదును. వాళ్ళ నడవడికలూ తెలుసు నాకు. ఐతే, పాంచాల దేశం లాంటి దేశంకానీ, ద్రుపదుడిలాంటి రాజుకానీ లేరంటే నమ్మండి. అతడికి వొక్కతిగాక వొక్కతే కూతురు. లోకంలోని అందమంతా పుణికిపుచ్చుకున్న పుత్తడిబొమ్మ. అయోనిజ. అగ్నిగుండంలోపుట్టింది. ఐతే, నచ్చినవరుడు దొరకలేదా మెకి. అందుకని స్వయంవరం చాటిస్తున్నాడు ద్రుపదమహారాజు" అన్నాడు. "చిత్రం! అయోనిజ ఎలా దొరికింది ద్రుపదమహారాజుకి? తెలిస్తే, విడమర్చి చెప్పండి" అని అడిగారు పాండవులు.

### ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు

"అదో పెద్ద కథ," అంటూ ఆరంభించాడు బ్రాహ్మడు. "ద్రుపదుడూ, కౌరవుల గురువు ద్రోణుడూ బాల్యమిత్రులూ, సహాధ్యాయులునూ. ద్రుపదుడు రాజయాక ద్రోణుణ్ణి అవమానించాడు. ఆ కోపంతో హాస్తినాపురం వచ్చి కౌరవకుమాళ్ళకి ఆచార్యుడయాడు ద్రోణుడు. విద్య పూర్తిచేసి గురుదక్షిణగా ద్రుపదుణ్ణి

పట్టి తెమ్మన్నాడు. ఎవ్వరికీ సాధ్యంకాలేదు. అర్జునుడు వెళ్ళి జయించుకు వచ్చాడు. సగంరాజ్యం తీసుకుని ప్రాణాలతో ద్రుపదుణ్ణి వొదిలిపెట్టాడు ద్రోణుడు.

"అవమానం హృదయశల్యంగా వేధించింది ద్రుపదమహారాజుని. 'యుద్ధంలో ద్రోణుణ్ణి హతమార్చే కుమారుడూ, అర్జునుడికి భార్యకాదగ్గ కూతురూ కావాలని దీక్షపట్టాడు. ఎంతోమంది మునుల్ని ఆశ్రయించాడు. ఎన్నో ఆశ్రమాలు తిరిగాడు. పడరాని శ్రమలన్నీ పడ్డాడు.

"గంగాతీరంలో కాశ్యపగోత్రస్థులు యాజుడూ, ఉపయాజుడూ అని ఇద్దరు అన్నదమ్ములుండేవారు. ఎప్పుడూ వ్రతాలూ అవీ చేసుకుంటూ వానప్రస్థాశ్రమంలో వుండేవాళ్లు వాళ్లు అందులో ఉపయాజుడు వయస్సులో ఐతే చిన్నవాడే కాని తపస్సులో మాత్రం గొప్పవాడు. వాళ్ళనిచూసి అందులో ఉపయాజుణ్ణి ఆశ్రయించాడు ద్రుపదుడు. 'కుమారుడు కలిగేట్టు నాచేత యజ్ఞం చేయించండి. లక్ష పాడిఆవులు సమర్పించుకుంటాను మీకు' అంటూ ప్రాధేయపడ్డాడు. 'ఫలాపేక్ష లేదు నాకు. మరెవళ్ళనైనా చూసుకో' అంటూ నిరాకరించాడు ఉపయాజుడు. అంతమాత్రాన నిరాశ చేసుకోలేదు ద్రుపదుడు. మరో సంవత్సరం వరకూ వొదలకుండా అతణ్ణే ఆశ్రయించాడు.

"ఎలాఐతేనేం చివరికి జాలికలిగింది ఉపయాజుడికి. 'నావల్ల ఈపని కాదని చెప్పనే చెప్పాను. మా అన్న యాజుడు దీనికి తగినవాడు. నాకు తెలుసు. ఫలాపేక్ష కలవాడాయన. ఒకనాడు అడివిలో ఇద్దరమూ వెళుతున్నాము. కింద వొకపండు పడివుంది. చూసి చప్పున తీసుకున్నాడాయన. ఆ స్థలం పరిశుద్ధమైందో, అపరిశుద్ధమైందో అనైనా ఆలోచించలేదు. ఫలాపేక్ష కలవాడు కాని మంచీచెడ్డా విచారించడు. అంచేత, ఆయనైతే నీ ఆవులికి ఆశపడతాడు. నీ కోరిక నెరవేరుస్తాడు' అని సలహా ఇచ్చాడు.

"యాజుడి దగ్గిరికి వెళ్ళాడు ద్రుపదుడు. తపస్సూ, పంచమహా యజ్ఞాలూ * అవీ చేస్తూ, శిలావృత్తీ, ఉంఛవృత్తీ, భిక్షాటనం — వీట్లతో కుటుంబం గడుపుకుంటూ జీవిస్తున్నారు యాజుడు. వెళ్ళి సాష్టాంగపడ్డాడు ద్రుపదుడు. 'మంచి మంచి పాడిగోవులు లక్ష సమర్పించుకుంటాను. కుమారుడు కలిగేట్టు నాచేత యజ్ఞంచేయించండి' అంటూ ప్రార్థించాడు. 'ద్రోణుడు నన్ను లోకువకట్టి పరాభవించాడు. అతణ్ణి హతమార్చే కొడుకు కావాలి నాకు. పిడివెత్తి ఆరుమూరల ధనుస్సు ద్రోణుడిది. అతణ్ణి యుద్ధంలో గెలిచేవాళ్ళింతవరకూ లేరు. అతణ్ణి సాధిస్తే, ధర్మార్థ కామ మోక్షాలు నాలుగూ సాధించినట్లవుతుంది నాకు' అని వినయంగా చేతులు జోడించాడు.

"యాజకత్వానికి వొప్పుకున్నాడు యాజుడు. 'నువ్వు కోరుకుంటూన్న కొడుకూ, కూతురూ పుడతారు. అధైర్యపడకు' అన్నాడు. యజ్ఞానికి అవసరమైన ఉపకరణాలు యావత్తూ జతపరిచాడు. ఉపయాజుణ్ణి సహాయం పెట్టుకున్నాడు. ద్రుపదుడూ, అతడి రాణి కోకిలాదేవీ – ఈ ఉభయులి చేతా పుత్రకామేష్టి జరిపించాడు. నిర్విఘ్నంగా సమాప్తమైంది యజ్ఞం.

"అగ్నిగుండంలోంచి అగ్నిశిఖలాంటి కుమారుడు పుట్టాడు. మంటలవలె భయంకరంగా వుంది అతడి దేహం. ఒక చేతిలో మాంచి ధనుస్సు. మరోచేతిలో తళతళ లాడుతూన్న కత్తి. శరీరానికి కవచం తలమీద కిరీటం, రథంమీద కూచుని, సరిగ్గా అగ్నిహోత్రుడిలా పుట్టుకు వచ్చాడు.

"అతడి వెనక దేవకన్నెలాంటి వొక కూతురూ పుట్టింది. నల్లకలువల అందమంతా పోతపోసినట్టుంది ఆమెశరీరకాంతి తుమ్మెద రెక్కలలాంటి వుంగ్గులు తేరిన జుత్తు. చేరడేసి కళ్లు. గుప్పెట్లో

---

* పంచమహాయజ్ఞాలు బ్రహ్మయజ్ఞం, భూతయజ్ఞం, దేవయజ్ఞం, పితృయజ్ఞం, మనుష్యయజ్ఞం.

ఇముడుతుంది నడుం. శరత్కాలంలోని తామర పువ్వులపరిమళం లాంటి శరీరపరిమళం. నిజానికి ఆమెని పొగడాలంటే మాటలు దొరకవు మనకి. అంత పొట్టీకాదు పొడుగూ కాదామె. అంత స్థూలమూ కాదు, అంత పల్చనా కాదు. మలిచినట్లు చిక్కని శరీరం. ఇంతెందుకూ, మగవాడన్నవాడు ఎలాంటి ఆడదాని కావాలని కోరుకుంటాడో అలాంటిదామె.

"కుమారుణ్ణి 'ధృష్టద్యుమ్నుడు' * అంది ఆకాశవాణి. కుమార్తెని 'కృష్ణ' అని పిలిచింది.

"స్వర్గం వాళ్ళో పడ్డట్టయింది ద్రుపదమహారాజుకి. లక్ష పాడి ఆవులూ దక్షిణ ఇచ్చాడు యాజుడికి. ఎంతోమంది బ్రాహ్మలికి సంభావనలూ అవీ ఇచ్చాడు. కొడుకుని ధనుర్వేదంలో అసమానుణ్ణి చేశాడు. కుమార్తెని అరిచేతి నిమ్మపండులా పెంచాడు. ద్రుపదుడి కూతురు గనక కృష్ణపేరు ద్రౌపది.

ద్రౌపదికి పెళ్ళీడు వచ్చిందిపుడు, ఇంతవరకూ అర్జునుడి కోసమనే అట్టేపెట్టా డామెని. కానైతే పాపం, పాండవులు లక్క ఇంట్లో కాలిపోయారు. ఈ వార్త విని స్వజనం కంటే హెచ్చుగా దుఃఖపడ్డాడు ద్రుపదుడు. 'అర్జునుడి కోసమనే అంతశ్రమా పడి అగ్నిగుండంలో కన్నాను అమ్మాయిని. పాడుదైవం నా నా భాగ్యం లేకండా చేశాడు. అతడికోసం నిశ్చయించిన దాన్ని మరొకడి కెలా ఇచ్చేది ?' అంటూ విచారంపెట్టుకున్నాడు. రాజపురోహితుడు వచ్చి ధైర్యంచెప్పేదాకా ఏదీ పాలుపోలే దతడికి.

"పాండవుల విషయంలో ఎన్నో శుభశకునాలు కనిపిస్తున్నాయి నాకు. ఏ ప్రమాదమూ జరగలేదు వాళ్ళకి. ఎక్కడో క్షేమంగానే వున్నారు. దేవేంద్రు డొకప్పుడు అజ్ఞాతవాసంలో

---

* ధృష్టము - ధీరత్వము, ద్యుమ్నము : ధనము. ధృష్టద్యుమ్నుడు : ధీరత్వమే ధనంగా కలవాడు.

వుండిపోయాను. ఉపశ్రుతి * మూలంగా బృహస్పతి అతడి ప్రనికి కనుక్కున్నాడని వేదాల్లో వుంది. ♦ నేనూ ఉపశ్రుతిని చూశాను. అంచేత నామాట నమ్మండి. పాండవులు బతికేవున్నారు. ఐతే, ఎక్కడ ఎలావున్నా వాళ్ళు ఇక్కడికి రావాలంటే, వొక్కటే ఉపాయం తడుతోంది, అదేమిటంటే, మన అమ్మాయికి స్వయంవరం చాటించడమే. స్వయంవరంలో కన్యాదానం రాజులికి రాసిపెట్టిందే కదా !' అంటూ చెప్పాడు పురోహితుడు.

"కొంత కుదుటపడ్డాడు మహారాజు. మంత్రులతోనూ వాళ్ళతోనూ ఆలోచించి మత్స్యయంత్రం తయారుచేయించాడు. ఆకాశమంత ఎత్తుని వొక బంగారంచేప తిరుగుతూవున్నట్టు పెట్టాడు. సామాన్యు డెవడూ ఎత్తలేందీ, ఎత్తినా ఎక్కుపెట్టలేందీ మాంచి దిట్టమైన ధనుస్సు చేయించాడు. దాంతో ఆ చేపని కొట్టాలి. అలా కొట్టినవాళ్ళకి కన్యాదానం చేస్తానని స్వయంవరం చాటించాడు ఇవాళకి రెండున్నర మాసా లుంది స్వయంవరం. పుష్యశుద్ధ పంచమి, రోహిణీ నక్షత్రంనాడు జరుగుతుంది. అందుకని ప్రపంచంలో వున్న రాజులు యావన్మందీ కాంపిల్యనగరానికి బయల్దేరు తున్నారు. ఇదీ కథ" అని చెప్పాడు.

పాంచాలానికి పయనం

అది విన్నప్పటి నించీ మనస్సు మనస్సులో లేదు పాండవులికి. ఎలాఐనా కాంపిల్యనగరం వెళ్ళాలి. కొడుకుల అభిలాష పసికట్టింది కుంతి. "ఎన్నాళ్ళో ఐపోయిం దిక్కడ, ఎంతకాల మిలా వుంటే మాత్రం ఏం లాభం? అదీకాక, పరాయి కొంపలో చిరకాలం వుండలేం కదా! దక్షిణపాంచాలంలో ధర్మం హెచ్చని వింటున్నాం. అడక్కుండానే అన్నం పెడతారట అక్కడ? పిండివంటలతో భిక్షం

* ఉపశ్రుతి . ఏదన్నా వొకటి భావిస్తూ వున్నప్పుడు హఠాత్తుగా వినపడేది.

♦ చూ ఉద్యోగపర్వం నహుషచరిత్ర

పెడతారట! రాజూ ధర్మం తప్పని పరిపాలన చేస్తున్నాడు. భిక్షాటనానికి ఒక చోటని నియమం లేదు కదా! కొన్నాళ్లు అక్కడికి వెళదాం పదండి. బతికుంటే - వూరు మనకి" అంది. తమ మనసులో మాటే తల్లీ చెప్పింది. అదే మంచిమాట అన్నారు కుమారుళ్ళు. ఇంటి బ్రాహ్మడి దగ్గిర సెలవు పుచ్చుకున్నారు. తిన్నగా పాంచాలానికి పయనం కట్టారు.

కొండలూ, ఏళ్ళూ, అడవులూ, చెరువులూ, దాని దాటుకుంటూ తల్లితోకూడా నడిచి వస్తున్నారు పాండవులు. సమయానికి వస్తానని శాలిహోత్రాశ్రమంలో లోగడ చెప్పాడు వ్యాసముని. అలాగే మార్గంలో ప్రత్యక్షమయాడు. పాదాభివందనం చేశారు పాండవులు. ఆశీర్వదించాడు వ్యాసుడు. "పాంచాలానికి బయల్దేరి మంచిపనే చేశారు" అన్నాడు. "ఈ సంగతి చెప్పడానికే వచ్చాను. ద్రౌపదికి స్వయంవరం చాటించాడు ద్రుపదుడు. ఈమె విషయంలో ఒక రహస్యం వుంది. వినండి. లోగడ ఒక కన్య వుండేది. దౌర్భాగ్యంవల్ల ఆమెకి భర్త దొరకలేదు. అందుకని ఆమె గొప్ప తపస్సు చేసింది. తపస్సుకి మెచ్చి శివుడు దర్శనమిచ్చాడు. 'ఏం కావాలో చెప్పు' అన్నాడు. ఆతురత కొద్దీ 'పతి, పతి, సతి, పతి, పతి,' అంటూ అయిదు మార్లంట ఆమె. 'తథాస్తు' అన్నాడు శివుడు. 'మళ్ళీ జన్మలో నీకు ఐదుగురు భర్తలవుతారు' అని చెప్పి అంతర్ధానమయాడు, అదే ఇప్పుడు ద్రౌపది ఐంది. అంచేత ఇది మనస్సులో వుంచుకోండి. నాకు తెలుసు, ధర్మరాజు వున్న చోట ధర్మహాని జరగదు. తిన్నగా కాంపిల్య నగరం వెళ్ళండి. శుభమే కలుగుతుంది మీకు. సందేహించకండి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

## అంగారపర్ణుడు

రాత్రింబగళ్ళు నడుచుకుంటూ పాంచాలం వెళుతున్నారు పాండవులు. ఒకనాడు అర్ధరాత్రి సోమశ్రవతీర్థంలో గంగవొడ్డుకి

వచ్చారు. అర్ధరాత్రయినా, అపరాత్రయినా గంగ తారసిస్తే స్నానం చెయ్యాలని శాస్త్రం. అంచేత తల్లీ, కుమారుళ్ళూ గంగాస్నానానికి సిద్ధపడ్డారు. వెలుతురుకోసం కొరకంచు పట్టుకుని, ముందు నడుస్తు న్నాడు అర్జునుడు. వెనక అన్నదమ్ములూ, తల్లీ వస్తున్నారు. హఠాత్తుగా ధనుష్టంకారం వినపడింది ఎదట.

ఆ సమయానికి గంగలో భార్యాజనంతో జలక్రీడ లాడు తున్నాడు గంధర్వుడు అంగారపర్ణుడు. పాండవులు వస్తూన్న చప్పుడు విని పైకి వచ్చాడు విల్లు చేత్తో పుచ్చుకుని ధనుష్టంకారం చేశాడు. "ఎవరది? తప్పుకువెళ్ళండి. ముందుఅడుగువేస్తే ప్రాణాలు దక్కవు" అంటూ గదమాయించాడు. "వేకువా, మునిమాపూ, అర్ధరాత్రీ — ఇవి భూతాలూ, యక్షులూ, రాక్షసులూ, గంధ ర్వులూ సంచారం చేసే సమయాలు. అందుకనే ఇలాంటప్పుడు బయట తిరగరు మనుష్యులు. మొండికెత్తి తిరిగారో, వాళ్ళు రాజు లయేదీ, రౌతులయేదీ ఎదటపడితే బతకనివ్వం. మీా రేదో తెలీక వచ్చినట్టున్నారు. ఈ వనం పేరు అంగారపర్ణ. గంగని ఇక్కడ అంగారపర్ణ అనే అంటారు. లోకమంతా ఎరుగునుకీమాట. నేనే అంగారపర్ణుణ్ణి. కుబేరుడు నా స్నేహితుడు. నేనే విహరిస్తూ వుంటా నిక్కడ. నా వనంలో అడుగుపెట్టేవాడూ, నా గంగలో మునిగిన వాడూ ఇంతవరకూ లేడు" అంటూ సాగదీశాడు.

"అసందర్భం" అంటూ మరో అడుగు వేశాడు అర్జునుడు. "అడవులూ, నదులూ అందరివీని. ఒక్కడివే ఎలా అవుతాయి? శివుడి జటాజూటంలో సుళ్ళుతిరిగి, హిమాలయం శిఖరంమీాంచి బయ ల్దేరి, భూమిమీాద పరవళ్ళుదొక్కి, సముద్రంలో కలుస్తోంది గంగా భవాని. ఇంతమేరా దీన్ని సేవించుకోవడానికి ప్రతీ ప్రాణికీ హక్కుంది అసలు, గంగ త్రిలోకపావని. స్వర్గంలో మందాకిని. భూలోకంలో గంగ. పాతాళంలో భోగవతి. మీా గంధర్వులూ, దేవతలూ, సిద్ధులూ మొదలైన వాళ్ళకి మందాకిని. నాగులకోసం

భోగవతి. మా మనుష్యులకోసం గంగ. ఇక్కడ స్నానానికే వచ్చాం మేము. గంగ మా జన్మహక్కు. నువ్వు వొద్దంటే మానే వాళ్ళం కాం. రాత్రిళ్ళు మనుష్యులు భయపడి బయట తిరగకన్నావు. అది చేతకాని పిరికివాళ్ళ సంగతి. వేళాపాళలతో పట్టింపు లేదు మాకు. అవసరమైతే నువ్వే తప్పుకోవాలి" అంటూ గంగతట్టు దారి తీశాడు.

"వద్దంటే వినవేం ?" అంటూ రథమెక్కి బాణాలు వెయ్యడం ఆరంభించుకున్నాడు అంగారపర్ణుడు. చేతి కొరకంచు తిప్పుతూనే అతడి బాణాలు అడ్డుకున్నాడు అర్జునుడు. "వెర్రివాడివి. నీ బాణాలికీ, మాయలికీ భయపడే వాళ్ళెవరిక్కడ? అస్త్రాలూ అవీ నాకు కొంచెం చేతనవును. ఎవళ్ళో పిరికివాళ్ళనుకుంటున్నావు గావును! ఇదిగో ఇది ఆగ్నేయాస్త్రం. ఇది అగ్నిదేవుడు మొదట బృహస్పతి కిచ్చాడు. అతను భరద్వాజుడి కిచ్చాడు. భరద్వాజుడు పరశురాముడి కిచ్చాడు. ఆయన ద్రోణాచార్యులి కిచ్చాడు. ఆచార్యులు నాకు ప్రసాదించారు" అంటూ అంగారపర్ణుడిమీద ఆగ్నేయాస్త్రం వేశాడు అర్జునుడు

అస్త్రం తగిలిందో లేదో, అమాంతంగా కాలి పోయింది గంధర్వుడి రథం. కంగారుపడి కింద పడిపోయాడు అంగారపర్ణుడు. చంగున వెళ్ళి జుత్తుపట్టుకున్నాడు అర్జునుడు. బరబరా ఈడ్చుకు వచ్చాడు అన్నగారి దగ్గిరికి.

మొర్రో మొర్రో మన్నారు అంగారపర్ణుడి ఆడవాళ్ళు. భయపడి పరిగెత్తుకు వచ్చింది అతడిభార్య కుంభీనసి "పతిభిక్ష పెట్టండి" అంటూ పాదాలమీద పడింది. జాలిగుండె ధర్మరాజుది. కనికరించాడు. "ఓడిపోయాడు. పౌరుషం, కీర్తి, రెండూ లేవిక. పోనీ, ఇంతతో వొదిలిపెట్టు. ఓడినవాణ్ణీ, చచ్చినవాణ్ణీ మళ్ళీ చంపడమెందుకూ ?" అన్నాడు. "బతికిపోయావు అంగారపర్ణా! వెళ్ళు అన్నయ్య అనుగ్రహించాడు" అంటూ వొదిలిపెట్టాడు అర్జునుడు.

"అంగారవర్ణుడు మరి లేడు" అంటూ నుంచున్నాడు గంధర్వుడు. "నీతో పోడిపోయాను మళ్ళీ ఆ పేరేమిటి నాకు? సిగ్గు. యుద్ధంలో ఓడిపోయాక మళ్ళీ అదే పేరుతో ఏ సభకి వెళ్ళినా నవ్వుతారు. నీ ఆగ్నేయాస్త్రంతో ఎలాగూ కాలిపోయింది నా రథం. ఐతే, గంధర్వమాయ వుండనే వుంది మాకు. నవ రత్నాలతో చిత్ర విచిత్రమైన రథం సృష్టించుకుంటాను. ఇవాళనుండీ చిత్రరథుడని పేరు పెట్టుకు బతుకుతాను.

"నీ పరాక్రమానికి జోహారులు. ఇంతటివాడివి. నీతో స్నేహం చెయ్యాలని వుంది నాకు. చాక్షుషీవిద్య * ఇస్తాను నీకు ఎంతో తపస్సువల్ల నాకు దొరికింది. పూర్వం మనువు చంద్రుడి కిచ్చాడిది. చంద్రుడి దగ్గిర గంధర్వరాజు విశ్వావసువు సంపాదించాడు. ఆయన నా కిచ్చాడు. చాక్షుషీ విద్యవల్ల మూడు లోకాల్లోనూ దేన్ని చూడా లంటే దాన్ని ఎప్పుడు కావలిస్తే అప్పుడు చూడవచ్చు ఇలాంటి విద్యలవల్లనే మేం మనుష్యుల కంటే గొప్పగానూ, దేవతలంటే లక్ష్యం లేకం డానూ జీవిస్తున్నాము. ఒకటి మాత్ర ముంది. నేర్చుకున్నా, ఆపాటి ఈపాటి వాళ్ళకి పనిచెయ్యదు చాక్షుషీ. నువ్వు సామాన్యుడివి కావు. తపతి వంశంలో పుట్టినవాడివి. మహాపురుషుడివి. నీదగ్గిర తప్పకండా ఫలిస్తుంది. ఐతే, ఇది పుచ్చుకున్నప్పుడు షాణ్మాసికవ్రతం – అంటే ఆరుమాసాలు వొంటికాలుమీద తపస్సు చెయ్యాలి. ఇది కాక, మీ ఐదుగురికీ వాయువేగ, మనోవేగాలతో పరిగెత్తే కామగమనం కల గంధర్వజాతి గుర్రాలు నూరేసి ఇస్తాను. లోగడ వృత్రాసురుడి నెత్తిమీద వజ్రాయుధంతో కొట్టాడు దేవేంద్రుడు. వజ్రం కంటే గట్టిది వాడి బుర్ర. ముక్క ముక్కలైందది వజ్రాయుధం. ఆ వజ్రం ముక్కలు వేదాలూ, ఆయుధాలూ, నాగలీ, శుశ్రూషా, వేగమూ, అయాయి. మొదటి

* టెలివిజన్ లాంటి దేమో!

రాలుగూ బ్రాహ్మణులూ మొదలయినవాళ్ళకి చెందాయి. వేగంమాత్రం గుఱ్ఱాలికి సంక్రమించింది. అంచేత రాజ్యాలుపాలించే రాజులికి గుఱ్ఱాలే ఉత్తమమైన సాధనాలు'' అన్నాడు.

"నీతో నేస్తం కట్టడం సంతోషమే నాకు. ఐతే, ఎంత ప్రశస్తమైనా విద్యా, శాస్త్రం, ధనం పైవాళ్ళనించి పుచ్చుకోను నేను'' అన్నాడు అర్జునుడు. "ఊరికే పుచ్చుకోవద్దు. దానికి బదులుగా ఆగ్నేయాస్త్రం అనుగ్రహించు'' అన్నాడు చిత్రరథుడు. "అలా ఐతే గుఱ్ఱాలుమాత్రం పుచ్చుకుంటాం. అంతా బావుంది, కాని గంధర్వుడివి నువ్వు. చూడగానే మనుష్యుల్ని పోల్చుకునే వుంటావు. మరి, అలా తిరగబడ్డావేం?'' అంటూ అడిగాడు అర్జునుడు.

"తెలియకేం నేస్తం, తెలుసు. మహారాజులు మీరు. మీ మహాగుణాలు మూడులోకాల్లోనూ మారుమ్రోగుతూనే వున్నాయి. నారదుడూ మొదలైన మహామునులూ, సిద్ధులూ, సాధ్యులూ చెపుతూనే వుంటారు. ప్రతిదినం వింటూనే వుంటాను. పాండవులంటే తెలీనివాళ్ళెవరు? ఐతే, ఏంచెయ్యనూ, ఎంతటివాడికైనా ఆడవాళ్ళు పక్కని వుండేసరికి బుద్ధి గడ్డితింటుంది. నా వాళ్ళతో జలక్రీడలో వున్నానాయె నేను. తిరగబడ్డా నంటే వింతేముంది? కామభోగాల్లో వున్నవాణ్ణి నేను. నువ్వో బ్రహ్మచారివి. అంచేతే అర్ధరాత్రయినా గెల్చుకన్నావు నన్ను. ఆడవాళ్ళతో వున్నవాడికి అపజయం తప్పదు.

"ఇంకో మాట, ఇంతవాళ్ళయినా అగ్నులూ అవీ లేవు మీకు. అదో కారణం నా మొండి సాహసానికి. రాజుకి పురోహితుడు ముఖ్యం. ధర్మదేవతా, వాయువూ, ఇంద్రుడూ, అశ్వినీ దేవతలూ—వీళ్ళ వరప్రసాదంవల్ల పుట్టినవాళ్ళు మీరు. పవిత్రమైన తపతివంశస్థులు. ధనుర్వేదం కడముట్టా చూసిన ద్రోణుడి శిష్యులు. ఇలాంటి మీకు పురోహితుడు లేకండా వుండడమేమిటి? వేదాలూ, వేదాంగాలూ తెలిసినవాణ్ణి, యాజ్ఞాలూ వాట్లో ఆరితేరిన వాణ్ణి,

ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ – ఈ నాలుగు పురుషార్థాలూ సాధించినవాణ్ణి, పవిత్రమైన ఆచారం కలవాణ్ణి, ముఖ్యంగా అబద్ధమాడనివాణ్ణి పురోహితుడుగా పెట్టుకోండి'' అంటూ సలహా ఇచ్చాడు చిత్రరథుడు.

"మంచిది. సరే కాని. మమ్మల్ని తపతివంశస్థులన్నావేమిటి? కౌరవవంశం మాది. పాండవులం. కుంతీదేవి కుమార్శ్ళం. మరి తపతి ఎవరట? అంటూ అడిగాడు అర్జునుడు.

త ప తీ సం వ ర ణు ల క థ

"అవును, కౌరవవంశమే మీది. ఐతే, కురుమహారాజు తల్లే తపతి. అంచేత తపతివంశస్థులున్నా మీరు, తాపత్యులు.

"తపతి సూర్యుడి కూతురు. సావిత్రీదేవి చెల్లెలు. ఐన ఆలస్యం అవనే అయింది. ఆమె కథ చెపుతాను. వినండి. చెక్కిన దంతపుబొమ్మలాంటి పిల్ల తపతి. బుద్ధిమంతురాలు. ఆమె యవ్వనవతి కావడం చూసి, తగిన వరుణ్ణి పెళ్ళిచెయ్యాలని సూర్యుడి ప్రయత్నం. ఇంతలో మీ హస్తినాపురంలో అజామీఢుడి కొడుకు సంవరణుడు సూర్యోపాసన ప్రారంభించాడు. కులానికి తగిన గుణం, గుణానికి తగిన రూపం, రూపానికి తగిన ప్రతాపం – అన్నీ వున్నాయి సంవరణుడికి. 'ఆకాశంమీద నేనెలా ప్రకాశిస్తున్నానో, భూమిమీద సంవరణుడలా ప్రకాశిస్తున్నాడు. ఇతడే తపతికి తగినవరుడు' అనుకునేవాడు సూర్యుడు. అతడి తపస్సునీ మెచ్చుకునేవాడు.

"ఒకనాడు వేటకి బయల్దేరాడు సంవరణుడు. ఎంతోదూరం అడివిలో తిరిగాడు. పరిగెత్తి పరిగెత్తి అలిసిపోయింది అతడి గుర్రం. మేతలేదు. తాగడానికి నీళ్ళుసహా దొరకలేదు. చివరికి పడిపోయింది. మరుక్షణంలో ప్రాణం వొదిలిపెట్టింది.

"కాలినడకని దారివెదుక్కుంటూ వస్తున్నాడు సంవరణుడు. ఒక కొండపక్కని యవ్వనవతియైన వొక అమ్మాయి కనపడింది. పుటంపెట్టిన బంగారంలా వుంది ఆమె శరీరం. ఆ కాంతికి చుట్టు

క్కల చెట్టుచేమలు బంగారం పూత పోసినట్టున్నాయి. చకితు
యాడు సంవరణుడు. బొమ్మలా కదలకండా నుంచుండిపోయాడు.

"ముల్లోకాల మహాలక్ష్మి ఒంటరిగా అడివిలోకి వచ్చిందా!"
అనుకున్నాడు. 'సూర్యుడి తేజస్సుగాని భూమినీ దికి దిగలేదు
దా! ఉన్న అందమంతా ఈ పిల్లమీదే ఒలకపోసినట్టున్నాడు
బ్రహ్మదేవుడు! ఈ వుంగరాలజుత్తూ, ఈ బెదురుకళ్ళూ, ఈ
దొండపండుపెదవీ, మొహం తీరూ - అబ్బా, నే నెరిగినంతవరకూ
చూడలేదు; వినలేదు. అప్సరసా! యక్షులపడుచా? సిద్ధుల
పిల్లా? ఇంత అందంగా వుంది! దేవకన్యే. సందేహం లేదు.
దేవతాస్త్రీ అన్నా ఇంత అందంగా వుంటుందా అంటా! ఈమె శరీరం
అంటిపెట్టుకోవడానికి ఈ వస్తువు లెంత భాగ్యంచేశాయో!'

"మంత్రించినట్టు చూస్తున్నాడు సంవరణుడు. రెండుకళ్ళూ
ఆమె అవయవాలికే అప్పగించాడు. వెళ్ళిన చూపులు వెనక్కి
మరలడం లేదు. తన మనస్సు తన స్వాధీనంలో లేదు. తుదకి సాహ
సించాడు. 'అడివిలో ఒంటరిగా వున్నావు; ఎవరు పిల్లా, నువ్వు?'
అంటూ ఒక అడుగు ముందుకి వేశాడు.

"అడుగుతీసి అడుగు వేశాడో లేదో - మేఘంలో మెరుపు
లాగ - చప్పున మాయమైపోయింది అమ్మాయి. ఒక్కసారి
ప్రపంచం మునిగిపోయినట్టయింది సంవరణుడికి. అంత మహారాజూ
ఆపుకోలేకపోయాడు. ఆమె నుంచున్న చోటు చేతులతో తడుముతూ
ఏడవడం మొదలుపెట్టాడు.

"నవమన్మథుడిలా వున్న సంవరణుణ్ణి చూసి అమ్మాయి
మనస్సూ అలాగే వుంది. అతడి దైన్యంచూసి మళ్ళీవచ్చి అతడి
ఎదట నుంచుంది. 'ఇంత మోహపడిపోయారేం?' అంది మృదు
వుగా. ఆ పలుకుల్లో అమృతం ఒలుకుతూవుంది. ఆ కంఠంలో
వీణ పలుకుతూ వుంది. ఆ చూపుల్లో ప్రణయం కులుకుతూ వుంది.
'దేవుడికి భయపడనివాణ్ణి. నీ ముందు లొంగిపోయాను. ప్రాణాలు

నావిగా లేవు. అనుగ్రహించు. గాంధర్వవివాహం చేసుకుందాం. నన్ను వరించు' అంటూ మోకరించాడు సంవరణుడు.

"నేను కావాలంటే మా నాన్నగారి నడగాలి.' అంది ఆమె. 'తండ్రిచాటుపిల్లకి స్వాతంత్ర్యం లేదుకదా ! సూర్యుడు మా నాన్న. సావిత్రి మా అక్కయ్య. తపతి అంటారు నన్ను. దేవకన్యని. నా మీద ప్రేమే వుంటే నాన్నగారిని ప్రార్థించండి ఆయన తప్పక అంగీకరిస్తారు' అంటూ చెప్పి తిన్నగా సూర్యలోకానికి వెళ్ళిపోయింది తపతి.

"ఎడబాటు సయించలేకపోయాడు సంవరణుడు. హృదయం పగిలిపోతూ వుంది. మూర్ఛపోయాడు. ఇంతలో మంత్రులూ వాళ్ళూ వెదుక్కుంటూ వచ్చారు. నీళ్ళూ అవీ చల్లి ఉపచారాలు చేశారు. తెలువుకున్నాడు రాజు. కాని తే ఇంటికి వెళ్ళలేదు మరి. ఆ కొండ మీదే వుండి సూర్యుణ్ణి ఆరాధించడం ఆరంభించాడు. తన పురోహితుడు వశిష్ఠుణ్ణి తలంచుకున్నాడు.

"అపరబ్రహ్మలాంటివాడు వసిష్ఠముని. రాగం, కోపం, భయం ఇవేవీ లేవాయనకి. రాజు తలుచుకున్న పన్నెండోనాటికి వచ్చి చేరుకున్నాడాయన. చూశాడు. వ్రతాలూ, ఉపవాసాలూ చేస్తూ శల్యావశిష్టంగా వున్నాడు మహారాజు. యోగదృష్టితో అంతా తెలుసుకున్నాడు ముని. తపతి కావాలి సంవరణుడికి. బయల్దేరాడు సూర్యమండలానికి. లక్ష యోజనాలు వెళ్ళి సూర్యుణ్ణి కలుసుకున్నాడు. వేదమంత్రాలతో అతణ్ణి ప్రార్థించాడు. సూర్యుడు ప్రసన్నుడై ఋషిని గౌరవించాడు. అతడు వచ్చిన కారణం విచారించాడు.

"అమ్మాయి తపతికి సంబంధం తీసుకువచ్చాను" అన్నాడు వశిష్ఠుడు. 'పూరువంశంశిరోమణి, బుద్ధికి బృహస్పతి, ధర్మమూ అర్థమూ తెలిసిన గుణవంతుడు. అన్నివిధాలా అమ్మాయికి తగిన వరుడు. అజామీఢుడి కుమారుడు సంవరణుడు. కూతుళ్ళు కన్న

ఫలం, మంచి వరుడికి పెళ్ళి చెయ్యడమే కదా!' అన్నాను. 'అవును అమ్మాయికి తగినవాడు సంవరణుడే అని నేనూ అనుకుంటూ వచ్చాను. మంచిది. తీసుకువెళ్ళు' అంటూ కూతుర్ని మునివెంట పంపాడు సూర్యుడు.

"నిమిషానికి ఒక లక్షా నూటా అరవైనాలుగు యోజనాలు వెళుతుంది సూర్యుడి రథం * అంత వేగంతోనూ సూర్యుడి వెంట వెళ్ళి, తపతిని తీసుకువచ్చాడు వశిష్ఠుడు శాస్త్రోక్తంగా సంవరణుడికి వివాహం చేశాడు. ఇక్కడ చెప్పవచ్చిందేమిటంటే, సమర్థుడైన పురోహితుడే వుంటే ఎంతయినా సాధించవచ్చు.

"కోరినకన్య దొరికింది సంవరణుడికి. ఇహ ప్రపంచంతో సంబంధం లేకపోయింది. ఇరవైనాలుగు గంటలూ తపతే వుండాలి పక్కని. రాజ్యమూ, ప్రజలూ వూసే వొదిలిపెట్టాడు. అడవుల్లోనూ, కొండలమీదా ఆమెతో కామక్రీడల్లో మునిగి తేలుతున్నాడు. ఇలా పన్నెండేళ్ళు గడిచాయి.

"రాజులేక అరాజకమైంది దేశం. ధర్మం నశించింది. అనావృష్టి పట్టుకుంది. పంటలు పాడయాయి. కరువూ, కాటకాల్తో మాడిపోయారు ప్రజలు. మళ్ళీ పరిగెత్తుకు వచ్చాడు వశిష్ఠుడు. రాజుని ప్రబోధించి రాష్ట్రానికి తీసుకు వచ్చాడు. శాంతి, పౌష్టిక కర్మలు చేయించాడు. ప్రజల్లో శాంతి ఏర్పడింది. సకాలంలో వానలు పడ్డాయి. పుష్కలంగా పంటలూ పండాయి. తపతి

* అచ్చయిన నన్నయభారతం అనేక ప్రతుల్లో సూర్యరథం నిమిషానికి వొకలక్షా నూటా అరవైనాలుగు యోజనాలు వెళుతుంది అని వుంది. కాని కీ|| శే|| మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు పరిష్కరించిన ప్రతిలో (విశాఖపట్నం ఎస్. ఎస్. ఎమ్. ప్రెస్సులో 1923 లో అచ్చయింది) పాఠాంతరం కింద నిమిషార్థంలో రెండువేల యోజనాలు వెళుతుంది అని వుంది. ఇదే సరయిందనీ, కాంతి ప్రయాణం లెక్కకి ఇది సరిపోతుందనీ మిత్రులు 'శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు తెలుపుతున్నారు.

గర్భంలోనే మీ కౌరవవంశం మూలపురుషుడు కురుమహారాజు పుట్టాడు'' అన్నాడు. *

"ఐతే, మా పూర్వుల పురోహితు డన్నమాట వశిష్ఠముని!'' అన్నాడు. అర్జునుడు. "సూర్యుడి రథంతో సునాయాసంగా ప్రయాణించినవాడు ఎంత గొప్పవాడో ఆయన! ఆ మహాత్ముడి మహిమ వినాలనిపిస్తోంది'' అన్నాడు.

వశిష్ఠుడూ — విశ్వామిత్రుడూ

"వశిష్ఠముని మహిమ చెప్పడానికి నే నెంతవాణ్ణి!'' అన్నాడు చిత్రరథుడు. "తమ పూర్వపుణ్యంవల్ల అతణ్ణి పురోహితుడిగా చేసుకుని మహారాజ్యాలు పాలించారు ఇక్ష్వాకవంశం మహారాజులు. ఎన్నో మహాయజ్ఞాలూ చేశారు. కామ క్రోధాలు రెండూ జయించాడాయన. అవి తన కాళ్ళు గుద్దుతా యంటే నమ్ము.

"ఓ సారి విశ్వామిత్రుడు విరోధం పెట్టుకుని అతడి కుమాళ్ళని చంపేశాడు. ఐనా తొనకలే దతడు. కావాలంటే యమలోకంనుండి మళ్ళించి తేగలడు కుమాళ్ళని. ఐనా, గట్టుదాటని సముద్రంలా కట్టుబడ్డాడు విధికి. అలాంటి మహాముని వశిష్ఠుడు. అతడివిషయం చెప్పడమంటే, ఎన్నినోళ్ళు కావాలి!'' అన్నాడు.

"విశ్వామిత్రుడికీ, వశిష్ఠుడికీ విరోధం దేనికి!'' అంటూ తిరిగి ప్రశ్నించాడు అర్జునుడు. "అదో పెద్ద కథ'' అంటూ మళ్ళీ అందుకున్నాడు గంధర్వుడు.

"కన్యాకుబ్జ నగరానికి రాజుగా వుండేవాడు విశ్వామిత్రుడు. తన ప్రతాపంతో శత్రువన్నవాడు లేకండా చేసుకున్నాడు. ఎదురు లేకండా రాజ్యం పరిపాలిస్తూ వుండేవాడు. ఒకనాడు వేటకని పెద్ద సైన్యం వేసుకు బయల్దేరాడు. అడివిలో వేటాడి వేటాడి అలిసి

---

* అప్పటి పాంచాలం రాజు దుర్ముఖుడు సంవరణుణ్ణి వోడించాడట. సంవరణుడు సింధుతీరానికి పారిపోయి, వశిష్ఠుడి సహాయంతో తిరిగి రాజ్యం సంపాయించాడని ఐతరేయ బ్రాహ్మణం.

పోయాడు. తిరిగి తిరిగి వశిష్ఠుడి ఆశ్రమం చేరుకున్నారు రాజూ, పరివారమున్నూ. సగౌరవంగా స్వాగతంచెప్పాడు వశిష్ఠుడు. రాజుకీ, సేనకీ ఇష్టంవచ్చిన భోజనాలు కురిపించమని తన హోమధేనువు నందిన్ని నియోగించాడు. క్షణంలో కావలిసినవన్నీ సిద్ధం చేసింది నందిని. నేయి నదులై పారింది. పెరుగు కాలువలు కట్టింది. అన్నం పర్వతాల్లా కుప్పలుపడింది. నవరసాలతో నిండిన ఎన్నో రకాల కూరలూ, పిండివంటలూ రాసులై పడ్డాయి. తృప్తికరంగా భోజనాలుచేసి లేచారు రాజూ పరివారమున్నూ. వాళ్ళ సంతోషం చెప్పతరం కాదు.

"ఆశ్చర్యపోయాడు విశ్వామిత్రుడు. అతడి కళ్ళన్నీ నందిని మీదే వున్నాయి. 'మృదువైన రోమాలు. మొగ్గలాంటి చెవులు. మెత్తటి పెద్ద పొదుగు. పొడవయిన శిరాలు. చిన్న చిన్న కుదురైన కొమ్ములు. చంద్ర బింబంలాంటి తెల్లటి శరీరం. ఎంత అందంగా వుందో! మునికి పెన్నిధిలా దొరికిందీఆవు' అనుకుంటూ గుటకలు వేస్తున్నాడు. ఎలా ఐనా కాజెయ్యాలి దాన్ని. మెల్లగా మునిదగ్గిర కూచున్నాడు. 'దీనికంటే మంచివి లక్ష ఆవులిస్తాను. కావాలంటే నా రాజ్యమే ఇచ్చేస్తాను. ఈ ఆవు నా కిచ్చెయ్యి' అన్నాడు

"ఈ ఒక్కగోవుకి అన్ని ఆవులూ, అంత రాజ్యమూనా? అంటూ నవ్వాడు వశిష్ఠుడు. 'దీనితోనే ఏదో నేను దేవతల్నీ, పితృదేవతల్నీ, అతిథుల్నీ తీడనకండా తృప్తిపరుస్తున్నాను. దీన్ని పెంచేసరికే నా పనైపోతూ వుంది. అన్ని ఆవులు ఎక్కడ పెట్టు కునేది? ముక్కు మూసుకు తపస్సు చేసుకునేవాళ్ళకి మాకు రాజ్యాలుమాత్ర మెందుకు? ఏదో, నాకే వుండనీ దీన్ని. ఇతర్లకి ఇచ్చేది కాదిది!" అంటూ నిరాకరించాడు.

"కొండంత ప్రభువు కోరుతూవుంటే కాదంటా డేమిటి బ్రాహ్మడు!" అనుకున్నాడు విశ్వామిత్రుడు. 'నేను రాజుని. రక్షించగలను, శిక్షించా గలను. బ్రాహ్మడివి. నువ్వు చేసే దేమిటి?

పోనీ అని లక్షఆవులు ఇస్తానన్నాను. కాదు పొమ్మంటున్నావు. ఏమైనాసరే, దీన్ని తోలుకుపోతాను నేను' అంటూ బలవంతాన ఆవుని తోలుకు పదండన్నాడు సైనికుల్ని.

"అవుననూ, కాదనూ అనకండా వూరికే చూస్తూ కూచున్నాడు ముని. కంచే చేనుమేస్తే చేసేదేముంది! సైవాళ్ళ బాధలేకండా కాపాడవలిసినవాడు రాజు. అతడే దోపిడికి నెట్టుకుంటే ఇహ దిక్కేముంది!

"నందిని పట్టుకోవడానికి శాయశక్తులా ప్రయత్నించారు సైనికులు. లాభంలేకపోయింది. పట్టుబడలేదు ఆవు. కర్రలతోనూ, కొరడాలతోనూ బాదారు. ఐనా ప్రయోజనం లేకపోయింది. అరుచుకుంటూ వసిష్ఠుడి దగ్గిరికి వచ్చేసింది. 'నన్నిలా కొడుతూ వుంటే వూరుకున్నారేం? అంటూ బావురు మంది, 'ఈ కిరాతుల చేతిలో నన్ను పెట్టేశారా? ఇది ధర్మమేఅని తోచిందా?' అంది. పలుకూ, వులుకూ లేదు ముని. చూస్తూ కూచున్నాడు.

"ముని భావం గ్రహించింది నందిని. తన దూడని పట్టుకో బోతున్నారు సైనికులు. కోపంతో బుసకొడుతూ పరిగెత్తింది వాళ్ళమీదికి. ఎండాకాలం నడినెత్తి సూర్యబింబంలా చూడ శక్యం కాకండా వుంది దాని శరీరం. ఒక్కసారి వొళ్ళు దులిపింది. నిప్పులవర్షం కురిసింది. భయంకరంగా వుంది. తోకలోంచి వేలాది శబరులు పుట్టుకువచ్చారు. పేడలోంచీ, మూత్రంలోంచీ శకులూ, యవనులూ, పౌండ్రులూ, పుళిందులూ, ద్రవిళ్లూ, సింహళులూ పుట్టారు. నోటి నురుగులోంచి దరదులూ * బర్బరులూ వేలూ, లక్షలూ పుట్టుకువచ్చారు. రాజుసైన్యం కంటే ఐదింతలు సేన తయారైంది. అదంతా వెళ్ళి విశ్వామిత్రుడి సైన్యంమీద విరుచుకు పడింది. తుక్కుతుక్కుకింద కొట్టి మూడు యోజనాలు వెంట తరిమి మరీ విడిచిపెట్టింది. పిక్కబలం చూపింది విశ్వామిత్రుడిసైన్యం.

---

* దరదులు : కాశ్మీర ప్రాంతంలోని అడవిజాతివాళ్ళు.

"ఏంముంగిక! తెల్ల మొహం వేశాడు విశ్వామిత్రుడు. 'తపోబలం ముందు క్షాత్రబలం దిగదుడుపు' అనుకున్నాడు రాజ్యమూ, సంపదా భోగాలూ — అన్నీ వొదిలిపెట్టేశాడు. అడవులికీ, పర్వతాలమీదికీ వెళ్ళి ఉగ్రమైన తపస్సు చేశాడు. తపోబలంవల్ల సకలసంపదలూ, సర్వసిద్ధులూ పొందాడు. చివరికి బ్రహ్మర్షి అయ్యాడు. వసిష్ఠుడి మీద కక్ష తీర్చుకోవాలనే ఇంతా చేశాడు విశ్వామిత్రుడు.

కల్మాషపాదుడి కథ

"ఆ దినాల్లో సూర్యవంశంలో కల్మాషపాదు డని వొకరాజు వుండేవాడు. అతడి కుల పురోహితుడు వసిష్ఠముని. వశిష్ఠుడిమీద కక్షసాధించా లని కల్మాషపాదుడి దగ్గిర యాజకత్వానికి ప్రవేశిం చాడు విశ్వామిత్రుడు. అదును కనిపెట్టి అతడిమీద దెబ్బతీయాలి. అదీ అతడి అభిప్రాయం.

"ఒకనాడు కల్మాషపాదుడు వేటకి వెళ్ళాడు. వేటాడి వేటాడి విశ్రాంతికని వసిష్ఠముని ఆశ్రమానికి బయల్దేరాడు. వసిష్ఠుడికి నూరుగురు కుమాళ్ళు. పెద్దవాడు శక్తిముని దాగ్లో కల్మాషపాదుడికి ఎదురయ్యాడు. రాజ్య గర్వంవల్ల ఎవళ్ళనీ లక్ష్యపెట్టేవాడు కాడు కల్మాషపాదుడు. ఎదురుగా వస్తూన్న శక్తిని చూసి 'తప్పుకోవేం ?' అంటూ గదమాయించాడు. 'నేను కాదు, నువ్వే తప్పుకోవాలి' అన్నాడు శక్తి. 'ఎంతటి మహారాజులైనా రుషులు ఎదురుపడితే విన యంగా కోరి తప్పుకుంటారు. అలాంటిది నువ్వేదో నన్ను తప్పుకో మంటూ వేమిటి ?' అన్నాడు.

"చర్రుమంది కల్మాషపాదుడికి. చేతి కొరడాతీసి వొకట్టి వేశాడు. 'అకారణంగా రాక్షసుడిలా కొట్టావునన్ను. రాక్షసుడివై నరమాంసం తింటూ బతుకు' అని శపించాడు శక్తి. అప్పటికి కళ్ళు తెరిచాడు కల్మాషపాదుడు. శాపం పెట్టినవాడు శక్తి అనీ, వసిష్ఠుడి కుమారుడని తెలుసుకున్నాడు. కాళ్ళావేళ్ళా పడ్డాడు. క్షమించమని బతిమాలాడు. శాపం తప్పే మార్గం ప్రసాదించమన్నాడు.

"ఇంతలో విశ్వామిత్రుడు వచ్చా డక్కడికి. వశిష్ఠుణ్ణి దెబ్బ తీయడానికి ఇదో అవకాశ మనుకున్నాడు. ఎవ్వరికీ కనపడకండా నుంచున్నాడు. కింకరుడని వొక రాక్షసుణ్ణి సృష్టించాడు. కల్మాష పాదుడి హృదయంలో ప్రవేశపెట్టాడు. దాంతో వొళ్లుమరిచి పోయాడు కల్మాషపాదుడు. శాపం విరుగుడుమాట మరిచిపోయి వెళ్ళిపోయాడు. అప్పటినించీ సగం మనిషీ, సగం రాక్షసుడూ — ఇలా వుండేవాడతడు. కింకరుడు ఆవేశించేసరికి రాక్షసకృత్యాలు ప్రారంభించేవాడు. ఆ ఆవేశం కాస్త తగ్గినప్పుడు రాజ్యవ్యవహారాలు విచారించేవాడు.

"ఒకనాడు వొక బ్రాహ్మడు వచ్చాడు. 'ఆకలిగా వుంది. మాంసంకూరతో అన్నం పెట్టించండి' అంటూ కల్మాషపాదుణ్ణి కోరాడు. 'సరే, ఉండు' అన్నాడు కల్మాషపాదుడు అంతః పురంలోకి వెళ్ళి ఆ మాటే మరిచిపోయాడు. అర్ధరాత్రపుడు జ్ఞాపకం వచ్చింది. చప్పున వంటవాణ్ణి పిలిచాడు. 'నే నొక బ్రాహ్మడికి భోజనం పెడతాను వుండమన్నాను. మరిచిపోయాను. కని పెట్టుకు వుంటాడు పాపం. వెళ్ళు, వెంటనే మాంసంకూరతో భోజనం పెట్టు వాడికి' అన్నాడు. అర్ధరాత్రి, మాంసం ఎలాదొరుకుతుంది ?' అన్నాడు వంటలవాడు. అంతలోనే కింకరుడు ఆవేశించాడు రాజుని. 'తప్పుచేసేవాళ్ళని మనం తలకొట్టేస్తామే — వధ్యస్థానం — అక్కడికి వెళ్ళు. మనిషిమాంసం దొరుకుతుంది. అది వండిపెట్టు బ్రాహ్మడికి' అన్నాడు. రాజాజ్ఞ, కాదంటే తల ఎగిరి పోతుంది. చెప్పినట్టు చేశాడు వంటవాడు. మనిషిమాంసం వండి బ్రాహ్మడికి భోజనం పెట్టాడు. రెండు ముద్దలు తిన్నాడో లేదో తెలిసిపోయింది బ్రాహ్మ డికి. 'తినరాని తిండి నరమాంసం పెట్టావు. రాక్షసుడివై పోవాలి నువ్వు' అంటూ శాపం పెట్టాడు రాజుకి.

"శక్తి శాపమూ, ఈ బ్రాహ్మడి శాపనార్థాలూ అన్నీ కలిశాయి. దాంతో రాక్షసుడే అయిపోయాడు కల్మాషపాదుడు. దానికితోడు

శ్వామిత్రుడి కింకరుడు ఆవేశిస్తూనే వున్నాడు ముందు శక్తి ముని దగ్గిరకే పరిగెత్తాడు కల్మాషపాదుడు. 'నువ్వే – నువ్వే నన్ను రాక్షసుణ్ణి చేశావు నరమాంసం - అవును, నరమాంసం తింటూ బతకమన్నావు. బలేపని చేశావు అందుకని తొలిముద్ద, నిన్నే మింగుతాను' అని అమాంతంగా మీదపడ్డాడు. అతణ్ణి విరునుకు తినేశాడు.

"విశ్వామిత్రుడి ప్రయోగంవల్ల ఇలాగే వశిష్ఠుడి వందమంది కుమాళ్ళనీ మింగేశాడు కల్మాషపాదుడు. కక్ష సాధించాడు విశ్వామిత్రుడు. అంత తపశ్శాలిన్నీ దుఃఖంతో కుంగిపోయాడు వశిష్ఠుడు. బతుకే దుర్భర మనిపించింది. చివరికి ఆత్మహత్యకి నెట్టుకున్నాడతడు. అగ్గిలో వురికాడు. మంచులా చల్లబడిపోయింది అగ్గి. మెడకి బండ కట్టుకుని సముద్రంలో పడ్డాడు. కెరటాల చేతులతో వొడ్డుకి తెచ్చి వొదిలింది సముద్రం. మేరుపర్వతంమీంచి కిందికి దూకాడు. దూదికుప్పలా దెబ్బతగలకండా అయాయి కొండపణుకులు. పెద్ద పెద్ద మొసళ్లున్న వొక నదిలో పడ్డాడు. నూరు పాయలై మొరకవేసింది నది. శతద్రు అని పేరువచ్చింది దానికి. కాళ్ళూ చేతులూ తాళ్ళతో కట్టుకుని మరో నదిలో గెంతాడు. పాశాలు విప్పి వొడ్డుకి చేర్చింది నది. అంచేత విపాశ అని పేరు వచ్చింది దానికి.

"ఏం చేసినా చావు ముట్టలేకపోయింది వశిష్ఠుణ్ణి. చేసేది లేక ఆశ్రమానికి వచ్చేస్తున్నాడతడు. చూసి, వెనకాలే వస్తోంది, తన కోడలు–శక్తి భార్య అదృశ్యంతి. నిండుచూలాలుగా వుందామె. షడంగాలతో వేదధ్వని వినపడుతోంది ఆమె గర్భంలోంచి. చెవిలో అమృతం పోసినట్టయింది మునికి. సరిగ్గా పెద్దకొడుకు శక్తి గొంతుక అది. శక్తి చదివినట్టే సువ్యక్తంగానూ సరళంగానూ వుంది. చకితుడయాడు ముని. తన్ను తానే సమాళించుకున్నాడు. కోడలి కడుపులో కుమారుడున్నాడు. ఎల్లప్పుడూ వేదం చదువుతూ వుండేవాడు శక్తి. అది వింటూ కడుపులో పెరిగాడు

వీడు వేదాలూ, వేదాంగాలూ సమా స్తమూ నేర్చుకున్నాడు మనమడి మొహం చూసన్నా దుఃఖం మరుస్తాను'అంటూ తలవూపాడు అంతతో చచ్చిపోదా మన్న ప్రయత్నం వొదులుకున్నాడు. ఆది శేషుడుగానే భూభారం నెత్తిని భరించినట్టు పుత్రశోకం గుండెల్లో భరించాడు వశిష్ఠముని.

"మళ్ళీ వొకనాడు ఆశ్రమం కాసి వస్తున్నాడు కల్మాష పాదుడు. రౌద్రాకారంగా వున్నాడు రాక్షసుడు. చూసి, కెవ్వున కేక వేసింది అదృశ్యంతి. భయపడ కన్నాడు వశిష్ఠుడు. హుంకారం చేసి నిలబెట్టాడు. రాక్షసుణ్ణి. కమండలంలోంచి మంత్రించిన నీళ్ళు తీశాడు. రాక్షసుడిమీాద చల్లాడు. క్షణంలో శాపంవదిలింది కల్మాష పాదుడికి. పన్నెండేళ్ళు రాక్షసుడై తిరిగాడీ. వశిష్ఠుడి అనుగ్రహం వల్ల మళ్ళీ మామూల్మాలు మనిషయాడు. పూర్వస్మృతి లేచివచ్చింది. నిద్రలోంచి లేచినట్టయింది అతడికి

"రెండుచేతులూ నడినెత్తిని జోడించాడు కల్మాషపాదుడు. 'మీా దయవల్ల శాపం వొదిలింది. బతికిపోయాను ఆశీర్వదించండి' అంటూ ప్రార్థించాడు. 'ఇకనైనా బుద్ధికలిగి వుండు' అంటూ దీవించాడు ముని. ఎంతో ఇదయిా బతిమిలాడీ వశిష్ఠుణ్ణి అయోధ్యా పట్టణం తీసుకువచ్చాడు కల్మాషపాదుడు. అతడి మాట జవదాటకండా యథాపూర్వంగా రాజ్యపాలనం ప్రారంభించాడు.

"కల్మాషపాదుడు రాక్షసుడుగా వున్నప్పుడు ఇంకో విశేషం జరిగింది. ఆకలితో వొకనాడు అడివిలో తిరుగుతున్నా డతడు. భార్య మదయంతి కూడా వెంట వుంది. ఒకచోట వొక బ్రాహ్మడూ, అతడి భార్యా సంభోగస్థితిలోవున్నారు. చూసి, మీాద పడ్డాడు కల్మాషపాదుడు. బ్రాహ్మణ్ణి పట్టుకు తినేశాడు. కుయ్యో మొర్రో మంది బ్రాహ్మడిభార్య అంగీరసి. 'మా సంతానయత్నం భంగంచేశావు. నా భర్తనీ భక్షించావు. పతివ్రతని, నా మంగళ సూత్రం మంటగలిపావు. దిక్కులేనిదాన్ని చేశావు. నువ్వూ నీ

భార్యతో సంభోగంలో వున్నప్పుడు ఫెళ్ళుమని పేలిపోతావు' అంటూ శాపనాకారాలు పెట్టింది. 'వంశంలో దీపం లేకండా చెయ్యకు పుత్ర భిక్ష పెట్టు' అంటూ కాళ్ళమీద పడింది మదయంతి. 'వశిష్ఠుడివల్ల కొడుకు పుడతాడు' అంది అంగీరసి. భర్తవియోగం భరించలేక చివరికి అగ్గిలోపడి ప్రాణాలు వొదిలిందామె.

ఈ విషయం కల్మాషపాదుడు మనిషయ్యాక చెప్పింది మదయంతి. సంతానం కనే యోగ్యత తనకి లేకపోయిందే అని దుఃఖపడ్డాడు కల్మాషపాదుడు. సంతానంలేందే సద్గతి లేదు. వశిష్ఠుణ్ణి ప్రార్థించాడు. ఋతుస్నానంచేసి సిద్ధంగా వుంది మదయంతి. తీసుకువెళ్ళి మునికి సమర్పించాడు. మదయంతికి గర్భాదానంచేసి ఆశ్రమానికి వెళ్ళిపోయాడు ముని. *

"పన్నెండేళ్ళు గర్భంమోసింది మదయంతి. విసిగిపోయింది. చివరికి వొక అశ్మశకలంతో—అంటే రాతిముక్కతో కడుపు చీల్చుకుంది. మాంచి తేజశ్శాలి వజ్రంలాంటి కొడుకు పైకివచ్చాడు. అశ్మశకలంతో పుట్టడంచేత అశ్మకుడు అన్నా రతణ్ణి. ♦

"అక్కడ వశిష్ఠాశ్రమంలో అదృశ్యంతికి పరాశరుడు పుట్టాడు. మనమడి జాతకర్మలూ అవీ సక్రమంగా జరిపాడు వశిష్ఠుడు. పెరిగి ప్రయోజకుడౌతున్నాడు పరాశరుడు. తన తండ్రిని రాక్షసుడు

---

* స్కాందపురాణం, విష్ణుపురాణాల్లో కల్మాషపాదుడి కథ కొంత తేడాతో కనిపిస్తుంది. మిత్రసహుడనీ, సౌదాసుడనీ ఇతడి పేర్లు. ఇతడు నలుడి సమకాలికుడయిన ఋతుపర్ణుడి మనుమడని భాగవతం. మునిమనుమడని విష్ణు, బ్రహ్మాండపురాణాలు. రఘువు కొడుకు ప్రవృద్ధుడే కల్మాషపాదుడని వాల్మీకి రామాయణం. అశ్వమేధ పర్వంలోని ఉదంకుడి కథలో ఉదంకుడు గురుదక్షిణ కోసం ఇతడిదగ్గిరికే వెళ్ళి, ఇతడి భార్య మదయంతి కుండలాలు కోరినట్టుంది

♦ అశ్మకుడి కొడుకు మూలకుడు, పరశురాముడు రాజుల్ని చంపినప్పుడు దిసమొలతో వున్న స్త్రీలు మూలకుడి చుట్టూ వుండి పరశురాముడు చంపకుండా అతణ్ణి రక్షించారట. అంచేత మూలకుణ్ణి నారీకవచుడనీ అన్నారు. వి. పు. 4 ఠ. బ్రహ్మాండపురాణం.

తినేశాడని వొకనాడు తల్లివల్ల విన్నాడు. దుఃఖంతోనూ, కోపం తోనూ దహించుకుపోయిం దతడి హృదయం. తన తపశ్శక్తితో లోకసంహారం చేస్తానని భీష్మించుకు కూచున్నాడు.

## ఔ ర్వ డి క థ

" 'చంపినవాడు రాక్షసుడైతే లోకం తప్పేం వచ్చింది !' అంటూ, కూడదన్నాడు వశిష్ఠుడు. 'ఆ ఔర్వుడూ నీ లాగే తొందరపడ్డాడు. వేదాల్లో వున్న కథ అది. చెపుతాను విను. అది వింటే నువ్వు చెయ్యవలిసిం దేమిటో నీకే బోధపడుతుంది. ఆ రోజుల్లో కృతవీర్యుడు అని వొక రాజు వుండేవాడు. భృగువంశస్థులైన భార్గవులు పురోహితులుగా వుండే వారతడికి. ఎన్నో యజ్ఞాలూ అవీ చేసి లెక్కలేనంత ధనం వాళ్ళకిచ్చాడు. అతడు కాలంచేశాక అతడి బంధువులంతా భార్గవులమీద తిరగబడ్డారు 'మోసంచేసి మన కృతవీర్యుడి ధనం దోచుకున్నారు వీళ్ళు. వీళ్ళ పని పట్టించాలి' అంటూ నానాహింసలూ పెట్టారు వాళ్ళని.

"భయపడిపోయారు భార్గవులు. ఉన్న ధనమంతా తెచ్చి ఇచ్చేశారు కొందరు. కొందరు సాటిబ్రాహ్మలికి పంచేశారు. మరి కొందరు వాళ్ళ ఇళ్ళల్లోనే పాతిపెట్టుకున్నారు. ఒక భార్గవుడి ఇంట్లో చొరబడ్డారు రాజబంధువులు. తవ్వి చూస్తే ఎంతో ధనం దొరికింది. దాంతో ప్రతీ ఇల్లూ దోచుకున్నారు. భార్గవు డన్న ప్రతీవాణ్ణీ, వొక్క పురుగు మిగల్కుండా నరికివేశారు. కడుపులో శిశువుల్ని సహా కనికరించలేదు. భార్గవుల భార్యలంతా హిమాలయానికి పారిపోయారు. అందులో వొకా మె * తనగర్భం ఊరువులో (తొడలో) ధరించింది. అది తెలిసి దాన్ని భేదించడం కోసం పరిగెత్తుకు వచ్చారు రాజబంధువులు. భార్గవుడన్న పేరు లేకండా చెయ్యాలని వాళ్ళ క్రోధం.

---

* ఆరుషి.

"'వాళ్ళు వచ్చేసరికే తొడలోంచి కుమారుడు కలిగాడామెకి. ఊరువులోంచి పుట్టాడు, అందుచేత ఔర్వుడయ్యాడు. ప్రళయకాలం సూర్యబింబంలా ప్రకాశిస్తున్నాడు బాలుడు. అతణ్ణి చూడడంతోటే కళ్లు జిగేలుమన్నాయి రాజబంధువులికి అంతే. దాంతో గుడ్డి వాళ్ళయిపోయారు వాళ్ళు. దారీ తెన్నూ కనపళ్ళేదు. హిమాలయం అడవుల్లో పడి తిరిగారు. చివరికి ఎలాగో ఔర్వుడి తల్లి దగ్గిరికి వచ్చి బతిమిలాడారు. నేత్రదానం చెయ్యవలిసిందని ప్రాధేయపడ్డారు. 'మీ కళ్ళు పోగొట్టింది నేను కాదు. నా కొడుకు నడగండి. వాడి పెద్దవాళ్ళ నందరినీ చంపేశారు మీరు. ఆ కోపంతో వాడే మీకీ పాట్లు తెచ్చాడు. ఏడంటే ఏమిటో అర్థం కాలేదు మీకు. నూరేళ్ళు నా తొడలో పెరిగాడు. వేదాలూ అవీ క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. తపోనిధి. ప్రార్థించండి వీణ్ణి. కనికరించినా, కడతేర్చినా వీడే చెయ్యాలి' అంది. ఔర్వుడి ముందు సాగిలబడ్డారు కృతవీర్యుడి బంధువులు. అతడి దయవల్ల కళ్లు తిరిగి వచ్చాయి వాళ్ళకి. అంతతో బతుకుజీవుడా అని ఇంటిముఖంపట్టారు.

"'తన వంశస్థులు నాశనమైనందుకు దుఃఖించాడు ఔర్వుడు. నీలాగే లోకసంహారం చేస్తానని భీష్మించుకు కూచున్నాడు. ఘోరమైన తపస్సు ప్రారంభించాడు. అతడి తపస్సుకి చరాచర ప్రాణికోటితో సహా లోకాలన్నీ గడగడా వణికాయి. ఔర్వుడి పెద్దలంతా పితృలోకంనుండి దిగి వచ్చారు. 'నీ తపః ప్రభావానికి లోకాలన్నీ భయపడుతున్నాయి. శాంతించు. మేమేదో చేతకానివాళ్ళమై రాజబంధువులచేత చావడం లేదు. లోభంవల్లా ధనం దాచుకోలేదు. కావలిస్తే కుబేరుడినుండే తెచ్చుకోగలం. అసలు సంగతేమిటంటే, తపస్సువల్ల ఆయువు పెద్దదయింది మాకు. నరలోకంలో వుండలేక విసిగిపోయాం. ఆత్మహత్య పాపంకదా! అందుకని, ధనం నెపం మీద రాజవాళ్ళతో రభస తెచ్చుకున్నాం. నరదేహం వొదిలిపెట్టాం. అంతే. కాకుంటే భార్గవుల్ని తేరిమూసేవాళ్ళెవరు?

కనక శాంతించు. లోకాలికి ఉపద్రవం తెచ్చిపెట్టే ప్రయత్నం విరమించు' అన్నారు.

" 'వాళ్ళలా మిమ్మల్ని బాధిస్తూ వుంటే, తల్లికడుపులో వుండే మండుకుపోయేది నాకు. ఆ కోపంతోనే పుట్టాను. లోకనాశనం చేస్తానని ప్రతిజ్ఞపట్టాను ఎదురులేని ప్రతిజ్ఞనాది. ఎట్లా మళ్ళించనూ ! అరణిలో పుట్టిన అగ్ని అరణిలోంచి తీయకపోతే అరణినే కాలుస్తుంది కోపంతో ప్రతిజ్ఞచేసినవాడు, ఆ ప్రతిజ్ఞ నెరవేర్చకపోతే తన కోపం తన్నే దహిస్తుంది. కోపం సకారణమైనప్పుడు, దాన్ని అణుచుకున్నవాడు ధర్మమూ, అర్థమూ ఎలా నిలుపుకుంటాడు ? దుష్టులు మంచివాళ్ళని హింసిస్తూ వున్నప్పుడు, సమర్థుడు చూసి వూరుకుంటే దుష్టుల పాపంలో తానూ భాగస్థుడే అవుతాడు. లోకంలో ఎంతోమంది సమర్థులున్నారు. పాపం జరుగుతూ వుంటే చూస్తూ వూరుకుంటారు. వాళ్ళమీదే నా కోపం. మీరు నా పితృదేవతలు. మీ మాట అతిక్రమించలేను. ఐతే, ఉపసంహరిస్తే నా కోపాగ్ని నన్నే మింగుతుంది. ఏం దారి ? మీరే చెప్పండి' అన్నాడు ఔర్వుడు

" 'లోకాలన్నీ నీళ్ళలోనేవుంటాయి. నీ కోపాగ్ని సముద్రంలో వొదిలిపెట్టు. అది సముద్రజలం దహిస్తుంది. నీ ప్రతిజ్ఞా వొకవిధంగా నెరవేరుతుంది' అన్నారు పితరులు.

" 'పితరుల ఆదేశం పాలించాడు ఔర్వుడు. తన కోపాగ్ని సముద్రంలో వేశాడు. అదే ఔర్వాగ్ని అయింది. గుర్రం మొహం పెట్టుకుని సముద్రంనీళ్ళు తాగుతూ వుంటుంది. విన్నావూ, నువ్వూ ధర్మం తెలిసినవాడివి. లోకోపద్రవకరమైన కోపం కూడదు. శాంతించు' అన్నాడు వశిష్ఠుడు.

రా క్ష స యా గ ం

"తాతగారి ఆదేశం పాలించాడు పరాశరుడు. లోకసంహారయత్నం విరమించాడు. కానైతే, రాక్షసుడు తన తండ్రిని

చంపాడు. అంచేత, రాక్షససంహారం చెయ్యాలి. అందుకని రాక్షస యాగం తలపెట్టాడు. వందమంది కుమార్ళని పొట్టలో పెట్టుకున్నాడు రాక్షసుడు. ఆ గాయం బాధిస్తూనే వుంది వశిష్ఠుణ్ణి కనక అవునూ, కాదూ అనకండా వూరుకున్నాడతడు.

"ఘోరంగా ఆరంభమైంది రాక్షసయాగం. మహా మంత్రాలతో రాక్షసుల్ని అగ్నిలో పడవేస్తున్నాడు పరాశరుడు. యజ్ఞవేదిక దగ్గిర మూడగ్నులమధ్యా నాలుగో అగ్నిలా ప్రకాశిస్తున్నాడతడు. వందలూ, వేలూ వచ్చి అగ్నిగుండంలో కాలిపోతున్నారు రాక్షసులు. భయంకరమైన ఆకారాలవాళ్ళూ, వికృతమైన స్వభావాలవాళ్ళూ, ఎన్నెన్నో ఘోరాలు చేసినవాళ్ళూ, పిల్లలూ, వృద్ధులూ, నడివయస్సువాళ్ళూ - జతలు జతలుగా, జట్లు జట్లుగా, గుంపులు గుంపులుగా వచ్చి పడుతున్నారు. కుయ్యో మొర్రో అంటున్నారు. లబో లబో మంటున్నారు.

"ఈ అకాలప్రళయానికి రాక్షసకులమంతా తల్లడిల్లిపోయింది. పులహుడూ, పులస్త్యుడూ, క్రతువూ మొదలైన మహామహులంతా వశిష్ఠముని ఆశ్రమానికి వచ్చారు. పరాశరుణ్ణి చూసి చకితులయారు. కళ్ళు జిగేలు మనిపిస్తోంది అతడి తేజస్సు. అందరూ కలిసి రాక్షసయాగం నిలపవలసిందని అతణ్ణి ప్రార్థించారు. అంత మంది చెపుతూ వుంటే కాదనలేకపోయాడు పరాశరుడు. విరమించాడు రాక్షసయాగం పులస్త్యుడూ వాళ్ళూ చెప్పినప్రకారం అగ్నిహోత్రం తీసుకువెళ్ళి హిమాలయం ఉత్తరందిక్కు వేశాడు. అదే పర్వతాల్లో వుండి అప్పుడప్పుడు రాక్షసుల్నీ, రాళ్ళనీ, చెట్లనీ నిర్దాక్షిణ్యంగా భక్షిస్తూ వుంటుంది."

చిత్రరథుడు చెప్పిన ఈ కథలన్నీ కుతూహలంతో విన్నారు పాండవులు. "ఇతే నేస్తం, నువ్వేమో ఆప్తమిత్రుడివి మాకు. సమస్తవిషయాలూ తెలుసు నీకు. ఎవణ్ణి పురోహితుడిగా పెట్టుకోవాలో మేం, అతడెలా, ఎక్కడ లభిస్తాడో మరి నువ్వే చెప్పు"

అంటూ అడిగాడు అర్జునుడు. కొంచెం ఆలోచించాడు చిత్రరథుడు. "ఇక్కడ దగ్గిరే వుంది ఉత్కచం పుణ్యతీర్థం. అక్కడ తపస్సు చేసు కుంటున్నాడు దేవలుడి తమ్ముడు ధౌమ్యుడు. బృహస్పతిలాంటి బ్రాహ్మడతడు. అన్నివిధాలా అతడే మీకు తగిన పురోహితుడు" అన్నాడు.

అసంతోషం అతడికి ఆగ్నేయాస్త్రం ఉపదేశించాడు అర్జునుడు. "నువ్విచ్చిన గుర్రాలు అందాకా నీదగ్గిరే వుండనీ, సమయం వచ్చి నప్పుడు పుచ్చుకుంటాము. ఇప్పటికి సెలవు" అన్నాడు. "సెలవు" అన్నాడు చిత్రరథుడు.

గంగానది దాటి ఉత్కచతీర్థం వెళ్ళారు పాండవులు. నిష్ఠా పరుడై తపస్సులో వున్నాడు ధౌమ్యుడు. నమస్కరించారు పాండ వులు. ఆదర పూర్వకంగా సత్కరించా డతడు. పాండవుల ప్రార్థన మన్నించాడు. పౌరోహిత్యానికి సంతోషపూర్వకంగా సమ్మతించాడు. అవాళనించీ పాండవుల పురోహితుడు ధౌమ్యుడు.

ఉత్కచం నుండి తిన్నగా పాంచాలం వెళ్ళారు పాండవులు. దార్లో ఎంతోమంది బ్రాహ్మలు కలిశారు. జట్లు జట్లు, గుంపులు గుంపులు వెళుతున్నారు వాళ్ళు. "మీ రంతా ఇలా ఎక్క డికి వెళుతున్నారు?" అంటూ అడిగారు పాండవులు. "కాంపిల్యానికి. ద్రుపదమహారాజు స్వయంవరం చాటించాడు. ప్రపంచమంతా అక్కడికే బయల్దేరుతోంది. ఎంతోమంది మహా రాజులు, దానాలూ ధర్మాలూ చేసేవాళ్ళు ఉత్సవానికి వస్తారు. పుష్కలంగా సంభావనలూ అవీ దొరుకుతాయి. ముఖ్యంగా జగ న్మోహినీ విగ్రహంమట రాజకూతురు. కళ్ళ వేడుకగా ఆవిణ్ణి చూస్తాం. అసలు, ఆ చిన్నదాని శరీరమే పద్మపుష్పాల్లా పరిమళిస్తుందిట! మీరూ వస్తే రండి మాతోకూడా" అన్నారు బ్రాహ్మలు. "చూస్తా రేం? తప్పకండా రండి. ఉత్సవం మాట దేవుడెరుగు, మీలో ఈ నల్లటాయన్ని చూస్తే వెంటపడుతుం దేమో ద్రౌపది!"

న్నాడొక కొంటె బ్రాహ్మడు. కొంతదూరం వెళ్ళేక మళ్ళీ వ్యాస
ని కనిపించాడు. చేతులు జోడించారు పాండవులు. ఆశీర్వదించాడు
సు. ముందుముందు ఫలానా, ఫలానా శుభాలు కలుగుతాయని
ప్పి వెళ్ళాడు

కాంపిల్యనగరం చేరారు పాండవులు. ఓ, దివ్యవైభవంగా
ంది పట్టణం. దేశ దేశాల రాజులు సైన్యాలతో వచ్చి వేసుకున్న
బిరాలు పట్నం నాలుగు పక్కలా కోటలాగా వున్నాయి.
లుగు సముద్రాలూ ఏకమై వొక్కదగ్గిర వొక్కపెట్టుని వుప్పొంగి
ట్టుంది కాంపిల్యం. అవన్నీ చూస్తూ, వెళ్ళి వెళ్ళి ఏకాంతంగా
క కుమ్మరి ఇంట్లో బసచేశారు పాండవులు.

స్వయంవరం

అవాళ ద్రౌపది స్వయంవరం. కలకలలాడుతోంది కాంపిల్య
గరం. పట్టణానికి ఈశాన్యంగా ఏర్పాటైంది స్వయంవర ప్రదేశం.
లుచదరంగానూ, మాంచి విశాలంగానూ వుంది. చుట్టూ
తయిన అగడ్త. ఎత్తయిన ప్రాకారం. పెద్దపెద్ద వాకిళ్ళు. వెడల్పాటి
ద్వారాలు. లోపల కైలాస పర్వతంలాంటి అందమైన మేడలు. రక
కాల మంచెలు. ప్రదేశమంతా మంచిగంధం నీటితో తడిపారు.
పూర్వంగా అలంకరించారు.

నిర్ణయించిన సమయానికి ముందే తోసుకంటూ వస్తున్నారు
రాజులూ, మహారాజులున్నూ. ఒకళ్ళని మించిన దుస్తులు వొక
ళ్ళవి. ఒకళ్ళని మించిన అలంకారాలు మరొకళ్ళవి. ఒకళ్ళని మించిన
డంబరం ఇంకొకళ్ళది. తాము ఫలానా అని తెలిసేట్టు ప్రత్యేక
ప్రత్యేకంగా, ఎవళ్ళ జెండాలు వాళ్ళవి. ఎవళ్ళ బిరుదులు వాళ్ళవి.
ఎవళ్ళ నిశానీలు వాళ్ళవి. ఒక్కొక్కరి సైన్యాలూ కదిలి వస్తూవుంటే
గజగజ లాడుతూ వుంది నేల.

వచ్చిన రాజుల్ని ఎవళ్ళకి తగినట్టు వాళ్ళని గౌరవిస్తున్నాడు
ద్రుపదుడు. ఎవళ్ళ స్థానాల్లో వాళ్ళని కూచోబెడుతున్నాడు.

దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, దుర్ముఖుడూ మొదలైన ధృతరాష్ట్రకుమాళ్లు వందమందీ వొకదగ్గిర కూచున్నారు వాళ్ళ సమీపంలోనే కర్ణుడూ అశ్వత్థామా సోమదత్తుడూ భూరిశ్రవుడూ శ్రుతసేనుడూ కూచున్నారు. మరోచోట కుమాళ్ళతోనూ వాళ్ళతోనూ వచ్చి శల్యుడు కూచున్నాడు. విరాటరాజూ అతడి తమ్ములూ, కుమాళ్ళు ఉత్తరుడూ, శంఖుడూ వొకదగ్గిర కూచున్నారు. జరాసంధుడూ, శకునీ మొదలైనవాళ్ళు మరోదగ్గిర కూచున్నారు. ఇంకో చోట కృష్ణుడూ బలరాముడూ కృతవర్మా అక్రూరుడూ సాంబుడూ సంకర్షణుడూ ప్రద్యుమ్నుడూ అనిరుద్ధుడూ సాత్యకీ మొదలైన యాదవప్రముఖులూ, వృష్ణులూ, భోజులూ, అంధకులూ కూచున్నారు మరో చోట సుమిత్రుడూ సుకుమారుడూ సుశర్మా సుదక్షిణుడూ సుషేణుడూ సేనాబిందుడూ చంద్రసేనుడూ సముద్రసేనుడూ ఔశీనరుడూ చేకితానుడూ శిశుపాలుడూ శ్రేణిమంతుడూ జనమేజయుడూ జయద్రథుడూ బృహద్రథుడూ సత్యవ్రతుడూ చిత్రాంగదుడూ శుభాంగదుడూ భగీరథుడూ భగదత్తుడూ పౌండ్రకవాసుదేవుడూ వత్సరాజూ మొదలైన నానా దేశాలరాజులూ కూచున్నారు. బ్రాహ్మల సంఘంలో కలిసి వొకచోట బ్రాహ్మలమల్లేనే వచ్చికూచున్నారు పంచపాండవులు. ద్రుపదమహారాజుని అతడి రాజ్య వైభవాన్నీ చూసి సంతోషించారు.

నివురుగప్పిన నిప్పులా బ్రాహ్మలమధ్య కూచున్న పాండవుల్ని చూడ్డంతోటే కనిపెట్టేశాడు శ్రీకృష్ణుడు. అర్జునుడే ద్రౌపదిని గెలవేసుకు వెళతా డనుకుంటూ తనలోతాను నవ్వుకున్నాడు.

ఉత్సవం చూడవచ్చిన దేవతల విమానాలతో నిండిపోయి వుంది ఆకాశం. దేవతలూ ఖచరులూ గరుడులూ గంధర్వులూ కిన్నరులూ ఎవళ్ళ విమానాలమీద వాళ్ళు వచ్చి ఉత్సాహంతో చూస్తున్నారు స్వయంవరం.

మద్దెళ్ళూ, వీణలూ, పిల్లనక్రోవలూ — వీటితో రసవంతమైన సంగీతం శ్రవణానందంగా వుంది. బాజాలూ బజంత్రీలూ, ఢంకా నగారాలూ, సముద్ర ఘోషలా మోగుతున్నాయి. దివ్యమైన పూలదండలు. దివ్యమైన గంధాలు. స్వయంవరప్రదేశమంతా పులకరించేట్టు వీస్తోంది మలయమారుతం.

తెల్లటి పూలమాల—వరణమాల—పట్టుకుని హంసలా నడిచి రంగమధ్యంలో వచ్చి నుంచుంది ద్రౌపది. తెల్లటి వజ్రాల నగలు పెట్టుకుంది. తెల్లటి గంధాలు పూసుకుంది తెల్లటి జిలుగువస్త్రాలు కట్టుకుంది. సానపెట్టిన మన్మథబాణంలా వుంది.

పుణ్యాహఘోషలు చేశారు బ్రాహ్మలు. ఆశీర్వాదాలు కురిపించారు. హోమకుండం దగ్గిర రాజపురోహితుడు పరిస్తరణం చేశాడు. హోమమారంభించేసి వివాహ ఉపకరణాలు అగ్నిలో వేల్చడానికి సిద్ధంగా వున్నాడు.

మత్స్య యంత్రం

ఇంతలో ధృష్టద్యుమ్నుడు ముందుకి వచ్చి నుంచున్నాడు. భోరుమంటూన్న ప్రజల కలకలమూ. వాయిద్యాలూ ఆపించాడు. రాజులందరినీ ఒకసారి కలయజూశాడు. అగ్నిదగ్గిర ధూపదీప నైవేద్యాలతోనూ, పువ్వులతోనూ, చందనంతోనూ పూజచేసి వున్న ధనుస్సూ, ఆకాశమంత ఎత్తునివున్న మత్స్యయంత్రమూ వాళ్ళకి చూపించాడు. "ఈ విల్లు ఎక్కుపెట్టి, ఐదు బాణాలతో ఆ చేపని కొట్టినవాళ్ళని నా చెల్లెలు వరిస్తుంది" అన్నాడు. "మునిశక్తివల్ల సంపాదించిన విద్య ఇది. రండి. ప్రయత్నించండి ధనుర్విద్యలో సామర్థ్యం, కౌశలం చూపించడానికి మంచి అవకాశమిది. దీనివల్ల కీర్తీ, శుభమూ రెండూ సాధించినవాళ్ళవుతారు" అన్నాడు. సభలోని యావన్మంది రాజుల్నీ ఆయన ఫలానా,

---
పరిస్తరణం : అగ్నిచుట్టూ దర్భలతో అలంకరించడం.

ఈయన ఫలానా అంటూ ద్రౌపదికి చూపెట్టాడు. "వీళ్ళలో ఎవరు గురిపెట్టి చేపని కొడితే వాళ్ళని వరణమాలవేసి వరించు"అన్నాడు.

ప్రతీవాణ్ణీ ఆకర్షిస్తూ వుంది ద్రౌపది. ప్రతీరాజూ ఆమె రూపలావణ్యానికి ముగ్ధుడౌతున్నాడు. ఇక్కే చేపని కొడితేచాలు, ఆమె తనదై పోతుంది. ప్రతీవాడికీ ఇదే వుబలాటం. ప్రతీరాజూ తన శక్తేమిటో తానేమిటో మరిచిపోతున్నాడు, చరచరా విల్లు దగ్గిరికి వెళ్ళుతున్నాడు పెదివి బిగించి కుడిచేత్తో వింటికొన మెలి పెడుతున్నాడు. పెనగులాడుతున్నాడు. బలమంతా ఉపయోగిస్తు న్నాడు. ఉఁహూఁ. ఎవ్వడికీ లొంగలేదు విల్లు. వెళ్ళిన ప్రతీవాడూ తలవొంచుకు వచ్చేస్తున్నాడు. నిరాశ చేసుకుంటున్నాడు. మొహాం వేలవేస్తున్నాడు.

"మాయవిల్లిది. ఎవడూ వంచలేని మానులా వుంది మన కెందుకీ అక్కరమాలినపని!" అంటూ లేవడమే మానుకున్నారు కొందరు. "ఇది ఎక్కుపెట్టడమే కష్టం. తీరా ఎక్కుపెట్టినా అంతఎత్తు చేపనికొట్టడం అసలే సాధ్యంకానిపని. అంచేత ఎవ్వడికీ దక్కే పిట్ట కాదు ద్రౌపది. మనకెందు కిక్కడ!" అంటూ వచ్చినదారి పట్టారు కొందరు. ఎవరికీ చేతకానట్టు కనపడింది మత్స్యయంత్రం.

యాదవులూ భోజులూ వృష్ణులూ అంధకులూ — వీళ్ళల్లోంచి కొందరు లేవాలని చూశారు. కాని, కృష్ణుడు వద్దనడంతోటే ఆగి పోయారు. మానసంకొద్దీ వెళ్ళి ప్రయత్నించాడు శిశుపాలుడు. బల మంతా బిగబట్టి ఎక్కుపెట్టాడు విల్లు. మినపగింజంత వారా వుండి పోయింది నారి. అలిసిపోయాడు. అలాగే జరాసంధుడు వెళ్ళాడు. చిన్న యవగింజంతలో ఆగిపోయాడు. శల్యుడు పెసరగింజంతలో వచ్చేశాడు. కర్ణుడు నువ్వుగింజంతవరకూ వెళ్ళాడు అంతే. మరి చేతకా లేదు. ఐపోయింది. ఇక రాజుల్లో వొక్కడూ లేడు.

అన్నగారికేసి చూశాడు అర్జునుడు. కళ్ళతోనే అనుమతిం చాడు ధర్మరాజు. బ్రాహ్మల సంఘంలోంచి నుంచున్నాడు అర్జు

నుడు. బ్రాహ్మలంతా గొల్లుమన్నారు. ఠీవిగా ధనుస్సు దగ్గిరికి నడిచాడు అర్జునుడు. "రాజకుమార్తుల్ని చూసేసరికి పైగాన పట్టుకుంది పిడికి" అంటూ హేళనచేశారు కొందరు. "ఇంతలేసి రాజులు పాదుకదల్చలేక సోకిముకిచారు. ఈ బడో వెర్రి బ్రాహ్మడిలా వున్నాడు. బ్రాహ్మణజాతికి తలవొంపులు తెస్తున్నాడు" అంటూ అడ్డుకోబోయారు కొందరు. "ఆ మాత్రం సాధకోకపోతే వెళ్ళనే వెళ్ళడు. మనమైతే లేచామా మరి!" అంటూ సర్దిపెట్టారు కొందరు. "మంచి ఉత్సాహవంతుడు. యువకుడు. ఎంత అలావుందో తేజస్సు! పొడావుగా గుడియల్లా వున్నాయి చేతులు. దేవుడి కృప వల్ల మత్స్యయంత్రం కొట్టి, మన గౌరవం నిలబెట్టాలి" అంటూ ఆశీర్వదించారు కొందరు. అంత సభలోనూ యావన్మంది కళ్ళూ అర్జునుడి మీదే వున్నాయి.

ధనుస్సుదగ్గిరికి వెళ్ళాడు అర్జునుడు. గురువులకి నమస్కారం చేశాడు. ధనుస్సుకి ప్రదక్షిణచేసి చేతులు జోడించాడు. ఎత్తి పట్టుకున్నాడు విల్లు. చిత్రం! పరిచితమైన దానిలాగే సునాయాసంగా ఎక్కుపెట్టాడు. ఐదు బాణాలూ గురిచూశాడు. కన్నుమూసి కన్ను విప్పేసరికి కింద పడింది చేప.

ఓ, అవి కేకలుకావు అవి చప్పట్లుకావు. సభ సభంతా హోరెత్తిపోతూవుంది. బ్రాహ్మల్లో మరీ అడ్డూ అపూ లేనట్టుంది. గావంచాలు ఎగరవేస్తున్నారు. కేకలమీద కేకలు వేస్తున్నారు. నాలిక కరుచుకున్నారు రాజులు. "ఏడు బ్రాహ్మడేమిటి! బ్రాహ్మడివేషంలో వచ్చిన బ్రహ్మదేవుడు. దేవేంద్రుడో, శివుడో, సూర్యుడో, కుమారస్వామో! మనుష్యమాత్రుడికి సాధ్యం కాదిది" అంటూ ఆశ్చర్యపోయారు ప్రజలు. జయ జయ ధ్వానాలు చేస్తున్నారు. పూలవాన కురిపించారు దేవతలు. దేవదుందుభులు మోగాయి. ఈ గందికలో నకుల సహదేవుల్ని వెంటపెట్టుకుని విడిదికి వెళ్ళిపోయాడు ధర్మరాజు. ద్రుపదుడూ ధృష్టద్యుమ్నుడూ

వచ్చి అర్జునుడి చెరోపక్కా నుంచున్నారు. మదపుటేనుగు నడకలతో నవ్వుకుంటూ వచ్చింది ద్రౌపది. రాజపుత్రులు యావన్మందీ చూస్తూనే వున్నారు. అర్జునుడి మెళ్ళో వొయ్యారంగా తెల్లపువ్వుల దండ వేసింది.

కంట్లో కారంకంచు పెట్టినట్టయింది కౌరవులూ కోపగాళ్ళైన రాజకుమాళ్ళకి. దుస్సహామనిపించింది దుర్యోధనుడికి. కత్తితీసి కలబడ్డాడు ద్రుపదుడి మీదికి. "కూతుర్ని బ్రాహ్మడికే కట్టబెట్టాలని వుంటే, తగుదునమ్మా అని రాజుల్నెందుకు రమ్మన్నాడు వీడు? నిజమైన చుట్టంలాగ పైకేమో మర్యాద చూపెట్టాడు. తీరా సమయానికి బ్రాహ్మడికి పెళ్ళిచేశాడు. వీడి పీచు రేగ్గొట్టందే వొదలకూడదు. వాడివిద్య వాడుచూపెట్టి రాజుకూతుర్ని సంపాదించాడు బ్రాహ్మడు. వాడి తప్పేముంది? వాడివూసు మనకెందుకు? ద్రుపదుడే దుర్మార్గుడు రాజులంటే మొదటినుండీ నిర్లక్ష్యమే వీడికి. పట్టుకోండి వీణ్ణి" అంటూ రెచ్చగొట్టాడు రాజుల్ని. అందరూ వొక్కసారి ద్రుపదుడి మీదికి తిరగబడ్డారు.

బ్రాహ్మలమధ్యకి పారిపోయాడు ద్రుపదుడు. "భయపడకు" అంటూ ముందుకి వచ్చారు బ్రాహ్మలు. దుడ్డుకర్రలూ, జింక తోళ్ళూ విసురుకుంటూ రాజులమీదికి తిరగబడ్డారు. చూసి నవ్వుకున్నాడు అర్జునుడు. "మీ కెందుకా శ్రమ! నే నున్నానుగా! తప్పుకోండి. మంత్రాల్లా పనిచేస్తాయి నా బాణాలు. పాముల్లా ఈ రాజులు ఎలా పరిగెడతారో చూడండి" అంటూ ధనుస్సూ బాణాలూ పుచ్చుకున్నాడు.

తుఫాను వానలా బాణాలుమీద బాణాలు వొదుల్తున్నాడు అర్జునుడు. యముడులాగ పక్కని భీముడు కూడా సర్దుకున్నాడు. పెద్ద చెట్టొకటి వూడపీకి అర్జునుడికి సహాయంగా నిలబడ్డాడు.

వాళ్ళ ఇద్దరి ఉద్రేకమూ చూసి తలపంకించాడు కృష్ణుడు. బలరాముడికేసి చూసి, "వాళ్ళిద్దరినీ చూశావా!" అన్నాడు.

"బాణాలతో కౌరవుల్ని కొడుతూన్నవాడు అర్జునుడు. చెట్టుపట్టుకు బాదుతున్నవాడు భీముడు. ఇందాకా బ్రాహ్మల్లోంచి లేచివెళ్ళాడే తెల్లటాయన, అతడే ధర్మరాజు అతడి వెనకాల వెళ్ళిన ఇద్దరూ నకుల సహదేవులు" అన్నాడు. ఆశ్చర్యంతోనూ, సంతోషంతోనూ తేరిపారచూశాడు బలరాముడు. "లక్క ఇంట్లో కాలిపోకుండా తప్పించుకున్నారు. ఎలా బతికారో, అదృష్టవంతులు! సుఖంగా ఆనాటి గొప్ప సుదినం. ఐదుగుర్నీ చూశాం" అన్నాడు.

ఇంతలో అర్జునుడిమీదికి కర్ణుడు వచ్చి కలబడ్డాడు. భీముడి మీదికి సర్దుకున్నాడు శల్యుడు. కలబడీ కలబడడంతోటే వొకరి మీద వొకరు బాణాలు కొట్టుకున్నారు. కర్ణుడూ అర్జునుడున్నూ. బలంగా చెవిదాకా ధనుస్సులాగి నొదుల్తున్నారు బాణాలు. అటూ, ఇటూ కిందా, మీదా ఎటుచూస్తే అటు, బాణాలే బాణాలు — అర్జునుడి బాణాలు ఆపుకోలేకపోయాడు కర్ణుడు. యుద్ధం మానేసి నుంచుండిపోయాడు. "నువ్వేదో అసాధ్యపుబ్రాహ్మడిలాగే వున్నావు. పరశురాముడూ, శివుడూ, అర్జునుడూ — ఈ ముగ్గురూ తప్పిస్తే నన్నెదిరించేవాడు ప్రపంచంలో లేడు నిజంగా, నిన్ను మెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను. నీ పరాక్రమమూ, నేర్పూ అద్వితీయంగా వున్నాయి" అన్నాడు.

"ఆ ముగ్గురినమాటా ఏమో, నాకు తెలియదు. నేనుమాత్రం నేనే. అస్త్రవిద్యలో ఏదో ఇంత కృషిచేశాను. నిన్ను గెలవడం నాకు సరదా. యుద్ధం మానకు. నిలబడు" అన్నాడు అర్జునుడు. "ఊహూఁ, బ్రాహ్మడివి నువ్వు. నీతో ఎందుకు రొష్టు?" అంటూ వెనక్కి వెళ్ళిపోయాడు కర్ణుడు.

శల్యుడూ, భీముడూ కుస్తీపట్లుపట్టారు. తొలిపట్టులోనే కిందవేసి కొట్టాడు భీముడు. లేచి మళ్ళా కలబడితే వొట్టు, వొళ్ళు దులుపుకుంటూ పరిగెత్తాడు శల్యుడు. విరగబడి నవ్వుతూ చప్పట్లు కొట్టారు బ్రాహ్మలు.

ఆలోచనలోపడ్డారు దుర్యోధనుడూవాళ్ళూను "శల్యుణ్ణి గెలవాలంటే బలరాముడూ, భీముడే అనుకున్నాం. మరి, పరశురాముడూ, శివుడూ అర్జునుడూ తప్పిస్తే కర్ణుడిమీదికి వచ్చేవాడు లేడనుకున్నాం. మరి, వీళ్ళెవరు? పులిమీద పుట్రలా వుంది వ్యవహారం! వీళ్ళ పునికేదో కనిపెట్టాలి" అంటూ గుసగుసలు ప్రారంభించారు. అదిచూసి, "వ్యర్థంగా ఎందుకూ శ్రమపడతారు?" అంటూ కలగజేసుకున్నాడు కృష్ణుడు. "ఎవళ్ళకీ సాధ్యంకానిపని సాధించాడు బ్రాహ్మడు. న్యాయంగా అతడికి స్వయంవరంలో దొరికింది ద్రౌపది. ఇందులో అసందర్భమేముందని! అతడి చేవా చూడనే చూశాం. నిజంగా అసాధ్యుడు. చాలిక. ఇంతతో విరమించండి. మర్యాదగా మన ఇళ్ళకి మనం వెళదాం" అన్నాడు.

ఎవళ్ళ ఇళ్ళకి వాళ్ళు తిరుగుమొహం పట్టారు రాజులు. బ్రాహ్మల జయజయ ధ్వానాలమధ్య ద్రౌపదిని వెంటపెట్టుకొని అర్జునుడూ భీముడూ బసకి బయల్దేరారు.

బసలో పరిపరి విధాల భావిస్తూ కూచుంది కుంతి. "అంతపొద్దాయి వెళ్ళారు కుమాళ్ళు. ఏమయిందో అక్కడ? కౌరవులు దుర్మార్గులు. మరేం ఉపద్రవం తెచ్చిపెట్టారో? ప్రాణాలమీదికి తీసుకురాలేదు కదా! దిక్కులేని బిడ్డలికి దేవుడేసాయం" అంటూ వెయ్యి దేవుళ్ళకి మొక్కుతోంది మాటి మాటికీ వాకిట్లోకి వచ్చి చూస్తోంది. కళవిళపడుతోంది. ఇంతలో ధర్మరాజూ, నకుల సహదేవులూ వచ్చేశారు.

ఐ దు గు రూ  పం చు కో ం డి

మరికొంతసేపట్లో భీముడూ, అర్జునుడూ వచ్చి "అమ్మా, వాక భిక్ష తెచ్చాం" అన్నారు. రోజూవున్న అలవాటుమీద "ఐతే, ఐదుగురూ పంచుకోండి నాయనా," అని అనేసింది కుంతి. అనేసి చూసింది. లక్ష్మీదేవిలా నుంచునివుంది ద్రౌపది. నాలిక కరచుకుంది కుంతి. నుంచున్నదగ్గిరే చతికిలబడిపోయింది. ధర్మ

రాజుని పిలిచింది. "నోరుజారిపోయిందోయి, ఏమిటి సాధనం?" అంది. "నీ తమ్ముళ్లిద్దరూ కోడల్ని తెచ్చి, భిక్ష తెచ్చా మన్నారు. అలవాటుమీద 'ఐదుగురూ పంచుకోండి' అన్నాను. ఇంతవరకూ ఎన్నడూ నా మాట అసత్యం కాలేదు. నా మాటంటే పిల్లలూ జవ దాటి ఎరగరు. ఐతే, లేని ఆచారం! ఎలా చెయ్యడం!" అంటూ తలవంచుకుంది.

తల్లిని సముదాయించి అర్జునుడి మొహం చూశాడు ధర్మరాజు. "నువ్వే గెల్చుకున్నావు ఈమెని. నువ్వే పెళ్ళిచేసుకో" అన్నాడు. "అదెలా?" అన్నాడు అర్జునుడు. "పెద్దవాళ్ళుంటూండగా ముందు చిన్నవా డెలా చేసుకుంటాడు? నువ్వే పట్టమహాదేవిగా చేసుకో. మా అందరికీ ఇది సమ్మతం" అన్నాడు.

ద్రౌపదిని చూస్తే అన్నదమ్ములైదుగురికీ ఆశగానే వుంది. అయిదుగుర్నీ వొక్కలాగే ఆకర్షిస్తున్న దామె. అదీ కనిపెట్టాడు ధర్మరాజు. అంతలో వ్యాసముని మాటలూ జ్ఞాపకం వచ్చాయి. "మన పెద్దలు వ్యాసుడూ, అమ్మా చెప్పనేచెప్పారు. మన ఐదుగురికీ ఈమె ధర్మపత్ని కావాలని. పెద్దలమాటే మనకి ధ్రువతార. అంచేత ఐదుగురమూ చేసుకుందాం" అన్నాడు.

ఇంతలో వెతుక్కుంటూ కృష్ణుడూ బలరాముడూ వచ్చారు. మేనత్త కుంతికీ, ధర్మరాజుకీ నమస్కరించారు. భీముణ్ణీ, అర్జునుణ్ణీ, నకుల సహదేవుల్నీ కౌగిలించుకున్నారు. అందరూ ఆనంద బాష్పాలు వర్షించారు. కుశలప్రశ్నలు చేసుకున్నారు.

"కౌరవులు కక్ష కట్టడంచేత మారువేషాల్తో వున్నాం. ఎలా కనిపెట్టారు మీరు?" అంటూ అడిగాడు ధర్మరాజు. చిన్న చిరునవ్వు నవ్వాడు శ్రీకృష్ణుడు. "సూర్యుడు మేఘాల్లో దూరితే మాత్రం, తేజస్సెలా దాగుతుంది! వేషాలు మారినా, మీ తేజస్సు కనబడుతూనే వుంది. అదీకాక, అంతమంది రాజులమధ్య అసామాన్యమైన అద్భుతకార్యం అర్జునుడికి తప్ప ఇంకొకడి కెలా

సాక్ష్యమవుతుంది? మీ పరాక్రమమే మిమ్మల్ని పట్టి ఇచ్చింది" అన్నారు. "దుర్యోధనుడూ మీకో క్షేమమూ చూసారు. లక్క- ఇంట్లో పెట్టి నిప్పు పెట్టారు. మీ భాగ్యమే మిమ్మల్ని కాపాడింది. ఎన్ని కష్టాలు పడ్డారో పాపం! కష్టకాలమేమో గడిచిపోయింది. ఇకముందు మంచిరోజులే వున్నాయి" అంటూ ఎన్నో విధాల ధైర్యం చెప్పారు. కొంతసేపయాక, "వెళ్ళొస్తా"మని చెప్పి ద్వారక వెళ్ళి పోయారు బలరామకృష్ణులు.

అక్కడ కోటలో ఆలోచనలో పడ్డాడు ద్రుపదుడు. అల్లుడయినవాడు ఎవ్వడో? ఏ వంశంవాడో? విద్యాబుద్ధు లేమిటో? ధృష్టద్యుమ్నుణ్ణి పిలిచాడు రహస్యంగా కనిపెట్టి రమ్మన్నాడు. వెదుక్కుంటూ వెళ్ళాడు ధృష్టద్యుమ్నుడు. కనబడకండా కుమ్మరి ఇంట్లో వుండి కనిపెట్టాడు. చూసిందంతా వచ్చి తండ్రితో చెప్పాడు. "వాళ్ళు ఇద్దరు కారు, ఐదుగురు" అంటూ ఆరంభించాడు. "ఓ ముసలావిడ కూడా వుంది. తల్లేమో! అందరికంటే పెద్దాయన తెల్లగా వుంటాడు - భోజనాల వేళకి తక్కిన నలుగురినీ బైటికి పంపాడు. వాళ్ళు బ్రాహ్మల కొంపలికో ఎక్కడికో వెళ్ళి భిక్షాన్నం పట్టుకువచ్చారు. తెచ్చిందంతా ముసిల్దాని ముందు పెట్టారు. చెల్లాయిని పిలిచిందామె. బలులకోసం, అతిథుల కోసం, మాధవాకవళంవాళ్ళకోసం ముందు కొంత తీసిపెట్టమంది. మిగిలింది రెండువంతులు చెయ్యమంది. ఇందాక కల్యాణ్ణి చిత్తు చేశాడే వస్తాదు, అతడికో వంతు పెట్టమంది. రెండోది తక్కిన నలుగురికీ వడ్డించమంది. వాళ్ళు తినగా మిగిలింది మనం తిందామంది. ఆవిడ చెప్పినట్టే చేసింది చెల్లాయి. అందరూ తిన్నాక మిగిలింది తాను తిన్నాది. దర్భలు పరిచి అందరికీ విడివిడిగా చెల్లాయే పక్కలు వేసింది. వాటిమీద వాళ్ళ లేడితోళ్ళు పరిచింది. వాళ్ళు పడుకున్నాక వాళ్ళపాదాలకింద తాను నడుం వాల్చింది. అడుక్కుంటేనేగాని అన్నంలేదు. దర్భలు తప్పిస్తే పక్కలు లేవు.

జంకతోట్లూ, చేతికర్రలూ, చింకిపాతలూ - ఉన్న ఆస్తల్లా ఇదే వాళ్ళకి. అలాంటివాళ్ళని - ఆగర్భ శ్రీమంతురాలు చెల్లాయి - అసహ్యించుకోకండా - అలా సేవచేస్తూ వుంటే దుఃఖంకాదు ఆశ్చర్యం వేసింది నాకు.

"పక్కలమీద వాళ్ళు చెప్పుకున్న మాటలూ విన్నాను. వాళ్ళ సంభాషణలో ఎంతసేపూ రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, పెద్దపెద్ద వ్యూహాలూ, వాటిని ఛేదించేసూత్రాలూ, అస్త్రాలూ అస్త్రాల ఉపసంహార దేవతలూ, ధనుర్వేద రహస్యాలూ - ఇవి తప్ప మరోమాట లేదు. వాళ్ళ వ్యావహారికభాష చూస్తే, రాజుల్లా వున్నారు. నడవడి చూస్తే బ్రాహ్మలనిపిస్తోంది. అంచేత బ్రాహ్మల్లో, రాజుల్లో ఐవుంటారు" అన్నాడు.

కొంత కుదుటబడ్డాడు ద్రుపదుడు. ఐనా, ఇంకా తథ్యం తెలుసుకోవాలి. మర్నాడు పురోహితుణ్ణి పంపాడు. అర్ఘ్యమూ అదీ ఇచ్చి అతణ్ణి గౌరవించమని భీముణ్ణి నియోగించాడు ధర్మరాజు.

"అంత అద్భుతంగా మత్స్యయంత్రం కొట్టా డీయన. ఈయన్ని స్వయంగా చూడాలనుకుంటున్నాడు మా మహారాజు" అంటూ మాటల్లోకి దింపాడు పురోహితుడు. "ఐతే, మీ కులం, గోత్రం, ప్రవరా, పేర్లూ అవీ తెలుసుకోవాలి కదా మేం! ఈ వివరాలకోసం కూడా ఆతరపడుతున్నా డాయన" అన్నాడు.

నవ్వాడు ధర్మరాజు. "ఎవడు చేపనికొడితే వాడికి పిల్లనిస్తా నన్నాడు మీ రాజు. అంత తేలికైన షరతుపెట్టాడు. ఆ ప్రకారం చేపనికొట్టి పిల్లని పుచ్చుకున్నా డితడు. ఎవడైతేనేం? అంతా మించి పోయేక తెలుసుకుని మాత్రం ప్రయోజన మేమిటి! ఆ మాత్రం చేవ లేనివాడూ, రాజకన్యకి తగనివాడూ ఐతే, యంత్రం కొట్టనే లేడు కదా! ఇంతకీ, మీ రాజుగారికి కావలిసిందీ అదేకదా! విచారపడవద్దను. అనుకున్నదేదో అదే అయిందను. ఇంతకంటె అధికం చెప్పవలిసిందీ లేదను" అన్నాడు.

విన్నాడు ద్రుపదుడు. ఈ మారు మరో ఉపాయం పన్నాడు. బ్రాహ్మలూ, రాజులూ, కోమట్లూ, కాపుదనం - ఈ నాలుగు జాతులికీ తగినట్టు నాలుగు రథాలు తెప్పించాడు. "ఈ రథాలు తీసుకు వెళ్ళు. ఏదో వొకదానిమీద వాళ్ళని మన కోటకి రమ్మను" అంటూ ధృష్టద్యుమ్నుణ్ణి పంపాడు.

చూశారు పాండవులు. రాజులికి తగిన నవరత్నాల బంగారం రథంమీద వెళ్ళికూచున్నారు. మరోరథం మీద కుంతినీ, ద్రౌపదినీ కూచోబెట్టారు. ధృష్టద్యుమ్నుడివెంట రాజభవనానికి వెళ్లారు. వీళ్ళు వచ్చేసరికి ఎన్నో వస్తువులూ, వాహనాలూ అవీ సిద్ధంగా వున్నాయి. వాటిలోనూ నాలుగు వర్ణాలవారికి ఉపయోగపడేవి, ఎంతో విలువయినవి వున్నాయి. వేటినీ ముట్టుకోలేదు పాండవులు. రాజకుమాళ్ళకి పనికివచ్చే ఆయుధాలు మాత్రం ఎంచుకున్నారు. కత్తులూ కవచాలూ ధనుస్సులూ బాణాలూ తూణీరాలూ రథాలూ గుర్రాలూ అవీ పుచ్చుకున్నారు.

వివరాలు ఎప్పటికప్పుడు వింటూనే వున్నాడు ద్రుపదుడు. వాళ్ళ రాకకోసం ఎదురుచూస్తున్నాడు. కుమాళ్ళూ, తమ్ములూ, బంధువులూ, మంత్రులూ - యావన్మందీ దగ్గిర మూగివున్నారు. ఇంతలో పాండవుల్ని ప్రవేశపెట్టాడు ధృష్టద్యుమ్నుడు. అచ్చంగా, బ్రాహ్మలే ఐదుగురూను. లేడిచర్మాలే ఉత్తరీయాలుగా వున్నాయి. మొహాల్లో బ్రహ్మతేజస్సు వొలికిపోతూవుంది. అప్పుడే ఉదయించిన సూర్యబింబాల్లా కనిపిస్తున్నారు. ఐతే, ఎల్లప్పుడూ కసరత్తూ అదీ చేసి, గట్టిపడినట్టున్నాయి శరీరాలు. మోకాళ్ళకి అంది వస్తున్నాయి చేతులు. ఎగు భుజాలూ, వెడల్పాటి వక్షస్థలాలూ, ఆబోతుకళ్ళలాంటి నేత్రాలూ - చూసి సంతోషించాడు ద్రుపదుడు.

ఐదుగురూ తిన్నగా, జంకూ, గొంకూ లేకండా వచ్చి, రాజులికి వేసిన ఆసనాలమీదే ఠీవిగా, కూచున్నారు. తేలిపోయింది.

రాజులే అని గ్రహించుకున్నాడు ద్రుపదుడు. ఐనా, [illegible] పెద్దాయన్ని ప్రశ్నించాడు "నిజం తెలుసుకోవాలని [illegible] సతమతమై పోతూన్నది మనస్సు అన్యథా భావించకండి. దేవలోకం నుండి వచ్చిన దేవతల్లా వున్నారు మీరు. బ్రాహ్మణుల్లో రాజుల్లో తెలియకుండా వుంది నాకు. మమ్మల్ని వంచిస్తూన్న మంత్ర సిద్ధులా! యథార్థం తెలిస్తే మీ సహాయుత్నం చేసుకుంటాను. మీ ప్రవర్తన మాత్రం చూస్తే స్పష్టంగా రాజులే అనిపిస్తోంది నాకు" అన్నాడు.

"అవును, రాజులమే," అన్నాడు ధర్మరాజు. "పాండవుల్ని. నేను పెద్దవాణ్ణి. ఇతడు భీముడు. ఇతడు అర్జునుడు. వీళ్ళు నకుల సహదేవులు. ఈమె మా అమ్మ, కుంతీమహాదేవి" అన్నాడు.

ఆఁ! కలకాదు కదా!! తన చెవులు తాను నమ్మలేక పోతున్నాడు ద్రుపదుడు. ఆశ్చర్యం. ఆనందం. ఒళ్ళు మరిచి పోయాడు. కొంతసేపటికిగాని తెలివుకోలేక పోయాడు. ఉద్వేగంగా లేచివచ్చి ఐదుగుర్నీ ఆలింగనం చేసుకున్నాడు రెండు కళ్ళనుండీ ఆనంద బాష్పాలు ధారలుకట్టాయి. గొంతుకు గద్గదిక పడింది. గుక్క తిప్పకుండా ఎన్నో కుశలప్రశ్నలు వేశాడు. "లక్కఇంటి నించి బతికి వచ్చారు. అదృష్టవంతుణ్ణి" అన్నాడు.

వారణావతంనించి పాంచాలంవరకూ జరిగిందంతా చెప్పాడు ధర్మరాజు. విని ధృతరాష్ట్రుణ్ణీ, దుర్యోధనుణ్ణీ నిందించాడు ద్రుపదుడు. మహారాజ మర్యాదలతో గౌరవించాడు పాండవుల్ని. కోటలోనే విడిది పెట్టించాడు. ద్రౌపదినీ, కుంతీదేవినీ సమర్యాదగా అంతఃపురానికి పంపించాడు.

ఇలా సుఖంగావుండి వొకనాడు మెల్లగా పెళ్ళి ప్రస్తావన తెచ్చాడు ద్రుపదుడు. "ఏది కావాలని కలలు కన్నానో అదే జరిగింది. అర్జునుడు అల్లుడు కావాలని అంత శ్రమ పడ్డాను. లక్కఇంటి దాహం విన్నాక, నా ఆశ అడియాస అయిందని కొంగపెట్టు

కున్నాను. నా తపస్సు వ్యర్థం కాలేదు. ఆఖరికి అర్జునుడే అమ్మాయికి దొరికాడు. స్వయంవరంలో అమ్మాయిని గెల్చుకున్నాడు. ఇక శాస్త్రోక్తంగా వాళ్ళిద్దరికీ మూడుముళ్ళూ వేయించడమే తరువాయి. శుభముహూర్తం నిశ్చయిద్దాం" అన్నాడు.

"అదెలా?" అంటూ అడ్డువచ్చాడు ధర్మరాజు. "పెద్దవాణ్ణి నేను ముందు చేసుకోవాలి. తర్వాత భీముడు. ఆ తరవాత కదా అర్జునుడు! అన్నలికి వివాహం కాందే, తమ్ముడికి చెయ్యడం ధర్మవిరుద్ధం మరి!" అన్నాడు.

"నిజమే, ధర్మసంప్రదాయం తప్పించడం తగనిపని. ఐతే — మరి – నువ్వే చేసుకో అమ్మాయిని" అన్నాడు ద్రుపదుడు.

"నేనొక్కణ్ణే కాదు, అన్నదమ్ములైదుగురమూ చేసుకుంటాం ద్రౌపదిని" అన్నాడు ధర్మరాజు. "మా అమ్మగారి ఆదేశమూ అదే. ఆవిడమాట జవదాటలేం మేము" అన్నాడు.

నివ్వెరపోయాడు ద్రుపదుడు. కొంతవరకూ మాటాడలేదు. "ఒక్కడికి బహుమంది భార్యలుండడం కద్దు. అంతేగాని ఒక స్త్రీకి బహుమంది భర్తలు మనలో రివాజులేదు. లౌకికధర్మమూ, వైదికధర్మం రెండూ తెలిసినవాడివి నువ్వు. నువ్వు అధర్మం చెపుతావనడానికి నోరాడదు నాకు. సరే, మీ అమ్మగారూ నువ్వూ, నేనూ, మా అబ్బాయీ కలిసి మాటాడదాం. ఆలోచించి ఏదో ఒక నిర్ణయం చేద్దాం రేపు" అన్నాడు.

ఈ ధర్మసందేహం తీర్చడానికే అన్నట్టు సరిగ్గా అదే సమయానికి వచ్చాడు వ్యాసముని. లేచి సాష్టాంగపడ్డారు పాండవులూ, ద్రుపదుడూ వాళ్ళూను. మణులు తాపిన ఎత్తయిన బంగారం పీఠం మీద కూచోబెట్టి రత్నార్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి పూజించారు. అందరి క్షేమం విచారించాడు ముని. మంచి మంచి మాటలు చెప్పి అందరికీ సంతోషం కలిగించాడు.

సమయం కనిపెట్టి చేతులు జోడించాడు ద్రుపదుడు. "ధర్మరాజు ఏదంటే అదే ధర్మం లోకానికి. ప్రపంచానికి గురువులాంటివాతడు. అలాంటివాడు, ఐదుగురమూ ద్రౌపదిని వివాహం చేసుకుంటాం అంటున్నాడు. మీకు తెలీని లోకాచారం లేదు. పూర్వం ఇలా చేసిన మహానీయు లెవరైనా వున్నారా ? అది పెద్దలు అంగీకరించారా ? ఈ ధర్మ సందేహం బాధిస్తోంది నన్ను. ధర్మసంకరం కాకండా విషయపరిష్కారం చెయ్యవలసిన వారు మీరు. సెలవియ్యండి" అన్నాడు.

"ఎన్ని కాలాలకైనా అబద్ధమాడాలనీ, అధర్మం చెయ్యాలనీ మనసు పుట్టదు నాకు. మీరు అన్యథా ఆలోచించడం అనవసరమంటాను. పూర్వచరిత్ర తడువుతూరా, కావలసినన్ని నిదర్శనాలు కనపడతాయి. గౌతమవంశంలో జటిల అనే మునికన్య ఏడుగురికి వొక్కతే భార్య అయింది. ప్రచేతసులు పదిమందీ వొక్క కన్యనే పెళ్ళాడారు * ఇవన్నీ ప్రసిద్ధమైన పురాణకథలు.

"మరిన్నీ, గురువు లందరిలోకీ శ్రేష్ఠమైన గురువు తల్లి. తల్లి మాటా; బ్రహ్మరాతా తప్పించరానివి. ఆమె ఆదేశం మాకిది. అంచేత; మరో విధంగా ఆలోచించక మా ఐదుగురికీ ఇచ్చి వివాహం చెయ్యండి" అన్నాడు ధర్మరాజు.

ధర్మసూక్ష్మం అంత తేలికగా పరిష్కరించలేం మనం. మూడుకాలాల నడవళ్లూ తెలిసిన మేధావి వ్యాసముని. అతడు ఆలోచించి నిశ్చయనం చెయ్యాలి. అతడెలా చెప్తే అలా చేద్దాం" అన్నాడు ద్రుపదుడు.

---

* ప్రచేతసులకథ మత్స్యపురాణం, విష్ణుపురాణం, భాగవతం, బ్రహ్మాండపురాణం మొదలయిన వాట్లో విపులంగా వుంది. ప్రచేతసులు పృథుచక్రవర్తి మునిమనుమడయిన ప్రాచీనబర్హి కుమారులు. వీళ్ళు పదిమంది. పదిమందీ ఏకస్వభావులే. కండుమునికీ, అప్సరస ప్రమ్లోచకీ పుట్టిన మారిష అనే కన్యని పదిమందీ వివాహం చేసుకున్నారు.

"ధర్మం తెలిసిన బుద్ధిమంతుడు ధర్మరాజు. అధర్మం ఎందుకు చేసతాడు ?" అంటూ అందుకున్నాడు వ్యాసుడు. "దేవతామూర్తి మరి కుంతి. ఆమె మాత్రం అసందర్భంగా ఎందుకంటుంది ? వీళ్ళ మాటా, దేవతల సంకల్పమూ వొక్కటే అనుకో. అన్యథా ఆలోచించకు. ఐదుగురికీ అమ్మాయినిచ్చి పెళ్ళిచెయ్యి. దీని వెనక ఎంతో గాథ వుంది. వినాలంటే ఇలా రా" అంటూ ద్రుపదుడి చెయ్యి పట్టుకుని లోపలి లోగిలికి తీసుకువెళ్లాడు. ఇద్దరూ ఏకాంతంగా కూచున్నాక ఆరంభించాడు వ్యాసుడు.

### ఇంద్రసేన కథ

"పూర్వం నలుడి కూతురు ఇంద్రసేన మౌద్గల్యరుషిని పెళ్లాడింది. కొన్నాళ్ళకి మౌద్గల్యుడికి కుష్ఠవ్యాధి పట్టుకుంది. ఆ వ్యాధితో బాగా చివికిపోయా డతడు. ముసిలితనమూ వచ్చింది. ముడుతలు తేరి వొడిలిపోయింది శరీరం తలా, గెడ్డం దూదిలా పండిపోయాయి. మొహం కంపుకొడుతూ వుండేది. రాను రాను చర్మం, గోళ్ళూ వూడిపోతూవుండేవి. దీనికితోడు బ్రహ్మాండమైన కోపిష్టి అతగాడు. ఇన్నీ సయిస్తూ భర్తని సేవిస్తూ వుండేది పాపం, ఇంద్రసేన. వండి, భర్తకిపెట్టి అతడు తిని విడిచిన ఎంగిలి కాస్తా తిని లేచేది.

"ఒకనాడు భోజనంలో మౌద్గల్యుడి బొటనవేలు విస్తట్లో తెగిపడింది. అసహ్యించుకోలేదు ఇంద్రసేన. ఆ వేలు తీసి పక్కనిపెట్టింది. ఎప్పటిలాగే ఉచ్ఛిష్టం తినడం మొదలుపెట్టింది. మౌద్గల్యుడి మనస్సు కరిగింది. ఎన్నడూ లేని దయతో దగ్గిరికి వచ్చాడు. 'ఏమి కోరతావో కోరు' అన్నాడు. ఈ బీభత్స

---

బృహదశ్వుడి కుమాళ్ళు పాంచాలం రాజులు అయిదుగురిలోనూ వొకడయిన ముద్గలుడి కొడుకు మౌద్గల్యుడు, ఇతడి భార్య నలుడి కూతురు (నాలాయని) ఇంద్రసేన. (చూ. హరివంశం) ముద్గలుడు బ్రాహ్మణుడై మౌద్గల్యగోత్రీకులికి మూలపురుషు డయాడు.

రూపం విడిచిపెట్టు,' అంది ఇంద్రసేన. 'ఎన్నాళ్ళయో కామ వాంఛతో బాధపడుతున్నాను. తపశ్శాలివి నువ్వు. నీకు సాధ్యం కానిదేముంది ? నీకు నచ్చినట్టు అందమైన ఐదురూపాలు ధరించు. మనసుదీరా నన్ను అనుభవించు' అంది.

"ఆమె అడిగినంతా చేశాడు మౌద్గల్యుడు. క్షణంలో మాయ మైంది కుష్ఠరోగం. వార్ధక్యమూ కనపడకండా పోయింది. అందమైన ఐదురూపాలతోనూ ఆలింగనం చేసుకున్నా డామెని. ఆమెతో సూర్యుడి రథమెక్కి ప్రయాణం చేశాడు. ఆకాశగంగలో స్నానాలు చేశాడు. చంద్రకిరణాలమీద విహరించాడు. కైలాస పర్వతంమీదా, మేరుపర్వతంమీదా క్రీడించాడు. అనేక ప్రదేశాలు సంచారం చేశాడు. ఇలా ఎన్నో సంవత్సరాలు ఇంద్రసేనతో కామవిలాసా లతో కాలక్షేపం చేశాడు. తుదకి తృప్తిపడి ఆమెని వొదిలివెళ్లాడు. ఘోరమైన తపస్సు చేశాడు. ఇక్కడ బ్రహ్మర్షులూ, దేవలోకంలో దేవర్షులూ పూజించా రతణ్ణి. అనంతరం శరీరం విడిచిపెట్టాడతడు. స్వర్గానికిపోయి సుఖపడ్డాడు.

"ఇంద్రసేనకి మాత్రం కామభోగాలమీద కాంక్ష తీరలేదు. అలాగే మరణించింది కొన్నాళ్ళకి. తిరిగి కాశీరాజు కూతురుగా పుట్టింది. వరుడు దొరకక ఎంతోకాలం కన్యగా వుండిపోయింది. తన దౌర్భాగ్యానికి దుఃఖిస్తూ, శివుడికోసం తపస్సు చేసింది. తప స్సులో వున్నప్పుడు విడివిడిగా చూసి ఆమెని అభిలషించారు యముడూ, వాయువూ, ఇంద్రుడూ, అశ్వినీదేవతలున్నూ. జన్మాం తరంలో వాళ్ళ దేహాంశల్లో పుట్టిన తమకి ఆమె భార్యకావాలని కోరుకుని వెళ్లారు.

"మరింత ఘోరంగా తపస్సు చేసిందామె. గాలీ నీరూ మాత్రమే ఆహారంగా చేసుకుంది కొన్నాళ్ళు. కొన్నాళ్ళు అదీ లేకండా నిరాహారంగావుంది. ఒంటికాలిమీద నుంచుంది కొన్నాళ్ళు. కొన్నాళ్ళు పంచాగ్నులమధ్య కూచుంది. ఇలా, మహా ఉగ్ర

మైన తపస్సు చేసింది. ఈశ్వరుడికి దయకలిగింది. వచ్చి, వరంకోర మన్నాడు ఆతురతకొద్దీ 'పతి, పతి, పతి, పతి, పతి,' అంటూ ఐదు మార్లు కోరిందామె. 'తథాస్తు' అన్నాడు శివుడు. 'మళ్ళీజన్మలో ఐదుగురుభర్తలౌతా' రన్నాడు.

"'ఐదుగురుభర్త లేమిటి? అన్యాయం' అంటూ చేతులు జోడించిం దామె. 'లోకవిరుద్ధమైన వరం పుచ్చుకోలేను ప్రభూ! స్త్రీకి వొక్కడే భర్త' అంది 'అధర్మం కాకండా ఆజ్ఞాపిస్తున్నాను. నా మాటకి తిరుగులేదు' అన్నాడు శివుడు. 'ఐతే, ఐదుగురిమీదా నాకు భోగేచ్ఛవుండేట్టు అనుగ్రహించు. ఐదుగురితోనూ కాపరం చేసేటపుడు, ప్రతి సంగమంలోనూ నేను కన్యగా వుండేట్టూ ప్రసాదించు" అంటూ సాగిలపడిందామె. ఆమె కోరికలు అంగీకరిస్తూ, 'ఐతే, గంగాతీరంవెళ్ళి దేవేంద్రుణ్ణి నాదగ్గిరికి తీసుకురా' అన్నాడు శివుడు. ప్రదక్షిణ పూర్వకంగా శివుడికి నమస్కారంచేసి బయల్దేరిందామె. గంగదగ్గిరకువెళ్ళి ఇంద్రుడికోసం కనిపెట్టుకు కూచుంది.

"ఆ సమయానికి దేవలోకంలో ఏమిజరిగిందో తెలుసా! నైమిశారణ్యంవచ్చి, యముడు సత్రయాగం ప్రారంభించాడు. జీవుల్ని చంపడం మానివేశాడు. దాంతో మరణంలేకండా పోయింది మానవులికి. దేవతల కది కన్నుకుట్టింది. వెంటనే దేవలోకంలో సమావేశంజరిపారు. దేవేంద్రుడి నాయకత్వంకింద అందరూ కలిసి బ్రహ్మదగ్గిరికి వెళ్ళారు 'మరణమే లేకపోతే, మనుష్యులికీ మాకూ భేదమేముం దిక!' అంటూ మొర్ర పెట్టారు.

"'భయపడకండి' అంటూ భరోసాఇచ్చాడు బ్రహ్మ. ఈ పాటికి మనవాడి సత్రయాగం పూర్తయే వుంటుంది, యథాప్రకారం తనపనిలో తాను ప్రవేశిస్తాడు. అతడి తేజస్సూ, మీ తేజస్సూ కలుపుకుని ఐదుగురు పుడతారు భూమ్మీద. అతడి పనికి సాయపడతారు' అంటూ చెప్పి పంపించాడు.

“బ్రహ్మలోకంనించి స్వర్గానికి తిరిగివెళుతూ గంగదగ్గిరికి వచ్చారు దేవతలు. వాళ్ళు వచ్చేసరికి, గంగలో ఒక పడుచుపిల్ల ఏడుస్తూ కూచుంది. ఆమె కన్నీటి చుక్కలు గంగలోపడి బంగారం పద్మాలు పూస్తున్నాయి. ఆశ్చర్యపోయారు దేవతలు.‘ ఎవరునువ్వు? ఎందుకిలా ఏడుస్తున్నావు?’ అంటూ అడిగాడు దేవేంద్రుడు. ‘నన్ను తెలుసుకోవాలని వుంటే నాతో కూడా రా’ అందామె. ‘సరే,’ అంటూ వెంటనడిచాడు దేవేంద్రుడు.

“ఇద్దరూ హిమాలయపర్వతం వరకు వెళ్ళారు. ఎదురు గుండా పెద్ద గుహ. గుహాముందు చిత్రవిచిత్రమైన ఒక రత్నాల పీనె. పీనెమీద సింహాసనం. సింహాసనంమీద నడియవ్వనంలోవున్న ఒక యువకుడు. యువకుడి ఎదట చక్కని దంతపు బొమ్మలాంటి కుర్రది. ఇద్దరూ కులాసాగా జూదమాడుకుంటున్నారు. వెళ్ళి, ముందు నుంచున్నాడు ఇంద్రుడు. లేవలేదు సరికదా, కన్నెత్తి చూడనన్నా లేదు యువకుడు. అభిజాత్యం బాధించింది ఇంద్రుణ్ణి. చురుమన్నాడు. ‘జీవులతోవున్న ఈ సమస్త ప్రపంచమూ నాది. లోకాలన్నీ నా వజ్రాయుధంతో ఏలుకుంటున్నాను. దేవేంద్రుణ్ణి నేను. నేనే వచ్చి నుంచుంటే కళ్ళు కనపడడంలేదు నీకు. సింహాసనమెక్కి కూచున్నావు. పై పెచ్చు పెళ్ళాంతో కులుకుతున్నావు! ఇంత నిర్లక్ష్యమా?’ అంటూ గద్దించాడు.

“‘వీడు నా ఆటకి అడ్డువస్తున్నాడు. దుర్మార్గుడు’ అంటూ పళ్ళు కొరికాడు యువకుడు. కన్యతట్టు చూసి; ‘ఈడ్చుకురా వీణ్ణి’ అన్నాడు. ఆమె చెయ్యి తగిలిందో లేదో, తూలి, తెలివిలేకండా పడ్డాడు దేవేంద్రుడు. ‘ఏం, ప్రపంచానికి ప్రభువు నంటున్నావు. మిడిసి పడుతున్నావు. ఏదీ, ఈ కొండశిఖరం ఎత్తి, ముక్కలు చెయ్యి, చూద్దాం’ అన్నాడు యువకుడు.

“పర్వతశిఖరంఎత్తి పగలగొట్టాడు దేవేంద్రుడు. తీరాచూస్తే, అందులో [illegible] తనలాంటివాళ్ళే మరి నలుగురు కనిపించారు.

'ఏమిటీ చిత్రం! ఒక్కణ్ణేకదా, ఐదుగుర్నెలా అయాను" అంటూ తెంబేలుపడి యువకుడికేసి చూశాడు ఇంద్రుడు. మరీచిత్రం! యువకుడు సాక్షాత్తూ శివుడు. కుర్రది పార్వతి. 'మీ ఐదుగురూ నరయోనిలో పుట్టండి' అన్నాడు శివుడు.

"యముడూ, వాయువూ, ఇంద్రుడూ, అశ్వినీదేవతలూ — ఈ ఐదుగురే వొక్కరూపంలో కనిపించారు. వాళ్ళే పంచపాండవులై పుట్టారు. కాశీరాజుకూతురే ద్రౌపది. ఐదుగురు దేవేంద్రులికి భార్య అవుతానని లోగడ తపస్సుచేసింది లక్ష్మి. ఆ లక్ష్మి అంశతోనే పుట్టింది ద్రౌపది. దేవతల హితంకోసమే జరుగుతున్నాది ఇదంతా. అటు బ్రహ్మ వాళ్ళ ప్రార్థనమీద నారాయణుడి నల్లవెంట్రుక వొకటీ, తెల్లవెంట్రుక వొకటీ - ఈ రెండూ కృష్ణుడూ బలరాముడూ అయాయి. కృష్ణుడు పాండవులపక్ష మున్నాడు.

"ఇంతకథ వుంది మరి! చిత్రంగా వుందేమో నీకు! కావలిస్తే పాండవుల పూర్వదేహాలు చూడు" అంటూ ద్రుపదుడికి దివ్యదృష్టి ఇచ్చాడు వ్యాసుడు.

తాటిచెట్లంతలేసి దివ్యవిగ్రహాలు ఐదూచూశాడు ద్రుపదుడు. రత్నకిరీటాలూ, రత్నహారాలూ ధగధగ లాడిపోతున్నాయి. ఉదయిస్తూన్న సూర్యబింబంలాగా, మండుతూన్న అగ్నిహోత్రంలాగా వున్నాయి శరీరాలు. వాళ్ళకి భార్యకావాలంటూ తపస్సుచేస్తూన్న కన్యామూర్తినీ చూశాడు. సౌందర్యమంతా కుప్పపోసి నట్టుందామె. నిర్విణ్ణు డయాడు ద్రుపదుడు.

మళ్ళీ అందుకున్నాడు వ్యాసుడు. "ఇందాక ధర్మరాజన్నట్టు కావాలంటే, చరిత్ర నిదర్శనాలూ కనిపిస్తాయి. పూర్వం నితంతుడని వొకరాజు వుండేవాడు. అతడికి సాల్వేయుడూ, శూరసేనుడూ, సేనాబిందుడూ, సారుడూ, అతిసారుడూ, అని ఐదుగురు కొడుకులు. ఈ ఐదుగురు అన్నదమ్ములూ ఐకమత్యంతో వుంటూ ఔశీనరరాజు కూతురు అజితని స్వయంవరంలో పెళ్ళి చేసుకున్నారు. ఐదుగురికీ

ఆమె వాళ్ళకతే భార్య. వాళ్ళు ఐదుగురికీ ఐదుగురు కుమారుల్నీ కన్న దామె. అంచేత, ఆ సందేహమూ అక్కరలేదు. ఇంతకీ ఇదేమో మన చేతిలో లేదు. ఆలోచించకు. ఐదుగురికీ అమ్మాయినిచ్చి పెళ్ళిచెయ్యి" అంటూ ఉపదేశించాడు. ద్రుపదుణ్ణి ఒప్పించి పాండవులదగ్గిరికి తీసుకు వచ్చాడు.

### ద్రౌపది పెళ్ళి

ఇవాళ పుష్యమీ నక్షత్రం. * పుణ్యదినం. దివ్యమైన ముహూర్తముంది. అన్నదమ్ము లైదుగురూ ద్రౌపదిని పెళ్ళిచేసుకోండి" అన్నాడు వ్యాసుడు. ముహూర్తం నిశ్చయమైంది. పట్నంలో అష్టశోభనాలూ + చేయించాడు ద్రుపదమహారాజు. వివాహమహోత్సవానికి అవసరమైన కార్యక్రమ మంతా క్షణాలమీద కావాలని ఆజ్ఞ వేశాడు. కలియుగ వైకుంఠంలాగ ఎంతో ఇదిగా తయారైంది కాంపిల్యనగరం.

ఊరంతా, ఎక్కడపడితే అక్కడ వాకిలి ద్వారాలదగ్గిర పోక చెట్లూ, అరటిచెట్లూ నాటారు. వాటికి రావిచిగుళ్ళు దండలుకట్టి వేలాడదీశారు. వాకిళ్ళలో మంచిగంధం కల్లాపుచల్లారు. పచ్చ కర్పూరం, మంచిముత్యాలూ ముగ్గులువేశారు. మంగళాలంకారాలతో తీరికలేకండా వున్నారు పునిస్త్రీలు. ఉత్సవానికి వస్తూన్న రాజులూ, రాజబంధువులూ, స్నేహితులూ, బ్రాహ్మలూ అంతులేకండా వున్నారు.

---

* రోహిణి అని తెలుగు. ఇది సరికాదు. పుష్యమి అనే మూలం. ఒడియాలో సరళాదాసు ఉత్తర అంటాడు. స్వయంవరం జరిగింది పౌషమాసం రోహిణినాడు "పౌషమాసం అంటే:- రేవతికి అధిదేవత పూషుడు. రేవతి మీనరాశిలోది. పౌషమాసమంటే మీనమాసం" అని మా రాఘవరావుగారు. దీన్ని బట్టి ద్రౌపది పెళ్ళి మీనమాసంలో శుక్లపక్షం పుష్యమీ నక్షత్రం నాడన్నది రూఢి.

+ అష్టశోభనాలు : కల్లాపులు, ముగ్గులు, పందిళ్లు, తోరణాలు, ధ్వజాలు, ఛత్రాలు, ధూపదీపాలు, పూర్ణకుంభాలు.

కోటకి ఈశాన్యంగా అలంకరించారు వివాహ మండపం. చిత్ర విచిత్రములైన వస్త్రాలు చందువాలు కట్టారు. గుత్తులు గుత్తులు, దండలు దండలు ముత్యాలహారాలూ, పూలమాలలూ వేలాడ వేశారు. మండప స్తంభాలికి చక్కని చీనాదేశ వస్త్రాలు చుట్టి ముస్తాబుచేశారు. కొత్తచిగుళ్ళూ వరి అక్షతలూ పెట్టి, బంగారం పూర్ణకుంభాలు తీర్చిపెట్టారు. పేలాలూ నేతులూ నింపిన బంగారం గిన్నెలు పేర్చారు. చిదుగులూ, దర్భలూ, సన్నికల్లూ, కాడి సీలలూ—వొకటేమిటి, అవసరమైన అన్నివస్తువులూ సిద్ధంచేశారు.

బంగారంతో తయారుచేసి, పచ్చలతో సింగారించారు పెళ్ళి పీన. పీనమధ్య ప్రకాశిస్తూ వుంది హోమకుండం. పాండవుల పురోహితుడు ధౌమ్యుడూ, విద్వాంసులైన బ్రాహ్మణులూ ఎవరిస్థానాల్లో వాళ్ళు కూచున్నారు.

మంగళస్నానాలుచేసి, మహోజ్వలములైన రత్నాలనగలూ అవీ పెట్టుకుని పెళ్ళికొడుకులు ఐదుగురూ వచ్చి పీటలమీద కూర్చు న్నారు. నెరజాణలైన ముత్తయిదువులు అప్సరసలాగ అలంకరించారు ద్రౌపదిని. వెయ్యిమంది చెలికత్తెలతో వచ్చి కూచుంది పెళ్ళి కూతురు. బ్రాహ్మణుల పుణ్యాహధ్వనీ, ఎన్నోవిధాల బాజాలూ, బజంత్రీలూ, మంగళగీతాలూ—వొక్కసారి గింగురుమంటున్నాయి. మెలికలు మెలికలుగా శిఖతీర్చి మండుతోంది హోమకుండం. వివాహ మంత్రాలతో ఆహుతులు వేల్చాడు ధౌమ్యపురోహితుడు.

మొదట ధర్మరాజుకి పెళ్ళిచేశారు ద్రౌపదిని. తరవాత భీము డికి. ఆ తరవాత అర్జునుడికి. అనంతరం నకులుడికి, చివర సహదేవుడికి. ఆశీర్వాదాలతో మంగళాక్షతలు చల్లారు సమావేశమైన మహాజనులు. ఆకాశంమీద దేవదుందుభులు మోగాయి. మెల్ల మెల్లగా వీస్తూన్న మలయవాయువులతో కలిసి, ఘుమ ఘుమ లాడుతూ పూలవాన కురిసింది.

# ఆదిపర్వం

## ఎనిమిదో ఆశ్వాసం

మహావైభవంగా కుమార్తెని పాండవులికి వివాహం చేశాడు ద్రుపదమహారాజు. పెళ్ళిపీటలమీద అల్లుళ్ళయిదుగురికీ విడి విడిగా వెలలేని మణులూ, రత్నాలనగలూ, ధనరాసులూ, బంగారు మంచాలూ, బంగారం పీటలూ, చెరో వంద బంగారం రథాలూ, వందవంద భద్రగజాలూ వెయ్యేసి కాంభోజదేశం గుర్రాలూ, పదేసి వేలు దాసదాసీజనాలూ, నూరేసివేలు పాడిఆవులూ చదివించాడు.

నాలుగుసముద్రాలమధ్యా వున్న యావత్తూ భూప్రపంచానికీ సామ్రాజ్యలక్ష్మి కాదగ్గది ద్రౌపది. అరమరలేకండా ఐదుగురు భర్తలికీ సమానంగా శుశ్రూష చేసే దాసి. ఐదుగురినీ మెప్పించేది. కోడలి గుణాలు చూసి పొంగిపోయేది కుంతీదేవి. "నా చిట్టితల్లీ, మా నాయనలు మహారాజులై, రాజసూయాలూ అవీ చేసేటపుడు, ధర్మపత్నిగా నువ్వే కూచుంటావే తల్లీ" అంటూ లాలించేది. విష్ణువు దగ్గిర లక్ష్మీదేవిలాగా, చంద్రుడి దగ్గిర రోహిణిలాగా, ఇంద్రుడిదగ్గిర శచీదేవిలాగా, వశిష్ఠుడిపక్క అరుంధతిలాగా, నీ భర్తల దగ్గిర ప్రేమగా వుండు. బంగారంలాంటి చిట్టిబాబులు పుడతారు మా అమ్మకి. చూడమ్మా, గురువుల్నీ, బంధువుల్నీ గౌరవిస్తూ వుండేం! అతిథిపూజా అదీ మరిచిపోకూడదు. ప్రజలమీద దయగలిగి వుండాలి. నాలాగే, కొడుకుల్నీ, మనమల్నీ ఎత్తుకుంటావమ్మా, నువ్వు" అంటూ దీవించేది. ముద్దించేది, దగ్గిర కూచోబెట్టి బుద్ధులు చెప్పేది.

తన మేనత్తకొడుకులు ద్రౌపదిని వివాహం చేసుకున్నారని, ద్వారకలో విన్నాడు శ్రీకృష్ణుడు. ఐదుగురికీ నవరత్నాల నగలూ

దేశదేశాల జిలుగువస్త్రాలూ, సవారీలూ, పల్లకీలూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, స్త్రీలూ పంపించాడు. మహారాజుల్లాగ కాంపిల్యనగరంలో వుంటూ వచ్చారు పాండవులు.

పరాక్రమవంతులైన పాండవులు అల్లుళ్ళయారు. పై పెచ్చు ఇసతోనే వుంటున్నారు. ఇక, దేవతలన్నా భయంలేదు ద్రుపద మహారాజుకి దేశంలో శాంతీభద్రతలకి లోపంలేదు. దొంగలభయం, కరువూ కాటకాలూ, అనారోగ్యం — ఇవేవీ లేవు. గుండెలమీద చేతులు వేసుకుని హాయిగా నిద్రపోతున్నారు ప్రజలు. ఇలా వొక సంవత్సరం గడిచింది.

అక్కడ హాస్తినాపురంలో వొకనాడు కర్ణుడూ, దుశ్శాసనుడూ, శకునీ, సోమదత్తుడూ - వీళ్ళతో కలిసి కులాసాగా లోకాభిరామా యణం మాటాడుతూ కూచున్నాడు దుర్యోధనుడు. ఇంతలో దక్షిణ పాంచాలం వెళ్ళిన వేగులవాళ్ళువచ్చి "పాండవులు బతికేవున్నారు మహాప్రభో" అన్నారు. గుండెల్లో రాయిపడింది దుర్యోధనుడికి.

"అవాళ మత్స్యయంత్రం కొట్టినవాడు అర్జునుడు. శల్యుణ్ణి చిత్తుచేసినవాడు భీముడు. ఐదుగురూ ద్రౌపదిని వివాహం చేసుకున్నారు. ఇప్పుడు కాంపిల్యనగరంలోనే కాపురమున్నారు" అంటూ చెప్పారు వేగులవాళ్ళు.

"అయ్యో, ఐతే పురోచనుడు వొకడే కాలిపోయాడు లక్క ఇంట్లో!" అంటూ దుఃఖపడ్డాడు దుర్యోధనుడు. "అదృష్టం కలిసి రాకపోతే, మనిషన్నవాడు ఎంత కొట్టుకుంటే మాత్రం ఏంలాభం?" అంటూ తల కొట్టుకున్నాడు. "ఊం — అయిందేదో ఐంది. ద్రుప దుడికీ వాళ్ళకీ పడకండా భేదం కల్పించి పాండవుల్ని అక్కడినుండి ఉద్వాసంచెయ్యాలిపుడు. యాదవులూ, వృష్ణులూ, భోజులూ పాండవులంటే పడిచచ్చేవాళ్ళే. శిశుపాలుడూ వాళ్ళదిక్కే మొగ్గు తాడు. తమ మేలుకంటే పాండవులమేలేకోరేవాళ్ళు వీళ్ళు. వీళ్ళంతా వకం కాకుండానే, తగిన పాచిక వేయాలి మనం" అంటూ పాంచాలం

వాళ్ళకీ పాండవులికీ ఎలా పుల్లలు పెట్టడమా అన్న దురాలోచనలో పడ్డాడు దుర్యోధనుడు.

ఎప్పటికప్పుడు పాండవుల వార్తలు వింటూనే వున్నాడు విదురుడు. అర్జునుడు మత్స్యయంత్రం కొట్టడం, దుర్యోధనుడూ వాళ్ళూ దెబ్బతిని రావడం, ద్రౌపది పాండవుల్ని వివాహమాడడం, ఇంత కాలమూ పాండవులక్కడ క్షేమంగా వుండడం — ఇదంతా వివరాలతో చెప్పాడు ధృతరాష్ట్రుడికి. "పోనీ బిడ్డలు క్షేమంగా వున్నారని విన్నాను. అంతేచాలు. కాలంచేశారని దుఃఖపడ్డాం. వాళ్ళ వొంట్లో పీడ వొదిలింది. అమంగళం శాంతించింది. ఆఁ, వివాహం కూడా చేసుకున్నారూ! ఎంతశుభవార్త! పాంచాలం మన బంధు రాజ్యంలో చేరిందన్నమాట!" అంటూ విదురుడికి సంతోషం కలిగేట్టు మాట్లాడాడు. లోపలి కుళ్ళుమాత్రం పైకి కనపడకండా నటించి అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు.

ఒంటరిగా వుండడం కనిపెట్టి కర్ణుణ్ణీ, దుశ్శాసనుణ్ణీ, శకునినీ వెంటపెట్టుకుని తండ్రిదగ్గిరికి వచ్చాడు దుర్యోధనుడు. "రాత్రీ, పగలూ పిశాచంలాగ పిన్నాయన్ని వొదిలిపెట్టకండా వుంటాడు విదురుడు. మీతో మాట్లాడడానికే అవకాశం చిక్కడు మాకు. ఇవాళ ఏదో సుదినం. ఇన్నాళ్ళకి చిన్న సందు దొరికింది. విదురుడు పాండవులమనిషి అని తెలిసి తెలిసీ అతడి మాటే వింటారు మీరు. అతడంటే మరేదీ కనపడదు మీకు" అంటూ వెళ్ళగానే మొదలు పెట్టాడు దుర్యోధనుడు.

"వాళ్ళంటే మీ కెంతఇదో నాకూ అంతే అని నమ్మండి" అన్నాడు ధృతరాష్ట్రుడు. "మాటల్లోనూ చేతల్లోనూ పైకిమాత్రం పాండవులంటే ఇష్టంగావున్నట్టు నటిస్తాను. అంతే. లోగుట్టు ఎన్నడూ విప్పిచెప్పను విదురుడికి. మనకి దైవం అనుకూలించలేదు. వాళ్ళరొట్టె నేతిలోపడింది. చచ్చిపోయారనుకున్నవాళ్ళు బతికి [illegible] ఏం చెయ్యాలో మీరే చెప్పండి" అన్నాడు.

"అదే మేమూ ఆలోచిస్తున్నాను" అంటూ అందుకున్నాడు దుర్యోధనుడు. "పాండవులు పాంచాలంలో వుండకండా చెయ్యాలి. ఎందుచేతనంటే. అసలే బలవంతుడు ద్రుపదుడు. చుట్టాలూ, పక్కాలూ, కొడుకులూ, స్నేహితులూ వున్నవాడు. అలాంటి వాడి ఆసరాలో వుంటే, కృష్ణుడూ, బలరాముడూ అటే కలుస్తారు. యాదవులూ, వృష్ణులూ, భోజులూ, అంధకులూ అందరూ ఏకమవుతారు. ఇక చెప్పేదేముంది? పాండవుల్ని గెలవడం ప్రాణసంకట మౌతుంది. కనక ద్రుపదుడితో పాండవులికి పడకండా భేదోపాయం ప్రయోగించాలి. అక్కడనుండి వాళ్ళని తరిమెట్టు చేయాలి. లేదా, తగిన వాళ్ళని పంపి కుంతికొడుకులికీ మాద్రి కొడుకులికీ విరోధం పెట్టించాలి. అదీ కాదంటే, అందమైన ఆడవాళ్ళవి ఐదుగురికీ అంటగట్టి ద్రౌపదిమీద విరక్తి పుట్టించాలి. లేదంటే, సుంధరలాంటి దాన్ని పంపి, ఐదుగురు మగళ్ళతో వేగలేదని ద్రౌపదికి భర్తలమీద అసహ్యం కలిగించాలి. కాదంటారా రహస్యంగా భీముణ్ణి చంపించి, వాళ్ళని కోరలులేకండా చెయ్యాలి. భీముడూ, అర్జునుడూ ఏకమైతేనే పీకలమీదికి వస్తుంది. వాణ్ణి కాస్తా కాజేస్తే, అర్జునుడు మన కర్ణుడిముందు నలుసు. ఏదిచేసినా వెంటనే చెయ్యాలి. ఆలస్యమైన కొద్దీ విషమిస్తుంది" అన్నాడు.

"అంత మీదమీద, భేదోపాయాలకి లొంగేవాడు కాదు ద్రుపదుడు" అంటూ కలగజేసుకున్నాడు కర్ణుడు. పుట్టెడు బంధువులూ, బుద్ధిమంతులైన కుమార్తెళ్ళు పెట్టుకుని, పదిమంది రాజుల్లోనూ జనమంచిగా పోతున్నవాడు. వినయంగా మసులుకుంటూన్న అల్లుళ్ళని ఎన్నడూ వొదులుకోడు. ఒక్క పెళ్ళాంమీద వలపుపెట్టుకున్న వాళ్లు పాండవులు. వాళ్ళలో వాళ్ళు కుమ్ములాడుకోవడం జరగనే జరగదు. ఒక్క స్త్రీకి బహుమంది భర్తలు వున్నారూ అంటే, అది దానికి ఇష్టమే అన్నమాట. అంచేత, అసహ్యించుకోవడం కాదు,

మరింత వలపుతో వుంటుంది ద్రౌపది. ఇక, భీముణ్ణి చంపుతా మంటారా, అది లోగడే తేలిపోయింది. నాకు తోచిందల్లా వొక్కటే ఉపాయం – దండోపాయం అదే వీరత్వం. రాచబిడ్డ అన్నవాడి కల్లా వీరత్వమే మహోపాయం. వెంటనే సైన్యం వేసుకు వెళ్ళడం. ద్రుపదుణ్ణి చిదకగొట్టడం. పాండవుల్ని పట్టుకురావడం, ఇంతకు మించిన ఉపాయం లేదుమరి" అన్నాడు.

"అదీ కొంత నిజమే. ఐనా, తెలిసినవాళ్ళని మనవాళ్ళు నలుగురినీ పిలిచి ఆలోచిద్దాం" అన్నాడు ధృతరాష్ట్రుడు. వెంటనే భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, సోమదత్తూ – ఈ మొదలైన వాళ్లని పిలిపించాడు. విషయమంతా పొందికగా తెలియజేశాడు. "ఇప్పుడు మనం చెయ్యవలసిన కర్తవ్యమేమిటో నిర్ణయించండి" అన్నాడు.

అంతావిని, దుర్యోధనుడికేసి చూశాడు భీష్ముడు. "మీ అయ్యా, పాండురాజూ – ఇద్దరూ వొక్కటే నాకు. వారి బిడ్డలు మీరు. మీరన్నా, పాండవులన్నా కూడా నాకు భేదం లేదు. వాళ్ళతో విరోధానికి ఎన్నడూ వొప్పుకోలేను. తాత తండ్రుల నుండీ వస్తూన్న రాజ్యానికి మీ కెంత అధికారముందో, వాళ్లకీ అంతే అధికారముంది. అంచేత, వాళ్ళకి సగం రాజ్యమిచ్చి తక్కిన సగం నువ్వు అనుభవించు. విరోధప్రయత్నం విరమించు. స్నేహంగా వుండడమే క్షేమం నీకు. దీనివల్ల బంధువులూ సుఖపడతారు. పదిమందిలో కీర్తి వస్తుంది. కీర్తికంటే కావలసిందేముంది మనిషికి? కీర్తి స్వర్గం. అపకీర్తి నరకం. కీర్తిలేనివాడి జీవితం వ్యర్థం" అన్నాడు.

"వేలకి విలవైన సలహా ఇచ్చారు తాతగారు" అంటూ ముక్తాయించాడు ద్రోణుడు. బతికివున్నారని తెలియడంతోనే వాళ్లకోసం పరిగెత్తించవలసింది మనం. ఇప్పుడైనా మించిపోయింది లేదు. వాళ్ళ ఐదుగురికీ, కుంతీదేవికీ, ద్రౌపదికీ, ద్రుపద ధృష్టద్యుమ్నులికీ బహుమానాలూ, ఆభరణాలూ అవీ ఇచ్చి దుశ్శాసనుడూ, విక

ర్ణుడూ మొదలయినవాళ్లని కాంపిల్యం పంపించు సగౌరవంగా వాళ్లని పిలుచుకు రమ్మను. అన్నదమ్ములు మీలో మీకు విరోధమేమిటి? శకునీ, కర్ణుడూ చెడగొడుతున్నారు నిన్ను. అనుభవం కల పెద్దల మాట వినకండా పెడదారిని పెడతారు స్నేహితులమని చేరిన బుద్ధిమంతులు కొందరు. సత్యమూ, ధర్మమూ తప్పనివాళ్లు పాండవులు. వారసత్వంగా వచ్చిన వాళ్ల రాజ్యం వాళ్లది కాదనడానికి ఎవడి శక్యం?'' అన్నాడు.

"శత్రువుల్ని చేరదియ్యమన్నవాణ్ణి ఈయన్నే చూశాను," అంటూ కస్సుని లేచాడు కర్ణుడు. "వాళ్లకి తోచిందేతప్ప ఇంకో ఆలోచన వుండదు ఈ ముసిలాళ్లకి. రాజు కావాలన్నది వొకటి, వీళ్ళు చెప్పింది మరొకటి. కళ్లుమూసుకుని వాళ్లకి తోచింది వాళ్ళు బోధిస్తారు మంత్రులు. దాని మంచీ చెడ్డా విచారించి నడుచుకోవలిసినవాడు యజమాని. లోగడ మగధరాజు నితంతువు * అసమర్థుడుగా వుండేవాడు. అతడి ముఖ్యమంత్రి రాజశాసనం తన పిడికిల్లో పెట్టుకుని మహారాజుని మట్టిపెట్టేశాడు. రాజుని తోసిరాజని తానే రాజైపోయాడు. తుదకి అతడి చేతిలోనూ నిలవలేదు రాజ్యం. శత్రువులపాలైంది. అంచేత, మంత్రుల్ని నమ్మకూడదు. పైకి మేలుచేస్తున్నట్టే నటించి ఉపన్యాసా లిస్తారు. చేసేదంతా కీడే చేస్తుంటారు. ఈ ముసిలాళ్ళు ఇద్దరిమాటా సవతితల్లి ప్రేమలా వుంది నామట్టుకు'' అన్నాడు.

"మాది సవతితల్లిప్రేమ! నీది కన్నతల్లి ప్రేమ! మాకంటే నువ్వే కావలిసినవాడివి కౌరవులికి!!'' అంటూ లేచాడు కోపం ఆపుకుంటూనే ద్రోణుడు. "నీ మంత్రోపదేశం వల్లే కౌరవకులంలో కల్లోలం రేగుతుంది. అద్దంలా కనిపిస్తూనే వుందది. అంతేలే. ఏజాతి పిట్ట ఆ జాతికూత కూస్తుంది'' అన్నాడు.

---

* అంబువీచుడు.

శ్రుతిమించకండా అడ్డువచ్చాడు విదురుడు. "యథార్థ వాదులూ, మధ్యస్థులూ, ధర్మజ్ఞు తెలిసినవాళ్ళూ, వృద్ధులున్నూ భీష్మ ద్రోణులు. వాళ్ళేద చెపితే అది చెయ్యాలం నీ ధర్మం" అన్నాడు ధృతరాష్ట్రుడికేసి తిరిగి. 'వివిశంటే మనకి హితులెవ్వరు? దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, కర్ణుడూ యువకులు. ఇది మంచీ, ఇది చెడ్డా అని తెలియదు వాళ్ళకి వాళ్ళమాట పాటించకు. పాండవుల్ని పిలిపించు. అర్ధరాజ్య మిచ్చి ఆదరించు. ఉన్నమాట చెప్తున్నాను. సహజంగానే వాళ్ళు వీరులు. దానికితోడు ద్రుపదుడూ ఆత్మబంధు వయూ డిపుడు. వాళ్ళ బావ ధృష్టద్యుమ్నుడూ వాళ్ళంత వాడే మరి. శ్రీకృష్ణుడూ, బలరాముడూ వాళ్ళకి మిత్రులుగానూ, మంత్రులుగానూ పనిచేస్తున్నారు. ప్రజాశక్తీ, దైవశక్తీ వాళ్ళదిక్కే వుంది. వెర్రికాక పోతే, వాళ్ళమీదికి యుద్ధానికి వెళ్ళడమేమిటి మనవాళ్ళు? ధనుస్సు చేతిలోవుంటే అర్జునుణ్ణి తేరిచూసేవాడెవడు? అతడికి తోడు అమిత బలుడు భీముడు. అగ్రతనుసకలు నకుల సహదేవులు. వీళ్ళందరికీ మించిన బలం ధర్మరాజు ధర్మగుణం. ధర్మం, ధైర్యం, దయా, సత్యం — ఇవి తమ్ముల మల్లేనే అతడు చెప్పినట్టు వింటాయి. వాళ్ళతో విరోధం పెట్టుకోవడం కొండతో ఢీకొట్టవడమే. ఇంతకీ వాళ్ళు పరాయివాళ్ళు గనకనా మనకి? పాండురాజుకొడుకులు నీ కొడుకులు కారా? వాళ్ళని ఎడపెట్టడం న్యాయమా? మన పుణ్యమా అంటూ లక్క ఇంటి దురంతం నుండి బతికారు వాళ్ళు. పురోచనుడు పూసిన అపకీర్తి బురద వుండనే వుంది నీకు. అర్ధరాజ్య మిస్తే అది కడుక్కుపోతుం దిపుడు. దుర్యోధనుడి దుర్బుద్ధిలో పడ్డావో, ప్రజల్లో ఉపద్రవం పుడుతుంది. మొదటినించీ చెవిలో ఇల్లుకట్టుకు పోరుతూనే వున్నాను. ఇప్పుడైనా అనర్థంరాకండా చూడు" అన్నాడు.

దాంతో కొంత దారికివచ్చినట్టు కనపడ్డాడు ధృతరాష్ట్రుడు. "ఆ మాత్రం బుద్ధిలేదా నాకు? నువ్వూ పెంకనాన్నా ఆచా

ర్యులూ ధర్మనిర్ణయంచేసి చెప్పింది కాదని ఎలా అంటాను? అందుకనేకదా మిమ్మల్ని పిలిపించింది! మీ మాటప్రకారం పాండవుల్ని పిలిపిస్తాను. అర్ధరాజ్యమూ ఇస్తాను. సరేనా!" అన్నాడు. "మరి నువ్వేవెళ్ళు కాంపిల్యం అవసరమైన సరంజామా యావత్తూ పట్టుకు వెళ్ళు. సగౌరవంగా బిడ్డల్ని తీసుకురా" అన్నాడు.

పాంచాలానికి ప్రయాణమయ్యాడు విదురుడు. అంచెలమీద వెళ్ళి కాంపిల్యం చేరుకున్నాడు. ఆ సమయానికి శ్రీకృష్ణుడూ అక్కడే వున్నాడు. కుమార్తెల్నీ, అల్లుళ్ళూ, కృష్ణుడూ — అందరితోనూ కలిసి సరదాగా మాట్లాడుతున్నాడు ద్రుపదుడు. విదురుడు రావడంతోటే సగౌరవంగా సత్కరించి కూచోబెట్టాడు. ధృతరాష్ట్రుడు పంపిన రత్నాభరణాలూ, పట్టుబట్టలూ అన్నీ విడివిడిగా పాండవులికీ, ద్రుపదుడికీ వాళ్ళకీ ఇచ్చాడు విదురుడు. కుశలప్రశ్నలయ్యాక, ద్రుపదుడితో తాను వచ్చిన ప్రస్తావన ప్రారంభించాడు. "మహారాజా, ఉన్నతవంశస్థుడివి నువ్వు. ధర్మశీలుడివి. నీ అంతటి వాడితో సంబంధం కలిసింది మాకు. ఇంతకంటే కావలిసిందేముంది? భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ — ఒకరేమిటి, కౌరవకులం యావత్తూ సంతోషిస్తున్నారు దీనికి. కుంతీదేవీ, కుమారులూ తమని ఎడబాసి పోవడం ప్రజలూ, బంధువులూ ఎంతో దుఃఖించారు. మీ దగ్గిర వున్నారని విని ప్రాణాలు లేచివచ్చాయి. చూడాలని అందరూ ఆతురపడుతున్నారిపుడు. నువ్వు అనుమతిస్తేనేకాని బైలుదేరరు వీళ్ళు. అంచేత, నిన్ను ప్రార్థిస్తున్నాను. అల్లుళ్ళనీ, కుమార్తెనీ నాతో హస్తినాపురం పంపించు" అన్నాడు.

"ధృతరాష్ట్ర మహారాజు పంపడమూ, నువ్వు స్వయంగా రావడమూ—అప్పుడే అనుకున్నాను, పాండవుల భాగ్యరేఖ బైలుపడింది అని. సర్వకాల సర్వావస్థల్లోనూ కృష్ణుడూ, నువ్వూ వీళ్ళక్షేమం విచారిస్తూనే వున్నారు. మీ ఉభయులూ ఆలోచించి ఏది నిశ్చయిస్తే అదే సమ్మతం నాకు" అన్నాడు ద్రుపదుడు.

"ఎవరి ఆలోచనలో ఏముంది ?" అంటూ అందుకున్నాడు కృష్ణుడు. "పాండవులమేలు వెయ్యికళ్ళతో కనిపెడుతూ వున్నవాడు విదురుడు. అతడంటూ వుంటే, ఈగన్నా వాలదు వీళ్ళమీద, అన్యథా విచారించకు. వీళ్ళకి మంచే కలుగుతుంది ఇకమీద సందేహంలేదు" అన్నాడు.

"తాతగారు భీష్ములూ, బాబయ్యగారూ, మామగారూ, విదురుడూ గురుజనం మాకు. శ్రీకృష్ణుడు మాకే ఏమిటి లోకానికే గురుదేవుడు. ఇందరూ ఏదంటే అదేశుభం మాకు" అన్నాడు ధర్మ రాజు. విదురుడివెంట వెళ్ళడానికి అంగీకరించాడు.

అందరిదగ్గిరా సెలవుతీసుకుని హస్తినాపురం బయల్దేరారు పాండవులు. శ్రీకృష్ణుడూ, బావ ధృష్టద్యుమ్నుడూ అపరిమితమైన పరివారంతోనూ, సేనలూ వాటితోనూ వెంటవచ్చారు.

ముందుగా వార్త వచ్చింది హస్తినాపురం. ఎదురువెళ్ళి తీసుకు రండని వికర్ణుణ్ణీ, చిత్రసేనుణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ పంపాడు ధృత రాష్ట్రుడు. మహోత్సవంతో పట్నం ప్రవేశించారు పాండవులు. మహా నందంతో స్వాగతమిచ్చారు ప్రజలు. "ధర్మస్వరూపుడు ధర్మరాజు. మన అదృష్టంవల్ల, తమ్ములతోసహా బతికివచ్చాడు. పాండురాజే మనకోసం మళ్ళీ వచ్చినట్టుంది మనకి. ధర్మాత్ములికి దేవుడే తోడ్పడ తాడు. ధర్మసహాయమూ, పురుషసహాయమూ వున్నవాళ్ళకి ఆపదలు పోవాలిగాని, రాజ్యాలెటుపోతాయి! మనం చేసిన దానాలూ, ధర్మాలూ నిజమైతే ధర్మరాజే రాజవుతాడు మనకి" అంటూ ఉత్సవం చేశారు పౌరులు.

రావడంతోనే భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ మొదలైన పెద్ద లికి నమస్కరించారు పాండవులు. ఎవళ్ళకి తగినట్టు వాళ్ళని సంభా వించారు. దుర్యోధనుడూ మొదలైనవాళ్ళని ఆలింగనం చేసుకుని ఎప్పటిలాగ వాళ్ళతో కలిసీమెలిసీ కాలక్షేపం మొదలు పెట్టారు. అలా ఐదేళ్ళు గడిచాయి.

ఒకనాడు పాండవుల్ని కొలువులోకి పిలిచాడు ధృతరాష్ట్రుడు. శ్రీకృష్ణుడూ, భీష్ముడూ, విదురుడూ, ద్రోణుడూ, మొదలైన పెద్దలంతా వున్నారు. తమ్ములతో కలిసి దుర్యోధనుడూ వోపక్క కూచున్నాడు అందరి ఎదటా పాండవుల్ని సంబోధించాడు ధృతరాష్ట్రుడు. "జనులందరికీ కర్మసాక్షి ఈ శ్రీకృష్ణుడు. ఈయన సాక్షిగా ఇందరి ఎదటా కౌరవరాజ్యంలో అర్ధభాగం ఇస్తున్నాను మీకు. ఇది మీ అయ్య పాండురాజుది పుచ్చుకొని అనుభవించండి" అంటూ అర్ధరాజ్యానికి ధర్మరాజుని అభిషేకించాడు. 'ఇవాళనించీ ఖాండవప్రస్థం రాజధానిగా చేసుకోండి మీరు. వెళ్ళండి' అంటూ ఆదేశించాడు

"మహాభాగ్యం" అన్నారు పాండవులు. తాతదగ్గిరా గురువులదగ్గిరా సెలవుతీసుకున్నారు. శ్రీకృష్ణుణ్ణి వెంటపెట్టుకుని సపరివారంగా ఖాండవప్రస్థం వచ్చేశారు.

## ఇం ద్ర ప్ర స్థ ం

ఖాండవప్రస్థంలో రాజధాని నిర్మాణం కావాలి ఇంద్రుణ్ణి తలిచాడు కృష్ణుడు. ఇంద్రుడు విశ్వకర్మని పిలిచాడు. "వెళ్లు. పాండవులకోసం భూలోకంలో ఖాండవప్రస్థంలో స్వర్గంలాంటి పట్నం తయారుచెయ్యి" అంటూ ఆజ్ఞాపించాడు. వ్యాసుడూ, ధౌమ్యుడూ వాళ్ళూ కలిసి మంచి ప్రశస్తమైన ప్రదేశం నిర్ణయించారు. కొలతలూ అవీ వేశారు. శాంతిపూజలూ మొదలైనవి చేశారు. విశ్వకర్మ వచ్చి, అద్భుతమైన పట్టణం నిర్మించి వెళ్ళాడు ఇంద్రప్రస్థమన్నారు దాన్ని.

పట్నంలోని మేడల బంగారంశిఖరాల కాంతులు, దగ్గిరి మేఘాలమీద మెరుపులతో సమానంగా ప్రకాశిస్తున్నాయి. మంచులాగా ముత్యాలలాగా తెల్లవయిన పెద్దపెద్దమేడలు హిమాలయ పరంతాల్లాగ కనిపిస్తున్నాయి. చంద్రకాంతమణి వేదికల లతా

గృహాలనుండి పడుతూన్న జలప్రవాహాలు ఆకాశగంగని అనుకరిస్తు న్నాయి పట్నంచుట్టూ అగడ్త. అగడ్తలో పూసిన నల్లకలవలూ, తెల్లకలవలూ, పద్మాలూ పట్టణలక్ష్మికి పాదపూజచేసిన పువ్వుల్లా వున్నాయి. ఆకాశంమీది నక్షత్రాలు తలమీది పూజా పుష్పాల్లా కనిపిస్తున్నాయి. గోపురాలమీది రత్నాలకాంతులు పడి సూర్యుడి పచ్చనిగుర్రాలు రంగురంగులుగా కనిపించేవి అది చూసి ఆ గుర్రాలు తనవి కావేమో అని శంకించేవాడు సూర్యుడు.

పట్నం బైట అందమైన పెద్దపెద్ద తోటలు. అగరూ, కర్పూరం, గంధం, సంపంగీ, తమాలం, కేతకీ, కొబ్బరీ అరిటీ, పనసా, మామిడీ, పోకా— వొకటేమిటి, రకరకాల పూలచెట్లూ ఫలవృక్షాలూ— నందనవనంలా వున్నాయి. తోటలమీది సువాసన మోసుకుని, పట్నంలోని నందినీనదీతరంగాల తుంపుర్లతో కలిసి ఘుమఘుమలాడుతూ, చల్లచల్లగా వీచేది మలయమారుతం.

ఇలా భూలోకవైకుంఠంలాగా, అలకాపట్నంలాగా, అమరావతిలాగా అందంగా అపూర్వంగా వుంది ఇంద్రప్రస్థం,

వ్యాసమునీ, శ్రీకృష్ణుడూ మంచిరోజు నిర్ణయించారు. అవాళ పురప్రవేశమహోత్సవం. ధౌమ్యుడూ, అతడి వెనక ఎంతోమంది బ్రాహ్మలూ సముద్రఘోషలా వేదఘోష చేస్తున్నారు. పుణ్యజనలు ఆశీర్వాదాలు చేస్తున్నారు. మంగళసంగీతాలు మధురంగా వినిపిస్తున్నాయి. ఎన్నోవిధాల వాద్యాలు మోర్మోగుతున్నాయి. నాలుగు పురుషార్థాలవంటి నలుగురు తమ్ములూ వెనక నడిచారు. శుభముహూర్తంలో పురప్రవేశం చేశాడు ధర్మరాజు. జయజయధ్వనులు చేశారు ప్రజలు.

ఇంద్రప్రస్థం సింహాసనంమీద ప్రజానుకూలంగా ధర్మపరిపాలన ప్రారంభించాడు ధర్మరాజు. అతడి రాజ్యంలో దొంగల భయం లేదు. రోగభయం లేదు. శత్రుభయం లేదు. యజ్ఞాలు చేయడం చేయించడం, వేదాలు చదవడం చదివించడం, దానాలు

చేయడం పుచ్చుకోవడం— ఈ ఆరుకర్మలూ చేస్తూవుండేవాళ్లు బ్రాహ్మలు అంగళ్ళలో నవరత్నాలు రాసులుపోసి విక్రయించే వాళ్లు కోమట్లు, వీధుల్లో ఎక్కడచూసినా అందమైన ఆడవాళ్ళకి కొదవలేదు. ఇలా, ధర్మమూ, అర్థమూ, కామమూ, మూడింటి మీదా ఆసక్తికలిగి హాయిగా వుండేవాళ్లు ప్రజలు.

తమ్ముళ్లు నలుగురూ అనురాగంతోనూ, విధేయతతోనూ సేవిస్తూవుంటే, వొక మహాయజ్ఞంలాగ పవిత్రంగా ధర్మరక్షణచేసే వాడు ధర్మరాజు. వర్ణాశ్రమధర్మాలూ సడలకండా జాగ్రత్తపడే వాడు. హాస్యానికైనా అబద్ధమాడేవాడు కాడు పరాక్రమమూ, స్నేహమూ— ఈ రెంటిచేతనే యావన్మందిరాజుల్నీ వశపరచు కున్నాడు శత్రువులే లేకండా చేసుకొని అజాతశత్రువయాడు. ధర్మరాజంటే శరత్కాలంవెన్నెలలా వుండేది ప్రజకి. అతడు రాజు కావడంచేత 'మంచిరాణీ' అనిపించుకుంది భూదేవి.

ఇంద్రప్రస్థంలో పాండవులరాజ్యం స్థిరపడ్డాక ద్వారక వెళ్ళిపోయాడు కృష్ణుడు. వెళ్లేముందు ఐదుగురినీ దగ్గిరికి పిలిచాడు. "ఇవ్వాళో, రేపో నారదుడు వస్తాడు మీదగ్గిరికి. ఆయన ఉపదేశం విని అలా నడుచుకోవాలి మీరు" అని చెప్పివెళ్లాడు.

అన్నట్టుగానే వొకనాడు నారదముని వచ్చాడు. తమ్ముళ్ళతోసహా లేచి పాదపూజచేశాడు ధర్మరాజు. "మా పూర్వపుణ్యంవల్ల మీ దర్శనమైంది. కృతార్థులమయాము" అంటూ ద్రౌపదిని తెచ్చి మొక్కించాడు. ఆశీర్వదించాడు నారదుడు. ద్రౌపది అంతఃపురానికి వెళ్లాక ఐదుగురతోనూ ఏకాంతంగా ప్రసంగించాడు. "ఒక్కమాటమీద నడుచుకుంటూన్న అన్నదమ్ములు మీరు. మీ ఐదుగురూ వొక్కపిల్లని పెళ్ళిచేసుకున్నారు. ఈమె కారణంగా మీలోమీకు విభేదాలు పొక్కకూడదు. లోగడ సుందుడూ, ఉపసుందుడూ అని ఇద్దరు అన్నదమ్ములు వొక్కస్త్రీ కోసం పోట్లాడి చచ్చారు. ఆ కథ చెపతాను వినండి.

## సుంద-ఉపసుందుల కథ

''హిరణ్యకశిపుడి వంశంలో నికుంభుడని వొకడుండేవాడు వాడి కొడుకులు సుందుడూ, ఉపసుందుడున్నూ, తపస్సువల్ల కాని కావలసినవి దొరకవని నిశ్చయించుకున్నారు వాళ్లు వింధ్య పర్వతానికి వెళ్లి ఘోరమైన తపస్సు చేశారు. ఎండాకాలంలో పంచాగ్నులమధ్య నుంచున్నారు. వానాకాలం, చలికాలం చెరువుల్లో కూచున్నారు. గాలితప్ప మరో తిండి మానేశారు. ఒంటి కాలిమీదా, చేతులుమీదికెత్తి, తల కిందికిపెట్టి ఎంతోకాల మున్నారు. వాళ్ల తపోగ్ని దారుణమైంది, వింధ్యగుహల్లోంచి పొగలు బయల్దేరాయి. ఆకాశందాకా కమ్ముకున్నాయి. దాంతో అదలుపుట్టింది దేవతలకి. మంచిమంచి పడుచుపిల్లల్ని పంపించి వాళ్ల తపస్సు చెడగొట్టాలని చూశారు లాభంలేకపోయింది. మా తండ్రిగారయిన బ్రహ్మదగ్గిరికి వెళ్లి మొరపెట్టారు

''వింధ్యపర్వతానికి దిగివచ్చారు మా తండ్రిగారు. 'మీ తపస్సుకి మెచ్చాను. ఏం కావాలో కోరండి' అన్నారు. సుందుడూ, ఉపసుందుడూ చేతులు జోడించారు. 'మా ఇష్టంవచ్చినరూపం మేం ధరించగలగాలి. ఇష్టంవచ్చినచోటికి వెళ్ళగలగాలి. మాకు సకలమాయలూ చేతనవాలి. పైవాళ్ళచేత చావకూడదు. అసలు చావే వుండకూడదు మాకు' ఇలా గుక్కతిప్పుకోకుండా అడిగేశారు వరాలు. ఒక్క చావులేకుండావుండడం తప్ప తక్కిన వరాలన్నీ ఇచ్చారాయన.

''దాంతో వొక్కసారి చెలరేగారు వాళ్లు. ఎన్నడూ ఎవ్వరికీ లేనంతరాజ్యం సంపాదించారు దిగ్విజయం చెయ్యాలనీ రాక్షసలోకాన్ని మెప్పించాలనీ సంకల్పించారు. అకాలకౌముది*

---

* కౌముది : వెన్నెలపండుగ. ఈ పండుగ ఆశ్వయుజపూర్ణిమనాడు చేసారు. ఆ వాళ వెన్నెట్లో, మంచి వేశ్యలతోనూ వాళ్ళతోనూ కులాసాగా గడి

ఉత్సవం మొదలుపెట్టారు దేవలోకం, నాగలోకం మొదలైన లోకాలన్నీ దోచుకోవడమూ ప్రారంభించారు మునులూ, బ్రాహ్మలూ కనిపించడం భయం - సట్టుకు బాధించేవాళ్ళు. యజ్ఞాలూ, హోమాలూ, శ్రాద్ధకర్మలూ- ఒకటేమిటి, నిత్యనైమిత్తికకర్మలు యావత్తూ ధ్వంసంచేసేవాళ్ళు ఉండివుండి పెద్దపులిగానో, సింహంగానో, ఏనుగుగానో మారిపోయేవాళ్ళు అడవుల్లో తిరుగుతూ మునిపల్లెలమీద పడేవాళ్ళు మునుల్ని విరుచుకు తినేసేవాళ్ళు మునులూ దేవతలూ ఈ ఉపద్రవం తట్టుకోలేకపోయారు. మళ్ళీ మా తండ్రిగారితో వెళ్ళి చెప్పుకున్నారు.

'ఏం చెయ్యాలో పాలుపోలేదు మా తండ్రిగారికి వాళ్లల్లో వాళ్ళే కొట్టుకుచావాలి. అంతే. మరో మార్గం లేదు వెంటనే విశ్వకర్మకు కబురుచేశా రాయన. మాంచి గువ్వపిట్టలాంటి చిన్నదాన్ని తయారుచెయ్యమన్నారు. తన కళాకౌశలమంతా ఉపయోగించాడు విశ్వకర్మ. నువ్వుగింజలవంటి చిన్న చిన్న రత్నాలతో జగన్మోహినిలాంటి పడుచుపిల్లని తయారుచేశాడు. తిలలవంటి రత్నాల శరీరంకలది గనక తిలోత్తమ అన్నారు దాన్ని ఆకాం

---

షడం, జూజమాడడం, రాత్రంతా జాగరం చెయ్యడం-ఇలా వినోదంగా ఉత్సవం చేస్తారు. ఆవాళ జాగరం చేసేవాళ్లకి లక్ష్మీదేవి వెదుక్కుంటూవచ్చి వరమిస్తుందట!

శ్లో॥ ఆశ్వినస్యాం పౌర్ణమాస్యాం తు చరే జ్జాగరణం నిశి,
కౌముదీ సా సమాఖ్యాతా కార్యా లోకై ర్విభూతయే.
కౌముద్యాం పూజయే లక్ష్మీం ఇంద మైరావతం స్థిరం,
సుగంధి ర్నిశి సద్వేశ్య శ్చాక్షై ర్జాగరణం నిశి
నిశీథే వరదా లక్ష్మీః కోజాగ ర్తీతి భాషిణీ
తస్మై విత్తం ప్రయచ్ఛామి అక్షైః క్రీడాం కరోతియః.

లింగపురాణం.

ఆశ్వయుజమనీ, కార్తీకమనీ కాలనియమం లేకండా సుంద-ఉపసుందులు ఎల్లప్పుడూ ఈ పండుగ-చెయ్యడంచేత అది అకాలకౌముది అయ్యింది.

చక్కదనం చూసి దేవతలే ఇదయారు. రెండుకళ్లు చాలవన్నట్టు వెయ్యికళ్ళతో చూశాడు దేవేంద్రుడు. అంత అందంగావుంది తిలోత్తమ.

"వింధ్యపర్వతానికి వెళ్ళు. సుందుడూ ఉపసుందుడూ గర్వించి లోకాల్ని బాధిస్తున్నారు. నీకోసమని వాళ్ళలోవాళ్ళు కొట్టుకుచచ్చేటట్టుచెయ్యి" అన్నారు మా తండ్రిగారు.

"భూలోకానికి మెరుపులా దిగింది తిలోత్తమ. వింధ్య పర్వతం అరణ్యాలికి వొక కొత్తవెలుగు వచ్చినట్టయింది. ఆమెని చూడడంతోటే మతిపోయింది సుంద ఉపసుందులికి. నా క్కావా లంటే నా క్కావాలన్నారు. అంతవరకూ వాళ్లిద్దరిలో భేదమే వుండేది కాదు. ఒక్కపీటమీద కూచుండేవాళ్ళు ఒక్కమంచం మీద పడుకుండేవాళ్ళు ఒక్క కంచంలో తినేవాళ్ళు. ఒక్క ఇంట్లో వుండేవాళ్ళు, ఒక్కవాహనంమీద తిరిగేవాళ్లు. అలాంటి వాళ్లకి వొక్కపిల్లమీద మనసుపోయింది ఇపుడు.

"'నా పెళ్ళాం' అంటే 'నా పెళ్ళాం' అని చెరోచెయ్యా పట్టుకున్నారు తిలోత్తమని. 'మా ఇద్దర్లో ఎవడు కావాలి నీకు! చెప్పు' అంటూ చెరోపక్క లాగారు. 'మీ ఇద్దరూ దెబ్బ లాడండి. ఎవడు గెలిస్తే వాణ్ణి పెళ్ళాడతాను' అంటూ వోర చూపులు చూసింది తిలోత్తమ, ఇంకేముంది, అన్నమీద తమ్ముడూ, తమ్ముడిమీద అన్నా కలబడ్డారు. గుద్దుమీద గుద్దూ, తాపు మీద తాపూ లంకించుకున్నారు. షడాపడా కొట్టుకుంటున్నారు. దబీదబీ బాదుకుంటున్నారు గోత్రిపోతులు గుద్దుకుంటున్నట్టుంది. కొండాకొండా ఢీకొన్నట్టుంది.

"తమ్ముణ్ణి చూస్తేనేకాని అన్న తినేవాడు కాడు. అన్నని చూస్తేనే కాని తమ్ముడు వుండలేకపోయేవాడు. అలాంటి అన్న దమ్ములే ఆడదానికోసం గుద్దులాడుకుని చచ్చిపోయారు. ఇంతగా చెప్పవచ్చిందేమిటంటే, అవకతవకలన్నిటికీ ఆడదేకారణం. అందుచేత,

ముందుముందు ప్రమాదించకుండా మీలోమీరు ఒప్పందం చేసుకోండి" అంటూ చెప్పాడు నారదముని

ముని చెప్పినట్టే నొక నియమం చేసుకున్నారు పాండవులు. అన్నదమ్ములు ఒక్కొక్కరిదగ్గిరా ఒక్కొక్కఏడు వుండాలి ద్రౌపది. ఒకరితో కలసి ఆమె వున్నప్పుడు, మరొకరు లోపలికి వెళ్ళకూడదు. తెలిసయినాసరే, తెలియకఏనాసరే, అలావెళ్ళినవాళ్ళు వ్రతనిష్ఠతో ఓసంవత్సరం తీర్థయాత్ర చెయ్యాలి. ఇలా నారదుడి ముందే ప్రతిజ్ఞ చేసుకున్నారు.

### అర్జునుడి తీర్థయాత్ర

సుఖంగానే గడిచిపోతున్నాయి దినాలు ఇంతలో, ఒక నాడు దేవిడీముందు ఒక బ్రాహ్మడు వచ్చి కేకలువేస్తూ ఏడవడం మొదలుపెట్టాడు. అది అర్జునుడి చెవిలోపడింది. ఎన్నాడూలేనిది ఏమిటిది? అంటూ తెల్లపోయాడతడు. వెంటనే బ్రాహ్మణ్ణి పిలిపించి కనుక్కున్నాడు. "ఇంకేముంది, నా కొంప మునిగింది" అంటూ గోలపెట్టాడు బ్రాహ్మడు "ధర్మరాజులుంగారి రాజ్యం ధర్మరాజ్యం. వారిదేమిటి ఇది మాదే అని సంతోషిస్తున్నాము. ఇలాంటి ధర్మరాజ్యంలో దొంగలు దోచుకుపోతున్నారు నా ఆవులు, వాటితోనే హోమాలూ అవీ చేసుకు బతుకుతున్నాను. మరో ఆధారం లేదు నాకు. తల్లిలేనిపిల్లలై పోయాయి పెయ్యలు. అడే అరవడం అరుస్తున్నాయి, గడ్డయినా ముట్టడం లేదు. రండి, ఆలస్యంచేస్తే ఆవులు దక్కవు. ధనుస్సూ, బాణాలూ పట్టుకోండి. దొంగల్ని కొట్టి నా ఆవులు నాకు ఇప్పించండి" అంటూ గోలు గోలు మన్నాడు.

విషమసంధిలో పడిపోయాడు అర్జునుడు. ఆయుధాలగదిలో ద్రౌపదితో వున్నాడు ధర్మరాజు. వెళ్ళడ మెలాగ? వెళ్ళితే నియమభంగం. వెళ్ళకపోతే బ్రాహ్మడి ఏడుపు. ఏమైనా సరే, వెళ్ళడమే న్యాయమనుకున్నాడు అర్జునుడు. ఆయుధాలగదిలో

వెళ్లాడు. ధనుస్సూ, బాణాలూ తెచ్చుకున్నాడు. బ్రాహ్మడి వెంట నడిచాడు దొంగల్ని వెంటాడి చంపాడు. బ్రాహ్మడి ఆవులు బ్రాహ్మడి కిచ్చి పంపాడు.

తిరిగి వచ్చి అన్నగారిముందు చేతులు జోడించాడు అర్జునుడు. తీర్థయాత్రకి అనుజ్ఞ ఇప్పించమంటూ తలవాల్చాడు. "పరోపకారంకోసం-అందులోనూ ఆవులికీ, బ్రాహ్మలికీ ఆపద వచ్చినపుడు - లోపలికి వచ్చావు నువ్వు. ఆపద్ధర్మమది. నియమ భంగ మెలా అవుతుంది? దొంగల్ని చంపడం అశ్వమేధంతో సమాన మన్నారు పెద్దలు. వాళ్లని పోనివ్వడం భ్రూణహత్య చేసినంత పాపం. దొంగల్ని చంపావు ఆవుల్ని కాపాడావు. బ్రాహ్మడికి ఉపకారం చేశావు అంచేత, ప్రాయశ్చిత్తం అనవసరం నీకు" అన్నాడు ధర్మరాజు.

"అలాకాదు అన్నయ్యా," అన్నాడు అర్జునుడు. "లోకమర్యాద రక్షిస్తావున్న మనమే మర్యాదతప్పితే, ఇంతకంటే అపకీర్తి మరేముంటుంది? దొంగలనెపంమీద ప్రాయశ్చిత్తం తప్పించుకోవచ్చు మనం. కాని నింద తప్పించుకోలేం. ధర్మంకోసం నెపం వెదకడం అన్యాయం అనుమతించండి. ఒక్కసంవత్సరం తీర్థయాత్ర ఇట్టే ముగించుకు వస్తాను" అన్నాడు.

అన్నగారి అనుమతి తీసుకొని తీర్థయాత్రకి బయల్దేరాడు అర్జునుడు. పెద్దలికి నమస్కరించి ఆశీర్వాదాలు పుచ్చుకున్నాడు. శాస్త్రవేత్తల్నీ, కథలూ అవీ తెలిసిన పౌరాణికుల్నీ వేదపండితుల్నీ వెంటపెట్టుకున్నాడు. వెళ్ళిన ప్రతీతీర్థంలోనూ అక్కడి రోగుల్నీ వాళ్లనీ చూసేవాడు. అక్కడి స్థలపురాణాలూ పుణ్యకథలూ తెలుసుకునేవాడు. హరిద్వారం వెళ్ళి కొన్నాళ్ళున్నాడు. రోజూ గంగాస్నానం చేస్తూ వొడ్డుని హోమం చేసేవాడు.

ఒకనాడు యథాప్రకారం గంగలో స్నానం చేసి, దేవతర్పణం, ఋషితర్పణం, పితృతర్పణం ముగించుకొని, హోమం చేసుకుందికి

వొడ్డుకి వస్తున్నాడు అర్జునుడు. ఒక నాగకన్య చూసింది అతణ్ణి. ఇంద్రనీలమణివంటి శరీరం, ఐరావతం తొండంలాంటి చేతులూ - ఆ దివ్యసుందరవిగ్రహం చూసి మతిపోయింది ఆమెకి. అమాంతంగా పెనవేసుకొని నాగలోకం తీసుకుపోయింది అతణ్ణి. నాగలోకంలో అందమైన మేడ ఆమెది. అందులో వుంచింది అర్జునుణ్ణి గంగాతీరంలాగే అక్కడా అగ్ని వెలిగింది హోమం ముగించుకున్నాడు అర్జునుడు. తరవాత నాగకన్యని చూసి నవ్వుతూ పలకరించాడు. "ఎవరి అమ్మాయివి? నీ పేరూ? ఇంత ఇదైపోయావేం?" అన్నాడు.

### ఉలూపి

"నాగకన్యని. ఉలూపిని" అందామె, కాలివేలు కింద రాస్తూ "ఐరావతవంశం మాది. కౌరవ్యుడు మా తండ్రి. నిజం దాచడ మెందుకూ, నిన్ను చూసి మోహించాను. మన్నించు. మా నాగకన్యల పాటలలో ఇంతకుముందే నీ ప్రశంస వింటున్నాను, నీమీద మనసు పెట్టుకున్నాను. ఇన్నాళ్లకి, ఇవాళ గంగలో కరువు తీరా కనిపించావు నువ్వు" అంటూ తలవొంచుకుంది.

"బావుంది కానీ, మా అన్నగారి మాటమీద వ్రతదీక్షలో వున్నాను. బ్రహ్మచారిగా పన్నెండునెలలు తీర్థయాత్ర చెయ్యాలి. ఇలాంటిస్థితిలో నావల్ల నీ కేం లాభం చెప్పు!" అన్నాడు అర్జునుడు. "నాకూ తెలుసు ఆ సంగతి" అంది ఉలూపి. "ద్రౌపది కోసం మీరు నియమం చేసుకోవడం, మీ అన్నా ఆవిడా వున్నగదిలోకి నువ్వు వెళ్లడం, ఇపుడు తీర్థయాత్రకి బైలుదేరడం అన్నీ తెలుసు నాకు. ఈ తీర్థయాత్రలూ, వ్రతాలూ ఎన్నయినా ప్రాణదానం కంటే గొప్పవి కావు అవునా? విను మరి నీకోసం నా ప్రాణాలు పోవడానికి సిద్ధంగా వున్నాయి. నీ వ్రతాలే నువ్వు చూసుకుంటే, చావేమో తప్పదు నాకు. అంచేత, పరిగ్రహించి అనుభవించు నన్ను. ప్రాణదానం చెయ్యి. ఇంతమాత్రానికి వ్రతభంగమూ

కాదు నీకు'' అంటూ జాలీ, వలపూ కుమ్మరించే వోరచూపులు చూసింది. మనోహరంగావుంది ఆ మూర్తి.

లొంగిపోయాడు అర్జునుడు. ఆ రాత్రి ఆమెతో స్వర్గ సౌఖ్యాలు అనుభవించాడు. నిక్షేపంలాంటి కొడుకుపుట్టాడు ఉలూపికి. ఇలావంతు డని పేరు పెట్టిందామె,

మర్నాడే నాగలోకంనించి వచ్చేశాడు అర్జునుడు. సూర్యోదయం అయేసరికి హరిద్వారంలో వున్నాడు. వెదుక్కుంటూనే వున్నారు తనకూడా వచ్చిన బ్రాహ్మలూ వాళ్లూను. జరిగిందంతా చెప్పాడు అర్జునుడు. వాళ్ళ ఆశ్చర్యానికీ, ఆనందానికీ అంతం లేదు.

హరిద్వారం నించి హిమాలయం వెళ్లాడు అర్జునుడు. అగస్త్యవటమూ, భృగుతుంగమూ అనే క్షేత్రాలు చూశాడు. అక్కడి నుండి హిరణ్యబిందుతీర్థం వెళ్లి గోదానమూ, భూదానమూ, సువర్ణదానమూ - ఇలా ఎన్నో దానాలు చేశాడు. హిరణ్యబిందువునించి తూరుపుదేశాలు వెళ్లాడు. నైమిశారణ్యం వెళ్లి నారాయణదర్శనం చేశాడు. ఉత్పలినీ, కౌశికీ, నందా, అపరనందా, గయా మొదలైనవి సేవించాడు. గంగా, గంగాసాగరసంగమం దర్శించాడు. అలా సముద్రతీరం వెళ్లి ఏలకివనాల్లో సంచారంచేశాడు. పగడపు దీవుల్లో విహరించాడు. ఇసుకతిన్నెలమీద తిరిగాడు. వెళ్ళివెళ్ళి కళింగదేశం ప్రవేశించాడు. వెంటవెళుతూన్నవాళ్లు కొందరు అక్కడినించి ఉత్తరంగా వెనక్కి వచ్చేశారు.

కళింగంనుంచి కొద్దిపరివారంతోనే ముందికిసాగాడు అర్జునుడు. పూరీవెళ్ళి పురుషోత్తమక్షేత్రం చూశాడు. అక్కడినించి మహేంద్ర పర్వతం చూసి దక్షిణదేశం వెళ్ళాడు. దక్షిణగంగ గోదావరిలో స్నానం చేశాడు. జగదాది భీమేశ్వరం చూశాడు. శ్రీశైలం వెళ్ళాడు. వేగీదేశంవైభవం పరికిస్తూ, దక్షిణసముద్రానికి వెళ్లాడు. కావేరీసాగర సంగమంలో ఎన్నో దానాలు చేశాడు. అక్కడితో పన్నెండు నెలలూ పూర్తయాయి.

## చి త్రాం గ ద

పదమూడో నెలలో మణిపూరుపట్నం* వెళ్లాడు అర్జునుడు. మణిపూరురాజు చిత్రవాహనుడు సగౌరవముగా స్వాగతమిచ్చాడు. అతడికూతురు చిత్రాంగద, దేవతాస్త్రీలకంటె అందకత్తె. ఆమెని మోహించాడు అర్జునుడు. వివాహంచేసుకుంటా నన్నాడు. ఆప్తుల వల్ల ఇది విన్నాడు చిత్రవాహనుడు. "నువ్వే అల్లుడివైతే ధన్యుణ్ణే అవుతాను" అన్నాడు. "ఐతే, వొక్కమాటమాత్ర ముంది, అది నువ్వు అంగీకరిస్తే చాలు. లోగడ మా వంశంలో ప్రభంజను డని ♦ వొక రాజు వుండేవాడు. అతడికి సంతానం లేకపోయింది. శివుణ్ణి ధ్యానిస్తూ తపస్సుచేశాడు. శివుడు ప్రత్యక్షమై వరమి చ్చాడు. ఒక కుమారుడు కలుగుతా డన్నాడు. వంశంలో ప్రతీ వాడికీ వొక్కొక్క కొడుకే పుడతా డన్నాడు. అది మొదలు మా వంశంవాళ్లందరికీ వొక్కొక్క కొడుకు పుడుతూ వచ్చాడు. నాకు మాత్రం కూతురు కలిగింది, చిత్రాంగద. దీన్ని పుత్రీకరణం చేసు కున్నాను నేను. అంటే, ఈమెగర్భంలో కలిగినపుత్రుడు నా పుత్రుడు కావాలి. వాడే మా వంశకర్త అవుతాడు. ఇదే ఈమెకి కన్యాశుల్కం. ఈ శుల్కం ఇవ్వగలిగితే చెప్పు. చిత్రాంగదని వివాహం చేసుకోవచ్చు" అన్నాడు.

అంగీకరించాడు అర్జునుడు. మాంచి గొప్పగా జరిగిపో యింది చిత్రాంగద పెళ్లి. చిత్రాంగద సౌందర్యానికి ముగ్ధుడై ఆమెతో కొన్నాళ్లు మామగారియింట వుండిపోయాడు అర్జునుడు. అప్పుడప్పుడు మునులతోనూ, బ్రాహ్మలతోనూ వెళ్లి దగ్గరదగ్గర సముద్రతీరంలో వుండే తీర్థాలుతిరిగి వస్తూవుండేవాడు.

## నా రీ తీ ర్థా లు

ఒకనాడు సౌభద్రతీర్థం వెళ్లి అందులో స్నానానికి సిద్ధపడ్డాడు అర్జునుడు. అక్కడిఋషులంతా కూడదని వారించారతణ్ణి. "ఇదే

* మణిలూరు ? ♦ ప్రభాకరుడు ?

కాదు. ఇలాంటివి మరి నాలుగున్నాయి. అన్నీ సముద్రపొడ్డునే వున్నాయి. వీటిలో దిగడం బ్రహ్మాతరం కాదు. భయంకరమైన మొసళ్లున్నాయి. దిగడంతోనే అమాంతంగా నోట్లో వేసుకుంటాయి. ఇది సౌభద్రతీర్థం, పౌలోమం, కారంధమం, ప్రసన్నం, భారద్వాజం అని పంచతీర్థాలు. దక్షిణసముద్రతీరంలో ప్రసిద్ధమైన విది. నూరేళ్లయింది, దుష్టరాజుల సంపదలాగ మంచివాళ్లకి అందకండా ఐపోయాయి. వద్దు దిగకు. దుస్సాహసం కూడదు'' అంటూ ఎన్నోవిధాలచెప్పి అడ్డు వచ్చారు

''తీర్థానికి వచ్చి తిరిగిపోవడమేమిటి?'' అంటూ నీళ్లలోకి వెళ్లాడు అర్జునుడు. ఒక్క మునుగు మునిగాడో లేదో, పట్టుకుంది మొసలి. అది పట్టుకోవడమూ, అర్జునుడు దాన్ని విసిరికొట్టడమూ చిటికెలో జరిగిపోయాయి ఒడ్డున వచ్చి పడింది మొసలి. పడిందో లేదో, చిత్రం! క్షణంలో వొక దేవకాంతఅయి నుంచుంది.

''ఎవరు నువ్వు? ఇన్నాళ్లూ మొసలిగా వున్నావేం?'' విస్మయపోతూ అడిగాడు అర్జునుడు ''అప్సరసని. కుబేరుడికి ఇష్టమైనదాన్ని వర్గ అంటారు నన్ను, నాలాగే నా చెలికత్తెలు నలుగురూ–సౌరభేయీ సమీచీ బుద్బుదా లతా ఈ పక్క తీర్థాల్లో మొసళ్లయి వున్నారు. వాళ్లనీ శాపం తప్పించి రక్షించు'' అంది దేవకాంత. ''శాపమేమిటి? మొసళ్లయి ఎందుకున్నారు?'' అంటూ మళ్లా అడిగాడు అర్జునుడు

''మా పొగరం కొద్దీ, మేం చేతులారా తెచ్చుకున్నది ఇదంతా. నూరేళ్ల కిందటి మాట, మేం ఐదుగురమూ ఖుల్లాసాగా ప్రపంచాలన్నీ తిరుగుతూ వుండేవాళ్లం, అమరావతీ, అలకాపురం–వొకటేమిటి, దిక్పాలకుల పట్నాలన్నీ తిరిగాం. ఒక నాడు భూలోకానికి వచ్చాం. ఇక్కడ వొక అడివిలో వొక ఋషిని చూశాం. చెప్పవలసివస్తే అగ్నినిప్పులాంటివాడాయన. లోకంజోలిలేకండా వొకమూల తపస్సుచేసుకుంటున్నాడు బ్రాహ్మడు.

అతడి తపస్సు చెడగొడదామని దుర్బుద్ధిపుట్టింది మాకు. అతడి ముందు పాటలు పాడాం. ఆడాం. పరిహాసాలాడాం. ఊఁహూఁ, ఏం చేసినా లాభంలేకపోయింది. నపుంసకుడిలా పలుకూ పులుకూ లేదు, మగవాడి మగతనం రెచ్చగొట్టే వికారాలన్నీ చేశాం. దాంతో భగ్గుమన్నాడు బ్రాహ్మడు. మొసళ్లవండని శాపంపెట్టాడు.

'కాళ్లావేళ్లా పడ్డాం. క్షమించమన్నాం. మునీశ్వర్లకి కోపం కూడ దన్నాం. మా పాపం మమ్మల్నే బెడిసికొడుతుం దన్నాం. ఏడిశాం. మొత్తుకున్నాం. చివరికి కనికరించాడు రుషి 'వెళ్లండి. ఒక మహాపురుషుణ్ణి పట్టుకుంటారు మీరు. ఆయన మిమ్మల్ని నీళ్లలోంచి బైట వేస్తాడు దాంతో శాపం మిరుగు డౌతుంది మీకు' అన్నాడు.

''ఏం చెయ్యాం! రుషి చెప్పిన మహాపురుషుడు ఎవ్వడో అను కుంటూ వస్తున్నాం. దారిలో నారదులవారు కనిపించారు. నమస్కారంచేశాం. 'ఏం ఇలా మొహంవేలవేశారేం!' అన్నా డాయన. ఏడుస్తూ జరిగిందంతా చెప్పాం. 'భయపడకండి,' అంటూ వోదార్చా డాయన. దక్షిణసముద్రతీరంలో ప్రశస్త మైనవి ఐదు తీర్థాలున్నాయి మీరు ఐదుగురూ వాట్లో వుండండి. నూరేళ్లకి పాండురాజుకొడుకు అర్జునుడు తీర్థయాత్రకి వస్తాడు. అతడే ముని చెప్పిన మహాపురుషుడు. అతడి వల్లే శాపమోచనం కలుగుతుందిమీకు' అని చెప్పి వెళ్లాడు అప్పటినుండీ నీకోసం కాచుకుకూచున్నాం. ఇవాళ మా అదృష్టం పండింది. కరుణించు. నా చెలికత్తెల్ని ఉద్ధరించు'' అంటూ ప్రాధేయపడిందది వర్గ.

తక్కిన నలుగురినీ శాపంనించి తప్పించాడు అర్జునుడు. ఐదుగురు అప్సరసలూ అతణ్ణి దీవించి దేవలోకం వెళ్లారు. అప్పటి నించీ ఆ ఐదుతీర్థాలూ నారీతీర్థాలని ప్రఖ్యాతిలోకి వచ్చాయి.

కొన్నాళ్లకి కుమారస్వామిలాంటి కుమారుణ్ణి కన్నది చిత్రాం గద. బభ్రువాహనుడని పేరుపెట్టా రతడికి మణిపూరానికి అధిపు

వాహనుణ్ణి పుత్రుడుగా ఇచ్చి, మణిపూరునించి వచ్చేశాడు అర్జునుడు. గోకర్ణక్షేత్రం చూసి పశ్చిమసముద్రతీరం గుండా ప్రయాణం చేస్తూ ప్రభాసతీర్థం వెళ్లాడు. అక్కడి ద్వారకాపట్నం దగ్గిరలోనేవుంది అని విన్నాడు. మనస్సులో ఎన్నెన్నో ఊహలు సముద్రతరంగాల్లాగ పరిగెడుతున్నాయి.

"ద్వారక వెళతాను. మా కృష్ణుణ్ణి కలుసుకుంటాను. మరదలు సుభద్రని చూస్తాను. అందరికంటే అందకత్తెఅట భద్ర! బుద్ధిమంతురాలూనట! ఎన్నాళ్లనించో వుంది ఆమెని చూడాలని. కృష్ణమూర్తి దయవుంటే, మనం ఆడిందేఆట అవుతుంది. ఐతే, ఏం జరిగినా రహస్యంగా జరగాలి. లేదంటే, గుర్తుపట్టేస్తారు యాదవులు. ఏమైనా సరే. అడ్డంగా నరుక్కురమ్మన్నాడు." ఇలా ఆలోచనమీద ఆలోచన. చివరికి ఏ మాలోచించాడో మరి, ఇతర్లు పోల్చుకోకండా యతివేషం వేసుకున్నాడు.

ఎలా తెలుసుకున్నాడో తెలుసుకున్నాడు కృష్ణుడు. ప్రభాసంలో అర్జును డున్నాడని కనిపెట్టాడు. హటాత్తుగావచ్చి అర్జునుడి ముందు ప్రత్యక్షమయాడు. ఆనందం పట్టలేకపోయాడు అర్జునుడు. అమాంతంగా లేచి కృష్ణుడి పాదాలమీద వారిగాడు. ఆనంద బాష్పాలతో పాదాభిషేకం చేశాడు. "నీ పాదపద్మాలు దర్శించాను. ధన్యుణ్ణయాను" అన్నాడు. "పన్నెండుమాసాలు వ్రతదీక్షతో బైల్దేరాను, తీర్థయాత్ర చేశాను. ఇవాళ నీ దివ్యదర్శనమైంది. నా పాపాలన్నీ కడుక్కుపోయాయి" అన్నాడు.

ఎత్తి కౌగిలించుకున్నాడు కృష్ణుడు ఎంతో స్నేహంగానూ, ఇదిగానూ పలకరించాడు. "అంతా ఎలావున్నారట! కులాసా ఏనా?" అన్నాడు, తీర్థయాత్ర కారణం కనుక్కున్నాడు. మాటల సందర్భంలో అతడికి సుభద్రమీద ప్రేమవున్నట్టూ పసికట్టాడు. యతివేషంతోనే అతణ్ణి ద్వారక తీసుకువెళ్లాడు. రైవతకపర్వతం [illegible] బసపెట్టించాడు.

పూలతీగలతో అల్లుకున్న తోటలు, బంగారం లోగిళ్ళు, వజ్రాల తిన్నెలు, పగడాల వేదికలు. అద్భుతంగా వుంది రైవతక పర్వతం. గుహలో మణిదీపాలు వెలుగుతున్నాయి. కృష్ణుడూ, అర్జునుడూ ఆ గుహలోనే కులాసాగా కాలక్షేపంచేశారు ఆ రాత్రి.

రైవతక ఉత్సవం

రాత్రి గడిచింది. తెల్లవారింది. అర్జునుణ్ణి అక్కడే వుంచి పట్నంలోకి వచ్చాడు కృష్ణుడు. పురజనుల్నీ వాళ్ళనీ సమావేశ పరిచాడు. రైవతకఉత్సవం చెయ్యబోతున్నామని ప్రకటించాడు. పట్టణమంతా చాటించమన్నాడు. ద్వారకాపట్నంలో ఉత్సాహమే ఉత్సాహం చెలరేగింది. ఎక్కడచూస్తే అక్కడ-ప్రజలు ముస్తాబు చేసుకుంటున్నవాళ్ళే. నగలు పెట్టుకున్నవాళ్ళే. చందనం పూసుకున్నవాళ్ళే అత్తరువు రాసుకున్నవాళ్ళే. ఎవళ్ళకివున్న వైభవం వాళ్ళు చూపెట్టుకుంటున్నారు

తప్పెట్లు మోాయించేవాళ్ళూ, తాళాలు వాయించేవాళ్ళూ, శంఖాలు వూదేవాళ్ళూ, నగారాలు కొట్టేవాళ్ళూ-ఓ, వీధులన్నీ వెర్రిసరదాలతో నిండిపోయాయి. పాటలు పాడుతున్నారు. నృత్యాలు చేస్తున్నారు. పెద్ద సంబరంతో వెళ్ళి రైవతకపర్వతం పూజించారు ప్రజలు

కల్లుతాగి కైపెక్కి నాట్యంచేస్తున్నారు స్త్రీలు. స్తనాలు కదులుతున్నాయి. సిగపువ్వులు రాలుతున్నాయి. చిరుచెమటలు పోస్తున్నాయి. నిషా హెచ్చినకొద్దీ నాట్యమూ హెచ్చుతోంది. ఐనా, రాగం తప్పడంలేదు పాటలు. తాళం తప్పడంలేదు అడుగులు. మూాకలు మూాకలుగా చూస్తున్నారు జనం.

ఉగ్రసేనుడూ ఉద్ధవుడూ అక్రూరుడూ అనిరుద్ధుడూ సాంబుడూ సంకర్షణుడూ విదూరథుడూ ప్రద్యుమ్నుడూ భానుడూ సుషేణుడూ శారణుడూ శైనేయుడూ హార్దికుడూ గదుడూ, పత్యకుడూ-ఈ పెద్దలైన యాదవనుంది యాదవులూ భార్యలలో సహా

ఏనుగులమీదా, గుర్రాలమీదా, మేనాలమీదా ఉత్సవానికి బయ
ల్దేరి వచ్చారు. చెప్పేదక్కర్లేదు ఇహ శ్రీకృష్ణుడు. అష్టమహా
దేవులతోనూ, విలాసినీజనముతోనూ- దారికి రెండు వేపులా ప్రజలు
జేజేలు చేస్తూ వుంటే- దేవేంద్రవైభవంతో బయలు దేరి వచ్చాడు
రైవతకపర్వతానికి

అద్భుతంగా వుంది ఉత్సవం అర్జునుడిదగ్గిరికి వచ్చాడు
కృష్ణుడు. ఇద్దరూ కలిసి రైవతకంమీద విహరిస్తున్నారు. అంద
మైన ప్రదేశాలు చూచిచూచి వొక మణివేదికమీద కులాసాగా
కబుర్లుచెప్పుకుంటూ కూచున్నారు ఎంతోమంది కన్యలతో కలిసి
ఆ ప్రాంతానికే వచ్చింది సుభద్ర. సిరిసిరిమువ్వల బంగారం కాలి
తొడూ, రత్నాల కాలిఅందెలూ మధురంగా మోగుతున్నాయి.
హంసనడకలతో వచ్చింది, అర్జునుడే భర్త కావాలని పర్వతపూజ
చేసింది. చూసీ చూడడంతోటే తెలిసిపోయింది అర్జునుడికి, ఆమే
సుభద్ర అని. చలించింది మనస్సు. కృష్ణుడితో మాటాడుతూనే
వున్నాడు. చూపులుమాత్రం సుభద్రమీదికి పరిగెడుతున్నాయి
"యతీశ్వర్ల మనస్సు అమ్మాయిలమీదికిపోతోం దేమండీ," అంటూ
నవ్వాడు కృష్ణుడు. 'దాస్తా వెందుకు ? అంతా తెలుసు నాకు
సుభద్రమీద కన్ను వేశావు. భయపడకు. మా అమ్మతోనూ
అయ్యతోనూ మాట్లాడుతాను. నీ కోర్కె నెరవేరేయత్నం చేస్తాను'
అన్నాడు. వెంటనే వేగులవాళ్ళని ఇంద్రప్రస్థం పంపాడు. అర్జు
నుడు ద్వారకలో వున్నాడని ధర్మరాజుతో చెప్పి రమ్మన్నాడు.

ఇదంతా అయాక బలరాముడూ మొదలైన యాదవప్రము
ఖులూ వచ్చారక్కడికి. అర్జునుణ్ణి "నిజమైన యతే అనుకున్నారు
చేతులుజోడించి నమస్కారాలు చేశారు. ఎక్కడెక్కడ, ఏదే
తిరుగుతున్నదీ అడిగి తెలుసుకున్నారు. ఏ తీర్థం సేవిస్తే ఏం ఫల
ఫలం కలిగేదీ కనుకున్నారు. అర్జునుడు వర్ణించి చెపుతూవుంటే, వింటు
[illegible] వుండగా

చాతుర్మాస్యవ్రతం ఇక్కడే చేసుకొని మమ్మల్ని కృతార్థుల్ని చెయ్యండి'' అంటూ ప్రార్థించారు. కూడా తీసుకువెళ్లి కన్యల అంతఃపురంలో బసపెట్టించారు భోజనం మొదలైన సమస్తమూ చూడమని సుభద్రని నియోగించారు ఒక లతాగృహంలో మకాం వేశాడు అర్జునుడు భక్తితోనూ, ఆదరంతోనూ పరిచర్య ప్రారంభించింది సుభద్ర ''అంతఃపురంలో వున్న యతీశ్వరుడు అర్జునుడు'' అని రుక్మిణీదేవికీ, సత్యభామకీ మాత్రం చెప్పిపెట్టాడు కృష్ణుడు.

రోజుకోరకం పిండివంటలతో అర్జునుడికి భోజనం పెడుతోంది సుభద్ర. రోజుకోరకం విలాసంతో సుభద్ర కనిపిస్తోంది అర్జునుడికి. రోజురోజుకీ భక్తితాత్పర్యాలు చూపిస్తోంది సుభద్ర. రోజురోజుకీ ప్రేమా, ఆతురతా హెచ్చిపోతోంది అర్జునుడికి ఆపుకోలేకపోతున్నాడు అర్జునుడు ఆలోచనలోపడుతోంది సుభద్ర. ''దొంగ యతి కాదుకదా ఈయన! ఏమో ఏ పుట్టలో ఏ పాముందో! అర్జునుడు ఎలావుంటాడని విన్నామో, మూడుమూర్తులా అలాగే వున్నాడీయన. ఇంద్రనీలమణివంటి శరీర మన్నారు ఆయనిది. ఈయన దేహమూ అలాగేవుంది. మోకాళ్లకి అందివచ్చే చేతులు అన్నారాయనివి. ఈయనివీ అలాగే వున్నాయి. కెంపురొలుకులతో పద్మాలవంటి నేత్రాలు అన్నారాయనివి. మరి ఈయనివి మాత్రం! ఎత్తయిన వెడల్పాటి వక్షస్థల మన్నారు ఆయనిది. అక్షరాలా ఈయనిదీ అంతే. ఇన్ని పోలికలున్నాయి కొంపదీసి ఆయనే కాదుకదా. ఈయన?''

ఉండలేకపోయింది సుభద్ర. ఒకనాడు యుక్తిగా అడగనూ అడిగేసింది. అప్పుడే భోజనంచేసి లేచాడు అర్జునుడు. మెల్లగా ప్రసంగంలోకి దిగింది సుభద్ర. ఐతే, స్వామీ, మీరు చూడని తీర్థాలూ, వెళ్లని పట్నాలూ, మీకు తెలీని రాజవంశాలూ లేవటకదా! మరి, ఇంద్రప్రస్థమూ చూసే వుంటారు. మా వూరుకంటే అందమైంది అంటారా అది! అక్కడ వున్నారే పాండవులు, వాళ్లు

మా మేనత్తకొడుకులు. మా అత్త కుంతీదేవి ఎలావుందట! అర్జునుడు మాంచి వీరుడటకదూ! అవునా! తీర్థయాత్రకి వెళ్లాడని విన్నాం. తిరిగి వచ్చేశాడేమో! మీరు వినలే దనుకుంటాను. తెలిసివుంటే చెప్పరూ! వినాలని వుంది నాకు'' అంది

''నాకంటే నీకే హెచ్చు తెలుసు అర్జునుడివిషయం'' అన్నాడు అర్జునుడు. నవ్వీ నవ్వకండా వున్నాయి అతడి కళ్లు. ''ఇదిగో భద్రా చూడూ, నువ్వు అంత ఇదిగా అడుగుతూ వుంటే- మరి, నిజమే చెప్పమంటావా? ఐతే- దాచడ మెందుకూ- నేనే- నేనే అర్జునుణ్ణి నీకోసమే ఇలా వచ్చాను. మనల్ని దేవుళ్లాగ కలిపింది ఈ రైవతక పర్వతం. రా. తెలుసు నాకు. నేనంటే నీకు ఇష్టమని. రాజులికి గాంధర్వవివాహం, రాక్షసవివాహం రాసిపెట్టిన విషయం. విను, గాంధర్వవివాహం చేసుకుందాం మనం'' అన్నాడు.

సిగ్గుపడిపోయింది సుభద్ర. తల వొంచుకుంది. క్షణం నిలవ లేకపోయింది అక్కడ ''పెద్దలున్నారు, పెళ్ళిచెయ్యడానికి'' అంటూ తుర్రుమంది లోపలికి అటేచూస్తూ, లతామందిరానికి వచ్చేశాడు అర్జునుడు.

చెల్లెల్నీ, అర్జునుణ్ణీ వోకంటితో కనిపెడుతూనే వున్నాడు కృష్ణుడు. అవాళనించీ అర్జునుడికి భోజనమూ అదీ చూసేపని రుక్మిణిమీద పెట్టాడు. సమయంచూసి దేవకితోనూ, వసుదేవుడితోనూ సుభద్ర పెళ్లిప్రసంగం తెచ్చాడు. అర్జునుడు యతివేషంలో వుండడమూ, సుభద్రా అర్జునుడూ వొకళ్ల నొకళ్లు ప్రేమించుకోవడమూ అంతా దాపరికం లేకండా చెప్పాడు. వాళ్లూ తనతో ఏకీభవిస్తున్నందుకు సంతోషించారు. 'అన్నయ్య బలరాముడూ వాళ్లూ కొంతమంది అంగీకరించరు, వాళ్లకి తెలియకండా వివాహం జరిగిద్దాం'' అంటూ దానికీ తల్లిదండ్రుల్ని వొప్పించాడు. శివపూజ నెపంపెట్టి యాదవులూ, భోజులూ, అంధకులూ, వృష్ణులూ- యావన్మందినీ అంతర్ద్వీపానికి తర్లించుకు వెళ్లాడు.

## సుభద్ర పెళ్ళి

అంతర్ద్వీపంలో మాంచి సంబరంతో సాగిపోతూవుంది శివ పూజ. పెళ్లి ఎప్పుడంటే ఎప్పుడని రైవతకంలో కువకువలాడి పోతున్నారు సుభద్రా అర్జునులు అన్నగార్ని ధ్యానించుకుంటూ కూచుంది సుభద్ర. దేవేంద్రుణ్ణి తలపోస్తున్నాడు అర్జునుడు. వసుదేవుడూ, అక్రూరుడూ, సారణుడూ, సాత్యకీ- ఇలా తనమాటలో వాళ్ల ని కొందరిని కూడా వేసుకొని, సరిగ్గా సమయానికి రైవతకం వచ్చేశాడు కృష్ణుడు. దేవతలూ సిద్ధులూ, సాధ్యులూ, ఋషులూ- వీళ్లందరితో కలిసి దేవేంద్రుడూ వచ్చాడు దేవలోకం నుండి. బృహస్పతి ముహూర్తం పెట్టాడు. యముడూ వరుణుడూ, వాయువూ కుబేరుడు మొదలైన దేవతలూ, అత్రీ భృగుడూ భరద్వాజుడూ నారదుడూ వశిష్ఠుడూ వామదేవుడూ మొదలైన ఋషులూ సదస్యులు. కళ్యపుడుహోత అరుంధతీ శచీ రుక్మిణీ సత్యభామా అప్సరసలూ పేరంటాళ్లు దివ్యంగా వుంది సుభద్రపెళ్లి.

కుమారుడికి మంగళస్నానాలు చేయించాడు దేవేంద్రుడు. మాంచి మణులతో ధగధగలాడుతూన్న బంగారంమకుటం పెట్టించాడు. విలవకట్టలేని నగలూ, దండకడియాలూ అవీ తొడిగించాడు. పెళ్లికొడుకుని ముస్తాబుచేసి వెయ్యికళ్ళతోనూ చూసుకున్నాడు. నిర్విఘ్నంగా మూడుముళ్ళూ పడ్డాయి. దేవలోకానికి వెళ్లిపోయాడు దేవేంద్రుడు.

ఇంతవరకూ అనుకొన్నదంతా సక్రమంగా జరిగిపోయింది. చెప్పినంతా చేశాడు కృష్ణుడు ఇక చెల్లెల్నీ మరిదినీ ద్వారక దాటించెయ్యాలి మంచి బంగారంరథం సిద్ధంచేశాడు. గాలిలా పరిగెత్తే గుర్రాలు పూయించాడు. ధనుస్సూ, బాణాలూ, అక్షయ తూణీరాలూ అవీ రథంమీద పెట్టించాడు అర్జునుణ్ణి పిలిచి "సుభద్రని దీనిమీద ఇంద్రప్రస్థం తీసుకెళ్లు' అని చెప్పాడ.

"వెళ్లిరా" అంటూ కౌగిలించుకున్నాడు. ఏమీ తెలియనట్టు తిరిగి అంతర్ద్వీపం చేరుకున్నాడు.

సుభద్రని తీసుకు బయల్దేరాడు అర్జునుడు యతివేషం తీసివేశాడు. పట్నం దాటిపోతున్నాడు. అడ్డుకున్నారు నగరపాలకులు. "అర్జునుడు వీడు మన కృష్ణబలరాములు లేనిసమయం చూసి సుభద్రని ఎత్తుకుపోతున్నాడు. వదిలేశామా, మన కొంపమునుగుతుంది" అంటూ తిరగబడ్డారు పృథుశ్రవసుడూ మొదలైన నగరరక్షకులు. కత్తులూ, కర్రలూ, కోలలూ పట్టుకుని పటాలానికి పటాలంవచ్చి ముట్టడించారు.

చూశాడు అర్జునుడు. పగ్గాలు సుభద్రచేతి కిచ్చాడు. విల్లూ, అమ్ములూ అందుకున్నాడు ఆమె రథం నడుపుతూవుంటే అతడు బాణాలు వెయ్యడం మొదలుపెట్టాడు. అంతమందినీ అన్ని దిక్కులా వొక్క పెట్టుని చెల్లాచెదురుచేశాడు వీథులూ, సందులూ, గొందులూ, మేడలూ, మిద్దెలూ, రైవతకపర్వతం రత్నప్రదేశాలూ, వనాలూ, చెరువులూ - ఎక్కడచూస్తే అక్కడ నిండిపోయాయి అర్జునుడి బాణాలు. సుభద్ర సారథ్యం చేస్తూనేవుంది. అర్జునుడు బాణాలు వొదల్తూనే వున్నాడు. పట్నం దాటిపోయింది రథం.

ప్రమాదం తెలియచేసే నగారా మోగించాడు సభాపాలుడు. అంతర్ద్వీపంలో ఉరుములు వురిమినట్టు ప్రతిధ్వనించింది నగారా. బలరాముడూ మొదలైన యాదవప్రముఖులంతా నుంచున్నపాటుని లేచివచ్చారు. విషయం విని ఉద్రేకపూరితులయారు యాదవసంఘం కలిసి వెంటనే పెద్ద సభ తీర్చారు

"తలకి మించినపని చేశాడు అర్జునుడు." "మన లక్ష్యం లేకండా, గొల్లకులంలో కలంకం పెట్టాడు." "కన్నెపిల్లని లేవదీసుకుపోయాడు." "సముద్రం చేతులతో ఈదడానికి సాహసించాడు" "పదండి, వాడి పనిపట్టిద్దాం" "ఉప్పెనలా పడదాం." "దావానలంలా ముట్టడిద్దాం." "వాడి పొగరేమిటో చూద్దాం."

ఎవళ్ళకితోచినట్టు వాళ్ళు కేకలువేస్తున్నారు. సభ సభంతా అల్లకల్లోలంగా వుంది. ఈ గందరగోళంతో తనకి ప్రమేయంలేనట్టు కూచున్నాడు కృష్ణుడు. చూశాడు బలరాముడు. కేకలు వారించి కృష్ణుడికేసి తిరిగాడు. "అసలు నీకు తెలియకుండా వాడికి ఇంత సాహసం ఎలా కలిగిందట! వాడి బతుక్కి సుభద్రని లేవదీసుకు పోయేపాటివాడా వాడు!" అంటూ మొదలకించాడు.

"అదికాదు మనం ఆలోచించవలిసింది," అంటూ మెల్లగా ఎత్తుకున్నాడు కృష్ణుడు అర్జునుడికి "మరదలుపిల్ల సుభద్ర తన మరదల్ని తాను తీసుకువెళ్ళాడు, ఇంతేనా! తగనిపని ఏముంది ఇందులో! అతగాణ్ణి ముట్టడిద్దామంటున్నారు మీరు మంచిదే. ఐతే, అదిమాత్రం అంత మీదమీద పనా! అపజయంలేని పాండవ సింహం అర్జునుడు. ఆ మాట నాకు తెలుసు. అంచేత, మీరంతా శాంతించమని నా సలహా" అన్నాడు.

సముద్రానికి గట్టులాగ గొల్లపెద్దల ఉద్రేకానికి అడ్డువేసింది శ్రీకృష్ణుడి ఉపదేశం. పోటులోవున్న సముద్రం చప్పున పాటులో పడ్డట్టు అయింది.

అటు సుభద్రని తీసుకొని ఇంద్రప్రస్థం వెళ్ళిపోతున్నాడు అర్జునుడు ఆవర్తకదేశం దాటేసరికి అంతకిముందే కృష్ణుడు సహాయం పంపిన యాదవసైన్యం అతణ్ణి కలుసుకుంది. దాంతోకూడా అరణ్యాలూ అవీ దాటుతూ, పట్నాలూ, పల్లెలూ చూస్తూ, పుణ్యతీర్థాలు సేవిస్తూ ఇంద్రప్రస్థం సమీపం చేరుకున్నాడు అర్జునుడు. అక్కడ తమ గొల్లపల్లెల్లో మకాం వేశాడు.

"మనం ఇలా వెళితే, నిన్ను చూసి నొచ్చుకుంటుందేమో ద్రౌపది!" సుభద్రని ఆదరిస్తూ చెప్పాడు అర్జునుడు. "తొందరపడి, చప్పున ఏదన్నా మాట జారవిడిచిందంటే ప్రమాదిస్తుంది. పతివ్రతవాక్యం పడి తీరుతుంది. ముందు నువ్వు వొక్కతెవే వెళ్ళి ఆమెకి నమస్కారం చెయ్యి" అన్నాడు.

కొంతమంది గొల్ల పడుచుల్ని వెంటపెట్టుకొని ముందుగా ఇంద్ర ప్రస్థం వెళ్ళింది సుభద్ర. అత్త కుంతీదేవికీ, ద్రౌపదికీ నమస్కారం చేసింది. ఆశీర్వదించారు వాళ్ళు 'భర్త విజయుడు కావాలి" అంది ద్రౌపది. "వీరుడైన కుమారుడూ కలగాలి" అంది మేనకోడల్ని ముద్దించి దగ్గిర పెట్టుకుంది కుంతి.

తరవాత పట్నంలో ప్రవేశించాడు అర్జునుడు. కూడావచ్చిన యాదవసైన్యం వెంటనడిచింది ఆశీర్వాదాలు చేస్తున్నారు బ్రాహ్మలు ఉత్సాహంతో స్వాగతం చెబుతున్నారు ప్రజలు. ధౌమ్యుడికీ, ధర్మరాజుకీ, భీముడికీ కుంతికీ పాదాభివందనం చేశాడు అర్జునుడు. నకుల సహదేవుల్ని కౌగిలించుకున్నాడు విశేషాలు చెప్పుకుంటూ అందరూ సుఖంగా కాలక్షేపం చేశారు.

చెల్లెలూ, మరిదీ క్షేమంగా ఇంద్రప్రస్థం చేరిన కుశలవార్త తెలుసుకున్నాడు కృష్ణుడు సంతోషించాడు ఇక, చెల్లెలికి అరణం పంపాలి బలరాముడూ, వసుదేవుడూ సాత్యకీ, ప్రద్యుమ్నుడూ మొదలైన ప్రముఖులతో ఇంద్రప్రస్థం ప్రయాణంకట్టాడు. లెక్కలేనన్ని వస్తువులూ, వాహనాలూ అరణం తీసుకువెళ్ళాడు.

ముందే వార్త వచ్చింది ధర్మరాజుకి నకుల సహదేవుల్ని ఎదురుపంపాడు. మహాసమారోహంతో, ఇంద్రుడిలా ఇంద్రప్రస్థం ప్రవేశించాడు కృష్ణుడు భీమార్జునులతో ఎదురు వెళ్ళి సగౌరవంగా తోడితెచ్చాడు ధర్మరాజు. వసుదేవుడూ మొదలైన పెద్దలికి నమస్కరించాడు. బలరాముణ్ణీ, కృష్ణుణ్ణీ, ప్రేమపూర్వకంగా సత్కరించాడు. యాదవులూ, పాండవులూ కలిసి పదుదినాలు మహోత్సవం చేశారు. తప్పట్లూ, తాళాలూ, డప్పులూ. వాయిద్యాలూ తెరిపిలేకండా మోగాయి బ్రాహ్మలికి సంభావనలూ అవీ చేతనిండా దొరికాయి. పదువారాల నగలూ, వెయ్యి వరుగులూ. గుర్రాలతో వెయ్యి బంగారం రథాలూ, వెయ్యి బంగారంపల్లకీలు, ఐదు వందలు గంధర్వజాతి గుర్రాలూ, వెయ్యి బాహ్లీక కాంభోజ పారశీక

దేశాల గుర్రాలూ, లక్ష ఆవులూ, పదిలక్షల యాదవక్షై స్వర్ణం నిండుముస్తాబుతో వున్న వెయ్యిమంది స్త్రీలూ చెల్లెలికి అరణమిచ్చాడు శ్రీకృష్ణుడు కుంతీదేవికీ, ద్రౌపదికీ, ధర్మరాజుకీ, భీముడికీ, నకులసహదేవులికీ విడివిడిగా నగలూ, నాణేలూ అవీ ఇచ్చి సత్కరించాడు. బలదేవుడు మొదలైన యాదవప్రముఖులంతా ఎవళ్లకి తగినట్టు వాళ్ళు సుభద్రకీ అర్జునుడికీ కట్నాలు చదివించారు అందరికీ ఎదురుసత్కారం చేశారు పాండవులు ఎనిమిదోనాడు బలరాముడూ మొదలైనవాళ్ళంతా ద్వారక వెళ్లిపోయారు. శ్రీకృష్ణుడు మాత్రం కొంతకాలం అక్కడే వున్నాడు

కొన్నాళ్లకి రెండో అర్జునుడిలాంటి కొడుకు పుట్టాడు సుభద్రకి అతడే అభిమన్యుడు. పుత్రోదయానికి ఉత్సవం చేయించాడు ధర్మరాజు బ్రాహ్మలికీ వాళ్ళకీ ఆవులూ అవీ పంచిపెట్టాడు. ధౌమ్యుడు జాతకర్మలు చేశాడు. అన్నప్రాశనా, చూడాకర్మా, ఉపనయనం అన్నీ సక్రమంగా జరిగిపోయాయి మేనల్లుడంటే మొదటినించీ ముచ్చటగా వుండేది కృష్ణుడికి. శుక్లపక్షంచందమామలాగ పెరుగుతూవచ్చాడు అభిమన్యుడు ధౌమ్యుడిదగ్గిర వేదవేదాంగాలు చదివాడు. తండ్రిదగ్గిర ధనుర్వేదం నేర్చుకున్నాడు. మహాస్త్రాలు ప్రయోగించడం, ఉపసంహరించడం, సైన్యవ్యూహాలు ఛేదించడం అన్నీ తెలుసుకున్నాడు.

ద్రౌపదికీ వరసగా ఐదుగురు కుమాళ్ళు కలిగారు. ధర్మరాజుకి ప్రతివింధ్యుడూ, భీముడికి శ్రుతసోముడూ, అర్జునుడికి శ్రుతకీర్తి, నకులుడికి శతానీకుడూ సహదేవుడికి శ్రుతసేనుడూ పుట్టారు. ఇలా పిల్లాజెల్లాకలిగి ఇంటిల్లిపాదీ కలకల్లాడుతూ ఇంద్రవైభవంతో ఇంద్రప్రస్థంలో రాజ్యం చేస్తున్నారు పాండవులు.

### అగ్నిహోత్రుడి ఆకలి

ఆ సంవత్సరం ఎండలు మండిపోతున్నట్టున్నాయి. కొరవిపెట్టినట్టున్నాయి సూర్యకిరణాలు. మంటల్లా వీస్తున్నాయి గాడ్పులు.

వడదెబ్బకి మాడిపోతున్నాయి చెట్టుచేమలు. నదీనదాలు సన్న గిల్లిపోయాయి. కదలనట్టున్నాయి పగళ్లు. దుర్భరంగా వుంది ఎండాకాలం. ఆపసోపాలుపడిపోతూ వోనాడు కృష్ణుడితో అన్నాడు అర్జునుడు "ఈ ఎండాకాలం నాలుగురోజులూ కొండల మీదికిపోతే బావుండేది. చరియలమీదా, అడవుల్లోనూ వేటాడు కుంటూ గడుపుదాం. యమునవొడ్డున అక్కడా చల్లగా వుంటుంది. మనిద్దరం వెళదాం." సరే అంటే సరే అన్నాడు కృష్ణుడు. ప్రయాణం నిశ్చయమైంది.

అవసరమైన పరివారం వెంటవేసుకుని బావమరుదులిద్దరూ బైల్దేరి వనవిహారానికి వెళ్లారు. చల్లనిప్రదేశాల్లో గడపడం మొదలు పెట్టారు. ఖాండవవనం దగ్గిర వోకనాడు వోక చందనలతా గృహంలో చంద్రకాంతివేదికమీద కూచుని కబుర్లు చెప్పుకుంటు న్నారు. మాంచి సువాసనలు చల్లగాలి వీస్తోంది. ప్రాణం లేచివచ్చి నట్టుంది. ఇంతలో వోక బ్రాహ్మడు వచ్చి నుంచున్నాడు ఎదట. బాగావాడిలిపోయి వున్నాడు. జడలూ, మీసాలూ, గెడ్డాలూ చిక్కగా కపిలవర్ణంగా వున్నాయి. కృష్ణుడూ, అర్జునుడూ నమ స్కరించారు. "భోజనప్రియుణ్ణి నేను" అంటూ దగ్గిరికి వచ్చాడు బ్రాహ్మడు. "ఏం తిన్నా భస్మమైపోతుంది నాకు. ఆకలిగా వుంది. పెట్టగలిగితే, మంచి భోజనం పెట్టండి. సుష్టుకృతుగా భోంచేస్తాను" అన్నాడు. "ఏం తింటావో చెప్పు. తప్పకండా పెడతాం" అన్నారు కృష్ణార్జునులు. "ఖాండవవనం తింటాను" అన్నాడు బ్రాహ్మడు. "అగ్నిహోత్రుణ్ణి నేను. ఖాండవవనంకోసం ఎన్నాళ్లగానో కాసుకు కూచున్నాను. ఇది దేవేంద్రుడిది. అతడి వానధారలవల్ల నా యత్నం వ్యర్థమౌతూ వచ్చింది. తక్షకు డని వోక నాగరాజు నివాసమున్నాడిందులో. అతడికీ దేవేంద్రు డికీ ప్రాణస్నేహం. అంచేత, అమృతం రక్షిస్తున్నట్టు ఈ అడివిని కాపాడుతున్నాడు. కనకనే దీన్లో ప్రాణులికి భయమన్నది లేదు.

మీ్రా రై తే మహా బలవంతులు. అస్త్రవిద్యలో అడ్డులేదు మీకు. ఇంద్రుడుచేసే విఘాతా లేవీ మీ ముందు సాగవు. మీరు 'ఊఁ' అంటే చాలు. నా పని నేను చేస్తాను. అనాయాసంగా ఆరగిస్తాను ఖాండవం'' అన్నాడు.

శ్వే త కి క థ

ఖాండవవనం తింటానని అగ్నిహోత్రుడు రావడానికి పూర్వ గాథ వొకటుంది. ఆ కాలంలో శ్వేతకి అని వొక రాజు వుండే వాడు. రాజరుషి ఆయన. యజ్ఞాలంటే వొళ్లుమరిచిపోయేవాడు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. చేతికి ఎముకలేకండా దానాలూ, ధర్మాలూ చేశాడు. ఐనా, తృప్తికలగ లేదతడికి నూరేళ్ళ సత్ర యాగ మొకటి తలపెట్టాడు, ఋత్విజుల్ని పిలిచాడు ఎప్పుడూ అతడు చేస్తూన్న యజ్ఞాలతో అప్పటికే అలిసిపోయీ, విసిగిపోయీ వున్నారు వాళ్లు ''ఇహ, మా తరంకాదు'' అన్నారు. 'నీ యజ్ఞా లికి యాజకత్వంచెయ్యడం ఈశ్వరుడి కేమోగాని మానవమాత్రుడికి మాత్రం సాధ్యం కాదు'' అంటూ నిరాకరించారు.

పూనిక వొదలలేదు శ్వేతకి. ఈశ్వరుడికోసం కైలాస పర్వతం వెళ్లాడు. ఉగ్రమైన తపస్సు చేశాడు. మెచ్చి ప్రత్యక్షు మయాడు శివుడు. ''ఏంకావాలో కోరు'' అన్నాడు. ''నూరేళ్ల సత్రయాగం చెయ్యాలని వుంది నాకు. నువ్వు వచ్చి నడిపించాలి'' అంటూ ప్రార్థించాడు శ్వేతకి. ''అది బ్రాహ్మలపని. వాళ్ళే చెయ్యాలి యాజకత్వం. నువ్వు పన్నెండేళ్ళు బ్రహ్మచర్యం చేస్తూ, అగ్నితర్పణం చెయ్యి. ధారాపాతంగా అగ్నికి నెయ్యి సమర్పించు'' అని అంతర్ధానమయాడు శివుడు.

పన్నెండేళ్లూ అగ్నని నేతితో కుమ్మరించాడు శ్వేతకి. పన్నెం డోవేటి చివర మళ్లీ శివుడు ప్రత్యక్షమయాడు, దుర్వాసరుషిని పిల్చి శ్వేతకి తలపెట్టిన నూరేళ్లయజ్ఞానికి ఋత్విక్కుడిగా వుండ

మన్నాడు ఎంతోమంది మునులతో వచ్చాడు దూర్వాసుడు. శ్వేతకి సత్రయాగం నిర్విఘ్నంగా సమాప్తంచేసి వెళ్లాడు

యజ్ఞమేమో జరిగిపోయింది. కానైతే, శ్వేతకిపోసిన నెయ్యి తిని, అగ్నిమాంద్యం పట్టుకుంది అగ్నికి. తేజస్సు తగ్గిపోయింది. దుర్దాహం పట్టుకుంది. బ్రహ్మదగ్గిరికివెళ్లి తన అవస్థ చెప్పుకున్నాడు. అపరిమితంగా నెయ్యి తినడంవల్ల కలిగిన మహావ్యాధి అది అని పోల్చుకున్నాడు బ్రహ్మ. "ఈ వ్యాధి దానంతట తీరేదికాదు. వెళ్లు. ఖాండవవనం దహించు. మహౌషధా లున్నాయి దాన్లో. దాంతో యథాపూర్వంగా ఆరోగ్యవంతుడివై వస్తావు" అన్నాడు. బ్రహ్మ మాటప్రకారం ఖాండవం ప్రవేశించడానికి విశ్వప్రయత్నం చేశాడు అగ్ని. లాభంలేకపోయింది. అడుగుపెట్టేసరికి పెద్ద ఏనుగుమందలాగ ముంచుకువచ్చేవి మేఘాలు. నిరాశ చేసుకున్నాడు. మళ్లీ బ్రహ్మతోనే మొర్రపెట్టాడు. "మీ మాటప్రకారం ఖాండవం తినబోయాను. కాని దాని రక్షకులబాధ తలమునకలౌతున్నాది నాకు. ఒకమారు కాదు. రెండుమార్లు కాదు. ఏడుమార్లు ప్రయత్నించాను. ఏడుమార్లూ దెబ్బతిని వచ్చేశాను. ఏమిటి సాధనం?" అంటూ కన్నీళ్లు గుటకలుమింగాడు.

జాలిపడ్డాడు బ్రహ్మ. రాబోయేకాలం వొకసారి కళ్ళ ముందికి తెచ్చుకున్నాడు. "కొంతకాలం వోపికపట్టాలి నువ్వు" అన్నాడు "ముందుముందు ఆదిమునులు నరుడూ, నారాయణుడూ నరలోకంలో అర్జునుడూ, కృష్ణుడూ అయి పుడతారు వాళ్లు వోనాడు ఖాండవం దగ్గిరికి తిరగడానికి వస్తారు. వాళ్ళని నువ్వు ప్రార్థించు. ఆయుధాల బలంతో నీకు సాయపడతారు వాళ్లు. అనాయాసంగా ఖాండవం ఆరగిస్తావు" అన్నాడు. ఆమాట నమ్ముకుని ఇన్నాళ్ళూ కాచుకున్నాడు అగ్ని. ఇప్పటికి బ్రహ్మమాట నిజమైంది. కృష్ణుడూ అర్జునుడూ అక్కడ తిరగడం చూశాడు. బ్రాహ్మణవేషంలో వచ్చి భోజనం పెట్టమన్నాడు.

"నువ్వు చెప్పినట్టు చెయ్యడానికి సిద్ధంగా వున్నాము" అన్నాడు అర్జునుడు. కాని వొక్క మాట చెప్పాలి. మహామేఘాలు తరుమడానికైతేనేం, దేవతల్నీ దేవేంద్రుణ్ణీ ఎదిరించడానికైతేనేం కావలసిన దివ్యాస్త్రాలేమో నాదగ్గిర ఎన్నో వున్నాయి. ఐతే, ఏం లాభం! అవి ఉపయోగించ దగిందీ, నా బాహుశక్తిని తట్టుకోగలిగిందీ మంచి ధనుస్సు లేదు ఇదే పెద్ద కొరతగా వుంది నాకు. అంతేకాదు, తగిన రథమూ, గుర్రాలూ కొదవగానే వున్నాయి. మా కృష్ణుడికి తగిన మహాయుధం లేదు ఇది ఆలోచిస్తున్నాం మరి" అన్నాడు.

## గాండీవం

"దానికి నేనున్నాను. విచారించకండి" అన్నాడు అగ్ని. వరుణదేవుణ్ణి స్మరించాడు. మరుక్షణంలో వచ్చి నుంచున్నాడు వరుణుడు. "చూడూ. బ్రహ్మచేతి ధనుస్సు- లోగడ చంద్రుడిచ్చింది- నీ దగ్గిర వుందికదా! దాని అవసరం వచ్చిందిపుడు. అదీ, అత డిచ్చిన అక్షయతూణీరాలూ, రథమూ, కపిధ్వజమూ కావాలి. సుదర్శనచక్రమూ, కౌమోదకి గదా కూడా కావాలి. ఈయన అర్జునుడు. మహారథుడు. ఈయన శ్రీకృష్ణుడు. లోకకళ్యాణంకోసం వీటిని ఉపయోగిస్తారు వీళ్లు" అన్నాడు.

వరుణుడు తలుచుకోవడమే తడువుగా అగ్ని కావాలన్నవి, ధనుస్సూ, అక్షయతూణీరాలూ, రథమూ, చక్రమూ, గదా అన్నీ తీర్చిపెట్టినట్టు ఎదట ప్రత్యక్షమయాయి. ఎంతో గొప్పగా వుంది ధనుస్సు. ఎంత అందంగావుందో, అంత దృఢంగానూ వుంది. బాణాలతో కిక్కిరిసి వున్నాయి అక్షయతూణీరాలు. ధగధగా మెరిసిపోతూవుంది రథం నరరకాల ఆయుధాలు ఎక్కడవుండవలిసినవి అక్కడ పేర్చివున్నాయి. తెల్లటి మల్లిపువ్వులలాంటి గుర్రాలు పూన్చిఉన్నాయి రథంమీద జెండా, జెండామీద కోతి, కోతికి సింహాంత్లోక. గాలికి జెండా కదిలిందంటే, సముద్రఘోషలా

వినపడుతుంది దాని చప్పుడు. వేనవేలు కిరణాలతో వెలుగుతూన్న నడినెత్తిసూర్యుడిలా చూడశక్యం కాకుండావుంది సుదర్శనచక్రం. అంతకంటే ఇదిగావుంది కౌమోదకీగద.

ధనుస్సు అర్జునుడి చేతిలో పెట్టాడు అగ్ని. "ఇది గాండీవం, తిరస్కరించరాని దివ్యధనుస్సు. దేవతలూ, నాగులూ, గంధర్వులూ- ఎవ్వరైనాసరే, దీని ముందు వోడిపోవలసిందే. ఎదురే లేదు దీనికి. వజ్రంకంటే ధృఢమైంది. అభేద్యమైంది. దీనికి తగిలిన శత్రుబాణాలు వజ్రానికి తగిలిన రాతిముక్కల్లా ముక్కలౌతాయి. ఎంతటి మహాయుధాన్నయినా ముక్కలు చెయ్యగలుగుతుంది. మూడులోకాల దివ్యధనుస్సులన్నీ దీనిమీంద దిగదుడుపు. ఇది బ్రహ్మనుండి క్రమానుగతంగా వరుణుడికి వచ్చింది. అతడిదగ్గిర పుచ్చుకుని నీ కిచ్చాను నేను ఇవి అక్షయతూణీరాలు. ప్రతిపక్షులసైన్యం క్షయంకావాలి కాని వీటికి క్షయముండదు. ఇది దివ్యరథం. అడ్డు లేనేలేదు దీనికి. దిగ్విజయం సాధించిపెడుతుంది. ఈ తెల్లగుర్రాలు గంధర్వజాతివి. వాయువేగ, మనోవేగంతో పరిగెడతాయి. ఈ రథంమీాదే లోగడ చంద్రుడు దిగ్విజయం సాధించుకు వచ్చాడు. స్వీకరించు వీటిని" అన్నాడు.

చక్రం. గదా కృష్ణుడి చేతిలో పెట్టాడు. "కృష్ణా, ఇది సుదర్శనం. ఇది కౌమోదకి. దేవతలూ. రాక్షసులూ, యక్షులూ, పిశాచులూ, నాగులూ-ఎవ్వరూ వీటిముందు ఎదిరించి బతకలేరు. ఈచక్రం నువ్వు ప్రయోగించినపుడు, శత్రువుని చంపి తిరిగి నీ చేతికి వచ్చేస్తుంది. దీని నిర్మాణంలోనేవుంది ఆశక్తి. మాయలన్నవి నిలవనివ్వదు కౌమోదకి. రాక్షసుల ప్రాణాలంటే నల్లేరుమీాదికి బండినడక దీనికి" అన్నాడు.

అన్నీ సంతోషంతో పుచ్చుకున్నారు అర్జునుడూ, కృష్ణుడున్నూ. "ముక్కోటి దేవతల్నీ వేసుకుని దేవేంద్రుడురానీ, పీఁగనొట్టిమరీ వోడిస్తాం. ఇక శంకించకు. ఆరంభించు భోజనం"

అన్నారు. గాండీవం ఎక్కుపెట్టి నారి మోగించాడు అర్జునుడు. చక్రమూ, గదా పట్టుకు సర్దుకున్నాడు కృష్ణుడు.

### ఖాండవదహనం

బ్రాహ్మడిరూపం విడిచిపెట్టి నిజరూపం ధరించాడు అగ్ని. బంగారంపర్వతం పగిలి, విరజల్లుకు పడ్డట్టయింది ఖాండవంలో. అడివంతటా పెద్దపెద్దమంటలు, రకరకాలుగా వొక్కసారి ముట్టుకున్నాయి. బెంబేలుపడిపోతున్నాయి జంతువులు కకావికలై పోతున్నాయి. రొదచేసుకు ఎగిరిపోతున్నాయి పక్షులు. గావుకేకలు వేసుకుంటూ ఆర్పడానికి పరిగెత్తుకువచ్చారు అడవిని కాపాడుతున్నవాళ్లు. గదా, చక్రంతో వొక వొడ్డు కాసుకున్నాడు కృష్ణుడు గాండీవంతో మరో దిక్కు అడ్డుకున్నాడు అర్జునుడు ఆర్పవచ్చిన వీరులంతా అర్జునుడి బాణాలికి బలిఅయిపోయారు.

జంయ్యిమని వీస్తూ అగ్నికి సహాయపడుతోంది గాలి. పెద్ద పెద్ద నాలికలు చాస్తున్నాడు అగ్ని. ఆకలితో విజృంభిస్తున్నాడు. అంగలు వేసుకుంటూ పరిగెడుతున్నాడు. సివాలాడుతున్నాడు. సుళ్లు తిరుగుతున్నాడు. ప్రళయంనాటి కాలాగ్నిలా కనిపిస్తున్నాడు. ఘోరంగా మండిపోతున్నాడు. పెచ్చురేగిపోతున్నాడు. పొగలే బావుటాలు చేసుకుంటున్నాడు.

అద్భుతంగా అంటుకుంటోంది ఖాండవవనం కర్పూరవృక్షాలూ, చందనంచెట్లూ, అగరువృక్షాలూ అవీ తగలబడుతున్నాయి. పొగలు ఘుమఘుమలాడుతూ ఆకాశాన్నంటుతున్నాయి. పైన వస్తూ పోతూన్న దేవవిమానాలికి ధూపం వేస్తున్నట్టున్నాయి. అగ్నిజ్వాలలూ, అర్జునుడి బాణజ్వాలలూ ఖాండవంలోని ప్రాణికోటిని ముట్టడివేస్తున్నాయి. ప్రాణభయంతో గగ్గోలు పడిపోతున్నాయవి, వాటి ఆర్తనాదాలతో అడివి అడివంతా మందరంతో మథిస్తూన్న సముద్రంలా వినిపిస్తోంది. పైకెగిరిపోతున్నాయి పక్షులు. వెంటాడి వస్తూన్న నిప్పు తగిలి మంట

లోకనే కూలిపోతున్నాయి మళ్లీ. మృగాలూ, పిట్టలూ, పాములూ- వొకటేమిటి అన్నీ మండిపోతూ వుంటే, అగ్నే అన్నిరూపాల్లో అవతరించినట్టుంది. కోనేళ్లూ, చెరువులూ, మంటకి సలసలా మరుగుతున్నాయి నాచూ, పద్మాలూ మాడిపోతున్నాయి. చేపలూ, నీటికోళ్లూ, హంసలూ, బాతులూ, చచ్చి తెప్పున తేలి పోతున్నాయి. పెద్దపెద్ద పాములు గరళం కక్కుకుంటూ చురుచురా మాడిపోతున్నాయి.

ఈ అకాలప్రళయం చూసి అదిలిపోయారు దేవతలు. దేవేంద్రుడి దగ్గిరికి పరిగెత్తారు. పిడుగుపడ్డట్టయింది ఇంద్రుడికి 'అయ్యో, తక్షకుణ్ణి రక్షించాలి'' బ్రహ్మాండమైన మేఘాలు వేసుకుంటూ మెరుపులా వచ్చి వాలాడు ఖాండవం దగ్గిర. కుంభవృష్టి కురిపించాడు అగ్నిమీద. ప్చ్! లాభంలేకపోయింది మీది వాన మీది మంటలమీదే ఆరిపోయింది. టుప్పుమని చినుకన్నా పడలేదు అగ్గిమీద. ఉరుములూ, మెరుములూ, పిడుగులూ - ఏనుగు తొండాలవంటి వర్షధారలు కడవలతో కుమ్మరించినట్టు-జలప్రపాతమైనట్టు- ఎడతెగకుండా అడివంతటా కురిపిస్తున్నాడు ఇంద్రుడు.

చూశాడు అర్జునుడు. వేలూ, లక్షలూ బాణాలమీద బాణాలు వేశాడు అంతటి ఖాండవవనానికి బాణాలతో ఇల్లు కట్టాడు. చిన్న చినుకుబొట్టయినా దూరడానికి వీలులేకండా అయిపోయింది. ఇక, పైకిపోదామన్న ఆశకూడా లేకపోయింది లోపలి ప్రాణులికి. కుయ్యో మొర్రోమంటున్నాయి. కాలి చస్తున్నాయి.

ఇంతలో తక్షకుడి కొడుకు నాగకుమారుడు అశ్వసేనుడు ఎలా అయినా తల్లితో సహా తప్పించుకుపోవాలని ప్రయత్నించాడు. తల్లిని తన తోక కరుచుకు వేలాడమన్నాడు. మంట తగలకండా ఆకాశానికి ఎగరబోయాడు. ఒక్క బాణం వేసి అశ్వసేనుడి తోక తెగ్గోశాడు అర్జునుడు. కొడుకుతోక నోటిల్లోనేవుంది, అగ్గిలోపడి మాడిపోయింది తక్షకుడి భార్య రెండో బాణం అశ్వసేనుడిమీద కూడి

పెడుతున్నాడు అర్జునుడు. చప్పున, మోహినీమాయచేసి తప్పించాడు ఇంద్రుడు. అశ్వసేనుడు బతికిపోయాడు. ఐతే ఆ పగమాత్రం చచ్చిందాకా వొదల్లే దతణ్ణి.

తక్షకుడేమయాడు ? ఎక్కడా కనిపించడేం ? గుండెలో రాయిపడ్డట్టుంది దేవేంద్రుడికి. పాపం, చచ్చేపోయా డేమో! ఎంతఘోరం! కళ్ళు మొయ్యా కోపంవచ్చింది అర్జునుడిమీద. వెంటనే ఘోరమైన మేఘాస్త్రంతీసి ప్రయోగించాడు. పెద్ద తుఫాను మేఘాలు భయంకరంగా ముందుకువచ్చాయి గాలీవానా మిన్నూ మన్నూ ఏకంచేస్తూ చెలరేగింది. తెల్లమొహంవేశాడు అగ్ని. "భయపడకు" అన్నాడు అర్జునుడు. గాండీవంతో మారుతాస్త్రం సంధించి వొదిలిపెట్టాడు. దూదిపింజెల్లాగ ఎగిరిపోయాయి మేఘాలు. మరింత కోపం వచ్చింది ఇంద్రుడికి దేవసైన్యం వుసికొల్పాడు కృష్ణార్జునులమీదికి. హాలో అంటే హాలో అంటూ మీదపడ్డారు దేవతలూ, గరుడులూ, నాగులూ, రాక్షసులూ, యక్షులూ, గంధర్వులూను. "దేవతలు నా వంతు" అన్నాడు అర్జునుడు. "తక్కినవాళ్లు నావంతు" అన్నాడు కృష్ణుడు గాండీవం, సుదర్శనం- ఈ రెండిటిమధ్యా సర్వనాశనం అయిపోయింది దేవసైన్యం. నివ్వెరపోయాడు దేవేంద్రుడు కరచరణా లాడలేదు. లోలోపల మెచ్చుకుంటూనే వున్నాడు కొడుకుని. ఐనా, ఇంకా చూద్దామనుకున్నాడు. రాళ్ళవాన కురిపించాడు. ఆటాడినట్టు వాటన్నిటినీ బాణాలతో తుళ్ళగొట్టాడు అర్జునుడు. మందరపర్వతం తెచ్చి అగ్నిమీద విసిరాడు దేవేంద్రుడు. పిడుగుల్లాటి బాణాలువేసి తుక్కు తుక్కు చేశాడు అర్జునుడు.

దాంతో, "ఎందుకీ వ్యర్థప్రయాసం, దేవేంద్రా !" అంటూ గర్జించింది ఆకాశవాణి "ఆదిమునులు నరనారాయణులు వీళ్లు. వీళ్లతో విరోధ మేమిటి? లోగడ దేవాసురయుద్ధంలో వీళ్ల పరాక్రమం తెలిసేవుంది నీకు వీళ్లని గెలవ లేవు తక్షకుడికోసం శోంటోలు

పడుతున్నావేమో! ఇంతకిముందే కురుక్షేత్రం వెళ్ళాడతడు. ఖాండవం కాలవలిసిందని బ్రహ్మవచనం, తప్పదు'' అంది

విరమించుకున్నాడు దేవేంద్రుడు కృష్ణార్జునులు సింహనాదాలు చేశారు. దిక్కులు చిల్లులుపడ్డట్టయాయి. ముల్లోకాలూ తుళ్ళిపడ్డాయి. ఇంతలో నముచి తమ్ముడు మయుడు తప్పించుకుపోలేక తక్షకుడి ఇంటిముందు తచ్చాడుతూ వుండడం చూశాడు కృష్ణుడు. సుదర్శనం విసిరి చంపబోయాడు అటు అగ్ని ఇటు కృష్ణుడూ. మరి బతుకాశ లేదు మయుడికి. రక్షించమంటూ కేకవేసి అర్జునుడి శరణుజొచ్చాడు. అభయమిచ్చాడు అర్జునుడు. బతికిపోయాడు మయుడు. అశ్వసేనుడూ, మయుడూ, మరినాలుగు లావుకపిట్టలూ- వీళ్ళే బతికారు. చిన్న పురుగైనా పైకిపోనివ్వలేదు కృష్ణార్జునులు. కడముట్టా కాలిపోయింది ఖాండవవనం.

లావుకపిట్టల కథ

మందపాలుడని వొక ముని వుండేవాడు. బ్రహ్మచర్యంతో ఎన్నో సంవత్సరాలు తపస్సుచేశాడతడు, యోగబలంతోనే శరీరం వొదిలిపెట్టాడు. ఐనా, అతడికి పుణ్యలోకాలు లభించలేదు. ఏమిటి కారణమని దేవతల్ని అడిగాడు. ''ఎంత తపస్సు చేసినా, సంతానం లేకపోతే సద్గతి లేదు అంచేత, సంతానవంతుడివై రా'' అన్నారు దేవతలు మళ్ళీ భూలోకానికి వచ్చాడు మందపాలుడు సత్వరంగా సంతానం కలిగేమార్గం విచారించాడు పక్షియోనిలో అయితే త్వరలో సంతానం కలుగుతుందని తెలుసుకున్నాడు. తానొక లావుకపిట్ట అయాడు జరిత అనే పెంటిలావుకాన్ని జతచేసుకున్నాడు. జరితగర్భంలో జరితారీ, సారిసృక్వుడూ స్తంభమిత్రుడూ, ద్రోణుడూ అని బ్రహ్మజ్ఞానం కల నలుగురు కుమార్లని కన్నాడు వాళ్ళనీ, జరితనీ ఖాండవవనంలో పెట్టాడు. తాను వెళ్ళి తొలిభార్య లపితతో గడుపుతున్నాడు.

అగ్నిప్రళయంచూసి అడిలిపోయింది జరిత. "రెక్కలురాని పసికందులు పిల్లలు. తండ్రాదగ్గిర లేడు. నడవలేని వీళ్లని ఎక్కడ దాచేది ? దయలేకపోయింది తండ్రికి ! వొదిలిపెట్టి తన దారిని పోయాడు. అడివంతా ఆక్రమిస్తున్నాయి మంటలు. మా నాయనల్ని ఎలా బతికించేది ? ఏందారి ?" అంటూ దుఃఖపడింది. "బాబూ, ఈ బిలంలో దూరిపొండి మంట తగలకండా మట్టి కప్పుతాను" అంది 'బ్రహ్మజ్ఞానం కల నలుగుర్ని కన్నాను అపాయం రాకండా చూస్తూవుండు' అని వెళ్ళాడు మీ బాబు పాపం, ఆయనకేం తెలుసు ఈ ఆపద మనకి వస్తుందని!" అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది.

"ఎందు కమ్మా. ఏడుస్తావు !" అన్నాడు పెద్దకొడుకు జరితారి "ఆపద రావలిసి వుంటే ఎక్కడ వున్నా తప్పదు. బిలంలో దూరామే అనుకో, అక్కడ ఎలక నోట్లోవేసుకుంటుంది. ఇక్కడ వుంటే అగ్గిమింగుతుంది ఎలకచేత చావడంకంటే అగ్గిలో చావడమే నయం. పుణ్యలోకమన్నా లభిస్తుంది మరో మాట, చిన్న మాంసంముద్దలం మేము బిలంలో ఐతే ఎలకచేత చావు తప్పనిసరి ఇక్కడే వుంటేనా, ఏమో ప్రమాదం తప్పినా తప్ప వచ్చు. గాలి ఇటునించి అటువేస్తే అటు పోతాడు అగ్ని. ప్రాణ భయం తప్పుతుంది మాకు. కష్టాలువచ్చినప్పుడు ప్రమాదం తప్పదూఅన్న దారి వొదిలిపెట్టాలి. సందేహాంగా వున్నదారే తొక్కాలి. అంచేత, విచారించకు. మా మీద మోహాం విడిచి పెట్టు. నువ్వు ఎక్కడికన్నా వెళ్ళి బతికిపో. మేము కాలిపోయినా, నువ్వుంటూ వుంటే మళ్ళీ కొడుకులు కనవచ్చు. పుణ్యవశంచేత మేం బతికిపోయామా, తిరిగి మా దగ్గిరికి రావచ్చు" అన్నాడు. "అవును, అదేమంచిపనమ్మా," అంటూ మిగిలిన ముగ్గురూ తల్లికి నమస్కరించారు. ఏం చేస్తుంది పాపం! దిక్కులేనితల్లి, మంటలు ముంచుకొస్తున్నాయి. ప్రాణభయంతో ఎగిరిపోయింది జరిత.

నాలికలు చాచుకుంటూ వచ్చేస్తున్నాడు అగ్ని. నాలుగు లావుక పిట్టలూ నాలుగు వేదాలూ చదువుతూ "రక్షించు, రక్షించు" అని ప్రార్థించాయి అగ్నిని.

ఖాండవం కాల్చడానికి అగ్ని వస్తున్నాడని అంతకిముందే తెలుసుకున్నాడు మందపాలుడు. అగ్ని సూక్తాలతో స్తోత్రం చేశాడు అగ్నిని. "అఖిలధర్మమూర్తివి నువ్వు. నా కుమార్ళుని-నాలుగు లావుకపిట్టల్ని ఖాండవంలో కరుణించు. వాళ్ళని కాల్చకు" అంటూ వినయంగా వేడుకున్నాడు.

చిన్న పూతికపుల్లయినా మిగలకండా ఖాండవం కాలిపోయిందని విన్నాడు మందపాలుడు. జరితా, కొడుకులూ ఏమైపోయారో అంటూ దుఃఖించాడు. "రెక్కలన్నా మొలవని చిన్నపాపలు. నడవలేని పసికందులు లావుకపిల్లలు పాపం. నలుగుర్నీ వొక్కర్తీ ఏం చేస్తుంది జరిత! అగ్నిని ప్రార్థించాను. ఐనా, మరిచిపోయాడో మరవకపోయినా, తెలుసుకోగలిగాడో లేదో! తెలుసుకున్నా, ఆ సమయానికి ఏమయిందో!" అన్నాడు లపితతో.

"నా ఎదటేకదా, అగ్నిని ప్రార్థించావు! తప్పకండా రక్షిస్తానని అన్నాడు మరి. నువ్వూ విన్నావు నేను విన్నాను. అప్పుడే అంత మరుపా! నా దగ్గిర వుంటూ జరితమాటే తలుస్తుంటావు పైపై ప్రేమలే నామీద చూపెడుతున్నావు అదంటేనే నీకిష్టం. అది ఎగిరే పిట్ట. ఎక్కడికన్నా పోతుంది. దానికేం వస్తుంది!" అంది లపిత. నవ్వుకున్నాడు మందపాలుడు. 'వశిష్ఠుడిలాంటి భర్తా, అరుంధతిలాంటి భార్యా అయినా, సంశయస్వభావం వొదిలిపెట్టదు ఆడది" అనుకున్నాడు. లపితని వుండమని ఖాండవానికి వచ్చాడు.

మందపాలుడి ప్రార్థన వ్యర్థంచెయ్యలేదు అగ్ని. లావుక పిట్టలున్న చెట్టు ముట్టలేదు. బతికిపోయాయి పిట్టలు. అది చూసి జరితకూడా వచ్చేసింది. తల్లీ, పిల్లలూ సుఖంగా కూచున్నాయి. చూసి, సంతోషించి వెళ్ళాడు మందపాలుడు.

# సభాపర్వం

## మొదటి ఆశ్వాసం

### మయసభ

ధర్మరాజు కొలువుతీర్చి కూచున్నాడు. శ్రీకృష్ణుడూ, అర్జునుడూ, మొదలైన యావన్మందీ ఎవళ్ల ఆసనాల్లో వాళ్లున్నారు ఇంతలో మయుడు లేచి అర్జునుడి ముందు చేతులు జోడించి నుంచున్నాడు. "ప్రాణాలు రక్షించావు మహోపకారివి ఏదో చేసి నిన్ను మెప్పిస్తానని అనడానికి నోరు తిరగడం లేదు నాకు,, ఐనా, చంద్రుడికో నూలుపోగు, ఏదన్నా వొకటి నీకునచ్చింది చెయ్యాలనే నా అంతరాత్మ చెపుతోంది. దానవవిశ్వకర్మని నేను. అనేక రకాల శిల్పకళలు తెలుసునాకు మీకు నచ్చింది తయారుచేస్తాను. ఆదేశించు" అన్నాడు.

కృష్ణుడి మొహం చూశాడు అర్జునుడు. "అపూర్వమైంది ఏదన్నా నువ్వే ఔత్తాయించాలి" అన్నాడు, రవంత ఆలోచించి మయుడుకేసి తిరిగాడు కృష్ణుడు, "ఐతే, ధర్మరాజుకోసం మంచి వొక సభ తయారుచేసి పట్టుకురా," అన్నాడు. "సర్వలోక సుందరంగా వుండాలది. భూదేవికి అపూర్వమైన అలంకారంగా వుండాలి రాజాధిరాజులికి చక్రవర్తి ధర్మరాజు అన్నివిధాలా అతడి వైభవానికి తగివుండాలి మరి. నీ శిల్పచాతుర్యమంతా దానిలో తెలియాలి" అన్నాడు.

"పక్కని ఆదేశం," అంటూ తలవూపాడు మయుడు "దేవేంద్రుణ్ణి మించిన వైభవం ధర్మరాజుది. ఆయనగొప్పకి తగి

నట్టే నవరత్నాలతో వొకసభ తయారుచేస్తాను 'దేవతల విమానాలు దీనిముందు ఏమాత్రం' అని ప్రజలు మెచ్చుకొనేట్టు చేస్తాను. లోగడ రాక్షసరాజు వృషపర్వుడికోసం వొకసభ తయారుచేయాలని రకరకాల రత్నాలూ మొదలైన ఉపకరణాలు యావత్తూ జాగ్రత్త చేశాను. అవన్నీ బిందుసరం సరస్సులో దాచాను అవి తీస్తాను ఎన్నడూ, ఎవ్వరూ కనీవినీ ఎరగనంత విచిత్రంగా సభ తయారుచేసి ధర్మరాజు కిస్తాను. అక్కడే వృషపర్వుడు* దాచిపెట్టిన వొక గద వుంది, పగవాళ్లని చంపడంలో దాన్ని చెప్పి మరోదాన్ని చెప్పాలి. అది భీముడికి తెచ్చిఇస్తాను. దేవదత్తం అని శంఖమొకటుంది. దారుణంగా మోగుతుంది దది. అది అర్జునుడికోసం తెస్తాను. వెళ్లివస్తాను, సెలవివ్వండి" అన్నాడు. ధర్మరాజుచేత సత్కారం పొంది, అందరితోనూ చెప్పి వెళ్లాడు మయుడు

"ఎన్నాళ్ళో అయిపోయింది వచ్చి. తండ్రిగారిని చూడాలనిపిస్తోంది. వెళ్ళివస్తాను" అని ద్వారక వెళ్లిపోయాడు కృష్ణుడు.

ఇంద్రప్రస్థంనించి ఈశాన్యంగా బయల్దేరాడు మయుడు. కైలాసపర్వతానికి ఉత్తరంగావున్న మైనాపర్వతం వెళ్లాడు. అక్కడ హిరణ్యశృంగం మీద బిందుసరం చేరుకున్నాడు. సృష్టికర్త చరాచరములైన ప్రపంచాలు యావత్తూ ఇక్కడే సృష్టించాడు భగీరథుడు గంగని ప్రత్యక్షం చేసుకుని కృతకృత్యుడైన ప్రదేశమిది. మణులతో చిత్రవిచిత్రంగా యజ్ఞశాలలుకట్టి, బంగారు యూపస్తంభాలున్నపాతి బ్రహ్మ, విష్ణువూ, శివుడూ, ఇంద్రుడూ, నర

---

* "హేమాదిత్యం దదౌ రాజర్షి" అని తెలుగు పాఠం. "నిహితా భావయా శ్వేతం. రాజ్ఞా మహాత్మా వరణే రిపూన్" అనిమూలం. "రాజ్ఞా = వృషపర్వణా" అని నీలకంఠవ్యాఖ్య. నిహితా యౌవనాశ్వేన రాజ్ఞా మహాత్మా రిపూన్ రణే" అన్న పాఠన్నిబట్టికారం యౌవనాశ్వుడు.

† యూపాలన్ని ఇట్లు యజ్ఞశాలలో కనుపడని కట్టడాలుగాని చూచే కాయిన్ని,

నారాయణులూ మొదలైన దేవతలు యుగాలతరబడి ఎన్నో యజ్ఞాలూ అవీ అక్కడే చేశారు.

అలాంటి బిందుసరంలోంచి లోగడ తాను దాచిపెట్టిన ఉప కరణాలు పైకితీశాడు మయుడు. నిర్మాణం నిర్విఘ్నంగా జరగడం కోసం పూజలూ అవీ చేశాడు, బ్రాహ్మలకి దానాలూ అవీ ఇచ్చాడు. శుభముహూర్తాన్ని సభ కట్టడం ప్రారంభించాడు. గోడలూ, అరుగులూ, దూలాలూ, చప్టాలూ, ప్రాకారాలూ, అన్నీ మణులతోనే తయారుచేశాడు.

అక్కడక్కడ ఇంద్రనీలమణులు తాపి, వాటి కాంతులతో అచ్చంగా నీళ్ళకోనేళ్ళలా చేశాడు అందులో తామరకెంపు లతో* ఎర్రతామరపువ్వులు చేసి పెట్టాడు. వైడూర్యాలతో తెల్ల కలవలు చేశాడు. వెండితో తెల్లతామరలూ, రాజహంసలూ చేశాడు బంగారంతో తాబేళ్ళు చేశాడు. వజ్రాలతో చేపలు చేసిపెట్టాడు. ముత్యాలతో నురుగూ, పచ్చలతో నాచూ చేసి అమిర్చాడు. మామూళ్ళలు నీళ్ళే అది. ఐనా, చూసేవాళ్ళకి నిజంగా కోనేరన్న భ్రమ కలిగిస్తుంది నిజమైన కోనేళ్లూ కొన్ని చోట్ల నిర్మించాడు స్ఫటికంరాతిగోడలు వాట్లో ప్రతిఫలించినట్లు చేసి అవి మామూళ్ళలునీళ్ళే అని భ్రమ కలిగేటట్టూ చేశాడు. మనో హరంగా వుండే రకరకాల జలయంత్రాలూ, ఎల్లప్పుడూ పూల తోనూ, పళ్ళతోనూ నిండిన తోటలూ, కలవపువ్వులతో కలకల లాడే కోనేళ్లూ, గువ్వగూళ్ళతోనూ వాటితోనూ చిత్రచిత్రము లైన ఉపవనాలూ నిర్మించాడు.

---

* తామరకెంపు పద్మరాగమణి. పద్మరాగం, కురువిందం, సౌగంధికం, నీలగంధి అని కెంపులు నాలుగు రకాలు. పద్మరాగం ఎర్రపద్మంరంగుతో వుంటుంది. ఇది శ్రేష్ఠమైంది. కురువిందంలో పసుపుఛాయా, సౌగంధికంలో అశోకంచివురురంగూ వుంటాయి. ఈ రెండూ మధ్యరకం. నీలగంధిలో నీలం తళుకు వుంటుంది. ఇది నాసిరకం.

ఇలా తన శిల్పచాతుర్యమంతా వినియోగించి పనిపూని పద్నాలుగునెలలు కట్టాడు సభ. మొత్తం పదివేలమూరలు పొడవుంది సభామందిరం. ఎన్నోరకాల మణులతోనూ వాటితోనూ సూర్యుడిలా వెలిగిపోతూ వుంది. ప్రపంచానికే వొక కొత్త శోభకలిగిస్తూవుంది

ఏమాత్రం ఏలోపమూ లేకండా సభంతా తయారయాక మాంచి బలమైనవాళ్లనీ అంతరిక్షంలో సంచరించేవాళ్లనీ ఎనిమిది వేలమంది రాక్షసభటుల్ని తీసుకువచ్చాడు మయుడు. అంతసభనీ వాళ్లచేత మోయించుకువచ్చి ధర్మరాజు కిచ్చాడు. అన్నట్టుగానే పిడుగులాంటి గద తెచ్చియిచ్చాడు భీముడికి. శంఖం దేవదత్తం అర్జునుడి కిచ్చాడు సంతోషించి ఘనమైన సత్కారం చేశాడు ధర్మరాజు. తగిన సన్మానంపొంది సెలవుతీసుకువెళ్లాడు మయుడు.

ఇక సభాప్రవేశం జరగాలి, పదివేలమంది బ్రాహ్మలికి పాయసాలతోసహా భోజనంపెట్టాడు ధర్మరాజు. దూడలతోవున్న ఆవులు తలోవెయ్యా దానంచేశాడు. అంతమందికీ రత్నాల వుంగరాలూ మొదలైన నగలూ, మంచిమంచి వస్త్రాలూ, పువ్వులూ, పళ్లూ, గంధం–ఇవన్నీ ఇచ్చాడు జ్యోతిష్కులు శుభముహూర్తం నిశ్చయించారు ధౌమ్యుడూ మొదలైనబ్రాహ్మలు ఆశీర్వాదాలూ, పుణ్యాహవచనాలూ గింగురుమనిపిస్తున్నారు. తమ్ములు నలుగురితోనూ కలిసి సభాప్రవేశంచేశాడు ధర్మరాజు. సభలో కూచుని అడిగినదానం లేదనకండా ఇచ్చాడు. కావాలన్నవాడికల్లా పుష్కలంగా ధనం పంచిపెట్టాడు బంధువుల్నీ, స్నేహితుల్నీ, సంతోషపరిచాడు. దాంతో ధర్మరాజుకీర్తి దశదిశలూ వ్యాపించింది.

మయసభలో మహావైభవంతో కొలువుతీర్చి కూచునేవాడు ధర్మరాజు. ఇటు ఉదయపర్వతంనుండి పడమటిపర్వతం వరకూ అటు సేతువునుండి హిమాలయం వరకూ – ఈ మధ్యవున్న యావన్మంది రాజులూ వచ్చి అతణ్ణి సేవించి వెళ్లేవాళ్లు. ఏనుగులూ, గుర్రాలూ,

రత్నాలూ, బంగారాలూ, సానులూ - ఇలా లెక్కలేని కట్నాలు పట్టుకవచ్చి సమర్పి చేశాళ్లు ధర్మరాజు దర్శన మంటేనే ఎంతో అంతి సంతోషంగావుండేది వాళ్లకి.

మార్కండేయుడూ, మాజాయనుడూ, మాండవ్యుడూ, మందపాలుడూ, మైత్రేయుడూ, సుబలుడూ, సునకుడూ, సుమిత్రుడూ శుకుడూ, సుమంతుడూ, సువ్రతుడూ, శాండిల్యుడూ, సత్యుడూ, బకుడూ, రైభ్యకుడూ, కౌశికుడూ, ఘటజానుకుడూ, యాజ్ఞవల్క్యుడూ, దాల్భ్యుడూ, గౌతముడూ, కుత్సుడూ, పర్ణాదుడూ, గోపతీ, గోపవేషుడూ, పవిత్రపాణీ, ఆత్రేయుడూ, కరుడూ కలాపుడూ, హారీతుడూ, తిత్తిరీ, వాయుభక్షుడూ, భార్గవుడూ, వ్యాసుడూ, జైమినీ, పైలుడూ మొదలైన మునులూ, నేనూ (వైశంపాయనులు) ధర్మరాజు సభకి వెళ్లాము.

ఇంతమందినీ భక్తితాత్పర్యాలతో పూజించాడు ధర్మరాజు, మునులంతా ఆశీర్వచనాలు చేశారు. తమ్ములూ తానూ మేము చెప్పే ధర్మకథలూ అవీ వింటూవుండేవాళ్లు దేవేంద్రుడి భవనం కంటే గొప్పగా వుండేది ధర్మరాజుకోట

ఒకనాడు అంతరాళంనుండి దిగివస్తూన్న సూర్యుడిలాగ మీాదినించి దిగివచ్చాడు నారదుడు అతడి ధర్మోపన్యాసం వినడంకోసం వెంటబడుతూన్న దేవతల్ని వెనక్కిపంపి, పర్వతుడూ, పారిజాతుడూ, రైవతకుడూ, మొదలైన మునులతో కలసి ధర్మరాజు మందిరానికి వచ్చాడతడు.

తమ్ములతో సహా ఎదురువెళ్లాడు ధర్మరాజు నమస్కరించి తీసుకువచ్చాడు. దివ్యమైనపీఠంమీాద కూచోబెట్టాడు. అడుగులు కడిగి- అర్ఘ్యమూ పాద్యమూ * ఇచ్చి పూజించాడు కుశలప్రశ్నలయాక, పరిపాలనవిషయం ఎత్తుకుని ధర్మరాజుని ఎన్నో ప్రశ్నలు వేశాడు నారదముని.

---

* అర్ఘ్యం చేతులకోసం ఇచ్చేనీళ్ళు. పాద్యం పాదాలకోసం ఇచ్చేనీళ్ళు.

## నారదుడి రాజనీతి ప్రసంగం

"మీ వంశంలోని మహాపురుషులు ఎన్నో ధర్మమార్గాలు ఏర్పాటు చేసి వెళ్లారు ఆ ప్రకారం నువ్వు నడుచుకుంటున్నావనే అనుకుంటాను ధర్మమూ, అర్థమూ, కామమూ—ఇవి ఒకదాన్ని ఒకటి బాధించకుండా తగినట్టు కాలవిభాగం చేసుకుని- అంటే ఉదయం అర్థమూ, మధ్యాహ్నం ధర్మమూ సాయంకాలం కామమూ - సాగిస్తున్నావు కదా! ధర్మంమీదే మనస్సు పెట్టి, చెయ్యవలసిన రాచకార్యాలు అర్ధరాత్రివేళ ఆలోచిస్తున్నావా? నియోగవృత్తులన్నిటిలోనూ యోగ్యులైనవాళ్ళని- వాళ్ళ నేర్పూ అదీ ముందే పరీక్షించీ, ఆదరించీ మరీ నియోగిస్తున్నావా? * రాచకార్యాలు సవ్యంగా సాగడంకోసం న్యాయంగా నడుచుకునేవాళ్లనీ, శాస్త్రం బాగా తెలిసినవాళ్ళనీ, నీమీద అభిమానం కలవాళ్ళనీ, తాతతండ్రుల వరుసని అనువంశికంగా వస్తూన్న పంతుళ్ళని మంత్రులుగా నియమిస్తున్నావు కదా!

* నియోగవృత్తులవాళ్ళు అంతఃపురం అధికార్లూ, అంగరక్షకులూ, అశ్వవైద్యులూ, అశ్వాధికార్లూ, అవసరికులూ, సామానుకొట్ల పెద్దలూ, ఒంటెల అధికార్లూ, దివిటీలవాళ్ళూ, కారవలికులూ, కార్యజ్ఞులూ, కాలాంచికులూ, కారుకులూ, కంచర్లూ, కమ్మర్లూ, ఏనుగులవైద్యులూ, ఏనుగుల అధికార్లూ, కోటగాళ్ళూ, గురువులూ, గోష్ఠాధికార్లూ, ఘటికానిర్ధారకులూ, చర్మకారులూ, చామరాలు వేసేవాళ్ళు, చిత్రకార్లూ, గొడుగుపట్టేవాళ్ళు, జ్యోతిష్కులు, జాలికులు, తాంబూలికులూ, వీవన విసిరేవాళ్ళూ, ద్వారపాలకులూ, దేవకార్యకులూ, కోశాధికార్లూ, నర్తకులూ, పల్లకీ మోసేవాళ్ళూ, వైగ్యులూ, పరిచారకులూ, హాస్యగాళ్ళూ, పక్షులు పెంచేవాళ్ళూ, పాదరక్షలు పట్టుకునేవాళ్ళూ, పురపాలకులూ, పురోహితులూ, ప్రకటనకర్తలూ, భాండారికులూ, భేరీలు వాయించేవాళ్లూ, మల్లాధికార్లూ, మహామంత్రులూ, మాలలుకట్టేవాళ్లూ, ముద్రాధికార్లూ, మురజవాదకులూ, వేటగాళ్లూ, చాకళ్ళూ, రాయబారులు, అడవులకాపాడేవాళ్లూ, భట్రాజులూ, వస్త్రాధికారులు, వర్షవరాధికారులు, వ్యావహారికులూ, విద్వాంసులూ, బజార్లు రక్షించేవాళ్ళూ, చోపుదారులు, సానులు, సామంతులూ, వైదికులూ, శిలాచ్ఛేదకులూ, బంగారంపనివాళ్ళూ, స్తుతిపాఠకులు, సారథులు, వంటవాళ్ళూ, సేనాధిపతులు, సూచికులు, మంగళ్ళూ మొదలైనవాళ్ళు.

"రాజుకి జయం కలిగించవలసిందల్లా రహస్యం. అలాంటి రహస్యం ప్రజల చెవులికి వెళ్ళకుండా భద్రపరుస్తున్నావా మరి? ఇది ధర్మం, ఇది అధర్మం అని తెలుసుకోదగ్గ మహాపండితుడే అనుకుంటాను నీ పురోహితుడు! వేదాలూ, శాస్త్రాలూ అన్నీ చదువుకున్న సమచిత్తుడే కదా అతను! సర్వదా నీ యజ్ఞాలు నడిపిస్తున్న యాజ్ఞికుడు సమర్థుడేనా? అతను నిత్యకృత్యాలు ఏమరుపాటు లేకుండా నిర్వహిస్తాడా బాగా?

"నమ్మకమైనవాళ్ళనీ, మర్యాదస్థుల్నీ, రకరకాల యుద్ధాలు నడిపించి జయం సాధించగల పరాక్రమవంతుల్నీ సేనాధిపతులుగా నియమిస్తున్నావా?

"పలుకుబడికలవాడూ, సమర్థుడూ ఐన మంత్రి అధికారంతో ఏం చెయ్యాలన్నా చెయ్యగలడు. నీ మంత్రి రాజపుత్రుల్ని హెచ్చు ధనవంతుల్ని చేసి, వాళ్ళకి అనుకూలంగా వుండి, పతనాలు లేవదియ్యడు కదా? ఏమో, ధనం ఎంతైనా చేస్తుంది మరి!

'దేశానికి అనర్థం సూచించే అపశకునాలు దివ్యమూ, అంతరిక్షమూ, భౌమమూ అని మూడురకాలు. అంటే, గ్రహగతుల్లో అరిష్టయోగాలు కలగడం, గ్రహణాలు అవీ రావడం దివ్యం. తోకచుక్కలు లేవడం, ఉల్కలు పడడం, ఇంద్రధనుస్సులు కనపడడం, సూర్యచంద్రుల చుట్టూ గూడుకట్టడం అంతరిక్షం. భూకంపాలు రావడం, విపరీతాలు పుట్టడం భౌమం. ఇలాంటివన్నీ మీ జ్యోతిష్కులు శాస్త్రదృష్టితో చూసి, వాటికి శాంతులూ మొదలైన ప్రతీకారాలు చేయిస్తున్నారా?

"మీ వైద్యులు అప్రమత్తులై మీ ఆరోగ్యం కనిపెడుతున్నారు కదా! ధాతు, వ్రణ, నేత్ర, లేహ్య, తైల, శస్త్ర, గ్రహ, మంత్రాలనే అష్టాంగ ఆయుర్వేదంలో దక్షులేనా వాళ్ళు? మనోవ్యాధికి మందు లేదంటారు. అది పొరపాటు. శరీరవ్యాధికి మందు ఎలాగో, మనోవ్యాధికి వృద్ధుల ఉపదేశం అలాంటిది. శరీర

వ్యాధికి ఔషధసేవనమూ, మనోవ్యాధికి వృద్ధుల సేవించడమూ- ఈ రెండూ నువ్వు చేస్తున్నావనే నమ్ముతాను.

"లంచాలు తిననివాళ్లనీ, పాపచింతలేనివాళ్లనీ, మాంచి తర్ఫీదైనవాళ్లనీ బొక్కసం వసూలుచేసే రాశాదార్లుగానూ, సముద్దార్లుగానూ నియమిస్తున్నావా? నీ నౌకర్లలో ఎవడు ఉత్తముడో ఎవడు మధ్యముడో, ఎవడు అధముడో తెలుసుకుంటున్నావా? వాళ్ళ యోగ్యతబట్టి ఉత్తముణ్ణి ఉత్తమకార్యంలోనూ, అధముణ్ణి అధమకార్యంలోనూ పెడుతున్నావు కదా! వాళ్ళ యోగ్యతలను బట్టీ, పనులబట్టీ జీతాలు ఏర్పరుస్తున్నావా? సకాలంలో వాళ్ళ జీతాలు వాళ్ళకి ముడుతున్నాయి కదా! అవసరానికి జీతాలు దొరకక నౌకర్లు బాధపడుతూ వుంటే యజమానికి కీడు తప్పదు. ఇంకా లేదైతే ఏంగాక, సిబ్బంది ఉపూరుమంటే సర్వనాశనం కలుగుతుంది.

"వంశపారంపర్యంగా భృత్యులుగావున్న వాళ్లని సత్కారంతో చూడడం మంచిది. ఏమంటే నీ కోసం యుద్ధంలో ప్రాణాలొదిలి పెడతారు వాళ్లు. నీకోసం యుద్ధంలో మరణిస్తారు వీరభటులు. వాళ్లమీద ఆధారపడివున్న వాళ్ల కుటుంబాలకి ఏమీ, గుడ్డా లోపం లేకుండా పోషిస్తున్నావా?

"చూడూ, డబ్బుకి కక్కుర్తిపడేవాళ్లనీ, దొంగల్నీ, అభిమానం లేనివాళ్లని, పగవాళ్లపక్షం వుండేవాళ్లనీ, పిరికివాళ్లనీ, దుర్మార్గుల్నీ పెద్దపెద్ద రాజకార్యాలు చేసుకురమ్మనవు కదా! దేశంలో దొంగలభయం లేకుండా చూస్తున్నావా? మీ భటులు దొంగలతో లాలూచీపెట్టుకోరు కదా! కక్కుర్తిపడి, లోపాయికారీగా వాళ్ళ నుండి ధనం పుచ్చుకుని వాళ్లని ప్రోత్సహించకుండా కట్టిపెడుతున్నావా?

"దేశంలో పంటచెరువులు నీళ్ళతో నిండి వరుపుదోవమా అదీ లేకుండా వున్నాయా? బీదవాళ్ళయిన వ్యవసాయదార్లకి విత్తనాలూ, ధాన్యాలూ అందిస్తున్నావా? వర్తకులికి ఋణాలిచ్చేటప్పుడు నూటికి వొకటి చొప్పునే వడ్డీ పుచ్చుకుంటున్నావా? కుంటివాళ్లూ

గుడ్డివాళ్లూ మూగివాళ్లూ- ఇలాంటి వికలాంగుల్నీ, బంధువుల్నీ దయచూస్తూ, పోషిస్తున్నావా?

"చేసినపని గుర్తించినవాడే ప్రజాపరిపాలనకి తగినవాడు. మంచిచేసినవాణ్ణి పదిమందీవున్న సభలో ప్రశంసించి సత్కరిస్తున్నావా? ఎంతశత్రువైనా యుద్ధంలో శరణన్నవాణ్ణి క్షమిస్తున్నావుకదా!

"ఆదాయంలో నాలుగోవంతు, లేదా మూడోవంతు, అంతకీ కాదంటే రెండోవంతు ఖర్చుపెట్టాలి ఇది జ్ఞాపకముంచుకుంటున్నావా? ఆయుధాలమందిరం, ధనాగారాలు, ఏనుగుల శాలలూ, గుర్రాలశాలలూ, సామానుకొట్లూ- ఇవి ముఖ్యం. వీటిమీద మంచి నమ్మకమైనవాళ్లకీ, నువ్వంటే భక్తివున్నవాళ్లకీ, సమర్థులైన వాళ్లకీ పెద్దరికం ఇచ్చావుకదా!

"గురువులూ ముసలివాళ్లయిన శిల్పులూ వర్తకులూ, బంధువులూ, ఆశ్రితులూ, సాధుజనులూ- వీళ్లకి పేదరికం రాకుండా అనుగ్రహంతో చూస్తున్నావా? అలాఅయితేనే నిన్ను దేవుడిలా చూస్తారు ప్రజలు.

"కావలసిన మంత్రులూ, చుట్టాలూ మూలబలం, రాజ పుత్రులూ, విద్వాంసులూ- వీళ్లందరినీ పెట్టుకొని ప్రతీరోజూ కొలువుతీరుస్తున్నావా? లోపలివాళ్లనీ పైవాళ్లనీ ఎప్పుడూ, కనిపెడుతూ నిన్ను నువ్వు రక్షించుకోవాలి సమర్థులైన వేగుల వాళ్లని పంపుతూ పరాయిరాజుల గుట్టుమట్టులు తెలుసుకుంటూ వుండాలి. అలాచేస్తున్నావా?

"వార్తలు-వార్తమీదే ప్రపంచం నడుస్తున్నాది. వార్తలు లేకపోతే అంధకారంలోనే పడిపోతారు ప్రజలు కనక రాజైనవాడు దేశంలో వార్తలు ప్రచారం చెయ్యించాలి నువ్వు చేయిస్తున్నావా?

"సంతానమూ, సంయోగమూ లేకపోతే భార్యవుండినీ్ని లాభంలేదు. మంచిబుద్ధి లేకపోతే చదువు చదివినీ్ని లాభంలేదు. దానమూ, భోగమూ లేకపోతే ధనముండినీ్ని ప్రయోజనం

లేదు ఉపాసనా అదీ లేకపోతే వేదాలు చదివినా లాభం లేదు ఇది గుర్తించేవుంటావు కదూ!

"నీ కోటలు పరాయివాడు ప్రవేశించడానికి వీలు లేకుండా కట్టుదిట్టంగా వున్నాయా? అవన్నీ ధనధాన్యాలతోనూ, ధనుర్బాణాలతోనూ, యంత్రాలూ వాటితోనూ, వీరభటులతోనూ సమృద్ధిగా వున్నాయా? నీళ్ళకీ పశువుల గ్రాసానికీ, వంటచెరుకూ వాటికీ వాటిలో లోపం లేదు కదా! దుర్గముంటే శత్రువులకి భయం కలగాలి

"నిజం చెప్పవలసివస్తే నీలోని అంతశ్శత్రువుల్ని ముందు గెలవాలి ముందు. తరవాత దేశబలం, కాలబలం, గ్రహబలం సైన్యబలం- ఇవన్నీ చూసుకోవాలి అప్పుడు శత్రువులమీద దండయాత్ర చెయ్యాలి గర్వంతో తుళ్ళిపడుతూ ఇంద్రియవ్యసనాల్లో పడి మత్తెక్కి వున్న నీపగవాళ్ళమీదికి ఈవిధంగానే దాడిచేస్తున్నావా? బలవంతుడైన శత్రువు మీదికి వెళ్ళేటప్పుడు ముందుగా సామం, దానం భేదం మొదలైన ఉపాయాలు ప్రయోగించి మరీ వెళుతున్నావు కదా!

అబద్ధం, బద్ధకం, మూర్ఖులతో ఆలోచనా, నాస్తికం, ప్రమాదం, క్రోధం దీర్ఘచింతా. చెయ్యవలసినపనులు ఆలస్యంగా చెయ్యడం, తెలివిగలవాళ్ళని తెలుసుకోలేకపోవడం, ధనంవిషయంలో అనర్థకచింతా, అవసరమైనపనులు చెయ్యలేకపోవడం, రహస్యం దాచలేకపోవడం, మంగళప్రదమైనవి ప్రయోగించలేకపోవడం, విషయలాంపట్యంలో తగుల్కోవడం- ఈ పద్నాలుగూ రాజదోషాలు. వీటిని బహిష్కరిస్తున్నావు కదా!"

నారదుడు అడిగిన ప్రతీదానికీ వినయంగా జవాబు చెప్పాడు ధర్మరాజు "నా లోపం లేదని చెప్పలేను. ప్రయత్నలోపమూ, శక్తివంచనా లేకుండా ఇవన్నీ అనుసరిస్తున్నాను మీ ఉపదేశాలూ మహాత్ముల చరిత్రలూ ఆదర్శంగా వుంచుకుంటున్నాను. నా యథాశక్తిని అన్యాయమార్గం విడిచిపెడుతున్నాను మంచిదని నమ్మిన పనిమాత్రం చేస్తున్నాను" అన్నాడు.

ఇలా ఎంతోసేపు ప్రసంగించాక నారదుడికి మయసభ చూపించాడు ధర్మరాజు. "మహాముని, మూడులోకాల్లోనూ మీరు చూడని సభలంటూ వుండవు ఇలాంటి సభ ఇంకా ఎక్కడన్నా వుందేమో చెప్పండి?" అన్నాడు.

"అవును, అపూర్వంగానే వుంటుంది" అన్నాడు నారదుడు. "మానవమాత్రుడికి సాధ్యంకాని శిల్పమిది రత్నాలతో ఎంతో చిత్రంగా వుంది. నరలోకంమాట అలావుంచు. ఇంద్రుడూ మొదలైన లోకపాలకులదగ్గిరా ఇలాంటిసభ చూడలేదు సరికదా, విననన్నా లేదు. ఇంద్రుడిసభ చూశాను యముడిసభా, వరుణ కుబేరులసభలూ బ్రహ్మసభ చూశాను అవేవీ వైభవంలో గానీ, సౌందర్యములోగనీ దీనిముందు సమానంకావు" అన్నాడు

నారదుడిలా అనడంతోటే లోకపాలకుల సభలు ఎలా వుంటాయో వినాలని కుతూహలపడ్డాడు ధర్మరాజు. "ఐతే, చెపుతాను విను" అంటూ ఆరంభించాడు నారదుడు

**లోకపాలకుల సభలు**

"ఎన్నో మంచిమంచి రత్నాలలోనూ, బంగారంతోనూ చిత్రంగా వుంటుంది ఇంద్రిసభ మూడులోకాలసంపదా అక్కడే వుందంటే నమ్మాం. దాన్ని పొగడాలంటే వెయ్యినోళ్లు కావాలి. దానిపొడవు నూటయాభై యోజనాలు. వెడల్పు వంద యోజనాలు. ఎత్తు ఐదు యోజనాలు, ఆకాశంమీద వుంటుందది కామగమనంతో ఎక్కడికి కావాలంటే, అక్కడికి వెళుతుంది. చలీ, గాలీ, ఎండా, వానా ఇవేవీ అందులో బాధించవు. అన్నిఋతువులలోనూ పూసే పువ్వులతోనూ, పండేపళ్ళతోనూ కలకలలాడుతుండే తోటలూ, స్వచ్ఛమైన మంచినీళ్ళ కోనేళ్ళూ చుట్టూ వైభవంగా వుంటాయి. తపఃప్రభావంతో దేవేంద్రుడే నిర్మించాడది.

"అలాంటి మహాసభలో ధగధగా ప్రకాశిస్తున్న రత్నాభరణాలు వేసుకొని, శచీదేవితోసహా కొలువుతీరుస్తాడు దేవేంద్రుడు.

బంగారం విమానాలమీద బారులుతీర్చుకొని వచ్చి సేవిస్తూవుంటారు దేవతలు. చంద్రబింబంలాంటి అతడి మొహంకేసి అప్సరసలు వొయ్యారంగా చూస్తూవుంటే ఆ చూపులనే పువ్వులతో అతణ్ణి పూజచేస్తున్నారా అని అనిపిస్తుంది

"తమ రాజుకోసం యుద్ధంలో ప్రాణాలు బలిపెట్టినవాళ్ళూ, కులధర్మాలు వొదలకుండా నడుచుకున్న గృహస్థులూ, ప్రపంచంలో కీర్తి నిలిపి వెళ్ళినవాళ్ళూ పరోపకారంతో జీవితం వెళ్ళబుచ్చిన వాళ్ళూ-ఇలాంటివాళ్ళంతా రోగం, ముసలితనం, చావూ దుఃఖం, భయం, ఆకలిదప్పులూ ఏమీ లేకుండా ఇంద్రుడి సభలో వుంటారు ధర్మమూ, అర్థమూ, కామమూ, యజ్ఞాలూ, యజ్ఞమంత్రాలూ, శ్రీవిలాసాలూ- ఇవన్నీ స్వయంగా రూపం ధరించివచ్చి అతణ్ణి సేవిస్తూవుంటాయి. శుక్రుడూ, బృహస్పతి అగ్ని, చంద్రుడూ, అశ్వినీదేవతలూ విశ్వేదేవతలూ, ధాత విధాతా హరిశ్చంద్రుడూ- వీళ్ళంతా ఇంద్రసభలోనే వుంటారు

"యమధర్మరాజుసభా మంచి తేజోవంతాలైన మణులతోనూ బంగారంతోనూ అందంగా వుంటుంది విశ్వకర్మ తన నైపుణ్యమంతా వినియోగించి అది నిర్మించాడు. దాని పొడవు నూరు ఆమడలు వెడల్పు నూరు యోజనాలు. దానికి తలిచిన చోటికి వెళ్ళే కామగమనం వుంది. ఎంతో రమణీయంగానూ సూర్యుడివంటి తేజస్సుతోనూ వున్న యమసభలోనే లోకాల ధర్మాధర్మవివేచనం జరుగుతుంది. అందులో అగస్త్యుడూ, మతంగుడూ మొదలైన సిద్ధమునులున్నూ, పితృదేవతలూ, కాలకింకరులూ, మూర్తిమంతమైన కాలచక్రమూ, క్రతుదక్షిణాది దేవతలూ, కృతవీర్యుడూ జనమేజయుడూ జనకమహారాజూ బ్రహ్మదత్తుడూ వృషదశ్వుడూ శంతనుడూ భూరిద్యుమ్నుడూ ఇంద్రద్యుమ్నుడూ మన్మథుడూ వసురాజు మీతండ్రి పాండురాజూ ఇంకా ఎందరెందరో రాజులూ వాళ్లూ యమసభలో వుంటారు. ఆ సభలో

కూచుని యమధర్మరాజు జీవుల పాపపుణ్యాలు నిరంతరమూ విచారణచేస్తూ వుంటాడు *

"వరుణుడిసభ సర్వలోకోత్తరంగానూ వుంటుంది. మంచి మంచి మణులతోనూ, తెల్లటి కాంతులతోనూ ఎంతో ముచ్చటగా వుంటుంది. పొడవూ, వెడల్పుల్లో యమసభ అంతే వుంటుంది దానికీ కామగమనముంది జలస్తంభనంచేసి, నీళ్లలో కూచుని కట్టాడు దాన్ని విశ్వకర్మ.

"అందులో భార్యతోసహా కూచుని సభతీరుస్తాడు వరుణుడు. నాలుగుసముద్రాలూ గంగా యమునా నర్మదా గోదావరీ విదిశా విపాశా కావేరీ కృష్ణవేణీ సరస్వతీ పెన్నా ఐరావతీ మొదలైన నదులూ సరస్సులూ చెరువులూ సెలయేళ్లూ దిగుడు బావులూ దిక్కులూ కొండలూ భూమీ- ఇవన్నీ రూపాలు ధరించి మొసళ్లూ తాబేళ్లూ సింహాలూ శరభాలూ ఏనుగులూ మొదలైన జంతువులతోసహా వచ్చి ఎల్లప్పుడూ వరుణుడి కొలువు చేస్తూ వుంటాయి వాసుకీ ఐరావతుడూ తక్షకుడూ కర్కోటకుడూ ధనంజయుడూ మొదలైన నాగరాజులూ, ప్రహ్లాదుడూ విరోచనుడూ బలిచక్రవర్తి నరకాసురుడూ నముచీ విప్రచిత్తి కాలకంఠుడూ కైటభుడూ ఘటోదరుడూ రావణుడూ విశ్వరూపుడూ విరూపాక్షుడూ వాలీ-వీళ్లంతా వరుణసభలో వుంటారు.

"కుబేరుడిసభ ఇంద్రసభతో సమానంగా వుంటుంది కుబేరుడే తన దివ్యశక్తి వినియోగించి, మంచిమంచి మణులతోనూ వాటితోనూ కట్టాడు దాన్ని. దానిపొడవు నూరు యోజనాలు. వెడల్పు డబ్బయి యోజనాలు. శుభ్రమైన తెల్లటికాంతితోనూ, బంగారంచెట్లతోనూ మెరుస్తూ, మెరుపులతో వున్న తెల్లమేఘాలలా ఎంతో ఇదిగా వుంటుంది. నందనవనంలోని మందార, పారిజాత

* యమసభవర్ణన చూ. గరుడపురాణం.

వృక్షాలమీంచి వచ్చే చల్లగాలి హాయి [illegible]స్తూ, [illegible] కొలువుతీరుస్తాడు కుబేరుడు.

"నర కిన్నరనాథులైన గంధర్వులూ మహాకర్ణుడూ గజకర్ణుడూ కాలనేమీ హేమనేత్రుడూ కభీషణుడూ పింగళుడూ ప్రవాళకుడూ మొదలైన యక్షులూ నలకూబరుడూ రంభ మేనకా తిలోత్తమా ఊర్వశీ ఘృతాచీ మొదలైన అప్సరసలూ కుబేరుడి కొలువులో వుంటారు. దేవమునులతో కూడా కలిసివెళ్ళి ఎప్పుడూ చూస్తూవుంటాను నేను. కుబేరుడికి నేస్తం శివుడు. అంచేత, యావత్తు భూతగణాలతోనూ అతడూ అక్కడే వుంటాడు

"ఇహా, మా తండ్రిగారైన బ్రహ్మదేవుడిసభ సంగతి చెపతాను విను. లోగడ నేను ఎంతో కాలం భూలోకంలో వుంటూ వచ్చాను అప్పుడు సూర్యుడువచ్చి, బ్రహ్మగారిసభ వర్ణించి చెప్పాడు. చూడాలని కుతూహలం కలిగింది. వెంటనే బయల్దేరి వెళ్ళాను. ఏం చెప్పమంటావు! నాకళ్ళని నేనే నమ్మలేకపోయాను. ఇలా వుంటుందని చెప్పడానికిగాని, ఊహించడానికిగాని వీల్లేనంత అద్భుతంగా వుందది. దాని వైశాల్యం అసలే అర్థంకాదు. కేవలం శూన్యంమీదే స్థిరంగా నిలబడి వుందది. దాని కాంతిముందు చంద్రమండలమూ, సూర్యమండలమూ ఏమాత్రమంటావు! ఆ సభలోనే కూచుని లెక్కలేని జీవరాసులు సృష్టిచేస్తూ వుంటారు మా తండ్రిగారు ఎన్నోఅన్ని కఠినినియమాలు పెట్టుకుని అధికంగా తపస్సు చేసేవాళ్ళ తపఃఫలాలూ నిర్ణయిస్తూ వుంటారు.

"విశ్వకర్తలైన మనువూ మరీచీ, భృగువూ, భరద్వాజుడూ దక్షుడూ వశిష్ఠుడూ వామనుడూ వాలఖిల్యుడూ పులస్త్యుడూ పులహుడూ క్రతువూ కశ్యపుడూ గౌతముడూ అంగిరసుడూ ప్రచేతసులున్నూ, సూర్యచంద్రులూ గ్రహనక్షత్రాలూ దేవగణాలూ వసువులూ రుద్రులూ సిద్ధులూ సాధ్యులూ సంతానవంతులైన పంచాశీతిసహస్రమునులూ ఊర్ధ్వరేతస్కులైన దివ్యర్షు

ఎనిమిదివేలమంది ఋషులూ పితృదేవతలూ విశ్వకర్మా బ్రహ్మదేవుడి సభలో ఆయన కొలువు చేస్తూ వుంటారు

"అంతేకాదు ధర్మమూ అర్థమూ కామమూ మోక్షమున్నూ, శబ్దమూ స్పర్శమూ రూపమూ రసమూ గంధమూ తపస్సున్నూ, శమమూ దమమూ ధృతీ శ్రుతి మేధా బుద్ధిన్నీ, యశమూ కీర్తిన్నీ. సంకల్పమూ వికల్పమూ ప్రణవమున్నూ, క్షణాలూ లవాలూ ముహూర్తాలూ రాత్రింబగళ్లూ పక్షాలూ మాసాలూ ఋతువులూ సంవత్సరాలూ గల కాలచక్రమున్నూ, ఋగ్వేదమూ యజుర్వేదమూ సామవేదమూ అథర్వణవేదమున్నూ, వేదాంగాలున్నూ పురాణాలూ ఇతిహాసాలున్నూ, ఎన్నోరకాల భాష్యాలున్నూ సమస్తమైన విద్యలున్నూ మూర్తిమంతాలై మా తండ్రిగారిని కొలుస్తూ వుంటాయి. తల్లి సరస్వతీదేవితో సహా ఆయన పద్మాసనంమీద అలౌకికమయిన మహానందం అనుభవిస్తూ వుంటారు" అన్నాడు.

నారదుడు చెప్పినదంతా కుతూహలంతో విని, వొక్క ప్రశ్న మాత్రం వేశాడు ధర్మరాజు. "ఐతే, మహాత్మా, వొక్కసందేహం కలుగుతూ వుంది. మా తండ్రి పాండురాజు మొదలుకుని యావన్మంది రాజులూ యమధర్మరాజుసభలో వున్నారన్నావు. బావుంది కాని హరిశ్చంద్రుడు మాత్రం దేవేంద్రుడి సభలోవుండడానికి కారణమేమిటి? ఈ రాజులందరికంటే ఆయన ఏదన్నా ప్రత్యేకమయిన మహాపుణ్యం చేశాడా?" అని అడిగాడు.

"సరిగ్గా అడగవలిసిన ప్రశ్న అడిగావు" అంటూ అందుకున్నాడు నారదుడు "అసలు నేను వచ్చిందే సగం అందుకోసం. యమసభలో మీ తండ్రి పాండురాజుని చూశాను. ఆయన ఇదే మీతో చెప్పమన్నాడు. ఐతే, హరిశ్చంద్రుడి గొప్ప ఏమిటనిగదా నీ ప్రశ్న? సూర్యవంశానికి మకుటంలాంటివాడతడు, త్రిశంకుడి కుమారుడు, అయోధ్యమహారాజు. ధర్మపరాయణుడు వేద

రహస్యా లెరిగినవాడు. సత్యసంధుడు. తన కీర్తిచంద్రికలచేత భూలోకంయావత్తూ ప్రకాశవంతంగా చేసినవాడు. దిగ్విజయంచేసి, తన బాహుశక్తిచేత ఏడుద్వీపాలూ* జయించుకు వచ్చాడు శత్రు వన్నవాణ్ణి లేకుండా చేశాడు అతడి శాసనంముందు ప్రపంచంలోని రాజులందరూ తలవొగ్గారు అలా దేదీప్యమానంగా మహా సామ్రాజ్యం ప్రతిష్ఠించాడు. ఉత్తమమైన రాజసూయ మహా యజ్ఞంచేశాడు. యాచకులికి ఏమడిగితే ఆ ధన మిచ్చాడు. రాజ సూయం చేయడంచేతనే అతడికి ఇంద్రసభలో వుండే మహాభాగ్యం కలిగింది ఇది తెలుసుకునే పాండురాజు నీతో చెప్పమని నన్ను కోరాడు. 'రాజసూయం చేసిన రాజులు హరిశ్చంద్రుడిలాగ దేవేంద్రుడి దగ్గరవుండి దేవతలతో సమానంగా పూజించబడతారు కోరిన కోరికలూ లభిస్తాయి వాళ్ళకి. అందుచేత మునీంద్రా నర లోకం వెళ్ళి ధర్మరాజుతో చెప్పు నేనిక్కడ ఇలా వున్న సంగతీ, రాజసూయం చేసినవాళ్ళు ఇంద్రుడిదగ్గిర సుఖపడుతూన్న సంగతీ తెలియచెయ్యి. మావాణ్ణి రాజసూయం చెయ్యమను నా ఐదుగురు కుమాళ్లూ శక్తివంతులు. దేవతల దయవల్ల పుట్టిన వాళ్లు. పెద్దవాడు పుణ్యాత్ముడు. తమ్ముల బాహుబలంతో సార్వ భౌముడై, రాజసూయం చెయ్యగలుగుతాడు. నా కొడుకు రాజ సూయంచేస్తేనా, ఇక కావలిసిం దేముంది! నా తండ్రితాతలతో సహా నేను ఇంద్రలోకంవెళ్ళి సుఖపడతాను' అని చెప్పాడు.

"అది చెప్పడంకోసమే ఇలా వచ్చాను. ధర్మరాజా, రాజ సూయం చెయ్యమనే నేనూ చెపుతున్నాను. నీ పెద్దలికి ఇంద్ర లోకసౌఖ్యం కలిగించినవాడ వవుతావు. దిగ్విజయం చెయ్యి.

---

* ఏడుద్వీపాలు : జంబూద్వీపం, ప్లక్షద్వీపం, కుశద్వీపం, క్రౌంచద్వీపం, శాకద్వీపం, శాల్మలద్వీపం, పుష్కరద్వీపం. ఆధునికులు వీటిని క్రమంగా ఆసియా, ఆసియామైనర్, యూరోపు, ఉత్తరఅమెరికా, దక్షిణఅమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా అని అంటున్నారు.

అందులో వచ్చిన ధనం బ్రాహ్మణసంతర్పణకి వినియోగించు. ధర్మ పరిపాలన చెయ్యి. నాలుగువర్ణాలవాళ్ళని సంరక్షించు. సామ్రాజ్యం చెయ్యి ప్రసిద్ధిసంపాదించు. కానైతే, అప్రమత్తుడివిగా మాత్ర ముండాలి. ఏమంటావా, బహువిఘ్నాలతో కూడుకున్నది రాజ సూయం యజ్ఞద్రోహులైన బ్రహ్మరాక్షసులూ వాళ్లూ వుంటారు. ఎలాఅయినా దాన్ని పడగొట్టాలనే చూస్తారు ఏ అడ్డూ లేకండా నిర్విఘ్నంగా పూర్తయిందే అనుకో ఐనా ప్రజాప్రళయమైన పెద్ద యుద్ధంమాత్రం తప్పదు'' అన్నాడు.

ఇలా చెప్పి నారదుడు వెళ్లిపోయాక ధౌమ్యుడూ వ్యాసుడూ బంధువులూ, స్నేహితులూ మంత్రులూ-వీళ్ల యావన్మంది ఎదటా తమ్ములతో ఆలోచించాడు ధర్మరాజు.

''పితృసంకల్పం నెరవేర్చడం కుమాళ్ల కర్తవ్యం కొడుకులు పుట్టినదానికి ఫలం తండ్రులికి హితం చెయ్యడమేకదా! రాజసూయం చెయ్యమని నాన్నగారి ఆదేశం దీనివల్ల పరలోకంలోని మన పెద్దలికి మహోపకారం జరుగుతుంది. కానైతే, అది సమాప్త మయాక ఘోరమైన యుద్ధం జరుగుతుందంటాడు నారదముని పెద్దలకోసం రాజసూయం చెయ్యాలనేవుంది కాని, ప్రజానాశనం మాట తలచుకుంటేమాత్రం మనస్కరించకండా వుంది. చెయ్య డమూ, మానడమూ అని మనస్సు కొటపటాయిస్తోంది'' అన్నాడు.

''సందేహించకు మహారాజా'' అంటూ ప్రోత్సహించారు ధౌమ్యుడూ మొదలైనవాళ్లు. ''రాజసూయం తప్పకుండా చెయ్యా లనే మా కోర్కికూడాన్ను. దీనివల్ల ఎన్నో దోషాలుపోయి, ప్రజలికి క్షేమమే కలుగుతుంది. రాజులంతా మీ ప్రతాపానికి లోబడే వున్నారిప్పుడు. మిమ్మల్ని ఎదిరించేవాళ్లంటూ లేరు. ఇదేసమయం వాళ్లనించి ధనం పుచ్చుకోడానికి'' అన్నారు. తమ్ములు కలుగజేసి ''మా అభిప్రాయమూ ఇదే'' అన్నారు. రాజ సూయం చెయ్యడానికే నిశ్చయించాడు ధర్మరాజు.

ఈ కార్యం నిర్విఘ్నంగా జరగాలంటే, మహాపురుషుడు శ్రీకృష్ణుడి సహాయం కావాలి. అందుకని నమ్మకమైనఅనుచరుల్ని పిలిచి ద్వారక పంపాడతడు. గాలిలా పరిగెత్తే గుర్రాలుపూసిన రథాలిచ్చి తక్షణం కృష్ణుణ్ణి పిలుచుకు రమ్మన్నాడు.

ధర్మరాజుకబురు అందడమేతడవుగా అంచీలమీాద బయల్దేరి ఇంద్రప్రస్థం వచ్చాడు కృష్ణుడు. కుంతీదేవికీ, ధర్మరాజుకీ నమస్కరించాడు. భీముణ్ణి కౌగిలించుకున్నాడు. వినయంగా నమస్కరించిన అర్జునుణ్ణీ, నకుల సహదేవుల్నీ ఎత్తి ఆదరించాడు.

కృష్ణుడికి ఉత్తమాసనం వేసి, గురువుని గౌరవించినట్టు గౌరవించాడు ధర్మరాజు. యోగక్షేమాలూ అవీ విచారించాక, పిలిచిన కార్యం ప్రస్తావించాడు "మహాపురుషుడివి నువ్వు నీకు తెలియనివిషయమంటూ లేదు. ఐనా, నా నాఅవసరంకొద్దీ నేను చెపుతున్నాను. నారదముని వచ్చి వీళ్ళందరిఎదుటా చెప్పివెళ్ళాడు, నన్ను రాజసూయంచెయ్యమని మా తండ్రి పాండురాజు చెప్పాడట! నామీాద వాత్సల్యంవల్లే అలా చెప్పాడో, నాకు అంతటి శక్తిసామర్థ్యాలు వున్నాయనుకునే చెప్పాడో-ఏమో మరి! ఏమైతే నేం, వీళ్ళందరూ కాకనేకాదు చెయ్యవలసిందే అనడంచేత రాజసూయం ఆరంభించడానికే వొడబడ్డాను. ఇక నువ్వు 'ఊఁ' అనడమే తరవాయి. నీ ఆజ్ఞకోసమే మేమంతా ఎదురుచూస్తూ కూచున్నాము" అన్నాడు

"దివ్యంగా వుంది" అంటూ అందుకున్నాడు శ్రీకృష్ణుడు. "రాజసూయం చెయ్యడానికి అన్నివిధాలా నువ్వే సమర్థుడివి. పగవాళ్ళని మచ్చుకి లేకుండా చెయ్యగల తమ్ములున్నారు అదృష్టమంటి నీకు! ఐతే, వొక్కమాట చెప్పాలి. లోగడ పరశురాముడు రాజకులం నాశనం చేశాడుకదా! అప్పటినుంచీ చంద్రవంశమూా సూర్యవంశమూా తప్ప తక్కిన క్షత్రియవంశాలన్నీ కృత్రిమవంశాలే అయిపోయాయి. కిరీటం ధరించడానికి వ్యాటికి అర్హతలేకుండాపోయింది.

సూర్యచంద్రవంశాలు రెండే క్రమంగా నూటపొక్క వంశాలయాయి. యయాతి, భోజవంశాలవల్ల పద్నాలుగువంశాలయాయి. ఇన్నివంశాల రాజుల్నీ జయించి విర్రవీగుతున్నాడు జరాసంధుడు ఏం చెప్పనూ, ఉద్దోలమైన సామర్థ్యం వాడిది. చేదిదేశంరాజున్నాడే, గర్వపోతు శిశుపాలుడు, వాడు వాడికి సేనాధిపతి. వరుణుడంత బలశాలి, ప్రాగ్జోతిషం రాజు భగదత్తుడు పశ్చిమ దిక్కంతటికి ఏకైకఛత్రపతి పాండురాజు స్నేహితుడు కావడంచేత లోపల నువ్వంటే ఇష్టమేఅయినా, జరాసంధుడంటే భయంఅతడికి. అంచేత, మాటల్లోనూ, క్రియల్లోనూ జరాసంధుడిదిక్కే వుంటాడు. ఇక చేది రాజుల్లో పురుషోత్తముడూ అంగ వంగ పౌండ్ర కిరాతుల్లో పౌండ్రక వాసుదేవుడూ* నా పేర్లు పెట్టుకుని జరాసంధుణ్ణి కొలుస్తూ వుంటారు. తూర్పు, దక్షిణదేశాలు పురుజిత్తుడూ కరూశుడూ కరభుడూ నకులుడూ సంకర్షణుడూ సూపహితుడూ మనోదత్తుడూ చక్రుడూ సాళ్వేయుడూ. యవనుడూ వాడివెనకే పడి చస్తారు. ఉత్తరాదివాళ్ళయిన పద్ధెనిమిది రాసకులాలవాళ్ళూ, శూరసేన పుష్కర పులింద కళింద, కుంతి మత్స్య దేశాల రాజులూ వాళ్ళ వాళ్ళ దేశాలూ అవీ వొదిలిపెట్టి వాడికి లొంగిపోయారు

"కులంవాళ్లని పీడించుకుతింటూన్న మా మామ కంసుణ్ణి చంపానుకదా నేను! కంసుడిభార్య జరాసంధుడి కూతురు§ భర్తని చంపినపగ నామీదపెట్టుకుని తండ్రిని నామీదకి రెచ్చగొడుతూ వుండేది. మమ్మల్ని వాడు పెట్టినబాధ ఇంతా అంతా కాదు.

---

* పౌండ్రక వాసుదేవుడు ద్వారకమీద దండెత్తడం, కాశీరాజుతో సహా అతణ్ణి సంహరించి కృష్ణుడు కాశీపట్టణం కాల్చడం విష్ణుపురాణం, హరివంశం, బ్రహ్మపురాణం మొదలైనవాట్లో విపులంగా వుంది.

§ ఎంతోమంది కంసుడి భార్యలు అందులో జరాసంధుడి కూతుళ్ళు అస్తి, ప్రాప్తి అని ఇద్దరు.

### హంసుడూ, డిభకుడూ

"హంసుడూ డిభకుడూ అని జరాసంధుడికి ఇద్దరు అప్పుడుండే వాళ్ళు సాల్వదేశంరాజు బ్రహ్మదత్తుడి* కొడుకులు వాళ్ళు నరాంతక దేవాంతకులు. మాయలో బ్రహ్మాండనాయకులు. ఒకళ్ళచేత చావు లేదు వాళ్ళకి. అన్నంటే తమ్ముడూ, తమ్ముడంటే అన్నా ప్రాణం పెట్టేవాళ్ళు కౌశికుడూ, చిత్రసేనుడూ అని పేళ్ళుపెట్టుకుని, పెద్ద సైన్యంతో ఇద్దరూ జరాసంధుడికి రెండుభుజాల్లా వుండేవాళ్ళు వాళ్ళు ముగ్గురూ కలిశారో, సప్తసగలు చుక్కలు దూరాయన్నమాటే. మూడులోకాలూ మూడునిమిషాల్లో బుగ్గిచేస్తారు

"హంసుణ్ణీ, డిభకుణ్ణీ వెంటపెట్టుకువచ్చి మా మధురానగరం మీద దండువిడిశాడు జరాసంధుడు యదు, వృష్ణి, భోజ, అంధక వీరుల పద్దెనిమిదివేలమందితోనూ వాణ్ణి ఎదిరించాను నేను. ఏ ఆయుధంతోనూ చావనివాళ్ళు కావడంచేత ఈ హంస, డిభకులతో గట్టిచిక్కే వచ్చింది మాకు. ఉపాయబలంతప్ప మరోబలం పనిచెయ్యలేదు. ఇద్దరూ ఆటోకరూ ఇటోకరూ యుద్ధంచేస్తున్నారు. సమయంకనిపెట్టి హంసుడు చచ్చిపోయాడని డిభకుడితో చెప్పాం. నిజమే అనుకున్నాడు డిభకుడు. అన్నలేని ప్రపంచంలో నాకు పనేమిటి అంటూ దుఃఖపడ్డాడు దుఃఖం భరించలేక యమునానదిలో పడి ప్రాణం వొదిలిపెట్టాడు. తమ్ముడిచావు విని గుండెలు పగిలిపోయాయి హంసుడికి. వాడూ ప్రాణం వొదిలి పెట్టాడు. ఇలా వాళ్ళపీడ వొదిలించుకున్నాం.

"ఆప్తమిత్రుల చావుతో అసహాయుడైపోయాడు జరాసంధుడు. విచారిస్తూ మగధ వెళ్ళిపోయాడు. వాడి ఉపద్రవం పడలేక మధురవొదిలి వెళ్ళిపోవలిసివచ్చిందిమాకు కుశస్థలం వెళ్ళి రైవతకపర్వతంమీద కోట కట్టుకున్నాం ద్వారకాపట్నం నిర్మించు

---

* బ్రహ్మదత్తుడు రాజసూయంచెయ్యాలని ప్రయత్నించి కృష్ణుడితో పోడి పోయాడు.

కున్నాం. అప్పటినించీ ఇంతవరకూ మీ ఆశ్రయంతో కూడా ఏదో సుఖంగా గడుపు తున్నాం.

"ఇంతా ఎందుకు చెప్పవచ్చానంటే జరాసంధుడు బతికి వుండగాను సామ్రాజ్యం స్థిరంకాదు నీకు సామ్రాజ్యం స్థిరమైతేనే కాని, రాజసూయం నిర్విఘ్నంకాదు. జరాసంధుడు దుర్మార్గుడు పొగరెక్కి వున్నాడు ప్రపంచంలోని రాజుల్ని పట్టితెచ్చి, గిరి వ్రజములో ఖైదుచేసిపెట్టాడు. కటికివాడిలా కనికారంలేకుండా రోజుకో రాజుని ఘోరంగా నరుకుతూ భైరవపూజ చేస్తున్నాడు. వీణ్ణి హరీ అనిపిస్తేచాలు, నీ యజ్ఞం దిగ్విజయంగా పూర్తవుతుంది.

రక్షణవల్ల భగీరథుడూ, విజయంవల్ల మాంధాతా* బాహు బలంవల్ల భరతుడూ, తపస్సువల్ల కార్తవీర్యుడూ, బుద్ధివల్ల మరుత్తుడూ.* సర్వసామ్రాజ్యం సంపాదించారు ఇన్నీ వున్న నీకు అదేమంత దుర్లభ మౌంటాను! జరాసంధుడు ఎంత బలవంతుడు కానుగాక, ఎంతగర్వించి వుండునుగాక, వాడి దుర్మార్గమే వాడి సర్వనాశనం చేస్తుంది. సందేహంలేదు. వివేకంలేనివాడి దగ్గిరసంపద నిలుస్తుందా!" అన్నాడు.

"కృష్ణుడి దయుంటూ వుంటే, మనకి అసాధ్యమేముంది అన్నయ్యా," అంటూ అందుకున్నాడు భీముడు "ఏపనైనా ఆరంభించనివాడిచేత ఏపనీ కాదు. ఎంత సామాన్యుడూ కూడా ఆరంభిస్తే చాలు, ఎంత గొప్పవాణ్ణయినా- ఆరంభించనివాణ్ణి అవ లీలగా వోడిస్తాడు. ఇంకోమాట, గెలిచినా-వోడినా-కలబడవలిసి వస్తే గొప్పవాడితోనే కలబడాలి. అప్పుడే మగవాడి మగతనం తెలిసివస్తుంది. అంతేకాని, తక్కువవాణ్ణి గెలిస్తేమాత్రం వూరా, పేరా! కృష్ణుడి దయా, అర్జునుడిదన్నా, నీ ఆశీర్వాదం వుంటే చాలు, నేను చంపివస్తాను జరాసంధుణ్ని. మేం ముగ్గురమూ ఈ

* మాంధాతకథా, భగీరథుడికథా' చూ. అరణ్యపర్వం,

* మరుత్తుడికథ. అశ్వమేధపర్వమూ, చూ. మార్కండేయపురాణమున్నూ.

యజ్ఞంలో మూడు అగ్నిహోత్రాలనుకో జరాసంధుడే యజ్ఞపశువు శత్రువులు ఆహుతులు'' అంటూ భుజాలు సవరించాడు

"అవును. అలా అయితేనే నాకు గాండీవం దొరకడంలో అర్థముంటుంది," అంటూ భీముడికి శ్రుతికలిపాడు అర్జునుడు. "కులమూ, రూపమూ, ధనమూ విక్రమవంతుడి దగ్గిర వుంటేనే రాణిస్తాయి విక్రమంలేనివాడిదగ్గిర వుంటే ఎంతో లేకపోయినా అంతే. అంచేత అన్నయ్యా, రాజుల్ని జయించు. రాజసూయం చెయ్యి, అప్పుడే మనకి మయసభ వున్నందుకూ, నాకు గాండీవం, దివ్యరథమూ దొరికినందుకూ సార్థకత కలుగుతుంది, అంతేకాదు, రాజసూయంకోసం జరాసంధుణ్ణి చంపి, రాజుల్ని విడిపించడంకంటే కీర్తి, పుణ్యమూ మరేముంటాయి!'' అన్నాడు

భీముడూ, అర్జునుడూ అన్న దానికి సంతోషిస్తూ మళ్ళీ ఎత్తుకున్నాడు కృష్ణుడు. "అదృష్టం అనుకూలంగా వున్నప్పుడే పరాక్రమానికి బయల్దేరాలి. బుద్ధిపూనికా వున్న మగవాడు చెయ్యవలిసిన పనే ఇది. మేం ముగ్గురమూ వెళతాము. నదీప్రవాహం చెట్టుని కుంకుడువేళ్ళతో పెకిలించినట్టు జరాసంధుణ్ణి నిర్మూలం చేస్తాం. తన అంతరువు తెలుసుకోకండా, భూతాల్లో అంతరాత్మ లాగ వొంటరిగా కూచుని సుఖం గునుస్తున్నాడు వాడు. అంచేతే వాడిదగ్గిరికి వెళ్ళడం ఆయాసంలేనిపని మాకు'' అన్నాడు.

"నీ ఆదేశంమీాద నడుచుకొనేవాళ్ళం మేం," అన్నాడుధర్మరాజు. "నువ్వుండగా మాకు జయంకలగడంలో సందేహం మేముంటుంది! నీ సంకల్పం కలిగింది. గిరివ్రజంలో రాజుల అరదండాలు విడ్డాయనే అనుకోవాలి. రాజసూయమూ నిర్విఘ్నంగా నెరవేరినట్లే. అదృష్టవంతుణ్ణి నేను. ఐతే, వొక్కమాట. రాక్షస సంహారం చేసేవాడివి నువ్వు. కాల్తావున్న అడవిమంటలో మిడత పడి కాలకండాఉండడం ఎలాంటిదో, యుద్ధంలో నిన్ను ఎదిరించి బతికిపోవడం అలాంటిది. కాగా, నీ మీాదికివచ్చిన్నీ ఏలా వెళ్ళ

గలిగాడు జరాసంధుడు ? అంత బలమూ, అంత సాహసమూ వాడి కెలావచ్చాయి ? వాడి పుట్టుపూర్వోత్తరాలు వినాలనిపిస్తోంది నాకు'' అన్నాడు. వినమంటూ ఆరంభించాడు శ్రీకృష్ణుడు.

జ రా స ం ధు డు †

ఉపరిచరవసువు కొడుకు బృహద్రథుడు. మగధ రాజై బహు సమర్థుడుగా వుండేవాడు మూడు అక్షౌహిణులసేన వుండేది అతడికి. ఆతడి సేనముందు శత్రువన్నవాడు నిలవలేకపోయేవాడు కాశీ రాజు కూతుళ్ళని కవలవాళ్ళని ఇద్దరిని పెళ్లాడాడతడు, ఇద్దరూ సౌందర్యవతులే కావడంచేత ఇద్దరిమీదా వొకేవిధమైన ప్రేమతో వుండేవాడు ఐతే, ఎంతకాలానికి సంతానం లేకపోయింది బృహద్రథుడికి ఎన్నో వ్రతాలూ, నోములూ అవీ చేశాడు. పుత్రకామేష్టులూ చేశాడు. ఐనా లాభంలేకపోయింది. 'ఎన్ని సంపదలుంటే ఏం లాభం ? కొడుకుల్లేంది జీవితమే వ్యర్థం కదా' అంటూ విచారంపెట్టుకున్నాడు. చివరికి తపస్సు చేసుకుందామని భార్యలతో సహా అడివికి వెళ్ళిపోయాడు.

'అడివిలో కక్షీవంతుడి * కుమారుడు చండకౌశికుడు కనిపించాడు. ఒక గున్నమామిడిచెట్టుకింద నిష్ఠతో తపస్సుచేసుకుంటున్నాడతడు. విడవకండా చేస్తున్న ఉపవాసాలతోనూ, వ్రతాల

† పాండవుల ప్రపితామహి మత్స్యగంధి సోదరిపుత్రుడు జరాసంధుడు.




* కక్షీవంతుడు దీర్ఘతముడికీ సుదేష్ణదాదికూతురు ఉశిజకీ పుట్టినవాడు. [చూ. పుట ౧౨౦] తండ్రిమల్లేనే కక్షీవంతుడున్నూ సూక్తద్రష్ట అయిన మహా ఋషి [చూ. ఋగ్వేదం 1,9 మండలాలు.] విద్యావంతుడు కావడంచేత ఇతడికి స్వనయుడనే రాజు తన కూతురునిచ్చి పెళ్లిచేశాడు.

తోనూ శుష్కించి వున్నా, అగ్నిహోత్రుడిలా శరీరమంతా ప్రకా
శిస్తూవుంది. మాసిందేతడవుగా చండకౌశికుణ్ణి ఆశ్రయించాడు
బృహద్రథుడు. వదలకండా అతడి పరిచర్యచేయడం మొదలు
పెట్టాడు. అతడి సేవా అదీ చూసి సంతోషించాడు చండకౌశికుడు.
'నీకు ఇష్టమైంది ఏదన్నా కోరుకో ఇస్తాను' అన్నాడు.

రెండుచేతులూ జోడించాడు బృహద్రథుడు 'సంతానం
కటాక్షించండి,' అన్నాడు 'మీదయవల్ల సర్వసుఖాలూ, సర్వ
సంపదలూ అన్నీ వున్నాయి. కానైతే, దానికి తగినట్టు సంతానం
మాత్రం లేదు. అందుకని ఇవన్నీ వ్యర్థమనిపించింది నాకు.
కొడుకులు కలిగేవరకూ తపస్సుచేద్దామని నిశ్చయించుకు వచ్చాను.
మీ అనుగ్రహం కలిగింది. బతికిపోయాను' అన్నాడు.

అతడి దైన్యం చూసి కనికరించాడు ముని. కళ్లుమూసుకుని
ధ్యానముద్రలో కూచున్నాడు. ఇంతలో, గాలీలేదూ ఏటూలేదూ,
చెట్టుమీద చిలకలన్నా లేవు చిత్రం! దానంతట అది వొక
మామిడిపండువచ్చి చండకౌశికుడి వొళ్లోపడింది. దాన్నిపుచ్చుకుని
అభిమంత్రించాడతడు. బృహద్రథుడి చేతిలోపెట్టి, 'ఈపండుతో
కొడుకు పుడతాడు వెళ్లు' అన్నాడు. బ్రహ్మానందం కలిగింది
బృహద్రథుడికి. తిరిగి తనపట్నం వచ్చేశాడు మామిడిపండు
సమంగాకోసి ఇద్దరిభార్యలికీ ఇచ్చాడు

"చెరోముక్కా తిన్నారు రాణులు. ఇద్దరూ గర్భవతు
లయారు. పదోనెలలో వొకరాత్రి ఇద్దరికీ పురుడువచ్చింది.
ఒక్కకన్నూ, వొక్కచెవ్వూ, వొక్కచెంపా, వొక్కచనుకుదురూ,
వొక్కభుజం, వొక్కచెయ్యీ, వొక్కపక్కా, వొక్కపిర్రా,
వొక్కకాలూ- ఇలా ఈమెకో సగంపిల్లా, ఆమెకో సగంపిల్లా
చిత్రంగా పుట్టాయి.

చూసి భయపడ్డారు రాణులు. 'ఈ సగంముక్కలు కొడుకూ
ళ్లని ఎలాచూపిస్తాం రాజుకి!' అంటూ సిగ్గుపడిపోయారు.

దాదుల్ని పిలిచి 'ఎవరికీ తెలియకండా ఈ ముక్కలు బైటపారవేసి రండి' అన్నారు. దాదులు అవి తీసుకువెళ్ళి, కోటదేవిడీ దగ్గిర నాల్గుదార్ల చౌకంపక్క పడవేసి వచ్చారు.

ఆ చౌకం దగ్గిర జర అని వొక రాక్షసి ఎప్పుడూ కనిపెట్టుకు వుండేది. అదేదో బలికామోసనుకుని రెండుచెక్కలూ తీసుకు పట్టుకుపోయింది. తీరాచూస్తే రెండుచెక్కలూ మెల్లమెల్లగా కదులుతున్నాయి. చూసి, రెండూ సమానంగా వొక దగ్గిర సంధించి పట్టుకుంది జర. ఆశ్చర్యం! రెండుముక్కలూ సరిగ్గా అతుక్కున్నాయి జర చేతిలో కుమారుడు తయారయాడు. వజ్రమంత కఠినమైపోయింది కుర్రాడి శరీరం జర చేతిలో కొండంత బరువైంది. అంతరాక్షసీ కుర్రవాణ్ణి పట్టలేకపోయింది. గావుకేకలు వేస్తూ ఏడవడం మొదలుపెట్టాడు కుర్రాడు కరచరణాలు ఆడడంలేదు జరకి.

"పిల్లవాడి ఏడుపు విని అంతఃపురంలోని ముసిలిఅవ్వలంతా పడుతూ లేస్తూ వచ్చారు. సంతోషంతో కుర్రవాణ్ని ఎత్తుకోవడం మొదలుపెట్టారు ఈ గడిబిడంతా విని బృహద్రథుడూ వచ్చాడు. తన ఎర్రటిపిడికిలి మొహంమీద పెట్టుకొని దిక్కులు అదిరేట్టు ఏడుస్తున్నాడు కొడుకు. మంచి తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. కృతార్థత పొందిన చూపులతో చూస్తూ ఆనందించాడు తండ్రి.

"జర కామరూపిణి కావడంచేత మనుష్యస్త్రీరూపంలో రాజుముందు నుంచుంది. సంగతంతా చెప్పింది. 'రాజా, రాక్షసిని నేను. నా పేరు జర. ఈవూరే కాపరంపెట్టుకున్నాను. ఈచౌకం వొదలకండా బతుకుతున్నాను. నీకు మేలుచెయ్యాలనే అహోరాత్రులూ నా భావన. ఇన్నాళ్ళకి ఆ అవకాశం లభించింది. నీ రాణులిద్దరికీ పుట్టిన శిశువుముక్కలు తెచ్చి మీ దాదులు ఈ చౌకందగ్గిర పడేసిపోయారు. ఆరెండూ నేను జోడించి పట్టుకునే సరికి చప్పున అతుక్కుపోయి వజ్రంలా గట్టిపడ్డాడు అబ్బాయి. ఆ బరువు ఏం చెప్పేది, మేరుపర్వతం శిఖరమంత అనిపించాడు

నేను ఎత్తుకోలేకపోయానంటే నమ్మండి'' అంటూ కుమారుణ్ణి బృహద్రథుడి చేతిలో పెట్టింది.

'' 'రాక్షసివేమిటి తల్లీ, నాపాలిటి భాగ్యదేవతవి' అంటూ ఆమెని ఎంతో గౌరవించాడు బృహద్రథుడు 'నా సేవకి మెచ్చి వీణ్ణి అనుగ్రహించాడు ముని, నువ్విప్పుడు ప్రాణంపోసి బతికించావు. నిజంగా మాపాలి దేవతవే నువ్వు' అన్నాడు. కుమారుణ్ణి తీసుకు వెళ్లి భార్యల కిచ్చాడు. జర సంధించడంచేత కుమారుడికి జరాసంధుడు అని పేరు పెట్టాడు. అప్పటినించీ పట్నం అష్టశోభనాలూ చేయించి, జర రాక్షసికి ఏటేటా గొప్ప ఉత్సవం చేయిస్తూ వచ్చాడు. కొడుకుని అరిచేతినిమ్మపండులా ఎంతో ఇదిగా పెంచాడు. నెయ్యి ఆహుతులుపోస్తూంటే వృద్ధిపొందే హోమాగ్నిలాగ, అగ్గజంగా పెరుగుతూ వచ్చాడు జరాసంధుడు

'అతణ్ణి చూసిపోదామని వొకనాడు అడివినుండి చండకౌశికుడు వచ్చాడు. కొడుకునీ, భార్యల్నీ మంత్రుల్నీ వాళ్ళనీ వెంట పెట్టుకుని ఎదురువెళ్ళాడు బృహద్రథుడు. నమస్కరించి తీసుకు వచ్చాడు. మంచి ఆసనంవేసి, పాదాలుకడిగి, అర్ఘ్యమూ పాద్యమూ ఇచ్చి పూజించాడు. 'ఈ రాజ్యమూ, సంపదా సర్వమూ మీదే' అంటూ కొడుకుని పాదాలమీద వేశాడు.

''సంతోషించాడు ముని. 'జరవల్ల నీకు మంచి ఉపకారం జరిగింది. నాయోగదృష్టితో తెలుసుకున్న సంగతిది. నీ కొడుకు కుమారస్వామి అంత బలశాలి అవుతాడు. శివుణ్ణి పూజించి వశం చేసుకుంటాడు. వీడిమీదికి వచ్చినవాళ్ళు ఎంతటివాళ్ళయినా అగ్గిలో పడ్డ పురుగుల్లాగ మాడిపోతారు. గరుత్మంతుడి వేగం ఇతర పక్షులు అనుసరించలేనట్టు, మనుష్యమాత్రులు ఇతడి పరాక్రమం అనుసరించలేరు. గ్రహాలమధ్య సూర్యుడిలా రాజుల్లో వీడు ప్రకాశిస్తాడు. నదుల ప్రవాహవేగాలు పర్వతం ఛేదించలేనట్టు, ఏదివ్యాస్త్రాలయినా వీడి శరీరం ఛేదించలేవు. మహానదులు లాక్కునే

సముద్రంలా శత్రురాజుల సంపదలు లాక్కుంటాడు వీడు. ఇలాంటిది వీడి సామర్థ్యం' అని చెప్పి వెళ్ళాడు.

"వయసువచ్చి ప్రయోజకుడయాడు జరాసంధుడు. రాజ్య భారం అతడిమీదపెట్టి భార్యలతోసహా తపోవనం వెళ్ళిపోయాడు బృహద్రథుడు. రాజయోగ కిందా మీదా కనిపించలేదు జరాసంధుడికి. హంసుడూ, డిభకుడూ వాడికి తోడయారు దాంతో పిగిలిపిట్టలమీదికి డేగలాగ రాజులమీదికి దండయాత్రలు చేశాడు. వాళ్ళని నానాహింసలూ పెట్టాడు ఐతే, హంసుడూ, డిభకుడూ చచ్చాక నడుం విరిగింది వాడికి రెక్కలు కొట్టేసిన గరుడపక్షిలా అయిపోయాడు తననంతూ ఎప్పుడువస్తుందో అని బితుకూ బితుకూ మంటూనేవుంది వాడికి. ఐతే వాణ్ణేమో ఆయుధబలంతో చంపడం వొట్టిది. బ్రహ్మాతరం కాదు. అలాంటి వరం వాడికిచ్చాడు శివుడు. అంచేత, మల్లయుద్ధంలోనే వాణ్ణి కొట్టాలి అది మన భీమన్న పని.

"అర్జునుడి రథబలం, భీముడిబాహుబలం, నా నీతిబలం వుంటూవుంటే నీకు అసాధ్య మేముంది? మేం ముగ్గురమూ వెళతాం. మా బాహుబలమూ నీతిబలమూ ప్రయోగిస్తాం. నా మీద నీకు నమ్మకమే వుంటే భీముణ్ణీ అర్జును ణ్ణీనా చేతిలో పెట్టు" అన్నాడు.

కృష్ణుడిలా చెపుతూవుంటే, అప్పుడే గెలుచుకువచ్చినంత విజయచిహ్నాలు కనిపించాయి భీమార్జునుల మొహాల్లో. కృష్ణుడి మాటలు వింటూనే అదీ కనిపెట్టాడు ధర్మరాజు.

"సమస్తకార్యాలూ నిర్వహించే సమర్థుడివి నువ్వున్నావు మాకు. ఇక మేము సాధించలేని వేముంటాయి?" అన్నాడు. పైకి అన్నాడే కాని తమ్ముల్ని వొదిలివుండడమంటే ఏదో ఇదిగానే వుంది. "భీముడూ అర్జునుడూ-ఇద్దరూ నాకు రెండు నేత్రాలు కృష్ణుడు హృదయం. వీళ్ళని విడిచివుండడమంటే బాధగానే వుంది. ఐనా మనస్సులో ఎక్కడలేని ఉత్సాహమే కలుగుతున్నాది. కృష్ణుణ్ణీ అర్జునుణ్ణీ తలుచుకుంటేనే శుభం కలుగుతుందంటారు.

అలాంటిది, వాళ్ళిద్దరి ప్రాపూ వున్న భీముడు గెల్చుకురావడంతో సందేహం మేముంటుంది? కార్యసిద్ధి కలిగితీరుతుంది-వెళ్ళిరండి'' అన్నాడు. ముగ్గురూ మూడుసింహాల్లా బైల్దేరుతూవుంటే మొహం నిండా కళ్ళు చేసుకుని చూస్తూ నుంచున్నాడు.

### మగధ విజయం

భీమార్జునులూ కృష్ణుడూ తిన్నగా మగధ బయల్దేరారు. స్నాతకవ్రతులై బ్రాహ్మణ వేషాలు వేసుకున్నారు. మొహాల్లో మాత్రం వీరశ్రీ తాండవమాడుతోంది అనేకపర్వతాలూ అడవీ దాటారు వాటిల్లోంచి పుట్టిన కాలకూటం, శోణం, కంటకీయం నదులూ దాటారు సరయూనదీ. పూర్వకోసలదేశం, మిథిల దేశం, గంగానదీ గడిచి మగధదేశం ప్రవేశించారు గోరథపర్వత మెక్కి గిరివ్రజం చూశారు గిరివ్రజం మగధ రాజధాని. పరాయి వాడు తేరిచూడడానికి వీలులేని పిడుగుల్లాంటి పెద్దపెద్ద కోటలతోనూ, అందమైన గోపురాలతోనూ పువ్వులతో ఘుమఘుమలాడుతూన్న ఉపవనాలతోనూ అలకాపట్నంలా ఎంతో అందంగా కనిపిస్తున్నాది గిరివ్రజం. చూసి చకితుడయాడు కృష్ణుడు. తల పంకించాడు. "చూడండి. ఈ గోరథమూ, ఋషభమూ, వైహారమూ, ఋషిగొండా, చైత్యగిరీ- ఈ ఐదూ వీరభటుల్లాగ ఈ పట్నం చుట్టూ కాస్తున్నాయి. అందుకనే ఈ వూరుపేరు గిరివ్రజం. ఇక్కడే పూర్వం దీర్ఘతముడు ఉసిజ (ఔశీనరి) అనే శూద్ర స్త్రీ గర్భంలో కక్షీవంతుడూ మొదలైన వాళ్ళని కన్నాడు, అతడి అనుగ్రహంవల్లా దుర్భేద్యమైన ఈ కోటలబలంవల్లా మగధవాళ్ళని మనుష్యమాత్రుడు గెలవలేడు" అన్నాడు.

ముగ్గురూ గోరథపర్వతంమీదించి నగర ద్వారంగుండా పట్నం లోకి వెళ్ళక, సురాసురి చైత్యకగిరి ఎక్కారు. దాని శిఖరంమీదవున్న మూడు భేరులు చూశారు. మగధవాళ్ళు మానుషాదం అనే అబో

---

*[illegible]

తోసి చంపి, దాని చర్మంతో చేసి పెట్టినవి భేరీలు. పైవాళ్ళు పట్నంలో ప్రవేశిస్తేచాలు, దీర్ఘతముడి ప్రభావంవల్ల వాటంతట అవే మోగుతా యవి. అందుకనే గోరథందారిని వెళ్ళక ఇక్కడికి పదమన్నాడు కృష్ణుడు

ముగ్గురూ ముందు ఆ మూడు భేరీలూ చిదకగొట్టారు. చైత్యకగిరి మధ్యని పగలగొట్టి, దొంగదారిని గిరివ్రజంలో ప్రవేశించారు. ప్రవేశించి, ప్రథమంలో పూలమాలలు కట్టేవాళ్ళ ఇళ్ళకీ, గంధాలూ అవీ తీసేవాళ్ళ ఇళ్ళకీ వెళ్ళారు. గంధాలూ పూలమాలలూ బలాత్కారంగా అడిగి పుచ్చుకున్నారు. ముగ్గురూ అగరూ, చందనం, పుప్పొళ్లూ అవీ పూసుకున్నారు. ఠీవిగా పూలమాలల వేసుకున్నారు. అలా గిరివ్రజం రాచబాటని నడుచుకుంటూ వెళుతూవుంటే ముగ్గురినీ చిత్రంగా చూశారు గిరివ్రజం పౌరులు.

జరాసంధుడికోటలో బ్రాహ్మలికిమాత్రం అడ్డులేదు. రాత్రీ, పగలూ ఎప్పుడుపడితే అప్పుడు వెళ్ళవచ్చువాళ్ళు. అది అవకాశం చేసుకుని, పశువులశాలలో సింహాలుదూరినట్టు, జరాసంధుడి గృహంలోకి వెళ్ళారు భీమార్జునులూ, కృష్ణుడున్నూ. అర్థరాత్రయినా అభ్యగతులికీ, స్నాతకబ్రాహ్మలికీ ఎదురువెళ్ళి పూజించేవ్రతం జరాసంధుడిది. కృష్ణుడికీ, భీమార్జునులికీ ఎదురువచ్చి పూజలూ వగైరాలు చెయ్యబోయాడతడు. అవేవీ అక్కర్లేదన్నారు వాళ్ళు. వీళ్ళ గర్వమూ అదీ చూస్తే, ఇదేదో పేచీలాగే వుందనుకున్నాడు జరాసంధుడు. "మీరు స్నాతకులే అయితే ఈ చందనం, పూలమాలలూ ఏమిటి?" అంటూ ప్రశ్నించాడు. "చైత్యకగిరి ఎక్కడం, భేరీలు పగలెయ్యడం, తప్పుదారిని పట్నంలో చొరబడడం— ఇదంతా ఏమిటి?* పోనీ, నేను చేసే సత్కారం పుచ్చుకోవడాని కేం

* మాలలూ అవీ వేసుకోవడం, సుగంధద్రవ్యాలు పూసుకోవడం, తప్పుదారిని ప్రవేశించడం, కొండలూ అవీ ఎక్కడం మొదలైనవి స్నాతకులైనవాళ్ళు చెయ్యరాని పనులు చూ. గౌతమస్మృతి. స౦. 884.

వచ్చింది? మీరేదో వేషధారుల్లాగే వున్నారు. మీ వేషాలు చూస్తే బ్రాహ్మలలాగానూ, మీ పొడవాటి చేతులూ, ఎత్తయిన ఛాతీలూ అవీ చూస్తే అచ్చంగా క్షత్రియులులాగానూ కనిపిస్తున్నారు. ఏమిటి సంగతి?'' అన్నాడు.

''అవును. క్షత్రియులమే. క్షత్రియ జాతి స్నాతకులం మేం,'' అన్నాడు కృష్ణుడు ''బ్రాహ్మలే అన్నమాటేమిటి? క్షత్రియులూ, వైశ్యులూ కూడా స్నాతకవ్రతులు కావచ్చుకదా! గంధమూ, పూలమాలలూ వేసుకున్నామంటున్నావు వీట్లో లక్ష్మివుంటుంది కనక బలవంతంగా పుచ్చుకు వేసుకున్నాము. ఇక, తప్పు దారిని వచ్చామన్నావు. స్నేహితుల ఇంటికైతే అసలు దారిని రావడం, విరోధుల ఇంటికైతే పెడదారిని రావడం క్షత్రియధర్మం నీ దగ్గిరికి మేం వచ్చిన ప్రయోజనం వేరు. అంచేత నువ్విచ్చే అర్ఘ్యపాద్యాలు నిరాకరిస్తున్నాము'' అన్నాడు.

''అదేమన్నమాట! మీరు నాకుగానీ, నేను మీకుగానీ ఏనాడూ ఏ కీడూ చేసిన పాపాన పోలేదు. ఏ దోషమూ ఎరగను నేను. మీకు పగవాణ్ణెలా అయాను? దైవభక్తుణ్ణి. ఉత్తమ క్షత్రియధర్మం తప్పనివాణ్ణి. పైపెచ్చు, మునులన్నా బ్రాహ్మలన్నా ఎంతో గౌరవం నాకు'' అన్నాడు జరాసంధుడు.

''ఆగు-ఉత్తమ క్షత్రియధర్మం తప్పనివాణ్ణంటున్నావు. ఏదోషమూ ఎరగనంటున్నావు. బావుంది. ఉత్తముడైన క్షత్రియుడు-నీలాగ రాజుల్ని ఖైదులో పెట్టి. వాళ్ళని పశువుల్లాగ నరుకుతూ! శివపూజ చేస్తున్నవాడు-నరలోకంలో ఎవడున్నాడు? ఇంత కంటే దోషం ఏం కావాలి? నిష్కారణంగా ఏపాపం ఎరగనివాళ్ళని హింసించేవాడు లోకాని కంతటికీ శత్రువే అవుతాడు. దయాధర్మం లేకండా విరోధుల్ని చంపుతున్నావు. పాపాత్ముడివి. ధర్మరక్షణ కోసం కంకణం కట్టుకున్నవాళ్ళం మేం. నిన్ను ఉపేక్షిస్తే మనందరికీ పాపం చుట్టుకుంటుంది. ఈ పాపభయమే మమ్మల్ని ఇలా వచ్చే

టట్టు చేసింది కులం రక్షించడంకోసమని క్షత్రియకులం యావత్తూ భరిస్తున్నవాడు పంపగా వచ్చాం. దుష్టనాశనం చేసే మరీ వెళతాం.

"'నాకంటే గొప్పవాడు లేడు' అని ఎవటివాళ్ళకి అవమానంగా మాట్లాడకు. నీతీ నియమం లేకండా మహాత్ముల్ని అవమానం చేసిన బృహద్రథుడూ* దంబోద్భవుడూ♦ కార్తవీర్యుడూ‡ ఏమయ్యారో ఆలోచించు ప్రతాపంతో రణయజ్ఞం చేసిన వీరులూ, ఉగ్రమైన తపస్సు చేసిన తాపసులూ సద్గతి పొందుతారు అంతే కాని నీలాగ దారుణంగా భైరవపూజ చేసినవాళ్లకి ఏం గతి దొరుకుతుందని! ఏం జేదో అయింది. ఇప్పుడైనా నామాట విను ఖైదులోంచి రాజుల్ని వొదిలిపెట్టు.

"నిజం దాచడ మెందుకూ, ఇదిగో ఈయన భీముడు. ఈయన అర్జునుడు. నువ్వు పెట్టిన చిచ్చు ఆర్పడానికి వచ్చిన పాండవ సింహాలు వీళ్లు నేను కృష్ణుణ్ని బుద్ధికలిగి రాజుల్ని వొదిలి పెట్టావా మంచిమాట. లేదా యుద్ధంలో నిన్ను కాజేస్తాము. తప్పదు. రాజుల్ని విడిపించకండామాత్రం కదలడం జరగదు" అన్నాడు శ్రీకృష్ణుడు,

ఈమాటలతో జూలుపట్టిలాగిన సింహంలా కనుబొమలు ముడిపెట్టి చక్రుమన్నాడు జరాసంధుడు "పరాక్రమంతో దండెత్తి పరరాజుల్ని గెలవడం దోషమా?" అంటూ పిడికిలి బిగించాడు. దేవకార్యంకోసం తెచ్చాను రాజుల్ని. వీళ్లని వొదిలిపెట్టవలసిన అగత్యం ఏంవచ్చింది నాకు? పరాక్రమమే నావ్రతం. నువ్వు కాదన్నా. నేను చేసింది ఉత్తమక్షత్రియధర్మమే. ప్రతాపంలో నన్ను గెల్చుకువెళ్లినవాడు లేడు కృష్ణా, వీళ్లకంటే కొత్తగాని, నువ్వు బాగానే ఎరుగుదువే నన్ను!

---

*గర్వమంతుడై కేత భంగపడ్డాడు. ♦ చూ. ఉద్యోగపర్వం మూడో అధ్యాయం ‡ చూ. అరణ్యపర్వం మూడో అధ్యాయం.

“సరే, నన్ను సైన్యంతో సైన్యం పెట్టుకు యుద్ధం చెయ్యమంటారా, రండి. కాదూ, మీముగ్గిరితో నన్ను వొక్కణ్ణిపోట్లాడమంటారా, సంయ్యో. లేదు, ఇద్దరితో దెబ్బలాడమన్నా, వొక్కడితో కలబడమన్నా– దేనికన్నా సిద్ధం. ఏ ఆయుధంతో డీకొనాలంటె దాంతో నేరండి. అన్నిటికీ సిద్ధంగానే వున్నాను” అన్నాడు.

“ఒక్కడితో ఇద్దరు ముగ్గురు యుద్ధం చెయ్యడం తగనిపని” అన్నాడు కృష్ణుడు. “ఇదిగో మేం ముగ్గుర మున్నాం. మాలో నీ ఇష్టం వచ్చినవాణ్ణి ఎంచుకో. ఆయుధాలతోనూ అవసరం లేదు మాకు. మల్లయుద్ధం చేద్దాం” అన్నాడు.

“బావుంది ఐతే, మీముగ్గిరిలోనూ భీముడే నాకంటికి ఆనుతున్నాడు. ఇతడూ నేనూ కుస్తీపడతాం” అన్నాడు జరాసంధుడు. మల్లయుద్ధం ప్రారంభించేముందు తన కొడుకు సహదేవుడికి రాజ్యాభిషేకం చేశాడు. పురోహితుడిచేత స్వస్తివచనాలూ అవీ చెప్పించుకున్నాడు. జుత్తు విప్పి గట్టిగా సిగవేసుకున్నాడు. మల్లయుద్ధానికి అనువైన కాసెకోకా అదీ బిగించుకున్నాడు. వీరరసికత్వంతో మీసం మెలిపెడుతూ వచ్చి రీవిగా రంగంలో నుంచున్నాడు. అతడికంటె అగ్గజంగా తయారయ్యాడు భీముడు.

భీముడూ జరాసంధుడూ వొక్కసారి కలియబడ్డారు. ఇద్దరూ బలంలో సమవుజ్జీలు. ఇద్దరూ వొకళ్లమీద వొకళ్లు కోపం పెట్టుకున్నారు. ఇద్దరూ కుస్తీలలో గడితేరినవాళ్లు. ఇద్దరూ వొడుపులతో కలియబడుతూవుంటే, పడాపడా కొట్టుకుంటూంటే– కాలయముడుగాని విజృంభించి ఈ సంక్షోభం కలిగిస్తున్నాడా అని భయపడ్డారు ప్రజలు. కౌశలంగా వొకళ్ల నొకళ్లు లాక్కుంటున్నారు. ఒకళ్ల నొకళ్లు పట్టుకుంటున్నారు. ఒకళ్ల నొకళ్లు కిందవేస్తున్నారు. కోపంతో పెనగులాడుతున్నారు.

ఉభయులూ మహోగ్రమైన ఇనపగుదియలలాంటి బాహు దండాలతో దారుణంగా బాదుకుంటున్నారు. భయంకరంగా వుంది

మల్లయుద్ధం. సింహమూ ఏనుగూ పోట్లాడినట్టు, రెండు వజ్ర పర్వతాలు ఢీకొన్నట్టు, ఇంద్రుడూ వృత్రాసురుడూ కలబడ్డట్టు ఇద్దరూ ఘోరంగా పోరాడుతున్నారు.

కార్తీకమాసం పాడ్యమినాడు ఆరంభమైంది మల్లయుద్ధం. చతుర్దశివరకూ ఈ పద్నాలుగురోజులూ పిసరంత ఎడతెరిపిలేకుండా హోరాహోరి పోట్లాట జరుగుతూనే వుంది. త్రయోదశినాడు ఇద్దరూ మరింత ఘోరంగా దెబ్బలాడారు అక్కసుదీరా వొకళ్ళ నొకళ్ళు కొట్టుకున్నారు. లాక్కున్నారు విసురుకున్నారు, గుద్దుకున్నారు. పొడుచుకున్నారు. తన్నుకున్నారు. తోసుకున్నారు తమకి వచ్చిన కుస్తీపట్లన్నీ ఉపయోగించారు. ఆవాళ మర్నాడూ అలాగే వెళ్ళింది.

చతుర్దశినాటిరాత్రి జరాసంధుడు బాగా అలిసిపోయాడు. అదికనిపెట్టాడు కృష్ణుడు. భీముడికి ఇసారా ఇచ్చాడు. "ఎదటి వాడు నీరసంలో పడ్డాడు ఇదే సమయం వాణ్ణి చంపడానికి. కానీ, నీ బలమూ, నీ తండ్రి గాలి బలమూ చూపించాలి" అన్నాడు.

జల్దుకున్నాడు భీముడు. వాయుదేవుణ్ణి తలుచుకున్నాడు. ఒక్కసారి బ్రహ్మాండమైన బలం వచ్చినట్టయింది. అమాంతంగా జరాసంధుణ్ణి మీదికెత్తి అదేతిప్పడం తిప్పాడు ముక్కంటా, నోటంటా, చెవుల్లోంచీ రక్తం కక్కుకున్నాడు జరాసంధుడు. అలా వందసార్లయినా తిప్పాడు భీముడు, సుడిగాల్లో గిరగిరా తిరిగే గడ్డిపోచలా కనిపించాడు జరాసంధుడు. అంతతో పోలేదు. భయపడి పెడబొబ్బలుపెట్టేటట్టు గా-ట్టిగా అడిసిపట్టుకుని బలంకొద్దీ వొక్కటి చరిచాడు దాంతో కీళ్ళు కీళ్ళు సంధులు విడిపోయి చచ్చి వూరుకున్నాడు జరాసంధుడు. భూమి దద్దరిల్లినట్టు సింహనాదం చేశాడు భీముడు. బ్రహ్మాండం బద్దలైందో, హిమాలయశిఖరం విరిగిపడిందో అంటూ గడగడలాడింది గిరివ్రజం. గర్భిణీస్త్రీలకి గర్భపాతమే ఐపోయింది. మగధసేనాశిబిరాల్లో చిక్కితే నెత్తురు

లేదు. లోకానికి తెలియాలంటూ జరాసంధుడి కళేబరం తెచ్చి కోటదేవిడీముందు పడవేశాడు భీముడు.

తెల్లవారింది మగధప్రజలు బయపడవద్దని అభయమిచ్చాడు కృష్ణుడు. చెరలోవున్న రాజులందరినీ విడిపించాడు. జరాసంధుడి కొడుకుని చేరదీశాడు. ధైర్యంచెప్పాడు. అతణ్ణే మగధసింహాసనం మీాద కూచోబెట్టాడు. మీా తాత సంపాదించిన రత్నాలరథం తీసుకురా'' అంటూ ఆజ్ఞాపించాడు.

వెంటనే రథం తెప్పించి చేతులు జోడించాడు సహదేవుడు. ''పూర్వం తారకాసురిడితో జరిగిన యుద్ధంలో ఇంద్రుడు ఎక్కినరథం ఇది ఇంద్రుడు వసురాజు కిచ్చాడు. వసురాజు తన కొడుకు బృహద్రథుడి కిచ్చాడు. జరాసంధు తాత దగ్గరనుండీవస్తూన్న దివ్యరథ మిది'' అంటూ చెప్పాడు కృష్ణుడు. భీమార్జునులతో సహా రథమెక్కి కూచున్నాడు. ఇక దానికి సారథి కావాలి. గరుత్మంతుణ్ణి తలుచుకున్నాడు ధగధగా మెరిసిపోతున్న రెక్కలతో ఉత్తరక్షణంలోవచ్చి వాలాడు గరుత్మంతుడు. తలవొంచి, నమస్క రించి నుంచున్నాడు. అతణ్ణి సారథ్యంచెయ్యమన్నాడు కృష్ణుడు. మనోవేగ వాయువేగాలతో రథంతెచ్చి ఇంద్రప్రస్థంలో దించాడు గరుత్మంతుడు

''మహాత్ముడయ్యా, ప్రజాకంటకుణ్ణి చంపేశాడు భీముడు. రాజుల అరదండాలు విడిపించారు పాండవులు. నాలుగుసముద్రాల మధ్యవున్న భూప్రపంచంలో ధర్మరాజుసామ్రాజ్యం పాటిలేని దైంది''. అంటూ సంతోషించారు లోకులు.

ఇంద్రప్రస్థంలో ఆశ్చర్యమే, ఆశ్చర్యం. ''ఏ ఆయుధంచేతా చావనివాడు జరాసంధుడు. అలాంటివాణ్ణి భీముడుగనక చంపేసి వచ్చాడు. మహాశక్తిమంతుడయితే సాధ్యంకావిపసి'' అంటూ భీముణ్ణి కృష్ణార్జునులన్నీ చూడ్డానికి అదే పనిగా వచ్చారు ప్రజ. కృష్ణుడూ భీమా ర్జునులూ [illegible] లతో ధర్మరాజుకి నమస్కరించారు.

ఇంతలోనే జరాసంధుడి చెరలోంచి విడిపించిన రాజులూ వచ్చి చేరుకున్నారు. అందరినీ ధర్మరాజుకి చూపించాడు కృష్ణుడు చేతులు జోడించుకు నుంచున్న వాళ్ళనందరినీ యథోచితంగా గౌరవించాడు ధర్మరాజు ఎవళ్ళ దేశానికి వాళ్ళని భద్రంగా పంపించివేశాడు. వెళ్ళివస్తానంటూ కృష్ణుడూ మగధనించి ఎక్కివచ్చిన రథంమీద ద్వారకాపట్నం వెళ్ళాడు.

### దిగ్విజయం

ఇక దిగ్విజయం జరగాలి. దిక్పాలకులవంటి తమ్ముళ్లు నలుగురినీ పిలిచాడు ధర్మరాజు. "వెళ్ళండి, దిగ్విజయం చేసుకు రండి" అంటూ ఆదేశించాడు. భీముణ్ణి తూర్పుదిక్కు పంపాడు. అర్జునుణ్ణి ఉత్తరానికి పంపాడు. నకులుణ్ణి పడమటికీ, సహదేవుణ్ణి దక్షిణానికీ పంపాడు. అపారమయిన చతురంగబలాలు వేసుకుని నలుగురూ నాలుగుదిక్కులికీ బయుల్దేరారు. నాలుగు సముద్రాలమీదికీ నడిచిన నాలుగు కొత్తసముద్రాల్లా ఇంద్రప్రస్థంనించి వొక్కసారి బయుల్దేరింది పాండవసేన.

అగ్ని ఇచ్చిన రథమెక్కాడు అర్జునుడు. గాండీవం పట్టుకున్నాడు. ఎండాకాలం సూర్యుడిలాగ తన ఉగ్రమైన ప్రతాపం వెలుగుతూ వుంటే, ఉత్తరదిక్కు గెలవడానికి బయలుదేరాడు ముందు పుళిందదేశంరాజుని ప్రతివిద్యుణ్ణి వోడించాడు. అలా ఉత్తరాదిరాజుల్ని స్వాధీనపరుచుకుంటూ ప్రాగ్జ్యోతిషం ముట్టడించాడు. ప్రాగ్జ్యోతిషంరాజు నరకాసురుడికొడుకు భగదత్తుడు పెద్దసైన్యంతో వచ్చి తిరగబడ్డాడు. పడమటిసముద్రప్రాంత వీరుల్ని వెంటవేసుకుని ఎనిమిది రోజులు ఘోరంగా యుద్ధంచేశాడు. తుదకి అర్జునుడి బాణాల ముందు నిలవలేకపోయాడు. లొంగిపోయాడు. "ఇంద్రుడి స్నేహితుణ్ణి నేను. ఇంద్రుడి కుమారుడివి నువ్వు అసలు నీతో యుద్ధం చెయ్యడమే తగనిపని నాకు. ఓడిపోయాను. ఏం కావాలో చెప్పు. నీ ఇష్టంవచ్చింది చేస్తాను" అన్నాడు.

అన్నయ్య ధర్మరాజు రాజసూయం చేస్తున్నాడు. నీ వంతు కట్నం నువ్వు చెల్లించు. రాజసూయానికి ఇంద్రప్రస్థం దయచెయ్యి'' అన్నాడు అర్జునుడు.

భగదత్తుడిదగ్గిర ఎంతో ధనమూ అదీ పుచ్చుకుని తూర్పుకి వెళ్ళాడు అర్జునుడు. దారికడ్డాకూ కొండగుహల్లోనూ, లోయల్లోనూ వుండే రాజులతో యుద్ధంచేసి గెలుచుకున్నాడు వాళ్ళందరిదగ్గిరా ఎంతో అంత ధనమూ బంగారమూ పుచ్చుకున్నాడు. ఉలూకదేశం రాజు బృహంతుణ్ణి వోడించాడు. ఉత్తరఉలూకం, వామదేవం, మోదాపురం, సుదామం, సుసంకులదేశం రాజుల్ని జయించాడు. దేవప్రస్థపురంరాజుని సేనాబిందుణ్ణి గెలిచాడు. విష్వగశ్వుడనేరాజుని పాదాక్రాంతుణ్ణి చేసుకున్నాడు. ఎంతోమంది కొండరాజుల్ని, బర్బర, పారశీక, తురుష్క దేశాలరాజుల్ని లొంగదీసుకున్నాడు. పౌండ్రం కాశ్మీరం త్రిగర్తం లోహితం సుధన్వం గాంధారం కాంభోజం కోసలం ఈ దేశాల రాజులదగ్గిర ఎన్నో అన్ని చిత్రవిచిత్రములయిన రత్నవస్తువులూ, బంగారంసామానులూ వాహనాలూ పుచ్చుకున్నాడు. చిత్రాయుధుడు పాలిస్తూవున్న సింహపురం గెలిచాడు ఆడవుల్లోని రాజుల్ని వశపరుచుకుంటూ వెళ్ళి శ్వేతపర్వతం రాజుని వోడించాడు పైకివెళ్ళి కాంభోజకటకుడనే రాజుచేత గౌరవంపొందాడు. హాటకదేశంలో మానసరోవరం ఋషికుల్యాం చూసి-అరబే హరివర్షం జయించి, అక్కడి రాజులదగ్గిర అపరిమితమయిన పదార్థాలూ, తిత్తిరిపిట్ట రంగువీ, తెలుపూ నలుపూ కలిసిన రంగువీ, మండూకం రంగువీ, హంస రంగువీ-ఇలా రంగురంగుల గుర్రాలూ, కొండల్లాంటి ఏనుగులూ, పుచ్చుకున్నాడు. హేమకూటం, నిషధాచలం దాటి గంధర్వనగరాలు గెలుచుకున్నాడు.

నూరువేల యోజనాల ఆయతమైన. అచ్చంగా బంగారంతో ధగధగలాడుతూవున్న సుమేరుపర్వతం చూశాడు. జంబూమహావృక్షం, జంబూమహానది చూశాడు. జంబూనదీతీరంలోవుండే

మేరువుకి ప్రదక్షిణంగా తిరిగాడు గంధమాదనం దాటాడు. అక్కడి దేశాలరాజులైన సిద్ధులూ, విద్యాధరులూ, చారణులూ, గంధర్వులూ-వీళ్ళ దగ్గిరగా చిత్రవిచిత్రాలయిన వస్తువులూ, వాహనాలూ అవీ పుచ్చుకున్నాడు మాల్యవంతం, నీలపర్వతం దాటి, ఉత్తరకురుదేశాలు వెళ్ళాడు అంటే, భరతవర్షం జయించుకుంటూ వెళ్ళి ఇలావృతవర్షం మేరువు తూర్పున భద్రాశ్వవర్షం, పడమట కేతుమాలవర్షం, ఉత్తరాదిని రమణవర్షం, హిరణ్వతీవర్షం గెలిచి ఉత్తరకురుభూములికి వచ్చాడు. తరవాత అక్కడి హారినివాసపురం ముట్టడించాడు

హారినివాసపురం ద్వారపాలకులు భయంకరమైన ఆకారాల వాళ్ళు. చెప్పలేనంత బలవంతులు అర్జునుణ్ణిచూసి ఆశ్చర్యపోయారువాళ్ళు 'ఏమిటిది? రాజా, ఏయుగంలోనూ ఏమహారాజూ చెయ్యని సాహసంచేశావు నువ్వు. శూరుడన్నవాడు అడుగుపెట్టనిచోటికి వచ్చావు నీవంటి వీరుణ్ణి నిన్నే చూశాము. ఓ, చాలు. ఇంతకంటే వీరప్రతాపాలు ఇంకేంకావాలి! వీటిని ఉత్తరకురుభూములంటారు మానవమాత్రులికి అన్యులికి తెలియని ప్రదేశాలివి. నువ్వేమో ఇక్కడ సాధించి, ఏపైనాపట్టుకువెళ్ళడం మాత్రం జరగదు. ఐనా, నువ్వేది చెబితే అది చెయ్యడానికి సిద్ధంగా వున్నాము మేం ఏంకావాలో చెప్పు' అన్నారు.

"ధర్మరాజు రాజసూయం చెయ్యబోతున్నాడు. అతడి సామ్రాజ్యం మీరు అంగీకరించినట్టు గుర్తుగా మీదగ్గిరవున్న వస్తువు ఏదయినా ఇవ్వండి" అన్నాడు అర్జునుడు దాంతో, ఉత్తరకురుదేశంలోవున్న రాజులు యావన్మందీ ఎంతోవిలువైన వస్త్రాలూ, నగలూ, ధనరాసులూ తెచ్చియిచ్చారు.

ఇలా ఉత్తరకురుభూములు దగ్గిరనించీ ఇంద్రప్రస్థంవరకూ అర్జునుడి శాసనంకింద ఉత్తరదిక్కు రాజులందరూ స్వాధీనులయారు ఉత్తరదిక్కంతా ధర్మరాజు తేజస్సు సూర్యబింబంలా ప్రకాశించింది.

దక్షిణదిక్కు వెళ్ళిన సహదేవుడు సుమిత్ర శూరసేన దత్త యవనుల్నీ, గోశృంగపర్వతంమీది వాళ్ళనీ జయించాడు. తాత కుంతి భోజుడిచేత ఆదరం, సన్మానమూ పొందాడు. అక్కడినుంచి చర్మణ్వతీనదీతీరంలో జంభకుణ్ణి ముట్టడించాడు. జంభకుడు కృష్ణుడి విరోధుల్లోనివాడు. మంచి బలవంతుడు సహదేవుడు అతణ్ణి ఓడించి అతడిదగ్గిర మంచిమంచి గుర్రాలూ, ఏనుగులూ, రత్నాలూ ఎంతో ధనం పన్ను తీసుకున్నాడు. నర్మదానదిదగ్గిర అవంతిరాజులు విందుణ్ణీ, అనువిందుణ్ణీ ముట్టడించి గెలిచాడు. అక్కడినించి వెళ్ళి మాహిష్మతీపురంమీద* దండువిడిశాడు.

ఇంతవరకూ సవ్యంగా వస్తూన్న సహదేవుడికి ఇక్కడ పెద్ద అడ్డువచ్చింది. మాహిష్మతీపురంరాజు నీలుడు సైన్యాలతో వచ్చి తిరగబడ్డాడు. సహదేవుడిసైన్యంమీద వరసగా ఏనుగులమీదా రథాలమీదా అగ్గివచ్చి తాండవం చెయ్యడం మొదలుపెట్టింది. కాళ్లూ చేతులూ ఆడలేదు సహదేవుడికి

ఇలా సహదేవుడి సైన్యంమీద అగ్గివచ్చి పడడానికి వేరే వొక కారణముంది. నీలుడివంశంలో పూర్వం నిషధుడని వొకరాజు వుండేవాడు. అతడికాలంలో అగ్ని బ్రాహ్మణవేషంతో మాహిష్మతీ పురంలోవుండి వేదాలుఅవీ చదువుకుంటూ వుండేవాడు. ఒకనాడు ప్రమాదవశాత్తూ చిన్నపొరపాటు చేశాడు. వ్యభిచరించాలని బుద్ధిపుట్టి పరాయిస్త్రీతో పోయాడు. ఎలాగోఅది తెలిసిపోయింది. తలార్లువచ్చి పట్టుకున్నారు. శిక్షించడంకోసం రాజుదగ్గిరికి తీసుకు వెళ్లారు. అవమానంతో కుమిలిపోతూ లేచాడు బ్రాహ్మడు. కోపంతో కణకణలాడాయి కళ్లు. నిలువునా మండిపోతూ కంపించాడు. చూస్తూవుండగా పెద్ద మంటలతో నిజరూపం చూపించాడు

* మాహిష్మతీపురం యదువంశంలోని మహిష్మంతుడు స్థాపించాడని విష్ణుపురాణం.

భయంతో గడగడలాడాడు నిమధుడు. రెండు చేతులూ జోడించి సాష్టాంగపడ్డాడు. తెలియక పొరపడ్డాం, క్షమించు అంటూ ప్రార్థించాడు. శాంతించాడు అగ్ని. "ఏదన్నా వరం కోరుకో ఇస్తాను" అన్నాడు చల్లగా "ధన్యుణ్ణి" అంటూ మొక్కాడు నిమధుడు. "ఈపట్నంమీదికి శత్రువులు వస్తే మాత్రం వాళ్లని కాల్చాలి నువ్వు. ఆ మాత్రం వరం దయచెయ్యి" అని వేడుకున్నాడు.

"సరి నువ్వుకోరినట్టే చేస్తాను. ఐతే, నేను ఒకమాట చెపుతున్నాను మీవూళ్లో ఆడువాళ్లు అందమైనవాళ్లు వీళ్లకి కామేచ్ఛా అధికం. అందుకని ఇపుడే కాదు, ఎప్పుడున్నా ఇక్కడి స్త్రీలు ఇష్టంవచ్చినట్టు వ్యభిచారం చెయ్యడానికి అవకాశమివ్వాలి వ్యభిచరిస్తే తప్పుపట్టకూడదు. అలా శాసనంచెయ్యాలి" అన్నాడు అగ్ని. అప్పటినించీ మాహిష్మతీపురంలో వ్యభిచారం దోషంకాదు, వచ్చిన శత్రువులమీద అగ్ని ఎగబడడంవల్ల శత్రుభయమూ లేకండా పోయింది. మాహిష్మతీపురంమీదికి వెళ్ళడం మరణంవాత పడడమే అనుకునేవాళ్ళు పరాయిరాజులు. ఆనాడు నిమధుడికిచ్చిన వరంవల్లనే సహదేవుడిసైన్యం దహించడం లంకించుకున్నాడు అగ్ని.

చలించకూడదనుకున్నాడు సహదేవుడు. శుచిస్నానంచేసి, దర్భలమీద పడుకున్నాడు. అగ్నిసూక్తాలతో అగ్నిభట్టారకుణ్ణి స్తోత్రంచేశాడు "నీవల్లనే అఖిలవేదాలూ పవిత్రంగా వున్నాయి పవిత్రవంతుల్లో పవిత్రవంతుడివి నువ్వు. నువ్వే యజ్ఞానివి. నీప్రీతి కోసమే ధర్మరాజు రాజసూయం చేస్తున్నాడు. నీయజ్ఞం నువ్వే భగ్నంచెయ్యడం న్యాయంకాదు. వైశ్వానరా, కరుణించు" అంటూ వేడుకున్నాడు

ప్రసన్నుడయ్యాడు అగ్ని. సహదేవుడిసైన్యంమీంచి వచ్చేశాడు. గట్టుతెగిన సముద్రంలా మాహిష్మతీపురంలో ప్రవేశించింది పాండవసైన్యం. దాంతో లొంగిపోయాడు నీలుడు ఏనుగులూ

గుర్రాలూ మంచిమంచి పట్టువస్త్రాలూ, రకరకాల నవరత్నాల నగలూ కానుకలిచ్చి, సహదేవుణ్ణి సత్కరించాడు.

ఇలా నీలుడిదగ్గిర కప్పంపుచ్చుకుని దక్షిణం జయిస్తూ వెళ్ళాడు సహదేవుడు. సౌరాష్ట్రంలో దండు విడిశాడు. రాయబారుల్ని పంపి రుక్మి భీష్మకుడూ శూర్పకుడూ మొదలయిన రాజులదగ్గిర లెక్కలేనన్నివస్తు వాహనాలూ అవీ అందుకున్నాడు సముద్ర తీరంలోవున్న నిషాదులూ ఏకపాదులూ కాకముఖులూ ఉడకకేసులూ రాక్షసయోనులూ-వీళ్ళందరినీ స్వాధీనం చేసుకున్నాడు రామశైలం గెల్చాడు. తామ్రపర్ణిద్వీపం జయంతిపుర తాళవనం జయించాడు. పాండ్యదేశంరాజు మలయధ్వజుణ్ణీ* కేరళంరాజునీ, దుర్యోధనుడి మామ కళింగంరాజునీ, కరహాటం, ద్రవిడ యవనరాజుల్ని వోడించాడు. సముద్రపొడ్డు అడవుల్లో సేతువుదగ్గిర డేరా వేశాడు

అక్కడకూచుని ఘటోత్కచుణ్ణి తలిచాడు తక్షణం ప్రత్యక్షమయాడు ఘటోత్కచుడు దండంపెట్టి నుంచున్నాడు "ఏమిటి శెలవు?" అంటూ తలవొంచాడు, "లంకాపట్నంవెళ్ళాలి నువ్వు. విభీషణుడిదగ్గిర కట్నం తీసుకురావాలి" అన్నాడు సహదేవుడు,

ఆంజనేయుల్లాగ ఆకాశంమీంచి వెళ్ళాడు ఘటోత్కచుడు. లంకాపట్నంవెళ్ళి విభీషణుణ్ణి చూశాడు. "శ్రీకృష్ణులసహాయంతో రాజసూయం చెయ్యబోతున్నాడు ధర్మరాజు. అందుకని భీమసేన అర్జునులూ, నకుల సహదేవులూ దిగ్విజయం చేస్తున్నారు. సహదేవులు దక్షిణదేశం జయించి సేతువుదగ్గిర వున్నారు నన్ను మీదగ్గిరికి పంపారు. నేను భీమసేనుల కుమారుణ్ణి ఘటోత్కచుడంటారు నన్ను. రాజసూయంకోసం రాజులుయావన్మందీ కట్నాలు చెల్లించారు మీరూ మీవంతుకప్పం చెల్లించాలి అంటూ చెప్పాడు.

* మలయధ్వజుడికి తటాక అని వొక కూతురుండేది. ఆమెకి మూడు స్తనాలుండేవట! మగవాడిలా యుద్ధాలూ అవీ చేసేదట. పెళ్ళయాక మూడో స్తనం మాయమయిందట. చూ. స్కాందపురాణం.

"సహదేవుడిశాసనం నేనూ సమ్మతిస్తున్నాను" అన్నాడు విభీషణుడు. వెంటనే లెక్కలేనంత ధనం-బంగారం యూపస్తంభం, గొప్పగొప్ప మణులు చెక్కిన నగలూ, చందనంమానులూ, అగరు కర్రలూ అవీ ఐదువందలమంది రాక్షసులచేత సహదేవుడిదగ్గిరికి పంపించాడు. ఇలా దక్షిణాదియావత్తూ జయించి, ధర్మరాజు సామ్రాజ్యం సాటిలేనిదనిపించాడు

అటు నకులుడూ పెద్ద చతురంగసేనతో బయల్దేరాడు. సైనికుల సింహనాదాలూ, మదపుటేనుగుల ఘీంకారాలూ గుర్రాల కిసలింపులూ, రథాల చక్రఘోషలూ చెవులు బద్దలుచేస్తున్నాయి అలా భూగోళందద్దరిల్ల జేస్తూ అతను పడమటికి వెళ్ళాడు. గెలుపుమీద గెలుపు సాధించాడు మొట్టమొదట రోహితిక దేశం ముట్టడించాడు. ఎంతోసైన్యంతో తిరగబడ్డారు అక్కడి శూద్రరాజులు దత్తకుడూ మయూరకుడూ మొదలైనవాళ్ళు. లిప్తలమీద వాళ్ళని వోడించాడు నకులుడు. మరు, మళయాళ బర్బర, కర్ణాట, హాటక దేశాలరాజుల్ని జయించాడ. పుష్కరవనంలోని అడివిగొల్లల్ని సరస్వతీ సింధుతీరాల్లోవున్న పల్లెవాళ్ళల్ని, పంచజన, సింహాన, దామరపట్టణాలవాళ్ళని (పంచనదీతీరవాసుల్ని) యాదవగిరి నివాసుల్ని వశపరుచుకుంటూ ద్వారక వెళ్ళాడు ద్వారకలో శ్రీకృష్ణుణ్ణి సందర్శించి తనరాక విన్నవించాడు అక్కడినించి మద్ర దేశం వెళ్ళాడు. మద్రరాజధాని శాకల్యపురంలో తన మేనమామ శల్యుణ్ణి చూశాడు. మేనల్లుణ్ణి ఎతో ఆదరించాడు శల్యుడు. నగలూ, వాహనాలూ ఎన్నో ఇచ్చి పంపించాడు తరువాత పడమటిసముద్ర తీరంలోని భయంకరులైన బర్బరుల్ని, కిరాతవీరుల్ని వోడించి వశపరుచుకున్నాడు. నకులుడు. పడమటిదిక్కంతా జయించి పదివేల వొంటెలమీద ధనరాసులు వేసుకుని ఇంద్రప్రస్థం వచ్చాడు.

ఈ విధంగా భీముడూ అర్జునుడూ నకులుడూ సహదేవుడూ దిగ్విజయంచేసి నాలుగుసముద్రాలమధ్యా వున్న ప్రపంచంలోని

యావన్మంది రాజులచేతా లెక్కాజమాలేనంత ధనం, వస్తువులూ, వాహనాలూ పట్టుకువచ్చి విడివిడిగా ధర్మరాజుముందు పెట్టారు. ఈ ధనంతో వరుణుడూ కుబేరుడూ తీసికట్టయారు ధర్మరాజుముందు.

న్యాయార్జితమయిన ఈ ధనరాసులు చూశాడు ధర్మరాజు. అదంతా పాత్రోచితమయిన దానాలూ వాట్లోనూ వినియోగించడానికీ, రాజసూయం ప్రారంభించడానికీ సంకల్పించుకున్నాడు అతడి సంకల్పానికి అనుగుణంగానే సలహాలు చెప్పారు ఆప్తమంత్రులు ''మహారాజా, నీ ధర్మపరిపాలనా, నీ గుణసంపదా, మచ్చలేని నీ చరిత్రా ప్రజల్లో ఎంతో అభివృద్ధి కలిగించాయి. రాజవంచకులూ, దేశద్రోహులూ దొంగలూ మొదలయినవాళ్ళ బాధ లేకుండా అయింది రోగభయం, శత్రుభయం, చీకూచింతా ఇవేవీ లేవు. ధరవరలూ చౌకపడ్డాయి. నీ తమ్ముల బాహుబలంవల్ల రాజులందరూ నీ శాసనంకిందికి వచ్చారు. సార్వభౌముడివి నువ్వు.

''బంగారంకొండ సన్నిహితమైనట్టు. కుబేరుడి తరగనినిధులు ప్రత్యక్షమయినట్టు. పరిమితంలేకండా వెండీ బంగారం రత్నాలూ వాటితో సమృద్ధంగా వున్నాయి ఖజానాకొట్లు. కావలిసింది లేదనకండా ఇచ్చే కల్పవృక్షాల్లాగ నేతులూ నూనెలూ ఉప్పులూ పప్పులూ బియ్యాలూ ధాన్యాలూ అన్నిటితోనూ పరిపూర్ణంగా వున్నాయి సామానుకొట్లు వేదాలన్నీ స్వరూపం ధరించినట్టువచ్చి నీ అభ్యుదయం కోరుతూ కాచుకున్నారు. మహాయాజకులైన బ్రాహ్మలు రాజసూయమహాయజ్ఞానికి ఇదే. తగినసమయం'' అంటూ బోధించారు.

ఆ దేసమయానికి సరిగ్గా ద్వారకనించి శ్రీకృష్ణుడూ వచ్చి అందుకున్నాడు ఎంతో అంత ధనం, ఎన్నో అన్నిరత్నాలూ తెచ్చి ధర్మరాజుకి కట్నమిచ్చాడు. అర్ఘ్యం, పాద్యం ఇచ్చి ఎంతో ఇదిగా సత్కరించాడు ధర్మరాజు. తమ్ములూ ధౌమ్యపురోహితుడూ వ్యాసమునీ ఋత్విజులూ బంధువులూ ఆప్తులూ మంత్రులూ

సామంతులూ యావన్మందీ కొలువులో కూచున్నారు అందరి ఎదటా కృష్ణుడితో ప్రసంగించాడు ధర్మరాజు

"ధర్మతత్త్వం తెలిసినవాడివి, కృష్ణా నివల్లనే ప్రపంచంలోని యావన్మందిరాజులూ నాప్రభుత్వం అంగీకరించారు వీళ్ళదగ్గిర దొరికినధనం ఇంతాఅంతా అని చెప్పడం బ్రహ్మాతరం కాదు. శాస్త్రోచితంగా ఇది సద్వినియోగం కావాలి దేవతలికి నోరువంటివాడు అగ్ని. అతడినోట్లో విధ్యుక్తంగా వేల్చి దేవతాప్రీతీ, తగిన దక్షిణలతో బ్రాహ్మణప్రీతీ చెయ్యాలి. అంచేత ఈ ధనంతో నీకు ఇష్టమైన యజ్ఞం చేసి నాకూ లోకానికి నచ్చిన పనిచెయ్యి లేదా నన్ను రాజసూయంలో నియోగించడమే నీ అభీష్టమైతే అలాగే అనుగ్రహించు. నువ్వు ఏదంటే అదే శిరసావహిస్తాను" అన్నాడు.

"రాజులందరిలోనూ పూజ్యుడివి నువ్వు" అంటూ అందుకున్నాడు కృష్ణుడు. "వైభవంలో దేవేంద్రుడంతటివాడివి. ప్రజలంతా నీ సుగుణాలకే ముగ్ధులైవున్నారు జనబలం, దైవబలం కారణంగా మహాసామ్రాజ్యవిభూతి నీది అంచేత నువ్వే ఈమహాయజ్ఞం చెయ్యడానికి తగినవాడివి. సందేహించకు ఆరంభించు రాజసూయం. నువ్వు చెప్పినపని తూచ తప్పకుండా చేస్తాను నేను. 'ఇది చెప్పవచ్చా, ఇది చెప్పరాదూ' అనుకోకుండా నీ ఇష్టం వచ్చినపనిలో పెట్టు నన్ను" అన్నాడు

కృష్ణుడిమాటలు అమృతం చిలకరించినట్టు అనిపించాయి ధర్మరాజుకి. ఇక తనకోర్కెలన్నీ నరవేరినట్టే అనుకున్నాడు. వచ్చిన ధనం సార్థకమైందనీ సంతోషించాడు.

## రాజసూయం

మహాపురుషుడయిన శ్రీకృష్ణుడి అనుజ్ఞా, తమ్ముల అనుకూల్యం, వ్యాసుడూ మొదలైన పెద్దల సమ్మతీ-ఇన్నీ పురస్కరించుకుని రాజసూయం ప్రారంభించాడు ధర్మరాజు సహదేవుణ్ణి చూసి, "తమ్ముడూ, నువ్వు ధౌమ్యులు చెప్పినప్రకారం మునఇంద్ర

సేనుడూ, అర్జునుడి సారథి దరుక్కీ వాళ్ళనీ పెట్టి యజ్ఞానికి అవసరమయిన వస్తు సామగ్రి యావత్తూ తెప్పించు యజ్ఞశాలలూ, దేశదేశాలనించి వచ్చే రాజులికి బసలూ అవీ కట్టించు. బ్రాహ్మణులూ రాజులూ కోమట్లూ శూద్రులూ అనకండా యావన్మంది ప్రజనీ యజ్ఞానికి పిలిపించు అన్నాడు.

అన్నగారి ఆజ్ఞప్రకారం ఇంద్రసేనుడూ మొదలయినవాళ్లని ఆయా పనులికి నియోగించాడు సహదేవుడు మంచి శిల్పం తెలిసిన వడ్రంగుల్నీ వాళ్ళనీ పెట్టి శాస్త్రంలో చెప్పిన కొలతలప్రకారం లక్షణయుక్తంగా యజ్ఞశాలలు ఎంతో అంత అందంగా కట్టించాడు. అందులో యజ్ఞానికి కావలిసిన సకలఉపకరణాలూ చిన్న పూతిక పుల్లవారా లేకండా ఉంపించాడు ఇంద్రప్రస్థంచుట్టూ ఉద్యానవనాలతోనూ నూతులతోనూ దిగుడుబావులతోనూ రకరకాల మంచిమంచి గృహాలుకట్టించాడు. నెయ్యా నూనే, బియ్యం-వొకటేమిటి- కావలసిన ప్రతీవస్తువూ వాటిల్లో పెట్టించాడు పట్టణమంతా భూలోకస్వర్గంలా తయారుచేయించాడు. పిలవవలిసిన రాజులు యావన్మందికీ ఎవళ్ల తాహతుకి తగినట్టు వాళ్ళకి ఆహ్వానాలు పంపించాడు.

సహదేవుడికబురు వెళ్లడమే తడువుగా కుమాళ్లతోనూ తమ్ముళ్లతోనూ స్నేహితులతోనూ విరాటరాజూ ద్రుపదుడూ శిశుపాలుడూ సుబలుడూ భగదత్తుడూ శక యవనులూ బృహద్బలుడూ చంద్రసేనుడూ సముద్రసేనుడూ కుంతిభోజుడూ పౌండ్రకవాసుదేవుడూ బలరాముడూ మొదలయిన యాదవ వృష్ణి భోజ అంధక ప్రముఖులూ అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ కరూశ గౌడ ఆంధ్ర సింహళ కేరళ కుంతల ద్రవిళ మరు యవన దేశాల రాజులూ మన్నుందొరలూ సముద్రద్వీపంరాజులూ వచ్చి ఇంద్రప్రస్థం ప్రవేశించారు. వాళ్లతోపాటు బ్రాహ్మణులూ కోమట్లూ శూద్రులూ వొకటేమిటి యావన్మంది ప్రజా ప్రపంచం నాలుగుమూలలనించీ వచ్చి

ఎవళ్ళకితగినబసల్లో వాళ్ళు ప్రవేశించారు. హస్తినాపురంనుంచి భీష్ముడూ ధృతరాష్ట్రుడూ మొదలయినవాళ్ళని పిలుచుకురావడం కోసం నకులుణ్ణి పంపాడు ధర్మరాజు. ఎంతోధనమూ అదీ పట్టుకుని బంధుమిత్ర సహితంగా భీష్ముడూ ద్రోణుడూ ధృతరాష్ట్రుడూ కృపుడూ అశ్వత్థామా సోమదత్తుడూ కర్ణుడూ భూరిశ్రవుడూ శల్యుడూ శకునీ సైంధవుడు జయద్రథుడూ దుర్యోధనుడూ దుశ్శాసనుడూ వికర్ణుడూ మొదలయినవారంతా ఉత్సాహంగా వచ్చారు. పట్నం నాలుగు దిక్కులనించీ నేల ఈనినట్లు అదే వచ్చిపడుతున్నారు జనం.

వాళ్ళందరినీ ఎవళ్ళకితగినట్లువాళ్ళని గౌరవసత్కారాలు చేశాడు ధర్మరాజు. "మీ అందరి అనుగ్రహంవల్ల ఈ మహాయజ్ఞం తలపెట్టాను. మీరు యావన్మందీ సహాయపడి ఇది నిర్విఘ్నంగా నెరవేర్చాలి" అంటూ వాళ్ళందరినీ ఔననిపించాడు. వెండి బంగారాలూ రత్నాలూ దానాలివ్వడం, దక్షిణలివ్వడం- ఇలాంటిపనుల కోసం కృపాచార్యుణ్ణి నియమించాడు. ఇది చెయ్యవలిసిందీ, ఇది చెయ్యరాందీ అని నిర్ణయించి చెప్పడానికి భీష్ముణ్ణి ద్రోణాచార్యుణ్ణి ఏర్పాటుచేశాడు. సామానులు ఖర్చుపెట్టేపని విదురిడికిచ్చాడు. దేశదేశాలరాజులు తెచ్చియిచ్చే కట్నాలూ కానుకలూ పుచ్చుకొనే భారం దుర్యోధనుడిమీదపెట్టాడు. పప్పులూ బియ్యాలూ ఫలహారాలూ అవీ అందరికీ ఇచ్చేపని దుశ్శాసనుడికి అప్పగించాడు. ఇలా ఎవళ్ళకిచెప్పవలిసినపని వాళ్ళకిచెప్పి, తానువెళ్ళి దీక్షతో యజ్ఞంలో కూచున్నాడు.

అవతారమెత్తిన ధర్మదేవతలా వున్నాడు ధర్మరాజు. బ్రహ్మతేజస్సూ రాజతేజస్సూ మొహంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వుంది. మెడలో వేసుకున్న రత్నాలహారాల కాంతులు దానికి తోడవుతున్నాయి. బ్రహ్మజ్ఞానం తెలిసిన బ్రాహ్మలమధ్య కూచుని, బ్రహ్మరుషులతో కూచున్న బ్రహ్మలా కనిపిస్తున్నాడతడు. వేద

ఘోషా ఆశీర్వాదాలూ మంగళవాయిద్యాలూ-వీట్లమధ్య మరో మాట వినపడడంలేదు.

పైలుడూ ధౌమ్యుడూ హోతలు. యాజ్ఞవల్క్యుడు అధ్వర్యుడు. వ్యాసుడు బ్రహ్మ సునాముడు ఉద్గాత. వీళ్ళ కుమాళ్లూ స్నేహితులూ శిష్యులే మైత్రావరణుడూ అచ్ఛావాకుడూ గ్రావస్తుతుడూ ప్రతిప్రస్థాతా నేష్టా ఉన్నేతా బ్రాహ్మణాచ్ఛంసీ ఆగ్నీధ్రుడూ పోతా ప్రస్తోతా ప్రతిహర్తా సుబ్రహ్మణ్యుడూ అని వరసగా సహాయఋత్విజులు. నారదుడూ మొదలయిన మహామునులూ, భీష్ముడూ మొదలయిన మహారాజులూ సదస్యులు. శ్రీకృష్ణుడు రక్షణకర్త.

వైశాఖమాసం రోహిణీనక్షత్రం అమావాస్యనాడు దివ్యంగా ఆరంభమైంది రాజసూయం ఆరు అగ్నులతోనూ శాస్త్రయుక్తంగా, ఎక్కడా ఏలోపంలేకండా జరిగింది. ఎక్కడపడితే అక్కడ ఇసకపాతర ధనధాన్యాలు. ఇకచాలుచాలు అన్నంతవరకూ బ్రాహ్మలికి దక్షిణలు దొరికాయి. కళ్ళవేడుకగా చెప్పలేనంత ఘనంగా సర్వకార్యాలూ జరిగాయి అగ్నిముఖంగా మంత్రాహుతులతో యావన్మంది దేవతలూ తృప్తిపడ్డారు. లెక్కలేనన్ని సంభావనలూ దానాలూ వాటితో బ్రాహ్మలూ, తాహతుకితగిన గౌరవసత్కారాలతో లక్షలకొద్దీ రాజులూ, మద్రపోషితాల సంతర్పణలతో కోట్లాది ప్రజా సంతృప్తులయారు. యావన్మందీ ధర్మరాజుని అతడి తమ్ముళ్ళీ మరీమరీ ప్రశంసించారు.

# సభాపర్వం

## రెండో ఆశ్వాసం

ఆరోనాడు అవభృథస్నానం* జరిగాక అందరూ అంతర్వేదిలో† కూచున్నారు. అంతగొప్పగా జరిగిన రాజసూయ మహోత్సవమూ, ధర్మరాజుధర్మనిష్ఠా చూసి ఎంతో ప్రశంసించాడు నారదముని సదస్యులుగా కూచున్న రాజుల్నీ, వాళ్ళల్లో వొకడయి వున్న కృష్ణుణ్ణిచూసి తలపంకించాడు ఆనాడు దేవలోకంలో జరిగిన నిర్ణయం జ్ఞాపకంవచ్చింది. రాబోయే మహాభారతయుద్ధం కళ్ళముందు కట్టినట్టయింది. సంతోషించాడు.

ఆ మహాయజ్ఞంచూసి అందరికంటే అధికంగా ఆనందించాడు భీష్ముడు ధర్మరాజుదగ్గిరికి వచ్చి "బాబూ, చూడూ, రాజూ ఋషీ ఋత్విజుడూ స్నాతకుడూ గురువూ ఇష్టుడూ-వీళ్ళంతా పూజించదగ్గవాళ్ళు యజ్ఞం దివ్యంగా జరిగింది. ఈ సమయంలో ఇక్కడవున్న వీళ్ళలో గొప్పవాడయిన వొకమహాత్ముణ్ణినువ్వు పూజించడం మంచిదని నా అభిప్రాయం" అన్నాడు

"తప్పకండా" అంటూ అందుకున్నాడు ధర్మరాజు. "ఐతే, ఇంతమందిలోనూ అలాంటి ఉత్తముడయిన మహాత్ముడెవరో నువ్వే నిర్ణయించి చెప్పవలిసినవాడివి" అన్నాడు.

"చెప్పడానికేముంది!" అంటూ ఎత్తుకున్నాడు భీష్ముడు. "దివ్యకిరణాలతో మిన్నూ మన్నూ వెలిగిస్తూవున్న సూర్యుడిలాగ తనకితానే ప్రకాశిస్తున్నాడు, మహానుభావుడు శ్రీకృష్ణుడు. నిజంగా అతడే యజ్ఞపురుషుడు. లోకాలుయావత్తూ పూజించదగ్గవాడు.

---

* యజ్ఞం చివర చేసే స్నానం. †అంతర్వేదీ బహిర్వేదీ అని కొన్ని విధులకోసం యజ్ఞశాలలో నలుచదరంగా అలంకరించి ఏర్పాటుచేస్తారు.

అతడికంటే ఇక్కడ తగినవాడు మరెవ్వడున్నాడు! అంచేత మరో ఆలోచనలేకండా కృష్ణుణ్ణే పూజించు, నువ్వుచేసిన ఈ మహా యజ్ఞానికి అదే ఫలం మరి'' అన్నాడు.

శిశుపాలుడి శివాలు

తాతగారిమాటమీద వెంటనేసహదేవుడిచేత అర్ఘ్యం తెప్పించాడు ధర్మరాజు. శాస్త్రంలో చెప్పినప్రకారం ఆ మహాసభలో శ్రీకృష్ణుడికిచ్చి పూజించాడు అదిచూసి సయించలేకపోయాడు శిశుపాలుడు అంతమందిలోనూ ఆక్షేపిస్తూ లేచాడు ధర్మరాజు మీదికి ''ఇంతమంది మహారాజులూ పండితులూ మహామునులూ వుంటే, ముసిలిభీష్ముడి దుర్బుద్ధిలోపడి ఈ చరిత్రహీనుణ్ణి పూజించావు దీంతో నీ బుద్ధితక్కువే బయటపడింది. అంతే, కాక పోతే, గొల్లవాణ్ణెవడన్నా పూజిస్తాడా? ధర్మతత్వం తెలియడానికి ఎంతవాడు కావాలి! ధర్మబాహ్యుడివి నువ్వు నిన్ను మొదలువంచి వొప్పించాడు బుద్ధిలేని భీష్ముడు. ఉత్తములుంటే, వొదిలి ఈ యాదవుణ్ణి పూజించమన్నాడు. ముసిలితనంవల్ల బుద్ధి పెడతలపట్టింది. కాకపోతే, ఈ వికారమేమిటి? మీకు కావలసినవాడయితే ధనం ఇచ్చుకోండి. మీ ఇంట్లో మీరు ఎంతన్నా మన్నించుకోండి. నెత్తిమీద పెట్టుకోండి. అడిగేవాడెవడు? పట్టాభిషిక్తులైన మహారాజులూ, వేదపండులయిన బ్రాహ్మలూ వున్న మహాసభలో అందరిలోకీ వీడే అధికుడని అర్ఘ్యం పెడతావా? న్యాయమేనా అని అడుగుతున్నాను!

''పోనీ, వృద్ధుడని పూజించా నంటావా? వసుదేవుడు వున్నాడుగా! ఋత్విజు డనుకున్నావేమో! వ్యాసు డేమయాడు? ఆచార్యుడంటావా? కృపుడూ ద్రోణుడూ లేరా? రాజని పూజించావేమో? గొల్లవాడికి రాజయే అర్హత కూడానా! మరి, వీళ్లల్లో ఎవళ్లతో సమానమని ఎంచుకట్టావు కృష్ణుణ్ణి? తాత చెప్పడం మనమడు చెయ్యడం అంతేనా నీతి! నువ్వేదో మంచివాడివనీ

పూజ్యుడవనీ తగుమనిషివనీ నమ్మి ఇంతమందీ నీ యజ్ఞానికి వచ్చి నందుకు తగినశాస్తి చేశావు.

" తెలీక నువ్వు అర్ఘ్యం ఇచ్చావేకట్టు, తగుదునమ్మా అంటూ తా నెలా పుచ్చుకున్నాడూ అంటూ కృష్ణుడు! ఆమాత్రం సిగ్గయినా లేకపోయింది చూడు! పేడివాడికి పెళ్లాం, చెవిటివాడికి సంగీతం, గుడ్డివాడికి అద్దం ఇవ్వడ మెలాంటిదో యాదవుడికి అర్ఘ్యం ఇవ్వడం అలాంటిది నువ్వు చేసిన పనికి ఈ రాజులంతా నవ్వుతున్నారు. ధర్మరాజన్న పేరు నేతిబీరకాయచేశావు చాలు" అంటూ ధర్మ రాజునీ భీష్మణ్ణి కృష్ణుణ్ణి చెడామడా తిడుతూ శివాలుతొక్కాడు. కొడుకులతోనూ వాళ్లతోనూ సభనుంచి లేచి వెళ్లిపోయాడు

వెంటవెళ్లి మంచిమాటలాడి మళ్లించాడు ధర్మరాజు. "బుద్ధిమంతుడివి, ధీరుడివి, మహారాజువి, ఇంతకఠినంగా మాట్లాడ వచ్చా! విషంకంటే అగ్నికంటే, దారుణమయినవి కఠినమయిన మాటలు కృష్ణుడు త్రిలోకపూజ్యుడు వేదపురుషుడు. అది ఆత్మజ్ఞానంవల్ల తెలుసుకునే చెప్పాడు తాతయ్య న్యాయమయిన మాట కాని ఇందులో దోషమేముంది? ఆయనవలె కృష్ణుణ్ణి తెలుసు కోవడం నీకు తరంకానిపని. మహాత్ముల్ని గుర్తించడం అంత సామాన్యవిషయమా మరి! జగద్గురువనీ లోకోత్తరుడనీ నీకంటే వృద్ధులయిన మహారాజులు అభినందిస్తున్నారు కృష్ణుణ్ణి. నువ్వు కాదనడంలో అర్థమేమిటి?" అంటూ బోధించాడు.

"కుర్రతనం వొదల్లేదు శిశుపాలుడికి" అంటూ సగంలో కలగజేసుకున్నాడు భీష్ముడు 'దుర్మార్గుడు వీడు వీణ్ణింత బుది రించడం దేనికి? అహంకారంతోనూ క్రోధంతోనూ మండిపోతు న్నాడు. గోష్పాదమంత రాజ్యంతోనే కొండెక్కి కూచుంటున్నాడు. ఇలాంటివాడికి నూరిపోస్తే మాత్రం ధర్మం తలకెక్కే దేమిటి?" అంటూ శిశుపాలుడిదిక్కు తిరిగాడు. "వినయం వొదిలి వదురుతున్నావు. కృష్ణుడు అర్ఘ్యానికి తగడంటున్నావు. మూర్ఖుడివి కనక చెప్ప

వలిసివస్తున్నాది చూడు, ఈ సభలోవున్న యావన్మందిరాజులూ కృష్ణుడు చెరవిడిపించినవాళ్ళూ, అతడు యుద్ధంలో వోడించినవాళ్ళూ, అతణ్ణే శరణన్నవాళ్లూనూ కదా! ఇంతమందిలోనూ అతణ్ణెమించిన వాళ్లెవరో చూపించూ, పోనీ! వయుస్సులో అధికులయిన బ్రాహ్మలు ఎంతమందివుంటే ఏంగాక. వాళ్ళలో జ్ఞానంలో అధికుడయినవాడు బాలుడయినా సరే అతడే పూజించదగ్గవాడు అలాగే రాజుల్లోనూ పరాక్రమవంతుడే అందరిలోకీ పూజించదగ్గవాడు. ఈ రెండు కారణాలచేతా అర్ఘ్యానికి అర్హుడు కృష్ణుడు జగదారాధ్యుడతడు. ఒక్కమాకేకాదు దేవతలికిసహా పూజ్యుడు వయుస్సులో పెద్దవాళ్ళులటివుంటే ఎవరిక్కావాలి! గుణంలో పెద్దవాణ్ణిచూచి పూజించాం మేము ఇతర్లని పూజిస్తే వాళ్ళకిమాత్రం తృప్తి. శ్రీకృష్ణుణ్ణి పూజిస్తే మూడులోకాలికీ తృప్తి. తెలుసా!

"బుద్ధీ మనసూ పురుషుడూ ప్రకృతీ ఆకాశం భూమీ దిక్కులూ కాలం అంతా తానే అయి తన దివ్యశక్తి చేత భూప్రపంచం యావత్తూ ధరించిన సర్వాంతర్యామి శ్రీకృష్ణుడు. ఎంతో యోగనిష్ఠకల యోగులుకాని తెలుసుకోలేరు అతణ్ణి నువ్వెనగా ఎంత?" అన్నాడు

"ఇదంతా ఎందుకూ" అంటూ దురుసుగా ముందుకి వచ్చాడు సహదేవుడు. "నిరాఘాటంగా అర్ఘ్యం ఇచ్చాము కృష్ణుడికి. 'ఇది మేం వొప్పుకోం' అంటూ పొగరబోతు ఎవడన్నా కూశాడో, ఇదిగో వాడి నెత్తిమీద నాకాల్తో తంతాను" అంటూ కాలెత్తాడు. సభలోవున్న రాజులు యావన్మందీ గజగజలాడారు ఒక్కడూ కిక్కురుమనలేదు.

దాంతో ఎక్కడలేనిరోషం తెచ్చుకుని చిందులుతొక్కాడు శిశుపాలుడి సేనాపతి సునీథుడు. తన సైన్యాన్ని హెచ్చరించాడు, తనపక్క మొగ్గే రాజులందరినీ వొకదగ్గిర చేర్చాడు. శిశుపాలుడి అసరాతీసుకుని యుద్ధానికి సిద్ధపడ్డాడు.

ఇంకేముంది! యాదవసైన్యం వృష్ణి భోజ అంధక సేనలూ సైన్యం అంటే సైన్యం అంటూ యుద్ధానికి లేచాయి. ఈ సైన్యాలకలకలమంతా తుఫానురేగిన సముద్రంలా వుంది. గుర్రాలు బారులు తీరుస్తుంటే కెరటాల్లా వుంది మదపుటేనుగులు తిమింగిలాల్లా వున్నాయి సైనికులు చేపల్లా వున్నారు.

ఈ కల్లోలమంతా చూసి ఇదయిపోయాడు ధర్మరాజు. గడబడిపోతూ భీష్ముడి దగ్గిరికి వచ్చాడు "ఈ రాజులు ప్రళయకాల సముద్రంలా చెలరేగుతున్నారు. యజ్ఞం విఘ్నం కాకుండా చూడు. ప్రజలికి అపకారం జరగకుండా కాపాడు వీళ్ళు శాంతించే ఉపాయం ఆలోచించు" అంటూ కిళపిళపడ్డాడు.

"నీ యజ్ఞం విఘ్నం చేసేవాడెవడు!" అన్నాడు భీష్ముడు. 'స్వయంగా శ్రీకృష్ణుడు కనిపెడుతూవుంటే ఇక్కడ వేలుచూపేవాడెవడు! కృష్ణుడు కళ్ళెర్రచెయ్యనీ సాద్దువుగాని శిశుపాలుడి వెనకనిచేరిన వీళ్ళంతా యమలోకానికి పరిగెడతారు. శిశుపాలుడి పసా నిమిషంలో భస్మమంటుంది. ఏనుగుకుంభస్థలాలు కొట్టిన సింహాన్ని ఎన్ని కుక్కలరిచినమాత్రం ఏంచేస్తాయి? సింహపరాక్రముడు శ్రీకృష్ణుడు. అతడిచేవ ఇక్కడ సమావేశమయిన వీళ్ళలో ఎవడికి తెలియదుగనుక!" అన్నాడు.

ఈ మాటలు చెవులికి శూలాల్లా తగిలాయి శిశుపాలుడికి "ఈ ముసిలాడికి పిచ్చెత్తినట్టుంది. పెర్రిగొల్లవాణ్ణి దేవుడంటున్నాడు. ధర్మతత్త్వాలన్నీ తనకీ పాండవులికీమాత్రం తెలుసునంటూ అందరినీ అవమానపరుస్తున్నాడు" అంటూ మింగేసినట్టుచూశాడు భీష్ముణ్ణి. "నిన్ను ఊతగా పట్టుకున్నాడు ధర్మరాజు ఓడకి కట్టిన వోడలా అయాడు ఉన్నగౌరవంకాస్తా వూడగొట్టుకున్నాడు. నువ్వో ఇష్టమొచ్చినకృష్ణుణ్ణి పట్టుకున్నావు. దురాత్ముడివి, పులితోలు చూపెట్టి బెదిరిస్తున్నావు. నీ టాటూకుచప్పుళ్ళకి భయపడే కుందేళ్ళనుకున్నావో వీళ్ళు!

"తెగపొగుడుతున్నావు కృష్ణుణ్ణి. ఆడదాన్ని చంపాడు. 1 బండి తోసేశాడు 2 పువ్వుల మాన్లు విరిచేశాడు 3 చిన్న పుట్టంత కొండ ఏడుదినాలపాటు ఎత్తాడు 4 ఎద్దుని చంపేశాడు. 5 ఇదేనా ఇతగాడి గొప్పతనం! ఈ స్తోత్రజపానికి వొక్క నాలిక చాలదు నీకు. వందచీలికలు చేస్తే మరీ పొగడవచ్చు 'అన్నీ నాకే తెలుసు' నంటావే! మరి ఎందుకో వీడు అర్హుడో అర్ఘ్యానికి చెప్పావ్? స్త్రీలనీ, గోవుల్నీ, బ్రాహ్మల్నీ, అన్నంపెట్టినవాళ్ళని, నమ్మినవాళ్ళని చంపడం మహాపాపం కదా! ఈయనగారు స్త్రీ హత్య చేశాడు, గోహత్యా చేశా. ధర్మం తెలిసే ఈ పాపాత్ముడికి అర్ఘ్యమిమ్మన్నావా? నువ్వేదో శ్రీరంగనీతులు చెపుతున్నావు. పరస్త్రీని అంబని ఎలా ఎత్తుకువచ్చావు? నీ తమ్ముడు విచిత్రవీర్యుడు ఇంకా నయం ధర్మం తెలిసినవాడుగనక ఆమెను వొదిలిపెట్టాడు అంతేనా, పిల్లాజెల్లా లేని గొడ్డుమొరడువి. ఇలాంటి నువ్వు-ధర్మచరిత్రుడివంటే ఎవడు హర్షిస్తాడు? నీ దొంగజపాలూ, ధర్మపన్నాలూ ఎవడు నమ్ముతాడు?

"పూర్వం సముద్రపొడ్డుని వొక ముసలిహంస వుండేదిలే నీలాగే ధర్మపన్నాలు ఏకరువుపెట్టేదిట! 'ధర్మంగా నడవండి' అంటూ పక్షులన్నిటికీ ఉపదేశం చేసేది సముద్రంపిట్టలన్నీ దాన్ని చూసి తపశ్శాలి అనుకున్నాయి. దానితిండికి మంచిమంచి పదార్థాలు తెచ్చిపెట్టేవి. తమ గుడ్లు దానిదగ్గర దాచుకుని, మేతకని వొకనాడు దూరంగా వెళ్ళాయి సమయం కనిపెట్టి గుడ్లన్నీ నోట్లో వేసుకుంది హంస ఎలాగో వొకపిట్ట ఇదిచూసింది, సముద్రం పక్షులతో చెప్పింది ఎంతో దుఃఖపడ్డాయవి ముసలిహంసని చంపి మరీ వొదిలిపెట్టాయి. నువ్వూ అలాగే దొంగజపం చేస్తూ తత్వం బోధిస్తున్నావు. కౌరవవంశం నాశనం చెయ్యాలని చూస్తున్నావు.

---

1. పూతన. 2. శకటాసురుడు. 3 మద్దిచెట్లు 4. గోవర్ధనం. 5. వృషభాసురుడు. (అరిష్టుడు.)

"కృష్ణుడేదో ఇంతయిందనీ వూడపొడిచేస్తాడని బెదిరిస్తున్నావు. ఇతడిబలం నీకేమోకానీ, నాకుమాత్రం కొత్తకాదు. మా జరాసంధుడిముందు పదిసార్లు తోకముడిచాడు. ఆ మహావీరుణ్ణి బ్రాహ్మణవేషంతో మోసంచేసి, భీముణ్ణి అర్జునుణ్ణి వెనకవేసుకుని చంపించాడు. ఇదంతా ప్రయోజకత్వమే కామోసు! భట్రాజులా పొగడడం లంకించుకున్నావు. అంత పొగడాలనేవుంటే ఇంత వంతులూ, మహావీరులూ అయిన కర్ణుడూ శల్యుడూ మొదలయినవాళ్ళున్నారు. వాళ్ళని పొగుడుకుంటూ బతకరాదూ? ఆత్మనిందా, ఆత్మపూజా, పరనిందా, పరస్తవం పూజ్యాలు చెయ్యరానివన్నారు మునులు. తెలుసా" అంటూ నోటికివచ్చినతిట్లు ప్రారంభించాడు.

ఇలా అంతకంతకీ మించిపోతూవున్న శిశుపాలుణ్ణి అమాంతంగా పీకనులిమెయ్యాలని లేచాడు భీముడు. పద్మపత్రాల్లాంటి నేత్రాలు చింతనిప్పుల్లా మెరిశాయి. త్రికూటపర్వతం మీద మూడుపాయలైన గంగానదిలాగ నుదురుమీద కనుబొమలు ముడిపడ్డాయి. కాలయముడిలాగ పళ్ళు పటపటమన్నాయి. రాజులగుండెల్లో ప్రాణాలు లేవు. సభ సభంతా గజగజలాడింది.

చప్పున భీముడిచెయ్యి పట్టుకున్నాడు భీష్ముడు. "నువ్వు కాదు, కృష్ణుడే చంపాలి వీణ్ణి" అంటూ ఆపాడు. "దీనికి పూర్వచరిత్ర కొంచెం వుంది. చెప్తాను విను. వీడు పుట్టినపుడు నాలుగు చేతులతోనూ, మూడుకళ్ళతోనూ పుట్టాడు. కొడుకు వికృతరూపం చూసి దమఘోషుడూ, మీ పినతల్లి సాత్వతీ భయంతో తెల్లపోయారు. మతిపోయింది వాళ్ళకి. అంతలో 'ఎవడయితే వీణ్ణి ఎత్తుకుంటే వీడి హెచ్చుచేతులూ, నొసటి మూడోకన్నూ మాయమవుతాయో, వాడుతప్ప మరొకడు చంపలేడు వీణ్ణి' అంటూ కనపడని భూతమేదో చెప్పింది వాళ్ళకి. మరీ చిత్రమనిపించింది.

అప్పటినించీ కొడుకుని చూడవచ్చినవాళ్ళనల్లా ఎత్తుకోమనేవాళ్ళు సాత్వతీ దమఘోషులు. తమ మేనత్తకి ఇలాంటి వికృత

స్వరూపుడు పుట్టాడని విన్నారు కృష్ణుడూ బలరాముడున్నూ. మరి దీని చూడాలని మంత్రులూ వాళ్ళతో కూడా మేనత్త ఇంటికి చేది దేశం వెళ్ళారొకనాడు.

మేనల్లుళ్ళని సత్కరించింది సాత్వతి. ముందుగా కుమారుణ్ణి బలరాముడి చేతికిచ్చింది తరువాత కృష్ణుడి చేతికిచ్చింది, ఎత్తు కున్నాడో లేదో కృష్ణుడు చిత్రం! అధికం కన్నూ చేతులూ లేవు. ఆశ్చర్యపోయింది సాత్వతి భూతం చెప్పినమాటలు చెవిలో గింగురు మన్నాయి. కృష్ణుడి చేతిలోనే వీడుకు చావు వుందని తెలుసుకుంది "బాబూ, నాకొక వరమివ్వాలి నువ్వు" అంటూ ప్రార్థించింది కృష్ణుణ్ణి "దుర్మార్గుడై నీకు అపకారం చేసినా నీమరిదిని కనికరించు. నూరుతప్పులు మన్నించు చాలు" అని ప్రాధేయపడింది. "సరే" అన్నాడు కృష్ణుడు అంచేత నూరుతప్పులూ నిండేవరకూ చావు లేదు వీడికి. అదినిండిన ఉత్తరక్షణంలో ఎలాగూ చస్తాడు. ఇలా వుంది కనక నే ఇంతవరకూ కూయగలుగుతున్నాడు. లేకపోతేనా, నీదాకా ఎందుకూ, ఈపాటికే సముద్రంలోనలుసులా నాబాణాల ముందు కనబడకండాపోయేవాడు" అంటూ కూచోబెట్టాడు.

**శిశుపాలుడి వధ**

భీష్ముణ్ణి భీముణ్ణి వొక లెక్కింబేచూడలేదు శిశుపాలుడు. చువ్వలాగ దూసుకువచ్చాడు కృష్ణుడిమీదికి. "అభిమానం చేతా అవివేకం చేతా అపూజ్యుణ్ణి పూజ్యుడని పూజించారు నిన్ను. ఈ పాండవులూ నువ్వూ ఈ బుద్ధిలేని భీష్ముడూ రండి నాతో యుద్ధానికి. మీ చేవేదో చూసేపోతున్నాను ఇవాళ" అంటూ కవ్వించి కలబడ్డాడు. ఇంతదాకా పస్తాయించి చూస్తున్నాడు కృష్ణుడు. గంభీరంగా లేచాడు సభ సభంతా నిశ్శబ్దంగా నుంచున్నారు

"నూరుతప్పులు మన్నించమని మా అత్త కోరడం చేత ఇంత వరకూ సయించాను వీణ్ణి. వీడు ఇది చేశాడూ ఇది చెయ్యలేదూ అనికాదు. మేం భగదత్తుడిమీదికి ప్రాగ్జ్యోతిష వెళ్ళినప్పుడు, ఎవళ్ళూ

లేకపోవడంచూసి ద్వారక తగలబెట్టాడు పిల్లలూ వృద్ధులూ అలోలక్షణా అనిపోయారు రైవతకపర్వతంమీద స్త్రీజనంతో క్రీడిస్తూవున్న మా భోజరాజుల్ని నిష్కారణంగా చంపాడు. అశ్వమేధం కోసం విడిచిపెట్టిన గుర్రం దొంగిలించి వసుదేవుడి యజ్ఞం విఘ్నం చేశాడు. బభ్రుడిభార్యని ఎత్తుకుపోయి తనభార్యగా చేసుకున్నాడు. చూడండి. మీ అందరిఎదటా ఇవాళ నామీదికే తిరగబడుతూ వస్తూ న్నాడు. ఇంతవరకూ దయతలిచాను ఇక నాతప్పు లేదు' అన్నాడు

"నీ దయా నీ కోపం ఎవడిక్కావాలి?' అంటూ పకపకా నవ్వాడు శిశుపాలుడు. "ఇన్ని మాటలు చెపుతున్నావు మొదట నాకిచ్చినపిల్లని నువ్వేతగినట్టు ఎలా ఎత్తుకువెళ్ళావు! సిగ్గులేకుండా మళ్ళీమాట్లాడుతున్నావు!" అన్నాడు

అతడి నోట్లోని మాట నోట్లోనేవుంది నిప్పులుకక్కుతూ వచ్చింది కృష్ణుడిచేతి చక్రాయుధం శిశుపాలుడి కంఠం తెగింది శిరస్సు కిందపడింది మొండెమొకచోటా తల వొకచోటా అయింది. పిచికారీ వేసినట్టు బొందెలోంచి చిమ్ముకువచ్చింది రక్తం. వజ్రాయుధంతో పడ్డ కొండలా కిందపడింది మొండెం. చిత్రం! అంతమందీ చూస్తూనే వున్నారు. కిందపడ్డ బొందెలోంచి బయల్దేరిందొక తేజస్సు భూమీ ఆకాశం వెలిగిస్తూవచ్చి కృష్ణుడిలో లీనమయింది. మబ్బులేని పిడుగులవాన పడింది అక్కడ శిశుపాలుడి ఇంటిమీద సముద్రాలతోనూ కొండలతోనూ గిరగిరా తిరిగింది భూమి. "శ్రీకృష్ణుడికీ-జై' అంటూ కోలాహలం చేశారు ప్రజ.

తమ్ములతో చెప్పి శిశుపాలుడి మృతశరీరానికి సంస్కార క్రియలు చేయించాడు ధర్మరాజు. అతడి కుమారుడు ధృష్టకేతుణ్ణి చేదిదేశానికి పట్టాభిషేకం చేశాడు.

ఇలా నిర్విఘ్నంగా సమాప్తమైంది రాజసూయం. దేవతల్నీ పెద్దల్నీ బ్రాహ్మల్నీ-యావన్మందినీ సంతృప్తిపరిచి అవభృథ

అభిషేకంతో పవిత్రవంతుడై సభలో కూచున్నాడు ధర్మరాజు. చూసి కృష్ణుడూ మొదలయిన మిత్రులంతా సంతోషించారు. దుర్యోధనుడూ వాళ్ళూ మాత్రం మచ్చరించి మండిపడుతున్నారు

ఇంతలో దేశదేశాలనించి యజ్ఞానికి వచ్చిన రాజులు యావన్మందీ ధర్మరాజు ఎదటికి వచ్చారు "మహారాజా, నీ మహాసామ్రాజ్యమూ, నీ ధర్మప్రవృత్తీ - ఈ రెండివల్లా అన్ని రాజవంశాలనీ మించిపోయింది మీ భరతవంశ. రాజసూయ మహోత్సవం చూసి తరించాం. మీరు చేసిన సత్కారాలతో కృతార్థులమయాము. ఇక మా దేశాలికి మేం వెళతాము" అంటూ సెలవు తీసుకున్నారు

ధర్మరాజు ఆజ్ఞప్రకారం భీష్ముణ్ణీ ధృతరాష్ట్రుడూ మొదలయినవాళ్ళని భీముడూ దిగబెట్టివచ్చాడు ద్రుపదుణ్ణి అర్జునుడూ కర్ణుణ్ణీ శల్యుణ్ణీ సుబలుణ్ణి నకులుడూ కృపుణ్ణీ ద్రోణుణ్ణీ అశ్వత్థామనూ మొదలయినవాళ్ళనీ సహదేవుడూ దిగబెట్టివచ్చారు మోయ్య గలిగినంత ధనధాన్యాలు పుచ్చుకుని ధర్మరాజుని దీవిస్తూ వెళ్ళారు వేలాది బ్రాహ్మలు

పాండవులయిదుగురితోనూ చెప్పి ద్వారక వెళ్ళడానికి సిద్ధపడ్డాడు శ్రీకృష్ణుడు. పయనమయేముందు ధర్మరాజుతో ఇలా అన్నాడు "ప్రాణులన్నీ తనమీదే ఆధారపడి బతికేటట్టు కురుస్తున్నాయి మేఘాలు. అలాగే పక్షులు తమని కనిపెట్టుకుని బతికేటట్టు కాపిస్తున్నాయి ఫలవృక్షాలు. దేవతలందరూ తనప్రాపులో వుండేట్టుపాలిస్తున్నాడు దేవేంద్రుడు. ఆవిధంగానే నువ్వూ నీబంధుజనం నిన్ను ఆశ్రయించి బతికేట్టు ఘనంగా జీవించమంటాను నేను మరిన్నీ ఏమాత్రం అజాగ్రత్తపడకుండా ప్రజారక్షణ చెయ్యమంటాను

"నిన్ను వొదిలివుండడమంటేనే కష్టంగావుంది నాకు" అన్నాడు ధర్మరాజు "నీదయవల్ల ఈ మహాయజ్ఞం నిర్విఘ్నంగా నెరవేరింది. భూలోకంలోని రాజులందరినీ మించిన కీర్తివంతుణ్ణయాను నావంశం పావనమయింది. ద్వారకలో వుండినా,

మమ్మల్ని కనిపెడుతూవుండాలి నువ్వు దూరంగా వున్నా దగ్గిర వున్నట్టు చూడాలి'' అన్నాడు. అనలేక అనలేక చివరికి ''సరే, వెళ్ళిరా'' అన్నాడు.

బంగారం రథంమీద కూచుని బయల్దేరాడు కృష్ణుడు గాలిలా పరిగెత్తే గుర్రాలు. జెండామీద రత్నాలు తాపిన బంగారం గరుత్మంతుడు. నొగలమీద సారథి దారుకుడు మేఘంలా గంభీరశబ్దం చేస్తూ పరిగెత్తింది రథం తమ్ముళ్ళతోకూడా వినయంగా కొంత దూరం నడిచివెళ్ళి సాగనంపాడు ధర్మరాజు రథం గరుడపతాకం కనపడుతూన్నంతవరకూ చూస్తూ కూచున్నారు పాండవులు మనస్సులు కృష్ణుడివెంట వెళ్ళాయి శరీరాలుమాత్రం ఇంటికివచ్చాయి.

పరాభవం

దుర్యోధనుడూ శకునీ మయసభసౌందర్యం చూస్తూ ఇంద్రప్రస్థంలో నేవున్నారు కొన్నాళ్ళు. చిత్రమైన దాని శిల్పచాతుర్యానికి ఆశ్చర్యపోతూ వొకనాడు సభామందిరంలో తిరుగుతున్నాడు దుర్యోధనుడు. దాని నిర్మాణమే అయోమయమయింది అతడికి. తెరిచిన ద్వారం మూసివుందనుకుని వెళ్ళేవాడుకాదు. మూసివున్న ద్వారం తెరిచివుందని భ్రమపడేవాడు. స్ఫటికం తలుపులు నొసటితో ఢీకొనేవాడు. సమప్రదేశం ఎత్తుగావుందనుకునేవాడు. ఎక్కబోయేవాడు. ఇంద్రనీలాలతోవున్న స్థలాలు కోనేళ్ళనుకునేవాడు. దిగబోయి బట్టలెత్తి కట్టేవాడు చివరికి స్ఫటికంరాళ్ళకోనేళ్లు మామ్మూలునేలే అనుకుని దిగబడిపోయాడు ఇలా నానా ఇదీ అయి తడిబట్టలతో పైకివచ్చాడు. చూసి నవ్వాపుకోలేకపోయింది ద్రౌపది పకపకా నవ్వింది. భీముడూ మొదలైనవాళ్ళు చప్పట్లు చరిచారు సిగ్గుపడిపోయాడు దుర్యోధనుడు సంగతి తెలిసి, మంచి పొడిబట్టలూ అవీ పంపి కట్టబెట్టాడు ధర్మరాజు

ఈ పరాభవం దావాగ్నిలా దహించింది దుర్యోధనుణ్ణి ఇంద్రప్రస్థంలో ఇక వుండలేకపోయాడు హస్తినాపురం వచ్చేశాడు

రాజసూయమే కన్నుకుట్టింది. మయసభమరింత మచ్చరం వేసింది. పరాభవం బతుకే దుర్భరమనిపించింది. మండిపోతున్నాది మనస్సు. ఎండాకాలం సన్నగిల్లే ఏరులాగ చిక్కిపోవడం మొదలుపెట్టాడతడు. కత్తిబంగారం నిప్పులో వేస్తే వన్నె చెడ్డట్టు మనస్తాపంతో మాడి పోతూవచ్చింది అతడి శరీరం. రాజ్యవ్యవహారాలు వొదులు కున్నాడు. స్నేహితుల్ని మానుకున్నాడు ఎక్కడన్నా వొంట రిగా కూచునేవాడు. పాండవులపచ్చ తలచుకుని బాధపడేవాడు. కుంగిపోయేవాడు కుసిల్లిపోయేవాడు.

అది కనిపెట్టాడు శకుని ఒకనాడు మెల్లగా దగ్గిరికివచ్చాడు. "బాబూ, ఏమిటిది? ఇన్నాళ్ళయింది, నాతో మాట్లాడ్డమే మానేశావు! కలకల్లాడుతుండే నీ మొహం గొక్కుపోయింది! ఎప్పుడు చూసినా నిట్టూరుస్తూ పరధ్యానంగా వుంటావు! రారాజువి నీ ప్రతాపంముందు తలవొంచనిరాజు లేడు. నీలాంటివాడికి ఇలా దీర్ఘాలోచన దేనికి!" అంటూ అడిగాడు

"ఏం చెప్పమన్నావు శకునిమామా?" అంటూ పెద్దవూపిరి వొదిలాడు దుర్యోధనుడు "నువ్వూ చూశావుకదా మయుసభ! ఏయుగంలోఅయినా, ఎక్కడయినా అలాంటిది విన్నామా? ప్రపం చానికే అది అపూర్వం. ఎలా సంపాదించాడో ధర్మరాజు! సర్వ సౌభాగ్యాలూ దాంతోనే వచ్చాయి అతడికి. దాన్ని చూసే, రాజులు రైతుల్లాగ వచ్చి కుప్పలుకుప్పలుధనం కప్పం చెల్లించి వెళ్ళారు. సార్వభౌములే అయిపోయారు కుంతికొడుకులు. ప్రపంచ మంతటా పాండవుల ప్రభే వెలిగింది.

"అవాళచూడూ, శిశుపాలుడి శిరస్సు కృష్ణుడు నరికినప్పుడు అంతమందిరాజులూ, శూరులూ వొక్కరయినా నోరెత్తారూ! పై పెచ్చు జై అంటే జై అన్నారు.

బలవంతులయిపోయారు పాండవులు. దిగ్విజయంలో దోచి తెచ్చారు ధనరాసులు. పాలుపొంగినట్టు పొంగుతోంది వాళ్ళ

సంపద చూస్తూ సయించవలిసిందేనా మనం? వాళ్ళ గొప్ప తన తక్కువా మానసం కలవాడు ఎవడు భరిస్తాడు చెప్పు! వాళ్ళ రాజ్యమూ సిరీ సంపదా మనం ఎలా లాక్కోవడమనే అహో రాత్రాలూ బాధపడుతున్నాను'' అంటూ నిట్టూర్చాడు

సర్వనాశ మాతులః

''ఇంతమాత్రానికేనా ఇంతవిచారం పెట్టుకున్నావు!'' అంటూ అందుకున్నాడు శకుని. ఇదెంతసేపు మాట! పద, మీ నాన్న చేత ఊఁ అనిపించు చాలు. నిమిషాలమీద వాళ్ళరాజ్యమూ ధనమూ మయసభా అన్నీ లాక్కొని కట్టుబట్టలతో వాళ్ళని బయటికి పంపి స్తాను'' అన్నాడు ఏవేవో బోధించి దుర్యోధనుణ్ణి ధృతరాష్ట్రుడి దగ్గిరికి తీసుకు వెళ్ళాడు

''బావా, నీ కొడుకుఅవస్థ చూశావా!'' అంటూ దుర్యోధనుడి శరీరస్థితి వర్ణించి చెప్పాడు. అదిరిపడ్డాడు ధృతరాష్ట్రుడు కొడుకుని తడివి చూశాడు. ''ఏమొచ్చిందోయి నీకు. ఇలా చిక్కిపోయావు బాబూ!'' అంటూ దుఃఖపడ్డాడు. కౌరవరాజ్యమంతా నీ చేతుల్లోనే వుంది. తమ్ములూ సిబ్బందీ నువ్వంటే కళ్ళనద్దుకుంటారు. కిట్టనివాడంటూ లేడు నీకు. దేవేంద్రుడికిసహా కావలిసిన భోగభాగ్యాలు నీ కళ్ళముందున్నాయి. యావన్మందిరాజులూ, నీమాటంటే, చేతులుకట్టుకు నుంచుంటారు రారాజువి నువ్వు మరి నీకు దేనికని చింత! రాజ్యభోగాలమీద ఈ వైరాగ్య మెందుకు!'' అంటూ తల నిమిరాడు.

''ఏమివుంటే ఏంలాభం, నా అదృష్టమదీ'' అంటూ ఆరంభించాడు దుర్యోధనుడు ''పాండవుల్ని చూడండి అఖండంగా వెలుగుతోంది వాళ్ళ ప్రభ ఏ దేవేంద్రుడు వాళ్ళ సాటికివస్తాడు! ప్రపంచంలో ఎక్కడచూసినా వాళ్ళకీర్తి, వాళ్ళప్రతాపమే. ఉత్తర కురుభూములు మొదలుకొని ఉత్తరాదియావత్తూ ఎక్క అర్జునుడు కొట్టుకువచ్చాడంటే సామాన్యవిషయమా! మూడడుగులలోనూ

ముల్లోకాలూ ఆక్రమించిన త్రివిక్రముడంతపని చేశాడు! స్నేహం. బాంధవ్యం- ఈ రెంటివల్లా కృష్ణుడూ, ద్రుపదుడూ తప్పిస్తే నాలుగు సముద్రాలమధ్యావున్న యావన్మంది రాజుల్లోనూ కప్పం చెల్లించని వాళ్ళుంటూలేరు పాండవులికి. కొండలతోనూ అడవులతోనూ ద్వీపాలతోనూవున్న ఈ విశాలప్రపంచమంతా వాళ్ళ స్వాధీనం లోనే వుంది. నేనూ వొక రాజపుత్రుణ్ణే కదా! చూస్తూ ఎలా సయించమన్నారు ఇది?

"రత్నాలూ అవీపుచ్చుకోవడం నామీద పెట్టాడు ధర్మరాజు. బాబయ్యా, ఏం చెప్పమన్నారు? సమస్తసముద్రాల్లోనూ వున్న రత్నాలు యావత్తూ ధర్మరాజు ఇంట్లో వున్నాయంటే నమ్మండి. యజ్ఞదీక్షలోకూచున్న అతడికిగాడ కాంభోజదేశాల రాజులు రంగు రంగుల తివాసీలూ చిలకరంగుల గుర్రాలూ తెచ్చారు సింహాళం కేరళ చోళ పాండ్యదేశాలనించి వచ్చిన రాజపుత్రులు లెక్కలేనన్ని మంచిమంచి సముద్రముత్యాలూ పగడపుచెట్లూఏలకులూ అగరుచందనాలూ పట్టుకు వచ్చారు. ధగధగా మెరుస్తూన్న మణిహారాలతోనూ ఘుమఘుమలాడుతూన్న మదజలాలతోనూ వున్న పద్నాలుగు వేల ఏనుగులు ఇచ్చాడు శ్రీకృష్ణుడు. అర్జునుడూ కృష్ణుడూ పైకి శరీరాలు వేరుగాని వొక్క ప్రాణంలా నడుచుకుంటారు.

"ధర్మరాజంటే పడిచస్తాడే - ఆ విరాటరాజు - రెండు వేల ఏనుగు లిచ్చాడు. ద్రుపదుడు వెయ్యిఏనుగులూ పదివేలగుర్రాలూ మాంచివొయ్యారంగల పద్నాలుగు వేలమంది యువతులూ పదహారు వేలమంది దాసీలూ కట్నమిచ్చాడు. కురుదేశం కుకురదేశం కేకయ దేశం కాశ్మీరం కాంభోజం గాంధారం మద్రదేశం ద్రవిడదేశం మగధ మాళవం కళింగం బంగాళం గౌడదేశం ఆంధ్రదేశం కేరళం కోసలం మొదలయినరాజులూ, ప్రాగ్జ్యోతిషం భగదత్తుడూ, మరుకచ్ఛపనివాసులూ, చేదిరాజులూ, అజానేయ బాహ్లిక హూణ పారశీక దేశాల గుర్రాలూ కొండల్లాంటి ఏనుగులూ ఇచ్చారు. దివ్య

వస్త్రాలు కట్టుకుని వొంటినిండా నగలతోవున్న వేలకొద్దీ అందక త్తె ల్నిచ్చారు. లెక్కా-జమా లేనన్ని మేకలూ గొర్రెలూ ఆవులూ గేదెలూ వెండితోనూ బంగారంతోనూ అల్లిన తివాసీలూ బట్టలూ ఇచ్చారు. మేరుపర్వతం వింధ్యపర్వతం మందరపర్వతం అడవుల్లోనూ, మత్స్య కీచక దేశాల వనాల్లోనూ వుండే పుళింద పారద బర్బర తురక శంకణ కొంకణరాజులు అడుగులకి మడుగులొత్తుతూ హేమశైలం రామశైలం కురుక్షేత్రాల్లో దొరికే గొప్పగొప్ప ఔషధాలూ, ఇంద్రనీలంరంగువీ, ఆరుద్రపురుగురంగువీ, కోయిలరంగువీ, నెమిలిరంగువీ, చిలకరంగువీ, మంచిమంచి గుర్రాలూ తెచ్చియిచ్చారు. పట్టుతోకుట్టిన హంసతూలికా తల్పాలూ పెద్దపెద్ద విచ్చుకత్తులూ మణులూ బంగారంచెక్కిన ఏనుగుదంతం పల్లకీలూ సవారీలూ కుర్చీలూ ఇచ్చారు. అర్జునుడి నేస్తమట - గంధర్వుడు చిత్రరథుడు-ఐదువందల గంధర్వజాతిగుర్రాలు ఇచ్చాడు. తుంబురుడనే గంధర్వుడూ అలాంటివే మరి వంద గుర్రాలిచ్చాడు

ధర్మరాజుసంపదతో సరయిన సంపదకల రాజులు పూర్వంగాని ఇప్పుడుగాని లేరు, ఇకముందూ వుండబోరు. ఇంతగొప్పగా వున్న పగవాళ్ళపచ్చ చూస్తూ రాజన్నవాడు ఎవడు సయిస్తాడు? మీరన్నట్టు నాకు ఏ లోపమూ లేదు. ఐతే. అగ్నిహోత్రంలాగ అహోరాత్రాలూ ఇదే నన్ను దహించివేస్తోంది.

''ఏంచెప్పనూ! ఒకలక్షమంది బ్రాహ్మలు భోజనం చేసేసరికి దానంతట అదే మోగేశంఖం రాజసూయమన్నాళ్ళూ వొక్క-నిమిషమన్నా ఆగకండా అదేమోగడం మోగింది. ప్రపంచం నాలుగు చెరుగులనించీ వచ్చినవాళ్ళ యావన్మంది భోజనాలూ ప్రతీ దినం తానే స్వయంగా విచారించేదిద్రౌపది. రాజులూ బ్రాహ్మలూ వైశ్యులూ శూద్రులూ బంధువులూ స్నేహితులూ సైనికులూ పనివాళ్లూ పేదలూ సాధులూ-అందరూ తృప్తిగా తిని లేచాక అర్ధరాత్రి వ్వుడుగాని తాను ఎంగిలిపడేది కాదు.

"ఎంత తక్కువవాడయినా రాజసూయంలో గౌరవం పొందాడేకానీ ఇదిగా రాలేదు. అప్పుడెప్పుడో హరిశ్చంద్రుడు చేసిన రాజసూయం ధర్మరాజు యజ్ఞంకింద దిగదుడుపుకి రాదన్నారు అంతమంది మునులున్నూ.

"అవభృథస్నానమప్పుడు ఋషులతోనూ రాజులతోనూ దేవేంద్రుడిలా, కూచున్నాడు ధర్మరాజు. పర్వతుడూ నారదుడూ వ్యాసుడూ మొదలయిన మహామునులతో ఎన్నో తీర్థజలాలు తెచ్చి అభిషేకం చేశాడు ధౌమ్యుడు. ముత్యాల తెల్లగొడుగు పట్టాడు సాత్యకి. రెండుపక్కలా రత్నదండాలతో చామరాలువేశారు భీమార్జునులు మూర్ధాభిషిక్తులైన మహారాజుల్ని వొక్కొక్కరినీ తెచ్చి ధర్మరాజుకి మొక్కిస్తూవుండేవాళ్ళు కృష్ణుడూ నకులసహదేవులూ ధృష్టద్యుమ్నుడున్నూ.

"ఆ డాబూ అదంతా చూసి, నేనూ మరికొంతమందిమీ నిశ్చేరపోయి నుంచున్నాము. మాకేసి మరింత ఇదిగా చూశారు పాండవులు. కృష్ణుడూ ద్రౌపదీ సాత్యకీ- వీళ్ళంతా ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు.

"వేదపండులయిన బ్రాహ్మల్ని ఎనభయి ఎనిమదివేలమందిని ఇంట్లో వుంచాడు ధర్మరాజు వాళ్ళకని వొక్కొక్కరికీ ముప్ఫయి మంది నౌకర్లని ఇచ్చాడు. పదివేలమంది ఊర్ధ్వరేతస్కులు ప్రతీదినం అతడి పంక్తిని ఎత్తుపీటలమీద వెండిపాత్రల్లో తిని లేస్తారు.

"అదృష్టవంతులు పాండవులు. నచ్చినతిండి తింటున్నారు. మెచ్చినబట్ట కడుతున్నారు. అన్నివైభవాలూ అనుభవిస్తున్నారు. పురుషార్థాలు సాధిస్తున్నారు నా దురదృష్టం! చెడిపోయినవాడిలా పగవాళ్ళపొంగుచూస్తూ చేతులుపిసుక్కు కూచోమన్నాడు దేవుడు!" అంటూ మరింత నిట్టూర్చాడు.

"ఎందుకింత కష్టపడతావు బాబూ," అంటూ ఎత్తుకున్నాడు శకుని. పాండవుల ధనమూ గినమూ చిటికెలో నీచేత పెడతాను.

జూదమంటే చెవికోసుకుంటాడు ధర్మరాజు. అంతేకాని అందులో మాయలూ మర్మాలూ ఎరగడు. పాచికల్లో పై చెయ్యి మనది. మన మాయముందు మరొకడు పనికిరాడు. ఇలాఅనేసరికి ఓడిస్తాను ధర్మరాజుని'' అన్నాడు.

చేటంత మొహమయింది దుర్యోధనుడికి. చప్పున లేచి తండ్రి పాదాలమీద పడ్డాడు "శకునిమామ చెప్పిందానికి అంగీకరించండి బాబయ్యా'' అన్నాడు.

''అలాగే కానీ,'' అంటూ కుమారుణ్ణి బుజ్జగించాడు ధృతరాష్ట్రుడు. ''ఐతే, విదురుడితో మాత్రం విచారిద్దాము. మంచీ చెడ్డా తెలిసినవాడు విదురుడు. ముందూ వెనకా ఆలోచించి చెపుతాడు. భీష్ముడు తాతయ్య బాహుబలమూ, విదురుడి నీతిబలమూ- ఈ రెండే మనరాజ్యం నడుపుతున్నాయి. నీకు తెలియందేముంది? అంచేత ఈ మాట విదురుడిచెవిలో వేసి, అతను చెప్పిన ప్రకారం చేద్దాం'' అన్నాడు

''అదే మీరు వదలరు'' అంటూ లేచాడు దుర్యోధనుడు. మనఇంట తింటూ పాండవులంటే పడిచస్తాడు విదురుడు, మామ చెప్పిందానికి ఎలాగూ ఒప్పుకోడతడు. అతడితో ఏంపని! ఒప్పుకోండి మీరు. కాదంటారా, ఇదిగో ఇప్పుడే అగ్గిలోపడి చస్తాను మీరూ మీ విదురుడూ హాయిగా వుందురుగాని'' అన్నాడు.

దాంతో కాళ్లూ చేతులూ ఆడలేదు ధృతరాష్ట్రుడికి. అది కూడనిపని అని తనకి తెలుసు. కాని హఠించి కూచున్నాడు కుమారుడు. సరే అని సమ్మతించాడు తుదకి.

వెంటనే మంచిమంచి శిల్పుల్ని వెయ్యిమందిని పిలిపించాడు ధృతరాష్ట్రుడు బంగారంచెక్కిన వేలాది స్తంభాలతోనూ, చిత్ర చిత్రములయిన ద్వారాలతోనూ, రత్నాలుచెక్కిన చీడీలతోనూ ఒక చక్కని సభామందిరం తయారుచెయ్యమన్నాడు. విదురుణ్ణి వొంటరిగా పిలిచాడు "దుర్యోధనుడూ శకుని ధర్మరాజుతో జూద

చూడాలని సరదాపడుతున్నారు ఏమంటావు?'' అంటూ మెల్లగా చెప్పాడు. విని, బెదిరినట్టయ్యాడు విదురుడు. ''జూదం ప్రజాక్షయానికి కారణమవుతుంది. అవును, ద్వాపరంపోయి కలి సమీపిస్తోంది మరి!'' అనుకుంటూ తనలోతాను తలపూపుకున్నాడు. ధృతరాష్ట్రుడితో ఇలా అన్నాడు. ''ఎంతఘోరం! నీ కొడుకులు కపటం చేసి పాండవులమీదికి కలబడుతున్నారు. నువ్వు సమ్మతిస్తున్నావు. నేను మాత్రం ఇది ఒప్పుకోను. వాళ్ళూ వీళ్ళూ ఐకమత్యంగా వుండేట్టు చేయడం మనవిధి. అంతేకాని, ఇదేమిటి? అన్యాయం ఎంత శాంతులయినా జూదంలోకూచుంటే కలహం తప్పదు వద్దు. నీ బుద్ధంతా వినియోగించు! శకుని దుర్యోధనుల దుర్బుద్ధి మళ్ళించు. కౌరవవంశం నాశనం కాకుండా కాపాడుకో.''

''అదేమిటి? కలహం వస్తుందంటావేమిటి?'' అన్నాడు అంధరాజు. 'నువ్వూ నేనూ భీష్ముడూ దగ్గిరే వుంటాంగా! చెడ్డ ఎందుకు వస్తుంది? కాదనకు. సమ్మతించు. నువ్వే వెళ్ళి ధర్మరాజుని పిలుచుకురావాలి. ఊరికే సందేహించకు. ఇందులో భయపడవలసిందే లేదు. లే. బాగా పరిగెత్తే గుర్రాలు రథానికి పూయించు. ఇంద్రప్రస్థంవెళ్ళి ధర్మరాజుని తీసుకురా'' అన్నాడు

మాట్లాడకండా భీష్ముడిదగ్గిరికి వెళ్ళాడు విదురుడు. శకునీ దుర్యోధనుడూ ధృతరాష్ట్రుడూ కలిసివేసిన ఎత్తు చెప్పాడు. ''ఇది అక్రమం'' అంటూ ఉభయులూ ఆలోచనలో పడ్డారు.

ఇంతలో కొడుకుని పిలిచాడు ధృతరాష్ట్రుడు కొత్తగా కట్టించిన సభచూపించాడు. జూదం కూడదంటూ మళ్ళీ బోధించాడు. 'బాబూ, జూదంవల్ల మీలోమీకు విరోధం పుడుతుంది. దాంతో ప్రజకీ దేశానికీ ఘోరమయిన అనిష్టం కలుగుతుంది. నువ్వూ పాండవులూ ఎప్పటిలాగ కలిసీ మెలిసీ స్నేహంగా వుండండి వాళ్లూ నీ అన్నదమ్ములే కదా! వాళ్ళసంపద నీకు కన్ను కుట్టడమేమిటి? మోసంచేసి ఇతర్లసొమ్ము కాజెయ్యాలనిచూడడం

పాపం. పాపం సర్వనాశనం తెచ్చిపెడుతుంది. ఇందుకే విదురుడు వొప్పుకోలేదు దీనికి. ఏది ధర్మమో, ఏది కాదో అంతా తెలిసినవాడతడు. అతడుకూడదన్నది మనం చెయ్యడం శ్రేయస్కరం కాదు. నువ్వనుకుంటున్నావు కానీ, ధర్మరాజు సంపదకంటే అయిదురెట్లు సంపద వుంది నీకు. అతడి యజ్ఞాన్ని మించినట్లు నీ ఇష్టంవచ్చిన యజ్ఞం చేద్దువుగాని. కావలిసినన్ని దక్షిణలూఅవీ ఇద్దువుగాని భూలోకంలోని రాజులు యావన్మందీ నీకూ కట్నాలు పట్టుకువస్తారు. నామాట విను'' అన్నాడు.

''ధర్మరాజుతో జూదమాడడమే నాయజ్ఞం'' అంటూ ప్రారంభించాడు దుర్యోధనుడు ''అదే అన్నికట్నాలూ పుచ్చుకోవడానికి తగినమార్గం. ఏమంటారా, జరిగింది చెపుతాను వినండి. రాజసూయం తరవాత మీరంతా ముందు వచ్చేశారా, మయసభ చూడాలని అక్కడే వున్నాను నేను. ప్రపంచంలో ఏనాడూ ఏరాజన్నా ఎరుగునా అలాంటిసభ? నిర్మలమయిన స్ఫటికంరాళ్ళతో చంద్రకాంతిలా మిలమిలా మెరుస్తుందది. రకరకాల రత్నాలతోనూ, బంగారంతోనూ చూడడానికి రెండుకళ్ళు చాలవనిపిస్తుంది. దాని శిల్పానికి ఆశ్చర్యపోతూ లోపలికివెళ్ళి చూస్తున్నాను నేను. నీళ్లు లేనిచోట ఇంద్రనీలమణుల కాంతివల్ల నీళ్ళని భ్రమపడ్డాను. తడిసిపోతాయేమో అని కట్టుబట్టలు ఎత్తికట్టాను. నీళ్లతో నిండివున్న స్ఫటికంరాళ్ల బావుల్లో మెరకనేల అనుకుని దిగబడిపోయాను. తడిసి ముద్దయాను. 'ఇది ఫలానా ఇది ఫలానా' అని ముందు చెప్పడం లేదు సరికదా, నన్నుచూసి విరగబడి నవ్వాడు భీముడు. నౌకర్ల చేత పొడిబట్టలు పంపాడు ధర్మరాజు.

''ఆ సభలో చిత్రమేమంటే తెరిచినద్వారం మూసినట్టూ, మూసింది తెరిచినట్టూ కనపడేది. తీసే వున్నాయని వెళ్లబోయి మూసినతలుపులు గుద్దేశాను. నుదురు బొడిపికట్టింది. దెబ్బతిన్న నన్నుచూసి జాలిపడడానికిబదులు వేలకొద్దీ చెలికత్తెల మధ్యనించి

పకపకానవ్వింది ద్రౌపది. చచ్చినట్టనిపించింది నాకు. ఎలా బయటికి రావాలో అర్థం కాలేదు. ఆ అవస్థ అనుభవించాలి కాని ఎలా చెప్పను! 'ఇదిగో ఇదీ వాకిలి ఇలా రా' అంటూ సరయిన ద్వారం చూపించి బయటికి లాగారు నకులసహదేవులు. అది తలచుకున్నప్పుడల్లా శల్యంలా కలుక్కుమంటున్నాది నా హృదయం.

"గొప్పవాళ్లు బూజుపట్టిపోతున్నారు తక్కువవాళ్లు పయికి వస్తున్నారు ఒక నీతి నియమం లేదు కాలానికి. ఏమయినా కళ్ల ఎదట శత్రువులు జోరవిరుచుకు నడుస్తూంటే ఎలావూరుకోమంటారు!

"చెట్టు మొదల పుట్ట చిన్నదయినా ఆ చెట్టునినాశనం చేస్తుంది. అలాగే అల్పుడేఅయినా మనిషి పరాక్రమంతో పయికివచ్చాడంటే చుట్టుపక్కలవాళ్లకీ పుడిపెడతాడు. పగవాళ్ల అభివృద్ధి ఉపేక్ష చేస్తే, వ్యాధి మహావ్యాధిఅయినట్టు అసాధ్యమై తుదకి సర్వనాశనం జరుగుతుంది. అంచేత పాండవుల ఔన్నత్యం సయించకూడదు మనం. ఎలాఅయినా సరే, అది పాడుచేసితీరాలి, అలా కాకపోతే నా మనో వ్యాధికి మరోమందు లేదు.

"పగవాణ్ణి సాధించడానికి ధర్మమేమిటి అధర్మమేమిటి? నముచిని నమ్మించి అధర్మంగా చంపలేదో దేవేంద్రుడు? సులువయిన ఉపాయంతో శత్రువుల సంపద కాజెయ్యడంకంటే పురుషార్థమేముంటుంది రాజులికి?"

పక్కనే వుండి దానికి తిగిప తాళం వేశాడు శకుని. "అవును" రథాలూ గుర్రాలూ ఏనుగులూ— ఈ సన్నాహమేమీ అవసరంలేదు వ్యూహాలుపన్నడం ప్రమేయమూ లేదు. ఇవతలసైన్యం అవతల సైన్యం కత్తులూ అవీతీసి ఆర్భాటం చేసుకోనక్కరలేదు. పాచికల్తో ఇట్టే నీకాళ్లముందు వాళ్లరాజ్యం పడేస్తాను. గోటితోపోయేదానికి గొడ్డలిదాకా ఎందుకు? ధర్మరాజుని పిలిపించు. పాచికలముందు కూచోబెట్టు. చాలు. ఇది తప్పిస్తే మరోలాగ దేవత లయినా పాండవుల పూతికపుల్ల పట్టుకరాలేరు" అన్నాడు.

"ఊహూఁ, మీరేం చెప్పండి నేనుమాత్రం దీనికి వొప్పు కోను" అన్నాడు ధృతరాష్ట్రుడు, "విదురిడిమాటమీద నడచు కుంటున్నవాణ్ణి నేను. తెలిసినవాడతడు. బృహస్పతి చెప్పిననీతి శాస్త్రం రహస్యాలన్నీ ఎరుగును. జూదంవల్ల కలహంవస్తుందని స్పష్టంగా చెపుతున్నాడు. బలవంతులతో విరోధం తెచ్చుకోకపోవడమే మంచిది. ధర్మసమ్మతమయిన నామాట వినకపోయారో తరవాత పశ్చాత్తాప పడతారు. అంచేత ఈమాయజూదం మానండి ఎప్పటిలాగే సుఖంగా వుండండి" అన్నాడు.

కాదుగాక కాదనే పట్టుబట్టాడు దుర్యోధనుడు. "ప్రతీసారీ విదురుడు విదురుడే అంటారు మీరు అతడు అంగీకరించడని మొదటే చెప్పాను నేను ఇంతకీ మనం చేసేపనికి పైవాడిసలహా ఏమిటంటాను! తన అభిప్రాయం. పైవాడి అభిప్రాయం ఎప్పుడయినా వొకటవుతుందా చెప్పండీ! విదురుడు పాండవులమనిషి. పాండ వులు విదురుడివాళ్లు. ఎప్పుడూ వాళ్లమీదే పక్షపాతం విదురిడికి. గొర్రెకటికవాణ్ణినమ్మినట్టు అతణ్ణేఅప్పుడని అనుకుంటారుమీరు ఇంతకీ మేము ఏమంత తప్పుపని చెయ్యబోతున్నామని ? జూదం ఆడడంలో దోషంలేదని పురాణాల్లోనూ వింటున్నాం స్నేహంగా జూద మాడడంవల్ల దేవతల సాన్నిధ్యం లభిస్తుంది. అంచేత శకునిమామ య్యని ఇది నడిపించమనండి. ధర్మరాజుని పిలిపించండి" అన్నాడు.

ఎంతోసేపు ఆలోచించాడు, ధృతరాష్ట్రుడు. కాదంటే వినిపించుకునేట్టు లేడు కొడుకు. మళ్లీ విదుర్ణ్ణి పిలిపించాడు. "చూడూ, మనం కొత్తగా సభకట్టించాం కదా! ఇదిచూస్తే కుర్రాళ్లు ధర్మరాజూ వాళ్లూ సంతోషిస్తారు వాళ్లు, బాధ్యం చెయ్యకు వాళ్లని పిలుచుకురా. బంగారంతోనూ మణుల తోనూ ఎంతో చిత్రంగా వుందిది. ఈ సభామండపంలో మన వాడూ ధర్మరాజూ సరదాగా ఏవో రెండుఆటలు ఆడుకుంటారు, అంతమాత్రానికి మరేమీ మించిపోదు" అన్నాడు.

ఎంతో బాధపడ్డాడు విదురుడు. "వద్దంటే వినకుండా వున్నావు. ఈ మాయజూదం మన నాశనానికేవచ్చింది. ఇది మానుకుంటే మనకీ వాళ్ళకీ క్షేమం" అంటూ ఎంతో నూరిపోశాడు. లాభంలేకపోయింది,

"సరే, ఈ పాడుపని తప్పదు మనకి దైవయోగమే ధృతరాష్ట్రుడిచేత ఇలా ప్రేరేపిస్తున్నది" అంటూ సమాధానం చెప్పుకున్నాడు విదురుడు. "వెళ్ళివస్తాను" అంటూ బయల్దేరాడు. ఇంద్రప్రస్థం వెళ్ళాడు. తమ్ముళ్ళతోసహా ధర్మరాజుని చూశాడు. కుశలప్రశ్నలూఅవీ అయాక తానువచ్చినపని చెప్పాడు.

"కొడుకులంటే అమితవాత్సల్యం మా పెదనాన్నకి" అన్నాడు ధర్మరాజు. అతడు ఆదరంగా మమ్మల్ని పిలవమని పంపాడు నిన్ను. నువ్వా దయతో వచ్చావు బావుంది. కాని కొత్తసభ చూడడం, అందులో జూదమాడడమనున్నా! ఏమి శోభ! జూదంవల్ల మాలో మాకు విరోధాలు రగలకపోవు. ఐతే, నువ్వుచెప్పిందిమాత్రం కాదనలేం మేం. ఇలాగే పెదనాన్నమాటా కాదనలేకపోయివుంటావు నువ్వు. అదే న్యాయంకూడాను" అంటూ విదురుడివెంట బయల్దేరడానికే నిశ్చయించాడు ధర్మరాజు. దివ్యమయిన వస్త్రాలు కట్టుకున్నాడు. రత్నాలనగలు పెట్టుకున్నాడు. గంధమూ పూలమాలలూ వేసుకున్నాడు. ప్రయాణం ముందు బ్రాహ్మలికి బంగారమూ మణులూ దానంచేశాడు.

మంగళవాయిద్యాలు మోగుతున్నాయి. బ్రాహ్మలు ఆశీర్వాదాలుచేస్తున్నారు. వందిమాగధులు గానంచేస్తున్నారు. భట్రాజులు పొగుడుతున్నారు. రాజమందిరంనించి పైకివచ్చి రథంమీద కూచున్నాడు ధర్మరాజు. తమ్ములు నలుగురూ కుంతీదేవి ద్రౌపదీ ధౌమ్యుడూ మొదలయిన పరివారమూ వెంటవచ్చారు. రథాలు వచ్చి హస్తినాపురం రాజవీధిని నడుస్తూవుంటే, ఇసకవేస్తే రాలకుండా బారులుతీర్చి నుంచున్నారు ప్రజలు,

కోట దేవిడీముందు రథం దిగి ఇంతమందితోనూ ధృతరాష్ట్రుడి కొలువుకూటానికి వెళ్ళాడు ధర్మరాజు. వందమంది కుమారులతోనూ భీష్ముడూ శకునీ జయద్రథుడూ కర్ణుడూ కృపుడూ ద్రోణుడూ అశ్వత్థామా సోమదత్తుడూ మొదలయిన యావన్మంది తోనూ కొలువుతీర్చివున్నారు ధృతరాష్ట్రుడు. తమ్ములతో కూడా కలిసి పాదాభివందనం చేశాడు ధర్మరాజు. అక్కడనించి రాణివాసంలోకి వెళ్ళాడు. రాణివాసంలో భానుమతీ మొదలయిన కోడళ్ళమధ్య చుక్కల్లో రోహిణిలా వుంది గాంధారి. నమస్కారం చేశాడు ధర్మరాజు. పాదాలికి మొక్కింది ద్రౌపది. ద్రౌపదిని చూసి గాంధారి కోడళ్ళందరూ నిశ్చేరపోయారు. "ఉన్న అందమంతా ముద్దచేసి ఈమెని సృష్టిచేసినట్టున్నాడు బ్రహ్మ. కాకపోతే ఎవ్వరిదగ్గిరాలేని కాంతీ ఈ పొంకం ఈమె కెలావచ్చాయి?" అంటూ గుసగుసలాడారు. మచ్చరించుకున్నారు.

అవాళంతా కుశలప్రశ్నలతోనూ వాటితోనూ కులాసాగా గడిచిపోయింది. మర్నాడు తెల్లవారాక దుర్యోధనుడువచ్చి సభ చూద్దువుగాని రమ్మన్నాడు ధర్మరాజుని. తమ్ములతోకూడా వెళ్ళాడు ధర్మరాజు. గొప్పగొప్ప మణులతోనూ వేలకొద్ది స్తంభాలతోనూ ఎంతో ఇదిగావుంది సభ. చూసి మెచ్చుకున్నాడు ధర్మరాజు. అందరూ వొక రత్నాల నెలకట్టుదగ్గిర కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు.

ఆమాటా ఈమాటా ఆడి మెల్లగా జూదంమాట ఎత్తుకున్నాడు దుర్యోధనుడు. "రెండాటలు పాచికలు వేద్దాం. పొద్దుపోకండా వుంది. జూదం అంటే సరదాఅట కదా నీకు! నీతో సమానమయినవెయ్యి లేదనే చెప్తారు తెలిసినవాళ్ళు" అన్నాడు.

"వంచనా, జూదం-ఈరెండూ రాజనీతికి తగనిపనులు" అన్నాడు ధర్మరాజు. "ధర్మం తెలిసినవాళ్ళు ఈ రెండూ వొదిలిపెట్టాలి. రాజులికి జూదం పాపహేతువు. అందులోనూ మోసం

నేర్చిన కపటజూదగాళ్ళతో ఆడనేకూడదు. పొరపాట్నయినా అలాంటివాళ్ళతో ఆడామా మనధర్మాలన్నీ తుడుచుకుపోతాయి దాంతో. మరోమాట. మాయచేసి జూదంలో గెలవడం మహా పాపమనీ, ధర్మజూదంలో గెలవడం ధర్మయుద్ధంలో గెలిచినంత పుణ్యమనీ అసితుడయిన దేవలుడు* చెప్పాడు" అన్నాడు.

"అదేమన్నమాట," అంటూ ముందుకి వచ్చాడు శకుని. "జూదంలో నైపుణ్యం కలవాడంటే, లోకజ్ఞానం కలవాడూ మంచి బుద్ధిమంతుడూ ప్రసిద్ధికలవాడూ మంచి రాజనీతికోవిదుడూ అన్న మాట. అంచేత జూదమాడేవాళ్ళని నిందించడం తగదనే నామతం. మాయా కపటం సంగతి చెప్పవలసివస్తే బలంలేనివాళ్లు బలవంతుల్ని గెలవాలంటే బహువిధాల మాయా కపటం చెయ్యడం ఎక్కడా వున్నదేను. నిజంగా చెయ్యవలసిందీ అదే. జూదం నీకు చేతకాదంటే అది వేరేసంగతి. ఆమాట స్పష్టంగా చెప్పు ఇన్ని డొంక తిరుగుళ్ళెందుకు!" అన్నాడు.

'పిలిస్తే బలవంతాన రానే వచ్చాను. తీరా వచ్చి తిరిగి పోవడం తగని పని' అంటూ ఆటకి సిద్ధపడ్డాడు ధర్మరాజు.

జూదం

కర్పూరం కస్తూరి గంధం- వీట్లతో అలికి సిద్ధంగా వుంది జూదమాడే వేదిక. పువ్వులతోనూ చందనంతోనూ పూజచేసిన

---

* అసితుడి కుమారుడు దేవలుడు. అసితుడు కాశ్యపుడి కుమారుడు. దిలీపుడి యజ్ఞసమయంలో వొక అప్సరసని చూసి కాశ్యపుడికి రేతస్ఖలన మయిందట. అది స్రువంలో పోసి అగ్నిలో వేశాడట. అందులోంచి అసితుడు పుట్టాడట.

తథా నృపర్షేర్దిలీపస్య యజ్ఞే స్వర్గస్త్రియాం కాశ్యప అగతాస్థః
స్రువం గృహీత్వా స్రవజాత్మతేజశ్చిక్షేప వహ్నావసితో యతో౽భూత్॥
అశ్వఘోషుడి సౌందరనంద. 7 82

హిమవంతుడికి పార్వతీ ఏకపర్ణా ఏకపాటలా అని ముగ్గురు కూతుళ్ళు. ఏకపర్ణ అసితుడి భార్య. ఈ దంపతుల కుమారుడు దేవలుడు. బ్రహ్మాండపురాణం.

సొగటాలపాలీ ముందు సరిచేసుకుని వొకపక్క కూచున్నారు శకుని వివింశతీ చిత్రసేనుడూ వికర్ణుడున్నూ.

"వీళ్లలో ఎవరు నాతో ఆడతారు ?" అని అడిగాడు ధర్మరాజు. "నా స్థానే మా మామ అడతాడు" అన్నాడు దుర్యోధనుడు.

"ఇతడు వొడ్డిన పందెం ఎంతయినా సరే. ఇవ్వగలనే పూచీనాది ఇదిగో ముందు ఇవి వొడ్డుతున్నాం" అంటూ చేతి రత్నాలకడియాలు తీసి కిందపెట్టాడు.

"ఒకళ్లకోసం మరొకళ్లు జూదమాడడం గట్టిపేచీయే" అంటూ ఆటలో కూచున్నాడు ధర్మరాజు. అటు శకునీ, ఇటు ధర్మరాజూ ఆరంభమయింది ఆట రత్నాల కడియాలికి మణి హారాలు వొడ్డాడు ధర్మరాజు. ఇంతలో భీష్ముడూ ధృతరాష్ట్రుడూ విదురుడూ కృపుడూ ద్రోణుడూ అశ్వత్థామా వాళ్ళూ వచ్చారు ఎత్తయిన సోఫాలమీద కులాసాగా ఆట చూస్తూ కూచున్నారు

వచ్చిన సొగటాలు దొర్లిస్తున్నాడు మాయలమారి శకుని. తొలిఆటలోనే వోడిపోయాడు ధర్మరాజు. "సీశా నేను వోడతాను ?" అంటూ మళ్లీ పందెం కాశాడు ధర్మరాజు మళ్లీ వీగిపోయాడు. మళ్లీ కాచాడు. మళ్లీ వోడిపోయాడు ఓడినకొద్దీ తమకం హెచ్చయింది ధర్మరాజుకి. హెచ్చినకొద్దీ ఆడుతూనేవున్నాడు. ఆడినకొద్దీ వోడిపోతూనే వున్నాడు. ఓడినకొద్దీ ఈసూ పంతం పెరుగుతూనేవున్నాయి.

వేలకొద్దీ బంగారం మొహర్లు నిండి ఎన్నోలక్షల హుండీలతో వున్న భాండాగారాలు వొడ్డాడు ధర్మరాజు. వీగిపోయాడు.

మంచి మంచి జాతిరత్నాలు వజ్రాలు వైడూర్యాలూ పచ్చలూ పగడాలూ ముత్యాలూ పుష్యరాగాలూ కెంపులూ గోమేధికాలూ నీలాలూ- ఇవన్నీ కుప్పలు కుప్పలుగా వున్న రత్నాల కొట్లూ వొడ్డాడు. ఓడిపోయాడు.

పుట్లకొద్దీ బంగారంతో భర్తీగా వున్న నాలుగువందల బంగారం కోటార్లు కాశాడు. పోగొట్టుకున్నాడు

రత్నాల చిరుగంటల మాలలతో సహా లెక్కా జమా లేని గుర్రాలూ వోడిపోయాడు.

బంగారం కట్టుతాళ్ళతోనూ అంబారీలతోనూ కూడా మదపు టేనుగులు వందలకొద్దీ వోడిపోయాడు

నిలువునా రత్నాల తొడుగుతో వున్న వేలకొద్దీ ఆడ వాళ్ళని వోడిపోయాడు.

లక్షమంది పరిచారికల్ని వోడిపోయాడు.

అర్జునుడికి చిత్రరథు డిచ్చిన అయిదువందలు గంధర్వజాతి గుర్రాలూ, తొలివించీ పాలూ బియ్యం తింటూ పెరిగిన కోటాను కోట్లు జాతిగుర్రాలూ, మేకలూ గొర్రెలూ ఆవులూ గేదెలూ గాడిదలూ కంచరగాడిదలూ-అన్నీ వోడిపోయాడు

ఇలా ప్రతీదీ వొడ్డడం, వోడిపోవడం తప్ప వొక్కసారీ గెలిచిన పాపాన పోలేదు ధర్మరాజు. చూసి ఏంచెయ్యాలో తోచలేదు విదురుడికి ధృతరాష్ట్రుడి దగ్గిరికి వచ్చి మెల్లగా చెప్పాడు. "దుర్యోధనుడు దుర్మార్గుడు. ముందు చెడ్డా తరవాత వీడూ పుట్టారు. అందుకనే వీడు పుట్టినప్పుడు నక్కలు కూశాయి. ఎన్నో దుశ్శకునాలు కనిపించాయి పవిత్రమూర్తులయిన మహా భీష్ముడూ భీమసేనుడూ ప్రతీపుడూ శంతనుడూ పుట్టిన వంశం వీడి మూలంగా పాపభూయిష్టం కాబోతున్నది. 'ఒకడినల్ల కులం నష్టపడుతున్నప్పుడు, ఆవొక్కణ్ణీ వొదిలిపెట్టి కులం రక్షించడం ధర్మం" అని శుక్రాచార్యుల వచనం. కులంకోసమనే కదా యాదవులూ వృష్ణులూ కృష్ణుడిచేత కంసుణ్ణి చంపించారు.!

అర్జునుణ్ణి పంపు, నువ్వు అనుజ్ఞ ఇస్తే చాలు. దుర్యోధనుణ్ణి నిరోధిస్తాడు. నీ వంశానికి విపత్తుతప్పుతుంది. ప్రజలా

హాయిగా సుఖపడతారు. కులంలో ఈ కలహ మెందుకు? ధర్మం విచారించు. ఒక నక్కని ఇచ్చి సింహాలు పుచ్చుకుంటే తప్పేముంది? గుణంలేని అధముడు దుర్యోధనుడు. అతణ్ణి బహిష్కరించు. పాండవుల్ని పక్కనిపెట్టుకో. ఇదే నీకు క్షేమం. ఇంతకీ పాండవులు పయివాళ్ళేగదు కదా! బొగ్గులకోసం పూల చెట్లూ పళ్ళచెట్లూ తగలబెట్టే బొగ్గులవాడిలా, దురాశచేత కౌరవ వంశమే కాలుస్తున్నాడు నీకొడుకు. ఆహోతుల మీదికి కాలుదువ్వే నక్కలాగ పాండవులతో విరోధంపెట్టుకుంటున్నాడు. జూదపు సొమ్ముకోసం ఆశపడకూడదు. ఇంతతో అయినా ఈ మాయ జూదం మాన్పించు'' అంటూ ఎంతో చెప్పాడు.

విదురుడు ఇంత మొత్తుకున్నా పలుకూ వులుకూ లేకండా వూరుకున్నాడు ధృతరాష్ట్రుడు. దాంతో దుర్యోధనుడి దగ్గిరికే వెళ్ళాడు విదురుడు.

''ఇదిగో, శకునిమంత్రంలో పడ్డావు. మాయ జూదమాడి అన్నదమ్ముల సంపద దోచుకుంటున్నావు. నీ పాడుబుద్ధికి ఛీ అంటుంది లోకం. పరాజయమెరగని పాండవసింహాలు ధైర్యవంతులు, విక్రమవంతులు మోసంచేసి వాళ్ళని ఓడించావు. బాగుపడతావా?'' అన్నాడు.

''తిన్నయింటి వాసాలు లెక్కపెట్టేగుణం ఎన్నడూ పోదు నీకు'' అంటూ ధుమధుమలాడాడు దుర్యోధనుడు. ''పరాయి వాళ్ళనే పొగుడుతావు పాండవుల పక్షమే పలుకుతావు. నన్నూ నా తమ్ముళ్ళనీ పడతిడతావు. ఇంటికి చేట్టూ పొరుగుకి లక్ష్మి అన్న నీతి నీది. ఒడిలో నాగుబాములా వున్నావు మాదగ్గిర. సులువుగా శత్రువుల సంపద సంపాదించడం రాజుల ధర్మం. ఐనా, పిలవని పేరంటానికి వచ్చి నీతులు చెప్పడమెందుకు? చెప్పమని ఎవడన్నా అడిగాడా ఏమన్నా నా? అంత చెప్పాలనేవుంటే నీమాటలు వినేవాళ్ళదగ్గిరికి దయచెయ్యి మాదగ్గిర చెప్పకు'' అన్నాడు.

"అవును, చెడ్డనేర్చేవాళ్ళూ నీలాంటి మహానుభావులూ చెప్పేవి నచ్చుతాయి నీకు" అన్నాడు విదురుడు. మామాట లెలా పనికివస్తాయి? అసలు రాజుల లక్షణమే అంత! అపథ్య మయినా ప్రియంగావుంటే చాలు. పథ్యమయినమాట అప్రియ మయితే సరి, రుచించదు అంచేతే 'అప్రియమయినా హితం చెపుదాము అన్నవాడు దొరకడు. మొదట అప్రియంగా వున్నా, చివర హితం కూర్చేమాట చెప్పేవాడే కావలసినవాడు. బల వంతంగా అయినాసరే, అలా మొగమాటం లేకండా చెప్పేవాడే మిత్రుడు. గంపెడు పిల్లలతో వున్నవాడు ధృతరాష్ట్రుడు. అతడి మంచికే పాటుపడే వాణ్ణి నేను అన్యథా భావించి తూలనాడు తున్నావు పాండవులతో తెచ్చుకున్న పగకి ప్రతిఫలం లభించినపుడే తెలుసుకుంటావు" అంటూ మాట్లాడకండా కూచున్నాడు.

చరాస్తి పిసరంత లేకుండా పీగిపోయాడు ధర్మరాజు. "ఉన్న దంతా వోడిపోయావు ఇక వడ్డడానికి ఏముందో చూపెట్టి మరీ పాచికలుపట్టు" అంటూ పాచికలు ముందు తోసి, ఆటకట్టిపెట్టి కూచున్నాడు శకుని.

"ఐతే కాసుకో, నా సామ్రాజ్యం యావత్తూ వొడ్డు తున్నాను" అంటూ సొగటాలు దొర్లించాడు ధర్మరాజు. ఇంత వరకూ ఏం జరిగిందో ఇప్పుడూ అదే జరిగింది. ఓడిపోయాడు ధర్మరాజు. దేవబ్రాహ్మణ వృత్తులు తప్ప రాజ్యమంతా వోడి పోయాడు. బ్రాహ్మల్ని తప్ప రాజ్యంలోని ప్రజనీ రాజపుత్రుల్నీ వొక్కొక్క ఆటకీ వొడ్డి పీగిపోయాడు అంతతోనూ ఆట కట్ట లేదు. సహదేవుణ్ణి వొడ్డాడు ఓడిపోయాడు నకులుణ్ణీ వొడ్డాడు. ఓడిపోయాడు. అర్జునుణ్ణి వోడిపోయాడు. భీముణ్ణి వోడిపోయాడు. చక్రవర్తుల్లాంటి తమ్ముల్ని నలుగుర్ని పీగిపోయి, తుదకి తన్ను తానే వొడ్డుకున్నాడు. ఓడిపోయాడు. చివరికి చేసేదిలేక చేతులు పిసుక్కుంటూ కూచున్నాడు.

"నిన్నే వొడ్డుకున్నావే ? నువ్వు వొడ్డాలంటే వేరే ధనం లేకపోలేదే! మరిచిపోయావేమో ద్రౌపదిని ? అది నీదికాదా ?" అన్నాడు శకుని.

"ఊఁ ఇదిగో ద్రౌపదినే వొడ్డుతున్నాను" అంటూ పాగటాలు వేశాడు ధర్మరాజు. ఈ సారీ తానే వీగిపోయాడు. ఐపోయింది. ఇహ వొడ్డడానికి పూచికపుల్లయినా మిగలలేదు. జూదంలో అంతా వెళ్ళిపోయింది. కూలిపోయాడు ధర్మరాజు. దీనంగా కూచున్నాడు

అతణ్ణి చూసి భీష్ముడూ ద్రోణుడూ కృపుడూ మొదలయిన వృద్ధులు చెమట్లుపోసుకున్నారు. తలలు వంచుకున్నారు. నోట మాటరాలేదు వాళ్ళకి తలవంచి మొహం పక్కకి తిప్పుకున్నాడు విదురుడు. దుఃఖిస్తూ కూచున్నాడు. ఆట చూసిందికి మూగిన జనంలో కంట నీళ్ళుపెట్టనివాళ్ళు లేరు. సభ సభంతా సముద్రఘోషలా వొక్కసారి అల్లకల్లోలమైంది. దుశ్శాసనుడూ కర్ణుడూ జయద్రథుడూ సంతోషంతో వొకళ్ళ నొకళ్ళు చూసుకున్నారు. నవ్వుకున్నారు.

"ఏమిటీ కలకలం ? ఎవళ్ళెవళ్ళు ఏమేమిటి వొడ్డారు ? ఎవరు ఏమిటి వీగిపోయారు ?" అంటూ విదురుణ్ణి అడిగాడు ధృతరాష్ట్రుడు.

భార్యతోసహా పాండవులు బానిసలయ్యారన్న గర్వం వొక్కసారి కళ్ళుకప్పింది దుర్యోధనుణ్ణి. తన ఇల్లు తుడిచిపెట్టడంకోసం ద్రౌపదిని పిలుచుకు రమ్మన్నాడు విదురుణ్ణి

ఈ పొగరుబోతుతనం సహించలేకపోయాడు విదురుడు. "నీ అంత తెలివితక్కువవాణ్ణి నిన్నేచూశాను. తగినపని అనే చెప్తాయిస్తున్నావో నాకు! మదించి కళ్ళుకానకండా దౌర్జన్యంచేసే దుష్టుడి సంపద ఎంతవుంటే ఏంగాక! చివరికి సమూలంగా నశిస్తుంది. తప్పదు. ప్రపంచసామ్రాజ్యానికి రాణీ కా తగ్గ మహాసతి ద్రౌపది. నీచేత అవమానం పాలయేటంత దిక్కుమాలిం దనుకున్నావా ?

తెలిసి తెలిసీ మూర్ఖుడివై నల్లతాచుల్ని ఎందుకు రెచ్చగొడతావు? మోసంచేసి పరాయిసొమ్ము దోచుకోవడం పౌరుషమా? శకుని మాయలో పడి ఇంతిపనికి సిద్ధపడ్డావా? వెదురుబియ్యం పండి, వెదుళ్ళ అడివినే నాశనంచేసినట్టు, ఈజూదంలో నువ్వు పండించిన చెడ్డపంట సమూలంగా నిన్నే నాశనంచేస్తుంది తప్పదు. చూద్దువు గాని'' అన్నాడు

''చాలు, ఆట్టే వదరకు'' అంటూ విదురుణ్ణి తూలగసి రాడు దుర్యోధనుడు. సూతిపుత్రుణ్ణి - ప్రాతికామిని పిలిచాడు ''ఎడదిడ్డం అంటే పెడదిడ్డం అంటాడీ విదురుడు. పాండవులంటే భయం. నువ్వు వెళ్ళు ద్రౌపదిని పిలుచుకురా'' అన్నాడు.

వ స్త్రా ప హ ర ణ ం

ద్రౌపదిదగ్గరికి వెళ్ళి వినయంగా నమస్కరించాడు ప్రాతికామి ''అమ్మా జూదమాడి ధనమూ రాజ్యమూ దుర్యోధనునికి వోడి పోయారు ధర్మరాజు. కుమాళ్ళనీ తమ్ముళ్ళనీ తమనీ మిమ్మల్నీ కూడా వొడ్డి వోడిపోయారు. అంచేత మిమ్మల్ని సభలోకి పిలుచుకురమ్మన్నారు దుర్యోధనులు. రండి'' అంటూ పిలిచాడు.

''ఆఁ!'' అంటూ వులికిపడింది ద్రౌపది. ''భార్యని జూదంలో వొడ్డి వోడిపోయిన భర్త ఎక్కడయినా వుంటాడా? ఎంత చెడ్డజూదగాడే అవుగాక! చిత్రం! ధర్మరాజే ఇలా చేశాడా! ఐతే ముందు నన్ను వోడి తరవాత తనని వోడాడా? కాక, తనని ముందువోడి తరవాత నన్నువోడాడా? నీకు తెలిస్తే చెప్పు, లేదంటే వెళ్ళు, ఆ జూదముచ్చునే అడిగిరా, ఇది తెలిశాకే నీతో వస్తాను'' అంది.

తిరిగివచ్చాడు ప్రాతికామి, ద్రౌపది అన్నమాటలు ధర్మ రాజుతో చెప్పాడు. తలవంచుకు వూరుకున్నాడు ధర్మరాజు, పలుకూ వులుకూ లేదు.

"ఆ సందేహమేమిటో ఈ సభలోనే వచ్చి అడగమను రమ్మను" అన్నాడు దుర్యోధనుడు. మళ్ళీ ప్రాతికామిని పంపాడు వెళ్ళి "మీరడిగిన విషయం తేల్చడానికి సభ్యులు మిమ్మల్నే రమ్మంటున్నారు, రండి" అంటూ మళ్ళీ ద్రౌపదిని పిలిచాడు ప్రాతికామి.

దుర్యోధనుడి మర్మం, ధర్మరాజు మాట – సంకోచిస్తూ బయల్దేరింది ద్రౌపది. ఒంటివస్త్రంతో వున్నదామె. బొటబొట కన్నీళ్ళు రాలుతూ గుండెలమీద పడుతున్నాయి. మాట్లాడకుండా ప్రాతికామి వెంట తలవంచుకుంటూ వచ్చింది కురువృద్ధుల పక్కని ముడుచుకుపోతూ నుంచుంది.

మొహమెత్తి ఆమెని చూడలేకపోయారు పాండవులు. సిగ్గుతోనూ దుఃఖంతోనూ దించిన తలలు ఎత్తకుండా కుంగిపోతున్నారు. చిక్కితే మొహాల్లో నెత్తురు లేదు.

చూసి మరింత సంతోషించాడు దుర్యోధనుడు. దుశ్శాసనుణ్ణి సైగచేశాడు. "ప్రాతికామి భీముడికి భయపడతాడు. వెళ్ళు. ద్రౌపదిని మనదగ్గిరికి తీసుకురా" అన్నాడు.

దుర్మార్గుడు దుశ్శాసనుడు. అతణ్ణి పంపడంతో భయపడింది ద్రౌపది. గాంధారి దగ్గిరికి పరుగెత్తింది. "ఎక్కడికి వెళతావు?" అంటూ వెంటపడ్డాడు దుశ్శాసనుడు. "కాదనడానికి వీలు లేదు. జూదంలో శకుని గెల్చుకున్నాడు నిన్ను. మా అన్నయ్య సొత్తయిపోయావు నువ్వు. నువ్వే అన్నమాటేమిటి? నువ్వూ నీ మొగుళ్ళూ అందరూ దాసులు మాకు" అంటూ పట్టుకోబోయాడు.

"వద్దు. ముట్టుకోకు. బైటవున్నాను. ఒంటిబట్టతో వున్నాను. పెద్దలూ బంధువులూ వున్న సభమధ్యకి ఎలా వెళ్ళేది?" అంది ద్రౌపది. రావి ఆకులా వణికిపోతున్నదామె.

"ఒంటిబట్టతో వుంటేనే! బట్టలేకుండా వుంటేనేం? నిన్ను తీసుకునే వెళతాన్నేను" అంటూ బలవంతంగా ఆమెజుత్తు పట్టుకున్నాడు దుశ్శాసనుడు. రాజసూయంలో అవభృథఅభిషేకంతో

పవిత్రమయిన ఆ వేణీభరం పట్టుకుని, గొరగొరాసభలోకి ఈడ్చుకు వచ్చాడు ద్రౌపదిని.

సభ సభంతా నిర్విణ్ణులయారు. ముక్కుమీద వేలుపెట్టు కున్నారు. గాలికి చిందరవందర అయిపోతున్న పతాకంలాగ దుశ్శాసనుడి చేతిలో అయిపోయింది ద్రౌపది. విడిపోయిన జుత్తు తోనూ, వివర్ణమయిన మొహంతోనూ సభలో కర్ణుడూ దుర్యో ధనుడూ శకునీ జయద్రథుడూ మొదలయిన దుష్టులమధ్య నుంచుంది. కోపం, సిగ్గూ దహించుకుపోతున్నాయి నిట్టూరుపుల్లో నిప్పులు రాలుతున్నాయి. అదురుతూన్న పెదవులతో ఇలా అంది బరువుగా

దైవమెంత వక్రించినా ధర్మం తప్పడు ధర్మరాజు

అ దలా వుండనివ్వండి

ఇంతమంది కురువృద్ధులు వున్నారు ఇక్కడ.

అడుగుతున్నాను మిమ్మల్ని.

మంచీచెడ్డా అనకండా ఈ దుర్మార్గుడు పొగరెక్కి నన్ను ఎందుకిలా ఈడ్చుకువచ్చాడో చెప్పండి

'ఇది కూడదు' అనేవాళ్ళే లేరా!

ఇలా అవమానం చేస్తుంటే ఇంతమందీ చూస్తున్నారే!

సర్వధర్మాలూ తెలిసిన ఈ భరతవీరుల పవిత్రవంశం ఇవాళ నించీ అధర్మంతో కళంకితం అయిపోవలిసిందేనా!

అంతమందిలోనూ వొక్కడూ మాట్లాడలేదు. ఒక్కొ క్కడే మూడులోకాలూ గెలవగల అయిదుగురు భర్తలున్న ద్రౌపది. అనాథలా సభలో ఏడుస్తున్నాది భయంతో వడుకుతున్నాది. కృష్ణుణ్ణి తలుచుకుంటున్నాది. ధర్మరాజు కారణంగా జరిగిన పాండ వుల పరాజయం అనే అగ్ని ఆమె వాడిచూపుల్లో కనకనలాడుతోంది.

దుఃఖంతో సయించలేకపోయాడు భీముడు. ధర్మరాజుకేసి చురచురా చూశాడు.

ధనం- వాహనాలు- రాజ్యం- ఆయుధాలు- అన్నీ వోడ్డావు.
బావుంది.
వీటికీ మాకూ నువ్వు అధిపతివే గనక- నన్నుకూడా వోడ్డావు.
ఓడిపోయావు
కాదనను
ఈ మాయజూదంలో ద్రౌపదినివోడ్డడం ఏం బావుంది చెప్పు?
ఈపాడుఆట కారణంగా ఆమెని ఏం చేస్తున్నారో చూడు!
శకుని కపటం తెలిసిన్నీ పాచిక్కిజూదంలో కూచున్నావు.
పాచికలుపట్టే నీ పాడుచెయ్యి తగలేస్తే పాపమేముంది?'
అన్నాడు. ప్రతీమాటా ఎంతో ఇదిగా బరువుగా వుంది.

"అన్నయ్యా! ఇలా అనవచ్చా!" అంటూ వారించాడు అర్జునుడు. "అన్నయ్యే ధర్మంతప్పితే ప్రపంచమే తలక్రిందవుతుంది. సుహృద్ద్యూతానికీ ధర్మ యుద్ధానికీ రమ్మంటే రాజన్నవాడు రానన కూడదు. తన సర్వస్వమూ పోయినా ఈ రాజధర్మ నిలబెట్టాడు అన్నయ్య. ధర్మానికి నిలబడ్డాడు ధర్మరాజు మోసంచేశాడు మాయలమారి శకుని" అన్నాడు.

ఇంతలో దుర్యోధనుడి తమ్ముడు వికర్ణుడు లేచి ఇలా ఉపక్రమించాడు. "ద్రౌపది వేసిన ప్రశ్నకి జవాబు చెప్పవలిసిన బాధ్యత సభవారిమీద వుంది. ధర్మసూక్ష్మాలు విడమర్చి చెప్పగల బుద్ధిమంతులు పక్షపాతం లేకండా ఈ సమస్య పరిష్కరించాలంటాను. తెలిసిన్నీ న్యాయవిచారణ చెయ్యకపోవడం నరక హేతు వవుతుంది. పెద్దలయిన భీష్ముడూ ద్రోణుడూ కృపుడూ మాట్లాడకుండా వూరుకున్నారు. సభలోవాళ్ళే నిర్వచనంచేసి దీనికి సమాధానం చెప్పమని కోరుతున్నాను" అన్నాడు.

ఎవ్వరూ మాటాడలేదు. ఒక్కనిమిషం ఆగి మళ్ళీ తానే ఎత్తుకున్నాడు వికర్ణుడు "ఐతే, నేనే చెపుతాను వినండి. జూదం — వేటా తాగుడూ అమితభోజనం— ఈ నాలుగూ దుర్వ్యసనాలు

ఈ వ్యసనాల్లో తగుల్కొన్నవాడికి ఇదిమంచీ ఇది చెడ్డా అన్నజ్ఞానం నశిస్తుంది. అలాంటిస్థితిలో వున్నవాడు ఏపనిచేసినా పాటించ కూడదు. ఇక రెండోది- పిలిస్తే జూదానికివచ్చి వ్యసనంలో పడి పోయాడు ధర్మరాజు. వ్యసనంలోవున్నవాడు ఏంచెయ్యాలో తెలీని స్థితిలో వుంటాడని ముందే చెప్పాను. అదే జరిగింది ఇప్పుడు, ఏమంటారా- ద్రౌపది ధర్మరాజు వొక్కడిభార్యే కాదు. పాండ వుల అయిదుగురికీ సమిష్టిభార్య ఆమె. ఆమెని పందెంగా వొడ్డ డానికి అసలు అధికారమేలేదు ధర్మరాజుకి. ఆటతమకంలో ఆమెని వొడ్డాడతడు. అలాంటపుడు అతడు చేసిన పని చెల్లకూడదు. పైగా శకునిచేత ద్రౌపది అధర్మంగా గెలవబడిందనే నాఅభిప్రాయం. అందుచేత ఆమెని- అందులోనూ వొంటిచీరెతో వున్నదానిని ఇలా ఈడ్చుకురావడం అన్యాయం'' అన్నాడు

''ఎవ్వరికీ తెలీని ధర్మం నీకే మహా తెలిసింది!'' అంటూ గదమాయించాడు కర్ణుడు ''ఇంతమంది పెద్దవాళ్లూ వుంటూంటే, మధ్యకివచ్చి మాట్లాడుతున్నావు. కుర్రతనమా, ఇది దురుసు తనమా? ద్రౌపది అధర్మంగా గెలవబడిం దంటున్నావు. ఇందరి ఎదటా తనయావదాస్తులూ ధర్మరాజు వోడిపోయినప్పుడు, ద్రౌపదీ వాటిలోంచి వెలికాదు అందుచేత ధర్మంగా గెలవబడిందేను. కాదే టిమి? అలా కాకపోతే పాండవులుమాత్రం ఎందుకు వొప్పుకుంటారు!

''ఇక, వొంటిబట్టతో ఈడ్చుకురావడం అన్యాయ మంటు న్నావు. ఆడదానికి వొక్క మొగుడు వుండం ధర్మం ఆమెనే ఆలు అంటాం. అనేకమంది మొగుళ్ళు దీనికి అందుచేత ఆలు కాదిది రంకుటాలు. లంజ. లంజని వొంటిబట్టతో ఏమిటి, బట్ట విప్పి దిసమొలతో తెచ్చినా అధర్మం కాదు'' అన్నాడు,

''అవును, బట్ట విప్పవలిసిందే దీన్ని'' అంటూ అందు కున్నాడు దుర్యోధనుడు. ''తమ్ముడూ దుశ్శాసనా, దీనివే కాదు, దీనివీ దీని మొగుళ్ళవీ- అందరి గుడ్డలూ విప్పించూ'' అన్నాడు

దుర్యోధనుడి నోట్లోమాట నోట్లోనే వుంది, పైమీది వోణీలు తీసి కింద పెట్టారు పాండవులు. తనకింది భూదేవి పగిలి పోతున్నట్టుంది ద్రౌపదికి. గుండెలు కొట్టుకుంటున్నాయి. కాళ్లు వణుకుతున్నాయి. ఏం కాని! "కృష్ణా, నువ్వుతప్ప మరిదిక్కు లేదు" అంటూ కళ్లుమూసుకుంది

దుర్యోధనుడు చెప్పడమేతడువు, ద్రౌపదిమీదికి దురుసుగా వచ్చాడు దుశ్శాసనుడు అంత సభలోనూ అమాంతంగా ఆమెచీర విప్పి బైటవేశాడు ఆశ్చర్యం! సరిగా అలాంటిదే మరో చీర ఆమె వొంటిమీద వుంది. అదీ లాగి విప్పేశాడు దుశ్శాసనుడు. మళ్ళీ అలాంటిదే ఇంకో చీర ఆమె వొంటిమీద. మళ్ళీ విప్పాడు. మరోటి సిద్ధంగా వుంది. ఇలా ఎన్నిలాగి పారేస్తూంటే అన్ని వుంటూ వచ్చాయి. విప్పిన చీరెలు గుట్టలుపడుతున్నాయి. ద్రౌపది వొంటిమీద చీరె యథాపూర్వంగా వుంటూనే వుంది.

కొండలా కుప్పపడ్డాయి చీరెలు అలసిపోయాడు దుశ్శాసనుడు. మరి శక్తిలేదు చేతుల్లో జావోస్తున్నాడు. చిన్న తనంగా వుంది. చెమట్లుపోస్తున్నాడు. నుంచుండిపోయాడు.

తమ కళ్ళఎదట తను భార్యని చెయ్యరానిపని చేస్తున్నాడు, దుశ్శాసనుడు. పళ్ళు పటపటకొరికాడు భీముడు, అగ్గి మండు తున్నాయి కళ్ళు. ప్రళయానికి సిద్ధపడుతున్న యముడిలా భయం కరంగా వుంది మొహం,

"ఇదిగో, కురువృద్ధులూ పెద్దలూ బంధువులూ యావ న్మందీ చూస్తున్నారు.

వినండి

ఇంతమంది ఎదటా మా ద్రౌపదిని ఇలా చేశాడు దుర్మార్గుడు దుశ్శాసనుడు.

యుద్ధంలో వీణ్ణి హతమారుస్తాను,

దుర్యోధనుడి కళ్ళఎదట వీడి గుండె నెత్తురు తాగుతాను.

ఇలా చెయ్యకపోయానో, నా తండ్రుల గతికి తప్పిన వాణ్ణవుతాను'' అంటూ ప్రతిన చేశాడు.

అతిమానుషమయిన భీముడి ప్రతిజ్ఞవిని సభ సభంతా జజ్జరిల్లినట్టయింది. తలవొంచుకున్నారు కురువృద్ధులు. ప్రజల్లో ప్రతీవాళ్లూ దుర్యోధనుణ్ణి ఛీ అన్నవాళ్ళే. కొడుకుల్ని కలిపి ధృతరాష్ట్రుణ్ణి తిట్టేవాళ్ళే. "ద్రౌపది అడిగినదానికి ఇప్పుడయినా సమాధానం చెప్పరేం ఈ ముసిలాళ్లు' అంటూ తూలనాడేవాళ్ళే.

కళ్లనీళ్లు తిప్పుకుంటూ ఇంతమందినీ చూశాడు విదురుడు. "బుద్ధిమంతులు మీరంతా ద్రౌపది అడిగిన ప్రశ్న పరిష్కరించండి'' అన్నాడు. "సభలో ధర్మసందేహం వచ్చినప్పుడు అది పరిష్కరించని ప్రతీసభ్యుణ్ణీ పాపం చుట్టుకుంటుంది. వికర్ణుడు యువకుడయినా బృహస్పతిలా ధర్మవిచారణ చేశాడు. చిన్నవాడని ఇతడి మాట కొట్టివెయ్యకండి. మీరూ విచారించండి. బ్రహ్మలాంటి వాడయినా ఒక్కడే ధర్మవిచారణ చెయ్యడమంటే అసాధ్యం. సభకివచ్చి, ఎవరయినా ధర్మసందేహం అడిగినప్పుడు, తెలిసిన్నీ చెప్పని సభ్యులు, అబద్ధమాడితే వచ్చే పాపంలో సగం పాపం పంచుకుంటారని ఋషివాక్యం. ధర్మం తెలిసిన్నీ, మరోలాభానికి ఆశపడో పక్షపాతబుద్ధితోనో సభలో వ్యతిరేకంగా చెప్పిన సభ్యుడు అబద్ధమాడితేవచ్చే పాపం పూర్తిగా అనుభవిస్తాడు. ఇతిహాసాల్లోనూ ఇదే వింటున్నాము.

"పూర్వం ప్రహ్లాదుడి కొడుకు విరోచనుడూ అంగిరసుడి కొడుకు సుధన్వుడూ ఒక తగువు తెచ్చారు. ఇద్దరు ఒక్కపిల్లనే పెళ్ళిచేసుకోవాలని, నేను బుద్ధిమంతుణ్ణంటే నేను బుద్ధిమంతుణ్ణి అంటూ పందెం వేసుకున్నారు. ఎవడు బుద్ధిమంతుడని తేలితే వాడు ఆ పిల్లని పెళ్ళిచేసుకోవడానికీ అతడికి రెండోవాడు ప్రాణం బలిపెట్టడానికీ పందెం. ఇద్దరూ ప్రహ్లాదుడిదగ్గిరికి వచ్చారు. ధర్మం తెలిసినవాడివి నువ్వు. మా ఇద్దరిలో ఎవడు బుద్ధిమంతుడో విచా

రించి తీర్పు చెప్పు. సరిగా చెప్పకపోతే మాత్రం పిడుగుపడుతుంది నెత్తిమీద' అన్నాడు సుధన్వుడు.

"భయపడ్డాడు ప్రహ్లాదుడు. తాను కశ్యపుని దగ్గిరికి వెళ్ళాడు. ఈ వైనమంతా చెప్పాడు. 'సభలో సాక్షి అయినవాడూ ధర్మం తెలిసినవాడూ తప్పు చెప్పకూడదు. అలా చెప్పినవాణ్ణి వరుణ పాశాలు వెయ్యి చుట్టుకుంటాయి. సంవత్సరానికి వొకటి చొప్పున వెయ్యేళ్ళకిగాని వొదలవు. ఇది ధర్మం ఇది అధర్మం అని తీర్పు చెప్పని సభ్యులు ధర్మద్రోహులకింద లెక్క. కామక్రోధాలికి లొంగిపోయి ఎవడన్నా సభలో అధర్మనిర్ణయం చేశాడే అనుకో, దానివల్ల వచ్చిన పాపం వొకవంతు రాజుకీ, రెండువంతులు చెప్పిన వాడికీ, మరోవంతు సభలోని సభ్యులికీ చెందుతుంది. అందుచేత నువ్వు ధర్మమే చెప్పు' అంటూ సలహా ఇచ్చాడు కశ్యపముని.

"తాతగారి సలహా ప్రకారం పక్షపాతం లేకుండా చెప్పాడు ప్రహ్లాదుడు. కొడుకైన విరోచనుణ్ణి కాదని చెప్పాడు. సుధన్వుడే బుద్ధిమంతుడని తీర్పు చెప్పాడు. అతని ధర్మబుద్ధిని మెచ్చుకున్నాడు సుధన్వుడు. దానికి ప్రతిఫలంగా విరోచనుడికి ప్రాణదానం చేసి వెళ్ళాడు. ఇలాంటి నిదర్శనాలెన్నయినా వున్నాయి.

ఆ విధంగానే మీరూ ద్రౌపది అడిగిన ధర్మనిర్ణయం చెయ్యండి" అన్నాడు. లాభం లేకపోయింది. దుర్యోధనుడి భయంవల్ల సభ్యుల్లో వొక్కడూ నోరెత్తలేదు.

"అయ్యో" అంటూ దుఃఖపడింది ద్రౌపది. 'అనాడు స్వయంవరంలో అంతమంది రాజులచేతా అంత గౌరవం పొందాను. పాండవుల ధర్మపత్నిని. శ్రీకృష్ణుడంతవాడికి చెల్లెలి ననిపించుకున్నాను. ఇవాళ ఈ నిండుసభలో వీడిచేత ఇంత అవమానం అనుభవించాను. ఈ సభలో ఇంతమంది వున్నారే! ఒక్కరూ మాటాడరేం! చెప్పండి. అడుగుతున్నాను నేను. చెప్పండి, [illegible]నా వీళ్ళకి నేను!" అంటూ గద్గదకంఠంతో అడిగింది.

"అమ్మా ధర్మసూక్ష్మం తేల్చవలసినవాడు ధర్మరాజు. అతడుతప్ప నీ ప్రశ్నకి సమాధానం చెప్పగలవాడు ఈ సభలో మరొకడు లేడు. ఏడవకు తల్లీ, ఏడవకు దీనిఫలం కౌరవులికి కట్టికుడుపుతుంది ఎంతో కాలం అక్కరలేదు" అని నిట్టూర్చాడు భీష్ముడు.

ఇటు భీష్ముడు ఇలా అంటున్నాడు. అటు ద్రౌపదినిచూస్తూ హేళనగా నవ్వుతున్నాడు కర్ణుడు "పిల్లా, ఐదుగురు మొగుళ్లుండడంకంటే వొక్కడయితే మంచిది. వీళ్లు జూదంలో వోడిపోయి నిన్ను వోదిలేశారు నా మాట విను. జూదంలో పెళ్ళాన్ని వోడిపోనివాణ్ణి, నీ మీద వలపున్నవాణ్ణి మరొక మొగుణ్ణి చూసుకో" అన్నాడు.

"తొడమీద కూచుందువుగాని రా" అంటూ ఆమెని కన్ను గీటాడు దుర్యోధనుడు అదిచూసి జూలుపట్టుకులాగిన సింహంలాగ లేచి నుంచున్నాడు భీముడు క్రోధంతో వడికిపోతున్నాడు. భయంకరంగా వున్నాడు గడగడలాడింది సభ. "రాజ్యగర్వం నెత్తికెక్కింది వీడికి ద్రౌపదిని తొడమీదికి పిలుస్తున్నాడు. దురాత్ముడు. యుద్ధంలో నా గదతో కొట్టి వీడి తొడలు విరగ్గొట్టకపోతే భీముణ్ణే కాదు నేను" అంటూ అరిచాడు. ఓసారి అన్నగారికేసి చూశాడు. ఆయుధాలతట్టు వురకబోయాడు. త్రిపురసంహారానికి లేచిన రుద్రుడిలా ఘోరంగా వుంది అతడి రూపం. తనవశంలో తాను లేడు. రెప్పపాటులో జరిగిపోతుంది సంహారం చప్పునవచ్చి అడ్డుకున్నారు విదురుడూ భీష్ముడూ ద్రోణుడూ మొదలయినవాళ్లు. "కోపానికి ఇది అదును కాదు" అంటూ శాంతపరిచారు అతణ్ణి.

ధృతరాష్ట్రుడి అగ్నిహోత్రంగృహంలో నక్కలు అరిశాయి. అగ్నులు ఆరిపోయినట్టయాయి. కౌరవస్త్రీల గుండెల్లో దుఃఖమేదో కుములుకు లేచింది. ధృతరాష్ట్రుడి కొడుకుల పడకగదుల మీద గూబలూ కాకులూ కూశాయి "అరిష్టం వీళ్ళకి తప్పదు కానీ" అనుకున్నారు భీష్మద్రోణులూ విదురుడూ కృపుడున్నూ.

ద్రౌపది ధర్మగుణానికి చకితుడయ్యాడు ధృతరాష్ట్రుడు. మెచ్చుకున్నాడు. పాండవుల్ని దగ్గరికి పిలిచాడు. ధర్మరాజు చెయ్యి పట్టుకున్నాడు. ''బాబూ, అయిందేదో అయిపోయింది ఇదంతా మనసులో పెట్టుకోక నీ సర్వసంపదలూ నీ రాజ్యమూ నీకే వుండనీ. ఎప్పటిలాగే సుఖంగా ఇంద్రప్రస్థంలో మీ అయ్యరాజ్యం నువ్వు పాలించుకో. పెద్దలసేవించి సర్వధర్మాలూ తెలిసినవాడివి నువ్వు. తెలిసిచావనివాడు నీ తమ్ముడు దుర్యోధనుడు. ఏదో తెలీక నీకు అపకారం చేశాడు. పట్టించుకోకు. మనస్సులో విరోధం పెట్టుకోవద్దు. మంచి చెడూ గుణాలు మాత్రం గ్రహించి దోషాలు విడిచిపెట్టడం- ఇవి ఉత్తముల లక్షణాలు నీకు మాత్రం తెలియనిదేముంది! ఇంతకీ తప్పంతా నాది. ఏదోకదా అనుకుని ఈ జూదం ఉపేక్షించాను బుద్ధిలేనివాణ్ణి, ముసలివాణ్ణి. నా మొహం చూడు. మీ అమ్మ గాంధారిని చూసి దుర్యోధనుడి దోషాలు మరిచిపో. ధర్మస్వరూపుడివయిన నువ్వు రక్షకుడివిగానూ, సర్వశాస్త్రాలు తెలిసిన విదురుడు మంత్రిగానూ వుంటేనే కౌరవకులానికి గౌరవం, క్షేమం'' అన్నాడు.

ఇదంతా చూసి వికిలిగా నవ్వాడు కర్ణుడు ''పెళ్లాం వరాల వల్ల పెద్దమనుషులయ్యారు వీళ్లు. ఇదీ వొక మగతనమేనా?'' అంటూ మూతివిరిచాడు. పొడిచినట్టయింది భీముడికి. ''పాండురాజు కొడుకులు భార్యవల్ల రాజ్యం సంపాదించారు అనిపించుకోవడంకంటే కష్టం మరేముంటుంది? విద్యా, కార్యం, సంతానం- ఇవి పురుషుడి తేజస్వరూపాలు ఈ మూడింటిలోనూ కార్యమే ప్రధానమైంది. పనిచెయ్యనివాణ్ణి ప్రతీవాడూ చులకన చేస్తాడు. మనం కార్యం వొదిలిపెట్టి చేతులు పిసుక్కోవడం హేయం. ఇదిగో నా కార్యమేదో ఇప్పుడే చూపిస్తాను వీళ్లని తల పగలగొట్టిమరీ రాజ్యం లాక్కుంటాను'' అంటూ శత్రుమధ్యవున్న సింహం కొదమలాగ గర్జించాడు నెమ్మదిగా అతణ్ణి శాంతపరిచాడు ధర్మ

రాజు. ధృతరాష్ట్రుడి మాటమీద తమ్ముళ్లతోనూ ద్రౌపదితోనూ కలిసి రథాలమీద ఇంద్రప్రస్థం వచ్చేశాడు.

తమ ఇంతప్రయత్నమూ ఇలా బూడిదలోపోసిన పన్నీ రయిందే అని ఆలోచనలోపడ్డారు దుర్యోధనుడూ దుశ్శాసనుడూ కర్ణుడూ శకునీ సైంధవుడున్నూ ఐదుగురూ కూచుని మళ్లీ ఒక కొత్తఎత్తు వేశారు.

తండ్రిదగ్గిరికి వచ్చి మళ్లీ ప్రారంభించాడు దుర్యోధనుడు "బాబయ్యగారూ, వల్లోపడ్డ పిట్టల్ని విడిచిపెట్టి పీకలమీదికి తెచ్చారు మీరు" అన్నాడు. "శత్రువన్నవాణ్ణి ఎలాఅయినా చంపడమే ధర్మమనికదా ఇంద్రుడికి బోధించాడు బృహస్పతి! మీరు ఎంతఉపకారం చేసినా పాండవులు మనకి శత్రువులే కాని మిత్రులు కారు. ద్రౌపదికి మేం పెట్టినపాట్లు కల్లోకూడా మరిచిపోరు వాళ్లు, సమయం కనిపెట్టి తప్పకండా మా ప్రాణాలమీదికి వస్తారు. వాళ్లకి రాజ్యమూ అదీఇచ్చి మీరు పంపడం, కోపం తెప్పించిన పామును మెళ్లో వేసుకున్నట్టయింది. ఎంతపొరపాటు జరిగిందో ఊహించండి.

"గాండీవంతో అర్జునుడూ గదపట్టుకుని భీముడూ కత్తి డాలుతో నకుల సహదేవులూ దండెత్తివస్తే అడ్డుకునేవాడెవడు! మేం బతకాలంటే ఒక్కటే మనకున్న సాధనం. మళ్లీ జూద మాడడమే. ఈసారి జూదంలో ధనమూ రాజ్యమూ ఒడ్డడం కాదు. ఎవరువోడితే వాళ్లు పన్నెండేళ్లు అడవుల్లో వుండడమూ, ఒకఏడు ఎవ్వరికీ తెలియకుండా వుండేట్టు అజ్ఞాతవాసం చెయ్యడమూ అని పందెం పెడదాం. మనమే గెలుస్తాం. మీకా సందేహం అక్కర్లేదు. చూడనే చూశారుగా! శకునిమామ జూదంలో మహారావణుడు, పాండవులు అడివికిపోతే, ఈలోగా మనం రాజ్యం స్థిరపరుచుకుని బలవంతులం కావచ్చు తరవాత వాళ్లు రానివ్వండి భయంలేదు" అంటూ ఇలా ఎన్నివిధాలచెప్పాలో అన్నివిధాలా చెప్పి మొదలువిరిచాడు తండ్రిని. చివరికి "సరే"

అన్నాడు ధృతరాష్ట్రుడు. మరోసారి జూదానికి ధర్మరాజుని పిలుచుకురమ్మని ప్రాతికామిని ఇంద్రప్రస్థం పంపాడు. ప్రాతికామి ఇంద్రప్రస్థం వెళ్లాడు. ధృతరాష్ట్రుడి ఆహ్వానం వినిపించాడు

తండ్రిమాట జవదాటరాదంటూ తమ్ములతోనూ ద్రౌపదీ వాళ్ళతోనూ మళ్ళీ హస్తినాపురం వచ్చాడు ధర్మరాజు, తిరిగీ యథాప్రకారం సభామంటపంలో సొగటాపాళీముందు శకునీ ధర్మరాజూ కూచున్నారు.

'ధనమూ రాజ్యమూ మా బావ ధృతరాష్ట్రుడు మీకు ఇచ్చేశాడు. అంచేత మరి ఒడ్డి ఆడకూడదు మనం" అన్నాడు శకుని "ఈ సారి ఒక కొత్తపందెం వేద్దాం ఎవళ్ళు ఓడిపోతే వాళ్లు లేడితోళ్ళూ నారబట్టలూ కట్టుకుని అడివికిపోవాలి. బ్రహ్మచర్యంచేస్తూ కందమూలాలూ అవీ తింటూ పన్నెండేళ్ళు అరణ్యవాసం చెయ్యాలి పదమూడోఏడు ఎవరికీ తెలియకండా ఏదన్నా ఒకపట్నంలో అజ్ఞాతవాసం చెయ్యాలి. ఇదీ పందెం. ఈ పందెం చేతనయితే రా ఆడదాం" అన్నాడు.

మళ్ళీ జూదానికి పిలవనే పిలిచారు రానూవచ్చాను నేను. ఇంతావచ్చి పందానికి జంకడమెందుకు? కానీ" అన్నాడు ధర్మరాజు.

ఆట మొదలయింది మాయపాచికలు శకునివి. ఏముంది, మళ్ళీ ఓడిపోయాడు ధర్మరాజు.

పందెంప్రకారం అడివికి సిద్ధపడ్డారు పాండవులు రాజవేషాలు వొదిలిపెట్టారు. నగలూ అవీ తీసివేశారు, సన్నపు బట్టలు విడిచిపెట్టారు, నారలు కట్టుకున్నారు లేడిచర్మాలు ధరించారు, అచ్చంగా మునులమల్లే తయారయారు భీష్ముడూ ధృతరాష్ట్రుడూ కృపుడూ ద్రోణుడూ విదురుడూ మొదలయిన పెద్దలదగ్గర సెలవు తీసుకున్నారు. స్నేహితులూ బంధువులూ [illegible]తోనూ [illegible]ళ్ళకి తగినట్టు వాళ్ళతో చెప్పి వనవాసానికి సంసిద్ధులయారు.

భీష్ముడూ ద్రోణుడూ విదురుడూ కృపుడూ ధర్మమూర్తులుకదా! చెప్పరేం? కౌరవుల మోసంవల్ల దేశంవొదిలి పోవలిసిందేనా నా తండ్రులు! అన్నలతో నువ్వూ అడివికే వెళతావా చిట్టిబాబూ, సహదేవా! అయ్యో, నా బంగారుతండ్రీ!'' అంటూ ఏడ్చింది. వినయంగా నమస్కరించి నుంచున్న ద్రౌపదిని కౌగిలించుకుంది కడుపులో సముద్రం దొరిలినట్టయింది వెక్కివెక్కి ఏడ్చింది ''నా చిట్టితల్లీ, నీవల్ల ద్రుపదవంశమూ పాండవవంశమూ రెండూ పవిత్రమయిపోయాయి భర్తల్ని వొదలకండా వెంటవెళుతున్నావు. భాగ్యమంటె నీదేనేతల్లీ,'' అంటూ వొదలలేక వొదలలేక వొదిలి పెట్టింది కుమాళ్ళనీ కోడల్నీ దీవించింది.

కన్నీరు మున్నీరుగా ఏడుస్తూన్న ఆమెని వోదార్చి లేవదీశాడు విదురుడు, సగౌరవంగా తన ఇంటికి తీసుకువెళ్లాడు. అవాళనించీ విదురుడింటే వుంటూవచ్చింది కుంతి

భర్తలవెంట తలవిరబోసుకుని అడివికి నడిచింది ద్రౌపది. కౌరవుల అంతఃపురంలోనివాళ్ళంతా ఆమెనిచూసి భయంతోనూ దుఃఖంతోనూ తలవొంచుకున్నారు. ముందునడిచాడు ధర్మరాజు. నలుగురుతమ్ముళ్లూ అతడి వెనక నడిచారు. క్రోధంతో మండుతున్నాయి వాళ్ళ హృదయాలు. వెళుతూ సభలో పిడుగులు పడ్డట్టు గర్జించారు.

''ధృతరాష్ట్రుడి కొడుకులు వందమందినీ నా గదతో చంపుతాను. దుష్టచిత్తుడు దుర్యోధనుణ్ణి కిందవేసి తలమీద తంతాను దుశ్శాసనుణ్ణి చంపి వాడి గుండెరక్తం తాగుతాను. తప్పదు'' అన్నాడు భీముడు.

''పదమూలుగోవడు మరిచిపోకండి. కర్ణుడూ మొదలయిన దుర్జనులందర్నీ నా గాండీవానికి బలివేస్తాను. వాళ్ళ నెత్తురు భూతాలికి కుత్తుక బంటియ్యా తాగిస్తాను'' అన్నాడు అర్జునుడు.

"మాయజూదంలో మమ్మిలా చేశాకు [illegible] మా కత్తులతో ఆ పాపాత్ముణ్ణి తుత్తునుకలు చేస్తా[illegible]" అన్నారు నకులసహదేవులు. ఇలా ఘోరంగా ప్రతిజ్ఞ చేసూ [illegible] వాదిలి పోయారు పాండవులు.

అటు పాండవులు పట్నం వొలిమే [illegible] ంబు ధృతరాష్ట్రుడికోట్లో నక్కలుకూస్తూ [illegible] మకి పట్టపగలే ఉల్కలుపడ్డాయి ఆకాశం మీద [illegible] మెరుపులు మెరిశాయి అమావాశ్యగాం డే సూర్యబింబం రాహు గ్రస్తమయింది. హటాత్తుగా భూకంపమయింది.

"పద్నాలుగోఏడు భారతయుద్ధం జరుగుతుంది. భీమార్జునులు పరాక్రమంతో పాండవులు జయిస్తారు" అంటూ కేకలు వేశాడు అంతరిక్షాన నారదుడు

అదంతా విన్నాడు ధృతరాష్ట్రుడు. కొడుకుల దుర్నయాల వల్ల ఇంకే అపశకునాలు పుడతాయో అని బెంగ పెట్టుకున్నాడు. విదుర్ణ్ణి పిలిపించాడు పాండవులు పట్నంవిడిచి ఏవిధంగా వెళ్లారో చెప్పమన్నాడు. "వాళ్లువెళ్ళడం నిశ్చేరపోతూ చూశారు ప్రజ" అన్నాడు విదురుడు "బట్ట మొహంమీద కప్పుకుని వెళ్లాడు ధర్మరాజు. రెండుచేతులూ చాచుకుంటూ వెళ్లాడు భీముడు. ఇసక చల్లుకుంటూ వెళ్లాడు అర్జునుడు. ఒంటినిండా బుగ్గిపూసుకుని వెళ్ళాడు నకులుడు. సిగ్గుతో తలవొంచుకుంటూ వెళ్లాడు సహదేవుడు. వికారంగా తల విరబోసుకుంది ద్రౌపది. దుఃఖపడుతూ తడిసిన వొంటిబట్టతో నడిచిందామె. వాళ్లప్రక్కనే రౌద్రసామమూ, యామ్యసామమూ గానంచేస్తూ వెళ్ళాడు ధౌమ్యుడు" అన్నాడు.

"విచిత్రంగానే వుంది. ఐతే ఇలా వెళ్లడంలో ఏమిటి అంతర్యం!" అని అడిగాడు అంధరాజు. "ఏం, ఇంకా అర్థం కాలేదా! తెలుస్తూనేవుందిగా !" అని వివరించాడు విదురుడు. "[illegible] వాసంతో రాజ్యంపోయింది ధర్మరాజుకి.

ఆ ఇదితో తీక్ష్ణంగా వున్న తన చూపులు ప్రజలికి హానికలిగించవచ్చు. అందుకని మొహంమీద బట్టకప్పుకుని వెళ్ళాడతడు. రాబోయే యుద్ధంలో తన బాహుబలం చూపించే అవకాశం దొరికిందికదా, అనుకుంటూ చేతులు చాచుకు వెళ్ళాడు భీముడు. 'ఇదిగో ఇంత కంటే అధికంగా నా బాణాలు వేసి శత్రువుల్ని చంపుతాను' అని ఇసక చల్లుతూ వెళ్ళాడు అర్జునుడు. సౌందర్యంలో సాటిలేనివాడు కదా, నకులుడు. 'ఈ అందానికి ఈ దుఃఖమా' అని ప్రజ బాధపడకుండా వొంటినిండా బుగ్గి పూసుకున్నాడతడు, దీనంగా వున్న తన మొహం చూసినవాళ్ళకి చెడ్డకలుగుతుందని తలవంచుకు వెళ్ళిపోయాడు సహదేవుడు. భర్తలూ కొడుకులూ స్నేహితులూ బంధువులూ యుద్ధంలో చస్తే ఇలాగే ఏడుస్తారు కౌరవస్త్రీలు అని సూచిస్తూ తలవిరబోసుకుని ఏడుస్తూ వెళ్ళింది ద్రౌపది. రౌద్ర సామగానం, యామ్యసామగానం చేస్తూ వెళ్ళడంతో రాబోయే భారతయుద్ధంలో మరణించే కౌరవుల అపరక్రియలు సూచించాడు ధౌమ్యుడు'' అని చెప్పాడు.

ఇది విన్నాక మరింత మతిపోయింది ధృతరాష్ట్రుడికి. 'ఏమైనా బలవంతులు పాండవులు వాళ్ళతో విరోధం తగనిపని ఇదంతా ప్రజానాశనానికి వచ్చింది. ఏం దారి!'' అంటూ భయం తోనూ దుఃఖంతోనూ వో మూల కూలబడిపోయాడు ''అయ్యో, అయ్యో'' అంటూ నిట్టూర్చాడు.

అంతా దగ్గిరవుండి పరికిస్తూన్నాడు సంజయుడు ఊరుకో లేకపోయాడు. ''పాండవులు మంచివాళ్ళనీ ధర్మపరులనీ ఆలోచ నన్నా లేకపోయింది నీకు'' అంటూ ఎత్తుకున్నాడు. సంపదతో సహా వాళ్ళరాజ్యం లాక్కున్నావు, దేశం వెళ్ళగొట్టావు. ఇంతా చేసి ఈ విచారమెందుకట మళ్ళీ! భీష్ముడూ విదురుడూ ద్రోణుడూ చెప్పినా లాభంలేకపోయింది. కర్ణుడూ శకునీ వూదిన మంత్రాంగమే రుచించింది నీ కొడుకులికి. అకారణంగా పాండవులికి అపకారులుగా

తయారయారు ముందూ వెనకా పిచారం లేకపోయింగా. బల వంతులతో విరోధం తెచ్చుకున్నారు నావ్వా, నీకొడుకే జవాబు దారీ దీనికి దించుకున్నా, పెంచుకున్నా మీా ఉభయులే చెయ్యాలి. ఎవరుమాత్రం ఏం చెయ్యగలరు మరి?'' అన్నాడు

''అలాకాదు మహారాజా '' అంటూ అందుకున్నాడు విదు రుడు. ''ఊరికే విచారించిమాత్రం ప్రయోజన మేమిటి? ఇప్పు డయినా మించిపోయింది లేదు. పాండవుల్ని పిలిపించు ఎప్పటి లాగే వాళ్ళరాజ్యం వాళ్ళకి ఇప్పించు అందరూ సుఖంగా వుండేట్టు చూడు మోసంచేసి పరులసొమ్ము పడవేసుకోకు. నిందలపాలు కాకు'' అన్నాడు.

విదురుడిమాటలు వినీ విననిపించుకోనట్టు వూరుకున్నాడు ధృతరాష్ట్రుడు. పాండవుల్ని పిలవడం కాదుకదా, మళ్ళీ ఆవూసే ఎత్తడం మానేశాడు.

భీష్ముడూ విదురుడూ సంజయుడూ కృపుడూ మొదల లయినవాళ్ళకి పాండవులు అడివికి వెళ్ళడం బాధగానేవుంది. ధృత రాష్ట్రుడికొలువులోవున్నా పాండవులంటే ప్రాణంగా వుండేది ద్రోణుడికి. తన ప్రబలశత్రువు ధృష్టద్యుమ్నుడు పాండవుల బావ మరిది కావడంచేత హాస్తినలో వుండిపోయాడతడు. కాకుంటే పాండవులవెంట తానూ అడవులికే వెళ్ళిపోయేవాడు.

అర్ధరాజ్యం సంపాదించాక ఇరవైమూడేళ్ళు ఇంద్రవైభవంగా ఇంద్రప్రస్థం పరిపాలించారు పాండవులు. తుదకి ఇలా శకుని పన్నిన మాయజూదంలో వోడిపోయి, పందానికి కట్టుబడి వనవాసానికి వెళ్ళిపోయారు.

వ్యావహారికాంధ్ర మహాభారతం

సభాపర్వం

సంపూర్ణం.

ప్రాచీన గ్రంథావళి : ౨

సంపాదకుడు : పురిపండా అప్పలస్వామి

# వ్యావహారికాంధ్ర

# మహాభారతం

## అరణ్యపర్వం

## సంపుటం 2

పురిపండా అప్పలస్వామి

కవితాసమితి అధ్యక్షుడు



ప్రాచీన గ్రంథావళి

రాజమహేంద్రవరము

# వి ష య సూ చి క



# అరణ్యపర్వం



## ఒకటో అధ్యాయం

### వనవాసం

అడివికి బయల్దేరిపోయారు పాండవులు. తమ ఆయుధాలు మాత్రమే పట్టుకున్నారు. ద్రౌపదినీ వెంటపెట్టుకుని ఉత్తరం దిక్కు వెళ్ళారు. ఇంద్రసేనుడూ మొదలయిన ముఖ్యసేవకులు పద్నాలుగు వేల రథాల్తో బయల్దేరారు. సుభద్రా, అభిమన్యుడూ, ద్రౌపది కుమాళ్ళు అయిదుగురూ - వీళ్ళందరినీ తీసుకుని వెళ్ళారు వాళ్ళు.

అలా పాండవులు అడివికి వెళ్ళిపోతూవుంటే హస్తినాపురంలో యావన్మందీ వలవలాపడ్డారు. "ఏమిటీ అన్యాయం! పాండురాజు కుమాళ్ళని ధృతరాష్ట్రుడూ, దుర్యోధనుడూ అధర్మజూదం ఆడించారు. అడివికి తరుముతున్నారు. కఠినాత్ములు. దుర్యోధనుడే ఈ ఘోరం నెట్టుకున్నాడు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ అడ్డు చెప్పకండా వూరుకున్నారు. అంత ఉత్తముడు విదురుడు. అతడూ మాటాడలేదు. ఏమి కూడబలుక్కున్నారో వీళ్ళు!

"అసలే లోభి దుర్యోధనుడు. అతడు రాజు! కర్ణుడూ, జయద్రథుడూ, శకునీ అతడికి ఆప్తమంత్రులు. ఇహా చెప్పేదేమిటి? ఇలాంటి రాజ్యంలో ఎలా బతకడం! పరమధార్మికులు పాండవులు. వాళ్ళే లేనప్పుడు ధర్మ మెలా వుంటుంది? ప్రజని కాపాడేవాళ్ళెవరు? పదండి పోదాం. పాండవులు ఎక్కడవుంటే మనమూ అక్కడే వుందాం."

ఇలా అంటూ ఇళ్ళూ వాకిళ్ళూ వొదిలి పెట్టేశారు పౌరులు. ఆడా మగా యావన్మందీ పాండవుల వెంట పడ్డారు.

"మహాత్ములారా, మమ్మల్ని వొదిలి వెళుతున్నారు. న్యాయమేనా మీకు! ఇక మాకు దిక్కేమిటి? దుర్యోధనుడూ వాళ్ళూ దుష్టులు. దుష్టులతో వుంటే సాధువులూ దుఃఖాల పాలవుతారు. చెడ్డ చెయ్యకపోతే ఏం గాక. మనిషి చెడ్డవాళ్లని చూస్తే నేచాలు, చెడతాడు. వాళ్ళని తాకినా, వాళ్లతో మాట్లాడినా, జట్టు కూడినా పాపాలే పట్టుకుంటాయి.

"పుట్టుకతోనే బుద్ధిమంతులు మీరు. మీవిద్యా, మీబుద్ధీ ఉదాత్తమైనవి. మీస్వభావమే స్వచ్ఛమైంది. అందుకని మీతోనే వుంటాం మేము. మంచివాళ్ళతో వుంటేకదా, మంచి అబ్బుతుంది? ధర్మం తెలుసుకుంటాం. కృతార్థులమూ అవుతాం. నేలా, నువ్వులూ, నీళ్ళూ, బట్టలూ పువ్వులతో వుంటే, పువ్వులలాగే పరిమళిస్తాయి. దుర్యోధనుడు దుర్మార్గుడు. అతడి రాజ్యంలో వుండం. మీ వెంబ వస్తాం. అంగీకరించండి" అంటూ దండాలు పెట్టారు.

వాళ్ళందరినీ ఆదరంగా చూశాడు ధర్మరాజు. "మీరు మాతో వస్తామంటే, అంతకంటే మాకు కావలిసిం దేముంది?" అన్నాడు. "మీ అనురాగం మామీద వుంది. అంచేత, మాలో లేని గుణాలు గొప్పచేసి చెపుతున్నారు. ఐతే, వనవాసం ఎంతో కష్టం. మీరు భరించలేరు. వద్దు. నామాట వినండి, రాకండి. ఆగిపొండి" అంటూ ఎన్నోవిధాల బోధపర్చి, మళ్ళించాడు వాళ్ళని. యావన్మందీ దుఃఖిస్తూ వెళ్ళలేక వెళ్ళిపోయారు హస్తినాపురం.

పౌరులు వెళ్ళిపోయాక, ముందుకి సాగారు పాండవులు. గంగా నదివరకూ వెళ్ళారు. 'ప్రమాణం' అని ఒకపెద్ద మర్రిచెట్టువుం దక్కడ.

దానికింద బసచేశారు. గంగలో స్నానం చేసి ఆ పగలూ, రాత్రీ అక్కడే గడిపారు.

మర్నాడు తెల్లవారేసరికి ఎంతో మంది బ్రాహ్మలు వచ్చి కలుసుకున్నారు పాండవుల్ని. బంధువులతోనూ, శిష్యులతోనూ అగ్నిహోత్రాలూ అవీ పట్టుకుని వచ్చారు వాళ్ళు. వాళ్ళందరూ బ్రహ్మతో సమానమైనవాళ్ళు. వేదపారాయణచేసి పాపాలు వొదిలించుకున్న వాళ్ళు. ప్రపంచమంతా పూజించదగ్గవాళ్ళు. అంతమందీ కూడా పాండవులతో అరణ్యవాసం చెయ్యడానికే సిద్ధపడి వచ్చారు. అందర్నీ ఎంతోఅంత ఇదిగా పూజించాడు ధర్మరాజు. వాళ్ళ ఆశీర్వాదాల్తో సంతోషించాడు. కాని, వాళ్ళూ తమతో అడివికి రావడం మాత్రం అతడికి నచ్చలేదు.

“పగవాళ్ల వంచన మూలాన వున్నదంతా పోయింది మాకు. అడవులికి పోతున్నాం. కాయా కసురూ, దుంపా దుబ్బా తింటూ, నిష్ఠతో కాలం గడపాలి. పాపం, మాతోపాటు మీకూ ఎందుకా కష్టం! వద్దు. నా ప్రార్థన వినండి. ఇళ్ళకి వెళ్ళిపొండి. ఘోరమయిన ఏనుగులూ, పులులూ — వీటిమధ్య వనవాసం దుర్భరంగా వుంటుంది. సహించలేరు” అన్నాడు.

ధర్మరాజు మాటలు దుఃఖం కలిగించాయి బ్రాహ్మలికి. “మీరు తప్ప మాకు మరోగతిలేదు” అంటూ పట్టుబట్టి కూచున్నారు వాళ్ళు. “మమ్మల్ని — ఇంకో ఆశ్రయమూ లేని వాళ్ళని, ఇలా వొదిలిపెట్టడం ధర్మంకాదు మీకు. ఆశ్రితుల్నీ, భక్తుల్నీ ఎంత ఇదయినవాళ్ళయినా విడిచిపెట్టరు. మీరేమో రాజులు. ధార్మికులు. మేమా బ్రాహ్మలం. మమ్మల్ని పొమ్మనడం ఏం న్యాయం? ఇంతమందినీ ఎలా పోషించడమని విచారిస్తున్నారేమో మీరు! ఆ చింతే అక్కరలేదు మీకు. మాకు కావలిసినవి, కందమూలాలూ అవీ మేమే తెచ్చు

కుంటాం. పయిగా, జపం. హోమం, అధ్యయనం - ఇలాంటి పుణ్యా కార్యాల్తో మిమ్మల్ని సంతోషపెడుతూ ధన్యుల మవుతాం. దుశ్మా గ్గానికే నెట్టుకున్నారు ధృతరాష్ట్రుడి కుమాళ్ళు. తీరని అపకారం చేశారు మీకు. ఏమయినా కానివ్వండి. మేము మాత్రం వీళ్ళ రాజ్యంలో వుండడం వొట్టిది'' అన్నారు.

విషమసంధిలో పడిపోయాడు ధర్మరాజు. అంతఇదిగా అంటూ వుంటే వాళ్ళని కాదనడంఎలాగ? సమ్మతించక తప్పిందీ కాదు, చివరికి. ఐతే, వొక్కటే విచారం బాధిస్తోంది. ముప్పూటలా పంచభక్ష్యపర మాన్నాలు తిని లేస్తూ వున్న బ్రాహ్మలు, అడివిలో కాయా కసవూ తింటూ వుంటే, ఎలా సహించడం? ఈ విచారంతో మతిపోయిం దతడికి. నోటమాటరాలేదు. అమాంతంగా నేలమీద చతికిలబడే పోయాడు, దాంతో.

అప్పుడు, బ్రాహ్మల్లోంచి శౌనకుడని బ్రహ్మరుషి వొకాయన వచ్చి, ఎన్నోవిధాల అతణ్ణి సముదాయించాడు. ఆత్మవ్యవసాయం కోసం జనకమహారాజు పూర్వం చెప్పిన జనకగీతల శ్లోకాలు విడమర్చి వివరించాడు.

## జనకగీతలు

"వెయ్యి దుఃఖాలూ, వందభయాలూ రానీ, వివేకం కలవాడు చలించడు. వివేకం లేనివాడు మాత్రం విచారిస్తాడు. శారీరకం, మాన సికం అని దుఃఖం రెండు విధాలు. ఈ రెంటివల్లా దేహి బాధపడ తాడు. అయితే జ్ఞానవంతుడు మాత్రం రెంటికీ దూరంగానే వుంటాడు. ఇదే బోధించాడు.

"వ్యాధిరావడం, శ్రమకలగడం, కీడు మూడడం, మేలు కలక్క పోవడం — ఈనాలుగూ శారీరక దుఃఖానికి మూలకారణాలు. ఏమం

టూవా, వీటివల్లే మానసిక దుఃఖ మేర్పడుతుంది. మానసిక దుఃఖమే శారీరకదుఃఖంగా పరిణమిస్తుంది. కాలుతూన్న ఇనపగుండు వొక నీళ్ళకడవలో వేశామనుకో, ఆనీళ్ళు వేడెక్కు తాయికదా ! అదిగో అలాగే మనస్సులోని దుఃఖంవల్ల శరీరమూ దుఃఖపడుతుంది. అందు కనే చన్నీళ్లతో అగ్గి చల్లార పెట్టినట్టు, జ్ఞానంతో మనస్సుని శాంతంగా వుంచాలి. మనస్సులోంచి దుఃఖం వొదిలిందో, శరీరం నించీ వొదిలి పోతుంది.

"ఇక మానసికదుఃఖం: మానసికదుఃఖానికి స్నేహమే కారణం. స్నేహమే మనిషిని విషయాల్లో ముంచుతుంది. స్నేహసముద్రంలో పడ్డ వాడు దుఃఖాల్లోనే కొట్టుకుంటాడు. దుఃఖం, భయం, శోకం, మోహం, వీటన్నిటికీ స్నేహమే పునాది. అంచేత బంధువులన్నా, మిత్రులన్నా, ధనరాసులన్నా స్నేహం పెట్టుకో కూడదు. తామరాకు మీద నీళ్ళంటవు. అలాగే తెలిసినవాణ్ణి స్నేహ మంటదు. స్నేహంవల్లే రాగం పుడుతుంది. రాగంవల్ల కామం పుడుతుంది. కామంవల్ల క్రోధం, క్రోధంవల్ల తృష్ణా కలుగుతాయి. తృష్ణ సర్వదోషాలకీ పట్టుకొమ్మ. పాపాలన్నిటికీ పాదు. దుఃఖాలన్నిటికీ మొదలు. కనకనే తృష్ణకి దూరంగా వుంటారు బుద్ధిమంతులు. తొర్రలో పడ్డనిప్పు రవంతే అయినా చెట్టంతటినీ దహించివేస్తుంది. అదిగో అలాగే, కొంచెమే అయినా తృష్ణ, ధనలోభం కలిగించి సర్వనాశనం చేస్తుంది. మనిషిని. ధనలోభం కలవాడికి శుభాలంటూ వుండవు. ప్రాణులికి మృత్యువంటే ఎలా భయంగా వుంటుందో, అలాగే డబ్బున్న వాడికి రాజన్నా, దొంగలన్నా, తనవాళ్ళన్నా, నీళ్ళన్నా, నిప్పన్నా నిత్యమూ బెంగ బెంగగా వుంటుంది. నీళ్ళలో చేపలూ, నేలమీద క్రూరమృగాలూ, ఆకాశంమీద పక్షులూ మాంసం తినేట్టు, అందరూ అన్ని విధాలా పీక్కుతింటూనే వుంటారు, ధనవంతుణ్ణి.

"ధనమే అన్ని అనర్థాలికీ ఆధారం. మాయా, మోహమూ ధనమే కలిగిస్తుంది. కావరం, కార్పణ్యం, మానం, భయం, ఉద్వేగం - ఇన్నిటికీ ధనమే ఆదిపీఠం. ధనం ఆర్జించడం, దాన్ని దాచడం, ఖర్చుపెట్టడం - ఇన్నిటా దుఃఖమే అనుభవించాలి. ధనంకోసం ప్రాణాలే పోతాయి. ధనంకోసం చింతించడమంటే తన్ను తాను నాశనంచేసుకోవడమన్న మాట! ధనం దగ్గిరచేరడం, శత్రువులు కత్తిగట్టడం - రెండూ వొకటే. ధనతృష్ణ ఎన్నటికీ చల్లారదని నమ్ము. అంచేత ధనం గడించాలన్న దుఃఖంనించి బయటపడడమే పరమార్థం. ధర్మం చేయడంకోసమన్నా సరే, ధనం గడించడం కంటే, గడించకపోవడమే మంచిది. ఏమంటావా, బురదతొక్కడం, కాళ్ళు కడగడంకంటే తొక్కకపోవడమే నయం కాదా! కనక ధనంకోసం చింతించకూడదు. రూపం, యవ్వనం, జీవితం, ప్రియజనం, ధనం - ఇందులో వొకటీ శాశ్వతం కాదు. అంచేత, బుద్ధిమంతు డెవడూ వీటికోసం దేవులాడడు."

"నా స్వంతానికి ధనమెప్పుడూ కావాలనలేదు నేను" అన్నాడు ధర్మరాజు. "ఇంతమంది బ్రాహ్మల్నీ అడవిలో ఎలా భరించడమనే నా విచారం. గృహస్థుణ్ణి నేను. నావంటివాడు ఎక్కడవుంటే ఏం గాక, పోషించవలిసిన వాళ్ళని పోషించకండా ఎలాపీ లవుతుంది? బ్రాహ్మల్నీ, అతిథుల్నీ కాదనడం ఎలాగ? ఉన్నది వినియోగించి సాధురక్ష చెయ్యాలి కదా? ఆశ్రమాలన్నిటిలోకీ గొప్పది గృహస్థాశ్రమం. గృహస్థన్నవాడు, ఆర్తులయినవాళ్ళకి అభయమివ్వాలి. దాహమన్న వాళ్ళకి దాహమివ్వాలి. ఆకలన్న వాళ్ళకి అన్నంపెట్టాలి. అలిసివచ్చిన వాళ్ళకి పక్కా, ఆసనం ఇవ్వాలి. సనాతనంగా వస్తూ వున్న గృహస్థధర్మాలివి. ఇంటికి వచ్చినవాడికి ఆమాత్రం తృణాసనం, పడుకుందికి కాస్త స్థలం, ఇంత మంచి తీర్థం, రెండు మంచిమాటలూ చెప్పనివాడు గృహస్థే కాడంటాను

ఊరికే పశువుని చంపడం ఎంత పాపమో, కేవలం తనకోసమే వండు కోవడం, వొంటరిగా భోజనం చెయ్యడం అంతేపాపం.[1] అగ్ని హోత్రాలూ, ఎద్దులూ, భార్యాపుత్రులూ, బంధువులూ, పండితులూ, గురువులూ, స్నేహితులూ, సేవకులూ, అతిథులూ —వీళ్ళని సత్క రిస్తూ వుంటేనే క్షేమం. కానప్పుడు సర్వనాశనమే అవుతుంది. అందు కనే గృహస్థు సర్వసంతర్పకుడు — అంటే, అందరినీ తృప్తిపరిచేవాడు కావాలి. ప్రతిదినం పక్షులికి, కుక్కలికీ తుదకి క్రూరజంతువులికీ కూడా తిండి పెట్టాలి. ఉదయం సాయంకాలం వైశ్వదేవం చెయ్యాలి. అమృతం - అంటే యజ్ఞంలో మిగిలిందీ, విఘసం —అంటే అతిథులికి పెట్టగా మిగిలిందీ తినాలి.[2] ఇలా చేసినవాణ్ణే ఉత్తమ గృహస్థు డంటారు. కనుక మీ అందరికోసమే నా విచార మంతాను" అన్నాడు.

"అవును" అంటూ మళ్ళీ అందుకున్నాడు శౌనకుడు. "ఐతే, తపస్సువల్ల ఎంతలేసి పనులన్నా సాధించవచ్చు, తపస్సు చెయ్యినువ్వు. తపస్సిద్ధితో ఇంతమందినే కాదు, మరింతమందినైనా పోషిస్తావు. చెప్ప వచ్చిందేమంటే, ఇంద్రియాలు బలీయమైనవి. అంచేత విషయాభి లాష ఎంతటివాళ్ళనైనా వికారపెడుతుంది. సంకల్పంలో కామం పుడుతుంది. కామంలో చిక్కుకున్న మనస్సు ఇంద్రియాన్ని ప్రేరే పిస్తుంది. అపుడు చెవి మొదలయిన ఇంద్రియాలు శబ్దం మొదలయిన విషయాల్లో పరిభ్రమిస్తాయి. విషయాభిలాష బాణం లా దూసుకు పోతుంది దేహిని. వెలుగుకి ఆసపడి అగ్గిలోపడ్డ శలభం లాగ దుఃఖా గ్నిలో పడిపోతాడతడు. తన్ను తాను మరచిపోతాడు. పాప తృష్ణతో

---

1, 2. యాజ్ఞాలుచేసి అందులో మిగిలిందే భుజించే సత్పురుషులు సర్వపాపాలనుండీ ముక్తి పొందుతున్నారు. తమ స్వంతంకోసం వంట చేసుకొనేవాళ్ళు పాపులు. అలాంటి వాళ్ళుకేవలం పాపమే తింటున్నారు. చూ. నా భగవద్గీత. పు. ౨౦

సంసారచక్రంలో నలుగుతూ వుంటాడు. గరికనించి బ్రహ్మపర్యంతం గల సమస్త ప్రాణికోటికీ ఇదేతంతు. ఐతే ఇది అజ్ఞానుల విషయం.

"రాగద్వేషాలూ, అభిమానమత్సరాలూ విడిచిపెట్టిన మహాత్ములు మాత్రం తమ తపోమహత్వంవల్ల సంసారం జయిస్తారు. వేదాల్లోచెప్పిన శుద్ధసంకల్పం, ఇంద్రియనిగ్రహం, బ్రహ్మచర్యం మొదలయిన వ్రతాలూ,గురుసేవా,నియమితాహారం, వేదాధ్యయనం, కర్మఫలత్యాగం, చిత్తనిరోధం, — ఈ ఎనిమిదీ పాలించి కృతార్థు లవుతారు.

"కర్మచెయ్యి అనీ వేదమే చెపుతోంది. చెయ్యవద్దనీ వేదమే చెపుతోంది. అందుచేత కర్మచేసే వాడు అది వేదాజ్ఞఅనే చెయ్యాలి. కర్మ మానిన వాడూ అది వేదాజ్ఞ అనే మానాలి. మొదటిది ప్రవృత్తి మార్గం. రెండోది నివృత్తిమార్గం. యజ్ఞం, అధ్యయనం, దానం, తపస్సూ, సత్యం, క్షమా, ఇంద్రియనిగ్రహం, నిర్లోభత్వం— ఈ ఎనిమిదీ ధర్మమార్గాలు. మొదటి నాలుగూ కర్మకి చెందినవి. తక్కినవి మనస్సుకి చెందినవి. 'నేను చేస్తున్నాను' అన్న అభిమానం విడిచిపెట్టి ఆచరించాలి, ఇవి.

"తత్వజ్ఞానం తెలిసిన వాడివి నువ్వు. శుశ్రూషా, శ్రవణ గ్రహణ ధారణాలూ, ఊహా అపోహా, అర్థం విజ్ఞానం ఎరిగిన వాడివి. నువ్వు ప్రారంభించిన వన్నీ సంపన్నా లవుతాయి. వసువులూ, రుద్రులూ, ఆదిత్యులూ తపస్సు వల్లే ఐశ్వర్యం సంపాదించారు. నువ్వూ తపస్సు చెయ్యి. ఇష్టసిద్ధి కలుగుతుంది. తపస్సిద్ధులైన వాళ్ళు సాధించని దంటూలేదు. అంచేత యోగ్యంతో తపస్సుచెయ్యి. యోగసిద్ధి వల్ల లభించిన ధనంతో బ్రాహ్మల్ని భరించు. నీకోర్కె సఫల మవుతుంది" అన్నాడు.

శౌనకుడి ఉపదేశం విని తమ్ముళ్లతో కలిసి ధౌమ్యుడితో ఆలోచించాడు ధర్మరాజు. "వద్దంటే వినకండా వున్నారు బ్రాహ్మలు. మనతో అడివికేవస్తామని కూచున్నారు. వీళ్ళని వొదిలి పెట్టాలన్నా మనస్కరించడంలేదు. వీళ్ళ భోజనం సంగతే తెమలడంలేదు. ఏమిటి సాధనం ?" అన్నాడు.

ఆలోచించాడు ధౌమ్యుడు. "తపస్సు తప్ప ఇంకోమార్గం కనిపించదు" అన్నాడు. "సూర్యుడి కోసం తపస్సు చెయ్యి. దేవతలూ నాగులూ, మునులూ, చారణులూ – యావన్మందీ ఆ సహస్రకరుణ్ణి స్తుతిస్తారు. వేద శరీరు డాయన. త్రిమూర్తుల్తో సమానమయినవాడు. దయాస్వరూపుడు. ఆయన్నే ధ్యానించు. పూర్వం, సృష్టి ఆరంభంలో జీవరాసులు ఆకలితో అల్లాడి పోయినప్పుడు, జాలిపడి, సూర్యుడే అన్నం పుట్టించాడు. ఉత్తరాయణంలో భూరసాన్ని – అంటే నీటిని లాక్కుని, దక్షిణాయనంలో తిరిగీ మేఘంతో ఓషధులు చల్లాడు. రాత్రుల్లు చంద్ర కిరణాల అమృతంపోసి వాటిని తడుపుతూ పెంచాడు. వాటిలోంచి అన్నం పుట్టించాడు. ఆ అన్నంతో జీవుల ప్రాణాలు నిలబెట్టాడు. అందుకనే అన్నం ఆదిత్యమయం అన్నారు. ఇది తెలిసే లోగడ భీముడూ, పృథుచక్రవర్తీ, కార్తవీర్యుడూ, నహుషుడూ మొదలయిన వాళ్లు తపస్సుచేసి సూర్యుడినుండి అన్నం సంపాదించారు. ఆపద కాలంలో ప్రజల్ని ఉద్ధరించారు. కనక, సూర్యభగవాన్నుణ్ణే ఆశ్రయించు.. నీకోర్కె నెరవేరుతుంది" అంటూ సూర్యారాధన ఎలా చెయ్యాలో నేర్పాడు. సూర్యుడి నూటా ఎనిమిది పేళ్లూ *

---

* సూర్యుడు అర్యముడు భగుడు త్వష్ట పూషుడు అర్కుడు సవిత రవి గభస్తిమంతుడు అజుడు కాలుడు మృత్యువు ధాత ప్రభాకరుడు పంచభూతస్వరూపుడు సోముడు బృహస్పతి శుక్రుడు బుధుడు కుజుడు ఇంద్రుడు వివస్వంతుడు దీప్తాంశుడు శుచి సౌరి శని బ్రహ్మ విష్ణువు రుద్రుడు స్కందుడు యముడు వైద్యుతుడు అగ్ని జాఠరాగ్ని ఏంధనాగ్ని తేజస్పతి ధర్మధ్వజుడు వేదకర్త వేదాంగుడు వేదవాహనుడు సత్యుడు త్రేత ద్వాపరుడు కలి కల

విధియుక్తంగా ఉపదేశించాడు. ప్రతీ పేరూ స్పష్టంగా ఏవర్ణం ఎలా ఉచ్చరించాలో చెప్పాడు. ప్రతీదాని అర్థమూ విడమర్చి వివరించాడు.

"ఇది లోగడ ఇంద్రుడు నారదుడుకి చెప్పాడు. నారదుడు వసురాజుకి చెప్పాడు. వసురాజే నాకు చెప్పాడు. సూర్యుడి నూటాఎనిమిదిపేళ్లూ కోరినకోరికలు సిద్ధింపజేస్తాయి. దేవతల ఏర్పాటిది. ఈపేళ్ళు జపిస్తూ తపస్సుచెయ్యి" అన్నాడు.

## అక్షయపాత్ర

ధౌమ్యుడి ఉపదేశం అక్షరాలా అనుసరించాడు ధర్మరాజు. పువ్వులూ, ఉపహారాలూ వాటితో పూజించాడు సూర్యుణ్ణి. వ్రతదీక్ష పూనాడు. గాలి మాత్రం ఆహారం చేసుకుని, గంగానదిలో నుంచున్నాడు. ప్రాణాయామపరుడై, సూర్యుడి నూటాఎనిమిదిపేళ్లూ జపించడం ప్రారంభించాడు.

ప్రత్యక్షమయాడు సూర్యుడు. "నీతపస్సుకి సంతోషించాను" అన్నాడు. "నువ్వు అడివిలోవున్నంతకాలం, పన్నెండేళ్ళూ నీ వంటిల్లు తరుగులేకండా వుంటుంది. అడివిదుంపలూ, కాయకూరలూ, మాంసమూ - ఏదయినాసరే ద్రౌపదిచేతిలో దివ్యంగా నాలుగురకాల

కాష్ఠ ముహూర్తుడుక్వపుడు యాముడు క్షణుడు సంవత్సరకరుడు అశ్వత్థుడు కాలచక్రుడు విభావసుడు శాశ్వత పురుషుడు యోగి వ్యక్తుడు అవ్యక్తుడు సనాతనుడు కాలాధ్యక్షుడు ప్రజాధ్యక్షుడు విశ్వకర్మ తపోనుదుడు వరుణుడు సాగరుడు అంశుడు జీమూతుడు జీవనుడు అరిహుడు భూతాశ్రయుడు భూతపతి సర్వలోకనమస్కృతుడు స్రష్ట సంవర్తకవహ్ని సర్వాది అలోలుపుడు అనంతుడు కపిలుడు భానుడు కామదుడు సర్వతోముఖుడు శయుడు విశాలుడు వరదుడు సర్వధాతునిషేచితుడు మనువు సుపర్ణుడు భూతాది శీఘ్రుకుడు ప్రాణధారగుడు ధన్వంతరి ధూమ కేతువు అదిదేవుడు అదితిపుత్రుడు ద్వాదశాత్ముడు అరవిందాక్షుడు మాతాపి పితామహస్వరూపుడు స్వర్గద్వారుడు ప్రజాద్వారుడు మోక్షద్వారుడు త్రివిష్టపుడు దేహకర్త ప్రశాంతాత్ముడు విశ్వాత్ముడు విశ్వతోముఖుడు చరాచరాత్ముడు సూక్ష్మాత్ముడు మైత్రేయుడు కరుణాన్వితుడు— ఈ 108 సూర్యుడిపేళ్ళు.

వంటకాలయి తయారవుతుంది. ఇదిగో ఇది రాగిపాత్ర. అక్షయపాత్ర ఇది. ఎంతమందికి వడ్డించినాసరే, తరుగంటూ వుండదు దీనికి ” అంటూ వరమిచ్చి అంతర్ధాన మయాడు.

సూర్యుడి దగ్గిర వరం పొంది, గంగలోంచి బయటికి వచ్చాడు ధర్మరాజు. ధౌమ్యుడికి పాదాభివందనం చేశాడు. అక్షయపాత్ర ద్రౌపది చేతిలో పెట్టాడు. వంట తయ్యారైంది. అన్ని వేల మంది బ్రాహ్మలికీ తృప్తికరమైన భోజనం లభించింది. కందమూలాలూ, కాయకూరలూ వేసే వండింది ద్రౌపది. ఆమె చేతిలో అది అమృతమే అయిపోయింది అందరికీ.

బ్రాహ్మలు భోజనంచేసి లేచాక, విఘసాన్నమూ, అమృతాన్నమూ ఆరగించారు పాండవులు. భర్తల భోజనాలయాక, మిగిలింది తిని లేచింది ద్రౌపది. అంతవరకూ తరుగు లేకండా వుంది అక్షయపాత్ర.

ఇలా ప్రతీదినం వేలాది బ్రాహ్మల్ని వాళ్ళనీ తృప్తిపరుస్తూ గంగవొడ్డుని ప్రమాణవటం కింద కొన్నాళ్ళున్నారు పాండవులు. అనంతరం బ్రాహ్మలు స్వస్తివాక్యాలు చెపుతూ వుండగా అక్కడి నుండి కామ్యకవనం వెళ్ళిపోయారు.

### విదురుడి విరోధం

అక్కడ హస్తినాపురంలో వొకనాడు విదురుణ్ణి పిలిచాడు ధృతరాష్ట్రుడు. “చూడూ తమ్ముడూ, శుక్రుడికంటే బుద్ధిమంతుడివి నువ్వు. పాండవులూ, నా కొడుకులూ వొక్కటే నీకు. బాగా ఆలోచించి చెప్పు, పాండవుల విషయ మేమిటి?” అని అడిగాడు.

“పాండవులంటే దేవమూర్తులు” అంటూ అందుకున్నాడు విదురుడు. “నీకు మాత్రం తెలియందికనకనా, వాళ్ల పరాక్రమం!

భీముడూ అర్జునుడూ పెద్దపులులు. అస్త్రవిద్యలో అఖండులు. శత్రువుల్ని దక్కనిస్తారని అనుకోకు వాళ్ళు, కలబడితే. 'అధర్మజూదంతో కొంపలంటుకుంటాయి, నీకొడుకులికీ వాళ్ళకీ' అని చెవిలో ఇల్లు కట్టుకు పోరాను. వినిపించుకున్నావు కావు. కొడుకుమాటే వేదవాక్యమయింది. ఇంతవరకూ వచ్చింది. ఇపుడయినా మించిపోలేదు. పిలిపించు వాళ్ళని. వాళ్ళరాజ్యం వాళ్ళకి ఇచ్చెయ్యి. కీర్తి, ధర్మమూ నిలబెట్టు. రాజ్యమూ, ధర్మమూ, అర్థమూ కామమూ, - వీటికి ధర్మమే మూలం. ధర్మం వొదిలిపెట్టకు కర్ణుడూ, శకునీ, దుశ్శాసనుడూ చేస్తున్న దుర్బోధలతో మతి పోయింది దుర్యోధనుడికి. అతని దుర్మార్గానికి తాళం వెయ్యకు.

"వీడు పుట్టడమే పాడుముహూర్తంలో పుట్టాడు. ఎన్నో అపశకునాలూ పుట్టా యపుడు. కౌరవకులానికి కాలసర్పం వీ డని ఆనాడే చెప్పాను. కులదూషకుణ్ణి విసర్జించి కులం రక్షించడం ధర్మం. సకల సామ్రాజ్యానికీ ధర్మరాజుని రాజు చెయ్యి. బంధువులతోనూ, మంత్రులతోనూ, నీకొడుకుల్ని మనుమల్ని రక్షించుకో. పదిమంది ఎదటా ద్రౌపదినీ భీముణ్ణీ ప్రార్థించమని దుశ్శాసనుణ్ణి పంపు.

"నిజానికి ధర్మరాజు ఋషి. అజాతశత్రువు. నీకొడుకులు చేసిన అపరాధం గణించడు. క్షమిస్తాడు. అతణ్ణి సముదాయించి ప్రసన్నుణ్ణి చేసుకో. నీవల్ల కౌరవవంశం కళంకం లేం దవుతుంది. కీర్తివంత మవుతుంది" అన్నాడు.

"ఇలకోడిలాగ అదే గొలుక్కు తింటావేమిటి?" అంటూ రుసరుసలాడాడు ధృతరాష్ట్రుడు. "నా కొడుకుల మంచి అంటేనే కన్నుకుడుతుంది నీకు. చాలు. నీ సలహావద్దూ, సహాయమూ అక్కరలేదు నాకు. పాండవులే అంత మంచివాళ్ళయితే వాళ్ళదగ్గరకే వెళ్ళు.

లేదా, నీకు నచ్చిన మరెక్కడికయినా దయచెయ్యి'' అంటూ మొహం ముడుచుకున్నాడు.

ఆగలేక పోయాడు విదురుడు. అక్కడ మరి నిలవనే లేక పోయాడు. ఉన్నపాళాన బయల్దేరి పోయాడు. మనోవేగంతో పరిగెత్తే రథం మీద కామ్యకవనం రానూ వచ్చేశాడు.

దూరంనుంచే చూశాడు ధర్మరాజు. భీముడితో అన్నాడు: "తమ్ముడూ, మోసంచేసి అప్పుడు గాండీవం మొదలయిన ఆయుధాలు లాక్కోవడం మరిచిపోయినట్టున్నాడు దుర్యోధనుడు! శకుని మంత్రం మళ్ళీ తగిలినట్టుంది. కంకాయింపు చేసి జూదం కోసం మళ్ళీ పంపించినట్టున్నాడు విదురుణ్ణి దుర్మార్గుడు! అలా కాకపోతే ఎందుకు వస్తాడీయన? మరి జూద మాడలేను. కాని - అందుకోసమే పనికట్టుకు ఈయన వస్తే ? - ఏం దారి? పెద్దవాడు, ఈయనమాట ఎలా కాదనడం ?''

ఇలా అంటూనే వున్నాడు ధర్మరాజు. అంతలోనే దగ్గిరికి వచ్చేశాడు విదురుడు. ఎదురు వెళ్ళారు పాండవులు. సత్కారపూర్వకంగా తీసుకువచ్చారు. క్షేమం విచారించారు. వచ్చిన కారణమూ అడిగారు.

"ధృతరాష్ట్రుడు పొమ్మంటే వచ్చేశాను'' అన్నాడు విదురుడు. "'మాకూ పాండవులికీ కావలసిన వాడివి. ఇపుడు చెయ్యవలసిందేమిటో చెప్పు' అంటూ తానే అడిగాడు, పిలిచి. ఉభయులికీ, ప్రపంచానికీ మేలయినట్టు హితంచెప్పాను. పైత్యరోగికిపంచదారలాగ అది వెగటించింది ఆయనికి. ఉన్నమాట చెపితే బుద్ధిమంతులు ఆదరిస్తారు, దాన్ని. బుద్ధిలేనివాళ్ళకిమాత్రం అది విరసంగా విషంలా వుంటుంది. రెండోదే జరిగింది. ధృతరాష్ట్రుడి దగ్గిర. ఎన్నో ఆడి పోశాడు నన్ను. 'మా మంచి నీకు కిట్టదు' అన్నాడు. 'పాండ

వుల దగ్గిరికే పో' అన్నాడు. అందుకని మీ దగ్గిరికే వచ్చే శాను. ముసిలి ఛాందసుణ్ణి పెళ్ళాడిన అందకత్తెలాగ, ఆ దుర్మార్గుణ్ణి అసహ్యించుకుంటుంది, రాజ్యలక్ష్మి. అనురాగం చూపదు. ధర్మానికి తలుపులు వేశారు ధృతరాష్ట్రుడి కొడుకులు. వాళ్ళకా రాజ్యం స్థిర పడుతుంది? ఎన్నడూ జరగదది. నామాట తప్పదు. ధర్మరాజా, తనకి తానై వలచి వస్తుంది నీదగ్గిరికి, సామ్రాజ్యం. నమ్ము. నామాట ప్రకారం నువ్వుమాత్రం ధర్మం తప్పకు" అన్నాడు.

"నీమాట ఎప్పుడూ జవదాటం మేము" అన్నాడు ధర్మరాజు. ఇలా పాండవుల దగ్గిర వుంటూ వచ్చాడు విదురుడు.

విదురుడు పాండవుల దగ్గిరికి వెళ్ళిపోయాడు అనగానే మతి పోయింది ధృతరాష్ట్రుడికి. కళ్ళులేని అతగాడికి, నిజంగా కళ్లయినా, హృదయమయినా విదురుడే, మరి. అతడు లేంది అరనిమిషం గడవదు అతడికి. సతమతమే అయిపోయా డతడు. వెంటనే సంజయుణ్ణి పిలిపించాడు.

" సంజయా! తమ్ముడు విదురుడు లేంది అంధకారంగా వుంది నాకు. నేనంటే ప్రాణం పెట్టేవాడు. నామనస్సు తెలిసినవా డతడు. సర్వధర్మాలూ ఎరిగిన పండితుడు. వెళ్లు. కామ్యకవనం వెళ్ళి, తక్షణం పిలుచుకురా" అన్నాడు.

కామ్యకవనం వచ్చాడు సంజయుడు. ధర్మరాజుని చూశాడు. వేలాది బ్రాహ్మలమధ్య కొలువుతీర్చి కూచున్నాడు ధర్మరాజు. ధౌమ్యుడూ, విదురుడూ దగ్గిరకూచున్నారు. ద్రౌపదీ, దిగ్దంతుల్లాంటి తమ్ములూ అజ్ఞాబద్ధులై కొలుస్తున్నారు. ఇంతమంది మధ్యా సూర్యు డిలా ప్రకాశిస్తున్నా డతడు. వనవాసంలో వున్నా ముల్లోకాలూ ఏలు తున్నట్టు ఉల్లాసంతోనే వున్నాడు. బ్రహ్మానందమే అయిపోయింది సంజయుడికి. వెళ్లి భక్తిపూర్వకంగా నమస్కరించాడు ధర్మరాజుకి.

"మిమ్మల్నీ, విదురుణ్ణీ తలుచుకోని క్షణం లేదు ధృతరాష్ట్ర మహా రాజు. మీతో చెప్పి విదురుణ్ణి తీసుకురమ్మని పంపించాడు నన్ను" అంటూ విన్నవించాడు.

సంజయుడు ఇలా చెప్పడంతోనే, విదురుడి దిక్కు చూశాడు ధర్మరాజు. "చూశావన్నా, ధృతరాష్ట్రుడి శాసనానికి తలవొగ్గు తున్నారు. మనం మరింత మన్నించాలి. అంచేత కాదనక వెళ్లు" అన్నాడు.

సంజయుడివెంట హస్తినాపురం వచ్చేశాడు విదురుడు. సరాసరి ధృతరాష్ట్రుడి దగ్గిరకే వెళ్ళాడు. తలవంచి నమస్కరించాడు. అమాం తంగా లేచి కౌగలించుకున్నాడు ధృతరాష్ట్రుడు. స్నేహపూర్వకంగా శిరస్సు ముద్దాడాడు. "తమ్ముడూ, క్షమాశీలివి నువ్వు. బుద్ధిలేని వాణ్ణి నేను. నన్ను క్షమించు" అన్నాడు.

"క్షమించడానికి ఏముంది, అన్నయ్యా," అన్నాడు విదురుడు. "నువ్వూ, నీకొడుకులూ న్యాయం తప్పినప్పుడు, తగినమాట చెప్పడం నాధర్మం. నా ధర్మం నేను నిర్వహించాను, అంతే. ఇప్పుడూ చెపు తున్నాను. పాండవులు పరాక్రమవంతులు. వాళ్లతో విరోధం విపత్తుకి కారణం" అన్నాడు. అన్నదమ్ము లిద్దరూ ఎంతోసేపు మాట్లాడుకున్నారు. అప్పటినుంచీ మళ్ళీ ఎప్పటిలాగే ధృతరాష్ట్రుడి దగ్గిర వుంటూ వచ్చాడు విదురుడు. తల్లో నాలికలా, అన్ని కార్యా ల్లోనూ సహాయపడేవాడు, వృద్ధమహారాజుకి.

## దు ష్ట చ తు ష్ట య ం

ధృతరాష్ట్రుడూ విదురుడూ మళ్ళీ కలవడంతోనే ఎక్కడలేని సందేహమూ పట్టుకుంది దుర్యోధనుడికి. కర్ణుడూ శకునీ దుశ్శాస నుడూ తానూ - ఈ దుష్టచతుష్టయం మంతనాలు ప్రారంభించారు.

“ వదిలాడనుకుంటే మళ్ళీ ప్రవేశించాడు ఈపాండవపక్షపాతి. అతడి సలహాఅంటే అమృతం మానాన్నకి. ఇద్దరూ అదే గుసగుసలు, రాత్రింబగళ్ళు. కూడబలుక్కుని, పాండవుల్ని లాక్కువస్తారనే అనిపిస్తోంది. ఏం చేద్దాం? కామ్యకవనం వెళదాం. వాళ్ళు నిద్ర పోతున్నప్పుడు, అర్ధరాత్రి అగ్గిపెట్టేద్దాం. రహస్యంగా విషం ప్రయోగిద్దాం. లేదా, నీళ్ళలో ముంచేద్దాం. ఏమంటారూ? ఏంచేద్దామో చెప్పండి ” అన్నాడు దుర్యోధనుడు.

“ నీ తెలివితక్కువకి నవ్వొస్తోంది” అన్నాడు శకుని. “ సత్యం సత్యం అని మడిగట్టుకున్న వాళ్ళు పాండవులు. విదురుడు ఎంతనూరిపోసినా, మతిపోయి మానాన్న పిలిపించినా, వాళ్ళేమో రారుగాక రారు. శపథంవొదలరు ” అన్నాడు.

“ అదేమన్నమాట? ” అంటూ కలగజేసుకున్నాడు కర్ణుడు. “ రాజ్యమంటే చేదా, పిలిస్తే రాకపోడానికి? నేనొకటి చెపుతాను వినండి. ఇది మంచి సమయం. ఇలాంటపుడు వెళ్ళి వాళ్ళని కానిచ్చుకున్నామంటే, పీడావొదుల్తుంది మనకి. సర్వప్రపంచంలోనూ శత్రువన్నవాడు వుండడు. సమస్త సామ్రాజ్యమూ నీదవుతుంది, ముందూ వెనకా చూడవద్దంటాను. సైన్యాలు వేసుకు వెళదాం, పాండవుల్ని అడివిలో ముట్టడిద్దాం. బయల్దేరు ” అన్నాడు.

“ ఓ, భేషుగ్గా వుంది. నాకు నచ్చింది ” అన్నాడు దుశ్శాసనుడు.

అసలే మదోన్మత్తుడు దుర్యోధనుడు. కర్ణుడు చెప్పిందే నచ్చింది అతడికి. వెంటనే సైన్యాలూ అవీ సన్నాహం చేశాడు. దండయాత్రకి సిద్ధంగా వున్నాడు.

దివ్యదృష్టిని అదంతా అవగతమైంది వ్యాసమునికి. ఉత్తరక్షణంలో ప్రత్యక్షమయాడు దుర్యోధనుడి ముందు. కూడదంటూ కూకలువేసి, ధృతరాష్ట్రుడి దగ్గిరికి వెళ్ళాడు. “ ఇదిగో, నీకొడుకులు

మరీ కూడని పనికి నెట్టుకుంటున్నారు. రాజ్యం, దేశం వొదిలిపోయారు పాండవులు. వాళ్ళమానాన వాళ్ళు అడవిలో వున్నారు. వాళ్ళని చంపడానికే సంకల్పించాడు సీకొడుకు. సైన్యాల్తో దాడిచేస్తున్నాడు. ఏం న్యాయమిది! అడవుల్లో వున్నారని పరుగెడుతున్నాడు వాళ్ళ మీదికి! పాండవులమీద గండెత్తడమంటే కొండని ఢీకొట్టడమే. ఇంకా అవకతం కాలేదు మీ వాడికి. వెళ్ళాడా పరాభవం తప్పదు. అంచేత, చీవాట్లు పెట్టు. ఈ దుర్బుద్ధి మాన్పించు. ధైర్యవంతులు పాండవులు పదమూడేళ్ళూ సత్యవ్రతం పాలించేవస్తారు. అప్పుడు ఎలాగూ తప్పదు కయ్యం నువ్వూ, నేనూ, ద్రోణుడూ, భీష్ముడూ, విదురుడూ – ఇంతమందిమీ వుండీ చూస్తూ వూరుకోవడం బాగా లేదు, దుర్యోధనుడి దుడుకుతనం. మందలించు'' అన్నాడు.

"అవును, అన్నిటికంటే పుత్రస్నేహం బలీయమైందే, తల్లిదండ్రులికి. అందుకనే ఎంతధనమున్నా శాంతివుండదు, కొడుకుల్లేని వాళ్ళకి అలా అని మంచీ చెడ్డా అక్కర్లేదా, మరి! పుత్రస్నేహమంటే వేదాల్లో వొక కథ జ్ఞాపకం వస్తోంది, చెపుతాను విను.

### సురభికథ

"గోసంతతి కంతటికీ తల్లికదా, కామధేనువు సురభి. ఒకనాడు దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళి, జాలిగా ఏడవడం మొదలు పెట్టింది. అది. తెల్లపోయాడు దేవేంద్రుడు. 'ఇదేమిటి, ఏడుస్తున్నావు? ఎవ్వారికీ ఏమీ ప్రమాదం రాలేదు కదా? అందరూ క్షేమమేనా?' అంటూ అడిగాడు. 'ఏముంది? నీ వజ్రాయుధం కింద, మూడులోకాల్లోనూ, ప్రాణులు సావన్నీదీ క్షేమంగానే వున్నారు. ఒక్క నా పిల్లకి మాత్రం ఖర్మం కాలిపోయింది. నాకు దూడలకి, ఎడ్లకి బతుకే బరువై పోయింది. భూలోకంలో పెద్ద పెద్ద నాగళ్ళు పూన్తున్నారు వాటికి.

బాధపడుతూ అవి భూమి దున్నుతూ వుంటే చూడలేకపోతున్నాను నేను. బలమైన దాంతో బలంలేనిదాన్ని పూన్చుతున్నారు. అది లాగ లేక బాధపడుతూ వుంటే అదే బాదడం బాదుతున్నారు దాన్ని. అడ్డమూనితిట్లూ తిడుతున్నారు. ములుకర్రతో పొడుస్తున్నారు. నానాహింసా పెడుతున్నారు. చూడలేక తరుక్కు పోతోంది. నాకడుపు' అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

" 'కోటానుకోట్ల సంతానం నీది. మొత్తంమీద దుఃఖముండదు వాటికి. విచారించకు' అన్నాడు దేవేంద్రుడు. 'అదికాదు ప్రభూ' అంటూ మళ్ళీ చెప్పసాగింది సురభి. 'బక్కచిక్కి కొందరు బాధపడుతూ వుంటే, చూసి ఎలా భరించేది?' అంటూ మొరపెట్టుకుంది. 'సరే, భయపడకు' అంటూ అభయమిచ్చాడు, ఇంద్రుడు. వర్షం కురిపించి, పుష్కలంగా పచ్చగడ్డి పుట్టించాడు. పచ్చగడ్డిమేసి, బక్కచిక్కినవి కూడా బలంగా తయారయాయి ఎడ్లు.

"ఇంతకీ చెప్పవచ్చిందేమింటంటే, — కొందరు బావుంటేచాలు అని మిగిలినవాళ్ళని వొదిలిపెట్టింది సురభి! అలాగే అడవుల పాల యిన పాండవుల్ని నిష్ఠురంగా చూడవద్దంటాను. నువ్వెంతో, పాండు రాజూ, విదురుడూ అంతే నాకు. అలాగే, నీకొడుకులు వందమందినీ ఎలాచూస్తున్నావో, పాండురాజు కొడుకులు అయిదుగురినీ అలాగే చూడాలి నువ్వు. పుత్రస్నేహంలో పక్షపాతం కూడదు కదా!

"మంచివాళ్ళ సహవాసంతో చెడ్డవాళ్ళూ మంచివాళ్ళవుతారు. ధర్మరాజు దగ్గిర వుంటే దుర్యోధనుడూ ధర్మాత్ముడవుతాడు. ధర్మ రాజు రాజరుషి. ఎవ్వరయినా కోరుకోవలసిందే అతడి సహవాసం. అతణ్ణి సేవిస్తూ అతడిదగ్గిర కొంతకాలం వుండమను దుర్యోధనుణ్ణి. ఉభయులికీ క్షేమమయిన మార్గం చెప్పాను. కాదనకు" అన్నాడు.

---

* చూ. వాల్మీకి రామాయణం, అయోధ్యాకాండ

"దుర్యోధనుడు నామాట వినడు" అన్నాడు ధృతరాష్ట్రుడు. "నిజంగా కౌరవవంశం రక్షించాలనే వుంటే, నువ్వే బుద్ధిచెప్పు వాడికి. ఒక దారికి తీసుకురా" అటూ చేతులు జోడించాడు.

"చెప్పవలిసింది చెప్పేవచ్చాను" అటూ లేచాడు వ్యాసుడు. "నేను వెళ్ళాలి. ఇప్పుడే మైత్రేయముని వస్తాడిక్కడికి. అతడే బుద్ధి జెప్తాడు నీకొడుక్కి" అంటూ తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

## మై త్రే యు డి శా ప ం

వ్యాసుడు వెళ్ళిన కొద్దిక్షణాల్లోనే ప్రత్యక్షమయాడు మైత్రేయుడు. చప్పున లేచి ఎదురు వెళ్ళాడు ధృతరాష్ట్రుడు. సత్కార పూర్వకంగా తోడితెచ్చాడు. కొడుకులతో కలిసి ఎన్నో సపర్యలూ చేశాడు. తగిన ఆసనంవేసి భక్తి తాత్పర్యాలతో కూచోబెట్టాడు. నెమ్మదిగా అతడు కూచున్నాక "ఎక్కడినుండి ఇలా దయచేశారు?" అంటూ ప్రశ్నించాడు.

"కామ్యకవనం నించి, సరాసరి పాండవుల దగ్గరనించే ఇలా వస్తున్నాను" అన్నాడు మైత్రేయుడు. "తీర్థయాత్ర చేస్తూ కురుజాంగలం వచ్చాను. కామ్యకవనంలో పాండవుల్ని చూశాను.- జడలూ, లేడితోళ్ళూ, ముదాక నారబట్టలూ కట్టుకున్నారు వాళ్ళు. అడివిదుంపలూ, కాయా కసవూ తింటూ పొట్టపోసుకుంటున్నారు. తపస్సూ చేస్తున్నారు.

"అడవిలో అలా వాళ్ళని చూశాను. ఇక్కడ హస్తినాపురం రాజమందిరంలో, నిన్నూ నీకొడుకుల్నీ చూసిపోదామనే, పనిగట్టుకుని, ఇలా వచ్చాను."

పాండవుల విషయం చెప్పగానే మొహం దించుకున్నాడు ధృతరాష్ట్రుడు. దించిన మొహం ఎత్తకుండానే ప్రశ్నించాడు. "పాండవులు క్షేమంగా వున్నారు కదా!" అని. "సత్యవ్రతులు

వాళ్ళు. మమ్మల్ని తలుస్తూ వుంటారా ? సత్యవంతులే కాదు, బల వంతులు కూడాను. అన్నదమ్ముల స్నేహానికి విరుద్ధంగా, శపథభంగా నికి పూనుకోరు కదా ! " అని అడిగాడు.

"ధర్మమతులు వాళ్ళు. వాళ్ళక్షేమానికి లోప మేముంది ? " అన్నాడు. మైత్రేయుడు, "ముప్పొటలా మునీశ్వర్లు వచ్చి ఆశీర్వదించి వెడుతూ వుంటారు, వాళ్ళని. వాళ్ళకి క్షేమంకాక మరెవ్వాళ్ళకుంటుంది? సందేహించకు. శపథభంగానికి పూనుకోరు వాళ్ళు. వాళ్ళే శపథం తప్పిననాడు, సూర్యచంద్రుల గతులే తప్పిపోతాయి. ఐతే, మహా రాజా! నీకొడుకే దుర్మార్గానికి నెట్టుకున్నాడు. అకారణంగా వాళ్ళకి అపకారం చేస్తున్నాడు" అంటూ దుర్యోధనుడిదిక్కు తిరిగాడు, ముని.

"దుర్యోధనా! నిజంగా నువ్వు బుద్ధిమంతుడివే అయితే నా మాట విను. పాండవులతో విరోధం విడిచిపెట్టు. మీ ఉభయులికీ- ఉభయులికీ అన్నమాటేమిటి - కౌరవవంశానికే ఇది క్షేమం. పాండ వులు పరాక్రమవంతులు. వజ్రదేహులు. ఇంద్రుడితో సమానులు. ఒకొక్కడూ పదిలక్షుల ఏనుగులంత బలవంతులు ఉత్సాహవంతులు. యుద్ధమంటే వురకలు వేస్తారు. వాళ్ళలో భీముడు - నీకుమాత్రం తెలియందేముంది ? - యముడే యముడు. బకాసురుణ్ణి చంపాడు. హిడింబుణ్ణి కొట్టాడు. పదివేల ఏనుగుల బలశాలిని, జరాసంధుణ్ణి- చిటికలో చీల్చిపారేశాడు. నిన్నగాక మొన్న, అంత కిమ్మీరుణ్ణే, అవలీల హతమార్చాడు. అతడే కళ్ళెర్రచేస్తే బతికేవా డెవడు ?

"పైగా, శ్రీకృష్ణుడు వాళ్ళ దగ్గిరచుట్టం. ధృష్టద్యుమ్నుడు బావమరిది. మానవమాత్రుడికి ఎవడికి సాధ్యం, వాళ్ళని వేలెత్తి చూపడానికి? నీ మంచికోసం చెపుతున్నాను. వాళ్ళతో విరోధం విడిచి పెట్టు. వాళ్ళతో స్నేహమే నీకు శ్రేయస్కరం " అన్నాడు.

మైత్రేయుడు చెపుతువ్నంతసేపూ పెడసరంగానే వున్నాడు దుర్యోధనుడు. ముసిముసి నవ్వులు నవ్వుతూ, కాలి బొటనవేలు కింద రాస్తూనే వున్నాడు. తొడలమీద చేత్తో తాళంవేస్తూ కూచున్నాడు.

ఒళ్లు మండింది మైత్రేయమునికి. "ఈ పెడసరానికి ప్రతిఫలం అనుభవిస్తావు. యుద్ధంలో తొడలు విరిగి మూలుగుతావు" అంటూ శపించాడు. గజగజలాడి పోయాడు ధృతరాష్ట్రుడు. చేతులు జోడించి ప్రార్థించాడు. "అనుగ్రహించండి. శాపం మళ్ళించండి" అంటూ కాళ్ళావేళ్ళా పడ్డాడు. కొంత శాంతించాడు ముని. "ఇతడికి సమబుద్ధి కలిగిందంటే శాపం తగలదు. అలా కాక, ఈగర్వం ఇలాగే వుంటే మాత్రం నా శాపం తప్పదు" అన్నాడు

ముని శాంతించాక, "కిమ్మీరుణ్ణి భీముడు చంపా డన్నారు. అదేమిటో సెలవియ్యండి" అంటూ అడిగాడు ధృతరాష్ట్రుడు. "నా మాటలు వెటకార మనిపించా యిమీ వాడికి. ఇక నేను చెప్పడ మెందుకు? వెళతాను. కిమ్మీరుడి విషయం కామ్యకవనంలో బ్రాహ్మలవల్ల వినే వున్నాడు విదురుడు. అతడు చెపుతాడు విను" అంటూ లేచి పోయాడు మైత్రేయుడు. వెళ్ళిపోయాక విదురుణ్ణి కిమ్మీరుడి కథ చెప్పమన్నాడు ధృతరాష్ట్రుడు. విదురుడు చెప్పడం మొదలుపెట్టాడు

## కిమ్మీరుడివధ

"మూడుఅహోరాత్రాలు ఎక్కడా ఆగకండా ప్రయాణంచేసి, కామ్యకవనం చేరారు పాండవులు. ఒకనాడు అర్ధరాత్రి, రాక్షసులు తిరిగేవేళ, రాక్షసమాయ చేస్తూ వొక రాక్షసుడు ఎదురయ్యాడు వాళ్ళకి. అప్పుడే ఉదయిస్తూన్న సూర్యకిరణాలుపడి, ఎర్రగా ఎలా వుంటుంది పెద్ద నల్లమేఘం, అదిగో అలా భయంకరంగా వున్నాడు వాడు. కొండ గుహలాంటి పేద్ద నోరు తెరిచి ఎదూరుగుండా నుంచున్నాడు. పెద్ద పెద్ద కోరలు, వాడిగా, ఎంతోవికారంగా

వున్నాయి. అంతలేసి మిడిగుడ్లు బండిచక్రాల్లాగ తిరుగుతున్నాయి. కపిలవెంట్రుకలు అటూ ఇటూ వేలాడుతున్నాయి. ప్రాణిమాత్రులందరూ భయభ్రాంతులయ్యేట్టు పెడబొబ్బలు పెడుతున్నాడు. చెట్లూ చేమలూ అల్లాడిపోయేట్టు చిందులు తొక్కుతున్నాడు. వేలాది బ్రాహ్మలూ, వాళ్ళముందు లేడిచర్మాలు కప్పుకుని పాండవులూ రావడంచూసి దారికి అడ్డంగా పేద్ద పర్వతంలా నుంచున్నాడు.

"ఎన్నడూ చూడలేదు అలాంటి ఆకారం. నిలువునా కంపించిపోయింది ద్రౌపది. భర్తల మధ్యకి వెళ్ళి కళ్ళు మూసుకుంది. దుశ్శాసనుడు పట్టిలాగిన ఆమె వేణీభరం వేలాడుతూ వుంటే, ఐదు పర్వతాలమధ్య, నదిలా కనిపించిందామె, భర్తలమధ్య. ఇంద్రియాలు అంటూ విషయాల్ని పట్టుకున్నట్టు అయిదుగురు భర్తలూ ఆమెని పొదివి పట్టుకున్నారు. ఆమెని భయపడకండా వోదార్చారు.

"ఇంతలో రక్షోఘ్న మంత్రాలు (రాక్షసుల్ని నాశనం చేసే మంత్రాలు) చదివాడు ధౌమ్యపురోహితుడు రాక్షసుడి మాయాబలం నాశనం చేశాడు. మాయాబలం నాశనం కావడంతోనే మిడిగుడ్లలో నిప్పులుకక్కుతూ రాక్షసుడు. పేద్ద చేతులు చాచుకుంటూ ముందు నుంచున్నాడు.

"'ఎవడివి నువ్వు? ఏమిటి ఇదంతా? ఈఅడవిలో ఏంపని?' అంటూ అడిగాడు ధర్మరాజు. 'కిమ్మీరుడంటారు నన్ను' అంటూ అట్టహాసం చేశాడు రాక్షసుడు. 'రాక్షసుణ్ణి. బకాసురుడి తమ్ముణ్ణి. ఇక్కడి ప్రాణులు తినడమే ఈఅడవిలోపని నాకు. రాక్షసమాయలో రాజుని. ఈమాయచూపించి మనుష్యుల్ని తినడం సరదా నాకు. నన్ను గెలిచినవాడు ఇంతవరకూ లేడు. నాభయంవల్ల కామ్యకవనంలో కాలు పెట్టే మనిషే లేడు. మీరెవ్వరో ముందు చెప్పండి. మిమ్మల్ని, ఇంతమందిని తినేస్తాను. తప్పదు. మాంచి విందు నాకు'అన్నాడు.

"'' మేము ఎవరిమనేనా నీ ప్రశ్న ? చెపుతాను విను' అన్నాడు ధర్మరాజు. నన్ను ధర్మరాజు అంటారు. ఇతను భీముడు. ఇతను అర్జునుడు. వీళ్ళిద్దరూ నకుల సహదేవులు. నలుగురూ నాతమ్ముళ్లు. పాండవులంటారు మమ్మల్ని. శపథంపట్టి వనవాసంకోసం వచ్చాం.'

"భీము డనగానే పెద్ద తుఫానులా నవ్వాడు కిమ్మీరుడు, 'ఆఁ ! ఏమిటీ ! భీముడా వీడు ! ఏమదృష్టం ఇవాళ! వీడెప్పుడు దొరుకుతాడా, ఎప్పుడు మింగుతానా అని కలలు కంటున్నాను. అమ్మకి చిక్కిన మేకలా వాడే వూడిపడ్డా డిక్కడ. బిడతంభట్టు చేతికి చిక్కాడు. మాఅన్నని వీడే చంపాడు. నానేస్తం హిడింబుణ్ణి పొట్టబెట్టుకున్నాడు. అతడి చెల్లెల్ని లేవదీసుకుపోయాడు. అమాంతంగా మింగేస్తాను వీణ్ణి. వాతాపిని మింగిన వశిష్ఠుడిలా గర్జున తేన్చేస్తాను' అంటూ భూమి బద్దలయ్యేటట్టు అరిచాడు.

"వాడిలా అంటూనే వున్నాడు, చింతనిప్పుల్లా ఎరుపెక్కాయి భీముడికళ్ళు. పటపటమన్నాయి పళ్ళు. శరీరం పొంగినట్టయింది. తమంత తామే బిగుసుకున్నాయి పిడికిళ్ళు. గాండీవం తీశాడు అర్జునుడు. కత్తులు దూశారు నకులసహదేవులు. 'కానీ' అన్నట్టు భీముణ్ణి చూశాడు ధర్మరాజు.

"తుపాను రేగిన రెండు సముద్రాల్లా కలబడ్డారు భీముడూ కిమ్మీరుడున్నూ. ఇద్దరూ వొక్కలాగే వున్నారు. ఇద్దరూ కోపంతో వొళ్ళు మరచిపోయారు. ఇద్దరూ బుసకొడుతున్నారు. ఇద్దరూ చెరో చెట్టు పెరికి పట్టుకున్నారు. చెట్టు గిరగిరా తిప్పి కిమ్మీరుడి నెత్తిమీద కొట్టాడు భీముడు. ముక్కలై వూడుకుంది చెట్టు. సరిగ్గా అలాగే మారుదెబ్బ కొట్టాడు కిమ్మీరుడు. భీముడి నెత్తిమీదపడి ముక్కలైంది చెట్టు. ఇద్దరూ మళ్ళీ చెరో చెట్టూ పెరికారు. అవీ అలాగే ముక్కలయాయి. మళ్ళీ చెరో చెట్టూ పెరికారు. ఇలా చుట్టుపట్ల

వున్న చెట్లన్నీ అయిపోయాయి. చెట్లయుద్ధం ఆగిపోయింది. చెరో రాయీ తీశారు. రాళ్ళయుద్ధం ఆరంభమైంది. పెద్దపెద్ద పణుకులు, వొకళ్ళమీద వొకళ్ళు విసురుకుంటున్నారు. భీముడు విసిరిన రాళ్ళన్నీ గురితప్పకుండా కిమ్మీరుడిమీద పడుతున్నాయి. గుండపిండి అయి కింద పడుతున్నాయి కిమ్మీరుడు విసిరిన రాళ్ళూ అలాగే భీముడి మీదపడుతున్నాయి గుండగుండ అయి కింద పడుతున్నాయి. ఉభయులూ రాళ్ళవర్షమే కురిశారు. పెద్ద పణుకు తీసి కిమ్మీరుడి గుండెలమీద కొట్టాడు భీముడు. దెబ్బతినీ మీదికి వురికాడు కిమ్మీరుడు. సూర్యుణ్ణి పట్టుకున్న రాహువులాగా, భీముణ్ణి పట్టుకున్నాడు. ఆపట్టులోనే కిమ్మీరుడి బలం తెలిసిపోయింది భీముడికి. యమదండాల్లాంటి చేతుల్తో వాడి నడుమూ, కంఠమూ పట్టుకున్నాడు. నేలమీద వేసి, బకుణ్ణి విరచినట్టే పెళపెళా విరిచాడు. బకుడిలాగే కిమ్మీరుడూ చచ్చి వూరుకున్నాడు. 'బకుడూ, హిడింబుడూ అని ఏడ్చావు. వాళ్ళదగ్గిరికే దయచెయ్యి' అంటూ వాడి కళేబరం దూరంగా విసిరేడు.

"కిమ్మీరుడితోనే కామ్యకవనంలో రాక్షసభయం వొదిలి పోయింది. అన్నదమ్ములూ, ధౌమ్యుడూ, మిగిలిన బ్రాహ్మలూ—యావన్మందీ భీముణ్ణి పొగిడారు. ఇదీ కిమ్మీరుడి కథ."

కిమ్మీరుణ్ణి భీముడు అలా చంపిన కథ విదురుడు చెప్తూవుంటే కౌరవుల గుండెల్లో రాయి పడ్డట్టయింది. బిక్క చొచ్చిపోయారు కొందరు.

### కామ్యకవనంలో శ్రీకృష్ణుడు

'పాండవుల రాజ్యం పోయింది. దేశం నించి తరిమేశారు వాళ్ళని. మునుల్లాగ, అడవుల్లో బాధపడుతున్నారు వాళ్ళు' -

ప్రపంచమంతా పాకింది ఈవార్త. వినీవినడంతోనే కామ్యకవనం బయల్దేరాడు శ్రీకృష్ణుడు. యాదవులూ, వృష్ణులూ, భోజులూ, అంధకులూ - యావన్మందీ అతడి వెంట వచ్చారు. పాంచాలంనించి ధృష్టద్యుమ్నుడూ శుక్తిమతినించి ధృష్టకేతూ వాళ్ళూ వచ్చారు. దారికడాకూ దుర్మార్గుడయిన దుర్యోధనుణ్ణి తిట్టిపోయనివారు లేరు.

ఇలా అందరూ కామ్యకవనం వచ్చారు. పాండవుల అవస్థచూసి యావన్మందీ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు.

సహించేలేక పోయాడు శ్రీకృష్ణుడు. కోపంతో చింతనిప్పులే అయిపోయాయి అతడి నేత్రాలు. పిడికిలి బిగించి ఉగ్రమూర్తే అయిపోయాడు. "మోసం - మోసంచేసి వీళ్ళని ఇన్నిపాట్లు పెట్టారు, పాపాత్ములు. సహించవలిసిందేనా మనం! పదండి. కౌరవులు వాళ్ళ పురుగన్నా లేకండా సంహరిద్దాం" అన్నాడు.

ఆపాద మస్తకం కంపించి పోతున్నాడు శ్రీకృష్ణుడు. ప్రళయ యముడిలా భయంకరంగా వున్నా డతడు. "దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీ - వీళ్ళ కొత్తరక్తంతో భూదేవికి తర్పణం చేద్దాం. ముక్కలుకోసి మాంసాలు కాకులికీ, రాంబందులికీ వేద్దాం. లెండి. ధర్మరాజే సామ్రాట్టు. సమస్త సామ్రాజ్యానికీ అతణ్ణే పట్టాభిషేకం చేద్దాం" అంటూ పిడుగులే వురిమాడు.

గడగడలాడి పోయింది కామ్యకవనం. గాలికూడా కదలడానికి భయపడుతున్నట్టుంది.

చప్పున లేచాడు అర్జునుడు. రెండుచేతులూ జోడించాడు. "శాంతించు ప్రభూ, శాంతించు" అంటూ ప్రార్థించాడు. "పూజ్యుడివి. పురాణ పురుషుడివి. ఈశ్వరుడివి. అప్రమేయుడివి. చరాచరములయిన భూతరాసులన్నీ నీలోనే పుడుతున్నాయి. నీలోనే వుంటున్నాయి.

నీలోనే లయ మవుతున్నాయి. గంధమాదనంలో పూర్వం ఘోర మయిన తపస్సు చేశావు నువ్వు. పదివేలసంత్సరాలు పళ్లూ కంద మూలాలే తిన్నావు. పదకుండు వేలవళ్ళు నీళ్ళతో మాత్రం గడిపావు. వెయ్యి దివ్యసంవత్సరాలు ప్రభాసతీర్థంలో వొంటికాలిమీద తపస్సు చేశావు, ఎన్నో వేలసంవత్సరాలు బదరీవనంలో ఘోరమయిన తపస్సు చేశావు. గాలిమాత్రం ఆహారం చేసుకున్నావు. చేతులు మీదికెత్తి, వొంటికాలిమీద నుంచున్నావు. సరస్వతీచక్రం (సత్రం) లోపన్నెండేళ్ళు ఎన్నో అన్ని వ్రతాలు చేశావు. లేడిచర్మం వేసుకుని, నియమపాలనం చేస్తూ శరీరం కృశింప జేసుకున్నావు. తపోనిధానుడివి. సర్వలోకాలూ జయించావు. చైత్రరథంలో లెక్కలేనన్ని, గొప్పగొప్ప యజ్ఞాలు చేశావు. ఒక్కొక్క యజ్ఞంలోనూ నూరేసి లక్షల మాడలు దక్షిణ లిచ్చావు. యజ్ఞపురుషుడివి. తపస్సూ, యజ్ఞాలూ చేసి అమిత తేజో వంతుడి వయావు. దైత్యరాజుల్ని చంపావు. దానవరాజుల్ని వధిం చావు. ఇంద్రుడి దేవేంద్రత్వం అడ్డులేకండా చేశావు. లోకప్రభుడివి. అదితికశ్యపులికి జన్మించావు. దేవేంద్రుడికి తమ్ముడి వయావు. మూడు అడుగుల్లో మూడు లోకాలూ ఆక్రమించావు. విశ్వరూపధారివి. నరకుడూ, శిశుపాలుడూ వంటి లోకకంటకుల్ని, గర్వపోతుల్ని సంహ రించడానికి పుట్టిన అవతారమూర్తివి. మహాత్ముడివి. అసత్యం, మదం, మత్సరం, దుర్వికారం — ఏవీ ముట్టవు నిన్ను. కృష్ణా, నీకు నువ్వే సాటి. శాంతించు" అంటూ స్తోత్రం చేశాడు.

శాంతించాడు శ్రీకృష్ణుడు. చిత్తనిప్పుల్లాంటి నేత్రాలు చూస్తూ చూస్తూ వుండగానే ప్రశాంతమయిన పద్మపత్రాల్లా అయి పోయాయి. "నువ్వూ నేనూ వొకటే కదా," అన్నాడు చిరు నవ్వుతో. "నరుడూ నారాయణుడూ అని ఆదిమునులం మనం. అర్జునా, నువ్వు నరుడివి. నేను నారాయణుణ్ణి. ఇలా మనుష్య

యోనిలో పుట్టాం. నువ్వు వేరూ, నేను వేరూ అన్న భేదమే లేదు. అంచేత, నీ మిత్రుడే నా మిత్రుడు. నీ శత్రువే నాశత్రువు'' అన్నాడు.

అనంతరం కృష్ణుడూ, అర్జునుడూ కులాసాగా కబుర్లు చెప్పు కుంటూ కూచున్నారు. చుట్టూ యావన్మందీ ఆసీనులయారు. ఇంతలో ద్రౌపదివచ్చి దీనంగా నుంచుంది, కృష్ణుడి ఎదట. "అన్నయ్యా" అంటూ బావురుమంది. "అన్నీ తెలుసు నీకు. అయినా నీ ముందు నాపరాభవం చెప్పుకుంటేనేకాని శాంతిలేదు నాకు'' అంటూ కళ్ళ నీళ్ళుతుడుచుకుంది. "సృష్టి ఆదిలో ప్రజాపతివి నువ్వే అన్నాడు అసిత దేవలుడు. సత్యంతో యజ్ఞాలు పుట్టించడంచేత నిత్యసత్యమయుడి వయిన యజ్ఞపురుషుడి వన్నాడు కశ్యపుడు. శిరస్సులో స్వర్గం, పాదాల్లో భూమీ, కుక్షిలో లోకాలూ నిండి వుండడంవల్ల సర్వ మయుడి వన్నాడు నారదుడు. అక్షయ మయిన జ్ఞాననిధి వన్నారు మహామునులు. యుద్ధంలో వెన్ను చూపని వీరపురుషులికీ, ఆత్మప్రబో ధంతో స్థిరచిత్తులైన పుణ్యపురుషులికీ ధర్మమూ, అర్థమూ, కామమూ తెలుసుకుని తృప్తులయిన రాజరుషులికీ, యోగసిద్ధులయిన సాధు జనులికీ, నువ్వే గతి. లోకాలన్నిటికీ నువ్వే శరణ్యం. నీకు తెలియం దేముంది ?

"రాజాధిరాజు పాండురాజు. అంతటి మహారాజు కోడల్ని. వీరాధివీరుల ధర్మపత్నిని. పూజ్యుడి వయిన నీ చెల్లెల్ని. మహాశక్తి శాలి ధృష్టద్యుమ్నుడి తోడబుట్టువుని. ఇంతటిదాన్ని —నన్ను దుశ్శా సనుడు జుత్తుపట్టి ఈడ్చాడు. నిండుసభలో — పాపాత్ముడు — బట్టలు విప్పి అవమానించాడు. కళ్ళారాచూస్తూ, తమని కాదన్నట్టు—పైవా ళ్ళలా వూరుకున్నారు నాభర్తలు. భీష్ముడూ మొదలయిన వృద్ధులు యావన్మందీ వున్నారు. ఒక్కడూ నోరు మెదపలేదు.

"శరణంటే అడ్డుపడే వీరపురుషులే భీమార్జునులు! నేను మొర్రో అంటే కదలన్నా కదలలేదు. ఎందుకొచ్చిన బాహుబలం వీళ్ళది! భర్తలున్నారు. అన్నదమ్ములున్నారు. కొడుకులున్నారు. బంధువులున్నారు. ఇందరూ వుండికూడా, దిక్కులేనిదాన్నే అయిపోయాను నేను! నన్ను చూసి కర్ణుడు నవ్వాడు. దుశ్శాసనుడి దారుణం కంటే, కర్ణుడి నవ్వే బాధిస్తోంది నన్ను. అగ్నిశిఖలా సర్వాంగాలూ దహించేస్తోంది. అన్నయ్యా, చేతులు జోడించి అడుగుతున్నాను నిన్ను. నాపరాభవానికి ప్రతీకారం లేదా? చెప్పు" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమె గుండెలమీదపడి కన్నీళ్లు ధారాపాతంగా ప్రవహిస్తున్నాయి.

"నీ గుండెల్లో కుములుతూవున్న అగ్నిహోత్రం చెల్లీ, ఎంతమాత్రం వ్యర్థంకాదు. ఏడవకు" ఓదారుస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు. "అర్జునుడి బాణాలు కార్చిచ్చులా ఆక్రమిస్తాయి. కౌరవుల బలగం కారడివిలా కాలిపోతుంది. పగలు రాత్రయినా, రాత్రిపగలయినా, ఏడు సముద్రాలూ ఇంకిపోయినా ఇదిమాత్రం తప్పదు. నమ్ము" అన్నాడు.

"కృష్ణుడు మనపాల వున్నాడు. చివరికి అన్నీ చక్కబడతాయి. విచారించకు" అన్నాడు అర్జునుడు. "పురుషోత్తముడీయన. మనఇంతమందినీ పాపాలంటకుండా కాపాడతాడు. తప్పకుండా హతమారుస్తాం శత్రువుల్ని. నీ పరాభవానికి ప్రతీకారం నువ్వే చూద్దువుగాని" అన్నాడతను.

"ఏడవకమ్మా, ఏడవకు" అంటూ ఓదార్చాడు, ఉబుకుతూన్న కోపం దిగమింగుతూనే ధృష్టద్యుమ్నుడు. "దుర్యోధనుణ్ణీ, దుశ్శాసనుణ్ణీ భీముడు చంపుతాడు. కర్ణుణ్ణి అర్జునుడే కడతేరుస్తాడు.

నేను ద్రోణుణ్ణి చంపుతాను" అన్నాడు. ఇలా ఇందరూ ఓదార్చారు ద్రౌపదిని.

తరవాత ధర్మరాజు దిక్కు తిరిగాడు కృష్ణుడు. "ద్వారకలో సాత్యకివల్ల అంతా విన్నాను. వినడంతోనే నిన్ను వచ్చి చూసేదాకా మనస్సు కుదుటపడ లేదు. నేనే దగ్గరవుంటే ఈ దుర్వ్యసనంలో పడ నిచ్చేవాణ్ణి కాదు. ఆడదీ, జూదమూ, వేటా, తాగుడూ - ఇవి కామం వల్ల పుడతాయి. ఈ నాలుగు దుర్వ్యసనాలూ తప్పించుకోవాలి. అందులోనూ ముఖ్యంగా అనర్థదాయక మైంది జూదం. దీన్ని వొదలక పోవడమే పాపం. ఇదంతా సహేతుకమయిన దృష్టాంతాల్తో నిరూపించేవాణ్ణి. భీష్ముడూ, విదురుడూ, ద్రోణుడూ, కృపుడూ - వీళ్ళని కూడగట్టుకుని ధృతరాష్ట్రుణ్ణి వొప్పించేవాణ్ణి. ఎంతమాత్రం జూదం జరగనిచ్చే వాణ్ణి కాదు. కాదని అడ్డువచ్చిన అవివేకుల్ని అంతుచూసి మరీ వొదిలేవాణ్ణి. ఇంతకీ నేను ఆ సమయంలో ద్వారకలోనూ లేక పోయాను. సాల్వుడితో యుద్ధం చేస్తూ పదినెల్లు సముద్రతీరంలో వుండిపోయాను. వాణ్ణి చంపి వచ్చాక ద్వారకలోగాని ఇదంతా తెలియలేదు నాకు" అన్నాడు.

సాల్వుడూ, యుద్ధమూ అనడంతోనే, ఆవివరం చెప్పమన్నాడు ధర్మరాజు. చెప్పడం మొదలు పెట్టాడు శ్రీకృష్ణుడు :

## సౌంభకం కథ

రాజసూయంలో, నీఅర్ఘ్యం కారణంగా తిరగబడ్డ శిశుపాలుణ్ణి నేను చంపానుకదా! అదిగో, ఆ శిశుపాలుడి తమ్ముడే ఈసాల్వుడు. అన్నని చంపానని విన్నాడు. నే నిక్కడే ఇంద్రప్రస్థంలోనే వున్నాను. వాడు ద్వారక పరిగెత్తాడు. సౌంభకనగరంతో సన్నద్ధుడై వెళ్ళి పట్టణాం ముట్టడించాడు. కామగమనం కలది సౌంభకం. ఎక్కడికిపడితే

అక్కడికే వెళుతుంది. 'మా అన్ననిచంపి విర్రవీగుతున్నాడు. దుర్మార్గుడు కృష్ణు డెక్కడ? రమ్మనండి యుద్ధానికి. వాణ్ణి చంపి మరీ నీళ్ళు తాగుతాను' అంటూ చతురంగ బలాలతో ద్వారకచుట్టూ దండు విడిశాడు. పట్నం బయట అందమయిన పెద్దపెద్ద ఉద్యానవనాలన్నీ వల్లకాడుచేశాడు. తాటిచెట్లూ, మద్దిచెట్లూ, దేవదారుచెట్లూ, గిరక తాటిచెట్లూ, తమాలవృక్షాలూ - వొకటేమిటి వనం వనమంతా నాశనం చేశాయి వాడి ఏనుగులు.

"ఐతే పట్నంయొక్క వాడి ప్రతాపమంతా. పట్నం చుట్టూ నీళ్ళతో నిండివుంటుంది అగడ్త. వాడి తాతతరంకాదు దాటడం. శిరంగులూ మొదలయిన అనేకయంత్రాలతోనూ వాటితోనూ అసాధ్యంగా వుంటుంది ప్రాకారం. పశుగ్రాసం, ధాన్యాలూ పుష్కలంగా వుంటాయి లోపల. నాలుగు దిక్కులా మాంచి దృఢంగా, కదలకండా వుంటాయి దేవిడీల తలుపులు. వేలాది సైనికులు కాపలా కాస్తూనూ వుంటారు వాటిని. ఎక్కడబడితే అక్కడ ముష్కరుల్లాంటి వీరభటులు పికపిక లాడుతూ వుంటారు. లేక్కలేనన్ని ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ నిండివుంటాయి. రాత్రిళ్ళు పట్టపగల్లాగ దివిటీలు వెలుగుతూవుంటాయి. పెద్దపెద్ద మేడలమీద మంచి మంచి బాణాలూ, చక్రాలూ, తోమరాలూ, గండ్రగొడ్డళ్ళూ, పాశాలూ, అంకుశాలూ, దివిటీలూ పట్టుకుగస్తు తిరుగుతూవుంటారు వీరభటులు. పరాయివాడు భేదించడం వశం కాదు ద్వారకాపట్టణం. అంచేత లోపలికేమో తొంగి చూడలేక పోయాడు సాల్వుడు.

పట్టణం వెలపలమాత్రం సర్వదుంబాలా చేశాడు. చలివేంద్రాలూ, యజ్ఞశాలలూ, దేవాలయాలూ, పుట్టలూ మాత్రం వాడి ధర్మమంటూ వొదిలిపెట్టాడు. సముద్రప్రదేశంలో డేరాలు పాతాడు. రాత్రింబగళ్ళూ అదే ఉపద్రవం ప్రారంభించాడు.

మా వాళ్ళు మాత్రం సామాన్యులా! సహించలేకపోయా రది. అన్నీ కూడగట్టుకుని సౌంభకం మీద దండెత్తారు. ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, చారుదేష్ణుడూ - వీళ్ళంతా మహారథులే మరి. యుద్ధమంటేనే వురికి గెంతులేస్తారు. చతురంగ బలాలు వేసుకుని పట్నం బయట సాల్వుడితో తలపడ్డారు. పరశురాముణ్ణి చెప్పి, చెప్పవలసిన వాడు సాంబుడు. వచ్చీరావడంతోనే సాల్వుడి సేనాధిపతి క్షేమ ధూర్తిమీద పడ్డాడు. భూమీ ఆకాశం బాణాల్తో ముంచెత్తాడు. క్షేమధూర్తి చలించలేదు. ఒక లక్ష బాణాలయినా వేసివుంటాడు సాంబుడిమీద. చెలరేగిపోయాడు సాంబుడు. బంగారం మొదళ్ళున్న సానపట్టిన బాణాలు తీసి అదేకొట్టడం కొట్టాడు, క్షేమధూర్తి గుర్రాల్ని. దాంతో రథం ఈడ్చుకుంటూ అదే పారిపోవడం పారి పోయాయి గుర్రాలు.

క్షేమధూర్తి అలా పోవడంతోనే వేగవంతుడని వొకడు కల బడ్డాడు సాంబుడిమీద. సాంబుణ్ణి ఆగమంటూ వేగవంతుణ్ణి ఎదిరించాడు చారుదేష్ణుడు. గద తీసుకుని వొకే వొక్క దెబ్బకొట్టాడు వాణ్ణి. భళ్ళున పగిలిపోయింది వేగవంతుడి తల. రక్తం ధారలు కట్టింది. మీదిప్రాణాలు మీదే ఎగిరిపోయాయి. పిడుగు దెబ్బకి విరిగి పడ్డ కొండ శిఖరంలా కిందపడింది కళేబరం.

అంతలో వివింధ్యుడని వొకడు మెరుపులా వచ్చాడు చారు దేష్ణుడి మీదికి. బాణ మీద బాణం వేశాడు అతడిమీద. కళ్లల్లో నిప్పులు రాలాయి. చారుదేష్ణుడికి. అగ్నిబాణం తీశాడు అమ్ములపొదినుంచి. అభిమంత్రించి వొదిలిపెట్టాడు. మంటలు కక్కుతూ వెళ్ళింది అగ్నిబాణం. వివింధ్యుడి గుండెకి తగిలి దూసుకుపోయింది. అయిపోయిం దతడిపని. నేల అదిరినట్టు కళేబరం మాత్రం కిందపడింది. హాహాకారాలే చేసింది సాల్వుడి సైన్యం.

"భయపడకండి" అంటూ స్వాలుడే దూసుకువచ్చాడు ఈసారి. ఆయుధాలన్నిటితోనూ పరిపూర్ణంగా వుంది అతడి రథం. ధూమకేతువులాగ పరుగెత్తించాడు యాదవుల మీదికి. కనపడ్డ వాణ్ణల్లా పొడిచాడు. చేతికి అంనదివాణ్ణల్లా నరికాడు. పరుగెత్తిన వాణ్ణల్లా బాదాడు. వీరవిహారమే చెయ్యడం మొదలెట్టాడు. సేన సేనంతా వాడే కనిపించాడు. అన్నిచోట్లా వాడి వాడివాడి ఆయుధాలే మెరిశాయి.

పట్టరాని కోపం వచ్చింది ప్రద్యుమ్నుడికి. హంసల్లాంటి తెల్ల గుర్రాలు పూసిన బంగారం రథం పరిగెత్తించాడు. అందమయిన జెండా కొయ్యని చక్కగా అమర్చిన మకరధ్వజం ఎగురుతూవుంటే మెరుపులా వురికాడు సాల్వుడిమీద. ఉడుంతోలు కవచంగా తొడిగిన చేతుల్తో బాణాలు సంధిస్తూ కవ్వించి పిలిచాడు వాణ్ణి. వాడిటు తిరిగాడో లేదో, వందలూ, వేలూ బాణాలు కుప్పించాడు.

సాల్వుడు మాత్రం సామాన్యుడా మరి! బాణాలతో తుపానే పట్టించాడు మనవాడి మీద. రెండు చిచ్చులపిడుగులు ఢీకొన్నట్టు ఘోరంగా జరిగింది యుద్ధం. అటు సౌంభకం ప్రజలూ, ఇటు ద్వారక వాళ్ళూ అరిచేతిలో ప్రాణాలు పట్టుకుని నుంచున్నారు. క్షణం గడిచిందో లేదో ప్రద్యుమ్నుడిదే పైచెయ్యి అయింది. దెబ్బతిని మూర్ఛపోయాడు సాల్వుడు. రథం మీదే పడిపోయాడు. కాని వెంటనే తెలువుకున్నాడు. లేచీ లేవడంతోనే యమదండాల్లాంటి బాణాల్తో కొట్టాడు ప్రద్యుమ్నుణ్ణి. మూర్ఛపోయాడు ప్రద్యుమ్నుడు.

దారుకుడి కొడుకు సారథ్యం చేస్తున్నాడు. తక్షణం, మళ్ళించాడు రథం. యుద్ధంనించి దూరంగా తీసుకుపోయాడు మనవాణ్ణి. అంతలోనే తెలువుకున్నాడు ప్రద్యుమ్నుడు. కోప్పడ్డాడు సారథిని. "ఏమిటిది? పారిపోవచ్చావేమిటి? భయపడ్డావా? యుద్ధంలో వెన్నుచూపడం,

పారిపోతున్న వాళ్ళని చంపడం, శరణంటే కావకపోవడం — యాదవుల్లో కల్లోఅయినా చూశావా? ఇలా పారిపోయి వచ్చావమంటే పరువన్నా నిలుస్తుందా! ఏమంటారు పెదనాన్న బలదేవులు! తమ్ముళ్ళూ, అక్రూరుడూ, నవ్విపోతారే నన్ను! ఎంతపనిచేశావు! అయిందేదో అయింది. పరిగత్తించు రథం, సాంబుడూ వాళ్ళ దగ్గిరికి. సాల్వుడిమీదికి పోనీ. పోనీ వేగం" అన్నాడు.

"క్షమించు" అన్నాడు సారథి. "ఒడుపు తప్పివస్తే రథిని రక్షించాలి సారథి. అలాగే సారథినీ రక్షించాలి రథి నువ్వు మూర్ఛపోయావు. గత్యంతరం లేకపోయింది నాకు. తప్పించుకు వచ్చేశాను" అంటూ పగ్గాలు సవరించాడు. "ఇదిగో రెప్పపాట్లో సాల్వుడిమీద వురుకుతుంది రథం" అన్నాడు. సవ్యంగా, అపసవ్యంగా — చిత్రంగా చుట్టూతిప్పి, క్షణంలో సాల్వుడికి అడ్డంగా పరిగెత్తించాడు రథం.

దెబ్బకొట్టినట్టయింది సాల్వుడికి. వరసాగ్గా మూడు బాణాలు కొట్టాడు ప్రద్యుమ్నుడి సారథిని. రాక్షసమాయచేసి, ఎడతెరిపిలేని బాణాలు వొదిలాడు ప్రద్యుమ్నుడిమీద. అన్ని బాణాలూ భగ్నం చేశాడు ప్రద్యుమ్నుడు. బ్రహ్మాస్త్రం గురిపెట్టాడు సాల్వుడిమీద. చెవులవరకూలాగి వొదిలిపెట్టాడు. సాల్వుడి మొహంమీద్నే తగిలింది బ్రహ్మాస్త్రం. ఉన్నపాళాన పడిపోయాడు సాల్వుడు. తెలివితప్పి కూలబడ్డాడు రథంమీద. రెప్పపాట్లో మరో దివ్యాస్త్రం సంధించాడు ప్రద్యుమ్నుడు. ఉత్తరక్షణంలో వొదిలిపెడతాడు సాల్వుడిమీద.

ఆకాశంనిండా హాహాకారాలు చెలరేగాయి. దేవతలతో సహా నారదుడూ, మారుతులూ వచ్చి ప్రద్యుమ్నుడి ముందు నుంచున్నారు. "ఆగు. బాణం వొదలకు. వీడు నీచేత చావడు. కృష్ణుడే చంపుతాడు వీణ్ణి. బ్రహ్మదేవుడి ఆదేశమిది" అంటూ వారించారు. ఎత్తినబాణం

దించేశాడు ప్రద్యుమ్నుడు. దాంతో ద్వారక ముట్టడి విరమించుకున్నాడు సాల్వుడు. సౌంభక మెక్కి వచ్చిన దారిని మళ్ళిపోయాడు.

రాజసూయం ముగిశాక నేను ద్వారక వెళ్ళి చూతునూ, దిగాలు మంది మనస్సు. పాడయిపోయిన ఉపవనాలతోనూ, విరిగిపోయిన ద్వారాలతోనూ దిస్సపోయివుంది పట్నం. బ్రాహ్మల కొంపల్లోంచి వేదధ్వనులు కాని, స్వాహాశబ్దాలు కానీ వినపడవు. ఎవరి మొహాలు చూసినా కళా కాంతీ లేదు. ముస్తాబులే మానుకున్నారు స్త్రీలు. అంతా అదోలా వుంది ద్వారక.

ఉగ్రసేనుడివల్ల జరిగిందంతా విన్నాను. 'సాల్వుణ్ణి చంపికాని పట్నంలో కాలుపెట్టను' అంటూ శపథం చేశాను. పట్నం భద్ర మని బలరాముడూ మొదలయినవాళ్ళకి అప్పగించాను. మంచున్న పాళాన ప్రయాణభేరీ వేయించాను. పురోహితులూ మొదలయిన బ్రాహ్మలికి నమస్కరించి బయల్దేరాను. స్వస్తివచనాలు చెప్పారు వాళ్ళు. శైబ్యం, సుగ్రీవం, మేఘపుష్పం, వలాహకం రథానికి పూయించాను. పాంచజన్యం పూరించాను. పంచమహావాద్యాలూ మోగాయి. జయించుకురావాలని వేలాదిజనం దీవించారు. దిక్కులు ప్రతిధ్వనించాయి. గరుడధ్వజం మేఘాల్లో రెపరెపలాడింది. లెక్కా, జమాలేనంత చతురంగ సైన్యం వెంట నడిచింది. కొండలూ, వనాలూ, నదులూ, సరోవరాలూ దాటి మార్తికావత దేశం ప్రవేశించాను.

నేను చేరకముందే నావార్త విన్నాడు సాల్వుడు. పుంజాలు తెంపుకు పారిపోయాడు. సౌంభకంతో వెళ్ళి సముద్రంలో దాగున్నాడు. అన్నిటికీ సిద్ధంగానే వున్నాను నేను. వదలకండా వెంట తరిమాను. వాడున్న చోటికే వెళ్ళాను; ముట్టడించాను. వెళ్ళీ వెళ్ళడంతోనే వ్యవధి ఇవ్వకండా ఆక్రమించాను. ముందూ వెనకా చూడకండా రక రకాల ఆయుధాలు ప్రయోగించాను.

సాల్వసైన్యంలోని వీరులంతా వొక్క మొగిని ఏకమయారు. నా సారథిమీదా, గుర్రాలమీదా, రథంమీదా అడ్డమూని అస్త్రాలూ వడగళ్ళవానలా వర్షించారు. నా ధనుస్సు శార్ఙ్గం సారించాను నేను. విడుపూ విరామం లేకపోయింది బాణాలికి. సముద్రంలో పడుతూన్న రాక్షస కళేబరాలికి ఎడా తెరిపీ లేకపోయింది. గాలితో అసలే కల్లోలంగావుంది సముద్రం. గుభీగుభీ కళేబరాలు వేలూ లక్షలూ పడుతూవుంటే ప్రళయఘోషలా ఘోషించింది. సముద్రఘోషనీ మించిపోయాయి మాభటుల సింహనాదాలూ, ఏనుగుల ఘీంకారాలూ గుర్రాల సకిలింపులూ అవీనూ.

క్షణక్షణం మాసైన్యంలో ఉత్సాహం పెరుగుతూ వచ్చింది. వాళ్ళసైన్యం క్షీణించింది. ఆగలేకపోయాడు సాల్వుడు. సౌంభకం మీద ఎక్కి మాయయుద్ధం మొదలు పెట్టాడు. గొడ్డళ్ళూ, అంకుశాలూ, ముద్గరాలూ, శూలాలూ, కత్తులూ, కటార్లూ - వొకటేమిటి అదేపనిగా నామీద కుమ్మరించాడు. అవన్నీ తునకలాగ తూలగొట్టాను నేను. దాంతో రాళ్ళవర్షం లంకించుకున్నాడు వాడు. చిమ్మచీకట్లు కల్పించాడు. అంతలోనే మండుటెండ పుట్టించాడు. క్షణంలో మబ్బులు. క్షణంలో నిర్మలాకాశం. క్షణంలో చలి. క్షణంలో వేడి. వంద సూర్యులు, వంద చంద్రులు, లక్ష చుక్కలు, ఆకాశంమీద. ఇది పగలూ ఇది రాత్రీ అని తెలియదంటే నమ్మ. నేనే నిచ్చరపోయాను. ఆలోచించాను. అన్నిమాయలూ అడిచిపెట్ట డానికి అమోఘం అగ్నిబాణం. అదే ప్రయోగించాను. వాడి మాయవేషాలన్నీ దాంతో మండి పూరుకున్నాయి.

ఐతే మరో ఆపద వచ్చిపడింది. ద్వారకనించి ఆహుకుడు పంపాడంటూ వొకడు రొజుకుంటూ వచ్చాడు. "ద్వారకలో సాల్వుడు వసుదేవుణ్ణి పట్టుకున్నాడు. ఇక్కడ ఎవరితో యుద్ధం చేస్తు

న్నావు? వెంటనే వచ్చి పట్నం రక్షించు" అంటూ వార్త వినిపించాడు. తుళ్ళిపడ్డాను. ఏమీ అర్థం కాలేదు నాకు. అన్నయ్యా బలరాముడూ వాళ్ళూ అంత పరాక్రమవంతులు! వాళ్ళంతా ఏమయ్యారు? వసుదేవుడు పట్టుపడ్డ మేమిటి? ఇలా సంశయిస్తూనే వున్నాను. ఎదురుగుండా సౌంభకం కనిపించింది. పుణ్యం తరిగిపోయి స్వర్గంలోంచి వస్తున్న యయాతిలాగ సౌంభకం మీద కనిపించాడు వసుదేవుడు. ఒంటిమీద వస్తువులు లేవు. బట్టలు చిందరవందరగా వున్నాయి. తల చెదిరిపోయి వుంది. రాక్షసులు పట్టుకుని బాధిస్తున్నారు. నాకళ్ళే నేను నమ్మలేకపోయాను. తల తిరిగిపోయింది. నిండు ప్రాణాలు నిలువునా ఎగిరిపోయాయంటే నమ్ము. శార్ఙ్గం చేతిలోంచి జారిపోయింది. రథంమీద పడిపోయాను.

నా అవస్థ చూసి బెంగపెట్టుకున్నాయి మా సైన్యాలు. సతమతమే అయిపోయాయి. తెలుపుకున్నాను కొంతసేపటికి. చూతునూ, సౌంభకంమీద వసుదేవుడు లేడు. సాల్వుడుమాత్రం పకపకా నవ్వుతున్నాడు. అదంతా మాయ అని అర్థమైపోయింది. ఎక్కడలేని కోపమూ వచ్చింది నాకు. శార్ఙ్గం చెలిదాకా లాగి వో — క్క — బాణం వేశాను. కనపడకండా పోయింది సౌంభకం. ఏడుపులూ పెడబొబ్బలూ పెట్టింది వాడి రాక్షససైన్యం. వాళ్ళ ఏడుపులు గురిపెట్టాను. శబ్దభేదిబాణాలు ప్రయోగించాను. క్షణంలో వాళ్ళందరినీ హతమార్చాను.

ఇందాకటి దెబ్బతో ప్రాగ్జ్యోతిషం పారిపోయింది సౌంభకం. మళ్ళీ తిరిగి వచ్చిందది. రాక్షసరూపం ధరించాడు సాల్వుడు. మీద పర్వతవర్షం కురిపించాడు. అన్నిదిక్కులనించీ పెద్దపెద్ద పర్వతాలు నామీద పడుతున్నాయి. ఊపిరి సలపకండా అయింది. వజ్రబాణం ప్రయోగించాను. కొండలన్నీ పిండిచేశాను.

'ఉద్దండుడు వీడు. మాయావి. మరి ఉపేక్షించకు' అంటూ నన్ను హెచ్చరించాడు సారథి దారుకుడు. దారుకుడి నోట్లోమాట నోట్లోనే వుంది. తీశాను సుదర్శనచక్రం. అభిమంత్రించి, వొదిలి పెట్టాను. రాక్షసులూ, యక్షులూ, గంధర్వులూ, దైత్యులూ, దానవులూ సుదర్శనం ముందు సలుసులు. ప్రళయకాలంలో గూడు కట్టినసూర్యబింబంలా భయంకరంగా బయల్దేరింది సుదర్శనం. మంటలు కక్కుతూ వెళ్ళి సౌంభకంమధ్య పడింది. శివుడి పాశుపతం పడి మండి పోయిన త్రిపురాల్లాగ భగ్గున మండి బుగ్గయింది సౌంభకం. నిలువునా చీలుకుపోయి కిందపడ్డాడు సాల్వుడు. ఇదీ సాల్వుడి సంగతి."

సౌంభకం కథవిని చకితులయ్యారు పాండవులు. ఇలా కృష్ణుడి తోనూ తదితర బంధువులతోనూ కులాసాగా కాలక్షేపం చేశారు వాళ్ళు. చెప్పవలిసినవన్నీ చెప్పి, వెళ్ళివస్తానన్నాడు కృష్ణుడు. సుభద్రనీ, అభిమన్యుణ్ణీ తన బంగారంరథంమీద ద్వారక తీసుకు పోయాడు. *

ప్రతివింధ్యుడూ మొదలయిన ద్రౌపది కుమార్ళ్ళు అయిదుగురినీ కాంపిల్యం తీసుకుపోయాడు ధృష్టద్యుమ్నుడు. తన చెల్లెలూ నకులుడి భార్యా ఐనక రేణుమతిని శుక్తిమతి నగరం తీసుకుపోయాడు ధృష్టకేతు.

## ద్వైతవనం

అనంతరం, ఆయుధాలూ అవీ పట్టుకుని ద్వైతవనం వచ్చేశారు పాండవులు. ఇంద్రసేనుడూ మొదలయిన మూలభృత్యులు ఇరవయిమంది మాత్రం వెంటబెట్టుకున్నారు. యావన్మంది బ్రాహ్మలూ యథాప్రకారం కూడా వున్నారు.

---

* ఇక్కడ శ్రీకృష్ణుడు పాండవులికి చెప్పినట్టు శ్రీవత్సరాజు కథ అని వొక చక్కని కథ రాశాడు, బంగాలీభారతకర్త కాశీరామదాసు.

ద్వైతవనం చేరాక తమ్ములతో అన్నాడు ధర్మరాజు: "మహారణ్య మిది. మదపుటేనుగులూ, సింహాలూ, పులులూ, పెద్ద పెద్ద పాములూ — ఎన్నో వున్నాయి యిక్కడ. అప్రమత్తులమై వుండాలి మనం. అంతేకాదు, శత్రువులూ మనల్ని కాంటాడుతూనే వుంటారు. ఎన్ని మాయలయినా ప్రయోగిస్తారు తెలిసి మసులుకోవడం ఎంతయినా అవసరం" అని.

"నీ ప్రతాపమే అందరికీ రక్షరేక అన్నయ్యా," అన్నాడు అర్జునుడు. "బ్రహ్మజ్ఞానులయిన వేలాది బ్రాహ్మలు తెల్లవారేసరికి నీ పూజ లందుకుంటున్నారు నిన్ను ఆశీర్వదిస్తున్నారు. అన్ని లోకాలూ చుట్టివచ్చే మహామునులు, నారదుడూ, వ్యాసుడూ మొదలయిన వృద్ధులు నీక్షేమం కోరుతున్నారు. అలాంటపుడు, లోప మేముంటుంది మనకి !

"నందనవనంలా వుంది ద్వైతవనం. అన్ని రుతువుల పువ్వులూ వున్నా యిక్కడ. అన్ని కాలాల పళ్ళూ వున్నాయి. అన్ని వనస్పతులూ సమృద్ధిగా వున్నాయి. నెమళ్ళూ, చిలకలూ, కోయిలలూ — వీటి మధురగానాల్తో పులకరిస్తున్నాయి తోపులు. పద్మవనాల్తో పరిమళిస్తున్నాయి సరోవరాలు. కొంగలూ, కొక్కెరలూ, జక్కవలూ, కన్నెలేడిపిట్టలూ వాటితో ఎంతో గొప్పగా వున్నాయివి. అమృతంలాంటి చల్లని నీళ్ళతో ప్రవహిస్తున్నాయి నదులు. అన్నిటినీ మించి మహామునుల ఆశ్రమాలూ వున్నా యిక్కడ. అంచేత ఇక్కడే వుందాం" అన్నాడు.

ద్వైతవనంలో నివాసం పెట్టారు పాండవులు లతలతో అల్లుకున్న చెట్లకింద అన్నదమ్ములు అయిదుగురూ విడివిడిగా నివాసాలు ఏర్పరుచుకున్నారు. అయిదుగురూ మనోనిగ్రహంతో కాలక్షేపం చేస్తూ వుండేవాళ్లు. దేవకార్యాలూ, పితృకార్యాలూ నిర్వహించేవాళ్లు.

తమని చూడవచ్చిన మునులికీ, బ్రాహ్మలికీ తృప్తిగా భోజనాలూ అవీ పెట్టేవాళ్లు.

ఒకనాడు మహాముని మార్కండేయుడు, శిష్యులతో కూడా అక్కడికి వచ్చాడు. మహాతపశ్శాలి మార్కండేయుడు. పాపాలన్నీ వొదిలించుకున్న మహారుషి. సకల ధర్మాలూ తెలిసిన మహాత్ముడు. భక్తిపూర్వకంగా ఎదురువెళ్ళి అతణ్ణి ఎంతోఅంత సత్కరించాడు ధర్మరాజు. వనవాస కష్టంతో వున్న ద్రౌపదినీ పంచపాండవుల్నీ చూశాడు ముని. తల పంకించాడు. "నాయన తండ్రి మాటమీద రాజ్యం వొదలి, తమ్ముడితోనూ భార్యతోనూ వనవాసం చేసిన రాముణ్ణే చూశాను. ఇపుడూ ధర్మాత్ముడయిన ధర్మరాజునే చూశాను. సగరుడూ, భరతుడూ, నలుడూ, యయాతీ, పృథువూ, అంబరీషుడూ - ఈ పూర్వరాజులు యావన్మందీ ధర్మమూ సత్యమూ పాలించడం వల్లే భాగ్యవంతులయారు, పుణ్యలోకాలూ పొందారు. శకునివంటి పాపాత్ముడితో కలిసి దుర్యోధనుడిలా అధర్మం చేసినవాళ్లు ఇంతవరకూ ఎవ్వరూలేరు. ధర్మం తప్పకండా నడుస్తున్నారు మీరు. సత్యవ్రతం పాలిస్తున్నారు. తప్పకండా ఇష్టసిద్ధి కలుగుతుంది మీకు" అన్నాడు.

ధర్మప్రసంగంచేసి మార్కండేయముని వెళ్ళిపోయాక, అపర సంధ్యోపాసనలో కూచున్నాడు ధర్మరాజు. సాయంకాలహోమాలు ఆరంభమయాయి వేలాది బ్రాహ్మలు అగ్నిహోత్రాలు వెలిగించారు. అపుడు బకదాల్భ్య డనే ముని అన్నాడు: "వీళ్ళంతా ఉత్తమ బ్రాహ్మలు. వేదపరాయణులు. సాధుచరిత్రులు. ఇంతమందీ ఎల్లప్పుడూ ప్రేమపూర్వకంగా మీశుభం, ఔన్నత్యం వృద్ధి చేస్తూ వుంటే, ఈ వనవాసం మహారాజా, మీకే తగింది. బ్రాహ్మలు హితాభిలాషులు కావడం వల్లే పూర్వం బలిచక్రవర్తి మొదలయిన వాళ్ళు ఎంతో కాలం తరగని సంపదలతో తులదూగారు. భూలోకం

యావత్తూ పాలించారు. అగ్నిదేవుడికి గాలిదేవుడు తోడైతే అరణ్యాలు తగలబడినట్టు, రాజులికి బ్రాహ్మలు తోడైతే, శత్రువులు దగ్ధమే అయిపోతారు. బ్రాహ్మల మాటలు వినుకున్న రాజులికి, అందులోనూ ఇంద్రియనిగ్రహం కలవాళ్ళకి, ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ – నాలుగూ సిద్ధిస్తాయి. బ్రాహ్మల్ని వొదిలిపెట్టి, ధర్మానికి దూరంగా వున్న రాజుని ప్రజలుకూడా వొల్లరు. ప్రజానురాగం లేనివాడికి రాజ్యమూ స్థిరంకాదు. ధర్మరాజా, బ్రాహ్మలంటే ప్రాణం మీకు. ధర్మమే మీవ్రతం. అభ్యుదయం తప్పదు మీకు" అన్నాడు. అక్కడ వున్న యావన్మంది బ్రాహ్మలూ బకదాల్భ్యుణ్ణి పూజించారు.

అలా ద్వైతవనంలో దినాలు గడుపుతున్నారు పాండవులు. వనవాసం కష్టమనిపించినప్పుడల్లా ఉత్సాహంకలిగే కథలూ, కబుర్లూ చెప్పుకుంటూ వుండేవాళ్ళు.

ఒకనాడు అందరూ కూచుని ఆమాటా ఈమాటా ఆడుకుంటున్నారు. "అవును, ఆ ముసిలాయనమాటే చిత్రమనిపిస్తుంది నాకు!" అంటూ ఎత్తుకుంది ద్రౌపది. "కొడుకుమాటే రుచించింది క్రూరుడు. పాపానికే నెట్టుకున్నాడు. రాజ్యం లాక్కున్నాడు. దేశం వెళ్ళగొట్టాడు. అప్పుడుకాని కడుపునిండలేదు. వజ్రమన్నా కరుగుతుంది, కాని ఆ రాతిగుండె కరగదు. ధర్మమూర్తులు మీరు. తనకొడుకులు అనరాని మాటలు అన్నీ అన్నారు. బెల్లంకొట్టిన రాయిలా అలా వూరుకున్నాడే కాని పల్లెత్తుమాట అనలేదు వాళ్ళని! పోట్లాట పొసగాలనేనా అతడి శుభసంకల్పం!

"మంచిమంచి మేడల్లో విహరించేవాళ్ళు మీరు, అడవుల్లో తిరుగుతున్నారు. హంసతూలికలమీద పండుకునే వాళ్ళు, గడ్డిమీదా గాదమీదా నిద్రిస్తున్నారు అగరూ, చందనం పూసుకునేవాళ్ళు, బుర్దీ, బూడిదతో తిరుగుతున్నారు. రాజాధిరాజులు సేవించేవాళ్ళు, అడివి

మృగాల్తో గడుపుతున్నారు. కళ్ళారా చూసి సహిస్తున్నాను నేను! పగిలన్నా పోదు, పాషాణహృదయం నాది! అంధమహారాజులాగే దేవుడూ నిష్ఠురంగానే వున్నాడు. సమస్తభోగాలూ దూరంచేశాడు.

"మహారాజా, సింహాంకోదములు చెరలో పడ్డట్టుంది, మీ తమ్ముల సంగతి. నీ శాసనం వాళ్ళని గొలుసుల్లా బంధించి వుంచింది. పరాక్రమం మాని పడరాని పాట్లూ పడుతున్నారు.

"నీ పాదాలమీద శిరస్సులు వాంచి నమస్కరించేవాళ్ళు, శత్రు రాజులు. వాళ్ళ కిరీటాల్లోని పద్మరాగమణుల కాంతికి ఎర్రపడేవి నీ పాదపద్మాలు. అలాంటి నీ పాదాలు కొండలమీదా, కరుకురాళ్ళ మీదా రక్తాలు చిమ్ముతున్నాయి. మహదైశ్వర్యంతో తులతూగే మీరు అడవుల పాలయారు. అష్టకష్టాలూ అనుభవిస్తున్నారు. రోజూ, పదివేలమంది బ్రాహ్మలికి బంగారంపళ్ళేల్లో షడ్రసోపేతంగా భోజనాలు పెట్టేవాడివి. వాళ్ళు తృప్తిపడి లేచాకే, ఆరగించేవాడివి. ఇప్పుడో, కాయా కసవూతోనే కాలం గడుస్తోంది. అయినా, చిత్రం! శత్రువుమీద కోపం రాదు నీకు!

"పదివేల ఏనుగుల బలశాలి మీ పెద్దతమ్ముడు. కారడివిలో, కాయకూరలు తింటూ ఎలా చిక్కిపోయాడో చూడు! రెండుచేతులే అయినా వెయ్యిచేతుల కార్తవీర్యుడికంటే బలశాలి అర్జునుడు. ఒక్క బిగిని వాకేసారి ఆయిదుబాణాలు వేస్తాడు. అంతటి మహారథుడు అడివి మృగాలమధ్య దేవులాడుతున్నాడు! ఎండంటే కందిపోతారు, సుకుమారులు నకుల సహదేవులు. ఎలా దీనంగా వున్నారో చూడు! ఇదంతా చూస్తూ, ఎలా వూరుకుంటున్నావో అనిపిస్తుంది నాకు.

"క్షమాగుణం వుండవలిసిందే. కాదనను. అయితే, క్షమ అప్పుడు క్షమా, ప్రతాపమప్పుడు ప్రతాపం ప్రకటించాలి, రాజు. ప్రతాపం శూన్యమైతే, ప్రజానురాగమూ శూన్యమవుతుంది. ఇతిహా

సాలూ ఇదే చెపుతున్నాయి. 'క్షమా, ప్రతాపం - ఈ రెంటిలో ఏది గొప్పదో చెప్పు, అని తాతని ప్రహ్లాదుణ్ణి అడిగాడు బలిచక్రవర్తి. 'రెండూ గొప్పవే, అన్నాడు ప్రహ్లాదుడు. 'క్షమ అప్పుడు క్షమా, ప్రతాపమప్పుడు ప్రతాపం ప్రకటించాలి రాజు. ఎప్పుడూ ప్రతాపం ప్రకటించడం ఎంత దోషమో, ఎప్పుడూ క్షమతో వుండడమూ అంతే దోషం. క్షమ మాత్రమే వహించినవాడి దగ్గిర సేవకులు సహా భయపడరు. పైగా అవమానిస్తారు. పొగరుబోతులై తిరగబడతారు. చేతికిచిక్కిన ధనమూ చపాయిస్తారు. అలా అని ఎప్పుడూ ప్రతాపం ప్రకటించడమూ చిక్కే. అలాంటివాడు క్రూరుడే అయిపోతాడు. యావన్మందినీ బాధిస్తాడు. ఇంట్లోదూరిన పాములాగ బుసకొడుతూనే వుంటాడు. క్షమ కావలిసినప్పుడు క్షమా, ప్రతాపం కావలిసినప్పుడు ప్రతాపం ప్రకటించేవాడే ఇహపరాలు రెండూ సాధిస్తాడు,' అన్నాడు.

"అపరాధం వొకటే అయితే, అదీ స్వల్పమైందయితే - క్షమించవచ్చు. కౌరవుల అపరాధాలు వొకటా రెండా; అవన్నీ, క్షమించవలిసినవేనా? క్షమాగుణానికి సమయమే కాదిది. ప్రచండమైన ప్రతాపమే ప్రకటించవలిసిన కాలమిది. ఏమాత్రమైనా కన్నెఱ్ఱ చేస్తే చాలు, నువ్వు. ఉగ్రులే అయిపోతారు నీ తమ్ములు. వాడి వందమంది తమ్ములతోనూ నులిపేస్తారు దుర్యోధనుణ్ణి" అంది.

అంతా విన్నాడు ధర్మరాజు. "ఐతే, క్రోధం నేర్పుతున్నావు నాకు!" అన్నాడు. "క్రోధమంటేనే పాపం. క్రోధంవల్లే ధర్మం, అర్థం, కామం - అన్నీ నశిస్తాయి. క్రోధం వహించినవాడు ముందూ వెనకా కానలేడు. ఏం చెయ్యాలో తెలుసుకోలేడు. గురువునైనా నిందించడానికి జంకడు. చంపరాని వాళ్ళనీ చంపుతాడు. ఆత్మహత్యకే పూనుకుంటాడు. అలాంటపుడు, ధర్మమే వ్రతం చేసుకున్న నావంటివాడు క్రోధం పెట్టుకోవడం న్యాయమే అంటావా? నువ్వే చెప్పు. తెలిసిన

వాడు, తన తెలివి అనే నీళ్ళతో క్రోధమనే మహాగ్ని ఆర్పివేస్తాడు. క్రోధంవిడిచిపెట్టినవాడే దేశం, కాలం, పాత్రా తెలుసుకుంటాడు. దేశ కాలాలు తెలుసుకున్నప్పుడే వాటికి అనుగుణ్యంగా ప్రతాపం ప్రక టిస్తాడు. భూదేవిలాగ క్షమాగుణం కలవాడికి ఎప్పుడూ జయమే లభిస్తుంది. క్షమావంతుడే ప్రతాపవంతుడు. ప్రతాపంలోంచి పుట్టిన ఉత్సాహం, సామర్థ్యం, శౌర్యం, చురుకూ — ఈనాలుగు గుణాలూ క్షమావంతుడిలోనే వీర్యవంతా లవుతాయి. మహాత్ముడు కశ్యపుడూ ఈఅర్థమే గానం చేశాడు.

"క్షమే ధర్మం. క్షమే యజ్ఞం. క్షమే వేదం. క్షమే శాస్త్రం. క్షమే సత్యం. క్షమే అతీతం. క్షమే భవిష్యత్తు. క్షమే తపస్సు. క్షమే పవిత్రం. క్షమే పరబ్రహ్మం. సచరాచరమయిన జగత్తు యావత్తూ క్షమలోనే నిలిచివుంది. తపస్సు చేసేవాళ్ళూ, వేదాలు చదివినవాళ్ళూ, యజ్ఞాలు చేసినవాళ్ళూ, బ్రహ్మం తెలిసినవాళ్ళూ — వీళ్ళకి ఏ పుణ్య లోకాలు లభిస్తాయో, క్షమావంతులికీ అవే లభిస్తాయి. వ్యాసుడూ, భీష్ముడూ, విదురుడూ, కృపుడూ, ద్రోణుడూ, సంజయుడూ — యావ న్మందీ నా క్షమాగుణమే మెచ్చుకుంటున్నారు. క్షమలేనివాడు దుర్యోధనుడు. క్షమలేనివాళ్లు అతడి తమ్ములు. క్షమ లేక పోవడం మూలానే అతడికి నాశనం తప్పదు. ధర్మమే ఎవళ్ళనయినా రక్షి స్తుంది" అన్నాడు.

"ధర్మం ధర్మం ధర్మం— ధర్మానికి ఏనాడో తలుపులు మూసేశారు దుర్యోధనుడూ, అతడితమ్ములూను" అంది మళ్ళీ ద్రౌపది. "వాళ్ళ నేంచేస్తుంది ధర్మం? ధర్మం పేరుచెప్పి తాత తండ్రులరాజ్యం వొదులుకుంటున్నారు. మీరు చెయ్యాని ధర్మాలు ఏమివున్నాయి చెప్పండి? ధర్మం కోసమే రాజ్యంచేశారు. ధర్మం కోసమే బతుకుతున్నారు. అవసరంవస్తే ధర్మంకోసం భీముణ్ణీ,

అర్జునుణ్ణీ, నకులసహదేవుల్నీ — తుదకి నన్నూ వొదిలిపెడతారు మీరు. రాజ్యమున్నప్పుడూ, ఇప్పుడూ వేలకొద్దీ బ్రాహ్మలికి భోజనం పెడుతున్నారు. వైశ్వదేవం, పంచయజ్ఞాలూ ఏనాడూ లోపం రానివ్వలేదు. దక్షిణలతోసహా రాజసూయం, పౌండరీకం, గోసవం, అశ్వమేధంలాంటి మహాయజ్ఞాలూ చేశారు.

"ఇంతటిధర్మాత్ముడివే అయినా, విపరీతమే అయింది నీబుద్ధి. మాయజూదంలో పడిపోయావు. తమ్ముల్నీ, నన్నూ వోడిపోయావు ఏమయింది ధర్మం? మీధర్మం మిమ్మల్ని రక్షించింది కాదేం? మోసం చేసినవాళ్ళని ధర్మమని దయతలిస్తే, ఫలితమేమవుతుంది? మోసంచేసినవాళ్ళే తిరగబడతారు. ప్రాణాలూ తీస్తారు.

"ఇంతకీ ఆధాతకీ విధాతకీ వొకనమస్కారం. ఆ దేవుడూ ఏం దేవుడో — అర్థంకాదు. మంచివాళ్ళకి చెడ్డచేస్తాడు. చెడ్డవాళ్ళకి మంచి చేస్తాడు. చెడ్డవాళ్ళే అతడి చుట్టాలు. మంచివాళ్ళు శత్రువులు" అంటూ ధర్మాన్నీ, దైవాన్నీ ఆక్షేపిస్తూ ఏమేమో అంది.

"ఈనాస్తికబుద్ధి ఎలా వచ్చింది నీకు?" వారిస్తూ అన్నాడు ధర్మరాజు. "దైవదూషణా, ధర్మదూషణా — కూడదు. ధర్మం సందేహించకూడదు. మహామునులు యావన్మందీ ధర్మమే అవలంబిస్తున్నారు. ధర్మం అతిక్రమించిన దుర్మతికి ప్రాయశ్చిత్తమే లేదు. నీ కళ్ళెదటే చూశావు కదా, మార్కండేయుణ్ణి. ధర్మప్రభావంవల్లే ఆయన చిరంజీవిగా వున్నాడు. వ్యాసుడూ వశిష్ఠుడూ, మైత్రేయుడూ, నారదుడూ, లోమశుడూ, శుకుడూ — ఈ మహామును లందరూ ధర్మం వల్లే అంతవాళ్ళయారు. ధర్మపరుణ్ణానేకదా, వీళ్ళంతా నన్ను మన్నిస్తారు!

పైవాళ్ళు ధర్మం తప్పారని నే నేందుకు తప్పాలి? "మంచికర్మకి మంచిఫలం తప్పకండా వుంటుంది. ధర్మంకాని, అధర్మంకాని— ఇవి ఎప్పుడూ వ్యర్థం కావు. తపస్సూ, వేదాధ్యయనం, బ్రహ్మచర్యం,

దానం, యజ్ఞం - ఈ పుణ్యకర్మలికి ఫలమే లేకపోతే, దేవరుషులూ, గంధర్వులూ వీటిని చెయ్యకనే పోదురు. అంత దూరమెందుకు? ప్రత్యక్షప్రమాణం మనకి కనపడుతూనే వుంది. నువ్వూ, మీ అన్నా పుట్టడానికి పుణ్యకర్మలే కదా, కారణం! ఏమంటావు?

"మంచికర్మల ఫలితం సామాన్యులికి చప్పున అవగతం కాదు. తత్వవేత్తలికి మాత్రం ఈరహస్యం తెలుసు. అందుకనే, ఫలాపేక్ష లేకండా సత్కర్మలు చేస్తారువాళ్ళు. ప్రత్యక్షంగా ఫలం కనిపించక పోయినాసరే, ధర్మం సందేహించ కూడదు. పుణ్యానికి ఫలమున్నట్టే పాపానికీ వుంటుంది, ఫలం.

"కర్మకి ఫలం తప్పకండా వుంటుందనీ, ధర్మం సనాతనమైందనీ ఆదిలో తనకుమాళ్ళకి బ్రహ్మ చెప్పాడు. అందులోకశ్యపుడు అక్షరాలా నడచుకున్నాడు. అధర్మానికి చెడ్డఫలం, ధర్మానికి పుణ్యఫలం లభించడం దైవనియోగం.

"కాగా - కర్మఫలం ఆశించి నేను కర్మలు చెయ్యడంలేదు. కర్మ నా కర్తవ్యం గనక చేస్తున్నాను. దానం చెయ్యాలి, కనక దానం చేస్తున్నాను యజ్ఞాలు చెయ్యాలి, కనక యజ్ఞాలు చేస్తున్నాను. ఫలం లభించినాసరే, లభించకపోయినా సరే, ఇవి చెయ్యడం మానవుడి కర్తవ్యం. 'ఫలానా ఫలం కావాలి' అని నేను ఎప్పుడూ ధర్మం చెయ్యడం లేదు. అసలు అలా ఫలాపేక్ష పెట్టుకోనే కూడదు.

"దైవాన్ని నిందించకూడదు. దైవానుగ్రహం లేకపోతే ధర్మమూ సాధ్యంకాదు. దైవానుగ్రహంవల్లే ధర్మకర్మ చేస్తారు మానవులు. ధర్మకర్మవల్లనే దేవత్వమూ పొందుతారు" అన్నాడు.

"కర్మకి ఫలం లేదనలేదు నేను" అంది ద్రౌపది. "కర్మఫలానికి దైవం కారణం కాదనీ నా ఉద్దేశం కాదు. విధి మనపాల వక్రించిం దని అలా వచ్చేసింది మాట. వేదాలూ, శాస్త్రాలూ, విధివిధానాలూ

ప్రమాణం కావనే మష్టులికి పుణ్యాగతు లుండవనీ తెలుసు నాకు. మా తండ్రిగారిదగ్గిరికి బ్రహ్మజ్ఞానులయిన బ్రాహ్మలు వచ్చేవాళ్ళు. వాళ్ళ ప్రసంగం ఇంతో అంతో వినేదాన్ని. ఎంతటి జ్ఞానవంతు లయినా కర్మ చెయ్యాలి. జడపదార్థం లాగ, కర్మ చెయ్యకండా మనిషన్నవాడు బతకలేడు. ఫలం ఏమయినా సరే, కర్మ చేస్తూ వుంటారు ప్రాణులు. మనం చూస్తూనే వున్నాం.

"ఐతే, మనిషి చెయ్యడం, దైవం సహాయపడడం - కర్మ ఫలం లభించడానికి ఈ రెండూ కారణాలు. అర్థసిద్ధి మనస్సులో నిశ్చయించుకుని, కర్మకి ప్రయత్నించాలి. అప్పుడే దైవమూ సహాయ పడతాడు. కర్మ సిద్ధిస్తుంది.

"నువ్వుల్లో నూనె వుంది. కర్రల్లో అగ్గి వుంది. అది తెలుసుకుని, దానికోసం ఉపాయంతో ప్రయత్నించాలి. అప్పుడే దైవసహాయం లభిస్తుంది. నువ్వుల్లోని నూనే, కర్రల్లోని అగ్గీ పైకి వస్తుంది. అలాగే, పొలం దున్ని, విత్తనాలు చల్లి, సిద్ధంగా వుండాలి వ్యవసాయదారుడు. అదునుకి వర్షంపడితే పంట పండుతుంది. మేఘాలు కురవలేదే అనుకుందాం, అపుడు వ్యవసాయదారుడిలోపం మాత్రం వుండదు.

"చెప్పవచ్చిం దేమిటంటే, మనిషీ, దైవం - - ఈ ఇద్దరివల్లా కర్మఫలసిద్ధి కలుగుతుంది. పురుషప్రయత్నం వుంటేనే అది సుస్థిర మవుతుంది. కోరికలేనివాడు, దైవపరుడయితే మాత్రం ఏంలాభం? నీటిలోని పడవలాగ చెడి పూరుకుంటాడు. అందుకని, మహారాజా, కర్మఫలసిద్ధి నిశ్చయించుకుని ప్రయత్నం చెయ్యమంటాను. నీ తమ్ముల పరాక్రమంతో ప్రయత్నం చెయ్యి. మన ఈ దారిద్ర్యం దూరం చెయ్యి" అంది.

"ద్రౌపది చెప్పింది సబబే నన్నయ్యా," అంటూ తానూ అందుకున్నాడు భీముడు. "తాతతండ్రుల రాజ్యం మనది. అర్జునుడి

గాండీవం కింద శత్రువులికి అసాధ్యమైంది. దేవేంద్రు డయినా తేరి చూడలేంది. అలాంటి యీ రాజ్యం పరులపాలుచేసి, అడవుల్లో ఇలా వ్రతాలు చేసుకు బతకడం - ఏం న్యాయమంటాను. సింహం పంజా లోని మాంసం నక్కలు లాక్కున్నట్టుంది, మనదగ్గిరనుంచి కౌరవులు రాజ్యం తీసుకోవడం. వాళ్ళూ, వాళ్ళ స్నేహితులూ ఏమనుకుంటు న్నారో మనల్ని? ద్రౌపది అన్నట్టు ధర్మం పేరుచెప్పి ఆమోసగాళ్ళని సహించవలిసిందేనా మనం!

"కాదన్నయ్యా, ఇది ధర్మం కానేకాదు. వెంటనే వాళ్ళకి బుద్ధి చెప్పడమే సరయిన ధర్మం. ధర్మం అర్థం కామం - వీటిలోంచే కదా పుట్టింది ధనం! సర్వార్థసాధనమైందీ ధనమే. అలాంటి ధనం వొదిలి పెట్టి మన వాళ్ళకి దుఃఖం, శత్రువులికి సుఖం కలిగేట్టు జీవించడం, తగిన పనేనా అని అడుగుతున్నాను. ధర్మం ధర్మం అంటున్నాము. బల మేమీ లేనట్టు, మునుల్లాగ కూచుంటున్నాము. బాహుబలం లేనివాడికి ఈవైరాగ్యం చెల్లితే చెల్లుతుంది. నీవంటివాడికి ఈ దైన్యమేమిటి?

"నువ్వు 'ఊఁ' అనే వుంటేనా, జూదంనాడే వాళ్ళందరినీ మచ్చుకన్నా లేకండా చేసేవాళ్ళం. అవాళ అలా చేసివుంటే, ఇవాళ ఈపాట్లే వుండేవికావు మనకి. నీశపథం భంగమవుతుం దని భయపడు తున్నాం, అంతా వోర్చుకుంటున్నాం. మన జడత్వం చూసి, మనల్ని పిరికిపందలకింద కడుతున్నారు వాళ్ళు.

"ప్రాణంలేనివాణ్ణి సుఖదుఃఖాలు రెండూ వొదిలిపోతాయి. అలాగే, 'ధర్మం ధర్మం' అని ముక్కుమూసుకున్నవాణ్ణి అర్థమూ కామమూ రెండూ విడిచిపోతాయి. ధర్మమూ కామమూ విడిచిపెట్టి, కేవలం ధనం కావాలంటూ కూచోవడమూ తెలివితక్కువే. అడివిలో ఆవు పెంచిన ట్టవుతుందది. ధర్మమూ అర్థమూ వొదిలిపెట్టి కామం పట్టుకు వేలాడినా అంతే. నీళ్ళులేని చెరువులో చేపలు పెంచినట్టవుతుంది.

మేఘానికీ సముద్రానికీ ఎలాంటి సంబంధమో, ధర్మానికీ ధనానికీ అలాంటి సంబంధం. అంచేత, ధర్మమూ, అర్థమూ, కామమూ—మూడూ సమానంగా సేవించినవాడే సర్వమూ తెలిసినవాడు.

"నువ్వు అనుసరిస్తున్న ధర్మం కేవలం అర్థం, కామం రెంటికే కాదు నీకూ నీబంధువులికీ బాధగానే వుంది.

"ధర్మమే ప్రధానమనుకుందాం. అయినా, యజ్ఞాలూ మొదలయిన ధర్మకార్యాలికీ ధనం కావాలి కదా! డబ్బులేనివాడు గడ్డిపరక చెయ్యేడు. ప్రపంచాలు ధర్మంమీదే ఆధారపడి వున్నాయి. నిజమే. ధర్మానికి మించింది ఏదీలేదు. అయితే, ధనంలేని ధర్మం బ్రాహ్మడికేమో, కాని క్షత్రియుడికి మాత్రం తగదు.

"యుద్ధంలో శత్రువుల్ని గెలవడం, రాజ్యం సంపాదించడం, ఏభయమూ రాకండా దాన్ని పాలించడం, తగినవాళ్ళకి దానం చెయ్యడం, బ్రాహ్మల్ని పూజించడం — ఇవీ ఉత్తమ క్షత్రియుడి ధర్మాలు. ఇవే అతడి సుగతికి మార్గాలు. ధర్మం ధర్మం అని కూచుంటే, శత్రువుల్ని జయించలేం. మోసగాళ్ళని మోసంతోనే జవాబు చెప్పాలి. రాక్షసులూ దేవతలూ అన్నదమ్ములే కదా! రాక్షసులు మొదట పుట్టినవాళ్ళు కూడాను. దేవతలు మోసంచేసే కదా, వాళ్ళని జయించారు! అంచేత అన్నయ్యా, శపథం నిలుపుకోవాలీ, అన్న ఈధర్మం వొదిలిపెట్టు. శత్రువుల్ని జయించడానికి ప్రయత్నించు. యాదవులూ, సృంజయులూ, కేకయులూ, పాంచాలులూ మొదలయిన మిత్రులు నీకు మేలుచెయ్యాలనే చూస్తున్నారు. వీళ్ళంతా మనప్రక్క నుంచుంటారు. మిత్రబలంతో వున్న శత్రువుని మిత్రబలంతోనే భేదించాలి. దానికి తగిన బలం, పట్టుదలా వుండాలి. దేశబలమూ, కాలబలమూ కలిసివస్తే ఇక చెప్పేదక్కరలేదు. అసాధ్యమంటూ వుండనే వుండదప్పుడు. ఒక బలవంతుణ్ణి — వాడు

ఎంతబలమైనవాణ్ణయినా కానీ, పదిమంది బలంలేనివాళ్ళు ఏకమయితే, హతమారుస్తారు. తేనెటీగలకంటే బలమయినవాడే మనిషి, తేనె లాక్కోవాలని వెళతాడు. తేనెటీగ లేంచేస్తున్నాయి? అన్నీ ఏకమై, అంతమనిషినీ తరిమి కొడుతున్నాయి. కుక్కతోలుసంచిలో పోసిన ఆవుపాలులా అయింది, దుర్యోధనుడి చేతిలో సామ్రాజ్యం. కనకనే, పట్నంలో అయితేనేం, పల్లెల్లో అయితేనేం నువ్వేరాజు కావాలంటున్నారు ప్రజలు. పెడమొహం పెట్టకు నువ్వు. సైన్యాలూ ఆయుధాలూ సిద్ధంచెయ్యి. రథాలు పూయించు. హస్తిన ముట్టడించు. ఈముహూర్తంలోనే బయల్దేరు. క్షాత్ర తేజం ప్రకటించు. అరిటితోట నరికినట్టు కౌరవుల్ని నరుకుతుంది, తమ్ముడి గాండీవం.

“వాళ్ళకేమోరథాలూ గుర్రాలూఏనుగులూ అధికంగా వున్నాయనిభయపడకు. నా గదముందు అవన్నీనలుసులు. లే. శత్రుసంహారం చెయ్యి. నాలుగు సముద్రాల మధ్యా వున్న భూమండలం యావత్తూ పరిపాలించు. ప్రజాపాలన కంటే ధర్మ మేముంది మనకి! రాజ్యం సంపాదించిన రాజు దక్షిణలిచ్చి బ్రాహ్మల్ని సంతోషపెడతాడు. యజ్ఞాలుచేసి దేవతల్ని తృప్తిపరుస్తాడు. అగ్రహారాలూ ఆవులూ దానంచేసి పాపాలువొదుల్చుకుంటాడు. మబ్బులు విడిచినచంద్రుడిలా ప్రకాశిస్తాడు” అన్నాడు.

“నువ్వుచెప్పిందంతా నిజమే, కాదనను” అన్నాడు ధర్మరాజు. “పైగా ధర్మసమ్మతమైందీ, పెద్ద లంగీకరించిందీ, ఇష్టసిద్ధి కలిగించేదిన్నీ. సందేహం లేదు. అయితే, దానికి ఇది మాత్రం సమయంకాదు. ఆలోచించు. నీకే అవగతమవుతుంది. ఏదయినా సరే, బాగా ఆలోచించి తేల్చినప్పుడే సులభ మవుతుంది. వృద్ధులూ పెద్దలూ వున్న కౌరవసభలో నేను చేసిన ప్రతిజ్ఞ జ్ఞాపకం చేసుకో. పన్నెండేళ్ళు వన

వాసం చేస్తానన్నాను. ప్రజల మధ్య ఒక సంవత్సరం అజ్ఞాత వాసమూ చేస్తానన్నాను. చేసిన శపథం తప్పడం చేతకాదు నాకు.

"ధనం చంచలమైంది. మెరుపులాంటిది. దాని కానపడి, క్షమాగుణం వొదిలిపెట్టలేను. బుద్ధిమంతుడు ఎవ్వడూ అలాంటిపని చెయ్యడు. రాజ్యం, కొడుకులూ, ధనం, కీర్తి — ఇవేవీ సత్యంతో సరికావు. అంచేత తమ్ముడూ, తొందరపడకు. మంచిరోజులు వచ్చే వరకూ ఓపికపట్టు" అన్నాడు.

"ఓపిక ఏమిటి అన్నయ్యా," అంటూ మళ్ళీ ఎత్తుకున్నాడు భీముడు. "నిమిషం మనది కాదు. నీడలా మృత్యువు కనిపెట్టుకునే వుంటుంది. ఎప్పుడో మంచిరోజులువస్తాయని కాలం వృథాపుచ్చడమా? దేహిమాత్రుడికి మరణం తప్పదు. మరణానికి ముందే విరోధం తీర్చుకోనివాడిజన్మ వ్యర్థం. అంతమంది రాజుల ఎదట మన్ని పరాభవించారు వాళ్ళు. ప్రతీకారం చేసేదాకా, రాత్రింబగళ్ళు దహించుకుపోతోంది హృదయం. నాకంటే అర్జునుడూ, నకులసహదేవులూ, అమ్మ కుంతీదేవీ మరీ కుమిలిపోతున్నారు. వీళ్ళ దుఃఖం చూడకండా వున్నావు నువ్వు. పగవాళ్ళు సంతోషించేట్టు, అడవుల్లో గడుపుతున్నావు. ధర్మం నెపంపెట్టి ఇలా ఉపేక్షించడం న్యాయం కాదంటాను. ఇది బ్రాహ్మణధర్మం, కాని క్షత్రియధర్మం కాదు. మనువు చెప్పిన రాజధర్మం నీకు తెలియంది కాదు. శత్రువుని చంపకపోతే స్వంతానికే నష్టం.

"మరో మాట, — అడివిలో పన్నెండేళ్ళూ వుండా లంటే వుండగల మనుకో. రెండోకంటివాడికి తెలియకండా ప్రజలమధ్య అజ్ఞాతంగా వుండడమంటే మాత్రం, — నిజం చెపుతున్నాను — ఒక్క రోజన్నా వుండలేం. ఏమంటావా? రాజుల్లో సూర్యుడివంటివాడివి నువ్వు. పిల్లలకగ్గిరినుంచీ వృద్ధులదాకా నిన్ను ఎరగనివాళ్ళు లేరు.

సింహాలు నీతమ్ముళ్ళు. జగమెరిగిన బ్రాహ్మలు. మేరుపర్వతం దాక్కోవడం ఎలా సాధ్యంకాదో, మనం దాక్కోవడమూ అలా సాధ్యం కాదు. అంచేత, ఎలాగూ దొరికిపోతాం మనం. తిరిగీ ఎలాగూ అరణ్యవాసం తప్పదు. బతుకంతా ఇంతే అవుతుంది.

'నేనొక ఉపాయం చెపుతాను విను. సంవత్సరాలికి బదులు నెలలు లెక్కపెట్టడం ప్రతీచోటా వున్నదేను. పదమూడు సంవత్సరాలు కదా, నీ శపథం ! మనం అడవులికి వచ్చి పదమూడు మాసాలైంది. పదమూడు సంవత్సరాలికీ పదమూడు మాసాలు, సరిపోయింది. ధర్మవిరోధమూ లేదు. సరా ! యుద్ధానికి తగిన సమయ మిది. ఇంకో ఆలోచనే వొద్దు. వెంటనే ఉద్యోగించు" అన్నాడు.

పెద్ద నిట్టూరుపు విడిచాడు ధర్మరాజు. ఎంతో బాధపడుతూన్నట్టు, చెప్పకండానే చెపుతోంది అతడి మొహం. ఆలోచిస్తూ వూరుకున్నాడు కొంతసేపు. చివరికి ఇలా అన్నాడు : "తమ్ముడూ, పరాక్రమంలో ఎంత ఉద్దండుడివో, పాండిత్యంలోనూ అంతఉద్దండుడివే నువ్వు. నువ్వు చెప్పింది సబబే. కాదనను. ఐతే, మళ్ళీ చెపుతున్నాను, తొందరపడకు. నేను చెప్పింది విను. కార్యం స్వల్పమయితే సాహసించినా తప్పులేదు. ఇది మహాకార్యం. సాహసంతో సాధ్యమయ్యేది కాదు. బాగా ఆలోచించి అడుగువెయ్యవలిసిన పని ఇది. ఆలోచించి చేసినదానికి దైవంకూడా అనుకూలపడతాడు. తొందరపాటు లేకండా ఆలోచించడం అవసరం.

"దుర్యోధనుడూ అతడితమ్ముళ్ళూ పొగరుబోతులు. ఇళ్ళు కాల్చడం, విషంపెట్టడం, దోచుకోవడం, స్త్రీలని చెరచడం, పైవాడి భూమి లాక్కోవడం, హత్యచెయ్యడం - దేనికీ జంకరు వాళ్ళు. వాళ్ళని అంతసుళువుగా గెలవగల మనుకోడమూ పొరపాటే. కర్ణుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ మొదలయిన హేమాహేమీలు వాళ్ళ

స్నేహావర్గంలో వున్నారు. మనతో ఓడిపోయిన రాజుల్ని యావన్మందినీ కూడగట్టుకున్నాడు దుర్యోధనుడు. వాళ్ళూ తక్కువవాళ్ళు కారు. అతడికోసం ప్రాణాలయినా ఇవ్వడానికి సిద్ధంగా వున్నారు. ముఖ్యంగా కర్ణుడు — అభేద్యమయిన సహజకవచం వాడిది. వాడి బాణాల నేర్పూ, వాడి పరాక్రమం తలుచుకుంటే, కంటిమీద రెప్పపడదు నాకు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ - వీళ్ళకి వాళ్ళూ మనమూ సమానమే. అయినా, వాళ్ళదగ్గిరే వున్నారు వాళ్లు. ఎన్నో అన్ని దివ్యాస్త్రాలు తెలుసు వాళ్ళకి. ముందు వాళ్ళని గెలిస్తేనేకాని దుర్యోధనుడి మీద ఈగనాను వాలడానికి వీలుండదు. ఇదంతా ఆలోచించకుండా తొందర పడితే ఏంలాభం ?"

ఇలా ఈప్రసంగంలో వున్నారు పాండవులు. పుణ్యం పండిందా అన్నట్టు వచ్చి ప్రత్యక్షమయాడు వ్యాసముని. అందరూ లేచి భక్తి వినయాలతో పూజించారు రుషిని. అందరినీ చల్లనిచూపు చూశాడు ముని. "భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ మొదలయిన వాళ్ళని ఎలా గెలవడమని భయపడుతున్నావు" అని అంటూ ధర్మ రాజుని చూసి మందహాసం చేశాడతడు. "తెలిసి, అది పోగొట్టాలనే ఇలా వచ్చాను. ఒక రహస్యవిద్య ఉపదేశిస్తాను. ఎంతో యోగం వుంటేనే కాని లభించనివిద్య ఇది. ఈ మహావిద్యకోసం అర్జునుణ్ణి నియోగించు. అతడే దీనిలో సిద్ధి పొందుతాడు" అన్నాడు. ధర్మ రాజుని ఏకాంతంగా తీసుకువెళ్ళాడు. 'ప్రతిస్మృతి' అని వొక రహస్య విద్య సక్రమంగా అతడికి ఉపదేశించాడు.

"దీని శక్తివల్ల ఎంతో, వీర్యవంతుడవుతాడు అర్జునుడు. ఇంద్రుడూ, యముడూ, వరుణుడూ, కుబేరుడూ మొదలయిన దేవతల్నీ, శివుణ్ణీ ప్రత్యక్షం చేసుకుంటాడు. వారివల్ల దివ్యాస్త్రాలు సంపా

దిస్తాడు. నువ్వు భయపడుతున్న శత్రువులు యావన్మందినీ జయిస్తాడు" అన్నాడు. కృతజ్ఞతాపూర్వకంగా పాదాభివందనంచేశాడు ధర్మరాజు.

చెప్పవలసినవన్నీ చెప్పాక, "వెళ్ళివస్తా" నన్నాడు వ్యాసుడు. "ద్వైతవనంలో ఎంతోకాలం వున్నారు మీరు. పువ్వులూ, పళ్ళూ తరిగిపోతున్నాయి. చెట్లూ తగ్గిపోతున్నాయి. జంతువులూ క్షీణిస్తున్నాయి. అడవి పెరగకుండా అయిపోతోంది. ఒక్కచోటే హెచ్చుకాలం వుండడం ఎవ్వరికీ మంచిదికాదు. ఇంకో అడవికి వెళ్ళండి" అంటూ చెప్పి వెళ్ళాడతడు.

వ్యాసుడు చెప్పినప్రకారం ద్వైతవనం విడిచిపెట్టేశారు పాండవులు. సపరివారంగా కామ్యకవనం వచ్చి, సరస్వతీనది ఒడ్డుని నివాసం పెట్టుకున్నారు.

## అర్జునుడి తపస్సు

ఒకనాడు అర్జునుడితో అన్నాడు ధర్మరాజు: "బ్రాహ్మణికి వేదం పట్టుబడ్డట్టు, భీష్ముడూ మొదలయిన వాళ్ళకి మహానీయమయిన ధనుర్వేదం కరతలామలకమైంది. దివ్యమంత్రాలతో వాళ్ళు చెప్పినట్టు వినుకుంటుందది. తనకోసమని వాళ్ళని కొలువులో వుంచుకున్నాడు దుర్యోధనుడు. యుద్ధమే ప్రారంభమైతే, మనమీద తప్పకండా చెయ్యి చేసుకుంటారు వాళ్ళు, దివ్యాస్త్రాలతో వున్న వాళ్ళని గెలిచే ఉపాయం ఉపదేశించాడు వ్యాసుడు. నీకోసమని ప్రతిస్మృతి విద్య అనుగ్రహించాడు నాకు.

"ఈవిద్య నువ్వు గ్రహించు. ఇతర్లు నిన్ను గెలవకండా కవచం వేసుకో. కత్తీ, గాండీవం తీసుకో. ఉత్తరాదిగా వెళ్ళు. తపోయోగంతో దేవేంద్రుణ్ణి ప్రత్యక్షం చేసుకో. వృత్రాసురుడికి భయపడి లోగడ దేవతలు తమ ఆయుధాలూ, బలమూ ఇంద్రుడి దగ్గిర దాచు

కున్నారు. అతడు దయచూస్తే అవన్నీ లభిస్తాయి నీకు. అతడి ఉప. దేశంతో శివుణ్ణి ఆరాధించు. శివుడి అనుగ్రహంతో ఇష్టసిద్ధిపొందు. ఇది వ్యాసులవారి ఉపదేశం'' అని.

వ్రతదీక్ష పూనాడు అర్జునుడు. 'శత్రువుల్ని గెలవాలి' అన్న సంకల్పంతో అతడికి ప్రతిస్మృతి ఉపదేశించాడు ధర్మరాజు. ఆ యోగ విద్య అన్నగారినించి గ్రహించాడు అర్జునుడు. దాని ప్రభావంతో తేజోవంతు డయ్యా డతడు.

అన్నగారి అనుమతి తీసుకున్నాడు అర్జునుడు. విధిపూర్వకంగా హోమం చేశాడు. అగ్నిహోత్రుణ్ణి సంతృప్తి పరిచాడు. బ్రాహ్మల స్వస్తివాక్యాలికి తలవొంచాడు. ధౌమ్యుడికి నమస్కరించాడు. అన్న దమ్ముల దగ్గిర సెలవుతీసుకున్నాడు. దివ్యాస్త్రాల సంపాదనకోసం ప్రయాణ సన్నద్ధు డయాడు.

శరీరానికి బంగారం కవచం తొడిగాడు. భుజాలికి అక్షయ తూణీరాలజంట కట్టుకున్నాడు. చేత్తో గాండీవం పట్టున్నాడు. అతణ్ణి చూసి బ్రాహ్మలేకాదు, కంటికి అవుపడని భూతాలు కూడా సంతోషించాయి.

"అర్జునుడి అభిలాష ఫలించాలి."
"సర్వవిఘ్నాలూ శాంతించాలి."
అన్నిదిక్కులా ఈ మాటలు వినిపించాయి.

"పగవాళ్ళు పెట్టిన పరాభవసముద్రంలోంచి నువ్వో గట్టు చేర్చాలి'' అంటూ దగ్గిరికి వచ్చింది ద్రౌపది. ఆమె కళ్ళల్లో తళతళ లాడుతున్నాయి కన్నీళ్ళు. "అవమానం సహించలేని పాడుక్షత్రియ కులంలో పుట్టడం జన్మజన్మకీ వొద్దు నాకు. అది సహించుకునే బ్రాహ్మణ పుట్టుకే కోర్తాను'' అంది. "ఎవ్వరికీ సాధ్యంకాని భారం

నీమీద వేసుకున్నావు. దిక్కులూ, సూర్యచంద్రులూ, భూమీ, ఆకాశం, గాలీ – ఇవన్నీ నిన్ను రక్షిస్తాయి" అంటూ దీవించింది. ప్రేమా, వియోగవింబారం పుట్టిపడే కడకంటి చూపులు దారిబత్తేట పెట్టింది. వియోగంవల్ల కెర్లుకువస్తూన్న దుఃఖం దిగమింగుకుంది.

ఈశాన్యంగా బయల్దేరాడు అర్జునుడు. యోగవిద్యా, గాండీవమూ మాత్రం అతడికి తోడుగా వున్నాయి. ఇంద్రసంబంధమైన యోగశక్తివల్ల చూడశక్యంగాకండా వున్నాడతడు. హిమాలయం చేరాడు. గంధమాదనం దాటాడు. ఇంద్రకీలపర్వతం ఎక్కుతున్నాడు. "ఆగు" అంటూ పెద్దకేక వినపడింది ఆకాశంమీద. ఆగలేదు అర్జునుడు. దారికడాకూ పూలవాన కురిసింది. ఆశ్చర్యపోయాడు. మరి పదిఅడుగులు వెళ్ళాడు. ఒక చెట్టుకింద వో ముసీలి బ్రాహ్మడు కూచుని కనిపించాడు. బ్రహ్మచర్యమూ వాటివల్ల కాబోలు బాగా కృశించిపోయివుందిఅతడి శరీరం. బ్రహ్మతేజస్సు వుట్టిపడుతోంది. నమస్కరించాడు అర్జునుడు. విశ్రమిస్తూ అతడిదగ్గిర చతికిల బడ్డాడు.

"ఎక్కడినుండి వస్తున్నావు?" పలకరించాడు బ్రాహ్మడు. "నీ తేజస్సూఅదీ చూస్తే,ఇంద్రియాలు నిగ్రహించిసిద్ధిపొందినట్లున్నావు. కోరిన పుణ్యఫలాలు అనుభవించు. ఇక్కడ పనేముంది? శాంతంగా తపస్సుచేసుకునేవాళ్ళు వుండే స్థలమిది. కత్తీ, కవచం, ధనుస్సూ – ఇవన్నీ ఎందుకిక్కడ? ఏదో గొప్ప క్షత్రియుడి వేమో! క్రోధం, పౌరుషం మానుకున్న బ్రాహ్మలుండే పుణ్యభూమి ఇది. ఆయుధాలు పనికిరావిక్కడ. విడిచిపెట్టు" అన్నాడు. ఎన్నో విఘ్నం కలిగించే మాటలూ చెప్పాడు.

చలించలేదు అర్జునుడు. అతడి ధైర్యానికి మెచ్చుకున్నాడు బ్రాహ్మడు. ముసిలిరూపం వొదిలిపెట్టాడు. దేవేంద్రుడై నిలబడ్డాడు.

"సంతోషించాను. దేవేంద్రుణ్ణి నేను. ఏం కావాలో అడుగు ఇస్తాను" అన్నాడు.

అంజలిబంధం శిరస్సుని పెట్టి నమస్కరించాడు అర్జునుడు. "ప్రభూ, దివ్యాస్త్రాలు ప్రసాదించు" అన్నాడు "అస్త్రాలాకవిశేష మేమిటి?" అన్నాడు దేవేంద్రుడు. "పుణ్యలోకాలో, దేవత్వమో, సర్వసంపదలో – ఏం కావాలో కోరు" అన్నాడు. "అవన్నీ నాకెందుకు?" అన్నాడు మళ్ళీ అర్జునుడు. "దివ్యాస్త్రాలే నాకు కావలిసినవి. శత్రువులు పరాభవించారు. ఆ దుఃఖంతో కుమిలిపోతున్నారు నాఅన్నదమ్ములు. అడివిలో విడిచివచ్చాను వాళ్ళని. స్వాంతసుఖం ఆసపడి తిరిగిపోలేను" అన్నాడు.

కుమారుడి మాటలువిని కొండ అందుకున్నట్టయింది దేవేంద్రుడికి. "దివ్యాస్త్రాలే నీఅభీష్టమైతే శివుణ్ణి ధ్యానించు. యోగశక్తితో ఆయన్ని ప్రసన్నుణ్ణి చేసుకో. దిక్పాలకుల్తోకూడా వచ్చి, ఆయనే నీకోర్కె చెల్లిస్తాడు" అని అంతర్ధానమయాడతడు.

ఇంద్రుడి ఉపదేశం గురిపెట్టుకున్నాడు అర్జునుడు. హిమాలయం శిఖరం మీదికి వెళ్ళాడు. మందరాచలం తపోవనం ప్రవేశించాడు. రకరకాల వృక్షాలతో అద్భుతంగా వుంది తపోవనం. పూలతోనూ, పళ్ళతోనూ వొంగిపోతున్నాయి చెట్లు. అమృతంలాంటి మంచినీళ్ళతో కలకలా ప్రవహిస్తున్నాయి సెలయేళ్ళు. ఎర్రతామరలూ, సౌగంధికాలూ, తెల్లకలవలూ, కలహంసలూ వాటితో కలకలలాడుతున్నాయి సరోవరాలు. అలాంటి తపోవనంలో తపస్సుకి పూనుకున్నాడు అర్జునుడు.

దర్భలు వస్త్రంగా కట్టుకున్నాడు. లేడితోలు కప్పుకున్నాడు. దండకమండలాలూ ధరించాడు. మనోవాక్కాయకర్మలు మూడూ నిగ్రహించాడు. శివుడి మీద చిత్తం నిలిపాడు. ఉగ్రమయిన తపస్సు

ప్రారంభించాడు. దేవదుందుభులు వినిపించాయి అతడికి. దేవపారిజా తాల పరిమళంతో అతకిచుట్టూ చల్లగాలి వీసింది.

**మూడు దినాల కొకసారి మాత్రం వొక రాలిన ఆకు తింటూ వచ్చాడు అలా మొదటినెల గడిపాడు రెండోనెల ఆరురోజుల కో ఆకు తిన్నాడు. మూడోనెల పదిహేను రోజులకో ఆకుతో గడిపాడు.** నాలుగోనెల గాలితప్ప మరో ఆహారమే మానుకున్నాడు. రెండు చేతులూ మీాది కెత్తాడు. ఒక్క కాలివేలుమీాద నిలబడ్డాడు.

ఇలా ఘోరమయిన తపస్సు చేస్తున్నాడు అర్జునుడు. ముక్కు మీాద వేలు పెట్టుకున్నారు అక్కడి మునులు. శివుడి దగ్గిరికి వెళ్ళి విన్న వించారు. "ఎన్నడూ కనీ వినని ఉగ్రమైన తపస్సు చేస్తున్నాడు అర్జునుడు. కాలమేఘాల్లాగ, తపోవనం నిండిపోతున్నాయి తపోగ్ని పొగలు, ప్రభూ, అర్జునుడి తపస్సు అద్భుతం. భూతకోటి యావత్తూ భయంతో వణుకుతోంది. అతడికోర్కె చెల్లించు. ఈ తపోభారం నించి ప్రపంచాలు రక్షించు" అన్నారు.

"భయపడకండి." చిరునవ్వు నవ్వుతూ అన్నాడు శివుడు. "అర్జునుడి అభిప్రాయం అవగాహనే నాకు. అతడు కోరినవర మిస్తాను. సంతోషపెడతాను. మీారు మీాఆశ్రమాలికి వెళ్ళండి. సుఖంగావుం డండి" అన్నాడు, "మహాప్రసాదం" అంటూ వచ్చేశారు మునులు.

చెం చు రా జు

చెంచురాజు వేషంవేశాడు శివుడు. మాంచి బంగారంవంటి శరీ రంతో, చేతిలో విల్లూ తానూ తయారయాడు. చెంచీత వేషం వేసింది పార్వతి. భూతగణంలో అందరూ పురుషులుచెంచులుగాతయారయారు. వాళ్ళ భార్యలు చెంచీత లయారు. పొట్టిపొట్టి చేతులూ, మిడిగుడ్లూ, మొద్దు మొహాలూ, మొండి జుత్తులూ, చేతుల్లో తడబడ్గల ధనుస్సులూ—

ఇలా చెంచుబలగం చెంచురాజు తెంమపక్కలా నడిచింది. అడివి అడివంతా అల్లకల్లోలం చేస్తూ వేటకోసం బయల్దేరాడు చెంచురాజు. పక్షులూ, మృగాలూ బెంబేలు పడిపోయాయి. మూగవోయినట్టూ, కాళ్ళువిరిగినట్టూ, కళ్ళుపోనట్టూ ఎక్కడివక్కడ, కిక్కురుమనకండా నక్కిపోయాయి. అడావుడిగా అర్జునుడిదగ్గరికే వచ్చాడు చెంచురాజు.

సరిగ్గా అదేసమయానికి, ఈశ్వరనియోగంవల్ల మూకుడు అనే రాక్షసుడు, పెద్ద అడవిపందిరూపంలో అక్కడ ప్రత్యక్షమయాడు. అర్జునుణ్ణి చంపడంకోసం సరాసరి మీందికి వచ్చేస్తున్నాది పంది. దూరం నించే చూశాడు అర్జునుడు. చప్పున గాండీవం తీశాడు. నారి మోగించాడు. చువ్వలాగ వచ్చేస్తోంది పంది. గాండీవానికి బాణం సంధించాడు అర్జునుడు.

"వద్దూ,నువ్వు కొట్టకు. ఆగూ" అంటూ పందివెంట పరిగెత్తుకు వస్తున్నాడు చెంచురాజు. ఆగలేదు అర్జునుడు. రివ్వున వొదిలిపెట్టాడు బాణం. అర్జునుడు బాణం వొదిలాడో లేదో, చెంచురాజూ వేశాడు మాంచి నాగుపాములాంటి బాణం. కొండమీదపడ్డ పిడుగుల్లాగ రెండూవొక్కసారే పడ్డాయి పందిమీద. ఇటు అర్జునుడూ, అటు చెంచురాజూ వేసిన బాణాల్తో సముద్రంలోమందరంలాగ గిరగిరా తిరిగింది పంది. అంతే. అంతలోనే మాయమయింది. నిజరూపంతో నిలుచున్నాడు మూకుడు. ఉత్తరక్షణంలో అంతర్ధానమైపోయాడు.

నిచ్చరపోయాడు అర్జునుడు. క్షణంలో మరోచిత్రం. ఎదూరుగుండా మేరుపర్వత శిఖరంలా నుంచున్నాడు చెంచురాజు. పెద్ద ధనుస్సు చేతిలోవుంది. లెక్కాజమాలేని చెంచుసైన్యం, మాంచి యవ్వనంలో వున్న వేలకొద్దీ చెంచీతలూ, చెంచుయువకులూ కూడా వున్నారు. "ఎవరు నువ్వు!" అంటూ అడిగాడు అర్జునుడు. మానవమాత్రుడి సంచారంలేని ఈ మహారణ్యంలో ఇంతమందితో ఈ సంచార మేమిటి?

సరే దానికేం, నేను కొట్టిన పందిని నువ్వు కొట్టావు. వేట ధర్మం భంగంచేశావు. దీనికి ప్రతిఫలం ఇప్పుడే అనుభవిస్తావు- నాబాణాల్తో నీపని పట్టిస్తాను'' అంటూ కళ్ళెర్రచేశాడు.

"నువ్వు కొట్టానంటా వేమిటి!'' అంటూ నిర్లక్ష్యంగా నవ్వాడు చెంచురాజు. అసలు నేనూ పందిని కొట్టినవాణ్ణి. నువ్వేదో పెద్దమాట లాడుతున్నావు. గొప్పలు చెప్పుకునే చవటలా వున్నావు. మాటల్తో ఏముంది? అంతబలమే వుంటే రా; అదేదో తేల్చేస్తాను'' అంటూ ధనుస్సు తీసి బాణం గురిపెట్టాడు.

అతడి నోట్లోమాట నోట్లోనే వుంది, బాణంమీద బాణం - పుంఖానుపుంఖంగా ప్రయోగించాడు అర్జునుడు. వర్షం కురుస్తూ వుంటే చలించకుండా ఎలా వుంటుంది పర్వతం, అదిగో అలా, అర్జునుడి బాణాలు పడుతూంటే కదలకుండా నుంచున్నాడు చెంచురాజు. ఒక్క బాణమూ అతణ్ణి గంటుపెట్టలేదు.

అర్థంకాలేదు అర్జునుడికి. ఎవడు వీడు ? దేవేంద్రుడా ? కుబేరుడా ? స్వయంగా శివుడే ఇలా వచ్చాడా ? ప్రభావశాలి అయిన మరెవరో మహాత్ముడా ? చిత్రం ! నాబాణాలు చీమకుట్టినట్టయినా లేదు వీడికి. ! సామాన్యుడికి సాధ్యమేనా ఇది ? మరొకడయితే, పరుగుచ్చుకునేవాడు. మూర్ఛపోయేవాడు. ప్రాణాలే వొదిలేవాడు. బుద్ధి లేనివాడికి నీతులుచెప్పినట్టు నాబాణాలన్నీ వృథా అయిపోయాయి వీడిమీద ! ఏమిటిది ? వీడువేసిన బాణాలు మాత్రం విషసర్పాల్లా వున్నాయి. అన్నీ దివ్యాస్త్రాలే అనిపిస్తున్నాయి. ఒళ్ళంతా మంట లెత్తిస్తున్నాయి ! ఎవ్వడీయన ?

"ఈ పర్వతం దేవతలుండేది కదా ! ఏమో, చెంచువేషంలో వున్న ఏమహాపురుషుడో ఈయన! సరే, చూద్దాం'' అంటూ ఎంచి

తిరుగులేని దివ్యబాణాలూ ప్రయోగించాడు. మరీచిత్రం! తన తూణీరాల్లో బాణాలు కనపడవు. ఎన్నడూ తరుగులేని అక్షయ తూణీరాలవి. ఖాండవదహనంలో అగ్నిదేవు డిచ్చినవి. "ఏమిటిది? నా అక్షయతూణీరాలు వుట్టిపోయాయి? యుగాంతంలో ఎండిపోయిన సముద్రాల్లా వున్నాయేమిటి?" మతిపోయినట్టయింది అర్జునుడికి. భరించలేనంత కోపం వచ్చిం దతడికి. అమాంతగా గాండీవం మీాది కెత్తాడు. చెంచుమీాద విసిరి కొట్టాడు. గారిడీలా వుంది! గాండీవం మాయమైంది. ఉక్కురోషంతో ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు అర్జునుడు. కత్తితీశాడు. చెంచురాజు నెత్తిమీాద బలంకొద్దీ బాదాడు. ఏం లాభం! అదీ వృథాఅయింది. కనపడ్డచెట్టూ, చేతికి దొరికిన రాయీ విసిరాడు. చెంచురాజు శరీరంలో అవన్నీ ఎక్కడికో పోతున్నాయి. పిచ్చెత్తినట్టయింది అర్జునుడికి. అమాంతంగాకలబడ్డాడు చెంచు మీాదికి. చేతికొద్దీ పిడిగుద్దులు గుద్దాడు. అతడి సాహసానికి చెంచులూ, చెంచీతలూ సెబాసన్నారు. అర్జునుణ్ణి అడిసి పట్టుకున్నాడు చెంచు రాజు. దాంతో మూర్ఛపోయి కిందపడిపోయాడు అర్జునుడు.

అర్జునుడి ధైర్య పరాక్రమాలికి తలపంకించాడు చెంచురాజు. కళ్ళు విప్పాడు అర్జునుడు. శివుడిగా మారిపోయాడు చెంచురాజు. జటామకుటం, చంద్రరేఖా, లలాటనేత్రం, గరళకంఠం, త్రిశూలం, ఏనుగుతోలూ, మెళ్ళోపాములూ–నిజరూపంతో తీవిగా నిలుచున్నాడు శివుడు.

"అర్జునా, నీఅంతటి శౌర్యవంతుడు ఎక్కడా లేడు. నీ తపస్సుకీ నీక్షాత్రగుణానికీ మెచ్చాను. నీకోర్కె సఫలం చేస్తాను. దేవతలూ, రాక్షసులూ, మానవులూ - ఈ యావన్మందినీ నువ్వే జయిస్తావు. ఇదిగో, నా స్వరూపం దర్శించు" అంటూ అతడికి దివ్యదృష్టి ప్రసాదించాడు.

శివుడి దివ్యస్వరూపం చూశాడు అర్జునుడు. కృతార్థుడే అయిపోయాడు. శరీరం గగుర్పొడిచింది. సాష్టాంగ దండప్రణామం చేశాడతడు. గద్గదకంఠంతో శివుణ్ణి ప్రార్థించాడు.

"ప్రభూ, శ్రీకంఠా, లోకేశా, ఈ ప్రపంచాలు నువ్వే పుట్టిస్తున్నావు. త్రిపురాలు సంహరించి లోకాలు రక్షించావు. విష్ణువు నీకు స్నేహితుడు. చంద్రుడు నీ తలపువ్వు. దేవేంద్రుడూ మొదలయిన దేవతలికి నువ్వే ఆనందం ప్రసాదిస్తున్నావు. పుణ్యస్వరూపా, విరూపాక్షా, దక్షప్రజాపతియజ్ఞం ధ్వంసం చేశావు. దేవా, బుద్ధిమంతులు నీతత్త్వం భేదిస్తారు. కర్మ ప్రధానమనీ, విజ్ఞానము అధ్యాత్మయోగమనీ, సర్వక్రియా కారణమనీ గ్రహించి నిన్ను భావిస్తారు

ఈశానా, సర్వేశ్వరా, శర్వా, సర్వజ్ఞా, సర్వాత్మకా, నిర్వికల్ప ప్రభావా, పార్వతీపతీ, మూడులోకాలూ నీవల్లే నడుస్తున్నాయి. భూమీ, గాలీ, ఆకాశం, నీళ్ళూ, అగ్ని, సూర్యచంద్రులూ - అన్నీ నువ్వే నిర్మించావు. సంసారచక్రం నువ్వే నడుపుతున్నావు.

దేవాదిదేవా, మహాదేవా, యోగస్థితిలో వుండి, జ్ఞానదీపంతో సంసారమాయాంధకారం పారదోలినవాళ్ళూ, క్రోధం రాగం మొదలయిన దోషాలు జయించినవాళ్ళూ, ఆత్మనిగ్రహం కలవాళ్ళూ, యతీశ్వర్లూ నీ పాదపద్మాలు ధ్యానించి తృప్తులయారు. నాశనం లేనివాడివి నువ్వు.

భవా, భర్గభట్టారకా, శుక్రుడూ, అగస్త్యుడూ, కుత్సుడూ మొదలయిన మునులు ఎల్లప్పుడూ నిన్ను స్తోత్రం చేస్తారు. నీ లలాటనేత్రంతో మన్మథుణ్ణి భస్మం చేశావు. గంగని శిరస్సుమీద ధరించావు. భస్మమే పూసుకున్నావు. నీ ప్రసాదంవల్లే దేవతలూ గంధర్వులూ సిద్ధులూ సాధ్యులూ నాగరాజులూ రాక్షసరాజులూ శాశ్వతమయిన ఐశ్వర్యం సంపాదించారు.

ఈశ్వరా, విశ్వకర్తా, త్రిలోకాధీశ్వరా, కారుణ్యమూర్తీ, నన్ను మన్నించు. చెంచురాజే అనుకున్నాను నిన్ను. తెలుసుకోలేకపోయాను. నీచరిత్ర తెలుసుకుందికి నేనెంతటివాణ్ణి. ఎదిరించాను. అపరాధం చేశాను. క్షమించు. నమస్కరిస్తున్నాను" అన్నాడు.

దయామృతం చిలకరిస్తూ చూశాడు శివుడు. చెయ్యిపట్టుకు లేవనెత్తాడు అర్జునుణ్ణి. "క్షమించాను" - నవ్వుతూ అన్నాడు. "మానవమాత్రుడికి సాధ్యంకాని నీపరాక్రమం మెచ్చుకున్నాను. పూర్వజన్మలో నువ్వు దేవరుషివి. నరుడివి. నారాయణుడి స్నేహితుడివి. నరనారాయణులని మీ ఇద్దరూ ఆదిమునులు. బదరీవనంలో అనేక వేల సంవత్సరాలు తపస్సుచేశారు. మహావీర్యవంతులయారు. మీవల్లే లోకాలు నిలబడ్డాయి. ఆనాడూ నీదే ఈగాండీవం. ఇంద్రుడి అభిషేకంనాడు దీంతోనే రాక్షసుల్ని గెలిచావు. గాండీవం, అక్షయ తూణీరాలూ నేనే మాయంచేశాను. ఇవిగో తీసుకో. నీకేంకావాలో అడుగు. వరమిస్తాను" అన్నాడు.

"ప్రభూ, పాశుపతం ప్రసాదించు" అంటూ సాగిలబడ్డాడు అర్జునుడు. "పాశుపతమూ, బ్రహ్మశిరమూ యుగాంతంలో జగత్సంహారంచేస్తాయని విన్నాను వీటితో అభిమంత్రిస్తే అనేకలక్షలశూలాలూ, గదలూ, సర్పాల్లాంటి బాణాలూ పుడతాయనీ విన్నాను. కరుణించు. పాశుపతం ప్రసాదించు. దైత్యులూ దానవులూ యక్షులూ రాక్షసులూ పిశాచులూ నాగులూ - యావన్మందినీ జయిస్తాను. భీష్ముణ్ణీ ద్రోణుణ్ణీ కవచకుండలాల కర్ణుణ్ణీ గెలుస్తాను" అన్నాడు.

సిద్ధపడే వచ్చాడు శివుడు. మంత్రం, ధ్యానం, జపం, హోమం- అన్నిటితోనూ అర్జునుడికి ప్రసాదించాడు పాశుపతం. సంధానం, ప్రయోగం, ఉపసంహారం-అన్నీ క్షుణ్ణంగా చెప్పాడు. "పాశుపతానికి అసాధ్యమైంది ప్రపంచంలో లేదు. తక్కువవాళ్ళమీద ప్రయోగిస్తే మాత్రం

లోకంతగులబెడుతుం దిది. దీని రహస్యం ఇంద్రుడికీ కుబేరుడికీ వరుణుడికీ యముడికీ కూడా తెలియదు. మనుష్యులమాట చెప్పే దేముంది! దివ్య బాణ మిది. దీంతో సర్వలోకాల్నూ జయిస్తావు" అన్నాడు.

వరమిచ్చి అంతర్ధానమయ్యాడు శివుడు. వెయ్యిసూర్యబింబాల్లా అర్జునుడి చేతిలో ప్రకాశిస్తోంది పాశుపతం. దేవతలూ యక్షులూ గజ గజ లాడిపోయారు చూసి. పర్వతాలూ సముద్రాల్తోసహా గిరగిరా తిరిగింది, భూమండలం.

శివుడి దేహస్పర్శతో పవిత్రమే అయిపోయింది అర్జునుడి శరీరం. పాపాలుపోయి పరమతేజోవంత మయింది. అధిక వీర్య వంతమూ అయింది. పద్నాలుగు లోకాలూ అరిచేతిలో పడ్డంత ఆనందం కలిగింది అర్జునుడికి. "నాదే భాగ్యం. శివుడి దర్శనంచేశాను. శివుడి దేహం స్పృశించాను. కృతార్థుణ్ణయాను. ఇక సందేహం లేదు. ఇవాళే ధర్మరాజుశత్రువులు నశించారు. ఇవాళే సర్వసామ్రాజ్యం అన్నయ్య కాళ్ళముందుకి వచ్చింది." అంటూ ఆనందబాష్పాలు రాల్చాడతడు.

"అర్జునుడు పాశుపతం సంపాదించాడు" — దేవలోకంలో గుప్పుమంది ఈవార్త. వరుణుడూ కుబేరుడూ యముడూ మొదలయిన యావన్మందిదేవతలతోనూ బయల్దేరాడు దేవేంద్రుడు. దివ్య విమానాల్తో వెలిగిపోతూ కనపడింది ఆకాశం. విమానాలమీంచి అంతమందీ అర్జునుడిముందు దిగారు. "ఈసందర్భంలో నిన్ను మెచ్చి వరాలివ్వడాని కని దేవేంద్రుడితోసహా దేవతలు నీదగ్గిరికి వచ్చారు" అన్నాడు యముడు. మధురంగానూ, మేఘగర్జనలా గంభీరంగానూ వున్నాయి యముడి మాటలు. "చూడు వీళ్ళని" అంటూ అర్జునుడికి దివ్యదృష్టి ఇచ్చాడతడు. "అర్జునా, నువ్వు ఆదిమునివి. బ్రహ్మానియోగం వల్ల మనుష్యుడివై, ఉత్తమ క్షత్రియకులంలో పుట్టావు. సూర్యుడి

అంశంలో పుట్టిన కర్ణుణ్ణీ, దేవ దైత్య దానవ గంధర్వ యక్ష రాక్షస అంశల్లో పుట్టిన రాజుల్నీ వధిస్తావు. అక్షయమైన కీర్తికలుగుతుంది నీకు. ఇదిగో, ఈ దండం ఇస్తున్నాను. పుచ్చుకో'' అంటూ పగ వాళ్ళని పడగొట్టే యమదండం విధియుక్తంగా అతడి కిచ్చాడు. శత్రువుల్ని చీల్చే వారుణ పాశాలు ఇచ్చాడు వరుణుడు. కౌబేరాస్త్రం ఇచ్చాడు కుబేరుడు.

యముడిచ్చిన దివ్యదృష్టితో దేవతల్ని చూశాడు అర్జునుడు. గాఢమయిన నల్లటిశరీరంతో వున్నాడు యముడు. దేవతలరూపంలో అతడిచుట్టూ పితృదేవత లున్నారు. వైడూర్యం రంగుతో వున్నాడు వరుణుడు. సముద్రాలూ నదులూకొండలూ చుట్టూ సేవిస్తున్నాయి. జంబూనదం రంగు శరీరం కుబేరుడిది. చుట్టూవున్నారు యక్షులు.

దేవత లిచ్చిన దివ్యాస్త్రాలు పుచ్చుకున్నాడు అర్జునుడు. వినయ వాక్యాలతో, పువ్వులూ పళ్ళూ నీళ్ళూ ఇచ్చి తృప్తిపరిచాడు.

ఐరావతంమీద దేదీప్యమానంగా వున్నాడు దేవేంద్రుడు. చేతిలో వజ్రాయుధం వెయ్యికిరణాలు ప్రసరిస్తోంది. చుట్టూ దేవతలు కొలుస్తున్నారు. కళ్ళు వేడుకగా చూశాడు అర్జునుడు. బ్రహ్మానందం అనుభవించాడు. శివుడివరాల్తో అసలే ఉత్సాహంగా వున్నాడతడు. కుమారుణ్ణి వెయ్యికళ్ళతోనూ చూసుకున్నాడు దేవేంద్రుడు. మురిసీ పోయాడు. వెయ్యికళ్ళూ ఇన్నాళ్ళకి సార్థకమయాయి అనీ అను కున్నాడు. "అర్జునా, నువ్వు అమరావతికి రావాలి'' అంటూ ఆహ్వా నించాడు ఆదరంగా. "శివుడి దగ్గిర మహాస్త్రం సంపాదించావు. దేవ కార్యం నెరవేర్చడానికి సమర్థుడి వయావు. నా రథం పంపిస్తాను. దాని మీద వత్తువుగాని. నేను ఇవ్వదలుచుకున్న దివ్యాస్త్రాలు అక్కడే ఇస్తాను'' అన్నాడు. "మహాప్రసాదం'' అన్నాడు అర్జునుడు. దేవత

లందరితోనూ అమరావతి వెళ్ళిపోయాడు దేవేంద్రుడు. రథంకోసం ఎదురుచూస్తూ కూచున్నా డర్జునుడు.

అంతలోనే ఆకాశంమీద అవుపించింది రథం. మేఘాలమీంచి అందంగా ఎగురుతోంది నల్లజెండా వైజయంతం. ఆకాశమంతా అల్లుకుపోతున్నాయి రథానికి తాపిన రత్నాలకాంతులు. కొండ గుహలు ప్రతిధ్వనిస్తున్నాయి రథచక్రాల ఘుర్ఘురధ్వనులు. ఉరు ముల్తో, మెరుపుల్తో వస్తూన్న మేఘంలాగ వస్తోంది దేవేంద్రుడి దివ్యరథం. వాయువేగ మనోవేగాలతో పరిగెత్తే పదివేలగుర్రాలు పూన్చివున్నాయి. రకరకాల ఆయుధాలు వుండవలిసినచోట్ల నిండి వున్నాయి.

చూస్తూవుండగా రథం తెచ్చి అర్జునుడిముందు నిలబెట్టాడు మాతలి. "అర్జునా! మీ అయ్య దేవేంద్రుడు రథం పంపాడు. దీని మీద నిన్ను అమరావతి రమ్మన్నాడు. రాజసూయాలూ, అశ్వమే ధాలూ వంద వంద చేసినవాళ్ళకయినా లభించదు ఈరథం. దయ చెయ్యి దీనిమీదికి" అన్నాడు.

పయనమయాడు అర్జునుడు. గంగలో స్నానంచేశాడు. పవిత్రు డయాడు. దేవతర్పణం, ఋషితర్పణం, పితృతర్పణం చేశాడు. రథ మెక్కి కూచున్నాడు. మందరపర్వతం దగ్గిర సెలవుతీసుకుంటూ అన్నాడు: "ఆత్మనిగ్రహంతో తపస్సమాధిలో వున్నవాళ్ళకీ, పుణ్య లోకాలు కాంక్షించేవాళ్ళకీ, నిర్మలహృదయులికీ ఆశ్రయస్థానం నువ్వు. దేవదంపతుల విహారభూమివి.రత్నాలతో రాణిస్తున్నాయి నీగుహలు. ఇన్నాళ్ళూ నీవొడిలో సుఖంగా గడిపాను. నీపుణ్యతీర్థాలు సేవించాను. గంగాజలంలో కడిగి నీచెట్లపళ్ళు తిన్నాను. మందరపర్వతమా! సెల వియ్యి. అమరావతి వెళ్ళివస్తాను."— పదివేల గుర్రాల పగ్గాలూ సడిలిచాడు మాతలి. అమరావతి అభిముఖంగా, మేఘాల మీంచి

పరిగెత్తింది రథం. దేవమార్గం చేరుకుంది. ఉత్తరక్షణంలో అమరావతి వచ్చేసింది.

అమరావతి

అద్భుతంకా వుంది అమరావతి. దీపాలుకాని, సూర్యచంద్రులు కాని అవసరం లేదక్కడ. దానంతట అదే స్వంతప్రకాశంతో సదా సర్వదా దేదీప్యమానంగా వెలుగుతోంది. ఎక్కడచూస్తే అక్కడ అందంగా వెలిగిపోతున్నాయి రత్నాలమేడలు. ధర్మంతో ప్రజల్ని పాలించిన రాజులూ, యుద్ధాల్లో ప్రాణాలు వొదిలిన వీరులూ, యజ్ఞాలుచేసి దేవతల్నీ బ్రాహ్మల్నీ తృప్తిపరిచిన ధర్మాత్ములూ, ఆ మేడల్లో నివసిస్తున్నారు. అన్నిలోకాల్లోని పుణ్యాత్ములికీ ఆదర్శం అమరావతి. ఐతే, అగ్నిహోత్రాలు వుంచుకోనివాళ్ళూ, తీర్థాలు సేవించనివాళ్ళూ, అబద్ధాలాడేవాళ్ళూ, వేదవిరుద్ధంగా నడిచేవాళ్ళూ, మాంసం తినే వాళ్ళూ, యుద్ధంలోంచి పారిపోయే వాళ్ళూ మాత్రం ఆ చుట్టుప్రక్కల అడుగు పెట్టలేరు.

అమరావతి ద్వారందగ్గిరికి వచ్చింది అర్జునుడి రథం. ద్వారం దగ్గిర తెల్లగా హిమాలయ పర్వతంలాగ నిలబడివుంది ఐరావతం. ఆగని సెలయేళ్ళలాగ మదజలాలు ప్రవహిస్తున్నాయి దాని కపోలాల మీద. ద్వారందగ్గిర చేరేసరికి దేవకన్యలూ సిద్ధులూ గంధర్వులూ కిన్నరులూ అర్జునుడిమీద విజయగీతాలు పాడారు.

లోపల ప్రవేశించింది రథం. అన్నిరుతువుల్లోనూ పూసే పూవులు ఎల్లప్పుడూ పూస్తూనేవుంటాయి అమరావతి ఉద్యానాల్లోను. వాటి పరిమళం యీవత్తూ మోసుకువచ్చి, అర్జునుడిమీద కుమ్మరించి, స్వాగతం చెప్పాడు వాయువు.

"ఆదిముని నరుడు."

"ఘన దేవేంద్రుడి కుమారుడు."

"శ్రీకృష్ణుడి నేస్తం."

"శివుణ్ణి మెప్పించి వరాలు పొందాడు."

ఇలా చెప్పుకుంటూ పరిగెత్తుకువచ్చారు అమరావతి దేవతలు. దారి రెండుపక్కలా బారులుతీరి నుంచున్నారు. అప్సరసలు మంగళ గీతాలు పాడుతున్నారు. సిద్ధమునులు ఆశీర్వదిస్తున్నారు.

అమరావతి వైభవానికి ఆశ్చర్యపోతూ, ఆనందిస్తూ వెళుతు న్నాడు అర్జునుడు. కోటదగ్గిరికి వచ్చేసింది రథం. మాతలి చెప్పడంతోనే రథం దిగాడు అర్జునుడు. దేవరుషులతో ఎదురుగా వచ్చాడు దేవేం ద్రుడు. అంజలిబంధం శిరస్సున కీలించి ప్రణామంచేశాడు అర్జునుడు. కౌగిలించుకున్నాడు దేవేంద్రుడు. ఉభయులికీ గరిపొడిచాయి శరీరాలు.

కొడుకుని కొలువుకూటానికి తీసుకువెళ్ళాడు దేవేంద్రుడు. తొడలమీద కూచోబెట్టుకున్నాడు. తన సింహాసనంమీద అర్ధాసన మిచ్చాడు. ఐరావతం కుంభస్థలాలమీద సాపుదేరిన తనచేతుల్తో కొడుకుశరీరం మాటిమాటికీ నిమిరాడు, ఆదరంగా.

దేవకన్యలు చామరాలు వేశారు. ఆ గాలికి ముంగుర్లు కదులుతూవుంటే అదోఅందంగా అవుపించాడు అర్జునుడు. దేవేంద్రుడు సైగచేయడంతోనే, దేవతలూ గంధర్వులూ సిద్ధులూ విద్యాధరులూ అర్జునుణ్ణి ప్రశంసిస్తూ ప్రసంగాలు చేశారు. ఊర్వశీ ఘృతాచీ మేనకా రంభా పూర్వచిత్తీ స్వయంప్రభా మిశ్రకేశీ దండగౌరీ వరూథినీ గోపాలీ సహజన్యా కుంభయోనీ ప్రజాగరా చిత్రసేనా చిత్రలేఖా సహా మధు స్వనా మొదలయిన దేవవేశ్యలు నాట్యం చేశారు.

ధగధగా మెరిసిపోతూవున్న మాంచి మణమందిరం అర్జునుడికి విడిదిగా ఏర్పాటుచేశాడు దేవేంద్రుడు. గంధర్వులగానంతోనూ వాటి తోనూ ఎంతో ఇదిగావుంది విడిది. అందులో హాయిగా వుంటూ వచ్చాడు అర్జునుడు.

ఊర్వశి వలపు

సాయంకాలమైంది. సూర్యుడు అస్తమించాడు. చంద్రోదయమైంది. దిక్కులనే స్త్రీలని ముస్తాబు చేస్తున్నట్టుంది వెన్నెల. చిత్రసేనుణ్ణి పిలిచాడు దేవేంద్రుడు. "నేను చెప్పానని చెప్పి, ఊర్వశిని అర్జునుడిదగ్గిరికి పంపించు" అన్నాడు. అప్పటికే అర్జునుడిమీాద మనస్సుపెట్టుకుని వుంది ఊర్వశి. చిత్రసేనుడు చెప్పడమే తడువుగా సిద్ధపడింది. తెల్లటి వెన్నెల లాంటి సన్నచీర కట్టుకుంది. అలాంటిదే రవికా వేసుకుంది. కస్తూరీ, కర్పూరం, కుంకుమం కలిపిన మంచి గంధం పూసుకుంది. రకరకాల పువ్వులు ముడుచుకుంది. రత్నాలు తాపిన నగలు పెట్టుకుంది. ఇలా మాంచి గజ్జలగుఱ్ఱంలా తయారైంది. నిలకడగా నిలవగలిగిన మెరుపుతీగలా బయల్దేరింది.

దారికడాకూ కాళ్ళనూపురాలు ఝుళంఝుళ మంటున్నాయి. చేతి రత్నకంకణాలు ఝుణఝుణ మంటున్నాయి. మొలనున్న ఇరవయిఅయిదుపేటల మొలనూలుమువ్వలు క్రేంకారం చేస్తున్నాయి. అదంతా కలిసి మన్మథుడి ఆజ్ఞావాద్యాలు మోగుతున్నట్టుంది మెల్లిమెల్లిగా నడుచుకుంటూ తేలిపోతూ వచ్చింది ఉర్వశి. అర్జునుడిబసలో అడుగు పెట్టింది.

ఉన్నపాళంగా నుంచున్నాడు అర్జునుడు. ఎదురువచ్చి, దండప్రణామంచేశాడు ఊర్వశికి. "అమ్మా! నీ కుమారుణ్ణి, అర్జునుణ్ణి, నమస్కరిస్తున్నాను" అంటూ అభివాదనం చేశాడు. "నన్ను మన్నించి ఆశీర్వదించడానికి వచ్చావు. కృతార్థుణ్ణయాను" అన్నాడు.

"అమ్మ ఏమిటి అర్జునా!" వోరచూపులు చూస్తూ అంది ఊర్వశి. ఆ చూపులు తుమ్మెదల్లా వున్నాయి. అర్జునుడి అందమనే తేనె తాగేస్తున్నట్టున్నాయి. అతణ్ణి చూస్తున్నకొద్దీ రెచ్చిపోతూ వుంది ఆమె మోహం. విలవిలలాడిపోతూ వుందామె. "ప్రియతము

డివి నువ్వు. నారదుడూ మొదలయిన మునులు చెపుతూవుంటే విని, ఎన్నాళ్ళయో మనస్సుపెట్టుకున్నాను నీమీద. ఇన్నాళ్ళకి ఇవాళ వొంటరిగా లభ్యమయావు. ప్రేమతో వచ్చాను. నన్నే నీకు ఉపహారం పెట్టుకుంటున్నాను. అమ్మా అని సందర్భం లేని మాట అన్నావు. ఎక్కడి వరస చెప్పూ! దేవవేశ్యని నేను. అసలు వావివరసల ప్రసక్తే లేదు మాకు. అందులోనూ ఇది దేవలోకం. దేవలోకంలో వావీ వరసా ఏమిటి? ఇక్కడ స్త్రీలూపురుషులూ ఎవరిఇష్టంవచ్చినట్టు వాళ్ళు సంచరించవచ్చు. ఎవళ్ళతోపడితే వాళ్ళతో సంగమసుఖం అనుభవించవచ్చు. ఇది దోషంలేని ఆచార మిక్కడ. నువ్వు మానవుణ్ణంటా వేమో. దేవలోకం రావడంచేత, నువ్వూ దేవతవే అయావు. సందేహించకు. నాకోర్కె చెల్లించు. రా. దేవమందారం తేనెలు తాగి, మత్తెక్కి, తుమ్మెదలు పాటలు పాడే ప్రదేశా లున్నాయి. బంగారం మేరు పర్వతం గుహాలున్నాయి. హాయిగా పిల్లగాల్లు వీస్తున్న నందనం మొదలయిన వనా లున్నాయి. గంగ వొడ్డుని బంగారం పద్మాల పరిమళంతో గుబాళిస్తున్న రత్న వేదిక లున్నాయి. చంద్రకిరణాల్లో ఎంతో అందంగా వున్న ఇసుకతిన్నె లున్నాయి. ఇలా ఎన్నో ఏకాంతస్థలాలున్నాయి ఈస్థలాల్లో - రా, ఎల్లప్పుడూ నన్ను సంగమ కేళిలో వోలలాడించు" అంది. ఆమె పెదవుల్లో మొలకనవ్వూ, కళ్ళల్లో వలపూ వొలికి పడుతున్నాయి.

"హరి హరీ" అంటూ చెవులు మూసుకున్నాడు అర్జునుడు. "అమ్మా! ఇది ధర్మవిరుద్ధం" అన్నాడు. "నీనోట రారాని మాట లివి. దేవతలదారి వేరు. లోకాలు పుట్టించగలరు. పెంచనూగలరు. ఎలా నడిచినా తప్పులేదు వారికి. నేను మానవుణ్ణి. కర్మభూమిలో జన్మించాను. కర్మ ప్రధానం నాకు. దేవలోకం ఆచారం నాకు తగదు. నా వంశకర్త పురూరవుడి భార్యవి నువ్వు. దేవేంద్రుడి కొలువులో వున్న

దానివి. ఈ రెండు కారణాలవల్లా నాకు తల్లివి నువ్వు. ఇంద్ర సభలో నువ్వు నాట్యం చేస్తున్నప్పుడు రెప్పవెయ్యకుండా నిన్ను చూశాను. నిజమే. అయితే దురభిప్రాయంతో కాదు. మా పూరు వంశానికి తల్లివికదా అన్న ఆనందంతోనే అలా చూశాను. నిజం చెపుతున్నాను. కుంతీ, మాద్రీ, శచీదేవి ఎంతో నువ్వూ అంతే నాకు. ఇందులో సందేహం లేదు. అంచేత, నన్ను పుత్రవాత్సల్యంతో చూడు'' అన్నాడు.

ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకినట్టయింది ఊర్వశికి. కోపంతో కళ్ళు కందినట్టయాయి. చురచురా చూసింది అర్జునుణ్ణి. "నిన్ను వలచి వచ్చాను. నీతండ్రి మాటమీదే వచ్చాను. నా అభిలాష నిష్ఫలం చేశావు. నపుంసకుడివై పో. మానవలోకంలో మానాభిమానాలు లేకండా ఆడవాళ్ళమధ్య బతుకు'' అని శపించింది. ఇక వొక్క క్షణం అక్కడ నిలువలేక పోయిందామె. గిరుక తిరిగింది. చువ్వలా బయటికి వచ్చేసింది.

తెల్లవారాక అంతా విన్నాడు దేవేంద్రుడు. అర్జునుణ్ణి పిలిచి వోదార్చాడు. "నీలాంటి ధైర్యవంతుణ్ణి ఏ యుగంలోనూ చూడలేను. తలవెంట్రుకవాసి చలించని ధర్మనిష్ఠ నీది. మునులుసహా ముక్కుమీద వేలుపెట్టుకునేటంత ఇంద్రియనిగ్రహం ప్రదర్శించావు. ఊర్వశి శాపానికి విచారించకు. అది అనుభవించడం తప్పదే అనుకో. అయినా అది మేలే చేస్తుంది నీకు. పదమూడో ఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి కదా, మీరు! ఆ సంవత్సరంకాలం మాత్రం నపుంసకత్వం వుంటుంది. రాచకన్నెలికి నృత్యం నేర్పుతూ మరుగుపడి వుంటావు అజ్ఞాతవాసం అయిపోగానే శాపం వొదిలి పోతుంది'' అన్నాడు. అనంతరం వజ్రాస్త్రం మొదలయిన దివ్యాస్త్రాలూ ఇచ్చాడు. వాటి రహస్యాలూ ప్రయోగాలూ ఉపసంహారాలూ ఉపదేశించాడు. మహాయుద్ధాల్లో

విజయం సాధించు" అంటూ దీవించాడు. చిత్రసేనుడి దగ్గిర నృత్యమూ గీతాలూ వాద్యాలూ నేర్పించాడు. ప్రతీదీ గురితప్పకండా నేర్చుకుంటూ వచ్చాడు అర్జునుడు.

అలా అమరావతిలో వున్నాడు అర్జునుడు. అయిదేళ్ళు కావచ్చింది భూలోకంలో. ఒకనాడు రోమశముని ఇంద్రసభకి వచ్చాడు. దేవతల పూజలందుకుని, దేవేంద్రుడిపక్క అర్ధాసనంలో కూచున్న అర్జునుణ్ణి చూశాడు. ఆశ్చర్యపోయాడు. "యుగయుగాలు తపస్సు చేసినవాళ్ళకి కూడా దుర్లభం, అలాంటిది - ఎవ్వరీయన? నీతో సమానంగా నీ సింహాసనంమీద కూచున్నాడు ?" అంటూ అడిగాడు దేవేంద్రుణ్ణి.

"మహాముని నరుడు" అన్నాడు దేవేంద్రుడు. "నాఅంశని నరలోకంలో పుట్టాడు. కుంతికొడుకు. అర్జునుడు. శివుణ్ణి మెప్పించి పాశుపతం పుచ్చుకున్నాడు. దిక్పాలకులూ నేనూ దివ్యాయుధాలిచ్చాము. దేవకార్యంకోసం సిద్ధంగా వున్నాడు. అంతేకాదు, లోగడ సగరసంతానం భస్మంచేసిన కపిలమునే నారాయణుడు, అతడే ఇపుడు కృష్ణుడై పుట్టాడు. కృష్ణార్జును లిద్దరూ రాక్షససంహారం చేసి భూభారం తగ్గిస్తారు. అందుకే వీళ్ళ అవతారం.

"మునీంద్రా! నీమూలాన జరగవలిసిన పనికూడా వుంది. విను. భూలోకం వెళ్ళు. ధర్మరాజుని చూడు. అర్జునుడి కుశలం చెప్పు. అమరావతిలో నాదగ్గిర క్షేమంగా వున్నాడను. దివ్యాస్త్రాలు సంపాదించాడనీ, కర్ణుడూ మొదలయినవాళ్ళని ఓడిస్తాడనీ చెప్పు. ఇదివిని అతడూ అతడి తమ్ములూ సంతోషిస్తారు. మరోమాట - ధర్మరాజుని తీర్థయాత్ర చెయ్యమను. ప్రత్యేకించి నేను చెప్పాననీ చెప్పు. తీర్థయాత్రతో అతడి దోషాలన్నీ తొలిగిపోతాయి. సామ్రాజ్యమూ

సిద్ధిస్తుంది. ముఖ్యంగా తీర్థయాత్రలో అతడికి సహాయంగా వుండాలి నువ్వు" అన్నాడు.

ఇంద్రుడి మాట ప్రకారం ధర్మరాజు దగ్గిరికి కామ్యకవనం బయలు దేరాడు రోమశముని.

## ధృతరాష్ట్రుడి దిగులు

"అర్జునుడు అమరావతి వెళ్ళాడు. దివ్యాస్త్రాలూ సంపాదించాడు" — ఈ వార్త వ్యాసుడి వల్ల ధృతరాష్ట్రుడు విన్నాడు. గుండెల్లో రాయి పడింది. సంజయుడితో విచారిస్తూ కూచున్నాడు. "అసలే సింహం. దానికి కవచం తొడిగితే ఇక అడిగావా? అదిగో అలాగే అయింది. అర్జునుడికి దేవతలు దివ్యాస్త్రాలివ్వడం" అంటూ నిట్టూర్చాడు. "అసలే అసాధ్యుడు వాడు. దేవతల్తోసహా దేవేంద్రుణ్ణి వోడించాడు. ఖాండవం కాల్చాడు. దిగ్విజయం చేశాడు. అంతమంది రాజుల్ని వోడించాడు. అన్న చేత రాజసూయం చేయించాడు. అలాంటివాడికి పాశుపతంలాంటి దివ్యాయుధాలు దొరికాయంటే, అడ్డూ ఆపూ వుందా ఇక! దేవతలే అయిపోయారు పాండవులు. వాళ్ళని వేలెత్తి చూపేవాడే వుండడు మరి.

"అవును, ధర్మంతప్పనివాళ్ళు వాళ్ళు. ఏదయినా సంపాదిస్తారు. వాళ్ళకీ మరొకళ్ళకీ పోలేమిటి? వాళ్ళతో విరోధం తెచ్చుకున్నాడు దుర్యోధనుడు. నిజానికి కొరివితో తలగోక్కున్నాడు. తనకీ తనవాళ్ళకీ ముప్పు తెచ్చుకున్నాడు. పిడుగుదెబ్బలికయినా ఆగుతాయి కాని, పర్వతాలు అర్జునుడి బాణాలికి ఆగవు. శత్రుసైన్యాలేమాత్రం వాటిముందు! ప్రళయసూర్యుడి కిరణాల్లో మాడిపోయిన ప్రాణికోటిలా, వాడి బాణాల్లో మాడిపోతారు, మనవాళ్ళు. తప్పదు. సంజయా, ఏం దారి?" అంటూ తలమీద చేతులు పెట్టుకున్నాడు.

"నీ ఉపేక్షే దీనికంతటికీ కారణం" అంటూ మొదలుపెట్టాడు సంజయుడు. "ఆవాళ సభలో, వాళ్ళని అన్ని దుర్భాష లాడారు నీకొడుకులు. కూడదని కూకలన్నా వెయ్యలేదు నువ్వు. పలుకూ పులుకూ లేకుండా పూరుకున్నావు. నీఉపేక్షవల్లే మాయజూద మాడాడు నీకొడుకు. పాపం, వోడిపోయారు పాండవులు. దేశాలు వొదిలి అడవులపాలే అయిపోయారు.

"మొదట కామ్యకవనంలో వున్నప్పుడు వాళ్ళ దగ్గిరికి శ్రీకృష్ణుడు వచ్చాడని విన్నాం. ఆయనతో అనేకమంది రాజులూ వచ్చారు. నీకొడుకులు చేసిన మోసమూ, ద్రౌపది పరాభవమూ విని నాలికలు కరచుకున్నారు వాళ్ళు. అప్పుడే నీకుమాళ్ళని హతమారుస్తా నంటూ కత్తితీశాడు శ్రీకృష్ణుడు. హస్తినాపురంలో ధర్మరాజుకి పట్టాభిషేకం చేస్తా నన్నాడు. ఇంద్రప్రస్థంలో జరిగినదానికి వందింతలు చేస్తా నంటూ బయల్దేరాడు. ద్రుపదుడూ సృంజయుడూ కేకయుడూ ధృష్టద్యుమ్నుడూ బలరాముడూ సాంబుడూ — యావన్మందీ వున్నారాయె. ఏముంది? చెప్పినంతా చేసేవాడే శ్రీకృష్ణుడు. కాని ధర్మావతారం ధర్మరాజు. ప్రతిజ్ఞ తప్పనివాళ్ళు పాండవులు. వాళ్ళు వారించడంవల్ల ఆగిపోయాడు శ్రీకృష్ణుడు. అవసరంవస్తే అర్జునుడికి సారథ్యంచేస్తాననీ అన్నాడట, ఆయన! దీన్నిబట్టి స్పష్టంగా తెలుస్తూనే వుంది, పదమూడేళ్ళూ గడిచాక దండెత్తుతారు పాండవులు. వాళ్ళ కోసం ఎంతన్నా చేస్తాడు శ్రీకృష్ణుడు.

"అసాధ్యమయిన తపస్సుచేసినవాళ్ళని ఎరుగుదుము. దేవతల దగ్గిర వరాలు పొందినవాళ్ళనీ ఎరుగుదుము. కాని బాణాల్తోనే ఎదిరించి శివుడి వరాలు పొందాడట అర్జునుడు! అర్జునుడి గాండీవం, భీముడి గదా, నీ ఉపేక్షా — కౌరవకులం నశించడానికి ఈ మూడూ మూల కారణాలు" అన్నాడు.

"నిజం సంజయా, నిజం. నా ఉపేక్షే ఇంతచేసింది. అయితే, ఏం చెయ్యనూ! ముసిలివాణ్ణి. పుట్టుగుడ్డిని. బుద్ధిలేనివాణ్ణి. అంచేత, నా మాటంటే గడ్డిపోచలా చూస్తాడు దుర్యోధనుడు. బలముందని కిందామీదా కనపడదు వాడికి. చెడ్డబుద్ధులే కాని మంచి రుచించదు. ఎంత మొత్తుకున్నాను. వాడి దుర్బుద్ధి మారింది కాదు. భీష్ముడూ ద్రోణుడూ విదురుడూ అంటే వాడికి గౌరవమే లేకపోయె. కర్ణుడూ శకునీ – వీళ్ళిద్దరే గురువులు వాడికి. వాళ్ళెంత చెపితే అంత. నాచేతిలో ఏముంది?" అంటూ వూరుకున్నాడు ధృతరాష్ట్రుడు.

ఇక అక్కడ కామ్యకవనంలో – "ఎన్నాళ్లో అయింది అర్జునుడు వెళ్ళి. ఇంతవరకూ కబురులేదు. ఇంద్రుణ్ణీ, శివుణ్ణీ ఎప్పుడు మెప్పిస్తాడో? ఎప్పుడు వరాలు పొందుతాడో? దివ్యాస్త్రాలతో ఎప్పుడు తిరిగివస్తాడో? కళ్ళారా ఎప్పుడు చూస్తామో!" – పగలూ రాత్రీ ఇదేచింత పాండవులికి.

ఒకనాడు ధర్మరాజుతో అన్నాడు భీముడు: "అర్జునుడు లేకపోవడం, ఇన్నేళ్ళూ ఇన్ని యుగాల్లా వున్నాయి అన్నయ్యా"– అని. "ఇంత ఆలస్యమెందుకయిందో? ఏమీ తెలియకుండా వుంది. పాండవుల బతుకూ, పాంచాలుల బతుకూ అతడిమీదే ఆధారపడి వున్నాయి. అతడి భుజబలంమీదే ఆశపెట్టుకుని వున్నాం. అతడి వల్లే శత్రువుల్ని గెలవాలి. అతడి వల్లే రాజ్యం సంపాదించాలి. ఇన్నాళ్ళయింది. ఇంక సహించలేం. అర్జునుడికోసం కృష్ణుణ్ణి పంపించు. తీసుకు వచ్చెయ్యమను.

"అర్జునుడు రాగానే, అతడూ కృష్ణుడూ నేనూ వెళతాం. శపథమూ, గడువూ గిడువూ అలా వుండనీ. మేం ముగ్గురం చాలు. యుద్ధం చేస్తాం. కౌరవుల్ని కడముట్టిస్తాం. రాజ్యం వశపర్చుకుంటాం.

అసత్యం అంటే భయం కనక, నువ్వు రావద్దు. ఇక్కడే వుండు. పదమూడేళ్లూ అయాకే హస్తిన వచ్చి, అభిషేకం చేసుకుందువు కాని.

"మాయజూదంలో మనరాజ్యం కాజేశాడు దుర్యోధనుడు. వాడు రాజ్యంలో బలపడి, వేళ్ళు తన్నకండానే వాణ్ణి పడగొట్టాలి. మోసం చేసినవాణ్ణి మోసంతోనే గెలవాలి. పాపంలేదు. ఏదో విధంగా శత్రువుని జయించి, రాజ్యం సంపాదించడమే రాజులికి రాజధర్మం" అన్నాడు.

భీముడి వేగిరపాటు చూసి సంతోషమే కలిగింది ధర్మరాజుకి. రెండు చేతులతోనూ అతణ్ణి లాక్కున్నాడు, దగ్గిరికి. గుచ్చి కౌగిలించుకున్నాడు. శిరస్సు మూచూశాడు. "తమ్ముడూ! అగ్ని దేవుడికి గాలి దేవుడులా అర్జునుడికి నువ్వు తోడైతే, ప్రాణంతో బతికే శత్రువు ఎవడుంటాడు ? ఐతే, ఇది సమయం కాదు, కోపానికి. ఎన్నాళ్ళింక ! పదమూడేళ్లూ పూర్తికానీ. నువ్వూ అర్జునుడూ ధర్మయుద్ధంలోనే దురాత్ముల్ని సంహరింతురు కాని. మన సత్యభంగం జరగడం నాకు నచ్చని పని" అన్నాడు. నచ్చజెప్పి అతణ్ణి శాంతపరిచాడు.



# అరణ్యపర్వం



## రెండో ఆశ్వాసం

భీముడికి ధర్మరాజు నచ్చజెప్పుతున్నాడు. అదే సమయానికి బృహదశ్వుడనే ఒక ముని ధర్మరాజు దగ్గిరికి వచ్చాడు. మర్యాదలూ మన్ననలూ అయాక, కౌరవులు తమకి చేసిన మోసం చెప్పి తమ వనవాసం విషయం ప్రస్తావించాడు ధర్మరాజు. "దేశంవొదిలిపెట్టాం. రాజ్యం పోగొట్టుకున్నాం. బంధువులికీ దూరమయాం. అడవుల్లో మృగాలమధ్య బతుకుతున్నాం. మునీంద్రా, మాలాగ అడవులపాలై, అష్టకష్టాలూ పడిన రాజులు ఎవరుంటారు?" అన్నాడు.

"నీకంటే కష్టాలు సహించినవాళ్ళున్నారు" అన్నాడు బృహదశ్వుడు. "శపథానికి కట్టుపడి అడివికి వచ్చావు నువ్వు. దేవతల్లాంటి తమ్ములు వెంటవున్నారు. బ్రాహ్మలూ, రథాలూ, భార్యా – వీళ్ళందరితోనూ వనవాసం చేస్తున్నావు. కాని పూర్వం నలమహారాజు వొంటరిగా అడవుల్లో ఎన్నో అన్ని కష్టాలు పడ్డాడు. అతడూ జూదంలోనే పుష్కరుడితో వోడిపోయాడు, రాజ్యం" అన్నాడు. బృహదశ్వుడిలా అనడంతోనే నలుడి కథ వివరించుమని కోరాడు ధర్మరాజు. బృహదశ్వుడు మొదలు పెట్టాడు.

### నలచరిత్ర

నలుడు నిషధదేశం చక్రవర్తి. వీరసేనుడి కుమారుడు. మంచి పరాక్రమశాలి. ప్రపంచంలోని రాజులు యావన్మందినీ జయించాడు. ఎన్నో అక్షోణీల సైన్యంవుండేదతడికి. పరాయిరాజులు అతణ్ణి తేరి

చూడలేక పోయేవాళ్ళు. ప్రజల్ని కన్నబిడ్డల్లా చూస్తూ, ధర్మం తప్పకండా రాజ్యం పాలిస్తూ వుండేవా డతడు. ఐతే, జూదం అంటే మాత్రం లోకం కనబడేది కాదు మరి.

విదర్భ దేశంలో భీమసేనుడని వొక రాజు వుండేవాడు. కుండిన పురం అతడి రాజధాని, దశార్ణ దేశం రాజు కూతుర్ని వివాహం చేసుకున్నా డతడు. ఎంతో కాలంవరకూ ఆ దంపతులికి సంతానం కలగలేదు. చాలాచాలా వ్రతాలూ అవీ చేశారు. లాభంలేక పోయింది. చివరికి దమనుడు అని వొకఋషిని ఆశ్రయించారు. ఎన్నో విధాల అతణ్ణి సేవించారు. దమనరుషి వరంవల్ల వొక కూతురూ, ముగ్గురు కుమార్తెళ్ళూ కలిగారు భీమరాజుకి. కుమార్తెళ్ళకి దముడూ, దంతుడూ, దమనుడూ అని పేర్లుపెట్టాడు భీమరాజు. కుమార్తెని దమయంతి అన్నాడు.

దమయంతి నిజంగా దంతపుబొమ్మ లాంటి పిల్ల. అందమూ, అందానికి తగిన బుద్ధిన్నీ ఆమెది. భీమరాజు సంపదకి కొదవ లేదు. అంచేత దేవకన్నెల్లాంటి వందమంది చెలికత్తెలు అరిచేతిలో పెట్టుకుని కొలుస్తూ వుండేవాళ్ళు దమయంతిని. చూసి వచ్చినవాళ్ళు ఆమె అందమూ సుగుణాలూ నలుడి దగ్గిర వర్ణించి చెప్పేవాళ్ళు. విని లోలోపల ఆమెని ప్రేమిస్తూ వుండేవాడు నలుడు. అలాగే నలుడి విషయం వింటూ వుండేది దమయంతి. అతణ్ణి ప్రేమిస్తూనూ వుండేది.

హ ం స ందే శ ం

ఒకనాడు దమయంతినే తలుచుకుంటూ ఉద్యానవనంలో తిరుగుతున్నాడు నలుడు. అతడి మనస్సు మనస్సులో లేదు. ఇంతలో వొకహంసలచుంద ఆకాశంమీద కనిపించింది. ఆకాశలక్ష్మి మెడలో ముత్యాల హారంలా ఎంతో ముచ్చటగా వుందది. అలా ఎగురుతూ

వచ్చి నలుడి ఉద్యానంలోనే వాలాయి హంసలు. వాటి నడకలూ అవీ చూశాడు నలుడు. ముచ్చటవేసింది, రొప్పడం మొదలు పెట్టాడు. అన్నీ ఎగిరిపోయాయి. ఒక్కటిమాత్రం వుండిపోయింది. చప్పున దాన్ని పట్టుకున్నాడు నలుడు. హంసలు దాన్ని వొదిలి వెళ్ళలేకపోయాయి. అరుస్తూ, ఆకాశంమీద తెల్లమబ్బుల్లాగ గుంపులు కట్టి ఎగరడం ప్రారంభించాయి.

పట్టుబడ్డహంస బిగులు బిగులుగా చూసింది నలుణ్ణి. 'చంపుతాడో ఏమో? ఏం చేస్తాడో?' అని భయపడుతూ మనుష్యభాషలో మాట్లాడింది. 'రాజా! నీకు నేను ఉపకారంచేస్తాను. నీ ప్రియురాలు - నాకు తెలుసు - దమయంతి దగ్గిరకి వెళ్ళి నీ చక్కదనం వర్ణించి చెపుతాను ఆమె నిన్ను ప్రేమించేట్టు చేస్తాను. నన్ను వొదిలిపెట్టు' అంది. హంసపలుకులు అమృతమే వర్షించినట్టయింది నలుడికి. మారు మాటలేకండా వొదిలిపెట్టేశాడు హంసని. రివ్వున ఎగిరిపోయింది హంస. క్షణంలో తన జట్టుతో కలుసుకుంది. ఆ వెళ్ళడం వెళ్ళడం మందతో సహా కుండినపురమే వెళ్ళింది.

చెలికత్తెలతో కులాసాగా ఉద్యానవనంలో తిరుగుతోంది దమయంతి. సరిగ్గా అక్కడే వాలాయి హంసలు. తలా వొక్కటి పట్టుకున్నారు, దమయంతీ ఆమె చెలికత్తెలున్నూ. నలుడితో మాటాడిన హంస దమయంతికే దొరికింది. ఆమె పట్టుకోవడమే తడువు ముద్దులుగులుకుతూ మాట్లాడిందది. 'నీప్రియుడు నలుడిదగ్గిరనించి వచ్చాను' అంది. తుళ్ళిపడింది దమయంతి. 'నాలుగు సముద్రాల మధ్యావున్న భూప్రపంచంలో నేనుచూడని రాజులులేరు. ఐతే,అందంలో కాని బుద్ధిలో కాని నలుడితో సమానమయినవాడు వొక్కడూ కనిపించలేదు. అందాలబరిణివి నువ్వు. నిజం చెప్పనా? నలుడి భార్యవయితేనే నీ చక్కదనానికీ, యవ్వనానికీ, వైభవానికీ సాఫల్యం. ఏం,

అవు నంటావా! నువ్వు స్త్రీలలో రత్నానివి. నలుడు పురుషరత్నం మీ ఇద్దరూ కలిస్తే, అబ్బా! అద్భుతం'' అంది.

మతేపోయింది దమయంతికి. ఒళ్ళంతా గరిపొడిచింది. "దేవ దూతలా దొరికావు'' అంటూ ఆదరంగా దువ్వింది హంసని. "ఆయన సంగతి నాతో చెప్పావు. బావుంది. మరి, నామాట ఆయని కెలా తెలుస్తుంది? చూడూ, నువ్వే పుణ్యంగట్టుకోవాలి. నామాట విన్న వించాలి. నామీద దయకలిగేటట్టు చెయ్యాలి. నీమేలు మరిచి పోను '' అని ముద్దాడి, విడిచిపెట్టింది. ఆమెని చూసి, చెలికత్తెలూ వొదిలిపెట్టేశారు, వాళ్ళచేతుల్లోని హంసలు. మళ్ళీ నిషధవచ్చింది హంస. దమయంతి వైనమంతా నలుడితో చెప్పింది. ఆమె చక్క దనమూ అదీ అతడితో మరింత వర్ణించి వెళ్ళింది.

అక్కడ నలుడికోసం దమయంతీ, ఇక్కడ దమయంతికోసం నలుడూ ఆపసోపాలు పడిపోతున్నారు. ఉభయుల హృదయాల్లోనూ మన్మథాగ్ని రగులుకుంది. పగళ్ళు యుగాలే అయిపోయాయి. తెల్ల వారేవేకావు రాత్రులు. మంట లుచ్చుకున్నాయి శరీరాలు. పద్మ పత్రాలూ తామరతూళ్లూ అద్దుకున్నారు వాళ్ళు. పచ్చకర్పూరం గంధమూ మంచిగంధమూ పూసుకున్నారు. చిగురుపక్కలమీద పడుకున్నారు. ఎంతచేసినా ఏం లాభం? వేదన అధికమయిందే కాని తగ్గేమార్గం కనపల్లేదు. రోజు రోజుకీ శరీరాలు చిక్కిపోతున్నాయి. మోహాలు నల్ల బడుతున్నాయి.

దమయంతి అవస్థ చూచి భయపడ్డారు చెలికత్తెలు. పాలు పోకండా అయిపోయింది వాళ్ళకి. భీమరాజు దగ్గిరికి వెళ్ళారు. సంగ తంతా చెప్పారు. "అదేమో బాబూ, ఏం మంత్రించిందో హంస! అదే తలపోసుకుంటూ కూచుంటుంది అమ్మాయి. అది వెళ్ళిన దిక్కే, నిషధదిక్కు - చూస్తుంది. నిట్టూరుస్తుంది. మాతో మాటలే మానే

సింది. ముస్తాబు పూసే మానుకుంది. అన్నహారాలు విషమే అయి పోయాయి. సుఖంగా కూచోదు. పక్కమీద శరీరం వాల్చదు. అహో రాత్రాలు కంటిమీద కునుకన్నా లేదంటే నమ్మండి. నలుడు నలుడు నలుడు - ఆ నలుడిమీదే పంచప్రాణాలూ పెట్టుకు కూచుంది. ఇంకో రాజుమాటకి అతడెంత గొప్పవాడు కానీండి - పెడమొహం పెడు తుంది'' అన్నారు. ఏమీ పాలుపోలేదు భీమరాజుకి. నలుణ్ణి ఎలా తీసుకురావడం? కట్టుతప్పినపిల్ల దమయంతి. స్వయంవరం తప్ప మరో ఉపాయ మేముంది?

దమయంతికి స్వయంవరం. దేశదేశాల రాజులికీ వర్తమానాలు పంపాడు భీమరాజు. దమయంతికోసం అప్పటికే కలలు కంటు న్నారు రాజులు. వర్తమానం అందడమే తడువు. యావన్మందీ హడావుడిగా పయనం కట్టారు విదర్భకి. దూరదూరాల రాజులూ వచ్చారు. సైన్యాలూ రథాలూ వాటితో జవజవ లాడిపోయింది భూమి. కుండినపురంలో ఇసకవేస్తే రాలడం లేదు జనం.

అదేసమయానికి పురాణమునులు పర్వతుడూ నారదుడూ భూలోకంలో సంచారంచేసి, ఇంద్రలోకం వెళ్ళారు. ఇంద్రుడు వాళ్ళని గౌరవించి, భూలోకం భోగట్టా లడిగాడు. "భూలోకంలో ధర్మపరి పాలనచేస్తూ ఎంతోమంది రాజులున్నారు. మంచి వీరులుకూడా న్నూ వాళ్ళు. యుద్ధాల్లో మరణించి, స్వర్గసుఖాలకోసం మా అమరావతికి అతిథులై రావడం కద్దు. ఐతే, ఈమధ్య మాత్రం అలారావడం లేదు. ఏమిటి కారణం?'' అన్నాడు. "దీనికి వొక్కటే కారణం'' అన్నాడు నారదుడు. "దమయంతి స్వయంవరం. భూలోకంలోనే కాదు, సిద్ధ, సాధ్య, విద్యాధరుల్లోనూ, తుదకి మన దేవకన్యల్లోనూ దమయంతిలాంటి సౌందర్యవతి లేదు. అందుచేత, రాజన్నవాడల్లా

ఆమె స్వయంవరానికే విదర్భ వెళుతున్నాడు. యుద్ధానికి తీరికేలేని వాళ్ళకి" అన్నాడు.

"అంతఅందకత్తా,దమయంతి" అన్నాడు దేవేంద్రుడు. తానూ కుతూహాల పడ్డాడు స్వయంవరానికి. అగ్ని వరుణుడూ యముడూ కూడా అతడితో బయల్దేరారు. రత్నాలుతాపిన బంగారం విమానాలమీద విదర్భవచ్చారు. దారిలో నలుణ్ణి చూశారు. అంతమంది రాజులమధ్యా పట్టియిచ్చినట్టు ప్రకాశిస్తున్నాడు నలుడు. ఆదిత్యుల మధ్య విష్ణువులా వున్నాడు. అంతరిక్షంమీద విమానాలు నిలిపారు దేవతలు. భూమ్మీదికి దిగి, నలుణ్ణి పలకరించారు. "నలమహారాజా! మాకో ఉపకారం చెయ్యాలి" అన్నారు. "తప్పకండా చేస్తాను" – అనేశాడు నలుడు. "మీరెవ్వరు? నావల్ల అయే ఉపకారమేమిటి? ఆదేశించండి"అన్నాడు. "ఆడితప్పనివాడివి. మరేమీ లేదు, దూతగా మాకో చిన్నపని చేసిపెట్టాలి. నేను దేవేంద్రుణ్ణి. వీళ్ళు దిక్పాలకులు. ఈయన అగ్ని. ఈయన వరుణుడు. ఈయన యముడు. దమయంతి స్వయంవరానికి వచ్చాం మేము. మాకోసం ఆమె అంతఃపురానికి వెళ్ళాలి నువ్వు. మా వివరాలు ఆమెతో చెప్పాలి. మాలో వొకణ్ణి వరించమని ఆమెకి నచ్చచెప్పాలి" అన్నాడు దేవేంద్రుడు.

అడకత్తెర్లో పడిపోయాడు నలుడు. అంజలిబంధం శిరస్సుమీద కీలించాడు. "నేనూ అదే అభిలాషతో వచ్చాను. నన్నే దీనికి నియమించడం భావ్యమేనా మీకు?" అన్నాడు. "ఐతే ఆలోచించకండా అంగీకరించా వెందుకూ?" అన్నాడు దేవేంద్రుడు. "చేస్తానన్నావు. చెయ్యకపోతే తప్పుతుందా? ఆడితప్పని వాడివనీ, ఇది నీవల్లకాక మరొకరివల్ల సాధ్యంకాదనీ తెలిసే, నిన్ను కోరాం. దేవకార్యం కాదనకు. అంతఃపురంలోకి ఎలా వెళ్ళడం అనుకుంటున్నావేమో! ఆ భయ

మక్కరలేదు. ఎంతమంది కాపున్నా, ఎన్ని ఆయుధాలు పట్టుకున్నా పరవాలేదు. వెళ్లు. నిన్ను అడ్డుకునే వాడు వుండడు" అన్నాడు. తప్పిందికాదు నలుడికి.

దేవదూత

దమయంతి అంతఃపురములో ప్రవేశించాడు నలుడు. చుక్కల్లో చంద్రవంకలా వారిగి కూచునివుంది దమయంతి. హంస చెప్పినదాని కంటే, వెయ్యిరెట్లు అందంగా వుంది. నలునిపేరే పలుకుతోంది. నలుడిపేరే వింటోంది. ఆమె ఆరాటానికి అదొక్కటే మహా పథంలా వుంది. తొలిచూపుల్లోనే చలించిపోయాడు నలుడు.

"ఎవరీ కొత్తమనిషి?" — తుళ్ళిపడ్డారు చెలికత్తెలు. ఉన్నపాళాన లేచారు. ఎదురువచ్చారు. సంతోషంతో స్వాగతం చెపుతున్నట్టు వున్నారు వాళ్ళు.

దమయంతీ చూసింది. ఇద్దరికళ్ళూ ఒక్కసారే కలుసుకున్నాయి. ఒక్కసారే వాలిపోయాయి. ఏనాటి పరిచయ మిది! ఎవరీయన? మన్మథుడా? దేవేంద్రుడా? సూర్యుడా? చంద్రుడా! వరుణుడా? కుబేరుడా? అశ్వినీదేవతా? — నలుడు కాడు కదా! తేరిపారచూసిం దామె. కన్యాసులభమైన లజ్జ కలగనేలేదు ఆమెకి. అపరిచితు డన్న అనుమానమూ లేకపోయింది. అప్రయత్నంగానే విడివడ్డాయి పెదవులు. మధురంగా, ఎంతో మృదువుగా మాట్లాడింది: "మహాపురుషుడిలా వున్నావు! దేనికని ఇలా వచ్చావు? పోతుటీగ దూరనివ్వకండా కాపలావుంచారు నాన్నగారు. ఎవ్వరికీ తెలియకండా ఎలా రాగలిగావు? ఆత్మీయుడిలా ఆకర్షిస్తున్నావు. ఎవరు నువ్వు?"

"దేవదూతని" అన్నాడు నలుడు. "ఇంద్రుడూ, అగ్నీ, వరుణుడూ, యముడూ నీస్వయంవరంకోసం వచ్చారు. ముందు నన్ను

పంపారు. వాళ్ళల్లో వొకర్ని వరించమని కోరమన్నారు. వాళ్ళ సందేశం పట్టుకువచ్చాను. వాళ్ళ ప్రభావంవల్లే మరొకళ్ళకి అవుపడ కండా అంతఃపురం ప్రవేశించాను. దమయంతీ! దిక్పాలకులు వాళ్లు. దేవతలు. వాళ్ళల్లో ఇంద్రుణ్ణో, అగ్నినో, వరుణుణ్ణో, యముణ్ణో - ఎవణ్ణో వొకణ్ణి - నీకు నచ్చిన వాణ్ణి వరించు. వాళ్ళ అభీష్టం నెర వేర్చు. నేను ఎవణ్ణనేనా, నీప్రశ్న ? నలు డంటారు నన్ను. నిషధ నాది" అన్నాడు.

నలుడా ? - తల వొంచుకుంది దమయంతి. కలకాదు కదా ? హంసవల్ల విని పాపం, ఇంతదాకా అతడికోసమే ఆరాటపడుతోంది. ఆ నలుడు - ఇపుడు తన ఎదటేవున్నాడు. కాని ఈ మాటలేమిటి ? బాణాల్లా బాధిస్తున్నాయి.

"నే నెక్కడ? దేవతలెక్కడ? -" మెల్లిమెల్లిగా అంది దమయంతి. "వాళ్ళకి పదివేల నమస్కారా లని చెప్పు. ఏమి మాట లివి ! — నిజం చెపుతున్నాను. నేను నీదాన్ని. నీ సుగుణాలు హంస నోట విన్నాను. నిన్నే — మనస్సులో నిలుపుకున్నాను. నీకోసమే - అవును, నీకోసమే ఈస్వయంవరం. నువ్వు రావాలనే ఇంతమందిరాజు లికీ స్వయంవరం చాటించాడు నాన్న. ఇంత కాఠిన్యం వహించకు. నిన్నే వరిస్తున్నాను. నువ్వే నా భర్తవి. అలా కాకపోతే - నిజం, విను. నుయ్యో, గొయ్యో చూసుకుంటాను. విషం పుచ్చుకుంటాను. ఉరిపోసుకుంటాను. అగ్గిలో దూకనా శరీరం వొదిలిపెడతాను. తప్పదు" అంది.

"బాగా ఆలోచించు" అన్నాడు మళ్ళీ నలుడు. "దేవతలు వాళ్ళు బలవంతులు. ప్రపంచాలు పాలిస్తున్నారు. వైభవానికి కొరతలేనివాళ్ళు. తేజోవంతులు. అలాంటివాళ్ళు కోరుతున్నారు

నిన్ను నేనో - సామాన్య మానవుణ్ణి. సంసారిని. వాళ్ళ పాదధూళికి సరిపోనివాణ్ణి. వాళ్ళని కాదని నన్ను కోరుతున్నావు. ఏం సబబిది? దేవతలికి వ్యతిరేకిస్తే, - దమయంతీ, అధమగతులు వస్తాయి. వాళ్ళలో నీకు ఇష్టమైనవాణ్ణి వరించు. దేవకార్యం సిద్ధిస్తుంది. నేనూ సంతోషిస్తాను' అన్నాడు.

ఎంతోసేపు మాటాడలేకపోయింది దమయంతి. సోగకన్నుల నించి ధారలు కడుతున్నాయి కన్నీళ్ళు. కాళ్ళకింది నేల కదిలిపోతు న్నట్టుంది. అంతలోనే మెరుపులా ఏదో తట్టింది. "నీ అభిప్రాయం అవగతమైంది" - కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది. "అపాయంలేని ఉపాయం చెపుతాను విను. స్వయంవరానికి దిక్పాలకులూ వస్తారు కదా! వాళ్ళఎదటే నిన్ను వరిస్తాను. అలాఅయితే దోషమే వుండదు మనమీద. సరేనా?' అంది. తిరిగి వచ్చేశాడు నలుడు. జరిగింది జరిగినట్టు దిక్పాలకుల్తో నివేదించాడు.

స్వయంవరం

తిథీ, నక్షత్రం చూసి, మంచిరోజు ఏర్పాటుచేశారు స్వయం వరం. 'నలుణ్ణే కాని మరెవ్వరినీ వరించదట, దమయంతి. ఆ ఇదే మిటో మనమూ చూద్దాం' అంటూ దిక్పాలకులు నలుగురూ నలుడి రూపమే ధరించి స్వయంవరంలో నలుడి పక్క కూచున్నారు. సుము హూర్తాన తెల్లటిపూలమాల పట్టుకుని స్వయంవరం సభలోకి వచ్చింది దమయంతి. సభలోని రాజులందరినీ తేరిపారచూసింది. నలుడూ, నలుగురు దిక్పాలకులూ - అయిదుగురు నలచక్రవర్తులు! అయిదు గురూ ఒక్కలాగే వున్నారు. తలవెంట్రుక వాసిలేదు. నిజమయిన నలు డెవడు? ఎలా గుర్తించడం? ఏమీ పాలుపోలేదు పాపం దమయంతికి. దిక్పాలకుల్నే ప్రార్థించింది. "కరుణించండి. నలుణ్ణి

పోల్చుకునే ఉపాయం మీరే అనుగ్రహించండి" అంటూ మనసా ప్రార్థేయపడింది.

అనుగ్రహించారు దిక్పాలకులు. రెప్పలు వాల్చకపోవడం, చెమట పట్టకపోవడం, ఆసనం కిందికి అంటకుండా వుండడం - ఇలా సహజగుణాల్తో కనిపించారు. పొల్తిపట్టేసింది దమయంతి. ధర్మసమ్మతంగా నలుడి మెళ్ళో పూలహారం వేసింది. సాధువాదాలు చేశారు దేవతలు. ఆశీర్వాదాలు చేశారు బ్రాహ్మలు. బాజాలూ బజంత్రీలూ తూర్యారవాలూ సముద్రఘోషలా భోరుమని మోగాయి. ఇంత వైభవం ఎక్కడా చూడలేదని ప్రశంసించారు ప్రజలు.

ఇలా స్వయంవరంలో లభించిన దమయంతిని వైభవంగా వివాహం చేసుకున్నాడు నలుడు. వరాలిచ్చి మరీ వెళ్ళారు దిక్పాలకులు. 'నీయజ్ఞాల్లో స్వయంగా హవిర్భాగాలు పుచ్చుకుంటాను' అన్నాడు దేవేంద్రుడు. 'నువ్వు అడిగినచోట అగ్ని సాధిస్తాను' అన్నాడు అగ్ని. 'కోరిన దగ్గర నీళ్లుపుట్టిస్తాను' అన్నాడు వరుణుడు. 'నీమనస్సు ధర్మం తప్ప నివ్వను' అన్నాడు యమధర్మరాజు.

క లి

నలుడికి వరాలిచ్చి, దేవలోకం వెళిపోతున్నారు దిక్పాలకులు. దారిలో ద్వాపరంతోకూడాఎదురయాడు. కలి.'ఎక్కడికీ ప్రయాణం?'- ప్రశ్నించారు దిక్పాలకులు. 'విదర్భకి' అన్నాడు కలి. 'భీమరాజు కూతురు దమయంతి. ఆమెస్వయంవరం జరుగుతోంది. ఆమెచేత వరించబడతాను. ఆమెని పెళ్ళాడి వస్తాను' అన్నాడు. పకపకా నవ్వారు దిక్పాలకులు. 'ఎగిరిపోయిన పిట్టకోసం వలవేస్తున్నావు' అన్నారు. 'స్వయంవరమూ, పెళ్ళీ అంతా అయిపోయింది. మేమూ అక్కడనించే వస్తున్నాం. అందరిదీ నక్కాసే అయింది. ఎవళ్ళనీ వరిం

చిందికాదు దమయంతి. నలుడి మెళ్ళోనే వేసింది వరణమాల' అన్నారు.

ఎక్కడాలేని కోపంతో చిందులు దొక్కాడు కలిపురుషుడు. 'నలుణ్ణీ, దమయంతినీ వొకచూపు చూస్తాను. రాజ్యంనించి వెళ్ళగొడతాను. ఇద్దరినీ చెట్టొకపిట్ట చేసేస్తాను. ఏడిపించి ఏడిపించి, కాళ్ళరాసి మరీ వొదలిపెడతాను' అంటూ మీసం మెలివేసి బయల్దేరాడు.

జూదమంటే నలుడికి వెర్రిసరదా అని తెలుసు కలికి. ద్వాపరాన్ని పాచికల్లో ప్రవేశపెట్టాడు. ఒకుపు చూసి నలుడిలో ప్రవేశించాలి తాను. అందుకోసం కనిపెట్టుకు కూచున్నాడు. అశ్వమేధం వంటి మహాయజ్ఞాలూ, జపాలూ, తపాలూ, దానధర్మాలూ మొదలయిన పుణ్యకర్మలు ఎప్పుడూ చేస్తూవుండేవాడు నలుడు. అందుమూలాన ఎంతోకాలానికిగాని అతడిదగ్గిర అడుగుపెట్టలేకపోయాడు కలి. పన్నెండేళ్ళు గడిచాయి. ఇంద్రసేనుడని కుమారుడూ, ఇంద్రసేనఅని కూతురూ కలిగారు నలుడికి.

ఒకనాడు లఘుశంకతీర్చుకుని, నీళ్లు తీసుకున్నాక కాళ్లుకడగడం పొరపాటున మరిచిపోయాడు నలుడు అలాగే సంధ్యావందనమూ చేసేశాడు. అది సందుదొరికింది కలికి. చప్పున ఆవహించాడు నలుణ్ణి. అనంతరం పుష్కరుడిదగ్గిరికి వెళ్ళాడు. నలుడి పినతండ్రికొడుకే పుష్కరుడు. 'నలుడితో జూదమాడు. నిన్ను గెలిపిస్తాను. వాడి రాజ్యమూ ధనమూ అంతా గెల్చుకుందువు కాని,' అంటూ అతణ్ణి రేపెట్టాడు. బ్రాహ్మడివేషంలో పాచికలుపట్టుకుని అతడివెంట నలుడిదగ్గిరికి వచ్చాడు. 'మా పుష్కరమహారాజుతో జూదానికిరా' అంటూ నలుణ్ణి కవ్వించాడు. జూదానికి రమ్మంటే, రాననడం ధర్మవిరుద్ధం అంటూ ఆటలో కూచున్నాడు నలుడు.

అటు నలుడూ ఇటు పుష్కరుడూ. ఆరంభమయింది ఆట. పాచికలు వేసీవెయ్యడంలోనే వీగిపోయాడు నలుడు. ప్రతీఆటా వీగి పోతూనే వచ్చాడు. ప్రతీపందెం గెలుస్తూనే వచ్చాడు పుష్కరుడు. తమకం హెచ్చిపోతూనేవుంది ఆట. నలుణ్ణి పట్టుకునేవున్నాడు కలి. ఆప్తులు వారించారు. వినిపించుకోలేదు నలుడు. మాసాలతరబడి జరిగింది జూదం. వస్తువులూ వాహనాలూ వొకటేమిటి — రాజ్యం లోని సంపద యావత్తూ వీగిపోతూ వచ్చాడు నలుడు. ప్రజలూ మంత్రులూ దమయంతిని వెంటవేసుకువచ్చారు. 'ఇంతతో అయినా ఆట ఆపండి' అంటూ మొరపెట్టారు. కలిమాయ, అందరినీ అవతలికి పొమ్మన్నాడు నలుడు. ఒక్కరికీ సాధ్యం కాలేదు మానిపించడం. 'ఓడినకొద్దీ పిచ్చెత్తుతోంది మహారాజుకి. ఏం దారి? మాసర్వనాశ నానికే వచ్చింది పాడుజూదం' అంటూ మొత్తుకుంది దమయంతి. ఆప్తబంధువులతోనూ, మంత్రి పురోహితులతోనూ ఆలోచించింది. 'పుష్కరుడు చెప్పినట్టు వింటున్నాయి పాచికలు. మహారాజంటే పెడ మొహంపెడుతున్నాయి. అపజయంతప్పదు మాకు. ఏమిటి సాధనం?' అంటూ విచారించింది. వాళ్ళ సలహాప్రకారం, భర్తతో చెప్పి సారథి వార్ష్ణేయుణ్ణి పిలిచింది. 'సారథీ! రథం సిద్ధంచెయ్యి. అబ్బాయినీ, అమ్మాయినీ తీసుకువెళ్ళి, తాతగారింట దిగబెట్టిరా' అంటూ కన్నీళ్ళు తుడుచుకుంది. రథంవేసుకుని ఇంద్రసేనుణ్ణీ, ఇంద్రసేననీ విదర్భలో దిగబెట్టాడు వార్ష్ణేయుడు. అక్కడినించి అయోధ్యవెళ్ళి, ఋతుపర్ణుడి దగ్గిర సారథిగా కుదురుకున్నాడు.

యావదాస్తీ వీగిపోయాడు నలుడు. తుదకి రాజ్యమూ రాణివా కూడా వోడిపోయాడు. కట్టుబట్టలతో దమయంతిని వెంట బెట్టుకుని, పట్నం వొదిలిపోయాడు. పట్నంబయట మూడురాత్రుల్లూ

మూడు పగళ్లూ వున్నాడు. ఏచెట్టునీడో తప్ప, ఇంత తలదాచుకుందికి ఆస్కారం లేదు. 'నలుడికి సహాయం చేసేవాడికి మెడమీద తలకాయ నిలవదు' అని శాసనం చేశాడు పుష్కరుడు. రాజశాసనం, కలి మాయా — పిట్టమనిషన్నా, తొంగిచూడలేదు నలుణ్ణి. పచ్చిమంచి నీళ్ళయినా ఇచ్చిన పాపాన పోలేదు.

వనవాసం

మానవలోకం యావత్తూ పూజించ దగ్గ మహనీయుడు నల చక్రవర్తి. అంతవాడు ఏమయాడో? చూడూ? అంతా అదృష్టం. పిడికెడు మెతుకులూ, పుడిసెడు మంచితీర్థం కరువై పోయింది అతడికి. ఊరవతల ఈమూడురోజులూ భార్యా, తానూ చెరువునీళ్ళతో పొట్ట నింపుకున్నారు. ఆకలి దహించేస్తోంది. అడివిలోపడి తిరుగుతున్నారు. ఇంతలో కొన్ని పక్షులు కనిపించాయి. బంగారంలా మెరుస్తున్నాయి, వాటి రెక్కలు. నలుడి దగ్గిరదగ్గిరే మేస్తూ తిరుగుతున్నాయవి. వాటిని చంపి ఆకలి తీర్చుకోవచ్చు అనిపించింది నలుడికి. ఇంకో సాధనం దగ్గిర లేదు. తాను కట్టుకున్న వస్త్రం విప్పాడు. పట్టుకుందికి విసిరాడు వాటిమీదికి. పక్షులు దొరకలేదు, సరికదా బట్టతోకూడా ఎగిరిపోయాయి మీదికి. దిసమొలతోనే నిలబడి పోయాడు నలుడు.

ఎగిరిపోయిన పక్షులు హెచ్చరించి మరీ వెళ్ళాయి. 'పక్షులం కాం మేము. నీధనమూ రాజ్యమూ వోడించుకుపోయిన పాచికలం. నీబట్ట పట్టుకుపోవడం కోసమే ఇలా వచ్చాం' అంటూ ఆకాశంమీద మాయమే అయిపోయాయి. నెత్తిని చేతులు పెట్టుకు నిలుచున్నాడు నలుడు. 'వీటివల్లే నాకు ఈదశ పట్టింది' అనుకున్నాడు

తుదకి కట్ట గుడ్డా లేకండా పోయింది నలుడికి. ఏం చేస్తాడు? దమయంతి చీరె భార్యాభర్తలు ఇద్దరూ కట్టుకున్నారు. ఒకరి

మొహం వొకరు చూసుకుని ఘోరంగా దుఃఖించారు. తనకంటే దమయంతి అవస్థ మరీ దుంఖంగా వుంది నలుడికి. అడవిలో ఎన్నో దార్లున్నాయి. వాటిని ఆమెకి చూపి చెప్పాడతడు: "ఇదిగో ఈ దారి దక్షిణ దేశం వెళుతుంది. మధ్య రుక్షివంతపర్వతం తగులుతుంది. ఇదిగో, ఇది విదర్భకి - మీ‌ాకన్నవారింటికి వెళుతుంది. ఇది కోసల వెళుతుంది. ఇది ఉజ్జయినికి. వింధ్యాచలం ఇక్కడికి దగ్గిర. ఇదిపయోష్ణి నది. ఎటు వెళదాం మనం? చూడూ దమయంతీ, అడవుల్లో అవస్థ పడలేవు నువ్వు. విన్నావూ - నామాట విను. మీ‌ాకన్న వారింటికి వెళ్ళిపో' అన్నాడు.

వెక్కి వెక్కి ఏడ్చింది దమయంతి. 'ఇద్దరమూ వెళదాం విదర్భ' అంది. 'మనకి అక్కడ లోపమేముంటుంది? అడవుల్లో క్రూరజంతుల మధ్య ఇలా తిరగవద్దు' అంటూ చేతులతో అద్దుకుంది కన్నీళ్ళు. తలవంచుకున్నాడు నలుడు. 'నిజమే, నువ్వన్నట్టు మామగారి రాజ్యం వొకటీ మన రాజ్యం వొకటీ కాదు. కాని లోగడ వెళ్ళానూ అంటే, సర్వసంపదలతోనూ తులతూగుతూ వెళ్ళాను. అందరికీ వొకటే ఆనందంగా వుండేదపుడు. ఇప్పుడు, ఈదరిద్రావస్థలో ఎలా వెళ్ళేదీ?' అన్నాడు. 'పోనీ, నన్ను మాత్రం వొదిలిపెట్టకు' అంది. జాలిగా దమయంతి. 'నీ నీడలో బతకవలసినదాన్ని. నీవెనకాలే వుండవలసిన దాన్ని. నీదయే నా జీవనం. నీతోనే వుండనీ నన్ను. రోగికి మందువంటిది పురుషుడికి భార్య. భార్యపక్కని వున్నవాడికి ఆపద వచ్చినా బాధించదు. శ్రమా, అలసటా, ఆకలీ, దాహమూ - ఏది వచ్చినా తోడయి తొలిగిస్తుంది భార్య. దాన్ల చూపించి తప్పుకోకు. నువ్వు ఎటు వెళితే అటే వస్తాను. నువ్వు ఎక్కడవుంటే అక్కడే వుంటాను' అంది. 'నా ప్రాణం వొకటీ నువ్వు వొకటీనా!' ఆమెని వోదారుస్తూ అన్నాడు నలుడు. 'భయపడకు. నిన్ను వొదిలి

నేను మాత్ర మెలావుంటాను!" అంటూ నమ్మకం కలిగించి నచ్చ జెప్పాడు.

ఇద్దరూ ఏకవస్త్రంతో అలా అడవిలోపడి తిరుగుతున్నారు. నరవాసనలేని కారడివి అది. ఒకదగ్గిర వొక చావిడి కనపడింది. అప్పటికే బాగా బడిలిపోయారు వాళ్ళు. విశ్రాంతికని దానిమీద చదికిలబడ్డారు. నవనాళ్ళూ లాక్కుపోతున్నాయి. కరుకునేలమీద – ఆధూళిలోనే – అప్రయత్నంగా శరీరాలు వాల్చారు. ఆయాసంతో కళ్ళేమో మూశాడు నలుడు. బండెడు దుఃఖం. కునుకు రాలేదు కంటికి. లేచికూచున్నాడు. కాళ్ళదగ్గిర పడివుంది దమయంతి. బాగా అలిసిపోయిందేమో, వొళ్లుమరిచి నిద్రపోయింది.

పెద్ద నిట్టూర్పు విడిచాడు నలుడు. తనరాజ్యమూ ధనమూ జూదంలో పోవడం, బంధువులూ ప్రజలూ తనని వొదిలిపెట్టడం, భార్యతో అడవులపాలు కావడం – ఒక్కొక్కటే తలపోసుకుంటూ దుఃఖపడ్డాడు. 'హంసతూలికా తల్పంమీద, దాసీజనం అతి సుకుమారంగా కాళ్ళు వొత్తుతూవుంటే నిద్రపోయేది, సుకుమారి దమయంతి. పాపం నన్ను నమ్ముకుని, ఈ దుమ్ము దుమ్ముమధ్య గురక పెడుతూ పడుకుంది! అయ్యో, అదృష్టం! నాకు భార్యకావడమే ఈమెకు ఇన్ని కష్టాలు. అబ్బా, చూడలేను. ఈమెకష్టం – సహించలేను – ఎటయినా – వెళ్ళిపోతాను. – పోతాను. ఊఁ – తన కన్నవారిల్లు చేరుకుంటుందిమో." మెరుపులా తట్టింది ఈఆలోచన. చప్పున లేచాడు. మెలకువ రాకుండానే ఆమెచీర మెల్లిగా మధ్యకి చించివేశాడు. ఆమెకి ఆమెకట్టుకున్నముక్క వొదిలి తనముక్క తాను కట్టుకున్నాడు. ఆమెనివిడిచి గబగబా వెళ్ళిపోయాడు. పదడుగులు వెళ్ళాడో లేదో, ముందుకి సాగలేదు కాలు. ప్రేమబంధం తెగడమే కష్టమైంది. గిరున

వెనకకి వచ్చేశాడు. పాపం, అలాగే అమాయకంగా నిద్రపోతోంది దమయంతి.

దమయంతిని వేరు చెయ్యాలనే కలి ప్రయత్నం. దానికి వ్యతిరేకంగా పట్టి లాగుతోంది ప్రేమ. ఒదిలి వెళ్ళబోతాడు నలుడు. అటు కలీ, ఇటు ప్రేమా. రెంటిమధ్యా పెనగులాడుతున్నాడతడు. ఎంతోసేపు ఏదీ నిశ్చయించలేకపోయాడు. చివరికి కలిదే పైచెయ్యి అయిపోయింది. 'ఆడదాన్ని అడివిపాలుచేసి ఎలా వెళ్ళేది?' అనకండా గుండె రాయే చేసుకున్నాడు నలుడు. దారుణమయిన అడివిలో దమయంతిని విడిచిపెట్టి తనమానాన తాను వెళ్ళిపోయాడు.

మేలుకుంది దమయంతి. పక్కని భర్తలేడు. చీర చిరిగి సగమే వుంది. కెవ్వమం దామె. గుండెలో రాయే పడిపోయింది. లేచింది. నాలుగు దిక్కులా చూసింది. భయం, దుఃఖం, బాధ – కేకలువేసి పిలిచింది. 'మహారాజా, మహారాజా' – అడివి మాత్రం ప్రతిధ్వనించింది. 'మహారాజా, మహారాజా!' అని. 'అయ్యో, వెళ్ళిపోయావా! దయలేకపోయిందో! వొదిలిపెట్టే వెళ్ళిపోయావా! ధర్మం తప్పనివాడివి. అబద్ధమాడని వాడివి. వొదిలి వెళ్ళనన్నావు? భయపడకన్నావు! మరిచిపోయావో! ఏపొదలో వున్నావు? కనపడు. ఇంత ఘోరం ఎలా సాహసించావు? ఎలా చూసేది నిన్ను? ఎక్కడికి వెళ్ళావు? ఈఅడివిలో ఏందారి నాకు?

'మహారాజా! నాలుగు వేదాలకంటే, వొక్కసత్యం గొప్పది. ప్రాణంతో సమాన మన్నావు. వొదిలి వెళ్ళ నన్నావు. నీమాట నువ్వు నిలబెట్టు' అంటూ పరిపరివిధాల ప్రలాపించింది. వెర్రిదానిలా వెదుకుతుంది. ఆడది. ఒంటరిది. అంతులేని అరణ్యం. అడుగు తీసి అడుగు వేస్తే ముళ్ళు. అటు క్రూరమృగాలు. ఇటు విషసర్పాలు.

వీటి కేమిటికీ ఆమె విచారించదు. తనభర్త వొంటరిగా వెళ్ళాడనే ఆమె బాధ. ఆకలీ దప్పికతో ఎంత ఇదయి పోతున్నాడనే ఆమెదుఃఖం.

వెదుకుతోంది. వొగుర్చుకుంటూ వెదుకుతోంది. పిట్ట కూస్తే వులికిపడుతోంది. వడదెబ్బకి తట్టుకోలేకపోతోంది. తూలిపోతోంది. జాపోస్తోంది. చెట్టునీడని చేరబడుతోంది. ఎలుగుబంట్లని చూసి ఏడుస్తోంది. పులులు చూసి కళ్ళుమూసుకుంటోంది. పాములుచూసి భయపడుతోంది. రావిఆకులా వడికేపోతోంది. తుప్పతుప్పా తొలిగిస్తోంది. ముళ్ళు తప్పించుకుంటోంది. దిక్కులు చూస్తోంది. ఉలికులికి పడుతోంది. పిచ్చిదే అయిపోయింది.

ఎదట పే - ద్ద కొండచిలవ. దాని దగ్గిరే అడుగు వేసింది దమయంతి. చప్పున పట్టుకుంది కొండచిలవ. కెవ్వుమంది దమయంతి. మింగేస్తోంది కొండచిలవ. కదలామెదలలేకపోయింది దమయంతి. గావు కేకలు వేస్తూ ఏడ్చింది. 'ఇప్పుడయినా రక్షించు. పాం మింగేస్తోంది' అంటూ అరిచింది.

ఎక్కడినించి వురికాడో వొక చెంచు. మెరుపులావచ్చి వాలాడు. సూరకత్తితీసి, నిలువునా చీల్చివేశాడు కొండచిలవని. రాహువు విడిచిన చంద్ర రేఖలా, పాం నోట్లోంచి బయటపడింది దమయంతి. 'భయపడకు' అని ధైర్యంచెప్పాడు చెంచు. పక్క చెరువులో స్నానం చేసింది దమయంతి. పళ్ళూఅవీ తెచ్చిఇచ్చాడు చెంచు. ఆరగించింది దమయంతి. 'ఎవరిపిల్ల వంట? ఒంటిదానివి, అడివిలో ఏం పని?' - పక్కనే కూచుని అడిగాడు చెంచు.

'నలమహారాజు రాణిని' - తనసంగతంతా పూసగుచ్చినట్టు చెబుతోంది దమయంతి. నాగసారంముందు నాగుబాములా వింటున్నాడు చెంచు. అంతదుఃఖంలోనూ తేనెలూరుతున్నాయి ఆమె మాటలు. పెదవులు చప్పరిస్తున్నాడు చెంచు. చంద్రబింబంలా

వుంది ఆమె మొహం. రెప్ప వెయ్యడంలేదు చెంచు. ఉబ్బెత్తుగా కొట్టవచ్చినట్టుంది ఆమె వక్షస్థలం. చందనంలా ఘుమఘుమ లాడుతోంది శరీరం. ప్రతీవొంపులోనూ వొలికిపోతోంది వొయ్యారం. ఒళ్ళు మరిచిపోయాడు చెంచు. మతేపోయింది వాడికి. ఆమె కావాలి. ఆగలేకపోయాడు. మనసులోమాట చెప్పనూ చెప్పేశాడు, నవ్వుతూ.

తాకడంమాట అలావుండనీ, దగ్గిరచేరడానికి — తుదకిచూడడానికీ కూడా అలివికాంది దమయంతి. అగ్గినిప్పులాంటి పతివ్రత. ఆమెనే అపేక్షించాడు చెంచు. మృత్యువుతోనే ముద్దులాట! కాలం తీరిన వాణ్ణి కాపాడేవా డెవ్వడు?

కళ్ళల్లో నిప్పులే రాలాయి దమయంతికి. 'నేనే పతివ్రతనైతే, నుంచున్నపాళాన చస్తాడు వీడు' అంది. ఆమెనోట్లోమాట నోట్లోనేవుంది, ఘంటలో-కాలిన మానులా చచ్చిపూరు కున్నాడు చెంచు.

రాజుల్లో సింహం తనభర్త. అతణ్ణే మనస్సులో నిలుపుకుంది దమయంతి. పాములూ, పెద్దపులులూ — వేటికీ కూడా భయపడడం మానివేసింది. ఆ ఉగ్రారణ్యంలో వొంటరిగా భర్తని వెదుకుతూ బయలుదేరింది. మామిడీ, సురపొన్నా, చందనమూ, అశోకమూ, వకుళమూ, తాడీ - ఏచెట్టు చూసినా మా నలుణ్ణి చూశావా అంటుంది. కాళ్ళు పొక్కు లెక్కుతూంటే, సెలయేళ్ళలో నిలబడుతుంది. పుట్టపుట్టా తొంగిచూస్తుంది. గుట్టలెక్కుతుంది. గుహాలు తొంగిచూస్తుంది.

పెద్దపెద్ద పాములూ, క్రూరమృగాలూ, దొంగలూ, కిరాతులూ — ఘోరంగా వుంది మహారణ్యం. ఎదురుగుండా వొక పుణ్యానది కనిపించింది దమయంతికి. దానివొడ్డునే వొక మునిపల్లె. ఆశ్రమాల్లో చెట్లకింద వశిష్ఠుడూ, వామదేవుడూ, వాలఖిల్యులూ, భృగుడూ, నారదుడూ వంటి మహామునులు తపస్సుచేస్తున్నారు. నీళ్ళూ, గాలీ, ఆకూ అలమూ, కాయా కసవూ, గడ్డిగింజలూ—ఇవే ఆహారం వాళ్ళకి.

వెళ్ళి నమస్కరించింది దమయంతి. 'ఎవరమ్మా నువ్వు ?' — ఆశ్చర్యపోతూ అడిగారు మునులు. 'ఇంత దివ్యంగావుంది నీ తేజస్సు! వన దేవతవా? దేవతాస్త్రీవా? ఇలాఎందుకు తిరుగుతున్నావు?' అన్నారు. 'నలుడి భార్యని' అంది దమయంతి. 'పుణ్యశ్లోకు డాయన. నిరంతరం యజ్ఞాలూ అవీ చేసేవాడు. దురదృష్టం! నన్ను వొదిలిపెట్టి వెళ్ళిపోయాడు మహారాజు. ఆయన్నే వెదుకుతూన్నాను. మీఆశ్రమాలికి వచ్చాడేమో చెప్పండి. మీ పాదాలు మొక్కి కృతార్థురాలినై వుంటాను. ఏదిక్కువెళ్ళాడో చెప్పండి. ఆయనే కనపడకపోతే, చచ్చిపోతాను' అంటూ వెక్కివెక్కి ఏడ్చింది. 'ఏడవకు' — వోదారుస్తూ అన్నారు మునులు. 'త్వరలోనే కనిపిస్తాడు నలుడు. మళ్ళీ నిషధ పాలిస్తాడు. ఇది మా యోగదృష్టిని తెలిసింది' అన్నారు. కళ్ళెత్తిచూసింది దమయంతి. చిత్రం! మునులూ లేరూ. మునిపల్లే లేదు. ఆశ్రమాలూ, అగ్నిహోత్రాలూ అన్నీ అదృశ్యమయిపోయాయి. కలా? భ్రమా? తెల్లబోయింది దమయంతి.

అలాగే ముందుకి సాగింది. కొంతదూరం వెళ్ళింది. మళ్ళీ ఇదేమిటి? ఎదురుగుండా పేద్ద బిడారుగుంపు. నరవాసనలేని కీకారణ్యం. ఇంతమంది వర్తకులు! ఎంత అదృష్టం. బిడారులోకి బయల్దేరింది దమయంతి. సగంగుడ్డతో వుందామె. మురికి వోడుతూ వుంది శరీరం. దుమ్మూ దుట్రాపడి, విరబోసుకుని చింపిరి చింపిరిగావుంది జుత్తు. ఆకలీ, దాహం, నిద్రా— అన్నీమరిచి, అచ్చంగా పిచ్చిదానిలాగే వుందామె.

చూసి, ఉలికిపడ్డారు వర్తకులు. 'అమ్మో, దెయ్యం' అంటూ పరుగెత్తారు కొందరు. భయంతో కదల్లేక చతికిలేబడ్డారు కొందరు. 'అడివిలో ఏమిటి వెదుకుతున్నావు?' అంటూ చప్పట్లు కొట్టారు కొందరు. 'ఉండర్రా, అమ్మతల్లి' అంటూ దండాలుపెట్టారు కొందరు.

'భయపడకండి బాబూ, నేను దమయంతిని' వారిస్తూ అంది దమయంతి. 'నలచక్రవర్తి భార్యని. నా దురదృష్టం! భర్త తప్పిపోయాడు. ఒక్క తెనే అడివిలో తిరుగుతున్నాను. మీ పుణ్యముంటుంది మహారాజుని చూశారేమో చెప్పండి' అంది.

దగ్గిరికి వచ్చారు వర్తకులు. వాళ్ళలో పెద్ద - శుచి ముందుకి వచ్చాడు. 'లేదమ్మా, లేదు. భయంకరమయిన ఏనుగులూ, ఎలుగుబంట్లూ, పెద్దపులులూ తప్పిస్తే మనిషన్న వాడే కనపళ్లేదు మాకు. వెలుగు దూరిందికే సందులేని మహారణ్యమిది. మహారాజు మాకంట పళ్ళేదు' అన్నాడు. పెద్దనిట్టూర్పు విడిచింది దమయంతి 'మీబిడారు ఎక్కడికి వెళుతుంది?' అని అడిగింది. 'చేది దేశం' అన్నాడు శుచి. 'ఐతే, మీతో కూడా వస్తాను' అంది దమయంతి. వర్తకులతో కలిసి బిడారువెంట నడిచింది. అడుగులేమో పడుతున్నాయి. శరీరమేమో కదులుతోంది. ప్రాణాలుమాత్రం నలుడిమీదే వున్నాయి.

కరకరా కాస్తోంది ఎండ. అడివంతా పొగలెక్కుతున్నాయి. నడినెత్తిని మండుతున్నాడు సూర్యుడు. గొంతుకలు ఆర్చుకపోతున్నాయి. పాదాలు పొక్కులెక్కుతున్నాయి. ఒక మంచినీళ్ళ చెరువు దగ్గిర ఆగింది బిడారు. ఆనాటికి అక్కడ మకాం వేశారు వర్తకులు. పొద్దుగూకింది. బాగా రాత్రి అయింది. బిడారంతా అలిసి నిద్రలో వుంది. అర్ధరాత్రి. దీం దీం మంటోంది అడివి. ఎక్కడినించి వచ్చి పడిందో, సముద్రం నీళ్ళకి దిగిన మేఘాలగుంపులాగ నీళ్ళకని చెరువులోకి పెద్ద ఏనుగులమంద. బిడారు బిడారంతా తొక్కేశాయి ఏనుగులు. చిందర వందర చేసేశాయి వర్తకుల్ని. కొందర్ని మట్టేశాయి పచ్చడికింద. దంతాల్తో చీల్చేశాయి కొందర్ని. దారీ తెన్నూ లేకండా పరిగెత్తారు వర్తకులు. చెట్టోపిట్ట అయిపోయారు. తప్పు

లోనో, పుట్టల్లోనో తలదాచుకున్నారు. నీతిలేనివాడి ధనంలాగ, సర్వదుంబాలా అయిపోయింది బిడారు.

దమయంతి దిక్కుమాత్రం వొక్క ఏనుగన్నా రాలేదు. అంతా చూస్తూనే వుందామె. విచారిస్తూనే వుంది. 'బతికి బాగుపడదామనుకున్న వాళ్ళకే వస్తోంది చావు. చస్తానంటున్నాను నేను. తొంగి చూడకండా వుంది నన్ను! బిడారు సహాయంతో అడివినించి అవతల పడతామని ఆశపడ్డాను. దీసదశ ఇలా అయింది. ఏం పాపం చేసి పుట్టానో, పాపిష్టిదాన్ని. స్వయంవరంలో నలుగుర్నీ కాదన్నాను. నలుణ్ణే వరించాను. ఆ కక్షే సాధిస్తున్నారో, వాళ్ళు! ఏందారి? –' ఇలా తెల్లవాళ్లూ ఏడుస్తూ కూచుంది.

భళ్ళున తెల్లవారింది. చావగా మిగిలినవర్తకులు మెల్లి మెల్లిగా చేరుకున్నారు. వాళ్ళతో బయల్దేరింది దమయంతి. రాత్రనకా పగ అనకా నడిచింది. చేదిదేశం రాజధాని చేరుకుంది.

జనంతో గందికగా వుంది చేదినగరం. ఓపక్కనించి నడుచుకుంటూ వెళుతోంది దమయంతి. పగలు ఎండలో పాలిపోయిన చంద్రరేఖలా వుందామె. అలా కోటదగ్గిరికి వెళ్ళిందామె. మేడ మీంచి చూసింది రాజమాత. తన దాదితో అంది: 'చూడూ, చిరిగిన మురికిగుడ్డతో వస్తోంది, ఎవరో ఆమె! ధూళికొట్టి వికారంగా ఎగురుతోంది జుత్తు. పాపం, వెర్రిదానివేషంతో వచ్చిన లక్ష్మీదేవిలా వుందామె. ఎందుకనో, ఆమెమీద ఇదిగావుంది నాకు. చూస్తున్నకొద్దీ ప్రేమగావుంది. వెళ్ళు. మన లోగిలికి పిలుచుకురా ' అని.

దాది పిలుచుకు వచ్చింది దమయంతిని. 'ఎవరమ్మా నువ్వు?' – ఆదరంగా అడిగింది రాజమాత. 'దుఃఖంలో వున్నట్టున్నావు! ఏమిటి కారణం?' అంది. 'ఏం చెప్పను తల్లీ,' అంది దమయంతి. 'పుట్టెడంత దుఃఖం నాది. బతికి చెడ్డదాన్ని. ఉన్నదంతా జూదంలో వోడి

పోయాడు భర్త. ఆయనవెంట అడివికే వెళ్ళాను నేను. ఆగర్భ శ్రీమంతుడు - ఆకలితో పడరానిపాట్లు పడ్డాడాయన. నా నుదటి రాత! ఒళ్ళుమరిచి నిద్రపోయాను. ఒదిలిపెట్టిపోయాడాయన. పాపం, వొంటిగుడ్డతోనే వెళ్ళాడు. ఏం చెయ్యనూ? అది మొదలు ఆయన కోసమే తిరుగుతున్నాను. సైరంధ్రీవ్రతం పట్టాను. ఆకూ, అలమూ తిని ప్రాణం నిలుపుకున్నాను. ఎక్కడ పొద్దుగూకితే అక్కడే వాసం. క్రూరమృగాలే తోడునీడ. అడవిలో గూడులేని పిట్టలా తిరిగాను' అంటూ గోలుగోలు మంది. కన్నీళ్ళు పడి గుండెలమీద బురద పులిమినట్టయింది.

'ఏడవకు' - వోదారుస్తూ అంది రాజమాత. 'నాదగ్గిర వుండు. బ్రాహ్మల్ని పంపిస్తాను. నీభర్తని వెదికిస్తాను. విచారించకు' అంది. 'సైరంధ్రిగానే వుంటాను' కళ్ళనీళ్ళుతుడుచుకుంటూ అంది దమయంతి. 'ఎంగిలి ముట్టను. పాదాలు పట్టను. నాభర్తకోసం వెళ్ళే బ్రాహ్మలతో తప్ప, పరపురుషుడితో మాట్లాడను. అలా అయితేనే వుంటాను' అంది. 'నీకు ఎలా ఇష్టమయితే అలాగే వుండు' అంది రాజమాత. ఎంతో గౌరవమూ, ఆదరమూ కనపరిచింది. తన కూతురు సునందని పిలిచి ఆమెకి సమర్పించింది. అలా చేదినగరంలో సైరంధ్రిగా తల దాచుకుంది దమయంతి. ఎప్పుడూ నోములూ అవీ నోస్తూ వుండేది. భర్తచింతతప్ప ఇంకో చింత లేదు.

బాహుకుడు

దమయంతిని వొదిలిపెట్టి కారడివిలోపడి వెళుతున్నాడు నలుడు. ఎంతోదూరం వెళ్ళిపోయాడు. హాటాత్తుగా వొక దగ్గిర, దారుణంగా రగులుకుంది దావాగ్ని. ఆకాశాన్నంటుతున్నాయి మంటలు. పెద్దపెద్ద చెట్లు కాలి, కూలిపోతున్నాయి. ఘోరంగావుంది అరణ్యం. మంట

ల్లోంచి వొక ఆర్తనాదం వినపడింది నలుడికి. 'నలమహారాజా, రక్షించు. రక్షించు. వేగిరం రా' అని వినడమే తడువు. వెనకా ముందూ చూడలేదు నలుడు. మంటల్లోకి వురికాడు. ఒక నాగ కుమారుడు జాలిగా ముడుచుకుని పడివున్నాడు. క్షణంలో మంటల్లో మండిపోయేట్టున్నాడు. నలుణ్ణి చూసి చేతులు జోడించాడు. 'కర్కోట కుణ్ణి మహారాజా, బ్రహ్మర్షి నారదుడి దగ్గిర అపరాధం చేశాను. ఆ పాపఫలితంగా కదల్లేక పడివున్నాను. పరుగెత్తుకు వస్తున్నాయి మంటలు. తప్పించుకునే శక్తిలేదు నాకు. కనికరించు. రక్షించు. చల్లటి నీటిపట్టుని వొదిలిపెట్టు. నీకు మేలే చేస్తాను' అంటూ ప్రార్థించాడు. పట్టుకువెళ్ళిందికి అనువుగా వేలెడంత శరీరమూ ధరించాడు.

వెంటనే కర్కోటకుణ్ణి పొదివి పట్టుకున్నాడు నలుడు, పరిగెడుతూ మంటల్లోంచి తప్పించాడు. దూరంగా వొక చెరువుదగ్గిర దించబోయాడు. 'మరి పదిఅడుగులు. నీకు మేలే చేస్తాను' అన్నాడు కర్కోటకుడు. ఒకటి - రెండూ - మూడూ- పదో అడుగు వేసేసరికి టపీమని కాటువేశాడు కర్కోటకుడు. కాటు పడీ పడ్డంతోనే వికారంగా మారిపోయాడు నలుడు.

నిజరూపంతో నుంచున్నాడు కర్కోటకుడు. 'కరిచానని విచారించకు. నిన్ను పరాయివాళ్ళు పోల్చిపడితే ప్రమాదం. అందుకనే ఈవికారరూపం కలిగించాను. నావిషం నీశరీరంలో వున్నంతకాలం విషసర్పాల భయముండదు. శత్రువులేకాదు, పిశాచాలూ, రాక్షసులూ కూడా నీజోలికి రారు. సందేహించకు. నీభార్యనీ కలుసుకుంటావు. యథాపూర్వకముగా రాజ్యవైభవమూ లభిస్తుంది. యుద్ధాల్లో

---

* పది అనడానికి 'దశ' అన్నాడు నలుడు. దశ అంటే కరు అనికూడా అర్థం. అంచేత దశ అనగానే కాటు వేశాడు కర్కోటకుడు.

అపజయం వుండదు. నీ నిజరూపం నీకు కావలిసినప్పుడు, నన్ను తలంచుకో. ఈవస్త్రం నీదగ్గిరికి వస్తుంది. ఇది కట్టుకుంటే చాలు, నీరూపం నీకువస్తుంది. ఇంకా విను. అయోధ్యరాజు ఋతుపర్ణుడు, ఉత్తముడు. అతడిదగ్గిర వంటపుట్టీగా కుదురుకో. నీదగ్గిర వున్న విద్య అశ్వహృదయం అతడికి ఉపదేశించు. అతడి దగ్గిర 'అక్షహృదయం' వుంది. అది నువ్వు స్వీకరించు. నీపేరు బాహుకుడు అని చెప్పు' అని చెప్పి అదృశ్యుడయాడు.

అయోధ్యవెళ్ళాడు నలుడు - కాదు - బాహుకుడు. ఋతుపర్ణుడి కొలువులోకి వెళ్ళాడు 'మీ సేవచెయ్యాలని వచ్చాను. బాహుకుడు అంటారు నన్ను. గుర్రాల తర్ఫీదు బాగా తెలుసు. మంచి మంచి వంటలూ చెయ్యగలను' అన్నాడు. అంగీకరించాడు ఋతుపర్ణుడు. 'నా రథాలూ గుర్రాలూ గాలిలా పరిగెత్తించాలి' అన్నాడు.

గుర్రాలమీద పెద్దగా కుదురుకున్నాడు బాహుకుడు. గుర్రాలూ గుర్రపురౌతులూ రథాలూ తర్ఫీదుచేస్తూవుండేవాడు. మంచి మంచి వంటలూ అవీ చేసి ఋతుపర్ణుణ్ణి మెప్పించేవాడు. ఇలా ప్రచ్ఛన్నంగా కాలం గడుపుతున్నాడతడు. నలుడిసారథి వార్ష్ణేయుడూ ఋతుపర్ణుడి దగ్గిరే వున్నాడని చెప్పాను కదా! అతణ్ణే, జీవలుడు అని మరొకణ్ణి బాహుకుడికి సహాయులుగా నియమించాడు ఋతుపర్ణుడు.

ఎక్కడ వున్నా, ఏం చేస్తున్నా దమయంతి కోసమే బాధపడే వాడు బాహుకుడు. రాత్రిళ్ళు కంటిమీద రెప్పపడేది కాదు. ఏమేమో ప్రలాపించేవాడు. 'ప్రేయసీ, ప్రియసఖి! ఎక్కడికి వెళ్ళావు? ఎక్కడవున్నావు? అయ్యో, నాప్రాణం! అడివిలో నిన్ను ఎవ్వరూ పట్టుకోలేదు కదా! అడివిమృగాలు ఆక్రమించలేదు కదా! కన్న వారింటికి వెళ్ళలేదూ! తెలీనిదేశాలు పట్టిపోయావా?' అంటూ దుఃఖ పడేవాడు. నిట్టూర్చేవాడు. ఏడ్చేవాడు.

అదంతా చూస్తూ వుండేవాడు జీవలుడు. ఏమీ అర్థమయ్యేది కాదు అతడికి. ‘ఈ ప్రకారావతారానికి విరహ ముకటా!’ అనుకుండేవాడు, లొడితి డేసి స్తోట్టచేతులూ, వంకరటింకర శరీరం, వికారం గూనీ – పగలు చూస్తే రాత్రి కల్లోకి వస్తాడు. వీడికి ప్రేయసి కూడాన్ను! వీణ్ణి వొలిచిన ‘ప్రేయసి’ అదెంత వొయ్యారిభామో!’ అనుకుంటూ వుండేవాడు. ఒకనాడు అడిగేశాడు. ‘ఏమిటోయి బాహుకా, ఇందతా? అసలు మీ ఆవిడికీ నీకూ వియోగం ఎందుకు వచ్చిందట?’ అన్నాడు.

నాలిక కరుచుకున్నాడు బాహుకుడు. ‘అదేమిటి జీవలా, నాబతుక్కి పెళ్ళాం కూడానా? ఎవళ్ళన్నా వింటే నవ్వుతారు’ అన్నాడు. ‘ఐతే, ఈగొడవంతా ఏమిటంటా, రోజూ?’ అన్నాడు జీవలుడు. ‘ఓహో అదా; పూర్వం మందప్రజ్ఞుడని వొక భటుడు వుండేవాడు. ఎంచేతో తన భార్యని పోగొట్టుకున్నాడు వాడు. ఎంతో వెదికాడు దాన్ని. దొరికింది కాదది. అతడు ప్రలాపిస్తూ వుంటే వినేవాణ్ణి నేను. అతణ్ణి అనుకరించడం నాకు అలవాటు. అంతే’ అన్నాడు బాహుకుడు.

ఇక్కడ ఇలా వుంది. అక్కడ విదర్భలో – నలుడు జూదంలో వోడిపోయాడని విన్నాడు భీమరాజు. మనమడూ, మనమరాలూ ఇక్కడే వున్నారు. కూతురూ, అల్లుడూ ఏమయారో? ఎటువెళ్లారో? ఎక్కడ వున్నారో? అంతా అయోమయంగా వుంది. ఎంతో దుఃఖపడ్డాడు భీమరాజు. వాళ్ళని వెదకడంకోసం నమ్మకమయిన బ్రాహ్మల్నీ పండితుల్నీ నియోగించాడు. ఎన్నో బహుమానాలూ అవీ ఇచ్చి సత్కరించాడు వాళ్ళని. నలదమయంతుల వునికి తెలుసుకు వచ్చిన వాళ్ళకి వెయ్యివరహాలిస్తానని చాటించాడు. ‘మా దమయంతినీ, నలుణ్ణీ తీసుకురండి, వెయ్యి ఆవులూ, అగ్రహారాలూ ఇస్తాను’ అన్నాడు.

పు ట్టు మ చ్చ

భూమినాలుగు చెరగులూ వెదుకుతూ బయల్దేరారు బ్రాహ్మలు. ప్రపంచంలోని పట్టణాలూ, పల్లెలూ యావత్తూ వెదికారు. అందులో, సుదేవుడు అని వొక బ్రాహ్మడు చేదినగరం వచ్చాడు. పుణ్యాహవాచనంకోసం కోటలోకి వెళ్ళుతున్నారు బ్రాహ్మలు, వాళ్ళతో అంతఃపురానికి వెళ్ళాడు సుదేవుడు. సునందదగ్గిర దమయంతిని చూశాడు. పొగలోని అగ్నిప్రభలాగ, నల్లమబ్బుల్లో చంద్రరేఖలాగ, బురదలో తామరతీగలాగ పోల్చిపట్టడానికి వీలేలేకండా వుంది దమయంతి. దీక్షగా పరికించాడు సుదేవుడు. ఆమె కనుబొమలమధ్య, చిన్న చుక్కలావున్న పుట్టుమచ్చ గుర్తుపట్టేశాడు. 'వియోగంవల్ల పాపం, ఇలా వుంది' అనుకున్నాడు. 'ఎండిపోయిన ఏరులా, పద్మాలులేని చెరువులా, చెట్లులేని వనంలా — శోభతరిగిన్నీ, పతివ్రతాత్వంతో ప్రకాశిస్తూనే వుం దీమె. నిజంగా, పాతివ్రత్యమే శోభ స్త్రీలకి. అంతకి మించిన శోభే లేదు వాళ్ళకి. చంద్రుడితో రోహిణిలా భర్తతో ఎప్పుడు కలుస్తుందో మాతల్లి ? కూతూరూ అల్లుడూ కులాసాగా వుండడం ఎప్పుడుచూస్తాడో మా భీమరాజు !' ఇలా పరిపరివిధాల భావించా డతడు.

మెల్లిగా దమయంతిదగ్గిరికి వెళ్ళాడు సుదేవుడు. 'తల్లీ! నేను సుదేవుణ్ణి, గుర్తులేనూ ? నీసోదరుడి స్నేహితుణ్ణి' అన్నాడు. తుళ్ళిపడింది దమయంతి. 'మీ వాళ్ళంతా క్షేమంగా వున్నారు, విదర్భలో. మీఅబ్బాయీ, అమ్మాయీ, అమ్మా, నాన్నా, అన్నయ్యలూ — అందరూ కులాసాగా వున్నారు. మీకోసమని బెంగపెట్టుకున్నారు. నువ్వు కనిపించావు. పరవాలే దింక. నిన్ను వెదకడంకోసం మీనాన్న దేశదేశాలు పంపాడు బ్రాహ్మల్ని. నేను ఇక్కడికి వచ్చాను. నా అదృష్టం పండింది. నిన్ను చూశాను' అన్నాడు.

సుదేవుణ్ణి పోల్చింది దమయంతి. రెండుచేతుల్తోనూ మొహం కప్పుకుని ఏడవడం మొదలుపెట్టింది. 'సైరంధ్రి ఏడుస్తోంది' అంటూ తల్లికి కబురుచేసింది సునంద. పరివారంతో సహా పరిగెత్తుకు వచ్చింది రాజమాత. సైరంధ్రిదగ్గిర సుదేవుణ్ణి చూసింది. 'ఈమె నెరిగినట్టున్నావు! ఎవ్వరీమె? ఎవరి కూతురు? ఎవరి ఇల్లాలు? ఎంచేత భర్త వొదిలిపెట్టాడు? ఇలా వ్రతాల్తో గడుపుతోందేం? అసలు, ఎలా పోల్చుకున్నావు?' – పశ్నమీద ప్రశ్న వేసిందామె.

'భీమరాజు కూతురు దమయంతి' అన్నాడు సుదేవుడు. 'ఆఁ' అంటూ కేకవేసింది రాజమాత. 'నలచక్రవర్తి భార్య. దురదృష్టంవల్ల రాజ్యం పోగొట్టుకున్నాడు నలుడు. ఎటో వెళ్ళిపోయాడు. ఆయనతో కూడా ఈమె వెళ్ళింది. ఈ వార్త విన్నాడు భీమరాజు. వేలకొద్దీ బ్రాహ్మల్ని దేశదేశాలూ పంపాడు వెదకడానికి. నేను వచ్చానిక్కడికి. మీదగ్గిర క్షేమంగా వుందీమె. అదిగో, చూడండి. కనుబొమల మధ్య, పద్మంలా లక్షణవంతమైన పుట్టుమచ్చ. ధూళి కప్పి వున్నా కనపడింది నాకు. ఇట్టే పోల్చుకున్నాను' అన్నాడు సుదేవుడు.

నీళ్ళు తెచ్చి కడిగింది రాజమాత. స్పష్టంగా కనపడింది పుట్టుమచ్చ. అంతఃపురమంతా ఆశ్చర్యమే ఆశ్చర్యం. రాజమాత ఆనందం మేరలేక పోయింది. 'మాఅమ్మే, మాతల్లే' అంటూ అమాంతంగా కౌగిలించుకుందామెని. శిరస్సు ముద్దాడింది. 'నువ్వు నాకూతురువేనే, మాతల్లీ!' అంది. మీఅమ్మా నేనూ అక్కచెల్లెళ్ళం. దశార్ణరాజు కూతుళ్ళం. మీఅమ్మ భీమరాజుని పెళ్ళాడింది. నన్ను వీరబాహుడికిచ్చారు. మాఅమ్మే, చెప్పావుకావు తల్లీ' అంటూ తల నిమిరింది. ఆమెకి పాదాభివందనం చేసింది దమయంతి. కన్నీళ్ళతో పాదాభిషేకమే చేసింది. సునందని ఎత్తుకుని ముద్దాడింది.

కొద్దిరోజులు గడిచాయి. కన్నవారింటికి వెళతానంది దమయంతి. 'ఇదీ కన్నవారిల్లే నాకు. అక్కడ ఎలాగో, ఇక్కడ అలాగే సుఖంగా వుంది. ఐతే, అమ్మనీ, నాన్ననీ చూడాలనిపిస్తోంది. పిల్లల మీదా దీవిగా వుంది. సెలవియ్యండి. వెళ్ళివస్తాను' అంటూ రాజమాతకి నమస్కరించింది. కన్నకూతురుకంటే అధికంగా ఆమోజనం చేసింది రాజమాత. రత్నాల సవారీ ఇచ్చి విదర్భపంపింది దమయంతిని.

కుండినపురం వచ్చేసింది దమయంతి. పుట్టి పెరిగిన ఇల్లది. అదే కోట. అదే మేడ. అయినా, ఆనందం లేదామెకి. శరీరసౌఖ్యాలు వొదిలిపెట్టేసిందామె. అడివిలో నలుడు చింపిపోయిన చీరెముక్క— ఆ మురికిగుడ్డే కట్టుకుండేది. నేలమీద – ధూళిలోనే పడుకుండేది. నలుడు – నలుడు – నలుడు – నలుడు తప్ప ఇంకోటి లేదు ఆమె హృదయంలో. ఆ ప్రేమమూర్తి దర్శనంకోసం ప్రాణాలుమాత్రం నిలుపుకుంటూ వుండేదామె. దినాలు లెక్కపెడుతూ వ్రతదీక్షతో వుండేది. నలుడులేని జీవితం వ్యర్థం. దహించేస్తూవుంది వియోగం. యుగాల్లా గడవకండానూ వున్నాయి దినాలు.

ఒకనాడు ఏకాంతంగా తల్లితో చెప్పింది దమయంతి: 'అమ్మా, మీఅల్లుణ్ణి వెదికించు. ఆయన్ని కనక చూడకపోతే, ఇంక ఎన్నాళ్ళో బతకను నేను' అంది. భీమరాజుతో చెప్పింది తల్లి. మరింత సమర్థులయినవాళ్ళని వెదకడానికి నియోగించాడు భీమరాజు. వాళ్ళని పిలిచి ఏమో చెప్పింది దమయంతి. నలుణ్ణి కనుక్కునే ఉపాయాలు బోధపరిచింది. 'అసమర్థుడుగా వున్నాడు మహారాజు. అంచేత, ఎవళ్ళకీ తెలియకుండా, ఎక్కడో మరుగుపడి వుంటాడు. మీరొకపని చెయ్యాలి. రాజసభలికీ వాటికీ వెళ్ళండి. అందరి ఎదటా మహారాజుని ప్రబోధించండి. 'అబద్ధమాడని వాడివి. పతివ్రత

అయిన భార్యని వొంటిగా వొదిలి వచ్చేశావు. ఆ మెచీరె చించుకు పోయావు. ధర్మమేనా ఇది? భార్య భర్తవ్య - అంటే భరించదగ్గది. ఈ న్యాయం నీదగ్గిర వ్యర్థమయింది. ఇంత నిర్దయబుద్ధి తగునా? నీ ఇల్లాలు సాధ్వి. కరుణించు. ప్రసన్నుడివి కా' అంటూ బహిరంగంగా అనండి. మీ మాటలు సహించకండా ఎవరయితే మీకు జవాబు చెపుతారో, ఆయనే మహారాజని తెలుసుకోండి. నాస్థితి విన్నవించండి. తీసుకురండి. అలా మీ వెంట రానప్పుడు, తెలుసుకొని అయినా రండి' అంది.

ప్రతీ రాజసభకీ వెళ్ళారు బ్రాహ్మలు. ప్రతీచోటా దమయంతి మాటలు చెప్పారు. ఎక్కడా కనిపించలేదు నలుడు. వెళ్ళిన ప్రతీ వాడూ మొహం వేలవేసుకుని వచ్చేశాడు. పర్ణాదుడు అని ఒక బ్రాహ్మడు మాత్రం వొక వార్త పట్టుకువచ్చి, దమయంతితో చెప్పాడు: 'అమ్మా! నువ్వు చెప్పినట్టే రాజసభల్లో చెప్పూతూ ఎన్నో దేశాలు తిరిగాను. ఎవ్వరూ ఎక్కడా ఏమీ అనలేదు. అయోధ్యలో మాత్రం వొక విశేషం జరిగింది. ఋతుపర్ణుడి కొలువులో నువ్వు చెప్పిన మాట చెప్పాను. ఎవ్వరూ ఏమీ అనలేదు. కాని వొక వింతమనిషి మాత్రం వొకమాట అన్నాడు. ఋతుపర్ణుడి దగ్గిర నూరువరహాలు జీతానికి వున్నాడతడు. పొట్టిచేతులూ వాడూ వికారంగా వున్నాడు పేరు. బాహుకుడట. ఋతుపర్ణుడి గుర్రాలు తర్ఫీదుచేస్తాడతడు. వంటలోనూ మాంచి నైపుణ్యముందతడికి. రహస్యంగా నన్ను పిలిచాడు. వెటకారంగా వొకనవ్వు నవ్వాడు. నిట్టూరుస్తూ మాట్లాడాడు. 'ఏం బాపనయ్యా, భార్య భార్య అని నీతులు చెపుతున్నావు! భార్య!- భర్త తప్పేచేశానుడకో, అది సహించుకుంటేనే భార్య. అప్పుడే భర్తతో సుఖమూ, పరంలో సౌఖ్యమూనూ' అన్నాడు. అంతే, మరి నోరువిప్పలేదు. చరాచరా వెళ్ళిపోయాడు బసకి' అన్నాడు.

జాగ్రత్తగా వింది దమయంతి. ఎంతో సేపు విచారించింది. 'మహారాజే కాకపోతే, ఆమాట ఎందుకంటాడు ? ఏమో ? అయినా, ఇంకా నేర్పుకలవాళ్ళని పంపి తెలుసుకోవాలి' అని నిశ్చయించుకుంది. తండ్రితో చెప్పి సుదేవుణ్ణి పిలిపించింది. 'బుద్ధిమంతుడివి నువ్వు. పండితుడివి. నన్ను గుర్తించి నట్టే, మహారాజునీ గుర్తించాలి. నీకౌశలమంతా ఉపయోగించి, ఆయన్ని తీసుకురావాలి. నీకు అసాధ్యమంటూ వుండదు. నాకు తెలుసు. ఉత్తరకోసల దేశం అయోధ్య వెళ్ళు. ఋతుపర్ణుణ్ణి చూడు. భంగాసరమహారాజు కుమారుడాయన. మంచివాడు. 'భీమరాజు నలుడికోసం ప్రపంచమంతా వెదికించాడు. ఎక్కడా అతడి జాడే కనపడలేదు. అంచేత దమయంతికి రెండో స్వయంవరం చాటిస్తున్నాడు. యావన్మందిరాజులూ అప్పుడే బయల్దేరి వెళుతున్నారు విదర్భ' అంటూ ఆయనతో చెప్పి రా' అంది.

రెండో స్వయంవరం

అయోధ్య వెళ్ళాడు సుదేవుడు. 'దమయంతికి రెండోస్వయంవరం. రేపే విదర్భలో జరుగుతుంది' అంటూ ఋతుపర్ణుడితో చెప్పాడు. బాహుకుణ్ణి చూశాడు ఋతుపర్ణుడు. 'నీ అశ్వవిద్య చూపించవలిసిన అవసరం వచ్చింది. దమయంతికి రెండోస్వయంవరం. రేపేనట ! ఒక్కరోజులో విదర్భ వెళ్ళాలి నేను ?' అన్నాడు 'చిత్తం' - బరువుగా అన్నాడు బాహుకుడు. పైకిమాత్రం అన్నా డతడు. అంతే. హృదయం వెయ్యి చెక్కలు అయిపోతూ వుంది లోపల. 'అడివిలో వొదిలిపెట్టినందుకు కసితీర్చుకుంటున్న దన్న మాట ! ఏమయినా, ఆడది ప్రేమగా వుంటుందని నమ్మినవాడు పిచ్చివాడు, - ఏమిటీ ? దమయంతికి మళ్ళీ పెళ్ళా ? పతివ్రత దమయంతి నాకు తెలుసు' పిల్లలతల్లి. నిజంగా ఇంతపని చేస్తుందా ? నమ్మవలిసినమాటేనా

ఏమో! తెలుసుకోవాలి. వెళుతున్నాం కదా!' - పరిపరివిధాల పరిగెడుతూవుంది, అతడిమనస్సు.

రథం సిద్ధంచేశాడు బాహుకుడు. మాంచి లక్షణవంతమయిన గుర్రాలు, గాలిలా ఎగిరిపోయేవి ఎంచి పూశాడు. రథంమీద అడుగు పెట్టాడు ఋతుపర్ణుడు. నడుం వంచినట్టయాయి గుర్రాలు. 'ఇదేమిటి ఈ బక్క గుర్రాలు పూశా ? వీటితో అంతదూరం ఎలా వెళతాం! ఇవి విప్పేసి మంచివి పుయ్యి' అన్నాడు. 'కాదు మహారాజా, ఇవి గాలికంటే వేగం వెళతాయి. పొద్దు గూకకండానే విదర్భలో వుంటాం' అన్నాడు బాహుకుడు. 'అలా అయితే, నీ అశ్వవిద్యకి నువ్వు ఏదికోరితే అదే ఇస్తాను' - బొమలెగరవేస్తూ అన్నాడు ఋతుపర్ణుడు. వార్ష్ణేయుడితో సహా రథమెక్కి కూచున్నాడతడు.

పగ్గాలు పుచ్చుకున్నాడు బాహుకుడు. కదిలింది, రథం. బాణంలా- గాలిలా- మెరుపులా- ఎగిరేపోతోందది. ఎదట, దూరంగా కనిపించిన ప్రతీ దృశ్యం రెప్పపాటులో దగ్గిర పడుతోంది. మరు క్షణంలో ఎంతోదూరం వెనక్కిపోతోంది. సూర్యుడి రథంలా వుంది. 'బాహుకుడూ అనూరుడా ?' - ఆశ్చర్యపోతున్నాడు ఋతుపర్ణుడు.

రథం నడపడంలో బాహుకుడి కౌశలం అద్భుతం. ముక్కుమీద వేలు పెట్టుకున్నాడు వార్ష్ణేయుడు. 'ఎవడీ బాహుకుడు ? శాలిహోత్రుడా ? * మాతలా ? నలమహారాజా ? ఈముగ్గురికీ కాక, మరెవడికి సాధ్యం ఈసారథ్యం? వయస్సులోనూ జ్ఞానంలోనూ మా మహారాజు పోలికలే వున్నాయి. మరి, ఈవికృతరూపం మాటేమిటి? ఏమో! మహాపురుషులు దేవనియోగంవల్ల ప్రచ్ఛన్నంగా వుంటారు. వాళ్ళని తెలుసుకోవడం దుస్సాధ్యం' అనుకుంటూ కూచున్నాడు.

* అశ్వశాస్త్రకర్త (శాలిహోత్రుడి అశ్వశాస్త్రం మనుమంచభట్టు తెలుగు చేశాడు.)

ఇంతలో రుతుపర్ణుడి ఉత్తరీయం జారి కింద పడిపోయింది. తిరిగి చూశాడు రుతుపర్ణుడు. 'బాహుకా! రథం నిలుపు. ఉత్తరీయం పడిపోయింది. వార్ష్ణేయుడు పట్టుకువచ్చేస్తాడు' అన్నాడు. 'ఉత్తరీయం పడ్డచోటు ఇక్కడికి యోజనం దూరముంది. అది వార్ష్ణేయుడెలా తెస్తాడు'? — నవ్వుతూ అన్నాడు బాహుకుడు. నాలిక కరుచుకున్నాడు రుతుపర్ణుడు. ఏమిటీ రథవేగం? అనేక దేశాలూ అడవులూ దాటుకుంటూ ఎగిరిపోతోంది రథం.

ఒక అడివిలోంచి వెళుతోంది రథం. ఎదురుగా వొక తాడిచెట్టు కనిపించింది. పెద్దపెద్ద కొమ్మలతోనూ, పళ్ళతోనూ సండి వుండది. బాహుకుడికి చూపిస్తూ అన్నాడు రుతుపర్ణుడు; 'చూడూ, అన్ని విద్యలూ అందరికీ తెలియవు. ఒకరికి వొకవిద్యవస్తే, మరొకరికి మరో విద్య వస్తుంది. నాకోవిద్య వచ్చు. ఏవయినాసరే, చూసీచూడడంతోనే, అవి ఎన్నో చెప్పేస్తాను. ఇదిగో, ఈతాడిచెట్టువుంది, — దీనికి ఎన్ని ఆకులు వున్నాయో, ఎన్ని పళ్ళు వున్నాయో చెపుతాను చూడు. ఈరెండుకొమ్మలికీ ఆకులూ, పళ్ళూ కలిసి మొత్తం పదివేల వొకటి. తక్కినకొమ్మలివి రెండువేలా తొంభయి అయిదు. కావలిస్తే లెక్కపెట్టుకో' అన్నాడు.

టపీమని రథం నిలబెట్టాడు, బాహుకుడు. 'లెక్కపెట్టిచూస్తే కాని నమ్మను' అన్నాడు. చెట్టు నరికి కిందవేశాడు. ఆకులూ, పళ్ళూ లెక్కపెట్టాడు. సరిగ్గా రుతుపర్ణుడు చెప్పినన్నే వున్నాయి. ఆశ్చర్యపోయాడు బాహుకుడు. ఈవిద్య ఉపదేశించమనీ కోరాడు. 'అక్షహృదయ మంటారు, ఈవిద్యని. ఇది బాగా తెలుసుకుంటే, గణితశాస్త్రం యావత్తూ వేళ్ళమీద వుంటుంది. ఏ కళంకమూ వొంటినంటదు. ఏవిషమూ బాధించదు' అంటూ విధిపూర్వకంగా బాహుకుడికి అక్షహృదయం ఉపదేశించాడు రుతుపర్ణుడు.

అక్షహృదయం స్వీకరించాడు బాహుకుడు. 'నీకు అశ్వహృదయం ఉపదేశిస్తాను స్వీకరించు' అన్నాడు. 'తరవాత పుచ్చుకుంటాను' అన్నాడు ఋతుపర్ణుడు. 'ముందు విదర్భపోదాం. అందాకా వుండనీ. పద వేగం' అన్నాడు.

అక్షహృదయం ప్రభావం వెంటనే అనుభవానికి వచ్చింది బాహుకుడికి. అంతవరకూ అతణ్ణి ఆశ్రయించుకుని వున్న కలి అతడి శరీరంనంచి బైటికి వచ్చేశాడు. కర్కోటకుడు కాటువేసిన విషం కక్కుకుంటూ బాహుకుడిముందు నుంచున్నా డతడు. రావిఆకులా వొణికి పోతున్నాడు. 'మహారాజా! నేను కలిని' అంటూ చేతులు జోడించాడు. పిడికిలి బిగించాడు బాహుకుడు. కోపంతో అతడి కళ్ళు ఎర్రపడ్డాయి. పెదవులూ అదురుతున్నాయి. శపించడానికే ఉద్యుక్తుడయా డతడు. 'క్షమించు' అంటూ దీనంగా బతిమిలాడాడు కలి. 'కర్కోటకుడి విషంతో ఇన్నాళ్లూ దహించుకుపోతూ వున్నాను. ఈ శిక్ష చాలు. కరుణించు' అంటూ కాళ్ళావేళ్ళా పడ్డాడు. శాంతించాడు బాహుకుడు. తాడిచెట్టుని ఆశ్రయించాడు కలి. అది మొదలు తాడిచెట్టు అపవిత్రమైపోయింది. కలి వొదిలిపోయాడు బాహుకుణ్ణి. అతడిలో మరే దోషమూ లేదిప్పుడు. ఒక్క వికృతరూపం మాత్రం మిగిలింది. రథమెక్కి పగ్గాలు సడిలించాడు బాహుకుడు. జారెడుపొద్దు వుందనగా కుండినపురం వచ్చేసింది రథం.

భీమరాజుకి కబురు వెళ్ళింది. అతడు రమ్మనగానే పట్నంలో ప్రవేశించింది ఋతుపర్ణుడి రథం. సంధ్యాకాంతులు పట్నంమీద సిందూరం పూస్తున్నాయి. రాజవీధిని పరుగెడుతోంది రథం. మేఘగంభీరంగా పట్నమంతా ప్రతిధ్వనించాయి రథచక్రాలు.

వార్ష్ణేయుడు విడిచి వెళ్ళిన నలుడి గుర్రాలు భీమరాజు అస్తబాల్లోనే వున్నాయి. అవాళనించీ ఉల్లాసంగా సకిలించిన పాపాన

పోలే దవి. ఋతుపర్ణుడి రథచక్రాలు విన్నాయి. ఏమిటి అవగత మయిందో, వాటికి, సంతోషంతో సకిలించాయి.

దమయంతీ వింది. రథ ఘోష. గుర్తుపట్టేసింది. నలమహారాజే. సందేహ మేమిటి? అతడిదే ఈరథ ఘోష. అతడే నడుపుతున్నా డిది. చెవుల్లో అమృతం పోసినట్టయిం దామెకి. గాల్లో తేలిపోతూ మేడ మీదికి వెళ్ళిం దామె. రథం రావడం చూస్తోంది. 'అదిగో రథం. ఋతుపర్ణుడు - వార్ష్ణేయుడు - మూడోవాడూ ? - ఎవరీయన ? నలుడేడీ ?' కళ్ళనీళ్లు తుడుచుకుంటోంది దమయంతి. నిట్టూరుస్తోంది. 'మహారాజే రానినాడు? - ఆయన దర్శనమే కానినాడు ? - జీవించను మరి' - ఏడుస్తోం దామె.

ఋతుపర్ణుడకి ఎదురువెళ్ళాడు భీమరాజు. గౌరవలోపంలేకండా స్వాగతం చెప్పా డతడికి. తోడితెచ్చి, మంచి మేడలో విడిది పెట్టించాడు. విడిదిలో కూచున్నాడే కాని ఏమీ పాలుపోలేదు ఋతుపర్ణుడికి. 'ఇదేమిటీ ? ఏసందడీ కనపడదేం ? స్వయంవర మన్న శబ్దమే లేదు పట్నంలో. రాజన్నవాడు వొక్కడూ రాలేదేం ? నిజానికి రెండో పెళ్ళి చేసుకుంటుందా దమయంతి? అంత అలగామనిషా ఆమె ?'- ఆలోచనమీద ఆలోచన బాధిస్తోం దతణ్ణి. ఇంతకీ విచారించకండా పరిగెత్తుకురావడం సిగ్గుగానూ వుంది.

రథాలశాలలో రథం పెట్టాడు బాహుకుడు. గుర్రాలు అస్తబాల్లో కట్టాడు. వచ్చి, రథంపక్క విశ్రమించాడు.

బాహుకుణ్ణిచూసి, నిరాశచేసుకోలేదు దమయంతి. కేశిని అని వొకపరిచారికని పిలిపించింది. 'ఋతుపర్ణుడు అయోధ్య రాజు. వార్ష్ణేయుడు మా సారథి. తెలుస్తూనే వుంది. ఈబాహుకు డెవ్వడో ? అతడంటే నే నా మనస్సు పరిపరివిధాల పోతున్నాది. మన పర్ణాదుడికి

జవాబు చెప్పినవాడు ఇతడే అనుకుంటాను. నువ్వు వెళ్ళు, అతడి సంగ తేమిటో కనిపెట్టుకురా' అని పంపింది.

బాహుకుడిదగ్గిరికి వచ్చింది కేశిని. 'మా దమయంతి నీక్షేమం విచారించి రమ్మంది' అంటూ అతడిదగ్గిర చతికిలబడింది.

కేశిని : ఇక్కడికి ఎందుకు వచ్చావేమిటి నువ్వు?

బాహు : దమయంతికి రెండో స్వయంవరం కదూ! తెలియదూ నీకు ? రాజులందరినీ రావించాడు మీరాజు. అందుకనే మారాజూ వచ్చాడు, ఋతుపర్ణుడు. ఆయనతో వచ్చాను నేను. అయోధ్యనుంచి మీవూరు నూరుయోజనాల దూరం. ఏకాఏకిని వొక్క రోజులో తీసుకువచ్చాను, రథం.

కేశిని : మీరు ముగ్గురు వచ్చారటగా! మరి ఆ మూడో అత డెవరు?

బాహు : నలరాజుసారథి, వార్ష్ణేయుడు.

కేశిని : నలమహారాజు ఎటువెళ్ళిందీ, వార్ష్ణేయుడికి తెలుసను కుంటా. ఏం ?

బాహు : ఊహూం. నలుడిపిల్లల్ని ఇక్కడ తాతగారింట దిగబెట్టి వెళ్ళాడతడు. నలుడిరాజ్యం పోయిందని తెలిసి, ఋతుపర్ణుడి కొలువులో చేరాడు. అతడి కెలా తెలుస్తుంది ?

కేశిని : మరి ?

బాహు : నలుడి వెంటవెళ్ళిన దమయంతికి తెలియాలి. తప్పితే నలుడికి తెలియాలి. మూడో వాడి కెలా తెలుస్తుంది ?

కేశిని : నిజమే. కాని, దమయంతి ఎలాంటి అవస్థలోవుందో తెలుసా ? అడివిలో పాపం, వొంటిదాన్ని చేసి పోయాడు నలుడు. ఎంత రాతిగుండెవాడూ కాకపోతే, ఇంత దారుణం చేస్తాడు చెప్పూ!

ఆమె కట్టుకున్న చీరె సగం చించుకుపోయాడు. ఆ మిగిలినముక్కతోనే ఇప్పటికీ వుందామె. అడవిలోలాగే, నేలమీద ధూళిలోనే పడుకుంటుంది. మకిలిపట్టిపోయింది ఆమె శరీరం. జడలుకట్టేసింది జుత్తు. వ్రతంపట్టి క్షణమొక యుగంలా గడుపుతోందామె.

గుండెలు పగిలిపోతున్నాయి బాహుకుడికి. కళ్ళనీళ్ళు తిరుగుతున్నాయి. తల వొంచుకుంటున్నాడు మొహం పక్కకి తిప్పుకుంటున్నాడు. మరి మాటాడకుండా వూరుకున్నాడు.

జరిగిందంతా దమయంతితో పూసగుచ్చినట్టు చెప్పింది కేశిని. బాహుకుడే నలుడన్న సందేహం మరింత బలపడింది దమయంతికి. 'ఋతుపర్ణుడి వంటపుట్టిన్నీ అటకదా, బాహుకుడు! వెళ్ళు. వంట సమయంలో అతణ్ణి మళ్ళీ కనిపెట్టు బాగా' అంది.

మళ్ళీ వెళ్ళింది కేశిని. బాహుకుడు వంట చేస్తున్నంతసేపూ అక్కడే వుందామె. అతడి విషయం చూసి, ఆశ్చర్యపోయింది. తిరిగి వచ్చి, దమయంతితో విన్నవించింది. 'ఏం చెప్పేదమ్మా, బాహుకుడు భగవంతుడు కాని మనిషి కాడు' అంది. ఎక్కడా కనీ వినీ ఎరగం. నాకళ్ళే నేను నమ్మలేకపోయాను. పిడికెడు గడ్డిపరకలు పొయ్యిలో వేశాడతడు. చిత్రం! వాటంతట అవే మండాయి. వంటంతా అయ్యేదాకా, అవే అలా మండుతున్నాయి. మరో పుడక వేస్తే వొట్టు. మాంసాలూ కూరలూ కడగాలంటే, ఉత్తికుండ లోంచే నీళ్లు పొంగి వస్తున్నాయి. తరగడమంటూ లేదు. ఇంకా చిత్రం విను. పువ్వులు చేతిలో వేసి నలిపాడు. నమ్ముతావో లేదో, వాటి వాసనపోవాలా! ఊహూఁ, సజ్జపువ్వులకంటే పదిరెట్లు ఘుమ ఘుమ లాడాయి' అంది.

దమయంతి కళ్ళు మెరిశాయి. పోయిన పెన్నిధి చేతిలో పడ్డట్టయింది మొహం. కేశినిచేత బాహుకుడు వండిన కూరలూ తెప్పించింది; రుచిన్నీ చూసింది. సందేహం లేదు. నలపాకమే అది.

మనస్సు చెడ్డది. చివరివరకూ సందేహిస్తూనే వుంటుంది. అంతతో వూరుకోలేదు దమయంతి. కొడుకునీ, కూతుర్నీ బాహుకుడి దగ్గిరికి పంపింది. చూశాడు బాహుకుడు. ఆపుకోలేకపోయాడు. ఇద్దరినీ ! ఎత్తుకున్నాడు. వెక్కి వెక్కి ఏడ్చాడు. అడ్డాల్లో కూచోపెట్టుకున్నాడు. 'నా పిల్లలు ఇలాగే వుంటారు. అందుకని ఎత్తుకున్నాను. వాళ్ళుజ్ఞాపకం వచ్చారు. ఏడుపు వచ్చింది' అన్నాడు. 'చూడూ కేశినీ! నువ్వు మాటి మాటికీ ఇలా రావడం ఏమంత బావుండలేదు. ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు? పరాయి దేశంనించి వచ్చినవాళ్ళం మేము. అతిథులం. మాతో ఏంపని నీకు ? ఇక మళ్ళీ రావొద్దు నువ్వు' అన్నాడు.

తిరిగి వచ్చేసింది కేశిని. బాహుకుడు పిల్లల్ని ఎత్తుకోవడం, ఏడవడం, తనని రావద్దనడం —అంతా దమయంతితో చెప్పింది. ఉన్న కాస్త సందేహామూ వూడిపోయింది. ఆనందంతో కాళ్ళు కిందనిలవ లేదు. దమయంతికి. గబగబా తల్లిదగ్గిరికి వచ్చింది. 'అమ్మా! సందేహం లేదు. బాహుకుడే మీ అల్లుడు. ఆపుకోలేకపోతున్నాను ఆనందం. ఆయన్ని ఇక్కడికి తెప్పిస్తావో, నన్నే అక్కడికి వెళ్ళమంటావో చెప్పు' అంది. భీమరాజుతో చెప్పింది రాణి. బాహుకుణ్ణి అంతః పురానికి పిలిచింది.

అంతఃపురంలోకి వచ్చాడు బాహుకుడు. దమయంతిని చూశాడు. జాలిగా కొనవూపిరితో వుందామె. ఒళ్ళంతా వొకటే మకిలి. 'నాటి దమయంతియేనా, ఈతపస్విని ?' కపోలాల మీంచి కన్నీళ్ళు వరదలు కడుతున్నాయి. బాహుకుడు అడుగుపెట్టగానే, ప్రేమా, లజ్జా, భయమూ, తత్తరపాటూ—ఏదో ఏదో అయిపోయిందామె చూసి. ఆ అతివికృతస్వరూపం పరాయివాడని భావించనే లేదామె. చూసీ చూడ్డంతోనే బావురుమంది. తనని కాదన్నట్టు నిలబడ్డాడు బాహు

కుడు. ఏడుస్తూనే అంది దమయంతి. 'పిట్టమనిషిలేని కీకారణ్యాం. అలిసి నిద్రపోతున్న ఆడదాన్ని — సాధ్విని నమ్ముకున్నదాన్ని — అగ్ని సాక్షిగా పాణిగ్రహణం చేసినభార్యని - నలమహారాజు తప్ప, అంతనిష్ఠురంగా ఎవరు వొదిలి వెళతారు ? దేవతల్ని కాదని వరించాను. కొడుకునీ కూతుర్నీ కన్నాను. కలలో అయినా, హాస్యానికయినా అపరాధంచేసి ఎరగను. ఏం దోషం చేశానని నామీద ఇంత నిర్దయ ? 'నాప్రాణం వొకటీ, నువ్వు వొకటీనా ?' అన్నాడు. 'నిన్ను వొదిలిపోతానని భయపడకు' అని నమ్మించాడు. ఎలా మరిచి పోయాడు, అన్న మాటలు

క్షణక్షణం ఉబికి, ఉక్కిరిబిక్కిరి అవుతోంది దుఃఖం. ఆపుకో లేకపోయాడు బాహుకుడు. బయలుపడిపోయాడు. 'కలి ఆవహించాడు నన్ను. నామతి నాస్వాధీనంలో లేకపోయింది. అందుకనే అన్ని పాట్లు మనకి. అదృష్టంవల్ల అవతలికిపోయాడు కలి. కాగా — నీకోసమే ఇక్కడికి వచ్చాను. కాని —

'అదలావుండనీ, ప్రాణంపెట్టి ప్రేమించినవాణ్ణి, నువ్వే లోకం అనుకుంటున్న వాణ్ణి నన్ను తోసిరాజని — మరోవరుడికోసం — రెండో స్వయంవరానికి సిద్ధపడ్డావు. కులస్త్రీ చెయ్యవలసిన పనేనా ఇది ? స్వయంవరానికే కదా, రాజులికి కబురుపెట్టాడు భీమరాజు ? నీస్వయంవరానికేకదా, వచ్చాడు రుతుపర్ణుడు ?' అన్నాడతడు.

చివరిమాటలికి గజగజలాడింది దమయంతి. అంజలిబంధం హృదయందగ్గిర కీలించింది. 'నీ—నీకోసమే, మహారాజా, ఇదంతా. దేశదేశాలు పంపి వెదికాను నిన్ను. సభల్లోనూ అక్కడా నేను చెప్పినట్టు చెప్తూతూ వచ్చారుబ్రాహ్మలు. పర్ణాదుడు అయోధ్య వెళ్ళాడు. నువ్వు జవాబు చెప్పావు. దాంతోనే గుర్తుపట్టాం నిన్ను. అందుకనే రేపే స్వయంవరమని కబురుపెట్టాను. నువ్వాయితేనే నూరుయోజ

నా లూ వొక్క రోజున వస్తావు. ఇది తేల్చుకోవడానికే ఈ ఉపాయం తట్టింది. అంతే మహారాజా, మరో పాప మెరగను. నీపాదాలు ముట్టి ప్రమాణం చేస్తున్నాను. నాలో ఏపాపమున్నా, సూర్యచంద్రులూ, ఈవాయువూ నా ప్రాణాలు హరిస్తారు' అంది.

ఆమె అలా అంటూనే వుంది. గగనవీధిని గంభీరంగా పలికింది గాలి. 'రాజా! కళంకంలేని పవిత్రచరిత్ర దమయంతి. సూర్యుడూ, చంద్రుడూ, నేనూ ఈమూడేళ్ళూ కాపాడుతూనే వున్నాం ఈమెని!'-

దేవలోకంనించి పూలవాన కురిసింది. దేవదుందుభులు మోగాయి. పిల్లగాలులు చల్లగా పరిమళిస్తూ వీశాయి.

కర్కోటకుణ్ణి తలుచుకున్నాడు బాహుకుడు. వస్త్రంవచ్చి మీదపడింది. వికృతరూపం అదృశ్యమైంది. సూర్యుడిలా ధగధగా మెరిసిపోతూ నిలబడ్డాడు నలుడు. ఆనందమే ఆనందం. అమాంతంగా అతణ్ణి అంటుకుపోయింది దమయంతి. విరహతాపంతో పాటు ఆమె మలినత్వమూ మాయమైంది. పైరుకివచ్చిన పొలంనీరు పడితే, నవ నవలాడినట్టు — చంద్రోదయంతో రాత్రి ప్రకాశించినట్టు — కలకల లాడిందామె. బంధువులూ, స్నేహితులూ, ఓ, — కోటకోటంతా ఉప్పెనలా వుంది ఉత్సాహం. భీమరాజు కాళ్ళు కిందపడ్డంలేదు. పట్నంయావత్తూ అష్టశోభనాలూ చేయించాడతడు. దేవాలయాల్లో పూజలూ పునస్కారాలూ లెక్కా జమా లేదు.

ఈసందడిలో సంగతంతా తెలిసిపోయింది ఋతుపర్ణుడికి. వెంటనే నలుడి దగ్గిరికి పరుగెత్తుకువచ్చాడు. 'నిఖిలలోకపూజ్యుడివి నువ్వు బాహుకుడివై నాదగ్గిర ప్రచ్ఛన్నంగా వున్నావు. నిన్ను తెలుసుకో లేకపోయాను. అపరాధం చేశాను. చెప్పరానిపనులు చెప్పాను. క్షమించు' అన్నాడు మహాదరంగా అతణ్ణి గౌరవించాడు నలుడు.

నలుడిదగ్గిర అశ్వహృదయం నేర్చుకున్నాడు ఋతుపర్ణుడు. అనంతరం అయోధ్య వెళ్ళిపోయాడతడు.

విదర్భలో నెలరోజులున్నాడు నలుడు. భీమరాజుతో చెప్పి నిషధ బయలుదేరాడు. దమయంతిని అక్కడే వుంచాడు. ఒక రథమూ, పదహారుఏనుగులూ, యాభై గుర్రాలూ, ఆరువందల కాలి భటులూమాత్రం వెంట వేసుకున్నాడు. అలా వెళ్ళి, పుష్కరుణ్ణి జూదానికి పిలిచాడు. లేదా యుద్ధానికయినా సరే, రమ్మన్నాడు. 'దమయంతిని పందెం పెడతాను. నేను వోడిపోతే దమయంతిని వొదులుకుంటాను. నువ్వు వోడితే నాదగ్గిర గెలిచిన రాజ్యమూ, సర్వసంపదలూ వొదులుకోవాలి. ఈపందెం నచ్చితే ఆటలో కూచో. కాదంటావా, రాజ్యం వీరభోజ్యం కనక యుద్ధంలో నిలబడు. జూదం - యుద్ధం - ఈరెంటిలో ఏదికావాలో ఎంచుకో' అన్నాడు.

యుద్ధంలో గెలుపు రాదని తెలుసు పుష్కరుడికి. జూదంలో వొకసారి వోడిపోయినవాడే నలుడు. ఈసారీ అలాగే వోడించవచ్చు. చక్కనిచుక్క దమయంతికూడా దక్కుతుంది. సుఖపడవచ్చు అనుకున్నాడు. జూదానికే సిద్ధపడ్డాడు. 'నేను వోడితే రాజ్యమంతా నీది. నువ్వు వోడితే దమయంతి నాది' అంటూ ఆటలో కూచున్నాడు.

ఆట వేసీవెయ్యడంతోనే వోడిపోయాడు పుష్కరుడు. తన రాజ్యం తనకి వచ్చేసింది నలుడికి. 'వెనకటి గెలుపంతా నీప్రభావమే అనుకున్నావు. వెర్రివాడివి. అదంతా కలిమహిమ. నువ్వు నాపినతండ్రి కొడుకువి. తమ్ముడివి. అంచేత వొదిలిపెడుతున్నాను. ఏమీ చెయ్యను నిన్ను. వెళ్ళు' అంటూ అతణ్ణి పంపివేశాడు నలుడు.

విదర్భలో గుప్పుమంది ఈవార్త. తండ్రిసెలవు తీసుకుంది దమయంతి. కొడుకునీ, కూతురునీ పట్టుకుని నిషధవచ్చేసింది. భార్యా

పిల్లలతో రాజ్యం పరిపాలించాడు నలచక్రవర్తి. అనేకం యజ్ఞాలూ అవీ చేశాడు. దేవేంద్రవైభవంతో సర్వసుఖాలూ అనుభవించాడు.

## తీర్థకీర్తనం

నలచరిత్ర చెప్పాక, తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు బృహదశ్వుడు. అర్జునుడిమీదే పంచప్రాణాలూ పెట్టుకుని దినాలు గడుపుతున్నారు పాండవులు. ఒకనాడు ఆకాశంమీద తెల్లటి తేజస్సు కనిపించింది. చూస్తూవుండగానే, పైనించి దిగి వచ్చాడు నారదముని. తమ్ముళ్లతో సహా పూజించి సత్కరించాడు ధర్మరాజు. సంతోషించాడు నారదుడు. 'మహారాజా! ఉదారమయిన నీ చరిత్రా, ధర్మబుద్ధీ చూస్తే, మిక్కిలీ సంతోషంగా వుంది నాకు. ఏదయినా అడగాలని వుంటే అడుగు చెపుతాను" అన్నాడు.

"నువ్వు సంతోషిస్తే, మూడులోకాలూ సంతోషించినట్టు"– చేతులుజోడిస్తూ అన్నాడు ధర్మరాజు. "నీదర్శనం అయినప్పుడే కృతార్థుణ్ణయాను. ఎన్నాళ్ళయో నాకో ధర్మసందేహ ముంది. అది నువ్వేతీర్చాలి. ఏమిటంటావా, ఎంతో మంది మహాత్ములు ప్రదక్షిణపూర్వకంగా, ప్రపంచసంచారం చేస్తారు. ఎన్నెన్నో తీర్థాలు సేవిస్తారు. అయితే, వాళ్లకి లభించే ఫలమేమిటి? ఏతీర్థం ఎలాంటిది? ఏతీర్థంలో ఎలాంటి ఫలముంటుంది? ఈ వివరాలు తెలుసుకోవాలని వుంది" అన్నాడు. నారదుడు ప్రారంభించాడు.

"వెనకటికి, సరిగ్గా ఇలాగే అడిగాడు పులస్త్యుణ్ణి మీ భీష్ముడు, చెపుతాను విను. పితృదేవతల తృప్తికోసం, హరిద్వారంలో పుణ్యకర్మలు చేస్తున్నాడు భీష్ముడు. అతడి పితృదేవభక్తికీ, న్యాయమయిన అతడి నడవడికీమెచ్చి, అతణ్ణి చూడాలని వచ్చాడు పులస్త్యుడు. 'దాసుణ్ణి, ఏంసెలవు?' పాదాభివందనం చేస్తూ అన్నాడు భీష్ముడు

'నీపితృ దేవభక్తికి సంతోషించాను. పుణ్యవ్రతాల్లో నిన్ను మించిన వాడులేడు. అందుకనే నిన్ను చూడాలని వచ్చాను. ఏదయినా తెలుసుకోవాలనివుంటే, అడుగు. చెపుతాను' అన్నాడు. పులస్త్యుడు. 'కృతార్థుణ్ణి అయాను' అన్నాడు భీష్ముడు. నువ్విప్పుడు అడిగినట్టే పులస్త్యుణ్ణి అడిగాడు. భీష్ముడికి పులస్త్యుడు చెప్పిందే నీకు చెపుతాను. సావధానంగా విను.

ఇంద్రియాలు గెల్చినవాళ్ళూ, ఆత్మనిగ్రహంకలవాళ్ళూ, అహంకారం లేనివాళ్ళూ, ఇతర్లనించి దానం గ్రహించనివాళ్ళూ, ఉన్నదాంతోనే తృప్తిపడి కోరికలు లేనివాళ్ళూ, మితాహారులూ, ధనం కూడబెట్టనివాళ్ళూ, గర్వం విడిచినవాళ్ళూ, ఎప్పుడూ సంతోషంగా వుండేవాళ్ళూ, కల్లాకపటంలేనివాళ్ళూ, మంచి ఆచారం కలవాళ్ళూ, క్రోధం లేనివాళ్ళూ, ధర్మాత్ములూ - వీళ్ళంతా సర్వతీర్థాలూ వందసార్లు సేవిస్తే వచ్చేఫలమే పొందుతారు. భాగ్యంలేని పాపాత్ములికి మాత్రం తీర్థసేవ లభించదు. తిలదానం, గోదానం, సువర్ణదానం, ఉపవాసవ్రతం తీర్థసేవా - ఇవి చెయ్యనివాళ్ళే దరిద్రులవుతారు. వాళ్ళదోషమే వాళ్ళని దరిద్రుల్ని జేస్తుంది. యజ్ఞాలు చెయ్యాలంటే దానికి ఎన్నో ఉపకరణాలూ, ఎన్నో సంభారాలూ అవసరం. దరిద్రులికి అది సాధ్యంకాని పని. దరిద్రుడు యజ్ఞంచేసి దాని ఫలం పొందడమూ, ఆకాశంలో పువ్వు లేరడమూ వొకటే. యజ్ఞాలకంటె తీర్థాలఫలం అధికం. దరిద్రులయినా తీర్థాలు సేవించి పుణ్యఫలం పొందవచ్చు. తీర్థాల వివరం అడిగావు నువ్వు. చెపుతాను, విను.

పుష్కరం: తీర్థాలన్నిటిలోకీ ఉత్తమయిన తీర్థంపుష్కరతీర్థం. దేవతల్లో శ్రీ మహావిష్ణువులాగ పుణ్యతీర్థాల్లో పుష్కరం గొప్పది. సుప్రసిద్ధమయింది. మునులూ సిద్ధులూ వచ్చి మహాత్ములూ దాన్ని సేవిస్తునే వుంటారు. దేవతల్తోసహా బ్రహ్మదేవుడు అక్కడ సన్ని

హితుడై వుంటాడు. దాన్ని తలచుకుంటేనే చాలు, పాపాలు పోతాయి. పదివేలకోట్ల తీర్థాలు పుష్కరంలో వున్నాయి. ఎంతో మంది మహామునులు తపస్సుచేసి అక్కడ సిద్ధిపొందారు. యజ్ఞాలుచేసి కృతకృత్యులే అయారు దేవతలు.

పుష్కరంలో స్నానంచేసి దేవతర్పణం, ఋషితర్పణం, పితృతర్పణం చేసినవాళ్ళు పది అశ్వమేధయజ్ఞాలు చేసినఫలం పొందుతారు. నూరేళ్ళు అగ్నిహోత్రంలో నెయ్యి ఆహుతి చేసి హోమంచేస్తే ఎంతో, ఒక్కరోజు పుష్కరం సేవిస్తే అంత. బ్రాహ్మలూ, రాజులూ, కోమట్లూ, శూద్రులూ, స్త్రీలూ - ఎవరయినా సరే, పుష్కరంలో స్నానం చేస్తే సర్వపాపాలూ పోతాయి. పన్నెండేళ్లు పుష్కరంలో నియమంతో వుంటే, సర్వయజ్ఞాలూ చేసినంత ఫలం దొరుకుతుంది. చివర బ్రహ్మలోకమూ ప్రాప్తిస్తుంది. ఎంతో పుణ్యం వుంటేనే కాని పుష్కరం వెళ్ళలేడు మనిషి. ఇక, అక్కడ తపస్సు చెయ్యడం, దానం చెయ్యడం చెప్పనే అక్కరలేదు.

తరవాత, జంబుమార్గం, బదరికాశ్రమం, అగస్త్యవటం- ఈతీర్థాలు సేవిస్తే, అశ్వమేధయజ్ఞం చేసినంత ఫలం దొరుకుతుంది.

కణ్వాశ్రమం, ధర్మారణ్యం, యయాతిపదం చూసినవాళ్ళకి సమస్తపాపాలూ పోతాయి.

మహాకాళం, కోటితీర్థం, భద్రవటం శివక్షేత్రాలు. ఇక్కడ శివపూజ జరిపిన వాళ్ళకి గణపతిత్వం లభిస్తుంది.

నర్మదానదీ, దక్షిణ శింధువూ, చర్మణ్వతీనదీ వీటిల్లో స్నానమాడినవాళ్లు అగ్నిష్టోమం (వసంతకాలంలో అయిదు రోజులు చేసే యజ్ఞం) వల్ల పొందేఫలం పొందుతారు.

వశిష్ఠాశ్రమంలో కాయకూరలూ, కందమూలాలూ తిని, వొక్కరోజు వుంటే చాలు, ఎంతో ధనమూ, వేలాది ఆవులూ దానం చేసిన ఫలం కలుగుతుంది.

పింగళతీర్థం సేవిస్తే, వంద కపిలగోవులు దానం చేసినంత ఫలం వుంటుంది.

ప్రభాసతీర్థం సేవిస్తే అగ్నిష్టోమం, అతిరాత్రం (జ్యోతిష్టోమం లోని వొక యజ్ఞభాగం) వల్ల కలిగేఫలం కలుగుతుంది. ప్రభాసంలో అగ్ని దేవుడు ప్రత్యక్షమై వుంటాడు.

వరదానంలో స్నానంచేసి, సరస్వతీనది సముద్రంలో కలిసిన చోట స్నానమాడినవాళ్ళకి వెయ్యిఆవులు దానం చేసినంత పుణ్యం వస్తుంది. లోగడ దుర్వాసుడు విష్ణుమూర్తికి ఇక్కడే వరమిచ్చాడు. అందుకనే ఈతీర్థంపేరు వరదానం అయింది.

పిండారకం అని ద్వారకలో వొకతీర్థం వుంది. ఇక్కడ పద్మాల మీద త్రిశూలం గుర్తులు అచ్చుగుద్దినట్టు కనిపిస్తాయి. శివక్షేత్ర మిది. ఇక్కడ శివుణ్ణి పూజించినవాళ్ళకి పాపాలుండవు.

సాగరసింధుసంగమం: సింధునది సముద్రంలో కలిసే చోటిది. ఇక్కడ స్నానమాడినవాళ్ళకి స్వర్గమే లభిస్తుంది.

శంఖకర్ణంలో శివపూజ చేస్తే పది అశ్వమేధాలు చేసినంత ఫలం.

వసుధారా, వసుసరం – ఈరెండుతీర్థాల్లోనూ స్నానమాడిన వాళ్ళు ఐశ్వర్యవంతు లవుతారు.

సింధూత్తమ తీర్థంలో స్నానంచేస్తే స్వర్ణదానం చేసినంత పుణ్యం లభిస్తుంది.

బ్రహ్మతుంగం సేవిస్తే బ్రహ్మలోకం ప్రాప్త మవుతుంది.

శక్రకుమారి (ఇంద్రతీర్థం) సేవిస్తే ఇంద్రలోకం దొరుకుతుంది.

శ్రీకుంజంలో బ్రహ్మదేవుడికి నమస్కరించి, విమలతీర్థంలో స్నానంచేస్తే ఇంద్రసభలో స్థానం లభిస్తుంది. విమలతీర్థంలో బంగారం చేపలుంటాయి.

మలహారంలో అగ్ని దేవుడికి అర్ఘ్యమిస్తే అది అక్షయమవుతుంది. వెయ్యి గోదానాలకంటే, వెయ్యిఅశ్వమేధాలకంటే అధిక ఫల మిస్తుంది. పితృదేవతల్ని తృప్తిన్ని పరుస్తుంది.

దేవిక నదిలో దేవతలతోసహా శివుడు నివాసముంటాడు. దానిలో స్నానమాడినవాళ్ళకి కోరినకోర్కలు ఫలిస్తాయి. రెండు కోసుల వెడల్పూ ఇరవైకోసుల పొడవూ వుంటుందది.

ఈ దేవికా, కామాఖ్యమూ, రుద్రతీర్థమూ, యజనమూ, యాజనమూ, బ్రహ్మవాలుకా, బ్రహ్మ మొదలయినవాళ్లు దీర్ఘ సత్రయాగాలు చేసిన దీర్ఘసత్రస్థానమూ — ఇవి సేవించినవాళ్ళకి ఇష్టసిద్ధి కలుగుతుంది.

వినశనతీర్థం (అచిరం) దగ్గిర సరస్వతీనదిలో స్నానం చేసిన వాళ్ళు స్వర్గలోకం వెళతారు. వినశనందగ్గరే సరస్వతి అదృశ్య మవుతుంది. మేరువు వెళ్ళే దారిలో నాగోద్భవం, శివోద్భవం, చమసో ద్భవం దగ్గిర కనిపిస్తుంది.

శశయానంలో స్నానమాడితే వెయ్యిగోవులు దానం చేసిన మహాపుణ్యం వస్తుంది.

శివకోటిలో శివపూజ చేసినవాళ్ళకి కైలాసం ప్రాప్తమవుతుంది. మేమంటే మేమని కోటానుకోట్ల ఋషులు శివుణ్ణి పూజించడానికి పోటీ పడ్డారిక్కడ. అదిచూసి, కోటిమూర్తులై వెలిశాడు శివుడు. అందు కనే అది శివకోటి అయింది.

కురుక్షేత్రం: నైమిషంలోనూ మూడు పుష్కరాల్లోనూ ప్రసిద్ధ మయినక్షేత్రం కురుక్షేత్రం. కురుక్షేత్రంలో వున్నవాళ్ళని దేవతలనే

అంటారు, తెలిసినవాళ్ళు. అంత గొప్ప క్షేత్రం కురుక్షేత్రం. అందులో ఉత్తరాన దృషద్వతీనది ప్రవహిస్తోంది. దక్షిణంలో సరస్వతి పారుతోంది. శమంతపంచకమూ, రామహ్రదమూ అక్కడే వున్నాయి. బ్రహ్మదేవుడి ఉత్తరవేదిక లాంటిది కురుక్షేత్రమంటే. అక్కడ అడుగు పెడితే చాలు, తుదకి అక్కడవుంటానని అనుకుంటే చాలు, సర్వపాపాలూ నశిస్తాయి.

విష్ణుస్థానంలో విష్ణుపూజచేస్తే అశ్వమేధయజ్ఞం చేసినంత ఫలం వుంటుంది. విష్ణుక్షేత్ర మది.

పారిప్లవంలో స్నానంచేస్తే అగ్నిష్టోమం చేసినంతఫలం వుంటుంది.

పృథివీతీర్థంలో స్నానమాడితే వెయ్యి ఆవులు దానం చేసి నట్టవుతుంది.

శాలూకినిలో స్నానంచెయ్యడమూ, పది అశ్వమేధాలు చెయ్యడమూ వొక్కటే.

సర్పతీర్థంలో తరంకుడని ద్వారపాలకుడు వున్నాడు. సర్పలో స్నానమాడి తరంకుడి దర్శనంచేస్తే అగ్నిష్టోమంచేసినంత ఫలం.

వరాహతీర్థంలో స్నానంచేసినా అదేఫలం కలుగుతుంది. వరాహతీర్థంలోనే ఆదివరాహమయ్యాడు ఆదివిష్ణువు.

అశ్వితీర్థంలో స్నానమాడినవాళ్ళు రూపవంతులవుతారు.

జయంతీ, సోమతీర్థమూ, వంశతీర్థమూ—వీట్లల్లో స్నానం చెయ్యడమూ, పౌండరీకమూ, రాజసూయమూ చెయ్యడమూ వొక్కటే.

అగ్నివటందగ్గిరా, పంచవటం దగ్గిరా శివుణ్ణిపూజిస్తే కోరిన వరం దొరుకుతుంది.

కురుక్షేత్రద్వారం ప్రదక్షిణం చేస్తేసమస్తపాపాలూపోతాయి.

రామహ్రదంలో స్నానంచేస్తే అశ్వమేధయజ్ఞం చేసినట్టవుతుంది. రామహ్రదంకురుక్షేత్రంలోందని ముందేచెప్పాను. పూర్వం పరశు

రాముడు రాజులమీద విరుచుకుపడ్డాడు. గండ్రగొడ్డలితో వాళ్ళని నరికి, వాళ్ళరక్తంతో అయిదు మడుగులుచేశాడు. ఆమడుగుల్లో నుంచుని ఆనెత్తురుతో పితృతర్పణం చేశాడు. పితృదేవతలు ప్రత్యక్షమై, కావలిసిన వరం కోరమన్నారు. 'రాజుల్ని చంపినపాపం నాకు వుండకూడదు. ఈ అయిదుమడుగులూ పుణ్యతీర్థాలు కావాలి. నాకు పుణ్యాల్లో కాలూ వుండాలి' అన్నాడు రాముడు. పితృదేవతల వరంవల్ల పుణ్యతీర్థాలయ్యాయవి. అవే రామహ్రదాలు.

కాయశోధనలో స్నానమాడినవాళ్ళకి పవిత్రమవుతుంది శరీరం.

లోకోద్ధారంలో స్నానం చేసినవాళ్ళు కులమే ఉద్ధరిస్తారు. ఇక్కడే లోకాలు ఉద్ధరించాడు మహావిష్ణువు.

శ్రీతీర్థంలో స్నానం చేసినవాళ్ళు శ్రీమంతులవుతారు.

కపిలతీర్థంలో స్నానం చెయ్యడమూ వెయ్యి కపిల గోవులు దానం చెయ్యడమూ వొకటే.

సూర్యతీర్థంలో స్నానంచేసి, అక్కడ ఉపవాసం చేసినవాళ్ళు సూర్యలోకం వెళతారు.

గోభవం సేవిస్తే వేలకొద్దీ గోవులు లభిస్తాయి.

శంఖినీతీర్థంలో స్నానంచేస్తే, ఉత్తమరూపం వస్తుంది.

యతీంద్రతీర్థంలో మునిగి తరండక ద్వారపాలకుణ్ణి దర్శించినవాళ్ళూ, సరస్వతిలో స్నానం చేసినవాళ్ళూ అగ్నిష్టోమం చేసినంత ఫలం పొందుతారు.

మాతృతీర్థం దర్శిస్తే సంతానం వృద్ధిఅవుతుంది.

బ్రహ్మావర్తమూ, శరవణమూ దర్శిస్తే సమస్తవ్యాధులూ నాశన మవుతాయి.

శ్వావిల్లో మాపహాతీర్థంలో పదకుండు తీర్థాలున్నాయి. అక్కడ ప్రాణాయామం చేసిన బ్రాహ్మలికి పార్వతీదేవి ప్రసన్నురాలవుతుంది.

మానుషతీర్థంలో స్నానం చేస్తే విషయాలంటవు. దేవత్వమూ లభిస్తుంది. వెనకటికి వొకప్పుడు ఎరకలవాళ్ళు కృష్ణమృగాల్ని వెంటాడారు. అవి పరిగెత్తుకువచ్చి ఈతీర్థంలో వురికాయి. వెంటనే మనుష్యులయి బైటికి వచ్చాయి. కనకనే దీని పేరు మానుషతీర్థ మయింది.

ఆపగలో పితృతర్పణంచేసి, వాళ్ళ నుద్దేశించి వొక్క బ్రాహ్మడికయినా భోజనం పెడితే చాలు. కోటిమంది బ్రాహ్మలికి భోజనం పెట్టినట్టవుతుంది. పితృ దేవతలు తృప్తిపడతారు. మానుషతీర్థానికి తూర్పుగా వుంది ఆపగ. మహానది అది.

బ్రహ్మోదుంబరం, సప్తరుషికుండం, కేదారం — వీటిని దర్శించిన వాళ్ళకి బ్రహ్మలోకం దొరుకుతుంది.

కపిల కేదారం దర్శించినవాళ్ళు పాపాలు పోయి అదృశ్యులవుతారు.

సరకతీర్థంలో స్నానంచేసి కృష్ణచతుర్ధశినాడు శివుణ్ణి పూజిస్తే కోరిన కోర్కెలు సిద్ధిస్తాయి.

ఇంద్రస్యందనంలో స్నానమాడి, పితృతర్పణం చేసినవాళ్ళకి వాజపేయం చేసినంత ఫలం దక్కుతుంది. ఇంద్రస్యందనంలో మూడు కోట్ల కూపప్రహ్రదాలున్నాయి.

కింజదాన, కింప్యతీర్థాల్లో జపం చేసినా, దానంచేసినా, అవి అక్షయ మవుతాయి.

అంబాజన్మంలో ప్రాణం వొదిలినవాళ్ళకి పుణ్యాలోకాలు యావత్తూ ప్రాప్తమవుతాయి. అంబాజన్మతీర్థాన్నే నారదతీర్థమనీ అంటారు. సరకతీర్థానికి తూర్పునే వుం దిది.

పుండరీకతీర్థంలో శుక్లదశమినాడు స్నానం చెయ్యడమూ, పౌండరీకయజ్ఞం చెయ్యడమూ వొక్కటే. ఇక్కడ వైతరిణిలో స్నానం చేసి, శివుడికి నమస్కరిస్తే, సర్వపాపాలూ పోతాయి.

ఫలకీవనతీర్థంలో స్నానమాడడమూ, అగ్నిష్టోమమూ అతిరాత్రమూ జరపడమూ వొక్కటే. ఫలకీవనంలోనే దేవతలు ఎన్నో అన్ని సంవత్సరాలు తపస్సు చేశారు.

మిశ్రకంలో స్నానంచేసినవాళ్ళకి సమస్తతీర్థాల్లోనూ స్నానం చేసినఫలం లభిస్తుంది. ఎన్నో అన్ని తీర్థాలు అక్కడ మిశ్రమంచేశాడు వ్యాసుడు. అందుకనే ఇది మిశ్రకం అయింది.

వ్యాసవనమూ, మనోజవమూ, మధువటీ – ఈ తీర్థాల్లో స్నానంచేసినా వెయ్యి ఆవులు దానం చేసినా వొకటే.

కౌశికీనదీ, వృషద్వతీనదీ కలిసినచోటస్నానం చేస్తే పాపాలన్నీ పోతాయి.

దర్భకూలంలో నాలుగు మానికల నెయ్యి దానం చేస్తే పితృ రుణం విముక్తి అవుతుంది.

సూర్యతీర్థంలో మునిగినవాళ్ళకి సూర్యలోకం దొరుకుతుంది. భృగుతుంగంలో గంగాస్నానం చేసి, శివార్చనచేస్తే అశ్వమేధ యజ్ఞం చేసినంత ఫలం దొరుకుతుంది.

వామనతీర్థంలోమునిగి, వామనస్వామిని పూజిస్తే విష్ణులోకం ప్రాప్తమవుతుంది.

పావనతీర్థంలో స్నానమాడినవాళ్ళకులం పావన మవుతుంది.

శ్రీకుంజంలో సరస్వతీ స్నానంచేస్తే అగ్నిష్టోమంచేసినంత ఫలం వస్తుంది.

నైమిషకుంజంలో స్నానంచేస్తే రుషులు తృప్తి పడతారు. ఇక్కడనుండే రుషులు తీర్థయాత్రకి బయలు దేరి, ముందు కురుక్షేత్రం వెళతారు.

బ్రహ్మతీర్థంలో స్నానంచేస్తే, ఏజాతివాళ్ళయినా సరే, బ్రాహ్మ లవుతారు. బ్రాహ్మలేచేస్తే బ్రహ్మలోకం వెళతారు.

సప్తసారస్వతతీర్థంలో సారస్వతసిద్ధి కలుగుతుంది. వెనకటకి మంకణుడని వొక బ్రహ్మరుషి వుండేవాడు. ఇక్కడే అతడు తపస్సు చేస్తూ వుండేవాడు. ఒకనాడు దర్భగడ్డితగిలి ఆయనచెయ్యి తెగింది. ఆకుపచ్చరక్తం కారింది. మహానందం పుట్టుకువచ్చింది మంకణుడికి. నాట్యమే ప్రారంభించా డతడు. దేవతలూ మునులూ అది సహించ లేకపోయారు. శివుడి దగ్గిరికి వెళ్ళారు. 'ప్రభూ! ఎలా అయినా మంకణుడి ఆట ఆపించాలి' అంటూ ప్రార్థించారు. మునివేషం వేసు కున్నాడు శివుడు. మంకణుడి దగ్గిరికి వచ్చాడు. 'ఏమయ్యా, ఏమిటీ ఆట? ఎందు కిలా ఆడుతున్నావు? ఇంత ఆడవలసినంత ఏమిటి చూశావు?' అని అడిగాడు. 'ఇదిగో, చూడు' అన్నాడు మంకణుడు. 'నా చెయ్యి తెగింది. పచ్చటి ఆకురసం కారుతోంది. ఇంతకంటే ఆశ్చర్యం ఏం కావాలి? అందుకనే ఆనందం ఆపలేకపోతున్నాను. ఆడుతున్నాను' అన్నాడు. 'ప్చ! అదేం ఆశ్చర్యం? ఇది చూడు' అన్నాడు శివుడు. తన బొటనవేలిమీద వేలితో కొట్టాడు. బండారం లాంటి భస్మం రాలింది. సిగ్గుపడిపోయాడు మంకణుడు. తానేదో గొప్పవా ణ్ణనుకున్నాడు. ఆ గర్వంకాస్త వూడిపోయింది. 'ప్రభూ! నువ్వు పరమేశ్వరుడివి' — చేతులుజోడిస్తూ అన్నాడు మంకణుడు. 'దేవా, అనుగ్రహించు. నా తపస్సు వృద్ధిపొందేటట్టు కరుణించు' అంటూ ప్రార్థించాడు. దయకలిగింది శివుడికి. 'నీతపస్సు వృద్ధి అవు తుంది. భయపడకు. నీఆశ్రమంలోనే నివసిస్తాను నేను' అన్నాడు. మంకణుడి ఆశ్రమం వుండినచోటే సప్తసారస్వత తీర్థం.

ఔశవసం, కపాలమోచనం, విశ్వామిత్రం, కార్తికేయం — ఈ తీర్థాల్లో బ్రహ్మ మొదలయిన దేవత లుంటారు. వీటిల్లో స్నానాలు చేసినవాళ్ళకి పాపాలన్నీ తుడుచుకుపోతాయి. పైగా బ్రహ్మలో కమూ లభిస్తుంది.

పృథూదకతీర్థం: ఇది ఉత్తమోత్తమ మయిన తీర్థమని వేదాలు చెప్తున్నాయి. దేవేంద్రుడూ మొదలయిన దేవతలికీ, వ్యాసుడూ మొదలయిన మహాయోగులికీ ఆస్పద మిది. ఇక్కడ మరణించిన వాళ్ళకి పాపాలుండవు.

సురకన్యానదీ, సరస్వతీనదీ కలిసినచోట స్నానంచేస్తే బ్రహ్మహత్యా మొదలయిన గొప్పగొప్ప పాపాలు పోతాయి.

అతికర్షణ (అర్ధకీల తీర్థంలో స్నానంచేస్తే శూద్రులు బ్రాహ్మణులే అయిపోతారు. బ్రాహ్మణులే స్నానంచేస్తే పరమసిద్ధి పొందుతారు. అత్రిముని (దర్భి) నిర్మించిన తీర్థం ఇది.

శతం, సహస్రం అని రెండుతీర్థాలున్నాయి. జపం, దానం, ఉపవాసం మొదలయినవి ఇక్కడ ఒక్కసారిచేసినా చాలు. వంద రెట్లూ వెయ్యిరెట్లూ ఫలముంటుంది.

ఔశీనం, దాని తూర్పున వుండుకున్న కురుతీర్థం, హరిద్వారం- ఈతీర్థాలు చూస్తేనే చాలు, స్వర్గద్వారాలు తెరచుకుంటాయి. ఔశీనం (తైజసం) లోనే దేవతలు కుమారస్వామిని సేనాధిపతి చేశారు.

రుద్రపత్ని తీర్థంలో శంకర నారాయణుల్ని సేవిస్తే సర్వ దుఃఖాలూ హరించిపోతాయి.

స్వస్తిపురం ప్రదక్షిణం చేస్తే వెయ్యి ఆవులు దానం చేసినట్టు.

గంగమడుగులో ఒకకూపంలో మూడుకోట్ల తీర్థా లున్నాయి. సరస్వతీ తీర్థంలో స్నానంచేస్తే ఏఫలం వుంటుందో ఇక్కడ స్నానం చేసినా అదేఫలముంటుంది.

బదరీవనంలో వశిష్ఠాశ్రమం వుంది. రేగుపళ్ళుతింటూ అక్కడ మూడురాత్రుళ్ళు వుంటే పాపపరిహారం అవుతుంది.

ఏకరాత్రం తీర్థంలో ఒకరాత్రి ఉపవాసం చేస్తే బ్రహ్మలోకం వెళతారు.

ఆదిత్యాశ్రమం అని వొక వనముంది. అక్కడ సూర్యపూజ చేసినవాళ్ళు సూర్యలోకం వెళతారు.

దధీచితీర్థంలోనూ కణ్వాశ్రమంలోనూ మూడు రాత్రుళ్ళు నివసించినవాళ్ళు స్వర్గలోకం పొందుతారు.

సన్నిహతితీర్థం బ్రహ్మదేవుడూ మొదలయిన దేవతలూ, మునులూ, సిద్ధులూ, గరుడులూ, నాగులూ తలావొకనెల సేవిస్తూ వుంటారు. సూర్యగ్రహణమప్పుడు ఇందులో స్నానంచేస్తే వంద అశ్వమేధాలు చేసినంత ఫలం వుంటుంది.

ధర్మతీర్థంలో తపస్సు చేసినవాళ్ళకి ధర్మబుద్ధి కుదురుతుంది. ధర్ముడు తపస్సుచేసిన స్థలమిది.

జ్ఞానపావనం, సౌగంధికం— ఈ రెండు పుణ్యనదుల్లోనూ స్నానమాడినవాళ్ళకి పాపాలంటూ వుండనే వుండవు.

దేవప్రవ అని సరస్వతీప్రవాహముంది. వొక పుట్టలోంచి అక్కడబైటికి వస్తూవుంటాయి నీళ్ళు. ఆనీళ్ళలో స్నానంచేసి, పితృతర్పణం చేస్తే అశ్వమేధయజ్ఞం చేసినంత పుణ్యం వస్తుంది.

సుగంధా, శతకుంభా, పంచయజ్ఞా, త్రిశూలఖాతా — ఈ పుణ్యనదుల్లో స్నానం చేస్తే దారిద్ర్యం దగ్గిరికిరాదు.

శాకంభరితీర్థంలో స్నానంచేసి, వొక్కరోజు శాకాహారంతో గడిపితే పన్నెండేళ్ళు శాకాహారంతో తపస్సుచేసినంత పుణ్యం వస్తుంది. ఇక్కడే, వెనకటికి పార్వతీదేవి శాకాహారం చేస్తూ వెయ్యి దివ్య సంవత్సరాలు తపస్సుచేసింది.

స్వర్ణతీర్థంలో శివుణ్ణి పూజిస్తే కైలాసం దొరుకుతుంది.

ధూమావతీ, రథావర్తా, ధారా — ఈతీర్థాల్లో స్నానాలుచేస్తే దుఃఖాలు దూరమవుతాయి.

హరిద్వారం నిజంగా స్వర్గద్వారమే. ఎప్పుడూ ఎంతో అంత మంది ఋషులు వుంటారిక్కడ. వందకోట్ల తీర్థాల్లో స్నానం చెయ్యడమూ ఇక్కడ వొక్కసారి గంగాస్నానం చెయ్యడమూ వొక్కటే.

సప్తగంగాసంగమమూ, త్రిగంగాసంగమమూ, శక్రావర్తనమూ, కనఖలమూ, గంగా సరస్వతీ సంగమమూ — ఈ మొదలయిన తీర్థాల్లో స్నానం చేసినవాళ్ళు పుణ్యలోకాలు పొందుతారు.

భద్రకర్ణేశ్వరంలో శివపూజచేసిన వాళ్ళూ,అరుంధతీ వటమూ, సింధుప్రభవా, యమునాప్రభవా — ఈపుణ్యతీర్థాలు సేవించినవాళ్లా అన్నిటిలోనూ సిద్ధిపొందుతారు.

వేదికా, ఋషికుల్యా, కృత్తికామఘమూ, విద్యా, వేతశిఖా — ఈతీర్థాలు దర్శిస్తే పాపాలు పటాపంచ లవుతాయి.

బ్రహ్మతీర్థంలో స్నానంచేస్తే పద్మవర్ణంగు విమానాలమీంద బ్రహ్మలోకం వెళతారు.

నైమిశం చూస్తేనే పాపాలు పరుగెత్తిపోతాయి. ఒక్కనెల అక్కడ వుంటే ఎంతోఅంత పుణ్యం వస్తుంది. శుచిగా వొక్కదినం అక్కడ ఉపవాసం చేస్తే ఎన్నో తీర్థాలు సేవించినట్టు అవుతుంది.

నందోద్భవమూ, ఇందీవరమూ, గంగాద్వారమూ, దిశాపతి తీర్థమూ — వీట్లల్లో స్నానం చేస్తే వాజపేయం చేసినంత ఫలం

బాహుదలో స్నానం చెయ్యడమూ సత్రయాగం చెయ్యడమూ వొక్కటే.

సరయూనది దగ్గిర గోప్రతానంలోనూ, గోమతిలోనూ స్నానమాడితే అశ్వమేధం చేసినంత ఫలం. గోప్రతానం దగ్గిరే శ్రీరామచంద్రమూర్తి స్వర్గస్థుడయాడు. గోమతి దగ్గిర దేవతలూ, ఋషులూ యజ్ఞాలు చేసిన యజ్ఞభూమి వుంది.

కోటితీర్థంలో కుమారస్వామిని సేవించి, వారణాసి (కాశీ) లో శివపూజచేసి, కపిలహ్రదంలో స్నానం చేసే రాజసూయం చేసినంత ఫలం వుంటుంది.

మార్కండేయ తీర్థం: గంగా, గోమతీనదులు కలిసిన దగ్గిర వుంది. మార్కండేయ తీర్థంలో స్నానంచేసి, బ్రాహ్మ కల్పించిన యూపస్తంభం ప్రదక్షిణం చేస్తే వాజపేయం చేసినంత ఫలం.

గయ: గయలో వొక నెలవున్న వాళ్ళు అటు తల్లివంకవాళ్ళనీ, ఇటు తండ్రివంక వాళ్ళనీ ఉద్ధరిస్తారు. గయలో పిండం వేసిన వాళ్ళు పితృదేవతల అనుగ్రహానికి పాత్రులవుతారు; కృతార్థులూ అవుతారు. 'అనేకమంది కొడుకులు వుంటే, అందులో వొక్కడయినా గయ వెళతాడు. వొక్కడయినా అశ్వమేధం చేస్తాడు. లేదా, నల్లటి ఆబోతు అచ్చువేసి వొదిలిపెడతాడు!' - ఈ ఆశతోనే హెచ్చుమంది కొడుకులు కోరుకుంటారు గృహస్థులు. అలాంటిది గయ అంటేను. గయలో ఫల్గునదిలో స్నానం చేస్తే పరమసిద్ధి కలుగుతుంది.

యక్షిణీతీర్థంలో నీళ్లు తాగడంవల్ల బ్రహ్మహత్యా మొదలయిన మహా మహా పాపాలు పోతాయి.

మణినాగంలో స్నానంచేస్తే పాములభయం వుండదు.

గౌతమవనంలో అహల్యాకుండంలో మునిగి, ఉదపానంలో స్నానమాడితే అశ్వమేధం చేసినంత ఫలం.

జనకతీర్థం: ఇది జనకమహారాజు దన్న మాట. ఇక్కడ స్నానంచేసినవాళ్ళు విష్ణులోకం వైకుంఠం వెడతారు

కంపనా, మహానదీ - ఈ రెంటిలోనూ స్నానమాడినవాళ్లు పౌండరీక యజ్ఞం చేసినంతఫలం పొందుతారు.

దేవపుష్కరిణీ, మహేశ్వరపదమూ, మహానుమక్షథమూ ఈతీర్థాల్లో స్నానంచేస్తే అశ్వమేధం చేసినట్టవుతుంది.

మహేశ్వరపథంలో స్నానంచేసినవాళ్ళూ, విష్ణుక్షేత్రమయిన సాలగ్రామ తీర్థంలో స్నానమాడి విష్ణుపూజ చేసినవాళ్ళూ, అక్కడే నాలుగుసముద్రాలూ సన్నిహితమయి వున్న కూపంలో స్నానంచేసిన వాళ్లూ విష్ణులోకం వెళతారు. వెనకటికి ఒక రాక్షసుడు తాబేలు రూపంలో వచ్చి, కోటితీర్థాలు అపహరించుకుపోయాడు. వాణ్ణి కొట్టి, అవన్నీ పట్టుకువచ్చి ప్రతిష్ఠించాడు విష్ణుమూర్తి. అలా ప్రతిష్ఠించిన చోటే మహేశ్వరపథం.

చంపకారణ్యం భరతాశ్రమంలో శివారాధనచేస్తే సూర్య లోకమూ, వరుణలోకమూ లభిస్తాయి. భరతాశ్రమంలో దేవతల్తో సహా నివసించివుంటాడు శివుడు.

కన్యాసం దేశంలో కన్యాదానం చేస్తే అక్షయమయిన పుణ్యం లభిస్తుంది.

దేవకూటంలో స్నానం చేసినవాళ్ళు బ్రహ్మలోకం వెళతారు.

విశ్వామిత్రుడి మడుగులో స్నానంచేసి, కుమారవీరాశ్రమంలో ఒక నెలవుంటే అశ్వమేధం చేసినట్టవుతుంది. విశ్వామిత్రుడు సిద్ధి పొందినచోటే విశ్వామిత్రుడి మడుగు.

అగ్నిధారలోనూ, బ్రహ్మసరంలో పుట్టిన కుమారధారలోనూ స్నానాలు చేసి, మూడు రాత్రుళ్ళు ఉపవాసముంటే బ్రహ్మహత్యలాంటి పెద్ద పెద్ద పాపాలు వొదిలిపోతాయి.

గౌరీశిఖరకుండంలో స్నానంచేసినా, నందీకూపంలో స్నానం చేసినా అశ్వమేధం చేసినంత ఫలముంటుంది.

కాళికా, కౌశికానదులు కలిసిన దగ్గర మూడురాత్రుళ్ళు ఉప వాసం చేస్తే సర్వపాపాలూ దూరమవుతాయి.

ఊర్వశీతీర్థంలో స్నానమాడినవాళ్ళని యావన్మందీ పూజిస్తారు.

గోకర్ణంలో స్నానంచేస్తే వెనకటిజన్మ జ్ఞాపకం వుంటుంది.

సరస్వతిలో స్నానంచేసి వృషద్వీపంలో వుండుకున్న కుమార స్వామి కొలువుచేస్తె దేవవిమానంమీద ప్రయాణం చేస్తారు.

నందా, నందాలకా, ఆకాశగంగా, గంగాసాగర సంగమమూ–ఈతీర్థాల్లో స్నానంచేసినవాళ్ళకి అశ్వమేధం చేసినంత పుణ్యం వస్తుంది.

శోణానదీ, నర్మదానదీ పుట్టిన చోట్లూ, బదరీతీర్థమూ—వీట్లలో మునిగిన వాళ్ళకి ఆయుర్దాయం పెరుగుతుంది.

మహేంద్రం, రామతీర్థం, మతంగ కేదారం, వంశగుల్మం – ఈ తీర్థాల్లో స్నానం చెయ్యడమూ, అశ్వమేధం చెయ్యడమూ వొక్కటే.

శ్రీ పర్వతంమీద దేవతల మడుగులో స్నానంచేసి, శివారాధనచేస్తే కోరినకోరికలు సిద్ధిస్తాయి. అశ్వమేధం చేసినంత ఫలమూ వుంటుంది.

కృష్ణవేణిలోనూ వొక దేవతల మడుగు వుంది. దేవేంద్రుడు ఇక్కడే నూరు యజ్ఞాలుచేశాడు. అందువల్ల మిక్కిలీ పవిత్రమైందది. దేవేంద్రుడు శతక్రతువయ్యాడు (నూరుయజ్ఞాలు చేసినవాడు). కృష్ణవేణి దేవతలమడుగులో స్నానం చేస్తే పాపాలూ గీపాలూ పటాపంచలవుతాయి.

పాండ్యపర్వతం దగ్గిర కావేరిలోనూ, తుంగభద్రలోనూ, సముద్రతీరంలో కన్యాతీర్థంలోనూ స్నానంచేసినవాళ్ళకి అశ్వమేధం చేసినంతఫలం వస్తుంది.

గాయత్రీస్థానంలో మూడు రాత్రుళ్లువుండి, గాయత్రీజపం చేస్తే జన్మదుఃఖాలు వుండవు

పెన్నానదిలో స్నానమాడితే నెమళ్లూ, హంసలూ పూసిన విమానాల్లో పుణ్యలోకం వెళతారు.

గోదావరిలో స్నానంచేస్తే, పదిఅశ్వమేధాలుచేస్తే ఎంత పుణ్యమో అంతపుణ్యమూ వుంటుంది.

పయోష్ణీ, దండకారణ్యమూ, శరభంగాశ్రమమూ, జమదగ్ని సేవించిన శూర్పారకమూ, సప్తగోదావరీ-ఈతీర్థాల్లో స్నానమాడితే పుణ్యలోకాలు లభిస్తాయి.

తుంగకారణ్యం: దీన్ని చూస్తేనే చాలు, సమస్తపాపాలూ తుళ్ళిపోతాయి. పూర్వం రాక్షసులికి భయపడి ఓంకారరూపంలో వుండిపోయాయి వేదాలు. అప్పుడు అంగిరసుడు ఇక్కడే ఉద్ధరించాడు వాటిని. సారస్వతుడూ మొదలయిన వాళ్ళచేత చదివించి, ప్రచారంలోకి తెచ్చాడు. దేవతలమాటమీద భృగుమహర్షి ఇక్కడే యజ్ఞమున్నూ చేశాడు. అంతగొప్పది తుంగకారణ్యమంటే.

కాపింజర పర్వతంమీద దేవతల మడుగులో స్నానంచేస్తే సమస్తకోరికలూ సఫలమవుతాయి.

మేదికంలో స్నానం చేసినవాళ్ళు మేధావంతులవుతారు.

చిత్రకూటం దగ్గిర మందాకిని సేవించినా, భద్రస్థానంలో కుమారస్వామిని పూజించి జ్యేష్ఠమాసంలో శివపూజ చేసినా, రామనివాసం దగ్గిర శృంగిబేరపురంలో గంగాస్నానంచేసి శివారాధన చేసినా యావజ్జీవమూ చేసిన సమస్తపాపాలూ నాశనమవుతాయి.

ప్రయాగ: ప్రయాగలో నివాసంచెయ్యడమూ, నూరు యజ్ఞాలుచెయ్యడమూ ఒక్కటే. అందుకనే, దేవతలూ మహాయోగులూ సిద్ధులూ సాధ్యులూ నాగులూ అక్కడ నివసిస్తారు. అది ప్రజాపతి యజ్ఞవేదిక. అందుకనే మూడు అగ్నికుండాలు అక్కడ కనిపిస్తాయి. గంగానదీ, యమునానదీ అక్కడే కలుస్తున్నాయి. ఆ సంగమస్థానంలో వేదాలూ, యజ్ఞాలూ మూర్తిమంతాలై వుంటాయి. అరవయికోట్లా పదివేలు తీర్థాలు అక్కడే సన్నిహితమై సేవిస్తూ వుంటాయి, రాజసూయం, అశ్వమేధం చేసినవాళ్ళూ, సత్యవాదులూ, నాలుగువేదాలు క్షుణ్ణంగా చదివినవాళ్ళూ ఏపుణ్యంలో

కాలు పొందుతారో, అక్కడ ఆసంగమస్థానంలో స్నానంచేసిన వాళ్లూ అవే పొందుతారు. అక్కడే భోగవతీ, వాసుకీ,హంసవ్రతమూ అనే తీర్థాలున్నాయి. వాటిల్లోస్నానంచేస్తే పది అశ్వమేధాలు చేసి నట్టవుతుంది.

ఇది తీర్థకీర్తనం. ఇది సావధానంగా వింటేనే, సర్వతీర్థాల్లోనూ స్నానంచేసినంత ఫలం. వ్రతాలు చెయ్యనివాళ్లూ, ఉపవాసాలు నచ్చనివాళ్లూ, దుర్మతులూ, శుచీశుభ్రత లేనివాళ్ళూ తీర్థయాత్ర చెయ్యలేరు. నువ్వేమో గుణవంతుడివి. సర్వధర్మాలూ తెలిసినవాడివి. అంచేత తీర్థయాత్ర చెయ్యి'.

"ఇలా పులస్త్యుడు చెప్పినదంతా సావధానంగా విన్నాడు భీష్ముడు. ధర్మరాజా, నువ్వుకూడా తీర్థయాత్రకి బయల్దేరు. పూరుడూ పురూరవుడూలాగా, భగీరథుడూ రఘువూలాగా కృతకృత్యుడివై రాజ్యం రక్షించు.

"అన్నట్టు చెప్పడం మరిచాను. దేవరుషి రోమశుడు దేవలోకంనించి నీదగ్గిరికి వస్తూన్నాడు. ఆయన ఉపదేశం విను. ధౌమ్యుడి సలహాతీసుకుని, తీర్థయాత్రకి బయల్దేరు" అన్నాడు.

నారదుడు వెళ్ళిపోయాక, ధౌమ్యుణ్ణి దగ్గిరికి పిలిచాడు ధర్మరాజు. "ఒక్కణ్ణే పంపాను అర్జునుణ్ణి. ఆయుధాలు తెస్తాడన్న ఊహే కాని, వెనకాముందూ ఆలోచించలేకపోయాను. మనకందరికీ అతడంటే ప్రాణం. అతడులేకపోవడం కామ్యకవనమే చిన్నపోయింది. మేఘంకోసం కనిపెట్టుకువున్న చాతకపక్షుల్లాగ, అతడికోసం కనిపెట్టుకుని వున్నాం. అయితే, వొకటిమాత్రం నిశ్చయం. కార్యం సాధించికాని తిరిగిరాడు తమ్ముడు. తప్పక దివ్యాస్త్రాలు పట్టుకునే వస్తాడు. అతడు వచ్చే వరకూ మనం తీర్థయాత్ర చెయ్యడం మంచిదనిపిస్తోంది నాకు" అన్నాడు.

"అవును, నాకూ అది నచ్చింది" అంటూ భూమి నాలుగు చెరగులా వుండుకున్న పుణ్యతీర్థాల వివరం చెప్పాడు ధౌమ్యుడు. అదే సమయానికి తిన్నగా అమరావతినించి అక్కడికి వచ్చాడు రోమశ ముని. తమ్ముళ్లతోనూ, దగ్గిరవున్న బ్రాహ్మల యావన్మందితోనూ లేచి, ఎదురువెళ్ళాడు ధర్మరాజు. భక్తి తాత్పర్యాలతో పూజించాడు. కుశలమడిగి, "ఎక్కడినించి దయచేశారు?" అని అడిగాడు. "సరాసరి ఇంద్రలోకంనించి వస్తున్నాను" అన్నాడు రోమశుడు. "అన్ని లోకాలూ చూస్తూ, ఇంద్రలోకం వెళ్ళాను. అక్కడ మీ అర్జునుణ్ణి చూశాను. దేవేంద్రుడితో సరిసమానంగా, అపర దేవేంద్రుడిలాగ, అతడి అర్ధాసనంలో కూచున్నాడు మీ తమ్ముడు. స్వయంగా శివుడూ మొదలయిన దేవతలు వరాలిచ్చారు, అతడికి. అతడి తేజస్సు చూసి, చకితుణ్ణే అయిపోయాను నేను. నిజం చెపుతున్నాను. భీష్ముడూ మొదలయిన యావన్మందినీ గెలుస్తాడు నీ తమ్ముడు. అతడి పదహారో కళకైనా యుద్ధంలో కర్ణుడు సాటిరాడంటే నమ్ము.

"ఇంద్రుడిపక్క అతణ్ణి చూడడంతోనే నివ్వెరపోయాను. ఎవ్వరా అనుకున్నాను. అపుడు, ఇంద్రుడే చెప్పాడు అతడి ప్రభావం. అతడు మనుష్యుడు కాడు. దివ్యపురుషుడు. అమృతంతో పాలసముద్రంలో పుట్టిన పాశుపతం అతడికిచ్చాడు శివుడు. ఇంద్రుడూ, వరుణుడూ, కుబేరుడూ—యావన్మందీ దివ్యాస్త్రాలు ఇచ్చారు. ధర్మరాజా! క్షేమంగా అమరావతిలోవున్నాడు అర్జునుడు. అన్యులికి అసాధ్యమయిన దేవకార్యం సాధించి త్వరలోనే భూలోకం వస్తాడు. ఈవిషయం మీతో చెప్పమన్నాడు దేవేంద్రుడు.

"అంతేకాదు, తీర్థాలు సేవించినవాళ్ళకీ, పరమశాంతులికీ, తపోవంతులికీ అసాధ్యమైంది ఏదీ లేదనీ, అంచేత నీచేత తీర్థయాత్ర చేయించమనీ ప్రత్యేకం నన్ను పంపాడు దేవేంద్రుడు. అతడిమాటమీద

అందుకనే ఇలావచ్చాను. నువ్వు తీర్థయాత్ర చెయ్యడమే అర్జునుడి అభిప్రాయమున్నూ. కపిలగోవు దానమూ, స్వర్ణదానమూ, తీర్థసేవా, తపస్సూ - ఇవి చెయ్యని వాళ్ళకి ఈలోకంలోనూ పరలోకంలోనూ కూడా సుఖంలేదు. భూలోకంలోవున్న తీర్థాలు యావత్తూ లోగడ నేను రెండుసార్లు తిరిగి వచ్చాను. దేవేంద్రుడి ఆదేశం, మూడోసారి నీతో తిరిగి వస్తాను " అన్నాడు.

"నన్ను తీర్థయాత్ర చెయ్యమని, నిన్ను పంపాడు దేవేంద్రుడు! ఇంత కంటే కావలిసింది ఏముంది? కృతార్థుణ్ణయాను. ముఖ్యంగా నీ సహాయం, - నాదే అదృష్టనుంటే. సాకల్యంగా తీర్థాలు సేవిస్తాను. ధన్యుణ్ణవుతాను. అర్జునుడి క్షేమవార్త విన్నాను. ఎంతోసంతోషంగా వుంది నాకు. నువ్వు వచ్చేముందే నారదుడూ, ధౌమ్యుడూ చెప్పారు. వారిమాటమీద తీర్థయాత్ర నిశ్చయం చేసుకున్నాను. నువ్వు వచ్చావు, పెన్నిధే దొరికింది నాకు. తప్పక బయలుదేరతాను. తరిస్తాను " అన్నాడు ధర్మరాజు.

### తీ ర్థ యా త్ర

మూడు దినాల్లో అన్నిఏర్పాట్లూ చేసుకున్నాడు ధర్మరాజు. రోమశుడి మాటమీద భిక్షుచేసుకుతినే బ్రాహ్మల్నీ, యతుల్నీ వొదిలి పెట్టాడు. ధౌమ్యుడూ మొదలయిన కొద్దిమంది బ్రాహ్మలూ ద్రౌపదీ - వీళ్ళనిమాత్రం వెంటపెట్టుకున్నాడు. మార్గశీర్ష మాసం చివర తీర్థయాత్ర ఆరంభిచాడు.

"నిజంగా మాదే భాగ్యం " అన్నారు బ్రాహ్మలు. "ఆయుధాలుపట్టుకు కాపాడుతూ వుంటారు మీ తమ్ముళ్ళు. రోమశముని తీర్థదర్శనం చేయిస్తాడు. నిశ్చింతగా వస్తాము నీవెంట. మా అదృష్టమే

కాకపోతే, రాక్షసులూ, పిశాచాలూవున్న అడవుల్లోపడి మేమేమిటి, తీర్థయాత్ర చెయ్యడ మేమిటి?" అన్నారు.

బయల్దేరేముందు, వ్యాసుడూ నారదుడూ పర్వతుడూ అక్కడికి వచ్చారు. ధర్మరాజుచేసిన పూజలూఅవీ అందుకున్నారు. అవసర మయిన ఉపదేశాలూ చేశారు. "శారీరనియమాలు మానవ వ్రతాలు. మనోబుద్ధిశౌచాలు దేవవ్రతాలు. ఈరెండూ సౌమ్య వ్రతాలే. మీ తీర్థయాత్రలో ఇవి మీరు తప్పకూడదు. ఋజు మార్గం మానకూడదు. తీర్థయాత్రచేసి, మహాభిషుడూ నాభాగుడూ భరతుడూ భగీరథుడూ ముచికుందుడూ మాంధాతా సగరుడూ సార్వభౌముడూ అష్టికుడూ రోమపాదుడూ మొదలైనవాళ్ళు శత్రువుల్ని జయించారు. అలాగే నువ్వూ జయించు. సర్వలోకసౌఖ్యాలూ అనుభవించు" అంటూ ఆశీర్వదించి వెళ్ళారు.

దారికడాకా ధర్మప్రసంగాలుచేస్తూ బయల్దేరారు పాండవులు. "ప్రపంచంనడవడి చిత్రంగా వుంటుంది!" - రోమశమునితో అన్నాడు ధర్మరాజు. "అధర్మంచేసేవాళ్ళకి అభివృద్ధీ, ధర్మాత్ములికి దారిద్ర్యమున్నూ. ఎంచేత? కొండలూ, నదులూ, నదాలూ, సరస్సులూ అచేతనాలయిన్నీ పుణ్యతీర్థా లయాయి. పవిత్రవంత మయాయి. మనుష్యులపాపాలు పారదోలుతున్నాయి. ఏమిటిదీ?" అని అడిగాడు.

"అధర్మంగా నడిచేవాళ్ళ నడవడి ఎన్నడూ సమంజసమై నిల వదు" అన్నాడు రోమశుడు. "వాళ్ళకి నాశనంతప్పదు. మదించి, అధ ర్మంగా మిడిసిపడ్డ వాళ్ళని — రాక్షసుల్నీ, దైత్యుల్నీ, దానవుల్నీ వేల గొద్దీ చూశాం. వాళ్ళందరూ ఏమయారు, తుదకి? ధర్మంగా నడుచు కోవడంచేతే శక్తి సంతరించి, అభ్యుదయంతో వున్నారు దేవతలు. శ్రీవైభవాల్తో తులదూగుతూనూ వున్నారు. ధృతరాష్ట్రుడి కొడుకులు

ఇప్పుడేదో బాగా వున్నారనుకుంటున్నావు! నువ్వే చూద్దువు కాని. రాక్షసుల్లాగే విధిచేత నాశనమవుతారు వాళ్ళు.

"అధర్మంవల్ల దర్పం పుడుతుంది. దర్పంవల్ల మానం, మానం వల్ల క్రోధమూ పుడతాయి. క్రోధంవల్ల సిగ్గూ శీలమూ చెడతాయి. సిగ్గూశీలం లేనివాళ్ళ దగ్గిర వోర్పు వుండదూ, లక్ష్మీ నిలవదు. మీారో, దేవతల్లాంటివాళ్ళు. ధర్మంమీాదే మీా మనస్సు. కనక యుద్ధంలో మీారే జయిస్తారు. సర్వసంపదలూ మిమ్మల్నే వరిస్తాయి.

"ఇక, తీర్థాలసంగతి : ధర్మంగా నడుచుకునే దేవతలూ, రుషులూ తీర్థాలనే ఆశ్రయించుకుని వుంటారు. అందుకనే అవి పవిత్రంగా వుంటాయి. సమస్తమయిన కోరికలూ తీర్చగలుగుతాయి. తీర్థసేవలూ, యజ్ఞాలూ, దానాలూ, బ్రహ్మల దీవనలూ— వీటితోనే ప్రజలు పాపాలనించి విముక్తులవుతారు. సర్వశ్రేయస్సులూ సంపాదిస్తారు" అన్నాడు.

ఇలా రోమశుడి ధర్మోపదేశం వింటూ తీర్థయాత్ర ప్రారంభించారు పాండవులు. నైమిశం దర్శించారు. అశ్వతీర్థం గంగా ఘోషం కన్యాతీర్థం సేవించారు. గోమతీ బాహుదా మహానదుల్లో స్నానాలుచేశారు. ప్రయాగ వెళ్ళారు. గంగా యమునా కలిసిన చోట స్నానంచేశారు. బ్రాహ్మలికి బంగారమూ, ఆవులూ దానం చేశారు. ప్రయాగలో కొన్నిదినా లున్నారు. వేదాలు తెలిసిన బ్రాహ్మల దగ్గిర వేదార్థాలు విన్నారు. అక్కడనించి పుణ్యనదులుపుట్టిన గయ పర్వతం వెళ్ళారు. రామసరం బ్రహ్మసరం వైవశ్వతతీర్థం చూశారు. గయలో అక్షయవటందగ్గిర వేదాల్లోచెప్పినప్రకారం చాతుర్మాశ్య వ్రతాలు చేశారు. అక్కడి మునులదగ్గిర పుణ్యకథలు విన్నారు.

అప్పుడు శమఠుడని వొకముని ధర్మరాజుతో గయమాహాత్మ్యం చెప్పాడు. "వెనకటికి గయుడని వొకరాజు వుండేవాడు. అధూర్త

రయుడి కుమారుడతడు. ఇక్కడా, బ్రహ్మసరం దగ్గిరా ఎన్నో యజ్ఞాల్లో అందరూ తినగా మిగిలిన అన్నమే ఇరవైఅయిదు కొండలయింది. చుక్కలూ, ఇసకరేణువులూ లెక్కపెట్టగలమేమో, కాని అతడు యజ్ఞాల్లో ఇచ్చిన దక్షిణలు లెక్కపెట్టలేం. గయుడంటే అలాంటివాడు. అతడిపేరుమీదే గయ పుణ్యతీర్థమయింది. పితరుల హితంకోసం ఇక్కడ పిండప్రదానంచేస్తే ఇష్టసిద్ధి కలుగుతుంది" అన్నాడు. శమఠుడు చెప్పింది శ్రద్ధగా విన్నాడు ధర్మరాజు.

గయనుండి అగస్త్యాశ్రమం వెళ్ళారు పాండవులు. అక్కడ రోమశుణ్ణి అడిగాడు ధర్మరాజు: "అగస్త్యముని వాతాపిని చంపాడని విన్నాను. వివరంగా అది వినాలని వుంది–" అని. రోమశుడు చెప్పాడు:

### వాతాపి కథ

ఇల్వలుడూ వాతాపీ అని ఇద్దరూ అన్నదమ్ములు. రాక్షస రాజులు వీళ్ళు. మణిమతీపురం వీళ్ళ రాజధాని. వాతాపి చిన్నవాడు. కామరూపి. ఇల్వలుడు పెద్దవాడు. ఏది కావాలంటే అది సిద్ధించేట్టు వొకమంత్రం కావాలని వొక బ్రాహ్మణ్ణి ఆశ్రయించాడతడు. ఎంతప్రార్థించినా, మంత్రం ఉపదేశించలేదు బ్రాహ్మణుడు. ఆకక్ష బాగా పెట్టుకున్నాడు ఇల్వలుడు. తనతమ్ముడు కామరూపి కదా! అతణ్ణి మేకగా తయారుచేశాడు. ఆమేకని చంపి, బాగా కూరవండించి, బ్రాహ్మణుడికి పెట్టాడు. తృప్తిగా మాంసంతిని లేచాడు బ్రాహ్మణుడు. అలా, బ్రాహ్మణుడి కడుపులోకి వాతాపి వెళ్ళడంతోనే 'తమ్ముడూ' అని కేకపెట్టాడు ఇల్వలుడు. అన్న పిలవడమేతడువు, బ్రాహ్మణుడి కడుపులో బతికి లేచాడు వాతాపి. అతడి బొజ్జపగిలించుకుని బైటికి వచ్చాడు. బ్రాహ్మణుడు మరణించాడు. అది మొదలు బ్రాహ్మణున్న

నాడు తనదగ్గిరికి అతిథిగావస్తే చాలు, ఇదేపని చేసేవాడు. ఇలా ఎంతో మందిని చంపుతూ వచ్చాడు ఇల్వలుడు.

వీళ్ళసంగతి ఇక్కడ ఇలా వుంది. ఇక అగస్త్యమునిసంగతి చెపుతాను విను. మొదట బ్రహ్మచర్యాశ్రమంలో వుండేవాడు ఆయన. ఘోరమయిన తపస్సుచేస్తూ అడవుల్లో గడిపేవాడు. ఒక నాడు వెళుతూ వెళుతూ తన పితరుల్ని చూశాడు. ఒక గుమ్మిలో తల్లకిందులా వేలాడుతున్నారు వాళ్ళు. దగ్గిరికివెళ్ళి 'ఎందుకిలా వున్నారు?' అని అడిగాడు అగస్త్యుడు. 'నీ తాత ముత్తాతల మోయ్' అన్నారు వాళ్ళు. 'నువ్వేమో బ్రహ్మచారివై కూచు న్నావు. తపస్సు తప్ప సంతానం మాటే తలపెట్టవు. అంచేత, ఊర్ధ్వ గతి లేకండా పోతున్నాది మాకు. నీ అనంతరం అధోలోకమే గతి. ఇహనైనా నువ్వు పెళ్ళి చేసుకుని, ఒక ఇంటివాడి వయితే, బతికి పోతాం. నీకు సంతానం కలగడంతోటే, పుణ్యలోకాలు వస్తాయి మాకు' అన్నారు.

'మీ ఆదేశం ప్రకారం తప్పక పెళ్ళిచేసుకుంటాను' అని మాటఇచ్చి వచ్చాడు అగస్త్యుడు. అసమయంలో విదర్భరాజు సంతా నంకోసం విచారిస్తున్నాడు. తన తపశ్శక్తివల్ల అతడికి ఒక కూతురు కలిగేట్టుచేశాడు అగస్త్యుడు. ఆమే లోపాముద్ర. నీళ్ళల్లో పద్మం లాగా, వినయం కలవాడిదగ్గిర ధనంలాగా, పూనికకలవాడిదగ్గిర విద్య లాగా పెరిగి పెద్దదయింది లోపాముద్ర. యవ్వనానికి తగిన అందం, అందానికి తగిన బుద్ధీ - చెప్పతరంకానట్టు వుం దామె. వయస్సు లోనూ, రూపంలోనూ ఆమెతో సమానమయిన వందమంది చెలికత్తె లతో, చుక్కల్లో చంద్రుడిలా వుండే దామె.

లోపాముద్ర అంటే, ప్రతి రాకుమారుడికీ ఆశగా వుండేది. కాని అగస్త్యముని భయం వల్ల ఎవ్వరూ పైకి తేలేవాళ్లు కాదు.

తండ్రిమాత్రం తగిన వరుడికోసం ఛప్పన్న దేశాలూ గాలిస్తూ వుండేవాడు.

ఒకనాడు సరాసరి అగస్త్యుడే వచ్చాడు విదర్భ రాజునిచూసి లోపాముద్రని తనకిచ్చి పెళ్ళిచెయ్యమన్నాడు. రాజూ రాణీ ఇద్దరికీ గుండెల్లో రాయిపడ్డట్టయింది. 'నారలు కట్టుకుని, ఆకూ అలమూ తింటూ అడివిలో ముక్కుమూసుకు నే(బ్రాహ్మడీయన. ఈయనకిస్తే, మన అమ్మాయినీ నారలు కట్టుకోమంటాడు. ఆకూ అలమూ తినమంటాడు. అడివిలో జపంచేసుకు కూచోమంటాడు. మహాసుఖాలు అనుభవించ దగ్గ పిల్లని తెలిసి తెలిసీ ఎలా గంగలో తొయ్యడం? కాదూపోదూ అంటే శాపం పెడతాడేమో, ముని. ఏం దారి?' అంటూ విచారిస్తూ కూచున్నారు వాళ్ళు.

అంతా తెలుసుకుంది లోపాముద్ర. తల్లిదండ్రుల్ని విచారించ వద్దనీ ధైర్యం చెప్పింది. అగస్త్యుడికే ఇచ్చి తనని వివాహం చెయ్య మని వాళ్ళకి నచ్చజెప్పింది.

అగస్త్య లోపాముద్రల వివాహం విధ్యుక్తంగా జరిగిపోయింది. వివాహానంతరం భార్య నగలూ అవీ తీయించివేశాడు అగస్త్యుడు. నారలూ, లేడిచర్మమూ కట్టించాడు. హరిద్వారం తీసుకుపోయి తపస్సు మొదలుపెట్టాడు.

యవ్వనంతో నవనవలాడుతూవుంది లోపాముద్ర. ఋతుస్నానం చేసి, బాగా వికసించిన పద్మంలా వుంది. ఆమె వాలుచూపులూ, అవయవాలూ అవీ ఆగనివ్వలేదు అగస్త్యుణ్ణి. ముని అభిలాష అవగత మైంది లోపాముద్రకి. సిగ్గుపడుతూ భర్తముందు చేతులుజోడించింది. సంతానంకోరి, భర్త భార్యని కలవడం లోకధర్మమే. కానైతే,

వాక్కు ప్రార్థన చెల్లించమని కోరుతున్నాను. నగలూ నాణేలూ, మంచిచీరే, వాటితో నన్ను ముస్తాబుచెయ్యి. నువ్వూ పరిమళ ద్రవ్యాలూ అవీ పూసుకో. పూలమాలలూ వస్త్రవులూ ధరించు. ఇలా సంతోషంతో నన్ను పరిగ్రహించు. ఈరుతుదినాల్లో నాకు సంతానం అనుగ్రహించు' అంది.

'బావుంది, నువ్వు కోరినవన్నీ కావాలంటే ధనం కావాలి' అన్నాడు అగస్త్యుడు. 'నాదగ్గిర తపోధనంతప్ప మరో ధనం లేదు. తపోధనంతో అన్నీ సాధించవచ్చు. నిజమే, కాని వీటికోసం తపస్సు ఖర్చుపెట్టడం నాకు నచ్చనిపని. సరే, ఏరాజునయినా యాచిస్తాను. నీకోరిక తీరుస్తాను; వుండు' అని ధనయాచనకోసం బయల్దేరాడాయన.

ఆవెళ్ళడం వెళ్ళడం తిన్నగా శ్రుతపర్వుడు అనే రాజుదగ్గిరికి వెళ్ళాడు అగస్త్యుడు. అతడు చేసిన గౌరవాలూ అవీ అయాక, తాను వచ్చినపని చెప్పాడు. 'నువ్వు పోషిస్తూ వున్న వాళ్ళకి ఇబ్బంది కలగకండా నీఆదాయంలో ఏమయినా ధనం మిగిలివుంటే అది నాకియ్యి' అని కోరాడు.

'జమఎంతో ఖర్చూఅంతే అవుతోంది నాకు. సున్నకిసున్నా హళ్ళికి హళ్ళిగావుంది నాఖజానా' — చేతులు జోడిస్తూ నివేదించాడు శ్రుతపర్వుడు. ఇద్దరూ కలిసి బ్రధ్నశ్వుడు అనే మరోరాజు దగ్గిరికి వెళ్ళారు. ఇద్దరినీ గౌరవించి, కారణం కనుక్కున్నాడు బ్రధ్నశ్వుడు. శ్రుతపర్వుణ్ణి అడిగినట్టే, బ్రధ్నశ్వుణ్ణీ అడిగాడు అగస్త్యుడు. అతడూ తన ఆదాయవ్యయాలు సమంగానే వున్నాయన్నాడు. మిగులు లేదన్నాడు. ముగ్గురూ కలిసి పురుకుత్సుడి కుమారుడు త్రసదస్యుడనే రాజుదగ్గిరికి వెళ్ళారు. అక్కడా అలాగే అడిగాడు అగస్త్యుడు. త్రసదస్యుడూ మొదటి ఇద్దరిలాగే జవాబుచెప్పాడు. అయితే, 'మణిమతీ

పురం వెళ్ళితే మనకోర్కె సిద్ధిస్తుంద'ని చెప్పాడు. 'తమ్ముడు వాతా పితో కలిసి ఏలుబడి సాగిస్తున్నాడు ఇల్వలుడు. అతడిదగ్గిర ఎంతో అంత ధనం నిలవవుంది. అతణ్ణి మించిన ధనవంతుడు లేడనే చెప్పాలి, భూలోకంమీద' అన్నాడు. ముగ్గురు రాజులూ, అగస్త్య మునీ కలిసి మణిమతీపురం వెళ్ళారు.

అపరిమితమైన ఆదరం చూపించాడు ఇల్వలుడు. అతిథిపూజా అదీచేసి ఆప్యాయం కనపరిచాడు. తరవాత, వుండనేవుండిగా అతడి వ్రతం – బ్రాహ్మణ్ణంటే చంపబోవడం – అగస్త్యుణ్ణీ అదేపని చేశాడు. వాతాపిని మేకచేసి చంపాడు. ఆ మాంసం మంచి బాగా కూరవండిం చాడు. అదంతా అగస్త్యుడికి భోజనం పెట్టాడు.

ఇల్వలుడి సంగతి ముందే తెలుసు రాజులికి. అంచేత, వాడు పెట్టినమాంసం తినవద్దన్నారు ఋషిని. 'తమ్ముణ్ణి మేకచేసి చంపు తాడు. ఆమాంసంపెట్టి బ్రాహ్మల్ని చంపుతాడు. వీడి భోజనమే అక్కర్లేదు మనకి. ధనమిచ్చాడా పుచ్చుకు వెళదాం. అంతే. మరేమీ వద్దుమనకి' అన్నారు.

వినుకోలేదు ముని. తృప్తిగా పీకలదాకా మాంసంతిని లేచాడు. ఆనవాయితీప్రకారం వాతాపిని పిలిచాడు ఇల్వలుడు. 'తమ్ముడూ! తమ్ముడూ!' – మరెక్కడి తమ్ముడు! కడుపు తడువుకుని గ్రుని తేన్చాడు అగస్త్యుడు. కడుపులోని వాతాపి కడుపులోనే జీర్ణమై పూరుకున్నాడు.

ఎప్పటిలాగే రావలిసిన వాతాపి రాలేదు. ఇదీ వాతాపిని అగ స్త్యుడు జీర్ణంచేసుకున్న కథ. అగస్త్యుడు శక్తికి అడిలిపోయాడు ఇల్వ లుడు. విచారించాడా, తనమోసం బట్టబయలవుతుంది. దుఃఖం ముం చుకు వస్తున్నా, సంతోషంగా వున్నట్టే నటించాడు. ఇలా తన

మనోభావం కనపడనివ్వకండా ముని ముందు చేతులు జోడించాడు. 'ఏం పనిమీద దయచేశారో సెలవియ్యండి' అన్నాడు.

'నువ్వు గొప్ప ధనవంతుడివని తెలుసు మాకు. అందుకని ఈ ముగ్గురు రాజులూ, నేనూ నీదగ్గిర ధనమడిగి పుచ్చుకుందామని వచ్చాం' అన్నాడు అగస్త్యుడు. 'ఎంతకావాలో చెప్పండి. మీరు ఎంతకావాలంటే అంతా ఇస్తాను' అన్నాడు ఇల్వలుడు.

'ఈరాజులు ముగ్గురికీ తలా పదివేలుఆవులూ, పదివేలుబంగారం వరహాలూ ఇయ్యి. ఇరవైవేల ఆవులూ, ఇరవయివేల బంగారం వరహాలూ, ఒక బంగారంరథమూ నాకు ఇయ్యి' అన్నాడు అగస్త్యుడు. అడిగినంతా ఇచ్చాడు ఇల్వలుడు. రథానికి విరావమూ సురావమూ అని మంచి గుర్రాలు పూశాడు. ఇల్వలుడిచ్చిన ధనంతో సహా రాజులూ మునీ రథంమీద కూచున్నారు. తన సైన్యంకూడా వెంట ఇచ్చి అగస్త్యుడి ఆశ్రమానికి పంపించాడు ఇల్వలుడు.

తమ తమ రాజ్యాలికి వెళ్ళిపోయారు రాజులు. లోపాముద్ర కోరినవన్నీ పెట్టి ఆమెని సంతోష పెట్టాడు అగస్త్యుడు. తానూ చక్కగా అలంకరించుకున్నాడు. లోపాముద్రని కౌగిలిలోకి లాక్కు-న్నాడు. 'ఎంతమంది కొడుకులు కనాలనివుందో చెప్పు' అంటూ లాలించాడు. 'పదిమందితో సమానమయినవాళ్ళు వందమంది కావాలా? వందమందితో పోలినవాళ్ళు పదిమంది కావాలా? పోనీ, వెయ్యి మంది కావాలా? అదీకాదు ఇదీకాదు వెయ్యిమందితో సమానమయినవాడు ఒక్కడు కావాలా? చెప్పు. ఏమిటి నీఅభిలాష?' అని అడిగాడు.

ముసిముసినవ్వుల్తో మురిపించింది లోపాముద్ర. 'కొరగాని కొడుకులు కోటిమంది పుడితేమాత్రం ఏంలాభం? వెయ్యిమందిని

పోలిన ఉత్తముణ్ణి వొక్కణ్ణి అనుగ్రహించు. చాలు' అని తలవొంచు కుందామె. 'నువ్వు కోరుకున్న కొడుకు పుడతాడు' అన్నాడు ముని. నీళ్ళాడింది లోపాముద్ర. తపోవనానికి వెళ్ళిపోయాడు ముని. ఏడేళ్ళు గర్భం మోసింది లోపాముద్ర. ఏడోఏట దేదీప్యమానమయిన కుమారుడు కలిగాడు. అతడిపేరు దృఢస్యుడు. వేదరహస్యాలు జపంజేస్తూనే పుట్టా డతడు. నిజంగా వెయ్యిమందికుమాళ్ళు వొకఎత్తూ దృఢస్యుడు వొకఎత్తున్నూ. దృఢస్యుడికి తేజస్వి అని వొకకుమారుడు కలిగాడు. అతడు చెప్పలేనంత ఇధ్మభారం—అంటే కర్రలబరువు మొయ్యడంచేత, ఇధ్మభారుడనీ అన్నారు అతణ్ణి. ఇలా అగస్త్యముని కొడుకునీ, మనమణ్ణీ కని తన పితరులికి పుణ్యలోకాలు కలిగించాడు.

---

[వ్యాభా. అ-19]

# అరణ్యపర్వం

## మూడో ఆశ్వాసం



### అగస్త్యముని కథ

వాతాపికథ విన్నాడు ధర్మరాజు. "అగస్త్యముని చరిత్ర ఇంకా వినాలని వుంది" అన్నాడు. రోమశుడు మొదలు పెట్టాడు:

కృతయుగంలో వృత్రాసురుడి ఉపద్రవం అధికంగా వుండేది. కాలకేయుల్తో కలసి వాడు దేవేంద్రుణ్ణీ, దేవతల్నీ నాన బాధలూ పెట్టేవాడు. భరించలేకపోయారు దేవతలు. బ్రహ్మదగ్గిరికివెళ్ళి మొర పెట్టుకున్నారు. వృత్రుణ్ణిచంపే ఉపాయమేదో చెప్పమన్నారు. 'దధీచి ముని ఎముకలతో కాని మీకోర్కి సిద్ధించదు' అన్నాడు బ్రహ్మ. 'దధీచి సరస్వతీవొడ్డుని తపస్సుచేస్తున్నాడు. వెళ్ళి ప్రార్థించండి. తన ఎముకలు ఇస్తాడతడు. వాటితో వజ్రాయుధం మొదలయిన ఆయుధా లవుతాయి. ఆ ఆయుధాల్తో రాక్షసులు చస్తారు. వజ్రా యుధంతో ఇంద్రుడు వృత్రాసురుణ్ణి చంపుతాడు' అన్నాడు.

దేవేంద్రుడితోసహా దధీచిముని దగ్గిరికి వెళ్ళారు దేవతలు. దేవతల కోసం ఎముకలిచ్చి మహోపకారం చెయ్యమని కోరారు. 'ఇంతకంటే కృతార్థత ఏముంది?' అన్నాడు దధీచి. దేవకార్యం కోసం నవ్వుతూ ప్రాణంవొదిలిపెట్టాడతడు. అతడి ఎముకలతో ఆయు ధాలు చేసుకున్నారు దేవతలు. వెన్నముకతో వజ్రాయుధం తయారు చేశాడు బ్రహ్మ. వందఅంచులతో అద్భుతంగా తయారైంది వజ్రా యుధం. ధగధగా మెరిసిపోతూనూ వుంది. 'దీంతో రాక్షససంహారం.

చెయ్యి' అంటూ అది దేవేంద్రుడికిచ్చాడు బ్రహ్మ. దాంతో వృత్రుణ్ణి చంపాడు దేవేంద్రుడు.

వృత్రుడేమో చచ్చాడు. కాలకేయులు మాత్రం మిగిలిపోయారు దేవతలతో యుద్ధానికి రాకుండా సముద్రంలో దాగున్నారు వాళ్ళు. పగలంతా సముద్రంలో వుండేవాళ్ళు. రాత్రిపడగానే బయటికి వచ్చే వాళ్ళు. ప్రజల్ని బాధించుకు తినేవాళ్ళు. 'విద్యా, తపస్సూ వున్న ధర్మాత్ముల వల్లే ప్రపంచాలు అపాయం లేకుండా వున్నాయి. అలాంటి వాళ్ళని అందరినీ వెదికి చంపమంటే, లోకానికి గుణపాఠం నేర్పిన వాళ్ళమవుతాం' అని నిశ్చయించుకుని, మునుల ఆశ్రమాలమీద దాడి ప్రారంభించారు. ఒక రాత్రి వశిష్ఠుడి ఆశ్రమం ముట్టడించారు. నూటా తొంభయి ఏడుగుర్ని పట్టుకు తినేశారు. మరో రాత్రి చ్యవనుడి ఆశ్రమం మీద విరుచుకుపడ్డారు. వందమందిని మింగేశారు. మరో రాత్రి భరద్వాజాశ్రమంలో ఇరవై మందిని విరుచుకు తిన్నారు. ఇలా బ్రాహ్మల్నీ, ఋషుల్నీ వందలూ, వేలూ తినేస్తూ మునిపల్లెలు నిర్మానుష్యం చెయ్యడం మొదలుపెట్టారు.

యజ్ఞాలు నిలిచిపోయాయి. పుణ్యకర్మలు మూలబడ్డాయి. దేవతలకి ఆహుతులు ఆగిపోయాయి. దేవతల్లో భయోత్పాతమే పుట్టిపోయింది. ముక్కోటి దేవతలూ సమావేశమైనారు. దేవేంద్రుడి నాయకత్వంకింద అగ్నీ, యముడూ, వరుణుడూ, కుబేరుడూ మొదలయినవాళ్ళంతా వైకుంఠానికి వెళ్ళి, విష్ణుమూర్తి దగ్గిర చేతులు జోడించారు. 'ప్రభూ! వరాహావతారమెత్తి భూమిని ఉద్ధరించావు. నరసింహావతారమెత్తి దైత్యుల మూలపురుషుణ్ణి హిరణ్యకశిపుణ్ణి చంపావు. వామనావతారమెత్తి బలిచక్రవర్తిని పాతాళానికి తొక్కావు. యజ్ఞమూర్తివై యజ్ఞవిరోధి జంబుకుణ్ణి సంహరించావు. గుడ్లవల్లా, మాని

వల్లా, చెమటవల్లా, విత్తులవల్లా * — ఈ నాలుగింటివల్లా పుట్టిన సర్వ ప్రాణుల్నీ రక్షిస్తున్నావు. జగద్రక్షకుడివి. మా విన్నపం చిత్తగించు.

'కాలకేయుల ఉపద్రవం దుర్భరంగా వుంది. బ్రహ్మాండమయిన శరీరాలు వాళ్ళవి. నీటికోటలుకట్టుకుని పగలంతా సముద్రంలో వుంటున్నారువాళ్లు. రాత్రిళ్లుపైకివస్తారు. సర్వఘోరాలూచేస్తున్నారు. ఆశ్రమాలమీదపడి మునీశ్వర్లని చంపేస్తున్నారు. ఏనాడూ లేదింత బ్రాహ్మణహింస. పరమసాధువుల్ని ఇలా బాధించడంతో, భూలోకానికే బాధ కలుగుతోంది. భూమి బాధపడడంవల్ల ప్రపంచాలు యావత్తూ బాధపడుతున్నాయి. వేదాలు జీర్ణించుకున్న బ్రాహ్మలు, వేదాల్లోని పుణ్యకర్మలు చేస్తారు. కాగా, హవ్యాలవల్ల దేవతలూ, కవ్యాలవల్ల పితరులూ తృప్తులవుతారు. వారివల్ల లోకాలు సుఖపడతాయి. అంచేత, బ్రాహ్మణబాధ లేకండా అనుగ్రహించు. లోకాలు రక్షించు' అంటూ ప్రార్థించారు

ప్రసన్నుడయాడు విష్ణుమూర్తి. 'మహాబలవంతులు కాలకేయులు. సముద్రంలో వున్నంతవరకూ వాళ్ళని సాధించడం కష్టం. సముద్రం నీరంతా తీసెయ్యాలి. అప్పుడూ వాళ్ళపని పట్టించాలి. ఇది తప్పిస్తే మరోఉపాయం లేదు. ఐతే, భయపడకండి మీరు. సముద్రం నీళ్ళన్నీ వరుణుడివి కదా! మిత్రుడూ, వరుణుడూ కన్నకొడుకు అగస్త్యుడు. ♦ అంచేత, అతడే సముద్రం నీళ్ళన్నీ తాగెయ్యగలడు. వెళ్ళండి అగస్త్యుణ్ణి ప్రార్థించండి' అన్నాడు.

---

* గుడ్లవల్ల పుట్టినవి (అండజాలు) పక్షులూ, పాములూ, మొ.
మావివల్ల పుట్టినవి (జరాయుజాలు) మనుష్యులూ, మృగాలూ. మొ.
చెమటవల్ల పుట్టినవి (స్వేదజాలు) నల్లులూ, పేళ్ళూ మొ.
విత్తులవల్ల పుట్టినవి (ఉద్భిజ్జాలు) చెట్లూ, గడ్డీ. మొ.

♦ వెనకటికి వోనాడు మిత్రుడూ, వరుణుడూ వస్తూవస్తూ దారిలో ఊర్వశిని చూశారు

విష్ణువుదగ్గిర సెలవుతీసుకున్నారు దేవతలు. అగస్త్యుడిదగ్గిరికి వచ్చారు. అప్పటికే దక్షిణదేశంలో వున్నాడు అగస్త్యుడు. ఎన్నో విధాల అతణ్ణి ప్రార్థించారు. 'దేవలోకకళ్యాణం నీవల్లే కావాలి. వెనకటికి వింధ్యపర్వతం పెరిగి ప్రపంచానికి ఉపద్రవం తెచ్చిపెట్టినపుడు నువ్వే ఉద్ధరించావు. మహామునీ, ఇప్పుడూ నువ్వే కరుణించు' అన్నారు.

"ఐతే, వింధ్య ఎందుకు పెరిగింది ? అది అగస్త్యుడెలా వారించాడు ? " అని అడిగాడు ధర్మరాజు. "చెపుతాను, విను" అంటూ ప్రారంభించాడు రోమశుడు.

మేరుపర్వతంచుట్టూ సూర్యుడు ప్రదక్షిణంచేస్తున్నాడు కదా ! అదిచూసి మచ్చరంపట్టుకుంది వింధ్యకి. ఆకోపంతో సూర్యుణ్ణే నిలదీసి అడిగింది, వొకనాడు. 'మేరువుకంటే ఏమంత తీసిపోయామని, నువ్వురోజూ దానిచుట్టే తిరుగుతున్నావు ? నాచుట్టూ తిరగవేం ? మతీసుతీ లేనట్టుంది నీకు ! ఏమిటిది ?' అంటూ నిక్కచ్చి చేసింది.

'నన్నేం చెయ్యమన్నావు ?' అన్నాడు సూర్యుడు. 'మొదటినించీ విధి విధించిన విధాన మది. ఇందులో నాస్వేచ్ఛ పనికిరాదు' అన్నాడు. అరికాలిమంట నెత్తికెక్కింది వింధ్యకి. 'ఐతే, అదేదో చూస్తానుండు' అంటూ రుసరుస లాడింది. పొడావుగా అదే పెరగడం మొదలుపెట్టింది. మేఘాలుదాటి ఆకాశంమీదికే పెరిగిపోయింది. ఇంకా — ఇంకా ఎత్తుగా, సూర్యుడూ చంద్రుడూ నక్షత్రాలూ నడవడానికి వీలులేకండా పే—ద్ద రాకాసిలా ఆకాశమంతా ఆక్రమించింది.

---

అవెంటనే వాళ్ళకి వీర్యస్ఖలనం అయిపోయింది. ఊర్వశి అది తీసి, వొక కుండలో భద్రపరిచింది. కొన్నాళ్ళకి ఆకుండలోంచి అగస్త్యుడూ వశిష్ఠుడూ పుట్టారు. వశిష్ఠుడు మొదట బ్రహ్మ మానసపుత్రుడు. ముని శాపంవల్ల దేహం పోగొట్టుకుని తిరిగీ ఇలా పుట్టాడు.

సూర్యచంద్రుల రాకపోకలు ఆగిపోయాయి. నక్షత్రాలూ గ్రహాలూ వచ్చి వింధ్యందగ్గిర చిక్కుపడిపోయాయి. ఇది రాత్రీ, ఇది పగలూ అని తెలియడం లేదు. అంతా గుడ్డిగా అయిపోయింది. దేవతలందరూ పరుగెత్తుకువచ్చారు. ఎన్నోవిధాల బోధచేశారు. ఊహుం మంకుపట్టుకు కూచుంది వింధ్యం. ఏం దారి?

అప్పుడు అగస్త్యుణ్ణి వెళ్ళి ఆశ్రయించారు దేవతలు. 'సూర్య చంద్రుల గతులు నిలిచిపోయాయి. లోకాలు స్తంభించి పోయాయి. వింధ్యపెరుగుదల నివారించాలి. ఈపని నువ్వేచెయ్యాలి. మరొకరికి సాధ్యంకాదు' అంటూ కాళ్ళావేళ్ళా పడ్డారు.

లోపాముద్రని వెంటపెట్టుకుని వింధ్యం వచ్చాడు అగస్త్యుడు. భక్తిపూర్వకంగా ఋషిని పూజించింది వింధ్యం. 'దక్షిణదేశం వెళతాను. దారి కావాలి' అన్నాడు అగస్త్యుడు. 'చిత్తం' అంటూ నేల మట్టంగా తల వొగ్గింది వింధ్యం. 'ఇదిగో, మన సద్భావం కలకాలమూ వుండాలి. నేనుమళ్ళీ తిరిగివచ్చేదాకామాత్రం నువ్వు ఇలాగే వుండాలి' అన్నాడు ముని. 'మహాప్రసాదం' అంది వింధ్యం. దక్షిణానికి వెళ్ళాడు అగస్త్యుడు. ఆవెళ్ళడం వెళ్ళడం అక్కడే వుండిపోయాడు మరి తిరుగుముఖంపట్టలేదు. అదీ ఆకథ. ఇక ప్రకృతానికి వద్దాం.

అలా దేవతలు తనని పొగుడుతూవుంటే, చల్లని చిరునవ్వు నవ్వాడు అగస్త్యుడు. 'ఏమిటి సంగతి? చెప్పండి' అన్నాడు. కాలకేయుల ఘోరాలు వివరించారు దేవతలు. దీనికి ప్రతిక్రియ మాకు సాధ్యంకాకండావుంది. నువ్వే పుణ్యంకట్టుకోవాలి. సముద్రంనీళ్ళు నువ్వు తాగి తేచాలు. మాఆయుధాల్తో వాళ్ళపనిపట్టేస్తాం మేం అన్నారు. 'సరే, కానియ్యండి' అన్నాడు అగస్త్యుడు. సముద్ర దగ్గిరికి ప్రయాణమయ్యా డతడు.

కెరటాల చేతుల్తో భరతం పడుతున్నట్టుంది సముద్రం. గాలి కుదవేస్తుంటే, మీాదికి వచ్చేస్తున్నట్టుంది. పర్వతగుహల్లోకి పరిగెడుతున్నట్టుంది. నురుగు నురుగులయి నవ్వుతున్నట్టుంది. క్రూరమయిన మొసళ్ళూవాటితో అల్లకల్లోలంగానూ వుంది.

సముద్రం దగ్గిరికి వచ్చాడు అగస్త్యుడు. దేవతలూ, మహామునులూ, గరుడులూ, ఖచరులూ, సిద్ధులూ, గంధర్వులూ, నాగులూ, యక్షులూ— యావన్మందీ వెంటవచ్చారు. యావన్మందీ ముక్కుమీాద వేలు పెట్టుకుని బొమ్మల్లాగ చూస్తూనే వున్నారు. గుటకల మీాద గుటకలు వేస్తూ సముద్రంనీళ్ళన్నీ తాగేశాడు అగస్త్యుడు. ఒన్న చుక్కన్నా మిగలకండా ఖాళీఅయిపోయింది సముద్రం. తిమి తిమింగలాలూ, మొసళ్ళూ, తాబేళ్ళూ, పాములూ, ఎండ్రపీతలూ—ఇలాంటివన్నీ కళవిళ పడతూ బైటపడ్డాయి. వాటితోపాటు కాలకేయులూ బయటపడ్డారు. కాలకేయులు కనపడడమే తడువు, విరుచుకుపడ్డారు దేవతలు. దేవేంద్రుడి నాయకత్వంకింద యుద్ధమే లంకించుకున్నారు.

హటాత్తుగా వచ్చినదాడి కాసుకోలేకపోయారు కాలకేయులు. దేవతల ఆయుధాలికి బలేఅయిపోయారు కొందరు. భయపడి పాతాళం చొరబడ్డారు కొందరు. కకావికలై కాళ్ళకి బుద్ధిచెప్పారు కొందరు. ఇలా కాలకేయులు అడగారిపోవడంతోటే హాయిగా సుఖపడింది లోకం. 'ఇదంతా మహాత్మా, నీవల్లే' అని అగస్త్యుడికి జేజేలు పెట్టారు దేవతలు. 'కాలకేయుల పనేమో కడతేరింది. ఇక సముద్రం యథాప్రకారం నిండించు. ఎన్నో జంతువులికి ఆశ్రయం ఇది. ఇలా ఇంకిపోయివుంటే ఎలాగ?' అంటూ వేడుకున్నారు.

'నీళ్ళు నేనెక్కడ తెచ్చేది?' అన్నాడు అగస్త్యుడు. 'నాకడుపులో అప్పుడే అరిగిపోయాయి అవి. ఒక్క చుక్క తెమ్మన్నా తేలేను' అన్నాడతడు.

గట్టిచిక్కి వచ్చింది. సముద్రం నిండే దారేమిటి? మునులూ, దేవతలూ అంతా కలిసి బ్రహ్మదగ్గిరికి వెళ్ళారు. 'సముద్రంలోకి నీ ళ్ళలా వస్తాయో' చెప్పమన్నారు. బాగా ఆలోచించాడు బ్రహ్మ. 'లాభంలేదు' అని పెదివి విరిచాడు. 'ఎంతో కాలం ఇలా వుండవలిసిందే. కొంతకాలం గడిచాక, భగీరథుడు అని వొకడు పుడతాడు. అదిగో అతడే సముద్రం నింపుతాడు. ఇంకొకడికి సాధ్యంకాదు' అన్నాడు. ఇహ చేసేదేముంది? ఎవరని వేశాలికి వాళ్ళు వచ్చేశారు మునులూ దేవతలున్నూ. అదీ అగస్త్యుడి కథ.

"ఐతే, భగీరథుడు సముద్రం ఎలానింపాడు?" అని అడిగాడు ధర్మరాజు. రోమశుడు చెప్పాడు.

భ గీ ర థు డి క థ

పూర్వం ఇక్ష్వాకువంశంలో సగరుడని వొక మహారాజు వుండేవాడు. అప్పటికి ప్రబలంగావుండిన హైహయవంశంరాజుల్ని జయించి, ప్రపంచ మంతా ఏకశాసనంకింద ఏలుబడి సాగించాడతడు. వైదర్భి, శైబ్యా అని అతడికి ఇద్దరు భార్యలు. అయితే సంతానం మాత్రం లేదు. ఆవిచారంతో ఇల్లువొదిలి తపస్సుకి వెళ్ళిపోయా డతడు. కైలాసపర్వతంమీద ఘోరమయిన తపస్సుచేశాడు. కొన్నాళ్ళకి శివుడు ప్రత్యక్షమయాడు. ఏం కావాలో కోరమన్నాడు. కుమాళ్లు కావాలని ప్రార్థించాడు సగరుడు. వైదర్భికి అరవయివేలమంది కుమాళ్లూ, శైబ్యకి వొకకుమారుడూ కలిగేటట్టు వరమిచ్చాడు శివుడు. వైదర్భికొడుకులు పొగరుపోతులవుతారనీ, అందరూ వొకేసారి కాలంచేస్తారనీ, శైబ్యకొడుకు మాత్రం వంశకర్త అవుతాడనీ చెప్పాడు.

'ఇంతమంది కలిగినా, కలగనట్టే కదా,' అని విచారిస్తూ ఇంటికివచ్చేశారు సగర దంపతులు. కొన్నాళ్లు గడిచాయి. సగరుడి

భార్యలు ఇద్దరూ నీళ్లాడారు. శైబ్యకి అసమంజసుడని వొక కొడుకు పుట్టాడు. వైదర్భికిమాత్రం వింతగా వొక ఆనపకాయ పుట్టింది. 'అరవై వేలమంది పుడాతారని వరమిచ్చాడు శివుడు. అరవై వేలమందికి బదులు ఆనపకాయ ?' అంటూ అది పారవెయ్యటానికి సిద్ధపడ్డాడు సగరుడు. కూడదంటూ కేకవేసింది ఆకాశవాణి. 'రాజా! తొందర పడకు. దీనివిత్తనాలు వొక నేతిజాడీలో జాగ్రత్తచెయ్యి. వాటి లోంచి నిక్షేపంలాంటి కొడుకులు అరవై వేలమంది పుడతారు' అంది.

ఆనపవిత్తనాలు నేతిజాడీలో వేశాడు సగరుడు. రెండు మాసాలు గడిచింది. ఆనపవిత్తుల్లోంచి అరవై వేలమంది కొడుకులూ పుట్టారు. వాళ్ళంతా విపరీతంగా పెరిగారు. భూమీ ఆకాశం రెంటినీ తాళాలు వాయించేటట్టు తయారయారు. ఇంద్రలోకం మొదలుకుని అన్నిలోకాలూ హింసించడం మొదలుపెట్టారు. అసమంజసుడూ వొక రాక్షసుడిలా తయారయాడు. ఊళ్ళో పసిపిల్లలు కనపడితే చాలు, పీకపిసికి ఏట్లోపారేసేవాడు. మహా గోలపెట్టారు ప్రజలు. దాంతో అతణ్ణి రాజ్యం వెళ్లగొట్టాడు సగరుడు.

సగరపుత్రుల దుర్న్యాయాలు సహించలేక పోయారు దేవతలు. బ్రహ్మదగ్గిరికి వెళ్ళి మొరపెట్టారు. 'భయపడకండి' అన్నాడు బ్రహ్మ. 'వాళ్లపాగరే వాళ్ళని భస్మం చేస్తుంది. మీరు అలా చూస్తూ వుండండి' అన్నాడు. కొన్నాళ్ళయాక, అశ్వమేధయాగం తలపెట్టాడు సగరచక్రవర్తి. అన్నీ సిద్ధమయినాయి. గుర్రం వొదిలిపెట్టారు. దాన్ని రక్షిస్తూ సగరుడి కుమాళ్ళు వెంటనడిచారు. ప్రపంచమంతా తిరిగింది గుర్రం. చివరికినీళ్ళులేని సముద్రంలో దిగింది, అంతే. మరి కనపడలేదు. ఎంతో వెదికారు రాజకుమాళ్ళు. కనపడలేదు. తిరిగివచ్చి తండ్రితో చెప్పారు. 'పాతాళం తవ్వి అయినా గుర్రం పట్టుకురండి' అన్నాడు సగరుడు. అరవై వేలమంది సగరకుమాళ్ళూ వెళ్ళారు. సముద్రంలో

దిగబడ్డారు. పారలూ, గడ్డపారలూ పట్టుకుని బురదంతా తిరగవేశారు. బురదలో బతుకుతున్న జంతువులు చిందరవందర చేశారు. కనపడ లేదు గుర్రం. పాతాళందాకా తవ్వుదామన్నారు. అంతమందీ అదే పనిగా తవ్వడం మొదలుపెట్టారు. అలా తవ్వుతూ తవ్వుతూ ఈశాన్యంగా వెళ్ళారు. అక్కడ కపిలముని ఆశ్రమం చూశారు. అదిగో గుర్రం. ఆశ్రమం పక్కనే తిరుగుతూ మేస్తోంది. అంతమందీ వొక్కసారి పరుగెత్తారు. ఆశ్రమంలో జపంచేసుకుంటున్నాడు కపిలముని. 'వీడే గుర్రం దొంగ' అని చెడామడా తిట్టారు అతణ్ణి. కళ్ళు మొయ్యా కోపంవచ్చింది కపిలమునికి. ఒక్కసారి కళ్ళువిప్పాడు. నిప్పులు – నిప్పులే వర్షించాయి చూపులు. దాంతో అరవై వేలమందీ అమాంతంగా భస్మమై పూరుకున్నారు. కబురు చెప్పిందికి కూడా వొకపురుగు లేకుండా పోయింది. అదంతాపైనించి నారదుడుమాత్రం చూశాడు. వచ్చి, సగరుడితో చెప్పివెళ్ళాడు. ఘోరంగా దుఃఖించాడు సగరుడు. శివుడు చెప్పినంతా అయింది. ఇక విచారించిమాత్రం ఏం లాభం?

అప్పటికి అసమంజసుడికి అంశుమంతుడని వొకకొడుకు వుండే వాడు. మనవణ్ణి పిలిచాడు సగరుడు. 'బాబూ, నీతండ్రులు అరవయివేలమందీ హతమారిపోయారు. నీనాన్నని వాడిదుర్మార్గం వల్ల ఆనాడే తగిలేశాను. పుత్రులుకలిగీ అపుత్రకుణ్ణయిపోయాను. పుట్టెడంత పుత్రశోకం! అశ్వమేధం ఆగిపోయిందన్న బాధ మరీ దుర్భరంగా వుంది. ఇక, నువ్వే మాకు ఆధారం. ఎలాఅయినా ఈ యజ్ఞం సాగే ఉపాయం చూడు' అన్నాడు.

తాతగారి మాటమీద తక్షణం పయనమయాడు అంశుమంతుడు. తన తండ్రులు తవ్వినదారిని సముద్రంలోంచి వెళ్ళాడు. కపిలముని ఆశ్రమం చూశాడు. ఆశ్రమంలో సూర్యబింబంలా ప్రకా

శిస్తున్నాడు కపిలముని. అంజలిబంధం శిరస్సుమీద కీలించాడు అంశు మంతుడు. తాను వచ్చినపని సవినయంగా విన్నవించాడు.

చల్లనిచూపు చూశాడు కపిలుడు. దీవించాడు. గుర్రం తీసుకు వెళ్ళమన్నాడు. 'నువ్వు తీసుకువెళ్లుతున్న ఈగుర్రంతో అశ్వమేధం నిర్విఘ్నంగా జరుగుతుంది. మీతాత కృతార్థుడూ అవుతాడు. కొడుకులు కన్నవాళ్ళకి లభించే ఉత్తమగతులూ అతడికి లభిస్తాయి. తాతేకాదు, పితంద్రులూ తరించడానికి నువ్వే కారణమవుతావు. నీమనుమడు భగీరథుడు గంగను భూలోకం తెస్తాడు. సముద్రం నింపుతాడు. పితంద్రుల భస్మరాసులమీంచి గంగ ప్రవహిస్తుంది. వాళ్ళకి ఉత్తమగతులు కలుగుతాయి' అన్నాడు.

గుర్రం పట్టుకుని తాతదగ్గిరికి వచ్చాడు అంశుమంతుడు. ముని చెప్పిన భవిష్యత్తు విషయాలు వివరించాడు. సంతోషించాడు సగర చక్రవర్తి. పుత్రశోకం మరిచిపోయాడు. అశ్వమేధయజ్ఞం పూర్తి చేశాడు సముద్రుణ్ణి పుత్రభావంతో స్వీకరించాడు. అది మొదలు సముద్రానికి సాగరమనీ పేరు వచ్చింది. ఇలా ఎంతోకాలం రాజ్యం చేశాడు సగరచక్రవర్తి. అతడి అనంతరం అంశుమంతుడు రాజయాడు.

అంశుమంతుడి కొడుకు దిలీపుడు. తాతలాగే ఎంతోకాలం ఏలుబడి సాగించాడు అంశుమంతుడు. దిలీపుడు ప్రయోజకుడయాక, అతడికి రాజ్యం సమర్పించి తపోవనం వెళ్ళిపోయాడు అంశుమంతుడు.

తండ్రిముత్తాతల్ని మరిపించాడు దిలీపుడు. తాతలు అధోగతిలో వుండడం విని విచారించాడు. గంగని భూమిమీదికి దింపాలని ఎంతో ప్రయత్నించాడు. అయితే, సాధ్యంమాత్రం కాలేదు.

దిలీపుడి కుమారుడే భగీరథుడు; వంశోద్ధారకుడు; పుణ్యమూర్తి. భగీరథుణ్ణి సమస్త సామ్రాజ్యానికీ చక్రవర్తిచేసి, తాను తపోవనం వెళ్ళిపోయాడు దిలీపుడు. 'కపిలముని కోపంతో భస్మమై

పోయారు తన ముత్తాతలు. గతుల్లేక అలా పడివున్నారు.' — బాల్యం నించీ బాధిస్తూ వుండే దిది భగీరథుణ్ణి. గంగని భూమ్మీదికి తేవాలి. వాళ్ళకి ముక్తి కలిగించాలి. రోజూ షష్ఠిఘడియలూ ఇదే దీక్ష. ఈ దీక్షతోనే అతడు హిమాలయం వెళ్ళాడు.

బ్రహ్మాండమంత ఎత్తుంది హిమాలయం. నక్షత్రమండలం అంటుతున్నాయి దాని శిఖరాలు. రకరకాల ధాతువుల్తో నిండిపోయి వున్నాయవి. తెల్లటి మంచుశిఖరాలమీద నల్ల నల్లటి మేఘాలు అద్భుతంగా వున్నాయి. రంగు రంగుల రత్నాలతో చిత్ర విచిత్రంగా వున్నాయి గుహామందిరాలు. వాటిల్లో తమ తమ భార్యలతో విహరిస్తున్నారు దేవతలూ, గంధర్వులూ, విద్యాధరులూ, సిద్ధులూన్ను. చెట్లమీద చిలకలూ, కోయిలలూ, మైనగోరలూ, పారవాపిట్టలూ, నెమళ్లూ, తుమ్మెదలూ, చకోరాలూ, చాతకాలూ, మధుర ధ్వనులు చేస్తున్నాయి. సింహాలూ, శరభమృగాలూ, పెద్దపులులూ, ఏనుగులూ, హనుమంతులూ వాటితో కోలాహలంగా న్నాయి పొదలు.

ఇలా ఎంత అందంగావుందో, అంత భయంకరంగానూ వుంది హిమాలయపర్వతం. దానిమీద గంగాదేవికోసం తపస్సుప్రారంభించాడుభగీరథుడు. అడివిపళ్ళూ ఆకీమాత్రం తింటూ ఎన్నోవ్రతాలు చేశాడు. ఉపవాసాలూ, దేవపూజలూ, జపాలూ చేశాడు. ఎన్నో అన్ని సంవత్సరాలు నిష్ఠతో వున్నాడు. అతడితపస్సు మెచ్చి, గంగాదేవి ప్రత్యక్షమయింది. 'ఎందు కింత తపస్సుచేస్తున్నావు ? ఏం కావాలి ?' అని అడిగింది. భక్తిపూర్వకంగా దండప్రణామంచేశాడు భగీరథుడు. 'అమ్మా! నా తాతలు అరవై వేలమందీ కపిలమునికోపానికి భస్మమై పోయారు. ఉత్తమగతులులేక పడి వున్నారు. నీపుణ్యజలంతో కాని ముక్తిలేదు, వాళ్ళకి. అందుకని దేవీ, నాది వొక్కటే ప్రార్థన. స్వర్గం నించి భూమికిదిగాలి నువ్వు' అని ప్రార్థించాడు. 'తప్పకండా వస్తాను'

అంది గంగ. 'నా అభ్యంతరం లేదు. అయితే, పైనించి నేను దిగినప్పుడు నా ప్రవాహం భరించాలి. ఆ పనికి వొక్క శివుడుమాత్రం సమర్థుడు. మరొకరికి సాధ్యంకాదది. అందుకని, ముందు శివుణ్ణి ఆశ్రయించు. ఆయన 'ఊఁ' అంటే చాలు. నీకోర్కె చెల్లిస్తాను' అంది.

కైలాసం వెళ్ళాడు భగీరథుడు. శివుడికోసం తపస్సుచేశాడు. ఎంతోఅంత కాలానికి ప్రత్యక్షమయాడు శివుడు. 'వెళ్ళు, గంగని భూలోకం రమ్మను. నేను భరిస్తాను' అన్నాడు. మళ్ళీవచ్చి, గంగని ప్రార్థించాడు భగీరథుడు.

గంగావతరణం

కరుణించింది గంగమ్మ. భూలోకానికి దిగింది. కెరటాలతో ఎగిరిఎగిరి వచ్చింది. పురకలు వేసుకుంటూ దిగింది. ఆకాశమంతా ఆక్రమిస్తూ వచ్చింది. దిక్కులన్నీ నిండిపోతూ దిగింది. జలచరాలతో ప్రవహిస్తూ వచ్చింది. సుళ్ళుతిరుగుతూ దిగింది. కింద నుంచున్నాడు శివుడు. ముక్కోటి దేవతలూ చూస్తున్నారు. ముక్కుమీద వేలుపెట్టుకుంటున్నారు. చిన్న పద్మపత్రం ధరించినట్టే ఆ మహాప్రవాహం గంగమ్మని, జటాజూటంలో ధరించాడు శివుడు.

శివజటాజూటంనించి వొయ్యారంగా భూమిమీదికి దిగింది గంగ. హంసనడకలు. నురుగునవ్వులు. చేపచూపులు. కలకల పలుకులు. కొత్తపెళ్ళికూతురులా నడిచింది గంగమ్మ. భగీరథుడు దూత. ప్రేమకోసం శుష్కించినవరుడు సముద్రం. వెళ్ళి, జీవనం పోసింది గంగ. ఎండినసముద్రం నిండింది. సగరసంతానం తరించింది.

గంగ భూలోకం వచ్చింది. సూర్యచంద్రులు వున్నంతకాలం భగీరథుడికీర్తి నిలిచింది.

గంగావతరణమూ, భగీరథుడికథావిన్నాక, అక్కడినించి నందా అపరనందా నదులదగ్గిరికి వెళ్ళారు పాండవులు. ఆనదుల్లోస్నానాలు

చేసి హేమకూటం వెళ్లారు. అక్కడ వాళ్ళకి వింత కనపడింది వాళ్ళకి. ఎక్కడా ఏమీ కనపడదు, రాళ్ళు పడుతున్నాయి. గాలి గడ్డగట్టిపోయి వుంది. వర్షం కురిసేస్తూ వుంది. చదివేవాళ్ళు లేరు, కాని వేదఘోష వినిపిస్తూ వుంది. సాయంత్రం, ప్రాతఃకాలం అగ్ని ప్రజ్వలిల్లుతూనూ వుంది. హోమలు మీద పడిల దేకరవడం కరిచేస్తూవున్నాయి. అదంతా చూసి "ఏమిటిది?" అని రోమశుణ్ణి అడిగాడు ధర్మరాజు.

"ఇక్కడ ఋషభకూటంలో ఋషభఋషి, శతవృద్ధు తపస్సు చేస్తూ వుంటాడు. ఎవరన్నా మాట్లాడితే తన తపస్సు చెడిపోతుందని మండిపడి ఈకొండని పిలిచి రాళ్లు రువ్వమన్నాడు. గాలిని చప్పుడు చెయ్యొవద్దన్నాడు. ఇతర్ల మాటలు తన చెవుల్లో పడకండా వర్షం కుర వాలని మేఘాల్తో చెప్పాడు. అంచేత తపస్సూ, దానమూ, ధర్మమూ, శమమూ, దమమూ, - ఇవేవీ లేనివాళ్ళు ఈకొండ ఎక్కలేరు. దేవతలూ, దేవదర్శనులూ ఋషభమునిదర్శనంకోసం వస్తారు. ఇక్కడ దేవతలు యజ్ఞాలు చేశారు. దానికి నిదర్శనంగా ఇప్పటికీ కుశల ఆకా రంలో గరిక మొలకలూ, యూపస్తంభాల ఆకారంలో వృక్షాలూ కనిపిస్తాయి" - అని చెప్పాడు రోమశుడు. ఆపుణ్యతీర్థంలో స్నానం చేసి, ముందుకి నడిచారు పాండవులు. దారికడాకూ విశేషాలు చెప్పుతూ వచ్చాడు రోమశుడు.

"ఇది విశ్వామిత్రుడి ఆశ్రమం. ఇది కౌశికినది ఋశ్యశృంగుడి మడుగు." — ఋశ్యశృంగుడిమడుగు అనడంతోనే "ఋశ్యశృంగుడికథ వినాలనివుంది" అన్నాడు ధర్మరాజు. రోమశుడు చెప్పాడు.

### ఋశ్యశృంగుడి కథ

ఋశ్యశృంగుడు కశ్యపముని మనుమడు. విభాండకఋషి కుమా రుడు. అతడి జన్మకథ చిత్రమైంది. విభాండకుడు అఖండబ్రహ్మ

చారి. అతడు ఒకనాడు మడుగులో స్నానంచేస్తున్నాడు. అదేసమయానికి ఆదారిని ఊర్వశి వెళ్ళడం తటస్థించింది. అందకత్తెలలో అందకత్తె ఊర్వశి. ఆమెని చూడడంతోనే మనస్సు చలించింది విభాండకుడికి. నీళ్ళలో వీర్యస్ఖలనమూ అయిపోయింది. అమోఘమయింది రుషివీర్యం. నీళ్ళకనివచ్చి, ఒక ఆడలేడి అది మింగింది. గర్భం నిలిచింది లేడికి. కొన్నాళ్ళకి లేడి గర్భంలో పుట్టాడు రుశ్యశృంగుడు. కొడుకుని తీసి విభాండకుడు పెంచాడు. తండ్రితప్ప మరో మనిషికాని, ఆశ్రమం తప్ప మరోస్థలంకాని తెలియదురుశ్యశృంగుడికి. ఆశ్రమంలోనే ఘోరమయిన తపస్సుచేసుకుంటూ కూచుండేవా డతడు.

ఆదినాల్లో అంగదేశం* రోమపాదుడు పాలిస్తూ వుండేవాడు. ఒకసారి అతడి దేశంలో వర్షాలు కురవడం మానేశాయి. ప్రజలు బెంగపెట్టుకున్నారు. పండితుల్ని పిలిచి 'దీనికి ఏమిటి కారణం?' అని అడిగాడు రోమపాదుడు. 'నీ పురోహితుణ్ణి నువ్వు అవమానించావు. పొగరుబోతువని బ్రాహ్మలు నిన్ను బహిష్కరించి వెళ్ళారు. అందుకని నీఅంగదేశం అనావృష్టిదోషానికి పాల్పడింది' అన్నారు పండితులు. 'ఐతే, ఇప్పుడు ఏమిటి సాధనం?' అని అడిగాడు రాజు. 'ఒకటే ఉపాయం వుంది' అన్నారు పండితులు. 'రుశ్యశృంగుడని ఒక ముని వున్నాడు. అతడు ఎక్కడవుంటే అక్కడ పుష్కలంగా వర్షాలుకురుస్తాయి. అలాంటివరం అతడి కిచ్చాడు దేవేంద్రుడు. కనక, రుశ్యశృంగుణ్ణి ఇక్కడికి ఎలాఅయినా తెప్పించావా, నీరాజ్యంలో వర్షం కుండలతో కుమ్మరిస్తుంది' అన్నారు.

వారి సలహాప్రకారం, ముందు పురోహితుడికి చేసిన అవమానానికి ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు రోమపాదుడు. తరవాత, మాంచి

---

* ఇక్కడ శివుడికంటిమంటతో మన్మథుడు అంగత్యాగం (దేహత్యాగం) చేయడంవల్ల దీనికి అంగదేశం అని పేరు వచ్చిందని వాల్మీకి. చూ. బాలకాండ.

నెరజాణలవంటి సానుల్ని పిలిపించాడు. 'ఇదిగో, మీరు రుశ్యశృంగుణ్ణి వల్లో వేసుకోవాలి. ఎలాఅయినా ఇక్కడికి తీసుకురావాలి' అని చెప్పి విభాండకముని ఆశ్రమానికి పంపించాడు. మంచిమంచి మిఠాయిలూ, గమ్మునిపోయే వాసనద్రవ్యాలూ అవీ తీసుకుని పయనమయారు సానులు. అప్సరసలలాగే వున్నారు వాళ్ళు. అలా వెళ్ళి ఆశ్రమంపక్కతోటలో మకాంచేశారు.

రుశ్యశృంగుణ్ణి అగ్నిహోత్రాలు చూస్తూవుండమని, పళ్ళూ వాటికోసం అడివికి వెళ్ళాడు విభాండకుడు. ఆసందు చిక్కింది సానులికి. యవ్వనంతో, మాంచి అరిటిమొవ్వలా నవనవలాడుతూన్న తన కూతుర్ని బాగా ముస్తాబుచేసింది, ఒక ముసిలిసాని. రుశ్యశృంగుడి దగ్గిరికి పంపింది.

దాన్ని చూశాడోలేదో, తడబడిపోయాడు రుశ్యశృంగుడు. అదీ వొక రుషికుమారుడే అనుకున్నాడు. 'ఎక్కడినించి వచ్చావు రుషికుమారా?' అంటూ ఆహ్వానించాడు. 'ఎంచక్కా వున్నావు! నీలాంటి రుషికుమారుణ్ణి ఎన్నడూ చూడలేదు' అంటూ లేడిచర్మం, దర్భలూ పరిచి కూచోబెట్టాడామెని. అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చాడు. అడివిదుంపలూ, పళ్ళూ ఇచ్చి అతిథిపూజా ఆరంభిచాడు.

'ఇలాకాదు, నామాట విను' అంది సాని. 'మాఆశ్రమానికి నువ్వు వస్తానంటేనే, నువ్వుచేసే మర్యాదలు పుచ్చుకుంటాను నేను. మాఆశ్రమం ఇక్కడికి మూడుయోజనాలే వుంది. నాతో రా. స్నేహంగా వుందాంమనం' అంది. 'తప్పకండా వస్తాను' అన్నాడు రుశ్యశృంగుడు. అతిథిసత్కారాలు చేసి సాన్ని పూజించాడు. ఆమె తెచ్చిన పూలదండలు వేసుకున్నాడు. అత్తర్లూ, గంధాలూ రాసుకున్నాడు. మిఠాయిలూ తిన్నాడు. రంగురంగుల పట్టుబట్టలూ కట్టుకున్నాడు. అతడిఎదట అభినయం పట్టింది సాని. నాట్యం

చేసింది. పాటలు పాడింది. బంతాటలాడి అతణ్ణి రెచ్చగొట్టింది. తన వాయ్యారమంతా వొలికించింది. కిలకిలా నవ్వింది. గాట్టిగా కౌగిలించుకుంది. పెదవులికి పెదవులు తగిలించింది. 'ప్చ్' అంటూ ముద్దూ పెట్టుకుంది. విభాండకుడు వచ్చే వేళ అయేసరికి, 'మళ్ళీ వస్తాను' అని చెప్పి వచ్చేసింది.

నిషా తాగినట్టయింది ఋశ్యశృంగుడికి. అగ్నిహోత్రాలు మరిచే పోయాడు. సాని వెళ్ళినదిక్కే చూస్తూ వుండిపోయాడు. కొంతసేప టికి పళ్ళూ అవీ పట్టుకుని వచ్చాడు విభాండకుడు. కొడుకుని చూసి మతిపోయింది అతడికి. 'అగ్నిహోత్రం మాని, ఇలా కూచున్నా వేమిటి? ఏమిటి విచారిస్తున్నావు' అని అడిగాడు.

'ఏమీలేదు,' అన్నాడు ఋశ్యశృంగుడు. 'ఇప్పుడిప్పుడే నాదగ్గి రికి వొక బ్రహ్మచారి వచ్చి వెళ్ళాడు. ఎంతో అంత అందంగా వున్నా డతడు. అచ్చంగా బంగారంలా వుంది అతడి శరీరం. మొహం పద్మమే పద్మం. గమ్మమనిపోతున్నాయి జడలు. అతడిగుండెలమీద, బాగా బలిసి, గుండ్రంగా ఎంచక్కా పెద్దపెద్ద పిండాలు రెండు వున్నాయి. మెళ్ళో తళతళమంటూ జపమాల వేలాడుతోంది. ఒత్తయిన నెంట్రుకల్లో బంగారం పట్టే వుంది. ఆతడు నడుస్తూవుంటే, కలహంసలు పలుకుతున్నట్టు చప్పుడవుతుంది. సన్నని నడుం, అలాఅలా కదులు తుంది. పెదిపి కదిపితే చాలు, కమ్మని పరిమళం. మాట్లాడితే, కోకిల పలికినట్టు హాయి. అతడిబట్టలు మెత్తగా, చిత్రంగా ఆకర్షిస్తున్నాయి. రకరకాల పూలమీంచి గాలివీస్తే ఎలావుంటుంది? — అదిగో అలా ఘుమఘుమలాడుతుంది అతడిశరీరం. అతడు, కుడిచేత్తో ఎర్రపండు పట్టుకుని కిందకొడితే, అది మీదికి లేచేది. అలా కొడుతూ, అతడు వంగుతూ లేస్తూవుంటే, గాలికి వంగి లేస్తూవున్న లేతచెట్టులా ఎంత ఇథిగా కనిపించాడని! అబ్బ! ఇప్పటికీ నాకళ్ళముందు కట్టినట్టే

వున్నాడు. అంతేనా, — అతడు నన్ను అదిమిపట్టి, కౌగిలించు కున్నాడు. మొహానికి మొహం తగిలించాడు. పెదవులుమీద పెద వులు పెట్టి, ఎంతో మృదువుగా శబ్దం పలికాడు. ఆః, అలాంటి మంత్రం ఎన్నడూ వినలేదు. హృదయం ఇట్టే లాగేసినట్టయింది నాకు.

'అతిథిసత్కారం చేశాను నేను. మనదగ్గిరవున్న మంచిమంచి అడివిపళ్ళు ఇచ్చాను. ముట్టనైనా ముట్టాడుకాడతడు. అతడు తెచ్చిన పళ్ళూ పానకాలూ ఇచ్చాడు నాకు. అమృతంలా వున్నా యవి. తన చేతి పువ్వులు చల్లాడు నామీద. మన అడివిపువ్వులులాంటివి కావు అవి. వాటి వాసనకి వెంటనేవచ్చి వాలాయి, తుమ్మెదలు. ఆముని కుమారుడి ఆశ్రమానికి వెళ్ళాలని వుంది నాకు. అతడితో కలసి అక్కడ తపస్సుచేస్తాను' అన్నాడు.

అంతా అయోమయంలా అనిపించింది విభాండకమునికి. సుత రామూ అర్థంకావడంలేదు. అంతా ఏదో మాయ అనుకున్నాడు. 'మన తపస్సు పాడుచెయ్యడంకోసం అనేక వేషాలు వేస్తారు రాక్షసులు. రసవంతాలయిన పానకాలూ అవీ మునులు ముట్టకూడదు. సువాసన పుష్పాలు మనకి పనికిరావు' అని ఎన్నోవిధాల బోధపరిచాడు కొడుక్కి. ఆదినం అలా గడిచింది. మర్నాడు, మళ్ళీ యథాప్రకారం అగ్నిహోత్రాలు చూస్తూవుండమని అడివికి వెళ్ళాడు విభాండకుడు.

మళ్ళీ వచ్చింది సాని. సానిటక్కులన్నీ చూపెట్టింది. ఎంత రెచ్చగొట్టాలో అంతా రెచ్చగొట్టింది. ఋశ్యశృంగుడి మనస్సులో వికారం రేపింది. పూర్తిగా, ఆమెచేతి కీలుబొమ్మఅయిపోయాడతడు. సానులతో మాట్లాడ్డం, వాళ్ళతో కలిసి కూచోవడం, కలిసి తిరగడం— ఇవన్నీ మెడకి ఉచ్చులు తగుల్చుకోవడమేకదా, మరి!

సాని పన్నిన వల్లో తగులుకున్నాడు ఋశ్యశృంగుడు. తండ్రికి తెలియకండా ఆశ్రమం వొదిలిపెట్టేశాడు. సానివెంట అంగదేశంవచ్చే

శాడు. అక్కడ, రాజాశ్రమం అనే వనంలో అతడికోసం ముందే బస ఏర్పాటుచేశాడు రోమపాదుడు. స్వానితోసహా రాజాశ్రమంలో మకాం వేశాడు ఋశ్యశృంగుడు.

అంగదేశంలో అడుగుపెట్టాడు ఋశ్యశృంగుడు. ఆ మరుచటి క్షణం ఆకాశం మేఘాలతో నిండిపోయింది. ధారాపాతంగా వర్షాలు కురిశాయి. నదులూ, చెరువులూ, బావులూ నీళ్ళతో నిండిపోయాయి. అవగ్రహదోషం అంతరించింది. రోమపాదుడి సంతోషానికి గట్లు తెగినట్టయింది.

రోమపాదుడికూతురు శాంత. అందకత్తె. యవ్వనవతి. ఆమెని ఋశ్యశృంగుడికిచ్చి వివాహంచేశాడు రోమపాదుడు. అల్లుడికీ, కూతురికీ ఎంతో అంత ధనం అరణ మిచ్చాడు. రత్నాల నగలూ, బంగారం మంచాలూ, పీటలూ, లెక్కలేనంతమంది నౌకర్లూ ఇచ్చాడు. వేలకివేలు ఆవు లిచ్చి, దేశమంతటా ఆలమందలు నిలిపాడు. ప్రతీ దినం సత్కారాలూ అవీ చేసి, అతణ్ణి సంతోషపెడుతూ వుండేవాడు

తండ్రీ, ఆశ్రమం మరిచిపోయాడు ఋశ్యశృంగుడు. అంగదేశంలో హాయిగా సుఖా లనుభవిస్తూ దినాలు గడుపుతున్నాడు.

అక్కడ — అడివినుండి ఆశ్రమానికివచ్చాడు విభాండకుడు. ఆశ్రమంలో కుమారుడు లేడు. మతిపోయింది అతడికి. చుట్టుపక్కల వెదికాడు. అడివంతా గాలించాడు. దేశదేశాలు తిరిగాడు. తుదకి అంగదేశం వచ్చాడు. ఒక గొల్లపల్లె వెళ్ళాడు. ఆలమందలతో కల కలలాడుతోంది గొల్లపల్లె. గొల్లలందరూ దగ్గిరికి వచ్చారు. ఎంతోఅంత గౌరవం చేశారు ఋషిని. ఆరోజు అక్కడ విశ్రాంతి తీసుకున్నాడు విభాండకుడు. అంత సమృద్ధిగావున్న ఆలమంద ఎవరిదని గొల్లల్ని ప్రశ్నించాడు.

'ఇదాఅండీ! ఇది రుశ్యశృంగుల వారిది. మీకు తెలీనే తెలీదా? ఇది వొక్కటేకాదు. ఇలాంటిమందలు దేశంలో ఎన్నో వేలున్నాయి వారివి' అన్నారు గొల్లలు. కొడుకు కబురువిని, సంతోషించాడు విభాండకుడు. కొడుకు ఆలమందలలోనే బసచేస్తూ రోమపాదుడి రాజధానికి వచ్చాడతడు. శాంతతో సుఖంగా కాపరం చేస్తున్నాడు రుశ్యశృంగుడు. కొడుకునీ, కొడల్నీ చూసుకున్నాడు విభాండకుడు. బ్రహ్మానందం అనుభవించాడు. రోమపాదుడితో చెప్పి, కొడుకునీ కోడలినీ ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు. వశిష్ఠుణ్ణి అరుంధతిలాగా, అగస్త్యుణ్ణి లోపాముద్రలాగా, మౌద్గల్యుణ్ణి నలుడికూతురు ఇంద్రసేనలాగా రుశ్యశృంగుణ్ణి భక్తిశ్రద్ధలతో సేవిస్తూ వుండేది శాంత. ఒక ఇంటివాడై సుఖపడ్డాడు రుశ్యశృంగుడు.

రుశ్యశృంగుడి కథ విని, కౌశికహ్రదంలో స్నానం చేశారు పాండవులు. అక్కడినించి గంగాసాగరసంగమం వెళ్ళారు. ఐదు వందలనదుల సంగమస్థానం అది. సాగరసంగమంలో స్నానాలు చేసి, సముద్రంవొడ్డునే పడి కళింగదేశంవెళ్ళి, వైతరిణీనది చూశారు. "ఇది వైతరిణి. ఇందులో స్నానమాడితే అర్చిరాదిమార్గం లభిస్తుంది. దీని ఉత్తరతీరంలో పూర్వం దేవతలూ రుషులూ ఎన్నో యజ్ఞాలు చేశారు. అవబృథస్నానాలతో పుణ్యతీర్థమయింది ఇది. సమస్త యజ్ఞాల్లోనూ ప్రశస్తమైంది పశుభాగం. అది శివుడికి లభించేట్టు దేవతలూ, మునులూ ఇక్కడే నిర్ణయించారు" అని చెప్పాడు రోమశుడు.

ద్రౌపదీసహితంగా వైతరిణిలో స్నానాలుచేశారు పాండవులు. పితృతర్పణమూ చేశారు. అప్పుడు, ధర్మరాజు రోమశుడితో ఇలా అన్నాడు: "మునీంద్రా, ఈనదిలో ఆచమనంచేసి మానవవిషయాల లోంచి ముక్తి పొందాను. సర్వలోకాలూ స్పష్టంగా కనిపిస్తున్నాయి

నాకు. ఇదిగో - వానప్రస్థులుచేస్తూ వున్న వేదపఠనమూ వినిపిస్తోంది. ఇదంతా నీ అనుగ్రహం."

"వానప్రస్థులు ఇక్కడికి ముప్ఫయివేల యోజనాలదూరంలో వున్నారు. వాళ్ళ వేదపఠనం విన్నావు. దివ్యపురుషుడివి నువ్వు" - ఆశ్చర్యపోతూ అన్నాడు రోమశుడు.

వైతరిణినించి ముందుకిసాగారు పాండవులు. వెళ్ళివెళ్ళి వొక వనంలో ప్రవేశించారు. పళ్ళతో వొంగిపోతూవుంది వనం. అక్కడ పెద్ద వేదికవొకటి చూపించాడు. రోమశుడు. "స్వాయంభవుడయిన విశ్వకర్మ పూర్వం ఈవనంలో యజ్ఞంచేశాడు. యజ్ఞదక్షిణగా దక్షిణభూభాగం యావత్తూ కశ్యపుడికి దానంచేశా డతడు. దాంతో భూదేవికి కోపంవచ్చింది. పాతాళానికి వెళ్ళిపోయింది. కశ్యపుడికి పట్టువడలేదు. ఆమెఅనుగ్రహం కోసం ఉగ్రమైన తపస్సు చేశాడు కశ్యపుడు. చివరికి ప్రసన్నురాలయింది భూదేవి. నీటిలోంచి బైటికివచ్చింది. వేదికరూపంలో కశ్యపుడికి నిజరూపం చూపింది. అదిగో, అదే ఈవేదిక. ఈవేదిక ఎక్కినవాళ్ళు వీర్యవంతులవుతారు. ఇదిగో, మీకు మంత్రం ఉపదేశిస్తాను. ఈమంత్రంతో దీనిమీదికి ఎక్కండి మీరు. మంత్రంలేకండా అయితే సముద్రంలోకి వెళ్ళిపోతుంది ఇది" అన్నాడు.

అగ్నిర్మిత్రో యోనిరాపోఽథ వేద్యో
విష్ణో రేతశ్చాస్య భూమిశ్చ నాభిః॥

అని మంత్రమూ ఉపదేశించాడు. మంత్రం పఠించి తమ్ముళ్ళతో సహా వేదిక ఎక్కాడు ధర్మరాజు. ఎంతో వీర్యవంతు డయాడు. సాక్షాత్తూ దేవేంద్రుడిలా అవుపించాడు.

అక్కడినించి మహేంద్రపర్వతం వెళ్ళారు పాండవులు. గుహలతోనూ వాటితోనూ ఎంతో గొప్పగావుంది మహేంద్రం. దేవతలూ ఖచరులూ మొదలయిన వాళ్ళు సేవిస్తూ వుంటారు దాన్ని. అక్కడి మునుల్ని చూసి నమస్కరించాడు ధర్మరాజు. "అయ్యా, ఎప్పుడూ మీరు పరశురాముల దర్శనం చేస్తూనేవుంటారు. మీరు దర్శించే సమయంలో మాకూ వారి దర్శనం అనుగ్రహించండి" అన్నాడు.

"మహారాజా, మీరువస్తారని జ్ఞానదృష్టివల్ల ముందే తెలుసు వారికి" అన్నాడు అందులో పరశురాముడి శిష్యుడు అకృతవ్రణుడు. "రేపు చతుర్దశి. ఈమునులందరికీ వారిదర్శన మవుతుంది. మీరూ చూద్దురు కాని" అన్నాడు.

ఆ రాత్రి మహేంద్రంమీదే వుండిపోయారు పాండవులు. అకృతవ్రణుడి దగ్గిర కూచుని "పరశురాముడి చరిత్రవింటాం, వివరించు" అన్నారు. అకృతవ్రణుడు ఆరంభించాడు.

### పరశురాముడి కథ

కన్యాకుబ్జం గాధిరాజు పాలిస్తూవుండేవాడు. అతడికి సత్యవతి అని వొకకూతురు వుండేది. భృగుపుత్రుడు రుచీకుడు వచ్చి ఆమెని తనకిచ్చి వివాహం చెయ్యమని గాధిరాజుని కోరాడు. మునికి కూతురు నివ్వడానికి ఇష్టంలేక వొక వింతమరతు పెట్టాడు గాధి. 'రాజహంసల్లా తెల్లగా వున్న వెయ్యిగుర్రాలు కావాలి. అన్నిటికీ వొక్క చెవ్వు మాత్రం నల్లగా వుండాలి. ఇది మాకులంలోని కన్యాశుల్కం రివాజు. ఇది ఇవ్వగలిగితే సత్యవతిని ఇస్తాను. నాఅభ్యంతరం లేదు' అన్నాడు.

సత్యవతిని పెళ్ళాడాలనే దీక్ష రుచీకమునిది. గాధిరాజు కోరిన గుర్రాలకోసం వరుణదేవుణ్ణి ప్రార్థించా డతడు. వరుణుడి వరంవల్ల

గంగలో వెయ్యిగుర్రాలూ లభించాయి రుచీకుడికి. అవి దొరికిన చోటు కన్యాకుబ్జందగ్గిర గంగఉత్తరతీరం అశ్వతీర్థమని ప్రసిద్ధి చెందింది.

తానుకోరిన నల్లచెవుల తెల్లగుర్రాలు వెయ్యీ రుచీకుడు తేవడంతోనే మరి మాటాడలేకపోయాడు గాధిరాజు. కూతుర్ని అతడికిచ్చి వివాహం చేశాడు. భార్యతో సుఖంగా కాలక్షేపం చేస్తున్నాడు రుచీకుడు. కొడుకునీ, కోడలినీ చూసివెళదామని రుచీకుడితండ్రి కన్యాకుబ్జం వచ్చాడు. కోడల్ని చూసి తృప్తికలిగిందతడికి.

ఒకనాడు కోడల్ని ఆదరంగా దగ్గిరికి పిలిచాడతడు. 'అమ్మాయీ! బుద్ధిమంతురాలివి నువ్వు. నిన్నుచూస్తే సంతోషంగావుంది నాకు. నీకు ఏంకావాలో చెప్పు. నీకోరిక తీరుస్తాను' అన్నాడు. వినయంగా తలవొంచి నమస్కరించింది సత్యవతి. 'నాకో కొడుకూ, మా అమ్మకో కొడుకూ కలిగేట్టు వరమివ్వండి' అంటూ దోసిలివొగ్గింది. 'మంచిది, అలాగేకానీ' అన్నాడు ముని. 'ఋతుస్నానం చేసి, నువ్వు బొడ్డచెట్టూ, మీ అమ్మ రావిచెట్టూ కౌగిలించుకోండి' అన్నాడు.

తల్లీ కూతుళ్ళు ఇద్దరూ ఋతుస్నానం చేశారు. బొడ్డచెట్టుకి బదులు రావిచెట్టుని కౌగలించుకుంది సత్యవతి. ఆమెతల్లి బొడ్డచెట్టుని కౌగలించుకుంది. అది తెలుసుకున్నాడు ముని. 'నీకు బ్రాహ్మణకుమారుడే పుడతాడు. అయితే, వాడు క్షత్రియధర్మం వహించి, గర్వించి తిరుగుతాడు. మీఅమ్మకి క్షత్రియకుమారుడు పుట్టినీ*, మహాతపశ్శాలి అవుతాడు. బ్రాహ్మణుడై మహాపురుషుడూ అవుతాడు' అన్నాడు.

'పొరపాటు క్షమించండి' అంటూ మామగారి పాదాలమీద పడింది సత్యవతి. 'క్షత్రియధర్మం నాకొడుక్కి వద్దు. అతడికి బదులు

* అతడే విశ్వామిత్రుడు.

మనుమడికి తావియ్యండి పోనీ, ఈమాత్రం అనుగ్రహించండి! అని బతిమిలాడింది. ' సరే' అని కరుణించాడు ముని.

నీళ్ళాడింది సత్యవతి. నిక్షేపంలాంటి కుమారుణ్ణి కన్నది. ఆయన పేరు జమదగ్ని. నాలుగు వేదాలూ మాత్రమే కాదు, ధనుర్వేదమూ క్షుణ్ణంగా అభ్యసించాడు జమదగ్ని. ప్రయోజకుడయాడు. ప్రసేనజిత్తు అనే రాజుకూతురు రేణుకను వివాహం చేసుకున్నాడు. రేణుక కుమారుడే పరశురాముడు. పరశురాముడు చిన్నవాడు. అతడికంటే ముందు రుమణ్వంతుడూ, సుషేణుడూ, వసువూ, విశ్వావసుడూ అని మరినలుగురు కుమాళ్ళు కలిగారు రేణుకకి.

జమదగ్ని మహా తపశ్శాలి. ఆదిమునులతో సమాన మయిన వాడు. మహా ఉగ్రమయిన తపస్సు చేసుకుంటూ వుండేవాడు. ఒక నాడు కొడుకులు అయిదుగురూ పువ్వులూ పళ్లూ తేవడంకోసం అడివికి వెళ్ళారు. వాళ్ళవెనక రేణుకకూడా వెళ్ళింది. ఒకదగ్గిర సరోవరంలో మార్తికావత దేశం రాజు చిత్రరథుడు భార్యలతో జలక్రీడ లాడుతున్నాడు. చూసి, మతిచలించింది రేణుకకి. కామవికారమూ హెచ్చింది. తుదకి, చిత్రరథుడితో వ్యభిచరించిందామె.

ఆమె దుశ్చరిత్ర అవగతమయిపోయింది జమదగ్నికి. మండిపడ్డాడతడు. పెద్దకొడుకులు నలుగుర్నీ పిలిచాడు. తల్లిని చంపమన్నాడు. మాతృహత్య మహాపాతకమని జంకారు వాళ్ళు. మాట్లాడకండా తలవొంచుకు నుంచుండిపోయారు. అగ్నిహోత్రుడే అయిపోయాడు జమదగ్ని. కొడుకులు నలుగుర్నీ పడదిట్టాడు. 'మృగాల్లాగా, పక్షుల్లాగా అజ్ఞానంతో అడవుల్లో తిరగండి మీరు ' అని శపిం

ఇదే కథ కొంచెం తేడాతో ఆనుశాసనికపర్వంలో భీష్ముడూ, శాంతిపర్వంలో కృష్ణుడూ చెపుతారు. వాట్లల్లో సత్యవతిమాట ప్రశక్తి లేదు. విష్ణుపురాణంలోని కథా, శాంతి అనుశాసనికాల్లోని కథా వొక్కలాగే వున్నాయి.

ఛాడు. తరవాత కనిష్ఠుడైన పరశురాముణ్ణి పిలిచాడు. 'మీఅమ్మని చంపు' అన్నాడు. ఉత్తరక్షణంలో గండ్రగొడ్డలి పైకెత్తాడు పరశు రాముడు. దెబ్బతో తల్లి తల తెగనరికాడు.

భార్య రెండుముక్కలై పడడంతోనే జమదగ్ని కోపం చల్ల పడింది. తనమాట పాటించి, సాహసించిన రాముణ్ణి చూసి పరమా నందం కలిగింది. 'బాబూ, నామాట మన్నించావు. ఇతర్లకిసాధ్యం కాని సాహసకార్యం చేసి చూపెట్టావు. ఏం కావాలో చెప్పు. నువ్వు ఏదికోరితే అదే ఇస్తాను' అన్నాడు, 'మాఅమ్మ నిర్దోషురాలై మళ్ళీ బతకాలి. నాఅన్నలు శాపంపోయి ఎప్పటిలాగే వుండాలి. యుద్ధంలో ఎదురులేకండా, నేను చిరకాలం బతకాలి. ఈమూడు వరాలూ అనుగ్రహించు' అన్నాడు పరశురాముడు. కొడుకు కోరిన వన్నీ సంతోషంగా యిచ్చాడు జమదగ్ని.

ఇలా కొంతకాలం గడిచింది. ఒకనాడు హైహయవంశస్థు డయిన కార్తవీర్యుడు వేటకి వచ్చి జమదగ్నిఆశ్రమానికి వచ్చాడు. బాగా అలిసిపోయి వున్నాడతడు. వెయ్యిచేతులు కలవాడని అతడి ప్రసిద్ధి. అతడికీ, అతడిసైన్యానికీ యథోచితంగా సత్కరించాడు జమదగ్ని. అయితే, అదేమీ నచ్చలేదు కార్తవీర్యుడికి. రాజ్యమదం కిందామీదా కనపడనియ్యలేదు. ఆశ్రమంలోనివాళ్లని అనరాని మాటలాడి అవమానం చేశాడు. భటుల్తోచెప్పి ఆశ్రమంలోని చెట్లూ అవీ పాడుచేశాడు. జమదగ్నిహోమధేనువునీ, దూడనీ కట్టి పట్టుకుపోయాడు.*

కొంతసేపటికి దర్భలూ, పళ్ళూ అవీ పట్టుకుని, అడివినుండి వచ్చాడు పరశురాముడు. 'రామా! మాఅవస్థచూశావా?' అన్నాడు

* కార్తవీర్యుడు ఈవిషయమే ఎరగడనీ, అతడికుమాళ్ళే హోమధేనువు తెచ్చారనీ శాంతిపర్వం. చూ. అ. 2.

జమదగ్ని. 'ఇదంతా కార్తవీర్యుడి పని. మన హోమధేనువుకూడా పట్టుకుపోయాడు. ఏందారి?' అన్నాడు. క్రోధంతో వొక్కసారి మండిపడ్డాడు పరశురాముడు. తక్షణం ధనుర్బాణాలు తీసుకున్నాడు. కార్తవీర్యుడివెంట పరుగెత్తాడు. బాణవర్షం కురిపించి అతడిసైన్యంలో వొక్కడూ మిగలకండా చంపేశాడు. కార్తవీర్యుడిమీద కలబడి పిడుగుల్లాటి బాణాలు వేశాడు. అతడి చేతులు తెగనరికాడు. చివరికి వొక్కబాణంతో అతడి ప్రాణాలూ పుచ్చుకున్నాడు.

కార్తవీర్యుడికుమాళ్లు ఆక్రోధం బాగా మనస్సులోపెట్టుకున్నారు. పరశురాముడు లేని సమయంచూసి, జమదగ్ని ఆశ్రమం ముట్టడించారు. ఆశ్రమంలోని మునుల్ని చెడామడా తిట్టారు. పూల మొక్కలూ అవీ నరికేశారు. ఆశ్రమంఅంతా నానాహంగామా చేసేశారు. జమదగ్నిని పట్టుకుని ఘోరంగా నరికిపారేశారు. 'రామా, రామా' అంటూ ప్రాణం వొదిలిపెట్టాడు జమదగ్ని.

రాముడు వచ్చి చూసేసరికి అంతా అయిపోయింది. నెత్తీ నోరూ కొట్టుకుని ఏడుస్తోంది తల్లి రేణుక. చచ్చి పడివున్నాడు తండ్రి. దుఃఖం, కోపం - ఉన్మత్తుడే అయిపోయాడు రాముడు. 'ముక్కుమూసుకుని, అడివిలోతపస్సుచేసుకుంటున్న శాంతమూర్తిని, నాతండ్రిని మహారుషిని వధించారు. మహాపరాధం చేశారు క్షత్రియులు. ఇదిగో, ప్రతిజ్ఞచేస్తున్నాను. భూమ్మీద క్షత్రియుడన్న పురుగులేకండా వాళ్ళ వాళ్ళనీ చంపేస్తాను' అంటూ అప్పుడే బయల్దేరాడు. వెదికి వెదికి రాజుల్ని గండ్రగొడ్డలికి బలిపెట్టాడు. భూమండలమంతా జయించాడు. యజ్ఞాలు చేశాడు. భూమియావత్తూ యజ్ఞదక్షిణగా కశ్యపుడికి ధారపోశాడు. ఇప్పుడునిస్సంగుడై ఈమహేంద్రపర్వతంమీదతపస్సుచేసుకుంటున్నాడు.

ఇలా అకృతవ్రణుడుచెప్పిన పరశురాముడి కథ విని ఆరాత్రి అక్కడే వెళ్లబుచ్చారు పాండవులు. మర్నాడు, తెల్లవారింది. అవాళ

చతుర్దశి. యాదవన్మందీ పరశురాముడి దర్శనం చేశారు. భక్తితో ఆయన్ని పూజించారు. ధర్మరాజునిఎంతో గౌరవించాడుపరశురాముడు.

మహేంద్రంనించి దక్షిణంవెళ్ళారు పాండవులు. గోదావరి చేరారు. గోదావరి దక్షిణగంగ. త్రియంబకంనించి పుట్టిననీళ్ళతో పవిత్రమైన పుణ్యానది. గోభక్తీ, దేవభక్తీ, బ్రాహ్మణభక్తీ పెట్టుకుని గోదావరిలో స్నానంచేశాడు ధర్మరాజు. ఆవులూ, బంగారమూ, రత్నాలూ దానం చేశాడు. ఎంతో మంది బ్రాహ్మల్ని పూజించాడు.

గోదావరినించి ద్రవిడదేశం వెళ్ళారు పాండవులు. అగస్త్యతీర్థం సేవించారు. లోగడ, వేలాది ఆవులూ అవీ అక్కడ అర్జునుడు దానం చేసినట్టు విన్నారు. తమ్ముణ్ణి మెచ్చుకున్నాడు ధర్మరాజు. అక్కణ్ణించి సూర్పాకారం వెళ్ళారు. పరశురామవేదిక చూశారు. పేద్ద కొండంత ఎత్తు వుందది. అలా పడమటిసముద్రంవొడ్డుగుండా వెళ్ళి, ప్రభాసతీర్థం చేరారు. ప్రభాసంలో పన్నెండుదినాలు పంచాగ్నుల మధ్య తపస్సుచేశాడు ధర్మరాజు. గాలీ, నీరూ తప్ప ఇంకో ఆహారం తీసుకోలే దాయన.

'పాండవులు ప్రభాసతీర్థం వచ్చారు' - ఈవార్తద్వారకలో తెలిసింది. కృష్ణుడూ, బలరాముడూ మొదలయిన యాదవన్మంది యాదవులూ ప్రభాసం వచ్చారు. తీర్థయాత్రల ఆయాసంవల్ల బాగా చిక్కిపోయివున్నారు పాండవులు. లేడిచర్మాలే బట్టలుగా కట్టుకున్నారు. చూసి, ఎంతోఅంత దుఃఖపడ్డారు యాదవులు. ముఖ్యంగా ద్రౌపదిని చూసి సహించుకోలేకపోయారు. ఎన్నో అన్ని చెప్పి ఆమెని వోదార్చారు. తమ తీర్థయాత్రలో విశేషాలూ కష్టాలూ వాళ్ళతో చెప్పాడుధర్మరాజు. అర్జునుడు తపస్సుకి వెళ్ళడమూ, దివ్యాస్త్రాలు సంపాదించడమూ, ప్రస్తుతం ఇంద్రుడిదగ్గిర వుండడమూ - అన్నీ చెప్పాడు.

విని, "విధి విధానమే అవకతవక అనిపిస్తోంది నాకు!" అన్నాడు బలరాముడు. "పాపమంటే భయపడతారు పాండవులు. సత్యవ్రతులు. దేవతలుకన్న వాళ్ళు. విధి వీళ్ళని కష్టపెడుతున్నాడు. దుర్యోధనుడూ మొదలయినవాళ్ళు నీచులు. పాండవుల్ని బాధిస్తున్నారు. వాళ్ళని సుఖపెడుతున్నాడు! ఏమిటిది?

"మతిలేని కొడుకులమాట అమృతంలా వుంది అంధరాజుకి. ఆమాత్రం బుద్ధిలేకపోయింది. పాండవుల్ని దేశంవెళ్ళగొట్టాడు. వీళ్ళ రాజ్యం లాక్కున్నాడు. అడవులపాలు చేశాడు. ఏం న్యాయ మిది? భీష్ముడూ వాళ్ళూ చెప్పినా విన్నాడుకాడు. పదండి. భూమిమీద వాడి కొడుకన్నవాడు లేకుండా చేసేద్దాం. ధర్మరాజుని రాజుచేద్దాం. ఊరుకోకూడదు మనం" అన్నాడు.

"నిజమే" అంటూ సమర్థించాడు సాత్యకి. "నువ్వూ, కృష్ణుడూ, సాంబుడూ, సారణుడూ, ప్రద్యుమ్నుడూ — ఇంతమందీ వుంటూ వుండగా, పాండవులు ఇలా పడరానిపాట్లు పడుతున్నారు. రాజ్యం పోయి, అడవుల్లోపడి, కందమూలాలుతిని బతుకుతున్నారు. ఇప్పుడే బయల్దేరదాం. భూమీ ఆకాశం బద్దలయేట్టు సైన్యదుందుభులు వేయిద్దాం. శత్రువుల్ని చెండాడడంలో అడ్డూ ఆపూ లేంది యాదవ సైన్యం. కౌరవుల్ని ముట్టడిద్దాం. నీ నాగలీ, కృష్ణుడి శార్ఙ్గమూ వాళ్ళని ఛిన్నాభిన్నం చేస్తాయి. పైగా నేనూ, అనిరుద్ధుడూ, ప్రద్యుమ్నుడూ — మేమంతా వుండనేవున్నాము.

"మనం వొక్క యాదవులమేనా! కృష్ణుడు 'ఊఁ' అంటే చాలు — కేకయులూ, సృంజయులూ, పాంచాలులూ, వృష్ణులూ, భోజులూ — వీళ్ళంతా విరగబడతారు. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణి కలిపి వాళ్ళని మచ్చుకన్నా కనపడనివ్వరు. ధర్మరాజూ, అతడి తమ్ములూ ప్రతిజ్ఞకి కట్టుబడి వుంటామంటూరు వుండనీ. పదమూడేళ్ళ

గడువూ దాటాకే ధర్మరాజుని పట్టాభిషేకం చేద్దాం. అంతవరకూ అభిమన్యుణ్ణి రాజ్యరక్షకుడిగా ప్రతిష్ఠచేద్దాం'' అన్నాడు.

"క్షేమయినమాట. నాకూ అది నచ్చింది'' అంటూ ధర్మరాజు దిక్కు తిరిగాడు కృష్ణుడు. "సాత్యకి చెప్పింది సమంజసంగా వుంది. సందేహంలేదు. యుద్ధంలో నీశత్రువుల్ని సంహరిస్తారు వీళ్ళు. నిష్కంటకంగా రాజ్యం దఖలుపడుతుంది'' అన్నాడు.

"వినోదముంటూ వుంది. శత్రువులు ఏమాత్రం మాకు ? ఐతే ఒక్కమాట. భీష్ముడూ ద్రోణుడూ సాక్షాత్తూ ధర్మమూర్తులు. వాళ్ళ ఎదుట సభలో శపథం చేశాను. అది తప్పడం తగనిపని'' అంటూ వాళ్ళనందరినీ శాంతపరిచాడు ధర్మరాజు.

పాండవుల దగ్గిర సెలవుతీసుకున్నారు యాదవులు. ద్వారక వెళ్ళిపోయారు. అక్కడినించి పయోష్ణీనదికి వెళ్ళారు పాండవులు. పయోష్ణిలో స్నానాలు చేశారు. పయోష్ణి మాహాత్మ్యం తెలుపుతూ ధర్మరాజుతో అన్నాడు రోమశుడు :

"దీనివొడ్డున నృగుడు అనేరాజు యజ్ఞాలు చేశాడు. ఆయజ్ఞాల్తో తృప్తిపడి రాక్షసుల్ని చంపాడు దేవేంద్రుడు. ఇక్కడే పూర్వం గయుడు ఏడు అశ్వమేధయజ్ఞాలు చేశాడు. అతడి యజ్ఞాల్లో చషాలమూ, *స్థాలీ, ♦చమసా, †పాత్రీ, యూపమూ, స్రుక్కూ, స్రువమూ— బంగారంతో చేసినవే. యూపాలు కేవలం దేవతలు చేసినవి. లెక్కలేనంతమంది ఋత్విజుల్ని సదస్యుల్ని పూజించాడు నృగుడు. బంగారం ఆవులు ఎన్నో అన్ని బ్రాహ్మలికి దానంచేశాడు. చివరికి ఇంద్రలోకం వెళ్ళి సుఖపడ్డాడు. సోమం కలిసిన పవిత్రనది పయోష్ణి. దీనిలో స్నానంచేస్తే దేవసాయుజ్యం దొరుకుతుంది."

* యూపస్తంభంచివర తగిలించే కడియం. ♦ పాత్ర. † చదరంగా వుండే యజ్ఞపాత్ర

పయోష్ణినుంచి నర్మద వెళ్ళారు పాండవులు. నర్మదలో స్నానాలు చేశారు. వైదూర్యపర్వతంచూసి, ముందుకి నడిచాడు. దారిలో వొక సరోవరం చూపించాడు రోమశుడు. "త్రేతా ద్వాపరాల సంధిని ఈసరోవరంలో, ఇది సంయాతి (శర్యాతి ?) యజ్ఞం చేసినచోటు. భృగువు కుమారుడు చ్యవనుడు సంయాతి కూతురు సుకన్యని పెళ్ళిచేసుకున్నాడు. అతడి యజ్ఞంలో ఇంద్రుణ్ణి లక్ష్యపెట్టకండా అశ్వినీ దేవతల్ని సోమపీథుల్ని చేశాడతడు" అన్నాడు.

సుకన్యకథ వినిపించమన్నాడు ధర్మరాజు. రోమశుడు చెప్పాడు.

## సుకన్యకథ

ఈచెరువుకి దగ్గిరలోనే అన్నపానాలు లేకండా ఎన్నో వేల సంవత్సరాలు తపస్సుచేశాడు చ్యవనుడు. అతడి శరీరంమీద పుట్ట బలిసిపోయింది. డొంకలూ తీగలూ కప్పి, ఇది ఫలానా అని చెప్పడానికి వీలులేకండా అయింది. ఇలా ఎంతోకాలం గడిచిపోయింది.

ఒకనాడు సంయాతిమహారాజు తన నాలుగువేలమంది స్త్రీలతోనూ, ఈ చెరువులో జలక్రీడలాడడానికి వచ్చాడు. అతడి కూతురు సుకన్య, చెలికత్తెలతో చెరువుపక్క తిరుగుతూ పుట్ట దగ్గిరికి వచ్చింది. పుట్టలోంచి మిలమిలా మెరుస్తూ చ్యవనుడి కళ్ళు కనిపిస్తున్నాయి. అవి మిణుగురుపురుగులే అనుకుంది సుకన్య. వాటిని పట్టుకోవాలని వుబలాటపడింది ఆమె. చెలికత్తెలతో చెప్పి, పుట్ట తవ్వించింది. కోపంతో కళ్ళువాల్చుకు కూచున్నాడు చ్యవనుడు.

మునికోపం వల్ల అక్కడ సంయాతిసైన్యాలికి మలమూత్రాలు బంధించిపోయాయి. కారణం తెలియక కంగారుపడ్డాడు సంయాతి. తన సైన్యంలో జరిగిన ఏదో అపరాధం కావొచ్చు అనుకున్నాడు. అందరినీ అడిగాడు. కాని అసలు సంగతేమిటో తెలియలేదు.

ఇంతలో తండ్రిదగ్గిరికి వచ్చింది సుకన్య. తండ్రి విచారం చూసింది. 'మేం తిరుగుతూవుంటే వొకపుట్టలో రెండు మిణుగుర్లు కనపించాయి. పుట్టకవ్వించాను. కాని మిణుగుర్లు అంతుచిక్కలేదు. ఒక వేళ అదే కారణమేమో, మనసైన్యం ఇలా అవడానికి!' అంది.

వెంటనే పరివారంతోసహా పుట్టదగ్గిరికివచ్చాడు సంయాతి. తపస్సువల్ల అస్థిచర్మావశేషంగావున్న ముసలిపండు — చ్యవనుణ్ణి చూశాడు. నమస్కరించాడు. 'మీతపస్సూ, మీమహిమా తెలియక అపరాధంచేసింది అమ్మాయి. ఆడవాళ్ళు అజ్ఞానులు. క్షమించండి. సైన్యం రక్షించండి' అంటూ సాష్టాంగపడ్డాడు.

శాంతించాడు చ్యవనుడు. కానైతే, 'అందకత్తెననీ, యవ్వనవతిననీ మహా మిడిసిపడుతోంది నీకూతురు. దాన్ని పెళ్ళాడితేనే కాని నాకోపం తగ్గదు' అంటూ భీష్మించుకు కూచున్నాడు. వేరే గత్యంతరం లేదు. చ్యవనుడు చెప్పినట్టు సమ్మతించాడు సంయాతి. సుకన్యని అతడికి ఇచ్చి పెళ్ళిచేశాడు. నిరోధంనుండి విముక్తిపొంది సుఖపడింది సైన్యం.

అరమరిక లేకండా భర్తని సేవిస్తూవుండేది సుకన్య. ఒకనాడు అశ్వినీదేవతలు ఆమెదగ్గిరికి వచ్చారు. మేము ఫలానా అని చెప్పి ఆమెతో పరిచయంచేసుకున్నారు. 'నువ్వు ఎవరమ్మాయివి? నీభర్త ఎవరు?' అంటూ అడిగారు. 'సంయాతిమహారాజు మానాన్న. చ్యవనముని నాభర్త' అని చెప్పింది సుకన్య. 'పాపం!' అంటూ నొచ్చుకున్నారు అశ్వినులు, 'ఇంత అందమైనదానివి. యవ్వనవతివి. అన్నీవుడిగిపోయిన ముసలితొక్కని పెళ్ళాడావు. ఏమనుభవిస్తావు? నీవయసంతా అడివికాసిన వెన్నెల అయిపోయింది. ఇప్పుడయినా 'ఊఁ' అను. తగినభర్తని తెచ్చిపెడతాం. సుఖపడుదు కాని' అన్నారు.

'ఏమిటీ ఈమాటలు అంటూ?' నొచ్చుకుంది సుకన్య. 'చ్యవన మునినే ప్రేమిస్తున్నాను నేను. నాతో ఇలా అనడం తగనిపని మీకు' అంటూ గిరుక్కున ఆశ్రమంలోకి వెళ్ళిపోయింది. అశ్వినులు అన్న మాటలు భర్తతో చెప్పింది. భార్యపాతివ్రత్యానికి సంతోషించాడు చ్యవనుడు. 'అలా కాదు, వాళ్ళు చెప్పిందానికి సమ్మతించు' అని బోధించిపంపాడు. భర్తమాటమీద అశ్వినులదగ్గిరికి వచ్చింది సుకన్య. 'ఏదీ, యవ్వనవంతుడయిన భర్తని చూపించండి' అంది.

ఆమె అలా అనగానే ఈచెరువులో దిగారు అశ్వినీదేవతలు. వాళ్ళతోపాటు చ్యవనుడూ దిగాడు. ముగ్గురూ నీళ్ళలో మునిగారు. ఒకమునుగు మునిగి ముగ్గురూపైకి లేచారు. ముగ్గురూ ఒక్కలాగే వున్నారు. ముగ్గురూ యవ్వనంతో నవనవ లాడుతున్నారు. ముగ్గురూ పైకివచ్చి, 'మాలో నీ ఇష్టంవచ్చినవాణ్ణి వరించు' అంటూ సుకన్య ముందు నిలబడ్డారు. తనభర్తని చ్యవనుణ్ణే వరించింది సుకన్య.

బ్రహ్మానందం అయిపోయింది చ్యవనుడికి. అశ్వినీదేవతల్ని ప్రశంసించాడతడు. 'మీవల్ల యవ్వనవంతుణ్ణయాను. అంచేత సోమ పానంఅర్హత కలిగిస్తాను మీకు. మామామ సంయాతిచేత యజ్ఞం చేయిస్తాను అందులోఇంద్రుడు చూస్తూవుండగానే మీచేతసోమపానం చేయిస్తాను' అన్నాడు. సంతోషించి వెళ్ళిపోయారు అశ్వినులు.

'అల్లుడు యవ్వనవంతుడయాడు. ముసిలితనం వొదిలిపోయింది'— ఈకబురువిన్నాడు సంయాతి. ఆశ్చర్యపోయాడు. అల్లుణ్ణీ అమ్మాయినీ చూసి వెళదామని పయనంకట్టుకు వచ్చాడు.

మామగారిని మంచి మంచి మర్యాదలుచేశాడు చ్యవనుడు. 'సరయిన సమయానికి వచ్చావు. మంచిపనిచేశావు' అన్నాడు. 'నీచేత యజ్ఞం చెయ్యించాలని వుంది నాకు, దానివల్లనీకు ఎంతో అభివృద్ధి

కలుగుతుంది. వెళ్లు. వెంటనే యజ్ఞసంబారాలు సమకూర్చు' అన్నాడు.

అల్లుడి మాటప్రకారం సర్వసంబారాలూ సమకూర్చి, యజ్ఞంలో కూచున్నాడు సంయాతి. స్వయంగా అధ్వర్యం వహించి, యజ్ఞం నడిపించాడు చ్యవనుడు అందులో విధ్యుక్తంగా అశ్వినీదేవతలికి సోమం ఇవ్వబోయాడతడు. దానికి కోపం తెచ్చుకున్నాడు దేవేంద్రుడు. 'అశ్వినులు కేవలం దేవతల వైద్యులు. సోమపానానికి సుతలామూ అర్హతలేదు వాళ్ళకి. అసందర్భమయినపనికి పూనుకుంటున్నావు. దేవత్వం లేనివాళ్ళకి సోమం సమర్పించే పిచ్చివాళ్లు ఇంతవరకూ కనిపించలేదు' అంటూ అడ్డువచ్చాడు. దేవేంద్రుణ్ణి లక్ష్యపెట్టేరకం కాదు చ్యవనుడు. అశ్వినులచేత సోమపానం చేయించాడు. సహించలేకపోయాడు దేవేంద్రుడు. చర్రున వజ్రాయుధం తీశాడు. వజ్రాయుధంతో సహా అతడిచెయ్యి కదలకండా చేశాడు చ్యవనుడు. ఎత్తినచెయ్యి ఎత్తినట్టే వుండిపోయింది. అంతతోనూ ఆగలేదు ముని. ఇంద్రుడిపని ఇవాళతో అంతంచేసేస్తానంటూ కూచున్నాడు. మంత్రించి అగ్నిలో ఆహుతివేశాడు. వేసీవెయ్యడంతోనే, భయంకరమైనరూపంతో మదుడు అని వొక రాక్షసుడు హోమకుండంలో పుట్టుకువచ్చాడు. పదివేలయోజనాల పొడవున్నాయి వాడి చేతులు. నూరేసియోజనాల పొడవున్నాయి నాలుగు కోరలు. పదేసియోజనాలున్నాయి పళ్ళు. సూర్యగోళం చంద్రగోళం అంతలేసి కళ్ళు. భూమీ ఆకాశం పట్టకండావుంది శరీరం.

భూమిమీద వొక్క-దవడా ఆకాశంమీద వొక్క-దవడా చాచాడు మదుడు. ప్రపంచమంతా వొక్క-సారి నాకేసేటంత నాలిక చాచి, పెదవులు చప్పరించాడు. బ్రహ్మాండం పగిలేటంత పెద్ద కేక వేశాడు. అమాంతంగా ఇంద్రుణ్ణి మింగెయ్యాలంటూ ఆవులించాడు,

ఏంచెయ్యాలో తోచలేదు దేవేంద్రుడికి. వజ్రాయుధం విసరడానికయినా చెయ్యి కదలడాయె. రక్షించమంటూవచ్చి చ్యవనుడి కాళ్ల మీాద పడ్డాడతడు. 'అపరాధం మన్నించు' అన్నాడు. 'నీతపోమహిమ అమోఘం. ఇవాళనించీ అశ్వినీదేవతలు సోమపానానికి అర్హులు. అంగీకరిస్తున్నాను. రక్షించు' అన్నాడు.

శాంతించాడు చ్యవనుడు. ఇంద్రుడిచెయ్యి కదిలింది. స్తంభనం నించి విముక్తిపొంది అమరావతి వెళ్ళిపోయాడతడు. కల్లూ, ఆడవాళ్లూ, వేటా, జూదమూ—ఈనాలుగింటినీ ఆశ్రయించి మదుణ్ణి బతకమన్నాడు చ్యవనుడు. సోమపానంతో ఆనందించి స్వర్గలోకం వెళ్లిపోయారు అశ్వినులు.* చ్యవనుడు తపోమహత్వం ప్రకటించిన ప్రదేశం ఆర్చిక పర్వతమని ప్రసిద్ధికి వచ్చింది.

సుకన్యకథ విన్నారు పాండవులు. ఆసరోవరంలో స్నానాలు చేశారు. అక్కడనుండి సైంధవారణ్యం వెళ్ళారు. శంతనుడూ, శునకుడూ, నర నారాయణులూ, బ్రహ్మ మొదలయినవాళ్ళ తపోవనం సైంధవారణ్యం. దేవరుషుల నివాసభూమి. అక్కడ చంద్రసరోవరంలో స్నానాలుచేశారు పాండవులు. అతిథుల్ని పూజించారు.

చంద్రసరోవరంనించి యమునానదికి వెళ్ళారు పాండవులు. "ఇది యమునానది. గంగతో సమానమైంది. దీని వొడ్డుని మాంధాత ఎన్నో సంవత్సరాలు యజ్ఞాలు చేశాడు. మాంధాతచరిత్ర చెపుతాను. వినండి" అంటూ ఇలా చెప్పాడు రోమశుడు.

## మాంధాత కథ

ఇక్ష్వాకువంశంలో యువనాశ్వుడని వొకరాజు వుండేవాడు. ఎంతోఅంత ఉత్తముడతడు. ప్రతాపశాలికూడా. వెయ్యి అశ్వ

* చూ. గ్వేరుదం.

మేధాలుచేసిన పుణ్యవంతుడు. అన్నీవుండీ అయిదోతనం లేనట్టు సకల సంపదలూ వున్నీ సంతానం మాత్రం కొఱతగా వుండే దతడికి. ఆ విచారంతో అతడు రాజ్యభారం మంత్రులచేతిలోపెట్టి, భృగుముని ఆశ్రమానికి వెళ్ళాడు. ఎంతోకాలం భృగుణ్ణి ఆశ్రయించాడు. కొన్నాళ్ళకి జాలికలిగింది మునికి. అతడిచేత పుత్రకామేష్టి చేయించాడు. యజ్ఞకుండంలోంచి మంత్రబలంతో నిండిన బంగారుకలశం సంపాదించాడు. అది యజ్ఞశాలలోనే ఋత్విజులచేత భద్రంగా వుంపించాడు. అంతవరకూ జాగరంతో వుండడంచేత ఆరాత్రి ఆదమరిచి నిద్రపోయారు ఋత్విజులు. సగంరాత్రపుడు దాహంవేసింది యువనాశ్వుడికి. లేచి, స్వర్ణకలశంలోని మంత్రజలం కడుపునిండా తాగేశాడు.

తెల్లవారాక తెలుసుకున్నాడు భృగుడు. ఎంతోఅంత నొచ్చుకున్నాడు. 'నీకు కొడుకుపుట్టడంకోసం నాతపోవీర్యంవల్ల సంపాదించిన మంత్రజల మది. నీభార్యకివ్వడంకోసం భద్రపరిచాను.* దాహంవేసి తాగేశావు నువ్వు. చెయ్యరాని పొరపాటే చేశావు. యోగ మలా వుంది. ఎవరేం చేస్తారు ? వెళ్ళు. దీనివల్ల ఇంద్రుడితో సమానమైన కొడుకు నీకడుపులోంచే పుడతాడు' అన్నాడు.

జరగవలిసిందేమో జరిగిపోయింది. రాజధాని అయోధ్యకి వచ్చేశాడు యువనాశ్వుడు. నూరేళ్ళు అయాక అతడి ఎడమపక్క కడుపు పగిలించుకుని, ఉదయకాలపు సూర్యబింబంలాంటి కుమారుడు పైకివచ్చాడు. ఆబాలుణ్ణి చూడడానికి స్వర్గంనించి దేవేంద్రుడే దిగివచ్చాడు. అతడినోట్లో తన చూపుడువేలు పెట్టి, 'అమృతంతో వుందిది. దీన్ని తాగు' అన్నాడు. ఇంద్రుడిమాటప్రకారం అతడికి

* యువనాశ్వుడిభార్య మతినారుడికూతురు గౌరి.

మాంధాత అని పేరుపెట్టారు దేవతలు. అలా, దేవేంద్రుడి దయవల్ల పెరిగి ప్రయోజకుడయ్యాడు మాంధాత. తలిచినంత మాత్రాన్నే వేదాలూ, శాస్త్రాలూ, ధనుర్వేదమూ, దివ్యాస్త్రాలప్రయోగాలూ,ఉప సంహారాలూ వచ్చేశా యతడికి. ఇంద్రుడే అతణ్ణి అభిషేకించాడు.

సాటిలేనిచక్రవర్తి అయ్యాడు మాంధాత. ఇంద్రుడి అర్ధాసనం మీద కూచున్నాడు. అజగవం అని ధనుస్సూ, అభేద్యమయిన కవచమూ దివ్యాస్త్రాలూ ధరించాడు. ప్రపంచ మంతా దిగ్విజయం చేశాడు. సంపూర్ణమయిన దక్షిణలతో ఎన్నో యజ్ఞాలు చేశాడు. కోట్లూ, అర్బుదాలూ గోదానాలుచేసి, బ్రాహ్మల్ని మెప్పించాడు. తన చల్లని ఏలుబడిలో ప్రజలు కష్టాలే మరిచిపోయారు.

ఒకసారి భూమిమీద అనావృష్టి కలిగింది. దానికి కోపించి దేవేంద్రుడితోనే దెబ్బలాడాడు మాంధాత. ఏనుగుమందలు కొట్టినట్టు తన బాణాల్తో మేఘాల్నికొట్టాడు. తప్పనిసరిగా భూమ్మీద కురిసేట్టు చేశాడు. పుష్కలంగా పంటలుపండించాడు. అంత మహానీయుడు మాంధాత. ఆ మాంధాత యజ్ఞంచేసిన ప్రదేశం ఇది.

కురుక్షేత్రంలో సరస్వతి వొడ్డుని మీ ద్రుపదుడితాత సోమకుడు పుత్రయాగంచేసి, వందమంది కుమార్తెళ్ళని కన్నాడు. ఆ వివరమూ చెపుతాను. వినండి" అంటూ ఇలా చెప్పాడు రోమశుడు:

## పు త్ర యా గ ం

సోమకుడికి నూరుమంది భార్యలు. యజ్ఞంచేసి, జంతుడు అని వొక్కగాక వొక్కకొడుకుని కన్నాడతడు. వందమందితల్లులూ ఎవరికివారే జంతుణ్ణి కన్నకొడుకులా చూసుకునేవారు. అరిచేతినిమ్మ

* "మాధాంతా"(మాం=నన్ను. ధా తా=తాగును) అని ఇంద్రుడు అనడంవల్ల అతడిపేరు మాంధాత అన్నారు.

పండులా పెంచేవాళ్ళు. రవంతఅయినా అరమరలేకండా అంతమందీ అలా పెంచడంచూసి ఆశ్చర్యపోయేవాళ్ళు జనం.

ఒకనాడు ఆబాలుడితొడమీద చీమకుట్టింది. అతిసుకుమారుడు కావడంచేత అది సహించలేకపోయా డతడు. అదే ఏడవడంఏడ్చాడు. వందమంది తల్లులూ పరుగెత్తుకు వచ్చారు. జంతుడి ఏడుపుచూసి గోలు గోలుమన్నారు. అంతఃపురమంతా వొకటేఏడుపుల్తోనిండిపోయింది. ఈఏడుపులు విని సోమకుడూ వచ్చాడు. విషయం తెలుసుకుని కొడుకుని బుదిరించాడు. అనంతరం కొలువుకివచ్చి మంత్రులతోనూ, ఋత్విజుడితోనూ ఆలోచించాడు.

'ఒక్కకొడుకు కొడుకు కాడన్నారు పెద్దలు. వందమంది భార్యలు వున్నారు నాకు. ఏంలాభం? మినుకూ మినుకూ మంటూ ఇంతమందికీ ఈవొక్కడే కళ్ళవెలుగు. ఇదంతాచూస్తూ మీరు వూరుకోడం బాగాలేదు. దీని కేదో ఉపాయంఆలోచించండి' అన్నాడు.

'తలుచుకుంటే, నూరుగురికీ నూరుగురు కొడుకులూ పుడతారు మహారాజా,' అన్నాడు ఋత్విజుడు. 'ఐతే, మేం చెప్పిన యజ్ఞం అడ్డు చెప్పకండా అంగీకరించాలి మీరు. ఇప్పుడున్న ఈవొక్కగానీ వొక్క కుమారుణ్ణి యజ్ఞ పశువుగా చేసి వధించాలి. ఈ పశుహవ్యంతో అగ్ని హోత్రుణ్ణి సంతోష పెడితే, నీనూరుగురు భార్యలికీ సంతానం కలుగు తుంది. ఈపుత్రయాగంవల్ల జంతుడుకూడా తిరిగీ నీపెద్దకొడుకై జన్మిస్తాడు. అతడి కుడిఎడమ భాగాల్లో బంగారం గురుతులుంటాయి' అన్నాడు.

ఋత్విజుడి ఉపదేశం అంగీకరించాడు సోమకుడు. కొడుకుని యజ్ఞ పశువుచేసి చంపాడు. అతడి కొవ్వు అగ్నిలో ఆహుతిపెట్టాడు. గుండెలు బాదుకుని ఏడ్చారు రాణులు. హోమకుండంలో లేచిన పొగ

పిల్చి వందమందీ గర్భవతు లయారు. నవమాసాలూ నిండాయి. వంద మందికీ వందమంది కొడుకులు పుట్టారు. అందులో పెద్దవాడే జంతుడు. జంతుడిమీద పూర్వంలాగే వందమందికీ ప్రేమగా వుండేది.

కొంతకాలం గడిచింది. పుత్రయాగం చేయించిన ఋత్విజుడు కాలంచేసి, నరకంలో నానాబాధలూ పడుతూవచ్చాడు. మరికొన్నాళ్ళకి సోమకుడూ కాలంచేశాడు. స్వర్గానికిపోతూ, ముందు నరకంలో బాధపడుతూవున్న ఋత్విజుణ్ణి చూశాడు. 'అయ్యా, నువ్వు నరకంలో వుండడానికి ఏమిపాపం చేశావు ?' అని అడిగాడు.

'ఏంలేదు మహారాజా, నీచేత పుత్రయాగం చేయించాను కదా! ఆపాపమే నన్నిలా నరకంలో తోసింది. నువ్వేమో మహాయజ్ఞాలు చేశావు. పుణ్యలోకాలికి పోతున్నావు. అంచేత, నువ్వే నన్ను ఉద్ధరించాలి' అన్నాడు ఋత్విజుడు.

అక్కణ్ణించి యమధర్మరాజు దగ్గిరికి వెళ్ళాడు సోమకుడు. అతణ్ణి పుణ్యలోకాలికి వెళ్ళమన్నాడు యముడు. 'నేనేకాదు, నా ఋత్విజుణ్ణికూడా తీసుకువెళతాను' అని యముణ్ణి ప్రార్థించాడు సోమకుడు. 'నాకారణంగా అతడు నరకంలో బాధపడుతున్నాడు. కరుణించు' అని దోసిలిపట్టాడు.

అంగీకరించాడు యముడు. తాను చేసిన తపస్సుమూలానా యజ్ఞాలు మూలానా తన ఋత్విజుణ్ణి నరకంలోంచి ఉద్ధరించాడు యజ్ఞపుత్రుడయిన సోమకుడు. తనతోకూడా పుణ్యలోకాలికి తీసుకువెళ్ళాడు. ఇదీ సోమకుడి కథ.

ధర్మరాజా, ఇదిగో ఇక్కడే బ్రహ్మ ఇష్టాకృతం అనే వెయ్యి సంవత్సరాల సత్రయాగంచేశాడు. ఇదిగో, ఇక్కడ నాభాగుడూ, అంబరీషుడూ యజ్ఞాలుచేసి పరమసిద్ధిపొందారు. ఇది నహుషుడు

యజ్ఞంచేసినచోటు. పది పద్మాల*గోవులు సదస్యులికి ఇచ్చి సత్కరించాడతను. ఇదిగో ఇక్కడ సార్వభౌముడు యజ్ఞంచేశాడు. ఇది యయాతి యజ్ఞంచేసిన స్థలం. యయాతియజ్ఞానికి ఇంద్రుడు స్వయంగా వచ్చాడు. ఇది రామహ్రదం. ఇది నరనారాయణస్థానం. ఇది ప్లక్షావతరణం. ఇదిగో, ఈయమునా తీరంలో దేవతలూ రుషులూ సారస్వతయజ్ఞంచేశారు. దేవరుషి సంవర్తుడు దీన్ని రక్షిస్తూవుంటాడు. ఇక్కడ భరతుడు ఎన్నో యజ్ఞాలుచేశాడు. సర్వలోకాలూ దర్శించాడు. నువ్వూ ఈతీర్థంలో స్నానంచెయ్యి. సమస్తలోకాలూ కనిపిస్తాయి''—ఇలా ప్రతీ తీర్థం చూపిస్తూ వచ్చాడు రోమశుడు.

తమ్ములతోసహా రోమశుడుచెప్పినతీర్థాల్లో స్నానాలుచేశాడు ధర్మరాజు. దివ్యదృష్టివచ్చినట్టయింది అతడికి. రోమశుడితో అన్నాడు: "మునీంద్రా, అన్నిలోకాలూ అవుపిస్తున్నాయి నాకు. దేవరుషులూ, ఆదిత్యులూ, అశ్వినులూ, దేవేంద్రుడూ-దేవేంద్రుడిదగ్గిరమాతమ్ముడు అర్జునుడూ అందరూ కనిపించారు.'' "అవును,'' అన్నాడు రోమశుడు. "పరమరుషులు ఇలాగే మూడులోకాలూ చూస్తారు'' అన్నాడు.

అలా ముందుకువెళుతూ "ఇదిగో, ఇది దక్షుడు యజ్ఞంచేసిన ప్రదేశం. ఇది సరస్వతీనది. దేవతలతోకలిసి బ్రహ్మ యజ్ఞాలుచేశాడిక్కడ. ఇది బ్రహ్మదేవుడి యజ్ఞవేదిక. ఇరవైకోసులు దీని ప్రమాణం. ఇక్కడ కాలం చేసిన మానవులు దేవత్వం పొందుతారు. సరస్వతి మొదట నిషధదేశంలో భూమిలోకి వెళ్ళిపోయింది. తిరిగి ఇక్కడ చమసోద్భవ తీర్థంలో బయులుపడింది. ఇది సిద్ధతీర్థం. ఇక్కడే అగస్త్యుడు లోపాముద్రని పరిగ్రహించాడు. ఇది విష్ణుపదం. విపాశనది. ఇది కాశ్మీర మండలం. నిరస్తం. ఇది మానసద్వారం. వెనకటికి

---

* పద్మం = పంద కోట్లు

ఇక్కడే పరశురాముడు హంసపథం నిర్మించాడు. * ఈసరోవరంలో చైత్రమాసం శివుణ్ణి పూజిస్తారు మహామునులు. అప్పుడే పార్వతీదేవితో సహా శివుడు వాళ్ళకి ప్రత్యక్ష మవుతా డిక్కడ. అందుకనే అరుంధతీ సహితంగా వశిష్ఠుడు ఇక్కడ నివసించాడు. ఇది భృగుతుంగ పర్వతం. ఇక్కడే గువ్వపిట్టకోసం తన శరీరంకోసి డేగకి ఇచ్చాడు శిబిచక్రవర్తి. అతని కథ చెపుతాను, విను" అంటూ ప్రారంభించాడు రోమశుడు :

### శిబిచక్రవర్తి కథ

శిబి ఉశీనరుడి కుమారుడు.† అతడు ఇక్కడ యజ్ఞంచేస్తూ వుండగా జరిగింది ఆకథ. అసలు విషయం ఏమిటంటే — అతడి గొప్ప స్వభావం పరీక్షించాలని అగ్నికీ ఇంద్రుడికీ బుద్ధిపుట్టింది. ఇంద్రుడు డేగ అయాడు. అగ్ని గువ్వపిట్ట అయాడు. గువ్వని చంపుకుతినాలని తరుము కుంటూ వచ్చింది డేగ. ప్రాణభయంతో గువ్వవచ్చి శిబిచక్రవర్తిని శరణు జొచ్చింది. గువ్వని వొదిలిపెట్టమంటూ వాదించింది డేగ. 'రాజా, నువ్వు ధర్మం తెలిసినవాడివనీ, సత్యవంతుడివనీ వినికిడి. భరించలేనంత ఆకలితో వున్నాను నేను. నాతిండికి అడ్డురావడంన్యాయ మేనా నీకు ? తిండిలేందే ఏప్రాణీ జీవించలేదు నాకు ఆహారంలేకండా చేశావా, ఆకలితో చచ్చిపోతాను. నేను చచ్చిపోతే నాపెళ్ళాం పిల్లలూ చచ్చిపోతారు. ఒక్క గువ్వకోసం ఇంతమంది ప్రాణాలు పోగొ ట్టడం ధర్మం కాదు. ధర్మం ఎరిగినవాళ్లు ధర్మానికి బాధకలిగించేధర్మం ధర్మంగా భావించరు. సర్వహితమైంది ఏదో అదే ధర్మం.♦ 'శ్యేనాః కపోతాన్ ఖాదంతి' అని వేదవాక్యం, ఈగువ్వ నాకు వేదసమ్మత మయిన ఆహారం. కనక వొదిలిపెట్టు దాన్ని' అంది.

---

* పరశురాముడు క్రౌంచపర్వతం రంధ్రంచేసి మానససరోవరం హంసలికి దారిచేశా డనిగాథ. † చూ. ఉద్యోగపర్వం. ♦ చూ. మను. ౨.౨౯౯.

'పక్షివయినీన్ని తెలిసినదానిలా వున్నావు' అన్నాడు శిబి, 'నువ్వే ఆలోచించు, ప్రాణభయంతో వచ్చి నన్ను ఆశ్రయించింది ఇది. ఆశ్రయించినవాళ్ళని ఎంత అధముడయినా వొదిలిపెడతాడా ! ఆశ్రితులీ్ని, శరణన్నవాళ్ళనీ విడిచిపెట్టడంకంటే అధర్మమేముంటుంది.

'నీఆకలిమాట - నిజంగా ఇదంతా నీఆకలికోసమే అయితే, ఈఅడివిలో నువ్వు కోరినమృగం - లేడి, ఎనుపోతు, పంది, మరేదన్నా పక్షి - దేనిమాంసం కావాలంటే దాని మాంసం ఇస్తాను. ఈగువ్వ మీాద మాత్రం ఆశ వొదిలిపెట్టు. నన్ను శరణన్నదాన్ని మాత్రం నేను విడవను' అన్నాడు.

'నేను తినబోతున్నదాన్ని అడ్డుకుంటున్నావు నువ్వు. అదే నీ నిశ్చయమైతే, నీ దేహం కోసి గువ్వఎత్తు మాంసం తూచి ఇయ్యి' అంది డేగ. 'సంతోషంగా ఇస్తాను' అన్నాడు శిబి.

వెంటనే కత్తీ, తక్కెడా తెప్పించాడు. తక్కెడలో వోపక్క గువ్వని పెట్టాడు. తన దేహంకోసి మాంసం రెండోపక్క వేశాడు. గువ్వే బరువైంది. తనమాంసం చాలలేదు. మరోముక్క కోసి వేశాడు. చాలలేదు. మరోముక్క వేశాడు. అదీ చాలలేదు. గువ్వదిక్కే మొగ్గుతోంది తక్కెడ. మరోపెద్దముక్క శరీరంకోసి వేశాడు. ప్చ్! లాభంలేదు. ఇలా ఎంతవేసినా గువ్వఎత్తుతో సరిపోలేదు. శరీరంలో వున్న మాంసమంతా కోసి వేశాడు. ఊహూఁ, గువ్వదిక్కే మొగ్గు చూపుతోంది తక్కెడ. ఇక లాభంలేదన్నాడు శిబి. నెత్తురు కారుతూన్న దేహంతో తుదకి తానే లేచి తక్కెడలో కూచున్నాడు.

డేగా, గువ్వా వొకదాని మొహం వొకటి చూసుకున్నాయి. ఉత్తరక్షణంలో పక్షులరూపం వొదిలిపెట్టాయి. ఇంద్రుడూ, అగ్నీ నిజరూపాలతో నుంచున్నారు. 'నీధైర్యమూ, శౌర్యమూ మొదలయినగుణాలు మహోత్తమమైనవి. ఇతర్లకి సాధ్యంకానివి' అంటూ

శిబిని పొగిడారు. 'శబ్దబ్రహ్మం వున్నంతవరకూ నీకీర్తి నిత్యమై నిలుస్తుంది' అని వరమిచ్చి వెళ్ళిపోయారు. అందుకని, శిబిచక్రవర్తి పుణ్యస్థానం అంటారు దీన్ని."

శిబికథ అయాక ముందుతీర్థాలు వివరిస్తూవచ్చాడు రోమశుడు. "ఇదిగో, పళ్ళతోటలతో జేబుగావుందే – ఇది ఉద్దాలకముని కుమారుడు శ్వేతకేతు తపోవనం. ఇక్కడ సరస్వతి మనుష్యరూపంలో వచ్చి శ్వేతకేతువుని సేవించింది. ఒక్క శ్వేతకేతు వే కాదు, అతడూ అతడి మేనల్లుడు అష్టావక్రుడూ ఇక్కడే ఉగ్రమయిన తపస్సుచేశారు" అన్నాడు. అష్టావక్రుడి కథ చెప్పమన్నాడు ధర్మరాజు. రోమశుడు ప్రారంభించాడు.

## అ ష్టా వ క్రు డి క థ

అష్టావక్రుడు ఏకపాదముని [కహోళముని] కుమారుడు. ఏకపాదుడు మహావిద్వాంసుడు. తన విద్యాప్రభావంవల్లనే శ్వేతకేతువు అక్కని సుజాతని పెళ్ళిచేసుకున్నాడు. తపస్సుచేసుకుంటూ అతడు శిష్యులికి వేదాలు చదివిస్తూవుండేవాడు. ఎంతో అంతకాలమయాక సుజాత నీళ్ళుపోసుకుంది. ఏకపాదుడు పగలూ రాత్రీ పాఠాలు చెప్పడం విని, సుజాతకడుపులోని కుమారుడు కడుపులోంచే ఆక్షేపించాడు తండ్రిని. 'పగలనీలేదూ, రాత్రనీలేదూ, ఇలా ఎల్లప్పుడూ చదివించడమేనా? నిద్రా అది లేక వల్లించివల్లించి జడ్డిపట్టిపోతున్నారు శిష్యులు, ఏమిటి చదువుతున్నారో వాళ్ళకే తెలియకుండా వుంది. ఏం చదువిది?' అన్నాడు. ఎక్కడలేని మంటా మండుకు వచ్చింది ఏకపాదుడికి. 'వేదాధ్యయనానికి వంకలు పలుకుతున్నావు. అందేత, ఎనిమిది వంకలతో పుడతావు' అని శపించాడు కొడుకుని.

నవమాసాలూ నిండాయి సుజాతకి. నేడో రేపో ప్రసవించే సమయమైంది. బెంగగావుంది ఆమెకి. ఒకనాడు భర్తతో అంది: 'ఎంత లేనివాళ్లయినా పురుడువస్తుందంటే ముందుగానే జాగ్రత్తపడతారు. నెయ్యీ, నూనే, వస్త్రాలూ సంగ్రహించి పెట్టుకుంటారు. మనకా, చేతిలో ఎర్రని ఏగానీ లేదు. అంచేత, ఏప్రయత్నం లేకండాపోయింది. నేనా, రేపో నేడో అన్నట్టు వున్నాను. ఏం దారి? ఈ పురిటిబాధ ఎలా గట్టెక్కుతుందో అని బెంగగావుంది'—అని.

భార్యమాటలువిని, ధనం సంపాదించడంకోసం బయలుదేరాడు ఏకపాదుడు. ఆవెళ్లడం వెళ్లడం మిథిల రాజు యజ్ఞంచేస్తున్నాడని విని, అక్కడికి వెళ్లాడు. అక్కడ వరుణుడికొడుకు వందితో అతడికి శాస్త్రవివాదం జరిగింది. ఆ వివాదంలో ఏకపాదుడు ఓడిపోయాడు. అలా ఓడిపోయిన పండితుల్ని నీళ్లలో ముంచి బందీలుగా వుంచడం రివాజు అక్కడ. అలాగే ఏకపాదుడూ ఓడిపోయి, నీళ్లలోమునిగి, అక్కడే బందీగా వుండిపోయాడు.

ఇక్కడ పురిటినొప్పులువచ్చాయి సుజాతకి యుక్తసమయంలో ఆమెకి అష్టావక్రుడు (ఎనిమిదివంకలవాడు) పుట్టాడు. అష్టావక్రుడు పుట్టినప్పుడే సుజాతతల్లి కుశికసుతకి శ్వేతకేతువు పుట్టాడు. మేనల్లుడూ మేనమామా ఇద్దరూ వొకే ఈడువాళ్లయి, వొక్కదగ్గిరే పెరిగారు. ఒక్కదగ్గిరే పన్నెండేళ్లూ శ్వేతకేతుతండ్రి ఉద్దాలకుడిదగ్గిర వేదాలూ, వేదాంగాలూ క్షుణ్ణంగా చదుకున్నారు.

పుట్టిననాటినుండీ కన్నతండ్రిని ఎరగడు అష్టావక్రుడు. తాత ఉద్దాలకుణ్ణే తండ్రి అనుకునేవాడు. శ్వేతకేతువుని సోదరుడనుకునేవాడు. ఒకనాడు ఉద్దాలకుడి తొడమీద కూచునివున్నాడు అష్టావక్రుడు. చూసి మచ్చరించుకున్నాడు శ్వేతకేతువు. 'మానాన్న తొడ

మీద నువ్వెందుకు కూచున్నావు? వెళ్ళు. మీనాన్న తొడమీద కూచోరాదూ!' అంటూ చెయ్యిపట్టుకుని కిందికి లాగేశాడు.

ఏడుస్తూ తల్లిదగ్గిరికి వచ్చాడు అష్టావక్రుడు. 'మాఅయ్య ఎవరో, ఎక్కడవున్నాడో చెప్పు' అంటూ మారాముపెట్టాడు. తల్లి వల్ల తండ్రివునికి తెలుసుకున్నాడు. వెంటనే మిథిలకి పయనమయాడు. మేనల్లుడివెంట శ్వేతకేతువూ బయలుదేరాడు. ఇలా మేనమామా, తానూ వెళ్ళి జనకుడి యజ్ఞశాలదగ్గిర ప్రవేశించాడు అష్టావక్రుడు.

కుర్రవాళ్ళనిచూసి, లోపలికి వెళ్ళనియ్యలేదు ద్వారపాలకులు. 'మూగివాళ్లూ, గుడ్డివాళ్లూ, చెవిటివాళ్లూ, స్త్రీలూ, బ్రాహ్మలూ - యావన్మందీ వెళుతూవున్న రాజద్వారం ఇది. బ్రాహ్మలం మేం. విద్వాంసులం. మమ్మల్ని అటకాయిస్తావేమిటి?' అంటూ పట్టు పట్టాడు అష్టావక్రుడు. 'మీరు కుర్రవాళ్లు. పన్నెండేళ్ళయినా దాటినట్టు లేదు. ఇది యజ్ఞసభ. వృద్ధులూ, మహావిద్వాంసులూ, యజ్ఞాల్లో ఆరితేరినవాళ్లూ తప్ప ఇతర్లు వెళ్ళడానికి వీల్లేదు' అన్నారు జవాన్లు.

'అదేమన్నమాట!' అంటూ అడ్డుతగిలాడు అష్టావక్రుడు. వయస్సు ముదరడం, తల పండడం - ఈమాత్రం జరిగితే మనిషి వృద్ధుడూ, పండితుడూ అయిపోయినట్టేనా? జ్ఞానంకదా, ప్రధానం జ్ఞానంకలవాడు బాలుడయినా, వృద్ధుడే.* వేదాలు బాగా చదివి ఆచారవంతుడయినవాడు బాలుడయినా, అందరూ పూజించదగ్గవాడే పొగడదగ్గవాడే. సందేహం లేదు. కుర్రవాళ్ళమని మమ్మల్ని అవమానించవద్దు. మీరాజసభలో కొమ్ములు తిరిగి న్నాడే వంది, అతడితో వాదించటానికే వచ్చాం మేం. మహారాజుతో మనవి చెయ్యి' అన్నాడు.

---

*శో. న తేన వృద్ధో భవతియే నాస్య పలితః శిరః
యో వై యువాఽప్యధీన స్తం దేవాస్థవిరం విదుః. మనుస్మృతి.

'సరే, ప్రయత్నించిచూస్తాము' అంటూ వెళ్ళి జనకుడితో చెప్పారు జవానులు. లోపల ప్రవేశపెట్టమన్నాడు రాజు. మేన మామతో సహా సభలో ప్రవేశించాడు అష్టావక్రుడు. కుర్రవాళ్ళని చూసి ఎన్నో ప్రశ్నలు వేశాడు జనకుడు. అన్నిటికీ అన్ని సమాధానాలూ చెప్పాడు అష్టావక్రుడు.

జనకుడు : ఆరు నాభులూ, పన్నెండు అంశలూ, ఇరవై నాలుగు పర్వాలూ, మున్నూటా అరవయి రేకులూ - ఇది తెలుసుకున్నవాడు పండితుడు.

అష్టావక్రుడు : ఆరు రుతువులూ నాభులు. పన్నెండు మాసాలూ అంశలు. ఇరవై నాలుగు పక్షాలూ పర్వాలు. మున్నూటా అరవయి దినాలూ రేకులు. ఈకాలచక్రం నిన్ను కాపాడుతుంది.

జనకుడు : బడబలవలె కలుసుకుని, ఏవి ఎవరివల్ల గర్భం ధరించి, ఎవణ్ణి కంటాయి ?

అష్టావక్రుడు : పూర్వ ఉత్తర అరణులు వాయువుతో కలుసుకుని కన్న అగ్నివల్ల బాధ నీశత్రువుకయినా వుండకండా వుండాలి.

జనకుడు : నిద్రలో కళ్ళు మూయని వాళ్ళెవరు ?

అష్టావక్రుడు : చేపలు.

జనకుడు : జన్మించిన్నీ కదలంది ఏది ?

అష్టావక్రుడు : గుడ్డు.

జనకుడు : హృదయంలేంది ఏది ?

అష్టావక్రుడు : రాయి.

జనకుడు : వేగంవల్ల ఏది పెరుగుతుంది ?

అష్టావక్రుడు : ఏరు.

సంతోషించాడు జనకుడు. 'నువ్వు దేవతవి కాని సామాన్యుడివి కావు. మండపానికి దయచెయ్యి. ఇదిగో, ఇతడే వంది' అని వందిని

పరిచయం చేశాడు. వందిదిక్కు తిరిగాడు అష్టావక్రుడు. అతణ్ణే ధిక్కరిస్తూ గంభీరంగా అన్నాడు: 'వందీ, పండితుల్ని వాదనలో పీక నొక్కుతున్నావు. వాళ్ళని నీళ్ళలో ముంచేస్తున్నావు. ప్రళయాగ్నిలో సెలయేరు ఆర్చుకుపోతుంది. అలాగే నాముందు నీవాదన అడగారి పోతుంది.' వెంటనే వాదనకి దిగాడు వంది.

వంది : అనేకవిధాల ప్రజ్వలిస్తాడు అగ్ని; ఒక్కడు. అంతటినీ వెలిగిస్తాడు సూర్యుడు; ఒక్కడు. వీరుడూ, నియంతాన్న ఇంద్రుడు; ఒక్కడు. పితృదేవతల ప్రభువు యముడు; ఒక్కడు.

అష్టావక్రుడు : స్నేహితులు– ఇంద్రుడూ అగ్నీ; ఇద్దరు. రథ చక్రాలు రెండు. భార్యాభర్తలు ఇద్దరు.

వంది : కర్మవశంగా మనుష్యుల జన్మలు మూడు. వాజపేయం వహించిన వేదాలు మూడు. అధ్వర్యులు యజ్ఞంలో అనుష్ఠించే కాలాలు మూడు. లోకాలు మూడు. జ్యోతులు మూడు.

అష్టావక్రుడు : బ్రాహ్మల ఆశ్రమాలు నాలుగు. యజ్ఞం నడిపే వాళ్లు నలుగురు. దిక్కులు నాలుగు. వర్ణాలు నాలుగు. పశువులకాళ్ళు నాలుగు.

వంది : అగ్నులు అయిదు. పంక్తిఛందస్సు పాదాలు అయిదు. యజ్ఞాలు అయిదు. ఇంద్రియాలు అయిదు. సిగలు అయిదు. లోకంలో విఖ్యాతమయిన నదాలు అయిదు.

అష్టావక్రుడు : సంస్కారపూర్వకంగా అగ్నిస్థాపన చేసేటపుడు దానం ఇవ్వవలిసిన ఆవులు ఆరు. కాలచక్రంలో రుతువులు ఆరు. మనస్సుతో కలిపి ఇంద్రియాలు ఆరు. కృత్తికలు ఆరు. వేదాల్లో సిద్ధ మైన యజ్ఞాలు ఆరు.

వంది: గ్రామ్యపశువులు ఏడు. అడివి పశువులు ఏడు. యజ్ఞం వహించిన ఛందస్సులు ఏడు. ఋషులసంఖ్య ఏడు. వీణకి తీగెలు ఏడు.

అష్టావక్రుడు: వంద ముడతల సంచులు ఎనిమిది. సింహాన్ని చంపే శరభమృగం కాళ్ళు ఎనిమిది. దేవతల్లో వసువులసంఖ్య ఎనిమిది. యజ్ఞంలో యూపస్తంభం అంచులు ఎనిమిది.

వంది: పితృయజ్ఞాల మంత్రాలు తొమ్మిది. సృష్టి విధానాలు తొమ్మిది. బృహతీఛందస్సు అక్షరాలు తొమ్మిది. నాశనంలేని సంఖ్య తొమ్మిది.

అష్టావక్రుడు: దిక్కులు పది. వెయ్యిలో వందలు పది. గర్భిణిస్త్రీ గర్భంమోసే నెలలు పది.

వంది: యూపాలసంఖ్య పదకొండు. ప్రాణుల వికారాలు పదకొండు. దేవతల్లో రుద్రులసంఖ్య పదకొండు.

అష్టావక్రుడు: సంవత్సరానికి నెలలు పన్నెండు. ఆదిత్యుల సంఖ్య పన్నెండు.

వంది: తిథుల్లో ప్రశస్తమైనతిథి త్రయోదశి-అంటేపదమూడు. భూలోకంలో ద్వీపాలు పదమూడు.—

అంతే చెప్పాడు వంది. శ్లోకం సగమే అయింది. మరి ముందుకి నడవలేదు. దాంతో చేతులునులుపుకుంటూ సలబడిపోయాడతడు. వెంటనే అందుకున్నాడు అష్టావక్రుడు.

"అతిఛందస్సు మొదటి అక్షరాలు పదమూడు"-అని.

పీగిపోయాడు వంది. సభసభంతా అష్టావక్రుడి ప్రశంసతో ఱుమునిపోయింది. ఇలా జనకమహారాజు సభలో అంతమంది

పండితులఎదటా వందిని పీగగొట్టాడు అష్టావక్రుడు. అంతవరకూ వందితో వోడిపోయినవా ళ్లందరినీ-తనతండ్రి ఏకపాదునితో సహా చెర విడిపించాడు. జనకుడిచేత సన్మాన సత్కారాలూ పొందాడు. తండ్రిని తీసుకుని మేనమామతో సహా ఆశ్రమానికి వచ్చేశాడు. ఇదీ అష్టావక్రుడికథ.

“ఇదిగో ఇది సమంగ. పుణ్యనది. ఇక్కడే భరతుడి రాజ్యాభిషేకం జరిగింది. పూర్వం ఈనదినీళ్లు ముట్టడంచేతనే దేవేంద్రుడికి లక్ష్మీప్రసన్న మయింది.

ఇది మైనాకకుక్షి. ఇక్కడకొడుకులకోసంఅదితి తపస్సుచేసింది.

ఇది ఋషిదైవతమైన కనకశిలాపర్వతం. సనత్కుమారుడు సిద్ధి పొందిన స్థల మిది. ఇది ఉష్ణగంగ. ఇందులో స్నానంచేసినవాళ్ళు కృతార్థు లవుతారు.

ఇదిగో, ఇది రైభ్యముని ఆశ్రమం. ఇది భరద్వాజుడి ఆశ్రమం. ఇక్కడే భరద్వాజుడి కొడుకు యవక్రీతుడు విద్యాగర్వంచేత ప్రాణాలు వొదిలిపెట్టాడు.”

యవక్రీతుడి పేరుచెప్పగానే అతడి చరిత్ర చెప్పమన్నాడ ధర్మరాజు. రోమశుడు చెప్పాడు.

## యవక్రీతుడికథ

రైభ్యుడూ, భరద్వాజుడూ ఇద్దరూ పరస్పరం స్నేహం వుండేవాళ్ళు. ఇద్దరూ కలిసి తపస్సుచేసుకుంటూనూ వుండేవాళ్ళు రైభ్యుడికి అర్వావసువూ, పరావసువూ అని ఇద్దరు కుమాళ్ళు. భరద్వాజుడి కుమారుడు యవక్రీతుడు. రైభ్యుడూ అతడి కుమాళ్ళు అధ్యయనంలో అందెవేసినచేతులు. వాళ్ళవిద్య చూసి ప్రతీవాళ్లూ గౌరవించేవాళ్ళు వాళ్ళని. అది చూసి కన్నుకుట్టేది యవక్రీతుడికి. తపస

చేసి, వాళ్ళని మించినట్టు వేదాలూ, శాస్త్రాలూ సాధించాలని నిశ్చయించుకున్నాడతను. అగ్నిలో ధాయ్యా- అంటే సామి దేనికుక్కా సంధిస్తూ ఉగ్రమైన తపస్సుచేయడం ప్రారంభించాడు.

అతడి తపస్సు సహించలేకపోయాడు దేవేంద్రుడు. తిన్నగా యవక్రీతుడి దగ్గిరికి వచ్చాడు. 'ఎందుకని ఇలా తపస్సు చేస్తున్నావు?' అంటూ అతణ్ణి అడిగాడు. 'చదవకండానే చదువులన్నీ రావాలి నాకు. వేదాలూ శాస్త్రాలూ వేటిలోనూ కొరతవుండకూడదు. అందుకనే తపస్సు చేస్తున్నాను' అన్నాడు యవక్రీతుడు. 'గురువు లేని చదువు చదువేమిటి?' అన్నాడు ఇంద్రుడు. 'తపస్సువల్ల విద్య సంపాదించవచ్చు. సందేహం లేదు. కాని తే, పరమార్థమేమీ వుండదు. ఎంత సాధువయినవాడికయినా, అలాంటి విద్యవల్ల మదనూ మచ్చరమూ మాత్రం అధికమవుతాయి. అంచేత, చదవకండా విద్యరావాలని తపస్సు చెయ్యడం తగనిపని. విడిచిపెట్టు' అని చెప్పి వెళ్ళాడు.

ఇంద్రుడేమో చెప్పాడు. కాని వినుకోలేదు యవక్రీతుడు. ఎప్పటిలాగే తపస్సు మొదలుపెట్టాడు. దానికి మరింతా ఇదయాడు దేవేంద్రుడు. ఒక ముసిలి బ్రాహ్మడివేషంలో మళ్ళీ వచ్చాడు. ఉత్తి ఎముకలగూడుమాత్రంగా వుంది శరీరం. ఊదేస్తే పడిపోయినట్టున్నాడు. అలావచ్చి పిడికెడేసి ఇసక పోసి నదీప్రవాహానికి అడ్డుగట్టు పోయడం మొదలు పెట్టాడు. అది చూశాడు యవక్రీతుడు. 'ఏమిటి తాతా ఈ వెర్రి?' అంటూ నవ్వాడు. 'మూడుకాళ్ళ ముసిలి పండువి. శరీరంలో పూచికపుల్లంత సత్తువ లేదు. అసాధ్యమైనపనికి యత్నిస్తున్నావు! ఏమనాలి నిన్ను? ఎప్పటికి ముగుస్తుందిది!' అన్నాడు.

'నీలాటి వెర్రే నాదిన్నూ' అంటూ నిజరూపంతో నిలబడ్డాడు దేవేంద్రుడు. 'నువ్వెలా అసాధ్యమైన దానికి యత్నిస్తున్నావో,

నేనూ అలాగే చేస్తున్నాను. విన్నావా, లాభం లేదు. ఇంతట్లో అయినా ఈ తపస్సు కట్టిపెట్టు' అని మళ్ళీ మందలించాడు. ఎన్నో విధాల బోధించాడు.

అయినా వినలేదు యవక్రీతుడు. నాకోర్కెతీర్చి మరీ వెళ్ళమని భీష్మించి కూచున్నాడు. చివరికి యవక్రీతుడు కోరిన వర మిచ్చి వెళ్ళాడు దేవేంద్రుడు. చదవకండానే చదువులన్నీ వచ్చే శాయి యవక్రీతుడికి. తక్షణం తండ్రిదగ్గిరికి వెళ్ళి చెప్పాడు: 'అన్ని చదువులూ నాకు అవగతమైనాయి. రైభ్యుణ్ణి, అతడి కొడుకుల్నీ ఇహ గీటుకే తీసుకురాను' అన్నాడు గర్వంగా.

కొడుకుమాటలికి బాధపడ్డాడు భరద్వాజుడు. గర్వం కూడ దని బోధించాడు. వేదంనించి కథలూ ఆపీ ప్రమాణం చూపాడు.

'వెనకటికి బాలధి అని వొకముని వుండేవాడు. పుత్రశోకంతో ఎంతోఅంత తపస్సుచేశా డతడు. దేవతల దయవల్ల చివరికి చిరంజీవి అయిన మేధావి అని వొక కుమారుణ్ణి కన్నాడు. ఆయుర్దాయముంది కదా అని మహా మిడిసిపడేవాడు మేధావి. రుషి అన్నవాణ్ణి ఎవణ్ణీ లక్ష్యపెట్టేవాడు కాడు. ఒకనాడు ధనుషాక్షుడు అనే రుషిని అడ్డ మానిమాటలూ అన్నాడు. అరికాలిమంట నెత్తికెక్కింది ధనుషాక్షు డికి. అతడు కళ్ళెర్రచేసేసరికి చచ్చివూరుకున్నాడు మేధావి. విన్నావా, గర్వమంత చెడ్డది మరొకటిలేదు. ఎంతటివాణ్ణయినా నాశనంచేస్తుం దది. గర్వం లేనివాడే గొప్పవాడు. అంచేత అబ్బాయీ, నువ్వో గర్వం వొదిలిపెట్టు. కోపానికి తావివ్వకు. రైభ్యుడి కొడుకులు శాంత మూర్తులు. వాళ్ళతో మచ్చరంపెట్టుకోకు'అని ఎన్నోబుద్ధులు చెప్పాడు.

'సరే' అన్నాడు యవక్రీతుడు. 'మీ రొకటీ రైభ్యు డొకటీ కాదు నాకు. మీరు చెప్పినట్టే నడచుకుంటాను' అన్నాడు. కానైతే,

తనకి ఇంతవచ్చునని ప్రకటించవలెననే వుండే దతడికి అందుకని, ఋషుల సభలికీ వాటికీ వెళ్ళి తన పాండిత్యం ప్రదర్శిస్తూ వుండేవాడు.

ఒకనాడు, వుండబట్టక రైభ్యుడి ఆశ్రమందిక్కు బయల్దేరా డతడు. ఆశ్రమంముందు వసంతకాలంలోని పూలమొక్కలతోనూ, పళ్ళచెట్లతోనూ అందంగా వుంది తోట. చిలకలు కిలకిల మంటున్నాయి. తుమ్మెదలు పాడుతున్నాయి. కోయిలలు కూస్తున్నాయి. ఆతోటలో పరావసుడిభార్య కృష్ణ తిరుగుతోంది. చూశాడు యవక్రీతుడు. చూసినకొద్దీ కామవికారం రేగిం దతడికి. ఆగలేకపోయాడు. మెల్లిగా ఆమెదగ్గిరికి వెళ్ళాడు. మనస్సులోమాట చెప్పనూ చెప్పేశాడు, సాహసించి.

భయపడింది కృష్ణ, కాదంటే శాపంపెడతాడేమో! ఒప్పుకున్నట్టే నటించింది. మెల్లిగా తప్పించుకువెళ్ళి, మామ రైభ్యుడితో అంతా చెప్పేసింది. కోపంతో బుసకొడుతున్నట్టు వుందామె. కన్నీళ్ళతో మెళ్లోని రుద్రాక్షపేరు తడిసిపోతూనూ వుంది.

హోమాగ్నిశిఖలాగ చర్రున లేచాడు రైభ్యముని. పళ్లు కొరుకుతూ తన తలనుండి వొక జడ పెరికాడు. అగ్నిలో వేల్చాడు. హోమకుండంలోంచి, కృష్ణకంటే అందమయిన అమ్మాయి కృత్తి పుట్టుకువచ్చింది. మరో జడ పీకాడు ముని. మళ్లీ అగ్నిలో వేల్చాడు. వికృతమయిన కోరలతోనూ వాటితోనూ శూలంపట్టుకుని వొక రాక్షసుడు పుట్టాడు. ఇద్దరూ చేతులు జోడించారు. 'ఏమిటి సెలవు?' అంటూ అడిగారు. 'అవినీతిపరుడయిన యవక్రీతుణ్ణి హతమార్చండి' అన్నాడు ముని.

ముందుగా కృత్తి వెళ్లింది. కామవికారంతో కళవిళపడుతూన్న యవక్రీతుడి కమండలం లంకిచుకుంది. కమండలం పోవడంతోటే అపవిత్రుడయిపోయాడు యవక్రీతుడు. తపశ్శక్తి తగ్గిపోయింది. దాంతో,

అతణ్ణి వెంటతరిమాడు రాక్షసుడు. అడలెత్తిపరుగెత్తాడు యవక్రీతుడు. చెరువుల్లోనూ, నదుల్లోనూ చొరబడ్డాడు. అతడు అడుగుపెట్టడంతోనే అడుగంటిపోయాయి వాటిల్లోనీళ్లు. చేసేదిలేక తండ్రి అగ్నిహోత్రంలో దూరికాడు. అవీ ఆరిపోయాయి. మరి తావులేకపోయిందతడికి. చిక్కిపోయాడు రాక్షసుడికి. శూలంతో వొక్కపోటు పొడిచాడు రాక్షసుడు. అరుస్తూ ప్రాణం వొదిలేశాడు యవక్రీతుడు.

తిరిగి రైభ్యుడి దగ్గిరికి వచ్చి నివేదించాడు రాక్షసుడు. కృత్తి నిచ్చి అతడికి పెళ్లిచేశాడు రైభ్యుడు.

కొంతసేపయాక అడివినుండి ఆశ్రమానికి వచ్చాడు భరద్వాజుడు. ప్రతీదినం స్వాగతమిచ్చే అగ్నిహోత్రాలు ఆరిపోయివున్నాయి. తెల్లపోయా డతడు. ఆశ్రమం కాపలావున్న శూద్రుడివల్ల అంతా విన్నాడు. చచ్చి పడివున్న కొడుకునీ చూశాడు. గుండెచెక్కలయినట్టయింది దుఃఖం. 'అయ్యో, చెవులో గూడుకట్టుకు పోరాను. రైభ్యుడు కోపిష్టి, అతడి ఆశ్రమానికి వెళ్ళవద్దన్నాను. నామాటలు నచ్చలేదు నీకు! గర్వం - గర్వమే కబళించింది నిన్ను' అంటూ ఎంతో మొత్తుకున్నాడు. ఏడ్చాడు. ఏడుస్తూనే చితి పేర్చాడు. కొడుకుశవం చితిమీద పెట్టాడు. అగ్గి రగిలించాడు. మండుతోంది చితి. భరించలేక పోయాడు భరద్వాజుడు. చితిమీదపడి తానూప్రాణాలు వొదిలేశాడు.

యవక్రీతుడిపని అలా అంతమైపోయింది. అంతలో బృహద్ద్యుమ్నుడని వొకరాజు సత్రయాగం తలపెట్టి అర్వావసుణ్ణీ, పరావసుణ్ణి రుత్విజులుగా పిలిచాడు. తండ్రి రైభ్యుడి అనుమతి తీసుకుని, అన్నదమ్ములు ఇద్దరూ బృహద్ద్యుమ్నుడి యజ్ఞానికి అధ్వర్యం వహించారు.

ఒకనాడు వేకువజామున పరావసుడు తన ఆశ్రమానికి వస్తున్నాడు. చీకటిగావుంది దారి. ఎదురుగుండా ఏదో వస్తున్నట్టు చప్పుడయింది. తిన్నగా అది తనదిక్కే వస్తోంది. ఏమిటది-? — ఏదో

మృగమే అనుకున్నాడు పరావసుడు. కళ్ళుమూసుకుని కత్తితో వొక్క వేటు వేశాడు. తీరాచూస్తే అది మృగంకాదు మనిషి. తన తండ్రి – రైభ్యుడు. దెబ్బతో ప్రాణంపోయింది. కింద పడిపోయాడు.

ఎంతో దుఃఖించాడు పరావసుడు. ప్రేతకార్యం ముగించి, బృహద్ద్యుమ్నుడి సత్రయాగానికి వెళ్ళాడు. 'తండ్రిని చంపుకున్న పాపాత్ముణ్ణి' అంటూ అన్న అర్వావసుడితో చెప్పి ఏడ్చాడు. 'అన్నయ్యా, అయిందేదో అయిపోయింది. బ్రహ్మహత్యాపాతకం వొదిలించుకోవాలి ఇపుడు. యజ్ఞకార్యం వొక్కడివీ నువ్వు నిర్వహించలేవు. నేనయితే పరవాలేదు. ఒక్కణ్ణే చెయ్యగలుగుతాను. నేను యజ్ఞంలో వుంటాను. నువ్వు నాకోసం బ్రహ్మహత్యావ్రతం చేసిరా!' అన్నాడు.

తమ్ముడిమాటకి సమ్మతించాడు అర్వావసుడు. ఆశ్రమానికి వెళ్ళి బ్రహ్మహత్యావ్రతం మొదలుపెట్టాడు. పరావసుడు వొక్కడే సత్రయాగం నడుపుతూ వుండేవాడు. బ్రహ్మహత్యకి ప్రాయశ్చిత్తాలూ అవీ ముగించి, యథాప్రకారం సత్రయాగానికి వచ్చాడు అర్వావసుడు. ఇంతలో అన్నగారికి ఉద్వాసంచెప్పాలన్న దుర్బుద్ధి పుట్టింది పరావసుడికి. 'మా అన్న యజ్ఞానికి పనికిరాడు' అని బృహద్ద్యుమ్నుడితో చెప్పాడు. 'యజ్ఞమంటే మహాపవిత్రమయిన కార్యం. బ్రహ్మహత్య చేశాడు మాఅన్న. దానికి ప్రాయశ్చిత్తంకోసమే ఆశ్రమానికి వెళ్లాడు. దీనికి పనికిరాడిక' అన్నాడు.

దాంతో, యజ్ఞశాలకి వస్తోన్న అర్వావసుణ్ణి రాకండా సేవకుల చేత అటకాయించాడు బృహద్ద్యుమ్నుడు. 'నేనుకాదు రాజా, బ్రహ్మహత్యచేసినవాడు మా తమ్ముడే. వాడికోసమే నేను ప్రాయశ్చిత్త వ్రతాలు చేశాను. పాపం వొదిలించుకుని వస్తున్నాను' అన్నాడు అర్వావసుడు.

అర్వావసుడే సత్యం చెప్పాడు. అతడి ధర్మబుద్ధికి దేవతలు సంతోషించారు. 'తమ్ముడి పాపం పోగొట్టడానికి ని ప్రాయశ్చిత్త వ్రతాలు చేశావే నువ్వు. నీ ధర్మబుద్ధికి సంతోషంగా వుంది మాకు. ఏం కావాలో కోరుకో. నీఇష్టం వచ్చింది చేసిపెడతాం' అన్నారు. మాతండ్రినీ, భరద్వాజుణ్ణీ, యవక్రీతుణ్ణీ బతికించండి. మాతమ్ముడికి 'పితృహత్యాదోషం లేకండా చెయ్యండి. అంతేచాలు' అన్నాడు అర్వావసుడు. 'తథాస్తు' అన్నారు దేవతలు.

రైభ్యుడూ, భరద్వాజుడూ, యవక్రీతుడూ బతికి, యజ్ఞం దగ్గిరికే వచ్చారు. జరిగిందంతా తెలుసుకున్నారు. 'అయితే వేదాలూ, శాస్త్రాలూ అన్నీ వచ్చు నాకు. ఎన్నో వ్రతాలూ అవీ కూడా చేశాను. కాని, రైభ్యుడిదగ్గిర పీగిపోయాను. నాకంటే అతడికి అంత ఆధిక్యం ఎలావచ్చిందో తెలియడం లేదు. ఏమిటిది?' అంటూ దేవతల్ని అడిగాడు యవక్రీతుడు.

'నిజమే, ఎన్నోవిద్యలు వచ్చు నీకు. కానైతే, గురుశుశ్రూష లేదు. కష్టపడి, గురువుని సేవించి నేర్చుకున్న విద్య సమయానికి స్ఫురిస్తుంది. మరోలాగ నేర్చుకున్నది ఏదీ అలా ఫలవంతం కాదు. గురుశుశ్రూష లేదు నీకు. నీవిద్య నిర్వీర్యమయింది. గురువుని సంతోషపరిచి నేర్చినవాడు కనక రైభ్యుడు బ్రహ్మజ్ఞాని. గురుసేవే అతణ్ణి అంత శక్తివంతుణ్ణి చేసింది' అని చెప్పి అంతర్ధానమయారు దేవతలు.

ఇదే యవక్రీతుడి ఆశ్రమం. ఇక్కడ నివాసంచేసినవాళ్ళకి పాపాలు అంటవు.

ఇది కాలశైలం. ఇదిగో ఇది ఏడు పాయలయిన గంగ. మానవమాత్రుల కళ్ళకి కనపడ దిది.

ఇది మందరపర్వతం. ఇక్కడ రకరకాల ఆయుధాల్లో ఆరితేరిన ఎనభైఎనిమిది వేలమంది గంధర్వులూ, కిన్నరులూ, కింపురుషులూ,

దేవతలూ దేవేంద్రుణ్ణి కొలిచి వెళతారు. కైలాసపర్వతం ఆరు యోజనా లుంది. అక్కడే వుంటాడు కుబేరుడు.

రోమశుడు చెప్పిన ప్రతీవిషయం సావధానంగా వింటూ, ప్రతీ తీర్థం దర్శిస్తూ, ఇంతవరకూ ఏ లోపమూ లేకండా వచ్చారు పాండవులు. అక్కడినుండీ మాత్రం భయంకరంగా వుంది మార్గం. అప్పుడు భీముణ్ణిచూసి "తమ్ముడూ, అడుగు పెట్టడానికే అసాధ్యంగా వుంది దారి. వెళ్ళడం కష్టం. మనమాటకేం, అసలే నడవలేదు ద్రౌపది. మనరథాలతో ఇంద్రసేనుడూ మొదలైనవాళ్ళూ, ధౌమ్యుడూ, తక్కిన బ్రాహ్మలూ, సహదేవుడూ, నువ్వూ ద్రౌపదిని తీసుకుని వెనక్కి వెళ్ళిపొండి. నేనూ, నకులుడూ రోమశుడితో కలిసి మీదికి వెళ్ళి వస్తాం. మేం వచ్చేవరకూ ద్రౌపది భద్రం" అన్నాడు ధర్మరాజు.

"అదేమన్నమాట అన్నయ్యా" అన్నాడు భీముడు. "ఇలా రాక్షసుల్తో నిండివున్న అరణ్యంలో నిన్ను విడిచిపెట్టి వుండడమా? నిమిషమైనా వుండగలమా మేం! తమ్ముడు అర్జునుడు లేడనే విచారిస్తున్నావు నువ్వు. దానికితోడు సహదేవుడూ, నేనూ, ద్రౌపదీ కూడా దగ్గిరలేకపోతే, ఇంక చెప్పేదేముంది! మరింత బాధపడతావు. నువ్వు కష్టపడుతూవుంటే మేం సుఖంగా వుండడం! ఈభేదభావం మాకుమాత్రం ఏమంతమంచిది? నువ్వేమీ సంశయించకు. ద్రౌపదీ, చిన్నతమ్ములూ నడవలేకపోతే, వాళ్ళని భుజాలమీద వేసుకుని మోసుకువస్తాను. రథాలూ అవీ వెళ్ళడానికి వల్లకాదంటావా, పోనీ. వాటినీ, ఇంద్రసేనుడూ మొదలయినవాళ్ళనీ ఎక్కడయినా జాగ్రత్తగా వుంచి వెడదాం" అన్నాడు.

"నాకోసం విచారించకండి" అంటూ ధర్మరాజుని వోరచూపులు చూసింది ద్రౌపది. "మీవెనకాలే నడుస్తూ వస్తాను" అంది.

"అర్జునుడికోసం మరి విచార మక్కరలేదు. గంధమాదనం మీద అతణ్ణి తప్పకచూస్తాం, పదండి" అన్నాడు రోమశుడు. రోమశు డిలా అనడంతోనే అందరికీ ఆనందం కలిగింది. అపరిమిత మయిన ఉత్సాహంతో అందరూ ముందుకి నడిచారు. అలా వెళ్ళివెళ్ళి ఎదట పుళింద (కుళింద) రాజయిన సుబాహుడిపట్నం చేరారు. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, కిరాతప్రజలూ, వాళ్ళతో కిటకిట లాడుతోంది ఆ పట్టణం.

పాండవులు వచ్చా రనటంతోనే ఎంతో అంత గౌరవించాడు సుబాహుడు. తమ రథాలూ, గుర్రాలూ సారథుల్తోసహా సుబాహుడి దగ్గిర భద్రపరిచారు పాండవులు. ఇంద్రసేనుడూ మొదలయిన మూల భృత్యుల్ని వుంచేశారు. ద్రౌపదినీ, బ్రాహ్మల్నీ జాగ్రత్తగా చూసు కుంటూ కాలినడకనే గంధమాదనం బయల్దేరారు.

నడుస్తున్నాడే కాని అర్జునుడే మనస్సులో మసుల్తున్నాడు ధర్మరాజుకి. - "అలిగి యుద్ధంలో నుంచున్నాడా, ఇంద్రుణ్ణయినా వీగ్గొడతాడు. వేగానికి గాలివంటి వాడు. తేజస్సుకి సూర్యుడే సూర్యుడు. పద్మపుష్పం రేకుల్లాంటి ఆకళ్లూ, పొడవాటి బాహువులూ, వృషభం మూపురాల్లాంటి భుజస్కంధాలూ - గాండీవంతో ఎప్పుడూ కళ్ల ముందు కట్టినట్టేవుంటాడు తమ్ముడు. నిజంగా ప్రపంచానికే ధనుర్ఆ చార్యుడతడు. శక్తి ఎలాంటిదో, క్షమా గుణమూ అలాంటిదే అతడిది. భీమన్నా, అర్జునుడువెళ్లి ఎన్నియుగాలో అయినట్టు వుందోయి, నాకు. ఇన్నిసంవత్సరాలు ఏంజేస్తున్నాడో ? మళ్ళీ మనమందరం కలిసి ఎప్పటి లాగే ఎప్పు డుంటామో ! అబ్బ, అతణ్ణి చూశాక గాని ఈబాధ చల్లారదోయి" అన్నాడు భీముడితో

అందరికీ అర్జునుడిమీద ధ్యాసగావుంది. అర్జునుడిగురించే మాట్లాడుకుంటూ అలా వెళ్లివెళ్లి అక్కడ పెద్ద పర్వతంలాంటి ఏము

కలగుట్ట చూశారు పాండవులు. దూరానికి కైలాసపర్వతంలా అవుపిస్తోం దది. ఇదేమిటని రోమశుణ్ణి అడిగాడు ధర్మరాజు. "నరకాసురుడి ఎముకలగుట్ట అది" అన్నాడు రోమశుడు. "ఇంద్రపదవి కోసం పది వేలేళ్లు తపస్సు చేశాడు నరకాసురుడు. ఇంద్రుడు భయపడి విష్ణుమూర్తిని ప్రార్థించాడు. తనచేత్తో తడివి నరకాసురుడి ప్రాణాలు తీశాడు విష్ణువు. ఆనాటి నరకాసురుడి ఎముకలే అలా పర్వతంలా వున్నాయి" అన్నాడు. అక్కడి నించి వెళ్లి గంధమాదనం చేరారు పాండవులు.

ఎంతో అంత ఎత్తుగా వుంది గంధమాదనం. గైరికం మొదలయిన ధాతుప్రదేశాలు పెద్దపెద్దవి కొండనిండా నిండివున్నాయి. వాటి ఎర్రరంగు అకాలంగా సాయంకాలం ముంచుకువచ్చిందా అన్న శంక కలిగిస్తుంది అక్కడి మునులికి. రంగురంగుల రాళ్లూ, రకరకాల మృగాలూ వాటితో భూదేవతయొక్క పేద్ద స్తనంలా వుంది గంధమాదనం. స్వచ్ఛమయిన స్ఫటికంరాళ్లమీద నిర్మలంగా సెలయేళ్లు ప్రవహిస్తున్నాయి. నిండుగా వున్నా యవి. వాటిలోని పద్మాలు గాలికి వూగుతూ వుంటే అద్భుతంగా వుంది.

గంధమాదనం పాదదేశం చేరారు పాండవులు. అక్కడ అడుగు పెట్టారో లేదో, పే - ద్ద పెనుగాలి వీచడం మొదలుపెట్టింది. భూమీ ఆకాశమూ ఏకంచేస్తూ గొప్ప ధూళి రేగింది. తళతళా మెరుస్తూన్న మంచుదార్లూ, సూర్యబింబమూ - అన్నీ ధూళితో కప్పడిపోతున్నాయి. దిక్కులు తెలియడంలేదు. తుప్పలూ, తీగెలూ ఎగిరిపోతున్నాయి. చెట్లకి చెట్లు విరిగిపోతున్నాయి. చెప్పలేనంత జోరుగా వుంది గాలి. విరిగిపడుతూన్న చెట్లచప్పుళ్ళకి బెదిరిపోతున్నారు పాండవులు. ఆకాశం విరిగి భూమ్మీద పడుతున్నట్టుంది. కొండ శిఖరాలు పగుల్తున్నట్టుంది. ధూళీ దుమారంలో ఎటు అడుగుతీసి ఎటు వెయ్యాలో తోచడంలేదు. ఎవరు ఎక్కడున్నారో కనపడడంలేదు.

ప్రతీహొక్కరూ బెంగతో ఇదయిపోతున్నారు. చిమ్మచీకటిలా వున్న ఆదమ్ముల్లో దేవులాడుతున్నారు. చెట్లూ తుప్పలూ చేతుల్తో తడువుతున్నారు. ఎవళ్ళకి వీలయినట్టు వాళ్ళు పెద్ద పెద్ద చెట్ల మొదళ్ళకి చేరుకుంటున్నారు. ఎలాగో వోలాగ తలదాచుకుంటున్నారు. అగ్ని హోత్రాల్తో ధౌమ్యుడూ, ధర్మరాజూ, సహదేవుడూ వొక చెట్టుకింద చేరుకున్నారు. గదా, బాణాల్తో భీముడూ, ద్రౌపదీ వొకదగ్గిర తల దాచుకున్నారు. రోమశుడూ, నకులుడూ, తక్కిన బ్రాహ్మలూ వొక దగ్గిర వొత్తిగిల్లారు.

హోరుహోరు మని గాలి వీస్తోనే వుంది. పే-ద్ద వడగళ్ళవాన ప్రారంభమైంది. ఉరుములూ, మెరుములూ — దిక్కులు పిక్కటిల్లు తున్నాయి. అంతటా భయంకరంగా వుంది, వర్షం. బ్రహ్మాండ మైన వర్షం. కొండమడుగులు నిండిపోతున్నాయి. సెలయేళ్ళు రెండువొడ్లూ కోరుకుంటూ పరుగెడుతున్నాయి. చెట్లమొదళ్ళు పెల్లగిల్లి పోతున్నాయి. అలా ఎంతోసేపు అదేమోతగా గాలీ వానా కురిసి కురిసి, చివరికి ఆగింది.

వాన వెలిశాక అందరూ వొకదగ్గిర చేరారు పాండవులు. మళ్ళీ-యథాప్రకారం యాత్ర ప్రారంభించారు. కరుకురాళ్ళతో ఇరుకుగా వుంది దారి. పాపం, నడవలేకపోయింది ద్రౌపది. మూర్ఛ పోయింది. వెంటనే భీముడు ఆమెని ఎత్తి పట్టుకున్నాడు. లేడిచర్మం పరిచి పడుకోబెట్టాడు. అరిటాకు తెచ్చి విసరడం మొదలుపెట్టాడు. నకుల సహదేవులు, ఆయుధాల అభ్యాసంవల్ల కాయలు కాసిన చేతుల్తో మెల్లిమెల్లిగా ఆమెపాదాలు పట్టారు. ఆస్థితిలో ఆమెని చూసి మిక్కిలీ దుఃఖపడ్డాడు ధర్మరాజు.

“ఎర్రతామరలవంటి మృదువయినవి ఈమె పాదాలు. కరుకు రాళ్ళమీాద కరుకుదేరి కందిపోయాయి, పాపం, ఎంత కష్టపడుత్తోంది!

దీనంతటికీ నేనే మూలం. మెత్తని పరుపుమీద హాయిగా కన్ను మూసే సుకుమారి కటికి రాళ్ళమీద పడి బాధపడుతోంది. 'పాండవులు మహాపురుషులు. వాళ్ళ భార్య అయితే సుఖపడుతోంది నాకూతురు' అని వుబ్బిపోయివుంటాడు ద్రుపదుడు!" అని కళ్ళనీళ్ళు తిప్పుకున్నాడు.

ధౌమ్యుడూ మొదలయిన బ్రాహ్మలు ధర్మరాజుని ఓదార్చారు. అంతలో, భీముడూ మొదలయినవాళ్ళు చేసిన శీతలోపచారాల్తో స్పృహ తెలుసుకుంది ద్రౌపది. ధర్మరాజు, ఆమె దగ్గిరకూచుని ఓదార్చాడు. తరవాత భీముడితో అన్నాడు : తమ్ముడూ, రాళ్ళూ రప్పలతో అసాధ్యంగా వుంది ఈ దారి. మరి నడవలేదు ద్రౌపది."

ఆలోచించాడు భీముడు. అన్నగారి సలహా తీసుకున్నాడు. పెద్ద కొడుకు ఘటోత్కచుణ్ణి తలచుకున్నాడు. తలచుకోవడమే తడువు, ఎదట ప్రత్యక్షమయాడు ఘటోత్కచుడు. వెంట తన రాక్షససైన్యం కూడా వుంది. నలుగురు తండ్రులికీ పాదాభివందనం చేశాడు ఘటోత్కచుడు. బ్రాహ్మలికీ మొక్కాడు. తండ్రిముందు చేతులుజోడించి "ఏమి సెలవు ?" అన్నాడు.

కొడుకుని కౌగలించుకున్నాడు భీముడు. ద్రౌపదిని చూపించాడు. "బాబూ, ఈమె మీ అమ్మ. రోజూ నడిచి అలిసిపోయింది. అంచేత, ఈమెని ఎత్తుకుని మాతోకూడా రావాలి నువ్వు" అన్నాడు. 'మహాప్రసాదం " అని తలవూంచాడు ఘటోత్కచుడు, "ఈమే కాదు. మీరూ నడవలేంది ఈదారి. కరుకురాళ్ళతో గహనంగా వుంటుంది. మానవమాత్రులు అడుగుపెట్టలేరు. కనుక మీ అందరినీ ఎత్తుకు తీసుకువెళతాను" అన్నాడు. నలుగురుతండ్రుల్నీ, ద్రౌపదినీ, ధౌమ్యుణ్ణీ తాను ఎత్తుకున్నాడు. బ్రాహ్మలకోసం తనసైన్యం నియమించాడు. యోగబలంకలవాడు రోమశుడు. ఒకరిసహాయం అక్కరలేంకడానే సిద్ధగతితో బయల్దేరా డతడు. ఇలా యావన్మందీ

ఆకాశమార్గంలో వెళ్ళి బదరీవనం (రేగిచెట్ల అడివి) చేరుకున్నారు. గంగానదివొడ్డునే వుంది బదరీవనం – నరనారాయణాశ్రమం. అక్కడ అందరూ రాక్షసుల భుజాలమీంచి దిగారు. వనం వనమంతా ఎంతో గొప్పగా వున్నాయి రేగుచెట్లు. చెట్లనిండా తేనెలూరుతూవున్నాయి పళ్లు. మెరుస్తూ నవనవలాడుతున్నాయి ఆకులు. మెలికలు మెలిక లుగా వున్నాయి కొమ్మలు. వనమంతా ఎప్పుడూ చల్లగా, నీడగా వుంటుంది. అదంతా చూసి ఆశ్చర్యపోయారు పాండవులు. అక్కడి గంగానదిని దేవతలూ సిద్ధులూ మునులూ అన్నివేళలా సేవిస్తూ వుంటారు. పాండవులు యావన్మందీ గంగాస్నానం చేసి, ఎన్నో వ్రతాలూ అవీ కూడా చేశారు అక్కడ. యోగసమాధిలోవుండి అక్కడినుండి మైనాకపర్వతం, హిరణ్యశిఖరం, బిందుసరం చూశారు. అలా బదరీవనంలో పదహారు దినాలు వున్నారు పాండవులు.

## సౌ గ ం ధి క ప ద్మ ం

ఒకనాడు గంధమాదనం సానువుల్లో రతనాల వేదికలమీద భీముడూ ద్రౌపదీ విహరిస్తున్నారు. ఒక సౌగంధికపద్మం ఎగిరివచ్చి వాళ్ళ కాళ్ళముందు పడింది. వెయ్యి రేకుల్తో, ఎంతో మృదువు గానూ అందంగానూ వుంది సౌగంధికం. చప్పున తీసింది ద్రౌపది. అపురూపమయిన దాని అందం, ఇంకోపువ్వులో లేని దాని సువాసనా చూసి ఎంతో ముచ్చటపడింది దామె. "ఒక్కపువ్వే ఇంత కళ్ళ వేడు కగా వుంది. మనస్సుని ఆకర్షిస్తోంది. మరిన్ని అయితే ఎంత బావుం టేది! ఈదగ్గిర్లోనే వుంటాయేమో! ఉండేమాత్రం తెచ్చిపెట్టాలి ఇది మీఅన్నయ్యకి వెళ్ళి చూపిస్తాను" అంటూ వెంటనే ధర్మరాజు దగ్గిరికి వెళ్ళింది ద్రౌపది.

భార్యకోరిక తీర్చడానికే నిశ్చయించాడు భీముడు. తన ధనుస్సు రుక్మపృష్ఠమూ, కోడెతాచుల్లాంటి బాణాలూ పట్టుకున్నాడు సౌగం

ధికం తెచ్చిన గాలికి ఎదురుగా బయల్దేరాడు. వెళుతున్నాడు భీముడు. గంధమాదనంలోని రకరకాల రత్నాలగుహాలుచూస్తున్నాడు. తుమ్మెదల ఝుంకారాలూ, కోయిలల కూతలూ వింటున్నాడు. అన్ని రుతువుల్లోనూ వుండే పువ్వులూ పూసి పరిమళిస్తున్నాయి. ఆఘ్రాణిస్తున్నాడు. మంచి మంచి పళ్ళు రుచిచూస్తున్నాడు. సంతోషిస్తున్నాడు. ముందుకి నడుస్తున్నాడు. ఎదురుగ్గా వస్తూన్న మృగాల్ని ఎదిరిస్తున్నాడు. ఏనుగుతో ఏనుగుని బాదుతున్నాడు. సింహంతో సింహాన్ని కొడుతున్నాడు. చిన్న చిన్నమృగాలు చేతుల్తోనే మోదుతున్నాడు. దారికి అడ్డంగావున్న మాళ్ళు విరిచేస్తున్నాడు. తీగెలు తెంపేస్తున్నాడు. అతడి అడుగులికి గంధమాదనం గజగజ లాడిపోతోంది. నడక వేగానికి చెట్లూ చేమలూ అల్లాడిపోతున్నాయి; వారిగేపోతున్నాయి. గుహాల్లో కనపడకండా వుండి దేవకాంతలూ, సిద్ధస్త్రీలూ, నాగకన్యలూ, గరుడకాంతలూ, గంధర్వస్త్రీలూ, కిన్నరకన్యలూ పరదాగా అతణ్ణి చూస్తున్నారు.

అలా మాం—చి మదగజంలా నడుస్తూ, గాలిలాగా గరుత్మంతుడిలాగా వేగంతో గంధమాదనం మీదికి ఎక్కి వెళ్లాడు భీముడు. అక్కడ వే—ద్ద సింహానాదం చేశాడు. ఆసింహానాదం విని ఎగిరిపోతున్నాయి పక్షులు. వాటి రెక్కలు తడిసివుండడంచూసి, ఎదట దగ్గిరలోనే సరోవరం వుందని నిశ్చయించుకున్నాడతడు. మరింత వేగం నడిచాడు. ముందుకి వెళ్లాడు. కొంతదూరం వెళ్ళేసరికి నిజంగానే సరోవరం నిర్మలమైన నీళ్ళతోనిండి కనిపించింది. దానివొడ్డునే వాక చక్కనివనం. తమాలవృక్షాలూ, తాటిచెట్లూ, అరటిచెట్లూగాలికి కదులుతున్నాయి. వాటిమీాది చల్లగాలితో సరోవరం చల్లగావుంది.

ఆసరోవరంలో స్నానంచేశాడు భీముడు. స్నానానంతరం వొడ్డునివున్న అరిటితోటలోకి వెళ్లాడు. ఎన్నో యోజనాలుంద తోట.

అందులో నుంచుని, వొక్కసారి తన శంఖంతీసి పూరించాడు. ఇంద్రుడి వజ్రాయుధం ధ్వనిలాగ భయంకరంగా ఆకాశం ప్రతిధ్వనించింది శంఖం.

## హను మ ం తు డు

ఆదగ్గిరిలోనే వొకగుహలో నిద్రపోతున్నాడు హనుమంతుడు. భీముడి శంఖధ్వని విన్నాడు. బెదిరి లేచాడు. "మహాధ్వని ఇది. వినిందికి మహానందంగా వుంది" అంటూ కళ్లు విప్పాడు. "నాతమ్ముడి శంఖధ్వనే ఇది" అని గమనించాడు. సంతోషించాడు. శరీరం పులకరించింది. భీముడిదారికి అడ్డంగా పెద్దపెద్ద చెట్లు పడవేశాడు. ఒక చిన్న దారిమాత్రం వొదిలాడు. దారికి అడ్డంగా తాను పడుకుని తోక ఆడించడం మొదలుపెట్టాడు.

హనుమంతుడు తోకఆడిస్తూవుంటే ఘోరంగావుంది చప్పుడు. అడివిమృగాలు భయపడిపోతున్నాయి. కొండగుహాలికి పారిపోతు న్నాయి. అపూర్వమయిన ఆధ్వని విన్నాడు భీముడు. ఆశ్చర్య పోయాడు. ఆదిక్కే నడిచాడు. అరటితోపుమధ్య వొక పెద్ద బండ మీాద పడుకునివున్నాడు హనుమంతుడు.

కుద్దించి బాగా బలిసివుంది మెడ. పొడవుగా వున్నాయి దవ డలు. పెదవులు మండుతూన్న నిప్పులా వున్నాయి. చెవులు ఎర్రగా వున్నాయి. నాలిక రాగి రేకులా వుంది. కనుబొమలు చలిస్తున్నాయి. పళ్ళు, గోళ్ళు వాడిగా వున్నాయి. మెరుపులో గోరోజనం కలిపితే ఎలావుంటుంది రంగు, అదిగో అలా వున్నాయి కళ్ళు. ఎత్తుగా కొట్ట వచ్చినట్టు దృఢంగా వుంది వక్షస్థలం. పొడవుగా వున్నాయి చేతులు. పొడావుగా పైకిలేస్తూవుంటే పతాకంలా వుంది తోక. యోగనిద్రలో వున్నట్టు అరమూతలు పడుతున్నాయి కళ్ళు.

అతణ్ణి లేవగొట్టా లనిపించింది భీముడికి. దగ్గిరసా వెళ్ళాడు. బలమంతా బిగబట్టి పే-ద్ద సింహానాదం చేశాడు. మెల్లిమెల్లిగా,

రెప్పలెత్తి చూశాడు హనుమంతుడు. ఆవలించాడు, తడితడిగా చలిస్తున్నాయి కళ్ళు. "ఎవరయ్యా నువ్వు?" అన్నాడు, భీముణ్ణి అనాదరంగా చూస్తూ. "ముసలివాణ్ణి, జబ్బుగా వున్నవాణ్ణి, అలిసి నా మానాన నిద్రపోతున్న వాణ్ణి నూస్తూ చూస్తూ ఇలా లేవగొడతావేం? ఆమాత్రం జాలికూడా లేదూ నీకు! అంత మదమటయ్యా! జంతువులికయితే ధర్మం తెలీదు. భూతదయాస్వరూపమయిన ధర్మం తెలిసినవాళ్ళుకదా, మనుష్యులు? అలాంటి మనుష్యజన్మ ఎత్తినీ నువ్వు వృద్ధుల సేవ చెయ్యలేదేమో? అంచేత, ధర్మం తెలీకండా దయన్నా లేకండా మాబోటి ముసిలివృగాల్ని భయపెడుతున్నావు. గావుకేకలేస్తున్నావు. మనుష్యమాత్రుడికి అగోచరమైంది ఈవనం. ఎందుకువచ్చావిక్కడికి? సిద్ధగతి లేనివాళ్ళకి ఇటువెళ్ళడం సాధ్యంకాదు. నామాట విను. రానేవచ్చావు. అమృతంలా వుంటాయి ఇక్కడి కందమూలాలు. అవి ఇన్ని తిని వచ్చినదారిని వెళ్ళు. నిన్ను చూస్తే ఎంచేతో నీమీద స్నేహం కలుగుతోంది నాకు. అందుకని చెపుతున్నాను. ఇంతకీ ఎవరంటాను నువ్వు?" అన్నాడు.

"భీముడు అంటారు నన్ను" అన్నాడు భీముడు. "క్షత్రియుణ్ణి. ఏదో అనుకుంటున్నావేమో, ఉద్దోలమయిన బలం నాది. పాండురాజు మాతండ్రి. కుంతీదేవి తల్లి. వాయుదేవుడి వరంవల్ల పుట్టాను. పనిమీద వెళుతున్నాను. దార్లో లెమ్మంటున్నాను. దారిచ్చావా, మంచిమాట. లేదంటే, నూరుయోజనాల సముద్రం దాటిపోయిన మాఅన్న హనుమంతుడిలాగ నిన్నూ ఈకొండనీ దాటి వెళతాను" అన్నాడు.

"ఏమిటేమిటీ?" అంటూ చూశాడు హనుమంతుడు. "హనుమంతుడా? సముద్రం దాటేశాడా? సముద్రం ఎందుకయ్యా, దాటాడు? నీకు తెలుసేమో చెప్తావూ? వింటాను" అన్నాడు.

"శ్రీరాముడని వొక రాజు వుండేవాడు" అంటూ ఆరంభించాడు భీముడు. ఇక్ష్వాకువంశం ఆయనది. మహావీరుడు. తండ్రిమాట నిలపడంకోసం అడివికి వెళ్ళాడు. లంక రాజు రావణాసురుడు అడివిలో రాముడిభార్యని సీతని ఎత్తుకపోయాడు. సీతని వెదకడానికని వానరులు బయల్దేరారు. సంపాతి అనేపక్షి చెప్పడంచేత వాళ్ళకి సీతవృత్తాంతం తెలిసింది. అయితే, సముద్రం దాటి, లంక వెళ్ళితేనే కాని సీతని చూసి రావడానికి వల్లకాదు. ఎవరు దాటగలరా అని బెంగపెట్టుకున్నారు వానరులు. అప్పుడు వాయుబలంతో సముద్రం దాటాడు హనుమంతుడు. ఇదీ నేను విన్నమాట. హనుమంతుడంత బలశాలినే నేనున్నా. నా పరాక్రమం, పౌరుషం చూపించమంటావా ?" అన్నాడు.

విన్నాడు హనుమంతుడు. ఏదో అర్థంకాని నవ్వు నవ్వాడు. "ఆఁ, అలాగా! సరే, నేను ముసిలివాణ్ణి. లేవలేను. నా తోక కొంచెం వొత్తిగించి నీదారిని నువ్వు వెళ్ళు నాయనా," అన్నాడు.

నిర్లక్ష్యంగా చూశాడు భీముడు. ఎడమచేత్తో తోక ఎత్త బోయాడు. శక్యం కాలేదు. పూని, రెండుచేతుల్తోనూ పట్టి ఎత్తబోయాడు. ఊహూఁ, కదల్లేదు. బలమంతా ఉపయోగించి వొకపట్టు పట్టాడు. ఎత్తలేకపోయాడు. మొాకరించి పడిపోయాడు. ఒళ్ళంతా ముచ్చెమటలు పోసింది. ఎందుకూ చేతకానివాడిలా అయిపోయాడు. గర్వం గంగపాలైంది. చిన్నబుచ్చుకున్నాడు. విచారంగా తలవొంచుకు నుంచుండిపోయాడు. వెంటనే హనుమంతుడిముందు రెండుచేతులూ జోడించాడు. నమస్కరించాడు. "అయ్యా, నిన్ను తెలుసుకోకండా పెద్దమాట లాడాను. క్షమించు. కోతిరూపంలో వున్న సిద్ధుడివో, గంధర్వుడివో చెప్పు" అన్నాడు.

"తమ్ముడూ, నేనే హనుమంతుణ్ణి"–నవ్వుతూ అన్నాడు హనుమంతుడు. కేసరి మాతండ్రి. అంజనా దేవి తల్లి. ఆమె గర్భంలో

వాయుదేవుడికి పుట్టాను. నువ్వు నాతమ్ముడివి. ఆనాడు రావణుడు సీతామహాలక్ష్మిని దొంగిలించినప్పుడు, శ్రీరామచంద్రులవారు సుగ్రీవుడూ మొదలయిన వానరవీరుల సహాయంతో సేతువు కట్టారు. సముద్రం దాటారు. యుద్ధంలో వాణ్ణి సంహరించారు. ఆ యుద్ధంలో నాపరాక్రమం మెచ్చుకున్నారు స్వామి శ్రీరాములు. దేవతలూ, మానవులూ పొగుడుతూ నాకీర్తి ఎంతకాలం వుంటుందో అంతకాలం నువ్వు జీవించి వుండు' అని నాకు వరమిచ్చారు. ఆప్రభువు పదకొండు వేల సంవత్సరాలు పరిపాలించి, స్వర్గం వేంచేశారు'' అన్నాడు.

హనుమంతుడని తెలియడంతోనే "నీదర్శనంవల్ల కృతార్థుణ్ణయాను'' అంటూ పాదాభివందనంచేశాడు భీముడు. "అన్నా, తమ్ముణ్ణి దయచూడు. సముద్రందాటినప్పుడు నువ్వు ధరించినరూపం చూడాలనివుంది నాకు. చూపించు'' అని చేతులు జోడించాడు.

"ఆకాలంనాటిరూపం ఈకాలంలో ఎలాచూపడం?'' అన్నాడు హనుమంతుడు. "కాలం ఎప్పుడూ వొక్కలాగే వుండదు. వివిధ అవస్థల్లో వివిధరూపాలుగా మారుతూ వుంటుంది. అందుకనే కృత, త్రేతా, ద్వాపర, కలియుగాల సంఖ్య వేరువేరుగానూ, ఆయా యుగాల్లో చరాచరమయిన భూతాలవిధానాలూ వేరువేరుగానూ వుంటాయి'' అన్నాడు.

హనుమంతుడు ఇలా అనగానే యుగాల ఆచారవర్తనాలు తనకి తెలియచెయ్యమని కోరాడు భీముడు. హనుమంతుడు చెప్పాడు.

"కృతయుగంలో ధర్మం నాలుగుపాదాల్తో నడుస్తుంది. విష్ణువు తెల్లరంగుతో ప్రకాశిస్తూ ప్రజాపాలనం చేస్తాడు. సనాతనధర్మం సక్రమంగా వుంటుంది. బ్రాహ్మణులూ, క్షత్రియులూ, వైశ్యులూ వొకే వేదకర్మ ఆచరిస్తూ పుణ్యలోకాలు పొందుతారు. అసూయా, శత్రుహింసకోసంచేసే అభిచారమూ, దర్పమూ, కార్పణ్యమూ,కొండెకాని

తనమూ, యుద్ధమూ, క్రోధమూ, మదమూ, మచ్చరమూ, భయమూ, సంతాపమూ, వ్యాధీ, ప్రజాక్షయమూ—ఏవీ వుండవు. త్రేతాయుగంలో ధర్మం మూడు పాదాల్తో వుంటుంది. ప్రజలు సత్యంమీదే నడుస్తారు. యజ్ఞాలూ, తపస్సులూ, దానాలూ మొదలయినపనులూ చేస్తారు. విష్ణువు ఎర్రనివాడై ప్రజాపాలనంచేస్తాడు. ద్వాపరంలో ధర్మంరెండు పాదాల్తోనే నడుస్తుంది. నాలుగు విధా లయిపోతాయి వేదాలు. ఈనాలుగువేదాలప్రకారం ధర్మం, కామం ప్రపంచంమీద వ్యాపిస్తుంది. ప్రజల్లో సత్యం నశిస్తుంది. కోరికలు పెట్టుకుని, జనంలు యజ్ఞాలూ అవీ చేస్తారు. విష్ణువు నల్లనివాడై ప్రపంచం పాలిస్తాడు. కలియుగంలో ఒకేపాదంతో వుంటుంది ధర్మం. ప్రజలు అధర్మపరులవుతారు. తమోగుణంతో ప్రవర్తిస్తారు. కామ క్రోధాల్లో పడి తమ్మనితాము మరిచిపోతారు. అధర్మమే వాళ్ళకి ఆరాధ్యమవుతుంది. విష్ణువు పసుపువర్ణంతో ప్రజాపాలనం చేస్తాడు. ఈయుగంలో చేసిన తపస్సూ, దానధర్మాలూ అధికమయిన ఫలాలిస్తాయి. తమ్ముడూ, నువ్వు అడిగింది చెప్పాను. నీకోరిక సిద్ధిస్తుంది. ఇక వెళ్లు” అన్నాడు.

“అన్నా, ఆనాటి నీరూపం చూసి కాని వెళ్ళాలని లేదు. అనుగ్రహించు”—మళ్ళీ చేతులు జోడించాడు భీముడు. దాంతో అతడికి తన నిజస్వరూపం చూపించాడు హనుమంతుడు. చెప్పడానికివీల్లేకండా పీ—ద్ధ మేరుపర్వతంలా పెరిగింది అతడి శరీరం. దిక్కులికి అందేటంత పొడవైంది తోక. చూసి కళ్ళుమూసుకున్నాడు భీముడు. భయం — ఆశ్చర్యం —ఏదోలా వుంది అతడికి.

“అన్నా, అతిభీషణంగా వుంది నీరూపం. మిక్కిలీ అద్భుతంగా వుంది. భూమీ ఆకాశం పట్టినట్టుంది. చాలు. నీ ఎప్పటిరూపం ధరించు” అన్నాడు. వెంటనే మామూల్రూపం ధరించాడు హను

ను మంతుడు, "తమ్ముడూ, ఇంతేకాదోయి, శత్రుబలం చూస్తే ఇంతకి రెండింతలు అవుతుంది నాశరీరం " అన్నాడు.

"నమ్ముతున్నాను అన్నా, నమ్ముతున్నాను. నువ్వు వొక్క డివే రావణుణ్ణి చంపేస్తావు. ఇంతబలశాలివి. నీ సహాయం వుంటే, శ్రీరాముడు రావణుణ్ణి సబాంధవంగా చంపాడంటే ఆశ్చర్యం ఏమి వుంది ?" అన్నాడు భీముడు.

భీముడి మాటలికి సంతోషించాడు హనుమంతుడు. 'భీమన్నా, నువ్వు సౌగంధికం కోసం వెళుతున్నావు. మంచిదే. కాని అక్కడ అనవసరమయిన సాహసం మాత్రం చెయ్యకు. ఆసరోవరం యక్షులూ, రాక్షసులూ రక్షిస్తూ వుంటారు. దేవతలకోసమే అది ఏర్పడింది. దేవ తలు బలీ, హోమమూ, నమస్కారమూ — వీటికే స్వాధీనులవుతారు. కాని సాహసానికి లొంగరు. నువ్వు నీధర్మం తప్పకండా ఉత్తమ ధర్మాలు తెలుసుకోవాలి. అల్పబుద్ధులు మోహంలో పడతారు. ధర్మాధర్మాలు తెలుసుకోవలిసినప్పుడు శాస్త్రం తెలిసిన విద్వాం సుల్నే సేవించాలి. మంచిఆచారవంతుడివీ కావాలి. ఆచారంతోనే ధర్మం పుడుతుంది. ధర్మంతోనే వేదప్రతిష్ఠ జరుగుతుంది. వేదాలవల్లే యజ్ఞాలు నడుస్తాయి. అలాంటి యజ్ఞాలతోనే దేవతలు తృప్తిపడతారు.

"బుద్ధిమంతులు ఎప్పుడూ కాలం దేశం తెలుసుకుని కార్యం సాధిస్తారు. సాహసం చెయ్యరు. ఎక్కడ తగినట్టు అక్కడ సామం మొదలయిన ఉపాయాలు ఉపయోగిస్తారు. మరిన్నీ, ఆలోచనవల్ల అన్నికార్యాలూ అనుకూలపడతాయి. అయితే, ఆలోచన ఎవ ళ్ళతో చెయ్యాలి? క్రూరవాళ్ళతో కాని, ధనంతో మదించిన తక్కువ వాళ్ళతో కాని ఆలోచన చెయ్యకూడదు. విద్వాంసులూ, బుద్ధి మంతులూ అయినవాళ్ళతోమాత్రం ఆలోచించాలి.

"నిగ్రహానుగ్రహ శక్తికల రాజుశాసనంలో తమతమ మర్యాదలు తప్పకండా నడుచుకుంటూరు ప్రజలు. నిగ్రహానుగ్రహాసమర్థుడివి నువ్వు. అంచేత, నీకు యావన్మందీ వశ్యులవుతారు. నిన్ను చూసి నాకళ్ళు సార్థకమయాయి. సంతోషంగా వుంది నాకు. నువ్వు ఏది కావాలంటే అదిచేస్తాను. మీకు అపకారంచేసిన శత్రువుల్ని ఆగుడ్డి రాజు కొడుకుల్ని సమూలంగా ఇట్టే యుద్ధంలో చంపేస్తాను. హాస్తినాపురం రాళ్ళతో కప్పెట్టేస్తాను. చెప్పు" అన్నాడు.

"అన్నా, జగదేకవీరుడివి. నీకు అదో లెక్కా-మిటి? నీ దయ వల్ల వాళ్ళు మాకు మించిపోరు. నీదాకా ఎందుకూ? మేమే వాళ్ళని సంహారించేస్తాం" అన్నాడు భీముడు.

"మంచిది. అయితే, యుద్ధంలో నన్ను తలచుకోవాలి. అతిరథుడయిన అర్జునుడి రథం జెండామీంచి మీ బలపరాక్రమాలు పరికిస్తాను" అని భీముణ్ణి గుచ్చి కౌగలించుకున్నాడు హనుమంతుడు. సౌగంధికసరోవరానికి దారికూడా చూపించి అంతర్ధానమయాడు.

హనుమంతుడి కౌగిలింతతో ఆయాసమంతా పోయింది భీముడికి. మరింత బలమూ వచ్చింది. దాంతో వడివడిగా సౌగంధిక సరోవరందిక్కు- అంగలువేస్తూ బయల్దేరా డతడు. దార్లో పర్వత కుంజాల్లో విహరిస్తూవున్న మేఘాలూ, ఏనుగుమందలూ చూస్తూ నడిచాడు. నీటిధారలూ, మదజలధారలూ, మెరుపులూ దంతాలూ, ఉరుములూ ఘీంకారాలూ – ఇలా సమానగుణాలవల్ల ఏవి మేఘాలో ఏవి ఏనుగుమందలో అర్థంకాలే దతడికి.

అలా వెళ్ళివెళ్ళి వెండికొండ సమీపంలో వొక అందమయిన ప్రదేశం చూశాడు భీముడు. అక్కడ కుబేరుడి ఉద్యానం – అందులో సౌగంధికపద్మవనం చూశా డతడు. అక్కడి బంగారు పద్మాల తేనె

లానుతూ కులాసాగా విహారిస్తున్నాడు వాయువు. తన ప్రియకుమారుడు రావడంచూసి, ఎదురువచ్చి అతడికి ఆనందం కలిగించాడు.

పదివేలమందిరాక్షసులు కంటిమీద రెప్ప వెయ్యకండా కాపాడుతున్నారు సౌగంధికవనం. వాళ్ళంతా భీముణ్ణి చూశారు. "వీడెవడు, వీరపురుషుడు? లేడిచర్మం ధరించాడు. తపస్విలా వున్నాడు. ఆయుధాలు పట్టుకున్నాడు. మంచి తేజస్సుతోనూ వున్నాడు" అని ఆశ్చర్యపోతూ, రకరకాల ఆయుధాలుపట్టుకుని గబగబా అతడి దగ్గిరికివచ్చారు.

"ఎవరునువ్వూ? ఎందుకు వచ్చావు? ఇది కుబేరుడి వనం. ఇక్కడికి రావడమంటే, ఎవడయినా భయపడతాడు. ఇలా వచ్చి నువ్వు పొరపాటే చేశావు. ఈసరోవరంలో కుబేరుడు భార్యలతో జలక్రీడ లాడతాడు. దీనివొడ్డుని దేవరుషులు దేవతార్చనచేస్తారు. అమృతంతో సమానమైనవి ఈనీళ్ళు. ఈపద్మాలు బంగారం పద్మాలు. వీటి నాళాలు వైడూర్యాలు. వీటి పరిమళంతో సమానమయిన పరిమళం ప్రపంచంలో మరి ఎక్కడా లేదు. అందుకని అక్షౌహిణీల కొద్దీ యక్షులు దీన్ని రక్షిస్తూ వుంటారు. దీని మహిమ తెలియక ఇంత దూరం వచ్చావు నువ్వు" అన్నారు.

"భీముడు అంటారు నన్ను" – ధీమాగా అన్నాడు భీముడు. "పాండురాజు మాతండ్రి. ధర్మరాజు మాఅన్న. మాద్రౌపది కోసం ఈపద్మాలు తీసుకువెళ్ళాలని వచ్చాను. మీరేకాదు, దేవతలు అడ్డంవచ్చినా సరే, పద్మాలు పట్టుకు వెళతాను" అన్నాడు.

"అయ్యా, నువ్వు దివ్యపురుషుడివి. సౌగంధికపద్మాలు నీకు కావాలంటే, కుబేరుణ్ణి అడుగు. ఆయన అంగీకారంపొంది తీసుకువెళ్ళు. మేం కాదనం. ధర్మరాజు తమ్ముడివి కనక, ధర్మం తప్పకూడదు" అన్నారు రాక్షసులు.

"అదేమన్న మాట?" – జెట్టుసరిగా అన్నాడు భీముడు. కొండవాగులవల్ల పుట్టిన సరోవర మిది. అందరికీ అందుబాటు కావలిసిందే. కాని వొక్కడి దేలా అవుతుంది? కుబేరుడు తవ్వించ లేదుకదా, మొదట! అదీకాక, ఉత్తమక్షత్రియుడు వొకణ్ణి అడగ వలిసిన అవసరమేముంది? భుజవిక్రమంతో ఇతర్లధనం సంపాదించడం, అర్థించినవాళ్ళకి ఇచ్చి, కీర్తి సంపాదించడం – ఇదే అతడి ధర్మం. అంచేత, మిమ్మల్ని కానీ, మీ కుబేరుణ్ణికానీ అడగవలిసిన అగత్యం లేదు. పద్మాలు తీసుకునే వెళతాను" అంటూ సరోవరం లోకి దిగాడు. కావలిసినన్ని సౌగంధికపద్మాలు ముందు కోసుకున్నాడు. మహావీర్యవంతాలయిన ఆసరోవరంనీళ్ళుతాగాడు. అనంతమయిన బలవంతు డయాడు.

తమని లక్ష్యపెట్టకండా చెరువులో చొరబడడంతోటే వొళ్ళు మండింది రాక్షసులికి. చేతికివచ్చిన ఆయుధం పట్టుకుని భీముడిమీదికి తిరగబడ్డారు. భయంకరంగా గర్జించాడు భీముడు. వాళ్ళు వేసిన ఆయుధాలన్నీ గదతో ఇట్టే కాసుకున్నాడు. చేతికి అందినవాణ్ణల్లా చిత్తుగా కొట్టాడు. ముందూ వెనకా చూడకండా పరుగుచ్చుకున్నారు రాక్షసులు. తిన్నగా వెళ్ళి కుబేరుడితో చెప్పారు.

అంతా విన్నాడు కుబేరుడు. భీముడి పరాక్రమం మెచ్చుకున్నాడు. పైగా అతడు ద్రౌపదిని సంతోషపెట్టాలని వచ్చాడు. అతణ్ణి ఏమీ అనకండా ఉపేక్షించి ఊరుకున్నాడు. రాక్షససేన వోడించి, సౌగంధికపద్మాలు పుచ్చుకుని, సరోవరం వొడ్డుని పూల వనంలో విహరిస్తున్నాడు భీముడు.

భీముడు ఇక్కడ రాక్షసుల్తో దెబ్బలాడుతూ వున్నప్పుడు, అక్కడ బదరీవనంలో మబ్బులేని పిడుగులు పడ్డాయి. కొండలు వణికాయి. బూడిదవాన కురిసింది. దిక్కులు ఎర్రపడ్డాయి. సూర్యుడు

కనపడకండా చీకట్లు కమ్మాయి. ఈదుర్నిమిత్తాలికి తెల్లపోయాడు ధర్మరాజు. "ఈమహోత్పాతాలు భీముడి యుద్ధం సూచిస్తున్నాయి. జాగ్రత్తగా వుండాలి. అన్నట్టు ఏడీ భీముడు?" అని నాలుగు దిక్కులూ చూశాడు. అందరూ వున్నారు. భీముడే కనబళ్ళేదు. దగ్గిరేవున్న ద్రౌపదిని అడిగాడు. "ఏడీ భీముడు? సాహసమంటేనే సరదా అతడికి. భయమన్న మాటే లేదు. ఈకొండనిండా రాక్షసులూ గంధర్వులూనూ. ఒంటరిగా ఎటువెళ్ళాడు? నువ్వుగాని ఎటూ పంపలేదు కదా?" అన్నాడు.

"ఇందాకా చూపించానుకదూ, బంగారం పద్మం. అది గాలికి కొట్టుకువచ్చి మాముందు పడింది. దగ్గిరే వుంటాయేమో, మరిన్ని పువ్వులు తెచ్చిపెట్టమన్నాను. అందుకని ఇదిగో, ఈశాన్యదిక్కు వెళ్ళాడు" – తడబడుతూ చెప్పింది ద్రౌపది.

"అయితే అందరం అక్కడికే వెళదాం" అన్నాడు ధర్మరాజు. ఘటోత్కచుణ్ణి పిలిచాడు. అతడి భుజాలమీదా, రాక్షససేనమీదా ఎక్కి బదరీవనం వచ్చినట్టే, అందరితోనూ కలిసి సౌగంధికవనం దగ్గిరికి వచ్చాడు.

గదపట్టుకుని ధీమాగా తిరుగుతున్నాడు భీముడు. అతడి దెబ్బ తిని వందలూ వేలూ చచ్చి పడివున్నారు రాక్షసులు. నిచ్చెరపోయారు ధర్మరాజూ, బ్రాహ్మలూ వాళ్ళున్నూ. అందరూ రావడంచూసి చప్పున దగ్గిరకివచ్చాడు భీముడు. అన్నగారికీ, రోమశుడికీ, ధౌమ్యుడికీ నమస్కారంచేశాడు. తనకి మొక్కిన నకుల సహదేవుల్ని ఎత్తి కౌగిలించుకున్నాడు. వైడూర్యనాళాలతోవున్న బంగారం సౌగంధిక పద్మాలు ద్రౌపదికి ఇచ్చాడు.

"తెలిసినవాడివి కదా, ఇంతసాహసం కూడునా?" – తమ్ముడి శిరస్సు నిమురుతూ అన్నాడు ధర్మరాజు. "ఇదిగో తమ్ముడూ,

నిజంగా నామీద నీకు ప్రేమ వుంటే, ఇకముందు ఇలాంటిపనులు చెయ్యకు" అని బోధించాడు.

**అనంతరం వాళ్ళు యావన్మందీ కుబేరవనంలో విహరించడం** మొదలుపెట్టారు. కొంతసే పయేసరికి కావలావాళ్ళయిన యక్షులు వచ్చారు. దేవముని రోమశుణ్ణీ, దేవేంద్రుడులా వున్న ధర్మరాజునీ చూసి నమస్కరించారు. "అయ్యా, మీరు ఇక్కడ మసలకూడదు. యక్షులూ, రాక్షసులూ తిరుగుతూవుండే భయంకరప్రదేశం ఇది" అని వినయంగా చెప్పారు. దానిమీద తిరిగీ నరనారాయణాశ్రమం వచ్చేశారు పాండవులు. అక్కడ కొంతకాలం వుండాలన్న సంకల్పంతో ఘటోత్కచుణ్ణీ, అతని సైన్యాన్నీ పంపేశారు.

జ టా సు రు డు

ఇలా అక్కడ వుంటున్నారు పాండవులు. ఒకనాడు వాళ్ళదగ్గిరికి వొక బ్రాహ్మడు వచ్చాడు. "వేదపండితుణ్ణి. ధనుర్వేదం తెలిసిన పరశురాముడి శిష్యుణ్ణి" అని చెప్పి పాండవులదగ్గిర వుంటూవచ్చాడు. బ్రాహ్మడే అని అందరూ నమ్మారు వాణ్ణి. భీముడు వేటకి వెళ్ళిన సమయం కనిపెట్టి, వొకనాడు భయంకరమయిన రాక్షసరూపంతో సిద్ధపడ్డాడు కొత్తబ్రాహ్మడు. ద్రౌపదినీ, ధర్మరాజునీ, నకులుణ్ణీ వాళ్ళ ఆయుధాల్తోసహా పట్టుకున్నాడు. గాలిలా ఆకాశమార్గాన ఎత్తుకుని పారిపోతున్నాడు. కరచరణాలు కదల్లేదు మిగిలినబ్రాహ్మలికి. చేసేదిలేక భీముడుకోసం పరుగెత్తాడు సహదేవుడు.

ఆకొత్తబ్రాహ్మడే జటాసురుడు. బ్రాహ్మడి వేషంలో వచ్చి మోసంచేశాడు. అలా ఎత్తుకుపోతూవుంటే వాడిమీదనుండే వాణ్ణి బరువుగా అదిమాడు ధర్మరాజు. మరి పరుగెత్తలేకపోయాడు జటాసురుడు. దుర్భరమైంది భారం.

"మాయావివి. మోసం చేశావు, కూడు పెట్టిన వాళ్ళకీ, నమ్మినవాళ్ళకీ చెడ్డ తలపెట్టడం మహాపాపం. ధర్మం తెలియదు నీకు. మనుష్యులకి సౌఖ్యాలుకలిగిస్తూ, దేవతలూ వాళ్ళూ విహరిస్తారిక్కడ. ఆమనుష్యుల్నే పాలిస్తాం మేము. అలాటిమాకు అపకారం చెయ్యడం క్షేమం కాదు నీకు. మాఆయుధాలు మాచేతికిచ్చి, యుద్ధానికి రా. అంతేకాని ఇదేం పని!"– అదుముతూనే అన్నాడు ధర్మరాజు.

అంతలో అడ్డంగా వచ్చాడు సహదేవుడు. "ఆగు. కిందికి రా. ఎవరనుకున్నావో మమ్మల్ని? నీపొగ రడిచి మరీ వొదుల్తాను" అంటూ ఎదిరించాడు. సహదేవుడి నోట్లోమాట నోట్లోనే వుంది, గాలిలా ఎగిరిపోతూ వచ్చాడు భీముడు. ద్రౌపదినీ, ధర్మరాజునీ, నకులుణ్ణీ ఆకాశమార్గాన ఎత్తుకుపోతున్న జటాసురుణ్ణీ, కింద ఎదిరిస్తూన్న సహదేవుణ్ణీ చూశాడు. "నీకు ప్రాణాలమీద ఆశ వుంటే వొదిలిపెట్టు వాళ్ళని" అని గాట్టిగా గద్దించాడు." అతిథివయి వచ్చావు. తిన్నయింటికే ఎసరుపెట్టావు నీలాంటి దుర్మార్గుణ్ణి నిన్నే చూశాను. బుద్ధివుంటే వొదులు వాళ్ళని. లేదంటావా – బకుడికీ, హిడింబుడికీ, కిమ్మీరుడికీ పట్టినగతే నీకూ పడుతుంది" అన్నాడు.

భీముడి గద్దింపుతో కిందికి దిగాడు జటాసురుడు. "బకుణ్ణీ, హిడింబుణ్ణీ, కిమ్మీరుణ్ణీ చంపావు కదూ! హుఁ, అందుకే వచ్చాను నేను. నిన్ను చంపుతాను. నీరక్తంతో వాళ్ళకి తర్పణం చేస్తాను" అంటూ అంతంత గుడ్లు చేసుకుని భీముడిమీదికి తిరగబడ్డాడు జటాసురుడు. వాళ్ళ ఇద్దరికీ మధ్యగావచ్చి, వాణ్ణి కొట్టబోయారు నకుల సహదేవులు. తమ్ముల్లిద్దరినీ "ఆగండి" అన్నాడు భీముడు. ఉగ్రుడిలా జటాసురుడిమీదికి వురికాడు.

ఉభయులికీ భయంకరమయిన యుద్ధం జరిగింది. వాళ్ళ ఇద్దరి తొడలూ తగిలి మహావృక్షాలు విరిగి, ముక్కలయ్యాయి. అదు

గులకింద భూమి కంపించింది. చేతికి అందిన చెట్లన్నిటితోనూ కొట్టుకున్నారు. చెట్లయిపోయాక, కొంచెపు రాళ్ళతో కొట్టుకున్నారు. చివరికి ఒకళ్ళని ఒకళ్ళు పట్టుకున్నారు. వాలీ సుగ్రీవుల్లా దెబ్బలాడారు. ఇద్దరూ గుద్దుకుంటున్నారు. ఆగుద్దులచప్పుళ్ళకి అడవి మృగాలూ, పక్షులూ భయపడి పారిపోయాయి.

అంతకంతకీ భీముడిబలం హెచ్చిపోతూవుంది. జటాసురుడిబలం తగ్గుముఖం పట్టింది. యముడిలా వున్నాడు భీముడు. రాక్షసుడిబలం తగ్గడం కనిపెట్టేశాడు. వాడి మెడ కుంగిపోయేట్టు వో— క్కపిడిగుద్దు గుద్దాడు. పే—ద్ద పిడుగుపడితే విరిగిపడ్డ నల్లటి కొండశిఖరం లాగ గుద్దుతో కూలిపోయాడు జటాసురుడు. పడీ పడ్డంతోటే వాడి కళేబరం మీదికెత్తి, పెద్దపాషాణంమీద విసిరికొట్టాడు భీముడు. పచ్చడి పచ్చడి అయిపోయింది జటాసురుడి కళేబరం. రోమశుడూ, ధౌమ్యుడూ మొదలయిన యావన్మందీ వచ్చి భీముణ్ణి ప్రశంసించారు.



# అరణ్యపర్వం



## నాలుగో ఆశ్వాసం

అలా నరనారాయణాశ్రమంలో కొన్నాళ్ళు గడిచింది. ఒక నాడు తమ్ముళ్లతో ధర్మరాజు అన్నాడు: "అర్జునుడు వెళ్ళి అయిదేళ్లు కావస్తోంది. ఇక వచ్చేస్తాడు. దివ్యాస్త్రాలు తప్పకండా తెస్తాడు. కళ్లారా తమ్ముణ్ణి ఇక్కడే చూస్తాం" = అని

అనంతరం గంధమాదనం సందర్శించే అభిలాషతో అక్కడి నుండి ఉత్తరముఖంగా బయల్దేరారు పాండవులు. కొండలమీంచి వెళ్ళి వెళ్ళి పదిహేడోనాడు హిమాలయంమీద వృషపర్వుడనే రాజరుషి ఆశ్రమంచేరారు. భూత భవిష్యత్కాలాలు తెలిసిన మహాజ్ఞాని వృషపర్వుడు. పాండవుల్ని కన్నకొడుకుల్లా ఆదరించి, సత్కరించాడాయన. ఏడుదినాలు అక్కడ వున్నారు పాండవులు. ఎనిమిదోనాడు, వృషపర్వుడు చెప్పినదారిని ఇంకా ముందుకి వెళ్ళారు. ధౌమ్యుడూ, రోమశుడూ మొదలయిన కొద్దిమందినిమాత్రం వెంటపెట్టుకుని తక్కిన బ్రాహ్మలు యావన్మందినీ వృషపర్వుడి ఆశ్రమంలో వొదిలిపెట్టారు. దార్లో కొండలమీద మంచిమంచి దృశ్యాలుచూస్తూ, చెట్లకింద విశ్రమిస్తూ వెళ్ళివెళ్ళి నాలుగోనాడు శ్వేతపర్వతంమీద కాలుపెట్టారు పే—ద్ద మేఘంలా తెల్లగానూ, మణులూ వాటితోనూ, స్ఫటికం గుహాలతోనూ ఎంతో అందంగావుంది శ్వేతపర్వతం. దాన్నిచూస్తూ వుంటే శ్రమే అనిపించలేదు వాళ్ళకి.

శ్వేతపర్వతం తరవాత మాల్యవంతం చేరారు. మాల్యవంత పర్వతంమీంచి గంధమాదనం చూశారు. ఆనందంతో శరీరాలు

పులకరించాయి వాళ్ళకి. కళ్ళల్లోంచి ఆనందబాష్పాలు ప్రవహించాయి. "తమ్ముడూ, గంధమాదనంవనాలు ఎంత అద్భుతంగా వున్నాయో! మధ్యమధ్య ఆగంగా నది ఎలావుందో చూడూ, చూడూ!" అంటూ భీముడికి చూపాడు ధర్మరాజు.

ఇలా అవన్నీ చూస్తూ వెళ్ళి రాజరుషి ఆర్ష్టిషేణుడి ఆశ్రమం చేరుకున్నారు పాండవులు. ఆశ్రమంలోకి వెళ్ళి ఆ ర్ష్టిషేణుడి ముందు మోకరించారు వాళ్ళు. వాళ్ళు పాండవులని దివ్యదృష్టితో తెలుసుకున్నాడు రుషి. అందరినీ ఆప్యాయంగా ఆదరించాడు. ముఖ్యంగా ధర్మరాజుని ఎంతో గౌరవించాడు. ఎన్నో అన్ని ధర్మప్రసంగాలూ చేశాడు. "ధర్మరాజా, గాలీ నీరూ మాత్రం సేవించే మునీశ్వర్లు పౌర్ణమీ పాడ్యమీ తిథుల్లో ఈపర్వతం ఆకాశమార్గాన వస్తూ వుంటారు. అప్పుడు భేరీలూ, పణవాలూ, మృదంగాలూ, శంఖాలూ వినిపిస్తాయి. మీరు అందరూ ఇక్కడేకూచుని అవి వినాలి. అక్కడికి వెళ్ళే తలంపే పెట్టుకోకూడదు. ఇక్కడినుంచి పైకివెళ్ళడం మీకు సాధ్యంకాదు కూడా అవన్నీ దేవతలు విహరించే స్థలాలు. మనుష్యులికి ప్రవేశం లేదక్కడ. పరమసిద్ధులూ, దేవరుషులూ మాత్రం ఈకైలాసశిఖరం దాటి వెళ్ళగలరు. చపలచిత్తంవల్ల ఎవరయినా వెళ్ళాలని ప్రయత్నిస్తే పర్వతంమీది జీవకోటి యావత్తూ ద్వేషిస్తుంది. రాక్షసులు బల్లేలతో పొడుస్తారు. పర్వసంధికాలాల్లో నరవాహనుడైన కుబేరుడు నూంచి వైభవంతో వస్తాడు. ఈకైలాసశిఖరం మీదే కుబేరుడి ఉద్యానవనమూ, దేవతల ఉద్యానవనాలూ రాక్షసుల ఉద్యానవనాలూ వున్నాయి" అని చెప్పాడు. అర్జునుడు వచ్చేవరకూ వాళ్ళని తన ఆశ్రమంలోనే వుండమని కోరాడు.

అయిదు రంగుల పద్మాలు

ఆర్షిషేణుడి ఆశ్రమంలో కొన్నిమాసాలు వున్నారు పాండవులు. అనేకమయిన వింతలూ చూశారు. ఒకనాడు పెద్దగాలి వేసింది. హిమాలయ శిఖరం మీంచి అశ్వరథ (శ్వేతకి) పుణ్యానదినుండి అద్భుతమయిన పువ్వులు ఎగిరివచ్చి పాండవులముందు పడ్డాయి. అయిదు రంగుల పువ్వులవి. వాటి రేకులు బంగారంతో వున్నాయి. అవి చూసి వాళ్ళ ఆశ్చర్యానికి అంతూపంతూ లేకపోయింది.

ఒక చంద్రకాంతశిలావేదిక మీద ఏకాంతంగా కూచుని వున్నాడు భీముడు. మెల్లిమెల్లిగా ద్రౌపది అతడిదగ్గిరికి వచ్చింది. "అయిదురంగుల పువ్వులు చూశావు కదూ! అమ్మయ్యా, సౌగంధికాలకంటే కూడా ముచ్చటగా వున్నాయవి. ఈవాసనా, ఈసౌకుమార్యం కల్లోకూడా ఎరగను నేను. ఎంతో కోరికగా వుంది నాకు. మరిన్ని కావాలి నాకు. నువ్వు కాకపోతే నాకోరిక మరెవ్వరు తీరుస్తారు? ఏం, తెచ్చిపెట్టవూ!" అంటూ బులిపించింది భీముణ్ణి.

చిరునవ్వుతో అంగీకరించాడు భీముడు. లేడికి లేచిందే ప్రయాణం. వెంటనే చక్రవాకపర్వతమంత ఎత్తయిన గంధమాదన పర్వతం శిఖరం మీదికి వెళ్ళాడు. అక్కడికి కుబేరుడి భవనం స్పష్టంగా కనిపిస్తోంది. బంగారంతోనూ, స్ఫటికం రాళ్ళతోనూ ఎంతో అంత అందంగా వుంది కుబేరుడి భవనం. మణులతోనూ పూలమాలలతోనూ దేదీప్యమానంగా వుంటది. భవనంనాలుగుదిక్కులా బంగారం ప్రాకారం మెరుస్తోంది. దానినిండా రకరకాల రత్నాలు జిగేలు జిగేలు మంటున్నాయి. చుట్టూ ఉద్యానవనాలు చెప్పశక్యం కాకండా వున్నాయి.

కుబేరుడి భవనం చూశాడు భీముడు. పర్వతశిఖరం పగిలిపోయేట్టు వొక్కసారి శంఖం పూరించాడు. అది వినీ వినడంతోనే

యక్షసైన్యమూ, రాక్షససేనా పరిపరివిధాలయిన ఆయుధాలు పట్టుకుని, పెద్దపెద్ద పొలికేకలు వేసుకుంటూ పరుగెత్తుకువచ్చింది. ఒక్కసారి భీముణ్ణి చుట్టుముట్టేసింది. జల్దుకొన్నాడు భీముడు. అందరిమీదికీ అన్నిదిక్కులా దారుణమైన బాణాలు అదే పనిగా కురిపించడం మొదలుపెట్టాడు. రాక్షససేన పెద్ద మేఘంలా వుంది. భీముడి బాణాల్తో వాళ్ళ శరీరాల్లోంచి కారే రక్తధారలు వర్షధారల్లా వున్నాయి. వాటితో నేల మీది నదులన్నీ రక్తం నదులయిపోయాయి. దాంతో, వచ్చిన సైన్యాలన్నీ వచ్చినట్టే చెల్లాచెదురయి పారిపోయాయి.

అదిచూశాడు కుబేరుడి స్నేహితుడు మణిమంతుడు. సహించలేకపోయాడు. పెద్ద గదపట్టుకుని, వొక దిగ్గజం సింహంమీదికి వచ్చినట్టు భీముడిమీదికి వచ్చాడు. అతణ్ణి చూశాడోలేదో భీముడు, కనపడకండా అతణ్ణి బాణాల్తోముంచెత్తిమరీ వొదిలాడు. అయితే, చలించలేదు మణిమంతుడు. గిరగిరాతిప్పి గద విసిరాడు భీముడిమీదికి, మెరుపులాగా, సూర్యబింబంలాగా, దశదిశలూ పట్టపగల్లా వెలిగిస్తూ భీముడిమీదికి వచ్చింది గద. అంత ఉధృతంగానూ వస్తూ వున్న మణిమంతుడి గదని గడ్డిపోచలా చూశాడు భీము తన బాణాలతోనే దాన్ని ముక్కలు చేసేశాడు. దాంతో కుబేరుడి సైన్యం గడగడలాడింది. తనగద అలా ముక్కలైపోవడంతో ఇక మరింత మండిపోయాడు మణిమంతుడు. ఒక్కపెట్టుని శక్తితీసి భీముడిమీదికి విసిరాడు. భీముడి భుజానికిమాత్రం తగిలి కిందపడిపోయింది శక్తి. ఈసారి గదపుచ్చుకుని భీముడే యముడిలాగ హుంకరించి, మణిమంతుడిమీదికి వురికాడు. భీముడి హుంకారానికి కొండశిఖరం, జవజవలాడిపోయింది. అయినా, మణిమంతుడుమాత్రం తగ్గలేదు. త్రిశూలం తీసి భీముడిమీదికి విసిరాడు. నిప్పులు కక్కుతూ వస్తోంది త్రిశూలం. గదతో పది ముక్కలు చేశాడు దాన్ని భీముడు.

గదా, శక్తి, త్రిశూలాలను - వ్యర్థం కావడంతోటే ఆకాశమార్గం పట్టాడు మణిమంతుడు. "ఎటుపోతావు? నిలబడు" అంటూ గద తీసి విసిరాడు భీముడు. దాంతో ప్రాణాలుపోయి కిందపడ్డాడు మణిమంతుడు. మణిమంతుడు మరణించడంతోటే కుయ్యో మొర్రో మంటూ తూరుపుదిక్కు దౌడుతీసింది కుబేరుడి రాణువ.

ఇక్కడ ఇలావుంది. అక్కడ భీముడు కనపడకపోయేసరికి "ఏమయాడా" అని వెదకడం మొదలు పెట్టాడు ధర్మరాజు. ఇంతలో ద్రౌపదివచ్చి "శిఖరంమీదికి అయిదురంగుల పువ్వులకోసం వెళ్ళాడు" అని చెప్పింది. ఆశ్రమంలో ధౌమ్యుడూ మొదలయినవాళ్ళని వుండమని, రోమశుణ్ణీ, నకుల సహదేవుల్నీ వెంటపెట్టుకుని శిఖరంమీదికే తానూ బయల్దేరాడు ధర్మరాజు. తీరా వెళ్ళిచూచేసరికి, చచ్చిపడివున్న వేలాది రాక్షసులమధ్య ఘోరంగా గదపట్టుకుని నిలబడివున్నాడు భీముడు.

ఇంతలో పారిపోయివచ్చిన సైనికులు కుబేరుడిదగ్గిరికి వెళ్ళారు. జరిగిందంతా మొర పెట్టారు. చకితుడే అయిపోయాడు కుబేరుడు. "అప్పుడు సౌగంధికపద్మాలూ అలాగే పట్టుకుపోయాడు. ఇప్పుడు మణిమంతుణ్ణే కాజేశాడు. ఎంత ఉద్దోలమయిన బలవంతుడో వీడు!" అని తల పంకించాడు. దేవతలూ, రాక్షసులూ, యక్షులూ, గరుడులూ, గంధర్వులూ- వీళ్ళందరితో కలిసి, భీముడిదగ్గిరికి బయల్దేరి వచ్చాడు వచ్చి, ధర్మరాజూ మొదలయిన వాళ్ళనీ, ఇంకా యుద్ధానికి సిద్ధంగా వున్న భీముణ్ణీ చూశాడు. సంతోషించాడు.

కుబేరుణ్ణి చూడడంతోనే సవినయంగా నమస్కారంచేశారు పాండవులు. ధర్మస్వరూపుడయిన ధర్మరాజుని చూసి మందస్మితం చేశాడు కుబేరుడు. 'ధర్మరాజా' నీతమ్ముడు నాస్నేహితుణ్ణే మణిమంతుణ్ణి చంపి, నాకేదో అపకారం చేశాడని సిగ్గుపడుతున్నట్టున్నావు. అలాంటిదేమీ పెట్టుకోవద్దు. అసలు, దీనంతటికీ అగస్త్యుడిశాపం

కారణం అన్నాడు. భీముణ్ణి ఆదరంగా దగ్గిరకి పిలిచాడు. "భీమసేనా, నీసాహసం నాకు ఉపకారమే అయింది. అందుకని, నిజంగా నిన్ను మెచ్చుకుంటున్నాను" అన్నాడు.

"దేవా' అగస్త్యముని శాపంవల్ల జరిగిం దన్నావు కదా! అగస్త్యుడు శాపంపెట్టవలసిన అగత్యం ఏంవచ్చిందో వినాలనివుంది" అంటూ చేతులు జోడించాడు ధర్మరాజు.

"చాలాకాలం కిందటిమాట అది" అంటూ ఎత్తుకున్నాడు కుబేరుడు. "ఒకసారి, కుశవతినదగ్గర దేవతలు సత్రయాగం ప్రారంభించారు. నన్నుకూడా పిలిచారు. వంద మహాపద్మాల యక్షుల తోనూ రాక్షసులతోనూ కలిసి పుష్పకవిమానంమీద ఆకాశ మార్గాన వెళుతున్నాను నేను. యమునానదిలో ఊర్ధ్వబాహువుల్తో ఉగ్రమయిన తపస్సుచేస్తున్నాడు అగస్త్యముని. నాతోకూడా పుష్పకంలోనే వున్నాడు మణిమంతుడు. తెలియక అగస్త్యుడిమీద ఉమ్మివేశాడు. ఉగ్రుడే అయిపోయాడుముని. 'నీకళ్ళయెదటే నీస్నేహితుడు నామీద వుమ్మేశాడు. అంత ఇదిగా వుంది వాడిమదం! సరే! ఒక మానవుడిచేత చస్తాడు వాడు. నీయక్షసైన్యమూ, రాక్షససైన్యమూ కూడా ఆమనిషిచేత నాశన మవుతుంది. వీడుచేసిన ఈపాపం ఆమానవుణ్ణి చూశాక పోతుంది' అని శపించాడు.

"ధర్మరాజా, ధృతీ దాక్షిణ్యమూ దేశమూ కాలమూ పరాక్రమమూ—ఈ అయిదూ లోకతంత్రాలు. ఇవి ఎరిగిన ఉత్తమక్షత్రియుడు ధర్మం తెలిసినవాడై, అడ్డులేకండా ప్రపంచం పాలిస్తాడు. చివరికి పుణ్యలోకాలికీ వెళతాడు. ధర్మరహస్యాలు తెలియకండా వూరికే సాహసం చేసేవాడికి సద్గతు లుండవు. అందుచేత, దుస్సాహసం కూడదంటూ నీజ్ఞానమూ, ధర్మబుద్ధీ వినియోగించి నీతమ్ముణ్ణి సరిదిద్దు.

"సూర్యుడూ యముడూ, వాయువూ, ఇంద్రుడూ అశ్వినులూ ఎంత నేనూ అంతే అని భావించండి. శుక్లపక్షమంతా మీరు ఆర్ష్టిషేణుడి ఆశ్రమంలోనే వుండండి. మీకు కావలసిన అన్నపానాలు యావత్తూ నాపరిచారకులు మీకు ఎప్పటికప్పుడు అందించేటట్టు ఏర్పాటుచేస్తాను నేను.

"మీతమ్ముడు అర్జునుడు దేవతలదగ్గిర దివ్యాస్త్రాలు సంపాదించాడు. ఇప్పుడు దేవేంద్రుడిదగ్గిరే వున్నాడు. దేవేంద్రుడికి ఎంతో ఉపకారమూ చేశాడు. ఏడు మహామేధాలు చేసిన పుణ్యాత్ముడు మీపితృపితామహుడు శంతనుడు ఎంతో తృప్తిపడ్డాడు. మీకుశలమూ విచారించాడు. ఇక వచ్చేస్తాడు అర్జునుడు. మీకోరికలన్నీ సిద్ధిస్తాయి'' అన్నాడు.

ఆరాత్రి కుబేరుడి భవనంలోనే గడిపారు పాండవులు. మర్నాడు ఉదయాన్నే ధౌమ్యుడూ ఆర్ష్టిషేణుడూ పాండవులదగ్గిరికి వచ్చారు. వాళ్ళని చూసి పాదాభివందనం చేశారు పాండవులు. తరవాత ఆర్ష్టిషేణుడు ధర్మరాజుచెయ్యి పట్టుకుని, తూర్పుదిక్కు వేలు చూపిస్తూ అన్నాడు: "అదిగో, మహారాజా! సముద్రం దాకా వ్యాపించివుందే, అదే మందరపర్వతం. ఎంత అద్భుతంగా వుందో చూడు. ఈదిక్కే దేవేంద్రుడి నివాసం. ఇటు ఉదయించే సూర్యుణ్ణి, సర్వధర్మాలూ ఎరిగిన మునులూ, సిద్ధులూ, సాధ్యులూ, దేవతలూ మొదలయినవాళ్ళు పూజిస్తారు. ఇదిగో దక్షిణదిక్కు చూడూ, ఆకనిపిస్తూ వుందే, అది యముడి సంయమన పట్టణం. దక్షిణదిక్కే మరణించినవాళ్ళు పోవవలసిన దిక్కు. అదిగో, పడమటిదిక్కు కనిపిస్తూవున్న ఆపర్వతంమాడూ, అదే అస్తాచలం. వరుణుడు ఆపర్వతంమీదా, సముద్రంలోనూ నివసిస్తూ వుంటాడు. మనఎదట ఇదిగో,

ఇటు ప్రకాశిస్తూన్న బంగారంపర్వతం—అదే మేరుపర్వతం. దీని ఎని మిది దిక్కులా ఎనమండుగురు దిక్పాలకులు వుంటారు. దానిమీదే బ్రహ్మదేవుడి సభ వుంది. అక్కడ కూచుని ఆయన సృష్టిచేస్తూ వుంటాడు. మేరువుమీదే వశిష్ఠుడూ మొదలయిన సప్తరుషులూ. ఉదయిస్తూ అస్తమిస్తూ వుంటారు. అగ్నికానీ, సూర్యుడుకానీ దీనికి వెలుగుపెట్టలేరు. దానంతట అదే ప్రకాశిస్తూ వుంటుంది. సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ నియమం తప్పకండా నిరంతరం ఈమహా పర్వతాన్ని ప్రదక్షిణం చేస్తూ వుంటారు. మేరుపర్వతం ప్రదక్షిణం చేస్తూనే నక్షత్రాల్లో చంద్రుడు పర్వసంధుల్లో మాసవిభాగం చేస్తాడు. అలాగే సూర్యుడు పగలూ, రాత్రీ, కలా, కాష్ఠా మొదలయిన కాల విభాగం చేస్తాడు. సూర్యుడే వర్షమూ, గాలీ, వేడీ మొదలయినవాటితో సమస్త జీవుల్నీ పోషిస్తాడు."

ఆర్ష్టిషేణుడి ఆశ్రమంలో నెలరోజులు వున్నారు పాండవులు.

### అర్జునుడు వచ్చేశాడు

ఒకనాడు ఆకాశంమీద ఆకస్మికంగా పెద్ద వెలుగు కనిపించింది క్రమంగా అది వెయ్యి మెరుపులు పరిగెత్తినట్టు గంధమాదనం దిక్కే వస్తోంది. చూస్తూ వుండగా వొక బంగారం రథం దేవలోకంనుండి గంధమాదనం మీంద దిగింది. మాతలి సారథ్యం చేస్తున్నాడు. రథం మీంద అర్జునుడు సూర్యుడిలా ప్రకాశిస్తున్నాడు.

రథం తిన్నగా పాండవులు వున్న చోటికే వచ్చింది. రథందిగాడు అర్జునుడు. రోమశుడికీ, ధౌమ్యుడికీ, ధర్మరాజుకీ, భీముడికీ పాదాభి వందనం చేశాడు. తనకి నమస్కరించిన నకుల సహదేవుల్ని గుచ్చి కౌగిలించుకున్నాడు. కళ్ళు చల్లబడ్డాయి ద్రౌపదికి. హృదయం ఆనందంతో ఉత్ఫుల్లమయింది. యావన్మందీ మహానందభరితు

లయినారు. మాతలిని ఎంతో గౌరవించాడు ధర్మరాజు. అర్జునుణ్ణి అన్నదమ్ముల దగ్గిర దించి అమరావతి వెళ్ళిపోయాడు మాతలి.

అంతలో సూర్యుడు పడమట అస్తమించాడు. చీకట్లు కమ్ము కునీ కమ్ముకోవడంతోటే తూర్పున చంద్రోదయ మయింది. నీలా కాశంలో తెల్లటి రాజహంసలా కనిపించాడు చందమామ. ఆరాత్రి ఎంతో సేపు అన్నదమ్ములమధ్య కూచుని కులాసాగా కాలక్షేపం చేశాక నిద్రపోయాడు అర్జునుడు.

మర్నాడు తెల్లవారింది. సిద్ధులూ, మునులూ, రోమశుడూ, ధౌమ్యుడూ, అన్నదమ్ములూ — యావన్మందితోనూ సభతీర్చినట్టు కూచున్నాడు ధర్మరాజు. అంతలో వొక్కపెట్టుని దేవదుందుభులు మోగాయి. కిన్నరులూ, గంధర్వులూ పాడిన పాటలు వినిపించాయి. వెయ్యి సూర్యబింబాలు ఉదయించినట్టు ఆకాశంనిండా దేవవిమా నాలు కనిపించాయి. దేవగణాల్తో దేవేంద్రుడు పాండవుల్ని చూడడం కోసం గంధమాదనం వేంచేశాడు. ఉన్నపాళంగా యావన్మందీ లేచారు. ఇంద్రుడికి ఎదురువెళ్ళారు. సవినయంగా అభివాదనంచేశారు. చేతులు జోడించారు. చెయ్యవలసిన సత్కారా లన్నీ చేశారు.

చల్లని చూపులు చూసి వాళ్ళందరినీ అభినందించాడు దేవేం ద్రుడు. అర్జునుణ్ణి ఉద్దేశించి ధర్మరాజుతో అన్నాడు: "ధర్మరాజా, నీతమ్ముడు నాదగ్గిర దివ్యాస్త్రాల్లో ఆరితేరి తయారయాడు. శివుడూ మొదలయిన దేవతలదగ్గిర దివ్యాస్త్రాలు సంపాదించాడు. నివాత కవచుల్ని సంహరించి దేవతలకి మహోపకారం చేశాడు. ఇతడి పరాక్రమం ముందు శత్రువన్నవాడు నిలవలేడు. శత్రుసంహారంచేసి సామ్రాజ్యం నీచేతుల్లో పెడతాడు"— అని.

పరమానందభరితు లయారు పాడవులు. ఇలా వాళ్ళందరినీ సంతోషపరచి దేవతలయావన్మందితోనూ అమరావతి వెళ్ళిపోయాడు

దేవేంద్రుడు. [ఇది ఇంద్రుడూ పాండవులూ కలుసుకున్న ఘట్టం. బ్రహ్మచర్యవ్రతంతో వుండి, ఒక సంవత్సరంవరకూ రోజూ ఇది విన్నవాళ్లూ, చదివినవాళ్లూ కూడా నూరుసంవత్సరాలు జీవిస్తారు. ]

దేవేంద్రుడు వెళ్ళిపోయాక ఆనందంతో అర్జునుణ్ణి కౌగిలించుకున్నాడు ధర్మరాజు. "తమ్ముడూ, దేవతలికి ఏదో మహోపకారం చేశావన్నాడు దేవేంద్రుడు. నివాతకవచుల్ని సంహరించావన్నాడు. ఆ వివరాలూ, శివుడూ మొదలయిన దేవతలదగ్గిర దివ్యాస్త్రాలు పొందినవైనమూ, ఇంద్రుణ్ణి మెప్పించిన సంగతీ అంతావినాలనివుంది. చెప్పు" అని అడిగాడు.

అన్నగారు కోరినప్రకారం ఆవివరాలన్నీ చెప్పాడు అర్జునుడు. అన్నదమ్ములూ, రోమశుడూ, ధౌమ్యుడూ, ద్రౌపదీ మొదలయిన యావన్మందిమధ్యా కూచుని తాను తపస్సుకి వెళ్ళిన నాటినుండీ అవాళదాకా జరిగింది పూసగుచ్చినట్టు ప్రారంభించాడు.

"నువ్వు ఉపదేశించిన ప్రతిస్మృతి విద్యాప్రభావంవల్ల ఎంతో తపశ్శాలి నయాను. హిమాలయం వెళ్ళాను. అక్కడ ముసిలి బ్రాహ్మడి వేషంలో నాఎదటికి వచ్చిన దేవేంద్రుణ్ణి చూశాను. ఆయన ఉపదేశం ప్రకారం శివుడి కోసం ఉగ్రమయిన తపస్సుచేశాను. శివుడు కిరాతరాజు వేషంలో వచ్చాడు. నాతో ఘోరంగా యుద్ధం చేశాడు. చివరికి ప్రసన్నుడయాడు. నిజస్వరూపం చూపించాడు. పాశుపతాస్త్రం ప్రసాదించాడు. అదయాక దేవేంద్రుడూ మొదలయిన దేవతలు వచ్చి ఐంద్రాస్త్రం, ఆగ్నేయాస్త్రం, యామ్యాస్త్రం, రాక్షసాస్త్రం, వారుణాస్త్రం, కౌబేరాస్త్రం, గాంధర్వాస్త్రం, పైశాచాస్త్రం, బ్రహ్మాస్త్రం మొదలయిన దివ్యాస్త్రాలు ప్రసాదించారు. వాటి ప్రయోగ విధానాలూ ఉపదేశించారు.

"దేవేంద్రుడు దేవలోకం రమ్మన్నాడు. మాతలి దివ్యరథం పట్టుకు వచ్చాడు. ఈమానవదేహంతోనే అమరావతి వెళ్ళాను. అక్కడ దేవేంద్రుణ్ణే గురువుగా వరించాను. అతడి అనుగ్రహంవల్ల దివ్యాస్త్రాల ప్రయోగం, ఉపసంహారం, ఆవృత్తీ, ప్రాయశ్చిత్తం, ప్రతిఘాతం నేర్చుకున్నాను. ఎంతో సంతోషించాడు దేవేంద్రుడు. 'అర్జునా మహాస్త్రాలుయావత్తూ కరతలామలక మయాయినీకు. యుద్ధంలోనిన్ను ఎవ్వడూ గెలవలేడు. దేవతలకీ బ్రాహ్మలకీ మేలు చెయ్యి. నీకు సిద్ధి కలుగుతుంది, అన్నాడు. అంతేకాదు, నాగురుదక్షిణగా దేవలోకం మేలుకోసం నేను చెప్పినపని చెయ్యాలి నువ్వు. సముద్రగర్భంలో నివాతకవచులని మూడుకోట్ల రాక్షసులు వున్నారు.ఉద్దండులు వాళ్ళు. ఎప్పుడూ దేవతల్ని వేధించుకు తింటూవుంటారు. వాళ్ళని వెళ్ళి చంపాలినువ్వు' అని ఆదేశించాడు.

"తాను పెట్టుకున్న దివ్యభూషణాలు తీసి నాకు తొడిగించాడు. ఇదిగో, ఈకిరీటం నాతలమీద పెట్టాడు. అభేద్యమయిన బంగారం కవచం తొడిగాడు. కొండచిలువలాంటి ఈనారి గాండీవానికి తన చేతులతోనే స్వయంగా కూర్చాడు. హంసరంగువీ, నెమిలిరంగువీ మంచిమంచి గుర్రాలు పూసిన రథంమీద నన్ను కూచోపెట్టాడు. మాతలిని సారథ్యం చెయ్యమన్నాడు. ఆయన ఆజ్ఞప్రకారం నివాతకవచుల సంహారానికి బైల్దేరాను నేను.

"అమరావతినించి అలా బయల్దేరుతూవున్న నా రథం దగ్గిరికి గుంపులు గుంపులుగా వచ్చారు దేవతలు. 'అర్జునా, ఇదేరథమెక్కి-లోగడ దేవేంద్రుడు అనేక వేల రాక్షసుల్ని - శంబరుడూ, నముచీ, బలుడూ, వృత్రుడూ మొదలయినవాళ్ళని - యుద్ధంలో గెలిచాడు. అలాగే నువ్వూ పరాక్రమవంతుడివై నివాతకవచుల్ని సంహరించు' అని ఆశీర్వదించారు. దేవదత్తం శంఖం కూడా ఇచ్చారు. ఆగమేఘాల

మీాద పరుగెత్తింది రథం. దార్లో అక్కడక్కడ దేవరుషులు కూడా నన్ను ప్రశంసించారు.

### వి వా త క వ చు లు

"క్షణాలమీాద సముద్రం చేరింది రథం. నురుగులుకక్కుతూ పెద్ద పెద్ద కొండల్లా వున్నాయి కెరటాలు. పెద్ద పెద్ద చేపలూ, తాబేళ్లూ, తిమింగిలాలూ, మొసళ్లూ నడకొండల్లాగ తేలుతూ మునుగుతూ వున్నాయి. సముద్రగర్భంలో పెద్దపెద్ద మేడలతోనూ విశాలమయిన వీధులతోనూ వున్న రాక్షసపట్నం చూశాము. తిన్నగా ఆపట్టణం ద్వారందగ్గిరికి రథం పోనిచ్చాడు మాతలి. ద్వారంముందు రథం ఆగీ ఆగడంతోటే, దేవదత్తం పూరించాను నేను. దిక్పర్వతాల గుహల్లో ప్రతిధ్వనించింది దేవదత్తం. దానిమీాద, రాక్షసులు యావన్మందీ దెబ్బతిన్న తాచుల్లాగ పరుగెత్తుకు వచ్చారు. నారథం చుట్టు ముట్టేశారు. అందరిచేతుల్లోనూ అనేకవిధాలయిన ఆయుధాలున్నాయి. చీకట్లుచిమ్ముకువస్తున్నట్లు నల్లగా కారెక్కి వున్నాయి వాళ్ళ దేహాలు.

"వచ్చి రావడంతోటే,వాళ్ళు ముట్టడిప్రారంభించారునామీాద. చేతికివచ్చిన ఆయుధం ప్రయోగించడం మొదలుపెట్టారు. ఉత్తర క్షణంలో నేనూ విజృంభించాను.ప్రతివాణ్ణే పదేసిబాణాల్తో కొట్టాను. మారథం ముందుకి సాగనివ్వకండా భూమీా ఆకాశం నిండిపోయి నట్టు అపరిమితమయిన బాణాలు కప్పిపెట్టారు రాక్షసులు. పైనించి చూస్తూవున్న దేవతలూ రుషులూ అదిచూసి నిర్ఘెరపోయారు. మాతలికి కరచరణాలు ఆడలేదు. ఎలా రథం నడపడమో తోచక చేతుల్లోంచి పగ్గాలు వొదిలిపెట్టేశాడు. అప్పుడు చప్పున పగ్గాలు నేనే తీసుకున్నాను. ఇటురథం నడుపుతూనే, అటు రాక్షసుల్ని బాణాల్తో వొదడం ప్రారంభించాను. ఎంతోఅంత సంతోషించాడు మాతలి.

నా బాణం ప్రతీదీ వెళ్ళి వాళ్ళ దేహాలు చీలుస్తూ వుండేది. వాళ్ళ పెద్ద పెద్ద కళేబరాలనించి నెత్తురుధారలు వరదల్లా ప్రవహించేవి. వాళ్ళ దేహాలు కొండలుగానూ, నా బాణాలు వర్షంగానూ, వాళ్ళ రక్త ధారలు సెలయేళ్లులాగానూ వుండేవంటే నమ్మండి.

"దానిమీద వాళ్ళు మాయాయుద్ధం లంకించుకున్నారు. ఉన్నట్టుండి నామీద వర్ష బాణాలు ప్రయోగించారు మా రథమూ, మాతలీ, నేనూ వొక్కసారి వర్షంలో మునిగిపోయాము. వెంటనే దేవేంద్రుడు నాకిచ్చిన శోషణాస్త్రం ప్రయోగించాను. ఎక్కడివర్షం అక్కడ పటాపంచలయిపోయింది. అంతలో రాళ్ళవాన కురిపించారు వాళ్ళు. అన్ని దిక్కులనుంచీ పెద్దపెద్ద రాళ్ళు వచ్చి మమ్మల్ని కప్పెయ్యడం ప్రారంభించాయి. చప్పున పిడుగు బాణం వేశాను. రాళ్ళన్నీ పిండిపిండి చేసి పారేశాను. అప్పుడు, అగ్నేయాస్త్రాలూ, వాయువ్యాస్త్రాలూ కలిపి నామీద ప్రయోగించారు వాళ్ళు. కనకనలాడుతూన్న అగ్గి నిప్పులు పెద్దగాలితో వచ్చి మామీద పడడం ప్రారంభించాయి. వారుణాస్త్రం వేశాను నేను. ఆ ఉపద్రవమూ అడిచివేశాను.

"అదంతా అలా అయిపోవడంతోనే ఉగ్రమైన చీకటిబాణాలు వేశారు రాక్షసులు. ఒకటే చీకటి కమ్ముకుంది. దిక్కులే తెలియడం లేదు. అంధకారంలో అడలెత్తిపోయాడు మాతలి. తెలివితప్పిపోయి వొక్కసారి కిందపడిపోయాడు. చీకట్లో గుర్రాలు రథం లాగడం మాట అలా వుండనీ, అడుగుతీసి అడుగు వెయ్యలేకపోయాయి. అంతలో తెలివితెచ్చుకున్నాడు మాతలి. కాని నన్ను చూడక 'అర్జునా, ఎక్కడ వున్నావు?' అంటూ భయంతో కేకవేశాడు. 'అమృతంకోసం దేవతలికీ రాక్షసులికీజరిగిన యుద్ధంకూడా ఇంతభయం కలిగించలేదు. పరాక్రమంతో వీళ్ళు మదించి వున్నారు. అంచేత, ఇంత ఘోరంగావుందీ యుద్ధం. బ్రహ్మచేసిన భువనప్రళయ మిది' అన్నాడు.

"రవంతయినా చలించలేదు నేను. 'నాభుజశక్తి చూస్తూ వుండు' అని మాతలికి ధైర్యంచెప్పాను. ఒక్కసారి సూర్యుణ్ణి తలుచుకున్నాను. దేవేంద్రుడు ప్రసాదించిన సూర్యబాణం ప్రయోగించాను. దాంతో ఎక్కడిచీకట్లు అక్కడ చెల్లాచెదరైపోయాయి. దేవేంద్రుడు మొదలయిన దేవతలు అందరూ సంతోషించారు. నివాతకవచుల గుండెలు ఒక్కసారి దిగజారిపోయాయి. బలే అంటూ మాతలి కేక వేసి మెచ్చుకున్నాడు. దానిమీద పెచ్చు రేగిపోయాను నేను గాండీవం విడువూ విరామం లేకండా పనిచేసింది. బాణాలమీద బాణాలు జడివాన కురిపించాను. కొండలుపడ్డట్టు చచ్చి కుప్పలుపడ్డారు నివాతకవచులు. కన్నుమూసి కన్ను తెరచేటంతలో వందలూ వేలూ పడుతూ వుంటే భూమి గజగజలాడిపోయింది. చివరికి ఒకడూ మిగలలేదు. అంతమందీ హతవారిపోయారు.

"ఇలా యావన్మందీ కూలిపోవడంతోటే, పట్నంలోని రాక్షస స్త్రీలు నెత్తీనోరూ కొట్టుకుంటూ ఏడుపులు ప్రారంభించారు. వాళ్ళ ఏడుపులు భూమీ ఆకాశం నిండిపోయాయి.

"మారథం పట్నంలోకి పోనిచ్చాడు మాతలి, అమరావతి కంటే అందంగా వుంది పట్నం. చూసి, మాతలిని అడిగాను: 'రత్నమందిరాల్తో ఇంత అందంగా వుండే ఈపట్నం, ఇక్కడ వుండక అమరావతిలో వున్నాడేం దేవేంద్రుడు?' అని. 'ఇదీ దేవేంద్రుడిదే' అనిచెప్పాడు మాతలి. 'రాక్షసులవల్ల ఉపద్రవం వచ్చినప్పుడు, సురక్షితంగా వుండాలని సముద్రంలో ఈపట్టణం తయారుచేశాడు. అయితే, తపస్సుచేసి, బ్రహ్మని మెప్పించారు నివాతకవచులు. ఈపట్నం వాళ్ళనివాసం కావాలనీ, దేవతలచేత వాళ్ళకి చావు వుండకూడదనీ వరంపొందారు. అవాళనించీ ఇది వాళ్ళకి దఖలుపడింది. దేవతలవల్ల చావులేకండాపోయింది అందుకనే వీళ్ళని చంపడంకోసం

నిన్ను పంపాడు దేవేంద్రుడు. దేవతలికి అసాధ్యమైనవాళ్ళని చంపి పారేశావు నువ్వు' అని నన్ను ప్రశంసిస్తూ రథం మళ్ళించాడు.

### కాలకేయులు

"తిరిగి వచ్చేస్తున్నాం మేము. దార్లో వొక తపోవనం తగిలింది ఆవనం మధ్య వొక విచిత్రమైన బంగారం పట్టణమూ కనిపించింది. అది ఎవ్వరిదని మాతలిని అడిగాను. 'ఇది హిరణ్యపురం' అన్నాడు మాతలి. 'వెనకటికి పులోమా, కాలకా అని ఇద్దరు రాక్షస స్త్రీలు బ్రహ్మదేవుడికోసం అనేక వేల సంవత్సరాలు తపస్సుచేశారు. తుదకి బ్రహ్మ ప్రసన్నుడయాడు. ప్రత్యక్షమై 'వరం కోరండి' అన్నాడు. వరం కోరారు వాళ్ళు. మా కుమాళ్ళకి ఏవిధమయిన కష్టాలూ వుండకూడదు, దేవతలూ, రాక్షసులూ, నాగులూ, —ఎవ్వరి చేత వాళ్ళు చావకూడదు. వాళ్ళకోసం అందమయిన బంగారం పట్నంకావాలి. అది ఆకాశమార్గంలో ఎక్కడికిపడితే అక్కడికి వెళ్ళేది గానూ వుండాలి' అని కోరారు. ఆప్రకారమే బ్రహ్మ వాళ్ళకి వర మిచ్చాడు.ఆరాక్షస స్త్రీల కుమాళ్ళే పౌలోములూ కాల కేయులున్నూ. అరవై వేలమంది వీళ్ళు. వాళ్ళదే ఈహిరణ్యపురం' అన్నాడు.

'అలా అయితే హిరణ్యపురం మీాదికి మనరథం పోనీ' అన్నాను నేను. నా నోట్లోమాటనోట్లోనేవుంది, సప్తవాయువులంత వేగంతో హిరణ్యపురం కోటమీాదికి రథం వురికించాడు మాతలి. మారథం చూసి ఇంద్రుడే వచ్చాడు అనుకున్నారు వాళ్ళు. వాళ్ళ కోపానికి అంతం లేకపోయింది. ఆరవై వేలమందీ రథాలువేసుకుని వొక్కసారి పట్నంలోంచి పైకివచ్చారు. చెట్లూ రాళ్లూ పుట్టించే బాణాలు వేసి అరవై వేలరథాలూ ముందుకి సాగకండా చేశాను.ఇంకే ముందీ, వాళ్ళకి వున్నదే మాయయుద్ధం. వెంటనే హిరణ్యపురంతో

కూడా ఆకాశంమీదకి ఎగిపోయారు. వెంటనే బాణాలువేసి ఆకాశ మార్గంలోకూడా అరికట్టేశాను. మళ్ళీ నేలమీదికి వచ్చారు వాళ్ళు.

వీళ్ళతో ఇదంతా ఎందుకని పాశుపతమే తీశాను నేను. శివుణ్ణి ధ్యానించాను. బాణం గాండీవానికి సంధించాను. అరవై వేల రాక్షసులమీదా వొదిలిపెట్టాను. ఆ దివ్యాస్త్రప్రభావం అద్భుతం. బాణం వొదిలానో లేదో, ఎక్కడపడితే అక్కడ యక్షులూ, రాక్షసులూ, పిచాచులూ, నాగులూ, గంధర్వులూ, వేలువేలు నిండిపోయారు. సింహాలూ, శరభాలూ పెద్దపులులూ, ఏనుగులూ, ఎనుపోతులూ, ఆబోతులూ వేలూ లక్షలూ పుట్టుకువచ్చాయి. ఇవన్నీ కలబడి, దొరికిన పౌలోముణ్ణీ కాలకేయుణ్ణీ చంపేశాయి. అరవై వేల మందిలోనూ వొక్కడూ మచ్చుకయినా మిగలలేదు. అంతా లిప్తలో జరిగిపోయింది.

అలా నివాతకవచుల్నీ, పౌలోముల్నీ, కాలకేయుల్నీ సమూలంగా సంహరించి అమరావతికి వచ్చేశాను. వచ్చి, దేవేంద్రుడి ముందు మోకరించాను. జరిగిందంతా పూసగుచ్చినట్టు విన్నవించాడు మాతలి. దేవేంద్రుడి ఆనందానికి అంతమే లేకపోయింది. 'అర్జునా' అంటూ ఆదరంగా దగ్గిరికి లాక్కున్నాడు నన్ను. 'దేవతలికి మహోపకారం చేశావు. మహానందంగా వుంది నాకు. ఎంత దుస్తరమైన యుద్ధమే రానీ, శత్రువన్న వాడు నీముందు నుంచోవడమన్నది అబద్ధం. ఎన్ని మదపుటేనుగు లయితేమాత్రం సింహాన్ని చేసేదేమిటి? ద్రోణుడూ, అశ్వత్థామా, కృపుడూ, భీష్ముడూ, కర్ణుడూ, నీబాణాల ముందు నిస్తేజులయిపోతారు. తప్పదు. ఇక, నిన్ను చూడాలని నీ అన్నదమ్ములు ఎదురుచూస్తున్నారు. భూలోకంవెళ్ళి వాళ్ళని సంతోషపెట్టు' అన్నాడు. రథమూ మాతలినీ ఇచ్చి, ఇక్కడికి పంపించాడు" అని చెప్పాడు.

తమ్ముడు సాధించిన మహాకార్యం విన్నాడు ధర్మరాజు. భూలోకసామ్రాజ్యం యావత్తూ అప్పుడే తన చేతుల్లో వచ్చి పడ్డట్టు ఆనందించాడు. అతడు తెచ్చిన మహాస్త్రాలూ, వాటి ప్రయోగాలూ చూపించమనీ కోరాడు. ముందు వొక్కొక్క బాణమూ తీశాడు అర్జునుడు. ఇది ఫలానా, ఇది ఫలానా అంటూ అందరి ఎదటా అన్న గారికి చూపించాడు. తరవాత, వాటిని ప్రయోగించి చూపడానికి సంసిద్ధుడయాడు.

అతడలా సిద్ధపడేసరికి ఈభూమండలం వొక్కసారి గిరగిరా తిరగడం ప్రారంభించింది. సముద్రాలు అల్లకల్లోల మయిపోయాయి. దిగ్గజాలు మోకరిల్లి పడిపోయాయి. సూర్యబింబం మాసిపోయింది. మంటలతో గాడ్పులు వీశాయి. ఆకాశంమీద శివుడూ, బ్రహ్మ మొదలయిన దేవతలు యావన్మందీ తడబడుతూ వచ్చి గుమికూడారు. వెంటనే నారదుణ్ణి అర్జునుడిదగ్గిరికి పంపారు. మెరుపులా వచ్చాడు నారదుడు. "అర్జునా, ఆగు. ఎదట శత్రువులేకుండా ఇవి ప్రయోగించడం ఘోరం. సిద్ధబాణా లివి. ఊరికే ప్రయోగిస్తే ముల్లోకాలూ కాల్చి వొదిలిపెడతాయి" అని వారించాడు. అంతతో ఆప్రయత్నం విరమించాడు అర్జునుడు.

గంధమాదనం మీద పదినెల్లు గడిపారు పాండవులు. ఒక నాడు దేవలోకంనుంచి దేవకన్యలు అర్జునుడిదగ్గిరికి వచ్చారు. "అర్జునా పన్నెండేళ్ళ వనవాసమూ, వొక్కేడు అజ్ఞాతవాసమూ నిర్విఘ్నంగా నిర్వహిస్తారు మీరు. తరవాత యుద్ధంలో శత్రువుల్ని వోడిస్తారు. నీపరాక్రమంవల్ల ఈభూలోకం యావత్తూ ధర్మరాజు పరిపాలిస్తాడు. శ్రీరామచంద్రుడిలాగ నీకీర్తి మూడులోకాల్లోనూ వ్యాపిస్తుంది" అని చెప్పి వెళ్ళారు. దేవరుషి రోమశుడూ చెప్పవలసిన ధర్మాలు ధర్మరాజుతో చెప్పి దేవలోకం వెళ్ళిపోయాడు.

ఆర్ష్టిషేణుడి ఆశ్రమం నుండి వచ్చినదారినే కొండదిగుతూ వెనక్కి మళ్ళారు పాండవులు. అవసరమయినచోట్ల ఘటోత్కచుడి సహాయం తీసుకుంటూనూ వచ్చారు. దార్లో మళ్ళీ వృషపర్వుడి ఆశ్రమం చూశారు. బదరీవనంలో వొక రాత్రి వున్నారు. సుబాహుడిపట్నం వచ్చి, ఇంద్రసేనుడూ మొదలయిన పరివారంతో కలుసుకున్నారు. ఘటోత్కచుణ్ణి పంపివేశారు. అక్కడనుండి తమ రథాలు వినియోగించారు. దేవరుషులూ, బ్రహ్మరుషులూ యజ్ఞాలు చేసిన ప్రదేశాలూ, వాళ్ళు వినియోగించిన రకరకాల యూప స్తంభాలూ అవీచూస్తూ హిమాలయందగ్గిర వో సంవత్సరంవున్నారు.

### పెనుబాము

ఒకనాడు హిమాలయం మహారణ్యంలో వేటకివెళ్ళి, భీముడు వొక మహాసర్పంచేత పట్టుబడిపోయాడు. ధర్మరాజు వెళ్ళి అతణ్ణి విడిపించాడు. పదివేల ఏనుగులంత బలం కలవాడు భీముడు. కుబేరుడి సైన్యం గుండపిండ చేసిన వీరుడు. అంతవాడూ వొక పాముచేత ఎలా కట్టుబడిపోయిందీ చెప్తాను. విను.

హిమాలయం మీద వొక ఎత్తయిన శిఖరం కింద అడివిలో తిరుతున్నాడు భీముడు. వేటకని వెళ్ళి బాగా అలసిపోయాడతడు. తిరుగుతూ తిరుగుతూ వొకదగ్గిర ఒక పెనుబాము చూశాడు. పసుపు పచ్చగా నిగనిగలాడుతూవుంది పాము. పెద్దపెద్ద గుడ్లు — భయంకరంగా వుంది చూపు. ఆకలితో తెరుస్తూ వుంటే గుహలా వుంది నోరు. నెలవంకల్లాంటి నాలుగు కోరలు దారుణంగా మెరుస్తున్నాయి. యముడన్నా ఇంతకంటే నయం అనిపిస్తోంది. పొగలు కక్కుతూ బుసకొడుతూ వుంటే, కొండ కొండంతా చెట్లూ చేమలతో సహా పొగలు కమ్ముకుంటోంది.

మాంసానికి ఆసపడి భీముణ్ణి పట్టుకుంది పాము. అతడి రెండు చేతులూ నోటితో పట్టుకుంది. శరీరమంతా పెనవేసి చుట్టేసింది. అంత భీముడూ కదలాడలేక కొట్టుమిట్టాడిపోయాడు. తన వెయ్యి ఏనుగుల బలమూ పిసరంత పనికిరాలేదు. అంతబలం ఎలావచ్చింది పాముకి? ఆశ్చర్యపోయాడు భీముడు. 'నిజమయిన పాముకాదిది. ఇందులో ఏదో అద్భుతం వుంది" అనుకుని పాముతో అన్నాడు. "సర్పరాజా, నేను భీముణ్ణి, పాండురాజు కుమారుణ్ణి, ధర్మరాజు తమ్ముణ్ణి, నాగులూ, యక్షులూ, రాక్షసులూ, పిశాచులూ — ఎవరయినా సరే యుద్ధంలో నాముందు నిలువలేదు. ఏనుగులూ, సింహాలూ అవలీల చంపేస్తాను. అంతబలం నాది. అలాంటి నన్ను పట్టుకుని బంధించావు నువ్వు. ఇంతబలం ఎలావచ్చింది నీకు? ఇది నీకు సహజంగా వున్న బలమేనా? లేదా, ఏదన్నా వరంవల్ల కలిగిందా?" అని అడిగాడు.

అది పామే అయినా, తన పూర్వజన్మస్మృతి చెడకుండా వున్నది దానికి. అంచేత మనుష్యభాషలోనే భీముడికి జవాబు చెప్పింది. "అవును. వరంవల్లే ఈశక్తి కలిగింది నాకు. ఎంత మహామహా బలవంతులయినా సరే. ఈ అడవిలో నాముందు గడ్డిపోచ అయిపోతారు. నా ఎదటపడ్డ జంతువు పెద్దపులీ, శరభమృగం, ఏనుగూ — ఏదయినా అను, నాకుఆహారం కావలిసిందే. భీమన్నా, ఇవాళ నువ్వే నాకుఆహారం కాని అయ్యో, ఏం చెప్పేది? దేవేంద్రపదవి సంపాదించాను. మద మెక్కి, దేవరుషులికి అపచారం చేశాను. ఒక రుషిశాపంవల్ల ఈగతి పట్టింది" అంటూ దుఃఖించడం మొదలుపెట్టింది పాము.

"దుఃఖాలు వచ్చినప్పుడు ఆత్మనింద చేసుకుని మాత్రం ఏం ప్రయోజనం?" అన్నాడు భీముడు. "ఏది ఏమయినా సరే చలించకుండా వుండడమే పురుషుడి పురుషార్థం. ఏమంటావా, పురుష ప్రయత్నంవల విధివిధానం తప్పించలేము కదా! అంతెవరకూ ఎందుకూ

నాసంగతే చూడూ. మహాబలవంతుణ్ణి అయివుండికూడా, నీకు చిక్కి-పోయి ఈఅవస్థకి వచ్చాను. ఐతే, నాచావుకి విచారం లేదు నాకు. రాజ్యం పోగొట్టుకుని ఘోరమైన ఈకొండఅడవుల్లో తిరుగుతున్నారు, నాఅన్నదమ్ములు. నన్ను చూడక ఎంత దుఃఖిస్తారో అని మాత్రం దుఃఖపడుతున్నాను" అన్నాడు.

ఇక్కడ ఇలా దురవస్థలో వున్నాడు భీముడు. అక్కడ తీవ్రమయిన నక్కకూత విన్నాడు ధర్మరాజు. మనస్సులో ఏదో శంక కలిగినట్టయింది. ఉత్తరక్షణంలో ఎడమభుజం అదిరింది. ఏదో ఆపద రాబోతుందని హృదయానికి తట్టింది. తమ్ములదిక్కు చూశాడు. భీముడు కనపళ్ళేదు. అర్జునుణ్ణీ, నకుల సహదేవుల్నీ ద్రౌపదిదగ్గిర కాపలా పెట్టాడు. ధౌమ్యుడూ మొదలయిన బ్రాహ్మలతో కలిసి వెదుకుతూ తాను బయలు దేరాడు.

అడివిలో దారి ధూళితో వుంది. ధూళిలో భీముడి అడుగులు సున్నితమైన మత్స్యరేఖా, నాగలీ. కలశం మొదలయిన గుర్తులతో కనిపిస్తున్నాయి.* అడుగులంబడే కొండశిఖరం ప్రాంతానికి వెళ్ళాడు ధర్మరాజు.

పెనుబాము శరీరం చుట్టేసి నులిచేస్తూవుంది. ఆయాస పడుతున్నాడు భీముడు. చూసి, నిశ్చేష్టితుడయి పోయాడు ధర్మరాజు. భీముడా వొకపాము చుట్టేస్తూవుంటే, సామాన్యమానవుడిలా బాధపడడం! తమ్ముడుస్థితి చూసి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి ధర్మరాజుకి. పాముని సంబోధిస్తూ అన్నాడు:

---

* పాదంలో నాగలిరేఖ మొదలైనవి మహాపురుషలక్షణాలు.

హల ముసల గదా సి శంఖ చక్ర ద్విప మకరాబ్జ రథాంకితాంఘ్రి హస్తః
విభవ మపి జనోఽ స్య బోభుజీతి క్షమతి హి న వ్యజనం స్వతంత్రబుద్ధిః. బృ. సం

ధర్మ: అయ్యా, దేవతవో, రాక్షసివో, నిజంగా సర్పానివో! ఎవరునువ్వు? పామురూపంలో వున్నావు? నేను ధర్మరాజుని. నిన్ను అడుగుతున్నాను. మాంసంకోసమే నాతమ్ముణ్ణి పట్టుకుంటే, చెప్పు. నీఆకలి తీరేటంత లేడిమాంసం పెడతాను. ఇతణ్ణి వొదిలిపెట్టు.

పాము: ధర్మరాజా, పూర్వజన్మలో నహుషుణ్ణి నేను. మీ పూర్వులికి పూర్వుణ్ణి. చంద్రుడినుండి అయిదోతరంవాడు ఆయుమహారాజు. ఆయనకుమారుణ్ణి నేను దేవేంద్రుడితో సమానమైనవాణ్ణి. ఐశ్వర్యంవల్ల మతిచెడి వెయ్యిమంది బ్రాహ్మలచేత నాపల్లకీ మోయించాను. బ్రాహ్మలికి ఘోరమయిన అవమానం చేశాను. దాంతో మండిపడ్డాడు అగస్త్యుడు. 'పెనుబామువై పోయి భూలోకానికి పో' అని శపించాడు. ఆశాపమే ఈఅవస్థకి తెచ్చింది నన్ను. ఇలా బాధ పడుతున్నాను. విధి విచిత్రమైంది! ఏం చెప్పమన్నావు! నూరు యజ్ఞాలు చేశాను. ఎంతో తపస్సూ చేశాను. వేదాలన్నీ చదివాను. దేవేంద్రపదవీ అధిష్ఠించాను. తుదకి పాము జన్మ ఎత్తి బాధపడుతున్నాను. సుఖంకలిగించే విధే దుఃఖమూ తెచ్చిపెడుతుంది.

అగస్త్యముని శాపంతో ఇంద్రపదవి వొదిలిపెట్టి ఇలా వచ్చేస్తూ అతణ్ణి ప్రార్థించాను. 'మునీంద్రా, నాపూర్వస్మృతి నాకు వుండేట్టూ, ఎంతబలంకల ప్రాణాలయినా నన్ను ముట్టగానే వాటి శక్తి నశించేట్టూ అనుగ్రహించు' అని చేతులు జోడించాను. 'అలాగే కానీ' అని కరుణించాడు ముని. 'నువ్వు అడిగిన ప్రశ్నలికి సరిఅయిన సమాధానం ఎవడిస్తాడో, అతడివల్ల శాపమోచనం కలుగుతుంది నీకు. అయితే, అది చాలా కాలానికి కాని సమకూడదు' అని శాపాంతం కూడా చెప్పాడు. అవాళనించీ అతిడి మాటమీద ఆశపెట్టుకుని ఇంత కాలమూ ఇలా పడివున్నాను. పగలు ఆరో భాగంలో ఆహారంగా లభించాడు నీతమ్ముడు అంచేత, ఇతణ్ణి వొదిలిపెట్టడం కానీ, మరో

ఆహారం పుచ్చుకోవడం కానీ చెయ్యాను. నీకు చేతనయితే మాత్రం నాప్రశ్నలికి సమాధానం చెప్పి, ఇతణ్ణి విడిపించుకుని వెళ్లు.

ధర్మ: నువ్వు అడిగినవాటికి సమాధానం చెప్పడం సర్వజ్ఞు లయిన బ్రహ్మర్షులికి కాని సాధ్యంకాదు. అయినా ప్రయత్నిస్తాను. తెలిసినంతవరకూ చెపుతాను అడుగు.

పాము: ఎవడు బ్రాహ్మడు ? ఏది తెలుసుకోదగింది?

ధర్మ: సత్యమూ, దానమూ, క్షమా, సత్ప్రవర్తనా, అహింసా, తపస్సూ, దయా ఎవడిలోవుంటే వాడే బ్రాహ్మడు. సుఖదుఃఖాలికి అతీతమైందీ, తెలుసుకున్నాక శోకంకలగనీయందీ అయిన పరబ్రహ్మమే తెలుసుకో దగింది.

పాము: నాలుగువర్ణాలవారికీ బ్రహ్మమూ, సత్యమూ సమానమే కదా! అయితే, నువ్వు చెప్పినసత్యం, దానం మొదలయినగుణాలు వొక శూద్రుడిలో వుంటే, అతణ్ణి బ్రాహ్మడే అనాలా ? అదీ కాక, సుఖమూ దుఃఖమూ లేందే తెలుసుకోదగింది అన్నావు. సుఖదుఃఖాలు లేంది ఏదీ లేదనే నా సందేహం.

ధర్మ: దయా, సత్యం మొదలయిన గుణాలు కల శూద్రుడు శూద్రుడు కాడు. ఇవి లేని బ్రాహ్మడు బ్రాహ్మడూ కాడు. అంచేత, ఈగుణాలు ఎవడిలోవుంటే వాణ్ణి బ్రాహ్మడే అనాలి.* ఇవి లేనివాణ్ణి శూద్రుడనాలి. సుఖమూ దుఃఖమూ లేంది ఏదీ లేదన్నావు. నువ్వన్నది నిజమే. అయితే, అజ్ఞానం అనే ఆవరణలోంచి బైటపడి, తానూ, బ్రహ్మమూ వొకటే అని తెలుసుకొన్న వాడికి సుఖంకానీ, దుఃఖంకానీ ఎంతమాత్రం వుండనే వుండవు.

పాము: నడతబట్టే బ్రాహ్మణ్ణి నిరూపిస్తే మరి జాతివిభాగం ఏం కావాలి?

---

* చూ. శుక్రనీతిసారం అ. ౧

ధర్మః మనుష్యుల్లో జాతులు నిర్ణయించడం నిజంగా దుస్తర మయిన పని. ఏమంటావా, ఇపుడు సర్వత్రా వర్ణసంకరమే కని పిస్తోంది. అందరూ అన్ని జాతుల స్త్రీలతోనూ సంతానం కంటూనే వున్నారు. మాటలూ, మైథునమూ, చావూ, పుట్టుకా—ఇవి మనుష్యుల యావన్మందిలోనూ సమానమే కదా!*దీనికి వైదికప్రమాణం కూడా వుంది. 'యే యజామహా' అని శ్రుతి. జాతి ఇది అని నిశ్చయంలేక పోవడంవల్లే ' యజ్ఞంచేస్తున్న మేము ' అని సామాన్యార్థంలోనే చెప్ప బడింది. 'యజ్ఞంచేస్తున్న బ్రాహ్మణులమయిన మేము' అని ఏవిశేష ణమూ చెప్పబడలేదు. అంచేత, తత్వం తెలిసిన విద్యావంతులు శీలా నికే—అంటే నడతకే ప్రాధాన్య మిస్తారు. ద్విజల్లో కుర్రాడు జన్మిం చాక నాభిచ్ఛేదనం, జాతకర్మా. నామకరణం, చౌలం, ఉపనయనం— ఇవన్నీ చేసినప్పుడు తల్లిని సావిత్రీ అనీ, తండ్రిని ఆచార్యుడనీ వ్యవహ రిస్తారు. సంస్కారం జరిపి వేదాధ్యయనం చేయించేవరకూ అతడు శూద్రుడితోనే సమానం. ఇది మనువే నిర్ణయించాడు. సంస్కారం జరిపి, వేదాలు చదివించినా కూడా శీలం లేకపోతే అతడిలో వర్ణ సంకరం ఏర్పడినట్టే నిశ్చయించాలి. సంస్కారమూ, నడతా వున్న వాణ్ణే బ్రాహ్మణుడని చెప్పనే చెప్పాను.

పాముః తెలుసుకోవలిసినవి అన్నీ తెలిసిన మహామతివి నువ్వు. నీమాటలు విన్నాను. నీతమ్ముణ్ణి విడిచిపెట్టకుండా ఎలా వుండగలను!

ధర్మః వేద వేదాంగ పారగుడివి నువ్వు. నిన్ను వొకవిషయం అడుగుతాను, చెప్పు. ఏమికర్మలు చెయ్యడంవల్ల ఉత్తమగతి లభిస్తుంది?

---

* జాతిరత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే।
సంకరాత్ సర్వవర్ణానాం దుష్పరీక్ష్యేతి మే మతిః॥
సర్వే సర్వాస్వపత్యాని జనయంతి యదా నరాః।
వాఙ్మైథునమథో జన్మ మరణం చ సమం నృణామ్॥
సం. మ. అరణ్యపర్వణి, అజగరపర్వ.

పాము : దానమూ, ప్రియభాషణమూ, సత్యమూ, అహింసా ఈనాలుగింటివల్లే ఉత్తమగతి లభిస్తుందని నా అభిప్రాయం.

ధర్మ : దానం, సత్యం — ఈ రెంటిలో ఏదిగొప్పది ? అహింసా సత్యభాషణమూ — ఈ రెంటిలో ఏది గొప్పది ? ఏది తక్కువది ?

పాము : దానం, సత్యం, అహింసా ప్రియభాషణం — వీట్ల గొప్పతనం వాటికార్యం మీద ఆధారపడి వుంటుంది. ఒకప్పుడు దానంకంటే సత్యమే గొప్పదవుతుంది. ఒకప్పుడు సత్యం కంటే దానమే గొప్పదవుతుంది. అలాగే ఒకప్పుడు ప్రియభాషణంకంటే అహింస గొప్పదవుతుంది. ఒకప్పుడు అహింసకంటే ప్రియభాషణం గొప్పదవుతుంది.

ధర్మ : శరీరంలేకుండా దేహి స్వర్గానికి ఎలా వెళతాడు ? వెళ్ళి అక్కడ కర్మఫలం మాత్రం ఎలా అనుభవిస్తాడు ?

పాము : తమతమ కర్మల ననుసరించి స్వర్గవాసం, మనుష్య జన్మ, తిర్యగ్యోనిలో పుట్టడం — ఇలా ప్రాణులికి మూడు గతులు న్నాయి. మనుష్యయోనిలో జన్మించే ప్రాణికి అహింసా మొదలయిన సత్కర్మలవల్ల స్వర్గవాసం ప్రాప్తిస్తుంది. దానికి వ్యతిరేకంగా అసత్కర్మలుచేసే ప్రాణికి తిర్యగ్యోనుల్లో — అంటే పశువులూ మొదలయిన వాటి యోనుల్లో జన్మం లభిస్తుంది. తిరిగీ సత్కర్మలకోసం ప్రాణి మనుష్యయోనిలో జన్మిస్తుంది. సత్కర్మలుచేసి ముక్తిపొందుతుంది.

ధర్మ : ఇంత సర్వజ్ఞుడివి నువ్వు. స్వర్గంలోనూ నివసించావు. నీలాంటివాడు పొరపాటు ఎలాచేశాడని మాత్రం బాధిస్తోంది నన్ను.

పాము : అది ఐశ్వర్యంవల్ల కలిగిన అజ్ఞానం. పతనంఅయాక గాని తెలివి కలుగలేదు. ధర్మరాజా, నువ్వు నాకు మహోపకారం చేశావు. నీతో మాట్లాడంవల్ల నాకు శాపాంతం అయిపోయింది. నా పతనంగాథ వినిపిస్తాను, విను.

నేను అప్సర్గలోకానికే రాజుగా వుండేవాణ్ణి. దివ్యవిమానాల మీద ఆకాశమార్గంలో విహరించేవాణ్ణి. అహంకారం నన్ను ఆవరించి, కిందా మీదా కనపడేదికాదు. నేను కన్నెత్తిచూస్తే చాలు, ఎంతటి వాడి తేజస్సయినా హరించేపోయేది. బ్రహ్మర్షులూ, దేవతలూ, యక్షులూ, రాక్షసులూ, నాగులూ - మూడులోకాలలోనివాళ్ళు ఎవ ళ్ళయినా సరే, నాముందు తలవొంచవలసిందే. నాఅహంకారం ఎంత వరకూ వెళ్ళిదంటే, వెయ్యిమంది బ్రహ్మర్షుల చేత నాపల్లకీ మోయించాను. అదే నాసర్వనాశనానికీ కారణమయింది. పల్లకీ మోస్తున్న అగస్త్యముని నెత్తిమీద తన్నాను. కళ్ళెర్రచేసి వొకటే శాపం పెట్టాడతడు. అంతే - నారాజ లక్షణాలన్నీ వొక్కసారి మాయమైపోయాయి. పల్లకీమీంచి జారిపోయాను. పామునైపోయి పడిపోతున్నట్టు తెలియవచ్చింది నాకు. దీనంగా అగస్త్యుణ్ణి ప్రార్థిం చాను. కనికరించాడు ముని. 'ధర్మరాజు నిన్ను శాపంనుండి విడి పిస్తాడు. దాంతో నీపాపం నశిస్తుంది. తరువాత మళ్ళీ నీపుణ్యఫలం నువ్వు అనుభవిస్తావు' అన్నాడు.

రాజా, ఇదిగో నీతమ్ముణ్ణి నువ్వు తీసుకవెళ్ళు. నీకు శుభం కలుగుతుంది. సెలవు. నేను స్వర్గానికిపోతాను.

చూస్తూవుండగా పాముశరీరం విడిచిపెట్టేశాడు నహుషుడు. దివ్యశరీరంతో స్వర్గానికి వెళ్ళిపోయాడు. తమ్ముణ్ణి తీసుకుని ఆశ్రమానికి వచ్చేశాడు ధర్మరాజు.

వానాకాలం వచ్చింది. ఎండల్లో తపించి వున్న అడవి చెట్లకి ఆనందంగా వానలుపడ్డాయి. ఝంఝూవాయువులికి పెద్ద పెద్ద వర్షధారలు తూలిపోతూవుంటే, నాలుగుదిక్కులా వేలాడుతూ నల్లటి కొత్తమేఘాలు అదేపనిగా కురిశాయి. అమావాస్య చీకట్ల లాగ గాఢమయిన మేఘాలు దట్టమయిన చీకట్లుకమ్మాయి. మెరుపు

మెరిసినప్పుడు తప్ప ఏవస్తువు ఏదో తెలియకండా అయిపోయింది ప్రజలికి. ఆకాశంమీద మేఘాల ధ్వనీ, చెట్లకొమ్మలమీద నాట్యంచేస్తున్న నెమళ్ళధ్వనీ ఇదంతా కలిసి అద్భుతంగా వుంది అడివి. కేతకి పువ్వుల పుప్పొళ్ళతో ఘుమఘుమ లాడుతూన్నగాలి చెలికత్తెలా వూపుతూ వుంటే పూలగుత్తుల వుయ్యాల్లమీద కూచుని వూగుతూ పాటలు పాడాయి తుమ్మెదలు. ఆకాశంమీద ఇంద్రధనుస్సులాగ భూదేవి, చివురుపెట్టిన గరికతోనూ, పుట్టగొడుగులతోనూ, ఆరుద్రపురుగుల తోనూ అలంకరించుకుంది.

వర్షాకాలం వెళ్ళిపోయింది. శరత్కాలంవచ్చింది. భూదేవికీ ఆకాశానికీకూడా ముస్తాబు చేసినట్టయింది. సర్వప్రపంచమూ ఆనందంతో కలకల్లాడింది. మహారుషులు ఉపాసిస్తూవుంటే ప్రకాశించే పరమ హంసలాగా, బ్రహ్మదేవుడి రథంలాగా రాజహంసలతో అందంగా ఎంచక్కా అవుపించింది సరస్వతీనది, కలక తేరిన నీళ్ళతో. ప్రభాత సమయాల్లో కాంతి హెచ్చిస్తున్నాయి సూర్యకిరణాలు. మేఘాలు లేకండా నిర్మలంగా వుంటోంది ఆకాశం. పద్మాలు వికసించీ, అమితవైభవంగా వుంటున్నాయి సరస్సులు. హంసలూ, సారసాలూ, తుమ్మెదలూ చేస్తున్న ధ్వని గోష్ఠీగానంలా వుంది. ఏనుగుమందలు అడవుల్లో తిరుగుతున్నాయి. వాటినిచూస్తే శరత్తుకి భయపడి వాన మేఘాలు తమనీళ్ళధారలు ఏనుగుల మదజలధారల్లోనూ, గర్జనలువాటి ఘీంకారాల్లోనూ దాచుకుని, ఇలామారువేషాల్లో తిరుగుతున్నాయా అని అనిపిస్తోంది. తుమ్మెదలకోలాహలం హెచ్చింది. రాజహంసలు మందలు మందలు విహరించాయి. సురపొన్నలు పూశాయి. ఒక్క గుక్కలో సముద్రంతాగేసిన అగస్త్యుడు దక్షిణాదిని ఉదయించాడు. తెల్లమేఘాలు చుట్టూవున్న ఆకాశం ప్రతిబింబాలాగ, చుట్టూపూసిన రెల్లుగడ్డితో కనిపిస్తున్నాయి చెరువులు.

ఆశరదృతువులో సరస్వతీనది వొడ్డుని మరుభూమిలో కొన్నాళ్లు గడిపారు పాండవులు. వికసించిన ఎర్రతామరలూ, కలవలూ మొదలయిన పువ్వుల పుప్పొళ్ళు కలిసిన తరంగాలతో కల్లోలంగా వుంటుంది సరస్వతీనది. దానివొడ్డుని ఎల్లప్పుడూ ఎంతోమంది తపస్సుచేసుకుంటూ వుంటారు. అనేకమంది మునులు ఎప్పుడూవచ్చి స్నానాలూ అవీచేసి వెళుతూ వుంటారు. అలాంటి సరస్వతీనదిలో కార్తీక స్నానాలు చేసుకుని సంతోషంగా గడిపారు పాండవులు. అనంతరం అక్కడినించి ధౌమ్యుడూ మొదలయిన బ్రాహ్మలూ, ఇంద్రసేనుడూ మొదలయిన మూలభృత్యులూ — యావన్మందితో కూడా కామ్యక వనం వచ్చేశారు. అక్కడిమునులు సగౌరవంగా వాళ్ళకి స్వాగతం చెప్పి ఎంతో అంత సత్కరించారు.

కామ్యకవనంలో సముచితంగా కాలక్షేపం చేస్తున్నారు పాండవులు. ఒకనాడు అర్జునుడి స్నేహితుడయిన వొక బ్రాహ్మడు వచ్చాడక్కడికి. ఆసమయానికి బ్రాహ్మలమధ్య సభతీర్చి కూచుని వున్నాడు ధర్మరాజు. తిన్నగా వచ్చి ధర్మరాజుతో చెప్పాడు బ్రాహ్మడు: "మహారాజా, మీారిక్కడ వున్నారని విని మిమ్మల్ని చూడాలని శ్రీకృష్ణుడు వస్తున్నాడు. ఎప్పుడూ మిమ్మల్ని తలుస్తూనే వుంటాడాయన. అంతే కాదు, ఎన్నో వేలయుగాలై జీవిస్తూవున్న మార్కండేయమునీ మిమ్మల్ని చూడాలని ఇప్పుడే వస్తున్నాడు" అన్నాడు.

బ్రాహ్మడి నోట్లోమాట నోట్లోనేవుంది, రథఘోష వినపడింది. మేఘం గర్జిస్తోందని భ్రమపడ్డాయి నెమళ్ళు. నాట్యమే మొదలుపెట్టాయవి. ఆకాశమంత ఎత్తుని గరుడధ్వజం కనిపించింది. చూస్తూ వుండగానే మెరుపులు మెరిస్తే మేఘాలమీంచి శచీదేవితో వచ్చే దేవేంద్రుడిలాగ శైబ్యమూ, సుగ్రీవమూ మొదలయిన గుర్రాలుపూసిన రత్నాల రథంమీద సత్యభామా సహితంగా వచ్చాడు శ్రీకృష్ణుడు.

ఉన్న పాళంగా లేచి ఎదుట వెళ్ళారు పాండవులు. రథం దిగీ దిగడంతోటే ధర్మరాజుకి అభివాదనం చేశాడు కృష్ణుడు. భీముణ్ణీ, అర్జునుణ్ణీ, నకుల సహదేవుల్నీ గుచ్చి కౌగలించుకున్నాడు. ద్రౌపదిని ఆదరపూర్వకంగా పలకరించాడు. అర్ఘ్యమూ మొదలయిన వాటితో అతణ్ణి సముచితంగా సత్కరించాడు ధర్మరాజు. ధౌమ్యుడూ మొదలయిన బ్రాహ్మలు యావన్మందీ అభినందిచారు. సత్యభామా ద్రౌపదీ పరస్పరం కౌగిలించుకున్నారు.

కృష్ణుణ్ణి తగిన ఆసనంవేసి కూచోపెట్టాడు ధర్మరాజు. తమ్ముళతో సహా తాను దగ్గిర కూచున్నాడు. అర్జునుణ్ణి తన పక్కనే కూచోపెట్టుకున్నాడు కృష్ణుడు. చిరకాలానికి కలుసుకున్న ఆనందంతో మాటి మాటికీ ఆదరంగా అర్జునుణ్ణి చూశాడు. చివరికి ధర్మరాజుతో ఇలా ఆరంభించాడు: "బావా, శివుడూ మొదలైన దేవతలదగ్గర అర్జునుడు దివ్యాస్త్రాలు పట్టుకు రావడమంటే మహాభాగ్యమని భావించాలి. నిజంగా ధన్యుడివన్న మాట నువ్వు. అయితే, దీనంతటికీ నీ ధర్మచరిత్రమూ, తపస్సూ కారణాలు. రాజ్యంకంటే ధర్మమే ప్రియం నీకు. వేదవేదాంగాలు తెలిసినవాడివి. మంచినుంచి యజ్ఞాలు చేశావు. ధనుర్వేదం తుదచూసిన వాడివి. రాజధర్మానికి నిన్ను చెప్పి మరొకణ్ణి చెప్పాలి. ఇలా ఇహమూ పరమూ కరతలామలక మయాయి నీకు. దమమూ, ధైర్యమూ, సత్యమూ, తృప్తీ, శమమూ - ఇవన్నీ సహజ గుణాలు నీకు. ధనంకోసమని కామానికీ, లోభానికీ లొంగవు నువ్వు. ధర్మరాజన్న పేరు నీకు సార్థకమయిందని మూడులోకాల వాళ్ళూ పూజిస్తారు నిన్ను" అన్నాడు.

ఇంకా ఇలా అన్నాడు: "జూదం నెపంపెట్టి, అవాళ నిండు సభలో దుర్యోధనుడు చేసిన దుర్మార్గం సహించడమంటే, నీకే చెల్లింది. ధర్మంకోసం ఇంత ధైర్యం వహించినవాడు ప్రపంచంలో

మరి ఎక్కడా వుండదు. సత్యానికి కట్టుపడ్డావు. శాంతం వహించావు. అంచేత వాళ్ళ ఆటలు అలా సాగిపోయాయి. నువ్వే కొంచెం కళ్ళెర్ర చేస్తే ఇంక ఏమయినా వుందా? కౌరవకులం కనపడకండా పోయేది. నీఆజ్ఞ చెలియలికట్టలా దాటరాంది. కనకనే పౌరుషతరంగాలు లేవకండా ఆగిపోయాయి. కాకపోతే, నాలుగు సముద్రాల్లా నీ నలుగురు తమ్ముళ్లూ ప్రళయంచేసి ముంచెత్తేవాళ్ళు. పగవాళ్ళపాలిటి కాలయముల్లా కబళించేవాళ్ళు. అంధకులూ, వృష్ణులూ, భోజులూ, కుకురులూ—యావన్మందీ బంధుస్నేహంతోనూ, భక్తిభావంతోనూ నీకు సహాయం చేయడానికి సిద్ధంగా వున్నారు. దురాత్ముడు దుర్యోధనుడు వీళ్ళముందు నిలవడానికయినా సమర్థుడా? నాలుగు సముద్రాలమధ్యా వున్న భూఖండం అంతటికీ నువ్వే సామ్రాట్టువి. నువ్వు తలుచుకుంటే అడ్డేముందీ!'' అని.

"నీ శరణుజొచ్చిన మాకు అడ్డేముంటుంది కృష్ణా,'' సంతోషిస్తూ అన్నాడు ధర్మరాజు – "వనవాసం మరికొంచెమే మిగిలివుంది. అదీ, అజ్ఞాతవాసమూ పూర్తిచేస్తాము. తరవాత మా దోషం లేకండా శత్రువుల్ని జయించడానికే పూనుకుంటాం. ఇదంతా నిర్వహించే భారం మాత్రం నీమీదే వుంది.''

దగ్గిరే కూచుని అంతా వింటోంది ద్రౌపది. ఆమెతో ఇలా అన్నాడు కృష్ణుడు. "చెల్లీ, నీ కుమాళ్ళు కులాసాగా వున్నారు. యాదవకుమాళ్ళతోకలిసి ఏనుగులూ, గుర్రాలూ ఎక్కడమూ, అస్త్రశస్త్రాలు లుపయోగించడమూ నేర్చుకుంటున్నారు. ఇంకో చింతేలేదు వాళ్ళకి. ప్రద్యుమ్నుడు వాళ్ళకి దివ్యాస్త్రాలుకూడా ప్రసాదించాడు. కన్నీళ్ళుపెట్టుకోకమ్మా, వాళ్ళని అభిమన్యుడికంటే ఆదరంగా చూస్తోంది సుభద్ర. ఇంతకీ మీకష్టాలు గట్టెక్కే కాలం ఎంతోదూరం లేదు.''

ఇలా కృష్ణుడు మాట్లాడుతూ వున్న సమయంలో మార్కండేయముని వచ్చాడు. చప్పునలేచి కృష్ణుడూ పాండవులూ, తక్కిన యావన్మందీ ఎదురువెళ్ళి అతణ్ణి పూజించారు. అందరినీ ప్రత్యేక ప్రత్యేకంగా కుశలమడిగాడు ముని. అతడు సుఖంగా కూచున్నాక, పాండవుల మంచి మనస్సులో పెట్టుకుని మార్కండేయుడితో ప్రసంగించాడు కృష్ణుడు: "మునీంద్రా, 'నేనూ పాండవులూ ఈ బ్రాహ్మణులూ మేం యావన్మందిమీ అమృతంలాంటి నీమాటలు చెవులారా వినాలని ఆశపడుతున్నాం. మాకోర్కె చెల్లించమని ప్రార్థిస్తున్నాము. దేవతలగాథలూ, రాజులచరిత్రలూ, బ్రాహ్మణలవిశేషాలూ, పతివ్రతల కథలూ సెలవిచ్చి, అనుగ్రహించు" అన్నాడు.

అంతలో నారదముని అక్కడికి వచ్చాడు. అందరూ ఎదురువెళ్ళి అతడికి నమస్కరించారు. ఉన్నతాసనం వేసి, ఉచితమయిన సత్కారాలు చేసి అతణ్ణి సంతోషపరిచారు. మార్కండేయమునిని చూసి నారదుడు, "మునీంద్రా, కృష్ణుడికీ పాండవులికీ హితంకలిగించే పుణ్యకథలు వినిపించు" అని చెప్పాడు. కొంతసేపు వుండి, "వెళ్ళివస్తాను" అని అందరితోనూ చెప్పి వెళ్ళిపోయాడతడు.

నారదముని వెళ్ళిపోయాక "మునీంద్రా, నాదొక ధర్మసందేహముంది" అంటూ మార్కండేయుడి దిక్కు తిరిగి చేతులు జోడించాడు ధర్మరాజు. "ధర్మం మానకండా నడుచుకుంటున్నాం మేము. అయినా, కష్టాలే అనుభవిస్తున్నాము. ధృతరాష్ట్రుడి కుమాళ్లు పాపాలే చేస్తున్నారు. కాని సౌఖ్యాలు అనుభవిస్తున్నారు. ఈ విపరీతానికి ఏమిటి కారణం? మనిషి ఇప్పుడు చేసేకర్మఫలం ఈలోకంలో అనుభవిస్తాడా? పరలోకంలోనా? లేదా, ఇక్కడా అక్కడాకూడా అనుభవిస్తాడా? అదీ కాక, శరీరంతో చేసినకర్మ శరీరంతోనే వొదిలి

పోతుందా ? ఈసందేహం తీర్చటానికి నువ్వే తగినవాడివి. సెల వియ్యి" అన్నాడు.

మందహాసంతో ఉపక్రమించాడు మార్కండేయుడు :

## మార్కండేయముని ప్రసంగం

"మొట్టమొదట ప్రథమకల్పంలో బ్రహ్మ ఎంతో అంత నిర్మలంగా మనుష్యుల్ని సృష్టి చేశాడు. అప్పటి మనుష్యులు ధర్మపరులు. మహా సత్వసంపన్నులు. సత్యవాదులు. సత్యసంకల్పులు. బ్రహ్మభూతాత్ములు. స్వచ్ఛందజీవులు. దేవతల వాహనాల మీద తిరిగేవాళ్లు వాళ్ళు. ఆయాసంలేకండా అధికమయిన ఫలసిద్ధి పొందేవాళ్ళు. సర్వజ్ఞులు. మచ్చరమంటే ఏమిటోకూడా ఎరగరు. అనేక వేల సంవత్సరాలు హాయిగా బతికేవాళ్లు.

"రాను రాను కాలం మారింది. కామం, క్రోధం మొదలయిన గుణాలు ఆవరించాయి. మనిషిన్నవాడల్లా మాయ నేర్చుకున్నాడు. దాంతో దేవతలనుండి దూరమయిపోయింది మానవజాతి. బలమూ అంతంత అయిపోయింది. శరీరాలూ చిన్నవయినాయి. ఆయుర్దాయమూ తగ్గిపోయింది. దారిద్ర్యమూ, కొరగానితనమూ, లెక్కలేని రోగాలూ మీదపడ్డాయి. నాస్తికత్వం బలిసింది. ఒకరంటే వొకరికి కిట్టకండా అయింది. పాపాలమీదే అభిలాష పెరిగింది. చేసిన చెడ్డ పనులప్రకారం పశువుకడుపులోనో పక్షి కడుపులోనో పుడుతూ నరకంలో బాధపడుతూ - ఇలా చావడం పుట్టడం, పుట్టడం చావడం తోనే సరిపోతూ వుంది మానవులికి.

"మనిషి ఇక్కడ పుణ్యపాపాలు చేస్తాడు. చనిపోయాక అవి వొదలవు. చేసినకర్మలు నీడలా వెంటబడతాయి. పుణ్యానికి సుఖమూ, పాపానికి దుఃఖమూ అనుభవింపజేస్తాయి. వాటివల్లే తిరిగీ జన్మిస్తాడు

దేహి. మంచి చెడ్డలు మనల్ని వొదిలిపోతాయని అనుకునేవు. అది పొరపాటు. తనువులు వొదిలినా కర్మలు వొదలవు.

"మరోమాట. కొందరికి ఈలోకంలోనే సుఖం కలుగుతుంది. మరికొందరికి పరలోకంలో కలుగుతుంది. కొందరికి ఇక్కడా అక్కడా కూడా కలుగుతుంది. మరికొందరికి ఇక్కడా అక్కడా ఎక్కడా సుఖం వుండదు. ఎంచేత? చెపుతాను విను. బాగా ధనం వుండి, పగలూరాత్రీ ఇంద్రియసుఖాల్లో తేలుతూవున్న వాళ్ళు మంచికార్యాల దిక్కు కన్నెత్తిచూడరు. లోభమూ, మోహమే వాళ్ళకి స్వర్గంలా వుంటుంది. అలాంటివాళ్ళకి పరలోక సౌఖ్యాలు అందరాని పళ్ళు. ఈలోకంలోని సౌఖ్యమే వాళ్ళకి అంతాను. ఉపవాస వ్రతాలు చెయ్యడం, రోజూ వేదాలు చదవడం, తీర్థాలుసేవించడం — వీటితో ఇక్కడి జీవితం అంతా దుఃఖంలా గడిపిన వాళ్ళు పుణ్యాత్ములు. అలాంటివాళ్ళకి ఇక్కడ సుఖంలా వుండక పోవచ్చు. పరలోకంలో మాత్రం వాళ్ళు మహాసౌఖ్యాలు అనుభవిస్తారు. ధర్మమే చెపుతూ, ధర్మంమీదే నడుచుకుంటూ, ధర్మంతప్పకండా ధనంగడిస్తూ, ధర్మయుక్తంగా వివాహంచేసుకుని, సంతానంకనీ యజ్ఞాలూ మొదలయిన ధర్మకార్యాలుచేస్తూ జీవించేవాళ్ళే సత్పురుషులు. అలాంటి వాళ్ళు ఈలోకంలోనూ, పరలోకంలోనూ కూడా కోరినసౌఖ్యాలు అనుభవిస్తారు. సౌఖ్యాలే వాళ్ళకాళ్ళకిందికి వస్తాయి. ఇక అబద్ధాలాడీ, కామక్రోధాలికిలొంగిపోయీ, శుచిత్వంలేకండా, తినరానితిళ్ళు తింటూ నాస్తికులై తిరిగే దుష్టులు నీచులు. ఇక్కడా,అక్కడా ఉభయలోకాల్లోనూ సౌఖ్యం వుండదు వీళ్ళకి. ధర్మరాజా, ఇది మనుష్యుల కర్మగతిప్రకారం.

"దేవతల్తో సమానమైనవాళ్ళు మీరు. దేవకార్యం కోసం భూలోకంమీద పుట్టారు. మీరు మీపరాక్రమంతో ఎంతమందిన్నో

శత్రువుల్ని సంహరిస్తారు. భూభారం తగ్గిస్తారు. ఎన్నో యజ్ఞాలు చేస్తారు. చివరికి దేవతల్లో కలిసిపోతారు'' అన్నాడు.

తరవాత బ్రాహ్మణప్రభావం చెప్పమన్నాడు ధర్మరాజు. దానికి దుందుమారుడి కథ చెప్పాడు మార్కండేయుడు.

## దుందుమారుడి కథ

వెనకటికి హైహయవంశంలో దుందుమారుడని వొక రాజకుమారుడు వుండేవాడు. అతడు వొకనాడు వేటకివెళ్ళి అడవిలో తిరుగుతున్నాడు. లేడితోలు కప్పుకున్న మునికుమారుడొకడు అతడికి దూరంగా కనిపించాడు. అతణ్ణి లేడే అనుకున్నాడు దుందుమారుడు. వెంటనే ధనుస్సులో బాణం తొడిగి విడిచిపెట్టాడు. బాణం తగిలీ తగలడంతోటే మునికుమారుడు కింద పడిపోయాడు. వెళ్ళి చూశాడు దుందుమారుడు. నిలువునా నీరు విడిచిపోయాడు. ఎంతో దుఃఖపడ్డాడు. ఊళ్ళోకి వచ్చి, తనవంశంలోని పెద్దలతో చెప్పాడు. వాళ్ళని తీసుకు వెళ్ళి మునికుమారుడి కళేబరం చూపించాడు. వాళ్ళూ ఎంతో విచారించారు. అక్కడికి దగ్గిరలోనే వుంది తార్క్ష్యముని ఆశ్రమం. దేవతలు సహా పూజించదగ్గవాడు తార్క్ష్యముని. హైహయులందరూ వెళ్ళి అతడికి సవినయంగా నమస్కరించారు. దీవించాడుముని. వాళ్ళకి తగిన గౌరవసత్కారాలు చెయ్యవలసిందని శిష్యులతో చెప్పాడు.

'మీసత్కారానికి అర్హతలేని పాపాత్ములం' అంటూ సాష్టాంగపడ్డారు హైహయులు. 'మునీంద్రా, మాలో ఈదుందుమారుడు వేటకని వచ్చి, ఘోరమయిన అపరాధం చేశాడు. లేడితోలు కప్పుకున్న మునికుమారుణ్ణి లేడే అనుకుని బాణంవేసి చంపేశాడు. ఈమహాపాపానికి ప్రాయశ్చిత్తం సెలవియ్యండి' అని ప్రార్థించారు,

నవ్వాడు తార్క్ష్యముని. 'చావూ, భయం, రోగం, నాశనం– ఇవేవీ ఎన్నడూ మా ఆశ్రమంలో లేనే లేవు. అలాంటప్పుడు మీ వాడు చంపడం, మా వాడు వొకడు చావడం ఎలా జరుగుతాయి ?' అంటూ తన కుమారుణ్ణి పిలిచాడు. అతణ్ణి చూపిస్తూ, 'చూడండీ, ఇతణ్ణేనా మీ వాడు చంపాడంటున్నారు ?' అన్నాడు.

ఇందాక చచ్చి పడివున్న వాడే ఆమునికుమారుడు. ఆశ్చర్య పోయారు హైహాయులు. 'చచ్చిన మనిషి బతికివచ్చాడు. మా కళ్ళనే మేం నమ్మలేకపోతున్నాం. మహాత్మా, ఇలాంటి ప్రభావం మీకు ఎలా వచ్చిందో? దీనికోసం మీరు ఏంచేస్తున్నారో అని ఆశ్చర్యంగా వుంది మాకు' అంటూ చేతులు జోడించారు.

'ఏముంది ? సోమరితనం దగ్గిరకు రానివ్వం. అబద్ధమాడం. శుచిగల ఆహారం తప్ప మరొకటి ముట్టుకోం. నిత్యకర్మల్లో పిసరంత లోపం రానివ్వం. అతిథులంటే ఆప్యాయంగా పూజిస్తాం. కామం, క్రోధం మొదలైన వాటికి కల్లోకూడా చోటివ్వం. బ్రహ్మచర్యమే మా వ్రతం. ఇంతే. ఇందువల్లే భయం కానీ, రోగం కానీ, మృత్యువు కానీ లేదు మాకు. అంచేత మీకేదో మా వాణ్ణి చంపినపాపం చుట్టు కుంటుందన్న భయం అక్కరలేదు' అన్నాడు తార్క్ష్యుడు. సంతో షించారు హైహాయులు. మునికి నమస్కరించి, సెలవుతీసుకున్నారు.

బ్రాహ్మణప్రభావమంటే అలావుంటుంది. మరో చిన్న కథ చెపు తాను విను. దానివల్ల బ్రాహ్మలసంగతేకాదు, రాజులసంగతీ తెలుస్తుంది.

## అ త్రి క థ

పృథుచక్రవర్తి కాలంనాటి కథ అది. అత్రిముని వొకసారి తపస్సుకని అడివికి బయలుదేరాడు. వెళ్ళేముందు భార్యనిచూసి 'నువ్వూ నాతో వస్తావా ? పిల్లల్ని కనిపెట్టుకుని ఇంటిదగ్గరే వుంటావా ?

అని అడిగాడు. 'తపస్సుకి వెళుతున్నారు. బాగానేవుంది. కానైతే కుటుంబానికీ, కొడుకులికీ ఇంతగ్రాసం అదీ చూపించి మరీ ఈ ఆశ్రమం వొదలడం మీకు ధర్మం. అంతేకాని, మీ దోవని మీరుపోతే మరి వీళ్ళగతేంగానూ! పృథుచక్రవర్తి అడిగినవాళ్ళకి లేదనకండా కోరినంతా ధనం పంచిపెడుతున్నాడట! మీరు వెళ్ళండి. ఆ మహారాజునడిగి, ఇంత ఇంట్లో పడేసి ఆతరవాత తపస్సుకివెళ్ళండి' అంది అత్రిభార్య.

ఆలోచించాడు అత్రి. భార్య చెప్పింది న్యాయంగానే కనపడింది. సరే, అని బయలుదేరి పృథుచక్రవర్తి దగ్గిరికి వెళ్ళాడు. అశ్వమేధ యాగం చేస్తున్నాడు పృథుచక్రవర్తి. బ్రాహ్మడన్నవాడికల్లా చేతికి ఎముక లేకండా దానం చేస్తున్నాడు. వెళ్ళి ఆశీర్వదించాడు అత్రి. 'మహారాజా, నువ్వే బ్రహ్మవి. నువ్వే దేవేంద్రుడివి. యావన్మంది ప్రజలికీ నువ్వే ఈశ్వరుడివి. ధర్మాలన్నీ తెలుసు నీకు. నీతో సమానుడయిన ప్రభువు ఈ భూప్రపంచంలో మరివొకడు లేడు. నిన్నే ఎప్పుడూ మహామునులు పొగుడుతారు' అన్నాడు గంభీరంగా.

అత్రి ఇలా అంటున్నప్పుడు అక్కడే వున్నాడు గౌతముడు. అత్రిమాటలు విని అరికాలి మంట నెత్తికెక్కిందతడికి. 'పోటి కుండలా ఎందుకలా వూరికే వాగుతావు?' అంటూ గదమాయించాడు అత్రిని. 'ఏదో నాలుగుడబ్బులకోసం ఆసపడి వచ్చావు. బాగానే వుంది. అంతమాత్రానికి మానవమాత్రుడయిన రాజుని 'బ్రహ్మవీ, ఇంద్రుడివీ, ఈశ్వరుడివీ' అని తెగవాగుతున్నావు. ఆ మాత్రం జంకన్నా లేకండా వుంది నీకు!' అన్నాడు.

'మంచీ చెడ్డా లేకండా, తగుదునమ్మా అని పెద్దపెద్ద మాట్లాడుతున్నావేమిటి?' అని అడ్డుతిరిగాడు అత్రి. 'లోకానికి ప్రభువు రాజు. ధర్మాలన్నిటికే అతడే ఆటపట్టు. అలాంటి రాజుని పొగడడంలో తప్పేముంది?' అన్నాడు.

'మళ్ళీ అదే మాట కూస్తున్నావు!' అంటూ కసిరాడు గౌతముడు. 'ముసలితనంవల్ల బాగా మతిపోయింది నీకు. తలముగ్గు బుట్టలా అయితే మాత్రం జ్ఞాన మెలా వస్తుంది? వయస్సు ముదిరితే లాభంలేదు. జ్ఞానం ముదరాలి. జ్ఞానవృద్ధుల మాటలే సభల్లో హర్షిస్తారు' అన్నాడు.

ఇలా ఇద్దరూ ఇల్లు ఎగిరిపోయినట్టు కేకలువేస్తూ వాదించడం మొదలుపెట్టారు. ఎవరికీ ఎవరూ తీసిపోయినట్టు లేదు. అప్పుడు కశ్య పుడు లేచి కలగజేసుకున్నాడు. సభలో వున్న మునులతో అన్నాడు: 'వీళ్ళు ఇద్దరూ ఇలా గుద్దులాడుతూ వుంటే, వీళ్ళలో ఎవళ్ళవాదం సరయిందో తేల్చిచెప్పడం మనకి సాధ్యంకాకుండా వుంది. సర్వ ధర్మాలూ తెలిసిన మహానుభావుడు సనత్కుమారుడు. ఆయనదగ్గిరికి వెళ్ళి అడుగుదాం. ఆయన చెప్పినతీర్పు అందరం ఒప్పుకుందాం' అన్నాడు. బావుందంటే బావుంది అన్నారు మునులు. అత్రీ గౌతముడూ కూడా అంగీకరించారు. అంతా కలిసి సనత్కుమారుడి దగ్గిరికి వెళ్ళారు సంగతంతా వినిపించి, తీర్పుచెప్పమన్నారు.

'అత్రి చెప్పిందే నిజం' అన్నాడు సనత్కుమారుడు. 'అత్రి చెప్పిందాంట్లో అధర్మం ఏమీ లేదు. భూభారం యావత్తూ తన భుజాలమీద మోసేవాడు రాజు. యావత్సందినీ పాలించే ప్రభువు అతడు. శత్రువులనించి రక్షించేవాడూ అతడే. సామాన్యులే కాదు, మునులుకూడా అతడి శాసనంప్రకారమే నడుచుకోవాలి. అంచేత, సందేహమేమిటి? రాజే బ్రహ్మ. రాజే ఇంద్రుడు. రాజే ఈశ్వరుడు. జనులందరికీ రాజే పూజ్యుడు. అనంతమైంది అతడి ప్రభావం.

'విరాట్టూ, సమ్రాట్టూ, యుధాజిత్తూ, స్వర్ణేత్పృడూ, సహాజిత్తూ, ప్రభువూ, సత్యయోనీ, పురావిత్తూ, సత్యధర్మప్రవర్తకుడూ అని రాజుని వేదాలు కొనియాడుతున్నాయి.

'లోగడ అధర్మానికి భయపడి బ్రాహ్మణులు తమ తేజస్సు క్షత్రియుల దగ్గిర దాచుకున్నారు. బ్రాహ్మణ్యంవల్లనే క్షాత్రమూ నడుస్తోంది. బ్రాహ్మణ్యమూ, క్షాత్రమూ రెండూ ఒకదాన్ని ఒకటి ఆశ్రయించుకునే వున్నాయి. ఒకదానినుండి ఒకటి విడదీస్తే, రెండింటిలో ఏదీ కూడా నిలవలేదు. క్షత్రియుడు బ్రాహ్మణుల ఆశ్రయంవల్ల తేజోవంతుడవుతాడు. సూర్యుడు చీకట్లని తరిమినట్టు అధర్మం పారదోలతాడు. అంచేత, రాజు సర్వాధికుడు అన్న అత్రివాదమే సరయింది' అన్నాడు.

సనత్కుమారుడు చేసిన నిర్ణయం పృథుచక్రవర్తికి మునులు వచ్చి చెప్పారు. సంతోషించాడు పృథువు. అత్రిని ఘనంగా సన్మానించాడు. 'మానవులు అందరికంటె గొప్పవాణ్ణని పొగిడావు నన్ను. నీమాట నిజమని తేలింది. కనక, కోటి ఆవులు ఇస్తాను నీకు' అంటూ అతడు అడిగినంత ధనం ఇచ్చి పంపాడు. అదంతా తెచ్చి ఇంట్లో పడేశాడు అత్రి. కొడుకులికి పంచిపెట్టి తపస్సుకి వెళ్ళిపోయాడు.

అత్రి కథ విన్నావు కదా! మరో కథ చెపతాను విను. దీనివల్ల మరిన్ని మంచిధర్మాలు తెలుస్తాయి.

తార్క్ష్యముని ఒకప్పుడు సరస్వతీదేవిని ఆరాధించి, ఆమెని ప్రత్యక్షం చేసుకున్నాడు. అతణ్ణి బాధిస్తూవున్న ఎన్నో సందేహాలు ఆమెని అడిగి తెలుసుకున్నాడు. సరస్వతీగీత అంటారు వాటిని.

### సరస్వతీగీత

'అమ్మా! పురుషుడన్నవాడు ఏయే ధర్మాలు చెయ్యాలి? ఏయే ధర్మాలు చేస్తే అతడు పుణ్యాత్ముడనిపించుకుంటాడు? శాశ్వతమైన పుణ్యగతులు దేనివల్ల లభిస్తాయి?' అని తార్క్ష్యుడు సరస్వతిని అడిగాడు. అప్పుడు ఆమె ఏమన్నదో విను.

'నాలుగు వేదాలూ క్షుణ్ణంగా చదివిన బ్రాహ్మణుడూ, అనేక మయిన యజ్ఞాలు చేసిన పుణ్యాత్ముడూ స్వర్గానికి వెళతారు. స్వర్గంలో దేవతా స్త్రీల కౌగిళ్ళలో అనేకసంవత్సరాలు హాయిగా సుఖపడతారు.

'మంచి దూడతో వుండి, బాగా పాలిచ్చే తొలిచూలుఆవు తగిన శ్రోత్రియుడికి దానంచేసిన నిర్మలచరిత్రుడు, ఆ ఆవు వొంటిమీద ఎన్ని రోమాలుంటాయో, అన్ని వేల సంవత్సరాలు స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తాడు. బాగా బరువు లాగగలిగిన మంచి బలమయిన ఎద్దు బ్రాహ్మడికి దానం చేసినవాడు పదిపాడిఆవులు దానంచేసినంత ఫలం పొందుతాడు. వస్త్రదానం చేస్తే చంద్రలోకం వెళతాడు. బంగారం దానంచేస్తే స్వర్గానికి వెళతాడు. ఏడుసంవత్సరాలు దీక్షగా నెయ్యితో హోమంచేసి, అగ్నిహోత్రుణ్ణి తృప్తి పరిచినవాడు పద్నా లుగు తరాల పితరుల్ని వెంటపెట్టుకుని మరీ స్వర్గలోకం వెళతాడు. సదా సర్వదా శుచిగా వుండి, అగ్ని ముఖంగా దేవతల్ని తృప్తి పరి చినవాడు గోలోకం వెళ్ళి చిరకాలం సుఖపడతాడు.

'అగ్నిహోత్రమంటే అన్యంకాదు. నాస్వరూపమే అది. సమస్త యజ్ఞాల్లోనూ ఉపయోగింపబడే విశిష్టద్రవ్యాలు యావత్తూకూడా నాఅధీనమే అని నమ్ము. మహనీయమయిన అగ్నిహోత్రంలోనే నేను ప్రభ విస్తాను. ఆత్మజ్ఞానంకల మహాత్ముల సంశయాలు నేనే తీరుస్తాను. తపస్సూ, స్వాధ్యాయమూ, దానమూ, వ్రతమూ, — వీటిమీద ఎప్పుడూ ఆసక్తకల తపోధనులు శోకతాపాలు లేకండా ఎక్కడయితే సుఖంగా వుంటారో — అదిగో, అదే నాపరమపదం.

'భక్ష్యాలూ, పానీయాలూ నదుల్లాగ చెయ్యాలి. ఆ నదులికి పాలే ప్రవాహం. పంచదారే ఇసక. మినుముల పిండివంటలే తీరాలు. పాయసమే బురద, అలాంటి నదులు అనేకంచేసి, ఇంద్రుడూ, అగ్ని

మొదలయిన దేవతల్ని తృప్తిపరిచిన యజ్ఞకర్తలు యావన్మందీ నాపరమ పదమే చేరుకుంటారు' అంది.

సరస్వతీగీత విని కృతార్థుడయ్యాడు తార్క్ష్యముని.

మార్కండేయుడు చెప్పిన కథలు ఉత్సాహం కలిగించాయి పాండవులికి. తరవాత, "వైవస్వతమనువుకి అంతటి ప్రభావం ఎలా వచ్చిందో వివరించు" అన్నాడు ధర్మరాజు. మార్కండేయుడు మనుచరిత్ర చెప్పాడు.

### మనుచరిత్ర

చాక్షుసమన్వంతరంనాటి కథ అది. వైవస్వతమనువు అంటే సామాన్యుడు కాడు. మహాపుణ్యవంతుడతడు. ధైర్యశాలి. అన్నాహారాలు లేకండా పదివేలసంవత్సరాలు బదరికాశ్రమంలో తపస్సు చేశాడు. రెండుచేతులూ మీదికెత్తి, వొంటికాలుమీద నిలబడీ ఎన్నోసంవత్సరా లున్నాడు. అంత మహనీయు డతడు.

ఒకనాడు అతడు స్నానం చేసి, వొక మడుగువొడ్డుని నుంచు న్నాడు. అంతలో వొక చిన్న చేప అతడిదగ్గిరికి వచ్చి, అతడితో ఇలా అంది: 'అయ్యా, నేను చిన్న చేపని. అంచేత, బలంకల పెద్దచేపల వల్ల బాధకలుగుతుందని భయంగా వుంది. ఈమడుగేమో పెద్ద పెద్ద చేపలతో అల్లకల్లోలంగా వుంది వీటివల్ల నాకు అపాయం రాకండా రక్షించాలి నువ్వు. ఇక్కడినుండి తీసుకుపోయి, ఎక్కడన్నా నిద్రా భద్రంగా వుంచిపెట్టు. నీఉపకారం మరిచిపోను. ప్రత్యుపకారం చేస్తాను'

చేప మనుష్యభాషలో మాట్లాడింది. ఆశ్చర్యపోయాడు వైవస్వతుడు. దాన్ని మడుగులోంచి పైకి తీశాడు. పట్టుకు వెళ్ళి, వొక నూతిలో విడిచిపెట్టాడు. తరుచు వెళ్ళి అది ఎలా వుందో చూసి వస్తూవుండేవాడు. నూతిలో చేప క్రమంగా పెరుగుతూ వుండేది,

కొన్నాళ్ళు గడిచింది. యథాప్రకారం చూడవచ్చాడు వైవస్వతుడు. మళ్ళీ మాట్లాడింది చేప. 'అయ్యా, నీ ప్రయత్నంవల్ల బతికిపోయాను. ఇక్కడ ఇన్నాళ్ళు సుఖంగా గడిచింది. నా శరీరం పెరిగింది. ఈ నూతిలో ఇక శరీరం కదపడానికే స్థలంలేకండా వుంది. అందుకని, మరోచోటికి నన్ను తీసుకువెళ్ళడమే మంచిది' అంది.

సరే, అని చేపని నూతిలోంచి తీశాడు వైవస్వతుడు. అంతకంటే పెద్దనూతిలో విడిచిపెట్టాడు. అక్కడా పెరగడం మొదలుపెట్టింది చేప. "ఇక్కడా నాకు స్థలం చాలడం లేదు." అని మళ్ళీ వైవస్వతుడితో చెప్పింది. అందులోంచి చేపనితీసి గంగమడుగులో వొదిలిపెట్టాడు వైవస్వతుడు. కొంతకాలానికి గంగలోనూ విస్తారంగా పెరిగింది చేప. అందులోనూ తిరగడానికి స్థలం చాలడంలేదు దానికి.

మళ్ళీ వైవస్వతుడితో చెప్పింది. ఈసారి దానిని తెచ్చి సముద్రంలో వేశాడతడు. సముద్రంలో వొదలడంతోనే సంతోషించింది చేప. 'మహోపకారం చేశావు నాకు' అంటూ అతడి దగ్గిరికి వచ్చింది. "నీకు ప్రత్యుపకారం చేస్తాను. నేను చెప్పింది జాగ్రత్తగా విను. భూతకోటి కంతటికీ ప్రళయం రాబోతున్నది. మరి వ్యవధి లేదిక. సముద్రాలన్నీ పొంగి పొర్లుతాయి. దీన్నే మన్వంతర సంధి అంటారు. అంచేత, ఆలస్యంచెయ్యకండా వెంటనే వొక వోడ జతపరుచు. మంచి దృఢమయిన తాళ్ళతో దాన్ని తీసుకురా. సమృద్ధిగా సకలధాన్యాలతోనూ, తండులాలతోనూ దాన్ని నింపించు. సప్తరుషులతో కలసి ఆ వోడమీద సముద్రంలోకి వచ్చి నన్ను తలంచుకో. నేను పెద్దకొమ్ములతోకూడా వచ్చి, మీకు ప్రత్యక్షమవుతాను. మేలు చేస్తాను' అని చెప్పి కెరటాల్లో కలసిపోయింది.

చేప చెప్పినప్రకారం వోడ తయారుచేశాడు వైవస్వతుడు. సప్తరుషులతో సహా ఎక్కి సముద్రంలోకి వచ్చాడు. వచ్చి తలంచడం

తోకనీ పెద్ద కొమ్ములతో ప్రత్యక్షమయింది చేప. తన కొమ్ములకి వోడని తాళ్ళతో కట్టమంది. అలాకట్టడంతోనే వోడని సముద్రం మధ్యకి ఈడ్చుకుంటూ వెళ్ళింది.

ఉత్తరక్షణంలో సముద్రాలన్నీ ఉద్ధృతంగా వుప్పొంగడం మొదలుపెట్టాయి. మొట్టమొదట హద్దుమీరి కదిలాయి. క్రమంగా మధ్యప్రదేశాలు దాటాయి. ఉత్సాహంగా చేతులెత్తి ఆడినట్టు కెరటాలతో విజృంభించాయి. అట్టహాసం చేస్తున్నట్టు పెద్దపెద్ద నురుగుల్తో అంతటా ఆక్రమించాయి. మహావేగంతో ఉప్పొంగుతూ వున్న నీళ్ళతో అదేపొంగడం పొంగాయి. అన్ని దిక్కులూ కబళించాయి. ప్రళయకాల మహావాయులతో మరింత పెల్లురేగి పోయాయి. సముద్రాలన్నీ వొక్కపెట్టుని ఏకమై పోయాయి. ప్రపంచం అంతా జలమయంచేసి ముంచేశాయి. లోకమంతా వొకే వొక్క సముద్రం అయిపోయింది.

ఆ ప్రళయసముద్రంలో వోడ మునిగిపోకండా అనేక వేలసంవత్సరాలు లాక్కుంటూ పోయింది చేప. చివరికి ప్రవాహమంతా తగ్గిన తరవాత, హిమాలయశిఖరం దగ్గిర వోడ నిలిపింది. 'ఈ పర్వతశిఖరానికి మీ వోడ కట్టండి' అంది. చేప చెప్పడమే తడువు, సప్తరుషులూ, వైవస్వతుడూ హిమాలయశిఖరానికి వోడ తాళ్ళతో కట్టారు. ఆవాళనించీ ఆశిఖరానికి నౌకాబంధం అన్న పేరు ప్రసిద్ధమైంది.

ఓడ భద్రంగా నౌకాబంధం శిఖరానికి కట్టిన తరవాత వాళ్ళతో చేప ఇలా అంది: 'ఇదిగో, ఈ మహాప్రళయంలో మీకు ఏ ఆపదా రాకండా రక్షించాను. నేనే ఈ విశ్వానికి ప్రథమ కర్తని; ప్రభువుని. మీమీద వున్న వాత్సల్యం చేత చేపరూపం ధరించి, ఇన్ని పోకడలుపోవలసివచ్చింది. ప్రళయమేమో గడిచిపోయింది. ఇక మీకు ఏ ఆపదా రాదు, నిర్భయంగా వుండవచ్చు మీరు. ఈ వైవ

స్వతమనువు దేవతలూ, రాక్షసులూ, మనుష్యులూ' మొదలైన సకల జీవరాసులతో సహా జగత్సృష్టి చేస్తాడు. నాప్రసాదంవల్ల ఇతడికి జ్ఞానోదయం కలుగుతుంది.' ఇలాచెప్పి చేప అదృశ్యమైపోయింది. అనంతరం వైవస్వతుడు ఎంతో తపస్సుచేశాడు. చరాచర రూప మయిన సమస్తప్రాణికోటినీ సృష్టించాడు. ఇదీ వైవస్వతమనువు చరిత్ర. ఈచరిత్ర చదివినా, విన్నా నిజంగా పాపాలు పోతాయి. ఇహాపరసౌఖ్యాలు సిద్ధిస్తాయి. ''

వైవస్వతమనువు చరిత్రవిన్నాడు ధర్మరాజు. చేతులు జోడించి "మునీంద్రా నీకు నమస్కారం" అన్నాడు. "బ్రహ్మతో సమాన మయినవాడివి నువ్వు. అద్భుతమైంది నీమాహాత్మ్యం. అఖిలాండ కోటిబ్రహ్మాండం యావత్తూ నశించినా, నువ్వుమాత్రం నాశనం లేకండా బతికే వుంటావు. మళ్ళీప్రపంచాలు పుట్టుకు వచ్చినప్పుడు చలనం లేకండా పరికిస్తావు. ఈచరాచరప్రకృతి సర్వమూ సముద్రంలో మునిగి పోయి జలప్రళయం అయినప్పుడు పద్మాసనంమీది బ్రహ్మదేవుణ్ణి నువ్వొక్కడివే భజిస్తావు. సర్వేశ్వరుడు ప్రసన్నుడై నీవొక్కడికే ఈ ప్రభావం ప్రసాదించాడు. అనారోగ్యం, ముసిలితనం, చావూ—ఏవీ నీచుట్టుపక్కలకిరావు. సర్వప్రాణుల్నీ సంహరించే యముడి నెత్తి మీద నీ యెడమకాలు పెట్టావు. ఇఁంతా నీకే చెల్లింది.

"మహామునీ, ఈచరాచరప్రకృతి యావత్తూ ఉత్పత్తికావడం, పెరగడం, నాశనం కావడం అనేకమార్లు ప్రత్యక్షంగా అవలోకించావు. అంచేత, వొక్క సంగతి అడుగుతాను నిన్ను. ప్రళయకాల్మ మపుడు ఈప్రపంచాలు ఎలా వుంటాయో చెప్పు" అన్నాడు.

## ప్రళయవర్ణన

"ధర్మరాజా, అఖిల భూతేశ్వరుడూ, ఆదిదేవుడూ, గురుడూ, నీకు ఇష్టసఖుడూ, మంత్రీఅయిన ఈకృష్ణపరమాత్మని ధ్యానిస్తూన్నాను.

ఈయన అంగీకారంతో అదంతా చెప్తున్నాను. విను" అన్నాడు మార్కండేయుడు.

"కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అని నాలుగుయుగాలు. ఈ నాలుగుయుగాలూ పన్నెండువేల దివ్య సంవత్సరాలతో ముగుస్తాయి. *ఈపన్నెండువేల దివ్యసంవత్సరాలూ ఒక మహాయుగం. ఇలాంటి వెయ్యిమహాయుగాలు బ్రహ్మకి ఒక దినం. (కల్పం) బ్రహ్మదినం ముగిసినప్పుడు నూరేళ్ళు అనావృష్టిదోషం కలుగుతుంది. అప్పుడు సూర్యుడు ఏడుగురు సూర్యుళ్ళవుతాడు. తన వేడికిరణాల్తో నదీనదాలూ సముద్రాలూ పీల్చేస్తాడు. నీటిచుక్కన్నా లేకండాచేసేస్తాడు. ప్రపంచం మండిపోయేట్టు చేస్తాడు. సూర్యుడితో అగ్నిహోత్రుడూ విజృంభిస్తాడు. అగ్నిహోత్రుడికి యుగాంతప్రళయ వాయువు తోడవుతుంది. ఆ పెనుగాలితో ఆ మహాగ్ని ఒక కొండలని కాదు, మనుష్యులనికాదు, దేవతలనికాదు, పాములనికాదు—సమస్త భూతకోటితోనూ మూడులోకాలూ నిమిషంలో భస్మంచేసేస్తుంది.

"తరవాత నల్లటివీ, తెల్లటివీ, పసుపుపచ్చటివీ, ఎర్రటివీ,పింగళ వర్ణానివీ దట్టమయిన సంవర్తక మేఘాలు లేస్తాయి. పెద్దపెద్ద కొండల్లాగ భయంకరంగా వుంటాయవి. మెరుపులతోనూ, పిడుగులతోనూ గర్జిస్తూ నాలుగుదిక్కులా ఉద్ధృతంగా లేచి, జడి కురవడం కురుస్తాయి. ఆ వర్షపాతంవల్ల లోకంలోని మహాగ్ని చల్లారుతుంది. మళ్ళీ నదులూ, సముద్రాలూ ఎప్పటిలాగ నిండుతాయి. అంతతోనూ మేఘాలు శాంతించవు. ఘోరంగా గర్జిస్తూ ఎంతోకాలం కుంభవృష్టిగా కురుస్తూనే వుంటాయి. ఆ వర్షంతో ప్రపంచమంతా మచ్చుకయినా మిగలకండా నీళ్ళలో మునిగిపోతుంది. ఇవి దిక్కులూ,

*మా శాంతిపర్వం . అ , 5

ఇది భూమీ, ఇది ఆకాశం అని నిరూపించడానికి వీలులేకుండా వొక్క టే చీకటి మూడులో కాలూ ముంచేస్తుంది.

"అప్పుడు బ్రహ్మ ప్రేరణవల్ల వొకగాలి నలిరేగి బయలు దేరుతుంది. ప్రళయమేఘా లన్నిటినీ చెల్లాచెదరు చేసి వొదిలిపెడుతుంది. ఆగాలి సేవించి బ్రహ్మ, అంధకారబంధురమయిన ఆనీళ్ళ మధ్య తామరపువ్వుమీద సుఖంగా నిద్రపోతాడు. అదే కల్పాంతం. ఇలాంటి కల్పాంతాలు పూర్వం ఎన్నో అన్ని జరిగిపోయాయి. ఇంకా ముందు ముందు ఎన్నో జరుగుతాయి.

"గడిచిన వొకానొక కల్పాంతసమయంమాట చెపుతాను విను. ఆమహాంధకారంలో ఏదీ కనపడలేదు నాకు. నేను వొక్కణ్ణే వున్నాను. ఇంక ఎవ్వరూ లేరు. భయంతో బేజారై పోతూ ఎంతకాలం అలా తిరిగానో నాకే తెలియదు. అలాతిరగ్గా తిరగ్గా వొక దగ్గిర, ఆనీళ్ళ మధ్య బ్రహ్మాండమయిన వొక మర్రిచెట్టు కనపడింది. మర్రిఆకు పక్క చేసుకుని, ముద్దుముద్దుమాట కడుతున్న చిన్నిబాలుడు వొకడు ముచ్చటగా పడుకుని వున్నాడు. నీలిమేఘంలా శ్యామలంగా వుంది అతడి శరీరం. మొహం చంద్రబింబంలా వుంది. పువ్వులా ముట్టుకుంటే కందిపోతాడేమో అన్నంత సుకుమారంగానూ వున్నా డతడు. ఏమను కోనూగి నాఆశ్చర్యానికి అంతంలేకపోయింది.

"'లోకా లన్నీ నశించిపోయాయి. ఒకే వొక్క మహాసముద్రం ఇది. ఇక్కడ ఈబాలు డేమిటి? అందులోనూ వొంటరిగా మర్రిఆకుమీద పడుకోవడ మేమిటి? ఎవ డితడు?' – ఇలా ఎన్నో విధాల భావిస్తూ దగ్గిరికి వెళ్ళాను. నేను వెళ్ళడంతోనే క్రీగంట నన్ను చూశాడు బాలుడు. వికసించిన పద్మంలా వుంది మొహం. అంతేనా, 'ఏమయ్యా,' అంటూ మధురంగా; గంభీరంగా పలకరించాడు నన్ను. 'బాగా అలిసిపోయినట్టు వున్నావు! తెలుస్తూ నేవుంది

నాకు. కొంచెం విశ్రాంతి కావాలేమో, ఇదిగో స్థలమిస్తా. నాశరీరంలో ప్రవేశించి, సుఖంగా నిద్రపోదువుకాని. రా ' అని తననోరు తెరిచాడు.

"రాజా, నమ్ముతావో లేదో, అతడు నోరు తెరవడమే తడువు, బలాత్కారంగా ఏదోశక్తి నన్ను అతడి నోట్లోకి నెట్టింది. నోట్లోంచి అతడి కడుపులో ప్రవేశించాను. మహాశ్చర్యం! నాకళ్ళనే నేను నమ్మలేకపోయాను. అక్కడ గంగా, యమునా, గోదావరీ, కావేరీ, మొదలయిన నదులూ— గంధమాదనం, హిమాలయం, హేమ కూటం, మందరం, వింధ్యా, మేరువూ మొదలయిన పర్వతాలూ సముద్రాలూ, వనాలూ, పట్టణాలూ, ద్వీపాలూ, ఖండాలూ, పశు వులూ, పక్షులూ, మృగాలూ, పాములూ, వివిధకార్యాల్లో మగ్ను లయిన మనుష్యులూ — ఇన్నిటితోనూ వున్న భూలోకం చూశాను.

"సూర్యుడూ, చంద్రుడూ, గ్రహాలూ, నక్షత్రాలూ – వీటి అన్నిటితోనూ ప్రకాశవంతంగా వున్న ఆకాశం చూశాను. వాయు మార్గాలు చూశాను. ఇంద్రుడూ, వరుణుడూ, యముడూ, మొద లయిన దేవతలతో సహా స్వర్గలోకం చూశాను. నాగుల్నీ, యక్షుల్నీ రాక్షసుల్నీ, అసురుల్నీ, విద్యాధరప్రముఖులయిన యావన్మందినీ చూశాను. సర్వలోకాలూ ఆబాలుడి గర్భంలో చూశానంటే నమ్ము.

"అలా బాలుడి మహాగర్భంలో, నావశంలో నేను లేకండా వంద సంవత్సరాలు తిరిగాను. ఎక్కడా కాలునిలపడానికి మనస్సుపుట్ట లేదు, చివరికి భయం పట్టుకుంది. దాంతో ఆవింతబాలుడి పాదాలే సంస్మరించాను. అతణ్ణే శరణు జొచ్చాను. శరణాగతవత్సలు డతడు. తన నోటి వాయువేగంతో బయటికి తీసుకువచ్చాడు నన్ను. బైటికి వచ్చి చూతునూ, ఎప్పటిలాగే మఱ్ఱిఆకుమీద పడుకుని వున్నాడు బాలుడు. నన్నుచూసి, చిరునవ్వుతో వొయ్యారంగా పలక రించాడు. 'నాకడుపులో సుఖంగా నిద్రపోయావా ?' అని అడిగాడు.

తడబడుతూ దగ్గిరికి వెళ్ళాను నేను. ఎర్రతామరరేకులకంటే కూడా అందంగావున్న వేళ్ళతో చివుళ్ళకంటే మెత్తగా వున్న అతడి పాద పద్మాలు నాశిరస్సుమీద పెట్టుకున్నాను. 'దేవా. నిదయవల్ల అతి ఆశ్చర్యకారణమైన చరాచరభూతప్రపంచం చూస్తూ చూశాను. నీమాయాప్రభావం భావించలేక పోతున్నాను. ఒకటే అయిన ఈమహా సముద్రం, ఈవటవృక్షం, నీ ఈశిశురూపం-ఇలా వుండగా, నీగర్భ ప్రదేశంలో పద్మాలుగు లోకాలూ దేదీప్యమానంగా వున్నాయి. ఇలాంటి నీ బాలత్వంచూసి, ఎలా సుఖంగా నిద్రపోయేది!

"'ప్రభూ, నీఆశ్రితుణ్ణి నేను. నీహృదయంలో నామీద కరుణే వుంటే, ఈసమ్మోహం వొదిలిన ట్టనుగ్రహించు' అని ప్రార్థించాను.

"దేవదేవుడు కరుణించాడు. తన దివ్యమహిమ ఆదరంగా విడమర్చి చెప్పాడు. 'దేవతలూ, మునులూ కూడా నామహిమ తెలియలేరు. బుద్ధిమంతుడివి నువ్వు. పుణ్యమతివి. పితృభక్తుడివి. కనక నే నీకు చెప్పవలసివస్తోంది. విను. నారములు అంటే నీళ్ళు. నీళ్ళే నాకు అయనం—అంటే ఆధారం. అంచేత నారాయణుడు అని నాపేరు. వేదాల్లోనూ ఈపేరే ప్రసిద్ధి. అలా నారాయణు డని పేరుగల నేను శాశ్వతుణ్ణి. ప్రభువునై నేనే చిదానందంగా ఈ లోకాలన్నీ పుట్టిస్తాను. పాలిస్తాను. అవసర మని తోచినప్పుడు సంహరిస్తాను. బ్రహ్మ, శివుడూ, దేవేంద్రుడూ, యముడూ, కుబేరుడూ, వరుణుడూ మొదలైన దేవతలు అందరూ నన్నే ఆశ్రయిస్తారు. భూమి నాకు పాదాలు. అగ్ని నాకు మొహం. సూర్యచంద్రులు నేత్రాలు ఆకాశం శిరస్సు. ఇలాంటి అద్భుతమయిన ఆకారం నాది. ఎన్నో దక్షిణలతో ఎన్నో అన్ని మహాయజ్ఞాలు చేశాను నేను. గొప్పగొప్ప యజ్ఞాలుచేసిన బ్రాహ్మలూ, క్షత్రియులూ, వైశ్యులూ నన్నే ఎల్ల ప్పుడూ కొలుస్తారు. ప్రళయసముద్రంలో మునిగిపోయిన ఈభూమండలం

పూర్వం నేనే వరాహావతారమెత్తి ఉద్ధరించాను. సముద్రాలూ, కొండలూ, అడవులూ, పట్టణాలూ వాటితో వున్న ఈభూప్రపంచం శేషుడిరూపంలో వెయ్యిపడగలతోనూ నేనే మోస్తున్నాను. బడబాగ్ని రూపంలో ఏడుసముద్రాలనీళ్ళూ నేనే తాగుతాను. పద్నాలుగు లోకాలూ ప్రళయంలో పడ్డప్పుడు తిరిగి ఆనీళ్ళు నేనే విడిచిపెడతాను. యుగారంభంలో నా మొహంనించి బ్రాహ్మలూ, భుజాలనించి రాజులూ, తొడల్లోంచికోమట్లూ, పాదాల్లోంచిశూద్రులూ పుట్టిస్తాను. ఋగ్వేదం యజుర్వేదం సామవేదం అథర్వణవేదం నాముఖంనించే ఉద్భవిస్తాయి. ఇవన్నీ క్రమపరివర్తనం పొంది, తిరిగి నన్నే చేరుకుంటాయి.

"'అహంకారం లేనివాళ్ళూ, క్రోధంలేనివాళ్ళూ, అసూయలేనివాళ్ళూ, కోరికలులేనివాళ్ళూ అధ్యాత్మజ్ఞానం కలవాళ్ళూ, తాత్వికులూ మహామునులూ మోక్షాపేక్షతో నన్నే సేవిస్తారు. నక్షత్రాలూ, గ్రహాలూ, ఆకాశమూ, గాలీ, దిక్కులూ — ఈయావత్తూ నాస్వరూపాలే. సముద్రాలన్నీ పక్కచేసుకుని సుఖంగా శయనిస్తాను నేను. దానమూ సత్యమూ తపస్సూ జ్ఞానమూ అహింసా అనే సాత్వికగుణాలూ, కామమూ క్రోధమూ అజ్ఞానమూ మొదలయిన తామసగుణాలూ — ఇవన్నీ నాస్వరూపాలే. ఇంతెందుకూ — వొక్కటి చెప్తాను విను. ప్రపంచంలో స్పష్టంగా కనపడుతూవున్న ప్రతీదీ, కనపడనిదీకూడా - అంతా నేనే అని తెలుసుకో.

"'ఎప్పుడయితే ధర్మానికి హాని కలుగుతుందో, ఎప్పుడైతే అధర్మం పెచ్చుపెరిగిపోతుందో, ఎప్పుడైతే రాక్షసులు క్రూరులై మితిమీరిపోతారో, ఎప్పుడైతే దేవతలుదైన్యం పాలవుతారో అప్పుడు నేను సత్కులీనుల ఇంట పుట్టి, ధర్మరక్షణ చేస్తూవుంటాను తెలుపూ, ఎరుపూ, నలుపూ, పసుపూ ఈనాలుగురంగుల్లో నాలుగు యుగాల్లోనూ చరిస్తూ ధర్మస్థాపనం చేస్తూ ంట్లాన్ను.

" 'కాలచక్రం నేనే నిర్వికల్పంగాచేస్తాను. వృద్ధిన్నీ నేనే చేస్తాను. పైగా ప్రళయకాలమప్పుడు నేనే యముడి రూపం ధరించి సంహరిస్తాను.

" 'ఋషీ, నావిధానమంతా సంతోషంగానీకు చెప్పాను. మూడు లోకాలూ రక్షించే బ్రహ్మ నాశరీరంనించే పుడతాడు. నిజానికి అతడు నాలో సగపాలే. నారాయణుడన్న పేరుగల నేను బాలుడిరూపంలో శంఖమూ చక్రమూ, గదా ధరించి, ఈ ఏకసముద్రంలో వెయ్యి మహాయుగాలకాలం యోగనిద్రలో పరవశుణ్ణయి వుంటాను. దారుణ మయిన ఈకల్పాంతంచూసి, నువ్వు భయభ్రాంతుడివయ్యావు. అది తెలిసి, నీమీదవున్న అనుగ్రహంవల్ల నాఆత్మలో గుప్తంగా వున్న లోకాలు చూపిస్తూ నీకు కనపడేలాగు చేశాను. ఇక శంక లేకండా, నీఇష్టంవచ్చినచోట తిరుగు. నా నాభికమలం కర్ణికలో బీజకోశంలో బ్రహ్మ నిద్రపోతున్నాడు. అతడు మేలుకుని లోకాలు సృజిస్తాడు. చూద్దువుకాని' అని సెలవిచ్చాడు. అలా సెలవిచ్చి ఆబాలుడు, ఆదేవ దేవుడు అంతర్ధాన మయ్యాడు. రాజా, ఎంతో చిత్రంగా వుంటుంది ఈప్రళయవృత్తాంతం నీకు. నాకుమాత్రం అదంతా అనుభవ గోచర మయిన విషయం.

"ఆనాడు అక్కడ అలా ప్రత్యక్షమయిన దయాస్వరూపుడే, ఇదిగో ఇవాళ ఇక్కడ ఇలా నీకు నచ్చిన చుట్టంగా, మంత్రిగా, స్నేహితుడిగా వున్నాడు - శ్రీకృష్ణుడు. ఈ పుణ్యస్వరూపుణ్ణి, కమలాక్షుణ్ణి, దయామూర్తిని, ఉత్తమశ్లోకుణ్ణి దర్శించగలిగాను. ధన్యు ణ్ణయాను. నాపుణ్యం పండింది. ఈదేవ దేవుడి కరుణవల్లే కదా, చీకూ చింతా లేకండా ప్రళయకాలంలో కూడా బతుకు తున్నాను. ఈ దేవుణ్ణి దర్శించడంవల్లే ఆనాడు జరిగిన అదంతా పొక్క మాటు కళ్ళముందు కట్టినట్టయింది నాకు! పరమపురుషు డీయన. ఈయన్ని ఆశ్రయించు" అన్నాడు.

మార్కండేయుడు వివరించిన ప్రళయవృత్తాంతం సావధానంగా విన్నారు పాండవులు. చివరిమాటలు విని తమ్ములతో కలిసి శ్రీకృష్ణుణ్ణి స్తోత్రవాక్యాలతో అభినందించాడు ధర్మరాజు. తరవాత మార్కండేయుడితో అన్నాడు: "మునీంద్రా, నీ అనుగ్రహంవల్ల మిక్కిలీ అద్భుతమైన విషయాలు విన్నాము. బ్రహ్మానంద మయింది. కలియుగంలో సమస్తధర్మాలూ లోపిస్తాయని చెపుతారు. అదేమిటో సెలవియ్యి"-అని. మార్కండేయుడు చెప్పాడు:

## కలికాలం

"కృతయుగంలో ధర్మం నాలుగుపాళ్ళూ వుంటుంది. త్రేతాయుగంలో మూడుపాళ్ళే వుంటుంది. ద్వాపరంలో రెండు పాళ్ళు మాత్రమే. కలియుగంలో ధర్మం కరువే అయిపోతుంది. కేవలం వొక్కపాలు మాత్రం వుంటుంది.

"కలియుగంలో ప్రజలమధ్య సత్యం క్షీణిస్తుంది. సత్యం తరగడంవల్ల ఆయువూ తరిగిపోతుంది. ఆయువు తరగడంతోనే విద్యలూ తగ్గిపోతాయి. విద్యలు తగ్గడంతో అజ్ఞానం అధికమయిపోతుంది. అజ్ఞానంవల్ల లోభం పట్టుకుంటుంది. లోభంవల్ల కామం పుడుతుంది. కామం వల్ల క్రోధమూ, క్రోధంతో విరోధాలూ పెచ్చు రేగుతాయి. దాంతో సర్వవర్ణాలవాళ్ళూ కలహాలు పెంచుకుని కుమ్ములాడతారు. ఒకడి అదుపులో వొకడు వుండడు. అంతా కలిసి వర్ణసంకరంచేసి విడిచి పెడతారు.

"బ్రాహ్మలు జపమూ, నియమమూ, స్వాధ్యాయమూ వొదిలిపెట్టేస్తారు. శూద్రులు మంచి తపస్సంపన్నులవుతారు. దేశాలన్నీ అరాజకం పాలవుతాయి. అధర్మంతో నిండిపోతాయి. పాములూ, పులులూ, అడివిమృగాలూ వాటితో అడవుల్లాగ భయంకరంగా తయా

రవుతాయి. ద్రవిళ్ళూ, గొల్లలూ, తురకలూ, బర్బరులూ, పుళిందులూ మొదలయిన వాళ్ళతోనిండి నానా హంగామా అయిపోతాయి.

"క్షత్రియులు శూద్రుల్లా ప్రవర్తిస్తారు. శౌర్యమూ, తేజస్సూ వొదులుకుని రాజ్యాలు లేకుండా తిరుగుతారు. రసపదార్థాలూ సుగంధద్రవ్యాలూ పసలేకండా అయిపోతాయి. పాడి పంటా కొరత పడుతుంది. పూలతోటల్లో పువ్వులూ పళ్ళతోటల్లో పళ్ళూ తగ్గి పోతాయి. రాజులు ప్రజల్ని భయపెట్టి, హెచ్చుపన్నులు గుంజుతారు. బ్రాహ్మలు నాగలిపట్టి వ్యవసాయం చేస్తారు. వర్తకమూ సాగిస్తారు. వర్ణాశ్రమాలు అన్నీ పాషండధర్మాలతో నిండిపోతాయి. ప్రతీవాడూ శరీరం పెంచుకోవడంతో సరిపోతుంది. పుణ్యఫలాలు బొంకులుకింద తయారవుతాయి. అదునికి వానలు పడవు. విత్తనాలు పొల్లుగింజలై చెడిపోతాయి. క్రయవిక్రయాలు రెండూ కపటంతోనే సాగుతాయి. ప్రజలు దాచుకున్న సొమ్ము దోచుకుంటారు. సాదుచరిత్ర కలవాళ్ళు దుర్గతుల పాలవుతారు. రోగాల్తో కృశిస్తారు. పడికాలంలోనే రాలి పోతారు. పాపులు మహావైభవం అనుభవిస్తారు. సకలసంపదలతోనూ తులతూగుతారు. చిరున చీదనైనా చీదకండా చిరకాలం జీవిస్తారు. అడవిపంటలు అధికమవుతాయి. గొర్రెలపాడి కుక్కముకిరికి అవుతుంది.

"పురుషులికి ఆడవాళ్ళే ఆత్మబంధువులవుతారు. అందరూ అన్ని వర్ణాలవాళ్లూ ఆప్యాయంగా మాంసం తింటారు. పితృదైవకార్యాల్లో కుత్సితమయిన దేశకాల పాత్రలే ప్రాధాన్యం వహిస్తాయి. ప్రజలు పరస్పరం భోక్తలయి కూచుంటారు. ఒక వావీ వరసా వుండదు. బ్రాహ్మలు వేదం నిందిస్తారు. యజ్ఞాలూ, వ్రతాలూ వొదిలేస్తారు. చెడ్డపనులంటేనే పండుగ వాళ్ళకి.

'స్త్రీల ధనమూ, దుర్బలుల ధనమూ, దీనుల ధనమూ అపహరించిన వాళ్లూ, స్నేహితుల్నీ, తల్లుల్నీ, తండ్రుల్నీ, పుత్రుల్నీ హత్య

చేసిన వాళ్లూ, అడ్డమూనిపనులూ చేసుకు తిరిగేవాళ్లూ తగుమనుషులని సంఘంలో గౌరవం పొందుతారు. భ్రష్టులయిన వాళ్ళనే బ్రాహ్మలు ఆశ్రయిస్తారు. తిడుతూ, తూలనాడుతూ ఇచ్చే పాడుదబ్బే పరిగ్రహిస్తారు.

"రాజులు రాజ్యరక్షణ మాని మోసగాళ్ళవుతారు. మంచి వాళ్ళని వెళ్ళగొడతారు. వాళ్ళ స్త్రీలూ, ధనమూ, పొలాలూ దోచుకుంటారు. వాళ్ళలో వాళ్లు కుమ్ములాడుకుని, ప్రజానాశనానికి కారకులవుతారు. కొడుకు తండ్రిని అవమానిస్తాడు. భార్య భర్తని తూలనాడుతుంది. ఆలు మగలు వొకరంటే వొకరికి నచ్చక, ఎవరిమట్టుకువాళ్లు పైతిరుగుళ్లు తిరుగుతారు. శిష్యుడు గురువుని మెచ్చడు. గురువు శిష్యుణ్ణి మోసగిస్తాడు. చుట్టానికి చుట్టం పంగనామాలు పెడతాడు.

"పితృకార్యాలూ, దేవకార్యాలూ జరగవు. వేదార్థాల ఉపదేశాలు సాగవు. భూలోకం యావత్తూ దుష్టులతో నిండిపోతుంది.

కలికాలం గడిచినకొద్దీ పదహారు సంవత్సరాలు పరమాయువవుతుంది. ఏడూ, ఎనిమిది సంవత్సరాలకే స్త్రీలు పిల్లలుకంటారు. ఎక్కడ చూస్తే అక్కడ దరిద్రం తాండవమాడుతుంది. దాత అన్నవాడు కనిపించడు. ఒకడిధనం ఒకడు చపాయిస్తాడు. తెలిసినవాళ్ళు సహా క్రూరులై పాపాలే చేస్తారు. ప్రతీవాడూ అన్నం అమ్ముకుని బతుకుతాడు. బ్రాహ్మలు వేదం విక్రయిస్తారు. స్త్రీలు యావన్మందీ మానం అమ్ముకుని తిరుగుతారు. కరువూ కాటకాలూ రాజ్యం చేస్తాయి. ఎక్కడచూస్తే అక్కడ భయం దిందిం మంటుంది.

"తక్కువజాతులికి పట్టపగ్గాలుండవు. దొరికినవాళ్ళనల్లా నరుకుతారు వాళ్లు. ప్రజలు దిక్కులేనివాళ్ళవుతారు. ఒకదగ్గిర నిలవకండా తిరుగుతారు. బందిపోటుదొంగలు పెచ్చురేగిపోతారు. హత్యలూ, దోపుళ్ళూ అధికమవుతాయి. కాకుల్లా కకావికలై పోతారు ప్రజలు.

అడవుల్లో తలదాచుకుంటారు. రాష్ట్రాలు నశిస్తాయి. పట్టణాలు పాడవుతాయి. ప్రజలికి రక్షణ దొరకదు. కొండా కోనా పట్టిపోతారు.

"శూద్రులికి వేదధర్మాలు బ్రాహ్మలే ఉపదేశిస్తారు. శూద్రుల సేవచేస్తారు వాళ్ళు. నీచపనులుచేసి పొట్టపోసుకుంటారు. వ్యభిచారం, తాగుడూ మితిమీరిపోతుంది. దేవాలయాలూ, బ్రాహ్మలకొంపలూ, ఆశ్రమాలూ నాశనమయిపోతాయి. తపోవనాల నామరూపాలుండవు.

"కలియుగం అంతమయేముందు ధర్మమన్నది పేరుకయినా మరి ఎక్కడా వుండదు. జనం త్రాహి త్రాహి మనిపోతారు. ఎన్నో అన్ని మహోత్పాతాలు పుడతాయి. కలియుగాంతంలో విష్ణువు కల్కి అవతారమెత్తుతాడు. సుప్రసిద్ధమయిన శంబళగ్రామంలో విష్ణుయశుడు అని వొక బ్రాహ్మడు వుంటాడు. విష్ణు వతడికి కుమారుడై పుడతాడు. సార్వభౌముడవుతాడు. తలుచుకోవడంతోనే వేదాలూ, శాస్త్రాలూ అవగతం అవుతాయి అతడికి. శస్త్రాస్త్రాల సర్వరహస్యాలూ తెలిసిపోతాయి. బ్రాహ్మల్ని కూర్చుకుని దండయాత్రబయలుదేరతా డతడు. అధర్మపరులయిన మ్లేచ్ఛుల్ని మాతవారుస్తాడు. తిరిగీ భూలోకంమీద ధర్మం స్థాపిస్తాడు. అశ్వమేధం చేస్తాడు. ఈభూలోకం యావత్తూ బ్రాహ్మణధనంగా బ్రాహ్మలికి పంచిపెట్టేస్తాడు. చివరికి వార్ధక్యంలో తపోవనం వెళ్ళిపోతాడు.

"అతడు ప్రతిష్ఠించిన ప్రకారం బ్రాహ్మణాదివర్ణాలు సక్రమంగా నడుస్తాయి. దాంతో కృతయుగం ప్రవేశిస్తుంది. దేశాలు నిత్యకళ్యాణం పచ్చతోరణాలుగా తయారవుతాయి. తోటలూ, ఆలమందలూ, యజ్ఞశాలలూ, తపోవనాలూ, దేవాలయాలూ దేదీప్యమానంగా తయారవుతాయి. పంటలు పుష్కలంగా పండుతాయి. భూదేవి కలకలలాడుతుంది. ప్రతీచోటా యజ్ఞాలు ఆరంభమవుతాయి. వాటిప్రయత్నాల్లో ప్రజలు మగ్నులవుతారు. ఎక్కడపడితే అక్కడ

బహ్మాణులు కనిపిస్తారు. అమనికి వానలు కురుస్తాయి. గ్రహాలు వక్రత్వం విడిచిపెట్టి తేజోవంతంగా ప్రకాశిస్తాయి. ప్రజలు రోగాలు పాలుకాకుండా ఆరోగ్యంగా వుంటారు. కృతయుగం ఇలా వుంటుంది. త్రేతా ద్వాపరాలుకూడా ఇంచుమించు ఇలాగే నడుస్తాయి. రాజా, ఇలాంటి యుగాలు ఎన్నో నాకళ్ళముందు గడిచిపోయాయి.

ధర్మరాజా, నువ్వు అడిగిన అతీత, అనాగతకాలాల విశేషాలు చెప్పాను. ఐతే, వాక్యహితోపదేశంమాత్రం నీకు చేస్తాను. విను. ఎప్పుడయినా సరే, బ్రాహ్మలికి మాత్రం నువ్వు సంతోషం కలిగిస్తూ వుండు. బ్రాహ్మలు తృప్తిపడ్డాగా, చాలు. ఎంతో అంత పుణ్యంచేస్తే కలిగేఫలితం కలుగుతుంది. సమస్తప్రాణులమీదా దయ కలిగి వుండు. ప్రజల్ని నీస్వజనంలా పరిపాలించు. పెద్దలు నడుచుకున్న పద్ధతులు అవగతంచేసుకుని మరీ ధర్మం నడిపించు. చెడ్డ దగ్గిరికి రానివ్వకు. తెలియక ఏదయినా చిన్న పొరపాటు జరిగిపోయిందే అనుకో—అలాంటప్పుడు వెంటనే దానికి ప్రతీకారం జరిగించు. గర్వం వొదిలిపెట్టు. ప్రియమయిన సత్యమే ఎప్పుడూ చెప్తూవుండు. కాలగతులు తెలుసుకుని బుద్ధిమంతుడివికా.

"భరతవంశంలో పుట్టినవాడివి నువ్వు. నిర్మలుడివి. ప్రాజ్ఞుడివి. నీకు వేరే చెప్పనక్కరలేదు. ఐనా, చెప్తున్నాను. బ్రాహ్మల్ని సంతోషపెడుతూ వుండు" అన్నాడు.

"మహాముని, నీ ఉపదేశం విని ధన్యుల మవుతున్నాము," అన్నాడు ధర్మరాజు— "ఇంతవరకూ నా శక్తివంచన లేకుండా లోభమూ, మాత్సర్యమూ మొదలయినవాటికి దూరంగానే వున్నాను. ఇప్పుడు నీధర్మశాసనం శిరసావహిస్తాను. మరింత వినాలని వుంది, బ్రాహ్మణప్రభావం సెలవియ్యి." ధర్మరాజు అడిగిన దానికి మరో చక్కని కథ చెప్పాడు మార్కండేయుడు.

## మండూకకన్య సుశోభన

సూర్యవంశంలో పరీక్షిత్తు అని ప్రసిద్ధుడయిన వొకరాజు అయోధ్య ఏలుతూ వుండేవాడు. ఒకనాడు అతడు వేటకని బయలు దేరాడు. గాలిలా పరిగెత్తే గుర్రం ఎక్కాడు. కనపడ్డ జంతువునల్లా వేటాడుతూ అడవిలో తిరుగుతున్నాడు. ఒకదగ్గర బాగా పూసిన పూలపొదలమధ్య పువ్వుల్లో పువ్వులాగ వొక అమ్మాయి కనపడింది. మదించిన ఏనుగులా నడుస్తూ పువ్వులేరుతూ వుందామె. చూసి, చప్పున దగ్గిరికి వెళ్ళాడు పరీక్షిత్తు. ఆమె అందానికి కళ్ళు అప్పగించి, బొమ్మలాగా నిలబడిపోయాడు.

ఆమె అతడికి కావాలి. అతడి అందంచూసి ఆమెకూడా చలించింది. అతణ్ణి సాభిప్రాయంగా వోర చూపులు చూసింది. మెల్లిగా పలకరించాడు పరీక్షిత్తు. 'ఒంటరిగా ఇలా అడవిలో వున్నావు. ఎవరిదానివి?' అని అడిగాడు. 'మానాన్నగారి మాట మీద ఈ అడవిలో మంచి వరుడికోసం విహరిస్తున్నాను. 'ఎవరి దానివి' అని అడిగావు నువ్వు. ఎవరిదాన్ని కావాలో మరి నువ్వే చెప్పాలి'—ముసిముసి నవ్వులతో అంది అమ్మాయి.

ఆమె బిగురుమాటలికి మరింత ఇదయిపోయాడు పరీక్షిత్తు. తన మనసులోనిమాట కాస్త పైకి చెప్పేశాడు. 'నన్ను ఎప్పుడూ జలక్రీడ చెయ్యమనకుండా వుంటాను అంటే, నిన్ను వరిస్తాను' అందామె. ఆమె ఏర్పాటుకి అంగీకరించాడు పరీక్షిత్తు. ఆమెని పట్నం తీసుకు వచ్చేశాడు. ఆమెతో సకలసౌఖ్యాలూ అనుభవించడం మొదలుపెట్టా

ఇలా వుండగా కొన్నాళ్ళకి వసంతకాలం వచ్చింది. ఉప వనాల్లో విహరించాలని రాజుకి మనస్సు కలిగింది. పళ్ళచెట్లతోనూ, పూలతీగెలతోనూ, పద్మసరోవరాలతోనూ వున్న అయోధ్యాపట్నం ఉపవనాల్లో విలాసగృహాలు ఏర్పాటుచేయించాడతడు. భార్యతో

సహా వెళ్ళి పద్మపుష్పాల పరిమళాలతో వీస్తున్న చల్లగాలి అనుభవిస్తూ అక్కడ నివాసం ప్రారంభించాడు.

ఒకనాడు బాగా వుక్కగా వుంది. ఒంటినిండా చెమటపట్టి, భార్యతోకూడా పరీక్షిత్తు ఇంటిలోంచి బైటికివచ్చాడు. దగ్గిరేవుంది పద్మసరోవరం. భార్యని వొడ్డునే నుంచోబెట్టి, తాను వెళ్ళి నీళ్ళలో మునిగాడు. 'ఎంతో హాయిగా వుంది. రా. స్నానంచేసి చెమట వొదిలించుకో' అని భార్యని నీళ్ళలోకి పిలిచాడు.

చిన్న మందహాసంచేసిందామె. అంతే. మాట్లాడకండా వెళ్ళి నీళ్ళలో మునిగింది. ఒక్క మునుగు మునిగిందో లేదో, మరి కనిపించకండా మాయమైంది. తెల్లపోయాడు రాజు. సరోవరమంతా గాలించి వెదికాడు. కనపళ్ళేదు భార్య. నీళ్ళన్నీ పైకి చిమ్మాడు. ఐనా, ఆమె కనపళ్ళేదు. ఉత్తి కప్పలుమాత్రం కుప్పలు కుప్పలుగా కనిపించాయి. మతిపోయింది రాజుకి. 'ఈకప్పలే నారాణిని మింగేశాయి' అని నిశ్చయించుకున్నాడు. ఎక్కడలేని కోపం వచ్చింది వాటిమీద. సేవకుల్ని పిలిచాడు. 'ప్రపంచంలో వున్న కప్పలన్నింటినీ చంపెయ్యండి' అని ఆజ్ఞాపించాడు.

రాజు ఆజ్ఞప్రకారం అన్నిదిక్కులికీ బయలుదేరారు సేవకులు. చెరువులూ, వాగులూ, నదులూ, కాలువలూ, నూతులూ, సెలయేళ్ళూ - వొకటేమిటి నీళ్ళువున్న ప్రతీచోటా గాలించి గాలించి కప్పలు కుప్పలు కుప్పలు చంపెయ్యడం మొదలుపెట్టారు. కప్పల్లో మహా సంక్షోభం కలిగింది. కప్పలరాజు మునివేషంలో పరీక్షిత్తు దగ్గిరికి వచ్చాడు. 'మహారాజా, ఈకప్పలు చంపి నువ్వు సాధించేది ఏముంది? కప్పలమీద నీకోపం చూసి లోకం నవ్వుతోంది. ఇంతట్లో అయినా ఈకోపం విడిచిపెట్టు' అన్నాడు.

'అదేమన్న మాట,' గద్దిస్తూ అన్నాడు రాజు — నాభార్యని కడుపులో పెట్టుకున్న మాయపురుగు లివి. కప్పలంటావేమిటి? వీటిని సర్వనాశనం చెయ్యందే ప్రకపోను. నాతో అధికంగా ఈవిషయం చెప్పకు. వెళ్ళు.' ఎంతో ఖేదపడ్డాడు ముని. 'మహారాజా, విను, నేను కప్పలరాజుని. ఆయువు అంటారు నన్ను. నీభార్య అంటున్నావే, ఆమె ఎవరో కాదు. నా కూతురు. సుశోభన దానిపేరు. దాని చేత నువ్వే కాదు. ఎంతెంతవాళ్ళో ఇలాగే దగాపడ్డారు. నువ్వనగా ఏపాటి?' అన్నాడు.

'ఐతే, ఆమెని తెచ్చిపెట్టునాకు' అని ప్రార్థించాడు పరీక్షిత్తు. నవ్వుతూ కూతుర్ని పిలిచాడు ముని. వచ్చినిలుచుంది సుశోభన. ఆమెని రాజు కిచ్చి, ఆమెదిక్కు చురచురా చూశాడు కప్పలరాజు ఆయువు. 'ఇదిగో, నీఅంత చెడ్డదాన్ని నిన్నే చూశాను. గొప్పగొప్ప రాజుల్ని ముప్పుతిప్పలు పెడుతున్నావు. అంచేత నీకడుపులో పుట్టిన కొడుకులు కపటపరులవుతారు' అని ఆమెని శపించి అదృశ్యుడయాడు. సుశోభనతో సుఖంగా కాలక్షేపంచేశాడు పరీక్షిత్తు.

కొన్నాళ్ళకి క్రమంగా సుశోభనగర్భంలో శలుడూ, దలుడూ, వలుడూ అని ముగ్గురు కొడుకులు కలిగారు. పెద్దవాడయిన శలుడికి రాజ్యాభిషేకంచేసి, తపోవనం వెళ్ళిపోయాడు పరీక్షిత్తు. ఇది మండూక కన్యకథ. నువ్వడిగిన బ్రాహ్మణప్రభావం ఇక్కడినుండేఆరంభమవుతుంది.

శలుడు అయోధ్య ఏలుతూ వుండేవాడు. ఒకనాడు అతడు బంగారం రథంమీద వేటకి వెళ్ళాడు. ఎన్నో జంతువులు వేటాడాడు. ఇంతలో వొకలేడి అతడిబాణం తగిలీకూడా పడిపోకండా పరుగెత్తింది. దానివెంట రథం పరుగెత్తించాడు శలుడు. ఎంతపరుగెత్తించినా లేడిని చేరుకోలేకపోయింది రథం. సారథిని గద్దించి, 'ఇంకా ఇంకా వేగం పోనియ్యి' అన్నాడు శలుడు.

'మనం ఎంతవేగం వెళితే, అంతకంటే వేగం పరుగెడుతోంది లేడి. ఇంతకంటే మనగుర్రాలు పరుగెత్తలేవు. వీటితో మనప్రయత్నం వ్యర్థమవుతుంది. మనగుర్రాలు వామ్యా లయితే తప్ప, ఈలేడి మనకి దొరకదు' అన్నాడు సారథి.

'వామ్యాలా? అంటే? ఎవరివా గుర్రాలు?' అని అడిగాడు రాజు. 'వామదేవమహాముని గుర్రా లవి. వాటినే వామ్యాలు అంటారు' అని చెప్పాడు సారథి. 'అయితే, వామదేవముని ఆశ్రమానికి వెంటనే మనరథం పోనీ' అన్నాడు శలుడు.

నిమిషాలమీద వామదేవముని ఆశ్రమంముందు రథం నిలిపాడు సారథి. ఆశ్రమంలోకి వెళ్ళి మునికి నమస్కరించాడు శలుడు. 'మునీంద్రా, నాచేత దెబ్బతిని వొక లేడి పారిపోయింది. దాన్ని వెంటతరిమి చంపాలి నేను. అందుకని మీగుర్రాలు కావాలి. ఇప్పించండి' అని ప్రార్థించాడు 'సరే. నీపని అయిపోయాక మాగుర్రాలు మాకు ఇచ్చెయ్యాలి. అలా అయితేనే తీసుకువెళ్ళు' అన్నాడు ముని.

'అలాగే' అని వామ్యాలు పుచ్చుకున్నాడు శలుడు. వాటిని తనరథానికి పూశాడు. లిప్తలో రథంతో లేడిదగ్గర వాలాయి వామ్యాలు. దెబ్బతో లేడిని పడగొట్టాడు శలుడు. వామ్యాల వేగానికి మెచ్చుకుంటూ అయోధ్య వచ్చేశా డతడు. 'రాజులికి తగిన జాతిగుర్రాలివి. గాలికంటే, మెరుపుకంటే వేగం పరుగెడతాయి. ఇలాంటిగుర్రాలు ఆ బ్రాహ్మడి కెందుకూ?' అంటూ వాటిని కోటలో కట్టించి అట్టేపెట్టుకున్నాడు. అలా వొకనెల గడిచిపోయింది.

ఎంతకీ గుర్రాలు తేకపోవడం చూసి సందేహం కలిగింది వామదేవుడికి. 'అవును, అతగాడు రాజయ్యె. బలవంతుడున్నూ. గుర్రాల మీద మోజు కలిగివుంటుంది. ఉంచేసుకుని వుంటాడు. తిరిగీ ఇవ్వాలని ఎందుకు బుద్ధిపుడుతుంది ఇలాంటివాడికి?' అంటూ ఆత్రేయుని

డని వొక శిష్యుణ్ణి పిలిచాడు. 'చూడూ, శలుడు మన వామ్యాలు తీసుకువెళ్ళాడు. నెలదినాలు కావస్తోంది. తనంత తాను తెచ్చి ఇవ్వాలన్న బుద్ధి పుట్టినట్టు లేదు. నువ్వు వెళ్ళు, మన గుర్రాలు మనకి తీసుకువచ్చెయ్యి' అన్నాడు.

ఆత్రేయుడు అయోధ్య వెళ్ళాడు. కోటలోకి వెళ్ళి శలుణ్ణి చూశాడు. గురువుగారు పంపారని గుర్రాలు ఇచ్చెయ్యమనీ అడిగాడు. 'గుర్రాలు అడగడానికి గురువు ఎంతవాడో, తీసుకువెళ్ళడానికి శిష్యుడివి అంతవాడివే వచ్చావు. ఏమిటీ మాటలు! వెళ్ళు వెళ్ళు' అని కసిరాడు శలుడు. ఆత్రేయుడు వెళ్ళి అంతా గురువుకి చెప్పాడు. విని ఉగ్రుడే అయిపోయాడు వామదేవుడు. ఈసారి తానే స్వయంగా అయోధ్య వచ్చాడు, శలుణ్ణి చూసి, 'నాగుర్రాలు నాకు ఇచ్చెయ్యి' అంటూ వురిమాడు. 'పనేమో ముగిసింది కదా! ఇంతవరకూ గుర్రాలు ఇవ్వకండా పైగా ఈదురాశ ఏమిటి? పరాయి సొమ్ము అవమంటేమాత్రం సొంతం అవుతుందా? ఎరువు చిరం అవుతుందా? పరులధనం అపహరించడం పాపం. పేరాసపడి వరుణపాశాలు పీకలమీదికి తెచ్చుకోకు. నిష్కారణంగా నరకాగ్నిలో పడిపోకు' అన్నాడు.

బ్రాహ్మడివి నువ్వు. వ్యర్థంగా గుర్రాలు ఎందుకూ అంటాను నీకు?' అన్నాడు శలుడు. 'పోనీ, పూరికే ఇవ్వనక్కరలేదు మాకు. కావాలంటే మంచి బలమయిన ఎడ్లజత ఇస్తాను. పట్టికెళ్ళు. అంతకీ కాదంటే కంచరగాడిదలు రెండు ఇస్తాను. అంతేకాని, వామ్యాల మీద మాత్రం ఆశపెట్టుకోకు' అన్నాడు.

'ఏమిటిది! ఎవరన్నా వింటే నవ్వుతారు. బ్రాహ్మల సొమ్ము కాజేసి, మరేమో బుకాయిస్తావేమిటి?' అని నిష్ఠూర్ర చేశాడు ముని. కఠినంగా ఏవేవో అన్నాడు. దానిమీద దురాగ్రహం

కలిగింది శలుడికి. దగ్గిరవున్న బలవంతులయినవాళ్ళని పిలిచాడు. 'నోటికివచ్చినట్టు వాగుతున్నాడు ఈబ్రాహ్మడు. వీణ్ణి తాళ్ళతో కట్టండి. శూలాలతో పొడిచి చంపెయ్యండి' అన్నాడు.

వాళ్ళు తనదగ్గిరికి రాకముందే కళ్ళల్లో నిప్పులుకురిశాడు ముని. ఒక్కహుంకారంతో అనేకమంది రాక్షసులు పుట్టించాడు. వాళ్ళంతా కోరల్లాంటి శూలాల్తో శలుడుమీద పడ్డారు. ఉత్తరక్షణంలో శలుణ్ణి చంపేసి కిందపడేశారు. వామదేవుడు ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

శలుడి తరవాత అతడి తమ్ముడు దలుడు రాజయాడు. కొన్నాళ్ళు గడిచాక మళ్ళీ వామదేవుడు వచ్చాడు. దలుణ్ణిచూసి, 'రాజా, నువ్వు ధర్మపురుషుడివి, ధర్మం నిలబెట్టాలంటే, నాగుర్రాలు నాకు ఇచ్చెయ్యి' అని అడిగాడు. ముని ఇలా అడగడంతోటే బుస్సుమన్నాడు దలుడు. 'కొవ్వెక్కి ఈబాపనయ్యకి మతిపోయినట్టుంది. వీడి గుండెలు పగలగొట్టి మరీ వొదిలిపెడతాను. ఏదీ, నావిల్లూ, విషంపూసిన బాణాలూ ఇలా అందుకో' అంటూ పక్కనే వున్న సారథిని ఆజ్ఞాపించాడు.

పకపకా నవ్వాడు వామదేవుడు. 'నన్ను కొడతావు! నువ్వు కొడతానన్న ఆబాణం నీఅంతఃపురంలో గెంతులేస్తున్న నీకొడుకుని కొడుతుంది' అన్నాడు. ముని నోట్లోమాట నోట్లోనేవుంది, బాణం వెళ్ళి దలుడికొడుకు గుండెలమీద తగిలింది. ఠారుమని చచ్చి వూరుకున్నాడు కుర్రాడు. అంతఃపురమంతా వొక్కసారి గొల్లుమన్నారు. ఆపదుపులు వినిన్నీ దురాగ్రహం వొదల లేదు దలుడు. తన దగ్గిర వాళ్ళని చూసి, 'ఇదిగో, మీరందరూ చూడండి. ఈబ్రాహ్మణ్ణి దుర్భాషలాడుతున్న ఈదుర్జనుణ్ణి నాబాణాల్తో రక్తం వరదలయినట్టు కొట్టి చంపేస్తాను' అని చప్పున ధనుర్బాణాలు పుచ్చుకున్నాడు. బాణం తొడిగి గురిపెట్టాడు. అంతే. ఏం చెప్పనూ, ధనుస్సూ,

బాణాలూ పట్టుకున్న రెండుచేతులూ కదలకుండా పట్టుకున్నవి పట్టుకున్నట్టే వుండిపోయాయి.

తెల్ల మొహంవేశాడు దలుడు. తలవొంచుకున్నాడు. స్తంభించిపోయి చెమట్లు పోసుకున్నాడు. పంతమూ, కోపమూ పటాపంచలయిపోయాయి. దీనంగా తనవాళ్ళదిక్కు చూశాడు. 'ఎన్నో అన్నాను. అన్నీ పొల్లయిపోయాయి. బాణం తొడిగే శక్తికూడా లేకండా అయిపోయింది. ఎన్ని అంటే ఏం లాభం? ఎలాఅయినా బ్రాహ్మణశక్తి గొప్పది. వామదేడిముందు నేను వోడిపోయాను. మహానుభావు డీయన. ఇతణ్ణే ఆశ్రయిస్తాను' అంటూ అలాగే తలవొంచి పక్కగా నమస్కరించాడు మునికి. అతడి బంధువులూ, మిత్రులుకూడా భయభక్తులతో వామదేవుడిపాదాలమీద శరణంటూ సాగిలబడ్డారు. 'శాంతించు' అని ఎన్నోవిధాల ప్రాధేయ పడ్డారు.

చివరికి ప్రసన్నుడయ్యాడు ముని, దలుడిచేతులు స్తంభనంనించి విడిపించాడు. అతడి కుమారుణ్ణికూడా బతికించాడు. భార్యాపుత్రులతోసహా మునిపాదాలమీద పడ్డాడు దలుడు. వామ్యాలు తెచ్చి అతడిముందు పెట్టాడు. రాజుని ఆశీర్వదించి, గుర్రాలుతీసుకుని ఆశ్రమానికి వెళ్ళిపోయాడు వామదేవుడు. ధర్మరాజా, బ్రాహ్మణ ప్రభావం అంటే అలా వుంటుంది.

చేతులు జోడించాడు ధర్మరాజు. "మునీంద్రా, నువ్వు చెప్పిన కథలన్నీ వింటున్నాము. అయితే, వొకటి అడుగుతాను. ఏమీ అనుకోకు. నీకంటే వృద్ధులయినవాళ్ళు ఎవరయినా, ఎక్కడైనావున్నారా?, అని సందేహంగా వుంది నాకు" అన్నాడు. "ఉన్నారు చెపుతాను, విను" అంటూ మరోకథ ఆరంభించాడు మార్కండేయుడు.

## ఇంద్రద్యుమ్నుడి కథ

ఇంద్రద్యుమ్నుడని వొకరాజు వుండేవాడు. అతడు దేవేంద్రలోకంలో హాయిగా వుంటూవుండగా ఎంతోకాలానికి అతడికీర్తి భూలోకంలో మాసిపోయింది. దానిమీద 'దేవలోకంలో నువ్వు వుండడానికి తగవు' అన్నారు దేవతలు. స్వర్గంనించి అతణ్ణి కిందికితోసేశారు. పాపం, నాదగ్గిరికి వచ్చాడతడు. 'అయ్యా, ఎంతో పుణ్యం చేసినవాణ్ణి నేను. ఇంద్రద్యుమ్నుణ్ణి. నన్ను ఎరుగుదువా?' అని అడిగాడు. 'ఎరగను' అన్నాను నేను. 'హిమాలయపర్వతం శిఖరం మీద ప్రావాకర్ణుడు అని వొక పులుగుపిట్ట వుంది. నాకంటే పెద్దది. దానికి తెలిస్తే తెలియాలి నిన్ను. అక్కడికి వెళ్ళు' అన్నాను. నన్నూ రమ్మన్నాడతడు. 'రసాయనఘుటికాప్రయోగంవల్ల దేహా దాహంగా వుంది. కదిలిరాలేను' అన్నాను నేను.

అపుడు ఇంద్రద్యుమ్నుడు గుర్రమయ్యాడు. నన్ను మోసుకుని వెళ్ళాడు. ఇద్దరమూ ప్రావాకర్ణుడి దగ్గిరికి వెళ్ళాము. నన్ను అడిగినట్టు ప్రావాకర్ణుణ్ణీ అడిగాడు ఇంద్రద్యుమ్నుడు. చాలాసేపు ఆలోచించాడు ప్రావాకర్ణుడు. తుదకి 'నన్నుఎరగను' అనేశాడు. అయితే ఇంద్రద్యుమ్నం అని వొక చెరువు వుంది. అక్కడ నాళీకజంఘుడని వొక కొంగ వుంది. అది నాకంటే పెద్దది అది నిన్ను ఎరిగివుంటే ఎరిగివుండవచ్చు. దాన్ని అడుగు. వెళ్ళు' అన్నాడు ప్రావాకర్ణుడు. ఇంద్రద్యుమ్నుడు మళ్ళీ గుర్రమై నన్నూ పులుగుపిట్టనీ మోసుకుని నాళీకజంఘుడి దగ్గిరికి బయలుదేరాడు. నన్నూ, ప్రావాకర్ణుణ్ణీ అడిగినట్టే నాళీకజంఘుణ్ణీ అడిగాడు.

మాఇద్దరిలాగే 'నిన్ను ఎరగను' అన్నాడు నాళీకజంఘుడు 'అయితే ఈ చెరువులో యుగంధరుడు (యకూపారుడు) అని వొక తాబేలు వుంది. అది నాకంటేకూడా ఎంతో పెద్దది. దాన్ని అడ

గుదాం వుండు' అని పేరుపెట్టి తాబేలుని పిలిచింది కొంగ. 'ఒక సందేహం వచ్చింది. నిన్ను అడగాలని పెద్దలు కొందరు వచ్చారు. ఓసారి బయటికి రా' అంది.

చెరువులోంచి బయటికి వచ్చింది తాబేలు. 'అయ్యా, నేను ఇంద్రద్యుమ్నుణ్ణి. ఎంతో పుణ్యం చేసినవాణ్ణి. నన్ను ఎరుగుదువా ?' అని యథాప్రకారం తాబేలుని అడిగాడు ఇంద్రద్యుమ్నుడు.

'ఆఁ, ఏమన్నారూ ? ఇంద్రద్యుమ్నుడా ?' అంటూ ఏదో తలుచుకుని కాసేపు తలవంచుకుంది తాబేలు. దాని రెండుకళ్ళనించీ కన్నీళ్ళు బొటబొటా కారడం మొదలుపెట్టాయి. గద్గదకంఠంతో చెప్పింది.: 'అమ్మో, ఇంద్రద్యుమ్న మహారాజునే ఎరగనా? ఎంత ఉత్తముడు ఆయన! ఏభయమూ లేకండా నన్ను ఎన్నిసార్లు రక్షించాడిక్కడ! ఎంత దయశాలి ఆయన! ఆయన్ని ఎన్నటికయినా మరవగలనా? ఆమహాత్ముడు ఎన్ని యజ్ఞాలు చేశాడని! యజ్ఞాల్లో ఆయన బ్రాహ్మలికి ఇచ్చిన ఆవుల డెక్కలవల్ల భూమి తవ్వుకుపోయి కదా, ఈ చెరువు అయిందిక్కడ. అందుకే దీని పేరు ఇంద్రద్యుమ్నం అన్నారు' అంది.

తాబేలు ఇలా అంటూనే వుంది. విమానంతో దేవదూతలు వచ్చారు ఇంద్రద్యుమ్నుడి దగ్గిరికి. 'మహారాజా, నీకీర్తి ప్రపంచంలో శాశ్వతంగా వుంది. దేవలోకంలో నీనివాసం స్థిరపడింది. దయచెయ్యి. విమానం ఎక్కు. పురుషుడికీర్తి ఎంత కాలం భూలోకంలో వుంటుందో, అంతకాలమూ అతను పుణ్యలోక సౌఖ్యాలు అనుభవిస్తాడు' అన్నారు.

'మంచిది. కాని వృద్ధఋషినీ, ముసిలి గుడ్లగూబనీ, పని కట్టుకు తీసుకువచ్చాను. వీళ్ళని వీళ్ళస్థానాల్లో దిగబెట్టి వస్తాను. వుండండి' అన్నాడు ఇంద్రద్యుమ్నుడు. అలాగే మమ్మల్ని దిగబెట్టి,

దేవవిమానం మీద దేవలోకం వెళ్ళిపోయాడాయన. అంచేత, నాకంటే కూడా వృద్ధులు లేకపోలేదు" అన్నాడు.

"నీకంటె వృద్ధులు వున్నారంటే మహాశ్చర్యమైన విషయం" అన్నాడు ధర్మరాజు. "మునీంద్రా, ఇక్ష్వాకు వంశంలో పుట్టిన కువలాశ్వుడికి ధుంధుమారుడు అని ఎలా పేరువచ్చిందో సెలవియ్య" అని అడిగాడు. మార్కండేయుడు చెప్పాడు.

## కువలాశ్వుడి కథ

ఉదంకుడు అని వొక ముని. శివుడితో సమానమయినవాడతడు. మరుభూమిలో నివసిస్తూ, విష్ణువుకోసం ఎన్నో సంవత్సరాలు తపస్సుచేశాడు. అతడిభక్తి మెచ్చి ప్రసన్నుడయాడు విష్ణువు. సాక్షాత్కరించి ఎదట నుంచున్నాడు. ప్రణామం చేశాడు ఉదంకుడు. 'ప్రభూ, జంగమస్థావరాత్మకమయిన ఈప్రపంచం యావత్తూ నీమాయకి లోబడి వుంది. విశ్వరూపుడివి నువ్వు. నిన్ను తెలుసుకుంటే చాలు. పాపాలన్నీ వొదిలిపోతాయి. దేవతలూ, రుషులూ, సిద్ధులూ, గరుడులూ, నాగులూ యావన్మందీ నిన్ను సేవించి, కృతార్థు లవుతున్నారు. నువ్వు సంతోషిస్తేనే, సమస్తప్రపంచాలూ శాంతి పొందుతాయి. నువ్వే కోపిస్తే, ఇంక మూడు లోకాల్లోనూ అడ్డే వుండదు. విక్రమించి మూడు లోకాలూ ఆక్రమించిన త్రివిక్రముడివి నువ్వు'- ఇలా ఎన్నో విధాల స్తోత్రం చేశాడు.

కరుణించాడు విష్ణువు. 'వరం కోరు. ఇస్తాను' అన్నాడు. 'దేవా, నీదివ్యరూపం కళ్ళారా చూశాను. ఇంతకంటే నాకు కావలిసింది ఏముంది? అయినా, వొక్కవరం అడుగుతున్నాను. సత్యమూ, ధర్మమూ, శమమూ-ఇవి ఎప్పుడూ నామనస్సు వొదలనట్టూ నీమీద భక్తి దృఢంగా వుండేట్టూ అనుగ్రహించు. ఇంతకంటే మరో వరం

అక్కరలేదు నాకు' అన్నాడు ఉదంకుడు. 'నువ్వు కోరింది ప్రసాదించాను' అన్నాడు విష్ణువు.' నాఅనుగ్రహంవల్ల పరమజ్ఞానయోగమూ సిద్ధిస్తుంది నీకు. అయితే మునీ, మూడులోకాలకీ మేలుకలిగే కార్యం వొకటి నీమూలాన నెరవేరవలసి వుంది. ఏమిటంటావా! చెపుతాను విను. ధుంధుడు అని వొక రాక్షసుడు లోకానికి ఉపద్రవం చేస్తాడు. వాణ్ణి చంపడంకోసం నువ్వు బృహద్రథుడి కొడుకు కువలాశ్వుణ్ణి సిద్ధం చెయ్యాలి. నేను ప్రసాదించిన యోగబలంతో కువలాశ్వుడు వాణ్ణి సంహరిస్తాడు. ఈకార్యం నువ్వు చేసిపెట్టడం మూలాన లోకాలన్నీ సుఖపడతాయి' అని చెప్పి అంతర్థానమయాడు. యథాప్రకారంమళ్ళీ తపస్సులో కూచున్నాడు ఉదంకుడు.

ఇక కువలాశ్వుడి విషయం: ఈ భూలోకం యావత్తూ పాలించినవాడు ఇక్ష్వాకుడు. అతడి కొడుకు శశాధుడు. శశాధుడి కొడుకు కకుత్థ్సుడు. కకుత్థ్సుడి కొడుకు వేనుడు. వేనుడి కొడుకు పృథువు. పృథువు కొడుకు విశ్వకుడు. విశ్వకుడి కొడుకు అద్రి. అద్రి కొడుకు యువనాశ్వుడు. యువనాశ్వుడి కొడుకు శ్రావస్తి. శ్రావస్తికొడుకు బృహదశ్వుడు. బృహదశ్వుడి కొడుకే కువలాశ్వుడు.

కువలాశ్వుడు ప్రయోజకుడయాడు. సంతానవంతుడూ అయాడు. అతడికి పట్టాభిషేకంచేసి, తపోవనానికి బయలుదేరాడు బృహదశ్వుడు. అదివిన్నాడు ఉదంకుడు. వెంటనే అయోధ్య వచ్చాడు. బృహదశ్వుణ్ణి కలుసుకున్నాడు. 'అడవికి వెళ్ళవద్దు' అని వారించడం మొదలుపెట్టాడు. 'అపుడే అడవికి వెళ్ళవలసిన అగత్యం ఏమివచ్చింది నీకు! వద్దు. ప్రజారక్షణ సాగించు. ప్రజారక్షణకంటే ధర్మం ఏముంది? అడివికి వెళితేకాని ధర్మం సాధించలేవా? పూర్వ రాజులు ఎంతమంది ప్రజారక్షణచేసి ధర్మం సాధించలేదు! నీరక్షణ

వల్ల మావంటివాళ్ళం ఏబాధాలేకండా ధర్మకర్మలు చేసుకుంటున్నాం. దీనిమూలాన మాత్రం నీకు ధర్మం రావడంలేదా?

'నేను ఎందుకు వద్దంటున్నానో విను. నిజంగా అద్భుతమన్న మాట. మధుకైటభులు అని ప్రసిద్ధులయిన రాక్షసులమాట వినే వుంటావు. వాళ్ళ కొడుకు ధుంధుడు. ఉద్ధోలమయిన బలం వాడిది. దానికితోడు బ్రహ్మాండమైన తపస్సు చేశాడు వాడు. బ్రహ్మని మెప్పించాడు. అసాధ్యమయిన వరాలు సంపాదించాడు. దేవతలూ, దానవులూ, గంధర్వులూ ఎవళ్ళూ వాణ్ణి గెలవలేరు. వాడి గర్వానికి అడ్డూ ఆపూ లేదు. వాడు ఇప్పుడు నాఆశ్రమానికి దగ్గిరిసా తిష్ఠ వేశాడు. నాఆశ్రమం దగ్గిర సముద్రం ఎడారి ఎన్నో యోజనా లుంటుంది. అందులో పెద్ద గొంది తయారు చేసుకున్నాడు. ఆగొందిలో ఒళ్ళుమరచి నిద్రపోతూ వుంటాడు. వాడి శరీరమేమో ఇసకలో వుంటుంది. వాడి ఊపిరిగాలిమాత్రం పొగలతోనూ, మంటల తోనూ బైటికి వస్తుంది. సంవత్సరానికి వొకసారి అలా బైటికివచ్చి, భూమీ ఆకాశం నిండిపోయి, ఇసకతుపాను రేగుతుంది. ఆఉద్ధృతానికి ఆచుట్టుపక్కల ప్రదేశం యావత్తూ - కొండలూ అడవులూ సహా కంపించిపోతాయి. అలా ఆకంపం ఏడుదినాలవరకూ వుంటుంది. ఈదారుణం మూలాన మాఆశ్రమంలో మేము వుండలేకపోతున్నాం. అంచేత, ముందు వచ్చి నువ్వు ఆరాక్షసుణ్ణి సంహరించు. మాకూ లోకానికీ మహోపకారం చెయ్యి. అంతగా కావలిస్తే, ఈఘనకార్యం చేశాక తపోవనం వెళ్ళవచ్చు. అంత ఘోరమైనవాణ్ణి ఎలా చంపడం అని అనుకునేవు. ఆవిచారం అక్కర్లేదు. వాణ్ణి చంపడానికి పూను కునేవాళ్ళకి తనశక్తి ప్రసాదిస్తానని విష్ణుమూర్తి స్వయంగా నాతో చెప్పాడు. కనక, తే. విష్ణుశక్తి నీలో సంధించుకో. లోకాలు

రక్షించు. నువ్వుతప్ప ఈ మహాకార్యం మరొకడు చెయ్యలేడు. దీని మూలాన కీర్తీ పుణ్యమూ కలిసివస్తాయి నీకు' అన్నాడు.

ఉదంకుడు చెప్పిందంతా విని, రెండు చేతులూ జోడించాడు బృహదశ్వుడు. మునీంద్రా, క్షమించు. నేను అస్త్రసన్యాసం చేసేశాను. తపోవనం వెళ్ళడం తప్పదు నాకు. నీకోరిక నెరవేరితే చాలు కదా! దానికి నాకుమారుడు వున్నాడు. మహాబలవంతుడు వాడు. మంచిపనికి వెనకతియ్యడు. ధుంధుణ్ణి వాడు తప్పకండా హతమారుస్తాడు. నాకు సెలవియ్యి, అన్నాడు. కుమారుడు కువలాశ్వుణ్ణి మునికి అప్పగించాడు. అనంతరం తపోవనం వెళ్ళిపోయాడు.

ధుంధుడు మధుకైటభుల కొడుకు అన్నాను కదూ! వాళ్ళ సంగతి కాస్త చెపుతాను విను.

వెనకటికి ఈమూడులోకాలూ ఒకేఒక్క సముద్రంగా అయిపోయాయి. అప్పుడు మహావిష్ణువు ఆదిశేషుణ్ణి పాన్పు చేసుకుని, ఆమహాసముద్రంలో యోగనిద్రలో పవ్వళించాడు. అలా ఎంతో కాలం గడిచిపోయింది. ఇలా వుండగా, ఒకనాడు హటాత్తుగా పెద్ద రాక్షసులు ఇద్దరు అక్కడికి వచ్చారు. వాళ్ళే మధుకైటభులు. వాళ్ళువచ్చి, విష్ణువు నాభికమలంలో వున్న బ్రహ్మని చూశారు. ఎక్కడలేని కోపం తెచ్చుకుని బ్రహ్మని బాధించడం మొదలెట్టారు. భయపడిపోయాడు బ్రహ్మ. వెర్రికేకలు వేశాడు. 'ప్రభూ, నాఅవస్థ పరికించు' అని విష్ణువుతో మొరపెట్టాడు. యోగనిద్రలో వుండే అది చూశాడు విష్ణువు. కళ్ళువిప్పి రాక్షసుల్ని పరికించాడు. 'మీపరాక్రమం మెచ్చుకున్నాను. అతణ్ణి కొట్టకండి. కావలిసిన వరాలు కోరుకోండి. ఇస్తాను' అన్నాడు.

విష్ణుమూర్తి మాటలు విని విరగబడి నవ్వారు రాక్షసులు. 'నువ్వు మాకు ఇచ్చేదేమిటి? కావాలంటే నువ్వే కోరుకో కావలిసి

నన్నివరాలు మేమే ఇస్తాం' అన్నారు. 'ఆడి తప్పరు మీరు. ఆమాటమీద నిలబడండి' అన్నాడు విష్ణుమూర్తి. 'మీమాట ప్రకారం మిమ్మల్నే వరం అడుగుతున్నాను. లోకం మేలుకోసం మీరు చచ్చిపోండి' అన్నాడు.

ఒకళ్ళ మొహం వొకళ్ళు చూసుకున్నారు మధుకైటభులు. చివరికి విష్ణువుదిక్కు తిరిగారు. 'అవును. నవ్వులాటకయినా అబద్ధం ఆడం మేం. మాపరాక్రమానికి అడ్డేలేదు. అయినా, యోగం ఇలా వుంది. తప్పించడం ఎవరి తరం? కానీ. నువ్వు కోరినట్టు మాప్రాణాలు ఇచ్చేశాం. చంపెయ్యి మమ్మల్ని. అయితే, వొక్క షరతుమాత్రం వుంది. ఏమిటంటావా? నీళ్ళులేనిచోట చంపాలి మమ్మల్ని' అన్నారు. నవ్వాడు విష్ణుమూర్తి. మూడులోకాల్లోనూ ఎక్కడచూసినా జలమయంగానే వుంది. ఆలోచించాడు. తన తొడలమీద వాళ్ళని పడుకోబెట్టాడు. సుదర్శనచక్రంతో వాళ్ళ శిరస్సులు నరికి పారేశాడు. అదిగో, వాళ్ళ కొడుకే ధుంధుడు.

బృహదశ్వుడు చెప్పి వెళ్ళిన ప్రకారం సర్వసన్నద్ధుడూ అయాడు కువలాశ్వుడు. అతడికి అనేక వేలమంది కుమాళ్ళు. వాళ్ళందరినీ వెంటపెట్టుకున్నాడు. ఒక మంచిరోజుచూసి, ఉదంకుడి వెంట బయలుదేరాడు. చతురంగబలాలతో కూడా అతడు కదిలి వెళుతూ వుంటే భూమండలం గజగజ లాడిపోయింది. అదే సమయంలో తన శక్తి కువలాశ్వుడిలో ప్రవేశపెట్టాడు విష్ణువు. దేవేంద్రుడూ మొదలయిన దేవతలూ, రుషులూ యావన్మందీ కూడా అతడి ఈశ్వరశక్తి వృద్ధిచేశారు. దివ్యదుంధుభులు మోగాయి. మెల్లి మెల్లిగా అనుకూల వాయువులూ వీశాయి. దేవతల విమానాలతో ఆకాశం నిండిపోయింది. శుభసూచకంగా ఎదురయిన పక్షులూ మృగాలూ విజయం తథ్యం అని వ్యక్తంచేశాయి.

ఇలా మహా ఇదిగా సముద్రతీరానికి వెళ్ళాడు కువలాశ్వుడు. తన అనేక వేలమంది కుమాళ్ళనీ ఇసకమైదానం తవ్వమని ఆదేశించాడు. అతడు చెప్పడమే తడువు. అంతమందీ తవ్వడం మొదలుపెట్టారు. శూలాలూ, పారలూ మొదలయిన అనేకరకం పనిముట్లతో విడుపూ విరామం లేకండా ఆ ఇసకదిబ్బలు వారంరోజులు తవ్వారు. అంత తవ్వాక ఆ అడుగుని పడుకుని వున్నాడు ధుంధుడు. వాడు వూపిరి వొదుల్తూవుంటే, పొగలూ మంటలూ బైటికి వస్తున్నాయి.

ధుంధుణ్ణి చూసీ చూడ్డంతోటే పట్టిసాలూ, గదలూ, కత్తులూ గండ్రగొడ్డళ్ళూ, శూలాలూ—ఇలావొకటేమిటి, చేతికివచ్చిన ఆయుధ మల్లా పట్టుకుని అన్నివేలమంది రాజకుమాళ్ళూ బాదడం మొదలు పెట్టారు వాణ్ణి. అలా బాదగా బాదగా, పొడవగా పొడవగా కొంత సేపటికి కొంచెం కదిలాడువాడు. ఒళ్ళు విరుచుకుంటూ లేచాడు. బద్ధకంగా ఆవులించాడు.

ధుంధుడు ఆవులించేసరికి అతడినోట్లోంచి అగ్నినిప్పులు జలజలా రాలాయి. ఘోరంగా మంటలూ పుట్టుకువచ్చాయి. మహారాజా, ఏం చెప్పేది ? కపిలుడి కోపాగ్నిలో పడ్డ సగరపుత్రుల్లాగ ఆమంటల్లో కువలాశ్వుడి కుమాళ్ళు మాడి వూరుకున్నారు. కేవలం దృఢాశ్వుడూ, కపిలాశ్వుడూ, చంద్రాశ్వుడూ అని ముగ్గురు కొడుకులు మాత్రం మిగిలిపోయారు.

దానిమీాద, ప్రళయకాలం సూర్యుడిలాగ ఉగ్రుడయిపోయాడు కువలాశ్వుడు. అమాంతంగా ధుంధుడిమీాద వురికాడు. వాడూ అంతకంటే భయంకరంగా ఎదిరించాడు. పే-ద్ద శూలం పట్టుకుని మంటలు కక్కుతూ తిరగబడ్డాడు. తన యోగబలంవల్ల ముందు ఆమంటలూ అవీ ఆర్పివేశాడు కువలాశ్వుడు. తరవాత వెంటనే

బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. భూమీ ఆకాశం మంటల్తో నింపేస్తూ వెళ్ళింది బ్రహ్మాస్త్రం. తగిలీతగలడంతోనే భస్మమైపోయాడు ధుంధుడు.

ధుంధుడు చావడంతోటే, దేవదుందుభులు మోగాయి. దేవేంద్రుడూ మొదలయిన దేవతలూ, ఉదంకుడూ మొదలయిన మహామునులూ కువలాశ్వుణ్ణి ఎంతో అంత ప్రశంసించారు. 'ధుంధుణ్ణి చంపావు కనక, ధుంధుమారుడు అన్న పేరు శాశ్వతంగా వుంటుంది నీకు' అన్నారు. 'కావలిసివవరం కూడా కోరుకో. ఇస్తాం' అన్నారు. 'బ్రాహ్మలమీద భక్తీ, ఎప్పుడూ దానంచెయ్యాలన్న బుద్ధీ, విష్ణుమూర్తితో స్నేహమూ కావా' లన్నాడు కువలాశ్వుడు. 'రాక్షసుడిచేత మరణించిన కుమాళ్ళందరూ బతకా' లనీ కోరాడు. అతడు కోరినవన్నీ ఇచ్చి వెళ్ళారు దేవతలు.

అలా మహావిజయం సాధించాడు కువలాశ్వుడు. ఉదంక మునిని ఆశ్రమానికి పంపి, తాను రాజధానికి మళ్ళాడు. అయోధ్యాపట్టణంలో ప్రవేశించేసరికి సానిమేళాలతోనూ వాటితోనూ ఘనమయిన స్వాగతం చెప్పారు ప్రజలు. ఎంతోకాలం వైభవంతో రాజ్యం ఏలుబడిచేశాడు కువలాశ్వుడు. ఇదీ కువలాశ్వుడు ధుంధుమారుడని పేరు తెచ్చుకున్న కథ.

---

# అరణ్యపర్వం



## ఐదో ఆశ్వాసం

కువలాశ్వుడికథ విన్నాక పతివ్రతల ప్రసంగం తెచ్చాడు ధర్మ రాజు. "మహామునీ, ఇంద్రియాలు సహజంగా గెలవరానివి. అలాంటి ఇంద్రియాలు జయించి, మనస్సు స్వాధీనంలో వుంచుకుని, అహంకారం విడిచిపెట్టి భర్తశుశ్రూషచేసేస్త్రీ సర్వలోకాల్లోనూ ఉత్తమురాలని భావిస్తాను. నిజంగా పతివ్రతల చరిత్ర దుర్లభమైందీ, ధర్మసూక్ష్మాలు తెల్పేదిన్నీ కదా! అంచేత, పతివ్రతలప్రభావం వినాలని వుంది.

"మరిన్ని, కుమాళ్ళకోసం తల్లీతండ్రీ ఉభయులూ ఆయాసపడ తారు. అయితే, ఆఇద్దరిలోనూ ఎవరి ఆయాసం అధికం? తలిదండ్రుల విషయంలో కుమారుడు ఎలాంటివాడు కావాలి? ఒకడు హీనయోనిలో పుడతాడు. వాడు పరమధార్మికులు పొందే లోకాలు పొందాలంటే, ఎలా నడుచుకోవాలి? దయచేసి ఇవి సెలవియ్యి" అని అడిగాడు.

దానిమీద మార్కండేయుడు ఇలా చెప్పాడు:

"తొమ్మిదిమాసాలు భద్రంగా గర్భం మోస్తుంది తల్లి. ఎన్నో కష్టాలు సహిస్తుంది. తుదకి ప్రాణం అటా ఇటా అన్న స్థితికి వచ్చి, కుమారుణ్ణి కంటుంది. అయితే, కొడుకుకోసం తపస్సులూ, దానాలూ చేస్తాడు తండ్రి. యజ్ఞాలూ, వ్రతాలూ చేస్తాడు. దేవతల్నీ సాధు వుల్నీ సేవిస్తాడు. కనక, బాగా ఆలోచిస్తే తల్లిదండ్రుల ఉభయుల కష్టమూ వొక్కటే అనిపిస్తుంది.

"కొడుకు తమమీద భక్తి కలిగి వుండాలనీ, ధర్మార్థాలు కోరే వాడుగా వుండాలనీ ఆసపడతారు తలిదండ్రులు. వాళ్ళ ఆశ సఫల

చేసినవాడే నిజమయిన కుమారుడు. తల్లిదండ్రుల్ని అనుసరించి నడుచుకుని, వాళ్ళని సంతోషపరిచే కుమారుడు ధర్మమూ, కీర్తీ సాధిస్తాడు. చివరికి పుణ్యగతులూ పొందుతాడు.

"ఇక పతివ్రతల సంగతి: ఎప్పుడూ భర్త శుశ్రూషమీదే ఆసక్తి కల పతివ్రతకి యజ్ఞాలూ, దానాలూ తపస్సులూ అన్నిటివల్లా కలిగే ఫలాలు యావత్తూ కరతలామలక మవుతాయి. దీనికి వొక ఇతిహాసం చెపుతాను, విను. నువ్వడిగిన విషయాలన్నీ అందులో విశదమవుతాయి.

### కౌశికుడి కథ

ఒకవూళ్ళో కౌశికు డని వొక బ్రాహ్మడు వుండేవాడు. అతడు ధర్మాత్ముడు. తపశ్శీలుడు. విడవకండా ఎప్పుడూ వేదాధ్యయనం చేసేవాడు. అతడు వొకనాడు వూరి సమీపంలో వొక చెట్టుకింద కూచుని, వేదాలు గుణించుకుంటున్నాడు. సరిగ్గా అతడి నెత్తి మీదుగా చెట్టుకొమ్మమీద వొక కొక్కెర కూచుంది. అది అతడి నెత్తిమీద రెట్టవేసింది. కోపంతో కొంగని ఎర్రగా చూశాడు కౌశికుడు. అలా అతడు చూడగానే చచ్చి, కిందపడిపోయింది కొంగ. ఎంతో నొచ్చుకున్నాడు బ్రాహ్మడు. 'అయ్యో, కటికగుండెవాణ్ణయిపోయాను' అంటూ దుఃఖపడ్డాడు. 'నిష్కారణంగా కొంగని చంపేశాను. ఇంకెక్కడిశాంతి నాకు!' అని ఎంతోసేపు విచారించాడు. మధ్యాహ్నంవరకూ అలా ఎన్నో విధాల విచారిస్తూ కూచుండిపోయాడు. ఎలాఅయితేనేం చివరికి లేచి, నిత్యకృత్యాలు నిర్వర్తించుకున్నాడు. తరవాత వూళ్ళోకివెళ్ళి, శుచిమంతులయిన బ్రాహ్మల ఇళ్ళల్లో భిక్షమడగడం ప్రారంభించాడు.

ఒక ఇంటివాకిట నుంచుని 'భిక్షాం దేహి' అని కేక వేశాడతడు. ఇంటి ఇల్లాలు ఆ కేక వింది. భిక్షం వెయ్యడానికని పాత్రకోసం వెళ్ళింది.

ఇంతలో ఆమెభర్త వచ్చాడు. బాగా ఆకలితో వున్నా డతడు. భర్తని చూడగానే భిక్షంమాట అట్టేపెట్టిం దామె. భర్తకి పీట వేసింది. కాళ్ళు కడిగిందికి నీళ్ళూ అవీ ఇచ్చింది. అతడికి స్నానం చేయించింది. రుచికరంగా భోజనం పెట్టింది. మంచిమాటలతో ఉల్లాసం కలిగించింది. అతడి భోజనం అయాక, చక్కగా పక్క-పరిచింది. భర్త, శరీరం వాల్చగానే కాళ్ళు పడుతూ కూచుంది. అతడు సుఖంగా నిద్రపోయాక, వాకిట్లో బ్రాహ్మడు భిక్షంకోసం నిలుచున్న సంగతి తలుచుకుంది.

అంతవరకూ అలాగే నుంచునివున్నాడు కౌశికుడు. ఇంటామెని చూడడంతోటే మండిపడ్డాడు. 'వెంటనే భిక్షం పెడితే నాదారిని నేను పోయేవాణ్ణి. ఇంతసేపు నిలబెట్టావు. దుర్మతివి. మదించి ఇంత చులకనచేశావు నన్ను' అంటూ గదమాయించాడు. 'క్షమించు' అంటూ వినయంగా చెప్పింది ఇంటామె. 'నాభర్త ఆకలితో వచ్చాడు. ఆయనసేవలో వుండి నీవిషయం ఆలోచించలేకపోయాను. ఇది తప్పు అని భావించకు' అంది. 'నీ మొగుడంత ఎక్కువా, బ్రాహ్మడంటే ఇంత తక్కువానా?' అంటూ మరింత కళ్ళెర్రచేశాడు బ్రాహ్మడు 'బ్రాహ్మలంటే దేవేంద్రుడుకూడా తలవంచుతాడు. అలాంటిది నీకొవ్వు నిన్ను ఇలా చేస్తోంది. బ్రాహ్మలంటే గడ్డిపోచలా చూస్తున్నావు. అవమానంతో కోపగిస్తే, బ్రాహ్మడు ఏంచేస్తాడో తెలుసా? కొండలూ, నదులూ, వనాలూఅన్నింటితోనూ భూప్రపంచం భస్మంచేసేస్తాడు. బ్రాహ్మడికి అడ్డేమిటి? నీకంటికి మాత్రం కనిపించకండా వున్నారు కాని' అన్నాడు.

'ఆడదాన్ని. నాఅపరాధం పట్టించుకోకు' అంటూ మళ్ళీ నెమ్మదిగా బతిమిలాడింది ఇంటామె. 'బ్రాహ్మలంటే నాకు మాత్రం తెలియదని కాదు. దేవతలతో సమానమయినవాళ్లు బ్రాహ్మలు.

ఒక బ్రాహ్మణుడు సముద్రంనీళ్ళు తాగడానికి పనికిరాకుండా శపించాడు. ఒకాయన దండక దేశం దగ్ధంచేశాడు. ఒకడు వాతాపిని మింగి అరిగించేసుకున్నాడు. ఇలా ఎంతమందో ఎన్నో చేశారు. తెలుసు నాకు. బ్రాహ్మల మాహాత్మ్యాలు విననివాళ్ళెవరు? తెలిసి తెలిసి నేను మాత్రం కోరివిత్తో తలగోక్కుంటానా? అంత వెర్రిదాన్నా? కాదు. అయితే ఇదేమిటీ అంటావేమో! చెపుతాను. కొంచెం శాంతంగా మాత్రం విను.

'భర్తే నాకు దైవం. మనసా, వాచా, కర్మణా ఆయన హితమే కోరి నేను నడుచుకుంటాను. ఆయన సేవే నాకు పరమధర్మం. కనక, ముందు అతనిసేవ నిర్వర్తించాను. నువ్వు కోపగొట్టువాడివనీ నాకు తెలుసు. నీకోపంమూలాన వాళ్ళ కొంగ చచ్చిపోయిందనీ ఎరుగుదును. అయితే, కోపంమాత్రం మంచిదికాదని గ్రహించాలి నువ్వు. కోపమూ, మోహమూ — ఈ రెండూ ఘోరమయిన శత్రువులయి మనిషిని పీడిస్తూ వుంటాయి. వీటిని మనస్సులో అణుచుకోవాలి. అప్పుడే బ్రాహ్మడికి గౌరవం.

'సత్యం చెప్పినవాడూ, హింస చెయ్యనివాడూ, గురుజనుల హితంకోరేవాడూ, ఇంద్రియాలు స్వాధీనంలో వుంచుకునేవాడూ, యావన్మందినీ తనలాగే చూసుకునేవాడూ, ధర్మం తప్పనివాడూ కామానికి వశంకానివాడూ, ఆరుకర్మలూ* సముచితంగా ఆచరించేవాడూ మాత్రమే బ్రాహ్మడు. అలాంటి పుణ్యాత్ముణ్ణే బ్రాహ్మడనాలి. అలాంటివాణ్ణే దేవతలూ కీర్తిస్తారు. ఆర్జవమూ, శమమూ, అధ్యయనమూ — ఇవే బ్రాహ్మడికి పరమధనం. అతడి ధర్మగతికి ఇవే సాధనం. ఇవే వేదాల్లో తెలిపిన విధులు.

* యజనమూ, యాజనమూ, అధ్యయనమూ, అధ్యాపనమూ, దానమూ, ప్రతిగ్రహమూ.

'ధర్మం అనేకవిధాల సూక్ష్మంగా వుంటుంది. నువ్వు కేవలం స్వాధ్యాయపరుడివి. అంటే వేదాలు వల్లించడం మాత్రం చేస్తున్న వాడివి. అంచేత ధర్మసూక్ష్మాలు నీకు తెలియవు. నువ్వు బాగుపడాలని వుంటే, నామాట విను. వెంటనే మిథిలానగరంవెళ్ళు. అక్కడ వొక కిరాతుడు వున్నాడు. అతడి పేరు ధర్మవ్యాధుడు. జితేంద్రియుడతడు. సత్యవాది. మాతాపితృ భక్తుడు. అతణ్ణి ఆశ్రయించు. సకలధర్మాలూ నీ కతడు చెప్తాడు. నీ సంశయాలు యావత్తూ తీరుస్తాడు. నామీద కోపం వొదిలి పెట్టి ప్రసన్నుడివి కా. ఆడవాళ్ళకి పరిజ్ఞానం వుండదు కదా! అందుకని, ఆడది ఎంతతప్పు చేసినా క్షమించడం ధర్మం' అంది.

వింటూన్నంతసేపూ చెమట పట్టిపోయాడు బ్రాహ్మడు. ఆమె తెలివికి ఆశ్చర్యపోయాడు. తన తప్పు తనకి తెలిసివచ్చింది. 'అమ్మా, నీఉపదేశం నామనస్సుకి ఎంతో ప్రశాంతి కలిగించింది' అన్నాడు. నిజంగా నేను నిందార్హుణ్ణి. క్షమించు. నీ ఆదేశం అనుసరిస్తాను. మిథిల వెళ్ళి వస్తాను. సర్వశుభాలూ నీకు కలుగుతాయి' అని వెంటనే తిన్నగా మిథిల బయల్దేరాడు. పల్లెలూ పట్నాలూ అనేకం దాటుకుంటూ ఏకాఎకిని ప్రయాణంచేశాడు.

### ధ ర్మ వ్యా ధు డు

మిథిలాపట్నం చేరుకున్నాడు కౌశికుడు. పట్నం సౌందర్యం చూస్తూ రాజమార్గం ప్రవేశించాడు. అక్కడివాళ్ళని అడిగి ధర్మవ్యాధుడి వునికి తెలుసుకున్నాడు. బజార్లో కసాయికొట్టం పెట్టుకు కూచున్నాడు ధర్మవ్యాధుడు. వంతులు వంతులుగా పెట్టి మాంసం అమ్ముతున్నాడు. సందడిగా వచ్చి కొనుక్కుపోతున్నారు జనం. అసహ్యంగా వుంది మాంసందుకాణం. అడుగుపెట్టలేకపోయాడు కౌశికుడు. ఒకవోర కొంచెం దూరంగా వొదిగినుంచున్నాడు.

బ్రాహ్మడిరాక తెలిసిపోయింది ధర్మవ్యాధుడికి. లేచి ఎదురు వచ్చాడు. భక్తిపూర్వకంగా నమస్కారం చేశాడు. కుశలమడిగాడు. ఎంతో మంచిగా మాట్లాడాడు. 'అయ్యా, ఆఇల్లాలు పతివ్రత. ఆమే నాసంగతి చెప్పింది నీకు. ఆమెమాటమీదే వచ్చావు నాదగ్గిరికి. నువ్వు వచ్చినపని తెలుసు నాకు. సంతోషంగా వుంది. రా. మా యింటికి వెళదాం' అని తనయింటికి తీసుకువెళ్ళాడు బ్రాహ్మణ్ణి.

చెప్పకండానే తనసంగతి తెలుసుకున్నాడు ధర్మవ్యాధుడు. మరింత నిచ్చెరపోయాడు కౌశికుడు. 'రెండు వింతలు చూశాను, మొదటిది పతివ్రత తెలివి. రెండోది ఈకిరాతుడి ఎరుక.' ఇలా ఆలోచిస్తూ ధర్మవ్యాధుడి వెంట అతడి ఇంటికి నడిచాడు బ్రాహ్మడు. ఇంటికి వెళ్ళాక ఎంతో గొప్పగా అతణ్ణి పూజించాడు ధర్మవ్యాధుడు. ఆమాటా ఈమాటా ఆడుతూ అడిగాడు కౌశికుడు: ధర్మం తెలిసినవాడివి. జీవహింస జీవనంగా పెట్టుకున్నావు! ఘోరం. ఇది చూస్తూవుంటే దుఃఖంగా వుంది నాకు. ఏం పని ఇది?' అన్నాడు.

'నువ్వు పొరపడుతున్నావు' — చిన్న చిరునవ్వుతో అన్నాడు ధర్మవ్యాధుడు. 'బ్రాహ్మలికి తపస్సూ, అధ్యయనమూ, బ్రహ్మచర్యమూ పరమధర్మం. రాజులికి దండనీతీ, వైశ్యులికి కృషీ పశువులు పాలించడమూ, వర్తకమూ, శూద్రులికి బ్రాహ్మణశుశ్రూషా ఎలాగోఅలాగే మాంసం అమ్మకు బతకడం మాకు పరమధర్మం. పైగా ఇది మాకు వంశానుక్రమంగా వస్తూవున్న కులవృత్తి. అంతేకాదు. ఈదేశంరాజు జనకుడు. తనధర్మం పిసరంత తప్పడు. సకలవర్ణాలూ సరిగ్గా రక్షిస్తూ వుంటాడు. తమ వర్ణాచారం వదిలిపెట్టిన వాళ్ళని—వాళ్ళు తన కుమార్తెలయినా సరే,— కఠినంగా దండిస్తాడు. అంచేత కూడా నేను మాకులాచారం విడిచి పెట్టడానికి భయపడతాను.

'ఇలా మాంసం అమ్ముకు బతుకుతున్నాను. నిజమే. అయినా, నేనుమాత్రం జీవహింస చెయ్యను. పైవాళ్ళు చంపి తెస్తారు. మాంసం మాత్రం నేను అమ్ముతాను. తగిన వెలకే అమ్ముతాను. ఆ వచ్చిన డబ్బుతో జీవయాత్రసాగిస్తున్నాను. నిజంచెప్పాలంటే, ఆధనంతో నాకు ప్రమేయం లేదు. మనశ్శాంతే నాకు ధనం. వినయంతో గురుజనుల సేవ చేస్తాను. వృద్ధులూ, అతిథులూ, బ్రాహ్మలూ, దేవతలూ- వీళ్ళందరినీ పూజిస్తాను. సత్యమూ, శౌచమూ, దానమూ ఎప్పుడూ మరచిపోను. సేవకులన్నా బంధువులన్నా ఓర్పు చూపిస్తాను. అసూయ దగ్గిరకు రానివ్వను. దురాశ మనస్సు ముట్టనివ్వను. పరనింద చెవుల పడ నివ్వను. నిరంతరం ఉపవాసవ్రతాలు వదలకండా చేస్తాను. ఏక పత్నీవ్రతం విడిచిపెట్టను. ఋతుకాలాల్లో తప్ప స్త్రీసంగమం తల పెట్టను. నిందా, స్తుతీ ఒకేలాగే భావిస్తాను. కనకనే, తక్కువ కులంలో పుట్టినా నేను పవిత్రుణ్ణే అయాను. ప్రసంగం వచ్చింది కనక ఇదంతా చెప్పవలసి వచ్చింది. అదీకాక, నాదగ్గిర ఏదో వినాలని వచ్చావు నువ్వు. అంచేత ధర్మవిశేషాలు నాలుగు ముక్కలు చెపుతాను. జాగ్రత్తగా మాత్రం విను.

'తన కులధర్మం తప్పకండా బతకడమే ఉత్తమధర్మం అంటారు పెద్దలు. మనస్సులో దయా, అన్నిటిమీదా ఓర్పూ అవసరం. విషయవాంఛలు మానుకోవాలి. త్యాగం-త్యాగానికి మించిన గుణం మరి లేదంట్, నమ్ము. త్యాగమున్నవాడికి అసాధ్యమే లేదు ప్రపంచంలో. నిజమయిన మాట, మంచికలిగించే మాట చెప్పాలి. సజ్జనుల్ని సర్వదా పూజించాలి. క్రోధంవల్లా విద్వేషంవల్లా మతి చలించినా, ధర్మం మాత్రం తప్పకూడదు. అదే ఉత్తమమార్గం. మంచీ చెడ్డా, దుఃఖమూ సంతోషమూ—దేనికీ లొంగకూడదు, మనకి ఎవ్వరైనా చెడ్డచేశారనుకో. అయినా వాళ్ళకీకూడా మనం మంచే

చెయ్యాలి. వీటినే ప్రశంసిస్తారు పెద్దలు. వీటికి వ్యతిరేకంగా నడిచేవాడే దోసకారి. అతడు తనపాపంతో తానే కాలి పూరుకుంటాడు. వాడికి వేరే వొకరు ప్రత్యేకం చెడ్డ చెయ్యనక్కర్లే వుండదు.

'ధార్మికులు మంచిపని చేస్తూవుంటే, అది చెడగొట్టాలని చూస్తారు నాస్తికులు. వాళ్ళనుచూసి ధర్మంమీద ఆసక్తి వదలిపెట్ట కూడదు తెలిసినవాళ్ళు. పొరపాటువల్ల ఏదన్నా పాపం చేశామేఅనుకో తెలిశాక, పశ్చాత్తాపంవల్ల సగమూ, 'మరి ఎప్పుడూ చెయ్యను' అని నిశ్చయించుకోవడంవల్ల సగమూ-ఇలా ఆపాపం వదుల్చుకో వచ్చు. పాపాల్లోకల్లా క్రోధమూ, లోభమూ-ఈరెండే పెద్ద పాపాలు. అంచేత, ఈరెండూ జయిస్తేనేకాని ధార్మికుడని అని పించుకోలేడు మనిషి.

'ధర్మవిషయంలో శిష్టాచారమే ప్రమాణంగా తీసుకోవాలి. శిష్టాచారానికి దూరంగావున్న కొన్ని మార్గాలుంటాయి. గడ్డితో కప్పివున్న నూతుల్లాగ కపటధర్మాలతో ఆవరించి వుంటాయవి. వాటికి దూరంగానే వుండాలి మనం' అన్నాడు.

ధర్మవ్యాధుడి ఉపదేశం శ్రద్ధగా విన్నాడు కౌశికుడు. 'అయితే, శిష్టాచారమంటే ఏమిటో కూడా చెప్పు, అని అడిగాడు. 'శిష్టులు అంటే ఉత్తములు' అంటూ మళ్ళీ ఎత్తుకున్నాడు ధర్మవ్యాధుడు. 'ఉత్తములు ఆచరించేవే శిష్టాచారాలు. దానమూ,తపమూ,సత్యమూ, యజ్ఞమూ, ఆర్జవమూ, కామమూ, క్రోధమూ లోభమూ, మొదలైనవి వొదిలిపెట్టడమూ,గురుజనులశుశ్రూషా,దమమూ,సంతోషమూ,అధ్య యనమూ, దాంభికత్వమూ దైన్యమూ అసూయా అహంకారమూ లేకండా వుండడమూ, సనాతనధర్మమే ప్రశంసించడమూ,నాస్తికులతో సహవాసంచెయ్యకండా వుండడమూ, శీలం రక్షించుకోవడమూ, తీర్థ యాత్రలు చెయ్యడమూ, శుచిగా వుండడమూ, భూతాలన్నిటిమీదా

దయకలిగి వుండడమూ, మితంగా హితంగా మాట్లాడడమూ-ఇవన్నీ శిష్టాచారాలు. శిష్టాచారం ప్రకారం నడుచుకుంటేకలిగే ఆనందం మరోవిధంగా లభించడం దుర్లభం.

'అందుకని నువ్వూ శిష్టాచారంప్రకారం నడుచుకో. గురు శుశ్రూష చెయ్యి. వేదాధ్యయనమూ చెయ్యి. మంచి జ్ఞానంతో చిత్తం పరిపక్వంచేసుకో. మోహం వొక మహానదివంటిది. విష యాలే దానికి నీళ్ళు. కామమూ క్రోధమూ - ఇవి పెద్దపెద్ద మొసళ్ళు. చలించని ధైర్యం తెప్పచేసుకుని ఈమహానది దాటు. కృతార్థుడివికా. క్రమంగా శిష్టాచారం పట్టుబడిందా, అప్పుడు, హృదయం ధర్మా నికి వునికిపట్టయిపోతుంది. సత్యమూ, అహింసా వాటంతట అవే కుదుటపడతాయి.

ధర్మాలన్నిటిలోకీ అహింస రాజు. అది సత్యం మీద ఆధారపడి వుంటుంది. అంచేత, శిష్టాచారాలు అన్నిటిలోనూ సత్యమే గొప్ప దన్నారు, వేదాలు తెలిసిన పెద్దలు వేదాల్లో చెప్పిందీ. శాస్త్రాల్లో వివ రించిందీ, శిష్టజనులు ఆచరించిందీ - ఇలా ధర్మం మూడు విధాలు. ఈ మూడువిధాలధర్మాలూ మనుష్యుల సద్గతికి కారణాలు.

ఎప్పుడూ శమవంతుడై, శిష్టాచారంప్రకారం నడుచుకునే పుణ్యాత్ముడు దుర్గతులనించి దాటిపోతాడు. ప్రజ్ఞ అనే మేడమీద కూచుంటాడు. మోహపంకంలో మునిగి అధోగతికి పోడు. దుఃఖం అనుభవించేలోకం చూస్తూ, తానుమాత్రం నవ్వుతూ వుంటాడు.

ఇదిగో, మొట్టమొదట నాప్రవర్తన చూసి, 'ఇది హింసా కర్మకదా,' అన్నావు. దానికి ఏదో సమాధానం చెప్పాను. అది అలా వుండనీ. 'హింసఅంటే ఇలా వుంటుంది' అని విడమరిచి చెప్పడంకూడా అంత సులభం కాదు. ఏమంటావా? తాము పూర్వం

చేసుకున్న కర్మలవల్లే ప్రాణులు నశిస్తాయి. అంతే. చంపేవాడు కేవలం నిమిత్తమాత్రుడే అవుతాడు. ఆచార్యులయిన మహాపురుషులు ఇదే చెప్పారు. అదీకాక, 'పక్షులూ, దుంపలూ మొదలయినవి పశువులికీ వాటికీ ఆహారంగా బ్రహ్మ నియమించాడు' అని గొంతెత్తి చాటుతున్నాయి వేదాలు. అది కాదనగలమా? శిబిచక్రవర్తి తన శరీరంకోసి ఇంద్రుడికీ, అగ్నికీ మాంసం పెట్టలేదా? అది హింసే కదా! అలా అని అతడికి ఉత్తమగతి లేకండా పోయిందా? రంతిదేవుడు అనే రాజు, తెల్లవారితే రెండేసివేలు ఆవులు వధించేవాడు. అలా ఒకటికాదు, రెండుకాదు – వెయ్యిసంవత్సరాలు వధించాడు. అతణ్ణి పాపం పట్టుకుందా? వేదార్థాలమీదే ఆసక్తికల పురుషులు యజ్ఞాల్లో పశువులు చంపడం లేదా? వాళ్ళకి పుణ్యలోకాలు లేకండా పోయాయా? అగ్నులు అధికంగా మాంసం కాంక్షిస్తాయని వేదాల్లో లేదా; పితృదేవతల కార్యాల్లో మాంసం పెట్టాలనీ, పితృదైవత శేషం భుజించాలనీ మునులే చెప్పారు కదా!

వ్యవసాయదారుడు పొలం దున్నుతాడు. అతడి నాగలి మొనలో ఎన్నిప్రాణులు చావడంలేదు! అది హింస అంటావా? అహింస అంటావా? ఇంతెందుకూ, మనుష్యులు భూమిమీద నడిచినప్పుడు పాదాలకింద ఎన్ని ప్రాణులు నలిగి చావడంలేదు! ఇది హింసా, మరేమన్నానా? నువ్వే ఆలోచించు.

నీరూ, నేలా, ఆకాశమూ—ఇదంతా ప్రాణులతోనే నిండివుంది. అంచేత, ఏపనిచేసినా జీవహింస తప్పదు. కదిల్తేచాలు జీవహింస. హింస లేకండా దేహయాత్ర సాగదు. ఇదంతా ఆలోచించకండా 'మేం జీవహింస చెయ్యడం లేదు' అంటారు కొందరు. వెర్రి. అన్నీ

* చూ. ఆనుశాసనిక పర్వం. అ. 3.

వదిలిపెట్టి, అహింసావ్రతం పెట్టుకుని అడివికిపోయిన మునులసంగతే చూద్దాం. ఆకూ అలమూ, దుంపా దుబ్రూ తింటూ బతుకుతారా లేదా వాళ్ళు! అది మాత్రం జీవహింస కాదూ? నిజం విచారిస్తే హింస చెయ్యనివాడంటూ ఎవ్వడూ లేడు ప్రపంచంలో. ఐతే, శమతమ శక్తినిబట్టి వీలయినంతవరకూ హింస చెయ్యకండా వుండాలి. అదే అహింస అంటే.

'ధర్మం అనేకవిధాలుగా వుంటుంది. ధర్మసూక్ష్మం గ్రహించడం కష్టమైన సంగతి. వేదప్రమాణం మీాదా, పెద్దల నడవడిని బట్టీ అది తెలుసుకోవాలి. ప్రాణులమేలుకోసం, అసత్యం చెప్పినా అది సత్యమే అవుతుంది. పుణ్యమే కలుగుతుంది. సత్యం చెప్పడంవల్ల ఉపద్రవం కలిగిందనుకో, అప్పుడు అది సత్యంకాదు; అసత్యమే అవుతుంది. దానివల్ల పాపమే వస్తుంది. ప్రాణంమీాదికి వచ్చినప్పుడూ, పెళ్ళిళ్ళ సందర్భంలోనూ అబద్ధమాడినా అది నిజంతోనే సమానమన్నారు పెద్దలు. ఇలా వుంటాయి ధర్మసూక్ష్మాలు.*

'మంచిదే కానీ, చెడ్డదే కానీ కులధర్మం వదలరాదన్నారు ధర్మవేత్తలు. ఆపని ఏదయినా సరే, అది మన భాగ్యమని మాత్రం అనుకోవాలి. అంతే. పూర్వకర్మఫలం తప్పించుకోలేం. మూఢుడు మాత్రం అది గ్రహించలేడు. ఆపదవచ్చినప్పుడు దేవుణ్ణి తిడతాడు. ఒకపని చేసినప్పుడు, దాని ఫలానికి తానే కర్తననుకుంటాడు తెలీక. తానే కర్త ఐతే, ఏదీచెడకండా అన్నిపనులూ ఫలించినట్టు చెయ్యలేడేం?

'నీతిమంతులూ, ధర్మపరులూ, సమర్థులూ అయినవాళ్లుకూడా చేసేపనులు వొకప్పుడు ఫలించవు. దుష్టచిత్తులూ, క్రూరులూ చేసే పనులు ఫలిస్తాయి. ఊరికే కూచున్న కొందరికి డబ్బువచ్చి వాళ్ళో

* చూ. శాంతిపర్వం. అ. 3.

పడుతుంది. ఎంత ఆయాసపడినా కొందరికి దమ్మిడీఅయినా దొరకదు. పేదవాళ్ళకి కొందరికి సంతానం కుక్కముదికిగా వుంటుంది. ధనవంతులికి కొందరికీ, ఎన్ని దానాలూ ధర్మాలూ చేసినా, వ్రతాలూ గితాలూ చేసినా సంతానం వుండదు. ఇదంతా వాళ్ళవాళ్ళ కర్మఫలం కాకపోతే మరేమిటి? కర్మఫలమే కాక, అంతా తన ప్రయోజకత్వమే అయితే ఆపదలూ, రోగాలూ, చావులూ, లేకుండానే వుండే వాళ్ళు మనుషులు.

'కర్మవల్లే దేహం కలుగుతుంది. కర్మవల్లే బతుకుతుంది. దేహం పడిపోయాక, దేహంలో వుండేజీవుడు దేహం వొదిలి, కర్మానుసారంగా ఇంకోచోటికి వెళ్ళిపోతాడు.'

జీవుడు విషయం చెప్పగానే 'ఐతే జీవుడు ఎలాంటివాడు?' అని అడిగాడు కౌశికుడు.

'జీవుడు సనాతనుడు' అని మళ్ళీ అందుకున్నాడు ధర్మవ్యాధుడు. 'జీవుడు పవిత్రుడు. నిజకర్మవల్ల అశాశ్వతమయిన దేహంలో ప్రవేశిస్తూ వుంటాడు. దేహం నశించినంతమాత్రాన జీవుడు నశించడు. ఈ దేహం వదిలిపెట్టి, ఇంకోదేహంలో ప్రవేశిస్తాడు. కర్మానుసారంగా సుఖమో, దుఃఖమో అనుభవిస్తాడు. ఇలాగే, జీవుడికి మళ్ళీ మళ్ళీ దేహబంధం కలుగుతూనే వుంటుంది. అయితే, ఈ దేహబంధం తాను చేసిన పుణ్యపాపాల ననుసరించి వుంటుంది. స్థిరమయిన పుణ్యకర్మ మాత్రమే చేసినట్టయితే దేవత్వం కలుగుతుంది. పుణ్యకర్మా, పాపకర్మా కలిపిచేస్తే మనిషిజన్మ కలుగుతుంది. సుతరామూ పాపమే చేస్తే పశువు జన్మో, పురుగు జన్మో కలుగుతుంది. ఇలాగే అనేక యోనుల్లో పుడుతూ, చస్తూ మోహసముద్రంలో కొట్టుకుంటూ వుంటాడతను. అంతేకాని, వొకవొడ్డు చేరడమంటూ వుండదు.

'ఇది తెలుసుకున్న బుద్ధిమంతుడు మాత్రం పాపం దగ్గిరికిపోడు. మదమూ, అహంకారమూ, మచ్చరమూ ఇవేవీ దగ్గిర చేరనివ్వడు. ధర్మమార్గంలోనే నడుస్తాడు. ధర్మం రుచిమరిగితే దాన్నివొదిలిపెట్టడు. అధికంగా మళ్ళీ మళ్ళీ ధర్మమే ఆచరిస్తాడు. వదలకండా ధర్మాలు చేస్తూవుంటే, మనస్సు నిర్మలమవుతుంది. ఇంద్రియార్థాలు — అంటే శబ్దమూ, స్పర్శమూ మొదలయిన విషయాలు వృత్తివే అని తెలుస్తుంది. దానిమీద వాటిని అసహ్యించుకుంటాడు; వదిలిపెడతాడు. తపస్సూ, దమమూ, సత్యశీలమూ — వీట్లో పరిణతి పొందుతాడు. చివరికి ముక్తుడై పరమపదం చేరతాడు' అన్నాడు.

'ఇంద్రియాలంటే ఏవి? వాటిని నిగ్రహించకపోతే పాప మెలా వస్తుంది? నిగ్రహించినవాడికి ఏమిటి సిద్ధిస్తుంది?' అని మళ్ళీ అడిగాడు కౌశికుడు.

ధర్మవ్యాధు డిలా చెప్పాడు: 'విషయాలు తెలుసుకో డానికి మనస్సే మూలం. కామక్రోధాలతో కూడుకుని మనస్సే పురుషుణ్ణి ఎప్పుడూ విషయాలకోసం ప్రేరేపిస్తూ వుంటుంది. విషయాలలో పడ్డ పురుషుణ్ణి రాగం ఆవరిస్తుంది. రాగంవల్ల లోభమూ లోభం వల్ల నిర్దాక్షిణ్యమూ, నిర్దాక్షిణ్యంవల్ల ఔద్ధత్యమూ పెరుగుతాయి. ఇలా పాపంలోనే కూరుకుపోతూ అతడికి బుద్ధిమంతులు చెప్పిన మంచి మాటలు రుచించవు. చెడ్డవాళ్ళతోనే సహవాసం ఏర్పడుతుంది. అతడు మనస్సులో వొకటి భావిస్తాడు. నోటితో వొకటి చెప్తాడు. చెయ్యడమేమో ఇంకొకటి చేస్తాడు. ఇలా ఇహంలో పాపాత్ముడై చెడతాడు. పరంలో సహా దుఃఖమనుభవిస్తాడు. అందుచేత విషయాల జోలికి పోకూడదు. సాధువుల సహవాసంచేసి, సుగతిపొందాలి.

'ఇంద్రియాలంటే ఏవి?' అనీ, 'వాటిని నిగ్రహిస్తే ఎలాంటి ఫలం కలుగుతుంది?' అని అడిగావు. అది చెప్పడం అంటే బ్రహ్మ

విద్య చెప్పడం అన్న మాట. నిజానికి నాబోటివాడికి బ్రహ్మవిద్య తెలియడం కష్టం. అయినా, నువ్వు ఉత్తమ బ్రాహ్మడివి. ఉత్తమ బ్రాహ్మడికి ప్రియమయిన పని తప్పక చేసితీరాలి. అంచేత, పరమ బ్రహ్మవేత్తలయిన బ్రాహ్మణోత్తములికి నమస్కరించి, బ్రహ్మవిద్యా విషయం చెపుతాను. సావధానంగా విను.

'ఆకాశమూ, గాలీ, అగ్గీ, నీళ్ళూ, భూమీ — ఇవి పంచమహాభూతాలు. శబ్దమూ, స్పర్శమూ, రూపమూ, రసమూ, గంధమూ — ఇవి ఈ మహాభూతాల గుణాలు. భూమికి ఈ అయిదు గుణాలూ వుంటాయి. నీళ్ళకి గంధం మినహాయించి తక్కిన నాలుగు గుణాలే వుంటాయి. అగ్నికి శబ్దమూ, స్పర్శమూ, రూపమూ వుంటాయి. గాలికి శబ్దమూ, స్పర్శమూ వుంటాయి. ఆకాశానికి వొక్క శబ్దం మాత్రం వుటుంది. ఈ అయిదు మహాభూతాలూ వొక్కదాన్ని విడిచి వొకటి వుండలేవు. ఒకటిగానే వుండి, స్థూలంగా మాత్రం అయిదు విధాలుగా వ్యక్తమవుతూ వుంటాయి.

'చెవీ, చర్మమూ, కన్నూ, నాలికా, ముక్కూ — ఈఅయిదూ ఇంద్రియాలు. శబ్దమూ, స్పర్శమూ, రూపమూ, రసమూ, గంధమూ— ఈఅయిదూ ఇంద్రియవిషయాలు. ఈ చెప్పిన అయిదు ఇంద్రియాలే కాక, ఆరోది మనస్సు. ఏడోది బుద్ధి. ఎనిమిదోది అహంకారం. సత్వమూ, రజస్సూ, తమస్సూ ఈ మూడూ గుణాలు. ఇపుడు చెప్పిన ఈ పంచ మహాభూత ప్రపంచం యావత్తూ అవ్యక్తం అనే తత్వంలో ఆవిర్భావమూ (పుట్టడం) తిరోభావమూ (నశించడం) పొందుతూ వుంటుంది.

'బాహ్యేంద్రియాలవల్ల తెలియవచ్చేది వ్యక్తం. ఇంద్రియాలికి అందక, కేవలం ఊహామాత్రంచే తెలుసుకోదగింది అవ్యక్తం. శబ్దమూ మొదలయిన విషయాల్లో ఇంద్రియాలు తగుల్కుంటాయి; ఇష్టం వచ్చినట్టు చిందులు తొక్కుతాయి. బుద్ధిమంతుడు వాటి స్వభావం

తెలుసుకోవాలి. అప్రమత్తుడై వుండాలి. వాటిని లొంగదీసుకోవాలి. ఇంద్రియాలు జయించిన ధీరుడికి ఆత్మదృష్టి ప్రాప్తమవుతుంది. అప్పుడతడు సర్వభూతాల్లోనూ తననే చూస్తాడు. అదే ఆత్మదర్శనం ఆత్మదర్శనం సిద్ధించినవ్యక్తి తపస్సులో ఎన్నడూ చలించడు. సకల విషయాలూ వొదిలిపెట్టడమే తపస్సు. తపస్సులో స్థిరుడై కూచున్న యోగికి మరో పనే వుండదు. స్వర్గమే అను, నరకమే అను అది ఇంద్రియాల నడవడినిబట్టే వుంటుంది. ఇంద్రియాలు మళ్ళిస్తే స్వర్గం. మళ్ళించకపోతే నరకం.

'ఈ శరీరమే రథం. ఇంద్రియాలు గుర్రాలు, ఆత్మ సారథి. ఈ పెంకిగుర్రాలు ఇష్టం వచ్చినట్టు పరుగెత్తకండా ధైర్యం అనే పగ్గం పట్టినవాడే స్వర్గందారిని వెళతాడు. అతడే ధీరుడూ, ఉత్తముడూ అనిపించుకుంటాడు.

'ఇంద్రియాలు ఎటు లాగితే అటు పరుగెడుతుంది మనస్సు. ఆ ఉద్వేగం అదుపులో వుంచకపోతే, తుపానులో వోడ సముద్రంలో నశించినట్టు సర్వనాశనం అయిపోతుంది. బుద్ధి. అయిదు ఇంద్రియాలూ, మనస్సూ తన స్వాధీనంలోకి వచ్చాక, పురుషుడు సదా ధ్యానసమాధి మగ్నుడవుతాడు. అప్పుడు అతణ్ణి దేవతలూ, మునులూ కూడా పొగుడుతారు' అన్నాడు.

తరవాత, సత్వమూ, రజస్సూ, తమస్సూ — ఈ మూడు గుణాల వివరం విడమర్చి చెప్ప' మన్నాడు కౌశికుడు.

'చెపుతాను, విను' అంటూ వివరించాడు ధర్మవ్యాధుడు. మూడు గుణాల్లోనూ తమోగుణం నీచమైనది. అది మోహం కలిగిస్తుంది. సత్వగుణం ప్రకాశవంతమైంది. మూడింటిలోకీ ఉత్తమమైంది. పై రెండుగుణాలూ కలిసిందే రజోగుణం, అసౌఖ్యమూ, నిజం తెలియకపోవడమూ, దైన్యమూ, మోహమూ, ఓర్పు లేకండా వుండ

డమూ — ఇవి తామసభావాలు. రాగం, లోభం, జడత్వం, మానం ఇవి రాజసభావాలు. ధైర్యమూ, శాంతీ, దయా, సంతోషమూ, విద్యా సాత్వికభావాలు.

'జ్ఞానవంతుడై తత్వం తెలుసుకుంటాడు సాత్వికుడు. లోక వృత్తాంతాలు అసత్యమని అతను అసహ్యించుకుంటాడు. సమస్త వాంఛలూ వదులుకుంటాడు. మమకారం, వికారం, అహంకారం పరిత్యజిస్తాడు. హింసా మొదలయినవి విడిచిపెట్టి, ఉత్తమ మయిన శాంతి పొందుతాడు. సత్వగుణం కలిగినవాడు శూద్రుడే అయితే ఏం గాక, జన్మాంతరంలో వైశ్యుడై తరవాత క్షత్రియుడై, క్రమంగా బ్రాహ్మడే అయిపోతాడు. తుదకి మానవజన్మనుండి మోక్షమూ పొందుతాడు' అన్నాడు.

ధర్మవ్యాధుడి జ్ఞానోపదేశం వింటూన్న కొద్దీ వినాలనే ఉత్సాహంగావుంది కౌశికుడికి. ఇదంతా విన్నాక, మళ్ళీ అడిగాడతను: 'ఆత్మని అంటిపెట్టుకుని దేహంలో అగ్ని ఎలా వెలుగుతుంది? దేహంలోని వాయువులికి ఏ వేవి వునికిపట్లు?' అని ప్రశ్నించాడు.

'ఆత్మాగ్నికి నాభి ఆశ్రమం. నాభినుండి శిరస్సుదిక్కు వృద్ధి పొందుతూ వుంటుండది.

'ప్రాణమూ, అపానమూ, సమానమూ, ఉదానమూ, వ్యానమూ అని శరీరంలోని వాయువు అయిదువిధాలు. ఈ అయిదు వాయువులూ అగ్నిని అంటిపెట్టుకునే వుంటాయి. ప్రాణవాయువు శిరస్సులో వుంటుంది. అపానం గుదమూ, పొత్తికడుపూ అంటిపెట్టుకుని వుంటుంది. ఉదానం కంఠంలో వుంటుంది. సమానం బొడ్డుదగ్గిర వుంటుంది. వ్యానం శరీరమంతటా అన్ని సంధుల్లోనూ వుంటుంది.

ప్రాణమూ, అపానమూ కలిసి మొదలకండా ఆత్మాగ్ని వెలిగిస్తూ వుంటాయి. మలమూత్రాలు బహిర్గతం కావడానికి అపానం

కారణం. ఉదానం కర్మబలయత్నకారి. భూతాత్మభావం ప్రాణం. ప్రాణమూ, అపానమూ, అగ్ని - వీటి సహాయంతో అన్నరసం ఆకర్షించి అన్ని ధాతువులూ * పోషిస్తుంది సమానం. ప్రాణమూ, అపానమూ వీటితో కూడుకుని, దేహమంతటా చరిస్తూవున్న అగ్నే జీవాత్మ. నీటిలో తామరాకులాగ దేహంతో వుండీ కూడా అంటకుండా వెలుగుతూన్న ఈ జీవాత్మే పరమాత్మ. చేతనంలేని శరీరం చైతన్యవంతం చేస్తుంది జీవాత్మ. ఇది పరమయోగులు కనిపెట్టిన రహస్యం. వాయురహస్యం తెలిసిన మునులు అభ్యాసంచేసి, జీవాత్మని శిరస్సులో బంధించి వుంచుతారు.

'చేతనంలేని క్షేత్రం (దేహం) చేతనవంతం చేస్తాడు జీవాత్మ. జ్యోతిర్మయు డతడు. అతడే పరమాత్మ. అతడే ముల్లోకాలూ కల్పించిన సుప్రసిద్ధుడు. నాశనంలేనివాడు. భూతాల్లో వెలిగే ఆ భూతాత్ముణ్ణి అద్వైతబుద్ధికల జ్ఞానులు మాత్రం సూక్ష్మధర్మంతో తెలుసుకుంటారు. జ్ఞాని అయిన మహాత్ముడు శుభాశుభకర్మల జోలికి పోనేపోడు. సుఖమే అను, దుఃఖమే అను - రెండూ వొక్కలాగే చూస్తాడు. అలాంటి పుణ్యాత్ముడు ఏంచెయ్యాలో చెపుతాను, విను.

నిత్యమూ నియమంప్రకారం తినాలి. ఇంద్రియాలు జయించాలి. రాత్రి తొలిభాగమూ కడపటిభాగమూ యోగధారణతో వుండాలి. అప్పుడే జ్ఞానదీపంతో జీవాత్మని తనలోచూస్తా డతడు. అమృతమయత్వమూ పొందుతాడు.

'ముఖ్యంగా వొకమాట. కామమూ, క్రోధమూ ఈ రెంటి విషయంలో మాత్రం బహుజాగ్రత్తగా వుండాలి. జ్ఞానులికి ఇదే సర్వదా క్షేమకరమయిన మార్గం.

---

* కొవ్వూ, రక్తమూ, మాంసమూ, మెదడూ ఎముకలూ, మూలుగూ, శుక్రమూ- ఈఏడూ దేహంలోని ధాతువులు.

'పురుషుడు ఎప్పుడూ కర్మచేస్తూ వుండాలి. కాని, కర్మఫలం మాత్రం విడిచిపెట్టాలి. కోర్కెలువొదలిపెట్టడమే యోగాల్లోకల్లా ఉత్తమయోగం. ఈజ్ఞానం లక్ష్యంగాకలవాడే నిజమయినబ్రాహ్మడు.

జీవితం క్షణభంగురమైంది. ఇది తెలుసుకోవాలి. ప్రపంచంలో ఎవ్వరినీ చెడ్డగా భావించకూడదు. అందరినీ స్నేహాభావంతోనే చూడాలి. ఇతర్లదగ్గిరనించి ఏదీ పుచ్చుకోకూడదు. ఇలా దయాస్వభావుడూ, నిత్యతపస్వీ, నిత్యతృప్తుడూ, క్రోధంలేనివాడూ అయిన బ్రాహ్మడు బ్రహ్మత్వం పొందుతాడు.

'నువ్వు అడిగిన ధర్మాలు అన్నీ సంక్షేపంగా చెప్పాను. ఇంకా ఏమిటి వినాలని వుందో చెప్పు' అన్నాడు ధర్మవ్యాధుడు.

'వినవలిసినవి అన్నీ విశదంగా విన్నాను. నాకళ్ళు విడ్డట్టయింది. నువ్వు సర్వజ్ఞుడివి' అన్నాడు కౌశికుడు.

'ఈఉత్తమజ్ఞానం నాకు లభించడానికి మూలధర్మం వొకటి వుంది. అది నీకు ప్రత్యక్షంగా చూపిస్తాను. రా' అంటూ కౌశికుణ్ణి తన ఇంటిలోపలికి తీసుకువెళ్ళాడు ధర్మవ్యాధుడు.

లోపల అందమయిన నాలుగిళ్ళ భవంతి వుంది. ఒక చక్కటి మిద్దెగదిలో రకరకాల సువాసనలు గమ్ముమనిపోతున్నాయి. గది మధ్య ఉన్నతమయిన మంచి ఆసనం వేసి వుంది. ఆ ఆసనం మీద ధర్మవ్యాధుడితల్లిదండ్రులు సుఖంగా కూచుని వున్నారు. వెలలేని వస్తువులు ధరించివున్నారు వాళ్ళు. కోరిన అన్నపానాలతో తృప్తులయిన్నీ వున్నారు. కౌశికుడికి వాళ్ళని చూపించి, వెళ్ళడంతోటే వాళ్ళ పాదాలికి వినయంగా నమస్కరించాడు ధర్మవ్యాధుడు. వాళ్ళ కుశలమూ అడిగాడు.

ముసిలిదంపతులు ఇద్దరూ కొడుకుని ఆశీర్వదించారు. 'నీలాంటి కన్నతండ్రి వుంటే, మాకు లోపమేమిటి బాబూ,' అన్నారు,

'నీధర్మమే నీకు శ్రీరామరక్ష నాయనా. చిరంజీవి వవుతావు. ఏలోపమూ వుండదు నీకు. నీ పుణ్యచరిత్రమూలాన మన వంశమే పవిత్రమైపోయిందోయి. నిజానికి నువ్వు ఏదో దేవతవి కాని సామాన్యుడివి కావు తండ్రీ. ఎందుకో ఏమో మనుష్యదేహం ధరించావు. త్రికరణశుద్ధిగా మున్నూటా అరవైరోజులూ పితృభక్తి సాగిస్తున్నావు. నిన్ను చెప్పాక పరశురాముణ్ణే చెప్పాలోయి. అంతే. నీతో పోల్చడానికి మరొకడు లేడు, ప్రపంచంలో' అన్నారు.

తల్లి దండ్రులికి కౌశికుణ్ణి చూపించాడు ధర్మవ్యాధుడు. 'ఈ మహాత్ముడు మనల్ని చూడాలని వచ్చాడు' అంటూ అతణ్ణి వాళ్ళకి పరిచయం చేశాడు. తగిన ఆసనమూ అవీ ఇచ్చి బ్రాహ్మణ్ణి సత్కరించారు వృద్ధులు. అతడూ వాళ్ళ క్షేమం విచారించాడు.

'వీళ్ళు నాతల్లి తండ్రులు' అంటూ కౌశికుడితో చెప్పడం మొదలు పెట్టాడు ధర్మవ్యాధుడు. 'వీళ్ళకి సేవ చెయ్యడం వల్లే నాకు ఆమాత్రం జ్ఞానం లభించింది. లోకంలో అందరూ దేవతల్ని పూజిస్తారు. నాకుమాత్రం వీళ్ళే దేవతలు. ఇతర దైవం నాకు అక్కర లేదు. వీళ్ళకే నేను పళ్ళూ పువ్వులూ చందనం సమర్పిస్తాను. భక్ష్య భోజ్యాలూ నివేదిస్తాను. భార్యా బిడ్డలతో ఎప్పుడూ సేవిస్తూ వుంటాను. వేదా లనూ, యజ్ఞా లనూ, వ్రతా లనూ అన్నీ వీరే నాకు. తల్లీ, తండ్రీ, గురువూ, అగ్నీ, ఆత్ముడూ — ఈఅయిదుగుర్నీ పూజించినవాడే ధర్మాత్ముడని నమ్మకం.

'ఇదిగో, ఆఇల్లాలు పతివ్రత పంపింది నిన్ను. ధర్మజ్ఞానంకోసం నాదగ్గిరికి వచ్చావు. ఆమె అనుగ్రహంవల్ల ఇన్ని నీకు చెప్పాను. చెప్పడమేమో చెప్పాను. కాని నీమీద మంచిభావంమాత్రం లేదు నాకు. చెయ్యరానిపని చేశావు నువ్వు. ఏమిటంటావా? నీతల్లీ, తండ్రీ ఎంతో వృద్ధులు. జీవితసముద్రంలో నిన్నే పడవగా నమ్ముకొని బతుకు

తున్నారు. అలాంటి తల్లిదండ్రుల్ని విడిచిపెట్టేశావు. వేదం వల్లించడం తప్ప ఇంకో చింతే లేదు నీకు. వాళ్ళ అనుమతయినా తీసుకో కండా ఇల్లు వదిలి వచ్చేశావు. ఎంతో ఘోరం! నీకోసం వాళ్ళ గుండెలు పగిలిపోతున్నాయి. ఏడ్చి ఏడ్చి గుడ్డివాళ్ళే అయిపోయారు. ఇప్పుడయినా మించిపోయింది లేదు. వెంటనే వెళ్ళు. వాళ్ళ దుఃఖాగ్ని చల్లార్చు నీ వేదాలు రుక్కు పెట్టడమూ, పుణ్యంకోసం ఈప్రయాసా—ఇదంతా తలిదండ్రుల సేవచెయ్యకపోతే వ్యర్థమే అనుకో. అంచేత నామాట విను. శుభం కలుగుతుంది' అన్నాడు.

తలవంచుకున్నాడు కౌశికుడు. 'అన్నా, నువ్వు చెప్పినట్టే నడుచుకుంటాను' అన్నాడు. 'ఇవాళనించీ మా అమ్మా నాన్నే నాకు దైవం. వాళ్ళసేవలో రవంతా లోపంరానియ్యను. నిజంగా నాదే భాగ్యం. నీస్నేహం కలిగింది. బ్రహ్మానందంగా వుంది నాకు. ఇంక నాకు శుభం కలగడంలో సందేహమేముంది? పాపం బరువు నానెత్తిని పడకండా నన్ను ప్రబోధించావు. నాపాలిటి దేవుడివే నువ్వు.

'ధర్మమార్గం అసమానమైంది. ఎలాంటివాళ్ళకీ అంద దది. పది వేలమందిలో వొక్కడయినా ధర్మపరుడు వుంటాడో వుండడో. అందులో సనాతనమయిన ధర్మం సిలాగ నిష్ఠతో అనుష్ఠించేవాడు వొకడయినా వుంటాడంటే నమ్మను. సుగుణాలపుట్టవి నువ్వు. నిన్ను శూద్రుడు అని అంటే పాపం. నీ చరిత్రమే అద్భుతం. అన్నా, భూత భవిష్యద్వర్తమానాలు యావత్తూ నీకు తెలుసు కదా! ఇంత మహనీయుడివి, ఇలా పుట్టడంలో ఏమిటి కారణం?' అన్నాడు.

'నువ్వు ఏది అడిగినా చెపుతాను' అన్నాడు ధర్మవ్యాధుడు. 'అలా చెప్పడం నాకర్తవ్యం కూడాను. పూర్వజన్మంలో నేనొక బ్రాహ్మణ్ణి. పుణ్యచరిత్రుణ్ణి. వేదాలూ, వేదాంగాలూ క్షుణ్ణంగా చదువుకున్న వాణ్ణి. నాకు వొక రాజపుత్రుడు స్నేహితుడుగా వుండే

వాడు. అతడి సాంగత్యంమూలాన ధనుర్వేదం కూడా అభ్యసించాను. అతడు వొకనాడు వేటకని బయలుదేరాడు. నేనూ అతడితో వెళ్లాను. అడివిలో ఎన్నో మృగాలు వేటాడుతున్నాం. ఇంతలో పొరపాటున, తుప్పలచాటున వున్న వొక మునీశ్వరుడి దేహం దూసుకుపోయింది నాబాణం. వెంటనే, హా అంటూ పడిపోయా డతడు. చప్పున పరిగెత్తాను నేను బాణం దుసెళ్ళిపోయి పొర్లుతున్నాడు ముని. నిలువునా నాప్రాణాలు ఎగిరిపోయినట్టయాయి. ఓదార్చబోయాను. కోపంతో శపించా డతడు. 'బ్రాహ్మడివయినీ్న పాపానికి పూనుకున్నావు. కిరాతుడిలా ప్రవర్తించావు. అంచేత, కిరాతుడివయి పుడతావు' అన్నాడు.

'ఎరక్క తప్పుచేశాను' అని కాళ్ళావేళ్ళా పడ్డాను నేను. 'క్షమించు ఈ పాడుజన్మలో పడవెయ్యకు నన్ను !' అంటూ ప్రార్థించాను. కొంతసేపటికి జాలికలిగింది మునికి. 'నామాట తప్పదు. అయితే, కిరాతుడివై పుట్టినా, ధర్మంమాత్రం స్పష్టంగా తెలుస్తుంది నీకు. తల్లినీ, తండ్రినీ భక్తితో సేవిస్తావు. వాళ్ళని సంతోష పెడతావు. పితృసేవమూలాన పూర్వజన్మంకూడా జ్ఞాపకం వుంటుంది నీకు. తరవాతజన్మలో బ్రాహ్మడివై పుడతావు' అని అనుగ్రహించాడు.

'నెమ్మదిగా అతడిదేహంలోంచి బాణం వూడపెరికాను. భద్రంగా ఆశ్రమం చేర్చాను. నాభాగ్యంవల్ల అతడికి ప్రాణాపాయం మాత్రం రాలేదు. బతికిపోయాను. ఇదీ నా పూర్వచరిత్ర. నా స్వయంకృతాపరాధమే నన్ను ఈజన్మ ఎత్తించింది. ఏం చెయ్యనూ' అన్నాడు.

'అన్నా, అలా విచారపడకు' అన్నాడు కౌశికుడు. నిజానికి నీది నీచజన్మ కానే కాదు. ఇలాంటి జన్మా, ఇలాంటి చరిత్రా - ఇది ఆశ్చర్యమయిన విషయం. ఎక్కడా నేను కనీవినీ వుండలేదు. మరో జన్మలో ఉత్తమబ్రాహ్మణ్ణవుతా నంటున్నావు. మరో జన్మదాకా

ఎందుకంటా. పుణ్యాచరిత్రుడివి. ఈజన్మలోనే ఉత్తమ బ్రాహ్మడివి. ఏమంటావా? చెడ్డనడత కలవాడు బ్రాహ్మడికి పుట్టినా, అతడు శూద్రుడే. శూద్రుడే ఏమిటి? అంతకంటేనీచుడే అవుతాడు. సత్యమూ, శౌచమూ, ధర్మమూ -ఈగుణాలుకలవాడు శూద్రుడికి పుట్టినా, అతడు ఉత్తమబ్రాహ్మడే అవుతాడు. ఇదే మునుల మతమున్నూ.

'ఇంకోమాట, మంచిచేస్తే మేలూ, చెడ్డచేస్తే కీడూ రావడం తప్పనిసరి. వాటివల్ల కలిగే సుఖదుఃఖాలు రెంటినీ వొక్కలాగే చూస్తారు బుద్ధిమంతులు. దేహవ్యాధికి మందూ మాకూ ఉపయోగించినట్టే, ధర్మకర్మలుచేసి మనోవ్యాధి నివారించుకుంటారు వాళ్ళు. సర్వమూ సాత్వికదృష్టితోనే చూస్తారు. ప్రియమైనవి పోవడం, అప్రియమైనవి సంభవించడం తరుచు జరుగుతూనే వుంటుంది. వీటి మూలాన మూఢులికి మాత్రం హృదయతాపం వదలదు. మండుతూనే వుంటుంది. ఎంతవిచారకరమైన పరిస్థితివచ్చినా, దుఃఖించకూడదు. దేనికీ సంతోషించడమూ తగదు. అందుకనే, గతించిన దానికీ రాబోయేదానికీ దేనికీ దుఃఖించరు పెద్దలు. ఎప్పుడూ ఆనందంగానే వుంటారు. దుఃఖంవల్ల తేజోహీనుడయిపోతాడు మనిషి. ఆత్మహితమయిన కార్యానికి పనికిరాకండా పోతాడు. కనక, దుఃఖాలకి దూరంగా వుండాలి. కర్తవ్యకర్మ చేస్తూ వుండాలి. అపుడే శుభం కలుగుతుంది' అన్నాడు.

"అవును. నువ్వు చెప్పిందే ఆదర్శంగా పెట్టుకుని నడుస్తున్నాను" అన్నాడు ధర్మవ్యాధుడు. 'నిజం. నామనస్సులోదుఃఖంఅన్నదిలేనేలేదు. ముందటికి అంతా మంచిదే అవుతుంది అన్న నమ్మకం నాకు దృఢంగా వుంది' అన్నాడు.

'పుణ్యమూర్తివి. అన్నిటా కృతార్థుడివి. నీపరిచయంవల్ల ఎంతో ధర్మం తెలుసుకున్నాను. ఇక వెళ్ళివస్తాను. అనుమతించు'

అని అతణ్ణి ప్రదక్షిణంచేసి సెలవుతీసుకున్నాడు కౌశికుడు. తిన్నగా తన తల్లిదండ్రుల దగ్గిరికి వచ్చేశాడు. అవాళనించీ వాళ్ళని ఎంతో భక్తితో సేవించడం మొదలుపెట్టాడు. చివరికి కృతార్థుడూ అయాడు.

ధర్మరాజా, నువ్వు అడిగిన దానికి పతివ్రతమాహాత్మ్యమూ, పితృశుశ్రూషా, తక్కువజాతివాడు ధర్మం ఆచరించే ఉపాయమూ చెప్పాను. ఇంకాఏమిటి తెలుసుకోవాలని వుందో అడుగు" అన్నాడు మార్కండేయముని.

"అగ్ని దేవుడు పూర్వం ఎందుకో తపస్సు చేశాడని విన్నాను. అతడు అలా తపస్సు చేయవలిసిన అగత్యం ఏమొవచ్చింది? అంగిరసుడు అగ్ని అయాడుట! ఎంచేత? అగ్నులు ఎంతమంది? దయచేసి సెలవియ్యి" అన్నాడు ధర్మరాజు. మార్కండేయుడు చెప్పాడు.

## అ గ్ని వ ం శ ం

ఒకసారి అగ్ని దేవుడికి దేవతలమీద మహాకోపం వచ్చింది. దానిమీద, అతడు హవ్యాలూ అవీ పుచ్చుకోడం మానేశాడు. అడివికి వెళ్ళిపోయాడు. బాగా చిక్కిపోయి, ఎంతోకాలం ఘోరమయిన తపస్సు చేసుకుంటూ కూచున్నాడు. కొన్నాళ్ళయాక, అతడికి ఒక బెంగపుట్టింది. 'ఇలా నేను అడివిలో కృశించిపోతూ, వెలగకండా వున్నాను. ప్రపంచంలో పనులన్నీ ఆగిపోతాయికదా! దీనికి బ్రహ్మ వూరుకోడు. మరొకర్ని అగ్నిగా నిలబెడతాడు. అంచేత నేను ఇక్కడవుండిపోతే ఎలాగ? వెంటనే వెళ్ళాలి' అనుకున్నాడు. తపస్సు కట్టిపెట్టాడు. తనస్థానానికి తాను ప్రయాణ మయాడు.

అగ్ని అనుకున్నట్టే అయింది. అతడు అలిగి వెళ్ళిపోవడంతోటే, అతడి స్థానంలో అంగిరసుణ్ణి నిలబెట్టాడు బ్రహ్మ. అగ్ని వచ్చి చూసేసరికి మూడులోకాలికీ అగ్నిగా అతడిస్థానంలో వెలుగు

తున్నాడు అంగిరసుడు. ఎంతో అంత తపోవంతుడు అంగిరసుడు. అంచేత ఎంతో తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. భయపడిపోయాడు అగ్ని. వచ్చినదారినే తలవంచుకుని వెనక్కి వెళ్ళిపోయాడు.

అది చూశాడు అంగిరసుడు. చప్పునవెళ్ళి ఆహ్వానించాడు. అగ్నిభట్టారకా, పవిత్రుడివి నువ్వు. మూడులోకాలూ పూజించాయి నిన్ను. చీకట్లువెళ్ళగొట్టి ప్రకాశించావు నువ్వు. మొదటి అగ్నిగా నిన్నే ప్రతిష్ఠించాడు బ్రహ్మ. నీస్థానంలో నిలవడానికి నేను తగను. దయచెయ్యి. నీస్థానం నువ్వు స్వీకరించు. సందేహించకు' అన్నాడు.

'అది సరికాదు' అన్నాడు అగ్ని. నాకీర్తి లోకంలో మాసే పోయింది. ప్రపంచమంతా నిన్నే పూజిస్తోం దిప్పుడు. అంచేత నువ్వే తగినవాడివి. నేను తగను. కావాలంటే, నేను రెండో అగ్నిగా వుంటాను. ప్రజాపత్యఅగ్నినై నడుచుకుంటాను. నువ్వు ప్రథమాగ్ని పదంలో వుండు' అన్నాడు.

'దేవా, ఇలా నిష్ఠురంగా నిగాకరించకు' అన్నాడు అంగిరసుడు. 'ప్రథమాగ్ని పదవి నువ్వే స్వీకరించు. నన్ను నీప్రథమపుత్రుడిగా ఆదరించు' అన్నాడు.

చివరికి సమ్మతించాడు అగ్ని. అలా అంగిరసుడు అగ్ని దేవుడి తొలికొడుకయాడు. అగ్నితో సమానరూపంకలిగి ప్రకాశించాడు. అంగిరసుడి భార్య శివ. శివగర్భంలో అంగిరసుడికి బృహత్కీర్తి బృహజ్జ్యోతీ బృహద్బ్రహ్మ బృహన్మనసుడూ బృహన్మంత్రుడూ బృహద్భాసుడూ బృహస్పతీ అని ఏడుగురు కుమార్లూ, భానుమతీ రాగా సినీవాలీ అర్చిష్మతీ హవిష్మతీ మహిష్మతీ మహామతీ అని ఏడుగురు కుమార్తెలూ కలిగారు. ఇందులో బృహస్పతికి సంయుడు కలిగాడు. సంయుడు ఎంతో గుణవంతుడు యజ్ఞాల్లో అతడే ప్రథమ హవిస్సు గ్రహిస్తాడు. సంయుడిభార్య సత్య. ఈమెకి భరద్వాజుడూ,

భరతుడూ అని ఇద్దరు కొడుకులు పుట్టారు. భరతుడికి భారతుడు అని వొక కొడుకూ, భారతి అని వొక కూతురూ పుట్టారు. భారద్వాజుడి భార్య వీర. ఈమెకి వీరుడు అని వొక కుమారుడు కలిగాడు. వీరుడి భార్య సరయువు. సరయువు కొడుకు భానుడు. భానుడికొడుకు నిశ్చ్యవనుడు. అతడి కొడుకు నిష్కృతి. పాపాత్ములైన మానవులు అతణ్ణి సేవించి పాపవిముక్తు లవుతారు. అంచేతే అతడిపేరు నిష్కృతి అయింది. నిష్కృతికొడుకు రుజస్కరుడు. అతడి కుమారుడు క్రోధుడు. క్రోధుడు మంచి తేజశ్శాలి. క్రోధుడి కుమారుడు రుజుడు. రుజుడికి స్వాహాఅని వొక కూతురూ, కాముడు అని వొక కొడుకూ పుట్టారు. కాముడికి అమోఘుడు కలిగాడు. అమోఘుడికి ఉక్థుడు పుట్టాడు.

ఇలా వుండగా, కాశ్యపుడూ, వాశిష్ఠుడూ, ప్రాణుడూ, అంగిరసుడూ, చ్యవనుడూ అని అయిదుగురూ తేజశ్శాలి అయిన కొడుకు కావాలంటూ అనేక సంవత్సరాలు ఓంకారం స్మరణచేశారు. ఘోరమయిన తపస్సూ చేశారు. చివరికి తేజశ్శాలిఅయిన చక్కని కుమారుడు కలిగాడు వాళ్ళకి. అచ్ఛమయిన అగ్నిచాయ అతడి శిరస్సు. స్ఫటికంలాంటి బాహువులు. బంగారమే బంగారం కళ్ళూ, చర్మమునూ. తొడలు మాత్రం నలుపు. ఆకుమారుణ్ణి చూసి లోకాలు యావత్తూ ఆశ్చర్యపోయాయి. అలా పుట్టిన ఆఅగ్ని పంచజనప్రభవుడు (అయిదుగురికి పుట్టినవాడు) కనక, పాంచజన్యుడని పేరుపడ్డాడు.

పదివేలసంవత్సరాలు తపస్సుచేశాడు పాంచజన్యుడు. శిరస్సులో బృహద్రథంతరులు అనేవాళ్ళని పుట్టించాడతడు. మొహం లోంచి హరినీ, నాభినించి శివుణ్ణీ, బలంవల్ల ఇంద్రుణ్ణీ, ప్రాణాల్లోంచి వాయువునీ, బాహువుల్లోంచీ పళ్ళల్లోంచీ విశ్వభూతాల్నీ సృజించాడు.

తపుడు అని మరో అగ్ని ఎప్పుడూ తపస్సులోనే వుండేవాడు. పదిహేనుమంది కుమాళ్ళని కన్నాడతడు. అందరూ ఘోరమయిన తేజోవంతులు. కపటవృత్తి కలవాళ్ళు. అందులో భీముడూ, అతిభీముడూ, భీమబలుడూ, బలుడూ, అతిబలుడూ — ఈ అయిదుగురూ ఒకటి. సుమిత్రుడూ, సుమిత్రవరుడూ, మిత్రజ్ఞుడూ, మిత్రవర్ధనుడూ, మిత్రవర్మా - ఈ అయిదుగురూ వొకటి. సువీరుడూ, ప్రవీరుడూ, సుకేతుడూ, సువర్చసుడూ, సురహంతా అని అయిదుగురూ వొకటి. ఇలా మూడుజట్లు అయి యజ్ఞాల్లో యజమానుల యజ్ఞఫలం అపహరించడం వీళ్ళ పని. అందుకనే వీళ్ళ శాంతికని, యజ్ఞాల్లో అగ్నిచయనం చేస్తారు. వేదాల్లో చెప్పిన అగ్నిచయనాలవల్లా, భయంకరమయిన పక్షాఘాతాలవల్లా, బ్రాహ్మల మంత్రఘోషలవల్లా యజ్ఞభూమిదగ్గిరికి రాలేరు వీళ్ళు.

ఈ పదిహేనుమంది మాత్రమే కాదు. మరి అయిదుగురు కుమాళ్ళు కూడా వున్నారు తపుడికి. అన్నియజ్ఞాల్లోనూ భాగం భుజిస్తారు వాళ్ళు. ఈ అయిదుగురిలో పెద్దవాడు వైశ్వానరుడు. చాతుర్మాస్యవిధుల్లో ఇంద్రుడితో కలిసి పూజింపబడతాడితడు. రెండోవాడు విశ్వపతి. యావద్విశ్వానికీ ప్రభువు. మూడోవాడు విశ్వకుడు. విశ్వానికి ఆత్మ. నాలుగోవాడు విశ్వభుక్కు. ఇతడే ప్రాణులు భుజించిన ఆహారం పక్వంచేస్తాడు. అయిదోవాడు గోపతి. సమస్త ధర్మకార్యాలికీ హేతువయిన వాడితడు.

భానుడికి సోముడికూతురు బృహద్భాస గర్భంలో బలదుడూ మన్యుడూ ధృతిమంతుడూ అగ్రయణుడూ అగ్నీ సోముడూ అని ఆరుగురు కుమాళ్ళూ, నిశ అని వొక కూతురూ కలిగారు.

తపఃఫలాలు యావత్తూ నిర్వహించడంకోసం ఇంద్రుడు మనువు అని వొకకొడుకుని కన్నాడు. భానుడి కూతురు నిశని

ఈమనువు పెళ్ళాడాడు. ప్రాజాపత్యా డనిపించుకున్నాడు. ఉత్తమోత్తములయిన బ్రాహ్మలచేత పూజించబడ్డాడు.

ఇలా ఇన్నివిధాలయిన అగ్నులూ అన్నివిధాల ధర్మక్రియలకీ సాధకులై ప్రకాశించారు. దక్షిణాగ్ని మొదలయిన అగ్నులు గాలి వీవడంవల్ల పరస్పరం రాపాడినప్పుడూ, రజస్వలాస్పర్శ మొదలయిన వాటివల్ల సంకరం పొందినప్పుడూ, మృతజాతకాది సంస్పర్శ కలిగినప్పుడూ ప్రాయశ్చిత్తంకోసం అష్టాకపాలేష్టి * చెయ్యాలి.

ఆపుడు అనే అగ్ని భార్య ముదిత. అసమాన మయిన అందకత్తె ఆమె. అపారమయిన తేజశ్శాలిని. అగ్ని అని వొక కుమారుణ్ణి కన్నదామె. మూడులోకాల కార్యతంత్రాలు యావత్తూ నిర్వహించాడు అగ్ని. హవ్యాలు మోసుకుపోయి, దేవేంద్రుడూ మొదలయిన దేవతలికి అందిచ్చేవాడు. వాళ్ళని సంతోషపెట్టేవాడు. క్రమంగా హవ్యాలు ఎంతో అంత బరువయిపోయాయి. ఆబరువు మోయలేక పోయా డతడు. ఒకనాడు అథర్వుడుఅనే అగ్ని దగ్గిరికి వెళ్ళాడు. 'నేను దుర్బలుణ్ణయిపోయాను. ఇకముందు హవ్యాలు పట్టుకువెళ్ళి దేవతలికి నువ్వు ఇయ్యి' అని నెమ్మదిగా చెప్పాడు. అలా అథర్వుణ్ణి నియమించి, తాను సముద్రంలో వెళ్ళి దాక్కున్నాడు.

దానిమీద అతణ్ణి వెదకడం ప్రారంభించారు దేవతలు, సముద్రమంతా గాలించారు. అగ్ని ఫలానాచోట దాక్కున్నాడని సముద్రం చేపలు దేవతలికి చెప్పేశాయి. దాంతో చేపలమీద అపరిమితమయిన కోపం వచ్చింది అగ్నికి. 'మనుష్యులు దయా దాక్షిణ్యం లేకండా మిమ్మల్ని చంపుకుతింటారు' అని వాటిని శపించాడు.

అగ్ని దొరికిపోవడంతోటే అతణ్ణిచుట్టూ చేరారు దేవతలు 'ఎప్పటిలాగే మాకు హవ్యాలు తెచ్చిపెట్టు' అంటూ అతణ్ణి వెయ్య

* ఎనిమిది మట్టిపాత్రలతో చేసే యజ్ఞం.

విధాల ప్రార్థించారు. ఎంతకీ సమ్మతించలేదు అగ్ని. ప్రార్థించడం మానలేదు దేవతలు. విసిగిపోయాడు అగ్ని. తుదకి శరీరం విడిచి పెట్టేశాడు. మృతదేహం దేవతలముందు పడేసి, తాను భూమిలో ప్రవేశించాడు. ఆ మృతదేహం చీములోంచి గంధకం పుట్టింది. దుమ్ముల్లోంచి దేవదారువు పుట్టింది.. శ్లేష్మంలోంచి స్ఫటికం పుట్టింది. పిత్తంలోంచి మరకతం పుట్టింది. వాతంలోంచి నల్లరాయి పుట్టింది. చర్మంలోంచి అభ్రకమూ, సన్నని రాల్లోంచి పగడమూ పుట్టాయి.

అలా భూగర్భం ప్రవేశించి ఘోరమయిన తపస్సు ప్రారంభించాడు అగ్ని. అప్పుడు భృగువూ, అంగిరసుడూ మొదలయిన మహామునులు వచ్చి తమ తపోబలంవల్ల అగ్నిని సంతృప్తి పరిచారు. దాని మీాద తేజోరూపంతో బయటికి వచ్చాడు అగ్ని. మహాతేజస్సుతో ప్రకాశిస్తూవున్న మహామునుల్ని చూశాడు. వాళ్ళ తేజస్సు భరించడం కష్టమైంది తనకి. సహించలేక, తిరిగీ సముద్రంలో మునిగిపోయాడు.

అంతతో ఆ అగ్ని విషయం వదులుకున్నారు మునులు. అథర్వాగ్నినే పూజించడం మొదలుపెట్టారు. అనేక బహుమానాలూ అతడి కిచ్చారు. దేవతలకి సక్రమంగా హవ్యాలు మోసుకు వెళ్ళే వాడు అథర్వుడు. దేవతలూ తృప్తిపడుతూవచ్చారు. అది చూసి సహించలేకపోయాడు అగ్ని. సర్వభూతాలూ చూస్తువుండగా సముద్రంలోంచి పైకి వచ్చాడు. ఎప్పటిలాగే లోకకళ్యాణంకోసం హవ్యాలు మోసుకువెళ్ళడానికి అంగీకరించాడు.

"మహారాజా, ఇలా అగ్ని వంశం అనేకశాఖలుగా ప్రకాశించింది. పూజనీయమూ అయింది. అయితే అగ్నులు ఎందరయినా. వారి ఆత్మల్లోని తేజస్సు మాత్రం వొక్కటే."

అగ్నివంశం కథ విన్నాక, "మహామునీ, అగ్నికీ కృత్తికలకీ శివుడికీ కుమారస్వామి పుట్టాడంటారు కదా, అదేమిటో సెలవియ్యి" అని అడిగాడు ధర్మరాజు. మార్కండేయుడు చెప్పాడు.

### కుమారస్వామి కథ

పూర్వం దేవతలికీ రాక్షసులికీ ఘోరంగా యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దేవతలు ఓడిపోయారు. దేవగణాల్తో కూడా పారిపోయాడు దేవేంద్రుడు. 'దేవసైన్యం నడిపించి, రాక్షసుల్ని గెలవగల సేనానాయకుడు ఎక్కడ దొరుకుతాడు ?' ఈ ఆలోచనతో మానస పర్వతంమీదికి వెళ్ళాడు. అక్కడ ఒంటరిగా ఆలోచిస్తూ కూచున్నాడు.

ఇంతలో ఒక స్త్రీ ఏడుపు వినవచ్చిం దతడికి. 'రక్షించండి రక్షించండి. రాక్షసుడు ఎత్తుకపోతున్నాడునన్ను. విడిపించండి. ఎవ్వరూ లేరా ? దయచూడండి !' _ స్పష్టంగా ఇంద్రుడి చెవిలో పడింది ఏడుపు. గుండెల్లో కలిచినట్టు అయిం, దతడికి. 'భయపడకు. వస్తున్నాను' అంటూ ఏడుపు వినవచ్చినదిక్కు పరిగెత్తాడు. పది అడుగులు వేశాడో లేదో భయంకరుడయిన రాక్షసుణ్ణి చూశాడు. రాక్షసుడి చేతిలో పెద్ద గద వుంది. పే - ద్ద నల్లమేఘంలా వున్నా డతడు. మెరుపు తీగలాంటి ఒక అమ్మాయిని ఎత్తుకుని ఆకాశమార్గంలో పారిపోతున్నాడు. అతడిపేరు కేశి. అతడి రౌద్రాకారం చూస్తేనే అర్థమవుతూ వుంది, అతడు ఎంత ఉద్దండు డయిందిన్నీ.

ఒక్క వూపుని వెళ్ళి అడ్డం నిలిచాడు దేవేంద్రుడు. 'దురాత్మ ర్గుడా విడిచిపెట్టు, ఈమెని. లేదా చూడు, కొండలు చెండిన వజ్రాయుధ మిది. నీలాంటి పెద్దపెద్ద రాక్షసుల రక్తం తాగి బలిసి వుంది' అంటూ అటకాయించాడు. చలించలేదు కేశి. 'హు' మ్మంటూ ఎదురు తిరిగాడు. గదతీసి దేవేంద్రుడి మీదికి విసిరాడు. వజ్రాయు

ధంతో దాన్ని ముక్కలు చేసేశాడు దేవేంద్రుడు. ఒక కొండ శిఖరం విరిచి విసిరాడు కేశి. వజ్రాయుధంతో దాన్ని వొకవేటు వేశాడు ఇంద్రుడు. ఆకాశం ప్రతిధ్వనించింది దెబ్బకి. గుండపిండయి కిందపడింది కొండశిఖరం. ఈ రెండూ వ్యర్థం కావడంతోటే జంకేశాడు కేశి. అమ్మాయిని వొదిలిపెట్టేసి వెనక్కి చూడకుండా కాళ్ళకి బుద్ధిచెప్పాడు.

అమ్మాయి దగ్గిరికి వచ్చి నెమ్మదిగా అడిగాడు ఇంద్రుడు. 'ఎవరి పిల్లవి? వీడి కెలా చిక్కావు?' - అని. 'ప్రజాపతి అరిష్టనేమి కూతుర్ని' అంది ఆమె. 'దేవసేన అంటారు నన్ను. మాఅక్క దైత్యసేన. మా ఇద్దరమూ మానాన్నగారి నడిగి, చెలికత్తెలతో సహా ఇక్కడ మానసపర్వతం లోయల్లో విహరించడానికి వచ్చాం. మమ్మల్ని చూసి ఈనీచుడికి వికారమెత్తింది. మాటిమాటికీ మా దగ్గిరికి వచ్చి, వాడి వొయ్యారమంతా వొలకపొయ్యడం మొదలు పెట్టాడు. మమల్ని వల్లో వేసుకోడానికి చెప్పరాని చిన్నెలన్నీ చేశాడు. వాడి చేష్టలూ అవీ మా అక్కయ్యకి నచ్చాయి. నాకు మాత్రం అసహ్యం వేశాయి. మాఅక్కయ్యని లేవదీసుకుపోయాడు వాడు. అంతతో వీడావొదిత్తే బావుండిపోను. ఇష్టం లేని దాన్ని, నన్నూ ఎత్తుకుపోవడం మొదలుపెట్టాడు. మీరు లేకపోతే నాగతి ఏమయేదో ఏమో!' అంది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

'ఐతే, నువ్వు నాకు చెల్లివి' అన్నాడు దేవేంద్రుడు- మాఅమ్మా మీఅమ్మా దక్షుడి కూతుళ్ళు. పింతల్లి పెత్తల్లి బిడ్డలం. నేను దేవేం ద్రుణ్ణి. కోరుకో. నీకో వర మిస్తాను.'

'అన్నా, పౌరుషశాలి అయిన భర్త కావాలి నాకు.' అంది దేవసేన- 'ఏమంటావా? మానాన్నగారు వొకనాడు నన్ను లాలిస్తూ అన్నారు. 'అమ్మాయీ, మహాపౌరుషవంతుడయిన భర్తని పెళ్ళాడ తావు నువ్వు' అని. దేవతలూ, దానవులూ ఎవ్వరూ గెలవలేకపోవాలి.

మూడులోకాలూ పిడికిల్లో పట్టగలగాలి. నీకు స్నేహితుడూ అయి వుండాలి. అలాంటి భర్త కావాలి నాకు. ఈవొక్కవరం అనుగ్రహించు. చాలు.

'అలాంటివాడు ఎవడు? ఎవడు ఈమెకి భర్త అవుతాడు?' - ఆలోచించాడు దేవేంద్రుడు. ఆమె 'భర్త కావాలి' అన్నముహూర్తం రౌద్రముహూర్తం.* సూర్యచంద్రుల సంగమకారణమయిన అమావాస్య ఆరంభం. ఉదయసంధ్య రక్తం వొలకపోసినట్టు వుంది. దాని ప్రతిబింబంతో సముద్రం ఎరుపెక్కివుంది. అదంతా సంకులమయిన దేవాసురయుద్ధంలా కనిపిస్తోంది. అక్కడే ఎర్రటిసూర్యుడు పొడుచుకు వస్తున్నాడు. అప్పుడే భృగువూ, అంగిరసుడూ మొదలయిన మునులు వేలుస్తూవున్న హవ్యాలు మోసుకుని అగ్ని సూర్యమండలం ప్రవేశిస్తున్నాడు.

చూశాడు దేవేంద్రుడు. 'సూర్యచంద్రులు కలుసుకుంటున్నారు. రౌద్రముహూర్తమిది. అంచేత సూర్యుడూ, చంద్రుడూ, అగ్ని - ఈముగ్గురి తేజస్సుతో జన్మించినవాడు ఈమెకి భర్త అవుతాడు' అని నిశ్చయించుకున్నాడు. ఆలస్యం చెయ్యకండా ఆమెని వెంటపెట్టుకుని బ్రహ్మదగ్గిరకి వెళ్ళాడు. 'దేవా, ఈదేవసేనకి తగిన భర్తని ప్రసాదించు, అంటూ చేతులు జోడించాడు.

'మహాప్రతాపశాలి ఈమెకి భర్త అవుతాడు, అన్నాడు బ్రహ్మ. 'మూడులోకాలూ రక్షిస్తాడతడు. అతడే నీఆపదలూ తొలిగిస్తాడు. దేవసైన్యానికి నాయకుడూ అవుతాడు, అన్నాడు. సంతోషించాడు దేవేంద్రుడు. బ్రహ్మదగ్గిర సెలవుతీసుకుని వచ్చేశాడు.

*సూర్యోదయం ముందు ఆరజాములో రెండు ముహూర్తాలు. మొదటిది బ్రాహ్మముహూర్తం. రెండోది రౌద్రం. - పరాశరుడు.

బహ్మామాటప్రకారం దేవసేనని భద్రంగా వుంచాడు. ఇది ఇలా వుండగా—

వసిష్ఠుడూ మొదలయిన సప్తరుషులు అమావాస్యహోమం ప్రారంభించారు. యావన్మంది దేవతలూ హవిర్భాగాలు పుచ్చుకోవడానికి సంసిద్ధులయారు. ఆహవనీయుండ్వారా ఆవహుతు డయాడు అగ్ని. మును లిచ్చిన ఆహుతులు తీసుకుపోయి దేవతలకి క్రమంగా అందించడం మొదలుపెట్టాడు.

సప్తరుషుల భార్యలు ఏడుగురూ బాగా స్నానాలు చేశారు. మంచిమంచి చీరెలు కట్టుకున్నారు. వస్తువులూ అవీ పెట్టుకుని బాగా ముస్తాబయారు. హోమం జరుగుతూన్నంతసేపూ వచ్చి, వాళ్ళ భర్తలకి పరిచర్య చేస్తూవచ్చారు.

వాళ్ళ నవ్వు మొహాలూ, మెరిసే సోగకళ్ళూ, వొయ్యారం నడకలూ, సన్నని నడుములూ, పొట్టలమీంది ముడతలూ, పికపిక లాడుతూవున్న పెద్దపెద్ద స్తనాలూ చూసి, విలవిలలాడిపోయాడు అగ్ని. పూర్తిగా కామాతురుడే అయిపోయాడతడు. అతడి శరీరం అతడి స్వాధీనం తప్పిపోయింది. మళ్ళించుకో లేకపోయాడు మనస్సు. వాళ్ల కోసమని గార్హ్యపత్యకుండలో ఆవేశించాడు. వాళ్ళు తన దగ్గిరికి రావాలంటూ గుటకలు మింగేవాడు. వాళ్ళుకొంచెం దగ్గిరికి వచ్చారో జ్వాలాహస్తాలతో ఇట్టే వాళ్ళని తాకేవాడు. కౌగిలిలోకి లాక్కోవాలనుకునేవాడు. గుండె దడదడలాడి, కళవిళపడిపోయేవాడు.

అంతలో రుషుల హోమక్రియ యావత్తూ సమాప్తమైపోయింది. అగ్ని ఆశ అడియాస అయిపోయింది. భరించలేకపోయాడతడు. రుషుల భార్యల సంగమం దొరకందే అతడిప్రాణాలు నిలిచేటట్టు లేవు. ఎవ్వరూ లేని అడవిలోకివెళ్ళి బాధపడుతూ కూచున్నాడు. రుషుల భార్యలు ఎలాగూ చిక్కరు. వాళ్ళు చిక్కందే ప్రాణాలు దక్కవు.

ఏందారి? ఇక మరణమే శరణ్యం అనుకున్నాడు. ఒక నదివొడ్డుకి వెళ్ళి ఆత్మహత్య చేసుకోడానికి సిద్ధపడ్డాడు.

ఇదంతా తొలినించీ కని పెడుతూనే వుంది, అతడిభార్య స్వాహా దేవి. కార్యం మించివచ్చిం దనుకుంది. భర్తకి సంతోషం కలిగేట్టు వొక ఉపాయం ఆలోచించింది. సప్తరుషుల్లో అంగిరసుడి భార్య శివ. ఆమెరూపం ధరించింది స్వాహా. ఒంటరిగావున్న అగ్నిదగ్గిరికి చక్కా వచ్చింది. సిగ్గు అభినయిస్తూ పక్కన చేరింది. 'అపుడే మరిచి పోయారా ?' అంటూ ముసిముసినవ్వులతో పలకరించింది. 'అంగిరసుడి భార్యని. శివ అంటారు నన్ను. నేనూ, నాతోడిమునుల భార్యలూ రోజూ నిన్ను చూస్తూ ఇదవుతూనే వున్నాం. నీఅందమయినమూర్తి మమ్మల్ని నిలవనివ్వడంలేదంటే నమ్ము. కానైతే నీ మనస్సేమో తెలియక ఇంతవరకూ బాధపడుతూ వచ్చాం. అమావాస్యహోమంలో నువ్వు కనపరిచిన సరదాచిన్నెలవల్ల నీగుట్టుకాస్త తెలుసుకున్నాం. మాచిరకాలవాంఛ నెరవేరింది సంతోషపడ్డాం. గుబగుబలాడిపోయింది మనస్సు. క్రమంగా వొకళ్ళతరవాత వొకళ్ళం నీతో అనుభవించాలని వచ్చాం. అందరూకలిసి ముందు వెళ్ళమని నన్ను తోశారు. అంచేత మాకోర్కె చెల్లించు. మమ్మల్ని అనుభవించు. లేదంటావా, మన్మథుడే మాప్రాణాలు తీస్తాడు. తప్పదు' అంటూ తలవొంచుకుంది.

అరిచేతిలో స్వర్గం కనవడింది అగ్నికి. ఆదరంగా ఆమెని సందిట్లోకి తీసుకున్నాడు. అతడి మనస్సుకి నచ్చినట్లు నటించిందామె. ఆమెని అనుభవించి తృప్తిపడ్డాడు అగ్ని. అతడి వీర్యం ధరించి వెళ్ళి పోయింది స్వాహా. తక్షణం గరుడపక్షిరూపం ధరించింది. మహావేగంతో ఎగిరి శ్వేతపర్వతం చేరుకుంది. అక్కడ రెల్లుతుప్పలో వొక బంగారం కుండల్లో పెట్టి భర్తవీర్యం భద్రపరిచింది. తృణాలమీద

మళ్ళీ అగ్నివున్న వనానికి వచ్చింది. ఈసారి మరో ఋషి భార్యరూపం ధరించింది. సంగమానంతరం మళ్ళీ గరుడపక్షి అయిపోయి శ్వేత పర్వతం వెళ్ళింది. భర్తవీర్యం బంగారం కుండలో భద్రపరిచింది. ఇలాగే వరాసగా ఆరుగురి ఋషుల భార్యల రూపంతో భర్తని సంతోష పరిచింది. వశిష్ఠుడిభార్య అరుంధతి మహాపతివ్రత. కనక ఆమెరూపం మాత్రం ధరించలేకపోయింది.

ఇలా ఆరుసార్లు సంగ్రహించిన అగ్ని వీర్యంవల్ల రెల్లుతుప్పలోని బంగారం కుండలో ఆరుమొహాలతో వొక కుమారుడు కలిగాడు. పన్నెండు చేతులు అతడికి. సూర్యబింబంలా పదిదిక్కులూ వెలిగిస్తూ ప్రకాశించాడతడు. అతడే కుమారస్వామి.

శుక్ల పాడ్యమినాడు గర్భాధానం జరిగింది. విదియనాడు గర్భం వ్యక్తమైంది. తదియనాడు శరీరంమాత్రం పుట్టింది. చవితినాడు సర్వాంగాలూ సంపూర్ణమై జన్మించాడు కుమారస్వామి. పంచమి నాడు బాగా బలిసి విజృంభించాడు.

శివుడు త్రిపురసంహారంచేసిన విల్లు శ్వేతపర్వతంమీద గుప్తంగా వుంది. అడ్డూ ఆపూ లేకండా వెళ్ళి, ఆవిల్లు పుచ్చుకున్నాడు కుమార స్వామి. పుచ్చుకోడమే తడువుగా విల్లుఎక్కుపెట్టాడు. భయంకరంగా నారిమోగించడం మొదలుపెట్టాడు. ఆమహాధ్వని విని వులిక్కిపడ్డాయి దిగ్గజాలు; ఐరావతమూ సుప్రతీకమున్నూ, నిప్పులు కక్కుతూ వచ్చి కుమారస్వామిని ఆక్రమించాయి.

మహాభుజుడు కుమారస్వామి. దిగ్గజాలు రెంటినీ పెనవేసి రెండు చేతుల్తో పట్టుకున్నాడు. పుట్టుకతోనే సహజంగా లభించిన శక్తి వొకచేత్తో పట్టుకున్నాడు. ఆటకోసం పెట్టుకున్న కోడి మరోచేత్తో పట్టుకున్నాడు. మరి రెండుచేతుల్తో పూరించిన శంఖం పట్టుకున్నాడు. రెండుచేతుల్తో ఆకాశం బాయింధవడం మొదలెట్టాడు. రెండుచేతుల్తు

నోటిదగ్గిర పెట్టుకొని, బాల్యోచితంగా మాటిమాటికీ వేళ్ళు చప్పరించాడు. మిగిలిన రెండుచేతుల్లోనూ ధనుస్సూ, బాణాలూవున్నాయి.

ఒక వాడిబాణంతో క్రౌంచపర్వతం దూసుకుపోయేట్టు కొట్టాడతడు. శక్తి వేసి శ్వేతపర్వతశిఖరం విరగ్గొట్టాడు. అంతతో వూరుకోక, ఆరునోళ్ళతోనూ గాట్టిగా అరిచాడు. ప్రళయకాలంలో భైరవుడు అరిచినంత భయంకరంగా ప్రతిధ్వనించింది ఆ అరుపు. ఆ అరుపుతో కులపర్వతాలు వుప్పూత ఊగిపోయాయి. దిక్కులు పగిలిపోయాయి. గిరగిరా తిరిగేపోయింది భూచక్రం. భయంతో కిందామీదా అయిపోయారు దేవతలు. సముద్రాలసంగతి చెప్పేఅక్కరలేదు, సంక్షోభించిపోయాయి. సూర్యుడి గుర్రాలు బెదిరిపోయి, ఎటుపడితే అటు ఈడ్చుకుపోయాయి రథం.

ఈమహోత్పాతాలు చూసి సతమతమైపోయారు మునులు. లోకకల్యాణం కోసం వెంటనే శాంతికవిధులూ అవీ చేశారు. అప్పుడు చైత్రరథంలోనివాళ్ళు యావన్మందీ చేరి, 'ఋషులభార్యలికి అగ్ని వల్ల పుట్టిన బాలుడే ఈఅనర్థమంతా చేస్తున్నాడు' అంటూ కేకలువెయ్యడం మొదలు పెట్టారు. ఈ అపవాదుకి సిగ్గుపడిపోయారు ఋషులు. వశిష్ఠుడు తప్ప తక్కిన ఆరుగురూ తమతమ భార్యల్ని వొదిలిపెట్టేశారు. 'పాపం, వీళ్ళ తప్పేముంది?' అన్నారు జనంలో కొందరు. 'ఇన్ని పోకిళ్ళూ పోయింది అగ్ని భార్యే' అన్నారు.

ఇదంతా చూసింది స్వాహాదేవి. పెద్దప్రమాదమే వచ్చిందంటూ మునులదగ్గిరికి వెళ్ళింది. 'నాభర్తవల్ల నేనే కన్నాను వీణ్ణి. మీవాళ్ళ తప్పేమీ లేదు. అపవాదు విన్నంతమాత్రాన, మీవంటి సత్పురుషులు కులసతుల్ని వొదిలిపెట్టడం అన్యాయం' అంటూ నచ్చజెప్పింది. ఎంతచెప్పినా లాభం లేకపోయింది. అంగీకరించలేదు ఋషులు.

అది అలా వుండగా-

కుమారస్వామి దగ్గిరికి విశ్వామిత్రుడు వచ్చాడు. అతడి శరణు జొచ్చి, అనేకవిధాల అతణ్ణి స్తుతించాడు. అతడి ఆదేశం ప్రకారం అతడి జాతకర్మాదులు మొదలయినవి నెరవేర్చాడు.

ఇదంతా తెలుసుకుని, దేవతలందరూ కలసి దేవేంద్రుడిదగ్గిరికి వెళ్ళారు. 'అగ్ని దేవుడికి వొక కొడుకు పుట్టాడు' అని కబురు చెప్పారు. 'కనీవినీ ఎరగనంత బలవంతుడూ, పౌరుషవంతుడున్నూ అతడు. నిన్ను గడ్డిపరకలా చూస్తాడు. ఘడియకో, క్షణానికో వచ్చి నీరాజ్యం మీాద పడతాడు. నీ దేవేంద్రపదవి లాక్కుంటాడు. తప్పదు. అందు కని, అతడు రాకముందే అతణ్ణి చంపెయ్యి. అలా అయితే నీ ఇంద్ర పదవీ నీకు దక్కుతుంది. మేమూ హాయిగా బతుకుతాం. లోకాలూ సుఖంగా వుంటాయి', అన్నారు.

వెంటనే సప్తమాతృకల్ని* పిలిపించాడు దేవేంద్రుడు. 'వెళ్ళండి. అగ్ని కొడుకుని చంపండి. నాకు ఉపకారం చెయ్యండి' అని ఆదేశిం చాడు. ఘోరంగా కుమారస్వామి మీాదికి పరిగెత్తారు సప్తమాతృ కలు. అయితే అతణ్ణి ఆక్రమించలేకపోయారు. అల్లంత దూరంనించే అతడి తేజస్సు చూసి భయపడిపోయారు. ఇంకో ఉపాయం లేక 'శరణం టే శర' ణంటూ అతణ్ణే ఆశ్రయించారు. 'మేం లోక మాతలం. మమ్మల్ని మాతృభావంతో పరిగ్రహించు' అన్నారు. అంగీకరించి వాళ్ళని ఆదరించాడు కుమారస్వామి.

ఇంతలో అగ్ని వచ్చి, కుమారుణ్ణి కలుసుకున్నాడు. తండ్రిని పూజించాడు కుమారస్వామి. కొడుకుని కాపాడుతూ అతడిదగ్గిర వుంటూ వచ్చాడు అగ్ని.

---

* సప్తమాతృకలు: బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవీ, వారాహి, ఇంద్రాణి చాముండా.

మాతృకలు మొదట పరిగెత్తినప్పుడు వాళ్ళ క్రోధంవల్ల లోహితాస్య అని వొకామె పుట్టింది. ఆమె కుమారస్వామికి దాదిగా కుదురుకుంది. అతణ్ణి లాలించింది. భూతగణాలు యీవత్తూ వచ్చి, అతడి చుట్టూ చేరుకున్నాయి.

ఇదంతా విన్నాడు దేవేంద్రుడు. మరింత కంగారు పడ్డాడు. ఎకాయెకిని కుమారస్వామి మీదికి దండయాత్ర ప్రారంభించాడు. నిప్పులు కక్కుతూన్న వజ్రాయుధం చేత్తో పుచ్చుకున్నాడు. రథాలూ ఏనుగులూ, గుర్రాలూ, భటులూ ఉద్ధృతంగా బయల్దేరదీశాడు. దేవసైన్యం దేవతలు యీవన్నందీ వరుం కట్టారు అందరిచేతుల్లోనూ దారుణమైన ఆయుధాలు తళతళా మెరుస్తున్నాయి. బింకాలు పలుకుంటూ, పెద్దపెద్ద కేకలు వేసుకుంటూ దేవసైన్యం కొర్లివచ్చింది. కుమారస్వామిని ముట్టడించింది.

చూశాడు కుమారస్వామి. ఉరుములు వురిమినట్టు కోపంతో అట్టహాసం చేశాడు. అతడి ఆరుముఖాలనించీ, అగ్నిజ్వాలలు బయలుదేరాయి. భయంకరంగా దేవసైన్యంమీదపడి, అదే కాల్చడం మొదలెట్టాయి. కరచరణాలు ఆడలేదు దేవతలికి. క్షణంలో త్రాహి త్రాహి మనిపోయారు. 'ప్రభూ, నీకింకరులం. మమ్మల్ని రక్షించు' అని శరణుజొచ్చారు. మంటలార్పి, వాళ్ళని చేరదీశాడు కుమారస్వామి.

దేవతలు యీవన్నందీ కుమారస్వామిని ఆశ్రయించడం తోటే, మరింత మతిపోయింది దేవేంద్రుడికి. ఉగ్రుడే అయిపోయాడతడు. ఉంకించి, వజ్రాయుధంవిసిరాడు కుమారస్వామి మీదికి. కుమారస్వామి కుడిపక్కని తగిలింది వజ్రాయుధం. తగిలీ తగలడంతోనే, అతడి కుడిపక్క విశాఖుడు అని వొక వింతపురుషుడు పుట్టాడు. బంగారంలా వుంది విశాఖుడి శరీరం. చేతిలో శక్తి వుంది. తలమాత్రం మేకతల.

విశాఖుడు మాత్రం పుట్టి పూరుకోలేదు. అతడితోపాటు, అనేకమంది కన్యలూ కుమాళ్ళూ పుట్టుకు వచ్చారు.

అదంతా చూసి జజ్జరిల్లిపోయాడు దేవేంద్రుడు. శరణు శరణంటూ చేతులు జోడించాడు. అభయమిచ్చి, అతణ్ణి ఆదరించాడు కుమారస్వామి. దేవతలు యావన్మందీ సంతోషించారు. సింహనాదాలూ చేశారు. కుమారస్వామి దేవేంద్రుల చుట్టూ చేరి జేజేలు చేశారు.

సర్వలక్షణాలతోనూ, సంపూర్ణమయిన యవ్వనంతో వున్నాడు కుమారస్వామి. పొడవూ, ఉన్నతాలూ అయిన ఆ బాహువులూ, కవచంతో, మలిచినట్టు వున్న ఆశరీరమూ, ఆఎర్రవస్త్రాలూ, అందమయిన ఆ కర్ణకుండలాలూ, రత్నాలు చెక్కిన బంగారం కిరీటమూ — చూడడానికి వెయ్యికళ్ళూ చాలనట్టు వున్నాడతడు. తొలిచూపులోనే వలపుకలిగింది లక్ష్మికి. తెల్లపద్మాలు చేత్తోపుచ్చుకొని ఎదట సాక్షాత్కరించిందామె. అందరి ఎదటా కుమారస్వామిని వరించింది. లక్ష్మి రావడంతోటే, మరింత కాంతివెచ్చింది కుమారస్వామికి. సంపూర్ణ చంద్రుడిలా ప్రకాశించాడతడు. రెప్ప వెయ్యకండా అతణ్ణి చూశారు దేవతలూ రుషులున్నూ.

ఇదంతా పంచమినాడే జరిగింది. లక్ష్మికుమారస్వామిని వరించిన ఆశుక్ల పంచమి లోకానికి పూజనీయమూ, లక్ష్మీకరమున్నూ అయింది.

ఆదినం అలా వెళ్ళింది. ఆరోదినం షష్ఠి వచ్చింది. అవాళ మహామునులందరూ కుమారస్వామిని భక్తితో పూజించారు. 'దేవా, నువ్వు దేవేంద్రపదవి స్వీకరించాలి' అని చేతులుజోడించారు. 'పుట్టిన ఆరునాళ్ళకే జగజ్జెట్టి వయావు. లోకాలన్నీ గెల్చుకున్నావు. ఆశ్చర్యకరంనీమాహాత్మ్యం. ఇలాంటినువ్వే దేవేంద్రపదవికి తగినవాడివి. అనుగ్రహించు. దేవలోకం ఏలుకో. మమ్మల్ని పరిపాలించు' అన్నారు.

'ఇంద్రుడుగా వున్న వాళ్ళు చెయ్యవలిసిన పని ఏమిటో ముందు చెప్పండి' అని అడిగాడు కుమారస్వామి. 'లోకం పాలించడమే ముఖ్యమైన పని' అన్నారు మునులు. 'సూర్యుడూ, చంద్రుడూ, భూమీ, నీరూ, అగ్నీ, గాలీ, ఆకాశమూ - వీటి స్థిరత్వం చెడకుండా నిశ్చలమయిన శక్తి ప్రసాదించాలి. బలమూ, తేజస్సూ నిలుపుకుంటూ పరిపాలన సాగించాలి. శిష్టుల్ని రక్షించాలి. దుష్టుల్ని శిక్షించాలి - ఇవీ ఇంద్రుడయినవాడి కర్తవ్యాలు' అన్నారు.

'నువ్వు దేవేంద్రుడు కావడం నాకూ సమ్మతమే,' అంటూ అందుకున్నాడు ఇంద్రుడు - 'నువ్వు దేవేంద్రపీఠం అధిష్ఠించు. నీచిత్తం వచ్చిన పనులు నాకు ఆదేశించు. శిరసావహిస్తాను. నీదయవుంటే చాలు. చీకూ చింతా లేకుండా సుఖంగా బతుకుతాను. మహాపరాక్రమశాలివి నువ్వు. అన్నివిధాలా నువ్వే తగినవాడివి.

'అంతేకాదు, నేను దేవేంద్రుడిగా వుండడానికీ జంకుగానే వుంది. ఏమంటావా: నీతేజస్సూ అదీ చూసి చకితులయిన వాళ్ళు, ఎవళ్ళయినా కొందరు నీకు ఇంద్రపదవిమీద అభిలాష కలిగేటట్టు చెప్పి, లేనిపోని దోషాలూ నామీద ఆరోపించవచ్చు. నీకూ నాకూ భేదాలూ కలిగించవచ్చు. దానిమీద నీకుకోపంవచ్చి, నామీద దయతప్పిందో ఇక అడ్డుపడే దాతంటూ వుండదు. లోకభయంకరమయిన మహాయుద్ధమే రావచ్చు. అంచేత అదంతా లేకండా స్వర్గరాజ్యం నీకే అప్పగిస్తున్నాను. మమ్మల్ని అందరినీ ఏలుకో.'

'అలా ఎందు కవుతుంది!' నవ్వుతూ అన్నాడు కుమారస్వామి - 'వద్దు. నువ్వే దేవేంద్రుడివై సుఖంగా వుండు. నేను. నీ నేస్తంగా వుంటాను. నా యావచ్ఛక్తీ వినియోగించి, నీకు అవసరమయిందల్లా నిమిషాలమీద చేసిపెడుతూ వుంటాను. ఏం చెయ్యాలో ఆదేశించు.'

'మహాప్రసాదం' అన్నాడు. దేవేంద్రుడు. 'నీ అనుమతిమీాద నేను దేవేంద్రపదవిలో నిలుస్తాను. సత్యవంతుడివి నువ్వు. నా దేవ సైన్యం అంతటికీ నాయకత్వం వహించు లోకాలు రక్షించు' అన్నాడు.

సేనానాయకపదవి అంగీకరించాడు కుమారస్వామి. 'నీ ఇష్ట ప్రకారం నీసేనకి నాయకుణ్ణవుతాను. అపజయమంటూ లేకండా సైన్యం సరిచేస్తాను. నీశత్రువులు - వాళ్లు ఎంత ఘోరమయిన వాళ్ళయినా సరే, వాళ్ళని నాశనం చేస్తాను యావత్తులోకాలూ కాపాడతాను. తరుగూ తిరుగూ లేకండా చేస్తాను లే. సేనాని పట్టంకట్టు, నన్ను.'

బ్రహ్మానందం కలిగింది దేవేంద్రుడికి. వెంటనే సమస్తమయిన దేవతలూ మునులూ యావన్మంది సమక్షంలో కుమారస్వామిని దేవ సైన్యానికి సర్వసేనాధిపతిగా అభిషేకం చేశాడు. మహామునులు జయజయ ధ్వానాలు చేశారు. దేవతలు సింహనాదాలు చేశారు. కిన్నరులూ గంధర్వులూ గానంచేశారు. మంగళతూర్యాలు వాయిం చారు. అప్సరసలు నృత్యంచేశారు. కల్పవృక్షం పూలవాన కురిసింది. మేరుపర్వతశిఖరంమీాద శరచ్చంద్రుడిలాగ,మణికిరీటంతోవున్న కుమార స్వామి శిరస్సున ఉజ్వలమైన తెల్లగొడుగు ఎంతోగొప్పగా కనిపించింది.

సరిగ్గా అదేసమయానికి శివుడూ వచ్చాడక్కడికి. ఆనం దంతో కలకల్లాడుతున్నాడు శివుడు. చంద్రవంక జటాజూటం మీాద మెరుస్తూ వుంది. మెళ్ళో నాగుపాములు పడగెత్తి ఆడుతున్నాయి. పక్కని పార్వతీదేవీ, వెంట సిద్ధులూ వున్నారు.

ప్రేమతో ప్రియకుమారుణ్ణి కుమారస్వామిని గుచ్చి కౌగిలించు కున్నాడు శివుడు. వాత్సల్యం వుట్టిపడేటట్టు చల్లని చూపులు చూశాడు. విశ్వకర్మ తయారుచేసిన బంగారం పూలమాల అతడి మెళ్ళో వేశాడు.

ఐతే కుమారస్వామి శివుడి కుమారుడెలా అయ్యాడని అంటావేమో! అదే చెపుతున్నాను విను. లోగడ తన వీర్యం అగ్నిలో భద్రపరిచాడు శివుడు. * ఆ వీర్యంవల్లే అగ్ని కుమార స్వామిని కన్నాడు. అదీకాక, అగ్నే శివుడని వేదాలు తెలిసిన బ్రాహ్మలు చెపుతూనే వున్నారు కదా! దానా దీనా కుమారస్వామి అగ్నికుమారుడూ, శివుడి కుమారుడున్నూ కావడంలో సందేహ మేముంది? అగ్ని భార్యకృత్తికలు అని పేరుకల ముని భార్యల ఆరుగురి రూపం ధరించి, భర్తతో కలిసి, శ్వేతపర్వతంమీద రేతస్కందం చేయడంవల్ల పుట్టిన వాడు కనక కుమారస్వామికి కార్తికేయుడనీ, స్కందుడనీ పేర్లు.

శివుడువచ్చి కుమారస్వామిని కలుసుకున్నాక, దేవసేనని ముస్తాబు చేయించి తీసుకువచ్చాడు దేవేంద్రుడు. 'బ్రహ్మదేవుడు నీకోసమే ఏర్పాటుచేసిన కన్య ఈమె; దేవసేన. పరిగ్రహించు ఈమెని' అంటూ కుమారస్వామికి నివేదించాడు. వెంటనే ముహూర్తమూ నిశ్చయమైపోయింది. మంగళవాద్యాలు మోగాయి. బృహస్పతి పురోహితుడుగా కూచున్నాడు. దేవసేన కుమారస్వాముల కల్యాణం వైభవంగా జరిగిపోయింది. కుమారస్వామి పెళ్ళి జరిగిన ఆషష్ఠి లోకానకి పవిత్రదినమైంది.

పెళ్ళిపందిరిలో కూచున్న కుమారస్వామి దగ్గిరికి భర్తలు వదిలేసిన ముని భార్యలు ఆరుగురూ వచ్చారు. 'బాబూ, మాకు ఏదో వొక దారి చూపించు' అంటూ దీనంగా నుంచున్నారు. 'చూడకా

* శివుడూ పార్వతీ మన్మధక్రీడలో వుండగా వారికి భంగం కలిగించమని ఇంద్రుడు అగ్నిని కోరాడనీ, అగ్ని వెళ్ళి ఎదట నిలవగానే శివుడు ఎడంగా తొలిగిపోయాడనీ, శివుడి వీర్యం కిందపడిపోయిందనీ. దానికి పార్వతి కోపించి, అగ్నినే ఆవీర్యం ధరించమందనీ బ్రహ్మాండపురాణం. తరవాతకథ భిన్నంగానూ వుంది. శివుడివీర్యం మొయ్యలేక అగ్ని గంగకి ఇచ్చాడనీ, ఆమెకూడా భరించలేక రెల్లుగడ్డిలో విడిచిందనీ, రెల్లుగడ్డిలో సూర్యరశ్మికి కుమార స్వామి పుట్టాడనీ, అతణ్ణి కృత్తికలు పెంచారనీ వుంది.

చెయ్యకా దుర్మార్గులు కొందరు పంతంపట్టి కావాలని మామీద నిందలు వేశారు. నిందకి భయపడి మావాళ్ళు మమ్మల్ని వదిలి పెట్టేశారు. ఏమయినా నువ్వు మాకు కుమారుడివే. నీతల్లులం మేము. పుణ్యలోకాలికి దూరమైపోయి దుఃఖపడుతున్నాం. నువ్వు తప్ప మాకు మరి దిక్కులేదు. మాకేదో పుణ్యగతి కల్పించు' అన్నారు.

'మీ పుత్రుణ్ణే నేను,' వినయంగా అన్నాడు కుమారస్వామి. 'మీరు నాకన్నతల్లులు. సందేహం లేదు. మీరు కోరినట్టే చేస్తాను' అంటూ, పక్కనే వున్న ఇంద్రుణ్ణి పిలిచాడు. 'వీళ్ళకి తగిన స్థానం చూడు' అన్నాడు.

'అభిజిత్తుస్థానం ఖాళీగా వుంది.' అన్నాడు దేవేంద్రుడు — 'దక్షుడి కుమార్తెలు ఇరవైఏడుచుక్కలూ చంద్రుడి భార్యలు. అందులో రోహిణి పొరుగున వుండేది అభిజిత్తు. అందరిలోకీ తానే భర్తకి ప్రియురాలు కావాలని ఆమె ఆకాంక్ష. అందుకని తపస్సుకి వెళ్ళిపోయిందామె. ఆమెస్థానం వీళ్ళకి ప్రసాదించు.'

ఇంద్రుడు చెప్పినప్రకారం అభిజిత్తుస్థానం వాళ్ళ కిచ్చాడు కుమారస్వామి. వెంటనే వాళ్ళు ఆరుగురూ అక్కడికి వెళ్ళిపోయారు. అవాళనించీ, భరణికీ, రోహిణికీ మధ్య ఆకాశంమీద కృత్తికలు ఆరుగురూ అగ్నిదైవత్యమయిన నక్షత్రంగా ప్రకాశిస్తూ వున్నారు.

తరవాత, స్వాహాదేవి వచ్చింది కుమారస్వామి దగ్గిరికి 'నాన్నా, నువ్వు నాకుమారుడివి. నీదగ్గిరే వుంటాను నేను. అంగీక రించు' అంది. సంతోషంగా సమ్మతించాడు కుమారస్వామి. 'అమ్మా, నాదగ్గిరే వుండు నువ్వు. నేనూ, నీకోడలూ నీకు ఏలోపమూ రానివ్వము' అన్నాడు.

అనంతరం హవిషా, కాళీ, కౌశికా, ఉద్ధతా, శారికా, ఆర్యా, వైధాత్రీ అని ఏడుగురు కుమారమాతృకలు వచ్చి నుంచున్నారు.

'మూడులోకాలికీ మమ్మల్ని తల్లులుగా నియమించు' అన్నారు వాళ్ళు. 'ఇంతవరకూ వున్న మాతృకలకంటే మేం అధికం కావాలి. ఇక ముందు వాళ్ళని లోకాలు అంగీకరించకూడదు. వాళ్ళకి బదులు మమ్మల్నే సేవించాలి. ఈవరం ప్రసాదించు' అన్నారు.

'వాళ్ళ ఆధిక్యం తగ్గడం ఎందుకూ?' నవ్వుతూ అన్నాడు కుమారస్వామి — 'కావాలంటే, ఇంకోవరం కోరండి ఇస్తాను.

'ఐతే, బాలగ్రహాల మవుతాం. లోకంమీద శిశువుల్ని ఎప్పుడూ పీడిస్తూ వుంటాం. ఐనా, నీ దయకి పాత్రులమయే వుంటాం. ఈవరం అనుగ్రహించు' అన్నారు మాతృకలు.

'అయ్యో, చెడ్డపనికే నెట్టుకున్నారే!' అంటూ ఆలోచించాడు కుమారస్వామి. 'ఇది న్యాయమైన పనేనా? ఐనా, అన్నాను కనక అంగీకరిస్తున్నాను. కాని మీకు మొక్కిన వాళ్ళ పిల్లల్నీ, పూజించిన వాళ్ళ పిల్లల్నీ మాత్రం దయగా చూడాలి మీరు. ఏబాధాలేకండా వాళ్ళని కాపాడాలి. పదహారు సంవత్సరాలవరకే కుర్రాళ్ళని బాధించాలి మీరు. మీరక్షణకోసం నాఅంశలో పుట్టినవాణ్ణి వొకణ్ణి మీతో పంపిస్తాను' అన్నాడు. ఉత్తరక్షణంలో బంగారంలాంటి దేహకాంతి కలవాణ్ణి వొకణ్ణి పుట్టించాడు. పుట్టడంతోటే అతడికి ఆకలి అధికమైంది. ఆకలితో అతడు మూర్ఛపడిపోయాడు. వెంటనే అతడికి చైతన్యం కలిగించాడు కుమారస్వామి. అతడు స్కందాపస్మారగ్రహ మయాడు. బాలగ్రహాలయిన మాతృకలికి రక్షకుడుగా నిలిచాడు.

వాళ్ళతోపాటు పక్షులతల్లి వినతా, దైత్యులతల్లి దితీ, గోవులతల్లి సురభీ, కుక్కలతల్లి సరమా, చెట్లతల్లి కరంజా, పాముల తల్లి కద్రువా, కుమారస్వామి దాది లోహితాస్యా కూడా గర్భంలో వున్న శిశువుల్నీ, పుట్టిన పిల్లల్నీ పీడిస్తూ వుంటారు. అయితే బలులూ, మంత్రాలూ, ఉపహారాలూ, దానాలూ, తర్పణాలూ అవీ చేస్తే

తృప్తిపడతారు. పిల్లలికి అయురారోగ్యాలు ప్రసాదిస్తారు. ఈగ్రహా లన్నీ పదహారేళ్ళలోపునే బాధిస్తాయి. కాని ఆతరవాత బాధించేవి కూడా కొన్ని వున్నాయి. చెపుతాను, విను.

నిద్రించినప్పుడూ, లేదా, మేలుకుని వున్నప్పుడూ దేవతల్ని చూసి భ్రమపడి, మనిషి పలవరిస్తాడు. అప్పుడు అతణ్ణి సోకింది దేవగ్రహ మన్నమాట.

పడుకున్నప్పుడూ, లేదా కూచున్నప్పుడూ పితరుల్ని చూసి, భ్రమపడతాడు మనిషి. అలా భ్రమ పెట్టేది పితృగ్రహం.

గంధర్వుడిలాగ కనపడి, భ్రమ పెట్టేది గాంధర్వగ్రహం.

కాలం విపరీతమయినప్పుడు భ్రమ కలిగించేది యక్షగ్రహం.

వాతమూ, పైత్యమూ మొదలయిన వికారాలవల్ల బుద్ధి తప్పడమూ వొక గ్రహావికారమే అంటారు. విన్నావు కదూ, అయితే మనిషన్న వాడికి డబ్భయిసంవత్సరాలవరకే ఈగ్రహాలబాధ. తరవాతా! — ఏగ్రహమూ అక్కరలేదు తరవాత. ముసలితనమే అన్నీ చక్క బెట్టేస్తుంది.

కాని వొక్కమాట మాత్రం వుంది. ఒక నియమమూ, నిష్ఠా కలిగి, ఇంద్రియాలు జయించినవాళ్ళనీ, శుచిగావుండిన శాంతిసంపన్నులినీ ఈ గ్రహాలు ఏవీ ఎలాంటి పరిస్థితిలోనూ కూడా ఏమీ చెయ్యలేవు. అంతేకాదు, ఆది దేవుడయిన శివుడిమీద భక్తి పెట్టుకున్నా చాలు. అతడి పొలి మేరకయినా ఈగ్రహాలు అడుగుపెట్టవు.

బాలగ్రహాల నియామకమూ అదీ అయాక, స్వాహాదేవి కుమారుడితో ఇలా అంది: 'నాన్నా, దక్షప్రజాపతి కూతుర్ని నేను. చిన్నప్పుడే అగ్నికి ఇచ్చి పెళ్ళి చేశాడు మాతండ్రి. ఐతే, నేనంటే ఇష్టంలేదు మీ అయ్య అగ్నికి. నువ్వేమో సర్వసమర్థుడివి. అంచేత మాఇద్దరికీ మంచి అనురాగం కుదిరేటట్టు చెయ్యాలి నువ్వు.'

'అమ్మా, విచారించకు,' అన్నాడు కుమారస్వామి. 'ఉత్తములయిన బ్రాహ్మలు అగ్నిలో హవ్యాలు వేలుస్తారు కదా! అపుడు 'స్వాహా' అంటూ కలిపి మంత్రాలు చదువుతారు వాళ్ళు. ఆవిధంగా నీకు నీభర్తతో నిత్యసహవాసం సిద్ధిస్తుంది.'

అంతలో మునులతో కలిసి బ్రహ్మదేవుడూ అక్కడికి వచ్చాడు. వచ్చీ రావడంతోటే కుమారస్వామిని అభినందించాడు. దగ్గిరే వున్న శివపార్వతుల్ని చూపించి, 'ఇదిగో ఈయన త్రిపురాలు జయించిన శివుడు. ఈమె లోకమాత; హిమవంతుడికూతురు; పార్వతి. వీళ్లు ఇద్దరూ నీ తల్లిదండ్రులు. వీళ్ళని సేవించు. అగ్నిలోనూ, ఆయన భార్య స్వాహాదేవిలోనూ యోగబలంవల్ల తమ వీర్యం భద్రపరిచారు వీళ్ళు. లోకహితం కోసం అగ్నిదంపతులు నిన్ను కన్నారు' అంటూ కుమారస్వామి జన్మక్రమం అతడితో విడమర్చి చెప్పాడు.

అంజలిబంధం కీలించి శివపార్వతులికి సాగిలబడ్డాడు కుమారస్వామి. స్తోత్రగానంచేసి పూజించాడు. అపుడు ఐరావతం చెక్కిన గంటలురెండు దేవేంద్రుడు కుమారస్వామికి బహుమానమిచ్చాడు. ఒకటి తాను వుంచుకుని, రెండోది విశాఖుడికిచ్చాడు కుమారస్వామి.

ఇదంతా అయాక కుమారస్వామిని మళ్ళీ కౌగలించుకున్నాడు శివుడు. శిరస్సు ముద్దాడాడు. వెయ్యిసింహాలు పూనిన వొక అందమయిన రథంమీద పార్వతీదేవితో సహా అతణ్ణి ఎక్కించుకుని, భద్రవటం బయల్దేరాడు.

ఆసింహాలరథం ముందు యక్షులతో సహా పుష్పకవిమానం మీద కుబేరుడు నడిచాడు. వెనక ఐరావతం ఎక్కి యావన్మంది దేవతలతోనూ దేవేంద్రుడు బయలుదేరాడు. కడిపక్క ఎంతోమంది రాక్షసులమీదా యక్షులమీదా నాయకత్వంవహించి, అమోఘుడని వొక యక్షప్రముఖుడూ, సర్వపరికరాలతోనూ వసువులూ, రుద్రులూ, ఆది

త్య్యలూ నడిచారు. ఎడమపక్క అతిభయంకరాలయిన వ్యాధులూ మృత్యువూ, వాటితో యముడూ, ఘోరమయిన రకరకాల జలచరాలతో కలిసి వరుణుడూ నడిచారు.

అంతేకాదు. శూలమూ, పట్టిసమూ, గదా, ముసలమూ మొదలైన కుమారస్వామి ఆయుధాలూ,కమండలం మొదలైనఉపకరణాలూ మూర్తిమంతాలై వెంటనడిచాయి. చంద్రుడు తెల్లగొడుగు పట్టాడు. అగ్నీ, గాలీ చామరాలు వేశారు. విద్యా, సావిత్రీ, గాంధారీ, కేశీ అనే దేవతాస్త్రీలు పార్వతిని సేవిస్తూ నడిచారు. శివుడి స్నేహితుడు పింగళుడు అనే యక్షుడు వృషభపతాకం పట్టాడు.

ఇలా మహావైభవంగా వెళ్ళి భద్రవటం చేరాడు శివుడు. అక్కడ కుమారుణ్ణి మరోమారు గుచ్చి కౌగలించుకున్నాడతడు. 'బాబూ, దేవతల పనిపడ్డప్పుడల్లా వెనుకాడకండా నెరవేరుస్తూ వుండు' అని ఉపదేశించాడు. 'ఏడు వాయు సమూహాలికీ నువ్వే అధిపతిగా వుండు. ఏసమయంలోనూ కూడా నాపాదాలు ధ్యానించడం మరచిపోకు. వెళ్లు. సుఖంగా వుండు. శుభం కలుగుతుంది నీకు' అంటూ ఆశీర్వదించాడు.

ఇలా శివుడు కుమారస్వామిని సెలవిచ్చి పంపుతున్నాడు. అంతలోనే అకస్మాత్తుగా ఉత్పాతాలు పుట్టుకువచ్చాయి. దిక్కులు మండాయి. భూమి గిరగిరా తిరిగింది. ఆకాశం అరిచింది. పర్వతాలు వణికాయి. అంతటా అంధకారమే అంధకారం ఆవరించింది. దేవతల గుండెలు దడ దడలాడాయి.

చూస్తూ వుండగానే పెద్ద రాక్షససేన వచ్చిపడింది. శివుడితోసహా దేవతలు యావన్మందినీ ఘిరాయించేసింది. ప్రతీవాడి చేతిలోనూ ఘోరమయిన మారణాస్త్రాలే వున్నాయి. చతురంగసేన యావత్తూ భూమి ఈనినట్టు వుంది. వాళ్ళ కోలాహలం దిక్కులు

చెవుడు పడినట్లు చేస్తోంది. ఆసేనంతటికీ మహిషాసురుడు నాయకుడుగా వున్నాడు. ఘోరంగా వున్నాడు వాడు.

వచ్చీ రావడంతోటే మాటా మంతీ లేదు. కయ్యానికి కాలుదువ్వారు రాక్షసులు. లెక్కాజమా లేకండా దేవతలమీద బాణాలు కురిపించేశారు. గదలూ, ఖడ్గాలూ, ముసలాలూ, పరిఘలూ, ఫిరంగులూ — వాళ్ళకేమిటి, ఏదిపడితే అది ఎడతెరిపిలేకండా విసిరారు. కన్నుమూసి కన్ను తెరిచేలోపల ఎన్నో ఏనుగులూ, ఎన్నో గుర్రాలూ, ఎన్నో రథాలూ, ఎందరో భటులూ — దేవసైన్యం పచ్చడి పచ్చడి అయిపోయింది. అడివిలో అగ్గిముట్టుకుంటే పరిగెత్తే మృగాల్లాగ అయిపోయారు దేవతలు. ప్రాణభయంతో దిక్కు తెలియకండా పరిగెత్తారు.

సింహనాదం చేశాడు దేవేంద్రుడు. 'భయపడకండి. పారిపోకండి. నిలవండి. ఎవళ్ళ వాహనం వాళ్ళు మళ్ళించండి. ఎవళ్ళ ఆయుధం వాళ్ళు సరిచేసుకోండి. చేతికివచ్చిన రాక్షసుణ్ణి చంపెయ్యండి. నేను వుండగా మీకు వచ్చేదేమీ లేదు. ధైర్యం వహించండి. గెలుపు మీదే అవుతుంది' అంటూ గొంతెత్తి హెచ్చరించాడు.

దాంతో విరిగిపోతూవున్న దేవసైన్యం వెనక్కిమళ్ళింది. వాహనాలూ, ఆయుధాలూ సరిచేసుకుని రాక్షసులమీదికి తిరగబడ్డారు వసువులూ, రుద్రులూ, సాధ్యులూ మొదలయిన దేవతలు. మంచి మంచి శక్తివంతాలయిన అస్త్రాలు రాక్షసులమీద ప్రయోగించారు. పెనుగాలికి తూలిపోతూవున్న సంధ్యాకాలపు ఎర్రమేఘాల్లా దేవతల బాణాలికి రాక్షససేనలో కూలిపోతున్నాయి ఏనుగులు. తుపానుగాలికి కొట్టుకుపోయే సముద్రం కెరటాల్లాగ, తిరిగిపోతున్నాయి గుర్రపుదళాలు. అడివిలో దావాగ్ని ముట్టుకుంటే కాలిన మోళ్ళు కుప్పబడ్డట్టు గుండ పిండి అయి కుప్పలుపడ్డాయి రథాలు. పెద్దపెద్ద పిడుగులికి కొండశిఖరాలు ఎగిరిపడి, ప్రళయకాల మహాసముద్రంలో పడుతూవుంటే ఎలా

వుంటుంది, అదిగో అలావుంది దేవతలబాణాలికి రాక్షసుల తలకాయలు ఎగిరి కింద పడుతూ వుంటే.

ఇలా దేవసైన్యం విజృంభించి చిత్రవధ ప్రారంభించడంతోటే, రాక్షససైన్యం నడుం విరిగిపోయినట్టయిపోయింది. నిలవలేకపోయారు రాక్షసులు. తలావొక్కదిక్కు పరిగెత్తారు.

చూశాడు మహిషాసురుడు. దేవసైన్యం అదిలిస్తూ ముందుకి వురికాడు. బ్రహ్మాండమయిన వొక పర్వతం పెకికి, రెండు చేతులుతోనూ ఎత్తి దేవతలమీదికి పరిగెత్తాడు. పోయినబలం తిరిగి వచ్చింది రాక్షసులికి. పారిపోతూవున్న వాళ్ళల్లా మహిషాసురుడివెంట దేవతలమీదికి వచ్చారు. పటహమూ, నిస్సాణమూ, పణవమూ మొదలైన యుద్ధవాద్యాలు వాయిస్తూ సింహనాదాలు చేశారు. దేవతలుకూడా దేవేంద్రుడి నాయకత్వంకింద చలించకండా నిలబడ్డారు. వీరావేశంతో ఎదిరించారు.

బుసకొడుతూ అంతకొండా దేవసైన్యంమీద విసిరికొట్టాడు మహిషాసురుడు. భూకంపం కలిగినంత శబ్దమయింది. పదివేలమంది దేవయోధులు కొండకింద పచ్చడి అయిపోయారు. ఆదెబ్బతో అడిలిపోయారు దేవతలు. దేవేంద్రుడూ మొదలయిన ముఖ్యులంతా నిశ్చేష్టులే అయిపోయారు. నిలపడానికి గుండెలు చాలలేదు వాళ్ళకి. వెంటనే వెనకంజా వేసేశారు.

మరింత మిడిసిపడిపోయాడు మహిషాసురుడు. చేతులుచాచి దిక్కులే ముట్టుకున్నాడు. చిన్నవాళ్ళమీదికి ఎందుకులేఅన్నట్టు శివుడి రథమే అడ్డగించి పట్టుకున్నాడు. ఒక్క పెట్టుని పొలికేకలు పెట్టారు రాక్షసులు. 'అదిగో చిక్కిపోయాడు శివుడు' అంటూ అదే అరవడం అరిచారు. ముల్లోకాలూ తల్లడిల్లిపోయాయి. మహామునుల మొహాల్లో చిక్కితే నెత్తురుచుక్క లేదు.

చిరునవ్వునవ్వాడు శివుడు. 'చూశావా, వీడిసాహసం !' అని కుమారస్వామిని చూశాడు. 'నారథమే కట్టుకున్నాడు వీడసలు ! ఇక వీడిపని కానీ' అన్నాడు.

కులపర్వతంలాంటి కుమారస్వామి అందాకా అదంతా సరదాగా చూస్తున్నాడు. శివుడి మాటతో చివ్వుమని లేచాడు. ఒక్కమారు శరీరం పొంగించాడు. ఆసమయంలో అతణ్ణి చూడవలిసిందే, కాని చెప్పాలంటే మాటలు చాలవు. ఎర్రటి రత్నభూషణాలు, ఎర్రటి పూలదండలు. ఎర్రటి కొత్తవస్త్రాలు-దానికితోడు రెండుకళ్లూ చింత నిప్పుల్లా ఎర్రపడ్డాయి. యుద్ధమనడంతోటే మొహమూ ఎర్రగా కంది పోయింది. లోకాలన్నీ కాల్చెయ్యడానికి బయల్దేరిన కొత్తసూర్యుడా అనిపిస్తున్నాడు. అతడి ఉగ్రరూపంచూసి, దిగజారిన గుండెలు దిట్టం చేసుకున్నారు దేవతలు.

ఉత్తరక్షణంలో ఘోరమయిన శక్తి తీశాడు కుమారస్వామి. ఒక్క వూపుని విసిరికొట్టాడు మహిషాసురుడి మీద. ప్రళయాగ్నిలా నిప్పులు కక్కుతూ వెళ్ళింది శక్తి. తగిలీ తగలడంతోటే మరి కదప ళ్ళేదు మహిషాసురుడు. మచ్చులేకండా మండిపోయి వూరుకున్నాడు.

మహిషాసురుడితో వూరుకోలేదు కుమారస్వామి. అదే శక్తి మళ్ళీ మళ్ళీ ప్రయోగిస్తూ లక్షలకొద్దీ రాక్షసుల్ని చంపేశాడు. అతడి ప్రమథగణమూ రాక్షససేన మీద విరుచుకుపడింది. చేతికందిన రాక్షసుణ్ణల్లా చంపేసింది. వాళ్ళరక్తం కడుపారా తాగేసింది. పీకల మొయ్యా మాంసమూ తినేసింది. మత్తెక్కి పాటలుపాడుతూ స్వామిని స్తోత్రంచేసి నాట్యం చేసింది.

ఇలా రాక్షసులు యావన్మందినీ చంపేసి చీకట్లు తగిలేసిన సూర్యుడిలా ప్రకాశించాడు కుమారస్వామి. దేవేంద్రుడి సంతోషం చెప్ప అక్కరలే దిప్పుడు. అమాంతంగా కౌగలించుకున్నాడు

కుమారస్వామిని. 'స్వామీ, దేవతలూ నేనూ యావన్మందిమీ నీకింకరులం. మమ్మల్ని రక్షించు' అంటూ జేజేలుచేశాడు. బ్రహ్మ వరంవల్ల గర్వించి, మమ్మల్ని కర్రిపరకకింద కట్టేశాడు మహిషా సురుడు. బ్రహ్మాండమయిన బలం వీడిది. అంతవాడూ నీకోపాగ్నిలో పురుగులా మాడిపోయాడు. వీడితో సమానమయినవాళ్లు మరి వంద మందీ చచ్చారు. నీకీర్తిపతాక ముల్లోకాల్లోనూ ఎగురుతోంది' అన్నాడు.

శివుడూ రథం దిగివచ్చి, కుమారుణ్ణి మళ్ళీ మళ్ళీ కౌగలించు కున్నాడు. అతడి పరాక్రమం ప్రశంసించాడు. 'నన్ను ఎలా చూస్తు న్నారో ఇతణ్ణీ అలాగే చూసుకోవాలి మీరు' అని దేవతలతో చెప్పాడు. తరవాత భద్రవటానికి వెళ్ళిపోయాడు. దేవతలు సంతో షిస్తూ, ఎవరి నివాసాలికి వాళ్ళు వెళ్ళిపోయారు.

"ధర్మరాజా! అలా ఒక్కరోజునే రాక్షసులు యావన్మందినీ చంపేశాడు కుమారస్వామి. అన్నిలోకాలికీ అభయ మిచ్చా డతడు. ఇదీ కుమారస్వామి అవతారకథ. ఇది వింటేనేచాలు, అన్నిదోషాలూ హరించిపోతాయి."

### సత్యభామా, ద్రౌపదీ

ఇలా ఇక్కడ పాండవులూ, శ్రీకృష్ణుడూ మార్కండేయుడు చెపుతూవున్న కథలు వింటున్నారు. అదేసమయంలో మరో చోట ఏకాంతంగా సత్యభామా, ద్రౌపదీ మాటమంతీ ఆడుకుంటూ కూచున్నారు. ఆమాటా, ఈమాటా అయాక, సందర్భం కల్పించు కుని, "ఇదిగో, వొకమాట అడుగుతాను. దాపరికంలేకండా నిజం చెప్పాలి నువ్వు" అంది సత్యభామ – "ఎప్పుడూ అనుకుంటూ వుంటాను, ఐదుగురు భర్తల్నీ వొక్కతాటిమీద నువ్వు ఎలా నడుపు కుంటున్నావో అని. చిత్రం సుమా? అయిదుగురికీ అయిదుగురూ

నువ్వు గీసినగీటు దాటరు ! నవ్వుమొహాల్తో నిన్ను చూస్తారే కాని వోనాడూ మొహంముడుచుకోడం ఎరగం కదా ? తెలీక అడుగు తాను, ఏమీ అనుకోకేం. ఏమిటి నువ్వు చేసినమాయ ? ఏమయినా మంత్రమహిమా ? పెట్టుమందా ? నోముల ప్రభావమా ? లేదా— పడకగదిలో నువ్వు చేసిన మరేమయినా కౌశలమా? ఏమిటి చెప్పూ, నీభాగ్యానికి కారణం ? అడిగా ననుకోకు — నీదగ్గిర నేర్చుకుని మా అన్నయ్యని కొంగుని ముడిగట్టుకోవాలని, నీలాగే ప్రణయడోలి కల్లో ఊగులాడిపోవాలనీ గుబగుబలాడిపోతూవుంది నామనస్సు."

సత్యభామ ఇలా అడగడంతోటే కొంత చిరాకే కలిగింది ద్రౌపదికి. అయినా, లోలోపలే అది అపుకుంది, ఆమే. చిన్న చిరు నవ్వు నవ్వింది. "ఐతే వదినా, మాఅన్నయ్యకి నువ్వు తగిన వుజ్జీ కాదన్న మాట ! ఆయనికి ఎలావున్నా నాకుమాత్రం నువ్వు నచ్చలేదు సుమా !" అంటూ ఆమె తెలిఎతక్కువ ఎత్తిపొడుస్తూ పరిహాసమూ చేసింది. "కాని, నన్నేదో చెడ్డదానిలా అనుకోవడం న్యాయమేనా నీకు !" అంటూ వెంటనే గాంభీర్యమూ వహించింది. "మంత్రాలూ తంత్రాలూ, మందులూ మాకులూ-వీటివల్ల భర్తలు ప్రేమిస్తారనడం, వొట్టి వెర్రితనం. దానివల్ల ఉపయోగంలేదు సరికదా, వున్నప్రేమా వూడిపోతుంది. అలాంటిభార్యతో కాపరమూ, నాగుపాముతోపొందూ వొకటే అని భావిస్తాడు భర్త, తెలిస్తే. వశీకరణ తంత్రాలూ పెట్టుమందులూ మాయలూ బెడిసికొట్టి, భర్తకి రోగమూ, మూగ తనమూ, జడత్వమూ మొదలయినవి తెచ్చిపెడతాయి. చేతులారా చేసుకున్న దుర్మార్గంవల్ల తుదకి నిందా, పాపమూ మెడకి చుట్టుకుం టాయి. అంచేత భర్తవిషయంలో కపటం కూడదు భార్యకి. అతడి మనస్సుకి నచ్చినట్టు మసులుకోడమే ఆమె చెయ్యవలిసిందల్లా.

"ఇంతకీ, నాభర్తలవిషయంలో నేను ఏంచేసి, నువ్వన్న 'భాగ్యం' అనుభవిస్తున్నానో చెప్తాను. కాస్త సావధానంగా విను. నాభర్తలు మరేస్త్రీలమీదఅయినా ప్రేమచూపిస్తే మచ్చరించను నేను.* ఎంత యిదయినా అహంకారం తెచ్చుకోను. ఏమరపాటూ లేకండా వినయంతో, మనసా వాళ్లమీద భక్తిపెట్టుకుని మసులుకుంటాను. చూపుల్లోనూ, మాటల్లోనూ, భావాల్లోనూ, పనుల్లోనూ - వేట్లోనూ కూడా వాళ్లకి వ్యతిరేకంగా వుండను. గంధర్వుడు కానీ, యక్షుడు కానీ, దేవత కానీ - ఎవడయినా సరే, పరపురుషుడన్నవాణ్ణి గడ్డిపోచలా చూస్తాను. స్నానం, భోజనం, పడకా - ఏవీ కూడా భర్తలకంటే ముందు చెయ్యను. వాళ్లు ఇంట్లో అడుగుపెట్టగానే, కాళ్లకి నీళ్లూ అవీ నేనే స్వయంగా అందిస్తాను. ఆసనాలూ అవీ వెయ్యడం, వడ్డనా అదీ చెయ్యడం నేనే చేస్తాను. పనివాళ్లకి చెప్పను. నియమంతప్పకండా వేళకి స్నానాలూ, భోజనాలూ సిద్ధంచేస్తాను. ధాన్యంగదీ, ఖజానాకొట్టూ వ్యర్థంగా వ్యయం కానివ్వను. ఇల్లూ, వాకిలీ వూడ్చడం, వంటపాత్రలు శుభ్రంచెయ్యడం - వీటిల్లో అశ్రద్ధ చెయ్యను. బంధువులికీ చుట్టాలికీ అసంతృప్తి కలగనివ్వను.

"తరుచు తలవాకిట నుంచోవడం, • చెడ్డస్త్రీల సహవాసం చెయ్యడం, కయ్యానికి కాలుదువ్వడం, హేళన † తరుచు నవ్వడం - ఇవన్నీ కిట్టనిపనులు నాకు.

"భర్తలు పొరుగూరువెళ్లేటప్పుడు పువ్వులూ, చందనమూ, నగలూపెట్టుకోను. వాళ్లు ఎప్పుడు తిరిగివస్తారా అని కనిపెట్టుకు కూచుం

* పెనిమిటి పెక్కండ్రు వనితలగైకొన్న సమమైన వర్తన పలుపవలయు - కళాశాస్త్రం.

• తరుచు వాకట్లో నుంచున్న స్త్రీ వ్యభిచరిస్తుందని కళాశాస్త్రం. ఇదే, వాత్స్యాయనుడి మతమున్నూ. బిచ్చకత్తె, యోగినీ, బౌద్ధసన్యాసినీ, కులటా, మంత్రకత్తె, సోదెకత్తె, మందులమారీ- వీళ్లతో పతివ్రతలు స్నేహంచెయ్యకూడదని వాత్స్యాయనుడు.

టాను. అపరిమితమయిన భక్తితో అత్తగారిని సేవిస్తాను. ఆమె చెప్పినపనులన్నీ పరికత్తెగా చేసిపెడతాను. గురువుల్నీ, బ్రాహ్మల్నీ, అతిథుల్నీ నేనే స్వయంగా భయభక్తులతో పూజిస్తాను. ఓర్పూ, నెమ్మదీ, ప్రసన్నతా వదిలిపెట్టను. భర్తలు నెమ్మదయినవాళ్లు కదా అని తగని చనువు తీసుకోను. కోపం వచ్చిందో, వాళ్లు నాగు పాములే అని నాకు తెలుసు. అందుకని పక్కబెదురుతోనే వుంటాను.

“మా అత్త కుంతీ దేవి భూదేవి లాంటి తల్లి. ఆమె స్నానమూ, భోజనమూ అవీ నేనే స్వయంగా చూస్తాను. ఆమె పరిచర్యలో రవంత లోపం రానివ్వకండా ఆమెని తృప్తిపరుస్తాను.

“ధర్మరాజు పంతిని రోజూ బంగారం పళ్ళేలలో ఎనిమిది వేల మంది బ్రాహ్మలూ, పది వేలమంది యతులూ భోజనం చేస్తారు. వీళ్ళ భోజనాదికాల్లో ఏలోపమూ రాకండా నేనే చూస్తాను. బట్టలూ, నగలూ ఇచ్చి వాళ్ళని సంతోషపెడతాను. మాకోటలో లక్షమంది పరిచారకులు అభ్యాగతులకోసం ఎప్పుడూ సిద్ధంగా వుంటారు. వాళ్ళ వొంటినిండా బంగారం రత్నభూషణాలు మెరుస్తూవుంటాయి. చేతుల్లోని పాత్రలు కిందపెట్టడానికి వాళ్ళకి అవకాశమే వుండదు. రాత్రీ పగలూ అభ్యాగతులికి వడ్డనలు చేస్తూనే వుంటారు. వాళ్ళంతా ఎలా పనిచేస్తూ వున్నదీ, ఎప్పుడు ఏపొరపాటు చేస్తున్నదీ నేనే కనిపెడుతూ వుంటాను ఎప్పుడూ మదజలం కారుతూవున్న లక్షలాది ఏనుగులూ, మంచి జవసత్వాలుకల లక్షలాదిగుర్రాలూ వున్నాయిమాకు. వేళకి వాటిని రోజూ ఆహారం పెట్టేవాళ్ళనీ, వాటికి తగిన జాగ్రత్త తీసుకొనే వాళ్ళనీ నేనే నియమిస్తాను తరుగులేని భాండాగారాల్లో నిండివున్న లెక్కాజమా లేని రత్నరాసులూ, బంగారాలూ దినమూ జరిగే ఆ దాయవ్యయాలూ నాకు తెలియనివి లేవని నమ్మ. సొమ్ములు కాపర్ల వరకూ గల యావన్మంది సేవకుల నడతలూ నేనే

పరికిస్తూ వుంటాను. అందరినీ నేనే నడుపుతాను. అందుకనే మావాళ్ళు కుటుంబభారం యావత్తూ నామీద వేసి నిశ్చింతగా వుంటారు. నేనే అన్ని పనులూ చూస్తూవుంటాను.

"రాత్రి నాలుగోజామునే నేను నిద్రపోవడం. ఇంతెందుకూ రాచకార్యాల్లో మునిగి నిద్రాహారాలు మరిచేపోతాను నేను. విన్నావా? ఇలానడుచుకోడంవల్లనాభర్తలికిఇష్టురాలినయాను. అంతే కాని నువ్వన్న మందులూ, మాయలూ, గారడీలూ మాత్రం ఎరగను."

ద్రౌపది చెప్పిన ఈమాటలతో సిగ్గుపడిపోయింది సత్యభామ. "ఎరక్క ఏదో అడిగేశాను. నాతప్పు పట్టించుకోకు. నేను అన్నవి అన్నీ నవ్వుతాలే అనుకో. నిజంగా నీచరిత్ర పారవడిగా తీసుకోవాలి మావంటివాళ్లు" అందామె.

"భర్తని వల్లోవేసుకునే చతురోపాయం చెపుతాను, విను," మృదువుగా నవ్వుతూ అంది ద్రౌపది—"స్త్రీఅన్నదానికి భర్తేదైవం. భర్తని మించిన దైవం లేనేలేదు, భార్యకి. భర్త ప్రీతికలిగి దయ చూశాడో — అలంకారాలూ, వస్త్రాలూ, సంపత్తీ, గౌరవం, సంతతీ, కీర్తీ, స్వర్గం— అన్నీ కాళ్ళకింద వుంటాయి. అదిలేకపోతే, ఆడదాని గతి అడగనే అక్కరలేదు. ఇంతకీ వదినా, కష్టపడితే కాని సౌఖ్యం లేదు. పుణ్యాగతీ వుండదు. పెనిమిటిసేవ చేస్తేనే సుఖమూ, పుణ్యమూనూ. అంచేత, ప్రేమతో భర్తమనసుపట్టి మసులుకో. నువ్వే చూద్దువు కాని, నువ్వు గీసినగీటు దాటకండా నీతోనే వుంటాడు మాఅన్నయ్య.

"ఆయన నీ గుమ్మందగ్గిరికి వచ్చాడనగానే చప్పున లేచి ఎదురు వెళ్ళు. లోపలికిరాగానే నువ్వే ఆసనం అదీ అమిర్చిపెట్టు. నౌకర్లని నియమించాను కదా, అని ఉపేక్షించకు. అన్ని అవసరాలూ నువ్వే స్వయంగా చూడు. ఏదన్నా వో మంచిమాట నీతో చెప్తూ

డనుకో — ఎంత నమ్మకమయినవాళ్ళతోఅయినా సరే, అది చెప్ప కూడదు నువ్వు. నీసవతులికి తెలిసిందంటే, దాంతోనే వొక అభాండం నీమీద అల్లేస్తారు వాళ్ళు. అన్నయ్య మనస్సు విరిగిపోనూవచ్చు, దానివల్ల. భర్తకి నచ్చిన బంధువులూ, స్నేహితులూ వస్తే, వాళ్ళకి భోజనాలూ అవీ అరమరలేకండా ఏర్పాటుచేసి ఆదరించు. భర్తకి నచ్చనివాళ్ళు — వాళ్ళు నీకు ఎంత కావలిసినవాళ్ళు అయినా సరే, వాళ్ళతో ఎప్పుడూ సంపర్కం పెట్టుకోకు. ప్రద్యుమ్నుడూ మొద లయిన కుమాళ్ళతో అయినా ఏకాంతంగా, ఏకాసనంమీద కూచో వడం కూడదు. కులవతులూ, పతివ్రతలూ, నిర్మలమతులూ అయిన స్త్రీలతోనే స్నేహం చెయ్యి. చెడ్డవాళ్ళ నీడకూడా తొంగిచూడకు.

"వదినా! ఇవే నీకు మంత్రాలూ మందులున్నూ. ఈమాత్రం చేస్తే చాలు. నువ్వు అన్న 'భాగ్యం' నూరింతలు వుంటుంది నీకు."

ఈఉపదేశంతో పరమానందం కలిగిపోయింది సత్యభామకి. "ధర్మం తెలిసినదానివి నువ్వు" అంటూ ద్రౌపదిని ప్రశంసించిం దామె. "దేవతల్లాంటివాళ్ళు నీభర్తలు. తపోబలం కలవాళ్ళు. శౌర్యవం తులు. కీర్తివంతులు. అచిర కాలంలోనే మీసామ్రాజ్యం మీకు వచ్చే స్తుంది. మీకు అపకారంచేసిన కౌరవరాజుభార్యలు దిక్కులేక మొత్తుకుంటారు. నవ్వుతూ కళ్ళారా చూస్తావు నువ్వు. బంగారం కొండల్లాంటి కొడుకులు కన్న వీరమాతవి. విచార మేమిటి నీకు? ప్రతివింధ్యుడూ మొదలయిన నీ అయిదుగురు కొడుకులూ వచ్చి, ద్వారకలో వున్నా రిపుడు. పిసరంత లోపంలేదు వాళ్ళకి. రుక్మిణీ, సుభద్రా మొదలయినవాళ్లు కన్న కొడుకులకంటె అధికంగా ముద్దు చేస్తున్నారు వాళ్ళని. వాళ్ళ చింతే వొద్దు నీకు" అంది.

అంతలో కృష్ణుడు పాండవులతో "వెళ్ళి వస్తాను" అంటూ ప్రయాణానికి సిద్ధపడ్డాడు. మార్కండేయుడి దగ్గిరా సెలవు పుచ్చు

కున్నాడు. సత్యభామ ద్రౌపదిని కౌగిలించుకుంది. "వెళ్లి వస్తాను" అంటూ సగౌరవంగా చెప్పి బయలుదేరింది. ఆమెతోకూడా రథ మెక్కి ద్వారకాపట్నం వెళ్లిపోయాడు కృష్ణుడు. పాండవులికి ధైర్యం చెప్పి, మార్కండేయుడూ తన ఆశ్రమానికి వెళ్లిపోయాడు.

## ధృ త రా ష్ట్రు ది దుః ఖం

శ్రీకృష్ణుడూ, మార్కండేయమునీ వెళ్ళిపోయాక, కామ్యక వనం వదిలిపెట్టేశారు పాండవులు. ద్వైతవనం వచ్చి నివాస మేర్పరుచుకున్నారు.

ఒకనాడు హస్తినాపురంనించి బ్రాహ్మణ్డొకడు అక్కడికి వచ్చాడు. చక్కని కథలూ అవీ అతడికి తెలుసు. పాండవుల్ని చూసి, ఎన్నోకబుర్లు చెప్పా డతడు. తిరిగి హస్తినాపురం వెళ్ళి, ధృతరాష్ట్రుడి దగ్గిరికివెళ్ళాడు. "పాండవుల్ని చూసివచ్చాను" అనడం తోనే వాళ్ళ క్షేమం అడిగాడు ధృతరాష్ట్రుడు. "క్షేమం అంటే ఏదో ప్రాణాల్తో వున్నారు," అన్నాడు బ్రాహ్మడు – "ఎండకి ఎండీ, వానకి తడిసీ, చలికి వడగట్టుకుపోయీ శరీరమాత్రావశేషులుగా వున్నారు అయిదుగురున్నూ. దుఃఖసముద్రంలో మునుగుతూ తేలుతూ వున్నా రంటే నమ్ము. పాపం, ద్రౌపదీ దేవి ఐదుగురుభర్తలు వున్నా అనాథ లాగే వుంది. శోకదేవతే ఆమెరూపంలో మూర్తీభవించిందా అని పించింది నాకు."

విని, గుండె నీరైపోయిన ట్టయింది ధృతరాష్ట్రుడికి. రెండు కళ్ళల్లోంచీ బొటబొటా కన్నీళ్ళు ధారలుకట్టాయి. కొంతసేపటిదాకా నోట్లోంచి మాటే పెగలకండాపోయింది. గొంతుక గద్గదికపడింది. "అయ్యో" అంటూ నిట్టూర్చాడు. "చేతులారా నేను చేసిన చెడ్డా, నాకొడుకు తలపెట్టిన ద్రోహం–ఈ రెండూ పాండవులికి ఈపాట్లు

తెచ్చాయి, నా కొడుకులు అందరిలోకీ పెద్దవాడు ధర్మరాజు. కౌరవ కులానికే దీపంవంటివాడు. అంతటి ధర్మాత్ముడికి ఇంతటి దుఃఖం పెట్టాడు దయలేని దైవం! దివ్యమయిన మేడల్లో హంసతూలికా తల్పాలమీద నిద్రపోయే సుకుమారి కఠోరమయిన నేలమీద పడు కుంటున్నాడు! తెలతెల వారగానే మాగధులూ, భట్రాజులూ పాడే పాటలు విని ఉల్లాసంగా మేలుకునేవాడు, నక్కలు చేసేవూలలు విని లేస్తున్నాడు.

"పదివేల ఏనుగుల బలశాలి భీముడు. అలిసి, బడుగయిన ఏనుగులాగే పడివున్నాడు అడవుల్లో, పాపం!

"అన్నలూ, భార్యా అలాకష్టపడుతూవుంటే చూసిన్నీ, అన్న గారి ఆజ్ఞ అడ్డుపెట్టడంవల్ల, కట్టుబడ్డ పాములా బుసకొడుతూ వుంటాడు అర్జునుడు. నా కొడుకు చేసిన నేరాలు తలుచుకుంటూ ఎంత బాధ పడిపోతున్నాడో!

"సింహంకొదమలే నకులసహదేవులు ధైర్యవంతులు. సుఖ పడవలసిన సుకుమారులు. అలా అష్టకష్టాలూ అనుభవిస్తున్నారు.

"అన్న శపథంచేశాడు. దానికి కట్టుబడిపోయాడు భీముడు. అంత ఘోరమయిన బలశాలీ అలా కష్టాలూ సహిస్తున్నాడు. అతడి గుండెల్లోమాత్రం ప్రళయాగ్ని రాజుతూనే వుంటుంది. శకుని కపటం, దుశ్శాసనుడి దుర్మార్గం, కర్ణుడి తుంటరితనం, దుర్యోధనుడి దుర్ణయం— ఇవన్నీ శల్యాల్లా గుండెల్లో కెలుకుతూనే వుంటాయి అర్జునుడికి. క్రోధం దావాగ్నిలా మండుతూనే వుంటుంది. గాలిలా దాన్ని వన వాసం నానాటికీ రెచ్చగొడుతూనే వుంటుంది. దానిమీద, వొళ్ళంతా మంటలెత్తుతూ వుంటే, మొహం జేవురించి, కనుబొమలు ముడిపెట్టి, దవడ కరుస్తూ వుంటాడతడు. నాకొడుకుల పాలిటి

మృత్యువే అతడు. అతడి భయంకరస్వరూపం ఎప్పుడూ కళ్లముందు కట్టినట్టే వుంటుంది నాకు.

"ధర్మరాజు హృదయంలో మాత్రం అర్జును డంత కోపం వుండదు. యముడితోనే సమానం భీముడు. భీముడు దావాగ్ని. అర్జునుడు పెనుగాలి. కర్ణుడూ, శకునీ, నా నూరుమంది కొడుకులూ మహారణ్యం. ఆదావాగ్నితో ఈ మహారణ్యం కాలిపోవడం తప్పదు.

"కానీ. కర్మఫలం ఎవడు తప్పిస్తాడు? విధికి అడ్డేమిటి? కౌరవులికి అంత్యకాలమే దాపురించింది. సందేహం లేదు. వద్దుగాక వద్దు అని మొత్తుకున్నాను, జూదం మానమని. పిసరంత చెవినిపెట్టాడు కాదు దురాత్ముడు, దుర్యోధనుడు. కొడుకుని మానిపించలేక, కులక్షయమే తెచ్చుకున్నాను. ఇదంతా అదృష్టంకాకపోతే మరేమిటి?

"రాత్రి తరవాత పగలు రానే వస్తుంది. పగలు ముగిశాక రాత్రీ వస్తుంది. అలాగే సుఖమూ, సుఖంవెంట దుఃఖమూ తగిలే వుంటాయి. మంచికి సంతోషిస్తూనే వుంటాం, ఆపదలు వచ్చిపడతాయి. ఆపదలికి అడిలిపోతూనే వుంటాం, సుఖాలూ వస్తాయి. లోకం తీరే ఇది. ఇంతకీ చేసుకున్నది అనుభవించక తప్పదు. ఇదంతా తెలిసినపండితులు మాత్రం సుఖదుఃఖాలు రెండూ వొక్కలాగే చూస్తారు. శాంతన్నా సౌఖ్యమన్నా వాళ్ళకే వుంటుంది, ఎప్పుడూ.

"మరోమాట, అన్నీపోయి అడవులపా లయాడు కదా, అర్జునుడు! అలాంటివాడు స్వదేహంతో స్వర్గంవెళ్ళి వచ్చాడట! ఇంతకంటే వింత ఏముంది? తం తే బూర్లగంపమీాద పడ్డాడు! ధనుస్సు గాండీవం! బాణాలు దివ్యాలు! ఇంక కావలసింది ఏమిటీ అంటాను!"

ఇలా అనేకవిధాల దుఃఖించా డతడు.

దుర్యోధనుడి దుర్బుద్ధి

తండ్రిమాటలు విన్నాడు దుర్యోధనుడు. "ఈముసిలాయన ఇంత బెగిలిపోయాడేం!" అంటూ శకునిదిక్కు చూశాడు. అతణ్ణీ, కర్ణుణ్ణీ వెంటపెట్టుకుని వొకదగ్గిర రహస్యంగా ఆలోచన మొదలెట్టాడు.

దుర్యోధనుడి మనస్సు కర్ణుడికి ముందే తెలుసు. "నీకు వచ్చే లోపమేముంది?" అంటూ అతడే కలగచేసుకున్నాడు ముందు. "అడవులు పట్టిపోయారు పాండవులు. అక్కడ అష్టకష్టాలూ అనుభవిస్తున్నారు. వాళ్ళశౌర్యం వాళ్ళదగ్గిరే పెట్టుకోనీ. వాళ్ళ ఇంద్రప్రస్థంలోని సర్వసంపదలూ నీబుద్ధిబలంవల్ల నీచేతిలో చిక్కిపోయాయి. తూర్పూ, పడమరా, ఉత్తరాదీ, దక్షిణాదీ- నాలుగు దిక్కుల రాజులూనీకే కప్పంచెల్లిస్తున్నారు. సముద్రమూ, కొండలూ, అడవులూ, ద్వీపాలూ-- అన్నిటితోనూ ఈ భూమండలం యావత్తూ, దేవలోకం ఏలేదేవేంద్రుడిలాగ నువ్వే పరిపాలించు. పల్లెజనమూ, పట్నవాసులూ నీఅభ్యుదయమే కోరుతున్నారు. కౌరవసమాజం అంతా నీమూలాన సన్మానంపొందుతూ వుంది. నిన్నే సేవిస్తూవుంది. నువ్వే ఇక లోకంలో సూర్యుడిలా ప్రకాశిస్తావు.

"పాండవులు ఇప్పుడు ద్వైతవనంలో కష్టపడుతూ వున్నారని వింటున్నాం. నువ్వు వొకసారి వెళ్ళి, నీసామ్రాజ్యవైభమంతా వాళ్ళ కళ్ళకి జిగేలు మనిపించాలని నాకోర్కె. వేసవికాలపు సూర్యుడిలా వాళ్ళ కళ్ళు కప్పేయాలి నీ తేజస్సు. సహించలేకపోవాలి వాళ్లు. వెనకటికి నహుషుడి కొడుకు యయాతిలాగ మహోజ్వలంగా వున్న నిన్ను చూచి వాళ్ళగుండెలు బద్దలైఅయిపోతాయి. స్నేహితులికిసంతోషమూ, శత్రువులికి దుఃఖమూ కలిగించడమే కదా, సంపదలికి తగినఫలం! శత్రువులబాధచూస్తే కలిగే సంతోషంతో ధనధాన్యలాభం, పుత్రలాభం,

బంధుజనలాభం — ఇవేవీ సరికావంటె నమ్ము. నారబట్టలూ అవీ కట్టుకుని దుంపాదుల్టా నముల్తూ అడవిలో కుసిల్లుతూవున్న అర్జునుణ్ణి మనం మహారాజవైభంతో వెళ్ళిచూసి, సంతోషించడంకంటే కృతార్థత ఇంకేముంటుంది? మహాసౌభాగ్యభోగాల్తో వెలిగిపోతూవున్న నీరాణుల్ని చూసి, గుండె దిగజారిపోతుంది ద్రౌపదికి. తన్ను తానే నిందించుకుని కుంగిపోవాలి, అది. అప్పుడూ మన ఆనందం ” అన్నాడు.

కర్ణుడి ప్రతీమాటా కనకాభిషేకంలా అనిపించింది దుర్యోధనుడికి. “ సరిగ్గా నామనస్సులోనిమాటే నువ్వూ చెప్పావు,” అన్నా డతడు— “ తప్పకండా మనం ద్వైతవనం వెళ్ళవలిసిందే. ముమ్మాటికీ ఇది నిశ్చయం. ఐతే, మానాన్న మాత్రం అంగీకరిస్తాడని తోచదు. అదొక్కటే భయంగావుంది. ఎంచేత నంటావా? ద్వైతవనంలో పాండవులు వున్న సంగతి ఆయనకి తెలుసు. మనం అక్కడికి వెళ్ళడం అంటే వాళ్ళతో కయ్యానికే అని గ్రహించేస్తాడు. వద్దుగాక వద్దు అని భీష్మించుకు కూచుంటాడు.

“ అంతేకాదు, వాళ్ళు ఏదో మహా పరాక్రవంతులనీ, తపస్సుచేసినవాళ్ళనీ, బెంగపెట్టుకుని ఇంతసేపూ రాగాలుతీస్తున్నాడు. విన్నావు కదూ! ఆయనదగ్గిర అదేపనిగా కూచుని, వాళ్ళనే పొగుడుతుంటాడు, భట్రాజులాగ విదురుడు. జూదంనాటినించీ విదురుడు పాండవులపక్షపాతి అన్నది బయటపడేపోయింది. మన ప్రయత్నం అతడు విన్నాడో, అడ్డమాని అడ్డంకులూ కల్పిస్తాడు. అంచేత,ఇదంతా రహస్యంగా వుంచి, బాబయ్యగారి అంగీకారం సంపాదించే ఉపాయం వెదకాలి. నువ్వూ, శకునిమామా బాగా ఆలోచించండి ఇవాళ. రేపు ఉదయాన్నే వచ్చి, భీష్ముడుతాతయ్యనీ, బాబయ్యనీ వొప్పించి ప్రయాణం కడదాం. ” అనంతరం కర్ణుణ్ణీ, శకునినీ పంపించివేసి తాను అంతఃపురములోకి వెళ్ళిపోయాడు దుర్యోధనుడు.

ఆరాత్రి ఎంతట తెల్లవారుతుందా అన్నట్టు గడిచిపోయింది వాళ్ళకి. భళ్ళుని తెల్లవారిందో లేదో, దుర్యోధనుడిదగ్గిరికి వచ్చేశాడు కర్ణుడు. "చక్కనిఉపాయమే తట్టింది," అంటూ మందహాసం చేశాడు — "ద్వైతవనంలో మన ఆవులమందలు వున్నాయికదా! వాటిని చూడడానికి వెళతామంటే తప్పకండా అంగీకరిస్తారు బాబయ్యగారు. ఏమంటావు?"

కర్ణుడి అడుగుల్లోనే శకుని వచ్చాడు. "నీమీద వొట్టువేసి చెపుతున్నాను మహారాజా, రాత్రంతా నేను సరిగ్గా ఇదే ఉపాయం ఆలోచించాను" అన్నాడు. నవ్వుతూ ముగ్గురూ ఒకళ్ళచేతులు వొకళ్ళు చరుచుకున్నారు.

వెంటనే సుమంగుడు అని వొకగొల్లవాణ్ణి వెంటపెట్టుకుని ధృతరాష్ట్రుడి దగ్గిరికి వెళ్ళారు. ముసలిరాజుకి నచ్చినమాటలు చెప్పి ప్రసన్నుణ్ణిచేసుకున్నారు ముందు. తరవాత "ఇదిగో, వీడు మన ద్వైతవనంలోని ఆలమందలనించి వచ్చాడు" అంటూ సుమంగుణ్ణి ఎదట పెట్టారు. సుమంగుడిదిక్కు తిరిగి "ఆలమందలు క్షేమంగా వున్నాయా?" అని అడిగాడు ధృతరాష్ట్రుడు.

"చిత్తం మహారాజా" అంటూ దుర్యోధనుడు చెప్పినపాఠం అక్కడ అప్పగించాడు సుమంగుడు. "ద్వైతవనంలో పశువులికి వున్న సౌఖ్యం మరెక్కడాలేదు మహాప్రభో. ఐతే, ఇప్పుడుమాత్రం పెద్ద ఆపదే వచ్చిపడిందండి. ఎక్కడాలేని క్రూరమృగాలూ దిగబడ్డాయండి అక్కడికి. ఈసంగతి కామందులవారికి మనవిచేసుకోవాలనే పడుతూ లేస్తూ వచ్చానండి" అన్నాడు.

సుమంగుడి నోట్లోమాట నోట్లోనేవుంది, వెంటనే కలగజేసుకున్నారు కర్ణుడూ, శకునీనీ. "ఐతే, క్రూరమృగాలు చంపేసి, ఆవుల

మందలు రక్షించడానికి అబ్బాయిగారిని చప్పున పంపండి మహారాజా" అని విన్నవించారు.

ఎంతో సేపు తటపటాయిస్తూ ఆలోచించాడు ధృతరాష్ట్రుడు. "బాగానేవుంది. క్రూరమృగాలు చంపడమూ, ఆలమందలు కాపాడడమూ రెండూ మంచివే. ఐతే, అక్కడ పాండవులు వున్నారు. అసాధ్యులు వాళ్ళు. అంచేత అక్కడికి మీరు వెళ్ళడమంటే నాకేమీ నచ్చడంలేదు. అడవుల్లో, బాధల్లో వున్నారు కదా, అని మీరు వాళ్ళని కవ్విస్తారు. నాకాయ నూకాయలు కారు వాళ్ళు. పైగా తపస్సులూ అవీ చేసివున్నారు. వాళ్ళకి కోపమేవచ్చిందా, తపశ్శక్తి చేత అయినా దహించేస్తారు. లేదా దివ్యాస్త్రాలతో అయినా చంపేస్తారు మీ యావన్మందినినీ. మీరుచేసిన అవమానాల్తో వాళ్ళ గుండెలు కాల్తూనే వున్నాయి. మిమ్మల్ని చూస్తేనే పాములు చూసిన గరుత్మంతుడిలాగ భగ్గుమంటాడు భీముడు.

"అంతే కాదు, దివ్యాస్త్రాలు లేనప్పుడే వొక్కడూ తాను ప్రపంచమంతా జయించుకువచ్చాడు అర్జునుడు. దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళి దివ్యాస్త్రాలూ పట్టుకువచ్చాడిప్పుడు. అతణ్ణి ఎదిరించి నిలవగల మగవాడెవడిక! వాళ్ళకి మీరు చెడ్డ చెయ్యడం కానీ, మీకు వాళ్ళు చెడ్డ చెయ్యడంకానీ కూడని పనులు. అంచేత ఆలమందలకోసం తగినవాళ్ళని మరి ఎవళ్ళనయినా ద్వైతవనం పంపుదాం. మీరు మాత్రం వెళ్ళ వద్దు" అన్నాడు.

"నిజమే మహారాజా, పాండవులు పరాక్రమవంతులే. అయితే వాళ్ళని కదపవలిసిన అవసరం ఏముంది మాకు! కదిపినా ధర్మం తప్పని వాడు ధర్మరాజు. శపథం వదిలి పెట్టడు. తమ్ముళ్లూ అతడి సత్యానికి కట్టుపడి వుంటారు. హద్దుదాటరు. నమ్మండి నామాట. మాకు వేటాడాలని ఎన్నాళ్ళయో ఎంతో వేడుకగా వుంది. మా వేడుకా నెర

వేరుతుంది. ఆవులమందలు రక్షించడమూ అవుతుంది. ఇట్టు తగలడమూ దేవుణ్ణి మొక్కడమూ రెండూ నెరవేరతాయి. ఏఇబ్బందీ వుండదు. అంగీకరించండి" అంటూ సరిది చెప్పాడు శకుని.

మళ్ళీ తటపటాయించాడు ధృతరాష్ట్రుడు. చివరికి ఎలాగో "సరే, వెళ్ళిరండి" అంటూ సమ్మతించాడు. "బుద్ధికలిగి మసులుకు రండి. ఆలస్యంమాత్రం చెయ్యకండి" అని హెచ్చరికా చేశాడు.

ఆ ల మం ద లు

ధృతరాష్ట్రుడు 'సరే', అన్నాడో లేదో, 'ఆలమందలికి ప్రయాణమ' ని అటు పట్టణంలో చాటించేశాడు దుర్యోధనుడు. ప్రయాణానికి యావత్తూ క్షణాలమీద సిద్ధం అయిపోయింది. మాంచి విలువయిన దుస్తులూ, ఆభరణాలూ వేసుకుని దేవేంద్రుడిలా బయల్దేరాడు దుర్యోధనుడు. వందమంది తమ్ముళ్లూ, కర్ణుడూ, శకునీ, తక్కిన స్నేహితులూ, బంధువులూ అలాగే అలంకరించుకున్నారు. అందరూ తగిన వాహనాలతోనూ, సైన్యాలతోనూ సిద్ధపడి వచ్చారు. దుర్యోధనుడి ప్రియురాళ్ళూ, రాణులూ ఎన్నోవేలమంది పల్లకీలమీదా, మేనాలమీదా బయలుదేరారు. ఆడా, మగా అనకండా వెంట నడిచారు పౌరులు.

ఈ ప్రయాణానికి అవసరంగా ఎనిమిదివేలు రథాలూ, ముప్ఫయివేలు ఏనుగులూ, తొంభయివేలు గుర్రాలూ, లక్షమంది కాల్బలములూ వున్న పెద్ద సైన్యమే వెంటనడిచింది. వేటలో బాగా ఆరితేరిన వేటకాళ్ళూ, విట విదూషకులూ, వంద వైతాళికులూ, వేశ్యలూ, వైశ్యులూ - వొక రేమిటి యావన్మందీ బళ్ళతోనూ వాళ్ల తోనూ ఆలమందలంటే ఆనందంతో ప్రయాణం కట్టారు.

అలా కోలాహలంగా బయలుదేరి రెండుకోసులదూరం మాత్రం వెళ్ళాడు దుర్యోధనుడు. అవాళ అక్కడ మకాంవేశాడు. ఆ సాయం కాలమూ రాత్రీ అక్కడే గడిపాడు. మర్నాడు ఉదయానే బయలు దేరాడు. కొండలూ, అడవులూ దాటి ఆలమందలు వున్న అరణ్యాం ప్రవేశించాడు. వొక అందమయిన ప్రదేశంలో డేరాలు వేయించాడు.

ఆ వనంలో ఎన్నో వేలు, ఎటుచూస్తే అటు, తామర తంపరగా వున్నాయి ఆవులమందలు. అందంగా, భయమన్నమాట లేకండా స్వేచ్ఛగా విహరిస్తూవున్నా యవి. మల్లెపువ్వుల్లాగ, శంఖా ల్లాగ, చంద్రహారాల్లాగ, మంచులాగ, నురుగులాగ, చందనంలాగ, ముత్యాలసరాల్లాగ, వజ్రాల్లాగ - తెల్లటివీ, కడిమిపువ్వుల్లా, కృష్ణ చందనంలా, నల్లమేఘాల్లా, నల్లకలవల్లా, తమాలపువ్వుల్లా-నల్లటివీ; ముదిరిన మంకెనఆకురంగువీ, బంగారం సంపెంగపువ్వు రంగువీ - ఇలా రకరకాల రంగులవి వున్నాయి ఆలమందలు.

అవన్నీ చూశాడు దుర్యోధనుడు. తన పశుసమృద్ధికి పరమా నందభరితు డయాడు. మహారాజు వచ్చా డనడంతోనే సవినయంగా వచ్చి, సాష్టాంగపడ్డారు గొల్లలు. వాళ్ళందరినీ ఎవళ్ళకితగినట్టువాళ్ళని ఆదరించాడు దుర్యోధనుడు. వాళ్ళతో కలసి, ప్రతీమందా తిరిగాడు. ప్రతీమందలోని ఆవులపేర్లూ వాటిలక్షణాలూ విడివిడిగా అడిగి తెలుసుకున్నాడు. ఆబోతులూ, దూడలూ, ఈనినఆవులూ, లేత పెయ్యలూ, చూడిఆవులూ - ఇలా యావత్తు పశువులూ ప్రత్యే కంగా పరికించాడు. ఏమందకి తగినట్టు ఆమందకి తగినరక్షణకోసం తగినవాళ్ళని నియోగించాడు. గొల్లలు తెచ్చి సమర్పించిన పాలూ, పెరుగూ, మజ్జిగా మొదలయినవి సపరివారంగా ఆరగించాడు.

ఇదంతా అయి సుఖంగా కూచున్నాక, గాయకులూ, నర్తకులూ, భట్రాజులూ వచ్చి దుర్యోధనుణ్ణి అభినందించారు. వాళ్ళం దరికీ ఎవళ్ళకితగిన బహుమానాలు వాళ్ళకి ఇచ్చి, ఆదరించా డతడు.

తరవాత వేటకి ఉపక్రమించాడు దుర్యోధనుడు. భేరీలు రొప్పి, మందలుమందలు పడగొట్టాడు. తరిమితరిమి వందలకొద్దీ పెద్దపెద్ద ఏనుగులు పట్టుకుని కట్టేశాడు. వెంటాడి వెంటాడి భయంకరమయిన సింహాలు చంపేశాడు. కారెనుపోతులూ, పెద్దపులులూ, ఒంటరి అడివి పందులూ లెక్కా జమా లేకండా కొట్టేశాడు. అడివి అడివంతా ఎక్కడచూసినా తానే అయి వీరవిహారంచేశాడు.

అలా వేటాడి వేటాడి వనమంతా తిరిగాడు దుర్యోధనుడు. తామరపువ్వుల పరిమళంతో గమ్ముమని పోతూవున్న చెరువులు చూశాడు. పువ్వులూ, పళ్ళతో వంగిపోతూన్న తోటల్లో తిరిగాడు. నెమళ్ళూ, తుమ్మెదలూ, చిలకలూ, కోకిలలూ చేస్తూవున్న మధుర ధ్వనులు విన్నాడు. ఇలా పరివారంతో సహా తిరిగి తిరిగి చివరికి ద్వైతవనం సరోవరం చేరుకున్నాడు.

ఆసమయానికి ద్వైతసరోవరం సమీపంలోనే వున్నాడు ధర్మ రాజు. మునులసహాయంతో కందమూలాలూ అవీ సాధనంగా పెట్టు కుని, సద్యస్కంధం అని వొక యజ్ఞం చేస్తున్నా డతడు.

ద్వైతసరోవరం చూడగానే అక్కడ "క్రీడాగృహాలు నిర్మిం చండి" అని సేవకుల నాజ్ఞాపించాడు దుర్యోధనుడు.

రాజు తలిస్తే కొదవేముంది? వెంటనే క్రీడాగృహాలు కట్టడం మొదలుపెట్టారు సేవకులు. ఇట్టే పని ప్రారంభించారో లేదో వాళ్లు, గబగబా పరిగెత్తుకు వచ్చారు కొందరు గంధర్వులు. "ఈసరోవరం గంధర్వరాజు చిత్రసేనుడిది. అతడి క్రీడలకోసం ఏర్పడింది ఇది. మీ

కెవ్వరూ ఇక్కడ ఇలాంటి పని చెయ్యకూడదు. అసలు ఈప్రాంతా నికే రాకూడదు మీరు. వెళ్ళిపొండి" అని గదమాయించారు. చేసేది లేక తెల్లపోయారు సేవకులు. రొజుకుంటూ వెళ్ళిఅదంతా దుర్యోధనుడితో చెప్పారు. దిట్టమయిన సైనికుల్ని కొందర్ని వెంట ఇచ్చి పంపాడు దుర్యోధనుడు. వాళ్ళు వచ్చి "మీరే ఇక్కడి నించిపొండి" అని కూకలు వేశారు గంధర్వుల్ని. "దుర్యోధనమహారాజు దయ చేశారు. ధృతరాష్ట్రులవారి కుమాళ్ళు వారు. ఇక్కడ జలక్రీడ లాడ డానికి రాణులతోకూడా వేంచేస్తున్నారు. మీరిక్కడ వుండకూడదు. పొండి" అన్నారు.

"ఏమిటి ఈ తలబిరుసు?" అంటూ వొకళ్ళ మొహం వొకళ్ళు చూసుకుని నవ్వుకున్నారు గంధర్వులు. సైనికులమీద కోపమూ వచ్చింది వాళ్ళకి. "ఎదటివాళ్ళని తెలుసుకోకండా వున్నాడు మీ రాజు. మదమెక్కినట్టున్నాడు. తన మానమూ, ప్రాణమూ పోగొట్టుకోవాలని చూస్తున్నాడు. మామాట వినండి. బుద్ధిమంతు ల్లాగ వెనక్కి వెళ్ళిపోండి" అన్నారు ఖచ్చితంగా.

"సరే, చూస్తాం" అంటూ వెళ్ళి దుర్యోధనుడితో సంగతంతా చెప్పారు సైనికులు. అగ్గిమీద గుగ్గిలంవేసినట్టు మండిపోయాడు దుర్యోధనుడు. తమ్ముల్నీ, కర్ణుడూ మొదలైన ముఖ్యుల్నీ చూశాడు. "వెళ్ళండి. మీమీ సైన్యాలు వేసుకుని గంధర్వులగర్వం వదల గొట్టండి. సరోవరం ఆక్రమించండి. వాళ్ళకి సాయం దేవతల్తో దేవేం ద్రుడు వచ్చినా సరే, పీపు పగలగొట్టి పంపండి"అంటూ గర్జించాడు.

ఓ, ఇక అడిగేదేముంది? పొలో అంటే పొలో అంటూ కౌర వుల రాణువ యూవత్తూ కదిలింది ద్వైతసరోవరం దగ్గిరికి. వాళ్ళ సింహ నాదాల్తో దిక్కులు చిల్లులే పడిపోయాయి. అలా వస్తూన్న చతురంగ బలానికి ఎదురు వెళ్ళి ముందు నెమ్మదిగా వారించారు కొందరు

గంధర్వులు. "మాతో మీకు విరోధ మెందుకూ ! ఆగండి. మేం చెప్పేది కాస్త వినండి" అంటూ చెప్పడం మొదలు పెట్టారు. **ఆ మాటలు లక్ష్యమే చెయ్యలేదు, సేనముందు నడుస్తూవున్న యోధులు. బాణాలతోటే జవాబుచెప్పారు గంధర్వులికి.**

మించివచ్చిం దంటూ చిత్రసేనుడి దగ్గిరికి పరిగెత్తారు గంధర్వులు. జరిగిందంతా విన్నవించారు. చెప్పరానంత కోపంవచ్చింది చిత్రసేనుడికి. "వెళ్ళండి. ఘిరాయించండి కౌరవుల్ని. దొరికినవాళ్ణల్లా చంపేసి మరీరండి" అంటూ ఎన్నోవేలమంది గంధర్వుల్ని, మాంచి మెరికెల్లాంటివాళ్ళని పంపాడు దుర్యోధనుడి సేనమీదికి.

బల్లెమూ, బాణమూ, కత్తీ, గదా, గండ్రగొడ్డలీ, త్రిశూలమూ - ఏది దొరికితే అది పట్టుకుని వొక్కసారి వచ్చారు గంధర్వులు. ఏనుగుల్లాంటివాళ్ళు, పెద్దపెద్ద కొండల్లాంటివాళ్ళు, మంచిమంచి తేజోవంతులు—వాళ్ళంతా కో అంటే కో అంటూ వచ్చి చుట్టుముట్టారు కౌరవుల్ని. కనపడ్డవాళ్ణల్లా ముందూ వెనకా చూడకండా మోదడం మొదలెట్టారు. దుశ్శాసనుడూ మొదలయిన కౌరవులు ఎవ్వరూ కూడా గంధర్వుల దెబ్బలికి నిలవలేకపోయారు. తోకముడుచుకుని దుర్యోధనుడి వెనక్కి పారిపోయారు. కర్ణుడుమాత్రం కదలకండా నిలబడ్డాడు. గంధర్వుణ్ణి వొక్కణ్ణీ ముందుకి రానివ్వలేదు. భల్లమూ, అర్ధచంద్రమూ వంటి గట్టి గట్టి బాణాలతో కొడుతూ నిమిషంలో వందలకొద్దీ గంధర్వుల్ని నరికి కుప్పలుపెట్టాడు. ఎంత కొడుతూవుంటే అంతకి పదింతలు, వందింతలు, వెయ్యింతలు వచ్చిపడుతూనే వున్నారు గంధర్వులు. ప్రపంచమంతా గంధర్వమయమే అయిపోయినట్టయింది. ఎందరువచ్చినా ఎదిరిస్తూనే వున్నాడు కర్ణుడు.

ఇంతలో శకునీ, వందమంది తమ్ముళ్ళూ, తక్కిన మూలబలమూ-యావన్మందితోనూ ఉద్ధృతంగా వచ్చి, కర్ణుడితో కలిశాడు దుర్యోధన

మహారాజు. కౌరవులికీ గంధర్వులికీ ఘోరమయిన యుద్ధం జరిగి పోయింది. కొంతసే పయేసరికి కౌరవులే పై చెయ్యిలా కనిపించింది. నిభాయించలేకపోయారు గంధర్వులు. చలించిపోయి, వెనక్కితగ్గే శారు. తనవాళ్ళు జంకిపోవడం చూశాడు చిత్రసేనుడు. కళ్ళు మొయ్యా అతడికి కోపం వచ్చింది. ఒక్కవూపుని దురుసుగా మదపుటేనుగులాగ కౌరవసేనమీాదికి వురికాడు.

మాయయుద్ధంలో మహిరావణుడు చిత్రసేనుడు. ముందూ వెనకా చూడకండా ముమ్మరంగా ప్రయోగించాడు మాయాస్త్రాలు. గాలి బంధించిపోయింది. సూర్యుడు కనపళ్ళేదు. కౌరవసైన్యమంతా అల్లకల్లోలం అయిపోయింది. రథాలు ముక్కలై పోయాయి. ఏనుగులు పీనుగులయాయి. గుర్రాలు కూలిపోయాయి. భటులమాట ఇక చెప్పే అక్కర్లేదు. ఒక్కొక్కణ్ణే పదేసి పదేసిమంది గంధర్వులు పట్టుకుని చంపెయ్యడం మొదలుపెట్టారు. దాంతో, మారణహోమంలో పడి పోయినట్టయిపోయారు కౌరవులు. మరో ఉపాయం లేక, ప్రాణాలు అరిచేత్తో పట్టుకుని, ధర్మరాజు వున్నదగ్గిరికి పారిపోయింది కౌరవసేన.

కర్ణుడు మాత్రం కదల్లేదు. గంధర్వులు కురిపిస్తూవున్న బాణాల వర్షంలో కులపర్వతంలాగ నిలబడే వున్నాడు. తన యావశ్శక్తులా పోరాడుతూనే వున్నాడు. దుర్యోధనుడూ అతడికి సాయంగా శకునీ, తమ్ములూ వాళ్ళతో నుంచున్నాడు.

ఇంతలో వాక వెయ్యిమందన్నా వుంటారు, మంచి ఘుటికు ల్లాటి గంధర్వులు. వొక్కసారి కర్ణుడి రథంమీాదికి వురికారు. కొందరు గుర్రాలమీాద పడ్డారు. కొందరు సారథిని పట్టుకున్నారు. కొందరు జెండాకర్ర విరిచేశారు. కొందరు రథచక్రాలు రెండూ ముక్కలు చేసే శారు. కొందరు గొడుగు తుక్కు తుక్కు చేసేశారు. కొందరు నొగలు గుండపిండి చేసేశారు. కొందరు జెండా చించేశారు. కొందరు ఇరుసే

విరిచేశారు. ఇలా రథమే లేకుండా చేసేశారు. దాంతో కర్ణుడూ పలాయనమే చిత్తగించాడు. వికర్ణుడి రథంమీదికి పారిపోయి అదే పారిపోవడం పారిపోయాడు.

దుర్యోధనుడు ఇంకా పెనుగులాడుతూనే వున్నాడు. చిరచిర లాడుతూ చూశాడు చిత్రసేనుడు. కర్ణుడి రథంలాగే అతడి రథమూ చిదకగొట్టారు గంధర్వులు. రథం విరగడంతోనే నేల కూలబడి పోయాడు దుర్యోధనుడు. మెరుపులా మీదపడ్డాడు చిత్రసేనుడు. దుర్యోధనుడి జుత్తుపట్టుకుని మెలిపెట్టాడు. కిందపడవేసి, పెడచేతులు విరిచికట్టాడు. అడివి అడివంతా దద్దరిల్లిపోయినట్లు పేద్ద సింహ నాదమూ చేశాడు.

అది చూశారు గంధర్వులు. మరి పట్టపగ్గాలులేకపోయాయి వాళ్ళకి. దుర్యోధనుడి ఆడవాళ్లనీ, అతడి తమ్ములు దుశ్శాసనుడూ, దుర్ముఖుడూ, వివింశతీ, చిత్రసేనుడూ, విందుడూ, అనువిందుడూ మొదలయినవాళ్లనీ, వాళ్ల కుమార్ళనీ, మంత్రుల్నీ పట్టుకున్నారు. అందరినీ విరిచికట్టి, చిత్రసేనుడిముందు పెట్టారు. మిగిలిన కౌరవులూ, పౌరులూ, మంత్రులూ వాళ్ళూ నెత్తీ నోరూ మొత్తుకుంటూ ధర్మ రాజుదగ్గిరికి పరిగెత్తారు. "రక్షించండి, మహారాజా, రక్షించండి" అంటూ శరణు జొచ్చారు. "మీతమ్ముణ్ణి దుర్యోధనుణ్ణీ, ఆయన భార్యల్నీ, తమ్ముల్నీ కట్టేసి పట్టుకుపోతున్నారు గంధర్వులు. కరు ణించండి. తమ్ముల్ని కాపాడండి" అని కాళ్లమీదపడ్డారు.

"కాగలకార్యం గంధర్వులే తీర్చేశారు," పకాపకా నవ్వుతూ అన్నాడు భీముడు- "మనపని తేలికఅయిపోయింది. కను పులో చల్ల కదలకండా విజయం మన కాళ్ళముందుకి వచ్చింది. మోసం ముందుపుట్టింది. తరవాత పుట్టాడు మనతమ్ముడు దుర్యోధ నుడు. పాపాలపుట్ట. దుర్మార్గుడికి తగినపనే చేశాడు దేవుడు. అడి

విలో అష్టకష్టాలూ పడుతున్నాం మనం. రాజ్యగర్వంతో మనల్ని నవ్వడానికి వచ్చాడు దుష్టు. తగినఫలమే అనుభవించాడు. అనుభవించనీ, మనం ప్రమేయం పెట్టుకోవద్దు. వాడిమీద దయఏమిటీ?"

"కావేషీ సాధించడానికి, తమ్ముడూ, ఇదా సమయం?" అన్నాడు ధర్మరాజు—"శరణంటూ వున్న ఈకౌరవుల్ని కరుణించడం ధర్మం కదా, నీకు! ఒక్కోకముక్కలు తోబుట్టువులంటే. ఒక్క వంశంలో పుట్టినవాళ్లకి సంపదకోసం వొక్కొక్కప్పుడు భేదాభిప్రాయం పుడుతుంది. అంతమాత్రం చేత సహజమయిన అనురాగం ఎటు పోతుంది? జ్ఞాతులు తమలో తాము ఎంతన్నా కుమ్ములాడుకోవచ్చు. కాని పరాయివాళ్లవల్ల పరాభవం వచ్చినప్పుడు వొకళ్ళనిచూసి వొకళ్ళు వూరుకుంటే, లోకనింద నెత్తిని పడుతుంది.

"దుర్యోధనుడు దుర్మార్గుడే. ఒప్పుకుంటాను. అయితే భార్యలతో సహా పరాయివాళ్ళచేతుల్లో పడిపోయాడు. ఇది ఉపేక్షిస్తే మనకి కులహాని. అంతేకాదు, శరణంటే రక్షించడం రాచధర్మం కదా! నీవంటి బలవంతుడయిన రాచబిడ్డకి ఇలాంటి మంచిపని కర్తవ్యమే అని వేరే చెప్పాలా? లే. ఆలోచించకు. తమ్ములూ, నువ్వూ సర్వసన్నాహాలతో రథాలమీద వెళ్ళండి. దుర్యోధనుణ్ణి విడిపించుకురండి."

"అదేమన్నమాట అన్నయ్యా," అంటూ మళ్ళీ అడ్డుతగిలాడు భీముడు—"వాడి ఏమంచి తలంచుకుని వెళ్ళమంటావు నన్ను? నీళ్ళలో తోయించాడు. విషం పెట్టాడు. ఇల్లు కాల్చాడు. కపటజూదం ఆడించి, రాజ్యం లాక్కున్నాడు. అంతమంది ఎదటా ద్రౌపదిని జుత్తుపట్టుకు ఈడ్పించాడు. బట్టలూ విప్పించాడు. పుట్టినప్పటినించీ మనకి ఎసరుపెట్టని రోజేలేదు వాడు. వాడు చేసింది వొక్కటీ పట్టించుకోవు నువ్వు. కేవలం దయా, దయా, దయా అంటావు. ఈదయ మనకష్టాలు దాటిస్తుందా?"

ఇలా పూర్వవిరోధం తలచుకుంటూ రుసరుసలాడా డతడు.

"పొరపడుతున్నావు" అంటూ నెమ్మదయిన మాటల్తో అతణ్ణి సముదాయించాడు ధర్మరాజు- "రక్షించమంటూ వస్తే, ఎంత చేతకాని వాడయినా తనచేతనయినంత సాయంచేస్తాడు. అలాంటిది, శూరుడయినవాడూ పైగా ఉత్తమశూరుడూ పూరుకోవడం న్యాయమేనా? ప్రాణాలు తీసిన శత్రువే అగుగాక, శరణూ అంటే రక్షించడమే ధర్మం హృదయం కలవాళ్ళు. దీన్నిమించిన ధర్మమే లేదు మరి.

"మీబలమూ పరాక్రమమూ బాగా తెలుసు దుర్యోధనుడికి. మనం ఇక్కడ వున్నామనీ తెలుసు. అంచేత తప్పకండా అతణ్ణి మీరు విడిపిస్తారని ఆశపడుతూనూ వుంటా డతడు. సందేహం లేదు. ఇది మనకి కీర్తీ పుణ్యమూ తెచ్చిపెట్టే సమయం. ఈఅవకాశం వదిలిపెట్టకూడదు. నిన్ను ఇంత నిర్బంధించకపోదును. నేనే వెళ్ళి వుందును. కాని యజ్ఞదీక్షలో వున్నాను. వల్లకాదు. అంచేత నువ్వూ తమ్ములూ చప్పున వెళ్ళండి. గంధర్వుల్తో మంచి మాటలాడి, దుర్యోధనుణ్ణి విడిపించండి. సామోపాయానికి లొంగకపోతే మాత్రం యుద్ధం చేసనా సరే, కార్యం సాధించుకు రండి. నాయజ్ఞం సఫలం చెయ్యండి." ఇలా అనేకవిధాల నచ్చజెప్పాడు.

ఎలా అయితేనేం తుదకి అంగీకరించాడు భీముడు. ధర్మరాజు చెప్పడంతోనే "దుర్యోధనుణ్ణి విడిపించందీ తిరిగిరాను" అని ప్రతిజ్ఞ చేశాడు అర్జునుడు. ఉత్సాహంతో వాళ్ళ ననుసరించారు నకుల సహదేవులు.

నలుగురూ చప్పున కవచాలు తొడిగారు. తూణీరాలు వేసుకున్నారు. ధనుస్సులు పట్టుకున్నారు. అన్నగారికి నమస్కరించి రథాలెక్కి బయల్దేరారు. ఆగమేఘాలమీద పరిగెత్తాయి రథాలు. కౌరవ సైన్యం యావత్తూ సింహనాదాలు చేస్తూ వారివెంట బయల్దేరింది.

అప్పటికే గంధమాదనం తోవపట్టి దుర్యోధనుణ్ణీ వాళ్ళనీ లాక్కుపోతున్నారు గంధర్వులు. పాండవుల్ని చూడ్డంతోటే ఎదురు తిరిగారు. అన్నగారి ఆజ్ఞప్రకారం ముందు సామోపాయమే ప్రయోగించాడు అర్జునుడు. "మీకూ మాకూ విరోధమెందుకు ? మంచిగా వదిలిపెట్టెయ్యండి దుర్యోధనుణ్ణి. మహారాజు ధర్మరాజు ఆజ్ఞ ఇది. కాదనకూడదు మీరు" అన్నాడు.

"ధర్మరాజయితేమాత్రం మా మీద ప్రభువా," అన్నారు గంధర్వులు – "ఆయన ఆజ్ఞ మాకేమిటి? మేమెందుకు పాలించాలి? ఆజ్ఞాపించడానికయినా, శాసించడానికయినా ఒక్కడే మాకు అధికారి, దేవేంద్రుడు. ఆయన్ని తప్పించి, ఎవరయినా సరే, లక్ష్యపెట్టం మేం."

"ఐతే, మాతప్పులేదిక" అంటూ గాండీవం సారించాడు అర్జునుడు. "ముందేకయ్యం ఎందుకు అని మంచిమాటల్తో చెప్పిచూశాను. సామోపాయంతో ఎలాగూ దారికివచ్చినట్టులేదు మీరు. సరే, యుద్ధంచేసే విడిపించుకు వెళతాను దుర్యోధనుణ్ణి" అంటూ బాణాలతో కొట్టాడు గంధర్వుల్ని. గంధర్వులూ సిద్ధంగానే వున్నారు. బాణాల్తో వర్షమే కురిపించారు పాండవులమీద. ఇటు పాండవులూ, అటు లక్షలాది గంధర్వులున్నూ, భయంకరంగా జరిగింది యుద్ధం.

అర్జునుడి రథం విరగ్గొట్టాలని ఎగబడ్డారు గంధర్వులు. దయాదాక్షిణ్యంలేకండా పదిలక్షులమంది గంధర్వుల్ని చంపేశాడు అర్జునుడు. మంచిమంచి అగ్గితునకల్లాంటి వాళ్ళనల్లా తన బాణాగ్నిలో భస్మం చేశాడు. భీముడూ, నకుల సహదేవులూ కొడుతూ వున్న బాణాలు విడుపూ విరామంలేకండా వున్నాయి. వింటిమోతలతో భూగహ్వారం నిండిపోతూ వుంది. గంధర్వసేనలో రక్తాలు మడుగులు కడుతున్నాయి.

అయినా, దుర్యోధనుణ్ణి వదలలేదు గంధర్వులు. అతణ్ణీ అతడి భార్యల్నీ, పరివార సహితంగా పట్టుకుని ఆకాశమార్గంలో పరిగెత్తారు వాళ్ళు. ఆ కాశానికే అడ్డువేశాడు అర్జునుడు. దట్టమయిన బాణాలు వేశాడు. చీమకయినా సందులేకండా ఆకాశమార్గమంతా కప్పి పెట్టాడు. వల్లో చిక్కిన పిట్టల్లా అయిపోయారు గంధర్వులు. అయినా ఆగలేదు వాళ్ళు. అక్కడినించే అనేకరకాల ఆయుధాలు ప్రయోగించారు. అవన్నీ కింద పడకండానే ఖండించికొశాడు అర్జునుడు. మరింత ఉగ్రుడయిపోయాడతడు. వాడి వాడి బాణాలు ప్రయోగించాడు. దాంతో గంధర్వుల తలలు తెగాయి. రక్తం వర్షంలా కురిసింది. కాలవలై పారింది. ఆకాశంమీద మరి కిక్కురుమనలేదు గంధర్వులు. ప్రపంచానికే భయంపట్టుకున్నట్టయింది.

అంతతో పోనివ్వలేదు అర్జునుడు. ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. ఎండిన అడివి కార్చిచ్చు దహించేస్తుందే, అదిగో, అలాగ గంధర్వుల్ని కాల్చేసింది అగ్నిబాణం. మరి సహించలేకపోయాడు చిత్రసేనుడు. దారుణమయిన గద తీసి అర్జునుడిమీద విసిరికొట్టాడు. సగంలోనే దాన్ని ముక్కలుచేసేశాడు అర్జునుడు. మాయాబలమే ఇక శరణ్యమయింది గంధర్వ రాజుకి. చప్పున మాయమైపోయాడు. కనపడకండా పాండవులు నలుగురిమీదా బాణాలమీద బాణాలు కురిపించాడు. కనపడకండానే మేఘం వురిమినట్టు వురిమాడు. తన పరాక్రమం యావత్తూ ప్రకటించాడు.

మాట్లాడకండా శబ్దభేది బాణాలు వదిలాడు అర్జునుడు. చిత్రసేనుడి శరీరమంతా తూంట్లుపడేట్టు కొట్టాడు. లిప్తలో మాయాగీయా మాయమయేట్టు చేశాడు.

లొంగిపోయాడు చిత్రసేనుడు. ఆయుధాలూ అవీ వదిలిపెట్టేశాడు. ఆకాశం దిగివచ్చి, అర్జునుడిముందు నుంచున్నాడు. తిరా

చూస్తే అర్జునుడి స్నేహితుడే చిత్రసేనుడు. ఎత్తిన ధనుస్సు దించేశాడు అర్జునుడు. భీముడూ వాళ్ళూ కూడా ఆపేశారు యుద్ధం. రథాల మీదించే వొకళ్ళ నొకళ్ళు పలకరించుకున్నారు. కుశలప్రశ్నలూ వేసుకున్నారు.

"నువ్వేనా నేస్తం, ఎవరో అనుకున్నాను" అన్నాడు అర్జునుడు. "ఐతే, మాతో నీకు విరోధ మేమిటి? వదిలిపెట్టెయ్యి దుర్యోధనుణ్ణి" అన్నాడు. "పిడిసంగతేమిటో మీకు తెలీదు, వినండి" అన్నాడు చిత్రసేనుడు. "అడవిలో మీరు ఆయాసపడు తున్నారు కదా! మిమ్మల్నీ, మీ ద్రౌపదీ దేవినీ హేళనచెయ్యాలనీ, అవమానించాలనీ ద్వైతవనం వచ్చాడు దుర్మార్గుడు. ఇదంతా దేవేంద్రుడు తెలుసుకున్నాడు. ఒళ్ళుమండిందాయనికి. 'భార్యలతోనూ వాళ్ళతోనూ కలిపి కట్టేసి, పట్టుకుర' మ్మని పంపించాడు నన్ను. అందుకే ఇలా వచ్చాను. ఆయనదగ్గిరకే వీళ్ళని పట్టుకు పోతున్నాను అంచేత నువ్వు అడ్డురాకు. నువ్వు నాస్నేహితుడివి. నీమీాద కోపంలేదు నాకు, నీపరాక్రమం చూస్తే సంతోషమే కాని మచ్చరం కలగదు" అన్నాడు.

"అదికాదు నేస్తం, నామాట విను. దుర్యోధనుడు మాకు సోదరుడు. అతణ్ణి వదిలిపెట్టు. అదే ఉపకారం అవుతుంది మాకు. అన్నయ్య ధర్మరాజూ సంతోషిస్తాడు. దేవేంద్రుడే చెప్పనీ, మరేమయినా కానీ – అదేదో ధర్మరాజుతో చెప్పు. ఆయన ఏం చెయ్యమంటే అదే చెయ్యి. నాకోసం ఈమాత్రం మన్నించు. రా" అన్నాడు.

స్నేహితుడిమాట తోసెయ్యలేకపోయాడు చిత్రసేనుడు. కట్లతోనే దుర్యోధనుణ్ణీ అతని భార్యల్నీ వాళ్ళనీ తీసుకుని ధర్మరాజు దగ్గరికి వచ్చాడు. స్నేహపూర్వకంగా చిత్రసేనుణ్ణి సన్మానించాడు ధర్మరాజు. "ఇంకా నయమే అయింది. మాదుర్యోధనుడు మీచేత చావ

కండా బతికాము. అదే పది వేలు మాకు. మీవల్ల మావంశానికి ఆపద లేకండా అయింది. బతికిపోయాం. ఇతను నా తమ్ముడు. తప్పే చేశాడనుకోండి. అయినా మా మొహం చూసి అంతా క్షమించండి. మాకోసం ఇతణ్ణి విడిచిపెట్టండి" అని ప్రార్థించాడు.

కాదనలేకపోయాడు చిత్రసేనుడు. దుర్యోధనుణ్ణీ, అతడి భార్యల్నీ, తమ్ముల్నీ, మంత్రుల్నీ అందర్నీ విడిచిపెట్టేశాడు. పాండవుల దగ్గర సెలవు తీసుకుని తిన్నగా అమరావతి వెళ్ళిపోయాడతడు. దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళి జరిగినదంతా పూసగుచ్చినట్టు నివేదించాడు. సంతోషించాడు దేవేంద్రుడు. అమృతం కురిపించి యుద్ధంలో చచ్చిపోయిన గంధర్వులు యావన్మందినీ బతికించాడు.

చిత్రసేనుడు వెళ్ళాక దుర్యోధనుడి కట్లు విప్పించాడు ధర్మరాజు. "తమ్ముడూ, ఇలాంటి సాహసం ఇంకెప్పుడూ చెయ్యకు" అని మందలించాడతణ్ణి. "దుర్జనుడు ఎప్పుడూ వొళ్ళు తెలీక సాహసం చేస్తాడు; మొదలంటా నశిస్తాడు. సరే,-అయిందేదో అయింది. దీనికోసం విచారం పెట్టుకోకు. సపరివారంగా ఇంతటితో ఇంటికి వెళ్ళిపో" అంటూ బుద్ధిచెప్పి పంపించాడు.

దించిన మొహం ఎత్తకండా వెళ్ళిపోయాడు దుర్యోధనుడు. ధౌమ్యుడూ మొదలయిన బ్రాహ్మలూ, తక్కిన యావన్మందీ ధర్మరాజు ధర్మబుద్ధి వెయ్యినోళ్ళతో మెచ్చుకున్నారు.

---

# అ ర ణ్య ప ర్వ ం



## ఆ రో ఆ శ్వా స ం

### దు ర్యో ధ ను డి ప్రా యో ప వే శ ం

పాండవుల్ని పరాభవించాలనే బయలుదేరాడు దుర్యోధనుడు. తుదకి వాళ్ళవల్లే ప్రాణాలు దక్కించుకుని బయట పడ్డాడు. సిగ్గుతో అతడు కుంగిపోతున్నా డిపుడు. దించిన తల ఎత్తడానికే మొహం చెల్లలే దతడికి. ఇంతకంటే చావే నయం అనిపిస్తోంది.

పాండవుల దగ్గిరనించి బయలుదేరాడు దుర్యోధనుడు. చెదిరిన సైన్యాలూ మెల్లిమెల్లిగా అతణ్ణి చేరుకున్నాయి. అలా కొంతదూరం వెళ్ళాడు. ఒక సమతల ప్రదేశం చూసి ఆగిపోయాడు. అక్కడే డేరాలు వేయించాడు. ఒక్కడే లోపలి గదిలో ప్రవేశించాడు. విచారిస్తూ వొంటరిగా మంచంమీద పడుకున్నాడు. రాహువు మింగిన చంద్రుడిలా కళాకాంతీ లేకండా వున్నా డతడు.

అంతలో వెదుక్కుంటూవచ్చి కలిశాడు కర్ణుడు. వికర్ణుడి రథం మీద పారిపోయాక, ఇదే రావడం అతడు. "అమానుషమయిన యుద్ధమే జరిగిపోయింది మహారాజా," లోపలగదిలో అడుగు పెడుతూ అన్నాడు కర్ణుడు–"కామరూపులు గంధర్వులు. ఆకాశ వీథుల్లో ఎగిరిపోయే వాళ్ళు. ఉద్దండులు. వాళ్ళముందు నుంచోడమే కష్టం ఎంతటివాళ్ళకయినా. అలాంటివాళ్ళని చంపేశావు నువ్వు. గెల్చుకు వచ్చావు. బ్రహ్మానందంగా వుంది నాకు.

"నువ్వు చూస్తూనే వున్నావు కదా, ఈసుళ్ళపుట్టలా ఎంత మంది నామీదపడ్డారో! నేనుమాత్రం తీసిపోయానా! కుప్పలు

కొప్పులు కూలగొట్టాను. అయితే, ఏం లాభం! మనసైన్యం మాత్రం నన్ను వదిలేసి వుడాయించింది. అడ్డుకునేవాళ్ళు లేకపోయారు. సారథం విరిగిపోయింది. అయినా, చలించలేదు నేను. వికర్ణుడిరథం ఎక్కాను. ఆగితేనా అది! యుద్ధంలోంచి ఎక్కడికో లాక్కుపోయింది నన్ను. ఏమైతే నేం గాక! చెక్కుచెదరకండా నువ్వు బైటపడ్డావు. శత్రువుల్ని చంపేశావు. నిన్నుచూసి ప్రాణాలులేచివచ్చాయి నాకు. కృతార్థుణ్ణయాను.

"నిజానికి ఇంత పరాక్రమం ఎన్నడూ చూపించలేదు నువ్వు. అద్భుతం! మూడులోకాల్లోనూ నిన్ను మించినవాడు లేడంటాను నేను." ఇలా దుర్యోధనుణ్ణి పొగడ్డం లంకించుకున్నా డతను.

మరింత సిగ్గు పడిపోయాడు దుర్యోధనుడు. "అసలుసంగతి తెలియలేదు ఇతగాడికి. అందుకే ఇలా అంటున్నాడు" అనుకున్నా డతడు, లోపల. "మనమేమిటి, గెలవడమేమిటి?" అంటూ జరిగిందంతా చెప్పడం మొదలుపెట్టాడు. "నువ్వు అలా వెళ్ళిపోయావు. నేనూ, తమ్ములూపోట్లాడుతూనే వున్నాం. ఉభయసైన్యాలూహోరాహోరీ పోరాడుతూనే వున్నాయి. ఇంతలో గంధర్వరాజుకీ నాకూ పడింది. అతడి బాణాల్తో చచ్చినంతపని అయిపోయింది నాకు. నన్నూ, నాభార్యల్నీ, నాతమ్ముల్నీ, మంత్రుల్నీ అందర్నీ చెరపట్టి కట్టేశారు గంధర్వులు. దాంతో మనవాళ్ళంతా ఏడుస్తూ ధర్మరాజు దగ్గిరికి పరిగెత్తారు. శరణు శరణంటూ అతడి పాదాలమీద పడ్డారు దయకి అపరావతారం ధర్మరాజు. తమ్ములు బలవంతులు కదా వెంటనే నన్ను విడిపించమని పంపాడు వాళ్ళని. ఆఘమేఘాలమీద వచ్చి అడ్డుకున్నారు వాళ్ళు. మొదట మంచిమాటల్తోనే చెప్పారు లాభంలేకపోయింది. వినలేదు గంధర్వులు. దానిమీద బాణాలికి ప చెప్పారు పాండవులు. భీముడూ, అర్జునుడూ, నకుల సహదేవులూ న

గుహా యముల్లాగ విజృంభించారు. ఘోరమైన యుద్ధం జరిగింది. పాండవుల దెబ్బలకి ఆగలేకపోయారు గంధర్వులు. ఆకాశంమీంచి పారిపోవాలని చూశారు మబ్బుల్ని పట్టుకుని. ఆకాశానికే అడ్డం వేశాడు అర్జునుడు. బాణాల్తో చూడలేకండా కట్టేశాడు. చేసేదిలేక లొంగిపోయాడు చిత్రసేనుడు. అర్జునుడి దగ్గిరకొచ్చి పలకరించాడు. అసలు అర్జునుడి స్నేహితుడే చిత్రసేనుడు. స్నేహితులిద్దరూ వోహో అంటే వోహో అనుకున్నారు. 'దుర్యోధనుడు మా తోబుట్టువు. అతణ్ణి వొదిలిపెట్టెయ్యి' అని కోరాడు అర్జునుడు. మన ఎత్తంతా అర్జునుడితో చెప్పేశాడు చిత్రసేనుడు. 'దేవేంద్రుడి ఆజ్ఞ ఇది. అంచేత వదలనుగాక వదలను' అన్నాడు. సిగ్గుతో నేను చచ్చిపోయానంటే నమ్ము. భూమిలో వోక రంధ్రమన్నావుంటే, దూరిపోదా మనిపించింది. అలా కాదంటూ ధర్మరాజుదగ్గిరకి పిలుచుకు వచ్చాడు చిత్రసేనుణ్ణి, అర్జునుడు. మనం తీసుకున్న గోతిలో మనమే పడ్డట్టయింది. కట్లతోవున్న నన్నూ, నావాళ్ళని ధర్మరాజుముందు నుంచోపెట్టారు. ధర్మరాజు దయవల్ల చెరవిడించె నాకు. బతికి బయటపడ్డాను. గెలుపు గెలుపంటావు నువ్వు. ఇదీ నాగెలుపు!

"కర్ణా! కిట్టనివాళ్ళ ఎదట భంగపడిపోయాను. నవ్వులపాలే అయిపోయింది నాబతుకు! ఇక రాజ్యంతో ఏం పని? బతుకెందుకు? ప్రాణాలెందుకు? యుద్ధంలో గంధర్వుల చేతుల్లో చచ్చిపోయినా బావుండేది. ఈ తలవొంపు లేకపోవును. అటు స్వర్గమూ, ఇటు కీర్తీ రెండూ దక్కును. ఇంత ఇది అయ్యాక ఇంకా బతికి పదిమందిలోకి వెళ్ళలేను. ప్రాయోపవేశం చేస్తాను. ప్రాణం వొదిలిపెడతాను. దుశ్శాసనుణ్ణి తీసుకుని మీరంతా హస్తినాపురం వెళ్ళిపోండి.

"స్నేహితులికి సంతోషమూ శత్రువులికి సంతాపమూ కలిగిస్తూ ఇంతకాలం బతికాను. శత్రువులచేత తలకొట్టించుకుని, సిగ్గులేకండా

బంధువులమధ్య మొహం మెలా చూపించేది ? బాబయ్యగారి ఎదట ఎలా మాట్లాడేది ? పెద్దలు భీష్ముడూ, బాహ్లీకుడూ అడిగితే ఏమని చెప్పేది? ఆచార్యులయిన కృపుడికియింకా ద్రోణుడికి ఎదటా ఎలా నుంచుండేది? పరిజనులూ, పౌరులూ, పురోహితులూ ఎదిటికివస్తే ఎలా మొహాం చూపించేది ?

"చేతులారా చేసుకున్న దోషం యిది. అనుభవించి తీరాలి. ఒకర్ని అని ఏమిలాభం ? ఎంత ఐశ్వర్యవంతుడైనా, ఎంత సంపదవుండినా చెడ్డనడత కలవాడు అవి ఉపయోగించుకోలేడు. చెడ్డపనుల్లో పడి చివరికి చెడిపోతాడు. తిప్పలు. తలుచుకుంటే గుండె పగిలిపోతుంది. ఎంత దురవస్థకి వచ్చాను! ఒక శత్రువు చెరపట్టడం! ఒక విరోధి దయతలిచి విడిపించడం !! – ఎంతయినా చిత్రమైంది విధి ! మానమే పోయాక, ప్రాణంవుండి ఏం లాభం ? అందుకని చావే నిశ్చయించు కున్నాను. తిరుగులేని నిశ్చయమే ఇది. ఎవ్వరూ మాన్పించలేరు దీన్ని."

అంతలో దుశ్శాసనుడూ అతడి వెనక శకుని లోపలికి వచ్చారు. దుశ్శాసనుణ్ణి దగ్గిరికి పిలిచాడు దుర్యోధనుడు. "తమ్ముడూ, మన రాజ్యం నీకు పట్టంకడుతున్నాను. కౌరవసామ్రాజ్యానికి నువ్వే రాజువి ఇకమీద. కర్ణుడూ, శకునీ మంత్రులుగా వుంటారు. ప్రపంచమంతా పరిపాలించు. తమ్ముల్ని దయచూడు. బంధువుల్ని పోషించు. బ్రాహ్మల జీవనోపాధులు నిలబెట్టు. పెద్దల్ని భక్తితో సేవించు. దేవతల్ని దేవేంద్రుడు పాలించినట్టు నామంతుల్ని పరిపాలించు. శత్రువులు తలఎత్తనివ్వకు. స్నేహితులైన శూరుల్ని సన్మానించు" అన్నాడు.

అన్నగారి వొకొక్కమాటా వొకొక్క శూలంలా అనిపించింది దుశ్శాసనుడికి. కెరటాల్లాగ పొంగిపోయివచ్చింది దుఃఖం. ఆపుకోలేక పోయాడతడు. అన్నగారిపాదాలమీద పడి బావురుమన్నాడు. "ఇలా అనవద్దు అన్నయ్యా," అంటూ కన్నీళ్ళతో పాదాలుకడి

గాడు. "భూగోళం బద్దలు కానీ, హిమాచలం కదిలిపోనీ, సముద్రం ఇంకిపోనీ, సూర్యచంద్రులు మాసిపోనీ – ఏది ఏమయినా కానీ వొక లోపమంటూ రాదు నీకు. రారాజువి నువ్వు. నీపదవికి నేనా సమర్థుణ్ణి? స్నేహితుల్ని రక్షిస్తూ, శత్రువుల్ని చంపేస్తూ నువ్వే సామ్రాజ్యం పరిపాలించు" అంటూ గోలుగోలుమన్నాడు. తమ్ముణ్ణి చూసి తానూ బొటబొటా కన్నీళ్ళు కార్చాడు దుర్యోధనుడు.

"ఏమిటిది? కుర్రాళ్ళలా ఏడుస్తూ కూచుంటా రేమిటి?" అంటూ ఇద్దరినీ వోదార్చాడు కర్ణుడు. "ధైర్యం వహించండి. విచారం విడిచిపెట్టండి. ఏడ్చేవాళ్ళని చూస్తే పగవాళ్ళు మరీ నవ్వుతారు. దుఃఖపడేవాడికి దుఃఖంమీద దుఃఖమే వస్తుంది. ఇంకో లాభం వుండదు.

"మహారాజా, సర్వసౌఖ్యాలికీ ఆధారమైంది శరీరం. అలాంటి శరీరమే వదిలిపెడతా నంటున్నావు. ఎంత అవివేకం! ఏదో వొక తక్కువమనిషికి పుట్టవలిసినబుద్ధి ఇది. నీఅంతటివాడికి తగదుగాక తగదు. నీదుఃఖంచూసి నీతమ్ముళ్ళూ నేనూ సహించలేకపోతున్నాం. గుండెలు పగిలిపోతున్నాయి. అనుగ్రహించు. ఇంతమందినీ దుఃఖ సముద్రంలో ముంచెయ్యకు.

"ఇంతకీ పాండవులు విడిపించారని కదా, బాధపడుతున్నావు. అంతే. అనలుసంగతి ఆలోచించడం లేదు నువ్వు. రాజు రాజ్యంలో నిశ్చింతగా బతుకుతూవున్న పజలు, వాళ్ళు ఎవళ్ళయినా సరే, రాజుకి బంట్లే కదా! అంచేత అవసరంవచ్చినప్పుడల్లా రాజుకోసం పనిచెయ్యవలిసిందే ప్రజలు. ఎక్కడావున్న న్యాయమే ఇది. అవునా? మరి, పాండవులు నీ దేశంలో వున్నారు. నీఆజ్ఞకి బద్ధులయిన్నీ వున్నారు. కాబట్టి వాళ్ళు నీదాసులు. అవసరంవచ్చినప్పుడు నీపని చెయ్యడమే వాళ్ళ విధి. అదే చేశారు వాళ్ళు. దీనికోసం విచారించడం ఎందు

కంటాను! జూదంనాడే నీకు దాసులయిపోయారు పాండవులు. వాళ్ళ వస్తువులూ, వాహనాలూ యావత్తూ నీకు దఖలుపడ్డాయి. వాళ్ళూ నీకొలువులోనే వుండి నిత్యమూ నిన్ను సేవించవలిసింది. అదీ లేకపోగా ఇలాంటి అవసరసమయాల్లో అయినా నీసేవ చెయ్యవద్దా? అదే చేశారు వాళ్ళు. దీనికి పైగా విచారమెందుకూ? బాగా ఆలోచించు. విచారం విడిచిపెట్టు. రాజధానికి బయల్దేరు. నామాట విను. సర్వం తెలిసినవాడివి. ఇంతకంటే ఏం చెప్పేది?

"కాదని భీష్మించావా, మాకు మాత్రం ఏముందిక! ఇంత మందిమీ నీతోనే ప్రాయోపవేశం చేస్తాం. ప్రాణాలు వదిలిపెడతాం. లోకంలో నగుబాట్లు మాత్రం తప్పవు నీకు" అంటూ ఎన్నో విధాల బోధచేశాడు.

అయినా వినిపించుకోలేదు దుర్యోధనుడు. ప్రాయోపవేశమే నిశ్చయించుకు పడుకున్నాడు. అదిచూసి, "ఏమిటీ వెర్రి బాబూ," అంటూ శకునీ నచ్చ చెప్పడం మొదలుపెట్టాడు— "అన్నివిధాలా ఆలోచించిచెప్పాడు కర్ణుడు. అతడిమాట మన్నించు. విచారం విడిచిపెట్టు. నీకోసం నాబుద్ధిబలం అంతా వినియోగించాను. నిష్కంటకం చేసి, సమస్తసామ్రాజ్యమూ నీచేతుల్లో పెట్టాను. అది అనుభవించకండా ప్రాణం వదిలేస్తానంటూన్నావు. కాకపోతే ఏమిటిది? దీనివల్ల నువ్వు వృద్ధుల్ని సేవించడంలేదని మాత్రం స్పష్టపడుతోంది.* కోపమో, సంతాపమో కలిగిందే అనుకో, అదేపట్టుకు కూచుంటారా మరి! వెంటనే వదిలిపెట్టెయ్యాలి గాని, ధైర్యంగా.

"పిరికితనమూ, ఏమరుపాటూ, గర్వమూ, మెత్తబాటూ, కర్తవ్యం నిర్ణయించుకో లేకపోవడమూ, విషయలంపటత్వమూ — ఇవి

* వృద్ధుల్ని సేవించినరాజు కష్టాలు వచ్చినా దుఃఖించడు. కామందకీయనీతిసారం ప్రథమవర్గ. శ్లో. 60.

వున్న రాజుదగ్గిర లక్ష్మి నిలవదు; వొదిలిపోతుంది. అంచేత, ఇపుడు కర్తవ్య మేమిటో నిర్ణయించు ముందు.

"నీకు ఉపకారమే చేశారంటున్నావు కదా, పాండవులు! పోనీ వాళ్ళతో విరోధం విడిచి పెట్టెయ్యి. తగిన బహుమతులు ఇచ్చి సన్మానం చెయ్యి, కావాలంటే. అంతేకాని, ఇలా దుఃఖంతో కుంగిపోవడం దేనికి? గతమంతా మరిచిపో. ఇప్పటి ఉపకారమే గణించు. మనస్సులో మరి ఏవిధమయిన ఇదీ పెట్టుకోకు. పాండవుల్ని పిలిపించు. వాళ్ళ తండ్రివాటా వాళ్ళకి ఇచ్చెయ్యి. పుణ్యమూ కీర్తీ రెండూ దక్కుతాయి నీకు. వాళ్ళు నీతోబుట్టువులే కాని పరాయివాళ్ళు కారు కదా! మీరూ, వాళ్ళూ ఏకం కండి. కలిసి రాజ్యం పరిపాలించండి. గౌరవానికి గౌరవమూ వుంటుంది. సౌఖ్యానికి సౌఖ్యమూ వుంటుంది."-

ఇంకా ఏదో చెపుతూనే వున్నాడు శకుని. చప్పున లేచాడు దుర్యోధనుడు. తన కాళ్ళముందు పడివున్న శకుణ్ణి గుచ్చి ఎత్తాడు. శిరస్సు ముద్దాడాడు. కర్ణుణ్ణీ శకునినీ చూసి "ఎందుకు నన్ను బాధ పెడతారు?" అన్నాడు - "ధర్మం, ఐశ్వర్యం, ధనం, భోగం — వేటిమీదా అభిలాషలేదు నాకు. చుమ్మాటికీ ప్రాయోపవేశమే నిశ్చయించుకున్నాను. అడ్డురాకండిమీరు. మాటాడకండా మీ ఇష్టం వచ్చిన దగ్గిరికి వెళ్ళిపోండి."

"నిన్ను వదిలి ఎక్కడికి వెళతాం," అన్నారు వాళ్ళు - "నువ్వే మాకు ప్రభువువి. నీతోనే లోకం మాకు. నువ్వే ఇలా అయితే మరి మేము మాత్రం ఎటుపోతాం? నిన్నే అనుసరిస్తాం."

అంతలో పడమటి పర్వతం చేరుకున్నాడు సూర్యుడు. మరణించా లన్న నిశ్చయంతో శుచిస్నానం చేశాడు దుర్యోధనుడు. నారబట్టలు కట్టుకున్నాడు. సాయంకాల నిత్యకర్మలు నిర్వర్తించాడు.

ఏకాంతస్థలంలో దర్భాసనం వేసుకుని మౌనంగా కూచున్నాడు. క్రమంగా బాహ్యేంద్రియాల కర్మలు మానవత్తూ వదిలి పెట్టేశాడు. గాలిలేని దీపంలాగ స్థిరమయిన సమాధిదశలో వుండిపోయాడు.

## పాతళయాత్ర

పూర్వం దేవేంద్రుడితో ఓడిపోయిన రాక్షసరాజులు పారిపోయి పాతాళంలో వున్నారు ' దుర్యోధనుడు ప్రాయోపవేశం చేసుకుంటున్నాడు' - ఈసంగతి తెలిసింది వాళ్ళకి. రాక్షసఅంశలో పుట్టినవాడు దుర్యోధనుడు. అతడు చచ్చిపోవడమంటే రాక్షసుల పక్షం నశించడమన్నమాట. అంచేత రాక్షసరాజులు మూడవన్నందీ సమావేశమై ఆలోచించారు. దుర్యోధనుణ్ణి పాతాళానికి పిలవడమే కర్తవ్యం అని నిశ్చయించారు. వెంటనే వేద వేదాంగాలు తెలిసిన బ్రాహ్మల్ని పిలుచుకువచ్చారు. శుక్రుడూ బృహస్పతీ చెప్పిన అథర్వమంత్రాల ప్రకారం హోమం ప్రారంభించారు. మంత్రాలు చదువుతూ బ్రాహ్మలు అగ్నిలో నేయీ పాలూ ఆహుతు లిచ్చారు. హోమకర్మ సమాప్తం కాగానే వొక భయంకరమైన స్వరూపంతో కృత్తి బయటికి వచ్చింది. " ఏమిటి సెలవు " అంటూ ఎదట నుంచుంది.

" దుర్యోధనుడు ప్రాయోపవేశం చేస్తూ కూచున్నాడు. వెళ్ళు. అతణ్ణి తీసుకురా ఇక్కడికి " అన్నారు వాళ్ళు. క్షణంలో వచ్చింది కృత్తి. దుర్యోధనుణ్ణి పొదివి పట్టుకుంది. లిప్తలో పాతాళలోకం తీసుకువచ్చింది. రాక్షసరాజులముందు నుంచోబెట్టింది.

దుర్యోధనుణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకున్నారు రాక్షసులు. క్షేమం విచారించారు. " దుర్యోధనమహారాజా! శూరుడివి నువ్వు. ఆత్మహత్యకే తెగించావేమిటి ! " అని సాభిప్రాయంగా ప్రశ్నించారు— " ఎంతో మంది శూరులూ నిన్ను కనిపెట్టుకుని నీదగ్గిర

వున్నారు. సుప్రసిద్ధమయిన భరతవంశంలో పుట్టావు. ఇలాంటి నీకు ప్రాయోపవేశం ఖర్మ ఏమిటి? ఆత్మహత్య చేసుకున్న వాడు ఇహలోకంలో హీనత్వం పొందుతాడు. నిందలపాలవుతాడు. పరలోకంలో నరకబాధలూ అనుభవిస్తాడు. ఛా. నీవంటి బుద్ధిమంతులు చెయ్యవలిసినపనేనా ఇది! ధర్మమూ, కీర్తి, భోగమూ యావత్తూ నాశనంచేసే ఈదుర్బుద్ధి వదిలిపెట్టు. ధైర్యం వహించు. ప్రతాపం ప్రకటించు. శత్రువుల్ని సంహరించు. నువ్వు ఏదో మనుష్యమాత్రుడివే అనుకుంటున్నావేమో! కాదు. నీపూర్వజన్మరహస్యం చెపుతాం. కాస్త సావధానంగా విను.

"మేమందరం తపస్సుచేసి నిన్ను సంపాదించాం. ఘోరమయిన తపస్సుచేసి శివుణ్ణి మెప్పించాం. ఆయనే సృష్టించాడు నిన్ను. మాఅందరికీ నిన్ను నాయకుణ్ణిచేసి ఇచ్చాడు, మాకు. కేవలం వజ్రంతో తయారైంది నీపూర్వదేహం. ఏశస్త్రాలూ భేదించలేవు దాన్ని. నిత్యమూ కలకల్లాడుతూ, పువ్వులాగ, సుకుమారంగానూ వుండేది. మనుష్యస్త్రీలమాట అలా వుంచు. దేవకన్యలయినా ముగ్ధులు కావలిసిందే నిన్ను చూసి. అంత ఇదయిన శరీరంతో నిన్ను నిర్మించాడు శివుడు.

"నువ్వు భూలోకంలో పుట్టడంతోటే నీసహాయంకోసం ఎంతో అంతమంది దానవులూ, దైత్యులూ రాచకులంలో జన్మించారు. దివ్యాస్త్రాల్లో ఆరితేరినవాళ్ళు, వాళ్ళంతా. వాళ్ళే భగదత్తుడూ మొదలయినవాళ్ళు. భీష్ముడూ, ద్రోణుడూ – ఇలా కొందరు దేవాంశలో పుట్టినవాళ్ళు వున్నారు. నిజమే. అయినా, రాక్షసభావమే ఆవేశిస్తుంది వాళ్ళని. దాంతో దయా దాక్షిణ్యం లేకండా తయారవుతారు వాళ్ళు. మూర్ఖులికిమల్లే వొకళ్ళ నొకళ్ళు తిట్టిపోసుకొంటారు. ఆవేశంతో వొళ్ళుమరిచిపోతారు. కొడుకు లనీ,

మనమ లనీ, స్నేహితు లనీ, అన్నదమ్ము లనీ, శిష్యులనీ, గురువు లనీ, పిల్ల లనీ. పెద్ద లనీ,—ఏమీ విచారించకండా యుద్ధంచేస్తారు. దివ్యాస్త్రా లనీ, మానవాస్త్రా లనీ ఆలోచించరు. చేతికివచ్చిన ఆయుధంతో పాండవ పక్షాన్ని పడమోదుతారు. పాండవులూ బంధుస్నేహం మరిచిపో తారు. తెగించి, నీమీదికి వస్తారు. నీచేత హతవారిపోతారు.

"అర్జును డంటే ఏదో అడలుగా వుంది నీకు. మాకు తెలుసు. అందుకని మేమూ తగిన ఉపాయం ఆలోచించి సిద్ధంచేసి పెట్టాం. నరకాసురుడు కృష్ణుడిచేతిలో కాలం చేశాడు కదా! అతడి అంశ కర్ణుణ్ణి ఆవేశించేట్టు ఏర్పాటు చేశాం. దాంతో కృష్ణుడన్నా అర్జునుడన్నా మండిపడతాడు కర్ణుడు. తన దివ్యాస్త్రాల్తో అర్జునుణ్ణీ, కృష్ణుణ్ణీ ఇద్దర్నీ నంజుకుంటాడు. తప్పదు. ఇది తెలిసి పాండవుల్ని రక్షించాలని చూస్తాడు దేవేంద్రుడు. కపటరూపంతో వచ్చి, కర్ణుడి కవచకుండలాలు చపాయిస్తాడు.

"సంశప్తకులని వెయ్యికోట్లు రాక్షసులు పుట్టే వున్నారు భూమ్మీద. యుద్ధంలో వాళ్ళచేతుల్లోనే చిక్కిపోతాడు అర్జునుడు. నీకు శత్రువు అన్న పురుగేవుండదు ప్రపంచంమీద. ఎక్కడచూస్తే, అక్కడ నీశాసనమే వెలుగుతుంది. కనుక, మహారాజా, విచారం విడిచిపెట్టు. ప్రసన్నుడివి కా. మాకింతమందికీ నువ్వే తెప్పవి. నీ దుఃఖంచూసి, ఇంతమందిమీ బెంగపెట్టుకున్నామంటే నమ్ము. వెళ్ళు. మరో ఆలోచన పెట్టుకోక."

ఇలా అనేకవిధాల వోదార్చి, బోధపరిచారు. మళ్ళీమళ్ళీ కౌగలించుకున్నారు. సగౌరవంగా "వెళ్ళిరా" అంటూ సాగనంపారు.

తిరిగీ వెంటనే దుర్యోధనుణ్ణి ఎత్తుకుని బయల్దేరింది కృత్తి. ఎక్కణ్ణించి ఎలా తెచ్చిందో అతణ్ణి అక్కడ అలా దించేసి వచ్చింది.

బ్రహ్మానందం కలిగిపోయింది దుర్యోధనుడికి. అంతా అద్భుతం గానూ, ఇంద్రజాలంగానూ వుంది. చిత్రమైన కలే అనుకున్నాడు మొదట. ప్రత్యక్షంగా చూసింది కల ఎలా అవుతుంది? నిజమే అని నిశ్చయించుకున్నాడు. తుదకి "యుద్ధంలో పాండవుల్ని గెల్చుకుంటాను" అన్న భావం దృఢపడి పోయిందతడికి. దాంతో చిదానందమే కలిగిపోయింది. రాత్రి జరిగిన ఈచరిత్రా, రాక్షసులు అన్న మాటలూ ఎవ్వరితోనూ చెప్పలేదతడు. అంతా గోప్యంగా తన మనస్సులోనే పెట్టుకున్నాడు.

మర్నాడు తెల్లవారింది. కాకి కావుమందో లేదో, కర్ణుడు వచ్చి పలకరించాడు దుర్యోధనుణ్ణి. ఎన్నో దృష్టాంతాలూ, హేతువులూ చూపిస్తూ, రహస్యంగా ఏవేవో బోధించాడతడు. "చచ్చి శత్రువుని సాధించలేం కదా ?" అన్నాడు. "చావు క్షేమం కలిగిస్తుందా ?" అని వాదించాడు. "వ్యర్థంగా చావడం గొప్పా ?" అని అడిగాడు. "బొందెలో ప్రాణం వుంటేనే గెలుపన్నా, సౌఖ్యమన్నా సాధిస్తాం" అంటూ వొప్పించాడు. "శోకానికీ, దైన్యానికీ సమయం కాదిది. లే. పరాక్రమమే పరమావధి మనకి" అంటూ నచ్చచెప్పాడు. స్నేహపూర్వకంగా రెండుచేతులతోనూ ఎత్తి అతణ్ణి కౌగలించుకున్నాడు.

"అర్జునుడంటే ఏదో అడలుగా వుంది నీకు. నాకు తెలుసు. అరణ్యవాసం అయిపోయి, పద్నాలుగోఏడు రానీ. నువ్వు చూస్తూ వుండగానే వాణ్ణి నంజుకుంటాను. ఇదిగో ఆయుధాలు పట్టుకు ప్రమాణం చేస్తున్నాను" అంటూ శపథమూ చేశాడు.

కర్ణుడు శపథమూ, రాత్రి రాక్షసుల మాటలూ సరిపోతూనే వున్నాయి. తన భావం మరింత దృఢపడిపోయింది దుర్యోధనుడికి. చప్పునలేచి నుంచున్నాడతడు. దర్భాసనం వదిలిపెట్టి బైటికి

వచ్చేశాడు. "పట్నానికి ప్రయాణ సన్నాహం కానివ్వండి" అని మంత్రులికి ఆజ్ఞాపించాడు. దినకృత్యాలు నిర్వర్తించుకుని తానూ సంసిద్ధుడై బయలుదేరాడు.

విచారం విడిచి పెట్టి అలా కలకల్లాడుతూ మహారాజు కనపడ్డం తోటే చంద్రోదయం అయిన సముద్రంలా అయింది కౌరవ సైన్యం. రారాజే పూర్ణ చంద్రుడు. గుర్రాల బార్లు కెరటాలు. మదపు టేనుగులు మొసళ్ళు. సైనికులు చేపలు. సైన్యమే సముద్రం. శరత్కాలంలో రాజహంసలతోనూ, తామరపువ్వులతోనూ ఎలావుంటాయి చెరువులు. అదిగో అలావుంది, దుర్యోధనుడి తిరుగుయాత్రలో తెల్ల గొడుగులతోనూ పతాకాలతోనూ ఆకాశం.

దుశ్శాసనుడూ మొదలైన తమ్ములతోనూ, శకునీ కర్ణుల తోనూ, మంత్రులతోనూ, భార్యలతోనూ వైభవంగా హాస్తినాపురం వచ్చేశాడు దుర్యోధనుడు.

కొన్నాళ్ళు గడిచిపోయింది. ఒకనాడు మంత్రులూ వాళ్ళతో కొలువుతీరి కూచున్నాడు దుర్యోధనుడు. ఆలమందలు చూచిందికి వెళ్ళిన విషయం ఎత్తుకుని దుర్యోధనుణ్ణి మొదలకించాడు భీష్ముడు. "పెద్దలు చెప్పిన మంచిబుద్ధులు చేదనిపించాయి. దుష్టుల్ని వెంట వేసుకు వెళ్ళావు. చూశావా, ఫలితం ఏమయిందో! గంధర్వులు బాగానేబుద్ధి చెప్పా రనుకుంటాను. ఇంతకీ, ధర్మరాజు ద్వేషంలేనివాడు కాబట్టి బతికి పోయావు. ఈ సూతుడి కొడుకుని వూరికే పెద్దచేసి నమ్ముకుంటావు. ఏమయింది? నిన్నూ, నీభార్యల్నీ, తమ్ముల్నీ గంధర్వులు కట్టేసి పట్టుకుపోతూవుంటే అడ్డుపడ్డాడా, ఈగర్వపోతు? పుంజాలు తెంపుకు పారిపోయాడు. కళ్ళారా చూశావుగా, అయ్యగారి వీరత్వం! ఉద్దండ మయిన బలవంతులు పాండవులు. వాళ్ళ శౌర్యంలో పదహారోవం తయినా వుందా, ఈబడాయిరాముడు దగ్గిర? వాళ్ళవిలువా, వీడి

విలువా గంధర్వుల కయ్యంలో తేలిపోయింది కదా! ఇప్పుడయినా బుద్ధి తెచ్చుకోమంటాను. కులమూ సిరీ చెడగొట్టుకో కంటాను. పాండవుల్తో కలిసి మెలిసీ బతకమంటాను. నా మాట విను. అన్ని విధాలా నయమవుతుంది నీకు" అన్నాడు.

ఏమిటీ గోల అన్నట్టు అనాదరంగా చూశాడు దుర్యోధనుడు. కర్ణుణ్ణీ, శకునినీ చూసి నవ్వుతూ లేచిపోయాడు. అతడూ, అతడి వెంట శకునీ, కర్ణుడూ, తక్కిన తమ్ముళ్లూ లేచి బైటకి వెళ్ళిపోయారు. సిగ్గేపడిపోయాడు భీష్ముడు. తలవంచుకుని ఇంటికి వెళ్ళిపోయా డతడు.

## వైష్ణవయజ్ఞం

భీష్ముడు వెళ్ళిపోయాక మళ్ళీవచ్చి కొలువుతీర్చాడు దుర్యోధనుడు. "తాతగారి మాటకేం! ఇప్పుడు ఏం చెయ్యాలో ఆలోచించండి" అన్నాడు. మంత్రుల్ని చూసి, "ఏం చేస్తే మన ప్రతాపమూ, పరాక్రమమూ వృద్ధిఅవుతాయో చెప్పండి" అని అడిగాడు.

"మహారాజా, ఇప్పుడుమాత్రం అడ్డేముంది మనకి!" అన్నాడు కర్ణుడు — "శత్రువన్న వాడు లేడుకదా, నీకు! ఏవిచారమూ లేకండా హాయిగా ఈప్రపంచం యావత్తూ ఏలుకో. దేవేంద్రుడిలాగ సర్వ సుఖాలూ అనుభవించు."

"నిజమే, నీవంటి వీరుడు తోడైవుంటే అడ్డేమిటి నాకు!" అన్నాడు దుర్యోధనుడు — "ఐతే వొక్క కోరికమాత్రం ఎప్పుడూ బాధిస్తూ వుంటుంది నన్ను. ధర్మరాజు రాజసూయం చేశాడు కదా! అవాళనించీ అనుకుంటూనే వున్నాను, నేనూ రాజసూయం చెయ్యాలని. అది నాచేత చేయించావంటే నీమేలు మరిచిపోను."

"అంతేనా, అదెంతలోమాట!" అన్నాడు కర్ణుడు — "దానికోసం ఇంత ఆలోచించాలా మనం! రాజసూయానికి ఇదే తగిన

సమయం కూడాను. ఏమంటావా? ఉన్న రాజులు సూవన్నింటికీ నీస్వాధీ
నంలోనే వున్నారిప్పుడు. అంచేత, మరో ఆలోచనే అక్కరలేదు.
తక్షణం ఆరంభిద్దాం రాజసూయం. రాజుల్ని పిలిపించు. బ్రాహ్మల్ని
కబురంపు. యజ్ఞశాలలూ, యూపస్తంభాలూ సిద్ధం చేయించు. భక్ష్య
భోజ్యాలూ, యజ్ఞపరికరాలూ- అన్నిటికీ ఆజ్ఞాపించు. దేవేంద్ర
వైభవంతో చేద్దువుగాని రాజసూయం. అన్నిటికీ నేనున్నాను."

వెంటనే పురోహితుల్ని పిలిపించాడు దుర్యోధనుడు. "సంపూ
ర్ణమైన దక్షిణలతో రాజసూయమహాయజ్ఞం చేయాలనుకుంటున్నాను.
సర్వకార్యాలూ సాకల్యంగా జరిగించాలి మీరు" అని ఆదేశిం
చాడు వాళ్ళని. సర్వం తెలిసిన పండితులతోనూ వాళ్ళతోనూ
సంప్రదించారు పురోహితులు. తిరిగివచ్చి దుర్యోధనుడితో విన్న
వించారు. "మహారాజా, రాజసూయం చేసేముందు శత్రువులు
లేకండా చూసుకోవాలి మనం. పాండవులు నీకు శత్రువులుగా వుం
డనే వున్నారు. ముందు వాళ్ళని ఓడించాలి నువ్వు. అప్పుడు కాని
రాజసూయం ఆరంభించడానికి వల్లకాదు. అందుకని దానికిబదులు
అలాంటిదే మహోయజ్ఞం ఆరంభించమని మా మనవి. వైష్ణవయజ్ఞం
అని వొకయజ్ఞం వుంది. అన్నివిధాల రాజసూయంతో సమాన
మది. లోగడ శ్రీకృష్ణుడు చేశాడు ఈయజ్ఞం. దీనివల్లా అభీష్ట
సిద్ధి కలుగుతుంది" అన్నారు.

"ఇది బావుందంటే బావుంది" అన్నారు కర్ణుడూ శకునీ
ఇద్దరూనూ. వైష్ణవయజ్ఞానికే ఉద్యుక్తు డయాడు దుర్యోధనుడు.
తన ప్రయత్నం తండ్రితోనూ, తల్లితోనూ చెప్పాడు. వాళ్ళచేతా
'ఊఁ' అనిపించాడు. తరవాత ద్రోణుడూ, విదురుడూ, భీష్ముడూ,
కృపుడూ మొదలైన ముఖ్యులతోనూ చెప్పాడు. "బాగానేవుంది"
అంటూ వాళ్ళూ అంగీకరించారు.

పట్టణం దగ్గిరలోనే వొక పుణ్యస్థలంలో ఎంతో అందంగా యజ్ఞశాలలూ అవీ తయారుచేయించాడు దుర్యోధనుడు. యజ్ఞానికి అవసరమయిన వస్తుసామగ్రి యావత్తూ, పూతికపుల్ల వారాలేకండా సిద్ధం చేయించాడు. ఒక మంచిరోజుచూసి, ఉత్తములయిన బ్రాహ్మల సహాయంతో యజ్ఞదీక్ష ఆరభించాడు.

భూమండలంలోని రాజులు యావన్మందినీ ఆహ్వానిస్తూ దూతలు పంపాడు. ఉత్తములయిన బ్రాహ్మల్నీ ఆహ్వానించాడు ఒక దూతని పిలిచి ద్వైతవనం పంపాడు. "పాండవుల్నీ, వాళ్ళతో ఆశ్రమంలో వున్న బ్రాహ్మలు యావన్మందినీ యజ్ఞానికి పిలుచుకురా" అన్నాడు.

దూతవెళ్ళి ధర్మరాజుకి ఆహ్వానం అందించాడు. "దుర్యోధన మహారాజులుంగారు వైష్ణవయజ్ఞం చేస్తున్నారు. వారు తమ పరాక్రమంతో సంగ్రహించిన ధనంపెట్టి సంబరాలు సమకూర్చారు. మిమ్మల్నీ మీతమ్ముళ్ళనీ, మీదగ్గిరవున్న బ్రాహ్మలు యావన్మందినీ దయచేయమని ఆహ్వానించారు" అని మనవి చేశాడు.

"సంతోషమయిన వార్త తెచ్చావు," చిన్న చిరునవ్వు నవ్వుతూ అన్నాడు ధర్మరాజు—"దుర్యోధనుడు యజ్ఞం చేస్తున్నాడంటే మహానందంగా వుంది నాకు. కులమే పవిత్రమైందన్న మాట. అంతా బావుంది. మేము రావడమంటే ఎలా అవుతుంది? మా శపథం పూర్తయాక కదా, మేం పట్నంలో అడుగు పెట్టడం? దుర్యోధనుడితో ఇది చెప్పు. మరోలా అనుకోవద్దను."

ఆ పక్కనే వున్నాడు భీముడు. "ఇలా రారా" అంటూ దురుసుగా పిలిచాడు దూతని—"అన్నయ్య చెప్పడం కాదు. నామాట విను. పదమూడోయేటి చివర శస్త్రాస్త్రాలఅగ్నిలో ధృతరాష్ట్రుడి వంద మంది కొడుకుల్నీ వేల్చి, నరయజ్ఞం చెయ్యడానికి వస్తాడు ధర్మరాజు.

అందాకా రావడం పడదు. వెళ్ళు. జంకకండా మీరాజులుంగారి ముందు, నేను ఎలా చెప్పానో అలాగే చెప్పు."

తిరిగివచ్చి జరిగిందంతా దుర్యోధనుడికి నివేదించాడు దూత. ధర్మరాజు చెప్పిన మంచిమాటలూ, భీముడన్న నిష్ఠురం మాటలూ వున్నవి వున్నట్టు వివరించాడు.

'దుర్యోధనమహారాజు వైష్ణవయజ్ఞం చేస్తున్నాడు' - ప్రపంచమంతటా పాకిపోయింది ఈవార్త. ఆహ్వానాలందిన యావన్మంది రాజులూ, మునులూ. దేశదేశాల ప్రజలూ వచ్చి, హస్తినాపురం నిండిపోయారు. వచ్చినవాళ్ళందరికీ తగిన సత్కారాలు జరపడానికీ, పాత్రోచితంగా దానాలు ఇవ్వడానికీ విదురుణ్ణి నియమించారు.

అనుకున్న ముహూర్తంలో ఆరంభమైంది వైష్ణవయజ్ఞం. వచ్చినవాళ్ళకి లేదనకండా అన్నసంతర్పణ జరిగింది. తగినవాళ్ళకి గొప్పగొప్ప సంభావనలు అందాయి. కోరిన వస్త్రాలూ నగలూ అందుకుని, ఆశీర్వాదాలు కురిపించారు బ్రాహ్మలు. ఎప్పుడు జరగవలసిన కర్మలు అప్పుడు - ముహూర్తం తప్పకండా జరిగాయి. శాస్త్ర ప్రకారంగా, నిర్విఘ్నంగా సమాప్తమైంది యజ్ఞం. అవబృథస్నానంచేసి, అసంఖ్యమయిన బంగారాలూ, రత్నాలూ బ్రాహ్మలికి ఇచ్చి పూజించాడు దుర్యోధనమహారాజు.

యజ్ఞోత్సవానికి వచ్చిన అనేకమంది ప్రజలు దుర్యోధనుడి ఎదట అతణ్ణి అనేక విధాల ప్రశంసించారు. "రాజులు ఎవ్వరూ ఇంతవరకూ ఇంత గొప్పగా యజ్ఞం చేసినవాళ్ళు లేరు. నిజంగా మహారాజా, మీ అదృష్టమే అదృష్టం. ఏనాడో హరిశ్చంద్రుడు రాజసూయం చేశాడని విన్నాం. ఇంద్రప్రస్థంలో ధర్మరాజుచేసిన యజ్ఞమూ చూశాం. ఆ రెండూ మీయజ్ఞం ముందు దిగదుడుపే అంటాం, ఈ వైష్ణవయజ్ఞం

చేసే రఘు మహారాజూ, యయాతీ, భరతుడూ అఖండమైన కీర్తి సంపాదించారు. చివరికి పుణ్యలోకాలూ పొందారు" అన్నారు.

ఇలా కొందరు రాజముందు అంటే, కొందరు వ్యతిరేకంగానూ అనుకున్నారు, లోలోపల. "ధర్మరాజు రాజసూయం ముందు ఇదే మిటి? ప్చ్! సముద్రంలో కాకిరెట్ట!" అంటూ పెదవి విరిచారు.

అనంతరం యజ్ఞశాలనుండి మహానందంతో పట్నంలోకి బయ ల్దేరాడు దుర్యోధనమహారాజు. తమ్ములూ, మంత్రులూ, బంధు వులూ వెంటనడిచారు. దారులుతీరి రెండుపక్కలా పౌరులు జయజయ ధ్వానాలు చేశారు. పుణ్యస్త్రీలు అక్షింతలు చల్లారు. వందిమాగధులు పొగుడుతూ నడిచారు. ఇలా మహావైభవంతో వచ్చి పట్టణంలో ప్రవేశించాడతడు. రాజమందిరంలోకి వెళ్ళి ముందు ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ పాదాభివందనం చేశాడు. తరవాత కృపాచార్యులికీ, ద్రోణా చార్యులికీ, భీష్మపితామహుడికీ ప్రణామంచేశాడు. ఇదంతా అయాక, కలకల్లాడుతూ బంగారం సింహాసనంమీద కొలువుతీరి కూచున్నాడు.

అదే సమయమంటూ అందుకున్నాడు కర్ణుడు. "మహా రాజా, దీనికి ఇదే సాటి అన్నట్టు దివ్యంగా జరిగింది నీయజ్ఞం. నిజంగా భాగ్యమంటే నీదే అంటాను. ప్రపంచం యావత్తూ నీకు స్వాధీన మయిపోయింది. హాయిగా అనుభవించు. పానకంలో పుడకల్లాగ పాండవులు మాత్రం మిగిలారు. వాళ్ళనీ కాజేసి, రాజసూయం కూడా చేద్దువుకాని. అదేదో అసాధ్య మనుకుంటున్నావేమో! ఇదిగో, శపథం చేసి చెపుతున్నాను. అర్జునుణ్ణి చంపేదాకా కాళ్ళుగానీ గోళ్ళు గానీ కడగనని నమ్ము" అన్నాడు.

అమాంతంగా లేచి కర్ణుణ్ణి కౌగిలించుకున్నాడు దుర్యోధనుడు. "నువ్విటూ వుంటే పాండవుల పనిపట్టడం అదెంతేపని" అంటూ ఆప్యాయంగా వీపు తట్టాడు.

కర్ణుడి ప్రతిజ్ఞ చారులవల్ల విన్నాడు ధర్మరాజు. అతడి మనస్సు మనస్సులో లేదు. కర్ణుడికి అభేద్యమయిన కవచమూ, అతడి పరాక్రమమూ తలుచుకుంటూ బెగిలిపోతూన్నాడతను. రాత్రి-రాత్రంతా కంటిమీద రెప్పన్నా పడలేదతనికి.

వైష్ణవయజ్ఞంనాటినుంచీ మరీ ఇదిగా వున్నాడు దుర్యోధనుడు. రోజూ వష్టిఘడియలూ కర్ణుడూ శకుని — ఈయిద్దరితోనే జరుపుతున్నాడు మంత్రాంగం. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ మొదలయిన పెద్దలికీ, మంచిమంచి బ్రాహ్మలికీ సత్కారాలూ సన్మానాలూ చెయ్యాలని చేస్తున్నాడు. "ఒకరికి ఇవ్వడమూ తాను అనుభవించడమూ— ఇదే డబ్బువున్నందుకు ఫలం" అంటూ నిత్యవినోదాల్తో వైభవంగా కాలం గడుపుతున్నాడు.

## జంతుసంతాపం

ఇక్కడ ఇలా వుంది. అక్కడ ద్వైతవనంలో వొకనాడు ధర్మరాజు గాఢనిద్రలో వున్నాడు. ద్వైతవనంలోని జంతువులు కన్నీళ్ళు కార్చుకుంటూ వచ్చి అతడి కల్లో కనపడ్డాయి. "మహారాజా, మేమంతా ఈవనంలోని జంతువులం. మీరు రోజూ వేటాడి వేటాడి చంపగా ఈమాత్రం మిగిలి వున్నాం. మాకులం నిలవాలంటే బీజమాత్రంగా మేమే కనిపిస్తున్నాం. మమ్మల్నయినా దక్కించాలంటే మీరు మరో వనానికి మకాం మార్చాలి. ధర్మాత్ముడివి. మా మొర్ర మన్నించు" అంటూ గోలు గోలుమన్నాయి. గుండె నీరయినట్టయింది ధర్మరాజుకి. కలలోనే వాటికి అభయమిచ్చాడతడు.

నిద్రలేచాక, వెంటనే తమ్ముల్ని పిలిచాడు ధర్మరాజు. స్వప్నవృత్తాంతం వినిపించాడు. "సంవత్సరంమీద ఎనిమిది మాసాలు ఇక్కడ వున్నాం. చాలు. మరో వనానికి వెళ్ళిపోవాలిప్పుడు. కామ్యక

వనానికి వెళదాం. మృగాలతోనూ పళ్ళతోనూ అది ఇప్పుడు కిక్కిరిసి వుందని వింటున్నాను. అంచేత పదండి. అక్కడ తృణబిందుడి ఆశ్రమం దగ్గిర వుందాం” అన్నాడు.

మంచిదంటె మంచిదన్నారు తమ్ములు. వెంటనే ప్రయాణ సన్నాహం జరిగింది. తమ్ములూ, ద్రౌపదీ, బ్రాహ్మలూ పరివారం యావన్మందితోనూ కలిసి కామ్యకవనం వచ్చేశాడు ధర్మరాజు. ఆశ్రమం అదీ నిర్మాణం జరిగిపోయింది. అక్కడ అలా వుంటూవచ్చారు పాండవులు. కందమూలాలూ అవీ తింటూ కాలక్షేపం చేసేవారు. ఒకళ్ళ అవస్థ ఒకళ్ళు చూసుకుని దుఃఖపడుతూనూ వుండేవాళ్ళు. జూదంనాటిపాట్లు తలుచుకున్నప్పుడల్లా ఒళ్ళు వుడుకెత్తేది వాళ్ళకి. లోలోపల క్రోధం గుక్కిళ్ళు మింగేవాళ్ళు. ఇలా వుండగా పదకుండో ఏడు గడిచిపోయింది. గడువుకాలం దగ్గిరపడుతుంది కదా, అని సంతోషిస్తూ వనవాసకష్టం సహించుకుంటున్నారు పాండవులు.

ఒకనాడు వ్యాసముని కామ్యకవనం వచ్చాడు. దూరం నించే అతణ్ణి చూశాడు ధర్మరాజు. ఉన్న పాళానలేచి, తమ్ములతో సహా ఎదురువెళ్ళాడు. సగౌరవంగా అతణ్ణి తోడితెచ్చి, అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి, విశేషంగా పూజించాడు. అడవుల్లో అవస్థపడుతూ బాగా చిక్కిపోయివున్నారు పాండవులు. మనమల దురవస్థ కళ్ళారా చూశాడు వ్యాసుడు. అంతటి మహాముని కళ్ళల్లో నీళ్ళుతిప్పుకున్నాడు. సముదాయిస్తూ ధర్మరాజుతో అన్నాడు:

“సుఖమయినా, దుఃఖమయినా కాలవ్యత్యాసంవల్ల కలుగుతూ వుంటుంది. సుఖమెలా స్థిరంకాదో, దుఃఖమూ అలాగే స్థిరంకాదు. తెలిసినవాడు ఈ రెంటితత్త్వమూ తెలుసుకుంటాడు. సుఖానికి సంతోషించడం కాని, కష్టానికి దుఃఖించడం కానీ చెయ్యడు. రెండూ సమానంగానే భావిస్తాడు. నీకు ఆపదలు వచ్చాయి, నిజమే. అయితే

ఇవన్నీ జ్ఞాపకంవుంచుకోవాలి. నేనొకటి చెప్తున్నాను, విను. ఈసమయంలో తపస్సు చెయ్యి. తపస్సుని మించింది లేదు. తపస్సువల్లే సకలసౌఖ్యాలూ సిద్ధిస్తాయి. క్షమా, అహింసా, సత్యమూ. సమతా, ఇంద్రియనిగ్రహమూ, శాంతీ, త్యాగమూ-ఇవన్నీ తపస్సు లక్షణాలు. ఇవే వరసగా ఊర్ధ్వ గతికి కారణాలు కూడానూ. ఇప్పుడు చేసే పుణ్యం మీదిజన్మలో మేలుచేస్తుంది. కనకనే దానమూ, ధర్మమూ, పరోపకారమూ మొదలైనవి చెయ్యాలి''-అని.

"అయితే, దానమూ, తపస్సూ- ఈరెంటిలో ఏది కష్టం? ఏది అధికమైనఫలం ఇస్తుంది?''అని అడిగాడు ధర్మరాజు.

"దానం. దానమే అధికఫలమిస్తుంది,'' అన్నాడు వ్యాసుడు- "ధనం మూలానకాని అదిసాధ్యంకాదు. కనక, కష్టమైందీ అదే. ఏమంటావా? ప్రాణంకంటేకూడా, ధనమే తీపి మనిషికి. ఘోర మయిన ఆయుధాలమీద పురకడమూ, సముద్రాలుదాటి వెళ్ళడమూ, నేల దున్నడమూ, పశువుల కాయడమూ, అడవుల్లో తిరగడమూ, కొండలమీద అవస్థపడడమూ, అడ్డమైన గడ్డీ తిని బానిసలుగా వుండడమూ-ఇదంతా డబ్బుకోసమేకదా, చేస్తారు! ఇంత కష్టపడి గడించిన డబ్బు వదిలిపెట్టడమంటే, ఎంతకష్టం!

"ఐతే, అన్యాయంలో ఆర్జించిన ధనంతో చేసినదానం నిష్ఫలం. మూర్ఖులు మాత్రం అలాచేస్తారు. న్యాయార్జితమయిన ధనం, అది అల్పమే అగుగాక, కాలమూ, దేశమూ విచారించి, తగినపాత్రకి దానంచేస్తే అదే పదివేలై ఫలిస్తుంది. వెనకటికి ముద్గలుడు అని వొక ముని కష్టపడి, న్యాయంగా ఆర్జించిన తూమెడువడ్లు సత్పాత్రదానం చేసి పరమసిద్ధి పొందాడు.''

"మునీంద్రా, ముద్గలుడు తూమెడు ధాన్యమే ఎలా సంపాదించాడు?'' అని అడిగాడు ధర్మరాజు- "అది ఎలాంటి సత్పా

త్రుడికి దానం చేశాడు? వివరంగా వినాలనివుంది సెలవియ్యి."

వ్యాసముని ఇలా చెప్పాడు:

### ముద్గలుడి కథ

పురాతనమయిన ఇతిహాసం ఇది. కురుక్షేత్రంలో వుండేవాడు ముద్గలుడు. అతిథులంటే ప్రాణం పెట్టేవాడు. మున్నాటూ అరవై రోజులూ వ్రతదీక్షతోనే వుండేవాడు. మచ్చరమంటే ఎరగడు. కల్లో అయినా అబద్ధం ఆడేవాడు కాడు. అన్నిటినీ మించి జితేంద్రియుడు కూడాన్నూ అతడు. భార్యా, వొక కుమారుడూ, తానూ ఈముగ్గురే సంసారం. శిలావృత్తీ, ఉంచవృత్తీ చేసుకుంటూ కుటుంబం గడుపుకు వచ్చేవాడు. దానికితోడు మరో విచిత్రమయిన పక్షోపవాసవ్రతమూ పెట్టుకున్నాడతడు. పాడ్యమి మొదలుకుని పద్నాలుగురోజులు దాకా వొక్కొక్క గింజా ఏరుతూ తూమెడు గింజలు సంపాదించేవాడు. పర్వదినం (అమావాస్య, లేదా పౌర్ణమి) నాడు ఆతూమెడు వడ్లూ వండేవాడు. దాంతోనే దేవపూజా, పితృపూజా చేసేవాడు. అతిథులికీ పెట్టేవాడు. మిగిలిన అన్నం తానూ, భార్యా, కొడుకూ తినేవాళ్లు. అంతే. మళ్లీ పక్షంరోజులూ పస్తే.

ఇలా వుండగా వొక పర్వదినం ముద్గలుడి ఇంటికి దుర్వాసుడు అతిథిగా వచ్చాడు. చూస్తే చాలు శాంతి వస్తుంది-అంత అసహ్యంగా వున్నాడు దుర్వాసుడు. పిచ్చివాడిలా నానా ఇదిగానూ వున్నాడు. ఒంటిమీద బట్టలేదు. జుత్తు విరబోసివుంది. భూమీ ఆకాశం మింగేసేటంత ఆకలితో తూలిపోతూ వచ్చాడతడు.

అతణ్ణి చూసి పిసరంతయినా అసహ్యపడలేదు ముద్గలుడు. మాడ్డంతోనే ఎదురు వెళ్ళాడు. గౌరవపూర్వకంగా తీసుకువచ్చాడు. అర్ఘ్యమూ పాద్యమూ ఇచ్చాడు. భక్తిశాత్పర్యాలతో భోజనమూ

పెట్టాడు. కడుపునిండా తినగలిగిందంతా తిన్నాడు దుర్వాసుడు. మిగిలింది పుచ్చుకుని శరీరంనిండా పులుముకుని చక్కాపోయాడు.

ఆ వొక్కపర్వంతో పోతే బాగానే వుండేది. ప్రతిపర్వమూ—అమావాస్యా, పౌర్ణమీ నాలకండా అదేప్రకారం ప్రత్యక్షమయేవాడు దుర్వాసుడు. అదేప్రకారం అరమరలేకండా అన్నం పెట్టేవాడు ముద్గలుడు. అలాగే తిన్నంత తిని మిగిలింది వొళ్ళంతా పులుముకుని, తన దారిని తాను పోయేవాడు దుర్వాసుడు.

ఇలా ఆరుపర్వాలు ఆరుపర్యాయాలు వచ్చి భోజనంచేశాడు దుర్వాసుడు. మిగిలిన అన్నం ఇంటివాళ్ళకి దక్కకండా పులిమేసుకున్నాడు అయినా, ఏమీ అనుకోలేదు ముద్గలుడు. ఇన్నాళ్ళూ పస్తే అయినా, పిసరంతాకూడా అతడిలో మార్పు కనపళ్ళేదు. ఆశ్చర్యపోయాడు దుర్వాసుడు. పరమానందభరితుడూ అయాడు. 'నీవంటి దానశీలుణ్ణి భూమండలంమీద చూడలేదు' అంటూ ముద్గలుణ్ణి ప్రశంసించాడు. 'సత్వగుణం కలవాడివి నువ్వు. సాధువులంటే భక్తినీకు. పుణ్యప్రభావుడివి. అద్భుతంగా వుంది నీచరిత్ర. అసహ్యించకండా, అవమానించకండా, చిరాకన్నా పడకండా, బద్ధకించకండా నిర్మలమయిన భక్తితో అన్నదానం చేశావు. ప్రసన్నతా, సత్యమూ, ధైర్యమూ, ఇంద్రియనిగ్రహమూ, కష్టం సహించడమూ, వొకరినుండి ఏదీ పుచ్చుకోక పోవడమూ — ఇవన్నీ నీసొత్తు.

'కామంలంటే పడిచస్తుంది నాలుక. ఓర్పూ, ధర్మమూ, శాంతీ—వీటిని అన్నిటినీ నాశనం చేస్తుంది ఆకలి. ఈ రెండూ గెల్చుకున్నావు నువ్వు. ప్రాణాలు నిలబెట్టేదే అన్నం. అలాంటి అన్నం దానంచేసేసి ప్రాణాలమీదే ఆశ వదులుకున్నావు! ఏమని పొగిడేది నిన్ను! మనస్సూ, ఇంద్రియాలూ వొకటిచేసి చేసినధర్మం తపస్సే అన్నారు పెద్దలు. అలాంటి తపస్సు నీదగ్గిరే చూశాను. నిజం చెపుతున్నాను

పరమానందంగా వుంది నాకు. పుణ్యాలోకాలు కరతలామలకమ యాయి నీకు. నీ తపఃప్రభావం దేవలోకంలో దేవతలు పొగుడు తున్నారు. ఇపుడే వస్తుంది విమానం నీకోసం. స్వదేహంతో స్వర్గా నికి వెళ్ళు. సుఖించు ' అని చెప్పి వెళ్ళిపోయాడు.

దుర్వాసుడు అన్నట్టే అంతలో విమానం పట్టుకువచ్చి, ముద్గ లుడిముందు ఒక దేవదూత నుంచున్నాడు. దివ్యహంసలూ సారస పక్షులూ పూసివున్నాయి విమానానికి. చిరుగంటలూ వాటితో ఎంతో గొప్పగా వుం దది. దివ్యపరిమళాలు విరజిమ్ముతూ వుంది. ఎక్కడికిపడితే అక్కడికి వెళ్ళే కామగమనం దాంది.

'మహామునీ, దయచేయ్యి' అని ముద్గలుణ్ణి ఆహ్వానించాడు దేవదూత – 'నీధర్మం మూలాన స్వర్గలోకం వెళ్ళే అర్హత కలిగింది నీకు. రా, విమానం ఎక్కు.'

'స్వర్గం అంటే ఏమిటి ?' అని అడిగాడు ముద్గలుడు – 'మహాత్మా, ఎలా వుంటుంది స్వర్గం ? అక్కడి మంచీ చెడ్డా ఏమిటో వినాలని వుంది నాకు. సత్పురుషులతో స్నేహం సాప్తపదీనం అంటారు. మనం స్నేహితులమే ఇప్పుడు. మన స్నేహం పురస్కరించుకునే అడుగుతున్నాను. చెప్పు. '

ఈమర్త్యలోకానికి పైన వుంది స్వర్గలోకం' అంటూ ఆరం భించాడు దేవదూత – 'సర్వాలంకారలతోనూ, దివ్యంగా ప్రకాశిస్తూ వుంటుంది. దేవయాన మది. గొప్పగొప్ప తపస్సులూ, యజ్ఞాలూ చేసినవాళ్ళూ, సత్యవంతులూ, ఉత్తములూ, ఇంద్రియాలు జయించిన వాళ్ళూ, దానపరులూ, రణశూరులూ అక్కడ హాయిగా వుంటారు. అప్సరసలూ, సాధ్యులూ, దేవమునులూ, మరుత్తులూ, వసువులూ మొదలయినవాళ్ళు విడివిడిగా ఎవళ్ళకితగినచోట వాళ్ళు నివసిస్తూ వుం టారు. ముప్ఫయిమూడువేల యోజనాల విస్తృతమయిన మేరుశిఖరం

మీాద, నందనవనం మొదలయిన దేవఉద్యానా లున్నాయి. పుణ్య పరుల క్రీడాస్థలా లవి. అక్కడ ఆకలీ, దప్పీ వుండదు. చలీ, వేడీ వుండదు. ముసలితనమూ, రోగమూ వంటి వికారాలూ వుండవు. ఎటు చూస్తే అటు మనోహరంగా వుంటుంది. ఇంద్రియాలు యావత్తూ ఆనందం అనుభవిస్తూనే వుంటాయి. ఈ పుణ్యలోకానికి అర్హులయిన వాళ్ళు కాలం నిండాక, మనుష్యశరీరాలు వదిలిపెట్టి, తేజోమయమైన దివ్యశరీరాలు ధరిస్తారు. దివ్యమయిన వస్త్రాలూ, దివ్యమయిన వస్తు వులూ ధరిస్తారు. వాడని మంచిమంచి పూలదండలు వేసుకుంటారు. దేవదూతలు పట్టుకువచ్చిన విమానాలమీాద అక్కడ చేరుకుంటారు. చీకూచింతా లేకుండా అక్కడ అన్ని సౌఖ్యాలూ అనుభవిస్తారు.

'స్వర్గలోకంమీాద బ్రహ్మలోకం వుంది. దానంతట అదే ప్రకాశిస్తూ, ఇతరలోకాలు ప్రకాశించేటట్టూ చేస్తుం దది. మనువులూ, ధాతలూ, మునులూ అక్కడ వుంటారు. లోభమూ, క్రోధమూ, తాపమూ, పగా, పాపమూ, దుఃఖమూ— ఇవి ఏవీ అక్కడ వుండవు. ఈలోకాలు అన్నీ ప్రళయంలో నాశనం అయిపోతాయి. బ్రహ్మ లోకం వొక్కటే చెక్కుచెదరకుండా శాశ్వతంగా వుంటుంది. అప్పుడు దేవేంద్రుడూ మొదలయినవాళ్ళూ అక్కడే నివసిస్తారు.

'స్వర్గలోకం సుగుణాలు చెప్పాను. మంచీ, చెడ్డా రెండూ అడిగావు నువ్వు. ఇక, దోషాలేవో చెపుతాను విను. ఇక్కడ చేసిన పుణ్యఫలం స్వర్గంలో అనుభవిస్తాడు మనిషి. అంతే. అక్కడ మళ్ళీ పుణ్యాం చెయ్యడానికి వల్లకాదు. ఇక్కడ చేసినపుణ్యాం అక్కడ చెల్లిపోవడంతోనే తరిమేస్తారు స్వర్గంనించి. మరిగిన సుఖాలు మాను కోడం అంటే ఎంత కష్టంగా వుంటుందో ఆలోచించు. ఆ దుఃఖంతో

భూమిమీద పడతాడు, పుణ్యం చెల్లిపోయిన మనిషి. అతడి తేజస్సూ బుద్ధీ అంతరించిపోతుంది. *

స్వర్గంలో వున్నంత సేపూ, తనకంటే హెచ్చుస్థాయిలో వున్న వాణ్ణి చూసినప్పుడల్లా కడుపుమంటగానే వుంటుంది అక్కడి వాళ్ళకి. ఒక్క బ్రహ్మలోకంలో తప్ప తక్కిన పుణ్యలోకాలు అన్నిటిలోనూ ఇదే పద్ధతి. పుణ్యలోకాలనించి తోసివేసిన మనిషి నరలోకంలో సౌఖ్యవంతుడయే పుడతాడు. ఇది కర్మభూమి. అది ఫలభూమి. ఇదే ఇందులో వున్న రహస్యం. నువ్వు ఏదో మంచివాడవి. నీమీద కలిగిన ఆదరంవల్ల, నువ్వు అడిగింది చెప్పాను. ఇక దయచెయ్యి. ఆలస్యం చెయ్యకు.'

దేవదూత చెప్పిందంతా విని, కొంతసేపు ఆలోచించాడు ముద్గలుడు, 'ఐతే, అలాంటి స్వర్గం అక్కరేలేదు నాకు' అన్నాడు. 'రమ్మని పిలిచావు. అదే పదివేలు అనుకుంటాను. ఆ స్వర్గసౌఖ్యాలు అన్నీ దేవతలకే వుండనీ. నాకెందుకు? వెళ్ళు. తెచ్చినచోటికే విమానం తీసుకుపో. ఎక్కడికి వెళితే మళ్ళీ మనిషి ఇక్కడికి తిరిగి రాడో, అదిగో అలాంటి ఉత్తమలోకం కావాలి నాకు. ఎలా అయినా దానికోసమే ప్రయత్నిస్తాను' అని చెప్పి విమానంతో దేవదూతని పంపేశాడతడు.

ఆ తరవాత శిలావృత్తీ ఉంఛవృత్తీ రెండూ విడిచిపెట్టేశాడు ముద్గలుడు. పరమశాంతిమార్గం అవలంబించాడు. నిందా స్తుతీ వొకటిగానే భావించాడు. మన్నూ బంగారమూ వొక్కలాగే చూశాడు. నిర్వికల్పం అయిన జ్ఞానయోగంతో పరమసిద్ధి పొందాడు. ఇదీ ముద్గలుడి కథ.

"ధర్మరాజా, రాజ్యంపోయిందే అని విచారించకు. తపస్సు చెయ్యి. తపస్సువల్లే సర్వశుభాలూ సమకూడతాయి. పదమూడు

* చూ: బ్రహ్మసూత్రాలు 311,8

సంవత్సరాలూ గడిచిపోయాక, నీ తాతతండ్రుల రాజ్యం నీకు సంక్ర మిస్తుంది. సందేహం లేదు."

అలా మనమల్ని సముదాయించి తగిన ధర్మోపదేశమూ చేసి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు వ్యాసముని.

### జ య ద్ర థు డి దు ర్న య ం

ఎంతో నివాసయోగ్యంగా వుంది కామ్యకవనం. వేటకి ముమ్మరంగా మృగాలు దొరుకుతున్నాయి. ఎక్కడపడితే అక్కడ రకరకాల పూలచెట్లు ఘుమఘుమ లాడుతున్నాయి. మునీశ్వర్ల పుణ్యాశ్రమాలూ అధికంగానే వున్నాయి.

ఒకనాడు వేటకని బయలుదేరి వెళ్ళారు పాండవులు. అయిదుగురూ నాలుగుదిక్కులికీ వెళ్ళారు. ద్రౌపదిని తృణబిందుడి ఆశ్రమంలో వుంచారు. ధౌమ్యుడూ, వొకరిద్దరు పరిచారకులూ మాత్రం ఆశ్రమంలో వున్నారు.

ఇంతలో అదేదారి వెళుతూ సింధుదేశంరాజు జయద్రథుడు అక్కడికి వచ్చాడు. వృద్ధక్షత్రుడి కుమారుడతడు. సాల్వదేశం రాజుకూతుర్ని వివాహంచేసుకోవాలని మాంచి పటాటోపంతో తర్లి వెళుతున్నాడు. పెద్ద చతురంగబలమూ, ఎంతోమంది రాచకుమాళ్ళూ అతడివెంట వున్నారు.

ఆశ్రమం వాకట్లో నుంచుని వుంది ద్రౌపది. వెడుతూ ఆమెని చూశాడు జయద్రథుడు. నల్లమేఘాల్లో మెరుపుతీగలాగ కామ్యకవనంలో కనపడుతోంది ద్రౌపది. చూసే చూడడంతోటే కళ్ళు జిగేలుమన్నాయి జయద్రథుడికి. మళ్ళించుకోడమే కష్టమైంది చూపు. ఉత్తరక్షణంలో వికారమే ఎత్తింది. "చూశావా, ఆమెని" అంటూ పక్కనే వున్న కోటికాస్యుణ్ణి పిలిచాడు. "ఎవ్వతో ఈవయ్యారి ! అడి

విలో ఇలా ఒంటరిగా వుండేం? దేవతా స్త్రీయా? యక్షుల పడుచా? నాగకన్యా? ఎవ్వరీమె? మనుష్యస్త్రీఅయితే ఇంత అందం ఎలా వస్తుంది? చివురాకులాంటి చేత్తో కదంబం కొమ్మ పట్టుకుని వసంతంలో వికసించిన కొత్త పూలతీగలాగ, వాః, ఎలా నుంచుందో చూడూ, చూడూ. అగ్నిజ్వాలలా హృదయంలో మంటలే పుట్టిస్తోంది.

"అబ్బ! ఈపిల్ల నాకు భార్యఅయితేనా! మూడులోకాలూ ఏలుకుంటాను. మన్మథుణ్ణే బంటు చేసుకుంటాను. ఇదిగో చూడూ, ఆలోచిస్తే లాభంలేదు. వెళ్ళు. నాకోసం ఆమెని ఒప్పించు. మా ఇద్దరినీ కలిపావో—నీమేలు మరచిపోను" అన్నాడు.

జయద్రథుడి నోట్లో మాట నోట్లోనే వుంది, ద్రౌపది దగ్గిరికి వెళ్ళాడు కోటికాస్యుడు. "అమ్మాయీ, క్రూర మృగాలూ అవీ వున్న అడివి ఇది. ఇలా ఒంటరిగా వున్నావు. ఏమిటి సంగతి?"అని ఒయ్యారంగా అడిగాడు- "ఈవనదేవతవా? ఇంద్రుడితో అలిగి ఇలావచ్చేసిన శచీదేవివా? విష్ణుమూర్తి గుండెలమీంచి లేచిపోయి, విలాసంగా ఇటు వచ్చిన లక్ష్మీదేవివా? ఎవరు నువ్వు? నిన్ను కన్న పుణ్యాత్ముడు, మీతండ్రి ఏవంశంవాడు? మరి-నిన్ను కట్టుకుని-సుఖపడుతూన్న-ఆమహానుభావుడు ఎవడో? నీపేరేమిటి? సంకోచించకు. నిజం చెప్పు."

"నేనెవరో తెలుసుకోవాలనుకుంటున్నావు కదూ! దాపరికం ఏముంది? చెపుతాను, విను. మహారాజు సురథుడు మా తండ్రి. నను కోటికాస్యుడంటారు. బలానికి నన్ను చెప్పి, ఇంకొకణ్ణి చెప్పాలి. నాపేరంటేనే శత్రువులికి సింహస్వప్నం.

"అదిగో, అటుచూడు. ఆ బంగారం రథంమీద వున్నాడే, అతడు క్షేమంకరుడు. త్రిగర్తదేశం రాజు. అదిగో, ఆపక్కనేవుండి నిన్నుచూస్తున్నాడే, అతడు కళింగదేశం రాజు. ఆచెరువు పక్కనించి రెప్పవెయ్యకండా నిన్నే చూస్తున్నాడు చూడూ, అతడు ఇక్ష్వాకు

వంశం రాజు; సుబలమహారాజు కుమారుడు; సుభగుడు. ఎర్ర గుర్రాలు పూసిన రథాలమీద, రత్నభూషణాల్తో అగ్ని శిఖల్లా మెరుస్తున్నారే, వాళ్ళు పన్నెండుగురూ సౌవీరకుమాళ్ళు. అదిగో ఆపట్టపు ఏనుగుమీద కొత్త పెళ్ళికొడుకులా వున్నాడే అతణ్ణి చూడు. సౌవీరరాజకుమాళ్ళు పన్నెండుగురూ అతణ్ణి సేవిస్తున్నారు. ఈ అనేక వేల రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, భటులూ ఆయన వెనకాలే వెళుతున్నారు. ఎవరనుకున్నావు ఆయన! ఆయనే సింధు, సౌవీర దేశాల ప్రభువు; జయద్రథమహారాజు. నిన్ను చూసి — నీవివయం కనుక్కు-రమ్మని ఆయనే నన్ను పంపించాడు.''

కోటికాస్యుణ్ణి చూడగానే, చప్పున, మృదువుగా కదంబం కొమ్మ వదిలేసింది ద్రౌపది. పైట చెంగు సర్దుకుంది. "ఒంటరిగా వున్నాను. ఇలా రావచ్చా అబ్బాయీ,'' అంది — "కుమాళ్ళు కల దాన్ని నేను. ధర్మవతిని. ఎవ్వతెతోనో మాట్లాడినట్టు మాట్లాడుతున్నావు. కూడునా ఇది? నువ్వు శిబివంశంలో పుట్టినవాడివి. సురథుడి కుమారుడివని ముందే తెలుసు నాకు. ఎవరనేనా నీప్రశ్న? పాంచాలం రాజు ద్రుపదుడి కుమార్తెని. ద్రౌపది అంటారు నన్ను. పంచపాండవుల ధర్మపత్నిని. నన్ను ఇక్కడ వుంచి వేటకని వెళ్ళారు మావాళ్ళు. ధర్మరాజు తూర్పుకీ, భీముడు దక్షిణందిక్కూ-, అర్జునుడు పడమరకీ, నకులసహదేవులు ఉత్తరానికి వెళ్ళారు. వాళ్ళు వచ్చే వేళా అయింది. ఇప్పుడే వచ్చేస్తారు. మీరు గౌరవనీయులే వాళ్ళకి. అంచేత వాళ్ళ ఆతిథ్యం స్వీకరించే వెళుదురు కాని. వాళ్ళు వచ్చేవరకూ ఈఆశ్రమం దగ్గిర కొంచెంసేపు విశ్రమించండి.'' అలాఅనేసి భయపడుతూవున్న మనస్సుతో పర్ణ శాలలోకి వెళ్ళిపోయిందామె.

కోటికాస్యుడు జయద్రథుడి దగ్గిరికి తిరిగి వచ్చేశాడు. ఆమె ద్రౌపది అనీ, పాండవుల భార్య అనీ చెప్పాడు. ఏమిమిదో అవస్థలో

వున్నాడు జయద్రథుడు. ద్రౌపదిని ఎత్తుకుపోవాలనే ఎత్తువేశాడు. అందుకు తగినవాళ్ళని కొందరిని వెంటవేసుకుని, ఆశ్రమంలోకి బయ ల్దేరా డతడు.

సింహంగుహలో చొరబడ్డ దుప్పిలాగ పాండవుల కుటీరం ప్రవే శించాడు సైంధవుడు జయద్రథుడు. ద్రౌపదిని చూసి "ఏం బావు న్నావా?" అంటూ మందహాసం చేశాడు. "నీకు తగిన ప్రేమ పాండవులమీద. ఐదుగురూ కులాసాయేనా?" అని కుశల మడిగాడు.

"ఆఁ, నీకుమాత్రం తెలియం దేముంది? స్థిరమయిన మనస్సు మావాళ్ళది. క్షేమంగానే వున్నారు" అంది ద్రౌపది – "నువ్వు ఆరోగ్యంగానే వున్నావు కదా! పాండవుల ఇంటి అతిథి వయావు ఇవాళ. ఇదిగో ఆసనం. ఇదిగో కాళ్ళు కడుక్కుందికి నీళ్ళు. పుచ్చుకో. లేడిమాంసంతో భోజనంచేసి వెళుదువు కాని. మీ బావలు వేటకి వెళ్ళారు. ఇప్పుడే వచ్చేస్తారు. వాళ్ళువచ్చి ఆతిథ్యమిస్తారు. మీ అందరినీ ఆదరిస్తారు. మీరు, మీపరివారమూ వారి అతిథ్యం పుచ్చు కునే వెళ్ళాలి."

"చాలా సంతోషం" – వెకిలిగా నవ్వుతూ అన్నాడు జయ ద్రథుడు – "నువ్వు చేసిన మర్యాదలన్నీ వచ్చినట్టే భావిస్తున్నాను. ఏకొరతా లేదు. – అయితే, చల్లకివచ్చి ముంత దాచడం ఎందుకూ!– నిజం చెప్పేస్తున్నాను. నిన్ను చూసిందగ్గిరనించీ – నిలపలేకండా వున్నాను, మనస్సు. బతకనివ్వటం లేదు, మన్మథుడు. నన్ను కృతా ర్థుణ్ణి చెయ్యాలి, నువ్వు. లే. ఆలోచించకు. రా. రథ మెక్కు.

"రాజ్యంపోయి అడవులుపట్టిపోయారు పాండవులు. వాళ్ళ హీనదశ చూసి, సాటివాళ్ళందరూ నవ్వుతున్నారు. అలాంటి మోటు వాళ్ళతో పాపం, సౌఖ్యం ఏముంటుంది నీకు! పిచ్చిదానివి. డబ్బు లేని మగవాళ్ళని ఆడదన్నది ఎవ తైనా వెంబడిస్తుందా? సింధు,

సౌవీర దేశాలికి పట్టమహాదేవి చేస్తాను నిన్ను. మహారాణివై, ఇష్ట భోగాల్తో ఏలుకో నన్ను."

నిలువెల్లా వొణికిపోయింది ద్రౌపది. చప్పున కొంత ఎడంగానూ వెళ్ళిపోయింది. తన భర్తలు వచ్చెయ్యాలంటూ వెయ్యి దేవుళ్ళ కయినా మొక్కుతుంది, లోలోపల. జవాబు చెప్పి కొంత కాలక్షేపం చెయ్యాలనీ నిశ్చయించింది. "నాకు తోబుట్టు వవుతావు. ధర్మమేనా ఇలా అనడం" అంటూ అవమానసూచకంగా అతణ్ణి చూసింది. "దుస్సల భర్తవి నువ్వు. దుర్యోధనుడికి ఎలాగో అలాగే పాండవులికీ చెల్లెలే దుస్సల. అంచేత, అన్నగమ్మడివే నాకు. న్యాయమూ, ధర్మమూ కల వంశంలో పుట్టావు. ధర్మమన్నా తెలుసుకోవద్దా? ఇహపరాలికి దూరమయే దారి ఎందుకు తొక్కుతావు?" అంది.

"ధర్మం ధర్మం అంటావు. రాజధర్మం మాది. ఆలోచించవేం?" - ముసిముసినవ్వులు నవ్వుతూ అన్నాడు జయద్రథుడు— "చెప్తాను, విను. రాజన్నవాడు ఆడవాళ్ళదగ్గిర వావీ వరసా చూడనక్కర లేదు. అంతే కాదు. ఆడదాన్ని అందరూ అనుభవించవచ్చు. అది వొకరిసొమ్మే అని నియమం ఏమీ లేదు."

దాంతో వొళ్ళు మండింది ద్రౌపదికి. రెండు కళ్ళూ ఎర్రకలువల్లాగ ఎర్రపడ్డాయి. 'మంచిమాటలతో యీపాపాత్ముడు పోడు' అని చీవాట్లే మొదలెట్టిం దామె - "అధముడిలా వున్నావు. రాస కులంలో తప్పబుట్టావు. పాండవులంటే గుర్తుకి వచ్చినట్టు లేదు నీకు! నోటికి వచ్చినట్టు కూస్తున్నావు. దీనిఫలం అనుభవించి తీరుతావు.

"కోపంతో వున్న మదపుటేనుగుదగ్గిరికి వెళ్ళి బరికోల చూపడం ఎలాంటిదో, ధర్మరాజుని రేపెత్తడం అలాంటిదే అనుకో.

"గుహలో సింహాంజూలు పట్టుకు లేపడమూ భీమసేనుణ్ణి కదపడమూ వొకటే అని నమ్ము.

"పెద్దపులి కోరలు పెరికి బతికి రావచ్చునేమో, భీభత్సుడు అర్జునుడు, అతడి ఎదటపడి బతకడమంటూవుండదు. ఏమనుకున్నావో!

"నల్లత్రాచుల తోక తొక్కడమూ, నకుల సహదేవుల్ని కవ్వించడమూ వొకటే, తెలియదేమో నీకు!

"దేవతల్నీ, రాక్షసుల్నీ వోడించిన పరాక్రమవంతులు పాండవులు. వాళ్ళకి చెడ్డచేసి, పాతాళంలో దూరినా బతకవు. కోరి కోరివితో తలగోక్కుంటున్నావు. అంతికాలం దాపురించింది నీకు. నువ్వేం చెయ్యగలవు! విధి అలాంటిది. తేలూ, ఎండ్రపీతా కాలం నిండినప్పుడు చూలు ధరిస్తాయి. అలా చావుకాలం దగ్గిర పడబట్టే పాండవులభార్యతో దుర్భాష లాడుతున్నావు. నీనాశనానికి ఇంతకంటే నిదర్శనం ఏమికావాలి?"

పకపకా విరగబడి నవ్వాడు జయద్రథుడు. "పాండవులు పరాక్రమం! ఓహోహో! మాకు మహా తెలియనట్టు — అదే చెప్పడం చెప్పేస్తున్నావు! పిరికివాళ్ళని బెదిరించినట్టు బెదిరిస్తున్నావు. సౌవీరకులం మాది. సైంధవులం మేం. పరాక్రమానికి పెట్టింది పేరు. ఏదో, నాకాయ నూకాయ లనుకునేవు! ఈ పొల్లుమాటలు విని వెళ్ళి పోతా ననుకోకు. లే. అదిగో బంగారం రథం ఎక్కు. రథం వొద్దంటావా, పట్టపు ఏనుగే ఎక్కు. పెంకిమాటలు మానెయ్యి. ప్రేమ — ప్రేమ చూపించు. మంచిమాటలాడు. నాప్రేమకి తగినట్టు వ్యవహరించూ. చూస్తావేం? బయల్దేరు" అన్నాడు,

"ఇంత పొగరుగా వుంది నీకు!" అంది ద్రౌపది — "వీరుల భార్యని. వీరుల చెల్లెల్ని. అయినా దిక్కులేనిదానిలా కనిపిస్తున్నాను నీకు! ఏమయితే నేం? మాటలవల్ల ప్రయోజనంలే దిప్పుడు. లెక్కా జమా లేని యాదవబలంతో శ్రీకృష్ణుడు దండెత్తివచ్చినప్పుడు—పాంచ జన్యం చెవులు దిమ్మెత్తిస్తూ వుంటే, శరవేగంతో రథాలు వెంటాడి,

వెంటాడి నిన్ను చెండాడినప్పుడు — అప్పుడూ నాకు దిక్కున్న సంగతి అర్థమవుతుంది నీకు.

"తొందరపడకు. గాండీవం ఇంద్రధనుస్సులాగ కన్పడుతుంది. దాని టంకారం పిడుగుల్లా వినిపిస్తుంది. అర్జునుడు మహామేఘంలా బాణవర్షం ముంచెత్తుతాడు. వేసవిలా తలఎత్తిన నీసైన్యం చల్లబడుతుంది. దిగులుపడి, కాళ్ళూ చేతులూ కదలక, కొయ్యబారి నిలబడిపోతావు. అదిగో అప్పుడూ తెలిసివస్తుంది. చేజేతులా తెచ్చుకున్న దానికి మొత్తుకుంటావు. ఇప్పుడు చెప్పి ఏం లాభం ?

"ఘోరమయిన గదాదండంతో ఏనుగుల కుంభస్థలాలు పగల గొట్టి, రణరంగంలో ముత్యాలు చిమ్ముతూ భీముడు, కాలయముడిలా కనపడ్డప్పుడు కాని నీకండకావరం చల్లారదు.

"వాళ్ళనీ వీళ్ళనీ చూసినట్టు చూసి, అవమానిస్తున్నావు నన్ను. ఏదో అనుకుంటున్నావు. నా పాతివ్రత్యమే నాకు శ్రీరామరక్ష."

జయద్రథుడు మీదికి రావడం చూసి, కేకలు వేసి ధౌమ్యుణ్ణి పిలిచింది ద్రౌపది. కేక విని పరిగెత్తుకు వస్తున్నాడు ధౌమ్యుడు. అతడు వచ్చేలోపున ద్రౌపది చెంగు పట్టుకున్నాడు జయద్రథుడు. ఆడపులిలా తిరగబడింది ద్రౌపది. అదిలిస్తూ ఒక్కటి వేసింది. దెబ్బతో పెను గాలికి విరిగిపడ్డ చెట్టులా బోర్లాపడ్డాడు జయద్రథుడు. పడీపడ్డంతో సర్దుకు లేచాడు. అమాంతంగా ద్రౌపదిని ఎత్తుకుని, రథంమీద పెట్టుకు సపరివారంగా దౌడు తీశాడు. ఏడుస్తూ ధౌమ్యుడికి నమస్కారం చేసింది ద్రౌపది. జయద్రథుణ్ణి కూకలు వేస్తూ, వచ్చాడు ధౌమ్యుడు. "ఆగు. రాజులు చెయ్యవలిసిన పనేనా ఇది ? ద్రౌపది పతివ్రత. వదిలి పెట్టు ఆమెని. పాపం కట్టికుడుపుతుంది. నీప్రాణాలు పుచ్చుకుని గాని వదలరు పాండవులు" అంటూ వెంటపడ్డాడు.

ఇక్కడ పాండవులు- నాలుగుదిక్కులా వేటాడి ఎన్నో మృగాలు చంపారు. అనుకున్న ప్రకారం అందరూ ఒకదగ్గిర కలుసుకుని, ఆశ్రమానికి బయల్దేరి వస్తున్నారు. తమ్ముళ్ళని చూసి "ఏమిటో, అపశకునాలు కనిపిస్తున్నాయి" అన్నాడు ధర్మరాజు– "సూర్యుడున్న దిక్కు కూస్తున్నాయి పక్షులు. ఘోరంగా అరుస్తున్నాయి. మన ఎడమ పక్కనించి పరిగెడుతున్నాయి మృగాలు. భయంకరంగా అరుస్తోంది నక్క. ఈశకునాలు చూస్తే పగవాళ్ళవల్ల అవమానంవస్తుంది. కయ్యమూ కలుగుతుంది. ఏమో, కడుపులో చెయ్యిపెట్టికలిచినట్టుంది. శరీరం పటుత్వంతప్పినట్టు అవుతోంది.

"వేగం పదండి. ఆశ్రమంలో ద్రౌపదిని ఒక్కతెనే వుంచి వచ్చాం. దుర్యోధనుడూ వాళ్ళూ దుర్మార్గులు. సమయంచూసి, ఏమయినా చేస్తారు. పద్మాలులేని సరోవరంలాగా, రాజులేని రాష్ట్రంలాగా శూన్యం శూన్యంగా కనిపిస్తోంది కామ్యకవనం. ఏమిటీడువస్తుందో!"

అయిదుగురూ రథాలు పరిగెత్తించుకుని ఆశ్రమానికి వచ్చేశారు. వాకట్లో కిందపడి గోలుగోలుమంటూ ఏడుస్తోంది, ద్రౌపది పరిచారిక ధాత్రిక. చప్పున రథం దిగి, పరిగెత్తుకువచ్చాడు ధర్మరాజు సారథి ఇంద్రసేనుడు. "ఇదేమిటి? కిందపడి ఏడుస్తున్నావు? ఎవరేం చేశారు?" అని అడిగాడు.

"ద్రౌపదమ్మని జయద్రథుడు ఎత్తుకుపోయాడు" అంటూ మరింత గొల్లుమంది ధాత్రిక.

"పాండవుల బహిఃప్రాణం ద్రౌపదీదేవి. పతివ్రత. ఆమెనిలా దేచెయివేశాడూ జయద్రథుడు? ఎన్నిగుండెలున్నాయి వాడికి? సరే, వెళ్ళనీ. ఎక్కడికి వెళతాడు? స్వర్గ, మర్త్య, పాతాళాల్లో ఎక్కడికి వెళ్ళినా చంపేస్తారు పాండవులు. వాళ్ళబాణాలు మచ్చుచూడలేదు

వాడు! వాడు పనిపట్టడమూ, ఆమెని తీసుకురావడమూ క్షణాలమీద జరిగిపోతుంది. ఏడవకు" అన్నాడు ఇంద్రసేనుడు.

కన్నీళ్ళు చేతుల్తో తుడుచుకుంది ధాత్రిక. "దేవేంద్రుల్లాంటి అయిదుగురు రాజులున్నారు. వాళ్ళని లక్ష్యపెట్టకండా అమ్మగార్ని పట్టుకున్నాడు. అప్పుడే వాడి పెళ్ళాం పుస్తిపుటుక్కుమన్నాది. అది మళ్ళీ చెప్పాలా! ఇప్పుడిప్పుడే వెళుతున్నాడు వాడు. దూరం వెళ్ళిపోకండా రథాలు పరిగెత్తించండి. ఆయుధాలు పట్టుకోండి. కవచాలు తొడగండి. వాడి నెత్తిక్కొట్టేసి మరీ అమ్మగార్ని పట్టుకురండి.

"ఆలస్యమైతే కొంపమునిగిపోతుంది. బూడిదెలోపోసిన పూర్ణాహుతిలాగ, కాట్లోపెట్టిన సంపంగిదండలాగ ఆదుష్టు చేతిలో అమ్మగారు చెడకముందే అడ్డుకోండి. పవిత్రమైన పురోడాశం కుక్కానా కూట్టనివ్వడం! శవాలుతిన్న నక్కకా గంగాస్నానం! ఆచచ్చినవాడికా అమ్మగారి చక్కదనం!"

ఇలా మొత్తుకుంటూనే వుంది ధాత్రిక. ఆమెని ఓదార్చి, సర్వాయుధాల్తోనూ సంసిద్ధులయ్యారు పాండవులు. కోపంతో నల్లతాచుల్లా బుసకొడుతూ అయిదుగురూ జయద్రథుడు వెళ్ళినదిక్కు వురకలు పెట్టించారు రథాలు. లిప్తలమీద వెళ్ళి, అతడి సైన్యాన్ని కలుసుకున్నారు. సైన్యంవెంట కేకలువేస్తూ వెళుతూన్న ధౌమ్యుణ్ణి చూశారు. "విచారించకండి. సావకాశంగా రండి" అంటూ అతడికి నమస్కరించారు. సింహనాదాలు చేస్తూ, మాంసంకోసం పరిగెత్తే డేగల్లాగ వెళ్ళి, జయద్రథుడి సేనమీద పడ్డారు.

పాండవుల రథాలూ, రథాలమీద జెండాగుర్తులూ అవీ చూశాడు జయద్రథుడు. 'అదిగో అవస్తూన్న అయిదుగురూ నీభర్తలేనా!" అని అడిగాడు ద్రౌపదిని. "వాళ్ళలో ఎవడు ఎవడో విడమర్చి కాస్త చెప్పావా; తెలుసుకుంటాను" అన్నాడు.

"తెలుసుకుంటేనేం, తెలుసుకోక పోతేనేం, ఇక!" అంది ద్రౌపది. "ఇక నువ్వుచేసేది ఏముంది? కళ్ళు పొగర్లుకమ్మాయి. చెయ్యరానిపని చేశావు. నెత్తిమీదికి పిడుగే తెచ్చుకున్నావు. అనుభ వించు. అయినా, అడిగావు కనక చెపుతున్నాను. అంతేకాని, నువ్వంటే భయపడిపోయి కాదు. తమ్ములతో మహారాజు కంట బడ్డాడు. ఇక నామీద ఈగన్నా వాల్తుందని భయంలేదు" అంటూ అయిదుగుర్నీ విడివిడిగా చూపిస్తూ, వాళ్ళ పరాక్రమమూ అదీ వివ రించి చెప్పిందామె.

"కౌరవవంశం అంతటికీ మకుటమణి ధర్మరాజు. ధర్మమూర్తి. ఎంతటి శత్రువయినా శరణంటే రక్షిస్తాడు. మూర్తీభవించిన దయా స్వరూప మాయన. నామాట విను. ఆయనపాదాలమీద పడు. తప్పు మన్నించమని బతిమిలాడు. బతికిపోతావు" అంటూ హితోప దేశమూ చేసింది. "కాదంటావా, పాండవులంటే సామాన్యులు కారు. అయిదుగురూ అయిదు చిచ్చులపిడుగులు. మహాసముద్రంలో మహా తిమింగలాల వాతపడ్డ వోడలాగ నీసైన్యం రూపు మాసిపోతుంది. మానమూ, ప్రాణమూ రెంటికీ నీళ్ళువదులుకుంటావు. తప్పించు కుందామని అనుకుంటున్నావేమో? అది కల్లోవార్త" అంది.

ఆమె అలా అంటూనే వుంది. దశదిశలూ చీకట్లు కమ్మేట్టు బాణాల్తో ముంచేశారు పాండవులు.

"పారిపోకండి. పట్టుకోండి. కొట్టండి. నిలవండి. పొడవండి" అని హెచ్చరిస్తూ యుద్ధానికే దిగాడు జయద్రథుడు. త్రిగర్త సైన్యమూ, సింధుసేనా, అనేకమంది రాజులూ జయద్రథుడిచుట్టూ పెట్టనికోటలా నిలబడ్డారు. చూశాడు భీముడు. కళ్ళల్లో నిప్పులు కక్కుతూ రథం దిగి దూకి వురికాడు. బంగారంతో తొడిగిన ఉక్కుగద తిప్పుతూ జయద్రథుడి

మీదికి పరిగెత్తాడు. క్షణంలో అయిపోయేది జయద్రథుడిపని. చప్పున తనసేనతో వచ్చి అడ్డుపడ్డాడు కోటికాస్యుడు.

మరింత మండిపోయింది భీముడికి. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, భటులూ అదే మోదడం మోదా డతడు గదయెత్తి. నిమిషంలో నిర్మూలమయిపోయింది కోటికాస్యుడిసైన్యం. సింహనాదం చేశాడు భీముడు. తనసారథి దగ్గిరికి తెచ్చిన రథం ఎక్కి విల్లూ అమ్ములూ పుచ్చుకున్నాడు.

ఇంతలో నూరుగురు సౌవీరుల్ని మాంచి దిట్టమైన వాళ్ళని తునాతునకలు చేశాడు ధర్మరాజు. అతడి పరాక్రమం చూసి, కాళ్లూ చేతులూ కదల్లేదు, శత్రువులికి.

ఎక్కడచూస్తే అక్కడే కనిపించాడు నకులుడు. అతడిబాణాల్తో రణస్థలం యావత్తూ తలకాతులమయమే అయిపోయింది దారుణంగా.

గుర్రాలమీద కాతులు నరకడంలో ప్రత్యేకత కనపరిచాడు సహదేవుడు. గుర్రాలబారులమధ్యవి డాపెడావీరవిహారమే చేశాడతడు.

ఇక అర్జునుడిసంగతి అతిమానుషమే అనిపించింది. జయద్రథుడి సైన్యం మహాసముద్రం అయితే, మందరపర్వతమే అయిపోయా డతడు. కలిచి కలిచి శత్రురాజుల్ని జలచరాల్లాగ చిందరవందరచేసి వదిలాడు. కుడీ, ఎడమా అనకండా, సవ్య అపసవ్యాలుగా అతడు ఉపయోగిస్తూవుంటే కొరివితిప్పినట్టు మెరుస్తోంది గాండీవం. సాన పట్టిన బాణాల గనిలా వుంటదది. తెన్నూ తెరిపీ లేకండా బాణాలు పడుతూ వుంటే, నెత్తురునదులు పారాయి నేలంతా. మీది యోధుల తోనే వొరిగిపోయాయి ఏనుగులు. రథికులూ, సారథులూ, గుర్రాలూ, కొండాలూ అన్నిటితోనూ విరిగి కుప్పపడిపోయాయి రథాలు. కాతుల తోనే పచ్చడి అయిపోయాయి గుర్రాలు. కుయ్యో, మొర్రో

అంటూ, దొంతులు దొంతులుపడి చచ్చిపోయారు భటులు. మారణ హోమానికే పూనుకున్నాడు అర్జునుడు.

అది చూడలేకపోయాడు త్రిగర్త రాజు సుధన్వుడు. పెద్ద గద పట్టుకువెళ్ళి, ధర్మరాజుగుర్రాలు చావమోదాడు. ఒకేవొక్క బాణం తీసిపెట్టి వదిలాడు ధర్మరాజు. గుండెలు దూసుకుపోయి తారు మన్నాడు సుధన్వుడు. వెంటనే సహదేవుడి రథం ఎక్కాడు ధర్మరాజు.

మహానుఖుడూ క్షేమంకరుడూ అని ఇద్దరు త్రిగర్తవీరులు నకుల్ని ముట్టడించారు. మేఘం వురిమినట్టు గర్జించారు. ఇద్దరినీ వొక్క బాణంతోనే వూడేశాడు నకులుడు. అది చూశాడు వాళ్ళ పెద్దన్న సురథుడు. పెద్ద ఏనుగు సైన్యంతో పరిగెత్తుకువచ్చాడు. తన పెద్ద మదపు టేనుగు నకులుడిమీదికి తోలాడు. రథానికి పూసిన గుర్రాలు చంపేసింది ఏనుగు. కత్తీ, డాలూ పట్టుకుని కిందికి గెంతాడు నకులుడు. అతడిమీదికే కలబడింది ఏనుగు. చలించకండా నిలబడ్డాడు నకులుడు. ఒక్క వేటుతో తొండమూ, దంతాలూ తెగనరికాడు. కుద వేసినట్లు కూలిపోయింది ఏనుగు. భయంతో కొయ్యబారిపోయాడు ఏనుగుమీది సురథుడు. ఇంతలో అతడి నడినెత్తిమీద పడింది నకులుడి ఖడ్గం. చిటికెలో పైకి ఎగిరిపోయాయి ప్రాణాలు. ఇలా త్రిగర్తుల్ని చంపేసి, భీముడి రథంమీదికి వెళ్ళిపోయాడు నకులుడు.

తన సైన్యం తరిగిపోవడంతోనే వొళ్ళు తెలియడం లేదు కోటి కాస్యుడికి. ఉద్ధృతంగా భీముడిమీదికి పోనిచ్చాడు రథం. వచ్చీ రావడం తోటే అతడి గుర్రాలు చంపేశాడు భీముడు. అతడి సారథికంఠం నరికేశాడు. బలంగా ప్రాసం విసిరి కోటికాస్యుడి గుండెలమీద కొట్టాడు. గుండెలు పగిలి హరీ అనేశాడు కోటికాస్యుడు. చావగా మిగిలిన అతడి సైన్యం కాళ్ళకి బుద్ధి చెప్పేసింది.

అంతలో అంగారకుడూ, కుంజరుడూ, సృంజయుడూ, సుప్తకుడూ, శత్రుంజయుడూ, సుప్రబుద్ధుడూ, శుభంకరుడూ, భ్రమంకరుడూ, శూరుడూ, రథీ, గుహాకుడూ, బలాఢ్యుడూ అని పన్నెండు మంది సౌవీరకుమార్లూ, ఇక్ష్వాకు, శిబి, సైంధవ, త్రిగర్తసైన్యాలూ - యావన్మందీ వొక్కసారి అర్జునుణ్ణి ముట్టడించారు. దారుణమైన బాణాల్తో వొక్కసారి మీదపడ్డారు.

రుద్రుడే అయిపోయాడు అర్జునుడు. ఇలా కన్నుమూసి, కన్ను తెరిచేలోపల పన్నెండుమంది సౌవీరకుమార్లనీ కొట్టాడు. టపీ టపీ బాణాలు వేసి, పన్నెండు ధనుస్సులూ విరిచేశాడు. ఆ మరుక్షణంలో పన్నెండుమంది తలకాయలూ ఎగరగొట్టేశాడు. అంతతో ఆగలేదతను. ఇక్ష్వాకులూ మొదలయిన యావన్మందినీ వేటాడి వేటాడి వందలూ, వేలూ చంపేశాడు. రణస్థలం యావత్తూ శవాలతో నిండి పోయింది. ఆకాశమంతా మొండేలమయంగా కనపడింది. వీరలాంఛనాలయిన భుజకీర్తులూ మొదలయినవాటితో తెగిన చేతులూ కాళ్ళూ, గుండపిండి అయిన రథచక్రాలూ, ఇరుసులూ, నొగలూ, జెండాలూ, ఎండతగలకండా రథాలికి పెట్టిన కోతిగూళ్ళూ, తెల్లగొడుగులూ, విసనకర్రలూ, చామరాలూ, ముక్కలుముక్కలు అయినధనుస్సులూ, బాణాలూ, కత్తులూ, పరిఘులూ, శక్తులూ, గదలూ, ముసలాలూ, పట్టిసాలూ, ప్రాసలూ - ఇవే ఎక్కడచూస్తే అక్కడ కుప్పలుకుప్పలు పడ్డాయి. రక్తం వరదలై పారింది. ఆ రక్తం వరదలో మాంసం బురదలా వుంది. తలవెంట్రుకలు నాచులా వున్నాయి. భూతాలూ, భేతాళగణాలూ రక్తంవరదలో ఈతలాడుతూ, మునకలు వేస్తూ అల్లకల్లోలం చేశాయి.

అర్జునుడు కార్చిచ్చు. గాండీవం పెనుగాలి. సౌవీరసైన్యం కారడివి: సర్వనాశనమే పట్టింది జయద్రథుడి రాణువకి.

జజ్జరిల్లిపోయాడు జయద్రథుడు. ద్రౌపదిని అక్కడే వదిలేసి, ప్రాణాలు బిగబట్టుకు పారిపోయాడు. చూశాడు అర్జునుడు. సైనికుల్ని మోదుతూవున్న భీముణ్ణి కేక వేశాడు. "సిగ్గుమాలి పారిపోయాడు జయద్రథుడు. పొల్లుప్రజ నెందుకూ ఊరికే చంపడం? వాణ్ణే వెంటతరిమి పట్టుకోవాలి. పద. వేగం" అన్నాడు.

గద ఆపేసి, ధర్మరాజుతో అన్నాడు భీముడు: "అన్నయ్యా! ద్రౌపదీ, ధౌమ్యులూ, చినతమ్ములూ, మీరూ ఆశ్రమానికి వెళ్ళిపోండి. నేనూ, తమ్ముడూ వెంటాడతాం వాణ్ణి. పాతాళంలో దూరినా బతక నివ్వం. దేవతలేరానీ, వాడి దేవుడే రానీ వాడి ప్రాణాలు పుచ్చుకు మరీ వస్తాం."

"వద్దు, వాణ్ణి చంపకండి. దుస్సల మొహంచూసి అయినా వదిలెయ్యాలి మనం. కూతురు ముండమోస్తే గాంధారి దుఃఖపడుతుంది. మొదటితప్పుకింద ఆమాత్రం క్షమించండి" అన్నాడు ధర్మరాజు.

"అదేమిటి? ఆ పాపాత్ముణ్ణా క్షమించడం? వల్లకాదు. చంపెయ్యవలిసిందే. ద్రోహి వాడు. బతకనివ్వకండి. వాడు చస్తేనే నాకు నిద్రపడుతుంది" అంది ద్రౌపది.

జయద్రథుణ్ణి వెంటాడుతూ బయల్దేరారు భీమార్జునులు. ద్రౌపదిని తీసుకుని, ఆశ్రమానికి వచ్చేశారు ధర్మరాజూ, నకుల సహదేవులున్నూ.

కోచుల్లా పరిగెత్తాయి భీమార్జునుల రథాలు. కోసెడు దూరంలో కనిపించింది జయద్రథుడి రథం. దూరంనుంచే బాణాలు ప్రయోగించాడు అర్జునుడు. దెబ్బతో జయద్రథుడి గుర్రాలు కూలిపోయాయి. బెంబేలు పడిపోయాడు జయద్రథుడు. ధనుస్సూ, బాణాలూ, రథం మీదే జారవిడిచాడు. పుంజాలు తెంపుకుని, పశువులాగ పారిపోయాడు.

వచ్చాడు వైశ్రవణుడు. 'మహాత్మా, నేను నీకు కుమారుణ్ణవుతాను. నన్ను కరుణించు' అంటూ అతడి దయ సంపాదించాడు. ఆటా, పాటా బాగా తెలిసిన మూంచి రాక్షసస్త్రీలని, పుష్పోత్కటా, బాకా, మాలినీ అని ముగ్గురిని విశ్రవసమునికి పరిచారికలుగా ఇచ్చాడు.

ఆ రాక్షసస్త్రీలు ముగ్గురూ సమానంగా, వొకర్ని మించినట్టు వొకరు ఆబ్రాహ్మడి సేవచేసి, అతణ్ణి మెప్పించారు. వాళ్ళమీద చాలా సంతోషం కలిగింది విశ్రవసుడికి. దాంతో ముగ్గురికీ పుత్ర దానం చేశాడతడు. పుష్పోత్కటకి రావణుడూ, కుంభకర్ణుడూ పుట్టారు. మాలినికి విభీషణుడు కలిగాడు. బాకకి ఖరుడూ, శూర్ప ణఖా పుట్టారు. విశ్రవసుడు వాళ్ళకి జాతకర్మాలూ అవీ చేసి, పెంచి పెద్ద వాళ్ళని చేశాడు.

వాళ్ళలో రావణాసురుడికి పదిబుర్రలు. భయంకరుడు వాడు. దుర్మార్గుడు. రోషానికి పెట్టింది పేరు. అన్నిటికీ మించి చెప్పలేనంత బలమున్నూ వాడిది. గర్వానికీ, క్రూరత్వానికీ అన్నకి తగిన తమ్ముడు కుంభకర్ణుడు. ఖరుడూ అంతే. దేవతల్ని అవమానించడం, మాంసం తినడం, రక్తం తాగడం, దురుసుగా తిరగబడడం — ఇవన్నీ వాడి సహజగుణాలు. వాడి చెల్లెలు సుప్పనాతి. అడిగేదేముంది! పరమ దుర్మార్గురాలు. వీళ్ళు అందరిలోనూ విభీషణుడు వొక్కడే మంచి వాడు. ఉత్తముడు. రాక్షసకుమాళ్ళు నలుగురూ తండ్రి విశ్రవస మునిదగ్గిర వేదాలూ, వేదాంగాలూ బాగా నేర్చుకున్నారు. ధను ర్వేదంలోనూ మంచి ఆరితేరినవాళ్ళయారు. అలా వాళ్ళంతా గంధ మాదనంమీద తండ్రిదగ్గిర పెరుగుతూ వచ్చారు.

ఒకనాడు, విశ్రవసుడికి నమస్కరించి వెళదామని, కుబేరుడు గంధమాదనం వచ్చాడు. రాజరాజు అయిన అతడి వైభవం అదీ చూశారు విశ్రవసుడి రాక్షసకుమాళ్లు. అదంతా తపస్సువల్ల వచ్చిం

దని తెలిసి, వాళ్ళు బ్రహ్మదేవుణ్ణే ధ్యానిస్తూ తపస్సు ప్రారంభించారు. అందులోనూ రావణుడు మరీ ఘోరమయిన తపస్సు చేశాడు. మండువేసంగిలో పంచాగ్నులమధ్య నుంచున్నాడు. వర్షాకాలమంతా ఆరుబయటా, చలికాలం చన్నీళ్ళలోనూ నిలబడ్డాడు. గాలితప్ప మరో ఆహారమే మానేశాడు. కుంభకర్ణుడూ మాం — చి నిశ్చలమైన తపస్సు చేశాడు. నియమంప్రకారం తినేవా డతడు. నేలమీదే పడుకునేవాడు. ఇంద్రియాలు నిగ్రహించి, వ్రతాలూ అవీ చేసేవాడు. ఆకులుమాత్రం తింటూ తపస్సు చేశాడు విభీషణుడు. పరిశుద్ధమయిన మనస్సుతో జపం చేసేవా డతడు. వీళ్ళ ముగ్గురికీ ఖరుడూ, సుప్పనాతీ తగిన పరిచర్య చేస్తూ వుండేవాళ్ళు.

అలా వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశారు వాళ్ళు. తన తలకాయ వొకటి పెరికి మండుతూన్న అగ్గిలో వేసేశాడు రావణుడు. మరో వెయ్యి సంవత్స రాలు గడిచాయి. మరో తల మంటలో వేసేశా డతడు. ఇలా తొమ్మిది వేల సంవత్స రాలు గడిచేసరికి, తొమ్మిది తలలూ మంటలో వేసేశాడు రావణాబ్రహ్మ. మరో వెయ్యిసంవత్సరాలు గడిచాయి. ఉన్న ఆవొక్క తలా పెరికేసుకోబోయా డతడు. వెంటనే ప్రత్యక్షమయాడు బ్రహ్మ. ఎప్పటిలాగ అతడి పది తలలూ అతడికి వుండేటట్టు చేశాడు. 'అమరత్వం (చావులేకండా దేవతల్లా వుండడం) తప్ప ఏం కావాలో కోరుకో' అన్నాడు.

'ప్రభూ, దేవతలూ, గంధర్వులూ, రాక్షసులూ, యక్షులూ, విద్యాధరులూ, నాగులూ — వీళ్ళు ఎవళ్ళూ నన్ను గెలవకండా వరమియ్యి. ఇష్టంవచ్చిన రూపంతో, ఇష్టంవచ్చిన దగ్గిరికి వెళ్ళగలిగేట్టు కామరూపం, కామగమనం ప్రసాదించు' అన్నాడు రావణుడు. 'ఒక్క మనుష్యుడు తప్పించి, నువ్వు అన్న వాళ్ళు ఎవళ్ళ వల్లా చావు లేదు నీకు' అని వరమిచ్చాడు బ్రహ్మ.

తర వాత కుంభ కర్ణుణ్ణి వరం కోరమన్నాడు బ్రహ్మ. దౌర్భాగ్యం కొత్తిమీద తాండవమాడుతోంది కుంభకర్ణుడికి. 'నిద్ర. మాస్తుగా నిద్ర కావాలి నాకు' అన్నా డతడు. 'తథాస్తు' అన్నాడు బ్రహ్మ.

అనంతరం విభీషణుణ్ణి వరం కోరమన్నాడు. చేతులుజోడించి బ్రహ్మదేవుణ్ణి స్తోత్రంచేశాడు విభీషణుడు. 'ఎంత ఆపదవచ్చినా సరే, పాపచింత నామనస్సుకి తట్టకూడదు. ఇదిన్నీ, బ్రహ్మాస్త్రమున్నూ నాకు అనుగ్రహించు' అన్నా డతడు. 'ఆశ్చర్యం! రాక్షసుడివయిన్నీ ధర్మబుద్ధికలవాడివి నువ్వు. కనక, నువ్వు కోరింది, దానితోపాటు చిరంజీవత్వమూ ఇస్తున్నాను. చావంటూ వుండదు నీకు" అని వరమిచ్చి అంతర్థాన మయాడు బ్రహ్మ.

ఈ వరాలతో కిందా మీదా కనపళ్ళేదు రావణాసురుడికి. మొట్టమొదట కుబేరుడిమీదికే దండెత్తే డతడు. తిన్నగా వెళ్ళి లంకా పట్నం ముట్టడించాడు. యుద్ధంచేసి లాభంలేదని తెలిసిపోయింది కుబేరుడికి. యక్షులూ కింపురుషులూ వాళ్ళతో కలిసి, పుష్పకవిమానం మీద గంధమాదనం పారిపోయారు. అక్కడికీ వెంటపడ్డాడు రావణాసురుడు. అతడి మానమూ, విమానమూ కూడా లాక్కున్నాడు. 'నీకంటే పెద్దవాణ్ణి నేను. నన్ను అవమానించావు. తుదకి నీ పగవాడిచేతిలో పడుతుంది పుష్పకం' అని శపించాడు కుబేరుడు.

రాక్షసరాజ్యం అంతటికీ రాజయాడు రావణాసురుడు. మాయాబలం, గర్వం అన్నీ వున్నాయి అతడి దగ్గిర. ఇంద్రుడూ మొదలయిన దేవతలు యావన్మందినీ వోడించా డతడు. వాళ్ళపట్ట ణాలూ ఆక్రమించేశాడు. పంతంపట్టి మరీ ప్రపంచం బాధిస్తూ వుండే వాడు. అతడి పేరంటే గాలికూడా కదలడానికి భయపడేది.

అతడిబాధ పడలేక దేవరుషులువెళ్ళి అగ్ని దేవుడితో మొర పెట్టారు. వాళ్ళని వెంటవేసుకుని బ్రహ్మదగ్గిరికి వెళ్ళేడు అగ్ని. 'రావ

ణాసురుడి బాధ మహా దుర్భరంగా వుంది. మూడులోకాలూ చిచ్చు పెడుతున్నాడు వాడు. దేవేంద్రుడు మొదలు దేవతలు యావన్మందీ వాడికి దాసు లయిపోయారు. నీళ్ళముంచినా పాలముంచినా ఇక నువ్వే మాకు దిక్కు' అంటూ విన్న వించారు.

'నేనూ వాడి విరగబాటు చూస్తూనే వున్నాను. అందుకనే విష్ణుమూర్తితో ఆలోచించాను. నరదేహంతో భూలోకంలో అవతరిస్తా డాయన. దేవేంద్రుడూ మొదలయిన దేవతలూ, తమతమ అంశల్లో వానరులూ, ఎలుగుబంట్లూ అయి పుడతారు. రావణ సంహారం జరుగుతుంది. భయపడకండి' అని అభయమిచ్చాడు బ్రహ్మ. వాళ్ళ ఎదటే దుందుభి అని వొక గంధర్వస్త్రీని పిలిచాడు. 'వెళ్ళు. గూనిదానివయి భూలోకంమీద పుట్టు. మంథర అని పేరుపెట్టుకుని వుండు. దేవకార్యానికి సాయంచెయ్యి' అన్నాడు.

దేవతల అంశల్లో కొండలం తేసివాళ్లూ, వజ్రంలా గట్టిదేహాల వాళ్లూ, సూర్యుడిలా తేజోవంతులూ, గుణవంతులూ, మాంచి బలవంతులూ, యుద్ధాల్లో ఆరితేరినవాళ్ళూ ఎంతోమంది వానరులూ, భల్లూకవీరులూ, భూలోకంమీద ఎక్కడపడితే అక్కడ పుట్టారు.

అయోధ్య

ఇలా వుండగా, అయోధ్యలో దశరథమహారాజు నలుగురు కొడుకులతోనూ, కోడళ్ళతోనూ ఇల్లంతా కలకల్లాడుతూ, మూడు లోకాల ఏలుబడీ దొరికినట్టు ముచ్చటగా కాలంగడుపుతూ వుండేవాడు. పెద్దకొడుకు రాముడు నిజంగా సుగుణాభిరాముడు. వేదాలూ, శాస్త్రాలూ—వొకటేమిటి సమస్తవిద్యలూ సంపూర్ణంగా నేర్చుకున్నాడతడు. ఇంద్రియాలు జయించాడు. ధర్మాలు తెలుసుకున్నాడు. దుష్టుల్ని శిక్షించడంలోనూ, శిష్టుల్ని రక్షించడంలోనూ సామర్థ్యం సంపాదించాడు. సుగుణాలే రూపం ధరించాయా అన్నంత సౌమ్య

పకపకా నవ్వారు పాండవులు. "ఒరేయ్, పిరికీ, ఇంకెటు పోతావు? నిలబడూ! ఇందుకేనా ఇంత బిగిరావు?" అంటూ వెంట పడ్డారు. తిరిగి చూశాడు జయద్రథుడు. లేడివెంటపడ్డ పెద్దపులుల్లా వచ్చేస్తున్నారు పాండవులు. మీద పడిపోతున్నారు. ఒక తుప్పలో దూరిపోయాడు జయద్రథుడు.

గువ్వమీద పడ్డ డేగలాగ అతడిమీద పడ్డాడు భీముడు. జుత్తు పట్టుకుని పైకి ఈడ్చుకువచ్చాడు. ఈడిగిలపడ్డాడు జయద్రథుడు. మెడ మీద తొక్కాడు భీముడు. మొహం పగిలి రక్తంకారేట్టు గుద్దాడు. ఒళ్ళంతా కుళ్ళుపోట్లు పొడిచాడు. తోపతోప చేసి సలగొట్టాడు. మీదికెత్తి గిరగిరా తిప్పాడు. నేలమీద పడగొట్టాడు. గుండెమీదా, మొహంమీదా మడమతో తొక్కాడు. పడాపడా నెత్తిమీద చరిశాడు. ఎడాపెడా చెంపలు వాయించాడు.

దాంతో తెలివితప్పి పడిపోయాడు జయద్రథుడు. "చాలు. ఆగు. చచ్చేట్టున్నాడు. చంపవద్దన్నాడు అన్నయ్య. కనికరించు" అన్నాడు అర్జునుడు. "కనికారం, కనికారం, కనికారం! అన్నయ్యకి కనికారంతప్ప మరో కార్యం కనిపించదు. అన్నయ్యతోపాటు నువ్వూ అదేపాట పాడతావు. వీణ్ణా కనికరించడం?" అంటూ దారయిన కత్తితీశాడు భీముడు. పెచ్చులురేగేట్టు జయద్రథుడి తల గొరిగేశాడు. చూసేవాళ్ళు నవ్వేట్టు అయిదుచోట్ల అయిదు శిగలుమాత్రం విడిచి పెట్టాడు. ఇలా అతడి రాజువేషం వదలగొట్టి, వికారంగా తయారు చేశాడు భీముడు. "ఒరేయ్, ప్రాణాలుపెట్టుకు బతకాలనే వుంటే, ప్రతీసభకీ వెళ్ళి 'పాండవుల దాసుణ్ణి' అని చెప్పుకోవాలి నువ్వు. చెపుతావా?" అని పిడికిలి చూపించాడు. దెబ్బలికి భయపడిపోయి "అలాగే అంటాను" అంటూ తలవూపాడు జయద్రథుడు.

అతడి పెడచేతులు విరిచికట్టేశారు భీమార్జునులు. రథంమీద వేసుకుని ఆశ్రమానికి తీసుకువచ్చారు. ధర్మరాజు ముందు పెట్టి, "అన్నయ్యా, ఇదిగో పాండవుల దాసుడు" అన్నారు. "దాసుణ్ణి చంపకూడదు. విడిచిపెట్టెయ్యండి" అన్నాడు ధర్మరాజు.

నవ్వు ఆపుకోలేకపోయింది ద్రౌపది. జయద్రథుణ్ణి చూసి పకపకా నవ్వింది. "దుర్మార్గుడు. దాసుడయాడు కదూ! అయితే పోనివ్వండి. వదిలిపెట్టెయ్యండి దాసుణ్ణి" అంది. కట్టువిప్పి వదిలేశారు జయద్రథుణ్ణి. ధర్మరాజుకీ, అక్కడవున్న మునులికీ నమస్కరించాడు జయద్రథుడు.

"ఎంత దుర్మార్గుడయినా, ఇంత ఘోరం నెట్టుకుంటాడా, బా?" అన్నాడు ధర్మరాజు. "ఇంద్రియలోలుడివి నువ్వు. నీచుడివి. ధృతిలేనివాడివి. నిన్ను ఏమనాలో అర్థంకాకండా వుంది నాకు! వెళ్ళు వెళ్ళు. ఇకముందు ఎప్పుడూ ఇలాంటి అవకతవక పనులు చెయ్యకు. బుద్ధికలిగి బతుకు" అన్నాడు.

సిగ్గుతో తలఎత్తకండా వెళ్ళిపోయాడు జయద్రథుడు. ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా హరిద్వారం వెళ్ళిపోయాడు. అన్ని చింతలూ విడిచిపెట్టేసి, అక్కడ తపస్సు ప్రారంభించాడు. ఒంటికాలు బొటనవేలిమీద నుంచుని, నిష్ఠతో శివుణ్ణి ధ్యానించాడు. చివరికి ప్రత్యక్షమయాడు శివుడు. "ఏంకావాలో కోరుకో" అన్నాడు.

"ప్రభూ, పాండవులు అయిదుగుర్నీ, వాళ్ళ సైన్యంతో సహా నేను గెలవాలి. ఇదే ప్రసాదించు" అని నమస్కరించాడు జయద్రథుడు.

"అది జరగని పని," అంటూ పెదివి విరిచాడు శివుడు— "పాండవుల్ని గెలవడం దేవేంద్రుడు మొదలయిన దేవతలకే సాధ్యం కాదు. అయితే వరం ఇస్తానన్నాను. ఇవ్వాలి. తప్పదు. అర్జునుడు తప్ప, తక్కిన నలుగుర్నీ ఒకరోజు యుద్ధంలో గెలుస్తావు నువ్వు. అంతే.

అర్జునుడు జగదేకవీరుడు. అతణ్ణి నువ్వే కాదు - ఆమాటకి వస్తే నేనయినా గెలవడం కష్టం. నా అనుగ్రహంవల్లే అతడు అంతవా డయాడు. అంతేకాదు, ఆయుధవిద్యలు అన్నీ తెలిసిన అఖిలేశ్వరుడు శ్రీకృష్ణుడు అతడి ప్రాణస్నేహితుడు. అతణ్ణేమిటి, గెలవడ మేమిటి!" ఇలా చెప్పి అంతర్ధానమయాడు శివుడు.

"ఏమయితేనేం, ఇదే చాలు పగతీర్చుకుందికి" అనుకుంటూ తనరాజ్యం వచ్చేశాడు జయద్రథుడు.

ఇక్కడ కామ్యకవనంలో మళ్ళీ ఒకనాడు ధర్మరాజు దగ్గిరికి మార్కండేయముని వచ్చాడు. తమ్ములతో సహా యథాప్రకారం ఎదురువెళ్ళి తీసుకువచ్చాడు ధర్మరాజు. కుశలప్రశ్నలూ అవీ అయాక జయద్రథుడి దుర్ణయం వివరించాడు ధర్మరాజు. అతడు ద్రౌపదిని ఎత్తుకుపోవడమూ, ఆమెకోసం వాళ్లు అనుభవించిన ఆయాసమూ అన్నీ చెప్పాడు. చివర ఇలా అన్నాడు. "మునీంద్రా, మహనీయమయిన శౌర్యమూ, ధైర్యమూ, ధర్మమూ అన్నీ వున్నాయి మాకు. అయినా రాజ్యం పోయి, దేశం వదిలి అడవులపాలే అయిపోయాము. విధి ఎంతన్నా చేస్తుంది. మహామునీ, ద్రౌపదిలా కష్టాలు అనుభవించిన రాణీ కానీ, మాలాగ దుఃఖాలపాలయిన రాజు కానీ ఎక్కడన్నా వుంటారా? మాఖర్మే ఇలా కాలిపోయింది!" అంటూ విచారించాడు.

"అలా విచారించవచ్చా మహారాజా," అన్నాడు మార్కండేయుడు - "నువ్వే అనుకుంటున్నావు. శ్రీరాముడు అడవుల్లో పడ్డ కష్టాలముందు నీకష్టం ఏపాటి? సీతాదేవి దుఃఖంలో వెయ్యోవంతు లేదు ద్రౌపది దుఃఖం. చల్లనితల్లి సీత. ఆమెని రావణాసురుడు సముద్రాలు దాటించి పట్టుకుపోయాడు. కోతులు వెంట పెట్టుకుని, సముద్రానికి వారధి కట్టాడు శ్రీరాముడు. రావణాసురుణ్ణి చంపి సీతని పట్టుకు వచ్చాడు."

మార్కండేయుడు రాముడి ప్రసంగం ఎత్తడంతోనే, అతడి చరిత్ర చెప్పమని కోరాడు ధర్మరాజు. రాముడి సంగతీ, రావణుడి విషయమూ, సీతని రావణుడు ఎందుకు ఎత్తుకు పోయిందీ, రామ రావణ యుద్ధమూ ఇవన్నీ - ఎలా జరిగిందీ వివరంగా చెప్పమన్నాడు. రామ కథ ప్రారంభించాడు మార్కండేయ మహాముని.

రామాయణం

ఇక్ష్వాకు వంశంలో అజుడని వొక రాజు వుండేవాడు. చాలా ప్రశస్త చరిత్రు డతడు. అతడి కొడుకు దశరథుడు. దశరథుడికి కౌసల్యా, కైకా, సుమిత్రా అని ముగ్గురు భార్యలు. అందులో కౌసల్యకి రాముడూ, కైకకి భరతుడూ, సుమిత్రకి లక్ష్మణుడూ శత్రుఘ్నుడూ - ఇలా నలుగురు కుమాళ్ళు కలిగారు దశరథుడికి. రాముడు విదేహ రాజుకూతురు సీతాదేవిని వివాహం చేసుకున్నాడు. ఇది రాముడి సంగతి. ఇక రావణుడి విషయం చెపుతాను.

సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడికి పులస్త్యుడు అని వొక మానస పుత్రుడు పుట్టాడు. అతడికి వైశ్రవణుడు అని వొక కుమారుడు కలిగాడు. అతడే కుబేరుడు. తండ్రి అయిన పులస్త్యుణ్ణి విడిచిపెట్టేసి, తాత అయిన బ్రహ్మని ధ్యానిస్తూ తపస్సు చేశాడు వైశ్రవణుడు. బ్రహ్మ ఇచ్చిన వరాలవల్ల నలకూబరుడు అని వొక కొడుకుని కన్నాడు. దిక్పాలకు డయాడు. ధనంమీద ఆధిపత్యమూ, శివుడితో స్నేహమూ సంపాదించాడు. లంకాపట్నం రాజధాని చేసుకుని మహావైభవంగా వుంటూ వచ్చాడు. తనంటె లక్ష్యం లేకపోవడంతోనే కుమారుడి మీద వొళ్ళు మండింది పులస్త్యుడికి. దానిమీద తన శరీరం సగంభాగం లోంచి విశ్రవసుడు అని వొకణ్ణి సృష్టించా డతడు. వైశ్రవణుడిమీద దెబ్బతియ్యమని అతడికి ఉపదేశించాడు. అది తెలిసి, విశ్రవసుడిదగ్గిరికి

మూర్తి అతగాడు. రూపమూ, మన్మథుడే మన్మథుడు. తామర రేకు ల్లాంటి నేత్రాలు. విశాలమై, కొట్టవచ్చినట్టు వక్షస్థలం. పొడవాటి చేతులు. ఎప్పుడూ నవ్వుతూ వుండే మొహం. మదించిన గున్న ఏనుగులాంటి నడక—చూస్తూనే తలలు వంచేవాళ్ళు జనం.

తగిన వయస్సు వచ్చి, ప్రయోజకుడయ్యాడు రాముడు. అప్పుడతణ్ణి యువరాజుగా పట్టాభిషేకం చెయ్యడానికి నిశ్చయించాడు దశరథుడు. ఆప్తులతోనూ, మంత్రులతోనూ ఆలోచించాడు. పురోహితుడు చెప్పినప్రకారం మంచిరోజూ నిర్ణయం చేసేశాడు.

కైక దాదిగా వుండేది మంథర. ఈసంగతి విని, గబగబా ఆమె దగ్గిరికి వెళ్ళింది. 'అవ్వ్వా, చూశావా అమ్మా, నీమీద మీఆయన ప్రేమ! ఉత్తి మాయవేషాలకే మోసపోయావే తల్లీ! పైమెరుగులే నిజమనుకున్నావే మాఅమ్మా! అంతా వొట్టి కపటం. ఆటక్కులాడి వుందే—కౌసల్య—అదంటేనే ప్రాణం మహారాజుకి. ఏం మందు పెట్టిందో మాయలమారి! దాని కొడుకునే, ఆ రామున్ణే ఇప్పుడు యువరాజుగా పట్టాభిషేకం చెయ్యడానికి నిశ్చయం. ఆమాత్రం దయలేకపోయింది నీమీద! పాపం, నీఅదృష్టం అదీ! నిన్నూ, నీకొడుకునీ వెనకపెట్టేసి, ఆసవతికొడుకే రాజ్యం ఏలుతాడు' అంటూ రాగాలు తీసింది.

చబుకుతో కొట్టినట్టయింది కైకకి. చివ్వున లేచింది. చరచరా భర్తదగ్గిరికి వెళ్ళింది. ఒంటరిగా దొరికాడు దశరథుడు. ప్రేమ వొలికిస్తూ ప్రసంగం లంకించుకుంది కైక. 'ఇదిగో, లోగడ నాకో వరమిచ్చావు నువ్వు. అది నాకు కావాలిప్పుడు. ఆడి తప్పనివాడివి. నీమాట నువ్వు చెల్లించుకోవాలి' అంటూ బెల్లించింది.

'నీకోసం ఏం చెయ్యమంటే అదేచేస్తాను' అన్నాడు దశరథుడు. 'చంపరానివాళ్ళని చంపెయ్యమంటావా? చెప్పు. చంపేస్తాను. చంప

దగ్గవాళ్ళని చంపవద్దంటావా? చెప్పు, వదిలేస్తాను. బ్రాహ్మల్ని తప్ప, ఎవ్వరిధనమున్నా, దోచేసి తెమ్మంటావా? నిమిషాలమీాద దోచేస్తాను. చెప్పు. ఏంచెయ్యమంటావో, ఏంకావాలో అడుగు' అన్నా డతడు.

'భరతుడికి పట్టంకట్టు. రాముణ్ణి పద్నాలుగేళ్ళు అడివికి పంపెయ్యి' అంది కైక, జంకూ గొంకూ లేకండా. చెవిలో కొరకంచు పెట్టినట్టూ, నెత్తిమీాద పిడుగుపడినట్టూ అయింది దశరథమహారాజుకి. తెలివితప్పి కిందపడిపోయా డతడు.

అదంతా విన్నాడు రాముడు. తనతండ్రి ఆడితప్పినవాడు కాకూడదు. అందుకని, భార్యతో సహా వెంటనే అడివికి వెళ్ళిపోయా డతడు. తమ్ముడు లక్ష్మణుడూ అతడివెంట వెళ్ళాడు.

రాముడు అడివికి వెళ్ళిపోయాడని విన్నాడు దశరథుడు. దుఃఖంతో గుండెలు పగిలిపోయాయి అతడికి 'రామా, రామా! నా రామా' అంటూనే ప్రాణాలు వదిలిపెట్టేశాడు.

ఇదంతా జరుగుతున్నప్పుడు భరతుడు వూళ్లో లేడు. దశరథుడు కాలంచెయ్యడంతోటే, అతణ్ణి పిలిపించింది కైక. 'మహారాజు కాలంచేశాడు. రాముడు అడివికిపోయాడు. రాజ్యానికి నువ్వే ఉత్తరాధికారివి. కనక, ఈమహారాజ్యం యావత్తూ రాజువై పరిపాలించు' అని హితబోధచేసింది.

అంతా తెలుసుకున్నాడు భరతుడు. క్రోధంతోనూ, దుఃఖంతోనూ అతడి హృదయం దహించుకుపోయింది. 'ఎంతపని చేశావు, పాపాత్మురాలా!' అంటూ మొత్తుకున్నాడు. మచ్చలేని సూర్యవంశంలో మచ్చ తెచ్చిపెట్టావు. దేవేంద్రుడిలాంటి భర్తని మింగేశావు. అయ్యో, ఎంత ధర్మాత్ముడు నాతండ్రి! కఠినాత్మురాలివి. దేవుడులాంటి అన్నయ్యని అడవులపాలు చేశావు. నాబతుక్కి కాల

కూటంలా తయారయావు. చెరిగిపోని అపకీర్తి నానెత్తిని పులిమావు. నలుగురిలోనూ 'ఛీ' అనిపించుకున్నావు. నీకడుపు నిండించుకున్నావు. ఈపాపం ఏంచెయ్యాదు? ఏందారి నాకు?' అంటూ ఎంతో అంత దుఃఖపడ్డాడు. తండ్రిభౌతిక దేహానికి అగ్నిసంస్కారం మొదలయిన అంత్యక్రియలు చేసి, అనంతరం మంత్రులూ, సామంతులూ, ప్రజలూ, ముగ్గురు తల్లులూ, వశిష్ఠమునీ, అతడి కొడుకు వామదేవుడూ, శత్రుఘ్నుడూ మొదలయిన యావన్మందితోనూ రాముడికోసం అడివికి ప్రయాణ మయాడు.

చి త్ర కూ ట ం

అప్పుడు చిత్రకూటంమీద వున్నాడు శ్రీరాముడు. నార బట్టలు కట్టుకుని, మునివేషంతో మునులమధ్య కూచునివున్నా డతడు అల్లంతదూరంనించి చూసి, ఏడుస్తూ వచ్చి, రాముడి పాదాలమీద వాలాడు భరతుడు. తండ్రి మరణం చెప్పాడు. తిరిగి అయోధ్య వచ్చి, రాజ్యం పాలించమని అన్నని ప్రార్థించాడు.

తండ్రిమాట నిలబెట్టాలనే దీక్ష రాముడిది. అంచేత, భరతుడు ఎంతచెప్పినా అంగీకరించలే దతడు. ఇంకో ఉపాయంలేక రాముడి పాదుకలుమాత్రం పట్టుకువచ్చాడు భరతుడు. రాముడు తిరిగి వచ్చే వరకూ నందిగ్రామంలో వుండి, ఆపాదుకలే పూజిస్తూ రాజ్యవ్యవహారాలు చూస్తూవుండేవా డతడు.

అయోధ్యకి దగ్గిరలోవుంటే మళ్ళీ భరతుడు రావచ్చు. అందు కని, దండకారణ్యాం వెళ్ళిపోయాడు రాముడు. ముందు శరభంగముని ఆశ్రమానికి వెళ్ళి, అతడు చేసిన సత్కారాలు స్వీకరించాడు. దండకారణ్యంలో గోదావరివొడ్డున పర్ణశాల కట్టుకుని, భార్య, తమ్ముడూ తానూ నివసిస్తూ వుండేవాళ్ళు.

దండక

దండకారణ్యంలో రావణాసురుడి చెల్లెలు సుప్పనాతి వాళ్ళకి అపకారం చెయ్యబోయింది. దాంతో, దానిమీద కోపంవచ్చి, దాని ముక్కూ, చెవులూ కోసేసి పంపేశారు రామలక్ష్మణులు. సుప్పనాతి కోసం దండకారణ్యంలోవున్న రాక్షసులు పెద్దపెద్ద సైన్యాలతోవచ్చి రాముడిమీద తిరగబడ్డారు. వాళ్ళందరినీ తనబాణాల్తో చంపేశాడు రాముడు. ఆదెబ్బతో ఖరుడూ మొదలయినవాళ్ళు పద్నాలుగు వేల మంది రాక్షసులు నాశనమయిపోయారు. దండకారణ్యంలో రాక్షస పురుగు లేకండా అయిపోయింది.

నెత్తీ నోరూ మొత్తుకుంటూ లంకాపట్నం పరిగెత్తింది సుప్పనాతి. రావణుడి కాళ్ళమీద పడి, గోలుగోలుమంది. చెల్లెలి అవస్థ చూసి మండిపోయాడు రావణాసురుడు. 'ఎవ్వ డిలా చేశాడు నిన్ను ? ఇంతసాహసం ఎవడికి వచ్చింది. ఎవడికి ఆయువు మూడింది ? తెలిసి తెలిసి, శూలంమీద వురికినవాడు ఎవ్వడంటూ ? తలకింద మంట పెట్టుకుని, ఎవ్వడా పడుకున్నవాడు ? నల్లతాచుని కాలదన్నినవాడు, ఎవడువాడు ? చెప్పు. పులిమీసాలతోనే, వుయ్యాలలూగడం ? ' అంటూ అదే గర్జించడం గర్జించాడు. అతడి పదినోళ్ళనుంచీ, కళ్ళనించీ, ముక్కురంధ్రాలనించీ, చెవులనించీ భయంకరంగా అగ్నిజ్వాలలు బైటికి వచ్చాయి.

రాముడిసంగతి యావత్తూ అన్నతో చెప్పింది సుప్పనాతి. భార్యతోనూ, తమ్ముడితోనూ రాముడు దండకారణ్యంలో వుండడం, తన ముక్కూ చెవులూ కోసి పంపడం, ఖరదూషణులు మొదలయిన రాక్షసుల్ని చంపెయ్యడం — అన్నీ పూసగుచ్చినట్టు చెప్పింది.

వెంటనే దండకారణ్యం ప్రయాణమయాడు ' రావణుడు. పట్నం కాపాడుతూ వుండడం కోసం తగినవాళ్ళని నియమించి, తగినబందో

బస్తు చేశాడు. తాను వొక్క డే బయల్దేరి, ముందు త్రికూటమూ కాల పర్వతమూ దాటి, సముద్ర పొడ్డుకి వచ్చాడు. అక్కడ గోకర్ణస్థానంలో మారీచుడు తపస్సు చేసుకుంటున్నాడు. మహా మాయలమల్లి మారీ చుడు. అతడు మొదట రావణుడి మంత్రిగా వుండేవాడు. తాటక సంహారమప్పుడు రాముడిచేత దెబ్బతిని, వైరాగ్యం వచ్చి, మిగతా జీవితం తపస్సులో గడుపుతున్నా డిప్పుడు.

రావణాసురుణ్ణి చూసి, గబగబా వచ్చి గౌరవించాడు మారీ చుడు. అతడి క్షేమం విచారించి, వచ్చినపని అడిగాడు.

'రాముడని వొక గర్వపోతు దండకారణ్యం వచ్చాడట! మహా మిడిసిపడుతున్నాడు వాడు. మన ఖరుణ్ణీ వాళ్ళనీ చంపేశాడు. వాడికి తగిన పాఠం నేర్పాలి. అందుకని, నీసహాయం కోరి వచ్చాను' అన్నాడు రావణుడు.

'వెర్రివాడిలా వున్నావు' అన్నాడు మారీచుడు. రాముడంటే ఏమో అనుకునేవు. అసాధ్యుడు. అతడి బాణం ముందు శివుడన్నా పరిగెత్తి వలసిందే. ఈదుర్బుద్ధి నీకు ఎవడన్నా మప్పాడో, నీకు కాలం దాపురించి నీబుర్రల్లోనే పుట్టిందో – అర్థంకాకండా వుంది నాకు. అత డితో వోడిపోయే కదా, ఇలా తపస్సుకి వచ్చేశాను నేను? వద్దు. ఈ ప్రయత్నం మానుకో' అని బోధించాడు.

చర్రుమన్నాడు రావణాసురుడు. 'నిన్ను చెప్పమని, నీసలహా కోసం రాలేదు. నేను చెప్పిందేదో విను. లేకపోతే నిన్ను చంపేస్తాను' అంటూ గద్దించాడు. 'వీడిచేత చావడంకంటే, రాముడి చేతుల్లో చావడమే నయం' అనుకున్నాడు మారీచుడు. 'నిమాట కాదనాలని కాదు. నీమంచికోసం చెప్పాను. ఆజ్ఞాపించు. ఏమిటి సెలవు' అన్నాడు. 'ఏం లేదు, రత్నాలు తాపిన బంగారంలేడివై పోవాలి నువ్వు. తిన్నగావెళ్ళి సీతముందు కనిపించాలి. సీత నిన్ను చూస్తుంది.

ఆశపడుతుంది. పట్టితెమ్మని రాముణ్ణి కోరుతుంది. రాముడు మాయ లేడి వెంట పడతాడు. నేను సీత వెంట పడతాను. సమయంచూసి, ఆమెని ఎత్తుకుపోతాను. భార్యపోవడంతోటే రాముడుపని అయి పోతుంది. ఆమెకోసం ఏడ్చిఏడ్చి చచ్చిపోతాడు' అన్నాడు రావణుడు. 'సరే' అని బయల్దేరాడు మారీచుడు.

రాముడూ, సీతా పర్ణశాల దగ్గిర కులాసాగా కూచున్నారు. అల్లంత దూరంలో మేస్తోంది మాయలేడి. వొళ్ళంతా బంగారం. అవి వెంట్రుకలు కావు రత్నాలు. చూసింది సీత. ఎంతో ముచ్చట పడింది. రాముడికి చూపించి అది కావాలంది ఆమె. సీత కోరికకి విధిప్రేరణ తోడయినట్టయింది. ఆలోచించకండా లేడి వెంట పడ్డాడు రాముడు. 'సీత భద్రం' అని లక్ష్మణుడితో చెప్పి వెళ్ళాడు.

యజ్ఞమృగం వెంటపడ్డ శివుడిలాగ మాయలేడి వెంట పడ్డాడు రాముడు. రాముణ్ణి చూసి, పరుగుచ్చుకుంది లేడి. అంతలోనే నిలబడి పోయింది. అదిగో, చెయ్యి చాస్తే అందుతుంది. చెంగున దాటు వేసింది. ఏదీ? పొదల్లో దూరిపోయింది. అదుగో, అక్కడే వుంది. ఉలిక్కి పడుతోంది. తిరిగిచూస్తోంది. కాలు దువ్వుతోంది. గరిక మేస్తోంది. నడుస్తోంది. మళ్ళీ పరిగెడుతోంది. పరాకుగా నుంచుంది. దొరికిపోయింది. ఊహూఁ — పారిపోయింది.

ఇలా ఎంతో దూరం రాముణ్ణి తీసుకుపోయింది మాయలేడి. అలిసిపోయాడు రాముడు. రాక్షసమాయ కాదుకదా, అను కున్నాడు. తక్షణం ధనుస్సులో బాణం తొడిగాడు. రివ్వున వదిలి పెట్టాడు. ఎదురులేని బాణం రాముడిది. రివ్వునవెళ్ళి లేడికి తగిలింది. మొహందిక్కు తగిలి, తోక దిక్కు దూసుకుపోయింది. దెబ్బతో పడి పోయింది మాయలేడి. పడిపోతూ, గాట్టిగా 'హా లక్ష్మణా! హా

సీతా!' అంటూ కేకవేసి, ప్రాణం వదిలిపెట్టేసింది. సరిగ్గా రాముడి కంఠమే అది.

ఆ కేక సీత వింది. నిలువునా వణికిపోయిం చావు. 'లక్ష్మణా, ఏదో ఆపద వచ్చింది మీఅన్నకి. రాక్షసులే ఏదో బాధ పెట్టిన ట్టున్నారు. ఎంతబాధగా పిలిచాడో, విను. వెళ్ళు. అడ్డుపడు. పరి గెత్తు' అంటూ ఇదయిపోయింది.

'భయపడకు' అన్నాడు లక్ష్మణుడు. 'అన్నయ్యకి ఆపద ఏమిటి? అతణ్ణి ఎదిరించేవాడు ఇక్కడేకాదు, ఎక్కడా లేడంటే నమ్ము. చూస్తూవుండు. ఇంతలోనే వచ్చేస్తాడు' అన్నాడు.

ఈమాటలతో లక్ష్మణుడిమీద సందేహం కలిగిపోయింది సీతకి. చెప్పరానంత కోపమూ వచ్చింది ఆమెకి. దాంతో అనరాని మాటలూ అనేసింది మరిదిని. 'నీ ఉద్దేశం ఏదో బోధపడుతూనే వుంది. ఎంత నిష్ఠురం! అన్నపోతే నన్ను కట్టుకోవాలని చూస్తు న్నావు. విషంతాగో, అగ్గిలో వురికోచస్తాను కాని, నిన్నుకట్టుకుంటా ననుకోకు. పెద్దపులి నక్కని పొందడం కల్ల' అంటూ ఏవేవో అంది.

చెవులు మూసుకున్నాడు లక్ష్మణుడు. హృదయం బద్దలైన ట్టయింది. వెంటనే ధనుస్సూ, బాణాలూ పుచ్చుకున్నాడు. అన్న వెళ్ళిన దిక్కు చరచరా నడిచాడు.

లక్ష్మణుడు చాటయేసరికి, వొక ముసిలి యతీశ్వరుడు వచ్చి, సీతఎదట వాకట్లో నుంచున్నాడు. ఎంతో దూరం నడిచి, అలిసి పోయినట్టున్నా డతడు. జడలుకట్టిన శిగ. కౌపీనం. జేగురువస్త్రం. చేతిలో దండకమండలాలు. దర్భతాడు. త్రిదండం. భుజంమీద సన్నని పాంమీసంలాంటి జందెం. చూసి, నిజమయిన యతే అను కుంది సీత. ఆసనమూ అదీ వేసి గౌరవించింది. పళ్ళూ అవీ తెచ్చి, ఇవ్వబోయింది.

పుచ్చుకోలేదు యతి. ఆమె అంటం చూస్తూ, గుటకలు వేస్తున్నాడతడు. 'ఈ పళ్లెందుకూ నాకు!' నవ్వుతూ అన్నాడు యతి. 'రావణుడు అంటారు నన్ను. రాక్షససామ్రాట్టుని. వినే వుంటావు నువ్వు. ప్రసిద్ధమయిన లంకాపట్నం మాది. ఇంత చక్కని దానివి నువ్వు. ఈ ముష్టిముండా రాముడితో ఈఅడవుల్లో అవస్థ ఏమిటి నీకు? రా. మాట్లాడకండా నాతో వచ్చెయ్యి. నా రాణీగా వుందువు కాని. యవ్వనం సార్థకపరచుకుంటూ, అష్టయిశ్వర్యాలూ అనుభవిద్దువు కాని' అన్నాడు.

భయపడిపోయింది సీత. అంతలోనే ధైర్యం తెచ్చుకుంది. 'ఏనుగు పందినా వరిస్తుంది?' అని జవాబు చెప్పింది. 'పద్మవనంలో బతికే తుమ్మెద రేగుపువ్వుకోసం వెళుతుందను కుంటున్నావు. వెర్రి వాడివి. నేనెక్కడ, నువ్వెక్కడ? విను, చుక్కలతో ఆకాశం కింద పడ్డా, భూలోకం బద్దలయిపోయినా, సముద్రాలన్నీ ఆర్చుకుపోయినా, సూర్యచంద్రులు మాసిపోయినా నేను పరపురుషుణ్ణి కామిస్తా ననడం కల్ల' అంటూ పర్ణశాలలోపలికి వెళ్ళిపోయింది.

అమాంతంగా మీదికివచ్చాడు రావణుడు. బలాత్కారంగా ఆమెని పట్టుకున్నాడు. ఆమెని ఎత్తుకుని, ఆకాశంమీదికి ఎగిరి పోయాడు. లంకదిక్కు దౌడుతీశాడు.

పాపం, విలవిలా కొట్టుకుపోయింది సీత. 'అయ్యో, రాముడి భార్యని. సీతని. నన్ను రాక్షసుడు ఎత్తుకుపోతున్నాడు. ఏ దేవతలయినా వుంటే రక్షించండి' అంటూ ఏడవడం మొదలు పెట్టింది.

ఆదారిలోనే, వొక కొండగుహలో వుంటున్నాడు రాంబందు జటాయువు. సీత ఏడుపు అతడి చెవిలో పడింది. వెంటనే పైకివచ్చాడు. పేద్ద రెక్కలకొండలాగ ఆకాశంమీదికి ఎగిరాడు. నల్లమేఘం వురిమి నట్టు కేకవేసి, రావణుణ్ణి అడ్డుకున్నాడు. 'దుర్మార్గుడా, ఈమెని విడిచి

పెట్టు ముందు. నీ ప్రాణాలు పుచ్చుకు మరీ వెడతాను. జటాయువు పంజా తప్పించుకుని ఎటు వెడతావో చూస్తాను' అంటూ కలబడ్డాడు. ఇద్దరికీ ఘోరమయిన పోరాటం జరిగింది. రెక్కలతో కొట్టాడు జటాయువు. గుదియతో బాదాడు రావణుడు. ముక్కుతో రక్కాడు జటాయువు. ఈటెతీసి విసిరాడు రావణుడు. జటాయువు ముక్కూ, గోళ్ళూ, రెక్కలూ తగిలి వొళ్ళంతా గాయాలయాయి రావణుడికి. రక్తాలు కారుతూ, అతడి శరీరం జేగురుసెలయేళ్ళు ప్రవహిస్తోన్న కొండలా వుంది. ఏమయినా, చలించలేదతడు. ఒడుపుచూసి, జటాయువు రెక్కలు నరికేశాడు. పెనుగాలి విసిరికొట్టిన పెద్ద నల్లమేఘంలాగ కింద పడిపోయాడు జటాయువు.

జటాయువు పడిపోవడంతోనే, సీతనిపట్టుకుని, అదేపారిపోవడం పారిపోయాడు రావణాసురుడు. మరి దిక్కులేక పోయింది సీతకి. ఏడుస్తూ, కిందికి చూస్తోం దామె. ఒక కొండమీద కొందరు వానరులు కనిపించారు. పైటచెంగు చింపి, తన నగలు మూటకట్టి వాళ్ళముందు పడేసింది సీత. తిన్నగా ఆమెని లంకాపట్నం తీసుకు పోయాడు రావణుడు. అశోకవనంలో పెట్టాడు. రాక్షసస్త్రీలని భద్రంగా కాపలా పెట్టాడు.

ఇక్కడ మాయలేడిని కొట్టి, వచ్చేస్తున్నాడు రాముడు. ఇటు నించి ఎదురయాడు లక్ష్మణుడు. చూసి, గతుక్కుమన్నాడు రాముడు. 'రాక్షసులు వున్న అడివి. వొదినెని వొంటరిగా వదిలి వచ్చావు. ఎంతపని చేశావు!' అన్నాడు తమ్ముణ్ణి. 'అదికాదు అన్నయ్యా,' అంటూ వదినెగారు అన్నమాటలు విన్నవించాడు లక్ష్మణుడు. బంగారంలేడి తనని తిప్పలు పెట్టడం, సీతని వొంటరిగా వదిలి లక్ష్మణుడు రావడం— గుండెల్లో ఏదో చెయ్యిపెట్టి కలిచినట్టే వుంది రాముడికి. విచారిస్తూ, చరాచరా నడిచాడు ఆశ్రమానికి.

చిలకలేని పంజరంలా చిన్నపోయి వుంది పర్ణశాల. సీత లేదు. నిలువునా ప్రాణాలు ఎగిరిపోయినట్టయింది రాముడికి. తెలివితప్పి కింద పడిపోయాడతను. తమ్ముడు ఉపచారాలు చేశాకగాని తెలుసుకోలేదు. లేచి, అన్నదమ్ములు ఇద్దరూ చుట్టుపక్కలా వెదుకుతూ వెళ్ళారు. వెళ్ళి వెళ్ళి దారిలో జటాయువుని చూశారు. పిడుగుపడి, కూలిపోయిన కులపర్వతంలా పడివున్నాడు జటాయువు. అదీ రాక్షస మాయే అనుకున్నారు రామలక్ష్మణులు. ధనుస్సుల్లో బాణాలు సంధించబోయారు.

వచ్చేప్రాణం పోయేప్రాణంతో వున్నాడు జటాయువు. వాళ్ళని చూసి, మెల్లిగా అన్నాడు: 'అయ్యా జటాయువుని నేను. మీ తండ్రి దశరథమహారాజు స్నేహితుణ్ణి.' రామలక్ష్మణులు దగ్గిరికి వచ్చాక, రావణుడు సీతని ఎత్తుకపోవడమూ, తాను అడ్డుకోవడమూ, తన రెక్కలు నరికి, రావణుడు సీతని పట్టుకుని, లంకదిక్కు పారిపోవడమూ చెప్పి, ప్రాణం వదిలేశాడు జటాయువు.

కన్నతండ్రికి చేసినట్టు జటాయువుకి సంస్కారక్రియలు చేశారు రామలక్ష్మణులు. అది అయాక దక్షిణంగా వెళ్ళారు వాళ్ళు. దారిలో వొక వింత రాక్షసుడి రూపం చూశారు. గుండెలమీద కన్నులున్నాయి వాడికి. కడుపులో నోరుంది. చేతులు పొడావుగా వున్నాయి. ఎంత వికారంగా వుండాలో అంత వికారంగానూ వున్నాడు వాడు, కబంధుడు.

ఆట్టేవుండి, దగ్గిరికి రాగానే తినెయ్యాలని లక్ష్మణుణ్ణి పట్టేసుకున్నాడు కబంధుడు. బ్రహ్మాండమయిన బలం వాడిది. వాడిచేతిలో విలవిలా గింజుకున్నాడు లక్ష్మణుడు. లాభంలేకపోయింది. ప్రాణం మీద ఆశవదిలేసి, జాలిగా రాముణ్ణి చూశాడతను. 'అన్నయ్యా, వదినెతో కలిసి నువ్వు రాజ్యం చెయ్యడం చూడలేకపోయాను.

దురదృష్టవంతుణ్ణి. రాజ్యం పోయింది. నాన్న చచ్చిపోయాడు. అడ వుల్లో తిరిగావు. భార్య రాక్షసుడి పాలయింది. తుదకి నాచావూ కళ్ళఎదట చూస్తున్నావు. ఇంకా ఎన్నికష్టాలు పడతావో పాపం!' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

'నేను వుంటూవుండగా నీకు చావేమిటి తమ్ముడూ' అంటూ కత్తితీశాడు రాముడు. కబంధుడి ఎడమ చెయ్యి నరికేశాడు. రాహువు కోరల్లోంచి బైటపడ్డ చంద్రుడిలా, కబంధుడిపట్టులోంచి పైకివచ్చే శాడు లక్ష్మణుడు. పట్టువిడిపించుకోడమూ కబంధుడి కుడిభుజం నరి కెయ్యడమూ వొక్కసారే చేశాడు లక్ష్మణుడు.

రెండుచేతులూ తెగిపోవడంతోటే వికృతరూపం వదిలి పోయింది కబంధుణ్ణి. దివ్యమయినరూపంతో ప్రత్యక్షమయా డతడు. ఆశ్చర్యపోయారు రామలక్ష్మణులు. 'ఎవరు నువ్వు?' అని అడిగాడు రాముడు. 'ఇంతవరకూ ఇలా రాక్షసుడివై ఎందుకున్నావు? ఇప్పుడు ఇలా మారడానికి కారణ మేమిటి?' అన్నాడు.

'గంధర్వుణ్ణి నేను' అన్నా డతడు—'విశ్వావసుడు అంటారు నన్ను. బ్రహ్మదేవుడి శాపంవల్ల రాక్షసుణ్ణయిపోయాను. మీమూలాన శాపం వదిలింది. సీతాదేవిని రావణాసురుడు ఎత్తుకుపోయాడు. లంకలో వుంచాడు ఆమెని. మీకు మేలుకలిగే విధానం చెపుతాను. వినండి. మీరు ఇలా వెళితే ముందు పంపాసరోవరం తగులుతుంది. దానికి అవతల ఋశ్యమూకపర్వతం వుంది. దానిమీద సుగ్రీవుడు మంత్రులతో వుంటున్నాడు. వాలి తమ్ము డతడు. అతడితో స్నేహం చెయ్యండి మీరు. మీకు కార్యసిద్ధి కలుగుతుంది'

ఇలా చెప్పి వెళ్ళిపోయాడు విశ్వావసుడు.

విశ్వావసుడి మాటప్రకారం ముందుకి వెళ్ళారు రామలక్ష్మ ణులు. పంపాసరస్సు చూశారు వాళ్ళు. పద్మకేసరాల్తో పరిమళిస్తూ

వున్న నీళ్ళతో బాటసార్లకి అర్ఘ్యం ఇస్తూంది పంప. తరంగ హస్తాల్తో పాద్యం పెడుతూవుంది. హంసలూ, చక్రవాకాలూ, సారసాలూ, తుమ్మెదలూ చేస్తూవున్న మధురధ్వనుల్తో ఆదరవాక్యాలు చెపుతోంది. గట్లమీద చల్లని చెట్లనీడల్తో విశ్రామస్థలాలు ఏర్పాటు చేస్తోంది. పిల్లగాలుల్తో ఉపచారాలూ చేస్తోంది. ఇలా అతిథిసత్కారం చేసి, తనజన్మ సార్థకం చేసుకుంటోంది పంప.

పంపాసరస్సు చూడడంతోటే, సీతావియోగం మరింత దుస్సహమైపోయింది రాముడికి. సీతని తలంచుకుని పనివి పనివి ఏడ్చాడతడు. అన్నగారిని వోదార్చాడు లక్ష్మణుడు. 'అన్నయ్యా, నీవంటివాడే ఆపదల్లో అధైర్యపడితే, ఇంక ఇతర్లమాట చెప్పే దేముంది? నీసేవకుణ్ణీ, శిష్యుణ్ణీ, సహాయుణ్ణీ నేను వున్నాను. పద. వదినె ఎక్కడవుందో అక్కడికి వెళదాం. తరవాత ఏం చెయ్యాలో అది చేద్దాం' అని ధైర్యం చెప్పాడు. అన్నదమ్ములు ఇద్దరూ పంపలో స్నానాలు చేశారు. దేవతర్పణమూ, ఋషితర్పణమూ, పితృతర్పణమూ చేశారు. అక్కడినించి ఋశ్యమూకపర్వతం వెళ్లారు.

**ఋశ్యమూకం**

ఎంతో ఇదిగా వుంది ఋశ్యమూకం. మేఘాలు వొరుసుకుంటూ వున్నాయి శిఖరాలు. కొండకింద ఆయాసం తీర్చుకుంటూ కూచున్నారు రామలక్ష్మణులు. శిఖరంమీంచి చూశాడు సుగ్రీవుడు. మంత్రులతో ఆలోచించి, వాళ్ళసంగతి కనుక్కురమ్మని హనుమంతుణ్ణి పంపాడు. రామలక్ష్మణులతో మాట్లాడి వెళ్ళాడు హనుమంతుడు. సుగ్రీవుణ్ణి తీసుకువచ్చి, శ్రీరాముడితో స్నేహం కలిపాడు. సీత పడేసిన నగలు తెచ్చి రాముడిముందు పెట్టాడు సుగ్రీవుడు. సీతని చూసినంత ఇదిగా వాటిని చూశాడు రాముడు. వాలిని చంపేసి,

వానరరాజ్యం సుగ్రీవుడికి పట్టంకడతానని ప్రతిజ్ఞ చేశాడతడు. సీతని వెదికి తేవడానికి సర్వశక్తులూ వినియోగిస్తానని మాటఇచ్చాడు సుగ్రీవుడు.

అందరూ కలిసి కిష్కింధాపట్నం వచ్చారు. వాలి కోట వాకిట్లో జబ్బలుచరుస్తూ నిలబడ్డాడు సుగ్రీవుడు. ఎక్కడలేని కోపం మండుకువచ్చింది వాలికి. ఉరకలు వేస్తూ యుద్ధానికి బయల్దేరాడతడు. 'వద్దు' అంటూ అడ్డం వచ్చింది అతడి భార్య తార. 'మీతమ్ముడి ఉద్ధృతం చూస్తే ఇన్నాళ్ళలాగ లేదు. వెనకదన్నుతో వచ్చాడివాళ. రాముడి భార్యని రావణుడు ఎత్తుకుపోయాడు కదూ! అందుకని, మీతమ్ముడి సాయంకోరి వచ్చాడు రాముడు. అతడికి ఇతడూ, ఇతడికి అతడూ సాయం చేసుకుందికి ఒప్పందం చేసుకున్నారని వింటున్నాను. అదీకాక, బలవంతుడు హనుమంతుడూ, బుద్ధిమంతుడు జాంబవంతుడూ మీతమ్ముడికి మంత్రులుగా వున్నారు. కనక, ఇపుడు యుద్ధానికి వెళ్ళడం నాకు నచ్చలేదు. వెళ్ళకు' అంది. 'సుగ్రీవుడంటే దీనికి ఇష్టం. అందుకే వెళ్ళవద్దు అంటుందినన్ను' అని అనుకున్నాడు వాలి. ఆమెని తోసేసి సుగ్రీవుడిమీదికి పరిగెత్తాడు.

అన్ననిచూసి హుంకరించాడు సుగ్రీవుడు. 'హోరిదుర్మార్గుడా!, అని గద్దించాడు వాలి. 'ఎన్నిసార్లు కవ్వించి నీమీదికి రాలేదు నేను! ఎన్నిసార్లు తోకముడవలేదు నువ్వు! ఇవాళ ఇంతధైర్యం ఎక్కడినించి వచ్చిందట!' అన్నాడు.

'రాజ్యం పోయింది. భార్యనీ లాక్కున్నావు. యుద్ధంలో ఓడిపోయిమాత్రం బతకడం ఎందుకూ! అందుకే తెగించి, ఆఖరికి పోట్లాటకే వచ్చేశాను. సిద్ధపడు. పాతసుగ్రీవుడు కాడిప్పుడు, పరిగెత్తడానికి. నీఅంతు చూడందే తిరిగి పోతాడనుకోకు ఇవాళ'—నవ్వుతూనే అన్నాడు సుగ్రీవుడు. అంటూనే పేద్ద అరుపు అరిచాడు. అరుపుతోనే వాలిమీదికి వురికేశాడు.

వాలీసుగ్రీవుల యుద్ధం ఘోరంగా అరంభమైంది. ఒడ్డూ, పొడుగూ ఇద్దరూ వొకళ్లాగే వున్నారు. బలానికీ, ప్రతాపానికీ ఇద్దరూ సమవుజ్జీలు. కలబడీ కలబడడంలో చెట్లతో బాదుకున్నారు వాళ్ళు. ఒక్కొక్క చెట్టూ పెరికేస్తున్నారు. ఒకరి గుండెల మీద వొకరు కొడుతున్నారు వజ్రమంతగట్టిగా వున్నాయి వాళ్ళ గుండెలు. వాటిమీదతగిలి గుండపిండి అయిపోతున్నాయి చెట్లు. చుట్టుపక్కల చెట్లన్నీ అయిపోయాయి. తరవాత రాళ్ళమీద పడ్డారు వాళ్ళు. పెద్దపెద్దరాళ్ళతో కొట్టుకున్నారు. ఉక్కులాంటి శరీరాలు వాళ్ళవి. తగిలి రాళ్ళన్నీ గుండగుండ అయిపోయాయి. రాళ్ళు అయిపోగానే ముష్టియుద్ధం లంకించుకున్నారు.

పిడిగుద్దులు, పెడబొబ్బలు, తాపులు, తోపులు, పోట్లు, తిట్లు- ఒకర్నిమించి వొకరు ఎగబడుతున్నారు. ఇద్దరూ చేతులు కలుపుతూ వుంటే, మాంచి మదించిన ఏనుగులు రెండూ తొండాలు కలుపుతున్నట్టుంది. ఒకర్నొకరు కరుచుకుంటున్నారు. ఒకర్నొకరు రక్కుకుంటున్నారు. ఇద్దరి దేహాలూ రక్తంతో నిండి పోతున్నాయి. ఇద్దరూ పూసినఅశోకవృక్షాల్లా గఎర్రగాతయారయారు.వొకళ్లాగేవున్నారు.

ఆ అవస్థలో ఎవడు వాలో ఎవడు సుగ్రీవుడో పోల్చుకోలేక పోయాడు రాముడు. ఎవణ్ణి కొట్టడమో తోచలేదతడికి. అప్పుడు చప్పున సుగ్రీవుడి మెడలో వొక ఆకులదండ వేశాడు హనుమంతుడు. వెంటనే వొకబాణం వేశాడు రాముడు. రివ్వున వెళ్ళింది బాణం. వాలిగుండెల్లో దూసుకుపోయింది. తూలిపోయాడు వాలి. కింద పడిపోయాడు. రాముణ్ణి తిడుతూ ప్రాణం వొదిలిపెట్టేశాడు. అంతా క్షణాలమీద జరిగిపోయింది.

వాలినిచంపి, కిష్కింధ రాజ్యంసుగ్రీవుడికి పట్టంకట్టాడు రాముడు. వాలిభార్య తారని సుగ్రీవుడిపరంచేశాడు. సుగ్రీవుడి కార్యం నెర

వేరింది. ఇక రాముడుపని జరగాలి. 'ఈ మిగిలిన ఎండా కాలమూ, వర్షాలూ పోగానే సీతా దేవిని వెదకిద్దాము' అన్నాడు సుగ్రీవుడు. మాల్యవంతంలో రాముడికి విడిది ఏర్పాటు చేశాడు. అందాకా తాను కిష్కింధలో వుంటూ వచ్చాడు.

వర్షాకాలం వచ్చింది. పర్జన్యుడిసామ్రాజ్యం సర్వసంపదలతో తులతూగింది. మేఘాలు తూర్యారవాలుచేశాయి. కొంగలు రెక్కలతో వింజామరాలు వేశాయి. నెమళ్ళు పురులు విప్పి గొడుగులు పట్టాయి.

**అ శో క వ న ం**

అక్కడ, రావణుడి చెరలో అశోకవనంలో వురిలోపడ్డ లేడి పిల్లలా బాధపడుతూ వుంది సీత. ఎల్లప్పుడూ భర్తనే తలుచుకుంటూ ఏడుస్తూవుంది. ఎంతో మంది రాక్షసస్త్రీలు, వికృతరూపాలవాళ్ళు ఆమెని కాపలా కాస్తూ వుండేవాళ్ళు. ఒకదానికి మిడిగుడ్లు వుంటే, వొకదానికి నుదుటిమీద కళ్ళు వుండేవి రాక్షస స్త్రీలకి. ఒకదానికి వొక్కటే కన్ను వుంటే, వొకదానికి వొక్కటే చన్ను. ఒకదానికి వొక్కటే కాలయితే, వొకదానికి వొకటే చెయ్యి. వీళ్ళంతా రాత్రింబగళ్ళు కంటిమీద రెప్ప వెయ్యకండా సీతాదేవి చుట్టూ కూచుండేవాళ్ళు. ఆమెని బెదిరించేవాళ్ళు. కసిరేవాళ్ళు. తిట్టేవాళ్ళు. కొట్టవచ్చే వాళ్ళు. 'ప్రపంచాలప్రభువు మా రావణాబ్రహ్మ. ఆయన్ని పెళ్ళాడకపోతే మింగేస్తాం నిన్ను. కండలు పీక్కు తినేస్తాం' అంటూ భయపెట్టేవాళ్ళు. తంపటపెట్టినట్లు వుండేది వాళ్ళ బాధ. భరించలేక పోయేది సీత.

'కానీండి బతుకుమీద ఆసే లేదు నాకు. మీయిష్టం వచ్చి నట్టు చెయ్యండి. రాముణ్ణితప్ప పరాయి మగవాణ్ణి తలచనైనా తలచ లేను నేను' అంది వొకనాడు సీత. ఆమె అలా అనడమే తడువు,

ఆమాటలు చెప్పడానికి రావణబ్రహ్మ దగ్గిరికి పరిగెత్తారు కొందరు రాక్షసస్త్రీలు.

అందరిలోకీ మంచిది త్రిజట. ఎప్పుడూ నెమ్మదిగా మాట్లాడేది. అన్యాయమంటే ఆమెకి నచ్చేది కాదు. సందు చూసుకుని అవాళ మెల్లిగా సీతదగ్గిరికి వచ్చింది త్రిజట. 'అమ్మా, శుభవార్త తెచ్చాను. నిజం. నామాట నమ్ము. అవిద్ధుడు మా ముసలి రాక్షసుడు నీతో కబురు చెప్పమన్నాడు. రాముడంటే ఇష్టం వాడికి. అందుకే నిన్ను వోదార్చమని పంపాడు నన్ను.

'నువ్వు వచ్చేశాక మీ ఆయనా మీ మరిదీ కలుసుకున్నారు. సుగ్రీవుడితో నేస్తం కట్టారు. నిన్ను వెదికి, విడిపించే ప్రయత్నంలో వున్నారిప్పుడు. నువ్వు భయపడకు. పరాయి ఆడదాన్ని బలాత్కారం చేస్తే తల పగిలిపోతుందని రావణుడికి నలకూబరుడి శాపం వుంది. వెనకటికి నలకూబరుడికోసం వెళుతూ వున్న రంభని దార్లో చెరపట్టాడు రావణుడు. అందుకని అలా శపించాడు నలకూబరుడు. అంచేత రావణుడు బలాత్కారంచేసే ప్రమాదం నీకు లేదు.

'మరోమాట, వాడి అంతికాలం వచ్చేసింది. అది సూచిస్తూ కలవచ్చింది నాకు. నాకల ఎప్పుడూ అబద్ధం కాదు. చెపుతాను విను. గాడిదలు పూడిన రథంమీద దక్షిణదిక్కు వెళ్ళుతున్నాడు రావణుడు. తల విరబోసుకుని వున్నాడు. ఒంటినిండా నూనె పులుముకున్నాడు. అతడిచుట్టూ కుంభకర్ణుడూ మొదలయినవాళ్ళు మూగి, నవ్వుతున్నారు. ఎర్రటి గంధాలు రాసుకున్నారు వాళ్ళు. ఎర్రటి పూలదండలు వేసుకున్నారు. తలలు విరబోసుకుని దిస మొలలతో అందరూ ఆదిక్కే వెళ్ళుతున్నారు. మా విభీషణుడు మాత్రం తెల్లటి హంస రెక్కల్లాంటి బట్టలు కట్టుకున్నాడు. తెల్లటి గంధం పూసుకున్నాడు. తెల్లటి పూలదండలు వేసుకున్నాడు. తెల్లగొడుగు వేసుకుని, తెల్లటి

కొండశిఖరంమీద కూచున్నాడు, నలుగురు మంత్రులు అతడి నాలుగుదిక్కులా కూచున్నారు. మహారాజులా వెలిగిపోతున్నా డాయన. నిజంగా రాక్షసుల్లో పుట్టవలసినవాడు కాడాయన. కల కాదు. నాకు నిజంగానే వుంది అదంతా.

'ఇంకావిను. శ్రీరాముణ్ణీ చూశాను. ఆయనకీర్తి వెన్నెలలా భూమీ ఆకాశమూ నిండిపోయివుంది. ఆయనా లక్ష్మణమూర్తీ వొక పట్టపుటేనుగుమీద కూచుని వున్నారు. ఇద్దరూ తేనె కలిపిన కమ్మని పాయసం తాగుతున్నారు. పులిచేత దెబ్బతిన్నావుట నువ్వు. ఒంటి నిండా నెత్తుర్లు కారుతున్నాయి. ఏడుస్తూ ఉత్తరదిక్కు వెళ్లుతున్నావు. నమ్ము. ఈ కల స్పష్టంగా తెలుస్తూనే వుంది. రావణ కుంభకర్ణుల చావుతప్పదు. మీకు శుభం కలుగుతుంది. త్వరలోనే మీ ఆయన నిన్ను తీసుకువెళతాడు. విచారించకు మరి' అంటూ ఓదార్చింది.

సీతకీ నమ్మకంగానే తోచాయి త్రిజట మాటలు. కొంత వూరటా కలిగించాయవి.

సీతమీద మనస్సు పెట్టుకుని బాధపడుతూ వుండేవాడు రావణుడు. దేవతల్నీ, దానవుల్నీ, గంధర్వుల్నీ అందర్నీ జయించా డతడు. కాని, మన్మథుడిదగ్గిరమాత్రం కానిస. సీతకోసం బాగా ముస్తాబయ్యాడు అవాళ. మంచిమంచి నగలు పెట్టుకున్నాడు. గమ్ము మనిపోయే పూలదండలు వేసుకున్నాడు. డాబయిన బట్టలు కట్టుకున్నాడు. నడక నేర్చిన కల్పవృక్షంలాగ తయారయాడు. అయితే, తన సొంపంతా స్మశానంలో లేచిన మర్రిచెట్టులా భయంకరంగానే వుంది.

తిన్నగావచ్చి, అశోకవనంలో ప్రవేశించాడు రావణాసురుడు. రోహిణిదగ్గిరికివచ్చిన శనిగ్రహంలా సీతదగ్గిరికి వచ్చాడతడు. ప్రేమ

కురిపించడం మొదలుపెట్టాడు. 'ఎందుకు పిల్లా, ఇలా విచారిస్తూ కూచున్నావు? బాగా ముస్తాబుచేసుకుని, నన్ను కొంచెం దయచూడ రాదూ! దేవతాస్త్రీలు వున్నారు. యక్షుల అమ్మాయిలు వున్నారు. రాక్షసస్త్రీలు వున్నారు. నాగులపడుచులు వున్నారు. అప్సరసలూ వున్నారు. వీళ్ళందరినీ కాదని, నీమీదే మనస్సు పెట్టుకున్నాను నేను. నిజంగా ఇది నీ భాగ్యం అన్నమాట! ఈమాత్రం తెలుసుకో లేక పోతున్నావు. అదే ఆశ్చర్యంగావుంది నాకు. రాముడో రాముడో అని ఏడుస్తావేమిటి? వాడికి వో సంపదా? రాజ్యమా? దిబ్బానా? ఇల్లా? వాకిలా? ఏముందని! అడవిలోతిరిగే ఆపేదవాడికోసం పడిచస్తా వేమిటి? వాడితో వొక సుఖమూ, ఏమన్నానా?

'ఇదిగో, నన్ను చూడూ. ప్రపంచాలన్నిటికీ ప్రభువుని నేను. నాఆజ్ఞకి ఎదురుచూస్తూ పద్నాలుగుకోట్ల రాక్షసభటులు వున్నారు. ఇరవైఎనిమిదికోట్ల రాక్షసవీరు లున్నారు. ఎనభైకోట్ల యక్షు లున్నారు. ధనాధిపతి కుబేరుడు మాఅన్న. బ్రహ్మదేవుడు మాతాత. బ్రహ్మతరవాత బ్రహ్మంతవాడు, విశ్రవసుడు మానాన్నగారు. కుబేరుడు పెట్టుకున్న గంధర్వులూ, అప్సరసలూ, నన్ను సేవిస్తూ వుంటారు. ఇదో లోకపాలకుడు అని ముల్లోకాల్లోనూ నన్ను పొగుడుతారు. దేవేంద్రుడి ఇంట్లోలాగే, మాఇంట్లో తినుబండారాలు కుప్పలు కుప్పలు. తరుగే లేదు వాటికి. నువ్వు ఊఁ అంటే చాలు. వీటి అన్నింటిమీదా, చివరికి నా ప్రాణాలమీదా నువ్వే మహారాణివి' అంటూ ఏవేవో వెళ్ళబోశాడు.

క్రోధం, దుఃఖం, బాధ - సహించలేకపోతూ వుంది సీత. అతడి దిక్కున్నా తిరగలేదామె. ఒక గడ్డిపరకతీసి చేత్తోపుచ్చుకుంది. దాన్నే సంభోధిస్తూ మాట్లాడింది. 'పరస్త్రీని నేను. పతివ్రతని. నిన

పోయురాలిని. ఎందు కిలా నన్ను హింసిస్తావు? రాక్షసుడివి నువ్వు. మనుష్యస్త్రీని నేను. ఒల్లనిదాంతో ఏం సుఖం నీకు? బ్రహ్మదేవుడి మనమ ణ్ణంటున్నావు! ఐదో లోకపాలు ణ్ణంటున్నావు! కుబేరుడితమ్ము ణ్ణంటున్నావు! ఇంతవాడివి! ఈకారుకూత లేమిటి? ఈ అధర్మం నెత్తుకోవడ మేమిటి?! అంటూ పవిటకొంగుతో మొహం కప్పుకుని జాలిగా ఏడ్చింది.

ఇదంతా చూసి, ఇంకా ఏవేవో అనరానివన్నీ అన్నాడు రావణుడు. ఏమన్నా లాభం లేకపోయింది. రుసరుస లాడుతూ అవా ళకి ఇంటికి వెళ్ళిపోయా డతడు.

# అరణ్యపర్వం

## ఏడో ఆశ్వాసం

**మాల్యవంతం**

ఎండాకాలం వెళ్లిపోయింది. మాల్యవంతం గుహాలోనే వర్షాకాలం–కొత్తమేఘాలతో అందమయిన ఆదినాలు దుర్భరమయిన సీతావియోగంతో ఎలాగో వెళ్ళబుచ్చాడు రాముడు. శరత్కాలం వచ్చింది. వెన్నెల వొలకపోస్తూ వున్నాయి రాత్రుళ్ళు. వికసించిన కలవపువ్వుల పరిమళాలతో ఘుమఘుమ లాడిపోతున్నాయి చల్ల గాలులు. ఒకంతట కదలనట్టున్నాయి రాత్రుళ్ళు. భరించలేక పోయాడు రాముడు.

'తమ్ముడూ, చూశావా సుగ్రీవుడి మోసం!' అన్నాడు, లక్ష్మణుణ్ణి చూసి రాముడు. 'వాలినిచంపి, వానరరాజ్యం ఇచ్చాం. భార్య దొరకడంతోటే, మనమాట మరిచిపోయాడు సుగ్రీవుడు. కృతఘ్నుడు! తనకోతిబుద్ధి చూపించుకున్నాడు. ఇంక ఇక్కడ మనకి ఏంపని! వెంటనే నువ్వు కిష్కింధ వెళ్ళు. బాధ్యత మరిచిపోయిన ఆ దురాత్మకుణ్ణి వాడి అన్నదగ్గిరికే పంపించి రా. నువ్వు వెళ్ళేసరికే గాని, మన కార్యప్రయత్నంలో వుంటేమాత్రం ఏమీ అనకు. అతణ్ణి నీతో కూడా పిలుచుకురా' అన్నాడు.

ధనుస్సూ, బాణాలూ పుచ్చుకున్నాడు లక్ష్మణుడు. చరచరా కిష్కింధ వెళ్ళాడు. అతణ్ణి చూసి, అడావుడిగా ఎదురు వచ్చాడు సుగ్రీవుడు. రెంటుచేతులూ జోడించాడు. తగిన విధంగా గౌరవ సత్కారాలు చేశాడు.

రాముడు చెప్పిన మాటలు చెప్పాడు లక్ష్మణుడు. గడగడ లాడాడు సుగ్రీవుడు. 'లక్ష్మణా, రామకార్యం లోపంచేసి, ఏ చెరువు నీళ్ళు తాగుతాను?' అన్నాడు, వినయంగా. 'దేవిని వెదకడంకోసం సుమారు నెలకిందే పంపాను. బలవంతులూ, బుద్ధిమంతులూ మంచి మంచి వానరులు నాలుగుదిక్కులూ వెళ్ళారు. భూప్రపంచమంతా—పల్లెలూ, పట్నాలూ, అడవులూ, సముద్రాలూ అన్నీ గాలించి వస్తారు. చెప్పి వెళ్ళినప్రకారం, వాళ్లు రావడానికి ఇంకా అయిదు రోజులే వ్యవధి వుంది. వాళ్ళు రాగానే శుభవార్త పట్టుకుని మీదగ్గిరికి రావాలని సిద్ధంగా వున్నాను' అన్నాడు.

సంతోషించాడు లక్ష్మణుడు. సుగ్రీవుణ్ణి కూడా తీసుకుని మాల్యవంతం వచ్చాడు. సుగ్రీవుడు చేసిన ఏర్పాట్లు అన్నగారికి విన్నవించాడు. విని, సంతోషించాడు రాముడు.

కొద్దిదినాల్లో తూర్పూ, పడమరా, ఉత్తరాదీ వెళ్ళిన వానరులు తిరిగి వచ్చేశారు. ఎక్కడా సీతజాడ కనపళ్ళేదని చెప్పారు వాళ్ళు. బాధపడ్డాడు రాముడు. ఇక దక్షిణదిక్కు వెళ్ళినవాళ్ళు మాత్రం రావాలి. వాళ్ళు తప్పక సీతకబురు తేవచ్చు. ఈ వొక్క ఆశతోనే ప్రాణాలు నిలుపుకుంటూ కూచున్నాడతడు.

మరో నెల గడిచిపోయింది. క్షణం వొక యుగంలా వుంది. దుఃఖిస్తూ కూచున్నాడు రాముడు. లక్ష్మణుడూ, సుగ్రీవుడూ దిగాలుగా దగ్గిర కూచుని వున్నారు. మాల్యవంతమంతా విచారంలో మునిగిపోయినట్టుంది.

ఇంతలో కొంతమంది వానరులు రొజుకుంటూ వచ్చారు. మన మధువనం మరి లేదు' అంటూ సుగ్రీవుడితో చెప్పారు. వాలేమిటి, మీరేమిటి—ప్రాణంలా చూస్తూవున్న తోట అది. ఆంజనేయులూ అంగదకుమారులూ మొదలయినవాళ్ళు అందరూ

పడి, సర్వదుంబాలా చేసేస్తున్నారు మధువనం. పళ్ళమాట అటుండ నివ్వండి, పిందెలుకూడా తెంపేసి కొరికేస్తున్నారు. మేము అడ్డుకో బోతే కొట్టీ, తిట్టీ, నానా హంగామాచేసి వదిలిపెట్టారు' అన్నారు.

'వీళ్ళు దక్షిణాదికి వెళ్ళినవాళ్ళు. అమ్మవారిని చూసే వుంటారు. ఆ సంతోషం ఫలితమే ఇదంతా అనుకుంటాను. కార్యం సాధించుకు వచ్చినవాళ్ళకి ఈమాత్రం చనువు సహజమే మరి!' అంటూ రాముడితో చెప్పాడు సుగ్రీవుడు.

ఆంజనేయులూ మొదలయినవాళ్ళందరూ మనసారా మధు వనంలో విహరించారు. మంచిమంచి పళ్ళన్నీ కడుపారా తిన్నారు. తేనెపట్లు కొట్టి, పీకలుమొయ్యా తాగారు. చల్లటి చెట్లకింద అలసట తీర్చుకున్నారు. బాగా మనసుతీరాక, గెంతులువేస్తూ మాల్యవంతం వచ్చారు. లక్ష్మణుడితోనూ, సుగ్రీవుడితోనూ కూచున్న రాముణ్ణి చూసి, అంతమందీ వొక్కసారి పాదాభివందనం చేశారు. కలకల లాడుతూవున్న వాళ్ళ మొహాలు చూడగానే శుభవార్త పట్టుకు వచ్చారని గ్రహించేశాడు రాముడు.

'సీతమ్మవార్ని చూసి వచ్చాను ప్రభూ,' అంటూ అందరి లోకీ ముందుకి వచ్చి, చేతులు జోడించాడు ఆంజనేయులు. మేమంతా దక్షిణందిక్కు వెళ్ళాం. కొండలూ, అడవులూ, పల్లెలూ, పట్టణాలూ అన్నీ గాలించాం. ఆవైనమంతా మనవి చేస్తాను. చిత్తగించు.

'అందరమూ కలిసి అక్కడక్కడా వెదుక్కుంటూ వెళు తున్నాం.ఒక్కదగ్గిర చిత్రంగా భూమిలో వొకపెద్దసొరంగం కనపడింది. అందరమూ అందులో దూరాం. కన్ను పొడుచుకున్నా కనిపించనంత చీకటి. దారికడాకూ ఏవేవో పురుగులు. అలాగే ఆసొరంగంలోంచి ఎన్నో యోజనాలు నడిచి వెళ్ళాం. వెళ్ళగా, వెళ్ళగా వొకపట్నం అవుపించింది. సూర్యుడిలా ప్రకాశిస్తూ వుంది ఆ పట్నం. అక్కడ

వొక తపస్విని కనపడింది. మమ్మల్ని చూసి, ఎంతో ఆదరించిం దామె. తనపేరు ప్రభావతి అనీ, ఆ పట్నం మయుడిపట్నం అనీ చెప్పింది. రుచిగావున్న ఆహారమూ, పానీయమూ ఇచ్చి, మమ్మల్ని తృప్తిపరిచింది. ఆమె చెప్పినదారిని సొరంగంనుంచి బైటికి వచ్చేశాం. సహ్యాపర్వతమూ, దర్దురపర్వతమూ చూశాం. అవి దాటి మలయ పర్వతం ఎక్కాం, అక్కడినించి విశాలమైన మహాసముద్రం చూశాం.

'ఆ సముద్రం వరకూ వున్న భూభాగం యావత్తూ వెదికేశాం. కనపళ్ళేదు అమ్మవారు. అక్కడినించి సముద్రమే సముద్రం. దారీ తెన్నూ లేదాయె. 'అమ్మవారు కనపళ్ళేదని రాములవారితో చెప్పడం కంటే, వారికి బాధకలిగించడం కంటే, ఇక్కడ చావు నయం మనకి' అనుకుంటూ అందరమూ నిరాశ చేసుకున్నాం. బతుకుమీద ఆశ వదిలిపెట్టేశాం. నిరశనవ్రతం నిశ్చయించుకున్నాం. అందరమూ వొక్కదగ్గిర చదికిలబడిపోయాం. 'రామకార్యం కోసం ప్రాణాలు వదిలిపెట్టాడు జటాయువు. పుణ్యలోకాలు పొందాడు. మనమూ అలాగే ఆమరణప్రాయోపవేశం చేసి ధన్యుల మవుతాం' అంటూ మాలో మేంమాట్లాడుకుంటున్నాం.

'మామాటలు విని, మలయపర్వత గుహలోంచి కొండంతరాం బందు వొకటి కన్నీళ్ళు కారుస్తూ మాదిక్కునడిచివచ్చింది. 'జటాయువు అంటున్నారు. ఎవరునాయనా మీరూ' అంటూ తిన్నగా మాదగ్గిరికే వచ్చిందది. 'జటాయువు నా తమ్ముడు. అనూరుడు మా తండ్రి. సంపాతి అంటారు నన్ను. నేనూ మాతమ్ముడూ సరదాగా వొకనాడు సూర్యమండలానికి ఎగిరాం. సూర్యుడి వేడికి నా రెక్కలు కాలి పోయాయి. నాతమ్ముడికి ఏమీ కాలేదు. ఈ కొండమీద పడి పోయాను నేను. అవాళనించీ, ఎక్కడికీ కదల్లేక, ఇక్కడే ఈగుహలో ఏడుస్తున్నాను. నాతమ్ముడు ఎక్కడవున్నాడో. ఎలావున్నాడో —

ఏకబురూ తెలియలేదు నాకు. చెప్పండి బాబూ, జటాయువు క్షేమమేనా? అని అడిగాడు.

'మీ సంగతి వివరించి చెప్పాము మేం. అమ్మవారిని రావణాసురుడు ఎత్తుకుపోవడమూ, వాడితో దెబ్బలాడి జటాయువు కాలం చెయ్యడమూ అన్నీ చెప్పాం. తమ్ముడికోసం ఎంతో అంత దుఃఖపడ్డాడు సంపాతి. మా విషయం అడిగి తెలుసుకున్నాడు. 'రావణుడు తెలుసు నాకు. ఉద్దోలమయిన పరాక్రమం వాడిది. వాడి రాజధాని లంకాపట్నం సముద్రంమధ్య వుంది. ఇక్కడికి నూరు యోజనాలు వుంటుంది. అక్కడికి వెళ్ళండి అక్కడే వుంటుంది సీత' అని చెప్పి వెళ్ళాడు సంపాతి.

'సముద్రం దాటడం ఎలాగ? ఈ ఆలోచనలో పడ్డాం మేం. ఒక్కడూ ముందుకి రాలేదు. రామచంద్రా, నీ అనుగ్రహమూ, మా తండ్రి వాయుదేవుడి దయా ఎక్కడి లేని ఉత్సాహమూ, బలమూ ఇచ్చాయి నాకు. నేనే మహాసముద్రం దాటాను. లంకాపట్నం వెళ్లాను.

'సముద్రం మధ్య త్రికూటపర్వతంమీద మణులు చెక్కిన పెద్ద పెద్ద బంగారం మేడలతో ధగధగా మెరిసిపోతూవుంది లంక. పట్నం యావత్తూ సందులూ, గొందులూ పిసరంత వదలకండా వెదికాను. చివరికి రావణుడి అంతఃపురవనం అయిన అశోకవనంలో సీతామహాలక్ష్మిని కనుక్కున్నాను.

'కన్నీళ్ళు కారికారి, పాకుడు దేరిపోయాయి మాతల్లి చెంపలు. నిట్టూర్పుల వేడికి కమిలిపోయి కారాకు లావున్నాయి పెదవులు. అశోకవృక్షం పూతలేకపోతే తూలిపోయేటంత దుర్బలంగా వుంది శరీరం. మూర్తీభవించిన శోకదేవతలాగ 'రామా, రామా' అంటూ వొకటే ఏడుపు ఏడుస్తూ వుంది. చూడగానే పోల్చేసుకున్నాను నేను

'వినయంగా వెళ్ళి నమస్కారం చేశాను. 'అమ్మా, రాములవారి దూతని. ఆంజనేయుణ్ణి' అంటూ విన్నవించాను. 'రాక్షసుణ్ణి

కాను. నిజమయిన వానరుణ్ణి. సందేహించకమ్మా! నిన్ను వెదక డానికే వచ్చాను. రామలక్ష్మణులు క్షేమంగా వున్నారు. వానర చక్రవర్తి సుగ్రీవుడితో స్నేహంచేసి, నీప్రయత్నంలోనే వున్నారు. జాప్యంలేదిక. లంకవచ్చి, నీచెర విడిపిస్తారు. విచారించకు' అన్నాను.

'ఒక్కక్షణం ఏమాలోచించిందో తల్లి 'నీమాట నమ్ముతు న్నాను' అంది. 'అవిద్ధుడని వొకముసలిరాక్షసుడి దగ్గిర విని, ఇంతకి ముందే త్రిజట చెప్పింది నాకు. సంతోషించాను. వెళ్ళు నాయనా, నాస్థితి విన్నవించి శ్రీరాముణ్ణి తీసుకురా. నీకార్యం సిద్ధిస్తుంది, అని ఇదిగో, ఆనవాలూ ఇచ్చింది మాతల్లి. ఆమె తలమీాది శిరోరత్నం ఇది. అంతేకాదు. స్వామీా, ఇంకా నమ్మకం కుదరడానికి, చిత్ర కూటంమీాద జరిగిన కథ జ్ఞాపకం చెయ్యమంది. అమ్మవారి సెలవు తీసుకుని, లంకాపట్నం కాల్చేసి మరీ వచ్చాను ప్రభూ' అని చెప్పి, సీత ఇచ్చిన శిరోరత్నం రాముడి చేతిలో పెట్టాడు ఆంజనేయులు.

సీత హృదయం మూర్తి మంత మైనట్టు వుంది శిరోరత్నం. హృదయానికి అద్దుకున్నాడు రాముడు. సీతనే కౌగలించుకున్నట్టూ, ఆమె చనుమొనలే గుండెలకి అద్దుకున్నట్టూ క్షణకాలం రెండుకళ్ళూ మూసేసుకున్నాడు.

సీత వునికేమో తెలిసింది. ఇక ఎంతట వెళ్ళి, ఎంతట ఆమెని కలుసుకోడమా అని గుబగుబలాడి పోయింది రాముడి మనస్సు. సుగ్రీవుడితట్టు చూసి, 'మనసైన్యం సిద్ధంచేయించు, అన్నా డతడు. దిక్కుదిక్కులా వున్న వానరనాయకులికి తాకీదులు పంపాడుసుగ్రీవుడు.

సుగ్రీవుడి ఆజ్ఞకి తిరుగులేదు. తాకీదులు అందడమే తరవాయి. నాలుగుదిక్కులనుంచీ తండోపతండాలు వచ్చిపడింది వానరసేన. గజుడూ, గవయుడూ చెరో పందకోట్ల వానరులతో వచ్చారు. కుముదుడు అరవయికోట్ల సైన్యంతో వచ్చాడు. వాలిమామ

సుషేణుడు వెయ్యికోట్ల సేనతో వచ్చాడు. గంధమాదనంనించి గంధమాదనుడు సెయ్యికోట్ల రాణువతో వచ్చిపడ్డాడు. దధిముఖుడు లెక్కా జమా లేనంత దండు వేసుకు వచ్చాడు. లక్షకోట్ల ఎలుగు బంట్లతో పెద్ద కారుమబ్బులా కదలివచ్చాడు జాంబవంతుడు. ఇంకా ఎంతోమంది వానరనాయకులు లక్షలూ, కోట్లూ, అర్బుదాలూ- పటాలాలు పట్టుకువచ్చారు. రకరకాల రూపాలవాళ్ళూ, భయంకరులూ, బలవంతులూ ఎంతోమంది మహాసముద్రాల్లా వచ్చి మాల్యవంతంమీదా, ఆచుట్టుపక్కలా దండువిడిశారు.

అవి అరుపులు కావు. అవి పరుగులు కావు. అవి గెంతులు కావు. గుహలనిండా వాళ్ళే. ఏ చెట్టుమీద చూసినా వాళ్ళే. ఏగుట్ట మీద చూసినా వాళ్ళే. ఓ మహాకోలాహలంగా వుంది మాల్యవంతం.

సుగ్రీవుడు జతపరిచిన ఇంతసహాయంతోనూ తమ్ముణ్ణి వెంట వేసుకుని బయల్దేరాడు రాముడు. సైన్యమంతటికీ ఉత్సాహంగా గెంతులేస్తూ ముందునడిచాడు ఆంజనేయులు. అంగదుడూ, నలుడూ, నీలుడూ మొదలైనవాళ్ళు పక్కలా, వెనకాలా నడిచారు. పళ్ళూ, నీళ్ళూ సమృద్ధిగా దొరికేచోట్ల మకాం వేస్తూ కొన్నాళ్ళకి దక్షిణ సముద్రం దగ్గిర మరోసముద్రంలా కోలాహలంచేస్తూ చేరింది రామదండు.

సేతువు

ఇంతవరకూ బాగానే సాగింది ప్రయాణం. మరి ఇక్కణ్ణుంచి ఏమిటి సాధనం? సుగ్రీవుడికేసి చూశాడు రాముడు. 'మన దండేమో అమితంగా వుంది. సముద్రమూ అతీతంగా వుంది. ఇది దాటే ఉపాయమేదో నువ్వే ఆలోచించు' అన్నాడు. నాయకులు యావన్మందీ ఆలోచనలో పడ్డారు. 'తెప్పలు కట్టుకు వెళదాం' అన్నారు కొందరు. 'ఓడలమీద అయితే మరీ సులువు' అన్నారు కొందరు,

నవ్వాడు రాముడు. 'మీరు చెప్పిన ఉపాయం మంచిదే. కాని, ఇంత సైన్యానికీ తెప్పలూ, ఓడలూ తయారు చెయ్యడం అంటే అయితికాని పని. అదీ కాక, నూరు యోజనాల సముద్రం తెప్పల మీద వెళితే, శత్రువు మీదపడి నాశనంచేస్తాడు. ఏదో సామాన్యులయిన వర్తకుల మోస్తరుగా ప్రయాణం చెయ్యడం వీరులికి రాణించదు. అంచేత, నేను చేసుకున్న నిశ్చయమేదో చెపుతాను వినండి. ఉపవాసవ్రతంచేసి సముద్రుణ్ణి ప్రార్థిస్తాను. సంతోషంగా అతడు నాకు దారిఇస్తే సరే సరి. పరాయివాడిగా నన్ను తలిచి నిరాకరిస్తాడూ, మరీ మంచిది. నా బాణాగ్నితోనే సముద్రజలం లిప్తలో ఇంకబెట్టేస్తాను' అన్నాడు.

తమ్ముడు లక్ష్మణుడితో సహా దర్భలమీద పడుకుని, ఉపవాస వ్రతంతో సముద్రుణ్ణి ప్రార్థించాడు రాముడు. తన నీటిజంతువుల పరివారంతో సహా వచ్చి రాముడి ముందు ప్రత్యక్ష మయాడు సముద్రుడు. 'నీ వ్రతదీక్షకి సంతోషించాను. ఏంకావాలో చెప్పు' అని అడిగాడు రాముణ్ణి. 'లంకకి దారికావాలి' అన్నాడు రాముడు. 'నువ్వు దారిఇచ్చావో మంచిమాట. లేదంటే సూర్యుడిలాంటి బాణాలు వేసి, నీళ్ళులేకుండా చెయ్యవలిసివస్తుంది నిన్ను' అన్నాడు. 'రామా, నీ పనికి అడ్డురావడానికి నేను మాత్రం ఏపాటివాణ్ణి!' అన్నాడు సముద్రుడు. కానైతే, వొక్కమాట విచారించాలి నువ్వు. ఇవాళ నీకు దారి ఇస్తే, అదే ఆనవాయితీ అయిపోతుంది. ప్రతీవాడూ బాణాలుచూపించి బెదిరిస్తాడు నన్ను. కనక, నేనో ఉపాయంచెపుతాను, విను. మీలో నలుడు మంచి శిల్పవిద్య తెలిసిన వాడు. విశ్వకర్మ కుమారు డతడు. అతణ్ణి సేతువు కట్టమను. నామీద వేసిన కొండలూ, రాళ్ళూ మునిగిపోకండా చేస్తాను నేను. సేతువుమీద వెళ్ళి శత్రువుని సాధించు. సరేనా!' అన్నాడు. దానికి సమ్మతించాడు రాముడు.

నలుణ్ణి పిలిచి సేతువు కట్టమన్నాడు రాముడు. వేలకొద్దీ వానరులు కొండలూ, చెట్లూ పెరికి తేవడం మొదలుపెట్టారు. వాళ్ళు అందిస్తూవుంటే, అవి సముద్రంలో వేసి లంకకి సేతువుకట్టాడు నలుడు. నూరుయోజనాల పొడవూ, పదియోజనాల వెడల్పూ కలిగి బాగా దృఢంగా తయారయింది సేతువు.

ఇంతలో రావణుడితో దెబ్బలాడి, తన అప్తుల్ని వెంటపెట్టుకుని వచ్చి, రాముణ్ణి ఆశ్రయించాడు విభీషణుడు. అతణ్ణి చూడగానే అతడు మంచివాడని పోల్చుకున్నాడు రాముడు. అతణ్ణి ఆదరించి, తన ఆంతరంగికుల్లో చేర్చుకున్నా డతడు. అతణ్ణి రాక్షసరాజ్యానికి రాజుచేస్తానని మాటఇచ్చాడు. లక్ష్మణుడితో నేస్తమూ కట్టించాడు.

విభీషణుడితోనూ, వానరసైన్యంతోనూ కలిసి, సేతువుమీద సముద్రం దాటాడు రాముడు. త్రికూటపర్వతం ఎక్కి, లంకాపట్నం చుట్టూ శిబిరాలు వేయించాడు. తాటివనాల్లోనూ, అగురుతోటల్లోనూ, తియ్యమామిడి తోపుల్లోనూ, నిమ్మా నేరడా కొబ్బరీ మొదలయిన తోటల్లోనూ మకాంవేసి బైఠాయించింది రామదండు.

శిబిరాలన్నీ వెయ్యికళ్ళతో కనిపెడుతున్నారు దండు నాయకులు. రాక్షసులు మాయచెయ్యకండా జాగ్రత్తపడుతున్నాడు విభీషణుడు. అంత అలావున్నా శుకుడూ సారణుడూ అని ఇద్దరురావణాసురుడి గూఢచారులు కోతులువేషంలో వచ్చి శిబిరంలో దూరిపోయారు. వెంటనే వాళ్ళని కనిపెట్టేశాడు విభీషణుడు. వాళ్ళని పట్టుకుని రాముడి ఎదట పెట్టాడు. 'బాగానేవుంది' అన్నాడు రాముడు. రానేవచ్చారు వీళ్ళు. మనసైన్యం యావత్తూ వీళ్ళకి చూపించి మరీ వదలండి, అన్నాడు.

రామదండు యావత్తూ చూసి వెళ్ళారు శుకసారణులు. రావణుడితో వర్ణించి చెప్పారు.' అది దరదుకాదు, మహాసముద్రం' అన్నారు.

దాన్ని గెలవడం అసాధ్యం' అన్నారు. 'రాముడూ, లక్ష్మణుడూ దేవతలు కాని మనుష్యులు కారు' అన్నారు. 'ఆ కోతుల బాగోత మేదో చూద్దాం కదూ' — నిర్లక్ష్యంగా నవ్వుతూ అన్నాడు రావణుడు. యుద్ధానికే సిద్ధపడ్డాడతడు. రాకాసుల్లాటి పెద్దపెద్ద బురుజులతోనూ, దాటడానికి వీలుకాని లోతయిన అగడ్తలతోనూ, ఫిరంగులూ రాళ్ళయంత్రాలూ తోమరాలూ చక్రాలూ ముద్గరాలూ త్రిశూలాలూ మొదలయిన ఆయుధాలతోనూ, రథాలూ గుర్రాలూ ఏనుగులూ మొదలయిన వాహనాలతోనూ, మూంచి మెరికల్లాంటి రాక్షస భటుల్తోనూ పరాయివాడు తేరిచూడ్డానికి వీలులేకండా వుంది లంకా పట్నం. అలాంటి లంకాపట్నం మరింత కట్టుదిట్టంచేశాడు రావణాసురుడు. 'ఎవడొస్తాడో చూస్తాను' అంటూ ధీమాగా కూచున్నాడు.

ఇక్కడ, రాముడు సుగ్రీవుడితో కూడా కొలువుతీర్చాడు. అంగదుణ్ణి పిలిచాడు. 'వెళ్ళు వాడికిబుద్ధి చెప్పు. ఇప్పుడయినా మర్యాదగా సీతని విడిచిపెట్టమను' అని రావణుడి దగ్గిరికి రాయబారం పంపాడు.

పోతుటీగ దూరడానికి వీలులేకండా వుంది లంక. ఈసుళ్ళపుట్టలా కాపలా కాస్తున్నారు రాక్షసులు. అంతమంది కళ్ళల్లోనూ కారంకొట్టేశాడు అంగదకుమారుడు. చెంగుని గంతేసి లోపల ప్రవేశించాడు. నిండు సభలో కొలువుతీరి కూచున్నాడు రావణబ్రహ్మ. ఎదురుగుండా వెళ్ళి, టింగురంగడిలా కూచున్నాడు అంగదుడు. 'సూర్యవంశం మహారాజు, ధనుర్విద్యలో గురుదేవుడు, శ్రీరామచంద్రమూర్తి పంపించాడు నన్ను. అంగదుడు అంటారు నన్ను' — సభలో పిడుగులు పడ్డట్టు అన్నాడు అంగదుడు. ఆమహాప్రభువు నీతో చెప్పమన్నమాటలు వినిపిస్తాను. కాస్త సావధానంగా విను. 'ఏపాపమూ ఎరగని పేదమునుల్ని — అడవిలో ముక్కు మూసుకున్న వాళ్ళని- ఎంతమందినో చంపావు. దేవతల భార్యల్ని

చెరపట్టావు. లోకకంటకుడిగా తయారయావు. సరే, అదంతా ఒక ఎత్తు. నాజోలికిరావడం వొకఎత్తు. ఇపుడు రెండే మార్గాలు నీకు. లంకలో తలుపులు బిగించి కూచోవడం కాదు. మూతిమీద మీసం వుంటే యుద్ధానికిరా. లేదా, బతుకుమీద ఆస వుంటే శరణు జొచ్చి సీతని అప్పగించు. నాబాణాలు నీప్రాణాలకోసం నాలుకలు చాస్తున్నాయి. నిన్ను విడిచిపెడతా యన్నమాట కల్ల. నేనేదో మనిషి మాత్రుణ్ణే అనుకునేవు. నాచేవ ఏమిటో యుద్ధంలో తెలుస్తుంది నీకు. నిన్నూ, నీ రాక్షసబలాన్నీ, నీ లంకాపట్నంతో సహా భస్మంచేసి కాని వదిలి పెట్టను.

అంగదుడు చెపుతూవుంటే పదితలలతోనూ బుస కొట్టాడు రావణాసురుడు. అదిచూసి, దెయ్యాల్లాంటి రాక్షసులు నలుగురువచ్చి అంగదుణ్ణి పట్టుకున్నారు. ఒక్క గెంతుగెంతి సభామందిరం మేడ మీదికిఎగిరిపోయాడు అంగదుడు. చెట్టు దులిపితే రాలిపోయినట్టు నలుగురూ కిందపడ్డారు రాక్షసులు. నవరత్నాలతో వున్న సభా మండపశిఖరం వొక్కతాపుతన్నాడు అంగదుడు. అపశకునం సూచించే ఉల్కలాగ కిందపడిపోయింది శిఖరం. అక్కడినుండి అదే గెంతువేసి, వానరశిబిరంలో వచ్చి వాలాడు అంగదకుమారుడు. వెళ్ళింది మొదలు వచ్చిందాకా జరిగినవైనం రాముడికి విన్నవించాడు.

## యుద్ధం

'ఐతే, ఇక చూస్తారేం' అన్నాడు రాముడు. ఆమాత్రం ఇసారా ఇవ్వడమే తడువు, పోలో అంటే పోలో అని లేచింది రామదండు. తాటిచెట్లు పట్టుకున్న వాళ్ళూ, మద్దిచెట్లు పట్టుకున్న వాళ్ళూ, పెద్ద పెద్ద రాళ్ళూ పణుకులూ పట్టుకున్న వాళ్ళూ- రంగురంగుల కోతులు, కొండలంత లేసి కోతులు- కేకలు వేస్తూ గెంతులు వేస్తూ-

ఓ, బల బలా బయల్దేరాయి. మూకలు మూకలుగా, జట్లు జట్లుగా కెరటాల్లా ప్రవహిస్తూ, సముద్రంలా బయల్దేరింది రామసేన.

దండు దండంతా వెళ్ళి వొక్కసారి కోట ప్రాకారం మీదికి ఎగబాకింది. కాపలావాళ్ళని కొట్టీ, రక్కీ, కరిచీ తగిలేశాయి కోతులు. కోటగోడలూ, ప్రాకారాలూ, దేవిడీలూ, గోపురాలూ, డాబాలూ విరిచేశాయి కొన్ని. బురుజులమీదా, ప్రాకారాలమీదా వున్న ఆయుధాలు, గదలూ, పరిఘలూ, ఈటెలూ – వొకటేమిటి దొరికిం దల్లా పట్నంమీద కుమ్మరించాయి కొన్ని. దాంతో పట్న వాసులు యావన్మందీ పిల్లలూ, స్త్రీలూ, వృద్ధులూ లబోలబోమంటూ ఏడు పులు ప్రారంభించారు. అది చూసి, వేలూ కోట్లూ రాక్షసుల్ని పంపాడు రావణుడు. వాళ్ళంతా వొక్క మొగిని వచ్చి, కోతుల్ని రొప్పి, కోటగోడలు స్వాధీనం చేసుకున్నారు. ఇంతవరకూ కోతులతో కపిలవర్ణంగా వుంది కోట. వాళ్ళని తగిలేసి, రాక్షసులు ఆక్రమించడంతోటే, నల్లమబ్బులు కమ్ముకున్నట్టు కనపడిం దది.

వానరసైన్యం వెనక్కి తగ్గడంతోటే ధనుస్సులూ, బాణాలూ పుచ్చుకుని ముందుకివచ్చారు రామలక్షణులు. దాంతో వెనక్కి వెళు తూన్న వానరులందరూ మళ్ళీ కోటమీదికి ఎగబడ్డారు. కోట రక్షిస్తూ వున్న రాక్షసులు వాళ్ళని ఎదిరించారు. వాళ్ళు మీదికి రాకండా రాళ్ళూ, శూలాలూ, పరసలూ, పట్టిసాలూ, ముద్గరాలూ ప్రయో గించారు వాళ్ళమీద. వాటిని వేటినీ లక్ష్య పెట్టలేదు వానరులు. చెట్లూ రాళ్ళూ రప్పలూ విసురుతూ ప్రాకారంమీదికి పాకారు.

ఉభయ సేనలూ కలబడ్డాయి, ముష్టియుద్ధం ప్రారంభమైంది. రామదండుకి తరుగంటూ లేదు. అంతలో బర్హిణుడూ, ప్రజంఘుడూ, ఖరుడూ, క్రోధనుడూ, వృద్ధుడూ అని అయిదుగురు వీరుల్ని ప్రాకారం మీదివాళ్ళకి సాయం పంపాడు రావణుడు. పెద్ద సైన్యంతో వచ్చి

మాయాయుద్ధం మొదలెట్టారు వాళ్ళు. కంటికి కనపడకండా ఎక్కడ పడితే అక్కడ కోతిమూకలమీద దెబ్బతీశారు. మయాయుద్ధంలో వాళ్ళని మించినవాడు విభీషణుడు. చప్పున రంగంలోకి వురికాడతడు. నిమిషంలో వాళ్ళు అయిదుగురినీ చంపేశాడు. క్షణంలో సగం శాత్రుసేన చల్లారిపోయింది. చావగా మిగిలినవాళ్ళు పిక్కబలం చూపి, పట్నంలోకి పారిపోయారు.

అదంతా విన్నాడు రావణబ్రహ్మ. అతడి కోపానికి అంతూ పంతూ లేకపోయింది. ఈసారి మంత్రులతో సహా పెద్ద సైన్యం వేసుకుని తానే స్వయంగా బయలెళ్ళాడతడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ — ఓ, ఆసందడికి దడదడ లాడిపోయింది భూమి. శుక్రుడు నేర్పిన వొక భేదించరాని వ్యూహం పన్నాడు రావణుడు. ఆవ్యూహం రామదండుమీదికి నడిపించుకువచ్చాడు. దానికి సరైంది, బృహస్పతి చెప్పి పెట్టినప్రకారం వొకవ్యూహం పన్నాడు రాముడు. ఉన్నట్టువుండి హటాత్తుగా వుప్పొంగిన రెండుసముద్రాల్లాగ రెండు సైన్యాలూ వొక దాన్ని వొకటి డీకొన్నాయి.

రాముడు రావణుడితో కలబడ్డాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తుతోనూ, సుగ్రీవుడు విరూపాక్షుడితోనూ, తారుడు ఖర్వుడితోనూ నలుడు తుండకుడితోనూ కలబడ్డారు. ఉభయపక్షాలికి దేవాసుర యుద్ధంలాగ ఘోరమయిన యుద్ధం జరిగింది. లక్ష్మణుడు ఎన్ని బాణాలు వేస్తే అన్ని బాణాలూ వేశాడు ఇంద్రజిత్తు, రాముడూ, రావణుడూ వేస్తున్న బాణాల్తో భూమీ, ఆకాశమూ చీకట్లుకమ్మేశాయి. వాళ్ళఇద్దరిలోకీ రాముడిదే పై చెయ్యి అవుతూ వచ్చింది. రావణుడి శరీరం మంటలు పుట్టేటట్టు కొట్టాడు రాముడు. భరించలేకపోయాడు రావణుడు. దాంతో బిడియం లేకండా పట్నంలోకి పారిపోయాడతడు. రావణుణ్ణిచూసి, సేనకూడా తోకముడిచేసింది.

పారిపోతూవున్న రాక్షససైన్యం మళ్ళిస్తూ రామదండుమీాదికి వచ్చాడు ప్రహస్తుడు. దిగజారినధైర్యం బిగబట్టుకు వచ్చింది రాక్షస సేన, మళ్ళీ రెండు సేనలికీ ఘోరమయినయుద్ధం జరిగింది. సరాసరి వస్తూవున్న ప్రహస్తుణ్ణి కొండలా ఎదిరించాడు విభీషణుడు. పే—ద్ద కేకవేసి, విభీషణుణ్ణి గదతో కొట్టాడు ప్రహస్తుడు. అది కాసుకుం టూనే మంత్రం చదివి వాణ్ణి శక్తితో కొట్టాడు విభీషణుడు. నూరు గంటలతో ఖణేలు ఖణేలు మంటూ ప్రపంచం కాల్చడానికి లేచిన అగ్నిశిఖలా వెళ్ళింది శక్తి. ప్రహస్తుడి గుండెలమీాద పడింది. కొండ కూలినట్టు కూలిపోయాడు ప్రహస్తుడు.

ప్రహస్తుడు పడిపోగానే మళ్ళీ జంకేసింది రాక్షససైన్యం. అంతలో పెద్ద కారుమబ్బులు వచ్చిపడినట్టు ఎంతో సైన్యం వేసు కుని, దూసుకువచ్చాడు ధూమ్రాక్షుడు. వాడి ధాటికి ఆగలేక పోయింది వానరసైన్యం. దాంతో వొక్క గెంతుగెంతి ముందుకి వచ్చాడు ఆంజనేయులు. కొత్తబలం వచ్చినట్టయింది కోతులికి. అటు ధూమ్రాక్షుడూ, ఇటు ఆంజనేయులూ. హోరాహోరి జరిగింది పోరు. ఆంజనేయులు నాయకత్వంకింద పట్టపగ్గాలు లేకపోయాయి రామదండుకి. చెలరేగిపోయాయి కోతులూ ఎలుగుబంట్లూనూ. ఒకొక్కక్క తాపుతో రాక్షసుల రథాలు కూలదోస్తున్నారు వానరులు. రాళ్ళువిసిరి ఏనుగులు చంపేస్తున్నారు. చెట్లతో బాది గుర్రాలు పచ్చడిచేస్తున్నారు. రక్కేస్తున్నారు రాక్షసుల్ని. ముక్కూ చెవులూ కరిచేస్తున్నారు. గిజగిజా గింజుకున్నారు రాక్షసులు. నానా హంగామా అయిపోయారు. చావగా మిగిలినవాళ్ళు వెర్రిపరుగులు పెట్టిపారిపోయారు కొందరు. ధూమ్రాక్షుడి వెనక తలదాచుకున్నారు కొందరు. భయపడి, వున్న దగ్గిరే కూలబడిపోయారు కొందరు.

దాంతో కాలయముడే ఐపోయాడు ధూమ్రాక్షుడు. మేఘంలా గర్జిస్తూ, కోతులమీద పడ్డాడు. బాణాలమీద బాణాలు వడగళ్ళ వాన కురిపించాడు. ఉక్కిరిబిక్కిరి అయిపోయారు వానరులు. పెద్ద సింహనాదంచేశాడు ఆంజనేయులు. చెంగున గెంతువేసి, ధూమ్రాక్షుడి మీదికి వురికాడు. గదమీద గదా, పరిఘమీదపరిఘా ఆంజనేయుడి మీద విసిరాడు ధూమ్రాక్షుడు. రాళ్ళూ, చెట్లూ వర్షంకురిపించాడు ఆంజనేయులు. ఇద్దరూ ఇలా కొంతసేపు దెబ్బలాడారు. చూసి చూసి, పెద్ద మర్రిచెట్టు వూడపెరికాడు ఆంజనేయులు. గిరగిరా తిప్పి ధూమ్రాక్షుడి గుండెలమీద కొట్టాడు. దెబ్బతో రక్తం కక్కుకుంటూ చచ్చిపోయాడు ధూమ్రాక్షుడు. ఆంజనేయుణ్ణి పొగుడుతూ ఒక్కసారి కోలాహలం చేశాయి కోతులు. ఆవూపు వూపుని రాక్షసుల్ని వెంటతరిమి కొట్టాయి. దెబ్బలు తడుముకుంటూ అదే పారిపోవడం పారిపోయారు రాక్షసులు.

ప్రహస్తుడూ, ధూమ్రాక్షుడూ చచ్చిపోయారనీ విన్నాడు రావణుడు. పదినోళ్ళతోనూ బాంబ్రడు బాంబ్రడుమని ఏడ్చాడు. 'ఉన్న కొడుకులందరూ వొక్కొక్కడూ చచ్చిపోతున్నారు. ఉండి లేనట్టు న్నాడు తమ్ముడు కుంభకర్ణుడు. వాడి నిద్రా వాడు తప్ప, ఎవడి సంగతీ అక్కర్లేదు వాడికి. ఏందారి? ఎవర్ని పంపడం, ఇప్పుడు?' అంటూ ఎంతోసేపు విచారించాడు. 'కొడుకు ఇంద్రజిత్తుని పంపితేనో! ఇద్దరమూ వెళితే? ఊహూఁ, కుంభకర్ణుణ్ణే లేపుతాను' అంటూ కుంభకర్ణుడి పడకగదికి వెళ్ళాడు.

మాఁస్తుగా నిద్రపోతున్నాడు కుంభకర్ణుడు. పెద్దపెద్ద టోకుర్లు తీస్తున్నాడు. 'లేవగొట్టండి' అని సేవకుల్ని నియోగించాడు రావణుడు. తప్పెట్లూ, తాళాలూ వాయించారు సేవకులు. భేరీలూ మృదంగాలూ బాదారు. జేగంటలు వాయించారు. బాకాలూ

బూరాలూ వూదారు. గావు కేకలు వేశారు. అదే వూపడం వూపారు. కొంతసేపయేసరికి కొంచెం కదిలాడు కుంభకర్ణుడు. పిలవగా పిలవగా వొత్తిగిల్లాడు. చివరికి బరూవుగా కళ్ళువిప్పాడు. హూం, అని పెద్ద ఆవలింత తీశాడు. కళ్ళు నులుపుకుంటూ వొకంతట తెలువు కున్నాడు. కళ్ళు నులుపుకొని చూసేసరికి ఎదురుగుండా అన్న రావణా బ్రహ్మ నుంచుని నవ్వుతున్నాడు.

'ఇలాంటి నిద్ర ఎక్కడన్నా వుందా, తమ్ముడూ!' నవ్వుతూ అన్నాడు రావణుడు — 'మేమంతా ఏమయిపోయామో నీకు అక్క ర్లేదు కదా! ఇప్పుడు ఏమయిందో విన్నావా? అయోధ్య రాజు లేడూ, దశరథుడు — అతడి కొడుకు రాముడు. రాముడి భార్యని పట్టుకువచ్చాను నేను. అందుకని, మనమీద కత్తికట్టాడు వాడు. ఎన్నో అన్ని కోతులు పట్టుకువచ్చాడు. సముద్రంమీద సేతువు కట్టి, లంకాపట్నం ముట్టడించాడు. ఎన్నడూ లేంది ఏడు చెరువులనీళ్ళు తాగిస్తున్నాడు మనల్ని. ప్రహస్తుడూ, ధూమ్రాక్షుడూ మొద లయినవాళ్ళని ఎందరినో చంపేశాడు. నువ్వు తప్పిస్తే వాణ్ణి చంపగల వాడు మరొక మొనగాడు లేడు. అందుకనే నీనిద్ర భంగంచేశాను. లే. మరి పడుకోకు. వాణ్ణీ, వాడి కోతుల్నీ మింగెయ్యి. వజ్రవేగుడూ, ప్రమాదుడూ నీకు తోడు వస్తారు.'

'అలాగా, అదెంతలోమాట' అన్నాడు కుంభకర్ణుడు. మాంచి కవచం వేసుకున్నాడు. అవసరమైన ఆయుధాలన్నీ పట్టుకున్నాడు. కావలిసినవాళ్ళని వెంటపెట్టుకున్నాడు. పెద్ద భూతంలాగ పట్నం లోంచి బైటికివచ్చాడు. ఎర్రగా పెద్ద మంటలా వుంది అతడి జుత్తు. తెలుపూ, ఆకుపచ్చరంగూ కలిసి చేవ దేర్తే ఎలావుంటుంది, అదిగో, అలా వుంది వాడి శరీరం. మిడిగుడ్లు రెండూ నిప్పులు రాలుతున్నాయి. పెదవులు బిగించినపళ్ళలోంచి రక్తం కారుతోంది. ఒక ఆమడంత

దూరం అందుతున్నట్టున్నాయి చేతులు. అడుగులు వేస్తూవుంటే జవజవలాడిపోతూ వుంది భూమి. ఘోరంగా వున్న ఆ వికృతరూపం చూసి బెంబేలు పడిపోయారు వానరులు.

వాళ్ళెవళ్ళనీ లెక్కలోకే తేలేదు కుంభకర్ణుడు. దురుసుగా రామలక్ష్మణులదిక్కే నడిచాడతడు. ఎలుగుబంట్లూ, కోతులూ వికటాకీనివచ్చి, అడ్డగించాయి. పెద్ద పెద్ద చెట్లతో కొట్టాయి. కొండలంతేసి పణుకులు విసిరాయి. మీదపడి బకిరాయి. కరిచాయి. కొరికాయి. యుద్ధానికి వచ్చినా కునుకు వదలలేదు కుంభకరుణి. కోతులూ, ఎలుగుబంట్లూ ఈగల్లాగా, దోమల్లాగా వున్నాయి అతడికి. నల్లమందుభాయిలా అతడికళ్ళు మూతలు పడుతున్నాయి. చేతికి దొరికిన ఎలుగుబంటిని తినేస్తున్నాడు. అందిన కోతినల్లా మింగేస్తున్నాడు. ప్రళయసంహారంచేసే యముడులా వుంది వాడి వైఖరి.

పవనచండుడూ, పవనాక్షుడూ, వజ్రబాహుడూ మొదలయిన వానరనాయకుల్ని మింగేశాడు కుంభకర్ణుడు. సామాన్య వానరుల్ని ఎంతమందిని తినేశాడో లెక్కా జమా లేదు. ఇలా తినేస్తూ, వూగుతూ, జోగుతూ ఇంకా ముందుకే అంగలు వేసుకుంటూ పరిగెడుతున్నాడతడు. బెగిలిపోయారు వానరులు. తారుడూ మొదలయిన వానర నాయకులు అరుచుకుంటూ చెట్టోపట్ట అయిపోయారు.

పరిస్థితి విషమించినట్టు కనిపించడంతోనే, పెద్ద మర్రిచెట్టు పట్టుకుని, పరిగెత్తుకు వచ్చాడు సుగ్రీవుడు. అంత చెట్టూ ఎత్తి కుంభకర్ణుడి నెత్తిమీద కొట్టాడు. పిడుగుపడ్డట్టయింది. కునుకు వదిలిపోయింది కుంభకర్ణుడికి. తెరిపారా చూశాడు సుగ్రీవుణ్ణి. చెయ్యిచాచి అతణ్ణి పట్టుకున్నాడు. చంకలో పెట్టుకుని, లంకదిక్కు దౌడుతీశాడు.

లక్ష్మణుడి కంటపడిం దది. రివ్వున వచ్చి, మాంచి దొక బాణం వదిలాడు. కుంభకర్ణుడి గుండెల్లో దూసుకుపోయింది బాణం.

దెబ్బతో సుగ్రీవుణ్ణి వదిలిపెట్టేశాడతడు. పెద్ద కొండపణుకు పట్టుకుని లక్ష్మణుడిమీదికి పరిగెత్తాడు. మాంచి చికిలిచేసిన రెండు ఈటెలు విసిరి, వాడి రెండుచేతులూ తెగగొట్టేశాడు లక్ష్మణుడు.

రెండుచేతులూ నరికేస్తే, నాలుగుచేతులు మొలిచాయి కుంభకర్ణుడికి. నాలుగూ నరికేశాడు లక్ష్మణుడు. ఎనిమిదిచేతులు మొలిచాయి. అవి నరికేస్తే, అన్ని మరన్ని. ఇలా ఎన్ని నరుకుతూవుంటే అన్ని రెండింతలు చేతులూ తలలూ మొలవడం మొదలెట్టాయి. విసిగిపోయాడు లక్ష్మణుడు. కళ్ళు మొయ్యా కోపం వచ్చింది. బ్రహ్మాస్త్రం వేసి కొట్టాడు. దాంతో కొండలా కూలిపోయి, చచ్చి వూరుకున్నాడు కుంభకర్ణుడు.

కుంభకర్ణుడు కూలిపోవడంతోనే వజ్రవేగుడూ, ప్రమాదుడూ లక్ష్మణుడిమీదికి వచ్చారు. తెరిపిలేకండా అతడిమీద బాణాలు వేశారు. వాళ్ళకంటే రెండింతలు మూడింతలు బాణాలు వేశాడు లక్ష్మణుడు. జడివానలా రెండుదిక్కులా బాణాలు ఎగురుతూ వుంటే, అటు రాక్షసులూ, ఇటు వానరులూకూడా రెప్ప వెయ్యకండా చూశారు.

ఉన్నట్టు వుండి, ఆంజనేయులూ నీలుడూ తలా వొక కొండా పట్టుకువచ్చారు. వజ్రవేగుడి మీదా, ప్రమాదుడి మీద విసిరి కొట్టారు. మచ్చుకన్నా లేకండా పచ్చడిపచ్చడి అయిపోయారు వజ్రవేగుడూ, ప్రమాదుడున్నూ. ఒక్కసారి కోలాహలం చేశాయి కోతులు. వింటెబద్దచూస్తే పారిపోయే కాకుల్లాగ ఎటుపడితే అటు ఎగిరిపోయారు రాక్షసులు. లంకాపట్నం ఎనిమిది దిక్కులా వున్న ఎనిమిది ద్వారాల్లోంచీ లోపలికి దూరిపోయారు వాళ్ళు. ఇదంతా చూసి ప్రాణాలమీద ఆసే వదులుకున్నారు లంకాపట్నం పౌరులు.

నమ్ముకున్న తమ్ముడూ, వజ్రవేగుడూ, ప్రమాదుడూ రాలిపోయారు. నడుం విరిగిపోయింది రావణాబ్రహ్మకి. నెత్తి నోరూ

మొత్తుకుంటూ కూచున్నాడు. తండ్రి దుఃఖం చూశాడు ఇంద్రజిత్తు. కవచమూ, కత్తీ, ధనుస్సూ, తూణీరమూ-అన్నీ కట్టుకుని సిద్ధంగా అతడి దగ్గిరికి వచ్చాడు 'నేనంటూ వుండగా మీకు ఇంత విచార మెందుకండీ నాన్నగారూ, అంటూ తండ్రిని ఓదార్చాడు. 'ఇంద్రుడంతవాణ్ణి ఇట్టే జయించారు మీరు. ఈకోతులూ, కొండముచ్చులూ ఓ లెక్కేమిటి మీకు? అనుజ్ఞ ఇవ్వండి. నల్లుల్లాగ నలిపేస్తాను వాళ్ళని. రామన్ననీ, లచ్చన్ననీ ఎముకలు విరగగొట్టి, పెడచేతులు కట్టిపట్టుకు వస్తాను' అన్నాడు.

'అంతవాడివేనోయి నాన్నా, నువ్వు' అంటూ కుమారుడి వీపు తట్టాడు రావణుడు. 'నీపరాక్రమం నేను ఎరగంది కాదు కనకనా! నువ్వువుండబట్టే నాకు ఇంత పేరూ, ప్రఖ్యాతీ, సంపదానూ. దేవతలతోసహా దేవేంద్రుణ్ణి కట్టేసి, నాకాళ్ళముందు పడేశావు. మహాస్త్రాలు తెలిసినవాడివి. మాయలో నిన్ను చెప్పి, మరొకణ్ణి చెప్పాలి. నీబాణాలముందు నిలబడే మొనగాళ్ళా, రామలక్ష్మణులు! నాకు తెలుసు. వెళ్ళు. ఒక్కణ్ణీ మిగల్చకు. అందరినీ చంపేసి రా. మనకోసం ప్రాణాలు వదిలిపెట్టారు మనవాళ్ళు. వాళ్ళ రుణం తీర్చుకో' అంటూ గుచ్చి కౌగిలించుకున్నాడు. 'జయించుకురా నాన్నా' అంటూ ఆశీర్వదించి పంపాడు.

రథమెక్కి రభసంగా పయనమయాడు ఇంద్రజిత్తు. ఈసారి ఎవడు వస్తాడా అని చూస్తు నేవున్నాయి, ఎలుగుబంట్లూ కోతులున్నూ. ఇద్రజిత్తుని చూడగానే కేకలు వేస్తూ, అతడి రథంమీదికి ఎగబడ్డాయి. కోతులూ, ఎలుగ్గొడ్లూ ఈగలురొప్పినట్టు రొప్పాడు ఇంద్రజిత్తు. లక్ష్మణుణ్ణి సవాలుచేస్తూ, యుద్ధానికి రమ్మని కేక వేశాడతడు. కేక విన్నాడో లేదో లక్ష్మణుడు. ఏనుగుమీదకి లంఘించిన

సింహంలా వచ్చి, అతడినుంచు నిలబడ్డాడు. రావడమూ ధనుస్సుని శరాలు సంధించడమూ వొక్కసారే జరిగాయి.

విలువిద్యలో లక్ష్మణుడు ఎంతవాడో ఇంద్రజిత్తూ అంత వాడు. లక్ష్మణుకు కంటపడడంతోనే వర్షమే కురిపించాడు ఇంద్రజిత్తు బాణాలు. ఇద్దరూ సమవుజ్జీలుగా కనిపించారు. ఎవరు హెచ్చో, ఎవరు తక్కువో చెప్పడమే కష్టమైంది. ఇంద్రజిత్తు వేస్తున్న బాణాలన్నీ తుక్కుతుక్కు చేశాడు లక్ష్మణుడు.

ఇంతలో, లక్ష్మణుణ్ణి వెనకపెట్టి, ముందుకి వచ్చాడు అంగదుడు. పెద్ద మానొకటి తీసి, ఇంద్రజిత్తు నెత్తిమీద కొట్టాడు. అది లక్ష్య పెట్టినట్టే లేదు ఇంద్రజిత్తు. పెద్ద ఈటెతీసి, అంగదుడిమీద గురి పెట్టాడు. ఎత్తిన ఈటె చేతిలోనేవుంది, ఒక్క బాణంవేసి లక్ష్మణుడు దాన్ని ముక్కలు చేసేశాడు. వెంటనే గదతీసి, అంగదుడిమీద విసి రాడు ఇంద్రజిత్తు. ఆదెబ్బ కాసుకుని, వొక మద్దిచెట్టు పెరికాడు అంగదుడు. ఇంద్రజిత్తు రథమూ, గుర్రాలూ, సారథీ - అందరినీ కలిపి అదేబాదడం బాదాడతడు. రథం గుండ అయిపోయింది. సారథి చచ్చి వూరుకున్నాడు.

రథం పోవడంతోనే తాను కనపడకండా అయిపోయి, ఇంద్ర జాలం చేశాడు ఇంద్రజిత్తు. మేఘాల్లోకి వెళ్ళిపోయాడు. అక్కడి నించే అవుపడకండా యుద్ధంచేశాడు. ఎవడిమీదికి వురుకుతాడో, ఎవడిమీద ఏఆయుధం విసురుతాడో అని బిగులుబిగులుగా చూస్తు న్నారు వానరులు. ఉరుముల్తో వచ్చిన ప్రళయమేఘంలాగ ఆకాశం మీాగ గుణంమోగించాడు ఇంద్రజిత్తు. రామదండుమీద పిడుగు ల్లాటిబాణాలు కుమ్మరించాడు. సేనసేనంతా చిందరవందర అయి పోయింది. రాముడూ, లక్ష్మణుడూకూడా ఆబాణాల్లో ఎక్కడ వున్నారో కనపడకండా అయిపోయారు.

అల్లకల్లోలంగా వుంది రామదండు. శబ్దవేదిబాణాలు వేస్తున్నారు రామలక్ష్మణులు. సుగ్రీవుడూ మొదలయిన ముఖ్యులు రాళ్లూ చెట్లూ పట్టుకుని ఆకాశంమీాదికి ఎగిరారు. ఏంచేసినా లాభంలేక పోయింది. కనపడకండా, ఎవ్వరికీ అందకండా కొడుతూనే వున్నాడు ఇంద్రజిత్తు. ఎవ్వరూ ఏమీా చెయ్యలేకపోతున్నారు అతణ్ణి. కనపడనివాణ్ణి ఎలాకొట్టడం ? ఏం దారి ? దిక్కులేనట్టుంది రామ దండు. ప్రళయంవస్తే పడిపోయిన సూర్యచంద్రుల్లాగ చతికిలబడి పోయారు రామలక్ష్మణులు.

పే-ద్ద సింహానాదం చేశాడు ఇంద్రజిత్తు. రామలక్ష్మణులు ఇద్దరినీ నాగాస్త్రాలువేసి కట్టేశాడు. కదలా మెదలా లేకపోయారు రామలక్ష్మణులు, సుగ్రీవుడూ, సుషేణుడూ, జాంబవంతుడూ మొదలయినవాళ్ళందరూ చుట్టూచేరి, ఏడవడం మొదలుపెట్టారు. అదిచూసి, విభీషణుడు పరిగెత్తుకు వచ్చాడు. ' భయపడకండి ' అంటూ చప్పున బ్రహ్మాస్త్రం వేశాడు. నాగాస్త్రం విడిపోయింది. నాగాస్త్ర మేమో విడిపోయింది. కాని, శరీరంనిండా గాయాలే గాయాలు. తెలివిరాలేదు రామలక్ష్మణులికి. పరిగెత్తుకువెళ్ళాడు సుగ్రీవుడు. విశల్యకరిణి పట్టుకువచ్చాడు. మహౌషధం విశల్యకరిణి. దాంతో గాయాలన్నీ మాయమైపోయాయి. మూర్ఛవదిలి, తెలుపుకున్నారు రామలక్ష్మణులు. రామదండు కలకల్లాడింది.

అప్పుడు కుబేరుడి దగ్గిరనించివచ్చిన వొక గుహ్యకుణ్ణి* రాముడి ముందు పెట్టాడు విభీషణుడు. ప్రభూ, ఈగుహ్యకుడు శ్వేతపర్వతం నించి వచ్చాడు. కుబేరుడిచ్చిన దివ్యజలం పట్టుకువచ్చాడు. ఈ నీళ్ళు కళ్ళకి రాసుకుంటే చాలు. నీకు కనపడని వస్తువంటూ వుండదు

* గుహ్యకులు : కుబేరుడి ధనాగారం కాపలా కా సేవాళ్ళు.

ఏమాయా అడ్డంరాదు అన్నాడు. గుహ్యకుడు తెచ్చిన దివ్యజలం కళ్ళకి రాసుకున్నారు రామలక్ష్మణులు. ఆకాశంమీదికి చూశారు. స్పష్టంగా కనిపించాడు ఇంద్రజిత్తు. అతడి ఇంద్రజాలమంతా ఎగిరిపోయింది.

తనమాయ మాయ మవడంతోటే, తెల్లమొహం వేశాడు ఇంద్రజిత్తు. వెళ్ళి, హోమంచేసుకు రావాలని ఇంటిదిక్కు మళ్ళాడు. ఎలాగో అది కనిపెట్టేశాడు విభీషణుడు. 'వీడు హోమం పూర్తి చేసుకు వచ్చాడా, హరిబ్రహ్మాదులు మరి గెలవలేరు వీణ్ణి. కదల నివ్వకు. ఇప్పుడే వీడిపని కానీ' అని లక్ష్మణుణ్ణి హెచ్చరించాడు. ఒక్క కేక వేశాడు లక్ష్మణుడు. కవ్విస్తూ ఇంద్రజిత్తువెంట పడ్డాడతడు. నాగుపాముల్లాంటి బాణాలు వొకదానివెనక వొకటి తగిలించాడు. పళ్ళు పటపటా కొరుకుతూ వెనక్కి తిరిగాడు ఇంద్రజిత్తు. [illegible]లు పుట్టే బాణాల్తో లక్ష్మణుణ్ణి కొట్టాడు. ఇంద్రజిత్తూ లక్ష్మణుడూ కలబడడం తోనే, రామదండూ రాక్షససేనా యుద్ధం మానేసి నిలబడి పోయింది. ఎవరికి ఏమవుతుందో! అందరికీ భయంగానే వుంది.

మదించిన రెండు ఏనుగుల్లాగా, రెండు పెద్దపులుల్లాగ, రెండు సింహం కొదమల్లాగ—ఘోరంగా పోట్లాడుతున్నారు ఇంద్రజిత్తూ లక్ష్మణస్వామిన్నీ. ధనుస్సు చెవులదాకా లాగి, దారయిన బాణం వొకటి కొట్టాడు లక్ష్మణుడు. దెబ్బతిని, వెంటనే ఎనిమిది బాణాలు, లక్ష్మణుడి శరీరం నాటుకుపోయేట్టు కొట్టాడు ఇంద్రజిత్తు. దానిమీద వొక తోకచుక్కలాగ విజృంభించాడు లక్ష్మణుడు. బాగా సానపెట్టిన రెండుబాణాలు పూని పూని వొదిలిపెట్టాడు. ఆరెండూ తగిలి, ఇంద్రజిత్తు రెండుచేతులూ తెగిపోయాయి. వెంటనే వజ్రాయుధం లాంటి మరో బాణం తగిలించాడు లక్ష్మణుడు. ధగధగామెరుస్తూ వున్న రత్నకుండాలాల్తో సహా తెగి, ఇంద్రజిత్తు శిరస్సు కింద పడి పోయింది. మొదలునరికిన మద్దిచెట్టుల్లా తుళ్ళిపోయింది మొండెం.

వెదికితే పిట్టన్నా లేకండా పారిపోయూరు రాక్షసులు. జయజయ ధ్వానాల్తో అదే కేకలు వేసింది రామదండు.

కొడుకుచావు విన్నాడు రావణుడు. గుండెబాదుకుని ఏడ్చాడు. కోపం భరించలేక అశోకవనానికి పరిగెత్తాడు. సీతని నరికేస్తా నంటూ వొరలోని చంద్రహారం తీశాడు. సమయానికి అడ్డుకున్నాడు అవిద్ధుడు. 'దేవేంద్రుడు మొదలయిన దేవతలందరినీ జయించావు. మహా వీరుడివి. ఇన్నాళ్లూ బతికి ఇంటివెనక ముసలమ్మని కొట్టినట్టు, ఆడమనిషి మీాదా చేయిచేసుకుంటావు? నీ అంతవాడికి ఇదా పౌరుషం? వెళ్ళు, రాముణ్ణి చంపు, అంటూ నచ్చచెప్పి, పంపేశాడు.

మాంచి భారీఎత్తుమీాద యుద్ధానికి సిద్ధపడ్డాడు రావణాసురుడు. ఇదే తన చివరియుద్ధం అని నిశ్చయించుకున్నాడు. ఉన్న సైన్యాన్నంతా, మూలబలంతో సహా బయల్దేరదీశాడు. అన్నిటితోనూ సిద్ధంగా వున్న రథమెక్కాడు. యుద్ధభూమికి వచ్చి గర్జించాడు. రామదండు కూడా మాంచి హోక్తారీగావుంది అవాళ. సుగ్రీవుడూ మొదలయిన యూవ న్మందీ వొక్కసారి సింహనాదాలు చేశారు. తోకలెత్తుకుని రావణుడి రాణువమీాద పడ్డారు. పెద్దపెద్ద రాళ్ళూ మాళ్ళూ విసిరారు. ఘోరంగా రగులుకుంది యుద్ధం.

మాయకీ మహేంద్రజాలానికీ ఇంద్రజిత్తే అనుకుంటే, అతడి బాబే రావణాబ్రహ్మ. వచ్చీరావడం తోనే, వొక మాయచేశాడు. తన శరీరం లోంచి వందలూ, వేలూ రాక్షసులు పుట్టించాడు. ప్రతీ రాక్షసుడూ భయంకరంగా వున్నాడు. ప్రతీవాడి చేతిలోనూ కత్తీ, గదా, శక్తీ, ధనుస్సూ, బాణాలూ వున్నాయి. అందరిమీాదా అన్ని, బాణాలూ వేశాడు రాముడు. క్షణంలో అందరినీ చంపేశాడు.

మరో మాయ చేశాడు రావణాసురుడు. ఎటుచూస్తే అటు రామలక్ష్మణులే. వెయ్యేసిమంది రాములు. వెయ్యేసిమంది లక్ష్మణులు.

లక్షలు లక్షలు రామలక్ష్మణులు. అందరిచేతుల్లోనూ కోదండాలు. అందరిచేతుల్లోనూ బాణాలు. చిత్రం అనిపించింది రామలక్ష్మణులికి. నిమిషంలో మాయరాముల్ని కొట్టేశాడు రాముడు. మాయలక్ష్మణు లందరూ లక్ష్మణుడివంతు. రాముడి బాణాలముందు రావణమాయ రాణించలేదు. అయితే, రావణుడికి రథం వుంది. రాముడికి లేదు.

ఇంతలో దేవేంద్రుడి రథం పట్టుకుని దేవలోకంనించి మాతలి వచ్చాడు. అప్పుడే ఉదయిస్తూవున్న సూర్యబింబంలా వుంది రథం. ఊం అంటే ఎగిరిపోయే పచ్చటి గుర్రాలు పూసి వున్నాయి. జెండా వైజయంతం తళతళా ఎగురుతోంది. రథం రాముడిముందు నిలిపాడు మాతలి. 'మహారాజా, దేవేంద్రుడి రథం ఇది. పెద్ద పెద్ద రాక్షస రాజుల్ని దీనిమీదనించే చంపాడు దేవేంద్రుడు. నీకోసం పంపా డిది. దీనిమీద ఎక్కి రావణాసురుణ్ణి సంహరించు. సాటిలేని సారథ్యం చేస్తాను నేను. దయచెయ్యి' అంటూ భక్తిపూర్వకంగా విన్నవించాడు.

మాతలిని ఆదరించి, రథ మెక్కాడు రాముడు. కోదండం ఎత్తి, గుణం మోగించాడు. దిక్కులు ప్రతిధ్వనించాయి. ఉత్తర క్షణంలో రాక్షససేనమీద బాణాలు కుమ్మరించాడు.

రాముడు రథంమీద రావడం చూశాడు రావణాసురుడు. బరి మీద పాములాగ రాముడిమీదికి పరిగెత్తించాడు తనరథం. ప్రళ యాగ్నిలా వున్నా డతడు. బాణాలు ప్రవాహంలా అన్ని దిక్కులూ వొక్కసారి విరజిమ్ముతూ ఘోరంగా కనిపించాడు. అతడి ఉద్ధృతం చూసి, ఆకాశంమీద దేవతలే తల్లడిల్లిపోయారు.

మహా ఘోరంగా వుంది రామ రావణ యుద్ధం. మంటలతో భయంకరంగా వున్న శూలం విసిరాడు రావణాసురుడు. సగంలోనే దాన్ని తెగనరికాడు రాముడు. శివ మెత్తినట్టు చెల రేగి పోయాడు రావణాసురుడు. వందలూ, వేలూ శూలాలు వేశాడు. భిండి

వాలాలూ, తోమరాలూ — వొకటేమిటి? వింతవింత ఆయుధాలు కుమ్మరించాడు. భూమీ ఆకాశం చీకట్లు చేసేశాడు. రాముడూ, రామదండూ ఆ ఆయుధాల్లో కప్పడిపోయినట్టున్నారు. భూతకోటి యావత్తూ హాహాకారాలుచేసింది. రాక్షస సైన్యంలో భేరీలూ, బాకాలూ — దిక్కులు దిమ్మెత్తిపోయాయి.

రావణాసురుడి ఆయుధాల దావాగ్ని అంతలోనే రాముడి బాణవర్షంతో ఆరిపోయింది. మహామేఘంలా ధనుష్టంకారం చేశాడు రాముడు. సంతోషంతో గెంతులు వేశారు వానరులు. దేవేంద్రుడి రథంమీద చూడ శక్యంకాకండా వున్నాడు రాముడు. బంగారం తొడిమతో తళతళలాడుతూ, వాడిదేరిన మొనతోవున్న బ్రహ్మాస్త్రం తీసి, ధనుస్సుకి తొడిగాడు. మంత్రం చదివి, చెవిదాకా రెండు కొసలూ లాగాడు. గురిచూసి, రివ్వున వదిలి పెట్టాడు ప్రళయాగ్నిలా మంటలు మండుతూ వెళ్ళింది రామబాణం, బ్రహ్మాస్త్రం. రావణాసురుడిమీద పడింది. ఉత్తరక్షణంలో రావణాసురుడూ అతడి రథమూ, గుర్రాలూ, సారథీ భస్మమై వూరుకున్నారు.

ఆకాశంమీద దేవదుందుభులు మోగాయి. గంధర్వులు గానం చేశారు. అప్సరసలు నాట్యం చేశారు. ఇంద్రుడు మొదలుకుని యావన్మంది దేవతలూ ఆనందించారు. వేయినోళ్ళతో రాముణ్ణి పొగిడారు. మూడులోకాల్లోనూ వొకటేపండుగ అవాళ.

రావణాసురుణ్ణి చంపేసి, లంకాపట్నానికి విభీషణుణ్ణి పట్టంకట్టాడు రాముడు. విభీషణుడూ, అవిద్ధుడూ కలిసి తగిన మేనాలో కూచోబెట్టి, రాముడిదగ్గిరికి తీసుకువచ్చారు సీతాదేవిని. పొత్తి పట్టడానికే వీల్లేకండా వుంది పాపం, సీతాదేవి. చిక్కి శల్యావశిష్టంగా వుంది. శరీరం మకిలిపట్టిపోయింది. మురికి వోడుతూ వుంది

కట్టుబట్ట. కన్నీళ్ళు కారికారి పాకుడుపట్టిపోయాయి చెంపలు. దువ్వాక అంటలుకట్టుకుపోయిందిజుత్తు.మూర్తీభవించినదుఃఖ దేవతలావుందామె.

సముద్రం కెరటాల్లాగ వుప్పొంగిపోతూవున్న దుఃఖం దిగమింగుతూ, ఇలా అన్నాడు రాముడు: 'సీతా, ఇన్నాళ్ళూ ఈదుర్మార్గుడి ఇంట్లో వున్నావు. ఇప్పుడెలా తీసుకువెళ్ళేది నిన్ను? నిన్ను తీసుకుని, ధర్మహాని తెచ్చుకోలేను. నీనడవడి మంచిదయినా, చెడ్డదయినా దాంతో ప్రసక్తి లేదిక్కడ. కుక్కవాతపడ్డ హవ్యంలా అయింది నీసంగతి. అంచేత, తిరిగీ నిన్ను ఇంట్లో పెట్టుకోలేను. నాపరాభవం తీర్చుకోవడానికి ప్రతీకారంగా యుద్ధం చేశాను. శత్రువుని చంపాను. అంతేకాని, నీకోసం కాదు. అయిందేదో అయింది. ఇక నీయిష్టం వచ్చిందగ్గిరికి వెళ్ళవచ్చు నువ్వు.'

గుండె బద్దలయినట్టయింది సీతకి. చెవుల్లో అగ్గిపోసినా, శూలాలు పొడిచినా, ఇంతకంటే నయం. మొదలునరికిన అరిటిచెట్టులాగ నేలకూలిపోయిందామె. శరీరంలో ప్రాణాలే వున్నట్టు లేదు.

ఇంతవరకూ సంతోషం వుప్పొంగిపోతూవున్న పరివారంలో వొక్కసారి విచారం కమ్మేసింది. భయం, విచారం - ఎవరికీ ఏమీ పాలు పోకండా ంది.

కొంతసేపట్లో మెల్లిగా తెలువుకుంది సీత. కంటినీరు కడవలు నిండుతోంది. రాముణ్ణి జాలిగా చూసింది. రెండుచేతులూ నడినెత్తిని జోడించింది. ఎలు రాసిన గొంతుకతో వెక్కివెక్కి చెప్పింది: 'నానడవడి రుజువుచేసిందికి అగ్గిలో దుకుతాను. ఈమాత్రం అంగీకరించు. పగలూ, రాత్రీ, షష్టిఘడియలూ నీపాదపద్మాలు తప్పించి అన్యథా తలంచనయినా తలంచలేదు నాహృదయం. ఈమాట అబద్ధమయితే భూదేవి బద్దలైపోవాలి. అగ్ని, గాలీ, సూర్యచంద్రులూ నన్ను దహించి వెయ్యాలి' అంది.

ఆమె నోట్లోమాట నోట్లోనేవుంది. పంచభూతాలూ తమతమ పేళ్ళు చెపుతూ ఇలా అన్నాయి : 'రామచంద్రా, సీత ఉత్తమురాలు. మాకు తెలుసు. సందేహించకు'– అని. అంతలో దేవతలతోనూ, మునులతోనూ వచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయాడు. భక్తిపూర్వకంగా అతణ్ణి పూజించాడు రాముడు. 'లోకకంటకుడయిన రావణాసురుణ్ణి చంపేశావు. లోకాలన్నిటికీ మహోపకారం చేశావు' అన్నాడు బ్రహ్మ. 'సీత విషయంలో సందేహించకు. నలకూబరుడి శాపం మూలాన పరస్త్రీని బలవంతం చెయ్యలేదు రావణుడు. నీభార్యలో నలుసంత కళంకం లేదు. ఏశంకా పెట్టుకోకు.. ఈమెని పరిగ్రహించు' అన్నాడు. యుద్ధంలో చచ్చిపోయిన వానరుల్ని అందరినీ బతికించాడు బ్రహ్మ. ఇలా రాముణ్ణి సంతోషపెట్టి అంతర్ధానమయాడతడు. మాతలీ రాముడి దగ్గిర సెలవు తీసుకున్నాడు. వెయ్యిగుర్రాల దేవ రథం పట్టుకుని అమరావతికి వెళ్ళిపోయాడు.

అవాళతో కైకపెట్టిన పద్నాలుగేళ్ళ గడువూ అయిపోయింది. అందుకని, సీతా లక్ష్మణులతో పుష్పకవిమానంమీద బయలు దేరాడు శ్రీరాముడు. తనతోపాటు సుగ్రీవుడూ మొదలయిన పరివారం యావత్తూ విమానంలో కూచున్నారు. లంకనించి బయల్దేరింది పుష్పకం. సముద్రం దాటింది. దండకారణ్యం దాటింది. సరాసరి అయోధ్యలో దిగింది.

## ప ట్టా భి షే కం

అయోధ్యా పట్టణంలో అవాళ ఆనందం తాండవించింది. అనంతరం వశిష్ఠుడూ, వామదేవుడూ పెట్టిన శుభముహూర్తంలో శ్రీరాముడి పట్టాభిషేకం వైభవంగా జరిగింది. భరతుడూ మొదలయిన అన్నదమ్ములూ, తక్కినబంధువులు యావన్మందీ, పరివారమూ

మహానందం అనుభవించారు. పౌరులూ, సామంతులూ కళ్ళు వేడుకగా పట్టాభిషేక మహోత్సవం చూశారు.

పట్టాభిషేకమహోత్సవం పూర్తయాక,సుగ్రీవుడూవిభీషణుడూ మొదలయిన స్నేహితుల్ని సన్మాన పూర్వకంగా సెలవిచ్చి, సాగ నంపాడు శ్రీరాముడు. సకలసంపదలతోనూ తులతూగుతూ ఎన్నో వేలసంవత్సరాలు రాజ్యం చేశాడతడు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. రామరాజ్యంలో కష్టాలన్న మాటలేకండా అష్టయిశ్వర్యాలూ అనుభ వించారు ప్రజలు. ఇదీ రాముడి కథ.

"ధర్మరాజా, చూశావా, అరణ్యవాసంలో అన్ని కష్టాలు పడ్డాడు రాముడు. శత్రువులవల్లా అన్ని అవస్థలు అనుభవించాడు. తుదకి మహాశుభాలు పొందాడు. నువ్వూ అలాగే ఈదుఃఖాలుకాస్త సహించుకున్నాక, ప్రపంచ సామ్రాజ్యానికి అధిపతి వవుతావు" అన్నాడు మార్కండేయముని.

రామాయణం విని, రాముడి పరాక్రమం ప్రశంసించాడు ధర్మరాజు. "ఎంత ఉత్తమురాలో సీతాదేవి!" అంటూ తల వూపాడు. "మహాముని, భర్తకోసం ఇలాగే కష్టాలు సహించిన పతి వ్రతచరిత్ర ఇంకేదన్నా వుంటే సెలవియ్యి. విని, కృతార్థుల మవు తాము" అన్నాడు "సావిత్రీ అలాంటి సాధ్వే" అన్నాడు మార్కండేయుడు. "నువ్వు అభిలాషపడుతున్నావు. ఆమెచరిత్రా చెవుతాను. విను" అంటూ సావిత్రికథ ప్రారంభించా డతడు.

### సావిత్రి కథ

మద్ర దేశంలో అశ్వపతి అని వొక రాజు వుండేవాడు. సంతా నం లేక అతడు పద్ధెనిమిది సంవత్సరాలు సావిత్రీదేవిని సేవించాడు. సావిత్రీదేవి ప్రత్యక్షమయింది. వరం కోరుకోమంది. కొడుకు కావా

లని సాష్టాంగపడ్డాడు అశ్వపతి. 'కొడుకుకాదు, కూతురు పుడుతుంది' అంది దేవి. 'నీకోర్కె ముందే తెలుసు నాకు. బ్రహ్మనడిగాను. కూతురే కలుగుతుం దన్నాడాయన. ఆయనమాటకి ఎదురుండదు. ఐతే, కూతురుమూలాన నీకోర్కె సిద్ధిస్తుంది. ఒక్కడు కాదు, వంద మంది కుమారుల్లు కలుగుతారు' అని చెప్పి అంతర్ధానమయింది. దేవి చెప్పినట్టే కుమార్తెని కంది, అశ్వపతిభార్య మాళవి. సావిత్రి అని పేరుపెట్టి అరిచేతి నిమ్మపండులా పెంచుతూ వచ్చారు ఆ అమ్మాయిని.

పెరిగి పెద్దదయింది సావిత్రి. నిండుయవ్వనంతో నవనవ లాడుతూ వుంది. సిద్ధకన్యలూ, సాధ్యయువతులూ, యక్షస్త్రీలూ, దేవకాంతలూ ఆమె అందంముందు దిగదుడుపుకి పనికిరారు. అమ్మా యికి తగినవరుడికోసం ఆలోచిస్తూ వుండేవాడు అశ్వపతి.

సాళ్వదేశంలో ద్యుమత్సేనుడు అని వొకరాజు వుండేవాడు. అతడి కొడుకు సత్యవంతుడు. సత్యవంతుడి సౌందర్యమూ, అతడి మంచిగుణాలూ విని, అతణ్ణి సావిత్రి ప్రేమిస్తూవుండేది, లోలోపల. సిగ్గుమూలాన, ఈవిషయం ఎవ్వరితోనూ చెప్పేది కాదు.

ఒకనాడు అశ్వపతిదగ్గిరికి నారదముని వచ్చాడు. తగినవిధంగా అతణ్ణి సత్కరించాడు అశ్వపతి. ధర్మప్రసంగం చేస్తూ, కొంతసేపు కూచున్నాడు ముని. ఇంతలో చెలికత్తెలతో కలిసి, సావిత్రి అక్క డికి వచ్చింది. మన్మథుడి విలాసంయావత్తూ పోతపోసినట్టు వుంది సావిత్రి. అంతదూరంలో చెలికత్తెల్ని నుంచోపెట్టింది. ఒయ్యారంగా వచ్చి, తండ్రికి సాష్టాంగ నమస్కారంచేసింది. ఆప్యాయంగా ఆమెని లేవదీశాడు అశ్వపతి. మునికి మొక్కించి, ఆదరంగా పక్కని కూచో బెట్టుకున్నాడు.

'ఇంకా అమ్మాయికి వివాహంచెయ్యలేదేమి? తగిన వరుడు దొరకలేదా?' అని అడిగాడు నారదుడు. కూతురు మొహం

చూశాడు అశ్వపతి. 'అమ్మా, బుద్ధిమంతురాలివి నువ్వు. నీకు తగిన వరుణ్ణి నువ్వేచెప్పాలి. చెప్పు తల్లీ, చెప్పు. ఏ రాజకుమారుణ్ణి వరిస్తావు?, అని తలనిమురుతూ అడిగాడు.

సిగ్గూ, సిగ్గుని మించినకోర్కె—చివరికి చెప్పడానికే నిశ్చయించింది సావిత్రి. 'సాళ్వరాజు కొడుకు—సత్యవంతుడు-' అని తల వంచుకుంది. 'సాళ్వరాజు ద్యుమత్సేనుడు దైవయోగంవల్ల గుడ్డివాడై పోయాడు. రాజ్యమూ పోయింది. భార్యాపుత్రులతో అడవిలో గడుపుతున్నాడు. తెలుసు నాకు. అయినా సత్యవంతుణ్ణే వరిస్తాను, అంది.

'మునీంద్రా, మీకు తెలియంది లేదు. సావిత్రిమాట విన్నారు కదా! సత్యవంతుడి విషయమేమిటో సెలవియ్యండి' అంటూ నారదుణ్ణి ప్రార్థించాడు అశ్వపతి.

'సత్యమే వ్రతం అతడికి' అన్నాడు నారదుడు. 'అందుకనే సత్యవంతుడు అన్నారు అతణ్ణి. అతడి అసలుపేరు చిత్రాశ్వుడు. సూర్యుడిలాంటి తేజశ్శాలి అతడు. బుద్ధికి బృహస్పతి. ప్రతాపానికి దేవేంద్రుడు. అశ్వినీదేవతలంత అందగాడు. తపమూ, శమమూ, దమమూ, దానమూ, బ్రాహ్మణభక్తీ ఎందులోనూ తక్కువలేదు. కానైతే, వొక్కటే తక్కువ. ఆయుర్దాయం. పెళ్ళిఅయాక, సరిగ్గా సంవత్సరంనాడు చచ్చిపోతాడు. చెప్పవలసిందికాదు, అయినా అడిగావు కనక, చెప్పాను' అన్నాడు.

'విన్నావు తల్లీ, దేవరహస్యం తెలిసిన దేవముని నారదులవారు. ఈయన వాక్యం అన్యథా జరగదు. సత్యవంతుడే అన్నమాట లేమిటి మనకి. మరొకణ్ణిచూడు' అన్నాడు అశ్వపతి. 'అదేలాగ నాన్నారూ' అంది సావిత్రి. 'మనస్సూ, వాక్కూ, కర్మా - ఈమూడింటిలోనూ మనస్సే ప్రధానం. మనస్సా అతణ్ణి ఎప్పుడు వరించానో, అప్పుడే

అతడి భార్యనయిపోయాను. ఏది ఏమయినా, సత్యవంతుడే నాభర్త. అతణ్ణి కాదని, మరొకణ్ణి ఎలా వరించేది?' అంది.

'బుద్ధిమంతురాలు నీకూతురు' అన్నాడు నారదముని. 'ఈమె సంకల్పం మానిపించడం మనకి సాధ్యంకాదు. అడ్డు చెప్పకు. ఈడూ జోడూచూస్తే సావిత్రికి తగినవాడు సత్యవంతుడు. ఈడూ జోడూ చూసి, పెట్లోతోసినాప్రమాదంలేదు అన్నారు పెద్దలు. సందేహించకు. సత్యవంతుడికే ఇచ్చి, సావిత్రిని పెళ్ళిచెయ్యి. ఈమె పుణ్యంమూలాన అయినా చిరంజీవి కావచ్చు సత్యవంతుడు, అన్నాడు.

మునికి నమస్కరించాడు అశ్వపతి. 'మాకు పరమగురువులు మీరు. మీఆదేశమేశిరసావహిస్తాను' అన్నాడు. దీవించి దేవలోకం వెళ్ళిపోయాడు నారదుడు.

మంచిరోజుచూసి, సావిత్రిని తీసుకుని ద్యుమత్సేనుడిదగ్గిరికి వెళ్ళాడు అశ్వపతి. బంధువులూ, మంత్రులూ, పురోహితులూ, పరివారమూ ఎంతోమంది వెంటవెళ్ళారు. వాళ్ళందరికీ కావలసిన సమస్త సామగ్రీ తానే పట్టుకువెళ్ళాడు అశ్వపతి. తపోవనంలో తపస్సుచేసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు ద్యుమత్సేనుడు. అశ్వపతి రావడంతోటే, అర్ఘ్యమూ అదీ ఇచ్చి, వచ్చినకారణం విచారించాడు.

సావిత్రిచేత అతడికి నమస్కారం చేయించాడు అశ్వపతి. 'ఈమె నాకూతురు, సావిత్రి. మా కులానికంతటికీ ఈ వొక్కతే వెలుగు. ఈమెని కోడలిగా అంగీకరించాలి నువ్వు, అన్నాడు.

'ఇంతకంటే భాగ్యమేముంది?, అన్నాడు ద్యుమత్సేనుడు— 'అయితే, రాజ్యం లేదు మాకు. అడివిలో కాపరం. పువ్వులాంటి సుకుమారి మీ అమ్మాయి. మాతో ఎలా అవస్థపడుతుంది?' అన్నాడు విచారిస్తూ.

'అన్నీ ఆలోచించే నీతో సంబంధానికి వచ్చాను'అన్నాడు అశ్వపతి. కలిమి ఎంత చిరంకాదో, లేమీ అంతే చిరంకాదు. కనక, కలిమికి సంతోషించకూడదు. లేమికి విచారించనూ కూడదు. ఇక, సావిత్రిమాట. వయస్సుకి చిన్నదే అయినా, బుద్ధికిమాత్రం ముసిలమ్మ మాచిట్టితల్లి. కష్టసుఖాలు అన్నీ తెలుసు మాఅమ్మకి. కనక నే, తెలిసి తెలిసి ఇలా వచ్చాను. సత్యవంతుడికి తగినపిల్ల సావిత్రి. కాదనకు. అంగీకరించు' అన్నాడు.

సంతోషంగా సమ్మతించాడు ద్యుమత్సేనుడు. ఆశ్రమంలోని మునులందరినీ కూడగట్టుకున్నాడు. శుభలగ్నంలో సత్యవంతుడికి సావిత్రిని పెళ్ళిచేశాడు. అల్లుడికి ఎన్నో అన్ని ఆభరణాలూ, వస్త్రాలూ అరణం చదివించాడు అశ్వపతి. పెళ్ళికార్యాలు ముగియడంతోనే సపరివారంగా తనరాజ్యం వచ్చేశాడు.

ఒంటిమీద నగలూ అవీ తీసి పెట్టేసింది సావిత్రి. పట్టుచీరెలూ అవీ మానేసింది. అడివిలో ఆశ్రమవాసానికి అనుగుణ్యంగా నార చీరలు కట్టుకుంది. అత్తమామలికీ, భర్తకీ భక్తిశ్రద్ధలతో సేవచేస్తూ వుండేది. ఆమె వినయమూ, నెమ్మదీ చూసి, అత్తామామా పొంగి పోయేవాళ్ళు. అంతా సుఖంగా గడిచిపోతూవుంది. నారదుడు చెప్పిన మాటలు మాత్రం అనుక్షణం ఆమెగుండెల్లో మెలుగుతూనే వుండేవి. పెళ్ళినాటికి సంవత్సరం ఎప్పుడు నిండితే అప్పుడు సత్యవంతుడు చచ్చి పోతాడు. రోజులు లెక్కపెడుతూ వుండేది సావిత్రి. రోజులూ, నెలలూ గడిచిపోయాయి. మరి నాలుగురోజులే తక్కువ సంవత్సరానికి. నాలుగో రోజున సంవత్సరం అయిపోతుంది.

ఆ నాలుగురోజులుముందు మూడురాత్రుల ఉపవాసం అని వొకనోముపట్టింది సావిత్రి. ఆశ్చర్యపోయాడు ద్యుమత్సేనుడు. 'ఎందుకమ్మా, ఇంత కష్టమయిన నోము నీకు? 'అని అడిగాడు కోడల్ని.

'నాకేమో కష్టంగా వుంటుందని విచారించకండి' – వినయంగా చెప్పింది సావిత్రి. 'మంచికోసమే తలపెట్టాను, ఇది. దీనికి కారణం ముందుముందు మీకే తెలుస్తుంది' అంది. 'మంచిది తల్లీ, బుద్ధి మంతురాలివి నువ్వు. నీకోర్కె సిద్ధిస్తుంది' అని ఆశీర్వదించాడు ద్యుమత్సేనుడు.

మూడురోజులూ గడచిపోయాయి. నాలుగోనాడు, పెందరాళే మేలుకుంది సావిత్రి. అవాళే తనభర్త చచ్చిపోతాడు. పగిలిపోతున్నట్టుంది ఆమె హృదయం. ప్రాతఃకాలకృత్యాలు తీర్చేసింది. భర్తకి చెయ్యవలసిన శుశ్రూషా చేసింది. అత్తమామలికీ, ఆశ్రమంలోని వృద్ధులకీ నమస్కారంచేసింది. సౌభాగ్యవతివి కమ్మని వాళ్ళుచేసిన దీవనలు అందుకుంది.

జాము పొద్దెక్కింది. కోడల్ని పిలిచాడు ద్యుమత్సేనుడు. 'మూడు దినాలు ఉపవాసంచేశావు. అలిసిపోయావు పాపం! ఇంత ప్రసాదం పుచ్చుకో అమ్మా,' అన్నాడు. చుక్క పొడిచేవరకూ తినకూడదు మామయ్యగారూ, అంది సావిత్రి. 'నోము సంకల్పించి నపుడే ఇలా నిశ్చయించుకున్నాను' అంది.

ఇంతలో సమిధలూ, పళ్ళూ, పువ్వులూ తేవడానికి అడివికి బయలుదేరాడు సత్యవంతుడు. 'ఇవాళ నేనూ నీతో వస్తాను' అంది సావిత్రి. 'మూడురోజులు ఉపవాసం. అలిసిపోయి వున్నావు. అడివికి ఎలా వస్తావు?' అన్నాడు సత్యవంతుడు. 'అడివిలో చివుళ్ళతోనూ పువ్వులతోనూ పళ్ళతోనూ ఎన్నో లతలూ, చెట్లూ ఎంచక్కా హాయిగా వుంటాయని విన్నాను. చూడాలనీ ఎన్నాళ్ళయో వుందినాకు. తప్పకండా వస్తాను. తీసుకువెళ్ళండి 'అంటూ కూచుంది సావిత్రి. సరే, అయితే రమ్మన్నాడు సత్యవంతుడు. గబగబా మామగారిదగ్గి

రికి వెళ్ళింది సావిత్రి. అత్తకీ మామకీ నమస్కరించింది. 'అగ్ని హోత్రాలకోసం సమిధలు తేవడానికి అడివికి వెళుతున్నారు మీ అబ్బాయి. నేనూ ఆయనతో వెళ్ళాలని వుంది, ఇవాళ. మీతో చెప్పి, వెళ్ళాలని వచ్చాను' అంది.

'సంవత్సరమై వచ్చింది. ఏనాడూ ఏదీ కావాలని అడగలేదు. వెర్రిబాగులుది. పోనీ, ముచ్చటపడుతోంది. వెళ్ళనీ' అన్నాడు ద్యుమత్సేనుడు. హృదయంలో కొండంతదుఃఖం కుమిలిపోతూ వుంది. అ దేదీ పైకి కనపణ్ణివ్వలేదు సావిత్రి. నవ్వు మొహంతో భర్త వెంట వెళ్ళింది, అడివికి.

సత్యవంతుడూ, అతడివెంట సావిత్రీ మెల్లిగా నడుచుకుంటూ వెళ్ళి, పక్కనేవున్న అరణ్యంలో ప్రవేశించారు. పెద్ద పెద్ద చెట్లూ, వాటిని పెనవేసుకుని పైకిలేచిన లతలూ — ఎంతో ఇదిగా వుంది అడవి. చివుళ్ళతోనూ, పళ్ళతోనూ, పువ్వులతోనూ, గమ్ముమనిపోతూవుంది. పూల తేనెలు తాగుతూ జుమ్ము మంటున్నాయి తుమ్మెదలు. అరముగ్గిన పళ్ళుతింటూ, కిలకిలమంటున్నాయి చిలకలు. పెద్ద పెద్ద చెరువుల్లో మందలు మందలుగా వున్నాయి రాజహంసలు. అవన్నీ భార్యకి చూపిస్తూ విశేషాలు వివరిస్తూ నడుస్తున్నాడు సత్యవంతుడు. అన్నీ చూస్తూనే వుంది సావిత్రి. భర్త చెప్పినవన్నీ వింటూనే వుంది. లోపల మాత్రం మథనపడిపోతూ వుంది. భర్త ప్రతీఅడుగూ కని పెడుతూనే వుంది.

మంచిమంచి పళ్ళు బుట్టనిండా కోశాడు సత్యవంతుడు. ఒక దగ్గిర వొక ఎండు కర్రచూశాడు. గొడ్డలితీసి అది నరకడం మొదలె ట్టాడు. రెండువేట్లు వేశాడోలేదో, కొట్టలేక పోయాడు. ఆయాసం వచ్చింది. గొడ్డలి కింద పడేశాడు. ఎగసోష వచ్చింది. బాధతో మొహమంతా అదోలా అయిపోయింది. 'అబ్బ, శరీరం పట్టుసడలి

పోతూవుంది' అన్నాడు. 'భ్రమకలిగినట్టు అవుతోంది. శూలాల్తో పొడిచినట్టుంది తల. నిలవ లేకపోతున్నా. కొంచెం పడుకుంటా' అంటూ చతికిలబడిపోయాడు.

భర్త తల తొడమీద పెట్టుకుంది సావిత్రి. అలాగే కిందవాలి పోయాడు సత్యవంతుడు. క్షణంలో తెలివి తప్పిపోయింది. పాపం. ఏంజేస్తుంది సావిత్రి! భర్తని వదలకండా పట్టుకుకూచుంది. క్షణాల్లో కూడా నారదుడు చెప్పిన సంవత్సరమూ పూర్తి అయింది.

అంతలో ఉన్నతుడయిన వొక దేవతామూర్తి సావిత్రిఎదట కనిపించాడు. నవ నవలాడుతూ నల్లటి కారుమేఘంలా వుంది అతడి శరీరం. భయంకరంగానూ. తీక్ష్ణంగానూ వున్నాయి దంతాలు. ఉజ్వలంగా, చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి కళ్ళు. పుటంపెట్టిన బంగారంలా వుంది కట్టుబట్ట. ప్రళయాగ్నిలా ప్రకాశిస్తున్నా డతడు. పాశాలు పట్టుకుని, ప్రపంచాన్నే భయపెట్టడానికి వచ్చినట్టున్నాడు.

చ్రరున సత్యవంతుడిమీదికే వచ్చా డతడు. భయపడిపోయింది సావిత్రి. భర్త శిరస్సు భద్రంగా కింద పెట్టి నుంచుంది. చేతులు జోడించింది. 'అయ్యా, ఎవరు నువ్వు? ఎందుకోసం, ఏం చెయ్యాలని ఇలా దయచేశావు! అని అడిగింది, అతణ్ణి.

'యముణ్ణి' అన్నాడు గంభీరంగా అతడు. 'అమ్మాయీ' నీపాతివ్రత్యమహిమవల్ల నన్ను చూడగలిగావు నువ్వు. మరొకరికి సాధ్యం కా దది. నీభర్త కాలం తీరిపోయింది. ఇతడు మహాపుణ్యాత్ముడు. కనక, నేనే వచ్చాను తీసుకువెళ్ళిందికి' అన్నాడు. అంటూనే, ఘోరం — సత్యవంతుడి ప్రాణం పెకిలించేశాడు. లొడితెడంత వున్న అతడి జీవుణ్ణి పాశాల్తో బంధించి, చరచరా దక్షిణం దిక్కుగా పట్టుకుపోతున్నాడు.

గోలుగోలుమంది సావిత్రి. భర్తదేహం వొకదగ్గిర భద్రంగా జాచిపెట్టింది. మాట్లాడకండా యముడి వెంటపడింది. అసాధ్యంగావుంది దారి. తొట్రుపడుతున్నాయి ఆమె పాదాలు. చూశాడు యముడు' 'ఇదేమిటి నా వెంటపడ్డావు! వద్దు వద్దు. ఇందాకా ఏదో వచ్చావు. ఇకముందు అడుగన్నా పెట్టలేని దారులివి. తిరిగిపో' అన్నాడు.

'పతులు ఎక్కడికి వెళ్ళితే, సతులూ అక్కడికే వెళ్ళడం ధర్మం. నీదయవల్లా, నాపతిభక్తివల్లా నేను వెళ్ళలేని చోటంటూ లేదు. మార్గాలన్నిటిలోకీ ధర్మమార్గమే ప్రధానమైంది. అలాంటి ధర్మమార్గానికి సజ్జనులే ఆధారం. సజ్జనుల సందర్శనం ఎప్పుడూ వూరికేపోదు. సజ్జనుల్లో ఉత్తముడివి నువ్వు. నీసందర్శనం లభించింది. దీనికి తగిన పరమశుభం దొరకందే వూరికే ఎలా వెళతాను?' అంది సావిత్రి. వినయమూ, వినయానికి తగిన ప్రగల్భమూ రెండూ వున్నాయి ఆమెమాటల్లో.

చకితు డయిపోయాడు యముడు. సావిత్రి, నీమాటలు ఎంతో ఉదారంగా వున్నాయి. మెచ్చుకుంటున్నాను నిన్ను. నీభర్తప్రాణం తప్ప ఏదన్నా వరంకోరు, ఇస్తాను' అన్నాడు.

చేతులు జోడించింది సావిత్రి. 'శత్రువులమూలాన మామామగారి రాజ్యం పోయింది. కళ్ళు కనబడకండా అడివిలో వ్రతాలు చేసుకుంటున్నా డాయన. ఆయనకళ్ళకి దృష్టిప్రసాదించు అంది.

'అలాగే కానీ' అన్నాడు యముడు. 'ఇక వెళ్ళిపో. మరి రాకు' అంటూ ముందుకి నడిచాడు. మళ్ళీ వెంట నడిచింది సావిత్రి.

సావిత్రి: మనోవాక్కాయకర్మలా ఎవ్వరికీ హాని చెయ్యరు మహానీయులు. దీనుల్ని కనికరిస్తారు; కాపాడుతారు. ఆశ్రయించినవాళ్ళని ఆదరిస్తారు. ఇచ్చేటపుడు, మరి లోపంలేకండా కడముట్టా ఇచ్చి, కోర్కెతీరుస్తారు. ఇవన్నీ ఆర్యధర్మాలు. దేవతల్లో ఉత్తము

టివి. నువ్వు ఎరగంది ఏముంది ? ధర్మవిధానం యావత్తూ నీభాషం లోనే వుంది. అంచేతనే ధర్మదేవతవి నువ్వు. ప్రాణులు తాము చేసుకున్న కర్మఫలం, పక్షపాతంలేకండా సమబుద్ధితో పంచి పెడతావు. అందుకనే 'సమవర్తి' అన్నారు నిన్ను. భూతకోటిని యమించడం చేత (అణిచివెయ్యడంచేత 'యముడు' అన్నారు కల్మషం (పాపం) శమనం (నాశనం) చెయ్యడంవల్ల 'శమనుడు' అన్నారు.

యముడు: చక్కగా వున్నాయి నీమాటలు. కల్మషంలేకండా చెపుతున్నావు. దాహంగావున్న వాడికి చల్లటి మంచినీళ్ళు ఎలావుంటాయో అలా వున్నాయి నాకు. సంతోషించాను. సత్యవంతుడి ప్రాణం తప్ప, ఇంకోవరం ఏదన్నా కోరు. ఇస్తాను.

సావిత్రి: దేవా, శత్రువులు లాక్కున్న రాజ్యం తిరిగీ మా మామగారికి అనుగ్రహించు.

యముడు: అలాగే కానీ. వెళ్ళు. నీపతిభక్తి గొప్పది. ఇక ఆగిపో. ముందు దారి దుర్గమంగా వుంటుంది. నువ్వు మరిరాకూడదు.

సావిత్రి: ఎలాంటిస్థితిలో అయినా సరే, తమధర్మం తాము వదిలిపెట్టరు ధర్మాత్ములు. మోహతాపాలికి వాళ్ళ హృదయంలో తావుండదు. అంచేత, ధర్మప్రభూ, భర్తవెనక వెళ్ళడం ఎలా వదిలిపెట్టేది ? ఏది ఏమయినా సరే, మోహంలో మునిగిపోకండా, ధర్మం నిలుపుకోవాలి కదా !

యముడు: సావిత్రీ, ధర్మంమీద నీకు వున్న ఆసక్తి అద్భుతం. మరో వరమిస్తాను. భర్తప్రాణం తప్ప ఏంకావాలో కోరు.

సావిత్రి: మాతండ్రి అశ్వపతికి పుత్రసంతానం లేదు. ఆయనకి వొక వందమంది కుమాళ్ళు ప్రసాదించు.

యముడు: అలాగే కానీ. ఇక వెళ్ళు. ఎంతోదూరంవచ్చావు. అలిసిపోయావు. తిరిగిపో.

సావిత్రి: భర్తపాదాలు సేవించడంతప్ప, ఇతరప్రసక్తి లేని దాన్ని. నాకు అలసటఏమిటి? సతులికి పతిభక్తితప్ప ఇంకా వున్న దేమిటి? ధర్మపరులయిన పుణ్యాత్ములు దొరకడమే దుర్లభం. వారి సంసర్గంవల్ల సమస్తపాపాలూ పోతాయి. వాళ్ళమూలాన్నే సూర్య చంద్రులు గతులుతప్పకండా వున్నారు. సముద్రాలు మేరదాటకండా వున్నాయి. కులపర్వతాలు కదలకండా వున్నాయి. భూతప్రపంచం యావత్తూ క్షేమంగా వుంటున్నది.

ఎవ్వరితోఅయినా ఏడుమాటలు మాట్లాడితే చాలు, వాళ్ళు ఆత్మబంధువులే అయిపోతారని అంటారు పెద్దలు. ఇంతసేపు మాట్లాడాను. అంచేత నీకుస్నేహితురాలిని నేను. స్నేహితురాలికోర్కె చెల్లించడం ధర్మం. అనుగ్రహించు.

యముడు: సావిత్రీ, పరమానందంగా వుంది నాకు. ఏం కోరుతావో కోరు. ఇస్తాను.

సావిత్రి: బతికిపోయాను. ఈసారి 'సత్యవంతుడి ప్రాణం తప్ప', అన్న షరతు లేదు. యమధర్మరాజా, భర్తవిరహం దుస్సహం. భర్తలేని స్త్రీ పాడిల్లు. అంచేత, నాభర్తప్రాణం ప్రసాదించు.

యముడు: గెల్చుకున్నావు. వెళ్ళు. నువ్వుకోరినట్టే నీభర్త బతుకుతాడు. నాలుగువందల సంవత్సరాలు జీవిస్తాడు. వందమంది కొడుకులు కంటాడు. యజ్ఞాలు చేస్తాడు. దేవతల్ని సంతోషపెడతాడు. కీర్తివంతుడౌతాడు.

ఇలా అనేసి అంతర్ధానమయిపోయాడు యముడు. భర్త దగ్గిరికి వచ్చేసింది సావిత్రి. అతడి తల తొడమీద పెట్టుకుకూచుంది.

కొంతసేపట్లో తెలువుకున్నాడు సత్యవంతుడు. 'ఎంతసేపు నిద్రపోయానో' అన్నాడు. 'లేపనన్నా లేపావు కావు కదా! ఏదో కల,-కలకాదు, - నిజంలాగే వుంది. ఎవడో ఒక మహాపురుషుడు,

మాంచి బలవంతుడు, నన్ను లాక్కువెళ్ళాడు. అవును, తలుచుకుంటే భయమేస్తోంది' అన్నాడు.

'అదంతా తీరికగా రేపు చెపుతాను' అంది సావిత్రి. 'పొద్దు పోయింది. ఆలస్యం చెయ్యకుండా ఇంటికి పద ముందు. మునిమాపు ముంచుకు వస్తోంది. అక్కడా అక్కడా అపుడే రాక్షసులు తిరుగుతున్నారు. అదిగో, నక్కలు కూస్తూన్నాయి. కదుపులు కదుపులుగా అడివిమృగాలు తిరుగుతున్నాయి. ఏదో చప్పుడవుతోంది. భయంగా వుంది నాకు. ఈఆలస్యానికి ఇంటిదగ్గిర మీఅమ్మా, నాన్నా ఎంత ఇదయిపోతున్నారో' అంది.

గడచిన విషాదం భర్తకి తెలియనివ్వకుండా మాట్లాడుతోంది సావిత్రి. 'పోనీ, అంత ఆయాసంగా వుంటే ఇక్కడే ఎక్కడన్నా ఈరాత్రి వుండిపోదాం. ఎంతో దూరముంది ఆశ్రమం. చీకట్లో దారీ తెన్నూ కనబడదు. తెల్లవారేకే వెళదాం' అంది.

'పరవాలేదు. మెల్లిగా వెళ్ళిపోదాం' అన్నాడు సత్యవంతుడు. 'తలపోటు తగ్గిపోయింది. వంట్లో చురుగ్గానే వుంది. అమ్మనీ, నాన్ననీ వదిలి అడివిలో ఎలా వుంటాం? ఇంతసేపు వదిలి ఎప్పుడూ వుండలేదు నేను. ఇవాళ ఇంత ఆలస్యం అయినందుకు ఏమవుతున్నారో వాళ్ళు! పొద్దుగూకితే చాలు. బైటికి రానివ్వదు అమ్మ. అడివిలో అర్ధరాత్రి కావచ్చినందుకు ఎంత ఇదయిపోతోందో, పాపం!'

'అమ్మా, నాన్నా ప్రతిదినం నన్ను కౌగలించుకుని, కళ్ళనీళ్ళు పెట్టుకుంటారు. శిరస్సు ముద్దాడతారు. 'దేహమూ, ప్రాణమూ, ధనమూ, అంతానువ్వేనాన్నా మాకు' అంటారు. 'నువ్వు దాటిస్తేనే ఈసంసారసాగరం గట్టెక్కుతాం. కళ్ళన్నా, కాళ్ళన్నా నువ్వేమాకు. నువ్వే మావంశం ఉద్ధరించాలోయి కన్నతండ్రీ' అంటూ ఎంతో లాలిస్తారు. నేను దగ్గిరలేక ఇప్పుడు ఎంత కొట్టుకుపోతున్నారో! ఏం

చెయ్యడం? పళ్ళూ, అవీ పట్టుకుని అప్పుడే వెళ్ళిపోవలిసింది నేను. నా దురదృష్టం! ఎంతపని చేశాను! వృద్ధులు. కళ్ళులేని కబోదులు. నా సంగతి తెలీక ఎంత దేవులాడుతున్నారో! ప్రాణమే వదిలేసి వుంటారు. ఇక ఆశ్రమంలో ఏంపని నాకు? నేనూ ప్రాణం వదిలేస్తాను' అంటూ విచారించాడు.

సావిత్రీ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. భర్తని వోదార్చింది. తామర తూళ్ళులాంటి చేతుల్తో అతణ్ణి పట్టుకుని లేవనెత్తింది. మెల్లిగా లేచాడు సత్యవంతుడు. దుమ్మూ దుట్రా దులుపుకున్నాడు. బరువు మొయ్యడం మరింతకష్టం అంటూ పళ్ళబుట్ట వొక చెట్టుకొమ్మమీద వుంచేసింది సావిత్రి. గొడ్డలి పట్టుకుంది. భర్త ఎడమచెయ్యి తన ఎడమభుజంమీద వేసుకుంది. కుడిచేత్తో అతణ్ణి పెనవేసి పట్టుకుంది. మెల్లి మెల్లిగా నడిపిస్తూ ఆశ్రమానికి బయలుదేరింది.

ఇక్కడ సత్యవంతుడు లేవడానికి ముందే అక్కడ ఆశ్రమంలో కళ్ళువచ్చాయి ద్యుమత్సేనుడికి. నాలుగుదిక్కులా చూశాడతడు. కొడుకు కనపళ్ళేదు. 'ఇంకా రాలేదూ? అడవిలో ఏమయిపోయాడో? కళ్ళువచ్చినా కళ్ళ వెలుగు కొడుకు కనపడడు!' అంధుడికంటే పది రెట్లు భార్యతోసహా విచారించాడు ద్యుమత్సేనుడు. దగ్గిర దగ్గిర అంతటా వెదికాడు. కనపడ్డ వాళ్ళనల్లా అడిగారు. ఏడీ సత్యవంతుడూ? కొడుకు గుణాలు తలుచుకుంటూ 'కొడుకా, కొడుకా' అని ఏడుస్తూ కూచున్నాడు. తల్లి దుఃఖం చెప్పే అక్కరలేదు. ఆశ్రమంలోని మునులందరూ వచ్చి వోదార్చారు. కాని, కళ్ళువచ్చాయంటే, అందరికీ ఆశ్చర్యమే.

కొంతసేపట్లో సావిత్రీ, సత్యవంతుడూ వచ్చేశారు. తల్లీ తండ్రీ అమాంతంగా కౌగిలించుకున్నారు. శిరస్సులు ముద్దాడారు. ఆశ్రమం అంతా ఆనందంతో నిండిపోయింది.

'ఏం నాన్నా, ఇంత ఆలస్యంచేశావేం?' అంటూ కొడుకు శరీరం నిమిరాడు తండ్రి. అడవిలో పళ్ళు కోయడమూ, కర్రలు కొడుతూ వుంటే తలనొప్పి రావడమూ, పడిపోవడమూ, కలలో ఎవరో వచ్చి లాక్కుపోవడమూ అన్నీ చెప్పాడు సత్యవంతుడు.

ఆ మిగిలినభాగం అందుకుంది సావిత్రి. 'కలకాదు. నిజమే అది' అంది. 'అలా వచ్చినవాడు యముడు. ఇవాళ ఈయన చచ్చి పోతారని ముందే నారదుడు చెప్పాడు మాకు. అందుకనే మూ నాళ్ళ ఉపవాసవ్రతం చేశాను. వదలకండా వెంట అడివికీ వెళ్ళాను. ఆయాసంవచ్చి, ఈయన పడుకున్నాక, యముడే స్వయంగా వచ్చాడు. ఈయనజీవుడు పెకలించి పట్టుకుపోయాడు. వెంటపడ్డాను నేను. ఎన్నో విధాల ప్రార్థించాను. సంతోషించి, నాలుగువరాలుఇచ్చాడు యముడు. నాలుగోవరంతో ఈయన బతికారు. మొదటివరంతో మీకళ్ళు వచ్చాయి. తక్కిన రెండువరాల్లో వొకటి మీ రాజ్యం మీకు తెస్తుంది. రెండోది మానాన్నకి వందమంది కుమాళ్ళ నిస్తుంది' అని విడమర్చి చెప్పింది.

'ఆపదలో అడ్డుపడ్డావు తల్లీ! నువ్వు మావంశం నిలబెట్టిన కుల దేవతవి కాని, కోడలివి కావు' అంటూ సావిత్రిని గుచ్చి కౌగిలించు కున్నారు అత్తమామలు. మునులందరూ ఆశీర్వదించారు.

కొద్దిదినాలు గడిచాయి. సాళ్వదేశంనించి వొకనాడు మం త్రులూ, మూలభృత్యులూ, పెద్దలూ, పౌరులూ కలిసి ద్యుమత్సేనుడి ఆశ్రమానికి వచ్చారు. 'ద్యుమత్సేన మహారాజా, మీశత్రువు మర ణించాడు. తన సేవకులు పన్నిన కుట్రవల్ల బంధువుల్తో సహా నశించి పోయాడు. సాళ్వరాజ్యం అరాజకంగా వుంది. నిన్నే రాజు చెయ్యాలని తీర్మానించుకు వచ్చారు ప్రజలు. మీతపోబలం వల్ల నేత్రాలూ వచ్చాయి మీకు. మాభాగ్యం. మిమ్మల్ని చూసి మా

కళ్ళు చల్లబడ్డాయి. ఇదిగో ఈసైన్యమంతా మీది. ఈ పట్టపు ఏనుగుమీద దయచెయ్యి ' అంటూ ఆహ్వానించారు.

కోడలు చెప్పినంతా జరిగిందని సంతోషించాడు ద్యుమత్సేనుడు. ఆశ్రమం మునులదగ్గిర సెలవుతీసుకున్నాడు. కొడుకుతో కలసి పట్టపుఏనుగుమీద కూచున్నాడు. చతురంగ సేనలతో కూడా ఉత్సవంగా సాళ్వరాజ్యం ప్రవేశించాడు. సత్యవంతుడికి యువరాజ్య పట్టం కట్టాడు. సర్వసౌఖ్యాలతోనూ రాజ్యం పరిపాలించాడు.

ఇలాకట్టుకున్న భర్తనీ, అత్తమామల్నీ, తల్లితండ్రుల్నీ ఉద్ధరించింది సావిత్రి. పుట్టినిల్లూ మెట్టినిల్లూ పవిత్రం చేసింది.

"ధర్మరాజా, సావిత్రిలాగే, మీద్రౌపదీ పరమకల్యాణి. ధర్మం తప్పని ఇల్లాలు. ఆమెలాగే ఈమెకూడా మిమ్మల్నీ మీవంశాన్నీ ఉద్ధరిస్తుంది. ఈమె మూలాన సకలభాగ్యాలూ మీకు సమకూడతాయి" అని చెప్పాడు మార్కండేయుడు. తరవాత, "వెళ్ళివస్తాను" అంటూ తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

ఈవిధంగా వనవాసం గడుపుకుంటూ వస్తున్నారు పాండవులు. మరి కొద్దిదినాల్లో పన్నెండేళ్ళూ పూర్తిఅయిపోతాయి.

## కీర్తి పదులు కోలేను

పాండవుల అరణ్యావాసం చివరిదినాల్లో, మాయచేసి కర్ణుడికవచకుండలాలు కాజెయ్యాలన్న ప్రయత్నంలో వున్నాడు దేవేంద్రుడు. అది ముందే తెలుసు సూర్యుడికి. ఈసంగతి కాస్త కర్ణుడి చెవిలోవేసి ఇంద్రుడిమాయ సాగకండాచెయ్యాలి. ఆ ఉద్దేశంతో బయల్దేరాడు సూర్యుడు.

ఒకనాడు తన ఇంటిదగ్గిర సావకాశంగా కూచున్నాడు కర్ణుడు. ఇంతలో ఎక్కడినుండో ఒక బ్రాహ్మడు వచ్చి, ఎదట నుంచున్నాడు.

"అంగరాజా, నీమంచికోసం వొకసంగతి చెప్పాలని వచ్చాను" అన్నాడతడు. "రహస్యవిషయ మిది. సావధానంగా విను. దేవేంద్రుడున్నాడే, దేవతలరాజు — అతడు పాండవపక్షపాతి. మాయ చేసి, నీకవచకుండలాలు హరించాలని చూస్తున్నాడు. బ్రాహ్మలంటే ప్రాణం నీకు. దానం అంటే పండుగ. బ్రాహ్మలు చెయిచాస్తేచాలు. ఆలోచించకుండా ఏదిపడితే అది ఇచ్చేస్తావు. ఈసంగతి బాగా తెలుసు ఇంద్రుడికి. అందుకని, కపటంగా బ్రాహ్మడివేషంలో వచ్చి, అడుగుతాడు. నువ్వుమాత్రం కవచకుండలాలు ఇవ్వొద్దు. బంగారమూ, నవరత్నాలూ, స్త్రీలూ-ఇలాంటివి ఏవికావలసినా ఇస్తాననూ. బతిమిలాడీ, నచ్చచెప్పీ ఎలాఅయినా తప్పించుకో. అంతేకాని, ఇవి ఇచ్చేశావా, నీప్రాణాలమీదికే వస్తుందనుకో. ఇవి రెండూ వున్నంత వరకూ మృత్యువు నిన్ను ముట్టలేదు. మూడు లోకాల్లోనూ ఎవ్వరయినా సరే, నిన్ను గెలవలేరు. నీ సర్వసౌఖ్యాలికీ యివే కారణాలు. నిజంచెపుతున్నాను. మోసపోకు" అన్నాడు.

"బ్రాహ్మణవేషంలో వచ్చిన దేవతలా వున్నావు, మహాత్మా, ఎవరు నువ్వు?" వినయంగా అడిగాడు కర్ణుడు.

"సూర్యుణ్ణి" అన్నాడు బ్రాహ్మడు. "నీమీద ప్రేమవల్ల ఇది చెప్పవచ్చాను" అన్నాడు.

తడబడుతూ లేచాడు కర్ణుడు. "కర్ణుడు నమస్కరిస్తున్నాడు" అంటూ పాదాభివందనం చేశాడు. "ప్రభూ, అనుగ్రహించావు. కృతార్థుణ్ణయాను" అన్నాడు. "దేవా, వొకమనవి. 'బ్రాహ్మలడిగితే ప్రాణాలయినా ఇచ్చేస్తాను.' ఇదీ నాశపథం. లోకమంతా ఎరుగు నిది. అలాంటప్పుడు, దేవేంద్రుడంతటి వాడే బ్రాహ్మడై వస్తే కవచకుండలాలే వొకగొప్పా నాకు? ప్రపంచం నిండివున్న ప్రసిద్ధి

మంటకలిసి, క్షణభంగురమయిన శరీరంకోసం, జన్మవ్రతానికే నీళ్ళదార వదలడమా, ఇప్పుడు!

"పాండవులమీద పక్షపాతంతో మాయకి నెట్టుకుంటే, తన కీర్తికే కళంకం వస్తుంది దేవేంద్రుడికి. అప్పుడు, మూడులోకాల్లోనూ మరింత ప్రకాశిస్తుంది, నాకీర్తి. అంచేత, అది నాభాగ్యమే అవుతుంది. ఏమన్నా కానీ! కీర్తి వదులుకోలేను. కీర్తిలో చావు వచ్చినా సంతోషిస్తాను. అపకీర్తి మాత్రం సహించలేను. అపకీర్తి కంటే: చావే నయమంటాను. కీర్తే పుణ్యగతులిస్తుంది. కీర్తే తల్లిలా కాపాడుతుంది. కీర్తే ఆయువూ, సిరీ ఇస్తుంది. కీర్తిలేనివాడూ శవమూ వొక్కటే. కీర్తిలేనివాణ్ణి ఆపదలూ కబళిస్తాయి.

"బ్రాహ్మలడిగితే లేదనకండా ఇవ్వడమూ, బలవంతుడయిన శత్రువుని పడగొట్టడమూ, యుద్ధంలో ముందుకి వురకడమూ, శరణన్నవాణ్ణి - వాడు ఎంతటి శత్రువయినా రక్షించడమూ, బ్రాహ్మలూ, స్త్రీలూ, వృద్ధులూ, పిల్లలూ వీళ్ళకి ఆపదవస్తే అడ్డుపడడమూ నా వ్రతాలు. ఇందులో వొక్కటితప్పినా అపకీర్తి పాలవుతాను. అంచేత, కవచకుండలాలు కాదనలేను దేవేంద్రుడికి" అన్నాడు.

"నీఅంత అమాయకుణ్ణి నిన్నే చూశాను" అన్నాడు సూర్యుడు. "ప్రేమాస్పదులు హితం చెపితే ససేమిరా విననంటావు! నువ్వెక్కడ, తెలివితేటలెక్కడ! ఊరికే చెడిపోకు. కర్ణా, నామాట విను. తనకి మించిన ధర్మం లేదు. కీర్తి కీర్తి అంటూన్నావు. తనకీ, ఆలుబిడ్డలికీ, తల్లి తండ్రులికీ కీడురాకండా చూసుకుని కీర్తి సంపాదించాలి. అంతేకాని, అసలుకే మోసం తెచ్చేది కీర్తేమిటి!

"కీర్తి అటుండనీ, ప్రాణాలు చూసుకో ముందు. ప్రాణముంటే కీర్తి అదే వస్తుంది. ఒక్క కీర్తే అన్నమాటేమిటి? భార్యలూ, పిల్లలూ, బంధువులూ, సంపదలూ, రాజవైభవాలూ అన్నీ వస్తాయి,

ప్రాణమంటూ వుంటే. ప్రాణమే లేకపోతే ఇహ వచ్చేదేమిటి? చచ్చిన వాడు బుగ్గిలో బుగ్గే అయిపోతాడు. కీర్తి చూడవస్తాడా? శవానికి అలంకారం లాగ, చచ్చేక కీర్తేమిటి?

"నువ్వు ఎంతో భక్తుడివి నాకు. భక్తుల్ని రక్షించడం నాకర్తవ్యం. కనక, ఇంతవరకూ చెప్పవలసివచ్చింది. అంతేకాదు, ఇంకో దేవరహస్యమూ వుంది, నీమీద నాకు వాత్సల్యం కలగడానికి. అయితే, అది ఇప్పుడు నేను చెప్పను. దానంతట అదే నీకు తెలుస్తుంది, ముందు ముందు. "అర్జునుడికీ నీకూ పులిపంది వారడకదా! మీరు ఇద్దరూ పోట్లాడినప్పుడు, కవచకుండలాలు కాపాడతాయి నిన్ను. అవి వుంటే అతడు గెలవలేడు. అంచేత పోగొట్టుకున్నావో, విమమిస్తుంది" అన్నాడు.

"కరుణామూర్తివి. భక్తవత్సలుడివి. నామీద వాత్సల్యంతో ఆదేశించావు. ప్రభూ, నీమాటకి అడ్డువచ్చాను. మన్నించు. యముడన్నా భయపడను. అసత్యమంటే వణికిపోతాను. నాశపథం ఈ నాటిదికాదు. నిన్ను వేడుకుంటున్నాను. నావ్రతం నన్ను మాన్పించకు.

"అర్జునుడు అసాధ్యుడనుకోవద్దు. నాదివ్యాస్త్రాలు నీకు తెలీనివా? ద్రోణుడూ పరశురాముడూ ప్రసాదించిన మహాస్త్రాలు సామాన్యమయినవి కావు. అంచేత, అర్జునుణ్ణి తప్పకండా చంపేస్తాను. సందేహంలేదు. నాత్యాగం నాకు వుండనీ. అనుజ్ఞ దయచెయ్యి. కీర్తి వదులుకోలేను" అంటూ అంజలిబంధంతో తలవంచాడు కర్ణుడు.

ఒక్క నిమిషం విచారించాడు సూర్యుడు. "ముమ్మాటికీ ఇదే నీనిశ్చయమన్న మాట! ఐతే వొక్కటిమాత్రం చెయ్యి. దేవేంద్రుడి దగ్గిర వొక దారుణమయిన శక్తి వుంది. అది అడిగి పుచ్చుకో ముందు. అతడు అది నీకు ముందుఇచ్చాక, కావలిస్తే కవచకుండలాలూ ఇయ్యి. అలా అయితే పరవా వుండదు. అద్భుతమైంది ఆశక్తి. దాని విశేషం చెపుతాను విను. యుద్ధంలో శత్రువుల్ని చంపేసి మళ్ళీ చేతి

లోకి వచ్చేస్తుంచది. దాంతోనే ఇంద్రుడు లక్షలు లక్షలు రాక్షసుల్ని చంపేశాడు. అది వుంటేచాలు. అందరినీ జయించేస్తావు నువ్వు" అని చెప్పి, అంతర్ధానమయిపోయాడు. ఎప్పుడు దేవేంద్రుడువస్తాడా, ఎప్పుడు కవచకుండలాలు అడుగుతాడా అని కాసుకుకూచున్నాడు కర్ణుడు.

కర్ణుడితో మాట్లాడుతూ, 'ఇంకో దేవరహస్యం వుంది, నీ మీదవాత్సల్యం కలగడానికి' అన్నాడు కదా, సూర్యుడు! కర్ణుడి పుట్టుకే ఆ దేవరహస్యం. ఇంతకిముందే విన్నారు మీరు, కర్ణుడి పుట్టుక. మళ్ళీ, కొంత విపులంగా చెపుతాను, వినండి.

### కర్ణుడి జన్మచరిత్ర

పాండవుల తల్లి కుంతి కన్యగా వున్నప్పటి కథ అది. ఆ దినాల్లో కుంతిభోజుడి ఇంటికి అతిథిగా వచ్చాడు దుర్వాసముని. అతణ్ణి ఎంతో గొప్పగా పూజించాడు కుంతిభోజుడు. "మీ ఇంట్లో కొంతకాలం వుండాలని వుంది. నేను వున్నంతకాలం నువ్వూ, నీవాళ్ళూ అవ్యాజమైన భక్తితో నన్ను సేవించాలి. ఏం, అంగీకారమేనా?" అని అడిగాడు దుర్వాసుడు. సంతోషంతో అంగీకరించాడు కుంతిభోజుడు. దుర్వాసుడి పరిచర్యకి తన కూతురు కుంతిని నియోగించాడు.

"తల్లీ, దేవుడులాంటివాడు, ఈ మునీశ్వరుడు. మనయింట్లో వుంటానంటే, అంగీకరించాను. బుద్ధిమంతురాలివి. ఏలోపం లేకండా ఇతణ్ణి సేవించాలి నువ్వు. ఎప్పుడుకావాలంటే అప్పుడు, ఏది కావాలంటే అది, ఆదరంగా అందించి సంతోషపెట్టాలి. ఏసందర్భంలోనూ కోపం రాకండా వెయ్యికళ్ళతో కనిపెట్టాలి. మునీశ్వర్లంటే తపఃప్రభావం కలవాళ్ళు. వాళ్ళకి పిసరంత కోపంవచ్చిందో, భూలోకమే బుగ్గిచేసి వొదిలి పెడతారు. వాతాపీ, దండకుడూ మొదలైన వాళ్ళు

మునీశ్వర్ల కోపంవల్లే నాశనమైపోయారు. నిజానికి మునులవల్లే ప్రపంచాలు బతికివున్నాయి.

చిన్న పిల్లవే అయినా బుద్ధిమంతురాలివి నువ్వు. పెద్దలన్నా, బ్రాహ్మలన్నా భక్తి నీకు. పట్నంలోనూ కోటలోనూ నిన్ను మెచ్చుకోని వాళ్ళు లేరు. యాదవకులంలో పుట్టావు. నాముద్దులకూతురువై పెరిగావు. అగ్నిహోత్రంలాంటివాడు దుర్వాసముని. నువ్వు మంచిదానివి కనకనే ఇతడిభారం నీమీద పెట్టాను. గర్వమూ, అహంకారమూ లేకండా రుషిని ఆరాధించు. కృతార్థురాలివి కా" అన్నాడు.

"నేను కోరుకున్న పనే నాకిచ్చారు నాన్నగారూ" అంది కుంతి. "ఇలాంటి మునులసేవ చెయ్యాలనే ఎప్పుడూ అనుకుంటూ వుంటాను. నాకోర్కె ఇప్పుడూ సిద్ధించింది. అదీకాక, మీరు చెప్పడమూ, నేను చెయ్యడమున్నూ. ఇది నాభాగ్యం. మీరు నిశ్చింతగా వుండండి. దుర్వాసుల వారికి ఏలోపమూ రానివ్వను" అంది.

కూతుర్ని దగ్గిరికి తీసుకుని, శిరస్సుముద్దాడాడు కుంతిభోజుడు. దుర్వాసుడి దగ్గిరికి తీసుకువెళ్ళి "ఈచిన్నది నాకూతురు. మీ సేవ చేస్తుంది. పసిపాప. ఆగ్రహించకండి. ఏతప్పుచేసినా మీరే సరిపెట్టుకోవాలి. సుళువులు నేర్పి పనిచేయించుకోవాలి. పిల్లలూ, స్త్రీలూ తప్పుచేస్తే మీకు మాత్రం తెలీందేముంది— మన్నిస్తారు కాని ఆగ్రహించరు మీబోటిపెద్దలు" అంటూ వినయంగా చెప్పి, కుమార్తెని అప్పగించాడు.

చంద్రకాంతిలా స్వచ్ఛంగా వున్న వొక మేడలో దుర్వాసమునికి బసఏర్పాటు చేశాడు కుంతిభోజుడు. పక్కా, ఆసనాలు మొదలయిన పరికరాలూ, అన్ని విధాల ఆహారసామగ్రీ ఉప్పుకల్లు వారా లేకండా అమిర్చి పెట్టాడు. ఎప్పటికప్పుడు అన్నివిషయాలూ విచారిస్తూ వుండేవాడు.

వెయ్యికళ్ళతో మునీశ్వరుణ్ణి కనిపెట్టుకు కూచుండేది కుంతి. భక్తి వినయాల్తో దేవతలిని కొలిచినట్టు కొలిచేది అతణ్ణి. ఆమె మనస్సు పరీక్షించాలి. అదీ దుర్వాసుడి అభిలాష. అందుకని, అడ్డ మూనితిప్పలూ పెట్టేవాడు ఆమెని. రేపు వస్తానని ఎటో వెళ్ళిపోయే వాడు. హటాత్తుగా అర్ధరాత్రి హాజరయ్యేవాడు. రాత్రికే వచ్చేస్తా ననేవాడు. మర్నాడుకాని కనిపించేవాడుకాడు. అన్నిటికీ తట్టు కునేది కుంతి. ఎప్పుడువస్తే అప్పుడు, పంచ భక్ష్యపరమాన్నాలూ వడ్డించేది. కొత్తకొత్త పిండివంటలు, ఏవి కోరితే అవి లేదనకండా ఎదట పెట్టేది. అలసిపోవడం, చిరాకుపడడం, ఇలాంటివి ఏవీ వుండేవి కావు ఆమెకి. ప్రతీదినం పిల్చి కనుక్కునేవాడు తండ్రి. ప్రతీదీ పూస గుచ్చినట్టు నివేదించేది కుంతి.

ఇలా వొక సంవత్సరం పూర్తి అయింది. ఎంతో అంత సంతో షించాడు దుర్వాసముని. "అమ్మాయీ, నీఆరాధన మెచ్చుకుం టున్నాను. నీకు ఏంకావాలో అడుగు ఇస్తాను" అన్నాడు.

"మీరు సంతోషించారు. అదే పదివేలు. మానాన్న సంతో షిస్తారు. ఇంతకంటే కావలసిం దేమిటినాకు!"— చేతులు జోడిస్తూ అంది కుంతి.

"అలా కాదు. కుంతీ, నీకో మంత్రం ఉపదేశిస్తాను" అన్నాడు దుర్వాసుడు. "ఆమంత్రప్రభావంతో, నువ్వు ఏ దేవతని ఆరాధిస్తే ఆ దేవత నీదగ్గిరికి వస్తాడు. నీచెప్పుచేతల్లో మసులుకుం టాడు" అన్నాడు.

కాదంటే, ఏం ప్రమాదమో అనుకుని, "మహాప్రసాదం" అంది కుంతి. విధియుక్తంగా మంత్రం ఉపదేశించాడు ముని. ఆమెని దీవించి తనదారిని తాను వెళ్ళిపోయాడతడు.

కొన్నాళ్ళు గడిచిపోయింది. 'మంత్రం ఉపదేశించి వెళ్ళాడు ముని. దీనిప్రభావం పరీక్షించాలి' అనుకుంటూ వుండేది కుంతీ కన్య. ఒకనాడు రుతుస్నానం చేసింది. సహజమయిన కవచకుండలాల్తో తూరుపుకొండమీద ఎంతో ఇదిగా ప్రకాశిస్తూవున్న సూర్యనారాయణమూర్తిని చూసింది. ఆమెని ఆకర్షించింది ఆమూర్తి. బాగా విడిన పువ్వులాగ ఆమెహృదయంలో అనురాగం గుబగుబలాడింది. దాంతో మరోమెట్టు ముందుకే వెళ్ళిపోయిందామె. "దేవా! నీలాంటి కుమారుణ్ణి అనుగ్రహించు" అంటూ మంత్రం చదివేసింది.

యోగబలంవల్ల మరో మూర్తి ధరించి, కుంతీ కన్యముందు నుంచున్నాడు సూర్యుడు. "నీమంత్రప్రభావంవల్ల పిల్లా, ఇదిగో వచ్చాను" అంటూ చిరునవ్వు నవ్వాడు. "నీవాణ్ణయాను, నిన్ను సంతోషపెట్టే వెళతాను. రా, ఏం కావాలో చెప్పు" అన్నాడు.

"ఏమీ అక్కరలేదు" -తడబడిపోతూ అంది కుంతి. "ఏదో సరదాకోసం, చాపల్యంగా, వూరికే చదివాను మంత్రం. అంతమాత్రానికే వచ్చేశావేమిటి? వెళ్లు. వెళ్ళిపో, ఆకాశంమీదికి" అంది.

"వెళ్ళక తప్పదే అనుకో, వచ్చినపని అయాక," అన్నాడు సూర్యుడు _"కాని, ఇప్పుడిప్పుడే ఏం కావాలని కోరుకున్నావు? అది చెప్పవేం? కవచకుండలాల్తో, నాలాంటి కొడుకు కావాలనలేదూ నువ్వు! మరి? తీరా వచ్చాక, పొమ్మంటే తప్పుతుందా! రా సిగ్గుపడకు. సంకోచించకు. ఒప్పుకో. నువ్వుకోరుకున్నట్టే కొడుకు పుడతాడు. లేదంటే నీతల్లినీ తండ్రినీకూడా చంపేస్తాను. నీసంగతీ సందర్భం తెలీకుండా, నీకు మంత్రంనేర్పిన ఆపొగరుపోతు రుషినీ కాల్చి వదిలిపెడతాను. అదిగో ఆకాశంమీద, చూడూ. నీమూలాన చిక్కుపడిపోయిన నన్ను చూసి దేవేంద్రుడూ వాళ్ళూ నవ్వుతున్నారు; కనపడదంటావా, ఇదిగో, దివ్యదృష్టి ఇస్తూన్నాను, కావలిస్తే."

భయంతోనూ సిగ్గుతోనూ ముడుచుకుపోయింది కుంతి. "మంత్ర బలం తెలుసుకోలేకపోయాను. తప్పే చేశాను. మించిపోయింది. అప రాధమనుకోకు. బాల్యచాపల్యం కింద మన్నించు. తల్లిచాటు పిల్లని. అమ్మా నాన్నా వున్నారు. నన్ను ఇవ్వడానికయినా, మానడాని కయినా వాళ్ళే కర్తలు. కన్యని. నాకు నేను ఎలా స్వతంత్రించేది? కన్యాధర్మం కాళ్ళదన్ని, వంశహానికే ఎలా సాహసించేది?" అంటూ అనేక విధాల ప్రాధేయపడిం దామె. లాభం లేకపోయింది. తన మూలాన, తన తల్లిదండ్రులకీ, వంశానికీ కళంకం వస్తుందంటూ కొంత సాహసించీ, వాదించీ చూసింది. "బంధువులున్న దాన్ని, తండ్రి చాటుదాన్ని. ఇలా అధర్మంలో దింపుతున్నావు. నీకీ ఆర్తికి మాత్రం మచ్చకాదా, ఇది! కులమూ, శీలమూ చూసి, పెద్దలు పెళ్ళిచేశాక స్త్రీకి భర్తతో కలియడం ధర్మం" అంది.

వినుకోలేదు సూర్యుడు. "అయినా, నువ్వు ఎరగని ధర్మం మాత్రం ఏముంది? లోకంలో సత్యమూ, ధర్మమూ నిలబెట్టిన వాడివే నువ్వు. నీకు ఏది మంచిదనితోస్తే అదే కానీ. కాదనడానికి నేనెంత దాన్ని? నీఅభిలాషే కానీ" అంది చివరికి కుంతి.

"పిచ్చిదానా. నీకు నువ్వే కర్తవి" అన్నాడు సూర్యుడు. "తల్లి తండ్రులూ, బంధువులూ, పెద్దలూ – ఎవరిప్రమేయమూ లేదు ఇం దులో. కామములు యావత్తూ కామించి పొందడం మూలాన, కన్యా శబ్దం వచ్చింది. అంచేత స్వయంగా స్వతంత్రించడంవల్ల దోషంలేదు నీకు. నేనుమాత్రం అధర్మంగా నడుస్తానా మరి! అంతేకాదు. నా సం గమంవల్ల నీకన్యాత్వం చెడదు. కొడుకు పుడతాడు. అయినా నీకు నింద వుండదు" అని చెప్పి, ఆమెని వొప్పించాడు. ఆమె సంగ మంతో సంతుష్టుడూ అయా డతడు. ఆమెకి గర్భాధానంచేసి, అంత ర్ధానానికి వెళ్ళిపోయాడు.

నీళ్ళుపోసుకుంది కుంతి. శుక్ల పక్షంలో చంద్రబింబం లాగ, గర్భంలో పెరిగాడు శిశువు. అయినా, సూర్యుడి మహిమవల్ల ఎవ్వరికీ తెలియలేదు. దాదికూతురికి వొక్కదానికి మాత్రం తెలుసు. తొమ్మిది నెల్లూ నిండాయి. పదో మాసమూ వచ్చింది. ఒకనాటిరాత్రి కన్యాంతఃపురంలో కుమారుడు కలిగాడు కుంతికి. కవచకుండలాల్తో బాల సూర్యుడిలా ప్రకాశిస్తున్నాడు బాలుడు.

లోక నిందకి భయపడిపోయింది కుంతి. కొడుకుని వొక పెట్టెలో పెట్టింది. భద్రంగా వొక తెప్పమీద బంధించింది పెట్టె. నిశిరాత్రి దాదికూతురూ తానూ వెళ్ళి పట్నం సమీపంలో పారుతూ వున్న అశ్వనది ప్రవాహంలో వదిలి పెట్టింది.

అటు నదీప్రవాహంలో కొట్టుకుపోతున్నాడు కుమారుడు. ఇటు దుఃఖప్రవాహంలో మునిగిపోతోంది కుంతి. "నాబుల్లి తండ్రిని గంగలో తోశాను. పాపిష్టిచేతుల్తో మానాన్నని ముద్దాడలేకపోయాను. చందమామలాంటి మొహం బాబుది! అయ్యో, నాన్న చిరునవ్వయినా చూడలేకపోయాను! అడ్డాల్లో వేసుకునే అదృష్టం లేకపోయింది?

"నానోములే అంతరా, నాకన్నతండ్రీ! నిన్ను కన్నాను. పెంచలేకపోయాను. ముద్దూముచ్చటా జరపలేకపోయాను. నీ గడనా అనుభవించలేకపోయాను! ఏవొడ్డు చేరతావో, నాన్న! ఏతల్లి పెంచుతుందో నిన్ను? ఏఅమ్మ నోచిందో నువ్వు కొడుకు కావడానికి! బుల్లిబుల్లి మాటల్తో బుగ్గిలో ఆడుతూ వుంటె, ఏపుణ్యాత్మురాలు ముద్దాడుతుందో నిన్ను! చేరదేసి కళ్ళతో బోసినవ్వులు నవ్వుతూ వుంటే, నోములు నోచినమ్మ, ఎవ్వతె ఎత్తుకుంటుందో తీసి!

"నాన్నా! అదృష్టవంతుడు మీఅయ్య. నువ్వు ఎక్కడవున్నా చూస్తూవుంటాండు నిన్ను. నేనే పాపిష్టిదాన్ని. కానైతే, అరిచెయ్యి అడ్డుపెడితే అడిగిపోతుందా సూర్యబింబం! బంగారులాంటి నీవొళ్ళు

చెవుల్లోని మణికుండలాలూ, నీవజ్రకవచం- ఎటుపోతాయి? ఇవే ఆనవాలు నాకు. ఇవేపట్టియిస్తాయి నిన్ను. ఎప్పుడైనా కళ్ళచూస్తాను.

"పెరిగి పెద్దయాక నవమన్మథుడిలాగ, సింహం కొదమలాగ అవుపిస్తాడు మాబాబు. వడుచుపిల్లలు మనసే పట్టలేరు, చూస్తే. పగవాళ్ళకి దిగులే పట్టుకుంటుంది.

భూమిమీదా, ఆకాశంమీదా, స్వర్గంలో, గాల్లో, అగ్గిలో, అన్నిదిక్కులా, సముద్రాల్లో - ఎక్కడయినా సరే, శుభమే కలగాలి నీకు నాతండ్రీ! దిక్పాలకులూ, సిద్ధులూ, సాధ్యులూ, రుద్రులూ, అశ్వినులూ, మరుత్తులూ ఎప్పుడూ నిన్ను కాపాడాతూ వుండాలి."

ఇలా గుండెలు పగిలిపోయినట్లు అశ్వనదివొడ్డుని ఎంతో సేపు ఏడ్చింది కుంతి. ఇంకా ఆలస్యమయితే విషమిస్తుంది. లోపలి దుఃఖం లోపలే గుటకలు వేసుకుంటూ, రహస్యంగా కన్యాంతఃపురం లోకి వచ్చేసిం దామె. మర్నాడు తెల్లవారాక, ఏమీ ఎరగనట్టు ఎప్పటిలాగే మసులుకుంది.

నిశిరాత్రి అశ్వనదిలో కొట్టుకుంటూ పోయింది పెట్టె. అశ్వ నదిలోంచి, అది కలుస్తూవున్న చర్మణ్వతినదిలో పడింది. చర్మణ్వతి లోంచి యమునలోపడి కొట్టుకుపోయింది. యమునలోంచి గంగా నదిలో పడింది. గంగానదిలో కొట్టుకుపోతూ మర్నాడు సూత దేశంలో పంపానగరం పక్కనించి వెళుతోంది పెట్టె.

సరిగ్గా అదే సమయానికి, ధృతరాష్ట్రుడి స్నేహితుడు, అతిర థుడు అనే సూతుడు, ఆడవాళ్ళతో జలకేళిచేస్తున్నాడు గంగలో. కెరటాలమీద తేలి తేలి కొట్టుకుపోతూ వున్న తెప్పా, తెప్పమీద పెట్టే చూశాడతడు. చిత్ర మనిపించిం దతనికి. సేవకుల్ని పంపించి వొడ్డుకి పట్టించా డది. పెట్టె పట్టుకువచ్చి, తానే ఏకాంతంగా తెరి

ధాడు అతిరథుడు. పెట్టెలో బంగారం కవచకుండలాల్తో ధగధగా మెరిసిపోతున్నాడు కుమారుడు.

ఆశ్చర్యం—ఆశ్చర్యానికి మించిన ఆనందం_ఆపుకో లేకపోయాడు అతిరథుడు. చప్పునతీసి ఎత్తుకున్నాడు కుమారుణ్ణి. తీసుకు వెళ్ళి, తన భార్య రాధచేతిలో పెట్టాడు. "పాపల్లేని మనకి దేవుడు ఇచ్చాడు ఈముద్దుపాపని. మానవశిశువు కాడు వీడు, దేవతా శిశువు" అన్నాడు. కుమారుణ్ణి అమాంతంగా అందుకుంది రాధ. పెన్నిధి దొరికినట్టు గుండెకి అద్దుకుంది. చిత్రం! పచ్చి బాలింతలాగ చన్నులు చేపాయి రాధకి.

పండులాగ ఎగిరిపడుతూ, కుమారుణ్ణి ఇంటికి పట్టుకువచ్చారు సూతదంపతులు. తమ కులోచితంగా జాతకర్మలూ అవీ జరిగించారు. సహజమయిన కర్ణకుండలాలు వుండడంచేత కర్ణుడని పేరు పెట్టారు. వసువర్మం అంటే బంగారుకవచం వుండడం మూలాన వసుసేనుడు అన్నారు, బ్రాహ్మలు. కుంతీకన్యకీ, సూర్యుడికిపుట్టిన కుమారుడు ఇలా సూతుడి కొడుకయాడు కర్ణుడు.

ఆప్తులైన పరిచారకులవల్ల ఈవృత్తాంత మంతా వింది కుంతి. గుండె నిబ్బరంచేసుకుని, విచారం విడిచిపెట్టింది.

తగిన వయస్సువచ్చాక, కర్ణుణ్ణి హాస్తినాపురం పట్టుకునివచ్చాడు అతిరథుడు. అస్త్రవిద్యకోసం ద్రోణాచార్యుడిదగ్గిర అప్పగించాడు. ద్రోణుడిదగ్గిరా, కృపాచార్యులు దగ్గిరా, పరశురాముడిదగ్గిరా మంచి మంచి మహాస్త్రాలు సంపాదించాడు కర్ణుడు. హాస్తినాపురంలో దుర్యోధనుడితో స్నేహమూ ఏర్పడిం దతడికి. దుర్యోధనుడికి మంచి చెయ్యడంకోసం అర్జునుడితో ఈసూ పెంచుకున్నా డతడు. పాండవు లంటే బద్ధవైరమే అయిపోయింది, తుదకి. కర్ణుడి అస్త్రవిద్యా,

కవచకుండలాలూ తలుచుకున్నప్పుడల్లా బిగులుబిగులుగా వుండేది ధర్మరాజుకి. అరణ్యవాసంలోనూ అదేబెంగతో వుండేవా డతడు.

కర్ణుడి కవచకుండలాలు

ఒకనాటి మధ్యాహ్న సమయం. కర్ణుడు సూర్యోపాసనలో వున్నాడు. చేతికి ఎముక లేకండా బ్రాహ్మలికి దానం చేస్తున్నాడు. అడిగింది లేకనలేదు. అంతలో 'భిక్షాందేహి' అంటూ వచ్చి, వొక బ్రాహ్మడు ఎదట నుంచున్నాడు.

"ఏం కావాలో అడుగు. ఇస్తాను" అన్నాడు కర్ణుడు. "మంచి మంచి అందమయిన ఆడవాళ్లు కావాలా? బంగారం పండే అగ్రహారాలు కావాలా? రత్నాలుతాపిన బంగారం నగలు కావాలా? ఏం కావాలి? చెప్పు" అన్నాడు.

"ఇవి ఏవీ నాకు అక్కర్లేదు" అన్నాడు బ్రాహ్మడు. "నీకవచమూ, కుండలాలూ కావాలి. ఇవ్వగలిగితే ఇయ్యి" అన్నాడు.

"వెర్రి బ్రాహ్మడిలా వున్నావు!" అన్నాడు కర్ణుడు. "విలవయిన వస్తువులు ఇస్తానంటే, వద్దంటున్నావు! ఎందుకు పనికిరానివి కావా లంటున్నావు. కవచకుండలాలు వుండనీ. ఇంకేవయినా కోరు. ఎంత విలువయినవి అయినా సరే, ఇస్తాను" అంటూ నచ్చ చెప్పబోయాడు. వినుకోలేదు బ్రాహ్మడు. "ఏమయినా సరే, నాకు అవే కావాలి" అంటూ కూచున్నాడు.

ఎన్నోవిధాల చెప్పాడు కర్ణుడు. రత్నరాసులు తెప్పించి ఎదట పోశాడు. బంగారం నగలు కుప్పపోశాడు. ఊహూఁ, లాభం లేకపోయింది.

"ఈకవచకుండలాలు సహజమైనవి నాకు. పుట్టుకతోనే వున్నాయి. ఇవి లేకపోతే యుద్ధంలో శత్రువులవల్ల నాప్రాణంకిూదికి

వస్తుంది. ఎలాఇమ్మంటావు, ఇవి? పల్లెల్తో, పట్టణాల్తో సహా, కావా లంటే నాఅంగరాజ్యం యావత్తూ ధారపోసేస్తాను నీకు. ఇవిమాత్రం అడగడం మానెయ్యి" అన్నాడు. ప్రార్థించాడు. పూజించాడు. ససేమిరా, వొప్పుకోలేదు బ్రాహ్మడు. ఉడుంపట్టు పట్టి కూచున్నాడు.

"నువ్వు ఎవ్వరో తెలిసిపోయింది నాకు"—చివరికి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు కర్ణుడు. "దేవేంద్రుడివి నువ్వు. ముల్లోకాల ప్రభువువి. నేను యాచించవలిసింది నిన్ను. అలాంటిది, నన్ను యాచిస్తున్నావు నువ్వు! ధర్మమేనా ఇది?" అన్నాడు.

"ఓహో, అర్థమయింది నాకు" అన్నాడు బ్రాహ్మడు. "ఇంతకిముందే వచ్చి, సూర్యుడు చెప్పేశాడన్నమాట! బావుంది. అయితే కర్ణా! మాబోటివాళ్ళకి ప్రియమయిన పని చెయ్యడానికి ఇంత సంకోచమెందుకూ నీకు?" అన్నాడు, సాభిప్రాయంగా.

"అయితే, వొక్కటిమాత్రం అనుగ్రహించు" అన్నాడు కర్ణుడు. "అమోఘమయిన నీ శక్తి నాకు ప్రసాదించు. కవచకుండలాలు స్వీకరించు" అన్నాడు.

"తప్పకండా ఇస్తాను" అన్నాడు దేవేంద్రుడు. "అద్భుతమైంది దీని శక్తి. యుద్ధంలో దీన్ని ప్రయోగిస్తే, శత్రువుల్ని చంపేసి తిరిగీ చేతికి వచ్చేస్తుంది. కర్ణా! నువ్వు కోరావు. నీకు ఇస్తున్నాను. ఐతే, వొకటిమాత్రం వుంది. ప్రపంచంలో ఎవ్వరూ గెలవలేని పగవాణ్ణి వొక్కణ్ణిమాత్రం చంపుతుంది నీదగ్గిర ఇది. అంతే. ఆతరవాత, నాదగ్గిరకి వచ్చేస్తుంది. ఇలాంటి ఏర్పాటుతోనే పుచ్చుకోవాలి నువ్వు" అన్నాడు.

"అంతమాత్రం చాలు" అన్నాడు కర్ణుడు. "నాకు వున్నవాడల్లా వొక్కడే పగవాడు. వాణ్ణి చంపడమే నా అభిలాష" అన్నాడు.

"నీఅభిలాష నాకు తెలుసు," చిరునవ్వుతో అన్నాడు దేవేంద్రుడు. "అర్జునుణ్ణి చంపడమే నీఅభిలాష. కానీ, అది జరగని పని. స్వయంగా శ్రీకృష్ణుడే అంగరక్షకుడు అర్జునుడికి. అతడిమీద చెయ్యి వేసేవా డెవడు?" అన్నాడు.

"ఆమాట ఇప్పుడెందుకూ?" అన్నాడు కర్ణుడు. "కాని, నావొంటితోనే పుట్టింది కవచం. ఇది వొలిచేస్తే వొళ్ళంతా వికారంగా తయారవుతుంది. దీనికి ఏమిటి ఆలోచించావు?" అన్నాడు.

"ఆ భయం అక్కర్లేదు. సూర్యుడిలా ప్రకాశిస్తుంది నీశరీరం. ఇదిగో శక్తి. అలాంటి ఆపదవస్తేనే ప్రయోగించాలి, ఇది. ఉత్తప్పుడు ఉపయోగిస్తే, నీకే విషమిస్తుంది" అంటూ తన మహాస్త్రం, శక్తి కర్ణుడి చేతిలో పెట్టాడు దేవేంద్రుడు.

"మహాప్రసాదం" అంటూ శక్తి పుచ్చుకున్నాడు కర్ణుడు. చెవుల కుండలాలు తీసి దేవేంద్రుడిచేతిలో పెట్టాడు. దారయిన వొక ఆయుధం పుచ్చుకుని, తన శరీరం చీల్చడం మొదలుపెట్టాడు. అంతబాధా అలాగే సహించాడు. కవచం వొలిచి, దేవేంద్రుడి ముందు పెట్టాడు.

కర్ణుడి ఈమహాత్యాగం చూసి, ముక్కుమీద వేలుపెట్టుకున్నాయి లోకాలు. 'హా హా' అంతరిక్షంలో కిన్నరులూ, యక్షులూ, సిద్ధులూ, సాధ్యులూ కోలాహలం చేశారు. దివ్యదుందుభులు మోగాయి. దేవలోకంనించి పూలవర్షమే కురిసింది అతడిమీద.

కర్ణుడి కవచకుండలాలు తీసుకుని, సంతోషిస్తూ వెళ్ళిపోయాడు దేవేంద్రుడు. ప్రపంచమంతా క్షణాలమీద పాకిపోయింది ఈవార్త. పాండవులేమో సంతోషించారు. దుర్యోధనుడూ వాళ్ళూ మాత్రం దుఃఖపడ్డారు.

## బ్రాహ్మడి అరణి

పాండవుల అరణ్యవాసం పన్నెండో ఏడు అయిపోవచ్చింది. కామ్యకవనం విడిచిపెట్టేశారు వాళ్ళు. మళ్ళీ ద్వైతవనంలో వచ్చి ఆశ్రమం పెట్టారు.

ఒకనాడు ధర్మరాజూ, తమ్ముళ్లూ యావన్మందీ కూచుని, ఆమాటా ఈమాటా ఆడుకుంటున్నారు. అంతలో వొక బ్రాహ్మడు రొజుకుంటూ, పరుగెత్తుకువచ్చాడు. "మహారాజా, వొకజింక నాఅరణి పట్టుకుపోయింది" అంటూ లబోలబో మన్నాడు. "చెట్టుకొమ్మని పెట్టాను అరణి. జింకవచ్చి చెట్టుకి రాసుకుంది. దాని కొమ్ముల్లో తగులుకుంది అరణి. పట్టుకుని అదే పారిపోవడం. పారిపోతోం దది. అరణి లేకపోతే, నా నిత్యకృత్యం ఆగిపోతుంది. లెండి. వెంటనే తెచ్చి పెట్టండి" అంటూ వొకటే తొందరచేశాడు.

ఉన్నపాళాన, ధనుస్సుపట్టుకు బయల్దేరాడు ధర్మరాజు. అతడి వెంట తమ్ముళ్లూ పరిగెత్తారు. చువ్వల్లాగ వెళ్ళి, జింకవెంట పడ్డారు. ఆగ మేఘాలమీద ఎగిరిపోతోంది జింక. ఎన్నో బాణాలు వేశారు. చిత్రం! ఒకటీ తగల్లేదు దానికి. అలా ఎంతోదూరం తీసుకుపో యింది జింక. వెళ్ళి వెళ్ళి, వొక కీకారణ్యంలో దూరింది. పాండవులు వెంటతరుముతూనే వున్నారు. ఆమహారణ్యంలో మరి కనపడ కండా అయిపోయింది జింక.

అంతప్రయత్నమూ వ్యర్థం అయిపోయింది. అన్నదమ్ములు అయిదుగురూ విచారిస్తూ వుండిపోయారు. బాగా అలిసిపోయిన్నీ వున్నారు వాళ్ళు. ఒక మర్రిచెట్టునీడని చదికిలబడిపోయారు. అన్నదమ్ముల ఆయాసంచూసి, ధర్మరాజుతో అన్నాడు, నకులుడు: "దయ, ధర్మం, కులం, శీలం— ఎందులోనూ లోపంలేదు మనకి. ఇలా శ్రమలు వస్తున్నాయంటే, ఏమిటి దీనికిమూలం?" — అని.

"కర్మ" అన్నాడు ధర్మరాజు. "సుఖమయినా, దుఃఖమయినా లోగడ తాను చేసుకున్న కర్మమూలంగానే వస్తుంది. మరో కారణం లేదు" అన్నాడు.

"కర్మే, కర్మకాకపోతే మరేమిటి? "అంటూ ముక్తాయించాడు భీముడు. "అవాళ, ప్రాతికామి వెళ్ళి, ద్రౌపదిని సభలోకి లాక్కువచ్చినప్పుడు, ఆగుడ్డిరాజుకొడుకుల్ని హతమార్చకండా వదిలిపెట్టేశామే—అదిగో, ఆకర్మ మన్ని ఇలా కట్టికుడుపుతోంది" అన్నాడు.

"లక్షలు విలువయిన మాట" అంటూ అందుకున్నాడు అర్జునుడు. "అవాళ, అనరానిమాటలూ అన్నాడు కర్ణుడు. అదంతా సహించాం. పిరికివాళ్ళలాగ అడవులుపట్టేశాం. అదిగో ఆకర్మే మన్ని ఇలా ముప్పతిప్పలూ పెడుతోంది" అన్నాడు.

"నిజమే అన్నయ్యా" అంటూ తానూ సాగదీశాడు సహదేవుడు. "ఆవాళ, మాయజూదమాడిన మాయలమల్లి శకుని తలకాయ తెగవెయ్యలేకపోయాను. అదిగో, ఆకర్మే ఇలా మన్ని అడ్డమానిగడ్డీ తినిపిస్తోంది" అన్నాడు.

అందరిమాటలూ విన్నాడు ధర్మరాజు. నకులుణ్ణి చూసి, "తమ్ముడూ, అందరమూ అలిసిపోయాం. నోళ్ళెండిపోతున్నాయి. నీళ్ళు కావాలి ముందు. లే. ఈచెట్టెక్కి చూడూ, ఈచుట్టుపక్కల ఎక్కడన్నా నీళ్ళున్నాయేమో!" అన్నాడు. మర్రిచెట్టెక్కి చూశాడు నకులుడు. "దూరంలో చెరువు కనిపిస్తోంది" అని చెప్పాడు. "అయితే, నువ్వే వెళ్ళు. నువ్వు ముందు తాగి, మాకోసం తెచ్చిపెట్టు నీళ్ళు" అన్నాడు ధర్మరాజు. చెట్టుదిగి, వెళ్ళాడు నకులుడు.

అందంగా వుంది చెరువు. కొబ్బరినీళ్ళలా నిర్మలంగా వున్నాయి నీళ్ళు. చూస్తేనే ప్రాణం లేచివస్తోంది. తాగాలని గబగబా దిగబోయాడు నకులుడు. ఆశ్చర్యం! అడుగు ముందుకి వేశాడో

లేదో, ఎవరో అన్నారు "అబ్బాయీ! ఈ చెరువు నాది. నీళ్ళు కావా లంటావా? అయితే, ఆగు. నేను అడిగిన ప్రశ్నలికి జబాబు చెప్పు ముందు"— అని.

నాలుగుదిక్కులూ చూశాడు నకులుడు. ఎవ్వరూ అవుపించ లేదు. నిర్లక్ష్యంగా నీళ్ళలోనికి దిగాడు. పుడిసెడు నీళ్ళు తాగేడో లేదో, తెలివితప్పి వొడ్డునే పడిపోయాడు.

నిమషాలమీద రావలిసినవాడల్లా ఆలశ్యం చెయ్యడంతో టే, సహదేవుణ్ణి పంపాడు ధర్మరాజు. "మీ ఇద్దరూ తాగి, మాకోసం పట్టుకురండి నీళ్ళు" అన్నాడు.

వెదుక్కుంటూ వెళ్ళాడు సహదేవుడు. చెరువువొడ్డుని పడి వున్న అన్నని చూశాడు. "ఏమిటిది ?" అంటూ ఆశ్చర్యపోయాడు. ఎంతో దుఃఖమూ కలిగిం దతడికి. నాలిక లాక్కుపోతూ వుంది దాహం. "ముందు, నీళ్ళు తాగాలి" అంటూ చెరువులోకి దిగబో యాడు. నకులుణ్ణి అన్నట్టే మళ్ళీ ఎవరో అన్నారు. "అబ్బాయీ! ఈ చెరువు నాది. సాహసించి దిగబోకు. నేను అడిగిన ప్రశ్నలికి జావాబు చెప్పు ముందు. తరవాత తాగు, నీళ్ళు"— అని. తానూ ఆ మాటలు పట్టించుకోలేదు సహదేవుడు. చెరువులోకి దిగాడు. నీళ్ళు తాగాడు. విషమెక్కినట్టు తెలివితప్పిపోయి, వొడ్డునే పడిపోయాడు.

"ఇద్దరూ వెళ్ళారు. ఇంత ఆలస్యమైంది. ఏమన్నా విష మించలేదు కదా! చప్పున వెళ్ళూ. తీసుకు వచ్చెయ్యి వాళ్ళని" అంటూ అర్జునుణ్ణి పంపాడు ధర్మరాజు.

వచ్చి, చూశాడు అర్జునుడు. తమ్ముళ్ళు ఇద్దరూ చెరువు వొడ్డుని పడివున్నారు. ఆశ్చర్యంతోనూ, దుఃఖంతోనూ అటూ ఇటూ చూశా డతడు. పిట్టమనిషి కనపళ్ళేదు. నోరు ఆర్చుకుపోతోంది. చెరువులోకి నడిచాడు. ఇంతకి ముందులాగే ఎవరో అన్నారు!

"ఈ చెరువు నాది. బలవంతాన దిగితే ప్రాణంమీాదికి వస్తుంది. నీళ్ళే కావాలంటే, ముందు నా ప్రశ్నలికి జవాబు చెప్పు"- అని.

ఒళ్ళుమండింది అర్జునుడికి. "ఎవడివి నువ్వు? దొంగచాటుని కూస్తున్నావు?" అంటూ శబ్దభేదిబాణం గాండీవానికి తొడిగాడు. మాటలు వినిపించిన దిక్కు బాణంమీాద బాణం వదిలాడు. వ్యర్థమే అయిపోయింది శబ్దభేది. మళ్ళీ మళ్ళీ అలా వినిపిస్తూనే వున్నాయి మాటలు. అలిసిపోయాడు అర్జునుడు. ముందు దాహం తీర్చుకోవాలి. చెరువులోకి దిగాడు. గబగబా రెండుపుడిసిళ్ళు తాగాడు. వొడ్డుకివచ్చి పడిపోయాడు.

"అర్జునుడూ ఆలస్యంచేశాడు. ఏమిటిది? నువ్వూ వెళ్ళు" అంటూ భీముణ్ణి పంపాడు ధర్మరాజు.

గాలిలా ఎగిరివచ్చాడు భీముడు. నిద్రపోతున్నట్టు పడివున్నారు తమ్ములు. చూశాడు. దుఃఖం పట్టలేకపోయాడతడు. "ఏమిటిది? దేవేంద్రుడో, దేవతలో, కిన్నరులో, నాగులో చేసింది కాని మనుష్య మాత్రుడి పని కాదిది. సరే, ముందు దాహం పుచ్చుకోనీ, తరవాత చూద్దాం" అంటూ నీళ్ళలోకి దిగాడు. ముందటిలాగే, మళ్ళీ ఎవరో అన్నారు. "ఎందుకిలా సాహసం చేస్తావు? ఈ చెరువు నాది. నీకు చేతనయితే నా ప్రశ్నలికి జవాబియ్యి. తరవాత నీళ్ళు తాగు" - అని.

వినిపించుకోలేదు భీముడు. గబగబా నీళ్ళుతాగాడు. అందరిలాగే వొడ్డుకివచ్చి పడిపోయాడు.

ఎంతకీ రాలేదు తమ్ములు. నలుగురూ అక్కడే వుండిపోయారు. మనస్సు కలిచినట్టవుతోంది ధర్మరాజుకి. ఈసారి తానే బయల్దేరాడు. మనిషన్నవాడు కాలుపెట్టనట్టు వుంది దారి. రాళ్ళూ, గుట్టలూ, చెట్లూ, పుట్టా, ముళ్ళూ, తుప్పలూ, అడివిపందులూ, పెద్దపులులూ- భయంకరంగా వుంది అడివి. వెదుక్కుంటూ వెళ్ళాడు ధర్మరాజు,

చెరువూ, చెరువునొడ్డుని పడివున్న తమ్ముళ్లూ అవుపించారు. దిక్పాల కులవంటి వాళ్ళు, సింహం కొదమల్లాంటి రాజకుమాళ్ళు - నలుగురు తమ్ముళ్లూ దిక్కులేని వాళ్ళలాగ, కింద తెలివిలేకండా పడివున్నారు.

కొయ్యబారిపోయాడు ధర్మరాజు. ఆశ్చర్యం, ఆశ్చర్యాన్ని మించిన దుఃఖం, నిట్టూర్పులు, కన్నీళ్ళు. కాళ్ళకింద భూమి కదిలి పోతున్నట్టుంది ధర్మరాజుకి. కొంతసేపటికి, ఎలాగో దిట్టపరుచుకున్నాడు గుండె. నలుగురు తమ్ముల్ని చూశాడు. నాలుగుదిక్కులూ పరికించాడు.

"ఏమి టిది? మరెవ్వరూ వచ్చిన జాడా కనిపించదు. పోట్లాటా జరిగినట్టులేదు. వీళ్ళ వొంటిమీదా, ఏదన్నా దెబ్బ తగిలిన గుర్తూ అవుపడదు. ఏమయినట్టు? - పరమదుర్మార్గుడు దుర్యోధనుడు. మాయలరాకాసి శకుని. ఎంతయినా చెయ్యగలరు వాళ్ళు. వాళ పనేనా ఇది? మేలుకున్నట్టే వున్నాయి, మొహాలు. శరీరంమీద కాంతి కాంతిలాగే వుంది. మరి? ఈ నీళ్ళు విషపునీళ్ళా? ఈ చెరువు చావుల చెరువా? ఇంత నిర్మలంగా వున్నాయి నీళ్ళు! అయితే, ఏమిటి ఈమాయ? ఏదీ పాలుపోకండా వుంది.

"రాజ్యమూ పోయింది. సంపదలూ శత్రువుల పాలయాయి. ఈ కారడివిలో, ఈ ఘోరమృగాలమధ్య బతుకుతూవున్న వీళ్ళని వెంటాడి, దిక్కులేని వాళ్ళనిచేశాడు దైవం! ఎటు పోయేది నేను? ఎందులోదూరేది? నాదుఃఖానికి అంత మెక్కడ?

"కొడుకులు కష్టపడిపోతున్నారనే కుమిలిపోతూవుంది, అమ్మ కుంతీదేవి. ఎదురువచ్చి, 'బాబూ, అయిగురూ వెళ్ళారు, అడివికి. ఒక్కడివే వచ్చావు! తమ్ములేరీ?' అంటే ఏమనిచెప్పేది? ద్రోణుడూ, విదురుడూ, భీష్ముడూ, కృపుడూ కుశల మడిగితే ఏమనేది? ఈదుఃఖం ఎలా భరించేది?"

ఇలా ఎన్నో విధాల దుఃఖపడ్డాడు ధర్మరాజు. దాహమేమో దారుణంగా వుంది. తానూ దిగబోయాడు నీళ్ళకి.

"ఆగు" అంది అశరీరభూతం. "ఇదిగో, నేను వొక కొంగని. ఈ చెరువు నా సొమ్ము. నామాట వినిపించుకోలేదు నీతమ్ములు. వద్దంటే నీళ్ళు తాగారు. ప్రాణాలు పోగొట్టుకున్నారు. నువ్వూ సాహసించావా, నీకూ వాళ్ళగతే పడుతుంది. ముందే చెపుతున్నాను. నేను అడిగిన ప్రశ్నలికి జవాబు చెప్పు. తరవాత తాగు నీళ్ళు" అంది.

ఆకాశందిక్కు చూశాడు ధర్మరాజు. "అయ్యా, కొంగ రూపంలో వున్న రుద్రుడివో, అగ్నివో, వాయుదేవుడివో, ఎవడివో నువ్వు! అలా కాకపోతే, కొంగేమిటి, నాతమ్ములిన్ని, కులపర్వతాల్లాంటివాళ్ళని కూలదియ్యడమేమిటి? దేవతలన్నా గెలువలేరు వీళ్ళని. అలాంటి వీళ్ళని, ఇలా చేశావు. ఏమీ ఎరగనట్టు మళ్ళీ దూరంగా వున్నావు. అద్భుతం, భయం, కౌతుకం — నిలవనివ్వలేదు నన్ను. ఎవరునువ్వు? ఏమిటి నీఉద్దేశం? నిజం చెప్పు నాహృదయవేదన తొలగించు" అన్నాడు.

"అవును. కొంగని కాను. యక్షుణ్ణి నేను. నామాయవల్లే ఇలా అయారు నీతమ్ములు" అంటూ భయంకరంగా ధర్మరాజు ముందు నుంచున్నాడు యక్షుడు. పేద్ద తాటిచెట్టంత పొడవుగా వున్నాడు యక్షుడు. పొడవాటి కొంగమెడ. పెద్దపెద్ద దంతాలు. తాటికాయలంతలేసి మిడిగుడ్లు. అతడు ఘోరంగా బుసకొడుతూ వుంటే, భూతకోటి యావత్తూ జజ్జరిల్లిపోతోంది.

అలా ధర్మరాజు ఎదట ప్రత్యక్షమై, మేఘంగర్జించినట్టుఅన్నాడు యక్షుడు: "నాఅనుమతిలేకండా ఈనీళ్ళు తాగినవాళ్ళు ఎవరయినా సరే, చచ్చిపోతారు. నువ్వు అలా చెయ్యలేదు. బుద్ధిమంతుడివి. అంచేత నాప్రశ్నలికి జవాబు చెప్పు."

"నువ్వు అడగడం, నీకు నచ్చినట్టు చెప్పడం, నాబోటివాడికి సాధ్యం కానిపని. అయినా, అడుగు. నాఅంతరంబట్టి, ప్రయత్ని స్తాను" అన్నాడు ధర్మరాజు.

## యక్ష ప్రశ్నలు

యక్షుడు : సూర్యుణ్ణి ఏది ఉదయింపజేస్తుంది ?

ధర్మరాజు : బ్రహ్మం.

యక్షుడు : సూర్యుడి రెండుపక్కలా ఎవరు తిరుగుతున్నారు ?

ధర్మరాజు : దేవతలు.

యక్షుడు : అతణ్ణి ఏది అస్తమింప జేస్తోంది ?

ధర్మరాజు : ధర్మం.

యక్షుడు : ఆతడికి ఆధారమేమిటి ?

ధర్మరాజు ; సత్యం.

యక్షుడు : మనిషి దేనివల్ల శ్రోత్రియుడవుతాడు ?

ధర్మరాజు : (వేదం) శ్రుతివల్ల.

యక్షుడు : దేనివల్ల మహత్త్వం పొందుతారు ?

ధర్మరాజు : తపస్సువల్ల.

యక్షుడు : దేనివల్ల సహాయవంతు డవుతాడు ?

ధర్మరాజు : ధైర్యంవల్ల.

యక్షుడు : దేనివల్ల బుద్ధిమంతుడవుతాడు ?

ధర్మరాజు : వృద్ధుల్ని సేవించడంవల్ల.

యక్షుడు : బ్రాహ్మడికి దేవత్వం ఎలావస్తుంది ?

ధర్మరాజు : వేదాలు చదవడంవల్ల.

యక్షుడు : సజ్జనత్వం ?

ధర్మరాజు : తపస్సువల్ల.

యక్షుడు : మానవత్వం ?

ధర్మరాజు : మరణంవల్ల.

యక్షుడు : దుర్జనత్వం ?

ధర్మరాజు : పరనిందవల్ల,

యక్షుడు : క్షత్రియుడికి దేవత్వం ఎలావస్తుంది ?

ధర్మరాజు : అస్త్రవిద్యవల్ల

యక్షుడు : సజ్జనత్వం ?

ధర్మరాజు : యజ్ఞంవల్ల,

యక్షుడు : మానవత్వం ?

ధర్మరాజు : పిరికితనంవల్ల.

యక్షుడు : దుర్జనత్వం ?

ధర్మరాజు : శరణన్నవాళ్ళని రక్షించకపోవడంవల్ల.

యక్షుడు : యజ్ఞియమైన సామమేది ?

ధర్మరాజు : ప్రాణం.

యక్షుడు : యజుస్సు ?

ధర్మరాజు : మనస్సు.

యక్షుడు : ఏది యజ్ఞం వరిస్తుంది ?

ధర్మరాజు : ఋక్కు.

యక్షుడు : యజ్ఞం దేన్ని అతిక్రమించదు ?

ధర్మరాజు : ఋక్కుని.

యక్షుడు : వ్యవసాయదారుడికి ఏది ముఖ్యం ?

ధర్మరాజు : వర్షం.

యక్షుడు : విత్తనాలు చల్లేవాడికి ?

ధర్మరాజు : బీజం. (ధాన్యాదులు)

యక్షుడు : ప్రతిష్ఠ కావలసిన వాళ్ళకి ?

ధర్మరాజు : గోవులు.

యక్షుడు : సంతానం కావలిసిన వాళ్ళకి ?

ధర్మరాజు : పుత్రుడు.

యక్షుడు : బతికివుండిన్నీ చచ్చినవా డెవడు ?

ధర్మరాజు : దేవతలూ, పితరులూ, అతిథులూ, సేవకులూ – వీరికి పెట్టకండా తినేవాడు.

యక్షుడు : భూమికంటే బరువైంది ఏది ?

ధర్మరాజు : తల్లి.

యక్షుడు : ఆకాశంకంటే ఉన్నతమైనవా రెవరు ?

ధర్మరాజు : తండ్రి.

యక్షుడు : గాలికంటే వేగం పోయేది ?

ధర్మరాజు : మనస్సు.

యక్షుడు : గడ్డికంటే దట్టమైం దేది ?

ధర్మరాజు : చింత.

యక్షుడు : నిద్రలోనూ కళ్ళు మొయ్యనివా ళ్ళెవరు ?

ధర్మరాజు : చేపలు.

యక్షుడు : పుట్టిన్నీ చేతనత్వం లేని దేది ?

ధర్మరాజు : గ్రుడ్డు.

యక్షుడు : రూపం వుండిన్నీ హృదయం లేని దేది ?

ధర్మరాజు : రాయి.

యక్షుడు : వేగంవల్ల పెరిగే దేది ?

ధర్మరాజు : ఏరు.

యక్షుడు : పొన్నూళ్ళో స్నేహితు డెవరు ?

ధర్మరాజు : విద్య.

యక్షుడు : ఇంటిదగ్గిర ?

ధర్మరాజు : భార్య.

యక్షుడు : జబ్బుతోవున్నవాడికి ?

ధర్మరాజు : వైద్యుడు.

యక్షుడు : మరణానికి సిద్ధంగా వున్నవాడికి ?

ధర్మరాజు : దానం.

యక్షుడు : సర్వభూతాలికి అతిథి ఎవడు ?

ధర్మరాజు : అగ్ని.

యక్షుడు : సనాతన ధర్మం ?

ధర్మరాజు : హోమం.

యక్షుడు : ఏది అమృతం ?

ధర్మరాజు : చంద్రుడు.

యక్షుడు : ప్రపంచమంతా ఏమిటి ?

ధర్మరాజు : గాలి.

యక్షుడు : ఎప్పుడూ ఒంటరిగా తిరిగేవా డెవడు ?

ధర్మరాజు : సూర్యుడు.

యక్షుడు : మళ్ళీమళ్ళీ పుట్టేవా డెవడు ?

ధర్మరాజు : చంద్రుడు.

యక్షుడు : చలికి ఏది మందు ?

ధర్మరాజు : అగ్గి.

యక్షుడు : పెద్ద విత్తనాలపాత్ర ఏది ?
ధర్మరాజు : భూమి.
యక్షుడు : ధర్మానికి కుదురేది ?
ధర్మరాజు : సామర్థ్యం.
యక్షుడు : కీర్తికి ?
ధర్మరాజు : దానం.
యక్షుడు : స్వర్గానికి ?
ధర్మరాజు : సత్యం.
యక్షుడు : సుఖానికి ?
ధర్మరాజు : శీలం.
యక్షుడు : మనుష్యుడి ఆత్మ ఎవ్వరు ?
ధర్మరాజు : కొడుకు.
యక్షుడు : దైవికమయిన చుట్టమెవ్వరు ?
ధర్మరాజు : భార్య.
యక్షుడు : అతడి ఉపజీవనం, అంటే జీవనాశ్రయం ఎవరు ?
ధర్మరాజు : మేఘం.
యక్షుడు : అతడి పరమాశ్రయం ఏమిటి ?
ధర్మరాజు : దానం.
యక్షుడు : ధన్యులయిన వాళ్ళలో ఉత్తమగుణమేది ?
ధర్మరాజు : సామర్థ్యం.
యక్షుడు : ధనాల్లో గొప్ప దేది ?
ధర్మరాజు : శాస్త్రజ్ఞానం.
యక్షుడు : లాభాల్లో గొప్ప దేది ?
ధర్మరాజు : ఆరోగ్యం.

యక్షుడు : సుఖాల్లో గొప్ప దేది ?

ధర్మరాజు : సంతోషం.

యక్షుడు : ధర్మాల్లో గొప్పదేది ?

ధర్మరాజు : అహింస.

యక్షుడు : ఎప్పుడూ ఫలించే దేది ?

ధర్మరాజు : యోగం.

యక్షుడు : దేన్ని నిగ్రహిస్తే సంతోషం సిద్ధిస్తుంది ?

ధర్మరాజు : మనస్సుని.

యక్షుడు : ఎవళ్ళతో సంధిచేసుకుంటే చెడకండా వుంటుంది ?

ధర్మరాజు : మంచివాళ్ళతో.

యక్షుడు : ఏది విడిచిపెడితే మనిషి ప్రియమైనవా డవుతాడు ?

ధర్మరాజు : క్రోధం.

యక్షుడు : ఏది మానుకుంటే ధనవంతు డవుతాడు ?

ధర్మరాజు : కామం.

యక్షుడు : దేనికి దూరంగా వుంటే సుఖపడతాడు ?

ధర్మరాజు : లోభానికి.

యక్షుడు : బ్రాహ్మడికి దానమెందు కివ్వాలి ?

ధర్మరాజు : ధర్మం పెరగడంకోసం.

యక్షుడు : నటులికీ నాట్యకర్తె కీ దానమెందు కివ్వాలి ?

ధర్మరాజు : దేశదేశాల్లో కీర్తి చాటుతారు గనక.

యక్షుడు : సేవకులి కెందు కివ్వాలి ?

ధర్మరాజు : యుద్ధాల్లో ప్రాణాలిస్తారు కనక.

యక్షుడు : రాజు కెందుకివ్వాలి ?

ధర్మరాజు : భయం రాకండా చూస్తాడు గనక.

యక్షుడు : లోకాన్ని కప్పివున్న దేది ?
ధర్మరాజు : అజ్ఞానం.
యక్షుడు : లోకం దేనివల్ల ప్రకాశించకండా వుంది ?
ధర్మరాజు : తమస్సువల్ల.
యక్షుడు : మనిషి, స్నేహితుణ్ణి ఎందుకు వదిలేస్తాడు ?
ధర్మరాజు : లోభంవల్ల.
యక్షుడు : స్వర్గానికి ఎందుకు వెళ్లడు ?
ధర్మరాజు : ఆసక్తులు వదులుకోలేక.
యక్షుడు : ఎవడు చచ్చినవాడితో సమానం ?
ధర్మరాజు : దరిద్రుడు.
యక్షుడు : చచ్చిన రాజ్యమేది ?
ధర్మరాజు : రాజులేనిరాజ్యం చచ్చినరాజ్యం.
యక్షుడు : చచ్చిన శ్రాద్ధమంటే ఏమిటి ?
ధర్మరాజు : శ్రోత్రియబ్రాహ్మడు లేని శ్రాద్ధం చచ్చినశ్రాద్ధం.
యక్షుడు : చచ్చిన యజ్ఞమంటే ?
ధర్మరాజు : దక్షిణలేనియజ్ఞం చచ్చిన యజ్ఞం.
యక్షుడు : లోకానికి ఏమిటి ఆధారం ?
ధర్మరాజు : సత్పురుషులు.
యక్షుడు : నీటికి ?
ధర్మరాజు : ఆకాశం.
యక్షుడు : అన్నానికి ?
ధర్మరాజు : ఆవు.
యక్షుడు : ఏది విషం ?
ధర్మరాజు : బ్రాహ్మడి ధనం.

యక్షుడు : తద్దినానికి ఏది తగిన కాలం ?

ధర్మరాజు : మంచిబ్రాహ్మణుడు రావడం.

యక్షుడు : తపస్సంటే ఏమిటి ?

ధర్మరాజు : తన కులధర్మం ఆచరించడం.

యక్షుడు : దమమంటే ?

ధర్మరాజు : మనస్సు అరికట్టడం.

యక్షుడు : క్షమ అంటే ?

ధర్మరాజు : ద్వంద్వదుఃఖాలు సహించుకోడం.

యక్షుడు : సిగ్గంటే ?

ధర్మరాజు : చేయరానిపనులంటే జడవడం.

యక్షుడు : జ్ఞాన మంటే ?

ధర్మరాజు : బ్రహ్మం గుర్తించడం.

యక్షుడు : శమ మంటే ?

ధర్మరాజు : మనస్సు ఉపశమింప చెయ్యడం.

యక్షుడు : దయ అంటే ?

ధర్మరాజు : యావన్మంది ప్రాణుల సుఖమూ కోరడం.

యక్షుడు : ఆర్జవమంటే ?

ధర్మరాజు : అన్నిటిమీదా సమభావం కలిగివుండడం.

యక్షుడు : గెలవరాని శత్రువేది ?

ధర్మరాజు : క్రోధం.

యక్షుడు : నశించని రోగమేది ?

ధర్మరాజు : లోభం.

యక్షుడు : ఎట్టివాడు సాధువు ?
ధర్మరాజు : సర్వభూతాలికి హితవుగా ప్రవర్తించేవాడు.
యక్షుడు : అసాధు వెవడు ?
ధర్మరాజు : దయలేనివాడు.
యక్షుడు : మోహమంటే ఏమిటి ?
ధర్మరాజు : మూఢత్వం.
యక్షుడు : మానమంటే ఏమిటి ?
ధర్మరాజు : ఆత్మాభిమానం.
యక్షుడు : సోమరితనమంటే ఏమిటి ?
ధర్మరాజు : ధర్మం చెయ్యకండా వుండడం.
యక్షుడు : శోకమంటే ఏమిటి ?
ధర్మరాజు : అజ్ఞానం.
యక్షుడు : స్థైర్యమంటే ఏమి ?
ధర్మరాజు : తన కులధర్మంమీద స్థిరబుద్ధితో వుండడం.
యక్షుడు : ధైర్యమంటే ఏమిటి ?
ధర్మరాజు : ఇంద్రియ నిగ్రహం.
యక్షుడు : స్నానమంటే ఏమిటి ?
ధర్మరాజు : మనోమాలిన్యం వదిలి వుండడం.
యక్షుడు : దానమంటే ఏమిటి ?
ధర్మరాజు : సమస్త ప్రాణులిదీ రక్షించడం.
యక్షుడు : ఎవడు పండితుడు ?
ధర్మరాజు : ధర్మం తెలిసినవాడు.

యక్షుడు : ఎవడు నాస్తికుడు ?

ధర్మరాజు : మూర్ఖుడు.

యక్షుడు : ఎవడు మూర్ఖుడు ?

ధర్మరాజు : నాస్తికుడు.

యక్షుడు : ఏది కామం ?

ధర్మరాజు : సంసారహేతువైందే కామం.

యక్షుడు : మచ్చరమంటే ఏమిటి ?

ధర్మరాజు : హృదయతాపం.

యక్షుడు : అహంకారమంటే ?

ధర్మరాజు : అజ్ఞానం.

యక్షుడు : దంభమంటే ?

ధర్మరాజు : తనగొప్ప తాను చెప్పుకోడం.

యక్షుడు : కొంటెతనమంటే ?

ధర్మరాజు : ఇతర్లని దూషించడం.

యక్షుడు : దైవమంటే ఏమిటి ?

ధర్మరాజు : పూర్వజన్మలో చేసిన దానఫలం.

యక్షుడు : పరస్పర విరుద్ధములూ, నిత్య విరుద్ధములూ అయిన ధర్మమూ, అర్థమూ, కామమూ — ఈ మూడూ ఎక్కడ కలుస్తాయి ?

ధర్మరాజు : భార్యలో.

యక్షుడు : ఎవడు తరగని నరకం అనుభవిస్తాడు ?

ధర్మరాజు : ఆశపెట్టి దానమివ్వనివాడూ, వేదాలూ, ధర్మశాస్త్రాలూ, దేవతలూ, పితృదేవతలూ, బ్రాహ్మలూ — వీళ్ళని ద్వేషించినవాడూ

ధనముండిన్నీ సత్పాత్రదానం చేయనివాడూ తరగని నరకం అనుభవిస్తాడు.

యక్షుడు : కులమా ? ప్రవర్తనా ? వేదాలు చదవడమా ? శాస్త్ర జ్ఞానమా ? – ఏది బ్రాహ్మణత్వ మిస్తుంది ?

ధర్మరాజు : కులం కాదు. వేదాలు చదవడమూ కాదు. శాస్త్ర జ్ఞానమూ కాదు. ప్రవర్తనే బ్రాహ్మణత్వ మిస్తుంది. నాలుగు వేదాలు చదివినా మంచి ప్రవర్తనలేని బ్రాహ్మడు నీచుడే అవుతాడు.

యక్షుడు : మంచిగా మాట్లాడే వాడికి ఏమిటి దొరుకుతుంది ?

ధర్మరాజు : స్నేహితులు దొరుకుతారు.

యక్షుడు : ఆలోచించి పనిచేసేవాడు ఏమవుతాడు ?

ధర్మరాజు : అందరిలోకి గొప్పవా డవుతాడు.

యక్షుడు : అధికం స్నేహితులున్నవాడు ?

ధర్మరాజు : సుఖపడతాడు.

యక్షుడు : ధర్మం తప్పకండా నడుచుకున్నవాడు ?

ధర్మరాజు : ఉత్తమగతులు పొందుతాడు.

యక్షుడు : ఎవడు సంతోషంగా వుంటాడు ?

ధర్మరాజు : ఋణం లేనివాడు. ప్రవాసంలో వుండనివాడు. తన ఇంట నిర్విచారంగా ఆకో అలమో వండించుకుని పగలు అయిదో జామునో, ఆరోజామునో భుజించేవాడు.

యక్షుడు : ఏది ఆశ్చర్యం ?

ధర్మరాజు : ప్రాణులు ప్రతీరోజూ చచ్చిపోతూ వుండడం చూస్తూనూ మనిషి తానుమాత్రం స్థిరంగా వుంటాననుకోడం.

యక్షుడు : ఏది మార్గం ?

ధర్మరాజు : పెద్దలు నడిచింది.

యక్షుడు : ఏది వార్త ?

ధర్మరాజు : భూమి పాత్ర, ఆకాశం మూత, పగలూ రాత్రీ కట్టెలు. సూర్యుడు అగ్ని, మాసాలూ రుతువులూ తెడ్లు. వీటితో కాలమే ప్రాణి కోటిని వండేస్తూవుంది. ఇదే వార్త.

యక్షుడు : పురుషుడంటే ఎవడు ?

ధర్మరాజు : భూమీ, ఆకాశం అంతటా ఎవడి కీర్తి నిండి వుంటుందో అతడే పురుషుడు.

యక్షుడు : లోకంలో అందరినీ మించిన ధనవంతు డెవడు ?

ధర్మరాజు : ప్రియమూ, అప్రియమూ, సుఖమూ, దుఃఖమూ, గతమూ, ఆగతమూ, ఇవన్నీ వొక్కలాగే చూసేవాడు అందరినీ మించిన ధనవంతుడు.

యక్షుడు అడిగిన ప్రతీప్రశ్నకీ సరయిన జవాబు చెప్పాడు ధర్మరాజు. సంతోషించాడు యక్షుడు. "ధర్మరాజా! నా ప్రశ్నలన్నిటికీ చక్కని జవాబులు చెప్పావు. సంతోషంగా వుంది నాకు. నీ తమ్ముల్లో వొక్కణ్ణి మాత్రం బతికిస్తాను. నలుగురిలో ఎవణ్ణి బతికించ మంటావో చెప్పు" అన్నాడు.

"నకులుణ్ణి బతికించు" అన్నాడు ధర్మరాజు.

"అదేం?" అన్నాడు యక్షుడు. "భీముడూ, అర్జునుడూ వున్నారు. అఖండమైన బలవంతులు వీళ్లు. నీకు ప్రాణంలాంటి వాళ్లున్నూ. అలాంటివాళ్ళని మానుకుని, నకులుణ్ణి కోరుకున్నావేం?" అని అడిగాడు.

"మా తండ్రికి ఇద్దరు భార్యలు; కుంతీ, మాద్రీనీ. కుంతి కొడుకులు ముగ్గురిలోనూ పెద్దవాణ్ణి నేను బతికాను. మాద్రికొడుకుల్లో వొకడు బతకడం ధర్మం కదా !" అన్నాడు ధర్మరాజు.

"నీ ధర్మబుద్ధికి మెచ్చుకుంటున్నాను" అన్నాడు యక్షుడు. "నీ తమ్ములు నలుగుర్నీ బతికిస్తాను" అన్నాడు.

యక్షుడి నోట్లోమాట నోట్లోనే వుంది. నిద్రపోయి లేచినట్టు లేచి కూచున్నారు భీమార్జునులూ, నకులసహదేవులున్నూ. అంతకంటే చిత్రం ఏమిటంటే, ఆకలీ దప్పికా కూడా లేదు వాళ్ళకి. ఆశ్చర్యపోయాడు ధర్మరాజు. "మహాత్మా! నువ్వు కేవలం యక్షుడివంటే నమ్మలేకపోతున్నాను" అన్నాడతడు. "నిజంగా దేవేంద్రుడివో, శివుడివో, అగ్నిహోత్రుడివో, గాలిదేవుడివో అయివుంటావు. కాదంటే, నాతండ్రి ధర్మదేవతవేమో అనిపిస్తోంది నాకు. అనుగ్రహించు. ఎవరు నువ్వు ?" అని చేతులు జోడించాడు.

"అవును, ధర్మదేవతనే నేను" - చిరునవ్వుతో అన్నాడు యక్షమూర్తి. "సత్యమూ, శౌచమూ, దానమూ, తపమూ, శమమూ, దాంతీ, కీర్తీ, జ్ఞానమూ - ఇవి అన్నీ నామూర్తులే. మహాధార్మికుడివయిన కుమారుడివి నువ్వు. నిన్ను చూసిపోవాలనే ఇలా వచ్చాను. నన్ను ఆశ్రయించిన వాళ్ళకి దుర్గతులంటూ వుండవు. నీకు ఏం కావాలో అడుగు. వరమిస్తాను" అన్నాడు.

ధర్మదేవత అనేసరికి తడబడిపోయాడు ధర్మరాజు. భక్తిపూర్వకంగా దండప్రణామం చేశాడు. "తండ్రీ! ఆశ్రమంలో అరణికోసం కూచునే వుంటాడు బ్రాహ్మడు. అది దొరికిపోయేటట్టు వరమియ్యి. అది పట్టుకుని మాయమే అయిపోయింది జింక" అన్నాడు.

"ఇంకా లేదూ ఏమీ లేదు" అన్నాడు ధర్మదేవత. "నీమనస్సు పరీక్షించడం కోసం నేనే అలా పట్టుకువచ్చేశాను అరణి. ఇదిగో" అంటూ ధర్మరాజు చేతిలో పెట్టాడు అరణి. "మీ వనవాసం పన్నెండేళ్ళూ నిండిపోయాయి పదమూడో ఏడు వచ్చేసింది. ఇక అజ్ఞాతవాసం చెయ్యాలి మీరు. మీ ఆరుగురూ ఎక్కడ, ఏయే రూపాలతో వుండాలంటే, ఆయా రూపాలు మీకువచ్చేటట్టు వరమిస్తున్నాను. అంతేకాదు, అజ్ఞాతవాసంలో మీరు ఎలా వున్నా సరే, మిమ్మల్ని ఎవరూ పోల్చిపట్టకండానూ వరమిస్తున్నాను. ఇంకా ఏం కావాలో అడుగు" అన్నాడు.

"ఆది దేవుడివి నువ్వు. అనుగ్రహించావు. దర్శన మిచ్చావు ధన్యుణ్ణయాను. ఇంతకంటే ఏంకావాలి నాకు ? అయినా వొక్కవరం మాత్రం దయచెయ్యి. ఎన్నడూ కూడా క్రోధమూ, మోహమూ మొదలయిన అరిషడ్వర్గాలు నన్ను అంటకండా అనుగ్రహించు" అన్నాడు ధర్మరాజు.

"తథాస్తు" అని, అంతర్థానమయిపోయాడు ధర్మదేవత.

అనంతరం ఆశ్రమానికి వచ్చేశారు పాండవులు. బ్రాహ్మడి అరణి అతడికి ఇచ్చి సంతోషపరిచారు. అతడిచ్చిన ఆశీర్వాదాలు అందుకుని ఆనందించారు.

వ్యావహారికాంధ్రమహాభారతం

అ ర ణ్యా ప ర్వ ం

స ం పూ ర్ణ ం.

ప్రాచీన గ్రంథావళి 3

సంపాదకుడు పురిపండా అప్పలస్వామి

# వ్యావహారికాంధ్ర

# మహాభారతం

## విరాట ఉద్యోగ పర్వాలు

### మూడో సంపుటం


పురిపండా అప్పలస్వామి

కవితాసమితి అధ్యక్షుడు





ప్రాచీన గ్రంథావళి

రాజమహేంద్రవరము

# సంపాదకుల మనవి

ఆధునిక సాహిత్యమంతా వెర్రితలలు వేస్తున్నదనుకునే అనారోగ్య చేతస్కులం కాంమేము. పరిణామ దృష్టికల ఏ క్రాంతిదర్శీ అలా అనుకోడు, అనుకోకూడదు. అయితే మన ప్రాచీన సాహిత్యమూ, సంస్కృతీ సమాధిచేసి అభ్యుదయం సాధిస్తామనుకోడం మాత్రం నేల విడిచి సాముచెయ్యడమే అవుతుంది రోదసి ప్రయాణం చేసినా, గ్రహమండల యాత్రచేసినా ఈప్రాచీన వసుంధరే ప్రాతిపదిక మనిషికి. భూతకాలం లేందే వర్తమానం లేదు. అలాగే ప్రాచీనతలేందే ఆధునికతలేదు. ఈనమ్మకమే ఈ ప్రాచీన గ్రంథావళి నెలకొల్పడానికి ప్రేరణ కలిగించింది మాకు.

ప్రాచీన సంస్కృతీ ప్రాచీన, విజ్ఞానమూ, ప్రాచీన సాహిత్యలావణ్యమూ అక్షరాశ్యులైన ఆంధ్ర ప్రజలకందరికీ కరతలామలకం చెయ్యడమే మాగ్రంథావళి సంకల్పం. మాసంకల్పం సఫలం కావాలంటే ముక్కోటి ఆంధ్రుల చేయూత అవసరం.

ఆంధ్రజాతికి అభిమాన గ్రంథం మహాభారతం భారతీయుల విజ్ఞాన సర్వస్వం మహాభారతం. భారతంలో లేంది భారతంలో లేదు. వింటే భారతమే వినాలి. ఈమహాభారతంతో మా గ్రంథావళికి శ్రీకారం చుట్టగలిగినందుకు సంతోషిస్తున్నాం. పద్దెనిమిది పర్వాలూ ఏడుసంపుటాల్లో సిద్ధంగా వున్నాయి ఎనిమిదోగ్రంథం భగవద్గీత. తక్కినవి క్రమంగా సమర్పించగలం.

అభ్యుదయ ఘంటాపథంలో మంగళకరమైన ప్రాచీన దివ్య జ్యోతితో తెలుగుతల్లికి నీరాజనమెత్తుతున్న మాసదుద్యమం సఫలం కావాలని ఆంధ్రప్రజానీకం ఆశీర్వదించాలి.

సంపాదకుడు

# విన్నపం

విశ్వచైతన్యం కలిగించి మానవాభ్యుదయానికి మార్గదర్శకాలైన మహాగ్రంథాల్లో మహాభారతం ప్రథమశ్రేణిది. రామలింగారెడ్డిగారి భాషలో ఐతే భారతాన్ని మించిన గ్రంథం ప్రపంచవాఙ్మయంలో మరొక్కటిలేదు. నిజమే, డాంటేరాసిన 'డివైన్ కామెడీ', హోమరు రాసిన 'ఇలియడ్', ఫిరదౌసీరాసిన 'షహనామా' — ఇవేవీ భారతం ముందు నిలవవు.

వ్యాసమహర్షి, ఆయనశిష్యులూ సంస్కృతంలో రాసిన జాతీయ ఇతిహాసం మహాభారతం. ఇది మానవమాత్రులందరికీ అందుబాటు కలిగించాలన్న ప్రయత్నం శతాబ్దాలనాటిది అందుకనే ఇంచుమించు మన ప్రాంతీయభాషలన్నిటిలోనూ దీని అనువాదం జరిగింది ద్వీపాంతర భాషల్లో సహా — నిన్న మొన్న రష్యావాఙ్మయంలో కూడా దీని భాషాంతరీకరణం జరిగింది.

ఈఅన్నిటిలోకీ తలమానికమైంది తెనుగుభారతం. ఇది మన కవిత్రయంవారి చేతిచలవ; ఆంధ్రుల చిరతపఃఫలం. తెనుగుభారతం ముందు బంగాళీ మొదలైన భారతాలు ఏనోన్ని రెట్లు తీసికట్టు.

సంస్కృతభారతం బంగారంముద్ద ఐతే తెనుగుభారతం ఆ బంగారంతో తీర్చిదిద్దిన బంగారంపద్మం అన్నారు కొమర్రాజు లక్ష్మణరావుగారు. అంచేతనే తెనుగు మహాభారతమే అనుసరించాను నేను.

చిరకాలానుగతమైన పరాధీనత నిన్నగాక మొన్న వదిలింది మనల్ని. నవభారతం నవాభ్యుదయకరంగా చక్కదిద్దుకుంటున్న దినాలివి. మార్క్స్ చెప్పినమేరకి సంపదమాత్రమేకాదు, మనవిజ్ఞానం, వాఙ్మయంకూడా బహుళజనప్రాప్తం కావాలి. అది వ్యావహారికభాష వల్లనే సాధ్యపడుతుంది కనకనే మహాభారతమేకాదు—మన ఉద్గ్రంథాలన్నీ వ్యావహారికాంధ్రంలో పునఃపాకం కావాలని ఆవేదన పడుతున్నాం. ఆ ఆవేదనఫలితమే ఈ వ్యావహారికాంధ్ర మహాభారతం.

ఈ భారతమహాసముద్రం ఈది గట్టుచేరడం — సాహసమే అని భయపడ్డాను మొదట. కాని, మిత్రుల ప్రోత్సాహం, సోదరకవులూ, పండితమిత్రులూ ఇచ్చిన ఉషారూ ముందుకి వురికించి దీక్షాబద్ధుణ్ణి చేశాయి నన్ను. ఎందాక కృతకృత్యుణ్ణయిందీ దేశీయులే చెప్పి ఆశీర్వదించాలి.

వ్యావహారికాంధ్ర మహాభారతం అవతరణకి ముఖ్యకారకులు నా ఆప్తమిత్రులు శ్రీ బిరుసుమంతి సింహాచలంగారు. సారధీ, సచివుడూ, సఖుడూ, బాంధవుడున్నూ నా కీయన. ఈయన సహాకారమే లేకపోతే ఇంతలో వెలుగు చూసేది కాదిది.

రాతప్రతి చదివి ఎంతైనా ఉత్సాహపరిచారు గతమార్చిలో నరసాపురంలో కూడిన కవిపండిత సభలోని మిత్రులు - ముఖ్యంగా శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారూ, శ్రీ శివశంకరస్వామిగారున్నూ. రాస్తున్నట్టు తెలిసి స్వాగతం పలికారు కృష్ణాపత్రికవారు తాముకూడా ఇదే అభిప్రాయంతో వుండికున్నీ నేను రాస్తున్నట్టు వినడంతోనే ఆశీర్వదించారు మిత్రులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. అవసరమైన గ్రంథసామగ్రి అందించారు మా మొహమ్మదు ఖాసింఖానుగారూ, శ్రీ గ్రంథి వేంకటరమణయ్యబాబు గారున్నూ. చిత్తురాతప్రతి కొంత సాపు రాసిపెట్టారు శ్రీమతి అత్తిలి స్వరాజ్యలక్ష్మిగారు. విరాళాలు వసూలుచేసి ఎంతోసహాయంచేశారు శ్రీ సామవేదం శ్రీనివాస అప్పలాచార్యులుగారూ, శ్రీ దాసరి రామారావు నాయుడు గారూ, శ్రీ బి. జి. ఎం. ఏ. నరసింగరావుగారూ, శ్రీ రోళ్ల సత్యనారాయణనాయుడుగారూ, శ్రీ విన్నకోట రామమూర్తి గుప్తగారూ మొదలైన హితాభిలాషులు. అందమైన చిత్రాలువేసి యిచ్చారు శ్రీ వి. ఆర్. ఎం. శర్మగారు. ఎప్పటికప్పుడు ప్రోత్సహిస్తూనే వచ్చారు మా కవితాసమితి నేస్తులూ, మా విశాఖ రచయితలసంఘం స్నేహితులూన్నూ. ముద్రణకాలంలో అన్ని సౌకర్యాలూ కలిగించారు శ్రీ కృష్ణాఎస్ట్రోఛాంబర్సు, కె. వి. అప్పారావు చెట్టిగారూ, వారిసతి అలివేలు మంగయమ్మగారున్నూ. అందంగా అచ్చుపని పూర్తిచేయించారు సరస్వతీ పవర్ ప్రెస్ ప్రొప్రయిటర్లు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు గారు వీరందరికీ నా వినయాంజలి.

ఇది విరాట ఉద్యోగ పర్వాల సంపుటం, మూడోది. సహృదయుల ఆదేశం ప్రకారం ఇదే ముందు వచ్చింది. తక్కినవి క్రమంగా అర్పించుకుంటున్నాను.

మకాం రాజమహేంద్రవరం
నందన హేమంతం

పురిపండా అప్పలస్వామి

# వి ష య సూ చి క

# అం కి తం

అమ్మా,

'అమ్మా' అని నిన్ను నోరారా పిలిచీ,

చివరిసారి నీ దర్శనం చేసీ,

వెళ్ళి వస్తానని నోరారా చెప్పీ,

ఇవాళకి

ఆరేళ్ళు దాటుతున్నాయి

భారతం సంపూర్ణంగా నానోటవినకండానె

వెళ్ళిపోయావు

తీర్చుకోలేని ఈలోపం నిరంతరం

వేధిస్తూనే వుంది నన్ను

ఏంచెయ్యనూ!

నాకు తెలుసు,

ఎక్కడ వున్నా నన్ను వింటావు నువ్వు.

ఇదిగో

తెలుగు భారతం.

ఆశీర్వదించు,

నందన హేమంతం 1952

# విరాటపర్వం



## మొదటి ఆశ్వాసం

### అజ్ఞాతవాసం

పాండవులు పన్నెండేళ్ళ వనవాసమూ సముచితంగా ముగించారు. పన్నెండోఏటి చివర ధర్మదేవత ప్రత్యక్షమయాడు. అజ్ఞాతవాసానికి విఘ్నం కలగకుండా వరమిచ్చాడు.

ఇక పదమూడోఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి. అంతవరకూ తమతోపాటు అగ్నిహోత్రాలూ అవీ వెంటపెట్టుకొని ఎంతోమంది బ్రాహ్మణులు అరణ్యవాసం చేస్తున్నారు వారందరికీ సవినయంగా నమస్కారంచేసి, ఇకముందు తాము నిర్వహించవలిసిన కార్యాన్ని గూర్చి ప్రస్తావించారు పాండవులు.

"దుర్యోధనుడి కుటిలకృత్యాలు మీకందరికీ తెలిసినవేకదా! పాపం, మీరుకూడా మాతోపాటు అడవుల్లోతిరిగి అష్టకష్టాలూ అనుభవించారు. ఇన్నాళ్ళూ ఎలాగో కాలం గడిచిపోయింది. ఇది పదమూడో సంవత్సరం. మేము అజ్ఞాతవాసంలోకి పోవాలి. దుర్యోధనాదులు మాకు భంగం కలిగించడానికి కాచుకొని వుంటారు. వాళ్ళకేమాత్రం ఆచోకీ తెలిసినా ప్రమాదం తప్పదు. అందుచేత మే మీ నిగూఢకార్యాన్ని నిర్విఘ్నంగా ముగించేటట్లు అనుగ్రహించాలి మీరు" అన్నారు.

చెపుతూ చెపుతూ ధర్మరాజు కంఠం గద్గదిక పడింది.

"ఈకష్టాలు గట్టెక్కి, బంధువులతోనూ, మీవంటి సహృదయులతోనూ సుఖంగా గడిపేదినం మళ్ళీ ఎప్పుడు వస్తుంది మాకు! నిజా

నికి మాలాంటి అభాగ్యులు మరెక్కడా ఉండరనుకుంటాను'' అని కంటతడి పెట్టుకున్నాడు.

ధర్మరాజు దుఃఖంచూసి అందరూ వోదార్చడం మొదలు పెట్టారు.

పురోహితుడు ధౌమ్యుడిలా అన్నాడు

''ఒక ధర్మనిర్ణయంచేయవలిసివచ్చినా,సత్కార్యాలునిర్వహించవలిసి వచ్చినా, ధృఢబుద్ధికీ, చాతుర్యానికీ, ధైర్యానికీ చెప్పవలిసి వచ్చినా నిన్ను చెప్పి మరొకర్ని చెప్పాలి. అలాంటి ప్రసిద్ధిపొందిన నువ్వు కష్టాలు వచ్చాయికదా అని విచారిస్తే మరి సామాన్యుల సంగతి చెప్పేదేముంది! శత్రువినాశనానికి కాలం కలిసివచ్చేవరకూ అణగారి వుండడమనేది దేవతల్లాంటి వాళ్ళకే తప్పలేదు.

''పూర్వంఇంద్రుడునిషధపర్వతంమీదప్రచ్ఛన్నంగా గడిపాడు. విష్ణువు వామనాకారం ధరించి అదితిగర్భంలో అణిగివున్నాడు. బ్రహర్షి ఔర్వుడు తల్లి తొడల్లో దాగున్నాడు. సూర్యుడు ధేనువు శరీరంలో తలదాచుకున్నాడు ఇవన్నీ మనం వింటూనే వున్నాం కదా! అలా అడిగిమడిగి వుండి, సమయం రాగానే విజృంభించి శత్రు నాశనం చేశారు వాళ్లు. మీరూ అలాగే ఈ ఆపదలు సహించుకుని, అదును రాగానే శత్రుసంహారం చేసి అవమానం తీర్చుకోండి.''

ధౌమ్యుడి మాటలు ధర్మరాజును సేదదేర్చాయి.

''అన్నయ్యా! నీ ఆజ్ఞకి కట్టుబడిపోయాడే కాని లేకపోతే అవాళే మదపుటేనుగు తామరవనాన్ని ధ్వంసం చేసినట్టు నిమిషాల మీద కౌరవులందరినీ చిందరవందర చేసి విడిచిపెట్టేవాడు మన అర్జునుడు'' అన్నాడు భీముడు.

''అవును'' అన్నట్టు తలపంకించాడు ధర్మరాజు.

పాండవుల యింగితం గ్రహించి బ్రాహ్మలంతా ఆశీర్వాదం చేశారు. పునర్దర్శనం అభిలషిస్తూ ఎవరిళ్ళకి వాళ్లు వెళ్ళిపోయారు.

బాహ్యాపరివారంకూడా యథోచితంగా సెలవుతీసికొని తమ తమ నివేశనాలకి వెళ్లిపోయింది.

తరవాత ఆస్థలం విడిచిపెట్టి పాండవులు ధౌమ్యుడితోకూడా రథాలమీద ఒకక్రోసెడు దూరం వెళ్ళిపోయారు. ఆరాత్రి అక్కడ గడిపారు

మర్నాడు తెల్లవారాక ముందు చేయబోయే కార్యక్రమం గురించి ఆలోచన సాగించారు.

ధర్మరాజు మనం ఐదుగురమూ ద్రౌపదిని వెంటపెట్టుకుని ఎక్కడికి వెళ్ళినా మనల్ని ఎవరైనా గుర్తుపట్టేస్తారు. ఈసంవత్స రమూ ఎలా గడపడమో నాకు బోధపడకండావుంది.

అర్జునుడు అన్నయ్యా, మీధర్మవర్తనానికి మెచ్చి ధర్మదేవత ప్రసాదించిన వరం మనకు వుండనే వుందికదా ! అంచేత మనం ఎలా ఎక్కడవున్నా మనల్ని ఎవరూ పోల్చుకోలేరు కౌరవదేశంచుట్టూ పాంచాల, చేది, మత్స్య, సాళ్వ,విదేహ, బాహ్లీక,దశార్ణ, శూరసేన, కళింగ, మగధ దేశాలు వున్నాయి. ఇవన్నీ సుభిక్షమైనవీ,జనాకీర్ణమై నవీ, అతి స్థిరమైనవీ, వాసయోగ్యమైనవీ అని వింటున్నాము.వీటిలో మీకు ఎక్కడనచ్చితే అక్కడ తలదాచుకుందాం.

ధర్మారాజు అవును,నిజమే.ధర్మదేవత అనుగ్రహించినవరమే మనకు రక్షరేక అయితే నిర్భయంగా నివసించదగిన చోటు చెప్పండి పోదాం. నామట్టుకు చూస్తే మత్స్యదేశాధిపతి విరాటుడు ధర్మ పరుడూ, ఉత్తముడూ, సజ్జనపాత్రుడున్నూ. అతడిదగ్గిర మనమంతా తగిన పనుల్లో కుదురుకోడం మంచిదని తోస్తూంది. కాబట్టి మనలో ఎవరెవరు ఏయేపనుల్లో ఎలా ఉండదలచిందీ చెప్పండి.

అర్జునుడు అన్నయ్యా, మహనీయమైన ఆకారం, గర్వించదగ్గ వైభవం, సౌకుమార్యం, సరళత్వం, మార్దవం, మహిమతోకూడిన

ప్రభుత్వం, భోగం, కీర్తి–ఇన్నీ కలిగి ప్రజలను పాలించడమే కాని ఇతరులను కొలిచి ఎరగని మీరు విరాటరాజు కొలువు ఎలా నిర్వహిస్తారు?

తమ్ముడి విచారం గ్రహించి గాంభీర్యం వహించి యిలా అన్నాడు ధర్మరాజు.

"సన్యాసివేషం వేసుకువెళ్ళి అతడి కొలువులో ప్రవేశిస్తాను నేను. పుణ్యకథలు చెపుతూ వేడుక కలిగిస్తాను. జ్యోతిషం, శకున శాస్త్రం సమయానుకూలంగా చర్చిస్తాను. వేదాలూ, స్మృతులూ, పురాణాలూ–వీటిల్లో నాచాతుర్యంచూపించి అతడి ఆదరణా, సభికుల గౌరవాదరాలూ సంపాదిస్తాను. ద్యూతక్రీడలో నా నైపుణ్యమంతా చూపించి సంతోషపెడతాను వెండివీ, బంగారానివీ, నవరత్నాలు తాపినవీ రకరకాల పాచికలు నాదగ్గిరవున్నాయి. అవన్నీ చూపించి ఉత్సాహం పుట్టిస్తాను. అన్నివిధాలా అతడికి అనుకూలంగా ప్రవర్తించి అతడి అనుగ్రహం గడిస్తాను.

"పేరు కంకభట్టు అని చెపుతాను. నాపూర్వవృత్తాంతం అడిగితే, ఇంతవరకూ ధర్మరాజుదగ్గిర స్నేహపాత్రుడిగా వుండేవాణ్ణంటాను.

"అంచేత నాగురించి విచార మక్కరలేదు. కాని పాపం, భీముణ్ణి చూస్తే గుండె తరుక్కుపోతూవుంది"

"గంధమాదనంలో యక్షుల్ని జయించి సౌగంధిక పుష్పాలు ద్రౌపదికి తెచ్చియిచ్చాడు. కిమ్మీరదానవుణ్ణి కొట్టి కామ్యకవనం నిష్కంటకం చేశాడు. జటాసురుణ్ణి చంపి మనఅందరిప్రాణాలూ కాపాడాడు. బకాసురుణ్ణి సంహరించి ఏకచక్రపురం రక్షించాడు. దర్పం మూర్తీభవించినట్లు ఆబాల్యంగా ఒకర్ని లక్ష్యపెట్టకుండా పెరిగాడు. ఇలాంటివాడు ఇతర్ల మనస్సుకి నచ్చినట్టు ఎలా సేవచేస్తాడోమరి!"

భీముడు నేను వంటలవాణ్ణయి వెళతాను. పంచభక్ష్యపరమాన్నాలూ షడ్రసోపేతంగా వంటచేసి పెడతాను. చవులూరేటట్టు

పచ్చళ్లూ, రకరకాల కూరలూ, వేపుళ్లూ రోజుకోరకంగా, వింత వింతగా తయారుచేసి అతణ్ణి మెప్పిస్తాను. ఇంతెందుకూ, నన్ను మించిన వంటవాడు తన రాజ్యంలో లేడనిపిస్తాను.

వంటకట్టెలకోసం కత్తీ, గొడ్డలీ ముట్టుకోను. కాళ్లతోనూ, చేతులతోనూ విరిచి, చీల్చి పొయ్యిలో పెడతాను. వంటశాల అధికారితో స్నేహంగా ప్రవర్తిస్తాను. అతడికిఅనుకూలంగాఅన్ని పనులూ నెరవేరుస్తాను. ఎంతకష్టమైనా యిట్టే సహిస్తాను మల్లవిద్యలోకూడా నా ప్రావీణ్యం ప్రదర్శిస్తాను లంఘించడం, పరిగెత్తడం, బరువు లెత్తడం – ఇలా చిత్రచిత్రాల బలప్రదర్శనం చూపించి 'ఓహో' అనిపిస్తాను. మల్లులతో పోట్లాడతాను, ఒక్కణ్ణే అనేకమందిని వీగగొట్టి ఆశ్చర్యం కలిగిస్తాను. ఎనుపోతు, మదపుటేనుగు, పెద్దపులి, సింహం – వీటిని అదిమిపట్టి కాళ్ళతో నలిపేస్తాను. నాబలం చూసి భయపడేటట్టు చేస్తాను. అన్నివిధాలా అతడిమనస్సు రంజింపజేస్తాను పేరు వలలుడు అని చెపుతాను. ఎక్కడ ఉండేవాడివని అడిగితే, 'ధర్మరాజు దగ్గిర వంటపుట్టిగా ఉండేవా'ణ్ణంటాను.

భీముడు చెప్పింది విని సమ్మతించాడు ధర్మరాజు. తరవాత అర్జునుణ్ణిచూశాడు. దుఃఖం కంఠాగ్రంగావచ్చింది. నిగ్రహించుకుంటూ అన్నాడు

"ఖాండవవనం దహించాడు. దేవదుర్లభుడైన మహేశ్వరుణ్ణి సందర్శించాడు. ఉద్దండులైన వేలాది రాక్షసుల్ని సంహరించి దేవేంద్రుణ్ణి సంతోషపరిచాడు అతడి అర్ధాసనం అధిష్ఠించాడు. ఇంతటి మహానుభావుడు ఒకమానవమాత్రుడిదగ్గిర సేవకావృత్తిఎలాచేస్తాడు!"

అర్జునుడు నాగురించి విచారించనక్కరలేదు అదృష్టవశాత్తూ మీఅందరికంటే నాకొక అనుకూలమార్గం వుంది. అమరావతికి వెళ్లినపుడు ఊర్వశి 'నపుంసకుడవుక'మ్మని నన్ను శపించింది. అప్పుడు

దేవేంద్రుడు కరుణించి ఈశాపఫలం అజ్ఞాతవాస సంవత్సరంలో నాకు అనుభవానికి వచ్చేటట్టు అనుగ్రహించాడు. అజ్ఞాతవాసంముగియగానే శాపవిమోచనం కలుగుతుంది. అంచేత నేను పేడి రూపం ధరిస్తాను. చీరె కట్టుకుంటాను. రైక వేసుకుంటాను. గాజులూ తొడుగు కుంటాను —— ఇలా పోల్చికి వీలులేకుండా తయారై వెళతాను. రాజ కన్యకలకు నృత్యం, సంగీతం నేర్పుతానంటాను. పేరు బృహన్నల అని చెపుతాను. 'ఇంతకు ముందు ఎక్కడ వుండే దానివి?' అని అడిగితే 'పాండవాంతఃపురంలో ద్రౌపదీదేవి దగ్గిర నాట్యాచార్యపదవిలో ఉండే దాని' నంటాను.

ధర్మరాజు ఇది బాగానేవుంది మరి నకులుడి సంగతి? అంద మైన ఆకారమూ, విశాలమైన వక్షఃస్థలమూ, సభ్యతా సందర్భమూ చెప్పకండానే ఈయన 'ఫలానా' అని పట్టియిస్తాయి. అందులో పరాయివాళ్ల సేవ పగవాడికి కూడా కోరదగింది కాదు. అదా పట్నవాసం, అజ్ఞాతంగా ఎలా నెగ్గుకువస్తాడో మరి! తలుచుకుంటే నే దుఃఖంగా వుంది నాకు.

నకులుడు నేను అశ్వశిక్షకుణ్ణాయి వెళతాను. అశ్వశాస్త్రం నాకు కరతలామలకం కదా! విరాటుడి గుర్రాలన్నిటినీ ఉచ్చైశ్శ్రవాల లాగ తయారుచేస్తాను.

వయసుకు వచ్చిన పెంటిగుర్రాల్ని పొర్లుకుపట్టించడం, కొదమ గుర్రాల్ని అదును తెలుసుకొని నడకలు నేర్పడం, కళ్లేలకీ లొంగని వాటిని నూలుపోగుకి సైతం నిలబడేటట్టు తర్ఫీదు చెయ్యడం, బిరు సెక్కిన పెంకెగుర్రాల్నయినాసరే చెప్పుచేతల్లో నడిపించడం—ఇలాంటి వాటన్నింటిలో నన్ను మించిన చెయ్యివుండకూడదు. అస్త్రబాలను నేనే వెయ్యికళ్లతోకనిపెట్టి పనివాళ్లకి విశ్రాంతికలిగిస్తాను. పేరు దామగ్రంథి అంటాను. ధర్మరాజుదగ్గిర అశ్వశిక్షకుడిగా ఉండేవాణ్ణనీ చెబుతాను.

ధర్మరాజు ఇదీ బాగానేవుంది. ఇక సహదేవుడు? తల్లి కుంతీ దేవి అరచేతి నిమ్మపండులా పెంచింది. కపటమంటేనే తెలీదు పాపం! నిరహంకారి. నీతివర్తనుడు. నిజానికి విధి ఎంతపనైనా చేస్తుంది! ఇంత సుకుమారుడు సేవకావృత్తి ఎలా నిర్వహిస్తాడు?

సహదేవుడు నేను గొల్ల వేషంలో వెళతాను. పశుశాస్త్రంలో నాది పై చెయ్యికదా! ఆలకాపరిగా కుదురుకుంటాను. గొడ్డుపోయిన గోవునైనా కామధేనువులాగ తయారుచేస్తాను. ఎండు బక్కలవంటి వాటినైనా ఈగవాలితే జారిపోయేటంత పుష్టిగా చేస్తాను. తెవుళ్ళ గొడ్లని కోడెదూడల్లాగ నిగనిగలాడేటట్టు చేస్తాను. పెంకెవాటినీ, దొంగగొడ్లనీ కొంటెవాటినీ కనుసన్నలో మెలిగేటట్టు, సాధువుల లాగ, గంగిగోవుల్లాగ చేసి మరీ విడిచిపెడతాను. విరాటరాజు ఆల మందలు తామర తంపరగా వృద్ధిఅయేటట్టు చేస్తాను, అతడిమెప్పు సంపాదిస్తాను. పేరు తంత్రీపాలుడంటాను. నిన్న మొన్నటి వరకూ ధర్మరాజుగారి ఆలమందలకు అధికారిగా వుండేవాణ్ణని చెబుతాను.

తరవాత ధర్మరాజు చూపులు ద్రౌపది దిక్కు తిరిగాయి. మొహం చిన్నబుచ్చుకున్నాడు. దుఃఖం దిగమింగుకున్నాడు తుదకి యిలా అన్నాడు

" ఈమె ఏపనీ చేయడం చేతకాని ముద్దరాలు మెత్తనిమనిషి. చెడ్డ అంటేనే తట్టుకోలేదు. జాలిగుండెకలది. ఒంటరిగా వుండడ మంటేనే భరించలేదు. తనకు తానుగా ఏదీ సవరించుకోవడమన్నా తెలీదు. స్త్రీజనానికంతటికీ తలమానికంగా వుండవలిసిన ఈమె ఇవాళ దాసిగా ఎలా మసులుతుంది? "

ద్రౌపది నేను సైరంధ్రిగా తయారౌతాను. అంతఃపురం దగ్గిరికి వెళతాను. నన్నుచూసి విరాటరాజు రాణీ తప్పకుండా పిలుస్తుంది. సవినయంగా వెళ్లి ఆమె కొలువులో చేరుకుంటాను. 'ఈమె స్వాధీ'

చెయ్యరాని నీచకార్యాల వంక పోదు' అని నన్ను ఆమె గౌరవించే విధంగా ఆమె కనుసన్నలలో నడుచుకుంటాను. కొత్తకొత్త పరిమళాలతో కలపం తయారుచేసి ఆమెకి పూస్తాను. కస్తూరిచక్కగాసిద్ధపరచి అందంగా తిలకం దిద్దుతాను. రకరకాలుగా, చిత్రచిత్రాలుగా వింత వింతల పూలదండలు కట్టి యిస్తాను. వివిధ శిల్పాలతో నా నేర్పంతా చూపించి ముప్పూటలా మెప్పిస్తాను. పేరు 'మాలిని' అంటాను. 'ఇంతకుముందు ఎక్కడ వుండేదాని' వని అడిగితే 'ద్రౌపదిదగ్గిర' అని చెపుతాను.

ధర్మరాజు ఇదిగో, మనవంశమంతటిలోనూనడవడికలోప్రసిద్ధి వడసిన పుణ్యసతివి నువ్వు. దుర్మార్గులూ, తుచ్ఛులూ వుంటారు. వాళ్లని ఒకకంట కనిపెడుతూ మసలవలిసి వుంటుంది మరి.

ఈమాటకు ద్రౌపది మనస్సు చివుక్కుమంది. అనాదరంగా ఒక మందహాసం చేసింది

"పాతివ్రత్యం, సౌజన్యం, గౌరవం—ఇవి సైరంధ్రీజాతికి సహజ గుణాలు అంచేత మీా కాసందేహం అక్కరలేదు. మితభాషిత్వం, వ్రతాదీక్షా, పాపభీతీ నన్ను కంటికి రెప్పలా కాపాడుతూనే వుంటాయి" అంది.

ధర్మరాజు సరే, మనమందరం యిలాజాగ్రత్తగాగుప్తజీవనం చేస్తాం మనఅగ్నిహోత్రాలు ధౌమ్యులు భద్రపరుస్తారు.వంటలవాళ్లూ, పాకాధ్యక్షులూ, ద్రౌపది పరిచారికలూ కాంపిల్యనగరం పోయి వుంటారు. రథాలు తీసుకుని ఇంద్రసేనుడు మొదలైన సారథులు ద్వారకాపట్నానికి వెళతారు. వీళ్లని ఎవళ్లైనామనవిషయంప్రశ్నిస్తే "ద్వైతవనంలో మమ్మల్ని విడిచి వెళ్లారు. అంతే. అంతకు మించి ఏమీా ఎరగం" అని చెబుతారు.

ధర్మరాజు ఆదేశం ప్రకారం అభ్యంతర పరివారమంతా సెలవు తీసుకుంది.

తరవాత ధౌమ్యుడిలా అన్నాడు "తెలిసినవారికైనా సరే క్షేమంకోరే హితులు బుద్ధులు చెప్పడం మానరు మీరా, కౌరవరాజ వంశంలో పుట్టారు. అరికాలు కింద పెట్టకండా అల్లారుముద్దుగా పెరిగారు మహారాజులై రాజ్యపరిపాలనా చేశారు. రాజాధిరాజుల మన్ననలూ పొందారు. ఇలాంటి మీరు ఒక మానవమాత్రుడి దగ్గిర సేవకులుగా ప్రవేశించడం, మానావమానాలు తట్టుకొని అడకువగా నడుచుకోడం అంటే నభూతో నభవిష్యతి అన్నమాట. కాలాన్ని విస్మరించి ఏమాత్రం తొందర పడినా ఇంత శ్రమా బూడిదలో పోసిన పన్నీరౌతుంది. ప్రమాదమూ సన్నిహితమౌతుంది అంచేత నాకు తెలిసిన నాలుగుసంగతులూ మీకు చెప్పడం నాకర్తవ్యం ధర్మాలన్నిటిలోకీ సేవాధర్మం కష్టతరమైంది. అందులోనూ రాజులసేవ కత్తులతో సామువంటిది. కాబట్టి సాధారణమైన సేవాధర్మాలు మీకు సంక్షేపంగా చెబుతాను. సావధానంగా వినండి.

## సేవాధర్మం

"అనుమతి పొందిగాని రాజసన్నిధికి వెళ్ళరాదు. దంభమైన దుస్తులు ధరించకూడదు. తనకు అర్హమైన స్థానంలోనే కూర్చోవాలి. 'రాజుగారి దయ వుంది కదా మనకేం' అని మర్యాద తప్పి వ్యవహరించడం తగదు. రాజగృహం కంటె అందంగా తనగృహం నిర్మించుకోకూడదు. రాజు ధరించినలాంటి దుస్తులు ధరించకూడదు. రాజు ఎదుట దర్పంగా మాట్లాడకూడదు. రాజుకి ప్రియమైన వాటిని సేవకుడు కాంక్షించకూడదు. మాట మించివస్తే పుత్రులని, మిత్రులని, ఆప్తులనీ విచారించరు రాజులు. స్వార్థం తప్పిస్తే రెండో ఆలోచనే వుండదు వారికి. అంచేత సేవకుడికి దిన దిన గండంగా వుంటుంది. రాజకార్యానికి అడ్డుతగలకూడదు మాటకు ఎదురాడకూడదు రాజు దగ్గిరవున్న పదిమందికీ అనిష్టమైనకార్యం ఎంతటివాడికైనా దుష్ట

తెస్తుంది. రాజు కట్టెదుట నిలవబడకూడదు. కేవలం వెనకనీ తగదు. పార్శ్వములలో ఉచిత స్థానంలో నిలవాలి. ఆవలింతా, తుమ్మూ, నవ్వడం, ఉమ్మడం – ఇవి రాజు సమక్షంలో చేయరానివి. రాజు దగ్గిర వున్నంతసేపూ ఎప్పుడేమంటాడో, ఎటుచూస్తాడో, ఎవరి మీద ఎప్పుడేభావం కలుగుతుందో అని కనిపెడుతూ వుండాలి. కోటలోని మాటలు బైట వెల్లడించకూడదు. రాజశత్రువుల దూతల దగ్గిరా, రాజు నిరాకరించినవారి దగ్గిరా, అధికారుల దగ్గిరా, పాప కృత్యాలు చేసేవారి దగ్గిరా రాజసేవకుడు సంచరించకూడదు

"రాజు దగ్గిర వుండే ఏనుగైతేనేం, దోమ ఐతేనేం దాంతో విరోధం పెట్టుకోకూడదు. నలుగురితో మంచిగా పోవడం, అడకువగా మసలుకోవడం సేవకుడన్నవాడికి ప్రధానకర్తవ్యం రాజు అనుగ్రహించని దే ఉన్నతాసనాలూ, ఉత్తమవాహనాలూ అధిష్ఠించకూడదు. రాజాదరానికి వుప్పొంగడం కాని అనాదరానికి దుఃఖించడం కాని తగదు. ఈ రెంటికీ అతీతుడుగా వున్నప్పుడే సేవకునికి క్షేమం కలుగు తుంది. రాజు ఒకణ్ణి శిక్షించడానికిగాని రక్షించడానికగాని ఊహిస్తూ న్నప్పుడు అది తెలిసిన సేవకుడు ముందుగా వెల్లడించడమంటే తన పీకలమీదికి తాను తెచ్చుకోవడమన్నమాట. రాజు ఆజ్ఞాపించిందే తడవుగా ఎండనకూడదు, వాననకూడదు, ఆకలనకూడదు, దప్పి అన కూడదు, కార్యనిర్వహణానికి నడుం కట్టాలి. రాజధనమంటే నల్ల తాచులా చూడాలి. అలా కానినాడు ప్రాణాలమీదికి వస్తుంది. అంతఃపురంచుట్టరికం ఎంతటి వాడికైనా ప్రాణాంతకం తెస్తుంది. రాణివాసానికి రాకపోకలు సాగించే స్త్రీజనంతో సంపర్కం అంత కంటె కూడా అవాంతరం తెచ్చిపెడుతుంది. అంచేత వీటి నన్నిటినీ మనస్సులో పెట్టుకొని ఈసంవత్సరకాలం చాకచక్యంతో మసలవలిసి వుంటుంది మీరు."

ధౌమ్యులు చెప్పినసేవాధర్మాలు విని కృతజ్ఞత తెలిపారు పాండవులు

"తల్లీ తండ్రీ, బంధువులూ, దైవం ఏదన్నా మీరుతప్ప మాకు మరొకరు లేరిక్కడ. వాత్సల్యముతో మీరుచేసిన ఉపదేశం శిరసా వహిస్తాము" అని నమస్కరించారు.

"ఈసంవత్సరంపాటు ఓర్పుతో సహించుకొని బైటపడండి. ఆపదలు గట్టెక్కిన తరవాత మీ అవమానానికి ప్రతిక్రియ సాధించవచ్చు" అని చెప్పి ఆశీర్వదించాడు ధౌమ్యుడు.

తరవాత నియమపూర్వకంగా అగ్ని వెలిగించాడు. ఇష్టఫలసిద్ధి కోసం పూజాకర్మ నిర్వహించాడు ప్రయాణసమయానికి మంగళప్రదమైన మంత్రాలు జరిపించాడు. సతీసమేతంగా అగ్నిహోత్రుడికీ, పురోహితుడికీ ప్రదక్షిణంచేశారు పాండవులు. ధౌమ్యులుచెప్పిన శుభక్షణంలో అతనితోకూడా కలిసి బైలుదేరారు. ప్రయాణారంభంలో అనేక శుభశకునాలూ కనుపించాయి వారికి.

ఇలా బయల్దేరి దశార్ణదేశానికి ఉత్తరంగా, పాంచాలదేశ జనపదాలకీ దక్షిణంగా, సాళ్వ, శూరసేనదేశాలకు మధ్యగా పోయి యమునానది దక్షిణతీరం చేరుకున్నారు పాండవులు అక్కడినుండి పశ్చిమాభిముఖంగా పయనించారు దారిలో కందమూలాలూ, పళ్ళూ మొదలైన అడివి ఆహారాలు భుజిస్తూ. రకరకాల మృగాలను వేటాడుతూ, మనోహరాలైన పూలచెట్ల నీడల్లో ఆయాసం తీర్చుకుంటూ, పద్మపరాగంతో పరిమళిస్తూవున్న సరోవరాల్లోనూ, నదీసంగమాల్లోనూ స్నానాలు చేస్తూ, అనేకవిధాలయిన చెట్టుచేమలను సందర్శిస్తూ, రకరకాల పిట్టల కలకలారావాలకు ఆనందిస్తూ అడివిమార్గం గుండా మత్స్యదేశంలో ప్రవేశించారు. అక్కడ ధౌమ్యుణ్ణి విడిచిపెట్టారు. అతడు ఒక పుణ్యాశ్రమంలో తలదాచుకున్నాడు.

గ్రామాల ప్రాంత ప్రాంతాలు అడవిదారినే పట్టి నడిచి ఉపప్లావ్య నగరానికి కొద్దిదూరంగా ఒక అరణ్యం ప్రవేశించారు. ఏకా ఏకిని నడిచి నడిచి అందరూ అలసిపోయారు.

ద్రౌపది మరింత అలిసిపోయింది.

"అబ్బా! దాహం! కాళ్ళు పీక్కు లెక్కు పోయాయి. గోళ్లు నెత్తురు చిమ్ముతున్నాయి. మతి స్వాధీనం తప్పుతున్నాది. ఇదిగో అదిగో అని యిందాకా నడిచాను. ఇంకా ఎంతదూరముందో? అడుగు తీసి అడుగు వెయ్యలేను మరి."

అని చతికిల బడిపోయింది. జాలీ, దుఃఖం కలిగిస్తూంది ఆమె అవస్థ. ధర్మరాజు నకులుణ్ణిచూశాడు "ఇవాళే ఉపప్లావ్యం చేరాలని ఒక్కవూపున ఇంతదూరమూ వచ్చేశాం. పాపం, పువ్వులతవంటి సుకుమారి అలిసిపోయింది. ఈమెని కొంతదూరం మోసుకుని రా బాబూ!" అన్నాడు. నకులుడి అవస్థా అంతంతగానే వుంది. అన్నగారి మొహం చూస్తూ అలాగే నిలబడిపోయాడతడు. అది గ్రహించి సహదేవుడి దిక్కు చూశాడు ధర్మరాజు. లాభం లేకపోయింది. అతడూ అలాగే వున్నాడు ఈసారి అర్జునుణ్ణి పిలిచాడు ధర్మరాజు

"కిరీటీ! చూడూ, ద్రౌపది అలిసిపోయింది. మరి నడవలేని స్థితిలో వుంది నిజానికి మేమందరమూ అదేస్థితిలో వున్నాం. అయితే ఇక్కడెక్కడా విశ్రమించడానికి వీలులేదు. ఎలాఅయినా ఈమెని కొంచెం మోసుకొని పట్నంప్రాంతానికి చేరుకోవాలి" అన్నాడు.

ద్రౌపదిని రెండుచేతులలోకీ తీసుకున్నాడు అర్జునుడు. అతడికి కొంత సంతోషమూ కలిగింది. మోసుకుని అన్నదమ్ములవెంట నడిచాడు. కొంతదూరం వెళ్ళేసరికి ఉపప్లావ్యం కనుగోచరమైంది.

"ఈ బాణాయుధాలతో మన ఈ ఆకారాలు చూస్తే ఎవరైనా యిట్టే పసికట్టవచ్చు. అంచేత యిక్కడే ఆగి, ఆయుధాలన్నీ

ఎక్కడో గుప్తంగా భద్రపరిచి మన వేషాలు మార్చుకుందాం"
అన్నాడు ధర్మరాజు ఆయన మాటప్రకారం అందరూ అక్కడ
ఆగారు. చల్లని ఓ యిసుకతిన్నెమీద ద్రౌపదిని దించాడు అర్జునుడు.

శమీవృక్షం

"మన ఆయుధాలన్నీ ఒకఎత్తూ, ఈగాండీవం ఒక ఎత్తూనూ.
దీన్ని పట్నంలోకి తీసుకువెళ్లడమంటే దుర్యోధనుడికి దొరికిపోడ
మన్నమాటే" అన్నాడు ధర్మరాజు అర్జునుడిచేతి గాండీవంచూస్తూ.

"ఇది పెద్ద కొండచిలవలాగ భయంకరంగా జనాన్ని బెదర
గొడుతుంది. విడిచిపెట్టడమంటే మనస్సుకి అదేదో బాధగానే వుంది.
ఏమైనా దీన్ని దాచిపెట్టడమే క్షేమం. అయితే మనం ఇవన్నీ
ఎక్కడ దాచడమో నిర్ణయించాలి ముందు."

అని ఆపరిసరాలు వెదకడం మొదలు పెట్టాడు అర్జునుడు. చేరు
వగా ఒకస్మశానం చూశాడు ఆపక్కనే ఒకజమ్మిచెట్టు కనిపించింది.
ఎన్నాళ్లనాటిదో ఆ వృక్షం! ఆకాశమంత ఎత్తుంది. కొమ్మలు
దిక్కులు కొలిచేటంత పొడవుగా వున్నాయి ఒకదాంతో ఒకటి పెన
వేసుకొని సూర్యకిరణం దూరడానికి వీల్లేనంత జీటుగానూ వున్నాయి.
అవి గాలికినాట్యంచేస్తున్నట్టున్నాయి. పట్టపగలే చిమ్మచీకటిగావున్న
గుబురుల్లో గూబలూ, కాకులూ చెవులు చిల్లులు పడేటట్టు వికారంగా
రొదచేస్తున్నాయి. తొర్రలలోక్రూరసర్పాలుబుసలుకొడుతున్నాయి.

ఇలా పెద్ద పెనుభూతంలా వున్న ఆ శమీవృక్షాన్ని అన్న
గారికి చూపించాడు అర్జునుడు.

"అన్నయ్యా! ఈ మహావృక్షం చూడండి. ఘోరమయిన
రుద్రభూమిలో వుండడమే కాకుండా, భూత, ప్రేత, పిశాచ, డాకినీ
మూకలకు నివాసస్థలంలా, భయంకరంగా వుంది. మానవమాత్రు
డెవ్వడూ దీనిచుట్టుపక్కలకి రాడు. పొరపాటునవచ్చాడోఎక్కడానికి

అసలే సాహసి చూ. అంతెవరకూ ఎందుకూ, చూస్తేనే బేజారై పరి గెడతాడు ఇంతకీ ఇక్కడికి రావడానికి ఎవరికన్నా అవసర మేం వస్తుంది గనక? మన ఆయుధాలు దాచడానికి ఇంతకంటె అనువైన స్థలం మరొ కటి దొరకదు. అన్ని విధాలా అనుకూలంగా వుంది ఆయుధాలన్నీ కట్ట కట్టి చర్మం చుట్టి తల వెంట్రుకలూ పెట్టి ఒక శవంలాగ తయారు చేద్దాం. బాగా ఎత్తున కొమ్మలజిబుల్లో పెట్టి కడదాం. దాంతో మనం నిశ్చింతగా వుండవచ్చు తిరిగి వచ్చాక తీసుకోవచ్చు '' అన్నాడు.

అందరూ ఇది బావుందంటే బావుందన్నారు ధర్మరాజూ సంతృప్తిపడ్డాడు.

గాండీవం చేత్తో నిమురుతూ ''అయ్యో'' అన్నాడు అర్జునుడు, '' దేవతలనూ, దానవులనూ, యక్షగంధర్వులనూ నీతోనే జయిం చాను. శత్రుభయంకరమైన మహాయుధానివి ఇవాళ ఒక చెట్టుకి వేలాడ గడుతున్నాను నిన్ను! ఇంతకంటెదురదృష్టమింకేముంటుంది!'' అన్నాడు పెద్ద నిట్టూర్పు విడిచాడు వింటినుండి నారి తప్పించాడు. అన్నగారి ముందు పెట్టాడు.

ధర్మరాజూ తన కోదండం ఎక్కు దించాడు. అతని ఇంగితం ప్రకారం భీముడూ, నకుల సహదేవులూ తమ తమ ధనుస్సులు ఎక్కు దించారు ఎవ్వరి మొహంలోనూ చిక్కితే రక్తంలేదు.

ధనుస్సులూ, బాణాలూ, అమ్ముల పొదులూ, కత్తులూ, కవచాలూ, ముద్గరాలూ ఈ మొదలైన ఆయుధాలన్నీ భద్రంగా పాముపెట్టెలో పెట్టి కట్టినట్టు స్వయంగా కట్టకట్టాడు ధర్మరాజు. ధర్మదేవత వరం తనకు అంగరక్షగా వుంది. లవలేశమూ జంకకండా ఆయుధాలకట్ట పట్టుకున్నాడు. నిర్భయంగా చెట్టుమీదికెక్కాడు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులనూ, ఇంద్రాది దిక్పాలులనూ, సూర్య చంద్రాది నవగ్రహాలనూ ధ్యానించాడు. వనదేవతలనూ, పితృ

దేవతలనూ స్మరించాడు. భూమ్యాకాశాలను స్తుతించాడు ఆయుధాల మోపు నిరపాయంగా ఒక పెద్ద కొమ్మకు వేలాడదీశాడు అంజలి బద్ధుడై ఆయుధాల అధిదేవతలను ప్రార్థించాడు.

"నాకూ, తప్పితే అర్జునుడికీ—మాయిద్దరికీ తప్పించి మూడో కంటివాడికి కనబడకూడదు మీరు. ఇతర్లకి ఘోరమైన విషసర్పాల వలె బుసలు కొడుతూ భయపెట్టాలి. మాలో ముఖ్యంగా భీముడు ధృతరాష్ట్ర సంతానమంటేనే ఎగిరి పడతాడు. అతడి చిత్తం ఎప్పుడెలా వుంటుందో తెలీదు. ఏ నిమిషాన్నయినా మదమెత్తి పరిగెత్త వచ్చు అతడి కోపానికి మీరు లొంగిపోకూడదు. ఎలాఅయినాసరే ఈ విషమసంవత్సరంలో అతణ్ణి వంచించాలి మీరు" అని నిమీలిత నేత్రుడయాడు.

దిగివచ్చి వృక్షానికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కారం చేశాడు. భీముణ్ణి కౌగిలించుకుని వీపు నిమిరాడు. తమ్ములందరినీ వోదార్చాడు. ఆపక్కనే చచ్చిపడివున్న ఓ పశువుచర్మం సహా దేవుడిచేత వొలిపించాడు. ఎండకూ, వానకూ ఆయుధాలు చెడకండా కట్టమీద పొదివించాడు అంతతోనూ తృప్తికలగ లేదతడికి. గింజ లేరుకు జీవించే మనిషి శవమొకటి సమీపంలో చూసి దానినికూడా ఆయుధాలమీద వేసి కట్టించాడు.

శవం కంపుకి ఈపరిసరాలకి ఎవ్వరూ చేరరని ఆరుగురూ నవ్వుకున్నారు. అక్కడా అక్కడా తిరుగాడుతూవున్న గొడ్లకాపర్లనిచూసి వాళ్ళకి వినబడేట్టు "ఇది మాఅమ్మ. నూరేళ్ళపండు. చచ్చిపోయింది. మా కులాచారం అనుసరించి మా పెద్దల రివాజుప్రకారం ఇలా వేలాడదీశాం" అని చెపుతూ పురాభిముఖంగా బయల్దేరారు.

అజ్ఞాతవాసంలో తమ రహస్యవ్యవహారానికి అనుకూలంగా జయుడూ, జయంతుడూ, విజయుడూ, జయత్సేనుడూ, జయద్బలుడూ

అని క్రమంగా ఐదుగురిపేర్లూ సంకేతించుకున్నారు. మార్గంలో పుణ్య నదీ స్నానంచేసి శ్రమ తీర్చుకున్నారు. దేవ పితృ తర్పణాదులూ, మంగళ జపహోమాది అనుష్ఠానాలూ నెరవేర్చుకున్నారు.

తరవాత ధర్మరాజు తూర్పుముఖంగా చేతులు జోడించి ధర్మ దేవతను ధ్యానించాడు.

"తండ్రీ!దయతో నువ్వుప్రసాదించిన వరంసమయానుగుణ్యంగా అనుగ్రహించు. ఈరాజకుమాళ్లు పొరపాటు చేయకుండా రక్షించు."

తమ్ముల మొహం చూచాడు. దుఃఖం వుప్పెనలా ముంచుకు వచ్చింది. నేత్రాలు అశ్రుసిక్తా లయినాయి. రుద్ధకంఠంతో మళ్ళీ ప్రార్థించాడు.

"గగనపథంలో దర్శనమిచ్చావు నువ్వు యక్షుడి చేతుల్లో పోయిన వీరిప్రాణాలు కటాక్షించుమని వేడుకున్నాను నేను. వాత్స ల్యంతో వోదార్చావునన్ను. దయార్ద్రిహృదయంతో చల్లనిమాటలు చెప్పావు" అని లోగడ తాను బ్రాహ్మణుడి అరణి తేవడంకోసం వెళ్ళి నపుడు ధర్మదేవత ప్రత్యక్షమై చెప్పినమాటలు విన్నవించాడు.అంజలి బంధంలలాటాన గీలించి, వినయాతివినయంగా పదేపదే మొక్కాడు.

ధర్మదేవత అనుగ్రహించాడు చూస్తూవుండగానే ధర్మరాజుకి సన్యాసిరూపం ఏర్పడింది. శరీరానికి కాషాయవల్కలాలూ, చేతికి దండకమండలాలూ కుదురుకున్నాయి. అందరూ ఆశ్చర్యపడుతూనే వున్నారు. ఇంతలోతక్కినవాళ్లకి, వాళ్లుసంకల్పించుకున్న వేషాలకి అను గుణ్యంగా అవసరమైన అన్నిపరికరాలూ ఎదట ప్రత్యక్షమయాయి.

## కంకభట్టు

ధర్మరాజు పరమానందభరితుడయాడు. "క్రమంగా వొకరి తరువాతి వొకరు రావలిసింది" అని చెప్పాడు పాచికలసంచి చంకని తగిలించుకున్నాడు. విరాటరాజు కొలువుకి బయల్దేరాడు.

అదృష్టవశాత్తూ అవాళ విరాటరాజు బైటనే కొలువుతీర్చి కూచున్నాడు. సన్యాసివేషంలో వస్తూన్న ధర్మరాజుని దూరంనుంచే చూశాడు.

"ఎవరో ఈ మహానుభావుడు! ప్రపంచమంతటినీ పరిపాలించ గలిగిన పరిపూర్ణ తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు త్రిమూర్తులతో సాటిరాదగిన ఈ యతీంద్రుడు ఇలా ఎందుకువచ్చాడో!

"రాజులా కనిపిస్తున్నాడు. రాజేకాదు, మూర్ధాభిషిక్తులయిన మహారాజులచేత పాదసేవలు చేయించుకోదగిన సార్వభౌముడులా వున్నాడు ఆశ్చర్యం! కరచరణాదులకు రత్నభూషణాలు లేవెంచేత? ఉభయపార్శ్వాలా భద్రగజాలేవి? 'తొలండి, దూరంపొండి' అంటూ ముందుగా జవానులు రారేం? ముత్యాల తెల్లగొడుగూ, చామరాలూ ఏవీ? – ఏమీ అర్థం కావడంలేదు.

"ఇంతకూ మనదగ్గిరికి దయచేయడంలో ఆంతర్యం? నన్నేం ఆజ్ఞాపించినాసరే 'దాసోహం' అంటాను. ఏదికోరితే అది సమర్పిస్తాను కనకాంబరాలూ, నవరత్నాలూ–ఉఁహూఁ, అవసరమైతే నా మత్స్యరాజ్య సింహాసనం ఇతని పాదాలముందు పెడతాను సపరివారంగా, మంత్రులతోకూడా ఈయనసేవకు సిద్ధపడతాను."

అంటూ దిగ్గున సింహాసనం దిగాడతడు. కొలువులోని సమస్త జనంతోనూ ఎదురువెళ్లి నమస్కారం చేశాడు. ఆశీర్వాదం పొంది సగౌరవంగా సన్యాసిని తోడితెచ్చాడు. ఉన్నతాసనం సమర్పించాడు.

"మహాత్మా, ఎక్కడినుండి దయచేశారు? ఏవూరు? మీనామధేయ మేమిటి? కులమేది? మహాత్ములూరక రారుకదా! దయచేసి దాపరికం లేకుండా సెలవియ్యండి" అన్నాడు.

"దాపరికం లేకుండా చెప్పడం అంత తేలికైనపనా!" అని మందహాసం చేశాడు సన్యాసి.

"శరీరం పంచభూతాలతో కూడుకున్నది. మనస్సా చంచలమైనది. ఇలాంటి స్థితిలో సత్యమే పలకడమంటే సాధ్యం కానిపని.

"రాజా, నేను సన్యాసిని. కులమేమని చెప్పనూ! పూర్వాశ్రమంలో ద్విజుణ్ణి. కురుదేశం నివాసభూమి సన్యాసులకు పేరుతో ప్రయోజనం సున్న. ఐనా కంకభట్టు అని పిలవవచ్చు మీరు. ధర్మపరుడైన ధర్మరాజు మిత్రుడు. వేషాలు వేరు, అంతే. ఆయనా నేనూ ఒకటే అన్నా అతిశయోక్తి కాదు. అంత అవినాభావ సంబంధంమాకు.

"ఉత్తమమైన అనేక వినోదాలు నాకు కరతలామలకాలు. ద్యూతక్రీడలోనూ ప్రవేశముంది. రాజకీయ పరిజ్ఞానంకూడా లేకపోలేదు. ఆబాల్యంగా ధర్మపరుల సహవాసమూ చేశాను. చూడలేనివాళ్లు నాధనమంతా అపహరించిఅవమానించారు. విరక్తిపుట్టి గృహత్యాగం చేశాను. నైచ్యంగా మెలగడం నాతత్వానికి సరిపడదు. రాజులలో విరాటరాజు సాధుజన మిత్రుడని విన్నాను. నీకొలువుకు ఆసపడి వచ్చేశాను. ఒక్క సంవత్సరంపాటు కఠోరమైన వ్రతమొకటి నిర్వహించుకోవాలి నేను. నీ కొలువులో నిరపాయంగా పూర్తి చేస్తాను. అనంతరం నన్ను పరాభవించిన వారిమీద పగతీర్చుకుంటాను" అన్నాడు.

విరాటుడు ఇంద్రుడితో సమానులైన మీరు నాకొలువు చేయడం ఏమంత న్యాయం! నారాజ్య సింహాసనమే మీకు సమర్పిస్తాను. సబాంధవంగా, సపరివారంగా మీకనుసన్నలలో మసులుకుంటాను. నాకుమల్లేనే నాఅనుచరులందరూ మీ ఆజ్ఞలు శిరసా వహిస్తారు. ఉత్తమాసనాలూ, ఉన్నతవాహనాలూ, రుచిరాన్నాలూ, స్వర్ణాంబరాలూ, రత్నభూషణాలూ, ఛత్రచామరాలూ అన్నీ మీవే. అనుగ్రహించండి.

"రాజా, వ్రతనిష్ఠతోవున్న సన్యాసికి ఇవన్నీ దేనికి? హవిష్యాన్నం తప్ప ఇతరం ముట్టని నాకు రుచిరాన్నా లెందుకూ!

కటికనేలనే శయనించే నాకు తూలికాతల్పాలతో ఏం ప్రయోజనం? ”
అని మందహాసం చేశాడు కంకభట్టు.

విరాటుడు మీ అభిలాషే నా అదృష్టమనుకుంటాను ఏ అరమర లేకండా మీరిక్కడ వసించవలసిందిగా ప్రార్థిస్తున్నాను నాకు మల్లేనే నా పరివారం మిమ్మల్ని మన్నిస్తుంది. మీ ఆజ్ఞలకు ఎదురుండదు మీరు పెద్దలు. మీ ఉపదేశమే మాకు పదివేలు. జూదమంటే నేనూ చెవికోసుకునేవాణ్ణే కాలక్షేపానికి మనకు లోపముండదు.

అని చేతిలో చేయి కలిపాడు. చిరకాల పరిచితులవలె ఉభయులూ స్నేహాలాపాలు ఆరంభించారు.

వంట పుట్టీ వలలుడు

మరో దిక్కునుండి వంటపుట్టీ వేషంతో ప్రవేశించాడు భీముడు మెల్లగా. అతడు ఒక చేత్తో గరిటా, ఇంకో చేత్తో కర్రలూ పట్టుకున్నాడు. వీపున చిత్రాసనం, చంకని కత్తీ, మొలని చాకూ పెట్టుకున్నాడు. ధోవతిమీద దట్టీ బిగించి కట్టుకున్నాడు మదపుటేనుగులాగ నడుచుకుంటూ వస్తూంటే చూచినజనం నిశ్చేష్టులైపోతున్నారు

అల్లంత దూరంలో చూశాడు విరాటరాజు, ఉలికిపడ్డాడు. భయమూ, ఆశ్చర్యమూ కలిగాయి కేడికి విశాలమైన వక్షస్థలమూ, గరిడీలు తిరిగిన భుజాలూ ఉన్నతమైన ఆగాంభీర్యం తన్మయత్వం కలిగించాయి.

“ ఈయనెవరో! ఈయనా మనుష్యమాత్రుడిలా కనిపించడం లేదు. ఇంద్రుడో, చంద్రుడో మానవాకారంలో వున్నట్టున్నాడు. ఏ ప్రాంతం వాడో! ఎరిగినవా శ్శెవళ్లైనా వున్నారో ఏమో! ” అని భావించడం మొదలు పెట్టాడు ఇంతలో దగ్గిరికి వచ్చి జయజయశబ్దం చేశాడు భీముడు. సవినయంగా నమస్కారం చేశాడు.

“ మహారాజా, వంటలవాణ్ణి వర్ణ నాలుగోది పేరు వలలుడంటారు. మీదగ్గిర వంటపుట్టీగా వుందామని వచ్చాను. మరోపని

చేతకాదు. రాజులికి వంటచేసి పెట్టడంలో నా అంతవాడు మీకు మరోచోట దొరకడు. కూడూగుడ్డా యిస్తేచాలు. మీచెప్పుచేతల్లో నడుచుకంటాను '' అన్నాడు.

నమ్మలేక పోయాడు విరాటరాజు. '' అయ్యా! వంటలవాడ వంటే ఎలా నమ్మడం? మహారాజ లక్షణాలతో ప్రకాశిస్తున్నావు. వంటపుట్టీ ఖర్మమెందుకు నీకు? సేనాధిపత్యమే యిస్తాను. నాఏనుగుసేన అంతటికీ అధిపతిగా ప్రతిష్ఠిస్తాను '' అన్నాడు.

మోటమనిషిలా మొహం అడ్డం తిప్పుకున్నాడు వలలుడు. '' అదేవిటి అలా సెలవిస్తున్నారు! వంటపుట్టీవాడికి ఈతంటా అంతా ఎందుకూ? వంటతప్ప మరోపని చేతకాదు నాకు. నాపనిలో మాత్రం నన్నుమించిన వాడులేడు ధర్మరాజుగారి దగ్గిర వంటపుట్టిగా వుండే వాణ్ణి. ఆమహారాజు నా వంట మెచ్చుకోని దినం లేదు. మిమ్మల్నీ అలాగే సేవించుకుంటాను. కాదూ పోదూ అంటే మరొక్క పని మాత్రం చేతనవును మల్ల విద్యలో కొంచెంప్రవేశముంది అపుడపుడు వేడుక కలిగించగలను. ఎనుపోతూ, పెద్దపులీ, సింహం, ఏనుగూ—— వీటితో పోట్లాడగలను. ఇక వస్తాదులసంగతి వేరే చెప్పనేలక్కర్లేదు. అంచేత మీదయ కలిగిందా నేను కోరినపని ఇప్పించండి. లేదంటారా మరోతావు చూసుకుంటాను '' అన్నాడు.

'' అయ్యయ్యో, అదికాదు మా ఉద్దేశం '' అన్నాడు విరాటుడు, '' ఎలా ఐనా నువ్వు వుండడమే మాకు కావలిసింది. దివ్యమైన నీ ఆకారం చూసి తగిన పని యిస్తామన్నాం కాని మరొకటి కాదు. నీకెలా యిష్టమైతే అలాగే వుండవచ్చు వంటశాలాధిపతిగా నిన్ను నియమిస్తున్నాను. మా వంటవాళ్లంతా నీ మాట ప్రకారం నడుచుకుంటారు. ఇక సరేనా! '' అన్నాడు.

' ధన్యోస్మి ' అనుకున్నాడు వలలుడు.

ఆ చా ర్య బృ హ న్న ల

మరికొంత సేపట్లో పేడి రూపంలో అర్జునుడూ వచ్చాడు. కాళ్ళ రీవి కనపడకుండా ఆడారి గూడకట్టూ, శరీరచ్ఛాయకి అడ్డంగా రంగు రవికా, చేతులు పొంకం బై టపడకుండా సంకుగాజులూ, మెడ పొ_త్తికి రాకుండా బంగారం పట్టెడా, ముఖం గు ర్తుకు రాకుండా ముంగుర్లూ, తలకట్టు తెలియకుండా మధ్యపాపటా, చెవుల సొంపు బై టపడకుండా పగడప్పోగులూ—మంచుకప్పిన మార్తాండుడిలాగ, నివురుగప్పిన నిప్పులాగ, వేషంవేసిన విష్ణుమూ_ర్తిలాగ ఆడారి వేషంలో అదోలా వున్నాడు అర్జునుడు అలాఅలా నడుస్తూ, ఓర చూపులతో గునుస్తూ, తారాడుతూండడం చూశాడు విరాటరాజు

"ఇదేమిటి ఈవింత! వేషంచూ_స్తే మూడు మూ_ర్తులా ఆడదే కాని రూపం దానికి భిన్నంగా వుంది ఈరాజసంకీ, రీవికీ స్త్రీత్వాన్ని ఎలా ముడిపెట్టడం? మహాపురుషుడెవడో విలాసంగా ఈవేషం వేసుకుని వుండాలి అంతే ఏమంటారు?" అన్నాడు తనవాళ్ళను చూసి

అందరికీ ఆశ్చర్యంగానే వుంది తెల్లబోయిచూస్తూన్నారు ఇంతలో మెల్లిమెల్లిగా జనాన్ని తప్పించుకుంటూ అతడే ముందుకు వచ్చాడు. తలవంచుకుని నమస్కా-రం చేశాడు.

"మహారాజా! నృత్యం నేర్పడం నావృ_త్తి. మిమ్మల్ని సేవించుకుందామని వచ్చాను. పేరు బృహన్నల. చూస్తూనేవున్నారుకదా, రూపం! పేడిని" అన్నాడు.

విరాటరాజు ఏమిటీ! మన్మథుణ్ణే, జయంతుణ్ణే, మించిన ఈ ఉదారమూ_ర్తికి పేడితనమా! నమ్మలేం ఆజానుబాహుబితమైన బాహువులూ, విశాలమైన వక్షస్థలమూ, ధనుర్విద్యా పారంగతులకు వుండవలిసినట్టున్నాయి. చూడడమే తడవుగా నాకు అనిపిస్తూనూవుంది, మా

దగ్గరవున్న ఉత్తమమైన ధనుర్బాణాలూ, స్వర్ణకవచమూ, వాహనాలూ, ఆభరణాలూ యిచ్చి సత్కరించాలని, ఈ మత్స్యదేశానికే అభిషేకం చేయాలని సంకల్పం కలుగుతూంది. ఏంలాభం? కథే అడ్డం తిరిగింది.''

బృహన్నల ఆడదీ మొగాడూ కాని నపుంసకజన్మనాది మహారాజా! పూర్వ శాపంవల్ల సంక్రమించిన ఈ పేడితనం అనుభవించక తప్పదు. పూర్వకృతం అనుల్లంఘనీయం కదా!

మరోపనికి ఎలాగూ పనికిరాను అంచేత బాల్యంనుండీ నృత్యకళ అభ్యసించాను. దండలాసకం (కోలాటం) కుండలి (గొబ్బి) ప్రేక్షణం (అభినయనృత్యం) పేరణం (కుండ మొదలైన పాత్రలమీదనిలిచి చేసే నాట్యం) మొదలైన నృత్యభంగిమలన్నీ నేర్చుకున్నాను. ఏమాత్రం చాతుర్యంలేని కన్యనైనాసరే వీటన్నిటిలోనూ ప్రావీణ్యం కలిగించగలను. ప్రసిద్ధమైననాట్యవిధానాలు రాజకన్యలకు నేర్పుతూ నగళ్లలో నాట్యాచార్య పదవిలో యిన్నాళ్ళూ గడిపాను.

శ్రద్ధగా విన్నాడు విరాటరాజు. అతడి హృదయం కరుణార్ద్రమైంది. గౌరవమూ ఏర్పడింది. బృహన్నల అచ్చమైన పేడిగా తెలుసుకున్నాడు. తనకూతురు ఉత్తరకు తగిన గురువు లభించినందుకు సంతోషించాడు. ఇక తరవాయి ఎందుకు? వెంటనే ఆమెను పిలిపించాడు.

ప్రారంభయవ్వనంలో నవనవలాడుతున్న ఉత్తరకుమారి మన్మథుడి పూలబాణంలా కొలువుకూటానికి వచ్చింది. వెంటవచ్చిన చెలికత్తెలను అల్లంతలో వుండమని తండ్రిగారి సమక్షానికి వెళ్ళి ప్రౌఢాంగనలా ముచ్చటగా నమస్కారం చేసింది.

రెండుచేతులతోనూ కుమార్తెను దగ్గిరికి తీసుకున్నాడు తండ్రి. మొహం దగ్గిర మొహం పెట్టి లాలించాడు వేళ్లతో బుగ్గలు పుణికాడు. ముంగురులు సవరించాడు. ''బృహన్నలా! ఈ అమ్మాయి నాట్యకళకు పనికి వస్తుందా?'' అని అడిగాడు.

బృహన్నల చిత్తం 'తస్యే రూపవతీశ్యామా-' అన్నారు మహారాజా! నృత్యకళకు అమ్మాయివంటి ఉత్తమ పాత్రలు దొరకడం దుర్లభం.

విరాటరాజు అవును సరిగా చెప్పావు ఉత్తర అంటే మాకు బహిః ప్రాణం. నువ్వు చతురమతివి. నీకు వేరే చెప్పనక్కరలేదు ఐనా చెబుతున్నాను. సిన్నమొన్నటి వరకూ ఆటపాటలతోనే గడిచిపోయింది అమ్మాయికి. క్రమశిక్షణ ఎరగదు ఇకమీద ఈమె భారమంతా నీదేమరి.

అని కర్పూర తాంబూలమూ, చీనాంబరాలూ, మణిమయాభరణాలూ యిచ్చి సత్కరించాడు కూతురు చేతులు బృహన్నల చేతిలో పెట్టాడు.

''అమ్మా, బృహన్నలాచార్యులకు నమస్కరించు. ఇవాళనుండీ ఈయనే నీగురువు తల్లీ, తండ్రీ, హితుడూ, చెలికత్తే- అన్నీ గురువుగారే అని భావించు నీకింకోలోపం లేదుమరి. గురువు ఏలాచెబితే అలా నడుచుకోవాలి మాట జవదాటకూడదు గురువుగారికి భోజనమూ, తాంబూలమూ, చందనమూ పూలూ - ఏలోపం రానివ్వకండా చూడాలి. ఇంకోమాట - మన ఇంట్లో ఎక్కడా ఆచార్యులకు అడ్డుండకూడదు వెళ్లు బుద్ధిగా విద్యనేర్చుకొని కళాప్రపూర్ణవై గురువుపేరు నిలబెట్టు '' అని చెప్పి గురుశిష్యులను సఖీజన సహితంగా అంతఃపురానికి సంపేశాడు.

దా మ గ్రం థి

మరికొంతసేపటికి నకులుడు ప్రత్యక్షమయాడు. దైవికంగా ఆ సమయానికి గుర్రాలు పరికిస్తున్నాడు విరాటరాజు. నకులుడూ పరిశీలనగా పరికించడం మొదలు పెట్టాడు. పద్మాలు సూర్యుణ్ణి పరికించినట్టు జనందృష్టి నకులుడిమీదికి తిరిగింది.

''ఇతడెవరో అశ్వలక్షణం తెలిసినట్టున్నాడు. ఆ పరిశీలనే చెబుతూంది. రూపురేఖలు పరాక్రమశాలిలా వున్నాయి ఆ నమ్రత చూస్తూన్నకొద్దీ గౌరవ భావం కలుగుతూంది''అన్నాడువిరాటరాజు.

దగ్గిరికి వచ్చి వంగివంగి నమస్కారం చేశాడు నకులుడు.

''అశ్వవిద్యలో కొంత ప్రావీణ్యం కలవాణ్ణి మహారాజా! పేరు దామగ్రంథి రాజవాహనాలైన గుర్రాల లక్షణాలు పరిశీలించగలను. ఏగుర్రం ఎలాంటిది? దేనికి ఎలాంటి శిక్షణకావాలి? వాటి వాటి చిత్తవృత్తు లెలాంటివి? దేనికి ఎలాంటి ఆహారం అవసరం? ఏ రోగానికి ఏచికిత్స చేయాలి? దేని ఆయుఃప్రమాణం ఎలా వుంటుంది? దేనికి ఎలాంటి నడక నేర్పాలి? ఇలాంటి అశ్వశాస్త్రరహస్యాలన్నీ కూలంకషంగా అభ్యసించాను. అనుగ్రహిస్తే అశ్వపాలకుడిగా ఏలినవారి సేవచేసుకుంటాను'' అన్నాడు.

విరాటరాజు రాజపుత్రుడిలా కనిపిస్తున్నావు అశ్వపాలకుడిగా ఎందుకూ, నాసమస్త సంపదలకీ పాలకుడిగా నియమిస్తాను.

దామగ్రంథి ఏలినవారి అనుగ్రహానికి కృతజ్ఞుణ్ణి. కాని తలకు మించిన పనికి తలపడడం ధర్మంకాదు ప్రభూ!

ఆబాల్యంగా నన్నుధర్మరాజులవారు పెంచారు. ఆ ప్రభువే నన్ను అశ్వశాస్త్రంలోపారంగతుణ్ణిచేసి వారి అశ్వపాలకుడిగా నియమించారు. నావిషయంలో ఆమహారాజుచేతికి ఎముకే వుండేదికాదు. తన తమ్ములలో ఒకడిగా ఆదరించేవారు ఇన్నాళ్లకి కానిరోజులు వచ్చాయి. ఆధర్మప్రభువు వైభవాలు విడిచిపెట్టి రాజ్యపరిత్యాగం చేశాడు. బంధుకోటిని పరిజనాన్ని విడిచిఅజ్ఞాతవాసానికి వెళ్లిపోయాడు. కడుపుచేత్తో పట్టుకొని దేశదేశాలు తిరిగాను. మత్స్యరాజేంద్రులు ధర్మరాజు వంటి ధర్మప్రభువులని విన్నాను. ఆసపడి వచ్చేశాను. ఏలినవారి వుష్ణాతిని సమయం వచ్చినపుడు జారిపోను మహారాజా!

పరాయివాళ్లు రాజ్యం మీదికి వస్తే ప్రాణం అడ్డుపెడతాను. ఉన్నదున్నట్టు మనవి చేశాను. దయతలిస్తే బతికిపోతాను. ప్రభువులు నన్ను అనుమానిస్తే మాత్రం సెలవు తీసుకుంటాను.

విరాటరాజు వద్దు వద్దు. అశ్వపాలకుడిగానే నీ అభిలాష ఐతే అలాగే వుండవచ్చు అశ్వశాల లన్నిటికీ నువ్వే అధికారివి. మా అశ్వపరివారమంతా నాకుమల్లేనే నీ అధికారంలో వుంటుంది.

సగౌరవంగా అతణ్ణి కొలువులోకి తీసుకున్నాడు విరాటరాజు.

## తంత్రీపాలుడు

ఇకతరవాయి ఎందుకన్నట్లు గొల్లవేషంలో సహదేవుడూ వచ్చాడు ఓపక్క కన్నెలమోపూ, మరోపక్క దామెన తాడూ వేసుకున్నాడు. మొలకు చుట్టి చుట్టి తాళ్లు కట్టుకున్నాడు మంచి మునకాలకర్ర చేత్తో పట్టుకున్నాడు. జనాన్ని చూచి బెదిరి బెదిరి నడుస్తున్నాడు. మూడుమూర్తులా గొల్లవాడిలా వున్నాడు ఇంతయినా మబ్బుకప్పి పొద్దుగూక దన్నట్టు ఆపద్మనేత్రాలూ, మొగంతీరూ అగ్నిదేవుడో, చంద్రుడో మా వయాసంలో యిలావచ్చాడని అనిపిస్తూనే వుంది. భయపడుతూ భయపడుతూ రాజువద్దిరక వచ్చాడతడు 'దణ్ణాలు దణ్ణాలు స్వామీ! గొల్లవాళ్ళ పిల్లాణ్ణండి. పేరు తంత్రీపాలుడండి. ఏలినవారి సేవచేసుకు బతుకుదామని వచ్చానండి నేను ఆలకాపరిగా వుంటే మందలో మరి తెగులన్నమాట వుండదండి. చూడీ, పాడీ తప్పకండా, కొంటే గోడూ లేకండా ఆవులన్నీ నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుంటాయండి తప్పిపోకండా, మెకాలపాల బడకండా సొమ్ములు కాస్తానండి. అటుమీద మీదయండి. కొండంత ఆసతో వొచ్చానండి స్వామీ!'' అన్నాడు.

విరాటరాజు గొల్లవాడివని ఎలా అనుకోడం ఏన్నా! చంద్రసూర్యవంశాల రాజకుమాళ్ళలా కన్పిస్తున్నావు అవసరమైతే

నా రాజ్యాన్నే పాలించగలవని నీ ముఖలక్షణాలు చెబుతున్నాయి. పశుపాలనవంటి తక్కువపని నీకు తగదు. ఉత్తమమైన ఆయుధాలూ, వాహనాలూ యిస్తాను. మత్స్యదేశంలో నువ్వు కోరుకున్న స్థలంలో నిన్ను మండలాధిపతిగా నియమిస్తాను. సమ్మతించు.

తంత్రీపాలుడు దాసుణ్ణిస్వామీ! కులంతక్కువోణ్ణి. కుర్రాణ్ణి. రాసకార్యాలమొహం తెలీనివాణ్ణి. మా తాతముత్తాలనుండీ కౌరవుల దగ్గిర సేవకులంగా పసువులు కాసుకుంటూ నేబతికాముండి నేనుధర్మరాజు గారి ఆలమందలు కాసేవాణ్ణండి. ఆమహారాజు నేనంటె ప్రాణం పెట్టేవారండి. నా చెయిసాంవల్ల మందలు తామరతంపర ఐపోతాయండి నా చెయి తగిల్తేచాలు స్వామీ, గొడ్డుపోయిందైనా సరే అబోతు పంచితం మూసూస్తేచాలు, దానిగాలి తగిల్తేచాలు చూలునిలుస్తుందండి. పొర్లుకురాని ఆవంటూ వుండదండి. ఉంగిడీ * అదుకూ, తిక్కా—ఇలాంటి తెగుళ్లు నాపేరు చెబితే చాలండి పరుగుచ్చుకుంటాయి. ఇంతెందుకండి, పసివిజాతికి కావలసినవన్నీనాకు కొట్టినపిండండిసామీ! ఇంకోపనంటే నావొల్లకాదండి. పసువుల పనంటారా కొమ్ములు తిరిగిన వాణ్ణయినా లెక్కచెయ్యనండి. అంతా మనవి చేసుకన్నాను. తరవాత తమచిత్తం నాభాగ్యమండి.

ఆలోచించాడు విరాటరాజు. చివరికి సరే, అన్నాడు "పెద్ద పనులు నచ్చకపోతే, పశుపాలనే అంత ఆప్యాయమైతే సరే. అలాగే కానీ. నేను కాదనను. మా ఆలమందలన్నిటిమీదా అధికారిగా నియమిస్తున్నాను నిన్ను. ఆలకాపర్లందరూ నీకింద పనిచేస్తారు నన్ను చూసినట్టుగానే నిన్ను చూసుకుంటారు" అని సగౌరవంగా ఆదేశించాడు.

ఇలా నిర్విఘ్నంగా పాండవులు ఐదుగురూ విరాటరాజు కొలువులో కుదురుకున్నారు.

---

* ఉంగిడి=జొన్నచేల్లో చిగురించిన మొలకలుతింటే పశువుకు వచ్చేరోగం.

## సైరంధ్రి మాలిని

ఇక మిగిలింది ద్రౌపది. తన దేశాచారం ప్రకారం ముచ్చటగా అల్లుకున్న జడ విప్పేసుకుని, కడివాటుగా మెట్టముడుచుకుం దామె. మాసినచీరె కట్టుకుంది ముదూగు వల్కలం పైట వేసుకుంది. పరిచారికా లక్షణాలు అవయవాలలో అచ్చుపడేటట్టు మనోభావాలు మార్చుకుంది.

మబ్బుకప్పిన చంద్రకళలాగా, మంచుముసిరిన పద్మపుష్పం లాగా, పొగచూరిన దీపకళికలాగా, ధూళికమ్మిన పూలతీగలాగా పాండవుల పట్టమహిషి సైరంధ్రీవేషంలో ఉపప్లావ్యం రాజవీధిని బైలు దేరింది.

పౌరజనం ఆమెని చూసి అమ్మలక్కలతో కూడా విరగబడ్డారు. "అరుంధతీ అమ్మవారా? రోహిణీదేవా? ఎవ్వరీమె? మానవ లోకంలో ఇంత దివ్యసుందర విగ్రహం ఎక్కడచూశాం?" అంటూ చుట్టూ మూగారు.

"ఎవరుతల్లీ నువ్వు?" "ఎక్కడినుండి వచ్చావు?" "ఏంపని మీద వచ్చావు తల్లీ?" అని ప్రశ్నమీద ప్రశ్న కురిపించారు.

"సైరంధ్రిని కూడూగుడ్డా యిచ్చి పోషించే దొరసానిదగ్గిర పనిపాట్లు చేసుకుని దినం గడుపుకుందామని వచ్చాను" అని మర్యాదగా జవాబు చెప్పిందామె.

"చిత్రం! ఈవిడేమిటి కడుపుకూటికి పని చేయడమేమిటి? నమ్మలేం" అంటూ, ఆశ్చర్యపోతూ ఆమెవెంట ముసురుకుంటూ బయల్దేరారు జనం.

అలా ఆమె రాజమందిరం వరకూ వెళ్ళింది. ఆసమయానికి రాణివాసం మేడమీద విలాసంగా విహరిస్తూవుంది రాజమహిషి సుదేష్ణాదేవి. కిటికీలోంచి ఆమెకంట పడింది, సైరంధ్రి.

"చక్కని చుక్కలా వుంది, ఎవరో ఆవిడ. ఎక్కడి నుండి వచ్చిందో? ఎక్కడికెళుతూవుందో? పాపం, ఏదో ఆపదలో వున్నట్టు

దీనంగా మాట్లాడుతూ వుంది విసుపోతూచూస్తున్నారు జనం. వెళ్ళండి వెళ్ళండి. ఇలా పిలుచుకురండి కనుక్కుందాం."

అని ప్రౌఢలైన పరిచారికల్ని ఇద్దర్ని పంపింది. చువ్వల్లా వెళ్లారు వాళ్లు.

"అమ్మా, మారాణీగారి సెలవయింది. అంతఃపురంలోకి రా" అని పిలిచారు.

ఆడబోయినతీర్థం ఎదురయిన ట్టయింది సైరంధ్రికి. వినయం మూర్తీభవించినట్టు వాళ్ల వెంట బయల్దేరిందామె.

ఆమె పాదం పెట్టిన చోటల్లా కుంకం పూసినట్టయింది. శరీర కాంతి తళతళలకు గోడలు మణికుడ్యాలలా కనిపించాయి చూపులు వాలిన చోటల్లా పూలహారాలు పరిచినట్టయింది. తలకట్టు ప్రతిఫలించిన పైకప్పు నల్లచందువాలా కనపడింది. ఈవిధంగా విరాటరాణివాసానికి కొత్తశోభ కలిగిస్తూ సుదేష్ణాదేవి సమక్షానికి వెళ్లి సవినయంగా నిలబడింది సైరంధ్రి.

ఆదరంగా మందహాసం చేసింది సుదేష్ణ. ఎదురువచ్చి చేరదీసింది. ఆమె ఆపాదమస్తకం పదేపదే చూసింది. "ఎవరమ్మా నువ్వు" అంది, "కులమేమిటి? పేరేమిటి? ఏంపనిమీద ఇలా వెళుతున్నావు? ఎక్కడినుండి వచ్చావు?" అని అడిగింది.

సైరంధ్రి సైరంధ్రిని మహారాణీ! పేరు మాలిని. ఐనుగురు పతుల ఇల్లాలిని. ఒకానొక కారణంగా బలవంతులైన పగవాళ్లు భర్తల ఎదటనే నన్ను శిగపట్టి ఈడ్చారు. అదే కారణంగా పతులతో సహా వ్రతనిష్ఠతో అరణ్యవాసం చేశాను. అడివితిళ్ళతో దినాలు గడుపుతూ బ్రహ్మచర్యం సాగించాను. మరోసంవత్సరములో వ్రతం సమాప్తమవుతుంది. నువ్వు ధర్మవర్తినివని విన్నాను నా నేర్చినట్టు నీ కొలువుచేసి బతుకుదామని వచ్చేశాను.

సుదేష్ణ చిత్రం! విద్యాధర, గరుడ, యక్ష, కిన్నర, దేవతా స్త్రీలలో ఎవరో అయి వుంటావు నువ్వు సందేహంలేదు. మా పట్నానికి ఎందుకు వచ్చావో నిజంచెప్పు

మాలిని నిజమే చెబుతున్నాను మహారాణీ! మొదట్లో సత్యభామాదేవిదగ్గిర పనిచేశాను. తరవాత ద్రౌపదీదేవిదగ్గిర వుండేదాన్ని. పనిపాట్లలో ఒకనాడూ 'తృటి' అన్నమాట అనిపించుకోలేదు. ఆ యిల్లాలికి నేనంటేనే ప్రాణం. మా ఇద్దరికీ భేదమే లేదు. ఆ మహాదేవి నన్నెపుడూ నీచప్పనికి నియమించి ఎరగదు. అలాగే నువ్వూ ఏలుకుంటావని ఆసపడి వచ్చాను.

గంధం చక్కగా తీస్తాను, సుగంధద్రవ్యాలు అమరుస్తాను. తిలకం దిద్దుతాను పువ్వులు కూరుస్తాను రకరకాల దండలు కడతాను. తల ముడుస్తాను. కనుసన్నలో మసులుకుంటాను.

ఆశ్చర్యపోయింది సుదేష్ణ.

"అంతా బావుంది. కాని, నిన్నుచూస్తే మారాజు ఉవ్విళ్లూరుతాడే! అనితర సులభమైంది నీమూర్తి. అలాంటప్పుడు నిన్ను నేనెలా భరించేది? పీత చూలు పెట్టుకున్నట్లు నా నాశనం నేనే కోరుకోనా?" అంది.

మాలిని దేవీ! పొరపడుతున్నావు. నాభర్తలైదుగురూ మహాబలవంతులైన గంధర్వులు. అనుక్షణం కనిపెడుతూనే వుంటారు నన్ను. తప్పుగా నన్ను చూసినవాణ్ణి, వాడెంత బలపరాక్రమాలు కలవాడైనాసరే, నూరుమంది వాడికి మద్దత్తు వచ్చినాసరే, దుమ్ము దుమ్మా, కీలుకీలూ మచ్చుకిలేకండా చంపేస్తారు. దీనికి తిరుగుండదు, అంచేత పరాయిమగాడు నామీద కన్నే వేయడు.

ఇంతకూ నేనంత తేలిక మనిషినని ఎలాభావించావు? మాకుల పెద్దలు తీర్చిదిద్దిన సంప్రదాయం నిష్కళంకమైనదని నమ్ము. రాజ

మహిషివి. ఇంత నీచభావానికి తావివ్వవచ్చునా తల్లీ! అలాంటి అను మానం నీకక్కర లేదు రాణివాసాల సదాచారాలు తెలిసినదాన్ని. భయభక్తులతో నీమనసుపట్టి మసులుకుంటాను పిన్నా పెద్దా 'ఔ' నన్నట్టు నడుచుకుంటాను. నాదొక్కటే ప్రార్థన ఎంగిలి ముట్టను. కుచ్ఛితం పనులు చేయను. మర్యాదగా నన్ను చూసేవాళ్లని మా వాళ్లూ మన్నిస్తారు.

అంతా విన్నది సుదేష్ణ. గౌరవమూ అనురాగమూ కలిగాయి సైరంధ్రిమీద. ఆమెని అనుమానించినందుకు నొచ్చుకుంది. "ఏమీ అనుకోవద్దు" అని బుజ్జగించింది. ఆదరించి పరిజనంలో చేర్చుకుంది.

ఆ అంతఃపురం ఆచారాలకు అనుగుణ్యంగా పనిపాట్లకి పూను కుంది సైరంధ్రి మాలిని.

ఇలా సతీసమేతంగా పాండవులు ఉపప్లావ్యనగరంలో అజ్ఞాత వాసం మొదలుపెట్టారు.

---

# విరాటపర్వం

## రెండో ఆశ్వాసం

ప్రవేశించిన ఉత్తరక్షణం నుండీ రాజుకి ప్రియపాత్రుడయ్యాడు కంకభట్టు వివిధ వినోదాలతో వేడుకపుట్టిస్తూ అందరినీ ఆనంద పరిచే వాడు. పాచికలాటలో గెల్చుకున్నధనం రహస్యంగా సహోదరులకు పంచిపెట్టేవాడు అమ్మేమిషమీద వంటలో మిగిలిన మాంసాలు అన్నదమ్ములకు అందించేవాడు వలలుడు. సంగీతసందర్భాలలో లభించిన బహుమానమూ, వస్త్రాలూ సోదర్లపరం చేసేవాడు బృహన్నల. గుర్రాల గ్రాసంలో మిగిలిన సొమ్ము అన్నదమ్ముల కిచ్చేవాడు దామ గ్రంధి అన్నలకు పాలూ పెరుగూ లోపం రాకండా చూసేవాడు తంత్రీపాలుడు. తన్ను పదికళ్లతో కనిపెడుతూన్న భర్తల్ని కళ్లారా చూసుకుంటూ సమయోచితంగా నడుచుకునేది మాలిని.

సౌజన్యమూ, మర్యాదా, ఓర్పూ, మెలకువా, న్యాయమూ— ఎందునా లోపం రానీయకండా పరివార మంతటితోనూ జనమంచిగా మసులుకుంటున్నారు పాండవులు.

### మల్లవిద్య

ఇలా నాలుగు మాసాలు గడిచాయి. శరదృతువులో బ్రహ్మోత్సవం వచ్చింది. దేశదేశాలనుండి మంచిమంచి వస్తాదులు వచ్చి రాజసభలో గుమికూడారు. ఎవరి ప్రతాపం వారు చెప్పుకుంటున్నారు. అందరి మధ్యా మహామల్లుడొకడు లేచాడు. విశాలమైన ఉన్న వక్షస్థలం గండరాలు మెలికలుతిరిగిన శరీరం—మదపుటేనుగులా భయంకరంగా వున్నాడతడు.

"ప్రపంచంలో వున్న రాజసభలన్నీ గాలించివచ్చాను, మహారాజా! నాముందు జబ్బచరిచే మొగాడు కనపడలేదు" అని రంకె వేసి సవాలు చేశాడు. సభలో పిడుగు గర్జించిన ట్లయింది.

అంతటా నిశ్శబ్దం. అంతమంది వస్తాదులలోనూ ఒక్కడికీ సాహసం కలగలేదు ఒక్కడూ తలన్నా ఎత్తలేదు.

చిన్నబుచ్చుకున్నాడు విరాటరాజు తన కళ్ళెదుట సవాలు చేస్తున్న వాణ్ణి ఎదిరించడానికి తనసభలో ఒక్కడూ కనిపించలేదు. ఎంత అవమానం! చిక్కితే నెత్తురుచుక్క లేదు అతడి మొహంలో.

అంతాకనిపెట్టాడు కంకభట్టు "రాజా, వీడితో పోట్లాడగల వాడు ఒక్కడే వున్నాడు. ఇంద్రప్రస్థ నగరంలో వాణ్ణి నేనెరుగుదును. మల్లవిద్యలో ముక్కాకలు తీరినవాడు. మనదగ్గిరే వంటపుట్టిగా వున్నాడు, వలలుడు. సందేహమ్మక్కరలేదు. ఆదేశించండి" అన్నాడు.

రాజు చెప్పడం తడవుగా వలలుణ్ణి ప్రవేశపెట్టారు దౌవారికులు. భయభక్తులతో వచ్చి నిలబడ్డాడు వలలుడు. మల్లుల మీాదికి చూపు పారగానే అతడి శరీరం వుప్పొంగింది. కుతూహలమూ రేకెత్తింది.

"ఇదిగో, ఈ నిలుచున్న మల్లుడితో పోట్లాడాలి. సిద్ధపడు" అన్నాడు రాజు. క్రీగంట కంకభట్టుని చూశాడు వలలుడు. "కానీ" అన్నట్టు కనుసన్న చేశాడుభట్టు.

"చిత్తం, మహారాజా! ధర్మరాజుగారి కొలువులో వున్నపుడు మహారాజు వేడుకకోసం దేశదేశాల మల్లులతో పోట్లాడేవాణ్ణి. అలాగే ఏలినవారి వేడుకకోసం నా ఓపినంతవరకు పోట్లాడతాను" అని సవినయంగా అన్నాడు వలలుడు. సింహనాదం చేశాడు మదగజంలా అడుగులు వేసుకుంటూ రంగస్థలంలో ప్రవేశించాడు. భుజాస్ఫాలనం చేసి రాజుకి నమస్కరించాడు.

మల్లుడూ అంతకు ముందే సిద్ధంగా వున్నాడు. ఇద్దరూ పరస్పరం చూసుకున్నారు. కింది మన్ను తీసి లలాటాలకు రాసుకున్నారు. తలలమీద చల్లుకున్నారు. రెండుచేతుల మునివేళ్లతో పరస్పరం ఒకళ్లొకళ్ళదిక్కు చల్లుకున్నారు. వంచిన ఎముమ జబ్బలు చరుచుకున్నారు. ఇద్దరి చప్పుడూ ఒకటిగా ప్రతిధ్వనించింది. ఇద్దరూ ముందుకు వంగి వింతగా నిలువబడి కలియబడ్డారు

చేయీ చేయీ కలిపిన దాల్ పేచీలోనే తోరహాత్తను (అంజమెడపట్టు) చూపెట్టాడు వలలుడు. తలుచుకుంటే ఆ పేచీలోనే మల్లుణ్ణి "హతోస్మి" అనిపించేవాడు. కాని విడిచిపెట్టి మళ్ళీ కలియబడ్డాడు.

ముందుకువంగి నిలబడే వలలుణ్ణి అంగుళమైనా కదపలేక పోయేవాడు మల్లుడు. వలలుడు తోరుచుకుంటూవస్తే నిలవరించా లేకపోయేవాడు. కుదవేసి పట్టుకొని గుంజిగుంజి వదలిపెట్టేవాడు వలలుడు. రాజు వేడుకకోసం తేలిక పేచీలతోనే ఆడించాడు కొంతసేపు. తరవాత కచ్చ పిడికిలితో పట్టుకొని అంతవాణ్ణీ అమాంతంగా మీదికెత్తి పట్టుకున్నాడు. కాళ్లూ చేతులూ కిందికి వేలాడుతూ గున్న ఏనుగులా కనిపించాడు మల్లుడు. వలలుడి ముష్టిబలానికి సభాజనమంతా తెల్లపోయింది. చివరికి నేలమీద విసిరికొట్టాడు వలలుడు. ముక్కుంటా నోటంటా నెత్తురు కక్కుకున్నాడు మల్లుడు. కింద పడీపడడంతోటే సింహంలా లంఘించి మల్లుడి వీపుమీద మండీ వేశాడు వలలుడు. ఎదురు పేచీకోసం బలమంతా చిక్కబట్టాడు మల్లుడు. రెండు చేతులా నేల అప్పళించాడు. లాభంలేకపోయింది. పీగపోయాడు.

సభ సభంతా గొల్లుమన్నారు. హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి. సింహాసనం దిగివచ్చి వలలుణ్ణి కౌగిలించుకున్నాడు రాజు. బహుమూల్యమైన బహుమానాలు బహూకరించాడు. అవంతా అక్కడే పంచిపెట్టి వంటింటికి వెళ్ళిపోయాడు వలలుడు.

అవాళనుంచీ వలలుడు లేని మల్లవినోదంలేదు విరాటరాజు కొలువుకూటంలో. రాణివాసం వినోదంకోసం మల్లక్రీడలు ఏర్పాటు చేసేవాడు రాజు. మల్లులు లేనపుడు పెద్దపులులతోనూ, మదపుటేనుగులతోనూ పోట్లాడేవాడు వలలుడు. వలలుడంత బలశాలి తనదగ్గిర వున్నందుకే మురిసిపోయేవాడు విరాటుడు.

## సింహబలుడు

ఇలా మరికొంత కాలం గడిచింది. తమదిక్కు ఒకరు వేలు చూపించకండా మెలకువతో దినాలు గడుపుకుంటున్నారు పాండవులు. సంవత్సరం దగ్గిర పడుతున్నది. కళ్ళుమూసుకుంటే పక్షం దినాలూ రెక్కలు కట్టుకు వెళ్ళిపోతాయి.

ఇంతలో ఒకనాడు మత్స్యదేశానికి సేనాధిపతీ, రాజు బావమరిదీ, రూపాభిమానీ, బలగర్వితుడూ, దుస్సాహసీ, అలంకారప్రియుడున్నూ అయిన సింహబలుడు అక్క సుదేష్ణాదేవికి నమస్కరించడం కోసం అంతఃపురానికి వేంచేశాడు. ఆసమయానికి సుదేష్ణ సమీపంలో పనిచేసుకుంటూ వుంది సైరంధ్రి. చూశాడు సింహబలుడు. చకితుడూ అయాడు. వెళ్ళినచూపులు వెనక్కురావడం దుస్సాధ్యమైంది. అదును కనిపెట్టి బాణాలు పదును పెట్టాడు మన్మథుడు. తన స్వాధీనంలోనుండి జారిపోతూవుంది ధైర్యం సింహబలుడికి.

సైరంధ్రి సౌందర్యం వురితాళ్ళయింది. సింహబలుడి హృదయం మృగమై చిక్కుకుంది. గిజగిజలూ ఆడిపోయింది. కాముడు కారుణ్యం లేని కిరాతకుడు. తహతహలాడాడు సింహబలుడు.

" దేవదుర్లభమైన ఈ సౌందర్యం మానవమాత్రుడు చూసి వుండడు. పూర్వపుణ్యం వల్ల కాని ఇంత అంద అందకత్తె ప్రాప్తం కాదు ఈమే పక్కని వుంటే పార్వతీప్రియుణ్ణే గెల్చేవాడు మన్మథుడు. ఈమె కంటపడిందంటే శచీపతిలాంటివాడు కీచుకీచు మంటాడు.

ఈమెకు సాటి లేరని భాషాభిభుడితోనే పందెం వేయవచ్చు. ఈమె భర్తముందు లక్ష్మీనాధుడి సంపద లెక్కా పత్రా! మన్మథ బాణాలు ఐదింటిని కరిగించి, పోతపోసి, జీవంపోసి వుండాలి ఈమెని. కాకపోతే ఈఅపూర్వసృష్టికి అవకాశ మెక్కడ? ఈమెని చూస్తే మన్మథుడే విరహతాపంతో విలవిల లాడిపోయి, చివురు గోరుగూ, పూల బాణాలూ నిజ్జగా పరుచుకుంటాడు. ఈమెని కన్న పుణ్యాదంపతులెవరో? పేరేమిటో? ఈమెని చేపట్టినభాగ్యశాలి ఎవరో? ఇల్లెక్కడో? ఈమెని పొందగల మార్గం? కార్యసంధానం చేసేవా ళ్లెవరు? ఏమిటి సాధనం?"

ఇలా పరిపరివిధాల భావించడం మొదలెట్టాడు. తానే చొరవ చేసుకుందా మనుకున్నాడు చుట్టూ జనాన్ని చూసి శంకింస్తూనూ వున్నాడు. మన్మథుడు బాణంమీద బాణం వేస్తూనే వున్నాడు. సింహబలుడు మతిచెడి కళవిలబడిపోతూనూ వున్నాడు మాలిని మలిన వేష లో వుందనికాని, తన వైఖరిచూసి అసహ్యించు కుంటూనూ వుందని కాని కామాంధుడు కావడంచేత కానలేక పోతున్నాడు.

"జంకన్నా లేకండా ఎలాచూస్తున్నాడో" అనుకుంది సైరంధ్రి, ముచ్చెమటలు పోశాయి "అయ్యో, విధి ఎంతైనా చేస్తుంది" అనుకుంది, నివ్వెర పోయింది. "ఇక్కడ నాకు దిక్కే లేదుకదా" అనుకుంది, నిలువునా కంపించింది. "ఏం చెయ్యడానికీ పాలుపోకండావుంది" అనుకుంది, తెలతెల్లపోయింది.

ఈస్వేదమూ, స్తంభమూ, కంపమూ, వైవర్ణ్యమూ ఇదంతా తన్ను చూసి కలిగిన కామవాంఛాఫలితమే అనుకున్నాడు కీచకుడు. మురసిపోతూనూవున్నాడు తనఅక్కా తదితర పరిజనం తన్ను కని పెడుతూవున్నారన్న ఇంగితజ్ఞానం కూడా లేకండా మన్మథుడి చేతి కీలుబొమ్మలా అయిపోయాడు.

ఆఖరికి అప్పగారిని అడిగితేనేగాని అసలుసంగతి తెలియదను కున్నాడు. ఎలాగో మాలినిమీదిచూపులు మళ్లించుకున్నాడు. తిన్నాగా వెళ్లి అప్పగారికి నమస్కారం చేశాడు.

అంతకు ముందే తమ్ముడుకోసం బంగారం పీఠం వేయించింది సుదేష్ణ. ప్రేమతో కుశలప్రశ్న లడిగింది.

ఇదంతా తలకెక్క లేదతగాడికి. క్షణమొక యుగంలావుంది.

"ఆ అమ్మాయి ఎవరో ముందు చెప్పూ" అన్నాడు. "ఇంతకు ముందెప్పుడూ నీ లోగిలిలో చూడలే దీమెని. ఎక్కడనుంచి వచ్చింది? ఏం పనిమీద వచ్చింది? ఎవరి యిల్లాలు? దీనిపేరేమిటి? దీనికీ నీకూ ఎలాటిస్నేహం?" అని ప్రశ్నమీద ప్రశ్న గుక్కతిప్పుకోకండా అడిగేశాడు.

అతడు కామాతురుడుగా వున్నాడని అంతకుముందే గ్రహిం చింది అక్కగారు. ఎలాఅయినా అతగాడి మనస్సు మళ్లించాలనీ అను కుంది. అతడి మాటలు వినిపించుకోకండా, ఆమాటా ఈమాటా చెప్పి విషయం ఇంకోదిక్కు తిప్పాలని ప్రయత్నించింది. కాని లాభం లేకపోయింది.

కామం సోకినవాణ్ణీ కాలం తీరినవాణ్ణీ అరికట్టడం అసాధ్యం. అక్కడినుంచి లేచిపోయాడు సింహబలుడు మాలిని దగ్గిరికే మళ్లీ వచ్చాడు. ఆపక్కా ఈపక్కా తారాడుతూ మెల్లిమెల్లిగా మరింత దగ్గిరికీ వెళ్లాడు.

"ఎవ్వరుపిల్లా నువ్వు, నీపేరేమిటి?" అన్నాడు. "నీఅంత అందకత్తెని నేనెక్కడా చూడలేదు. ఎక్కడినుంచి వచ్చావు? ఎవరి యిల్లాలివి? తల్లిదండ్రులెవరు?" అని ప్రశ్నించాడు.

వినీ వినిపించుకోనట్టు, తనపనేమో తానేమో అన్నట్టు వూరు కుంది సైరంధ్రి.

"ఇదిగో, కొంచెం కన్నెత్తి చూస్తే తరిగిపోతావా! ఏదీ చిన్న చిరునవ్వు! మాటాడితే పలువరస చూసేస్తారో! ఏదీ, చెయ్యి కొంచెం పట్టుకోనా!" అంటూ తన అనురాగమంతా వెల్లడించడం మొదలు పెట్టాడు సింహబలుడు.

అప్పటికీ మాటాడలేదు ద్రౌపది. కాళ్లూ చేతులూ అందడం లేదు కీచకుడికి.

"దిష్టి సోకిపోతుందేమో అని కళ్లారా నిన్ను చూడ్డానికే భయపడుతున్నాను మనసులో మాట నాలిక చివరిదాకా వచ్చి ఆగిపోతూ వుంది నీ మెత్తని చెయ్యి పట్టుకుందామనుకుంటేనే వడికపోతున్నాయి నా చేతులు. నీ మనస్సేమో ఎంతసేపటికీ అందకండా వుంది. ఏం చెయ్యనూ!

"ఇదిగో, చల్లకివచ్చి ముంత దాచడ మెందుకూ? నిజం చెప్పేస్తున్నాను. ఇలాగే మరికొంత సేపు వూరుకుంటివా, మన్మథుడు మరి బతకనివ్వడు నన్ను తరవాత నువ్వెంత చేస్తేమాత్రం లాభం? నన్ను పొందడమే దుర్లభమైపోతుంది నీకు" అన్నాడు.

ప్రతీమాటా శూలంలావుంది సైరంధ్రికి. దుస్సహమైనపరాభవ వికారం పైకి కనపడనీయకండా ఆపుకుంటూ "వీడు దురభిమానంతో వున్నాడు. తొందరపడక సామోపాయంతోనే తప్పించుకోవాలి," అని నిశ్చయించుకుంది. "అన్నా" అని సంబోధించింది. "తగు మనిషివి. తోడబుట్టువు లున్నవాడివి. ఇలా అనవచ్చునా? నా దురవస్థ చూస్తూనే వున్నావు. ఈమాసిన గుడ్డలూ నేనూ ఎంత అసహ్యంగా వున్నాను. నన్ను చూసి యిలా అవమానం చేయడం న్యాయమూ? కులంతక్కువ దాన్నాయె పతివత్నినాయె నన్నిలా అడగడం ధర్మమా?" అంది

మదనోన్మాదంలో కిందా మీదా తెలీని కీచకుడికి ఆమాటలు తలకెక్కడమే లేదు. ప్రణయం వొలకపోస్తూనే వున్నాడతడు.

"నెత్తమ్మిరేకుల మెత్తదనమంతా తెచ్చి పోతపోసినట్టు అందంగా వున్నాయి నీపాదాలు చక్రవాకాల పొంకమంతా తెచ్చి కుప్పపోసినట్టు బింకంగా వున్నాయి నీ స్తనాలు కళంకం తొలిగించిన చంద్రబింబంలోని కాంతి ముద్దకట్టినట్టు ఎంచక్కా వుంది నీ మొహం. తుమ్మెదల నలుపంతా తెచ్చినారుపోసినట్టు నవకంగావుంది కచభారం అనన్య సామాన్యంగా వున్న ఇవన్నీ అనుపమానమైనభోగాలకు గనులే కదా! ఎందుకూ లేనిపోని తిప్పలు పెడతావు? నువ్వు కలంతక్కువ దానివి కాదనడానికి నువ్వే సాక్షి. పరస్త్రీసంగమం పాపమంటావా, అది నేను చూసుకుంటాను. ఆపాపమైనా భరిస్తానుగాని ఈమన్మథ వేదన సహించలేను" అన్నాడు.

మరింత చుర్రుమంది మాలినికి. "వీడు నీచుడు. గదమాయిస్తేనే కాని మెత్తనిమాటలతో పోడు" అనుకుంది "దేవతల్లాంటి ఐదుగురు గంధర్వులున్నారు నాకు భర్తలు. అమిత బలవంతులువారు బలదర్పంతో కళ్ళుపొగరెక్కిన ఎంతటి శత్రువులనైనా హతమార్చడంలో అసమానులు. నామాట నీ తలకు పట్టడంలేదు. నీ మానప్రాణాలు వాళ్ళచేతుల్లో మాసిపోవడం మాత్రం తప్పదు" అంది.

వికటంగా నవ్వాడు కీచకుడు "ఐతే, నాబలం నీకు తెలియదన్నమాట నీభర్తలే కాదు, ముల్లోకాల్లోనూ నా ఎదుటనిలవగలిగిన మొనగాడు ఇంతవరకూ కనబడలేదు. ఇకముందు కనపడడు కూడాను" అన్నాడు.

ఈసారి ధిక్కారంగా అంది సైరంధ్రి "ఇది కూడునూ, కూడదూ అన్న జ్ఞానంలేని మూఢుడిలా వున్నావు పరస్త్రీల కాసపడి రావణుడంతివాడు సమూలంగా నాశనమయ్యాడు తెలుసా!" అంది.

ఆమెమాటలు అర్థంకాలేదు కీచకుడికి. మనస్సు బాధపడుతూనే వుంది. మదనాగ్ని జ్వాలలు శరీరందహించేస్తున్నాయి. నిట్టూర్పు మీద

నిట్టూర్పు నిప్పులు చెరుగుతున్నాయి. చిన్నబోయిన మొగంతో మళ్ళీ అక్కగారి దగ్గిరికి బైల్దేరాడు. "అక్కా, ఆమె పేరడిగితే చెప్పావు కావు. మరి నీదగ్గిర దాచడ మెందుకూ? ఆమె నాకు కావాలి లేకపోతే బతికను. మరి నీదయ. ఇంతసేపూ యిక్కడే వుందికదా! ఏదీ ఎక్కడికి వెళ్ళింది?" అని అడిగాడు.

అప్పటి అతగాడి స్థితీ, తొందరపాటూ చూసింది సుదేష్ణ. తలపంకించింది. ఆమె కేమీ పాలుపోడంలేదు.

"పిచ్చిబాగా నెత్తికెక్కింది వీడికి కూడదంటే వినుపించుకొనే మనిషి కాడు. ఏందారి భగివంతుడా!" అనుకుంది. "తమ్ముడూ, నువ్వు కోరడమే తరవాయిగా బంగారంబొమ్మల్లాంటి అందకత్తెలు హంసనడకలతో వచ్చి నిన్ను సుఖపెట్టడానికి సిద్ధంగా అంతమంది నీ మందిరంలో వున్నారు వాళ్ళ కాలిగోటికైనా పోలని ఈసైరంధ్రి నీ కెందుకు చెప్పూ! ఒక అందమూ ఒక ఇదీనా? ఏముంది గనక! వద్దు నా మాటవిను" అంది.

సింహబలుడు నాదగ్గిర వున్నవాళ్ళేకాదు, దేవేంద్రుడికొలువు కూటంలో వున్న సుందరీమణులందరూ కలిసినా సైరంధ్రి కాలిగోటికి సరిరారు నీకు తెలీక అన్నావు గాని, బేడిసలకు పుట్టి మన్మథ బాణాలతో ఆడుకుంటూ వున్నట్టున్న ఆ నేత్రాలూ, తామరతూళ్ళ దగ్గిర పాఠం చెప్పుకుని, పూలతీగెలను, లెక్కకి తేలిసట్టున్న ఆ మెత్తని చేతులూ, చివుళ్ళ దగ్గిర సంధి చేసుకుని, పద్మాలను పరిహసిస్తున్న ఆపాదాలూ, కోయిలల దగ్గిర నేర్చిన విద్య వీణలకు నేర్పుతూన్నట్టున్న కంఠస్వరం, ఆ రూపురేఖలూ, ఆ తీరూ, ఆ నాగరికతా, ఆ సోయగం సైరంధ్రి దగ్గిరతప్ప ఇంకో ఆడదని దగ్గిర వెదికినా దొరుకుతాయా! అంచేత నమానోన్నా భయానాన్నా ఎలాగో సైరంధ్రిని నాకు ఒప్పగించకపోతే మాత్రం నాప్రాణాలు నాకు దక్కవు."

సుదేష్ణ నాయనా, పరసతీ సంగమంవల్ల ఆయురైశ్వర్యాలూ, కీర్తి ప్రతిష్ఠలూ అన్నీ నశించి పోతాయి. తెలిసినవా ళ్ళెవరూ ఈపని చెయ్యరు. నీకు తెలియని ధర్మా లేమున్నాయి గనక!

ఇంతకూ జారిణీ సంయోగం ఏ మంత సుఖం చెప్పు? భర్తకు తెలిస్తే ప్రాణం మీదికి వస్తుందన్న భయంతో గుండెలు కొట్టుకుంటూ వుంటాయి. ఇతర్ల కంటబడితే మర్యాద భంగమని జంకు పీకుతూనే వుంటుంది. సాటివాళ్ళకు తెలిస్తే లోకువ కట్టేస్తారన్న తత్తరపాటుఏదీ తోచనివ్వదు. బంధువులు చూశారా కులం వెలిపడుతుందన్న శంకతో ముచ్చెమటలు పోస్తాయి బుద్ధిమంతుల కిది ఎంతమాత్రం తగదు.

అదీకాక, దీనికి ఐదుగురు భర్తలు గంధర్వు లున్నారు. వాళ్లు మహాబలవంతులట. వాళ్లను తలచుకుంటేనే నాప్రాణా లెగిరిపోతాయి. అంచేత, తమ్ముడూ, ఈ అవివేకంవద్దు నామాట విను. దాన్ని కోరకు. పెడదారి పట్టి చెడిపోడం దేనికి! రుచికదా అని అపత్యం చెయ్యవచ్చా?

ఈ ఉపన్యాసమంతా అయోమయంగావుంది కీచకుడికి. మన్మధుడు శరపరంపర ప్రయోగిస్తూనే వున్నాడు ఉద్రేకం క్షణక్షణ ప్రవర్ధమానంగా మితిమీరుతూనూ వుంది.

"అక్కా, ఒక్క మాట చెపుతాను. నాలుగు సముద్రాలనడుమ నాతో చెయ్యి చేసుకునే మొగాడు లేడన్నది జగమెరిగిన సత్యం. దానిభర్తలు ఎంత వుద్దండులైతేనేం, ఇంద్రుడు వజ్రాయుధంతో పర్వతాలను కూలవేసినట్టు నాబాహువులతో వాళ్ళను హతమారుస్తాను అంచేత ఆభయం నీకక్కర లేదు. ఇక నీతులు బోధించడం విడిచిపెట్టు నాసౌఖ్యం విచారించు, కాదన్నవా నాప్రాణాలు నిజంగా నాకు దక్కవు. ముమ్మాటికీ నమ్ము నా క్షేమమే కోరేదానివైతే ఈ ధర్మపన్నాగాలు ఏకరువు పెట్టకు. బుద్ధిలేవని తిట్టకు. వేగం దాన్ని

పంపించు'' అని ప్రాధేయపడుతూ దిగ్గున లేచి ఆమె పాదాలమీద సాష్టాంగ పడ్డాడు.

సుదేష్ణ హృదయం చివుక్కుమంది. తరవాత వచ్చేది ఎలా వున్నా సైరంధ్రిని అప్పగిస్తే కాని ఉపదేశాలతో కదలడనుకుంది. ''ఎటుచూసినా వీడికి కాలం మూడినట్టేవుంది ఇటు గంధర్వుల చేత తప్పినా అటు మన్మధుడి చేత నయినా చావు తప్పదు ఏం దారి!'' అనుకుంటూ తమ్ముణ్ణి లేవనెత్తింది. ఉబుకుతూ వున్న కన్నీళ్ళు దిగమింగుకుంటూ ఇలా అంది

''ఇంత ప్రాధేయపడడ మెందుకు తమ్ముడూ? ఎలా అయినా దాన్ని ఒప్పించక పోను లే విచారపడకు లే ఇక్కడ మసలకు మరి. కల్లు పేరు చెప్పి ఇవాళే నియింటికి పంపిస్తాను దాన్ని నీఅభిమతం నెరవేర్చుకో. వెళ్లు.''

కీచకుడి ఆనందానికి మేర లేదు. అక్కదగ్గిర సెలవు తీసుకున్నాడు. ఈలవేసుకుంటూ వెంటనే ఇంటికి వెళ్ళిపోవచ్చాడు.

వచ్చి రకరకాల పానియాలు తయారు చేయించాడు. వాటికి తగిన వంటకాలు వండించాడు ఒక రమ్యస్థలం ఏర్పాటు చేసుకున్నాడు. అందులో తానొక్కడే వుండి చుట్టుపక్కల ఎవర్నీ వుండకుండా ఆజ్ఞాపించాడు.

మాలినిమీది మోహం హృదయంలో చిచ్చు పెడుతూవుంది. దాగట్లో వెలక్కాయలాగ తల్లడిల్లి పోతున్నాడు. ఏవేవో తలపోస్తున్నాడు. గుటకలు మింగుతున్నాడు. సైరంధ్రికూడ తనమీద వలపుతో ఇలాగే అటమటించి పోతూవుంటుందని భావించుకుంటున్నాడు.

''దానికళ్లు క్రీడిస్తూవున్న వాలుగు చేపల్లా వున్నాయి. సానపెట్టిన మదనబాణాల్లా వున్నాయి. నిశ్చలంగావున్న పద్మపత్రాల్లా వున్నాయి. తళుక్కుమన్న తొలకరి మెరుపుల్లా వున్నాయి.

అలాంటి కళ్ళతో చూపులు గుండెల్లోనాటుకు పోయేట్టు చూసింది నన్ను. నామనస్సు యిస్త్రీ లాగేసుకుంది. ప్రేమ కురిపించేసింది. వలపుతో మిలమిలలాడిపోయింది.

"ఐతే, ఇంతఅయిన్నీ అక్కడ తనకు కొత్తకావడం చేత సిగ్గు పడే పోయిందో, కాక, నన్నుకొంచెం ఏడిపిద్దామని బుద్ధే పుట్టిందో తన మనస్సు మాత్రం విప్పి చెప్పిందికాదు."

"ఆ వయ్యారి నా ఎదట నిలబడితే కళ్ళకి కనకాభిషేకంలా వుంటుంది కళ్ళెత్తి నన్ను చూసిందో నాశరీరానికి అమృతసేచనంలా వుంటుంది. చిన్న చిరునవ్వు నవ్వి ముచ్చటగా మాటాడిందా, నా చెవులకి పండుగులా వుంటుంది నన్ను చేరవచ్చిందా, ఓ, హృదయా నికి బ్రహ్మానందం కలుగుతుంది. ప్రేమతో నన్ను భోగించి ఏలు కొన్నదా అంటే జన్మసాఫల్యమే ఐపోతుంది."

ఇలా పరిపరివిధాల మనస్సుకు తోచినట్టల్లా భావిస్తున్నాడు కీచ కుడు. ప్రతినిమిషానికీ మన్మథతాపం అధికమై పోతూవుంటే, ఎన్నో విధాల ప్రలాపిస్తున్నాడు. ఎంతట సుదేష్ణ పంపిస్తుందా, ఎంతట సైరంధ్రి వస్తుందా అని ఆమెరాక కోసం ఎదురు చూస్తున్నాడు.

ఇక అక్కడ, కొంతసేపయాక సుదేష్ణ సైరంధ్రిని పిలిచింది. దాహం నటిస్తూ ఇలా అంది

"చూడు మాలినీ, దుర్దాహంగావుందినాకు. అబ్బా, గొంతుక ఆర్చుకు పోతూవుంది. మంచి శ్రేష్ఠమైన మదిరారసం తాగాలనిపిస్తూ వుంది. మా తమ్ముడు సింహబలుడింట రుచికరమైన రకరకాల మద్యా లెపుడూ నిలువవుంటాయి. ఇక్కడున్నట్లు వెళ్ళి తీసుకురావలి. చూస్తాకదా ఎంతవేగం వస్తావో!"

సైరంధ్రి హృదయం దబదబా కొట్టుకుంది. శరీరం ముచ్చె మటలుపోసింది. నిలుచున్నది నిలుచున్నపాటున వుండిపోయిందామె.

"పులిమీద పుట్రలా ఇదేం ఖర్మం! అక్కడికి వెళ్ళనంటే చిక్కు. వెళితే ప్రాణాంతకం. ఏందారి భగవంతుడా" అవి భావిస్తూ వెనకాముందూ అవుతూన్న మనస్సుతో తడపడిపోయింది.

"అమ్మా! కల్లుకోసం నన్ను పంపకండి. మరెవర్నయినా పంపండి మర్యాద భంగంకాని పనులకేకదా నేను సమ్మతించాను. ఇలాంటిపనికి నన్ను నియోగించడం ధర్మమా! మీరాణివాసం నిష్కళంకమైనదని నచ్చి, దగ్గిర నాథర్తలు లేకపోయినా నిశ్చింతగా కాలం గడుపుతున్నాను. తమపంచన చేరిననాథులకు దుష్టుల బారినుండి రక్షించి పుణ్యం కట్టుకోడమే పెద్దధర్మం. అంతేకాని కంచే చేనుమేస్తే ఇక దిక్కేముంది? మొదటే చెప్పాను, నీచమైనపనులు ఆదేశించవద్దని. అలాంటపుడు ఎవరి ఇంటికో, దేనికో నన్నుపంపడం న్యాయమేనా?" అంది.

అంతావిన్నది సుదేష్ణ తాను చెప్పుతున్నది అనుచితమని తనకూ తెలుసు మనస్సు శంకిస్తూనే వుంది తమ్ముడి అవస్థ తలుచుకుంటే మాత్రం ఆమెబుద్ధి నశిస్తున్నది. లాలించి చెప్పడం మొదలెట్టింది.

"అయ్యో, ఆసవంకోసం ముచ్చట పడ్డాను. తక్కువదాన్నవర్ని పంపడం ఇష్టంలేక నిన్నుకోరాను. ఈపాటిదానికి నువ్వు గోరంతలు కొండంతలు చేస్తున్నావు. నీకేదో మహా నీచప్పని చెప్పినట్టు విచారిస్తున్నావు స్నేహంతో చెప్పినపనికి ఇలా ఎవరైనా భావిస్తారా! ఇంతకూ అది పరాయి ఇల్లుకదకనా! నిన్నెవరెరుగరని! వచ్చినప్పటినుంచీ నీమంచితనం, నీనడవడికా అందరికీ నేను చెబుతూనే వున్నాను కదా!" అంటూ మెల్లి మెలిగా లాలించీ, బెల్లించీ మరీ మరీ చెప్పడంతోటే "ఇక అధికంగా ఆమెతో వాదించి లాభంలే"దనుకుంది సైరంధ్రి మనస్సులో బాధపడుతూనేవుంది. సంకోచిస్తూనే వుంది.

"మీరంత ఇదిగా చెబుతున్నారు. ఎలా కాదనేది! సరే. వెళతాను" అంది.

ఎక్కడలేని సంతోషం పుట్టుకువచ్చింది సుదేష్ణకు. వెంటనే బంగారం మధుపాత్ర అందించింది సైరంధ్రికి. పుచ్చుకొని దైన్యం మూర్తీభవించినట్టు బైల్దేరిందామె. ఇందాక నీచుడైన కీచకుడు కర్ణ శూలాల్లాగ ఆడిన మాటలూ, పిడుగుపడ్డవాడిమీద కొరకంచు పెట్టినట్టు సుదేష్ణ యిలా అనుచితమైన పనికి నియోగించడమూ ఆమె మనస్సు పరిపరివిధాల బాధపడింది. నడుస్తూనే వుందిగాని దుఃఖ పడుతూనేవుంది 'మాయావిధీ' అని నిందించుకుంటుంది. 'ఇపుడు నాకెవరు దిక్కు?' అని కుంగిపోతుంది. కన్నీళ్లు తుడుచుకుంటుంది. తడబడుతుంది. అంతలోనే కుదుటబడి "నన్నెవడు ముడతాడో చూస్తాను!" అనుకుంటుంది. మళ్ళీ వెనక్కు తగ్గుతుంది.

దైన్యం కలిగేసరికి ఆమె మొహం వెలవెలపోతూవుంది. భయం కలిగేసరికి నిలువునా వడికిపోతూవుంది. భీతి హెచ్చినకొద్దీ అడుగులు తడ బడుతూన్నాయి. తడబడు తూన్నకొద్దీ ఆపాదమస్తకం ముచ్చెమటలు పోస్తున్నాయి. క్రమంగా ఆమెకి వణుకుపట్టుకుంది జంకు మితిమీరింది. దిగులుపుట్టింది. దుఃఖం పొర్లివచ్చింది. ఇలా దురవస్థపడుతూ ఆప దలో హరిస్మరణమే గత్యంతర మనుకుంది. అంతఃపురం వెలువడి ఆకా సంమీద లోకబాంధవుణ్ణి సూర్యుణ్ణి చూచింది. అంజలిబంధం శిరస్సున గీలించింది. "తండ్రీ! పాండవులనే తప్ప అన్యుల తలంచని దాననే ఐతే కీచకుడివల్ల ఏ ఆపదా రాకండా రక్షించు" అని మనసా ప్రార్థించింది.

నిండు దుఃఖంతో ప్రార్థిస్తున్న ఆమెని కాపాడడంకోసం దయ తలిచాడు సూర్యుడు మహా బలవంతుడైన ఓ రాక్షసుణ్ణి సృష్టించి పంపాడు. వాడు ఆకాశమార్గంలో అదృశ్యుడై ఆమెకి అండగా నిలిచాడు. అలా సూర్యుణ్ణి ప్రార్థించి బైలుదేరింది సైరంధ్రి. పెద్ద

పులివున్న పొదలోకి చొచ్చిన లేడిపిల్లలా మెల్లి మెల్లిగా తుదకి సింహ బలుడి మందిరంలో ప్రవేశించింది.

అల్లంత దూరంలో చూశాడు కీచకుడు. గుండెల్లో బాధా, శరీరంలో తాపం తగ్గేటట్టు నాలుగుగ్లాసులు గొంతుకలో పోసుకు న్నాడు వొళ్లు గరిపొడిచింది. తొందరపాటూ హెచ్చింది. సంతోషం పట్టలేక పోతున్నాడు తొడబడి పోతున్నాడు ఎదురు వెళ్ళాలను కుంటున్నాడు. మెళ్ళో హారాలు సర్దుకుంటున్నాడు. అలంకరించు కుంటున్నాడు. ముందూ వెనకలై పోతున్నాడు.

ఇంతలో సైరంధ్రివచ్చి, "అప్పగారికి దాహంగా వుంది. కల్లుకోసం నన్ను పంపించారు ఇప్పించండి" అంది.

ఇంతసేపూ ఆమె మొహంమీదే కళ్లు పెట్టుకుని వున్నాడు కీచకుడు. ఆమె మాటలతో తెలివి వచ్చినట్టయి ఇలా అన్నాడు

"అప్పగారి దాహం తీర్చడానికి వచ్చావు. ఆమె తమ్ముణ్ణి మరి, నా దాహంమాట ఏంచెప్పావు? నీ కడకంటిచూపుల్లేక నాశరీరం దహించుకుపోతున్నాది నీ తియ్యని మాటలకోసం చెవులు తహతహ లాడిపోతున్నాయి నీ విలాసాలు వర్ణించడానికని కోర్కెలు తల్లడిల్లి పోతున్నాయి. నీతో కేళీవినోదాల్లో తేలిఆడడానికి మనస్సు తపించి పోతున్నాది. నువ్వనుగ్రహించకపోతే మరి పరిత్రాణం లేదు నాకు నీకు దాసుణ్ణవుతున్నాను. ఎలుకో ఇంకా ఎందుకూ సిగ్గు చెప్పూ?"

ధీరురాలు సైరంధ్రి ఈమాటలు వినిపించుకోలేదు. తొణకనూ లేదు. "ఆలస్యమైతే అమ్మగారు కోప్పడతారు. ఆసవం ఇప్పించండి. వెళ్లాలి. నాకోసం చూస్తుంటారు" అంది తలవంచుకొని. "పరవా లేదు. కల్లు మరొకరిచేత పంపిస్తాను బలేగావుంటుంది నువ్వుకూడా కొంచెం పుచ్చుకో. నీ ముఖాసవం మాత్రం నన్ను తాగనీ.

ఈ మన్మథ వేదననుంచి నన్ను రక్షించు. రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, నా సర్వసంపదా నీ అధీనం చేస్తాను. రత్నజహ్వారీ మేడలూ, మిద్దెలూ, దాసదాసీజనం అన్నీ నీ పాదాలముందు పడేస్తాను నా వేశ్యలూ, నాభార్యలూ అంతా నీ చెప్పుచేతల్లో తిరిగేటట్టు చేస్తాను నేను నీ దాసుణ్ణే అయిపోతాను. నా వ్యవహారాలన్నీ నువ్వే చక్క పెట్టవచ్చు నా మాట వినుకో. "

అంటూ మోహం ఆపుకోలేక ఆమెమీదికి కలియబడ్డాడు కీచకుడు. తన్ను అంటిపెట్టుకువున్న రాక్షసుడి బలసత్వాలు తనకు సంక్రమించగా సింహబలుణ్ణి అమాంతంగా తోసేసి అక్కణ్ణుంచి పరిగెత్తింది సైరంధ్రి ఆమె భయానికి మేరలేదు. కీచకుడు వెంట పడ్డాడు ఎక్కడికిపోవడం? దైవికంగా ఆ సమయానికి విరాటరాజు కొలువుతీరివున్నాడు అక్కడికే పరిగెత్తిందామె. అసలే గర్వోన్మత్తుడు కీచకుడు ఇప్పుడు కామాతురుడుకూడా కావడంచేత చూస్తూన్న జనాన్ని లెక్క చెయ్యకుండా, రహస్యం బైటపడుతుందన్న సంకోచమూ లేకుండా సైరంధ్రి వెంట పడ్డాడు.

పూలతీగను వెంటాడే మదపుటేనుగులాగ, దేవకన్యను పట్టబోతున్న క్రూరరాక్షసుడిలాగ, నాగకొంగముకోసం పరిగెత్తే రాబందులాగ, మైనగోరపిల్లమీదికి లంఘించే గండుపిల్లిలాగ మహావేగంగా వెంటపడ్డాడు తుదకు ఆమెజుత్తు పట్టుకున్నాడు కోపంతో మండిపడుతూ ఆమెని తన్ని కిందపడవేశాడు.

అంతలో ఆమెకి అండగా వున్న అదృశ్య రాక్షసుడు అమాంతంగా వొక్కటి మోదాడు సింహబలుణ్ణి దెబ్బతో వెల్లకిలా బడ్డాడతడు. పడిన్నీ తన పాటు ఎవరికీ తెలియకుండా చప్పున లేచాడు. ఈ కనబడని దెబ్బకి కళ్లుపచ్చబడ్డాయి. పడుపు తప్పిన నాగుబాములా కోపంతో బుసకొడుతూ నిలబడిపోయాడు.

ఆసమయానికి రాజసభలో కంకభట్టూ, వలలుడూకూడా వున్నారు. సైరంధ్రికి జరిగిన అవమానమూ, కీచకుడి దౌష్ట్యమూ చూసి వలలుడి కళ్ళల్లో చింతనిప్పులు కురిశాయి. ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి అవయవాలదిరాయి పళ్లు పటపటమన్నాయి. కనుబొమలెగిరి ముడిపడ్డాయి మహా భయంకరమూర్తిగా కనిపిస్తున్నాడతడు. భూమ్యాకాశాలుపట్టి తాళాలు వాయిస్తాడా అన్నట్టున్నాడు. కులపర్వతాలు పడగొట్టి ఒకదానిమీద ఒకటి పడేట్టు పదాఘాతం చేస్తాడా అన్నట్టున్నాడు. సప్తసముద్రాలూ ఇక్కడా అక్కడా పెట్టి అడుగు బురద అలుముకుంటాడా అన్నట్టున్నాడు. దిక్కులు నాలుగింటినీ కలియగట్టి పిసికి ముద్దచేసి పిడకలు చేస్తాడా అన్నట్టున్నాడు బ్రహ్మాండ భాండం అమాంతంగా పగలగొడతాడా అన్నట్టున్నాడు ఉగ్రమూర్తి అయి ప్రళయాగ్నిలో పుట్టుకువచ్చినట్టు భీకరంగా కనిపిస్తున్నాడు.

ఇలా మహాకోపాటోపంతో, అజ్ఞాత వాసానికి భంగం వస్తుందన్న మాటా మరిచిపోయి సింహబలుణ్ణి హతమార్చడానికి ఉంకిస్తున్నాడతడు కీచకుడి బంధువూ, అతణ్ణి ఆదేశించవలిసిన వాడూ ఐన విరాటుడుకూడా చంపదగ్గవాడే అని నిశ్చయించుకున్నాడు. ఎదురుగా వున్న ఓ పెద్ద వృక్షాన్ని చూసి సాకూతంగా అన్నగారిదిక్కు చూశాడు.

కనుసన్నతో వారించాడు కంకభట్టు. మరిన్ని గూఢార్థంగా ఇలా అన్నాడు

“ఈ చెట్టే ఎక్కడ కనపడింది వలలుడికి! ఇది కాయలూ పళ్లతో కలకలలాడుతున్నది ఆశ్రితులకు విశ్రాంతి కలిగిస్తూవుంది. వంట కట్టెలకోసం దీన్నే కొట్టాలా? పనికిరానివి మరోచోట లేవు కనకనా!”

కంకుడు సమయస్ఫూర్తిగా చేసిన ఈసూచన మంత్రంలా పని చేసింది వలలుడిపట్ల మండుతూన్న అగ్నిహోత్రం చప్పున చల్లారినట్టయింది. అంత ఉగ్రమూర్తీ యథాపూర్వంలోకివచ్చి వూరుకున్నాడు.

అన్నదమ్ముల ఈవైఖరంతా స్పష్టంగా కనిపెడుతూ మెల్లిగా లేచింది సైరంధ్రి పరాగం పూలతీగలాగ కప్పిన ఆమెదేహం ధూళితో నిండిపోయింది చంపకపుష్పం నుంచి సౌరభం బుగులు కున్నట్టు ముకుపుటాలనుండి వేడినిట్టూర్పులు వెలువడుతున్నాయి. కలువరేకులనుంచి మంచు బిందువులులాగ కనుకొలకులనుండి కన్నీళ్లు రాలుతున్నాయి. చంద్రబింబం మీద కళంకంలా మొహంమీద ముంగుర్లు పడుతున్నాయి. సకలజనవంద్య అయిన ఆ యిల్లాలు అలా కీచకుడిచేత భంగపడి తిన్నగా విరాటరాజు కొలువుమధ్యకి వెళ్లింది. దైన్యంగా నిలబడింది.

తీరనికోపం ఒకవంకా, అజ్ఞాతవాసం భంగపడుతుందన్న భయం వొకవంకా ఆమెమనస్సుని వుర్రూతలూపుతున్నాయి సభా జనాన్ని చూసే మిషమీద భర్తల్ని చురచురా చూసింది. రాజూ, సభికులూ విన్నట్టుగా చలిస్తూన్న కంఠంతో ఇలాఅంది

"ధర్మాధర్మాలు నిరూపణం చేయగల ధీమంతులూ, సాధు రక్షణా, దుష్టశిక్షణా చేయగల సమర్థులూ, విలువిద్యలో సాటిలేని శక్తిమంతులూ, శత్రుసంహారంలో తిరుగులేని శౌర్యవంతులూ ఐన గంధర్వులైదుగురూ నన్నిలా వొకడు అవమానిస్తూ వుంటే చూస్తూ వూరుకున్నారంటే ఏమనుకోను! మరి ఏ ఆడది మానం కాపాడుకుని బతుకుతుందిక! అయ్యయ్యో! ధర్మం విచారించి 'ఇదికూడదు' అన గలవ్యక్తి ఇంతటి రాజసభలోనూ ఒక్కడూ లేకపోయాడు!

"పతివ్రతని. ఏపాపమూ ఎరగనిదాన్ని. ఇంతమందీ చూస్తూ వుండగా కీచకుడు ఇలా చెయిచేసుకుని, ఏస్త్రీని ఎవ్వరూ ఎక్కడా చేయని అవమానం చేస్తూంటే, అయ్యో దైవమా, ఎవరికీ జాలన్నా వేసింది కాదుకదా!

"ఇంతకూ మత్స్యదేశానికి ఈ ఘనప్రభువు ఈయన్నే అనాలి. రాజ్యంలో ఎవరన్నా దుష్కార్యంచేస్తే రాజన్నవాడు విచారించి

దండిస్తాడు ఈయన మిడుతూ మిడుతూ చూస్తూ వూరుకున్నాడు. ఇదెక్కడి రాజధర్మం!''

ఈమాటలు వినిన్నీ సింహబలుణ్ణి ఏమనడానికీ శక్తి లేనివాడు కావడంచేత విచారపడుతూ ఆమెనుచూసి తలవంచుకున్నాడు విరాట రాజు. రోషంతో బుసకొడుతూ నిలబడివున్న సింహబలుణ్ణి మంచి మాటలాడి ఎలాగో పంపించి వేశాడు.

రాజుతోపాటు అక్కడవున్న సభాజనమంతా తలవంచుకున్నారు ''ఇంత లక్షణవతి, ఈమె సైరంధ్రి ఎలా అయిందో!'' అని విచారపడ్డారు కొందరు ''ఇలాంటి శరీరానికి ఈ పాట్లురాశాడు పాడు దైవం!'' అని ఖేదించారు కొందరు ''రాజు కళ్ళ ఎదటే ఎంతపని చేశాడో దుర్మార్గుడు!'' అని నిందించారు కొందరు ''సుదేష్ణ ఉపేక్షే ఈవిడకీ పాట్లు కలిగించాయి'' అని నొచ్చుకున్నారు కొందరు. సభ సభంతా ఇలా గుసగుసలతో విచార పడుతూ నిస్తేజమైంది.

లజ్జా దుఃఖాలతో కుంగిపోతూవుంది కంకభట్టు హృదయం. ఉప్పొంగుతూవున్న రోషాగ్ని నిగ్రహించుకుంటున్నాడతడు లలాటం మీద చెమటబిందువులు తుడుచుకుంటున్నాడు చివరికి ధైర్యం చిక్కబట్టుకున్నాడు. గాంభీర్యం వహించాడు. తన సహజ కంఠ స్వరంతో ఇలా అన్నాడు.

''సాధ్వీ, రాజూ, ఈ ప్రజలూ, అందరూ నీపాట్లు చూడనే చూశారు మళ్ళీ ఈమాటలన్నీ అనడమెందుకు? అంతఃపురానికి వెళ్ళిపో ఇది సమయం కాదని గంధర్వులు వూరుకున్నారేమో! నీకూ వాళ్ళకూ ఏదయినా శపథముందేమో! అందుకే వాళ్ళుమాటాడ రేమో! అంచేత భర్తలనెందుకూ నిందించడం? ఎంతైనా ఆడదన్నది బిడియం విడిచి ఇలా సభల్లో కిందామీదా లేకుండా పెద్దల్ని ధిక్క రించవచ్చా?''

సైరంధ్రి కదలలేదు. ఏదో బదులు చెప్పబోయింది. మళ్ళీ అందుకున్నాడు భట్టు

"బరి దిగిపోయి కులసతుల మర్యాదకూడా కిందుచేసి ఇలా యిక్కడ నాట్యం చేయడం దేనికి? చాలు, వెళ్ళు" అన్నాడు.

దాంతో సాభిప్రాయంగా ఇలా అనేసిం దామె

"కంకభట్టూ, నిజమే నువ్వన్నది. నామగడు నటుడే. పెద్ద వాడిలాగే తక్కినవాళ్ళూనూ, మగలలాగే నేనున్నూ. కనక ఆట కత్తెనేమరి. అంచేత నాట్యం చేయడం కొత్తకాదు నాకు. నామగడు కేవలం నటుడే అనుకున్నావేమో, జూదగాడు కూడాను. జూదగాడి పెళ్లానికి మర్యాదమాత్రం ఎలా తెలుస్తుంది?" అని ఛర్రున అక్కడి నుండి బైలుదేరి రాణివాసం దిక్కు నడిచింది.

"నన్నిలా ఆదుర్మార్గుడి యింటికి పంపించిన ఈజగజంత సుదేష్ణకి ఇదంతా చెప్పి దుమ్మెత్తిపోస్తాను" అనుకుంటూ అంతఃపురం ప్రవేశించింది. అశ్రుసిక్తనేత్రాలతో ఆర్తురాలై, మూర్తీభవించిన దైన్యదేవతలాగ, తడబడుతూ, తూలిపోతూ సుదేష్ణ ఎదటికి వెళ్ళింది.

ఆమెని చూడ్డంతోటే గతుక్కుమనిపోయినట్లు నటించింది సుదేష్ణ. ఏమీఎరగనట్టు కపట విచారం చూపిస్తూ, గొంతుక అదోలా మార్చుకుని అంది

"అయ్యయ్యో, ఏమిటిది? మాలినీ, నీవొళ్లంతా ధూళిధూసరితమై పోయిందేం? ఏడుస్తున్నావు? మొహం చిన్నపోయింది పాపం! ఈ చెమట? నుదుటిమీద జుత్తంటుకుపోయింది! కన్నీళ్ళతో కళ్ళలా అయిపోయాయేమో! ఇదంతటికీ ఏమిటిసంగతి? పాపాత్ముడెవడైనా నీమీదికి సాహసించాడా? చెప్పు, ఆదుర్మార్గుణ్ణి ఇపుడే కొరత వేయిస్తాను. ముక్కముక్కలుగా ఖండింపిస్తాను. వాణ్ణి సర్వనాశనం చేయించేస్తాను. చెప్పు, ఏంజరిగిందో?"

"తెలిసీ, తెలియనట్టు నటిస్తే నేనేం చెప్పేది? ఐనా చెప్తాను వినండి. నన్ను కల్లుకోసం కీచకుడి ఇంటికి పంపించారుకదా! మీమాటప్రకారం వెళ్ళి అడిగాను. అతడు నన్ను చెరపట్టడానికి మీద పడ్డాడు. నేను తప్పించుకుని రాజసభదిక్కు పరిగెత్తాను అతడూ వెంటబడ్డాడు. అంతమందిలోనూ నన్ను జుత్తుపట్టుకుని తన్నాడు" అని జరిగిందంతా చెప్పి వలవలా ఏడ్చింది సైరంధ్రి.

అంతావిన్నది సుదేష్ణ ఓదార్చడం మొదలుపెట్టింది. "విచారించకు ఇప్పుడే వాడికి తగినశాస్తి చేయిస్తాను." అంది ఈ కల్లబొల్లి మాటలు పట్టించుకోలేదు సైరంధ్రి. "మీరంత కష్టపడనక్కరలేదు. నాదుఃఖం, ఊళ్ళోవాళ్ళదుఃఖం అంతా నాభర్తలే తీర్చేస్తారు. చూస్తూవుండండి తొందర పడకండి" అంది.

ఈమాటలకి సుదేష్ణా, తక్కిన పరిజనమూ భయభ్రాంతులయారు ఎంతో ఓదార్చారు. ఎన్నో మంచిమాటలాడారు ఎంత చేసినా స్నానమైనా చెయ్యకండా అభోజనం కూచుంది సైరంధ్రి. ఏంచెయ్యడానికీ తోచక బెంగపెట్టుకు వూరుకుంది సుదేష్ణ. ఈ పాపాత్ముడు చావ వలసిందే అనుకున్నారు తక్కినవాళ్ళు.

అవమానంతో దహించుకుపోతూవుంది సైరంధ్రి తాను పడుకునే చోటికి పోయి పక్కమీద శరీరం వాల్చింది కన్నీళ్ళు చెవికొలకుల్లోనుంచి దిగజారి తలగడ మీద మడుగులు కడుతున్నాయి. దుఃఖం కుమిలి కుమిలి వస్తూవుంది. ఆలోచన మీద ఆలోచన.

"సింహబలుడు బలవంతుడు. వాణ్ణి చంపడం వలలుడికే సాధ్యం" అనుకుంటుంది. దెబ్బతిన్న తాచులా నిట్టూరుస్తుంది. దైవబలాన్ని తలచుకుంటుంది.

ఇంతలో పొద్దుగూకింది. రాత్రిపడింది. క్రమంగా అంతఃపురమంతా నిద్రలో మునిగిపోయింది. అంతటా నిశ్శబ్దం.

తక్కమించి లేచి సైరంధ్రి స్నానం చేసింది ఉతికిన చీరె కట్టుకుంది వంటింటి దిక్కు బైల్దేరింది. గాఢనిద్రలో వున్న వలలుణ్ణి సమీపించింది

"వాడు నన్నంత పరాభవం చేసి, తలపువ్వు వాడకుండా ఇంటికి పోయి, హాయిగా నిద్రపోతూవుంటే—చీమ కుట్టినట్టయినా లేదు నీకు! సుఖంగా నిద్ర పోతున్నావు అన్నగారు వారించినంత మాత్రాన నామీద దయలేకపోయింది కదూ నీకు!" అని మెల్లగా తట్టింది.

"ఎవరది?"

"నేను."

గొంతుక పోల్చి పట్టాడు వలలుడు. ఆమె వచ్చిన కారణం చెప్పన అవగతమూ అయిపోయిం దతడికి.

"కీచకుడి దౌష్ట్యం వర్ణించి, వాణ్ణి నాచేత చంపించాలని వచ్చింది ఈమె నోటే అంతా విందాం" అనుకున్నాడు "ఇంత రాత్రపుడు ఇలా వచ్చావేం? ఎవరూ చూడలేదుకదా!" అన్నాడు.

సైరంధ్రి తెలిసిన్నీ మళ్ళీ నన్నే అడుగుతున్నావు. ఇంతలోనే మరుపు వచ్చిందో! నా నోటితో చెప్పాలి, అంతేనా! సరే. మంచిది. చెబుతాను, విను.

రాజుబావమరిది కీచకుడు అప్పగారికి మొక్కడానికి వచ్చాడు. నన్ను చూసేసరికి వాడికి పిచ్చెత్తింది. తన గొప్పంతా ఏకరవు పెట్టాడు. అసహ్యంవేసి పొమ్మన్నాను. పిచ్చి మరింత తలకెక్కింది వాడికి. కోపంతో కసిరాను. 'దేవతల్లాంటి ఐదుగురు గంధర్వులున్నారు నాకుభర్తలు అమిత బలవంతులు. బలదర్పంతో కళ్ళు పొగరెక్కిన ఎంతటి శత్రువులనైనా హతమార్చడంలో అసమానులు. నా మాట నీ చెలకు పట్టడంలేదు నీమానప్రాణాలు వాళ్ళచేతుల్లో పోవడం మాత్రం తప్పదు' అనీ చెప్పాను. వాడు మరీ బింకాలుపలికాడు.

నేనూ తగిన సమాధానం చెప్పాను. కోపంతో అప్పటికి వెళ్ళిపోయాడు తరవాత పాపాత్మురాలు సుదేష్ణ కల్లుకోసం వాడింటికి వెళ్ళమంది నన్ను. వెళ్ళనని ఎన్ని చెప్పినా ఆ నంగనాచి అన్నిటికీ అన్ని సమాధానాలూ చెప్పింది నిర్బంధించింది. మితిమీరి మొండిపట్టుపట్టడం మంచిదికాదని 'నన్నేవర్యేం చేస్తారు?' అని మీబలాన్ని నమ్ముకుని కల్లుకోసం వెళ్ళాను వాడింటికి. నన్ను చూసిందేతడవు తప్పుడు కూతలు కూశాడు వాడు మీదపడ్డాడు విదిలించుకుని వచ్చేస్తుంటే వెంటబడ్డాడు. మీరున్నచోటికి పారిపో వచ్చాను. ఆ పాపాత్ముడు నిప్పులు కక్కుతూ అక్కడికీ వెంటబడ్డాడు. అక్కడజరిగిన దంతా కళ్ళారా నువ్వు చూడనే చూశావు. మీఅన్నగారి పెద్దతనమూ చూశావు మరేం చెప్పమంటావు?

మీబలమూ, మగతనమూ గడ్డిపోచకు పనికిరాలేదు నిండు సభలో దుశ్శాసనుడు ఆపాట్లు పెట్టాడు. నిర్భయంగా సైంధవుడు ఇంత పనిచేశాడు ఇవాళ ఇంతమంది సభికుల ఎదటా ఇంతపని జరిగింది. దురవస్థ నాకు కొత్తగనకనా!

'ఆవు అరిచినా, ఆడది అరిచినా పరాయివాడైనా పరుగెత్తా' లంటారు. నన్ను కీచకుడు తన్నుతూవుంటే మీఅన్న మిడుతూ మిడుతూ ఎలా చూడగలిగాడా అంటా?

వలలుడు అదికాదు. నెత్తిమీద పిడుగుందని కానకండా కీచకుడు నిన్ను పరాభవించడమూ, నేను కోపంతో మండిపడడమూ చూసిన్నీ మేరుపర్వతమంత ధైర్యశాలి కనక నిగ్రహించుకున్నాడు అన్నయ్య నన్నూ వారించాడు అలా కాకపోతే కీచకుడూ లేదు, గీచకుడూ లేదు. వాణ్ణీ వాడిబావ విరాటుణ్ణీ సపరివారంగా ధ్వంసం చేసేవాణ్ణి నేను. అపు డేమయేదో ఆలోచించు జనం మనల్ని గుర్తుపట్టేస్తారు. అజ్ఞాతవాసం భంగమైపోతుంది. మళ్ళీ పన్నెండేళ్లు అరణ్యా

వాసం వళ్ళీ అజ్ఞాతవాసం ఇదంతా నువ్వూ నేనూ తెచ్చిపెట్టిన ఆపదగా నిందల పాలయ్యేవాళ్ళం అంచేత సత్యవ్రతనిష్ఠుడైన అన్నయ్యను పొగడవలిసిందేకాని నిందించడం తగదు. ఇంతకూ కీచకుడి చావు ఇపుడుమాత్రం ఏమంత మించిపోయిందని? చిటికలో చంపి నీకాళ్ళముందు పడేస్తాను సరేనా! ఒక్కటే, మనల నెవ్వరూ తెలుసుకోకండా ఎత్తువేయాలి. అంతే. వాణ్ణిచంపడంలో ఏముంది? నల్లి

సైరంధ్రి నాకామాత్రం తెలియకకాదు. నాపాట్లన్నీ బూడిదలో పోసినపన్నీరై ఇలా ఒక మూర్ఖుడిచేత మానమర్యాదలు మంటగలిసి పోయాయన్న బాధ హృదయాన్ని కలిచేస్తూవుంది. అంచేత భరించలేక అన్నానేకాని సమస్త జన సంస్తవనీయుడైన మీఅన్నను నిందించాలని కాదు నిజానికి ఆయన ధర్మమే మనల్ని గొడుగై రక్షిస్తూవుంది. మనకేకాదు ప్రపంచానికే అది రక్షరేక. ఆయన సామాన్యుడా? అజాతశత్రువై దిగ్విజయం సాధించాడు రాజమాత్రుడికి సాధ్యంకాని రాజసూయ మహాయజ్ఞం నిర్వహించాడు ధర్మవ్రతంలో అతడి కతడేసాక్షి అనిపించుకున్నాడు. ఒకనాడూ అసత్యమాడిన పాపానపోలేదు. నిత్య సత్యవ్రతుడు. గాంభీర్య ధైర్యాలకు అపరావతారమే ఆయన పరోపకారపరాయణుడు. దయాసముద్రుడు వంశోద్ధారకుడు. కీర్తిమంతుడు కలిమికి తగినత్యాగం, బలిమికి తగిన బలగం ఆమహానుభావుడిది లోకం ఆశ్చర్యపడేట్టు జీవించడం అతడికే చెల్లింది.

ఆయన చరిత్ర ముల్లోకాలకూ ఒరవడి పెడుతుంది. ఆయన కడకంటి చూపు వాలినచోటల్లా బంగారమే కురిసింది. ఆయనకీర్తి సప్తసాగరాలూదాటి పయనించింది ఆయన ప్రతాపదీప్తి శత్రువుల గర్వాంధకారం పటాపంచలు చేసింది. ఆయన పాదాలమీద వాళ్ళ కిరీటరత్నాల కాంతులు తళతళలాడాయి దేశదేశాల రాజులతో ఆయన వాకిలి నిరంతరం కిటకిటలాడింది. ఏనుగుల మదజలంతో

పంకిలమై, రాజుల రత్నభూషణాల రజస్సుతో అడగారుతూవుండే ఆవాకిలి ఎవరెరగరని !

అంతటి మహనీయుడు ఇవాళ కూటికీ గుడ్డకీ ఒకణ్ణి ఆశ్రయించి చెప్పినపనల్లా చేస్తూ వూరూ పేరూ లేకండా బదుకుతున్నాడంటే నాకడుపు చెరువై పోతూ వుంటూంది.

నువ్వుమాత్రం సామాన్యుడివా ! ప్రపంచభారాన్నే భుజాల మీాద ధరించగలవాడివి భూభారం వహించిన కులపర్వతాలికీ దిగ్గజాలికీ, నాగకూర్మాలికీ నిజంగా నీకుడిభుజం ఊరటపట్టు నీ పలుకే భూజనానికి పండుగ. నీకనుబొమలు ముడిపడితే పగవారికది కాల పాశమేకదా ! విశ్వవిజయాకరములూ, లోకభీకరములూ అయిన నీ చేతులలోనేకదా బకుడూ, హిడింబుడూ, కిమ్మీరుడూ, జరాసంధుడూ హతమైపోయారు. అలాంటి నువ్వు వంటకట్టెల కోసం బల ప్రయోగం చేస్తూవుంటే చూసి నాలోనేను కుళ్ళిపోతున్నాను.

అదీకాక, విరాటుడు వేడుకకోసం ఏనుగూ, ఎనుపోతూ, పెద్ద పులీ, మదపుటేనుగూ మొదలైన జంతువులతోనూ, ముష్కరులైన మల్లులతోనూ అదేపనిగా నిన్ను పోట్లాడిస్తూవుంటే,—'జగన్మాన్యమైన నీ మహనీయ శరీరం ఇలా నీచక్రియకు పాలు పరిచాడుకదా పాడుదైవం' అని కుంగిపోతాను. నీ పోట్లాట వినోదంగా చూచేందుకు రాణివాసం కాంతల్ని రమ్మంటాడు విరాటుడు సుదేష్ణవెంట నేనూ వస్తాను. నువ్వు కష్టంగా పోట్లాడేటపుడు దుఃఖపడతాను. గెలుచుకున్నపుడు ఆనందిస్తాను. అలాంటపుడు నన్నుచూసి సుదేష్ణా తక్కిన పరిచారికలూ గుసగుసలు మొదలుపెడతారు. తదేకదృష్టితో నిన్ను చూస్తూనే ఏమరుపాటుగా వాళ్ళసంగతి కనిపెడతాను నేను.

'వలలుణ్ణి మాలిని ఎలాచూస్తోందో ! ఏళ్ళిద్దరికీ ఏదో సంబంధం వుండేవుంటుంది. ఏళ్లురావడమూ ఒక్కసారే వచ్చారు. ఏ పుట్టిలో

ఏపాముందో!' అంటూ, అవుననీ కాదనీ గొణుగుకుంటారు. అందుచేత నిజమే, నా పరాభవానికి నువ్వు ఉద్రేకిస్తే ప్రజలు మనల్ని గుర్తు పట్టేస్తారు కాబట్టి రహస్యభంగం కాకండా నీకు నచ్చినవిధంగా వాడిపని పట్టించు.

ఇక మీపెద్దతమ్ముడు-ఎదిరిస్తే ఈశ్వరుణ్ణి పీకగొట్టగల శౌర్య శాలి ఇంద్రుడి అర్ధాసనానికి అర్హుడైన మహనీయుడు. యముడింట్లో చొచ్చిన వాణ్ణయినా తలుచుకుంటే రక్షించగల సమర్థుడు ఊర్వశి అంత అందకతె వలచివస్తే చలి చని ధీరుడు ఇందులో ఏవొకట్టి వున్నా చాలు, లోకం జేజేలు పడుతుంది అలాంటివి ఇన్నీకల మహా మహుడు, భరతకుల దీపకుడు, సురపతి కుమారుడు, తేజోనిధి, విద్యా పారగుడు, మానధనుడు. ఇంతటివాడూ ఎంతటిపాట్లు పడుతున్నాడు పాపం! రంగంలో నిలబడి ఆడపిల్లలికి నృత్యం నేర్పుతూ బతకడం ఎంతదైన్యం! చూస్తే గుండె తరుక్కుపోతుంది. దేవేంద్రుడంతటి వాడి కొడుకు కడుపుకూటికి నీచప్పని చేయడం! తలరాత ఏం చెయ్యాను గనక! 'ఇంతటి మేటి మగడికి పేడితనం రాసిపెడతావా' అని దైవాన్ని తిట్టుకుంటాను. పెల్లుబికేవ దుఃఖంతో నాలో నేను కుసిల్లిపోతాను ఈ నరకంలోనుంచి ఎప్పుడు బైటపడతామా అని మొత్తుకుంటాను-ఏం చెయ్యనూ?

మరి నీ రెండోతమ్ముడు!—ఎదురైనవాళ్లు తిరిగి తిరిగి తన్ను చూడదగినంత అందకాడు తనవర్తనం విని మునులైనా అనుకరించ దగినంత శీలవంతుడు రణంలో తనబంటుతనంచూసి శత్రువులైనా పొగడదగినంత పరాక్రమశాలి. తన వితరణం విని కల్పవృక్షం కూడా తలవూపదగినంత దానశీలుడు-ఇంతటివాడు అశ్వపాలకుడై దుస్థితి పాలవుతూవుంటే ప్రతిదినంచూసి కన్నీళ్ళు మింగుతూ కుమిలిపోతాను.

మీచిన్నతమ్ముడుమాత్రం!—మచ్చలేని అరూపం, గర్వంలేని

అభుజబలం, దయామిశ్రితమైన ఆశూరత్వం ప్రాణికూల వాదరహిత మైన అవిజ్ఞానం, ఉదాత్తమూ, సన్మానజనకమూ ఐన ఆత్మాగం—దేనిలో తక్కువని! ఎండకన్నెరగని సుకుమారుడు, పాపం! సొమ్మలు కాపరికారిగా ఎండనక, వాననక, గట్టనక, పుట్టనక, అడవులపాలై తిరుగుతూ వుంటే నాకే అన్నమాటేమిటి, పగవాళ్ళకైనా గుండె తరుక్కుపోతుందికదా!

మనం అరణ్యావాసానికి బైద్దేరేముందు అత్త కుంతీదేవి అతణ్ణి నాకు అప్పగించి, 'అమ్మా, నిన్ను నమ్ముకొని చిట్టిబాబుని అడవికి పంపిస్తున్నాను' అంటూ బావురుమని కంట తడిపెట్టుకుంది. 'పసి వాడు. అవునూ కాదనలేడు మంచీ చెడ్డా ఎరగడు వెన్నలాంటి మనస్సు. నేనే పిలవాలికాని 'ఆకలి' అని చెప్పడం ఎరగడు. ఇలాంటి నా కూన అడవికి పోతున్నాడంటే కడుపు చెరువైపోతోంది ఐతే నువ్వున్నావుకదా అని కుదుట బడుతున్నాను. నాబాబుకి ఎప్పుడేం కావాలో వెయ్యికళ్లతో కనిపెట్టాలి తల్లీ, నీ మేలు మరచిపోను' అని నాచేతిలో పెట్టిందతణ్ణి. వనవాసం పన్నెండేళ్ళూ మీచిట్టితమ్ముణ్ణి అలాగే చూసుకుంటూ వచ్చాను. ఇపుడు అజ్ఞాతవాసంలో ఇన్ని పాట్లు పడుతున్నాడు పాపం! ఏమీ చెయ్యలేక కుంగిపోతున్నాను. ఇక నా మాట—కోడకులకంటే ముద్దుగా, అరిచేతినిమ్మపండులా పెంచాడు మాతండ్రి ద్రుపదమహారాజు. కోడళ్లందరినీ ఒక ఎత్తూ, నన్నొక ఎత్తూ చూసుకుంది అత్త కుంతీమహాదేవి మీ ఐదుగురూ ప్రాణాలకంటే అధికంగా ఆదరించారు. కన్నతల్లిలా భావించారు ప్రజలు. బంగారం కొండల్లాంటి ఐదుగురు కొడుకుల్ని కన్నాను. భరత వంశంలో నా ఇల్లే ఇల్లు అనిపించుకున్నాను. బంధుజనంచేత ప్రశం సలూ పొందాను రాజసూయమహాయజ్ఞంలో ముక్కోటి దేవత లనూ తృప్తిపరిచాను. వారి అనుగ్రహమూ సంపాదించాను. కల్యా

ణాత్మనీ అయాను. పుణ్యావర్తనలో నా అంతది లేదని మహారాణుల కైవారాలందుకున్నాను. ఇలాటి నేను ఇలా దుఃఖపడుతూ, నీచత్వానికి ఒడబడి. జానెడుపొట్టకోసం పనికత్తెనై సుదేష్ణ కనుసన్నలలో చెప్పిన నీచప్పనులన్నీ చేస్తూ కుళ్లిపోతూవుంటే మీ రాతిగుండెలు ఇంతయినా కరగడంలేదు. ఏం చెయ్యనూ! పదిమందికి చెప్పి చేయించుకున్నానే కాని ఒకర్తె పనిచేసి ఎరగను. ఏదన్నా చెప్పవలసివస్తే జంకుతూ జంకుతూ, పనినేర్పించే మిషపెట్టి చెప్పేది మీతల్లి, నీకు తెలుసుకదా! ఆమెదగ్గిర ఓనాడూ భయపడలేదు నేను మీదగ్గిరా భయపడలేదు. నిజానికి దేవుడన్నా భయంలేదు నాకు. కాని, కలుపాత్ములాలు ఈసుదేష్ణ దగ్గిరమాత్రం పనిపాట్లల్లో గడగడలాడిపోతాను నేను. రాజూ రాణీలకు నేను తీసిందే కాని మరొకళ్లు తీసిన గంధం నచ్చదుకదా! చెమటలు కక్కుకుంటూ అంతగంధమూ నేనే తీస్తాను. మళ్లీమళ్లీ మెత్తగా నూరతాను. మీ అమ్మ కుంతీదేవికిరాసినట్టు భయభక్తులతో సుదేష్ణకు రాస్తాను. నా ఖర్మాన్ని తిట్టుకుంటాను.

మెత్తగా నలుగు నూరినూరి, చందనం తీసితీసి, కొత్తకొత్త కలపాలు తీర్చితీర్చి, ఆమెచెప్పిన పనల్లా చేసిచేసి — చూడు, ఎలా కాయలు కాసి పోయాయో నాచేతులు!

అంటూ రెండుచేతులూ చూపించి, వలలుడి గుండెలమీద మొహం పెట్టి వెక్కివెక్కి ఏడ్చింది అతడిహృదయమంతా అశ్రుసిక్తమైంది. ఆమెతోపాటు అతడూ దుఃఖించాడు జగదేకవీరుడైన అతడి నేత్రాలనుండి కన్నీళ్లు ఆమెశిరస్సుమీద రాలాయి. ఎట్టకేలకు ఆపుకున్నాడు. ఆమెకన్నీళ్లు మునివేళ్ళతో తుడిచాడు శిరస్సునిమిరి ఓదార్చాడు. ఆమె రెండుచేతులూ తీసుకొని మొహంమీద పెట్టుకున్నాడు. నిట్టూర్చాడు. ఉబుకుతూవున్న దుఃఖం తలమునక

లొతున్నది. అతడి అవస్థ చూసి పైటకొంగుతో మెల్లి మెల్లిగా అతడి కన్నీళ్లు తుడిచింది సైరంధ్రి.

"ఇంతమందిమీ ఇన్ని బాధలు పడడానికి ఒక్క మీఅన్నే కదా కారణం! జ్ఞాతులు పన్నిన మాయజూదంలో పడి మన కులానికే ఈపాట్లు తెచ్చిపెట్టాడాయన.

"అయ్యో, అడిఆసలు పెట్టుకుని చావకుండా బతుకుతున్నాను నేను. ఏంచెయ్యనూ! ఏనాడెవర్ని ఏబాధలు పెట్టానో! అనుభవించక ఎలాతీరుతుంది! అదేకాకపోతే మీకంఠంలో ప్రాణాలుండగా ఒక మూర్ఖుడు ఇలా నిండుసభలో జుత్తుపట్టుకు తంతాడా నన్ను!

"మీరు మాత్రం ఏంచేస్తారు! ఇదంతా ఖర్మ! చేసుకున్నది అనుభవించక ఎలాతీరుతుంది? కాబట్టి మీ అభ్యుదయంకోసం ఈకష్టాలెలాగో సహించుకుంటాను దానికేం, కాని కళ్లు పొగరెక్కి ఎంత చెప్పినా వినక చెరపట్ట చూస్తున్నాడీ దుర్మార్గుడు ఏందారి? ఇదిగో, నువ్వు వాణ్ణి హతమార్చకపోతే మాత్రం, మరి నాఆశ వదులుకోవలిసిందే మీరు. నుయ్యో, గొయ్యో చూసుకుంటాను. విషమన్నా తాగేస్తాను. నీకళ్లముందే వురిపోసుకుంటాను. నిజం, నీమీద వొట్టు పెట్టుకు చెబుతున్నాను" అంది.

ఆమెతల నిమురుతూ చిన్నమందహాసం చేశాడు వలలుడు. "వాణ్ణి చంపడంకోసం వొట్టుకూడా వేసుకోవాలీ? నాకళ్లముందు నిన్ను పరాభవించిన వాడు మళ్ళీ బతికిపోడం కూడానా? వాణ్ణప్పుడే చంపకపోయిన తప్పేచాలు నాకు. ఇంతెందుకు నిజంచెబుతాను విను. ఆరు మూడయేది, మూడు ఆరయేది, రేపు రాత్రిమాత్రం వాడి చావు తప్పదు. స్వయంగా అన్నగారే వచ్చి అడ్డుపడ్డా సరే, నువ్వే వచ్చి జాలిగా బతిమాలుకున్నాసరే వాణ్ణి చంపడం మానను. ఇది శపథమే అనుకో. అంచేత ఆచింత మరిపెట్టుకోకు" అన్నాడు.

ఆమె విచారం కొంత తగ్గించాలని మళ్ళీ అందుకున్నాడు: "పూర్వం సుకన్యా, సీతాదేవీ, లోపాముద్రా, దమయంతీ అడవుల్లో ఎన్ని బాధలు పడ్డారు! అన్ని బాధలూ నిగ్రహించి తుదిని సుఖపడ్డారు కదా! అలాగే నువ్వూ ఈ కష్టాలు గట్టెక్కి మహావైభవం అనుభవిస్తావు. దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని, సైంధవాదులైన దుర్మార్గుల్ని ప్రేతలోకానికి పంపే వరకూ నిద్రపట్టదు నాకు. అవమానంతో కుంగిపోతూవుంది నాహృదయం కోపంతో దహించుకు పోతూవుంది. కౌరవుల దినాలు దగ్గిరపడుతూన్నట్టే అజ్ఞాతవాసంకూడా దగ్గిర పడుతోంది. పదకొండు నెలలు గడిచాయి. పన్నెండో నెలనడుస్తోంది. ఇది తీరగానే నీకష్టాలూ తీరపోతాయి కీచకుడి పని రేపు పట్టిద్దాం. నువ్వు ఒప్పబడినట్టే నటించు నర్తనశాల సంకేతంగా ఏర్పర్చు వాణ్ణి అక్కడికి ఒంటరిగా రమ్మను రాగానే అయ్యగారి పని పట్టిస్తాను. నిన్ను మెప్పిస్తాను దీనికి తప్పించి మరోమార్గం లేదు. – అదిగో తెల్లవార వస్తోంది జనం మేల్కొని చూశారా అంటే మన రహస్యం బైటపడుతుంది. కథ అడ్డం తిరుగుతుంది. నీ పక్కమీదికి వెళ్ళిపో" అని చెప్పి ఆమెని కొన్ని అడుగులు దిగబెట్టి తిరిగి వచ్చాడు. తన పక్కమీద శరీరం వాల్చాడు.

తన పడకచోటికి వచ్చింది సైరంధ్రి. మనస్సంతా కలత కలతగావుంది. పక్కమీద కళ్ళుమూసిందేకాని నిద్రరావడంలేదు.

ఇంతలో పరాభవ దుఃఖంతోవున్న సైరంధ్రిని చూసినిట్టూర్పు విడిచినట్టు, వికసించిన పద్మాలలోంచి సౌరభం వెలువడింది. చీకట్లు విడిపోయాయి. పద్మవనాల్లోకి తుమ్మెదలు చొరవడ్డాయి. లతల్లోంచీ చెట్లలోంచీ పువ్వులు రాలిపడ్డాయి తమ విరహవేదన చకోరాలు కలువల కంటగట్టాయి. సుఖంగా ఒకళ్ళనొకళ్ళు పెనవేసుకు నిద్రపోయిన దంపతులు మేల్కొన్నారు. కిటికీలలోంచి మెల్లిమెల్లిగా

వీస్తున్న వేకువపిల్లగాలుల తాకిడికి కోర్కెలు గిలిగింతలు పరిచాయి వాళ్ళని. పరస్పరం ప్రేమగా చూసుకున్నారు వాళ్లు వలపు మొలక లెత్తగా తిరిగి సుఖకేళిస్నీ అనుభవించారు. వెరటి కొలనులలోని పద్మాల పరిమళమూ, తమ నిట్టూర్పుల సౌరభమూ వారి శరీరాల స్వేదగంధం తుడిచివేశాయి. చుక్కలన్నీ మాసిపోయి, పువ్వులు దులిపి శుభ్రపరిచిన పక్కలా వుంది ఆకాశం భళ్లున తెల్లవారింది. పద్మాల తపః ఫలమో అన్నట్టు తూరుపుకొండమీద సూర్యోదయమూ అయింది.

తెలతెల వారగానే నిమిషాలమీద కాల్యకృత్యాలు తీర్చు కున్నాడు సింహబలుడు లిప్తలమీద సర్వాభరణాలూ సింగారించు కున్నాడు సైరంధ్రికోసం మనస్సు పట్టపగ్గాలు లేకండా వుంది మోహంతో తడబడిపోతున్నాడు ఒకటీ వినబడ్డంలేదు. ఒకటీకనబడ్డం లేదు కాలహరణం చెయ్యకుండా సుదేష్ణ మందిరానికి బైలుదేరాడు.

"వెళుతూనే దాన్ని చూస్తాను. మచ్చికమాటలాడి మరులు పుట్టిస్తాను. వశపరచుకుంటాను ఒడుపుగా కౌగిటిలోకి లాక్కుంటాను. బ్రహ్మానందం అనుభవిస్తాను" దారికడాకూ ఇలా ఉవ్విళ్ళూరుతూ రాణివాసంలో ప్రవేశించాడతడు.

పనిపాట్లలో మునిగివుంది మాలిని. చూశాడు కీచకుడు ఎక్కడలేని సంతోషమూ పుట్టుకువచ్చింది మంచీ చెడ్డా విచక్షణ మాయమైంది. చుట్టుపక్కల జనం వున్నారన్న జ్ఞానం హరించి పోయింది. కిరాతుడి మాటులోకిపోయే మృగంలా తిన్నగా ఆమె దగ్గిరికే వెళ్ళాడు. చూసీ చూడనట్టు నటించింది సైరంధ్రి. జంక సన్నా జంకలేదు వలలుడి మాటలు మననం చేసుకుంటూ తన పనేమో తానేమో అన్నట్టుందామె.

ఎవ్వరినో పిల్చి ఏదో అంటున్నాడు కీచకుడు. కాలి బొటనవేలు కిందరాస్తున్నాడు. వికారంగా వొళ్లు విరుచుకుంటున్నాడు. ఊరికే వెకిలిగా నవ్వుతున్నాడు. చేతితో తాళం వేస్తున్నాడు కూనిరాగాలు తీస్తున్నాడు. ఈలవేస్తున్నాడు. తుదకి మెల్లిమెల్లిగా ఆమె దగ్గరగానూ చేరాడు. 'కన్నెత్తి చూడదేం!' అని ఇదయిపోతున్నాడు. తడబడిపోతున్నాడు. రెప్పవాల్చక ఆమెనే చూస్తున్నాడు. ఇంకా దగ్గిరికి జరిగాడు.

"ఇదిగో చూడూ, ఎప్పుడూ నీ చివురుపాదాలు సేవించే యోగ్యత కలగడమంటే నిజంగా భాగ్యమేసుమా!" అన్నాడు. "అయితే నన్నే వొల్లకుండా ఇలా ఏడిపిస్తున్నావా, లేకపోతే కామ సౌఖ్యాల వైరాగ్యమే పుచ్చుకున్నావా? నాలాంటి వాణ్ణి కొంచెం దయతలిస్తే నీసౌభాగ్యం సన్నగిల్లి పోతుందా, చెప్పూ?

"అమాయకురాలివి కాదని నాస్నేహమెందుకు తోసేస్తావు? నన్నేలుకో. అఖండవైభవంతో తులతూగు. అష్టయిశ్వర్యాలూ అనుభవించు మాపట్నంలోని స్త్రీలందరూ నీపాదసేవ చేస్తారు.

"మహాయుద్ధాలుచేసి రాజులనందరినీ చిటికలో వీగగొట్టాను. ప్రజాకోటిని నావైభవంతో ఆదరిస్తున్నాను. ఈరాజ్యపరిపాలన యావత్తూ నేనే సాగిస్తున్నాను. పేరుకిమాత్రం విరాటుణ్ణి రాజుగా పెట్టి ఇంతకూడు పడేస్తున్నాను. విన్నావూ, అంచేత ఒక్క నిన్నే కాదు, పదివేలమందిని నేను చెరపట్టినా 'కూడదు' అని అడ్డుచెప్పే మొనగాడెవడూ లేడిక్కడ. విరాటుడి ఎదటే అంతమందీ చూస్తుండగా నిన్ను తంతే 'కాదు, కూడదు' అని ఒక్కడైనా కిక్కురుమన్నాడూ? కొమ్ములు తిరిగిన మొగుళ్లు ఐదుగురున్నారన్నావు. వారిసంగతి అప్పుడే చూసేశాను. మరెవ్వరున్నారు? నువ్వెక్కడికి వెళ్ళినా మరి విడిచి పెట్టను. ఎలా తప్పించుకుంటావో చూస్తాను" అన్నాడు.

"సుతిమించే వున్నాను. తొందరపడి కలియబడ్డావా ప్రమాదం తప్పదు" అనుకుంది సైరంధ్రి. అతని మాటలు విని మెత్తబడ్డట్టు నటించింది. ఒడబడి పోయినట్టు కళ్ళెత్తి చూసింది. మనసిచ్చి మాటాడినట్టూ మొదలు పెట్టింది.

"కూడదని ఎంత చెప్పినా మాటిమాటికీ తొందర పడిపోతు న్నావు. ఎదటి వాళ్ళ మనస్సుకూడా ఇదవుతూ వుంటుందని గ్రహించ లేకపోతున్నావు. ప్రణయంపేర బరిదిగిపోడం మంచిదేనా! కోర్కె పుట్టింది కదా అని మంచీచెడ్డా అక్కర లేదా! మగవాళ్లు ఆపుకోలేక, తామేమో తమవలపేమో చూసుకుంటారు. ఎంతకలిగినా ఆడది అణుచుకుంటుంది ధైర్యంచిక్కబడుతుంది తొందరపడిపోదు అంచేత రహస్యభంగంకాకుండా కోర్కె తీర్చుకోడం మంచిదంటాను" అంది.

## స ం కే త ం

ఈ మాటలు అమృతసోనల్లాగ మైకం కలిగించాయి కీచకుడికి. ప్రపంచాలు జయించినంత సంతోషంగావుందతడి కిప్పుడు

"నీమీద మోహం నన్ను మతిలేకుండా చేసింది. ఇదంతా ఆలోచించడానికి నాకు ధైర్యముంటేనా! నన్నిన్ని బాధలు పెట్టావు. నువ్వేలాగ చెబితే అలాగే చేస్తాను. ఎప్పుడు, ఎక్కడ, ఎలా కలుసు కోడమో సంకేతం నువ్వే నిర్ణయించుమరి!" అన్నాడు.

"ఇంకేముంది, ఎలక బోనులో పడింది" అనుకుంది సైరంధ్రి. నిజంగా ప్రేమ కుమ్మరిస్తున్నట్టే మళ్ళీ అందుకుందామె. "నర్తన శాల. ఉత్తర మొదలైనకన్యలు పగలు నృత్యంచేసి వెళ్ళిపోవస్తారు. రాత్రిళ్ళు రహస్యకార్యాలు నెరవేర్చుకునేవాళ్ళ కది ఆటపట్టుగా వుంటుంది. ఇవాళే, రాత్రి మాటుమణిగిపోయేక. నువ్వు వొంటరిగానే రావాలి. నా అభీష్టం తప్పక నెరవేర్చుకుంటాను" అంది.

భూమిమీదే వున్నాడో, ఆకాశంమీదే వున్నాడో నిర్ణయించుకోలేనంత ఉషారుకలిగింది కీచకుడికి "ఓ, ఈమాత్రం దయ చూశావంటే, నువ్వేం చెయ్యమంటే అదేచేస్తాను. నువ్వీమాట మీద నిలబడాలి సుమా మరి" అన్నాడు.

తలవూపింది సైరంధ్రి "నువ్వు ఒక్కడివే రావాలి రెండో కంటివాడికి మనసంగతి తెలియకూడదు. అలాకాకపోతే ఒక్కనిమిష మైనా నిలబడనక్కడ. మరివెళ్ళు. మనమిలా మాట్లాడుతూవుంటే బావుండదు. ఎవరన్నా పసికట్టేస్తారు. ఇంకా ఏన్నో పనులూ వున్నాయి నాకు" అంది. ఎక్కడలేని సంతోషంతో, మాట్లాడకండా యింటికి వెళ్ళిపోయాడు సింహబలుడు.

పనిపాట్లు ముగించుకుంది సైరంధ్రి సమయం కనిపెట్టి వంట శాలకు వెళ్ళింది. వలలుణ్ణి చూసి వికసించిన మొహంతో ఇలా అంది "నాపని నేను ముగించాను. ఇకనీపనే మిగిలింది. పిట్టకన్నా తెలియకండా వాడిపని కాజెయ్యడానికి చీకటి రాత్రి కూడా బావుంది."

మందహాసం చేశాడు వలలుడు. "సరేకాని, ఆనీచుడూ నువ్వూ ఏమిటి మాట్లాడారో ముందుచెప్పు" అని అడిగాడు.

తాను పనిచేసుకుంటూ వుంటే సింహబలుడు సింగారించుకుని రావడం, రాత్రిమాటలు తలుచుకుంటూ తాను తొణుకూ బెణుకూ లేకండా వుండడం, సామ దాన భేద దండోపాయాలు చూపి వాడు మాటాడడం, తాను వొడబడి నట్టు నటించి, నాట్యశాల సంకేతంగా చెప్పి ఒంటరిగా రమ్మనడం, దాని కతడు సమ్మతించి వెళ్లడం—అంతా పూసగుచ్చినట్టు చెప్పింది సైరంధ్రి.

మహానందం కలిగింది వలలుడికి "ఎలా కసి తీర్చుకోవడమా అనే బాధపడుతున్నా నింతసేపూను. శుభవార్త తెచ్చి బ్రహ్మానందం కలిగించావు. అసాధ్యమైన సమస్య ఇట్టే గట్టెక్కించావు అన్నగారు

మెచ్చుకున్నట్టు కార్యసాధన చేయఃక్షమంటే ఇనపగుగ్గిళ్లు నమలడమన్న మాట!

"ఇంతకూ అన్నప్రకారం వస్తాడో రాడో! వచ్చినా వొంటరిగా వస్తాడో, ఎవళ్ళనైనా వెంటబెట్టుకువస్తాడో! వెర్రి వెర్రి వేషాలు వేసి రహస్యం చెడగొడతాడేమో! ఐనా నువ్వు నచ్చినట్టు చెప్పావు కదా! వాడికులుకూ, మూరాడకపోవడం చూస్తే వాడికి సందేహామే కలగలేదనాలి. అంచేత తప్పకండా వస్తాడు. మదించి వున్నాడాయె, ఒంటరిగానే వస్తాడు. నర్తనశాలలో ప్రవేశించి నీకోసం వెదుకుతాడు. నన్నుచూస్తాడు పోట్లాడతాడు. నా చేతుల్లో చస్తాడు. నువ్వు సంతోషిస్తావు. అంతే. దీనికి తిరుగులేదు మరింకా ఆలోచనెందుకూ! అయ్యగారు కొవ్వెక్కి వున్నాడు. మదనోన్మాదంతో వస్తాడు. నీకోసం తడివితే నేను దొరుకుతాను రసికుడికి. పాపం, తెల్లబోతాడు, ఆ తెల్ల మొహంమీద నర్తనశాల అదిరి పోయేటట్టు ఒక్కటి వేస్తాను, పెద్దపులినిగానే బాణంతో తీసికొట్టి నట్టు. తెలిసి పరిగెత్తాడా, కాకిమీదికి పోయిన డేగలాగ వెంట దరిమి పట్టుకుంటాను పిప్పి పిప్పిచేసి నలగ్గొడతాను. ఆలా కాకండా, నాతో సమానమైన భుజబలమే వాడిలో వుండి, నామీదికి చెయిచేసుకుని, నాకు మరింత కోపం తెప్పించాడా—భూమీ ఆకాశాలు గడగడలాడు పోయేటట్టు, దిక్కులు కంపించేట్టు, సముద్రాలుకలగుండు పడేట్టు, కులపర్వతాలు అల్లాడి పోయేట్టు నా రౌద్రమంతా చూపి వాణ్ణి చిత్రవధ చేస్తాను" అన్నాడు.

అతడి తీవ్రకోపం రహస్య భంగానికి కారణ మౌతుందని భయపడింది సైరంధ్రి. "నేను తెచ్చిపెట్టిన ఈ కయ్యానికి నువ్విలా ఉగ్రుడవే ఐతే అది మనరహస్యానికి భంగం కలిగిస్తుంది. మన కార్యం సఫమే అయినా అది దుష్ఫలంసే అవుతుంది పరవాళ్ళ గోనా సగు శాట్లు,

మీ అన్నయ్యా బాధపడతాడు. లోకులూ నిందిస్తారు. కాబట్టి రహస్యం చెడకండా వీలైతేనే ఈపనికి పూనుకుందాం. లేకుంటే వద్దు" అంది.

వలలుడు మదించి వాడు నన్నెదుర్కొన్నపుడు, బాహాబాహీని ఇద్దరమూ పోట్లాడుతూ వుంటే, రహస్యం గిహస్యం నాకు జ్ఞాపకం వుంటాయా! ఐనా వీలైనంతవరకూ ప్రమాదం రానివ్వను. సరేనా!

సైరంధ్రి అలాగే చెయ్యాలి. ఎంతమాత్రమూ ప్రమాదం రానివ్వకూడదు. ఇక వెళతాను. ఎంతసేపయో వచ్చాను ఆలస్యం చెయ్యకూడదు. సుదేష్ణ నాకోసం వెదుకుతుంది. వస్తాను.

ఇలా చెప్పి వెళిపోవచ్చింది సైరంధ్రి. చెయ్యబోయే కార్యం మననం చేసుకుంటూ వంటలో నిమగ్నుడయ్యాడు వలలుడు.

అక్కడ సింహబలుడు మన్మథ వేదనతో కొట్టు మిట్టాడిపోతూన్నాడు. పరిజనాన్ని ఎవర్నీ దగ్గిరకి రానీయకండా ఒక ఏకాంతస్థలం ఏర్పర్చుకున్నాడు. సైరంధ్రి చక్కదనం భావించుకుని భావించుకుని, ఆమె రూపురేఖలు తలచుకుని తలచుకుని, ఆమె వయ్యారం ఊహించుకుని ఊహించుకుని, ఆమెమాటలచాతుర్యం మననంచేసుకుని మననం చేసుకుని, రేగుతూన్న కోర్కెలతో పెనగులాడి పెనగులాడి—తుదకు తన మనస్సు తన స్వాధీనం తప్పిపోతూవుంటే—నానా హంగామా అయిపోతూ వున్నాడు. చలించిపోతున్నాడు. బాధపడిపోతున్నాడు. ఖేదిస్తున్నాడు. నిట్టూరుస్తున్నాడు. ఉసూరుమంటున్నాడు. శరీర మంతా అవశమైపోయి నిరాశ పడిపోతున్నాడు. ధైర్యం తూలిపోయి బెగ్గడిల్లిపోతున్నాడు మతిచెడిపోయి ఏదేదో చేసేస్తున్నాడు. విభ్రమావస్థలో పడిపోయి ఏడ్చేస్తున్నాడు. పిచ్చిపిచ్చి ఊహాలతో మేడలు కడుతున్నాడు.

"చెప్పినట్టు సైరంధ్రి వస్తుందా? వచ్చి, నిన్నటిలా తోసెయ్యక నన్ను పొందుతుందా? తీరా రాబోయేసరికి మరేదీ ఆటంకం

రాదుకదా! గంధర్వులు ఐదుగురు వున్నారంది. కొంపదీసి నిజం కాదుకదా! దాని తొట్రుపాటుచూసి సుదేష్ణ వినోదానికని మరేపనో చెప్పి ఆపెయ్యదుకదా! మాయలూ మర్మాలూ నేర్పి మన్మధుడు సమయానికి రాకండా చెయ్యడుకదా! అప్పటికి తప్పించుకుందామని అలా చెప్పి నన్ను పంపించెయ్యలేదుకదా! అదే నిజమై ఈరాత్రి రాకనే పోయిందా మరినేను బ్రతకడంకల్ల. ఏమిటి సాధనం?" అని విసవిస పోతాడు.

"అలా ఎందుకు రాకపోతుంది! అంత క్రూరాత్మురాలా! నాలాగే అదీ వలపుతో విలవిల లాడిపోతూ వుంటుంది. ఇంతకీ దాని నిజానికి నిలకడేమిటి? అనవసరంగా ఇలా బాధపడిపోడం కంటె జవాబూ గివాబూ లెక్క చెయ్యకండా వెళ్ళి ఎత్తుకువస్తాను దాన్ని. కామశాస్త్ర ప్రావీణ్యమంతా చూపిస్తాను. బ్రహ్మానందం అనుభ విస్తాను" అని బైర్దేరపోతాడు.

"ఏమైనా తుదముట్టా చూద్దాం వంటింటి కుందేలు ఎటు పోతుంది గనక" అని ధైర్యం తెచ్చుకుంటాడు.

అంతకంతకు తాపం అధికమైపోతూవుంది. ఎదురుగా ఆమె కన బడినట్టయి పట్టుకోబోతాడు కనపడక పోగానే కటకట పడతాడు. అక్కడే తారాడినట్టయి మాటాడించబోతాడు. లేకపోగానే కళ్ళనీళ్లు పెడతాడు. దగ్గిరికి వచ్చినట్టయి కౌగలించబోతాడు శూన్యం చూసి దుఃఖపడతాడు. వచ్చి వొడబడినట్టయి మీద పడబోతాడు బయలు పరికించి తెల్లబోతాడు. కేళీవినోదాలకు పూనుకున్నట్టయి అభిమత క్రీడలకు తలపడతాడు. ఏమీలేకపోగానే విలవిలలాడిపోతాడు. ఇలా పరిపరివిధాల మన్మధుడిచేతి కీలుబొమ్మలా ఐపోయి, జర్జరిల్లిపోయి, ఎక్కడాలేనిబాధా పడిపోయి, నానాయిదీ ఐపోతున్నాడు. తుదకి పరి చారికలు బతిమిలాడినమీదట ఎలాగో స్నానం, భోజనం ముగించాడు.

వేదన ఆపాదమస్తకం దహించేస్తూనేవుంది. ఉపశమనంకోసం పూలతోటకి బయలుదేరాడు. కమలవనందగ్గిర చల్లగాలికి నిలబడ్డాడు. మనస్సు మరింత చలించింది. మామిడిగున్న దగ్గిరికి వెళ్ళాడు. మరింత తాపం హెచ్చింది. పూలతీగల్లో చొరబడ్డాడు. పిచ్చి మరింత తల కెక్కింది. ఎక్కడ నిలవడం ? ఏమిటి సాధనం ?

పొదనుండి పొదకి, చెట్టునుండి చెట్టుకి, కొలనునుండి కొలనుకి వెళ్ళి వెళ్ళి, తిరిగి తిరిగి, పూదేనెకి జంకుతూ పుప్పొడికి భయపడుతూ, లేతగాలికి అడిలిపోతూ వేగిపోతున్నాడు. దాగట్లో వెలక్కాయలా తోటంతా తిరుగుతున్నాడు.

ముందు తన ప్రేయసిని తాగనిచ్చి మిగిలిన పూదేనె తాగుతూన్న గండుతుమ్మెదనూ, రెక్కలు విప్పి ప్రియురాలి చుట్టూ తిరిగి దాన్ని సంయోగానికి ఒప్పించిన రాజహంసనూ, పరస్పరం ఫల రసం ఆరగించి కులుకుతూవున్న చిలుకజంటనూ చూసి చూసి, కారు చిచ్చులా రేగుతూన్న కోర్కెలతో కీచుకీచు మని పోతున్నాడు.

శరీరమంతా వుడుకెత్తి పోయింది. మనస్సంతా నీరసించి పోయింది. ధైర్యమంతా సన్నగిల్లి పోయింది. తుదకి ఒక పూల పొద రింటి దగ్గిర చంద్రకాంత శిలాతల్పంమీద చతికిల బడ్డాడు సైరంధ్రిని ఊహారాజ్యంలో ప్రతిష్ఠించుకున్నాడు. పట్టపగ్గాలులేకుండా మనస్సు వెర్రిపరుగులు పెడుతోంది. ఎన్నెన్ని భావాలు ! ఎన్నెన్ని ఉద్రూతలు !!

"చేతిలో చెయ్యిపెట్టుకుంటాను. ప్రేమాలాపాలాడుతూ దగ్గిరికి లాక్కుంటాను. స్తనాలు గుండెలమీద అదుముకుంటాను. గాఢంగా కౌగిలించుకుంటాను. వేళ్ళతో ముంగుర్లు సవరిస్తాను. పెదవి కరిచి వలపు రెచ్చగొడతాను. మనస్సుతో మనస్సు పెనవేసుకుంటాను. భోగించి సుఖపారవశ్యం కలిగిస్తాను. మళ్ళీమళ్ళీ తనివిపుట్టిస్తాను. మళ్ళీ

మళ్ళీ సంయోగానికి పూనుకుంటాను. వితవింతగా సంతోషపెడ తాను మచ్చికచేసి, ఆసక్తి పుట్టించి వచ్చినట్టు క్రీడిస్తాను ''

అంటూ పరిపరివిధాల భావరతులలో మునిగి తేలుతున్నాడు. శిశిరోపచారాలు సాగిస్తున్నాడు. దీనికి అంతమంటూకపబడక అటమ టించి పోతున్నాడు.

'' మాయదారి పొద్దు గుంకదేం ? అసలు కదలదేం ? ఈపాటికి గూకిపోవాలికదా ! నామీద పగబట్టిందేమో ! ఇకమీద భూమ్మీద పగలేకాని రాత్రిలేకండా చేశాడేమో బ్రహ్మదేవుడు ! కాకపోతే నా కోసమే పగలింత పొడిగిందో ఇవాళ ! ''

ఇలా మాటిమాటికీ పలవరిస్తున్నాడు గుంకించరాని పొద్దును మిడుతూమిడుతూ చూస్తున్నాడు. చలవరాతి పక్కమీద దొర్లు తున్నాడు ఉసూరు వుసూరు మంటున్నాడు. కుమిలి కుమిలి వుడు కెత్తిస్తూన్న తాపానికి విరుగుడులేక, రేగిరేగి విచ్చలవిడి రెచ్చిపోతూ వున్న కోరికల ప్రతీకారంలేక, ముంచెత్తి ముంచెత్తి తల మున్క లవుతూన్న మోహానికి ఉపశమనంలేక వుప్పొంగి వుప్పొంగి కుదిపే స్తూవున్న దుఃఖానికి విరామంలేక, ధైర్యం అసలే లేక, ఇంద్రియాలు వశం తప్పిపోయి, తల్లడిల్లిపోతూ, తహతహ లాడిపోతూ మదన దేవతికి బలి అయి పోతున్నాడు సింహబలుడు. చివరికి ఎలాగో పొద్దుగూకింది. కీచకుడి హృదయం వికసించింది. పద్మాలుమాత్రం ముకిళించుకు పోయాయి. ప్రియుడు దరికివస్తే ప్రియురాలు రాగవతి కావడం సహజంకదా అన్నట్లు, సూర్యుడు దగ్గిరికి రాగానే ఎరుపెక్కి జనాదరణ పొందింది పశ్చిమదిశాంగన.

ఒక్కటొక్కటే పొడుచుకువచ్చాయి చుక్కలు. విరహంతో రోదనం చేశాయి చక్రవాకాలు. దట్టంగా ఎరుపెక్కుతూ వచ్చింది భూదేవి. ప్రకాశవంతమై అందగించాయి దీపాలు. సందడి మాటు

మణిగాయి నగరవీధులు. మదం హెచ్చుతూవచ్చాయి విటులచిత్త వృత్తులు. జారచోరులకు సంతోషం హెచ్చేటట్టు అస్తమించాడు అర్ధ చంద్రుడు. ఇది మిద్రూ ఇది పల్లం అని తెలియరాకండా, ఇది మరుగూ ఇది ఒయలూ అని గుర్తు లేకండా, కళ్లుమూసినా విప్పినా భేదం లేకండా దట్టంగా కమ్ముకువచ్చాయి చీకట్లు.

## నర్తనశాల

సన్నసన్నగా వలలుడి దగ్గిరకి బైలుదేరింది సైరంధ్రి. 'సమయ మైంది' అని హెచ్చరించింది. అప్పటికే సిద్ధంగావున్నాడు వలలుడు. పెళ్లికి పిలిచినట్టు ఉత్సాహంగా బయల్దేరాడు. ముసుగు సవరించు కున్నాడు తనవెంట కొంచెం దూరంగా నడుచుకు రమ్మన్నాడు సైరంధ్రిని. పోట్లాటకు వెళుతూన్నట్టు ఉద్రేకంగాని, తడబాటుగాని తన నడకలో వ్యక్తంకాకండా నడిచి నర్తనశాల చేరుకున్నాడు.

వివేకంలేనివాడి హృదయంలా వుంది నర్తనశాల మునివాకిలి. ఘోరారణ్యప్రదేశంవలె నిర్మానుష్యంగా వుంది. కాపురుషుడి సంపద వలె అనుపయోగ్యంగా వుంది అభ్యసించని శాస్త్రంవలె దుర్గమంగా వుంది. స్వప్నంలోని పదార్థంవలె అగోచరంగా వుంది. విషమకావ్యం వలె అస్పష్టాలంకారంగా వుంది. మూర్ఖుడి రాజ్యంవలె జార చోర హృద్యంగానూ వుంది. నాలుగువేపులా జాగ్రత్తగా పరికించాడు వలలుడు.

చీకటి గడ్డకట్టినట్టు పెద్దపెద్ద రాతిగోడలతోనూ, స్తంభాల తోనూ, చుట్టుపక్కల ఏమీ కనపడని ముంగిలిద్వారంతోనూ, పిరికి వాళ్ళు తొంగిచూడ్డానికి శక్యంకాకండా భయంకరంగానూ, నివాసా నికి నిరుపయోగంగానూ వుంది నర్తనశాల. తన బాహుబలగర్వం ముందుకి దారితీస్తూవుండగా, సైరంధ్రి చేయిపట్టుకుని, జంకూకొంకూ లేకండా, భయంకరమైన మదపుటేనుగులాగ లోపల ప్రవేశించాడు వలలుడు. మధ్యభాగంలో ఉత్తరకుమారి విశ్రమించే మంచం చక్కగా

వుంది. దానికి కొంచెం దూరంలో 'సైరంధ్రిని ఒదిగి వుండమన్నాడు వలలుడు. తాను మంచంమీద కూర్చున్నాడు. సింహబలుడి కోసం ఎదురు చూస్తున్నాడు.

ఇక్కడ సింహబలుడు—బాగా సింగారించుకున్నాడు. మదన వికారంతోనూ, ఉల్లాసంతోనూ శరీరం రెండింత లవుతూంది. కల్లు త్రాగిన వాడిలా కైపెక్కుస్తూవుంది వేగిరపాటు. తేలిక నడకలతో బయలుదేరా డతడు.

సింహమున్న గుహలోనికి పరిగెత్తుకువచ్చే ఏనుగున్నలాగ వలలుడున్న నర్తనశాల చేరుకున్నాడు కీచకుడు. వలపు స్థాయి తప్పి తల గిర్రుమంటూవుందతడికి. మదనోన్మాదం మతిచెడగొడుతూవుంది. 'బలవంతుణినాకేం' అన్న గర్వాంధకారం హృదయాన్ని ఆక్రమించు కుంది. తన అహంకారమే ముందు దారితీస్తూవుంటే జంకూకొంకూ లేకండా లోపల ప్రవేశించాడు.

'ఏమో, ఇంతకీ అది వచ్చిందో లేదో, అనుకుంటూ మంచం తడివాడు. ఓ, ఏమి అదృష్టం! ఇంకెవరు సైరంధ్రే. ఎంతసేపై కని పెట్టుకువుందో! తనకోసం ఎంత ఇద్దైపోతూవుందో!—సంతోషంపట్టలే కండా వున్నాడు కీచకుడు వీపుమీద చెయ్యివేశాడు. స్పర్శా సుఖంతో వొళ్లు గరిపొడిచిం దతడికి.

కోపంతో శరీరం కంపించింది వలలుడికి. కీచకుడి మాటల వయ్యారం, చేష్టలశృంగారం కొంచెం చూద్దామని కుతూహలమూ కలిగింది. సిగ్గుపడుతూన్నట్టు కదలకండా కూచున్నాడు.

సింహబలుడు పిల్లా, అందమైన వస్తువులన్నీ ఎంచిఎంచి నీ కోసం తెచ్చాను, పుచ్చుకో. అందకత్తెలు వలపు పట్టలేక ఎన్నెన్నో లంచాలు నా కాళ్ళముందు పెడతారు. అలాంటి నేనే ఇవాళ నీకు లంచమిస్తున్నాను. చిత్రం కదూ!

నామీద కన్నేసిన ఆడది మరొకర్ని కడకంటాకూడా చూడ దనుకో! నాఅందం కంటబడ్డకాంత నామీద పడకండా వుండడ మన్నది ఇంతవరకూ జరగలేదు.

నా విలాసం తలుచుకున్న ఆడదాన్ని మన్మథుడు బతకనిస్తాడా మరి! నా వివేకం రుచిమరగిన వయ్యారి జీవితాంతందాకా మరిచి పోదు. నా రసికసంభాషణ స్త్రీజాతికి నిజంగా ప్రేమపాశమే అనుకో. ఇంతటి రసికాగ్రేసరచక్రవర్తిని నన్ను నువ్వొక్కతివే దాసుణ్ణి చేసు కున్నావు. ఎంతటిదానివికావు!

ప్రతీపలుకూ బల్లెపు పోటులావుంది వలలుడికి. అయినా నిగ్ర హించుకుంటూ, గూఢార్థంగా కొంచెం తన ప్రేయసికి వినిపిద్దామను కున్నాడు. కంఠం మృదువుగా మార్చుకున్నాడు.

"ఇంత రసికుడివి, నిన్ను నువ్వు పొగుడుకోవాలా, మరి నేనేనా తక్కువదాన్ని! తెలీక అంటున్నావు గాని నాలాంటి ఆడది ఎక్క డన్నా దొరుకుతుందా! నా దేహంతో నీ దేహం కలిసినపుడు తెలు స్తుంది, నీ కెలావుంటుందో మరి! సామాన్యస్త్రీల వంటి దే అనుకుంటు న్నావేమో నా శరీరం! తప్పు తప్పు. నన్ను ముట్టుకున్న తరవాత మరో ఆడదానిజోలికి వెళతావూ నువ్వు! నేను జన్మమెత్తినందుకు నీ కామవికారం పూర్తిగా శమించేటట్టు చేస్తాను తగినఫలం అనుభ విస్తావిప్పుడు" అన్నాడు.

అంటూనే గభీమని లేచి కీచకుడి గుండె లదరిపోయినట్టు రోషణభీషణంగా ఒక అట్టహాసం చేశాడు. రెండుచేతులతోనూ వాడి తలకాయ పట్టి కిందికి దబాయించాడు.

## చిత్రవధ

తుళ్ళిపడ్డాడు కీచకుడు. ఐనా చలించలేదు. సైరంధ్రి చెప్పిన గంధర్వుల్లో ఒకడై వుంటాడని నిశ్చయించుకున్నాడు. కోపంతో

చప్పున తిరగబడ్డాడు. బుజాలు పట్టుకుని వలలుణ్ణి కిందపడేశాడు. రెండు తొడలతోనూ అదిమి పట్టుకున్నాడు. దాంతో దెబ్బతిన్న నల్ల తాచులా లేచాడు వలలుడు కోపంతో శరీరం వుప్పొంగింది. దిగ్గున మీదికివచ్చి గట్టిగా పట్టుకున్నాడు కీచకుణ్ణి.

ఉభయులూ రోషంతో నాగుబాముల్లా బుసలుకొడుతున్నారు. ఎవరికి ఎవరూ తీసిపోకండా పెనగులాడుతున్నారు భయంకరంగా పోట్లాడుతున్నారు. తనగుట్టు బైటపడుతుందేమో అని సింహబలుడూ అజ్ఞాతవాసం భంగపడుతుందేమో అని వలలుడూ భయపడుతూ చప్పుడు కాకండా, పల్లెత్తుమాటాడకండా పోట్లాడుతున్నారు దొంగ పోట్లు పొడుచుకుంటున్నారు కొట్టుకుంటున్నారు కిందపడుతున్నారు. మీదపడుతున్నారు బాహాబాహీ, కచాకచి మల్లయుద్ధం చేస్తున్నారు. దెబ్బకి దెబ్బ, పోటుకి పోటు, తోపుకి తోపు. ఒకళ్ళని మించిన బలం ఇంకొకళ్ళది. ఒకళ్ళని మించిన కోపం ఇంకొకళ్ళది.

పడుతూ లేస్తూ, పోట్లాడి పోట్లాడి కొంతసేపయ్యాక క్రమంగా వలలుడి బలం పెరుగుతూ వచ్చింది. కీచకుడి బలం క్షీణించడం మొదలు పెట్టింది. అది కనిపెట్టాడు వలలుడు. లేడిమీదికి వురికిన సింహంలాగు చప్పున కిలియుబడి కింద పడగొట్టాడు కీచకుణ్ణి తిరిగి వాడు లేచేలోపున పిడుగువంటి పిడికిలితో ఆయువుపట్లలో పొడిచాడు. మిడిగుడ్లుపెట్టి, విల విలా తన్నుకుని ప్రాణం వొదిలేశాడు సింహబలుడు.

పువ్వులూ పళ్ళూ నిండిన వృక్షాన్ని కూల వేసినట్టు మణి భూషణాలతో వున్న కీచకుణ్ణి అమాంతంగా పడగొట్టాడు వలలుడు. ఇంతలో వికృతవధ చెయ్యాలన్న కుతూహలం కలిగింది తనకి. శిరస్సూ, కాళ్ళూ, చేతులూ బలంగా పొట్టలోకి అదిమి తొక్కి చివరికి ఓ తిత్తిగా తయారు చేశాడు కీచకుణ్ణి అంతతోనూ పోనియ్యక, నేల వేసి నలగగొట్టి నలగగొట్టి బాగా ఓమాంసపు ముద్దగా చేసి విడిచిపెట్టాడు.

తన బలం నమ్ముకుని, కీచకుడి చావుకోసం కాచుకు కూచుంది సైరంధ్రి. 'ఐంది' అని ఆమెతో చెప్పి చప్పున రహస్యంగా నిప్పు తెచ్చి వెలిగించి చూపాడు. ఉలికిపడింది సైరంధ్రి. ఆశ్చర్యమూ, భయమూ, ప్రేమా ముప్పిరిగొన్న మనస్సుతో వలలుణ్ణి కౌగిలించు కుంది. చిత్రంగా మాంసం ముద్దలా పడివున్న శవాన్ని చూసి తల పంకించింది. ముక్కుమీద వేలు పెట్టుకుంది.

''దీనికోసం ఇంత చేశావు. ఇక సుఖపడు. అలాపెట్టిన పాట్లన్నీ వూరికే పోతాయామరి!'' అంది.

''అన్నమాట నిలబెట్టుకున్నాను ఈమె పరాభవాన్నీ, పరి తాపాన్నీ తొలగించాను'' అని తృప్తిపడ్డాడు వలలుడు.

''ఏం, కంటకం తొలిగిపోయిందా? నాబలం నచ్చిందా? కోపం శాంతించిందా? దుర్మార్గుడిగతి ఏమైందో చూడు! సంతోషంగా వుందా? నిన్ను పాపపుకళ్లతో చూసిన మొగాడు ఎంతటి మొనగాడై తేనేం, నాచేతుల్లో వాడి ప్రాణాలు దక్కవనిమాత్రం జ్ఞాపకం పెట్టుకో'' అన్నాడు.

సంతోషంతో గద్దదిక పడింది సైరంధ్రి కంఠం.

''నిన్న సభలో అంతకోపాన్ని నిగ్రహించుకున్న ధైర్యశాలివి. రహస్యభంగం కాకండా ఇపుడు ఇంతపని నిర్వహించిన కార్యదక్షు డివి. మనవాళ్ల నెవ్వరినీ పిలవకండా ఒక్కడివే యింతా సాధించిన సాహసుడివి. లోకదుర్జయుడైన ఈసింహబలుణ్ణి చిటికెలో కడతేర్చిన పరాక్రమశాలివి. నీ ఉత్తమనాయకత్వాన్ని తలుచుకుంటేనే శరీరం పులకరిస్తుంది నాకు. నా ఆశ్చర్యానందాలు నీకెలా విన్నవించనూ!'' అని దగ్గిరగా చేరి అతని రెండుచేతులూ పట్టుకుంది.

ఆమెచేతులు ముద్దుపెట్టుకున్నాగు వలలుడు. ''ఇక ఇక్కడ మసలకూడదు'' అనిచెప్పి త్వరత్వరగా అక్కడనుండి వెళ్లిపోయాడు.

---

# విరాటపర్వం

## మూడో ఆశ్వాసం

నర్తనశాలనుండి వచ్చి వంటింటి వాకిట్లో శరీరం కడు క్కున్నాడు వలలుడు. నెత్తురువాసన పోయేటట్టు మంచిగంధం పూసు కున్నాడు. నిశ్చింతిగా పక్కమీద చదికిలబడ్డాడు.

ఇక్కడ సైరంధ్రి—ఈసరికి వలలుడు వంటిల్లు చేరుకుని వుంటా డని నిర్ధారణ చేసుకుంది. పైకివచ్చి కావలివాళ్లని పిలిచింది.

''నాభర్తలైన గంధర్వులు సింహబలుణ్ణి చంపేశారు. ఈ పాపాత్ముడు తన పాపఫలం అనుభవించాడు'' అని చెప్పింది. దాంతో వాళ్లంతా లేచి గొల్లుమన్నారు దివిటీలు ముట్టించి అడా వుడిగా నర్తనశాలలోకి పరిగెత్తారు. ఈ గందరగోళమంతా విని కీచకుడి తమ్ములు నూటఐదుగురూ పరిగెత్తుకు వచ్చారు. ముద్దలా వికారంగావున్న శవాన్ని చూసి భయభ్రాంతులై ఆర్తనాదం చేశారు. అన్నశవంమీద పడి మొత్తుకున్నారు. కొందరు మూర్ఛ పోయారు. కొందరు నిలవలేక గుండెలు బాదుకున్నారు.

ఇంతలో తక్కిన బంధువులు కూడా వచ్చి మూగారు. ''ఇదేం చిత్రం! కాళ్లేవీ? చేతులేవీ? తలకాయేదీ? ఇలాంటిపీనిగని ఎక్కడన్నా చూశామా!! గంధర్వులచేత చచ్చేవాళ్లంతా ఇలా వికారపు చావు చస్తారేమో? కాకపోతే కోపంతో ఈయన్నే ఇలా చేశారో మరి! అంతబలమూ? ఎందుకూ పనికివచ్చింది కాదుకదా! అంతా వ్యర్థమై పోయింది. ఇంతకీ, మైకం కప్పినపుడు ముందు వచ్చేది కనపడదు. ఒళ్లు కొవ్వెక్కినవాడికి వినాశం తప్పదు. ఎవరేం చెయ్యగలరు!''

ఇలా అందరూ పరిపరివిధాల దుఃఖించారు. రోదనధ్వనులతో గొల్లుమంటూవుంది నర్తనశాల. ఇంతలో ఒక ఉపకీచకుడు తక్కిన వాళ్లని ఓదార్చడం మొదలు పెట్టాడు.

"మనమెంత మొత్తుకున్నా మన అన్న మనకు మరిరాడు. ఏంచేస్తాం! పుట్టినవాళ్ళం చావక తీరదుకదా! కలకాలం ఎవరుండి పోతారని! అంచేత మరి ఆలస్యం చెయ్యకండా సంస్కారానికి పూనుకోండి" అన్నాడు.

అతడి మాటప్రకారం అందరూ శవదహనంకోసం ఆయత్త పడ్డారు. ఇంతలో ఇదంతా కుతూహలంగా ఓ పక్కనుండి చూస్తున్న సైరంధ్రి వాళ్ళకంట పడింది. దాంతో ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది వాళ్ళకి.

"పాపిష్టి ముండ. ఇదే ఇంతపని చేసింది. దీన్నికూడా అన్నగారి శవంమీద పెట్టి తగలబెడదాం" అన్నారు కొందరు. అనడమే తడవుగ ఆమెని పట్టుకుని పెడరెక్కలు విరిచికట్టారు కొందరు. ఏమయినా రాజుగారి అనుమతి పొందడం మంచిదన్నారు కొందరు వెంటనే విరాటరాజు దగ్గిరికి వెళ్లారు. అప్పటికే ఈవార్త విని విచారిస్తున్నాడు విరాటరాజు.

"సింహబలుడి శవంతో పాటు సైరంధ్రినికూడా దహనం చేస్తాం. మీతో చెప్పడానికి వచ్చాం. అనుమతించవలిసింది" అని వాళ్లు అనడంతోటే, 'ఎలాగూ వద్దన్నా వినేట్టులేదు వీళ్ల వైఖరి' అనుకుని "మీ ఇష్టం" అన్నాడు రాజు. అదే అంగీకారంగా భావించుకున్నారు వాళ్లు హడావుడిగా తిరిగి వచ్చారు.

"దీని మీద ఇంత మోహం పెట్టుకున్నారు అన్నగారు. ఇలా అయినా ఆయనకి కొంత శాంతి కలిగించినవాళ్ళ మౌతాం. ఈ ముండకూడా మనకి వొదిలిపోతుంది" అంటూ సైరంధ్రిని సింహబలుడి

శవంమీద వేసి కట్టారు. అశుచీ పాపాత్ముడూ, నీచుడూ అయిన కీచకుడి కళేబరంతో కూడా నిత్యశుచీ, పుణ్యశీలా, ఉత్తమురాలునూ అయిన ఆమెని తీసుకుని స్మశానానికి బైలుదేరారు కీచకులు. ముందూ వెనకా లెక్కలేనన్ని కాగడాలు పట్టుకున్నారు. ఏడుపులతోనూ, పెడబొబ్బలతోనూ వెంట నడిచారు బంధువులు

భయభ్రాంతురాలై పెద్దపెట్టున ఏడుపులు ప్రారంభించింది సైరంధ్రి. కన్నీళ్ళతో ఆమె మొహమంతా తడిసిపోతూ వుంది.

"అయ్యో, దిక్కుమాలినదాన్నయిపోయాను. నా మొర వినండి. ఓయీ జయా, జయంతా, విజయా, జయత్సేనా, జయోద్బలా! మీరుంటూండగానే నిర్భయంగా ఈ కీచకులు నన్నిలా హింసిస్తున్నారు ప్రాణేశ్వరులారా! గంధర్వులారా! సింహబలుడి శవం మీద కట్టి తీసుకు పోతూన్నారు నన్ను రండి. రక్షించండి!!"

అంటూ కేకలు వేస్తూ ఏడ్చింది. ఈ కేకలు వంటింటిలోని వలలుడి చెవిలో పడ్డాయి. ఎక్కడలేని రోషం వచ్చిందతడికి. "వీళ్ళు మళ్ళీ ఇంతపని చేశారా!" అనుకుంటూ ఎవరికీ కనపడకండా చప్పున ప్రాకారం గోడదాటి స్మశానభూమి దగ్గిరకి వచ్చాడు. ఇటూ అటూ చూసి పెద్దవృక్షం మొకటి పట్టుకున్నాడు. బుజమ్మీద వేసుకుని కాలాంత రుద్రుడిలా దారికడ్డంగా నిలబడ్డాడు.

శవాన్ని మోసుకువస్తూన్న వాళ్ళు అల్లంతదూరంలో ఈ భయంకరాకారం చూసి తటుక్కున నిలబడిపోయారు. "అమ్మయ్యో, గంధర్వులు వచ్చిపడ్డారు" అని గడగడలాడిపోయి శవాన్ని అక్కడే దింపేసి పరిగెత్తారు. కొందరు గోతుల్లో దాక్కున్నారు. కొందరు కనపడ్డ చెట్లల్లా ఎగబాకారు. కొందరు నీళ్ళల్లోకి దుమికారు. కొందరు కదల్లేక చదికిలబడ్డారు. కొందరు పట్నం దిక్కు తోకముడిచారు వాళ్ళందరినీ వెంటాడాడు వలలుడు. వెదికి వెదికి అందర్నీ పట్టుకు

న్నాడు ఒకణ్ణీ మిగలనీయకుండా నూటఐదుగురు ఉపకీచకుల్నీ చేతులకొద్దీ బాదిబాది చంపేశాడు. తిరిగి వచ్చి సైరంధ్రి కట్లువిప్పి నిశ్చింతగా సుదేష్ణ మందిరానికి వెళ్ళిపో'' అని చెప్పాడు. తాను మరొకదారిని వంటింటికి వెళ్ళిపో వచ్చాడు.

కీచకులందరూ గంధర్వులచేత ధ్వంసమై పోయారని విని నిశ్చేష్టుడై పోయాడు విరాటరాజు. తమ్ముల మరణానికి దుఃఖిస్తూన్న సుదేష్ణను వోదార్చాడు.

''సైరంధ్రిని ఎలా అయినా ఇక్కడినుంచి పంపించెయ్యాలి. మగవాళ్ళు ఆమెదగ్గిరికి వెళితే ఏం ముప్పు వస్తుందో! అంచేత నేనే చెప్పడానికి జంకుగా వుంది. నువ్వే నా మాటలుగా చెప్పు. ఎలా అంటే బావుంటుందో, అలా మంచిమాటలాడి వెళ్ళిపోమను. ఆమె రూపమూ జగన్మోహనంగావుంది పురుషులా భోగైకపరాయణులాయె. మన్మథుడు తినపని ఎప్పుడూ మానడు. అంచేత పట్నంలోని వాళ్ళకి పక్కలో నాగుబామే ఇది. ఇలాంటిదాని పోత్తు పెట్టుకుని మనమెలా బతకడం!'' అన్నాడు.

సుదేష్ణకీ ఈమాట నచ్చింది. ఆమెని పంపెయ్యడానికే నిశ్చయించుకుంది.

సైరంధ్రి దుఃఖాంధకారంతో మచ్చరించినట్లు పటాపంచలై పోయాయి చీకట్లు. భళ్ళున తెల్లవారింది. పద్మినీ హృదయానంద కరుడైన సూర్యుడు సహస్రకిరణాలతో ఉదయించాడు. అప్పటికి సైరంధ్రి సచేలస్నానం చేసుకుంది రాగద్వేషాది వికారాలు త్యజించిన ప్రసన్న చిత్తంవలె కీచకవిధ్వంసంతో ప్రసన్నురాలైన ఆమె మందగమనంతో పట్నంలో ప్రవేశించింది.

రాజవీధిని రాజహంసలా ఆమె నడుచుకు వస్తూవుంటే, ''మన కీచకులపాలిటి మారిలా పుట్టిందిరా బాబూ, ఇది'' అని నిలిచి

చూశారు కొందరు. 'సి కొవ్వుమాత్రం కరగదా' అని కనపడకండా దాక్కున్నారు కొందరు ఎదురమేసరికి 'అమ్మో' అని మొహం తిప్పుకున్నారు కొందరు. అల్లంత దూరంలో చూసి మరోదారిని పరి గెత్తారు కొందరు ముఖాముఖి తారసిల్లేసరికి గజగజలాడి తప్పుకు న్నారు కొందరు. పులిని చూసిన లేడిపిల్లల లాగ చెల్లాచెదరై పోయారు కొందరు. ఇళ్ళల్లోంచి తొంగిచూసి 'రాకాసిరా నాయనా' అని గుండెలు బాదుకున్నారు కొందరు.

వాళ్ళందరిని చూస్తూ, నవ్వాపుకుంటూ రాజవీధిని నడిచి రాజమందిరం ప్రవేశించింది సైరంధ్రి. వంటింటి ముందునుంచి వెళుతూ వాకిట్లో నిలబడివున్న వలలుణ్ణి చూసీచూడనట్టు నటించి తనలో తా ననుకుంటున్నట్టు,

"కీచకులు తెచ్చిపెట్టిన ఉపద్రవం తప్పించి నన్ను రక్షించిన ధర్మాత్ముడికి గంధర్వపతికి జయంతుడికి పదివేల నమస్కారాలు" అంది గూఢార్థంగా. వలలుడూ చాకచక్యంగా అందుకున్నాడు.

"ఆపదలో అడ్డుపడని భర్త భర్తామరి! అలా అడ్డుపడకపోడం మగతనమూ కాదు, మర్యాదా కాదు. నీ భర్త లలాంటివాళ్ళు కాబట్టే నువ్వూ వాళ్ళ నలా చూసుకుంటున్నావు. దీనిక వాళ్ళని పొగడడం ఎందుకూ?" అన్నాడు.

అక్కడినుంచి మెల్లి మెల్లిగా నర్తనశాలదిక్కు వెళ్ళిందామె. రాచకన్యల నాట్యం చూసే నెపంమీద బృహన్నలను తొంగి చూసింది. ఆమె చూడ్డమే తడువుగా అక్కడి కన్యకలూ, బృహ న్నలా గబగబా వచ్చి ఆమెచుట్టూ మూగారు.

"కీచకులచేత ఏబాధా లేకండా వచ్చావమ్మా! నిన్ను బాధిం చినవాడికి మంచి పనయింగలే! ఈ లోకంలోనుంచే వెళ్ళిపోయాడు. అంతతో అయినా వూరుకోక పాపం, కీచకు లెంతగా బాధించారో

నిన్ను! నిన్నెపుడూ కనిపెట్టుకుని వుంటూవుండమూ నిభర్తలు! శత్రువుల్ని ఇలా చంపేస్తారేం!" అంటూ వాళ్ళు విన్న దాన్నిబట్టి ఆమెని వోదార్చడం మొదలెట్టారు.

"ఇపుడే నీమాటవిని నోచ్చుకుంటున్నాం మేము. ఆపాపాత్ములు నిన్నేం బాధలు పెట్టారో పాపం! అసలు జరిగిన సంగతేమిటో, అంత మందీ ఎలా చచ్చారో, నీనోట వింటేనేకాని నిజం తెలీదు. వివరించి చెపుతావూ, వింటాం" అన్నాడు బృహన్నల.

కొంచెం చిలిపిగానూ కొంచెం తీక్షణంగానూ చూసింది సైరంధ్రి. ఇక్కడ ఆడపిల్లలికి ఆటనేర్పుతూ కడుపులో చల్లకదలకండా కూచున్న బెత్తమ్మవి నువ్వు, సైరంధ్రి ఏమైపోతేనేం నీకు! కాకపోతే నన్నిలా నవ్వుతూ అడుగుతావూ!" అంది.

"నువ్వు కష్టాలు పడుతూంటే నాకుమాత్రం దుఃఖంగా లేదూ! ఐతే, నిరర్థకమైన ఈ పేడిజన్మెత్తిన నావంటివారి సానుభూతి వల్ల ప్రయోజన మేమిటి? నిన్నెరగను కనకనా! అగ్నిహోత్రంలాంటిదానివి. నీపాట్లు చూస్తూంటేనే నాగుండె చెరువై పోతూంటుంది. నాస్వభావం నీకుమాత్రం తెలియుందిగనకనా!" అని తక్కిన అన్నదమ్ములవలె మారు వేషంలో వుండడమే కాకండా ఊర్వశీ శాపంవల్ల ఆడారితనమూ అనుభవిస్తూన్నాను గనుక ఏమీచేయలేని స్థితిలో వున్నానని ధ్వనించేటట్టు అన్నాడు బృహన్నల.

తనలో తాను చిరునవ్వు నవ్వుకుంది సైరంధ్రి. 'అవును, నాకు మాత్రం తెలీదూ! ఇంత చెప్పాలా!' అంది. అక్కణ్ణుంచి సుదేష్ణదగ్గిరికి బైలుదేరింది. సోదరుల మరణదుఃఖంతో విలపిస్తూవుంది సుదేష్ణ. "నేనన్నంత పని అయింది చూశావా" అన్న సంతోషం హృదయంలో వుబుకుతూవున్నా పైకి వ్యక్తం కానియకండా, ఏమీ ఎరగని దానిలా వెళ్ళి నిలబడింది సైరంధ్రి.

ఆమెని చూడ్డంతోనే ఎక్కడలేని దుఃఖం వచ్చింది సుదేష్ణకు. వెంటనే భయమూ కలిగింది. వినయంగా పలకరించింది. ఆదరంతో చేరదీసి పక్కని కూచోబెట్టుకుంది. "చూడూ, మాలినీ నువ్వు అందక త్తెవి. మగవాళ్ళ మనస్సు పట్టలేనివాళ్ళు ఇదంతా ఆలోచించి రాజు భయపడుతున్నాడు. అంచేత నువ్వెక్కడికన్నా వెళ్ళిపోవలిసిందని నచ్చ చెప్పమన్నాడు" అంది.

తమ్ముళ్ళచావు పేగుల్లో కరేలు మన్నట్టయి మళ్ళీ అందామె, "బలవంతులైన మొగుళ్ళున్నారని పంతంపట్టి చంపస్తావు నువ్వు జనం నీదగ్గిర చేరడానికి భయపడతారు అంచేత మారాజ్యం విడిచిపెట్టి నీ ఇష్టం వచ్చిన దగ్గిరికి వెళిపో"

దానికి సైరంధ్రి నెమ్మదిగా ఇలా అంది. "అమ్మా, మరి పదమూడుదినాలు మాత్రం అనుగ్రహించండి. దాంతో నావ్రతం పూర్తయి పోతుంది. నాభర్తలు మీకు మేలేచేస్తారు నమ్మండి. మీ ఉపకారం మరిచిపోరు ప్రత్యుపకారం చేసి ఋణం తీర్చుకుంటారు మీరు భావిస్తున్నట్టు వాళ్లు క్రూరస్వభావులు కారు. దయార్ద్రహృదయులు. మత్స్యరాజేంద్రులకు పరమాప్తులై ప్రవర్తిస్తారు. ఏదో అవసరార్థం చెపుతున్న మాటలని తోసెయ్యకండి. ఈ మాత్రం ప్రార్థన మన్నించండి"

కొంచెం ఆలోచించి తుదకి సమ్మతించింది సుదేష్ణ. "సరే, అంతవరకూ వుండుమరి. నీకునచ్చినట్టే నడుచుకో. నాపిల్లల్నీ, రాజుని నీవాళ్ళుగా చూసుకోవాలి. నేనుమాత్రం నీకు ఏలోపమూ రాకండా చూస్తాను" అని మచ్చికగా మంచిమాటలాడింది. తరవాత యథాప్రకారంగా పనిపాటల్లో మగ్నమైంది సైరంధ్రి.

"పరసైన్య భయంకరుడూ, బలగర్వితుడూ, గండరగండడూ, విక్రమ దుర్దముడూ ఐన విరాటరాజు శాలమరిది నీంతచావు చచ్చాడు. అంతవాణ్ణలా చంపినవాళ్లు ఎంత పరాక్రమవంతులో మరి!"

"ఒక ఆడదానికోసం సింహబలుడు గంధర్వులచేత చిత్రవధ అయిపోయాడు. నిష్కారణంగా విరాటరాజు బలం కూలిపోయింది. పాపం, సూతకులం సర్వనాశనమైపోయింది." ఇలా ఈ వార్త ఆనోటా ఆనోటా పడి దేశదేశాలు పాకింది.

ఇక అక్కడ దుర్యోధనుడు—పాండవుల వునికిపట్టు కనిపెట్టి, వాళ్ళ అజ్ఞాతవాసం భంగంకలిగించి, తిరిగీ అడవులపాలు చెయ్యాలన్న దురభిప్రాయంతో నలుదిక్కులా వేగులవాళ్ళను పంపించాడు. వాళ్లు ప్రపంచమంతా తిరిగితిరిగి, గాలించి గాలించి ఎక్కడా పాండవుల పత్తాఫికరూ కనిపెట్టలేక, తుదకి నిరాశచేసుకుని తిరుగుముఖం పట్టారు. బయలుదేరేముందు ఏర్పాటుచేసుకున్న ప్రకారం సంకేత స్థలం దగ్గిర అందరూ కలుసుకుని మరి చేసేదిలేక, చిన్నపుచ్చుకున్న మొహాలతో హస్తినాపురం వచ్చేశారు.

వచ్చి, వెంటనే కోటలోకి బైల్దేరారు నిత్యకల్యాణం పచ్చ తోరణంగా వుంది కోట మునివాకిలి వరసగా ఏనుగులు కురిసిన మద జలధారలు కల్లాపులా వున్నాయి. సమ్మర్థంవల్ల రాలిన రాజుల రత్న భూషణాల రజస్సు ముగ్గులు పోసినట్టుంది. సందడిలో తెగిపడ్డ రత్న హారాలు పుష్పోపహారాల్లా వున్నాయి. మేమంటే మేమని విదేశదొర లెత్తిన పావడాలు తోరణాల్లా వున్నాయి ఇలా సహజవైభవో పేతంగావున్న వాకిలిలో సమ్మర్దాన్ని వొత్తిగించుకుంటూ లోపల ప్రవేశించారు వేగులవాళ్ళు.

నాగేంద్ర పతాకంతో మహోన్నతమైన స్వర్ణసింహాసనంమీద కొలువు తీర్చివున్నాడు దుర్యోధనమహారాజు. ద్రోణుడూ, భీష్ముడూ, కర్ణుడూ, కృపాచార్యుడూ, సుశర్మా, దుశ్శాసనుడూ వారి వారి ఉచి తాసనాల్లో అలంకరించివున్నారు. సైన్యాధిపతులూ, పండితులూ, పురప్రముఖులూ ఎవరిస్థానాల్లో వారు కూచునివున్నారు. సామంత

రాజులు సుసజ్జితులై అంజలిబంధం శిరస్సున గీలించివున్నారు. వారి తలలమీది పువ్వులకోసం వచ్చిన తుమ్మెదలు వారి ముకుళితహస్తాలను తమ్మి మొగ్గలని భ్రమిస్తున్నాయి. కలువలవంటి వారికన్నులకు రాజు నవ్వు వెన్నెలలావుంది.

వేగులవాళ్ళు వచ్చి జయజయ శబ్దపూర్వకంగా సాష్టాంగదండ ప్రణామాలు చేశారు ముకుళించిన హస్తాలు ముందుకుచాచి ఇలా విన్నవించారు "మహాప్రభూ, ఏలినవారి ఆజ్ఞప్రకారం పాండవులను వెదకడానికి బయలుదేరాం మొదట వారు వెళ్ళిన మహారణ్యాలు వెదికాం జానెడంతనేల విడిచిపెట్టకండా పొదపొదా, చెట్టుచెట్టూ, గుహాగుహా – ఇదీ అదీ అనకుండా ప్రతీదుర్గమప్రదేశమూ గాలించాం. తుదకి ఓచోట రథాలు వెళ్ళినజాడ కనిపించింది. ఆజాడ పట్టుకు బయల్దేరాం. అది తిన్నగా ద్వారకానగరం వెళ్లి ఆగింది. కేవలం సారథులుమాత్రమక్కడ కనిపించారు. పాండవులూ అక్కడే వుంటారని అనుమానించి పట్టణమంతా వలవేసినట్టు వీధివీధీ, సందుసందూ, గొందిగొందీ కలియవెదికాం. కాని ఎక్కడా నడీనన్నా కనిపించలేదు మహారాజా!

"అక్కణ్ణుంచి అందరం విడిపోయి సమస్తదేశాలూ పల్లెలనక, పట్నమనక, తోటలనక, బాటలనక వెదికాం. పిసరంత ఉపేక్ష చేయకండా ప్రాణాలమీద పందెం వేసుకు తిరిగాం. బయలైనా బద్ధకించలేము, మరుగులాగే వెదికాం, అంగుళంనేల వ్యర్థంపోనియ్యలేదు. నేలనాలుగు చెరగులూ గాలించినా వాళ్ళజాడ కనపడలేదు దేవరా! ఇది నివేదించుకుని, ప్రభువుల ఆదేశం శిరసావహించాలని సిద్ధంగా వున్నాం.

"మా సంచారంలో తెలిసిన మరోసంగతి మనవి చేసుకుంటున్నాం ప్రభూ! మత్స్యదేశాధిపతి బావమరది సింహబలుణ్ణి ఒక అందకత్తెకోసం గంధర్వులు రహస్యంగా చంపేశారు. ఆ చంపడం కూడా

విడ్డూరంగా వుంది మహారాజా! ఆయుధాలు ప్రయోగించలేదు కాళ్ళూ చేతులూ, తలా పొట్టల్లోకి తోసేసి పీనిగని మాంసంముద్దలా తయారు చేశారట! ఆతగాడి నూటఐదుగురు తమ్ముల్నీ ఒక్కణ్ణయినా మిగల్చకుండా అరాత్రే చంపేశారు. చంపినవాళ్ళ పత్తాఫికరూ లేదు. విరాటరాజు మనశ్శత్రువు గనక ఈ సంగతి నివేదించుకున్నాం దేవా!'

అంతా సావధానంగా విన్నాడు దుర్యోధనుడు. అతడికేమీ పాలుపోలేదు కొంతసేపు "సరే, ఇప్పటికి వెళ్ళం"డని వేగులవాళ్ళని పంపేశాడు. తరువాత మంత్రులవేపు చూశాడు.

"అజ్ఞాతవాసం పూర్తి చేసుకని, రాజ్యంకోసం ఆసపడి మన మీద పడకముందే వాళ్ళని కనిపెట్టి తిరిగీ అడవులకు వెళ్ళగొట్టాలి. వాళ్ళ వునికి తెలుసుకోడమంటే దుస్సాధ్యంగానే వుంది. ఏ విధానం అనుసరిస్తే వాళ్ళని కనిపెట్టగలమో మీ మీ బుద్ధులకొద్దీ ఆలోచించి చెప్పండి" అని అడిగాడు.

రాజిలా అనీ అనడంతోటే చప్పున లేచాడు కర్ణుడు "రాజా, ఇదేమంత సమస్యని! మారువేషాలు వేయించి మరింతమంది వేగుల వాళ్ళని నాలుగుదిక్కులూ పంపించామా అంటే ఇవాళా రేపటిలోనే దొరికపోతారు పాండవులు. ఎటుపోతారు?" అన్నాడు.

దురుసుగా తల ఎగరవేసుకుంటూ అందుకన్నాడు దుశ్శాసనుడు "అసలు వెదికించడంకూడా ఎందుకంటాను! ఒక వునికీ, ఒక పూరటూ లేకుండా నానాతిప్పలూ పడుతూ తిరిగి తిరిగి జవసత్వాలు వుడిగిపోయి ఏ అడివిమృగాల పాలోబడి ఏనాడో చచ్చేవుంటారు వాళ్ళు. వాళ్ళు చచ్చినచోట గరిక మొలిచి మచ్చు మాసిపోయి వుంటుంది. అంచేత ఇక వాళ్ళగొడవ కట్టిపెట్టి విచ్చలవిడిగా రాజ్య వైభవాలు అనుభవించడమే మంచిది" అన్నాడు.

చిన్న మందహాసం చేస్తూ గొంతుక సవరించుకన్నాడు ద్రోణుడు "దైవబలం సంపన్నులూ, శాస్త్రసమగ్రులూ, దివ్యసమానులూ పాండవులు మృగాలవాల పడివుంటారంటే విన్నవాళ్ళు నవ్వుతారు. వాళ్ళని కనిపెట్టేవిధానం ఏదన్నా వుంటే చెప్పండి, లేదా వూరుకోండి. ఈ పొల్లుమాటలతో ఏమిటిప్రయోజనం!" అన్నాడు.

"క్షేమయిన మాట అన్నాడు ద్రోణాచార్యులు" అంటూ అందుకున్నాడు భీష్ముడు, "నిజానికి పాండవులకు దైవబలమూ, భుజబలమూ, బాహుబలమూ - మూడూవున్నాయి. ఆ మహాత్ములికి అరిష్టాలు వస్తాయనడం అసందర్భం వాళ్ళ మహానుభావత్వంవల్ల వాళ్ళను కనుక్కోవడమూ కష్టమే వాళ్ళింతో వీభ్యా అంతే నాకు. ఐతే, కార్యనిరూపణం చెయ్యవలసిందని రాజు కోరాడు గనక వున్నది వున్నట్టు చెప్పడం నా కర్తవ్యం. నా మాటల్లో నిజానిజాలు నచ్చితేనే అనుసరించవచ్చు.

"ధర్మరాజు మహాపుణ్యపురుషుడు. అంచేత అతడు ఎక్కడ వుంటే అక్కడ గురుజనులమీద భక్తీ, పరోపకారబుద్ధీ, సత్యవాక్పాలనా, అహింసాపరాయణత్వమూ, నీతివర్తనమూ, సర్వమానవ సమానత్వమూ, ఐకమత్యమూ, దాతృత్వమూ మొదలైన ధర్మగుణాలు ప్రజల్లో నెలకొని వుంటాయి. ముఖ్యంగా అతడున్నచోట గోధనం ముమ్మరమైన పాడితో తామరతంపరగా వుంటుంది. అంచేత ఇపుడు ఏదేశం ఎలావుందో కనిపెడితే పాండవులు ఎక్కడవున్నదీ తేలిపోతుంది" అన్నాడు.

భీష్ముణ్ణి సమర్థిస్తూ ప్రారంభించాడు కృపాచార్యుడు "అవును. ఎన్నివిధాల వెదకాలో అన్నివిధాలా చప్పున వెదకాలి. ఆలస్యం చేసినకొద్దీ అమృతం విషమే అవుతుంది. భీష్ముల ఉపదేశం అనుసరిస్తే ఇట్టేదొరకిపోతారు పాండవులు. ఒప్పదం ప్రకారం పన్నెండేళ్ళ

వనవాసం పూర్తిచేశారు వాళ్ళు అజ్ఞాతవాసంకూడా అదిగో ఇదిగో అన్నట్టుంది. రాజంటే, ఏనుగు మీదికి సింహంలా వున్నారు వాళ్లు. ఇలాటి సందర్భంలో మనం అశ్రద్ధ చేయడం అవివేకమే అవుతుంది. చిన్న పామైనా పెద్దకర్రతో కొట్టాలంటారు పెద్దలు అలాంటపుడు ప్రబల వీరులైన పాండవులను ఉపేక్షించడంకూడదు. మనబల మిప్పుడెంతుందో మరంత సమకూర్చుకోవాలిమనం. యుద్ధమేవస్తే మన పక్షం వచ్చేవాళ్ళకి ఇపుడే వార్తలు పంపించాలి. సకలవిధాలా సైన్యబలం సర్వసన్నద్ధం చేసుకుని అప్రమత్తతగా వుండడమే కర్తవ్యం.

''అజ్ఞాతవాసం ముగించి వాళ్ళు కయ్యానికి కాలుదువ్వకండా సంధికివస్తే సంతోషమే. కాదని కయ్యానికే దిగితే, తగిన పాఠం చెప్పడానికి తత్పరులమై వుండాలి. దుశ్శాసను డన్నట్టు వాళ్ళు లేరే అనుకోండి. ఐనా మనబలం మనం బలపరచుకుని పరాయిరాజ్యాలు మనపిడికిలిలో పెట్టుకోవడంలో నష్టమేముంది,లాభమే కాని!''అన్నాడు

మంత్రుల మంతనాలన్నీ సమన్వయంచేసుకున్నాడు దుర్యోధనుడు. ఆలోచించి, ఒక నిశ్చయానికి వచ్చి తన అభిప్రాయం చెప్పడం మొదలుపెట్టాడు.

''సింహబలుడు, భీముడు, శల్యుడు, బలరాముడు – వీళ్ళు నలుగురూ సమానబలం కలవాళ్ళు. ఉద్ధతులు. మల్లయుద్ధంలో నిపుణులు. ఒకళ్ళనొకళ్ళు గెలవాలనుకునే వాళ్ళున్నా. భుజశక్తిలో ఈ నలుగురితో సమానమైన వాళ్ళు మరెక్కడా లేరు. వీళ్ళల్లో ఐతేనే ఒకళ్ళనొకళ్ళు గెలవడం సంభవం. శల్యుడూ, బలరాముడూ సింహబలుడికి దూరంలో వున్నారు. ఇకమిగిలింది భీముడు. అతడే సింహబలుణ్ణి చంపి వుండాలి. ఇంకొకడికి ఈపని సాధ్యంకాదన్నసంగతి మీకు తెలుసు. కాగా భీముడు మత్స్యదేశంలో వుండి వుండాలి 'అందకత్తె' అంటే ద్రౌపది అయివుంటుంది.

రహస్యంగా గంధర్వులన్న మిష పెట్టి చీకటిలో కీచకుల్ని భీముడే చంపి వుంటాడు నిజం. తాతగారూ చెప్పినలక్షణాలన్నీ మత్స్య దేశంలో వున్నట్టుకూడా వింటున్నాం. ఇవన్నీ చూస్తే పాండవులు ప్రచ్ఛన్నంగా ఉపప్లావ్యంలో ఉన్నారనే తోస్తున్నది.

"విరాటుడు మనకు శత్రుకోటిలోనివాడుకదా! అనేకసార్లు మన మీదికి కాలుదువ్వడం కద్దు. అంచేత మన మతనిమీదికి దండెత్తి పోయి అతడి ఆలమందల్ని దోచుకుందాం. అప్పుడు పాండవు లతని సహాయంకోసం రాకపోరుకదా! ఇంకేముంది! అజ్ఞాతవాసం భంగ మైందని నిరూపిస్తాం. మళ్ళీ పన్నెండేళ్ళు అరణ్యానికి వెళ్ళగొడతాం. నిష్కంటకంగా చతుస్సముద్రముద్రితమైన భూమండలం హాయిగా పరిపాలిస్తాం. ఒకవేళ పాండవులక్కడ లేరే అనుకోండి. ఐనా మనకి నష్టమేముంది! విరాటరాజ్యం కొల్లగొడతాం. అదీ మనకు లాభమే కదా! ఇప్పటికిదే నా నిశ్చయం. మీకూ ఇది నచ్చిందంటే దీనికి తగిన ఏర్పాట్లు వెంటనే చేయండి" అన్నాడు.

ఒకళ్ళమొహాలు వొకళ్ళు చూసుకున్నారు మంత్రులు. త్రిగర్త దేశాధిపతి సుశర్మ కర్ణ దుశ్శాసనులతో సంప్రదించి వాళ్ళ అంగీకా రంతో లేచి నిలబడ్డాడు.

"మహారాజా, కేకయులతోనూ సాల్వాడితోనూ కలిసి లోగడ నన్ను వీగగొట్టాడు కీచకుడు. వాడు బతికి వుండగా మళ్ళీ యుద్ధం జతపడిందికాదు మాకు. పరాభవం బాధిస్తూనేవుంది. మత్స్యదేశా నికి చేరువగానే నాజీతపుటూళ్ళున్నాయి. మాటిమాటికీ వాటిని పాడు చేస్తూంటాడు విరాటుడు. అతడిపని పట్టించి నా అక్కసు తీర్చుకోడా నికి తగిన సమయం వచ్చిందిపుడు. ఉపప్లావ్యం ముట్టడించి అతడి సప్తాం గాలూ* కొల్లగొట్టి తెస్తాను. దీంతో వాడి తెవులు కుదురుతుంది. అతడి ఆలమందలన్నీ రొప్పుకొస్తాను. అడ్డపడతారుకదా, పాండవుల్నీ

---

* రాజు, మంత్రీ, మిత్రం, కోశం, రాష్ట్రం, దుర్గం, సైన్యం ఇవి సప్తాంగాలు.

పట్టుకుంటాను, అంచేత మత్స్యదేశం ముట్టడికి అనుమతించండి నన్ను" అన్నాడు.

కర్ణుడూ శ్రుతివేశాడు సుశర్మకి. "సుశర్మ మాటలు సమంజసంగా వున్నాయి. పెద్దల ఉపదేశమూ, మహారాజు నిర్ణయమూ, సుశర్మ సంకల్పమూ మనకు విజయాన్నే సూచిస్తున్నాయి" అన్నాడు.

సభ అంతటినీ ఓసారి చూసి, దుశ్శాసనుణ్ణి ఉద్దేశించి ఇలా ఆదేశించాడు దుర్యోధనుడు

"పెద్దల అనుమతి తీసుకుని సత్వరం సైన్యం సన్నద్ధం చెయ్యి. రెండుపక్కలనుంచీ మనముట్టడి జరగాలి. ముందు సుశర్మ సైన్యాలు పంపుదాం. మర్నాడు మనం బయల్దేరుదాం" అన్నాడు.

చేతులు జోడించి "చిత్తం" అన్నాడు దుశ్శాసనుడు.

తనవాళ్ళందరూ ఏకగ్రీవంగా, దృఢసంకల్పులై కార్యాచరణకు పూనుకునేట్టు సంఘటితపరచవలెనన్న సంకల్పంతో సభలోనివాళ్ళనందరినీ గౌరవాదరాలతో కలయ చూశాడు దుర్యోధనుడు.

"ముందు సుశర్మ సైన్యాలు వెళ్ళి ఆలమందల్ని ముట్టడిస్తాయి. విడిపించడంకోసం సకల సైన్యాలతో పరుగెత్తుకువస్తాడు విరాటుడు. మనం మర్నాడు వెళ్ళి తక్కిన మందలు పట్టుకుంటాం. వాటిని విడిపించడానికి వస్తారు పాండవులు. సుశర్మ సైన్యాలు దక్షిణ దిక్కునుంచి ఆక్రమిస్తాయి మనం ఉత్తరదిక్కునుంచి ముట్టడిస్తాం మీలో ప్రతి ఒక్కరూ మీమీసేనలు తర్లించుకురావాలి. కబురందడానికిముందే వెళ్ళి గోధనం పట్టుకోవాలి. బహుళాష్టమినాడు దక్షిణగోగ్రహణం చేస్తాడు సుశర్మ. నవమినాడు మన ఉత్తరగోగ్రహణ మన్నమాట" అన్నాడు.

సమ్మతి సూచకంగా సంతోష ధ్వానాలు చేశారు సభికులు. హిమంతులూ, సైన్యాధిపతులూ సమరోత్సాహం ప్రకటించి కత్తులు ఝుళిపించారు.

ఇందరూ ఇన్ని ఆలోచనలు చేశారు. కాని అజ్ఞాతవాసం అంతం కావచ్చిందనే ఆలోచన ఒకరికీ లేకపోయింది.

## గో గ్ర హ ణం

రాజుకార్యం నెత్తిని వేసుకుని అప్రమత్తుడుగా బయల్దేరాడు సుశర్మ. రథాలూ రథ్యాలూ, శరాలూ శరాసనాలూ, అస్త్రాలూ శస్త్రాలూ, కవచాలూ, బిరుదులూ, నిస్సాణాలూ—సర్వసమృద్ధమైన సమర సన్నాహంతో అన్యదేశాన్ని ఆపోశనం పట్టెయ్యడానికి పురకలు వేస్తూ హుటాహుటిని నడిచింది త్రిగర్త సైన్యం. తొందర ప్రయాణమే ఐనా సైన్యాలకు అలయిక కలగకండా, ఉత్సాహం తగ్గకండా అతిభద్రంగా నడిపించుకు వెళ్లాడు సుశర్మ. వార్త పొక్కడానికి వీలులేకండా, మకాం చేసిన ప్రదేశాల్లో వాద్యాలు మొదలైన ఆర్భాటాలు నిషేధించాడు. దారికడాకూ ఆలమందలే కలగంటున్నా డతడు ముందుగా గూఢచారుల్ని పంపి ఆవులుండే స్థలాలు తెలుసుకున్నాడు. చప్పున వెళ్లి వందలాది మందల్ని ఒక్కుమ్మడి కార్చిచ్చులా ముట్టడించి తోలుకు రావడం మొదలు పెట్టాడు.

దాంతో కాపలా కాస్తున్న గొల్లలందరూ హాలో మని తిరగబడ్డారు. కర్రలూ, కత్తులూ పట్టుకొని అడ్డుపడ్డారు.

అది చూసి గుర్రపు దళానికి సంజ్ఞ చేశాడు సుశర్మ. వెంటనే గొల్లల మీదికి పరిగెత్తారు అశ్వసైనికులు. ఆటాడినట్టు వేటాడి నరకడం మొదలు పెట్టారు వాళ్ళని. చెల్లాచెదరై పోయారు గొల్లలు. నరుకులు తిని పడిపోయారు కొందరు. పోట్లతో ప్రాణాలు విడిచారు కొందరు. నెత్తురు కార్చుకుంటూ పట్నంలోకి పరిగెత్తారు కొందరు. నెత్తురు శరీరాలతో రొజుకుంటూ రాజసభలో ప్రవేశించి నిలువునా కూలబడ్డారు కొందరు. వాళ్ళనిచూసి భయంతోనూ వేదనతోనూ

రాజసభఅంతా తెలతెల్లపోయింది. వగర్చుకుంటూ జరిగిందంతా నివేదించారు గొల్లలు.

"మహాప్రభో, అవి రథాలు కావు. అవి గుర్రాలు కావు అవి ఏనుగులు కావు నేల ఈనినట్టు ఎక్కడినుండి వచ్చిపడ్డారో త్రిగర్తులు. ఏలినవారి అలమందల్ని రొప్పుకు పోతున్నారు. అడ్డుపడ్డ వాళ్ళని నరికి పారేశారు. ఆలస్యంలేకండా అడ్డుకోవాలి మహారాజా! లేకపోతే చెయిదాటి పోతాయి సొమ్ములు" అన్నారు.

విని అదిరిపడ్డాడు విరాటరాజు. కోపంతో కనుబొమలు ముడి పడ్డాయి. "ఏమిటీ, మన ప్రతాపం మరిచాడో సుశర్మ! నా మందల మీదికే ఎసరు పెట్టాడూ! మంచిది! ఆ కాస్త కొవ్వేదో ఇప్పుడే కరిగి పోతుంది" అని మంత్రుల్ని చూసి "చప్పున ముట్టడించాలి మనం. లేకపోతే చెయిదాటిపోతాయి పశువులు. అవమానం, కీడూ రెండూవస్తాయి. తక్షణం మన సమస్త సైన్యాలూ రథగజతురగాలతో సహా వాళ్ళమీదికి పరిగెత్తించండి" అన్నారు శస్త్రాస్త్రాలూ, కవచకార్ముకాలూ ఎవరికి తగినవి వారికి త్వరత్వరగా పంపండి" అని ఆదేశించాడు. సారథిని పిలిచి హెచ్చరించాడు.

"వెళ్ళు, నిమిషాలమీద రథం తయారుచెయ్యి. గాలిలాగ పరిగెత్తే గుర్రాలు పూన్చు. వాటికి దృఢమైన కవచాలుతొడుగు సమరోత్సాహివికదా నువ్వు. ఇదిగో, యుద్ధం వచ్చింది మరి! నీ ధైర్య సాహసాలతో శత్రువుల్ని చకితుల్ని చేయాలిప్పుడు" అన్నాడు.

తానూ వీరోచితంగా అలంకరించుకున్నాడు. బంగారంచెక్కిన కవచకిటాలు ధరించాడు. కత్తిపట్టుకుని బయలుదేరడానికి సిద్ధపడ్డాడు. దండయాత్రా సూచకాలైన భేరీకాహళాది తూర్యరవాలు సముద్ర ఘోషలా చెలరేగి దిక్కులు ప్రతిధ్వనించాయి రథం సిద్ధంచేసి నిమిషాలమీద తీసుకువచ్చాడు సారథి. నొగా, కాడీ దృఢంగా బంధిం

చాడు రథమూ, రథాంగాలూ అందంగా అలంకరించాడు సలక్షణమైన పంచకల్యాణి గుర్రాలు పూన్చాడు. రకరకాల ఆయుధాలు, శరాలు, శరాసనాలు అప్రయత్నంగా అంది వచ్చేటట్టు రథంమీద అమర్చి పెట్టాడు.

రథమెక్కి ప్రయాణభేరీ మ్రోయింపిచాడు విరాటరాజు. ఇంతలో బంగారం కవచాలతోనూ, రకరకాల శస్త్రాస్త్రాలతోనూ, రథ, గజ, తురగ భటాదిసేనా సమూహంతోనూ వచ్చి కలిశారు విరాటరాజు తమ్ముళ్లు శతానీకుడూ, మదిరాశ్వుడూ, సూర్యదత్తుడూను.

తెల్లని జోడుగుర్రాల రథంమీద, భీషణమైన శంఖారావం చేస్తూవచ్చాడు విరాటరాజు పెద్దకొడుకు శంఖుడు మరిన్ని రకరకాల వాహనాలమీద సమారోహంగా వచ్చారు అనేకులైన సామంతులూ, దండనాయకులూ, యోధాగ్రేసరులూ, దొరలున్నూ. వీళ్ళందరితోనూ బయలుదేరి సైన్యాన్ని సమాయత్తం చేసుకుంటూ విరాటుడు ఊరిబైట కొంచెంసేపు ఆగాడు

అంతలో వలలుణ్ణీ, దామగ్రంథినీ తంత్రీపాలుణ్ణీ కొంత దూరంలో నిలబెట్టి రాజుదగ్గిరికివెళ్లి అభివాదనం చేశాడు కంకభట్టు.

"రాజా, లోగడ ఓ ఋషిదగ్గిర సమంత్రకంగా, సాకల్యంగా నేనూ నేర్చుకున్నాను విలువిద్య సమరంలో నేనూ కొంతసామర్థ్యం చూపించగలను. సబాంధవంగా మీరు యుద్ధానికి వెళుతూంటే మీ పుప్పు తింటూ నేనుమాత్రం ఇంటిదగ్గిర ఎలాఉండగలను! నాకూ ఓ రథం, ఆయుధాలూ అనుగ్రహించండి" అన్నాడు. రాజు దానికి సమ్మతించకుంతోటే వలలుణ్ణీ, దామగ్రంథి తంత్రీపాలుల్నీ చూపించాడు.

"మన వలలుడి సంగతి చెప్పనే అక్కరలేదు. బలానికి తగిన బంటుకూడాను. దామగ్రంథీ తంత్రీపాలుడూ కూడా అసమానంగా యుద్ధం చెయ్యగల యోధులు. ధర్మరాజు దగ్గిరవున్నపుడు వీళ్ళు

పోరాడడం కళ్ళారా చూశాను. అంచేత తగిన రథాలిచ్చి వీళ్ళని యుద్ధానికి తీసుకువెళ్ళడం మంచిదని నా ఉద్దేశం" అన్నాడు.

విరాటరాజుకి పరమానందం కలిగింది. వెంటనే శతానీకుణ్ణి పిలిచి చెప్పాడు "తమ్ముడూ, వీళ్ళ నలుగురికీ మంచిరథాలు నాలుగు తెప్పించు. తగినకవచాలూ, కార్ముకాలూ ఇప్పించు వీళ్ళూ మనతో యుద్ధానికి వస్తారు" అన్నాడు.

అన్నగారి మాటప్రకారం శతానీకుడు వాళ్ళను తీసుకువెళ్ళి రథాలతో కూడా ఆవశ్యకమైన సమస్త సంబారాలూ సమకూర్చాడు. నలుగురూ యోధోచితమైన వీరగంధం పూసుకన్నారు. వీరమాలికలు వేసుకున్నారు కవచకిరీటాలు మొదలైన వీరభూషణాలు తొడుగుకున్నారు రథాలెక్కి తమకుతామే సారథ్యం చేసుకుంటూ విరాట సేనతో బైలుదేరారు.

కోపమూ, ఉద్రేకమూ ఉత్సాహమూ తొందరపెడుతూన్న హృదయంతో సంరంభంగా సైన్యం తర్లించుకుంటూ త్రిగర్తుల మీదికి బైల్దేరాడు విరాటరాజు.

అలా విరాటసైన్యం హుటాహుటిని పరిగెడుతూవుంటే—మదపుటేనుగుల చెవులు విసిరేగాలికి అరణ్యాలు నేలమట్టంగా పడిపోయాయి. రథఘోష ప్రతిధ్వనిస్తూన్న కొండలు భయంతో పెడబొబ్బలు పెడుతున్నట్టున్నాయి. గుర్రాల డెక్కలవల్ల రేగిన ధూళిపడి సముద్రం వండుకట్టుకు పోయింది. పదాతిదళం పాదాల తాకిడికి బరువెక్కిన భూమిని మొయ్యలేక నువ్వంటే నువ్వని ఆదికూర్మమూ, నాగేంద్రుడూ బరువులు మార్చుకున్నారు.

రెండు మహాసముద్రాలు భయంకరంగా గర్జిస్తూ పరస్పరం ఢీకొన్నట్టు ఇలావచ్చిపడ్డ విరాటసైన్యమూ, త్రిగర్తసైన్యమూ పొలో అంటే పోలో అని కలియబడ్డాయి.

యోధుల ధనుష్టంకారధ్వనులూ, ఖణేలు ఖణేలుమనే కత్తుల రాపిళ్ళూ, మువ్వలతో ఘల్లుఘల్లని కదంతొక్కుతూన్న గుర్రాల సకిలింపులూ, గంటల గణగణలతో చెలరేగుతున్న మదగజాల ఘీంకారాలూ కలిసి విజృంభించిన కోలాహలాన్ని ఉభయసైన్యాల భేరీ, నౌబత్తు, కాహళాది తూర్యారవాలు వినపడకుండా చేశాయి.

ఇంతలో ఓ చోట ధనుర్బలంతో ధనుర్బలం తలపడింది. ఇరు పక్షాల బాణాలు ఒకదాన్నొకటి తాకి భగ్గున మండిపొయ్యేవి అభేద్యములైన కవచాల్ని పగులగొట్టేవి. చురుక్కుమనిపించేవి. కవచాల మీదపడి శరీరాన్ని చురచుర కాల్చేవి. తలకాయలు కిందపడగొట్టేవి. ఇటునుండి అటు దొలుచుకు పోయేవి. నలుగురేసి ఐదుగురేసిమందిని ఒక్కసారి దూసుకుపోయేవి.

మరోచోట కాల్బలంతో కాల్బలం తలపడింది. బంటుకి బంటు, పదిమందితో ఒకడు, ఒకడితో పదిమంది సంకులసమరం ప్రారంభించారు.

దెబ్బతిని మోకరిల్లి పడినవాళ్ళను చూసిన్నీ జంకకుండా దెబ్బల ముందుకు లంఘించేవారు కొందరు. వాళ్ళను 'సెబా' సని పోటుమీదపోటూ, వేటుమీద వేటూ వేసేవారు కొందరు. కిందపడ్డ వాళ్ళని తొక్కుకుంటూ ముందుకు వురికేవారు కొందరు. చొచ్చుకు పోయిన చోటల్లా నెత్తురుప్రవాహాలు పారిస్తూ ప్రతీ భటుడూ సాహసంతో సమరం సాగించాడు.

ఒకచోట గుర్రపుదళాన్ని గుర్రపుదళం తలపడింది. ఒకడు పదిమందిమీదికి ఆక్రమిస్తే, విడిపోయి చెరొకపోటూ పొడిచేవారు. పదిమందీ ఒకడిమీద ఆక్రమించినా కదలకుండా వేటుమీద వేటు అందిచ్చేవారు. మూకమీద మూకగా వురికి ఒకళ్ళనొకళ్ళు నరుక్కునేవారు. తండోపతండాలుగా ముందుకీ వెనక్కీ పెనుగులాడుతూ కీలుబొమ్మల్లా పలువిధాల పోట్లాడారు అశ్వసైనికులు.

ఇంకోచోట ఏనుగుసేనతో ఏనుగుసేన తలపడింది. ఏనుగుల కపోలాల మదజలమూ, తొండాల తుంపుర్లూ పడి దుమ్మంతా అడ గారింది రణరంగం. కొండలవంటి వాటి వీపులమీదనుండి ఎత్తయిన జెండాలు ఆకాశం కొలుస్తున్నట్టున్నాయి. ఏనుగుల మెడల్లోని ఘంటారవాలూ, ఘీంకారాలూ దిక్కుల్ని అవతలకు నెట్టుతున్నట్టు న్నాయి. రోషంతో ఎరుపెక్కినవాటి నేత్రాలూ, దేహాలికి పూసిన సిందూరమూ సూర్యకాంతిని మించినట్టున్నాయి. రౌద్రం మూర్తీ భవించినట్టు, ప్రళయం రేకెత్తినట్టు, కొండలు ఢీకొన్నట్టు భయంక రంగా పోరాడాయి ఇరుపక్షాల ఏనుగులు. యోధుల శరవర్షంతో కొండలు కుప్పపడినట్టు పీనుగు గుట్టలై పడ్డాయి మదగజాలు.

రథాలతో రథాలు తలపడ్డాయి మరోదగ్గిర. నొగతో నొగ పగిలేటట్టు తాకించి ఎదిరిరథంమీదికి లంఘిస్తూ, గుర్రాలు కూలి పోగా విరథులయిన్నీ కత్తులతో, కటార్లతో, ఈటెలతో, ముద్గరా లతో పోరాడారు రథయోధులు. సారథి పడిపోగా, స్వయంగా రథం నడుపుకుంటూ, దెబ్బతిని రథంమీద పడిపోయిన్నీ చర్రున లేచి కొట్టిన వాణ్ణి తిరిగి కొడుతూ, మడంతిప్పని వీరత్వంతో రథయుద్ధం చేశారు వాళ్ళు.

ఇంతలో భీషణమైన బాణవర్షంతో శత్రుసైన్యాన్ని ముంచె త్తుతూ, ఉరుములవంటి ధనుష్టంకారంతో భూమ్యాకాశాలు ప్రతి ధ్వనింపజేస్తూ, స్వర్ణకవచంలోని మణులతో మెరుపులవలె మిరుమిట్లు గొలుపుతూ, ప్రళయకాల కాలమేఘంవలె త్రిగర్తులమీద వచ్చి పడ్డాడు శతానీకుడు. వచ్చాడో లేదో ఘోరాస్త్రాలు కుమ్మరించి రథికుల్ని సారథుల్ని కలుపుకొని నూరుగురిని ఖండ ఖండాలు గుంకపిండి చేశాడు.

అన్నగారి బలోన్మాదానికి దోహదం కలిగిస్తూ, ఆ కర్ణాం తంగా లాగిన ధనుస్సునుండి వేసే శాణం తీసే బాణం నిరూపించడానికి వీలులేకండా శరసంధానంచేస్తూ ప్రళయరుద్రుడిలా వురికిపడ్డాడు మది

రాశ్యడు. ఉరికిందే తడవుగా నాలుగువందల రథాలు పిప్పిచేశాడు. ఏనుగులూ, గుర్రాలూ రోజుకుంటూ పరిగెత్తేటట్టు తరిమాడు.

అతడివెంట అమానుషంగా రథాన్ని మండలాకారంగా నడిపిస్తూ, 'వీరుడంటే వీడేరా' అన్నట్టు ఏనుగుల్ని వెంటాడి పదులూ వందలూ పడగొట్టాడు సూర్యదత్తుడు

అతడివెంట పెళ్ళికొడుకులా కలకలాడుతూ శత్రువులకళ్లకు చిమ్మ చీకట్లు కమ్మేట్టు అస్త్రప్రయోగం చేస్తూ పైనుండి రథం పరుగెత్తించుకుని వచ్చి, ఎక్కడచూస్తే అక్కడ తానై రణరంగమంతా వీరవిహారం చేశాడు శంఖుడు.

దాంతో, మందరగిరితో మథించినపుడు సంక్షోభపడిన క్షీరసాగరంలా కలగుండుపడింది త్రిగర్తసైన్యం. తక్కిన విరాట సామంతులుసహా ఎవరికి తగినట్టు వారు శత్రువులమీదికి ఘోరంగా ఆక్రమణం చేశారు. సహోదరులూ, కుమారుడూ, మంత్రులూ, సామంతులూ, బంధువులూ – ఈబలగమంతా ఇలా పోరాడడం చూసి వీరావేశంతో జలదరించాడు విరాటరాజు

''సారథీ, అదిగో, ఆ బలమైన సేనావ్యూహం మధ్య కనిపిస్తూన్న సుశర్మ పతాకానికి సూటిగాపోనీ మనరథం'' అన్నాడు.

పగ్గాలు సడిలించి రథం పరిగెత్తించాడు సారథి. పరిగెడుతూన్న రథంమీంచి ఇరుపక్కలా ఐదువందలరథాలు పడగొట్టాడు విరాటరాజు.

రంగంలో రాజుకూడా వురికడంచూసి ఎక్కడలేని ఉత్సాహం మితిమీరింది సైనికులకు. ఈటెలూ, కత్తులూ, గదలూ, తోమరాలూ ఎవరికి దొరికిన ఆయుధాలతో వారు ఒక్కపెట్టున త్రిగర్తసైన్యంమీద తిరగబడ్డారు. ఈ వుప్పెనకు తట్టుకో లేక చెల్లాచెదరయి పోయింది త్రిగర్త సేన.

ఇదంతా చూస్తున్న సుశర్మకళ్ళ చింతనిప్పులు కురిశాయి. తమ్ముడూ తానూ ధనుస్సులు సారించి విరాటసైన్యంమీదికి పరిగెత్తిం చారు రథాలు. తామరకొలను చొరబడ్డ మదపుటేనుగులాగ శత్రు సైన్యంలో చొరబడి సుశర్మ విజృంభిస్తూ వుంటే రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, పదాతిదళాలూ చిందరవందరలై పోయాయి ఏలిక రెచ్చిపోడంచూసి ఉత్సాహోద్రేకాలు రెండింతలైనాయి త్రిగర్తసేనకి. విరిగిన సైనికులు తిరిగి తిరగబడ్డారు. ఉభయసైన్యాలూ హోరాహోరి పోరాటం సాగించాయి.

వీరావేశంతో సుశర్మనుచూశాడు విరాటుడు ఒకసేవకుణ్ణి కొప్పడ్డట్టు నిర్లక్ష్యంగా గదమాయించాడు. హడావుడిగా వెళ్ళి కలియబడ్డాడు. ఉభయులూ మూర్తీభవించిన రౌద్రంలా వున్నారు. ఉభయులూ బలగర్వంతో ఎగిరి పడుతున్నారు ఉభయులూ పరస్పర విజయకాంక్షతో పురకలు వేస్తున్నారు.

ఉభయులూ విసురుతూన్న ఈటెలు పరస్పరం ఢీకొని నిప్పులు కక్కుతున్నాయి. కన్నువిప్పి కన్నుమూసేటంతలో సుశర్మ మొహం మీదా గుండెలమీదా పది బాణాలు తగిలించాడు విరాటరాజు. మరి పదింటితో గుర్రాలను కొట్టాడు. దాంతో బాణంతీసి బాణం సంధించ డానికి అవకాశమివ్వకండా ధగద్ధగ మంటూన్న యాభై బాణాలు విరాటరాజు మీద కుప్పించాడు సుశర్మ.

తమతమ ప్రభువులు కలియబడి ఇలా యుద్ధం చేస్తూంటే రెండు పక్షాలలోనూ పదింతలు, వేయింతలై మితిమీరింది ఉత్సాహం. రథంతోరథం, ఏనుగుతోఏనుగు, గుర్రంతో గుర్రం, భటుడితోభటుడు బాహాబాహి, కచాకచి–సంకుల సమరం సహస్రముఖాల రెచ్చింది. దుమ్మురేగి భూమీ ఆకాశం ధూసరితమైంది. తనవాడెవడో పయి వాడెవడో తెలియకండా పట్టపగలే చిమ్మచీకటి కమ్మింది.

గాయాల్లోంచి కారే నెత్తురుతో, రేగిన దుమ్ము అడగారిపోయింది అదంతా ఎర్రగా ప్రకాశిస్తూ వేకువలో అరుణోదయ మైనట్టుంది

ఇలా సంగ్రామం ఘోరంగా జరుగుతూనేవుంది ఇంతలో సాయంకాలమైంది. ఎర్రగా చివురించిన మామిడి గున్నలా అస్తాచలం మీద కనిపించాడు సూర్యుడు.

దినమంతా పోట్లాడి అలిసిపోయిన సైన్యాలు చీకటి పడితేనే గాని యుద్ధం విరమించరని సమయం కనిపెట్టి వెళ్ళిపోయినట్టు అస్తాగతుడయాడు లోకబాంధవుడు.

మునిమాపులో కనిచీకట్లోనహా పోరాడి పోరాడి కటిక చీకట్లు కమ్ముకు రాగానే చేసేదిలేక ఎక్కడి వాళ్ళక్కడ నిలబడి పోయారు సైనికులు. అలా కొంతసేపు నిలిచిపోయింది యుద్ధం

తరువాత "నా మనుమలైన పాండవులు యుద్ధానికి ఉత్సహిస్తున్నారు. చీకట్లో రాణించరువాళ్ళు. అంచేత వెళ్ళాలి మనం"అని బైలుదేరి వచ్చినట్టు పూర్వగిరిమీద తొంగిచూశాడు చంద్రుడు వెన్నెల చూసి రెండు పక్షాలవాళ్ళూ మళ్ళీ కలియబడ్డారు. విరాటరాజు వీరావేశంతో సుశర్మ మీదికీ అతడి తమ్ముడిమీదికీ తలపడ్డారు. అంతలో త్రిగర్తుల రథాలు అనేకం అతణ్ణి చుట్టుముట్టాయి సుశర్మా, అతడి తమ్ముడూ రెండు పక్కలా రెండు రథాలతో ఎదిరించారు. విరాటరాజు సారథిని, గుర్రాల్ని చంపేశారు. విరథుడై నిస్సహాయుడై పోయాడు విరాటరాజు. రభసంగా అతణ్ణి వెంటాడి పట్టుకున్నాడు సుశర్మ. ఆవేశంతో సింహనాదం చేశాడు. విరాటుణ్ణి తన రథంమీదికి లాక్కు వచ్చాడు.

అదిచూసి భయపడిపోయి పటాపంచలై పరిగెత్తాయి మత్స్య సైన్యాలు. త్రిగర్తసైన్యంలో విజయదుందుభులు మార్మోగాయి. విజయగర్వంతో ఉప్పొంగిపోతూ విరాటరాజును బంధించి తీసుకు పోతున్నాడు సుశర్మ.

ఇదంతా చూస్తున్న కంకభట్టు వలలుణ్ణి పిలిచాడు "ఇంత వరకూ మన మిత్రుణ్ణి ఆశ్రయించి బతికాం. ఇప్పుడితడు శత్రువులపాలు కాకుండా విడిపించడం మనధర్మం. పరుగెత్తు పరుగెత్తు" అన్నాడు.

అన్నగారలా అనడంతోటే శరీరం పుప్పొంగింది వలలుడికి. "ఇదిగో మద్దిచెట్టు దీంతో సుశర్మని చితకగొడతాను. రాజుని విడిపించుకు వస్తాను. త్రిగర్తులందర్నీ పీచు రేగగొడతాను మీరిక్కడే వుండి చూస్తూండండి" అన్నాడు.

సంకోచసూచకంగా చిరునవ్వునవ్వాడు కంకభట్టు. "చెట్టే వూడపీకి పరిగెత్తావా, వీళ్లంతా తెల్లపోతారు నిన్నా పోల్చుకోవడానికి అడ్డుండదు మరి. అంచేత అలాంటిపని కూడదు. సామాన్యమైన ధనస్సుతోనే వెళ్లు వేగం. నీకు చక్రరక్షకులుగా తమ్ముల్లిద్దరూ వస్తారు" అన్నాడు.

మదగజానికి అంకుశంలా అన్నగారి పలుకులు అడ్డువచ్చాయి వలలుడికి. చెట్టుదిక్కు ఎత్తిన కాలు వెనక్కు లాక్కున్నాడు. "సరే, మీ మాట కానియ్యండి" అన్నాడు. శరీరం విదిలించుకున్నాడు. ముడిపడ్డ కనుబొమ్మలతో సుశర్మపోయిందిక శరవేగంతో పరిగెత్తించాడు రథం. దామగ్రంథీ, తంత్రీపాలుడూ అతణ్ణి అనుసరించారు ఉత్సాహంతో కంకభట్టూ వాళ్లని వెంబడించాడు.

ఇలా నాలుగు రథాలూ పరిగెత్తుకు రావడం చూసి వెనక్కు తిరగబడ్డారు త్రిగర్తులు. పొడిచినపోటు పొడవకుండా, వేసినవేటు వేయకుండా సారథుల్నీ గుర్రాల్నీ కలుపుతీసి వెయ్యిరథాలు గుండ చేశాడు వలలుడు. ఏడువందల రథాలు పడగొట్టాడు దామగ్రంథి. మూడువందలు చిదగ్గొట్టాడు తంత్రీపాలుడు. వెయ్యిమంది యోధుల్ని తెగేసి, సుశర్మని వెంటాడి దారుణంగా కలియబడ్డాడు కంకభట్టు. కలియబడీ పడడంతోటే పిడుగుల్లాంటి పదిబాణాలతో

కొట్టాడు సుశర్మని చప్పున రథంమీంచి దుమికి ఖడ్గంతో పడగొట్టాడు గుర్రాల్ని. దాంతో ఆశా, ఉత్సాహమూ లేక త్రిసుశర్మ రథంనుండి ఓ గదాదండం తీసుకున్నాడు విరాటుడు. అంత ముసలివాడున్నూ అమాంతంగా యువకుడిలా కిందికి లంఘించాడు. గదతో విసిరి కొట్టాడు సుశర్మని.

ఇంతలో సుశర్మ రథంమీదికి వురికాడు వలలుడు. మీదపడి అతణ్ణి పెడరెక్కలు విరిచికట్టాడు. భయంకరమైన సింహనాదం చేశాడు. త్రిగర్తసైన్యాన్ని గడగడలాడించాడు సుశర్మ దొరికిపోడం తోటే అతడి చక్రరక్షకుడు శోణాశ్వుడూ మొదలైన ఆప్తపరివారమూ, తమ్ముడు సువర్మా మొదలైన బంధువర్గమూ - అంతా వెక్కబలం చూపెట్టి పలాయనం చిత్తగించారు. వాళ్లని వెంటాడి ఆలమందలతో పాటు రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ మళ్లించుకువచ్చాడు వలలుడు.

తమ్ముల్ని వెంటబెట్టుకొని విరాటరాజు దగ్గిరికి వచ్చి జయజయ ధ్వానం చేశాడు కంకభట్టు వాళ్ళ నలుగురినీ మహాదరంతో కౌగిలించుకున్నాడు విరాటరాజు.

"కంకభట్టూ, నా ప్రాణమానాలు రెండూ కాపాడావు దీనికి సరైన ప్రత్యుపకారం నేనేమి చెయ్యగలనో తెలియంలేదు నేటినుండి నా రాజ్య సింహాసనం నీదే అని భావిస్తున్నాను ఈ శరీరమూ, ఈసంపత్తీ అన్నీ నువ్వే ప్రసాదించావు కాబట్టి, నీకే సమర్పించుకుంటున్నాను ఈ సమగ్రమత్స్యదేశాన్ని పరిపాలించి నన్ను అనుగ్రహించు" అన్నాడు

సస్నేహంగా మందహాసం చేశాడు కంకభట్టు. "రాజా నన్నింతగా ప్రశంసించడం దేనికి! ఇంతకూ నేనేమంత మహాకార్యం చేశానని! నన్నెప్పుడూ మన్నిస్తూనే వున్నావు నాకదే పదివేలు. శత్రుసంహారం చేసి మనం రాజధానికి వైభవంగా తర్లి వెళ్ళడమే నాకు సకలసంపదలూ అబ్బినట్టు" అన్నాడు.

భట్టు ఉదార హృదయం చకితుణ్ణి చేసింది విరాటుణ్ణి. ఒళ్లు పులకరించినట్లయింది. "ఉపకారమో, బంటుతనమో, దయాభావమో, కీర్తి కాంక్షో, స్నేహమో, సౌహార్దమో - శత్రుభీకరంగా నువ్వివాళ చేసిన యుద్ధానికి కారణం! నీ ఋణమెలా తీర్చుకోనూ! కార్చిచ్చులాంటి శాత్రవసైన్యాన్ని జంకైనా లేకండా ముట్టడించాడు వలలుడు. ఎంతమందిని, ఎంతమందిని హతమార్చాడు! అద్భుతమైన ఇలాంటి పరాక్రమం కనీవినీ ఎరగం. నిజానికి ఇవాళ గెలుపంతటికీ ఇతడే కారణం. దామగ్రంథిని ఏదో అనుకున్నాను నేను. తాటిపళ్లని కిందరాల్చినట్టు త్రిగర్తుల తలకాయలు వందలాదిగ తెగేశాడు. నిర్విరామంగా మరి తంత్రీపాలుడు మాత్రం! ఎక్కడచూస్తే అక్కడే కనపడ్డాడు. అంతటి సేనలోనూ యితడి చేత దెబ్బతిననివాడే లేడు. మీ మేలు మరవలేను. నిజంగా స్నేహితుడికి ఆపదలో అడ్డుపడ్డవాడే మనిషి. మనిషే కాదు, దేవత. నవరత్నాలు చెక్కిన స్వర్ణాభరణాలూ, రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, దేవకన్నెలవంటి యౌవనవతులూ నానావైభవ సంపత్తులూ——మీరు కోరుకుంటే అవి సమర్పించుకుంటాను. ఏమిచ్చి మీ ఋణం తీర్చుకోగలను!" అన్నాడు

"మమ్మల్ని ఇంత ఆదరించారు. ఇంతకంటే మాకింకేం కావాలి!" అన్నాడు వలలుడు.

"రాజా, నాదొక్క ప్రార్థనమాత్రముంది మన్నించక తీరదు" అన్నాడు కంకభట్టు

"ప్రార్థన ఏమిటి? నువ్వన్నది నేను ఆదేశంగానే పాలిస్తాను" అన్నాడు విరాటరాజు

"చంపదగ్గ శత్రువు చేతికి చిక్కినపుడు పొమ్మనడమే ఉత్తమ లక్షణం. అంచేత ఈ సుశర్మని సపరివారంగా విడిచిపెట్టడమే నా అభిమతం. తరువాత, పట్నానికి వేగిరావుల్ని వెంటనే పంపించాలి. వాళ్లు వెళ్ళి రాజధానిలో నీ విజయవార్త చాటిస్తారు. పట్టణమంతా విజయ

తోరణాలతో అలంకరిస్తారు. మంగళతూర్యారవాలు, పరిమళద్రవ్యాల కల్లాపులు, గీతావాద్యాలు, నృత్యాలు మొదలైన సంరంభంతో విజయోత్సవం సంసిద్ధం చేయిస్తారు" అన్నాడు కంకభట్టు.

కంకభట్టు ఉపదేశం వెంటనే అమలుపరిచాడు విరాటరాజు. సిగ్గుతో తలవొంచుకుని కుసిల్లి పోతూన్న సుశర్మని కట్లు విప్పించాడు. వెనక చూడకండా ఇంటిదారి పట్టాడు సుశర్మ

శుభవార్త తీసుకుని పట్నం పరిగెత్తారు బేగీరావులు. తెల్లవారేసరికి పట్నం నాలుగుమూలలా విజయవార్త గుప్పుమనిపించారు. పట్టణమంతా ముస్తాబు చేయించారు. సకలశోభాయమానంగా విజయోత్సవం సంసిద్ధ పరిచారు.

ఇక యుద్ధభూమిలో – గుత్తులుదగ్గిరికి నరకేసిన పాదాలు పడి, చివురాకుల సెజ్జలా వుందొకచోట. తెగి అడ్డదిడ్డంగా పడివున్న తొడలతో, మదపుటేనుగులు దూరిన అరటితోటలా వుందొకచోట. పెల్లగిల్లి కుప్పలుగా పడ్డ పేగులు ఆకలితో హంసలమంద వూడ పెరికి పోగులు పెట్టిన తామర తూళ్లలా వున్నాయొకచోట తెగిపడ్డ చేతులు వుంగరాలతో ప్రకాశిస్తూ, పాముల మందలావున్నాయొక చోట. తేలుతూ నవ్వినట్టున్న శిరస్సులతో నెత్తురు మడుగులు, కలువలతో వున్న కోనేళ్లలా వున్నాయొకచోట. గుర్తించడానికి వీలు లేకండా తునకలై పడివున్న కళేబరాలతో, కాలయముడి వంటశాలలా వుందొకచోట.

కంకభట్టాదులూ, విరాటరాజూ, సకల సామంత సేనాసమేతంగా వీటినన్నిటినీ పరికిస్తూ, దాటి వచ్చారు. వెన్నెట్లో పాలనురుగులా అందంగావున్న ఒక ఇసుకతిన్నెమీద ఆరాత్రి మహోల్లాసంగా వెళ్ళబుచ్చారు.

---

# విరాటపర్వం

## నాలుగో ఆశ్వాసం

### ఉత్తరగోగ్రహణం

మర్నాడు సూర్యోదయ మయేసరికి నేల ఈనినట్టు కౌరవ సైన్యం వచ్చిపడింది మత్స్య దేశంమీదికి భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, కృపాచార్యుడూ, శకునీ, దుశ్శాసనుడూ, అశ్వత్థామా మొదలైన మహారథులతో సహా బ్రహ్మాండమైన రావణువను తర్లించుకు వచ్చాడు దుర్యోధనుడు. ఈ సైన్యమంతా ఉత్తరదిశగా వచ్చి స్మశానభూమి చేరువగా విడిసింది.

వచ్చీ రావడంతోటే విరాటరాజు ఆలమందలు పట్టుకున్నారు సైనికులు. అడ్డువచ్చిన సామ్ముల కాపర్లని కృపుడూ, అశ్వత్థామా, శకునీ, కర్ణుడూ, దుశ్శాసనుడూ, దుర్ముఖుడూ, మొదలైన వాళ్ళు బాణాలతో మోదారు.

అదికౌరవసేన అని తెలియడంతోటే రథం తోసుకుని రొజుతుంటూ నగరానికి పరిగెత్తాడు పసువుల కాపర్ల పెద్ద వెళ్ళడమే తడవుగా అంతఃపురంలోవున్న ఉత్తరకుమారుడి దగ్గిరికి పరుగెత్తాడు అతడి తత్తరపాటు చూసి అంతఃపురంలోని స్త్రీజనమంతావచ్చి మూగారు.

"మహాప్రభో, ఉప్పెనలా వచ్చిపడ్డారు కౌరవులు. మన ఆలమందల్ని పట్టుకుపోతున్నారు చప్పునవచ్చి అడ్డుపడాలి. మీ భుజబలం చవిచూపి వాళ్ళందరికీ పారం చెప్పాలి. బైల్దేరండి. రథం సిద్ధం చేయించండి కవచం వేసుకోండి. ధనుర్బాణాలు తీసుకోండి తూణీరం గదా, ఖడ్గం, బల్లెం, చక్రం – అన్నీ తెప్పించండి.

''మహాబలవంతులనీ, అసహాయశూరులనీ, వంశోద్ధారకులనీ, భూచక్రాన్నంతటినీ ఏలుకోతగ్గవారని, ప్రజల తపఃఫలంవల్ల జన్మిం చారనీ, శరణాగతరక్షకులనీ పదివేలమందిలోనూ పొగుడుతూంటారు మహారాజు మిమ్మల్ని అదంతా ఇపుడు నిజమనిపించాలి'' అన్నాడు గొల్లలపెద్ద.

## ఉ త్త ర కు మా ర ప్ర జ్ఞ లు

స్త్రీజనంముందు తన్నిలా ప్రశంసించి కవ్వించడంతోటే ఒకటి రెండైపోయాడు ఉత్తరకుమారుడు. ఎక్కడలేని వుబలాటమూ పొడుచుకువచ్చిందతిడికి

''కౌరవుల్నీ గివురవుల్నీ నిమిషంలో పీగ్గొట్టి ఆవులు లాక్కొ స్తాను. ఐతే నాకు సారథిమాత్రంలేడు. అదే విచారంగావుంది తగిన సారథే వుంటేనా ఒక్కణ్ణీ బదకనివ్వను వాళ్ల కెంత కావరం! మా ఆవులు తోలుకుపోడమే? తగిన సారథి నెవణ్ణయినా మంచివాణ్ణి వెదికి తీసుకురండి. దుర్యోధనుడూ, భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వ త్థామా-వీళ్లంతా నన్ను అర్జునుడని భయపడేలట్టు చెండాడతాను. చిటికెవేసినంతలో అందర్నీ గెలవకపోతే నాపేరే ఉత్తరకుమారుడు కాదు. నాన్నగారూ, ఊళ్ళోవాళ్ళూ అందరూ 'భళీ' అనేలాగ పశు వులు మళ్ళించుకువస్తాను. నాకిదో లెక్కా! కాని ఏంలాభం! సారథి లేడు'' అన్నాడు.

అందరితోపాటు సైరంధ్రికూడా అక్కడేవుంది. ఉత్తరకుమా రుడు ప్రిజ్ఞలు వింది నవ్వాపుకోలేక అక్కడినుంచి వెళ్ళిపోయింది. వెళ్ళి బృహన్నలతో ఈ వృత్తాంతమంతా చెప్పింది. అత డంతా విన్నాడు. లెక్కవేసి అజ్ఞాతవాసంగడువు గడిచిపోయిందని నిరూ పించు కున్నాడు.

"నువ్వువెళ్ళి బృహన్నలకి సారథ్యంచెయ్యడం తెలుసునని చెప్పు. ఖాండవవనం కాల్చినపుడు అర్జునుడి సారథ్యంచేసి మెప్పించాడనీ, అనేకసార్లు ఇతడు సారథిగా వుండడం చూశాననీ, బృహన్నల సారథిగా వుంటే కౌరవుల్ని ఇట్టే కడతేర్చవచ్చుననీ, సంశయించవద్దనీ చెప్పు. ఎలాఐనా నచ్చచెప్పి నన్ను పిలిచేటట్టు చెయ్యి" అన్నాడు.

ఉత్తరకుమారి దగ్గిరికి వెళ్ళింది సైరంధ్రి. "అన్నయ్య సారథి కోసం వెదుకుతున్నారు. తెలిసిన సంగతి చెప్పాలికదా అని వచ్చాను. మన బృహన్నలకి మంచి సారథ్యం తెలుసు. అర్జును డంతవాడు మెచ్చుకున్నాడతణ్ణి. ఖాండవవనదహనంలో బృహన్నల సారథ్యమే అర్జునుణ్ణి గెలిపించింది. నేను బాగా ఎరుగుదును. అంచేత అన్నయ్యగారితో ఈ విషయం చెప్పాలి మనం" అంది.

ఇద్దరూ కలిసి ఉత్తరుడి దగ్గిరికి వచ్చారు అతడి కిదంతా చెప్పారు. విని పక్కున నవ్వాడు ఉత్తరకుమారుడు.

"మాలినీ, నన్ను పరిహాసం చేస్తున్నావు కదూ! పేడివాళ్లని కన్నెత్తి చూడడమంటేనే అసహ్యం నాకు. అలాంటిది యుద్ధానికి ఈవిగ్రహాన్ని ముందుపెట్టుకు పోయీాదా! రాకరాక అంత కౌరవసేన రావడం, పశువుల్ని పట్టుకుపోడం, పరాక్రమం చూపడానికి నేను బయల్దేరడం, నారథానికి బృహన్నల సారథి కావడం!! విన్నవాళ్ళని నవ్వండని చెప్పనక్కరలేదు మరి. ఇంతకీ ఉపప్లావ్యంలో సారథే కరువై పోయాడా!" అన్నాడు.

"ఒక్క కౌరవుల్నే కాదు, ముక్కోటిదేవతలనే జయించవచ్చు బృహన్నల సారథిగా వుంటే" అంది సైరంధ్రి, "అతగాడి అసాధారణమైన ధీరత్వం తెలుసు గనకనే చెబుతూన్నాను. శాపం వల్ల పేడితనం వచ్చినంత మాత్రాన వీరత్వం ఎక్కడికిపోతుందని! అంచేత సందేహించక బృహన్నల సారథ్యం ఒప్పుకోండి."

మనస్సు ముందూ వెనక లవుతున్నా, అప్పటికి మరో సారథి లేకపోడంవల్ల ఎలాగో అంగీకరించాడు ఉత్తరుడు. "సరే, ఐతే పిలవండి" అన్నాడు.

"నేను పిలుచుకు వస్తాను" అని బయల్దేరింది ఉత్తర. ఉత్తుంగమైన స్తనభారంవల్ల అల్లాడిపోతోంది ఆమె లేతనడుము. సమయం చూసి వెంటాడుతూన్న కామాంధకారంలావుంది కబరీభరం చూపు తళుకులు రెట్టింపు చేస్తున్నాయి ఆమె కర్ణభూషణాల ముత్యాల కాంతులు. అందెలధ్వని వినివచ్చి, నడకలు నేర్చుకోవడానికో అన్నట్టు ఆమె వెంట నడిచాయి రాజహంసలు. ఆమె అడుగులుపెట్టిన చోటల్లా పద్మరాగమణులు తాపినట్టయింది. త్వరత్వరగా వెళ్ళి మెరుపుతీగ మబ్బుల్లోకి వెళ్ళినట్లు నర్తనశాలలో ప్రవేశించిందామె గురువుగారికి నమస్కరించి చెప్పడం మొదలుపెట్టింది ఆమెమాటల్లో వినయమూ, చనువూ, ప్రార్థనా, తడబాటూ — అన్నీవున్నాయి.

"మా అన్నయ్యగారి సారథి ఒక యుద్ధంలో చచ్చిపోయాడు ఆవాళనుంచిన్నీ తగినవాడు దొరకక మరొకణ్ణి పెట్టుకోలేదు. అదలా వుండగా, ఇవాళ కౌరవులువచ్చి మా ఆవుల్ని పట్టుకున్నారు. నాన్నగారు నిన్నటినుంచీ త్రిగర్తుల మీదికి యుద్ధానికి వెళ్ళారు. అన్నయ్య కౌరవుల మీదికి బైల్దేరడానికి సిద్ధంగా వున్నాడు. ఐతే సారథిలేక విచారిస్తున్నాడు ఇంతలో మీసంగతి చెప్పింది సైరంధ్రి. అంచేత పిలుచుకని రమ్మని పంపించాడు. మీదగ్గిరవున్న చనువుచేత నామాట కొట్టెయ్యరన్న నమ్మకంతో వచ్చాను. అన్నకు సారథ్యంచేసి మీ పరాక్రమమంతా ప్రకటించాలి. ఈ ఆపదకు అడ్డుపడాలి. కాదంటే నా మీద మీకు వాత్సల్యం లేదనుకుంటాను మరి" అంది.

ఆమె మాటలు ఎంతో ముచ్చట వేశాయి బృహన్నలకి. ముసిముసిగా నవ్వుకున్నాడు "అమ్మాయీ, నేనేమిటి సారథ్యమేమి"

చెప్పూ! నీ మాటలు వింటేనే నాకు భయంగా వుంది. అయితే నువ్వు కావాలీ అంటే ఈ సారథ్యమే కాదు, ఎంత అసాధ్యమైన పనికయినా పూనుకుంటాను. పద ఆపైన ఎలావుంటే అలావుంటుంది'' అన్నాడు. మెత్తమెత్తగా అడుగులువేసే మదపుటేనుగులాగ నడుచుకుంటూ నర్తనశాలనుండి ఉత్తరుడివగ్గిరకి వచ్చాడు.

అంతదూరంలో చూసి ఎదురు వచ్చాడు ఉత్తరుడు. ''బృహన్నలా, కౌరవులికీ మనకీ యుద్ధం వచ్చింది సారథానికి నువ్వు సారథిగా రావాలి వేళ లేదు కవచం వేసుకో కాదనడానికి వీల్లేదు. రథమెక్కు నీ సంగతంతా మాలిని చెప్పింది'' అన్నాడు ఆదరంగా.

''అయ్యో, ఆటకో పాటకో నన్ను పిలిస్తే బావుంటుంది కానీ, అమ్మయ్యో, పోట్లాటకే! సారథిగా నే! బలమూ, పౌరుషమూ, వున్న మగవాణ్ణెవణ్ణైనా పిలవాలి, కాని నన్ను రమ్మంటే ఏందారి!''అన్నాడు బృహన్నల.

రెండుచేతులూ పట్టుకొన్నాడు ఉత్తరుడు అలా అనకు. ఖాండవ వనం కాల్చినపుడు అర్జునుడికి సారథ్యంచేసి గెలిపించావు కదా! అంత వాడివి ఇప్పుడిలాఅంటే ఎలా? నేనంటే నీకెంతిస్నేహం. అదంతా మరిచి పోయావా! లే. రణోత్సాహంతో బయల్దేరు. వేళలేదు'' అన్నాడు.

అతడి మాటకి అడ్డంరావడానికి భయపడుతూన్నట్టు నటించాడు బృహన్నల. ఎలాగో చివరికి 'సరే' అన్నాడు.

ఇంతలో మంచి కవచం ఒకటి తెప్పించాడు ఉత్తరుడు. ''తొడుగుకో'' అన్నాడు. అది పుచ్చుకొని ఏమీ ఎరగని వాడిలా అటుతిప్పి ఇటుతిప్పి చూశాడు బృహన్నల. చేతులు కాళ్ళకు పెట్టుకనీ, మెడ నడుముకి తగిలించుకునీ ఒక్కడే స్త్రీజనాన్నందరినీ నవ్వించాడు దాంతో అదితీసుకొని ఉత్తరుడే తొడిగించాడు బృహన్నలకి తానూ ఒక మంచి బంగారుకవచం వేసుకొన్నాడు మన్ను ఆవులమీదికి వురకలు వేసు

తోంది. "ఊc, గుర్రాలు పూన్చు, జెండా తగిలించు. ఆలమందలతో ఇదిగో అన్నట్టు రావాలి మనం నా విజయానికి పౌరులు జేజేలు పెట్టాలి. తెలుసా!" అన్నాడు.

"నువ్వేది చెపితే అదే చేస్తాను. నువ్వున్న దగ్గిరే వుంటాను. నువ్వెటు వెళితే అటే వెళతాను. నన్నూ, నా శక్తినీ చూసి నా చేత పని చేయించుకోవాలి నువ్వు. అంతే" అన్నాడు బృహన్నల. మనస్సు ఉత్సాహోద్రేకాలతో వుర్రూతలూగుతోంది లోలోపల.

బంగారం జాలర్లతో తళుక్కు తళుక్కు మంటూన్న పంచ కల్యాణి గుర్రాలు రథానికి పూన్చాడతడు. రత్నాలు చెక్కిన సింహ పతాకం రథం మీద తగిలించాడు. ఇలా సకల సన్నాహాలతో సంసిద్ధ పడుతూన్న బృహన్నల దగ్గిరకి ఉత్తరకుమారీ, ఆమె చెలికత్తెలూ వచ్చారు.

"కౌరవుల్ని ఓడించి, వాళ్ళ పాగాలలో మంచి మంచి అందమైనవీ, రంగురంగులవీ ఎంచి బొమ్మపొత్తికలకోసం తెచ్చిపెట్టాలి మాకు" అన్నారు.

"మహారథులైన కౌరవ వీరుల్ని ఉత్తరకుమారుడు జయించడమూ, నేను మీ బొమ్మలకి గుడ్డలు తెచ్చి యివ్వకపోడమూనా! తప్పకండా తెస్తాను" అన్నాడు బృహన్నల.

ధనస్సూ, తూణీరమూ, కృపాణమూ, ముద్గరమూ, మొదలైన ఆయుధాలు పదిలంగా రథంమీద పెట్టాడు. నొగలుమీద కూచుని పగ్గాలు చేత్తో పుచ్చుకున్నాడు.

ఇంతలోనే ఉత్తరుడూవచ్చి రథంమీద కూచున్నాడు. రథం రాజవీధిని సాగుతుంటే పుణ్యాంగనలూ, ధ్వజమూ, బ్రాహ్మణులూ బృహన్నలని చూసి "ఖాండవదహనంలో అర్జునుణ్ణి మల్లేనే ఇవాళ మా రాజకుమారుణ్ణి విజయలక్ష్మి వరించాలి నీవల్ల" అని దీవించారు. మంగళాక్షతలు చల్లారు. పట్నం దాటి రథం పరిగెడుతూ

వుంది అనర్గళంగా రథం నడుపుతూన్న బృహన్నల నైపుణ్యానికీ, వాయువేగంతో సాగిపోతూన్న రథగమనానికీ మెచ్చుకుంటూ కూచున్నాడు ఉత్తరుడు. ఇంతలోనే రథం స్మశానప్రాంతానికి వచ్చేసింది.

అలమందిలు అదిలించుకుంటూ, నేల అణగారిపోయేట్టు నడుచుకు పోతూవుంది కౌరవసైన్యం. ధూళి రేగి భూమీ ఆకాశం నిండిపోతోంది. కారుమబ్బులవంటి నల్ల రేగడి నేలలనుండి రేగుతూన్న ధూళి ఆకుగుబురుల్లా వుంది. సంజఎరుపులాంటి ఎర్రమట్టి నేలలనుండి రేగినధూళి చిగురాకు గుత్తులులా వుంది. హంసరెక్కలవంటి సుద్దమట్టి ప్రదేశాలనుండి రేగి ధూళి పూసిన పూలపొదలులా వుంది. పసుపురంగు నేలలనుండి రేగినధూళి ప్రకాశిస్తూన్న పుప్పొడిలావుంది. ఇలా ఇవన్నీ కలిసి పైకి లేస్తూవుంటే అందమైన ఓ పూలవనం భూమిమీంచి లేచి స్వర్గానికి వలసపోతూ వున్నట్టుంది.

అల్లంతదూరంనుండి ఇదంతా చూశాడు ఉత్తరుడు. ప్రాణాలు నిలువునా ఎగిరిపోయినట్లయిందతడికి. శరీరం కంపంపుచ్చుకుంది. మనస్సు చెదిరిపోయింది. వెర్రిచూపులు పుట్టుకొచ్చాయి. గొంతుక ఆర్చుకుపోయింది. తడబాటు ఆరంభమైంది.

"బృహన్నలా, ఆగు. ఏమిటీ సైన్యం! సైన్యమా సముద్రమా ఇది? భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ ఆది మహారథులతో భయాకరంగావుంది. గ్రీష్మకాల సూర్యుడివంటి దుర్యోధనుడి ప్రతాపంతో నిర్నిరీక్ష్యంగా వుంది. దారుణ మారణాస్త్రాల చతురంగబలంతో మహోగ్రంగా వుంది. అగ్నికీలలవంటి పతాకజాలంతో అడలు పుట్టిస్తోంది. కత్తిపట్టడం చేతకాని పసివాణ్ణి నేను. శకునీ, జయద్రథుడూ, దుర్ముఖుడూ, కర్ణుడూ, వికర్ణుడూ — అమ్మయ్యో! ముక్కాకలుతీరిన యోధులు! వీళ్లముందు నేనేమిటి, నిలవడమేమిటి! బుద్ధి గడ్డితిని తెలీక వచ్చేశాను. ఏందారీ! ఊఁహూఁ, ఎదిరించలేను. చూస్తేనే

భయమేస్తోంది. ఆగు. రథం పోనీకు గుండె బేజారైపోతోంది. కాళ్లు వణుకుతున్నాయి. వద్దు. ఎంతమాత్రం యుద్ధం చెయ్యలేను నేను. రథం మళ్ళించు. ప్రాణముంటే బలుసాకు తిని బతకవచ్చు'' అన్నాడు.

ఆతడి వైఖరి చూసి చిరునవ్వు నవ్వాడు బృహన్నల. ''ఆసైన్యసముద్రంలోకి తీసుకుపోయి నిన్ను ముంచెయ్యడానికి నేనంత వెర్రివాణ్ణనుకున్నావా? దొరికిందే తడువుగా పశువులు తోలుకుపోతున్నవాళ్ళని వెంటతరిమి ముందు ఆవుల్ని విడిపించుకు వద్దాం. ఆవుల్ని వొదిలి మనం ఇంటికి ఏ మొహంతో వెళతాం? రాణీవాసంలో ఆడవాళ్ళముందు అన్ని ప్రజ్ఞలు పలికావు. ఇట్టే సొమ్ములు మళ్ళించుకు వస్తానన్నావు మహావీరుడిలాగ రథమెక్కి బయల్దేరావు తీరావచ్చి గుర్రాలూ, ఏనుగులూ చూసి తోకముడిస్తే ఎలాగ?'' అన్నాడు.

దానికి మరింత వడికిపోయాడు ఉత్తరుడు ''ఆవుల సంగతి దేవుడెరుగును. ఆడవాళ్ళముందు అంటే అన్నాం, కాని యుద్ధంగిద్ధం నా చేతగాదు. వెళిపోదాం పద'' అన్నాడు.

రథం ముందుకు నడుస్తూనేవుంది. నచ్చచెప్పడం మొదలెట్టాడు బృహన్నల. ''చెయ్యీ చెయ్యీ కలిపి ఇంతో అంతో పోట్లాడి, ఎదిరిబలంతో మనబలం తీసికట్టని తేల్చుకున్న తరవాత నంటే పోనీ అనుకోవచ్చు అదైనా శూరుడన్నవాడెవడూ ఏకోశానా సమ్మతించడు. ఇంతవరకూ కన్నెత్తి నిన్నుచూడనన్నా చూడలేదీ సైన్యం. ఊరికే ఎందుకిలా భయపడుతున్నావో నాకర్థం కావడం లేదు. క్షత్రియుడన్నవాడు దిక్కులు పిక్కటిల్లే శంఖధ్వనికి జంకకూడదు. సేనల పరవళ్ళకు రేగిన ధూళికి బేలపడకూడదు. ఒక్కుమ్మడిని ఎత్తివచ్చిన చతురంగబలానికి చలించకూడదు రథాలూ, ఏనుగులూ, మారణాస్త్రాలూ, పైనపడుతున్నా పారిపోకూడదు. ఇన్నిటిని నిర్జించి యుద్ధం చేస్తేనే కీర్తిలక్ష్మి వరిస్తుంది. అంతేకాని, దూరంనుంచే తోక ముడిస్తే లోకం నవ్వుతుంది'' అన్నాడు.

మరింత ప్రాధేయపడ్డాగు ఉత్తరుడు. "నీకు తెలీదు. నామాట విను. త్రిగర్తులమీదికి, ఉన్న సైన్యమంతా వేసుకు వెళ్ళారు నాన్న గారు. పట్నంలో మన కొక్కడూ సహాయం రాలేదు. నేనొక్కణ్ణే యింత సేనమీద ఏం చెయ్యగలను? అసందర్భంగా నువ్వేం చెబితే ఏం లాభం? వాళ్ళు మనల్ని చూడకముందే రథం తిప్పు" అన్నాడు.

"అదేమన్నమాట!" అని అదిలించాడు బృహన్నల. భయ పడి పశువులు వొదిలేసి మనం పారిపోతే శత్రువులు చప్పట్లు కొడ తారు. ఊళ్లో వాళ్ళా 'ఛీ' అంటారు. తీరావచ్చి తోకముడవడ మంత నీచం మరిలేదు. ఇంతకీ సైరంధ్రి నావిషయం చెప్పిందికదా! నువ్వు దువ్వి నన్ను తీసుకు వచ్చావు. నన్నేదో అనుకొని ప్రశంసించి దీవించింది పౌరజనం. ఇంతా అయాక కౌరవులు ఆవులు తోలుకు పోతూంటే చూస్తూ తిరిగి పోతానా నేను! నీకాభయమెందుకూ! రా! ధైర్యం తెచ్చుకో. మన ప్రతాపం మచ్చుచూపి మన పశు వులు మనం మళ్ళించుకు పోదాం" అన్నాడు.

మరింత బిక్కమొహం వేశాడు ఉత్తరుడు. గుండెల్లో నెత్తురు చుక్క లేనట్లయింది. "ఊళ్ళోవాళ్లు 'ఛీ' అంటారూ! మహ బాగానే వుంది నీసంగతి! అంత కొవ్వెక్కివుంటే నువ్వు వెళ్ళి కలియబడు. నన్ను మాత్రం ఆపకు" అంటూ ధనుస్సూ, బాణాలూ రథంమీద పడేసి దభీమని కిందకి గెంతి పుంజాలు తెంపుకు పరుగెత్తాడు.

సిగ్గువిడిచి ఇలా వూళ్ళోకి పారిపోతూన్న అతణ్ణి చూసి అస హ్యించుకున్నాడు బృహన్నల రథం నిలిపేశాడు పగ్గాలు నొగలికి తగిలించాడు. కిందికి వురికి ఉత్తరుడి వెంట పడ్డాడు విడిపోయిన జుత్తు పిరుదుల వరకూ వేలాడుతున్నాది. ఎర్రటి ఉత్తరీయం కొసలు రెండూ గాలికి కొట్టుకుంటున్నాయి.

ఇదంతా కంటపడింది కౌరవులికి. బృహన్నల నిజస్వరూపం నిరూపించలేని వాళ్లు ఆ ఆడారివేషం చూచి అవహేళన చేశారు. ఆ ఉన్నత విగ్రహం, ఆ ఆజానుదీర్ఘబాహువులూ, దర్పంగా వున్న ఆ గమనం చూసి సంశయమనస్కులయారు బుద్ధిమంతులు.

"రూపమూ ఆడదిలా వుంది. ఆకారమూ పురుషుడిలా వుంది. వేసవికాలపు లతవలె వుంది ఆ అందం. ఎవరో మహానుభావుడు నివురు గప్పిన నిప్పులా ఈ వికృతవేషంలో ఉన్నట్టుంది. ఆ బాహువులూ, నడకా సరిగ్గా అర్జునుడిలాగే వున్నాయి. అతడే ఇలా పేడి రూపం వేసుకుని విరాట రాజింటవున్నాడన్నమాట. అవును. మూడు మూర్తులా అర్జునుడే. సందేహం లేదు అర్జునుడే కాకపోతే కౌరవ సేనమీదికి ఒంటరిగా వచ్చే మొనగాడెవడుంటాడు!

"ఉన్న సైన్యమంతా తీసుకుని విరాటుడు దక్షిణదిక్కు సుశర్మ మీదికి వెళ్ళివుంటాడు. ఇక అనివార్యంగా ఉత్తరుడు మన మీదికి బైలుదేరివుంటాడు మరెవ్వరూ లేక సారధిగా వచ్చి వుంటాడు అర్జునుడు. సైన్యం వచ్చి ఆలమందలు పట్టుకున్నారనగానే యువకోచితమైన చాపల్యంచేత కిందా మీదా తెలియని అహంకారంతో బైల్దేరి వచ్చేశాడు ఉత్తరుడు తీరా సేనా వాహిని చూడ్డంతోనే భయంపుట్టి పరుగుచ్చుకున్నాడు. అంతే. తనసారధి పరాక్రమం తనకేం తెలుసు పాపం!" అని నిశ్చయం చేసుకున్నారు పెద్దలు.

త్వరత్వరగా పరిగెత్తే ఏనుగుగున్నలాగ చప్పున వెళ్ళి – ఒక నూరడుగులు దాటకండానే ఉత్తరుణ్ణి పట్టుకున్నాడు బృహన్నల. దాంతో ఉన్నప్రాణం కాస్త ఊడిపోయినట్లయింది ఉత్తరుడికి. కొయ్యబారిపోయాడు. పెదవు లెండిపోయాయి. ముచ్చెమటలు పోశాయి.

వణుకు పట్టుకుంది గుండెలు తటతటా కొట్టుకున్నాయి కంఠం గద్గదిక పడింది. దీనంగా తేరిపారచూశాడు, వదిలిపెట్టమన్నాడు. కాళ్లా వేళ్ళా పడ్డాడు. "వొదిలెయ్యి నన్ను. ఊరుచేరగానే వంద మొహ్రీలిస్తాను. అష్టవైడూర్యాలిస్తాను రథాలిస్తాను. గుర్రాలిస్తాను. పది ఏనుగులిస్తాను. ఒక గ్రామమిస్తాను. మా అమ్మ నాకోసం చూస్తుంటుంది. ఆమె మొహమన్నా చూడనీ నన్ను" అని మొత్తుకున్నాడు. చేతులు జోడించాడు. లాభం లేకపోయింది.

నవ్వాపుకో లేకపోతున్నాడు బృహన్నల. రథం దగ్గిరికి ఈడ్చుకు వచ్చాడు ఉత్తరుణ్ణి

"భయపడకు. పోనీ, నువ్వు యుద్ధం చెయ్యనక్కరలేదులే. సారథిగా కూచో. అంతేచాలు. తక్కినపని చక్కబెడతాను నేను. చిచ్చుల పిడుగులా వాళ్ళమీదపడి గుండపిండి చేస్తాను ఈ సేననంతటినీ తరుముతాను. దుర్యోధనుడి గుండెలు జారగొడతాను. నీమీద ఈగన్నా వాలనివ్వను" అని నచ్చచెప్పాడు. ఇష్టం లేకపోయినా వొప్పించాడు. నొగలమీద కూచోపెట్టాడు. తాను రథంమీద కూచున్నాడు. స్మశానంచివర జమ్మివృక్షందగ్గిరికి ముందు పోనీయమన్నాడు రథం.

వడుకుతూనే, నొగలమీద పగ్గాలు సడిలించాడు ఉత్తరకుమారుడు. పేడిరూపంతో ప్రచ్ఛన్నంగా వుండికూడా, రణోత్సాహంతో భీషణంగావుండి, శమీవృక్షందగ్గిరికి వెళుతూన్న బృహన్నలను చూసి కౌరవసేనలో కలకలం బయలుదేరింది. అపశకునాలూ పొడసూపాయి వాళ్ళకి.

అదంతా పరికించాడు ద్రోణాచార్యులు. "సూర్యుడు మలిన పడ్డాడు. నక్కలుకూస్తున్నాయి. అకాల మేఘాలు ముసురుతున్నాయి అప్రయత్నంగా వాద్యాలు అపస్వరాలు పలుకు తున్నాయి.

అకారణంగా ఏనుగులు మోకరిస్తున్నాయి గుర్రాలు కన్నీళ్ళు విడుస్తున్నాయి. పతాకాలు వంగిపోతున్నాయి గుండెల్లో బిగులు బిగులాతోంది. ఆయుధాలు మంటలెక్కుతున్నాయి దిక్కులు పొగలు కమ్ముతున్నాయి—ఈ ఉత్పాతాలు మనకు విజయం సందిగ్ధమని సూచిస్తున్నాయి. అంచేత సేనావాహిని మొగలుతీర్చి అప్రమత్తులు కండి. ఎవళ్ళవాహనాలు వాళ్ళు, ఎవళ్ళఆయుధాలు వాళ్ళు సిద్ధం చేసుకోండి. పశువులు చెదరకండా బెదరకండా కాసుకోండి'' అని హెచ్చరించాడు.

బృహన్నల అక్షరాలా అర్జునుడని గుర్తించిన వాళ్ళలో ఒకడు కావడంచేత అతడి అజ్ఞాతవాసం భంగపడుతుందేమో అన్న సందేహం మెరుపులా మెరిసింది ద్రోణుడికి. సాభిప్రాయంగా భీష్ముణ్ణి చూశాడు

''వీడేదో బుద్ధిలేనివాడు కాకపోతే కౌరవుల ఎదటికి వస్తాడా ఇలా? మానులా వున్నాడు. అహంకారం తప్ప మరోటి కనపడనట్టుంది వీడికి! వీడి ఉద్దేశమేమిటోకాని వీడి ఆకారంమాత్రం అచ్చంగా అపర దేవేంద్రుడిలా వుంది'' అన్నాడు.

అతడి సందేహం తీర్చే అభిప్రాయంతో, దుర్యోధనుడితో చెప్పినట్టు నెపంపెట్టి గూఢార్థంగా అందుకున్నాడు భీష్ముడు

''రాజా, శత్రువులకు అనుకూలమైన హద్దులు దాటిపోయాయి. ఇక మనపరాక్రమం నిరాఘాటంగా నిరూపించవచ్చు. మరి భయం లేదు'' అన్నాడు.

అవగతమైంది ద్రోణుడికి అజ్ఞాతవాసం గడువు దాటిపోయిందనీ, ఆ భయ మేమీ మరి అర్జునుడికి లేదనీ, ఇక తన పరాక్రమం నిరాఘాటంగా నిరూపించవచ్చునీ తెలుసుకున్నాడు. సంతోషించాడు సంతోషం మొహంలో వెల్లడి కాకండా నిగ్రహించుకున్నాడు ఇక సందేహించడ మెందుకని గంభీరంగా ఇలా అనేశాడు

"ఆకలితో గుహలో పొంచివున్న సింహం ఏనుగునుచూసి క్రోధంతో లంఘించినట్టు, అరణ్యవాసంవల్ల రగులుతూవున్న హృదయంతో ఇదిగో, మనమీదికి వచ్చిపడుతున్నాడు అర్జునుడు మన ఇంతసేనలోనూ అతణ్ణెదిరించగల మొనగాడు వున్నాడా అంటే నామట్టుకు ఒకడూ కనిపించడంలేదు ఈశ్వరుణ్ణి కీచుకీచు మనిపించిన ధనుర్ధరుడతగాడు. అంచేత అతను మనల్ని గెలవడం, ఆలమందలు పట్టుకుపోడం ఈ రెండూ తప్పవు."

ద్రోణుడి మాటలికి కస్సుమని లేచాడు "కర్ణుడు. పెద్దవాడి వని వస్తాయి స్తున్న కొద్దీ నోటకవచ్చినట్టల్లా వదురుతున్నావు ఇంతమంది లోనూ నువ్వొక్కడివే మహా మొనగాడివి! పాండవపక్షపాతంవల్ల పగవాళ్ళని పొగిడి సర్వసైన్యాన్నీ నిరుత్సాహపరుస్తున్నావు నిజానికి అర్జును డంత వూడపొడిచిందేమిటో నా కర్థం కావడం లేదు రానీ, ఆ బంటుతనమేదో నేనే తేల్చేస్తాను నా బాణాలికి పని కల్పించి మన వాళ్ళంతా 'భళీ' అన్నట్టు చూపిస్తాను" అన్నాడు.

కర్ణుడి మాటలు కర్ణపేయంగా ఆనందించాడు దుర్యోధనుడు. "అసలు మనకు అంత శ్రమ అవసరం లేదంటాను నేను. ఏమంటారా, ఆ వచ్చేవాడు అర్జునుడే ఐతే అంతకంటే మనకు కావలిసిందే లేదు. దీంతో పాండవులు మళ్ళీ పన్నెండేళ్ళు వనవాసానికి పోవలసిందే. దీనికి తిరుగులేదు కాదు మరెవడో అంటారా, నా బాణాగ్నికి శలభంలా బలైపోతాడు. దీనికింత వాగ్వాద మెందుకూ!" అన్నాడు.

రాజుమాటలికి అందరూ బావుందంటే బావుందన్నారు. భీష్మద్రోణాదుల్లో ఎవళ్ళభావాలు వాళ్ళ మొహాల్లో దోబూచు లాడాయి.

శమీవృక్షం దగ్గిర రథం నిలపమన్నాడు బృహన్నల ఆగకర దృష్టులతో గంభీరంగా చూశాడు ఉత్తరుణ్ణి

"ఇదిగో, ఈ చెట్టుమీద గాండీవముంది. అదైతేనే గాని నా చేతులికి ఆగదు. మన దగ్గిర వున్న ఈ చిన్న ధనస్సులు దుర్బలమైనవి. నీ చేతిబలానికే సరిపోయేవి అసలు నేను ఎక్కు పెట్టేసరికే ముక్కలై పోతాయి. ఇలాంటివి నూరువేల ధనుస్సులైతే ఒక్క గాండీవంతో సమానం కావచ్చు. ఈ చిన్నవాటితో ఒక గట్టి కవచాన్నిగాని, ఒక ఏనుగునుగాని, మరి దేన్నిగాని తెగెయ్యడమే సాధ్యం కాదు కదా! తగిన ఆయుధం చేతిలో లేకపోతే యుద్ధంలో పేరా వూరా! అంచేత, ఈ చెట్టుమీదికి వెళ్ళి గాండీవంపట్టుకురా ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ అందరూ వాళ్ళఆయుధాలిక్కడే దాచిపెట్టారు ఆకట్ట విప్పు. అందులో గాండీవం మాత్రం పుచ్చుకుని తక్కినవి ఎప్పటిలాగే కట్టివెయ్యి" అని అచ్చంగా శవంలా వున్న ఆయుధాలమోపు చూపించాడు.

అది చూసి ఉలిక్కిపడ్డాడు ఉత్తరుడు. రాజకుమారుణ్ణివిఅయినా విచారించకండా, నన్నిలాంటి నీచప్పని చెయ్య మంటున్నావు! శవాన్నెవరైనా ముట్టుకుంటారా! దోషంకాదా!" అన్నాడు.

అతడి వీపుతట్టి బుజ్జగించాడు బృహన్నల "పొరపడుతున్నావు. ఇతర్లకి తెలియకుండా వుండాలని ఇలా చేశారు పాండవులు. ఆయుధాల మోపుకాని అది శవం కాదు. వెళ్ళు శివమైతే నిన్ను పంపుతానా! సందేహించకు. చెట్టెక్కి గాండీవం అందించు" అన్నాడు.

చేసేది లేక మెల్లి మెల్లిగా చెట్టుమీదికి వెళ్ళాడు ఉత్తరుడు. రథంమీద నిలబడి "వేగం కాని" అన్నాడు బృహన్నల. అలా అతడు ఆయుధాలు కట్లు విప్పాడు ఉత్తరకుమారుడు. ధగ ధగ మెరుస్తున్నాయి అప్పుడే ఉదయిస్తూన్న గ్రహాలవలె దశదిశలా కాంతులు ప్రకా శించాయి ఆయుధాలు. అంతేకాక, అవి పెద్దపెద్ద పాముల్లాగా

కనిపించాయి భయంతో గజగజ లాడిపోయాడు ఉత్తరుడు. పదేపదే బృహన్నల హెచ్చరించడంతో ఎలాగో ధైర్యం చిక్కబట్టుకున్నాడు.

అన్నిటిలోకీ పెద్దవిల్లుచూసి "సారథీ!"అని బృహన్నలను కేక వేసి అడిగాడు. "ఇదిగో, పెద్ద కొండచిలువలా వుంది ఈవిల్లు పాండవుల్లో ఎవరిది చెప్పు" అన్నాడు తక్కినవికూడా ఒక్కొక్కటీవర్ణిస్తూ ఏదేది ఎవరెవరిదో చెప్పమని అడిగాడు.

ఆదరపూర్వకంగా చెప్పడం మొదలుపెట్టాడు బృహన్నల. "ఇదిగో, కొండచిలువలా వుందన్నావే అదే గాండీవం. అర్జునుడికి పంచ ప్రాణాలూ అదే. దేవతలవేదీ, దానవులయేదీ – ఇది చేతిలో వుంటే వీగగొట్టాడన్నమాటే అతడు. మహోజ్జ్వలమూ, మహోగ్రమూ, ఐన గాండీవం సామాన్యమైంది కాదు దివ్యాంశసంభూతమైంది. శత్రు నిర్భేద్యమైంది. పురాణ పురుషుల చేతులమీద నలిగింది.

"ఈ మహాధనస్సు లక్ష సంవత్సరాలు ధరించాడు బ్రహ్మ. ప్రజాపతి అరవై నాలుగు వేల సంవత్సరాలు ధరించాడు. దేవేంద్రుడు ఎనభై అయిదు సంవత్సరాలు ధరించాడు చంద్రుడు అయిదువందల సంవత్సరాలు ధరించాడు. వరుణుడు నూరుసంవత్సరాలు ధరించాడు. అతడి దగ్గిర వేడుకపడి అగ్నిదేవుడు పుచ్చుకున్నాడు. అగ్నిదేవుడు అర్జునుడికిచ్చాడు. అర్జునుడు అరవై ఐదు సంవత్సరాలు ధరిస్తాడు.

"ఇక బంగారం ఎద్దులుచెక్కి నల్లకలవల రంగుతోవున్న ధనుస్సు ధర్మరాజుది. బంగారం వానరాలుచెక్కి తాటిచెట్టులా వున్న విల్లు భీముడుది బంగారం ముత్యాలతో రెల్లునిప్పు వెన్నెతో వున్నది నకులుడిది. బంగారు నెమళ్ళుచెక్కి చేవదేరి మెరుస్తున్నది సహదేవుడిది. అదిగో, మహోజ్జ్వలంగా మెరిసిపోతూ వుందే, ఆ గద –అదంటే భీముడికి ప్రాణం" అని చెప్పాడు.

మరిన్నీ తిక్కనబాణాలూ, కత్తులూ, కవచాలూ, వేరువేరుగా తొందరతొందరగా వివరించి చెప్పాడు. ఇంత వివరించి చెప్పినా బృహన్నలే అర్జునుడని తెలుసుకోలేక పోయాడు ఉత్తరుడు

"అయితే, ఆయుధా లిక్కడ దాచిపెట్టి పాండవులు ఎక్కడికి వెళ్ళిపోయారు? అంతా తెలిసినట్టే వుంది నీకు. దాచకండా నాతో చెప్పవూ! ఆ మహానుభావులికి మేనల్లుణ్ణి నేను. అయ్యో, ధర్మరాజు ఎక్కడున్నాడో! భీముడూ అర్జునుడూ ఎటు పోయారో! నకులసహదేవులు ఏమయి పోయారో! రాజలోకానికి కులదీపికలాంటిది ద్రౌపదీ దేవి ఏం పాట్లు పడుతున్నాదో పాపం!

"అంత ప్రతాపశాలిన్నీ ధర్మరాజు, దుర్యోధనాది నీచుల కపట జూదంలో పడి అష్టకష్టాల పాలయాడు. ఎక్కడున్నారో కాని కబురన్నా లేదు. అంతటి రాజ్యవైభవం విడిచిపెట్టి ఎలా వెళ్లారో!"

అని స్నేహమూ, విచారమూ, గౌరవమూ ద్యోతక మయేటట్టు ప్రశ్నించాడు.

"వాళ్ళకోసం విచారపడకు" అన్నాడు బృహన్నల. దైవికంగా వచ్చిన ఆవదలు అన్నీ సహించుకుంటూ పన్నెండేళ్లు వనవాసం చేశారు. పదమూడో ఏడు అజ్ఞాతవాసంకదా! ఆయుధాలిక్కడ పెట్టి మారువేషాలతో మనపట్నంలోనే ఇంతకాలమూ వున్నారు వాళ్ళెవరో చెబుతాను విను. నాన్నగారి ఆస్థానంలో వున్నారే కంకభట్టు ఆయన ధర్మరాజు. మనవంటలవాడు వలలుడే భీముడు. అశ్వపాలకుడుగావున్న దామగ్రంధి నకులుడు. సొమ్ములకాపరి అయిన తంత్రీపాలుడు సహదేవుడు తెలిసిందా! అల్లుడూ, మరిదాచడమెందుకూ నేనే అర్జునుణ్ణి. సైరంధ్రిగావున్న మాలిని ద్రౌపది. ఆమెకోసమే కదూ సింహబలుణ్ణి తమ్ములతోసహా, గంధర్వులని మిషపెట్టి చంపేశాడు భీముడు!" అన్నాడు.

ఉత్తరుడి ఆశ్చర్యానికి అంతంలేదు అయినా మరొక్క ప్రశ్న కూడా వేశాడతడు.

"అయితే అర్జునుడికి పదిపేర్లున్నాయి. ఆపదీ ఏమిటో, అవెలా వచ్చాయో చెప్పూ! అప్పుడు నమ్ముతాను" అన్నాడు.

చిరునవ్వుతో "చెబుతాను విను" అంటు అందుకున్నాడు బృహన్నల "అర్జునుడు, ఫల్గునుడు, పార్థుడు, కిరీటి, శ్వేతవాహనుడు, భీభత్సుడు, విజయుడు, జిష్ణుడు, సవ్యసాచి, ధనంజయుడు-నా పదిపేర్లూ ఇవి

పచ్చని శరీరకాంతి కలిగివుండడంచేత అర్జునుడన్నారు. ఉత్తర ఫల్గునీ నక్షత్రంలో పుట్టడంచేత ఫల్గును డన్నారు. మాతల్లి కుంతీదేవి పేరు పృథ. పృథపుత్రుణ్ణి కనక పార్థుడన్నారు ఇంద్రుడిచ్చిన కిరీటం అభేద్యంగా నా తలమీద సూర్యబింబంలా ప్రకాశిస్తూ వుంటుంది యుద్ధాల్లో. అంచేత కిరీటిఅన్నారు. నారథానికి ఎపుడూ తెల్ల గుర్రాలే వుండడంచేత శ్వేతవాహనుడన్నారు భీభత్సంగా యుద్ధం చేయడంవల్ల భీభత్సుడన్నారు. ఎంతవాడితో పోరాడినా విజయం నాదే కావడం చేత విజయుడన్నారు. నాకళ్ళముందు ధర్మరాజు శరీరంమీద గాయం కలిగించినవాణ్ణి, అతడెవడైనాసరే బతకనివ్వనని ప్రతిజ్ఞ చేయడం చేత జిష్ణుడన్నారు. రణరంగంలో గాండీవం రెండు చేతులా ప్రయోగిస్తూ, మీదుమిక్కిలి ఎడమచేతితో ఎక్కువ ప్రావీణ్యం చూపడం చేత సవ్యసాచి అన్నారు. ప్రపంచమంతా దిగ్విజయంచేసి ధనం కొల్ల గొట్టుకురావడంచేత ధనంజయుడన్నారు. ఇవికాక ఇంకో పేరుకూడా వుంది. కృష్ణుడిసహాయంతో ఖాండవవనం దహించానుకదా! ఎందరో దేవతలు ఎదిరించారు. అందరినీ ఓడించాను. ప్రసన్నులై బ్రహ్మ, మహేశ్వరుడూ ప్రత్యక్షమయ్యారు. పేదకు పెన్నిధి దొరికినట్టనిపించింది నాకు. దయార్ద్రహృదయులై అసదృశములైన దివ్యాస్త్రాలు అనుగ్రహించారు వారు. 'కృష్ణ' డని పదకొండో పేరుకూడా పెట్టారు.

దాంతో ఇంద్రాది దేవతలుకూడా ఎన్నో బాణాలు అనుగ్రహించారు. అంతేనా, ఇంకావిను. వరాలుపొంది గర్వించి దేవతలకు కంటకులుగా వున్న నివాతకవచులు అనే రాక్షసుల్ని-మూడుకోట్లమందిని-ఒక్కణ్ణే హతమార్చాను. ఆయుద్ధంలో దేవేంద్రుడి రథంమీద కూర్చున్నాను మాతలి సారథ్యంచేశాడు. దుర్జయులైన హిరణ్యపురం రాక్షసుల్ని సముద్రతీరంలో సంహరించాను. అప్పుడే సంతోషించి కిరీటమిచ్చాడు దేవేంద్రుడు. దేవతలు శంఖమిచ్చారు అదే దేవదత్తం. ఇలా మరె వళ్ళకీలేని బలసంపద నాది. దుర్యోధనుణ్ణి గంధర్వరాజు పట్టుకున్నప్పుడు, పద్నాలుగువేల గంధర్వులతో సహా అతణ్ణి ఓడించాను. దుర్యోధనుణ్ణి విడిపించుకు వచ్చాను. అంచేత నువ్వు భయపడకు. సందేహించకు. ఈ కౌరవసేనని ఇట్టే పడగొడతాను. భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, కర్ణ, దుర్యోధనులు చూస్తూవుండగా ఆలమందలు మళ్ళించుకు పోదాం'' అని త్వరత్వరగా చెప్పాడు.

ఆనందాశ్చర్యాలతో చెట్టుదిగాడు ఉత్తరుడు బృహన్నలకి సాష్టాంగ దండప్రణామం చేశాడు. అంజలిబంధం కపాలాన గీలించాడు.

''మహాభాగా, తెలుసుకోలేక అపరాధం చేశాను. క్షమించు. నువ్విలా ప్రత్యక్షం కావడం నా పూర్వభాగ్యం. నా కళ్ళపొరలు విడిపోయాయి. బ్రహ్మానందంగావుంది. అజ్ఞానంవల్ల నేనే మేమో అన్నాను. క్షమించానంటే బదికిపోతాను'' అన్నాడు.

రథం దిగివచ్చి అతడి శిరస్సుమూచూశాడు అర్జునుడు. కౌగిలించుకున్నాడు. అతడి రెండుకళ్ళనుండీ అశ్రువులు జలజలారాలాయి.

శరీరం పులకరించింది ఉత్తరకుమారుడికి ఇలా అన్నాడు. ''మామా! ధన్యుణ్ణయాను. భయం పటాపంచలైంది. పద. రథమెక్కు. నీబాహుచ్ఛాయని సింహంలా రథం నడుపుతాను ఝంఝా మారుతంలా శత్రువులమీద పడతాను. ఆజ్ఞాపించు నన్ను. కౌరవుల్ని

ముట్టడించు. గోవుల్ని మళ్లించు. అర్జునుడికి యుద్ధంలో సారథ్యం చెయ్యాలని ఎన్నో కలలు కన్నాను. ఇన్నాళ్ళకి సౌభాగ్యం పండింది.''

''అల్లుడూ, నువ్వంటేనే నాకెంతో ప్రేమ'' అన్నాడు అర్జునుడు, ''ఈగ వాలనివ్వను నీమీద వెయ్యికళ్ళతో చూస్తాను నిన్నే కాదు, గుర్రాలమీదకూడా ధూళికణం పడనివ్వను పద. కౌరవుల పని కానిద్దాం.''

''నువ్వు అర్జునుడవని తెలియడం తోటే నా మనస్సులో భయం, సందేహం, అన్నీ వదిలిపోయాయి. ఐతే, పురుషులలో మేటి పురుషుడవైన నీకు యీ పేడితనం ఎలావచ్చింది?'' అని వినయంగా అడిగాడు ఉత్తరుడు.

''మా అన్నగారి ఆజ్ఞప్రకారం ఒకసంవత్సరం బ్రహ్మచర్య వ్రతం సాధించవలిసి వచ్చింది ఊర్వశి శాపకారణంగా పేడితనమూ వచ్చింది వ్రతదీక్ష నిన్నటితో పూర్తయింది. పేడితనమూ ఇప్పుడు లేదుమరి'' అన్నాడు అర్జునుడు.

ఆనందాశ్రువులతో గద్గదకంఠుడయాడు ఉత్తరుడు.'' ఇలాఇన్నీ వివరించి చెప్పడమంటే అయాచిత ప్రేమతో నన్ను అనుగ్రహించడమన్న మాట! జగదేక వీరుడవైన నీప్రాపు దొరికిందినాకు. ఇక దేవతలనైనా లక్ష్యపెట్టను. నువ్వేం చెబితే అదిచేస్తాను. ఆజ్ఞాపించు'' అన్నాడు.

''గాండీవమూ, బంగారం మొదళ్ళబాణాలతో నిండివున్న జంట తూణీరమూ, నాకవచమూ, ఖడ్గమూ తీసుకురా, తక్కినవి యథాప్రకారం కట్టకట్టి చెట్టుమీద పెట్టు'' అన్నాడు అర్జునుడు.

ఆప్రకారం తక్కినవి భద్రపరిచి, గాండీవం మొదలైనవి తీసుకుని అతడి ఎదట పెట్టాడు ఉత్తరుడు.

వాటి అధిదేవతలకు నమస్కరించి ఆయుధాలు భక్తితో పరిగ్రహించాడు అర్జునుడు.

కవచతూణీరాలు వేసుకున్నాడు. గాండివం చేతపట్టుకున్నాడు. ధ్యానమాత్రంలో ఇంద్రుడిచ్చిన కిరీటమూ, కుండలాలూ వచ్చాయి. ఆజాను లంబితమైన కేశపాశం కుదచపడిపోయింది కిరీటం పెట్టుకున్నాడు కుండలాలు తగిలించుకున్నాడు హస్తాలకు వీరకంకణాలు అలంకరించుకున్నాడు. నడుముకు దట్టీ బిగించుకున్నాడు.

ఇలా తయారై మందహాసంతో రథమెక్కుతూవుంటే దర్శనీయమైన ఆ మూర్తిని చూడడానికి వెయ్యికళ్ళు కావాలనిపించింది. వరప్రభావం వల్ల తమంతతాముగా ప్రభవించిన కిరీటకాంతులు గగన వీధుల్ని మహోజ్జ్వలం చేశాయి.

రథమెక్కి ఎక్కడ పెట్టవలసిన ఆయుధం అక్కడ పెట్టుకుని గాండీవం ఎక్కుపెట్టి ముష్టి సవరించి, గుణం సారించి ధనుష్టంకారం చేశాడు అర్జునుడు. ఆ గుణధ్వనికి పక్షులు అరుచుకుంటూ ఎగిరిపోయాయి మృగాలు కలగుండుపడి అటూ ఇటూ పరిగెత్తాయి వృక్షాలు చలించాయి దిక్కులూ, ఆకాశమూ దద్దరిల్లాయి. కౌరవ సైన్యం తుళ్ళిపడింది.

అనంతరం అగ్నిదేవుణ్ణి ధ్యానించాడు అర్జునుడు. విశ్వకర్మ నిర్మితమూ, మాయామయమూ, మహోగ్రమూ ఐన వానర పతాకం పంపించాడు అగ్నిదేవుడు. వానర పతాకాన్ని ఆశ్రయించుకొని వికృతమయిన భయంకరభూతగణమూ వెంట వచ్చింది. ఉత్తరుడి సింహధ్వజం శమీవృక్షంమీద పెట్టించాడు అర్జునుడు కపిధ్వజం రథానికి కట్టించాడు. స్మరణమాత్రంగా వచ్చిన దేవదత్తం సవినయంగా పుచ్చుకున్నాడు.

సన్నద్ధుడై నొగలమీద కూర్చున్నాడు ఉత్తరుడు. పగ్గాలు చేత్తో పుచ్చుకున్నాడు గుర్రాలవీపులు నిమిరాడు. వాటి జవసత్వాలు ప్రశంసించాడు.

కనుసన్నతో హెచ్చరించాడు అర్జునుడు. "ఆలస్య మౌతోంది పశువులు దూరం పోయివుంటాయి జమ్మికి ప్రదక్షిణంగా రథం పోనీ. చిటికలో కలుసుకోవాలి మనం" అన్నాడు.

పగ్గాలు సడిలించి గుర్రాలు అదిలించాడు ఉత్తరుడు. కదిలింది రథం. హృదయంలో రణోత్సాహం పురకలు వేస్తోంది అర్జునుడికి. పిడుగులు గర్జించినట్టు ఒక్కసారి పూరించాడు దేవదత్తం. ఘోరంగా వున్న ఆ మహాధ్వనికి సప్తసముద్రాలూ కలగుండు పడ్డాయి. కులగిరులు జలదరించాయి భూగోళం దద్దరిల్లింది. దిక్చక్రం గడగజలాడింది. స్వర్గ లోకం తుళ్లిపడింది. పాతాళం ఘూర్ణిల్లింది. గ్రహతారకలు గడగడ లాడాయి. బ్రహ్మదేవుడు సంక్షోభించాడు. చచ్చినట్టు చాపచుట్టగా పడిపోయాయి గుర్రాలు. నిశ్చేష్టుడై నొగలమీద బోర్లాపడి, మూర్ఛ పోయాడు ఉత్తరకుమారుడు.

చప్పున లేచివచ్చి గుర్రాల్ని లేవదీశాడు అర్జునుడు. శరీరాలు నిమిరాడు. ఉత్తరుణ్ణి లేవనెత్తాడు. తలనిమిరాడు. దుస్తులు సవరించాడు. తెలివిపుచ్చి కౌగిలించుకున్నాడు. ఆదరించాడు.

"శంఖారవాలూ, ఢంకానగారాలూ, గజఘీంకారాలూ యుద్ధమెరిగిన రాజకుమార్ళకి సుపరిచితాలే కదా! ఇంతభయపడి పోయావేం?" అని అడిగాడు.

"ఎన్నోవందల శంఖాలు విన్నాను ఢంకానగారాలు విన్నాను. ఏనుగుల ఘీంకారాలూ విన్నాను. అమ్మయ్యో, అవేవీ ఇంత ఘోరంగా లేవు. మహాధ్వాన మిది. చిత్తమోహనం! అద్భుతం!! దుర్భరం!! ఇది వినేసరికి చెవులు బద్దలై పోతూయి. దిక్కులు గిర్రుమన్నాయి. గుండెనీరై పోయింది. ఇక మహోగ్రమైన కపిధ్వజం చూస్తే కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. అఖండమైన నీ తేజస్సు

చూస్తూంటేనే పరవశత్వం కలుగుతోంది నేను చలించి పోయా నంటే ఆశ్చర్యమేముంది!" అన్నాడు తడబడిపోతూ ఉత్తరుడు.

ధైర్యం చెప్పాడు అర్జునుడు. పదేపదే శంఖంపూరించి భయం పోగొట్టాడు. పగ్గాలు సడిలించి గుర్రాలు అదిలించాడు ఉత్తరుడు. వాయువేగంతో పరుగెత్తింది రథం. చక్రధ్వానం, ధనుష్టంకారం, శంఖధ్వనీ – భీషణంగా చెలరేగాయి.

మహావేగంతో పరిగెత్తుకు వస్తూన్న రథాన్ని దుర్యోధనుడికి చూపించాడు ద్రోణుడు.

"చెవులు బద్దలుచేస్తూ సంక్షోభం కలిగిస్తోంది గుణం మోత. బ్రహ్మాండం పగిలిస్తూ భూతకోటిని నిశ్చేష్టితం చేస్తోంది శంఖారవం. ఆకాశమంతా ఆవరిస్తూ భీతిపుట్టిస్తోంది పతాక వేగం. కళ్ళు మిరుమిట్లు కలిగించే ప్రకాశంతో విభ్రాంతి కలిగిస్తోంది కిరీటకాంతి. ఇంకా సందేహమేమిటి? ఆవిల్లు గాండీవం. ఆ శంఖం దేవదత్తం. ఆ ధ్వజం కపిధ్వజం ఆ కిరీటం ఇంద్రదత్తం. అవును ఈ ఉగ్రత్వం మరీ వేటికీ వుండదు. చిచ్చుల పిడుగులాగ, మహోద్రేకంతో వచ్చి పడుతున్నాడు శత్రుభయంకరుడు అర్జునుడు మనలో మనం వూరికే వివాదపడితే తీరేది కాదిది. మాటలు క్రియల్లో కనపడేటట్టు యుద్ధానికి తలపడాలి" అన్నాడు. కృపుడూ, అశ్వత్థామా మొదలైన యోధుల్ని సంబోధించి హెచ్చరించాడు. "ఇదిగో, మన సేనలో అపశకునాలు కనిపిస్తున్నాయి. అంచేత మనవిజయంమాట సందేహమే కనక మన మొకపని చెయ్యాలి. రాజును ముందు పంపేద్దాం గడబిడపడి ఆలమందల్ని బెదరగొట్టకండా వాటివెనకని పోనిద్దాం సైన్యాలు. బలమైన వ్యూహాలుగా ఏర్పడి మనమందరం వెనకనడిచి వెళదాం. అర్జునుడు దగ్గిరపడేసరికి అడ్డుపడి యుద్ధానికి తలపడదాం" అన్నాడు.

ద్రోణుడి మాటలువిని భీష్మ, కృప, కర్ణ, వికర్ణులను సాభిప్రాయంగా చూశాడు దుర్యోధనుడు.

"జూదంలో వోడిపోయి, పన్నెండేళ్లు అరణ్యవాసం, ఒక సంవత్సరం ఊళ్లో అజ్ఞాతవాసం చెయ్యడానికి సమ్మతించికదా పాండవులు వచ్చారు. పదమూడేళ్లూ నిండకండానే ఇపుడు అర్జునుడు మనముందుకు వచ్చాడా, తిరిగి యథాప్రకారం అడివికి పోక తీరదు. ఇదే నేను మొదటినుంచీ చెబుతున్నాను ఐతే, గడువు తీరలేదని మనం పొరపాటన్నా పడుతూండాలి, లేదా లోభం ఆపుకోలేక అర్జునుడు దుస్సాహసమైనా చేస్తూండాలి. అంచేత గడువు తీరిందీ లేనిదీ యథార్థం తేల్చవలసిన వారు తాతగారు

"ఆ వచ్చేది కేవలం ఉత్తరుడుకాక, అర్జునుడు కావడమే మనకు కావలిసింది ఏమంటారా, సుశర్మని అటుపంపి, మనం ఇటు రావడం పాండవులు విరాటనగరంలో ఉంటే కంటపడతారనే కదా! ఇలా, ఒక నిశ్చయంతో చేసినపనికి ఇపుడు కలవరపడడం దేనికి!

"ఇంతకీ శత్రువుల చిరకాల సంచితమైన గోధనం దోచుకున్నాం. అర్జునుడు వచ్చేదీ వాడిబాబు దేవేంద్రుడు వచ్చేదీ, మన ప్రతాపం మచ్చుచూపించి మరీ విడిచిపెడతాం వచ్చిందే కీర్తికారణమైన రణరంగానికి. మరి దిగులుపడడం దేనికి? అనవసరమైన సందేహాలికి స్వస్తి చెప్పండి. ధైర్యం వహించండి ఆయుధాలు ధరించండి వాహనాలు హెచ్చరించండి. మొనగాళ్ళయి నిలవండి. విజయలక్ష్మిని వరించండి, అంతేగాని శత్రువనేసరికి తెల్లబోయి, ఒకరిమొహం వొకరు చూస్తూ నిలవడం వీరలక్షణంకాదు" అన్నాడు.

ద్రోణాచార్యులను అధిక్షేపించే అభిప్రాయంతో మళ్ళీ ఇలా అందుకున్నాడు

"గుర్రాల సకిలింపులూ, అనుకూల వాయువులూ మనకే విజయం సూచిస్తున్నాయి కాకపోయినా ఒక్క అర్జునుడేమిటి ఇంత బలాన్ని గెలవడమేమిటి? ఎవరన్నా వింటే నవ్విపోతారన్న ఆలోచనైనా లేకపోయింది ద్రోణాచార్యుడికి నా మొహం ఎదట అదేపనిగా వాణ్ణి పొగుడుతున్నాడు సైన్యానికి పిరికిమందు పోస్తున్నాడు.

"రోషమో, రాజ్యాభిలాషమో—ఈ రెండే కారణాలు అర్జునుడిలా సాహసించడానికి. అంతే మరో కారణం కనబడదు. ఆపాటి దానికి భట్రాజులాగ పొగడడం లంకించుకున్నాడీయన.

"'ఆచార్యులు' అంటే ఏమిటి? మీనమేషాలు లెక్కపెట్టుకుంటూ, ఓదగ్గిర కూచోవలిసినవారన్నమాట యుద్ధం సంగతి వారినడిగితే ఎలా? బుద్ధిమంతులు ఇంట్లో కూర్చొని భోజనాల దగ్గిర కబుర్లు చెబుతారు తాలింఖానాలలో డాబులు పలుకుతారు శాస్త్రాలకాలక్షేపాల దగ్గిర నీతులువల్లిస్తారు. అంతే. యుద్ధంపేరు చెబితేమాత్రం వీపు చూపెడతారు. అంచేత యుద్ధంలో మనదగ్గిరకే రానివ్వకూడదు వారిని. ఎక్కడవున్నా మనక్షేమమే కోరుతారు వారు. గనక, వారిని సైన్యాల వెనక వుంచడమే నయం మనకి" అన్నాడు.

దుర్యోధనుడిమాటలు దుస్సహమై కస్సుమనిలేచాడు అశ్వత్థామ. "గొల్లవాళ్లని బెదిరించి, ఎలాగో గోవులు పట్టుకున్నంత మాత్రాన ఈ పెద్దకబుర్లెందుకో! ఇంతకీ, శత్రువులినా జయించలేదాయె. హస్తినాపురమూ చేరుకోలేదాయె. శత్రురాజ్యం పొలిమేరన్నా దాటలేదాయె అప్పుడే ఈ ఆత్మశ్లాఘమెందుకని!

"యుద్ధంలో రాజ్యం గెలుచుకున్నవాడు కూడా, బుద్ధిమంతుడైతే ఇలామాట్లాడడు. జూదంలో గెలుచుకున్నదీ ఒక గెలుపేనా! ఇదిగో, సమయంవచ్చింది కదా ఇప్పుడు! చెప్పిందంతా చేసి చూపెడితే సరి! అవాళ ద్రౌపదిని సభలోకి ఈడ్చుకురమ్మన్నావే—పాండవులతో

యుద్ధంచేసి ఓడించే అలా అన్నావా మరి! ఆ ఇల్లాలిని అలా అవమానించడం శకుని నీతి కాబోలు! ఇపుడు వస్తున్న ఆ అర్జునుడి మీదికి ఆ మామగారినే ఉసిగొల్పు.

"అపుడలా అవమానించావు కనకనే ధృతరాష్ట్రసంతతికి ధూమకేతువులాగ వచ్చిపడుతున్నాడిపుడు అర్జునుడు. ద్రోణాచార్యుల్ని అధిక్షేపించడం సులభమే దేవదానవులందరికీ దుర్జయుడైన అర్జునుణ్ణి ఎదిరించడం మాత్రం సులభంకాదు. లోకాతీతుడైన వ్యక్తి కవీరు డతగాడు. శత్రువులయినా అతణ్ణి ప్రశంసిస్తారు అలాంటిది కన్న కొడుకు కంటె అధిక వాత్సల్యంతో చూస్తూన్న గురువు ప్రియశిష్యుణ్ణి పొగిడాడంటే తప్పేముంది? అంతమాత్రానికి చిన్నాపెద్దా విచక్షణ లేకండా తృణీకరించడం సహించలేం. ఇక సిగ్గువిడిచి యుద్ధంచేస్తే ద్రోణుడు చెయ్యనీ. నేనుమాత్రం సహించలేను.

"ఇంకా విను–ప్రళయరుద్రుడు, బడబానలం, మహామృత్యువు–ఎవరువచ్చినా ఎదుర్కోగలడు అర్జునుడు అతడి కళ్ళెర్రబడితేచాలు, అతడి బాణాల ముందు సర్వమూ సంహారం కావలిసిందే. మాయ పాచికక్కడ సాగవు భుజాల్లో బలం వుంటే, గుండెల్లో దన్నుంటే చూపించాలి గాండీవంతో అడ్డపాచికలు వెయ్యడు గాండీవి. ఉరులు పోసిన అంపవాన కురిపిస్తాడు. ఆవులకోసం విరాటుడు వస్తే ఎదిరిస్తాం. అర్జునుడే వస్తేమాత్రం మా తరంకాదు" అన్నాడు.

దాంతో ఎక్కడాలేని క్రోధంతో మిసిపడుతూ కురువీరుల్ని సంబోధించాడు కర్ణుడు. "పాండవులిక్కడ వున్నారన్న అభిప్రాయంతోనే గోగ్రహణానికి సమ్మతించి మీరందరూ వచ్చారు. తీరావచ్చాక ఇప్పుడు అర్జునుణ్ణిచూసి పిరికిమాత్ర పుచ్చుకుని అతణ్ణి తెగ పొగిడేస్తున్నారు. రాజుని దుమ్మెత్తి పోస్తున్నారు. ఏం న్యాయమిది!

"ఇదిగో, నేనొక్కటే చెపుతున్నాను మీకు భయంగావుంటే మీ రెవ్వరూ రాకండి. ఒక్కడిబతుక్కి ఎంపదు కావాలని! నేనొక్కణ్ణే చాలు. మీ కాసం దేహం అక్కర్లేదు. ఆ కపిధ్వజం అల్లంతదూరా న్నే విరగేస్తాను. ఆ భూతాల్నీ గీతాల్నీ పీచు రేగగొడతాను రథం తునాతునకలు చేస్తాను. సారథిని చెండాడతాను. శరపరంపరతో అర్జునుణ్ణే తూటాడతాను. ధనుష్టంకారంతో దశదిశలూ దద్దరిల్ల జేస్తాను. బాణపాతంతో శత్రువు గుండెలు పగిలిస్తాను. అనర్గళమైన నా భుజ పరాక్రమం తా ప్రయోగిస్తాను. ఘోరంగా నా రౌద్రరూపం ప్రదర్శిస్తాను మీరన్నట్టే మనల్ని తృణప్రాయంగా భావించి క్రోధ జ్వాలలతో వస్తూన్న అర్జునాగ్ని అసాధ్యమైనదే అనుకోండి. నా శరవర్షంతో ఇట్టే నుసి చేస్తాను. చూస్తూవుండండి.

"పదమూడేళ్ళు పూనికపట్టి వస్తూన్నాడు తాను. తన బల దర్పాలు పేరు మోసి వున్నాయి ఇక కౌరవ సైన్యంలోకల్లా శక్తి సామర్థ్యాలు కలవాణ్ణి నేను అంచేత మా ఇద్దరికీ సమఉజ్జీ అన్న మాట.

" అదీకాకండా, అనుదినమూ అనూహ్యామైన మన్ననతో ఆద రిస్తూన్న మహారాజు రుణం తీర్చుకోడానికీ, 'యుద్ధంలో అర్జునుణ్ణి పడగొడతా' నని రాజుతో చేసిన శపథం సాధించుకోడానికీ, 'కర్ణార్జు నుల్లో ఎవ్వడధికుడా ?' అంటూన్న లోకుల అనుమానం తీర్చి వెయ్య డానికీ, పరశురాముడి కృపవల్ల సంపాదించిన విలువిద్యాపాటవం ప్రక టించడానికీ తగిన సుదినం దొరికింది నాకు. మీకు యిష్టం ముందా నుంచుని నా యుద్ధం చూడండి. లేదంటారూ, పశువుల వెంట వెళ్ళిపొండి" అన్నాడు.

దాంతో చుర్రుమంది కృపాచార్యుడికి. "కర్ణా, కయ్యానికి కాలు దువ్వడమేకాని కర్తవ్యం తెలీదు నీకు. అర్థసిద్ధికి యుద్ధం నికృష్టసాధనమన్నారు నీతిశాస్త్రవేత్తలైన పెద్దలు. దేశ, కాల,

స్త్రాత్రల నెరిగి చేసిన యుద్ధంలో అర్థసిద్ధి సాధ్యపడుతుంది. అంతేకాని, మోటతనంగా తన బలమూ, ఎదిరి బలమూ తెలుసుకోకుండా తెగ పడితే అర్థానికి బదులు అనర్థం ఏర్పడుతుంది. అర్జునుడు ఒక్కడేకదా పరవాలే దనుకుంటున్నావు కాబోలు! వైరివాడిని నిజంగా పొరపడు తున్నావు. దేవేంద్రాది దేవతలతో పోరాడి ఖాండవం దహించింది ఒక్కడేకదా! యాదవబల మంతటినీ తోసిరాజని సుభద్రని హరించింది ఒక్కడేకదా! దిగ్విజయంచేసి కౌరవ వంశానికి గౌరవం తెచ్చింది ఒక్కడేకదా! సపరివారంగా చిత్రసేనుణ్ణి జయించి రాజుని విడిపించింది ఒక్కడేకదా! నివాతకవచుల్నీ, కాలకేయుల్నీ సంహరించిందీ కూడా ఒక్కడేకదా!

"అవాళ ద్రౌపదికోసం అంతమంది రాజులూ ఎగబడి అతడి చేత దెబ్బలుతిని తోకముడిచినప్పుడు నువ్వూ వున్నావా లేవా అక్కడ! ఇదొక్కటీ చెప్పూ! పాండవులలో ఒక్కొక్కడూ విజృం భించి వీరవిహారంచేసి రాజలోకంలో మహోత్పాతం కలిగించారుకదా! నువ్విక్కడ ఇవాళ మీసాలు నులుపుతున్నావు. రాజు తలవూపుతు న్నాడు కదాఅని వృథాగర్వంతో పరవళ్ళు తొక్కుతున్నావు.

"అర్జునుడితో యుద్ధం చెయ్యడమంటే చేతులతో సముద్రం ఈదడమన్నమాట, అగ్నిహోత్రంలో వురకడమన్నమాట, వాసుకి కోరలు పెరకడమన్నమాట తెలిసిందా! సుడిగాలితో చెలరేగు తూన్న దావానలం ఒక్కడెవడన్నా ఆర్పడం సాధ్యపడుతుందా! అంచేత, ఈ దుస్సాహసం విడిచిపెట్టు. ఏవిధంగానైనా సరే రాజుని మనం కాపాడుకోవాలిప్పుడు.

"రాజూ, భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, నువ్వూ, నేనూ ఇంతమందిమీ కలిసి మొనలుతీర్చి అర్జునుడుమీదికి కలియబడదాం.

అంతేకాని ఒంటరిగా అతణ్ణి మూడుకళ్లవా ఎదిరించినా పరాభవం తప్పదు '' అన్నాడు.

తోకతొక్కిన తాచులా మళ్లీ కస్సు మన్నాడు కర్ణుడు. '' పాండవ పక్షపాతివని తెలిసితెలిసి నిన్ను పిలుచుకువచ్చిన రాజు ననాలి! బతికినన్నాళ్ళు భార్యా, బిడ్డలూ, నువ్వూ, సబాంధవంగా సుష్టుగా రాజుసొమ్ము దిగమింగడమే నీపని యుద్ధంపేరు చెబితే మాత్రం నోరు పెగల్దు. యుద్ధ సమయాల్లో పనికిరాలిన ఆబోతు లాగ అచ్చేసి వదిలిపెట్టేశాడు నిన్ను రాజు అట్టేమాటాడక ఇంటి మొహం పట్టు వెళ్లు యజ్ఞాలూ, గిజ్ఞాలూ ఎక్కడన్నా జరుగుతూంటే చూసుకో పప్పూ కూడూ కడుపారాతిందువుగాని. నీ బాపనబుద్ధి అంత!

'' నా బలమంటే ఏమిటో తెలియకండా వుంది నీకు. నేను విల్లెత్తితేచాలు, పద్నాలుగు భువనాలూ పల్లటిల్లిపోతాయి అర్జును డొకలెక్క అనుకుంటున్నావేమో! ఒక రథికుడికి ఎంతమంది కావా లని! '' అన్నాడు.

ఇందరూ ఇన్నివిధాల చేస్తూన్న తర్జనభర్జనలు సవిమర్శకంగా వింటున్నాడు భీష్ముడు. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి గంభీరంగా ప్రారం భించాడు. '' నీతికిఅనుగుణ్యంగా చెప్పాడు ద్రోణుడు. అశ్వత్థామ పలు కులూ ఉచితంగానే వున్నాయి. కృపాచార్యుడూ సుసంగతంగానే చెప్పాడు. రాజుగారి మన్ననకల మనిషికనక కర్ణుడు రణోద్రేకంతో మాటాడడం సబబేఅయితే కావచ్చు కాని, పెద్దల్ని ధిక్కరించడం మాత్రం ఏంన్యాయం! దేశ కాల పాత్రలు తెలుసుకున్నవాడు యుద్ధం చేసి చూపెడతాడు. అంతేకాని, మాన్యులైన వారిని కర్ణకఠోరంగా అవమాన పరచడం దుస్సుసేనం. బలవంతుడైన శత్రువు పైబడ్డపుడూ, పరాయిదేశంలో పనిపడ్డపుడూ ఆలోచించి అడుగు వెయ్యడం బుద్ధి మంతుల లక్షణం. ఉత్తములైన వీరులు పగవాళ్ల సుగుణాలు ప్రశం

సిస్తారు సమయం వచ్చినపుడు తమప్రతాపం ప్రకటిస్తారు తుదీ మొదలూ తెలియకుండా ఎంతటి వాళ్లనీ తృణీకరిస్తున్నాడు కర్ణుడు. ఆచార్యులైన వాళ్లు ఆరాధ్యులేగాని గర్హింపదగ్గవారా మరి ?'' అని రథం దిగివచ్చాడు. కృపుణ్ణీ, అశ్వత్థామనీ చేతులుపట్టుకుని ప్రార్థించాడు. '' పని ఎంతో వుంది మనకి. అదిగో, అర్జునుడు వచ్చిపడుతున్నాడు. మనలోమన విరోధానికి సమయం కాదిది. అందరం ఐకమత్యంతో కలిసే యుద్ధం చేద్దాం. పెద్దపనుల్లో భేదం కూడదని పెద్దల మతం. ఓపక్క వేదం, ఓపక్క ధనుర్వేదం ధరించిన మహానుభావులు మీరు. కురుబలానికి ఏ వొకటి వచ్చినా అది ప్రసిద్ధులైన మీనెత్తినే పడుతుంది. మనలో వొకడు తెలిక ఏదో అన్నాడు. క్షమించండి. మీరిలా కోపగించుకుని రాజకార్యానికి హాని కలిగించకండి '' అన్నాడు.

'' క్షమించడానికన్నా రాజకార్యానికన్నా మే మెవరం ? ద్రోణాచార్యుల్ని శాంతి పరచడమే మమ్మల్ని శాంతి పరచడం మావాటివారికి ఇంతగా చెప్పడం కూడా ఎందుకు ? '' అన్నారు కృపుడూ, అశ్వత్థామాన్నూ.

అనంతరం సాకూతంగా దుర్యోధనుణ్ణి చూశాడు భీష్ముడు. కర్ణుణ్ణీ, పితామహుణ్ణీ ఉభయుల్నీ వెంట పెట్టుకుని ద్రోణాచార్యుల దగ్గిరికి వెళ్లి నమస్కరించాడు దుర్యోధనుడు. సవినయంగా క్షమాపణ వేడుకున్నాడు. అశ్వత్థామనీ, కృపాచార్యుల్నీ ప్రార్థించాడు. అంతతో ప్రసన్నుడయ్యాడు ద్రోణుడు. కౌరవ యోధుల నందరినీ గంభీరంగా కలయచూశాడు.

'' భీష్ముడు చెప్పినపుడే కోపం వదిలి పోయింది. ఇక కార్యోన్ముఖులం కావాలి మనం. రారాజుమీద ఈగ వాలకుండా జాగ్రత్తపడాలి. బాధపడి బాధపడి బాగా కసితో వున్నాడు అర్జునుడు.

పిసరంతకూడా మనల్ని విడిచిపెట్టడు. కనురెప్ప వెయ్యకుండా అప్రమత్తులం కావాలి. దుర్భేద్యమైన వ్యూహం పన్ని అందరం ఒక్క చోట ముసురుకోవాలి. ఇందాక రారాజు కోరాడు, పాండవుల అజ్ఞాతవాసం గడువు గడిచిందీ లేనిదీ నిరూపించమని. భీష్ముడే దీన్ని పరిష్కరించాలి '' అన్నాడు.

ద్రోణుడిమాటలికి ప్రసన్నుడయాడు భీష్ముడు. ''రెండేళ్ల కొక అధికమాసం వస్తుంది. అలా వచ్చినవన్నీ కలిపి లెక్కవేస్తే నిన్నటితో సరిగ్గా పదమూడేళ్లూ పూర్తవుతున్నాయి. ఇది తెలిసిన వాడు కనకనే 'పందెం పూర్తిచేశా' మని ప్రకటించడానికే ఇవాళ ప్రత్యక్ష మయాడు అర్జునుడు. పాండవులు ధర్మపరులు. ధర్మరాజు నాయకత్వంలో ధర్మం తప్పడం అసంభవం. ఇన్నాళ్ళూ ఇన్ని పాట్లూ పడి, ఇపుడు తమకించి నెత్తికి పిడుగు తెచ్చుకుంటూ రనడం అవివేకం. అలాగే అయివుంటే ఆనాడే తిరగబడి మూర్ఖత్వానికి పూనుకునే వాళ్ళు వాళ్ళు తప్పనిసరిగా ధర్మపాశబద్ధులై ఇంత కాలమూ వోర్చుకున్నారు. ఇక ఎలాగూ వాళ్ళ పరాక్రమం వాళ్ళు చూపించక మానరు. మనమూ దానికి సిద్ధపడవలిసిందే మరి. వచ్చేవాడు అసాధ్యుడు. అవశ్యం మనమే గెలుస్తామని చెప్పలేం. రాజ్యంకోసం పెనగులాడే రెండుబలాలూ గెలవడం జరగదు కదా! జయాపజయాలికి సమ్మతించే దిగాలి యుద్ధానికి. అంచేత ఆలోచించి ఈ పరిస్థితిలో సంధి చేసుకోడమే సరైన మార్గమని నా అభిప్రాయం '' అన్నాడు.

సంధిమాట ఎత్తేసరికి చిన్న విసుపున్నవ్వు నవ్వాడు దుర్యోధనుడు. ''అబ్బే, పాండవులకీ మనకీ సంధి ఎలా కుదురుతుంది? నేనా, రాజ్యంలో పిసరంత వంతివ్వను. వంతివ్వకపోతే సంధికే రారు వాళ్లు. అంచేత యుద్ధంతప్ప మరో మార్గం లేదు '' అన్నాడు.

వాళ్లిద్దరి మాటలూ విని ఇలా అందుకున్నాడు ద్రోణుడు. "ఇది ఇలా చెయ్యాలి అని నిర్ణయించవలసి వస్తే దానికి రాజుకంటె సమర్థులు ఇంకొకరు లేరు ఐనా, నాకు తెలిసినంతమట్టుకు ఒక విధానం చెబుతాను. మన సైన్యం నాలుగు భాగాలు చేయాలి వెంటనే ఒక భాగం తీసుకుని ముందుగా వెళ్ళిపోవాలి రాజు. రాజు వెనక మరో భాగం ఆలమందలు తోలుకొంటూ నడవాలి. మిగిలిన సగంతో మనం గట్టి వ్యూహం పన్ని వెనకనుంచి మెల్లిమెల్లిగా నడవాలి. అర్జునుడు ఎక్కడ కలిస్తే అక్కడ అతడి మీదికి తిరగబడి నిలవరించాలి ఇలా అయితే రాజు సురక్షితంగా రాష్ట్రం చేరుకుంటాడు. ఆవులూ చెదర కండా మత్స్యదేశం సరిహద్దు దాటిపోతాయి. ఈలోగా అర్జునుడికి ఎవరు సాయం వచ్చినా మనం నిలవరించ గలుగుతాం" అన్నాడు.

భీష్ముడూ దానికి సమ్మతించాడు నాలుగు భాగాలుగా సైన్యం విభాగించాడు. ఒక భాగంతో రాజుని ముందు పంపేశాడు. మరో భాగం పశువుల వెనక నడిపించాడు మిగిలిన సైన్యంతో వ్యూహం నిర్మించాడు. నడుమ ద్రోణుడూ, వలపట కృపుడూ, దాపట అశ్వత్థామా, ముందు కర్ణుడూ వుండేటట్టు ఏర్పరిచాడు. మధ్యమధ్య వికర్ణుడూ, దుశ్శాసనుడూ, శకునీ, సైంధవుడూ, సోమదత్తుడూ, బాహ్లీకుడూ, భూరిశ్రవుడూ మొదలైన వాళ్ళను నిలిపాడు. ఇలా దిట్టమైన కట్టడిచేసి సైన్యంలో మహోత్సాహం రేకెత్తించాడు. వెనక భాగంలో పెద్ద తాటిచెట్టు జెండాతో నిలబడి తాను సైన్యం నడపడం మొదలు పెట్టాడు.

ఒకపక్క ఇంత మహారాణువా, ఇంకోపక్క ఒకే ఒక్క వీరుడూ-ఇలా యుద్ధానికి సిద్ధపడుతూ వుంటే, ఈ చిత్రం చూడాలన్న కుతూహలంతో, దేవతలూ, ఋషులూ, సిద్ధులూ సేవిస్తూ వుండగా సుదర్శనవిమానంమీద ఆకాశవీధిని వేంచేశాడు దేవేంద్రుడు ఆ విమానంలోనే స్వర్గవాసులైన చక్రవర్తులూ, రాజులూ, ఎవళ్ళకి తగి

నట్టు వాళ్లు ఛత్ర చామరాలతో కొలువు తీరి వున్నారు. ఇంద్రుడి పక్కని పెద్ద గద్దెమీద మహోజ్జ్వలంగా కూచుని చూస్తున్నాడు పాండురాజు. దేవకన్యలు అతడికి చామరాలు వీస్తున్నారు.

ఇంతలో పిడుగులా వచ్చేస్తున్నాడు అర్జునుడు భీషణధ్వనితో దేవదత్తం చెవులు మొత్తుతూ వుంటే పెడమొహం పెడుతూవుంది కౌరవసేన రధచక్రాలవల్ల రేగిన దుమ్ము పైన పడుతూ వుంటే వెలవెలపోతూవుంది. కపిధ్వజం కాంతులు మిరుమిట్లుగొలుపుతూవుంటే తేరి చూడలేకపోతూవుంది. ఆకారం భయం కలిగిస్తూవుంటే తల్లడిల్లి పోతూవుంది. ఇలా కదిలిపోతూన్న కౌరవ సైన్యాన్ని ఒక తీగ సాగినట్టు మెరుస్తోన్న రధంలో వెయ్యిప్రళయ మేఘాల గర్జనలు అదలించేటంత సంరంభంతో వచ్చి కలుసుకున్నాడు అర్జునుడు. కలుసికుని తల ఎత్తి బలగమంతా కలియచూసి ఉత్తరుడితో ఇలా అన్నాడు. ''ఇది వొక పెద్దగుంపు దీనిముందు ఆవులతో అదిగో, అదొక అల్పసైన్యం. అవతల అక్కడ మరికొంతసేన. ఇలా వంతులు వంతులైన సైన్య భాగాల్లో వృధాభిమానీ, దుర్గర్వీ, వదరుపోతూ అయిన దుర్యోధనుడు ఎక్కడవున్నాడో కనిపెట్టాలి. ఈ సేనకి దాపలగా వడివడిగా నడిపించు మన రధం. ఎవరడ్డపడ్డాసరే, అతడిమీదికే వురుకుతాను. అతడు మన చేతిలో చిక్కితే చాలు ఈ బలగమంతా విరిగిపోతుంది. ఆవులు మళ్లించడం మనకు తేలిక దాంతో కధే వుండదు మరి. ఈ పెద్ద సైన్యంలో అతడు కనిపించకపోతే దీన్ని ఇక్కడే వదిలి ముందుకు వెళదాం. చెల్లాచెదరై పోకండా పశువులు మళ్లించుకోవడం మన మొదటిపని. అది చక్కపెట్టేసరికి అక్కడే బైటపడతాడతగాడు.

చెప్పీ చెప్పడంతోనే రధం కుడిపక్కకు మళ్ళించాడు ఉత్తరుడు. బాణంవేస్తే పడేటంత ఎడంలో పక్కనుండే నడుస్తోంది రధం. బలగమంతటినీ డేగలా కలయచూదికాడు అర్జునుడు. ముందూ వెనకా,

ఉభయపార్శ్వాలా, నడిమిభాగాలా ఈయన ఫలానా, ఆయన ఫలానా అని ఎరుకపరుస్తూ ఉత్తరుడికి చెప్పాడు.

"దుర్యోధనుడిది పాముపతాకం. అత డిందులో లేడు. ఆవులు తోలుకు పోతున్నా డనుకుంటాను. మనకి కావలసిన పదార్థం పెద్ద మొనలో లేదు. అంచేత దీంతో చెయ్యిచేసుకోడం వ్యర్థప్రయాసం. వీళ్ళు మనకు అడ్డు పడకముందే త్వరత్వరగా పోయి పశువులు మళ్ళించాలి. సరిహద్దు దాటిపోకండా దుర్యోధనుణ్ణి పట్టుకోవాలి రథం ముందుకు పరిగెత్తించు" అన్నాడు.

రథం ఉత్తరుడు అదిలించేలోపున ద్రోణ, కృప, భీష్ములకి ముగ్గురికీ వారి పాదాల ముందు పడేటట్టు రెండేసి బాణాలు వేశాడు వారి చెవి పక్కలనుంచి పోయేటట్టు రెండేసి బాణాలూ వేశాడు. అదిచూసి ద్రోణుడు పరమానందభరితు డయాడు. పక్కనున్న ఆప్తజనంతో, "చూశారా అర్జును డెంత బుద్ధిమంతుడో!" అన్నాడు, "పాదాల దగ్గిర రెండు బాణాలు వేయడ మంటే నమస్కారం చేస్తున్నా డన్నమాట చెవి పక్కనుంచి రెండు బాణాలు వేయడమంటే చాలాకాలానికి కలుసుకున్నాం గనక కుశలప్రశ్న చేస్తున్నా డన్నమాట.

"ఎక్కుపెట్టిన గాండీవం మెరుపుతీగలా వుంది. కదలాడుతూ కపిధ్వజం కలిగిస్తోన్న ధ్వని వురుముల్లా వుంది. ధూళి చిమ్ముతూ పరిగెడుతూన్న రథం ప్రళయమేఘంలా వుంది శత్రువులు అనే ఎండ మీదికి దండెత్తి, వాళ్ళ దుర్గర్వ మనే తీవ్రతాపం చల్లార్చడానికి ధ్వజ మెత్తిన వానదేవుడులా వున్నాడు అర్జునుడు. పదమూడేళ్ళు బాధపడ్డ కసితో మండి పోతూ వచ్చాడు. ఈ పెంటకుప్ప నంతా నిమిషాలమీద ధ్వంసం చేస్తాడు. తప్పదు. వనవాసమూ అజ్ఞాతవాసమూ గడిపి నవాభ్యుదయం పొందిన ఈతడు, రాత్రి వెళ్ళబుచ్చి మహోజ్జ్వలంగా ఉదయించే సూర్యబింబంలా కనిపిస్తూన్నాడు" అన్నాడు.

కృపుడూ భీష్ముడూ కూడా అర్జునుడు వేసిన నమస్కార బాణాలకీ, కుశల ప్రశ్న శరాలకీ సంతోషించారు.

ఇంతలో ఆ సైన్యాన్ని దాటుకుపోయి ఆలమందల దిక్కు పరిగెత్తింది అర్జునుడిరథం. అదిచూసి తక్కిన యోధులతో ఇలాఅన్నాడు భీష్ముడు "అయ్యో, చిరకాలానికి చూశాం అర్జునుణ్ణి ఇతడు సజ్జనప్రియుడు, స్నేహపాత్రుడు, బంధుహితుడు, శత్రుభయంకరుడు. ఇలాంటి సహృదయుడు లభించడమే దుర్లభం. ఈమూర్తి, ఈదీప్తి ఎంత ఉదారంగా వున్నాయి! నిజానికి సర్వ ప్రపంచానికీ చక్రవర్తి కాదగినవాడు. ఎంత నైపుణ్యం! వెనక నుండి వచ్చిన్నీ పక్కనుంచి మనల్ని దాటిపోనిచ్చాడు రథం. కలియ బడడం ఇష్టంలేక కడకంటిని చూస్తూ కదిలిపోయాడు. ఇక్కడ కలియవెదికి మాట్లాడకండా ముందుకి వెళుతున్నాడూ అంటె రాజుకోసంగాలించి ఇక్కడ లేకపోగానే, అతడికోసమే పరిగెడుతున్నాడన్నమాట. సందేహం లేదు. క్రోధమంతా రాజుమీదేవుంది. మనకీ రాజుకీ మధ్యభాగంలో ఇతడు ప్రవేశించాడా, ఇక రాజుప్రాణాలుదక్కవు. ఒంటరిగా ఇతణ్ణి దుర్యోధనుడు నిలవరించలేడు. రుద్రుడికే సాధ్యం కాదా పని. తక్కిన వాళ్ళ లెక్కేముంది! వెంటనే మనమంతా రాజుదగ్గిరికి పరిగెత్తాలి. లేకపోతే ప్రమాదం తప్పదు అర్జునుడు రాజుమీద చెయిచేసుకుని ఒక ప్రమాదమే తటస్థిస్తే మనప్రయోజనం మరేముంది! ఈ ఆలమందలెందుకు, సిరులెందుకు, సంపదలెందుకు?" అని హెచ్చరించి, ఎలాఅయినా రాజును రక్షించాలన్న ఆతురతతో రథాన్ని పరిగెత్తించాడు భీష్ముడు.

సేనాధిపతి పరిగెత్తడంచూసి తక్కిన సైన్య మంతాకూడా ముందుకు వురకలు పెట్టింది. ఇదంతా చూసి, ముందు నడుస్తూన్న సేనకూడా గోవుల్ని తరుముకుంటూ, గోపాలకులతోసహా ముందుకు పరుగుచ్చుకుంది. అర్జునుడి రథం శరవేగంతో పరుగులు పెట్టి రెండు

క్రోశుల మేరలో ఆలమందని సమీపించింది "పశువులదగ్గిరికివచ్చేశాం" అన్నాడు అర్జునుడు. "మరి ముందుకు పోవద్దు. వెనకసైన్యం కూడా దగ్గిరపడుతున్నాది ఈ రెంటికీ మధ్య నిలబడి ఈ వస్తూన్న వాళ్ళకు కొంచెం బుద్ధిచెపుదాం. ఆగర్వాంకాస్త వదలగొట్టి పశువుల్ని మళ్ళిద్దాం. ఎలాగూ దుర్యోధనుడు మనచేత చిక్కకపోడూ" అన్నాడు.

చెప్పడమే తడువుగా ఉత్తరుడు సైన్యానికి అడ్డంగా తూర్పు ముఖంగా తిప్పాడు రథం. రెండుసేనలకీ మధ్యగా పోయి సమీపించడంతోనే విజృంభించాడు అర్జునుడు. చేయెత్తి "నిలవండి, నిలవండి" అని అదల్చడమేమిటి, శరపరంపర చిమ్మచీకట్లు కమ్మడమేమిటి. ఈ అంధకారమూ, భయాంధకారమూ కలిసి కౌరవసేనల గుండెలు బేజారు చేశాయి ముందుకు వెళ్ళాలో, వెనక్కి పోవాలో, నిలబడాలో, పరిగెత్తాలో, ఏమీ తోచక అర్జునుడి హస్తలాఘవానికి తెల్లపోయి బొమ్మల్లాగ నిలబడిపోయారు సైనికులు. ఆవుల వెనకవున్న సైన్యంమీదికి రథం పరిగెత్తించి, దాన్ని తూర్పుదిక్కు చెదరగొట్టాడు అర్జునుడు. అదేసమయంలో తెల్లవస్త్రం తీసి ఎగరవేశాడు. దేవదత్తం పూరించాడు పతాకం మీది వానరం గర్జించింది. దాని భూతగణాలు కోలాహలం చేశాయి. ధనుష్టంకారం, రథచక్రాల ఘుర్ఘురధ్వనీ, ఎదిరి రథాల కలకలం, ఆకాశం మీద దేవతల కల్లోలం – అన్నీకలిసి భూనభోంతరాళాలు గగ్గోలు పరిచాయి. దాంతో, ఆలమందలు బెదిరిపోయి తోకలెత్తుకు దక్షిణంగా అర్జునుడు వచ్చిన దారిని పరుగుచ్చుకున్నాయి. అంతవరకూ ఆవులతో వెళుతూన్న ఆలకాపర్లు కూడా ఇదే సమయమని వాటి వెంట వూరిదారి పట్టారు. అది చూశాడు అర్జునుడు. "ఆ వస్తూన్న బలగం పశువుల్ని అడ్డుకోకండా చూసుకోవాలి. వీటి వెంబడిని పోని రథం" అని సారథిని హెచ్చరించాడు. రథం గోపాలకుల్ని సమీపించింది. భయపడకండి.

పశువుల్ని వూళ్లోకి భద్రంగా తోలుకుపొండి" అని కేక వేసి హెచ్చరించాడు.

ఇంతలో రథాలతోనూ, ఏనుగులతోనూ, ముంచెత్తిన మేఘాలలాగ వచ్చిపడింది కౌరవసేన. వచ్చిందే తడువుగా శరవేగంతో మహావాయువులా ఎదిరించాడు అర్జునుడు. కౌరవసేన చెల్లాచెదురు కావడంతోటే ఆవులు చెదరకండా ఆసేనకి అడ్డంగా నిలబడ్డాడు. ఆవులన్నీ ఆలకాపర్లతోసహా చెక్కుచెదరకండా విరాటనగరం చేరుకున్నాయి.

---

# విరాటపర్వం

## ఐదో ఆశ్వాసం

ఇలా శత్రుసైన్యమంతా చేవదప్పి డిల్లపడి చూస్తూండగా, అనర్గళమైన బాహుపరాక్రమంతో విజృంభించి పశువులు మళ్ళించాడు అర్జునుడు. అనంతరం అల్లంతదూరంలో చూశాడు దుర్యోధనుణ్ణి. చూసిందే తడువుగా అక్కడికి పోనిమ్మన్నాడు రథం.

గుర్రాలు అదిలించాడు సారథి ఉత్తరకుమారుడు. దుర్యోధనుడికి సూటిగా బరిమీద పాములా పరిగెడుతున్నాది రథం. ఇంకేముంది! నిమిషాలలో కౌరవసేనకి సర్వనాశనం జరిగిపోతుంది. కౌరవ వీరులంతా మూడువేల రథాలతో పురకలువేస్తూ పరిగెత్తారు. వేయి రథాలతో పరిగెత్తాడు భీష్ముడు. మరో వేయిరథాలతో పరిగెత్తాడు కర్ణుడు. వీరంతా ఒక్క వ్యూహపున ముందుకుపోయి, రాజుకు అడ్డుపడి అర్జునుడి రథానికి ఎదురుగా నిలబడ్డాడు.

ఆవులు చెయిజారిపోయి నందుకు వుసూరు మన్నాడు దుర్యోధనుడు. ముందుకి మరి కాలు సాగలేదు. తమ్ములతోనూ, వేలాది రథాలతోనూ వెనక్కు తిరిగి నిలబడ్డాడు. తక్కిన సైన్యమంతా వచ్చి అండగా, ఓ పెట్టనికోటలా నిలపడింది.

ఇదంతా చూశాడు అర్జునుడు. అతడిపెదవుల్లో చిరునవ్వు మొలకెత్తింది. కళ్ళల్లో గర్వరేఖ తాండవించింది. హృదయంలో వీరరసం తొణికిసలాడింది. కౌరవయోధుల్ని ఒక్కొక్కరినీ ఉత్తరుడికి ఎరిగించాలన్న కుతూహలమూ కలిగింది. ''సారథీ, అదిగో, పతాకం మీద బంగారు వేదిక మెరుస్తూవుందే, ఆయన ద్రోణాచార్యులు. సింహం తోక ధ్వజాగ్రం మీద కనిపిస్తూవుందే, ఆయన అశ్వత్థామ. జెండా

మీాద బంగారం వృషభం ప్రకాశిస్తూ వున్న ఆయన కృపాచార్యులు. శంఖంలా మెరుస్తూన్న పతాకం కనపడుతోందిచూడూ, అతదే కర్ణుడు. మహోగ్రమైన తాళధ్వజం కనబడుతూ వుందే ఆయనే మా పితామహుడు భీష్ముడు. అల్లదిగో, రత్నాలు చెక్కిన పాము. జెండామీాద వుందే అతడే దుర్యోధనుడు.

"ద్రోణాచార్యులికి ప్రదక్షిణంగాపోని మన రథం. కౌరవరాజు కుమారు లందరికీ అస్త్రవిద్య నేర్పిన గురుదేవు డీయన. ఈయన్ని పరాభవించడం కూడదు మహాస్త్రాలు తెలిసిన మహానీయుడు. ధనుర్వేదం కూలంకషంగా మథించిన మహాత్ముడు. దూరలక్ష్యాన్ని అనాయాసంగా ఛేదించగల ధనుర్ధరుడు దర్శనమాత్రం చేతనే శత్రువుల గుండెల్లో దిగులు పుట్టిస్తాడు. ఈయనమీాదికి కలియబడ కూడదు మనం. దుర్యోధనుణ్ణి హతమార్చడానికి నేను ఉంకించినపుడు తెలియాలి, ఈయన నా మీాద బాణప్రయోగం చేస్తాడో లేదో. ఆయన ముందు చెయిచేసుకోని, అప్పుడు మనం కలగచేసుకుందాం.

"అశ్వత్థామ కూడా మహా తేజశ్శాలి. గురుపుత్రుడు. యుద్ధంలో ధనుర్బాణాలు పట్టుకుంటే దేవతలన్నా తేరిమాడలేరు వర ప్రసాదం వల్ల పుట్టిన మహానుభావుడు. కౌరవసేనంతటికీ మకుటంలాంటివాడు. కృపాచార్యులో, అస్త్రవిద్యలో ద్రోణాచార్యులంతవాడు. మహా ధైర్యశాలి మా జనకమిత్రుడు. మాకు బాల్యగురువు వీరిద్దరూ మన్నించదగ్గవారు. వీరితో కయ్యానికి కాలుదువ్వకూడదు మనం. ఎదురైనప్పుడల్లా తప్పించుకు పోనివ్వాలి రథం.

"ముఖ్యంగా కర్ణుడి సంగతి-యోధాగ్రేసరుడు వీడు తేజశ్శాలి. దృఢవేధి యుద్ధమంటే ముందూ వెనకా చూడడు అఖండమైంది వీడి పరాక్రమం. పరశురాముడిదగ్గిర విలువిద్య నేర్చాడు, ఎందరు ముట్టడించినా లక్ష్యపెట్టే ఘటం కాదు. శౌర్యవీర్యాల్లోనూ,

ధనుర్విద్యలోనూ నన్ను మచ్చరిస్తాడు. దుర్యోధనుడు పంచప్రాణాలూ వీడిమీదే పెట్టుకున్నాడు. పదేపదే నా మీదికి పురికొల్పుతుంటాడు. వీడికీ నాకూ భేటీ పడిందివాళ జాగ్రత్తగా కనిపెడుతూ మా ఇద్దరి తారతమ్యాలూ తేల్చాలి నువ్వు చలించకు. ఎదిరించి ముఖాముఖి పడ్డప్పుడు నేను పూరేకుంటానో, చిచ్చులపిడుగులా వాడి మీదికి పురకనే వురుకుతానో, ఏం చేస్తానో చెప్పలేనిప్పుడు. నువ్వుమాత్రం నన్ను గమనించి నిస్సంకోచంగా రథం పోనిస్తూ వుండాలి.

"ఇక దుర్యోధనుడు-ఉగ్రస్వభావుడు, హస్తలాఘవంలో మహా పరాక్రమశాలి. దురభిమాని. మూర్ఖుడున్నూ. ఇతణ్ణి కలియబడ్డప్పుడు నిజంగా నాకు పండుగే అనుకో. ఎల్లాఅయినా ఇతడి రథం మన పాలబడే ఉపాయం చూడాలి ఎవరడ్డుపడ్డా సరే, మెరుపు మెరిసినట్టు మనరథం ఉరికించాలి అతడి మీదికి.

"మరి, మా పితామహుడు భీష్ముడు-శత్రువుల గర్వారణ్యాం ఇట్టే భస్మీభూతం చేస్తుంది ఈయన ప్రతాపాగ్ని. అగాధమైన విజ్ఞాన మీాయననిది. మహాయుధవిద్యల రహస్యాలన్నీ కరతలామలక మీాయ నికి. విలుకాండ్రలో ఈయన్ని చెప్పి మరొకర్ని చెప్పాలి. రకరకాల లక్ష్యాలు భేదించడ మంటే ఈయనికి వేలపిండి పరశురాముడంత చండశాసనుణ్ణి మూడుచెరువుల నీళ్ళు తాగించాడు. ఈయన చుట్టు పక్కలికి చేరకూడదు మనం, కోపగించాడా, రాజుదగ్గిరికి గాని, సైన్యందగ్గిరికి గాని చేరకండా మనల్ని ముప్పతిప్పలూ పెడతాడు. ఇకపద" అని హెచ్చరించాడు చెప్పవలసిన పన్నీ చెప్పి సమరో న్ముఖు డయాడు తాను.

ఇంతలో కర్ణుణ్ణిచూసి చిన్న మందహాసం చేశాడు అశ్వత్థామ. "కర్ణా, ఇంతసేపూ నిన్ను నువ్వు పొగుడుకున్నావు. ఎన్నో పెద్ద కబుర్లు చెప్పావు. ఇదిగో పులిలాగ రానే వచ్చాడు అర్జునుడు. కల

బడూ మరి! చూసన్నా సంతోషిస్తాం. భయమేస్తోందా? వెళ్ళు, శకునిగార్ని పిలు. సలహాఅన్నా చెబుతాడు. రాజు నీ నెత్తిమీదే కార్యభారమంతా పెట్టాడాయె మరి! అదంతా పూరికే పోతే ఎలా?'' అని ఎత్తి పొడిచాడు.

ఈమాటలు కర్ణకఠోరంగా వేధించాయి కర్ణుణ్ణి. ''పిరికీ, అంటే 'ఓ' అంటా డీయనగారు. నన్ను ఎత్తిపొడుస్తున్నాడు తాటాకు చప్పుళ్ళకి పరిగెత్తే కుందేళ్ళేవీ లేవిక్కడ. ఇతణ్ణి నమ్ముకునే నేను యుద్ధానికి వచ్చానుకాబోలు? నోటికి అడ్డమంటూ వుండాలి. అర్జునుడు వచ్చేదీ వాడి అబ్బవచ్చేదీ నా బలమేదో ఇప్పుడే చూపిస్తాను'' అంటూ రథం ముందుకు వురికించాడు అతడికంటె ముందు ద్రోణుడూ, అతనితోపాటు కృపాచార్యుడూ భీష్ముడూ మొదలైనవాళ్లు బయలు దేరారు. వాళ్ళవెంట అశ్వత్థామా బయల్దేరాడు. అదిచూశాడు దుర్యోధనుడు రభసంగా తానూ బయలుదేరాడు. రాజుకూడా సిద్ధపడడంతోనే దుశ్శాసనుడూ, దుష్ప్రహుడూ, దుర్ముఖుడూ మొదలైన కౌరవ కుమారులూ, శకునీ, సైంధవుడూ మొదలైన బంధువులూ, బాహ్లీకుడూ, సోమదత్తుడూ మొదలైన సామంతరాజులూ, తక్కిన యావన్మందియోధులూ ఏనుగుమందలతోనూ, రథాలమూకలతోనూ పదాతిదళాలతోనూ గట్టుతెగిన సముద్రంలాగ పోలో అంటే పోలో అని ఒక్కసారి అర్జునుణ్ణి ముట్టడించారు ఆ సంరంభానికి భూమి గడగడలాడింది ధూళిరేగి సూర్యబింబాన్నీ, ఆకాశాన్నీ కప్పేసింది. యుద్ధావాద్యాలతో దిక్కులు ప్రతిధ్వనించాయి. మహాయుధాల ఉగ్రకాంతులు ఆకాశంనిండా ఘోరంగా ధగధగలాడి వేయి కళ్ళ దేవేంద్రుడికి కూడా చూడశక్యం కాకండా అయాయి.

తుఫానులో పెద్ద ఉప్పెనలా వచ్చిపడుతూన్న కౌరవసైన్యాన్ని చూసి అట్టహాసం చేశాడు అర్జునుడు. ఒక శ్లోకచుక్క చప్పున పుట్టి

భయంకరంగా చెలరేగినట్టు విజృంభించాడు. గాండీవధ్వని బ్రహ్మాండ భాండం పగిలిస్తోంది. ధనుస్సు నారినుండి, పిడినుండి, రెండుకొనలనుండి అతడి చేతులనుండి-తీక్ష్ణబాణాలు పుంఖానుపుంఖంగా ఒక్కుమ్మడిని విరజిమ్ముకు వెలువడుతున్నాయి.

ముందుకు వచ్చిన పదాతులు కుప్పలుతిప్పలుగా కూలుతున్నారు. పీనుగుల మీదినుండి రథం ముందుకు వురకలు వేస్తూవుంది. తనదృష్టీ, తనముష్టీ ఎటువెళితే అటు అర్జునుడి బాణాలు పదిమందిని, పదిహేను మందిని, ఒక్కొక్కటీ దూసుకుపోతున్నాయి అదిచూసికూడామడమ తిప్పని వీరులు జట్లు జట్లుగా వచ్చి మంటలో పడుతూన్న మిడతల లాగ అర్జునుడి బాణాగ్నిలో బలిఅయిపోతున్నారు ఈసుళ్ల పుట్టలా మీదికి వస్తూనేవుంది సైన్యం. రెప్పపాటులో అందరినీ హతమారు స్తూనే వున్నాడు అర్జునుడు. క్షణక్షణానికీ సేన మితిమీరుతూనే వుంది. క్షణక్షణానికీ గాండీవం రెచ్చిపోతూనేవుంది.

శత్రుబలగంనుండి రకరకాల మారణాస్త్రాలు వడగళ్ళవానలా వచ్చి పడుతూనే వున్నాయి. అన్నిటినీ ముక్కముక్కలు చేస్తూనే వున్నాడు అర్జునుడు. విరామంలేని తన బాణాలు వేసి, గోటితో ఈనెలు-చీరినట్టు చీల్చేస్తున్నాడు కొన్నిటిని. బాడిసతో నరికినట్టుతున కలు చేస్తున్నాడు కొన్నింటిని. రంపంతోకోసినట్టు పొట్టుపొట్టు చేస్తు న్నాడు కొన్నిటిని. రోటితోదంచినట్టు పిండిపిండిచేస్తున్నాడుకొన్నిటిని.

ఇంతయినా అతడి జెండా చెక్కుచెదరలేదు. అతడి సారథి మీద ధూళిపడలేదు. గుర్రాలమీద ఈగవాలలేదు. రథం దాట్ల మీద దాట్లతో ముందుకు పరిగెడుతూనేవుంది.

రకరకాల కవచాల్ని చీలికలు చీలికలు చేస్తున్న అతడి బాణాల వాడికి శత్రువులు అద్భుతపడిపోతున్నారు. ఇదంతా లిప్తల మీద సాధిస్తున్నాడు సవ్యసాచి అర్జునుడు.

ప్రశంసలతో కరతాళధ్వానులు చేస్తోంది ప్రేక్షకలోకం. శక్తివంతమైన అర్జునుడి బాహుద్వయంలో తాండవమాడుతోంది గాండీవం. చూపులమల్లే విరజిమ్ముతూన్న వాడి బాణాలు శత్రుసేనని దూది పింజలలా తుత్తినియలు చేస్తున్నాయి. క్షతగాత్రులై నెత్తురుమయంగా వున్న సైనికులు. పూసిన రక్తాశోకవృక్షాలవలె కనిపిస్తున్నారు.

క్రమంగా పదాతిదళం చిందరవందర కావడంచూసి రథ గజ తురంగాలతో తుఫాను మేఘాల్లావచ్చి అర్జునుడి రథంచుట్టూ ముట్టడించారు, వందలూ వేలూ ఉక్కుతునకల్లాంటి యోధులు. గుర్రాల గజ్జల మోతా, ఏనుగుల ఘంటాధ్వానం, రథాల ఘుర్ఘురధ్వనీ మేఘగర్జనలా భీషణంగా వుంది. దాంతో దేవత పూనినట్టు వీరావేశంతో రెచ్చిపోయాడు విభ్వచ్చుడు అర్జునుడు. విరామం లేకండా దీర్ఘనాదంతో మోగడం మొదలుపెట్టింది గాండీవగుణం. చంద్రవంకలా వుండవలసిన గాండీవం చక్రంలా మెరుస్తోంది. ఎక్కడా సూది మొనంత తెరిపి లేకుండా పుంఖానుపుంఖంగా, సంతతధారాపాతంగా, ఉగ్రాతిఉగ్రంగా–ఒకేసారి నలుదిక్కులా తీక్ష్ణ బాణాలు విరజిమ్ముతూ, సహస్ర కిరణాలు జగమంతటా ఒకేవిధంగా వ్యాపింపజేసే సూర్యభగవానుడిలా వున్నాడు అర్జునుడు.

మానవుల దృష్టి ఎలా అయితే, ఒక లక్ష్యం మీదనే కాని, అన్యథా పడదో అలాగే అర్జునుడి బాణం వొకటీ గురితప్పి వ్యర్థం కావడం లేదు.

ఏనుగులమీద, గుర్రాలమీద, రథాలమీద, సారథులమీద, కవచాలమీద, రథికులమీద, ఎక్కడపడితే అక్కడపడ్డ ప్రతిబాణమూ దూసుకుపోడమే కాని చిక్కుకోడమంటూ లేదు.

బాణాల మీద భాణాలు రథాల్ని పడగొడుతున్నాయి. పతాకాల్ని విరగ్గొడుతున్నాయి. గుర్రాల్ని తెగేస్తున్నాయి. ఏనుగుల్ని కూలవేస్తున్నాయి.

మహోగ్రమైన ఈ రణోత్సవంలో ఎడమ చేతినుండి కుడి చేతికీ,కుడి చేతినుండి ఎడమ చేతికీ గాండీవం మారుస్తున్నాడు సవ్యసాచి శరసంధానం కూడా సవ్యాసవ్యహస్తాలతో సమానంగా చేస్తున్నాడు. అతడు జమిలితూణీరం ఎందుకు వేసుకున్నాడో ఇప్పుడు బోధపడుతూవుంది.

పదునని లేదు, ఎగుడు దిగుడని లేదు, మెరకని లేదు, పల్లమని లేదు, తిన్నన అని లేదు, వంకర అని లేదు – అంతటా మనోవేగంలాగ, అనర్గళంగా పరుగులు పెడుతోంది అర్జునుడిరథం. అంతలో చప్పున సైన్యమంతా రెండుపాయలైనట్టు మధ్యనుండి చీల్చుకుపోయింది. మళ్ళీ అడ్డంతిరిగి దాన్ని నాలుగుపాయలైనట్టు చేసింది. మూలమూలకు కేబీసుగా పోయి ముక్కలు ముక్కలుగా చేసింది చక్రాకారంగా తిరిగి చిక్కచిక్కగా చేసింది. ఇలా మహాసముద్రంలో తిమింగలం విహరించినట్టు కౌరవసేనావాహినిలో వీరవిహారం చేస్తోంది అర్జునుడిరథం

అర్జునుడి బాణాలతో తునకలౌతూన్న రత్నపతాకాలూ, మణికిరీటాలూ, స్వర్ణఘంటికలూ కౌరవుల సర్వనాశనం సూచిస్తూ తెగిపడుతూన్న ఉల్కలవలె కింద పడుతున్నాయి.

'తమ వీపులమీది రౌతుల్ని కనికరించి రక్షించు' అని మొక్కుతున్నట్టు ముందుకు వంగి పడుతున్నాయి ముంగాళ్లు తెగిన గుర్రాలు. ఆకాశం మీద నల్ల మబ్బులు గుబుర్లు కట్టినట్టు కనిపిస్తున్నాయి గుట్టలు గుట్టలుగా కూలిపడ్డ ఏనుగులు. పలుపులూ, పగ్గాలూ తెగి, విచ్చలవిడి పారిపోతూన్న గుర్రాలు అర్జునుడి కృపకు పాత్రములై బతికిపోతున్నాయి. పాపం, వేలాడుతున్న పేగులతో హృదయవిదారకంగా రోదనంచేస్తూ పరుగిడితున్నాయి కొన్ని. అర్జునుడి బాణాలతో తునాతునకలై గాలిలో ఎగురుతూన్న గొడుగులూ, జండాలూ, చామరాలూ, ఆకాశంమీద తాండవమాడుతున్న కబంధాలికి అలంకారాలుగా అందగిస్తున్నాయి.

హుంకరించి ఒకసారి అర్జునుడి ఎదటికి వెళ్లిన యోధుడు రెండోసారికి కనిపించడంలేదు. సముద్రంలో బడబాగ్ని ప్రకోపించినట్టు, మహామారి శివమెత్తినట్టు, కాలంపండిన లోకాలమీద కాలయముడు సంహారక్రీడకు పూనుకున్నట్టు కౌరవసైన్యాన్ని సర్వసంహారం చేయడం మొదలు పెట్టాడు అర్జునుడు

గుర్రాల డెక్కలతో రేగిన ఎర్రటి దుమారమూ, శత్రువుల దేహాల్లో చొచ్చి రక్తసిక్తమై ఎగిసిపడుతూన్న అర్జునుడిశరపరంపరా, క్షతగాత్రులమీద సుళ్లుతిరిగి పదునెక్కి, సూర్యకిరణాల్లో తళతళమనే నెత్తురుతుంపర్లతో ఎరుపెక్కిన గాలితెరలూ, ధారాపాతంగా ప్రవహించిన రక్తంతో కుంకం పండినట్టయిన భూప్రదేశమూ-అన్నీ కలిపి అకాలసంధ్యలా అపూర్వశోభ కలిగించాయి. దానికి అనుగుణ్యంగా అర్జునుడి బాణాలతో తుళ్లిపడుతూన్న ఏనుగుల కుంభస్థలాల్లోని ముత్యాలు చుక్కల్లా కనిపించాయి. ఏనుగుల కపోలధారలు ఆస్వాదిస్తూ అర్జునుడిబాణాలకు బెదరి ఎగురుతూన్న తుమ్మెదబార్లు, పైకలేస్తున్న సాయంకాలపు పొగలలావున్నాయి. శత్రుబాణాల్ని అర్జునుడి బాణాలు ఢీకొని రేపుతూన్న మంటలు, సంధ్యాగ్నులలా వున్నాయి.

అర్జునుడి బాణాలకు ముక్కలౌతూన్న శత్రువుల ఎముకల ధ్వని, రేగుతూన్న అతడి క్రోధాగ్ని చేస్తూన్న చటచ్చటధ్వానంలా వుంది. అక్కడక్కడ పేరుకున్న రక్తంమడుగులు కోనేళ్ళలా వున్నాయి అందులో పడి తేలుతూన్న వింజామరలు హంసలలా వున్నాయి. తెల్లగొడుగులు తెల్లపద్మాలలా వున్నాయి. అర్జునుడు తుత్తునియలు చేస్తూన్న శత్రుబాణాల ఇనుపముక్కలు అందులో పడుతూ, పద్మాలకోసం ముసురుతూన్న తుమ్మెదలలా వున్నాయి.

సైనికుల తలలు చిదిగి పడివున్న మెదడుముద్దలూ, మాంసం ముక్కలూ, తెగి నలుదిక్కులా అంతంతలో సాగిపడివున్న కరచర

బాణాలూ కలిసి, అక్కడక్కడ విత్తనాలు చల్లడానికి పదునుపట్టి సిద్ధంచేసిన వరిమళ్ళలా వున్నాయి. యోధుల కిరీటాలనుండి తుళ్ళిపడుతూన్న వజ్రాలు, నైపుణ్యంగల రైతు చల్లుతూన్న విత్తనాలలా వున్నాయి.

ఇలా, మనోహరంగా వుండికూడా రణక్షేత్రం ఎంతో బీభత్సంగానూ వుంది. అంతటి సైన్యసాగరంలోనూ కిరీటి ఏక మాత్రసహాయుడై పోరాడుతూ వుండినా, చిత్రయుద్ధంలో కౌశలమూ, ఎదిరి బాణాలు సగంలోనే ఖండించే సామర్థ్యమూ, అన్నిటిని మించిన ధర్మబలమూ తనకే వుండడంవల్ల అతడికిగాని, అతడి సారధికిగాని, రధానికిగాని, గుర్రాలికిగాని, తుదకి పతాకానికిగాని పూాతికపుల్లయినా సోకలేదు. ఇలాతలుపువ్వు వాడకండావున్న గాండీవిని చూసి కౌరవులంతా నిచ్చెర పోయారు. భయభ్రాంతులూ అయారు.

అర్జునుడిరధం అడుగు పెట్టిన చోటల్లా గుర్రాలూ, ఏనుగులూ, రధాలూ పీనుగుపెంటలై, గుండపిండిగా కూలిపోతూన్నాయి. తమ దిక్కువస్తే తమగతీ అంతే అని భయపడి పుంజాలు తెంపుకుని ఏనుగుల్నీ, గుర్రాల్నీ వచ్చినదారే పట్టించారు కొందరు. బాణాలు దూసుకుపోయి కిందపడి తన్నుకుంటూాన్న వాళ్ళని చూసి నిలువునా జలదరించి, "యుద్ధం దేవుడెరుగును" అని పిక్కబలం చూపించారు కొందరు. "పొద్దుగూకితేగాని విరమించడు కాబోలు దేవుడా, ఏందారి?" అని దిగాలుపడి కూలపడ్డారు కొందరు. "అందర్నీ హతవార్చితేగాని ఆగి పోడురా బాబూ" అని హతాశులై మొత్తుకున్నారు కొందరు.

విరామంలేకండా మారణహోమం చేస్తూాన్న అర్జునుడి వీరావేశం చూసి తమమీాది కేం వస్తుందో అని తల్లడిల్లి రెప్పవెయ్యకండా మిడుతూమిడుతూ చూశారు దేవతలు.

సైన్యం క్రమంగా సన్నగిల్లుతూండడం చూసి మించివచ్చిందని కలవరపడ్డారు కౌరవనాయకులు. లేని ఆవేశం తెచ్చుకున్నారు.

అందరూ కలిసి ఒక్క పెట్టుని తిరగపడ్డారు అర్జునుడి మీదికి ఈసారి పెద్దలమీదికే గాండీవం సారించాడు విజయుడు. ఎత్తీఎత్తడంలోనే మొట్టమొదట డెబ్భయిబాణాలు వేశాడు ద్రోణుడిమీద. అరవై బాణాలు వేశాడు భీష్ముడిమీద. ఏడుబాణాలు అశ్వత్థామమీద. పది కృపుడిమీద దుశ్శాసనుడిమీద పన్నెండు. దుశ్శాసనుడిమీద పదిహేను. శకునిమీద ఎనిమిది ఆపైన కర్ణుడిసారధినీ గుర్రాల్నీ కొట్టాడు. అతడి కవచం చీల్చి చెండాడాడు. కీళ్ళుకీళ్ళు మంటెత్తిం చాడు. శరీరమంతా జర్జరితం చేశాడు. ఉత్తరక్షణంలో దేవదత్తం పూరించాడు. దాంతో యోధులంతా సైన్యాలతో సర్వసేనాని భీష్ముడి వెనక్కి పరుగుచ్చుకున్నారు.

ఆవేశం తెచ్చుకున్నాడు భీష్ముడు. చెల్లాచెదురై పోతూన్న సైన్యాన్ని ప్రబోధించాడు ఒక్కణ్నీ పోనీయకండా మళ్ళించాడు. భీష్ముడి ప్రాపున ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, వికర్ణుడూ మొదలైన ప్రముఖులంతావచ్చి సిద్ధపడ్డారు. అందరూ కలిసి ఏనుగులతోనూ, గుర్రాలతోనూ రధాలతోనూ దుర్యోధనుడిముందు మొనలుతీర్చి అర్జునుడికి ఎదురుగ్గా నిలబడ్డారు.

అంతా చూశాడు అర్జునుడు విడియుద్ధం చెయ్యాలన్న కుతూహలంతో ఉత్తరుణ్ణి హెచ్చరించాడు "వీపుతట్టి గుర్రాలు కొంచెం నిలబెట్టు. ఎదురుగుండా చూశావా, కారుమబ్బుదొంతర్లలాగ ఎలా వుందో, ఏనుగులూ, భటులూ, పతాకాలూ బార్లుతీర్చిన మహావ్యూహం! అదిగో కర్ణుడిజెండా. వాడూ మహా మిడిసిపడుతున్నాడుయుద్ధం కోసం. ముందు వాణ్ణి కొంచెం చూడాలి మనం చప్పున వెళ్ళి వాడి పని పట్టిద్దాం. వీణ్ణెవడూ గెలవలేడని నమ్ముకుంటూన్న దుర్యోధనుడికి కనువిప్పు కలిగిద్దాం, పద" అన్నాడు.

అర్జునుడి బలం మీద పరిపూర్ణమైన నమ్మకముంది ఉత్తరుడికి. గుర్రాల్ని ఓసారి దువ్వాడు. నిర్భయంగా కర్ణుడి మీదికి పాములా పరిగెత్తించాడు రథం.

ఆబోతుమీదికి పొంచి పడుతూన్న పెద్దపులిలాగ కర్ణుడిమీదికి వస్తూన్న అర్జునుణ్ణి చూశారు చిత్రాంగదుడూ, చిత్రరథుడూ, సంగ్రామజిత్తూ, దుష్ప్రహుడూ, చిత్రసేనుడూ, వివింశతీ, దుర్ముఖుడూ, దుర్జయుడూ, వికర్ణుడూ, శత్రుంతపుడూ, దుశ్శాసనుడూ మొదలైన కౌరవకుమారుల్లు. ధనుస్సులు ఎక్కుపెట్టి రథాలతో మొనలు తీర్చి ముందుకి వురికి అర్జునుడిమీదికి తలపడ్డారు వీళ్ళంతా పేలపిండిలా కని పిస్తున్నారు అర్జునుడికి. వీణవాయించినట్లు ధనుష్టంకారం చేశాడు. గాండీవం వీణలా వుంది ఎదిరిస్తూన్న కౌరవకుమారుల్లు వెనక సుతివేసే వాళ్లలా వున్నారు మహావైణికుడిలా వున్నాడు అర్జునుడు.

ఇంతలో, అందరికంటె ముందుకు వచ్చి కలియబడ్డాడు వికర్ణుడు. వాడివాడి బాణాలు ప్రయోగించాడు దాంతో ఎర్రగా చూశాడు అర్జునుడు. పూని ఒక బాణం వేసిందే తడవు, రెండుముక్కలైంది వికర్ణుడి విల్లు. దెబ్బతో పరుగుతీశాడతడు ఇది చూసీకూడా శత్రుంత పుడు ముందడుగు వేశాడు. తాబేటిగోళ్లవంటి దిట్టమైన బాణాలు ప్రయోగించాడు వచ్చీరావడంతోనే అతడిసూతుణ్ణి కొట్టాడు అర్జునుడు. దూసుకుపోయేటట్టు అయిదు బాణాలతో కొట్టాడు శత్రుంతపుణ్ణి వాటితో అతడు కిందపడి చచ్చివూరుకున్నాడు అతణ్ణి కానిచ్చి అనంతరం, ఇలా వొక్కొక్కడితో కాలహరణం చెయ్యడం వ్యర్థప్రయాసం అనిపించి, వాళ్లందరిమీదా ప్రవాహంలా శరవర్షం కుమ్మరించాడు అర్జునుడు. ఆ బాణప్రకోపానికి అరచేతిలో ప్రాణాలు పట్టుకుపరిగెత్తారు వాళ్లు. అదిచూసి "ఈపాటిదానికి ముందుకెందుకు వచ్చారో అబ్బాయిలు" అని వెర్రిధైర్యంతో తిరగబడ్డాడు కర్ణుడితమ్ముడు సంగ్రామ

జిత్తు. వడివడిగా వాడిబాణాలు వేశాడు. కనుకొనలు కెంపెక్కాయి అర్జునుడికి ఒక్క బాణంతో తలనరికి కింద పడగొట్టాడు సంగ్రామజిత్తుని.

## అర్జునుడూ కర్ణుడూ

తమ్ముడి మరణం కళ్లారా చూశాడు కర్ణుడు. కళ్లముందు చిమ్మచీకట్లు కమ్మినట్టయింది. ఏనుగుకి బరికోలచూపించినట్టు కలియ బడ్డాడు అర్జునుడిమీద. వచ్చీ రావడంతోనే అర్జునుడి గుర్రాల్ని కొట్టాడు. ఉత్తరుణ్ణి కొట్టాడు. అర్జునుడిమీద పన్నెండు బాణాలు వేశాడు. కళ్లె మొయ్యా కోపం వచ్చింది అర్జునుడికి జూలువిదులిపిన సింహంలా ఒళ్ళు దులుపుకున్నాడతడు పాముని పొదివిపట్టిన గరుత్మం తుడిలాగ బాణాలమీద బాణాలతో కర్ణుణ్ణి ఆక్రమించాడు.

కర్ణార్జును లిద్దరూ పరస్పరం కలియబడేసరికి కౌరవులంతా ఎక్కడివాళ్లక్కడ కుతూహలంతోనూ, ఆశ్చర్యంతోనూ కదలకండా నిలబడి చూడడం మొదలు పెట్టారు. ప్రళయమేఘంనుండి పర్వతం మీద శిలావర్షం కురుసినట్టు శరపరంపరతో కర్ణుణ్ణి ముంచెత్తాడు అర్జునుడు. ఝంఝూవాయువులు మేఘాల్ని పటాపంచలు చేసినట్టు అన్ని టికీ అన్ని ఎదిరిబాణాలు వేశాడు కర్ణుడు. అర్జునుడి బాణాలనుండి శిఖసాగిన అగ్నిహోత్రంలా ధనుర్బాణాలతో బైటపడ్డ కర్ణుణ్ణిచూసి కౌరవసేనలో తూర్యారవాలు మిన్నుముట్టాయి. కర్ణుడి బాణాలు అర్జునుడిమీద పడుతున్నప్పుడల్లా సంతోషంతో పొంగిపోతూ, అర్జునుడిబాణాలు కర్ణుడిమీద పడ్డప్పుడల్లా దిగులుతో కుంగిపోతూ పోటూపాటుల సముద్రంలా అవుపడింది కౌరవసేన.

కర్ణుణ్ణికవ్వించి ఎత్తిపొడిచాడు అర్జునుడు. "నాఅంతవాడు లేడని సభల్లో వాగుతావు ఇదిగో, ఇప్పుడుపడింది భేటీ. దీంతో బండారం బయటపడుతుంది. స్వోత్కర్ష చెల్లిరాదిక్కడ ఈ మొనగాళ్ల ఎదట పలికిన ప్రగల్భాలు పూరి కేపోవు మరి! తమ్ముడిగతి చూశావుకదా!

కాళ్లకి బుద్ధిచెప్పకండా మాత్రం నిలబడు. లకు చెప్పవచ్చు ఒక్కటైనా చేస్తే తెలుస్తుంది. అనాళ ద్రౌపదిపరాభవం చూసి విరగబడి నవ్వావు. దానిఫల మిప్పుడే చవిచూస్తావు. అపుడు ధర్మపాశ బద్ధుణ్ణయి బాణం పట్టలేదు నేను. బదికిపోయావు నువ్వు. ఇప్పు డెటు పోతావో చూస్తాను!'' అన్నాడు.

తృణీకారంగా నవ్వాడు కర్ణుడు ''ఓహో, అపుడు ధర్మబద్ధుడవై బాణంపట్టలేదూ? ఇపుడు బ్రహ్మాండం బద్దలుకొడతావూ! అన్నగారిమీద నెపంపెట్టి పిరికితనం కప్పిపుచ్చడం బాగానేవుంది! నీ బంటుతనమేదో చూస్తాంగా మరి! పందెంప్రకారం ప్రవర్తిస్తే రాజ్యంలో వంతు ఇవ్వకపోతారా అన్న పేరాసతో అడివికి బయల్దేరారు గాని, అసలు ధర్మమూ, ధైర్యమూ, అంటే ఏమిటో ఎరుగుదురామీరు! ఈమధ్య ఎక్కడెక్కడో, ఏవేవో ఘనకార్యాలు చేశావనీ విన్నాను. అవేవో నాఎదట చూపిస్తే నమ్ముతాను ఏమంటావా, నీ పిరికితనం మొదటినుంచీ తెలుసుకదా నాకు!'' అని శరవర్షం కురిపించాడు. శిరఃకంపంచేసి అర్జునుడూ గాండీవం పైకెత్తాడు. రకరకాల వాడి బాణాలు పుంఖానుపుంఖంగా ప్రయోగించాడు.

కర్ణార్జునులు ద్వంద్వయుద్ధంచేసి దేవాసురసంగ్రామంలా వుంది. ఉభయుల బాణపరంపరలలో సూర్యకిరణాలకు చోటులేకండా చిమ్మచీకట్లు కమ్మాయి. వివిధాస్త్రాలతో ఆకాశం నిండిపోయి, గాలి కదలికకీ వీలులేకండా పోయింది. కర్ణుడిసైన్యంకూడా వచ్చి అర్జునుణ్ణి ముట్టడించింది. దానిమీదనుంచి రథం వలయాకారంగా దాటిస్తూ, గుర్రాల్నీ, ఏనుగుల్నీ, రథాల్నీ కుప్పకుప్పలుగా కూలగొట్టాడు అర్జునుడు. ఇదే సమయమని మరింత విజృంభించి వెంటపడ్డాడు కర్ణుడు. 'ఇకవీణ్ణి ఉపేక్షించకూడదు' అని ఆకర్ణాంతంగాలాగి ఒక్కబాణంతో కర్ణుడి ధనస్సు ముక్కలుచేశాడు అర్జునుడు. దాంతో ఉగ్రుడై భయం

కరమైన శక్తి తీసి విసిరాడు కర్ణుడు. కౌరవులు గొల్లుమన్నారు. దేవతలు హాహాకారాలు చేశారు. తళతళా మెరిసిపోతూ, నిప్పులు కక్కుతుంటూ వస్తూన్న శక్తిని దివ్యాస్త్రాలువేసి మార్గమధ్యంలోనే తునకలు చేశాడు అర్జునుడు. దేవతలు గొల్లుమన్నారు. హాహాకారాలు చేశారు కౌరవులు.

కర్ణుడంటే ప్రాణంపెట్టే యోధులు కొందరు ఏనుగుమందతో వచ్చి అర్జునుడిమీద పడ్డారు. క్రోధంతో ఎరుపెక్కిన నేత్రపల్లవాలతోనూ, దంతకాంతుల పూలగుత్తులతోనూ, కుంభస్థల ఫలాలతోనూ మహారణ్యంలా వున్న ఆ ఏనుగుమందను ఝంఝూప్రభంజనంవంటి తీక్ష్ణ బాణాలతో మొదలంటా పడగొట్టాడు అర్జునుడు వెంటనే మరో ధనుస్సు పుచ్చుకున్నాడు కర్ణుడు. పుచ్చుకోడమే తడువుగా ఉత్తరుడిమీద ఆరుబాణాలు వేశాడు గుర్రాలమీద నాలుగూ, రథంమీద ఎనిమిదీ, ధ్వజంమీద పదీ వేశాడు. అరవై బాణాలతో అర్జునుణ్ణి కొట్టాడు

రోషం భీషణంగానూ, పతాకం శిఖగానూ, బాణాలు జ్వాలలుగానూ – అగ్నిహోత్రుడిలా విజృంభించాడు కర్ణుడు. కపిధ్వజం మెరుపుగానూ, రథచక్రధ్వానం వురుములుగానూ, శరపరంపర వర్షధారలుగానూ వానమేఘంలా ముంచెత్తాడు అర్జునుడు వర్షఋతువులో వన్నె తరిగిన తామరపువ్వుల్లాగ చిన్నబోయాయి కౌరవుల ముఖపద్మాలు.

అంతతో వూరుకోక వాడికోలలు గుప్పించాడు కర్ణుడు. దాంతో కళ్ళల్లో చింతనిప్పులు కురిపించాడు అర్జునుడు. గాండీవం ఆకర్ణాంతంగా లాగి శరంమీద శరం ధారాపాతంగా సంధించాడు. కర్ణుడి శిరస్సుమీద, లలాటంమీద, మెడలమీద, బాహువులమీద, గుండెలమీద, తూంట్లు పడేటట్టు, కొండమీద పిడుగులు కురిసినట్టు, దృఢమైన వాడిబాణాలు గుప్పించాడు. నిర్విరామంగా శరీరమంతా

మంటలెత్తిస్తూన్న అర్జునుడి బాణాలు దుర్భరమైన మరణవేదన కలిగించాయి. కళ్లు చిమ్మచీకట్లు కమ్మాయి. ఇక గత్యంతరం లేకపోయింది. కాళ్ళకి బుద్ధిచెప్పి రణరంగనుండి పారిపోయాడు కర్ణుడు. హేళనగా కేకలు వేశాడు ఉత్తరకుమారుడు. దేవదత్తం పూరించాడు అర్జునుడు. "కౌరవయోధులలో వీడొక గండరగండడు. వీడికిలా శృంగభంగమైంది. మనకిక ద్రోణాచార్యుల వేడి తగులుతుంది" అన్నాడు. వీరావేశంతో కౌరవసైన్యాన్ని కలయచూశాడు.

బాగా అలిసిపోయాడు ఉత్తరకుమారుడు. ఇక సహించలేనంతగా వుంది అతగాడిపని భయమూ వేస్తున్నది. చెమట్లు పోస్తున్నాయి. "అనుక్షణం అధికమవుతూవున్న నీశౌర్యం, తేజం, బలం చూస్తే నాగుండె బేజారైపోతోంది. కరచరణాలు ఆడడంలేదు. ఇక సారథ్యం చెయ్యడం నా తలకుమించిన పని. నాజన్మలో ఇలాంటిదెక్కడా చూడలేదు నేను. వినాలేదు. ఆశ్చర్యంతో నా హృదయం వివశత్వంపొందుతూ వుంది. సకలేంద్రియాలూ నిలిచిపోయినట్లయిపోతున్నాయి" అన్నాడు.

నవ్వుతూ అతణ్ణి చూశాడు అర్జునుడు "అన్నిటికీ నేనున్నాను కదూ! అల్లుడూ, నీకెందుకాభయం! గుర్రాల్ని దువ్వి రథం నడుపూ. అదిగో, ఆ ఎర్రటిగుర్రాల రథంమీద—నిడుపాటి చేతులూ, లావాటి మెడా, విశాలవక్షస్థలమూ—ఆయనే ద్రోణాచార్యులు, గురుదేవుడు. అసాధ్యుడు. కన్నకొడుకువలె నన్ను ప్రేమిస్తాడు. గురువుల మీదికి కత్తికట్టవలిసి వచ్చింది. రాచధర్మం ఎంతనిష్ఠురం! ఆయనకు సూటిగా రథం పోనీ" అన్నాడు.

## అర్జునుడూ ద్రోణుడూ

పగ్గాలు సడిలించాడు ఉత్తరుడు. గుర్రాలు అదిలించాడు. ద్రోణుడి మీదికి రథం పరిగెత్తించాడు. ఏనుగుతో ఏనుగు ఢీకొన్నట్టు అర్జునుణ్ణి ఎదిరించాడు అమానుషవిక్రమంకల ద్రోణుడు. మొదటి

చూపుల్లోనే సవినయంగా నమస్కరించాడు అర్జునుడు "అడవుల్లో ఇంతకాలమూ నానా బాధలూ అనుభవించాము సమయం వచ్చింది గనక బైటికి వచ్చాను ఆపదలో వున్నవాళ్ళని అనుగ్రహించడం ధర్మం. అనుగ్రహించకండి. ముందు మీరు శాణప్రయోగం చెయ్యందే నేను సాహసించడానికి భయపడుతున్నాను" అన్నాడు. మాటాడ కండా మంచిమంచి ఇరవై బాణాలు వేశాడు ద్రోణుడు, కౌరవసేనలో కరతాళధ్వనులు చెలరేగాయి ద్రోణుడి బాణాలు అన్నింటిని అల్లం తలో ఖండించాడు అర్జునుడు. చుర్రుమంది ఆచార్యులికి. వందలూ వేలూ బాణాలు గుప్పించాడు. అన్నిటికీ అన్నీ వేశాడు అర్జునుడు.

గురుశిష్యులు ఇద్దరూ మహారథులే ఇద్దరూ అస్త్రశస్త్ర పారం గతులే. ఇద్దరూ అద్భుతమైన బాహుబల సంపన్నులే ఇద్దరూ విఖ్యాతి పొందిన విక్రమవంతులే. ఇద్దరి బాణాలూ ఆకాశంలో దట్టంగాకమ్ము కున్నాయి. గురుశిష్యుల ద్వంద్వయుద్ధం సరికొత్తగావుంది. మాస్తూ గజగజలాడారు కౌరవరాజకుమాళ్లు. "అర్జునుణ్ణి తప్పిస్తే ద్రోణాచా ర్యుల్ని ఎదుర్కొనే విలుకాడు ముల్లోకాల్లోనూ లేడు. ఒకవేళ ఎది రిస్తే శివుడుమాత్రం ఎదిరించవచ్చేమో! అంతే" "ద్రోణుడు వేస్తున్న బాణాలన్నీ ఒకేఒక్క బాణంలాగ వరసకట్టి వెళుతూంటే, వాటిని చిన్నచిన్న రేణువుల్లా తూలగొడుతున్నాడు అర్జునుడు!" "నల్లని రెక్కలతో అర్జునుని బాణాలు వానకారు మేఘాలలా వున్నాయి. తెల్లని రెక్కలతో ద్రోణుడి శరాలు వర్షాకాలానికి మానససరోవరం లేచి పోతోన్న హంసలలా వున్నాయి" అని పరస్పరం చెప్పుకుంటూ చూస్తున్నారు సైనికులు. గురుశిష్యులు ఉభయులూ శ్రుతిమధురంగా ధనుష్టంకారం చేస్తున్నారు. ఒకరు వేసిన బాణాలు మరొకరు ఖండి స్తున్నారు. సవ్య అపసవ్య హస్తాలతో ఇద్దరూ ప్రేక్షకలోకాన్ని చకిత పరుస్తున్నారు. ఇద్దరూ దివ్యాస్త్రాలు ప్రయోగిస్తున్నారు. గురుదేవుడు

ద్రోణుడు ఇంద్రాస్త్రం వేస్తే దాన్ని ఇంద్రాస్త్రంతోనే ఖండించాడు శిష్యుడు అర్జునుడు. ఆగ్నేయాస్త్రం వేస్తే దాన్ని ఆగ్నేయాస్త్రం తోనే తునకలుచేశాడు. వాయువాస్త్రం వాయువాస్త్రం తోనే ముక్కలుచేశాడు. వారుణాస్త్రం వారుణాస్త్రంతోనే విరగ్గొట్టాడు. ద్రోణార్జునుల శరపరంపర భూనభోంతరాళాలు నిండి గాఢాంధకారం కమ్ముకుంది ఏ బాణం ఎక్కడపడుతున్నదో కనపడడంలేదు చూసే వాళ్ళకి. ఇంతలో ద్రోణుడి సైన్యం కూడా వచ్చి అర్జునుణ్ణి ముట్ట డించింది. పెచ్చురేగి రెప్పపాటులో ఆ బలగమంతటినీ మచ్చు లేకండా చేశాడు అర్జునుడు.

క్షతగాత్రుల రక్తం సముద్రంలా పొంగి పొర్లుతోంది. తెగిన చేతులనుండి రత్నకంకణాలూ, చెవులనుండి మణికుండలాలూ, తలల నుండి వజ్రకిరీటాలూ పడి సముద్రానికిమల్లేనే ఆరక్తసాగరానికిరత్నా కర నామం సార్థకం చేస్తున్నాయి తన సైన్యమంతా రూపుమాపి తనకు అసాధ్యుడై, ఘోరంగా పోరాడుతూన్న శిష్యుణ్ణి చూసి విస్తు పోయాడు ద్రోణాచార్యులు.

''మొట్టమొదటే చెప్పానుకదా! 'అర్జునుడు అసాధ్యు' డని. ఫాలాక్షుడైనా ఇతణ్ణి తేరిచూడడం కష్టం మేఘాలరాజు ముద్దుకొడుకు వీడు. శరవర్షం కురిపించడంలో చిత్రమేముంది! నిజానికి గురువును మిం చిన శిష్యుడు'' అని ప్రశంసించాడు. ''ఇంతసేపూ అర్జునుణ్ణి నిలవ రించాడంటే, ఇంత సేనలోనూ ద్రోణుడొక్కడే విలుకాడు'' అని తల లూపారు దేవతలు.

## అర్జునుడూ అశ్వత్థామా

ఇంతలో తీవ్రమైన శీఘ్రబాణాలు ప్రయోగించి ద్రోణుణ్నీ, అతడి గుర్రాల్నీ, సారథినీ, పతాకాన్నీ, రథాన్నీ, ముంచెత్తాడు అర్జునుడు. శరసంధానంసహా చెయ్యలేని స్థితిలో వుండిపోయాడు ద్రోణుడు. హాహా

కారాలు చేసింది కౌరవసైన్యం. తండ్రి అలిసిపోయాడని తెలిసిపోయింది అశ్వత్థామకి. ఎన్నో అన్ని రధాలతో పరిగెత్తుకువచ్చి అర్జునుణ్ణి ముట్టడించాడు వచ్చీరావటంతోనే అశ్వత్థామ గుర్రాల్ని కొట్టాడు అర్జునుడు సమయం కనిపెట్టి అర్జునుడి వింటినారి వ్రూడగొట్టాడు అశ్వత్థామ కన్ను తిప్పేటంతలో ఎనిమిది బాణాలతో కొట్టాడతణ్ణి అతడు నారి కూర్చుకునేటంతలో సింహనాదం చేశాడు. "వాహ్! ఇంతమందిలోనూ ఈ పాటి చేసిన మొనగాడు లేడింత వరకూ. వీరుడంటే అశ్వత్థామే వీరుడు" అని ప్రశంసించారు దేవతలు.

చిరునవ్వుతోనే గాండీవం సవరించాడు అర్జునుడు విల్లెత్తింది తడువుగా అశ్వత్థామనీ, అతడివెంటవున్న రధాల్నీ నుగుమాకడం ప్రారంభించాడు. అశ్వత్థామైనా ఏమంత తగ్గిపోలేదు ఉభయుల బాణాలు ఒకదాన్నొకటి ఢీకొంటూ మంటలతో చిచ్చులపిడుగుల్లాగ ఉగ్రంగా ఆకాశం నిండిపోతున్నాయి. అశ్వత్థామ అర్జునుల ద్వంద్వ యుద్ధం ఇంద్రవృత్రాసురుల యుద్ధ లా వుంది. శరాన్ని శరం ఢీకొని ఛటచ్ఛట శబ్దాలతో నిప్పులు కక్కుతూ వెదుళ్ళవనంలో నిప్పంటుకున్నట్టుంది. సైన్యమంతా ఆశ్చర్యపడి చూడడం మొదలుపెట్టింది.

అర్జును డెంతవేగం వేస్తూంటే అశ్వత్థామా అంత వేగం వేస్తున్నాడు బాణాలు. కొంతసేపయేసరికి అశ్వత్థామ తూణీరాలు ఖాళీ అయిపోయాయి. ఆటకట్టయిపోయింది అతగాడి పని. అక్షయ తూణీరాలు కావడంచేత అర్జునుడి బాణాలకు అంతమంటూ కనపడలేదు ఇక రెప్పపాటు ఆలస్యం అయితే అశ్వత్థామకి ప్రమాదం తప్పదు.

## అర్జునుడూ కృపుడూ

చప్పున ముందుకి ఉరికాడు కృపాచార్యుడు వచ్చాడో లేదో, బాణంమీద బాణం ప్రయోగించాడు దురుసుగా. అశ్వత్థామనుంచి కృపాచార్యుడి మీదికి తిరిగింది అర్జునుడిరధం. వాడివాడి బాణాలు వడి

వడిగా వచ్చిపడ్డాయి కృపుడిమీద అతడి కోపాగ్ని ఊదినట్లయింది నిలువు నిలువెల్లా మండిపడి లేచాడు అగ్నిశిఖలాంటి మాంచి బాణం ఒకటి తీసి కపిధ్వజాన్ని కొట్టాడు. జ్వాలలవంటి శరజాలంతో అర్జునుడి రథాన్ని ముంచెత్తాడు. దిక్కులు అదిరేలాగ సింహనాదం చేశాడు దాంతో కళ్ళు మొయ్యా కోపంవచ్చింది అర్జునుడికి. కళ్ళెర్రచేశాడు. ఉత్తరక్షణంలో కృపుడి వృషభపతాకం తెగేశాడు. సూర్యకిరణాల వంటి ఉజ్జ్వలబాణాలతో అతడి శరీరం తూట్లు పడేటట్టు కొట్టాడు. అదిచూసి కృపాచార్యుల రథరక్షకులైన చంద్రకేతుడూ, చిత్రాశ్వుడూ, మణిమంతుడూ, మంజుమాళీ, హేమవర్మా, సురథుడూ, సుషేణుడూ, అరిష్టుడూ, సుకేతుడూ, ఒక్కసారి కలియబడ్డారు వాళ్లు వచ్చిరావడంతోనే అంతమందనీ వెటుంక్కు మొనలుగల అన్ని బాణాలూ ఒకేముష్టితో పట్టుకొని, ఒకేసారి వేశాడు అర్జునుడు రెప్పపాటు కాలంలో అందరి తలలూ కిందపడ్డాయి. నెత్తురుధారలు ఘోరంగా ప్రవహించాయి. వెంటనే మళ్ళీ కృపాచార్యుల రథందిక్కు తిరిగింది గాండీవం ఒక బాణంతో కృపుడి కాడి విరిగింది. రెండింటితో చక్రాలు ముక్కలయాయి మూడింటితో చాపదండంతోసహా నొగలు తునకలైంది నాలుగింటితో గుర్రాలు కూలిపోయాయి. ఒక బాణంతో కృపుడివిల్లూ ముక్కలయింది. మరోదాంతో సారథితలా తెగింది. ఇదంతా ఒక లిప్తలో జరిగిపోయింది. అర్జునుడి కళ్ళల్లో నవ్వు తొణికిసలాడింది. ఉత్తరక్షణంలో ఒక తీక్ష్ణబాణం కృపుడి గుండెల్లో నాటుకుంది రథమూ లేదు గుర్రాలూ చచ్చాయి. ధనుస్సూ విరిగింది. హృదయమూ మండుతోంది——కిందూమీదూ కనపడలేదు కృపాచార్యుడికి. ఆవేశంతో శక్తి తీసి విసిరాడు అర్జునుడిమీద. నిప్పులు కక్కుతూ భయంకరంగా వస్తోంది శక్తి. పదిబాణాలతో దాన్ని సగంలోనే ముక్కలుచేశాడు అర్జునుడు. సహించలేకపోయాడు కృపాచా

ర్యుడు కత్తీ, డాలూ తీసుకున్నాడు. రథంమీంచి కిందికి దుమికాడు. పరిగెత్తాడు అర్జునుడుమీదికి. అల్లంతలోనే కత్తీ డాలు ముక్కలు చేశాయి అర్జునుడిబాణాలు. అంతలో నిరుపాయుడూ, నిరాశ్రయుడూ అయిపోయాడు కృపుడు నిమిషంలో తనప్రాణాలు తనవికావు. భయంతో పరిగెత్తాడు, అశ్వత్థామరథంమీది కెక్కి దాక్కున్నాడు. సైన్యమంతా పరిగెత్తుకుపోయి భీష్ముడి రథంవెనక చేరుకుంది.

రౌద్రరసవినోది అర్జునుడు. అంతతో తృప్తిపడలేదతడు. గాండీవం పలికిస్తూ ఆ సేనలమీదికి పరిగెత్తాడు. భటుడని కాదు, రౌతని కాదు, రథికుడనికాదు, నాయకుడనికాదు—అందరితోనూ సంకులసమ రానిక పూనుకున్నాడు శవంమీద శవం, రథంమీద రథం కూలి కూలి, విరిగివిరిగి కుప్పలుతిప్పలు పడుతున్నాయి చేతుల తీట తీరే టట్టుగా ఆ సైన్యసమూహాన్ని వేటాడుతున్నాడు అర్జునుడు. మాంసం ముద్దలు పంకంగానూ, విరిగిన రకరకాల ఆయుధాలు చేపలుగానూ, చామరాలు నురుగులుగానూ, తెగిన వీరుల శిరస్సులు కమలాలు గానూ, నెత్తురు వరదగానూ రణరంగమంతా రక్తపునదులు ప్రవ హించాయి.

ఇలా సకలసైన్యాన్ని అల్లకల్లోలంచేసి, తుదకి భీష్ముడిదిక్కు బయలుదేరాడు అర్జునుడు అదిచూసి కొండతో డీకొన్న పొట్టేలు లాగ పటాటోపంతో వచ్చి అడ్డుపడ్డాడు కర్ణుని కొడుకు వృషసేనుడు. రావడంతోనే అతడి విల్లు రెండుముక్కలయేటట్టు ఒకటీ, గుండెలు తూట్లు పడేట్టు అయిదూ బాణాలు వేశాడు అర్జునుడు దాంతో మరి నిలబడితే ఒట్టు. రథం దూకి పరుగుచ్చుకున్నాడు వృషసేనుడు.

ఇంతలో దుశ్శాసనుడూ, శకునీ, దుర్ముఖుడూ, వివింశతీ, వికర్ణుడూ అడ్డంగా వచ్చారు రావడమూ గాండీవం గర్జించడమూ, ఫెళ ఫెళా బాణాలు బయలుదేరడమూ, వాళ్ళందరి రథాలూ, గుర్రాలూ,

జెండాలూ, కవచాలూ తూట్లుపడి శరీరాలు మంటలెత్తడమూ ఒకే సారి జరిగిపోయింది. అందరూ కాళ్ళకు బుద్ధిచెప్పారు. కకావికలై పోయారు.

నవ్వు ఆపుకోలేకపోయాడు అర్జునుడు. "అదిగో, స్థిరంగా మేఘ మండలంలో మెరుస్తున్న మెరుపులాగ బంగారం తాళధ్వజం అతడే పితామహుడు. మన దివ్యాస్త్రాలు ఈయనకీ కొంచెం మచ్చు చూపిద్దాం. మెల్లిమెల్లిగా ఆయన దగ్గిరికి రథం నడిపించు" అన్నాడు ఉత్తరుడితో.

## అర్జునుడూ భీష్ముడూ

ఉత్తరుడు తనకు సూటిగా తెస్తున్నాడు రథం. ఇంక తనవం తనుకున్నాడు భీష్ముడు. తన శంఖం ఒకసారి పూరించాడు అర్జునుడి మీదికి పోనిచ్చాడు రథం. బిగులుబిగులుమంటూన్న కౌరవసైన్యం మళ్ళీ ఉత్సాహంతో కోలాహలం చేసింది. దిగ్దంతుల చెవు లదిరేటట్టు దేవదత్తమూ పూరించాడు అర్జునుడు. రంకెలు వేస్తూ ఢీకొన్న ఆబోతుల్లాగ తాతామనవఁలిద్దరూ కలియబడుతూంటే అనిమిషత్వం సార్థకమైనట్టు చూశారు దేవతలు.

ముందు శరసంధానం చేశాడు భీష్ముడు. పతాకంమీది వానరం మీద ఎనిమిదిబాణాలు వేశాడు. దాని చుట్టూ వున్న భూతగణం మీద ఎన్నోబాణాలు గుప్పించాడు. గుఱ్ఱాలమీదా, సారథిమీదా పది కొట్టాడు. కౌరవసేనలో ఓ, మేరమీరింది సంతోషం. బాకాలు పూరించారు వాళ్ళు. పెడబొబ్బలు పెట్టారు. అదే తడవుగా గాండీవ మెత్తాడు అర్జునుడు. విడుపూ విరామం లేకండా కుప్పలుతిప్పలుగా, పుంఖానుపుంఖంగా పదులూ, వందలూ, వేలూ కురిపించాడు బాణాలు. గాండీవం చక్రంలా, కాగిన బంగారంసలాకలా మెరిసిపోతూవుంది దట్టమైన పొగమంచులా భీష్ముణ్ణి కమ్ముకున్నాయి అర్జునుడి బాణాలు.

వాటన్నిటినీ అంతలోనే పటాపంచలు చేసి సూర్యుడిలా ప్రకాశించాడు భీష్ముడు. మంచి మంచి దివ్యాస్త్రాలు ప్రయోగించాడు అర్జునుడు. అన్నిటికీ అన్నీ ప్రతిశరాలు వేశాడు భీష్ముడు అర్జునుడు ఏమహాస్త్రం వేస్తే ఆ మహాస్త్రంతోనే దాన్ని దూరదూరాన ఖండించాడు. కోపం పట్టలేకపోయాడు అర్జునుడు. ఒక గట్టి బాణంతో పితామహుడి విల్లు రెండుముక్కలు చేశాడు. భీష్ముడికి కనుకొనల్లో కెంపులు మెరిశాయి. క్రోధంతో జూలు దులిపిన సింహంలా తక్షణం లేచాడు. మరోధనుస్సు తీసుకున్నాడు. బాణంమీద బాణం ప్రయోగించాడు.

ఇంతలో పెడబొబ్బలు పెడుతూ అతని రథరక్షకులూ వచ్చి కలిశారు. వాళ్ళనీ రెప్పపాటులో తుదముట్టించాడు అర్జునుడు. వచ్చిన భీష్ముడి బాణాలన్నిటినీ సగంలోనే ఖండించాడు. అతడి గుర్రాలనీ కొట్టాడు. మనవణ్ణి మించినట్టున్నాడు తాత. తాతని మించినట్టున్నాడు మనవడు. అబ్బురపడిపోతున్నారు ద్రోణుడూ మొదలైన మహారథులు. ఉభయుల్నీ పొగుడుతున్నారు సిద్ధులూ, ఖేచరులూ, దేవతలూను.

ఇలా పోరాడి పోరాడి సమయం కనిపెట్టి, చప్పున ఒక గట్టి బాణంతో అర్జునుడి ఎడమ భుజంమీద బలమైన దెబ్బ కొట్టాడు భీష్ముడు. కళ్లనిండా కోపం వచ్చింది అర్జునుడికి. చిటికలో భీష్ముడి విల్లు తునకలు చేశాడు. మరోవిల్లు అందుకునే లోపున మంచిమంచి బాణాలు గుండెలమీద కొట్టాడు. ఆ దెబ్బలకి తూలిపోయాడు పితామహుడు. రథంనొగలు పట్టుకోకపోతే అమాంతంగా కిందే పడేవాడు. దాంతో రథాన్ని అవతలికి తప్పించుకుపోయాడు సారథి.

అర్జునుడికిమాత్రం ఇంకా యుద్ధంలో తనివితీరినట్టు లేదు. మూకలుమూకలుగా వున్న కురుసైన్యాన్ని మరొకమారు తలయెత్తి కలయచూశాడు. గాండీవం తుడిచాడు. గుణం సారించాడు. ఇంట

తూణీరాలు బిగించుకున్నాడు ద్రోణుడూ, కర్ణుడూ మొదలైన వాళ్ళంతా మొద్దులమల్లే పులుకూ పులుకూ చూస్తూన్నారు. వాళ్ళ మీదికి రథం పరిగెత్తించాడు అర్జునుడు. అలా వస్తూన్న రథాన్ని చూసి కర్ణుణ్ణి కవ్వించాడు అశ్వత్థామ. "కర్ణా! ఇదిగో, అర్జునుడు మళ్ళీ వస్తున్నాడు. ఏమిటి సాధనం! నువ్వుతప్ప మరొకడు లేడిక్కడ. తోకముడవకండామాత్రం ఎదిరించాలి" అని వెకారించాడు. ఉరిసిన పుండుమీద ఉప్పూఖారం చల్లినట్టయింది కర్ణుడికి. "తోకముడుస్తానో, పీకనులుపుతానో, కళ్ళే ఉంటే చూస్తూ ఉండు" అన్నాడు. అతడు ముందుకి దూకబోయేసరికి యోధులూ, భటులూ అనేకులు వచ్చి కర్ణుడిముందు వ్యూహంగా నిలబడి అర్జునుణ్ణి ఎదిరించారు మదపుటేనుగు తుంగమడుగులో చొరబడ్డట్టు ఆ వ్యూహాన్నంతటినీ చాపకట్టగా పడగొట్టాడు విజయుడు.

పోరాడుతున్నకొద్దీ రెట్టింపవుతున్నవి అర్జునుడి బాహుబలమూ ధైర్యమూను, కౌరవయోధులు మాత్రం అలిసిపోయారు, దిగజారిపోయారు. కరణచరణాలు ఆడలేదు వాళ్ళకి. ఎక్కడివాళ్ళక్కడ యుద్ధం మానేసి నిలబడిపోయారు అవశమైన చూపులతో అర్జునుణ్ణే చూశాడు ఉత్తరుడు. "విరామంలేని యుద్ధం ఎలా భరించడం? నాలుక ఆర్చుకుపోతోంది నాకు. నీ ఆగ్రహానికా అంతంలేకండా ఉంది. ఈ సైన్యాలా, నువ్వు పచ్చడికింద కొడుతూన్నకొద్దీ మొండిగా మళ్ళీ మళ్ళీ వస్తున్నాయి. ఏంచెయ్యను? మరి నీ రథం నడపడం నాతరం గాదు", అన్నాడు.

నవ్వుతూ లాలించాడు అర్జునుడు. "అన్నిటికీ నేనుంటూండగా నీకువచ్చే లోపమేమిటిచెప్పూ? అంతగా కావాలంటే గుర్రాల్ని నేనూ కొంచెం సాయంపడతాను. మరికొంచెం తట్టుకోవాలి. అందరి పనీ అయింది. దుర్యోధనుడుమాత్రం మిగిలాడు. మహాభిమాని అతగాడు. మనల్ని లక్ష్యపెట్టడు. ఇప్పటి అతగాడి వైఖరి చూస్తే మన

మీదికి కలియబడేటట్టే వుంది. తమ్ముళ్ళూ, ఆప్తబంధువులూ రెండు పక్కలా మహోదురుసుగా నిలబడ్డారు అదిగో, ఆమూకచూడు. పద. అక్కడికి పోనీ రథం" అన్నాడు.

అనడమే తడువుగా దుర్యోధనుడిమీదికి పరిగెత్తింది రథం. మధ్యని అడ్డుపడుతూన్న కురువీరుళ్ళి చురుక్కు చురుక్కుమనిపిస్తూ వెంటతరుముతూ, చిరునవ్వునవ్వుతూ సమీపిస్తున్నాడు అర్జునుడు.

## అ ర్జు ను డూ దు ర్యో ధ ను డూ

దూరంనుంచే చూశాడు దుర్యోధనుడు. పెద్దపులిని కోలతో వేసినట్టు చర్రున కలియబడ్డాడు అర్జునుడిమీద. వచ్చిందే తడువుగా కనుబొమలు ముడిపెట్టి రెండుబాణాలు తగిలించాడు గుండెలమీద అర్జునుడు. బొటబొటా నెత్తురు కారుతూ వుంటే మదం కారుతూన్న మదపుటేనుగులాగ కనిపించాడు దుర్యోధనుడు క్రోధంతో తిరగబడి తీవ్రమైన ఒక బాణంతో అర్జునుడి లలాటంమీద కొట్టాడు. రక్తం చిమ్ముతోన్న లలాటంతో బాలభానుడివలె ప్రకాశిస్తూ, కరవాలవంటి వాడిబాణాలు విరజిమ్మాడు అర్జునుడు అన్నిటిని ఖండిస్తూనే వున్నాడు దుర్యోధనుడు. దగ్గంగా దారుణాస్త్రాలు ప్రయోగిస్తూనే వున్నాడు. వాటి నన్నిటినీ దూరదూరానే తునకలుచేస్తూ. అంపవాన కురిపించాడు అర్జునుడు. ఏనుగుతో ఏనుగు పోట్లాడు తున్నట్టుంది, దుర్యోధనుడూ అర్జునుడూ చేస్తూన్న ద్వంద్వయుద్ధం.

ఇంతలో కావలిరథాలు వెంటబెట్టుకుని 'హస్తిన' అనే పెద్ద మదపుటేనుగుమీద వచ్చి కలియబడ్డాడు వికర్ణుడు. ఐరావతం ఎక్కిన దేవేంద్రుడు వర్షధారలు కురిసినట్టు, హస్తినమీదినుంచి బాణవర్షం కురిపించాడతడు. వికర్ణుడి సాహసానికి కౌరవులంతా కరతాళధ్వనులు చేశారు. అర్జునుడి కళ్ళల్లో చింతనిప్పులు రేగాయి. ఆకలితో

వున్న కాలయముడిలా విజృంభించాడు. గాండీవం ఆకర్ణాంతంగా లాగి మంచి బాణమొకటి విడిచిపెట్టాడు నిప్పులు కక్కుతూ వెళ్ళి 'హస్తిన' కుంభస్థలంమధ్య తగిలి తోకదిక్కు దూసుకుపోయింది బాణం. వజ్రాయుధంతో కూలిపడ్డ మహాపర్వతంలాగ ఉత్తరక్షణంలో భూమి అదిరేట్టు కిందపడింది హస్తిన. రక్తధారలతో కెంపులహారం వేసుకున్నట్టున్న హస్తిన కళేబరం, నానాముఖాలా మండుతూన్న పర్వతంలా వుంది. హస్తిన కూలిపోవడంతోనే పిక్కబలం చూపెట్టి వివింశతి రథంమీద దూక్కాన్నాడు వికర్ణుడు.

ఏనుగుని కొట్టిన మరుక్షణంలో ఆలాంటిదే మరో బాణం తీసి దుర్యోధనుడి గుండెలమీద తగిలించాడు అర్జునుడు. హస్తిన పడడం, రాజు దెబ్బతినడం చూసేలోపున కావలిరథాల్నీ, వెంట వచ్చిన రక్షకబలాన్నీ బాణంమీద బాణం వేసి పడమోదాడు. దాంతో కకావికలై పరిగెత్తారు కౌరవయోధులు. ఎటుచూచినా తానొక్కడే మిగిలాడు దుర్యోధనుడు. తనచుట్టూ బట్టబయలు చూసి గుండెలు జారినట్టయిందతడికి మరుక్షణంలో తనప్రాణాలు తనవికానట్టున్నాయి. వెంటనే కాళ్ళకు బుద్ధిచెప్పాడు. వెనక్కి చూడకండా పలాయనం చిత్తగించాడు.

రాజా, పారిపోయాడు. అతిరథ మహారథులైన నాయకులా, చెల్లాచెదరు అయిపోయారు. ఇక సైన్యాలగతి చెప్పేదేముంది? కళ విళపడి ప్రాణభయంతో చెట్టొక పిట్టలా చెదిరిపోయారు. పోతుటేను గుతో పరిగెడుతూన్న ఏనుగుమందని వెంటాడే సింహంలా రాజుతో కలిసి పారిపోతూన్న కౌరవుల వెంటపడి సింహనాదం చేశాడు అర్జునుడు. అలా వెంటాడుతూ ఒక మంచి బాణం తీసి పెడతల మీద కొట్టాడు కర్ణుణ్ణి. మరోటి తీసి దుశ్శాసనుడి వీపుమీద తగిలించాడు.

గాయం తడవుకుంటూ కళ్ళకపడ్డాడు కర్ణుడు. "అర్జునుడు వెంట పడ్డాడు. కౌరవవంశానికల్లా మూలకందమైన రాజును రక్షించుకోవాలి ముందు. నిలవండి. ఎదిరించండి" అన్నాడు. అతడి మాటలు వినడానికే అవకాశం లేనట్టుంది తక్కినవాళ్ళకి. వినీవిననట్టే వెళ్ళిపోతున్నారు అశ్వత్థామా, కృపుడూ, ద్రోణుడూ, భీష్ముడూ మొదలైన వాళ్ళంతా. హతాశుడై బతిమిలాడాడు దుర్యోధనుడు. "నన్ను ఆదుకోవలసిన మీరూ అందరితోపాటు వదిలేసి వెళ్ళిపోతున్నారు. మీ పరాక్రమానికిది తగినపనేనా!", అన్నాడు.

దాంతో ముందుకి పోతూన్న వాళ్ళంతా వెనక్కి తగ్గారు. రాజుని అనునయించడం మొదలుపెట్టారు.

పారిపోతూన్న రారాజుని వెంటపడి ఎలుగెత్తి పిలిచాడు అర్జునుడు. "నిలు, దుర్యోధనా నిలు. రాచవాడన్నవాడు ఎవడూ పారిపోడు. నువ్వు రాజువుకూడా కదా? కుంతీ పుత్రులలోకల్లా చిన్నవాణ్ణి నేను యుద్ధానికి పిలుస్తూంటే లజ్జ విడిచి పరిగెడుతున్నావు. మానవంతుడినన్న నీ ప్రసిద్ధి మంటగలిపీ, బలదర్పాలకు జలాంజలి విడిచీ, నువ్వూ నీ అనుయాయులూ ఇలా పలాయనం చిత్తగిస్తే లోకం 'ఛీ' అంటుంది. ఇక సామంతుడన్నవాడెవడూ దగ్గిర చేరడు ఇవాళ దెబ్బలు తిని పరిగెత్తినవాడివి రేపు ఏనుగెక్కి ఎలా ఊరేగుతావు? ముస్తాబై సింహాసనమెలా ఎక్కుతావు? చందనకర్పూరాలు రాసుకుని ఎలా కులుకుతావు? అమ్మాయిలతో వైభోగం ఎలా అనుభవిస్తావు? ఛీ, ఛీ, నామాటవిను. నిలబడు. తనువెన్నాళ్ళని! యుద్ధంలో చచ్చి పరమన్నా అనుభవించు. మాయజూదానికి మాత్రం మరి అవకాశం లేదిక్కడ" అన్నాడు.

ములుకులకంటే చురుకైనపలుకులు! తోకతొక్కిన త్రాచులా తిరగబడ్డాడు దుర్యోధనుడు. తన బలగాన్ని విడిచి అర్జునుడి మీదికి

పరిగెత్తాడు. అదిచూసి భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన మహా రథులూ వెనక్కి మళ్ళారు. అర్జునుడి భయంతో వెనక చూస్తూ పరిగెడుతూన్న తదితర సైనికులూ ఇది చూసి నిలబడ్డారు. రాజు వురకడమూ, నాయకులు తలపడడమూ చూసి తెగించి వాళ్ళూ కలియబడ్డారు. ఇంతమదీ ఒక్క పెట్టున ఎవరికి దొరికిన ఆయుధాలతో వారు వుప్పెనలా వచ్చిపడ్డారు. అందరినీ నిలవరించాడు అర్జునుడు. తనమీద గాని, తన సారథిమీద గాని, గుర్రాలమీద కాని, రథంమీద కాని, తుదకి జెండామీద కాని ఈగన్నా వాలకండా అడ్డుకున్నాడు. అతని హస్తకౌశలానికి శత్రువులే చకితులయారు

చావగా మిగిలి కాందిశీకులయి, పారిపోతూ తిరిగి తిరగబడ్డ ఈ కౌరవబలగాన్ని – ముఖ్యంగా, దుర్యోధనుడి ప్రాణాన్ని స్వాహా చెయ్యడానికి నాలుక చాస్తోంది గాండీవం. ఇంతలో తపసోదరుల ప్రతిజ్ఞ జ్ఞాపకం వచ్చింది అర్జునుడికి. దుర్యోధనుణ్ణి చంపడం తన పని కాదనుకున్నాడు పశ్చాత్పుదు డయాడు సపరివారంగా రాజుతో సహా అతణ్ణి భంగపరిచాలని కుతూహలం కలిగింది. వెంటనే ఇంద్ర దైవత్యమున్నూ, అన్నింతపని చేసేదిన్నీ, శత్రుసైన్యం ఇట్టే జయించేదిన్నీ ఐన సమ్మోహనాస్త్రం ప్రయోగించాడు. దాంతో ఎక్కడి వాళ్ళక్కడ ఆయుధాలు జారవిడిచారు కౌరవులు. మెడలు తేలవేశారు. పక్కలికి వొరిగిపోయారు. నిషా తలకెక్కినట్టు, మత్తుమందు తిన్నట్టు, భంగు తాగినట్టు, ఘోరనిద్రలో మునిగినట్టు కౌరవసైన్యమంతా అచేతనమై పడిపోయింది.

## బొమ్మపొత్తిళ్లు

బొమ్మపొత్తిళ్లు తెమ్మన్న ఉత్తరకుమారి మాటలు జ్ఞాపకానికి వచ్చాయి అర్జునుడికి. "వీళ్లకి తెలివిరాకముందే చప్పునవెళ్లు, చెల్లి చెప్పింది కదా! బొమ్మపొత్తిళ్లకోసం. దుర్యోధన, అశ్వత్థామల తల

పాగాలు నల్లనివి. కర్ణుడిది ఆకుపచ్చది. ద్రోణ, కృపాచార్యులవి తెల్లనివి. వీటిని తీసుకురా సమ్మోహనాస్త్రానికి విరుగుడు తెలిసినవాడు పితామహుడు. మేలుకునే వుంటాడాయన. ఆయన దగ్గిరికి వెళ్లకు. వెళ్లు'' అన్నాడు ఉత్తరుడితో. చెప్పిందే తడువుగా పగ్గాలు నొగలకు ముడివేసి పరిగెత్తాడు ఉత్తరుడు. చెప్పినప్రకారం తలపాగాలు తీసుకు వచ్చి రథమెక్కాడు.

''ఈ రథాల ఇరకాటంలోంచి బయట పడదాం'' అన్నాడు అర్జునుడు. రథం కదిలింది. కదిలిందో లేదో బాణాలు టపీటపీ మనిపించాడు భీష్ముడు. మళ్లీ గాండీవం ఎత్తాడు అర్జునుడు. భీష్ముడి గుర్రాల్నీ, సారథినీ కొట్టాడు. చురుకైన బాణాలతో తాతగారిని చురచుర మనిపించాడు. వెనక్కి తగ్గిపోయాడు భీష్ముడు. రాహుగ్రాసంనుండి బయటపడ్డ సూర్యబింబంలా మూకలోంచి బైటికివచ్చి దర్పంతో ప్రకాశించాడు అర్జునుడు.

ఇంతలో కౌరవసైన్యం తెలువుకుంది దుర్యోధనుడూ కళ్లు విప్పాడు. అర్జునుణ్ణి చూశాడు. ఉరకబోయాడు. నవ్వుతూ, ''ఆగవోయ్'' అన్నాడు భీష్ముడు. ''సేన సేనంతా వొంటిమీద తెలివన్నా లేకండా పడిపోయింది. తలగుడ్డలు పట్టుకుపోయిందీ కానలేదు మీరు. తన ధర్మమూ అని అర్జునుడు తెగించలేదు, కాని కాకపోతే మనవారిపని కడతేరి వుండేది. మెడ తేలవేసి, ధనుస్సు జారవిడిచి, నిన్ను నువ్వెరగకండా పడివున్న నిన్ను చూసిన్నీ వూరుకున్నాడు అర్జునుడు. అతని కనికరాన్ని ఎంతన్నా పొగడాలి అతడు మన ప్రాణాలమీదికి రాకపోబట్టి బతికిపోయాం మనం. చాలు. ఇంతతో మనం వీరత్వం కట్టిపెట్టడం మంచిది. నెత్తిమీదపాగాలు పట్టుకు పోతున్నా, తెలుసుకోలేకపోయిన ఈ మహాబలాలతో మళ్లీ తెలివి తక్కువగా అతగాడిమీదికి సాహసించామా, ఈసారి తన బాణాగ్నికి

పూర్ణాహుతి పట్టేసి 'స్వాహా' అనేస్తాడు మనల్ని. కాబట్టి బుద్ధి మంతులవలె మన దేశంతోవ మనం పడదాం. ఆవులతోనూ వాటి తోనూ అతడు ఉపప్లావ్యానికి పోనీ" అన్నాడు.

అభిమానం వుడుకెత్తిస్తూ వుంది కోపం దహించేస్తూ వుంది. అయినా చేసేది లేక బుసకొడుతూ, నిట్టూరుస్తూ వూరుకున్నాడు దుర్యోధనుడు. తక్కినవాళ్లూ ఎప్పుడెప్పుడా అని చూస్తున్నారు. భీష్ముడి సలహాప్రకారం రాజుతోకూడా అందరూ వచ్చినదారిపట్టారు వెనక నుండి మరొక్కసారి దేవదత్తం పూరించాడు అర్జునుడు ధనుష్టంకారం చేశాడు. కొంతదూరం వెంటతరిమాడు.

"మళ్లా వెంటబడ్డాడ్రా బాబూ" అనుకున్నారు కౌరవులు. బిరుదులతోకూడా జెండాలూ, గొడుగులూ పరాజయచిహ్నంగా పడేశారు. అంతతో శాంతించాడు అర్జునుడు. అందరికీ వినబడేటట్టు "వెళ్లివస్తానండోయ్" అని కేకవేశాడు, భీష్మ, ద్రోణ, కృపాచార్యులికి నమస్కారబాణాలు వేసి సెలవు తీసుకున్నాడు. మొనలు తేరిన బాణాలతో కిరీటంమణులు వొలిచి దుర్యోధనుణ్ణి పరామర్శించాడు. నడినెత్తి సూర్యబింబంలా ప్రకాశిస్తోన్న కిరీటిని తేరిచూడలేక వెర్రి పరుగులు పెట్టారు సైనికులు. జనాన్ని తరిమి నిలబడ్డ మదగజంలాగ కౌరవుల్ని తరిమి నిలబడ్డాడు అర్జునుడు. "అల్లుడూ, మన ఆవులు మనకి దక్కాయి. శత్రుసైన్యం పీనుగుపెంట లైంది. మొనగాళ్ల పాగాలు లాక్కున్నాం. సిగ్గువిడిచి బిరుదునిశానీలు కిందపడేశారు వాళ్లు. మరి మనకు కావలసిందేముంది? ఇక ఇంటికి పోదాం. మీ అమ్మా, మీ వాళ్లూ ప్రాణాలు బిగబట్టుకుని నీకోసం ఎదురు చూస్తూం టారు. రథం తిప్పు. వేగంవెళదాం" అన్నాడు.

రథం మళ్లించాడు ఉత్తరుడు. యుద్ధంలో పరిగెత్తి పారిపోలేక వెనకపడి నడుస్తూన్నవాళ్లు అర్జునుణ్ణి చూసి ప్రాణభిక్ష పెట్టమని

సాగిలబడ్డారు. వాళ్లందరికీ అభయహస్తమిస్తూ బయలుదేరాడు అర్జునుడు ఉత్తరుడితో మళ్ళీ ఇలా అన్నాడు. "అల్లుడూ, కౌరవుల్ని గెలవడం, గోవుల్ని మళ్ళించడం – ఇదంతా నువ్వు చేసిన ప్రతాపమే అని చెప్పాలి బాబయ్యగారితో నువ్వు తక్కిన సంగతు లేవీ చెప్పకూడదు. తెలిసిందా!"

ఉత్తరుడు అమ్మయ్యో, ఇదంతా నాప్రతాపమే అంటే ఎవరు నమ్ముతారు? నాపస బాబయ్యగారికిమాత్రం తెలీదూ! ఇంతకీ, నిన్ను కాదని దాచడం ఎలాగంటాను! నే నేమిటి, ఈ కౌరవ సేనేమిటి! ఈ యుద్ధ మేమిటి! అయితే, అవసరం వచ్చిందాకా మాత్రం చెప్పను. సరేనా!

అర్జునుడు సరే, అలా గే కానీ.

ఇంతలో శమీవృక్షం సమీపించింది రథం నిలిబెట్టారు. గాండీవం, తూణీరం మొదలైనవి యథాప్రకారం ఆయుధాల మోపులో కట్టి పెట్టారు అర్జునుడు వినయంగా ప్రార్థించడంతోనే కపిధ్వజం, దేవదత్తం, కిరీటం అంతర్థాన మయాయి ఉత్తరుడి సింహపతాకం తిరిగి తగిలించారు రథానికి. తన ఆయుధాలతో రథికుడుగా కూచున్నాడు ఉత్తరకుమారుడు చీరకట్టుకుని, ముసుగు సవరించుకుని నొగలెక్కి కూచున్నాడు బృహన్నల.

ఇదంతా చూస్తున్న దేవేంద్రుడూ, దేవతలూ, మునులూ, సిద్ధులూ, గంధర్వులూ, పాండురాజూ మొదలైనవారంతా ఆశ్చర్యంతోనూ, సంతోషంతోనూ యుద్ధంకబుర్లు చెప్పుకుంటూ ఎవళ్ళనివేశాలకి వాళ్ళు వెళ్లారు.

"నీ విజయవార్త పట్నంలో చాటించడానికి ముందు వార్త పంపించు" అన్నాడు బృహన్నల. ఆ పరిసరాల్లో వున్న సొమ్ముల కాపర్లని పిలిచి పరిగెత్తించాడు ఉత్తరుడు. వెనకని బయల్దేరిందిరథం.

అంతకిముందే విజయోత్సవంతో పట్టణంలో ప్రవేశించాడు విరాట రాజు. కంకభట్టూ, వలలుడూ, దామగ్రంథీ, తంత్రీపాలుడూ, రాజ బంధువులూ, సామంతులూ, తక్కిన పరివారమూ అందరితోనూ కోటలో ప్రవేశించాడు బ్రాహ్మలూ, పుణ్యస్త్రీలూ, మంగళాక్షతలు చల్లుతూ వుండగా సింహాసన మధిష్ఠించాడు. తనవిజయం అభినందించడానికి వచ్చిన పౌరజనాన్ని యథోచితంగా సన్మానించాడు. కొంతసేపయాక సభంతా కలయజూచి "ఉత్తరుడెక్కడ" అన్నాడు.

"దుర్యోధనుడు రాణువతో ఉత్తరంగా వచ్చి ఆవులు పట్టుకుపోతూంటే విడిపించడానికి బృహన్నల సారథిగా వేసుకు వెళ్ళారు" అని అంతఃపుర పరిచారకులు తెలియచేశారు.

వినీవినడంతో ప్రపంచమే కూలిపోయినట్టయింది విరాటుడికి. సంతోషమంతా అంతలో విషాదంగా మారిపోయింది. తెలతెలపోతూ మంత్రుల్ని చూశాడు. "ముక్కుపచ్చలారని పాపడు. కిందూమీదూ కానకండా పశువులకోసం పరిగెత్తాడు. కౌరవసేనెక్కడ, వీడెక్కడ! కళవళపడుతోంది మనస్సు. వెంటనే తగిన సైన్యాలు పరుగెత్తించండి" అన్నాడు.

"అక్కడ సుశర్మ ఓడిపోయాడు. అంచేత ఇక్కడా మనవాళ్ళే గెలుస్తారు. మీకాసందేహం అక్కరలేదు. ఉత్తరుడు ఒంటరి అని భయపడకు. బృహన్నల సారథిగా వున్నాడు గనక దేవతలనైనా అతడు వీగ్గొడతాడు. కౌరవులొక లెక్కేమిటి?" అన్నాడు కంకభట్టు.

అంతమాత్రంచేత కుదుటపడలేదు విరాటరాజు. "త్రిగర్త సైన్యంవల్ల దెబ్బతిన్నవాళ్ళు తప్ప తక్కిన యోధులంతా బయలు దేరాలి. గెలవడంమాట దేవు డెరుగును. చిరంజీవి ఏమయాడో అతడిక్షేమం ముందు తెలుసుకోవాలి. ఇంతకీ, అదృష్టం దేవుడైనా తప్పించలేడు కదా!" అన్నాడు.

అతడి నోట్లోమాట నోట్లోనే ఉంది, ఉత్తరుడు పంపిన సొమ్ముల కాపరులు సభలో ప్రవేశించారు. "కౌరవబలాన్ని ఓడించి, ఆలమందలు మళ్ళించుకుని, సారథితోకూడా ఉత్తరకుమారులు సురక్షితంగా దయచేస్తున్నారు మహారాజా! వారి రథానికిగాని, గుర్రాలికి గాని, తుదకి బావుటాకిగాని తుప్పయినా రాలలేదు. మమల్ని పిల్చి, ఏలినవారికి ముందుగా కబురు చెప్పమంటే పరిగెత్తుకు వచ్చాం" అని విన్నవించారు.

విరాటుడి సంతోషసముద్రం గట్టుతెగినట్టయింది. గట్టొరసిన నిండుచెరువు రెండుకొమ్ములనుండీ పారినట్టు రెండుకళ్లనుండీ ఆనందాశ్రువులు ధారలుకట్టాయి. శరీరమంతా పులకలెత్తింది. "ఏమిటేమిటీ, మళ్ళీ చెప్పండీ!" అంటూ పదినాళ్లు సొమ్ములకాపర్లని ప్రశ్నించాడు. సగర్వంగా మంత్రులదిక్కు పరికించాడు "మదపుటేనుగుమీద గంటలు పెట్టించిమరీ ఊళ్లో ప్రతీవీధీ ప్రకటించండి అబ్బాయి విజయవార్త. బ్రాహ్మల్నీ, పుణ్యస్త్రీలనీ ఎదురుగుండా పంపించండి. రథాలూ ఏనుగులూ ఘంకానగారాలతోనూ, బాకాలతోనూపంపండి. ఉత్తరతో సహా ఉత్తమకన్యాజనం గంధమాల్యాదులతో ఎదుర్కొనేట్టు చెయ్యండి. అన్నివిధాలా అబ్బాయి విజయోత్సవం అపూర్వంగా ఉండేట్టు చూడండి" అని ఆదేశించాడు. శుభవార్త తెచ్చిన సొమ్ముల కాపర్లని కొత్తబట్టలిచ్చి బహూకరించాడు. దక్షిణవిజయోత్సవ లో పాల్గొన్న వారంతా ఉత్తరవిజయోత్సవానికి బయలుదేరారు.

ఉత్సాహం పట్టలేకుండా ఉన్నాడు విరాటుడు. కంకభట్టుని చూసి "చిన్న ఆట వేద్దాం?" అన్నాడు.

"నువ్వు గెలుపుఖుషాలో వున్నావు. ఈ వేళ నీతో ఆడి గెలవడం కష్టం" అన్నాడు భట్టు.

విరాటుడు మందహాసం చేశాడు. ఆపక్కనే తారాడుతూన్న సైరంధ్రిని చూసి పాచికలు తెమ్మన్నాడు. ఆటపలక ముందుకి లాక్కున్నాడు. కంకభట్టుని దగ్గిరికి రమ్మన్నాడు.

"జూదమంత సుఖం మరొకటి లేదు!" అని, ఆటకి ఉపక్రమిస్తూ "జూదమాడి ధర్మరాజు రాజ్యం పోగొట్టుకున్నాడు. తమ్ముళ్ళ్నీ భార్యనీ పోగొట్టుకుని తుదకి అడవులపాలయ్యాడు. జూదంవల్ల కడకి లభించేది కీడుమాత్రమే" అన్నాడు కంకభట్టు.

పాచికలు వేస్తూ! సంతోషంతో అందుకున్నాడు విరాటుడు. "కంకభట్టూ! అంతపెద్ద కౌరవసైన్యాన్ని గెల్చి ఆలమందలు మళ్ళించాడు. నిజానికి అబ్బాయి జగదేకవీరుడు. ఇంతటి పరాక్రమశాలి ప్రపంచంలో మరొకడుంటాడంటే నమ్మను. 'నభూతో నభవిష్యతి' అంటాను. ఇలాంటి కులదీపకుడు ఒక్కడుంటే చాలదూ?" అన్నాడు.

చిన్న మందహాసం చేశాడు భట్టు. "రాజా! భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ దుర్యోధనుడూ - ఇంతలేసివాళ్ళని ఎదిరించి ఉత్తరుడు గెల్చుకువచ్చాడంటే ఇంతకంటే ఆశ్చర్యం మరొకటి వుండదు. నువ్వన్నట్టు అతడు జగదేకవీరు డేమిటి, ముల్లోక వీరుడే అయిపోతాడు" అన్నాడు.

భట్టుమాటలు కటువుగా వినిపించాయి విరాటుడికి. "అయితే నువ్వు సందేహిస్తున్నా వన్నమాట. భట్టూ, నువ్వాగనక ఇంతవరకూ సహించాను. ఇకముం దిలా వదరకు" అన్నాడు అతడిపెదవు లదిరాయి. కళ్ళకొనలు ఎర్రపడ్డాయి. దురుసుగా వేశాడు పాచికలు.

పిసరంత చలించలేదు కంకభట్టు. "సమయం దొరికిందంటూ రథమెక్కి బృహన్నల యుద్ధానికి సిద్ధపడితే, కురుబలమే అన్నమాటే మిటి? దేవతలనే గెలుస్తాడు ఉత్తరకుమారుడు" అన్నాడు.

క్రోధం మండుకువచ్చింది విరాటుడికి. వికృతంగా నవ్వాడు. ఇలాంటి చిత్రం ఇన్నాళ్ళకి నీనోటవిన్నాం. లక్షమందిని చూశాను కాని సారథిగాళ్ళు యుద్ధం చెయ్యడం చూడలేదు. అందులో బృహన్నల గాడు పేడికూడాను. నాకొడుకు వీరత్వం నీ కెందుకు కళ్ళు కుడుతోందో నాకర్థం కావడం లేదు. ఈ బాపనమూర్ఖత్వం కట్టిపెట్టు '' అన్నాడు.

కొంచెం కవ్వించిన ట్టనిపించింది కంకభట్టుకి. నిర్లక్ష్యంగా మళ్లీ మందహాసం చేశాడు. ''నువ్వన్నట్టు సారధి యుద్ధం చేసే ఉండడు. ఐతే ఇక్కడ సారథి ఎవరంటావు? ఉత్తరుడే సారథి. బృహన్నల రధి. అతడికి రణోత్సాహం కలిగిఉంటుంది. ఉత్తరుణ్ణి సారధిగా పెట్టుకుని కౌరవుల్ని నురుమాడి వుంటాడు. ఆవులూ తానేమళ్లించి వుంటాడు. తప్పదు. నామాటలో పిసరంత అబద్ధం వుండదు. వాళ్లు రానీ, నువ్వే విందువుగాని. అంచేత పట్నంలో బృహన్నల విజయంచాటించు. నామాట విను '' అన్నాడు.

దాంతో ముందూ వెనకా కనిపించలేదు విరాటరాజుకి. పడగెత్తిన తాచులా బుస్సుమన్నాడు. కళ్ళల్లో చింతనిప్పులు రాలాయి.

'' పేడిగాణ్ణి పొగడడం మానమంటే అదే వాగుతున్నావు '' అంటూ పాచికలు విసిరికొట్టాడు భట్టు మొహంమీద. దెబ్బ తినీ కోపం తెచ్చుకోలేదు భట్టు నెత్తురు చిమ్ముకు వస్తోంది రక్తం కింద పడకండా చప్పున వచ్చి చీరచెంగు అడ్డు పెట్టింది సైరంధ్రి. పక్కని వున్న స్వర్ణకలశంనుంచి నీటితో గాయాన్ని తడిఒత్తింది.

'' ఏం, అడ్డుకున్నావేం? '' అని ప్రశ్నించాడు విరాటుడు.

'' పుణ్యపురుషు డీయన. ఈయన నెత్తురు ఎన్ని చుక్కలు కింద పడుతుందో అన్ని సంవత్సరాలు ఆ పడ్డచోట అనావృష్టి కలుగుతుంది. పాండవాంతఃపురంలో వున్నప్పుడు నే నిసంగతి ఎరుగుదును. అంచేత మీకు హాని రాకండా అడ్డుకున్నాను '' అంది సైరంధ్రి.

ఇంతలో ఊళ్లోవాళ్లంతా ఉత్తరకుమారుణ్ణి తోడితేవడంకోసం బిరగబడ్డారు. ఏనుగులూ, గుర్రాలూ, మంగళవాద్యాలూ మార్గ మధ్యానికి ఎదురు వెళ్లాయి. నగరద్వారం ప్రవేశించడంతోనే ఆణి ముత్యాల అక్షతలు చల్లారు పుణ్యస్త్రీలు వేదఘోషతో ఆశీర్వా దాలు చేశారు పండితులు. పురవీథులలో పూలవాన కురిపించారు పౌరజనం. రాజమందిరం సింహద్వారందగ్గిర వేయిమంది కన్యలతో బృహన్నలకీ, ఉత్తరుడికీ హారతిపట్టింది ఉత్తర. పూలవానకురిపించింది. పన్నీటి జల్లుతో కర్పూరచందనం చిలకరించింది విజయతిలకాలు పెట్టింది. నవరత్నాలతో కలిపిన స్వర్ణపుష్పాలు చల్లింది. ఆమె ఆనం దానికి మేర కనిపించడంలేదు.

పెద్దలు ఆశీస్సులు వర్షించారు. శతానీకుడు మొదలైన బంధు వులు కౌగిలించుకున్నారు. ప్రజలు జేజేలు పెట్టారు. ఉత్తర కుమారుడి ప్రతాపం వేనోళ్ళ కీర్తించారు. అదంతా దుర్భరంగావుంది ఉత్తరుడికి.

" ఈయనవల్లా బృహన్నలభుజబలం కాని నా ప్రయోజకత్వ మేమీ లేదు. నమ్మండి. నేనే అన్నమా ఉమిటి! ఈయన సహాయ సంపత్తులు లభిస్తే ఎవరైనా జయిస్తారు. ఈయనే లేకపోతే నాబతు కేమయేదో మీకేం తెలుసు? " అన్నాడు. ఇలా కడాకూ బృహ న్నలని ప్రశంసిస్తూ కోటలో ప్రవేశించాడు.

వెంటనే ద్వారపాలకులు వచ్చి, రాజుతో విన్నవించారు. "అబ్బాయినీ, సారథిని తక్షణం ఇక్కడికే ప్రవేశపెట్టండి" అని ఆదేశించాడు రాజు.

తన నెత్తురు బృహన్నలకంట బడితే విరాటుడి కొంప మునుగు తుందని తెలుసు కంకభట్టుకి. అదంతా శుభ్రపరిచిందాకా బృహ న్నల రాకూడదు. "ముందు ఉత్తరకుమారుల్ని ప్రవేశపెట్టండి.

కొంచెంసేపయాక బృహన్నలని రమ్మనండి '' అన్నాడు ద్వారపాల కులతో ఆనందపరవశుడై వున్న విరాటుడు 'అదే' మని అడగలేదు.

ఉత్తరుడు వచ్చి తండ్రికి ప్రణామం చేశాడు కౌగిలించుకుని ఆనందబాష్పాలు రాల్చాడు విరాటుడు అనంతరం కంకభట్టుకి తల వంచి ప్రణామం చేశాడు ఉత్తరుడు అతడి మొహంమీద గంటు చూచి '' ఇదేమిటి! '' అన్నాడు.

'' నీ విజయం నేను ప్రశంసిస్తూవుంటే కాదని పేడివాణ్ణి పొగిడా డీయన. దాంతో కోపంవచ్చి పాచికలు విసిరాను. అవి తగిలి గంటు పడింది '' అన్నాడు విరాటుడు.

తత్తరపడి ఆపాదమస్తకం కంపించిపోయాడు ఉత్తరుడు. '' బాబయ్యా, ఎంత తప్పు చేశారు! వీ రేమన్నా మనం శిరసా వహించాలి కాని, 'ఔనూ, కాదూ' అనవచ్చా? క్షమించమని ప్రార్థించండి. మహాత్ముల్ని అవమానం చెయ్యడం కులక్షయం కాదా? వీరికి కోపకారణం మనకు సర్వనాశనం అన్నమాట '' అన్నాడు.

కుమారుడు చెప్పింది న్యాయసంగతం కావడమూ, అప్పటికే తన హృదయం కలతపడుతూ వుండడమూ కారణంగా, వెంటనే కంకభట్టు చేతులు పట్టుకున్నాడు విరాటుడు. భయభక్తులతో క్షమా పణ వేడుకున్నాడు.

''నాకు కోపమే కలగలేదు. నన్ను కొట్టాలని కొట్టలే దీయన. వేళావిశేషంగా జరిగిపోయింది. దీని కింత చెప్పడమెందుకూ'' అన్నాడు భట్టు.

ఇంతలో బృహన్నలా వచ్చాడు. అతణ్ణీ ఆదరించాడు విరా టుడు. బృహన్నలని చూసి ఉత్తరీయంతో గాయం కప్పుకున్నాడు కంకభట్టు.

యుద్ధవిశేషాలు చెప్పమన్నాడు కుమారుణ్ణి విరాటరాజు. "ద్రోణుడూ, భీష్ముడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ—వీళ్లంతా అలమందల కాసపడి, దుర్యోధనుడి ఎదట ఘోరాస్త్రాలతో నీమీదికి తిరగబడ్డప్పుడు ఎలా ఎదిరించావు? మరో సహాయమూ లేదు. ఒకరి మీద ఒకరు త్రొక్కిసలాడుకుంటూ నీమీద పడి వుంటారు. ఒక దళాన్ని కొడితే మరొకటి వచ్చి వుంటుంది ఒంటరితనం కనిపెట్టి మరీ మరీ ముట్టడించి వుంటారు ఇదంతా ఎలా నిగ్రహించావు? పోనీ, వాళ్ళు సామాన్యులా అంటే అదీ కాదాయె., పరశురాముణ్ణి ఓడించినవాడొక మహానుభావుడు. ధనుర్విద్యామహాచార్యుడింకొకడు, ఈశ్వర వరప్రసాదంవల్ల పుట్టిన పరాక్రమవంతుడు మరొకడు. మిగిలినవాళ్లు మాత్రం తక్కువవాళ్లా? ధృతరాష్ట్రసంతానంలో ఏఒకణ్ణి తీసినా, ప్రపంచమంతటినీ గెలుచుకువస్తారు. అలాంటి వాళ్ళందర్నీ ఎలా పడ గొట్టావు? అంత సైన్యంలో నుండిన్నీ ఆలమందలు ఎలా లాక్కున్నావు? మహాభిమాని దుర్యోధనుడు ఇదంతా చూస్తూ ఎలా సహించాడు? మానాభిమానాలు విడిచి ఎలాపయనం చేశాడు? ఊహించడానికే భయంగా వుంది నాకు" అన్నాడు.

"బాబయ్యా, ఆ కౌరవసేనేమిటి, నేనేమిటి? ఆవులు మళ్లించిందీ నేనుకాదు. కౌరవుల్ని గెలిచిందీ నేనుకాదు. మన అదృష్టంవల్ల దేవాంశసంభూతుడైన ఒక మహాపురుషుడు కాపాడాడు నన్ను. ఆయనే కౌరవుల్ని ఓడించాడు. పశువుల్నీ మళ్లించాడు. అదంతా చెపుతాను వినండి. ఆకాశమంత యెత్తున ధూళిరేగుతూ, నేల అణగారిపోయినట్టు నడుస్తూన్న ఆ సైన్యాన్ని చూసి ఒణుకు పట్టుకుంది నాకు. రథం దూకి వెనక్కి పరుగెత్తాను. అంతలో ఆ మహానుభావుడు 'నిలు, నిలు' మని వచ్చి నన్ను పట్టుకున్నాడు. బలవంతంగా రథం మీదికి తీసికెళ్లాడు. అతడి ఆజ్ఞ కాదనలేకపోయాను నేను. అతడు

చెప్పినట్టు సారథ్యం చేశాను. ఆవులు తోలుకు పోతూన్న సైన్యాన్ని వెంటాడి, అక్కడ రారాజు కనపడకపోగానే, పక్కనుంచి రథం పోని చ్చాడు అడ్డంగా పోనిచ్చి పశువుల్ని వూళ్ళోకి మళ్ళించాడు. అడ్డు పడ్డ సైన్యాన్ని చిందరవందర చేశాడు. బెదరకండా ఆవులు కొంత దూరం తోలి, రారాజుమీదికి పరిగెత్తాడు. అంతలో సేనంతా తిరగ బడింది. రారాజూ సేనాసమేతంగా కలియబడ్డాడు ఘోరమైన యుద్ధం జరిగింది. రథాలు ముక్కలు ముక్కలయాయి. గుర్రాలు పిండిపిం డయాయి. ఏనుగులు పీనుగులయాయి. శాపం పడ్డట్టు వేలకువేలు తెగి పడ్డారు భటులు. ఆ దివ్యపురుషుడు కురిపించిన బాణవర్షం నే నెలా వర్ణించేది! శత్రుభయంకరులైన రాజకుమారుళ్ళూ, పేరెక్కినమహాయో ధులూ అతడి బాణాగ్నిలో మిడతలవలె కూలిపోయారు. కర్ణుడి తమ్ముడు ఒక్కబాణంతో చచ్చాడు. మహా పటాటోపంతో కలియ బడ్డాడు కర్ణుడు. రావడంతోనే గుర్రాల్ని కొట్టాడు దివ్యపురుషుడు. సారథినీ కొట్టాడు. కర్ణుడి శరీరంనిండా బాణాలు గుప్పించాడు. బాధ భరించలేక పారిపోయాడు కర్ణుడు. ద్రోణాచార్యులూ వచ్చాడు. దెబ్బలుతిని కదల్లేక పోయాడు. అశ్వత్థామకీ, కృపాచార్యులుకీ-అంద రికి అదేగతి పట్టింది. భీష్ముడూ కలియబడ్డాడు పెద్దపెద్ద బాణాలు వేశాడు. కళ్లమొయ్యా కోపం వచ్చింది దివ్యపురుషుడికి. నిమిషంలో భీష్ముడి విల్లు రెండుముక్క లయింది. రథంమీద పడిపోయాడు భీష్ముడు. వెంటనే సారథి రథాన్ని తప్పించుకుపోయి అతణ్ణి రక్షించాడు.

''ఇలా వచ్చినవాడికల్లా శృంగభంగ మైంది. ఇంత చేసినా తనివి తీరలేదా మహానుభావుడికి. తమ్ములతోకూడా దృఢమైన వ్యూహం పన్నుకుని వున్న రారాజుమీద కలియబడ్డాడు. ధార్త రాష్ట్రులమీద వాడిబాణాలు వేసి వారదోలాడు. వికర్ణ డెక్కివచ్చిన మదపుటేనుగు హస్తినను ఒక్కబాణంతో పడగొట్టాడు. దుర్యోధ

నుడి గుండెలు పగిలేటట్టు కొట్టాడు. రాజు దెబ్బతినడంతోనే సైన్య మంతా పరిగెత్తింది. రాజుకూడా పారిపోయాడు. అలా పారిపోతూన్న కౌరవుల్ని అడవులదాకా వెంటతరిమాడామహాపురుషుడు. అంచేత ఇదంతా నాప్రజ్ఞ అనుకోకండి'' అని వివరించాడు ఉత్తరకుమారుడు.

విని ఆశ్చర్యపోయాడు విరాటరాజు. ''అయితే నాయనా, ఎవరా దివ్యపురుషుడు! ఆయనకి వినయంగా అర్ఘ్యమూ, పాద్యమూ అర్పించి, పూజించాలి. ఆయన వునికెక్కడ? ఇక్కడి కెందుకు రాలేదు?'' అన్నాడు.

''అక్కడే అంతర్ధాన మైపోయాడు, బాబయ్యగారూ! రేపో నేడో మనకి దర్శన మిస్తాడు. నిజంగా ఆయన దేవకుమారుడే అంటే నమ్మండి. మన ఆవులు మళ్ళించడమే కాదు. నే నంటే ప్రాణం పెడతాడు—అంత వాత్సల్యం నామీద. మనవంశాన్నే ఉద్ధరిస్తానని చెప్పాడు'' అని తండ్రికి ఆశ్చర్యానందాలు కలిగించాడు ఉత్తరుడు.

ఇంత వినీ, ఆ దివ్యపురుషుడు బృహన్నలే అని తెలుసుకో లేకపోయాడు విరాటుడు. ''ఇక నువ్వు వెళ్ళవచ్చు'' అన్నా డతణ్ణి.

''మంచి చాతుర్యం చూపెట్టావు. ఇలాగే చెప్పాలి. కంక భట్టుతోనూ ఇంతకు మించి చెప్పకు'' అని మెల్లిగా ఉత్తరుడితో చెప్పి అక్కడినుండి వెళ్ళిపోయాడు బృహన్నల.

ఇంతసేపూ ఉత్తరీయంతో గాయాన్ని కప్పుకొని బృహన్నల దిక్కు సరిగా చూడకండా కూర్చున్నాడు కంకభట్టు. ''ఇక బసకు వెళ్ళు'' అని రాజు చెప్పడంతోనే లేచిపోయాడు.

ఉచితపరివారంతో ఉత్తరకుమారుణ్ణి వెంటబెట్టుకుని, అంతః పురానికి బయలుదేరాడు విరాటరాజు. సుధేష్ణ ఎదురు వచ్చి కుమా రుణ్ణి కౌగిలించుకుంది. సముచితంగా రాజుని సమ్మానించింది. ఇష్టా

లాపంగా కూర్చుని, తాను త్రిగర్తసైన్యంతో చేసిన యుద్ధవిశేషాలు చెప్పడం మొదలుపెట్టాడు రాజు.

నర్తనశాలలో బృహన్నలకోసం ఎదురుచూస్తోంది చెలికత్తెలతోసహా ఉత్తరకుమారి రాజసభనుండి తిన్నగా అక్కడికే వెళ్ళాడు బృహన్నల యుద్ధంలో తెచ్చిన కౌరవయోధుల తలపాగాల మూట ఎదట పెట్టాడు. "బొమ్మపొత్తికలు తెమ్మన్నారు కదా, ఇవిగో! పుచ్చుకోండి" అన్నాడు ప్రేమతో.

ఇలా, అన్నివిధాలా కృతకృత్యుడై, ఎప్పటిమల్లేనే స్నానం, భోజనం, అన్నీ నిర్వర్తించుకున్నాడు బృహన్నల అనంతరం కంక భట్టుబసలో అన్నదమ్ము లయిదుగురూ సైరంధ్రితోసహా రహస్యంగా సమావేశమయ్యేట్టు ఏర్పాటు చేశాడు. ఆ ప్రకారం ఆరుగురూ ఏకాంతంగా సమావేశమయారు గోగ్రహణ వృత్తాంతమూ, యుద్ధసమాచారాలూ పరస్పరం చెప్పుకున్న తరవాత వలలుడితో ఇలా అన్నాడు బృహన్నల. "ఎంచేతో, ఇవాళసభలో నన్ను తిన్నగా చూడడానికి మొహం చెల్లలేదు అన్నయ్యకి. ఎంత ఆలోచించినా కారణం గోచరం కాదు నాకు. అప్పటినుండీ మనస్సు మనస్సులో లేకుండావుంది."

"అబ్బే, ఏమీలేదు. విరాటుడు ఉత్తరుణ్ణి అదేపనిగా పూరికే పొగుడుతూ వుంటే, బృహన్నల వున్నాడు గనక అతగాడు జయించాడన్నాను నేను. దాంతో తెలివితక్కువగా కోపం తెచ్చుకున్నాడు పాపం! 'పేడిని పొగుడుతావా' అని పాచికలు విసిరాడు మీదికి చిన్న దెబ్బ తగిలిందిక్కడ. నువ్వు చూస్తే మించివస్తుందని ఉత్తరీయం కప్పుకుని పెడమొహం పెట్టుకున్నాను. అంతే" అని మొహం మీది గంటు చూపించాడు కంకభట్టు.

చూసీ చూడ్డంతోనే కోపంతో శరీరం పొంగిందిపలలుడికి.
"ఆ దుర్మార్గుణ్ణి, వాడి కొడుకునీ, సబాంధవంగా చంపుతాను"

అని నిలబడ్డాడు. బృహన్నలకూ కళ్ళెర్రపడ్డాయి. "తన తాహతేమో తానేమో తెలుసుకోలేకండా వున్నాడు. ఈ అధముణ్ణీ వెంటనే పని పట్టించాలి వీణ్ణి చంపి వీడి రాజ్యానికి పట్టంకడతాను నిన్ను" అని చ్రరుమన్నాడు.

"అయ్యో, మీరు తొందర పడుతున్నారు. ఇంతవరకూ అతడు మనల్ని ఎరగనన్నా ఎరుగడు కదా! ఇతడి చాటున ఇవాళ దాకా వుండి మన శపథం నెరవేర్చుకున్నాం. ఇపుడు తీరా కీడెంచడం ధర్మం కాదు. మనం ఫలానా అని తెలిసిన తరువాత అతడు అవకతవకగా ప్రవర్తిస్తే అప్పుడు ఆలోచిద్దాం" అని తమ్ముల్ని శాంత పరిచాడు కంకభట్టు. తక్కినవాళ్ళూ "ఇది సమంజసమే" అన్నారు.

అజ్ఞాతవాసం గడిచిపోయింది. ఇక మేం ఫలానా అని వెల్లడించుకోవాలి. ఏవిధంగా బయటపడడం అన్న విషయం చర్చకువచ్చింది. ఎంతోసేపు ఆలోచన సాగించారు. తుదకి, విరాటరాజు కొలువు కూటంలో కొలువు తీర్చి బయటపడదామని తీర్మానించుకున్నారు.

## ఆత్మప్రకాశం

ఆరాత్రి గడిచింది. తెల్లవారకముందే లేచారు పాండవులు. ప్రాతః స్నానాలు చేశారు. సుగంధద్రవ్యాలు పూసుకున్నారు. తెల్లమడతలు కట్టుకున్నారు. పూలహారాలు వేసుకున్నారు. రాజకుమాళ్ళకి తగిన ఉజ్జ్వలవేషాలు ధరించారు. ఐదుగురూ విరాటరాజు కొలువుకూటం ప్రవేశించారు. తిన్నగా వెళ్ళి సింహాసనం మీద కూర్చున్నాడు కంకభట్టు. తక్కిన నలుగురూ వాళ్ళకి తగిన ఉన్నతాసనాలు అలంకరించారు. తీర్చిపెట్టిన పంచాగ్నులవలె విరాటరాజు సభలో ఆ అయిదుగురూ ప్రకాశించారు.

ఇంతలో విరాటుడు రత్నభూషణాలు అలంకరించుకున్నాడు. కుమారుడు ఉత్తరుణ్ణి వెంటపెట్టుకున్నాడు. కొలువుతీర్చే ఉత్సా

కాంతో రాజసభకి వచ్చేశాడు. వచ్చి, చూసీచూడ్డంతోనే తనకళ్ళనే తాను నమ్మలేక పోయాడు విరాటరాజు. చులకనగా ఈసడిస్తూ అన్నాడు. "ఏం భట్టూ, శ్రుతిమించి రాగాన పడినట్టు వొళ్లు పొగ రెక్కిందా ఏం! జంకన్నా లేకండా నాసింహాసనం మీదికే ఎగ బడ్డావూ! తీరా నన్ను చూసీ కూడా దిగవేం? ఎంత అహంకారం!" అన్నాడు.

మధురంగా చిన్న మందహాసం చేస్తూ లేచాడు బృహన్నల. రాజా, ఈయన ఎవరనుకుంటున్నావు? మణికిరీటాలు తలమీద వెలుగు తూన్న మహారాజుల్ని తన కోటకిదివ్వెలుగా చేశాడు. దండయాత్రలు సాధించినట్టు, ప్రపంచం నాలుగుమూలలూ చిన్నమాటమాత్రంచేతనే లోబరుచుకున్నాడు. తన్ను అర్థిస్తూ వచ్చిన జనానికి మహాదానాలు చేసి, వాళ్ళని తన త్యాగపతాకాలుగా దేశదేశాలా నింపాడు తన యశః ప్రకాశంతో దిక్కు-దిక్కులా వెలిపూత పూశాడు. రాజ సూయం చేశాడు. దిగ్విజయం సాధించాడు. విద్వాంసుడు విఖ్యాత చరిత్రుడు. అజాతశత్రువు సత్యవ్రతుడు. కౌరవకులదీపకుడు పాండు మహారాజుపుత్రుడు. ధర్మరాజు. ఇంద్రుడి సింహాసనానికయినా అర్హుడైన ఈ మహాత్ముడు నీచిన్న సింహాసనానికే తగడో!" అన్నాడు.

'ఏమిటీ!' అన్న ఆశ్చర్య మొకవంకా, 'నిజమేనా' అన్న సందేహ మొకవంకా ఉరూతలూపాయి విరాటరాజుని. "ఆఁ, ఐతే భీమార్జునులూ, నకులసహదేవులూ ఏరీ?" అన్నాడు అప్రయత్నంగా.

"వంటపుట్టిగావచ్చి, నీకు వేడుక పుట్టినప్పుడల్లా పులుల తోనూ, ఏనుగులతోనూ, సింహాలతోనూ, వస్తాదులతోనూ కుస్తీలు పడుతూన్నాడే ఈవలలుడు – ఈయనే భీముడు" అన్నాడు బృహ న్నల. "బకాసురుణ్ణి చంపి బ్రాహ్మల్ని రక్షించాడు కిమ్మీరుణ్ణి హతమార్చి కామ్యకవనం నిష్కంటకం చేశాడు. హిడింబుణ్ణి కడ తేర్చి హిడింబిని వరించాడు.

"ఇదిగో, నీ అశ్వపాలకుడుగా వున్నాడే ఈ దామగ్రంథి– మిత్రులికి అమృతం లాంటివాడు శత్రువులికి మాత్రం కాలకూటం– ఇతడే నకులుడు నీ ఆలమందలు తామరతంపరగా చేస్తూ, గోపాధ్యక్షుడుగా వుంటున్నాడే తంత్రీపాలుడు, కుంతీదేవిబహిఃప్రాణం, తేజశ్శాలి–ఇతడే సహదేవుడు

"సుదేష్ణాదేవిదగ్గిర సైరంధ్రిగావుంటే మాలిని, ఆమే ద్రౌపదీదేవి. ఆమెకోసమేకదూ కీచకు లందరినీ గంధర్వు లన్న నెపంతో రహస్యంగా కడముట్టించాడు భీముడు" అన్నాడు తనమాట మాత్రం ఎత్తుకోకండా వూరుకున్నాడు.

వెంటనే అందుకున్నాడు భీముడు. "ఇదిగో రాజా, పేడిరూపంతో వచ్చి ఉత్తరకి నాట్యం నేర్పుతూన్న ఈ బృహన్నలే మాతమ్ముడు అర్జునుడు. ఇంద్రుణ్ణి గెలిచి ఖాండవం దహించాడు. ఒక్కడే కాలకేయుల్నీ, నివాతకవచుల్నీ సంహరించాడు. గంధర్వరాజుని వోడించి దుర్యోధనుణ్ణి విడిపించాడు ఊర్వశిశాపంవల్ల పేడిరూపం ధరించాడు. ఇలా మారువేషాలతో నీ నీడని అజ్ఞాతవాసం గడుపుకొన్నాం మేం" అన్నాడు.

ఇదంతా ఇంద్రజాలంలా వుంది విరాటరాజుకి. ఆశ్చర్యంలో మునిగిపోయాడు. కల కాదు కదా? ధర్మరాజుకి నమస్కరించా లనీ తోచడంలేదు. మంత్రించిన బొమ్మలా నిలబడిపోయాడు. అంతలో అర్జునుణ్ణి తండ్రికి చూపిస్తూ ఇలాచెప్పాడు ఉత్తరుడు "బాబయ్యగారూ, ఈయన వద్దనడం వల్ల ఇంతవరకూ చెప్పలేదు నేను. నిన్న చెప్పనే ఆ దివ్యపురుషుడీయనే. ఈయనే అదంతా నిర్వహించాడు. ఏకమాత్రసహాయుడే ఇయ్యండిన్నీ, భయంతో పారిపోవస్తూన్న నాకు ధైర్యం చెప్పి, నిర్భయుంగా అంత మహారాణువమీాదికీ తిరగబడ్డాడు. అదంతా ఈయనకే చెల్లింది. తాను ఫలానా అనీ ధర్మరాజాదులు

ఫలానా ఫలానా అనీ విడమర్చి, నయాన్నా భయాన్నా నాకు ధైర్యం కలిగించినప్పుడు మామూలు యుద్ధంకదా అనుకున్నాను సారధ్యానికి సమ్మతించాను. అమ్మబాబూ, అది యుద్ధమేమిటి, మహాప్రళయం! అశక్తుణ్ణయి అనేకసార్లు వెనకాడాను ఒక్కపిసరు వెనక్కి తగ్గడీయన. యుద్ధం చేసినకొద్దీ బల పరాక్రమాలు హెచ్చడమే కాని తగ్గడమంటూ లేదు. దుర్యోధనుడు పారిపోతూవున్నా కూడా వెంటపడ్డాడు. 'జూదమాడ్డం అనుకున్నావేమో వెనక్కి తిరుగు!' అని సింహనాదం చేశాడు."

మరింత పరవశం కలిగింది విరాటుడికి సాక్షాత్తూ దివ్యపురుషుడి లాగ అనిపించాడు అర్జునుడు. అమాంతంగా వెళ్లి గాఢంగా కౌగిలించుకున్నాడు సగౌరవంగా రెండుచేతులూ పట్టుకున్నాడు వినయంగా ధర్మరాజుపాదాలమీద నెన్నుదురు మోపి సాగిలపడ్డాడు. రెండుచేతులా లేవనెత్తి అతణ్ణి కౌగిలించుకున్నాడు ధర్మరాజు. భీముణ్ణీ, నకుల సహదేవుల్నీ ప్రేమతో ఆలింగనం చేసుకున్నాడు విరాటుడు. శరీర మంతా పులకలెత్తిపోతూవుంది. అంజలిబంధం శిరస్సున నిలించి ధర్మరాజుకి పదేపదే ప్రణామంచేశాడు. అదేసమయంలో లేచి ఉత్తరుణ్ణి తన సహోదరులతో పరిచయం చేశాడు అర్జునుడు.

ధర్మరాజు అనుమతిని, ఒక ఉన్నతాసనంమీద కూర్చున్నాడు విరాటరాజు. వెంటనే బంధువుల్నీ, సహోదరుల్నీ, మంత్రుల్నీ, సామంతుల్నీ, పురప్రముఖుల్నీ, రాజోద్యోగుల్నీ, భటుటుల్నీ-అందర్నీ పిలిపించాడు. విషయ మంతా అంతఃపురానికి వర్తమానంచేశాడు. ద్రౌపదీదేవిని సముచితంగా గౌరవించమని సుధేష్ణకు కబురు పంపించాడు.

"పాండవులు బయటపడ్డారు" అన్న వార్త పట్నంలో గుప్పుమంది. జనం అదేప్రవాహంగా విరగబడ్డారు. రాజసభ పిటపిట లాడిపోతూవుంది.

"మీ గర్భవాసంలో తలదాచుకుని దుస్తరమైన ఈ అజ్ఞాత వాసం నిర్భయంగా గడపగలిగాము. కష్టమన్న మాట లేకండా చుట్టాలవలె గడిచింది మాకు. దీనికి మీ కెంతన్నా కృతజ్ఞులం మేం" అన్నాడు అర్జునుడు.

"నేనుమాత్రం మీకు పరాయివాణ్ణా?" అన్నాడు విరాటుడు. "అరణ్యాలలో అన్ని కష్టాలూపడి, మీ శపథమూ నెరవేర్చుకుని, తుదకి నన్ను అనుగ్రహించారంటే నిజంగా ఇది నా జన్మజన్మాల సుకృతంగా భావించుకుంటున్నాను. నా ఆలమందలూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, సైన్యమూ, మంత్రులూ ఈ పట్టణమూ, దేశమూ – అన్నీ మీకు సమర్పించుకుంటున్నాను. మత్స్యదేశానికి ధర్మరాజే రాజు నేను సబాంధవంగా మిమ్మల్ని సేవిస్తాను" అన్నాడు.

ఇంతలో అందుకున్నాడు ఉత్తరుడు. "మనకొక రాజ్యమంటూ ఎక్కడ వుంది ఇంకా? నన్నూ నిన్నూ శత్రువులనుండి నిన్నా మొన్నా రక్షించి వీరు పెట్టిన భిక్షేతప్ప? అంచేత మనం వేరే అర్పించనే అక్కరలేదు. ఇదంతా అక్షరాలా వారిదే. సందేహంలేదు. ముఖ్యంగా ఇంకో సంగతి. నివురుగప్పిన నిప్పులా మరుగుపడి వుండడం చేత ఇన్నాళ్ళూ వీరిని సేవించకండా మనం చేసిన అపరాధం క్షమించమనాలి ముందు. అంతేకాక మన సర్వసంపదా వీరి ప్రసాదమే కావడం చేత వీటినే ఇచ్చి సంతోషపెట్టలేము వీరిని. నూతనమైన ఒక కానుక సమర్పించడం భావ్యం. కనక ఉత్తరకోసం కబురు పంపండి" అన్నాడు.

కొడుకు చెప్పింది సమంజసం అనిపించింది విరాటుడికి. "వెంటనే ఉత్తరని అలంకరించి తీసుకురండి" అని మంత్రుల్ని నియోగించాడు.

సుధేష్ణ ఈ వార్త విని పరమానందభరితురాలయింది. అంతఃపుర పరిజనం నవనవాలంకరణాలతో ముస్తాబు చేశారు రాజు

కుమారిని. సానపట్టిన మన్మథ బాణంలా వుంది ఉత్తరకుమారి. ముత్యాలగొడుగులు పట్టించి ఆమెని సభాప్రవేశం చేశారు మంత్రులు. మేఘంపక్క మెరుపులా గొలుపుతూన్న వర్షలక్ష్మిలా వస్తూన్న కుమారిని ఎదురులేచి తోడితెచ్చాడు విరాడరాజు ధర్మరాజు సింహాసనంపక్క ఆమెని నిలబెట్టి సపరివారంగా అతడికి ప్రణామం చేశాడు.

''అజ్ఞానంవల్ల మీ మహనీయత్వం తెలుసుకోలేకపోయాను. అపరాధిని. నావల్ల కలిగిన తప్పులన్నీ క్షమించి దయచూడండి. వేడుకుంటున్నాను. నేనూ, నావాళ్లూ, అంతా మీ దాసులం. అమ్మాయిని అర్జునుడికి సమర్పించుకుంటున్నాను. నాబంధువులూ, ప్రజలూ ఇదే అభిప్రాయంతో వున్నారు ఇకముందు మీ భుజచ్ఛాయలలో జీవితం వెళ్లబుచ్చుతాను'' అన్నాడు.

అర్జునుడి మొహం చూశాడు ధర్మరాజు. ''ఈమె నాకు శిష్యురాలు. పుత్రికవంటిది. ఈసంవత్సరమంతా నాదగ్గిర మసిలింది. ఇప్పుడీమెని పరిగ్రహిస్తే లోకం నన్ను విషయలోలుడని నిందిస్తుంది. అంచేత ఈమెని కోడలిగా స్వీకరిస్తాను శ్రీకృష్ణుడిమేనల్లుడు, సుభద్ర కొడుకు. విక్రమంలో నా అంతవాడు, బుద్ధిమంతుడు, రూపవంతుడు—అమ్మాయికి తగిన వరుడున్నూ—అభిమన్యుడు'' అన్నాడు అర్జునుడు.

''అర్జునుడితో వియ్యమందడంకంటె నాకింక కావలిసిందేమిటి? అయితే నిశ్చయంచేయవలిసింది ధర్మరాజు. ఆయనఆజ్ఞ మన కందరికీ శిరోధార్యం'' అన్నాడు విరాటరాజు.

''అర్జునుడు సరిగానే చెప్పాడు. తన అభిమతమే నాఅభిమతమున్నూ. బంధుజనానికి వర్తమానాలు పంపించి శుభకార్యం శీఘ్రం నెరవేర్చడం మంచిది'' అన్నాడు ధర్మరాజు.

''పాండవుల బాంధవ్యంతో మత్స్యవంశం పావనమయింది'' అన్నాడు విరాటరాజు. ధర్మరాజుకీ, భీముడుకీ, అర్జునుడికీ, నకులసహా

దేవులికీ ఉత్తరకుమారిచేత నమస్కారం చేయించాడు. వారు ఆశీర్వ దించిన అనంతరం సిగ్గుతో తలవంచుకుంటూ అంతఃపురానికి వెళ్ళి పోయింది ఉత్తరకుమారి.

జ్యోతిష్కుల్ని పిలిపించాడు విరాటరాజు. లగ్న నిరూపణం చేయించాడు యాదవ పాంచాలాది బంధువర్గానికి ఉభయపక్షాల పెళ్లివారూ శుభలేఖలు పంపించారు.

''ఈ సంవత్సరమంతా నీ ఉదారగుణంవల్లనే అజ్ఞాతవాసం సుఖంగా గడిపాము. నిజానికి శ్రీకృష్ణుడి తరవాత నీఅంత బంధువు లేడు మాకు'' అని విరాటుణ్ణి ప్రశంసించాడు ధర్మరాజు. వినయంతో చేతులు దోయిలించి నిలుచున్న అతణ్ణి మాటిమాటికీ ఆదరించి కౌగి లించుకున్నాడు. పరివారంతోసహా రకరకాల ఉపకరణాలతో అనేక విధాల ఉపచారాలు చేశాడు విరాటరాజు. మహారాజోచితమైన మజ్జన భోజనాదులు నిర్వర్తించాడు వారికి.

ఇక్కడ ఇలావుంది. ఇకఅక్కడ-దుర్యోధనుడు ససైన్యంగా హస్తినానగరానికి వెళ్ళిపోతూ మార్గమధ్యంలో మజిలీ వేశాడు. మజిలీలో ఏకాంతంగా కర్ణుడూ, శకునీ, దుశ్శాసనులతో కూచుని మంతనం సాగించాడు. పాండవుల అజ్ఞాతవాసం ముగిసిందా, లేదా అన్నదే వాళ్ళ చర్చనీయాంశం. సాంగంగా చర్చించిన తరవాత భీష్ముడు చేసినతీర్పుతప్పనీ, అజ్ఞాతవాసం గడువుతీర లేదనీ, నలుగురూ ఏకగ్రీవంగా ఒక అభిప్రాయానికి వచ్చారు. ''గడువుకి ముందే అర్జునుడు బయట పడ్డాడు. కాబట్టి పాండవులు మళ్ళీ పన్నెండేళ్లు వనవాసమూ, పద మూడోయేడు అజ్ఞాతవాసమూ చేయవలసిందే'' అని తీర్మానించారు. ''అసత్యమంటే ధర్మరాజుకి భయం అందుచేత పందెంప్రకారం మళ్ళీ అరణ్యవాసానికే అంగీకరిస్తాడు'' అని నిశ్చయించి, భీష్మాదులకు

తెలియకుండా రహస్యంగా ఒక దూతని ధర్మరాజు దగ్గిరికి పంపించాడు దుర్యోధనమహారాజు.

దూతవచ్చి మళ్ళీఅరణ్యవాసం చెయ్యాలనిసూచిస్తూ దుర్యోధనుడి మాటలుగా ధర్మరాజుతో నివేదించాడు "అజ్ఞాతవాసం పూర్తికాకుండానే అర్జునుడు బయటపడి, శపథం తప్పాడు. అంచేత దీనికి తగిన ప్రతీకారం ఆలోచించవలిసింది" అన్నాడు. ఈ మాటలు విని నవ్వుకున్నాడు ధర్మరాజు "మా పంచాంగం ప్రకారం పదమూడేళ్ళు నిన్నాదేహంగా నిండిపోయాయి వెళ్ళు. భీష్ముడూ, ద్రోణుడూ వినేట్టు 'ముమ్మాటికీ నిండాయి' అని మీరాజుతో చెప్పు" అన్నాడు.

తిరిగి వచ్చి ఆ ప్రకారం దుర్యోధనుడితో ఈ వైనం వివరించాడు దూత. అంతతో అయినా మౌఢ్యం వదలక ఆ రాత్రి కొలువులో భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ, తన తమ్ములూ— అందరూ వుండగా, దూతని పంపినవిషయంమాత్రం గుప్తంగా వుంచి ఇలా ఆరంభించాడు దుర్యోధనుడు. "అనవసరంగా అర్జునుడితో యుద్ధం చేశాం. మోసపోయాం. నిజానికి అజ్ఞాతవాసం ముగియకుండానే అతడు బయటపడ్డాడు. ముందు దీని నిజానిజాలు తేల్చుకోవలిసింది మనం" అన్నాడు.

"ఏం మాటలివి? ఎవరన్నా వింటే నవ్వుతారు. అర్జునుడు వచ్చినప్పుడే నేను చెప్పానుకదా? మళ్ళీ ఈ తతంగంఅంతా దేనికి? సందేహం అక్కర లేదు. గడువు పూర్తిగా తీరిపోయింది" అన్నాడు భీష్ముడు. దానికి అందరూ సమ్మతించారు. "అవును, అర్జునుడు అంతవెర్రివాడా మరి!" అన్నారు. దాంతో నిరుపాయుడయ్యాడు రారాజు. మర్నాడు వేకువనే హస్తినాపురం బయలుదేరిపోయాడు.

ఇక్కడ పాండవులు—శమీవృక్షందగ్గిరికి వెళ్ళి పూజాపూర్వకంగా తమ ఆయుధాలు తెచ్చుకున్నారు. దినదినం విరాటరాజు

చేస్తూన్న సత్కారాలు స్వీకరిస్తున్నారు. పట్టణం ప్రజలూ, గ్రామాల వాళ్లూ తెచ్చి అర్పిస్తున్న రకరకాల ఉపహారాలు గ్రహిస్తున్నారు.

## ఉత్తర పెళ్లి

సుఖంగా దినాలు గడిచిపోతున్నాయి. ఇంతలో బంధువులికి శుభలేఖలు చేరాయి. ద్వారకాపట్టణంనుండి కృష్ణుడూ, బలరాముడూ సాత్యకీ సుభద్రనీ, అభిమన్యుణ్ణి తోడ్కొని వచ్చారు. వెంట కృతవర్మా, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, యుయుధానుడూ, రుక్మ్నుడూ, అక్రూరుడూ వచ్చారు. ఏనుగులమీందా, గుర్రాలమీందా, రథాల మీందా అనేకమంది యాదవకుమాళ్ళు వచ్చారు. ఇంద్రసేనుడూ మొదలైన పాండవులసారథులు రథాలతోకూడా వచ్చారు.

ఇలా వీరంతా మహావైభవంతో ఉపప్లావ్యం ప్రవేశించారు. వార్త తెలిసి సగందారికి వచ్చారు పాండవులూ, విరాటరాజూను. చిరకాలానికి కలుసుకోడంవల్ల అందరికీ ఆనందబాష్పాలు వచ్చాయి. అంతటా సంతోషమే సంతోషం తాండవించింది. బలరాముడూ మొదలైన ప్రముఖులికి ఎవరికి తగిన విడుదులు వారికి ఏర్పాటు చేశారు. సుభద్రని, అభిమన్యుణ్ణి ద్రౌపదిబసకి పంపించాడు కృష్ణుడు. స్వర్ణభూషణాలూ, చీనిచీనాంబరాలూ పాండవులికీ ద్రౌపదికీ పంపించాడు. గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ, దాసదాసీజనం విడివిడిగా అయిదుగురికీ ఇచ్చాడు. పదేపదే పరస్పరం కుశలప్రశ్నలు చేసుకుంటూ అజ్ఞాతవాసం విశేషాలు చెప్పుకుంటూ సంతోషంగా కాలక్షేపం చెయ్యడం మొదలుపెట్టారు పాండవులూ కృష్ణబలరాములున్నూ.

అనంతరం కాంపిల్యనగరంనుండి పాంచాలప్రభువు ద్రుపదుడు కుమాళ్ళతోనూ, చతురంగబలాలతోనూ వచ్చాడు. కాశీనుండి

కాశీదేశాధిపతి శైబ్యుడు సైన్యసమేతంగా వచ్చాడు. ఇంకా దేశ దేశాలనుండి బంధువులూ, సామంతులూ వచ్చారు అందరికీ ధర్మ రాజూ, విరాటరాజూ ఎవరికి తగిన విడుదులు వారికి ఏర్పరుస్తూ, రవంతా లోపం లేకండా సత్కారాలు చేశారు.

ఇలా ఉభయపక్షాలవారి బంధుకోటితో ఉపప్లావ్యనగరం ఇసక వేస్తే రాలనట్టుంది. పట్టణం సింగారించడంకోసం చాటించాడు విరాట రాజు. వీధివీధీ చలవపందిళ్లు వేశారు. అరటిచెట్లూ, పోకచెట్లూ, నాటారు. పువ్వులతో కలిపి పచ్చతోరణాలు కట్టారు. కుంకంతో అలికి, కర్పూరంతో ముగ్గులు తీర్చారు. ఉపప్లావ్యనగరమంతా కన్నుల పండువుగా వుంది ఇక రాజమందిరం చెప్పనే అక్కరలేదు ఎక్కడ చూస్తే అక్కడ రత్నదీపాలికి మెరుగుపెట్టేవాళ్లూ, మణిస్తంభాలికి కొత్తజిగిపెట్టేవాళ్లూ, ముత్యాలకుచ్చులు వేలాడగట్టేవాళ్లూ, మంగళ తోరణాలు తీర్చేవాళ్లూ—ఓ, కలియుగవైకుంఠంగా ఉంది. పెళ్లిపీనె చందనంతో అలికారు పుణ్యస్త్రీలు. ఆణిముత్యాలతో ముగ్గులు పెట్టారు. వైదికంగానూ, లౌకికంగానూ, అవసరమైన వస్తుసంభార మంతా —— పూతికపుల్ల వారా లేకుండా అమిర్చి పెట్టారు పురోహితులు.

నెరజాణలవంటి చెలికత్తెలు వచ్చి, పెళ్లికూతుర్ని ముద్దులు వొలికేట్టు ముచ్చటగా ముస్తాబుచేశారు. రాజదంపతులూ, కుమాళ్లూ తమ్ముల్లూ, బంధువులూ—అందరూ చందనమాల్యాదులు ధరించారు. రత్నభూషణాలు అలంకరించుకున్నారు. వచ్చినజనానికి యథోచిత మయిన సత్కారాలు జరిపించారు.

ఇంతలో ధర్మరాజూ, భీమార్జునులూ, నకులసహదేవులూవారి యావత్తుబంధువులూ విలువైన ఆభరణాలతో మనోజ్ఞంగా అలంక రించుకున్నారు. పెళ్ళికుమారుణ్ణి వైభవోపేతంగా ముస్తాబుచేశారు. పట్టపుఏనుగుమీద ఎక్కించిఇందరూ వెనకబయులుదేరారు ఏనుగులూ

గుర్రాలూ, రత్నజవాహిరీ, చీనిచీనాంబరాలూ, పసుపుకుంకాలూ, పుష్పాలూ, ఫలాలూ – ఇలా, ఎంతో వస్తుసంభారం వెంటనడిచింది. బ్రాహ్మణోత్తములు ఆశీర్వాదాలు చేస్తున్నారు. వందిమాగధులు కైవారాలు చేస్తున్నారు మంగళవాద్యాలూ, తూర్యారవాలూ దిక్కులు పిక్కటిల్లజేస్తున్నాయి మహావైభవంగా తర్లివచ్చారు మగ పెళ్లివారు. శ్రీకృష్ణుడితోసహా విరాటరాజమందిర ప్రవేశించారు. శంఖాలూ, జేగంటలూ, మంగళవాద్యాలూ మోగుతూవుండగా ఆడ పెళ్లివారు ఎదురువచ్చారు. వేదోక్తంగా పూజావిధులు నిర్వర్తించి పెళ్లికుమారుణ్ణి పీటమీదికి తీసుకువెళ్లాడు విరాటరాజు. తెరవెనక పెళ్లి కూతుర్ని కూర్చోబెట్టారు కృష్ణుడూ, బలరాముడూ, ధర్మరాజూ, అర్జునుడూ, మొదలైన పెద్దలు ఎవరికితగ్గస్థానాలు వారు అలంక రించారు. వేదోక్తంగా నడుస్తూవుంది వివాహమహోత్సవం. వృద్ధ బ్రాహ్మణులు మంత్రపూర్వకంగా ఆశీస్సులు వర్షించారు. మంగళ వాద్యాలు మిన్నుముట్టుతున్నాయి. జ్యోతిష్కులు నిర్ణయించిన సుముహూర్తంలో తెరఎత్తారు.

అదివరకే ఒకళ్లసౌందర్యం ఒకళ్లు వింటూవున్నారు వధూ వరులు. ఎప్పుడెప్పుడని పరస్పరం చూసుకోడంకోసం ఉవ్విళ్ళూరు తూనూ వున్నారు. తెరఎత్తడంతోనే ఒక్కసారిగా చూసుకున్నారు. మొదటిచూపులతోనే వారికి ప్రేమాంకురమయింది. వధువుముఖం మీంది లేతకాంతులు పానంచేశాయి వరుడి చూపులు. వరుడి పాదాల మీద వాలాయి వధువు కొనచూపులు. వధువు దేహలతమీద మాటి మాటికీ సంచారం చేశాయి వరుడి చూపులు. మెల్లిమెల్లిగా వరుడి మొహంవరకూ వెళ్లి, చప్పున తిరిగివచ్చాయి వధువు కీగంటి చూపులు. ఉభయుల శరీరాలమీద పొటమరిస్తున్న చిరుచెమటలలో తడిసి, బరువెక్కి వాలిపోతున్నట్టున్నాయి ఉభయులచూపులున్నూ.

కల్పలతా, కల్పవృక్షమూ ఒకదానిమీద వొకటి పువ్వులు కురిసినట్టు వధూవరులు దోసిళ్లతో ఒకళ్ళమీద ఒకళ్లు తలంబ్రాలు చల్లుకున్నారు. మొదట సిగ్గుతో ముందూ వెనక లవుతున్న చూపులు తలంబ్రాలప్పుడు విచ్చలవిడిగా సౌందర్యపానం చేశాయి. హృదయంలోఉన్న గాఢానురాగం చేతుల్లోచూపిస్తున్నట్టు ఎర్రగావున్న ఉత్తరకుమారి మృదుపాణిని, చిగురాకు అందుకునే ఏనుగుగున్నవలె మెలపుగా గ్రహించాడు అభిమన్యుడు

ఇలా పాణిగ్రహణంచేసి, ఒకేకుదురులో పెట్టిన మామిడి విరజాజి మొక్కలవలె ఏకాసనాసీనులయారు ఉత్తరాఅభిమన్యులు. ఉభయులకోర్కెలూ జతలుకట్టి, కొనలుసాగి, హృదయాల్లో చివుళ్లు పెడుతున్నాయి పులకాంకురాలు తలముక్కలై ఇద్దరిశరీరాలూ నవనవలాడుతున్నాయి. సమయం కనిపెట్టి ఇద్దరిచూపులూ కలుసుకుంటు న్నాయి, వెంటనే తిరుగుముఖం పడుతున్నాయి, వలపు బయలు పెడుతున్నాయి. ఉభయుల చెమటలూ ఘుమఘుమలాడి, కలిసి, కొత్తసౌరభం వెదచల్లుతున్నాయి. హోమసమయంలో నిర్వహించిన మంగళకృత్యాలవల్ల పరస్పరం గాఢమైన స్పర్శసుఖాన్ని అనుభవిస్తూ ఆనందసముద్రంలో తేలిఆడారు ఉత్తరాభిమన్యులు.

వివాహమహోత్సవం వైభవోపేతంగానూ, నిర్విఘ్నంగానూ నిర్వహించాడు విరాటరాజు. కృష్ణ, బలరామ, ధర్మరాజ, భీమార్జున నకులసహదేవులికీ, పురోహిత జనానికీ తక్కినపెద్దలికీ కర్పూర చందన తాంబూలాది సత్కారాలు చేశాడు. మణిభూషణాలూ, రుచిరాంబరాలూ బంగారు పళ్ళేలతో సమర్పించాడు. ద్రౌపదికీ, సుభద్రకీ అనురూపమైన ఆభరణాలూ, పట్టుచీరెలూ అంతఃపుర పరిజనంచేత పంపించాడు. అల్లుడికి ఏడువందల మదపు టేనుగులూ, మంచి మంచివి పదివేల గుర్రాలూ, కామధేనువుల్లాంటి ఐదులక్షల ఆవులూ

రెండు వేల రథాలూ, లక్ష దాసదాసీజనం—ఇంకా ఎంతో వస్తు సామగ్రీ అరణంగా ఇచ్చాడు.

వివాహమహోత్సవంతో కనీవినీ ఎరగనంత కళ్ళవేడుకగా వుంది ఉపప్లావ్యనగరం. ఎక్కడచూస్తే అక్కడ మంగళకార్యాలలో తీరికలేని పుణ్యస్త్రీలూ, నృత్యగీతాలలో మైమరిచిన నాట్యాంగనలూ కొత్తకొత్త రత్నాభరణాలు ధరించి, చతురపరిహాసాలతో విలాసంగా తిరుగుతూన్న నవయువకులూ, రథాలమీదా, ఏనుగులమీదా, గుర్రాలమీదా ఠీవిగా సంచారంచేస్తున్న యాదవ, పాంచాల, కేకయాది రాజకుమారుళ్ళూ—భూలోకస్వర్గంలా వుంది విరాట రాజమందిరం.

వ్యావహారికాంధ్ర మహాభారతంలో

విరాటపర్వం

సంపూర్ణం.

# ఉద్యోగపర్వం

## మొదటి ఆశ్వాసం

### ఉద్యోగం

ఈవిధంగా అభిమన్యుకుమారుడి వివాహం మహావైభవంగా జరిగింది. పాండవుల బాంధవ్యంతో మత్స్యవంశం పావన మైనట్ట యింది. పెళ్ళినాలుగుదినాలూ వేడుకలతో గడిచిపోయింది.

నాగవిల్లి మర్నాడు—విరాటరాజు కొలువుకూటం కలకల్లా డుతూ వుంది. పెళ్లికి వచ్చిన యావన్మంది బంధువులూ రాజులూ సమావేశమై వున్నారు. శ్రీకృష్ణుడూ, బలరాముడూ, ద్రుపదమహా రాజూ, విరాటరాజూ ఉన్నతమయిన ఆసనాల్లో కూర్చున్నారు. వారి వారి సోదర్లూ, కుమాళ్ళూ ఎవళ్ళకితగిన ఆసనాల్లో వాళ్లున్నారు. తమ్ముల తోనూ కుమాళ్ళతోనూ వచ్చి ఓ ఉత్తమాసనంలో కూచు న్నాడు ధర్మరాజు. ఇష్టాలాపాలతో జరిగిపోయింది కొంతసేపు.

ఇకముందు పాండవులు ఏం చెయ్యాలీ అన్నది వేధిస్తూవుంది కృష్ణుణ్ణి. ప్రసంగం మార్చి ఇలా ఆరంభించాడతడు గంభీరంగా ''శకుని కల్పించిన కపటజూదంలో తమ రాజ్యం పోగొట్టుకున్నారు పాండవులు. శక్తి కలిగి వుండిన్నీ సత్యానికి కట్టుపడి క్రోధపరవశులు కాలేదు. ప్రతిజ్ఞ ప్రకారం తుచ తప్పకండా అరణ్యవాసమూ, అజ్ఞాతవాసమూ నిర్వహించారు. పాపం, పన్నెండు సంవత్సరాలు క్రూర మృగాలతోనూ, రాక్షసులతోనూ మహారణ్యాలలో దినాలు గడిపారు. అందులోనూ దుస్తరమైన ఈ పదమూడోఏడు ఎంత దుర్భరం! తమనిమరొకరు తెలుసుకోకండా ఎన్ని ఆపదలైనా సహిం చుకున్నారు.

"ధర్మరాజు ప్రవర్తన మీ అందరికీ తెలిసిందేకదా! ఇంద్ర పదవైనా సరే, అధర్మంగా వస్తే మాత్రం అంగీకరించడు. న్యాయంగా ఏంలభిస్తే అదే పదివేలంటాడు. అంచేత, ధర్మమార్గం తప్పకండా కౌరవులకీ వీరికీ హితమయ్యేటట్టు ఒక విధానం విచారించండి.

"పాండవుల పైతృకమైన రాజ్యం కపటద్యూతంలో దుర్యోధనుడు అపహరించడం, అది వీరు దిగ్విజయం చేసి స్వాధీనపరచుకున్నదీ అయివుండడం, ధర్మరాజు మహానుభావత్వం విచారించక దుర్యోధనాదులు పరాభవించినా, తెగించి వారికీయన కీడు తలపెట్టక పోవడం రాజ్యం ఉభయులూ పంచుకుతినదగినవారు కావడం – ఇవన్నీ బాగా ఆలోచించి, ఇపుడు చేయవలసిన కర్తవ్యం నిర్ణయించి, 'ఇది ఇలా చేయాలి' అని చెప్పడానికి తగినవారు మీరంతా.

"ఐతే, నాకుతోచిందిమట్టుకు నేనుచెపుతాను వినండి. పాండవులు ఇంతవరకూ శాంతంగా శపథం పూర్తి చేశారు. ఇక తమ పరాక్రమం ప్రకటించాలె నన్న ఆవేశంతో వున్నారిపుడు వీరి ఉద్దేశం ఆచోకీ కట్టాడంటే చాలు, తన మిత్రమండలినంతా సమకూర్చుకుంటాడు దుర్యోధనుడు తక్కువబలగంతో వుంటే వీరిని కడతేర్చడం సులభమని వెంటనే జల్దుకుంటాడు. తానే బాధపడతాడు. సందేహం లేదు బలగం లేకండా ఎంత పరాక్రమవంతులకైనా అనంతమైన సహాయసంపత్తులుగల శత్రుసైన్యాల్ని గెలవడం సాధ్యంకాదు కదా! అంచేత పాండవుల పక్షం వచ్చే రాజులు కూడా ఇక్కడ సమావేశమాతారు. ఇలా వాళ్ళూ వీళ్లూ దేవాసురుల లాగు తెగబడతారు యుద్ధానికి. తప్పదు.

"ఇక్కడి పరిస్థితి ఇది. ఇక అక్కడ వాళ్ళ చిత్తవృత్తి ఎలా వుందో మనకి తెలియదు. ఎదటివాళ్ళ అభిప్రాయం ఏమిటో తెలియకండా ఏం చెయ్యాలో నిశ్చయించడం కష్టం. అంచేత, ఈ పరిస్థితిలో

తగిన రాయబారిని అక్కడికి పంపడం మంచిది. దుర్యోధనుడు వీరికి రాజ్యంలో వంతిస్తే సంతోషమే లేదంటే అప్పటి పరిస్థితిని బట్టి ఏం చెయ్యాలో ఆలోచిద్దాం'' అన్నాడు.

తమ్ముణ్ణి బలపరుస్తూ అందుకున్నాడు బలరాముడు. ''కృష్ణుడు చెప్పింది విన్నారు కదా! పిల్లకీ వాళ్ళకీ హితంగానూ న్యాయంగానూ వుందిది ఈవిధంగా ఉభయుల్నీ సఖ్యపరచడంసాధ్యమనే తోస్తున్నది నాకు వీళ్ళు పోగొట్టుకున్న రాజ్యం వీళ్ళు కావాలంటున్నారు అన్నిటి లేకండా వీరిభాగం వీరికి ఇచ్చివేసి తమభాగంతో తాము సంతోషించడమే కౌరవులికి న్యాయం. దానివల్ల అపాయం తప్పుతుంది. వీళ్ళు కూడా కోపం విడిచిపెట్టి బంధుత్వంతో కలిసిమెలిసి వుంటారని ప్రపంచమూ సంతోషిస్తుంది. అంచేత ఈ కార్యం చక్కబెట్టుకు రావడానికి ఒకర్ని పంపడమే మంచిది ఆ వెళ్ళవలిసిన మనిషి మాట పొందిక తెలిసినవాడై వుండాలి. కౌరవాధిపతి చిత్తవృత్తికి అనుకూల్యంగా వినయ విధేయతలతో ప్రార్థించి అడగాలి. లేకపోతే కార్యసాఫల్యం కాదు. ఏమంటారా! దుర్యోధనుడి బిరుసువనాన్ని సహిస్తూ మెలకువతో మసలుకుంటూనే జూదంలోపడి మోసపోయినాడు ధర్మరాజు. తుదకి చిక్కుల్లో పడ్డాడు.

''అంతేకాదు, తనకి పాచికల్లో నేర్పులేక పోడంచేతా, బంధువులు వారించడం చేతా, తాను ఆడడం మాని శకునిని నియమించాడు దుర్యోధనుడు. జూదంలో పండిపోయిన సిద్ధహస్తుడు శకుని. అంచేత ధర్మరాజు ఒడ్డిన పందెమంతా గెలుచుకుంటూ వచ్చాడు. కాబట్టి దుర్యోధనుడి దోషంకూడా ఇందులో ఏమీ లేదు అందువల్ల వాళ్ళని అధర్మపరులని నిందించడం న్యాయంకాదు. కనకనే వీళ్ళపంపిం రాయబారి నియమంతోనే చక్కబెట్టుకు రావాలంటూను'' అన్నా..

బలరాముడి మాటలువిని చర్రుమని లేచాడు సాత్యకి. "ఇలాంటి మాటలు చెప్పడం నీకే చెల్లింది. నిన్నేమనాలో తెలీకండా వుంది. నిన్నుకాదు, నీమాటలికి తలలూపుతూ వింటూన్నవాళ్ళ ననాలి. తనకు తానై వేడుకపుట్టి జూదమాడాడా ధర్మరాజు? వాళ్లందరూ కలిసి గూడుపురాణీ చేసి పిలుచుకువెళ్ళి బలవంతాన మెడలు విరిచారు. కపటంచేసి గెలుచుకున్నారు. ఏం న్యాయమిది!

"నిజానికిచూస్తే, ధర్మరాజుకంటే ధార్మికు మరెవడున్నాడు? ఆయనమీద నేరంమోపినవాడు సభలో అవమానంపొందడం తప్పదు. అన్నంతమాటా అక్షరాలా నెరవేర్చుకువచ్చారు పాండవులు. పైతృకమైన రాజ్యభాగంకోసం బలమూ, చలమూ ప్రయోగించడానికి సిద్ధంగా వున్న వీళ్ళు ఒకళ్ళని బతిమాలడానికి ఎందుకు వెళతారు? మెత్తగావుంటే మెచ్చుకుంటారా శత్రువులు! రణంలో రాజ్యలక్ష్మిని చేపట్టడంకంటె మరో రాజధర్మమేముందంటాను! దుర్యోధనుడు తగినమాటలతో దారికి రాకపోతే, నా బాణాలతో బుద్ధిచెప్పిమరీ పాండవులికి రాజ్యమిప్పిస్తాను. భీమార్జునులతో యుద్ధంలో నిలవగల మగవాడెవడున్నాడు? వీళ్ళూ, నేనూ సైన్యంతో చెలరేగితే ఎదిరించి ఏరాజు బతికిపోతాడో చూస్తాను. నకులసహదేవులూ, ఉపపాండవులూ, పాంచాలవర్గమూ, వృష్ణివీరులూ—ఇంతమందీ బయల్దేరితే క్షణంలో ధృతరాష్ట్రసంతానం వందమందినీ నిశ్శేషంచెయ్యరూ! ఈ మత్స్యరాజు సహాయముంటే మనం తీర్చలేని పనే వుండదంటాను. సామ దాన భేద దండోపాయాలు నాలుగూ తెలిసినవాడున్నూ, మహాబలవంతుడున్నూ అయిన విరాటరాజు సామాన్యుడా మరి!

"ముమ్మాటికీ యుద్ధంచేయడమే నా అభిప్రాయం. కాదని ఈలోగా సామోపాయంతో కార్యంచేసి చూడాలంటారా, ఐతే,

దైన్యం మాట మాని 'పాండురాజుభాగం ధర్మరాజు కోరుతు న్నాడు' అని మన దూతచేత చెప్పిద్దాం. మర్యాదగా లోకసంప్ర దాయం ప్రకారం ఇస్తే పుచ్చుకుందాం. కాదూ పోదూ అని వ్యతి రేకంగా జవాబు చెపుతాడూ, సరే. దాని ఫలం అతడే అనుభ విస్తాడు తరవాత" అన్నాడు.

"అవును, అదిబాగుంది," అని అందుకున్నాడు ద్రుపదుడు. "బలదేవుడు చెప్పింది సమంజసంగా లేదు. బలవంతుడూ, సహాయ సంపన్నుడూ, దుష్టాత్ముడూ ఐన దుర్యోధనుడు ప్రియవచనాలతో రాజ్యభాగం ఇస్తాడనుకోడంమాత్రం వెర్రి యుద్ధంతోగాని అతడు దారికి రాడు. దురభిమానుల మనస్సు మంచిమాటలతో కరగడం కల్ల. మన మంచిచూసి చులకనచేసి మరింత కొండెక్కి కూచుంటారు వాళ్లు.

"అదీకాక, కూటికోసం ఆశపడి దుర్యోధనుడికే తాళం వేస్తారు భీష్మద్రోణులు. కొడుకంటే ప్రపంచమే కనపడదు ధృత రాష్ట్రుడికి. రాజు ఆడిందేఆట పాడిందేపాట అంటారు కర్ణుడూ మొద లైన నీచులు, కాబట్టి దుర్వినీతుడుగానే వుంటాడు దుర్యోధనుడు అంచేత, ఎలా చూసినా యుద్ధంమాత్రం తప్పదు.

"ఈ పరిస్థితిలో మనం పిలవవలిసినరాజుల్ని పిలిపించి, తగిన సైన్యాలు సమకూర్చుకోక తీరదు. దుర్యోధనుడూ సహాయంకోసం ఆశ పడి వర్తమానాలు చేస్తాడు నీతిపరులైనరాజులు మొదటకోరిన వాళ్ళకే సహాయపడతారు. చప్పున చురుకైన బేగిరావుల్ని పంపించి శల్యుడికీ, కేకయుడికీ, దుష్టకేతుడికీ, జరాసంధుడికుమారుడూ మొద లైన రాజులికీ వారి బంధువులికీ, స్నేహితులికీ వార్తలు పంపించడం మంచిది ఇది నాకు తోచిన విషయం

"ఇక, ఇదిగో ఈయన మా అగ్రపురోహితుడు. ఇతడికి చెప్ప వలిసినవన్నీ చెప్పి, ధృతరాష్ట్రుడి దగ్గిరికి పంపిద్దాం. అతడి ఎదటా,

దుర్యోధనుడి ఎదుటా, భీష్మద్రోణుల ఎదుటా—ఎవరితో ఎలా చెప్పాలో, ఎక్కడ ఏది తర్కం ప్రయోగించాలో వివరించి చెప్పి పంపిస్తే, మర్యాదా, స్నేహమూ, లాభమూ అన్నీ జతపడతాయి'' అన్నాడు.

''అవును, ద్రుపదమహారాజు చెప్పిందే సమంజసంగా వుంది. ఇలాగే చెయ్యాలి'' అని అందుకున్నాడు కృష్ణుడు. ''కౌరవులెంతో పాండవులూ అంతే నాకు. అంచేత, ఈ ఉభయులూ హాయిగా రాజ్య పరిపాలన చేస్తూ సుఖపడాలనే చూస్తాను నేను. పెళ్ళికని పిలిస్తే వచ్చాం. ఈ నాలుగు దినాలూ వేడుకలన్నీ కళ్ళవేడుకగా చూశాం. ఇక ఆలస్యం చెయ్యడానికి వీలు లేదు. వెళ్ళిరావాలి.

''ద్రుపదమహారాజా, మా అందరిలోకీ గురుస్థానం మీది మీ మాటలంటే ధృతరాష్ట్రుడు మన్నిస్తాడు. మీరంటే భీష్ముడికి ఎంతో గౌరవం. ద్రోణుడూ, కృపుడూ మీ స్నేహకోటిలోని వారే. అంచేత, పాండవులకోసం రాయబారిని పంపవలసినభారం మీమీదే వుంది. మీమాటే మా అందరి మాటాన్ను. మీరు కార్యం చక్క-బెట్టేటపుడు కాదని ఎవళ్ళు తొందరపడితే వాళ్ళే చెడతారు

''ఉభయులికీ స్నేహం కుదిరిందా మంచిమాటే. అలాకాక, బెడిసిపోయి యుద్ధమే నిశ్చయమైందా, రాజులందరినీ ముందు రావించి తరవాత సావకాశంగా మాకూ కబురు పంపండి. మీ మాటప్రకారం వీళ్ళకు రాజ్యభాగం ఇవ్వకపోతే, వాళ్ళను అర్జునుడికోపాగ్ని ఎలాగూ ముంచెత్తుతుంది'' అని ప్రయాణోన్ముఖుడయాడు. ద్రుపదుడూ, ధర్మరాజూ, భీమార్జున నకులసహదేవులూ, విరాటరాజూ సగౌరవంగా అంపకం చేశారు. ఇలా బలరాముడు మొదలైన యాదవబృందంతో కూడా వైభవంగా ద్వారకాపట్నానికి వెళ్ళిపోయాడు శ్రీకృష్ణుడు.

పెళ్ళికని వచ్చిన తక్కిన రాజులుయావన్మందీ సమరసన్నాహాల కోసం తమతమ నగరాలికి బయలుదేరారు విరాటరాజూ ద్రుపదుడూ

కూడా సన్నద్ధులు కావడం మొదలుపెట్టారు ఈవిధంగా పాండవులు యుద్ధప్రయత్నాలలో నిమగ్నులై తమతో కలిసివచ్చే రాజుల దగ్గిరికి సత్వరం దూతల్ని పంపారు.

అక్కడ దుర్యోధనుడూ ఇదంతా చారులవల్ల విని, తన బంధుమిత్రులు యావన్మందికీ వార్తలు పంపించాడు. ఇలా ఉభయపక్షాల వార్తలూ చేరడంతోనే పెద్దపెద్దసైన్యాలు వేసుకుని భూగోళం దద్దరిల్లేటట్టునాలుగుదిక్కులనుంచీ మహాపటాటోపంతో-అటు హస్తినానగరానికీ, ఇటు ఉపప్లావ్యానికీ రావడం మొదలుపెట్టారు రాజులు.

## రాయబారం

ఇంతలో, అనుకున్న ప్రకారం ధృతరాష్ట్రుడి దగ్గిరికి పంపడం కోసం వయోవృద్ధుడూ, జ్ఞానవృద్ధుడూ అయిన తన పురోహితుణ్ణి పిలిచాడు ద్రుపదమహారాజు. "బుద్ధిమంతుడివి, చతురతకలవాడివి, సమయజ్ఞుడివి, ఇంగితవేదివి, ఇన్నిటికీ మించి నాకు నెచ్చెలివి. నాకు కర్తవ్యమైన కార్యం నిర్వహించడం నీకు ధర్మం. అంచేత, పాండవుల కార్యార్థం ధృతరాష్ట్రుడికి దగ్గిరికి వెళ్లాలి నువ్వు. నీనేర్పంతా వినియోగించి ఈ కార్యం సాధించుకురావాలి.

"కొడుక్కి పట్టిన వెర్రి అతణ్ణీ పట్టుకుని పాండవుల రాజ్యం కాస్తా కాజేస్తున్న కుటిలుడు ధృతరాష్ట్రుడు. అతడిసంగతీ, ధర్మరాజు సౌశీల్యమూ రెండూ నీకు తెలుసుకదా! ధర్మసమ్మతంగా ధృతరాష్ట్రుడికి నువ్వు నచ్చజెప్పినపుడు అక్కడవుండే ముఖ్యుల మనస్సులూ మనకు అనుకూల పడకపోవు. భీష్ముడూ ద్రోణుడూ యుద్ధానికి విముఖులైనట్లయితే, వాళ్లని ఒప్పించడానికి దుర్యోధనుడు పడరాని పాట్లూ పడతాడు దాంతో వారిసైన్యాలూ నిచ్చెరపోయి నిరుత్సాహపడతాయి. పాండవులు పడ్డపాట్లు బంధువులదగ్గిరా వర్ణించి చెప్పాలి. పండితులూ, వృద్ధులూ, సజ్జనులూ-అందరిదగ్గిరికీ వెళ్లి 'ఇది కులమర్యాదకి విరుద్ధం'

అని సహేతుకంగా నిరూపిస్తూ, 'వంతు పంచిపెట్టడమే న్యాయం, మరోమార్గం కూడదు' అని వాళ్ళంతా భావించేటట్టు చేయాలి. ఎవళ్ళతో ఎలా చెప్పాలో అలా నెమ్మదిగా చెప్పి, అక్కడివాళ్ళ హృదయాలు ఇక్కడ వాలేటట్టు చేయవలిసిన ఉపాయాలన్నీ చేయాలి.

"ఇక్కడ శ్రీకృష్ణుడూ మొదలయినవారు చేసిన ప్రసంగాలు మనం వినసే విన్నాం కదా! దానికి అనురూపంగా మాట్లాడి పాండవుల ఆధిక్యం తగ్గిపోకండా చూడాలి. హస్తినాపురంలో కొన్నాళ్ళుండి ధృతరాష్ట్ర భీష్మ, విదుర, ద్రోణ, కృప, దుర్యోధనాదుల దగ్గిరికి వెళుతూ, రోజురోజూ వారివారి అభిప్రాయాలు తెలుసుకుంటూ ప్రవర్తించాలి. దేవుడి దయవల్ల నువ్వాడిన సూత్రాలికి దుర్యోధనుడు ఓడబడ్డమే జరిగిందంటే, అది సకలజన సమ్మతమైన పనే అవుతుంది. ధర్మరాజూ తృప్తిపడతాడు. వెళ్ళిరా" అని చెప్పాడు.

వినవలిసిన వన్నీ విని బయలుదేరాడు ద్రుపదపురోహితుడు. ముందు ద్రుపదుడిదగ్గిర సెలవుతీసుకున్నాడు. తరువాత ధర్మరాజ, భీమ, అర్జున, నకుల, సహదేవుల్ని దర్శించాడు. వారి అనుమతీ తీసుకున్నాడు. అందరూ అతణ్ణి మన్నించి గౌరవంగా సాగనంపారు.

ఇంతలో అక్కడ దుర్యోధనుడు—రాజులందరినీ రమ్మనట్టే శ్రీకృష్ణుణ్ణి సామాన్యమైన దూతనిపంపి రమ్మనడం భావ్యం కాదని నిశ్చయించుకున్నాడు. తానే స్వయంగా బయల్దేరాడు. కొద్దిపరివారం వెంటబెట్టుకుని, త్వరితగమనంగల గుర్రాలు వేసుకుని హుటాహుటిని వచ్చి ద్వారకాపట్టణం చేరాడు. వచ్చీ రావడంతోనే శ్రీకృష్ణుడి మందిరం ప్రవేశించాడు. ఆసమయానికి నిద్రపోతున్నాడు కృష్ణుడు. తిన్నగావెళ్ళి ఆయన తలదిక్కు సోఫాలోకూచున్నాడు దుర్యోధనుడు.

దైవికంగా ఆదినమే అదేవేళకి కృష్ణుడికోసం అర్జునుడూ వచ్చాడు. వచ్చి కృష్ణుడి కాళ్ళకాడిదిక్కు వినయంగా నుంచున్నాడు.

కొంతసేపటికి కళ్లువిప్పి ముందు అర్జునిణ్ణి, తరవాత దుర్యోధనుణ్ణి చూశాడు కృష్ణుడు. ఇద్దరినీ ఆదరంగా కుశలప్రశ్న లడిగాడు. ఇద్దరినీ గౌరవించి 'వచ్చినపని ఏమి' టని అడిగాడు.

దుర్యోధనుడు యుద్ధంలో మీ సహాయంకోరడంకోసం వచ్చాం. మేమున్నా వీళ్ళున్నా నీకు వొక్కటేకదా! ఉభయులమూ నీకు ఒక్కలాంటి బంధువులమే. ఇవాళ నీ దర్శనంకోసం నేను ముందు వచ్చాను. సజ్జనులైనవాళ్లు ముందువచ్చినవాళ్ళనే ఆదరిస్తారు. సకల ధర్మాలూ సాకల్యంగా తెలిసినవాడివి నువ్వు. అంచేత లోకధర్మం విచారించి మాకు సహాయం రావలిసిందని కోరుతున్నాను.

## నేనుకావాలా ? సైన్యంకావాలా?

కృష్ణుడు అవును, నువ్వు ముందురావడం నిజమే కాని, అర్జునుణ్ణే ముందు చూశాను నేను. అంచేత, మీ ఇద్దరికీ సహాయపడడమే న్యాయం నాకు. దీన్ని అతిక్రమించకండా ఓ మార్గం చెపుతాను. మీకు నచ్చినట్టు మీ ఇద్దరూ కోరుకోవచ్చు. నాతో సమానమైన వాళ్లు నారాయణులనేపేరుగల యాదవులు పదివేలమంది వున్నారు. యుద్ధవిద్యలో ఉమరావులలాంటివాళ్లు. వాళ్లు యుద్ధంచేస్తారు. నేను నిరాయుధుణ్ణయి కేవలం ఆప్తుడిగామాత్రం వుంటాను. ఆ పదివేలమందీ ఒకదిక్కు, నేనొక్కణ్ణీ ఒకదిక్కు. ఈ రెండింటిలో ఎవ్వరికి ఏది ఇష్టమో ఎంచుకోండి. అయితే, మొదట చిన్నవాళ్ళు కోరడం ధర్మం. అర్జునా, నువ్వు మీ ఇద్దరిలోకీ చిన్నవాడివి. కనక నువ్వు ముందు కోరుకోవడం న్యాయం.

ఇలాచెప్పడంతోనే శ్రీకృష్ణుణ్ణే కోరుకున్నాడు అర్జునుడు. అర్జునుడు మోసపోయాడనుకుంటూ పరమానంద భరితుడయాడు దుర్యోధనుడు. పదివేలమంది నారాయణయాదవుల్నీ పుచ్చుకొని ఉత్సా

హంతో అక్కడనుంచి బయలుదేరి, బలరాముడి దగ్గిరికి వెళ్ళాడు వచ్చిన కార్యం తెలియచేశాడు.

ఆదరంగా అంతావిన్నాడు బలరాముడు. "అభిమన్యుడి వివాహ సందర్భంలో రాజులందరూ ఉపప్లావ్యంలో సమావేశమైన విషయం హస్తినాపురంలో పాకే వుంటుంది. ఆసభలో నేను నీపక్షంగా మాట్లాడాను. దానికి కొందరు అసహ్యపడి పాండవపక్షంగా ఏమేమో ఆడిపోశారు నన్ను. మాకృష్ణమూర్తికీ అది శ్రవణానందం కలిగించింది. కృష్ణుణ్ణి విడిచి నే నోక్షణమైనా వుండలేను కదా! అంచేత విరసంగా మరేమీ మాట్లాడకండా వూరుకున్నాను. అవాళనుంచీ వొక నిశ్చయానికి వచ్చాను. మీరూ వాళ్ళూ పోట్లాడుకుని, ఏది ఎలాపోయినా సరే, నేనుమాత్రం మాట్లాడకండా వూరుకుంటాను. ఎవ్వరికీ సహాయం రాను. ఈనిశ్చయానికి మరి తిరుగులేదు" అన్నాడు.

చేసేదిలేక దానికి సమ్మతించి, సవినయంగా అతడి దగ్గిరా, తరవాత కృష్ణుడిదగ్గిరా సెలవుతీసుకుని కృతవర్మదగ్గిరికి వెళ్లాడు దుర్యోధనుడు. ఒక అక్షౌహిణి సైన్యంతో వచ్చి తనపక్షాన్ని యుద్ధం చేస్తానని చెప్పాడు కృతవర్మ. దాంతో సంతృప్తిపడి హస్తినాపురానికి వెళ్ళిపోయాడు దుర్యోధనుడు.

అనంతరం అర్జునుణ్ణి ఇలా ప్రశ్నించాడు కృష్ణుడు. "అర్జునా, పరాక్రమవంతులైన నారాయణయాదవుల్ని పుచ్చుకున్నాడు దుర్యోధనుడు. యుద్ధమన్నా చెయ్యని నన్ను కోరుకున్నావు నువ్వు. దీనివల్ల ఏమిటిప్రయోజనం మీకు?

వినయంగా చిన్నినవ్వు నవ్వుతూ, ఇలాసమాధానం చెప్పాడు అర్జునుడు. "సుప్రసిద్ధుడవైన నువ్వు యుద్ధంచేస్తే ఆగెలిచినపేరు నీకే వస్తుంది. కాబట్టి యుద్ధంలో నీసహాయం కోరను నేను. ఇక, శత్రుపక్షంలో నువ్వుంటే నిన్నెదిరించి గెలవడమూ సాధ్యమైనపని కాదాయె.

అంచేత, విజయానికి మూలకందమైన నీసహాయమూ కావాలి. దానితోపాటు నువ్వు యుద్ధం చేయకుండానూ వుండాలి. కనక నే నిన్ను కోరుకున్నాను నేను. అయితే, నాదొక్క ప్రార్థనమాత్ర ముంది. మన్నించాలి. ఈమహాయుద్ధంలో నాకు సారధ్యంచెయ్య డానికి అనుగ్రహించాలి నువ్వు చిరకాలంనుండీ వున్న నాఈకోర్కె చెల్లించి కరుణించాలి నన్ను'' అంటూ చేతులు జోడించాడు.

''నీకోర్కె తీర్చడమే నావ్రతం'' అన్నాడు కృష్ణుడు, ''అనుప మానమైన నీ యుద్ధక్రీడలో తప్పకండా నీకు సారధ్యం చేస్తాను నేను'' అని బుజ్జగించాడు. అనంతరం కార్యాలోచనతత్పరులై ఉభయులూ ఉపప్లావ్యానికి, ధర్మరాజుదగ్గిరికి వెంటనే బయలు దేరారు.

## శల్యుడు

పాండవులు పంపిన దూతలు కొందరు శాకల్యపురం వెళ్లి శల్యుడితో చెప్పవలసిన వన్నీ చెప్పి యుద్ధంలో సహాయం రమ్మని అర్థించారు ఆహ్వానం సంతోషంగా స్వీకరించాడు శల్యుడు. పుత్ర మిత్ర సమేతంగా, పెద్ద చతురంగ బలంతో నిత్యప్రయాణాలు చేస్తూ ఉపప్లావ్యానికి బయల్దేరా డతడు.

ఈవార్త విన్నాడు దుర్యోధనుడు వెంటనే సమర్థులైన వాళ్లని కొందర్ని వెంటపెట్టుకుని శల్యుడు ప్రయాణం చేస్తున్న మార్గంలో, అతడు మజిలీవేసే ప్రతీచోటా అందమైన చలవపందిళ్లు వేయించాడు. నిర్మలమైన మంచినీటి నడబావులు తవ్వించాడు ముప్పంచల ఏనుగు శాలలూ, గుర్రపుకొట్టాలూ, విశాలమైన ఆస్థానమంటపాలూ కట్టిం చాడు బియ్యం, పప్పూ, నెయ్యీ, పెరుగూ, కూరకాయలూ, వంట కట్టెలూ—గడ్డీ మొదలైన పసుగ్రాసాలూ—ఇలా సకలసంభా రాలూ ఏర్పరిచాడు తానుకూడా గుప్తంగా తన పరివారంతో కలిసి నడవడం మొదలు పెట్టాడు

ఈవిధంగా ప్రయాణంలో రవంత లోపం లేకండా మహావైభవంగా జరుగుతూన్న అన్ని ఏర్పాట్లూ చూసి సంతోషం పట్టలేక పోయాడు శల్యుడు. తన పరివారాన్ని చూసి "ఇంత చాకచక్యంగా మనకి కావలిసినవన్నీ సమకూరుస్తున్న పాండవుల మంత్రు లెవ్వరు? వారిని గౌరవించడం మన ధర్మం" అన్నాడు. అంతకుముందే తన పరివారంతో మారువేషంలో వుండి పనులు చేయిస్తూన్న దుర్యోధనుడు "ఇదేసమయ" మని శల్యుడి ఎదటికి వచ్చి సవినయంగా తన్ను తానెరిగించుకున్నాడు. ససంభ్రమంగా గాఢాలింగనం చేసుకున్నాడు శల్యుడు. బంగారం ఆసన మిచ్చి గౌరవించాడు. "ఇదంతా ఈ మహాత్ముడి ప్రయత్నంవల్లే జరిగింది కాబోలు" అని ఆశ్చర్యపోయాడు. "నీ అభీష్టమేమిటో చెప్పు. తప్పకండా నెరవేరుస్తాను" అన్నాడు.

సంతోషంతో వుప్పొంగిపోయాడు దుర్యోధనుడు "సత్యసరస్వతులై అన్నమాట నిలబెట్టాలి మీరు. మీకు తెలియని ఔచిత్యాలు లేవు. మీదర్శనం చేసుకున్నాను నేను. అంచేత అనుగ్రహించి మంత్రులై నాసైన్యాలు నడిపించాలి మీరు. పాండవు లొకటీ కౌరవు లొకటీ కాదు మీకు. భక్తితో వేడుకుంటున్నాను. పరిగ్రహించాలి నన్ను" అన్నాడు.

"అవును. నామనస్సులో రవంత భేదం లేదు. పాండవులెంతో మీరూ అంతే నాకు. కాబట్టి నీ కోరిక నిజంగా సబబుగానే వుంది. నువ్వే ముందు నన్ను కలుసుకున్నావు. కనక నువ్వు కోరినట్టే చేస్తాను. సందేహించకు. ఇదే కాకండా ఇంకేమైనా వుంటేకూడా చెప్పు. తప్పకండా చేస్తాను" అన్నాడు శల్యుడు.

దుర్యోధనుడి ఆనందానికి మేర లేదు. "నా అమాత్య పదవి స్వీకరించి నన్ను మన్నించడం కంటె నాకు కావలిసింది మరొకటేముంటుంది! ధన్యుణ్ణయాను" అన్నాడు.

కులాసాగా అతడి వీపుతట్టాడు శల్యుడు. "హస్తినాపురానికి వెళ్ళిపో నువ్వు నేనువెళ్ళి పాండవుల్ని చూసి వస్తాను వాళ్ళను చూడకతీరదు" అన్నాడు "మంచిది. వెళ్లి వేగం తిరిగిరండి. వరం మాత్రం మరిచిపోకండి. మీ భరోసామీద వుంటానుమరి. దయ వుంచండి" అన్నాడు దుర్యోధనుడు మందహాసం చేసి ఆలింగనం చేసుకున్నాడు శల్యుడు "సందేహించకు వెళ్లు" అన్నాడు. దాంతో సెలవు తీసుకుని ఇంటిముఖం పట్టాడు దుర్యోధనుడు

తరవాత ఉపప్లావ్యం వచ్చాడు శల్యుడు. శిబిరంలో ప్రవేశించి, ధర్మరాజు మందిరానికి వెళ్లాడు తమ్ములూ, ద్రౌపదీ, సుభద్రా అభిమన్య ప్రభృతికుమారుళ్ళూ-అందరితో కలిసి ఎదురువచ్చి ప్రణామ పూర్వకంగా తీసుకువెళ్ళాడు ధర్మరాజు బంగారం ఆసనం వేసి, అర్ఘ్యపాద్యాదు లిచ్చి కుశలప్రశ్న చేశాడు అందరినీ యథాపూర్వకంగా అభినందించి ధర్మరాజును మళ్ళీమళ్ళీ ఆలింగనం చేసుకున్నాడు శల్యుడు

"మేమంతా కుశలంగానే వున్నాం నిర్జనమైన ఘోరారణ్యాల్లో తమ్ములతోనూ, ద్రౌపదితోనూ ఇంతకాలం వాసం, ఎన్నికష్టాలు అనుభవించావో నువ్వు! అందులోనూ ఇలాంటి ప్రకాశవంతమైన శరీరాలతో మీరు నిర్విఘ్నంగా సంవత్సరకాలం అజ్ఞాతవాసం చేశారంటే అది మీ సత్యనిష్ఠవల్ల సాధ్యమైంది కాని మరోటి కాదు నీదుఃఖానికి ఈప్రపంచమంతా దుఃఖించింది ఇన్నాళ్లకైనా ఈకష్టాలలోంచి బైటపడ్డందుకు పరమానందంగా వుంది" అన్నాడు. ఇలా కుశల ప్రశ్నలు జరిగాక దారిలో దుర్యోధనుడు కలుసుకోవడమూ, తన్ను అమాత్యుడిగా వుండమని ప్రార్థించడమూ, దానికి తాను సమ్మతించడమూ వివరించి చెప్పాడు శల్యుడు. అంతా విని "మీరు చేసింది మంచిపనే" అన్నాడు ధర్మరాజు "ఒకరు చేసిన మంచిపనికి మెచ్చుకుని వారి కోర్కె తీర్చడం ఉత్తముల లక్షణం. ఇది నాకుకూడా

సంతోషంగానే వుంది. ఐతే, నాది ఒక్క ప్రార్థన మాత్ర ముంది, వినండి అర్జునుడికి సారథ్యం చేయడానికి సమ్మతించాడు శ్రీకృష్ణుడు. అర్జునుడంటే పాములా పగపట్టినవాడు కర్ణుడు. వీళ్లిద్దరికీ యుద్ధమైనపుడు కృష్ణుడితో ప్రతిసారథ్యం చెయ్యాదగ్గ వారు మీరుతప్ప మరొకరు లేరు వాళ్లక. అంచేత, కర్ణ సారథిగా వుండడం మీకు తప్పనిసరి అయి తీరుతుంది. ఆసమయంలో నిరుత్సాహకరమైన మాటలాడి కర్ణుడి మనస్సు కలతపెట్టి అర్జునుణ్ణి రక్షించాలి మీరు. అకృత్యమని అనుమానించక నాప్రార్థన ఈ మాత్రం మన్నించాలి'' అన్నాడు.

''అవును, నువ్వన్నది సంభవమే'' అన్నాడు శల్యుడు, దుర్యోధనుడు చెపితే కాదనడానికి వీలుండదు. అలా కర్ణుడి సారథిని కావడమే తటస్థిస్తే తప్పకండా అర్జునుణ్ణి కాపాడతాను దుర్ణయశీలుడైన కర్ణుణ్ణి కర్ణకఠోరంగా మాటాడి కలతపెడతాను. వాడి గర్వానికి తగ్గపని వాడికి చేస్తాను శరసంధానానికి చేతులాడకండా నిరుత్సాహ పరుస్తాను. అలాంటి అవకాశం అంకించుకొని కిరీటిశర పరంపర కబళిస్తుంది వాణ్ణి.

''ఇదే అన్నమాటేమిటి, నువ్వేది కోరితే అదే చేస్తాను. అవాళ సభలో కర్ణుడు మిమ్మల్ని అన్నమాటలు విన్నప్పటినుంచీ మా హృదయాలు కుతకుత లాడుతూనే వున్నాయి. మాఅందరి మనస్సులూ నాటినుండి మీపక్షంగానే వున్నాయి. అదీకాక, మీరు పడ్డ పాట్లు ఎవర్ని కరిగించవని! 'ఇలా బాధలపాలయా' ననిమాత్రం కష్ట పడకు నువ్వు. ఇకముందు నీ మనోవాంఛ లన్ని ఫలవంత మై తీరుతాయి. మానవులమైన మన మే అన్న మాటేమిటి, దేవతలే ఒక్కొక్కప్పుడు ఆపదల పాలుకావడం కద్దు. దేవేంద్రు డంతవాడు ఒకప్పుడు భార్యాసమేతంగా నానాఅవస్థలూ పడ్డాడు. ఇంద్రుడి సంపద కంటే మీ సంపద అధికం కాదుకదా!

"ఇంద్రుడు కష్టాలపాలయిన ఉదంతం పురాతనమయిన ఇతిహాసగాథ. ఈసమయంలో మీరు తప్పకుండా వినవలసింది. దండయాత్ర ప్రారంభించేముందు ఈగాథ వినడం విజయకారణం కూడాను. చెపుతాను విను.

## నహుష చరిత్ర

"పూర్వం త్వష్ట అనే ఆయన దేవతల్లో మాన్యుడిగా వుండేవాడు. ఆయన ఒకసారి దేవేంద్రుడిమీద కత్తికట్టాడు. ఆ కత్తి తీర్చుకోడంకోసం మూడుతలలవాణ్ణి ఒకణ్ణి సృష్టించాడు. వాడికి విశ్వరూపుడని పేరు పెట్టాడు విశ్వరూపుడు ఇంద్రపదవికోసం ఘోరమైన తపస్సు ప్రారంభించాడు. అదిచూసి ఇంద్రుడు భయపడ్డాడు. అతడి తపస్సు భంగపరచడంకోసం అప్సరస్త్రీలని పంపాడు. వారి విలాసాలికీ, విహారాలికీ, విలోకనాలికీ, వికారాలికీ విశ్వరూపుడు చలించలేదు. దాంతో సిగ్గుపడిపోయాడు ఇంద్రుడు. విచారించి విచారించి తుదకి తెగవేశాడు విశ్వరూపుణ్ణి. ఇలా తపోనిష్ఠుడైన ముని హత్యాకపాల్పడి, ధర్మరహితుడయినా, ఎవ్వరికీ తెలియకుండా ఓసంవత్సరకాలం గడిపాడు. ఈ విషయం తెలిసి భూతగణాలు ఆక్రోశించడం ప్రారంభించాయి. తన దుష్కర్మ బయటపడడానికి భయపడి ఒక విషమవ్రతం చేసి, మునిహత్యాదోషం సముద్రాలికీ, వృక్షాలికీ, స్త్రీజనానికీ, భూమికీ పంచిపెట్టి తనకల్మషం వొదిలించుకున్నాడు దేవేంద్రుడు. ఎప్పటిమల్లేనే ఉల్లాసంగా వుండడం మొదలుపెట్టాడు.

"అదిచూసి మరింత మండిపడ్డాడు త్వష్ట. 'తపస్సులో వున్నవాణ్ణి. ఏ అపరాధమూ తెలీనివాణ్ణి హత్యచేసిన ఈపాపాత్ముణ్ణి అమాంతంగా మింగేసే మహాకాయుణ్ణి ఈ క్షణంలో పుట్టిస్తాను. చూడండి' అని మహానిష్ఠతో అగ్నిగుండం వెలిగించి ఒక యజ్ఞపుత్రుణ్ణి పుట్టించాడు లోకవిఖ్యాతిగా వాడికి 'వృత్రుడు' అని పేరుపెట్టాడు.

నా తపోబలంచేత మహాతేజశ్శాలివై దేవేంద్రుణ్ణి జయించు'' అని దీవించాడు. ఇంద్రుడి మీదికి విడిచిపెట్టాడు.

''విడవడమే తడువుగా జబ్బలు చరుచుకుంటూ ఇంద్రుడి మీదికి పరిగెత్తాడు వృత్రాసురుడు. ఇంద్రుడూ ఎదిరించి యుద్ధానికి సిద్ధపడ్డాడు. వాళ్ళిద్దరికీ ఘోరమైన యుద్ధంజరిగింది. ఆయుద్ధంలో ఉగ్రుడై అమాంతంగా ఇంద్రుణ్ణి మింగేశాడు వృత్రుడు.

''దాంతో దేవతలు భయపడిపోయారు. వృత్రాసురుడికి ఆవలింత వచ్చేటట్టు బద్ధకం కలిగించారు. ఒళ్ళు విరుచుకుంటూ బద్ధకిస్తూ పెద్దగా ఆవలించాడు వృత్రుడు అది కనిపెట్టి చప్పున సూక్ష్మశరీరంతో వృత్రుడి గర్భంలోంచి వురికి, పైకి చక్కా వచ్చాడు దేవేంద్రుడు. అలావచ్చి మళ్ళీయుద్ధానికి సిద్ధపడ్డాడు. తండ్రి త్వష్టప్రజాపతి తపోబలంచేత అంతకంతకీ వృత్రుడి బాహుబలం అధికమవుతూ వచ్చింది. వృత్రుడి ప్రతాపం భరించలేకపోయాడు ఇంద్రుడు. కాళ్ళకు బుద్ధిచెప్పి మందరపర్వతశిఖరంమీద దాగున్నాడు. దేవతలభయానికి మేర లేకపోయింది. వెదక్కుంటూ వెళ్ళి ఇంద్రుణ్ణి కలుసుకున్నారు అందరూ కలిసి వృత్రాసురుణ్ణి ఎలాచంపడమా అని ఆలోచించారు.

''మన మెంత విచారించినా లాభంలేదు. అందరం కలిసి విష్ణుమూర్తి దగ్గిరికి వెళ్ళి మొరపెట్టుకుంటే, అత డేదన్నా ఉపాయం చెబుతాడు బదికిపోతాం'' అన్నాడు ఇంద్రుడు. 'అవును, ఇదే బావుంది' అని దేవతలూ, మునీశ్వరులూ అందరూ కలిసి దేవేంద్రుణ్ణి వెంటపెట్టుకుని విష్ణుమూర్తి దగ్గిరికి వెళ్లారు. వృత్రాసురుడి సంగతంతా చెప్పి 'దేవా, రాక్షససంహారం చేసి ఇంద్రపదవిని రక్షిస్తూ వుండడం నీకు సహజం కదా! ఈ వృత్రాసురుణ్ణి సంహరించి లోకాలికి ప్రమోదం చేకూర్చవలిసింది' అని ప్రార్థించారు.

"దానికి 'ఓ ఉపాయం చెబుతాను వినండి' అన్నాడు విష్ణుమూర్తి. 'వృత్రుడికీ ఇంద్రుడికీ స్నేహం కలపండి. సమయం కనిపెట్టి నేను మెల్లిగా వజ్రాయుధంలో ప్రవేశిస్తాను. నా తేజోవిశేషంవల్ల ఇంద్రుడికి నూతనోత్సాహం కలుగుతుంది. దాంతో అనాయాసంగా శత్రుసంహారం చేస్తాడు' అని వాళ్లందరినీ ఓదార్చి పంపాడు.

"సంతోషంతో దేవతలంతా తిరిగివచ్చి వృత్రుడిదగ్గిరికి మునీశ్వరుల్ని పంపారు వాళ్లు సగౌరవంగా అతణ్ణి కలుసుకుని 'ఇదిగో, భుజపరాక్రమాల్లో దేవేంద్రుణ్ణి ఎవ్వరూ జయించలేరు నువ్వూ అంతటి వాడివే మరి. మీ ఉభయులూ ఎన్నాళ్లు యుద్ధం చేసినా ఒకళ్ళనొకళ్ళు జయించడం జరగదు. వ్యర్థంగా ఇలా పరస్పరం యుద్ధం చేసి లోకాన్ని బాధించడం దేనికి? ఎంతయినా స్నేహంతో శత్రుత్వం సాటిరాదు కదా! అంచేత, దేవేంద్రుడితో నేస్తంకట్టి మహావైభవాలు అనుభవించడం మంచిది నీకు. ఉభయులికీ ఇది క్షేమం కూడాన్ను' అన్నారు

"అదివిని 'ఆధిపత్యంకోసం ఆసపడుతూన్న మా ఇద్దరికీ స్నేహమెలా కుదురుతుంది? మీ వెర్రిగాని!' అన్నాడు వృత్రుడు

" 'సత్పురుషుల సాంగత్యం సంభవించినప్పుడు కాదనడం నీతిమంతుల లక్షణం కాదు సమస్తలోలికీ సమ్మతమైన సద్భావం కలవాడు దేవేంద్రుడు అతడితో నేస్తంకట్టడం సర్వవిధాల క్షేమం నీకు' అని నచ్చచెప్పారు మునులు చివరి కెలాగో ఒడబడ్డాడు వృత్రుడు. కాని ఓషరతుమాత్రం కోరాడు 'నేనొకటి చెబుతాను వినండి కాదనకండా అది మీరు చేసిపెట్టి, తరవాత మా ఇద్దరికీ స్నేహం కుదర్చండి. అది ఏమిటంటారా, తడిగావున్న దానితోగాని, పొడిగావున్న దానితోగాని చావకూడదు నేను. కర్రతోగాని, పాషాణంతోగాని, శస్త్రాస్త్రాలు వేటితోగాని, పగలుగాని, రాత్రిగాని చావుండకూడదు నాకు. ఈవరంమాత్రం కావాలి నాకు' అన్నాడు.

"'సరే' అని అంగీకరించారు మునీశ్వరులు. అతడు కోరిన వర మిచ్చారు. ఇంద్రవృత్రులికి నేస్తంకలిపి తమ నివాసాలికి వెళ్ళి పోయారు.

"ఇలా, ఉపద్రవంనుండిమాత్రం విముక్తి పొందాడు దేవేంద్రుడు. సుఖంగా ఎంతోకాలం గడిపాడు అయినా, మనస్సులో శత్రుత్వం కుములుతూనే వుంది విష్ణుమూర్తి చెప్పినమాటలు గుణించుకుంటూ మునులుచేసిన సంధి తెలుచుకుంటూ, వృత్రసంహారంకోసం రంధ్రా న్వేషణ చేయడం మొదలు పెట్టాడు ఓనాడు సాయంకాలం సముద్ర తీరంలో వృత్రుణ్ణి చూశాడు 'ఇది రాత్రీ కాదు, పగలూ కాదు. బావుంది. ఈసమయంలో వీణ్ణి నా వజ్రాయుధంతో కాజేస్తాను. అయితే వీడు ఆయుధాలతో చావడు. చంపడానికి ఏదోఒక సాధనం కావాలికదా!' అని ఆలోచించాడు. ఇంతలో సముద్రంనురుగు తన కంటపడింది 'ఇది తడిదీ కాదు, పొడిదీ కాదు' అని నిశ్చయించి ఆ నురుగుతీసి వజ్రాయుధానికి తగిలించాడు. ఉత్తరక్షణంలో వృత్రుడి మీదవేసి కొట్టాడు. ఆ క్షణంలో విష్ణువు కూడా సముద్రంనురుగుతో వజ్రాయుధంలో ప్రవేశించి వృత్రాసురుణ్ణి సంహరించాడు. వృత్ర వధతో లోకాలన్నీ కుదుటపడి మహోజ్జ్వలమైన ఆనందం అనుభ వించాయి బహ్మానందంపొంది మనసా విష్ణుమూర్తిని పూజించాడు దేవేంద్రుడు

"'దేవేంద్రు డిలా బ్రహ్మహత్య చెయ్యడం అన్యాయం' అని భూతసంఘాలు నిందాఘోష చేశాయి దాంతో ఇంద్రుడి సిరీ, సంపదా, ప్రభుత్వమూ అన్నీ నాశనమయాయి. ఈ సంభవించిన నీచదశ సహించలేక నిషధపర్వతంమీద అజ్ఞాతవాసానికి వెళ్ళిపో యాడు దేవేంద్రుడు, అమరావతిలో అరాచకం వచ్చిపడింది. అంతః కలహాలతో ఒకళ్ళనొకళ్లు పీడిస్తారని భయపడ్డారు దేవతలు. తమకు ఏలికగా స్వర్గాధిపత్యం వహించడానికి అన్నివిధాలా తగినవాడు నహుషుడని నిర్ణయించారు. మునీశ్వరులతో కలిసి అంతరూ నహుషుడి

దగ్గిరికి వెళ్ళారు. ఇంద్రుడి వైనం తెలియచేసి 'మీరు వచ్చి దేవేంద్రపదవి స్వీకరించాలి. మమ్మల్ని పాలించాలి' అని కోరారు. అంతా విని, 'మానవుణ్ణి దేవేంద్రపదవికి తగిన మాహాత్మ్యం నాలో లేదు. నన్నెందుకు బాధపెడతారు?' అన్నాడు నహుషుడు అంతమాత్రాన వూరుకోలేదు దేవతలు యముడూ, వరుణుడూ, మొదలైన దేవతలంతా తమ శక్తిప్రభావాలు మహామునుల ఎదట నహుషమహారాజుకి పంచియిచ్చారు ఇలా అతణ్ణి మహాతేజోవంతుణ్ణి చేసి, సగౌరవంగా తోడుకువెళ్ళి స్వర్గరాజ్యానికి అభిషేకం చేశారు. ధర్మపరుడై, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, సిద్ధ, సాధ్య, విద్యాధరాది సమస్త దేవయోనులనుంచిన్నీ తేజోభాగాలుగా పుచ్చుకున్నాడు నహుషమహారాజు మహానుభావుడై, మరో మానవుడికి లభ్యంకాని దేవేంద్రపదవి స్వీకరించాడు

"తుంబురుడూ, నారదుడూ మొదలైన మునుల వినోదాలిక సంతోషిస్తూ, రంభా, ఊర్వసీ మొదలయిన అప్సరస్త్రీలతో అభిమతమయిన భోగాలు అనుభవిస్తూ క్రమంగా మదం సొచ్చాయి, తుదకి కామాధీనుడయి పోయాడు నహుషుడు ఓనాడు శచీదేవి అతడికంట పడింది అంత అందకత్తెని అతడెప్పుడూ చూడలేదు ఆమెని చూడడంతోనే మనస్సు పట్టుతప్పిపోయింది అతగాడికి కామాంధకారం కన్నులుకప్పింది

"స్వర్గాధిపతినైన ఇంద్రుణ్ణికదా నేను శచీదేవి ఇంద్రాణి కదా మరి స్వర్గరాజ్యలక్ష్మితోపాటు ఈమెకూడా నన్ను పొందడానికి రాదేం?" అని భావించుకుని ఆమెని రమ్మన్నాడు

"దాంతో భయపడి బృహస్పతి ఇంటికి పారిపోయిందామె తన సతీత్వం కాపాడమని బతిమిలాడిందతణ్ణి ఆదరించి వోదార్చాడు బృహస్పతి 'భయపడకు నీకే ప్రమాదమూ రాకండా చూస్తాను తిరిగీ మన దేవేంద్రుడు మనకువచ్చేటట్టుకూడా ప్రయత్నిస్తాను' అన్నాడు

"ఇదంతా తెలుసుకుని మండిపడ్డాడు నహుషుడు. 'నేను పిలిచిన స్త్రీని తనఇంట్లో వుంచుకోడం న్యాయమేనా బృహస్పతికి ?' అన్నాడు. అదివిని దేవతలూ మునులూ నహుషుణ్ణి వారించారు 'నీఅంతటి మహనీయుడికి పరస్త్రీమీద వాంఛకలగడం ధర్మంకాదు' అన్నారు

"'ఓహో, అవాళ గౌతముడి పెళ్లాన్ని చెరపట్టినపుడు ఇంద్రుడితో ఈ నీతులు ఏకరువుపెట్ట లేకపోయారో!' అని అగ్గిమీద గుగ్గిలంలా భగ్గుమన్నాడు నహుషుడు క్షణంలో వాళ్ళంతా హడిలిపోయి శచీదేవిని తెచ్చి అతడికి అప్పగించాలని బృహస్పతి ఇంటికి వెళ్ళారు 'నహుషమహారాజు ఇప్పుడు దేవేంద్రపదవిలో వున్నాడు అందుచేత ఇంద్రాణి శచీదేవి లోకధర్మప్రకారం అతణ్ణి వరించడం న్యాయం. కనక ఈమెని తీసుకువెళ్ళి అతడికి సమర్పించు'' అన్నారు.

"ఈమాటలు విని దుఃఖిస్తూ బృహస్పతివెనకని చేరింది శచి 'నన్ను నహుషుడివాలు చెయ్యడం న్యాయం కాదు 'శచి' అంటే 'శుచి' అనే మీ మాట అనృతం కాకుండా కాపాడండి' అంది. వచ్చిన దేవతల్నీ మునుల్నీ చూసి హేళనగా చిన్న మందహాసం చేశాడు బృహస్పతి 'అవును, పంపించినవాడా, నహుషమహారాజుగారాయె! వచ్చినవాళ్ళా, లోకధర్మం తెలిసిన సర్వజ్ఞులాయె! కార్యమా, లోకహితంకోసమె ఆయె! మనకమాత్రం ఇది శిరోధార్యం కాకపోతే ఎలామరి!' అన్నాడు. 'ఐతే, ఇపుడు కర్తవ్యమేమిటో నువ్వేచెప్పు' అన్నారు దేవతలు. 'ఏమీ అక్కర్లేదు ఆమె స్వయంగా నహుషుడి దగ్గిరికి వెళ్ళి సాకుచెప్పి వస్తుంది. తరవాత దేవేంద్రుడికోసం మనమంతా ఏంచెయ్యాలో విచారిద్దాం' అన్నాడు బృహస్పతి అని సమ్మతించి వచ్చిన దారినే వెళ్ళిపోయారు వాళ్ళు.

"బృహస్పతి చెప్పినప్రకారం నహుషుడిదగ్గిరికి వెళ్ళిందిశచీదేవి. ఆమెనిచూసి కామాతురుడైపోతూ నహుషుడు విలాసంగా చూడ్డం

మొదలుపెట్టాడు అన్నీ కని వింటూ నెమ్మదిగా చెప్పడం ప్రారంభించింది శచీదేవి 'ఇదిగో, ఇంద్రుడు నిజంగా ఎక్కడవున్నదీ లేనిదీ సరిగ్గా తెలుసుకుని వచ్చి, తర్వాతగా నిన్ను చేరడం మంచిది. అంతేకాని, ఓపిక్కూ లేకుండా నువ్విలా తొందరపడితే ఎలా? నీకు తెలియకుండా ఏముంది గనక! కనక నాకు కొంతకాలం గడువివ్వడం న్యాయం నీకు' అని నచ్చ జెప్పింది ఎలాగో వొడబరిచి తిరిగివచ్చేసింది

"తరవాత దేవతలూ ఋషులూ కలిసి రహస్యంగా విష్ణుమూర్తి దగ్గిరికి వెళ్ళారు. ఇంద్రుణ్ణి పాపవిముక్తుణ్ణి చేయవలసిందని కోరారు 'అశ్వమేధయాగం చేస్తే ఇంద్రుడికి పుణ్యోదయమవుతుంది' అని చెప్పాడు విష్ణుమూర్తి వెంటనే వాళ్ళందరూ దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళారు అతడిచేత అశ్వమేధయాగం చేయించారు ఇంద్రుడు పాప విముక్తుడయాడు. తక్షణం అమరావతికి వచ్చాడు. నహుషుణ్ణిచూసి అతడి తేజస్సుకి గడగడలాడిపోయాడు ఋషినిచంపిన పాపంనుండి విముక్తి పొందినా నహుషుడంత బలం తనకి లేకపోడంచేత భయపడి మళ్ళీ ఎక్కడికో పారిపోయాడు

"భర్త మళ్ళీకనపడకపోడంతో శచీ ఏడుస్తూ కూమంది శచీ దేవి. ఆరాత్రి ఉపశ్రుతిని ఆరాధించింది. ఉపశ్రుతి ప్రత్యక్షమైంది చూసి 'ఎవరునువ్వు' అని ప్రశ్నించింది శచీదేవి 'నీ పాతివ్రత్యానికీ, నీ భక్తికీ మెచ్చి నీకు ప్రత్యక్షమయాను నేనే ఉపశ్రుతిని. నీ భర్తని చూపిస్తాను, నాతోరా' అంది ఉపశ్రుతి ఆమెని వెంటబెట్టుకుని బయల్దేరింది. హిమాలయానికి ఉత్తరంగా ముంజివంతం అనే పర్వతానికి తీసుకువెళ్ళింది. అక్కడ నూరు యోజనాల విస్తీర్ణమైన ఒక సరోవరంలో ప్రవేశించింది. అందులో ఏమురంగులతో కలకలలాడుతూ వున్న మంచి మంచి పద్మపుష్పాలుచూసింది ఒక పద్మనాళంలోంచి

బయలుదేరింది. శచీదేవికూడా ఆమె వెంట అలాగే వెళ్ళి ఆ కమల నాళంమధ్య సూక్ష్మరూపంలో వున్న దేవేంద్రుణ్ణి చూసింది. అంతలో ఉపశ్రుతి అంతర్ధానమైంది.

"ఇంత గహనప్రదేశంలోవున్న భర్తని చూడగలిగినందుకు తన పూర్వసుకృతాన్ని పొగుడుకుంటూ నిలుచుంది శచీదేవి. చూసి ఆశ్చర్యంతోనూ, ఆదరంతోనూ చేరదీశాడు ఇంద్రుడు. 'ఇక్కడ వున్నానని ఎలా తెలుసుకున్నావు? ఇంతకూ, ఇలారావడంలో కారణం?' అని అడిగాడు. నహుషుడు తనని చూసి కామాతురుడు కావడం, తాను బృహస్పతిపంచని చేరడం సాకుచెప్పి తప్పించుకోడం, ఉపశ్రుతి ప్రత్యక్షమై అక్కడికి తీసుకురావడం – అంతా వివరించి చెప్పింది శచి. 'నువ్వింక బయటికివచ్చి, నహుషుణ్ణి వెళ్ళగొట్టి నన్ను రక్షించకపోతే ప్రమాదం తప్పదు' అనికూడా చెప్పింది.

'నహుషుడి తేజోబలం అఖండంగా వుందిపుడు. అంచేత తగిన సమయంకోసం కనిపెట్టుకు వున్నాను నేను. సమయం దొరికేవరకూ శత్రువుప్రభావం సహించుకోవాలి అదే నీతిమార్గం ఐతే, నేను చెప్పినట్టు ఒకపనిచెయ్యి. తిన్నగా వాడిదగ్గిరికి వెళ్లి 'నన్నెలాఅయినా పొందాలనివుంటే, లక్షణం మునీశ్వర్లని వాహనంగా చేసుకుని నా దగ్గిరికిరా' అని చెప్పు దాంతో అన్నీ చక్కబడతాయి' అన్నాడు.

'సరే' అని నహుషుడిదగ్గిరికి వచ్చింది శచి ఆమెనిచూసి రెండు చేతులూ చాచి కౌగిలించుకోబోయాడు నహుషుడు. 'ఆగు' అంది నవ్వుతూ శచి. 'మన మేర్పరుచుకున్న గడువు మరికొద్ది కాలమే వుంది. ఆ కాస్తా తీరిపోగానే నిన్ను వరిస్తాను ఐతే, నా దొక సరదావుంది. నువ్వు మునీశ్వరుల్ని వాహనంగాచేసుకుని నాదగ్గిరికిరావాలి. ఇంకొకరికి సాధ్యంకాని ఋషివాహనం ఎంతో ముచ్చటగా వుంటుంది నీకు' అంది.

''సంతోషంతో కిందూమీదూ కనపడలేదు నహుషుడికి. 'నేను కాకపోతే మరెవ్వ డెక్కడగలడు ఋషివాహనం! ఇదెంతలోమాట ? పల్లకీఎక్కి సప్తర్షులతో మోయించుకుని, వూరేగుతూ నీ ఇంటికి వస్తాను చూస్తూవుండు. వెళ్లు' అన్నాడు. వెంటనే మునీశ్వరుల్ని పిలిపించాడు. పల్లకీ ఎక్కి వాళ్లచేత మోయించుకుంటూ అమరావతి పురవీథుల్లో వూరేగడం మొదలు పెట్టాడు.

''ఇంతలో బృహస్పతి దగ్గిరికి వచ్చింది శచీదేవి. 'నహుషుడికి పెట్టిన గడువు గడిచిపోయింది నా భర్తని దయతో అనుగ్రహించండి శరణాగతురాల్ని, నన్ను రక్షించండి' అంది 'నహుషుడివల్ల రావలిసిన ప్రమాదమేదో రానీ, భయపడకు. వాడి పతనంకోసం యాగం చేస్తాను. దానివల్లా, ముని వాహనంవల్లా అధఃపతనం కలుగుతుంది. వాడికి. నీ భర్త వునికికూడా ఇంతలో కనుక్కుంటాను' అని వోదార్చాడు. వెంటనే అగ్నిహోత్రుణ్ణి అర్చించి, ఇంద్రుడి సంగతంతా చెప్పి అతణ్ణి వెదకడానికి పంపాడు.

''ఆడవేషం వేసుకుని బయల్దేరాడు అగ్ని. మనోవేగం కలవాడు కావడంచేత క్షణాలమీద ప్రపంచమంతా వెదికాడు. ఎక్కడాఇంద్రుడి జాడ కనపడలేదు తిరిగి బృహస్పతిదగ్గిరికివచ్చి మదివివిరిచాడు 'లోకమంతా గాలించాను ఎక్కడా కనిపించలేదు. నేను ప్రవేశించరాదు కాబట్టి ఒక్క నీళ్ళలోమాత్రం వెదకలేదు. రాళ్ళలోంచి లోహాలూ, నీళ్ళలోంచి అగ్నినైన నేనూ ఉద్భవించాము. మా ప్రతాపం అన్నిచోట్లా చెల్లుతుంది కాని, మా జన్మస్థలాల్లో మాత్రం నశిస్తుంది. నీరు నాకు నాశనహేతువన్నది జగమెరగిన రహస్యంకదా!' అన్నాడు.

''అగ్నిమాటలు సగౌరవంగావిని మందహాసంచేశాడుబృహస్పతి. 'పావకా, నీ సాన్నిధ్యమాత్రంచేతనే జంగమస్థావరాలు సమస్తమూ కలకలలాడతాయి. క్రతువులూ, వేదాలూ—అన్నీ నువ్వేకదా! నీళ్ళ

నీవల్ల నే పుట్టాయి.విశ్వవ్యాపుడివి నువ్వు. అలాంటి నీకు వెళ్ళరానిస్థల మంటూ ఒకచెలా వుంటుంది ? బాగా ఆలోచించు. నిస్సం దేహంగా నీళ్ళలోకీ వెళ్ళి ఇంద్రుణ్ణి వెదుకు. వెళ్ళు నేనిక్కడ మంత్రాలతో బలం కలిగిస్తూవుంటాను నీకు ' అన్నాడు.

''మళ్ళీ బయల్దేరాడు అగ్ని. నదీనదాలూ, చెరువులూ, సముద్రాలూ, సరస్సులూ—అన్నీ గాలించి గాలించి, తుదకి దేవేంద్రుడున్న సరోవరం ప్రవేశించాడు. ఐదురంగుల పద్మాలు పరికించాడు. అందులో ఒక పద్మనాళంలోవున్న ఇంద్రుణ్ణి కనుక్కున్నాడు. వెంటనే బృహస్పతి దగ్గిరికి వచ్చి తెలియజేశాడు విని సంతోషంతో బయలుదేరాడు బృహస్పతి. దేవతల్నీ, మునుల్నీ వెంటపెట్టుకుని ఇంద్రుడిదగ్గిరికి వెళ్ళాడు. స్తోత్రాలతో అతడికి ఆనందం కలిగించాడు. 'సురపతీ, మహనీయమైన మహేంద్రపదవి స్వీకరించవేం ? ఏలోపం వచ్చిందని నీకు! వృత్రవధవల్ల అసలు పాపమే అంటదు నిన్ను. ఏమంటావా, సముద్రం నురుగులో ప్రవేశించి, వాణ్ణి చంపింది విష్ణుమూర్తి కదా! దానివల్ల నీకు జయం కలిగిందే అనుకో, అంతమాత్రంచేత నీకు పాప మెలా వస్తుంది. ఆలోచించు ' అన్నాడు.

'' దేవగురువంతవాడు చేసిన నిర్వచనంతో దోషవిముక్తుడై స్వదేహంతో నుంచున్నాడు దేవేంద్రుడు. బృహస్పతిని పూజించాడు, కర్తవ్యం నిరూపించమన్నాడు

''' అంతా ఇతగాడికి తెలిసే వుంటుంది.ఐనా విస్పష్టంచేస్తాను ' అని ఇలా ప్రారంభించాడు బృహస్పతి.

''' నువ్వు రాజ్యం విడిచిపెట్టి మరుగుపడ్డావు స్వర్గం రక్షించే మొనగాడు లేకపోయాడు మాకు దేవతలూ, మునులూ సమావేశమై ' ఏం దారి ' అని వివరించారు. అఖండమైన బలవీర్యాలు వుంటేనే గాని ఇంద్రపదవి సాధ్యమా మరి! దేవతల్లో ఏవొక్కడూ సాహసించి

ముందుకు రాలేదు. ఇహ చేసేదిలేక మానవుడన్న సంకోచమూ మాని నహుషుణ్ణి ప్రార్థించారు. 'అశక్తు' ణ్ణని మొదట సంకోచించాడు నహుషుడు. దేవతలందరూ తమతమ తేజస్సు నుంచి కొంతకొంత ఇచ్చి శక్తిమంతుణ్ణి చేశారు వాణ్ణి. తుదకి స్వర్గాభిషేకమూ చేశారు.

" 'మహేంద్రపదవితో పాటు మదమూ హెచ్చింది నహుషుడికి. ధర్మాధర్మ విచక్షణా పోయింది. మహామునుల్ని పల్లకీ మొయ్యమన్నా డిపుడు ఇంతేనా, వాడి దుర్వినయాలు చెప్పాలంటే ఏళ్ళూ పూళ్ళూ పట్టవు. వాణ్ణిపడగొట్టడానికి మంచి అనుకూలం చిక్కిందిపుడు. అవాళ విష్ణుమూర్తి చెప్పిన ప్రకారం అశ్వమేధం చేసి నువ్వు పుణ్యవంతుడ వయావే గాని, నహుషుడు మాత్రం తేజోహీనుడు కాలేదు. అందుచేతే వాణ్ణి ఆక్రమించలేకపోయావు. ఋషుల మీద సవారీచేసి భ్రష్టుయి కూచున్నా డిపుడు. కనక సునాయాసంగా తోసేస్తావు నువ్వు. ఇదంతా అశ్వమేధఫలమే. ఇహ ఉత్సాహంగా మనం బయల్దేరడమే తరవాయి' అన్నాడు.

" ఇంతలో సోమరసం పట్టుకుని యముడూ, కుబేరుడూ, వరుణుడూ వచ్చేశారక్కడికి. అందరూ కలిసి 'నహుషుణ్ణెలా గెలవడమూ?' అని ఆలోచిస్తున్నారు ఆసమయానికే 'దేవేంద్రా, నహుషుడి పని అయిపోయింది. లే స్వారాజ్యానికి బయల్దేరు' అంటూ పరిగెత్తుకు వచ్చాడు అగస్త్యముని. వినయంగా నమస్కరించి, అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చాడు ఇంద్రుడు. 'అంత శక్తిమంతుడే నహుషుడు! ఏం వచ్చిందట మరి?' అని ప్రశ్నించాడు.

" 'మా మీద సవారీ అయి అమరావతి వీధుల్లో వూరేగాడుగా వాడు. ఏం చెప్పమన్నావు?' అన్నాడు అగస్త్యుడు, 'మేమంతా వాణ్ణి మోసిసీ్ని, మోయలేకాన్నూ ఆపసోపాలు పడిపోయాం. మూడు, బుజా లెలా వాచాయోను! అలా వాడి పల్లకీ మోస్తూ, అలిసిపోతూ

ఆమాటా ఈమాటా వాడితో వేశారు మునులు. 'గోప్రోక్షణంలో చెప్పిన బ్రాహ్మణ మంత్రాలు నువ్వు అంగీకరిస్తావటనా!' అని అడిగాను నేను. 'ఛట్, గోవుని వధించే వేదమంత్రాలవి, నేనంగీకరించను' అన్నాడు వాడు. దాంతో విమర్శకి పూనుకున్నాను నేను. 'పూర్వాచార్యులు ప్రమాణములని సిద్ధాంతంచేసిన మహామంత్రాలు నిందించడం అవివేకం' అని ఖండించాను. ఇంకేముంది! అసలేకోతి, పై పెచ్చు కల్లుతాగింది ఒళ్ళు తెలీకండా తీసిపెట్టి నా నెత్తిమీదతన్నాడు. తిరిగి చూతునుకదా వాణ్ణి, ఓనిమిషంకింగ వున్న తేజస్సు లేదు వాళ్ళో 'ఋషుల్ని పల్లకీబోయీలుగా చేశావు. వాళ్ళమంత్రాల్ని దూషించావు. నన్నిలా అవమానించావు. అంచేత స్వర్గభ్రష్టుడివి కా. భూలోకంలో పామై శాశ్వతంగా పడివుండు' అని శపించాను. శపించానే కాని వెంటనే కనికారమూ కలిగింది 'హో, పదివేలసంవత్సరాలతరవాత ధర్మరాజనే మహాపురుషుడి దర్శనం కలుగుతుంది నీకు. దాంతో శాపవిముక్తి పొందుతావు పుణ్యలోకాలూ లభిస్తాయి' అని శాపవిమోచనమూ చెప్పాను పామై భూలోకంలో పడ్డాడువాడు అలా వాడికి స్వర్భంగమైంది. ఇక మనం బయల్దేరడమే తరవాయి' అన్నాడు.

"ఓ, దేవేంద్రపరివారంలో ఆనందకోలాహలాలికి అంతం లేనట్టయింది. రంభా, మేనకా, తిలోత్తమా ఇత్యాది దేవవేశ్యలూ వచ్చి నాట్యం చేశారు అగ్నిహోత్రుడూ మొదలైన దిక్పాలకులూ – సిద్ధులూ, సాధ్యులూ, కిన్నరులూ, కింపురుషులూ–బృహస్పతీ మొదలైన మునీశ్వర్లూ జయధ్వానాలు చేశారు. ఐరావతమెక్కి దేదీప్యమానంగా అమరావతికి వచ్చేశాడు ఇంద్రుడు. శచీదేవితో కూడా యథాపూర్వంగా స్వర్గాధిపత్యం వహించాడు.

"విన్నావూ, మహేంద్రుడంతవాడు సమయం మించివచ్చి, నానా దుఃఖాలపాలై అజ్ఞాతవాసం అనుభవించాడంటే, ఇక మనమేమాత్రం!

కనకనే మీరుపడ్డ వనవాస క్లేశానికీ, సేవకులై చేసిన అజ్ఞాతవాసానికీ విచారించనే వద్దంటాను'' అని చెప్పి, సభాసదుల్ని చూసి ఇంకా ఇలా అన్నాడు శల్యుడు

''నహుషుడిలాగే నశిస్తాడు దుర్యోధనుడు ఇంద్రుడిలాగే జయశ్రీ వరిస్తాడు ధర్మరాజు సముద్ర మేఖలా మనోహరమైన భూదేవిని పరిగ్రహించి సహోదర సమేతంగా సమస్త సౌఖ్యాలూ అనుభవిస్తాడు'' అన్నాడు.

''మీ ఉపదేశం వల్ల ఎంతో తేలిక పడింది హృదయం. ధన్యుణ్ణి'' అన్నాడు ధర్మరాజు మజ్జనభోజనాదులు చేయించి సత్కరించాడు. అనంతరం హస్తినాపురానికి ప్రయాణమయ్యాడు శల్యుడు. కొంత దూరం సమాదరంగా సాగనంపాడు ధర్మరాజు. ''దయమాత్ర ముంచండి, కర్ణుడి మాట మరిచిపోకండి'' అన్నాడు. ''నీకా సందేహమక్కరలేదు'' అని సాంత్వనంగా చెప్పి ఆలింగనం చేసుకుని, సైన్యాలతో హస్తిన మార్గం పట్టాడు శల్యుడు.

శల్యుణ్ణి సాగనంపి ధర్మరాజు తిరిగివచ్చాక, ఒక అక్షౌహిణి సైన్యాన్ని వెంటవేసుకుని సమారోహంగావచ్చి చేరాడు సాత్యకి. చేది దేశాధిపతి ధృష్టకేతూ, జరాసంధుడి కొడుకు సహదేవుడూ, చెరో అక్షౌహిణి సైన్యంతో వచ్చారు. కేకయదేశాధిపతులైన అయిదుగు రన్నదమ్ములూ ఓ అక్షౌహిణిసేనతో వచ్చారు. కుమాళ్లతోనూ, జ్ఞాతులతోనూ పెద్ద గుర్రపుదళాన్ని వేసుకొని ఒక అక్షౌహిణిసైన్యంతో వచ్చిపడ్డాడు ద్రుపదుడు. తమ్ములతోనూ, కొడుకులతోనూ, కొండరాజులతోనూ ఓ అక్షౌహిణీ రాణువతో కలిశాడు విరాటరాజు. పాండ్యదేశం మొదలైన పలుచోట్లనుండి మలయధ్వజుడూ మొదలయిన రాజులు ఒక అక్షౌహిణిదండుతో వచ్చారు. ఇలా మొత్తం ఏడు అక్షౌ

ణీల సైన్యం పాండవుల పక్షంగావచ్చి సమావేశమై యుద్ధానికి వురకలు వేయడం మొదలు పెట్టింది.

ఇక అక్కడ-దుర్యోధనుడికి సహాయంగా కిరాతసైన్యం కూర్చుకుని ప్రాగ్జ్యోతిషంనుంచి ఒక అక్షౌహిణి సైన్యంతో వచ్చాడు భగదత్తుడు. బాహ్లీక దేశంనుంచి భూరిశ్రవుడూ, ఉపప్లావ్యనుంచి తిరిగి వెళ్లి శల్యుడూ ఒక అక్షౌహిణితో కలిశారు. కాంభోజ దేశాధిపతి అయిన సుదక్షిణుడనే యవనరాజూ, సింధు సౌవీర దేశాధిపులైన జయద్రథ ప్రభృతులూ రెండు అక్షౌహిణీలతో వచ్చారు. మాహిష్మతీ పురంనుంచి హైహయ దేశాధిపతి నీలుడూ, ద్వారకనుండి కృతవర్మా, ఉజ్జయినినుంచి అవంతిరాజులు విందానువిందులూ చెరో అక్షౌహిణి వేసుకు వచ్చారు. నానా దేశాలనుంచి ఎంతోమంది మరో మూడు అక్షౌహిణీల రాణువతో వచ్చి కలిశారు.

ఇలా కౌరవులపక్షాన్ని పదకొండు అక్షౌహిణీల సైన్యం చేరింది. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ-రకరకాల వాహనాలతో, పదాతులతో మహాడంబరంగా వచ్చిపడుతూన్న ఈరాణువంతా నిలవడానికి స్థలమన్నా చాలడంలేదు హస్తినాపురం చుట్టుపక్కల ముఖ్యులతోనే ఎక్కడచూస్తే అక్కడ కిటకిటలాడుతోంది. అదంతా చూసి సంతోషం పట్టలేకండా వున్నాడు దుర్యోధనుడు. కురుజాంగలంలో, రోహిత కారణ్యంలో, మరుదేశంలో, అహిచ్ఛత్రంలో, కాలకూటంలో, గంగాతీరంలో, వారణావతంలో, వటస్థానంలో – ఇలా అనేకచోట్ల విచ్చల విడిగా సైన్యాలు విడిసేటట్టు ఏర్పాటు చేశాడు ధనధాన్యాలలోపం లేకపోడంచేత ఎవరికి కావలిసిన వస్తుసామగ్రి వారికి కుక్కమురికిగా అందజేశాడు.

ఇలా వుండగా ద్రుపదుడు పంపిన పురోహితుడు తగిన విధంగా హస్తినాపురం ప్రవేశించాడు. ధృతరాష్ట్రుణ్ణి ముందు చూసి, తరవాత

భీష్మ, ద్రోణ, విదుర, కృపాచార్యుల మందిరాలికి వెళ్ళాడు. ఎవరికి తగినట్లు వారితో చెప్పవలిసినవన్నీ చెప్పి అనుకూలపరుచుకున్నాడు. దుర్యోధనుణ్ణికూడా ప్రత్యేకంగా చూశాడు, ప్రతిదినమూ వెళ్ళి మప్పితంగా ధృతరాష్ట్రుణ్ణి మెత్తబరిచి సుముఖుణ్ణి చేసుకున్నాడు.

ఓనాడు ధృతరాష్ట్రుడు నిండుకొలువులో వున్నాడు. మంత్రులూ, సామంతులూ, సేనానాయకులూ – అంతా పికపిక లాడుతున్నారు. సమయం కనిపెట్టి లంకించుకున్నాడు ద్రుపదపురోహితుడు

"ధృతరాష్ట్ర మహారాజూ, పాండురాజూ అన్నదమ్ములు కావడం చేత, వాళ్ల సంతానం తండ్రుల ఆస్తికి హక్కుదార్లన్న మాట అందరికీ సమ్మతమేగదా! అదలావుండగా, గతచరిత్రసహా మీఅందరికీ విశదమే మరి. ప్రాణాంతకమైన ఘోరకృత్యాలతో పాండవుల్ని వీళ్లుకాజెయ్యాలని ప్రయత్నించారు ఐతే వాళ్ల పుణ్యాబలంవల్లా, బాహుబలంవల్లా అవన్నీ తప్పించుకుని బైటపడ్డారు. ఎలాగో వాళ్ళ జన్మహక్కయిన స్వరాజ్యం వాళ్ళు అనుభవిస్తూ వుంటే, మోసంచేసి రాజ్యంలాక్కున్న సంగతి మీఅందరికీ తెలుసు. దీనంతటికీ ఈ వృద్ధమహారాజు తల వూపుతున్నాడంటే, ఈయన్నేమనాలో మరి మహాఇల్లాలు ద్రౌపదీ దేవి. ఆమెని నిండుసభలోకి ఈడ్చుకవచ్చి, భర్తలకళ్ళముందు బట్టలు విప్పించడం, తమ సర్వసంపదా దోచుకోడం, అడవులికి పొమ్మనడం– ఇన్నీ సహించుకున్నారు పాపం, పాండవులు. అలాంటి వాళ్ళతో ఇప్పుడయినా సంధిచేసుకోడం న్యాయమేనంటరా, కాదా? వీళ్ళ వ్యవహారం పాండవుల ప్రవర్తనా వలపక్షంలేకండా విచారించి ధృత రాష్ట్రమహారాజుని మంచిదార్లో పెట్టవలసిన బాధ్యత ఈకొలువులో వున్న మీఅందరిమీగా వుంది ప్రజానాశనానికి భయపడుతున్నారు పాండవులు అసలు కౌరవులతో కలహించడానికే ఇష్టంలేదు వాళ్ళకి ఇహా, 'వాళ్ళు అల్పసంఖ్యాకులేమో' అనీ భావించకండి మీరు. ధర్మ

బలం వారిపక్షాన్నే వుంది. అక్కడ ఏడు అక్షౌహిణీలు కూడాయనీ, ఇక్కడేమో పదకొండు అక్షౌహిణీలు వున్నాయనీ అనుకుంటున్నారేమో! వినండి, మహాబలుడు భీముడూ, సాహసంలో రసికుడు సాత్యకీ యుద్ధంలో నుంచుంటే పదకొండుకాదు, పదకొండువందల అక్షౌహిణీలతో సమానమన్న మాట మీకు తెలియంది కాదు గాండీవం పట్టుకుని కల్లెరచేస్తే అర్జునుణ్ణి ఇంకొకడు ఎదిస్తాడనుకోడం కొండలతో పొట్టేలు ఢీకొంటుందనుకోడమే కదా! పైపెచ్చు ఎన్నో ఉపాయాలు తెలిసిన వాడూ, యుద్ధరహస్యాలెరిగిన వాడూ, కళాప్రవీణుడూ, మంత్రం, తంత్రం, ధైర్యం, వివేకం – ఒకటేమిటి, సర్వవిద్యలూ కరతలామలకం చేసుకున్న వాడూ అయిన శ్రీకృష్ణుడు ఆదిక్కేవున్నాడు. ఇహ, అసాధ్యమంటూ ఏముంటుంది పాండవులికి? ఆలోచించండి. మించిరాకండానే వాళ్లని పిలిపించండి. సహృదయంగా కొంతరాజ్యం, ఎంతోకొంత వాళ్లకపంచిఇవ్వండి. ఐకమత్యంతో కలిసి వుండడమే మీకూ, వాళ్ళకీ, సమస్తభారతదేశానికీ క్షేమం'' అన్నాడు.

అంతలో భీష్ముడిలా అందుకున్నాడు. ''బ్రాహ్మడివి. బ్రాహ్మణ సహజమైన నీపరుషవాక్యాలు శ్రుతికటువుగా వున్నప్పటికీ న్యాయ సంగతంగా వున్నాయి అవును, పాండవులకో ఆపదంటూ వుండకండా, వీళ్ళూ నష్టపోకండా ఐకమత్యంతో కలిసిమెలిసి వుండడం కళ్ళ వేడుక మావంటివాళ్ళకి ఇంతమందిబంధువులూ, శ్రీకృష్ణుడివంటి చుట్టాలూ వీళ్ళంతా కలిసి సంతోషంతో కలకలలాడుతూవుంటే – అంతకంటే కావలిసిందేముంటుంది? నువ్వన్నదానిలో ఈ సభ్యులికి అసమ్మతమైంది వొకటీలేదు.

''పాండవులు ప్రతిజ్ఞకి బద్ధులై, శక్తిలేనివాళ్ళలాగ అవమానం సహించి, తలవంచుకు వెళ్ళిపోయిన అవాళటి దైన్యస్థితీ, అడవుల్లో అనుభవించిన బాధలూ, నీచమయిన సేవకావృత్తిచేసి విరాటనగ

రంలో పడ్డ అగచాట్లూ—ఇవన్నీ తెలీనివాళ్ళెవరు? ఏపాపం ఎరగని వాళ్ళని బాధించడమంటే ఎవడు హర్షిస్తాడు? వాళ్ళ తండ్రిఆస్తి వాళ్ళకి పంచిపెట్టి, తనబిడ్డలూ, తమ్ముడిబిడ్డలూ అన్న పక్షపాతం లేకండా చూడడం కనీసధర్మం ధృతరాష్ట్రుడికి. అవునూ కాదూ అన లేక జూదంలో కూచున్నాడు ధర్మరాజు. సత్యభంగానికి జడిసీ, అధ ర్మానికి భయపడి రాజ్యంపోయినా సహించుకున్నాడు ఆలిని మాన భంగం చేసినా ఓర్చుకున్నాడు. అన్నగారి మొహంచూసి ఆగి పోబట్టిగాని, అర్జునుడే అవాళ తిరగబడివుంటే ఏమైపోయేది!" అన్నాడు

"అందరికీ తెలిసేవున్న ఈవిషయాన్ని పదేపదే చర్వితచర్వణం చేయడం దేనికో అర్థంకాదు నాకు" అని కస్సుమన్నాడు కర్ణుడు. "జూదంలో రారాజుకోసమని రాజ్యం గెలుచుకున్నాడు శకుని. ధర్మ రాజు వోడిపోయాడు. ఇందులో తప్పేముంది? ఆమాటకివస్తే, అడివికి వెళ్ళినవాడు, పందెంప్రకారం గడువునిండకండా నే బైటికివచ్చి, 'తండ్రి వంతు, తండ్రి వంతు' అని అరవడం తప్పుగాని! వియ్యంకుడూ, మామగారూ వున్నారుకదా అని సాహసించి బలవంత పెడితేమాత్రం భయపడి పోయి రాజ్యం ధారపోస్తాడా రారాజు? ఎందుకీ తలాతోకా లేనిమాటలు!" అన్నాడు.

కొట్టినంత నొచ్చుకున్నాడు భీష్ముడు "ఓః, బలే వీరుడివి! పెద్దపెద్దకబుర్లు వాగుతున్నావు! విన్నవాళ్లు నవ్వగలరు. నిన్నగాక మొన్నేకదా, ఒక్కడే మన ఆరుగుర్నీ వీపుగలగొట్టాడు అర్జునుడు. అప్పుడే మరిచిపోయావో మరి! ఇక్కడమాత్రం మాటలు కోటలు దాటిపోతున్నాయి! 'గడువుతీరలేదు, గడువుతీరలే'దని ఇంకా పాత పాటే పాడుతున్నావు అవాళే దుర్యోధను డడిగితే, విడమరిచి మరీ చెప్పాను ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, నువ్వూ స్పష్టంగా విన్నారు. మళ్ళీ గడువేమిటి? గడువు!" అని ముదలకించాడు.

ప్రసంగం ముదరకండా భీష్మున్ణి వినయంగానూ, కర్ణుణ్ణి గదమాయించీన్నీ సర్దుబాటు చేశాడు ధృతరాష్ట్రుడు. తరవాత ద్రుపదపురోహితుడిదిక్కు తిరిగి నెమ్మదిగా అన్నాడు. "పిల్లలంతా కలిసివుండడమే నాఅభిమతం. ముందు నువ్వు వెళ్ళు మావాళ్ళందరితోనూ ఆలోచించి, అందరికీ నచ్చిన పద్ధతిమీద పాండవుల దగ్గిరికి మంచివాళ్ళెకర్ని పంపిస్తాను" ఇలా చెప్పి సగౌరవంగా అతణ్ణి పంపేశాడు. ధృతరాష్ట్రుడిచ్చిన బహుమానాలు పుచ్చుకుని సుఖంగా తిరిగివచ్చేశాడు పురోహితుడు. హస్తినలో తాను చాకచక్యంతో నడిపించిన కథంతా పాండవులికి వినిపించాడు.

## సంజయరాయబారం

ఇక ధృతరాష్ట్రుడు —— కుమాళ్ళనీ, బంధువుల్నీ, పెద్దల్నీ, మంత్రుల్నీ కొలువులో సమావేశపరచి సంజయుణ్ణి పిలిపించాడు. "పాండవులు ఉపప్లావ్యంలో వున్నారు. శ్రీకృష్ణుడూ అక్కడే వున్నాడు. నువ్వు వెళ్ళి ఆయనతోసహా వాళ్ళని చూసి మాటాడి రావాలి. ఏలాఅయితే వాళ్ళ విచారం పోతుందో, ఎలాఅయితే వాళ్ళ మనస్సు కుదుటపడుతుందో, అలా చెప్పిరావాలి కష్టాలనుండిగట్టెక్కి క్షేమంగా బైట పడ్డారన్న శుభవార్త విని పరమానందంపొంది మీ అయ్య పంపించాడని చెప్పాలి ముందు" అన్నాడు. సభవేపు తిరిగి ఇంకా ఇలా అన్నాడు "మంచీ చెడ్డా తెలీనివాడు మాదుర్యోధనుడు. అంచేతే ఇంతమట్టుకు వచ్చింది. పాపం, పాండవులు బుద్ధిమంతులు. ఆవగింజంత దోషంలేదు వాళ్ళది. పాలూనీళ్ళూలాగ వాళ్ళూమనం కలిసి బదకడం మంచిది. పితృభాగానికి వీళ్ళెంత హక్కుదార్లో, వాళ్ళూ అంతే హక్కుదార్లు కాగా వీళ్ళుసుఖపడడ మేమిటి? వాళ్ళు కష్టపడడ మేమిటి? తీరా ఇంతా అయాక ఇక మనల్ని నమ్మరు వాళ్ళు స్వార్థపరులమనీ, మోసగాళ్ళమనీ, మనతో కలవడానికి సమ్మతించరు.

ఐనా, ధర్మరాజంటూ వున్నాడు గనక ఫరవాలేదు. తమ్ముళ్ళి వొప్పి స్తాడన్న ధైర్యం నాకుంది ఇంతకీ, వాళ్ళవంతు వాళ్ళకి ఇవ్వకండా మనకిమాత్రం ఎలా వీలవుతుంది? కాదని దబాయించామే అనుకోండి, వూరుకుంటారా వాళ్ళు! మండిపడి గాండీవం ఎక్కుపెడతాడు అర్జునుడు. పార్థసారధిగా కూచుంటాడు శ్రీకృష్ణుడు. ఇంకేముంది, ఇటున్న లోకం అటు తిరగబడుతుంది. గదవేసుకుని ధూమకేతువులాగ కౌరవకుమాళ్ళ మీదికి ఎగపడతాడు భీముడు నా నూరుగురు కొడుకుల్నీ నురుమాడతాడు. అది తలుచుకుంటేనే వొళ్ళు గరిపొడుస్తుంది నాకు. నిజానికి వాడిముందు నుంచునే వాడెవడు? కవలవాళ్ళుమాత్రం అన్న లికి తీసిపోతారా మరి! ద్రుపదుడూ అతడికొడుకులూ సామాన్యులా! విరటుడుమాత్రం! అతడి కొడుకులూ తమ్ములూ వొకణ్ణిమించినవాడొకడు సాత్యకితో సాపత్యమే లేదు. వృష్ణికుమాళ్ళూ, పాండ్యుడూ, కేకయపతులూ—వీళ్ళంతా యుద్ధంలో వూరికేపోతారా! పోనీ, వీళ్ళందరినీ నిభాయించామే అనుకోండి, బ్రహ్మరుద్రు డయినా భరించలేని ధర్మరాజు కోపాగ్ని నిగ్రహించడ మెలాగ?

"సంజయా, నువ్వు ధర్మరాజు దగ్గిరికి వెళ్ళు. కొలువులో వుండడం చూసి కలుసుకో అతణ్ణి తనకీ తన బంధువులికీ, తమ్ములికీ నచ్చినట్టు మప్పితంగా చెప్పవలసినవన్నీ చెప్పు వాళ్ళ హృదయంలో కోపం వుండకండా, యుద్ధం అనేమాట ధర్మరాజు మనస్సులోకి రాకండా చూడు శాంతిమార్గంమీద సామోపాయంతో కార్యం నడిపించు వాళ్ళూ మనమూ ఐకమత్యంతో బతికేట్టు సంధానం చెయ్యి లే త్వరగా వెళ్ళే రథం తీసుకో. కార్యం చక్కజేసుకు రా."

ధృతరాష్ట్రుడి ఆజ్ఞప్రకారం బయలుదేరి ఉపప్లావ్యం చేరుకున్నాడు సంజయుడు. తిన్నగా కృష్ణుడి మందిరానికి వెళ్ళాడు లోపలిగదిగిళ్ళలో అర్జునుడితో వినోదాల్లో వున్నాడు కృష్ణుడు కబురుచేసి లోపలికి

వెళ్ళాడు సంజయుడు. భయభక్తులతో కృష్ణార్జునుల్ని దర్శించాడు. వాళ్ళిద్దరూ సమ్మానపూర్వకంగా చేసిన ఆదరసత్కారాలికి సంతోషించాడు. ఆదినం సుఖంగా గడిచిపోయింది

మర్నాడు ధర్మరాజు కొలువుతీరినసమయం కనిపెట్టి అతడి దర్శనం చేశాడు సంజయుడు. చేతులుజోడించి దండప్రణామం చేశాడు. గుచ్చి కావలించుకున్నాడు ధర్మరాజు. ఆదరించి కూచోపెట్టుకున్నాడు.

"నా భాగ్యంవల్ల మీ దర్శనమైంది. ధన్యోస్మి" అన్నాడు సంజయుడు. "మీ రిక్కడ వున్నారని విని, మీ క్షేమం విచారించి రమ్మని ప్రేమపూర్వకంగా నన్ను పంపించారు బాబయ్యగారు నిన్నూ తమ్ముల్నీ, ద్రౌపదీదేవినీ, కుఱ్ఱాళ్ళనీ పరామర్శించారు" అన్నాడు.

"బాబయ్యగారి దయవల్ల సుఖంగానే వున్నాం" అన్నాడు ధర్మరాజు. "నిన్నిలా పంపించినందుకు పరమానందంగా వుంది. బాబయ్యగారికి క్షేమమే కదా! కుమాళ్ళు సుఖంగా వున్నారా? మన వాళ్ళు ఆనందంగా పెరుగుతున్నారా? పట్నాలూ పల్లెలూ సురక్షితంగా వున్నాయా? ఆచార్యులు ద్రోణుడూ, ఆయనకుమారుడూ, కృపాచార్యులూ సుఖమేనా? తాతగారు కుశలమేనా? ఆయనపెద్దరికం నిలబెట్టి నడుచుకుంటున్నారా మనవాళ్ళు? పెద్దల్ని మన్నిస్తున్నారా? మే మేర్పరిచివచ్చిన మాన్యాలు నడుస్తున్నాయనే అనుకుంటాను! పై వాళ్ళవల్ల ఉపద్రవాలు లేవుకదా! శత్రువు లెపుడయినా దండెత్తి వచ్చినపుడు అర్జునుడి గాండీవం, భీముడి గదాదండం ప్రజలు తలంచడం కద్దా! నకుల సహదేవుల ప్రశంస వస్తూవుంటుందా? ఒక్కనాడా, ఒక్క పర్యాయమా—ఎన్నోసార్లు తమ కళ్లముందు అంత లేసి యుద్ధాలు గెలుచుకువచ్చిన పాండవుల్ని ఇంతలోనే మరిచిపోతారా! ఏదిమరిచినా రారాజు గొల్లపల్లెలు చూడవచ్చినప్పుడు గంధర్వులతో జరిగిన సంగతి మాత్రం మరిచిపోలేరు లే!

"సంజయా, విను, మనం మధ్యస్థులు గావుండే మాట్లాడదాం—ఇంతవరకూ అర్జునుణ్ణి ఎదిరించినవాడు ఎవడయినా బదికిపోయాడో ఏమో చెప్పు? ఇంతకీ దుర్యోధనుడి ఇంట్లో కార్యానికీ, ఖడ్గానికీ తానే అన్నట్టు కర్ణులవారి పెద్దరికం చెల్లుతోనే వుందటనా!" అని అడిగాడు.

అన్నిటికీ చేతులు జోడించే జవాబు చెప్పాడు సంజయుడు. "మహారాజుదగ్గిర మంచివాడూ, చెడ్డవాడూ అనకండా అన్నిరకాల వాళ్ళూ వున్నారు. వాళ్ళల్లో ఒకళ్ళమాట ఒకళ్ళకి పడదు. వాళ్ళ నంత అనవలిసిందీ లేదు ఇంతకీ, నా దొక్క మనవి, చిత్తగించు. కౌరవుల క్షేమం నీచేతుల్లోనేవుంది ఇన్నాళ్ళదాకా వాళ్ళు క్షేమం గావున్నా లేకపోయినా, నువ్వు చల్లగా చూస్తే చాలు. ఇవాళ నుంచీ క్షేమానికి కొదవేవుండదు.

"వార్ధక్యంవల్ల బుద్ధి అదుపులో వుండలేదు ధృతరాష్ట్రమహారాజుకి అంచేత కొడుకుల తొందరపాటు వారించలేకపోయా డప్పుడు. తరవాత ఎంతో బాధపడ్డాడు. ఇపు డిపుడే కుదటపడుతున్నాడు. ఇవన్నీ సహించడం పుణ్యమూర్తివైన నీకే చెల్లింది. నీ అజాతశత్రుత్వాం విశ్వవిశ్రుతంకదా! 'మేమిచ్చి వచ్చిన మాన్యాలు నడుస్తున్నాయా?' అని అడిగావు. ఎందుకు నడవవు? రాజా, ఎంత చెడ్డవాళ్లయినా మాన్యాలు మారుస్తారా మరి! కురుదేశస్థులే కాదు, పాండవుల్ని తలంచని ప్రజలంటూ ఏ ప్రపంచంలో అయినా ఎలా వుంటారు? శత్రువులు సందడి చేసినపుడల్లా, 'భీముడో, అర్జునుడో నకులసహదేవులో వుంటే ఎంత బావుండేది?' అని, 'కోపంవచ్చినా ధర్మం తప్పరు పాండవులు. బలవంతు లయిన్నీ శాంతమూర్తులు' అనిన్నీ మీకోసం ప్రతివాడూ పలవరిస్తూనే వున్నాడు, ఎప్పుడూకూడా.

"ధర్మరాజా, నువ్వూ, నీ తమ్ములూ మీ ఆప్తులూ, శ్రీకృష్ణుడూ—అంతా వినేట్టు నీతో చెప్పమని మహారాజు చెప్పిన మాటలు మనవి చేస్తాను, అవధరించాలి" అన్నాడు.

"ఇదిగో వీళ్ళే నా తమ్ములు. వీళ్లు ఆప్తులు. ఈయన శ్రీకృష్ణుడు. వీళ్లు సభికులు—వీళ్లంతా వింటూనే వున్నారు. ఏం సెలవిచ్చాడో రాజు, తప్పకండా చెప్పు" అన్నాడు ధర్మరాజు.

కరుకుగా వున్న ఆమాటలికి వులికిపడ్డాడు సంజయుడు. కృష్ణుణ్ణి భక్తితో పరికించాడు. భీమార్జునుల్నీ, నకులసహదేవుల్నీ, ధృష్టద్యుమ్నుణ్ణీ వినయంగా వీక్షించాడు. ద్రుపదుణ్ణి విరాటరాజునీ స్నేహ దృష్టులతో చూశాడు. ధర్మరాజు వేపు చేతులు జోడించాడు. "సావధానంగా వినండి" అని నెమ్మది నెమ్మదిగా ఆరంభించాడు. "మాయామర్మంలేని మనస్సుతో నన్ను పంపించాడు మహారాజు. నా రథంకోసం స్వయంగా తానే వచ్చి ఆజ్ఞాపించాడు దీన్నిబట్టి మీకోసం ఆయన ఎంత ఆరాటపడుతున్నదీ వేరే చెప్పనక్కరలేదు ఈ అదును పోనివ్వకండా తెలుసుకోడం మంచిదికదా! సర్వధర్మాలూ తెలిసిన మీవంటి పెద్దలు తేలికపనికి తెగించకూడదని నామనవి. మడి బట్టకి మసితాకినట్టు దుర్యోధనుడివల్ల పాలవంటి మీ కులం కళంకిత మయింది. కార్యదక్షుడివైన నీవల్లగాని ఈకళంకం తుడుచుకుపోదు.

"ఇక యుద్ధమంటారా, యుద్ధం అనర్థహేతువు. జననాశనం సర్వనాశనకారణం. గెలిచినా వోడినా సుఖమన్నది సున్న. పిల్లలనక, వృద్ధులనక, సఖులనక, బంధువులనక, పిన్నలనక, పెద్దలనక యావన్మంది నీ చంపినతరవాత మరినోల్లుకునే దేముంటుంది? ఈసమస్తభోగాలూ దేనికోసమింక? కనకనే యుద్ధమంటే వద్దంటారు ఉత్తములు.

"నిజమే, పెట్టనికోట నీకు శ్రీకృష్ణుడు. భీముడూ, అర్జునుడూ యుద్ధంలో కాకలుదీరిన చెయ్యి. సాత్యకీ, విరాటుడూ సానపెట్టిన వజ్రాయు

ధాలు, మేరుపర్వతంవంటి చుట్టం ద్రుపదుడు. యుద్ధమంటే ఇష్టపడవు గాని, నిన్ను తేరిచూసేవా డెవడు?

"ఇక అక్కడో, భీష్ములవారూ, ద్రోణులూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, శల్యుడూ తమ ప్రాణాలు దుర్యోధనుడివే అంటారు. తమ్ములు వందమందీ అక్షీణమైన పరాక్రమవంతులు. కొడుకులా అజేయులు. బాహ్లీక సోమదత్తులు బ్రహ్మదేవుణ్ణి లక్ష్యపెట్టరు. వీరందరినీ నిగ్రహించడమంటే మాటలతో అయేపనికాదు. ఇలాంటి మీ ఉభయులికీ అన్యోన్యకలహం అభిలషించదగింది కా దనే నాఅభిప్రాయం. నిష్పక్షపాతంగా ఉభయపక్షాల హితం కోరేవాళ్లని ఎవళ్ళనైనా అడగండి, ఇదే చెబుతారు

"ఇదిగో కృష్ణులికి నమస్కరిస్తున్నాను. అర్జునుడికి జోహారు చేస్తున్నాను. తక్కిన స్నేహితులికీ, బంధువులికీ, హితులికీ, ప్రియులికీ, మంత్రులికీ, వినయంగా మనవిచేస్తున్నాను. కావేమీవిడిచిపెట్టి సెలవియ్యవలిసిందని ప్రార్థిస్తున్నాను ఆగ్రహించవద్దని అంజలిబంధం చేసి నిన్ను శరణు వేడుతున్నాను. ధర్మరాజా, శాంతించు. దీనికి పితామహుడూ సంతోషిస్తాడు. అతడికి నచ్చిన విషయం సర్వలోకానికీ ఆదర్శమవుతుంది" అన్నాడు.

శాంతంగా విన్నాడు ధర్మరాజు. "సంజయా, యుద్ధం యుద్ధం అంటున్నావు. స్నేహం తప్ప ఇంతవరకూ యుద్ధమన్నమాటన్నా నానోట విన్నావా నువ్వు?" అనిఅడిగాడు గంభీరంగా. "ఐకమత్యం మాకుమాత్రం మంచిదికాదా? కయ్యంలేకండా అర్థసిద్ధి కలుగుతూ వుంటే కాదన్న వెర్రివా డెవడన్నా వుంటాడా? జగత్కల్యాణమైనవీ, అందరూ హర్షించేవీ అయిన జనమంచిపనులకోసం ప్రాణంపెట్టేవాళ్ళు భీమార్జునులంటే, వీళ్లా దుష్కర్ములికి తొంగిచూసేవాళ్ళు? ఆశపోతులూ, స్వార్థసుఖాలికని చచ్చిపడే మూర్ఖులూమాత్రం దుర్మార్గానికి

ఉత్సాహిస్తారు. అంతేకాని ఇది ఉచితం ఇది అనుచితం అనే జ్ఞానంగల బుద్ధిమంతులెందుకు పూనుకుంటారు?

"ఇక భోగాలమాట—మంచి గుడ్డకీ, మంచి కూటికీ వెలిపడి మేం దరిద్రం అనుభవిస్తూంటే, మా అయ్యకి మాల్యవస్త్రాలూ, మాల్య సుగంధాలూ, నృత్యగీతాలూ, ఎలా రుచిస్తున్నాయీ అంటాను తన కొడుకుల్ని నీడపట్టుని చేరదీసి, మమ్మల్నెందుకు అడవులికి వెడలగొట్టాడూ అని అడుగుతున్నాను. అవాళ తన కొడుకులవిషయంలో ఈ నీతులూ గీతులూ అవసరం రాలేదు. ఇవాళ మమ్మల్ని మాత్రం 'మంచిగా నడవండి' అని బుద్ధులు చెబుతున్నాడు మా అయ్య! ఏం? తన లాగే ఎదటి వాళ్ళనీ భావిస్తే బావుంటుంది. అంతేకాని 'మాకు రొట్టె మీకు ముక్కా' అంటే మనస్సు లెలా కలుస్తాయి?

"నిజమే, ఏసంపదా లేకండా కొరమాలినట్టున్నాం మేం. ఇలాంటి మమ్మల్ని వూరికేపిలిచి పూజించడానికి అంతవెర్రివాడా మా అయ్య? అవాళ అంతచెప్పినా విననివాడు ఇవాళ ఎలామారిపోతాడు? అడిఆశలు పెట్టుకువచ్చి నువ్వు మమ్మల్ని బాధించిమాత్రం ఏంలాభం? మాకు కొత్తా, నీకు కొత్తా మనవాడిసంగతి?

"విషంమింగినా తనకొడుకు సర్వసమర్థుడనేనమ్ముతాడు ముసిలాయన. అలాంటివాడు సబువుకి కట్టుబడతాడనడం సర్వాబద్ధం ఆనాడు కర్ణుడిమాటలే కర్ణపేయమనిపించాయి తనకు. 'జూదపుసొమ్ము కోసం ఆశపడకూడదు' అన్న విదురుడిఉపదేశమే చెవికెక్కివుంటే ఈచిక్కంతా ఎందుకువచ్చేది? ముందుముందూ తన కొడుకులూ, కర్ణుడూ, శకునీ ఎలానడిపిస్తే అలాగే నడుస్తాడతడు. అంతే, మరోదారికి రాడు ఉన్న రహస్యమిది.

"నువ్వేమో మంచిబుద్ధులమీద ఉపన్యాసాలిస్తున్నావు. దుర్యోధనుడి దుర్బుద్ధి మార్చ్రాందని తెలీకన్నాపోవాలి, లేదా వెర్రన్నా

అయివుండాలి నీకు కృష్ణుడంటే తూష్ణీభావంతో చూస్తాడు. అర్జునుడి మీదికి కర్ణుణ్ణి వుసిగొలుపుతాడు. రారాజుగా రాజ్యమేలాలను కుంటున్నాడు దుర్యోధనుడు!''

చెబుతూ చెబుతూ అంతలో కొంచెం కోపమూ వచ్చింది ధర్మ రాజుకి ''భీష్మద్రోణులికీ, కృపఅశ్వత్థామలికీ, కర్ణదుర్యోధనులికీ మాతో యుద్ధమంటేఏమిటో తెలియదనా? తెలుసు. ఐతే, దురాశ కాలపాశంలా లాగుతూవుంటే వాళ్ళుమాత్రం ఏంచేస్తారట! తెలిసీ తెలిసీ మృత్యుముఖాన్నే వచ్చిపడతారు. విన్నావూ, యుద్ధమెలాగూ తప్పదు. కపిధ్వజం తన కాంతులతో వాళ్లని గుడ్డివాళ్లని చెయ్యకనూపోదు.

''సంజయా, ముందు మమ్మల్ని పొగిడినట్టే పొగిడావు. ఆ వెంటనే 'వాళ్ళని నిగ్రహించడమంటే మాటలా?' అని డెకారించనూ డెకారించావు. ఏమయినా పక్షపాతంమాత్రం వదలలేకపోయావు మంచిది. గాండీవం గర్జిస్తూ నిప్పులు క్రక్కుతూవుంటే మెత్తినప్పుడుకాని, గదాదండంతో భీముడి బాహుదండం విజృంభించినప్పుడుగాని, కవల కత్తులు నల్ల తాచుల్లా నాట్యమాడినప్పుడగాని - ఈ గుండుగొమ్ముల అనుమానం తీరదు నీకు. నువ్వేచూతువుగాని అదలావుండనీ - బుద్ధిమంతుడివి, నువ్వువచ్చి కావేషీకూడదని చెప్పావు గనక నువ్వు చెప్పినప్రకారమే తప్పకుండా సహించుకుంటాం. పరాభవం పొందినా ఎన్నిసార్లు వారి దుర్గుణాలు సహించలేదు! కొంతకాకపోతే కొంతన్నా నీకూ తెలుసు కదా! ఇపుడూ అలాగే సహిస్తాము. సందేహించకు. మేమై ఒకకీడు తలపెట్టం. ఐతే, మా అయ్యకి నిజంగా మామీద విచారమేవుంటే, ఆ ప్రేమేదో వ్యక్తమయ్యేట్టు మమ్మల్ని దగ్గిరికి చేరదియ్యడం, వంతిచ్చి తీరాలని కొడుకులికి చీవాట్లు వెయ్యడం, ఇంద్రప్రస్థమో, ఇంకేదో ఓపట్టణం మాకిచ్చి ఆదరించడం తనకి ధర్మంకదా మరి!'' అన్నాడు.

దానికి మళ్ళీ ఇలా అందుకున్నాడు సంజయుడు. "ఎంతటితప్పులయినా క్షమించే శాంతమూర్తివినువ్వు. మచ్చలేనిమనుగడా, నొప్పిలేని అహింసా ఇవే చాలు నీవైభవానికి. మీవంతు మీకివ్వక దుర్మార్గులై కౌరవులు చెడదలుచుకున్నారే అనుకో, ఐతే మీవంటి సాత్వికమూర్తులికి యుద్ధంలో గెలుచుకున్న నెత్తుటికూడుకంటె తుదకి భిక్షాన్నమైనా మేలే అంటాను. అదెలా అంటావా! మనవిచేస్తాను. అంతటి రాజసూయమహాయజ్ఞం చేశావు. సకలభూతాల్నీ సంతృప్తి పరిచావు. శాంతికీ, దాంతికీ ప్రపంచంయావత్తూ జేజేలు పెట్టేట్టు బదికిన పుణ్యామూర్తివి. ఇలాంటి అకలంకమైన నీ చరిత్ర ఇవాళ హింసాకళంకితం కావడం ఏమంత గొప్ప? నీది అహింసావ్రతమే కాకపోతే, కలుషాత్ములై కపటద్యూతం పుట్టించి, ఇంతచేసినవాళ్లని ఉపేక్షించడంలో అర్థమేమిటి? రాజ్యంవిడిచి అరణ్యంలో అష్టకష్టాలూ అనుభవించడం దేనికి? ఇంతాచేసి తుదకిక్రౌర్యానికి పూనుకోడమా? గురుజనాన్నీ, బంధువర్గాన్నీ వధించి నింద్యమూ, అస్థిరమూ అయిన సౌఖ్యం పొందిమాత్రం ప్రయోజనమేముంది?

"సామాన్యులు మింగడానికి చేదైనహాలాహలంవంటి కోపం దిగమింగడంలో శివుడితరవాత నిన్నేచెప్పాలి. నువ్వే ఇపుడు శాంతించకపోతే ఇక రక్షణేలేదుమరి" అన్నాడు.

దానికి మళ్ళీ ఇలాఅన్నాడు ధర్మరాజు "నువ్వు చెప్పిందంతా నిజమే. ఐతే, కొన్నిపనులు ధర్మయుక్తంగానే వున్నట్టుండి, తీరా పరిశీలించబోతే అధర్మాలై వూరుకుంటాయి. కొన్ని పైకిఅధర్మంగా కనిపించినా విడమరిస్తే ధర్మసంగతాలనే తేలుతుంది అంచేత నన్ను నిందించాలంటే నేనుచేసేది ధర్మమో, అధర్మమో సరిగా ముందు నిర్ధారించి తరువాతమరీ నిందించు.

"కోపంకూడదు. అహింసే పరమధర్మం. నిజమే, కాని వంశ నాశకులూ, లోకకంటకులూ అయిన పాపాత్ముల్ని సమూలంగా నాశనం చెయ్యడం ధర్మమనే పెద్దలన్నారుకదా! పోనీ, అదలావుండనీ, రాజన్నవాడికి యుద్ధంచెయ్యడం ధర్మమో అధర్మమో నువ్వే చెప్పుమరి!

"ఇంతెందుకూ, – ఇదికర్తవ్యం, ఇదిఅకర్తవ్యం అని శాసించడానికి శ్రీకృష్ణుడు వుండనేవున్నాడు. మన కీవితర్క మెందుకు? ఈయన ధర్మాధర్మవిదులికి గురువు. కార్యాకార్య నిరూపకులికి శిక్షకుడు. ఉచితానుచితజ్ఞులికి ప్రదర్శకుడు ఈయన ఉపదేశంవల్లనే యాదవ, భోజ, అంధక, వృష్ణి, సృంజయ, కేకయప్రభృతి రాజలోకాలు ఉత్తమ మార్గంలో నడుచుకుంటున్నాయి. విశేషించి ఈయనబుద్ధే, ఈయన ఆదేశమే సమస్తపురుషార్థాలికీ మూలం మాకు. అంచేత ఈయన్నే అడుగుదాం. ఈయన ఏదిచెబితే అదే వేదవాక్యంగా భావిస్తాను."

ధర్మరాజు ఇలా అనడంతోనే అందుకున్నాడు శ్రీకృష్ణుడు "నేనెపుడూ పాండవులక్షేమం కోరేవాణ్ణి. కడివెడుకొడుకులతోనూ, మనవలతోనూవున్న ధృతరాష్ట్రుడికీ ఏొకకీడు రాకూడదనేవాణ్ణి అంచేతనే, ఈనాటికైనా తెలివితెచ్చుకుని నిండుమనస్సుతో నిన్ను పంపాడు కదా అని సంతోషించాను వీళ్లికి శాంతికలిగేటట్టు స్నేహం, ధర్మం చూపి, సవినయంగా, సముచితంగా నువ్వు చెప్పడమూ చూస్తే మహానందంగా వుందినాకు. అంతా పైకి సవ్యంగానేవుంది. ఐతే, ధర్మరాజు మాటల్లో సత్యంవిచారిస్తే, సంధిమాత్రం సమకూడేట్టుకనిపించదు. ఇది సహజమేమరి! ఏమంటే, ఉభయత్రా సమధర్మం ఏర్పడితేనేగాని సంధి ఎలాకుదురుతుంది? దుర్యోధనుడా పొగరుబోతాయె. ధృతరాష్ట్రుడి సంగతిమాత్రం మనకి తెలీందేముంది? వీళ్ళంటే అతగాడికి స్నేహమనీ, ప్రేమనీ తీపికబుర్లు చెబుతున్నావు నువ్వు. కాని, తమవంతు తమకు రాందే పైమెరుగులతో ఎలాతృప్తిపడతారు వీళ్లు? నువ్వే చెప్పుమరి!

"నిజమే, గతాన్ని తవ్వి లాభం లేదు. ఎలాగో వోలాగ వొడబడి కౌరవులతో కలిసి బతకడమే పాండవులికి భావ్యం. కానైతే, వంశాచారం ప్రకారం వాళ్ళ తండ్రి భాగం వాళ్ళకివ్వనప్పుడు, మరో దారి వీళ్ళకేముందో చెప్పమంటాను? అన్ని ప్రయత్నాలూ అయిపోయి తుదకి తప్పనిసరిగా యుద్ధానికి వీళ్ళు తెగించారంటే, అందులో అన్యాయంగాని, అసహజంగాని ఏముంటుంది? నన్నడిగితే, ఇలా వోపక్క అవమానం మీద అవమానంతో కుసిల్లిపోతూ, ఓపక్క మంచివాళ్ళనిపించుకోడంకంటె యుద్ధానికి వురకడమే మంచిదంటాను. 'రాజన్నవాడికి యుద్ధం చెయ్యడం ధర్మమో అధర్మమో చెప్పు?' అని ధర్మరాజు నిన్నడిగాడు కదా! వర్ణాశ్రమధర్మాలు అన్నీ సక్రమంగా నడిచేట్టు చూడవలసినవాళ్ళు రాజులు. అలాంటపుడు స్వధర్మాన్నే వాళ్ళు విడిచిపెడితే ఇక చెప్పవలసిందేమిటి? క్షత్రియుడికి క్షాత్రమే స్వధర్మం, పై చేయిగా ఇవ్వవలసినవారే కాని కింది చెయ్యగా పుచ్చుకోవలసినవారు కారు రాజులు. అంతే కాదు, న్యాయార్జితమయిన మనసొమ్ము మనంతింటూ మంచిగా బదుకుతున్నప్పుడు పై వాళ్ళు అక్రమంగా మనల్ని బాధించారనుకో. అప్పుడేం చెయ్యాలి? ఇలాంటి విషమస్థితిని ఎదుర్కోడంకోసమే కదా ఈ శస్త్రాస్త్రధర్మాలు నియమించారు మన పెద్దలు. కానప్పుడు వీటి ప్రయోజనమే మృగ్యమవుతుంది. ఇంతకీ నువ్వు వీళ్ళకి చెపుతూన్న ధర్మసూత్రాలు కౌరవులికి మాత్రం చెప్పవద్దా మరి! అసలు వాళ్ళే కదా పెడదార్లుపట్టి అనర్థాలు చేస్తూన్నది!

"ముఖ్యంగా వొకటి విచారించు. ప్రపంచంలో వీళ్ళైనా మరెవళ్ళయినా జూదం ఆడుతున్నారంటావా! అంతమాత్రం చేత ఈ ఐదుగురికళ్ళెదుటా తుంటరితనంగా ద్రౌపదిని అలా చేశారంటే ఎంతదుర్మార్గులై వుంటారు వాళ్ళు!"

ఈమాట కృష్ణుడు ఎత్తేసరికి వులిక్కిపడ్డట్టు అయాడు సంజయుడు.

"ప్రభూ, ఇది మనస్సుకి తెచ్చుకుని మాట్లాడితే కార్యం చక్కబడుతుందా!" అన్నాడు.

కృష్ణుడు ఆగలేదు. "ముసలిరాజుమనసులోని మాట తెలీక భీష్ముడూ మొదలయిన వృద్ధులు నోరుమెదపకండా వూరుకొన్నారు. కొడుకుల్ని కోప్పడలేకపోయాడో! కూడదని వారించేవుంటే, నేనే కాదు చప్పన్నదేశాలూ సంతోషించేవి. నోటికివచ్చిన దుర్భాష లాడుతూ వెళ్ళి దుశ్శాసనుడు ఈమెని జుత్తుపట్టుకుని గొరగొరా అంత మందిలోకీ ఈడ్చుకు వస్తూవుంటే, మామగారుకదా ఆపెద్దమనిషి—బెల్లంకొట్టిన రాయిలా ఎలావూరుకో గలిగాడా అంటాను. మొర్రో అని ఏడుస్తూంటే ఎలాభరించాడు? ఇవాళ తిరిగీ తగుదునమ్మాఅని కుశలమడిగి రమ్మన్నాడా నిన్ను! తగదనిచెప్పి అడ్డుపడేవాళ్ళు లేక, సభ సభంతా తెల్లమొహం వేసినపుడు, ఈఇల్లాలు తన్నుతాను రక్షించుకోబట్టి, ఆ అవమానంనుంచి బతికిపోయారు పాండవులు. కాకపోతే రాచవాడన్నవాడికి భరించుకోదగ్గదేనా అది!

"ఏం, సభంతటికీ కర్ణశూలాలనిపించిన కర్ణుడి కారుకూతలు నువ్వుమాత్రం వినలేదా? 'మొగుళ్ళెవళ్ళూ ఇక్కడులేరు' అన్నాడు. 'వీళ్ళు జూదంలో వీగిపోయి నిన్నువదిలేశారు' అన్నాడు. 'నిమీద వలపున్న మరోమొగుణ్ణి చూసుకో' అన్నాడు. ఐదుగురికీ, ముఖ్యంగా అర్జునుడికి ఆ పలుకులు ములుకులై మరణవేదన కలిగిస్తున్నాయి. దీనికి ఏంప్రతీకారం చేశాడు ముసిలాయన?

"అంతేనా, 'వీళ్ళందరూ గొడ్డుపోయారు, పుంస్త్వం ఎవడి కుంది వీళ్ళల్లో!' అన్నాడు దుశ్శాసనుడు. అవును, అతడన్నట్లు ఎంతోకాలం గొడ్డేపోయారు వీళ్ళు. మరివీరివల్ల వాళ్ళకేకీ ఫలించనే లేదుగా! ఇలా చెప్పాలంటే ఆనాటిమాట లెన్నోవున్నాయి అవన్నీ ఇప్పుడు చెప్పదగ్గవి కావుకూడా. అంచేత ఈసంధికార్యం నిజంగా

దుర్ఘటమైంది. దీన్ని సాధించడం అసాధ్యమనే నా అభిప్రాయం. ఐనా, ఇక్కడ వీళ్ళని ఎలాగో వొప్పించి, నేనే అక్కడికి రావాలను కుంటున్నాను. వాళ్ళకి బుద్ధిచెప్పి వీళ్ళజనకభాగం వీళ్ళకి ఇప్పించగలిగితే మృత్యుపాశాలు తప్పుతాయి వాళ్ళకి ఈభారం నామీదపడడం నాకు సంతోషమే. నేనంటే వాళ్ళూ మన్నించవచ్చు కనక న్యాయానికి వొడబడతారనే నమ్ముతాను లేదూ, పెడదారే పడతారూ, పాండవుల బాణాగ్ని వరకూ అక్కర్లేదు, వాళ్ళలోభమే వాళ్ళని కార్చిచ్చులా కాల్చి భస్మం చేస్తుంది

"సంజయా, రోషం మూర్తీభవించిన విషవృక్షం దుర్యోధనుడు. దానికి స్కంధం కర్ణుడు. కొమ్మ శకుని. పువ్వులూ పళ్ళూ దుస్ససేనుడు. మొదలు ధృతరాష్ట్రుడు.

"ధర్మరాజు ధర్మవృక్షం,అర్జునుడు స్కంధం, భీముడు కొమ్మ, నకులసహదేవులు ఫలపుష్పాలు. నేను మొదలు. ఈ రెంటిని తెలుసుకుని ఇది సారమైందీ, ఇది అసారమైందీ, అని ఏరుకోవాలి. అది కాదంటావూ, ఐతే తగువే మానిపొమ్మను ధృతరాష్ట్రుడూ అతడి కొడుకులూ ఒక అరణ్యం అనుకో, పాండవులు సింహాలు, సింహాలు లేని అడవిని ప్రజలు నాశనం చేస్తారు అరణ్యం లేకపోతే సింహాలికి ఆశ్రయమే లేదు అంచేత అరణ్యానికి సింహాలూ, సింహాలికి అరణ్యం పరస్పరం రక్షణ. దేన్ని ఏది విడిచినా ఉభయత్రా నాశనం తప్పదు.

"తనకుమాళ్ళతో సమానంగా చేరదీస్తే నమ్మినబంట్లుగా రాజుని సేవిస్తారు పాండవులు. శత్రువు లెత్తివచ్చినప్పుడు పెట్టని కోటలా పనికి వస్తారు అలా ఉభయుల్నీ ఏలుకోవడమే ధృతరాష్ట్రుడికి ధర్మంకదా! సరే, ఈపనికోసం నేనే ఎలాగో హస్తినాపురం వస్తాను ఒప్పుగా వూహిస్తాడో మరి తప్పుగా తలుస్తాడో మీమహా

రాజు! దాన్నిబట్టే మేమూ నడుచుకుంటాం. ఐతే మా అభిప్రాయం ముందుగామాత్రం ఆయనతో చెప్పిపెట్టు'' అన్నాడు.

"నువ్వు రావడమే ఐతే బదికిపోయాం'' అన్నాడు సంజయుడు, "నేను వచ్చినకార్యం సఫలమైందన్నమాట ఇక సెలవు తీసుకుంటాను మీ అందరి అనుజ్ఞతీసుకుంటున్నాను. వెళ్ళివస్తాను. నామాటల్లో పొరపాట్లేమీ లేవుకదా!''

దానికి ధర్మరాజు "సంజయా, ఇందరిలోనూ వున్నది వున్నట్టు చెప్పావునువ్వు, తగనిమాట వొక్కటీ దొర్లలేదునీమాటల్లో. పైపెచ్చు పొరపాటుకూడానా! ఎదటివాళ్ళగురించి చెప్పేటప్పుడు మొగమాటమన్నది లేదునీకు. దురుసైందికాని, చులకనయిందికాని, పొల్లయింది కాని వొక్క పలుకు నీనాలికమీదికి రాదు. నువ్వూ, తప్పితే విదురుడూ, మీఇద్దర్నీ మినహాయిస్తే ఇలా రాయబారానికి రావడానికి మరొకడు లేడు హస్తినాపురంలో. ఈవినయమూ, ఈనేర్పూ ఇంకెవరికుంది?

"వెళ్ళివస్తావా, మంచిది. వెళ్ళగానే అక్కడిపెద్దలందర్నీ చూసి, క్షేమం విచారించానని చెప్పు. గురుదేవుడుద్రోణుడూ, పితామహుడు భీష్ముడూ, ఎంతో వాత్సల్యంతో చూస్తారునన్ను వారికి భక్తిపూర్వకమైన నానమస్కారాలు విన్నవించు మా తండ్రికి ప్రేమతో దండప్రణామాలు చెప్పు. దుష్టబుద్ధిదుర్యోధనుణ్ణి క్షేమం విచారించానను. అతడికి తగినతమ్ముడు దుస్ససేనుడు. అతణ్ణి కుశలమడిగా నను. తక్కినకౌరవకుమారుల్నీ, మహిళాజనాన్నీ యథోచితంగా అడిగానని చెప్పు. విదురుడితోనూ, మేనమామ శల్యుడితోనూ మావినయం మనవిచెయ్యి. అశ్వత్థామకి నాగాఢాలింగనం తెలియచెయ్యి, బాహ్లీక, సోమదత్త, భూరిశ్రవసులకూ యథోచితంగా నాశుభేప్సితాలు చెప్పు. మరిన్నీ, వంశానికి మూలపురుషులవంటి

ప వైరిన వృద్ధభూపతుల్నీ, కృతవర్మా, కర్ణుడూ శకునీ, సైంధవుడూ మొదలయిన వారినీ, లక్క నరాజుల్నీ యుద్ధానికి తోడువచ్చిన వివిధ దేశాధిపతుల్నీ ఎవరికితగినట్టు వారికి ప్రణామం, వినయం బాంధవ్యం, స్నేహం, వాత్సల్యం-ఇత్యాది వాక్యాలతో నామాటలుగా చెప్పు. 'స్నేహితుల సహాయంతో అచిరకాలంలోనే విజయంసాధించి మిమ్మల్ని ఆదరిస్తాను' అని దాసదాసీజనం యావన్మందికీ తెలియ చెయ్యి. నువ్వు వెళ్ళడంతోనే చెయ్యవలసిన పనులివి

''తరువాత మా అయ్య నిండుకొలువులో వున్నప్పుడు, అందరూ వినేట్టు ఆతడితో నామాటలుగా ఇలా చెప్పాలి 'మహారాజా, నీఆసరా వల్లనే ఏ ఆపదా లేకండా తమ ఆప్తబంధువులతోసహా సుఖంగా వున్నారు పాండవులు. శైశవంలోనే వాళ్ళతండ్రి రాజ్యం వాళ్ళకిచ్చి ఆదరించావు. ఇప్పుడు దరిద్రంతో బాధపడుతూంటే కనికరించకండా ఉపేక్షించడం న్యాయమా! ఇల్లలకగానే పండగకాదు ఆశకి అంత మంటూవుండాలి మీరంతా కలిసేవుంటే కన్నెత్తిచూసేవాడు వుండడు' అని మొగమోటంలేకండా చెప్పు.

'' మా తాత భీష్ముడితో ఇలాఅను 'శంతనమహారాజువంశం లోపించిపోకండా నిలబెట్టావు ఇప్పుడూ నువ్వే వంశనాశనంకాకండా అడ్డుపడాలి. మాలోమాకు సఖ్యతకుదిర్చి, నీమనమల్ని అధర్మంనుంచీ, చావునుంచీ రక్షించినట్టయితే ఛప్పన్న దేశాలూ జేజేలుపెడతాయి నీకు' అంతేకాదు, 'ఇంతయినప్పటికీ శాంతపరుడయినధర్మరాజుకి మాత్రం యుద్ధమంటే ఇష్టంలేదుసుమా!' అనిన్నీ చెప్పు.

''సభ వాళ్ళందరిముందూ దుర్యోధనుడితో ఇలా అను. 'బలవంతుల్ని బలహీనులికిమల్లే వెళ్ళగొట్టిన వెర్రితనమూ, అడవుల్లో వాళ్ళని అష్టకష్టాలూ పెట్టిన కఠినతనమూ, నిండుసభలో పాంచాలిని జుత్తుపట్టి ఈడ్చిన తులువతనమూ-ఇన్నిసహించాడు ధర్మరాజు. నిష్కారణంగా కౌరవకుమాళ్ళని యుద్ధంలోమింగుకోకు, పరాయి

సామ్యానికి పేరాస కూడదు. వాళ్ళవంతు వాళ్ళకిచ్చి ఐకమత్యంతో జీవించు.'

"వేము కయ్యానికి దిగకుండా సంధికోరడం తన కేక్షేమం. దురాశనుంచి తనని మళ్ళించడానికి మరొకరు పూనుకోకపోడంచేత నేనే బుద్ధిచెప్పవలసి వస్తున్నది. తనదగ్గిర ఎక్కడాలేనంత మహా వీరులు వున్నారని విర్రవీగుతున్నాడేమో! అన్నిటికీ మించిన ధర్మ బలం మాపక్కనే వుందని చెప్పు. అంతేనా, లోకారాధ్యుడయిన కృష్ణుడే మాకు ఆసరాగా వున్నప్పుడు మమ్మల్ని గెలవగలనని కలలో అన్నా అనుకోవద్దను. అదలావుండనీ, భీమార్జునులకే కాకండా తనకీ కూడా నేనె పెద్దవాణ్ణి అంచేత, వీళ్ళూవాళ్ళూ నా ప్రార్థన మన్నించి, నన్ను అలజడిపాలు చెయ్యకండా, కలహానికి స్వస్తిచెప్పి, ఎవరి భాగం వాళ్ళు అనుభవిస్తూ సుఖంగా వుండడం ఉత్తమమార్గం కదా?

"పోనీ, అంత అధికంగా ఇవ్వడానికి మనస్కరించకపోతే—— కుశస్థలం, వృకస్థలం, వాసంతి, వారణావతం, మరేదయినా వొక గ్రామం—ఇలా సోదరులయిదుగురికీ అయిదూళ్ళిచ్చి నిలవ నీడకలిగిస్తే చాలు. దాంతో అంతా చక్కబడుతుంది ఇక్కడా అక్కడా సహాయానికి వచ్చిన బంధువులూ మిత్రులూ యావన్మందీ నవ్వుతూ తేరుతూ కలుసుకోడం మనఅందరికీ కళ్ళవేడుకగా వుంటుంది. కురు, పాంచాల, యాదవ, మాత్స్యులు——అందరూ పరస్పరం స్నేహంగా జీవించడమే నాఅభిలాష ఇదంతా ఆమహానుభావుడికి బోధించు" అన్నాడు

అంతావిని చేతులుజోడించాడు సంజయుడు. "దేవా, నీఆజ్ఞ ప్రకారం చేస్తాను. నీకూ, నీతమ్ములికీ, కృష్ణుడికీ మాతండ్రి సుముఖుడ య్యేట్టు చెపుతాను" అన్నాడు.

అంతలో అర్జును డిలా అందుకున్నాడు. "సంజయా, బాల్య స్నేహితుడివి నువ్వు. చిన్నప్పటినుంచీ నీమంచితనం మాకూ, మా

చెడ్డతనం నీకూ కొత్తకాదు. మదపుటేనుగు వంటి భీమసేనన్ని ఇవాళ అంకుశంలా అడ్డుకున్నాడు ధర్మరాజు, ఇవాళ అడ్డుపెట్టడానికి ఈ అజాత శత్రువుఅనుగ్రహం వుండనే వుంది. అంచేత మంచీచెడ్డా ఆలోచనతో కౌరవులు తల చించుకోవలిసిన అగత్యమేముంది!'' అన్నాడు.

అనంతరం అన్నగారి ఆజ్ఞప్రకారం సపరివారంగా సంజయుడికి మజ్జనభోజనాదులు చేయించాడు అర్జునుడు మాల్యానులేపనాలతో ఉపచారాలూ చేయించాడు మణిభూషణాలూ చిత్రాంబరాలూ ఇచ్చి సత్కరించాడు.

పాండవులదగ్గిరా, శ్రీకృష్ణుడిదగ్గిరా సగౌరవంగా సెలవుతీసుకుని హస్తినాపురానికి బయలుదేరాడు సంజయుడు.

---

# ఉద్యోగపర్వం

## రెండో ఆశ్వాసం

అలాబయల్దేరి గాలిపరుగులతో ఆఘమేఘాలమీద గుర్రాల్నీ రథాన్నీ పరుగెత్తించి పొద్దుగూకేసరికి హస్తినాపురంచేరుకున్నాడు సంజయుడు. వెంటనే కోటలో ప్రవేశించాడు అంతఃపురానికి కబురు చేసి ధృతరాష్ట్రుడిదగ్గిరికి వెళ్ళాడు, పాదాభివందనం చేశాడు. ఆదరంగా లేవనెత్తి దగ్గిర కూచోబెట్టుకున్నాడు ధృతరాష్ట్రుడు.

సంజయుడు మహారాజా, ధర్మరాజుని చూసివచ్చాను నిజానికి సుగుణాలపుట్ట ఆమహానుభావుడు. నన్నెంతో సత్కరించాడు నీకు దండప్రణామాలు విన్నవించాడు. ఇచ్చటిబంధువుల్నీ అందర్నీ కుశల ప్రశ్న చేశాడు. నీ కుశలం, కుమాళ్ళక్షేమం అన్నీ ప్రసన్న చిత్తంతో ప్రశ్నించాడు.

ధృతరాష్ట్రుడు ఆఁ, ధర్మరాజు క్షేమంగావున్నాడూ? తమ్ముళ్లందరికీ కులాసాఏనా? బంధువులూ, సఖులూ, మంత్రులూ–అక్కడి వాళ్ళంతా ఆనందంగా వున్నారుకదా!

సంజయుడు వాళ్ళంతా నీప్రాపువల్ల సౌఖ్యంగా వున్నామని చెపుతున్నారు నిజానికి అది సత్యమేకదా మరి! ధర్మరాజుకి ధర్మం మీదవున్న అభిలాష భోగాలమీద లేదు అందులోనూ అహింస అంటే ప్రాణంపెడతాడతడు మానుషశక్తిని నమ్మడు. దైవంమీదే ఆధారపడతాడు. పాపపుణ్యాలభారమంతా నీమీదే పెట్టాడు. ఐతే, నువ్వు నీకొడుకులు చెప్పిందేకాని ఇంకోటి ఆలోచించవు శకుని–కర్ణుల చేతిలోవుంది చుక్కాని. అసలు నీమాటేసాగదు మొత్తానికి ఆలూ, బిడ్డాలేని కొయ్యలాంటి దేశదిమ్మరితప్ప, పదిమందికుటుంబంతో

వున్నావా ఎవ్వడూ ఇలా పొగరుబోతుపనులు చూస్తూవూరుకోడు. ప్రపంచంలో రాజులులేరా? కొడుకుల్ని కనడంలేదా? కొడుకులు పెడదారిపడితే ఇలాగే ఉపేక్షిస్తున్నారా తండ్రులు? లోకమంతా నిన్ను దుమ్మెత్తిపోస్తూంటే వినలేక చెవులు చీములుకడుతున్నాయి.

దుశ్శాసనుడూ, శకునీ ఆడిస్తూంటే కీలుబొమ్మల్లా గెంతుతున్నారు దుర్యోధనుడూ నువ్వూను మించివస్తే పిల్లివంటిది పీక పట్టుకుంటుంది. సహించి, సహించి తుదకతిరగబడ్డారా మీ చలమూ, బలమూ, కులమూ – అన్నీ చిటికెలో దుసెల్లిపోతాయి. 'మనం పోట్లాడడానికి వీళ్ళుతగరు' అని వదిలిపెట్టిపోతే 'పీగిపోయి వెళ్ళిపోయారు' అన్నట్టు ధర్మరాజు శాంతాన్ని పిరికితనమంటారు మనవాళ్ళు. అవాళ ఏమీచేయనీయకండా తమ్ముళ్ళకి అడ్డుపడడం నువ్వూ మెచ్చుకున్నావుకదా అతణ్ణి కాని సాదురేగిందంటే తలపోలాన్నే కాని నిలవదుమరి.

జూదంనాడే అనర్థంపుట్టింది. దానికితోడు నీఉపేక్ష మరింత చిచ్చయి రాజుకుంది. మనోనిగ్రహంకలవాడు ధర్మరాజు మెత్తని పులి లోకమంతా తప్పు నీమీద స్థిరపరిచేవరకూ మాటాడడు. ఆతరవాత ఆపడమంటే నీతరమూ కాదు నాతరమూ కాదు

హుటాహుటిప్రయాణం చేసిరావడంచేత శరీరమంతా పచ్చిపుండులావుంది. మనస్సూస్వాధీనంలో లేకండావుంది. పొద్దుపోయింది కూడా. రేపు కొలువుకివస్తాను. క్షమాళ్ళూ, బంధువులూ, ఆప్తులూ— అందరూవుంటారు. అన్నీ సవిస్తరంగా మనవిచేస్తాను. ఇవాళకి సెలవు తీసుకుంటాను.

## విదుర నీతి

ఇలాచెప్పి, సంజయుడు వెళ్ళినతరవాత తిల్లో జెరులుపాకడం ప్రారంభించాయి ధృతరాష్ట్రుడికి. ఎంతోసేపు గడిచింది. నిద్ర రావడం

లేదు. అంతఃపురం పారావాణ్ణి పిలిచి విదురుణ్ణి పిలుచుకురమ్మన్నాడు. పరిగెత్తుకువెళ్లి విదురుణ్ణి ప్రవేశపెట్టాడు పారాజవాను. అతణ్ణి ఆదరంగా పక్కని కూచోపెట్టుకున్నాడు ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుడు పాండవుల దగ్గిరికి వెళ్ళి ఇపుడే వచ్చాడు సంజయుడు. నన్ను నానా చీవాట్లూ పెట్టాడు. అక్కడ జరిగిందంతా రేపువచ్చి చెబుతానన్నాడు. అప్పటినుంచీ మనస్సు పరిపరివిధాల పోతోంది నాకు. శరీరమంతా నిప్పులు చెరిగి నట్టయి, కన్నుపొడుచుకున్నా నిద్ర రావడంలేదు.

విదురుడు మహారాజా, బలవంతుడుపై బడ్డ బలహీనుడూ, సంపద పోయినవాడూ, దొంగతనంకోసం కనిపెట్టుకు వున్నవాడూ, కామం నెత్తికెక్కినవాడూ నిద్రలేకండా బాధపడతారు వీటిల్లో ఏదీ నిన్ను బాధించడంలేదుకదా! ఏదన్నా పరాయిసొమ్ముకోసం ఆసపడ్డావో మరి? కాకపోతే నిద్రరాకపోడానికి కారణమేముంటుందిగనక!

ధృతరాష్ట్రుడు ధర్మరాజు ఏమన్నాడో తెలీక బాధపడుతున్నాను. కర్తవ్యంచెప్పి నావిచారం తొలిగించడానికి నువ్వుతప్ప మరొకడు సమర్థుడులేడు.

విదురుడు పాపం, నిజానికి బంధువూ, భటుడూ, చెలికాడూ, మంత్రీ, గురువూ కదా నీకు ధర్మరాజు. ధర్మాత్ముడు, శాంతమూర్తి, వినయశీలుడు, వివేకవంతుడు – అతడెపుడయినా ఒకఅనర్థం తలపెడతాడని ఎలా అనుకుంటున్నావు? నువ్వూ, నీకొడుకూ వాళ్ళనింతవరకూ అన్యాయంగా అష్టకష్టాలూ పెట్టారు. ఇది చాలు. ఇకనైనా వాళ్ళవంతు వాళ్ళకిచ్చెయ్యండి. మాంసం కరిచిపట్టిన పిల్లిలా వదలకండా కూచుంటే ఎలా సాగుతుంది.

రాజ్యంముగుదాళ్లు కర్ణ, శకుని, దుశ్శాసనులచేతుల్లో పెట్టారు మీరు. సవ్యంగా నడవమంటే ఎలానడుస్తుందిమరి! ఏమంటావా,

తనస్థితి తాను తెలుసుకోడం, తొందరపడకపోడం, అవసరాన్నిబట్టి తాలిమీ, విడుపూ ప్రయోగించడం – ఇవిలేని ప్రభుత్వం ఎక్కడన్నా వుందా? ఈ గుణాలున్న పెద్దమనిషి ఈ ముగ్గురిలోనూ వొక్కడన్నా వున్నాడా?

నువ్వు నిజమైనతండ్రివని, న్యాయానికి నిన్నే నమ్ముకుని చాల వరకు సహిస్తున్నాడు ధర్మరాజు. ఈమాట నువ్వూ ఎరుగుదువు.

ధృతరాష్ట్రుడు సంజయుడు రేపు చెప్పింది విని ఏంచెయ్యాలో అది చేయించునువ్వు. నామనస్సు మనస్సులో లేదు. కలతకలతగావుంది. ఏవో నాలుగు మంచిమాటలు చెప్పు. ధర్మాధర్మాలూ, న్యాయా న్యాయాలూ, నీతులూ నేర్చిన పండితుడివిక దా! నిద్రరాకండా బాధ పడుతున్నాను. ఏవేనా రెండునీతులు చెప్పి శ్రవణానందం కలిగించు.

విదురుడు పదిమందీ ప్రశంసించేటట్టు ప్రవర్తించినవాడే మనిషి. దేన్ని లోకం నిందిస్తుందో దానిజోలికి పోకూడదు. ఇతర్లకలిమి చూసి ఈర్ష్యపడకూడదు. జనమంచిగా నడుచుకున్నవాడే జగత్తుని జయి స్తాడు. కోపం, పొంగూ, గర్వం, అసంతృప్తి, దురభిమానం, నిర్వ్యా పారత్వం ఇవి కాపురుషలక్షణాలు. ఆలినీ, అధికారినీ, బంధువుల్నీ, భగవంతుణ్ణీ సద్గుణాలచేత సంతోషపెట్టలేనివాడు వ్యర్థజీవి. ప్రేమిం చినవాణ్ణి విడిచిపెట్టడం, వొల్లనివాణ్ణి వెంబడించడం, తెలిసితెలిసీ పులిమీసాలు పట్టుకోడం . ఇవి మూర్ఖుడిగుణాలు. ధనమూ, విద్యా, వంశం___ఇవి మంచివాడికి మంచీ, చెడ్డవాడికి చెడ్డా తెచ్చిపెడతాయి. మంచి విలుకాడిబాణం ఒకటుందంటే అది ఒకడికి తగలావచ్చు, తప్పిపోనూవచ్చు. కాని తెలివైనవాడి {?}తిమాత్రం శత్రురాజునే కాదు అతడిరాజ్యాన్ని దూసుకుపోతుంది.

ఎవడైతే ఒకటి వశంచేసుకొని దాంతో రెంటిని చేరుస్తాడో, మూటిని నాలుగింటితో స్వాధీనపరుచుకుంటాడో, ఐదింటిని గెలిచి

ఆరింటిని తెలుసుకుంటాడో, ఏడింటిని విడిచిపెట్టి నడుచుకుంటాడో వాడే వివేకవంతుడు. *

ఒంటరిగా మధురాహారాలు తినకూడదు. పదిమందీ నిద్రపోతూ వుంటే వొంటరిగా మేలుకుని వుండకూడదు. ఒంటరిగా కార్యాలోచన చెయ్యకూడదు. ఒంటరిగా దారినడవకూడదు.

నడవడిఅనే మహాసముద్రాన్ని వోడలాదాటిస్తుంది సత్యం. అంచేత సత్యాన్నిమించిన సద్గుణం మరొకటిలేదు.

క్షమించేవాణ్ణి చేతకానివాడంటారు మూర్ఖులు. ఐతే, క్షమనే అలంకారంగా ధరిస్తారు సత్పురుషులు.

ఒకటి – పరుషవాక్యాలు పలకకండావుండడం. రెండు – పాప కార్యాలు చేయకండా వుండడం. ఈ రెండిటివల్లా ఉత్తము డనిపించు కుంటాడు మానవుడు.

శక్తికలిగివుండిన్నీ సహించేవాడూ, పేదరికంలో వుండీకూడా అడిగే వాళ్ళకి కలిగినదాంట్లో ఇచ్చేవాడూ పుణ్యపురుషుడు.

న్యాయార్జితమైనవిత్తంతో అపాత్రదానంచేస్తే ఎంతపాపమో సత్పాత్రదానం చెయ్యకపోయినా అంతేపాపం.

---

* (అ) ఒకటి ప్రభుత్వం రెండు మంత్రం, ఉత్సాహం. మూడు శత్రులు మిత్రులు, తటస్థులు. నాలుగు, సామం, దానం భేదం, దండం. చతురోపాయాలు. ఐదు త్వక్కు, చక్షువు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణం. [త్వగింద్రియాలు] ఆరు సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధీభావాలు. ఏడు సప్తవ్యసనాలు.

(ఆ) ఒకటి మనస్సు. రెండు వాక్కు, క్రియ మూడు ధర్మం, అర్థం, కామం. నాలుగు బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్యాసం. ఐదు వాక్కు, పాణి, పాదం, వాయువు, ఉపస్థ [కర్మేంద్రియాలు] ఆరు యజనం, యాజనం, అధ్యయనం' అధ్యాపనం, దానం, ప్రతిగ్రహం. ఏడు. పంచభూతకృతులూ, బుద్ధి, అహంకారం' [ఆవరణాలు]

ఆడదీ, జూదం, తాగడం, వేటా, కఠినవాక్యం, కఠినదండనా, నిష్ప్రయోజనధనవ్యయం, ఇవి సప్తవ్యసనాలు. సప్తసముద్రాల్లో మునిగినా తేలవచ్చు. సప్తవ్యసనాల్లో పడ్డవాడుమాత్రంచచ్చినాపైకతేలడు.

తలకిమించిన వేషం తగువులికి హేతువు, తన్ను తాను పొగుడుకోడం, తన్ను తాను తన్నుకోడం వొకటే. కీడెంచినా మేలెంచిన వాడు మహాత్ముడు. ఇచ్చి విచారించిన వాడికంటే ఇవ్వనివాడే గొప్పవాడు. దరిద్రుడైనా ధర్మంతప్పనివాడు ధన్యుడు.

శత్రుత్వమైనా మిత్రత్వమైనా సమానమైన వాళ్లతోనే చెయ్యాలి. అధికులతో ఐతే ఆపద, హీనులతో ఐతే మానహాని.

కొంచెమైనా పంచుకుతినడం మంచిది. పనిలో కష్టమైనా మనసులో కష్టపడకూడదు. స్వల్పసుఖంతోనే సంతుష్టిపడాలి. శత్రువయినా 'దేహీ' అంటే 'నహీ' అనకూడదు. పొగిడితే పొంగిపోయేవాడు బుద్ధిహీనుడు. మంచివాణ్ణిపొగిడినా తెగడినా మంచే చేస్తాడు, చెడ్డ చేరనివ్వడు.

మహారాజా, ఈధర్మగుణాలన్నీ వున్న వాడు ధర్మరాజు. పాండవుల్ని పెంచింది నువ్వు. పెద్దచేసిందినువ్వు. మేలెంచినవాడివే ఇపుడు కీడెంచుతున్నావు. రక్షించినవాడివే ఇపుడు ఉపేక్షిస్తున్నావు. వాళ్ళని వెలిపెట్టి వూరుకోడం తగదు. పిలిపించు, వాళ్ళవంతు వాళ్ళకిచ్చెయ్యి. నీకొడుకులతో సమానంగా తిప్పుకో. ఇదేన్యాయం, ఇదేధర్మం, ఇదే నీతి.

ధృతరాష్ట్రుడు నాకేదిహితమో, ఏదికర్తవ్యమోనీకు తెలుసు. ధర్మరాజుసంగతీ తెలుసు నీకు. కనక ఏది ఎలాచెయ్యాలో విడమర్చి చెప్పు. నామనస్తాపం మానేట్టు చూడు.

విదురుడు అంత ఇదిగాఅడుగుతున్నప్పుడు, వున్నదున్నట్టు చెప్పాలి నేను. సావధానంగా విను. చేతిలోచిక్కిందికదా అని తమ్ముడి

రాజ్యం కాజెయ్యడానికి చూస్తున్నావు కానైతే, అన్యాయంసొమ్ము అరుగుబాటు కాదు. ఎర్రపిల్లకోసం గాలంమింగిన చేపలావుంది నీసంగతి. గుడినీ గుళ్ళోలింగాన్నీ మింగేద్దామంటున్నాడు నీకొడుకు. నిజం చెబుతున్నాను. నమ్ము ఇవేవీ సాగేవిమాత్రం కావు.

చివరిమాటకి చివుక్కుమన్నాడు ధృతరాష్ట్రుడు. నిద్రలేక కళ్లు మండుతున్నాయి. శరీరం స్వాధీనంలో వున్నట్టులేదు. కొంతసేపయాక మళ్ళీకదిపాడు విదురుణ్ణి.

ధృతరాష్ట్రుడు ఇందాక నువ్వుచెప్పిననీతులు ఎంతో తేలిక పరిచాయి హృదయాన్ని. అలాంటివే మరికొన్ని వినిపించు. శ్రమ అనుకోకు.

విదురుడు పండందే కోయడంవల్ల రుచేకాదు పండుబీజంకూడా పాడవుతుంది. బాగా పండిందే అయితేనో, రుచీ, బీజమూ రెండూ దక్కుతాయి. కార్యసిద్ధికి ఇదేసూత్రం.

మాలాకారుడు పువ్వులుకోసినట్టు, తేనెటీగలు పూదేనెతీసి నట్టు ఎదటివాళ్ళని నొప్పించకండా కార్యంసాధించినవాడు ఘనుడు. బొగ్గులకోసమని మొదలునరకడం మూర్ఖత్వం.

పరులపలుకుబడీ, బలమూ, విద్యా, ధనమూ చూసి మచ్చర పడేమానవుడు తెగులులేని బాధతో కుసిల్లిపోతాడు.

మధురంగా మాటాడగలిగితేనే మాటాడాలి. కానప్పుడు మౌనమే భూషణం మరి.

తలవిలువ నోరు తెలుపుతుంది. స్నేహమన్నా, విరోధమన్నా, గౌరవమన్నా, అగౌరవమన్నా, పాపమన్నా, పుణ్యమన్నా నోరే తెస్తుంది. మాటపొందిక మానవలక్షణం. మాను గొడ్డలితో తెగినా మళ్ళీ చిగురిస్తుంది. మాటలతో తెగిన పనిమాత్రం మరి అతకదు.

శరీరంలో విరిగిన బాణాలయినా ఉపాయంతో వూడదియ్యవచ్చు. మనస్సులో గుచ్చుకున్నమాటలు ప్రాణంపోయినా పైకిపెరకలేం.

ధర్మరాజు నోట ధర్మంతప్పినమాట ఒకనాడూ వినలేదు మనం. నీకొడుకులుమాత్రం వొకణ్ణిమించి వొకడు నోటికివచ్చినట్టు పేలుతూ వుంటారు. మాట్టాడకండా అవన్నీ వింటూవుంటావునువ్వు. నీఅంతటి మహారాజుకి తగిందేనా ఇది!

ధృతరాష్ట్రుడు విదురా, విన్నకొద్దీ వినాలనేవుంది నీనీతులు. తనివితీరడంలేదు. అవే మరికొన్ని చెప్పు.

విదురుడు పుణ్యకార్యాలన్నీ ఓయెత్తు, ధర్మం తప్పకండా వుండడం ఓయెత్తు. ఈరెంటితారతమ్యాలూనిర్ణయించవలిసివస్తేధర్మవర్తనదే ప్రధమతాంబూలం. ధర్మంవల్ల ఇహమూపరమూమాత్రమే కాదు, కీర్తికూడా లభిస్తుంది. ఇక్కడ కీర్తి ఎంతకాలముంటేఅక్కడ పుణ్యలోకం అంతకాలముంటుందంటారు పెద్దలు. పూర్వం ప్రహ్లాదుడు రాక్షసజాతిలో పుట్టిన్నీ ధర్మం తప్పలేదు. తనకొడుకు విరోచనుడూ, అంగిరసుడనే బ్రాహ్మడికొడుకు సుధన్వుడూ ఒక ధర్మసందేహం కోసం వివాదపడ్డారు. ఎవడు వోగితే వాడు తన ప్రాణాలు అర్పించాలని పందెంవేసుకుని తగువుతీర్చమని ప్రహ్లాదుడిదగ్గిరికి వచ్చారు. వీడు తన వాడూ, వీడు పరాయివాడూ అనుకోకండా న్యాయమేచెప్పాడు ప్రహ్లాదుడు. సుధన్వుణ్ణి గెలిపించాడు. తరవాత కొడుకుప్రాణాలు సుధన్వుడి దగ్గిర దానంగా గ్రహించి విరోచనుణ్ణి బతికించుకున్నాడు. అలాగే నువ్వూ ధర్మం విడిచిపెట్టకండా పుత్రులమీద పక్షపాతం విడిచిపెట్ట మంటాను. పాండవులతో సంధిచేసుకోమంటాను. వీళ్ళూవాళ్ళూ ఆపద లేకండా బతుకుతారు. నీకీ విచారం లేకండావుంటుంది.

చేయాలనిచేస్తున్నకొద్దీ పాపాలూ ఇంపుగానేవుంటాయి. విడిచి పెట్టాలని విడిచిపెట్టినకొద్దీ పుణ్యకార్యాలు అయిష్టం కలిగిస్తాయి.

పండితులులేని సభ వొకసభ కాదు, ధర్మంచెప్పని పండితుడు వొకపండితుడూ కాడు. సత్యాన్నివిడిచినధర్మం వొకధర్మంకాదు, సాకుచెప్పినసత్యం ఒకసత్యమూ కాదు.

నైతికజీవనమే ఉత్తమజీవనం. శౌర్యంమీాదబతకడం మధ్యమ జీవనం. నైచ్యతగాగడిపే భారవహజీవనం కనిష్ఠజీవనం. నీచజీవనం రోత.

నీకొడుకులెప్పుడూ కయ్యానికి కాలుదువ్వుతారు. కర్ణుడూ మొదలైన మంత్రులు దానికి ముందేబహుదూర్లు. నీతిమార్గానికిపూను కోనేపూనుకోవు నువ్వు పాండవులు దౌర్జన్యానికి దిగరు. నీతి విడవ కండా కార్యంసాధిస్తారు. ఎదుటివాళ్ళే మొదటవూదాలి. దాంతో భగ్గుమంటారు. ఆమంటని ఆర్పడంమాత్రం బ్రహ్మాతరంకాదు. కన్న తండ్రికిమల్లేనే భక్తితో చూసుకుంటున్నారు నిన్ను. సజ్జనులు మెచ్చు కునేట్టు నడుచుకుంటున్నారు అరమరికలేకండా నువ్వూ ఆదరించాలి వాళ్ళని. కన్నకొడుకులమల్లేనే చూసుకోవాలి. అదేధర్మం. అదేనీతి. తండ్రితరువాత తండ్రంతవాడివి నువ్వు వుండిన్నీ, పరోపకారపరులైన పరాయివాళ్ళే ఆశ్రయమయారు వాళ్ళకి.

ఉపకారంచేసినవాడికే అపకారంచేసినవాణ్ణి – వాడిపీనుగుని సహా–కుక్కలైనాముట్టవు. చేసినమేలు మరవడం కృతఘ్నత. పాండు రాజు నీకు పరమభక్తుడుగా వుండి ఏంచెయ్యలేదని! అతడిసంతానాన్ని నువ్వు అనాదరణచెయ్యడం ద్రోహం.

చావూ బ్రతుకూ, నిందా స్తుతీ, ఇవ్వడం పుచ్చుకోడం, సుఖం దుఃఖం–ఇలా వొకటివెంట వొకటి వస్తూపోతూ వుంటాయి. వీటిని విచారించడం వ్యర్థం. మనోవ్యాధికి మందులేదు. సంతాపం సర్వనాశ హేతువు బలమూ తరుగుతుంది, రూపమూ నశిస్తుంది, మతీ తప్పు తుంది, తెగులూ పడుతుంది. శత్రువులూ సంతోషిస్తారు. అంచేత రాజా, సంతాపం విడిచిపెట్టు.

ధృతరాష్ట్రుడు ధర్మాత్ముడైన ధర్మరాజుని కల్లబోదావుంతో కలతపెట్టాను. దురాత్ములైన నాకొడుకులు యుద్ధంలో చావునోట పడతారు. సంతాపంతప్ప ఇంకేముందినాకు! విదురా, ఈవిచారం నుంచి బయటపడేమార్గ మేదో ఉపదేశించు. శాంతి ఎలాలభిస్తుంది నాకు?

విదురుడు తపమూ, ఇంద్రియనిగ్రహమూ, విద్యా – ఇవి శాంతిసాధనాలు. అన్నిటికంటే ముఖ్యమైంది లోభంవిడిచిపెట్టడం.

జ్ఞాతులపోరాటం, ఆవుల అపహరణ, ఆడవాళ్ళఅవమానం, బ్రాహ్మలప్రభుత్వం అంగీకరించేవాడి అధికారం నిలవదు. జ్ఞాతులన్న వాళ్ళు పరస్పరం ప్రేమా, అనురాగాలతో పద్మవనంలాగ కలిసివున్నప్పుడే సిరీసంపదా తులతూగుతాయి. ఒంటరిగావున్న చెట్టుని ఏనుగో, గుర్రమో, గాలో–ఏదో ఒకటి తాకిపడగొడుతుంది. అదే అనేకమైన చెట్లు గుంపుగా వొకచోటవుంటే, వాటికి చెక్కు చెదరదుకదా! అలాగే అన్నదమ్ములందరూ ఐకమత్యంతో వొకటిగావుంటే వారి బ్రహ్మదులైనా వాళ్ళని తేరిచూడలేరు. కాదని వేర్లయితే పొరుగువాడే సొడ్డుపెడతాడు. కౌరవులూ పాండవులూ కలిసివుంటే కౌరవ రాజ్యాన్ని కన్నెత్తిచూసేవాడెవడు? శత్రువులబాధలేని సామ్రాజ్యం స్వర్గంకంటే గొప్పది.

అడవుల్లోతిరిగీ, అజ్ఞాతవాసంచేసీ అలసిపోయారు పాండవులు. వెంటనే పిలిపించు. వాళ్ళవంతు వాళ్ళకివ్వడమంటే, నీకొడుకుల్ని నువ్వు కాపాడుకోడమన్నమాట.

పొక్కులుచిక్కే మెప్పించేవాళ్ళు ప్రతీచోటావుంటారు నిష్ఠూరమని, నిజంచెప్పేవాళ్లుదొరకరు. జూదంనాడేసూచించాను. నిష్ఠూరానికి వెనకాడక నిజంచెప్పాను. పైత్యరోగికి పంచదారలాగ అది రుచించలేదు నీకు. ఇప్పుడూ అదేచెబుతున్నాను. కాకుల్ని కావలించుకుని నెమళ్ళని వెళ్ళగొడుతున్నావునువ్వు. పిల్లుల్ని చేరదీసిసింహాల్ని చెదరగొడుతున్నావు. దుర్యోధనాదుల్ని దగ్గిరతీసి, పాండవుల్ని పారదోలు

తున్నావు తీరా కార్యంమించి వచ్చేసరికి— నెత్తిమీద నిప్పుపడ్డప్పుడు తల్లడిల్లుతున్నావు. వంశాన్ని రక్షించుకోవాలంటే దుర్మార్గుడైన వాణ్ణి తొలిగించడమే నీతి. నువ్వు చెప్పింది వినక, దుర్ణయానికి నెట్టు కున్నప్పుడు దుర్యోధనుణ్ణి తొలిగిస్తే మాత్రం దోష మేమిటంటాను. అదలావుండనీ—సంపద సహాయాన్ని అపేక్షించి వుంటుంది. సహాయమూ సంపద ననుసరించి వుంటుంది. ఇలా ఇని వొకదాన్ని వొకటి పొంది తేనే గాని సిద్ధించవు. కనక నీసంపద పాండవులికీ, పాండవులసహాయం నీసంపదకీ చేకూరేటట్టు పరస్పరం కలియడం అవసరం. అలాకాక మనబలాన్ని మనమే వెలిచేయడం అవివేకం.

కురువంశవిస్తారులైన భీష్ముడూ, ధర్మరాజూ, అవక్రవిక్రము లైన కర్ణుడూఅర్జునుడూ ప్రతాపవంతులైన భీముడూదుర్యోధనుడూ, శస్త్రాస్త్రపారగులైన అభిమన్యుడూ, లక్ష్మణుడూ మొదలయిన కుమాళ్లూ, నిగ్రహానుగ్రహాసమర్థులు ద్రోణుడూ ద్రుపదుడూ, వీరి బంధుమిత్రులూ- యావన్మందీ ఏకముఖంగా నీఅడుగులికి మడుగు లొత్తుతూవుంటే ఎంత దేదీప్యమానంగావుంటుందో ఆలోచించు.

ఇంకోమాట, పోనీఅని పాండవులు పోరాటం సాగించక పోయినా, నేడో రేపో కౌరవరాజ్యం గంగలో కలిసిపోతుంది. ఏమంటావా, నీకొడుకుల చేతిలో రాజ్యంనిలవడం కల్ల.

ధృతరాష్ట్రుడు విదురా, నువ్వు చెప్పినమాలటన్నీ నిష్కల్మష మైనవి, సజ్జనసమ్మతాలైనవి, రాజనీతిబోధకాలైనవీని. నిజమే, కానైతే చూస్తూచూస్తూ కన్నకొడుకునిమాత్రం వదులుకోలేను. 'ఏకత్రని అగ్నివుంటే ఆకట్రే కాలిపోతుంది' అని వూరుకుంటాను.

విదురుడు గుణంలేనివాణ్ణే వొదలలేనంటున్నావు. మంచిదే. ఐతే గుణవంతులైనపాండవుల్ని, అందులోనూ నీఅనుగ్రహం అపేక్షి స్తున్నవాళ్ళని ఎలావొదులుకుంటావు ? నీకుహితంకోరేవాణ్ణి కదా నేను.

నామాట విను. దుర్యోధనుణ్ణి ఒప్పించు. వాళ్ళ భృతికి సరిపడ్డట్టు చిన్న పల్లెలయినా కొన్ని ఏర్పాటుచెయ్యి సంధిచేసుకో దుర్యోధనుణ్ణి వెళ్ళగొట్టమన్నానంటే ఎంతదూరం ఆలోచించి చెప్పానో ఊహించు. యుద్ధంవల్ల దుఃఖం తప్పదు. దానికపుడు ప్రతీకారమే వుండదు. కనక సంధి సర్వోత్కృష్టమైందని నమ్ము. చావాలంటే వంతులకోసం కొట్లాడుకునే చావనక్కరలేదు. వ్యథా, వ్యాధీ, వార్ధక్యాలతో కూడుకున్నది శరీరం. చావుకూడా జన్మహక్కే శరీరధారికి. సంపదలూ, భోగాలూ, ఏలుబళ్లూ, దిగ్విజయాలూ ఇన్నీ అనుభవించిన చక్రవర్తులూ కూడా వెళ్ళిపోయారే కాని వుండిపోలేదు. చెవికిచేదయినా నామాట మన్నిస్తే ఇహమూ పరమూ దక్కుతాయి నీకు. పైపెచ్చు కీర్తివంతుడవనిపించుకుంటావు. బాగా ఆలోచించు ధర్మరాజుని వొదులుకోకు. మనస్సు దిట్టం చేసుకో. కొడుకులికీ, మంత్రులికీ నచ్చజెప్పు.

ధృతరాష్ట్రుడు నీఉపదేశంవల్ల మనస్సు చల్లపడింది. బుద్ధి తెలువుకున్నట్టయింది. నువ్వు చెప్పినట్టే చేస్తాను. అవును, యశస్సుకీ, ఫలితానికీ, ధర్మానికీ ఇదే కర్తవ్యం.

విదురుడు అమ్మయ్య, ఎలాఅయితేనేం కర్తవ్యం తట్టు తిరిగింది నీమనస్సు. మళ్ళీ దుర్యోధనుడివేపు వాలిపోకండా దృఢంగా నిలబడితే చాలు, బతికిపోతాం.

'ఇలాచేస్తాను,' 'ఇలాచెయ్యను' అని భీష్మించి చెప్పడం భగవంతుడికేమోగాని మానవమాత్రుడికి సాధ్యంకాదు. పరిమితశక్తి కలదిమాత్రమే పౌరుషం.

ధృతరాష్ట్రుడు ధర్మతత్వమూ, నీతితత్వమూ చల్లనిమాటలతో బోధించావు. పరమార్థదృష్టి కలిగేటట్టు అధ్యాత్మతత్వం కొంత బోధించు.

విదురుడు ఏవో తెలిసినమట్టుకు చెప్పాను. అధ్యాత్మికవిషయాలు అతినిగూఢమైనవి. అవిచెప్పేందుకి సర్వవిధాలా సమర్థుడైన వాడు సనత్సుజాతుడు. బహుపురాతనుడయిన్నీ చిరకుమారు డాయన.

ధృతరాష్ట్రుడు ఆమహాత్ముడెక్కడ, నేనెక్కడ? అందునుంచి అవీ నువ్వేచెప్పాలి మరి.

విదురుడు దానికి అర్హతచాలదునాకు, వేదాంతవేద్యములైన రహస్యాలు నాబోంట్లకు అగోచరాలు. ఆ మహాత్ముడి సంగతి నేనెరుగుదును దేవతలకన్నా తెలియనిరహస్యాలు తెలుసాయనకి.

ధృతరాష్ట్రుడు కానైతే, ఆమహానుభావుడుమనకెలా లభిస్తాడు?

## స న త్సు జా తీ య ం

ధృతరాష్ట్రుడికుతూహలం కాదనలేకపోయాడువిదురుడు, దివ్యజ్ఞానప్రభావుడైన సనత్సుజాతుణ్ణి మనసా ధ్యానించాడు. ధ్యానమాత్రంతో ప్రత్యక్షమయాడు సనత్సుజాతుడు. ధృతరాష్ట్రుడూ విదురుడూ దండప్రణామం చేశారు. అర్ఘ్యపాద్యాదులిచ్చిపూజించారు. ధృతరాష్ట్రుణ్ణిచూపి ప్రార్థించాడు విదురుడు "దేవా, ఈమహారాజు మీకృపవల్ల అధ్యాత్మతత్వం వినగోరుతున్నాడు. అంచేత మిమ్మల్ని ప్రార్థించాను. మీరు అనుగ్రహించారు. గురువులనాశ్రయించినవాళ్ళు దేనివల్ల సుఖదుఃఖాలూ, లాభనష్టాలూ, రాగద్వేషాలూ, ఇత్యాది ద్వంద్వాల్లో చిక్కుకోకండా బదుకుతారో అట్టిపరమార్థం ఉపదేశించి కృతార్థుణ్ణి చెయ్యండీయన్ని" అన్నాడు.

'అనుగ్రహించవలిసింది' అని ధృతరాష్ట్రుడూ వేడుకున్నాడు,

దాంతో ప్రసన్నుడయ్యాడు సనత్సుజాతుడు. అధ్యాత్మరహస్యాలు వొకదానితరువాత వొకటి సూక్ష్మాతిసూక్ష్మమైన వివరాలతో విడమర్చిచూపాడు. ప్రజ్ఞాచక్షుడైన ధృతరాష్ట్రుడు ప్రశ్నించిన ప్రతీదానికీపరతత్వం ప్రసాదించే నిగూఢార్థం వివరిస్తూ ఇలాచెప్పాడు.

''రాజా, ముఖ్యంగా మృత్యువుగురించి ప్రశ్నించావు నువ్వు. మనస్సులో వొక కోరికఅంటూ లేకండా పనిచేసుకుపోయేవాడికి మృత్యుభయం లేదంటారు కొందరు. అసలు మృత్యువు అనేది వొకటి లేనేలేదన్నారు కొందరు. మృత్యువు వున్నదనీ, లేదనీ, ఇలా ఈ రెండు వాదాలూ మొదటీనుంచీ వస్తున్నాయి. నిజం విచారిస్తే అజ్ఞానంవల్ల కలిగే స్వాభిమానమే మృత్యువు. అంతేకాని మృత్యువుకి ఒక ఆకారం లేదు. పెద్దపులిగానే మరో ప్రాణిమీదపడి చంపుకుతిన్నట్టు మృత్యువు వచ్చి జీవుల్ని చంపి భక్షించడం ఎవరూ చూడలేదు.

''స్వాభిమానమే అహంకారం. అహంకారంవల్ల అంధులైన మానవులు 'నేను బ్రాహ్మ' ణ్ణనీ, 'క్షత్రియు' ణ్ణనీ, ఆరోపించుకుంటారు. సత్యం గోచరించదు వాళ్ళకి. మాటిమాటికి చావడం పుట్టడం ఇదేవాళ్ళగతి. అహంకారంనుంచి బయటపడడమే ప్రమాదమునుంచి బయటపడడం. ప్రమాదంనుంచి బయటపడడమే మృత్యువు నుజయించడం. మృత్యువును జయించడమే మోక్షం.

'' ఫలాపేక్ష లేకండా పనిచేసేవాడే శుద్ధచిత్తుడు చివరికి స్వర్గం మీదకూడా వాంఛపెట్టుకో కూడదు. అలాంటివాడే ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆదిభౌతికం అనే అనే తాపత్రయానికీ, సత్వం, రజస్సూ, తమస్సూఅనే గుణత్రయానికి, జాగ్రత్త, స్వప్నం, సుషుప్తీఅనేఅవస్థా త్రయానికి అందని ఆనందస్వరూపం చూస్తాడు. మృత్యువన్నదే అతడికి వుండదు. మాయఅన్నది అతడిచుట్టుపక్కలికి రాదు. అలాంటివాడే బ్రాహ్మడు. శుద్ధస్వరూపమయిన బ్రహ్మపదార్థానికి సృష్టికర్తృత్వం ఆరోపించడం మాయ. మాయలోపడి దానికి రూపకల్పన చేసేవాడు బ్రాహ్మడుకాడు.అలాంటివాణ్ణి ఆత్మవంచనచేసుకునే దొంగఅనాలి.

''పైవాళ్ళధనానికి ఆశపడేవాడూ, మంచిలో చెడ్డవెదికేవాడూ, ఎదటివాడిపచ్చ చూడలేనివాడూ, స్వల్పలాభంతో సంతోషించని

వాడూ, భార్యతో పోట్లాడేవాడూ, కటువుగామాట్లాడేవాడూ, అబద్ధాలికి జంకనివాడూ, ఇచ్ఛకాలాడేవాడూ, పై వాళ్ళమీద పోటీలుచెప్పేవాడూ, వినయంలేనివాడూ, పరనిందచేసేవాడూ - ఇలాంటి వాళ్ళని మృత్యువు ప్రతీక్షణమూ కబళిస్తూనే వుంటుంది. బ్రహ్మవిద్య సాధించి అమృతత్వంపొందిన మహానుభావులికి మాత్రం మృత్యువులేదు'' అన్నాడు.

ఇంతలో తెల్లవారివచ్చింది ''వెళ్ళివస్తాను'' అని చెప్పి అంత ర్ధానమయాడు సనత్సుజాతుడు. ఇలా రాత్రంతా జాగరంలా గడిచింది ధృతరాష్ట్రుడికి.

వినకుండా మొండివైఖరిలో వున్న ధృతరాష్ట్రకుమారుల్ని వూరికే అన్నదమ్ములతో కలహిస్తున్నందుకు దుఃఖపడి పాలిపోయినట్టు వెలవెలపోయాడు చంద్రుడు తెల్లకలువలతో కలిసి కలకలలాడుతూ ఇంతవరకూవుండి కలవల పై భవంకాస్తా మూసిపోయేసరికి,ఇక తమకీవుండడం తగదన్నట్టు అదృశ్యమైపోయాయి నక్షత్రాలు. రాత్రంతా వియోగంలోవున్న చక్రవాకదంపతులు సంతోషంతో మెడలు పైకెత్తాయి. మొహాలు చాచాయి. వెదుక్కునివెదుక్కుని వొకదాన్నొకటికలుసుకున్నాయి. ప్రేమగా చూసుకున్నాయి. సంయోగసౌఖ్యంలో కరిగిపోయాయి. ముకుళించుకున్న పద్మాలు మెల్లి మెల్లిగా పెదవులువిప్పాయి. గుప్పుమని పరిమళం గుబాళించింది రాత్రి పుష్పగర్భంలోవుండిపోయిన తుమ్మెదలు సంకెళ్ళువిడ్డట్టు ఉల్లాసంగాపైకివచ్చాయి. క్రమంగా పద్మాల రేకులు బింకమెక్కాయి. కేసరాలు అందగించాయి తేనెలూనిండుకుని తొణికిసలాడాయి. కొద్దికొద్దిగా నిద్రపోయి కళ్ళువిప్పిన విరహుల మీద దాడితియ్యడంకోసం, తమలోతాము పిల్చుకుంటూన్న మన్మథ సైన్యం కలకలంలావుంది, వనాల్లో అక్కడక్కడ వినపడుతూన్న చిలకలపలుకులూ, కోయిలలకూతలూ, తుమ్మెదలమోతలూ కలిసి.. కలధ్వని.అరుణోదయకాంతికి అందంఅతిశయించేట్టు పద్మపరాగం

విరజిమ్మాయి వేకువపిల్లగాలులు. చుక్కలు లేని ఆకాశంలా వృక్షాలు కనపడేట్టు పరువంతప్పిన పువ్వుల్ని కిందరాల్చాయి. మేల్కొన్న విటుల మధ్య సువాసనలు సుళ్ళుతిరిగేట్టు విడుతూవిడుతూవున్న పువ్వులపరిమళాలం విసిరికొట్టాయి. కిటికీలలోంచి దూరి గదుల్లో తెల్లమొహం వేస్తున్న దీపాల్ని ఘునంచేశాయి.

ఉదయశైలమనే అశోకవనంలో అందంగా, ఉజ్జ్వలంగా వికసించిన మొట్టమొదటిపూగుత్తిలా పొడుచుకువచ్చింది సూర్యబింబం. కొండల జేగురు దరియలుమరింత మెరుగుపెట్టినట్టయాయి. చెట్టుచెట్టుకీ పొదపొదకీ చివుళ్ళు మరింత ఎఱుపుపూసినట్టయింది. ఎర్రతామర్లఅంతర్దళాలు మరింత జిగిపెట్టినట్టయాయి. చక్రవాకదంపతుల రెక్కల కెంజాయలకి మరింత తళుకుపులిమినట్టయింది. ప్రపంచమంతా ప్రసన్నచిత్తంతో పల్లవించి కలకల్లాడింది.

## కౌరవసభలో కలకలం

కాలకృత్యాలు తీర్చుకున్నాడు ధృతరాష్ట్రుడు. తగినవిధంగా అలంకరించుకున్నాడు. ఆస్థానమండపానికి వచ్చి కొలువుతీరి కూచున్నాడు. ద్రోణుడూ, కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా, కర్ణుడూ మొదలైన దొరలూ, భీష్ముడూ, విదురుడూ, బాహ్లీకుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ మొదలైన బంధువులూ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలైన కుమారుళ్ళూ – సమస్తపరిజనంతోనూ వచ్చి ఎవరిస్థానాల్లో వాళ్ళు కూచున్నారు.

ఇంతలో సంజయుడువచ్చి దేవిడీదగ్గిరనుంచుని ద్వారపాలకుల చేత కబురుచేశాడు. లోపలికివచ్చి తగినస్థలంలో కూచున్నాడు. తహతహపడుతూవుంది కొలువు. అందరినీ వోసారి కలయచూసి ఆరంభించాడు సంజయుడు. "మహారాజుపంపినప్రకారం పాండవులదగ్గిరికి వెళ్ళివచ్చాను. ధర్మరాజుని చూశాను. స్నేహంగా కౌరవులనందరినీ

పేరుపేర కుశలప్రశ్న చేశా డాయన. పిన్నలికి దీవనలూ, పెద్దలకి నమస్కారాలూ తెలియజేశాడు. నేనూ మహారాజు చెప్పినప్రకారం బంధుత్వానికి అవసరమైనమాట లాడాను. తరవాత, వెళ్ళినకార్యం ప్రసంగించాను. నేను చెప్పిన ప్రతీదానికీ ఎంతో ఔదార్యంతో మాట్లాడా డాయన'' అన్నాడు.

తాను ధర్మరాజుతో చెప్పినమాటలూ, దానికి అతడు చెప్పిన జవాబులూ వివరించాడు. ధృతరాష్ట్రుడికీ, దుర్యోధనుడికీ, భీష్ముడికీ, చెప్పవలిసిందని ధర్మరాజు చెప్పినవన్నీ తెలియజేశాడు. ఇంకా ఇలా చెప్పాడు

''ఉపప్లావ్యం చేరడంతోనే మొదట కృష్ణార్జునుల్ని చూశాను. పౌరుషం సడలకండా, నీతివిడవకండామాట్లాడారువారు సావధానంగా అంతా వినండి.

''కుమారులైనవారూ వెళ్ళరానిచోటది. మహిళాజనం సేవిస్తూ వుండగా కృష్ణుడూ, సత్యభామా, ద్రౌపదీ, అర్జునుడూకలిసి రహస్య గోష్ఠిలో వున్నారు నేనువెళ్ళేసరికి అక్కడికేరమ్మన్నాడు నన్ను శ్రీకృష్ణుడు. మహారాజా, దీన్నిబట్టే తెలుస్తుంది నీమీద ఆయన కెంతఅభిమానమో మరి. ద్వారపాలకులవల్ల నాకీవిషయం ముందే తెలుసు. అంగీవేసుకున్నాను. తలపాగా చుట్టుకున్నాను. ఇలావినయమూ చిత్రమైన వేషం వేసుకువెళ్ళాను. అనేక మణిమయభూషణాలతో కృష్ణార్జును లిద్దరూ వొక్కశయ్యమీదే వున్నారు. పాదాలుచాచు కుని పవ్వళించివున్నాడు కృష్ణుడు. కృష్ణుడిపాదాలు తొడలమీద పెట్టుకుకూచున్నాడు అర్జునుడు. సత్యభామా ద్రౌపదీ సోఫాలమీద కూచుని వున్నారు. సవినయంగా దండప్రణామంచేశాను నేను. నన్నా దరించి అర్జునుడికి చేసన్నచేశాడు కృష్ణుడు రత్నాలుచెక్కిన బంగారంపాదపీఠంనుండి తాను వేలాడవేసుకున్న పాదాలు తీసి అతడు చూపడంతోనే, యువతులిద్దరు తెచ్చి నాకోసం వేశారు దాన్ని. నేనది చేత్తోతాకి నేలమీదకూచుని అంజలిబంధం నుదుటగీలించాను.

"కృష్ణార్జునులిద్దరూ ఏనుగు జతలా కనిపించారు ఇద్దరూ నీలవర్ణులు. ఇద్దరూ సమానమైన బలవంతులు. చూసి ఆనందాశ్రువులు ప్రవహించాయినాకు. శరీరం పులకలెత్తింది భయమూవేసింది. చెప్పిన పనిచెయ్యడానికి ఈఇద్దరూ సిద్ధంగావుంటే, సిద్ధించని కోర్కెలంటూ ఏముంటాయి ధర్మరాజుకి! అతణ్ణి ఎదిరించడమంటే యముడి నెత్తిమీద కొట్టడమన్నమాటే అనుకున్నాను. ఆమహానుభావులిద్దరూ న్నన్ను సన్మానించారు తాము కట్టదగ్గ వస్త్రాలూ, తాము తొడిగే భూషణాలూ నాకిచ్చి ఆదరించారు.

"నేనువెళ్ళినకార్యంవిన్నవించాను. అనేకవిధాలజవాబు చెప్పడానికి ప్రారంభించాడు అర్జునుడు. అతణ్ణివారించి తానేచెప్పాడుకృష్ణుడు 'సంజయా, ధృతరాష్ట్రమహారాజు నిండుదివాణంలో అతనూ, అతని కుమాళ్లూ, ద్రోణుడూ, కృపుడూ, భీష్ముడూ – అందరూవింటుండగా ఇలాచెప్పు' అన్నాడు. 'ధర్మరాజుకి కోపంవచ్చిందంటే నీళ్ళలో అగ్గి పుట్టిం దన్నమాట. దాన్ని ఆర్పడం అసంభవం. ఇకజాగ్రత్తగాలన్నీ పూర్తిచేసుకోవాలి మీరు. అ వేమిటంటూరా, వినండి. మీకు వున్న డబ్బావదసకమూ తగినవాళ్ళనిచూసి దానంచెయ్యండి. చుట్టాల్నీ, పక్కాల్నీ, వున్నవాళ్ళనీ లేనివాళ్ళనీ పిలిచి సంతోషంగా సత్కరించండి ఇచ్ఛానుసారంగా ఇంద్రియసౌఖ్యాలు అనుభవించెయ్యండి. తుదిచూపులుచూసుకుని ఆలుబిడ్డల్ని కావలించుకోండి. మనస్సుల్లోని కోర్కెలేవీ మిగలకండా సాకల్యంగా పూర్తిచేసుకోండి ప్రాణాలు అరిచేతుల్లోపెట్టుకునిమాత్రం పెందరాళే యుద్ధానికినడవండి, అని చెప్పు. ఏమంటావా, ఎక్కడా, ఎవ్వరూ, ఏనాడూ అనుభవించని అవస్థలోపడి 'కృష్ణా, రక్షించు' అని ద్రౌపదిచేసిన ఆర్తనాదం తీర్చలేనిఅప్పు అయి హృదయశల్యంగా వుందనాకు. ఇలాంటినేను రథం నడుపుతాను. గాండీవం ఎక్కుపెట్టి, జంటతూణీరంతో రణస్థలానికి

రానేవస్తాడు అర్జునుడు. ఎన్ని చెరువులనీళ్ళు తాగుతారు కౌరవులు!' అని చెప్పాడు.

"ఇలా వారిసంకల్పమూ, నీకొడుకు మొండిపట్టుపట్టి కూచోడమూ తలుచుకుంటే భయంవేసింది నాకు వాళ్లంటేఏమిటో తెలీడం లేదు దుర్యోధనుడికి. భీష్మద్రోణుల దన్నూ, కర్ణుడిగర్వమూ గెలిపిస్తుందని కలగంటున్నాడు" అన్నాడు.

అదివిని "ఐతే, అర్జును డేమన్నాడు?" అని అడిగాడు ధృతరాష్ట్రుడు.

"కళ్లమెర్రయ్యే కోపంవచ్చీకూడా గాంభీర్యంవహించాడు అర్జునుడు" అన్నాడు సంజయుడు, "అసలే ఎర్రతామర రేకుల్లావున్న నేత్రాలురెండూ కెంపుల్లామెరిశాయి. 'సంజయా, దుర్యోధనుడూ, అతగాడిసహాయంకోసం వచ్చిన రాజులూ అందరూ వినేట్టు నేనిలా అన్నానని చెప్పు. ధర్మరాజుఅడిగినా దుర్యోధనుడు వంతుఇవ్వక పోయాడో, మంచిమాటేఅది. తానింతకుముందు చేసిన దుర్ణయాలన్నిటికీ మకుటంపెట్టిన ట్లవుతుంది. భీముడూ నేనూ కోరుతున్నదే అది. వాళ్ళు మాఇద్దరినీ రేపెట్టడమే ధర్మరాజు కార్యం సిద్ధించడమన్నమాట. ఇది సంతోషించవలసిందేకదా! రణభూమిలో అంపశయ్యమీద దుర్యోధనుడు పొర్లాడితేనే కాని, వనవాసంలో ధర్మరాజు కటికి నేలశయనించిన ఆయాసం తీరదు మాకు. సత్యాన్నినమ్ముకుని, కష్టాలు గణించక హృదయంలో అదుచుకున్న ఆయనకోపాగ్ని ఎండినఅడివిమీదపడ్డ దావానలంలాగ వాళ్ళని కబళిస్తేనేకాని ఆయనంటే లక్ష్యపెట్టరు కౌరవులు. గదసారించి కాలయముడిలా భీముడు మత్తగజాల్నీ, రథాల్నీ, గుర్రాల్నీ గుండపిండిచేసి కూలవేస్తేనేగాని మారాజ్యం మాకివ్వడు రారాజు. పెద్దపులి లేళ్ళమీదికురికినట్టు, పెనుగాలి మేఘాలమీదపడ్డట్టు, ప్రాణులమీదికి మాౕమసగినట్టు, ప్రళయరుద్రుడు త్రిలో

కాలిమీదికి తిరగబడ్డట్టు నకులుడూ, సహదేవుడూ, సాత్యకీ, అభిమన్యుడూ, వాళ్ళు పదకొండుఅక్షౌహిణీలసైన్యాన్ని చెదరగొట్టి, చావగొట్టి, పడగొట్టినపుడుకాని కౌరవులు సంధికిరారు. సింహకిశోరాలు ఏకమై మదగజాలమీదికి వురికినట్టు ద్రౌపదికుమాళ్ళుఐదుగురూవాళ్ళమీదపడి నెత్తురుకాలవలు పారించినప్పుడుకాని మీరాజుకోపం వొదలిపోదు. ప్రాణాలులెక్క చెయ్యకండా వెంటవచ్చిన బంధువులతో ద్రుపదుడూ విరాటుడూ ఘోరంగా ముట్టడిస్తేనేగాని కొండమీంచిదిగరు గాంధారికొడుకులు. ఏకలక్ష్యంతో శిఖండిరథం భీష్ముడిమీదికి వురకలువేసినప్పుడు, ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిమీదికి పరుగెత్తినప్పుడు,యుద్ధమంటే తెలిసివస్తుంది మీకు.

"'గాండీవం క్రమవిజృంభణంతో శరపరంపరవర్షించినప్పుడు, తన చతురంగబలాలు జర్జరితమై ఇది కాలూ ఇది చెయ్యీ అని నిరూపించడానికి వీలులేకండా తుత్తునియలయివులతూ వున్నప్పుడు, నెత్తురూ, మూలుగులూ, దుమ్ములూ, మాంసమూ కుప్పలు కుప్పలై కూలిపడ్డప్పుడు, దేవదత్తం, కపిధ్వజం, తెల్లగుర్రాలు నొగలమీద కృష్ణమూర్తి కళ్ళపడ్డప్పుడు కళ్ళుచిప్పుతాడు దుర్యోధనుడు.

"'అవతారమూర్తి కృష్ణుడంటేనే నిరాలక్ష్యం మీరాజుకి. మేమంటే వుప్పాపత్రా! అదిమాకు తెలీదనికాదు. ఐనా తప్పంటే తెలీనివాడు దుర్యోధనుడు, కడిగిపెట్టినసాలగ్రామం, ఒకరిలక్ష్యం తనకెందుకు?

"'పితామహుడికి, గురుదేవుడికి, కృపాచార్యులికీ పాదాభివందనం చేసి స్వరాజ్యంకోసం యుద్ధంచేస్తాంమేం ధర్మపక్షంమాది. మాతో ఎదిరించినవాళ్ళఆయుధాలు ధర్మాలు నాశనంచేస్తుంది. ఇదే మానమ్మకం. పన్నెండేళ్ళు అడవుల్లో పడరానిపాట్లుపడ్డాం. పదమూడో ఏడుఅజ్ఞాతవాసఆయాసమూఅనుభవించాం. మా 'జనకరాజ్యం పిూజన్మ

హక్కు. న్యాయమయిన ఈ పోరాటంలో కౌరవులే గెల్చుకున్నారంటే ఇవాళనుండీ ధర్మంకంటే అధర్మమే గొప్పదంటాం. అంచేత జయం మాకు నిశ్చయం శ్రీకృష్ణుడే మాకు సూత్రధారుడు కర్ణుడితో సహా గాంధారికుమాళ్ళని కడతేర్చి కౌరవరాజ్యం కాజేస్తాం

"'ఎక్కుపెట్టకండానే గాండీవం చుట్టుకుంటున్నది. తమంతట తామే బాణాలు తూణీరాలనుండి పైకివస్తున్నాయి. పొరవదిలిననాగు పాంలా వొరనుండి కరవాలం అప్రయత్నంగానే బైటికివస్తోంది. అంచేత యుద్ధం అవశ్యంభావి. సందేహంలేదు కౌరవజనక్షయం, పాండవపట్టాభిషేకం తప్పదు సంజయా, నువ్వు చలించకండా ఇదంతా చెప్పాలి వాళ్ళకి. బాహ్లికుడూ భీష్ముడూ అనుభవంకల శతవృద్ధులు. ద్రోణాచార్యులు వాళ్ళకీమాకూ గురుదేవుడు. కృపాచార్యులు శిక్షకుడు. అశ్వత్థామ గురుపుత్రుడు. విదురుడు విజ్ఞాని శల్యుడు ధర్మాచరణశీలుడు నేనుచెప్పిందంతావిని వీరందరూ ఏదినిశ్చయిస్తే అదేజరుగుతుంది. అన్నిటికీ మేం సిద్ధంగానేవున్నాం. దుర్యోధనుడు చిరంజీవి కావాలనే మాకోరికకూడాన్నూ' అని చెప్పాడు."

సంజయుడు ముగించాక భీష్ముడిలాఅందుకున్నాడు "దుర్యోధనా, కృష్ణార్జునులంటే నువ్వనుకుంటూన్నట్టు సామాన్యులుకారు. విను ఓనాడు బ్రహ్మలోకంలో బ్రహ్మదేవుడి దర్బారుజరుగుతూవుంది. దేవేంద్రుడూ మొదలయిన దేవతలూ, ఋషులూ—అంతా పిటపిటలాడుతూ వున్నారు. అలాంటిసమయంలో వో ఇద్దరు ఆసభలోంచి రాసుకుంటూ, చెట్టాపట్టాపట్టుకుని వెళ్ళిపోయారు. వాళ్ళ తేజస్సుతో సభంతా జిగేలుమనిపోయింది 'ఎవళ్లు వీళ్లు, మిమ్మల్ని లక్ష్యపెట్టకండా, ఇటుచూడనన్నా చూడకండా ఇలా వెళుతున్నారు?' అని అడిగాడు బృహస్పతి బ్రహ్మదేవుణ్ణి.

" 'నరనారాయణులు వీరు. అపారమైన తపోబలంకలవాళ్లు. లోకహితార్థం యుగాలతరబడి అవతరించే మహామునులు. దుష్టశిక్షణా శిష్టరక్షణా వీళ్ళవ్రతం. అధర్మయుద్ధం కలిగినచోట్ల ధర్మపక్షం వహిస్తారు. దేవాసురయుద్ధంలో వీరిసహాయమే అర్థించాడు ఇంద్రుడు. పౌలోమ, కాలకేయాది రాక్షసుల్ని చంపి ఇంద్రుణ్ణి గెలిపించారువీరు. ఒక్కటేతేజస్సు ఇలా రెండుపాయలై వెలుగుతోంది' అని చెప్పాడు బ్రహ్మదేవుడు. ఆ నరనారాయణులే ఈ కృష్ణార్జునులు. వినోదార్థం ఇలా జన్మించారు. కనకనే సముద్రతీరంలోని హిరణ్యపురం ముట్టడించాడు అర్జునుడు. అరవైవేల నివాతకవచుల్ని హతమార్చాడు. మహేంద్రుణ్ణి మెప్పించాడు. కంసుణ్ణీ, నరకాసురుణ్ణీ కడతేర్చాడు కృష్ణుడు. ఇక, వాళ్ళిద్దరూ ఏకమైతే మరిచెప్పేదేముంది? ఒకకృష్ణుడు రథీ, ఒకకృష్ణుడు సారథీ—కృష్ణద్వయంతో వాకేరథం సంహారక్రీడకి పరిగెత్తుకువస్తూంటే —నిజమే, అపుడుగాని నీకు బోధపడదు.

"నామాటంటే అసలే నిరాలక్ష్యం నీకు. చెయ్యరానిపనులంటే చెవికోసుకుంటావు. గర్వానికా అంతూపొంతూ కనపడదు కౌరవులికి కాలంముంచుకొస్తోంది. కాకపోతే ఇదంతావేమిటి మరి? ఇవాళ నామాటలు రుచించవు, ' వాళ్ళొచ్చారూ, వీళ్ళొచ్చారూ 'అని మొర్రోమొర్రోమందువుగానిఅప్పుడు. శకునీ, కర్ణుడూ ,దుశ్శాసనుడూ తాళంవేస్తారు. ఈదుష్టత్రయం నూరిపోసిందేకాని మరోటి నచ్చదు నీకు. అందులో కర్ణుడంటే కన్నూమిన్నూ కనపడదు మరి. నిన్నేమనాలో అర్థం కాదు నాకు" అన్నాడు,

" ఏమన్నమాటలివి ?" అని కస్సుమన్నాడు కర్ణుడు, "తిరిగి తిరిగి ముక్తాయింపు నామీద కెందుకూ మధ్యని! నే నేంచేశానని! మహారాజుకీ,రాకుమారుళ్ళకీ, మనవంలకీనచ్చినట్టు నడుచుకుంటున్నాను. అదీ తప్పేనా? ఎవళ్ళవుప్పు తింటే వాళ్ళమాట చెప్పవద్దా! నావిశ్వా

సంచూసే నన్నింతవాణ్ణిచేశాడు రాజరాజు. దానికింత కన్నుకుట్టడ మెందుకు? ఇలా నోరు పారవేసుకోడం దేనికి?'' అన్నాడు.

ధృతరాష్ట్రుడిదిక్కు తిరిగి ఇంకా ఇలా అన్నాడు భీష్ముడు ''వాళ్ళలో ఏవొక్కడితోనూ సాపత్యంలేదువీడికి. పాండవుల్ని గెలుస్తా నని పెద్దకబుర్లు చెపుతాడు. వీడివూకదంపులు విని భళీఅంటే భళీ అంటారు మీఅబ్బాయిలు. వీణ్ణినమ్ముకుని దేవుళ్లాంటిధర్మరాజుని అవమానించి విరోధంపెట్టుకున్నాడు దుర్యోధనుడు. వాళ్ళల్లో ప్రతీ ఒక్కడూ పెద్దపెద్దయుద్ధాల్లో గెలుచుకువచ్చినవాడే. వీడింతవరకూ సాధించిన ఘనకార్యంవొక్కటైనావుందా? ఘోషయాత్రలో గంధ ర్వులు మీవాణ్ణి పట్టుకుపోతూంటే వెర్రిమొహంవేశాడు. అర్జును డొక్కడేవచ్చి పశువులుతోలుకుపోతూంటే వెనక్కిపరుగుచ్చు కున్నాడు. తనకళ్ళముందే తమ్ముణ్ణి తెగవేస్తే వీడేంచేశాడో కనుక్కో మరి! నోటిరంకుమాత్రం జాస్తీ. అదే మీచెవులికి అమృతపేయంగా వుంటుంది. కానీయండి.''

భీష్ముణ్ణి సమర్థించాడు ద్రోణుడు. ''కౌరవసంతతికంతటికీ కావ లిసినవాడు భీష్ముడు. ఈయన చెప్పినదాంట్లో పిసరంత అతిశయోక్తి లేదు. ధర్మరాజుతో మంచిగావుండడమే మంచిది యుద్ధమంటే వేలాంవెర్రిలావుంది మనవాళ్ళకి. కూడదు. సంజయుడితో అర్జునుడు అన్నాడంటే అన్నంతా చేసితీరతాడు. దూరంవెళ్ళనక్కర్లేదు, ఖాం డవదహనమే దానికిసాక్షి. ప్రపంచంలో ఎంతమంది యుద్ధంచెయ్యడం లేదు! ఎంతమంది విజయంసాధించడంలేదు. ఐతేనేంగాక, 'విజయుడు' అన్న రూఢిపదం అర్జునుడికేచెల్లింది. అతడితో సరివచ్చే విలుకాడు ఇక్కడేకాదు, ఎక్కడా ఎప్పుడూ లేడు. ముందుకూడా వుండబోడు. అతణ్ణి కవ్వించడమంటే కొరివితో తలగోక్కోడమే.''

భీష్ముడూ, ద్రోణుడూ ఇంతా గొంతుచించుకుంటే, పలుకూ వులుకూ లేకండా వూరుకున్నాడు ధృతరాష్ట్రుడు. కొంతసేపయాక

మళ్ళీ సంజయుణ్ణే ప్రశ్నించాడు. "ఐతే, అసలు ధర్మరాజు లోపలి అభిప్రాయ మేమిటంటావు? మన పదకొండు అక్షౌహిణీలసంగతి విన్నా డంటావా? ఇంతకీ, ఎవర్ని వెంటవేసుకుని ఇంతమనసైన్యాన్నీ నిగ్రహించగల ననుకుంటున్నాడు?"

ఈప్రశ్నతో నిశ్చేరపోయాడు సంజయుడు. "వైరికుదిరింది తనకి రోకలిచుట్టమన్నాట్ట. ఎవర్ని వెంటవేసుకుని వస్తాడని అడుగుతున్నాడు. ఇక, ఏంజెపితే ఏంలాభం? ఈయనసంగతే ఇలావుంటే, కుర్రాళ్ళసంగతి చెప్పేదేముంది" అని తనలోతాను నిట్టూర్పు విడిచాడు. తుదకిలా ప్రారంభించాడు.

"ధర్మరాజు ముఖ్యంగా సంధే కావాలంటున్నాడు. మీామీాద పిసరంత వ్యతిరేకభావంలేదు. తమతండ్రివంతుమాత్రం తమకి కావాలంటున్నాడు. కాదూపోదూ యుద్ధానికేరమ్మంటే దానికీ సిద్ధమే అన్నాడు. యుద్ధమో, సంధో నిర్ణయించవలిసినవాడివి నువ్వే అంటున్నాడు.

"ఎవర్ని వెంటవేసుకు వస్తాడని అడుగుతున్నావు! నెత్తికి ఆకాశం తగిలేవాడి ఎత్తెంత అంటున్నావు. ఐనా విను, బకాసురుణ్ణీ, జటాసురుణ్ణీ, హిడింబుణ్ణీ, కీచకుణ్ణీ చంపినవాణ్ణి-భీముణ్ణి వెంటవేసుకువస్తాడు. ముక్కంటిని మూడుచెరువులూ తిప్పినవాణ్ణి – అర్జునుణ్ణి వెంటవేసుకు వస్తాడు. సింహాలుపట్టుకుని మృగాలవేటకి వచ్చినట్టు నకులసహదేవుల్నీ, ఉపపాండవుల్నీ, అభిమన్యుణ్ణీ వెంటవేసుకువస్తాడు సాత్యకినీ, ధృష్టద్యుమ్నుణ్ణీ, ద్రుపదుణ్ణీ, విరాటుణ్ణీ, కేకయుల్నీ, జరాసంధుడి కుమారుడు సహదేవుణ్ణీ, జయత్సేనుణ్ణీ, దుష్టకేతు చేకితానుల్నీ శైబ్యుణ్ణీ వెంటవేసుకువస్తాడు. తండ్రినిమించినకొడుకు ఘటోత్కచుణ్ణి, అగ్గయినా పిడికిలిపడతా మంటూన్న తూర్పుఉత్తరాదిరాజుల్నీ వెంట వేసుకు వస్తాడు. పాండవుల కష్టాలువిని పగతీర్చుకుందామని ఉవ్వ

రోషంతోవున్న వుక్కుతునకలు వీళ్ళంతా. మీ సైన్యాలు వెన్నిచ్చ కుండా నిలబడాలి, అంతే.

"తూర్పుతో పడమరని, దక్షిణంతో ఉత్తరాన్ని ముడిపెట్ట గల ధీశాలి కృష్ణుడు వాళ్ళకి సూత్రధారుడు. ఆయనబుద్ధిబల మొక్కటే చాలు మీపదకొండు అక్షౌహిణీలనీ తుడిచివేయడానికి" అన్నాడు.

ఓ పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు ధృతరాష్ట్రుడు. "అవును. నువ్వన్నట్టు వొకణ్ణిమించినొకడు వృద్ధుడులే వాళ్ళంతా. కానైతే, అంతావొకయెత్తూ, మరి భీముడొక్కడూ వొకయెత్తు. ఉద్దోలమైన బలం వాడిది వాణ్ణితలుచుకుంటేనే దడ నాకు. రాత్రిళ్ళునిద్రపట్టదు. వాణ్ణినెట్టుకుపోయేవాడు మనవాళ్ళలో వొకడూలేడు. గుడ్లెర్ర చేసి వాడు గద ఎత్తాడో, అది కాలదండమే, తిరుగులేదు. ఎప్పుడూకూడా నామాటంటే మెడ్డేసేవాడు. చీటికీమాటికీ పగబట్టి వాడిమీదికి ఎగబడేవాళ్ళు వీళ్ళు. చిత్తుగా దెబ్బలుతినేవాళ్ళు ఐనా మర్నాడు మళ్ళీసిద్ధం. ఇంత రోషంకీ అదే కారణమైంది. దేవత లేవిటి, దానవులేవిటి, ఎవణ్ణీ లెక్కచెయ్యడు వాడు. అంత జరాసంధుణ్ణీ చిటికెలో చీల్చిపారేశాడు. తక్కినవాళ్ళు ఉఫ్పాపర్రా! ఊహూం, తప్పదు. నానూరుమంది కొడుకులూ వాడిచేతుల్లో చచ్చి పూరుకుంటారు. కనుబొమలు ముడిపెట్టుకుని భయంకరంగా వాడు పైనపడుతూన్నట్టూ, భయపడి కౌరవసైన్యం పారిపోతూన్నట్టూ— ఆ దారుణమైనదృశ్యం కళ్ళముందు కట్టినట్టే వుంటుందినాకు. గదా, కత్తి వాడిచేతిలో లేకపోయినాసరే, బ్రహ్మాస్త్రంతో అయినా పడ గొట్టలేం వాణ్ణి నిజమే, విధి వక్రించడంవల్ల చావూ బతుకూ తెలీ కుండావుంది మావాడికి భీముడన్న మహాసముద్రంలోనే మునిగి పోతారు వీళ్ళు. ఉప్పెనకి తుఫాను తోడయినట్టు భీముడికి అర్జునుడు తోడై వస్తాడు. ద్రోణుడన్నట్టు అర్జునుడంతవిలుకాడు ఎప్పుడూ, ఎక్కడా పుట్టలేదు. ముందు పుట్టబోడు. అన్నంతపని చేస్తాడు.

అందులో అబద్ధమేమీ లేదు అర్జునుడే అనుకుంటే అతడికి సారథి శ్రీకృష్ణుడు! అన్ని శక్తులూ ఒక్కదగ్గిరే కేంద్రీకృతమయాయి. ఇన్నిటిని ఎలా భరించడం? అసంభవం.

"భీమార్జునులసత్తా భీష్మద్రోణులకంటే తెలిసినవాళ్ళెవరు? తెలిసీకూడా మానుమంకోసం దండు మొగని నుంచుంటారు కీర్తి మాత్రంమిగిల్చి ప్రాణాలువొదుల్తారు. ఇంతే,ఇంతకంటేచేసేదివుండదు. వాళ్ళూ వీళ్ళూ శిష్యులూ మనవఁలూను వీరికి. అంచేత ఉభయులూ సమానమే. కేవలం మనదగ్గిరవున్న తప్పూకని, మనకోసం బలిఅయిపోతారు. నేను నా బిడ్డల్ని వొత్తిచెప్పనూ లేను, మళ్ళించనూ లేను. ఇది నాఖర్మం. మొదట విదురుడు చెప్పినంతా అయిందిప్పుడు. జూదంనాడే కౌరవజాతికి కాలం దాపురించింది. ఇంతా దుర్మార్గుడు దుర్యోధనుడే తెచ్చిపెట్టాడు. ఏంచేసేది? ఏందారి? ఎక్కడికిపోయేది? ఎవరు దిక్కు?

"పోనీ, భీమార్జునులు ఇద్దరితోనే తీరిపోయిందా? తమ్ముళ్లూ అలాంటివాళ్ళే. ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ-ఎవరింతులో తక్కువ తిన్నవాళ్లు? వినయంగా, వివేకంతో చుట్టాల్నీ పక్కాల్నీ వశంచేసుకుని ప్రభుత్వంసాగించే వొడుపులు తెలిసినవాడు ధర్మరాజు సత్యవ్రతుడు, శుచిమంతుడు, ధర్మాత్ముడు, దయాపరుడు. అతగాడిమీదికి దండెత్తడమంటే, మిడతలు పోయి మంటలో పడడమన్నమాట కురుపాండవయుద్ధంతో కౌరవవంశం నశించిపోడం నిశ్చయం అంచేత సౌమ్యమైన సంధివొక్కటే ఇప్పుడు శరణ్యం. మనవాళ్ళ కిది నచ్చినట్టయితే దీనికి తగినప్రయత్నం చేస్తాను" అన్నాడు.

"దివ్యమైనసంకల్పం" అన్నాడు సంజయుడు, "అప్పుడే ఉపేక్షించావు. ఇంత రాకనేపోయేది. ఇక నీతోనే వుంటారు పాండవులు. నీకొడుకులమీద ఈగవాలనివ్వరు. దిగ్విజయంలో గెల్చిన రాజ్యమంతా మీకే ఇచ్చివెళ్ళారు. అడివిలో బాధపడుతూనూ

గంధర్వులనుంచి దుర్యోధనుణ్ణి విడిపించారు అప్పుడైనా వాళ్ళని పిలి పించివుంటే ఎంత బావుండేది! నీమాట కాదనేవాళ్లా వాళ్లు? అయిం దేదో అయింది. ఇప్పుడయినా మించిపోయిందిలేదు. వెంటనే పిలిపించు వాళ్ళని ఓ ఇంటివాళ్ళనిచేసి చల్లని నీడపట్టుకలిగించు'' అన్నాడు.

కార్యం చెయిజారిపోయినట్టు తుళ్ళిపడ్డాడు దుర్యోధనుడు. ''అడవులంటూ, కొండలంటూ అదీయిదీ కతుకుతూ ఏదో బతుకు తూన్న వాళ్ళని ఇవాళ చేరదీశాడు వాళ్ళబావ కృష్ణుడు. నాకాయ నూకియల్ని నలుగుర్ని కూడబెట్టినంతమాత్రాన వాళ్లూవీళ్లూకలిసి వూడపొడిసేదేమిటో అర్థంకాదునాకు. ఎందుకింత అడిలిపోడం? వాళ్ళంత మొనగాళ్ళయితే మేమేనా వోట్టిచేతకానిచవటలం? ఎలా. చూచినాముమ్మాటికీ మేమే గెలుస్తాం ఇందులోసందేహమే లేదుమాకు.

''పరశురాముణ్ణి గెలిచిన పరాక్రమశాలి భీష్ముడు. ఈయన పేరంటే గడగడలాడుతుందిలోకం. నిజంగా ఈయనే కళ్ళెర్రచేస్తే పాండవులూ, గీండవులూపత్తాకనిపించరు. అయోనిజులైన ద్రోణుడూ, కృపుడూ అమితబలవంతులు. వీళ్ళు తేరిచూస్తే శివుడన్నా తోకముడు స్తాడు వరప్రసాదంవల్లపుట్టినవాడూ, సూర్యుడంత తేజశ్శాలిన్ని అశ్వ త్థామ. ఈయనవుంటూండగా భయందేనికి మనకి! సహజకుండలధారి, గండరగండడు కర్ణుడుమరవాడు అర్జునుడి పంచప్రాణాలూ ఈయన బాణాలికి బలికాకతప్పదు. బాహ్లీకుడూ, సోమదత్తూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, జయద్రథుడూ, శకునీ—వీరందరిలో ఎవరుతక్కువవాళ్లు? సహాయార్థంవచ్చిన ఈ దేశదేశాలరాజులు నేనంటే ప్రాణంపెడతారు. అగ్గిలోదూకమంటే దూకుతారు. సముద్రంలో వురకమంటే వురుకు తారు. వాళ్ళకంటే నాయిరుకుఅక్షోణీలసైన్యం మాది అధికం అంచేత, మమ్మల్ని తేరిచూడటానికేనాధ్యంకాదు పాండవులికి. బాబయ్యా, అనుమానించకండి

'' పోనీ, అలా కాదేలనుకోండి, మనకెవ్వరూ లేరేలనుకోండి, ఈబంధువులూ, స్నేహితులూ మమ్మల్ని వొదిలేశారే అనుకోండి. మాకుసహాయానికి వచ్చినవాళ్ళంతా మానుండివిడిపోయి వాళ్ళపక్షం చేరిపోయారేలనుకోండి – అప్పుడు అది మా గ్రహచారమే అనుకుంటాం. అంతేకాని ధర్మరాజు అడుగులికిమాత్రం మడుగులొత్తలేం మేం. భయపడి పారిపోనూలేం. ఏదిఏమయినాసరే యుద్ధంచేస్తాం. జయాపజయాలు దైవాధీనాలు. నాఉద్దేశమన్నా నెరవేరుతుంది. కృష్ణుడి ఉద్దేశమన్నా నెరవేరుతుంది. ఈరెంటిలో ఏది ఎలాఅయినా మంచిదే. ఈ నిశ్చయానికిమాత్రం తిరుగన్నదిలేదు'' అన్నాడు.

ఇంకా ఇలా అన్నాడు. '' కులంలో తలవంపులైనకూడు తినమంటున్నావు నువ్వు. వాళ్ళేదండెత్తివస్తున్నారు. 'మాకు చేతకాదు మొర్రో'అంటే మనపరువుపోడంతప్ప స్నేహమెలాకుదురుతుంది? వ్రతం చెడుతుంది కాని ఫలందక్కదు కొడుకులచావుకి భయపడి, లబోలబోమంటే నిన్నుచూసి అసహ్యించుకుంటారు ప్రజలు. గోరంతలు కొండంతలుచేసిపొగుడుతున్నావు భీముణ్ణి. వాడికళేబరం తలచుకుభయపడుతున్నావు. గదాయుద్ధంలో వాడు నాకిందదిగదుడుపు అన్నసంగతి మరిచిపోతున్నావు. నాతో గదపట్టుకున్నవాణ్ణి మూడులోకాల్లోనూ చూళ్ళేదు నేను. భీముడేవస్తే వజ్రాయుధంతోకొట్టిన పర్వతంలా పడగొడతాను ఎన్నోదినాలకోర్కె నాదిది. గదాయుద్ధం ఇన్నాళ్ళకి వచ్చింది. నాగదకి వాడు బలికావడం నిశ్చయం. వాడుచచ్చాడా, ఆశాస్వాంతం అయిపోతుంది పాండవులికి. ఇది తెలిసినవాడుకాబట్టే 'ఐదూళ్లయినా సంధ్యే' అంటున్నాడు ధర్మరాజు.

''అర్జునుడు అర్జునుడు 'అని వొకటే అరుస్తున్నారు అందరూను. కర్ణుడిశక్తిముందు అర్జునుడూ, గిర్జునుడూ పులిముందు పిల్లిపిల్లలు. భీష్ముడి బాణాలనుండి బతికిబైటపడ్డప్పుడు కదా అసలు కర్ణుడిదాకా

అయినా రావడానికి నీకు మా ళ్లు దుస్ససేనుడూ, దుష్ప్రహుడూ, దుర్ము ఖుడూ, వివింశతీ, వికర్ణుడూ, చిత్రసేనుడూ—వీళ్ళంతా వొక్కొక్కడే వొక్కొక్క ప్రపంచాన్ని జయిస్తారు. అలాంటిది అందరూ వొక్క మొగిని నిలపడితే వొక అర్జునుణ్ణేకాదు పదివేలపాండవుల్ని హతమారుస్తారు. మా సేన పదకొండు అక్షౌహిణీలు. వాళ్ళది ఏడు. మాది సారవంతమైంది. వాళ్ళది నిస్సారం. ఈసందర్భాల్లో వాళ్ళని మేం గెలుస్తామా? మమ్మల్ని వాళ్ళు గెలుస్తారా? ఈతరతమాలు ఆలోచించవద్దా? పరికిమందుపుచ్చుకుని వూరికే మొత్తుకోడమేనా? నిజంచెపుతున్నాను, మే మేదయినా చెయ్యగలం, కాని నిన్ను ఏడవకండా మాత్రం చెయ్య లేకపోతున్నాం.

''సంజయా. ఉక్రోషంతో దేశదేశాలమొనగాళ్ళని కూడబెట్టాడుకదా ధర్మరాజు. ఏమంటాడు? యుద్ధానికి సిద్ధమేనామరి!''

సంజయుడు యుద్ధమంటే బారెడుసాగుతున్నాడతడు. పెళ్ళికి పడ్డంత సందడిపడుతున్నారు తమ్ములు. అక్కడిఉత్సాహం చూడవలిసిందే, చెప్పలేం. చేతులుతీటతీరడం ఎప్పుడంటే ఎప్పుడంటున్నారు నాయకులదగ్గిరనుండీ సామాన్యసైనికులవరకూను. అర్జునుడిగాండీవం, భీముడిగదాదండం నమ్ముకుని కేరింతలుకొడుతున్నాయిసైన్యాలు

దుర్యోధనుడు అవును, పాండవుల్ని భట్రాజులా పొగడడం ఆనవాయితీ నీకు. మంచిదేకాని మామీదికి నడిపించుకురావడానికి వాళ్ళకున్న సాధనసామగ్రి ఏమిటో కొంచెం చెప్పూ విందాం.

సంజయుడు యువరాజా, పొరపడుతున్నావు. సాధనసామగ్రి కొరతలేదు పాండవులికి అర్జునుడి దివ్యరథం, గాండీవం దేవదత్తం, కపిధ్వజం ఏమైపోయాయని! ధర్మరాజు తోమరం, వృషభలాంఛితమైన చాపం, చంద్రధ్వజం, భీముడిగదా, వానరలాంఛితమైనవిల్లూ, సింహధ్వజం, నకులసహదేవుల కత్తులూ, డాళ్ళూ, మత్స్యమయూరచిహ్నితములైన ధనస్సులూ, శరభధ్వజం, గజధ్వజం వుండనేవున్నాయి,

పై పెచ్చు విరాటుడూ, ద్రుపదుడూ. సకలసంభారాలూ కొరతలే కండా సమకూరుస్తూనేవున్నారు.

ధృతరాష్ట్రుడు ఇక్కడ ఇంతమంది మహారథులూ అతిరథులూ వున్నారుకదా, వీరిలో ఎవరితో ఎవరు పోట్లాడుతారు వాళ్లు? గెలవ డానికి వాళ్ళు వేసుకున్న ప్రణాళిక ఏమిటో కొంచెం చెప్పూ

సంజయుడు భీష్ముడు శిఖండివంతు. అతడికితోడు విరాటరాజు బలగం. ద్రోణుడు ధృష్టద్యుమ్నుడివంతు. అతడికిదన్ను ద్రౌపది కమాళ్లు. దుర్యోధనుడూ, అతడితమ్ములూ భీముడివంతు. సీమనవం ఉంతా అభిమన్యుడివంతు. అశ్వత్థామా, సైంధవుడూ, కర్ణుడూ, అర్జునుడివంతు. కృతవర్మ సాత్యకివంతు సోమదత్తు చేకితానుడివంతు. శకునీ, అతని కొడుకు ఉలూకుడూ, సారస్వతులూ, శ్రుతాయువూ, కాళింగులూ నకులసహదేవులవంతు. శల్యుడు ధర్మరాజువంతు.

శల్యుడివిషయం వచ్చినప్పుడు 'శల్యుడు' ధర్మరాజుకి సమవుజ్జీ కాదని వాదించారు కొందరు. 'కాదు శల్యుడంటే వేళ్ళమీద చెప్పవలి సిన భారీ యోధుల్లో వొకడు' అని తానే ప్రశంసించాడు ధర్మరాజు. మనసుకువచ్చిన కేకయులు వాళ్ళదిక్కు వెళ్ళిన కేకయులవంతు ఇలా ఎవళ్ళతో ఎవళ్ళుకలబడాలో ఎవళ్ళని ఎవళ్ళుజయించాలో ప్రణాళి కలు వేసుకుని ముందే తీర్మానించుకున్నారు వాళ్ళు ఇక సీకూ సీకొ డుక్కీ ఏదితసంగమని తోస్తే, ఏది కర్తవ్యమనిపిస్తే అదే చేయండిమీరు.

ధృతరాష్ట్రుడు నాకూ, నాకొడుకులికీ ఇంకెక్కడికర్తవ్యం? ఇంకెక్కడి బతుకు? వీళ్ళందరినీ తేలికగా ఎలాకొట్టిపారెయ్యడం? ఏమిటిసాధనం? ధర్మరాజు రాజట! కృష్ణుడు పెట్టనికోటట! భీమా ర్జున నకులసహదేవులు పగిలించరాని బురుజులట! దుర్భేద్యమైన ఈ పాండవ సైన్యాన్ని గడ్డిపోచలాచూస్తున్నాడు మావాడు. బతుకుబతు కల్లా నేనుదుఃఖపడడానికివచ్చిందిఇదంతా. ఇక్కడిఇంతమందికీ ఒక్క

సారే అంతకాలం దాపురిస్తూ వుంటే అడ్డుకోడానికి నేనెవణ్ణి? అంచేత సంజయా, ఇకనెందుకీ కంఠశోష? వూరుకో.

దుర్యోధనుడు నాన్నా, పాండవులూ మేమూ ఒకేకుదురులో పుట్టాం. ఒక్కతిండే తిన్నాం ఒక్కదగ్గిరే పెరిగాం. ఒక్కచోటే శిక్షణా పొందాం. అలాంటప్పుడు శక్తిసామర్థ్యాలన్నీ వాళ్ళకే అబ్బాయినీ, వాళ్ళే గెలుస్తారనీ పట్టా రాసుందేమో తెలీడంలేదు. వాళ్ళనీ, వాళ్ళ వాళ్ళనీ ఆకాశాని కెత్తేస్తున్నారు, మేం సజరే అనడంలేదు. మంచిదే. ఐతే, పాండవులు పైకినడవవాలనీ, కౌరవసామ్రాజ్యంకౌరవులకే అనీ రాసిపెట్టాడు బ్రహ్మ ఇదిమారదనీ, మార్చేవాడు పుట్టలేదనీ, ఇకముందు పుట్టబోడనీ ఘంటాపథంగా చెపుతున్నాను నేను. అంచేత నిజమే, ఎందుకీ కంఠశోష? ఊరుకోండి.

ధృతరాష్ట్రుడు సంజయా, మావాడికీ మతిపోయింది. అవాకులూ చెవాకులూ పేల్తున్నాడు. వ్యర్థప్రలాపాలతో పాండవుల్ని గెలవడం వుత్తమాట. ధర్మమూ వాళ్ళపక్షమేవుంది సర్వసమర్థులైన వాళ్ళకన్నా సరే యుద్ధంవల్ల కీడేగాని మేలుండదు అదలావుండనీ— ఓమాటడుగుతాను చెప్పు. అక్కడవున్న వాళ్ళల్లో మేమంటే పుల్లవిరుపుమాటలు చెప్పి వాళ్ళని వుసిగొలుపుతున్నవాళ్ళెవ్వరు?

సంజయుడు ధృష్టద్యుమ్నుడు. పాండవులకోపాగ్నికి ఆజ్యధారగావుంటాయి అతగాడిమాటలు. 'భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన మహావీరులు క్రూరమైనజలజంతువులు, ఏనుగుమందలు కొండలు గుర్రపుదళాలు కెరటాలు. ఇలా ఘోరంగావున్న కౌరవసేనామహాసముద్రానికి నేనొక చెలియలికట్టనై నిలబడతాను' అంటాడతడు ధర్మరాజుతో 'అందుకు సందేహమేమిటి? అంతవాడివే నువ్వు. కాబట్టే వొగట్టు చేరుస్తావని నమ్ముకున్నాం నిన్ను' అంటాడు ధర్మరాజు. నాతోనూ చెప్పాడు ధృష్టద్యుమ్నుడు. 'సంజయా, మీవాళ్ళం

దరికీ చెప్పు. మహాదేవుణ్ణి గెలిచినవాడికి మానవులొక లెక్కా జుహా? ఒక్క అర్జునుడేచాలు మీ ప్రాణాలికి మాబోట్లు నిమిత్త మాత్రమే అనుకో. మీరేమిటి గెలవడమేమిటి? నక్కెక్కడ దేవలోక మెక్కడ? అంచేత, సపరివారంగా ధర్మరాజు కాళ్ళమీద పడమను మీరాజుని. బతికుంటే బలుసాకుతినిబతకవచ్చు. ధర్మరాజు శాంత మూర్తి. క్షమాశీలుడు. అంతలేసితప్పులే క్షమించాడు. ఇప్పుడు మాత్రం క్షమించడని భయపడకండి. తప్పక క్షమిస్తాడు' అన్నాడు

ధృతరాష్ట్రుడు బాబూ, దుర్యోధనా, నీకోసం, నీపరివారం కోసం రాజ్యంలో సగంతీసుకోవోయ్. తక్కినసగం న్యాయంగా ధర్మ రాజుకిచ్చెయ్యి. ఏబెడదా లేకండా సుఖంగా కాలక్షేపంచెయ్యి యుద్ధం నాకేకాదు, మనపెద్దలకెవ్వరికీ ఇష్టంలేదు. అన్యాయం కాబట్టి గురుదేవుడూ మొదలైన ఆప్తబంధువులూ, మిత్రులూ ఎవ్వరూ చొరవచేసుకోరు. ధర్మానికి అపరావతారం ధర్మరాజు. అతడితో ఐకమత్యంగావుండడమే కౌరవజాతికి క్షేమం.

కర్ణుడు రేపెడుతూవుంటే, దుశ్శాసనుడూ, శకునీ తాళంవేస్తూ న్నారు. వాళ్ళసొమ్మేంపోయింది? నష్టపడేవాళ్ళం మనం. కన్నతండ్రి మాట ఈమాత్రం మన్నించు. కాదనకు.

దుర్యోధనుడు యుద్ధమంటే కిట్టని ఈపెద్దల్నే వెంటవేసుకుని పాండవుల్ని సాధించదలచుకున్నానో నేను! కర్ణుడూ, దుశ్శాసనుడూ పక్కనుంటే చాలు. ఇంకొకడువచ్చినామంచిదే, రాకపోయినా మంచిదే ఊరికే నన్నెందుకు బాధపెడతావు? ఆఖరిమాట చెబుతు న్నాను, విను. చిన్న సూదిమొనమోపినంత భూమికూడా ఇవ్వను పాండవులికి.

ధృతరాష్ట్రుడు నీకోసం దుఃఖపడడంలేదు నేను. నిన్ననుసరించే వాళ్ళకోసం మొత్తుకుంటున్నాను. నామాట విను. యుద్ధం విడిచిపెట్టు. ఇప్పుడురుచించవు నీకు. ఉభయబలాలూ ఓహోఅన్నట్టు రభసంగా

భీముడు గదసారించి నీసేనుగులకుంభస్థలాలు పగలగొడుతూంటే, రక్తాలు కారుతూ, జేగురుసెలయేళ్ళతో పడివున్న కొండల్లా అవి మందలుమందలుగా కూలుతూవున్నప్పుడు జ్ఞాపకంవస్తాయి నా మాటలు. ఉద్రేకించి అర్జునుడు వొక్కసారి మారణాస్త్రాలు ప్రయోగించి, మొదలునరికిన మహారణ్యంలాగ నీసైన్యాలు పడగొట్టినప్పుడు తలుచుకుంటావు నన్ను.

మాటాడవేం? 'ఏమో, నువ్వు గెలవగలవేమో' అన్న ఆశ నాకుమాత్రం లేదంటావా? లాభంలేదు. విడివిడిగా విడమర్చి విన్నాం కదా వాళ్ళసంగతి. వాళ్ళశక్తి దైవికం. మనది మానుషం. అర్జునుడు అగ్నిదేవుణ్ణి మెప్పించి వరాలుపుచ్చుకున్నాడు, కపిధ్వజం మొదలైన యుద్ధపరికరాలు ప్రసాదించాడు అగ్ని. అదేకాదు, పాండురాజెంతో యముడూ, వాయుదేవుడూ, దేవేంద్రుడూ, అశ్వనిదేవతలూ అంతే కదా వాళ్ళకి. వాళ్ళమీద ధూళిపడనివ్వరు వాళ్ళు. భీష్మద్రోణుల సంగతి జగమెరిగిన రహస్యం. పాండవుల ప్రాణంమీదికి ఎప్పుడూ రానివ్వరువీరు.

దేవతలవరకూ ఎందుకూ? అర్జునుడుమాత్రం దేవతలంతటి వాడు కాడా! దేవతలేచంపలేని రాక్షసుల్ని తాను చంపి చక్కా వచ్చాడు. నువ్వూ, నీవాళ్ళూ అతణ్ణెరగరు గనకనా! కౌరవులికి వచ్చి పడ్డ ఈమహావిపత్తుకి ప్రతీకారం శాంతంతో కూడిన సంధిగాని మరోటి కాదు. ఎన్నివిధాల ఆలోచించినా యుద్ధంమానడమే కర్తవ్యమని పిస్తోంది. బాబూ, ఉపశమించు. దీర్ఘవైరం కూడదు.

దుర్యోధనుడు దేవతలేమో అర్జునుణ్ణి వెనకవేసుకువస్తారనడం అసందర్భం. ఏమంటే, రాగద్వేషాలికి అతీతంగావుంటేనే దేవత్వం. దేవతలు వొకళ్ళవాళ్ళయి ఎప్పుడూవుండరు. కాదూపోదూ అని పక్షపాతం వహిస్తే అది దేవత్వమే కాదు. అలాంటి దేవత్వంవల్ల అర్జునుడూ సురక్షితుడు కాడు. మనకి మునిగిపోయిందీ లేదు.

ఇహ నాచింత నువ్వేమీ పెట్టుకో అక్కర్లేదు. కార్చిచ్చు ఆర్పెయ్యడం, రాళ్ళవాన నిలిపెయ్యడం, పెనుగాలి కట్టెయ్యడం, నీళ్ళని గడ్డకట్టించి వాటిమీద గుర్రాలూ, ఏనుగులూ నడిపించడం, సైన్యాలికి కావలిసినచోట మంచినీళ్ళుపుట్టించడం, సింహ, శరభ, శార్దూల, భూతభేతాళాది క్రూరసత్వాల్ని స్తంభింపచెయ్యడం— ఇలాంటి సిద్ధులన్నీ మంత్రం, ధ్యానం ఆచరణతోసహా తెలుసునాకు. మిత్రత్వానికీ, శత్రుత్వానికీ, శుభానికీ, అశుభానికీ కావలిసినవన్నీ చెయ్యగలను. నువ్వు చెప్పిన అగ్నిమొదలైన దేవతల్ని నేనూ ప్రసన్నుల్ని చేసుకొనే వున్నాను. జలస్తంభనంలో నాఅంతవాడు ఎవడున్నాడు? నిజంగా నావంటి సామర్థ్యమే వాళ్ళకివుంటే పదమూడేళ్ళు ఇలా నానాగడ్డీ ఎందుకుతింటారు? అంచేత, చెవతాను విను. నేను కళ్ళెర్రచేస్తే దేవతలన్నా రక్షించలేరు. దేవతలుకోపించిన వాణ్ణయినా రక్షిస్తాను నేను. ఈ మానవమాత్రులు లెక్కేమిటి నాకు.

ఇవన్నీ ఏదో గర్వాగా అంటున్నాననుకోవద్దు ఇందులో పీసమంత పొల్లులేదు ఆత్మస్తుతి పౌరుషంకాదని నాకూ తెలుసు. నన్ను నేను పొగుడుకునేవాణ్ణికాను నేను పాండవులూ, పాంచాలులూ, మాత్స్యులూ, యాదవులూ, కేకయులూ, పాండ్యులూ, మాగధులూ, చైద్యులూ వీళ్ళంతా నాబారిపడి, సముద్రంలో చొచ్చిన నదీనదాలవలె రూపుమాసిపోతారు. నువ్వేవిందువుగాని. వీళ్ళంతా కలిసినా, తేజస్సు, ధైర్యం, పరాక్రమం, ఉపాయం, వివేకం—ఎందులో సాటివస్తారంటాను నాతో? భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామలకి తెలిసినంత అస్త్రవిద్య నాకూ తెలుసు. వాళ్ళకి చేతనయిందంతా నాకూ చేతనవును.

కర్ణుడు రాజరాజా, గురువుకోపంవల్ల నాలో అస్త్రస్ఫురణ పోయిందంటారు వీళ్ళు. సర్వాబద్ధ ఇది. ఆయన్ని తిరిగీ ప్రసన్నుణ్ణి చేసుకున్నాను. పోయినశక్తి మళ్ళీసంపాదించాను. అఖండమైన అస్త్ర

సంపదతో వున్నా నిపుడు. హరిబ్రహ్మాదులు తేరిచూడలేరు నన్ను. నేనంటూవుంటే అర్జునుడూ గిర్జునుడా మన రాజ్యంమీదికి వచ్చే వాళ్ళు? నువ్వూ, మనవాళ్ళూ యావన్మందీ 'ఒహో' అంటే 'ఒహో' అన్నట్టు పాండవుల్నీ గిండవుల్నీ హతవార్చి వొదుల్తాను. నీదగ్గర నుంచుని భీష్ముడూ మొదలైనవాళ్ళు వేడుకచూస్తూనే వుంటారు. మన సేనమీద గాలైనా సోకనివ్వను నాధనుస్సు కాలపృష్ఠం సారించి పాండవుల్ని బాణవర్షంతో ముంచెత్తుతాను. ఘోరంగా వీరవిహారం చేస్తాను.

భీష్ముడు కర్ణా, యమధర్మరాజు పిలుస్తున్నాడు నిన్ను. అందుకే ఇలా పేల్తున్నావు. నిన్నూ వొక మొనగాడనుకోమంటావు మమ్మల్ని ఆకాశం పొడిచేస్తావు. చాలు. ఇంతతో కట్టిపెట్టు. పాండవుల్ని నువ్వా హతవారుస్తావు?

రణరంగంలో మేమంతా వొకళ్ళితరువాత వొకళ్ళం హరీ అనేస్తాం. క్రమంగా సేనలన్నీ కూలిపోతాయి. అనంతరం కౌరవులూ కళ్ళు మూస్తారు. అంతే తప్పదు వూరికే నోరు చెరుచుకుంటూ వెందుకు? దేవేంద్రుడిచ్చిన శక్తివుందికదా, అర్జునుణ్ణి కొడదా మనుకుంటున్నావేమో! అది కృష్ణుడిచేత ముక్కలై వూరుకుంటుంది. తెలుసా? సర్పబాణంతో కొడదా మనుకుంటున్నా వేమో! అదేకాదు, ఏది వేసినా అర్జునుడికోసం అమాంతంగా కాజేస్తాడు కృష్ణుడు.

ధృతరాష్ట్రమహారాజా, జ్ఞాతులు ఐకమత్యంగావుంటేనే ఆనందం, సుఖమూను. కలహిస్తేమాత్రం కొరివిలా చివరంటూ కాలి వూరుకుంటారు. విరోధమెప్పుడూ కూడదు. స్నేహసంభాషణా, సహపంక్తి భోజనమూ, సత్కారమూ వీటివల్ల జ్ఞాతులప్రేమ సంపాదించినవాడు ఇహమూ పరమూ సాధిస్తాడు.

నేనొక పనిమీద పూర్వ మొక పర్వతానికి వెళ్లాను. అక్కడ వెళ్ళడానికి అసాధ్యంగా వున్నచోట వొక తేనెపట్టు కనిపించింది.

ఆతేనె తాగినవాళ్ళకి రోగం, ముసిలితనం, చావూ, దప్పీ ఏవీ వుండవన్నారు నావెంటవచ్చిన పండితులు. ఇక ఏముందీ, అందరూ ఆ తేనెకోసం వురికి బండరాతిమీదపడి ప్రాణాలువిడిచారు అదేవిధంగా నీకొడుకులూ ఆశపోతులై, రాజ్యమంతా మింగేద్దామని వురుకుతున్నారు. ముందువచ్చేది కానలేకపోతున్నారు. పులిగోకడం అయ్యా బతకడం వుండవట్టు అర్జునుడి ముందుపడడం వీళ్ళుబతికి రావడం వుండదు. పోనీ, సరిసమానమైన బలం కలవాళ్లయితే, 'వీళ్ళు గెలుస్తారు, వాళ్ళు గెలుస్తారు' అనవచ్చు ఒకటికొండా వొకటిపొట్టేలు ఒకటి ఏనుగూ వొకటిదోమ. అంచేత, మరోఆలోచనవద్దు. ధర్మరాజుని వెంటనే పిలిపించు.

బాహ్లికుడు దుర్యోధనా, 'ఇలావెడితే ప్రమాదం, ఇలా వెడితే ప్రమాదంలేదు' అని క్షేమంకోరి తెలిసినవాళ్ళు చెవితే విని పించుకోని గుడ్డివాడిలా, మంచిచెవితే వినిపించుకోవేం?

ధృతరాష్ట్రుడు బాబూ, నేనంతో బాహ్లికుడూ అంతేనికు. భీష్ముడికీ నువ్వంటేవాత్సల్యం వీరిమాటలువినుకో. మేం ముగ్గురం పెద్దవాళ్లం. నిన్ను బతిమాలుకుంటున్నాను నేను. ధర్మరాజుని వొదులుకోడం క్షేమంకాదు. వాళ్ళవంతు వాళ్ళకివిడిచిపెట్టు— పలకవేం?— ఏమిటీ నీమూర్ఖం! యుద్ధాలు చూస్తున్నామాలేదా? వీగిపోయినవాడెవడైనా మళ్ళీవెడతాడా? గోగ్రహణమప్పుడు నీసైన్యాలు వీగిపోయి పారిపోరాలేదా? నువ్వూ, నీకర్ణుడూ ఏమయారప్పుడు?

కర్ణా, అవాళ అర్జునుడు ఒక్కడే. ఇవాళ నొగలమీద కృష్ణుడు. పక్కని భీముడు. వెంటతమ్ములూ. కుమాళ్ళూనూ, ఇట్టికేగ లేసమ్మ స్వర్గానికి వెళుతుందా? ఒక్కణ్నే గెలవలేని మీరు, ఇంత మందిని ఎలాగెలుస్తారు? నీసాహసం. శూరత్వం మెచ్చదగ్గదే చచ్చి మాటనిలుపుకున్నాడంటారు నిన్ను. నమ్మిన బంటు అనిపించుకుంటావు.

క్షేమయినమాట. కానైతే, దానివల్ల ప్రయోజనమేమిటి, దుర్యోధనుడి చావుకి దారిచూపడం తప్ప?

## సహాయనిరాకరణం

కర్ణుడు ఇదంతా బాగానేవుంది. మంచిదే. కాని నన్ను తూలనాడినందుకు తగిన ప్రతిఫలం అనుభవించాలి భీష్ముడు. ఇదిగో, ఈయుద్ధంలో అతడితో సహాయనిరాకరణంచేస్తున్నాను నేను. అతడు చచ్చిందాకా యుద్ధంలో అడుగుపెట్టను. అందాకా నాఆయుధాలు విడిచిపెడుతున్నాను. అస్త్రసన్యాసం చేస్తున్నాను. అతడు చచ్చాకే కర్ణుడంటే ఏమిటో గ్రహిస్తుంది లోకం.

ఇలాచెప్పి కత్తీకటారీ ధనుస్సు కాలపృష్ఠంతోసహా అక్కడ పడేసి ఛ్రున సభనుండి వెళ్ళిపోయాడు కర్ణుడు.

"కర్ణుడు అంతవాడే ఔనుమరి!" అన్నాడు నవ్వుతూ భీష్ముడు, మాటఅంటే మరి తిరగడు. బొంకన్నది వొంటా ఇంటాలేదు వీడికి! ఇంతటివాడూ అలిగాడంటే బతకగలరా పాండవులు! దుర్యోధనా, వీడి మంత్రం తగిలి ఎలాగూ నువ్వు యుద్ధంమానవు. ఐతే, నేనూ చేస్తానుయుద్ధం, వీడూచేస్తాడు. మాఇద్దరి తారతమ్యాలు మాత్రం సరిగాకనిపెట్టు. అప్పుడైనా అర్థమవుతుంది నీకు. బాహ్లీకుడూ, ద్రోణుడూ — అంతాచూడనే చూస్తారు" అన్నాడు.

కర్ణుడు లేచిపోడమూ భీష్ముడి హేళనా తట్టుకోలేకపోయాడు దుర్యోధనుడు. తటపటాయించిన్నీ అనవలిసిన నాలుగుమాటలూ అనీ వేశాడు. "కౌరవుల కూడుతిని పాండవులపాటపాడ్డం పరిపాటే అయిపోయింది మీకు. నిన్నూ, బాహ్లీకుణ్ణీ, ద్రోణుణ్ణి నమ్ముకున్నందుకు మంచిశాస్తే చేస్తున్నారు, చాలు ఒక్కకర్ణుడూ దుస్ససేనుడూ వుంటే

పదివేల పాండవుల పనిపట్టేస్తాను. లక్షపిల్లులతో ఏపని! ఒక్క పులిపిల్ల చాలు. పీకకపీకా ముడిపడ్డాక ఈశ్రీరంగనీతులేమిటి? ఈవిశాల భారతభూమికి మేమే ప్రభువులం. చిన్నసూదిమొన మోపినంతభూమి కూడా ఇంకొకడిది లేదిక్కడ. ఈయుద్ధంలో ఇదేఇంకోసార నిరూపిస్తాం. నువ్వే చూద్దుగాని'' అన్నాడు, దురుసుగా.

కొడుకుమాటలికి తలతిరిగినట్టయింది ధృతరాష్ట్రుడికి. తన అశక్తతా తనకి బోధపడుతున్నది. అవుననీ కాదనడానికీ నోటమాట రాలేదు. పక్కనేవున్న విదురుడిమీద జాలిగా చెయ్యివేశాడు. ''విదురా, కర్ణుడితో కలిసి మావాడూ మృత్యుపాశాల్లో పడిపోయాడు. అన్ని ప్రయత్నాలూ అడుగంటిపోయాయి. ఇక నాశనం వొక్కటే తరవాయి, ఏమిటిసాధనం!'' అన్నాడు.

''అసలే మనపక్షం దుర్బలంగావుంది. దీనికితోడు ఈమనోమాలిన్యాలూ, అంతఃకలహాలూనూ, అపజయం అడిగితెచ్చుకో అక్కర్లేదు. పాండవులో, ఒక్కమాటమీద ఒక్కసూత్రంమీద నడుస్తున్నారు. క్రమశిక్షణకి వాళ్లనిచూసి సిగ్గుపడాలి మనం. అంచేత ఈ రాద్ధాంతసిద్ధాంతాలతో ఏం పని వెంటనే పాండవుల్ని పిలిపించు. సంధి తప్ప మరోసాధనంలేదు'' అన్నాడు విదురుడు.

దాగట్లోపడ్డ వెలక్కాయలావుంది ధృతరాష్ట్రుడిపని. సంజయుడి దిక్కుతిరిగాడు మళ్లీ. ''ఐతే సంజయా, ఇందాకసగంలో ఆగిపోయావు. నిన్ను సాగనంపుతూ, తుదిమాటగా ఏమన్నాడో అర్జునుడు?'' అని అడిగాడు.

సంజయుడు 'మాజనకరాజ్యం మాజన్మహక్కు. ఇంకొకడి ప్రమేయం లేదిందులో. ఇవాళ మీచేతిలో వుందని ఇచ్చెయ్యండనీ సౌమ్యంగా అడుగుతున్నాడు మాఅన్నయ్య. మంచిగా ఇచ్చారో బతికిపోతారు. లేదన్నారో, ధృతరాష్ట్రసంతానంలో తిలోదకాలకన్నా వొకణ్ణేమిగల్చను' అన్నాడు. దాంతో సెలవుతీసుకుని వచ్చేశాను నేను.

సంజయుడు చెబుతూవుంటే పెడమొహం పెట్టుకున్నాడు దుర్యోధనుడు. నిలువునా నీరైపోయి తలవంచుకున్నాడు ధృతరాష్ట్రుడు. ఒకరినోటా మాటరాలేదు. ఒకరి మొహానా నెత్తురుచుక్క లేదు. ఇలా ఎంతసేపు గడిచిపోయింది. తలవంచుకుని నిశ్శబ్దంగా వాళ్ళొక్కొక్కరూ వెళ్ళిపోయారు సభాసదులు. చివరికి అంత సభామందిరంలోనూ ధృతరాష్ట్రుడూ, దుర్యోధనుడూ, సంజయుడూ మాత్రం మిగిలిపోయారు.



# ఉద్యోగపర్వం

## మూడో ఆశ్వాసం

### శ్రీకృష్ణ రాయబారం

సంజయుడు వెళ్లిపోయినమర్నాడు, సరిగా అక్కడ కౌరవ సభలో రాద్ధాంతసిద్ధాంతాలు జరుగుతూన్న సమయానికే, ఇక్కడ తమ్ముళ్లనీ, కుమాళ్ళనీ, ముఖ్యులైన ఇష్టపరివారాన్నీ, సేనానాయకుల్నీ పిలిచి సమావేశపరిచాడు ధర్మరాజు.

"అందరంకలిసి కృష్ణుడిదగ్గిరికి వెళదాం ప్రార్థించి, ఆయన్ని కౌరవసభకి పంపించడం మంచిదని తోస్తున్నదినాకు. ఆయన రాయబారిగా వెళ్ళడంవల్ల బంధువులతోనూ, గురుజనంతోనూ యుద్ధం చేయడం తప్పుతుంది. ఆనుకూల్యమూ ఏర్పడుతుంది" అన్నాడు.

అందరినీ వెంటవేసుకుని కృష్ణుడి మందిరానికివెళ్ళాడు. సత్కార పూర్వకంగా అతణ్ణి ఆహ్వానించాడు కృష్ణుడు. అందరూ యథోచితమైన స్థానాల్లోకూచున్నారు. ఒకవంక పరివారంతో వచ్చి ద్రౌపదీ కూర్చున్నది. అంతా సుఖాసీనులయాక ఇలా ఉపక్రమించాడు ధర్మరాజు.

"కృష్ణా, ఆపదల్లోంచి మమ్మల్ని ఆదుకోడానికని ఈతనువుకి నిన్నేమాకు చూపించిపోయాడు పాండురాజు. మిత్రకార్యం చేసిపెట్టవలిసినసమయం వచ్చిపడిందిపుడు. నీమూలంగా అవినీతిపరుడయిన దుర్యోధనుడితో యుద్ధంచేయడం తప్పుతుంది మాకు. మారాజ్యభాగ్యమూ మేం అనుభవిస్తాం. ప్రద్యుమ్నుడూ మొదలైన నుకూళ్లు వాకటీ మేం ఒకటీ కాదునీకు. మమ్మల్ని కంటికిరెప్పలా కాపాడవలిసినభారం నీమీాదవుంది" అన్నాడు.

"నువ్వేంచెయ్యమంటే అది చేస్తాను. ఏంచెయ్యాలో చెప్పు" అన్నాడు కృష్ణుడు.

"హస్తినాపురం వెళ్ళాలి. కౌరవులతో చెప్పవలిసిన విధంగా చెప్పి వాళ్ళకీమాకూ సంధి చేసిపెట్టాలి. ఇదే నాప్రార్థన" అన్నాడు ధర్మరాజు, "సంజయుడు చెప్పినదాన్నిబట్టి మాపెదనాన్న అభిప్రాయం, ఆయనకుమారుడివైఖరీ బోధపడేవుంటుందినీకు. వంతూగింతూ ముట్టజెప్పకండానే, అవాకులూ చెవాకులూచెప్పి, మసిపూసి మారడకాయచెయ్యాలని చూస్తున్నారు మమ్మల్ని. పన్నెండేళ్ళు వనవాసంచేశాం. సంవత్సరం అజ్ఞాతవాసమూ చేశాం. పడరానివన్నీ పడి అంత దుష్కరమైనప్రతిజ్ఞ నిర్వహించుకువచ్చాం. కులధర్మమైనా యోచించడంలేదు ముసిలాయన చెడదలచుకున్నాసరే, తనకొడుకే తనకికావాలి. అతణ్ణి మళ్ళించనూలేడు. పైపెచ్చు అతణ్ణే అనుసరిస్తాడు. ఇంతకిమించినఆపద ఇంకేముంటుంది మాకు. పదిమాసాలూ మోసి కన్నది మాఅమ్మ. ఆమెనా సుఖపెట్టలేకపోయాం. బంధువులినా సంతోషపరచలేకపోయాం. అందరం హాయిగాకలిసివుండే ఉపాయమూ తెలిసిరాలేదుమాకు. ఇలా హీనంగాబతకడం మాకుమాత్రం ఏంపౌరుషమని. తుదకి 'ఐదువూళ్ళయినా యిస్తేచాలు' అన్నాను. నువ్వూ ఇక్కడిస్నేహితులూ నామాటకి ముక్కుమీాద వేలుపెట్టుకున్నారు కేవలం ఏదోఅనాలని అన్నమాటకాదది. సంతోషంతో ఇస్తే నిజంగా అమాత్రంతోనే తృప్తిపడతాను నేను. ఐతే, ఆమాత్రమైనా అంగీకరిస్తాడో లేదో దుర్యోధనుడు! అపుడు మేమేంచెయ్యాలి? అలాఅని యుద్ధానికీ మనస్కరించడంలేదు మనస్సు. యుద్ధం స్వాల్పం. పోనీ, సిరీ సంపదా నాకెందుకని వూరుకుండేదా అంటే, గడపడమేలాగ? నన్ను కనిపెట్టుకున్న ఈబంధువులసంగతేమిటి? వీళ్ళకి తిన డానికిండకూడా, కట్టడానికింతగుడ్డా ఎలావస్తాయి? నీవన్నీ ఆలోచించి చూస్తే వాళ్ళూ మేమూ కలిసివుండడమే శ్రేయస్సనిపిస్తోంది.

దాయాదులైతేనేం, శత్రువులైతేనేం, ఎవర్నయినా చంపాలనే ఎందుకుకోరాలి? మరోమార్గామేలేదా? దాన్ననుసరించవచ్చుకదా! కౌరవపక్షంలో ఎంతోమంది మనబంధువులూ వున్నారు, స్నేహితులూ వున్నారు. ఈ అనుబంధాలన్నీ ఇవాళ కాదని ఎలాతుడిచెయ్యడం? రాజ్యంకోసమని వాళ్ళ నెలా భరించడం? అబ్బ, క్షత్రియ ధర్మ మెంతకష్టం! ఎంతనిష్ఠురం!

"ఐతే, రాచవాడికి మరోధర్మం కూడదన్నారు పెద్దలు. కనక, కత్తిపట్టుకు బతకడమే కర్తవ్యం. కానైతే, వంశనాశనం ఘోరం కాదా? యుద్ధంవల్ల రాజ్యం వస్తుంది. నిజమే. కాని యుద్ధంప్రాణహాని కూడా తెస్తుంది. పదిమంది వొకడికి వోడిపోయి పరిగెత్తడం, బలవంతుడైనవాడు వొకసామాన్యుడిచేత దెబ్బతినడం – యుద్ధంలో సామాన్యంగా జరిగేపని. తప్పకండా గెలుస్తామనికాని వోడిపోతామనికాని వొకనిశ్చయంలేదు వోడిపోడం మాత్రం నిజానికి చావుకంటే దుర్భరం. యుద్ధంకాకండా, ఉపాయంతో శత్రువుల్ని సాధించినవాడు ధన్యుడు అతడే గుండెలమీద చెయిపెట్టుకుని హాయిగా నిద్రపోతాడు. పగగలిగి బతకడం పామున్న ఇంట్లో బతకడం వొకటే స్వప్నంలోనహా శాంతి వుండదు. పగలేని బతుకేబతుకు. పగవల్ల పగనశించదు. ఐతే, ఎదటివాడు పగపూని పైనిపడుతూ వుంటే ఆత్మరక్షణకి పూనుకోవద్దా! హింసలేకండా అది ఎలా సాధ్యపడుతుంది? ఎలాచూసినా పగవల్ల వగపుతప్పదు. అంచేత శాంతమే సర్వార్థ సాధనం.

"ఇటురాజ్యంకావాలంటున్నాం. అటుయుద్ధం వుండకూడదంటున్నాం. మారాజ్యానికి భంగంలేకండా వుండాలి. అటు కులక్షయం కాకండా వుండాలి. ఈరెండూ సాధించే ఉపాయమేవుంటే బతికిపోదుం,

"మామీద పక్షపాతం వహించవద్దు నువ్వు ధర్మమూ, నీతీ తప్పవద్దు. ఉభయపక్షాలికీ క్షేమమయ్యేట్టు చూడు. ఉభయుల్లో ఎవరిగౌరవానికీ భంగం రాకూడదు. విదురుడూ ఇత్యాది ఉత్తముల మనస్సుకి నచ్చినట్టు మాట్లాడు. మాటల్లో ఎక్కడా మెత్తదనం చూపెట్టకు మార్దవమూ చెడనివ్వకు. సహాయానికివచ్చిన దేశ దేశాల రాజులు సభలో వుంటారు. వాళ్ళందరికీ కనువిప్పు కలిగించు. న్యాయానికి రాక పిచ్చిపిచ్చిగా మాట్లాడాడే అనుకో దుర్యోధనుడు, మనం మాత్రం నోర్పువిడిచిపెట్టకూడదు. పెద్దలమాట వినలేదన్న అపవాదు అతగాడి నెత్తినే పడాలి. మనంమాత్రం ముసలిరాజుని మన్నిస్తే, జనవాక్యం మనపక్షమే వుంటుంది.

"బహుశా ముసలాయన కొడుకునే వెనకవేసుకు రావచ్చు. మనప్రార్థన నిరాకరించవచ్చు. కాదో, పండో తేల్చకండా మౌభావం వహించవచ్చు లాభంలేదని తొందరపడి వచ్చెయ్యకు. చివరంటా ప్రయత్నించు కాదూపోదూ, యుద్ధమే తప్పనిసరి అయి నప్పుడు మనదే ధర్మపక్షమని లోకం గ్రహించాలి. మన నిర్దోషిత్వం నిర్ధారణ కావాలి" అన్నాడు. కొంచెంసేపు మౌనంగా తలవంచుకుని మళ్ళీ ఇలా అన్నాడు.

"నువ్వు వెళ్ళకూడదని కూడా నాకఆలోచన తట్టుతున్నాది. దుర్యోధనుడూ, అతడి మంత్రులూ పోగరుబోతులు. మంచిమాటలు వాళ్ళ తలకెక్కవు. కుటిలమతులూ, క్రూరకర్ములూ అయిన ఆనీచుల దగ్గిరికి నిన్ను పంపలేను. నీకు బాధకలిగించే దేవేంద్రపదవి ఐనాసరే అక్కరలేదు నాకు. ఉంహూఁ, నొంటరిగా అక్కడికి వెళ్ళనేవద్దు నువ్వు."

దుర్యోధనుడే అన్న కాటేమిటి, ధృతరాష్ట్రుడూ అలాంటి వాడే" అన్నాడు కృష్ణుడు, "నువ్వన్నదాంట్లో రవంత అబద్ధంలేదు. నీమనోగతం నాకర్థమైంది. సింహాసనం దేహా మక్కర్లేదు. ఐనా, మాట

వచ్చిందిగనక చెపుతున్నాను. నిజానికి నేనే ఎర్రగాచూస్తే అక్కడ నిలబడే మగవాడంటూ ఎవడున్నాడు? ఫరవాలేదు. తప్పకండా వెళ తాను. నేను వెళ్ళడం అన్నివిధాలా మనకిమంచేకాని మరొకటి కాదు. సిద్ధించిందా మనప్రయోజనం సిద్ధించనేసిద్ధిస్తుంది. లేదా మన దోషం లేదని లోకానికి వెల్లడన్నా అవుతుంది'' అన్నాడు.

ధర్మరాజు ఐతే మంచిదే.నీకునచ్చిందంటే తప్పకండా వెళ్ళు. వాళ్ళూ మేమూ అనురాగంతో కలిసివుండేట్టు సంధికుదుర్చుకురా. అదేకదా మనకి కావలిసింది! మమ్మల్నెరుగుదువు. వాళ్ళనీ ఎరుగు దువు. మాఅభీష్టమూ ఎరుగుదువు. దాన్ని సాధించే విధానమూ ఎరు గుదవు. ఇన్నీ తెలిసిననీకు మేం బుద్ధి చెప్పడమేమిటి? వెళ్ళిరా.

కృష్ణుడు సంజయుడి మాటలూవిన్నాను. నీమాటలూవిన్నాను. ధర్మపరిపూర్ణమైవుంది నీమనస్సు. వాళ్ళు విరోధంవిడిచిపెడతా రన్నది నమ్మరానిమాట. భీష్మద్రోణులు వాళ్ళపక్షం వున్నారన్న ధీమా బాగావుంది వాళ్ళకి. రాజన్నవాడు అడకువగా బతకడం ఎక్కడోకాని వుండదు. కడుపులోచల్ల కదలకండా కాళ్ళదగ్గరికి వచ్చింది వాళ్ళకి రాజ్యం. తేరగా తినమరిగినవాళ్ళు అంత మీాద మీాదగా వంతిస్తారోనీకు, వెర్రికాని! అపవాదుకీ, అధర్మానికీ భయ పడేవాళ్ళుకారు కౌరవులు. అంచేత నువ్వు మెత్తబడకూడదు. యుద్ధానికే సిద్ధపడాలి. యుద్ధంలో జయిస్తేనే ఇహమూ, పరమూ దక్కుతాయి. కీర్తిప్రతిష్ఠలూ నిలబడతాయి.

ఈభీష్మద్రోణుల కళ్ళఎదటే వెళ్ళగొట్టారు మిమ్మల్ని. ద్రౌప దిని మానభంగమూ చేశారు. ఇంతచేసినీ పశ్చాత్తాపమన్నా కలగ లేదువాళ్ళకి ఇలాంటి ముష్కరులతో వ్యవహరించినపుడు దయా దాక్షిణ్యాల ప్రయోజనమేమిటి? వాళ్ళగర్వమూ, క్రౌర్యమూ చూస్తే ఎంతశాంతం కలవాడైనా తిరగబడతాడు. మాయజూదంలో

గీదరచేసి గెల్చుకున్నారు. అది మీమీద పెట్టి దేశంనుండి వెళ్ళగొట్టారు. మీరు దీనంగా వెళ్ళిపోతూవుంటే దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, శకునీ, కర్ణుడూ—ఈదుష్టచతుష్టయం విరగబడినవ్వారు. నోట పట్ట రాని దుర్భాషలూ ఆడారు. అవి విన్నవాళ్ళలో ధృతరాష్ట్రుణ్ణి దూయబట్టని వాళ్ళు లేరు. సమర్థులైవుండీన్నీ సత్యానికి కట్టుబడ్డారు మీరు. పల్లెత్తుమాట అనకండా తలవంచుకున్నారు. చూసిన ప్రతీ వాడూ కంట తడి పెట్టుకున్నాడు. పదిమందీ 'ఛీ' అన్నవాణ్ణి భగ వంతుడే పడగొడతాడు. ధర్మంతప్పినవాళ్ళని గెలవడం తేలిక. దైవో పహతులై ముందే నాశినమై వుంటారువాళ్ళు. చంపదగ్గవాళ్ళని నువ్వే ఏమిటి, ఎవళ్ళయినా చంపవచ్చు. కౌరవులు పాపాత్ములు. పాములవంటి విషస్వభావులు. వాళ్ళని చంపడంలో పాపంలేదు. పైపెచ్చు ధర్మంకూడాను.

మీతండ్రికీ, తాతకీ హృదయపూర్వకమైన భక్తిచూపడం మనధర్మం.వినయంగా నువ్వు ప్రణామంచేశావని చెపుతానువాళ్ళతో, కౌరవసభలో మనస్నేహితులూ, దేశదేశాలరాజులూ అనేకమంది వున్నారు. నీనిష్కళంకమైన పుణ్యచరిత్రం వాళ్ళందరికీ చాటి చెపు తాను. ధర్మమార్గాన్నే తలపోస్తూ నువ్వు పడుతూన్న ఆవేదనంతా నివేదిస్తాను.

దుర్యోధనుడు దారికివస్తాడని ఏకోశానాలేదు నాకు. మరీ పేట్రేగి పోయి నోటికి వచ్చిందల్లా కూస్తాడు. సంధి పొసగనివ్వడు. కుమారుణ్ణి మందలించలేడు సరికదా, ఉపేక్షకూడా చూపిస్తాడుతండ్రి. ఈనాటకమంతా యావన్మందికీ బట్టబయలవుతుంది. అంతా వాళ్ళకే గడ్డిపెడతారు. ఇంతకంటె మనకి కావలసిందేముంది! నేనుమాత్రం నావోపినంతవరకూ పని చేస్తాను. అన్నివిధాలా సంధికోసమేప్రయత్ని స్తాను. నాప్రయత్నం ఫలించిందా పరమసంతోషం. అలాకానప్పుడూ నా ప్రయాణం వ్యర్థంకానీను. అక్కడ వాళ్ళప్రయత్నాలూ, వాళ్ళ రాకడలూ కనిపెడతాను. కథానాయకులైనవాళ్ళ ఎత్తుగడలూ,

వాళ్ళ బలాబలాలూ, గుట్టుమట్టులూ తెలుసుకుంటాను నీకు జయం కలిగే రాజకీయాలన్నీ చక్కబెట్టుకు వస్తాను

బొందిలో ప్రాణమున్నంతవరకూ దుర్యోధనుడు రాజ్యమిస్తాడన్నమాట సర్వాబద్ధం. యుద్ధంతప్పదు ఎన్నో యుద్ధంశకునాలు చూశాను నేను. నువ్వు చతురంగ బలాలు సంసిద్ధం చేస్తానే వుండు. సైనికుల్లో ఉత్సాహం తగ్గనివ్వకు. నాయకుల్ని హెచ్చరిక చెయ్యి. నిర్విరామంగా సమరసన్నాహం సాగించు.

భీముడు యుద్ధం యుద్ధం అని బెదిరించకు మమ్మల్ని. వెళ్ళు. దుర్యోధనుణ్ణి సత్యహరిశ్చంద్రుణ్ణి చేసుకురా ముందు. కొరకరాని కొయ్య. నీమాటకి మెత్తబడితే ఇక కావలిసిందేముంది! హాలాహాలం అమృతమైందన్నమాట! అభిమానం, గర్వం, కోపం, మూర్ఖం ఎందులో తక్కువ మహానుభావుడు! అతణ్ణి కాదన్నవాడూ వొక్కడు లేడక్కడ. "ఏమంటే ఏమొస్తుందో మనకెందుకీరొస్టు" అనేవాడే ప్రతీవాడున్నూ. వెళ్ళు అంధదేశంలో అద్దాలవ్యాపారమవుతుంది నీరాయబారం.

పులీపందీవారడ మాఇద్దరిదీన్ని నాపేరంటేనే విషంవాడికి. నా నీడపడితే మండిపడతాడు. ఎక్కడ అడుగుపెడితే అక్కడ చంపాలని చూస్తాడు నన్ను. ఇలాంటి సుగుణాలమూటతో అరమరలేకండా బతకాలి నేను. అన్నగారూ, అర్జునుడూ కురువంశనాశనం కూడదంటున్నారుగామరి! ఎలాతప్పుతుంది. కౌరవులూ పాండవులూ క్షీరనీరన్యాయంగా కలిసీమెలిసీ వుంటూవుంటే ఈ దుర్యోధనుడే ఇంతా చేశాడు. దుర్మార్గుడు వీడొక్కడే కులక్షయానికి కారణం. వీడి వొక్కడి మూలంగానే కౌరవకులం కడముట్టానశిస్తుంది. తప్పదు. ఐతేశుభంపలకమంటే తుమ్మినట్టు, ఓంప్రథమంలో మనమే ఎందుకనాలి! ప్రయత్నం పురుషలక్షణంకదా! మనప్రయత్నం మనంచేద్దాం అఘటనఘటనా సమర్థుడివినువ్వు. నీసర్వశక్తులూ వినియోగించి అఫీనిగని దారికి తీసు

కురా. నువ్వన్నట్టు చసే కాని గర్వం, కపటం వొదలకుండా మచ్చ లేని ఈభరతవంశం ఈవిధంగా కళంకితమవుతుందనికూడా కానదు.

మా తండ్రిరాజ్యం మాకు న్యాయంగా రావలిసింది రాలేదు. పోనీ, ప్రాధేయపడ్డా వస్తుందేమో! కానియ్యండి. వాళ్ళకూ మాకూ పితామహుడు భీష్ముడు. ఆయనకూడా వినేట్టు దుర్యోధనుడితో చెప్పు. 'నువ్వూ మేమూ అన్నదమ్ములం. మనలోమనం కొట్లాడు కుంటే పై వాళ్ళు చప్పట్లు కొడతారు. ఇదేమంత మంచిపని! మీరూ మనం మనపెద్దలు చెప్పినట్టు వినుకుందాం. మనరాజ్యం మనం పంచు కుందాం' అని నామాటలుగా చెప్పు. మేమూ వాళ్ళూ కలిసివుంటే నే ప్రపంచానికి కళ్యాణం నయాన్నో, భయాన్నో ఎలాగో సంధి మాత్రం కుదర్చుకురా.

భీము డిలా అనగానే పకాల్న నవ్వాడు కృష్ణుడు. ఆరి తేరిన విలుకాడు ఏవొక్క బాణమూ మొద్దుబారనివ్వడు. ఎల్లప్పుడూ పదును పెడుతూనే వుంటాడు, భీముడు మెత్తబడుతూన్నట్టు పసికట్టి, కొంచెం పురిపెడదామనే అనుకున్నాడు కృష్ణుడు.

కృష్ణుడు ఎన్నడూలేని వింతమాటలు విన్నాం భీమసేనుడినోట. అగ్గిచల్లబడడం, మహాపర్వతం తేలికవడం, భీముడు మెత్తబడడం — చిత్రం! ఈయనగారే ఇలావుంటే మిగిలిన అన్నదమ్ముల్ని అడగడ మెందుకు? అన్నదమ్ములు యుద్ధంలో ఆయాసపడతారనో, పెత్తండ్రి కొడుకుల్ని చంపడం మన్నించకనో, ఎంచేతనో ఈమార్దవం!

యుద్ధమంటే ఆవేశం, శత్రువు ఎంతఉద్దండుడైతే అంత ఉద్రేకం, దుర్యోధనుడి అధిపత్యమంటే అసహ్యం, అన్నగారికి రాజ్యా భిషేకం చెయ్యాలనే ప్రతిజ్ఞ — ఇన్నీమరిచిపోయి భీమన్నా, ఎంత సౌమ్యంగామారిపోయావోవ్! భయమంటే ఏమిటో ఎరగనివాడివి ఈ పిరికి మందెక్కడ పుచ్చుకున్నావయ్యా!

ఇలా అంటూ మళ్ళీ పకపకానవ్వాడు. కృష్ణుడిమాటా, మాటలోని ఎత్తిపొడుపూ అతడినవ్వూ, నవ్వులోని ఎగతాళీ వుక్కిరి బిక్కిరి చేశాయి భీముణ్ణి. తానూనవ్వేశాడు. కాని ఆనవ్వునిండా రోషం రుసరుస లాడుతూనేవుంది.

"ఈవీరాలాపాలు ఇంకెక్కడైనా చెప్పండి, భీముడి దగ్గిర మాత్రంవద్దు" అని అందుకున్నాడు దభీమని, "'పాండురాజు వంశంమాకు వస్తేచాలు' అంటూన్న అన్నయ్యమాటకి అడ్డుచెప్ప కూడదన్న సంగతి నీకు తెలుసుకదా! ఇంతెందుకు, యుద్ధంలో దుర్యోధనుడి శవం చూపించిమరీ ముదలకిస్తాను నిన్ను, 'అవాళ ఏమన్నావయ్యా' అని, అంతవరకూ ఓపికపట్టు. నాశక్తి ఎరిగివుండీకూడా ఇలాకమ్మలు కడితే ఏమనేది నేను! భూమీ ఆకాశం ఇటుండి అటుతిరగబడుతూవుంటే, ఈముంజేతులతో అడ్డుకుని తిప్పేస్తాను. ఏమనుకుంటున్నావో మరి!" అన్నాడు.

"నవ్వితాలకన్నంత మాత్రాన ఇంత పట్టించుకోవాలా' బావా!"అన్నాడు కృష్ణుడు ముసిముసినవ్వునవ్వుతూనే,"అన్నంతపనీ చెయ్యగలవు. నాకుమాత్రం తెలియదనా! సామాన్యయోధుడవని ఎవడనగలడునిన్ను! కౌరవుల ఘోరాలు మరిచిపోయి మెత్తబడ్డట్టు కనబడ్డావ్నే, నీవంటివాడికది తగదని అన్నానేకాని నువ్వు సాధించిన వీరకృత్యాలు నేనెరగననా! నన్నుసారథిగా వుండాలన్నాడు మీతమ్ముడు. నేనూ సంతోషంతో సమ్మతించాను. ఇలాసిద్ధపడుతూన్న మేము నిన్ను ఆశించడం తప్పా! విజయంవల్లకాక యశోలక్ష్మి రాజ్యలక్ష్మి సమకూరవుకదా" అన్నాడు.

"అంహాం, అలాగా?" అన్నాడు కనుబొమను కొంచెం పైకెత్తుతూ భీముడు. "అర్జునుడూ నువ్వూ మొనగాళ్ళయి భారత యుద్ధమంతాపంచేసుకుంటే, మేంమాత్రం మిర్రులెక్కి నోళ్ళువెళ్ళబెట్టు

కునివ్వారికేచూస్తాంలే. ఈతడవమాత్రం వెళ్ళిరా. భీముడు వ్రాకదంపు కబుర్లికి వుడుక్కుంటాడనుకోకు. 'యుద్ధం రావాలి. ఏనుగుల కుంభ స్థలాలు పగలగొడుతూ, గుర్రాలు పచ్చడిచేస్తూ, రథాలు గుండ కొడుతూ అలసటన్నది లేకండా నేను గదకి పండువుచేస్తూంటే, చూసి తెల్లపోయి మాకృష్ణుడు నన్ను భళీఅనాలి' అని ఉవ్విళ్ళూరు తుంటాను నేను. నాకా యుద్ధమంటేపిరికి! పిడుగికా బిడియం!'' అన్నాడు.

''సందేహమేమిటి? అంతకంటే అధికమేచేస్తావు నువ్వు అస హాయశూరుడివి. నిన్ను చుక్కానిగా పెట్టుకుని అనేకసార్లు విపత్స ముద్రాలు ఈదుకువెళ్ళాము. ఈసారికూడా ఈఆపద నువ్వేగట్టెక్కిం చాలి. నేను వెళుతున్నాను. కౌరవులుదారికి వచ్చేట్టుచూరిపోస్తాను. సర్వవిధాలా సంధికోసమే ప్రయత్నిస్తాను. కాని చివరికి నువ్వేఆధార మన్నమాట నిశ్చయం'' అన్నాడు కృష్ణుడు.

''చెప్పవలిసిన నాలుగుమాటలూ ధర్మరాజు చెప్పనేచెప్పాడు'' అని అంతలో అందుకున్నాడు అర్జునుడు, ''ఆయన అభిప్రాయం నీకు అవగతమైందికదా! అంతకుమించి మేము చెప్పవలిసిందేముంటుంది? ఐనా, నాకు తోచినరెండు ముక్కలూ నేను చెబుతాను. ధృతరా ష్ట్రుడు ఎంగిలిచేత్తో కాకినికొట్టడు. తండ్రికంటే మరోపదాకులు హెచ్చుచదివాడు కుమారరత్నం, అంచేత 'సంధికావడం సర్వాబద్ధం' అన్ననమ్మకం నిలో దృఢపడిపోయింది. ఐతే గాండీవానికి పనిచెప్ప కండా మా కష్టాలుగట్టెక్కడం అసాధ్యమనే అంటావా? నువ్వుతల పెట్టినపనిలో అనష్టమంటూవుండదు. మొదట కావన్నట్టే వున్న కార్యాలు తుదిని సఫలీకృతం అవుతాయి. కనక ప్రయత్నించడమే పురుష లక్షణం. ఆపైన ఫలాఫలాలు దైవాధీనాలు. నిజానికి రెండూ నీవిలానాలేకదా! 'ధర్మరాజుతో విరోధించి ఆయన్ని పరాభవించిన ద్రోహుల్ని చంపితీరాలి' అనినువ్వంటే కాదని ఎవడంటాడు? ఇలా

అంటున్నావా? అంటే వాళ్ళు మమ్మల్ని ఇన్నివిధాలా హీనంగా కూ
చేశారన్నకోపం చేతనేకదా! ఐనా నాదొక్కమనవి. నిండుసభలో
ద్రౌపదిని అలా చేసినప్పటికీ అది సహించడమే మంచిదనుకున్నాం.
ఇంతదైన్యానికీ ఓర్చాం. అడవుల పాలయ్యాం. ఇంతెందుకు నీకు తెలీని
విషయ మేముందిగనక! అంచేత నువ్వూ ఓర్పువహించు. నీనే
ర్వంతా విని యోగించు మా రెండు కోవలూ ఒకటిగా చెయ్యి. ఇంతకీ,
తమ తాహత్తేమో తెలుసుకోలేని ధృతరాష్ట్రుడి కుమాళ్ళు వాళ్ళు
పెట్టినపాట్లు చవిటినేలలో నాటినవిత్తనాల్లాగ మా మనస్సుల్లో కొర
గాకండా పోయాయి? ఇపుడు తవ్వుకుని మాత్రం ఏంలాభం! వెళ్ళు,
ఎలాఐనా వాళ్ళని ఒప్పించు. మా రాజ్యం మాకు పంచి ఇవ్వమను.
ఉభయులికీ అదేగౌరవం, క్షేమం అని నచ్చజెప్పు. సంధి సర్వార్థ
సాధనం అని బోధించు. లేదూ, ఇదినీకు నచ్చలేదంటావా సరే,
‘ఇదిగో, అబ్బాయిలూ, ఈదారి నేనుచూపుతున్నాను ఇలానడవండి’
అని శాసించు. ‘మహాప్రసాదం’ అంటాం. నీకనుసన్నల్లో మసులు
కుంటాం. అవును. ‘ఇది మాకుమంచిది, ధర్మ మిలావుంటుంది’ అని
నీకు మేం చెప్పేపాటివాళ్ళం? మంచన్నా నువ్వే విచారించాలి.
న్యాయమన్నా నువ్వే విచారించాలి. నీ ఆదేశం శిరసా వహించడ
మన్నది ఈ నాటిమాట కాదుకదా మాకు'' అన్నాడు.

కృష్ణుడు నూరువిధాల సాగుచేసినా అదునికి చినుకులు పడక
పోతే పంటపండదు. అలాగే ఎన్నిప్రయత్నాలుచేసినా కాలం అనుకూ
లిస్తేగాని పురుషప్రయత్నం ఫలించదు పురుషయత్నం ఎంతకావాలో
అంతా చేస్తానునేను. అదృష్టం ఎలావుంటుందో చెప్పలేను. ఏమంటే
సవ్యంగా వంతిచ్చేవాడేఅయితే బాల్యంనుంచీ ఇంతలేసిఘోరాలు చేస్తా
డా దుర్యోధనుడు? పోనీ, అదలావుండనీ, గోగ్రహణమప్పుడు ‘వచ్చే
వాడు అసాధ్యుడు, మనమే గెలుస్తామని చెప్పలేం. పెనగులాడే రెండు
బలాలూ గెలవడం జరగదుకదా! జయాపజయాలికి సమ్మతించే యుద్ధానికి

దిగాలి. ఈపరిస్థితిలో సంధిచేసుకోడమే సరైనమార్గం' అని భీష్ముడంటే ఏమన్నాడీపెద్దమనిషి! 'సంధి ఎలా కుదురుతుంది? నేను రాజ్యంలో పిసరంత వంతివ్వను. వంతివ్వకపోతే సంధి కేరారువాళ్ళు యుద్ధంతప్ప మరోమార్గంలేదు' అన్నాడు. అదంతా ఆతరవాత మనం విన్నామా లేదా! అందుకుతగ్గఫలం అప్పుడే అనుభవించాడు. ఐనా బుద్ధిరాలేదు దుర్మార్గుడికి. కానీ, అతడి మంచిచెడ్డలతో నాకు ప్రమేయమేముంది? ధర్మరాజు చెప్పింది చెయ్యడం నావిధి. అంచేత సంధికుదర్చడంకోసం వెళతాను. అక్కడి గుట్టుమట్టులూ సంగ్రహించుకువస్తాను.

"మా అన్నయ్యలు ముగ్గురూ చెప్పినదాంట్లో అబద్ధమేమీ లేదు" అంటూ కలుగజేసుకున్నాడు నకులుడు, "అరణ్యవాసంలోనూ, అజ్ఞాతవాసంలోనూ మా హృదయాలు కుతకుతలాడుతూ వుండేవి. కాని ఆ ఉద్రేకం ఇప్పుడులేదు. మెల్లిగా చల్లబడిపోయి న్నాయి. నిజమే, ఒకరు గోవునికొడితే, మరొకరుదూడని చంపడమెందుకు? ఆక్రౌర్యమేదో కౌరవులదగ్గిరే వుండనీ. మనం మంచిగానే వుంటేసరి.

"గోగ్రహణం నాటిదెబ్బతో కొంచెం గుణపాఠం నేర్చుకొనే వుంటారు వాళ్ళు నీదయవల్ల ఇక్కడకూడిన పదకొండక్షౌహిణీసంగతీ తెలిసే వుంటుంది. పాంచాల, యాదవ, పాండ్య, కేకయ, మాత్స్యసేనలు చేవా కొత్తకాదు వాళ్ళకి. భీమార్జునుల పరాక్రమాలూ, లోకోత్తరమైన నీసహాయమూ చెప్పేఅఖర్లేదు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, బాహ్లీకుడూ కొంతగడ్డిపెట్టేవుంటారు. క్షేత్రం మనమనుకున్నంత ఊషరంగా వుండదు. నువ్వు వెళ్ళాక విదురుడూ నీకు సహాయంగా కేవలం నిరాశ చేసుకోవలిసిన అగత్యం నాకేమీ కనపడదు. అదీకాక నువ్వే స్వయంగా వెళుతూంటే కాదుపొమ్మనడానికి వాళ్ళది గుండా నల్లచెరువా! వెళ్ళు. కార్యంసాధించుకునే వస్తావు" అన్నాడు

"ఆకుకీ పోకకీ చెందని మాటలే అంటున్నారు మహారాజా, అన్నయ్యలూనూ" అని చివాల్న లేచి అందుకున్నాడు సహదేవుడు "అన్నిటికీ ఊం అంటే ఊం అంటున్నావు నువ్వు. ఇహ కావలిసిందేం వుంది? 'దేహీ' అని వెళ్ళి చెయిచాస్తా వన్నమాట! వెర్రి. దుర్యోధనుడేమిటి, వంతివ్వడమేమిటి? ఇంత లేసి యోధానయోధులు మీారు. ఇంత దైన్యానికి పాల్పడడంలో ఆంతర్యం అవగాహన కావడంలేదు. నాకు. ఇదివింటే ఏబంధువు హర్షిస్తాడు! ఏచుట్టం తిట్టకండా వుంటాడు? పరాయి రాజులుమాత్రం ప్రశంసిస్తారా? ఏమిటీ లేకితనం! ధర్మరాజంతటివాడు 'దేహీ' అనడం! ఇంతభిక్ష పెట్టండనడానికి శ్రీకృష్ణు డంతవాడు పయనంకావడం! ససేమిరా అని దుర్యోధనాదును విసిరికొట్టి పిడికిలెత్తడం! ఏమిటీ ఇదంతాను! కూడంటే ఇంత తీపా మాకు! మావాళ్ళు ధర్మపన్నాలు ఏకరువు పెట్టారే అనుకో, దానికి వాళ్ళూ తల వూపారే అనుకో, ఐనా అలాంటి సంధి ఎందుకొచ్చిందంటాను! ఇదిగో కృష్ణా, డొంకతిరుగుళ్లు చేతకాదు నాకు. యుద్ధంతప్ప మరోగత్యంతరం లేదు. కౌరవసభలో ఈమాటే నూటిగా బల్లగుద్ది చెప్పు. 'ఓనాడా రెన్నాళ్ళా, పదమూడేళ్లు అరణ్యవాసం చేసివచ్చాం. తీరావచ్చాక మారాజ్యం మాకివ్వక పోడమేమిటి? 'మావంతు మాకిచ్చి, నీవంతు నువ్వుపుచ్చుకో. అదికాదంటావా, నడుంబిగించి రంగంలోకి దిగబడు. మాయపాచికలు పారే దినాలు మళ్ళీరావు'అని ఖచ్చితంగా దుర్యోధనుడి గుండెలు దూసుకుపోయేట్టు ఎత్తిపొడిచి మరీచెప్పు" అన్నాడు.

"వినండి. వినండి. లక్షలు విలువచేసినమాట. వున్నదున్నట్టు చెప్పాడు సహదేవుడు" అన్నాడు సంతోషం పట్టలేకపోతూను సాత్యకి, "నిజమే, దుర్మార్గుడైన దుర్యోధనుడికి బోధపర్చడంవల్ల ప్రయోజనమూ వుండదు, మర్యాదా దక్కదు. పుస పడక్కోనేల

సైన్యాలూ మహోత్సాహంతో వున్నాయి. వీళ్లందరూ యుద్ధమే కావాలంటున్నారు. యుద్ధం–యుద్ధం తప్పమరోటి పనికిరాదు'' అన్నాడు.

''అవును, యుద్ధంతప్ప మరోటిపనికిరాదు'' అంటూ వొక్క సారి గొల్లుమన్నారు సభలోనివీరులు, ''సాత్యకిమాటలు అక్షరాలా సత్యం.'' ''సహదేవుడే సరైనవాడు.'' ''దెబ్బకిదెబ్బ తియ్యాలి.'' ''బాబూ నాయనా అనడం లేకితనం.'' ఇలా వీరాలాపాలతో సభంతా గగ్గోలుపడిపోయింది.

భర్తల మాటలన్నీ వొళ్లంతా చెవులు చేసుకు వింటున్నది ద్రౌపది. తలకొట్టేసినట్టుందామెకి. ముఖ్యంగా ధర్మరాజు మాటలికి దుఃఖం కంఠాగ్రమైంది. కోపంతో కళ్లూ కందినట్టయాయి. పెదవు లదురుతున్నాయి. దీనంగా చూస్తోంది కృష్ణుణ్ణి.

''అన్ని అవస్థలూ పెట్టి అప్పుడలా వెళ్లగొట్టారు.ఇప్పుడు సంజ యుణ్ణిపంపి కన్నీళ్లుతుడుస్తున్నారు'' అంది గద్గదకంఠంతో, ''దీంతో పెన్నిధి వొళ్లోపడ్డట్టయింది మావారికి. అంతమాత్రాన ఐదుగురికీ ఐదూళ్లు అభిషేకిస్తాడో దుర్యోధనమహారాజు! అవును, ఎందుకు చెయ్యడూ! అంత జాలికల ప్రభువు అన్నదమ్ముల అగచాట్లు చూస్తూ వూరుకుంటాడా! తమ్ముడిమీది ప్రేమచేత ఇన్నితిప్పలూ మరిచి పోతారు మామహారాజు. అదీ మంచిమాటే, బావుంది, కాని రాజ్యం వంతులేకండా సంధికి సమ్మతిస్తే వైరివాళ్ళనీ, చేతకానివా ళ్ళనీ, సిగ్గయినాలేకపోయిందనీ లోకం చెరిగిపొయ్యదా! గౌరవహీ నమైన దిప్పిక్కి ఇంత కక్కుర్తి దేనికో!

''ఆమాటకివస్తే ఈసంధి వాళ్ళకే మెరుగు. ఇంతకూ వీళ్ళు నిగ్రహించనే లేరనుకోనా! దండెత్తాలంటే సందేహించవలిసిన సమ యమా ఇది! పోనీ, ఏమిచేసినా సయించడానికి వాళ్ళేమిబ్రాహ్మలా! మొహమాటంపన్నది ఏకోశానా లేదు దుర్యోధనుడికి. నీమాట పిస రంత మన్నిస్తాడా? దురభిమానంతో మరింత బిరుసెక్కుతాడు. తీరా యుద్ధానికే కౌరవసభలో తీర్మానం జరిగింగనుకో అప్పుడయినా నడుం

కడతారో, కాక అడివికే పయనమౌతారో మీ వారు! నేనిలా అన్నానని అనుకోకండి. ఇంకా సావకాశంగా ఆలోచించండి. మీ మంచితనం నిలుపుకోడమే కాదు, కార్యం చెడకుండాకూడా చూడండి. బాగా ఆలోచించిన మీదట, మీకు నచ్చిన పద్ధతిలో మెళుకువగా సంధి చేసుకోండి.

"పడరాని పాట్లుపడ్డాం. పదిమంది నోళ్ళల్లోనూపడి అల్లరి పాలూ అయాం. ఐనా, నోరుమెదపలేకపోడం చూసి, ఆడజన్మ గనక మనసుపట్టలేక, వదురుతున్నాను. పిచ్చిదానిలా పేలుతున్నాను. కడుపుమంటనించి మంచీ చెడ్డా తెలీడంలేదు. బుద్ధిపూరిమేసిన మనిషికి వివేక మెలావస్తుంది?

"దేవతల అనుగ్రహంతో పుట్టాను భరతవంశలో అడుగు పెట్టాను. పాండుమహారాజు కోడల్నయాను. దిగ్దంతుల్లాంటి వాళ్ల పాణిగ్రహణం చేశాను. సింహంకొదమల్లాంటి కుమాళ్ళని కన్నాను. తోడబుట్టువుల ప్రాపూ సంపాదించాను. ఎందులో లోపమని నాకు! అంతేనా,అన్నా, సుభద్రకన్నా అధికంగా ఆదరించిమన్నిస్తావు నువ్వు. అలాంటినన్ను, రాజసూయ మంగళస్నానంతో పవిత్రమైన ఈజడపట్టి, ఓ నీచుడు, ఈ అయిదుగురికళ్లెదటే నిండుసభలోకి ఈడ్చుకు వచ్చాడు. కులస్త్రీని చేయవలిసిందేనా ఇది! ఏకవస్త్రని, అలా ఈడ్చుకువచ్చి అవమానపరుస్తాంటే, ఆదుశ్శాసనుణ్ణి కొయ్య బొమ్మల్లాచూస్తూ, నాఆశే వొదులుకున్నారు నాభర్తలు. చచ్చిన శవయిపోయింది నాకు.'అన్నా' అని నిన్నే తలుచుకున్నాను.

"కోడలుఅనైనా ఆలోచించాడుకాడు, దాసీగా చేసుకున్నాడు అంధమహారాజు,ఆమహానుభావుడిదగ్గిరకే మళ్లీ మావాళ్లు బయల్దేరితే, వీళ్లతోసహా నేనూ వెళ్లి అతగాడికి కోడరికం చేయమంటావా, కాక దాసీపనిచేయమంటావానన్ను?ఏంచెయ్యాలోను వ్వేచెప్పుమరి"అంది.

అంటూ ఉన్నకొద్దీ ఆవేశమూ, ఆ వేగాన్ని మించిన ఆవేదనా హెచ్చయి వూగిపోతూవుంది ద్రౌపది.

"ఇదిగో, దుశ్శాసనుడి వేళ్ళలో తెగిపోగా మిగిలినసగం ఇది" అంటూ గభాల్న సిగముడి విప్పింది. నల్లని మహాసర్పంలా వేలాడుతూన్న ఆవేణీభరం ఎడమచేత్తో పట్టుకునిలబడింది. వెళ్ళి కృష్ణుడి ముందు పెట్టింది. "చూడు, కౌరవసభలో సంధిమాట వచ్చేటపుడు, దీన్ని మాత్రం మరిచిపోవద్దంటూ. ఈజుత్తుపట్టి ఈడ్చాడేవాడు, ఆ ఈడ్చిన చెయ్యి యుద్ధంలో తెగి కిందపడాలి. వాడికట్టెతోకూడా అది ఇంతింత తునకలై బుగ్గిలో కలిసిపోవాలి. మాసిపోవాలి. అది కళ్ళతో చూసినప్పుడు – అప్పుడుకాని నాలోని వుడుకు చల్లారదు. అన్నా, సామాన్యంగాచల్లారే చిచ్చేనా ఇది! ఇంతకీ కారణం, వాడున్నాడే, ఆదుర్యోధనుడు – వాడిపీనిగ నా కాళ్ళముందు కళ్ళారా చూడకనే పోతే – భూతమంత గద మోసుకుతిరుగుతూన్న భీముడి బాహుబలం, తాటిపట్టంత గాండీవం వేసుకుబైల్దేరిన అర్జునుడి పరాక్రమం ఎందుకు. తగలెయ్యనా అంటూ. ఎన్నాళ్ళని, ఎన్నాళ్ళని – చిచ్చు వొళ్ళో పెట్టుకున్నట్టు ఈక్రోధం భరించనూ! దుష్టసంహారంచేసి ప్రపంచరక్షణకి పూనుకున్న నీ అంత తోబుట్టువ్వూ, మహాపరాక్రమవంతులైన మగవారూ వుండిన్నీ ఇది చల్లారేదారి కనపడదు నాకు!" అంది, రోజుకుంటూ.

ఆమె దుఃఖానికి గట్లు తెగినట్టయింది. వెక్కి–వెక్కి, ఎలుగెత్తి ఏడవడం మొదలు పెట్టింది. ఆమె అవస్థచూసి, సభసభంతా నీరై పోయినట్టయింది. గుడ్లనీరుతిరిగింది శ్రీకృష్ణుడికి.

"నేనంటూవుండగా ఎందుకమ్మా, నీకీవిచారం" అంటూ సంజ్ఞ చేసి పరిచారికలచేత ఆమె కన్నీళ్లు వొత్తించాడు. జుత్తూముడిపించాడు. "చెల్లీ, నువ్వన్నంతపనీ జరుగుతుంది. ధర్మరాజు పంపడమే తడవు, భీముణ్ణీ, అర్జునుణ్ణీ వెంటవేసుకుని నీశత్రువన్నవాడు కలిశాని కన్నా

లేకండా కడతేరుస్తాను. నమ్ము, మరోలాగ జరగనే జరగదు. కౌరవులు క్రూరులు. ఐదూళ్ళే కాదు, ఐదుమళ్ళుకూడా ఇవ్వరు. నిజం. విచారించకు. ఇవాళ నీవేడ్పు సామాన్యమే అనుకో. ఇంతకంటె వందరెట్లు, వెయ్యిరెట్లు కౌరవుల భార్యాబిడ్డలు ఏడ్చేదినాలు వస్తున్నాయి. చెవులారా విందువుగాని, నవ్వుదువుగాని. యముడి మహిషం మెడలోని ఇనపగంటలు వినడానికే ఉవ్విళ్ళూరుతున్నారు వాళ్ళు. సంధిమాటలూ, శాంతివచనాలూ ఎలా రుచిస్తాయి వాళ్ళకి? అసలు గ్రహపాటే ఇలా వుందన్నారు పెద్దలు. తప్పించడానికి మనమెవళ్ళం? అటున్న మేరువు ఇటుతిరిగినా భారతయుద్ధం జరగకతీరదు. పాండవులు శత్రుసంహారం చెయ్యడం తప్పదు. నువ్వు భారతసామ్రాజ్ఞివి కావడమూ తప్పదు. ఇంకెంతో కాలంలేదు'' అని ఓదార్చాడు. శాంతించినట్టయి కన్నీళ్లు తుడుచుకుంది ద్రౌపది.

''బావా, మేమెంతో వాళ్ళూ అంతే నీకు''అని ఈసారిమళ్ళా అందుకున్నాడు అర్జునుడు, ''అంచేత ముందూ వెనకా ఆలోచించు. సంధి ఉభయతారకంగా వుండేట్టుచూడు. ధర్మార్థ సంగతమైంది ధర్మరాజు సందేశం. వాళ్లు వినుకున్నారో, చిక్కేలేదు. అలాకానప్పుడు ఆపై మాటకి నువ్వే వున్నావిక'' అన్నాడు.

''అవును, ఉభయులికీ క్షేమదాయకమైన హితసాధనమే మీఅన్నయ అభిమతం. ఆ లక్ష్యసాధనకోసమే నాప్రయాణమూను'' అన్నాడు కృష్ణుడు.

''అవును'' అని తలవూపాడు ధర్మరాజు, ''నీనక్షత్రంరోహిణి కదా! రేపు రేవతి. సాధనతార. తారాబలం, చంద్రబలం దివ్యంగా వున్నాయి. పొద్దుగాలే ప్రయాణం మంచిది'' అన్నాడు. ఓసారి కొలువంతటినీ చూసి ''ఇప్పటికి ఇదే మన నిశ్చయం'' అనీ చెప్పాడు. అంతతో ఆనాటి సమావేశం ముగిసింది.

మర్నాడు అరుణోదయమయేసరికి కాలకృత్యాలు నిర్వర్తించుకున్నాడు కృష్ణుడు. సూర్యోపాసన చేసుకున్నాడు. అగ్నిసహారాధనా ముగించాడు. ప్రణామపూర్వకంగా ఉత్తములైన బ్రాహ్మలకి ప్రియాణసమయంలో చెయ్యవలసిన దానాలుచేసి సంతోషపరిచాడు. ఆశీర్వాదాలతో వాళ్లిచ్చిన మంత్రాక్షతలూ, దర్భాంకురాలూ స్వీకరించాడు. ఈతంతంతా సక్రమంగా పూర్తిచేసి సాత్యకిని పిలిచాడు.

"చూడూ తమ్ముడూ, మనవారిలో హస్తినాపురానికి బయల్దేరవలిసిన వాళ్ళని పగడబందీగా - వాహనాలతోనూ, కత్తికటార్లతోనూ - బయల్దేరించు నువ్వుకూడా నాతో బయల్దేసు దుర్యోధనుడు దుష్టు అతడిచుట్టూ చేరినవాళ్ళూ అదేజట్టు ఏమంటావు? చక్రం, గదా ఇత్యాది ఆయుధాలూ రధంమీద పెట్టించు" అన్నాడు. "ఏంసెలవు?" అన్నట్టు ఎదురుగా చేతులు జోడించి నిలుచున్న సారథి దారుకుణ్ణిచూసి "రధం సిద్ధం చెయ్యి" అన్నాడు. ఆదేశించడమే తడువుగా నవరత్నాలతో జిగేలు మనిపోతూవున్న రధంతెచ్చి వాకిట్లో నిలబెట్టాడు దారుకుడు. శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకములనే గుర్రాలు పూశాడు. గరుడధ్వజం తగిలించాడు. ఇంతలో ప్రయాణసమయోచితంగా అలంకరించుకుని వచ్చాడు కృష్ణుడు. చూసేవాళ్ళకి కళ్ళవేడుకగా వుందావేషం. మంగళతూర్యాలు మోగుతున్నాయి రెండుపక్కలా చామరాలు వీస్తున్నారు. వైభవంగా రథమెక్కాడు శ్రీకృష్ణుడు. సరిగ్గా ఆసమయానికే సపరివారంగా వచ్చిన సాత్యకినీ తనరథ మెక్కించు కున్నాడు. అన్నదమ్ములిద్దరికీ శుభసూచకంగా కుడికన్నూ, కుడిభుజమూ అదిరాయి. పూర్ణకలశం, వృషభమూ ఎదురయాయి. పునిస్త్రీపడుచులు సేసలు చల్లారు. ఇలా ప్రసన్నవాతావరణంతో ప్రియాణం ఆరంభమైంది.

పంచపాండవులూ, యాదవులూ, కేకయులూ, మాత్స్యులూ, పాండ్యులూ, పాంచాలురూ, — ఇత్యాది రాజవర్గం యావత్తూ భద్ర గజాలమీదా, రథాలమీదా, గుర్రాలమీదా వచ్చి చుట్టూ చేరారు. ఎవరికి తగినట్టు వారిని సంబోధించి ప్రసంగించాడు కృష్ణుడు. మందగమనంతోనూ, మహావైభవంగానూ నడవడం మొదలుపెట్టింది రథం. విడిదిగృహాల మైదానం దాటేసరికి వందమార్లయినా శుభ శకునాలు ఎదురై వుంటాయి. ఉపప్లావ్యంలోని జనమంతా అక్కడే వున్నట్టున్నారు. ఆసమ్మర్దాన్ని తప్పించుకుంటూ కృష్ణుడిరథానికి జోడింపుగా తనరథం పోనిచ్చాడు ధర్మరాజు.

''కృష్ణా, 'కృష్ణుడు వచ్చాడు' అన్నమాట వినడంతోనే పంచ ప్రాణాలూ లేచివస్తాయి మాఅమ్మ కుంతీదేవికి'' అన్నాడు, ''మా ఐదుగురి పక్షానా నమస్కారాలుచెప్పు. కౌగిలింతలు విన్నవించు. బాధతో కుములిపోతూవున్న ఆవిణ్ణి నువ్వే సేదదేర్చాలి. మేం అడివికి వెళ్ళినప్పుడు ఏడుస్తూ, ఏడుస్తూ. ఎంతోదూరం వెంటపడింది. దీనంగా కన్నీళ్లు కారుస్తూవుంటే, ఆమె మొహంచూసి కడుపు చెరువైపోతూ వుండేది మాకు. విధిలేక విడిచిపెట్టి వెళ్ళిపోయాం. పాపం, పాతిల్లో బల్లిలా కొనవూపిరితో వుంటుంది మా అమ్మ. లక్క ఇల్లు తగలబడ్డది మొదలు మాకోసం దిగులుపెట్టుకుంది, పడరాని పాట్లుపడింది. 'అమ్మా, కష్టాలు గట్టెక్కేనకాలం వచ్చింది' అని మామాటగా చెప్పు 'మా కృష్ణుడున్నాడు, నాకేంలోపం?' అని ఎప్పుడూ అంటూనేవుంటుంది మీ మేనత్త. ఆవిణ్ణి వోదార్చమని నీకు నేను చెప్పడమేమిటి?

''ఇక మా తాత భీష్ముడూ, ముత్తాత బాహ్లీకుడూ – ఇత్యాది కురువృద్ధులూ, ద్రోణుడూ, కృపుడూ మొదలైన ఆచార్యులూ బంధు వర్గమూ, స్నేహబృందమూ, తక్కిన రాజలోకమూ యావన్మందీ సం తోషించేట్టు నమస్కారాదికాలు తెలియచెయ్యి. ముఖ్యంగా విదురుడు–

సమబుద్ధికల సహృదయుడు ఆమహానుభావుడు. గాఢమయిన నా ప్రేమాలింగనాలూ, ఆదరసత్కారాలూ ఆయనకి అందించు'' అన్నాడు.

''బావా,'' అంటూముందుకివచ్చాడు అర్జునుడు, ''మారాజ్యం మాకుకావాలి'' అంటున్నాడు ధర్మరాజు. ఇందులో మాతమప్పు డేమీలేదు. లోకమంతటికీ తెలుసీమాట. దుర్యోధనుడూ, అతడి తమ్ములూ దీనికి అంగీకరించారా, మంచిమాట. మేమూ దానికి సమ్మతిస్తాం. కాదూపోదని గునిశారో, పుత్రమిత్ర సహితంగా గొయ్యితీసి పాతేస్తాను వాళ్ళని. తప్పదు'' అన్నాడు.

''చశాష్, అదీమాట'' అని అరిచాడుభీముడు. సంతోషంతో ప్రతీ అవయవమూ రెండింతలై వుప్పొంగిందతడికి. అంతమందిలోనూ ఘీంకారం చేస్తూన్న మదగజంలా కనిపించా డతడు.

''అవును, అంతే'' అన్నారు నకులసహదేవులు, ''కుదిరితే సంధి కుదరకపోతే యుద్ధం. ఏదో వొకటి తుదినిశ్చయం చేసుకువెంటనే వచ్చేయి'' అన్నారు.

ఇలా చెప్పవలసిన నాలుగుమాటలూ చెప్పి కౌగిలించుకుని సాగనంపారు పాండవులు. సెలవుతీసుకుని ప్రదక్షిణంచేసితిరిగి వచ్చారు. తక్కినవాళ్ళూ నమస్కరించి సెలవుతీసుకున్నారు. రథం వెళుతూ గరుడధ్వజం కనపడుతూన్నంతసేపూ కళ్ళప్పగించి,తరవాత వూళ్ళోకి మళ్ళి పోయారు ప్రజలు.

అవసరమయిన ప్రయాణసంబారాలన్నిటితో నడుస్తూన్న నిర్వాహకుల్ని చూసి ఉల్లాసం కలిగేట్టు హెచ్చరించాడు కృష్ణుడు. హస్తినాపురానికిపోయే రాజబాటని పరిగెత్తింది రథం. దారుకుడి చతురత్వానికి గుర్రాలపటుత్వం తోడైంది. సుఖప్రదంగానూ, మనోల్లాసంగానూ వుంది ప్రయాణం.

మార్గమధ్యంలో వోచోట నారదుడూ, జమదగ్ని, కణ్వుడూ మొదలయిన కొందరు మహామునులు ఎదురయారు. చూసి రథం దిగాడు కృష్ణుడు. నమస్కారం చేశాడు. "మీారిలా సాక్షాత్కరించడంలో ఏమిటి కారణం? నేను చెయ్యవలిసిందేమైనా వుంటే సెలవియ్యండి" అన్నాడు.

"దేవా, పుణ్యమూర్తివి నువ్వు నీదర్శనం చేసుకోడానికి వో కారణమంటూ వుండాలా?" అన్నాడు నారదుడు, "నీరాయబారం చూడాలని కుతూహలంతో వచ్చారు వీరంతా. కౌరవసభలో నువ్వు చేసే ఉపన్యాసం, విదుర భీష్మాదులికీ నీకూ జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలూ వినాలనీ వేడుకపడుతున్నారు" అన్నాడు.

"సంతోషం. తప్పకండా దయచెయ్యండి" అన్నాడు కృష్ణుడు.

"మంచిది. నువ్వుపద. మేమూసమయానికే అక్కడికి వస్తాము" అని దీవించారు మునులు. అక్కడినుంచి ఇంకా కొంతదూరం పోయింది రథం. అక్కడ వొక పుణ్యాశ్రమం దగ్గిర పెద్దవొద్దిచెట్టు నీడని విడిది చేశాడు కృష్ణుడు. భోజనాలూ అవీ ముగిశాక మళ్ళీ బయద్దేరాడు. ఇదిగో అదిగో పొద్దుగూకుతోందనగా, కుశస్థలం ప్రవేశించాడు. కృష్ణుడు వచ్చాడనడంతోనే అక్కడి జనమంతా విరగబడ్డారు. ప్రముఖులైన బ్రాహ్మలు కొందరువచ్చి తమఇళ్ళకు ఆహ్వానించారు. సమ్మర్దం కూడదని వారించాడు కృష్ణుడు. విశాలమైన వోమంచి మైదానంలో డేరాలు వేయించాడు. తగుపాటి జనంతో ముఖ్యులైన వాళ్ళ ఇళ్ళకు వెళ్ళాడు. వాళ్ళిచ్చిన అభ్యాగతపూజలు స్వీకరించాడు. వాళ్ళని సంభావించి, విడిదికి తిరిగివచ్చి కాల్యకృత్యాలలో మగ్నుడయాడు.

ఇక్కడ ఇలా వుండగా, అక్కడ హాస్తినాపురంలో ఈవార్త గుప్పుమంది. వినీ వినడంతోనే భీష్మద్రోణుల్నీ, విదుర సంజయుల్నీ, దుర్యోధనుణ్ణీ, శకుని కర్ణ సైంధవుల్నీ పిలిపించాడు ధృతరాష్ట్ర మహారాజు. కొడుకుని దగ్గిరికిపిలిచి "ఇదిగో, శ్రీకృష్ణుడు పాండవకార్యార్థం

మనదగ్గిరికి వస్తున్నాడు. ఇవాళ కుశస్థలంలో వున్నాడు. రేపిక్కడికి వస్తాడని వింటున్నాను. లోకాలన్నీ ఎవణ్ణయితే కీర్తిస్తున్నాయో, ఆమహానుభావుడు మనదగ్గిరికి దయచేస్తున్నాడు. ఇంతకంటె ఆశ్చర్యమేముంది! ఆయన ఎవర్ని అనుగ్రహిస్తాడో, వాళ్ళకి సర్వశుభాలూ సమకూడతాయి. అతడు అనాదరం చేసిన వాళ్లకి అశుభాలు తప్పవు. అందుచేత ఆయన్ని పూజించడానికి సకలసంబారాలూ సమాయత్తం చేయించు. పురవీధులు ముస్తాబు చేయించు. ప్రతీఇల్లూ మంగళ ద్రవ్యాలతో శోభాయమాన మయ్యేట్టుచూడు. నీవైభవానికి తగినట్టు, ఆయనమనస్సుకి నచ్చినట్టు సమస్తమూ సమకూర్చు'' అన్నాడు.

ధృతరాష్ట్రుడి సంకల్పానికి భీష్మద్రోణులు సంతోషించారు. ''దివ్యమైన ఏర్పాటు'' అన్నారు.

''సరే, అలాగే చేస్తాను'' అన్నాడు దుర్యోధనుడు. తగిన పరివారజనాన్ని వెంటనే పిలిపించాడు.''పట్టణమంతా కస్తూరితో అలకండి. కర్పూరంతో ముగ్గులు పెట్టండి. గోడలికి కుంకంపూయండి. సభామండపంనిండా రత్న తోరణాలు కట్టండి. నగళ్ళన్నీ అలంకారాలతో కలకల్లాడేట్టు చేయండి. మీచతురత్వ మంతా వినియోగించి మనలోగిలీ, దుశ్శాసనుడిభవనం ప్రత్యేకమైన శిల్పాలతో అపూర్వంగా అలంకరించండి. కృష్ణుడి విడిదికి అన్నివిధాలా తగినచోటు వృకస్థలం. అక్కడ పందిళ్ళు వేయండి.మంటపాలు నిర్మించండి. ఆయన రేపు తెల్లవారేసరికి వస్తారు. అంతకిపూర్వమే ఇదంతాపూర్తి కావాలి'' అని ఆదేశించాడు. పట్నంలో పండగ చేయండని చాటించమన్నాడు ఘుమఘుమలాడే పూలమాలలు కూర్చడానికీ, మణిభూషణాలూ, చిత్రాంబరాలూ సిద్ధం చేయడానికీ తగిన నైపుణ్యం కలవాళ్ళని నియోగించాడు, పిసరంతవెల్తిరాకండా అన్నిఏర్పాట్లూ చేయించాడు.

''విదురా'' అన్నాడు ధృతరాష్ట్రుడు సాలోచనంగా, ''మంచి మంచి బహుమానాలతో ముంచెత్తాలి కృష్ణుణ్ణి. రకరకాల రత్నాల రథాలూ, జవనాశ్వాలూ, భద్రగజాలూ, మణిమయాలంకారాలూ, దాసదాసీజనం అసంఖ్యంగా సమర్పిస్తాను. మనభవనంలోనూ, దుర్యోధనుడి లోగిళ్ళలోనూ, దుశ్శాసనుడి హవేలీలోనూ ఆయనకంటికి నచ్చినదల్లా కానుకగా అర్పించాలాయనికి. ఏమంటావు?'' అని అడిగాడు.

''శ్రీకృష్ణుణ్ణి సంతోషపరచడంకంటే కావలిసిం దింకేముంది!'' అని అర్థవంతంగానే అందుకున్నాడు విదురుడు, ''మంచిమాటే, కాని న్యాయంగా పాండవులికి ఐదూళ్ళయినా ఇవ్వడానికి మనసొప్పని నువ్వు ఇంతత్యాగానికి ఎలా తెగిస్తున్నావో అని ఆశ్చర్యంగా వుంది నాకు. అవును, నీఅభిప్రాయమేదో అవగాహన అవుతూనే వుందినాకు. ఒడుపుగా డబ్బూ దసకమూ లంచమిచ్చి, కృష్ణుణ్ణి వల్లోవేసుకుని కథఅడ్డం తిప్పాలని చూస్తున్నావు. 'ముద్దమూతికట్టు' అన్నమంత్రం అన్నిచోట్లా పారుతుం దనుకుంటున్నావు. ఇంతవెర్రివాణ్ణి నిన్నేచూశాం. మేరువంతధనం పోసినా అర్జునుణ్ణి విడిచిపెడతాడా కృష్ణుడు? అర్జునుడి భక్తీ, కృష్ణుడి ప్రేమా నీకుమాత్రం తెలియనివి గనకనా! అర్జునుడంటే ఆరోప్రాణం కృష్ణుడికి. జలపూర్ణమైన మంగళకలశమూ, పాద్యమూ, కుశలప్రశ్నా తప్ప ఇంకోదానితో మెప్పించలేం ఆమహానీయుణ్ణి. ఏపనిమీద ఆయనవస్తున్నాడో, అది మనసా మనం ఆచరించడమే ఆయన్ని సంతోషపరచడం. అవీ ఇవీ పదివేలయినా నిష్ప్రయోజనం'' అన్నాడు.

### దురాలోచన

''అవును, విదురుడు చెప్పినదాంట్లో ఏమంతా సందేహంలేదు'' అని సాగదీశాడు దుర్యోధనుడు, ''కృష్ణుడు పాండవులతో ఎప్పుడూ వేరుకాడు. కానుకలు చెల్లించేకాలం కూడా కాదిది. ఈసమయంలో ఇచ్చామే అనుకో, ప్రయోజనంలేదు సరికదా, భయపడి బహుమానా

లిచ్చామంటుందిలోకం. అందులో ఏదన్నా కొరతవచ్చిందా, నవ్వాల పాలూ అవుతాం అంతే. కృష్ణుడు పూజనీయుడన్న సంగతి నాకూ తెలుసు. ఐతే, కానుకలు పెట్టడంవల్ల మన చేతకానితనమే బైటపడు తుంది. పైపెచ్చు శత్రువులు కొమ్ములెక్కి కూచుంటారు. లంచాలవల్ల కంచాలపొత్తు కలుస్తుందా?" అన్నాడు.

"నువ్వూ, నీకొడుకూ ఏమన్నాయిస్తే వొకటీ, ఇవ్వకుంటే వొక టీనా కృష్ణుడికి! పొరపాటు. ఆయన సంకల్పించిన కార్యం అచంచల మైంది. పాండవులు శాంతించేట్టు చేయడమే ఆయన పూనిక. ఇంత కంటె క్షేమమయినమార్గం ఇంకోటి వుండదు. ఆయనేదిచెబితే అది, కిక్కురుమనకండా చెయ్యడమే నీకు క్షేమం. ధర్మనిర్వచనంచేసే చెబుతాడాయన. ఆయన చెప్పిందల్లా అక్షరాలా అంగీకరించండి. దాంతో అన్నీ చక్కబడతాయి" అన్నాడు భీష్ముడు.

"అదేమన్నమాట!" అని అడ్డంవచ్చాడు దుర్యోధనుడు. "పాండవులికి రాజ్యంలో వంతిమ్మాంటాడు కృష్ణుడు. నేనివ్వను గాక ఇవ్వను. అదలావుండనీ—ఇంకోఆలోచన తడుతూవుంది నాకు. విను. పాండవుల పంచప్రాణాలూ ఈకృష్ణుడు, ఇతణ్ణిపట్టి బంధిస్తే చాలు, రెక్కలువిరిగిన పక్షులైపోతారు వాళ్ళు. నాకు విధేయులై వుంటారు. పాంచాలులూ, యాదవులూ మొదలైన వాళ్ళ ఆప్తవర్గ మంతా కుక్కినపేళ్ళలా మనమాట వినుకుంటారు. ఛప్పన్నదేశాలూ నేనే ఏకైక చక్రవర్తినై ఏలుకుంటాను. దీనికితగిన పన్నుగడఅంతా ఇపుడే సిద్ధంచేస్తాను. ఏమంటావు?" అన్నాడు.

ఇది వినడంతోటే గతుక్కుమనిపోయాడు ధృతరాష్ట్రుడు. భీష్ముడు మొదలైన వాళ్ళంతా ముక్కుమీద వేలుంచుకుని నాలికలు కరుచుకున్నారు.

"అయ్యో, ఇది జగద్రోహం" అని గుండెలమీద చేతులు వేసుకున్నాడు ధృతరాష్ట్రుడు, "ఈతలంపే నీమనస్సులోకి రాకూడదు. పాపాత్ముడా, దూతగావచ్చినవాణ్ణి, మహాత్మ్యం కలవాణ్ణి, ధర్మాత్ముణ్ణి దండించడం ధర్మవిరుద్ధం. ఆయనేం సామాన్యుడా! లోకైక వంద్యుడు. పూజనీయుడని నువ్వేవొప్పుకుంటివే ఇప్పుడు! ఆయన రాక వల్ల కురువంశానికి ఏం అపకారంజరిగిందని! ఏచేశాడని నీకీ పాప చింత!" అని కొడుకుని గదమాయించాడు.

"నీకొడుకు ప్రాణాంతకమైన ఘోరానికి నెట్టుకుంటున్నాడు. కృష్ణుడిమీదికే ఇంతద్రోహం తలపెడితే మంత్రులతోసహా సర్వ నాశనం అయిపోతాడు. పుట్టుగతులుండకండా పోతాడు. అంతే, తప్పదు. ఇంక ఇది చేస్తేనేం, చెయ్యకపోతేనేం, ఆమహాత్ముడి విష యంలో ఇంత అపచారం తలపెట్టిన దుష్టాత్ములు ఎంతకన్నా తగు దురు. ఇలాంటిది వినలేను నేను" అంటూ దిగ్గునలేచి, పెడమొహం పెట్టుకుని చరచరా పైకి వెళ్ళిపోయాడు భీష్ముడు.

"ఇంతలేసి ఘోరాలు మనస్సులో పెట్టుకున్ననువ్వు, చెయ్య డానికి మాత్రం సందేహిస్తావంటే ఎలానమ్మడం? నిజం చెపుతు న్నాను, దీనివల్ల సమూలంగా నశించి పోతావు. కూడదు. నామాట విను. ఇలాంటి దురాలోచన కట్టిపెట్టు" అని బోధించి సాగనంపాడు కుమారుణ్ణి ముసిలిరాజు.

మర్నాడు కుశస్థలంలో పెందరాళే లేచాడు కృష్ణుడు, కాల్య కృత్యాలు నిర్వర్తించుకున్నాడు. ప్రయాణానికి సిద్ధమయాడు. తెల్ల వారే సరికి కుశస్థల వాసులంతా సాగనంపడానికి సమావేశమయారు. అందరితోనూ మందహాసం చేస్తూ మాట్లాడాడు కృష్ణుడు. బయల్దేరే ముందు రకరకాల ఫలహారాలూ, పిండివంటలూ, పళ్ళూ, గంధ

మాల్యాదులూ పట్టుకుని హస్తినానగరంనుండివచ్చి హాజరయ్యారు దుర్యోధనుడి సేవకులు. అన్నీ ఆదరంగా అందుకున్నాడు కృష్ణుడు. ఉపయోగించినట్టే నటించాడు. కాని వొక్కటీ ముట్టుకోలేదు. ప్రజలందరినీ "ఇకనిలవం" డని చెప్పి అక్కడనుండి బయల్దేరాడు.

ఇంతలో, వొక్కదుర్యోధనుణ్ణి తప్ప తక్కినబంధు వర్గాన్నంతటినీ, మంత్రుల్నీ, సామంతుల్నీ కృష్ణుడికి ఎదురుకోలుగా స్వాగతం చెపుతూ పంపించాడు ధృతరాష్ట్రుడు. భీష్ముడూ, ద్రోణుడూ బాహ్లికుడూ మొదలైన పెద్దలతో కూడాకలిసి వీరంతా మంగళవాద్యాలతోసహా మహావైభవంగా ఎదురువెళ్ళారు.

అందరినీ అన్ని విధాలా సంభావించాడు కృష్ణుడు. కృతవర్మ తనవాడే కావడంచేత విశేషస్నేహంతో చేరదీశాడతణ్ణి. సమస్త జనమూ పరివేష్టించి వెంటనడుస్తూవుండగా దేవేంద్రవైభవంతో పురప్రవేశం చేశాడు. తనకోసమని దివ్యసుందరంగా అలంకరించుకుని వుంది హస్తినానగరం, ఇసకవేస్తే రాలడంలేదు జనం. రాజవీధిని నడిచివస్తూంది రథం జయజయధ్వానాలు చేస్తున్నారు బారులు తీరిన ప్రజలు. రెండుపక్కలా మేడలమీద,కిటికీలలోంచి, బాల్కనీలమీంచి విరగబడి విలాసంగా చూస్తున్నారు పురస్త్రీలు. పూలవాన కురిపిస్తున్నారు అత్తరూ, పన్నీరుజల్లులూ ముంచెత్తుతున్నారు, ఆణిముత్యాలతో మంగళాక్షతలు చల్లుతున్నారు, అంజలిబంధాలు పైకెత్తి అదే మొక్కుతున్నారు.

"ఈయనేనే, పూతన ప్రాణాలు చనుబాలతో సహా చప్పరించేశాడు, ప్రౌఢబాలుడు."-"ఈయనేనమ్మా, చాణూరమల్లుణ్ణి చిటికిలో చిత్తుచేశాడు, జగజ్జెట్టి" "ఈయనేనే అక్కయ్యా, కంసుణ్ణి కడతేర్చి అతడి తండ్రిని రాజుచేశాడు, మహాప్రభువు." "ఈయనేనో, సత్యభామా దేవికి పారిజాతం తెచ్చి పెరట్లోనాటాడు, రసిక శిఖామణి." "ఈయనేనే అమ్మో, వెన్నముద్దలూ గోపికాస్త్రీల

మనస్సులూ పొంగిలించాడు, చిన్నికృష్ణమ్మ.'' ఈయనేనో వోవిడ, పగవాళ్ళ తలమీద పాదాలుపెట్టి, పద్మపరిమళంతో పరిమళింప చేస్తూన్నాడు, చతురమూర్తి.'' ఇలాముచ్చటమీద ముచ్చట చెప్పు కుంటూ తన్మయులూ అవుతున్నారు అమ్మలక్కలు, యువకులని కాదు, వృద్ధులనికాదు, పేదలనికాదు, అమీర్లనికాదు, హరిజనులని కాదు, బ్రాహ్మలనికాదు—దర్శనకుతూహలంతో అదే తొక్కిస లాడిపోతున్నారు జనం. ఎదటివాళ్ళని తోసుకుంటూ ముందుకు పోతు న్నారు. వేళ్ళమీద నిలబడి ఎదటికి చూస్తూన్నారు.రథాన్ని ముట్టడి వేస్తున్నారు. సిపాయిలు సమ్మర్దం సర్దుబాటు చేస్తున్నారు చోపు దార్లు బెత్తాలతో అదలిస్తున్నారు. వద్దని వాళ్ళని వారిస్తూ, ఆ ప్రజా సముద్రంలోంచి మందస్మితంతో, మందగమనంతో రథం పోనిస్తూ న్నాడు శ్రీకృష్ణుడు.

రాజవీధులు గడిచాయి. మణితోరణాలతో మహోజ్జ్వలంగా వున్న కోటదేవిడీ దాటింది. కక్ష్యాంతరాలూ గడిచాయి. ఇలా వెళ్ళి వెళ్ళి ఏనుగు మొగసాలదగ్గిర ఆగింది రథం. రథందిగి మందగమనంతో లోపల ప్రవేశించాడు కృష్ణుడు.

ఇంతలో భీష్ముడూ ద్రోణుడూ మొదలయిన వారంతా ముందుగా వెళ్ళి ధృతరాష్ట్రుడిదగ్గిర నుంచున్నారు. సంభ్రమంతో లేచాడు ధృతరాష్ట్రుడు. విదురుడితోనూ సంజయుడితోనూ కలిసి ఎదుర్కొన్నాడు కృష్ణుణ్ణి. మహాదరంతో పాదివి కౌగిలించుకున్నాడు కృష్ణుడు. విదురుణ్ణీ, తదితర సత్పురుషుల్నీ సమాదరదృష్టితో పరికించాడు. ఎత్తికౌగిలించుకున్నాడు, కుశలప్రశ్న చేశాడు. అదే విధంగా అందరితోనూ తగిన మర్యాదలు నిర్వహించవలసిందని సాత్యకికి సంజ్ఞ చేశాడు.

ముందే ఉన్నతమైన కనకాసనం సిద్ధంగావుంది. దానిమీద కృష్ణుణ్ణికూచోపెట్టాడుధృతరాష్ట్రుడు.అతడు ఆదేశించడమే తడువుగా

అర్ఘ్యమూ, పాద్యమూ, మధుపర్కాలూ ఇచ్చి కృష్ణుణ్ణి పూజించారు రాజపురోహితులు. అర్హపీఠంవేసి సాత్యకినీ అర్చించారు. వృద్ధమహారాజూ తక్కినదొరలూ ఎవళ్ళ ఆసనాల్లో వాళ్ళు కూర్చున్నారు. కొలువు కొలువంతా సూర్యోదయసమయంలో వికసించిన సరోవరంలా కలకలలాడుదూ కనువిందుగా వుంది.

ముందుగా ధృతరాష్ట్రుడికీ, భీష్మ, బాహ్లీక, ద్రోణప్రముఖులికీ ధర్మరాజు విన్నవించిన ప్రకారం ప్రమాణాలూ అవీ నివేదించాడు కృష్ణుడు. తరవాత కులాసాగా కబుర్లలోకి దిగాడు. రాజు మనస్సుకి నచ్చినట్టు ఎంతో మర్యాదగా మాట్లాడాడు. బంధువులూ, పరిచితులూ స్నేహితులూ సంతోషించేటట్టు స్నేహాలాపాలు చేశాడు. పరిహాసవచనాలతో యువకుల్ని ఉల్లాసపరిచాడు. ఇలా కొంతసేపు గడిచాక "విదురుడి ఇంటికి వెళతాను. ఇంకా వెళ్ళవలిసిన చోట్లకి కూడా వెళ్ళివస్తాను" అంటూ లేచాడు. ధృతరాష్ట్రుడిచేత "సరే" అనిపించుకుని బయలుదేరాడు.

సంభ్రమంగావచ్చి స్వాగతమిచ్చాడు విదురుడు. భక్తివినయాలతో మంగళోపచారాలు చేశాడు. దేవతలికి చేయవలిసినంత మహోపచారాలు చేసి పూజించాడు. పాండవుల వొక్కొక్కరి క్షేమమూ పేరపేర, పదేపదే అడిగాడు. వినయంగా చేతులుజోడించి "మీకోసం భోజనమిక్కడే ఏర్పాటు చేస్తాను" అన్నాడు. "మంచిది" అన్నాడు కృష్ణుడు.

## తల్లి కడుపు

అక్కడినుండి కుంతీదేవిదగ్గిరికి వెళ్ళాడు కృష్ణుడు. అతణ్ణిచూడ్డంతోనే కుమాళ్ళు కళ్ళఎదట కట్టినట్టయింది కుంతికి. బావురుమని రెండు చేతులతో కృష్ణుడిమెడ పెనవేసుకుని ఏడవడం మొదలుపెట్టింది. ఎంతో కష్టంమీద ఆమెని వోదార్చి సముదాయించాడు కృష్ణుడు.

ఎలాగో ఆపుకుందామె చివరికి. ఆసనం వేయించి కూచోపెట్టింది కృష్ణుణ్ణి ఉపచారాలు చేయించి పక్కనే కూచుంది.

"నీ చెప్పుచేతల్లో పెరిగి నీతిమంతులూ, శక్తిమంతులూ అయ్యారు నాకుమాళ్ళు" అంటూ ఆరంభించింది. ఆమెకంఠం గద్గదిక పోతూవుంది. "ఎండకన్నెరగరు. ఇటుపదిమందీ, అటుపదిమందీ సేవ చేస్తూ వుంటే, అరిచేతినిమ్మపళ్ళలా హాయిగా బదికిన వాళ్ళు ఇలాంటి నా నాయనలు పిట్టమనిషి లేని అడవుల్లో ఎలా వెళ్ళబుచ్చారు! నన్నూ— నాబొందినీ మాత్రం ఇక్కడ వొదిలి, నాపంచప్రాణాలూ వాళ్ళతో తీసుకుపోయారు. నాచేత్తో వడ్డిస్తే తినేవాళ్ళు, హంసతూలికా తల్పాలమీద నిద్రపోయేవాళ్ళు వైతాళికుల మధురగీతాలతోనూ, భద్రగజాల ఘీంకారాలతోనూ, తెలుపుకునేవాళ్ళు నాతంద్రులు. దుంపాదుల్రూ తినీ, పొదలనకా పుట్టలనకా పడుకుని పులుగులూ మృగాలూ అరిస్తే ఉలికులికిపడి లేస్తూ బతికారుకదూ! తండ్రిలేని బిడ్డలు. కన్నతల్లినీసహా విడిచి ఇలా దుఃఖాలపాలయ్యారు. అడవులే అనుకుంటే అజ్ఞాతవాసం! అన్నితిప్పలు పడ్డారు నా బాబులు!

"కల్లోసహా ధర్మంతప్పరు మా పెదబాబు ధర్మరాజు. ఎలా వున్నాడు? సింహవిక్రముడు భీమన్న క్షేమమేనా? విల్లూ బాణంపట్టు కుంటే ముల్లోకాలూ తలలొగ్గుతాయి నాకన్నతండ్రికి — అర్జునుడు సుఖంగావున్నాడు కదా! వినయానికి పెట్టిందిపేరు నా చిట్టితండ్రులు కవలవాళ్ళు బావున్నారా? కులసతి, నా ఇంటిదీపం, మా పాంచాలి, మాఅమ్మ, ఎలావుంది? కొడుకులకంటే కోడలంటే ప్రాణంనాకు. వాళ్ళ కంటే కోటిమడుగులు నేనంటే ప్రాణంపెడుతుంది నాచిట్టితల్లి. మగ నాలు, ముద్దరాలు, పుణ్యచరిత్ర, పతివ్రత — అలాంటి నా కన్నతల్లి, నిండుసభలో అందరి ఎదటా పడ్డపాట్లు తలచుకున్నప్పుడల్లా, గుండె చెక్కలై పోతుంది నాకు. దానికష్టాలు చూసిన్నీ సహించుకున్న

రాతిగుండె దాన్ని. నేను సహించలేనిదంటూ ఇంకేముంటుంది! ఈనర లోకంమీద ఇంతలేసికష్టాలు ఎవరికన్నా వుంటాయా చెప్పూ!

"అంతసభలోనూ వొక్క విదురుడు తప్ప 'ఇది అధర్మం, కూడదు' అని వొక్కరైనా నోరెత్తరుకదా! ప్రపంచమింకా నిలబడే వుందంటే విదురుడివంటి ధర్మాత్ములవల్లే అంటాను.

"అల్లుడూ, ఇంతా వొకయెత్తూ ఈపడమూడేళ్ళూ బావకొడుకు దెప్పిపొడుస్తూ పోస్తున్న ఎత్తుబత్తె మొకఎత్తూ ఐపోయింది నాకు. ఎవళ్ళతో మొత్తుకోను! బాబూ, ప్రమాణపూర్తిగా చెపుతున్నాను నాకొడుకు లొకటీ, దుర్యోధనుడూ, అతడితమ్ములూ వొకటీ అన్న భేదం ఏకోశానాలేదు నాకు. ఇందులో ఏమాత్రం అసత్యం వున్నా నాబిడ్డల మొహాలు చూడకండా పోవాలి నేను. నిజమైతేనే నువ్వూ, నా కూనలూ పదికాలాలపాటు చల్లగా వుంటారు.

"బావ మంచివాడు కాడని ఆడిపొయ్యడం దేనికి! అతడి కొడుకుల్నిమాత్రం నిందించడ మెందుకు? బాహ్లికుణ్ణి తిట్టడంతో ఏంపని? భీష్ముడిమీద వాదువెయ్యడమెందుకు?–ఇంతకీ ఇలాంటి కటికి వాళ్ళయింట నన్ను పడవేసిన మనవాళ్ళ ననాలిగాని! – ఐనా, అని మాత్రం ప్రయోజన మేముందిగనక!

"అర్జునుడు పుట్టినపుడు, 'వీడు లోకాలు జయిస్తాడు. భూమ్యాకాశాలు నిండుకుంటుంది వీడికీర్తి. యుద్ధంలో కౌరవుల్ని జయిస్తాడు. అన్నదమ్ములతోసహా సామ్రాజ్యాధిపతుల గౌరవాలనుభవిస్తాడు' అంది ఆకాశవాణి. అంటే ఆకాశవాణినే అనాలి. ధర్మమే నిజమైతే ఆకాశవాణి నిజమతుంది. అన్నిటికీ సూత్రధారుడవంటూ వుండనే వున్నావు నువ్వూ.

"నువ్వూ మన్నించే నీనేస్తులు నాతండ్రులు. నువ్వూ వస్తున్నావని విన్నప్పటినుంచీ ఆలోచిస్తున్నాను. నువ్వూ వెళ్ళగానే వాళ్ళతో ఈమాట చెప్పాలి. ధర్మరాజుతో ఇలా అను. "దేహీ అని చెయిచాచి

సంపాయించిన ముష్టిసంపద, ఎందుకువచ్చిందది! రాచబిడ్డడన్నవాడు శౌర్యం వొదలడం నిప్పులు చల్లారిపోవడమన్నమాట. అలాంటి వాళ్ళని ఎవరు లక్ష్యపెడతారు?

"భీమార్జునులతో ఇలాచెప్పు 'రాచకూతురు దేనికోసమైతే కొడుకుల్ని కంటుందో, దానికి తగినసమయం వచ్చిందిపుడు. ఆలస్యానికి అవకాశంలేదు. మీకర్తవ్యం మీరు మరిచిపోతే, మిమ్మల్ని పురుషుల కింద జమకట్టదు లోకం.

"నకులసహదేవులతోనూ ఇలా అన్నాననను, 'భుజబలంతో జీవించడమే స్వధర్మం. మెప్పెత్తబడడమంత నీచం మరొకటిలేదు.''

"ఏంచెయ్యాలీ అన్నది ద్రౌపదిని అడిగి తెలుసుకోండి' అని అందరితోనూ చెప్పు. కళ్ళెర్రచేస్తేచాలు భీమార్జునులకు అడ్డమంటూ వుండదు. ఇంత తెలిసి, అవమానాలు అనుభవించిన్నీ ప్రతీకారం చెయ్యవద్దా! ఎంతకయినా సమర్థులే నాబిడ్డలు! నువ్విలా చబితే అలా చేస్తారు వాళ్ళు. నువ్వనుగ్రహిస్తేచాలు చల్లారుతుంది నాకడుపుమంట" అంది. ఇలా గుక్క తిప్పకండా, తెరలు తెరలుగా వుప్పొంగుతూన్న దుఃఖం నివేదించుకుంది కుంతీదేవి.

"ఎందుకీ అధైర్యం అత్తా" అంటూ మెల్లిమెల్లిగా వోదార్చడం మొదలు పెట్టాడు కృష్ణుడు, "ధీరురాలివి, పుట్టినిల్లూ మెట్టినిల్లూ ప్రఖ్యాతి చెందినట్టు నడుచుకున్న ధన్యచరిత్రవి. నువ్వే కష్టాలు భరించలేకపోతే లోకంలో సామాన్యులసంగతి చెప్పేదేముంది? విచారించకు. అన్నివిచారాలూ స్వస్తిచెప్పడానికి కార్యభారం నామీద వేసుకున్నానుగా! విను. కొడుకులూ, కోడలూ కులాసాగా వున్నారు. భక్తిపూర్వకంగా దండప్రణామాలూ ఆలింగనాలూ మరీమరీ నివేదించమన్నారు. వీరధర్మం తప్ప మరోధర్మం ఆశించడమే లేదు వాళ్ళు. సీకడుపునపుట్టిన సింహాలు వాళ్ళు, నైచ్యానికి వొడబడతారా! వాళ్ళేమి

అల్పబుద్ధులు గనకనా ఏమన్నానా? ఎంతోకాలం లేదింక. మహోత్సాహంతో శత్రుసంహారం చేస్తారు. అఖండవైభవంతో సాగర మేఖలమైన సామ్రాజ్య మేలుకుంటారు? కళ్ళవేడుకగా, చల్లగా చూస్తావు నువ్వు'' అన్నాడు.

''అవును నాయనా, అవును వాళ్ళకి తండ్రన్నా, గురువన్నా, దైవమన్నా — అన్నీ నువ్వేమరి'' అంది, క్రమక్రమంగా వికసిస్తూన్న మొహంతో ఆమె, ''ఇదిన్యాయం, ఇదిఅన్యాయం, ఇదిమంచీ, ఇది చెడ్డా అవి నువ్వేది ఆదేశిస్తే అదే ఆచరిస్తారు వాళ్ళు. నీఆశ్రయ మంటూవున్న వాళ్ళకి ఆపదలెందుకుంటాయి? మాబాబులికే అన్న మాటేమిటి, కౌరవులికీ, ఈసమస్త ప్రపంచానికీ నువ్వే ఆధారం. నీపలుకే జగత్తుకి వేదవాక్కు'' అంది.

''నువ్వలాగే అంటావత్తా, ఎప్పుడూను'' అంటూ మందహాసం చేశాడు కృష్ణుడు, ''మళ్ళీవస్తాను. దుర్యోధనుడి దగ్గిరికి వెళ్ళనేలే దింకా'' అంటూ లేచాడు. ఆమెసెలవుతీసుకుని దుర్యోధనుడి మందిరానికి వెళ్ళాడు. సాత్యకి కృతవర్మలు వెంటనే వున్నారు.

తనకోసం ఎదురుచూస్తూ, ప్రత్యేకించి అలంకరించుకుని వుంది దుర్యోధన మహారాజు భవనం. కృష్ణుణ్ణి అల్లంతదూరంలో చూసి పడుతూలేస్తూ లోపలికి పరిగెత్తారు ద్వారపాలకులు. వెళ్ళడం, రారాజు ఆదేశంపొంది తిరిగిరావడం, క్షణాలమీద జరిగింది. ఎదురు వచ్చి సగౌరవంగా, సవినయంగా స్వాగతంవిన్నవిస్తూ, సమ్మర్దం సర్దుతూ, కక్ష్యాంతరాలగుండా తోడ్కొని వెళ్ళారు సపరివారంగా కృష్ణుణ్ణి. కైలాసపర్వతంవంటి మహాసౌధంలో సభతీర్చి, సింహాసనం మీద ప్రతీక్షిస్తున్నాడు దుర్యోధనుడు. బాహ్లీక, భీష్మ, ద్రోణ ప్రభృతులైన పెద్దలూ, కర్ణుడూ, శకునీ ఇత్యాదిమంత్రులూ, సైంధవుడూ మొదలైన దొరలూ, దుశ్శాసనుడూ, దుర్ముఖుడూ, వికర్ణుడూ,

మొదలయిన కౌరవ కుమారుల్నూ, దేశదేశాల రాజులూ పరివేష్టించి వున్నారు. సభసభంతా పిటపిటలాడుతూ వుంది.

కృష్ణుణ్ణి చూడ్డంతోనే సపరివారంగా లేచి రాజలాంఛనాలతో ఎదురువచ్చాడు దుర్యోధనుడు. అతణ్ణీ తదితర ప్రముఖుల్నీ కౌగిలించుకున్నాడు కృష్ణుడూ సాత్యకిన్నీ. మహోజ్జ్వలమూ, మహోన్నతమూ అయిన బంగారం పట్టుసోఫామీద కూచోపెట్టి కృష్ణుణ్ని అర్చించాడు రారాజు. సాత్యకిని సముచితంగా పూజించాడు. అనంతరం కృష్ణుడు చెప్పడంతోనే ఎవళ్ళ ఆసనాల్లో వాళ్ళు కూచున్నారు. అందరి దృష్టులూ కృష్ణుడిమీదే వున్నాయి. కుశలప్రశ్నలతో ఆరంభించి, మధురసంభాషణలలోకి దిగాడు కృష్ణుడు. అందరినీ అపూర్వమైన ఉల్లాసంలో వోలలాడించాడు.

మాటలసందర్భంలో అంకించుకుని "మీకేమేం కూరలు వండించేది ? మీకు ఇష్టమైనపదార్థాలేవో సెలవిస్తే—" అన్నాడు దుర్యోధనుడు.

"మీరేమీ శ్రమతీసుకోవద్దు. నాకోసం వేరేఏర్పాటుజరిగింది" అన్నాడు కృష్ణుడు.

కర్ణుడి దిక్కు సాకూతంగా చూశాడు దుర్యోధనుడు. "విన్నావా ఈయనరాకడ! ఇక్కడ ఎంచేత తినడో అడుగుదాం. దాంతో ఈపెద్దమనిషి బండారం బైటపడుతుంది" అన్నాడు చాటుగా. మళ్ళీ కృష్ణుడిదిక్కు తిరిగాడు. "మీకోసం సంబరపడి ఎన్నోరకాల పదార్థాలు సంసిద్ధపరిచి నిరీక్షిస్తున్నాంమేం. కాదనిఇంకో చోటికి వెళ్ళడం మనబంధుత్వానికీ నీతికీ విరుద్ధమైనపని. పాండవులెంతో కౌరవులూ అంతేకదా నీకు! నువ్వంటె మానాయనగారికీ ఎంతోఇష్టం. ఇదేమన్నా న్యాయంగావుందా? నీకుమాత్రం తెలీందేముంది!" అన్నాడు.

"నేను కాదన్నానా? కాదంటే, నేను రాయబారినికదా! కార్యం సానుకూలం కాందే రాయబారులు ఎదిరింట భోజనం చెయ్య కూడదు. బహుమానాలు స్వీకరించకూడదు. వచ్చినపని ముందు ముగించండి. ఆతరవాత అన్ని వేడుకలూ జరుపుకుందాం ఇపుడు మించి పోయిందేముంది?" అన్నాడు కృష్ణుడు.

"వచ్చినపనికోసం ఇంత తొందరెందుకు? కార్యం సానుకూల మవుతుంది, కాకపోతుంది, దానిసమయం వచ్చినపు డది ఆలోచిద్దాం ముందే ముకుతాటికీ మోకాలికీ ముడిపెట్టడం ఏంసబబు! మాదగ్గిరికి వచ్చినవాడివి మాయింట భోజనంచేసి, కులాసాగాకూచుని, వచ్చిన వ్యవహారం చక్కపెట్టుకోవాలి. అంతేగాని 'ఇ క్క డ తి న ను' అనడం ఏం న్యాయమో అర్థంకాదు నాకు. ఆలోచించకండా అంటున్నావు. అంతే" అన్నాడు దుర్యోధనుడు.

చిన్న చిరునవ్వునవ్వి సభవేపు వోసారికళ్ళు తిప్పాడుకృష్ణుడు. దుర్యోధనుడి చేతిలో చేయికలిపి విలాసంగా కదిలిస్తూ "నీకు తెలీనట్టు నాచేత చెప్పించాలని చూస్తున్నావు" అని ఎత్తుకున్నాడు, "ఐతేవిను. ప్రేమతోపిలిచి పెట్టినభోజనమే ఉత్తమభోజనం. ఆపదలో, మంచీ చెడ్డా అని నిర్ణయించడానికి వీలుకాని సమయంలో లభించిన కూడైనా కొంతవరవాలేదు, అది మధ్యమం. ఇక్కడ ఈరెండింటిలో ఏదీ పొసగడం లేదు. ఏమంటావా, నువ్వు మామీద ప్రేమకలవాడివి కావు. పోనీ మేమేదైనా ఆపదలో వున్నామా అంటే అదీలేదాయె. అంతే కాదు, పగవాళ్ళ ఇంటతిన్న అమృతమైనా అనుమానానికి కారణమవుతుంది. పగవాళ్ళకి పెట్టడమూ మీకంతమంచిదికాదు. ఏమీ జరగ లేదేఅనుకో, ఐనా శరీరంమీద నమ్మక మేముంది? ఎప్పుడేదన్నా రావచ్చు దాంతో లేనిపోని సంశయాలు సంభవిస్తాయి. 'నేను పగ వాణ్ణా?' అని అనవచ్చునువ్వు. అవును పగవాడివే, ఏమంటావా?

పాండవులంటే వల్లమాలిన పగనీకు. వాళ్ళంటే ప్రాణంనాకు. ప్రాణాలమీద పగపట్టినవాడు పగవాడు కావడంలో సందేహ మేముంది?

"పూజనీయులైన తోబుట్టువులు మీకు పాండవులు. ఐనా బాల్యంనుండీ పగపట్టి కీడే తలపెట్టారు మీరు. అంచేత మీ అందరి అన్నమూ దుష్టాన్నమేనాకు ఒక్క విదురుడింట భోజనం మాత్రం ఉత్తమమైందని నిశ్చయించాను. అక్కడికే వెళుతున్నాను" అన్నాడు.

"సరే, నీఇష్టం అలాగేకానీ" అన్నాడు రారాజు. "మీ సన్మానంకోసం మేమందరం మాఇళ్ళల్లో సకల సంబారాలూ సమాయత్తంచేసుకుని నిరీక్షిస్తున్నాము. అనుగ్రహించాలి" అంటూ లేచేముందు ఆహ్వానించారు బాహ్లికుడూ, భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన పెద్దలు.

"మీఅందరి సన్మానాలూ స్వీకరించినట్టే సంతోషిస్తున్నాను అందరిఇళ్ళకూ వచ్చినట్టేభావించండి. సెలవియ్యండి" అని అందరినీ వారించి విదురుడి గృహానికి వెళ్ళాడు కృష్ణుడు.

ఆదరస్నేహాలతోనూ, చంచలమైన భక్తివినయాలతోనూ, ఆహ్వానించాడు విదురుడు. పరిమళద్రవ్యాలతో పవిత్రస్నానం చేయించాడు. రకరకాలవంటలు సిద్ధంచేశాడు. విశాలమైన వాకమంచి ప్రదేశంలో భోజనాలు ఏర్పాటుచేశాడు. మధ్యమధ్య మధుర సంభాణాలతో విదురుణ్ణి సంతోషపెడుతూ, షడ్రసోపేతమైన చతుర్విధ సరసాన్నాలూ సుష్టుగా ఆరగించాడు శ్రీకృష్ణుడు.

"ప్రభూ, ఈవుడతాభక్తి మన్నించాలి, ఇదే నాకు పరమ భాగ్యం. ఇంకోలాగ నిన్ను ఆరాధించడమంటే ఎవరికిసాధ్యం?" అంటూ చేతులు జోడించాడు విదురుడు.

భోజనభాజనాలయాక చందనతాంబూలాలు సేవిస్తూ కూచున్నాడు కృష్ణుడు, అంతవరకూ సమయంకనిపెట్టుకు కూచున్నారు,

పట్నంలోని కవులూ, గాయకులూ వేదపారకులూ, వైణికులూ, వేణుగానప్రవీణులూ, జ్యోతిష్కులూ మొదలైనవాళ్ళు, వాళ్ళంతా వచ్చి వాళ్ళవాళ్ళ విద్యలతో కాలక్షేపం చేసి బహూకృతులై వెళ్ళారు. ఇలా దినమంతా సందడిగా గడిచిపోయింది.

రాత్రి అభ్యంతర మందిరంలో హంసతూలికాతల్పం మీద శరీరం వాల్చాడు కృష్ణుడు. పక్కనే ఒక ఉచితాసనంలో కూచుని ఏకాంతంగా ప్రసంగించాడు విదురుడు.

"ప్రభూ, ఇదో ఘనకార్యంగా ఇక్కడికి దయచెయ్యవచ్చావు నువ్వు?" అంటూ అందుకున్నాడు, "దుర్యోధనుడు దుష్టబుద్ధి నీచుడు. దురభిమాని నీమాట వినడనే నమ్ముకున్నావా? పది కోట్ల అక్షౌహిణీసైన్యం తనకి చేరిందని కిందామీదా చూడకుండా వున్నాడు భీష్మద్రోణుల ఆసరా చూసుకుని మరీ ధీమాగా వున్నాడు. కర్ణుడొక్కడే తనకి విజయాభిషేకం చేస్తాడని నమ్ముకుంటున్నాడు.

"నువ్వు వస్తావని తెలియడంతోనే ధృతరాష్ట్రుడి కుమాళ్లంతా రహస్యంగా సమావేశమయారు. 'కృష్ణుడిమాట తోసెయ్యాలి,' 'పాండవులికి పుచ్చిన వక్కన్నా యివ్వకూడదు,' 'రాజ్యమంతా మనమే పాలించాలి' అని కూడబలుక్కున్నారు. వాళ్ళతో ఇప్పుడు చేరిన రాజులంతా దిగ్విజయంనాడు పాండవులచేత దెబ్బతిన్నవాళ్ళే. ఆవుక్కురోషం వాళ్ళగుండెల్లో మెలుగుతోంది. అందునుంచి 'కర్ణుడితోపాటు గెలుపో చావో తప్ప ఇంకోటి పనికిరాదు మాకు' అంటూ భీష్మించుకు కూచున్నారు. ఈ కారణాలవల్ల మరీ మిడిసిపడుతున్నారు కౌరవులు. ఎంతమాత్రం సంధి జరగదు. వినాశకాలం నెత్తిమీద తాండవమాడుతోంది వాళ్ళకి. వట్టిమాటేమాత్రం ఎలావినుకుంటారు?

"తమతాహతూ, ఎదటివాళ్ళతాహతూ తెలీని దుర్మార్గులు, వాళ్ళమధ్యవెళ్ళి నువ్వుకూచోడం ఆ మూర్ఖులు వేసే పిచ్చిపిచ్చి

నవాళ్ళకి జవాబుచెప్పడం—నాకేమో నచ్చలేదు. తిక్క తలకెక్కి-నవుబూసందర్భం తెలీదు వాళ్ళక. మోటువాళ్ళు కావడంచేత ప్రతా పాలకీ లోపముండదు. నిలువెల్లావిమంతప్ప ఇంకోటిలేదు. మహనీయమైన నీస్వభావమూ, బుద్ధీ, పౌరుషం నాకు తెలీవనికాదు. ఐనా పాండవులమీాది స్నేహంచేతా, నీమీాది భక్తిచేతా చెవుతున్నాను. కౌరవసభకు వెళ్ళవద్దు'' అన్నాడు.

''తల్లితండ్రులమల్లే హితోపదేశం చేశావు నువ్వు'' అన్నాడు కృష్ణుడు, ''నీ వివేకానికీ, స్నేహానికీ నిజంగా సంతోషంగావుంది. నేను రావడానికి కారణం చెబుతాను. ముందువిని, తరవాత చెప్పవలిసింది చెప్పు. నువ్వేంచెబితే అదే చేస్తాను.

''దుర్యోధనుడి తలతిక్క ఎరగనని కాదు. అతడితో కూడు పురాణీచేస్తున్న రాజులపగా కొత్తకాదు. సంధిపొసగదన్న సంగతీ స్పష్టంగా తెలుసు. ఐతే ఈశ్రమఅంతా ఎందుకయ్యా, అంటావు. భూలోకం తల్లకిందయేటంత రాణువతో మృత్యుముఖానికి పరిగెడుతూన్న మూర్ఖత్వాన్ని మాన్పించడం పుణ్యహేతువేకదా! నిరంతరం పాపపుణ్యాల్లోపడి కొట్టుకుంటూ వుంటాడు మానవుడు. వీటినుండి క్షణం ఎడమైనా సత్పరిణామమే వుంటుందంటారు బంధువర్గంలో అంతఃకలహం పుట్టినప్పుడు, నిష్ఠూరంపడి అయినా సరే అడ్డపడి అది మాన్పించడానికి యత్నించని వాణ్ణి క్రూరకర్ముడన్నారు కర్మకాండ తెలిసిన పెద్దలు. అంచేత, ఈ భరతజాతి అంతఃకలహాలతో చిదికిపోకండా మనకి తోచిన ప్రయత్నం మనం చేద్దామని నాసంకల్పం. ధర్మసంగతంగా చెప్పవలిసిన నాలుగుమాటలూ చెబుతాను. మంత్రులతోసహా దుర్యోధనుణ్ణి సంధికి ఒప్పించడానికే ప్రయత్నిస్తాను. అతగాడికీ, పాండవులికీ, సమస్తలోకానికీ హితమైనట్టు వంచన లేకండా మాట్లాడతాను. నన్ను పాండవపక్షపాతిఅని శంకించి, నామాట

తోసివేశాడే అనుకో, మంచిమాటే. దానిఫలం అతడే అనుభవిస్తాడు ఇలా నేను ప్రయత్నించకపోయినా, 'అన్నదమ్ములు తమలోతాము కుమ్ములాడుకుంటూంటే, కాదనకుండా ఉపేక్షించి వూరుకున్నాడు కృష్ణుడు. తనచేత ఆమాత్రం కాకపోయిందా' అంటుంది తెలియని లోకం, అన్నివిధాలా చెప్పిచూస్తాను బదికిబాగుపడే యోగముంటేనే నామాట వినుకుంటారు వీళ్ళు. కాదని నువ్వు భావించినట్టు నామీదికీ కత్తికట్టారే అను, వీళ్లంతా వొకటైనా నాముందు నుంచోగలరా మరి! ఏమంటావు?'' అన్నాడు.

అంతావిని సమంజసంగానే వుందని సమ్మతించాడు విదురుడు. సెలవుతీసుకుని తనపడకగదికి వెళ్ళిపోయాడు. ''వేళ్లమీద లెక్కపెట్ట వలిసిన వ్యక్తి. ఈలోకంలో ఇలాంటి వాళ్లెంతమంది!'' అంటూ విదురుణ్ణీ, అతడిమాటలపొందికనీ తలుచుకుంటూ, పాలసముద్రం మీది తెల్లకెరటంలావున్న ఆతల్పం మీద వొళ్లుమరిచి సుఖంగా నిద్ర పోయాడు శ్రీకృష్ణుడు.

తెలతెలవారుతూండగా వైతాళికుల మంగళగానాలతో మేలు కున్నాడు కృష్ణుడు. కాలకృత్యాలు తీర్చుకుని సిద్ధపడేసరికి సాత్యకీ, కృతవర్మావచ్చి కలుసుకున్నారు. వాళ్ల వెంబడినే ఇష్టజనమంతా వచ్చారు.

ఇంతలో కర్ణుణ్ణీ, శకుని దుశ్శాసనుల్నీ వెంటవేసుకుని దుర్యోధనుడూ వచ్చాడు. ఆనలుగురూ ఎన్నో మంచిమాటలాడి కృష్ణుణ్ణి పొగడడం లంకించుకున్నారు. అతడు కులాసాగా కబుర్లు చెప్పాక, ''ధృతరాష్ట్రమహారాజు బంధుమిత్రులతోనూ, సమస్త సామంత పరిజనంతోనూ కొలువుతీరి మీకోసం ప్రతీక్షిస్తున్నాడు'' అని ఆహ్వానించారు. ''మంచిది'' అంటూ సర్వసన్నాహాలతో సంసిద్ధంగావున్న రథమెక్కాడు శ్రీకృష్ణుడు. శంఖాలూ, భేరీలూ, చామరాలూ మొదలైన భద్రచిహ్నాలతో బయలుదేరింది రథం,

గరుడధ్వజం గగనచుంబితంగా ఎగురుతోంది. సాత్యకీ కృతవర్మా చెరొక రథంమీదా, దుర్యోధనుడూ దుశ్శాసనుడూ శకునీ కర్ణుడూ ఓరథంమీదా రెండుపక్కలా వెంటవచ్చారు. పౌరజనం విరగబడి కన్నులపండువుగా బారులుతీరి పరికిస్తున్నారు.

## కౌరవసభలో శ్రీకృష్ణుడు

రాజమందిరద్వారం చేరాయి రథాలు. ధ్వనివిని సభసభంతా ఉత్సుకత్వంతో ఎదురుచూస్తున్నది. రథం దిగాడు కృష్ణుడు, ఎదురు వచ్చి విదురుడు అందిచ్చినచేయి వొకహస్తంతోనూ, సాత్యకిచేయి రెండోహస్తంతోనూ పట్టుకుని మందగమనంతో నడిచాడతడు. సమ్మర్దాన్ని సర్ది దారిచేస్తూ ముందునడిచారు కర్ణదుర్యోధనులు. కృతవర్మ మొదలైన యాదవులూ, అభ్యంతరప్రవేశంకల అనేక మంది తగుమనుషులూ వెనకనడిచారు. కృష్ణుడిముందు కౌరవులంతా సూర్యుడిముందు గ్రహతారకల్లా కనిపించారు. మహోజ్జ్వలమూర్తిగా ఇలా అతడు సభలో ప్రవేశించడంతోనే ధృతరాష్ట్రమహారాజూ, మంత్రులూ, సామంతులూ – సభాజనం యావత్తూలేచి స్వాగత మిచ్చారు. మహారాజుతోసహా అందరినీ అభినందిస్తూ, తనకని ప్రత్యే కించిన కనకమణిమయోజ్జ్వలమైన మహాసనం అలంకరిచాడు కృష్ణుడు.

సరిగ్గా ఆదేసమయానికి అంతరిక్షమార్గంలో ప్రకాశిస్తూ నారదాది మహామునులు కనిపించారు.

"మనల్ని చూసే కుతూహలంతో వచ్చారీ మునీశ్వర్లు" అంటూ వాళ్లని భీష్ముడికి చూపించాడు కృష్ణుడు, "అర్ఘ్యమూ, పాద్యమూ, ఆసనాలూ సత్వరం సమకూర్చండి. ఈ మహాత్ములు కూచుంటేనేకాని మనం కూచోకూడదు" అన్నాడు. సభవాళ్ళంతా సంభ్రమాశ్చర్యాలతో చూడ్డం మొదలుపెట్టారు. వెంటనే తగిన

వాళ్ళని నియోగించి బంగారుమణిపీఠాలు తెప్పించి వేయించాడు భీష్ముడు. మునీశ్వర్లని ఆహ్వానించి, ఆసనాలూ, అర్ఘ్యపాద్యాదులూ ఇచ్చి, పూజలు చేయించాడు. కృష్ణుడు కూచున్న అనంతరం, ధృతరాష్ట్రుడూ, తక్కినవాళ్ళూ మునులికి అభివందనాలర్పించి, ఎవరి ఆసనాల్లో వారు కూచున్నారు.

దుశ్శాసనుడూ, వివింశతీ తెచ్చి వేసినగద్దెలమీద కృష్ణుడి రెండు పక్కలా సాత్యకీ కృతవర్మలు కూచున్నారు. కర్ణుడూ దుర్యోధనుడూ ఇద్దరూ కలిసి దగ్గరగా వొకేగద్దెమీద కూచున్నారు. విదురుడు వొక మణిపీఠంమీద కృష్ణుడి వెనకపక్క మరీదగ్గరగా అంటిపెట్టి కూచు న్నాడు. కొడుకులతో సహా వొకపక్క తనకితగ్గ పీఠంమీద కూచు న్నాడు శకుని. తక్కినవాళ్ళూ ఎవళ్ళకితగ్గ స్థలాల్లో వాళ్ళు కూచున్నారు.

చల్లనిమేఘంవంటి శరీరంతోనూ, పద్మపత్రాలవంటి నేత్రాల తోనూ, మనోజ్ఞమైన పీతాంబరాలతోనూ, కళ్ళవేడుకగా వున్నాడు శ్రీకృష్ణుడు. రెప్పవేయకండా చూస్తూవున్న సభాజనానికి కళ్ళతో అమృతపానం చేస్తున్నట్టు మహానందంగావుంది. కొలువంతా చివురు పెట్టిన వింధ్యపర్వతంలా ఆనంద పారవశ్యంతో నిశ్చలంగా వుంది. చీమ చిటుకంటే వినబడేటంత నిశ్శబ్దంగా వుంది. అతడేం చెబుతాడో విందామని వొళ్ళంతా చెవులుచేసుకుని సావధానంగా వున్నారు జనం.

"మహారాజా," అంటూ జలదగంభీరమైన కంఠస్వరంతో ధృతరాష్ట్రుణ్ణి సంబోధించాడు కృష్ణుడు, "మహారాజా నీకు తెలీని సంగతులంటూ లేవు. ఐనా, మీరు నావాళ్ళు కావడంచేతా, భరత వంశానికి మేలుకలిగేట్టు హితంచెప్పి తగువుతీర్చడం నాధర్మం కావడంచేతా ఇలా వచ్చాను నేను. పాండవులూ మీరూ పాలూ నీళ్ళవలె కలిసిమెలిసి జీవించడం క్షేమం అది చెయ్యవలిసినవాడివి నువ్వు. వాళ్ళొకటి వీళ్ళొకటీ కాదుకదా నీకు!

ధర్మానికీ దయకీ, సత్యానికీ, ఐకమత్యానికీ, ప్రతిభకీ మొదటి నుంచీ పెట్టిందిపేరు భరతవంశం. అందులోనూ నువ్వూ నీతమ్ముడూ ఆదర్శపురుషులు మీ కుమాళ్లు గుణవంతులు. యశోధురంధరులు. ఐనప్పుడు, పారంపర్యమైన ఆవంశమర్యాద ఇప్పుడుమాత్రం తప్పడం దేనికి! ఈవంశాని కంతటికీ నువ్వే మూలవిరాట్టు విపుడు. ఇందులో ఎవరిస్థితి ఏమయినా, ఆమంచీ చెడ్డా నీతలనే చుట్టుకుంటుంది అంచేత సద్భావంతో విచారించి, లోపాత్తూ బయటినడవడీ పదిమందీ బావుందనేట్టు చెయ్యవలిసిన కీలకం నీచేతిలోనే వుంది.

"దుర్యోధనుడూ అతడి అనుయాయులూ ధర్మంగా నడవడం లేదు. హితాహితాలు చూడ్డంలేదు. దీనివల్ల అర్థసిద్ధి నశిస్తుందనీ భావించడంలేదు ఇది వంశమర్యాద కాదనే ఊహేలేదు వీళ్ళకి. మూర్ఖత్వానికి వొడిగట్టుకుని అసందర్భంగా ప్రవర్తిస్తున్నారు. బంధువర్గం బాధపడుతుందని సహా సంకోచించడంలేదు. ఇది జరగనివ్వకూడదు నువ్వు. పాండవులతో సంధిచేసుకుని, వాళ్ళూ మీరూ ప్రశాంతగా బతికండి. అదే నీకూనాకూ, మన కులానికీ, ఈ రాజులందరికీ క్షేమం. ఇలాకాక యుద్ధమే పొసిగిందా, ఇంతమందికీ సంకటం తప్పదు. మహారాజా, దూరమాలోచించు సంధికని చేతులు చాస్తున్నారు పాండవులు. నిరాకరించకు. నీకుమాళ్ళని దారికితేవడం నీచేతిలోపని నువ్వు తెలుసుకుంటే కురుదేశంలోనే, కాదు, సమగ్ర భారతంలోనే అసాధ్యమైంది లేదునీకు.

"అక్కడ చూడు, భీమార్జునుల్ని మించినవా ళ్ళెందరో వున్నారు. ఇక్కడా భీష్మద్రోణుల్ని మించినవా ళ్ళున్నారు. యుద్ధంలో కొట్టుకు చావడం కంటె, వీళ్ళందరూ కలిసి నీచేతికింది సేనగా వుంటే ఎంతమేలో ఆలోచించు. భూప్రపంచంలోని రాజులంతా నీపాదాలికి పావళ్ళు పడతారు. సముద్రమధ్యస్థమైన భూభాగమంతా నీశాసనం

కిందికి వస్తుంది. నువ్వే ఉపేక్షిస్తే వొక్క-కౌరవులికే కాదు, ప్రపంచ ప్రజలందరికీ దుర్దశ నెత్తినపడుతుంది. తుదకి సర్వనాశనమే మిగులుతుంది.

"పాండవులూ కౌరవులూ-ఇద్దరూ రెండు నేత్రాలు నీకు. ఇందులో ఎవరిచావు మేలు నీకు? ఎవరిబాధ సంతోషం? విచారించు. ఉభయుల్లో ఎవరుచచ్చినా, ఎవరునొచ్చినా దుఃఖపడేవాడివి నువ్వే. దెబ్బేమో నీకే తగులుతుంది. ఉభయుల్లో ఎవళ్ళు తక్కువ? ఎవళ్ళు హెచ్చు? ఉభయులూ విద్యావంతులే, ఉభయులూ బలశాలులే, విక్రమవంతులే. ఇలాంటివీళ్ళు అకారణంగా అక్రమంగా అంతఃకలహాల్లో పడి కొట్టుకు చస్తూవుంటే చూస్తూ వూరుకోవలసిందేనా? నవనవ లాడుతూన్న అందమైన వీరిశరీరాలు మారణాయుధాలకు బలిఅయిపోతూ, తునకలై తూలిపోతూవుంటే ఎలా సహించడం? దుర్భరం కాదా! అలా జరగనివ్వకు. శాంతప్రదమైన సంధిచేసుకో. నిన్నూ నీప్రభుత్వాన్నీ లోకం హర్షించేట్టు ప్రవర్తించు. సంతానాన్ని కాపాడుకో

"పాండవులు తండ్రిలేని బిడ్డలు. బాల్యంనుంచీ వాళ్ళని చేరదీసి కాపాడావు నిష్కారణంగా ఇపుడు నట్టేటవిడిచిపెట్టడం న్యాయం కాదు ఆదరించు ఒకవొడ్డుచేర్చి రక్షించు. వాళ్ళయిదుగురూ భక్తితో ప్రణామంచేసి వొక్కమాటగా నీతో విన్నవించమన్న మాటలువిను, 'తాను పొమ్మంటే పోయి పన్నెండేళ్ళు అడవులలో తిరిగాం. పదమూడో ఏడు అజ్ఞాతవాసమూ చేశాం. మాతండ్రి నియమం పాలించి, మా రాజ్యార్ధం మేమెలాగూ పొందగలంకదా అన్న నమ్మకంతో ఇన్ని అవస్థలూ పడ్డాం. తల్లనా, తండ్రనా, బంధువన్నా, ప్రభువన్నా, ఏడుగడఅన్నా — అన్నీ తానేమాకు. మావల్ల ఏమయినా పొరపాట్లుంటే, మమ్మల్ని పిలిచి, చీవాట్లుపెట్టి, 'అలాగాదు ఇలాగ' అని సరిదిద్దవచ్చు తాను చల్లగా కాచుకున్నంత కాలం వెయ్యేళ్ళ పాటు — తన్నేతప్ప ఇంకొకరిని ఎరగం మేం.

మేమెలాంటి వాళ్ళమైనా, మమ్మల్ని గాని, దుర్యోధనాదుల్ని గాని గణించదు లోకం. మేమెంత కొరగాని వాళ్ళమయినా సరే, తాను మాత్రం న్యాయం తప్పకుండా వుంటేచాలు. వంశప్రతిష్ఠ భంగ పడదు 'అన్నారు.

"'అధర్మంచేత ధర్మానికి దెబ్బతగులుతూవున్నపుడు, అసత్యం చేత సత్యానికి హాని కలుగుతూవున్నపుడు చూస్తూ ఉపేక్ష చేస్తే, అలా ఉపేక్షించినవారికీ చేటు తప్పదు చివరికి ధర్మమేజయిస్తుంది, సత్యమే ప్రకాశిస్తుంది. అదెప్పుడూ ధ్రువమే. కాని ఉపేక్షచేసిన వారికి నిందమాత్రం మిగులుతుంది' అని ఈ సభలోని సభ్యులతో చెప్పమన్నారు. దీనికి నువ్వూ, నీ సభాజనమూ ఏమంటారో చెప్పండి. ధర్మమొహం చూసి, నీతిని ఎదట పెట్టుకుని మనస్సులో వొకటీ బైటకి వొకటీ కాకండా నగ్నమైన సత్యాన్నే వివరించాను నేను, క్రోధం, మత్సరం విడిచిపెట్టండి పాండవులికిఅర్ధరాజ్యం పంచిపెట్టండి మువ్మాటికీ మీకు మేలైన పద్ధతి ఇది. నామాట వినండి. ఇదే మీకు కర్తవ్యం. మంచీ చెడ్డా తెలిసినవాళ్లు, న్యాయాన్యాయాలు గుర్తెంచిన వాళ్లు ముందుకిరండి. ఇదికాక చెప్పవలిసిం దింకేమయినావుంటే చెప్పండి.

"మహారాజా, పాండురాజు భాగం పాండవులకిచ్చి నీభాగం నువ్వు పుత్రపౌత్రాభివృద్ధిగా అనుభవించు, ఉభయులూ ఇలా సుఖంగా జీవించండి. బంధువులూ, మిత్రులూ, హితులూ 'భళీ' అనే మార్గమిది. ధర్మరాజు ధర్మనిష్ఠా, సౌశీల్యమూ సత్యసంధతా నీకు తెలియునివా! మీదగ్గిర ఎలా ప్రవర్తించాడో నేను చెప్పనక్కరలేదుకదా! అతడిచేవ మాత్రం కొత్తాసికు! నీకు తెలియని దిందులో ఏదీలేదు. ఐనా చెప్తుతున్నాను విను. ఇంద్రప్రస్థంలో వుండికూడా నీసామ్రాజ్యం సమృద్ధం చెయ్యాలనే సంకల్పించాడతడు. భూమండలంలోని రాజులందరూ నీఅడుగులికి మడుగులొత్తేటట్టు చేయాలనే ఉద్యమించాడు. దిగ్విజయం చేసి, సకల సంపదలతో తులతూగుతూ ప్రశాంత జీవితం గడుపుతూన్న

వాళ్ళని చూడలేకపోయారు మీవాళ్ళు నీకొడుకూ అతడి మంత్రులూ మత్సరంతో మంత్రాంగాలు పన్నారు. శకునితోకలిసి మాయజూదంలో పడవేశారు. వాళ్ళ సర్వసంపదలూ లాగేశారు. అంతతో వూరుకున్నారా? నిండుసభలో ద్రౌపదిని మానభంగం చేసి కసి తీర్చుకున్నారు ఇదంతా నీకళ్ళెదుటే జరిగింది. కిమ్మనకండా సమ్మతించావు నువ్వు. పాపం ధర్మరాజు ధర్మానికి కట్టుబడి తమ్ములతో సహా తల వొంచుకుని, పెడచేతులతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు. ఘోరారణ్యాల్లో దుఃఖిస్తూ దైన్యం అనుభవించాడు ఇంతయాక కూడా, అన్నీ మరిచిపోయి మీతో కలిసివుంటానంటున్నాడిపుడు అజాతశత్రుడతడు. అతడి కతడేసాటి. అతణ్ణి పొగడాలంటే నేనెంత వాణ్ణి! అతడిశాంతం, అతడివినయం, అతడిగౌరవం నిజంగా ఏమహారాజులకున్నాయి?

"నీబిడ్డల ఉభయపక్షాల హితంకోరి ఇంతవరకూ చెప్పాను. అతిలోభంతో కలుషితమైన నీకొడుకు మనస్సు మార్పించు. పాండవుల్ని పిలిచి తీసుకురా. శాంతిశూరులు వాళ్ళు. నీపాదసేవకోసం సిద్ధంగా వున్నారు. కాదు, ఇదినీకు నచ్చదంటావో, ఇంకోమార్గం లేదు వాళ్ళకి. యుద్ధానికి సిద్ధపడతారు. విన్నావూ, ఈరెండింటిలో ఏది నీకు ఉత్తమమైందని తోస్తే అదే నిశ్చయించు" అన్నాడు.

కృష్ణుడి ఉపన్యాసం కౌరవసభలో మంత్రదండలా పని చేసింది. సభాజనమంతా ముగ్ధులై పులకించారు. 'ఎంతగొప్పగా చెప్పాడో!' 'మళ్ళీ నోరెత్తే మగాడెవడున్నాడిక్కడ!' అంటూ బొమ్మల్లాగ నిశ్చేష్టితులై వూరుకున్నారు.

### దంభోద్భవుడు

అపుడు, జామదగ్న్యమహాముని లేచి దుర్యోధనుడితో ఇలా

అన్నాడు "రాజా, పూర్వం దంభోద్భవుడనే ఒకరాజు వుండేవాడు. తనకు ఎదురెవ్వడూ లేడని మహామిడిసిపడేవాడు. అతడు ఓనాడు గంధ మాదనపర్వతానికి వెళ్ళాడు అక్కడ నరుడూ నారాయణుడూ తపస్సు చేసుకుంటున్నారు చూడ్డమే తడువుగా వాళ్ళ మీదికి కత్తి పట్టి వాళ్ళని యుద్ధానికి రమ్మన్నాడు దంభోద్భవుడు. వద్దయ్యా, అని ఎన్నోవిధాల చెప్పారు వాళ్ళు. వినుపించుకోలేదు. దాంతో పిడికెడు దర్భలుతీసి బాణవర్షం కురిపించాడు నరుడు. ఇంకేముంది, రాజు సైన్యమంతా నిముషంలో నాశనమైంది. దంభోద్భవుడు త్రాహి త్రాహి అన్నాడు. విన్నావూ, ఆనరుడే ఇపుడు అర్జునుడుగానూ, నారాయణుడే కృష్ణుడుగానూ లీలాజన్ములై అవతరించారు. అంచేత, దంభోద్భవుడిలా గర్వించడం, కృష్ణార్జునులితో విరోధం పెట్టుకోడం క్షేమం కాదు నీకు."

గరుడగర్వభంగం

"అవును, తనేమిటో, ఎదటివాడేమిటో, తెలీకండా విర్రవీగడం కూడదు" అంటూ అందుకున్నాడు కణ్వముని, "గరుత్మంతుడంత వాడికి అహంకారం తలవంపులు తెచ్చిపెట్టింది. దుర్యోధన మహారాజా, ఆవృత్తాంతం వివరిస్తాను విను. ఇంద్రుడి సారధి మాతలికి గుణకేసి అనే కూతురుండేది. ఆమెకోసం వరుణ్ణి వెదికివెదికి ఆర్యకుడనే నాగరాజు మనవండైన చిరకుడనే వాడి కుమారుణ్ణి సుముఖుడనే వాణ్ణి తుదకి నిశ్చయించాడు మాతలి. ఈవిషయం తెలియచేయడంతోనే దుఃఖిస్తూ ఆర్యకుడు అయ్యా, గరుత్మంతుడు పగపట్టి వీడి తండ్రిని చంపి వీణ్ణి చంపడానికి సిద్ధంగా వున్నాడు. అంచేత వీడికి పెళ్లేమిటి! ఎలా సమ్మతించమంటావు ?" అన్నాడు.

"దేవేంద్రుణ్ణి ప్రార్థించి ఆయువుపోయిస్తాను సుముఖుడికి. నావెంట రండి' అని వాళ్లని అమరావతికి వెంటవేసుకువెళ్లాడు మాతలి. వాళ్ల భాగ్యవశాత్తూ అప్పుడు ఇంద్రుడి దగ్గిరే వున్నాడు విష్ణుమూర్తి. తన

అదృష్టానికి ఆనందిస్తూ విషయమంతా విన్నవించాడు మాతలి. అంతా విని జాలిపడ్డాడు దేవేంద్రుడు. విష్ణువున్నాడన్న భరోసా కూడా కలిగింది. వెంటనే సుముఖుడికి చిరాయువు ప్రసాదించాడు సుముఖుణ్ణి పాణిగ్రహణానికి సిద్ధపడ మన్నాడు మాతలి.

"ఇంతలో ఇదంతా తెలిసి మహాకోపంతో మండిపడుతూ వచ్చాడు గరుత్మంతుడు విష్ణువు దగ్గిరవున్నాడన్నైనా సంకోచించకండా చెడామడా తిట్టాడు ఇంద్రుణ్ణి. 'నువ్వు అదితికొడుకువి నేను వినత కుమారుణ్ణి. ఐనా, మనఇద్దరికీ తండ్రిమాత్రం వొక్కడే, కశ్యపుడు మనఇద్దరిపనీ రాక్షసవిధ్వంసమే. ఐనప్పుడు, నీకంటేనేను ఏమంత తీసిపోయానని, నామేరకు అడ్డం వస్తున్నావు?' అన్నాడు.

"'ఈమహనీయత్వాని కంతా మూలకారణం మహావిష్ణువు గాని మరొకటి కాదుగదా! ఎందుకింత అహంకారం!' అన్నాడు దేవేంద్రుడు. ఈమాట బల్లెంపెట్టి పొడిచినట్టయింది గరుత్మంతుడికి

"'తమ్ముడూ, నాబలమంటే ఏమిటో తెలీక నీచంగా మాట్లాడుతున్నావు. అదితి సంతానమైన ఈ దేవతాలోకమంతటినీ నాచిన్న ఈకముక్కతో ఎత్తిపారేస్తాను. తెలుసా! నన్ను చులకనగా చూస్తున్నావో!' అని గుడ్లింతచేసి నిప్పులు కురుస్తూ హుంకరించాడు. ఈవైఖరంతా చూస్తే చివ్వుమంది విష్ణుమూర్తికి. వెలికిగా చిన్న మందహాసం చేశాడు. 'అత వాడివానువ్వు! నాఆసరాతో నిన్ను నడుపుతూవుంటే ఇంతగర్వం ఎప్పుడు బలిసిందీ అంటా! తులువా!' అంటూ తన ముంజేతిని గరుత్మంతుడి వీపుమీద ఇట్టేమోపాడు. దాంతో రెక్కలుకొట్టుకుంటూ, చుంచువెళ్లబెట్టి, విలవిలా తన్నుకుని కుయ్యో మొర్రో మన్నాడు అంతగరుత్మంతుడూను. అదిచూసి జాలికలిగింది విష్ణుమూర్తికి. 'భయపడకు, అని అభయహస్తం చూపి రెక్కలుదువ్వి లేవనెత్తాడు. ఇకముందెప్పుడూ ఇలాంటి వెర్రివేషాలు

వేయకు. బుద్ధికలిగి మసులు, వెళ్లు' అన్నాడు 'మహాప్రసాదం' అని వచ్చినదారినే వెళ్ళిపోయాడు గర్వభంగమైన గరుత్మంతుడు అంచేత గర్వమెంతమాత్రంపనికిరాదు. ఇదంతా నారదులవారికి బాగా తెలుసు మాతలికన్యవివాహానికి స్వయంగా వెళ్ళారీయన. అంతేకాదు మహావిష్ణువు మహాత్మ్యమంతా కరతలామలక మీాయనికి. ఆమహావిష్ణువు అపరావతారమే ఈకృష్ణుడు. ఈయన ప్రాపుగల పాండవులతో వైరంకూడదు. స్నేహంగా వుండడమే క్షేమం నీకు'' అన్నాడు

తరవాత నారదుడూ అందుకున్నాడు ''ఎంతబలవంతులయినా తమకంటే అధికశక్తివంతులముందు నిగ్రహించలేరు కదా'' అంటూ, ''ఎవరికైనా గర్వం సర్వనాశనకారి. వినయమార్గంలా అది కార్యకారి కానేకాదు. చెప్పినమాటవినక, 'ససేమిరా నేను పట్టిన కుందేటికి మూడేకాళ్లు' అని కూచున్నవాడికి కష్టాలు కొనితేనక్కరలేదు. దీనికి గాలవుడే సాక్షిమనకి. అతడి చరిత్ర చెపుతాను, విను.

గాలవుడూ నల్లచెవుల తెల్లగుర్రాలూ

పూర్వం విశ్వామిత్రుడి దగ్గిర గాలవుడనే మునికుమారుడు విద్యాభ్యాసం చేశాడు. విద్యపూర్తిఅయాక 'గురుదక్షిణ ఏమిటి చెల్లించుకోమన్నారు?' అన్నాడు. 'ఏమీా అక్కరలేదు వెళ్ళు'అన్నాడు గురువు. 'అబ్బే, అదేమన్నమాట, గురుదక్షిణ మీారుపుచ్చుకోవాలి' అన్నాడు శిష్యుడు. ఎంత చెప్పినా 'ససేమిరా' వినను అన్నాడు. 'అయితే, అచ్చంగా తెల్లగావుండి, వొక్క చెవిమాత్రం నల్లగా వున్న ఉత్తమజాతి గుర్రాలు ఎనిమిదివందలు తెచ్చి గురుదక్షిణగా సమర్పించు' అన్నాడు విశ్వామిత్రుడు. 'సరే' అని బైలుదేరాడు గాలవుడు. నల్లచెవితెల్లగుర్రాలు ఎక్కడ దొరుకుతాయి? దేశదేశాలు తిరిగాడు. పల్లెపల్లెలు గాలించాడు. ఎక్కడా లభించలేదు. విచారంతో నిద్రాహారాలు మానేశాడు తుదకి ప్రాణహత్య చేసుకుంటా

నని నిశ్చయించి అదేపనిగా తిరగడం ప్రారంభించాడు. ఇలా తిరగ్గా తిరగ్గా ఒకచోట తన బాల్యసఖుడయిన గరుత్మంతుడు కనిపించాడు. ''ఏమిటిలా తిరుగుతున్నావు?'' అన్నాడు. దీనంగా వృత్తాంతమంతా వినిపించాడు గాలవుడు. విని జాలిపడ్డాడు గరుత్మంతుడు. 'అయోధ్యే నేస్తం, దేవతలుగాని ఇలాంటివి సాధించడం కష్టం. ఐనా, ప్రయత్నిద్దాం. దిక్కులన్నిటిలో తూర్పుదిక్కు దేవేంద్రుడిది. ఎందరో దేవతలు ఈ దిక్కే నివసిస్తారు. ఇటువెళ్ళి చూద్దాంపద' అని చెప్పి గాలవుణ్ణి తన మెడమీద కూచోబెట్టుకుని గగనమార్గంగుండా తూర్పుదిక్కు బయల్దేరాడు. ఇలా బయల్దేరి సముద్రం మీంచి వెళుతూ వున్నాడు. అతడి సర్వావయవాలూ వశం తప్పినట్లయాయి అంగుళం మేరయినా ముందుకు పోలేక కిందికి వాంగిపోయాడు. ఎలాగో వోపర్వతశిఖరంమీద గాలవుణ్ణి దించాడు. ఇంతలో శాండిలి అనే ముని పూర్వంపెట్టిన శాపంవల్ల రెండురెక్కలూ తెగి పడిపోయాయి గరుత్మంతుడికి. ఐతే, ఆ ముని అనుగ్రహం వల్లనే వెంటనే మళ్ళీ కొత్తరెక్కలు మొలిచాయి. దుఃఖమూ ఆవెంటనే సంతోషమూ రెండూ అనుభవించాడు గరుత్మంతుడు. దాంతో మరిముందుకు వెళ్ళడం కట్టిపెట్టి గాలవుణ్ణి వెనక్కి తీసుకువచ్చేశాడు.

ఇలా వచ్చి ప్రతిష్ఠానపురం రాజయిన యయాతి తన స్నేహితుడు కావడంచేత అతడి దగ్గిరికి గాలవుణ్ణి తీసుకువెళ్ళాడు. గాలవుడి చరిత్రంతా విని తనదగ్గిర అలాంటి గుర్రాలు లేవన్నాడు యయాతి. 'ఐనా, నేనొక సహాయం చేస్తాను. నా కుమార్తె మాధవి త్రిలోకసుందరి. ఆమెని మీకిస్తాను. తీసుకువెళ్ళండి. ఈమెనిస్తే ఏ రాజయినా మీ కా గుర్రాలివ్వవచ్చు' అన్నాడు.

''మాధవిని పుచ్చుకుని అక్కడినుండి బైల్దేరారు గాలవ గరుత్మంతులు తిరిగి తిరిగి అయోధ్యాపట్టణం వచ్చి ఇక్ష్వాకువంశస్థు

డయిన హార్యశ్వమహారాజు దగ్గిరికి వెళ్ళారు. తన దగ్గిర అలాంటి గుర్రాలు రెండువందలు మాత్రమే వున్నాయి అన్నాడాయన. ఏమిటి సాధనం? అప్పుడు మాధవి వొక ఉపాయం చెప్పింది. 'కొడుకుల్ని కనీకూడా నేను కన్నెగా వుండేటట్టు ఒక మహానుభావుడు వర మిచ్చాడు నాకు. చిరకన్యాత్వం నాది. ఈరాజుకి సంతానంలేదు. ఒక షరతుమీద నన్ను ఇతడికిచ్చి రెండువందల గుర్రాలూ పుచ్చుకోండి. పుత్రుడు కలిగేవరకూ భార్యగా నన్నువుంచుకుని తరవాత మీకు ఇచ్చేసే షరతు పెట్టండి' అంది. గాలవ గరుత్మంతులు 'ఇది బాగానే వుంది' అని హార్యశ్వుడికి తెలియజేశారు. సంతానం లేనివాడు కావడంచేత ఈ పద్ధతికి సమ్మతించాడు హార్యశ్వుడు. గుర్రాలిచ్చి మాధవిని భార్యగా స్వీకరించాడు. సకాలంలో వసుమనస్సుడు అనే కుమారుణ్ణి కన్నది మాధవి. దాంతో షరతు ప్రకారం ఆమెని గాలవుడికి అప్పగించాడు హార్యశ్వుడు. 'ఇలాగే మరికొన్ని చోట్లకూడా తక్కిన గుర్రాలు సంపాదించు' అని చెప్పి వెళ్ళిపోయాడు గరుత్మంతుడు.

''గాలవుడు మాధవిని తీసుకుని కాశీరాజయిన దివోదాసు దగ్గిరికి వెళ్ళాడు. అతడి దగ్గిరా రెండువందలగుర్రాలే వున్నాయి. హార్యశ్వుడితో ఏర్పరిచిన షరతే ఇక్కడా ఏర్పరిచి, మాధవిని ఇచ్చి ఆ రెండువందల గుర్రాలూపుచ్చుకున్నాడు. దివోదాసుడి భార్యగా వుండి ప్రవర్ధనుడు అనే కుమారుణ్ణి కన్నది మాధవి. అక్కడినుండి భోజ నగరంరాజు ఉశీనరుడి దగ్గిరికి వెళ్ళాడు గాలవుడు. ఉశీనరమహారాజు దగ్గిరా రెండువందలగుర్రాలే వున్నాయి. అక్కడా పూర్వంలాగే షరతుపెట్టి మాధవిని ఇచ్చి ఆరెండువందల గుర్రాలూ పుచ్చుకున్నాడు. ఉశీనరుడికి శిబిఅనే కుమారుణ్ణి కన్నది మాధవి. ఇలా మొత్తం ఆరువందలగుర్రాలే అయాయి. ఇంకా రెండువందలు కావాలి. మాధవీ కన్యని వెంటవేసుకుని దేశదేశాలు గాలించాడు గాలవుడు.

కాని ఇంకెక్కడా నల్లచెవి తెల్లగుర్రాలు లభించలేదు ఏమిటి దారి! ఇలా ఎంతోకాలం తిరగ్గాతిరగ్గా మళ్ళీకనిపించాడు గరుత్మంతుడు 'నేస్తం, నువ్వెంత తిరిగినా లాభం లేదుమరి. ఒకవిశేషకారణంవల్ల ఈముగ్గురికీ మాత్రం ఈగుర్రాలు లభించాయి.

'పూర్వం కన్యాకుబ్జం రాజయిన గాధిరాజు కూతుర్ని సత్యవతిని ఋచీకుడు అనేముని వరించి భార్యగా తనకి ఇమ్మని కోరాడు. 'ఒక చెవి నల్లగానూ శరీరమంతా తెల్లగానూ వుండే గుర్రాలువెయ్యిఇస్తే కుమార్తెని ఇచ్చి పెళ్లిచేస్తాను' అన్నాడు గాధిరాజు. 'సరే' అని వెళ్లి వరుణదేవుణ్ణి ప్రార్థించాడు ఋచీకుడు. వరుణుడి అనుగ్రహంవల్ల అశ్వతీర్థంలో నల్లచెవుల తెల్లగుర్రాలు వెయ్యి లభించాయి అవి గాధిరాజుకి ఇచ్చి సత్యవతిని పెళ్ళిచేసుకున్నాడు ఋచీకుడు. తరవాత గాధిరాజు పుండరీకం అనేయజ్ఞం చేసి ఆవెయ్యిగుర్రాలూ బ్రాహ్మలికి దానం చేశాడు వాళ్ళదగ్గిర హర్యశ్వుడూ, దివోదాసుడూ, ఉశీనరుడూ చెరి రెండేసివందలూ కొన్నారు. మిగిలినవి ఎక్కడో పత్తా లేకండా అయిపోయాయి. అంతే. మరెక్కడా లభించవు. నేనో ఉపాయం చెపుతాను విను. ఈ ఆరువందల గుర్రాలు గురువుకి సమర్పించు. పైముగ్గురు రాజులతో పెట్టిన షరతే పెట్టి, ఎలా అయినా ప్రార్థించి మిగిలిన గుర్రాలకోసం మాధవిని ఆయనికి అర్పించు' అన్నాడు. తానుకూడా వెంటవెళ్ళి విశ్వామిత్రుడికి నమస్కరించాడు. విషయమంతా వివరించాడు. 'గాలవుడు బాలుడు. నువ్వు దయాళుడివి. ఇతణ్ణి అనుగ్రహించాలి' అని ప్రార్థించాడు. ఆయన అంగీకరించిన తరవాత గాలవుణ్ణి కౌగిలించుకుని పోయివస్తాను' అని వచ్చేశాడు గరుత్మంతుడు. విశ్వామిత్రుడు మాధవిని భార్యగా చేసుకుని అష్టకుడు అనే కుమారుణ్ణి కన్నాడు. తరవాత షరతు ప్రకారం ఆమెని

గాలవుడికి ఇచ్చివేశాడు. ఇలా నలుగురిదగ్గిరా నలుగురు కొడుకుల్ని కని కన్యాత్వం నష్టపడకుండా తపస్సుకి వెళ్ళిపోయింది మాధవి.

"చెప్పినమాట వినకపోడంచేత ఇన్ని అవస్థలు పడ్డాడు గాలవుడు. కాబట్టి హఠించి కూచోడం తగదు. దురభిమానం దుర్దశకి దారితీస్తుంది. యయాతి మహారాజు దురభిమానం వల్లనే స్వర్గ భ్రష్టుడయాడు ఇపుడు చెప్పిన మాధవి కుమాళ్ళు, వసుమనస్సుడూ మొదలయిన అతని మనవలు నలుగురూ లేకపోతే ఊర్ధ్వలోకాలే మరివుండక పోయేవతడికి. దుర్యోధనా, దురభిమానమూ, మూర్ఖ ప్పట్టూ, దుర్మార్గులికేగాని నీవంటి రాజరాజుకి రాణించవు. మేము ఇంతమందిమి చెపుతున్నాము. సంధివల్ల అన్నీ చక్కబడతాయి. కృష్ణుడు చెప్పిన ప్రకారం చేసి కౌరవకులాన్ని కాపాడు" అన్నాడు.

ఈవిధంగా ముగ్గురు మునులూ చేసిన హితోపదేశానికి మాటి ముడుచుకున్నాడు దుర్యోధనుడు. కర్ణుడి మొహం చూసి, చెయ్యి చరిచి "పిచ్చెత్తినట్టుంది వీళ్ళకి" అని గొణుగుకుంటూ మునుల దిక్కు తిరిగాడు. "అయ్యా, ఎలాజరగాలని నాజాతకంలో వుందో అలా జరక్క మానదు. ఆపాటిదానికి మీరంతా ఎందుకింత శ్రమపడ తారు? మీమాట వొకటీ నచ్చడంలేదు నాకు" అన్నాడు.

కుమారుడిలా అనడంతోనే చటుక్కున అందుకున్నాడు ధృతరాష్ట్రుడు. "మీఉపదేశం శిరసావహించి ఆచరించేపుణ్యానికి నోచుకోలేదు నేను. విషయం నాచేతిలో లేదు ఏంచెయ్యనూ! నోరాడకండావుంది" అన్నాడు. కృష్ణుడి దిక్కుతిరిగి, "మహాత్మా, ఇహాపరసాధనమైన విధానం సెలవిచ్చావు నువ్వు. అశక్తుణ్ణి. చూస్తూనే వున్నావు. నీఆదేశం అనుసరించే తాహతు నాలోలేదు. క్షమించు. కొడుకా మంచబుద్ధి, నువ్వా కావనడానికి వీల్లేని చుట్టాలివి. ఏం చేసేను!

మహానుభావుడివి, దయార్ద్రచిత్తుడివి. నువ్వే నచ్చచెప్పి ఎలా అయినా వీణ్ణి దారికి తీసుకు రావాలి'' అన్నాడు.

ధృతరాష్ట్రు డిలా అనగానే దుర్యోధనుడి దిక్కు తిరిగాడు కృష్ణుడు. ''దుర్యోధనా, పవిత్రమయిన భరతవంశంలో పుట్టావు సర్వ గుణ సంపన్నుడివి నీఅంతవాడికి దురాగ్రహం కూడదు. ఎవరో నీచులు తప్ప నీవంటి ప్రభువు ఇలాంటి దుర్నయానికి పూనుకోవచ్చా! కుమాళ్ళూ, తమ్ముళ్ళూ, స్నేహితులూ, చెదుదారిని పడిపోకండా చూడవలిసిన వాడివి నువ్వు. పెద్దలూ, బంధువులూ, కన్నతండ్రీ సంతో పించే పని చెయ్యి అల్పబుద్ధుల దుర్బుద్ధులికి చెవివొగ్గకు. దానివల్ల హానీ ఆపదా తప్ప ఇంకో లాభం లేదు. పాండవులా బుద్ధిమంతులు, ప్రతాపవంతులు వాళ్ళతో కలిసి జీవించడానికే బాహ్లికుడూ, భీష్ముడూ, మీఅయ్యా అభిలషిస్తున్నారు. వాళ్ళమాట కాదనకు. పేరాసవల్ల రాజ్యాలు బలపడవు. ఆకలని ముసిడిపళ్ళు తింటే బలు పెక్కడు. కర్ణ, శకుని, దుశ్శాసనుల మంత్రాలోచనలతో కార్యాలు గట్టెక్కవు. తోబుట్టువులైన భీమార్జునుల బాహుబలం పనికి రాలేదా నీకు! పనికిమాలిన పరాయివాళ్ళని నమ్ముకుని వెంటబడుతున్నావు. నువ్వే పాండవుల్ని బాధిస్తున్నావు నువ్వెన్ని బాధలు పెట్టినా పల్లెత్తు మాటాడరు నిన్నువాళ్ళు. సత్యం విస్మరించరు. ధర్మం మరిచి పోరు. ఇలాంటి బంధుత్వం రుచించకపోడ మేమిటి నీకు! వాళ్ళూ మీరూ కలిసి వుంటే సమస్త రాజలోకమూ మీకనుసన్నలలో మసులు కుంటుంది, సేవకావృత్తి చేస్తుంది. అష్టయిశ్వర్యాలతో భరతవంశం నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఎంతముచ్చటగా వుంటుంది!

''నీలో ఈర్ష్యాభావం రెచ్చగొట్టి, కార్యం చెడగొడుతూన్న నీసలహాదార్లు నిజంగా యుద్ధమేవస్తే నిభాయించలేరు, నమ్మ. వీళ్ళే కాదు, సురాసురులు యావన్మందీ ఏ మయినా పాండవులకు ఎదురు పడ లే

రారు. ఇక్కడవున్న రాజులందరూ భీముడి ఒక్కపిడికిలికి సరిపోరు. అతగాడు తేరిచూస్తే కాలయముడన్నా గడగడ లాడతాడు. అంచేత వాళ్ళతో కయ్యానికి కాలుదువ్వకు. సర్వశుభంగా సంధిచేసుకో. పోనీ ఒకమాట చెపుతాను బాగాఆలోచించు. మీపదకొండు అక్షౌణీల రాణువలోనూ అర్జునుణ్ణి ఎదిరించగల మొనగాడంటూ ఒక్కడన్నా వున్నాడేమో చూపించు. ఉంటే యుద్ధానికి దిగవలిసిందే. కాదనను. అంతేగాని వూరికే జనక్షయం దేనికి? అవాళ అంతమంది ఆవుల్ని తోలుకు వస్తూంటే వచ్చింది వొక్క అర్జునుడేకదా! ఏంజరిగిందో అందరికీ తెలుసుకదా! వెనకాముందూ లేనప్పుడే అర్జునుడి ప్రతాప మలాంటిది. విన్నావూ, ఇక నేనుకూడా పక్కనేవుంటే చెప్పేదేముంది! వద్దు, నువ్వు గెలుస్తావని కల్లోసహా అనుకోవద్దు. పాపం, నిష్కారణంగా నీ వొక్కడికోసమని కొడుకులూ, తమ్ములూ, బంధువులూ యావన్మందీ సర్వనాశనమైపోతారు మధ్యని. రాజన్నవాడికి కులపాంసను డన్న వాడు రావడం ఘోరం.

''రాజ్యభారమంతా మీతండ్రి చేతుల్లోపెట్టు. నువ్వు యువరాజ్యపట్టం కట్టుకో. మీతండ్రి మనస్సుకినచ్చినట్టు సేవచేస్తూ సుఖంగా వుండడమే సామ్రాజ్య విభూతిగా భావించుకుంటారు పాండవులు. వెర్రివాడివి. పాండవులు నీతో స్నేహంగా వుంటామంటే వద్దంటున్నావు. సిరివస్తే మోకాలు వొడ్డినట్టుంది నీసంగతి'' అన్నాడు.

భీష్ముడు భక్తవత్సలుడైన కృష్ణుడు మనదగ్గిరికి వచ్చాడు. మనవంశం పావనమైంది. ఆయనవచ్చి చెప్పడమూ, మన మాయన మాట వినకపోడమూ మన అధఃపతనానికి కారణ మవుతుంది. ఈయనా, మీఅయ్యా చెప్పినమాటలు మన్నించు. వాళ్ళు చెప్పినట్టు చెయ్యి. ధృతరాష్ట్రుడి కంఠంలో ప్రాణముంటూండగా, ఆయున కష్టపెట్టేటే బంధు నాశనం, రాజ్యశ్రీ నాశనం, యశోనాశనం ఎందుకు తల

పెడతావు! కృష్ణార్జునులతో విరోధం మనబంధులోకానికే కాదు, సమస్త లోకానికీ కంటగింపుగా నేవుంది బతికిన రెన్నాళ్ళూ ఇహానికీ, పరానికీ భంగం లేకండా ఐకమత్యంతో బతకడం మంచిది.

ద్రోణుడు పితృ, పితామహ, గురువులం ఐన మేము నీ క్షేమం కోరిచెపుతున్నాం. మాహితోపదేశం మన్నించు. దుష్టుల మంత్రాంగానికి తలవ్వొపకు. బంధువుల్ని కూడగట్టుకుని సుఖపడు. కృష్ణుడు చెప్పింది రాజమార్గం. అలా నడచుకుంటే ఆయువ్వూ, ఐశ్వర్యమూ అన్నీ అలవడతాయి. నువ్వు కలకాలం చల్లగావుంటేనే మాకు కళ్ళ వేడుక. విననంటావా, నీఇష్టం. ఇంతకంటె నిన్ను నిందుకోలువులో ఏమనగలం గనక!

ధృతరాష్ట్రుడు బాబూ, కృపామయుడు కృష్ణమూర్తి. ఈయన్ని ఆశ్రయించు. అజాతశత్రుడు, పుణ్యమూర్తి మీ అన్న ధర్మరాజు. వెళ్ళు, అతణ్ణి తీసుకురా. దాంతో మన సర్వకార్యాలూ చక్కబడతాయి. కృష్ణుణ్ణి మనం నిరాకరించామా, పైపెచ్చు మనకు విపత్తు తప్పదు.

భీష్మద్రోణులు అగ్గిదేవుడికి గాలిదేవుడు తోడైనట్టు అర్జున గాండీవానికి కృష్ణసారథ్యం జతకూడకముందే మేలుకో. కురువంశ నాశనం కాకండా సంధికి సమ్మతించు.

ధర్మరాజు పాదాలమీద నువ్వుపడి, అతడు నిన్నెత్తిగుచ్చి కౌగిలించుకునీ—భీముడూ నువ్వూ నవ్వుతూ గుండెకు గుండె తగిలించుకుని గాఢాలింగనం చేసుకునీ — అర్జునుడూ, నకులసహదేవులూ నీకు నమస్కరించీ, నువ్వు చేయిదీసి ఆలింగనం చేసుకునీ—ఇలా వాళ్ళూ మీరూ అవినాభావంతో కలిసిమెలిసి, కులమంతా తామరతంపరై చుట్టాలతో, స్నేహితులతో కలకలలాడుతూవుంటే చూడడానికి ఎంత సొంపుగా వుంటుంది! యుద్ధానికి వచ్చిన ఉభయపక్షాల రాజులూ కులాసాగా వాళ్ళవాళ్ళ దేశాలకు తిరిగి వెళితే, వాళ్ళప్రజలు ఎన్నెన్ని ఉత్సవాలు చేస్తారో! దుర్యోధనా, మీ ఉభయులూ మీమీరాజ్య

భాగాలు మీరు పంచుకుని సుఖ గా వుంటే ప్రపంచం పరమానందం పొందుతుంది. నీమీద ఆశీస్సులు వర్షిస్తుంది. ఏమంటావు?

సూదిమొన మోపినంత నేలకూడా ఇవ్వను

ఇంత సేపూ ఇన్నీ తలవొంచుకు విన్నాడు దుర్యోధనుడు చివరికి లేచి కృష్ణుడి తట్టు తిరిగాడు. మెల్లి మెల్లి గా ఇలా ఆరంభించాడు.

''మాఅయ్యా, మాతాతా గురువూ ఎపుడూ నన్నుతిడుతూనే వుంటారు. వాళ్ళతో కలిసి నువ్వూ తిట్లకే అంకింతుకున్నావు అంతే కాని అసలుసంగతి విచారించావు కావు 'మాఆవిణ్ణి మానభంగం చేశారు, మేం అడవులపాలయిపోయాం' అంటూ గోలచేస్తూనే, మొనగాళ్ళయి చంపడానికీ, చెరపడానికీ నిష్కారణంగా మామీదికి కత్తి కడుతున్నారు పాండవులు. నిజం విచారిస్తే చింతాకంత తప్పులేదు నాది. ధర్మరాజు జూదంనిషాలోపడి శకునికి రాజ్యం వొగిపోయాడు. ఓసారి పోనీ అని తిరిగి ఇచ్చేశాం. మొండికత్తి మళ్ళీ వొడ్డాడు. పాచికల్లో పయిచేయి కావడంచేత శకునే గెల్చుకున్నాడు ఏదిఎలా అయినా ధర్మరాజు తెలిసి తెలిసి చేసుకున్న స్వయంకృతాపరాధమే అది. అంతే. దీనిక నేనెలా బాధ్యుణ్ణయాను? మామగార్నీ, వియ్యంకుణ్ణీ వెనక వేసుకుని వాళ్ళే కయ్యానికి కాలుదువ్వుతున్నారు. కాని, మేమింత ఘోరానికి పూనుకున్నామా మరి! యుద్ధంలో చచ్చి వీరస్వర్గమన్నా చూరగొంటాం కాని చచ్చుదద్దమ్మల్లాగ, దేవేంద్రుడికయినా సరే చేతులు జోడించేరకం కాదుమాది.

''చిన్నతనంలో మంచీ చెడ్డా తెలీక ఏదో జరిగిపోయిందంటే వూరుకున్నాను. ఇప్పుడు మళ్ళీ నన్ను లెక్కచెయ్యకండా మాతండ్రీ తాతా సంధిపేరుచెప్పి రాజ్యంలో ఎవ్వరికైనా వంతు ధారపోస్తే చేతులుకట్టుకుని కూచోవాలా నేను! మొదట రుచిమరిగి ఇప్పుడూ మళ్ళీ రాజ్యం రాజ్యం అని ఎగబడుతున్నారు వాళ్ళు. అంతమాత్రానికి

రాజ్యంలో సగం వొదులుకుంటానా నేను? అనాటి ఆటలూ, దోచుకోడాలూ అబ్బే, మళ్ళీసాగడం వట్టిమాట.

"మేమూ వాళ్ళూ పంచుకోవడమన్నది కల్లోకూడా జరగదు. చిన్న సూది మొన మోపినంత నేలకూడా ఇవ్వను నేను. ఎవరైనా సరే, యుద్ధంలో గెల్చుకుని రాజ్యమేలవలిసిందే. నాకు పదిసార్లు చెప్ప నక్కర లేదు. మమ్మాటికీ ఇదే నానిశ్చయం" అన్నాడు స్పష్టంగా.

దుర్యోధనుడి ఈపిడివాదం చురచురమంది కృష్ణుడికి. కోపంతో మొలకెత్తిన చిరునవ్వు ఒదో అందంగావుంది ఆయన మొహానికి, తెల్లపద్మాలవంటి నేత్రాలు ఎర్రకలువలవలె కెంపుదేరుకున్నాయి.

"మంచిది, నువ్వన్నట్టు యుద్ధంలో పడి వీరస్వర్గమే చూరగొందుగాని. ఎంతో ఆలస్యంలేదు. నువ్వూ, నీజట్టుదార్లూ మొనగాళ్ళయి నిలబడండి. ఇదిగో రేపే వస్తుంది యుద్ధం. విచారమక్కరలేదు" అన్నాడతడు. ఇంకా ఇలా అన్నాడు.

"నిజమే. నీవల్ల తప్పే లేదంటున్నావు. తప్పు వొకనాడు చేసి వొకనాడు చెయ్యలేదా నువు! నువ్వుపుట్టిన మర్నాటినుండీ ద్రోహాలే చేశావు పాండవులికి. విషం పెట్టావు. పాములతో కరిపించావు. కట్ట కట్టి నీళ్ళలో తోశావు. లక్కఇల్లు కాల్పించావు. చంపాలని ఎన్నో ఎత్తులు వేశావు. ధర్మం రక్షించింది వాళ్ళని. వాళ్ళరాచసిరి కన్ను కుట్టింది నీకు. నీగుండెలమీద జెర్రులు పాకాయి. తుదకి మాయ జూదం వొకటి కల్పించావు. ఇంతచేటూ దానివల్లనే పుట్టుకొచ్చింది. అన్నదమ్ములు జూదమాడారే కట్టూ, భార్యల సిగలుపట్టి సభలకి ఈడ్చుకువస్తారా! బట్టలూ విప్పి మానభంగం చేస్తారా! ఈభూగోళం మీద ఎక్కడున్నా వుంటారా ఇలాంటివాళ్ళు నువ్వొక్కడివితప్ప! అప్పుడు సభలో నువ్వూ కర్ణుడూ అన్నమాటలు నోటపట్టవలసినవేనా! కులకాంతని, పతివ్రతని చేసిన మానభంగం అవాళ కళ్లారా చూసిన

ఈ జనంముందే ఇవాళ 'నా వల్ల తప్పేలేదు' అనడం నీకే చెల్లింది. మొగుణ్ణి కొట్టి మొగశాల ఎక్కినట్టు, దండెత్తి వస్తున్నారని పైపెచ్చు తప్పంతా పాండవుల మీదే మోపుతున్నావు. గురువూ, తాతా' తండ్రీ చెప్పేమాటలన్నా చెవి కెక్కడంలేదు. నీకు రుచించదని తెలిసి తెలిసీ కూడా శాంతి మార్గం నీకూ పాండవులికీ క్షేమదాయకం అని ఇంతవరకూ చెప్పాను."

ఇలా చెడామడా కృష్ణుడు చెణకడం దుస్సహమనిపించింది దుశ్శాసనుడికి. దుర్యోధనుణ్ణి తట్టి "అన్నయ్యా! అయ్యా, భీష్మ ద్రోణులూ నీకోసం ఆప్తులై ఆదుకునేస్థితిలో లేరు. తమమాట ప్రకారం సంధికి సమ్మతించకపోతే కృష్ణుడికి అప్పగిస్తారు నిన్ను. ఇందులో పిసరంత సందేహంలేదు. ఇంక వో క్షణంకూడా ఇక్కడవుండడం క్షేమం కాదు నీకు" అని వూదాడు.

దుశ్శాసనుడు వూదడమే తడువు దుమదుమ లాడుతూ లేచి పోయాడు దుర్యోధనుడు. బాహ్లీకాది వృద్ధుల్నీ, తండ్రినీ, కృష్ణుణ్ణీ-ఎవరినీ లక్ష్యపెట్టకండా రాజసంతో సభవిడిచి వెళ్ళిపోయాడు. అతడి వెంట కర్ణుడూ, దుశ్శాసనాది తమ్ముళ్ళూ, శకునీ, వాళ్ళ అనుయాయులైన రాజులూ వెళ్ళిపోయారు. వెళ్ళి అల్లంతదూరంలో అందరూ గుంపు కట్టి కోపంతో రొజుకుంటూ నిలబడ్డారు. దాంతో కొలువంతా వొక్కసారి సంచలించిపోయింది.

ఇదంతాచూసి మతిపోయినట్టయింది భీష్ముడికి. "మహారాజునని మదమెక్కి మతిపోయింది వీడికి. లోభమూ, మోహమూ, మదమూ, మాత్సర్యమూ పూర్తిగా నెత్తికెక్కాయి. వృధాభిమానంతో అసందర్భంగా లేచిపోతున్నాడు. ఈరాజులూ ఏమను కుంటున్నారో, వీడితోనే లేచిపోయారు! వీళ్ళలో కొందరు మరీపెద్ద మనుషులాయె. ఇపుడేం చేయాలి?" అంటూ కృష్ణుణ్ణి చూసి "వీళ్ళందరికీ అంతకాలం దాపురించింది" అన్నాడు.

ఉన్న పెద్దల నొకసారి తేరిపారచూశాడు కృష్ణుడు. "ఇంత గర్వపోతా ఈ దుర్యోధనుడు!" అన్నాడు. "ఈ పెద్దమనుష్యులం దరికీ తలవంపులని అయినా తట్టలేదు ఈ తగుమనిషికి! భేదభావమిక పోనే పోదా ఈజాతికి! దీనికి ప్రతీకారమంటూ లేనే లేదామరి! పవిత్ర వంత మయిన భరతవంశం నిష్కళంకంగా వుంచడానికి దురభిమానిని వొకణ్ణి పరిత్యజించకూడదా! కంసుడూ ఇలాగే తండ్రిమీదికి కత్తి కట్టాడు. ధర్మవిధ్వంసం చేశాడు. కులంవాళ్ళంతా నాదగ్గిర మొత్తు కున్నారు. శరీరంనుండి కుళ్ళినమాంసం కోసిపారేసినట్టు వాణ్ణిసంహ రించి ఉగ్రసేనుణ్ణి కులపెద్దగా పట్టంకట్టాను. అలాగే మీరెందుకు చెయ్యరని అడుగుతున్నాను. ఆదొక్కటే సరైన మందవుతుం ది. కులానికా గొప్పవస్తుంది. కౌరవులికీ పాండవులికీ ఐకమత్యమూ నెల కొంటుంది ఏమంటారు? ఆలోచన కేముంది ఇందులో?" అంటూ ముదలకించి అడిగాడు.

ఇంకేముంది? పిడుగుపడ్డట్టయింది ధృతరాష్ట్రుడికి. అదిరిపడి విదు రుణ్ణి పిలిచాడు "వెళ్ళు, నిలుచున్న పాటుని గాంధారిని పిలుచు కురా. బుద్ధిమంతురాలు, బెదిరించి బుద్ధి చెపుతుంది కొడుక్కి" అన్నాడు.

వెంటనే గాంధారిని తీసుకువచ్చాడు విదురుడు "తల బిరు సెక్కి సభనుండి లేచిపోయాడు నీకుమారరత్నం. నువ్వన్నా కొంచెం చీవాట్లు వేసి వాణ్ణి దారికి తీసుకువస్తే బతుకుతాం. మహానుభావుడు శ్రీకృష్ణుడి మాట వినుకున్నామన్న గౌరవం దక్కుతుంది మనకి" అన్నాడు ఆమెతో ధృతరాష్ట్రుడు.

"కొడుకు గుణాలమాట అని తెలిసి తెలిసి వాడి వెనకే ఎందుకు పరిగెత్తాలి నువ్వు! వంతే అన్నమాటేమిటి, రాజ్యమంతా నువ్వు పాండవుల కిచ్చేసినా నిన్ను అడిగేవాళ్ళెవరంటాను!" అంది

గాంధారి. ఉభయులూ కలిసి దుర్యోధనుణ్ణి పిలుచుకు రమ్మని విదురుణ్ణి పంపారు. విదురుడు విశేషించి చెప్పిన మీదట, తనతో లేచిపోయిన వాళ్ళందరినీ అక్కడే వుంచి, వొక్కడే మొహం జేవురించుకుంటూ వచ్చి కూచున్నాడు దుర్యోధనుడు. అతడి వైఖరి చూసి తల్లికి వొళ్ళు మండుకు వచ్చింది. తనశాయశక్తులా ధర్మాలూ నీతులూ నూరిపోసిందామె. చుట్టరికం చూడమంది. బతుకు తెరువు విచారించమంది. స్వబలమూ, వచ్చిన సహాయమూ కొరగానివని నిరూపించింది. బంధువుల అయిష్టం వ్యక్తపరిచింది పాండవుల బలపరాక్రమాలు విప్పిచెప్పింది. బుజ్జగించింది. గదమాయించింది. బాబూ అంది. ఎన్ని చెప్పినా ఆమె ప్రయత్నమంతా బూడిదపోసిన పన్నీరైంది. ఛర్రున మళ్ళీ లేచిపోయాడు దుర్యోధనుడు. చూట్లాడకండా బయటికి వెళ్ళిపోయాడు. తన గుంపుతో చేరి కుంభకోణం మొదలెట్టాడు.

"కృష్ణుడి ఎత్తు సాగనివ్వకూడదు. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ వళ్ళో వేసుకుని మనపని పట్టించాలని చూస్తున్నాడు తాను కంసుణ్ణి కడతేర్చిన కథ సూచిస్తూ వుసికొలుపుతున్నాడు. ఇంకా ఆలోచించడం దేనికి! తనకంటె ముందు మనమే అతణ్ణి పట్టుకుందాం తీసిన అడుగు వెనక్కి వేయకూడదు మనం. ఇతణ్ణికట్టి ఖైదులో వేస్తేచాలు, రోగం కుదురుతుంది పాండవులికి. అంతకీ దండెత్తి వచ్చారా, సునాయాసంగా కాజెయ్యవచ్చు వాళ్ళని. కోరలుతీసిన పాములు ఏంజేస్తాయి?" అని ప్రస్తావించాడు. కర్ణుడూ శకుని దీనిని బలపరిచారు. దుశ్శాసనుడూ భేష్ అన్నాడు. ఇలా ఈదుష్టచతుష్టయమూ, తక్కిన వెనకపాటగాళ్ళూ అందరూ ఏకగ్రీవంగా తీర్మానించుకున్నారు. ఇక కృష్ణుడి మీద అమాంతంగా చెయిచేసుకోడమే తరవాయి.

ముందే గూఢచారుల్ని పెట్టి ఈ తతంగమంతా ఒక కంటితో కనిపెడుతూనే వున్నాడు సాత్యకి. టుంచిపోకండా జల్దుపన్నాడు.

కృతవర్మని గోశాడు. "అన్నయ్య మీదికి దౌర్జన్యానికి నెట్టుకున్నారీ మొనగాళ్లు. మన బలాన్ని వేసుకుని వాకిట్లో నువ్వు నిలబడు. లోపల నేను సర్దుకుంటాను" అని అతణ్ణి బైటికిపంపి బందోబస్తు చేశాడు. వెంటనేవచ్చి కృష్ణుడితో చెప్పాడు. అతడి అనుమతితో ధృతరాష్ట్ర, బాహ్లిక, భీష్మ, విదురులతో ఇలా అన్నాడు "ఇదిగో దుర్యోధనాదులు అశక్తదుర్జనత్వానికి నెట్టుకున్నారు. ఇది వాళ్ళ తలకుమించిన పని అని తెలియడంలేదు వాళ్ళకి. కృష్ణుణ్ణి కట్టబోడమంటే అగ్గిని బట్టలో మూటకట్టడమన్నమాట. విశ్వవిజయి శ్రీకృష్ణుడు. ఏమనుకుంటున్నారో వీళ్లు! ఇదంతా వ్యర్థకే పోతుందా ఇపుడు!"

భూమి గిర్రున తిరిగినట్లయింది విదురుడికి "మహారాజా, అంతికాలం దాపురించింది నీకొడుకులికి. సమిటీ బేహద్దీ! అగణ్యపరాక్రమవంతుడయిన కృష్ణుణ్ణి కేవలం మానవమాత్రుడనుకుంటున్నారు. పట్టడం వరకూ ఎందుకు, అతణ్ణి అంటితేనే చాలు, మంటలో మిడతలవలె మలమల మాడిపోతారు. ఏంచారి?" అన్నాడు.

కంగారుపడిపోయాడు వృద్ధమహారాజు. విదురుణ్ణి పరిగెత్తమన్నాడు. "ఆదుర్మార్గుణ్ణీ, తక్కినమష్టులందరిని వెంటనే ప్రవేశపెట్టు" అని కేకవేశాడు. అందనీ పిలుచుకు వచ్చాడు విదురుడు. దుర్యోధనుణ్ణి చెడామడా తిట్టడం లంకించుకున్నాడు ధృతరాష్ట్రుడు.

"మీరేమిటో, మీతాహతేమిటో తెలియకండా నువ్వూ ఈనీచులూ ఎంతపనికి తెగిస్తున్నారు! ఓరి దుర్మార్గులు! గాలిని పట్టుకోడం! కొండని కదల్చడం! కార్చిచ్చుని కౌగిలించడం! ఏం సాహసం! నాశనం తప్పదు మీకు. ఏంచేసేది నేనం!" అని మొత్తుకున్నాడు.

"బాల్యం నుంచీ ఈయన ఎప్పుడెప్పుడు ఎవరెవర్ని ఏమేమి చేసిందీ వింటూనే వున్నావు అమానుషవిగ్రహుడు శ్రీకృష్ణుడు. తెలిసి తెలిసీ వృథాగా ఎందుకు చెడతావు" అన్నాడు విదురుడు.

## విశ్వరూపం

తన కళ్ళెదుట నిలబడ్డ దుర్యోధనుణ్ణి నఖశిఖపర్యంతమూ తేరి పార చూశాడు కృష్ణుడు. "ఏం. నన్ను ఒంటరిగాడనుకుని పట్టు కుందా మనుకుంటున్నావు కదూ!' అంటూ ఒక మందహాసం చేశాడు. చూస్తూవుండగనే అతడి ఫాలప్రదేశమునుంచి బ్రహ్మ, వక్షస్థలంనుంచి మహేశ్వరుడూ, మొహంనుంచి అగ్నిహోత్రుడూ, పక్కలనుంచి ఇంద్రుడూ, యముడూ, వరుణుడూ, కుబేరుడూ, సూర్యుడూ, వాయువూ, అశ్వనీదేవతలూ ఉద్భవించారు. రెండు భుజాలనుంచి నాగలి భుజంమీద వేసుకుని బలరాముడూ, గాండీవం చేతపట్టుకుని అర్జునుడూ, వీపునుంచి నాయుధ హస్తాలతో ధర్మ రాజూ, భీమ, నకుల. సహదేవులూ ప్రభవించారు. తొడలనుంచి వివిధశస్త్రాస్త్రాలతో యదు. వృష్ణి, భోజ, అంధక మహావీరులు పుట్టుకు వచ్చారు, కృష్ణుడు నవ్వుతూనే వున్నాడు. శంఖం, చక్రం, గదా' ఖడ్గం, శక్తీ, శార్ జ్గం మొదలయిన ఆయుధాలతో వేలాది చేతులు మొలుచుకు వచ్చాయి. చెవుల్లోంచి, కళ్లల్లోంచి, ముకుపుటాల్లోంచి పొగలతో మంటలు లేచుకు వచ్చాయి. రోమకూపాల్లోంచి సూర్య కిరణాలవంటి తీక్ష్ణప్రభలు ప్రకాశించడం మొదలు పెట్టాయి. ఇలా శక్యంకాని శ్రీకృష్ణుడి తేజోరూపం చూడలేక సభాజనం యావత్తూ ఆశ్చర్యంతో, భయంతో కొయ్యబొమ్మల్లా నిశ్చేష్టులై పోయారు. కళ్ళు మూసుకున్నారు. నారదాది మహామునులకూ, భీష్మద్రోణులకూ విదుర సంజయులకూ మాత్రం దయా హృదయంతో దివ్యదృష్టి ప్రసాదించాడు కృష్ణుడు. మహానందలో వోలలాడారు వారంతా.

దేవదుందుభులు మోగాయి. కల్పవృక్షం ధారాపాయంగా పూలవాన కురిసింది. సిద్ధులూ, సాధ్యులూ, విద్యాధరులూ భక్తి పరవశులై మిన్నుపగిలేటట్లు జయధ్వానాలు చేశారు. ఈ మహా సంకులమంతా విని ఇది శ్రీకృష్ణుడి విశ్వరూప విజృంభణమని ఊహించాడు ప్రజ్ఞాచక్షుడయిన ధృతరాష్ట్రుడు. అంజలిబంధం నడినెత్తిని జోడించాడు.

"ప్రభూ, నా అజ్ఞానం మన్నించు. కరుణించు. నీపవిత్ర పాదపద్మాల దర్శనం ప్రసాదించు" అని ప్రార్థించాడు అనుగ్రహించాడు కృష్ణుడు. అంధమహారాజుకి దివ్యదృష్టి ప్రసాదించాడు. విశ్వరూప సందర్శనంతో బ్రహ్మానందం అనుభవించాడు ధృతరాష్ట్రుడు ఆశ్చర్యంతో, ఆనందంతో నిలువు నిలువల్లా పులకలెత్తిం దతడికి భక్తితో దండప్రణామం చేశాడు

"మహాప్రభూ, నిన్ను చూశాను. కృతార్థుణ్ణయ్యాను. నిన్ను చూసిన ఈకళ్లతో మానవమాత్రుణ్ణి చూడను. ఈదయచేసిన దృష్టి తిరిగి తీసుకో. యథాపూర్వంగా అంధుణ్ణి చెయ్యి" అని వేడుకున్నాడు.

ఈమాటలు విన్న జనమంతా ధృతరాష్ట్రుడి విశాల నేత్రాలు స్పష్టంగా చూసి నిర్ఘాంతపోయారు. తన అభిమతం ప్రకారం ఎప్పటి మల్లేనే అంధత్వం వచ్చింది ధృతరాష్ట్రుడికి విశ్వరూపం ఉపసంహరించాడు శ్రీకృష్ణుడు. మహామునులు అంతర్థానం కావడానికి అనుమతించాడు. అంతటితో లేచి ముందే తనపక్క సిద్ధంగావున్న సాత్యకి కృతవర్మల చేతులు పట్టుకుని మాట్లాడకండా బైటికి వచ్చేశాడు.



# ఉద్యోగపర్వం

## నాలుగో ఆశ్వాసం

ఇలా శ్రీకృష్ణుడు పెడమొహం పెట్టుకుని లోగిల్లు దాటివచ్చే సరికి రథం తీసుకుని నౌగలమీద సిద్ధంగా వున్నాడు దారుకుడు. అంత వరకూ బంధు, మిత్ర, సహాయులతో సహా వెంట నడిచి వచ్చారు కౌరవులు. గాంధారిమాత్రం నిష్క్రమించి పోతూ అంతఃపురానికి వెళ్ళి పోయింది వాళ్ళందరినీ చూసి "మీరంతా ఇక నిలవండి, నేను వెళ్ళివస్తాను" అన్నాడు కృష్ణుడు.

అపుడు ధృతరాష్ట్రుడు దగ్గరగావచ్చి మళ్ళీ ఇలా అన్నాడు "కృష్ణా, పాండవులతో విరోధం పెట్టుకోవద్దనీ, మన కులాచారం ప్రకారం వాళ్ళవంతు వాళ్ళకి ఇవ్వండనీ నీ ఎదటనే వీళ్ళకి చీవాట్లు వేశానుకదా! కౌరవజాతికి కష్టాలు తప్పనట్టే వున్నాయి. ఏంచేసేది? నావల్ల ఏపాపమూ లేదని నీకు రూఢిపడితే చాలు. భూప్రపంచం సమస్తానికీ రూఢిపడినట్లే. నానిర్దోషిత్వం నువ్వు తెలుసుకున్నావు కదా! అంతేచాలు నాకు."

అదివిని, బాహ్లీకుడూ, భీష్ముడూ, ద్రోణుడూ, కృపాచార్యులూ మొదలయిన ముఖ్యులందరినీ మళ్ళీవోసారి చూశాడు కృష్ణుడు. "ఇప్పుడు సభలో జరిగిందంతా మీకు తెలిసేవుంది. తాను దేనికీ బాధ్యుణ్ణి కాననీ, తనతప్పు ఏమాత్రం లేదనీ చెప్పి తప్పుకుంటున్నాడు ఈ వృద్ధమహారాజు. అయితే, నాకక్కడ వుండవలిసిన పనేముంది? వెళ్ళివస్తాను. ఇదంతా ధర్మరాజుకి తెలియజెయ్యాలి కదామరి!" అని రథమెక్కాడతడు. అక్కడినుంచి తిన్నగా కుంతీదేవి మందిరానికి

బయట్దేరాడు ద్వారం దగ్గిర రథందిగి లోపలికి వెళ్ళాడు. ధృత రాష్ట్రుడూ మొదలయినవాళ్ళుకూడా తనవెంట లోపలికి వచ్చారు.

కుంతీదేవికి నమస్కరించి కౌరవసభలో జరిగినవృత్తాంతమంతా— ధర్మసమ్మతంగా తానుచేసిన కార్యవాదమూ, కౌరవులు చేసిన ఖడ్గ వాదమూ, తుదకి దుర్యోధనుడు తలపెట్టిన అశక్తదుర్జనత్వమూ— అన్నీ క్లుప్తంగా తెలియజేశాడు. "అత్తా, కౌరవులు తేరగా తిని కూచుని కొవ్వెక్కి వున్నారు. కిందా మీదా తెలీడంలేదు వీళ్ళకి. మంచిదే, మాదేం పోయింది! నాలికలుచాస్తూ అర్జునాగ్ని చుట్టు ముట్టి వాళ్ళ కళ్ళన్నీ ఎరవేసుకున్నపుడు కాని కనువిప్పు కలగదు వీళ్ళకి. ఇక నీకొడుకుల దగ్గిరకి వెళ్ళాలి నేను. వాళ్ళకు ఏం చెపు తావో చెప్పు. వెళ్ళి వస్తానుమరి" అన్నాడు.

## కుంతీ సందేశం

"ఏంచెప్పేది తండ్రీ, ఏం చెప్పమంటావు? క్షాత్రమే జీవనంగా పెట్టుకు బదికిన ముచికుందుడూ, సృంజయుడూ మొదలయినవాళ్ళ చరిత్రలు ధర్మరాజుకి మాత్రం తెలీవనా!" అంది కుంతి.

"రాజులికి పరాక్రమమే జీవనవృత్తి. ఇతరవృత్తులు నిషేధ మన్నారు పెద్దలు. ఉత్తమసత్వులైనవాళ్ళు వంశధర్మం చెడకండా నిలబెడతారు. బుద్ధిహీనులయితేమాత్రం నీచమైన కూటికి సమ్మ తించి హీనంగా బతుకుతారు. విన్నావూ, నీబావలు సంధికని తల వూపారే కాని, వీళ్ళతోకలిసి వుండడం మాత్రం కష్టం. నీకా అను మానం అక్కరలేదు. వెళ్ళు. సంధిచెడడమే సర్వవిధాలా మంచి దైంది. వంశోచితమైన వీరత్వానికి ముందడుగువేసే అర్జునుడు సంధికి సమ్మతించడమేమిటి! ఉక్కుగుండు భీమన్నకి మాత్రం సంధి నచ్చిం దంటే నమ్మలేను నేను. ఇంతకీ, సర్వ జగన్మాన్యుడవైన నువ్వు ఇక్కడికి రావడమేమిటి, ఖర్మం కాకపోతే!

"సభలో ఇల్లాలిని చీరెలువిప్పి చేసిన మానభంగం మరిచే పోయారా నాకొడుకులు! ధర్మానికి భయపడి అవాళ తలవొగ్గడం సరే కాని, చిరకాలం ఇలా కీర్తిప్రతిష్ఠలు మంటగలపడం న్యాయమేనా!

"నేను సుఖంగానే వున్నానని చెప్పు. 'భుజబలంమీద బతికిన బతుకే బతుకు' అని మీఅమ్మ చెప్పిందను" అంటూ కౌగిలించు కుంది. కృష్ణుడు నమస్కరించాడు. దీవించిందామె. "వెళ్లిర"మ్మంది.

ఆమె సెలవు తీసుకుని సింహగమనంతో అక్కడినుంచి బయ ల్దేరాడు కృష్ణుడు. తనవెనక ఇంకావస్తూన్న ధృతరాష్ట్రుడు మొదల యిన వాళ్ళని "ఇక నిలవండి" అని వారించాడు. కర్ణుణ్ణి చూసి "అల్లంత దూరం నన్ను దిగబెట్టి వత్తుగాని, రా" అన్నాడు. చేత్తో రెక్కపట్టుకుని రధం మీదికి ఎక్కించుకున్నాడు. తన్ను సాగనంప వచ్చిన కృతవర్మని "ఇకవుండు, వస్తాను" అన్నాడు స్నేహంగా. నమస్కరించి సెలవు తీసుకున్నాడతడు. రధం రాజవీధిని బైలుదేరింది. ఇంకోవాహనం మీద పక్కని నడుస్తున్నాడు సాత్యకి. దారికి రెండు పక్కలా పిటపిట లాడుతున్నారు జనం.

"ఎంతమాట! కృష్ణుడి మాట విన్నారుకారు వీళ్ళు. మూర్ఖులు. యుద్ధంలో ఉభయపక్షాలేనా, ప్రపంచమంతా నాశనమవుతుంది. ఆమాత్రం బుర్ర లేదు వీళ్ళకి! దుర్యోధనుడంత ద్రోహి భూలోకంలో ఎక్కడా వుండడు" అనుకుంటూ కలవర పడుతున్నారు పౌరులు. బారులు తీరి, మూకలు మూకలుగా పరికిస్తున్నారు. ఆ జనసము ద్రాన్ని పాయలు చేసుకుంటూ హస్తినాపురం విడిచి ఉపప్లావ్యం దారిపట్టి సాగిపోయింది శ్రీకృష్ణుడి రధం.

ఇక్కడ ధృతరాష్ట్రుడు అందరితోనూ తిరిగివచ్చి మళ్ళీకొలువులో కూచున్నాడు. కృష్ణరాయబారంవిషయాలే ప్రసంగించడం మొదలు పెట్టాడు. ఇంతలో భీష్మద్రోణులు దుర్యోధనుడితో ఇలాఅందుకున్నారు.

"అమ్మా! ఎలామాట్లాడిందో కుంతి! నిశ్చేష్టులమై పోయాం. గుండెలు తీసిన మాటలవి శాంతికావాలన్న కార్యవాదులు కుంతీ, కృష్ణుడున్నూ. వీళ్ళే ఇలా తెగవేసి చెపుతూవుంటే, ఇక మరేముంది! ధర్మరాజనే మహాసముద్రానికి గట్టు తెగించవన్నమాట! మనమేం చెయ్యాలో పాలుపోకండా వుంది.

"ఒక్కటే ఉపాయం తోస్తున్నది మాకు. దుర్యోధనా, మాట్లాడకండా ధర్మరాజు దగ్గిరికి బైల్దేరు. ఈకౌరవబలాన్నంతా కాపాడుకో. అభిజాత్యం విడిచిపెట్టు. తరవాత విచారిస్తావు. లే. కృష్ణుడితోనే కలిసివెళ్ళు" అన్నారు.

ఈమాటలువిని మొహం ముడుచుకుని చురచురా చూస్తూ వూరుకున్నాడు దుర్యోధనుడు.

దాంతో ఛర్రున లేచిపోయారు భీష్ముడూ ద్రోణుడున్నూ. "దుర్యోధనా, ఇదిగో, సంసారం కడముట్టా చూసినవాళ్ళం మేం. యుద్ధమంటే బెదురుతున్నా మనుకోకు. పదేళ్ళు బతకవలసిన వాడివి నువ్వు. నీకోసం ఇంతవరకూ పెనగు లాడున్నాం. సరే, కావలిసిన పని గంధర్వులే తీరుస్తారు" అని సభనుండి వెళ్ళిపోయారు. ధృతరాష్ట్రుడూ లోపలి లోగిలికి లేచిపోయాడు. కొలువు ముగిసిందని చెప్పి బహిఃపరివారానికి సెలవిచ్చి, కొద్దిమందిని వెంటవేసుకుని తన ప్రాసాదానికి వెళ్ళిపోయాడు దుర్యోధనుడు.

## జ న్మ ర హ స్యం

అక్కడ, అలా వెళుతూ వెళుతూ కర్ణుణ్ణి బుజం దువ్వాడు కృష్ణుడు. స్నేహంతోనూ ఆదరంతోనూ అతడిమొహం చూస్తూ ఎవ్వరూ వినకండా ఇలా ఆరంభించాడు.

"కర్ణా, పెద్దలంటే ఎంతో మర్యాద నీకు. నీకు తెలీని ధర్మమంటూ లేదు నీకోరహస్యం చెపదామని ఇలారమ్మన్నాను, విను.

''కుంతీదేవి కుమారుడివి నువ్వు మీఅమ్మ కన్యగా వున్నప్పుడు, మంత్రబలంచేత సూర్యుణ్ణి రావించి కంది నిన్ను. పాండవుల్లో మొదటి వాడివి. ధర్మరాజూ మొదలయిన ఐదుగురూ నీతమ్ముళ్ళు. ధర్మసంగతమైన విషయమిది వింటున్నావా! వాళ్ళకీ ఈమాట చెపుతాను. బంధుమిత్ర సహితంగా, సకలసేనలతోకూడా నీ అడుగులికి మడుగులొత్తేటట్టు చేస్తాను. ఈభారత మహాసామ్రాజ్యానికి అభిషిక్తుణి చేస్తాను నిన్ను. సర్వసామ్రాట్టువై ఒయలుదేరతావు. నీపట్టాభిషేక మహోత్సవంలో యువరాజై ధర్మరాజు నీ రథంమీద తెల్ల చామరాలు వీస్తాడు. తెల్లగొడుగు పడతాడు భీముడు. అర్జునుడు నొగలెక్కి సారథ్యం చేస్తాడు. నకులసహదేవులూ, యాదవ, పాండవ, పాంచాల, పాండ్య, మాత్స్యులూ మొదలైన రాజకుమాళ్ళూ–మేము యావన్మందిమీ కలిసి వెంటనడుస్తాం ఇలా దేవేంద్రవైభవంతో సమగ్రభూగోళాన్ని పరిపాలిస్తావు. ఆరోభర్తగా ద్రౌపదికూడా నిన్ను వరిస్తుంది. ఆలోచించకండా నాతో వెళ్ళిపోయిరా. దీనివల్ల మీఅమ్మ కుంతీదేవితోపాటు బంధువూ, స్నేహితుడూ అన్నవాడల్లా సంతోషిస్తాడు'' అన్నాడు.

''సూచా వాచా నేనూ ఈమాట వింటూనే వచ్చాను'' అన్నాడు కర్ణుడు తలవంచుకుంటూ, ''కని నదిలో పారేసింది కుంతి. కొడుకులు లేనివాడు కావడంచేత నన్నుచూసి పైకితీశాడు సూతుడు. కన్నకొడుకని చన్నుకుడిపింది రాధ. మలమూత్రాదులెత్తి ఇంతకాలం ప్రాణంపెట్టి పెద్దవాణ్ణి చేశారువాళ్ళు. ఇది తెలిసి ఇవాళ 'మీవాణ్ణి కాను పొం' డని వాళ్ళని తోసెయ్యడమా! ఎంత దారుణమని! అంత కఠుకువాణ్ణా నేను!

''పెద్దలంటే మర్యాదకలవాణ్ణి, నాకు తెలీనిధర్మాలు లేవనీ నువ్వేకదా అన్నావిప్పుడు! రాధా, అధిరథుడూ జాతకర్మాది సమస్త సంస్కారాలూ తమ కులాచారం ప్రకారం నడిపారు నాకు. అలాంటి

తల్లిదండ్రులికి పుత్రధర్మం నిర్వర్తించకండా, వాళ్ళని విడిచిరావడం ధర్మమే అంటావా! బహుకుటుంబిని కూడా నేను. తమ్ముళ్లూ, చుట్టాలూ, స్నేహితులూ—వీళ్ళందరినీ కాదని నన్ను వచ్చెయ్యమనడం ఏమంతన్యాయం చెప్పూ నీకు!

''అదీకాక, సూతుడి కొడుకని చులకన చేయకండా, తన తమ్ముళ్లకంటే, కొడుకులకంటే కూడా నన్ను ప్రేమిస్తున్నాడు దుర్యోధనుడు. రోజురోజుకీ నాప్రతిష్ఠా, ప్రాభవం పెంపుచేస్తూ చివరికి తనంత వాణ్ణి చేశాడు. అలాంటి సహృదయుణ్ణి, ఆప్తుణ్ణి యుద్ధంముందు ఎలా విడిచిపెట్టేది ? అర్జునుడికి సమవుజ్జీననీ నామీద కొండంత ఆసపెట్టుకున్నాడు. పాండవులతో కలిసిపోయి నమ్మకస్వామిద్రోహానికి ఎలా నెట్టుకునేది ? అర్జునుడూ నేనూ పరస్పరం యుద్ధం చేయకపోతే లోకం నవ్వుతుంది మమ్మల్ని. పైపెచ్చు నేను వాళ్ళతో చేరడం అతగాడికే అపవాదు. ఇంక నామాట చెప్పదేముంది! కల్మషంలేనివాడివి కావడం చేత నామంచికని చెప్పావు సంతోషమే. కాని, నాకు మాత్రం మనస్కరించడంలేదు. క్షమించు.

''ఐతే, నాదొక ప్రార్థన—ఈరహస్యంమాత్రం రహస్యంగా నీకడుపులోనేవుంచు. తాను నాతమ్ముడని తెలిసిందంటే సామ్రాజ్యానికి సమ్మతించడు ధర్మరాజు, అతడి వంటి ధార్మికుడు ఈప్రపంచాన్ని కలకాలం పాలించవద్దూ! కృష్ణా,భీమార్జునాది సోదరులు ఋత్విజులవుతారుపైగా నువ్వు ఉపద్రష్టవవుతావు కౌరవకుమాళ్ళని యజ్ఞపశువులుగా చేసి అసమానమైన రణయజ్ఞం నిర్వహిస్తాడు ధర్మరాజు. ధర్మక్షేత్ర మయిన కురుక్షేత్రంలో ఈయజ్ఞముఖాన్ని మావంటివాళ్ళమంతా సద్గతిపొంది తరించిపోతాం'' అన్నాడు.

''అభిమానంతో నేనన్నది రుచించడంచలేదు నీకు ' అన్నాడు కృష్ణుడు. ''గర్వమన్నది ఎప్పుడూ వినాశహేతువు కాకపోదు చివరకు.

అర్జునుడితో యుద్ధానికి వస్తున్నావు పరాజయమో, ప్రాణంపోడమో తప్ప గెలుపన్నది సుతరామూ లభించదు నీకు. నీకే కాదు మీఅంద రికి ఇదేగతి పడుతుంది. అప్పుడు కాని శాంతించదు నీమనస్సు. గాండీవం, అక్షయమైన జంటతూణీరం, సరికొత్త దివ్యాస్త్రాలూ, నొగలమీద నేనూ, ఇంతమహాబలంతో విజృంభించే అర్జునమహారధి ముందు నిలవడం శక్యమేనా నీకు! చెప్తున్నాను విను. పాండవుల నిశ్చయం. సరే, నువ్వు వెళ్ళు వెంటనే మీరాజు దుర్యోధనుడికీ, భీష్మద్రోణులికీ, మీకు సహాయంవచ్చిన యావన్మందికీ చెప్పు ఈ మాసం సమ శీతోష్ణాలతో సౌమ్యంగావుంది. పూలతోనూ, పళ్ళ తోనూ, ధాన్యం మొదలయిన నిండుపంటలతోనూ కలకలలాడు తోంది. ఏడెనిమిది దినాలుంది అమావాస్య. అది పుణ్యదినం. ఆవాళ ఆరంభంకావాలి భారతయుద్ధం'' అన్నాడు.

''ఆమాటనువ్వు చెప్పనక్కరలేదు'' అన్నాడు కర్ణుడు, ''కౌర వులికీ పాండవులికీ యుద్ధం జరుగుతుందని శకునాలూ, స్వప్నాలూ అనేకం చూశాను నేను. ధర్మరాజే గెలుస్తాడని తెలుసు నాకు. అంచేతనే నేను నీతో రానన్నాను అక్కడికి.

''శకునీ, దుశ్శాసనుడూ, నేనున్నూ దీనికిమూలం. కాబట్టి వీళ్ళిద్దరూ కాని పాండవుల్లో కలిస్తే అపుడు నేనూ కలుస్తాను. కర్ణుడు లేని భారతంలేదు. కృష్ణా, ఈ సముద్రంఈది బయటపడితే నీదర్శనం చేసుకుంటాను. లేదా పరలోకంలోనే మళ్ళీ నీదర్శనం. నన్నింక పల్లెత్తుమాట అనకు. సెలవు'' అని కృష్ణుణ్ణి కౌగిలించుకున్నాడు.

''సరే, నీఇష్టం. వెళ్లు'' అన్నాడు కృష్ణుడు రధందిగి, కూడా వస్తూన్న తన రధమెక్కి హాస్తినాపురానికి తిరిగిపోయాడు కర్ణుడు యధాప్రకారం సాత్యకిని తనరధ మెక్కించుకున్నాడు కృష్ణుడు దారు కుణ్ణి చూసి త్వరగా పోనియ్యమన్నాడు రథం.

ఇంక ఇక్కడ, విషాదంతో కుంతీదేవి దగ్గిరికివచ్చాడు విదురుడు. "కౌరవవంశమహాసముద్రం ఇంకిపోయేదినాలు వచ్చాయి. కృష్ణుడి హితోపదేశానికి ఇందులో ఎవ్వడూ మేలుకోలేదు. ఇంతమందీ ఎవ్వరూ అర్జునుడి బాణాగ్నిముందు మిడతలు. పాండవుల ప్రతాపం తెలిసీ పాడవుతున్నారు వీళ్ళు. అన్ని అవస్థలూ పడీన్నీ బంధు క్షయానికి మనసొప్పక సంధికని చేతులుచాచారు నీకొడుకులు పాపం, ఈ పాపులతో పుట్టిపెట్టి ఇన్నిపాట్లూ వచ్చాయి పాండవులకి!" అన్నాడు. "చివరికి యుద్ధం చెయ్యవలిసిన కష్టమూ వచ్చింది" అని కంట తడిపెట్టుకున్నాడు.

విదురుడి మాటలు కుంతీహృదయంలో ఎన్నెన్నో భావాలు రేపాయి. అతడు వెళ్ళినతరవాత తనలోతాను వితర్కించుకుంటూ కూచుంది. "రాజ్యంకోసమని తనవాళ్ళని చేతులారా చంపుకోవడం ధర్మమేనా! యుద్ధమంటే అంత మోదమోదనా! ద్రోణుడూ, భీష్ముడూ, కృపుడూ, కర్ణుడూ – వీళ్ళను ఎదిరించి నిలవరించడం మాటలతో అయేదేనా! అందులోనూ అర్జునుడంటే నాగుపాం పగ కర్ణుడికి. యుద్ధమంటే వీడంతసందడిలేదు తక్కినవాళ్ళకి."

ఇలా గంటలతరబడి ఆలోచించి ఆలోచించి తుదకో నిశ్చయానికి వచ్చిందామె. "కర్ణుడికి అతడి జన్మరహస్యం చెబుతాను. పాండవుల మీద సోదరస్నేహం పుట్టిస్తాను ఇలా అయినా ఒకవేళ వంశక్షయాన్ని నిలిపిన దాన్నవుతాను" అని స్థిరపరుచుకుంది. తగిన సమయం నిరీక్షించి, అతడు జపం చేసుకుందికి గంగాతీరానికి వెళ్ళడం విని ఏకాంతంగా అక్కడికి బైలుదేరిందామె.

## తల్లీ కొడుకులు

తదేకధ్యానంతో జపంలో వున్నాడు కర్ణుడు. జపం తీరేవరకూ అతడి వెనక కూచుంది కుంతి. కొంతసేపటికి జపం ముగించి వెనక్కి

తిరిగిచూశాడు కర్ణుడు. తడబడుతూ, సవినయంగా ఆమెదగ్గిరికి వచ్చాడు. చేతులుజోడించి "సూతపుత్రుడైన రాధకొడుకు కర్ణుడు నమస్కరిస్తున్నాడు" అంటూ ప్రణామం చేశాడు. "తల్లీ, ఇలా ఇక్కడికి ఎందుకు వచ్చావు? నావల్ల కావలిసినపని ఏదన్నా వుంటే సెలవియ్యి" అన్నాడు తలవంచుకుని.

"బాబూ, రాధకొడుకువి కావోయి నువ్వు, కుంతీపుత్రుడివి" అంది కుంతి, "మాతండ్రి కుంతిభోజుడింట నేను కన్యగావున్నప్పుడు దూర్వాసముని అనుగ్రహించిన మంత్రబలంతో సూర్యుణ్ణి పిలిచాను. ఆయన ప్రసాదంవల్ల నాగర్భంలో జన్మించావు నువ్వు. పదిమాసాలూ మోసి కడుపారా కన్నానుతండ్రీ, నిన్ను. అంచేత సూతపుత్రుడివి కావు. న్యాయంగా పాండురాజు పుత్రుడివి నాయనా, ఇదే చెప్ప డానికి వచ్చాను. అటు ధర్మరాజు మొదలైన తమ్ముళ్ళకీ, ఇటు దుర్యోధన దుశ్శాసనాదులికీ నువ్వే పెద్దవాడివి. నువ్వే రాజు కాదగ్గ వాడివి. నాతండ్రీ, రాధకొడుకన్న ఖర్మమేం వచ్చిందోయి, నీకు?" అంది. కుంతి ఇలా చెపుతూ వుంటే "అవును, ఇది నిజం, ఇలా చెయ్యి" అన్నమాటలు సూర్యబింబంలోంచి వినిపించాయి కర్ణుడికి. తల్లి చెప్పిన వాక్యాలూ, సూర్యబింబంలోంచి వినిపించిన మాటలూ విని కూడా రవంతా చలించలేదు కర్ణుడు.

"నీమాట నిజమే అనుకో, ఐనా నేనొక్కమాట చెపుతాను, విను. పుట్టినప్పుడే నన్ను వేట్లో తోశావు. క్షత్రియసంస్కారాలికి అర్హత లేకండా చేశావు తీరా ఇవాళ నీబిడ్డలకోసమని ఈ మాట చెప్పవచ్చావు. ఇది సాధ్యమైన మాటేనా?

"సరే, సూర్యానుగ్రహంవల్ల నాపుట్టుక నింద్యంకాదే అనుకో, ఐనా, లోకానికి తెలీని రహస్యంగానే వుందికదా! ఈరహస్యం ఇపుడు బయట వేసినంత మాత్రాన నీకుగాని, నాకుగాని వచ్చేలాభమంటూ

లేరు, పై పెచ్చు అనర్థంకూడా. అర్జునుడంటే అద్వితీయుడని లోకం కోడై కూస్తోంది అలాంటప్పుడు 'నేనూ కుంతీకుమారుణ్ణే' అంటూ పాండవుల పంచకి వెళితే, అతడికి భయపడి ఈ ఎత్తు వేశానంటారు ప్రజలు. అంతేకాదు, ముఖ్యంగా నన్నే తెప్పచేసుకుని ఈ యుద్ధ సముద్రం ఈదాలనుకుంటున్నాడు దుర్యోధనుడు. తీరా నడిసముద్రంలో అతణ్ణి పడవెయ్యడం సబబేనాకు! కర్ణుడి అస్తిత్వం ఏమన్నా వుంటే అది దుర్యోధనుడి అనుగ్రహం వల్లనేకదా! విశ్వాసఘాతకుణ్ణయి, యుద్ధారంభంలో అతణ్ణి తోసిరాజని వెళ్ళిపోతే రాజన్నవాడల్లా వుమ్మిపోడా! కౌరవుల వుప్పుతిని పెరిగిందీశరీరం కౌరవుల కోసమే వినియోగపడుతుంది. కౌరవుల కూడుతిన్న ప్రతీవాడూ చెయ్యవలిసిన పనేఇది. అంచేత కౌరవులతోనేవుండి నీకొడుకులతో యుద్ధం చేస్తాను నేను నువ్వు లక్ష చెప్పు, కర్ణుడు వెనకాడేఘటం మాత్రం కాదు.

''ఐతే, ఇదేపని పెట్టుకుని, గంపంత ఆసతో వచ్చావు నువ్వు. ఊరికే పొమ్మనలేను నిన్ను. ఒక్కటిమాత్రం ఖరారుచేసి చెపుతున్నాను. నమ్ము. పాండవుల్లో అర్జునుణ్ణితప్ప తక్కినవాళ్లు యుద్ధంలో చేతచిక్కినా చంపకండా వదిలేస్తాను. అర్జునుడొక్కడే నాకు ఆజన్మ శత్రువు అతణ్ణి చంపడమో, అతడిచేత చావడమో తప్పదు నాకు. అతణ్ణి చంపినాకీర్తే, అతడిచేత చచ్చినాకీర్తే. విను, అర్జునుడు చస్తే కర్ణుణ్ణి కలుపుకుని ఐదుగురు. కర్ణుడు చస్తే అర్జునుణ్ణి కలుపుకుని ఐదుగురు. అంతే. ఆరుగురు కొడుకులన్నమాట అబద్ధంనీకు'' అన్నాడు.

''పోనీ, అంతమాత్రం భరోసా ఇచ్చావు, అదెంతకాదు'' అంది కంటినీరొత్తుకుంటూ కుంతి. ''కిందటిజన్మలో ఏం పాపం చేసుకున్నానో మరి, ఎలా తప్పుతుంది! అన్నంతమాటా మరిచిపోకు నాయనా, నీతమ్ములు నలుగురిమీదా గంటు పడనివ్వకు'' అని అతణ్ణి కౌగిలించు

కుంది. "ఆడినమాట తప్పను. సెలవు" అని తలవంచుకు నమస్కరించాడు కర్ణుడు అనంతరం ఎవళ్ళ ఇంటికి వాళ్ళు వెళ్ళిపోయారు మౌనంగా.

ఇక అక్కడ, అలా వాయువేగ మనోవేగాలతో ప్రయాణం సాగించి సురక్షితంగా ఉపప్లావ్యం చేరాడు కృష్ణుడు. సరాసరి ధర్మరాజు కొలువుకి వెళ్ళాడు. ఎదురు వచ్చి పూజించాడతడు. భీమార్జునులూ, విరాటుడూ, ద్రుపదుడూ మొదలైనవాళ్ళు కౌగిలించుకుని సంభావించారు. ఎవళ్ళకి తగినట్లు వాళ్ళని అభినందించి, కొలువులో కూచున్నాడు కృష్ణుడు. ఏమయిందో వినాలని వాళ్ళంతా చెవులు చేసుకుని కూచున్నారు కొలువులోని జనం.

"కౌరవులు కేవలం ఉన్మత్తులు. మంచిమాటలు నెత్తికెక్కవు వాళ్ళకి. సంధికెలా సమ్మతిస్తారు? అంత బుద్ధిమంతులే ఐతే, అంతలేసి పనులకెందుకు దిగబడతారు?" అంటూ ధర్మరాజుతో ఆరంభించాడు కృష్ణుడు. అందరూ వినేటట్లు తాను వెళ్ళివచ్చిన వృత్తాంతం సంగ్రహంగా వివరించి చెప్పాడు. పర్యవసానం సంధి కుదరడం లేదని చెప్పి, ప్రయాణం బడలికగా వుందనీ చెప్పి విడిదికి వెళ్ళిపోయాడు.

ఆరాత్రి తమ్ములతో వో ప్రత్యేక ప్రదేశంలో కొలువుతీర్చి కృష్ణుణ్ణి పిలిపించాడు ధర్మరాజు. "నువ్వు దుర్యోధనుడితో ఏమిటి చెప్పావు? అతడెలా జవాబు చెప్పాడు?" అని ప్రశ్నించాడు.

కృష్ణుడు ఎలా అయితే యుద్ధంకాకండా వుంటుందో, ఎలా అయితే ఐకమత్యం, స్నేహం నెలకొంటుందో – అలా చెప్పాను. ఉభయులికీ ఏది సుఖమో, ఏదిన్యాయమో, ఏదిసత్యమో అదల్లా వివరించాను.

"మిడుతూమిడుతూ చూస్తూ నేను చెప్పిందంతా ఎడచెవిని పెట్టి, అడ్డదిడ్డంగా జవాబులు చెప్పాడు దుర్యోధనుడు. అసహ్యంగా అవాకులూ చెవాకులూ మాట్లాడాడు.

ధర్మరాజు బాబయ్యా మాటాడలేదా? పితామహుడూ, ద్రోణుడూ, విదురుడూ చూస్తూవూరుకున్నారా?

కృష్ణుడు ఎన్నోవిధాల చెప్పాడు ధృతరాష్ట్రుడు. మొత్తుకున్నాడు. గడ్డిపెట్టాను. ఏం లాభం! భల్లూకపట్టు దుర్యోధనుడిది. పిడివాదం శంతనుడి పుణ్యవంశం పలవలువేయడం, ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డిగా మూలకూచోడం, పాండురాజు కుడిభుజమై పాటుపడడం, మీరంతా దిగ్విజయంచేసి రాజ్యం విస్తీర్ణం చెయ్యడం, వాళ్ళు మిమ్మల్ని వంచించడం, సత్యం తప్పకండా మీరు ప్రతిజ్ఞ పాలించడం— ఇన్నీ చెప్పి మీతండ్రివంతు మీకు ఇవ్వడం న్యాయసమ్మతమనీ, ధర్మం తప్పితే కౌరవులు హతవారిపోతారనీ అక్కడున్న పెద్దలంతా చీవాట్లువేశారు. మొగమాటంలేకండా చెప్పవలసినవన్నీ చెప్పారు. దాంతో రుసరుసలాడుతూ సభనుండి లేచిపోయాడా పెద్దమనిషి. తనజట్టుని వెంటవేసుకుని బైటికి వెళ్ళిపోయాడు.

దానాదీనా బెంబేరుపడ్డాడు ముసిలిరాజు. గాంధారిని పిలిచి కొడుక్కి బుద్ధిచెప్పమన్నాడు. విదురుడిచేత కొడుకునిపిలిచి నయానా భయానా చెప్పిచూసిందా ఇల్లాలు. లాలించింది. బతిమిలాడింది. కళ్ళెర్ర చేసింది. భయపెట్టింది సంధిచేసుకోమని నూరిపోసింది. ఏంలాభం? కొరకరానికొయ్య దుర్యోధనుడు. దాకంత మొహం చేసి మళ్ళీ లేచిపోయాడు తనవాళ్ళనందరినీ కురుక్షేత్రానికి నడవమన్నాడు. భీష్ముణ్ణి సేనానాయకుణ్ణి చేసుకుని దండయాత్ర ప్రారంభిస్తాడు.

నేను మొదట చెప్పవలసిందంతా సౌమ్యంగానే చెప్పాను. సామవాదమే ఉపయోగించాను. నారదాదిమునులచేతకూడా చెప్పించి చూశాను. ఊఁహూఁ, ప్రయోజనం లేకపోయింది. కోపం తెచ్చుకుని జంకించీ, భంగించీ, ధిక్కరించీ, డెకారించీ చూశాను. కార్యంచెడకండా మళ్ళీ శాంతంగా మాట్లాడాను. ఉక్కురోషం నిగ్రహించుకోలేక

నామీద చెయ్యి చేసుకోవాలని కుట్రపన్నాడు. అమానుషాలయిన మాయలుపన్ని, చూపవలిసిన రాగిడాలన్నీ చూపించాను. ఎలా అయినా సంధి జరగాలన్న సంకల్పంతో ఎన్నివిధాల పెనగులాడాలో అన్ని విధాలా పెనగులాడాను. అంతా గుడ్డివాడిచేతి అద్దమై పూరుకుంది. 'చిన్నసూదిమొన మోపినంత భూమన్నా ఇవ్వను పో' మ్మన్నాడు. తన దురభిమానంతో దుంపనాశనమయినా యుద్ధానికి బైలుదేరుతాడు కాని వొంతివ్వడు. 'దండం దశగుణం భవే' త్తని దండోపాయం తప్ప మరోసాధనం లేదువాడికి. ఉన్నమాట ఇది. తరవాత మీఇష్టం''

కృష్ణుడిలా ఖచ్చితంగా చివరిమాట చెప్పగానే తమ్ములు నలుగురిదిక్కూ చూశాడు ధర్మరాజు ''విషయమంతా విన్నారుకదా! ఇక సందేహంలేదు. రణదుందుభులు మోయించండి. బైల్దేరండి కురుక్షేత్రానికి'' అన్నాడు.

ఈమాట అన్నాడేకాని గుండెలమీద ఏదోకొట్టినట్టయింది ధర్మరాజుకి. మనస్సు కలుక్కుమంది. ''కృష్ణా, కౌరవవంశాన్ని నాశనం చెయ్యడానికి చేతులు రావడంలేదు. కళవిళపడిపోతూవుంది మనస్సు. సంధికి దారే లేకండాపోయిందికదా! నామనస్సేమో తెలుసు నీకు. నాతమ్ముల బాధలూ ఎరుగుదువు. దుర్యోధనుడి వైఖరీ, భీష్మ, ద్రోణ, విదురుల హృదయాలు తెలుసుకు వచ్చావు. నీకు తెలియనిదంటూ లేదిపుడు. ధర్మచ్యుతి కాకండా మేమెలా చెయ్యాలో ఆదేశించు'' అన్నాడు.

''యుద్ధం. యుద్ధం తప్ప చెయ్యవలిసింది మరొక్కటి లేనేలేదు'' అన్నాడు కృష్ణుడు, ''చెప్పినమాట వినకపోవడమే కాదు, చెప్పవచ్చిన వాణ్ణి నన్ను కట్టి ఖైదులో పెట్టబోయాడు దుర్యోధనుడు. అలాంటిపొగరుబోతుతో ఇంకాసంధేమిటి? వెర్రికాకపోతే!'' అన్నాడు.

అనంతరం, ఆవాళ విదురుడు ఏకాంతంగా చెప్పిన మాటలూ, భీష్ముడూ, బాహ్లీకుడూ, మొదలైన పెద్దలికి దుర్యోధనుడి మీద

కలిగిన మనఃక్షోభమూ, కౌరవుల కైదుకే కుంతీదేవి చెప్పిన సందేశమూ విసిసించాడు కృష్ణుడు. ఇం లో ధర్మరాజు పాపం ఆవంతైనా లేదని నిరూపించి విడిచాడు. అవశ్య కర్తవ్యమైంది కేవలం యుద్ధమే అని తీర్మానించాడు.

అంతావిని సాభిప్రాయంగా తన మొహం చూస్తూ వూరుకున్న తమ్ముల్ని తేరిపారచూశాడు ధర్మరాజు "కౌరవులు మనల్ని పెట్టిన హింసలికి మనస్సా క్షోభించి యుద్ధమన్న ఘోరానికి సమ్మతించింది అమ్మ. నాకు మాత్రం ంధువధకి వెనకాడుతూనేవుంది బుద్ధి. ధర్మమేదో అధర్మమేదో, హి తమేదో అహితమేదో నిర్ధారణ చెయ్యండి మీరు" అన్నాడు.

"హితమేదో, ధర్మమేదో – ఇది ఇలా వుంటుందని నిర్ణయించి చెప్పడానికి, మనకేం తెలుసునని" అన్నాడు అర్జునుడు, "వుండనే వున్నాడు, సమస్తధర్మపరిశోధకు యిన శ్రీకృష్ణుడు అమ్మా, విదురుడూ చెప్పినమాటలతో వున్న సందేహాలన్నీ వూడేపోయాయి. 'యుద్ధం చెయ్యండి' అని కృష్ణుకు ఆదేశిస్తూనే వున్నాడు. ఇంకా సందేహం దేనికి?" అన్నాడు.

## పాండవ సేనానాయకులు

దాంతో తుదినిశ్చయానికి వచ్చాడు ధర్మరాజు. "అవును, సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడి ఆదేశమయాక సందేహమేముంది! సిద్ధపడండి యుద్ధానికి" అని ఆదేశించాడు. ఇంకా ఇలా అన్నాడు "సరి, ఇక సేనాధిపతిని ఎంచుకోవాలి మనం. చెప్పండి. ఎదిరిపక్షంలో భీష్ముడు సేనాపతికదా! అతడికి సరైన వృజ్జీ ావాలి మనకి వివిధ వ్యూహాలు నిర్మించగలిగి వుండాలి. అంత జల రాక్రమశాలీ అయివుండాలి. ఇన్నీ కలిగి ఈ ఏడు అక్షోణీల సైన్యాం . డపగలవారు మనలో ఎవరోవిచారించండి. ఆయనికి సర్వసైన్యాధిప త్యం ఇచ్చి అభిషేకించాలి మనం"

సహదేవుడు కొడుకులూ, మనవలూ, సహోదరులూ, అధికంగా వున్నవాడు, అశేషమైన బలపరాక్రమాలు కలవాడు, విశేషించి మనకు ఆశ్రయదాత – విరాటురాజు సేనానాయకుడైతే బావుంటుంది.

నకులుడు ద్రుపదమహారాజైతేనో? బలగమూ అశేషం. పరాక్రమమూ అమోఘం. బాహుబలమూ అసమానం. చతురోపాయాల్లోనా సర్వజ్ఞుడు, ముఖ్యంగా భీష్మద్రోణులంటే బ్రహ్మాండమైన కోపం ఆయనకి. ఆలోచించండి

అర్జునుడు ద్రోణాచార్యుల్ని స్వాహాచేయడంకోసం అగ్నిగుండంలో అవతరించాడు రథం, గుర్రాలూ, ధనుర్బాణాలూ, కత్తీ, కవచం తనతోనే పుట్టాయి. అగ్నిశిఖలాంటి వాడు, మహావిక్రమశాలి, ధృష్టద్యుమ్నుడు. నాఆలోచనకి ఈయనైతే బావుంటుంది. లేదంటారా, కౌర్యానికి పెట్టనికోటవంటివాడు, ఉగ్రమూర్తి, మహాబలుడు, భీష్ముడికి మృత్యువై జన్మించినవాడు శిఖండి అతణ్ణే చేయండి.

ధర్మరాజు అలాకాదు, సకలచరాచరాల తారతమ్యాలూ తెలిసినవాడు శ్రీకృష్ణుడు. ఈయనమాటే మనకి విజయకారణం, ఈయన ఎవర్నంటే వారిని సర్వసేనానిగా ఎంచుకుందాం.

కృష్ణుడు ఈపదవికి ధృష్టద్యుమ్నుడు సర్వసమర్థుడు. ఈఅక్షౌహిణీలన్నింటిమీదా సర్వసైన్యాధిపతిగా అభిషేకించండి అతణ్ణి. దేవ, గంధర్వ, ఖచర, కింపురుషాది సమస్త దివ్యభూతాల మహావ్యూహాలూ తెలిసినవాడాయన. నీదగ్గిరవున్న రాజులందరూ మహారథులే. విక్రమవంతులే. ఐనా, ధృష్టద్యుమ్నుడే ఈ పదవికి తగినవాడు.

ధర్మరాజు బావుంది. అక్షౌహిణీనాయకుల్ని కూడా నువ్వే నిర్దేశించు మరి.

కృష్ణుడు సైన్యం వున్నవారూ, లేనివారూ అనకండా తగినవాళ్లనే ఎంచి చెపుతాను, వాళ్ళనే ఈ ఏడు అక్షౌహిణీలు నడపడానికి అభి

షేకించు. ద్రుపదుడూ, విరాటుడూ, సాత్యకీ, జరాసంధుడి కొడుకు సహదేవుడూ చేకితానుడూ, శిశుపాలుడి కొడుకు ధృష్టకేతుడూ, శిఖండీ – వీళ్ళని ఏడుగురినీ అక్షౌహిణీ నాయకులుగా అభిషేకించు. కౌరవ సైన్యం సంఖ్యాబలమే కాని సారవంతమైందికాదు. మన సైన్యాలా దృఢమైనవి అరమర పెట్టుకోకుండా బయల్దేరు భగవంతుడే నీకు సేనాధిపతి దేవతలనైనా గెలుచుకొస్తారు నీతమ్ములు. ధృతరాష్ట్రసంతాన మేపాటిది? పిలిపించి వీళ్ళకి లే రణభేరీ మోగించు.

ఇలా సకల నిర్ణయాలూ జరిగిన అనంతరం నిద్రకని తన విడిదికి లేచాడు కృష్ణుడు. అంతటో సమావేశం ముగించారు పాండవులు. సంతోషంగా ఆరాత్రి సుఖనిద్ర చేశారు.

మర్నాడు ఉదయాన్నే మంత్రి, సామంత, సోదర సహితంగా శ్రీకృష్ణుడితో సహా కలిసి బ్రహ్మాండమైన కొలువుతీర్చాడు ధర్మరాజు.

“సంధిజరగలేదు. యుద్ధమే నిశ్చయమైంది” అని పరివారం యావన్మందికీ తెలియజేశాడు. ఒక్కక్షణకాలం ఉద్రేకోత్సాహాల కోలాహలంతో కొలువు కొలువంతా గగ్గోలుపడిపోయింది ప్రముఖులు కొందరు సముచితమైన ప్రసంగాలు చేశారు అనంతరం కృష్ణుడు చెప్పిన అక్షౌహిణీపతుల్ని మహనీయంగా అభిషేకించాడు ధర్మరాజు. తరవాత, శ్వేతజాతుడై శ్వేతుడని ప్రఖ్యాతిపొందిన ధృష్టద్యుమ్నుడికి మహోత్కృష్టంగా సర్వసేనాధిపత్యానికి పట్టంకట్టాడు. ఆ ఎనమండుగుర్నీ తక్కిన రాజులికి చూపిస్తూ ప్రసంగించాడు. “కౌరవులతో యుద్ధానికి మనమందరం కురుక్షేత్రానికి ప్రయాణం కావాలి సిద్ధంకండి” అన్నాడు.

అనంతరం వాళ్ళందరినీ అర్జునుడికి చూపిస్తూ “అనుక్షణం కంటికి రెప్పలాగు ఇందరినీ కనిపెట్టుకు తిరగాలినువ్వు. ఎవళ్ళకి ఎప్పుడు ఏది కావాలో విచారిస్తూ, గురువులా ఉపదేశిస్తూ, ఎవళ్ళని నొప్పించ

కండా పనిచెయ్యాలి. నీకు రక్షగా సర్వశుభాలూ సమకూరుస్తాడు శ్రీకృష్ణుడు'' అన్నాడు.

## ప్రస్థానభేరీ

గాంభీర్యం చెడకండా, మాధుర్యం సడలకండా అక్కడి ప్రముఖులైన రాజులహృదయాలకు ప్రసన్నత కలిగించి మహోత్సాహంతో ప్రస్థానభేరీ వేయించాడు ధర్మరాజు.

ఆ ప్రయాణభేరీ మహాధ్వానానికి ఎండకి బీటలిచ్చిన పచ్చిగోడల్లా పగుళ్ళుపట్టాయి దిక్కులు. ఎసరుకాగినట్టు పొంగి పొర్లిపడ్డాయి సముద్రాలు. గాలికెత్తిన ఓడతెరచాపలా బూరటిల్లిపోయింది ఆకాశం. పిడుగులభయంతో గావుకేకలు వేసినట్టు ప్రతిధ్వనించాయి కులపర్వతాలు. కుమ్మరిసారెలా గిరగిరాతిరిగింది భూగోళం. చిత్రప్రతిమలా నిశ్చేష్టితమైపోయింది విశ్వం.

ఇలా ప్రస్థానభేరీ మోగుతూవుంటే సకలసైన్యాలూ సంకులంగా సన్నాహం కావడం మొదలుపెట్టాయి. అలా ఆ దినమంతా గడిచింది.

మర్నాడు మహావైభవంతో పెళ్ళికి బయల్దేరినట్టు పాండవులూ వారికుమాళ్ళూ, శ్రీకృష్ణుడూ, సాత్యకీ మహోజ్జ్వలంగా, మనోజ్ఞంగా సింగారించుకున్నారు. వీరోల్లాసంతోనూ, సంభ్రమోత్సాహాలతోనూ అందరూ ద్రౌపదిదగ్గిరికి వెళ్ళారు. ఆమె అనుజ్ఞ తీసుకున్నారు. ఆమే, తక్కిన పుణ్యస్త్రీలూ ఇచ్చిన మంగళాక్షతలు స్వీకరించారు.

బ్రాహ్మలు చేస్తున్న ఆశీర్వాదాలు అందుకుంటూ, భద్రపాఠకులు చదువుతూన్న శ్లోకాలు వింటూ రకరకాల మంగళద్రవ్యాలు పరికిస్తూ, శారీరకమయిన శుభశకునాలు సందర్శిస్తూ బయలు దేరారు పాండవులు. బయల్దేరేముందు ధర్మరాజు దగ్గిర శంఖాలూ, కాహళాలూ మొదలయిన మంగళతూర్యాలు జయసూచకంగా మార్మోగాయి. మనవాడి విజయయాత్ర అను మోదించడానికి

చంద్రుడు పయనం కట్టుకు వచ్చాడా అన్నట్టు అతడి పక్క ముత్యాల తెల్లగొడుగు వికసించింది. వింజామరలు వీస్తూవుండగా వందిమాగధులు కీర్తిగీతాలు పాడుతూవుండగా, చంద్రధ్వజంతోనూ రమ్యంగా వున్న రథ మెక్కాడు గొప్పగా ధర్మరాజు. అనంతరం నవ్వు మొహంతో రథంమీద వచ్చాడు అర్జునుడు. తెల్లగుర్రాల పగ్గాలు పట్టుకుని, వనమాలతో నొగలమీద కూర్చున్నాడు. పార్థ సారథి శ్రీకృష్ణుడు. హనుమత్పతాకం మెరుస్తూవుంది. కిరీటకాంతులు భూనభోంతరాళాలు నిండి జిగేలు మంటున్నాయి. గాండీవం, జమిలి తూణీరం ముందు వెనకలకి నవాభరణాలుగా వున్నాయి. ఇలావచ్చి అంజలి బంధంచేసి అన్నగారికి నమస్కరించాడు అర్జునుడు. దేవదత్తం పూరించాడు. ఉత్తరక్షణంలోనే పాంచజన్యం పూరించాడు శ్రీకృష్ణుడు.

ఆవెనక నల్లచారల దుప్పిరంగు గుర్రాల రథంమీద సింహ ధ్వజంతో భీముడూ, చిలకరంగు గుర్రాల రథంమీద శరభధ్వజంతో నకులుడూ, మేఘవర్ణంగుర్రాల రథంమీద గజధ్వజంతో సహ దేవుడూ, తమ తమ రథాలమీద అభిమన్యుడూ మొదలయిన కుమార్లూ అస్త్రశస్త్రాలతో తయారై వచ్చారు. వీరంతా ధర్మరాజుకి నమస్కరించి శంఖం మీద శంఖం పూరిస్తూ అగ్రభాగాన్ని అలంకరించారు. అనంత విజయం పూరించాడు ధర్మరాజు పౌండ్రకం పూరించాడు భీముడు. మణిపుష్పకాలు పూరించారు నకులసహదేవులు.

తక్కిన రాజులూ, యోధులూ వీరవేషాలతో ముచ్చటగా ముస్తాబులై రథాలమీదా, ఏనుగులమీదా, గుర్రాలమీదా వచ్చి నమస్కరించి ధర్మరాజు చుట్టూ చేరారు.

ఇంతలో మహోన్నతమైన రథంమీద ఎదురుగుండా వచ్చాడు సర్వసైన్యాధిపతి ధృష్టద్యుమ్నుడు వచ్చి ధర్మరాజుకి ప్రణామంచేసి సేనాతటికి ఎదునిలిచాడు, మూర్తీభవించిన సమరోత్సాహంలా.

మనోహరంగానూ, భయంకరంగానూ వున్న సన్నాహంతో శుభశకునాలికి సంతోషిస్తూ బయలుదేరాడు ధర్మరాజు. పరిచారకులూ, బళ్ళూ, గుడారాలూ మొదలయిన సమస్తసాధన సామగ్రీ వెంటవేసుకుని బయల్దేరిన ఈదండంతా ఏకమై కదిలిపోతూవుంటే, ఏదోసముద్రం లేచిపోయి వలసపోతూన్నట్టు కనపడింది. ఇలా తర్లి వెళుతూ మార్గంలో ఋష్యాశ్రమాలకీ, దేవాలయాలకీ అలజడి కలగనివ్వకండా వారిస్తూ ప్రయాణించి కురుక్షేత్రం ప్రవేశించారు పాండవులు. ప్రవేశించి, హిరణ్వతీనదీతీరాన్ని తృణ, కాష్ఠ, జలసమృద్ధమైన సమస్థలంలో దండువిడిశారు. మకాం వేస్తున్నాం అన్నదానికి సూచనగా పాంచజన్యంపూరించాడు శ్రీకృష్ణుడు. వెంటనే ధర్మరాజూ, అర్జునుడూ మొదలయిన యావన్మందీ తమతమ వీరశంఖాలు పూరించి ఆకాశం అదిరిపోయేట్టు చేశారు.

ఓ అందమైనచోట రాజమందిరం ఏర్పాటుచేశారు. సేనానాయకులికీ, పెద్దపెద్ద దొరలికీ, యోధులికీ, తక్కిన యావన్మందికీ ఎవరికి తగినట్టువారికి గుడారాలువేసి చక్కని నివాసాలు నిర్మించారు ఏనుగు శాలలు, గుర్రాలశాలలు రథాలశాలలు బారులు బారులుగా, వరస వరసలుగా తీర్చి కట్టారు. నిన్నటిదాకా నిర్మానుష్యంగావున్న ఆమహా మైదానమంతా సమృద్ధమైన సంబారాలతో ఏర్పడ్డ పాండవ శిబిరంతో మహాపట్నంలా తయారైంది. సర్వసేనాధిపతి ఓసారి శిబిరం చుట్టూ తిరిగి కట్టుదిట్టంచేసి వచ్చాడు. రాజులు యావత్తూ ఎవరిగుడారంలో వారు ఉత్సాహంతో విశ్రమించారు

ఇక హస్తినాపురంలో—చారులవల్ల అంతా విన్నాడు దుర్యోధనుడు. తోణకలేదు పైకి. వెంటనే తన మంత్రివర్గాన్ని సమావేశపరిచాడు, కొలువు తీర్చాడు. గర్వంతో వుట్టిపడుతోంది అతడికంఠం,

"తాను చెప్పినట్టు చెయ్యలేదన్న కోపంతో వృన్నవీ లేనివీ చెప్పి పాండవుల్ని బాగా రెచ్చగొట్టి వుంటాడు కృష్ణుడు. అసలే మన మీద ఏడుపుగా వుంది వాళ్లకి దీంతో అగ్గిమీద గుగ్గిలం పడ్డట్టవుతుంది. కత్తీ కమ్మా పట్టుకు తిరగబడతారు మనమీదకి. యుద్ధం అవశ్యంభావి. తప్పదు. అంచేత మనయావత్తు సైన్యాలూ కురుక్షేత్రానికి నడిపించాలి రేపే ప్రయాణం. ఊళ్ళో చాటించండి. రాజులందరినీ హెచ్చరించండి తమ్ముడూ దుశ్శాసనా! సువ్వూ, కర్ణుడూ, శకునీ–మీముగ్గురూ ఇది తా సిద్ధం చెయ్యాలి" అన్నాడు.

ఉత్తరక్షణంలో ఊరంతా గుప్పుమంది ఈవార్త దండులో మూలమూలలా చాటింపు జరిగింది. రాజులంతా సైన్యసమేతంగా జల్దుకున్నారు. ఎక్కడ చూసినా ప్రయాణసన్నాహాలే. ఎక్కడ చూసినా ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ సిద్ధపరిచేవాళ్ళే. ఎక్కడ చూసినా సంబారాలు చక్కబెట్టేవాళ్ళే ఎక్కడచూసినా ఆయుధాలు సవరించేవాళ్ళే తీరిక లేనివాళ్ళే. ఓ, ఎక్కడ చూసినా సందడే సందడి.

## కౌ ర వ సే నా నా య కు లు

మర్నాడు వేకువనే కాలకృత్యాలు ముగించుకున్నాడు దుర్యోధనుడు. తీర్చిదిద్దినట్టు ఉజ్వలంగా అలంకరించుకున్నాడు, భళ్లున తెల్లవారేసరికి కొలువులో కూచున్నాడు. "ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా, బాహ్లీకుడూ, శల్యుడూ, కృపుడూ జయద్రథుడూ, భూరిశ్రవుడూ, శకునీ, సుదక్షిణుడూ, కృతవర్మా ఈ పదకొండు మందినీ అ క్షౌ హి ణీ ల నా య కు లు గా చేస్తాను" అని నిశ్చయం చేసుకుని వాళ్లకోసం కబురుపెట్టాడు వాళ్లందరూ రాగానే యుద్ధం సంగతి ప్రసంగించాడు ఎంతో వినయంగా మాట్లాడాడు. "మీపదకొండుమందీ అక్షౌహిణీల నాయకులుగా అంగీకరించాలి" అని అర్థించాడు ఒక్కరూ 'అవునూ, కాదూ' అనకుండా అంగీకరించారు వారికి మహావైభవంగా అభిషేకోత్సవం జరిగించాడు చిరవాట

వాళ్ళనందరినీ వెంట వేసుకుని భీష్ముడిదగ్గిరికి బయల్దేరాడు. సవిన యంగా అతడికి సాష్టాంగ దండప్రణామం చేశాడు.

"వీళ్ళని మన పదకొండు అక్షౌహిణీల సేనకీ అధినాయకుల్ని చేశాను. ఇక ఈ సేనలన్నీ ఒక్క తాటిమీద నడిచేమార్గం చూసుకోవాలి" అంటూ రెండుచేతులూ జోడించాడు. "ఇందులో అనేక దేశాలవాళ్లున్నారు. అనేక జాతులవాళ్లున్నారు. ఇందరిమనస్సూ వొక్కటై, ఇందరూ ఏకలక్ష్యంమీద యుద్ధం చెయ్యడమంటే మాటలతో అయేదికాదు సర్వసమర్థుడూ, మెళుకువలు తెలిసిన నేర్పరీ అయిన మహనీయుడి నేతృత్వమూ, శిక్షణా వుండాలి దీనికి. దేవతల సేనవంటి దానికికూడా ఒక నాయకుడంటూ కుమారస్వామిని నియమిస్తేనే కాని సాగిరాలేదు మరి. మన ఇంతరాణువలోనూ నువ్వుతప్ప దీనికి సమర్థుడు మరొకడు లేడు కౌరవులంతా చుక్కలైతే పూర్ణ చంద్రుడివి నువ్వు నువ్వే ఈభారం వహించి ఒకగట్టుచేర్చాలి మమ్మల్ని. నువ్వు తప్ప సర్వసేనాధిపత్యానికి మరొక్కరంటూవుంటే నువ్వే చెప్పు. అంచేత నా ప్రార్థన మన్నించి ఈపట్టం స్వీకరించు. కౌరవ విజయధ్వజాన్ని కురుక్షేత్రరణరంగంలో అంబరచుంబితంగా ప్రతిష్ఠించు" అన్నాడు.

దానికి భీష్ముడు "ఉన్నమాట చెప్పాలి. మీరెంతో పాండవులూ అంతేనాకు. ఐతే, మీలో వొకణ్ణిగా వున్నానుకాబట్టి యుద్ధంలో మీతోనే వుండాలి నేను. మంచిది సేనాధిపత్యాన్ని స్వీకరిస్తాను. కాదనను. నాకునేను చెప్పుకోడం కాదు కాని నన్నెదిరించి బతికిపోయేవాడు ఈభూప్రపంచంలో లేడు ఒక్కఅర్జునుణ్ణి మాత్రం గెలవలేను. నాకంటె బాణాలు అధికం తెలుసునతగాడికి. ఇంకో మాట, పైవాళ్లనెవళ్లనైనా వరసకట్టనరికిపారేస్తాను. పాండురాజుబిడ్డలంటేమాత్రం చెయ్యాడదు నాకు. ఏమంటావా, నామీదికీ అంతగా చెయిచేసుకోరువాళ్లు. సరే. అప్పటిసందర్భాన్ని బట్టి చూసుకోవచ్చది.

ఒక్కటి మాత్రం నేను చెబుతున్నాను, విను. ఈ యుద్ధంలో ముందు నన్ను యినా పంపు. లేదా కర్ణుణ్ణయినా పంపు అంతే. అలా అయితేనే సేనాధిపత్యం వహిస్తాను. లేదంటే, ఈబెడదే నాసెత్తిని పెట్టకు'' అన్నాడు.

''మళ్లీదీన్ని కొత్తగా మొదలకించడం దేనికి?'' అంటూ గర్వమని అందుకున్నాడు కర్ణుడు, ''చెప్పవలిసిందేదో ఆనాడే చెప్పాను మరి భీష్ముడు కిందపడితేనేగాని యుద్ధంలో బాణం పట్టనని'' అన్నాడు. ''అవును, కావలిసిందే, అది'' అన్నాడు భీష్ముడు.

ఎలాఅయితేనేం, చివరికి కృతకృత్యుడయ్యాడు దుర్యోధనుడు. భీష్ముడు అంగీకరించగానే కొండ అందుకున్నట్టు అయిందతడికి. పట్టణమంతా పతాకోత్సవం చెయ్యండని పురమాయించాడు. భేరీమృదంగాలు, శంఖకాహళాలూ వాయించమని ఆదేశించాడు. వీధివీధినీ, సందుసందునా మంగళతోరణాలు కట్టించమన్నాడు. రత్నకుంభాలతో, బంగారం బిందెలతో, వెండికడవలతో తీర్థజలాలు తెప్పించాడు. నవరత్నాలూ, పుష్పాలూ, మారేడు జమ్మి మొదలైన మంగళవృక్షాల మహౌషధులూ—అవసరమయిన ప్రతీపదార్థం సమకూర్చాడు. ఋత్విక్పురోహిత సహితంగా, మంత్రతంత్రాలతో కావలిసిన సంస్కారమంతా తు చ తప్పకండా నిర్వహించాడు. ద్రోణుడూ, కృపుడూ మొదలయిన గురువులూ, బాహ్లీకుడూ మొదలైన కురువృద్ధులూ సంతోషించేట్టు యథావత్తైన సమకూర్చిన అభిషేకంచేసి సర్వసేనాధిపతి పట్టం కట్టాడు భీష్మపితామహుడికి. అక్షౌహిణీ పతుల్ని ఒక్కొక్కణ్ణీ చూపి ''వీరికి ఈసమస్త సేనకీ నువ్వే నాయకుడివి'' అన్నాడు.

ఇవతల భీష్ముడి శిరస్సుమీద రత్నకలశాలు తీర్థజలాలు కురుస్తున్నాయి. అటు పట్టణమంతటా పాషాణాలూ, నెత్తుటిధారలూ, ఎముకలూ వర్షిస్తున్నాయి. ఇక్కడ భేరీమృదంగాలు మ్రోగు

తున్నాయి పట్టణంలో మబ్బులేని పిడుగులు ప్రతిధ్వనిస్తున్నాయి. ఈ ఉత్పాతాలికి ఉలిక్కపడ్డారు ప్రజలు. నిరుత్సాహంతో మొహం వేలవేశారు సైనికులు. దానికి శాంతి విధానంగా దానాలూ, ధర్మాలూ చేశాడు దుర్యోధనుడు

ధర్మమే జయిస్తుంది

తన బుర్రవిప్పుట్టిన బుద్ధేమిటో, తానేమిటో, అంతే. ఇంత ఉద్యోగంలోనూ తల్లితోగాని, తండ్రితోగాని కసింతయినా సలహా చెయ్యలేదతగాడు. బెంగపెట్టుకుని, బెంబేలుపడిపోయి కరచరణాలూ ఆడక తెల్లపోయి మూలకూచున్నారు ముసిలిదంపతులు. అంతా అయాక చెప్పుల్లో కాలుపెట్టుకునేముందు వాళ్ళదగ్గరకి వెళ్ళాడు దుర్యోధనుడు. వాళ్ళ ఇష్టాయిష్టాలతో పనిలేకండా "వెళతాను" అని మాత్రం చెప్పాడు. తల్లినిచూసి "గెలవమని దీవించు" అన్నాడు. "ధర్మం ఎక్కడవుంటే గెలుపు అక్కడవుంటుంది" అందితల్లి గాంధారి.

అక్కడినుండి బయలుదేరి, తమ్ముల్లూ, మంత్రులూ, దళాధిపతులూ, దేశదేశాల మహారాజులూ — వీళ్ళందరితోనూ కలిసి పదకొండు అక్షౌహిణీల సైన్యాన్ని తర్లించుకుంటూ ప్రయాణం సాగించాడు రారాజు. సేనాముఖంలో సింహంలా నుంచున్నాడు సర్వసైన్యాధిపతి భీష్మపితామహుడు. ఈమహాసైన్యం కదిలిపోతూవుంటే భూమి అడగారినట్టయింది. దిక్కులు గజగజ లాడాయి.

ఇలా మహాసమారోహంగా వెళ్ళి కురుక్షేత్రం ప్రవేశించాడు దుర్యోధనుడు. ఒక రమణీయప్రదేశంలో డేరాలు వేయించాడు. కర్ణుడితో కలిసి ఎవరిగుడారం ఎక్కడ వెయ్యాలో — ఇదంతా ఏర్పాటు చేశాడు. మధ్య తనడేరాలు వేయించాడు హస్తినాపట్టణంలో ఎలా అయితే మంత్రులమందిరాలూ, సేనానాయకుల నివేశనాలూ వుండేవో అలా ఇక్కడా నిర్మించాడు. ఇల తృణాలమీద

కళ్ళవేడుకగా తయారైంది కౌరవశిబిరం. ఉభయశిబిరాలూ కురు క్షేత్రంలో కోలాహలంగా వుంటూ వచ్చాయి.

## బ ల రా ము డు తా ట స్థ్యం

"సంధికని హాస్తిన వెళ్లాడు కృష్ణుడు. సంధి కుదరలేదు కౌరవ పాండవుల పద్దెనిమిది అక్షౌహిణీల దండూ కురుక్షేత్రంలో డేరా వేసింది."

ఈ వార్త రెక్కలు కట్టుకుని ప్రపంచమంతా అల్లుకుపోయింది. ద్వారకలో బలరాముడూ విన్నాడు ఖేదపడ్డాడు. కొద్ది పరివారాన్ని వెంటవేసుకుని వెంటనే వచ్చాడు కురుక్షేత్రానికి. తిన్నగా పాండవ శిబిరానికి వెళ్ళాడు. కొలువులో వున్నాడు ధర్మరాజు. తక్షణం ససం భ్రమంగా లేచి అతణ్ణి కౌగిలించుకున్నాడు. అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి ఆరాధించాడు. కృష్ణుడూ, భీమార్జున నకులసహదేవులూ సాత్యకీ నమస్కరించారు. ద్రుపదుడూ, విరాటుడూ—ఈ మొదలయిన వారంతా సవినయంగా చేతులు జోడించారు. అందరినీ ఆదరించి అభినందించాడు బలరాముడు. కుశలప్రశ్నలయాక అందరినీ వోసారి చూసి వోనిట్టూర్పు విడిచాడు. "పాండవులూ, కౌరవులూ తుదకి క్రూరత్వానికే దిగబడ్డారు. ఒక్క బంధుజనానికే అన్నమాటేమిటి, ప్రపంచ ప్రజలందరికీ పీకలమీదికి తెచ్చారు. ఎంతఘోరం! ఇంతా జరుగుతుందనే మొదటినుండీ మా కృష్ణుడితో పోరుతూవచ్చాను నేను. 'ఉభయుల్నీ చీవాట్లువేసి ఒక్కదగ్గిరకూడనివ్వు' అని నాలో గూడు కట్టుకు పోరాను. ఉహూం, విన్నాడు కాడు. చిలికి చిలికి గాలి వాన అయింది. ముక్కూ మొహం తెలీనివాళ్ళు కౌరవులు. బెదిరించో, బెల్లించో దారికి తేవలిసింది వాళ్ళని. ఊరికే కోపం తెచ్చుకుని సంధి చెడగొట్టుకువచ్చాడు మావాడు. ఏలెక్కని చూసినా వాళ్ళూ వీళ్ళూ వొక్కటేకదా తనకి! ఐతే, ఏం పెట్టుమందు పెట్టాడో అర్జునుడు! అతడంటే ప్రపంచం కనపడదు మావాడికి. అంచేత కంటికిరెప్పలా కనిపెడతాడు పాండవుల్ని. కాగా వీళ్ళకి

జయం తప్పదు. వాళ్ళకి చావూతప్పదు. చూస్తూ చూస్తూ ఎలా సయించడం దీన్ని!

"భీష్ముణ్ణీ, దుర్యోధనుణ్ణీ, నాచేతులమీద నేర్పి ఇంతవాళ్ళని చేశాను. అలాంటివాళ్ళిద్దరూ ఇప్పుడు నాకళ్ళముందు ఒకళ్ళనొకళ్ళు చంపుకుంటూవుంటే, అబ్బ! ఎలాభరించడం! ఐతే, మావాడికి తెలీనిపుణ్యమూ, పురుషార్థమూ నాకుమాత్రం ఏం తెలుస్తుంది! ఐనా, ఈఘోరంమాత్రం చూడలేను నేను. సరస్వతీతీర్థానికి యాత్ర వెళ్ళిపోతాను. ఇదిమీకు చెప్పిమరీ పోదామని ఇలావచ్చాను" అన్నాడు. అనవలిసిన మూడుమాటలూ ముక్తసరిగా అనేసి కృష్ణుణ్ణీ, ధర్మరాజునీ వొప్పించి తీర్థయాత్ర వెళ్ళిపోయాడతను.

## పిలవని పేరంటం

తరవాత కుండినగరంనుండి పెద్దసైన్యం వెంటవేసుకొని వచ్చాడు కృష్ణుడిబావ రుక్మి. శార్ఙ్గమూ, గాండీవమూ, విజయమూ అనే దివ్యధనుస్సులు మూడింటిలోనూ విజయం అనే ధనుస్సుకలవా డాయన. వచ్చి ధర్మరాజు కొలువులో ప్రవేశించాడు ముందు. సన్మానసత్కారాలుచేసి కూచోబెట్టాడు ధర్మరాజు పాండవుల పక్షాన్ని వచ్చిన వీరులంతా సభలో వున్నారు తనని పరాభవంచేసి తనచెల్లెల్ని ఎత్తుకుపోయిన కృష్ణుడూ ఎదురుగానే కూచున్నాడు. మాటామంతీ అయాక, ఇంతమందిలోనూ తొణుకూబెణుకూ లేకండా అర్జునుణ్ణి సంబోధించి ఆరంభించాడు రుక్మి "ఏమోయ్, యుద్ధానికి భయంగావుంటేమాత్రం నాతో చెప్పు. సంకోచించకు. ఈ ప్రపంచంలో నన్ను కాదని బతికిపోయే మగాడంటూ లేడు. నేను అండగా వుండి, త్రినేత్రుణ్ణయినా తోసిరాజని గెలిపిస్తాను నిన్ను. ఏమంటావ్!" అన్నాడు.

విని పకాలుమని నవ్వేశాడు అర్జునుడు. నవ్వేసి, అనవలిసిన రెండుమాటలూ చటుక్కున అననూ అనేశాడు మొహంమీన్నాద.

''నిజం? ఇన్నాళ్లూ చెప్పావుకావుమరి! గంధర్వసేనమీదికి వెళ్ళినప్పుడూ, విరాటరాజు ఆవుల్ని మళ్ళించుకు వచ్చినప్పుడూ నీ ప్రయోజకత్వం తెలిసివుంటే పిలిచేవాణ్ణే! అయిందేదో అయింది. రుక్మీ, ఇవాళనుండీ నువ్వు పక్కనిలేకపోతే బైలేదేరను, సరా! విన్నావూ, 'యుద్ధమంటే భయమేస్తోందా' అని నువ్వు అడిగితే నవ్వొస్తోందినాకు. ఇంతవరకూ నేను వొంటరిగొట్టునయి వెళ్ళినచోట్లల్లా ఎలాగో వోలాగ జరిగిందనుకో, ఇప్పుడు మీబావగారూ తోడున్నారునాకు. పద్నాలుగులోకాలు పైనపడ్డా భయం దేనికంటావు! భయపడుతున్నాను మొర్రో అన్నప్పుడు పరిగెత్తుకు వత్తువు గాని నువ్వు. అంతవరకూ వీరంతా వుండనేవున్నారు. ఈపాళాన దయచేసి మరెవ్వరికయినా సాయపడు. వెళ్ళు'' అన్నాడు.

మొహంమీద పేడనీళ్ళు కొట్టినట్టయింది రుక్మికి. రుసరుసలాడుతూ లేచిపోయాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా దూసుకుంటూ దుర్యోధనుడిదగ్గిరికి వెళ్ళాడు. అక్కడా ఇదేతంతు అయింది. బెట్టుసరిగా గుర్రమెక్కి మాట్లాడేసరికి నీతోడూవద్దు గీడూవద్దు వేంచేయమన్నాడు దుర్యోధనుడు. వచ్చిపోయిన ఆయాసం మాత్రం మిగిలింది రుక్మికి. మొహంవేలవేసుకుని తనరాజధాని దారిపట్టాడతడు.

ఇలా బలరాముడూ, రుక్మీయుద్ధంలోకిరాకండా తప్పిపోయారు. తక్కినవాళ్ళలో ఏమాత్రం రాజన్నవాడున్నాసరే, ఈఉభయపక్షాల్లో అటో, ఇటో చేరిపోయి యుద్ధానికి సిద్ధపడ్డారు.

ఇక తెల్లవారితే యుద్ధమనగా ఆరాత్రి సంజయుణ్ణి పిలిపించాడు ధృతరాష్ట్రుడు. ''సంజయా, యుద్ధం అనర్థమని ఎరుగుదును. అవినీతివంతుడైన కుమారుణ్ణి అదిలించి అడ్డుపడదామని నాలికచివరిదాకా వచ్చింది. కాని, విధి బలీయమైంది. నోరు తిరగలేదు. సరే, దానికి నేను విచారించి మాత్రం ఏంలాభం? కావలసిందెలాగూ కాకపోదు.

మన చేతిలో ఏముంది? రాజన్నవాడికి యుద్ధంలో కళ్ళుమియ్యడం కంటె కోరవలిసింది లేదు. ఏమంటావు? అదలావుండనీ. ఉభయపక్షాలూ కురుక్షేత్రంలో మకాం వేసిన తరవాత మరేమన్నా విశేషాలు పుట్టాయేమో వినిపించు'' అన్నాడు.

''తప్పంతా కొడుకుమీదే తోలకపోస్తున్నావు'' అని ఎత్తుకున్నాడు సంజయుడు. ''నీలోపం మాత్రం నీకు కనపడకండానేవుంది. కోపగించుకుంటే చెప్పలేను, కాని నీకు తెలీకండానే ఇంతా చేశాడా పాండవుల్ని నీకొడుకు! ఎందుకీ రుద్రాక్షపిల్లితనం! అదలావుండనీ, వార్తలు వింటానంటున్నావుకదూ! విను.

## ఉలూక సందేశం

''ఇవాళ శకుని, కర్ణ, దుశ్శాసనులతో ఆలోచించి ఘోరమైన కార్యం చేశాడు మీవాడు. శకుని కొడుకు లేడూ— ఉలూకుడు – వాణ్ణి పిలిచి ఓగంటసేపు వాడికి బాగా నూరిపోలి, అవన్నీ ధర్మరాజు కొలువులో కృష్ణుడూ, అందరూ వుండడం చూసుకుని చెప్పి రమ్మన్నాడు. ఆ ప్రకారం ఉలూకుడు పాండవ శిబిరానికి వేంచేశాడు. నిండుకొలువులో ధర్మరాజు వుండడంచూసి లోపల ప్రవేశించాడు.

'' 'మీరు కోపం తెచ్చుకోనంటే, దుర్యోధనమహారాజు చెప్పి పంపిన మాటలు కొన్ని మీకు వినిపిస్తాను. ఏమంటారు ?' అన్నాడు.

'' 'భయపడకు, ఆబుద్ధిమంతుడు ఏం తుచ్ఛపుమాటలు చెప్పమన్నాడో అన్నీ జంకకండా చెప్పు. అందరూవింటారు' అన్నాడు ధర్మరాజు.

'' 'ఐతే, ......, 'కాసుకుని కాసుకుని తుదకి ధైర్యంగా వచ్చేశావన్నమాట యుద్ధానికి! సంజయుడితో అవాళ మహాపెద్దకబుర్లు కూశారు అన్నదమ్ములంతా. నోటిముందటి ముద్ద, రాజ్యం పోయిందనీ, పెళ్లానికి నలుగురిలోనూ హంగామా జరిగిందనీ బంటుతనానికి బయల్దేరావు రేపు యుద్ధంలో తోక ముడవకండా మాత్రం నుంచోవాలి

ఉన్నవాళ్లనీ, లేనివాళ్లనీ అందరినీ కట్టగట్టుకునే రంగానికిరా. వెనకా ముందూ చూసినంతమాత్రాన తప్పేదికాదిది. భీష్ముడిచేతిచేవా, ద్రోణుడి ములికీల పసా రుచే తగిత్తే తెలిసివస్తుంది కృష్ణుడిచేత పారం చెప్పించుకునే మరీరండి. వీళ్లిద్దరి బాణాలేచాలు మీాబతుకి. మీాకు మాత్రం తెలీదనా, భ్రమ వదలకండావుంది పాపం!' అని మీాతో చెప్పమన్నాడు.

" 'దుశ్శాసనుడి రక్తం తెగతాగేస్తానన్నావు. ఏదీ, చేతనైతే కానీమరి. ఆలస్యమెందుకూ! నూతిలో కప్పలాగ నీకదుపేమిటో, నువ్వేమిటో, అంతేనికు. కళ్ళు పొగరెక్కి ఎదటివాడు కనపడటంలేదు నీకు. ఈ యుద్ధంతోసరి. ఆపొట్టకాస్తా పగిలి వూరుకుంటుంది' అనమన్నాడు భీముణ్ణి."

"'"పెద్దకావిడిబద్దలాగ ఏదో గాండీవమంటూ వోవిల్లు మోసుకు తిరుగుతున్నావు కృష్ణమూర్తిగారి మద్దత్తూ వుందని తెలుసునూాకు. ఐతే, ఈ మేకపోతుగాంభీర్యానికి ఝుడిసి రాజ్యాలిచ్చేవాళ్ళెవళ్ళూ లేరిక్కడ.అవాళే పెళ్లాంగారిని జుత్తుపట్టుకుని గొరగొరా ఈడ్చుకు వచ్చినప్పుడు మీాఅన్నగారి గదా, నీ గాండీవంబద్దా ఏయేట్లో కలిసి పోయాయి? అప్పుడు లేకపోయిన కొమ్ములు ఇప్పుడెలావచ్చాయి? విరాటరాజు పంచని వలుడని వంటపుట్టీఅయి మీాఅన్నా, బృహన్నల పేరుతో సిగ్గూబిడియం లేకుండా ఆడారిసత్తెప్పవై నువ్వూ తినరానిగడ్డి తిన్నారు. కతకరాని గెంజీ కతికారు, రాజ్యం చపాయింతామన్న పేరాసవల్ల. ఇదంతా శౌర్యమూ, బాహుబలమూ అంటూ? మీాపాట్ల న్నిటికీ నాప్రభావమే కారణమని తెలిసిరాలేదు మీాకు? మీాబావ కృష్ణమూర్తి పరిగెత్తుకు వచ్చాడు హస్తినాపట్నానికి. మాయలూ, మహేంద్రజాలాలూ, టక్కుటమారా విద్యలూ చాలా చూపించాడు. ఇదిగో వెయ్యిమంది కాదు లక్షమంది అర్జునులూ, కృష్ణులూ వచ్చినా

గోచిపాతంత కాదు, చిన్నసూది మొనంత భూమన్నా పంచిపెట్టడం జరగదు. దురాశ దుఃఖానికి చేటుమీసు' అని అర్జునుడితో అనమన్నాడు' అని చెప్పాడు ఉలూకుడు.

"ఉలూకుడు చెప్పిన ప్రతీమాటా కారంచల్లినట్టయి, ప్రతీశబ్దం ఉల్లికట్టినట్టయి మొహాలు జేవురుపడ్డాయి భీముడికీ, అర్జునుడికీ, నకుల సహదేవులికిన్నీ ముకుపుటాలదిరాయి, కళ్లు ఎర్రపడ్డాయి. అంతా చూసి పకపకా నవ్వాడు కృష్ణుడు. 'ఉలూకా, నువ్వు తెచ్చిన సందేశం బాగానే వుంది. సంతోషించాం. వెళ్లు అందరూ వినేట్టు మీ రాజుతో కూడా ఇలా చెప్పు. 'యుద్ధం రేపే తెల్లవారిడమే తరవాయి. ధైర్యంగా చావుకి సిద్ధపడు. చావకుండా బాగుండికి పొసగదు కృష్ణ సారథ్యంతో అర్జునుడి విజయరథం నువ్వు వెళ్ళినచోటికల్లా వెంటతరుముతుంది. పొట్టిపొట్టి కబుర్లా భీముడి ప్రతిజ్ఞ! దుశ్శాసనుడి గుండె నెత్తురు నీకళ్ళెదుటే చీల్చి తాగుతాడు కళ్ళారా చూతువుగాని' అను అన్నాడు.

"'ఉలూకా, తలవిలువ నోరు తెలుపుతుంది. మాయజూదగాడి కొడుకువి. ఇంతకంటె మంచిమాట ఎలా మోసుకువస్తావు?' అన్నాడు అర్జునుడు. 'మంచిదే, వాళ్ళున్నారురా, వీళ్ళున్నారు అని వూరికే కుయ్యేడమెందుకూ? ఆ వున్న వాళ్ళెవరో, వాళ్ళనీ, మిమ్మల్నీ అందరినీ రేపు యుద్ధంలో చూస్తాగా! స్వంతంగా లేక ఎరువుబలంతో బీరవిరిస్తే అదో ప్రయోజకత్వమేనా అంటా! కులానికంతా మూలపురుషుడూ, శతవృద్ధుడూ, వ్రతదీక్షాపరుడూ, పూజ్యుడూ అయిన భీష్ముణ్ణి 'సేనలకంతటికీ నువ్వే నాయకుడవని ఉబ్బవేశారు, ఉక్కురోషంతో చంపుకోడానికి పూనుకున్నారు. దీంతో సాధించేదేముంది? వల్లకాడు. తాతని నమ్ముకుని చావు తప్పించుకుందామనుకుంటున్నాడు మీ రాజు. వెర్రి. కొలిమిముక్కకింద కాకేస్తాం ముసలాయన్ని. మరి యిద్ద ద్రోణుడు. మూడో కబళం కర్ణమంత్రి. వాంతోనే కాళ్ళు చల్లబడతాయి

దొంగారికి. తమ్ముల మరణం, కొడుకుల చావూ చూసి మరీ భీముడి గదచేత కూలిపడ్డప్పుడు గానీ తన దుష్కార్యాలు తలుచుకోడు దుష్టు. వేగం వెళ్ళు. రేపు తూరుపు తెల్లవారే సరికి మీ రాజుని రంగానికి రప్పించు. లే' అన్నాడు గదమాయిస్తూ.

"ధర్మరాజు మాత్రం ఉలూకుడికి తాంబూలం, విలువైన వస్త్రాలూ, ఆభరణాలూ ఇచ్చి వెళ్ళిరమ్మన్నాడు. అతడు వెళ్ళాక ధృష్టద్యుమ్నుణ్ణి చూసి 'రేపే యుద్ధం అని మన సైన్యాలికి తెలియ చెయ్యి. సర్వమూ సంసిద్ధంచెయ్యి' అని ఆదేశించి కొలువు చాలించాడు.

" 'ఈనాటికి ద్రోణుడిపనిపట్టించే వాడుపు కుదిరింది' అనుకుంటూ బయలుదేరాడు ధృష్టద్యుమ్నుడు. 'భీష్ముడిమీది పగ సాంత మవుతుంది. ఇన్నాళ్ళకి మిడతంభొట్లు చేతిలో చిక్కాడు' అనుకుంటూన్న శిఖండిని సహాయం తీసుకున్నాడు క్షణాలమీద స్కంధావారమంతా రాజశాసనం అమలుచేశాడు. యుద్ధానికి సంసిద్ధ పరిచాడు.

"అక్కడ దుర్యోధనుడి కొలువులోకి ఉలూకుడు తిరిగివచ్చేశాడు. కృష్ణార్జునులు చెప్పినమాటలు పూతికపుల్లవాటు లేకండా వెళ్ళబోశాడు. విని కర్ణుడిమొహం చూశాడు రారాజు. 'వెళ్ళు, రేపు తెల్లవారితే యుద్ధమని మన సైన్యాలికి చెప్పు. సమస్త సన్నాహాలూ సిద్ధంచెయ్యి' అన్నాడు. ఇలా రెండూసైన్యాలూ రణసన్నాహాలలో తీరిక లేకండా నిమగ్నమయాయి."

సంజయుడు చెపుతూవుండగా చటుక్కున మధ్యని అందుకుని "సరే, సన్నాహాల మాటకేం, కృష్ణార్జునుల్ని ఎదుర్కొని భీష్ముడేమవుతాడో పాపం! ఐతే, కొలువులో అంతమంది వున్నారుకదా, ఉలూకుడు చెప్పిన ఉల్లికుట్టు మాటలికి ఎవరూ ఏమీ అనలేదా మరి!" అని అడిగాడు ధృతరాష్ట్రుడు.

"చెపుతా" అంటూ ఎత్తుకున్నాడు సంజయుడు. "ఉలూకుడు చెప్పిన వన్నీ విని 'నేనంటూ వుంటూవుండగా ఈ లేనిపోని మాటలు ఎందుకు తలకిపట్టించుకుంటావు? నీసేనమీద ఈగవాల కండా కవచంలా నుంచుంటాను నేను. భయపడకు' అని దుర్యోధనుడితో ధైర్యం చెప్పాడు భీష్ముడు.

"'నాకు భయమేమిటి? ఒంటరిగావున్నప్పుడే బ్రహ్మాదేవుడన్నా భయంలేదు నాకు. పాండవు లొక లెక్కా-పత్రా? పైపెచ్చు ఇప్పుడు మహాస్త్రాల నిధులు నువ్వూ, ద్రోణుడూ వున్నారు నాకు. ఇంక నాకు భయం దేనికి? ఐతే, వొక్కటిమాత్రం తెలుసుకోవాలని సతిమత మైపోతూవుంది మనస్సు. ఏమంటావా, మనలోనూ, వాళ్ళలోనూ అనేకమంది యోధానయోధులున్నారు. వీళ్ళలో ఎవళ్ళ సత్తా ఎలాంటిదో తెలుసుకోవాలని వుంది నాకు. అంచేత వీళ్ళ తరతమాలు తూచినట్లు కొంచెం వివరిస్తే సంతోషిస్తాను' అన్నాడు మీ అబ్బాయిగారు.

రథులూ మహారథులూ

"'నువ్వు అడగడం, నేను కాదనడమూనా? ఉన్నదున్నట్టు నిష్పక్షపాతంగా చెపుతాను విను' అని ఆరభించాడు భీష్ముడు.

'తన్నూ, సారథినీ, గుర్రాల్నీ కాపాడుకుంటూ పదకొండువేల విలుకాండ్రతో యుద్ధంచేసేవాణ్ణి మహారథుడంటాం. అలాగే అనేకమందితో పోట్లాడేవాణ్ణి అతిరథుడంటాం. సమవుజ్జీగా వొక్కడితో యుద్ధంచేసేవాణ్ణి సమరథుడంటాం. తనంతవాడితో వొక్కడితోనూ యుద్ధంచెయ్యలేనివాణ్ణి అర్ధరథుడంటాం. ఐతే, నువ్వు అతిరథుల కిందికి వస్తావు. నన్ను మీ అందరికీ తెలుసు. నన్ను నేను చెప్పుకోకూడదు. కృతవర్మ అతిరథుడు. ఎంతకయినా తగ్గవాడు. శల్యుడు అతిరథుడు. కృష్ణుడిమీద ఉక్కురోషంవల్ల మేనల్లుళ్ళని విడిచిపెట్టీ కూడ నీపక్కవచ్చాడు. భూరిశ్రవుడు అతిరథుడ మడతిప్పని యోధుడు. మీ బావ సైంధవుడు మహారథుడు. ద్రౌపది విషయంలో

తనకి జరిగిన పరాభవంతో కుసిల్లిపోతున్నాడు. ఎంతకయినా తెగిస్తాడు. కాంభోజరాజు సుదక్షిణుడు సమరధుడు. రథయుద్ధంలో మొనగాడు. మాహిష్మతీపురం రాజు నీలుడు అతిరధుడు. రాజసూయం కాలంనుండీ సహదేవుడి పేరుచెపితే కారాలూ మిరియాలూ నూరతాడు. అవంతిదేశం రాజులు విందానువిందులు అర్ధరధులు. పాండవుల పినతల్లి బిడ్డలయినా, పగబట్టి నీతో చేరారు. త్రిగర్త రాజులు సుశర్మా, సత్యకర్మా, సత్యరధుడూ మొదలయిన ఐదుగురూ మహారధులు. గోగ్రహణంనుండీ పాండవులంటే పాముగ ఏళ్ళకి నీ కుమారుడు లక్ష్మణుడూ, దుస్ససేనుడి కొడుకూ సమరధులు. అయోధ్యరాజు బృహద్బలుడు సమరధుడు. కృపుడు ఒకటోరకం అతిరధుడు. చతురంగబలాలు నాలుగింటితోనూ దెబ్బలాడతాడు. మీ మామ శకుని సమరధుడు. అశ్వత్థామ మహారధుల్లో మొదటివాడని చెప్పదగ్గవాడే. రణపెంకి. ఐతే, బ్రాహ్మణపిలకి సమరానికి ముందుకి పోలేడు. ప్రాణభయం. ద్రోణాచార్యులు అతిరధుల్లో అగ్రేసరుడు. ఉభయసేనలకీ గురుదేవుడు. వృద్ధుడనుకోరాదితణ్ణి యుద్ధంలో కొదమసింహం. అర్జునుడంటే మాత్రం కన్నకొడుకంత అనురాగం. అతణ్ణి నొప్పించడు. మా పినతండ్రి బాహ్లీకుడు శతవృద్ధయినా అతిరధుడు. ఇతడి కుమారుడు సోమదత్తుడూ అతిరధుడే. రాక్షసరాజు హలాయుధుడు సమరధుడు. ప్రాగ్జ్యోతిషం రాజు భగదత్తుడు మహారధుడు. నరకాసురుడి కుమారుడితగాడు. ఏనుగుయుద్ధంలో ఇతణ్ణి చెప్పి ఇంకోణ్ణి చెప్పాలి. శకుని సోదరులు వృషకుడూ, అచలుడూ సమరధులు

## కర్ణుడు అర్ధరధుడు

"'పాండవుల మీదికి నిన్నెప్పుడూ వుసికొలుపుతూన్న నీమిత్రు కర్ణుడు అర్ధరధుడు. కవచకుండలాలు పోగొట్టుకోవడంవల్ల మొదటిపస లేదిప్పుడు. బుద్ధికి పెద్దన్న. జాలిగుండె. దానంపేర ఆస్తి కర్రావుడు

చుట్టేశాడు. పరశురాముడి శాపంతో బాణం పస చెడింది. అంచేత అందరికీ తెలుసు. అర్జునుడిముందు మానం ప్రాణం దక్కించుకో లేడు.''

'''కర్ణుడు అర్ధరథుడు' అనేసరికి 'అవును, నిజమే' అని అందు కున్నాడు ద్రోణుడు. 'బడాయిలుకొడుతూ ముందుకు బయల్దేరడం, తీరా ఫడేలమనేసరికి పరిగెత్తడం పరిపాటే కర్ణుడికి. అంచేత అర్ధ రథుడే అతగాడు' అన్నాడు.

''కత్తిపెట్టి పొడిచినట్టయింది కర్ణుడికి. 'పడకపోతే, పడకపోయిన ట్టుండాలి. అవ్వాకులూ చెవ్వాకులూ కల్పించడమేమిటి? నాదగ్గిర ఏం తక్కువ కనిపెట్టావని అర్ధరథుడని కూస్తున్నావు? చిత్తం వచ్చినట్టు నలుగురిలోనూ నోరుపారవేసుకోడం అలవాటయిపోయింది నీకు. పోని అని ఈరాజరాజు మొహం చూసి తుడుచుకు పోతున్నాను. ఆమాటకి వస్తే నువ్వే అక్షరాలా అర్ధరథుడివి' అని కొలువుదిక్కుచూసి, 'ఇదిగో వింటూనే వున్నారు మీరంతా. తేనెపూసినకత్తి ఈయనగారు రాజు మనసు చెడగొట్టడంకోసం ఉత్తములైన వాళ్ళకి తలవంపులుగా ఈయన తక్కువా, ఈయన ఎక్కువా అని చెపుతున్నాడు. ఇలాంటి వారిమాటలకే తండ్రీ, కొడుకూ చెవికోసుకుంటారు. మహారాజుల్ని ఏమనగలం మనం!

'''దుర్యోధనమహారాజా, శ్రుతిమించి రాగానపడ్డాడు మీతాత. ముసిలాయనకి మతిపోయింది. నీకట్టైమటే ఇలా కారుకూతలు కూస్తూంటే, ఎందుకసహించాలీ అని అడుగుతున్నాను నేను ఈయన అనగా ఎంత? ఈయన బలమనగా ఎంత? ఈయనవొక్కడూ లేకపోతే మాత్రం పుట్టిములిగిందేమిటి? ఈరాజుల మనస్సు కలతపడితే వ్రాసికే పోతుందా? పాండవపక్షపాతి ఈపెద్దమనిషి. పంచమవాహిని లోని వాడు. యుద్ధంతిన్నగా చేస్తాడని నమ్మకు. అనుభవమున్న వాళ్ళూ, బుద్ధిమంతులూ అయిన వృద్ధులబుద్ధులు. నెత్తిమీద పెట్టుకోవలిసిందే. అంతేకాని, ముదిమి తలకెక్కి, మతిచెడిన్నీ, నోటికి వచ్చిన పిచ్చి

కూతలు కూస్తుంటే ఊరుకోడమేమిటి? పెద్దబుర్ర లేకుంటే ఎద్దుబుర్ర పెట్టినట్టయి ది. సేన కుంచు ఈయన్ని పెట్టుకుంటే పిల్లిని చంక బెట్టు కున్నట్టే. ఎవడికొక్కా వాలి యుద్ధం! ఇంత గర్వపోతనే ఈయనతో కలిసి రానన్నాను నేను' అని రుసరుసలాడుతూ రుంజుకున్నాడు.

" 'ఈముసలాడిదెబ్బ మీ గురువు పరశురాముణ్ణడుగు చెపు తాడు. నాతో జట్టీకి సందడిపడ్డవాళ్ళందరికీ ఏమయిందీ ప్రపంచానికి తెలుసు. నాముసిలితనం, నీకుర్రతనం అర్జునుడికి బాగా తెలుసు' అన్నాడు మీసంమెలివేస్తూ భీష్ముడు. 'అబ్బపేరూ, అమ్మపేరూ తెలీని నీతో నోరు చేసుకోబట్టి కాని, నాగురించి నేను అనకూడదు పదిమం దిలో. కార్యానికీ, ఖడ్గానికీ నీ మంత్రాంగం తగలడంబట్టే కౌరవులికి ఈదశ పట్టింది. నిజమే, మా బోటివాళ్ళ కిది ఎలా చాతనవుతుంది? నీలాంటివాడు వూడపోడవాలి కాని. నేనుంటే రానని సాకుపెట్టు కుంటే వొదిలేవికావు అర్జునుడిబాణాలు. మంచివాళ్ళంతా హారీ అన్న తరవాత వొంటరిచావు ఎలాగూతప్పదు నీకు. చావకండా మిగిలివుండే తక్కిన వాళ్ళన్నా చూడకపోరు నీ శవంపాట్లు. రాజు నా నెత్తిని పెద్దబరువు మోపడంవల్ల తెగించకూడదు నేను. అందువల్ల బతికి పోయావు. అట్టే పేలకు మరి' అని పెడమొహం పెట్టుకున్నాడు.

"మించి వచ్చిందని మధ్యకి వచ్చి కలగజేసుకున్నాడు దుర్యో ధనుడు. 'నా బతుకూ, కార్యభారమూ విచారించు. నా మొహం చూసి మన్నించు కోపగించుకోకు' అని పితామహుణ్ణే, 'మనలో మనం మనస్సు విరుచుకునే సమయంకాదిది. మీఇద్దరూ ఏకమై నడి స్తేగాని గట్టెక్క దీ కార్యం. వినిపించుకోవాలి నన్ను' అని కర్ణుణ్ణే మప్పితంగా శాంతపరిచాడు. తరవాత పాండవుల తారతమ్యాలూ వివాలవి కుతూహాల పడ్డాడు. పితామహుణ్ణి మరీమరీ అడిగాడు.

"'వాళ్ళవిషయం చెప్పానంటే మళ్ళీ చిర్రూబుర్రూలాడతాడు మీమంత్రి. ఇక నిమనస్సూ ఎలావుంటుందోమరి! నాకె మకూ మధ్య ఈ తలబాధ!" అని భీష్ము డెంత కాదన్నా వినిపించుకోలేదు అబ్బాయిగారు. తప్పని సరిగా మొదలుపెట్టాడు ముసిలాయన.

"'ధర్మరాజు అతిరథుడు భీముడు అతిరథుల్లో పై చేయి. నకుల సహదేవులు సమరథులు పరాభవాగ్నితో కుములుతూ వుంది వాళ్ళ హృదయం. వాళ్ళముందు మనసేనకి భంగపాటు తప్పదు. అర్జునుణ్ణి ఈమాత్రం వాడని తైపారు వెయ్యడం తలకుమించిన పని నాకు. అతణ్ణి కొలవడానికి కొలబద్దంటూ లేదు. అర్జునుడే అసలు పెద్దపులి. కృష్ణుడన్న సింహమూ తోడయింది అతగాడికి. ఇక చెప్పేదేముంది? తనసేనల్ని చెక్కు చెదర నివ్వడు నీసేనలో వొక్కణ్ణీ దక్క నివ్వడు. ఒక్కడే ఇంతపనీ సాధిస్తాడు, గాండీవమంటూ చేతిలో వుంటే చాలు. ఏనుగులు మింగిన ఎల్లమ్మకి పీనుగులు పిప్పళ్లు' అన్నాడు.

"అర్జునుడి విషయం చెబుతూవుంటే అందరిగుండెలూ ఆగిపోయినట్టయింది. ఇంకా ఇలా అన్నాడాయన 'ద్రౌపది కొడుకులు ఉపపాండవులూ, ప్రతివింధుడూ, శ్రుతసోముడూ, శ్రుతకీర్తి, శతానీకుడూ, శ్రుతసేనుడూ ఐదుగురూ మహారథులు, అభిమన్యుడు మహారథుల్లో తలమానికం. కృష్ణార్జునులతో చెప్పదగినవాడు. తండ్రుల పరాభవానికి బదులుతీర్చుకోవాలని చూస్తుంటాడు రణపెంకె ఉత్తరుడు మహారథుడు. సాత్యకి అతిరథుల్లో అందెవేసిన చేయి. ద్రుపదుడూ విరాటుడూ మహారథులు. పాండవుల దగ్గిరిచుట్టాలు వీరు. వాళ్ళకోసం హోరాహోరి పోరాడతారు శిఖండి మహారథుడు అతడి తమ్ముడు ధృష్టద్యుమ్నుడు అతిరథుడు. అతడి కొడుకు ధృతవర్మ చిన్నప్పుడు తిరుగుబోతై చెడకపోయేవుంటే అతిరథు డయ్యేవాడు భోజుడూ, అజుడూ శిశుపాలుడికొడుకు ధృష్టకేతూ, పాంచాల రాజకుమాళ్ళు

ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ, క్షత్రదేవుడూ, జయంతుడూ, విరాటుడూ, సత్యజిత్తూ మహారథులు. కేకయదేశాధిపతులు జయత్సేనాదులు ఐదుగురు అన్నదమ్ములూ మహారథులు. కుంతీదేవి చెల్లెలి కుమాళ్ళువీరు. రథయుద్ధంలో మొనగాళ్ళు. కాశీరాజు నీలుడూ, విరాటరాజు జ్ఞాతులు సూర్యదత్తూ, మదిరాశ్వుడూ, శంఖుడూ మహారథులు. చిత్రాయుధుడూ, చేకితానుడూ, చంద్రదత్తూ వ్యాఘ్రదత్తూ కూడా మహారథులు. సేనాబిందుడు అతిరథుడు, భీముడంతవాడు. పాండ్యదేశంరాజు మలయధ్వజుడు అతిరథుడు. కాశ్యుడు సమరథుడు. కుంతి పెంపుడుతండ్రి కుంతిభోజుడు అతిరథుడు. రోచమానుడూ అతిరథుడు. అతిరథుల్లో అతిరథుడు ఘటోత్కచుడు. మాయాబలంలో మహిరావణుడంతవాడు. తోచిత వాళ్ళని చెప్పాను. అంతమాత్రంచేత బలమంతా ఇంతే అనుకో కూడదు. రెండుదిక్కులా ఇంకా ఎంతోమంది మహామహులున్నారు. పాండవుల్లో ఎంతముఖండీ లున్నా వాళ్ళెవళ్ళూ నన్నుమించి దాటిపోలేరు. ఐతే, ఒక్క శిఖండిమీద మాత్రం చెయిచేసుకోను నేను' అన్నాడు.

'' 'శిఖండిని నువ్వు చంపక పోడంలో వున్నరహస్య మేమిటో? మేం వినరానిది కాదనుకుంటాను'' అన్నాడు దుర్యోధనుడు 'అదొక పెద్దరామాయణం' అంటూ ఆరంభించాడు భీష్ముడు.

అంబ

'' 'మాతండ్రి శంతనులు కాలంచేశాక సత్యవతీదేవి ఆజ్ఞప్రకారం చిత్రాంగదుడికి రాజ్యాభిషేకం చేశాను అల్పకాలంలో ఆయనా గతించారు అప్పుడు మీతాత విచిత్రవీర్యుణ్ణి రాజుచేశాను. ఆయనకు పెళ్ళికని ఆలోచిస్తూంటగా, కాశీరాజు తనకూతుళ్ళకి స్వయంవరమని కబురంపాడు. బాహ్మణదని బయల్దేరి వెళ్ళాను. పెళ్ళడమేమిటి, అంబా, అంబికా, అంబాలికా అన్న లకన్యల్ని ముగ్గురి రథం ఎక్కించుకోడ

మేమిటి! ఇలాపట్టుకు వచ్చేస్తూవుంటే స్వయంవరానికి వచ్చిన రాజులందరూ కత్తులూ కటార్లూ తీశారు నామీదికి. నాచేతిసత్తా కొంచెం చవిచూపేసరికి అంతా పరుగుచ్చుకున్నారు. అలాతీసుకువచ్చి ముగ్గురు కన్యల్నీ సత్యవతిముందు పెట్టాను. ముగ్గురినీ విచిత్రవీర్యుడికిచ్చి పెళ్ళి చేయాలని ప్రయత్నించిందావిడ. అంతలో ముగ్గురిలోకీ పెద్దవయిన అంబ 'సౌంభపురం రాజైన సాళ్వుణ్ణి వరించాను నేను. ఆయనా నామీద అనురాగంతో వున్నాడు. మా ప్రేమకి అంతరాయం కలిగించడం న్యాయంకాదు నీకు' అంది నాతో. ఈ సంగతి సత్యవతికి చెప్పాను. ఆవిడా అంగీకరించింది. తగిన వృద్ధజనాన్ని వెంటనిచ్చి సాళ్వుడి దగ్గిరికి పంపేశాను అంబని. అంబికనీ అంబాలికనీ మీ తాతకి పెళ్ళిచేశాము.

"'అంబని సాళ్వుడు పరిగ్రహించలేదు. 'భీష్ముడు ఎత్తుకపోయిన దానివి. నీ కన్యాత్వం చెడింది. పో' మ్మన్నాడు. చంపినంత పనయింది అంబకి. 'భీష్ముడు బ్రహ్మచారి' అంది. 'తమ్ముడికోసం మమ్మల్ని తీసుకువెళ్ళా' డంది. 'నీమాట చెప్పగానే నన్ను పంపించేశా' డంది. 'మనసా వాచా నిన్నే నమ్ముకున్నా' నంది. 'తెలిసి మా తండ్రి స్వయంవరం చేశా'డంది. 'లేకుంటే ఇంతపుట్టేదే కాదు, నమ్ము' అంది. వాదించింది, ఏడ్చింది, కాళ్ళావేళ్ళా పడింది. 'కాదుగాక కాదు పో' మ్మన్నాడు సాళ్వుడు. పైకి నెట్టి తలుపు మూసుకున్నాడు. పాపం, రెంటికీ చెడ్డ రేవడయింది అంబ. నాదగ్గిరికీ రాలేదుమరి. 'సాళ్వుడికి కానప్పుడు ఈసంసారానికే చెడ్డా' ననుకుంది. 'ఇంత ముసలానికీ మూలం భీష్ముడే కదా, అతణ్ణి సాధించాలి' అని కూర్చుంది. 'భీష్ముణ్ణి గెలిచేపాటి బలశాలి లేడని స్వయంవరంనాడే తేలిపోయింది. అంచేత తపోబలంచేత జయిస్తానతణ్ణి' అని మునులుండే తపోవనాలికి వెళ్ళింది. ఆమె వృత్తాంతమంతావిని 'స్త్రీవి, సుకుమారివి, కఠిన సాధ్యమైన తపోనిష్ఠకి తట్టుకోలేవు.

పుట్టింటికి వెళ్ళిపో' అన్నారు మునులు. 'వినడుగాక వినను' అంది అంబ. అక్కడే వుండి 'ఏకాంతంగా తపస్సు చేసుకుంటా' నంది.

''ఇలా ఈమె చెబుతూ వుండగా, హోత్రవాహనుడనే రాజర్షి అక్కడికి వచ్చాడు. ఆయన కూతురుబిడ్డే ఈ అంబ. మునులు చేసిన అభ్యాగత పూజలు అందుకున్నాక 'ఈ చిన్నది ఎవ' రనీ, 'ఈమె విచారానికి హేతువేమి' టనీ అడిగాడు. పేరూ వూరూ విన్నాక తన మనుమరాలే అని తెలుసుకుని ఆప్యాయంగా దగ్గిరికి తీసుకున్నాడు. ఈ విషమసన్నివేశానికి విచారపడ్డాడు. 'తపస్సంత కష్టమెందుకు తల్లీ? పాపం, ఏపాపమూ తెలీనిదానివి. నీకోఉపాయం చెబుతాను. ఆశ్రిత వత్సలుడు పరశురాముడు. మహేంద్రపర్వతం మీద నివాసమాయనిది ఆయన్ని ఆశ్రయించు నీదుఃఖం నిమిషాలమీద తీరుస్తాడు నేనంటే ఎంతో గౌరవం. నా మనమరాలివంటే నిన్ను అరికాలు కింద పెట్ట నివ్వడు' అన్నాడు.

''ఇంతలోనే పరశురాముడి శిష్యుల్లో వొకడైన అకృతవ్రణు డనే మునీ వచ్చాడక్కడికి. వచ్చి హోత్రవాహనుణ్ణి చూసి 'రాజర్షీ' మీరు మా గురువుగారి నేస్తులని చెపుతూవుంటారాయన. మిమ్మల్ని చూడ్డంకోసం రేపే ఇక్కడికి శిష్యులతోకూడా వస్తున్నారు. అందుకే ముందు పంపించారునన్ను' అన్నాడు.

''రాముడు వస్తున్నాడంటే తపోవనమంతా సంతోషించింది. అన్నట్టుగానే మర్నాడు ప్రత్యక్షమయాడు పరశురాముడు. మును లంతా భక్తివినయాలతో స్వాగతమిచ్చారు, అర్చించారు, హోత్ర వాహనుణ్ణిఎత్తికౌగిలించుకున్నాడు పరశురాముడు. కుశలప్రశ్న లయాక, అంబని చూపించాడు హోత్రవాహనుడు 'ఇది నా మనమ రాలు. దీని దుఃఖగాథ కొంచెం చెవినిపెట్టండి' అన్నాడు. కన్నీళ్ళతో పాదాలుకడిగి సాష్టాంగపడ్డది అంబ. ఆదరంగా లేవనెత్తి పక్కని

కూచోపెట్టాడు పరశురాముడు. 'మీ తాత వొహటీ, నేనొహటీ కాదు నీకు. నీ దుఃఖమెలాంటిదైనా తీరుస్తాను నేను. నాదగ్గిర చేరావు. నీకు వచ్చేభయమేమీ లేదు. విచారించకు. చెప్పు. ఏమిటిసంగతి?' అని మప్పితంగా అడిగాడు. అంతాపూసగుచ్చినట్టు చెప్పింది అంబ.

'' 'నీపరాభవానికి ఇద్దరు కారకులయారు. ఒకడు భీష్ముడు, రెండోవాడు సాళ్వుడు. ఈ ఇద్దర్లో ఎవళ్ళమీదికి వెళదాం ? నీ అభిప్రాయమేదో అదేచేదాం' అన్నాడు రాముడు. 'సాళ్వుడెలాగూ చేరనివ్వడు నన్ను. అతడి ప్రమేయం మరివద్దు. దీనంతటికీ మూలం భీష్ముడు. అంచేత అతణ్ణి వధించడంకోసమే ఇలా తపస్సుకి వచ్చాను. నా పూర్వపుణ్యంవల్ల మీపాదాలు ఆశ్రయించాను' అంది అంబ.

భీష్ముడూ పరశురాముడూ

'' 'సరే నేనెలాచెబితే అలావినుకుంటాడు భీష్ముడు. లేదంటాడా పరసతో ఎగరగొడతాను తలకాయ. పద. పాపం, తపస్సేం వచ్చింది నీకు!' అని ఆమెని వెంటవేసుకుని పటాటోపంగా కురుక్షేత్రానికి వచ్చాడు పరశురాముడు. వచ్చి, సరస్వతీ తీరాన్ని మకాం వేసి కబురు చేశాడు నాకు. నేనూ ఋత్విక్కులూ, పురోహితులూ మొదలయిన విశిష్టజనంతో, పూజాద్రవ్యాలు తీసుకునివచ్చి ఆరాధించాను. నాభక్తిపపర్యలకి సంతోషించాడు రాముడు. ఎన్నోవిధాల అభినందించాడు. తుదకి అంబని నాముందు పెట్టి 'తీరా బలవంతాన తెచ్చి ఇలా విడిచి పెట్టేశావు. దీని గతి ఏంగానూ మరి! ఇప్పుడైనా నీతమ్ముడికి పెళ్ళి చెయ్యి దీన్ని' అన్నాడు.

'ఏం చెయ్యనూ, విషమసంధిలో పడిపోయాను నేన. 'అదేమన్న మాట స్వామీ, 'సాళ్వుడూ నేనూ ప్రేమించుకున్నాం; అతడి దగ్గిరికి పంపెయ్యి నన్ను' అని అంటేనేకదా పంపేశాను నే. ? తిరిగీ మా తమ్ముడికి పెళ్ళిచెయ్యడం ఎలా కుదురుతుంది ?' అన్నాననీ నెమ్మదిగా.

'నాకదంతా పనికిరాదు. నేను చెప్పినట్టు మాట్లాడకుండా చేస్తావా మంచిమాట. కాదూ పోదూ అంటే నిన్నూ ని చుట్టాల్నీ, పక్కాల్నీ పరసతో బలి వేస్తాను' అన్నాడు రాముడు. నేను వినయంగా చెప్పిన కొద్దీ అగ్గయిపోడం మొదలుపెట్టాడు. 'గురువులై అస్త్రవిద్యాపాండిత్యం నేర్పారు. అకారణంగా కోపిస్తే ఏం చేసేది?' అన్నాను నేను.

" 'గురువని కనబడుతోంది? గొప్పవాడి వైపోయావు కాదంటూనే నక్కవినయాలు వేస్తున్నావు. ఈ శషభిషలతో పనిలేదు. అంబని వెంటనే పెళ్ళిచెయ్యి. అప్పుడుగాని నా కోపాగ్ని చల్లారదు' అని మరీ ఎగిరిపడ్డాడాయన.

" 'కూడనిపని చేస్తావా చస్తావా అంటే ఏందారి? వద్దంటే పెళ్ళేమిటి? పై వాడిమీద మనసు పెట్టుకున్న పడుచుపిల్లని పెళ్ళాడాలని ఎవడి కుంటుంది? ఇలాంటి అధర్మానికి వొడిగట్టుకోడంకంటే నీచేత ఏమైతే అదే నయం. పూర్వం పెద్దలు చెప్పనే చెప్పారు–ఇది మంచీ, ఇది చెడ్డా అన్న కర్తవ్య జ్ఞానం లేకండా, లోకానికి విలకిందుగా నడిచేవారిని గురువులైనా సరే, దండించడం ధర్మమని' అని అనేశాను నేను.

"నోటిమాట నోట్లోనేవుంది, 'ఐతే, రా యుద్ధానికి. సైన్యాలు తెచ్చుకో' అని హుంకరించాడాయన. 'తపస్వికి కోపం కూడదు. గురువువి గదా అని ఇంతవరకూ పస్తాయించాను. యుద్ధమంటే అంత సందడిగా వుంటే అలాగే కానీ. ఎప్పుడో ఇక్ష్వాకులనాడు రాజుల మీదికి దండెత్తావటన! అప్పుడు ఈభీష్ముడు లేకపోడంవల్ల నువ్వు ఆడిందేఆటా, పాడిందేపాటా అయింది. సైన్యాలు తెచ్చుకో అన్నావు. సైన్యాలెందుకు? ఒంటరిగానే వస్తాను. నువ్వునేర్పిన శస్త్రాస్త్రాలే సైన్యాలు నాకు' అని నమస్కారం చేసి ఇంటికి వచ్చేశాను. సత్యవతీదేవికి యావద్వృత్తాంతమూ చెప్పాను. ఆమె అనుమతి తీసు

కన్నాను. సర్వసన్నాహంచేసిన రథమెక్కి వొక్కణ్ణేకురుక్షేత్రానికి బయల్దేరి వచ్చాను.

“ఇంతలో మాఅమ్మ గంగాదేవి ప్రత్యక్షమైంది. నేను ఫలానా అని చెప్పి నన్ను కోప్పడ్డది. రాముడి దగ్గరికీ వెళ్ళింది. ‘నీ శిష్యుడు నిరపరాధి. నిష్కారణంగా ఎందుకీ మొండిపట్టు?’ అని మళ్ళించబోయింది. ‘తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నా’ డాయన. మళ్ళీ నాదగ్గిరికి వచ్చింది. నేనూ మెత్తబడక పోడం చూసి పాపం, తల వొంచుకు అంతర్థాన మైంది.

“ ‘నేనువెళ్ళి రాముడిముందు రథందిగి నుంచున్నాను. ‘గురువులు కింద నుంచున్నారు. రథంతో ఎలాయుద్ధం చేసేది నేను?’ అన్నాను. స్మరణమాత్రంలో దివ్యరథం వచ్చిందాయనికీ. దివ్యాస్త్రాలూ చేతికి వచ్చాయి. అకృతవ్రణుడు సారథిగా నొగలమీద కూచున్నాడు. చూసి నేనూ రథమెక్కాను. శంఖం పూరించి నాసారథిని హెచ్చరించాను. రాముడికి నమస్కరించి గుణం సారించాను. నామీద శరవర్షం కురిపించాడు గురువు. ఒక్కబాణమైనా నారథం చుట్టుపక్కలికి రానీయకండా ఆశ్చర్యం కలిగించాను నేను. ఒక్కదూకుని నన్నూ, సారథినీ గుర్రాల్నీ అరవై బాణాలతో కొట్టాడు. దాంతో పూని వొక్కబాణం ఫడీ మనిపించాను నవ్వుతూను. దెబ్బతో మూడుముక్కలై పడింది ఆయనధనుస్సు. నిలువునా మహాగ్నిహోత్రంలా మండిపోతూ మరోవిల్లు పుచ్చుకున్నా డాయన. గుణధ్వనిచేస్తూ వందలువందలు బాణాలు నారథంమీద గుప్పించాడు చూడవచ్చిన దేవతలంతా నివ్వెరపోయి నుంచున్నారు. నా దేహమంతా మంటపుచ్చుకుంది. సానపెట్టిన బాణాలుతీసి ఆయన శరీరం తూంట్లుపడ్డట్టు కొట్టాను. దూసుకుపోయిన బాణాలతో వొళ్ళంతా రక్తంవరదలు కట్టిం దతడికి. ఎర్రగా చిగిర్చిన మామిడిగున్నలా కనిపించా డతడు. దాంతో స్పృహతప్పి రథంమీద పడిపోయాడు.

'' 'గురుదేవుడు పడిపోడంతోనే, నిష్ఠురమైన క్షత్రియవృత్తి 'ఛీ' అనిపించింది. నన్ను నేనే తిట్టుకున్నాను. ఇంతలో తెలువుకున్నాడాయన. కోపంతో ఆపాదమస్తకం కంపించిపోయాడు. జలప్రపాతం లాగ బాణాలవెంట బాణాలూ ప్రయోగించాడు. అన్నింటినీ సగంలోనే తెగవేసి వాయవ్యాస్త్రం ప్రయోగించాను. గుహ్యకాస్త్రంతో పడగొట్టాడు దాన్ని. అగ్నిబాణం వేశాను. వారుణాస్త్రంతో మళ్ళించాడాయన. ఆయనా దివ్యాస్త్రాలు విడిచిపెట్టాడు. అన్నీ పడగొట్టాను. దాంతో కాలయముడిలా గర్జిస్తూ ఘోరమైన వాకబాణంతో గుండెల మీద కొట్టాడు నన్ను. చచ్చాడంటే చచ్చాడని అరిచారు మునులూ అంబాన్నూ. అదేం బాణమో అర్థంకాలేదు నాకు. దెబ్బతో మూర్ఛపోయి రథంమీద వొరిగిపోయాను. సారథి పక్కకి తప్పించుకుపోయాడు రథం. తెలివివచ్చాక కోప్పడ్డాను సారథిని. తిరిగి రాముడిమీదికి వెళ్ళాను. బాణంపరంపరతో ముంచెత్తాను అతణ్ణి గబగబా.

'' 'ఉదయమయేసరికి ఆరంభించేవాళ్ళం. సాయంకాలానికి ముగిసేది యుద్ధం. ఇదే ప్రకారంగా ఇరవై రెండుదినాలు గడిచాయి. ఆ మర్నాడు నేను పట్టపగ్గాలు లేకండా చెలరేగాను. దెబ్బలూ తిన్నాను. ఆయన గుర్రాల్ని కొట్టాను. విల్లు ముక్కలు చేశాను. సారథిని నరికాను. శరీరమంతా నెత్తురువరదలు చేశాను. ఓ శక్తి వేశాడాయన. దాన్లోనే నరికాను. పదిశక్తులు వేశాడు. అవీ ముక్కలు చేశాను. వందలూ, వేలూ వేశాడు. అన్నీ పిండిపిండి చేశాను. ఆయన నిచ్చెరపోతూంటే నేను నవ్వుతూ వేసేవాణ్ణి బాణాలు. తుదకి మూర్ఛపోయాడాయన. అంబా, మునులూ హాహాకారాలు చేశారు.

'తెలివిరావడమే తడువుగా బలమైన బాణాలు మళ్ళీ వాదిలాడాయన. నన్ను మూర్ఛపోయేట్టు కొట్టాడు. నేను రథంమీద వొరగడంతోనే నాసారథితల నరికిపారేశాడు. అంతలో ఎనమండుగురు

బ్రాహ్మలు నన్నెత్తి పట్టుకున్నారు. నేద తేర్చి రథంమీద కూచో బెట్టారు. ఎనమందుగురూ వొకేవయసులో వున్నారు. నేను మేలు కున్నాక ఆకాశమార్గాన్ని వెళ్ళిపోయారు. మాఅమ్మగంగాదేవి పగ్గాలు పట్టుకుని నొగలమీద కూచోడం చూశాను. నమస్కరిం చాను, దీవించి అంతర్ధానమైం దామె. సారధిలేడుమరి. నేనే రథం నడుపుకుంటూ యుద్ధం చేశాను. సూర్యాస్తమయం వరకూ అలాగే పోరాడాను. సాయంకాలం శిబిరానికి వచ్చేశాను. ఆరాత్రి దర్భశయ్య వేసుకుని పడుకున్నాను. దేవతల్ని ధ్యానించి నమస్కరించాను' 'పర శురాముణ్ణి జయించేమార్గం అనుగ్రహించవలిసింది' అని ప్రార్థించి నిద్రపోయాను. తెల్లవారుఝామవుతుంది. పగలు కనిపించిన ఎనమం డుగురూ కల్లో కనిపించారు. నువ్వూ మేమూ వొక్కటే. భయ పడకు. ఇదిగో, ఇది మోహనాస్త్రం. పుచ్చుకో. పరశురాముణ్ణి జయించు' అని మాయమయ్యారు. వెంటనే లేచాను. మోహ నాస్త్రం మంత్రపూర్వకంగా ప్రయోగ ఉపసంహారాలతో మననం చేసుకున్నాను. మరో సారధిని కూర్చుకుని బయల్దేరాను.

''నన్ను చూడ్డంతోటే పెద్దపులిలా మీదికివచ్చాడు రాముడు. 'నిన్న సగం చచ్చావు. ఇవాళ ఆ వున్నసగమూ తీర్చేస్తాను, రా. నాసంగతి తెలీకండావుంది'అంటూ బాణాలు వొదిలాడు. నాశరీరమంతా మంటలుపుట్టేట్టు కొట్టాడు. కళ్ళనిండా కోపంవచ్చిందినాకు. అతడి నుదురు గుచ్చుకుపోయేట్టు వో బాణం వేశాను ఆ దెబ్బతో తూలి పోయి కిందపడవలిసిందే. చప్పున పొదివిపట్టుకున్నాడు అకృత వ్రణుడు. తేరుకుని కళ్ళల్లో నిప్పులుకక్కుతూచూశాడు రాముడు. బ్రహ్మాస్త్రం తీసి ప్రయోగించాడు. బ్రహ్మాస్త్రాన్ని బ్రహ్మాస్త్రంతోనే కొట్టాను. దాన్నదీ, దీన్నదీ డీకొన్నాయి. మిరుమిట్లుగొలిపే వెలుగు ఆకాశ

మంతా, అల్లుకు పోయింది. సమస్తభూతాలూ సంక్షోభించాయి. ఇదే సమయమని చప్పున మోహనాస్త్రం తీశాను.

" 'వద్దూ, వద్దూ, అది ప్రయోగించకు. ఆగు' అని కేకలు వేస్తూ పరిగెత్తుకు వచ్చాడు నారదుడు. గురుహత్యకే పూనుకున్నావు, కూడదు. అదిగో, పైకిచూడు. నీకు హితం చెప్పిందుకి వచ్చారు వసువులు' అని నా కలలోని ఎనమండుగురినీ చూపించాడు. వాళ్ళు నవ్వుతూ నాదగ్గిరికి వచ్చారు. 'నారదముని త్రిలోకపూజ్యుడు. ఈయన వాక్యం వేదవాక్యం. ఈయన మాట కాదనకు. గురుహత్య పాతకం' అన్నారు ఏమీ ఎరగనట్టు.

" 'మోహనాస్త్రం విరమించాను. ఇంతలో రాముడి తండ్రి జమదగ్ని, తక్కిన పితృవర్గమూ ప్రత్యక్షమయారు, అతణ్ణి బోధించడం మొదలుపెట్టారు. 'భీష్ముడు వసువుల్లోవాడు. అతణ్ణి గెలవలేం. యుద్ధం చాలించు. నరనారాయణుల్లో నరుడుమాత్రం మరో జన్మలో ఇతణ్ణి నిలవరిస్తాడు. అంతే, మరొకడికి సాధ్యంకాదు' అన్నారు. 'ఛట్, వల్లకా' దని కూచున్నాడాయన. అయినా వొదల్లేదు వాళ్ళు. మా అమ్మ గంగనీ తీసుకువెళ్ళి చెప్పించారు. నాదగ్గిరికీ వచ్చి చెప్పారు. మళ్ళీ ఆయనదగ్గిరికి వెళ్ళారు. ఇలా మాయిద్దరినీ శాంతింపజేశారు. తుదకి ఉభయులమూ ధనుస్సులు కిందపెట్టాము.

'అందరూ కలిసి 'బ్రహ్మజ్ఞాని, తేజశ్శాలి, పైపెచ్చు గురుదేవుడూ నీకు. వెళ్ళు, పాదాభివందనం చెయ్యి' అని నాతో చెప్పి, నన్ను వెంటవేసుకుని రామసన్నిధికి తీసుకువెళ్ళారు. 'నీ ప్రియశిష్యుడు. కరుణించు. కానిపనికి సాహసించలేకపోయాడు. అంతే. మరొకటి కాదు' అని ఆయనకు నచ్చచెప్పారు. నేను సాష్టాంగ ప్రణామం చేశాను. పొదివి కౌగిలించుకుని దీవించాడు గురుదేవుడు 'భీష్మా, నీభక్తి, నీశక్తి రెండూ నంతోషపరిచాయి నన్ను' అని పిపులట్టాయినన్ను.

అంబనిచూసి 'అమ్మాయీ, భీష్ముడు నన్ను గెల్చుకున్నాడు. ఇంతకంటె అధికమయ్యేది ఏదీలేదు నావల్ల. ఇక స్వప్రయత్నంచువ్వే చెయ్యి' అన్నాడు. 'మీచేత నయింది మీరుచేశారు. నాతలరాతకి ఎవరేం చేస్తారు? ఇకనాకు తపస్సు వొకటే శరణ్యం. భీష్మవధ తప్పదు. ఈజన్మలో కాకపోతే మళ్ళీజన్మలో ఐనా నాప్రతిజ్ఞ తీర్చుకుంటాను. మీరేవిందురు గాని' అని వెళ్ళిపోయింది అంబ. రాముడి పితృదేవతలూ, వసువులూ, మునులూ – అందరూ వెళ్ళివస్తామని అంతర్థానమయ్యారు. శిష్యబృందంతో గురుదేవుడు మహేంద్రగిరికి వేంచేశాడు. నేనూ రాజధానికి వచ్చి సత్యవతీదేవికి ప్రణామంచేసి ఇదంతా ఆమూలాగ్రంగా విన్నవించాను. ఆమె నన్ను అభినందించిన్నీ, అంబమాట తలచుకుని గుబులు బిగుపుతూ వచ్చింది. ఆవాళనుండీ కదబడ్డ వాళ్ళతోఅల్లా ఆమె వృత్తాంతం కనుక్కుంటూ వుండేవి.

" 'ఒకనాడు వ్యాసులవారూ, నారదమహర్షీ వచ్చారు మన ఇంటికి. ఆమాటా ఈమాటా అయాక మామనోవిచారం వివరించి, అంబ సంగతి ఏమయిందని అడిగాం. జరగవలిసింది ఎలాగూ జరక్కమానదు. మానుషయత్నంతో వ రాన్పించలేం మనం. అంచేత వ్యర్థంగా విచారం పెట్టుకోకండి. మనోవ్యాధికి మందులేదు' అన్నారు వ్యాసులవారు.

" 'అంబసంగతికి ఆమర్థాపడుతున్నారు కదూ, చెపుతావినండి' అని చెప్పాడు నారదుడు. 'అంబ కురుక్షేత్రం నుండి యమునాతీరానికి వెళ్ళింది. తరవాత కౌశికాశ్రమం మొదలయిన సిద్ధాశ్రమాలు తిరిగి ఉగ్రమైన వ్రతాలు చేసింది. ఓనాడు గంగాదేవికనబడి 'ఆడపుట్టుక పుట్టావు. నిష్ఠురమైన తపోవృత్తి దేనికనీకు!' అంది. 'భీష్ముడిచేత బతుకు బుగ్గయిపోయింది నాకు. మరోజన్మలో అయినా హతమార్చాలి అతణ్ణి. అందుకే ఈ తపస్సు' అంది అంబ. 'కుటిలత్వంతో ఇదంతా చేస్తున్నావు. అంచేత తనువు విడిచి, కుటిల గమనంతో

ప్రవహించే ఏరయి పారతావు. అంతే. అంతకు మించి పూతికపుల్లయినా విరగదు నీచేత' అంది గంగమ్మ.

" 'విని వెటకారంగా నవ్వింది అంబ. మత్స్య దేశానికి పోయి మరింత తీవ్రంగా తపస్సులో కూచుంది. గంగమ్మ మాటప్రకారం కొంతకాలానికి అంబ సగంశరీరం ఏరై పారింది. అదే యిపుడు మత్స్య దేశంలోని అంబానది. తపోబలంచేత తక్కిన సగం శరీరం నిలబెట్టుకుంది అంబ. గంగాప్రభావాన్ని సహా తపఃప్రభావంతో నిగ్రహించుకుంది. అక్కడనుండి అనేక పుణ్యాశ్రమాల్లో నివాసంచేస్తూ ఘోరాతి ఘోరంగా తపస్సు చేసింది. తుదకి వోనాడు శివుడు ప్రత్యక్షమై 'వరంకోరు' అన్నాడు. 'భీష్మణ్ణి చంపేట్టు వరమియ్యి' అంది అంబ. 'తథాస్తు' అన్నాడు శివుడు. 'అంటే, ఎలాపొసుగుతుందో సెలవియ్యి' అంది అంబ. 'ఈ శరీరం విడిచిపెడతావు నువ్వు ద్రుపదుడి ఇంట కూతురుగా పుడతావు మొదట. తరవాత మొగవాడి రూపం వస్తుంది. శిఖండి అన్నపేరుతో అఖండమైన ధనుర్విద్యాపాటవం గడిస్తావు. భీష్మణ్ణి సంహారిస్తావు' అని అంతర్ధానమయాడు శివుడు.

"వెంటనే సమిధలు కుప్పవేసింది అంబ. అగ్ని రగిలించింది. తన క్రోధాగ్ని మల్లేనే మండాయి సమిధలు. 'భీష్మణ్ణి చంపుతా' అంటూ అగ్నిలో ఉరికిందామె.

## శిఖండి

" 'ఇక ద్రుపదమహారాజుకీ మీకూ బద్ధవైరంకదా! సంతానం కోసమని ఆయనభార్య విచారం పెట్టుకుంది. దీనా దానావెళ్ళి శివుణ్ణి ధ్యానిస్తూ అతగాడూ తపసులో కూచున్నాడు. శివుడు దర్శనమిచ్చి 'వరంకోర' మన్నాడు. 'భీష్మణ్ణిచంపే కుమారుడు కావాలి' అన్నాడు ద్రుపదుడు. 'కూతురే పుడుతుంది నీకు. తరవాత అదే కొడుకుగా మారుతుంది. వాడే భీష్మణ్ణి చంపుతాడు' అని మాయ

మియ్యాడు శివుడు. 'మహాప్రసాదం' అంటూ ఇంటికివచ్చి భార్యతో చెప్పాడు ద్రుపదుడు.

"'అంబ ఆత్మ ద్రుపదుడిభార్య గర్భంలో ప్రవేశించింది. పది మాసాలూ నిండాక కుమార్తె కలిగింది. కొడుకే పుట్టాడని పైకి చెప్పారు రాజదంపతులు. కుమారుడికి మల్లేనే జాతకర్మలూ అవీ చేయించారు. 'శిఖండి' అని నామకరణం చేశారు. రహస్యం బయట పడకండా పెంచుతూ వచ్చారు. వయసు వచ్చాక ఆమె కీరహస్య కారణం చెప్పి, చదూవూ సంధ్యలూ చెప్పించారు. ద్రోణాచార్యుల దగ్గిర బాణవిద్యా నేర్పించారు.

"'ఇంతలో యవ్వనంవచ్చి నవనవలాడుతూ వుంది శిఖండి. రాజదంపతులికి గుండెలమీద కుంపటిలా అనిపిస్తోంది. ఉభయులూ ఆలోచించారు. వివాహం చెయ్యాలన్నారు. 'శివుడివరం సిద్ధించి నపుడే సిద్ధిస్తుంది మన ప్రయత్నం మనం చెయ్యాలి' అన్నారు. ఐతే వరుణ్ణి తేవాలా, కన్యని తేవాలా? కన్యనే తేవాలన్నారు. దశార్ణ దేశం రాజు హేమవర్మకుమార్తెని తెచ్చి శిఖండికి పెళ్ళిచేశారు. మంచి చాతుర్యం గల పిల్ల హేమవర్మకూతురు. వచ్చిన మొదట్లోనే కని పెట్టేసింది శిఖండి ఆడదని. ఐనా, గమ్మని తెలియనట్టు వూరుకుంది లోలోపల కుసిల్లిపోతూ. సమయం కనిపెట్టి వోనాడు తనదాసితో చెప్పి తండ్రికి కబురుపెట్టింది, తన మగడు పురుషుడుగాడు స్త్రీ అని. ఒకపక్క దుఃఖం – వొకపక్క కోపం – మహా ఇదయిపోయాడు హేమవర్మ. నుంచున్నపాటున దూతని పంపించాడు.

'దూతవచ్చి 'కొడుకని మభ్యపెట్టి కూతురికి వివాహం చెయ్యడం ఏమిటీ దారుణం? దీనివల్ల మీకూ మాకూ నగుబాట్లే కాక నువ్వు బాగుపడేదేముంది? దీని 'నిజమెంతవరకో కనుక్కుండా

మని వచ్చాను. హేమవర్మని హేళనచేసి నాగుశాముతో వెలనాట మాడావు. మగతనముంటే యుద్ధానికి దిగు' అన్నారు

"'మా వియ్యంకుడికి పిచ్చిపట్టిందా ఏమిటి?' అని నవ్వుతూ అన్నాడు ద్రుపదుడు. 'ఏమిటీ మాటలు! ఎవరన్నా వింటే సిగ్గుసిగ్గు. ఎప్పుడన్నా, ఎక్కడన్నా వుంటుందా ఇలాంటిది! వెళ్ళువెళ్ళు' అని అవీ ఇవీ చెప్పి, పరీక్షకి అవకాశ మివ్వకుండా పంపేశాడు దూతని.

'సహించకలేకపోయాడు హేమవర్మ. బారీఎత్తుని సైన్యం తర్లించుకుని కాంపిల్యనగరం అగడ్త చుట్టూముట్టడించాడు. అమ్మకి చిక్కిన మేకలా అయాడు ద్రుపదుడు. ఈ సిగ్గుచేటుకి కిక్కురుమన కండా, భార్యతో విచారిస్తూ వోమూల కూచున్నాడు. సేనానాయకులు మాత్రం యుద్ధంసరంజమా సిద్ధంచెయ్యడం మొదలుపెట్టారు ఇంతలో పొద్దుగూకింది. ఎలా తెల్లవారుతుందా, ఎలాయుద్ధంచేస్తామా అంటూ రాత్రంతా గడిపారు ఉభయపక్షాలవాళ్ళూను. ఈ కత్తెర బోనులో మరణంతప్ప మరోమార్గం కనపడలేదు శిఖండికి. అర్ధరాత్రి చడీచప్పుడూ లేకండా బయల్దేరింది. ఊరవతల అరణ్యంలోకి వెళ్ళిపోయింది. స్థూలకర్ణుడు అనే యక్షుడికి నివాసంగా వుందా అరణ్యం. అంచేత పిట్టమనిషి కనిపించ దందులో. అదంతా తెలుసు శిఖండికి. అందులో చొరబడి, మహానీయంగావున్న యక్షుడిమందిరం దగ్గిర ఆత్మహత్యకి ప్రయత్నించింది. అది తెలిసి పరిగెత్తుకు వచ్చాడు స్థూలకర్ణుడు. 'అమ్మాయీ, నిండుప్రాణాలెందుకు తీసుకుంటావు? చెప్పు, నీమనోవ్యాధికి మందిస్తాను నేను' అన్నాడు. 'ఏంచెప్పనూ, శివుడు తప్ప నాచింత తీర్చేవాడు లేడు ఈఆడజన్మపోయి మగజన్మ రావాలి నాకు. అప్పుడు గాని నా మనోవ్యాధి నయంకాదు' అని తన కథంతా చెప్పింది శిఖండి. విని కనికరంతో కరిగిపోయాడు యక్షుడు. 'ఇంతే కదా, వోషరతుమీద నేనిస్తాను మగతనం. నా మగతనం నువ్వు

పుచ్చుకో. వెళ్ళి మీ మామగారికి కనిపించు. దాంతో మీ ఆపద లన్నీ పోతాయి. అందాకా నీ స్త్రీత్వం నేను పుచ్చుకుంటాను. పది దినాల్లో తిరిగీ నామగతనం నాకిచ్చి, నీఆడతనం నువ్వుతీసుకువెళ్ళాలి. ఇదీ మనమరతు' అని తనపుంస్త్వం శిఖండి కిచ్చి ఆమె స్త్రీత్వం తాను పుచ్చుకున్నాడు.

" 'స్వర్గం చేతిలో పడ్డట్టయింది శిఖండికి. పురుషుడై ఇంటికి వచ్చేశాడు. తల్లిదండ్రులికి మొక్కి సంగతంతా చెప్పాడు. అద్భుతం కంటె ఆనందమే హెచ్చయింది రాజదంపతులికి. అమాంతంగా కౌగిలించు కున్నారు కుమారుణ్ణి. గండం గడిచి బైటపడ్డామని పొంగి పోయారు.

తెల్లవారాక కాల్యకృత్యాలు తీర్చుకుని, తగుమనుష్యుల్ని పంపి వియ్యంకుణ్ణి పిలిపించాడు ద్రుపదుడు. తొణుకూ బెణుకూ లేకండా శిఖండిని ఎదుటపెట్టాడు. మర్యాదగా శిఖండి పురుషత్వం స్థిరపరి చాడు. హేమవర్మని కాదనిపించాడు. తరవాత విందులూ కట్నాలూ జరిగించాడు. సిగ్గుపడిపోయాడు హేమవర్మ. తన్నుతాను నిందించు కుంటూ వచ్చినదారి పట్టాడు.

ఇంతలో క్రీడావిలాసంకోసం స్థూలకర్ణుడి మందిరానికి వచ్చాడు కుబేరుడు. వచ్చాక ఎంతసేపటికీ స్థూలకర్ణుడు కనిపించక పోడంతో కోపం తెచ్చుకున్నాడాయన. 'ఏమిటిది? ఇంతపొగరా వీడికి? మన మంటే ఇంత నిర్లక్ష్యం?' అని మొహం జేవురించుకున్నాడు. దగ్గరి వాళ్ళు చూచివచ్చి 'దేవా, సిగ్గుపడుతూంది స్థూలకర్ణుడు' అన్నారు. 'అదేమిటి? ఐనా, రమ్మనండి' అన్నాడు కుబేరుడు. తీరా వచ్చేక చూచి 'ఓ ఇదే బావుంది. శాశ్వతంగా ఇలాగేవుండు' అన్నాడు. కన్నీళ్ళతో కాళ్ళమీదపడింది స్థూలకర్ణుడు. దగ్గరివాళ్ళంతా కనిక రించమని చేతులు జోడించారు. 'సరే, మీరింత చెపుతున్నారు గనక

శిఖండి బతికివున్నంతకాలం స్థూలకర్ణుడు ఆడదిగానే వుండాలి. శిఖండి మరణించాక పూర్వరూపం వస్తుంది' అని అలకాపట్నానికి వెళ్ళిపోయాడు కుబేరుడు.

"'కుడిచికూర్చుని కొంపతీసుకున్నాను' అని దుఃఖపడ్డాడు యక్షుడు. అన్నప్రకారం పదోదినం ప్రత్యక్షమయాడు శిఖండి. "నీ వల్ల దోషంలేదు. దేవుడిచ్చిన మగజన్మనీది. కోరితెచ్చుకున్న ఆడరికం నాది. వెళ్ళు, సుఖంగా కాలంగడుపు' అని జరిగిందంతా చెప్పింది స్థూలకర్ణుడు. బ్రహ్మానందంతో తిరిగివచ్చాడు శిఖండి. తల్లికీ, తండ్రికీ చెప్పి నమస్కరించాడు. సంతోషంతో ఆకాశాన్నందుకున్నాడు ద్రుపదుడు. ఇప్పటికి ఇదీ అంబవృత్తాంతం' అనిచెప్పి మహార్షులిద్దరూ విజయంచేశారు. ఇదీ శిఖండి చరిత్ర.

"'ఆడవాళ్ళనీ, ఒకప్పుడు ఆడవాళ్ళుగా వున్నవాళ్ళనీ, ఆడ పేర్లు పెట్టుకున్నవాళ్ళనీ, ఆడవాళ్ళ ఆకారంగలవాళ్ళనీ చంపనని ప్రతిజ్ఞ నాది. అంచేత వొకప్పుడు ఆడదిగావున్న శిఖండిని—వాడెంత యుద్ధప్రవీణుడయినా — చంపడానికి చెయ్యెత్తను. ప్రాణభంగమైనా సహిస్తాను. కాని ప్రతిజ్ఞాభంగంచేసి నిందపాలు కాలేను' అని ముగించాడు భీష్ముడు.

"పితామహుడు చెప్పినదంతా విని పెద్దనిట్టూర్పు విడిచాడు నీకుమారుడు. చివరిమాటలు కొంచెం కంగారూ పెట్టాయి. కొంతసేపయాక ఆమాటా ఈమాటా ఆడుతూ తాతగార్ని మరోప్రశ్న వేశాడు. 'ఐతే, పాండవుల ఏడుఅక్షోణీలసైన్యాన్నీ చంపడానికి ఎన్నిదినాలు పడుతుందినీకు? ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ— వీళ్ళకి ఎవరికి ఎన్నెన్నిదినాలు పడుతుంది?' అన్నాడు.

"'వేయవలిసినప్రశ్నే వేశావు' అన్నాడు భీష్ముడు, నాశక్తి నేను చెపుతాను. తక్కినవారు ఎవళ్ళసంగతివాళ్ళు చెప్పడం మంచిది.

ముందు సీకోఖరారు చేస్తున్నాను, విను, తిరుగులేదు దానికి. మంచి బలమైన రాజరథికుల్ని రోజుకి వెయ్యిమంది చొప్పున తెగేస్తాను నేను. అర్జునుడి బాణాలు నన్ను హరీ అనిపించే వరకూ ప్రతీరోజూ నాకో టాకి తక్కువ వుండదు. ఈవిధంగా పదివేలమందికి తక్కువ కాకుండా చంపితేనేగాని బాణంవదలనని అనిపిస్తోందినాకు. ఎదిరిసేనని వేటాడు తూనే నీపదకొండుఅక్షోణీల సైన్యాన్ని గొడుగులా కాపాడుతూ నడి పిస్తాను. అయిందా, ఇక ఎన్నాళ్ళలో వాళ్ళని చంపగలనని అడిగావు. బాగా చూస్తే వోనెలపడుతుంది నాకు, ఏడక్షోణీలూ తుడిచిపెట్టడా నికి' అన్నాడు. 'మీకెన్నాళ్లు పడుతుంది?' అని అడిగాడు ద్రోణుడూ మొదలైనవాళ్ళని దుర్యోధనుడు. 'వయోవృద్ధుణ్ణి నేను. ఏమయినా మీ తాతకి పట్టినన్ని దినాలే పట్టవచ్చు నాకు, అన్నాడు ద్రోణుడు.

''రెండుమాసాలు పడుతుంది నాకు' అన్నాడు కృపుడు. 'పది రోజుల్లో సర్వనాశనం చేస్తాను నేను' అన్నాడు అశ్వత్థామ.

'' 'పట్టమని ఐదుదినాలు పట్టదు నాకు' అన్నాడు కర్ణుడు.

'' 'వెక్కిరించినట్టనిపించిది భీష్ముడికి. పకాలమని నవ్వాడు. 'చెప్పవచ్చు, నోటికి అడ్డేముంది. ఏమన్నా కాదనేవాళ్ళు లేరు మన రారాజుదగ్గిర. కర్ణా, విను, అర్జునుడిగాండీవ ముందే, అది కళ్ళముందు చుక్కలు చూపిస్తుంది. గుణధ్వని చెవుల్లో మరణవాయిద్యాలు వాయిస్తుంది! అప్పుడు చెపుదువుగాని ఈడాబుకబుర్లు' అని అనసూ అనేశాడు.

''ఇలా ఇక్కడ సీకొడులు కొలువులో జరిగిన విశేషాలు గూఢచారులవల్లవిన్నాడు ధర్మరాజు. తమ్ములు నలుగుర్నీ సమా వేశ పరిచాడు. 'మనచారు లిప్పుడేవచ్చి చెప్పారు పాండవులసేనలన్నీ

ఎన్నిదినాల్లో చంపగల' రని ప్రశ్నించాడు దుర్యోధనుడు. 'ఓ నెల్లో చంపుతానన్నాట్ట భీష్ముడు. 'నాకూ అన్నాళ్ళే పడుతుంది' అన్నాట్ట ద్రోణుడు. 'పదిదినాలు నాకుచాలు' అన్నాట్ట అశ్వత్థామ. అందర్లోకీ ఘనుడుగనక 'ఐదురోజుల్లోహతమారుస్తా' ననీ ప్రతిజ్ఞ చేశాట్ట కర్ణుడు. విన్నారా! ఐతే కిరీటీ, నిజంచెప్పూ, వాళ్ళపదకొండు అక్షౌహిణీలని నువ్వయితే ఎన్నాళ్ళలో సంహారిస్తావు'? అని అడిగాడు.

''నన్నపాటి చిరునవ్వు ముసిముసిగా నాట్యమాడింది అర్జునుడి మీసాలకింద. 'అన్నయ్యా, ఎందుకా అనుమానం నీకు! నాబలం తూచాలనే వుంటే, వోమాట చెపుతాను. కర్ణుడు నాగలమీదేవుండి, గాండీవం చేతిలోవుంటే-గట్టిగా తలుచుకున్నానా,- కౌరవసేనే అన్న మాటేమిటి, గోష్పాదం-నుంచున్నపాళాన్ని నిమిషంలో మూడు లోకాలూ మసిచేసివిడిచిపెడతాను. ఎలాఅంటావా, అవాళ ఈశ్వరుడు ప్రసాదించిన పాశుపతం నాతూణీరంలోనే వుంది. దాంతో సాధ్యం కానిదంటూ ముల్లోకాల్లోనూ లేదు. ఈపాశుపతం సంగతి ఎరగడు భీష్ముడు. ద్రోణుడికీ, కృపుడికీ, అశ్వత్థామకీకూడా తెలియదు. ఇక కర్ణుడిక తెలియకపోడంలో వింతేముంది? ఐతే, అంత దారుణమైన మారణాస్త్రం ప్రయోగించి, సర్వసంహారం చెయ్యడం కూడనిపని తక్కిన ఆయుధాలతో యుద్ధంచేసి గెలవడమే పౌరుషం. అవసరాన్ని పట్టి అప్పటిమాట ఆలోచించవచ్చు. ఐనా, మనవాళ్ళు మాత్రం అక్కడి వాళ్ళకంటె తక్కువేం వచ్చారంటావు! భీముడూ, నకులసహదేవులూ, అభిమన్యుడూ, ద్రౌపది కొడుకులూ, సాత్యకీ, విరాటరాజూ, ద్రుపదమహారాజూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ, ఘటోత్కచుడూ - ఇంతేనా, వందలు వేలు జెట్టానజెట్టు యోధానయోధులు వున్నారు. వెయ్యి మందిని చెప్పడమెందుకు? ఏనుగులాగ నిబలం నీకు తెలీడంలేదు.

దేవతలన్నా గెలవలేరు నిన్ను. ముల్లోకాల్నీ మూడు చెరువులనీళ్ళు తాగించగలవు. కోపమంటూ నీకు రాదుకాని, నిజంగా కళ్ళెర్రచేస్తే నీముందు నుంచునేవా డెవడు? అంచేత, మనసైన్యాన్ని వేలెత్తి చూపే మొనగాడే లేడు. నమ్ము. ముమ్మాటికీ మనం జయిస్తాం' అన్నాడు అర్జునుడు."

వ్యావహారికాంధ్ర మహాభారతం

ఉ ద్యో గ ప ర్వం

సంపూర్ణం.



ప్రాచీన గ్రంథావళి: ౪
సంపాదకుడు: పురిపండా అప్పలస్వామి

# వ్యావహారికాంధ్ర

# మహాభారతం

## భీష్మ, ద్రోణ పర్వాలు

సంపుటం 4

పురిపండా అప్పలస్వామి



ప్రాచీన గ్రంథావళి
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరం

# అంకితం

అమ్మా,

'అమ్మా' అని నిన్ను నోరారా పిలిచి,
చివసారి నీ దర్శనం చేసి,
వెళ్ళివస్తానని నోరారా చెప్పి,
ఇవాళకి
పదకుండు సంవత్సరాలు దాటుతున్నాయి.
భారతం సంపూర్ణంగా నానోట వినకండానే
వెళ్ళిపోయావు.
తీర్చుకోలేని ఈలోపం నిరంతరం
వేధిస్తూనే వుంది నన్ను.
ఏంచెయ్యనూ !
నాకు తెలుసు,
ఎక్కడవున్నా నన్ను వింటావు నువ్వు.
ఇదిగో
తెలుగు భారతం,
ఆశీర్వదించు.

పురిపండా అప్పలస్వామి

# విషయసూచిక

## భీష్మపర్వం (1299 – 1562)



## ద్రోణపర్వం (1563 – 1944)

# భీష్మపర్వం



## మొదటి ఆశ్వాసం

మహాపుణ్యక్షేత్రమైన కురుక్షేత్రంలో తూర్పుముఖంగా పాండవులూ, వారికెదురుగా కౌరవులూ దండువిడిశారు. జంబూద్వీపంలో ఎక్కడా మగపురుగని మిగలలేదు. పిల్లలూ, వృద్ధులూ మినహాయించి, అన్ని తెగల యోధులూ కురుక్షేత్రంలోనే వున్నారు.

తనసైనికులు యావన్మందికీ తగిన సౌకర్యాలు సమకూర్చాడు ధర్మరాజు. ఫలానావాడు పాండవసైనికుడు అని తెలియడానికి ప్రత్యేకమైన గురుతులేర్పరిచాడు.

ఇలా కురుక్షేత్రంలో కౌరవులూ పాండవులూ కయ్యానికి కాలు దువ్వుతున్నారు. ఒకళ్ళని గెలవాలని వొకళ్ళు ఉబలాటపడుతున్నారు. హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు సంజయుడితో కలసి కొడుకుల దుడుకుతనానికి విచారిస్తూ కూచున్నాడు. ఇంతలో త్రికాలవేది వేదవ్యాసముని వచ్చాడు. ధృతరాష్ట్రుడు చేసిన పూజలూ అవీ అందుకున్నాడు.

"ఈరాజుల కాలం తీరిపోయింది. అందుకనే భారతయుద్ధం వచ్చింది. దీనికోసం విచారించవలసిన పనిలేదు. యుద్ధం చూడాలని వుంటే చెప్పు. "దివ్యదృష్టిఇస్తాను" – ధృతరాష్ట్రుణ్ణి సముదాయిస్తూ అన్నాడు వ్యాసముని.

"అన్నదమ్ములు ఘోరంగా కొట్టుకుంటూవుంటే చూడలేను. కాని ఎప్పుడేం జరిగిందీ వినాలనిమాత్రం ఆతురతగావుంది. ఆమాత్రం అనుగ్రహించు" ప్రార్థిస్తూ అన్నాడు ధృతరాష్ట్రుడు.

ఎప్పటికప్పుడు యుద్ధవార్తలు ధృతరాష్ట్రుడికి వినిపించడంకోసం సంజయుణ్ణి నియమించాడు వ్యాసుడు. కురుక్షేత్రంలో ఉభయపక్షాల వాళ్ళూ పగలూ రాత్రీ చేసిన సమస్తకార్యాలూ చూడగలిగినట్టు అతడికి వరమిచ్చాడు. వాళ్ళు రహస్యంగా మాట్లాడుకున్నవీ, మనస్సులో అనుకున్నవీ తెలుసుకోగలిగినట్టూ, మనోవేగ వాయువేగాలతో రాకపోకలు చెయ్యగలిగినట్టూ, యుద్ధభూమిలో ఇష్టంవచ్చినట్టు తిరుగుతూవున్నా వాక బాణంకానీ, వాక ఆయుధంకానీ తగలకండావుండేట్టూ, దేవతల స్వరూపాలుకూడా చూడగలిగినట్టూ, వారిమాటలూ, వారిభావాలూ తెలుసుకోగలిగినట్టూ దివ్యశక్తీ, సర్వజ్ఞత్వమూ ప్రసాదించాడు.

"నువ్వేమో మరి విచారించకు" ధృతరాష్ట్రుడికి ధైర్యం చెపుతూ అన్నాడు వ్యాసుడు- "కాలం పరిపక్వం కావడంవల్ల వచ్చిన ప్రజాక్షయమిది. దీనికి విచారించవలసింది లేదు. ధర్మమేజయిస్తుంది. నువ్వు నిశ్చింతగావుండు. కౌరవులా పాండవులా కీర్తి నేను ప్రకటిస్తాను. కనుపిస్తూవున్న దుర్నిమిత్తాలు చూస్తూవుంటే ప్రజాక్షయం తప్పదనే చెప్పాలి. యుద్ధం తప్పదు.

"ఆకాశంమీద మబ్బులులేందే వురుములు వురుముతున్నాయి. గుర్రాలూ, ఏనుగులూ కన్నీళ్ళు కారుస్తున్నాయి. పక్షులు మృగాలు కంటున్నాయి. ఆవులకడుపులో గాడిదలు పుడుతున్నాయి. ఒకొ్కక్క స్త్రీకి నలుగురేసి, ఐదుగురేసి పిల్లలు వొకేసారి పుడుతున్నారు. పుట్టీ పుట్టడంతోనే పిల్లలు కలకలా నవ్వుతున్నారు. కిలకిలా ఆడుతున్నారు.

"జెండాలమీద డేగలూ, రాబందులూ, కాకులూ వాలుతున్నాయి. ఏనుగులమాంసం, గుర్రాలమాంసం తినాలని భూతాలు కటకటారావంచేస్తున్నాయి. సేనలమధ్య దక్షిణాభిముఖంగా గెద్దలెగురుతున్నాయి. తెల్లటివీ, ఎర్రటివీ, నల్లటివీ కబంధాలు ఉదయమూ సాయంత్రమూ సూర్యబింబం కప్పేస్తున్నాయి. చంద్రలాంఛనం తెల్ల

కిందుగా కనిపిస్తూవుంది. ఇదిరాత్రీ ఇది పగలూ అని తెలియరాకండా నక్షత్రాలూ, సూర్యచంద్రులూ ఎల్లప్పుడూ ప్రకాశిస్తున్నారు. కార్తీకపౌర్ణమినాడు చంద్రుడు తేజోవిహీనంగా కొరకంచులా కనిపిస్తున్నాడు. ఆకాశం పద్మవర్ణంగా వుంటూవుంది. వీరులైన రాజులూ, రాజకుమార్లూ చచ్చినవాళ్ళలా నిద్రపోతున్నారు. రాత్రిళ్ళు పందులూ, పిల్లులూ పోట్లాడుతున్నట్టు ఆకాశంమీద భయంకరమైన ధ్వనులు వినిపిస్తున్నాయి.

"దేవతావిగ్రహాలు వణుకుతున్నాయి; నవ్వుతున్నాయి; కండలుకండలు రక్తం కక్కుతున్నాయి; చెమరుస్తున్నాయి; ఏడుస్తున్నాయి; నేలకి వాలిపోతున్నాయి. మోయించకండానే దుందుభులు మోగుతున్నాయి. చిలకలూ, కోకిలలూ, నెమళ్ళూ ఘోరంగా అరుస్తున్నాయి. కత్తులూ అవీ పట్టుకుని కిరాతులు భయంకరంగా తిరుగుతున్నారు. వేకువజామప్పుడుకోట్లుకోట్లుమిడతలదండుతిరుగుతూ వుంది. ఉదయమూ, సాయంకాలమూ దిక్కులు మండుతున్నాయి. దుమారంగా మాంసవర్షమూ, బూడిదవర్షమూ కురుస్తూవుంది.

"అరుంధతీనక్షత్రం వశిష్ఠనక్షత్రాన్ని వెనక వేసుకుని ముందుకి సాగుతూ వుంది. శనిగ్రహం రోహిణీనక్షత్రాన్ని పీడిస్తూ వుంది. రాహువు సూర్యుణ్ణి మింగవస్తున్నాడు. శ్వేతగ్రహం (కేతువు? శుక్రుడు?) చిత్తానక్షత్రందాటి కురుకులనాశనం సూచిస్తూ వుంది. ఘోరమైన పొగ తోకచుక్క పుష్యమినాక్రమించి కురుపాండవసేనలు రెంటికీ వినాశనం తెలుపుతూవుంది. మఘలో అంగారకుడూ, శ్రవణంలో గురుడూ వక్రిస్తున్నారు. శని భగనక్షత్రం పీడిస్తున్నాడు. శుక్రుడు పూర్వాభాద్రలోంచి ఉత్తరభాద్ర తాకుతున్నాడు. శ్వేతగ్రహం పొగతోవున్న అగ్నిలా ప్రకాశిస్తూ, ఇంద్రదైవత్యమైన జ్యేష్ఠా నక్షత్ర మాక్రమిస్తూవుంది. ధ్రువనక్షత్రం భయంకరంగా ప్రజ్వలిస్తూ

అపసవ్యంగా కుడిపక్కకి నడుస్తూవుంది. సూర్యచంద్రులు రోహిణిని పీడిస్తూన్నారు. పరుషగ్రహం (రాహువు) చిత్రాస్వాతులమధ్యసంచారంచేస్తూవుంది. అగ్గిలామండుతూవున్న అంగారకుడు వక్రానువక్రగతులతో శ్రవణంలోవున్న బృహస్పతిని వేధించి బ్రహ్మరాశిలో వెలుగుతున్నాడు. సప్తరుషులు కాంతిలేకండా వున్నారు. సంవత్సరాని కొకసారి నక్షత్రానికి వెళ్లే శనీ, ఏడాదికొకసారి రాశిలోకివెళ్లే బృహస్పతీ విశాఖని సమీపిస్తున్నారు. సూర్యగ్రహణమూ, చంద్రగ్రహణమూ వొకదానితరవాత వొకటి పద్నాలుగు, పదిహేను, పదహారు, పదమూడురోజుల్లో వచ్చాయి.

"తల్లులతో కుమాళ్ళు సంగమం చేస్తున్నారు. రుతువుకాని రుతువులో పువ్వులు పూస్తున్నాయి. కాలంకాని కాలంలో కాయలు కాస్తున్నాయి. పన్నెండునెలలూ పళ్ళు పండుతున్నాయి. భూతాలు పక్షులతో కలిసి తింటున్నాయి. మూడేసి కొమ్ముల పశువులు పుడుతున్నాయి. నాలుగేసి, అయిదేసి కళ్ళూ, రెండేసి మేహనాలూ, రెండేసి తలలూ, రెండేసి తోకలూ కలిగిన జంతువులుపుడుతున్నాయి. పెద్ద పెద్ద కోరలతో వికారంగా అరుస్తున్నాయి. మూడుకాళ్ళ నెమళ్ళు పుడుతున్నాయి. నాలుగు కోరలతోనూ, కొమ్ములతోనూ గరుడపక్షులు పుడుతున్నాయి. బ్రహ్మవాదుల భార్యలు కూడా విపరీత సంతానం కంటున్నారు. నీపట్నంలోనే నెమళ్ళకి గరుడపక్షులు పుడుతున్నాయి. చిలకలు ఘోరంగా కూస్తున్నాయి. పసిపిల్లలు ఆయుధాలుపట్టుకు తిరగబడుతున్నారు. చెట్లమీద పద్మాలూ, కలవ పువ్వులూ పూస్తున్నాయి. అన్నిదిక్కులా గాడ్పులు చెలరేగుతున్నాయి; చెట్టూచేమా విరిచేస్తున్నాయి; దుమ్ము రేపుతున్నాయి. భూమి వొణుకుతూ వుంది.

"పూర్వం రుతువుల ప్రకారం పండుతూవున్న అన్ని పంటలూ ఇప్పుడు అపసవ్యంగా అవుపిస్తున్నాయి. యవలు ఆరుతలలు వేస్తున్నాయి. ధాన్యం నూరుతలలు వేస్తున్నాది. ఆవులు పాలకుబదులు రక్తం చేపుతున్నాయి. ఆయుధాలు మండుతున్నాయి. నీళ్ళు నిప్పులా అవుపిస్తున్నాయి. ఎక్కడ పడితే అక్కడ మృగాలు మండుతూన్న నోళ్ళతో అరుస్తున్నాయి. ఒక్క రెక్కా, వొక్క కన్నూ, వొక్క కాలూ కల వొకపక్షి ఆకాశంమీద ఎగురుతూ వుంది; నెత్తురు కక్కుతూ ఘోరంగా అరుస్తూవుంది.

"నల్లటి ఉత్పాత మేఘాలు దారుణంగా రాత్రుళ్లు రక్తం కురుస్తున్నాయి. మహానదులు రక్తంతో ఎరుపెక్కి పారుతున్నాయి. నూతులు నురుగులు కక్కుతూ ఆబోతుల్లాగ అరుస్తున్నాయి. ఇలాంటి దుర్నిమిత్తాలు వస్తే భూదేవి రాజులరక్తం తాగుతుందంటారు మహారుషులు. కైలాసపర్వతం మీదా, మందరపర్వతం మీదా, హిమాలయం మీదా పెద్దపెద్ద ధ్వనులు వినిపిస్తున్నాయి.

"బ్రాహ్మలు వేలుస్తూన్న అగ్నిహోత్రాలు నల్లగా, ఎర్రగా పసుపుపచ్చగా మండుతున్నాయి; భయంకరమైన శబ్దంచేస్తున్నాయి; దుర్గంధంతో ఎడమవేపు మంటలు సాగుతున్నాయి. కాకులు జెండాల మీద వాలి కాలం పండిందన్నట్టు 'పక్వాపక్వా' అని కూస్తున్నాయి. ఇదంతా స్పష్టంగా ప్రజాక్షయమే సూచిస్తూ వుంది. కనక యుద్ధం ముమ్మాటికీ తప్పదు. అలా అని వూరుకోడమూ కూడదంటాను. దురాత్ములైన దుర్యోధనుడూ మొదలైన నీకుమాళ్ళని మందలించు. నీతమ్ముడువంతు రాజ్యం అతడి కుమాళ్ళ కిచ్చి శాంతి స్థాపించు. అదే మంచిపని. మాలాంటివాళ్ళకి ఇష్టంగాలేనిరాజ్యం నీకుమాత్రం మెందుకంటాను!"

"నువ్వు నామేలుకోరే చెబుతున్నావు, నిజమే" అన్నాడు ధృతరాష్ట్రుడు - "నువ్వన్నదే ధర్మం కూడను అయితే నేనేం చేసేది? నయానా భయానా చెప్పిచూశాను నాకుమాళ్ళకి. లాభం లేకపోయింది. వాళ్ళని తిప్పడం నాచేతకాలేదు. దానికి శక్తిలేదు నాకు. నాతప్పులేదు. పాకం ముదిరిపోయింది."

"పోనీ, అదలా వుండనీ. ఇంకేమయినా అడగాలని వుంటే అడుగు" అన్నాడు వ్యాసముని. "అయితే యుద్ధంలో గెలుపు సూచించే శకునాలేవో తెలియచెయ్యి" అంటూ అడిగాడు ధృతరాష్ట్రుడు.

"అగ్నులు హోమకాలంలో పొగలేకండా మంచివాసనతో సవ్యంగా వెలగడమూ, భేరీలూ మొదలైనవి గంభీరంగా మోగడమూ, వాయువులు మృదువుగా అనుకూలంగా వీవడమూ మొదలయినవన్నీ శుభశూచకాలు. సైన్యం హెచ్చుగా వున్నంతమాత్రాన జయంకలుగుతుందనీ, తక్కువగా వున్నంతమాత్రాన అపజయం కలుగుతుందనీ లేదు. జయాపజయాలు దైవాధీనాలు. అందుకనే యుద్ధం కూడదంటారు పెద్దలు. సరే, నేను వెళుతున్నాను" అంటూ చెప్పి వెళ్ళిపోయాడు వ్యాసుడు.

వ్యాసముని వెళ్ళిపోయాక ఎంతోసేపు విచారిస్తూ కూచున్నాడు ధృతరాష్ట్రుడు. పెద్దనిట్టూర్పు విడిచి సంజయుడితో అన్నాడు:

"సంజయా, పూర్వకాలంనించీ భూమికోసం యుద్ధాలు చేస్తున్నారు రాజులు. ప్రాణాలు కూడా లక్ష్యపెట్టకండా వున్నారు. నిజంగా భూమంటే ఎంతతీపో కదా! వ్యాసముని అనుగ్రహంవల్ల సర్వమూ తెలుసు నీకు. భూమివిషయం తెలుసుకోవాలని వుంది వివరంగా కాస్త చెప్పు వింటాను."

"నాకు తెలిసినంతవరకూ చెప్తాను" అంటూ భూతత్వం చెప్పడం ప్రారంభించాడు సంజయుడు.

## భూతత్వం

"కదిలేవీ కదలనివీ అని ప్రాణులు రెండువిధాలు. మావిలో పుట్టేవీ, గుడ్లనించి పుట్టేవీ, చెమటలోంచి పుట్టేవి - ఇలా కదిలే ప్రాణులు మూడురకాలు. వీటిలో మావిలోపుట్టేవిశ్రేష్ఠం. అందు లోనూ మనుష్యులు మరీశ్రేష్ఠులు. మావిలో పుట్టినవాటిలో గ్రామ్య జాతులనీ అడవిజాతులనీ రెండురకాలు. ఆవులూ, మేకలూ, గొర్రెలూ గుర్రాలూ,గాడిదలూ, కంచరగాడిదలూ,మనుష్యులూగ్రామ్యజాతులు. పులులూ, పందులూ, మహిషాలూ, కోతులూ, ఏనుగులూ, ఎలుగు బంట్లూ, సింహాలూ అడివిజాతులు. ఇలా మొత్తం పద్నాలుగు జాతులు. గ్రామ్యజాతులలో మనుష్యులు శ్రేష్ఠులు. అడివిజాతులలో సింహాలు శ్రేష్ఠమైనవి.

"కదలనిప్రాణులు ఉద్భిజాలు. చెట్లూ, తుప్పలూ, తీగెలూ, గడ్డీ, త్వక్సారాలూ (తేగడా, చిత్రమూలం మొ.) అని ఉద్భిజాలు. అయిదురకాలు. ఇలా కదిలేవీ, కదలనివీ మొత్తం పందొమ్మిదీ. భూమీ మొదలయిన మహాభూతాలు అయిదూ కలిసి గాయత్రి అయినాయి. మహరాజా, ఈగాయత్రి తెలుసుకున్నవాళ్ళకి నాశన మంటూ వుండదు.

"ఇవన్నీ భూమిమీదే పుడుతున్నాయి. భూమిమీదే నాశన మవుతున్నాయి. అంచేత ప్రాణులన్నిటికీ మొదటినించీ భూమే ఆధారం. భూమికి ఎవడు అధిపతి అయితే ప్రాణులన్నిటికీ అతడే అధిపతి అన్నమాట. కనకనే రాజులు ప్రాణాలయినా లెక్కచెయ్య కుండా భూమికోసం పోరాడతారు.

"అంతేకాదు, మహాభూతా లయిదింటిలోనూ ఆకాశానికి శబ్దం వొక్కటేగుణం. గాలికి శబ్దమూ స్పర్శమూ రెండుగుణా లున్నాయి. అగ్నికి శబ్దమూ, స్పర్శమూ, రూపమూ వున్నాయి. నీటికి శబ్దమూ, స్పర్శమూ, రూపమూ, రసమూ వున్నాయి. భూమికి మాత్రం శబ్దమూ, స్పర్శమూ, రూపమూ రసమూ, గంధమూ—ఈఅయిదుగుణాలూ వున్నాయి. అంచేత పంచభూతాల్లోనూ భూమి గొప్పది. ఈభూమివివరం చెపుతాను విను.

"మేరువుకి దక్షిణంగా వొకపెద్ద జంబూవృక్షముంది. దాని పేరు సుదర్శనం, దానిపొడవు రెండువేల అయిదువందల యోజనాలు. రసం చిప్పిలుతూన్న పెద్దపెద్ద పళ్లతో ఎప్పుడూ కలకలలాడుతూ వుంటుందది ప్రతిపండూ రెండువేల అయిదువందల మూరలుంటుంది. అవి దభీదభీ చప్పుడుచేస్తూ అశేషపసిగా ఎల్లప్పుడూ కిందరాలి పగులుతూవుంటాయి. వాటిరసం నదీప్రవాహంలా తయారయి మేరువుని ప్రదక్షిణంచేసి ఉత్తరకురుభూములమీంచి ప్రవహిస్తూ సముద్రంలో కలుస్తుంది. ఆప్రవాహాన్ని జంబూనది అంటారు. జంబూనదిజలం తాగిన మానవుడికి ముసిలితనమూ, రోగమూ, దాహమూ వుండవంటారు. జంబూనది పడమట దట్టంగా పెరిగిన నేరేడుతోట లున్నాయి. అవి సముద్రంలా అవుపిస్తాయి. దీనంతటికీ కారణమయిన ఆజంబూవృక్షంపేర ఈద్వీపానికి జంబూద్వీపమనీ, సుదర్శనద్వీపమనీ అంటారు. దీనిచుట్టూ ఉప్పుసముద్రముంది.

"ఈదీవిమీద తూర్పుపడమర్లకి నిడుపుగా రెండుకొనలూ సముద్రాన్ని తాకుతూ హిమవంతమూ, హేమకూటమూ, నిషధమూ, నీలమూ, శ్వేతమూ, శృంగవంతమూ అని వరసగా ఆరు పర్వతా లున్నాయి. అవన్నీ రత్నాలతో అద్భుతంగా వుంటాయి. సిద్ధులూ, సాధ్యులూ, చారణులూ వీటిని సేవిస్తూవుంటారు, ఇటుమూడూ అటూ

మూడూ—ఆమధ్య మేరుపర్వతముంది. పద్మకోశంలా వుంటుం దది. బంగారంతోనూ, మణులతోనూ దివ్యంగా వుంటుంది. దాని పాతుడు పదహారు వేల యోజనాలని చెపుతారు, దానిపొడవు ఎనభై నాలుగు వేల యోజనాలంటారు. భూమికి మధ్యగావున్న ఆ మేరుపర్వతంమీద దేవేం ద్రుడూ మొదలయిన దేవతలూ, బ్రహ్మదేవుడూ యజ్ఞాలూ మొదల యిన పుణ్యకార్యాలుచేస్తూ సుఖంగా విహరిస్తూవుంటారు.

"దాని ఉత్తరభాగంలో కొండగోగువన ముంది. దానిలో పార్వతీపరమేశ్వరులు విహరిస్తూవుంటారు. వాళ్ళని సిద్ధులు సేవిస్తూ వుంటారు. జంబూద్వీపం తొమ్మిదిఖండాలు. ఉత్తరసముద్రానికీ శృంగ వంతపర్వతానికీ మధ్యభాగం ఐరావతవర్షం. శ్వేతపర్వతానికీ శృంగ వంతానికీ, మధ్యభాగం హైరణ్మయవర్షం. నీలపర్వతం ఉత్తరదేశం రమణకవర్షం; దక్షిణదేశం ఇలావృతవర్షం. మేరువుకి తూర్పుగా వున్నది భద్రాశ్వవర్షం; పడమట వున్నది కేతుమాలావర్షం. హేమ కంటకపర్వతానికి ఉత్తరంగావున్నది హరివర్షం. హిమవంతానికి అవత లిది కింపురుషవర్షం. ఇవతలిది భారతవర్షం. భారతవర్షంలో ఉత్త రానికి వెళ్ళినకొద్దీ ప్రజలలో బలసత్త్వాలూ ఆయురారోగ్యాలూ హెచ్చుగా వుంటాయి."

సంజయుడు చెప్పిందంతా విన్నాడు ధృతరాష్ట్రుడు. ఇంకావివ రాలు చెప్పమన్నాడు. సప్తద్వీపాలూ, సముద్రాలూ, వాటిపరిమా ణాలూ విశదంగా వివరించమన్నాడు. సంజయుడు మొదలుపెట్టాడు.

"జంబూద్వీపం విరివి ఎనభై వేల ఆరువందల యోజనాలు. ఉప్పునముద్రమూ, చెరుకుపానకంసముద్రమూ, కల్లుసముద్రమూ, పెరుగుసముద్రమూ, పాలసముద్రమూ,మంచినీళ్ళసముద్రమూ, నేయి సముద్రమూ- ఈఏడుసముద్రాల విరివీ జంబూద్వీపానికి రెండింతలయి వొకదాన్ని వొకటిమించివుంటుంది. ప్లక్షద్వీపమూ,శాల్మలద్వీపమూ,

క్రౌంచద్వీపమూ, కుశద్వీపమూ, శాకద్వీపమూ, పుష్కరద్వీపమూ–వీటివీటికికూడా జంబూద్వీపానికి రెండింతలై వొకదానినొకటి మించి వుంటుంది. ఈఆరుద్వీపాలూ జంబూద్వీపంకంటేఅన్నివిధాలా గొప్పగా వుంటాయి. ఎన్నో పర్వతాలతోనూ, రకరకాల నదులతోనూ, అనేక పట్నాలతోనూ వొకదాన్ని మించివొకటి వుంటుంది. దీనంతటికీకర్తా, భర్తా, హర్తా శ్రీమహావిష్ణువు. వినోదపరాయణుడైన ఆమహానీయుడు పాలసముద్రం ఉత్తరాన, మనోజవంకలిగిన ఎనిమిది చక్రాల బంగారం బండిమీద విహరిస్తూ వుంటాడు."

ధృతరాష్ట్రుడు : అయితే సంజయా, ఈభారతవర్షంకోసంకదా, కౌరవులూ పాండవులూ యుద్ధానికి తెగించారు! నిజానికి దుర్యోధను డెంతలుబ్ధుడో, పాండవులూ అంత లుబ్ధులుగానే వున్నారు!

సంజయుడు : పాండవులు లుబ్ధులుకారు మహారాజా, నీకొడుకులే లుబ్ధులు. వాళ్ళకది శకునినేర్పుతూన్న విద్య. అతడి మంత్రాంగంలోపడే దుర్యోధనుడు ఇంతచేటు తెచ్చుకున్నాడు. తమతమ దేశాలకోసం మీఅండతో పాండవుల్ని గెలవాలన్న పూనికతోనే వచ్చారు కొంతమంది రాజులు, ఎక్కడాలేని కట్టుకట్టి. వాళ్ళనిమాత్రం అనవలిసినపనేముంది? భూమికోసమని పూర్వంకూడా ఎంతోమంది రాజులు ఇలాగే యుద్ధాలుచేశారు. భగీరథుడూ, రఘువూ, యయాతీ, నహుషుడూ–ఈమహారాజులు యావన్మందీ ఈభూమిమీదే అంత ప్రసిద్ధులయారు, యుద్ధాలుచేసి.

"భారతవర్షం మహాసంపదలకి ఆస్థానభూమి. దీనికాసపడని వాడెవడు? దీనికోసం ప్రాణాలు లెక్కచెయ్యకండా యుద్ధాలుచెయ్యనివాడెవడుంటాడు. దీనివిస్తారమూ అదీ చెపుతాను విను మలయమూ, శుక్తిమంతమూ, వింధ్యా, పారియాత్రమూ, మహేంద్రమూ, ఋక్షవంతమూ, సహ్యమూ అని ఏడు కులపర్వతాలున్నాయి. వీటిమీకే

రకరకాల మణులు కావలసినన్ని సంపాదించవచ్చునంటే ఇక గనుల గురించి చెప్పనే అక్కరలేదు. ఇవికాక ఇంకా ఎన్నో అన్ని పర్వతా లున్నాయి. వాటిలో ఇనుమూ, రాగీ, తగరమూ, వెండీ, బంగారమూ లెక్కాజమాలేకండా దొరుకుతుంది. వీటివల్ల కలిగే సంపద ఇంతా అంతా అని కాదు. ఇంతే కాక అక్కడక్కడ ఎన్నో గనులూ వున్నాయి. నేర్పూ సామర్థ్యమూ వుంటేచాలు, అన్యాయానికి పోకుండా ఈకొండల లోంచే ఎంతోధనం సమకూర్చుకోవచ్చు.

తరవాత గంగా, తుంగభద్రా, వేత్రవతీ, వేగవతీ, కృష్ణవేణీ, పెన్నా, యమునా, తమసా, శరావతీ, కావేరీ, గోదావరీ, నర్మదా, బాహుదా, సరయూ, శతద్రువూ, వితస్తా, విపాశా, తామ్రపర్ణీ — ఈమహానదులూ, చిన్నవీ పెద్దవీ ఇంకాఎన్నో నదులూ ఉపనదులూ వున్నాయి. వీటివల్ల నానాముఖాల ధనధాన్యాలు ఎన్నో లభిస్తాయి. అక్కడక్కడ దట్టమయిన ఎన్నోఅన్ని అడవులున్నాయి. చాకచక్య ముంటే వాటిల్లోంచి ధనం సంపాదించడానికి వెయ్యిమార్గాలున్నాయి.

"ఇక పాంచాలమూ, పాండ్యమూ, బర్బరమూ, వత్సమూ, మత్స్యమూ, మగధా, మలయాళమూ, కళింగమూ, కుళింగమూ, కుకురమూ, కొంకణమూ, టెంకణమూ, త్రిగర్తమూ, సాముద్రమూ, సాళ్వమూ, శూరసేనమూ, సుదేష్ణమూ. సుహ్మమూ, కురూ, కరూ శమూ, కాశమూ, కోసలమూ, యవనమూ, యుగంధరమూ, ఆంధ్రమూ, సింధూ, చేదీ, చోళమూ, పుళిందమూ, పుండ్రకమూ, ఆభీరమూ, సౌవీ రమూ, సౌరాష్ట్రమూ, మహారాష్ట్రమూ, విదేహమూ, విదర్భా, ద్రవి ళమూ, దశార్ణమూ, కర్ణాటకమూ, గౌళమూ, అంగమూ, వంగమూ, మరాటమూ, లాటమూ, బాహ్లీకమూ, బహుదానమూ, కిరాతమూ, కేకయమూ, అశ్మంతకమూ, కాశ్మీరమూ, గాంధారమూ, కాంభో జమూ, కేరళమూ, మాళవమూ, నేపాళమూ, ఘూర్జరమూ, కుంత

లమూ, అవంతికమూ, అనూపకమూ—ఈ దేశాలన్నీ వున్నాయి. సమస్తమైనవస్తువులూ ఈదేశాల్లో లభ్యమవుతాయి. పురుషార్థాలయిన ధర్మమూ, అర్థమూ, కామమూ వీటివల్ల సాధించవచ్చు.

“తెలుసుకోవలసినవన్నీ తెలుసుకుని దయా ధర్మం తప్పకండా రాబళ్ళు గ్రహిస్తూ పరిపాలించే రాజుకి భూమి నిజంగా కామధేనువులా కావలసినవన్నీ సమకూరుస్తుంది. అయితే సర్వం తెలిసీ, కావలసినంత బలం కలిగీ రాజులు తమ కింత రాజ్యం వుందికదా అని తృప్తి పడరు. తండ్రీ, కొడుకూ, అన్నా, తమ్ముడూ అనకండా వొకళ్ళమీద వొకళ్ళుకత్తి కడతారు. మాంసంకోసం కాట్లాడే కుక్కలలాగ భూమి కోసం పోట్లాడతారు. అంచేత మహారాజా, ఈ భూమికోసం నీకొడుకులూ, పాండవులూ యుద్ధంచేస్తున్నారంటే ఇందులో చిత్రమేమీ లేదు. దైవం ఎవళ్ళదిక్కు మొగ్గితే వాళ్ళకే దక్కుతుంది రాజ్యం. దీని కోసం విచారం పెట్టుకునీ లాభంలేదు.

ఇలా సంజయుడు చెప్పిన భూతత్వం విన్నాక అతణ్ణి యుద్ధభూమికి వెళ్ళిరమ్మన్నాడు. ధృతరాష్ట్రుడు ఆప్రకారం కురుక్షేత్రం వెళ్ళాడు సంజయుడు, యుద్ధంచూసి, కొన్నాళ్లయాక తిరిగి హస్తినాపురం వచ్చాడు. అంతవరకూ కొడుకుమీదే బెంగపెట్టుకుని విచారిస్తూ కూచున్నాడు ధృతరాష్ట్రుడు. రాగానే అతడిపాదాలమీద పడి యుద్ధంలో భీష్ముడు పడిపోయాడంటూ చెప్పి గోలుగోలుమన్నాడు సంజయుడు.

“మహారాజా, వొకనాడూ రెన్నాళ్ళూ కాదు, పదిరోజులపాటు మిట్టమధ్యాహ్నం సూర్యుడిలా ప్రకాశించాడు; పాండవసైన్యాలు చీకట్లలా ముంచుకువస్తూనే వున్నాయి, ప్రచండమైన కిరణాలవంటి బాణాలతో వాటిని ఈపదిరోజులూ పటాపంచలుచేశాడు; చివరికి అయ్యో! అస్తమించిపోయాడు భీష్మభానుడు. తన యోధులందరికీ

ఆధారంగా వుండే తనకి బాణాలే ఆధారమయాయి. పరశురాముడితో సమానుడయిన వీరుడికి శిఖండిచేత భంగపాటుకలిగింది. దుర్యోధనుడు తనని నమ్ముకునే జూదమాడాడు; ఇపుడు ఆ నే యుద్ధవుజూదంలో వోడిపోయాడు భీష్ముడు. తనకేక వింటే వాడలెత్తేది శత్రువులకి, వాళ్ళ కళ్ళుముందే, వాళ్ళునవ్వుకునేట్టు కిందపడిపోయా డిపుడు.

"విధి ఎంతన్నా చేస్తుంది! పదివేలమంది రాజులు తననెదిరించి వోడిపోయారు. అలాంటిమహారథుణ్ణి శిఖండిమాత్రుడు పడగొట్టాడు! భీష్ముడంటే సామాన్యుడా? ఘోరస్వరూపుడు! ధనుస్సే అతడి మొహం. ఆయుధాలే అతడికోరలు. బాణాలేగోళ్ళు. ఖడ్గమేనాలుక. ఆభయంకరమూర్తి నరసింహమూర్తే, కాని నరమాత్రుడు కాడు. అంతవాడూ ఆఖరికి హతవారి పోయాడు!" అంటూ పనివి పనివి ఏడవడం మొదలెట్టాడు.

భీష్ముడు పడిపోయాడనడంతోటే గుండె ఝల్లుమంది ధృతరాష్ట్రుడికి. వెంటనే మూర్ఛపోయాడతడు. శీతలోపచారాలుచేశాకకొంత సేపటికి కాని తేరుకోలేదు. దృష్టిలేని అతడి రెండుకళ్ళనించీ కన్నీళ్ళు ధారలుకట్టాయి. గద్గదికమయినకంఠంతో ఏడవడమారంభించాడతడు: "దేవతలూ రాక్షసులూ యావన్మందీ వొక్కటైవచ్చినాముప్పుతిప్పలు పెడతాడు భీష్ముడు, సంజయా! శిఖండిబాణాలపాలయిపోయాడా? ఏమిటీ ఘోరం! అతడి తాళధ్వజం కిరణాల మెరుపులే మెరుపులు. ధనుష్టంకారం నిజంగా వురుములు. దావానలంలా విజృంభించే శత్రుసేనమీద అతడి బాణాలు జడివాన. అతడు మహామేఘం. అలాంటి భీష్ముణ్ణి—అయ్యో దేవుడా! శిఖండి అనే కృత్రిమవాయువా హతవార్చింది! తండ్రీ, దేవవ్రతా! పాండవసముద్రం ఉప్పొంగినప్పుడు తల దాచుకుందికి మాకు నువ్వే దీవివని నమ్మాము. తుచ్ఛమయిన శిఖండి గుంటలోనే మునిగిపోయావు నువ్వు. ఇంక మాకు దిక్కేమిటి?

"వీరరసమే జలరాసి. బాహువులే ఉగ్రమైన జలచరాలు. గదా, ధ్వజమూ మొదలైనవి పర్వతాలు. బాణాలే తరంగాలు. భీష్ముడు సముద్రం. అలాంటి మహాసముద్రం శిఖండిలాంటిసామాన్యుడు ఎలా ఈదగలిగాడూ అంట! అంబకోసం అంత పంతంతో వచ్చి సాధించలేకపోయాడు పరశురాముడు. అలాంటి భీష్ముణ్ణి శిఖండీ! పాండవులకోసం వచ్చి ఇట్టే హతవా(ర్చావు!

"ఆశౌర్యానికి నాశనంలేదని నమ్మాము. ఆసత్యం తిరుగులేందనుకున్నాము. ఆశీలమూ, ఆపరాక్రమమూ, ఆభయంకరత్వమూ, ఆశుద్ధచరిత్రమూ మాసిపోవనే ఆశించాము. అన్ని ఆశలూ అడియాసలయిపోయాయి" – ఇలా పనివిపనివి ఏడుస్తూ సంజయుడి రెండు చేతులూ పట్టుకున్నాడతడు.

"సంజయా, చెప్పూ, మాబాబయ్య అలా పడిపోయినప్పుడు ఎవ్వరూ అడ్డంరాలేదూ? అన్ని అక్షోణీలసేనా మాట్టాడకుండా చూస్తూనుంచుందా? ఆయన్ని ఎవరూ గెలవలే రనుకున్నాం. అంత మీరిపోయిందా శత్రుసేన? ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, శల్యుడూ తొలిగి పారిపోయారా? పాండవులూ, శిఖండీ తాత మీద విరుచుకుపడుతూంటే నాకొడుకులందరూ ఏంచేస్తున్నారు? చెల్లా చెదురయి అడివిపట్టిపోయారా? అయ్యో, ఎంతపనిజరిగిపోయింది! భీష్ముడు పడిపోయాడంటే ఇంకేముంది? అంతా పడిపోయిందనేలెక్క.

"ఆ, కురుకులవృద్ధుణ్ణి, నిర్మలచరిత్రుణ్ణి, భీష్మపితామహుణ్ణి చంపి రాజ్యం ఏలుకోడానికి తెగించారు పాండవులు! దేవుడూ వాళ్లకే తోడయాడు. ధర్మం వెనకపడి అధర్మం పెరిగిపోయినట్టయింది. తాతనిచంపి రాజ్యంపుచ్చుకోడం ఎంత నిష్ఠురం! అతణ్ణి చంపుకుని సంపదకోసం పోరాడడం! ఇంతకంటే పాపమే ముంటుంది?

కులా లన్నిటిలోకీ రాసకులం క్రూరమైంది. ఏకులంలో అయినా పుట్టి వచ్చు, కాని రాసకులంలో పుట్టకూడదు.

"అయ్యో, భీష్ముడులేని నాసేన భర్తలేని స్త్రీ లా అయి పోయింది. కుమాళ్ళు ఎంతబెంగపెట్టుకుని ఎలావున్నారో! ఎవరేమయి పోయారో ఇంకా ఏమయిపోతారో! రాజులూ, మంత్రులూ అని పించుకుంటున్న ఆజూదగాళ్ళు ఏమిటి భావిస్తున్నారో! ఏవిధంగా బోధిస్తున్నారో! ఇకమీద యుద్ధానికి ఆధార మెవరో!" అంటూ పొంగిపొంగి వస్తూన్న దుఃఖం ఆపుకుంటూ సంజయుడి చేతులు విడిచి పెట్టి ఇలా ప్రశ్నించాడు.

"సంజయా, యుద్ధమెలాజరిగింది? పదిదినాలూ ఉభయసేనలూ ఎలా ఎదురుకున్నాయి? ఎవ్వరెవ్వరు ఎప్పుడెప్పుడు ఏమేమిటిచేశారు? ఇన్నాళ్ళూ భీష్ముడెలా యుద్ధంచేశాడు? తుదకి ఎలా పడిపోయాడు? చెప్పు, అంతా వివరించి చెప్పు. భీష్ముడు పడిపోయాడన్న దుర్వార్త విన్న నాపాడుచెవ్వులు ఇంక ఏది వినడానికైనా సిద్ధంగానేవున్నాయి. దుర్నీతికి పుట్టినిల్లు నేను. నేను వినకపోతే ఎవరు వింటారు? నాగుండె రాయే అయిపోయింది. చెప్పు, అన్నీవింటాను" అన్నాడు.

"నువ్వన్నట్టు నీఅవినీతే ఇంతా తెచ్చింది" అంటూ అందు కున్నాడు సంజయుడు — "ధర్మాత్ములయిన పాండవులికి ఇన్నిపాట్లూ వచ్చాయి. అంతచేసి ఇంత తెచ్చుకున్నావు. చెడ్డచేసినవాళ్ళకి తప్పకుండా చెడ్డేవస్తుంది; సందేహంలేదు. మంచీచెడ్డా అనకండా విను. వినడా నికేకదా, నన్ను యుద్ధభూమికి పంపావు. వేదవ్యాసమునీంద్రుణ్ణి తలుచుకుంటాను. భక్తితో ఆయన పాదాలికి నమస్కరించి యుద్ధ వార్తలు వినిపిస్తాను. ఉన్నతమైనవాణ్ణి, మేఘంలాంటి శరీరచ్ఛాయ కలవాణ్ణి, ఉజ్వలమైన దండం ధరించినవాణ్ణి, గోరోజనంకాంతికలిగిన జటాజూటంకలవాణ్ణి, వేదార్థాలు నిరూపించినవాణ్ణి, కృష్ణమృగచర్మం

ధరించినవాణ్ణి, భరతవంశకర్తని, దేవతలు పూజించేవాణ్ణి, సత్యవతీ దేవి కుమారుణ్ణి వ్యాసమునీంద్రుణ్ణి సేవిస్తున్నాను" అంటూ వ్యాసుణ్ణి మనసులో నిలుపుకుని యుద్ధవార్త లారంభించా డతడు.

## కురుక్షేత్రం

"మహారాజా, నేను కళ్ళారా చూసిందీ, చెవులారా విన్నదీ, మునికృపవల్ల నాకు అవగతమయిందీ - యావత్తూ పూసగుచ్చినట్టు విస్తరించి చెప్తాను. సావధానంగా విను.

"ఆరాత్రి నీదగ్గిర సెలవుతీసుకున్నాను. తిన్నగా కురుక్షేత్రం వెళ్ళాను. మనసైన్యశిబిరంలో నీకొడుకుకోసం ప్రత్యేకంగా నియమించిన రాజగృహంలో సముచితంగా ప్రవేశించాను. భీష్ముడూ మొదలయిన కౌరవప్రముఖులూ, తగిన రాజులూ చుట్టూవున్నారు. దుర్యోధనుడు తగిన ఉన్నతాసనంమీద ఆశీనుడై వున్నాడు. నన్ను చూడడంతోనే ఆదరించాడు. నేను కొలువులో కూచున్నాను. యుద్ధవిషయమే ఆలోచన జరుగుతూవుం దప్పుడు. దుర్యోధనమహారాజా దుశ్శాసనుణ్ణి చూసి ఇలా అన్నాడు.

"తమ్ముడూ, ఎంతోకాలంనించీ ఎదురుచూస్తున్నయుద్ధం, పాండవులికీ మనకీ ఇన్నాళ్ళకి జతపడింది. ఇక ముఖ్యంగా మనం చెయ్యవలసినపని చెప్తాను, విను. అందరిలోకీ మనకి ముఖ్యమైనవాడు భీష్ముడు తాతయ్య. కంటికి రెప్పలాగ అన్నివిధాలా ఆయనని మనం కాపాడుకోవాలి. ఆయనని భద్రంగా చూసుకుంటే చాలు. పగవాళ్ళ పనిపట్టేస్తా డాయన. అందరినీ కాపాడవలసినవాడే ఆయనకదా! ఆయనని కాపాడడమేమిటని అనుకునేవు. అది కాదు, విను, చెప్తాను. ఇది వినవలసిందే కూడాను. అవాళ మనం యుద్ధానికి ప్రయత్నాలుచేస్తూవున్నప్పుడే చెప్పాడాయన, 'నాముందు యుద్ధంలో ఎవ్వరూ బతికి

బయటపడతారని మాత్రం నమ్మకండి. ఎవ్వరూ నన్ను గెలవలేరు, కాని వొక్క శిఖండి మాత్రం గెలుచుకుంటాడు. అతడిదగ్గిర గడ్డిపోచేఅయిపోతాను నేను' అని. రక్షణలేకండా ఏమరుపాటుగావుంటే సింహాన్నయినా నక్కవంటిది వోడగొడుతుంది. కనక నే యుద్ధంలో భీష్ముణ్ణి కాసుకుతిరగకపోతే శిఖండిచేత దెబ్బతినడం తప్పదు. నిజంగా ఇలాంటిదే నిద్రపోతున్న పెద్దపులిని గొర్రె చంపడమంటే. అంచేత మంచి దిట్టమైన రథికుల్ని తాతయ్యగారి రక్షణకోసం పెట్టాలి. మీరంతా మీ సైన్యాలతో సహా శిఖండిని చుట్టడిస్తూవుండాలి' అని చెప్పి అవాళకి కొలువుచాలించాడతడు.

మర్నాడు తెల్లవారాక దుర్యోధనమహారాజు సేననాయకులని పంపి ఎంపికయిన వీరులనీ సేనలనీ యుద్ధానికి సిద్ధపరిచాడు. దాంతో ఎక్కడలేని కలకలమూ ఆరంభమయింది. శంఖాలూ, దుందుభులూ మొదలయిన మంగళవాద్యాలూ అవీ సిద్ధంచెయ్యండని ఆయా పరివారాల నాయకులు హెచ్చరించారు. వాళ్ళ గంభీరమైన పలుకులూ, కట్లువిప్పి తెస్తూవున్న ఏనుగులఘీంకారాలూ, గుర్రాల సకిలింపులూ, పూన్చడానికి లాక్కువస్తూన్న రథాల చక్రఘోషలూ, వొకళ్ళనొకళ్లు పిలుచుకుంటూన్న సైనికుల కేకలూ - అన్నీ కలిసి శిబిరం శిబిరమంతా చంద్రోదయంతో ఘూర్ణిల్లిపోయే మహాసముద్రంలా అనిపించింది. సూర్యోదయం కావడంతోనే సైన్యాలు రణరంగానికి నడిచాయి. బంగారంభూషణాలతో ఏనుగులు దావాగ్నిమంటలతో వున్న కొండల్లా అవుపించాయి. పరుగు లురుకుతూ సకిలిస్తూవున్న గుర్రాలు సముద్రతరంగాల్లా కనిపించాయి. వాహనాలతోనూ, అలంకరణాలతోనూ వరసలుతీరి రథాలు కదులుతూవుంటే ఊళ్ళకివూళ్లు కదులుతున్నట్టనిపించింది. బింకాలుపలుకుతూ భటులు నడుస్తూవుంటే దాక్షసమూహాలు పయనిస్తున్నట్టు అవుపించింది.

తెల్లటి ధోవతీ, తెల్లటి రథమూ, తెల్లటి గుర్రాలూ, తెల్లటి ధనుస్సూ, బంగారం తాటిచెట్టుతో రెపరెపలాడుతూన్న పతాకమూ, బంగారం కవచమూ, తెల్లగొడుగూ – ఈఅన్నిటితోనూ గంగాపుత్రుడైన భీష్ముడు సముద్రంలాంటి ఆ కౌరవసేనకి పూర్ణచంద్రుడిలా అవుపించాడు.

తన చతురంగబలాలు పురికొలుపుతూ సమరోత్సాహంతో, ధగధగా మెరిసిపోతూవున్న బంగారం వేదికపతాకంరథంమీద బయలుదేరివచ్చాడు ద్రోణాచార్యులు. అలాగే బంగారం ఆబోతు పతాకంతో కృపాచార్యులూ, మణులుచెక్కిన సింహంతోకజెండా రథంమీద అశ్వత్థామా, రత్నాల నాగేటిచాలుజెండాతో మద్రరాజు శల్యుడూ నవ్వుతూ, వీరాలాపాలాడుతూ ఎవళ్లబలంతో వాళ్ళు యుద్ధానికిపయనమైవచ్చారు. తక్కిననాయకులూ ఎవళ్లకితగినసన్నాహాలతో వాళ్ళు తమతమ సైన్యాలువేసుకుని, వాళ్లవాళ్లజెండాలతోనూ, వాటితోనూ తర్లివచ్చారు. దృఢమైన చతురంగబలాలతో బ్రహ్మాండమైనయాదవసైన్యంవెంటపెట్టుకుని కృతవర్మా, బంధువులూ తానూకలిసి పెద్దరథసైన్యంతో జయద్రథుడూ, అనంతమైన చతురంగసేనలతో దిక్కులు కంపించినట్టు విందానువిందులూ, కళింగమహారాజూ, భగదత్తుడూ, ఎన్నోఅన్ని గుర్రపుదళాలు వేసుకుని కొడుకులూ, తమ్ములూ యావన్మందితో కలిసి మీబావ శకునీ, ఎంతోఅంత కాల్బలం వెంటపెట్టుకుని కుమారుడు సోమదత్తుతోనూ, మనమడు భూరిశ్రవసుడితోనూ కలిసి దేవేంద్రుడిలాగ బాహ్లికుడూ బయలు దేరారు. వాళ్ళందరినీ చూస్తూవుంటే కన్నులపండువుగా వుండేది మీసేనలకి.

అలాగే కాంభోజంరాజు సుదక్షిణుడూ, కోసలంరాజు బృహద్బలుడూ, మాహిష్మతీపురంరాజు నీలుడూ, త్రిగర్తరాజు సుశర్మా, రాక్షసరాజులు అలంబసుడూ, హాలాయుధుడూ, సౌవీర, శూరసేన,

ఆభీర, యవన దేశాల రాజులూ యావన్మందీ తమతమ చతురంగ బలాల తోనూ, తమతమ జెండాలతోనూ, రకరకాల ఆభరణాలతోనూ బయలు వచ్చారు. అందరి మొహాల్లోనూ యుద్ధంకోసం ఉత్సాహం ప్రకాశిస్తోంది.

ఇలా పదిఅక్షౌహిణీల మహాసైన్యం నడిచింది. పదకొండో అక్షౌహిణీతో దుర్యోధనమహారాజు బయలుదేరాడు. ధగధగా వెలిగి పోతూవున్న రత్నభూషణాలు వేసుకుని మదపుటేనుగుమీద కూచున్నాడతడు. తెల్లగొడుగులూ, నగలలోని వజ్రాలకాంతులూ, చామరాలూ, ఎన్నోరత్నాలతో మెరిసిపోతూవున్న నాగపతాకమూ—మహారాజా, చూసిందికి రెండుకళ్ళూ చాలవనిపించాడు రారాజు.

రెండుపక్కలా వాహనాలూ, గొడుగులూ వేసుకుని జిగేలు జిగేలుమంటూన్న తమతమ జెండాలతో దుశ్శాసనుడూ, దుర్మర్షణుడూ, వివింశతీ, వికర్ణుడూ మొదలయిన నూరుగురు తమ్ములూ దుర్యోధనుణ్ణి చుట్టుముట్టినడిచారు. కోదండాలూ, గదాదండాలూ, ఈటెలూ, బాకులూ, ముసలాలూ, ముద్గరాలూ, తోమరాలూ, గండ్రగొడ్డళ్ళూ, గుదియలూ, శూలాలూ మొదలైన ఆయుధాల తోనూ, బంగారంపనితనం కల కవచాలతోనూ, చిత్రవిచిత్రాలయిన కిరీటాలతోనూ, నవరత్నాలుతాపిన జెండాలతోనూ—ఇలా బయలు వెళ్ళిన కౌరవసేన ఎంత అందంగావుందో అంత భయంకరంగానూ అవుపించింది. వీరులభూషణాలలోని వజ్రాలకాంతులు హంసల్లాగా, మాణిక్యాల కాంతులు పద్మాల్లాగా, ఇంద్రనీలమణుల కాంతులు తుమ్మెదలలాగా అయి కౌరవసైన్యం పెద్ద ఎర్రతామరల సరోవరంలాగ కనిపించిందంటే నమ్మ.

అప్పుడు సర్వసేనాని భీష్ముడు రాజులు యావన్మందినీ పిలిచి హెచ్చరించాడు :

'వీరులారా, యుద్ధమంటే రాజులకి తెరిచిన స్వర్గద్వారమన్న మాట. ఈ ద్వారంలోంచే ఎందరో మహామహులు వెళ్ళారు. మీరూ ఈ దారినే నడవడం గొప్పవిషయం. రాజన్నవాడు ఇంట్లో మంచంపట్టి చవ్వడంకంటే మరో పాపంలేదు. నిజంగా యుద్ధం మనకి పంటకళ్ళం లాంటిది. ఇది లభించడమూ నిధి లభించడమూ వొక్కటే' అన్నాడు.

ఈ హెచ్చరికకి రాజులందరూ తలవూపారు. ఎవళ్ళకితగినట్టు వాళ్ళు ఉత్సాహంతోనూ ఉద్రేకంతోనూ మాటఇచ్చారు. వీర దర్పంతో ఎవళ్ళ సేనల్లోకివాళ్ళు వెళ్ళిపోయారు. అనంతరం దుర్యోధనుడితో భీష్ముడిలా అన్నాడు: 'ఇదిగో, నేను యుద్ధంచేస్తున్నంత సేపూ కర్ణుడుమాత్రం యుద్ధంలో అడుగుపెట్టకూడదు. అతడేకాదు, అతడి కుమారుళ్ళూ అతడి బంధువులూ, అతడిమంత్రులూ కూడా రాకూడదు. ఇది స్పష్టంగా చెపుతున్నాను.

దీనికి దుర్యోధనుడు నొచ్చుకోలేదు, పైగా సంతోషించాడు కూడా, 'అవును, పంతంపట్టి మరొకడు యుద్ధానికి రాకూడదంటే, మీబలమూ మీ తెగువా స్పష్టంగా కనిపిస్తున్నాయి. మహానందంగా వుంది నాకు' అంటూ తాతగారిని పొగిడాడతడు. నిజంగా భీష్ముడలా భీష్మించి యుద్ధానికి పూనుకోడంతోనే ఉప్పొంగిపోయాడు రారాజు. తమ్ముళ్లతోసహా అతడిచుట్టూ చేరాడు. తనసైన్యంతో మంచివ్యూహ మొకటి నిర్మించమనీ కోరాడు.

అప్పుడు పడమటిదిక్కు తిరిగాడు భీష్మసేనాని. తాళధ్వజంతో తాను సైన్యానికంతకీ ముందునుంచున్నాడు. తనతో ద్రోణాచార్యుల్ని నుంచోపెట్టాడు. కుడితట్టు కృపుణ్ణీ, అశ్వత్థామనీ నుంచోపెట్టాడు. ఎడమదిక్కు కృతవర్మనీ, శల్యుణ్ణీ పెట్టాడు. వెనక బాహ్లికుణ్ణీ, భూరిశ్రవసుణ్ణీ, సోమదత్తునీ వుంచాడు. సైన్యంమధ్య కౌరవకుమారుళ్లందరితోనూ కలిపి దుర్యోధనుణ్ణి పెట్టాడు. అతడిముందర 'అర్జునుణ్ణి చంపుతాం.

లేదా చస్తాం' అంటూన్న సుశర్మా మొదలయిన పదివేలమందిని దిట్టమైన సంశప్తరథికుల్ని నుంచోపెట్టాడు. సైన్యమంతటా అక్కడక్కడ తగినయోధులుండేట్టు ఏర్పాటుచేశాడు. ఒక్కొక్కసైన్య దళానికిముందు ఏనుగులూ, ఏనుగులకి దన్నుగా రథాలూ, రథాలకి దన్నుగా గుర్రాలూ, గుర్రాలకిదన్నుగా విండ్లవాళ్ళూ, విండ్లవాళ్లకి దన్నుగా కత్తీ డాలూ పట్టుకున్న బంట్లూ నిలబెట్టాడు. ఇలా అభేద్యమైన మానుషవ్యూహం తయారు చేశాడు భీష్మసేనాని. ఆవ్యూహంచూసి మనసైన్యంలో రాజులుయావన్మందీ ఆశ్చర్య పోయారు. ఎప్పుడూ ఎక్కడా ఇంత దృఢమైనవ్యూహం కనీవిని ఎరగమన్నారు వాళ్లు. అందరిమొహాల్లోనూ సంతృప్తీ, సంతోషమూ తాండవించాయి.

ఇక పాండవసైన్యం: బ్రహ్మాండమైనసైన్యంతో కదలివచ్చాడు ధర్మరాజు. అతడిసైన్యంలోని ఏనుగులమదంకోసం తుమ్మెదలు గుంపులుగుంపులుగా ఎగిరివచ్చాయి. వాటినిచూస్తూవుంటే ఆసైన్యం మీద నల్లగొడుగు పట్టారా అనిపించింది. గుర్రాలడెక్కలతో రేగిన ధూళి స్వర్గంలో అప్సరసల కుంకమూ, కర్పూరమూ మొదలైన చూర్ణంతో వియ్యమందినట్టయింది. జెండాలమీది మణులకాంతులు సూర్యకిరణాలనిమించిపోయాయి. జైత్రభేరీలధ్వనులుపర్వతగుహలలో ప్రతిధ్వనించాయి. రథఘోష చిరుగంటల ఝుణఝుణలతో ఆకాశం నిండా ఎంత అందంగా వినిపించిందో అంత భయంకరంగానూ అనిపించింది. సైనికుల ఆయుధాలు తళతళలాడుతూ అన్నిదిక్కులూ వెలిగించాయి. అలా తర్లివచ్చాడు ధర్మరాజు.

పదాతిసైన్యంతో బుజాలుపొంగించుకుంటూవచ్చాడు భీముడు. ఆనందం అతడి మొహానికి అదో కొత్తదనం తీసుకువచ్చింది. గదా మొదలైన ఆయుధాల కాంతులూ అతడు ధరించిన భూషణాలు

కాంతులూ ఇవన్నీ కలిసి చిత్రంగా అవుపించాయి. యుద్ధక్రీడకని అలా ఉజ్జ్వలంగా వచ్చాడతడు.

ఇక అర్జునుడో - అతడి దివ్యరథం పద్మరాగమణులలా ప్రకాశించింది. తెల్లగుర్రాలు వజ్రాలలా ప్రకాశించాయి. నొగలమీద శ్రీకృష్ణుడు ఇంద్రనీలమణులలా ప్రకాశించాడు. జెండామీద వానరం గరుడపచ్చలలా ప్రకాశించింది. తూణీరాలలో బాణాలుమరకతాలలా ప్రకాశించాయి. ఇలా రోహిణాద్రిలా వెలిగిపోతూ రణస్థలానికి వచ్చాడతడు, దేవదత్తంపూరిస్తూ. అతడి గాండీవం హరివిల్లు. దివ్యకిరీటంకాంతులు మెరుపులు. ధనుష్టంకారం గర్జన. శరీరకాంతి అసలే నలుపు. ఇలా కారుమేఘంలా ఎంతోగొప్పగా అవుపించాడు. అతడితో చెప్పశక్యంకానంత రథసైన్యం తర్లివచ్చింది.

రణోత్సాహంతో ముందుకి వురుకుతూన్న పెద్ద గుర్రపుసైన్యంతో వచ్చారు నకులసహదేవులు. మంచివాహనాలమీద పరస్పరం యుద్ధంగురించి మాట్లాడుకుంటూ ఆఇద్దరూ వస్తూవుంటే మహానందంతో చూశారు రాజులు.

రభసంతో కలగుండుపడిపోతూవున్న రణక్షేత్రానికి చిన్న ఏనుగుగుంపులాగ ద్రౌపదికుమార్లూ, అభిమన్యుడూ వచ్చారు. గుర్రాలసైన్యం వెంటవేసుకుని. అలాప్రతివింద్యుడూ, శ్రుతసోముడూ శ్రుతకీర్తి, శతానీకుడూ, శ్రుతసేనుడూ, అభిమన్యుడూ తమనాయకత్వం వహించి రావడంతోనే సంతోషంపట్టలేకపోయారు పాండవసైనికులు.

ఏనుగులసందడితో పెద్దరాణువ వెంటపెట్టుకుని దురుసుగా వచ్చాడు ద్రుపదమహారాజు. దుర్భేద్యమైనసైన్యం వేసుకుని తమ్ముల తోనూ, కుమార్లతోనూ కదిలివచ్చాడు విరాటరాజు. యాదవసైన్యంతో భూమి గజగజలాడిస్తూ వచ్చాడు సాత్యకి. ప్రతాపవాక్యాలు పలుకుతూన్నవీరుల్ని చుట్టబెట్టుకువచ్చాడు చేకితానుడు.

ఒకళ్లనొకళ్లు పరియాచికాలాడుకుంటూవున్న గుర్రపురౌతులు తనకి దన్నుగా నడుస్తూవుంటే, మహాధీమాగా తర్లివచ్చాడు శిఖండి. తమ్ముడితోసహా కలిసి వచ్చాడు మగధసహదేవుడు జరాసంధుడి కుమారుడు. దిక్కులు దిమ్మెత్తిపోతున్నట్టు యుద్ధవాద్యాలు మోగుతూవుంటే సముద్రంలాగ వుప్పొంగుతూవుండేది అతడి మగధ సేన, యుద్ధమంటే వుబ్బిపోతూ రకరకాల ఆయుధాలు పట్టుకుని. బలమూ, బలానికితగిన శౌర్యమూ, శౌర్యానికితగిన దర్పమూ, దర్పానికితగిన ఉత్సాహమూ కలిగినసైన్యంతో వచ్చారు ధృష్టకేతువూ, అతడి తమ్ముడూ పాండవుల కళ్లవేడుకచేస్తూ. యమ కింకరులలాంటి రాక్షససైనికులతో ఘోరమైన చీకటికొండలాగ నడిచివచ్చాడు ఘటోత్కచుడు. దానికితగినట్టే వున్నాయి అతడి పెద్దపెద్దకోరలు. అతడిచేతిలోని శూలం కాంతులు ఆకాశంజిగేలుమని పించేవి. వీళ్లేకాకండా పాండ్యరాజూ, అయిదుగురు కేకయరాజులూ, శైబ్యుడూ, కాశి, కరూశదేశాలరాజులూ ఎంతోమంది తమతమ సైన్యాలతోనూ, తమతమ జెండాలతోనూ వచ్చారు. ఇలా ఏడు అక్షౌణీల పాండవసేనా రణక్షేత్రంలో సమావేశమయింది. ఆసేనా మొహానికి తిలకంలా తయారయివచ్చాడు పాండవసేనాధిపతి ధృష్టద్యుమ్నుడు. పరిపూర్ణమైన వీరరసంతో తొణికిసలాడుతూ వుంది అతడిశరీరం. యుద్ధలక్ష్యంతో ఉజ్జ్వలంగావుంది వీరరేఖ. సూర్యరథంతో సమానంగా వుంది అతడిరథవేగం. ధగధగా మెరుస్తోంది ధనుస్సు. జిగేలు జిగేలు మంటోంది రథంమీది ధ్వజం. ఇలా మహాతేజస్సుతో వచ్చి ఏడక్షౌణీలసేనా నడిపించా డతడు.

అలా చతురంగబలాలతో ఆసేన ప్రచండంగా నడిచివస్తూ వుంటే మహారాజా, భూమి గజగజా వణికింది. దిక్కులదిరాయి. సైనికుల తొడతొక్కిడిలో వొకళ్ళనగలు మరొకళ్ళనగలతో రాపాడి

రాలిన గుండ భూమిమీద రేగినధూళి హెచ్చుకాకుండా అణిచివేసేది. ఆయుధాల కాంతులు చల్లనివెన్నెలలయి యుద్ధావేశంలో వీరులకి చెమట్లుపోయకుండాచేసేవి. భేరీధ్వనులకి ఆకాశం బద్దలయిపోకుండా ఏనుగులు తొండాలతో తుంపుర్లుచల్లేవి. సైనికులదర్పం దేవతలకి తెలియరాకుండా గొడుగులు దట్టంగా అడ్డుకునేవి.

శిబిరంనించి బయలుదేరి కురుక్షేత్రమంతటికీ ఉత్తమప్రదేశ మయిన శమంతకపంచకందగ్గిరికి వచ్చేసరికి ధర్మరాజుకి కుడికన్ను అదిరింది. ఇంకా ఎన్నో శుభశకునాలూ కనిపించాయి. దానికి మెరుగు పెట్టినట్టు ఏనుగులమదంసువాసనా, సైనికులుపూసుకున్న వీరగంధాల పరిమళమూ బుజ్జగిస్తూ, మృదూవుగా మెల్లమెల్లగా వీసింది మంద వాయువు.

దానికి పరమానందభరితుడయాడు ధర్మరాజు. తనలాగే సంతోషంగావున్న తమ్ముళ్లూ, తానూ, ద్రుపదుడూ, విరాటుడూ తక్కిన యావన్మందీ తూరుపుదిక్కు మొహామైకౌరవసేనకిఎదురూగ్గా నుంచున్నారు. తన సైన్యమూ, ఎదిరిసైన్యమూ తేరిపారవేసి వొక సారి చూసుకున్నాడు ధర్మరాజు. తనసేనలో అందరికీ సంజ్ఞలూ, గుర్తులూ ఏర్పరిచాడు. నాయకులైన రాజులుయావన్మందినీ దగ్గిరికి పిలిచాడు. "ఈయుద్ధంలో మనం రాజ్యంజయించడమో, లేదా వీర స్వర్గం సంపాదించడమో—ఇదే మన నిశ్చయం. కనక మీ అందరి నిశ్చయమూకూడా ఇదే అని నాముందు మాట ఇవ్వండి మీరు" అన్నాడు,

ధర్మరాజలా అనగానే యావన్మందిరాజులూ వీరోచితమైన వాక్యాలతో అతడిముందు ప్రతిజ్ఞచేశారు; శంఖాలు పూరించారు. తరవాత ఎవళ్ళపటాలంలోకి వాళ్ళువెళ్ళి నుంచున్నారు. అప్పుడు

సిద్ధంగా అమర్చిపెట్టిన ఫలహారాలూ, పళ్లూ, పువ్వులూ, కర్పూరమూ, కస్తూరీ అదీ వాళ్ళకి పంచిపెట్టాడు ధర్మరాజు.

ధృతరాష్ట్రుడు: అయితే సంజయా, మనసైన్యం ఎంతో పెద్దది కదా! ఇంతసైన్యాన్నీ ఎదిరించడమంటే కొంచెమైనా జంకలేదా పాండవులు?

సంజయుడు: నీసందేహం బాగానేవుంది. అయితే చెపుతాను విను. కౌరవసైన్యం చూసి ధర్మరాజు చిన్నబుచ్చుకోలేదు. అర్జునుణ్ణి చూసి 'తమ్ముడూ, ఎంతసేనవుందో చూశావోయి కౌరవులది! ముందు తాతగారి తాటిచెట్టుజెండా ఎంత ఘోరంగా అవుపిస్తూవుందో చూడూ' అన్నాడతడు.

దానికి అన్నగారి మొహం చూసి చిరునవ్వు నవ్వాడు అర్జునుడు. 'సైన్యం పెద్దాచిన్నాతో ఏముందన్నయ్యా,' అంటూముక్తసరిగా ఇలా అన్నాడు—'ధర్మంవొదిలిపెట్టినవాళ్ళకి ఎంతగొప్పసైన్యం వున్నా వాళ్ళని ఇట్టే గెలవవచ్చు' అన్నాడు వెనకటికి నారదముని. ద్రోణుడూ, భీష్ముడూ వింటూండగా వ్యాసమునీ నాతో ఆ మాటే చెప్పాడు. అది అలావుండనిచ్చి బలాబలాలు విచారించినా మనమేమంత అవుకుగా లేముకదా! చూడూ, అమానుషమైన శక్తిమంతుడు అన్నయ్య భీముడు. ఆయనగదముందు శత్రువులు ఎంతమందయినా నిలవగలరా? ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ మొదలయిన పాంచాలవీరులు వుండనేవున్నారు. వాళ్ళపరాక్రమంముందు సైన్యాల హెచ్చుతక్కువలు పనికివస్తాయా? విరాటరాజూ, శంఖుడూ మొదలైన మత్స్యవీరులూ, సాత్యకీ, చేకితానుడూ మొదలైన యాదవ శూరులూ-వీళ్ళంతా నీకు విజయంచేకూర్చందే వొదలరు. మన అభిమన్యుడూ, ఘటోత్కచుడూ మొదలయిన కుమాళ్ళు వొక్కొక్కడూ వొక్కొక్క అక్షోణీసైన్యంతో సమానంకదా! అతిలోకసామాన్య

మైన బలశౌర్యాలు నీళ్ళవి. నీదయా, కృష్ణుడి ఆసరా — ఈరెంటి వల్లా గాండీవానికి రెక్కలువచ్చినట్టుంది. ఇంతెందుకూ ఏనుగులాగ నీబలం నీకు తెలియదు కాని నీకే కోపంవస్తే దేవతలయినా జోహారు చెయ్యవలసిందే కదా!"

దాంతో వొక్కసారి తెలివితెచ్చుకున్నట్టు జల్లుకున్నాడు ధర్మ రాజు. "బాగుంది. అయితే కౌరవులుపన్నిన వ్యూహానికి తగినట్టు మన సైన్యంతోకూడా వొకమంచివ్యూహం తయారుచేయించు" అన్నాడు. దానిమీద ధృష్టద్యుమ్నుణ్ణి పిలిచాడు అర్జునుడు. అచలవ్యూహం పన్నమన్నాడు. సేనంతా బాగా పరిచూసి అచలవ్యూహం పన్నాడు ధృష్టద్యుమ్నుడు. వ్యూహంముందుభాగంలో అభిమన్యుడూ మొదలైన పాండవకుమార్ళనీ, సహదేవుణ్ణీ పెట్టాడు. తానూ అక్కడే నిలబడ్డాడు. తనకీ కుమార్ళకీ దన్నుగా భీముణ్ణి నియమించాడు. తమతమ బంధువులతోనూ, సైన్యాలతోనూ చేకితానుణ్ణీ, ద్రుపదుణ్ణీ దక్షిణ భాగంలోపెట్టాడు. అలాగే సాత్యకినీ, విరాటరాజునీ ఉత్తరభాగంలో నిలిపాడు. నడిమిభాగంలో నడగొండలవంటి ఏనుగులమధ్య రథంమీద తెల్లగొడుగులతోనూ, చామరాలతోనూ ధర్మరాజు బ్రాహ్మలికి బంగారమూ, నూతనవస్త్రాలూ దానంచేస్తూ, విజయం లభించాలని వాళ్ళుచేస్తూవున్న ఆశీర్వాదా లందుకుంటూ నుంచున్నాడు. భీష్ముడికి ఎదురుగా పౌరుషంతో శిఖండి నుంచున్నాడు. అతడికి దన్నుగా అర్జునుడు నుంచున్నాడు. వెనుకభాగంలో మగధసహదేవుడూ, ధృష్టకేతూ మీసాలు మెలిపెడుతూ నిలబడ్డారు. ఇలా పాండవుల అచల వ్యూహంకూడా ఎంత అందంగావుందో అంత భయంకరంగానూ అవుపడింది. వాళ్ళ రథాలు ద్వీపాలనుకో. ఏనుగులు కొండలు. గుర్రాలు కెరటాలు. వీర భటులు ఉగ్రమైన నీటిజంతువులు. ఇలా మహాసముద్రంలా వుంది వాళ్ళసైన్యం. ఇటు కౌరవసైన్యంలోనూ అటు

పాండవసేనలోనూ ఎవరికెంజాలికీలేదు అర్జునుడిరథంమీాది కపిధ్వజానికి వున్న ప్రకాశం. ముఖ్యంగా కౌరవసైన్యంగుండెల్లో దిగులుపుట్టిస్తూ ధగధగా వెలిగిపోతూ వుండేదది.

ఎఱ్ఱటివీ, తెల్లటివీ, నల్లటివీ కవచాలువేసుకుని ఆలమందల్లో ఆబోతుల్లాగ తమతమ సేనాదళాలమధ్య తిరుగుతూవుండేవాళ్ళు ఆకాశానికి వినపడేటట్టు పేరాలాపాలాడుతూ నాయకులు. కొన్ని దేశాల సేనలు దుర్యోధనుణ్ణిచేరాయి. కొన్ని దేశాలవి ధర్మరాజుని చేరాయి. మరికొన్ని చీలికలయిపోయి ఇటూ అటూ కూడా చేరాయి.

పిల్లలూ ముసిలాళ్ళూ తప్ప మొలతాడుకట్టిన మొగాడల్లా యుద్ధంలో గెలుపుసాధింతామనే అక్కడికి వచ్చారు. అదంతా చూస్తే నేలపొంగి అంతమందీ అక్కడ చేరారా అనిపించింది.

ధృతరాష్ట్రుడు : అయితే మనసైన్యమూ పాండవులసైన్యమూ-ఈరెంటిలో ఏదిపైచెయ్యిగా వుందంటావు?

సంజయుడు : రెంటిలో దేని కేదీ తీసిపోయినట్టులేదు. రెండు సేనలూ వొక్కలాగే వున్నాయి. అయితే కృష్ణుడూ అర్జునుడూ వుండడంవల్ల పాండవులసైన్యమే కొంత పైచెయ్యిలా అనిపించింది నాకు. పైగా పాండవుల ఏనుగులు ఘీంకారంచేసేసరికి కౌరవుల ఏనుగుల మదధారలు ఇంకిపోయాయి. వాటికోసం వచ్చిన తుమ్మెదలు వొక్కసారి నిరాశపడిపోయాయి. మహారాజా, నీకుమారుడు మంకుపట్టుపట్టి యుద్ధానికి రావడం చూసి పాండవులూ, శ్రీకృష్ణుడూ వల్లమాలిన సంతోషం పొందారంటేనమ్ము. కృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. ఆ రెండు శంఖాలూ వినడంతోనే పాండవసైన్యం కలకలలాడింది, కౌరవయోధులగుండెలు జలుజల్లుమన్నాయి. మన మానుషవ్యూహంలో నెత్తురు వాన కురిసింది. ఇంకా ఎన్నో దుర్నిమిత్తాలు పుట్టాయి. ఎందుకుపుట్టవూ అంటా

భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కృపుడూ - ఈనలుగురూ యుద్ధానికి బయలుదేరేటపుడు ప్రతీసారీ 'పాండవులు జయించాలి, పాండవులు జయించాలి' అంటూ బయలుదేరతారు. సరే, అదలా వుండనీ. అపశకునాలు చూసి నీకుమాళ్లు పిసరంతయినా జంకలేదు. పైగా సేనలో ఉత్సాహం రేకెత్తిస్తూ రణదుందుభులు మోగించారు. దాంతో రెండుసేనలూ యుద్ధంకోసం వురకలువేస్తూ, ప్రళయసముద్రాలలాగ వుప్పొంగాయి. అప్పుడు ఉభయసైన్యాల నాయకులూ కూడబలుక్కుని కొన్ని నియమాలు తేర్పరుచుకున్నారు.

రథాలవాళ్ళు రథాలవాళ్ళతోనే యుద్ధం చెయ్యాలి. ఏనుగుల వాళ్ళు ఏనుగులవాళ్ళతోనే పోట్లాడాలి. గుర్రాలవాళ్ళు గుర్రాల వాళ్ళతోనే పోరాడాలి. కాలిబంట్లు కాలిబంట్లతోనే కలబడాలి. శరణన్నవాణ్ణి చంపకూడదు. ఓడిపోయినవాణ్ణీ, పారిపోయినవాణ్ణీ, యుద్ధంమానేసినవాణ్ణీ, ఆయుధాలు లేనివాణ్ణీ, సారథుల్నీ, శంఖాలూ భేరీలూ అవీ మోయించేవాద్యగాళ్ళనీ, ఆయుధాలు మోసుకువెళ్ళే వాళ్ళనీ కొట్టకూడదు. ఉభయపక్షాలవాళ్ళూ ఈనియమాలు అంగీకరించారు.

ఉభయసేనలూ సమానమైన ధైర్యంతో ఎదురెదురుగా నిలబడ్డాయి. ఎవరిమనస్సులోనూ శాంతిలేదు. అయినా నిశ్చలంగావున్నాయవి. రంగురంగులుగావున్న ఆరెండుసేనలూ పూలతోనూ, పళ్ళతోనూ వున్న రెండువనాలలా అవుపించాయి. ఎంతట యుద్ధం ప్రారంభిద్దామా అనే రెండుసేనలూ బాధపడుతున్నాయి. ఉభయసైన్యాలూ ఎంతట కలబడతాయా, ఎంతట యుద్ధంచూస్తామా అని చిడిముడిపడిపోతున్నారు ఆకాశంమీద దేవతలు.

## "తాతా అనుమతించు"

ఇంతలో యుద్ధానికి సిద్ధంగావున్న ధర్మరాజు తన కవచం విప్పేశాడు. ఆయుధాలూ, కవచమూ రథంమీద పెట్టేశాడు. రథం

దిగిపోయాడు. చేతులుజోడించాడు. మాట్లాడకండా తిన్నగా భీష్ముడి దిక్కు నడిచాడు. అతడి అభిప్రాయమేమిటో పాండవసైన్యంలో ఎవ్వరికీ అర్థంకాలేదు. భీముడూ మొదలయిన సహోదరులమ్మల్లూ, కృష్ణుడూ, సాత్యకీ, ఆప్తులైన రాజులూ తడబడుతూ రథాలుదిగి అతణ్ణి వెంబడించారు.

"మేము ఇంతమందిమీా వుంటూవుంటే, నువ్వు ఇలానడుచుకు రావడ మేమిటి అన్నయ్యా?" అన్నాడు భీముడు.

"శత్రువులమీాద ఎత్తిన ఇంత సన్నాహమూ వొదిలేసి ఇలా వెళ్ళడం దేనికి?" అన్నాడు అర్జునుడు.

"పగవాళ్ళకున్న భయంకాస్తా పోయేటట్టు ఇలా దీనంగా వెళ్ళడ మేమిటి?" అన్నాడు నకులుడు.

"సిద్ధపడి యుద్ధానికని చేసిన ఇదంతా పాడయిపోయేట్టు ఇలా వెళ్ళడం ఏమంత సబబు?" అన్నాడు సహదేవుడు.

ఇంతమందీ ఇన్ని ప్రశ్నలూ వేస్తూవున్నా మాట్లాడకండా ముందుకి నడుస్తూనేవున్నాడు ధర్మరాజు.

"ఈయన అభిప్రాయ మేదో బోధపడింది నాకు" అంటూ వాళ్ళందరినీ వారించాడు శ్రీకృష్ణుడు— "భీష్ముడూ, కృపుడూ, ద్రోణుడూ, శల్యుడూ మొదలైన పెద్దలకి నమస్కరించి, వాళ్ళ అనుమతిపుచ్చుకుని యుద్ధంచెయ్యడంకోసం బయలుదేరా డీయన. పెద్దల అనుజ్ఞ తీసుకుని యుద్ధంచేస్తే జయం తప్పదంటారు తెలిసినవాళ్ళు. అంచేత అలాచెయ్యడం మంచిదే."

కృష్ణుడిలా చెప్పడంతోనే ధర్మరాజువెంట వెళుతూన్న రాజులు యావన్మందీ భయపడుతూ, మాట్లాడకండా బొమ్మల్లాగ నుంచుండి

పోయారు. కృష్ణార్జునులూ, భీముడూ, నకులసహదేవులూ మాత్రం ధర్మరాజువెంట వెళ్ళారు.

అలా ధర్మరాజు భీష్ముడి రథంవద్దిరికి వచ్చేసరికి కౌరవసైన్యంలో యావన్మందీ ఉత్సాహంతో మెడలెత్తి చూశారు. మన సేనానాయకులు తలావొకలాగ అనుకున్నారు.

"ఈయన ఇంత పిరికా?" అన్నారు కొందరు. "ఇలా భయపడవలసినంత ఏం పుట్టిమునిగింది!" అన్నారు కొందరు. "భీముడూ అర్జునుడూ, నకులసహదేవులూ, అభిమన్యుడూ, సాత్యకీ, విరాటరాజూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ — ఇంతమందీ వుండగా ఇతడికేం వచ్చింది!" అన్నారు కొందరు. "ధర్మరాజు భయపడేరకం కాదు. ఎందుకిలా వచ్చాడో మరి!" అన్నారు మరికొందరు.

అక్కడ పాండవసేనలోనూ సైనికులు అలాగే వున్నారు. "ధర్మరాజు మానధనుడు. భీష్ముడితో ఏమిటి మాట్లాడతాడో! ఆయన ఈయనని ఎలా గౌరవిస్తాడో! కృష్ణార్జును లేమంటారో! భీముడూ, నకులసహదేవులూ ఎలా మాట్లాడతారో! వీళ్ళెందుకిలా వెళ్ళారో!" అంటూ రకరకాలుగా ఆలోచిస్తూ నుంచున్నారు.

ఉభయసైన్యాలూ ఆతురతతో చూస్తూన్నాయి. మారణాస్త్రాలతో భయంకరంగా వున్న కౌరవవ్యూహందగ్గిరికి వచ్చాడు ధర్మరాజు. తిన్నగా భీష్ముడి రథందగ్గిరికి వెళ్ళాడు. ఆయనకి పాదాభివందనం, చేశాడు. "తండ్రీ, నిన్ను ఎదిరించి యుద్ధం చెయ్యవలసి వచ్చింది. అందుకని ముందు సెలవు అనుమతికోసం ఇలా వచ్చాను. నన్ను దీవించి పంపు. శత్రువుల్ని జయిస్తాను" అన్నాడు వినయంగా.

"తప్పకండా జయిస్తావోయి" అన్నాడు భీష్మపితామహుడు — "బాబూ, నువ్వు రావడం నిజంగా మంచిపనే చేశావు. ఇలా రాకపోయి

వుంటే నిన్ను శపించేవాణ్ణి నేను. సరే, ఇదేకాక ఇంకా ఏదైనా కోరుకో యిస్తాను. నీపక్షంవచ్చి యుద్ధం చెయ్యమనిమాత్రం కోరకు. అదితప్ప ఏదన్నా కోరు."

"తండ్రీ, అలాగే కానీ," అన్నాడు ధర్మరాజు — "దుర్యోధనుడిపక్షం వుండే యుద్ధంచెయ్యి. కాని మాక్షేమంమాత్రం నీహృదయంలో వుండనీ. అంతేచాలు మాకు."

"సరే, ఇంకా నీఅభిప్రాయ మేమిటో చెప్పు" అని మళ్లీ అడిగాడు భీష్ముడు. దానిమీద "నిన్ను గెలిచేవిధాన మేమిటో అనుగ్రహించు" అంటూ చేతులు జోడించాడు ధర్మరాజు.

ధర్మరాజిలా అడగడంతోనే చిన్న చిరునవ్వునవ్వాడు భీష్ముడు. "నన్ను ఎదిరించి గెలవడం దేవతలకయినా శక్యంకాదోయి"అన్నాడు.

"అవును, అందుకనే నిన్ను ప్రార్థిస్తున్నాను" అన్నాడు ధర్మరాజు.

"నాచేతిలో ఆయుధం వున్నంతవరకూ నన్ను ఎవ్వరూ జయించలేరు. నువ్వు నామనవడివి. నామనస్సుకరిగించి నన్ను ప్రార్థిస్తున్నావు. అయినా, అది చెప్పడానికి ఇంకా సమయం రాలేదు. ఇప్పుడేమీ అనకు. వెళ్లిపో. మరోసారి వద్దువుకాని" అన్నాడు భీష్ముడు.

సరే, అంటూ సంతోషించాడు ధర్మరాజు. మళ్ళీ ఆయనికి నమస్కరించాడు. తాతగారిమాట శిరోధార్యం చేసుకుని ఆయనదగ్గిర సెలవుపుచ్చుకున్నాడు. తరవాత ద్రోణాచార్యులూ, కృపాచార్యులూ శల్యుడూ—ఈముగ్గురిదగ్గిరికీ వెళ్లాడు. కృష్ణుడూ, నలుగురు తమ్ములూ యథాప్రకారం వెంటవెళ్లారు.

ముందు ద్రోణాచార్యులు దగ్గిరికి వెళ్ళి పాదాభివందనంచేశాడు ధర్మరాజు. యుద్ధంచెయ్యడానికి అనుమతించి, ఆశీర్వదించమని ప్రార్థించాడు.

"స్వయంగా శ్రీకృష్ణమూర్తి మంత్రిగా వుంటే జయంకోసమాశీర్వదించమని ఇతర్లని కోరడమెందుకూ?" అన్నాడు ద్రోణుడు- "ధర్మం ఏపక్షముంటే ఆపక్షం వుంటాడు శ్రీకృష్ణుడు. కృష్ణుడెటువుంటే జయమూ అటే వుంటుంది."

దానిమీద "గురుదేవా, యుద్ధంలో నిన్నెలా జయించాలో అనుగ్రహించు" అంటూ తలవాంచి చేతులుజోడించాడు ధర్మరాజు.

"నాచేతిలో ఆయుధం వున్నంతవరకూ నన్ను ఎవ్వరూ చంపలేరు" అన్నాడు ద్రోణుడు - "నేను ప్రాయోపవేశానికి పూనుకుని అస్త్రసన్యాసంచేస్తేనే నన్ను చంపడం సాధ్యమవుతుంది. అయితే, భరించలేనంత దుర్వార్త వింటేనేకాని వూరికే ప్రాయోపవేశానికి పూనుకోను. ఆవార్తకూడా నమ్మదగ్గ పెద్దమనిషి చెప్తేనే నమ్ముతాను. అప్పుడుకాని పగవాడు నన్ను చంపలేడు" అన్నాడు.

ద్రోణాచార్యులు చెప్పింది విన్నాడు ధర్మరాజు. ఆయనదగ్గిర సెలవు పుచ్చుకుని కృపాచార్యులుదగ్గిరికి వచ్చాడు. అయితే ఆయనని ఎలాచంపడం అన్నమాట అడగడానికిమాత్రం నోరు తిరగలేదు. పాదాభివందనంచేసి మాటాడకండా నుంచుండిపోయాడు. అయితే కృపాచార్యులుమాత్రం గ్రహించేశాడు. "నాకుచావులేదోయి, కాని నువ్వు జయిస్తావు. నిన్ను దీవిస్తున్నాను" అన్నాడాయన.

అక్కడినుంచి శల్యుడిదగ్గిరికి వెళ్లాడు ధర్మరాజు. అతడి అనుమతీ తీసుకున్నాడు. "మామా, కర్ణుడికి నువ్వు సారథ్యంచెయ్యవలిసే వస్తుంది. అప్పుడు అతడి పరాక్రమం కుంగిపోయేమాటలాడాలినువ్వు. అతణ్ణి చికాకుపెట్టెయ్యాలి. ఈమాత్రం వరమియ్యి నాకు" అంటూ అతణ్ణి కోరాడు.

"యుద్ధానికి ఉద్యోగిస్తున్నప్పుడే నీకు మాట ఇచ్చాను" అన్నాడు శల్యుడు—"తప్పకండా నామాట నేను చెల్లించుకుంటాను."

ఇలా ఆనలుగురిదగ్గిరా అనుమతి పుచ్చుకుని తమ్ముళ్లతో తిరిగి వచ్చేశాడు ధర్మరాజు. ఇంతలో ఉభయసైన్యాలూ పన్నిన వ్యూహాలు చూసే కుతూహలంతో వచ్చిన కర్ణుడిదగ్గిరికి వెళ్ళాడు శ్రీకృష్ణుడు. "కర్ణా, భీష్ముడిమీద అలిగి యుద్ధం మానేశావటకదూ ! బావుంది. అయితే, అతడు కళ్ళుమూసేదాకా పాండవులపక్షం వచ్చి, నీయుద్ధ నైపుణ్యంకాస్తా అతడికి చవిచూపడం బావుండదూ!" అని కవ్వించాడతణ్ణి.

"అదేమన్నమాట, కృష్ణా!" అన్నాడు కర్ణుడు – "నాకు భీష్ముడిమీద కోపమేకాని దుర్యోధనుడిమీద కాదే. భీష్ముడిమీద కోపంవల్లే యుద్ధానికి దూరంగా వున్నాను. అంతేకాని దుర్యోధనుడికి అర్పించిన ఈప్రాణం మరొకరికోసం వినియోగిస్తాననుకోకు."

కర్ణుడి నిశ్చయానికి సంతోషించాడు కృష్ణుడు. అతడి దగ్గిరనించి ధర్మరాజు దగ్గిరికి వచ్చేశాడు.

కౌరవసైన్యంనించి వచ్చేసి మళ్ళీ వెనక్కితిరిగాడు ధర్మరాజు. "ఇదిగో, మీలో ఎవ్వరైనాసరే, మాలో చేరాలనివుంటే, వెంటనే రావలసిందని ఆహ్వానిస్తున్నాను. అలా వచ్చినవాళ్లని నాతమ్ముళ్లతో సమానంగా ప్రేమతో చూసుకుంటాను" అంటూ కౌరవులందరూ విన్నట్టు గట్టిగా గొంతెత్తి అన్నాడు.

దాంతో "నేనువస్తాను. నన్ను కలుపుకోండి" అన్నాడు నీకుమారుడు యుయుత్సుడు. "తప్పకుండా వచ్చెయ్యి. నిన్ను నాఅయిదో తమ్ముడిలా చూస్తాను" అంటూ ప్రేమతో ఆహ్వానించాడు ధర్మరాజు. దుర్యోధనుడి దుర్గుణాలూ, పాండవుల సద్గుణాలూ ఏకరవుపెడుతూ, తనసర్వసైన్యంతోనూ, ధంకానగారాలతోనూ వెళ్లి పాండవసేనలో కలిశాడు యుయుత్సుడు. మహారాజా, ఎక్కడావున్నదే సవతిపిల్లలికి పరస్పరం పడకపోడం. అదలా వుండనీ. యుయుత్సుడు తనతో

కలవడంతోనే ఎంతో సంతృప్తిపడ్డాడు ధర్మరాజు. ఆదరవాక్యాలతో అతణ్ణి ఎంతో అంత సంతోషపెట్టాడు. తరవాత తనరథంమీదికి తాను వచ్చేశాడు; కవచం వేసుకున్నాడు; తూణీరం కట్టుకున్నాడు; ధనుర్బాణాలు పట్టుకున్నాడు. సేనసేనంతా వొక్కసారి ఉత్సాహంతో కోలాహలం చేసింది. తూర్యారవాలు చెలరేగాయి.

భీముడూ, అర్జునుడూ, నకులసహదేవులూ, తక్కిన రాజులూ ఎవరిరథాలు వాళ్ళెక్కి, తమతమ కీలకస్థానాల్లో నుంచున్నారు. అచల వ్యూహం మళ్ళీయథా ప్రకారం సిద్ధమయింది. ధర్మరాజు పెద్దలమీద కనపరిచిన వినయానికి ఉభయసైన్యాలూ మెచ్చుకున్నాయి. పాండవులు లోగడ అనుభవించిన బాధలు కొందరు జ్ఞాపకం చేసుకున్నారు. సంధికోసం వాళ్ళుచేసిన ప్రయత్నాలూ ప్రశంసించారు కొందరు.

## భగవద్గీత

ధృతరాష్ట్రుడు : సంజయా, ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో యుద్ధానికని సమావేశమైన మనవాళ్లూ పాండవులూ ఏం చేశారు?

సంజయుడు : వ్యూహంపన్ని ఎదురుగుండావుంది పాండవుల సైన్యం. చూశాడు దుర్యోధనుడు. తిన్నగా ద్రోణాచార్యులు దగ్గిరికి వెళ్ళి ఇలా అన్నాడు. "ఆచార్యా, అదిగో చూడండి. బుద్ధిమంతుడైన మీ శిష్యుడు, ద్రుపదపుత్రుడు ధృష్టద్యుమ్నుడు వ్యూహంగా తీర్చి పెట్టాడు పాండవుల మహాసైన్యం. అందులో భీమార్జునులతో సమానంగా యుద్ధం చెయ్యగలవాళ్ళు శూరులూ ధనుర్ధరులూ వున్నారు. సాత్యకీ విరాటరాజూ ద్రుపదుడూ ధృష్టకేతుడూ చేకితానుడూ కాశీరాజూ పురుజిత్తు కుంతిభోజుడూ శైబ్యుడూ యుధామన్యుడూ ఉత్తమౌజుడూ అభిమన్యుడూ ద్రౌపదికొడుకులూ—వీళ్ళంతా మహారథులే,

మనలో గట్టివాళ్ళని, నా సేనానాయకుల్ని మీ గుర్తుకోసం చెప్తున్నాను. వినండి. మీరూ భీష్ములూ కర్ణుడూ కృపాచార్యులూ అశ్వత్థామా వికర్ణుడూ భూరిశ్రవసుడూ జయద్రథుడూ మొదలైన వాళ్ళు, ఇంకా ఎంతోమంది అనేకమైన ఆయుధాల్లో ఆరితేరినవాళ్ళు, యుద్ధంలో హేమాహేమీలు వున్నారు. వీళ్ళంతా నాకోసం ప్రాణాలు బలిపెట్టడానికి సిద్ధంగా వున్నారు.

మనబలం భీష్ములు రక్షిస్తున్నారు. వాళ్ళసైన్యం భీముడు చూస్తున్నాడు. ఎంతోఅంతసేన మనది. వాళ్ళది చెప్పేదేముంది ? ఐతే, మీరందరూ మనవ్యూహం కీలకస్థానాల్లోఅన్ని ద్వారాల్లోనూ నిలబడి భీష్ముల్నిమాత్రం జాగ్రత్తగా కాపాడుతూ వుండాలి.

అంతలో ప్రతాపవంతుడు కురువృద్ధుడు — భీష్మపితామహుడు దుర్యోధనుడికి సంతోషం కలగడంకోశం పెద్ద సింహనాదంచేసి, శంఖం పూరించాడు. వెంటనే కౌరవసైన్యంలో శంఖాలూ భేరీలూ మృదంగాలూ కొమ్ముబూరాలూ ఒక్కపెట్టుని మోగాయి. సేన సేనంతా గింగురుమంది.

ఇక్కడ పాండవసైన్యంలో తెల్లగుర్రాలుపూసిన మహారథం మీద శ్రీకృష్ణుడూ అర్జునుడూ తమ దివ్యశంఖాలు పూరించారు. శ్రీకృష్ణుడు పాంచజన్యం వూదాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. భయంకరమైన పనులుచేసే భీముడు తన పెద్దశంఖం పౌండ్రకం పూరించాడు. ధర్మరాజు అనంతవిజయం, నకులుడు సుఘోషం, సహదేవుడు మణిపుష్పకం పూరించారు. కాశీరాజూ శిఖండీ ధృష్టద్యుమ్నుడూ విరాటరాజూ సాత్యకీ ద్రుపదుడూ ఉపపాండవులూ అభిమన్యుడూ సైన్యమంతటినించీ తమతమ శంఖాలు వొక్కసారి పూరించారు. ఆ మహాధ్వనితో భూమీ ఆకాశమూ దద్దరిల్లిపోయాయి. దుర్యోధనుడూ మొదలైనవాళ్ళ గుండెలు బద్దలైనట్టయింది.

మహారాజా, తరవాత ఏం జరిగిందో చెప్తాను విను. ఇక రెండు సేనలనించీ ఆయుధాలు ప్రయోగించడమే తరవాయిగా వుంది. అర్జునుడు సర్వసన్నద్ధుడయాడు. రథంమీద కపిధ్వజం ఎగురుతూవుంది. పగ్గాలు పట్టుకుని సారథి శ్రీకృష్ణుడు సిద్ధంగా వున్నాడు. గాండీవం సంధించాడు అర్జునుడు. ఒక్కసారి కౌరవులదిక్కు చూశాడు. శ్రీకృష్ణుడితో ఇలా అన్నాడు.

"కృష్ణా, దుర్మార్గుడైన దుర్యోధనుడి మేలుకోసం యుద్ధానికి వచ్చిన శూరులు ఎవరెవరో, వాళ్ళందరినీ ఒకసారిచూడాలనివుంది. ఎవళ్ళతో నేనుయుద్ధంచెయ్యాలో వాళ్ళనిబాగా చూసిందికి వీలయేట్టు ఈ రెండు సేనలమధ్యకీ పోనిచ్చి మనరథం నుంచోబెట్టు."

అర్జునుడిలా అనడంతోనే రెండు సేనలమధ్యకీ రథం నడిపించాడు శ్రీకృష్ణుడు. భీష్ముడూ ద్రోణుడూ తక్కినరాజులు యావన్మందీ వున్న కౌరవసైన్యం ఎదట రథం నుంచోపెట్టాడు. 'అర్జునా, ఇదిగో సమావేశమైవున్న ఈ కౌరవుల్ని చూడు' అన్నాడు.

చూశాడు అర్జునుడు. తండ్రులూ తాతలూ గురువులూ మేనమామలూ అన్నదమ్ములూ కుమాళ్ళూ మనుమలూ నేస్తాలూ మామలూ స్నేహితులూ-వీళ్ళందరినీ రెండు సేనల్లోనూ చూశాడు. అలా యుద్ధానికి సిద్ధంగావున్న బంధువులు యావన్మందినీ చూసేసరికి అతడి మనస్సు నీరైపోయింది. దుఃఖం ముంచుకువచ్చింది. ఇలా అన్నాడు:

"కృష్ణా, యుద్ధంకోసం కూడిన మా బంధువుల్ని చూసి నాకాళ్లూ చేతులూ పట్లుతప్పిపోతున్నాయి. నోరు ఎండిపోతూవుంది. శరీరం వణుకుతూవుంది. గగుర్పాటు కలుగుతూవుంది. చేతిలోంచి గాండీవం జారిపోతూవుంది. ఒళ్ళంతా మంటలుగావుంది. నిలవలేక పోతున్నాను. మనస్సు చలించిపోతూవుంది. దుశ్శకునాలు కనిపిస్తు

న్నాయి. స్వజనాన్ని చంపుకుని ఆతరవాత పొందే లాభ మేమిటో కూడా తెలియకుండా వుంది.

కృష్ణా, వద్దు. జయమూవద్దు, రాజ్యమూవద్దు నాకు. సుఖమూ అంతకంటే అక్కరలేదు. ఎవళ్ళకోసం మేము రాజ్యం, భోగం, సౌఖ్యం కావాలంటున్నామో, వాళ్ళే ధనంమీాదా ప్రాణంమీాదా ఆశ వొదులుకుని ఇక్కడ యుద్ధానికి సిద్ధంగా వున్నారు. అలాంటప్పుడు భోగాలతో కాని, జీవితంతో కాని మాకు ప్రయోజన మేముంది? గురువులూ తాతలూ తండ్రులూ కుమాళ్ళూ మనమలూ మామలూ మేనమామలూ బావమరుదులూ ఇతరబంధువులూ నన్ను చంపడానికి వచ్చినా సరే — మూాడులోకాల రాజ్యాధిపత్యంకోసమున్నా కూడా వీళ్ళని చంపలేను నేను. ఇక సామాన్యమైన రాజ్యంమాట అలావుంచు.

దుర్యోధనుడూ మొదలైనవాళ్ళని చంపినంతమాత్రాన మాకు వొరిగిపడే దేముంది? వీళ్ళు పాపాత్ములే అయినా వీళ్ళని చంపడంవల్ల పాపమే చుట్టుకుంటుంది. అంచేత వీళ్ళనీ ఈబంధువుల్నీ చంపడం తగనిపని మాకు. ఆత్మీయుల్ని చంపుకుని ఎలా సుఖపడగలం?

దురాశచేత మతిపోయినవాళ్ళు ధృతరాష్ట్రుడి కుమాళ్ళు. కులక్షయంవల్ల కలిగేదోషమూ మిత్రద్రోహంవల్లవచ్చే పాపమూ తెలిసికో లేకుండా వున్నారు. కాని తెలిసిన మేము ఈపాపంనించి ఎందుకు మళ్ళకూడ దంటాను!

కులక్షయంవల్ల సనాతనంగా వస్తున్న కులధర్మాలు తుడుచుకుపోతాయి. ధర్మంనశిస్తే కులం యావత్తూ అధర్మం పాలవుతుంది. అధర్మం వ్యాపిస్తే కులస్త్రీలు చెడిపోతారు. స్త్రీలు భ్రష్టులైతే వర్ణసంకరం కలుగుతుంది. వర్ణసంకరంతో అలా సంకరమైన కులానికీ, దాని సంకరానికి కారకులైనవాళ్ళకీ నరకమే గతి అవుతుంది. తద్దినాలూ తర్పణాలూ లోపించి పితరులు అధోగతి పాలవు

తారు. కులనాశనం చేసేవాళ్ళు చేసే ఈ వర్ణసంకర కార్యాలవల్ల కులధర్మాలు నశిస్తున్నాయి. కులధర్మాలు నశించడంతో మనుషులికి శాశ్వతంగా నరకవాసం కలుగుతుందని వింటున్నాం.

రాజ్యసుఖమనే దురాశలో పడి, మావాళ్ళనే మేం చంపడానికి నడుంకట్టాం! అయ్యో, ఎంత పాపానికి ఒడిగట్టుకున్నాం!!

ఇంతకంటే ఆయుధాలు వొదిలిపెట్టి పల్లెత్తు మాట్లాడని నన్ను ధృతరాష్ట్రుడి కుమారుళ్ళు ఆయుధాలతో యుద్ధంలో చంపితే చంపనీ అదే మంచిది నాకు."

ఇలా అంటూ ధనుస్సూ బాణాలూ పడేశాడు అర్జునుడు. దుఃఖంతో కుమిలిపోతూ యుద్ధభూమిలో రథంమీద చదికిలబడిపోయాడు.

అలా జాలిగా, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ దుఃఖంతో కూచున్న అర్జునుణ్ణి చూసి శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

"అర్జునా, ఈ విషమస్థితిలో నీకు ఈ మోహం ఎక్కడినించి వచ్చింది? పామరులు చెయ్యవలసిన పని ఇది. స్వర్గానికి విరుద్ధమైంది. అపకీర్తికరమైంది. శత్రువుల్ని తపింపజేసేవాడివి నువ్వు. నీకు తగదిది. ఈపిరికితనం వొదిలిపెట్టు. క్షుద్రమైన హృదయ దౌర్బల్యానికి తావివ్వకు. లే."

అర్జునుడు: భీష్ముడూ ద్రోణుడూ పూజ్యులు. వాళ్ళమీద బాణాలువేసి ఎలా ఎదిరించేది? మహానుభావులైన గురువుల్ని చంపి ఆనెత్తురుకూడు అనుభవించడంకంటే, వాళ్ళని చంపకండా లోకంలో బిచ్చమెత్తుకు బతకడం మంచిదికదా? ఎవళ్ళని చంపి మేం బతకాలనుకోమో, ఆ ధుర్యోధనుడూ వాళ్ళూ ఎదురుగుండా వున్నారు. ఇంతకీ యుద్ధంలో మేమే గెలుస్తామో, మమ్మల్ని వాళ్ళే గెలుస్తారో తెలియదు. ఈ రెంటిలో మాకు ఏది మంచిదో అదీ అర్థంకాకండావుంది.

దైన్యంవల్ల నాస్వభావం సరిగా వుండకండావుంది. ధర్మం మనస్సుకి తట్టకండా వుంది. నిన్ను అడుగుతున్నాను. ఏది మంచిదో నిశ్చయించి చెప్పు. నీ శిష్యుణ్ణి నీ శరణుపొందుతున్నాను. ఏం చెయ్యాలో చెప్పు. నన్ను శాసించు. భూమ్మీద ఎదురులేని మహాసామ్రాజ్యం దొరికినా — దేవేంద్రపదవి దొరికినా ఇంద్రియాలు దహించివేస్తున్న నా దుఃఖం ఎలాపోతుందో బోధపడకండా వుంది.

సంజయుడు : శత్రువులంటే మూడు చెరువులనీళ్ళు తాగించేఅంత అర్జునుడూ ఇలా అని, తుదకి 'యుద్ధం చెయ్యను' అంటూ చక్కా వూరుకున్నాడు. అలా ఉభయసేనలమధ్యా దుఃఖిస్తూ కూచున్న అర్జునుణ్ణిచూసి శ్రీకృష్ణుడు చిరునవ్వునవ్వుతూ ఇలా అన్నారు.

"అర్జునా, దుఃఖించడం అవసరం లేనివాళ్ళకోసం దుఃఖిస్తున్నావు. పైగా పండితుడిలా దానికికారణాలూ చెప్పుతున్నావు. చచ్చిన వాళ్ళకోసంగానీ, బతికిన వాళ్ళకోసంగానీ పండితులు దుఃఖించరు. నేనూ నువ్వూ ఈ రాజులూ వొకప్పుడు లేనివాళ్ళం కాదు. ఎప్పుడూ వున్న వాళ్ళమే. ఇకముందుకూడా వుంటాము. జీవికి ఈ శరీరంలో బాల్యం యవ్వనం ముసలితనం ఎలాంటివో, ఈ శరీరం వొదిలి మరోశరీరంలో ప్రవేశించడమూ అలాంటిదే. దానికోసం ధీరుడైన వాడు మోహంలో పడడు.

ఇంద్రియాలికి విషయాలతో సంబంధం తప్పదు. అవి చలీవేడీ సుఖమూ దుఃఖమూ కలిగిస్తూ వస్తూ పోతూ వుంటాయి. శాశ్వతమైనవి కావు. వీటిని సహించుకోవాలి నువ్వు. సుఖదుఃఖాలు సమంగా భావించే ధీరపురుషుణ్ణి ఇవి బాధించవు. అలాంటివాడే అమృతత్వం (బ్రహ్మత్వం) పొందగలుగుతాడు.

ఉండడానికి ఉనికి లేదు. ఉన్నదానికి లేకపోడమూ లేదు. తనువులు వుండనివి. ఆత్మ వుండేది; చిరమైంది. అసత్తూ సత్తూ

అనే ఈ రెండింటి యథార్థం తత్వజ్ఞాను లెరుగుదురు. చిరమయిన ఆత్మ అన్నింటిలోనూ వ్యాపించివుంది. దానికి నాశనం లేదనినమ్ము. నాశనంలేని దీన్ని ఎవ్వడూ నాశనం చెయ్యలేడు. ఆత్మ ఎప్పుడూ వొకళ్లాగే వుంటుంది. ప్రత్యక్ష ప్రమాణాలికి అవుపించకండా వుంటుంది. శరీరాలు నశిస్తాయి. కాని, ఆత్మ నశించ దనే తత్వజ్ఞులు చెప్పారు. అంచేత, అర్జునా, లే. యుద్ధం చెయ్యి.

ఆత్మ చంపుతుందని అనుకునేవాడూ, చంపబడుతుందని అనుకునేవాడూ – ఈ ఉభయులూ తెలియనివాళ్ళే. ఇది ఎవర్నీ చంపదు. అలాగే ఎవరిచేతా చావదు. దీనికి చావులేదు. పుట్టుకా లేదు. ఆది లేదు. అంతూ లేదు. ఒకప్పుడు వుండడం, తిరిగీ వుండకపోడం లేనేలేదు దీనికి. నిత్యమైందిది. శాశ్వతమైంది. పురాతనమైంది. శరీరాన్ని చంపినా ఇది చావదు. ఇలా ఈ ఆత్మ శాశ్వతమైందనీ, నాశనం లేదనీ, చావు పుట్టుకలు లేందనీ తెలిసినవాడు ఎవణ్ణయినా ఎలా చంపుతాడు? లేదా, ఎలా చంపిస్తాడు?

మనిషి చిరిగినబట్టలు వొదిలిపెట్టి కొత్తబట్టలు కట్టుకున్నట్టు, జీర్ణించినశరీరాలు విడిచిపెట్టి జీవాత్మ కొత్తశరీరాలు ధరిస్తుంది. ఆత్మని ఆయుధాలు నరకలేవు. అగ్ని కాల్చలేదు. నీళ్ళు తడపలేవు. గాలి ఇగిరించలేదు. ఇది ముక్కలు కాదు. కాలదు. తడవదు. ఎండదు. ఇది నిత్యమైంది. అంతటా వ్యాపించి వుంది. స్థిరమైంది. చలనంలేంది. సనాతనమైంది. కానైతే ఇది కళ్ళకి కనపడదు. ఏ ఇంద్రియానికీ గోచరం కాదు. మనస్సుతో తెలుసుకోడానికీ సాధ్యం కాదు. ఏ వికారమూ లేదు దీనికి. ఈ యథార్థమే చెప్పారు తత్వజ్ఞులు. ఇది తెలుసుకుని మరి దుఃఖించకూడదు నువ్వు.

ఒకవేళ ఈ ఆత్మ ఎప్పుడూ చస్తూ, పుడుతూ వుంటుందని భావించావే అనుకో, అయినా ఇలా దుఃఖించడం కూడ దంటాను.

ఏమంటే, పుట్టిన దానికి చావు తప్పదు కదా! అలాగే చచ్చిన దానికి పుట్టుకా తప్పదు. అందుచేత, ఎలాగూ తప్పని దీనికోసం దుఃఖించడం కూడదనిపని కాదా? భూతకోటి యావత్తూ పుట్టుకకి పూర్వం వ్యక్తంకాదు. మధ్యలోమాత్రం వ్యక్తమవుతుంది మరణం తరవాత కూడా మళ్ళీవ్యక్తంకాదు. ఇలాంటి విషయంలో దుఃఖించడం దేనికి

ఒకడు ఈఆత్మని ఆశ్చర్యంగా చూస్తాడు. అలాగే మరొకడు ఆశ్చర్యంగా చెపుతాడు. ఇంకొకడు ఆశ్చర్యంగా వింటాడు. ఇలా చూసినవాడూ, చెప్పినవాడూ, విన్నవాడూ ఎవడూకూడా ఆత్మని తెలుసుకోలేడు. అందరి దేహాల్లోనూ ఈ ఆత్మవుంది. ఇది చావడమంటూ లేదు. కనక ఎవ్వరికోసమూ నువ్వు దుఃఖించడం తగదు.

అంతేకాక, నీ స్వధర్మం చూసినా నువ్వు చలించవలిసిన పని లేదు. ఏమంటే క్షత్రియుడికి ధర్మయుద్ధంకంటే శ్రేయస్కరమైంది మరొకటి లేదు. కోరకండా స్వర్గద్వారాలు తెరిచిపెట్టినట్టు లభించిన ఇలాంటియుద్ధం - సౌఖ్యం రాసిపెట్టిన క్షత్రియులకే దొరుకుతుంది. ఈ ధర్మయుద్ధం నువ్వు విడిచిపెడితే నీస్వధర్మం నువ్వు విడిచినవాడివవుతావు. అంతేకాదు, నీ కీర్తి నువ్వు మట్టిపాలు చేసుకుంటావు. పాపం పోసుకుంటావు. లోకులు శాశ్వతంగా నీ అపకీర్తి ఆడిపోసుకుంటారు. గౌరవంగా బతికినవాడికి మరణంకంటే అపకీర్తి భరించరాంది. ఇంతవరకూ నిన్ను మేరువులాచూస్తున్న మహారథుల్లోనువ్వు గడ్డిపోచలా అయిపోతావు. యుద్ధభూమినించి పలాయనం చిత్తగించినవాడిగానే భావిస్తారునిన్ను. నీశత్రువులు నీసామర్థ్యం నిందిస్తారు. అనరాని మాటలన్నీ అంటారు. ఇంతకంటే మించిన దుఃఖం మరేముంటుంది? యుద్ధంలో మరణిస్తే స్వర్గం కాళ్ళముందుకి వస్తుంది. గెలిచావో రాజ్యం అనుభవిస్తావు. అందుచేత, అర్జునా, లే. యుద్ధానికి సిద్ధపడు. సుఖం దుఃఖం లాభం నష్టం, జయం అపజయం ఏదైనా

వాళ్ళచే అని భావించు. యుద్ధానికి సిద్ధపడు ఇలా సమబుద్ధితో యుద్ధంచేస్తే పాపం రాదు.

ఇంతవరకూ నీకు సాంఖ్యజ్ఞానం చెప్పాను. ఇక కర్మయోగ విషయం చెపుతాను, విను. దీంతో కర్మబంధాలు వొదిలించుకోగలవు నువ్వు. ఈకర్మయోగంలో ఆరంభించింది నాశనంకావడమంటూ లేదు. ఇందులో విఘ్నాలుకూడా వుండవు. ఈధర్మం ఏమాత్రం ఆచరించినా కూడా అది ఎంతోఅంత భయంనించి కాపాడుతుంది.

చెయ్యదగిందేదో, చెయ్యరాందేదో నిశ్చయించగలబుద్ధి ఈ యోగంలో ఏకాగ్రంకావాలి. అలా నిశ్చయంలేనివాళ్ళ బుద్ధులు చిలవలూ పలవలూవేసి పరిపరివిధాల పరిగెడతాయి.

వేదాల్లోని కర్మకాండకి చెందిన మాటలమీద వ్యామోహం పెట్టుకుని, ఇంతకంటే మరేమీ లేదని వాదించే మూఢులు "అనేక మయిన కర్మలఫలం మళ్ళీ పుట్టడమే. అందువల్ల ఐశ్వర్యం, భోగం అనుభవించవచ్చు" అంటూ పువ్వులు పూసినట్టు ఎన్నో పొదుపైన మాటలు చెపుతారు. స్వర్గమే వాళ్ళకి పరమావధి. పైమాటలే వారికి ఆదర్శం. భోగాలూ ఐశ్వర్యాలూ మాత్రమేవాళ్ళలక్ష్యం. అంచేత ఏది చెయ్యదగిందో, ఏది చెయ్యరాందో నిశ్చయించగల స్థిరబుద్ధి వాళ్ళకి ఎన్నడూ కుదరదు.

సత్వమూ, రజస్సూ, తమస్సూ- ఈ మూడుగుణాలికి సంబంధించిన విషయాలే చెపుతాయి వేదాలు. నువ్వు ఈ మూడుగుణాలు లేనివాడివి కావాలి. ద్వంద్వాలు లేనివాడివికావాలి. ఎప్పుడూ సత్వసంపన్నుడివి కావాలి. లేనిదానికోసం దేవులాడడంకాని, ఉన్నదాని కోసం ప్రాకులాడడంకాని లేకండావుండాలి. ఆత్మవంతుడివి కావాలి

ఎక్కడపడితే అక్కడ బాగా నీళ్ళు నిండి వున్నప్పుడు వొక నూతివల్ల ఎంతప్రయోజనమో, బ్రహ్మజ్ఞానం కలవాడికి వేదాలన్నింటివల్లా అంతే ప్రయోజనం.

కర్మలు చేయడంలోనే నీ అధికారం అంతే. వాటిఫలం మీద మాత్రం ఎన్నడూ అధికారం వుండకూడదు. ఫలాపేక్ష పెట్టుకుని కర్మ చెయ్యవద్దు. అలా అని కర్మలు మానివేయాలనీ అనుకోకూడదు. ఫలాపేక్ష వుంచుకోకండా యోగపరుడివి కావాలి. సిద్ధి కలగడం, కలగకపోడం — రెండూ వొకటే అని సమత్వబుద్ధితో కర్మలు చెయ్యాలి. ఈసమత్వబుద్ధినే యోగమంటారు. సమత్వబుద్ధిలేని కర్మ ఎంతో నికృష్టమైంది. అందుకని సమత్వబుద్ధి కుదుర్చుకోవాలి. ఫలాపేక్షకలవాడు అధముడు. సమత్వబుద్ధికలవాడు పాపపుణ్యాలు రెండూ ఈలోకంలోనే వొదిలిపెడుతున్నాడు. కనక యోగంకోసం– అంటే సమత్వబుద్ధికోసం సిద్ధపడు. కర్మల్లో కౌశలమే యోగం. సమత్వబుద్ధి కల జ్ఞానవంతులు చేసే కర్మల్లో ఫలాపేక్ష వుండదు. అంచేత వాళ్ళు జన్మబంధాల్లోంచి విడిపోయి, దుఃఖమూ తాపమూ లేని స్థితిని పొందుతున్నారు.

ఐతే, ఎప్పుడైతే నీ బుద్ధి మోహకల్మషంనించి దాటి బయట పడుతుందో అప్పుడే నువ్వు ఇంతవరకూ విన్న దానిమీదా ఇక విన బోయే దానిమీద నీకు అసహ్యం కలుగుతుంది. వేదాలూ అవీ విని కలతపడ్డ నీ బుద్ధి చలించకండా సమాధిలో ఎప్పుడు స్థిరంగా వుంటుందో అప్పుడే నీకు యోగం ప్రాప్తిస్తుంది.

అర్జునుడు : సమాధిలోవుండే స్థితప్రజ్ఞుడి (స్థిరబుద్ధికలవాడి) లక్షణమేమిటి? అతడు ఏమిటి మాట్లాడతాడు? ఎలా వుంటాడు? ఎలా నడుచుకుంటాడు?

శ్రీకృష్ణుడు: మనస్సులోని కోర్కెలన్నీ మానుకున్నవాడూ, తనలో తాను సంతుష్టిపడేవాడూ, స్థితప్రజ్ఞు డనిపించుకుంటాడు. దుఃఖాలు వచ్చినప్పుడు కించపడనివాడూ, సుఖాలు వచ్చినప్పుడు వుప్పొంగనివాడూ, అనురాగం, క్రోధం, భయం — ఇవేవీ లేనివాడూ, మునిలాగ ఉదాసీనంగా వున్నవాడూ స్థితప్రజ్ఞు డనిపించు కుంటాడు. దేనిమీదా మమకారం లేనివాడూ మంచికి సంతోషంగానీ చెడ్డకి ద్వేషంగానీ లేనివాడూ స్థితప్రజ్ఞుడు. తాబేలు తన అవయవాలన్నీ లోపలికి ముడుచుకున్నట్టు విషయాలన్నింటినించీ ఇంద్రియాలు మళ్ళించుకున్నవాడు స్థితప్రజ్ఞుడు.

ఆహారం మొదలయినవి విడిచిపెట్టినంత మాత్రాన అవి విడిచిపెట్టడం మాత్రం జరుగుతుంది. అంతేకాని వాటిమీద వాంఛమాత్రం పోదు. ఆత్మదర్శన మైనవాడికి విషయవాసన సహా నశిస్తుంది. విషయవాసన నశించినవాడే స్థితప్రజ్ఞుడు.

వివేకం కలిగి పురుషుడు ఎంతప్రయత్నిస్తూవున్నా క్షోభపెట్టడమే స్వభావంగాకల ఇంద్రియాలు బలాత్కారంగా మనస్సుని పెడదారికి లాగుతూ వుంటాయి. అంచేత వాటిని వశంలో పెట్టుకోవాలి. సమాధిలో నామీద మనస్సు లగ్నం చేసుకోవాలి. అలా చెయ్యగలిగినవాడే స్థితప్రజ్ఞుడు.

విషయాలు భావిస్తూవుండే పురుషుడికి ఆ విషయాలమీదే ఆసక్తి వృద్ధిఅవుతూ వుంటుంది. విషయాలమీద ఆసక్తి కలగడంతోటే కోరిక రేకెత్తుతుంది. కోరికతో క్రోధం కలుగుతుంది. క్రోధంవల్ల అవివేకమూ, అవివేకంతో మతిమరుపూ పుట్టుకు వస్తాయి మతిమరుపుతో బుద్ధి నశిస్తుంది. బుద్ధి నశించడంతోనే సర్వనాశనం జరుగుతుంది. ఐతే అంతఃకరణం స్వాధీనంలో వున్నవాడు రాగద్వేషాలనించి బైటపడి, తన స్వాధీనంలోవున్న ఇంద్రియాలతో విష

యాలు అనుభవిస్తూ వున్నప్పటికీ మనస్సులో ప్రసన్నత్వం పొందు తాడు. మనస్సు ప్రసన్నమైనవాడికి అన్ని దుఃఖాలూ హరించి పోతాయి. అలా మనస్సు ప్రసన్నమైతే వెంటనే బుద్ధి కుదుటబడు తుంది. బుద్ధి కుదుటపడినవాడే స్థితప్రజ్ఞుడు.

యోగంలేనివాడికి స్థిరబుద్ధి కుదరదు. భావనసహా కలగదు. భావనలేనివాడికి శాంతి వుండదు. శాంతిలేనివాడికి సౌఖ్యంమాత్రం ఎక్కడినించి వస్తుంది? ఏమంటే — నీటిమీద వోడని గాలి స్థిరంగా వుంచనట్టు విషయాల్లో చరించే ఇంద్రియాల వెంటపడ్డ మనస్సు బుద్ధిని స్థిరంగా వుండనివ్వదు. అంచేత, అన్నివిధాలా విషయాల నించి ఇంద్రియాలు అరికట్టినవాడే స్థితప్రజ్ఞుడు.

భూతకోటిఅంతటికీ రాత్రి అయినప్పుడు స్థితప్రజ్ఞుడు మేలుకుని వుంటాడు. భూతకోటియావత్తూ మేలుకుని వున్నప్పుడు అతడికి రాత్రిగా వుంటుంది.

నాలుగుదిక్కులనించీ నీళ్ళు ఎన్ని వచ్చి పడుతూవున్నా నిండు సముద్రం నిలకడగానే వుంటుంది. అలాగే విషయవాసనలన్నీ తనలో ప్రవేశిస్తూవున్నా శాంతంగానే వుంటాడు స్థితప్రజ్ఞుడు. విషయాసక్తు డికిమాత్రం శాంతి వుండదు.

కోరికలన్నీ మానుకుని నిస్పృహగా వుండేవాడూ, అహం కారం మమకారం లేకండా నడుచుకునేవాడూ శాంతి పొందుతాడు. అర్జునా, ఇదే బ్రాహ్మీస్థితి. ఈ స్థితి లభించాక ఎవడూ మోహం చెందడు. మనిషి మరణకాలంలో కూడా ఈస్థితికి వస్తే చాలు, బ్రహ్మత్వం పొందుతాడు.

అర్జునుడు: కర్మకంటే మరి బుద్ధే శ్రేష్ఠమైందని నీ అభిప్రాయ మైతే, కృష్ణా, నన్ను ఈ ఘోరకర్మలో — యుద్ధంలో ఎందుకు ప్రవేశ పెడుతున్నావు? కలగాపులగమైన మాటలతో నా బుద్ధి భ్రమింప

చేస్తున్నట్టున్నావు. ఏది నాకు మంచిదో ఆ వొక్కటీ నిశ్చయించి చెప్పు.

శ్రీకృష్ణుడు: ఈ లోకంలో సాంఖ్యులికి జ్ఞాన యోగమూ, యోగులికి కర్మయోగమూ—ఇలా రెండునిష్ఠలూ పూర్వం చెప్పాను. మనిషి కర్మలు చెయ్యందే కర్మలఫలాపేక్ష వొదలడంజరగదు. కర్మలు మానివేయడంవల్ల సిద్ధికలగదు. అసలు ఏమనిషీ ఎన్నడూ క్షణ మయినా కర్మచెయ్యకండా వుండలేడు. ఏమంటే ప్రకృతిలో పుట్టిన గుణాలికి లోబడి ప్రతివాడూ కర్మలు చెయ్యడానికి బాధ్యుడు.

పైకిమాత్రం చేతులూ మొదలయిన కర్మేంద్రియాలు బిగబట్టి మనస్సులో విషయాలు తలపోస్తూ వుండేవాడు మూఢుడు. అలాంటి వాణ్ణి కపటాచారుడంటారు. కాని, మనస్సుతో ఇంద్రియాలు నిగ్రహించి, ఫలాపేక్షలేకండా, కర్మేంద్రియాలతో కర్మలుచేసేవాడు ఉత్తముడు. అంచేత అర్జునా, నీకు నియమితమైన కర్మ నువ్వు చెయ్యి. కర్మ చెయ్యకపోడంకంటె చెయ్యడమే ఎంతోమంచిది. అంతేకాదు, కర్మచెయ్యకపోతే శరీరయాత్రసహా సాగదు.

యజ్ఞంకోసం చేసేవి కాక ఇతరత్రా చేసే కర్మలు లోకంలో బంధహేతువులే అవుతున్నాయి. అందుకని ఫలాపేక్షలేకండా యజ్ఞం కోసం కర్మ చెయ్యి. పూర్వం యజ్ఞాలతోసహా ప్రజల్ని సృష్టించి బ్రహ్మ ఇలా చెప్పాడు: 'ఈ యజ్ఞాలతో మీరు అభ్యుదయం పొందండి. మీకు ఇవి కామధేనువులాగ కోరిన కోరికలు తీరుస్తాయి. యజ్ఞాలతో మీరు దేవతల్ని సంతోషపెట్టండి. వాళ్ళు మిమ్మల్ని సంతోషపెడతారు. ఇలా వాళ్ళని మీరూ మిమ్మల్ని వాళ్ళూ ప్రేమించుకోండి. దాంతో మహోన్నతమైన శ్రేయస్సు కలుగుతుంది. దేవతలు యజ్ఞాల్తో సంతృప్తిపడి మీరు కోరిన సమస్తభోగాలూ

మీకు ప్రసాదిస్తారు. వాళ్ళిచ్చినవి వాళ్ళకి నివేదించకండా అనుభవించినవాడు దొంగ అనిపించుకుంటాడు.

యజ్ఞాలుచేసి అందులో మిగిలిందే భుజించే సత్పురుషులు సర్వపాపాలనించీ ముక్తి పొందుతున్నారు. అలా కాకండా తమ స్వంతం కోసం వంటచేసుకునేవాళ్ళు పాపులు. అలాంటివాళ్ళు కేవలం పాపమే తింటున్నారు.

ప్రాణులు అన్నీ అన్నంనించి పుడుతున్నాయి. అన్నం మేఘంనించి పుడుతుంది. మేఘం యజ్ఞంనించి పుడుతుంది. యజ్ఞం కర్మనించి పుడుతుంది. కర్మ బ్రహ్మం (ప్రకృతి) నించి పుడుతుంది. బ్రహ్మం అక్షరంనించి అనగా పరమాత్మనించి పుడుతుంది. అంచేత సర్వత్రా వ్యాపించివున్న బ్రహ్మం సర్వదా యజ్ఞాల్లో ప్రతిష్ఠితమైవుంది. ఇలాంటి ఈచక్రం అనుసరించనివాడి జీవితం పాపభూయిష్టమయిందని నమ్మకం. ఇంద్రియలంపటుడైన అలాంటివాడి బతుకు నిష్ఫలమే అన్నమాట.

కాని, ఆత్మప్రీతి, ఆత్మతృప్తి, ఆత్మసంతోషమూ — ఇవి కల వ్యక్తికిమాత్రం మరి చెయ్యవలసిందేదీ వుండదు. అతడికి ఈలోకంలో కర్మచెయ్యడంవల్ల ఎలాంటి ప్రయోజనమూ లేదు. చెయ్యకపోయినందువల్ల వచ్చేనష్టమూ లేదు ఏ ప్రాణితోనూ అతడికి స్వార్థమైన ఎలాంటి అవసరమూ లేదు. కనక, ఫలాపేక్ష లేకండా నువ్వు చెయ్యవలిసిన కర్మ నువ్వు చెయ్యి. ఏమంటే, ఫలాపేక్షవుంచకండా కర్మచేసే మనిషి తప్పకండా మోక్షం పొందుతాడు.

జనకుడూ మొదలయినవాళ్ళు ఇలాగే కర్మలుచేసి సిద్ధిపొందారు. లోకకల్యాణం దృష్టిలోపెట్టుకుని అయినా నువ్వు కర్మలు చెయ్యడం అవసరం. శ్రేష్ఠుడైన వ్యక్తి ఎలా నడుచుకుంటే, తక్కినవాళ్ళూ అలాగే నడుచుకుంటారు. అతడు ఏది ప్రమాణమనిచేస్తే దాన్నే లోకం అనుసరిస్తుంది.

అర్జునా, మూడులోకాల్లోనూ నేను చెయ్యవలిసిందంటూ ఏదీ లేదు. నాకులేందికానీ, వుండవలిసిందికానీ ఏదీ లేదు. ఐనా నేనుకర్మలు చేస్తూనేవున్నాను. అప్రమత్తుణ్ణయి నేను కర్మలు చేయకపోయానో, అప్పుడు మనుషులు సర్వవిధాలా నామార్గమే అనుసరిస్తారు. నేను కర్మలు చెయ్యకపోతే ఈలోకం చెడుతుంది. సాంకర్యానికి నేనే కారకుణ్ణవుతాను. ఈప్రజల్ని నాశనంచేసినవాణ్ణీ నేనే అవుతాను.

అజ్ఞానులు ఆసక్తితో చేసినట్లే, జ్ఞానులు లోకకల్యాణం కోసం ఆసక్తిలేకండా కర్మలు చెయ్యాలి. కర్మలమీద ఆసక్తికల అజ్ఞానుల బుద్ధి చెడగొట్టకూడదు. జ్ఞానవంతుడు తాను సర్వకర్మలూ చక్కగా చేస్తూ వాళ్ళుకూడా చేసేటట్టుచూడాలి.

అన్నిరకాల కర్మలూ ప్రకృతిగుణాలవల్లే జరుగుతూ వుంటాయి. ఐతే, అహంకారంవల్ల ఆత్మజ్ఞానం లేనివాడు ఆకర్మలు తానేచేశానని భావిస్తాడు. కాని, గుణాలూ కర్మలూ తనకంటే వేరేవున్నాయి అన్న తత్వం తెలిసినవాడు ఇంద్రియాలే విషయాల్లో ప్రవర్తిస్తున్నాయని తెలుసుకుని వాటిలో ఆసక్తుడు కాడు.

ప్రకృతిగుణాలతో భ్రాంతిచెందినవాళ్ళు గుణాలమీదా కర్మల మీదా ఆసక్తి పెట్టుకుంటారు. అల్పజ్ఞులైన ఆ మంద మతుల్ని జ్ఞానవంతులు పెడదారిలో పెట్టకూడదు. అంచేత అర్జునా, నువ్వు వివేక బుద్ధితో నీసమస్తకర్మలూ నాకు సమర్పించు. ఆశా, మమకారమూ, శోకమూ విడిచిపెట్టు. యుద్ధంచెయ్యి.

అసూయలేకండా శ్రద్ధగా నా ఈమతం ఎప్పుడూఅనుసరించే వాళ్ళుకూడా కర్మబంధాలనించి విముక్తులౌతారు. కాని, నా మతం నిందిస్తూ, అనుసరించనివాళ్ళు ఏవిధమయిన జ్ఞానమూ లేని అవివేకులూ భ్రష్టులూ అని నమ్ము.

జ్ఞానవంతుడుకూడా తన ప్రకృతినిబట్టే నడుచుకుంటున్నాడు. నిజానికి ప్రాణులు యావత్తూ తమ ప్రకృతి ప్రకారమే ప్రవర్తిస్తున్నాయి. అలాంటప్పుడు అర్జునా, నిగ్రహంమాత్రం ఏం చేస్తుంది?

ప్రతి ఇంద్రియానికీ అనుకూలవిషయంమీద అనురాగమూ, ప్రతికూల విషయంమీద ద్వేషమూ ఏర్పడి వుంటాయి. అంచేత వాటికి లొంగి పోకూడదు. రాగద్వేషాలు రెండూ శ్రేయోమార్గానికి శత్రువులు.

బాగా చేసిన పరధర్మంకంటే, లోపంతోవున్నా స్వధర్మమే శ్రేయస్కరమైంది. స్వధర్మంలో మరణించినా మంచిదే. కాని, పరధర్మం మాత్రం భయంకరమైంది.

అర్జునుడు : తనకి ఇష్టంలేకపోయినా ఏదో బలవంతంగా తనని ప్రేరేపిస్తున్నట్టు పాపం చేస్తున్నాడు మనిషి. ఐతే, అలా అతణ్ణి ఏది ప్రేరేపిస్తున్న దంటావు?

శ్రీకృష్ణుడు : కామం. మహోగ్రమైన ఈ కామం రజోగుణం వల్ల పుడుతుంది. దీని ఆకలికి అంతంలేదు. మహా పాపస్వభావం కల దిది. ఈ కామమే క్రోధం. లోకంలో దీన్ని మించిన శత్రువు లేదని నమ్ము. పొగచేత అగ్ని మరుగుపడ్డట్టు, మకిలిచేత అద్దంమరుగు పడ్డట్టు, మావిచేత గర్భం మరుగు పడ్డట్టు ఈ కామంచేత జ్ఞానం మరుగుపడిపోతుంది. జ్ఞానికి చిరశత్రు విది. తృప్తిపడని అగ్నిలాంటిది. కామరూప. దీనితో జ్ఞానం కప్పడి పోతుంది.

ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ. ఈ కామానికి ఆశ్రయస్థానాలని చెపుతారు. వీటిద్వారానే ఇది జ్ఞానాన్ని మరుగుపరిచి జీవుణ్ణి మోహంలో పడదోస్తుంది. అంచేత అర్జునా, మొదట నువ్వు ఇంద్రియాలు వశపరుచుకో. జ్ఞానమూ, విజ్ఞానమూ నాశనం చేసే ఈపాపిష్ఠి కామం వొదిలిపెట్టు.

దేహంకంటే ఇంద్రియాలు గొప్పవంటారు. ఇంద్రియాలకంటే మనస్సు గొప్పది. మనస్సుకంటే బుద్ధి గొప్పది. బుద్ధికంటే ఆత్మ గొప్పది. ఇలా బుద్ధికంటే గొప్పదైన ఆత్మని తెలుసుకుని, నీ అంతట నువ్వే ధైర్యం తెచ్చుకో. ఒకంతట జయించశక్యంకాని ఈ కామమనే శత్రువుని హతమార్చు.

నాశనమంటూ లేని ఈ యోగం నేను సూర్యుడికి చెప్పాను. సూర్యుడు మనువుకి చెప్పాడు. మనువు ఇక్ష్వాకుడికి చెప్పాడు. ఇలా పరంపరగా వచ్చిన ఈ యోగం, రాజరుషులు ఎరిగి వుండేవాళ్ళు. ఎంతోకాలం అయిపోడం వల్ల ఈ లోకంలో ఇప్పుడిది లోపించి పోయింది. నువ్వు నాకు భక్తుడివి. స్నేహితుడివి. అంచేత పరమ రహస్యమైన ఆ పురాతనయోగమే ఇప్పుడు నీకు చెప్పాను.

అర్జునుడు : సూర్యుడు ఏనాడో పుట్టాడు. తరవాత ఇప్పుడు పుట్టినవాడివి నువ్వు. అలాంటప్పుడు ఆదిలో నువ్వు సూర్యుడికి ఇది చెప్పావంటే ఎలా నమ్మడం?

శ్రీకృష్ణుడు : అర్జునా, నాకూ నీకూ అనేక జన్మలు గతించాయి. వాటన్నిటినీ నే నెరుగుదును. నువ్వు ఎరగవు. నేను పుట్టుక లేనివాణ్ణే అయినా, ఎప్పుడూ లోపించని జ్ఞానశక్తి స్వభావుణ్ణే అయినా, సర్వభూతాలికీ ఈశ్వరుణ్ణే అయినా నాప్రకృతిని ఆశ్రయించి నామాయాశక్తిచేత నేను పుడుతూనే వున్నాను. ఎప్పుడెప్పుడు ధర్మానికి హాని కలుగుతుందో, ఎప్పుడు అధర్మం అభివృద్ధి చెందుతుందో, అప్పుడు నన్ను నేనే సృష్టించుకుంటూ పుడుతున్నాను. సాధువుల్ని రక్షించడం కోసం, దుర్మార్గుల్ని హతమార్చడంకోసం, ధర్మం ప్రతిష్ఠించడంకోసం, ప్రతియుగంలోనూ నేను పుడుతున్నాను. ఇలా దివ్యమయిన నా జన్మకర్మల్లోని యథార్థం తెలుసుకున్నవాడు కాలం చేశాక తిరిగి మరి పుట్టడు. నాలోనే ఐక్యమవుతాడు.

అనురాగమూ, భయమూ, క్రోధమూ మానుకుని, నామీదే భావంపెట్టుకుని, నన్నే ఆశ్రయించినవాళ్ళు ఎంతోమంది జ్ఞానతపస్సు చేత పరిశుద్ధులై నాలోనే ఐక్యమయ్యారు. ఎవళ్ళు నన్ను ఎలా భజిస్తే వాళ్ళని నేను అలాగే అనుగ్రహిస్తున్నాను. ఎలా చూసినా, మానవులు యావన్మందీ అన్ని విధాలా నామార్గమే అనుసరిస్తున్నారు. మానవలోకంలో కర్మఫలం శీఘ్రంగానే ప్రాప్తమవుతుంది. అందుకని కర్మఫలసిద్ధి కోరేవాళ్ళు ఈ లోకంలో దేవతల్ని పూజిస్తున్నారు.

గుణాలా, కర్మలా భేదాలబట్టి నాలుగు వర్ణాల వ్యవస్థ నేనే సృష్టించాను. దీన్ని చేసినవాణ్ణి నేనే అయినా నాశనంలేని నేను దీనికి కర్తని కానని నమ్ము. కర్మలు నన్ను అంటవు. ఏమంటావా, కర్మ ఫలంమీద నాకు ఆసక్తి లేదు. ఇలాంటివాణ్ణని నన్ను తెలుసుకున్న వాణ్ణికూడా కర్మలు బంధించవు.

మోక్షాపేక్ష కలిగిన పూర్వులుకూడా ఇది తెలుసుకుని కర్మలు చేశారు. అంచేత అప్పటి పూర్వులూ, వాళ్ళ పూర్వులూ చేసిన కర్మలే నువ్వూ చెయ్యి. కర్మ ఏదో, అకర్మ ఏదో తెలుసుకోడంలో పండితులుకూడా భ్రమపడతారు. ఐతే, దేన్ని తెలుసుకుంటే నీకు శుభం కలుగుతుందో ఆ కర్మతత్త్వం నీకు చెపుతున్నాను, విను. కర్మ గతి గహనమైంది. అంచేత కర్మ అంటే ఏమిటో, వికర్మ అంటే ఏమిటో, అకర్మ అంటే ఏమిటో మొదట తెలుసుకోవాలి. కర్మలో అకర్మనీ, అకర్మలో కర్మనీ చూసిన మనిషే మనుష్యులందరిలోనూ బుద్ధిమంతుడు. అతడే సర్వకర్మలూ చేస్తూవుండే యోగి అన్నమాట.

ఎవడి సర్వప్రయత్నాలూ ఫలాపేక్ష లేకండా వుంటాయో, ఎవడి కర్మలు జ్ఞానాగ్నిలో దగ్ధమవుతాయో అతణ్ణే పండితుడంటారు తెలిసినవాళ్ళు. కర్మఫలంమీద అపేక్ష వుంచకండా కర్మఫలసాధనాలు ఆశ్రయించకండా ఎప్పుడూ తృప్తిగా వుండేవాడు కర్మలుచేస్తూ

వున్నా చెయ్యనట్టే లెక్క. ఆశలులేనివాడూ, మనస్సూ ఇంద్రియాలూ స్వాధీనం చేసుకున్నవాడూ, తనకంటూ ఏదీ అక్కరలేనివాడూ — ఇలాంటివాడు కేవలం శారీరకంగా కర్మలు చేసినా అతణ్ణి పాపాలంటవు. అయాచితంగా దొరికినదాంతో తృప్తిపడేవాడూ, సుఖదుఃఖాలూ లాభనష్టాలూ మొదలయిన ద్వంద్వాలు లేనివాడూ, మచ్చరం లేనివాడూ, కార్యం సిద్ధించినా సిద్ధించకపోయినా వొకలాగే భావించేవాడూ కర్మలు చేసినా అవి అతణ్ణి బంధించవు. విషయాభిలాష నశించినవాడూ, రాగద్వేషాలనించి ముక్తుడయినవాడూ, జ్ఞానం మీద స్థిరచిత్తం కలవాడూ కేవలం యజ్ఞం కోసమే - అంటే లోకం మేలు కోసమే కర్మలు చేస్తాడు. అలాంటివాడు చేసే ఆకర్మలు అతణ్ణి బంధించవు. సమగ్రంగా విలీనమైపోతాయి.

అర్పణం (హవనం) బ్రహ్మమే. హవిస్సూ బ్రహ్మమే. అగ్ని బ్రహ్మమే. హోతా బ్రహ్మమే. హవనక్రియా బ్రహ్మమే. ఇలా ఇదంతా బ్రహ్మమే అని దృఢబుద్ధికలవాడుపొందే ఫలమూ బ్రహ్మమే.

కొందరు యోగులు దేవతలకి సంబంధించిన యజ్ఞాలేచేస్తున్నారు. మరికొందరు బ్రహ్మమనే అగ్నిలో యజ్ఞాలతోనే యజ్ఞాలు హోమం చేస్తున్నారు. కొందరు చెవీ మొదలయిన ఇంద్రియాలే హవిస్సుచేసి నిగ్రహమనే అగ్నిలో హోమంచేస్తున్నారు. కొందరు శబ్దమూ మొదలయిన విషయాలు హవిస్సుగా ఇంద్రియాలు అనే అగ్నిలో హోమంచేస్తున్నారు. మరికొందరు ఇంద్రియవ్యాపారాలూ, ప్రాణవాయువూ మొదలయిన వాయువులు ఐదింటి చేష్టలూ జ్ఞానంతో వెలిగించిన ఆత్మసమాధి అనే యోగాగ్నిలో హోమం చేస్తున్నారు.

ఇంకా కొందరు ద్రవ్యయజ్ఞమూ, కొందరు తపోయజ్ఞమూ, కొందరు యోగయజ్ఞమూ, కొందరు స్వాధ్యాయ యజ్ఞమూ,

కొందరు జ్ఞానయజ్ఞమూ చేస్తున్నారు. ఇలా ఎంత మంది, ఎన్నో కఠిన నియమాలు పెట్టుకుని, అనేకమయిన యజ్ఞాలు చేస్తున్నారు.

అలాగే మరికొందరు ప్రాణాయామంచేస్తూ ప్రాణం, అపానం ఈ రెండిటి గతులూ బంధించి, అపానవాయువులో ప్రాణవాయువు హోమం చేస్తున్నారు. కొందరు ప్రాణవాయువులో అపానవాయువు హోమం చేస్తున్నారు.

కొందరు ఆహార నియమం పెట్టుకుని ప్రాణాల్లో ప్రాణాలు హోమం చేస్తున్నారు. వీళ్ళందరూ యజ్ఞాలు తెలిసినవాళ్ళే. యజ్ఞాలతో పాపాలు పోగొట్టుకున్నవాళ్ళే. యజ్ఞంలో మిగిలిన అమృతం భుజించడంచేత సనాతనమైన బ్రహ్మంలో లీనమవుతున్నారు. యజ్ఞం చెయ్యనివాళ్ళకి ఈలోకంలేదు. ఈలోకమే లేనివాళ్ళకి మరి పరలోకమెలా వుంటుంది ?

అనేక విధాలయిన ఈ యజ్ఞాలన్నీ బ్రహ్మముఖంనించే వచ్చాయి. ఐతే, ఇవన్నీ కర్మలవల్ల పుట్టినవని మాత్రం తెలుసుకో ఇలా తెలుసుకుంటే ముక్తుడివవుతావు.

ద్రవ్య యజ్ఞంకంటే జ్ఞానయజ్ఞం శ్రేష్ఠం. ఏమంటే, సమస్త కర్మలూ జ్ఞానంలోనే సమాప్తమవుతున్నాయి. తత్వవేత్తలైన జ్ఞానులు ఆ జ్ఞానం ఉపదేశిస్తారు. సాష్టాంగపడీ, వాళ్ళ సేవచేసీ, తరిచి తరిచి అడిగీ వాళ్ళదగ్గిర తెలుసుకోవాలి. జ్ఞానం కలిగిన తరవాత తిరిగి మోహంలో పడవు. అప్పుడు సమస్తభూతకోటినీ నీలోనూ, మరి నాలోనూ చూడగలుగుతావు. పాపాత్ములందరిలోనూ నువ్వు ఎక్కువ

---

* ఇక్కడ అపానవాయువు అంటే సాధారణంగా వాడుకలో వున్న అర్థం చేసుకోకూడదు. అపాన వాయువు అంటే లోపలికి పీల్చుకునే శ్వాసం అని అర్థం.

ప్రాణవాయువు అంటే పైకివిడిచే ఉచ్ఛ్వాసం.

పాపం చేసినవాడివే అనుకో, అయినా సరే, ఆ పాపం యావత్తూ జ్ఞానమనే పడవతో దాటిపోగలవు. మండుతూవున్న అగ్నిహోత్రం కట్టెలు కాల్చి భస్మం చేసినట్టు, జ్ఞానమనే అగ్ని అన్నికర్మలూ భస్మం చేస్తుంది.

నిజానికి జ్ఞానంవంటి పవిత్రమైంది ఈ లోకంలో మరొకటి లేదు. యోగంతో తయారైనవాడు క్రమంగా కొంత కాలానికి తనలో స్వయంగానే జ్ఞానం సంపాదిస్తాడు. శ్రద్ధావంతుడూ, ఇంద్రియ నిగ్రహం కలవాడూ, దాని మీదే తత్పరుడైనవాడూ జ్ఞానం సంపాదిస్తాడు. జ్ఞానం సంపాదించిన తరవాత శీఘ్రకాలంలోనే ఉత్కృష్టమైన శాంతినీ పొందుతాడు. కాని, జ్ఞానంలేనివాడూ, శ్రద్ధలేనివాడూ సంశయంకలవాడూ నాశనమవుతాడు. సంశయాత్ముడికి ఈలోకం లేదు. పరలోకమూ లేదు. సుఖమూ లేదు.

యోగంతో కర్మలూ, జ్ఞానంతో సంశయాలూ వొదుల్చుకున్న ఆత్మజ్ఞానిని కర్మలు బంధించలేవు. అంచేత అర్జునా, నీహృదయంలో అజ్ఞానంవల్ల పుట్టిన సంశయాన్ని జ్ఞానమనే కత్తితో నరుకు. కర్మయోగం ఆశ్రయించు. లే.

అర్జునుడు: కృష్ణా, కర్మలు వొదిలిపెట్టమని (కర్మసన్యాసం) చెపుతున్నావు. మళ్ళీకర్మలు చెయ్యమనీ(కర్మ యోగం) చెపుతున్నావు. ఈ రెంటిలో ఏదిమంచిదో బాగా నిశ్చయించి, ఆవొక్కటేనాకు చెప్పు.

శ్రీకృష్ణుడు: కర్మసన్యాసమూ, కర్మయోగమూ ఈ రెండూ మంచివే. కాని, రెంటిలోనూ కర్మసన్యాసంకంటే కర్మయోగమే శ్రేష్ఠమైంది. ఎవడు దేనినీ ద్వేషించడో, ఎవడు దేనినీ కోరడో అతడు నిత్యసన్యాసి అని నమ్ము. ఏమంటే సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలనించి వేరైనవాడు అనాయాసంగానే బంధాలు వొదుల్చుకుంటాడు. సాంఖ్యం (కర్మసన్యాసం) వేరూ, యోగం (కర్మయోగం)

వేరూ అని తెలియనివాళ్ళు చెపుతారు. కాని, పండితులు అలా చెప్పరు. ఈరెంటిలో ఏదైనాసరే, బాగా అనుసరిస్తేచాలు, ఈరెండింటిఫలితమూ దొరుకుతుంది. సాంఖ్యులు ఏస్థానం పొందుతారో, యోగులూ అదేస్థానం పొందుతారు. సాంఖ్యమూ, యోగమూ వేరు కావని తెలుసుకున్నవాడే నిజమైన తత్వం తెలిసిన వాడన్నమాట. సన్యాసం స్వీకరించినా యోగం లేకండా — అంటే కర్మ చెయ్యకండా మోక్షం దొరకడం కష్టం. కర్మయోగం సాధించిన ముని మాత్రం త్వరలోనే బ్రహ్మత్వం పొందుతాడు.

యోగంతో వున్నవాడూ, చిత్తశుద్ధికలవాడూ, మనస్సూ ఇంద్రియాలూ గెలిచినవాడూ, సర్వభూతాల్లోనూ వున్న ఆత్మే తన ఆత్మ అనుకునేవాడూ - ఇలాంటివాడు కర్మలు చేస్తున్నా వాటిని అంటకండానే వుంటాడు. యోగంతోవున్న తత్వవేత్త చూస్తూంటాడు. వింటుంటాడు. తాకుతుంటాడు. వాసన చూస్తుంటాడు. తింటుంటాడు. తిరుగుతుంటాడు. నిద్రిస్తుంటాడు. ఊపిరి వొదుల్తూ పీలుస్తూ వుంటాడు. మాట్లాడుతుంటాడు. మలమూత్రాలు విసర్జిస్తూవుంటాడు. కళ్ళు మూస్తూ తెరుస్తూ వుంటాడు. కావలసినవి పుచ్చుకుంటూనూ వుంటాడు. ఐతే, అవన్నీ 'ఏ ఇంద్రియం ఆపని చేస్తున్నదని తెలుసుకుని నేనేమీ చెయ్యడంలేదు' అనే అనుకుంటాడు.

బ్రహ్మార్పణం చేసి, ఆసక్తి పెట్టుకోకండా కర్మలుచేసేవాడు నీటిమీద తామరాకులాగ ఏపాపాలూ అంటకండావుంటాడు. అంచేత కర్మయోగి శరీరమూ, మనస్సూ, బుద్ధీ, ఇంద్రియాలూ- వీటితోఆసక్తి వుంచకండా ఆత్మశుద్ధికోసమే కర్మలుచేస్తూవుంటాడు. యోగంలో వున్నవాడు కర్మఫలం వొదిలివేయడంవల్ల చివరికి సంపూర్ణమైనశాంతి పొందుతాడు. యోగంతో లేనివాడు కామవాసనచేత కర్మఫలం మీద ఆసక్తిపెట్టుకుని బంధాల్లో పడుతున్నాడు.

ఇంద్రియాలు జయించి, సర్వకర్మలూ మనసా వొదిలిపెట్టిన వ్యక్తి తొమ్మిది ద్వారాల దేహపురంలో ఏదీ చెయ్యకండా, చెయ్యించకండా సుఖంగా వుంటాడు.

లోకుల కర్తృత్వంగాని, కర్మలుగాని, కర్మఫలాల సంబంధం గాని ప్రభువు సృష్టించడంలేదు. ప్రకృతే ఇదంతా చేస్తూవుంది. ప్రభువు ఎవడి పాపంగాని, పుణ్యంగాని పుచ్చుకోడంలేదు. అజ్ఞానం జ్ఞానాన్ని కప్పివేయడంవల్ల జీవులు మోహంలో పడుతున్నారు. కానైతే, ఆత్మజ్ఞానంతో అజ్ఞానంవొదుల్చుకున్న వాళ్ళజ్ఞానం సూర్యుడిలా పరబ్రహ్మాన్ని ప్రకాశింపచేస్తుంది. బ్రహ్మంమీదే బుద్ధిలీనమైనవాళ్ళూ, తామే బ్రహ్మమన్న నిశ్చయం కలవాళ్ళూ, బ్రహ్మం మీదే నిష్ఠకలవాళ్ళూ, బ్రహ్మ పరాయణులూ — వీళ్ళ పాపాలు జ్ఞానంవల్ల నాశనమవుతాయి. వీళ్ళకి మళ్ళీజన్మ వుండదు.

విద్యా వినయంకల బ్రాహ్మడిమీదా, ఆవుమీదా, ఏనుగు మీదా, కుక్కమీదా, చండాలుడిమీదా - అందరిమీదా జ్ఞానవంతుడి దృష్టి సమానంగానే వుంటుంది. ఇలా సమభావంతో మనస్సు స్థిరంగా వున్నవాళ్ళు ఈ జన్మలోనే మృత్యులోకం జయిస్తున్నారు. ఏమంటే బ్రహ్మం దోషంలేంది. అంతటా సమానమైంది. అంచేత సమబుద్ధి కలవాడు బ్రహ్మంలోనే వున్నాడన్నమాట. ఇష్టమైంది దొరికినప్పుడు సంతోషించడం, ఇష్టంలేంది లభించినప్పుడు కించపడడం కూడదు. ఇలా స్థిరబుద్ధికలిగి మోహం చెందనివాడే బ్రహ్మవేత్త. అతడు బ్రహ్మంలోనే వున్నట్టు లెక్క.

అర్జునా, విషయభోగాలమీద ఆసక్తిమానుకుని ఆత్మసౌఖ్యమనుభవించేవాడు అక్షయమైన బ్రహ్మానందం అనుభవిస్తాడు. విషయేంద్రియాల సంయోగంవల్ల కలిగేభోగాలు ఆదీ, అంతమూకలవి; క్షణికాలు. అంచేత అవి దుఃఖహేతువులు. బుద్ధిమంతుడు వాటిమీద

ఆసక్తి పెట్టుకోడు. ఈ జన్మలో శరీరం వొదిలిపెట్టేవరకూ — అంటే బతికివున్నంత కాలమూ కామం, క్రోధం మొదలైన వాటివల్ల కలిగే క్షోభ తట్టుకున్నవాడే యోగి. అతడే సౌఖ్యవంతుడు. అంతఃకరణంలోనే సుఖపడేవాడూ, ఆత్మలోనే హాయి అనుభవించేవాడూ, అలాగే ఆత్మలో ప్రకాశంపొందినవాడూ అయిన కర్మయోగి బ్రహ్మరూపుడై మోక్షం పొందుతాడు. పాపాలు పోగొట్టుకున్నవాడూ, సంశయాలు లేనివాడూ, ఆత్మనిగ్రహం కలవాడూ, సమస్త ప్రాణుల హితం కోరేవాడూ అయిన ఋషి మోక్షం పొందుతాడు. కామక్రోధాలు లేనివాడూ, మనోనిగ్రహంకలవాడూ, ఆత్మజ్ఞానంకలవాడూ అయిన యతికి ఎక్కడపడితే అక్కడ మోక్షం సాక్షాత్కరిస్తుంది.

శబ్దమూ, స్పర్శమూ మొదలైన బాహ్యవిషయాలు బహిష్కరించి, కనుబొమలమధ్య చూపు నిలిపి, ముకుపుటాల్లో ప్రాణవాయువూ, అపానవాయువూ సమంగా వుండేటట్టు చేసి, మనస్సూ బుద్ధీ ఇంద్రియాలూ అరికట్టి మోక్షం వొక్కటే పొందదగిందన్న ధ్యానంలో వుండే ముని సర్వదా ముక్తుడే అని చెప్పాలి.

యజ్ఞాలికీ, తపస్సులికీ నేనే భోక్తని. సర్వలోకాలికీ నేనే ఈశ్వరుణ్ణి. సర్వభూతాలికీ నేనే స్నేహితుణ్ణి. ఇలా నన్ను తెలుసుకున్నవాడు శాంతి పొందుతున్నాడు.

తాను చెయ్యవలసిన కర్మలు ఫలాపేక్ష లేకండా చేసేనవాడే సన్యాసి. అతడే కర్మయోగి. అగ్నిహోత్రాలూ అవీ విడిచిపెట్టినంతమాత్రాన సన్యాసికాడు. కర్మలు మానివేసినంత మాత్రాన యోగికాడు. సన్యాసమని దేనినంటారో అదే కర్మయోగమని నమ్ము. ఏమంటే ఫలాపేక్షని సన్యసిస్తేనే కాని — అంటే వొదిలిపెడితేనేకాని ఎవడూ యోగి కాలేడు.

యోగారూఢుడు కావాలనుకునే మునికి — అంటే యోగం పొందగోరే మునికి — కర్మసాధనమనీ, యోగారూఢుడైన వాడికి శాంతిసాధనమనీ చెప్పారు. ఎప్పుడైతే మనిషి ఇంద్రియవిషయాల మీదా, కర్మలమీదా ఆసక్తి పెట్టుకోకుండా, సర్వసంకల్పాలూ సన్న్యసిస్తాడో అప్పుడే అతణ్ణి యోగారూఢు డంటారు.

వివేకంతో తన్ను తానే ఉద్ధరించుకోవాలి. తన్ను తాను నాశనం చేసుకోకూడదు. ఏమంటే, తనకి తానే బంధువు. తనకి తానే శత్రువు. తన్ను తాను జయించినవాడు తనకి తాను బంధువు. తన్ను తాను తెలుసుకోలేనివాడు తనకి తాను శత్రువు. అంచేత, తన్ను తాను జయించి ప్రశాంతుడైనవాడూ, చలి వేడి, సుఖం దుఃఖం, మానం అవమానం—వీటికి లోబడకుండా ఆత్మ స్థిరంగా వున్న వాడూ, జ్ఞానంచేతా విజ్ఞానంచేతా ఆత్మ తృప్తిపడినవాడూ, ఇంద్రియాలు జయించినవాడూ, చలించనివాడూ, రాయీ మన్నూ బంగారం ఒక్కలాగే చూసేవాడూ యోగారూఢు డనిపించు కుంటాడు.

అభిమానులూ, స్నేహితులూ, శత్రువులూ, తటస్థులూ, మధ్యవర్తులూ, ద్వేషించినవాళ్ళూ, బంధువులూ, సాధువులూ, పాపులూ — వీళ్ళందరినీ ఒక్కలాగే సమబుద్ధితో చూసేవాడే ఉత్తముడు.

యోగిఅయినవాడు ఏకాంతంలో ఒంటరిగావుండి, మనస్సూ, ఆత్మా స్వాధీనం చేసుకోవాలి. కోరికలు లేకుండా వుండాలి. బంధాలు వొదుల్చుకోవాలి. మనస్సు ఎప్పుడూ యోగాభ్యాసంలోనే లగ్నం చేసుకోవాలి.

పరిశుభ్రమైనచోట స్థిరంగా తన ఆసనం ఏర్పరచుకోవాలి అది అంత ఎత్తుగాకాని, అంతపల్లంగా కాని వుండకూడదు. మొదట దర్భలు పరిచి వాటిమీద లేడిచర్మం వెయ్యాలి. దాని మీద వస్త్రం పరచాలి. మనోవ్యాపారాలూ, ఇంద్రియవ్యాపా

రాలూ సిరోధించుకుని, ఏకాగ్రమైన మనస్సుతో ఆ ఆసనంమీద కూచుని ఆత్మశుద్ధికోసం యోగాభ్యాసం చెయ్యాలి.

వెన్నుపూసా, తలా, మెడా సమంగా స్థిరంగా వుంచాలి. దిక్కులు చూడకండా కదలకండా కూచోవాలి. ముక్కు కొసని చూపు నిలపాలి. భయపడకండా, ప్రశాంతమైన అంతఃకరణంతో బ్రహ్మచర్యం పాలించాలి. మనోనిగ్రహంతో వుండాలి. నామీదే మనస్సు పెట్టుకుని, నన్నే ఆశ్రయించి యోగాభ్యాసం చెయ్యాలి.

ఇలా ఎప్పుడూ యోగాభ్యాసం చేసే యోగికి మనస్సు స్వాధీనంలోకి వస్తుంది. దాంతో, నాలోవున్నదిన్నీ, తుదకి నాలోనే లీనం చేసేదిన్నీ అయిన శాంతి లభిస్తుంది.

ఐతే అర్జునా, మితిమీరి తిండితినే తిండిపోతుకి ఈ యోగం సిద్ధించదు. అలాగే బొత్తిగా తినని వాడికీ సిద్ధించదు. అంతే కాదు, ఎక్కువగా నిద్రపోయేవాడికీ, బొత్తిగా నిద్రపోనివాడికీ కూడా సిద్ధించదు. ఉచితమయిన ఆహారం, విహారం, ఉచితమయిన కర్మలు చెయ్యడం, ఉచితమయిన నిద్రా, మెలకువా కలవ్యక్తిని ఈ యోగం దుఃఖం లేకండా చేసి సౌఖ్యం కలిగిస్తుంది.

బాగా నిగ్రహించిన మనస్సు ఎప్పుడయితే ఆత్మలో స్థిరపడుతుందో, అప్పుడు, సమస్తమయిన భోగాలమీదా కోర్కెలు వొదులుకున్న ఆ వ్యక్తి యోగి అనిపించుకుంటాడు.

ఆత్మయోగం అభ్యసించే యోగిమనస్సు, స్థిరమై నిశ్చలంగా గాలిలేనిచోట కదలకండా వుండే దీపంలాగ వుంటుందన్నారు.

యోగం ఆచరించడంలో నిరోధించబడ్డ మనస్సు ఏస్థితిలో ఉపరతి పొందుతున్నదో, తన్ను తాను చూసుకుని ఆత్మలోనే యోగి ఏస్థితిలో సంతుష్టిపడుతుంటాడో, ఇంద్రియాలికి అందనిదీ, బుద్ధితో మాత్రం తెలుసుకోదగిందీ అయిన అనంతసౌఖ్యం అతడు ఏస్థితిలో

తెలుసుకుంటాడో, ఆత్మతత్వంనించి చలించకండా ఏస్థితిలోవుంటాడో, ఏస్థితి దొరికాక మరే ఇతరలాభంకూడా అంతకంటే అధికమని తలం చడో, ఏస్థితిలోవుండి ఎంతటి గొప్పదుఃఖం వచ్చినా చలించకండా వుంటాడో- ఆస్థితిని-సర్వదుఃఖాలూ పోగొట్టే ఆ యోగమనేదానిని తెలుసుకోవాలి. విసుగూ విడుపూ లేని మనస్సుతో ఆ యోగం అభ్యసించాలి.

సంకల్పంవల్ల పుట్టేకోర్కెలు యావత్తూ, పూర్తిగా వొదిలి పెట్టాలి. ఇంద్రియాలన్నిటినీ, అన్ని వేపులనించీ మనస్సుతో మళ్ళించాలి. ధైర్యం చిక్కబట్టిన బుద్ధితో మెల్లమెల్లగా శాంతి పొందుతూ వుండాలి. ఆత్మలోనే మనస్సు కుదురుపర్చుకుని, ఏ విచారమూ మనస్సులోకి రానివ్వకండా వుండాలి.

మనస్సు నిలకడ లేంది. చంచలమైంది. అది సర్వదా ఏయే విషయాల మీదికి పరిగెడుతూ వుంటుందో, ఆయా విషయాల మీంచి అరికట్టి, దానిని ఆత్మవశం చెయ్యాలి.

ప్రశాంత మయిన మనస్సు కలవాడూ, రజోగుణం శాంతిం చినవాడూ, పాపంలేనివాడూ, బ్రహ్మత్వం పొందినవాడూ అయిన యోగికి ఉత్తమమైన సౌఖ్యం దొరుకుతుంది. ఇలా ఎల్లప్పుడూ ఆత్మసంబంధమయిన యోగాభ్యాసంచేసే యోగి పాపాలు వొది లించుకుని, సులువుగా బ్రహ్మసాక్షాత్కారంవల్ల కలిగే మహా సౌఖ్యం అనుభవిస్తాడు.

ఆత్మయోగంలో వున్నవాడి చూపు సర్వత్రా సమంగా వుంటుంది. అతడు సమస్తప్రాణుల్లోనూ తననీ, తనలో సమస్త ప్రాణుల్నీ చూస్తాడు.

ఎవడైతే సర్వత్రానన్ను చూస్తాడో, నాలో సర్వస్వమూ చూస్తాడో అతడికి సర్వదా నేను కనిపిస్తూనే వుంటాను. నాకూ అతడు

కనిపిస్తూనే వుంటాడు. ఏకత్వబుద్ధి మనస్సులో పెట్టుకుని, సమస్త భూతాల్లోనూ వుండే నన్ను భజించే యోగి సర్వవ్యవహారాల్లోనూ వుంటూవున్నా కూడా నాలోనే ప్రవర్తిస్తూ వుంటాడు. అర్జునా, సుఖమైనా దుఃఖమైనా తనలో లాగే సమస్త ప్రాణుల్లోనూ వొకేవిధంగా చూసే యోగి ఉత్తము డనిపించు కుంటాడు.

అర్జునుడు : నువ్వు బోధించిన ఈ యోగం — సమత్వబుద్ధితో ప్రాప్తమయే దీనిని — మనస్సు చంచలం కావడంచేత స్థిరంగా వుండేట్టు చూడలేక పోతున్నాను. కృష్ణా, మనస్సు చంచలమైంది. బలీయమైంది. దృఢమైంది. క్షోభ కలిగిస్తుంది. ఇలాంటి మనస్సు నిగ్రహించడమంటే గాలిని మూటకట్టడం లాంటి దుష్కరమైన పనే అని తలుస్తాను.

శ్రీకృష్ణుడు : అవును మనస్సు చంచలమైందే. నిగ్రహించడానికి సాధ్యంకాందే. సందేహం లేదు. కాని అభ్యాసంవల్లా, వైరాగ్యంవల్లా దాన్ని స్వాధీనం చేసుకోవచ్చు.

మనస్సు స్వాధీనంలో లేనివాడు ఈ యోగం సాధించడం కష్టమనే నా అభిప్రాయం. కానైతే, మనస్సు స్వాధీనంలో వుంచుకుని ప్రయత్నం చేసినట్టయితే మాత్రం ఉపాయంతో దీన్ని సాధించవచ్చు.

అర్జునుడు : శ్రద్ధతో యోగసాధన ఆరంభించినా, ప్రయత్న లోపంవల్ల మనస్సు చలించిన యోగభ్రష్టుడు యోగఫలం పొందలేడుకదా ! మరి అలాంటివాడి గతి ఏమవుతుంది? బ్రహ్మజ్ఞాన మార్గమూ అతడికి తెలియదు. మరో దారా వుండదు. అప్పుడు రెంటికీ చెడి, తెగిపోయిన మబ్బుముక్కలాగ అతడు చెడిపోడు కదా ! నా సందేహం తీర్చడానికి నువ్వే తగినవాడివి. ఈ సంశయం తీర్చడానికి నువ్వుతప్ప మరెవరు దొరుకుతారు?

శ్రీకృష్ణుడు : అలాంటివాడికి ఈ లోకంలో నాశనం లేనే లేదు. పరలోకంలోనూ నాశనంలేదు. మంచిపని చేసేవాడు ఎప్పుడూ దుర్గతిపాలు కాడుగదా! యోగభ్రష్టుడు పుణ్యాత్ముల లోకంలో అనేక సంవత్సరాలు వుంటాడు. తరవాత సంపన్నులయిన శుచిమంతుల ఇంట్లోనో, జ్ఞానులయిన యోగుల కులంలోనో పుడతాడు. లోకంలో ఇలాంటి జన్మ దొరకడం దుర్లభమే కదా మరి !

అలాపుట్టి, తన పూర్వజన్మంలోని జ్ఞానం తిరిగి పొందుతాడు. దాంతో మళ్ళీ అంతకంటే అధికంగా యోగసిద్ధికోసం ప్రయత్నం చేస్తాడు. అతడుకోరి ప్రయత్నం చెయ్యకపోయినా సరే, పూర్వజన్మంలోని అభ్యాసం చేతనే యోగం అతణ్ణి ఆకర్షిస్తుంది. యోగం తెలుసుకో దలిచినవాడు కూడా శబ్దబ్రహ్మం (వేదాలు) అతిక్రమిస్తాడు. ఇలా విడవకండా ప్రయత్నంచేసే యోగి పాపాలు పోదిలించుకుని, అనేక జన్మల సంస్కారంతో సిద్ధిపొంది చివరకి మోక్షం పొందుతాడు.

తపస్వులకంటే, జ్ఞానులకంటే, కర్మపరాయణులకంటే కూడా యోగి అధికుడని నామతం. అంచేత అర్జునా, నువ్వు యోగివి కావాలి.

అయితే ఎవడు శ్రద్ధతో నామీాద ఆసక్తి పెట్టుకుని నన్ను భజిస్తాడో అతడే యోగుల అందరిలోనూ ఉత్తముడని నామతం.

అర్జునా, నామీాదే మనస్సు వుంచి, నన్నే ఆశ్రయించి యోగం అభ్యసిస్తూ, నాపూర్ణస్వరూపం సందేహం లేకండా ఎలా తెలుసుకోగలవో అది చెపుతాను, విను. దేనిని తెలుసుకున్న తరవాత ఇక తెలుసుకో వలిసింది ఏదీ వుండదో అది — విజ్ఞానంతో కూడిన ఆ జ్ఞానం, ఏమీా మిగల్చకండా నీకోసం నేను చెపుతున్నాను.

వెయ్యిమంది మనుషుల్లో ఎవడో ఒకడు మాత్రం యోగసిద్ధికోసం ప్రయత్నిస్తాడు. అలా ప్రయత్నించిన వెయ్యిమందిలో ఎవడో ఒకడే నన్ను యథార్థంగా తెలుసుకుంటాడు.

భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం అని నా ప్రకృతి ఎనిమిది విధాలు. భూత స్వరూపమయిన నా ఈ ప్రకృతి నికృష్ట ప్రకృతి. ఇది కాక ఈ ప్రపంచ మంతటినీ ధరించేది నా రెండో ప్రకృతి. జీవనస్వరూపమయిన అది నా పరా ప్రకృతి. అంటే శ్రేష్ఠప్రకృతి అని తెలుసుకో. సమస్తమైన భూతాలూ ఈ రెండు ప్రకృతుల్లోంచే పుడుతున్నాయి. అలాగే ఈ జగత్తు యావత్తూ పుట్టడానికీ, నాశనం కావడానికీ నేనే కారకుణ్ణి. అర్జునా, నాకంటె శ్రేష్ఠమైంది మరేదీ లేనేలేదు. దారంలో మణుల్లాగ సర్వమూ నాలోనే కూర్చిపెట్టి వున్నాయి.

అర్జునా, నీళ్ళలో రసమూ, సూర్యచంద్రుల్లో ప్రకాశమూ, వేదాల్లో ఓంకారమూ, ఆకాశంలో శబ్దమూ, మనుషుల్లో పౌరుషమూ నేనే. భూమిలో పరిమళమూ, నిప్పులో తేజస్సూ, సమస్త భూతాల్లో జీవనశక్తీ, - తపస్సు చేసేవారి తపస్సూ నేనే. సర్వప్రాణులకీ సనాతనమైన బీజమూ నేనే. బుద్ధిమంతుల బుద్ధీ, తేజోవంతుల తేజస్సూసహా నేనే కామమూ రాగమూ కాక బలవంతుల బలమూ, ప్రాణుల ధర్మవిరుద్ధం కాని కామమూ నేనే. సాత్త్వికాలూ, రాజసాలూ, తామసాలూ అయినభావాలన్నీ నావల్లే పుడుతున్నాయి. అయితే అవి నాలో వున్నాయి. కాని, నేను వాట్లో లేను.

ఈ మూడు గుణాల్లోంచీ పుట్టిన భావాలవల్ల జగత్తు యావత్తూ మోహంలోపడి దీనికి భిన్నంగానూ, అనాదిగానూ వున్న నన్ను తెలుసుకో లేకపోతున్నది. గుణాలు మూడిటితోనూ కూడినదీ, దివ్యమైందీ అయిన నామాయ దాట శక్యం కానిది. నన్నే శరణు జొచ్చినవాళ్ళుమాత్రం ఈ మాయ తరించ గలుగుతారు. మాయతో మతిపోయినవాళ్ళూ, మూఢులూ, పాపాత్ములూ అయిన అధమ మానవులు రాక్షస స్వభావానికి లోబడి నన్ను సేవించరు.

ఆర్తుడూ, జ్ఞానం కావలిసిన వాడూ, ధనం కోరేవాడూ, ఆత్మజ్ఞానం కలవాడూ— ఈ నాలుగురకాల పుణ్యాత్ములూ నన్ను సేవిస్తున్నారు. వీళ్ళలో వొకే భక్తితో నన్ను సేవించేవాడూ, ఎల్లప్పుడూ నిష్కామబుద్ధితో వ్యవహరించేవాడూ అయిన జ్ఞాని గొప్పవాడు. ఏమంటే, నేను జ్ఞానికి ఎంతో ప్రియుణ్ణి. నాకూ జ్ఞాని ఎంతో ప్రియుడు. ఈభక్తులందరూకూడా మంచివాళ్ళే. ఐతే, ఇందులో జ్ఞాని అంటే మాత్రం నేనే అని నామతం. ఏమంటే, యోగపరుడై అతడు నేనేగతి అని నన్ను నమ్ముకున్నాడు కదూమరి!

ఎన్నో జన్మలెత్తిన తరవాత జ్ఞానవంతుడు "సర్వమూ వాసుదేవుడే" అని నన్ను సేవిస్తున్నాడు. అలాంటి మహాత్ముడు దొరకడమే దుర్లభం.

తమతమప్రకృతిలబట్టి ఆయా కోరికలతో మతిపోయిన వ్యక్తులు తమతమ కోరికలికి తగినట్టు ఉపాసిస్తూ ఇతరదేవతల్ని సేవిస్తున్నారు. ఏ భక్తుడు ఏ దేవతరూపం శ్రద్ధతో ఉపాసించడానికి ఇష్టపడతాడో ఆభక్తుడికి ఆ శ్రద్ధ నేనే స్థిరపరుస్తున్నాను. దాంతో ఆ భక్తుడు ఆశ్రద్ధతో ఆదేవతని ఆరాధిస్తున్నాడు. తాను కోరుకున్న కోరిక—నేను చేసిపెట్టిందే — ఆ దేవతనించి పొందుతున్నాడు. ఐతే, ఈ తక్కువ బుద్ధులవాళ్ళకి కలిగే ఈ ఫలాలు అశాశ్వతమైనవి. అంతేకాదు, దేవతల్ని ఉపాసించేవాళ్ళు దేవతల్నే పొందుతున్నారు. నా భక్తులుమాత్రం నన్ను పొందుతున్నారు.

నాశనం లేందీ, ఉత్కృష్టమైందీ, పరమైందీ నా రూపం. తెలుసుకోలేని బుద్ధిహీనులు అవ్యక్తుణ్ణయిన నన్ను నామ రూపాలు వున్నవాణ్ణని భావిస్తున్నారు. నేను యోగమాయచేత మరుగుపడి వుంటాను. అందరికీ కనపడను. అంచేత, ఈ మూఢలోకం చావుపుట్టుకలు లేనివాణ్ణని నన్ను తెలుసుకోలేక పోతున్నది. ఇంతకి

ముందూ, ఇప్పుడూ, ఇకముందూ — ఈ మూడుకాలాల్లోనూ పుట్టే యావత్తు ప్రాణుల్నీ నేను ఎరుగుదును. నన్ను మాత్రం ఎవరూ ఎరగరు. కారణమేమంటే, సమస్త ప్రాణులకీ ఇష్టమూ అయిష్టమూ పుట్టుకతోనే సుఖం దుఃఖం మొదలయిన ద్వంద్వాలు కలిగిస్తాయి. ఈద్వంద్వ స్వభావం మోహంలో ముంచెత్తుతుంది. ఐతే పుణ్యకర్మలు చేసే జనులుమాత్రం పాపాలు లేకండా చేసుకుంటారు. అలాంటివాళ్ళు ద్వంద్వమోహంలో పడరు. దృఢవ్రతులై నన్ను భజిస్తున్నారు. ఇలా నన్ను ఆశ్రయించి జరామరణాలనించి ముక్తులుకావడంకోసం ప్రయత్నించేవాళ్ళు సమగ్రంగా ఆబ్రహ్మమూ, అధ్యాత్మమూ, సమస్తమైన కర్మలూ తెలుసుకుంటారు. అధిభూతమూ, అధిదైవమూ అధియజ్ఞమూకూడా నేనే అని తెలుసుకున్నవాళ్ళు ఏకాగ్రచిత్తులై మరణ సమయంలోకూడా నన్ను తెలుసుకుంటారు.

అర్జునుడు : కృష్ణా, ఆ బ్రహ్మం అంటే ఏమిటి? అధ్యాత్మం అంటే ఏమిటి? కర్మ అంటే ఏమిటి? అధిభూతం అంటే ఏమిటి? అధిదైవం అంటే ఏమిటి? అధియజ్ఞం అంటే ఏమిటి? ఈ దేహంలో అది ఎలా తెలుసుకోడం? ఆత్మనిగ్రహం కలవాళ్ళు మరణకాలంలో నిన్ను ఎలా తెలుసుకోగలుగుతారు?

శ్రీకృష్ణుడు : ఉత్కృష్టమైందీ, నాశనంలేందీ ఏదో అదే బ్రహ్మం. ప్రతిదానికీ వుండే మూలస్వభావమే అధ్యాత్మమంటారు. జీవుల సృష్టి స్థితులికి కారణమైన సృష్టివ్యాపారమే కర్మ. నాశనమయేది అధిభూతం. పురుషుడు అధిదైవతం. శరీరధారుల్లో ఉత్తముడివైన అర్జునా, నేనే అధియజ్ఞం. ఈ దేహంలో నేనే వున్నాను.

ఇక, ఎవడైతే మరణసమయంలో నన్నే స్మరిస్తూ శరీరం వొదిలిపెడతాడో అతడు నన్నే పొందుతాడు. సందేహం లేదు,

ఏప్పుడూ భావిస్తూ, మరణకాలంలో ఎవడు ఏభావం స్మరిస్తూ దేహం చాలిస్తాడో అతడు ఆభావమే పొందుతాడు. అంచేత అర్జునా, సదాసర్వదా నన్ను స్మరిస్తూవుండు. మరిన్నీ యుద్ధం చెయ్యి. నీ మనస్సూ, బుద్ధీ నామీదే పెట్టుకుంటే నన్నే చేరతావు. దీనికి తిరుగు లేదు. మనస్సు మరోదిక్కు పోనివ్వకండా, అభ్యాసయోగంతో దివ్యుడయిన పరమపురుషుణ్ణి ధ్యానిస్తూ వుండేవాడు అతణ్ణే చేరతాడు.

సర్వజ్ఞుడూ, సనాతనుడూ, నియంతా, అణువుకంటే కూడా సూక్ష్మమైనవాడూ, సర్వానికీ ఆధారభూతుడూ, ఊహించడానికి శక్యంకాని రూపంకలవాడూ, సూర్యుడిలాగ తనంతటతానే ప్రకాశించేవాడూ అంధకారానికి అవతలవుండే వాడూ అయిన పురుషుణ్ణి భక్తితోనూ, యోగబలంతోనూ, నిశ్చలమైన మనస్సుతోనూ, నిలకడగా కనుబొమలమధ్య ప్రాణంనిలిపి మరణకాలంలో స్మరించేవాడు ఆపరమ పురుషుణ్ణి తప్పక పొందుతాడు.

వేదవేత్తలు దేనిని అక్షరమని – అంటే నాశనం లేనిదని చెపుతున్నారో, రాగం మానుకుని యోగులు దేనిని చేరుతున్నారో, దేనికోసం బ్రహ్మచర్య వ్రతం చేస్తున్నారో – దాన్ని నీకు స్పష్టంగా చెపుతున్నాను.

ఇంద్రియద్వారాలు యావత్తూ అరికట్టి, మనస్సు హృదయంలో బంధించి, ప్రాణం శిరస్సులో (కనుబొమలమధ్య, లేదా సహస్రారంలో చేర్చి, ఓం అనే ఏకాక్షర బ్రహ్మం జపిస్తూ, నన్నే స్మరిస్తూ దేహం విడిచిపోయేవాడు ఉత్తమగతి పొందుతాడు.

ఇతరమైన వేటిమీదా మనస్సు పోనివ్వకండా యావజ్జీవమూ నన్నే స్మరిస్తూవుండే స్థిరచిత్తంకల యోగికి నేను ఎంతోసులభంగాదొరుకుతాను. పరమసిద్ధిపొందిన మహాత్ములు నన్నే చేరతారు. దుఃఖానికి పుట్టినిల్లూ, అశాశ్వతమూ అయిన పునర్జన్మ మరి వుండదు వాళ్ళకి.

భూలోకంనించి బ్రహ్మలోకంవరకూ ఏలోకానికి వెళ్ళినాసరే, మళ్ళీ తిరిగిరావలసిందే. అంటే పునర్జన్మ పొందవలిసిందే. కాని నన్ను పొందినవాడికిమాత్రం మరి జన్మవుండదు.

పగలూ రాత్రీ - ఈలెక్క తెలిసినవాళ్ళు వెయ్యి దేవయుగాలు అయితే బ్రహ్మకి వొక పగలు అనీ, అలాగే మరో వెయ్యి యుగాలు అయితే బ్రహ్మకి ఒక రాత్రి అనీ ఎరుగుదురు. బ్రహ్మకి పగలయినప్పుడు అవ్యక్తంనించి సమస్తమైన ప్రాణులూ పుడుతున్నాయి రాత్రయినప్పుడు తిరిగి ఆఅవ్యక్తంలోనే కలిసిపోతున్నాయి. ఇలా మొదటవున్న ఈ ప్రాణిసమూహామే మళ్ళీ మళ్ళీ పుడుతూ బ్రహ్మకి రాత్రికాగానే లయమయిపోతూవుంది. అతడికి పగలు కాగానే తప్పనిసరిగా తిరిగీ పుడుతూవుంది. కాని, బ్రహ్మకి రాత్రి సమయమైన ఆ అవ్యక్తంకంటే భిన్నమయిన మరో అవ్యక్తపదార్థం-సనాతనమైన ఆ బ్రహ్మస్వరూపం మాత్రం ప్రాణికోటిఅంతా నాశనమైనాకూడా నాశనం కాదు.

ఇలా ఏదిఅవ్యక్తమైందనీ, నాశనం లేందనీ చెప్పబడుతూవుందో, దానినే ఉత్తమగతి అని అంటారు. అదే ఉత్కృష్టమైన నాస్థానం. దానిని పొందినవాళ్ళకి తిరిగీ పుట్టడమంటూ వుండదు.

అర్జునా, సమస్తభూతాలూ ఎవడిలో వుంటున్నాయో, ఎవడి వల్ల ఈజగత్తంతా వ్యాప్తమై వుందో ఆ పరమపురుషుడు ఏ కాంతమైన భక్తివల్లే లభ్యమవుతాడు.

ఇక, యోగి ఏ కాలంలో ప్రయాణిస్తే - అంటే మరణిస్తే ఈలోకానికి తిరిగి రాడో, ఏ కాలంలో ప్రయాణిస్తే తిరిగి ఈలోకంలో పుడతాడో ఆ కాలం గురించి ఇప్పుడు నీకు చెపుతాను. అగ్నీ, జ్యోతీ, పగలూ, శుక్లపక్షం, ఉత్తరాయణాఆరు మాసాలూ -

ఈకాలంలో ప్రయాణిస్తే - అంటే మరణిస్తే బ్రహ్మవేత్తలయిన జనులు బ్రహ్మంలో కలుస్తారు. తిరిగి జన్మించరు.

పొగా, రాత్రీ, కృష్ణపక్షం, దక్షిణాయనం ఆరు మాసాలూ - ఈకాలంలో మరణించిన యోగులు చంద్రజ్యోతిని పొంది - అంటే చంద్రలోకానికి వెళ్ళి తిరిగి వస్తున్నారు.

ఇలా శుక్లం (దేవయానం, లేదా అర్చిరాదిమార్గం) కృష్ణం (పితృమార్గం, లేదా ధూమ్రమాది మార్గం) అని రెండుమార్గాలూ ప్రపంచంలో శాశ్వతమైనవని చెప్పబడుతున్నాయి. ఇందులో వొక దారిని పోతే తిరిగి రారు. మరోదారిని పోతే తిరిగి వస్తారు. ఈ రెండు మార్గాలూ తెలిసిన ఏ యోగీకూడా మోహంలో పడడు. అంచేత అర్జునా, ఎల్లప్పుడూ నువ్వు యోగంతోనే వుండు.

ఇది తెలుసుకున్న యోగి వేదాల్లోనూ, యజ్ఞాల్లోనూ, తపస్సుల్లోనూ, దానాల్లోనూ చెప్పిన పుణ్యఫలం యావత్తూ అతిక్రమిస్తాడు. మరిన్నీ అంతటికీ ఆది కారణమైన ఉత్తమ స్థానం పొందుతాడు.

అర్జునా, అసూయలేని వాడివి నువ్వు. నీకోసం విజ్ఞానంతో కూడిన, అతిరహస్యమైన జ్ఞానం చెపుతున్నాను. దీన్ని తెలుసుకుని పాపాలు వొదిలించుకుంటావు. మోక్షం పొందగలుగుతావు. ఇది రాజవిద్య - విద్యల్లో ఉత్తమమైంది. రహస్యాల్లో రాజు - శ్రేష్ఠమైంది. పవిత్రమైంది. స్వానుభవంమీద తెలుసుకో దగింది. ధర్మసమ్మతమైంది. నాశనం లేంది. ఆచరించడానికి అతిసులభమైంది. ఈ ధర్మం మీద శ్రద్ధలేనివాళ్లు నన్ను పొందక, మృత్యుయాపమైన సంసారమార్గంలో పడి తిరుగుతున్నారు.

ఇంద్రియాలికి గోచరంకాని నేను ఈ జగత్తునిండా వ్యాపించి వున్నాను. సర్వభూతాలూ నాలో వున్నాయి. కాని నేను వాటిలో లేను. నిజానికి భూతాలూ నాలో లేవు. నా ఈశ్వరశక్తీ,

యోగసామర్థ్యం ఎలావుందో చూడు! భూతాల్ని పుట్టించే నా ఆత్మ భూతాల్ని ధరిస్తూ వున్నా, భూతాల్లో లేదు. యువు అంతటా తిరుగుతుంది. గొప్పది. అది శాశ్వతంగా ఆకాశంలో నిండివున్నట్టే సర్వభూతాలూ నాలో వున్నాయని నమ్ము.

కల్పం అంతమైనపుడు సర్వభూతాలూ నా ప్రకృతిలో కలిసి పోతున్నాయి. కల్పం ఆరంభమైనపుడు మళ్ళీ వాటిని నేనే పుట్టిస్తున్నాను. ప్రకృతికి వశంకావడం చేత స్వాతంత్ర్యం లేని ఈ సమస్త భూతకోటినీ, నేను నాప్రకృతిని అవలంబించి మళ్ళీ మళ్ళీ పుట్టిస్తున్నాను. ఐతే ఈ కర్మమీద నాకు ఆసక్తి లేదు. ఉదాసీనంగానే వుంటాను. అంచేత ఈ కర్మలు నన్ను బంధించవు.

అర్జునా, నేనే అధ్యక్షుణ్ణి. నాతోనే ప్రకృతి ఈ చరాచర సృష్టినంతా కంటున్నది. ఈ కారణంచేతే లోకం నడుస్తోంది. భూతకోటికంతటికీ నేనే నియంతని. అజ్ఞానులు నా పరభావం — ఉత్తమస్వరూపం తెలుసుకోలేక, మనుష్య శరీరం ధరించిన నన్ను చులకనగా చూస్తున్నారు.

కొరగాని ఆశలు పెట్టుకున్న వాళ్ళూ, వ్యర్థమైన కర్మలు చేసే వాళ్ళూ, పనికిమాలిన జ్ఞానం కలవాళ్ళూ, బుద్ధిమాలినవాళ్ళూ, మోహం కలిగించే క్రూరమైన రాక్షసప్రకృతినే ఆశ్రయిస్తున్నారు. ఇక మహాత్ములైనవాళ్ళో, — వాళ్ళు దైవప్రకృతిని ఆశ్రయిస్తున్నారు. ప్రపంచానికి కారణభూతుణ్ణయిన నన్ను తెలుసుకుంటున్నారు. ఏకాగ్ర చిత్తంతో నన్ను భజిస్తున్నారు. ఎప్పుడూ నన్నే కీర్తిస్తున్నారు. ప్రయత్నంతో దృఢవ్రతులై భక్తితో నమస్కరిస్తున్నారు. నిత్య యోగులై నన్ను సేవిస్తున్నారు. మరికొందరు జ్ఞానయజ్ఞంతో ఉపాసిస్తున్నారు. విరాటపురుషుణ్ణయిన నన్ను ఏకత్వంతోనూ, భిన్నత్వంతోనూ ఇలా అనేక విధాల పూజిస్తున్నారు.

క్రతువు (శ్రౌతయజ్ఞం) నేనే. యజ్ఞం (స్మార్తయజ్ఞం) నేనే. పితృదేవతలకి పెట్టేపిండం నేనే. యజ్ఞంకోసం వనస్పతులతో చేసే అన్నమూ నేనే. మంత్రం నేనే. హోమంలో వేల్చే నెయ్యీ నేనే. అగ్ని హోత్రం నేనే. హోమకర్మా నేనే.

ఈ జగత్తుకి నేనే తండ్రిని. నేనే తల్లిని. నేనే ధాతని. నేనే తాతని. తెలుసుకోదగిన, పవిత్రమైన ఓంకారం నేనే. సామవేదం, యజుర్వేదం నేనే. ఈ జగత్తుకి నేనే గతి. నేనే పోషకుణ్ణి. నేనే ప్రభువుని. నేనే సాక్షిని. నేనే నివాసం. నేనే ఆశ్రయం. నేనే నేస్తం. నేనే పుట్టించే వాణ్ణి. నేనే నిలిపేవాణ్ణి. నేనే నాశనం చేసేవాణ్ణి. నేనే నిదానం. నేనే నాశనంలేని బీజం. అర్జునా, వేడి నేనే కలిగిస్తున్నాను. వాన నేనే నిలుపుతున్నాను. నేనే కురిపిస్తున్నాను. నేనే అమృతం. నేనే మృత్యువు. నేనే సత్తు. నేనే అసత్తు.

ఋగ్వేదం యజుర్వేదం సామవేదం — ఈ మూడు వేదాలూ అభ్యసించినవాళ్ళు యజ్ఞాల్లో నన్ను పూజించి, సోమపానంచేసి, పాపాలుపోగొట్టుకుని స్వర్గంకోసం ప్రార్థిస్తున్నారు. వారి పుణ్యఫల మైన దేవేంద్రలోకానికి వెళుతున్నారు. అక్కడ స్వర్గంలో దేవతల దివ్యభోగాలు అనుభవిస్తున్నారు. అలా విశాలమైన స్వర్గలోకంలో భోగాలు అనుభవించి, ఆ పుణ్యం కాస్తా చెల్లిపోగానే మళ్ళీ జన్మ ఎత్తి మర్త్యలోకానికి వస్తున్నారు. ఇలా ఈ త్రయీధర్మపరులు — అంటే మూడు వేదాల్లోని వైదికధర్మం ఆచరించేవాళ్ళు భోగాలమీద వాంఛలు పెట్టుకుని రాకపోకలు చేస్తున్నారు — అంటే — మళ్ళీ మళ్ళీ చస్తూ పుడుతూ వున్నారు.

కాని, ఎవళ్ళయితే ఇతర భావన లేకండా నన్ను స్మరిస్తూ ఉపా సిస్తున్నారో ఆ నిత్య యోగులయిన వాళ్ళ యోగక్షేమాలు నేనే భరిస్తున్నాను. ఇతర దేవతల భక్తులై వాళ్ళని శ్రద్ధతో పూజించేవాళ్ళు

కూడా తెలియకుండా నన్నే పూజిస్తున్నారు. ఏమంటే యజ్ఞాలన్నింటికీ నేనే భోక్తని. నేనే స్వామిని. ఐతే వాళ్ళుమాత్రం నాయథార్థం ఎరగరు. అంచేత తిరిగిచావుపుట్టుకల ప్రవాహంలో పడిపోతూవుంటారు.

దేవతల్ని ఆరాధించేవాళ్ళు దేవతల్ని పొందుతున్నారు. పితరుల్ని పూజించేవాళ్ళు పితరుల్ని పొందుతున్నారు. భూతాల్ని కొలిచేవాళ్ళు భూతాల్నే పొందుతున్నారు. నన్ను సేవించేవాళ్ళు నన్నే పొందుతున్నారు.

పత్రం, పుష్పం, ఫలం, జలం — ఏదైనాసరే, భక్తితో నాకు సమర్పించే పరిశుద్ధచిత్తుడైన నిష్కామభక్తుడి భక్తిబహుమానం నేను గ్రహిస్తున్నాను. అర్జునా, నువ్వు చేసేకర్మలూ, తినే ఆహారం, చేసే హోమాలూ, ఇచ్చే దానాలూ, ఆచరించే తపస్సూ అంతా నాకు అర్పించు. ఈవిధంగా శుభమూ, అశుభమూ కలగజేసే కర్మబంధాల నించి విడుదల కలుగుతుంది నీకు. సన్న్యాసయోగంతో కూడిన అంతఃకరణ కలవాడివై, (కర్మఫలం త్యజించిన వాడివై) ముక్తుడివై, నన్ను పొందుతావు.

సర్వభూతాలూ నాకు సమానమే. విరోధి అనీ, ప్రియమైనవాడు అనీ నాకు లేరు. ఐతే, నన్నుభక్తితో సేవించేవాళ్ళు నాలోనే వుంటారు. నేనూ వాళ్ళలోనే వుంటాను. ఎంతో అంత దురాచారం కలవాడైనా సరే, ఇతరత్రా దేన్నీ ఆశ్రయించకండా నన్నే భజించినపుడు అతణ్ణి సాధువే అనాలి. ఏమంటే అతడి బుద్ధికి మంచి స్థిరత్వమే కుదురుతుంది. అతడు త్వరలోనే ధర్మాత్ముడవుతాడు. తరవాత శాశ్వతమైన శాంతినీ పొందుతాడు. అర్జునా, నాభక్తుడు ఎప్పుడూ నాశనం పొందడని నమ్ము.

ఏ పాపయోనిలో పుట్టినవాళ్ళయినా సరే, స్త్రీలయినా, కోమట్లయినా, శూద్రులయినా నన్ను ఆశ్రయించినవాళ్ళు ఉత్తమగతినే

పొందుతున్నారు. అలాంటప్పుడు పుణ్యవంతులైన బ్రాహ్మలవిషయం భక్తులైన రాజులసంగతి వేరే చెప్పే దేముంది!

అనిత్యమైనదీ, సౌఖ్యం లేందీఅయిన ఈలోకంలో నువ్వున్నావు. అంచేత అర్జునా, నన్నే భజించు. నామీదే మనస్సు నిలుపు. నా భక్తుడివి కా. నన్నే ఉపాసించు. నన్నే నమస్కరించు. ఇలా నన్నే శరణుపొంది ఈ యోగం అభ్యసిస్తే నన్నే పొందుతావు

అర్జునా, ఇంకా విను. ప్రీతిగావింటున్న నీమంచి కోసం ఉత్కృష్టమైన మాటలు మళ్ళీ చెపుతున్నాను. దేవతలు కాని, మహారుషులు కాని నాపుట్టుపూర్వోత్తరాలు ఎరగరు. ఏమంటే, దేవతలకీ మహాపురుషులకీ నేనే మూలకారణంకదా? ఆదిలేని వాణ్ణనీ, పుట్టుకలేనివాణ్ణనీ సర్వలోకాలికీ గొప్పఈశ్వరుణ్ణనీ నన్ను తెలుసుకున్నవాడు మానవుల్లో మూఢత్వం లేనివాడై, సర్వపాపాలూ వొదిలించుకుంటున్నాడు.

బుద్ధి, జ్ఞానం, అప్రమత్తత, క్షమా, సత్యం, దమం, శమం, సుఖం, దుఃఖం, పుట్టుక, చావు, భయం, నిర్భయం, అహింస, సమత్వం, సంతోషం, తపం, దానం, కీర్తి, అపకీర్తి - ఈ మొదలైనవి యావత్తూ సమస్తప్రాణులికీ నావల్లే కలుగుతున్నాయి. సప్త మహారుషులూ, నలుగురు పూర్వులూ, మనువులూ నా సంకల్పంవల్ల పుట్టినవాళ్ళే. లోకంలో వీళ్ళనించే సమస్తప్రజలూ పుట్టారు.

ఈ నా విభూతి, (మహిమ) యోగం - యథార్థం తెలుసుకున్నవాడికి స్థిరమయిన యోగంప్రాప్తమవుతుంది. ఇందులో సందేహంలేదు. నేనే సమస్తానికీ ఉత్పత్తిస్థానం. నానించే సమస్తమూ పుడుతూవుంది. ఇది తెలిసిన జ్ఞానులు భక్తిభావంతో నన్నే భజిస్తున్నారు. నామీదే మనస్సు నిల్పుకుంటున్నారు. నామీదే ప్రాణం పెట్టుకుంటున్నారు. ఒకళ్ళనొకళ్ళు బోధించుకుంటూ, నాకథలే

చెప్పుకుంటున్నారు. తమలో తాము ఎల్లప్పుడూ మహానందం అనుభవిస్తున్నారు.

ఎప్పుడూ యోగంతో వుండి, ప్రీతిపూర్వకంగా నన్ను భజించే వాళ్ళకి నన్ను పొందదగ్గ బుద్ధియోగం నేనే ఇస్తున్నాను. వాళ్ళని అనుగ్రహించడం కోసమే వాళ్ళబుద్ధిలో ప్రవేశించి, ప్రకాశిస్తున్న జ్ఞానదీపంతో అజ్ఞానంవల్ల కలిగిన అంధకారం నాశనం చేస్తున్నాను.

అర్జునుడు : నువ్వుపరబ్రహ్మవనీ, పరంధాముడివనీ, పరమ పవిత్రుడివనీ, శాశ్వతుడివనీ, దివ్యుడివనీ, ఆదిదేవుడివనీ, పుట్టుకలేని వాడివనీ, ప్రభుడివనీ యావన్మంది రుషులూ, దేవరుషి నారదుడూ, అసితుడూ, దేవలుడూ, * వ్యాసుడూ చెపుతున్నారు. నువ్వుకూడా నాకు అదే చెపుతున్నావు. నువ్వు చెప్పిందంతా నిజమే అని నమ్ముతున్నాను. ఓభగవంతుడా, నీమూలం దేవతలూ, రాక్షసులూ ఎవ్వరూ ఎరగరు.

పురుషోత్తమా! భూతాల సృష్టించే ఓ భూతేశా! దేవదేవా! జగత్పతీ! నీ విషయం నీకే తెలుసు. నీ దివ్యవిభూతి ఈ లోకమంతా వ్యాపించి వుంది. ఆ విషయం నువ్వే నాకు విస్తరించి చెప్పు. ఓ యోగీశ్వరా! ఎల్లప్పుడూ నిన్నే ధ్యానిస్తూ నిన్ను ఎలా తెలుసుకునేది? ఓ భగవంతుడా! వేటితో నిన్ను ధ్యానించేది? చెప్పు. నీయోగమూ, నీవిభూతీ విస్తరించి మళ్ళీ చెప్పు. అమృతంలాంటి నీమాటలు వింటున్న కొద్దీ నాకు తృప్తిలేకండా వుంది.

శ్రీకృష్ణుడు: బావుంది, ఐతే అర్జునా, దివ్యమయిన నావిభూతుల్లో ప్రధానమైనవి నీకు చెపుతాను, విను. ఏమంటే నా విభూతులికి అంతమంటూ లేదుకదా! సమస్తభూతాల హృదయాల్లోనూ వున్నఆత్మని నేనే. భూతాల ఆది, మధ్యం, అంతంకూడా నేనే. సూర్యుల్లో నేను

---

* చూ: ఆదిపర్వం పు 379 పాదటీక.

విష్ణువుని. ప్రకాశవంతుల్లో నేను సూర్యుణ్ణి. మరుత్తుల్లో నేను మరీచిని. నక్షత్రాల్లో చంద్రుణ్ణి. వేదాల్లో సామవేదాన్ని. దేవతల్లో దేవేంద్రుణ్ణి. ఇంద్రియాల్లో మనస్సుని. ప్రాణుల్లో చైతన్యాన్ని. రుద్రుల్లో శంకరుణ్ణి. యక్షుల్లోనూ రాక్షసుల్లోనూ కుబేరుణ్ణి. వసువుల్లో అగ్నిని. కొండల్లో మేరువుని. పురోహితుల్లో బృహస్పతిని. సేనానాయకుల్లో కుమారస్వామిని. సరస్సుల్లో సముద్రుణ్ణి. మహారుషుల్లో భృగువుని. మాటల్లో ఓంకారాన్ని. యజ్ఞాల్లో జపయజ్ఞాన్ని. కదలని వాటిలో హిమాలయాన్ని. చెట్లలో రావిచెట్టుని. దేవరుషుల్లో నారదుణ్ణి. గంధర్వుల్లో చిత్రరథుణ్ణి. సిద్ధుల్లో కపిలుణ్ణి. గుర్రాల్లో ఉచ్చైశ్రవాన్ని. ఏనుగుల్లో ఐరావతాన్ని. మనుషుల్లో రాజుని. ఆయుధాల్లో వజ్రాయుధాన్ని. ఆవుల్లో కామధేనువుని. సంతానం కలిగించే మన్మధుణ్ణి. సర్పాల్లో వాసుకిని. నాగుల్లో అనంతుణ్ణి. జలదేవతల్లో వరుణుణ్ణి. పితృదేవతల్లో ఆర్యముణ్ణి. శాసించేవాళ్ళల్లో యముణ్ణి. దైత్యుల్లో ప్రహ్లాదుణ్ణి. కబళించేవాళ్ళల్లో కాలాగ్నిని. మృగాల్లో సింహాన్ని. పక్షుల్లో గరుత్మంతుణ్ణి. వేగంగలవాళ్ళలో గాలిని. ఆయుధాలు ధరించేవాళ్ళలో రాముణ్ణి. చేపల్లో మొసలిని. నదుల్లో గంగని. అర్జునా, సృష్టి అంతటికీ ఆది, మధ్యం, అంతంకూడా నేనే. విద్యల్లో అధ్యాత్మవిద్యని నేనే. వాదించేవాళ్ళ వాదమూ నేనే.

అక్షరాల్లో అకారం నేనే. సమాసాల్లో ద్వంద్వసమాసం నేనే. అనంతమైన కాలం నేనే. నాలుగు దిక్కులా మొహాలుగల బ్రహ్మని నేనే. సర్వసంహారకుడైన మృత్యువు నేనే. తిరిగి జన్మించేవాళ్ళ పుట్టుకా నేనే. స్త్రీలలో కీర్తి, శ్రీ, వాణీ, స్మృతీ, మేధా ధృతీ, క్షమా నేనే.

ఇలాగే సామరుక్కుల్లో బృహత్సామం నేనే. ఛందస్సుల్లో గాయత్రీఛందస్సు నేనే, మాసాల్లో మార్గశీర్షం నేనే, రుతువుల్లో

వసంతరుతువు నేనే. మోసాలలో జూదం నేనే. తేజోవంతుల తేజసు నేనే. జయించేవాళ్ళ విజయం నేనే. ఉద్యమపరుల ఉద్యమం నేనే. సత్యవంతుల సత్యం నేనే. యాదవుల్లో వాసుదేవుణ్ణి నేనే. పాండవుల్లో అర్జునుణ్ణి నేనే. మునుల్లో వ్యాసుణ్ణి నేనే. కవుల్లో కవిని — శుక్రాచార్యుణ్ణి నేనే. శిక్షించేవాళ్ళ శిక్ష నేనే. గెలుపుకోరేవాళ్ళ నీతి నేనే రహస్యాల్లో మౌనం నేనే. జ్ఞానవంతుల జ్ఞానం నేనే. సర్వభూతాలికీ బీజం నేనే.

అర్జునా, ఈ చరాచరమయిన భూతకోటిలో నేను లేనిది ఏదీ లేదు. నా దివ్యవిభూతులికి అంతం లేదు. అందుకనే నా విభూతుల విస్తరం ఇలా సంక్షేపంగా చెప్పాను. ఏవస్తువు లోకంలో విభూతివంతం, శ్రీమంతం, ఉత్సాహవంతం అయి వుంటుందో అదంతా నా తేజస్సు అంశతోనే పుట్టిందని నమ్ము. ఇదీఅదీ తడవడ మెందుకూ? ఒక్కమాటలో చెపుతున్నాను విను. నా వొక్క అంశతోనే ఈ జగత్తంతా వ్యాపించి వున్నాను నేను.

అర్జునుడు: నన్ను అనుగ్రహించావు. ఉత్తమమైన అధ్యాత్మ రహస్యం నాకు ఉపదేశించావు. దీంతో నా మోహం నశించింది. ప్రాణులు పుట్టడం, నాశనంకావడం, నాశనంలేని నీ మాహాత్మ్యమూ నీవల్ల విస్తరంగా విన్నాను నీ విషయంలో నువ్వు చెప్పిందంతా యథార్థం. ఓ పరమేశ్వరా! ఓ పురుషోత్తమా! ఇప్పుడు నీ ఈశ్వర స్వరూపం ప్రత్యక్షంగా చూడాలని కోరుతున్నాను. యోగేశ్వరా! ప్రభూ! నేను అది చూడవచ్చునని నువ్వుభావిస్తే నాశనంలేని నీ ఆ ఆత్మస్వరూపం నాకు చూపించు.

శ్రీకృష్ణుడు: అర్జునా, ఎన్నోరకాల రంగులుకలవి నా రూపాలు ఎన్నోరకాల ఆకారాలివి. దివ్యమైనవి. ఎన్నో వందలు - ఎన్నో వేలూ చూడు. సూర్యులూ, వసువులూ, రుద్రులూ, అశ్వి

నులూ, మరుత్తులూ - ఇంకా, నువ్వు ఇంతవరకూ చూడని ఎన్నో అన్ని ఆశ్చర్యాలు - చూడు. నువ్వుచూడాలని కోరుతున్న ఇతర చరాచరస్వరూపమయిన సమస్తప్రపంచమూ ఇపుడు వొక్క-చోట నా శరీరంలో చూడు. ఐతే, నువ్వు నీసామాన్యమైన కళ్ళతో మాత్రం చూడలేవు. నీకు దివ్యదృష్టి ఇస్తున్నాను. దాంతో నా ఈశ్వర యోగం చూడు.

సంజయుడు : రాజా, ఇలాచెప్పి మహాయోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు తన శ్రేష్ఠమైన విశ్వరూపం అర్జునుడికి చూపించాడు.

ఎన్నో నోళ్ళు, ఎన్నోకళ్ళు - ఎన్నో చిత్రాలు, ఎన్నో దివ్యమైన అలంకారాలు, ఎన్నోదివ్యమైన ఆయుధాలు, దివ్యమైన పూలదండలు, దివ్యవస్త్రాలు, దివ్యమైన గంధంపూతలు - ఎటుచూస్తే అటు ముఖాలు -ఇలా సర్వాశ్చర్యమయమైన, అనంతమైన, వానంతట అదే ప్రకాశిస్తున్న విశ్వరూపం అర్జునుడికి చూపించాడు.

ఆకాశంమీద వొకేసారి వేలకొద్దీ సూర్యులకాంతి గాని వుంటే అది విశ్వరూపంకాంతికి సరిపోతుంది. అనేక భాగాలుగావున్న జగత్తు యావత్తూ శ్రీకృష్ణుడి శరీరంలో వొక్క-చోట చూశాడు అర్జునుడు. ఆశ్చర్యపోయాడు. శరీరం గగుర్పొడిచింది. అంజలిబంధం శిరస్సున గీలించాడు. ఇలా అన్నాడు.

అర్జునుడు : చూస్తున్నాను. ప్రభూ, నీదేహంలో సమస్త దేవతల్ని చూస్తున్నాను. చరాచరభూతకోటియావత్తూ చూస్తున్నాను. పద్మాసనంమీద కూచున్న బ్రహ్మదేవుణ్ణీ, యావన్మంది ఋషుల్నీ, సమస్తసర్పాల్నీ చూస్తున్నాను. విశ్వేశ్వరా! ఎన్నోచేతులు, ఎన్నో కడుపులు, ఎన్నో నోళ్ళు, ఎన్నోపళ్ళు - అంతటా అనంతంగావుంది నీ రూపం. దీనికి ఆది కనబడకండావుంది. మధ్యం కనపడకండా వుంది. అంతం కనపడకండావుంది ప్రభూ! ప్రభూ!! చూస్తున్నాను.

కిరీటంతో కనిపిస్తున్నావు. గదతో కనిపిస్తున్నావు. చక్రంతో కనిపిస్తున్నావు. ఎటుచూస్తే అటు — అంతటా ప్రకాశిస్తున్నావు. తేజోరాశిగా వున్నావు. చూడశక్యం కాకండా వున్నావు. మండుతూన్న అగ్నిహోత్రంలా వున్నావు. ప్రకాశిస్తున్న సూర్యుడిలా వున్నావు. అప్రమేయుడివైన నువ్వే అన్నిదిక్కులా కనిపిస్తున్నావు. నువ్వే తెలిసికోదగిన, నాశంలేని పరబ్రహ్మం — నువ్వే — అని నా అభిప్రాయం. నువ్వే ఈవిశ్వానికి నిదానం. నువ్వే ధర్మరక్షకుడివి. నువ్వే నిత్యుడివి. నువ్వే — నువ్వే పురాణ పురుషుడివి.

ఆది, మధ్యం, అంతం లేదునీకు. అఖండమైన వీర్యవంతుడివి నువ్వు. లెక్కలేనన్ని బాహువులు నీవి. సూర్యుడూ చంద్రుడూ నీనేత్రాలు. నీనోట్లో అగ్నిహోత్రం ప్రజ్వలిస్తోంది. నీ దివ్య తేజస్సుతో ఈవిశ్వమంతా తపింప జేస్తున్నావు. ఇలాగే నిన్ను చూస్తున్నాను. భూమీ ఆకాశం - ఈ మధ్యప్రదేశం యావత్తూ, అన్ని దిక్కులూ నువ్వే నిండిపోయి వున్నావు. అద్భుతంగా, భయంకరంగా వున్న ఈ రూపం చూసి మూడులోకాలూ భయంతో గజగజలాడుతున్నాయి. మహాత్మా! ఈ దేవతాసంఘాలన్నీ నీలోనే ప్రవేశిస్తున్నాయి. కొందరు భయపడి దోసిళ్ళొగ్గుతున్నారు. మహారుషులు 'స్వస్తి' 'స్వస్తి' అంటూ ఎన్నో అన్ని స్తోత్రాలతో నిన్ను స్తుతిస్తున్నారు. రుద్రులూ సూర్యులూ వసువులూ సాధ్యులూ విశ్వేదేవతలూ అశ్వినీదేవతలూ మరుత్తులూ పితృదేవతలూ గంధర్వులూ యక్షులూ అసురులూ సిద్ధులూ - వీళ్ళంతా ఆశ్చర్యంతో నిన్ను చూస్తున్నారు.

ఎన్నో నోళ్ళూ, ఎన్నో కళ్ళూ, ఎన్నో చేతులూ, ఎన్నో తొడలూ, ఎన్నో పాదాలూ, ఎన్నో కడుపులూ, ఎన్నో కోరలూ - ఇలా భయంకరంగావున్న నీ మహారూపం చూసి లోకాలు భయపడు

తున్నాయి. నేనూ భయపడుతున్నాను. ఓ విష్ణుమూర్తీ ! ఆకాశం అంటుతున్నావు. ప్రకాశిస్తున్నావు. ఎన్నో రంగులతో వున్నావు. నీ నోళ్ళు తెరచుకుని వున్నాయి. నీ కళ్ళు ప్రజ్వలిస్తున్నాయి. నిన్ను చూసి నా అంతరాత్మ విలవిలపోతూవుంది. ధైర్యం దిగజారుతూ వుంది. శాంతి లేకండా వుంది. భయంకరమైన కోరలతో కాలాగ్నిలా మండుతూ వున్న నీ నోళ్ళు చూసి నాకు దిక్కులు తెలియకండా వున్నాయి. సుఖం లేకండా వుంది. ప్రభూ ! ప్రసన్నుడివి కా.

ఈ ధృతరాష్ట్రుడి కుమారుళ్ళు యావన్మందీ, వాళ్ళ పక్షం రాజులూ అలాగే భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, మన పక్షం వీరులూ — వీళ్ళందరూ నేను ముందంటే నేను ముందు అన్నట్టు కోరలతో ఘోరంగా వున్న నీ నోళ్ళల్లో ప్రవేశిస్తున్నారు. కొందరు పళ్ళసందుల్లో పడి, వాళ్ళ తలకాయలు పిప్పి పిప్పి అయిపోతూ కనిపిస్తున్నారు. ఎన్నో నదీ ప్రవాహాలు సముద్రంలోకి ప్రవహిస్తున్నట్టు, ఈ మానవ వీరులు ప్రజ్వలిస్తూవున్న నీ ముఖాల్లో ప్రవేశిస్తున్నారు. పరిగెత్తి నాశనం కావడంకోసం మండుతూన్న అగ్గిలో పడే మిడతల్లాగ వాతవారి పోడంకోసం ఈ మనుష్యుల మూకలు తొందరగా నీ నోళ్ళల్లో ప్రవేశిస్తున్నాయి. మండుతూన్న నోళ్ళతో అన్ని వైపులా ఈ లోకం యావత్తూ నాకేస్తున్నావు నువ్వు. మింగేస్తున్నావు. నీ ప్రచండమైన కాంతులు లోకమంతా ఆవరించి దహించి వేస్తున్నాయి. దేవదేవా ! ఇలా ఉగ్రరూపంతో వున్న నువ్వు ఎవరో చెప్పు. నీకు నమస్కరిస్తున్నాను. ప్రసన్నుడివి కా. ఆదిపురుషుడివైన నిన్ను తెలుసుకోవాలని కోరుతున్నాను. నీ ప్రవృత్తి ఏమిటో నాకు తెలియకండా వుంది.

శ్రీకృష్ణుడు : లోకసంహారంకోసం విజృంభించిన కాలుణ్ణి నేను. లోకసంహారానికే పూనుకున్నాను. నువ్వు లేకపోయినా సరే, నీ ఎదిరి

పక్షంలోవున్న యోధులు మరివుండరు. అంచేత అర్జునా, లే. శత్రువుల్ని జయించి కీర్తిసంపాదించు. రాజ్యం సంపూర్ణంగా అనుభవించు. వీళ్ళని ఇంతకిముందే నేను చంపేశాను. నువ్వునిమిత్త మాత్రుడివి మాత్రం కా.

ద్రోణుణ్ణీ, భీష్ముణ్ణీ, జయద్రథుణ్ణీ, కర్ణుణ్ణీ, తక్కిన వీరుల్నీ నేను చంపేసేవున్నాను. ఇప్పుడు నువ్వుచంపు. విచారించకు. యుద్ధం చెయ్యి శత్రువుల్ని జయిస్తావు.

శ్రీకృష్ణుడు చెప్పిన ఈమాటలు విని వణికిపోతూ రెండు చేతులూ జోడించాడు అర్జునుడు. భయంతో నమస్కరించాడు. గద్గద కంఠంతో మళ్ళీ ఇలా అన్నాడు.

"కృష్ణా, నీగుణకీర్తనంవల్ల జగత్తు సంతోషిస్తున్నది. అనురాగం పొందుతున్నది. రాక్షసులు భయపడి పటాపంచలవుతున్నారు. సిద్ధులు నమస్కరిస్తున్నారు. ఇదంతా తగేవుంది. మహాత్మా! అనంతా! దేవేశా! జగన్నివాసా! బ్రహ్మకంటేకూడా గొప్పవాడివి నువ్వు. ఆది కర్తవి. సత్తూ, అసత్తూ నువ్వే. ఈరెండింటికీ అతీతమైన అక్షరుడివీ నువ్వే. అతీతమైన నిన్ను నమస్కరించకండా ఎలావుంటారు?

నువ్వే ఆదిదేవుడివి. పురాణపురుషుడివి. ఈవిశ్వానికి నువ్వే ముఖ్యమైన ఆధారం. తెలిసిన వాడివీ, తెలియదగిన వాడివీ నువ్వే. పొందదగిన వాడివీ నువ్వే. నువ్వే ఈవిశ్వమంతా వ్యాపించి వున్నావు. నువ్వే గాలివి. నువ్వే యముడివి. నువ్వే అగ్నివి. నువ్వే వరుణుడివి. నువ్వే చంద్రుడివి. నువ్వే ప్రజాపతివి. నువ్వే ముత్తాతవి. ఇదిగో వెయ్యిసార్లు నమస్కరిస్తున్నాను.

నీకు ముందుండి నమస్కరిస్తున్నాను. వెనకనించి నమస్కరిస్తున్నాను. నలుపక్కలనించీ నమస్కరిస్తున్నాను. నీశౌర్యానికి

సాటిలేదు. నీవిక్రమానికి అంతంలేదు. నువ్వు పరిపూర్ణుడివి. సర్వత్రా వ్యాపించి వున్నావు.

నీమహిమ తెలుసుకోలేకపోయాను. పొరపాటునో, స్నేహం చేతనో నిర్లక్ష్యంగా నిన్ను కృష్ణా అనీ, యాదవుడా అనీ, సఖుడా అనీ పిలిచాను. కలిసి తిరిగినప్పుడూ, భోజనాలప్పుడూ, కలిసి కూచునేటప్పుడూ, పడుకునేటప్పుడూ, ఒంటరిగావున్నప్పుడూ, పదిమందిలో వున్నప్పుడూ అప్రమేయుడివైన నిన్ను పరిహాసంకోసం అవమానించాను అపరాధంచేశాను. ప్రభూ! నా అపరాధం క్షమించు. ప్రార్థిస్తున్నాను.

చరాచర రూపమయిన ఈలోకానికి నువ్వే తండ్రివి. నువ్వే పూజ్యుడివి. నువ్వే గురుడివి. నువ్వే పెద్దవి. మూడు లోకాల్లోనూ నీతో సమానమైనవాళ్ళు లేరు. నిన్ను మించిన వాడు మరొక్కడు మరెక్కడ వున్నాడు? దేవా, సాష్టాంగపడి నిన్ను ప్రార్థిస్తున్నాను. తండ్రి కొడుకుని క్షమించినట్టు, స్నేహితుడు స్నేహితుణ్ణి మన్నించినట్టు, ప్రియుడు ప్రియురాలిని క్షమించినట్టు నాఅపరాధాలు మన్నించు.

ఎన్నడూ చూడని నీరూపం చూసి నేను ఆనందిస్తున్నాను. అయినా, నామనస్సు భయంతో బాధపడుతూ వుంది. ప్రభూ, నాకు నీపూర్వరూపం చూపించు. ప్రసన్నుడివికా. నీకిరీటంతోనూ, గదతోనూ, చక్రంతోనూ నిన్ను పూర్వంలాగే చూడాలని కోరుతున్నాను. ఓవెయ్యి బాహువుల విశ్వమూర్తీ, నీనాలుగు చేతులతో నాకు కనపడు.

శ్రీకృష్ణుడు: అర్జునా, తేజోమయమైందీ, అనంతమైందీ, ఆదిలేందీ అయిన నావిశ్వరూపం ఇంతవరకూ నువ్వుతప్ప ఎవ్వరూ చూడలేదు. ఉత్కృష్టమైన దీన్ని ప్రసన్నుణ్ణయి నాయోగసామర్థ్యంతో నీకు చూపించాను.

వేదాలు వల్లించిన వాళ్ళు కాని, యజ్ఞాలునేర్చినవాళ్ళు కాని ఈవిశ్వరూపం చూడలేదు. కర్మలుచేసినవాళ్ళూ, దానాలు చేసిన వాళ్ళూ, ఉగ్రమైన తపస్సు చేసినవాళ్ళూకూడా చూడలేదు. మానవ లోకంలో నువ్వుతప్ప మరొకరు చూడలేదు.

ఘోరంగావున్న నావిశ్వరూపం చూసి భయపడకు. మనస్సు కలవిళ పడనివ్వకు. భయంవొదిలి, సంతోషంగా ఇదిగో నా మానవ రూపం చూడు.

ఇలా శ్రీకృష్ణుడు అర్జునుడితో చెప్పి తిరిగీ తన ఎప్పటిసౌమ్య రూపం అతడికి చూపించాడు. భయంతోవున్న అతణ్ణి వోదార్చాడు.

అర్జునుడు : కృష్ణా, సౌమ్యమైన నీ ఈ మానవరూపం చూసి మనస్సు కుదుట పడింది. ఎప్పటి స్థితికి వచ్చాను.

శ్రీకృష్ణుడు : నువ్వుచూసిన నా విశ్వరూపం దుర్లభమైంది. దేవతలు సహా ఇది చూడాలని ఎప్పుడూ కోరుతూ వుంటారు. వేదాల వల్ల ఈ విశ్వరూపం చూడడం శక్యంకాదు. యజ్ఞాలవల్లా సాధ్యంకాదు. దానాలవల్లా, తపస్సులవల్లా కూడా వీలు కాదు కాని, ఇలాంటి విశ్వరూపుణ్ణయిన నన్ను చూడడానికీ, నిజంగా తెలుసుకోడానికీ, పొందడానికీ వొక్కటే వుంది సాధనం — భక్తి.

అంచేత అర్జునా, నాప్రీతికోసమే కర్మలు చేసేవాడూ, నేనే ఉత్కృష్టమైనగతి అనుకునేవాడూ, ఏ ఆసక్తిలేనివాడూ, ఏప్రాణి మీదా విరోధం లేనివాడూ అయిన నాభక్తుడు నన్నే పొందుతాడు.

అర్జునుడు : ఇలా ఎల్లప్పుడూనిష్ఠతో నిన్ను ఉపాసించేభక్తులూ, అవ్యక్తమైందీ, నాశనం లేందీ అయినదాన్ని భజించేవాళ్ళూ – ఈ ఉభయుల్లో గొప్పగా యోగం తెలిసిన వాళ్ళెవరు ?

శ్రీకృష్ణుడు : నామీదే మనస్సునిలిపి, ఎప్పుడూ నిష్ఠతో నన్ను ఉపాసించే వాళ్ళే ఉత్తమయోగులని నా అభిప్రాయం. ఐతే,

ఇంద్రియాలు నిగ్రహించి, సమత్వబుద్ధి కలిగి, సర్వప్రాణుల క్షేమమూ కోరుతూ, ఇది ఫలానా అని చెప్పరాందీ అవ్యక్తమైందీ, సర్వత్రా వ్యాపించిఉన్నదీ, చింతించడానికి వీలుకాందీ, స్థిరమైందీ, ధ్రువమైందీ, అంతటికీ ఆధారమైందీ అయిన అక్షరబ్రహ్మాం భజించేవాళ్ళుకూడా నన్నే పొందుతున్నారు.

కాని, అవ్యక్తమైనదానిమీద ఆసక్తులైనవాళ్ళకి శ్రమ అధికం. ఎంచేతనంటే, దేహం ధరించిన వాళ్ళకి అవ్యక్తమైన మార్గం కష్టసాధ్యం కదా! అయినా, ఆసక్తితో నా మీదే మనస్సువుంచి, సర్వకర్మలూ నాకే సమర్పించి, ఏకాంతమైన యోగంతో నన్ను ధ్యానించి ఉపాసించే వాళ్ళని నేను త్వరలోనే మృత్యురూపమైన సంసార సాగరంనించి ఉద్ధరిస్తున్నాను.

అంచేత, నువ్వునామీదే మనస్సు స్థిరంగా వుంచు. నామీదే నీ బుద్ధి లగ్నంచెయ్యి. అలా అయితే, తరవాత నువ్వు నాలోనే నివసిస్తావు. సందేహంలేదు. ఇప్పుడు ఇంకా నామీద మనస్సుస్థిరంగా వుంచలేకపోతే అభ్యాసయోగంతో – అంటే మళ్ళీ మళ్ళీ ప్రయత్నించి – నన్ను పొందాలని కోరుకో. అభ్యాసం చెయ్యడానికి నీకు శక్తిలేకపోతే, నన్ను చేరడం కోసం కర్మలు చేస్తూవుండు. నాకోసం కర్మలు చేసినా సరే నువ్వు సిద్ధిపొందుతావు. నాకోసం కర్మలు చెయ్యడానికీ నీకు శక్యం కాలేదనుకో, అప్పుడు నాశరణు జొచ్చి, ఆత్మనిగ్రహంతో సమస్తకర్మలఫలమూ వొదిలిపెట్టు.

ఏమంటే అభ్యాసంకంటే జ్ఞానంమంచిది. జ్ఞానంకంటే ధ్యానం గొప్పది. ధ్యానంకంటే కర్మఫలం వొదలడం శ్రేష్ఠమైంది. కర్మఫలం వొదిలిన వెంటనే శాంతి కలుగుతుంది.

ఏప్రాణినీ ద్వేషించనివాడూ, స్నేహభావం కలవాడూ, దయకలవాడూ, మమకారం, అహంకారం లేనివాడూ, సుఖదుఃఖాలు

సమంగా చూసేవాడూ, ఓర్పుకలవాడూ, ఎల్లప్పుడూ సంతోషంగా వుండేవాడూ, యోగీ, ఆత్మనిగ్రహం కలవాడూ, దృఢనిశ్చయం కలవాడూ, నామీదే మనస్సూ బుద్ధీ వుంచినవాడూ - ఇలాంటి నా భక్తుడు నాకు ప్రియమైన వాడు. లోకుల్ని క్షోభపెట్టనివాడూ, లోకులవల్ల క్షోభపడనివాడూ, సంతోషం, క్రోధం, భయం, ఉద్వేగం లేనివాడూ నాకు ప్రియమైనవాడు. అపేక్ష లేనివాడూ, పవిత్రుడూ సమర్థు , ఉదాసీనుడూ, విచారం లేనివాడూ, సర్వసంకల్పాలూ విడిచిపెట్టినవాడూ అయిన భక్తుడు నాకు ప్రియమైనవాడు.

సంతోషమూ ద్వేషమూ లేనివాడూ, దుఃఖమూ కోరికా లేనివాడూ, శుభమూ అశుభమూ వొదిలినవాడూ — ఇలాంటి భక్తుడు నాకు ప్రియమైనవాడు.

శత్రువూ స్నేహితుడూ, మానం అవమానం, చలీ వేడీ, సుఖం దుఃఖం, నిందా పొగడ్త — ఇవన్నీ వొక్కలాగే చూసేవాడూ, మౌనిగా వుండేవాడూ, దొరికిన దాంతోనే తృప్తి పడేవాడూ, తన ఇల్లని లేనివాడూ, స్థిరచిత్తుడూ — ఇలాంటి భక్తుడు నాకు ప్రియమైన వాడు.

ఐతే, ఇప్పుడు చెప్పిన అమృతసమానమైన ధర్మం శ్రద్ధతో ఆచరిస్తూ, నన్నే పరమార్థమని నమ్ముకున్న నాభక్తుడు నాకు మరింత ప్రియమైనవాడు.

అర్జునా, ఈశరీరం క్షేత్రమన్నారు. దీన్ని తెలుసుకున్న వాణ్ణి క్షేత్రజ్ఞుడన్నారు ఎరిగినవాళ్ళు. అన్నిక్షేత్రాల్లోనూ వున్న క్షేత్రజ్ఞుణ్ణి నేనే అని నమ్ము. క్షేత్ర — క్షేత్రజ్ఞుల్ని తెలుసు కోడమే నిజమైన జ్ఞానమని నామతం.

క్షేత్రమంటే ఏమిటో, అది ఎలా వుంటుందో, ఎలాంటి [illegible]తో వుంటుందో, దాని పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో

అలాగే క్షేత్రజ్ఞుడంటే ఎవరో, అతడి ప్రభావమేమిటో-ఈవివరాలన్నీ క్లుప్తంగా చెప్తాను, విను.

ఈవిషయం ఋషులు వివిధ ఛందస్సుల్లో బహువిధాలుగానూ, ప్రత్యేకంగానూ చెప్పారు. సందేహం లేకండా సహేతుకంగా బ్రహ్మ సూత్రాల్లోని పదాల్లోనూ చెప్పడంజరిగింది. భూమీ, నీరూ, అగ్నీ, గాలీ, ఆకాశం - ఈ అయిదు మహాభూతాలూ, అహంకారం, బుద్ధీ, ప్రకృతీ, చెవీ చర్మం కన్నూ నాలికా ముక్కూ — ఈ అయిదు జ్ఞానేంద్రియాలూ, వాక్కూ చేయీ పాదం గుదం ఉపస్థూ — ఈ అయిదు కర్మేంద్రియాలూ, శబ్దం స్పర్శం రూపం రసం గంధం ఇంద్రియాల ఈ అయిదూ విషయాలూ, మనస్సూ, కోరికా, ద్వేషం, సుఖం దుఃఖం, సంఘాతం, చేతనం, ధైర్యం — ఇవన్నీ కలిసి వున్న దాన్నే వికారంతో కూడుకున్న క్షేత్రమని చెప్పారు.

మానం దంభం లేకండావుండడం, అహింసా, ఓర్పూ సరళత్వం, గురువులసేవా, శుచిత్వం, స్థయిర్యం, మనోనిగ్రహం, ఇంద్రియ విషయాల్లో వైరాగ్యం, అహంకారంలేకండా వుండడం, చావూ పుట్టుకా ముసలితనం రోగం — వీటి దుఃఖం దోషం గమనించడం, ఇంటిమీాదా పెళ్ళాంపిల్లలమీాదా ఆసక్తిలేకండావుండడం, ఇష్టం అయిష్టం రెండూ వొక్కలాగేచూడడం, నేనుతప్ప ఇంకేదీలేదని నామీాద చలించని భక్తికలిగివుండడం, ఒంటరిస్థలంలో నివసించడం జనసమూహమంటే ఇష్టంలేకండా వుండడం, అధ్యాత్మజ్ఞానం నిత్యమనుకోడం, మోక్షమే ఉత్కృష్టమైందని తెలుసుకోడం — ఇదంతా జ్ఞానం. దీనికి భిన్నమైందంతా అజ్ఞానం.

ఏది తెలుసుకోదగిందో, దేన్ని తెలుసుకుంటే అమృతత్వం (మోక్షం) లభిస్తుందో దాన్ని చెపుతున్నాను. అది ఆదిలేంది. ఉత్కృష్టమైంది. అదే బ్రహ్మం. దాన్ని సత్తు అనిగాని, అసత్తు

అనిగాని, అనడానికి సాధ్యంకాదు. అంతటా దానికి కాళ్ళున్నాయి. చేతులున్నాయి. కళ్ళున్నాయి. తలలున్నాయి. నోళ్ళున్నాయి. చెవులున్నాయి. అంతటా అది వ్యాపించివుంది. ఇంద్రియవ్యాపారాలు అన్నింటిలోనూ అది ప్రకాశిస్తుంది. ఐతే దానికిమాత్రం ఏఇంద్రియమూ లేదు. దేంతోనూ ఆసక్తిలేకండా అది వేరుగా వుంటుంది. కానైతే, సమస్తమూ అదే భరిస్తుంది. అది గుణాలు అనుభవిస్తూ వుంటుంది. కాని, దానికిమాత్రం గుణాలులేవు.

సమస్త ప్రాణుల్లోనూ లోపటా, బయటా వుండేదీ అదే. కదిలేదీ కదలందీ అదే. సూక్ష్మమైందీ తెలియరాందీ అదే. దగ్గిర వుండేదీ దూరంగావుండేదీ అదే. సర్వభూతాల్లోనూ వివిధరూపాలతో వేరువేరుగా కనిపించేదీ అదే. నిజానికి విడదీయడానికి వీల్లేందీ, అఖండమైందీ అదే. అదే సమస్తభూతాలూ పుట్టిస్తుంది, భరిస్తుంది, సంహరిస్తుంది. దానినే తేజస్సులికి తేజస్సనీ, అంధకారానికి పరంగావుందనీ అంటారు. అదే జ్ఞానం. అదే తెలుసుకోదగింది. అదేజ్ఞానంతోపొందదగింది. అదే అందరి హృదయాల్లోనూ వుంది.

ఇలా క్షేత్రమూ, జ్ఞానమూ, తెలుసుకోదగింది క్లుప్తంగా చెప్పాను. ఇది తెలుసుకున్న నాభక్తుడు నాస్వరూపం పొందుతున్నాడు.

ప్రకృతీ పురుషుడూ - ఈ ఇద్దరూ ఆది లేనివాళ్ళని నమ్ము. గుణాలూ వికారాలూ ప్రకృతినించే పుడుతున్నాయి. కార్యమూ కరణమూ - అంటే శరీరం, ఇంద్రియాలూ - వీటి సృష్టికిప్రకృతేకారణమన్నారు. సుఖదుఃఖాలు అనుభవించడంలో పురుషుడు కారణమన్నారు. ఏమంటే, పురుషుడు ప్రకృతిలోవుండి, ప్రకృతిగుణాలు భోగిస్తాడు. ప్రకృతిసంబంధమమైన ఈ గుణాలసంగమమే పురుషుడు మంచియోనిలోగాని చెడ్డయోనిలోగాని జన్మించడానికి కారణమవుతుంది.

స్వతంత్రుడూ, సాక్షీ, అనుమోదించేవాడూ, పాలకుడూ, భోగించేవాడూ అయి ఈశరీరంలోవుండే పురుషుణ్ణి మహేశ్వరుడనీ, పరమాత్ముడనీ అన్నారు.

ఇలా పురుషుణ్ణీ, గుణములతో కూడిన ప్రకృతినీ తెలుసుకున్నవాడు ఎలాప్రవర్తించినా అతడికి పునర్జన్మలేదు.

ధ్యానంతో కొందరు తమలోనే ఆత్మని చూస్తున్నారు. కొందరు సాంఖ్యయోగంతో చూస్తున్నారు. కొందరు కర్మయోగంతో చూస్తున్నారు. ఇలా తెలియని మరికొందరు ఇతరులనించి విని ఉపాసిస్తున్నారు. విని ఆచరించే వీళ్ళుకూడ మృత్యురూపమయిన సంసారంనించి తరిస్తున్నారు.

అర్జునా, కదిలేవీ కదలనివీ - ఈ అన్నివస్తువులూ అవి ఎంత చిన్నవైనాసరే, క్షేత్రమూ క్షేత్రజ్ఞుడూ — ఈఉభయుల సంయోగం వల్లే పుడుతున్నాయని నమ్ము. సమస్తభూతాల్లోనూ సమంగావుండేవాడూ, నశించేవాట్లో నశించకండా వుండేవాడూ అయిన పరమేశ్వరుణ్ణి చూసినవాడే నిజంగా చూసినవాడు. ఏమంటే సర్వత్రా సమానంగావున్న ఈశ్వరుణ్ణిచూస్తున్నవాడు తన్ను తాను హింసించుకోడు. అంచేత అతడు మోక్షంపొందుతాడు. అన్నికర్మలూ ప్రకృతే అన్నివిధాలా చేస్తున్నదనీ, ఆత్మ దేన్నీ చెయ్యడంలేదనీ తెలుసుకున్నవాడే నిజమైనతత్వం తెలుసుకున్నవాడన్నమాట.

భూతాల్లో విడివిడిగావుండే బహుత్వం వొకచోటిగానూ, ఆ వొకచోటినించే అదంతా విస్తరించినట్టుగానూ మనిషి ఎప్పుడు చూస్తాడో అప్పుడు బ్రహ్మత్వం పొందుతాడు.

ఆదిలేందీ, గుణాలులేందీ కావడంచేత నాశనంలేని ఈపరమాత్మ శరీరంలోవుండినా అది ఏదీచెయ్యడంలేదు. దానికి ఏదీ అంటడమూ లేదు. సర్వవ్యాపిఅయిన ఆకాశం సూక్ష్మంకావడంవల్ల ఎలాఅయితే

అంటబడదో, అలాగే సమస్తదేహాల్లోనూ వున్న ఆత్మ అంటబడదు. సూర్యుడు నొక్కడే అయినా లోకమంతటినీ ప్రకాశింపజేస్తున్నాడు. అలాగే క్షేత్రి (క్షేత్రంలో వున్నవాడు) సమస్తమైన క్షేత్రాలూ ప్రకాశింపజేస్తున్నాడు.

ఇలా క్షేత్ర క్షేత్రజ్ఞుల అంతరం, ప్రాణులు ప్రకృతినించి విముక్తి పొందడం జ్ఞానదృష్టితో తెలుసుకున్నవాళ్ళు పరబ్రహ్మం పొందుతున్నారు.

జ్ఞానాల్లో ఉత్తమమైన జ్ఞానం తిరిగీ నీకు చెపుతున్నాను. దీన్ని తెలుసుకుని ఈలోకంలో మునులంతా ఉత్కృష్టమైన సిద్ధి పొందారు. ఈ జ్ఞానం ఆశ్రయించి నాతో ఐక్యమైనవాళ్ళు సృష్టిఆరంభంలో మళ్ళీ పుట్టరు. ప్రళయకాలంలోనూ బాధపడరు.

అర్జునా, ప్రకృతి (మహాద్బ్రహ్మం) నాకుయోని. దానిలోనే నేను గర్భాధానం చేస్తున్నాను. దాంతో సర్వభూతాలూ పుడుతున్నాయి. సర్వయోనుల్లోనూ పుడుతూవున్న సమస్తశరీరాలికీ మహాద్బ్రహ్మ - ఈప్రకృతేయోని. నేను బీజం స్థాపించే తండ్రిని.

సత్వమూ రజస్సూ తమస్సూ — ఈమూడు గుణాలూ ప్రకృతిలో పుడుతున్నాయి. నాశనంలేని ఆత్మని ఇవే దేహంలో బంధిస్తున్నాయి. ఈ మూడింటిలో సత్వగుణం ప్రకాశవంతమైంది. ఉపద్రవంలేంది. పవిత్రమైంది. అంచేత ఇది సుఖాసక్తితోనూ, జ్ఞానాసక్తితోనూ బంధిస్తుంది. రజోగుణం రాగంతో కూడుకున్నది. తృష్ణతోనూ ఆసక్తితోనూ పుట్టింది. అంచేత అది కర్మాసక్తితో బంధిస్తుంది. తమోగుణం అజ్ఞానంవల్ల పుట్టింది. దేహధారులందరికీ మోహం పుట్టిస్తుంది. అది మరుపూ బద్ధకం నిద్రా — వీటితో బంధిస్తుంది.

సత్వగుణం సుఖంలోప్రవర్తింప జేస్తుంది. రజోగుణం కర్మల్లో పవర్తింపజేస్తుంది. కాని తమోగుణం జ్ఞానం మట్టిపెట్టి పొరపాట్లలో

ప్రవర్తింపజేస్తుంది. రజోగుణమూ తమోగుణమూ — ఈ రెండు గుణాలీన్నీ అడిచిపెట్టి సత్వగుణం పైకిలేస్తుంది. సత్వగుణాన్నీ, తమోగుణాన్నీ త్రొక్కిపెట్టి రజోగుణం లేస్తుంది. అలాగే సత్వరజోగుణాల్ని మట్టుపెట్టి తమోగుణం తలఎత్తుతుంది.

ఈ శరీరంలో సర్వద్వారాల్లోను ప్రకాశవంతమైన విజ్ఞానం ఉదయించినపుడు సత్వగుణం పైకి లేచిందని తెలుసుకోవాలి. లోభం, వ్యాపకం, కర్మలు ఆరంభించడం, అశాంతీ, ఆశా కలిగినప్పుడు రజోగుణం లేచిందని తెలుసుకోవాలి. అలాగే అజ్ఞానం, సోమరితనం, అజాగ్రత్తా, మూఢత్వం కలిగినప్పుడు తమోగుణం తలఎత్తిందని తెలుసుకోవాలి.

సత్వగుణం పైకిలేచినప్పుడు దేహధారి మరణిస్తే ఉత్తమ జ్ఞానులుపొందే పవిత్రలోకాలు పొందుతాడు. రజోగుణం లేచినప్పుడు మరణిస్తే తిరిగీ కర్మలమీద ఆసక్తమైన జన్మ ఎత్తుతాడు. తమోగుణం తలఎత్తినప్పుడు మరణిస్తే మూఢయోనుల్లో జన్మిస్తాడు.

సత్వగుణంతో కూడిన కర్మలికి నిర్మలమైన సాత్వికఫలం చెప్పారు. రజోగుణ కర్మలికి ఫలం దుఃఖం. తమోగుణ కర్మలికి ఫలం అజ్ఞానం. సత్వగుణంవల్ల జ్ఞానం కలుగుతుంది. రజోగుణంవల్ల లోభమే కలుగుతుంది. తమోగుణంవల్ల పొరపాటూ, మోహమూ, అజ్ఞానమూ కలుగుతాయి. సత్వగుణంకలవాళ్ళు ఊర్ధ్వలోకాలికి వెళుతున్నారు. రజోగుణంకలవాళ్ళు మధ్యలోకంలో నిలుస్తున్నారు. తామసగుణం కలవాళ్ళు అధోలోకానికి పోతున్నారు.

ఎప్పుడైతే జీవుడు గుణాలకంటే ఇంకోకర్త లేడని గ్రహిస్తాడో, ఎప్పుడైతే గుణాలకంటే పరంగా వున్నదాన్ని తెలుసుకుంటాడో అప్పుడు అతడు నాస్వరూపమే పొందుతాడు. శరీరం పుట్టడానికి కారణాలయిన ఈ మూడుగుణాలూ అతిక్రమించి, పుట్టుకా ముసిలి

తనమూ, చావూ — వీటి దుఃఖాలు వొదిలించుకున్న జీవుడు మోక్షం పొందుతాడు.

అర్జునుడు : ప్రభూ, ఈ మూడుగుణాలూ జయించినవాడు ఎలా వుంటాడు? అతడి నడవడి ఎలా వుంటుంది? వీటిని అతడు ఎలా జయిస్తాడు?

శ్రీకృష్ణుడు : ఈ మూడుగుణాలూ గెల్చినవాడు, సత్వమూ, రజస్సూ, తమస్సూ- ఈ మూడుగుణాలికీ వరసగా చెందిన ప్రకాశం, ప్రవృత్తి, మోహం- ఇవి తనకి ప్రాప్తించినపుడు వాటిని ద్వేషించడు. అవి లేవని వాటిని కోరనూకోరడు.

అతడు ఉదాసీనంగా వుంటాడు. గుణాలికి చలించడు. గుణాలు వాటిపని అవి చేస్తున్నాయని భావిస్తాడు. కదలడు. సుఖంవచ్చినా దుఃఖంవచ్చినా వొక్కలాగే చూస్తాడు. తనలోతాను స్థిరంగా వుంటాడు. మన్నూ రాయీ బంగారమూ వొక్కలాగే చూస్తాడు. ప్రియం అప్రియం, నింద స్తుతి, మానం అవమానం, వొకటిగానే ఎంచుకుంటాడు. శత్రువునీ, స్నేహితుణ్ణీ వొక్కలాగే చూస్తాడు. సర్వ ప్రయత్నాలూ వొదులుకుంటాడు.

నన్ను స్థిరమైన భక్తియోగంతో సేవించినవాడు ఈమూడు గుణాలూ జయించగలుగుతాడు. బ్రహ్మత్వమూ పొందుతాడు. ఏమంటే అర్జునా, నాశనంలేనట్టిదీ, వికారంలేనట్టిదీ అయిన బ్రహ్మానికీ, శాశ్వతమైన ధర్మానికీ, స్థిరమైన సుఖానికీ నేనే ఆశ్రయం.

మీదికి మొదలూ, కిందికి కొమ్మలూవున్న రావిచెట్టు (అశ్వత్థం) నాశనం లేందని చెప్పారు. దీనికి వేదాలు ఆకులు. దీన్ని తెలుసుకున్న వాడు వేదాలు తెలిసినవాడు. దీని కొమ్మలు సత్వమూ మొదలయిన గుణాలతో పెరిగాయి. విషయాలు అనే చివుళ్లు పెట్టాయి. మీదికీ కిందికీవ్యాపించి వున్నాయి. దీనివేళ్లు కర్మబంధంతో మనుష్యలోకంలో

కిందికి పాదుకుని వున్నాయి. ఐతే, ఈలోకంలో దీని స్వరూపం గోచరించదు. దీని పుట్టుక తెలీదు. అంతమూ తెలీదు, పాతుకుపోయిన వేళ్లతో వున్న దీన్ని అనాసక్తి అనే దృఢమైన ఆయుధంతో నరకాలి.

తరవాత "ఈ అనాది ప్రకృతి అంతటికీ మూలకారణమైన ఆదిపురుషుణ్ణి ఆశ్రయిస్తున్నాను" అంటూ, ఎక్కడికి వెళితే మళ్ళీ తిరిగిరారో ఆ స్థానం వెదకాలి.

మానం మోహం ఆసక్తి దోషం లేనివాళ్లూ, సర్వదా అధ్యాత్మ జ్ఞానంలో స్థిరంకలవాళ్లూ, కోరికలు విడిచినవాళ్లూ, సుఖదుఃఖాలూ ద్వంద్వాలూ వొదిలినవాళ్లూ, జ్ఞానులూ నాశనంలేని ఆ స్థానం పొందుతున్నారు. వెళ్లినవాళ్ళు తిరిగీ వెనక్కిరాని ఆ స్థానం నా పరమపదం. సూర్యుడు కాని, చంద్రుడు కాని, అగ్ని కాని ఆస్థానం ప్రకాశించేట్టు చెయ్యలేరు.

సనాతనమైన నా అంశ జీవలోకంలో జీవుడై, ప్రకృతిలోవుండి పంచేంద్రియాలూ మనస్సూ — ఈ ఆరింటినీ ఆకర్షిస్తున్నది.

పరిమళ ప్రదేశంనించి సువాసన తీసుకుని వెళ్ళిపోతున్నాడుగాలి. అలాగే ఈశ్వరుడు (జీవుడు) దేహం ధరించి దానిని విడిచి పోయి నప్పుడు ఇంద్రియాలు తీసుకుని వెళ్ళిపోతున్నాడు.

జీవుడు దేహంలో చెవులూ కళ్లూ చర్మమూ నాలికా ముక్కూ మనస్సూ — వీటిని ఆశ్రయించి, శబ్దమూ స్పర్శమూ రూపమూ రసమూ గంధమూ అనే అయిదు విషయాలూ అనుభవిస్తున్నాడు. ఐతే, జీవుడు దేహంలో ఇంద్రియాలతో వుండడం కాని, శరీరం వొదిలిపెట్టినప్పుడు వాటిని తీసుకుని వెళ్ళిపోడంకాని, వాటిని అనుభవించడంకాని మూఢులు చూడలేరు. జ్ఞానదృష్టి కలవాళ్లు మాత్రం చూస్తున్నారు.

ప్రయత్నంచేసే యోగులు ఈఆత్మని తమలో చూస్తున్నారు. కాని, సంస్కారచిత్తంలేని అవివేకులు మాత్రం ప్రయత్నం చేసినా చూడలేరు. సూర్యుడిలోవుండి ప్రపంచం యావత్తూ వెలిగిస్తూవున్న తేజస్సు నాదే అని నమ్ము. అలాగే చంద్రుడిలోనూ, అగ్నిలోనూ వున్న తేజస్సూ నాదే. భూమిలో ప్రవేశించి సర్వభూతాలూ నేనే నా తేజస్సుతో ధరిస్తున్నాను. చంద్రుడిలో రసస్వరూపుణ్ణయి ఓషధులు యావత్తూ (వనస్పతులు) పోషిస్తున్నాను. ప్రాణుల శరీరాల్లో జఠరాగ్నినయి ప్రాణ, అపానవాయువులతో కూడి భక్ష్యం (పళ్లతో కొరికి తినేది) భోజ్యం (నాలికతో తీసుకుని మింగేది) లేహ్యం (చప్పరించి తినేది) చోష్యం (నమిలి రసం మాత్రం మింగేది)— నాలుగువిధాల ఆహారం పచనం చేస్తున్నాను.

అందరి హృదయాల్లోనూ నేనే వున్నాను. నావల్లే జ్ఞాపకశక్తీ, జ్ఞానమూ, మరుపూ కలుగుతున్నాయి. సమస్తమైన వేదాలచేతా తెలుసుకోదగినవాణ్ణీ నేనే. నేనే వేదాంతకర్తని. నేనే వేదాలు తెలిసినవాణ్ణి.

ఈలోకంలో క్షరుడూ నాశనం కలవాడు) అక్షరుడూ (నాశనం లేనివాడు) అని ఇద్దరు పురుషులున్నారు. సమస్త భూతాలే క్షరుడు. సమస్తభూతాలికీ మూలంలో వున్నవాడే అక్షరుడు. ఈ ఇద్దరికంటే వేరయిన ఉత్తమపురుషుణ్ణి పరమాత్మ అంటారు. అతను అక్షయుడు. ఈశ్వరుడు. అతడే మూడులోకాలూ ఆవరించి పరిపాలిస్తున్నాడు.

ఎందువల్ల నేను క్షరం కంటే అతీతుణ్ణిగానూ, అక్షరం కంటే ఉత్తముణ్ణిగానూ వున్నానో అందువల్ల లోకంలో అయితేనేం, వేదాల్లో అయితేనేం నేనే పురుషోత్తముణ్ణని ప్రసిద్ధుణ్ణయాను. ఇలా నన్ను పురుషోత్తముడని తెలుసుకున్న జ్ఞానవంతుడు సర్వమూ తెలిసిన వాడన్నమాట. అన్నిభావాలతోనూ అతడు నన్నేభజిస్తున్నాడు.

అర్జునా, ఎంతో రహస్యమైన యోగశాస్త్రం ఇలా నీకు చెప్పాను. దీన్ని తెలుసుకున్నవాడు బుద్ధిమంతుడవుతాడు. కృత కృత్యుడూ అవుతాడు.

అర్జునా, భయంలేకండా వుండడమూ, అంతఃకరణశుద్ధీ, జ్ఞాననిష్ఠా, యోగనిష్ఠా, దానమూ, ఇంద్రియ నిగ్రహమూ, యజ్ఞమూ, తనధర్మం ప్రకారం నడుచుకోడమూ, తపస్సూ, సరళత్వమూ, అహింసా, సత్యమూ, క్రోధం లేకండావుండడమూ, త్యాగమూ, శాంతీ, ఇతర్ల దోషాలు వూసులాడుకోకండా వుండడమూ జీవులన్నిటి మీాదా దయకలిగి వుండడమూ, లంపటుడు కాకండా వుండడమూ, ఇతర్ల మనస్సు నొప్పించకండా వుండడమూ, చెడ్డపనులంటే సంకోచించడమూ, చాపల్యం లేకండా వుండడమూ, సాహసమూ, ఓర్పూ, ధైర్యమూ, శుచిత్వమూ, ద్రోహబుద్ధి లేకండావుండడమూ, తన గొప్ప తలుచుకొని వుప్పొంగకండా వుండండమూ- ఇవన్నీ దైవీసంపదతో పుట్టిన, వాడికి కలుగుతాయి.

పటాటోపం, గర్వం, దురహంకారం, క్రోధం, నిష్ఠురత్వం అజ్ఞానం—ఇవి ఆసురీసంపదతో పుట్టినవాడికి కలుగుతాయి.

దైవీసంపద మోక్షం కలిగిస్తుందనీ, ఆసురీసంపద బంధహేతువవుతుందనీ చెప్పారు. అర్జునా, నువ్వు దైవీసంపదతో పుట్టినవాడివి. విచారించకు.

లోకంలో రెండురకాల జీవులు పుడుతున్నారు — దైవులూ ఆసురులూ. ఇంతవరకూ దైవులవిషయం విస్తరించి చెప్పాను. ఇపుడు ఆసురుల విషయం చెపుతాను, విను, ఏది చెయ్యదగిందో, ఏది చెయ్యరాందో ఆసురసంపత్తి కలవాళ్ళకి తెలియదు. వాళ్ళలో శుచిత్వం వుండదు. ఆచారం వుండదు. సత్యం సహా వుండదు. జగత్తంతా అసత్యమంటారు వీళ్ళు. దీనికి వొక ఆధారంగాని, వొక ఈశ్వరుడుగాని లేడంటారు. ప్రకృతీ పురుషుడూ—ఈ ఉభయుల పరస్పర సంపర్కంవల్ల

ఇది పుట్టలేదంటారు. అంచేత, కామం తప్ప మరో ప్రయోజనం దీని వల్ల లేదంటారు. ఇలాంటి భావాలుకల అల్పబుద్ధులూ, ఇంద్రియా సక్తులూ, ఉగ్రకర్ములూ అయిన దుష్టులు జగత్తు నాశనం చెయ్యడం కోసమే పుడుతున్నారు. తనివితీరని కోరికలతో దంభం, మానం, మదం – వీటిలో మత్తులై వుంటారు వీళ్ళు. బుద్ధిలేని వాళ్ళయి చెడ్డ సంకల్పాలు పెట్టుకుని దుర్మార్గప్పనులు చేస్తారు. చచ్చేవరకూ లెక్క లేనన్ని చింతలతోనే గడుపుతారు. కామభోగపరాయణులై అదే పరమార్థమని నమ్ముకుంటారు. వందలాది ఆశాపాశాల్లో తగు ల్కొని, కామక్రోధపరాయణులై విషయభోగాలకోసం అన్యా యంగా ధనం కూడబెట్టాలని కోరుకుంటారు.

"ఇవాళ నాకు ఇది లభించింది. ఈ కోర్కె ఇపుడు తీర్చు కుంటాను. ఇంత నా దగ్గిర వుంది. ఇంకా ఇంత వస్తుంది. ఈపగవాణ్ణి చంపాను. తక్కిన వాళ్ళనీ హతమారుస్తాను. నేను ప్రభువుని. నేను భోగిని. సిద్ధుణ్ణి. బలవంతుణ్ణి. సుఖవంతుణ్ణి. ధనవంతుణ్ణి. నేను గొప్ప కులంలో పుట్టాను. నాతోసమానుడెవడు? నేను యజ్ఞం చేస్తాను. దానం చేస్తాను. ఆనందం అనుభవిస్తాను" అని అజ్ఞానంతో మూఢులై అనేక విధాల చిత్తభ్రమల పాలవుతారు. ఇలా మోహ మనే వలలో తగుల్కొని విషయభోగాలమీద ఆసక్తులై చివరికి ఘోరమయిన నరకంలో పడతారు.

తమకి తామే గొప్ప చెప్పుకుంటారు వీళ్ళు. అడకువ అంటే ఏమిటో తెలియదు వీళ్ళకి. ధనంవుందికదా అని మానంతో మదమెక్కి, విధీ విధానం లేకండా పటాటోపంతో పేరుకి మాత్రం యజ్ఞాలు చేస్తారు వీళ్ళు. అహంకారం, బలం, గర్వం, కామం, క్రోధం – వీటిని ఆశ్ర యిస్తారు. తమశరీరంలోనూ ఇతర్ల దేహాల్లోనూ వున్న నన్ను ద్వేషిస్తారు. నిందిస్తారు. అలా ద్వేషించే ఈ క్రూరుల్ని, ఈ

అశుభుల్ని, నరాధముల్ని ఎప్పుడూ నేను అసురయోనుల్లోనే పుట్టిస్తున్నాను. ఇలా ఆసురజన్మ ఎత్తిన ఈ మూఢులు ప్రతి జన్మలోనూ నన్ను పొందకండానే అంతకంతకీ అధోగతి పాలవుతున్నారు.

కామమూ, క్రోధమూ, లోభమూ — ఈ మూడూ నరక ద్వారాలు. ఆత్మనాశనానికి మూలకారణాలు. అంచేత, ఈ మూడూ వొదిలిపెట్టాలి. అర్జునా, చీకటి ద్వారాలయిన ఈ మూటింటినించి విముక్తి పొందిన మనిషి తనకి శ్రేయస్సు కలిగించేపని చేస్తాడు. దాంతో చివరికి మోక్షం పొందుతాడు. ఐతే, అనుభవజ్ఞులు చెప్పిన శాస్త్ర విధులు అతిక్రమించి తన ఇష్టం వచ్చినట్టు చేసేవాడికి మాత్రం సిద్ధి లేదు సుఖం లేదు. ఉత్తమగతీ లేదు. అంచేత ఇది చెయ్యదగిందీ, ఇది చెయ్యరాందీ అని నిర్ణయించడానికి అనుభవం కల వాళ్ల శాస్త్రమే ప్రమాణం నీకు. అలా శాస్త్ర నిర్ణయమైన కర్మ చెయ్యడమే ఈ లోకంలో కర్తవ్యం.

అర్జునుడు : శ్రద్ధవుంటుంది. కాని శాస్త్రవిధులు పాటించరు. అలాంటివాళ్ళ ఆచరణ ఏమవుతుంది? అది సాత్వికమా? రాజసమా? తామసమా?

శ్రీకృష్ణుడు : స్వభావాన్నిబట్టి మనుష్యుల ఈశ్రద్ధ సాత్వికం, రాజసం, తామసం అని మూడు విధాలుగా కలుగుతుంది. అది చెపుతాను, విను. అర్జునా, మనుష్యులు యావన్మందికీ వాళ్ళవాళ్ళ అంతఃకరణసంస్కారం అనుసరించే, వాళ్ళ శ్రద్ధకలుగుతుంది. మనిషి శ్రద్ధా మయుడు. ఎవడికి ఎలాంటి శ్రద్ధ వుంటే అతడు అలాగే తయారవుతాడు.

సాత్వికులు దేవతల్ని భజిస్తారు. రాజసులు యక్షుల్నీ రాక్షసుల్నీ భజిస్తారు. తామసులు దెయ్యాల్నీ భూతల్నీ పూజిస్తారు. దంభంతోనూ, అహంకారంతోనూ, కూడిన వాళ్ళయి, కామం రాగం పట్టుదలా—వీటితో అవివేకులై శరీరంలోని ఇంద్రియాల్నీ అంతఃశరీరం

లోని నన్నూ కష్టపెడుతూ శాస్త్రవిరుద్ధంగా ఘోరమయిన తపస్సు చేసేవాళ్ళు ఆసురస్వభావులని తెలుసుకో.

ప్రతి మనిషికీ ఇష్టమైన ఆహారంకూడా మూడువిధాలుగా వుంటుంది. అలాగే యజ్ఞం, తపస్సూ, దానమూ మూడువిధాలుగా వుంటాయి. వాటి భేదాలు చెప్తాను. విను.

రసవంతమైనవీ, చమురున్నవీ, స్థిరమైనవీ, మనస్సుకి ఇంపయినవీ - ఆయుస్సు ఉత్సాహం బలం ఆరోగ్యం సుఖం సంతోషం కలిగించేవీ- ఇలాంటి ఆహారాలు సత్వగుణం కలవాళ్ళకి రుచిస్తాయి.

చేదయినవీ, పుల్లనివీ, ఉప్పనివీ, బాగా వేడిగా వున్నవీ, కారంగలవీ రసహీనంగా వున్నవీ, దాహంపుట్టించేవీ - దుఃఖం శోకం రోగం కలిగించేవీ- ఇలాంటి తిళ్ళు రజోగుణం కలవాళ్ళకి రుచిస్తాయి.

వంట యిూక జాము నిలువవున్నవీ, రసం లేనివీ, పాచికంపు కొట్టేవీ, వొకరోజు నిలువవున్నవీ, తినగా మిగిలిన ఎంగిలివీ, తిన కూడనివీ - ఇలాంటివి తామసగుణం కలవాళ్ళకి రుచిస్తాయి.

ఫలకాంక్ష లేకండా, కర్తవ్యమని మనసా నిశ్చయించుకుని, శాస్త్రాల్లో చెప్పినప్రకారం చేసేయజ్ఞం సాత్వికయజ్ఞం. ఫలాపేక్షతో డాబుకోసం చేసే యజ్ఞం రాజసయజ్ఞం.

ఒక విధీవిధానం లేకండా, అన్నదానమూ మంత్రాలూ దక్షిణలూ శ్రద్ధాలేకండా చేసేయజ్ఞం తామసయజ్ఞం.

దేవతల్నీ బ్రాహ్మల్నీ గురువుల్నీ జ్ఞానుల్నీ సేవించడం, శుచిగా వుండడం, సరళమయిన నడవడి, బ్రహ్మచర్యం, అహింస — వీటిని శారీరక తపస్సు అంటారు.

ఉద్వేగంకలిగించనిదీ సత్యమైందీ ప్రియమైందీ హితమైందీ మాట్లాడడం, వేదాలూ శాస్త్రాలూ అవీ అభ్యసించడం — దీన్ని వాచిక తపస్సు అంటారు.

మనస్సు ప్రసన్నంగా వుంచడం, సౌమ్యంగా వుండడం, మునిలా నడుచుకోడం, మనోనిగ్రహం కలిగివుండడం, భావనలో పరిశుద్ధంగా వుండడం- ఇదంతా మానవతపస్సు.

ఫలాశలేకండా శ్రద్ధతోనూ, యోగబుద్ధితోనూ మనిషిచేసే ఈమూడు తపస్సులూ సాత్విక తపస్సులు.

సత్కారం పొందాలనీ, మానం పొందాలనీ, పూజించబడాలనీ డాబుకోసం చేసే తపస్సు అస్థిరమైంది. అది రాజసతపస్సు అనిపించు కుంటుంది.

పిచ్చిపట్టుదలతో తాను స్వయంగా కష్టాలుపాలైగాని ఇతర్ల నాశనం కోసంగాని చేసే తపస్సు తామస తపస్సన్నారు.

యజ్ఞమూ తపస్సూ అయ్యాయి. ఇక దానం సంగతి: దేశ కాల పాత్రలు విచారించి దానం చెయ్యడం తన విధి అని భావించి, ప్రత్యుపకారం కోరకండా చేసేదానం సాత్వికదానమన్నారు. తిరిగి ఏదన్నా ఉపకారం పొందాలనికాని, ముందుముందు ఫలం పొందుతామని కానీ ఆశ పెట్టుకుని అతికష్టంమీద చేసే దానం రాజస దానమన్నారు. దేశ కాల పాత్రలు విచారించకండా, సత్కారమూ అదీ లేకండా, తిరస్కారభావంతో చేసే దానం తామస దాన మన్నారు.

ఓం తత్ సత్ (ఓం అది సత్యం) అని బ్రహ్మం మూడువిధాలని చెప్పారు. ఈనిర్దేశంవల్లే పూర్వం బ్రాహ్మలూ వేదాలూ యజ్ఞాలూ నిర్మించడంజరిగింది. అంచేత శాస్త్రాల్లో చెప్పిన వేదవాదుల యజ్ఞాలూ దానాలూ తపస్సులూ మొదలైన వైదిక కర్మలు ఎప్పుడూ ఓం అంటూ చేయడం జరుగుతుంది. మోక్షం కోరేవాళ్ళు ఫలాపేక్ష లేకండా తత్ (అదే) అంటూ నానావిధాల యజ్ఞాలూ దానాలూ తపస్సులూ మొదలైనవి చేస్తారు. ఉన్నది అనే అర్థంలోనూ మంచి తనం అనే అర్థంలోనూ సత్ శబ్దం వాడడంజరుగుతుంది. అలాగే

ప్రశస్తమైన కర్మల్లో మంచికర్మ అని చెప్పడానికీ సత్ శబ్దం వాడుతున్నారు. యజ్ఞం తపం దానం — ఈ మూడింటి ఆచరణకూడా సత్ అనే శబ్దంతోనే చెపుతున్నారు. అలాగే దానికి సంబంధించిన కర్మకూడా సత్ అనే చెప్పడం జరుగుతుంది.

అశ్రద్ధతో చేసే హోమం దానం తపస్సూ — యావత్తూకూడా అసత్ అనే అనిపించుకుంటుంది. అర్జునా, అలాంటి అసత్ కర్మవల్ల ఈలోకంలో ఫలంలేదు సరికదా, పరలోకంలోనూ లేదు.

అర్జునుడు : కృష్ణా ! సన్యాసం, త్యాగం — ఈ రెండింటి యథార్థం విడివిడిగా తెలుసుకోవాలని కోరుతున్నాను.

శ్రీకృష్ణుడు : ఫలాసక్తితో చేసే కామ్యకర్మలు వొదిలిపెట్టడం సన్యాసమన్నారు బుద్ధిమంతులు. సర్వకర్మలఫలమూ వొదిలిపెట్టడం త్యాగమన్నారు. దోషయుక్తమైనవి కనక కర్మలు పూర్తిగా వొదిలిపెట్టాలి అంటారు కొందరు పండితులు. యజ్ఞం దానం తపస్సూ — ఈ కర్మలు వొదిలిపెట్టకూడదంటారు మరికొందరు పండితులు. ఐతే, అర్జునా, త్యాగం విషయంలో నా సిద్ధాంతం విను.

త్యాగం మూడువిధాలని చెప్పారు. యజ్ఞం, దానం, తపస్సూ-ఈకర్మలు వొదలకూడదు. ఇవి చేస్తూనే వుండాలి. ఈమూడు పండితుల్ని సైతం పవిత్రవంతుల్ని చేస్తాయి. ఐతే అర్జునా, ఈకర్మలు కూడా ఆసక్తిలేకండా, ఫలం వొదిలిపెట్టి చెయ్యాలనే నాముఖ్యాభిప్రాయం. ఏమంటే, అదే ఉత్తమమైంది.

విధ్యుక్తమైన కర్మ వొదిలిపెట్టడం కూడనిపని. అజ్ఞానంవల్ల అలా వొదిలిపెడితే అది తామసత్యాగమే అనిపించుకుంటుంది. కర్మ కష్టంకలిగిస్తుందని శరీరాయాసానికి భయపడి కర్మలు వొదిలిపెడితే అది రాజసత్యాగ మవుతుంది. అలా చేసినవాడు ఆ త్యాగానికి పొందవలసిన ఫలంకూడా పొందలేడు. ఇది నా కర్తవ్యమని భావించి

కర్మచేస్తూ, ఆసక్తీ ఫలాపేక్షా వొదిలిపెడితే అది సాత్విక త్యాగ మనిపించుకుంటుంది.

మేధావీ, సంశయంలేనివాడూ అయిన సాత్వికత్యాగి అశుభ కర్మని ద్వేషించడు. శుభకర్మమీద ఆసక్తుడూ కాడు. ఏమంటే, దేహధారిఅయిన ఎవ్వడూకూడా కర్మలు పూర్తిగా వొదలడం సాధ్యం కాదు. అంచేత కర్మలుచేస్తూ కర్మఫలం వొదిలిపెట్టినవాడే నిజమైన త్యాగిఅని చెప్పాలి.

త్యాగికానివాడు మరణించాక అతడికి చెడ్డఫలం, మంచిఫలం, మంచీ చెడ్డా కలిసినఫలం — ఇలా మూడు విధాల కర్మఫలాలు కలుగు తాయి. కాని త్యాగికిమాత్రం ఎప్పుడూ ఈ ఫలం కలగదు.

అర్జునా, సమస్తకర్మలూ సిద్ధించడంకోసం కర్మసిద్ధాంతం బోధించే సాంఖ్యశాస్త్రంలో చెప్పిన ఈ అయిదు కారణాలూ నానించి తెలుసుకో. క్షేత్రమూ, కర్తా, వివిధ సాధనాలూ, అనేకవిధాలుగానూ విడివిడిగానూ వుండే వ్యాపారం దైవం, శరీరం వాక్కూ మనస్సూ— ఈమూడింటితోనూ మనిషి ప్రారంభించేకర్మలు, అవి న్యాయమైనవే అయినా — అన్యాయమైనవే అయినా — వాటన్నిటికీ ఈ అయిదే కారణాలు. అసలువిషయం ఇలావుంటే, సంస్కారబుద్ధి లేకపోడంచేత కేవలం తానే కర్తనని భావించే దుర్మతికి ఏమీ తెలియదనే నమ్ము.

"నేనే చేస్తున్నాను" అనేభావం ఎవడికిలేదో, ఎవడిబుద్ధి విషయాల్లో మగ్నంకాదో — అతడు ఈ లోకంలోని ప్రాణులందరినీ చంపినాసరే, చంపనట్టేలెక్క. ఆ హత్యాకర్మకి అతడు బద్ధుడుకాడు.

జ్ఞానం (ఫలానాకర్మ అన్నజ్ఞానం) జ్ఞేయం (ఆకర్మ ఇలావుంటుం దని తెలుసుకోడం) జ్ఞాత (ఆకర్మ తెలుసుకున్న వాడు) అని కర్మచోదన (కర్మకోసం ప్రేరణ) మూడు విధాలు. కరణమూ, కర్మా, కర్తా అని కర్మసంగ్రహం మూడు విధాలు. జ్ఞానమూ, కర్మా, కర్తా—ఈమూడూ

సత్వం, రజస్సు తమస్సు, అని మూడేసి విధాలని గుణ సంఖ్యా శాస్త్రంలో చెప్పివుంది. అది వున్నది వున్నట్టు చెపుతాను, విను.

భిన్న భిన్నంగా వున్న సర్వప్రాణాల్లోనూ భిన్నంకాకండా వొకటిగావున్న తరుగులేనిదాన్ని మనిషి ఏజ్ఞానంతో చూస్తాడో ఆ జ్ఞానం సాత్వికజ్ఞానం. అన్ని ప్రాణుల్లోనూ విడివిడిగా అదంతా భిన్న భిన్న మైందే అని గ్రహించే జ్ఞానం రాజస జ్ఞానం. సబబూ సందర్భం లేకండా ఏదో వొకదాన్లో ఆసక్తి పెట్టుకుని అదే అంతా అనుకునే అసత్యమైన నీచజ్ఞానం తామసజ్ఞానం.

ఫలాభిలాష లేని వ్యక్తి రాగద్వేషాలు వొదిలిపెట్టి, ఆసక్తి లేకండా చేసే విద్యుక్త కర్మ సాత్విక కర్మ. ఫలాభిలాషతోనో, అహంకారంతోనో ఎంతో ఆయాసపడి చేసేకర్మ రాజసకర్మ. ముందుముందు కలిగే మంచీచెడ్డా చూసుకోకండా, నాశనం హింసా విచారించకండా తన సామర్థ్యం గమనించకండా అజ్ఞానంతో చేసే కర్మ తామసకర్మ.

ఫలాసక్తీ అహంకారం లేనివాడూ, ధైర్యవంతుడూ, ఉత్సాహవంతుడూ, కార్యం సిద్ధించిందని సంతోషంగాని సిద్ధించ లేదని విచారంగాని లేనివాడూ — ఇలాంటి కర్త సాత్విక కర్త. విషయాసక్తుడూ, కర్మఫలం కాంక్షించేవాడూ, పిసినిగొట్టూ, పై వాళ్ళని పీడించుకు తినేవాడూ, శుచీ శుభ్రం లేనివాడూ, సంతోషంగాని దుఃఖంగాని లేనివాడూ — ఇలాంటి కర్త రాజసకర్త. ఏకాగ్రత లేనివాడూ, సంస్కారం లేనివాడూ, స్తబ్ధుడూ, పై వాళ్ళని చెరిచేవాడూ, సోమరిపోతూ, ఏడుపు మొహం వాడూ, క్షణంలో చేసే పనికి దినాలూ వారాలూ కాలయాపన చేసేవాడూ — ఇలాంటి కర్త తామస కర్త.

అర్జునా, సత్వమూ, రజస్సూ, తమస్సూ ఈ మూడు గుణాల ననుసరించి బుద్ధీ, ధృతీ కూడా మూడు విధాలు. వీటిగురించీ విడివిడిగానూ పూర్తిగానూ చెపుతాను, విను.

ఎందులో ఎక్కడ ఎలా ప్రవర్తించాలో, ఎందులో ప్రవర్తించకుండా వుండాలో, ఏది చెయ్యదగిందో, ఏది చెయ్యరాందో, దేనికి భయపడాలో, దేనికి భయపడకూడదో, ఏది బంధహేతువో, ఏది మోక్ష కారణమో—ఇదంతా తెలుసుకునే బుద్ధి సాత్త్విక బుద్ధి. ధర్మం అధర్మం, కార్యం అకార్యం—వీటిని వున్నవి వున్నట్టు కాక సందిగ్ధంగా తెలుసుకునే బుద్ధి రాజసబుద్ధి. చీకటి కప్పడంచేత అధర్మం ధర్మమని ఇలాగే ప్రతీదీ వ్యతిరేకంగా గ్రహించే బుద్ధి తామస బుద్ధి.

పురుషుడు మనస్సుయొక్కా, ప్రాణాలయొక్కా, ఇంద్రియాల యొక్కా క్రియలు తదేక దృష్టితో ధరించే అచంచలమైన ధృతి సాత్త్విక ధృతి. ఫలంకోరేవాడు ఆసక్తితో ధర్మం అర్థం కామం — ఈ మూడు పురుషార్థాలూ ఏ ధృతితో ధరిస్తున్నాడో ఆ ధృతి రాజసధృతి. మనిషి దుర్బుద్ధితో నిద్రాభయం శోకం విషాదం మదం—వీటిని ఏధృతితో వొదలకండా వుంటాడో ఆధృతి తామసధృతి.

ఇక, సుఖంకూడా మూడు విధాలు. చెపుతాను విను. ఏసుఖం అభ్యాసంవల్ల ప్రీతి కలిగిస్తుందో, దుఃఖం లేకండా చేస్తుందో, ఏది మొదట విషంలా వుండి చివరికి అమృతంలా అవుతుందో, ఏది ఆత్మ జ్ఞానంతో కలిగిన ప్రసన్నతవల్ల కలుగుతుందో — ఆ సుఖం సాత్త్విక సుఖం. ఏ సుఖం ఇంద్రియాలూ, విషయాలూ - వీటి కలయికవల్ల కలుగుతుందో, ఆరంభంలో అమృతంలావుండి, చివర విషంలా అవుతుందో - ఆ సుఖం రాజససుఖం. ఏసుఖం ఆరంభంలోనూ అంతంలోనూ మోహం కలిగిస్తుందో, ఏది నిద్రా బద్ధకమూ పొరపాటూ — వీటివల్ల కలుగుతుందో - ఆ సుఖం తామస సుఖం.

ప్రకృతినుంచి పుట్టిన సత్త్వమూ రజస్సూ తమస్సూ ఈ మూడు గుణాలూ వొదిలిపెట్టిన పదార్థం భూమిమీదకాని, ఆకాశంమీదకాని, స్వర్గంలో కాని ఎక్కడా లేదు. బ్రాహ్మలికీ క్షత్రియులికీ వైశ్యులికీ

శూద్రులికీ వారివారి స్వభావంవల్ల పుట్టిన ఈ గుణాలబట్టీ విడివిడిగా వారివారి కర్మలు ఏర్పడ్డాయి.

శమం దమం శుచిత్వం తపస్సు ఓర్పు సరళత్వం జ్ఞానం విజ్ఞానం ఆస్తిక్యబుద్ధి – ఇవి బ్రాహ్మల స్వభావసిద్ధమైన కర్మలు. శౌర్యం తేజస్విత ధైర్యం దక్షత యుద్ధంలో పలాయనం చిత్తగించకపోడం దాతృత్వం ప్రజాపరిపాలన క్షత్రియుల స్వభావసిద్ధమైన కర్మలు. వ్యవసాయం పశువులు పెంచడం వ్యాపారం వైశ్యులస్వభావసిద్ధమైన కర్మలు. అలాగే పరిచర్య శూద్రుల స్వభావసిద్ధమైనకర్మ.

తన స్వభావసిద్ధమైన కర్మలో తత్పరుడైనవ్యక్తి సిద్ధిపొందుతాడు. స్వకర్మలో తత్పరుడైనవాడు ఎలాసిద్ధిపొందుతాడో విను. ఎవడివించి ప్రాణుల ఉత్పత్తిక్రమం ప్రారంభమవుతుందో, ఎవడిచేత ఈసర్వమూ వ్యాపించివుందో అతణ్ణి మానవుడు తన స్వభావసిద్ధమైన కర్మతో పూజించడంవల్ల సిద్ధిపొందుతాడు.

చక్కగా ఆచరించిన పరధర్మంకంటే, లోపంతోవుంటే ఏంగాక స్వధర్మమే శ్రేయస్కరమైంది. ఏమంటే, స్వభావసిద్ధమైన కర్మ చెయ్యడంలో ఏ పాపమూవుండదు. అర్జునా, స్వభావసిద్ధమైన కర్మల్లో దోషం వున్నాసరే, దాన్ని విడిచిపెట్టకూడదు. ఏమంటే, నిప్పులో పొగవున్నట్టు కర్మలన్నిటిలోనూ ఏదోవొకదోషం వుండనేవుంటుంది.

అంచేత, అన్నివిషయాల్లోనూ ఆసక్తిమానుకుని, ఆత్మనిగ్రహంతో, భోగకాంక్ష లేకండా తన స్వభావసిద్ధమైన కర్మలు చేస్తూ, కర్మఫలం సన్యసించడంవల్లనే నిష్కామకర్మసిద్ధి కలుగుతుంది. ఇలా సిద్ధిపొందినవాడు ఎలా ఉత్తమమయిన జ్ఞాననిష్ఠాసాధనంతో బ్రహ్మం పొందుతాడో అది క్లుప్తంగా నానించి తెలుసుకో.

శుద్ధమైన బుద్ధితోవుండి, ధైర్యంతో తన్ను నియమించుకుని, శబ్దం మొదలయిన ఇంద్రియవిషయాలూ రాగద్వేషాలూ వొదిలిపెట్టి

ఏకాంతస్థలంలో వుండి, మితంగా భోజనంచేస్తూ, మనస్సూ వాక్కూ శరీరమూ స్వాధీనంలో వుంచుకుని, ఎల్లప్పుడూ ధ్యానంలోవుండి, వైరాగ్యం అవలంభించి, అహంకారం మొండిపట్టు గర్వం కామం క్రోధం లోభం - ఇవన్నీ విడిచిపెట్టి, మమకారం లేకండా శాంతంగా వున్న వాడు బ్రహ్మభావం పొందడానికి సమర్థుడవుతాడు. బ్రహ్మభావం పొందినవాడు ప్రసన్నచిత్తుడవుతాడు. దేనికోసమూ విచారించడు. దేనినీ కావాలనడు. సమస్తప్రాణుల్నీ సమంగాచూస్తాడు. ఉత్తమమైన నాభక్తి సంపాదిస్తాడు. ఆ భక్తితో నిజానికి నేను ఎవణ్ణో, ఎంతటి వాణ్ణో అదంతా తెలుసుకుంటాడు. అలా నా యథార్థస్థితి తెలుసుకుని తరవాత నాలోనే ప్రవేశిస్తాడు. ఎల్లప్పుడూ సర్వకర్మలూ చేస్తూ వుండీన్నీ, నన్ను ఆశ్రయించినవాడు నా అనుగ్రహంవల్ల శాశ్వతమైన నాశనంలేని మోక్షం పొందుతాడు.

అంచేత అర్జునా, అన్నికర్మలూ మనస్సా నాకు అర్పించు. నామీదే ఆసక్తిపెట్టుకో. బుద్ధియోగం ఆశ్రయించి నామీదే మనస్సు లగ్నంచెయ్యి. నామీద మనస్సు లగ్నంచేసుకుని నా అనుగ్రహంవల్ల అన్ని ఆటంకాలూ అవలీలగాదాటగలుగుతావు. అహంకారంతో నామాట వినకపోయావో నశిస్తావు.

అహంకారంతో, యుద్ధంచెయ్యకండా వుండాలని ప్రయత్నిస్తే నీ ప్రయత్నం వ్యర్థమే అవుతుంది. నీ ప్రకృతిసిద్ధమైన క్షత్రియ స్వభావం నిన్ను నీపనిలో ప్రవేశపెట్టి తీరుతుంది. మోహంవల్ల దేనిని చెయ్యడానికి ఇష్టపడకండా వున్నావో దానినే నీ స్వభావసిద్ధమైన కర్మకి బద్ధుడివికావడంచేత స్వాతంత్ర్యం లేనివాడివై నువ్వు చెయ్యవలసి వస్తుంది.

ఈశ్వరుడు ప్రాణుల యావన్మంది హృదయాల్లోనూ వుండి, యంత్రంమీద పెట్టి తిప్పినట్టు వాటిని తన మాయచేత తిప్పుతున్నాడు

అర్జునా, అన్నివిధాలా ఆ ఈశ్వరుణ్ణే ఆశ్రయించు. అతడి అనుగ్రహంవల్ల పరమశాంతి-శాశ్వతమైన మోక్షం పొందుతావు.

ఇలా రహస్యాలన్నిటికీ రహస్యమైన జ్ఞానం నీకు చెప్పాను. ఇది బాగా యోచించి ఎలా నీకు ఇష్టమైతే అలా చెయ్యి. నువ్వు నాకు ఇష్టమైనవాడివి. అంచేత నీ క్షేమం కోరి రహస్యాల్లో రహస్యమైన విషయం మళ్ళీ చెపుతున్నాను. విను. నామీద నీ మనస్సు పెట్టు. నాభక్తుడివి కా. నన్ను భజించు. నాకు నమస్కరించు. అప్పుడు నన్నే పొందుతావు. నిజం. ప్రతిజ్ఞచేసి చెపుతున్నాను. నువ్వంటే నాకు ఇష్టం. సర్వధర్మాలూ పరిత్యజించు. నన్ను వొక్కణ్ణే ఆశ్రయించు. సర్వపాపాలనించీ నేను నిన్ను విడిపిస్తాను. విచారించకు.

అర్జునా, తపస్సు లేనివాడికీ, భక్తిలేనివాడికీ, వినాలని కోరిక లేనివాడికీ, నన్ను నిందించేవాడికీ ఇది ఎప్పుడూ చెప్పకూడదు. ఐతే, పరమరహస్యమైన దీనిని నా భక్తులమధ్య చెప్పేవాడు మాత్రం నా పరమభక్తుడై నన్నే పొందుతాడు. సందేహంలేదు. అంతేకాదు, అతడికంటే నాకు ప్రియంచేసినవాడు మనుష్యుల్లో మరొకడు వుండడు. భూమ్మీద అంతకంటే నాకు ప్రియమైనవాడూ పుట్టబోడు.

మన ఇద్దరి ఈ ధర్మసంవాదం చదివినవాడు జ్ఞానయజ్ఞంతో నన్ను పూజించినవాడవుతాడని నా అభిప్రాయం. అలాగే అసూయ లేకండా శ్రద్ధతో ఇది వినేవాడు కూడా పుణ్యకర్మలు చేసేవాళ్ళు పొందే పుణ్యలోకాలు పొందుతాడు.

అర్జునా, ఏకాగ్రచిత్తంతో నువ్వు విన్నావుకదా! అజ్ఞానంవల్ల కలిగిన నీమోహం ఇక నశించింది కదా!

అర్జునుడు: కృష్ణా, నీ అనుగ్రహంవల్ల నామోహం నశించింది. నాకర్తవ్యధర్మం నాకు స్మరణకి వచ్చింది. సందేహం పటాపంచలైంది. నువ్వు చెప్పినట్టు చేస్తాను.

ఇలా మహాత్ముడైన శ్రీకృష్ణుడుకీ అర్జునుడికీ జరిగిన — శరీరం పులకలెత్తించే — అద్భుతమైన సంవాదం నేను విన్నాను. రహస్యమైన, శ్రేష్ఠమైన ఈ యోగశాస్త్రం యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు స్వయంగా చెపుతూవుంటే వ్యాసులవారి అనుగ్రహంవల్ల ప్రత్యక్షంగా విన్నాను. రాజా, శ్రీకృష్ణుడికీ అర్జునుడికీ జరిగిన అద్భుతమైన ఈ పుణ్యసంవాదం తలుచుకుని తలుచుకుని మాటి మాటికీ ఉప్పొంగి పోతున్నాను. అద్భుతమైన శ్రీకృష్ణుడి విశ్వరూపం తలుచుకుంటూవుంటే మాటిమాటికీ ఎంతో ఆశ్చర్యం, ఎంతో ఆనందం గలుగుతూవుంది.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడూ, విలుకాడైన అర్జునుడూ ఎక్కడవుంటే అక్కడ లక్ష్మి, జయమూ, ఐశ్వర్యమూ, స్థిరమైన నీతీ వుంటాయని నా నమ్మకం.

ధృతరాష్ట్రుడు : బావుంది. అయితే సంజయా, అలా కయ్యానికి కాలుదువ్వుతూవున్న రెండు సేనలలోనూ ముందు ఎవరుచెయ్యి చేసుకున్నారు? యుద్ధం ఎలాజరిగింది? అదంతా వివరంగా చెప్పు.

సంజయుడు : ముందు మనవాళ్ళే యుద్ధ మారంభించారు. దురాగ్రహంకొద్దీ నీ పెద్దకొడుకు దుర్యోధనుడు దుశ్శాసనుణ్ణి సంజ్ఞ చేశాడు. అసలే దర్పంలో దుర్దముడు దుశ్శాసనుడు. అన్నగారు ఇసారా ఇచ్చాడో లేదో సేనలు పురికొల్పాడతను. శంఖాలూ, భేరీలూ, మృదంగాలూ వొక్కసారి చెవులు గింగురుమన్నట్టు మోగాయి. చివాలున ధూమకేతువులాగ లేచాడు భీష్మసేనాని; పాండవసేనమీద దాడి ప్రారంభించాడు.

భీముణ్ణి ముందుపెట్టుకుని పాండవులు విజృంభించారు. భీష్ముడికి ఎదురువచ్చి మనసేనమీద కలబడ్డారు. వాళ్ళసేనలో ఎక్కడలేని ఉత్సాహమూ చెలరేగింది. మన అంతసేనా వొకలెక్కలోకే లేదు

వాళ్ళు. మనఏనుగులు వొాకగడ్డిపోచలా చూశారంటే ఇక తక్కిన సంగతి చెప్పేదేముంది!

ఇలా రెండు సేనలూ కలబడడంతోనే ఆకాశం తూటుకట్టినట్టు భేరీలూ, ఢక్కలూ, గర్జనలూ ఘోరంగా విజృంభించాయి. వాట న్నిటినీ, మించిపోయినట్టు పెద్ద సింహనాదంచేశాడు భీముడు. అతడు సింహనాదం చేస్తూవుంటే మనసేనలో భటుల గుండెలు గుభిల్లు మన్నాయి. గుర్రాలూ ఏనుగులూ గుండెలు బద్దలయినట్టయాయి. అప్పుడు దుర్యోధనుడి కళ్ళవేడుకగా ముందుకివచ్చి దుశ్శాసనుడూ, దుర్ముఖుడూ, దుస్సహుడూ, దుర్మర్షణుడూ, వివింశతీ, వృషసేనుడూ, చిత్రసేనుడూ, వికర్ణుడూ, పురుమిత్రుడూ భీముడిమీద కలబడ్డారు. అదిచూసి నకులసహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ, ద్రౌపదికుమాళ్ళు అయిదుగురూ మనకుమాళ్ళమీదికి వచ్చారు. భీముణ్ణి వెనకపెట్టి కొండలలాంటి కౌరవవీరులమీద పిడుగులలాంటి బాణాలు కురిపించారు. మనకుమాళ్ళున్నూ అడ్డూఆపూ లేని బాణాలతో వాళ్ళని ముంచెత్తారు. అదిచూస్తూ ఉభయసైన్యాలూ కొంచేపు నిశ్చేరపోయి చిత్తరువుల్లా నుంచుండిపోయాయి. రెండుపక్కల నించీ విజృంభిస్తూవున్న బాణాలకాంతి వొక వెలుగుతెరలా వాళ్ళమీద కనిపించింది. అప్పుడు ఆవేశంతో తనసేనని పురిగొలిపాడు మన దుర్యోధనుడు. గెలుపే లక్ష్యంగా పెట్టుకుని తనసేనని రెచ్చ గొట్టాడు ధర్మరాజు. వొక్కపెట్టుని హాలో అంటే హాలో అని రెండుసైన్యాలూ కలబడిపోయాయి.

అలా పాండవసైన్యమూ, కౌరవసేనా రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, భటులూ మొదటిసారిగా కలబడడంతోనే రణస్థలమంతా హాహాకారెత్తిపోయింది. కనీవినీఎరగనంత ధూళి రేగిపోయింది. నల్లటి ధూళిలేచి గ్రహణంపట్టినట్టు కనపడింది సూర్యబింబం. తెల్లటిధూళి

యుద్ధరంగానికి చందువాకట్టినట్టు కనపడింది. ఎర్రటిధూళి లేచి ఆకాశంమీంది దేవకాంతల ముంగురులమీందపడి, తుమ్మెదలమీందపుప్పొడి ఎలా అవుపిస్తుంది, అదిగో అలా అవుపించింది. పసుపురంగుధూళి పాకి దిక్కులనే గోడలికి బంగారంరేకు తాపినట్టు కనపడింది. ఏనుగుల గంటలూ, గుర్రాల సకిలింపులూ, ఆయుధాల రాపిళ్ళు, భూమీ ఆకాశం బద్దలుచేస్తున్న ఢంకా నగారాలూ ఏమీ తోచనివ్వలేదంటే నమ్ము. అయితే అంతలోనే ఆధూళంతా ఏమయిందో తెలుసా ? ఏనుగులు తొండాలతో చల్లిన తుంపుర్లూ, గుర్రాల నోటి నురుగులూ, దెబ్బలు తగిలిన భటుల రక్తాలూ - ఇవన్నీ పడి అదంతా అడగారి పోయింది. పిసరంత ధూళి కనపడితే వొట్టు !

అప్పుడు ఆమహాయుద్ధంలో ఉభయసేనలలోని రాజులూ తమ తమ బిరుదుచిహ్నలతోనూ, వీరధ్వజాలతోనూ శౌర్యమూ, ప్రతాపమూ మూర్తీభవించినట్టు కనిపించారు. అందరిలోకీ మీంతండ్రి భీష్ముడు మట్టమధ్యాహ్నం సూర్యుడిలాగ వెలిగిపోయాడు. భీమణంగా ఆయన విజృంభించడంచూసి నీకుమాళ్ళు పట్టలేనంత సంతోషించారు. దాంతో అర్జునుడికి వొళ్ళుమండింది. దేవదత్తం పూరించాడతడు. ధనుష్టంకారంచేసి బరిమీందపాములాగ భీష్ముడిమీందికి రథంపరిగెత్తించాడు. ఉభయులూ ముఖాముఖి తారసిల్లడమే తడవు వొకరిమీంద వొకరు మహాస్త్రాలే ప్రయోగించుకున్నారు. రౌద్రరూపం దాల్చింది యుద్ధం.

సాత్యకి కృతవర్మమీందికి పరిగెత్తాడు. అతడూ రభసంగా తిరగబడ్డాడు. ఇద్దరూ వాడివాడిబాణాలతో కొట్టుకున్నారు. పదులూ, వందలూ బాణాలు తగిలి ఇద్దరి శరీరాలూ రక్తాలుకారి, ఇద్దరూ పూచిన మోదుగుఖులా కనిపించారు.

కోసలంరాజు బృహద్బలుడూ, అభిమన్యుడూ వొకదగ్గిర కలబడ్డారు. కలబడీకలబడడంతోనే అభిమన్యుడి సారథిని కొట్టేశాడు బృహద్బలుడు. అతడి గుర్రాలూ చంపేశాడు. అయితే అభిమన్యుడుకూడా వూరుకోలేదు. బృహద్బలుడి సారథినీ, గుర్రాల్నీ చంపేసి, అతడి జెండాకూడా తెగేశాడు. అతణ్ణి ఆపాదమస్తకమూ బాణాలతో అదే కొట్టడం కొట్టాడు.

అర్జునుణ్ణి వొదలి భీముడిమీదికి వచ్చాడు భీష్ముడు. ఉభయ సేనల్లోనూ యావన్మందీ నివ్వెరపోయి నుంచుండిపోయేట్టు అస్త్రశస్త్రాల కౌశలం చూపిస్తూ ఉభయులూ యుద్ధంచేశారు.

మన దుశ్శాసనకుమారుడు నకులుడిమీద విరుచుకుపడ్డాడు; ఉగ్రమైన బాణాలు ప్రయోగించాడు. నవ్వుతూ వొక్కబాణం వేశాడు నకులుడు. దుశ్శాసనుడి విల్లు తునకలైపోయింది. మరో పాతిక బాణాలు పడావడా కొట్టాడునకులుడు. తునకలైనధనుస్సుపడేసి చప్పున మరోధనస్సు పుచ్చుకున్నాడు దుశ్శాసనుడు. నకులుడు వేసిన బాణాలు సగంలోనే నరికిపారేశాడు. అతడిజెండా రెండుముక్కలు చేసేశాడు.

దుర్ముఖుడు సహదేవుడిమీది కురికాడు. వాడివాడి బాణాలతడిమీద వడివడిగా కొట్టాడు. వాటన్నిటినీ తుక్కుతుక్కుకింద కొట్టేశాడు సహదేవుడు. పైగా దుర్ముఖుడి సారథినీ, గుర్రాల్నీ చంపేసి సింహనాదంచేశాడు.

శల్యుడూ ధర్మరాజూ కలబడ్డారు. మొదటి తాకిడిలోనే శల్యుడు ధర్మరాజుధనుస్సు రెండుముక్కలు చేసేశాడు. చూపులతోనే నవ్వాడు ధర్మరాజు. క్షణంలో మరోవిల్లు పుచ్చుకున్నాడు. శల్యుడి మీద శరవర్షం కురిపించాడు. కౌరవసైన్యం గడగడలాడింది.

ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యులమీదికి పరిగెత్తాడు. అతడు రావడమే తడువు అతడిధనుస్సు మూడుముక్కలు చేసేశాడుద్రోణుడు.

సర్దుకునేలోపున మరో గట్టిబాణం నాటుకుపోయేట్టుకొట్టాడు. దెబ్బ తిని ఉత్తరక్షణంలో ఇంకోధనుస్సు పుచ్చుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. గుక్కతిప్పకండా పద్నాలుగు బాణాలు ద్రోణుడిమీదకు ప్రయోగించాడు.

మగధసహదేవుడు భూరిశ్రవుడితో కలబడ్డాడు. తళతళా మెరిసే బాణాలు అతడి బుజాలమీద నాటించాడు. దాంతో వొక ఉగ్రమైన బాణంతీశాడు భూరిశ్రవుడు. సహదేవుడి గుండెలు పగిలేట్టు కొట్టాడు. వాళ్ళిద్దరూ యుద్ధంచేస్తూవుంటే వృత్రాసురుడూ, దేవేంద్రుడూ యుద్ధంచేస్తున్నారా అనిపించింది.

ధృష్టకేతువెళ్ళి కురువృద్ధుడు బాహ్లీకుణ్ణి ఎదిరించాడు. గబగబా తొమ్మిదిబాణాలు అతడిమీద వేశాడు. అన్నీ మెళుకువతో తప్పించుకున్నాడు బాహ్లీకుడు. తప్పించుకుంటూనే పదిబాణాలు ధృష్టకేతుమీద తగిలించాడు.

ఘటోత్కచుడు అలంబసుడితో కలబడ్డాడు. పెద్ద కొండలాంటి అలంబసుడిమీదికి ఘటోత్కచుడు పరుగెత్తుకు వస్తూవుంటే భూమి గజగజలాడిపోయింది. ఆ రాక్షసులిద్దరూ ఘోరంగా పోట్లాడారు.

శిఖండీ దురుసుగా అశ్వత్థామమీదికి వచ్చాడు. వచ్చీరావడంతోనే అతడి గుండెలమీద గట్టిదొక బాణం తగిలించాడు అశ్వత్థామ. చలించలేదు శిఖండి. దారుణమైన వొక బాణం తీశాడు; అశ్వత్థామ గుండెలు చీల్చుకుపోయినట్టు కొట్టాడు.

భగదత్తుడూ విరాటరాజూ కలబడ్డారు. ఉభయులూ ఉగ్రమైన బాణాలు కురిపించారు. జడివానలాగ అవి ఆకాశంకప్పేశాయి.

కేకయదేశంరాజు బృహత్క్షత్రుడూ కృపాచార్యులూ వొక దగ్గిర యుద్ధంచేశారు. ఇద్దరి జెండాలూ విరిగిపోయాయి. ఇద్దరి ధనుస్సులూ ముక్కలయిపోయాయి. ఇద్దరి గుర్రాలూ కూలిపోయాయి. దాంతో ఇద్దరూ దారుణమైన కత్తులు పట్టుకుని రథాల

మీదించి కిందికి దూకారు. నిష్ఠురమైన ఖడ్గయుద్ధం చేశారు. ఇటు జయద్రథుడూ, అటు ద్రుపదుడూ అది చూశారు. చివాలున వచ్చి ఆ ఇద్దరిమధ్యా చొరబడ్డారు. బృహత్క్షత్ర, కృపాచార్యులేమో ఆగిపోయారు. ద్రుపద జయద్రథులు మాత్రం వొకళ్ళనొకళ్ళు బాణాలతో కొట్టుకొన్నారు. బలానికీ, పరాక్రమానికీ, సాహసానికీ వొకరిని మించినట్టు వొకరు పోరాడారు.

కోపిష్ఠీ దురభిమాని అయిన వికర్ణుడూ, యుధామన్యుడూ వొక దగ్గిర కలబడ్డారు. ఉభయులూ కసీవిసీ ఎరగనంత రౌద్రరసం ప్రదర్శించారు. ఒకరిమీద వొకరు బాణవర్షం కురిపించారు. ఈర్ష్యతో హోరాహోరి పోరాడారు.

చేకితానుడు సుశర్మమీదికి వచ్చాడు. చికిలిపెట్టిన బాణాలు చురచురమనిపించాడు. అంతకంటే వాడైన బాణాలుకొట్టి సింహనాదం చేశాడు సుశర్మ.

మీ బావ శకుని ప్రతివింధ్యుడిమీదికి వెళ్ళాడు. ఏనుగుమీదికి దూరికిన సింహంకొదమలాగ అతడిమీద తిరగబడ్డాడు ప్రతివింధ్యుడు.

కాంభోజంరాజు సుదక్షిణుడు శ్రుతసోముణ్ణి ఎదిరించాడు. అతడి బాణాలతో ఇతడూ, ఇతడి బాణాలతో అతడూ కప్పడిపోయారు.

ఇరావంతుడూ శ్రుతాయువూ వొకదగ్గిర కలబడ్డారు. ఘోరమైన బాణాలతో పరస్పరం కొట్టుకున్నారు. ఇద్దరి గుర్రాలూ కూలిపోయాయి. ఇద్దరి రథాలూ విరిగిపోయాయి.

అనువిందుడూ, విందుడూ వెళ్ళి కుంతిభోజుణ్ణీ, ఆయన కుమారుడు పురాజిత్తునీ ముట్టడించారు. పురాజిత్తు బాణవర్షంతో విందుణ్ణి అదేముంచెత్తడం ముంచెత్తాడు. కుంతిభోజుడు వేసిన బాణాలన్నీ గదతో అడ్డుకుంటూ అతడిమీదికి విజృంభించాడు అనువిందుడు.

కైకేయులు అయిదుగురూ గాంధారరాజు అయిదుగురి మీదా కలబడ్డారు. వాళ్ళ పోరాటం ఘోరంగా జరిగింది.

సీకొడుకు దీర్ఘబాహుడు ఉత్తరుడి మీదికి పరిగెత్తాడు. నకులుడి కొడుకు శతానీకుడు చువ్వలా వచ్చి ఉలూకుడితో తలబడ్డాడు.

ఇలా ఉభయసేనల వీరులూ ఎవళ్ళకి తగిన వాళ్ళతో వాళ్ళు ఘోరమైన ద్వంద్వయుద్ధ మారంభించారు.

వందలూ, వేలూ లెక్కా జమా లేకండా రథాలతో రథాలు, ఏనుగులతో ఏనుగులు, గుర్రాలతో గుర్రాలు, భటులతో భటులు తమకంతో కలబడ్డారు. దొమ్మీయుద్ధం చేశారు. సైనికులు ఉన్మత్తులలా పెచ్చురేగిపోయారు. ఆకాశంమీద సిద్ధులూ, చారణులూ, భళీ అంటే భళీ అంటూ మెచ్చుకున్నారు.

బాణాలు తగిలి బాణాలు తునకలయి పోయాయి. కత్తులు తగిలి కత్తులు ముక్కలయిపోయాయి. ఏనుగుదంతాలతో ఏనుగు దంతాలు విరిగిపోయాయి. రథాలనొగలతో రథాలనొగలు గుండయి పోయాయి. అంతటా భయంకరంగా విజృంభించింది సంకులసమరం. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ మీద వురికిపడుతూవున్నా వెన కడుగు వెయ్యకండా యుద్ధంచేశారు కాలిభటులు. ఏనుగుల మీది యోధులమీదా, రథాలమీది రథికులమీదా, శరవర్షం కురిపించారు గుర్రాలమీది రౌతులు. ఏనుగుల గుంపులు చెల్లాచెదురు చేశారు రథికులు. ఇదీ అదీ అనకండా చతురంగబలాలన్నిటిలోనూ చొరబడి చిందరవందర చేశారు ఏనుగులమీది వీరులు. ఇలా అడ్డూ ఆపూ లేకండా రెండు సైన్యాలూ మందరపర్వతం చిలికిన మహా సముద్రంలా అల్లకల్లోలంగా అవుపించాయి. దూసుకుపోతూవున్న చిల్లకోలలూ, ఎడాపెడా మెరుస్తూవున్న కత్తులూ, దూసెళ్ళిపోతూ వున్న ఈటెలూ — ఇవన్నీ ఎర్రటి చివుళ్ళులా కనిపించాయి.

చివ్వున బాణాలు మొహాలికి తగిలేసరికి జిర్రుమని ధ్వనిచేస్తూ గిరగిరా తిరిగేవి ఏనుగులు. ప్రళయకాలం పెద్దసుడిగాలికి దిద్దిరా తిరిగే కులపర్వతాల్లా వుండేవవి. కత్తులూ, గదలూ, ఈటెలూ వాటితో ఏనుగుల కుంభస్థలాలూ, గుర్రాల మొహాలూ, భటుల కపాలాలూ భళ్ళు భళ్ళుమని పగిలిపోయేవి. దారుణంగా వుండేది వాటిధ్వని. రకరకాల ఆయుధాలు తగిలి గుర్రాలూ, ఏనుగులూ కూలిపోతూ వుండేవి. ఘోరంగా వుండేవి వాటి అరుపులు. ఎడ తెరపిలేని బాణాలశబ్దాలు దిక్కులు దిక్కు మార్మ్రోగించేవి.

ఒకచెయ్యి తెగిపోతే రెండోచేత్తో కత్తిపట్టుకు కలబడేవాళ్ళు వీరభటులు. ఒకకాలు తెగిపోతే రెండోకాలుతో శత్రువుమీదికి లంఘించేవాళ్ళు వాళ్ళు. శిరస్సులు తెగిపోతే, ముందు గురిపెట్టిన శత్రువుని పొడిచేసిమరీ కిందపడిపోయేవి వాళ్ళ మొండాలు. కింద పడినా బెదురకరవడమూ, కనుబొమలు ముడివెయ్యడమూ మానేవి కావు వాళ్ళ శిరస్సులు. తమ ఏనుగులూ, మావటీళ్ళూ కూలి పోతే పక్కవాళ్ళ వాహనాలెక్కి దెబ్బలాడేవాళ్ళు యోధులు దెబ్బలుతగులుతూవున్నా మడమతిప్పకండా తమస్నేహితులికీ, కోటి వాళ్ళకీ అడ్డుపడేవారు వాళ్ళు. ఎదిరిసేనలో చొరబడి, బంధువు లని మొగమాటం లేకండా దెబ్బతీసేవాళ్ళు.

వంటకని తరిగినట్టు ఏనుగులూ, గుర్రాలూ ముక్కలుముక్కలయి కుప్పలుపడేవి. రథాలమీది యోధులు కూలిపోగానే దిస్సపోయేవి రథాలు. రథాలకిందపడి భటులదేహాలు నలిగిపోయేవి. ఏనుగులు దంతాలతో పొడిచేసి, కాళ్ళతో కుమ్మేయడంతోనే పచ్చడి పచ్చడి అయిపోయేవి గుర్రాలు. అలా మధ్యాహ్నంవరకూ ఘోరంగా జరి గింది దొమ్మీయుద్ధం.

రెండోపూట మరింత రెచ్చిపోయాడు భీష్ముడు. నీకొడుకు చెయ్యివిసరడంతోనే దుర్ముఖుడూ, కృపాచార్యులూ, కృతవర్మా, శల్యుడూ వివింశతీ భీష్ముడికి అండగా వచ్చారు. బాణాలతో అగ్గి కురుస్తూ అయిదుగురూ అయిదు అగ్నిహోత్రాల్లాగ విజృంభించారు. రెండుపక్కలా వాళ్ళుకలిసివస్తూవుంటే, భయంకరమైన తాళధ్వజంతో చిచ్చుల పిడుగులాగ పాండవసేనమీద విరుచుకుపడ్డాడు భీష్ముడు.

కేకయసేనా, చేదిసైన్యమూ, పాంచాలం రాణువా — వొక టేమిటి, పాండవులదండు యావత్తూ భీష్ముడి రణక్రీడ చూసి పక్కకి తప్పుకుండేది. పరుగుచ్చుకునేది. అల్లకల్లోలమైపోయేది. శత్రుసైన్యం చిందరవందర చేసేశాడు భీష్ముడు. సేనసేనంతా పాయలుపాయలు చేసేశాడు. మెలికలు మెలికలుగా రథం పరిగెత్తించి పోగులుపోగులు చేసేశాడు. కేబీసుగా పరువులు పెట్టించి చీలికలు చీలికలు చేసేశాడు. కలిచి కలిచి వొదిలిపెట్టేశాడు.

పాండవసేనలో ఎక్కడచూసినా తెగి పడుతూన్న తలకాయలే కనిపించాయి. కింద కూలుతూన్న మొండాలే అవుపించాయి. ముక్కలయిన బాణాలే నిండిపోయాయి. తునకలయిన జెండాలే కుప్పపడ్డాయి. రక్తం వరదలయి పారింది. ప్రళయతాండవం చేస్తున్న భీష్ముణ్ణి అడ్డుకునే మొనగాడే లేకపోయాడు. పాండవసేన త్రాహి త్రాహి మనిపోయింది.

బంగారంరంగుగుర్రాలు పూసిన రథంమీద కర్ణికాపతాకంతో పురకలువేస్తూ వచ్చాడు అభిమన్యుడు. ఇలావచ్చాడు అలా అయిదు బాణాలువేసి శల్యుణ్ణి కొట్టాడు. ఒక చిల్లకోల కృతవర్మగుండెల మీద తగిలించాడు. ఒక వెడల్పాటి బాణం వేసి దుర్ముఖుడి సారథితల తెగగొట్టాడు. ఒక బాణంతో వివింశతి ధనుస్సు ఫెళ్ళు మనిపించి, మూడు బాణాలు అతడి వొంటిమీద నాటించాడు.

నాలుగు బాణాలుకొట్టి కృపాచార్యుల గుర్రాలు కూల్చేశాడు. ఒక చురుకైన బాణంవొదిలి భీష్ముణ్ణి తడబడిపోయినట్టు చేసేసి ఉద్రేకంతో సింహనాదం చేశాడు.

అతడి వీరత్వం చూసి 'భళీ' అన్నారు దేవతలు. "తండ్రిని మించిన కొడుకు. అమాటకివస్తే అతడికంటే ఇతడే వొకపాలు హెచ్చు" — భీష్ముడూ మొదలైనవాళ్ళు అతణ్ణి మెచ్చుకుంటూ అన్నారు.

అభిమన్యుణ్ణి మెచ్చుకుంటూనే ఆరు బాణాలు రువ్వాడు భీష్ముడు. అతడి జెండాకొయ్య తెగేశాడు. సారథిని కీచుకీచుమని పించాడు. తళతళలాడుతున్న బాణాలు అతడిమీద నాటించాడు. దుర్ముఖుడూ, కృతావర్మా మొదలైన ఐదుగురూ భీష్ముడితో కలిశారు. అభిమన్యుడిమీద అంపవాన కురిపించారు. కొండలాగ అన్నిటినీ అడ్డుకున్నాడు అభిమన్యుడు. ఒక్కడే ఆరుగురినీ పూవేసి వొదిలిపెట్టాడు. భీష్ముడి తాళధ్వజం ఎగరగొట్టేశాడు. సేనాధిపతి జెండా పడిపోడంతోనే కౌరవసేనకి నడుం విరిగినట్టనిపించింది. పాండవసేన సింహనాదాలు చేసింది.

పెద్ద సింహనాదంచేస్తూ అభిమన్యుడితో వచ్చి కలిశాడు భీముడు. కౌరవసైన్యం వేటాడడ మారంభించాడు. కళ్ళల్లో నిప్పులు కురుస్తూ అతడితట్టు తిరిగాడు భీష్ముడు. ఒకేవొక్క బాణంతో అతడి సింహ పతాకం కొట్టేశాడు. భయంకరంగా అరుస్తూ తాతగారిమీద తిరగబడ్డాడు భీముడు. పూనిపూని మూడు బాణా లతడిమీద తగిలించాడు. ఒక బాణం కృపాచార్యుడిమీద నాటించాడు. ఎనిమిది బాణాలతో కృతవర్మ శరీరం మంటలు పుట్టించాడు. ఆవూపుని శల్యుడిమీదపడి అతణ్ణి తబ్బిబ్బుచేసేశాడు.

శల్యుడంటే అభిమానించే వీరులందరూ పరిగెత్తుకువచ్చి భీముణ్ణి చుట్టుముట్టారు. రౌద్రం అవతార మెత్తినట్లు వాళ్ళమీద విరుచుకు పడ్డాడు భీముడు. వాళ్ల సారథుల్ని చంపేశాడు. గుర్రాలు కూల్చేశాడు. వాళ్లందరినీ రక్తంలో ఓలలాడించి వొదిలిపెట్టాడు. అతడి ఉద్ధృతం చూసినవాళ్లు ముక్కుమీద వేలుపెటుకున్నారంటే నమ్మి.

అంతలో సాత్యకీ ధృష్టద్యుమ్నుడూ, కేకయులూ, విరాట రాజూ, ఆయన కుమార్లూ అభిమన్యుణ్ణీ, భీముణ్ణీ దాటి ముందుకి వచ్చి భీష్ముణ్ణి ముట్టడించారు. ఇంతమందిమీదా తలో మూడేసి బాణాలు నాటించాడు భీష్ముడు. పెద్ద ఏనుగు సైన్యంతో వచ్చి వురి కాడు ఉత్తరుడు. అతడి పట్టపు ఏనుగు శల్యుడి రథంమీద పడింది. గుర్రాలు చంపేసి పచ్చడికింద తొక్కేసింది. తడబడిపోయాడు శల్యుడు. చివాలున శక్తితీశాడు. ఉత్తరుడి గుండెలమీద గురిచూచి కొట్టాడు. గుండెలు దూసెళ్ళి పోయింది శక్తి. చేతిలోని అంకుశమూ, తోమరమూ వొదిలేసి చస్తూ చస్తూ కిందపడిపోయాడు ఉత్తరుడు. అతడు కిందపడ్డాడో లేదో కత్తిదూసి మదపుటేనుగు తొండం నరికే శాడు శల్యుడు. ఏనుగు పీనుగయి పడింది. కృతవర్మ రథంమీదికి గెంతేశాడు శల్యుడు. సెబాసంటే సెబాసంటూ కేకలు వేసింది మద్రసేన.

తమ్ముడు పడిపోవడంతోనే ఎన్నో అన్ని రథాలు వేసుకుని దారుణంగావచ్చి మనవాళ్లమీద కలబడ్డాడు మత్స్యసేనాధిపతి శంఖుడు (శ్వేతుడు). ఒక ఏనుగువస్తే పది ఏనుగులు తిరగబడినట్టు భీష్ముడూ మొదలైనవాళ్లు వొక్కమొగిని అతడిమీద విరుచుకు పడ్డారు. మత్స్యదేశం రథసేన మచ్చుకిలేకుండా కొట్టేశాడు భీష్ముడు మేఘాలమీదపడ్డ పెనుగాలిలా కనపడ్డా డతడు.

కనీవినీ ఎరగనంత ప్రతాపంతో పోరాడాడు శంఖుడు. మన యోధుల ధనుస్సులు విరిచేశాడు. సారథుల్ని చంపేశాడు. జెండాలు ఎగరగొట్టాడు. యముడిలాగ వెళ్ళిశల్యుడిమీద పడ్డాడు. "శల్యుడు చచ్చాడంటేచచ్చా" డని కేకలువేశారు సైనికులు. అంతలో భీష్ము డితోకలిసి దుర్యోధనుడు శల్యుణ్ణి తప్పించాడు. భీష్ముడూ శంఖుడూ ఘోరంగా పోట్లాడారు. భీముడూ, సాత్యకీ, అభిమన్యుడూ, విరాట రాజూ, శిఖండీ, ధృష్టద్యుమ్నులు శంఖుడికి తోడ్పడ్డారు. శంఖుడు భీష్ముడి పతాకం ఎగరగొట్టేశాడు. అతడి ధనుస్సు పుటుక్కుమని పించాడు. అతడి వొళ్ళంతా రక్తాలు కారించాడు. మరొక ధనుస్సు పుచ్చుకున్నాడు భీష్ముడు. బాణాలమీద బాణాలు వేసి శంఖుణ్ణీ, అతడి రథాన్నీ ముంచెత్తాడు.

అదిచూసి అడ్డంగా రథంపరిగెత్తించుకు వచ్చాడు అర్జునుడు. కొరివీ కొరివీ తాకినట్టు అర్జునుడూ, భీష్ముడూ కలబడ్డారు. వాళ్ళిద్దరూ యుద్ధం ప్రారంభించడంతోనే, ఇటు మనవాళ్లూ, అటు పాండవులూ ఉద్రేకంతో కలబడ్డారు. ఘోరంగా జరిగిపోయింది యుద్ధం.

శల్యుడు వీరావేశంతో కృతవర్మరథంమీంచి దిగాడు. గదపట్టు కుని శంఖుడి రథంమీద పడ్డాడు అతడి గుర్రాలు చంపేశాడు. కత్తిపట్టుకు కిందికి దూకేశాడు శంఖుడు. అర్జునుడి రథం వెనక్కి పారి పోయాడు. అర్జునుడిమీంచి పాంచాలసైన్యం మీదికి వురికాడు భీష్ముడు. అడ్డూఆపూ లేకండా బాణాలమీద బాణాలుకుమ్మరించాడు. ఎండిన అడివిమీద కార్చిచ్చుమండినట్టు, ప్రాణికోటిమీద మారిమసిగి నట్టు పేట్రేగిపోయాడతడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కుప్పలుకుప్పలు కూలగొట్టాడు. వందలూ వేలూ కాల్బలం దుళ్ళ గొట్టాడు. ఎటుచూస్తే అటు భీష్ముడి తాళధ్వజమే ప్రత్యక్షమయింది.

గొర్రెలమందమీద పడ్డ పెద్దపులిలాగ కేకయసేనా, మత్స్యసైన్యమూ చిందరవందర చేసేశాడు భీష్ముడు.

దిక్కూ మొక్కూ లేనట్టు నాశనమయిపోయింది పాండవసేన. అతడి ప్రతాపాగ్ని ముందు వొక్కడూ నిభాయించి నిలవలేకపోయాడు. ఏంచెయ్యాలో తోచలేదు పాండవులికి. దూరంగా తప్పుకుని అంతమందీ తెల్లపోయి నుంచుండిపోయారు. సూర్యుడు అస్తమించుగాక, నాప్రతాపంతోనే ప్రపంచం వెలిగిస్తాను అన్నట్టు అవుపించాడతడు. చంద్రవంశం భీష్ముడి ప్రతాపంచూసి సిగ్గుపడిపోయినట్టు పడమట గుంగిపోయాడు సూర్యుడు. పాండవుల మొహాల్లాగే ముడుచుకుపోయాయి పద్మాలు. వాళ్ళ హృదయాల్లో నిండిన భయంలాగే అంతటా చీకట్లు కమ్మాయి.

ఉభయసేనలూ ఆనాటికి యుద్ధమాపేశాయి. ఎవళ్ళ శిబిరాలకి వాళ్ళు బయలుదేరారు. తాతగారి పరాక్రమం చెప్పుకుంటూ దుర్యోధనుడూ, అతనితమ్ములూ వొకటే ఆనందంతో ఉప్పొంగిపోయారు.



# భీష్మ పర్వం



## రెండో ఆశ్వాసం

తొలినాటి యుద్ధంలో తన కుమాళ్ళది పై చెయ్యి అయిన విషయం విన్నాడు ధృతరాష్ట్రుడు. తరవాత ఏంజరిగిందీ చెప్పమన్నాడు.

సంజయుడు మొదలుపెట్టాడు.

మహారాజా, ఆరాత్రి ధర్మరాజుమనస్సు మనస్సులో లేదు.

"లోకంలో అందరితోపాటే అనుకున్నాను భీష్మణ్ణి" తమ్ముళ్ళనీ, మరి కొంతమంది ముఖ్యమైనవాళ్ళనీ వెంటపెట్టుకుని వచ్చి శ్రీకృష్ణుడితో అన్నాడు ధర్మరాజు - "మోసపోయాను. కారడివి మీద కార్చిచ్చు పడినట్టు పడి మనసేన మంటకలిపేశాడతడు. చూడు, నీమరుదులు ఎలాదెబ్బలుతినేశారో! భీష్ముడి ప్రతాపాగ్ని చల్లార్పగల నల్లమబ్బని చెప్పాలంటే దగ్గ శూరత్వం మనదగ్గిర ఏముంది? ఎలా అతణ్ణి సాధించడం? మనుషులమాట అలావుండనీ, దిక్పాలకులయినా అతడితో నిభాయించలేరనే తోస్తుందినాకు. ఇంతకీఅర్జునుణ్ణి నమ్ముకున్నాను నేను. అతడే భీష్మణ్ణి జయిస్తాడని కలలుకన్నాను. ఏం లాభం? తనని కాదన్నట్టు ముభావంగా యుద్ధం చేశాడతడు. పాపం, భీముడు వొక్కడూ ఏం చేస్తాడు? అప్పటికీ తనశాయశక్తులా ఘోరంగా పోరాడాడు. అయినా ఇతణ్ణో అతణ్ణో తడవడం మాత్రమెందుకు? ఈయుద్ధమే అక్కరలేదు నాకు. మానేస్తాను. రాజులందరినీ భీష్ముడికి బలిపెట్టలేను. మళ్ళీ అడివికే పోతాను. కాయా కూరా

తింటూ కాలక్షేపం చేస్తాను. ఇదే నా నిశ్చయం. ఏమయినా నువ్వే మాకు పెద్దదిక్కు. మాకు మంచివచ్చినా, చెడ్డవచ్చినా, నీ చిద్విలాసమే. ఎప్పుడయినాసరే, ఎక్కడయినాసరే, నీమాటే మాకు వేదవాక్కు. నువ్వు ఎలా చెపితే అలా చేస్తాము. ఇప్పుడు ఏం చెయ్యాలో నువ్వే ఆదేశించు'' అన్నాడు.

"ఈ అనవసరమైన విచారం విడిచిపెట్టు'' ధర్మరాజు చెప్పిందంతా విని ధైర్యంచెపుతూ అన్నాడు శ్రీకృష్ణుడు - "నీశత్రువన్న వాణ్ణి వొక్కణ్ణీ మిగల్చకండా చేస్తానుకదూ! చూద్దువు కాని. నీకు ఎదురెవ్వరు? నీతమ్ముళ్లు వొక్కొక్కడే ఈప్రపంచం గెలుచుకు వస్తారు. బలపరాక్రమాలతో బాగా కొవ్వెక్కివున్నాడు భీష్ముడు. నిజమే. అయితేనేం, యుద్ధంలో శిఖండి అతడి ప్రాణంపుచ్చుకుంటాడు. తప్పదు. నీసేనలో తక్కిన వీరులుమాత్రం సామాన్యులా? మహాబలశాలి సాత్యకి. సత్యపరాక్రమదక్షుడు. అసలు అతడి అస్త్రప్రయోగం చూస్తేనే అద్భుతమవుతుంది. ఇదిగో ఈ విరాటరాజూ, ద్రుపదమహారాజూ బ్రహ్మాండమైన పరాక్రమవంతులు. నీకు సామ్రాజ్యంకట్టిపెట్టాలన్న దృఢనిశ్చయంతో ప్రాణాలువొదలటానికివచ్చారు. ఇంతెందుకూ, ఇదిగోమన సర్వసేనాని ధృష్టద్యుమ్నుడు. ఈవొక్కడే చాలు నీశత్రువులు యావన్మందినీ సంహరించడానికి. ఇంత బలం పెట్టుకునీ యుద్ధంమానేస్తాననటా వేమిటి?'' అన్నాడు.

"పాండవసేన రక్షిస్తావని నిన్నే సేనాధిపతిగా అభిషేకించమన్నాడు శ్రీకృష్ణుడు'' కృష్ణుడి మాటమీద ధృష్టద్యుమ్నుణ్ణి చూస్తూఅన్నాడు ధర్మరాజు - "అందుకోసమే ఉద్దండమైన ఆధిపత్యం వహించావు నువ్వు. ఈయావన్మంది రాజులూ, నేనూ, నాతమ్ములూ నీవెంటనడుస్తాము. ఈసైన్యవాహిని పురికొల్పి నడిపించు. శత్రువుల్ని జయించు'' అంటూ ఎన్నోవిధాల అతణ్ణి పొగిడాడు.

"మహారాజా, భీష్ముడే అన్న మాటేమిటి!" ఉత్సాహంతో అన్నాడు ధృష్టద్యుమ్నుడు – "కౌరవసేనలో మొనగాడెవడైనా సరే, నాఎదుటపడనీ, నువ్వే చూద్దువుగాని ఏంచేస్తానో! అసలు ద్రోణాచార్యుణ్ణి యుద్ధంలో చంపడానికే నన్ను పుట్టించాడు బ్రహ్మ. ఎన్ని సార్లు మన మనుకోలే దిది?" అన్నాడు.

ధృష్టద్యుమ్నుడు అన్న మాటలు విని పాండవులూ, తక్కిన రాజులూ, శ్రీకృష్ణుడూ సంతోషించారు. ధర్మరాజు ధృష్టద్యుమ్నుడితో ఇంకా ఇలా అన్నాడు.

"రేపు నువ్వు క్రౌంచవ్యూహం పన్ను. అదిచూసి శత్రువులు దద్దరిల్లిపోవాలి. దేవతలూ, దానవులూ యుద్ధంచేసినప్పుడు బృహస్పతి దేవేంద్రుడికి నేర్పిన వ్యూహమది. నీచాకచక్యమంతా అందులో కనపడాలి, అద్భుతంగా."

"తప్పకుండా రేపు క్రౌంచవ్యూహమే పన్నుతాను" అన్నాడు ధృష్టద్యుమ్నుడు. కొంత కుదుటపడ్డాడు ధర్మరాజు. ఎవరిగుడారానికి వాళ్ళని పంపేసి, శ్రీకృష్ణుని దగ్గిర సెలవు తీసుకుని లోపలి గుడారానికి వెళ్ళిపోయాడు ధర్మరాజు.

## రెండో రోజు

తెల్లవారింది. పాండవుల హృదయాలలాగే పద్మాలూ వికసించాయి. వాళ్ళ ప్రతాపంలాగే సూర్యుడు ఉదయించి ప్రకాశించాడు. కాలకృత్యాలు తీర్చుకుని ధర్మరాజు బయటికి వచ్చాడు.

పాండవసేన యావత్తూ క్రౌంచవ్యూహంగా తయారయింది. వ్యూహం ముక్కుదగ్గిర గాండీవంతోనూ, కపిధ్వజంతోనూ అర్జునుడు నుంచున్నాడు. కుంతిభోజుడూ, శైల్యుడూ కళ్ళదగ్గిర నిలబడ్డారు. ద్రుపదమహారాజు శిఖదగ్గిర నుంచున్నాడు. దశార్ణ, శూర

సేన, కిరాత దేశాల రాజులు కంఠాకారంగా నిలబడ్డారు. భీముడు కుడి రెక్కగానూ, ధృష్టద్యుమ్నుడు ఎడమ రెక్కగానూ నుంచున్నారు. అభిమన్యుడూ, సాత్యకీ, ద్రౌపది కుమారులూ, పౌండ్ర చోళ పాండ్య దేశాల రాజులూ భీముడిపక్క, నకుల సహదేవులూ, ఘటోత్కచుడూ, శంబర వత్స రాజులూ ధృష్టద్యుమ్నుడి పక్క సర్దుకున్నారు. కేకయ, కాశీ రాజులతో కలిసి విరాటరాజు తోడల దగ్గిర నిలబడ్డారు. హూణరాజూ మొదలైన ముఖ్యులు చుట్టూ కాయగా, ధర్మరాజు వెన్నుగా నుంచున్నాడు. ఇలా దేదీప్యమానంగా వుంది పాండవుల క్రౌంచవ్యూహం.*

లేత ఎండ కెంపులా ప్రకాశిస్తూ వుంది. తెల్లగొడుగులు పద్మాల్లా ఎంచక్క అవుపిస్తున్నాయి. ఉత్సాహంతో వురకలు వేస్తూ కౌరవసేన రణస్థలానికి వచ్చింది.

భీష్ముణ్ణీ, ద్రోణాచార్యుల్నీ, అశ్వత్థామనీ, కృపాచార్యుల్నీ, శల్యుణ్ణీ, కృతవర్మనీ, హెచ్చరించాడు దుర్యోధనుడు. "ఇదిగో, మీలో ఏ వొక్కడయినా చాలు, పాండవుల యావత్తు సైన్యమూ తునాతునకలు చేసెయ్యగలరు. అలాంటిది, ఇంతమందీ వొక్క సైన్యంలో వున్నారు. శివుడు వచ్చినా గెలవలేడు మిమ్మల్ని. అదిగో, క్రౌంచవ్యూహం పన్నుకు వచ్చారు వాళ్ళు. దారుణంగా వుందది. దానికి తగిన వ్యూహాలు పన్నాలి మనం, దిట్టంగా" అన్నాడు.

దుశ్శాసనుడూ, వికర్ణుడూ, విందానువిందులూ, శూరసేన యవన త్రిగర్త కురు దేశాలవాళ్ళూ కుడిపక్క, ద్రోణాచార్యులూ, కుంతల దశార్ణ విదర్భరాజులూ, గాంధార, సింధు, సౌవీర దేశాల వాళ్ళూ ఎడమపక్క, మహాసేనతో భీష్ముడు మధ్యభాగంలోనూ —

* వ్యూహాల వివరాలకోసం శుక్రనీతిసారమూ, కామందకనీతిసారమూ చూడండి.

ఇలా మూడువ్యూహాలుగా తయారయింది కౌరవసేన. ఈవ్యూహాలకి వెనక భాగంలో కృతవర్మా, శల్యుడూ, దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్ళూ, అశ్వంత, కాశ్మీరసేనలూ నిలబడ్డాయి. ఇలా మన సైన్యమూ, పాండవసైన్యమూ రెండూ యుద్ధానికి సిద్ధపడ్డాయి. శంఖాలు పూరిమాయి. భేరీలూ, మృదంగాలూ మొదలైన యుద్ధ వాద్యాలూ మోగాయి. ఒక సేనమీదికి వొకసేన ఎదురునడిచింది.

ధృతరాష్ట్రుడు : ఆఁ, అలా కలబడి ఎవరు ఎలాయుద్ధంచేశారు?

సంజయుడు : చెపుతున్నా. అలా రెండుసైన్యాలూ ఎదురు నడిచి, వొకదానికి వొకటి దగ్గిరపడేసరికి చెయ్యివిసిరి ఇసారాచేశాడు దుర్యోధనుడు. దాంతో మనసేనవెళ్ళి పాండవసేనతో డీకొంది. దొమ్మియుద్ధ మారంభ మయింది. ధూమకేతువులాగ విజృంభించాడు మన భీష్మసేనాని. సరిగ్గా క్రౌంచపక్షిలావున్న పాండవ సైన్యం రెండురెక్కలూ చీలికలు చేసేశా డతడు. కంఠంఈకలువూడ గొట్టేశాడు. శిరస్సు చీల్చేశాడు. వందలూ, వేలూ బాణాలు రువ్వి చిందరవందరచేసేశాడు.

"మనసైన్యం చించి చెండాడుతున్నాడు భీష్ముడు. నన్ను గడ్డి పోచలా చూస్తున్నాడు. ఈయన దురుసు కాస్త కట్టించాలి. నువ్వు మెచ్చుకున్నట్టు చేస్తాను చూడు. అతడిమీదికి రథం పోనీ" కళ్ళల్లో కెంపులు కురుస్తూ శ్రీకృష్ణుడితో అన్నాడు అర్జునుడు.

"నువ్వు చెప్పినట్టే రథం పోనిస్తాను" పగ్గాలు సడలిస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు - అయితే వొక్కమాట విను. గజిబిజి పడిపోకు. తొందరపడిపోకు. అఖండమైన శౌర్యమూ, అస్త్రపటుత్వమూ, భుజబలమూ చూపించి భీష్ముణ్ణి ఎదిరించు. ఏమంటావా, మహా పరాక్రమశాలి అతగాడు. అతడు నిచ్చెరపోయినట్టు నువ్వు యుద్ధం చెయ్యాలి. అదిగో, వెనకా ముందూ మాదకంఠా వస్తున్నార

శల్యుడూ, ద్రోణాచార్యులూ, దుర్యోధనుడూ. నిన్ను చూసి వాళ్ళ కళ్ళు జిగేలుమనాలి. వాళ్ళగుండెలు దిగులుపుట్టాలి. అదీ నువ్వు చెయ్యవలసిన పని” అన్నాడు.

అర్జునుడిరథం భీష్ముడితట్టు మళ్లింది. మధ్యలో శూరసేనసైన్యం అడ్డుతగిలింది. పెద్ద పెనుగాలి లేచి వొక అడవి నేలాపడగొడుతుంది, అదిగో అలాగ శూరసేనసైన్యం పడగొట్టేస్తూ భీష్ముడిదగ్గిరికి వెళ్లాడు అర్జునుడు. అతణ్ణి చూడడంతోనే సింహంలాగ మూరెడు లేచాడు భీష్ముడు. గబాగబా డెబ్బయిఏడు బాణాలు అతడిమీద గుప్పించాడు. అదేసమయంలో ద్రోణుడు పాతిక బాణాలూ, కృపాచార్యులు అయిదు వందలూ, వికర్ణుడు మూడూ, శల్యుడు తొమ్మిదీ, దుర్యోధనుడు అరవైనాలుగూ కొట్టారు. అవన్నీ మీద వర్షంలా పడుతూవుంటే, కొండలాగ కదలకుండా నుంచున్నాడు అర్జునుడు. ఒక్కడే అంత మందినీ వూపేశాడు. ఇరవై బాణాలు భీష్ముడిమీదా. అరవై బాణాలు ద్రోణుడిమీదా, ఎనిమిది కృపాచార్యులమీదా, మూడు వికర్ణుడిమీదా, మూడుశల్యుడిమీదా, అయిదు రారాజుమీదా నాటించాడు.

అంతలో సాత్యకీ, విరాటరాజూ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపది కుమార్లూ, అభిమన్యుడూ వచ్చి అర్జునుడితో కలిశారు. ద్రోణాచార్యులూ మొదలైనవాళ్ళమీద కలబడ్డారు. అర్జునుడి బాణాలు కాసుకుంటూనే అతడిమీద యాభై బాణాలు రువ్వాడు భీష్ముడు. దానికి బలే అంటే బలే అని కేకలు వేశారు కౌరవులు. దాంతో భీష్ముణ్ణి వొదిలేసి కౌరవసేనమీదే తిరగబడ్డాడు అర్జునుడు. రథికుల్ని చంపేశాడు. సారథుల్ని నరికేశాడు. రథికులూ, సారథులూ లేకుండా ఎన్నో అన్ని రథాలు మొఖ్ఖలా అయిపోయాయి. కౌరవవీరులందరూ హాహాకారాలు చేశారు. సేనసేన యావత్తూ చిందరవందర అయిపోయింది.

"అయ్యో, మనకి కావలసిన రాజులందర్నీ చంపేస్తున్నాడు అర్జునుడు" బెంబేలుపడిపోతూ భీష్ముణ్ణి నానామాటలూ అనడం మొదలెట్టాడు దుర్యోధనుడు - "ఇదిగో నీకళ్ళఎదుటే ఇది జరుగుతూ వుంది. కర్ణుణ్ణి యుద్ధానికి రాకండా కట్టేశావు. తీరా సమయం వచ్చేసరికి నిమ్మకి నీరెత్తినట్టు వూరుకుంటున్నావు. తెలుసంటావా ? ఏం న్యాయ మిది?" అన్నాడు.

"ఎంతమాటన్నావో నన్ను!" నొచ్చుకుంటూ అన్నాడు భీష్ముడు. తిరిగిచూడకండా అర్జునుడిమీదికి రథం వురికించాడు. అతడికి దన్నయి వికర్ణుడూ, దుర్యోధనుడూ కుడిపక్కా, అశ్వత్థామ ఎడమపక్కా బయలుదేరారు. ఇలా సకలబలంతో కూడా వెళ్ళి అర్జునుడిమీద కలబడ్డాడు భీష్ముడు. అన్నదమ్ములు వచ్చి అర్జునుడికి అండగా నుంచున్నారు. కౌరవసేనలోనూ పాండవసైన్యంలోనూ ఒక్కసారి శంఖాలు గర్జించాయి. రణదుందుభులు మోగాయి. దొమ్మీయుద్ధం ఆరంభమయింది.

భీష్ముడూ, అర్జునుడూ నువ్వెంత అంటే నువ్వెంత అన్నట్టు యుద్ధంచేశారు. ఘోరమైన బాణాలు కొట్టుకున్నారు. ఒకరి బాణాలు ఒకరు ఖండించారు. ఒకరి కవచాలు ఒకరు చీలికలు చేసుకున్నారు. అర్జునుడి గుర్రాలు భీష్ముడు కొట్టాడు. భీష్ముడి గుర్రాలు అర్జునుడు కొట్టాడు. భీష్ముడి తాళధ్వజం అర్జునుడు కొట్టాడు. అర్జునుడి వానర పతాకం భీష్ముడు కొట్టాడు. శ్రీకృష్ణుడి గుండెలమీద బాణాలు నాటించాడు భీష్ముడు. రక్తం ధారలుకట్టింది. చివురించిన పారిజాతవృక్షంలా కనిపించాడు శ్రీకృష్ణుడు. కళ్ళమొయ్యా కోపం వచ్చింది అర్జునుడికి. దిట్టమైన బాణాలు సంధించాడు. భీష్ముడు సారధిని రక్తాలుకారించాడు. దాంతో మరింత రెచ్చిపోయాడు భీష్ముడు. బాణప్రవాహంలో అర్జునుడి రథం ముంచెత్తాడు.

భీష్ముడి బాణాలు ప్రవాహమయితే, అర్జునుడు మహాగ్ని. అతడి బాణాలు అగ్నినాలుకలు. ఆప్రవాహం ఆపోశనంపట్టేశాయవి. అంతటితో ఆగిపోలేదా మహాగ్ని. కారడివిలా వున్న కౌరవసేనమీది కిన్నీ నాలుకలు చాచిందది. కార్చిచ్చులా మీదపడుతూవున్న అర్జున బాణాగ్నికి కారడవిలాగే మాడిపోయింది కౌరవసేన. అయితే శ్రావణ మేఘంలా బాణాలు వర్షించి కౌరవసేన కాపాడాడు భీష్మసేనాని.

హెచ్చుతగ్గులు లేకుండా తాతామనవలు అద్భుతంగా పోరాడారు. వాళ్ళయుద్ధం చూసి ఆకాశంమీద చారణులూ, సిద్ధులూ, గంధర్వులూ ముక్కుమీద వేలుపెట్టుకున్నారు. "భీష్ముడి ప్రతాపం తట్టుకోవాలంటే అర్జునుడే తట్టుకోవాలి. అర్జునుడితో ఎదిరించాలంటే భీష్ముడే ఎదిరించాలి. అంతే. యముడైనా, దేవేంద్రుడైనా కూడా వీళ్ళముందు నిలవడం కల్ల. నిజంగా ఇలాంటి యుద్ధం ఎక్కడా చూడ లేదు మనం" అంటూ మెచ్చుకున్నారు వాళ్ళు.

మిట్టమధ్యాహ్నమయింది. నడినెత్తికి సూర్యుడు వచ్చాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యులమీదికి వెళ్ళాడు. పెదవికొరిచి తిరగబడ్డాడు ద్రోణుడు. ధృష్టద్యుమ్నుడి సారథిమీదా, గుర్రాల మీదా బాణాలు నాటించాడు. మంచి వెడల్పాటి బాణం వేసి అతడి జెండాకొయ్య తెగవేశాడు. పాండవసేనాని జెండా ఎగిరిపోవడంతోనే కోలాహలంచేసింది కౌరవసేన.

నిలువునా మండిపడ్డాడు ధృష్టద్యుమ్నుడు. వందలూ వేలూ బాణాలు ద్రోణుడిమీద కుమ్మరించాడు. అన్నిటినీ వొక మహాస్త్రంతో మాడ్చేశాడు ద్రోణాచార్యులు. మరింత విజృంభించాడు ధృష్టద్యుమ్నుడు. ఘోరమైన బాణాలు ద్రోణుడిమీద కుప్పించాడు. వాటన్నిటినీ నరికి పారేశాడు ద్రోణుడు. అంతటితోనూ ఆగలేదతడు. దిట్టమైన వొక బాణం కొట్టాడు. ధృష్టద్యుమ్నుడి విల్లు పెళుక్కు

మనిపించాడు. శక్తి తీసి విసిరాడు ధృష్టద్యుమ్నుడు. మధ్యనే దాన్ని మూడుముక్కలు చేసేశాడు ద్రోణుడు. ఆవేశంతో వూగిపోయాడు ధృష్టద్యుమ్నుడు. అమాంతంగా వరసపెట్టి ఎన్నో అన్ని శక్తులు విసిరాడు. అన్నీ అవలీలగా తునాతునకలు చేసి కొట్టేశాడు ద్రోణుడు. దారుణమైన గదతీసి గిరగిరాతిప్పి విసిరాడు ధృష్టద్యుమ్నుడు. పిడుగులా వచ్చేస్తోంది గద. చలించకండా దాన్ని గుండపిండి చేసి కొట్టేశాడు ద్రోణుడు. మరిన్ని బాణాలుకొట్టి, ధృష్టద్యుమ్నుడి కవచం చీలికలు చేసేశాడతడు. శరీరమంతటా నెత్తురు వరదలు కట్టించాడు.

మరో ధనుస్సు పుచ్చుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. నల్లత్రాచుల్లాంటి బాణాలు ద్రోణాచార్యుడిమీద వొదిలిపెట్టాడు. అతడి వొళ్ళంతా రక్తాలు పారించాడు. కొత్తపువ్వులతో నిండిన మోదుగు చెట్టుల్లా అవుపించాడు ద్రోణుడు. వాడయిన వొక బాణం వేశాడతడు. ధృష్టద్యుమ్నుడి విల్లుమళ్ళీ పుటుక్కుమనిపించాడు. అతడు మరోవిల్లు తీసేలోపున అతడి సారథిని చంపేశాడు. నాలుగు గుర్రాలూ కూలగొట్టేశాడు. గదపుచ్చుకుని రథంమీంచి దూకబోయాడు ధృష్టద్యుమ్నుడు. పిడుగులాటి బాణం వేశాడు ద్రోణుడు. ధృష్టద్యుమ్నుడి చేతిగద ముక్కముక్కలయిపోయింది. కత్తీ, డాలూ పుచ్చుకుని, మెరుపులాగ ద్రోణుడిమీదికి వురికాడు ధృష్టద్యుమ్నుడు. ఏమవుతుందో అని అరిచేతిలో ప్రాణాలుపట్టుకుని చూసింది కౌరవసేన.

ద్రోణుడు మహాపర్వతం. పర్వతంమీంచి వరదలై పారుతున్న మహానది అతడి బాణాలు. ఎదురీదడం తలమునకలయింది ధృష్టద్యుమ్నుడికి. నురుగులుకక్కుతూ తెల్లటి బాణప్రవాహం ముంచుకు వస్తూవుంటే డాలుతో అడ్డుకోవడంతప్ప మరొకమార్గం లేకపోయిందతడికి. అంతలో పెద్ద పర్వతంలా వచ్చి అడ్డుపడ్డాడు భీముడు.

పిడుగుల్లాంటి బాణాలు ద్రోణుడిమీద విరజల్లా డతను. ఇంకో రథం మీద ధృష్టద్యుమ్నుణ్ణి ఎక్కించుకున్నాడు.

అది చూసి కళింగరాజు శ్రుతాయువుని భీముడిమీదికి పురికొలిపాడు దుర్యోధనుడు. పెద్ద సేనతో భీముడిమీదికి వచ్చాడు శ్రుతాయువు. ఊపిరితీసుకున్నట్టయింది ద్రోణుడికి. విరాటరాజుమీదికీ, ద్రుపదుడిమీదికీ వెళ్ళా డతను. ధృష్టద్యుమ్నుడూ, ధర్మరాజూ భీముడికి వెనకదన్నుగా నిలబడ్డారు. చేది, కరూశ దేశాలసేనలు భీముడికిదన్నుగా అతడి ముందు పెట్టనికోటలా నుంచున్నాయి. శ్రుతాయువుకి అండగా తన నిషాదసేనతో వచ్చి చేరాడు కేతుమంతుడు. "అదీ అలావుండాలి" అంటూ కేతుమంతుణ్ణి మెచ్చుకున్నాడు దుర్యోధనుడు.

చేది, కరూశసేనలూ, కళింగ, నిషాదసేనలూ, ఘోరంగా కలబడ్డాయి. చేతికివచ్చిన ఆయుధంతో దొమ్మీయుద్ధం చేశాయి. చిందరవందర అయిపోయాయి.

కేతుమంతుడు భీముడిమీద కలబడ్డాడు. మంటలోపడ్డ మిడతలాగ భీముడి బాణాగ్నిలో మాడిపోయాడు. శ్రుతాయువు కొడుకు శక్రదేవుడు భీముడిమీదికి దూసుకు వచ్చాడు. మంచిమంచి బాణాలు భీముడిమీద దిమ్మరించాడు. అతడి గుర్రాలు కూల్చేశాడు. యముడిలాగ గర్జించాడు భీముడు. పెద్దగదతీసి విసిరికొట్టాడు. దెబ్బతో రథమూ, రథసారథీ, గుర్రాలూ, జెండా — అన్నిటితోనూ పచ్చడయి వూరుకున్నాడు శక్రదేవుడు. అలా ఎంత అద్భుతమో అంతభయంకరమయిన పరాక్రమం చూపించి, బంగారం చెక్కిన డాలూ, ప్రళయ యముడి నాలికలాంటి కత్తీ పుచ్చుకుని రథంమీంచి కిందికి దూకాడు భీముడు.

కొడుకు చావు చూసి శిలతిరిగిపోయింది శ్రుతాయువుకి. ఆమాంతంగా రథం భీముడిమీదికి పురికించాడు. యమదండంలాంటి

బాణమొకటి భీముడిమీదకి వొదిలాడు. దాన్ని సగంలోనే నరికేశాడు భీముడు. ఆవూపుని పద్నాలుగు తోమరాలు కొట్టాడు శ్రుతాయువు. అన్నీ తన కత్తితోనే చిత్రంగా ముక్కలు ముక్కలు చేసేశాడు భీముడు.

శ్రుతాయువు తమ్ముడు భానుమంతుడు పెద్ద ఏనుగు సేనతో వెళ్ళి పడ్డాడు. అదే బాణాలు కురిపిస్తూ భీముడిమీద తన మదపుటేనుగు వురికించాడు. దిక్కులు ప్రతిధ్వనించినట్టు పెద్ద సింహనాదం చేశాడు భీముడు. అమాంతంగా ఏనుగు దంతాలమీద ఎక్కేసి, భానుమంతుడి తల నరికేశాడు. తలకాయ ఎగిరిపోయింది. చిమ్మనగ్రోవిలాగ రక్తం చిమ్ముతూ కిందపడిపోయింది మొండెం. ఉత్తరక్షణంలో ఏనుగుతలా నరికేసి కిందకి గెంటేశాడు భీముడు. రక్తంతో ఎర్రగా తళతళలాడింది అతడి ఖడ్గం.

తమ్ముడి మరణం చూసి ఉగ్రుడే అయిపోయాడు శ్రుతాయువు, తన చతురంగసేన యావత్తూ భీముడిమీద వురికించాడు. ఆసేనంతా చూసి బారెడెత్తు సాగాడు భీముడు. రథం లేకండా వున్నాననయినా వూహించుకోలేదతడు. సముద్రంలా వున్న కళింగసేనమీదకి అమాంతంగా వురికేశాడు. ఏనుగుల కుంభస్థలాలు నరికేశాడు. వాటి మెడదంటుకోసి కత్తి బరువెక్కేసరికి జెండాకొయ్యలు తెగేసేవాడు. తేలికయిపోయేది కత్తి. రథికుల్నీ, సారథుల్నీ, కలిపి రథాలు తెగేసేవాడు. కత్తి మొద్దువారిపోయేసరికి మంచి బలమైన మూలుగులతో వున్న గుర్రాలు తెగనరికేవాడు. పదునెక్కేది కత్తి. గుర్రాలు పట్టుకుని ఈడ్చి విసిరేసేవాడు. పక్కకి వొరిగేసరికి వాటిని సురకత్తితో పొడిచి పారేసేవాడు. భటులమీదపడి వాళ్ళని నల్లులు నలిపినట్టు నలిపేసేవాడు. ఇలా కళింగసేన యావత్తూ కలగుండు పెట్టేసి, చిత్రవధచేసేసి వొదిలిపెట్టాడు.

మధ్యాహ్నమయింది.

శ్రుతాయువుమీద కలబడ్డాడు భీముడు. ఇంతలో సర్వాయుధాలతోనూ సన్నాహపరిచి, మెరికల్లాంటి గుర్రాలుపూసి రథం పట్టుకువచ్చాడు భీముడి సారథి విశోకుడు. భీముడు రథమెక్కి ధనుస్సు సారించేలోపున బంగారం మొదళ్లు మెరుస్తూవున్న మంచిమంచి బాణాలు అతడిమీద నాటించాడు శ్రుతాయువు. ఏనుగుని బరికోలాతో పొడిస్తే ఎలా తిరగబడుతుంది, అదిగో అలాగ తిరగబడ్డాడు భీముడు. చెవిదాకా ధనుస్సులాగి శ్రుతాయువుమీద అయిదు బాణాలు వొదిలిపెట్టాడు. అయిదుబాణాలూ తగిలేసరికి చదికిలబడిపోయి, మూర్ఛపోయాడు శ్రుతాయువు. అతడి చక్రరక్షకుల్ని సత్యుణ్ణీ, సత్యదేవుణ్ణీ చంపేసి భయంకరమైన సింహనాదం చేశాడు భీముడు.

మూర్ఛపోయిన శ్రుతాయువుని యుద్ధంలోంచి తప్పించుకుని పట్టుకుపోయాడు అతడి సారథి. సరంగులేని వోడలా అయిపోయింది కళింగసేన. పటాపంచలయి పరుగుచ్చుకుందది. వెంటదరుముతూ పౌండ్రకం పూరించాడు భీముడు.

అదివిని భీముడిమీదికి పరిగెత్తుకువచ్చాడు భీష్ముడు. ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, శిఖండీ అతణ్ణెదిరించి ఎడాపెడా బాణాలు గుప్పించారు. మరికొన్ని రథాలుకూడావచ్చి వాళ్ళకి తోడ్పడ్డాయి. ఒక్క శిఖండినిమాత్రం వొదిలేసి తక్కినవాళ్ళని రక్తాలు కారినట్టు కొట్టాడు భీష్ముడు. భీముణ్ణి తడబడిపోయినట్టు చేసేశాడు. అతడి గుర్రాలు కూలగొట్టేశాడు. రథంపడగొట్టేశాడు. కోపం పట్టలేకపోయాడు భీముడు. పెద్దకత్తితీసి తాతగారిమీద విసిరాడు. సగంలోనే దాన్ని మూడు ముక్కలు చేసేశాడు భీష్ముడు. పళ్ళు పటపట కొరికాడు భీముడు. గదపట్టుకుని రథంమీదాంచి దూకేశాడు.

భీముణ్ణి వెనకపెట్టి సాత్యకి ముందుకి వురికాడు. మంత్రం వేసి నట్టు వొకేవొక్క బాణంతో భీష్ముడి సారథిని చంపేశాడు. సారథి పడిపోడంతోనే గుర్రాలు బెదిరిపోయాయి. అసలే గాలిలా పరిగెడతా యవి. భూమి అదిరిపోయినట్టు రథంలాక్కుని అదే పారిపోడం పారిపోయాయి. ఇంకేముంది! భీముడంటే అదిలిపోయింది కౌరవ సైన్యం. పిక్కబలంచూపి శకాపికలయిపోయింది. భీముడిముందు వొట్టి బయలుమాత్రం మిగిలిపోయింది.

ధృష్టద్యుమ్నుడు వచ్చి గౌరవంగా భీముణ్ణి తన రథంమీద ఎక్కించుకున్నాడు. సాత్యకివచ్చి "క్షేమయిన పనిచేశావు" అంటూ భీముణ్ణి మెచ్చుకున్నాడు — "ఒక్కడివే కళింగరాజుమీద కల బడ్డావు. అతడి కొడుకునీ, తమ్ముణ్ణీ — అంత సేననీ హతమార్చేశావు. మొనగాడివంటే నువ్వే సుమా" అన్నాడు.

ఇంతలోకే శల్యుడూ కృపాచార్యులూ అశ్వత్థామా వెళ్ళి వాళ్ళమీద దాడిచేశారు. "నా వెంటవెంటనే వుండి చూస్తూవుండు నన్ను" అంటూ సగౌరవంగా భీముణ్ణి రథంమీంచి దించి, అశ్వ త్థామదిక్కురథం పోనిచ్చాడు ధృష్టద్యుమ్నుడు. వెళ్ళీవెళ్ళడంతోనే పదిబాణాలు తగిలించి అశ్వత్థామగుర్రాలు చంపేశాడతడు. చప్పున శల్యుడి రథమెక్కేసి, ధృష్టద్యుమ్నుణ్ణి బాణాలతో కొట్టాడు అశ్వ త్థామ. శల్యుడూ, కృపుడూ కూడా ధృష్టద్యుమ్నుణ్ణి బాణాలతో ముంచెత్తారు.

నీమనవడు లక్ష్మణకుమారుడు అభిమన్యుడిమీద కలబడ్డాడు. తన హస్తలాఘవమంతా కనపరిచాడతడు. ఎంచిఎంచి మంచిమంచి బాణాలు తగిలించి అభిమన్యుడి దేహం మంటలు పుట్టినట్టు చేశాడు. పిడి లొంగినంతవరకూ ధనుస్సులాగి, వెడల్పాటిబాణం వేసి అవడి

ధనుస్సు పుటుక్కుమనిపించాడు. కౌరవసైనికులు వొక్కమారు గొల్లుమని జయజయధ్వానాలు చేశారు.

మరుక్షణంలో మరొకవిల్లు పుచ్చుకున్నాడు అభిమన్యుడు. లక్ష్మణుణ్ణి దారుణంగా కొట్టేశాడు. కొడుకు దెబ్బతినెయ్యడం చూశాడు దుర్యోధనుడు. పళ్లుకొరుకుతూ అభిమన్యుడిమీదికి వురిమాడు. రాజుతో కలిసి భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన ముఖ్యరథికులు వెళ్లి అభిమన్యుణ్ణి ఆక్రమించారు. నవ్వుతూ అందరితోనూ అన్నిరూపాలతో యుద్ధంచేశాడు అభిమన్యుడు. అందరినీ చురుక్కు చురుక్కు మనిపించి మరీ వొదిలిపెట్టాడతడు.

ఎక్కడనించి చూశాడో చూశాడు అర్జునుడు. దేవదత్తం పూరిస్తూ ఆఘమేఘాలమీద రథం వురకలుపెట్టించి వచ్చిపడ్డాడు. రావడమూ కౌరవసేనమీదా, దుర్యోధనుడూ, భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన వాళ్లమీదా బాణవర్షం కురిపించడమూ వొక్కసారే జరిగించాడతడు. రణస్థలం యావత్తూ ధణధణలాడించేశాడు. కౌరవసేన ప్రాణాలు నిలువునా ఎగిరిపోయినట్టయిపోయింది. అర్జునుణ్ణి అదే పొగడడం పొగిడారు ఆకాశంమీద దేవతలు. అదే సమయమని తన వాళ్లని చెయ్యివిసిరి హెచ్చరించాడు ధర్మరాజు. ఒక్కపెట్టుని తిరగబడింది పాండవసేన. యుద్ధభూమి యావత్తూ దుమ్ము రేగిపోయింది. సూర్యబింబం కనపడలేదంటే నమ్మి. చీకట్లు కమ్మేస్తే ఎలావుంటుందో, అదిగో అలా అయిపోయింది. అంతలోనే ఏనుగుల కళేబరాలనించీ, గుర్రాల దేహాలనించీ, భటుల శరీరాలనించీ చిమ్మిన రక్తధారలుపడి దుమ్మంతా అడగారిపోయింది. అర్జునుడి ఏకంకాల బాణాలు తగిలి కౌరవసైన్యంలో తునియలయిన ధనుస్సులూ, ముక్కలయిన కత్తులూ, గండ్రగొడ్డళ్లూ, పరిఘలూ,

పగిలిన ఏనుగు కుంభస్థలాలూ, గుర్రాల తలకాయలూ, భటుల కపాలాలూ, గుండపిండయిన రథచక్రాలూ, జెండాలూ, ఛత్రచామరాలూ, ఎక్కడపడితే అక్కడ కుప్పలుపడి నానా బీభత్సంగా అవుపించింది. తమమీంది యోధులు తెగి పడిపోవడంతోనే గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ దిక్కూ తెన్నూ లేకండా ఎటుపడితే అటు పరిగెత్తాయి. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కూలిపోవడంతోనే అడలెత్తిపోయి, పిచ్చివాళ్ళలాఅడ్డదిడ్డంగాపరుగులుతీశారుయోధులు మహారాజా, ఇలా మనసేననేనంతా క్షోభపడిపోయి, తడబడిపోయి, భయపడిపోయి, వెనక్కి తగ్గేసింది, పిక్కబలం చూపెట్టింది.

శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు.

అదంతా చూసి ద్రోణాచార్యులతో భీష్ముడన్నాడు: "శ్రీకృష్ణుడు సారథ్యం చేస్తున్నాడు. అర్జునుడు కౌరవసేన నురుమాడుతున్నాడు. శ్రీకృష్ణుడు సారథిగావుంటే ఎంత చెయ్యాలో అంతా చేస్తున్నాడతడు. మహాకోపంతో ముల్లోకాలూ మాడ్చెయ్యాలని అగ్నినేత్రం తెరిచిన మహాశివుడిలా వున్నాడిప్పుడు. పారిపోతూవున్న మన సేనలు మళ్ళించడం సాధ్యంకాని పని. ఉన్న యోధులయినా బాగా అలిసిపోయి వున్నారు. వెనకంజవేస్తున్నారు. పొద్దుకూడా గుంకిపోతూవుంది. ఇంతతో ఇవాళటియుద్ధం చాలింతాం."

"అవును, చాలింతాం" అన్నాడు ద్రోణుడు. తన వాళ్ళందరినీ వెనక్కి పిలిచేశాడు భీష్ముడు. పాంచాల, మత్స్యసేనలతో ఉత్సాహంగా కేకలువేసుకుంటూ, కోలాహలంచేసుకుంటూ వెనక్కి వచ్చేశారు పాండవులు ఉభయపక్షాలూ తమ తమ శిబిరాలికి వెళ్ళిపోయారు. రెండోరోజుయుద్ధం అలా ముగిసింది.

# మూడో రోజు

మర్నాడు తెల తెలవారేసరికి సైన్యం సిద్ధంచేసి, గరుడ వ్యూహం పన్నాడు భీష్ముడు. పెద్ద తాటిచెట్టు జెండాతో వ్యూహం ముక్కుదగ్గిర తానే నిలబడ్డాడు. ద్రోణుడూ, కృతవర్మా కళ్లదగ్గిర నిలబడ్డారు. కృపుడూ, అశ్వత్థామా శిరస్సుగా తయారయారు. త్రిగర్తులూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, భగదత్తుడూ, సౌవీరులూ, జయద్రథుడూ, కంఠంగా ఏర్పడ్డారు. దుర్యోధనుడూ అతడితమ్ముల్లూ వెన్నుదగ్గిర నిలబడ్డారు. విందానువిందులూ, సుదక్షిణుడూ, శూరసేనుడూ తోక దగ్గిర నిలబడ్డారు. మగధ, కళింగసైన్యాలు కుడిరెక్కదగ్గిరా, కర్ణాట, కోసల సైన్యాలు ఎడమరెక్కదగ్గిరా నుంచున్నాయి. తక్కిన వాళ్ళు తగిన కీలకస్థానాల్లో నుంచున్నారు.

అటు పాండవసేన కూడా ఉత్సాహంతో పరుగులు వేస్తూ వచ్చింది. "అదిగో, వాళ్లు గరుడవ్యూహం పన్నారు" కౌరవసైన్యం చూసి ధృష్టద్యుమ్నుడితో అన్నాడు అర్జునుడు – "దానికి తగినట్టు మనం అర్ధచంద్రవ్యూహం పన్నాలి. అలా అయితేనే మనం గెలుస్తాం" అన్నాడు.

అర్జునుడన్న ప్రకారం అర్ధచంద్రవ్యూహం పన్నాడు ధృష్టద్యుమ్నుడు. మగధ, పాండ్యసేనలతో కలిసి భీముడు అర్ధచంద్ర వ్యూహం కుడికొమ్ముగా నుంచున్నాడు. విరాటరాజూ, ద్రుపదుడూ, అనూపదేశం రాజు నీలుడూ, కాశీకరూశ సైన్యాలూ, ధృష్టకేతుడూ అతడిదగ్గిర నుంచున్నారు. శిఖండినీ, ధృష్టద్యుమ్నుణ్ణీ ముందుపెట్టుకుని ఏనుగుసేనతో ధర్మరాజు మధ్యభాగంలో నుంచున్నాడు. అతణ్ణి ఆనుకుని వరసగా సాత్యకీ నకులసహదేవులూ, ద్రౌపదికుమారుళ్ళూ, అభిమన్యుడూ, ఘటోత్కచుడూ, జయసేనుడూ మొదలైన అయిదు

గురు కేకయులూ నుంచున్నారు. అందరికీ అండగావున్న శ్రీకృష్ణుణ్ణి సారథిగా పెట్టుకుని అర్జునుడు ఎడమకొమ్ము కాశాడు. తక్కిన యోధులు ఎవళ్ళకి తగినస్థానాల్లో వాళ్ళు నుంచున్నారు.

ఇలా రెండుసేనలూ వ్యూహాలుపన్నుకుని వొకదానిమీదికి వొకటి నడిచాయి. నిస్సాణాలు మోగడంతోనే ఉభయసేనల లోనూ రౌద్రరసం తాండవమాడింది. ఓంప్రథమంగా అర్జునుడు మన సేనమీదికి వురికాడు. రథాలు పడగొట్టాడు. రథికుల్ని చంపేశాడు. సారథుల్ని నరికేశాడు. గుర్రాలు నూలగొట్టేశాడు. జెండాలు ఎగరగొట్టేశాడు. ఏనుగుల్నీ, ఏనుగులమీది యోధుల్నీ పీనుగులు చేసేశాడు. గుర్రాల్నీ, గుర్రాలమీది రౌతుల్నీ కూల గొట్టేశాడు. దాంతో గాంధారసేన యానత్తూ కో అంటే కో అని తిరగబడింది. అర్జునుణ్ణి చుట్టుముట్టింది. ఇంకా చూస్తారేం అన్నట్టు పాండవసేన గాంధారసేనమీద పడింది. రెండుసేనలూ ఉద్రేకంతో కలబడడంతోనే బ్రహ్మాండమైన దుమ్ము రేగింది. ఒకరి మొహం వొకరికి కనిపించలేదు. నేనుఫలానా అంటే నేనుఫలానా అని తమతమ పేళ్ళు చెప్పుకుంటూ పోరాడారు యోధులు. తాతల పేళ్ళూ, తండ్రులపేళ్ళూ ఎత్తి చెప్పుకున్నారు. తమ బిరుదులున్నూ ఉగ్గడించుకున్నారు. ఇంత దొమ్మీ ఆరంభమయినా, ఇటు భీష్ముడి పూనికా, అటు భీముడి బలమూ వుండడంచేత ఉభయసైన్యాలూ పిసరంత తబ్బిబ్బుపడకండా శిక్షణతో పోరాడాయి. రక్తం వరద కట్టింది. దాంతో దుమ్ముధూళీ అడుగారిపోయింది. సేనలికి వూపిరి సలిపింది. రెండుసేనలలోనూ తీక్ష్ణమైన బాణాలు జిగేలుమంటే జిగేలు మన్నాయి. ఉభయసైన్యాలూ దేవాసురయుద్ధంలా పోరాడాయి.

భీష్ముడూ, ద్రోణుడూ, పురుమిత్రుడూ, జయద్రథుడూ, శకునీ, వికర్ణుడూ పాండవసేనమీద విరుచుకుపడ్డారు. భీముడూ, ఘటో

త్కచుడూ, సాత్యకీ, చేకితానుడూ, ద్రౌపదికొడుకులూ వాళ్ళమీద కలబడ్డారు. భీముడూ, ఘటోత్కచుడూ వున్నచోటికి దుర్యోధనుడు తన రథసేన పరిగెత్తించాడు. భీష్ముడూ, ద్రోణుడూ దుర్యోధనుణ్ణి వెనక్కిపెట్టి భీముడితో కలబడ్డారు. భీముణ్ణి వెనకపెట్టి అర్జునుడు వాళ్ళనెదిరించాడు. అంతమందినీ వ్రాపేసి వొదలిపెట్టాడతడు.

సాత్యకి, అభిమన్యుడూ కలిసి సముద్రంలా వున్న గాంధార సైన్యం మథించడం మొదలెట్టారు. గాంధారయోధులు సాత్యకిరథం ముక్కలుచేసేశారు. సింహంలాగ కిందికి దూకేసి అభిమన్యుడి రథ మెక్కాడు సాత్యకి. అతడూ, అభిమన్యుడూ కలిసి గాంధార సైన్యం కకావికలు చేసేశారు.

ధర్మరాజు భీష్ముడికట్టు తిరిగాడు. అపరిమితమైన బలశాలి ధర్మరాజు. కళ్ళమొయ్యా కోపం తెచుకున్నాడో, అతడితో యుద్ధం ఘోరంగావుంటుంది. అందుకని అతడి ఎదటికి వెళ్ళలేదు మనబలగం. భీష్మద్రోణుల బలపరాక్రమాలు నమ్ముకొని, దూరం దూరంగానే పోరాడుతూవచ్చింది.

దుర్యోధనుడు భీముడిమీదికి దూసుకువెళ్ళాడు. బాగా చికిలి పట్టిన బాణాలు అతడిమీద తగిలించాడు. వెటకారంగా నవ్వాడు భీముడు. ప్రాణాంతకమైన బాణమొకటి ధనుస్సుకితొడిగి దుర్యోధనుడి గుండెలు దుసెళ్ళిపోయినట్టు వొదిలిపెట్టాడు. దెబ్బతో సొమ్మసిల్లి పోయాడు దుర్యోధనుడు. చప్పున యుద్ధంనించి అతణ్ణి తప్పించుకు పోయాడు సారథి. రాజురథం తప్పుకుపోడంతోనే సైన్యమూ విరిగిపోయింది; భయపడిపోయింది; అల్లకల్లోలమయిపోయి పరుగుచ్చు కుంది. పారిపోతూవున్న కౌరవసేన భీముడూ, ధృష్టద్యుమ్నుడూ వెంటదరిమారు. సింహనాదాలు చేశారు.

"ఆగండి, ఆగండి" అంటూ ద్రోణుడూ, భీష్ముడూ కేకలు వేస్తూనే వున్నారు. కాని ఏంలాభం! సింహనాదంచేస్తూ భీముడు తరుముతూవుంటే, తిరిగీ కూడుకుని చెయిగకట్టలేదు మనసేన.

ఇటు అభిమన్యుడూ, సాత్యకీ చెండాడుతూవుంటే నిభాయించుకోలేకపోయింది గాంధారసైన్యం. చచ్చినంత చచ్చి మిగిలింది తోక ముడిచేసింది. బంధువులతో కలిసి పిక్కబలం చూపెట్టాడు శకుని.

అర్జునుడి సంగతి అడగేఅక్కరలే దిక. గొర్రెలమందమీద తోడేలు పడినట్టు పడి కౌరవసేన కకావికలు చేసేశాడతడు. అతడి వానరపతాకం కనపడితేచాలు, అతడి వీరగర్జన వినిపిస్తేచాలు పుంజాలు తెంపుకు పరిగెత్తారు మనవాళ్ళు.

ఇంతలో దుర్యోధనుడు తెలువుకున్నాడు. యుద్ధంలోంచి రథం తెచ్చేశాడని సారథిమీద గుడ్లెర్రచేశాడు. రణభూమికి రథం మళ్ళించాడు సారథి. పారిపోతూన్న సైన్యాలు హెచ్చరించాడు దుర్యోధనుడు. రాజరథం కనపడగానే వెనక్కి తిరిగాయి సైన్యాలు. ఉన్న చోటినించే సేనలు ఉత్సాహపరిచాడు భీష్ముడు. ద్రోణాచార్యులూ అతడికి తోడయాడు. చంద్రోదయమైతే సముద్రమెలా వుప్పొంగుతుంది, అదిగో అలా ఉప్పొంగింది కౌరవసేన. ఇలా విరిగి పోతూన్న సైన్యాలు నిలదీసుకుని చరచరా భీష్మద్రోణుల దగ్గిరికి వచ్చాడు దుర్యోధనుడు

"పాండవులతో యుద్ధం చెయ్యంఅని ముందే మీరు చెప్పేసి వుంటే బావుండేది" ధుమధుమలాడుతూ అన్నాడతడు — "ఏమిటిది! ముల్లోకాలూ తిరగబడినా మీలో వొక్కొక్కరే వీగ్గొడతారు. అలాంటిది, మీ ముక్కున వూపిరాడుతూ వుండగానే మనసైన్యాలు ఇలా దుర్గతికి వచ్చేశాయి!" అన్నాడు. భీష్ముడితట్టుచూసి, "మొదటే ఈసంగతి చెప్పేసివుంటే కర్ణుడూ నేనూ నూపాట్లు మేం పడేవాళ్ళం.

ఊరికే నీమీద ఆశపెట్టుకున్నాను. మోసపోయాను. ఏమంటేమాత్రం ఏంలాభమిపుడు!" అంటూ రుసరుసలాడాడు.

"అబ్బాయీ, నువ్వు ఏదో అనుకుంటున్నావు" దుర్యోధనుణ్ణి సముదాయిస్తూ చిరునవ్వుతో అన్నాడు భీష్ముడు — "దేవతలందరితో కలిసి దేవేంద్రుడు వచ్చినా పాండవుల్ని గెలవడం కల్ల. యుద్ధంలో స్థిరమైనవాళ్ళు వాళ్ళు. దివ్యాస్త్రాలు పట్టుంగా వున్నవాళ్ళు. బలవంతులు. ముసిలాళ్ళూ, దుర్బలులూ, ఆయువు చెల్లినవాళ్ళూ — వీళ్ళా వాళ్ళని గెలుస్తారు! అలా అని నేను అశ్రద్ధచేస్తాననుకోకు. నాశక్తి వంచనలేకుండా పాండవసైన్యం హరింపచేస్తాను. నువ్వూ, నీబంధువులూ దగ్గిరేవుండి చూస్తూవుండండి" అంటూ జూలుదులిపిన సింహం లాగ లేచాడతను.

భీష్ముడు అలా లేవడంతోనే ఎక్కడలేని ఉత్సాహమూ పుట్టుకు వచ్చింది నీ కొడుకులికి. వందమందీ వొక్కసారి వంద శంఖాలూ పూరించారు. సైన్యమంతటా భేరీలూ, మృదంగాలూ దిక్కులు దిమ్మెత్తినట్టు మోగాయి.

పాండవసేనలోనూ శంఖాలు వురిమాయి. రణవాద్యాలు మోగాయి. సైన్యంలో ఆచివరినించీ ఈచివరికి ఉత్సాహమే ఉత్సాహం పరుగులు పెట్టింది. ఉభయసేనలూ వొకదానిమీద వొకటి విరుచుకు పడ్డాయి

ధృతరాష్ట్రుడు : దుర్యోధనుడిమాట బాగా పనిచేసిం దన్నమాట! భీష్ముడు ఉద్రేకంతో బయలుదేరాక యుద్ధమెలా నడిచింది?

సంజయుడు : అప్పటికి సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. అతడితో పోటీపడుతున్నాడా అన్నట్టు తనబాణాల కిరణాలు తళతళలాడిస్తూ వెళ్ళి అర్జునుడితో డీకొన్నాడు భీష్ముడు. అతడి వెంట రభసంగా దుర్యోధనుడూ మొదలైన మన వీరయోధులూ

వెళ్ళారు. భీముడూ మొదలైన పాండవయోధులు మనవాళ్ళ నెదిరించారు. దొరలూ దొరలూ కలబడగానే భటులూ భటులూ కలబడ్డారు. ఘోరమైన యుద్ధం జరిగిపోయింది.

అవి హుంకారాలు కావు. అవి అదలింపులు కావు. అవి తర్జనలు కావు. అవి పొగుడుకోడాలు కావు. అవి పంతాలు కావు-ఓ, ధణధణా నిస్సాణాలు- ఢంకాలు- నగారాలు - చెప్పశక్యం కాదంటేనమ్ము. తలకాయలూ, కాళ్ళు, చేతులూ, మొండాలూ తెగి పడిపోయాయి. బాణాలూ, కత్తులూ, గదలూ, ధనుస్సులూ ముక్కముక్కలయిపోయాయి. కిరీటాలూ, కంకణాలూ, భుజ కీర్తులూ గుండపిండయిపోయాయి. ఎక్కడచూస్తే అక్కడ ఇవే కుప్పలుకుప్పలు కనిపించాయి. చచ్చీచావక గింజుకుంటూవున్న కబంధాలు జలచరాలు. రక్తప్రవాహమే వరద. మాంసం ముద్దలు బురద – ఇలా ఎన్నో అన్ని ప్రవాహాలు రణస్థలమంతటా ప్రవహిం చాయి. ఎటుచూస్తే అటు గుండపిండయిపోయిన రథాలూ, అడ్డ దిడ్డంగా పడివున్న గుర్రాల కళేబరాలూ, పీనుగులయి కుప్పలుపడిన ఏనుగులూ - బీభత్సం తాండివమాడింది. వాటిమధ్య కాలుకదప డానికి సందులేక ఎక్కడి రథికు లక్కడ గుంపులుగుంపులు నిలబడి పోయారు.

ఆకలితో వున్న సింహంలాగ వీరవిహారంచేశాడు భీష్ముడు. ఎదటివాళ్ళని పేరుపేరునా పిలుస్తూమరీ యుద్ధంచేశాడు. బాణాలు విరజిమ్ముతూ ఎక్కడపడితే అక్కడ మెరుపు మెరిసినట్టు - కొరివి తిప్పినట్టు - గారడీ చేసినట్టు తనరథం దుమికించాడు. తనముందు నిలిచే మొనగాడే లేడన్నాడు. ఎంతమంది ఎదురయితే అంతమందినీ వొక్కబాణంతో కొట్టేశాడు. ఒక్క డెదురయితే ఆటలాడినట్టు ఎన్నో అన్ని బాణాలువేసి చిత్రవధచేసేశాడు. వీడెవడయినా తన

తట్టు తేరిచూస్తేచాలు. అతణ్ణి కీళ్ళూడగొట్టిన యంత్రంలా చేసేసి కూలదోసేశాడు. అతడి దృఢముష్టీ, లక్ష్యశుద్ధీ, లాఘవమూ చూసి దేవతలే ముక్కుమీద వేలుపెట్టుకున్నారు.

ప్రాణాంతకమయిన బాణాలు వేశాడు భీష్ముడు. పాండవుల చతురంగసేన పాయలుపాయలు చేసేశాడు. తునకలుతునకలు చేసేశాడు. చెక్కలుచెక్కలు చేసేశాడు. పొడిపొడి, ముద్దముద్ద చేసేశాడు. దావాగ్ని అంటుకున్నట్టు, మాయచేసినట్టు, మంత్రించి పడేసినట్టు శత్రుసేన నుసిచేసేశాడు; దుళ్ళగొట్టేశాడు; నాశనం చేసేశాడు. కాలరుద్రుడిలాగ ప్రళయతాండవంచేశాడు. పాంచాల యాదవ, మత్స్యసైన్యాలు నిచ్చేరపడి నిలబడిపోయాయి. పాండవ యోధుల కరచరణాలాడలేదు. సేన సేన యావత్తూ దిక్కులేనట్టు దీనావస్థకి వచ్చేసింది. దిగాలుపడిపోయింది.

"భీష్ముడూ, కృపుడూ, ద్రోణుడూ — ఈ యావన్మందితోనూ దుర్యోధనుడి సైన్యం గెలవడానికి ఎప్పుడు సమయం చిక్కుతుందా అని కలలు కన్నావు. చూడూ, చూడూ, ప్రళయరుద్రుడిలాగ ఎలా చెండేస్తున్నాడో భీష్ముడు! ఇంకా ఎంతసేపు ఇలా పస్తాయిస్తావు? ఇంకెప్పుడు నీ ప్రతాపం?" – పరిస్థితి గ్రహించేసి, అర్జునుణ్ణి హెచ్చరించాడు శ్రీకృష్ణుడు.

"నువ్వు అంత అనక్కరలేదు. ఉరికించు, అతడిమీదికి రథం. అతణ్ణి వంచేస్తానో చూస్తువుకాని" గాండీవం సారిస్తూ అన్నాడు అర్జునుడు.

పగ్గాలు సడిలించాడు శ్రీకృష్ణుడు. భీష్ముడిమీదికి పురకలు పెట్టింది అర్జునుడి దివ్యరథం. అర్జునుడు రావడంతోనే కలవరించాడు మహారథి భీష్ముడు. ఎక్కడలేని ఉత్సాహమూ తెచ్చుకున్నాడతడు. భూమి దద్దరిల్లినట్టు పెద్ద సింహనాదం చేశాడు. బాణంమీద బాణం

సంధించి, అర్జునుణ్ణీ, అతడి గుర్రాలీన్నీ, సారథి శ్రీకృష్ణుణ్ణీ దారుణమైన బాణాలతో కొట్టాడు. తనకి తగిలిన బాణాలు లెక్కచెయ్యలేదు శ్రీకృష్ణుడు. గుర్రాల గాయాలు తడివి, వాటిని సేదదేర్చాడు. భీష్ముడి మీదికి రథం తరిమాడు. వీరవిన్యాసంగా గాండీవం మోగించాడు అర్జునుడు. నారికి బాణం తొడిగాడు. భీష్ముడి ధనుస్సు ఫెళ్ళుమని పించాడు. మరో ధనుస్సు తీశాడు భీష్ముడు. అదిన్నీ అర్జునుడు పుటుక్కుమనిపించాడు. 'భేష్' అంటూ మరో విల్లు తీశాడు భీష్ముడు. తియ్యడమూ బాణాలు కురిపించడమూ లిప్తలమీద చేశా డతడు. చిత్రచిత్రంగా రథం పరిగెత్తించి, వొక్క బాణమూ తగలకండా తప్పించాడు పార్థసారథి శ్రీకృష్ణుడు.

భీష్ముడు వొదలలేదు. అర్జునుడిమీదా కృష్ణుడిమీదా బాణాలు కురిపిస్తూనే వచ్చాడతడు. భీష్ముడి బాణాలు కాసుకుంటూ అతడిమీద వడగళ్ళవానలా గబగబా బాణాలు రువ్వాడు అర్జునుడు. అయితేనేం, అతణ్ణి కరచరణా లాడనివ్వలేదు భీష్మపితామహుడు. అర్జునుణ్ణీ, అతడి రథాన్నీ తన బాణాగ్నిలో ముంచేసి వొదిలిపెట్టా డతడు.

అపరాహ్ణ మయింది. కృష్ణుడి శరీరం మంటలుచ్చుకుంది. అర్జునుడి బాధా అవగతమవుతూనే వుంది. పాండవసేన పారిపోతూ వుంది. భీష్ముడి హస్తలాఘవం పిసరంతా తగ్గలేదు. అతడి బాణాలికి అంతూపంతూ అవుపించలేదు.

అంతా గమనించాడు శ్రీకృష్ణుడు. "సిగ్గులేకండా పరిగెడుతూ వుంది పాండవసేన. భీష్ముడిముందు నిలిచే మొనగాడు వొక్కడూ లేడు వీళ్ళలో. అర్జునుడూ దెబ్బలుతినేశాడు; తూగిపోతున్నాడు. ఇలాగే అయితే ఇవాళే భీష్ముడు దుర్యోధనుడికోర్కె తీర్చేస్తాడు. యాదవులూ, పాంచాలులూ మొదలైనవాళ్ళు తోకముడవడం తోటే కన్నూ మిన్నూ కనపడలేదు కౌరవసేనకి. అంతటా అదే

ముట్టడిస్తూవుంది. ఇప్పుడు నేను వూరుకున్నానా అంతా బూడిదలోపోసిన పన్నీరే అయిపోతుంది. — భీష్ముణ్ణి చంపేసి ధర్మరాజుని గెలిపించాలి.'' — కృష్ణుడు ఇలా అనుకుంటూనే వున్నాడు, మరిన్ని బాణాలు బాదేశాడు భీష్ముడు. కాళ్ళూ, చేతులూ కట్టేసినట్టయిపోయింది అర్జునుడికి.

అదే సమయమని, అశ్వత్థామా, కృపాచార్యులూ, భూరిశ్రవుడూ, జయద్రథుడూ, వికర్ణుడూ గుంపుకట్టి, రథాల్తో వొక్కసారి అర్జునుడిమీద పడ్డారు. ఇంతో అంతో పోరాడుతూవున్న పాండవ సైన్యం దాంతో మరింత పరుగుచ్చుకుంది.

“ఆగండీ, ఆగండీ'' ఏనుగు సేనతో వచ్చి, పాండవసేనమళ్ళిస్తూ హెచ్చరించాడు సాత్యకి — “మీరన్నమాటలు మరిచిపోకండి! మించి వచ్చిందని పారిపోకండి! భయపడకండి! కనపడ్డ శత్రువు నల్లా కాజెయ్యండి! భీష్ముడూ గీష్ముడూ మనకి కొత్తేమిటి? నేనున్నాను. భయమేమిటి మీకు!'' అంటూ కుడిఎడమల పాండవసేనకి ధైర్యం చెపుతూ అర్జునుడిరథం దాటుకునివచ్చి, “నిలవండోయి! నిలవండి!'' అంటూ, ఎదటి కౌరవసేనని గదమాయించాడతడు.

“తోకముడిచేసిన పిరికిపందల్ని తిరిగీ పురికొల్పుతావెందుకు!'' అలా ముందుకి వురుకుతూవున్న సాత్యకితో అన్నాడు శ్రీకృష్ణుడు — “వాళ్ళేకాదు, మిగిలినవాళ్ళూ పోతేపోనీ. దుర్యోధనుడు జయించి, రాజ్యమేలడం నా కళ్ళతో చూసి సహిస్తాననుకోకు. ఇదిగో, ఘంటాపథంగా చెపుతున్నాను, భీష్ముణ్ణి చంపేస్తాను. కౌరవవీరుల్లో వొక్కణ్ణీ మిగలనివ్వను. వాళ్ళ ఇన్ని అక్షోణీలసేనలూ నాశనం చేసేస్తాను. భూమండలం యావత్తూ పాండవుల కర్పిస్తాను'' అంటూ తన సుదర్శనచక్రంస్మరించాడతడు. ఉత్తరక్షణంలో సుదర్శన

చక్రం ప్రత్యక్షమయింది. పగ్గాలు నొగలికి ముడిపెట్టి, కుడిచేత్తో చక్రంపట్టుకుని రథం దూకేశాడు శ్రీకృష్ణుడు.

భూమి జవజవలాడింది. సుదర్శనం అంచులు ధగధగ మెరిశాయి. కట్టుకున్న పట్టుబట్ట జీరాడుతూ, — ఎర్రపడ్డ మొహంతో, — సింహనాదం చేసి, — ఏనుగులాంటి భీష్ముడిమీదికి సింహం లాగ పరిగెత్తాడు శ్రీకృష్ణుడు. ఆ ఉద్రేకం, ఆ ఆటోపం, ఆ వడీ చూస్తే మహారాజా, జగత్సంహారంపూనుకున్న ప్రళయరుద్రుడే కళ్ళముందు తాండవమాడాడు.

శ్రీకృష్ణుడి ఉగ్రమూర్తి చూసి ఎదటవున్న కౌరవసైన్యంలో చిక్కితే నెత్తురులేదు. పెద్దపులిని చూసిన లేడిపిల్లలలాగ వొకరి వొంట్లోనూ ప్రాణంలేదు. ఎక్కడివాళ్ళక్కడ కిక్కురుమనకండాబిక్క జొచ్చిపోయారు. దుర్యోధనుడు దిగాలుమనిపోయాడు. పెదవు లెండి పోయి, కొయ్యబారిపోయా డతడు. ఏంచెయ్యాలో తోచలేదు తనకి.

"కృష్ణా, నన్ను కృతార్థుణ్ణిచెయ్యాలనే దయకలిగిందా!" తడబడకండా కృష్ణుడిమీదే దృష్టిపెట్టుకుని, వినయంగాఅన్నాడు భీష్ముడు — "దయచెయ్యి, నీఇష్టమే కానీ. ప్రభూ, ఇంతకంటే భాగ్యమేముంది నాకు!" అన్నాడు.

ఇదంతా లిప్తలమీద జరిగిపోతూ వుంది.

చివాల్న రథంగెంతేసి పరిగెత్తుకు వచ్చాడు అర్జునుడు. వెనకనించి కృష్ణుణ్ణి పొదివిపట్టుకున్నాడు. ఆజానుబాహుడయిన అంత అర్జునుణ్ణీ, కొమ్మలతో పెద్దవృక్షం లాక్కుపోయిన పెనుగాలిలా ఈడ్చుకుంటూ పోయాడు శ్రీకృష్ణుడు. పదడుగులు వెళ్ళాక కాని కాళ్ళానుకోలేకపోయాడు అర్జునుడు. ఈడిగిలబడి ఎలాగోఅతణ్ణి నిలబెట్టి "కృష్ణా, కృష్ణా, శాంతించు" అంటూ బతిమాలాడు — "మా అందరికీ నువ్వే తెప్పవి. నువ్వే అధైర్యపడి పూనిక తప్పితే ఇంక

దిక్కేముంది? ప్రతిజ్ఞాపరుడైన ధర్మరాజు ధైర్యమూ, శౌర్యమూ, బాహువీర్యమూ మంటగలిసిపోతాయి. లోకనాయకుడివి నువ్వు. నువ్వు చేయవలిసిన పనేనా ఇది! ప్రభూ, శాంతించు. సాత్యకి వెళ్ళాడు చాలు. నన్ను చచ్చుకింద కట్టేసి చక్రం పడుతున్నావు. నీప్రతిజ్ఞ మరిచిపోతున్నావు. కృష్ణా, నువ్వు పక్కనుంటే చాలు. నమ్ము. కౌరవసేన కనబడకండా చేసేస్తాను. నామాట మన్నించు" అంటూ కాళ్ళావేళ్ళా పడ్డాడు.

అర్జునుడి సమయనిష్ఠకి సంతోషించాడు శ్రీకృష్ణుడు. అతడి కోపమూ శాంతించింది. నెమ్మదిగా వెనక్కి వచ్చేశాడు. రథ మెక్కి నొగలమీద కూచున్నాడు. పగ్గాలు పట్టుకున్నాడు. పాంచ జన్యం పూరించాడు.

అతడి వెనకాలే రథంమీదికి వెళ్ళాడు అర్జునుడు. దేవదత్తం పూరించాడు. ధనుష్టంకారం చేశాడు. దిక్కులు ప్రతిధ్వనించాయి. ఇటు మన సేనకూడా జల్దుకుంది. భేరీలూ, మృదంగాలూ మోగించి అర్జునుడిమీదికి నడిచింది. దూదికుప్పమీదపడ్డ అగ్గిలాగ కౌరవసేన మీద పడ్డాడు అర్జునుడు. వందలు వందలు, వేలు వేలు బాణాలువేసి మారణహోమం ప్రారంభించాడు.

ఆసేన అతిక్రమించి భీష్ముడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, దుర్యోధనుడూ అర్జునుడిమీదికి వచ్చారు. వచ్చీరావడంతోటే శక్తి ప్రయోగించాడు భీష్ముడు. బంగారం మొదళ్ళున్న ఏడుబాణాలు కొట్టాడు భూరిశ్రవుడు. గద విసిరాడు శల్యుడు. తోమరం విసిరాడు దుర్యోధనుడు. ఒక్కొక్క బాణంవేసి శక్తీ, గదా, తోమరమూ ముక్కలుచేసేశాడు అర్జునుడు. భూరిశ్రవుడి ఏడుబాణాలూ ఏడు బాణా లతో కొట్టేశాడు. ఉత్తరక్షణంలో ఇంద్రాస్త్రం ప్రయోగించాడు. దాంతో రకరకాల బాణాలు వందలూ వేలూ బయలుదేరాయి.

కౌరవసేనమీాదపడి ఘోరంగా విజృంభించాయి. సేనమీాద ఇంద్రాస్త్రం ప్రయోగించేసి, పాముల్లాంటి బాణాలు భీష్ముడిమీాద వొదిలి పెట్టాడు అర్జునుడు. ఒక దారయిన బాణం కొట్టి భూరిశ్రవుడి విల్లు విరిచేశాడు. శల్యుడిమీాద తొమ్మిది బాణాలు కుప్పించాడు. ఎంచి ఎంచి వొక బాణం దుర్యోధనుడి గుండెలు దుసెల్లిపోయినట్టు కొట్టాడు.

ద్రుపదుడూ, విరాటరాజూ మొదలైన యోధులు వచ్చి అర్జునుడితో కలిశారు. అర్జునుడు మరింత పేట్రేగిపోయాడు. అతడి గాండీవమంటే అడలుపట్టుకుంది మనవాళ్ళకి. అదికనిపెట్టి సీకుమాళ్ళు వందమందీ ముందుకి వచ్చారు. అర్జునుణ్ణి ఘిరాయించారు. గొప్ప సంకులసమరం జరిగిపోయింది.

ఇంద్రాస్త్రం మనవాళ్ళమీాద అర్జునుడు వేశాడని చెప్పాను కదా! మహారాజా, దానివల్ల మన సేనకి కలిగిన దురవస్థ ఏమని చెప్పేది! గుర్రాలు కూలిపోయాయి. రథాలు తల్లకిందయి పోయాయి. ఏనులు పీనుగు లయిపోయాయి. కాల్బలం పచ్చడి పచ్చడి అయి పోయింది. గొడుగులూ, చామరాలూ, జెండాలూ, ఆయుధాలూ గుండగుండ అయిపోయాయి. రక్తం నదులయి పారింది. ఆరక్తం నదుల్లో జుత్తులే నాచులు. పేగులే నురుగులు. మెదడూ, మాంసమే బురద. అలాంటి రక్తనదీప్రవాహాలు ఎన్నో అన్ని వరదలయి పారాయి. భేతాళాలూ, పిశాచాలూ, రాబందులూ, నక్కలూ ఆ రక్తనదుల్లో విందులు కుడిచాయి. నెత్తురు పానంచేసాయి.

అర్జునుడు దేవదత్తం మూదాడు. శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. ఇద్దరూ సింహనాదాలు చేశారు

సాయంకాల మయింది. సూర్యుడ స్తమించాడు, మునిమాపు ముంచుకు వచ్చింది. నిజసైన్యం నాశనమవుతూ వుండడమూ, అర్జునుడి దివ్యబాణాలు నివారించడానికి వీలు లేకపోడమూ నివారించి,

భీష్ముడూ, ద్రోణుడూ, బాహ్లీకుడూ, దుర్యోధనుడూ సేనలు మళ్ళించారు. దివిటీలు వేసుకుని విడిదికి వచ్చేశారు.

శ్రీకృష్ణుడితో కలిసి నవ్వుతూ కేరుతూ, వందిజనులు కీర్తిస్తూ వుండగా శిబిరానికి వెళ్ళారుపాండవులు. ఆరాత్రి దుర్యోధనుడి శిబిరంలో సైనికులు అర్జునుడి పరాక్రమమూ, దేశదేశాల చతురంగబలాల నాశనమూ గుంపులుగుంపులయి చెప్పుకున్నారు.

## నాలుగో రోజు

మర్నాడు భళ్ళున తెల్లవారేసరికి యుద్ధానికి బయలుదేరాడు భీష్ముడు. అతడివెంట సముద్రతరంగాలలాగ వరసలువరసలు బయలుదేరింది కౌరవ సైన్యం. ద్రోణాచార్యులూ, దుర్యోధనుడూ, బాహ్లీకుడూ, కృతవర్మా గబగబా వెళ్ళి సేనలతో కలుసుకున్నారు. ఏనుగుల ఘీంకారాలూ, రథాల క్రేంకారాలూ, గుర్రాల సకిలింపులూ చెవులు దిమ్మెత్తించాయి. బాగా వ్యాపించిన పెద్ద మేఘమాలలా అవుపించింది కౌరవసైన్యం. మంచి వీరరసంతో వుప్పొంగుతూ ప్రత్యక్షమయింది పాండవసైన్యం. కౌరవసేన చూసి తమసైన్యంలో ముందుకి వచ్చారు కృష్ణార్జునులు. సూర్యుడూ, చంద్రుడూ ఇద్దరూ వొక్కదగ్గిరే ప్రకాశించినట్టు అవుపించారు వాళ్ళు. తూర్యాలూ, సింహనాదాలూ చెలరేగి, ఆయుధాలతో నిప్పులు రాలుస్తూ, ఉభయపక్షాల చతురంగసేనలూ హోరుమని కలబడ్డాయి. ఇరుపక్షాల వీరులూ తోమరాలతోనూ, ప్రాసలతోనూ చంపుకున్నారు. బల్లేలతోనూ, బాకులతోనూ పొడుచుకున్నారు. గండ్రగొడ్డళ్ళతోనూ, కత్తులతోనూ నరుకుకున్నారు. గదలతోనూ, ముసలాలతోనూ, ముద్గరాలతోనూ బాదుకున్నారు. గదలతోనూ, ప్రాసలతోనూ తలలు పగలగొట్టుకున్నారు. కలబడుతూ, తప్పుకుంటూ, గుంపులు

గుంపుల ఖపోతూ విడిపోతూ, తరుముతూ, నిలబడుతూ పోట్లాడారు. ఎన్నో చోట్ల, ఎన్నోరకాల, ఎన్నో మొనలయి జరిగింది యుద్ధం.

తాటిచెట్టుజెండా తళతళా మెరుస్తూవుంటే, మంచి ఉత్సాహంతో అర్జునుడిమీదికి రథం వురికించాడు భీష్ముడు. దుర్యోధనుడూ, ద్రోణుడూ, వివింశతీ, కృపుడూ, సోమదత్తూ, శల్యుడూ భీష్ముడివెంట వురకలు పెట్టారు. ఆ ఏడుగురినీ ఎదిరించాడు అభిమన్యుడు. వాళ్ళు కొడుతూవున్న బాణాలన్నీ అడ్డులేనిబాణాలతో తుంచేసి, అగ్నిహోత్రుడిలా× ప్రచండమైన తేజస్సుతో రణవేదికమీద వెలిగిపోయాడతను.

అభిమన్యుణ్ణి దాటేసి, భయంకరమైన బాణాలు అర్జునుడిమీద కురిపించాడు భీష్ముడు. గొప్పగొప్ప బాణాలతో వరసపెట్టి నరికేశాడు అర్జునుడు. అలా ఘోరంగా జరిగిన భీష్మార్జునులయుద్ధం ఉభయసేనలూ నివ్వెరపడిచూశాయి కొంచేపు.

అశ్వత్థామా, భూరిశ్రవుడూ, శల్యుడి కొడుకూ, చిత్రసేనుడూ మదగజాలు సింహంకొదమని పొదివినట్టు అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు. చూసి, మెల్లిగా నవ్వుతూ అశ్వత్థామ గుండెలమీద బాణంకొట్టాడు అభిమన్యుడు. శల్యుడికొడుకు జెండా ఎగరకొట్టేశాడు. చిత్రసేనుడి ధనుస్సు విరిచేశాడు. భూరిశ్రవుణ్ణి కీచుకీచు మనిపించాడు. వీళ్ళూ, దుర్యోధనుడూ మొదలైన ముందటి ఆరుగురూ కలిసి వొక్కుమొగిని అతడిమీద బాణాలు రువ్వారు. ధనుష్టంకారంచేస్తూ అంతమందితోనూ అద్భుతంగా పోరాడాడు అభిమన్యుడు. మహారాజా, హస్తలాఘవంలోనూ, అధికబలంలోనూ, శౌర్యమహిమలోనూ, అధికధైర్యంలోనూ అభిమన్యుడిముందు మనమహావీరులు దిగదుడుపుకైనా సరికారంటే నమ్ము.

అలా పదిమందితోనూ పోరాడుతున్న కొడుకుని చూసి గట్టిగా సింహనాదంచేసి వచ్చిపడ్డాడు అర్జునుడు. అందరికీ అన్ని రూపులయి, నొప్పించీ చిక్కుపెట్టేసీ వొదిలిపెట్టాడతడు. దాంతో నీకొడుకు పంపడంతోనే త్రిగర్తులూ, కృతవర్మా, కేకయులూ ఇరవై అయిదువేల రథాలవాళ్ళని వేసుకుని అభిమన్యుణ్ణి ముట్టడించారు.

"సారథీ, అదిగో అటు పరుగెత్తించు మన రథం" లోపల చొచ్చుకుపోయి యుద్ధంచేస్తున్న అర్జునుణ్ణి దూరంనించే చూసి, విజృంభించి సారథిని తొందరచేసేశాడు ధృష్టద్యుమ్నుడు. వాడివాడి బాణాలతో శత్రువుల్ని జజ్జరిల్లజేసేస్తూ, శౌర్యపరాక్రమాలతో విజృంభిస్తున్న సేన వెనక వేసుకుని, అర్జునుడిరథం దాటుకుంటూ మనసైన్యసమీపాన వాలాడతడు. వస్తూనే కృపాచార్యుల్ని మూడు బాణాలతో కొట్టాడు. శల్యుడిమీద పది బాణాలు వేశాడు. ఒక బాణం వేసి ధృఢగతుడయిన కృతవర్మ గుర్రాలూ, రథమూ కూలగొట్టేశాడు. ఉగ్రుడయిపోయి అతడిమీద గబగబా పది బాణాలు కొట్టాడు శల్యుడికొడుకు. అతడిసారథినీ పదిబాణాలతో కెవ్వుమనిపించాడు. కోపంతో మండిపడ్డాడు ధృష్టద్యుమ్నుడు. ఎర్రవడ్డ అతడి మొహంలో చిరునవ్వు మొలకలెత్తింది. ఆటోపంతో శల్యుడి కొడుకువిల్లు పెళ్ళుమనిపించాడతడు. నాగుపాముల్లాంటి బాణాలు అతడి వొంటిమీద నాటించాడు. ఆ వూపుని అతడి సారథినీ చంపేశాడు. గుర్రాలూ కూల్చేశాడు.

రథంపోయి, మానసమే వాహనం చేసుకున్నాడు శల్యుడి కొడుకు. కత్తీ, డాలూ పట్టుకుని, రెక్కల పెనుబాములాగ ధృష్టద్యుమ్నుడిమీద కలబడ్డాడు. అతడి శౌర్యం ఉభయసేనలూ మెచ్చుకున్నాయి. చూసి పాండవులు భయపడ్డారు. ధృష్టద్యుమ్నుడి బాణాలన్నీ డాలుతో కాసుకుంటూ, తళతళా ఖడ్గం ఝుళిపిస్తూ, చిత్రగతులలో అతడిమీద పడ్డాడు. చప్పుని గద తీశాడు ధృష్టద్యు

మ్నుడు. ప్రానిపెన్ని వొక్కటి బాదాడు. ఫెళపెళ గుండయి పోయింది శల్యుడికొడుకు డాలు. రెండో దెబ్బ పిడుగులా పడింది. భళ్ళున తలపగిలింది. ఇటు ప్రాణాలూ, అటుకత్తీ వొదిలేసి కొండలా కూలిపోయాడు శల్యుడి కొడుకు. భయపడిపోయి కలతపడి పోయారు కౌరవులు.

కొడుకు కూలిపోడంతోనే నిలువునా మండిపోయి ధృష్టద్యు మ్నుడిమీాద కలబడ్డాడు శల్యుడు. వరసపెట్టి మంచి ఉజ్వలమైన బాణాలు వొదిలిపెట్టాడు ధృష్టద్యుమ్నుడు.

ధృతరాష్ట్రుడు: మానుషం ఎందుకు పనికివస్తుంది? అంతా దైవాధీనం మన అన్ని అక్షౌహిణుల సేనా గెలుచుకుంటారు పాండవులు. చావూ, బాధా మనవాళ్ళవంతు. గెలుపూ, సంతోషమూ వాళ్ళవంతు. ఇదే నీదగ్గిర వింటున్నాను. సంజయా, తుదకి సిరీ, సంపదా పాండవుల చేతిలోనే పడుతుంది. దుర్యోధనుడి దుర్ణయంవల్ల దుర్వార్తలు వింటూ దుఃఖపడే దుర్గతిపట్టింది నాకు. పాండవుల్ని గెలిచే ఉపాయం కనిపించలేదు.

సంజయుడు: అవును నువ్వన్నదాంట్లో పిసరంతా సందేహం లేదు. నీ చతురంగబలం ఎంతో నాశనమయిపోయింది. ఇక ముఖ్యులు కూడా రాలిపోతారు. సరే, తరవాతసంగతి విను. శల్యుడు లెక్కాజమాలేని బాణాలు కొట్టాడు. ధృష్టద్యుమ్నుడూ అపరిమితమైన బాణాలతో ముంచెత్తాడు. శల్యుడు ధృష్టద్యుమ్నుడి విల్లు విరిచేసి, రకరకాల అస్త్రాలతో అతణ్ణి మూడు చెరువులనీళ్ళు తాగించాడు. అప్పుడు అభిమన్యుడు వచ్చి శల్యుడిమీాద వురికాడు. దుర్యోధనుడు వురికొల్పడంతోనే దుర్ముఖుడూ, దుస్సహుడూ దుర్మర్షణుడూ సత్యవ్రతుడూ చిత్రసేనుడూ, పురుమిత్రుడూ, వివింశతీ, వికర్ణుడూ - ఇంతమందీ పరిగెత్తారు. అయితే అభిమన్యుణ్ణి ఎదిరించ

డానికి జంకేసి, ధృష్టద్యుమ్నుణ్ణి చుట్టుముట్టారు. ఒక్కొక్కడూ లెక్కలేనన్ని బాణాలు వేశారు. చలించకండా వొకొక్కడిమీదా లెక్కలేనన్ని బాణాలు వేశాడు ధృష్టద్యుమ్నుడు. కరలాఘవం చూపెట్టి అంతమందినీ కుదిపేసి వొదిలిపెట్టాడతడు.

మేనమామకి ఆశ్చర్యమూ సంతోషమూ, కలిగినట్టు నకుల సహదేవులు శల్యుడిమీద శరవర్షం కురిపించారు. అతడున్నూ బాణాలతో ముంచెత్తాడు వాళ్ళని. వాళ్ళకి దన్నుగా ద్రుపదుడూ, విరాటరాజూ సేనలతో శల్యుడిమీద కలబడ్డారు. మనవాళ్ళలో పేరుపడ్డ మొనగాళ్ళు శల్యుడికి సహాయ్యం చేశారు.

మధ్యాహ్నమయింది. సూర్యుడు నడిమింటికి వచ్చాడు.

"ఇవాళే యుద్ధం అంతమయిపోవాలి"– తీవ్రమైనకోపంతో గద తిప్పుతూ సేనాముఖంమీదికి రథం పరిగెత్తించి అన్నాడు భీముడు. భయంతో తిడబడిపోయారు సేనాముఖులు. అప్పుడు ఉద్రేకంతో మగధరాజుని పురికొల్పాడు దుర్యోధనుడు. ఏనుగుమందలతో భీముడి మీదికి పరిగెత్తాడు మగధరాజు. ఏనుగుమందలు చూడగానే ఎక్కడ లేని ఉత్సాహమూ పుట్టుకువచ్చింది భీముడికి. భుజంమీద గద పెట్టుకుని గర్వంగా కులుకుతూ రథం దిగాడతడు. పర్వతాలమీద వాలిన మహావాయువులాగ భీషణంగా ఏనుగులమీద వురికేసి, పెద్ద సింహనాదం చేశాడు. గుండెలుపగిలి కలగుండుపడిపోయాయి ఏనుగులు. అలా, దేవతలున్నూ భయపడిపోయినట్టు మహావేగంతో విక్రమ విహారం మొదలెట్టాడతడు. అభిమన్యుడూ, ద్రౌపది కుమారుళ్ళూ, నకులసహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ ఏనుగులమీద బాణాలు వేస్తూ భీముడికి రెండుపక్కలా చేరారు. నకులుడికొడుకు శతానీకుడు ఏనుగుల తలలు బాణాలతో పడగొడుతూ విజృంభించాడు.

మగధరాజు తన మదపుటేనుగు అభిమన్యుడిమీదికి వురికించాడు. బాగా మెరుస్తున్న బాణ మొకటి తొడిగాడు అభిమన్యుడు. ఘోరంగా వొదిలిపెట్టాడు. ఏనుగు నుదుటిమీద తగిలి కుంభస్థలం దూసుకుపోయింది బాణం. అంతలోనే కళ్ళు జిగేలుమన్నట్టు మరొక బాణం కొట్టాడతడు. మగధరాజుని ఠారుమనిపించాడు. రెండు పీనుగులూ వొక్కసారే కింద దొర్లిపోయాయి.

ధృష్టద్యుమ్నుడు తళతళలాడుతున్న బంగారం మొదళ్ళ బాణాలతో మగధ ఏనుగుసేన యావత్తూ చిందరవందర చేసేశాడు. అతడి వీరావేశం పగవాళ్ళనూ పొగిడారంటే నమ్మండి. పిడుగులాంటి గద పట్టుకుని వొళ్ళు తెలియకుండా ఏనుగులు వేటాడాడు భీముడు. కొన్నిటి తొండాలు నలగ్గొట్టేశాడు. కొన్నిటి దంతాలు విరిచేశాడు. కొన్నిటి కుంభస్థలాలు భళ్ళుమనిపించేశాడు. కొన్నిటి వొళ్ళు పిప్పిచేసేశాడు. కొన్నిటి పక్కలు విరగదన్నేశాడు. కొన్నిటి వీపులు పీచుపిండి చేసేశాడు. ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ ముఖ్యులైన వాళ్ళూ భీముడితో కలిసి వాడివాడి బాణాలతో ఆ ఏనుగుల్ని నానాఇదీ చేసేసి దుళ్ళగొట్టారు. భీముడు వురికినచోటల్లా అతడిముందు ఏనుగులు వొరిగిపోతూవుండేవి. నెత్తురుకక్కుకుని కూలిపోతూ వుండేవి. కలయదిరుగుతూ వుండేవి. కింద దొర్లిపోతూవుండేవి. ఏనుగురక్తంతో గదా, తానూ తడిసిపోయి ప్రళయకాలయముడిలా పేట్రేగిపోయి మగధసేన పీనుగుపెంట చేసేశాడు భీముడు. జడివానలా పడుతూన్న బాణాల వల్లా, పిడుగులా పడుతూన్న గదవల్లా కలతపడిపోయి, బాధపడిపోతూ వున్న ఏనుగుల్ని గొల్లాడు వొడుపుతో మందలు రొప్పుకుపోయినట్టు తరుముకు పోయాడతడు. పెనుగాలికి కొట్టుకుపోయే మేఘాల గుంపులాగ చెల్లాచెదరయిపోయి, తమ సేన పడదొక్కేస్తూ దుర్యోధనుడి

మీాదికే పరిగెత్తాయి ఏనుగులు. వాటిని అదిలిస్తూ తన యావత్తు సేనా పురికొల్పాడు దుర్యోధనుడు.

రాజు పురికొల్పడంతోనే అమావాస్యనాడు అధికంగా ఉప్పొంగిన సముద్రంలా భీముడిమీాద విరగబడింది కౌరవసేన. అయితే అంత సేననీ వొక్క అడుగైనా ముందుకి రానివ్వలేదు భీముడు. యానా పొడ్డులాగ ఆపేశాడతడు. అలా నిలిపేసి, పెద్దరంకె వేసి అమాంతంగా కలబడ్డాడు. ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ మొదలైన రథికులున్నూ అతడికి తోడయారు. అతడి వలపటా, దాపటా నడిచి తమ ప్రతాపమంతా ప్రదర్శించారు. పుంఖానుపుంఖంగా వొక్కమొగిని బాణాలు కురిపించారు. కౌరవసేన కల్లోలం చేసేశారు. అడివి దహించే అగ్నిహోత్రుడిలాగ కౌరవవ్యూహమంతా పొడిపొడి చేసేసి చెలరేగిపోయాడు భీముడు. ఎంత పోట్లాడుతూవుంటే అంత, వుబ్బిపోతూవుండేది అతని శరీరం. అంత వుప్పొంగిపోతూ వుండేది మనస్సు. రొమ్ముతోనూ, నడ్డితోనూ, తొడలతోనూ, పాదాలతోనూ, యావత్తు శరీరంతోనూ దుర్యోధనుడి గుర్రాలూ, రథాలూ, ఏనుగులూ, బంట్లూ – చతురంగబలం యావత్తూ నేలమీాద మచ్చుకి లేకండా నిష్ఠురంగా తరిమేశాడతడు. మదపుటేనుగు చెర్లాటమాడి కుమ్మేస్తే తుంగమడుగు ఎలా అయిపోతుంది, అదిగో అలా అయిపోయింది మన సేన. అంతసైన్యమూ అడలెత్తిపోయింది, తడబడిపోయింది, నిశ్చేరపోయి నిలబడిపోయింది. భీముడి చుట్టుపట్లకి వెళ్ళడానికి, అతణ్ణి తేరిచూడడానికి మనవాళ్ళలో అక్కడ ఒక్కడికీ గుండెలు లేకపోయాయి. ఒక్కడినోటా ఒక మాట పెగిలితే వొట్టు.

అలా కార్చిచ్చులా చెలరేగిపోతూవున్న భీముడిమీాదికి, ఉరుముతూన్న మేఘంలాగ మహావేగంతో రథం పరిగెత్తిస్తూ శరవర్షం కురిపిస్తూ వచ్చాడు భీష్ముడు. అతణ్ణి రభసంగా వీరత్వంతో

ఎదురుకున్నాడు సాత్యకి. అదిచూశాడు అలంబుసుడు. ఆకాశం పగిలిపోయినట్టు అరుస్తూ వచ్చి సాత్యకిని ఢీకొన్నాడు. తీవ్రమయిన పది బాణాలు అతడి అవయవాలమీద నాటించాడు. బాగా వొళ్ళు మండింది సాత్యకికి. గబాగబా నాలుగు ఇనపబాణాలు కొట్టాడు. అలంబసుడు వెనక్కి తగ్గేశాడు. వీరావేశంతో సింహనాదంచేశాడు సాత్యకి. అతడి సింహనాదం విని కళ్ళకొసలు ఎరుపెక్కి వీరరసోద్రేకంతో చూశాడు భూరిశ్రవుడు. చర్రున వెళ్ళి సాత్యకితో కలబడ్డాడు. "అదిగదీ!" అంటూఅరిచారు కౌరవులు. అలా కలబడి తొమ్మిది ఇనపబాణాలు సాత్యకిమీద నాటించాడతడు. దాంతో బాగా సాన పెట్టిన బాణాలు వర్షంలా కుమ్మరించి అతణ్ణి ముంచెత్తాడు సాత్యకి. అక్కసుపట్టి తమ్ముళ్ళతో భూరిశ్రవుడికి అండగా వరిగెత్తాడు దుర్యోధనుడు. అటు పాండవులున్నూ సాత్యకితో కలిసి ఘోరంగా బాణాలు కుమ్మరించాడు. భీముడు భయంకరంగా ప్రకాశించాడు. నీకుమాళ్ళ మీదికి వురికి వెంటదరిమాడు. తమ్ముళ్ళు తోక ముడవడంతోనే సింహనాదం చేస్తూ దారుణంగా భీముడిమీద కలబడ్డాడు దుర్యోధనుడు. అతడి వొళ్ళు తూంట్లుపడ్డట్టు తొమ్మిది బాణాలు కొట్టాడు. అందాకా కిందనేవుండి పోట్లాడుతున్నాడు భీముడు. సారథికి కేక వేసి చప్పున రథమెక్కాడతడు. కళ్ళల్లో నిప్పులు కురుస్తూ అట్టహాసం చేశాడు. ఒక్కపెట్టుని ఉగ్రగతితో పది బాణాలు దుర్యోధనుడికి తగిలించాడు. మరిమూడు బాణాలు అతడి సారథి నందకుడి మీద వేశాడు.

నిలువునా నిప్పులు కక్కాడు దుర్యోధనుడు. బాణాలు ప్రవాహంలా వేసి భీముణ్ణి ముంచెత్తాడు. మూడు బాణాలు అతడి సారథి విశోకుడిమీద వేశాడు. మరొక బాణం వేసి భీముడి గొప్ప విల్లు విరిచేశాడు. కోపంతో మండిపోయి మరొకవిల్లు పుచ్చుకున్నాడు

భీముడు. ఉగ్రమైన బాణంతో దుర్యోధనుడి ధనుస్సు నరికేశాడు. మరో ధనుస్సు తీసి, పిడుగులాంటి బాణంతో కొట్టాడు దుర్యోధనుడు. భీముడి ఎదురొమ్ముమీద దారుణంగా కొట్టాడు. దెబ్బతో మూర్ఛపోయి పడిపోయాడు భీముడు. అభిమన్యుడూ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదికుమారుళ్ళూ అదిచూసి మండిపోయారు. ఒక్కుమ్మడిని బాణాలతో, దుర్యోధనుణ్ణి ముంచెత్తారు.

భీముడు తెలివుకున్నాడు. కాలయముడిలాగ విజృంభించాడు. దుర్యోధనుడిమీదా, శల్యుడిమీదా దుర్దాంతమైన పరాక్రమంతో కలబడ్డాడు. మహావేగంతో వాళ్ళని బాణాలతో కప్పేశాడు. నీసైనికులు చుట్టువట్ల చేరలేకపోయారు. సింహాంచూస్తే ఏనుగు లెలాఅయిపోతాయి, అదిగో అలా అయిపోయారు వాళ్ళు.

అపరాహ్ణమయింది.

నీకుమారుళ్ళు సేనానీ, సుషేణుడూ, జలసంధుడూ, సులోచనుడూ, భీమసేనుడూ, భీమరథుడూ, వీరబాహుడూ, దుష్టదర్శనుడూ, దుర్ముఖుడూ, వివిత్సుడూ, వికటుడూ, ఉగ్రుడూ, అలోపుడూ, సముడూ — ఈపద్నాలుగురూ ఎన్నో అన్ని బాణాలు రువ్వుతూ భీముణ్ణి ముట్టడించారు. పెద్దపులి లేడిపిల్లలమీద కలబడినట్టు వాళ్ళమీద కలబడ్డాడు భీముడు. ఒక్క వెడల్పాటి బాణంతో సేనాని తల నరికేశాడు. మూడు బాణాలతో జలసంధుణ్ణి యమలోకం పంపేశాడు. సుషేణుడి గుండెలమీద వొక ఇనపబాణం నాటించి పడగొట్టేశాడు. అయిదు బాణాలతో వీరబాహుణ్ణి చంపేశాడు. ఒక వెడల్పాటి బాణంతో ఉగ్రుడి తల కుండలాలతోకూడా ఎగరగొట్టేశాడు. భీమసేనుణ్ణీ, భీమరథుణ్ణీ వొక్కుమ్మడిని లెక్కలేనన్ని బాణాలువేసి కూలగొట్టేశాడు. నవ్వుతూ నాలుగు బాణాలతో సులోచనుణ్ణి కడతేర్చేశాడు. తక్కినవాళ్ళు భయపడిపోయి తోకముడిచేశారు.

"అయ్యో, చూస్తారేం! రాజకుమార్ళుని భీముడు చంపేస్తున్నాడు! భయపడతారేం?" — వీరరథికు లందరినీ చూసి పురికొల్పుతూ కేకలు వేసి వురికాడు భీష్మసేనాని. అతణ్ణి దాటుకుంటూ తన మదపుటేనుగు భీముడిమీదికి పరిగెత్తించి బాణాలతో అతణ్ణి కప్పేశాడు భగదత్తుడు. మేఘాలు కప్పేస్తే సూర్యుడెలా అవుపిస్తాడు, అలాగ భగదత్తుడి బాణాల్లో అవుపించాడు భీముడు.

అభిమన్యుడూ మొదలైన ముఖ్యులు అది చూశారు. చలించకండా కలబడి ఏనుగు మీద వరసపెట్టి బాణాలు నాటించారు. ఒళ్ళంతా రక్తం ధారలుకడుతూవున్నా భయంకరంగా విజృంభించిం దది. ఒక్కొ మొగిని భోరున సెలయేళ్ళు ప్రవహిస్తూవుంటే, కలాసాకోసం నాట్యంచేసిన నడకొండలా అవుపించిం దది. అలా చెల రేగిపోయి సైన్యం చంపేస్తూవుంటే పాండవయోధులు వొక్కరూ దాన్ని నిలవరించలేక నిచ్చెర పోయారు. అదిచూసి కౌరవసేన వాళ్ళమీద మరింత విరుచుకుపడింది. సంతోషంతో దుర్యోధనుడు రథంపరిగెత్తించాడు. తెగించి భీముడిమీద కలబడ్డాడు. వరసపెట్టి గట్టిగట్టి ఇనప బాణాలు అతడి గుండెలమీద నాటించాడు. మూర్ఛపోతూ జెండా కొయ్య పూతపట్టుకున్నాడు భీముడు. దాంతో వెర్రికేకలు వేసేశారు మనవాళ్ళు.

చూసి సింహనాదంచేశాడు ఘటోత్కచుడు. తండ్రిదగ్గిరికి వచ్చాడు. ఇది మాయాయుద్ధానికి తగిన సమయమని భావించాడు. పాండవుల సహాయంకోసం దేవేంద్రుడు ఐరావత మెక్కివచ్చాడని శత్రువులు అనుకునేట్టు, కైలాసపర్వతమంత ఎత్తూ, నాలుగు దంతాలూవున్న ఏనుగుమీద కూచుని, వజ్రాయుధం పట్టుకుని వెయ్యి కళ్ళతో ప్రత్యక్షమయా డతడు. అంజనం వామనం మొదలైన దిగ్గజాలవంటి ఏనుగులమీద దిక్పాలకులలాగ వోడి రాక్షసులు అతడి

రెండుపక్కలా నడిచారు. దురుసుగా వచ్చి వాళ్ళంతా దుర్యోధనుడి మీదపడ్డారు. అడ్డుకోవచ్చిన భగదత్తుడి ఏనుగుమీదికి వురికి బాణాలతో కొట్టి, ఏనుగుల దంతాలతో పొడిపించి, దాన్ని నానాబాధా పెట్టేశారు. భయపడిపోయి, బెంబేలుపడిపోయి, వెనక్కితిరిగి, మనసేనంతా తొక్కేస్తూ దిక్కు లదరినట్టు పరుగుతీసిం దది.

ఇలా ఘోరంగా భగదత్తుడి ఏనుగు తరిమేసి, పేట్రేగిపోయి దుర్యోధనుడిమీదికి పరిగెత్తాడు ఘటోత్కచుడు.

"ఘటోత్కచుడు తన మాయాగర్వంతో భయంకరంగా తయారయాడు. భగదత్తుణ్ణి తరిమేసి దుర్యోధనుడిమీద కలబడ్డాడు. చప్పున అడ్డుపడకపోవడం పౌరుషం కాదు. రాక్షసుణ్ణి ఘిరాయించాలి. జంకేరకం కాదు భగదత్తుడు. ఘటోత్కచుణ్ణి మూడు చెరువులనీళ్ళు తాగించగలడు. అయితే ఏంలాభం! ఏనుగు ఆగడం లేదు. "అదిగో ఘటోత్కచుడి ఏనుగు రారాజుమీదికి వురుకుతూ వుంది" — ద్రోణుడితో అంటూ ఏనుగుని కొట్టండని యోధులికి చెయ్యివిసిరి, తనరథం ముందుకి పరిగెత్తించాడు భీష్ముడు. ద్రోణాచార్యులూ మొదలైన మహారథులున్నూ అతడివెంట వెళ్ళి దుర్యోధనుడికి అడ్డుపడ్డారు. ఘటోత్కచుడిమీద రకరకాల అస్త్రాలు ప్రయోగించారు, ధర్మరాజూ మొదలైన పాండవులూ, ద్రుపదుడూ, విరాటరాజూ మొదలైన దండనాయకులూ ఘటోత్కచుడితో కలిసి అపరిమితమైన బాణాలు వేశారు. ఘోరంగా జరిగింది యుద్ధం. భీష్ముడు అపరిమితమైన పరాక్రమంతో పాండవసేన ఖండించాడు. ఘటోత్కచుడు అడ్డూ ఆపూ లేని మహావిక్రమంతో సింహనాదంచేశాడు. అతడి ఏనుగులు నలిగిపోయి, నీసేన యావత్తూ చింతరవందర చేసేశాయి.

"ఇతడితో ఇప్పుడు యుద్ధంచెయ్యడం నచ్చలేదు నాకు" ద్రోణుడితో అన్నాడు భీష్ముడు– "పొద్దు గుంకిపోతూవుంది. ఇవాళకి వెళ్ళిపోయి రేపు పొద్దున్న యుద్ధానికి వద్దాం" అన్నాడు.

"అదే మంచిది" అంటూ తమ రథాలవాళ్ళతో యుద్ధమాపండని సేనలు వెనక్కి మళ్ళించాడు ద్రోణాచార్యులు.

కౌరవులు వెనక్కి మళ్ళడంతోనే సింహానాదాలుచేశారు పాండవులు. భేరీలు, శంఖాలూ మొదలయిన తూర్యారవాలు భీషణంగా మోయించారు. నీకొడుకులూ, పేరుపడ్డ సేనానాయకులూ చిన్నబుచ్చుకుని విడిదలకి వచ్చేశారు. ఘటోత్కచుణ్ణి బ్రహ్మరథం పట్టేసి, నవ్వుతూ కేరుతూ తమ శిబిరానికి వెళ్ళిపోయారు పాండవులు.

ధృతరాష్ట్రుడు: సంజయా, యుద్ధంలో ఎప్పుడూ పాండవులు పై చేయీ, పరాక్రమంలో నాకొడుకులు తీసికట్టూ – ఇదే పాడుతున్నావు. తొలినించీ ఇదే వింటున్నాను. భీష్ముడూ, ద్రోణుడూ, శల్యుడూ – ఇంకా ఎంతోఅంతమంది మహాయోధులు మన సేనలో వున్నారు. ఇంతలేసివాళ్ళని తుక్కుకింద కట్టేసి, వాళ్ళు ఇంత వాళ్ళవడంలో ఏమిటి రహస్యం? మందా? మాయా? మంత్రమా?

సంజయుడు: మందూ, మాయా, మంత్రమూ ఏదీ కాదు. మహారాజా, దీనిలో వున్న రహస్యమంతా వొక్కటే, ధర్మం. ధర్మమూ, సత్యమూ తప్పనివాళ్ళు పాండవులు. ధర్మమంటే అక్కర లేదు నీకుమాళ్ళకి. వాళ్ళకి తాళంవేస్తూ పాపానికే నెట్టుకున్నావు నువ్వు. అదంతా ఏమవుతుంద మరి! ఊరికే పోతుందా? ధర్మం గెలవదా? వాళ్ళు గెలవడమూ, మీరు వోడిపోడమూ తప్పదు. ఆనాడే చెప్పాడు విదురుడు. మనకి కొత్తేముం దిపుడు!

నువ్వు ఇప్పుడు అడిగినట్టే ఆవాళరాత్రి దుర్యోధనుడూ అడిగాడు భీష్ముణ్ణి. ఆయన ఏమన్నాడో చెపుతాను, విను. "మొదటి

ప్రార్థించావు. ఎవరు వీళ్ళు?' అని బ్రహ్మదేవుణ్ణి అడిగారు. 'పరమ మునీశ్వరులు వీళ్ళు' అన్నాడు బ్రహ్మ – 'ఆదిపురుషులు, నర నారాయణులు నాకు ఆరాధ్యులు. వాళ్ళిద్దరినీ భూలోకంలో పుట్టండని ప్రార్థించాను. దానికి దయతో అంగీకరించారు. భూమ్మీద విలాసంగా పుట్టిన వీళ్ళని కేవలం మనుష్యులే అనుకుని లెక్క చెయ్యనివాళ్ళు చెడతారు. అలా కాకండా వాళ్ళని తెలుసుకుని భక్తితో కొలిచిన వాళ్ళకిమాత్రం శుభం కలుగుతుంది.' అని చెప్పి బ్రహ్మ తన లోకానికి వెళ్ళిపోయాడు. కొలువులో వాళ్ళంతా తమతమ స్థానాలికి వెళ్ళి పోయారు. ఈకథ నేను నారదుడూ, జామదగ్న్యుడూ, వ్యాసుడూ మొదలైనవాళ్ళవల్ల విన్నాను. నరనారాయణులతో విరోధం వద్దని లోగడ మహామునులు నిన్ను వారించారు కదా! అయినా నువ్వు మదాంధుడవయి వినలేదు. ఇకనైనా కృష్ణుణ్ణి ఆశ్రయించు. పాండవులతో పొత్తుకలిగి మసులుకో" అనిచెప్పి ఊరుకున్నాడు భీష్ముడు. సీకుమారుడు అదంతా పెడచెవినిపెట్టాడు. తగినవాళ్ళు చెప్పిన హితోపదేశం వినకపోవడం మీకున్నదే కదూ, సరే తరవాత సంగతి విను.

## ఐదో రోజు

మర్నాడు తెల్లవారింది. భీష్ముణ్ణి ముందుపెట్టుకుని సముద్రం పొంగివచ్చినట్టు రణస్థలానికి తరలివచ్చింది కౌరవసేన. మకరవ్యూహం పన్ని కయ్యానికి కాలుదువ్వుతూ నుంచుంది. అటు పాండవులూ వచ్చేశారు. శ్యేనవ్యూహం పన్నారు వాళ్ళు. వ్యూహం మొహంలో భీముడు నుంచున్నాడు. కళ్ళలో ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ నుంచున్నారు. శిరస్సులో సాత్యకి, కంఠంలో అర్జునుడూ నుంచున్నారు. ఎడమరెక్కలో విరాటరాజూ ద్రుపదుడూ, కుడిరెక్కలో కేకయులూ

---

మకరం: మొసలి. శ్యేనం: డేగ.

నుంచున్నారు. వీపున అభిమన్యుడూ, ద్రౌపది కుమారులూ, తోకలో నకుల సహదేవులతో కలిసి ధర్మరాజూ నుంచున్నారు.

ఇలా రెండు సేనలూ వ్యూహాలు పన్ని యుద్ధానికి సిద్ధపడ్డాయి. ఒక వ్యూహం మొసలి. రెండోది డేగ. మొసలి మొహం చీల్చుకుంటూ లోపల చొచ్చుకుపోయాడు డేగ ముంచు భీముడు. మొసలి మొహం లోనే వున్నాడు భీష్ముడు. ముందు అతడిమీదే కలబడ్డాడు భీముడు. బాణవర్షంతో అతణ్ణి ముంచెత్తాడు. నెయ్యిపోసిన అగ్నిహోత్రుడి లాగ లేచాడు భీష్ముడు. భీముణ్ణి కీచుకీచుమనిపించాడు. త్రేతాగ్ని దహించినట్టు పాండవసేన మాడ్చి వొదిలిపెట్టాడు. అంతలో అర్జునుడు వచ్చిపడ్డాడు. దివ్యాస్త్రాలు వేసి భీష్ముడి గర్వం అణిచేశాడు. అడ్డూ ఆపూ లేకండా విజృంభించాడు. ఎండాకాలం సూర్యుడిలాగ కౌరవ సేనమీద తన ప్రతాపం చూపించాడు. మనసేన నిలవలేకపోయింది. చెల్లాచెదురయిపోయింది. అదిచూసి దుర్యోధనుడు ద్రోణాచార్యులు దగ్గిరికివచ్చి ఇలాఅన్నాడు: "పాండవులంటే ఎక్కడలేని న్యాయాలూ వస్తాయి మీకు. నువ్వూ భీష్ముడూ కళ్ళెర్రచేస్తే దేవతలయినా నిలవలేరు. అర్జునుడు మనసైన్యం అలా మాడ్చేస్తూవుంటే మీరు ఉపేక్షించి వూరుకోడం న్యాయమేనా అని అడుగుతున్నాను?"

"ఏం మాటలివి?" అంటూ నొచ్చుకున్నాడు ద్రోణాచార్యులు—"ఎప్పుడూ వున్నదేనా ఇవాళే వచ్చిందా వాళ్ళప్రతాపం! సముద్రంలో ఆసపతుంబవేస్తే పట్టినంత పడుతుంది, కాని అంతా పట్టదుకదా! ఇంతకీ వాళ్ళని గెలవడం మాత్రం మాశక్యంకాదు. అది బాగా తెలుసుకోడం అవసరం నువ్వు." ఇలా అంటూనే పాండవసేనమీదికి పరిగెత్తాడతడు. ద్రోణాచార్యుల విజృంభణంతో తడబడిపోయి చెదిరిపోడం మొదలెట్టాయి పాండవసేనలు. అప్పుడు వాయువేగంతో వచ్చి అతణ్ణి ఎదిరించాడు సాత్యకి. తళతళా మెరు

స్తున్న బాణాలతో అతణ్ణి ముంచెత్తాడు. నవ్వుతూ కరుకయిన బాణాలు సాత్యకిమీద కురిపించాడు ద్రోణుడు. దెబ్బలు తింటూన్నా కదలకండా తీవ్రంగా పోరాడాడు సాత్యకి. అదిచూసి భీముడు సాత్యకితో కలిశాడు. వాడివాడి బాణాలు ద్రోణుడి మీద తగిలించాడు. శల్యుడూ, భీష్ముడూ ద్రోణుడికి తోడ్పడ్డారు. భీముణ్ణి మోదడం లంకించుకున్నారు. అభిమన్యుడూ, ద్రౌపది కొడుకులూ చువ్వలలాగ వచ్చి వాళ్ళమీద పడ్డారు. అడ్డులేని బాణాలతో వాళ్ళని ముంచెత్తారు. అల్లెతాడు మోగిస్తూ, అమ్ములతో ఆకాశం నింపేస్తూ శిఖండికూడా మహావేగంతో వచ్చి భీష్ముణ్ణి ఆక్రమించాడు. ఆవడితనమూ, అబిసుతనమూ చూసి ఇటూ అటూ పరిగెత్తింది మన రాణువ. శిఖండి అలా రావడంతోనే మొహం తిప్పేసుకున్నాడు భీష్ముడు. "ఆడదానితోనా నేను పోట్లాడతాను!" అంటూ ఎదిరించకండా తప్పుకుపోయాడతడు.

భీష్ముడు తప్పుకోగానే ద్రోణాచార్యుల్ని పురికొలిపాడు దుర్యోధనుడు. పెద్దపులిలాగ శిఖండిని వెంటదరిమాడు ద్రోణుడు. దాంతో కౌరవసేన యావత్తూ పొలికేకలు వేస్తూ విరగబడింది. అటు పాండవులూ తిరగబడ్డారు. పెద్ద దొమ్మీయుద్ధం జరిగిపోయింది. ఘోరంగా తయారయింది రణరంగం.

ధూళి మేఘం. కత్తులూ మొదలైన ఆయుధాల తళతళలు మెరుపులు. ధనుష్టంకారాలు ఉరుములు. నెత్తురువానకి సరిగ్గా ఇవన్నీ సరిపోయాయి. పోగులుపడ్డ గుర్రాల పేగులూ, ఏనుగుల పీనుగులూ, రక్తాలతో తడిసిన తెల్లబట్టలూ, ప్రాణాలు బలిపెట్టిన భటుల కళేబరాలూ – అబ్బ, దారుణంగా వుంది రణస్థలం.

ఉభయ సైన్యాలూ గావుకేకలు వేస్తూ నరుక్కుంటూ వుంటే, బాణాలు గుప్పుకుంటూ వుంటే, గదలతోనూ తోమరాలతోనూ

కొట్టుకుంటూ వుంటే దిక్కులు గడగడలాడాయి. ఆకాశంమీద గుంపు గుంపులయి చూస్తూవున్న దేవతలలోనూ కోలాహలం బయలు దేరింది.

అటు భీముడూ, ఇటు భీష్ముడూ ఇద్దరూ రెండు కంచుబురుజుల్లాగ కాశారు. భీముడికి అర్జునుడు దన్నయ్యాడు. భీష్ముడికి ద్రోణుడు దన్నయ్యాడు. ఎవరి పరాక్రమం వారు ప్రదర్శించారు.

కళింగుల ఏనుగుసేన భీముడిమీదికి రెచ్చగొట్టాడు దుర్యోధనుడు. ఇదే సమయమని దుర్యోధనుడి తమ్ములు యావన్మందీ భీముణ్ణి చుట్టుముట్టారు. భీష్ముడూ, ద్రోణుడూ, కళింగగజసేనా, సీకుమాళ్ళూ — ఇంతమందీ భీముడిమీద పడడంచూస్తే పెద్ద పర్వతం మీద దొంతర దొంతరలయి మేఘాలు కమ్మేస్తే ఎలా అవుపిస్తుందో అలా అవుపించింది.

గాండీవం మోగిస్తూ పెనుగాలిలా చెలరేగిపోయాడు అర్జునుడు. అంతమందినీ రొప్పిరొప్పి పడమోది వొదిలిపెట్టాడు. కౌరవ కుమాళ్ళ రథాలూ, కాళింగుల ఏనుగులూ అర్జునుడిముందు అర నిమిషమైనా ఆగలేకపోయాయి. వెనక్కి తిరిగిపోయి వెర్రిపరుగులు తీశాయి. ఇక తక్కిన బలగం సంగతి చెప్పేదేముంది! ముచ్చెమట్లు పోసుకుని భీష్ముడి వెనక్కి పారిపోయింది.

లేనిధైర్యం తెచ్చుకున్నాడు దుర్యోధనుడు. చెయ్యివిసిరి మళ్ళీ సైన్యం రెచ్చగొట్టాడు. ఉత్సాహం కలిగించి హెచ్చరించాడు. దాంతో కాంభోజసైన్యమూ, గోపాలసేనా, సింధు గాంధార సైన్యాలూ, త్రిగర్త కళింగ సేనలూ వేసుకుని శకునీ, జయద్రథుడూ పదండంటే పదండంటూ పాండవులమీదికి బయలుదేరారు. వాళ్ళకి దన్నుగా దుశ్శాసనుడూ బయలుదేరాడు. ఇంతమందీ వెళ్ళి భీముణ్ణీ, అర్జునుణ్ణీ ముట్టడించారు.

భీమార్జునలికి దన్నుగా ధర్మరాజు వచ్చాడు. అతడితో చేది, కాశి, కరూశ, పాంచాలసేనలతో ధృష్టద్యుమ్నుడూ మొదలైన రాటుదేరిన రథికులూ ఎత్తివచ్చారు.

విందుడూ అనువిందుడూ కాశీరాజుతో కలబడ్డారు. జయద్రథుడు భీముడితో కలబడ్డాడు. వికర్ణుడు సహదేవుణ్ణి ఢీకొన్నాడు. చిత్రసేనుడు శిఖండిమీదికి వెళ్ళాడు. దుర్యోధనుడు విరాటరాజుతో పోరాడాడు. త్రిగర్తులు నకులుణ్ణి చుట్టుముట్టారు. ద్రోణుడు చేకితానుడు మీదికీ, సాత్యకిమీదికీ వురికాడు. కృపుడూ కృతవర్మా కలిసి ధృష్టద్యుమ్నుడిమీద పడ్డారు. అభిమన్యుడు శాల్వుడి మీదికీ, కేకయులమీదికీ వచ్చాడు. ధృష్టకేతుడూ, ఘటోత్కచుడూ సోదరుల మీద విరుచుకుపడ్డారు. ధర్మరాజూ శల్యుడూ కలబడ్డారు.

ఇలా ఉభయులూ సంకులసమరం లంకించుకున్నారు. శస్త్రానికి శస్త్రం, ఆయుధానికి ఆయుధం, బాణానికి బాణం తగిలి మంటలు పుట్టి ఆకాశంమీదికి పరిగెత్తేవి. మధ్యాహ్నసూర్యుడి కిరణాలిని పారదోలుతున్నాయా అన్నట్టు వుండేవి. రథాలు గుద్దేసి తుళ్ళిపోయి దొర్లిపోతూ వుండేవి ఏనుగులు. ఏనుగులు తొండాలతో పట్టిలాగేసి విసిరేస్తూవుంటే ఉండిపిండ మైపోతూ వుండేవి రథాలు. గుర్రాలు తొక్కేస్తూవుంటేవాటి డెక్కల్లోపల నలిగిపోతూ వుండేవాళ్ళు కాలిబంట్లు. భటులు బాదేస్తూ, నరికేస్తూవుంటే రక్తాలు వరదలు కడుతూ పరిగెడుతూవుండేవి గుర్రాలు. ఇలా యుద్ధరంగం యావత్తూ మహా బీభత్స మయిపోయింది. అదంతా చూసి దేవతలవాళ్ళుకూడా జలదరించింది. అందులో భీముడికి పట్ట పగ్గాలే లేకపోయాయంటే నమ్మండి. అలావిజృంభించా డతడు. అతడి వడితనానికి ఎక్కడలేని కోపమూ పొడుచుకు వచ్చింది భీష్ముడికి. ఎన్నో అన్ని బాణాలు కొట్టా డతడిమీద. ఒళ్ళంతా రక్తాలు కారేటట్టు చేసేశాడు. ఆది

చూశాడు సాత్యకి. ఏనుగుకి బరికోల చూపిస్తే ఎలా కోపం వస్తుంది, అదిగో అలా కోపంవచ్చిం దతడికి. దారుణమైన బాణాలతో భీష్ముణ్ణి కొట్టడ మారంభించా డతడు. దాంతో మరింత వొళ్ళు మండింది భీష్ముడికి. బాగా పూనిపెట్టి, వొక్క బాణం వేశాడతడు. సాత్యకి సారథి తల ఎగరకొట్టేశాడు. సారథి లేకపోయేసరికి చుక్కాని లేని వోడలా అయిపోయింది సాత్యకి రథం. దారీ తెన్నూ లేకండా ఎటుపడితే అటే పరిగెత్తాయి గుర్రాలు.

"మళ్ళించండి ! మళ్ళించండి ! రథం ! పట్టుకోండి ! అడ్డుకోండి ! పరిగెత్తండి ! తడబడిపోతున్నాడు సాత్యకి వేగం. వేగం రథం నిలవరించండి !" - పాండవసేనలో ఇవే కేకలు చెలరేగాయి. సారథిలేని రథంతో వున్న సాత్యకిమీంద చెయిచేసుకోలేదు భీష్ముడు. అతణ్ణి వొదిలేసి పాండవసైన్యం చెండాడడం ప్రారంభించా డతడు.

అప్పుడు విరాటరాజు కాలయముడిలాగ నిప్పులు కక్కుతూ పరిగెత్తుకు వచ్చాడు. రెప్పపాటులో భీష్ముడిమీంద మూడు దారుణమైన బాణాలు కొట్టాడు. తడువుకోకండా వెంటనే అతడి గుర్రాలనీ కొట్టాడు. భీష్ముడుమాత్రం వూరికే పోయేవాడా ? గబా గబా పది బాణాలువేసి విరాటరాజుని రక్తపాన్నం చేయించిమరీ వొదిలిపెట్టాడు.

అంతలో అర్జునుడు భీష్ముడిమీందికి రథం వురికించబోయాడు. అడ్డంగా వెళ్ళాడు అశ్వత్థామ. ఆరుబాణాలు అర్జునుడిమీంద నాటించాడు. నవ్వుతూ వొకేవొక్క బాణం వేశాడు అర్జునుడు. అశ్వత్థామ ధనుస్సు రెండుముక్కలయి వూరుకుంది. చప్పున మరో ధనుస్సు తీశాడు అశ్వత్థామ. విడుపూవిరామంలేకండా బాణాలు గుప్పించాడు. అర్జునుణ్ణీ, అతడిసారథి శ్రీకృష్ణుణ్ణీ వొళ్ళువుంటలుచ్చుకున్నట్టుచేశాడు.

అర్జునుడి కళ్ళకొనలు కెంపులు మెరిశాయి. ఆ మెరుపులతో బాణాలున్నూ పరిగెత్తాయి. గాండీవం గర్జించింది. అశ్వత్థామ కళ

చం చీలికలయింది. అతడి శరీరం రక్తాలు వరదలు కట్టింది. చలించ లేదు అశ్వత్థామ. ధనుస్సు కింద పెట్టలేదు. బాణవేగం తగ్గించలేదు. గురుపుత్రుడు చావుదెబ్బలు తినేశాడు కదా! అని జాలీ, అయినా పౌరుషం వొదలలేదు కదా అని మెప్పూ – రెండూ కలిగాయి అర్జునుడి హృదయంలో. "బ్రాహ్మడితో ఇంతెందుకు పోనిస్తూ" అనుకుంటూ మరోతట్టు రథం మళ్ళించాడతడు.

అర్జునుడు అటు మళ్ళగానే ఇటు భీష్ముడిమీద వురకబోయాడు భీముడు. అడ్డంగా వెళ్ళి అయిదు బాణాలతో కొట్టి అతడి వొళ్ళు చీలికలయినట్టు చేశాడు దుర్యోధనుడు. జూలు లాగిన సింహంలా తిరగబడ్డాడు భీముడు. అంతకి రెండింతలు తెగిలించాడు దుర్యోధనుడి మీద. మహారాజా, ఇద్దరూ నిష్ణాతులు మొనగాళ్లు. సమ ఉజ్జీలు. ఇద్దరూ వొకళ్ళని వొకళ్లు బాణాలతో కొట్టుకుంటూ వుంటే, హోరాహోరి పోరాడుతూవుంటే, చూస్తూవున్న జనం ఏమన్నారో విను–"శత్రువు లనే చీకట్లు పారదోలడానికి ఇద్దరూ సూర్యులలాంటివాళ్ళు. ఇలాంటి వాళ్ళు దెబ్బలాడుకుంటున్నారూ అంటే దీనంతటికీ ధృతరాష్ట్రుడి బుద్ధి తక్కువా, అతడి ముష్కరమైన లోభగుణమూ మాత్రమే కారణం" అన్నారు.

చిత్రసేనుడూ, పురుమిత్రుడూ, భీష్ముడూ దుర్యోధనుడితో కలిశారు. భీముణ్ణి చుట్టుముట్టారు. అప్పుడు అల్లెతాడు మోగిస్తూ అడ్డంగా వచ్చిపడ్డాడు అభిమన్యుడు. అతితళా మెరిసిపోతూవున్న ఏడు బాణాలు పురుమిత్రుడిమీద తెగిలించాడు. డబ్బయి బాణాలు భీష్ముడి మీద వేశాడు. చిత్రసేనుడిమీద పది బాణాలుకొట్టి అతడి వొళ్ళంతా మంటలు పుట్టించాడు. తమని ఎన్ని బాణాలతో కొట్టాడో అన్ని బాణా లతోనూ అతణ్ణి కొట్టారు పురుమిత్రుడూ చిత్రసేనుడున్నూ. ఉగ్ర మైన కొత్తకొత్త బాణాలు ఎన్నోఅన్ని అభిమన్యుడిమీద నాటిం

చాడు భీష్ముడు. ఇంతమందినీ వూపేస్తూ యుద్ధం చేశాడు అభిమన్యుడు. చిత్రసేనుడి విల్లు విరిచేశాడు. అతడి గుర్రాలు కొట్టేశాడు. అతడి కవచం చిలకలు చేసేశాడు. శరీరం తూంట్లు తూంట్లు చేసేశాడు.

కౌరవరాజకుమార్లు అంతమందీ వొక్కసారి అభిమన్యుడిమీద పడ్డారు. శరవర్షం కురిపించి అతణ్ణీ అతడి రథాన్నీ ముంచేశారు. అమాంతంగా ఉగ్రుడై అయిపోయాడు అభిమన్యుడు. మంచి ఎండాకాలంలో బాగా ఎండిన అడివిని ముట్టుకున్న దావాగ్నిలాగ బాణాగ్నితో వాళ్ళని కాల్చెయ్యడం మొదలెట్టాడు. గుర్రాలు పురికిస్తూ, ప్రళయ తాండవం చేసే శివుడిలాగ యుద్ధరంగంలో వీరనృత్యం చేశాడతడు. అతణ్ణి చూసి శత్రువులు కూడా ముక్కుమీద వేలు పెట్టుకున్నారు.

## అభిమన్యుడూ లక్ష్మణకుమారుడూ

అలా రెచ్చిపోయి కౌరవసేన చించిచెండాడుతున్నాడు అభిమన్యుడు. అమాంతంగా అతడి ఎదటికి వెళ్ళాడు లక్ష్మణకుమారుడు. ఇలా వెళ్ళాడో లేదో ఎన్నో అన్ని బాణాలు రువ్వాడు అభిమన్యుడిమీద. అరకాలిమంట మరింత నెత్తికెక్కించి అభిమన్యుడికి. గట్టిగట్టి బాణాలు సంధించాడతడు. లక్ష్మణుడి గుర్రాలు కూల్చేశాడు. అతడి సారథినీ చంపేశాడు. రథంలేకండా అయిపోయాడు లక్ష్మణుడు. అయినా జంకలేదతడు. శక్తి తీసి అభిమన్యుడిమీద విసిరాడు. దానిని సగంలోనే తెగేశాడు అభిమన్యుడు. ఆ వూపుని లక్ష్మణుణ్ణి చావుదెబ్బలు కొట్టేశాడతడు. హరిబ్రహ్మాదులయినా అడ్డం లేరన్నట్టున్నాడతడు. అంతలో చప్పున రథం పరిగెత్తించుకు వచ్చాడు కృపాచార్యులు. లక్ష్మణకుమారుణ్ణి తన రథంమీద తప్పించుకు వచ్చేశాడు. అదంతా దుర్యోధనుడి కళ్ళముందే జరిగిపోయింది.

అప్పుడు మన యోధులందరినీ హెచ్చరిస్తూ విజృంభించాడు భీష్ముడు. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, పదాతులూ — వీళ్ళందరి తోనూ నేల నేలంతా మేఘాలు కప్పిన ఆకాశంలా అవుపించింది. యుద్ధవిద్యలో రాటు దేరిన సాత్యకి అటు విజృంభించాడు. అద్భుత మైన హస్తలాఘవం ప్రదర్శించా డతడు. బాణం తియ్యడం, సంధించడం, విడిచిపెట్టడం - ఊహించలేనంత వడితనం చూపెట్టాడు. పుంఖానుపుంఖాలు, బాణాలు వేసి కౌరవసేన నుదుమాడడ మారంభించాడు. నెయ్యి పోసిన అగ్నిహోత్రు డిలామండిపోతూ వెళ్ళి సాత్యకిని ముట్టడించాడు భూరిశ్రవసుడు. ప్రళయాగ్నిశిఖలవంటి బాణాలు లెక్కా జమాలేకండా కుమ్మరించాడు. దాంతో సాత్యకితో వున్న యోధులు భయపడిపోయి వెనక్కితగ్గేశారు. సాత్యకి కుమాళ్ళు పదిమందీ ధైర్యంతోవచ్చి భూరిశ్రవసుణ్ణి ఎదిరించారు. "ఇదిగో, భూరిశ్రవసా! నీతో చెయ్యీ చెయ్యీ కలపాలని సరదాపడే వచ్చాం మేము. మాలో ఎవణ్ణయినా వొకణ్ణి కోరుకో. సరాసరి యుద్ధంచేద్దాం" అంటూ కవ్వించా రతణ్ణి.

వాళ్ళని చూసి పకపకా నవ్వాడు భూరిశ్రవసుడు. "అబ్బా యిలా, మీలో వొకొక్కరూ అయితే నా బాణాలముందు తట్టుకోలేరు. అంచేత చేవంటూవుంటే పదిమందీ కలిసే రండి. నాచేవేదో చూద్దురు కాని" అన్నా డతడు.

మట్టమధ్యాహ్న మయింది. సాత్యకి కొడుకులు పదిమందీ భూరిశ్రవసుడిమీద విరుచుకుపడ్డారు. బాణవర్షం కురిపించారు. అవన్నీ దూరంనించే ముక్కముక్కలు చేసి కొట్టే శాడు భూరిశ్రవసుడు. పైగా పదిమందినీ బాణాలతో ముంచెత్తి వొదిలిపెట్టాడు. మరింత రెచ్చిపోయారు సాత్యకికొడుకులు. ఎన్నో అస్త్రబాణాలు వేసి భూరిశ్రవసుణ్ణి ముచ్చెమటలు పోయించారు. ఆ వూపుతో అతణ్ణి హతమార్చెయ్య

దానికే పూనుకున్నారు వాళ్ళు. పట్టలేనంత కోపం వచ్చింది భూరిశ్రవసుడికి. పదిబాణాలు కొట్టి పదిమంది బాణాలూ పుటుకుపుటుకు మనిపించేశాడు. అంతటితోనూ ఆగలేదతను. తళతళమంటూవున్న పదే పది బాణాలు కొట్టాడు. పదిమంది తలకాయలూ తెగనరికేసి, భూదేవికి బలిపెట్టేశాడు. గావుకేకలు వేసి కోలాహలంచేశారు కౌరవులు.

కళ్ళ ఎదట కుమారుల హత్య చూశాడు సాత్యకి. దుఃఖంతోనూ, కోపంతోనూ నిలువునా వొణికిపోయాడతడు. ముందూ వెనకా కనబడలేదతడికి. ఉన్నపాళాన రథం వురికించాడు. భూరిశ్రవసుడి రథానికి గుద్దించాడు. నొగతో నొగ రాపాడించి భూరిశ్రవసుడి సారథిని చంపేశాడు. అతడి గుర్రాలు నరికేశాడు. భూరిశ్రవసుడుమాత్రం సామాన్యుడా ? అతడూ అలాగే సాత్యకి సారథిని చంపేశాడు. అతడి గుర్రాలూ కూల్చేశాడు. ఇద్దరికీ రథాలు లేవిప్పుడు. కత్తులూ, డాళ్ళూ పట్టుకుని ఇద్దరూ రథాలమీంచి కిందికి దూకేశారు. ప్రాణాలమీద ఏదో జరిగిపోతుంది. అంతలో చర్రున భీముడు పరిగెత్తుకు వచ్చాడు. సాత్యకిని తన రథంమీద పట్టుకుపోయాడు. ఇటు దుర్యోధనుడూ చప్పున వెళ్ళాడు. భూరిశ్రవసుణ్ణి రథంమీద పెట్టుకు తీసుకువచ్చేశాడు.

అలపొద్దువేళ అయింది. వాలిపోతూవున్న సూర్యుణ్ణి చూశాడు అర్జునుడు. "పొద్దు గుంకిందో వెళ్ళిపోతారు శత్రువులు" అంటూ గాండీవం మోగించాడు. కనపడ్డ కౌరవుణ్ణల్లా కాజెయ్యడం మొదలెట్టాడు. సహించలేకపోయాడు దుర్యోధనుడు. పాతికవేల మంది రథికుల్ని రెచ్చగొట్టి అర్జునుడిమీద కలబడ్డాడు. అన్నివేల మంది రథికులూ వెళ్ళడమేమో వెళ్ళారు. అంతే అర్జునుడి బాణాగ్నిలో మిడతలలాగ మాడిపోయి వూరుకున్నారు. నడుం విరిగిపోయి పట్టయిపోయింది కౌరవసేనకి.

సూర్యుడి కిరణాలు సన్నగిల్లుతూ వచ్చాయి. అంతకంతకి ఎర్రదనం అధికమయింది. పడమటికొండశిఖరం మీదికి వెళ్ళాడతడు. "సాయంత్రమయిపోయింది" — గుంకిపోతూవున్న సూర్యుణ్ణి చూసి అన్నాడు భీష్ముడు "మన వాహనాలున్నూ బాగా అలిసిపోయాయి. ఇంకా యుద్ధం చెయ్యడం శ్రేయస్కరంకాదు. ఇంతతో ఆపుదాం" అంటూ ద్రోణుడూ మొదలైన నాయకుల్ని హెచ్చరించాడు. "సైన్యాలు మళ్ళించండి" అని ఆదేశించాడు.

ఉభయ పక్షాలలోనూ ఎవళ్ళమట్టుకు వాళ్ళకే తృప్తిగావుంది ఆవాళటి యుద్ధం. దివిటీలు వెలిగాయి. రెండుసేనలూ తమతమ శిబిరాలికి వెళ్ళిపోయాయి ఇటుమన కౌరవ శిబిరంలోనూ, అటు పాండవ శిబిరంలోనూ ఆరాత్రి సందడిగానే వుంది. సంగీతకాలక్షేపాలూ, సాహిత్యగోష్ఠులూ, రకరకాల సమావేశాలూ వినోదాలూ జరుపుకుంటూ సంతోషంతో ఆరాత్రి గడుపుకున్నారు.

## ఆరో రోజు

ఐదోరోజు రాత్రి అలా గడిచింది. మర్నాడు తెలతెలవారేసరికి ఉభయశిబిరాల్లోనూ ఉత్సాహం గుబగుబలాడింది. యుద్ధవాద్యాలు మోగాయి. రథాలూ గుర్రాలూ ఏనుగులూ సిద్ధంచేసుకుంటూ, పరస్పరం [illegible] చెప్పలేనంత సందడి చేశారు సైనికులు.

సేనాపతి ధృష్టద్యుమ్నుణ్ణిపిలిచి మకరవ్యూహం పన్నమన్నాడు ధర్మరాజు. వెంటనే యావన్మందీ సంతోషించినట్టు మకరవ్యూహం పన్నాడు ధృష్టద్యుమ్నుడు. మకరవ్యూహానికి అర్జునుడూ, ద్రుపద మహారాజూ శిరస్సయారు. నకుల సహదేవులు కన్నులయారు. భీముడు నోరయాడు. అభిమన్యుడూ, ద్రౌపదికొడుకులూ, ఘటోత్కచుడూ గండస్థలమయారు. సాత్యకీ ధర్మరాజూ కంఠమయారు. పెద్దసేనతో

కలిసి ధృష్టద్యుమ్నుడూ విరాటరాజూ వెన్నయారు. కేకయరాజులు అయిదుగురూ ఎడమభాగమయారు. ధృష్టకేతుడూ, చేకితానుడూ కుడిభాగమయారు. కుంతిభోజుడూ, శతానీకుడూ మొల అయారు. శిఖండీ, ఇరావంతుడూ తోక అయారు.

పాండవుల మకరవ్యూహానికి ప్రతిగా ఆలోచించి క్రౌంచ వ్యూహం పన్నాడు భీష్ముడు. దానికి తానూ, ద్రోణాచార్యులూ ముంచువు. కృపాచార్యులూ అశ్వత్థామా కళ్ళు. కృతవర్మా, కాంభోజరాజూ, బాహ్లీకుడూ తల. శూరసేనుడూ, దుర్యోధనుడూ కంఠం. సౌవీరులూ, భగదత్తుడూ గుండె. విందానువిందులూ, త్రిగర్త సేనతో సుశర్మా ఎడమరెక్క. యవన, శక, చూలికులు కుడిరెక్క. శ్రుతాయువూ, భూరిశ్రవసుడూ తోక

ఇలా కురు పాండవసేనలు రెండూ వ్యూహాలు పన్నుకుని యుద్ధానికి నడిచాయి. శంఖాలు పూరిమాయి. భేరీలు మోగాయి. అవన్నీ భూమీ ఆకాశం బద్దలు చేస్తున్నాయా అనిపించాయి. సూర్యోదయం అవుతూ అవుతూ వుండగా ఆరంభమయింది యుద్ధం. రథాలమీంది రథికులు గజయోధులతో కలబడ్డారు. గజయోధులు రథికులమీద విరుచుకుపడ్డారు. రౌతులూ రౌతులూ ఢీకొన్నారు. రథికులు రౌతులమీద దాడిచేశారు. రథికులూ, రౌతులూ ఏనుగుసేన నెదిరించారు. రథికులూ, గజయోధులూ రథాలమీందా, గుర్రపు దళాలమీద పడ్డారు. రథికులు పదాతులమీదికి పురికారు. పదాతులు రౌతులమీద కురికారు. ప్రాణాలమీద ఆశ వొదిలేసి ప్రతీవ్యూహాలు హోరాహోరి పోరాడారు.

భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ మొదలైన మహాయోధులు ఎక్కడికక్కడ రక్షిస్తూవుంటే నక్షత్రాలతో వెలిగే రాత్రిలాగ ఎంత శాస్త్రాన్నో అభ్యసించింది పాండవసేన. భీష్ముడూ,

కృపుడూ, ద్రోణుడూ, శల్యుడూ, దుర్యోధనడూ మొదలైన మహా వీరులు కాపాడుతూవుంటే గ్రహాలతోవున్న ఆకాశంలా కనిపించింది కౌరవసేన.

అప్పుడు ద్రోణుడి ఆటోపానికి అడ్డూ అపూ లేకపోయింది. పట్టపగ్గాలు లేకండా పాండవసేనమీాద విరుచుకుపడ్డా డతడు. అది సహించలేకపోయాడు భీముడు. ఉద్ధృతంగా ద్రోణుడి బలగంమీాదికి రథంపరిగెత్తించాడు. భీముడిదెబ్బలు తట్టుకోలేకపోయింది ముందున్న ద్రోణసైన్యం. వెనక్కి తగ్గేసింది. పలాయనమన్నా చిత్తగించింది. బాగావొళ్ళు మండింది ద్రోణాచార్యులికి. పూని పూని తొమ్మిది బాణాలు కొట్టి నొప్పించాడు భీముణ్ణి. చురచురలాడింది భీముడికి. మంచి దారైన బాణమొకటి తీసిపెట్టి వొదిలా డతడు. ద్రోణుడి సారథిని తారుమనిపించేశాడు. చప్పున పగ్గాలు స్వయంగా పుచ్చుకున్నాడు ద్రోణుడు. పిసరంతా చలించలే దతడు. సాహసంగా శత్రు సేనమీాదికి రథం పరిగెత్తించాడు.

అంతలో అందుకున్నాడు భీష్ముడు. ద్రోణుడితో కలిసి కేకయులమీాద పడ్డాడు. పెద్ద గాలివీస్తే మేఘాలు ఎలా పరిగెడతాయి, అదిగో అలాగ భీష్మద్రోణులు విజృంభించేసరికి పరుగుచ్చుకున్నారు కేకయులు. వాళ్ళతో సృంజయులు కూడా పుంజాలు తెంపుకు పరిగెత్తారు. భీముడు మరింత పేట్రేగిపోయాడు. అతడి చేతిలో నేలమట్టమయిపోతూ వచ్చింది మన కౌరవసేన.

అటు ధర్మరాజూ, ఇటు దుర్యోధనుడూ చేతులు విసిరి తమ తమ సైన్యాలు పురికొల్పారు. హాలో అంటే హాలో అని రెండు సేనలూ విజృంభించాయి. ఉప్పొంగిన రెండు సముద్రాల్లాగ వొకదానిమీాద వొకటి విరుచుకు పడ్డాయి.

ధృతరాష్ట్రుడు: సంజయా, మన బలగంలో కావలిసినంతమంది మహారథు లున్నారు. అయినా పాండవుల్ని గెలవలేకపోతున్నారంటే ఇంతకంటె చిత్ర మే ముంటుంది! అంతా దైవమాయ. ఇలా అవుతుందనీ పోరిపోరి ఆనాడే చెప్పాడు విదురుడు. ఏంలాభం! దుర్మార్గుడు చెవినిపెట్టాడు కాదు దుర్యోధనుడు. కర్మం ఎటు వెళుతుందో బుద్ధీ అటే వెళుతుంది. విధి తప్పించడం ఎవరితరం! ఎలా అవాలని వుంటే అలాగే అవుతుంది.

సంజయుడు: మంచీ చెడ్డా ఎరగనివాడు నీకొడుకు. తెలిసి తెలిసీ అతణ్ణి అనడం దేని కంటాను! అవాళ మనం ఉపేక్షించామే, అదిగో ఆ జూద మే ఇవాళ ఈకయ్యమయి ప్రత్యక్షమయింది. ఇప్పుడు మొత్తుకుంటే మాత్రం ఏంలాభం? ఊరుకో. నిబ్బరం తెచ్చుకుని యుద్ధం విను.

అలా నలిరేగిపోయిన భీముడు మనవాళ్ళని తరిమి కొడుతూ సముద్రంలాంటి మన సేనంతా రెండుపాయలు చేసేశాడు. వ్యూహం లోపలికి చొచ్చుకు వచ్చేశాడు. దుశ్శాసనుడూ, దుర్విషహుడూ, దుర్మదుడూ, దుస్సహుడూ, జయుడూ, జయత్సేనుడూ, వికర్ణుడూ, చిత్రసేనుడూ, సుదర్శనుడూ, చారుమిత్రుడూ, సువర్మ్ముడూ, దుష్కర్ణుడూ వొక్కదగ్గిరే వున్నారు. చూసి వాళ్ళదగ్గిరికే భీముడు పరిగెత్తాడు.

"ఇదిగో భీముడు." "ఒంటరిగా దొరికాడు." "పాదు కదల కండా చంపేద్దాం" అంటూ గబగబా నర్దుకున్నారు వాళ్ళు. ఒకళ్ళ నొకళ్ళు పేరుపేర పిలుచుకున్నారు. చతురంగబలాలతో కూడా భీముణ్ణి చుట్టుముట్టారు. ప్రళయకాలసూర్యుణ్ణి ఉగ్రమైన గ్రహాలు చుట్టవేస్తే ఎలా వుంటుందో అలా అనిపించిం దప్పుడు. నీకుమాళ్ళు తనని అలా చుట్టుముట్టడం చూసి పండుగులా ఉప్పొంగాడు భీముడు. "ఇదిగో ఇక్కడే రథం నిలబెట్టు" అని తన సారథిని విశోకుణ్ణి ఆదే

శించాడు గద పుచ్చుకుని రథంమీంచి వొకటే దూకు దూకాడు. ప్రళయ యముడి లాగ నీకుమూళ్ళ సైన్యంమీద వాలాడు. ఏనుగుల కుంభస్థలాలు పగలగొట్టాడు. తొండాలు తునకలు చేశాడు. జేగురు సెలవళ్ళతో కొండలు కూలిపోతూవుంటే ఎలావుటుందో అలాగ అవి రక్తాలు కార్చుకుంటూ కూలిపోయాయి. అతడు గద తిప్పుతూ వుంటే కళ్ళుమూసుకుపోయాయంటే నమ్మి. పచ్చడిపచ్చడి అయి పోతూవుండేవి ఏనుగులు. గుర్రాలూ, పదాతులూ చెప్పే అక్కరలేదు. పిసరంత దయా దాక్షిణ్యమూ లేకండా వీరవిహారం చేశాడు భీముడు. అతడి సంహారక్రీడ చూసి మాకళ్ళనే మేం నమ్మలేకపోయాం. అంత ఘోరమైంది అతడి పరాక్రమం.

"భీముణ్ణి లెక్కా జమాలేని సైన్యాలు ముట్టడించాయి" - ఈమాట ధృష్టద్యుమ్నుడి చెవిలో పడింది. అంతవరకూ ద్రోణా చార్యులతో పోరాడుతున్నా డతడు. భీముడిమాట వినగానే అతడి మనస్సు కలుక్కుమంది. ద్రోణుణ్ణి వొదిలేసి భీముడితట్టు పరిగెత్తిం చాడు రథం భీముడిరథం చూశాడు. రథంమీద భీముడు లేడు. ఒట్టిరథమే వుంది. అతడి గుండెలో రాయిపడింది. పెదవులు ఎండి పోయాయి. దుఃఖం ముంచుకువచ్చింది.

"విశోకా! విశోకా! భీముడేడీ? ఎక్కడ? మరేం ప్రమాదం రాలేదుకదా! అతడికే ఏమన్నా అయితే ఏంగతి! నిజంగా నాప్రాణా లుండవు. చెప్పూ! భీముడెక్కడ?"- తడబడిపోతూ గద్గదకంఠంతో విశోకుణ్ణి అడిగాడు ధృష్టద్యుమ్నుడు.

"భీముడికి ప్రమాదమేమిటి?" అన్నాడు విశోకుడు — "ధృత రాష్ట్రుడి కొడుకులున్నారే దుశ్శాసనుడూ వాళ్ళూ, వాళ్ళంతా గదలూ అవీ పుచ్చుకుని వొక్కసారి చుట్టుముట్టారు. దాంతో నన్ను ఇక్కడే వుండమని గదపట్టుకుని రథందిగేశాడు భీమసేనుడు. లేళ్ళమీదపడ్డ

సింహంలాగ అదిగో అక్కడ వాళ్ళవని పట్టిస్తున్నాడు. వీర విహారం చేస్తున్నాడు" అన్నాడు.

"ఒక్కడూ అతగాడు వ్యూహంలోకి చొచ్చుకుపోయి పోరాడు తున్నాడూ! నేను పూరికే ఇవతలవుంటే ఏమంటుంది లోకం!" అంటూ విశోకుడు చూపినతట్టు రథం పోనిచ్చాడు ధృష్టద్యుమ్నుడు. దారికడాకూ కూలిపోయిన ఏనుగులు దొర్లుతున్నాయి. వాటినిపట్టి భీముడు వెళ్ళినదారి తెలుసుకున్నాడతడు. ఆ దారినే రథం పరిగెత్తించాడు. తిన్నగా వెళ్ళి భీముడిదగ్గిర ఆగాడు. గదపట్టుకుని కౌరవసైన్యం నుగుమేస్తున్నాడు భీముడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, పదాతులూ పచ్చడి పచ్చడి అయిపోతున్నారు. కుప్పలు కుప్పలు కూలిపోతున్నారు అయినా వేలకి వేలు వచ్చి అతడిమీాద పడుతూనే వున్నారు. ఊపిరిసలపకండా చేస్తూనే వున్నారు.

"ఇదిగో, నేనూ వచ్చాను. కానీ. ఏం పరవాలేదు. నేనూ నావంతు నంజుకుంటాను వీళ్ళని" అంటూ మనసేనమీాదపడ్డాడు ధృష్టద్యుమ్నుడు.

"ఈ దుర్మార్గుణ్ణి ముట్టడించండి. భీముడికి భయపడకండి. అతడి కావరం వొదలగొట్టండి" - రథికుల్ని హెచ్చరిస్తూ కేకలు వేశాడు దుర్యోధనుడు. రారాజు హెచ్చరించడంతోనే నీకుమాళ్ళూ, తక్కిన యోధులూ అందరూ వొక్కపెట్టుని విరగబడ్డారు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ఏం చేశాడో తెలుసా? లోగడ ద్రోణాచార్యుల దగ్గిర సంపాదించిన సమ్మోహనాస్త్రం తీసి ప్రయోగించాడు. దాంతో మనవాళ్ళు యావన్మందీ తెలివితప్పిపోయారు. ఎక్కడివాళ్ళక్కడ బొమ్మల్లాగ కదలకండా వుండిపోయారు. రవంత అవకాశం దొరికింది భీముడికి. చప్పున దగ్గిరేవున్న వొక మంచినీళ్ళమడుగు దగ్గిరికి వెళ్ళాడు.

చల్లనినీళ్ళు కడుపారా తాగేసి దాహం తీర్చుకున్నాడు. నిమిషాల మీాద తిరిగివచ్చి ధృష్టద్యుమ్నుణ్ణి కలుసుకున్నాడు.

దృష్టద్యుమ్నుడు తనని వొదిలేసి భీముడితట్టు వెళ్ళడంతోనే కొంత అవకాశం చిక్కింది ద్రోణాచార్యులికి. అప్పుడు ద్రుపదమహా రాజుమీాదికి రథం మళ్ళించా డతడు. నవ్వుతూ అతడిమీాద శరవర్షం కురిపించాడు. అసలే పూర్వవిరోధం మండుతూవుంది. అంచేత అడ్డూ ఆపూ లేని రోషంతో వెంటపడ్డాడు ద్రోణుడు. భయపడిపోయాడు ద్రుపదుడు. ప్రుంజాలు తెంపుకుని ఆ దేహాఱిపోవడం పాఱిపోయాడు. ద్రుపదుడు పాఱిపోతూవుంటే గట్టిగా శంఖం పూరించాడు ద్రోణుడు. అలా ద్రుపదుణ్ణి తరిమేసి మళ్ళీ ధృష్టద్యుమ్నుణ్ణి వెదికా డతడు. కౌరవకుమాళ్ళమీాద అతడు సమ్మోహనాస్త్రం వేశాడని విన్నాడు. ఉత్తరక్షణంలో అక్కడికి రథంపరిగెత్తించుకువచ్చి వాలాడు. ఏముంది, మనవాళ్ళంతా మూర్ఛావస్థలో వున్నారు. తక్షణం ప్రజ్ఞాస్త్రం ప్రయోగించా డతడు. దాంతో ఎక్కడివాళ్ళక్కడ నిద్రలేచినట్టు తెలువుకున్నారు. పోయినప్రాణాలు వచ్చినట్టయాయి. మళ్ళీ అందరూ యుద్ధానికి సిద్ధపడ్డారు. ద్రోణుడితో కలిసి భీముడిమీాదికీ ధృష్ట ద్యుమ్నుడిమీాదికీ ఎగబడ్డారు.

"ఇదిగో, అభిమన్యుణ్ణి ముందుపెట్టుకుని వెళ్ళి భీముడికీ ధృష్ట ద్యుమ్నుడికీ సాయంచెయ్యండి" అంటూ ద్రౌపది కుమాళ్ళనీ, కేక యుల్నీ, ధృష్టకేతుణ్ణీ పంపాడు ధర్మరాజు. ధర్మరాజు నోట్లోమాట నోట్లోనే వుంది, ఆపన్నందుగుడూ సైన్యాలతో వెళ్లి భీముడితోనూ, ధృష్టద్యుమ్నుడితోనూ కలిశారు.

"భీమన్నా, నువ్వు ఇలా కిందనిలబడి యుద్ధం చెయ్యడం బాగు లేదోయి" అంటూ కేకయరాజుల్లో వొకరి రథం మీాదికి అతణ్ణి పంపించాడు ధృష్టద్యుమ్నుడు.

మట్టమధ్యాహ్న మయింది. నడినెత్తి సూర్యుడిలాగే భీష్ముడు తనప్రతాపం పాండవసేనమీద చూపించాడు. తన బాణాలతో శత్రు సేన మాడ్చేయ్యడ మారంభించాడు.

బ్రహ్మాస్త్రం ప్రయోగించి తనమీదికి వస్తూవున్న ద్రోణా చార్యున్ని అమాంతంగా ఎదిరించాడు ధృష్టద్యుమ్నుడు. ఎదటికి రాగానే అతడి ధనుస్సు ఫెళ్ళుమనిపించాడు ద్రోణుడు. చప్పున మరొకధనుస్సు తీశాడు ధృష్టద్యుమ్నుడు. బాణంమీద బాణం— ఏడు బాణాలు వేసి చురచుర మనిపించాడు ద్రోణుణ్ణి. దాంతో రుద్రుడే అయిపోయాడు ద్రోణుడు. ఘోరంగా నాలుగే నాలుగు బాణాలు కొట్టాడు. ధృష్టద్యుమ్నుడి నాలుగుగుర్రాలూ కూల్చేశాడు. మరొకటి వేసి అతడి సారథినీ తారు మనిపించేశాడు.

రథంలేకండా అయిపోయాడు ధృష్టద్యుమ్నుడు. ఒక్కసాటు దాటేసి అభిమన్యుడి రథంమీదికి వచ్చేశాడు. మరి ఆగలేక పోయింది పాండవసైన్యం. "ఆగండీ ఆగండీ" అంటూ భీముడూ, ధృష్టద్యుమ్నుడూ కేకలువేస్తూనే వున్నారు. అయినా లాభంలేకపోయింది. అదే సమయమనుకున్నాడు సుయోధనుడు పెద్ద రథ సైన్యంవేసుకుని దురుసుగా భీముడిమీదికి వచ్చాడు. ఇంతలో ధృష్టద్యుమ్నుడికోసం మరొకసారథి వచ్చాడు. గాలిలా పరిగెత్తే గుర్రాలుపూన్చి రథం పట్టుకువచ్చాడతడు. ఆరథమెక్కి ద్రోణుడిమీద కలబడ్డాడు ధృష్టద్యుమ్నుడు.

ఇలాఅక్కడధృష్టద్యుమ్నుడూద్రోణుడూ యుద్ధంచేస్తున్నారు. అటు భీముడిరథమూ పట్టుకువచ్చేశాడు విశోకుడు. రథమెక్కి ధనుస్సు పుచ్చుకున్నాడు భీముడు. అతడి మొహంమీద వొక క్రూరమైన ఉత్సాహరేఖ తాండవమాడింది. వెంటనే దుర్యోధనుడిమీదికి వురికించాడు రథం. భీముడు తనమీదికి వచ్చాడో లేదో, మంచిదొక

బాణం తీశాడు దుర్యోధనుడు. భీముడి ఎదురొమ్ము నాటుకుపోయినట్టు కొట్టాడు. పటపటా పళ్ళుకొరికాడు భీముడు. దుర్యోధనుడి రెండు చేతులమీదా రెండూ, గుండెలమీద వొకటీతగిలించాడు బాణాలు. దెబ్బతిన్నాడే అనుకో, అయినా చలించలేదు సీకోదుడు. బాణంమీద బాణం కొడుతూనే వచ్చాడు భీముణ్ణి.

భీముణ్ణి పట్టేద్దామని ఎత్తువేశారు నీతక్కినకుమాళ్ళు. దుర్యోధనుణ్ణి దాటుకుని ముందుకి వెళ్ళారు వాళ్ళు. ఒక్క మోగిని భీముడిమీద కలబడ్డారు. అభిమన్యుడూ, ద్రౌపదికుమాళ్ళూ, కేకయులూ, దుష్టకేతూ – ఈపన్నెండుమందీ వాళ్ళని ఎదురుకున్నారు. అసలు భీముడు వొక్కడే చాలు సీకుమాళ్ళకి. అతడికితోడు ఈపన్నెండుగురూ కలిశారు. ఇక చెప్పేదేముంది! చిత్తుగా చావుదెబ్బలుతినేశారు సీకోదుకులు. భరించలేకపోయారు. పలాయనం చిత్తగించారు. తనకి చిక్కకండా తప్పిపోయారే అని విచారించాడు భీముడు.

తమ్ములు లోకముడవడంతోనే తలకొట్టేసి నట్టయిపోయింది దుర్యోధనమహారాజుకి. ఎక్కడలేని కోపమూ తెచ్చుకున్నాడతడు. తనసైన్యం పురికొల్పి భీముడిమీదికి పరిగెత్తాడు.

అపరాహ్ణం కావచ్చింది. శత్రుభయంకరుడైన భీముడికీ, అమితబలశాలి దుర్యోధనుడికీ చెప్పలేనంతఘోరంగా జరిగిపోయింది యుద్ధం. దాంతో పారిపోతున్న సీకుమాళ్ళుతిరిగీ యుద్ధంలో ప్రవేశించారు. వికర్ణుడూ, చిత్రసేనుడూ అభిమన్యుడితో కలబడ్డారు. వికర్ణుడి గుర్రాలు చంపేశాడు అభిమన్యుడు. గబాగబా ఇరవైకుప్పె కోలలు అతడిమీద గుప్పించాడు. జర్జరిల్లిపోయాడు వికర్ణుడు. రథం గెంతేసి వొకటే దాడుతీశాడు చిత్రసేనుడి రథంమీదికి. ద్రౌపదికుమాళ్ళు భీముడికి అడ్డుపడి, చెడామడా దుర్యోధనుణ్ణికొట్టారు. అతడి వొళ్ళంతా రక్తం వరదలుకట్టించారు. దుర్యోధనుడుమాత్రం అంత

మీదమీద పోనిస్తాడా! అయినా గురిచూసి అయిదు బాణాలుకొట్టి వెంట తరిమాడు. ఇంతలో భీష్ముడూ వెళ్ళి పాండవులమీద పడ్డాడు. గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ, పదాతులూ— చతురంగబలం యావత్తూ కూలగొట్టడ మారంభించాడు. భీష్ముడు రావడంతోనే అర్జునుడూ వచ్చి అందుకున్నాడు ఘోరంగా ముట్టుకుంది యుద్ధం. రక్తనదులు పారాయి. కూలిపోయి కొట్టుకుపోయిన రథాలు వోడలలా అవుపించాయి. ఎవళ్ళబలం వాళ్ళు చూపిస్తూ, ఉభయ సేనలూ హోరాహోరి పోరాడాయి.

పొద్దుగూకేవేళ అయింది. భీముడు త్వరపడ్డాడు. "ఇవాళే దుర్యోధనుణ్ణి చంపేస్తాను" అంటూ దూకుడుగా అతడిమీదికి పోనిచ్చాడు రథం. దుర్యోధనుణ్ణి చూడగానే వొకవంక క్రోధమూ, వొకవంక సంతోషమూ — నిలువునా వొణికిపోయాడు భీముడు. "దుర్యోధనా, ఎన్నాళ్ళనో ఎదురుచూసిన పండుగ ఇన్నాళ్ళకి సమకూడిందోయి" అంటూ పటపటా పళ్ళుకొరికాడతడు — "కుంతీదేవి పడ్డ కష్టాలూ, ద్రౌపది పాట్లూ ఇవాళే తీర్చేస్తాను. కృష్ణుడిమాట లక్ష్యం లేకపోయింది! ఉలూకుణ్ణి పంపి సభలో కారు కూతలు కూయించావు! అన్నీ ఇదిగో ఇక్కడే కక్కిస్తాను. మగ తనం కలిగి నిలబడు, తోకముడవకండా" అంటూ ఉగ్రమూర్తే అయిపోయాడతడు. అనూంతంగా దుర్యోధనుడిమీదికి పురికాడు. అతడి నాలుగు గుర్రాలూ చంపేశాడు. సారథినినరికేశాడు. ధనుస్సు విరిచేశాడు. జెండాకొయ్య పళుక్కుమనిపించాడు. భయంకరంగా సింహానాదం చేశాడు.

ఇంకోవిల్లు తియ్యబోయాడు దుర్యోధనుడు. ఇలా వొంగాడో లేదో, పదిబాణాలు నాటించాడు భీముడు. పుట్టలో పాములు దూరినట్టు పదిబాణాలూ దుర్యోధనుడి శరీరంలో దూరిపోయాయి.

కళ్ళు తేలవేసేశా డతడు. మూర్ఛవచ్చి రథంమీదే వొరిగిపోయాడు. రథంమీంచి కిందికి ధారలు కట్టింది రక్తం.

అంతలో అమాంతంగా మధ్యదూరి అడ్డుకున్నాడు జయద్రథుడు. రథాలవాళ్ళతో వెళ్ళి భీముడిమీద కలబడ్డాడు. ఈలోగా కృపాచార్యులు పరిగెత్తుకు వచ్చాడు. దుర్యోధనుణ్ణి తన రథంమీద పెట్టుకుని పట్టుకువచ్చేశాడు. అభిమన్యుడూ, ద్రౌపదికుమాళ్ళూ, కేకయులూ భీముణ్ణి దాటివచ్చి జయద్రథుణ్ణి ఎదిరించారు.

చిత్రసేనుడూ, చిత్రుడూ, చిత్రాక్షుడూ, చారుమిత్రుడూ, సులోచనుడూ, నందుడూ, ఉపనందుడూ, అభిమన్యుణ్ణి ముట్టడించారు. అసలే అభిమన్యు డతడు. వచ్చిన ప్రతివాణ్ణీ అయిదేసి బాణాలతో జమాలు మనిపించాడు. వాళ్ళున్నా, వొక్క మొగిని తిరగబడ్డారు. వందలూ, వేలూ బాణాలు కురిపించి అతణ్ణి ముంచెత్తారు. అన్నదమ్ముల సహాయంకోసం వికర్ణుడున్నా వచ్చాడు. ఇందాక రథం పోయిన కోపం వుండనే వుం దతడికి. అదే సమయమని అభిమన్యుడిమీదికి ఎగబడ్డా డతడు. మళ్ళీ ఇందాకటిపనే చేశాడు అభిమన్యుడు. అతడి ధనుస్సు ముక్కలు చేసేశాడు. సారథిని చంపేశాడు. గుర్రాలున్నా కూల్చేశాడు. ఒళ్ళంతా తూంట్లు పడేట్టు బాణాలు నాటించాడు.

వికర్ణుడి అవస్థ చూశారు తక్కిన తమ్ములు. తెగించి అందరూ వొక్కసారి అభిమన్యుడిమీద పడ్డారు. అభిమన్యుణ్ణి వెనక పెట్టి ద్రౌపది కుమాళ్ళు అయిదుగురూ కౌరవ కుమాళ్ళమీద కలబడ్డారు. వాళ్ళ గుర్రాలు పడమోదారు. కేడాలు పడగొట్టారు. బాణాలతో వాళ్ళని కప్పెట్టారు. ద్రౌపది కుమాళ్ళు అయిదుగురూ తమకంటే కుర్రాళ్ళు, వాళ్ళచేత దెబ్బలు తినడమంటే ఎంతసిగ్గు కౌరవ రాజకుమాళ్ళకి! అదిగో ఆ సిగ్గే పారిపోకండా నిలబెట్టింది వాళ్ళని. లేని పౌరుషం తెచ్చుకుని దెబ్బలాడారు వాళ్ళు.

నకులుడి కొడుకు శతానీకుడు రకరకాల బాణాలు ప్రయోగిస్తూ విజృంభించాడు. అన్నదమ్ములలో అగ్రగణ్యుడిలా అవుపించాడు. కేకయరాజులూ, ద్రుపదుడూ అతడికి బాసటగా కలిశారు. ఎన్నో అన్ని రథాలతోనూ, గుర్రాలతోనూ విరగబడ్డారు వాళ్ళు. మన సేనంతా కలతపెట్టి వొదిలిపెట్టారు.

సాయంకాలం కావచ్చింది. కాలయముడిలాగ విజృంభించాడు భీష్ముడు. తన ప్రతాపం వేడి వొక్కసారి చూపించాడు. అతడిముందు శత్రువన్నవాడు వొక్కడూ నిలవలేకపోయాడు. చీకటిపడ్డాక యుద్ధ మాపుచేశాడు. కౌరవసైన్యం వెంటపెట్టుకుని శిబిరానికి బయలు దేరాడు. ముచ్చెమట్లు పోసుకుని పాండవులు తమ శిబిరానికి వెళ్ళిపోయారు.



# భీష్మ పర్వం

## మూడో ఆశ్వాసం

### దుర్యోధనుడి దుఃఖం

ఆరోనాటియుద్ధంలో కొడుకు గట్టిదెబ్బలు తినేశాడని విని ఎంతో అంత దుఃఖపడ్డాడు ధృతరాష్ట్రుడు. తరవాత ఏం జరిగిందో చెప్పమని సంజయుణ్ణి అడిగాడు.

సంజయుడు: ఆ రాత్రి దుర్యోధనుడు భీష్ముడితో ఇలా అన్నాడు. "మనం ఎంతో అంత పూనికపట్టి వ్యూహం పన్నుకువెళ్ళాం. మన వ్యూహ మంతా చించిచెండాడారు పాండవులు. అంతేనా! నీకళ్ళఎదటే భీముడిచేత దెబ్బలుతినేసి భంగపడ్డాను నేను. ఇప్పటి దాకా కోలుకో లేకపోతున్నాను. నిన్ను పెట్టుకుని పాండవుల్ని గెలుస్తానని కొండంత ఆశపెట్టుకున్నాను. నాఆశ అడియాసే అయి పోతూ వుంది. యుద్ధంలో దేవతలనయినా లెక్కచెయ్యవు నువ్వు. అలాంటిది పాండవులు నీముందు ఇంతివాళ్ళవుతున్నారంటే ఏమను కోను!" అంటూ ఎంతో దుఃఖపడ్డాడు.

"నాతో ఇంతిగా చెప్పాలా!" చిరునవ్వు నవ్వుతూ అన్నాడు భీష్ముడు - "నువ్వు చూస్తూనే వున్నావు కదా! ఎక్కడయినా నావొళ్ళు దాచుకున్నానా నేను? శత్రువులయినా అనగలరా ఆమాట! ఇంతకీ మొదటినించీ నేను ఘోషపెడుతూనే వున్నాను. పాండవుల్ని గెలవడం సాధ్యంకాని పని. ఏమయితేనేం, కపటంలేకండా చెపు తున్నాను, విను. నీజయంకోసం పోరాడతాను. విచారించకు" అంటూ అతణ్ణి వోదార్చాడు.

భీష్ముడిమాటలతో కొంత కుదుటపడ్డాడు దుర్యోధనుడు. ఆరాత్రి సుఖంగా నిద్రపోయాడు. మర్నాడు పెందరాళే లేచి యుద్ధానికి సిద్ధపడ్డాడు.

## ఏడో రోజు

ఆవాళ మండలవ్యూహం పన్నాడు భీష్ముడు. ఒక్కొక్క ఏనుగుకి ఏడేసి రథాలు. రథానికి ఏడేసి గుర్రాలు. గుర్రానికి ఏడుగు రేసి విలుకాళ్ళు. విలుకాడికి ఏడుగు రేసి పదాతులు. అందులో దుర్యోధన మహారాజు మధ్యనుంచున్నాడు. పేరుపడ్డ పెద్దపెద్దయోధులు అతిడి పక్కలు చుట్టూనుంచున్నారు. అలామండలవ్యూహంతో మనసేనసిద్ధపడింది. అటు పాండవులుకూడా వచ్చేశారు. మన మండలవ్యూహం చూశారు. ధర్మరాజు ధృష్టద్యుమ్నుణ్ణి పిలిచాడు. మండలవ్యూహానికి తగినట్టు వజ్రవ్యూహం పన్నమన్నాడు. ధర్మరాజు చెప్పినప్రకారం దిట్టమైన వజ్రవ్యూహం పన్నాడు ధృష్టద్యుమ్నుడు. రణదుందుభులు మోగాయి. మన మండలవ్యూహం లక్ష్యపెట్టకుండా వొక్కపెట్టుని తరుముకుంటూ వచ్చింది పాండవులవజ్రవ్యూహం. రెండువ్యూహాలూ ఉద్ధృతంగా ఢీకొన్నాయి.

ద్రోణుడు విరాటరాజునీ, అశ్వత్థామ శిఖండినీ, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుణ్ణీ, శల్యుడు నకుల సహదేవుల్నీ, విందానువిందులు యుధామన్యుణ్ణీ, ఎంతోఅంతమంది రాజులు అర్జునుణ్ణీ ఎదిరించారు. భీముడు కృతవర్మమీద కలబడ్డాడు. అభిమన్యుడు చిత్రసేన, దుశ్శాసన, వికర్ణులమీద పడ్డాడు. ఘటోత్కచుడు భగదత్తుడిమీదికి వచ్చాడు. సాత్యకి అలంబసుడితో తలబడ్డాడు. ధృష్టకేతుడు భూరిశ్రవసుణ్ణి ఢీకొన్నాడు. చేకితానుడు కృపాచార్యులతో పోరాడాడు. ధర్మ

రాజా శ్రుతాయువుతోనూ, ఎంతోమంది రాజులు భీష్ముడితోనూ కలబడ్డారు.

"బావా, చూశావా ఎలాంటివ్యూహంపన్నాడో మాతాత!" ఎంతోమంది రాజులు తనమీదికి రావడంచూసి కృష్ణుడితో అన్నాడు అర్జునుడు— "అందుకనే కౌరవులు కిందామీదా పలవడంలేదు ఇవాళ ఇంతమంది రాజులు నామీదికి వచ్చారు. చూస్తూవుండు, వీళ్ళందరినీ వంచేస్తానో ఇప్పుడు!" అన్నాడు. అంటూనే గాండీవం సారించా డతడు. ఎడా పెడా బాణాలు కురిపించాడు. మన రాజులు యావన్మందీ వొక్కపెట్టుని చెలరేగారు. అర్జునుణ్ణీ, శ్రీకృష్ణుణ్ణీ బాణాలతో ముంచెత్తారు. అర్జునుడి దివ్యరథమూ, అతడి కపిధ్వజమూ కనపడ లేదంటే నమ్ము. కౌరవసేనలో ఆనందానికి అంతూపంతూ లేకండా అయింది. వెర్రి కేకలు వేసేశారు మన వాళ్ళు.

కళ్ళమొయ్యాకోపం పొడుచుకువచ్చింది అర్జునుడికి. ఆపాళాన ఇంద్రాస్త్రం ప్రయోగించా డతడు. ఇంతమంది రాజులు వేస్తున్న బాణాలూ హతవాఁర్చేసిందది. దాంతో వూరుకుందా! వాళ్ళ శరీరాలూ చీల్చేసింది. ఏనుగులు పీనుగులుచేసింది. గుర్రాలు కూల్చేసింది. మందరపర్వతం సముద్రం మథంచేసినట్టు రాజులసైన్యాలుక్షోభపెట్టేసి వొదిలిపెట్టింది. దానిముందు నిలవడానికి, దానిని తేరిచూడడానికి వొక్కడికీ శక్తి లేకపోయింది. అరచేతిలో ప్రాణాలుపెట్టుకుని భీష్ముడికి రథం వెనక్కి పారిపోయాయి సేనలు. సుశర్మా మొదలయిన యావన్మంది రాజులూ తప్పుకున్నారు. అందరూ భీష్ముడిదగ్గిరకే పరిగెత్తారు.

అప్పుడు భీష్ముడు వొక్కడే అర్జునుడిమీదికి బయలు దేరాడు. "సేనలో వున్న అర్జునుడిమీదికి తాతయ్య వొక్కడే వెళుతున్నాడు. ఆయనతో మీరున్నా వెళ్ళవద్దూ! నేను అంతా చూస్తూనే వున్నాను. ఇలా పారిపోవచ్చా మీరు!" అంటూ రాజుల్ని హెచ్చ

రించాడు దుర్యోధనుడు. అలా రా రాజు హెచ్చరించడంతోనే లేని ధైర్యం తెచ్చుకున్నారు రాజులు. భీష్ముడి రెండుపక్కలా నడిచి అర్జునుడిమీదికి ఎగబడ్డారు. అక్కడ అలా యుద్ధం సాగుతూనే వుంది. ఇటు ద్రోణుడు విరాటరాజు ధనుస్సు వొక బాణంతోనూ, జెండాకర్ర వొక బాణంతోనూ ముక్కలు చేసేశాడు. వెంటనే మరొక బాణం పుచ్చుకున్నాడు విరాటరాజు. మూడు బాణాలు ద్రోణాచార్యులమీద నాటించాడు. మరొక మూడు బాణాలతో అతడి సారథిని కొట్టాడు. ఇంకొక నాలుగు బాణాలు వేసి అతడి గుర్రాలు కూలగొట్టాడు. ఒక బాణంతో జెండా ఎగరగొట్టేశాడు. మరొకటి వేసి జెండాకర్రా తెగ నరికేశాడు.

నిలువునా మండిపోయాడు ద్రోణాచార్యులు. ఎంచి ఎంచి ఎనిమిది మంచిమంచి బాణాలు వేశాడు. విరాటరాజు సారథినీ, అతడి గుర్రాల్నీ కొట్టేశాడు. రథంలేకండా అయిపోయాడు విరాటరాజు. వెంటనే శంఖుడి రథంమీదకి వెళ్ళిపోయాడతను. తండ్రీకొడుకూ వొక్కరథంమీదే వుండి ద్రోణుడితో యుద్ధంచేశారు. జడివానలా బాణాలు కురిపించి అతణ్ణి ముంచెత్తారు. మరింత వొళ్ళుమండింది ద్రోణుడికి. తీసిపెట్టి వొకేవొక్క బాణం వొదలిపెట్టాడతడు. శంఖుడి గుండెలమీద తగిలింది బాణం. దూసుకెళ్ళిపోయి వీపులోంచి బైటికి పోయింది. ఠారుమనిపోయాడు శంఖుడు. ధనుస్సూ, బాణాలతోపాటు ప్రాణాలుకూడా వొదిలేసి రథంమీంచి కింద పడిపోయాడు.

కుమారుడిచావు కళ్ళారా చూశాడు విరాటరాజు. అతడి గుండె బేజారైపోయింది. ముందూ వెనకా కనపడలేదు అతడికి. పుంజాలు తెంపుకుని అదేపారిపోవడం పారిపోయాడతడు. రాజు పారిపోవడంతోనే మత్స్యదేశం సైన్యాలు కకావికలు అయిపోయాయి. ద్రోణుడు పాండవసేనమీద విరుచుకుపడ్డాడు.

అదే సమయంలో అశ్వత్థామ నుదుటిమీద మూడు వాడివాడి బాణాలు నాటించాడు శిఖండి. మూడు బంగారం శిఖరాలతో ధగ ధగా మెరిసిన మేరుపర్వతంలా అవుపించాడు అశ్వత్థామ. అరికాలి మంట నెత్తికెక్కింది దతడికి. ఒక ప్రవాహంలాగ శిఖండిమీద బాణాలు వొదిలి పెట్టా డతడు. అతడి గుర్రాలు కూల్చేశాడు. సారథిని చంపేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. అతడి చేతిలోని విల్లూ విరిచేశాడు. మరొక ఆసరా లేకపోయింది శిఖండికి. కత్తీ డాలూ పట్టుకున్నా డతడు. రథంమీంచి కిందికి దూకేశాడు. డేగ లాగ అశ్వత్థామ మీదికి పరిగెత్తాడు. అశ్వత్థామ బాణాలు వేస్తూనే వున్నాడు. వాటన్నిటినీ కత్తితో నరికేస్తూ అతడిమీదికి వచ్చేస్తూనే వున్నాడు శిఖండి. పళ్ళు పటపటా కొరికాడు అశ్వత్థామ. వాడయిన బాణ మొకటి వేశాడు. శిఖండి డాలు పగలగొట్టేశాడు. మరొక బాణం వేసి అతడి కత్తిన్నీ ముక్కలు చేసేశాడు. అంతతో వూరుకోలే దతడు. చికిలిపట్టిన బాణాలు సూటిగా శిఖండి వొళ్ళంతా నాటించాడు. విరిగిన కత్తే అశ్వత్థామమీద విసిరాడు శిఖండి. దానిని దారిలోనే బాణాలతో తుక్కుకింద కొట్టేశాడు అశ్వత్థామ. ఇక చేసేదేమీ లేకపోయింది శిఖండికి. చప్పున సాత్యకి రథంమీదికి పారి పోయా డతడు.

ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుడిమీద శరవర్షం కురిపించాడు. అయితే లవలేశమూ చలించలేదు నీకొడుకు. పాములలాంటి క్రూరాస్త్రాలు ధృష్టద్యుమ్నుడిమీద వొదిలాడు. నాగుపాములాగ బుసకొట్టాడు ధృష్టద్యుమ్నుడు. ఒకేవొక్క బాణం వూనిపెట్టి వేశాడు. దుర్యోధనుడి ధనుస్సు పుటుక్కుమనిపించాడు. మరొక ధనుస్సుకోసం చెయ్యి చాపాడు దుర్యోధనుడు. ఆసందుచూసి అతడి నాలుగు గుర్రాలూ నరికేశాడు ధృష్టద్యుమ్నుడు. రథం లేకుండా అయిపోయాడు దుర్యోధనుడు. అయినా జంకలే దతడు. ఉక్రోషంతో కత్తి వుచ్చు

కున్నాడు. రథం దూకేసి పాండవసేనాని విరాదికి పరిగెత్తాడు. అప్పుడు మెరుపులాగ పరిగెత్తుకు వచ్చాడు శకుని. దుర్యోధనుణ్ణి తన రథంమీద పట్టుకు వచ్చేశాడు.

సాత్యకీ అలంబసుడూ దారుణంగా యుద్ధం చేశారు. విపరీతంగా బాణాలతో కొట్టుకున్నారు వాళ్ళు. ఒక అర్ధచంద్ర బాణం వేసి సాత్యకి ధనుస్సు తునకలు చేసేశాడు అలంబసుడు. చురుకయిన బాణాలు నాటించి చురచురలాడించాడు. మాయ చేసి, ఘోరంగా పెడబొబ్బలు పెట్టాడు. అతడి మాయ వొక్కటీ సాగనివ్వలేదు సాత్యకి. ఇంద్రాస్త్రం వేసి వాటన్నిటినీ తూలగొట్టేశాడతడు. ఇంద్రాస్త్రం ముందు అడిలిపోయాడు అలంబసుడు. బ్రతుకుజీవుడా అనుకుని అదే పారిపోవడం పారిపోయాడు. సింహనాదం చేశాడు సాత్యకి. ఆవూపున వచ్చి మనసేనమీద విరుచుకుపడ్డాడతడు.

కృతవర్మా భీముడూ వొకళ్ళమీద వొకళ్ళు పిడుగుల్లాటి బాణాలు గుప్పించుకున్నారు. కృతవర్మ వడితనం చూసి బాగా వొళ్ళు మండింది భీముడికి. అతడి సారథిని చంపేశాడు. గుర్రాలు నరికేశాడు. ఒళ్ళంతా బాణాలు నాటించి వొదిలి పెట్టాడు. ఏదు పందిలా అవుపించాడు కృతవర్మ. భరించలేకపోయాడతడు. దాంతో నీ బావ వృషకుడి రథమెక్కేశాడు. భీముడికి మరి అడ్డేలేకపోయింది. మన ఏనుగు సేనమీద పడ్డాడతడు.

ధృతరాష్ట్రుడు: సంజయా, ఎంత చెప్పినా మనవాళ్ళే దెబ్బ తింటున్నారని చెపుతావు. మనసేనే పారిపోయిందంటావు. పాండవుల పరాక్రమమే పొగుడుతావు. వాళ్ళదే పైచెయ్యి అంటావు. ఎప్పుడు చూసినా ఇదే పాట పాడతావు. ఏమిటీ మాయ? వినలేకపోతున్నాను నేను.

సంజయుడు : ఇందులో మాయ ఏముంది మహారాజా ? మన వాళ్ళు వోపినంతమట్టుకు దెబ్బలాడుతూనే వున్నారు. అయితే ఏంలాభం ? పాండవసేన సముద్రమనుకో. మన బలగం నదుల్లాగ అందులో మునిగిపోతూనేవుంది. సముద్రం చేరిన నదుల నిజత్వం మరి ఎక్కడ, నిలుస్తుంది ! అంచేత అది వాళ్ళ దోషం అనుకోకూడదు. ఇంతకీ తప్పేమో నీలోనేవుంది. నీతప్పువల్లే ఇంతాముంచుకు వచ్చింది. విచారించిమాత్రం ప్రయోజన మేమిటి ? తరవాతజరిగిన, యుద్ధం విను.

విందానువిందులూ యుధామన్యుడూ అమీ తుమీ తేల్చు కోవాలంటూ పోట్లాడారు. అనువిందుడి గుర్రాలు కూల్చేసి అతడికి రథం లేకండా చేసేశాడు యుధామన్యుడు. విందుడిరథ మెక్కేశాడు అనువిందుడు. ఒక్కబాణంతో విందుడి సారథిని చంపేశాడు యుధా మన్యుడు. ఇంకేముంది ! సారథిలేని గుర్రాలు అడ్డదిడ్డంగా రథం ఈడ్చుకుంటూ పరిగెత్తిపోయాయి. దాంతో అవంతిసేన యావత్తూ చిందరవందర అయిపోయింది.

ఇలా ఘోరంగా సంకులసమరం జరుగుతూవుంది. ఇంతలో భగదత్తుడి మదపుటేనుగు సుప్రతీకం శివమెత్తినట్టు చెలరేగి పాండవ సేనమీదికి పరిగెత్తింది. దాని ఉద్ధృతానికి జజ్జరిల్లి పోయారు పాండవులు. తుపాకిగుండుకి చెదిరిపోయిన పిట్టలగుంపులాగ కకావికలయిపోయింది వారిసేన. అటుచూసి వొక్కవూపున పరిగెత్తుకు వచ్చాడు ఘటోత్కచుడు. ఉద్ధృతంగా వస్తూవున్న నదీప్రవాహం నిలిపేసిన పర్వతంలాగ సుప్రతీకాన్ని ఆపేశా డతడు. దాంతో పోయిన ధైర్యం చిక్కపట్టుకుంది పాండవసైన్యం. కాలూని మళ్ళీ యుద్ధమారంభించింది.

ఏనుగుని ఆపేసి భగదత్తుడిమీద కలబడ్డాడు ఘటోత్కచుడు. గట్టిగట్టిబాణాలు అతడిమీదగుప్పించాడు. అవన్నీ అల్లంత దూరంలోనే

ఖండించి పారేశాడు భగదత్తుడు. గబాగబా పద్నాలుగుతోమరాలు ఘటోత్కచుడిమీద విసిరాడతడు. వాటిని గుండపిండిచేసేసి, డబ్బయి బాణాలు భగదత్తుడిమీద కురిపించి సింహనాదం చేశాడు ఘటోత్కచుడు. అగ్గిమీద గుగ్గిలంవేసినట్టు భగ్గుమన్నాడు భగదత్తుడు. ఘటోత్కచుడి గుర్రాలు నాలుగూ కూలగొట్టేశాడు. గుర్రాలులేని రథంమీదే నించున్నాడు ఘటోత్కచుడు. అమాంతంగాశక్తి తీశాడు. భగదత్తుడిమీద విసిరాడు. అదీ సగంలోనే తునకలుచేసి పారేశాడు భగదత్తుడు. ఎన్నో అన్ని బాణాలువేసి ఘటోత్కచుణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసేశాడు. ఆతడివొళ్ళంతా మంటలుపుట్టించాడు. ఆగలేకపోయాడు ఘటోత్కచుడు. దేవేంద్రుడితో వోడిపోయిన నముచిలాగ పారి పోయాడు. అతడు పారిపోవడంతోనే అతడి రాక్షససైన్యాలూ తోకముడిచేశాయి. ఇక చెప్పేదేముంది! సుప్రతీకం మళ్ళీ పాండవ సేనమీదికి పరిగెత్తింది. అడివియేనుగు పాలబడ్డ కలవ వనంలా అయి పోయింది పాండవసేన.

శల్యుడూ, మేనల్లుళ్ళు నకులసహదేవులూ తమకంతో పోరా డారు. బాణవర్షంతో మేనమామని ముంచెత్తారు మేనల్లుళ్ళు. నవ్వుతూ వాళ్ళకి బాణాలతోనే జవాబుచెప్పాడు శల్యుడు. నాలుగు బాణాలు వేసి నకులుడి నాలుగు గుర్రాలు చంపేశాడు. సహదేవుడి రథ మెక్కేశాడు నకులుడు. అన్నదమ్ములిద్దరూ వొక్కరథంమీదే నిలబడి గుక్కతిప్పుకోనివ్వకండా కొట్టారు మేనమామని. సహించ లేకపోయాడు శల్యుడు. రెండుకళ్ళలోనూ నిప్పులు కక్కాడు. కరు కయిన బాణాలువేసి మేనల్లుళ్ళ నిద్దరినీ చురచుర లాడించాడు.

బాగా చికిలిపట్టిన బాణమొకటి తీశాడు సహదేవుడు. ధను స్సునితొడిగాడు. నారి చెవులదాకాలాగాడు. వొదిలిపెట్టాడు. రివ్వున వెళ్ళింది బాణం. శల్యుడి గుండెలమీద తగిలింది. నెత్తురు అంటే

అంటకండా వీపులోంచి దూసుకునిపోయింది. చచ్చినట్టు రథంమీద పడిపోయాడు శల్యుడు. కౌరవసేన హాహాకారాలుచేసింది. శల్యుడు మూర్ఛపోగానే అతడి సారథి జల్దుకున్నాడు. యుద్ధభూమినించి రథం తప్పించి పట్టుకుపోయాడు. నకులసహదేవులు సింహనాదాలుచేశారు. శంఖాలు పూరించారు. ఇంద్రుడూ, ఉపేంద్రుడూ (విష్ణువు) కలిసి రాక్షసేనమీద కలబడినట్టు మన కౌరవసేనమీద కలబడ్డారు.

మట్టమధ్యాహ్న మయింది.

శ్రుతాయువుతో యుద్ధంచేస్తూవున్న ధర్మరాజు తొమ్మిది బాణాలు అతడిమీద వేశాడు. వాటిని మధ్యలోనే కొట్టేసి, ఏడు బాణాలు ధర్మరాజు వొంటిమీద నాటించాడు శ్రుతాయువు. కళ్ళు మొయ్యా కోపం వచ్చింది ధర్మరాజుకి. వరాహకర్ణ బాణంతీసి నూటిగా శ్రుతాయువు గుండెలమీద కొట్టాడు. మరొక వెడల్పాటి బాణం తీసి అతడిజెండా నరికేశాడు. శ్రుతాయువుమాత్రం సామాన్యుడా మరో ఏడుబాణాలు ధర్మరాజుమీద నాటించాడు. మరింత మండిపోయాడు ధర్మరాజు. శ్రుతాయువుగుర్రాలు చంపేశాడు. అతడి కోదండం విరిచేశాడు. అతడి శరీరం యావత్తూ చీల్చి రక్తమయంచేసేశాడు. భరించలేకపోయాడు శ్రుతాయువు. రథందూకేసి పిక్కబలంచూపెట్టాడు. తనసైన్యం తెల్లమొహంవేసింది. పాండవసైన్యం సంతోషంతో సింహనాదాలుచేసింది. ధర్మరాజు కౌరవసేన నురుమాడడ మారంభించాడు.

చేకితానుడు కృపాచార్యులమీద దిట్టమైన బాణాలురువ్వాడు. చిర్రెమంది కృపాచార్యులికి. చేకితానుడి ధనుస్సు విరిచేశా డతడు. అతడి గుర్రాలూ కూల్చేశాడు. గదపట్టుకుని రథం దూకేశాడు చేకితానుడు. అమాంతంగా కృపుడి రథంమీదికి వురికాడు. అతడి గుర్రాలు గదతో బాదేశాడు చేకితానుడి ఎముకల్లో నాటుకు పోయి

నట్టు పదహారు బాణాలు కొట్టాడు కృపాచార్యులు. ఉక్రోషంతో గద విసిరాడు చేకితానుడు. ఇట్టే దానిని కొట్టేశాడు కృపుడు. చెంగున రథంమీదికివెళ్ళి కత్తిపుచ్చుకున్నాడు చేకితానుడు. మెరుపులా కృపుడి మీదికి పరిగెత్తుకువచ్చాడు. కృపుడూ వొక కత్తిపట్టుకున్నాడు. రథం గెంతేసి చేకితానుడితో కలబడ్డాడు. ఉభయులూ కత్తులతో యుద్ధం చేశారు. చేకితానుడికత్తి కృపాచార్యులుకీ, కృపాచార్యులకత్తి చేకితానుడికీ వొక్కసారే తగిలాయి. ఇద్దరూవొక్కసారే మూర్ఛపోయారు. ఇటునించి శకునీ, అటునించి కరకర్షణుడూ పరిగెత్తుకు వచ్చారు. ఇద్దరినీ తమతమ రథాలమీద పట్టుకుపోయారు.

ధృష్టకేతూ, భూరిశ్రవసుడూ ఘోరంగా పోరాడారు. భూరిశ్రవసుడిమీద తొంభయిబాణాలు గుప్పించాడు ధృష్టకేతువు. బాగా చురచురలాడింది భూరిశ్రవసుడికి. రకరకాలబాణాలు ప్రయోగించాడతను. ధృష్టకేతువుసారథిని చంపేశాడు. అతడిగుర్రాలు కొట్టేశాడు. ఒళ్ళంతా మంటలుచ్చుకున్నట్టు బాణాలు నాటించాడు. రథందూకేసి శతానీకుడిరథ మెక్కేశాడు ధృష్టకేతువు.

దుశ్శాసనుడూ, వికర్ణుడూ, చిత్రసేనుడూ అభిమన్యుడితో అద్భుతంగా యుద్ధంచేశారు. అయితే అసహాయశూరుడు అభిమన్యుడు. అంతమందినీ కీసుకీసుమనిపించాడు. వాళ్ళగుర్రాలు కూల్చేశాడు. సారథుల్ని చంపేశాడు. ఒక్కడికీ రథం లేకండా చేసేశాడు. తలచుకుంటే వాళ్ళప్రాణాలూ పుచ్చుకునేవాడు. కాని వాళ్ళని తానే చంపుతానని ప్రతిజ్ఞచేశాడు భీముడు. అది తలుచుకుని వూరుకున్నా డతడు.

దుశ్శాసనుడూ మొదలైనవాళ్ళ అవస్థ భీష్ముడు చూశాడు. వాళ్ళని వెనక వేసుకుని అభిమన్యుడితో డీకొన్నాడు. ఎంతోమంది రాజులూ భీష్ముడివెంట వచ్చారు. అభిమన్యుణ్ణి ఘిరాయించారు.

వాళ్ళంతా ముక్కాకలు తేరినవాళ్ళు. పైపెచ్చు లెక్కాజమాలేనంత మంది వున్నారు వాళ్ళు. అభిమన్యుడు వొక్కడు.

"బావా, అటుచూడు" అభిమన్యుడికేసి చూపిస్తూ కృష్ణుణ్ణి హెచ్చరించాడు అర్జునుడు - "భీష్ముడితో కలిసి అంతమంది రాజులూ నాకొడుకుమీదికి పరిగెడుతున్నారు. అక్కడికే పోనీ మనరథం" అంటూ తొందరచేశాడు.

అర్జునుడినోట్లో మాట నోట్లో నేవుంది, పగ్గాలు సడిలించాడు సారథి శ్రీకృష్ణుడు. బరిమీద పాంలాగ పరిగెడుతూవుంది రథం. అడ్డంగా వెళ్ళి అడ్డుకున్నాడు త్రిగర్తరాజు సుశర్మ.

"అదిగదీ, అలావుండాలి" అన్నాడు అర్జునుడు - "మీదందు లోకల్లా నువ్వే మొనగాడివి. సరిగ్గానే వచ్చావిక్కడికి. రా! కాని తోకముడిచెయ్యకండా పోరాడాలిసుమా!" అంటూ గాండీవం సారించాడు. జడివానలాగ బాణాలు కురిపించాడు. సుశర్మ రథమూ, అతడిగుర్రాలూ, సారథీకనపడలేదంటే నమ్మి. మనసేన మాత్రం వూరుకుందా! పెద్దవుప్పెనలా వెళ్ళి అర్జునుణ్ణి ముట్టడించింది. అది చూసి పాండవసైన్యం వురకలువేసుకుంటూ వచ్చింది. అర్జునుణ్ణి వెనకపెట్టి మనసేనమీద కలబడింది. రెండు సేనలూ ముమ్మరమైన దొమ్మియుద్ధం చేశాయి.

అర్జునుడు రాజులమీదికివచ్చాడు. వాళ్ళజెండాలు నరికేశాడు. సారథుల్ని చంపేశాడు. గుర్రాలు కూల్చేశాడు. వాళ్ళగొడుగులూ, చామరాలూ గుండపిండిచేసేశాడు. ధనుస్సులు ముక్కలుచేసేశాడు. కవచాలు పగలగొట్టేశాడు. శరీరంకిటుకుస్థానాల్లో బాణాలు నాటించాడు. ఒళ్ళంతా చీలికలుచేసేశాడు. తలకాయలు ఎగరగొట్టేశాడు. అలా నానాబీభత్సమూ చేసేసి బీభత్సుడు అన్నపేరు సార్థకంచేసుకున్నాడు.

అపరాహ్ణమయింది. మళ్ళీ దురుసుగా వెళ్ళి అర్జునుణ్ణి ఎదిరించాడు సుశర్మ. అతడి రథరక్షకులు ముప్ఫయియిద్దరూ అర్జునుడిమీద పడ్డారు. పకపకానవ్వాడు అర్జునుడు. తలా రెండేసి బాణాలు అరవై నాలుగు బాణాలూ వేశాడు. ముప్ఫయియిద్దరినీ హరీఅనిపించేశాడు. కోపంపట్టలేకపోయాడు సుశర్మ. ఆక్రోశంతో అర్జునుడిమీదికి పురకబోయాడు. అర్జునుణ్ణి తప్పించుకుని సుశర్మ ముందుకి వచ్చాడు. అతడితో తక్కిన ద్రుపదుడి జ్ఞాతులూ తోసుకువచ్చారు. వాళ్ళంతా సుశర్మని చుట్టుముట్టారు.

అర్జునుడు భీష్ముడిదిక్కు నడిచాడు. దుర్యోధనుడూ, జయద్రథుడూ అతడితో తగిలారు. వాళ్ళనికడకంటితో చూస్తూనే భీష్ముడిమీదికి పురికాడు అర్జునుడు. అర్జునుడలా వెళ్ళడంచూసి ధర్మరాజూ అటేవచ్చాడు. శల్యుడు మూర్ఛలేచి అతణ్ణి అడ్డుకున్నాడు. అయినా ఆగలేదతడు. ధర్మరాజువెంట భీముడూ నకుల సహదేవులూ వచ్చారు. అన్నదమ్ములు అయిదుగురూ వచ్చి తాత భీష్ముణ్ణి ముట్టడించారు.

దుర్యోధనుడూ, జయద్రథుడూ దూసుకుంటూ వెళ్ళారు. పాండవులు అయిదుగురినీ అడ్డుకున్నారు. శలుడూ, శల్యుడూ, చిత్రసేనుడూ, కృపాచార్యులూ కూడా వాళ్ళతో కలిశారు. అటు శిఖండీ వచ్చి భీష్ముడిమీద ఎగబడ్డాడు. శిఖండిమీద చెయ్యి చేసుకోలేదు భీష్ముడు. అతడిధనుస్సు మాత్రం విరిచేసి ఊరుకున్నాడు. ఆమాత్రానికే అడిలిపోయాడు శిఖండి. "ఇదేమిటి?" అదలిస్తూ అన్నాడు ధర్మరాజు - భీష్ముణ్ణి చంపేస్తానంటూ అన్ని కబుర్లు చెప్పావు. ఆపంతాలన్నీ ఏమయిపోయాయి?" అంటూ మొగమాటంలేకండా ఎత్తిపొడిచాడు. ఎక్కడలేని పౌరుషమూ పొడుచుకువచ్చింది శిఖండికి. చువ్వలాగ వచ్చాడు భీష్ముడిమీదికి.

అడ్డంగా వెళ్ళాడు శల్యుడు. శిఖండిమీద ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. జంకలేదు శిఖండి వారుణాస్త్రం వేశాడు. ఆగ్నేయాస్త్రం ఆర్పేశాడు.

ఈలోపున భీష్ముడు ధర్మరాజు జెండా ఎగరగొట్టేశాడు. అతడి కోదండం విరిచేసి సింహనాదం చేశాడు.

భీముడు గదపుచ్చుకుని రథందిగాడు; దుర్యోధనుడిమీదికి వురికాడు. జయద్రథుడు రుద్రుడిలాగ వెళ్ళాడు. గబగబగబా అయిదు వందల బాణాలు భీముడిమీద కుమ్మరించాడు. ఒక అడుగయినా వెనక్కి తగ్గలేదు భీముడు. అన్ని బాణాలూ గదతో కొట్టేశాడు. ఆవూపుని వచ్చి జయద్రథుడి నాలుగు గుర్రాలూ బాదేశాడు. ఇంకొక రథంమీదికి పారిపోయాడు జయద్రథుడు. దాంతో మన వాళ్ళు పిరికిగుండె పడిపోయారు. నాయకులు వెనకడుగు వేశారు. సైన్యమూ మడమ తిప్పడం మొదలెట్టింది.

అప్పుడు చప్పున భీముడిమీద కలబడ్డాడు దుర్యోధనుడు. ఆ సందు చూసుకుని భీముడిమీద శక్తివిసిరాడు చిత్రసేనుడు. బాగా కళ్ళు ఎర్రపడ్డాయి భీముడికి. గిరగిరా తిప్పి గద విసిరాడు. పిడుగులాగ ఆకాశమార్గాన మెరుస్తూ వచ్చేస్తూవుంది గద. మహోగ్రంగా వుందది. దానిని చూసి మన యోధుల గుండెలలో ప్రాణాలు లేవంటే నమ్మూ. ఎవరిమీద పడుతుందో అని గడగడలాడిపోయారు వాళ్ళు. అందరూ వొక్కసారి పలాయనం చిత్తగించారు. దుర్యోధనుడిమాటే మరిచి పోయారు వాళ్ళు. చెట్టోపిట్టయి పారిపోయారు. మహారాజా, ప్రాణభయం ఎంతవాణ్ణయినా నీచుణ్ణి చేసేస్తుంది మరి!

తిన్నగా చిత్రసేనుడిమీదికే వచ్చింది గద. క్షణంలో అతడూ అతడి రథమూ పిప్పయిపోతాయి. సందేహంలేదు. అయితే చిత్రసేనుడుమాత్రం కళవిళపడలేదు. కత్తీ, డాలూ పట్టుకుని చప్పుని రథం

మీంచి గెంటేశా డతడు. అతడటు గెంతాడు, అటు రథంమీద పడింది గద. రథమూ రథానికి పూనిన గుర్రాలూ, రథం నొగలు మీది సారథీ మచ్చుకయినా లేకండా పచ్చడయి వూరుకున్నారు. చిత్రసేనుణ్ణి తన రథంమీదికి పట్టుకుపోయాడు వికర్ణుడు.

భీష్ముడు ధర్మరాజు జెండా ఎగరగొట్టేసి, కోదండం విరిచేశా డని చెప్పాను కదా! అంతలో వూరుకోలే దతడు. ధర్మరాజు వొంటినిండా బాణాలు నాటించాడు. నెత్తురు ధారలుకట్టించాడు. ఉగ్రుడే అయిపోయాడు ధర్మరాజు. ఉగ్రమైన శక్తితీసి తాతగారి మీద ప్రయోగించాడు. సగందూరంలోనే దానిని ముక్కలుచేసి కొట్టేశాడు భీష్ముడు. ధర్మరాజు నకులుడి రథంమీదికి వెళ్ళిపోయాడు.

నకుల సహదేవులతట్టు రథం తిప్పాడు భీష్ముడు. కాళ్ళనించి తలదాకా మంటలుచ్చుకున్నట్టు వాళ్ళిద్దరినీ బాణాలతో కొట్టా డతడు. తమ్ముళ్ళు దెబ్బలు తినెయ్యడం చూసి ధర్మరాజు హృదయం చివుక్కుమంది. తమకమూ హెచ్చిపోయింది. "భీష్ముణ్ణి చంపెయ్యండి" అంటూ తనవాళ్ళందరినీ హెచ్చరిస్తూ చెయ్యివిసిరా డతడు. దాంతో పాండవ యోధులు యావన్మందీ వొక్కసారి భీష్ముడిమీదికి పరిగెత్తుకు వచ్చారు.

అసలే భీష్ముడు! మృగాలమంద మీదికివస్తే సింహమెలా రెచ్చిపోతుంది, అదిగో అలాగ సలిగిరేగిపోయా డాయన. సులువు తెలిసిన తోటమాలి తాటిపళ్ళు రాల్చినట్టు వెడల్పాటి బాణాలు వేసి ఆ రాజుల తలకాయలు కిందపడగొట్టడ మారంభించాడు. అటూ, ఇటూ ఎటు పడితే అటు అంతటా తానే ప్రత్యక్ష మయ్యాడు. వీర విహారం చేశాడంటే నమ్ము. కరచరణా లాడలేదు పాండవులికి. కళ్ళప్పగించి బొమ్మల్లాగ నిలబడిపోయారు వాళ్ళు.

అప్పుడు వున్నట్టువుండి ధనుష్టంకారంచేశాడు శిఖండి. భీష్ముడి మీాదికి దూసుకుంటూ వచ్చాడు. తన బాణావిద్యాపాండిత్యమంతా చూపించాడు. అయినా అతణ్ణి గడ్డిపోచలాగే చూశాడు భీష్ముడు. అతడికేసి కళ్ళెత్తి చూడనైనా చూడలేదు. పాంచాలసేనమీాదపడి నురుమాడడ మారంభించాడు. అతడి వడితనం తట్టుకోలేకపోయింది పాంచాలసేన. చిందరవందరయి చెదిరిపోయింది.

ఇక్కడ భీష్ముడిలా వీరవిహారంచేస్తున్నాడు. అటు సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ కలిసి కౌరవసేనమీాద విరుచుకుపడ్డారు. సేనసేనల్లా అల్లకల్లోలం చేసెయ్యడం మొదలెట్టారు. విందుడూ, అనువిందుడూ ధృష్టద్యుమ్నుణ్ణెదిరించారు. అతడి గుర్రాలుపడగొట్టేశారు. దాంతో సాత్యకిరథమెక్కేశాడు ధృష్టద్యుమ్నుడు. అదిచూశాడు ధర్మరాజు. అక్కడున్న సైన్యంయావత్తూ విందానువిందులమీాదికి పురికొల్పాడు. హాలో అంటూ పాండవసైన్యం వొక్కసారి విజృంభించింది. విందానువిందుల్ని వెంటదరిమింది.

దుర్యోధనుడు చెయ్యివిసిరి మనదండుని హెచ్చరించాడు. తమ్ముళ్ళతో కలిసిభీష్ముణ్ణి ముందుపెట్టుకుని పాండవసేనమీాద పడ్డాడు. గదమాయిస్తూ రథం పరిగెత్తించుకుంటూ వచ్చాడు అర్జునుడు. అడ్డంగా వెళ్ళి అతణ్ణి అటకాయించాడు ద్రోణాచార్యులు. అర్జునుడి రథమూా, ఆకాశమూా కనపడకండా బాణవర్షం కురిపించాడు.

ద్రోణాచార్యులు అలావిజృంభించడంతోనే మనసేనలికి ఎక్కడలేని ధైర్యమూా పుట్టుకువచ్చింది. అతడి ఆసరా చూసుకుని శత్రుసేనతో పోరాడాయివి.

తనసేనని ఎక్కడికక్కడ గొంతెత్తి పురికొల్పుతూా వచ్చాడు ధర్మరాజు. అంచేత పాండవసేనలూ మడమతిప్పకండా ఘోరంగా పోరాడాయి.

సూర్యుడు పడమటికొండమీదికి వెళ్ళిపోయాడు. చూసి తీరా లన్నంత ఎర్రగావున్నా డతడు. సంజపొద్దు ఎర్రరంగు రణరంగమంతటా కురిసింది. రక్తనదులు ప్రవహించాయి. ఆప్రవాహంలో శవాలు తేలుతూ కొట్టుకుపోయాయి. గుంపులుగుంపులుగా వచ్చి వాటిని భూతాలూ, భేతాళులూ పట్టుకుపోయారు. ఒడ్డుని పడివున్న పీను గులు నక్కలు ఈడ్చుకుపోయాయి. ఘోరంగావుంది సాయం సంధ్య. సుశర్మా, మొదలైన రాజుల్ని గడగడా వణికించిన అర్జునుడూ, జయద్రథుణ్ణి మూడు చెరువులనీళ్ళు తాగించిన భీముడూ ధర్మరాజు ముందు నుంచున్నారు. యుద్ధమాపమన్నాడు ధర్మరాజు. ఆనాటికి యుద్ధమాగింది. పరివారం యావన్మందితోనూ కలిసి శిబిరానికి బయలుదేరాడు ధర్మరాజు. ఇటు మనవాళ్ళున్నూ సేనలు మళ్ళించి శిబిరానికి వచ్చేశారు.

## ఎనిమిదో రోజు

మర్నాడు తెల్లవారింది. అటు పాండవులూ ఇటు మన వాళ్ళూ మేం ముందంటే మేం ముందు అన్నట్టు వీరావేశాలతో యుద్ధానికి బయలుదేరారు. అవాళ భీష్మసేనాని కూర్మవ్యూహం పన్నాడు. "చూశావా కౌరవులవ్యూహం," మనవ్యూహం, ధృష్టద్యుమ్నుడికి చూపిస్తూ అన్నాడు ధర్మరాజు — "దీనికి ప్రతిగా ఏవ్యూహం పన్నితే బావుంటుందో ఆలోచించు" అన్నాడు.

బాగా ఆలోచించాడు ధృష్టద్యుమ్నుడు. వెంటనే శృంగాటక వ్యూహం పన్నాడు. ఇలా ఉభయసేనలూ వ్యూహాలుపన్ని ఉత్సాహంగా యుద్ధానికి సిద్ధపడ్డాయి. ఉభయవ్యూహాలలోనూ భేరీలూ, మృదంగాలూ మోగాయి. శంఖాలు పూరిమాయి. పోలోఅంటే పోలో అని రెండుసైన్యాలూ వొక్కసారి కలబడ్డాయి. ఆయుధాలతో

ఆయుధాలు రాపడ్డాయి; పొగలేని మంటలు లేచాయి. గుర్రాలూ, ఏనుగులూ, రథాలూపరిగెత్తి చెప్పలేనంత ధూళి రేగింది. రక్తాలు ప్రవహించి ఆధూళి ఆకాశంమీదికి ఎగరకండా అడగారిపోయింది. ఉభయసేనల్లో ఎవ్వరూ వెనకంజవెయ్యలేదు. రణరంగ మంతా రౌద్రం తాండవమాడింది.

భీష్ముడు పెద్దసింహనాదంచేసి శత్రుసేన చీల్చుకుంటూ పరిగెత్తాడు. అతడి వడితనం ఆపశక్యంకాలేదు పాండవులికి. భయపడిపోయి పక్కలికి తప్పేసుకున్నారు వాళ్ళు. ఎంతటి పిరికుడువచ్చినా సాహసించేవాడు వొక్కభీముడే అవుపించా డప్పుడు. సింహనాదంచేసి భీష్ముణ్ణి ఎదిరించా డతడు. వచ్చీరావడంతోనే భీష్ముడిసారథిని చంపేశాడు. సారథి పడిపోవడమే తడువు, బెదిరిపోయాయి గుర్రాలు. రథాన్ని ఈడ్చుకుంటూ వెనక్కి దౌడుతీశాయవి. దాంతో మనసేనలు తడబడిపోయాయి. పాండవసేనలు వొకటేగోలతో దుర్రుచ్చికొట్టాయి.

అపుడు కోడెతాచులా లేచాడు నీకుమారుడు సునాభుడు. పళ్ళుపటపటా కొరుకుతూ వెళ్ళి భీముడిమీద వురికాడు. కాలయముడిలాగ వున్నాడు భీముడు. పెదవులు బిగించాడు. కనుబొమలు ముడిపెట్టాడు. వెడల్పాటి వొక బాణంతోడిగి విడిచిపెట్టాడు. సునాభుడి తల నరికేశాడు. అలా అతడి తలక్రిందపడగొట్టేసి భయంకరంగా అట్టహాసంచేశాడు భీముడు. అన్నదమ్ముడిచావు చూసి ఆదిత్యకేతువూ, అపరాజితుడూ, బహ్వాశీ, పండితకుడూ, విశాలాక్షుడూ, కుండధారుడూ, మహోదరుడూనుండిపడ్డారు ఇంతమందీకలిసి వొక్కమొగిని భీముడిమీదికి వెళ్ళారు. రకరకాల బాణాలు వందలూ వేలూ అతడిమీద కుమ్మరించారు. దాంతో విపరీతమైన కోపంతో విజృంభించాడు భీముడు. భయంకరంగా కనిపించా డతడు. అతడిదిక్కు తేరిచూడడానికే వీలులేక పోయింది వాళ్ళకి. లేళ్ళమీద వురికిన

పెద్దపులిలా కురుకుమార్ళమీదికి వురికాడతను. దారయిన వొక బాణం కొట్టాడు. అపరాజితుడి తల తెగిపోయింది. మరొకటి వేశాడు. కుండధారుడితల కిందపడింది. ఇంకొకటి వొదిలాడు. పండితకుడితల పడిపోయింది. అలాగే వరసగా విశాలాక్షుణ్ణీ, మహోదరుణ్ణీ, ఆదిత్య కేతుణ్ణీ, బహ్వాసినీ తలలు నరికేశాడు భీముడు.

అలా ఏడుగురు కుమార్ళూ క్షణాలమీద హతమైపోయారు. వాళ్ళచావుచూసి తక్కినకుమార్ళు దూరదూరం తప్పుకుపోయారు.

"ఆనాడు సభలో అన్నంతపనీ ఇవాళే చేసేస్తున్నాడు భీముడు" ఒకరిమొహాలు వొకరు చూసుకుంటూ అనుకున్నారు రాజులు - "విదురుడు అన్నంతా అయింది. ఇక సందేహమేమిటి?" అనుకుంటూ భయంతో నుంచుండిపోయారు వాళ్ళు. మహారాజా, నువ్వేమో కొడుకుల దురావేశమూ, అవివేకీ ఆపావు కావు. అది వూరికే ఎలాపోతుంది? భీముడిచేతిలో నీకుమార్ళ చావు తప్పదు. అదలా వుండనీ. అప్పుడు ఏమయిందో విను. రారాజు కళ్ళఎదటే ఏడుగురు తమ్ముళ్ళనీ చంపేశాడు భీముడు.

తనచుట్టూవున్న యోధుల్ని చూశాడు దుర్యోధనుడు. "వెళ్ళండి, భీముణ్ణి చంపెయ్యండి" అంటూ గట్టిగా అరిచాడు. అలా వాళ్ళని హెచ్చరించి భీష్ముడిదగ్గిరికి వచ్చాడతను. "భీము డిలా చెలరేగిపోయి నాతమ్ముళ్ళని చంపేస్తూవుంటే నిమ్మకి నీరెత్తినట్టు వూరికేచూస్తున్నావు!" దుఃఖపడుతూ గద్గదకంఠంతో అన్నాడు. "రవంత విచారంకానీ, రోషంకానీ లేదు నీకు! వీళ్ళతో నాకెందుకని వూరుకుంటున్నావా? లేదా, అందరూ చావనీ అనే నీఅభిప్రాయమా? ఏమిటీ అన్యాయం?" అంటూ గోలుగోలుమన్నాడు.

"ఇదంతా ద్రోణుడూ, విదురుడూ, నేనూ ముందేచెప్పాం నీకు" విచారిస్తూ అన్నాడు భీష్ముడు - "నువ్వు పెడచెవిని పెట్టావు.

అప్పుడు నామాట వినిపించలేదు. పాండవులంటే ఏమో అను కోకు. అసహాయశూరులు వాళ్ళు శత్రుడయినా సరే, వాళ్ళని మాత్రం గెలవడం కల్ల. మన కుమాళ్ళు భీముడి ఎదటపడ్డారో చావు తప్పదు. ఎవడయినా సరే, బతికి బట్టకట్టడం వొట్టిదనుకో. మనం తప్పించలేం. అంచేత దానికోసం ఇంత ఇదవకూడదు. నువ్వు వీరస్వర్గమే లక్ష్యంగా పెట్టుకుని యుద్ధం చెయ్యి. మరో ఆలోచన బుర్ర లోకి రానివ్వకు. తెగించి నా హోపినంతవరకూ నేను పోరాడతాను. యుద్ధంలో జయం వస్తే నేను మాత్రం వొదిలిపెడతానా?" అంటూ ఎన్నోవిధాల వోదార్చాడు.

ధృతరాష్ట్రుడు : అంతటి ద్రోణాచార్యులూ, భీష్ముడూ వుంటూ వుండగానే నా కొడుకులు అలా హతివారిపోతున్నారు కదూ! నేనూ వాళ్ళ అమ్మా నెత్తికొట్టుకున్నాం. చెవిలో గూకుకట్టుకుని పోరాం. విన్నాడు కాడు దుర్యోధనుడు. దానిఫలం ఇప్పుడు అనుభవిస్తున్నాడు. ఊం, గతజలసేతుబంధనం! ఇప్పుడనుకుంటే మాత్రం ఏం లాభం? ఉండనీ అదంతా. తరవాత? కుమాళ్ళ చావు చూశాక భీష్ముడూ ద్రోణుడూ ఏంచేశారు?

సంజయుడు : దుర్యోధనుణ్ణి వోదార్చి, జూలుదులిపిన సింహం లాగ భయంకరంగా బయలుదేరాడు భీష్ముడు. తిన్నగా భీముడికేసి రథం పరిగెత్తించాడు. భీష్ముడు రావడం చూసి తనవాళ్ళకి చెయ్యి విసిరాడు ధర్మరాజు. ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ సైన్యాలు తోసుకొంటూ ముందుకి వచ్చారు. భీష్ముణ్ణి అడ్డుకున్నారు. అంతకి ముందే దుర్యోధనుడు ఇసారా ఇవ్వడంతో మనసేనలోని రాజులు విజృంభించారు. వాళ్ళతో చేకితానుడూ, ద్రౌపదికుమాళ్ళూ అర్జునుడూ కలబడ్డారు. అభిమన్యుడూ ఘటోత్కచుడూ నీకుమాళ్ళ వెంట

పడ్డారు. ఇలా దృఢమైన మూడు జట్లయికలబడ్డారు పాండవులు. మన వాళ్ళునూ దానికి తగినట్టే ఎదిరించి యుద్ధంచేశారు.

ద్రోణాచార్యులు ద్రుపదమహారాజు సేనమీద విరుచుకుపడ్డాడు. పాంచాలయోధుల్ని ముప్పతిప్పలూ పెట్టేశాడు. ఎన్నో అన్ని రకాల బాణాలు వర్షంలా కురిపించాడు. భీముడు మన ఏనుగుసేనమీది కురికాడు. తళతళా మెరుస్తూవున్న బాణాలు ఎడాపెడా గుప్పించాడు. దంతాలు విరిగిపోయీ, తొండాలు తెగిపోయీ, తలకాయ లెగిరి పోయీ కుప్పలుకుప్పలు కూలిపోయాయి ఏనుగులు. అదంతా చూస్తే సూర్యకిరణాలు సోకి చీకట్లు చెదిరిపోయినట్టనిపించింది నాకు.

నకుల సహదేవు లిద్దరూ మన గుర్రపుదళాలమీద పడ్డారు. ఇద్దరూ తేరిచూడడానికి వీలులేనంత ఉగ్రమూర్తు లయిపోయారు. వేలకివేలు గుర్రాలు నరికి పారేశారు. అని ఎంత కుప్పపడ్డాయంటే, ఆప్రదేశంలో మన వాళ్ళు కానీ, పాండవులు కాని రథాలు నడపడానికే వీలులేకండా అయిపోయింది.

అర్జునుడు మన రథాలవాళ్ళ మీది కురికాడు. విరుపూ విరామం లేకండా బాణాలు గుప్పించాడు. భుజకీర్తులతోనూ, హారాల తోనూ రథికుల శరీరాలు తెగి కింద పొర్లాడాయి. మహారాజా, ఏంచెప్పేది రకరకాల పువ్వులు రాలిన ఉద్యానవనంలా అవుపడింది రణరంగం.

## ఇరావంతుడు

అప్పుడు అర్జునుడి కుమారుడు ఇరావంతుడు పెద్ద గుర్రపుసేన వేసుకుని ఉద్ధృతంగా వచ్చాడు; మనవాళ్ళని ముట్టడించాడు. నిజంగా అది చూసితీరాలి. పక్షులమందమీద డేగలగుంపు వచ్చిపడితే ఎలావుంటుందో అలా అనిపించింది. అలా వచ్చిన ఇరావంతుణ్ణి శకుని

తమ్ముళ్లు శుకుడూ, శర్మవంతుడూ, వృషకుడూ, ఆర్జవుడూ గజుడూ, గవాక్షుడూ — ఈ ఆరుగురూ తమ గుర్రాల సేనతో ఎదిరించారు. ఇరావంతుడికీ వాళ్ళకీ చిత్రమైన యుద్ధం జరిగింది. శకుని తమ్ముళ్లు బాణాలువేసి, డొంకెనపోట్లు ♦ పొడిచీ ఇరావంతుణ్ణి ఎంత నొప్పించాలో అంతా నొప్పించారు. బరికోలతో పొడిస్తే తిరగబడ్డ మదపుటేనుగులాగ వాళ్ళమీద తిరగబడ్డా డతడు.

అసలు చెప్పకోదగ్గ విలుకాడు ఇరావంతుడు. శత్రువుల దెబ్బలు తప్పించుకుంటూ గుర్రం చిత్ర విచిత్ర గతులతో దాటించుకుంటూ బాణాలు గుప్పించా డతడు. అతడి లాఘవంచూసి శకుని తమ్ముళ్లు ఆరుగురూ అడిలిపోయారంటే నమ్ము. ఆకాశంమీద దేవతలూ అతణ్ణి మెచ్చుకున్నారు.

అయితే బాగా దెబ్బలు తినేసింది ఇరావంతుడి గుర్రం. దాట్లు దాటి మరింత అలిసిపోయింది. తుదకి పడిపోయిం దది. ఇరావంతుడు మాత్రం కిందపడలేదు. కత్తిపట్టుకుని మెళుకువతో దూకేసి తప్పించుకున్నాడు. అతడి ధైర్యం చూసి ముక్కుమీద వేలుపెట్టుకున్నారు శత్రువులు. అతడు కింద నుంచోడంతోనే శకుని తమ్ముళ్లు ఆరుగురూ వొక్కమారు అతణ్ణి ఘిరాయించారు. డొంకెనలతో అతణ్ణి పొడిచారు. బాణాలతో కొట్టారు. కత్తితోనే కౌశలంతో అవన్నీ తప్పించుకున్నాడు ఇరావంతుడు. చిత్రచిత్రమైన గతులు చూపించాడు. శత్రువుల ఆయుధం వొక్కటీ తనకి తగలకండా తుళ్ళగొట్టాడు.

"వీడు కిందవున్నాడు. గుర్రాలమీంచి వీణ్ణి మనంకొట్టలేం" అంటూ వొక దురాలోచన చేశారు శకుని తమ్ముళ్లు. వెంటనే గుర్రాలుదిగేశారు. కత్తులుపట్టుకుని ఇరావంతుడిమీద కలబడ్డారు.

---

♦ డొంకెన: వంకర అంచుగల ఈటె.

ఒక్కసారి గిర్రున తిరిగాడు ఇరావంతుడు. ఆరుగురినీ పన్నెండు ముక్కల కింద నరికిపారేశాడు. పెద్ద సింహనాదమూ చేశాడు.

కళ్ళు జిగేలుమన్నాయి దుర్యోధనుడికి. "చూశావా ఈ ఉలూపి కొడుకుని!" అంటూ అలంబసుణ్ణి చూశాడు — "వీడు ఒక్కడే మనవాళ్ళని చంపేస్తున్నాడు! వీడిపని కాస్త నువ్వే చూసెయ్యాలి" అంటూ వురికొల్పాడు.

రారాజు నోట్లోమాట నోట్లోనేవుంది. మాయచేశాడు అలంబసుడు. ఇరావంతుడికి ఎంత గుర్రపుసేనవుందో అంత గుర్రపుసేనా పుట్టించాడు. ఇరావంతుడి గుర్రపుసేన యావత్తూ చంపేశాడు. అంతతో ఆమాయ సైన్యం మాయమయిపోయింది. కాని ఇరావంతుడుమాత్రం ఒక్కడే అయిపోయాడు. అయినా అతడు వెన్ను చూపలేదు. పరాక్రమంతో అలంబసుడిమీద కలబడ్డాడు. మెరుపు మెరిసినట్టు అతడిమీదికి వురికాడు. కత్తితో ఒక్క దెబ్బకొట్టాడు. అతడి ధనుస్సు రెండుముక్కలుచేసి నరికేశాడు. ఉన్నపాళాన ఆకాశం మీదికెగిరిపోయాడు అలంబసుడు. అక్కడినించి మాయబాణాలు రువ్వాడు. ఇరావంతుణ్ణి నొప్పించాడు. అలంబసుడు రాక్షసుడయితే, ఇరావంతుడు నాగకుమారుడు. అతడూ ఆకాశంమీదికెగిరాడు. కళ్ళల్లో నిప్పులు కురుస్తూ అలంబసుణ్ణి ఒక్క నరుకు నరికాడు. రెండుముక్కలయిపోయాడు అలంబసుడు కాని చిత్రం, అంతలోనే మంచి నూనూగుమీసాలతో అవతరించాడు, కామరూపి అలంబసుడు. అంచేత ఎన్నిసార్లు నరికితే అన్నిసార్లూ పుడుతూనే వచ్చాడతడు. అయితే పిసరంతా చలించలేదు ఇరావంతుడు. రాక్షసమాయని మాయతోనే ఎదిరించాలనుకున్నాడతడు. తన తల్లివంశం నాగవంశం. నాగులూ కామరూపులే. మాయావిద్యలోనూ పేరువడ్డవాళ్ళు వాళ్ళు. ఆనాగమాయ మనస్సులో స్మరిం

చాడు ఇరావంతుడు. వెంటనే శేషుడిరూపం ధరించాడు. వందలూ వేలూ నాగుపాములతో ప్రత్యక్షమయ్యాడు.

అవకాశం చిక్కింది అలంబసుడికి. పెద్ద గరుడపక్షి అయి పోయాడతడు. నాగుపాములన్నిటినీ పట్టేసి మింగేశాడు. తెల్లపోయాడు ఇరావంతుడు. కత్తితీసి అతడి కంఠం ఉత్తరించేశాడు అలంబసుడు. ఇరావంతుడి శిరస్సు కిందపడిపోయింది. ఏమాత్రమూ చెన్ను తరగకండా చంద్రబింబంలాగ కలకలలాడుతూనేవుంది మొహం.

ధృతరాష్ట్రుడు : ఆఁ! ఇరావంతుడు అలాగ హతమారిపోయాడన్న మాట! సరే, అప్పుడు పాండవులు ఏంచేశారు? వాళ్ళ యోధులూ, వీరులూ ఏం చేశారు?

సంజయుడు : తమ్ముడిపాటు చూశాడు ఘటోత్కచుడు. భయంకరంగా పెద్ద సింహనాదంచేశాడు. విపరీతమైన రాక్షససేనతో మనవాళ్ళమీద విరుచుకుపడ్డాడు. అతడిసేనలో ప్రతివాడూ వాళ్ళ మదపుటేనుగే ఎక్కాడు. ప్రతివాడూ ప్రళయాగ్నిలాగే వున్నాడు. ప్రతివాడూ నేను ముందంటే నేను ముందని వురుకుతున్నాడు. ఆ ఏనుగులు పరిగెత్తుకు వస్తూవుంటే భూమి గజగజలాడిపోయింది. ఆ రాక్షస రాణువ చూసి మనవాళ్ళనిండుప్రాణాలునిలువునా ఎగిరిపోయినట్టయింది.

అలా వచ్చిన రాక్షసులు యావన్మందీ తళతళా మెరిసిపోతూ వున్న శూలాలతో మన ఏనుగుల్నీ, గుర్రాల్నీ, పదాతుల్నీ గుదిగుచ్చి పొడిచేసీ, చంపేసీ సర్వనాశనం చేసెయ్యడం మొదలుపెట్టారు. ఘటోత్కచుడి ఈ అగడమంతా చూశాడు దుర్యోధనుడు. ధనుష్టంకారంచేస్తూ వెళ్ళి అతడిమీద కలబడ్డాడు. దుర్యోధనుడివెంట బ్రహ్మాండమైన ఏనుగుసేనతో వంగదేశం రాజూ వెళ్ళాడు. వంగదేశం ఏనుగులు చూసి వుప్పొంగిపోయాడు ఘటోత్కచుడు. దారుణమైన కత్తిపట్టుకొని వాటిమీదికి వురికేశాడు. చిత్రవధ ప్రారంభించాడు.

ఇది తొండమూ, ఇది దంతమూ, ఇది చెవ్వూ, ఇది తలా, ఇది కాలూ అని పొల్లి లేకుండా కూరకి తరిగినట్టు తరిగిపారేశాడు. అతడి పడితనమూ, హస్తలాఘవమూ చూసి బలే అంటే బలే అన్నారు దేవతలు.

ఏనుగులు నాశనం కావడంతోనే పట్టలేనంత కోపంతో మండిపోయాడు దుర్యోధనుడు. బాణాలతో కప్పేశాడు ఘటోత్కచుణ్ణి. ఘటోత్కచుడి సైన్యంలోని ముఖ్యులు వేగవంతుడూ విద్యుజ్జిహ్వుడూ, బహ్వాశీ ఉద్రేకంతో దుర్యోధనుడి మీదికి వచ్చారు. వాళ్ళ ముగ్గురినీ చంపేశాడు దుర్యోధనుడు. ఆవూవుని ఘటోత్కచుడి శరీరమంతా బాణాలతో నింపేశాడతడు. కళ్ళల్లో నిప్పులు కక్కాడు ఘటోత్కచుడు. "మాయాజూద మాడావు. మా తండ్రుల రాజ్యం చపాయించావు. పతివ్రతని మా తల్లి ద్రౌపదిని అంతసభలోనూ మానభంగం చేశావు. దాని ఫలం నీకు ఇదిగో ఇప్పుడే చూపిస్తాను" అంటూ పురిమి దుర్యోధనుడిమీద విషసర్పాలవంటి బాణాలు గుప్పించాడతడు. అవేవీ లక్ష్యపెట్టలేదు దుర్యోధనుడు. ఉగ్రమైన పాక పాతిక బాణాలు ఘటోత్కచుడిమీద కొట్టాడతడు, దాంతో ఉగ్రుడే అయిపోయాడు ఘటోత్కచుడు. కాలయముడి నాలుకలాంటి శక్తి తీసి దుర్యోధనుడిమీద విసిరాడు. రెప్పపాటులో దుర్యోధనుడిమీద పడేదే అది. కాని చప్పున మధ్యకివచ్చి వంగదేశం రాజు అడ్డుపడ్డాడు. అతడి ఏనుగుమీద పడింది ఘటోత్కచుడి శక్తి. దెబ్బతో రక్తం కక్కుకుంటూ కూలిపోయింది ఏనుగు. కిందికి దూకేసి తప్పుకున్నాడు వంగదేశంరాజు.

వంగదేశం మదపుటేనుగా కూలిపోవడంతో మనసైన్యం జంకేసింది. కకావికలయి పరుగుచ్చుకుంది. ఒక్కడే అయిపోయాడు దుర్యోధనుడు. అయినా చలించలే దతడు. ధైర్యంతో పాక పర్వతంలా నుంచున్నాడు, మంచిదొక మహాస్త్రం తీశాడు. ఘటోత్కచుడిమీద ప్రయోగించాడు. మంటలు కక్కుకుంటూ వెళ్ళింది మహాస్త్రం

చూశాడు ఘటోత్కచుడు. ప్రళయమేఘంలా వురిమాడతడు. మధ్య లోనే దుర్యోధనుడి మహాస్త్రం మంటకలిపేశాడు. దిక్కులు బద్దలయి నట్టు పెద్దసింహనాదమూ చేశాడు.

ఘటోత్కచుడి సింహనాదం విన్నాడు భీష్ముడు. కౌరవయోధు లందరినీ వొకసారి కలయజూశాడు. "ఘటోత్కచుడు రాజుమీద విరుచుకుపడ్డాడు. ఏనుగులు చంపేశాడు. అదిగో మారిమసగినట్టు మనసేనమీద పడుతున్నాడు. దేవతలన్నా అతణ్ణి గెలవలేరు. లెండి. పరిగెత్తండి. రాజుకి సాయపడండి" అంటూ హెచ్చరించాడు. తొందర చేసేశాడు.

సేనాపతి భీష్ముడలా హెచ్చరించడంతోనే ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, చిత్రసేనుడూ, బృహద్బలుడూ, బాహ్లికుడూ విందుడూ, అనువిందుడూ, భూరిశ్రవసుడూ, జయద్రథుడూ, సోమ దత్తుడూ, వివింశతీ, వికర్ణుడూ వొక్కపెట్టుని తమతమ సేనలతోనూ, రథాలతోనూ పరిగెత్తారు. ఇంతమందీ వెళ్ళి దుర్యోధనుడిచుట్టూ పెట్టనికోటలా నిలబడి, ఘటోత్కచుణ్ణి ముట్టడించారు.

రాక్షసమాయతో మరింత రెచ్చిపోయాడు ఘటోత్కచుడు. పెద్దపెద్ద పెడబొబ్బలుపెడుతూ మన పదముగ్గురు మహాయోధుల మీందా క్రూరమైన బాణాలు కుమ్మరించాడు. కొందరి సారథుల్ని చంపేశాడు. కొందరి జెండాలు చించేశాడు. కొందరి రథాలు విరిచే శాడు. కొందరిగుర్రాలు కూల్చేశాడు. కొందరి కవచాలు పగలగొట్టి వొళ్ళంతా రక్తాలు కారించాడు.

బాగా వొళ్ళుమండింది మనవాళ్ళకి. అందరూ కూడబలుక్కు న్నారు. పోయిన సాధనాలు మళ్ళీ సమకూర్చుకున్నారు. పద ముగ్గురూ వొక్కసారి కమ్ముక్కుయి ఘటోత్కచుడిమీద పడ్డారు. మహాస్త్రాలు ప్రయోగించారు. మంటల్లో అతణ్ణిముంచెత్తారు. భరించ

లేకపోయాడు ఘటోత్కచుడు. ఉన్నపాళాన ఆకాశంమీది కెగిరిపోయాడు. అక్కడ పెద్ద నల్లమబ్బులా అవుపించాడు. ఉరుములురిమినట్టు రంకెలువేశాడు. అసాధ్యుడయిపోయాడు.

"తమ్ముడూ, ఇక్కడ భీష్ముడిపాల బడ్డ పాంచాలసైన్యం కాసుకోవాలి. అక్కడ ద్రోణుడూ మొదలైనవాళ్ళనించి ఘటోత్కచుణ్ణి కాసుకోవాలి. ఇక్కడ అర్జునుడున్నాడు. నువ్వు ఘటోత్కచుడి దగ్గిరికి వెళ్ళు" అంటూ భీముణ్ణి తొందరచేశాడు ధర్మరాజు.

భయంకరంగా సింహనాదంచేశాడు భీముడు. ఉరకలువేస్తూ వెళ్ళి కౌరవయోధులమధ్య వురికాడు. మన రాణువనంతా తింతారు చేసేస్తూ దుర్యోధనుడిమీదికి వచ్చాడు. బాగా దగ్గిరికి రానిచ్చాడు దుర్యోధనుడు. మంచి దారయిన వొక నెలవంకబాణం తీశాడు. భీముడి ధనుస్సు టపీమని నరికేశాడు. మరొక ధనుస్సు భీముడు తీసేలోపున గట్టిదొక సానపెట్టినబాణం అతడి ఎముకొమ్ముమీద కొట్టాడు. దెబ్బతో సొమ్మసిల్లిపోయాడు భీముడు. అంతలో అయిదుగురూ అయిదు మెరుపుల్లాగ వచ్చిపడ్డారు ద్రౌపదికుమాళ్ళు. అభిమన్యుడూ, ఘటోత్కచుడూ వాళ్ళతో కలిశారు.

తండ్రిని కొట్టాడన్నకోపంతో ఏడుగురూ సింహంకొదమల్లాగ వచ్చి దుర్యోధనుడిమీద పడ్డారు. కృపాచార్యులూ మొదలైన మన యోధులు వాళ్ళ నెదిరించారు. ఘోరమైన పోరాటం జరిగిపోయింది.

భీముడు తేరుకున్నాడు. భయంకరమైన బాణాలు మనవాళ్ళమీద ప్రయోగించాడు. ద్రోణాచార్యులతడిమీదికి వెళ్ళాడు. వాడి వాడి బాణాలు కొట్టి అతడి వొళ్ళంతా తూట్లుపడేట్టు చేశాడు. పళ్ళుకొరుకుతూ వొక ఘోరమైన బాణంతీశాడు భీముడు. బలంకొద్దీ ధనుస్సులాగి ద్రోణుడిమీదికి వొదిలిపెట్టాడు. అంతద్రోణుడూ ఆ దెబ్బతో మూర్ఛపోయాడు.

తండ్రి అవస్థచూసి పెద్దపులిలాగ వెళ్ళి భీముడితో కలబడ్డాడు అశ్వత్థామ. దుర్యోధనుడూ అతడితో కలిశాడు. ఇద్దరినీ కవ్వించినట్టు చేశాడు భీముడు. చిన్న చిరునవ్వు నవ్వాడు. గద చేత్తో పుచ్చుకున్నాడు. పళ్ళు బిగించాడు. భయంకరంగా రథం దిగాడు. ఇంతలో ద్రోణాచార్యులు తెలుసుకున్నాడు. భీముడిమీద కోదండం గురి పెట్టాడు. కృపాచార్యులూ ముఖ్యులైన యావన్మంది యోధులూ ద్రోణుడితో కలిశారు. ఒక్క మొగిని భీముడిమీద దివ్యాస్త్రాలు ప్రయోగించారు. ఘటోత్కచుడూ, ద్రౌపదికుమారుళ్ళూ, అభిమన్యుడూ ఏకమయ్యారు. వాళ్ళ ఆటోపం సాగకండా దారుణమైన బాణాలతో ఎదురుకున్నారు. కనీవినీ ఎరగనంత ఘోరంగా జరిగిపోయింది యుద్ధం.

అనూపదేశంరాజు భీముడి స్నేహితుడు నీలుడు అశ్వత్థామ నెదిరించాడు. బాణాలమీద బాణాలుకొట్టి అతణ్ణి అశ్వత్థామ సొమ్మసిల్ల గొట్టేశాడు. అది చూశాడు ఘటోత్కచుడు. అమాంతంగా అతడిమీద విరుచుకుపడ్డాడు. కసిదీరా బాణాలతో కొట్టాడు. కుమారుడికి ప్రమాదం రాకండా అడ్డుపడ్డాడు ద్రోణాచార్యులు. శరవర్షం కురిపించి ఘటోత్కచుణ్ణి ముచ్చెమటలు పోయించాడు. తల మునకలయిపోయింది ఘటోత్కచుడికి. కళ్ళు రెండూ చింత నిప్పులులా మండాయి. దాంతో రాక్షసమాయ లంకించుకున్నాడతడు.

ఆమాయలో ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, మొదలైన పదముగ్గురు యోధులూ, దుర్యోధనమహారాజూ రక్తాలుకారేట్టు చావుదెబ్బలుతినేసి, సొమ్మసిల్లిపోయి, నేలమీద పొర్లాడడం మన సైనికులు యావన్మందీ స్పష్టంగా చూశారు. ఇక చెప్పేదేముంది! కౌరవసైన్యం యావత్తూ కాళ్ళకి బుద్ధిచెప్పింది. తడబడిపోతూ, తమని తాము తొక్కేసుకుంటూ, పడుతూ లేస్తూ పారిపోడమారంభించింది.

"అదంతా అబద్ధం" చెయ్యెత్తి కేకలు వేశాడు భీష్ముడు – "మాయ. రాక్షసమాయ. పారిపోకండి ఆగండి. ఆగండి" అంటూ గొంతెత్తి అరిచాడతడు. కాని లాభంలేకపోయింది. కళ్ళారా చూసింది కాదంటే ఎలా నమ్ముతారు వాళ్ళు! భయం నిలవనివ్వలేదు వాళ్ళని. ఒక్కడూ ఆగలేదు. అందరూ తోకముడిచేశారు.

మొహం వేలవేసుకుని తాతగారిదగ్గరికి వచ్చాడు దుర్యోధనుడు. "నువ్వూ, ద్రోణుడూ వుండగానే శత్రువులచేత చావుదెబ్బలు తినేశాను! ఇదిగో వెళుతున్నాను. వాళ్ళని చంపడమో, వాళ్ళచేత చావడమో ఏదో వొకటి జరగాలిప్పుడు" అంటూ కంటసపడ్డాడు.

"ఈమాట పాండవులంటే చెల్లుతుంది" నవ్వుతూ అన్నాడు భీష్ముడు – "అయినా నువ్వు అంత సాహసానికి తెగించడం తగనిపని. దానికి మాలాంటి వాళ్ళం వుండనే వున్నాం కదా! శాంతించు" అంటూ లేచి భగదత్తుణ్ణి పిలిచాడాయన.

"ఇదిగో, రాక్షసమాయకి నువ్వే తగినవాడివి. నువ్వే ఇప్పుడు గెలుపు సాధించవలిసినవాడివి, వెళ్ళు. హిడింబి కొడుకుపని పట్టించు. రారాజుని సంతోషపెట్టు" అన్నాడు.

అసలే మహావీరుడు భగదత్తుడు. భీష్ముడలా అనడంతోనే పొంగిపోయాడతడు. కవ్వించిన సింహంలాగ పెద్ద సింహనాదం చేశాడు. సుప్రతీకమెక్కి తన దండుతో పాండవులమీదికి పరిగెత్తాడు. అప్పటికికాని ఇందాకచూసిన మాయ అబద్ధమని అవగతం కాలేదు మన సేనకి. భగదత్తుడు బయలుదేరడంతోటే, పారిపోతూవున్న సైన్యం యావత్తూ వెనక్కి తిరిగింది. మళ్ళీ ఎప్పటిలాగే యుద్ధానికి సిద్ధపడింది. ఉభయసేనలూ కలబడ్డాయి. ఘోరమైన దొమ్మీ యుద్ధం జరిగిపోయింది.

అప్పటికి అలవొద్దువేళ కావచ్చింది.

పెద్ద కొండలా వుంది మదపుటేనుగు సుప్రతీకం. దానిమీదించి రాక్షససేన తరిమాడు భగదత్తుడు. కవ్వించినట్టయింది ఘటోత్కచుడికి. రంకెవేస్తూ అతడిమీదికి పరిగెత్తాడతడు. అతడివెంట భీముడూ వురికాడు. భీముడివెంట ద్రౌపదికుమారుళ్ళూ, అభిమన్యుడూ మొదలైనవాళ్ళూ వచ్చారు. ఇంతమందీ కలిసి సుప్రతీకంమీద జడివానలాగ బాణాలు కుమ్మరించారు. ఈటెలతో పొడిచారు రకరకాల ఆయుధాలతో కొట్టారు. ఆపాదమస్తకం గాయాలుచేసి వొదిలిపెట్టారు. ఒంటినిండా రక్తాలు ధారలుకట్టి జేగురు సెలయేళ్ళతో వున్న కొండలా అవుపించింది సుప్రతీకం.

యముడిలాగ పెద్ద శూలంతీశాడు ఘటోత్కచుడు. సూటిగా గురిచూసి భగదత్తుడిమీద విసిరాడు. మంటలు కక్కుతూ వచ్చేస్తూ వుంది శూలం. ఒక అర్ధచంద్ర బాణంవేసి దానిని నరికేశాడు భగదత్తుడు. అంతతో వూరుకోలే దతడు. ఘోరమైన శక్తితీసి ఘటోత్కచుడిమీద ప్రయోగించాడు. చూశాడు ఘటోత్కచుడు. చెంగున ఆకాశంమీద కెగిరిపోయాడు. సగంలోనే శక్తిని చేత్తో పట్టేసి, తొడల మీద పెట్టి రెండుముక్కలుగా విరిచేశాడు. ఆ చిత్రంచూసి నాలికలు కరుచుకున్నారు మనవాళ్ళు.

పెద్ద సింహనాదంచేశాడు భగదత్తుడు. ఆ వూపునివెళ్ళి భీముడి గుర్రాలు చంపేశాడతడు. అభిమన్యుడిమీదా తక్కిన పాండవ యోధులమీదా కరుకయిన బాణాలు గుప్పించాడు. సుప్రతీకం పరిగెత్తించి వాళ్ళ గుర్రాలు చంపేశాడు. రథాలు పిప్పిచేసేశాడు. ఇక పదాతికుల్ని ఎంతమందిని తొక్కించేశాడో లెక్కాజమాలేదు. మహాసముద్రంలో మందరపర్వతం కవ్వంతిరిగినట్టు పాండవసైన్యంలో తాండవంచేసి ఎన్నోఅన్ని ఏనుగులు చంపేసింది సుప్రతీకం.

అప్పుడు దశార్ణ దేశంరాజు మదించిన తన పట్టపుటేనుగుమీద వచ్చి సుప్రతీకాన్ని ఎదిరించాడు. రణపెంకి దశార్ణ దేశం పట్టపు టేనుగు. అంత సుప్రతీకాన్నీ పాదుకదలకండా నిలిపేసిం దది. బాగా వొళ్ళుమండింది భగదత్తుడికి. ధగధగా మెరుస్తున్న నలభై తోమ రాలు గబగబా దశార్ణ దేశం ఏనుగుమీద విసిరాడు. పిడుగులుపడ్డట్టు పడి దశార్ణ దేశంఏనుగు మీది కవచం పగిలింది. కళేబరం చీలిక లయింది. మరి నిభాయించుకో లేకపోయిం దది. జ్రుమని వెనక్కి తిరిగింది. పాండవసేన పడదొక్కేస్తూ అదేపాటిపోడం పారిపోయింది.

భగదత్తుణ్ణి మెచ్చుకున్నాడు దుర్యోధనుడు, ఎక్కడలేని ఉత్సా హమూ పుట్టుకువచ్చిం దతడికి. కృపుడూ మొదలైన మహాయోధు లతో కలిసి శత్రువుల్ని నురుమాడడ మారంభించాడు. పాంచాల యోధులతోనూ, అర్జునుడితోనూ కలిసి ధర్మరాజు విజృంభించాడు. దుర్యోధనుణ్ణి కరచరణాలాడకండా నిలదీసి పోరాడాడు. అర్జునుడు గాండీవం మోగించాడు. ఆకాశం దిమ్మెత్తినట్టు దేవదత్తం పూరిం చాడు. రకరకాల బాణాలు రువ్వి కౌరవసేన వేటాడుతూ భీముడు యుద్ధంచేస్తున్న దగ్గిరికి వచ్చాడు. తమ్ముణ్ణి చూశాడు భీముడు. ఇరా వంతుడిచావు వినిపించాడు.

గుండెల్లో పిడుగుపడ్డట్టయింది అర్జునుడికి. "ఎక్కడ ఏడీ ఇరా వంతుడు?" అంటూ ఆతురపడుతూ భీముణ్ణి అడిగాడు. ఇరావం తుడు పడివున్న చోటు చూపించాడు భీముడు. గబగబా వెళ్ళాడు అర్జు నుడు. అలంబసుడికత్తితో కంఠం తెగి కిందపడున్నాడు ఇరావంతుడు. చూసి దుఃఖమాపుకోలేకపోయాడు అర్జునుడు. అతడి రెండునేత్రాల నించీ కన్నీళ్ళు ధారలుకట్టాయి. నిట్టూర్పులు లేచాయి.

"బావా!" కృష్ణుణ్ణిచూసి బావురుమన్నాడు అర్జునుడు — విదురుడు అన్నంతా అవుతూవుంది. కౌరవులికీ పాండవులికీ ఘోరం

సంభవిస్తుందని ముసిలాయన్ని ఎంతయినా వారించా డతను. లాభం లేకపోయింది. చెవిటివాడిముందు శంఖమూదినట్టే అయింది. మన వాళ్ళని ఎంతమందినో చంపేశారు వాళ్ళు. వాళ్ళనీ ఎంతమందినో చంపేశాం మనం. యుద్ధమంత పాడుపని మరొకటిలేదు. అయినా ధనంకోసం ఈ పాడుపనే చేస్తున్నాం. అంచేత కృష్ణా, ధన మంటేనే ఛీ అనిపిస్తూవుంది. ధనం లేకండా వుండడం కంటే చావు నయం. నిజమే. అయినా ధనంకోసమని జ్ఞాతివధ ఘోరం! యుద్ధంలో జ్ఞాతుల్ని చంపి ఏంనోల్లుకోవాలి? శకుని కర్ణుల కపటమూ, దుర్యోధనుడి దుర్నీతీ - ఈ రెంటివల్లా పాపం, ఈక్షత్రియలోకం హతమారిపోతూ వుంది. ధర్మరాజు 'అయిదూళ్ళయినా చాలు' అని ఎందుకన్నాడో ఇప్పుడు నాకు అర్థమవుతూవుంది. దుర్యోధనుడు దురాత్ముడు. అయిదూళ్ళయినా అంగీకరించాడు కాడు. యుద్ధంలో చచ్చిపడున్న ఈ ప్రజల్ని చూస్తే నాగుండె తరుక్కుపోతూవుంది. అందులోనూ నా చేతిలోనే ఎంతోమంది తెగిపోతూవున్నారంటే నామీద నాకే అసహ్యం వేస్తూవుంది. నన్ను నేనే నిందించుకుంటున్నాను. నిజానికి క్షత్రియధర్మమంత నికృష్టధర్మం ఇంకొకటి లేదు." ఇలా ఎంతో అంత దుఃఖపడ్డాడు అర్జునుడు.

అర్జునుణ్ణి భావగర్భితంగా చూశాడు శ్రీకృష్ణుడు. చిన్నమంద హాసమూ చేశాడు. ఆ మందహాసమే అద్భుతమైన చైతన్యం ప్రసాదించింది అర్జునుడికి. "అవును, కృష్ణా! అవును. ఈ మోహం విడిచిపెడుతున్నాను" గాండీవం సారిస్తూ అన్నా డతడు - "పగ్గాలు సడిలించు. రథం నడిపించు. కౌరవసేన గాండీవానికి బలిపెడతాను" అన్నాడు.

అర్జునుడు అలా అనడమే తడువు, పగ్గాలు సడిలించాడు సారథి శ్రీకృష్ణుడు. కౌరవసేనమీదికి శరవేగంతో పరిగెత్తుకు

వచ్చింది అర్జునుడి దివ్యరథం. ఎత్తినగాండీవం దించలేదు అర్జునుడు. చిచ్చులపిడుగులా రెచ్చిపోయా డతడు కొడుకుచావు దహించుకు పోతూన్న హృదయంతో శత్రుసంహార మారంభించాడు. అతడి ఎడటూ, కుడిఎడమలా కుప్పలుకుప్పలు కూలిపోయింది మనసేన. అలా విక్రమతాండవంచేస్తున్న అర్జునుణ్ణి భగదత్తుడూ, కృపుడూ, సుశర్మా, భీష్ముడూ - ఇంతమందీ కలిసి ఎదిరించారు. ఘోరాతిఘోరంగా జరిగిపోయింది యుద్ధం.

ఒకవంక సాత్యకి చెలరేగాడు. అతడితో కృతవర్మా, బాహ్లీకుడూ పోరాడారు. భీముడితో ద్రోణుడూ, దుర్యోధనుడితమ్ముళ్లూ యుద్ధం చేశారు. ద్రోణుడువేసిన బాణాలు కాసుకుంటూనే నీకొడుకుల మీాదకి ఏకధాటేని రథం పరిగెత్తించాడు భీముడు. నీకొడుకులబాణాలు తనకి తగలడంతో నెయ్యిపోసిన అగ్నిహోత్రుడిలా మరింత మండి పడ్డా డతడు. ప్రాణాంతకమైన బాణాలు వొదిలిపెట్టాడు. కుండభేదీ, అనాధృష్యుడూ, కనకధ్వజుడూ, విరావీ, సుబాహుడూ మొదలైన వాళ్ళని చంపేశాడు. వీళ్ళచావుచూసి తక్కినకుమాళ్ళు ఎక్కడివా ళ్ళక్కడ పటాపంచలయి పోయారు. వాళ్ళని వెంటాడి, మేకల్ని తరిమిన తోడేలులా అవుపించాడు, భీముడు.

సాయంకాలం కావచ్చింది.

తమకంతో సేనలు పురికొల్పాడు దుర్యోధనుడు. తెగించి హోరాహోరి పోరాడాడు. అంతకంటె తమకంతో పోట్లాడారు పాండవులు. ఉభయసేనలూ వొకదాన్నిమించి వొకటి యుద్ధం చేశాయి. రణరంగమంతా రక్తం మడుగులుకట్టింది. ఆభరణాలూ, ఆయుధాలూ కుప్పలుపడ్డాయి. అదంతాచూస్తే బాగా కుంకంపూసుకుని, రకరకాలనగలు పెట్టుకున్న అందకత్తెలా అవుపించింది రణస్థలం.

రాత్రిపడింది. చీకటి కమ్మింది. ఉభయపక్షాలూ యుద్ధమాపాయి. కౌరవులూ పాండవులూ ఎవరిశిబిరాలకి వాళ్ళు వెళ్ళిపోయారు.

## భీష్ముడు వద్దు, కర్ణుడు రానీ

ఆవాళరాత్రి దుర్యోధనుడి మనస్సు మనస్సులో లేదు. శిబిరం చేరడంతోనే దుశ్శాసనుణ్ణి పిలిచాడతడు. కర్ణుణ్ణీ, శకునునీ పిలుచుకు రమ్మన్నాడు. వాళ్ళని క్షణాలమీద ప్రవేశపెట్టాడు దుశ్శాసనుడు. నలుగురూ రహస్యంగా వొకదగ్గర కూచున్నారు.

"ఏంచేద్దామో చెప్పండి" అంటూ అందుకున్నాడు దుర్యోధనుడు — "విషమసంధి వచ్చిపడింది మనకి. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా మనకెందు కన్నట్టు తటస్థంగా వూరుకుంటున్నారు. పాండవుల్ని చంపాలన్న భావమే లేదు వాళ్ళకి. మనసేనలు నానాటికీ సన్నగిల్లిపోతున్నాయి. ఏందారి?" అన్నాడు.

అన్నాళ్ళూ యుద్ధం చెయ్యకండా వుండడం చేతులుకట్టేసినట్టుంది కర్ణుడికి. అదే సమయమంటూ అందుకున్నాడతను. "మహారాజా, దీనికి వొక్కటే మార్గముంది. భీష్ముణ్ణి యుద్ధానికి రాకండా చెయ్యి. చాలు. పాండవుల పొగరేదో నేను అణిచేస్తాను. వాళ్ళనీ, వాళ్ళ సేనల్నీ నల్లులు నలిపేసినట్టు నలిపేస్తాను" అన్నాడు.

"అవును, అదే బావుంది" దుశ్శాసనుడివంక చూస్తూ అన్నాడు దుర్యోధనుడు — "తమ్ముడూ, మనం వెళ్ళి తాతగారిని వొద్దని చెప్పేసివద్దాం. నువ్వు సిద్ధపడు" అన్నాడు. కర్ణుణ్ణీ, శకునినీ తమశిబిరాలికి పంపేశాడు.

అనంతరం అనేకరకాల సుగంధద్రవ్యాలువేసిన నీళ్ళలో స్నానం చేశాడు దుర్యోధనుడు. ఘుమఘుమలాడుతూవున్న మంచిగంధమూ

మొదలైన పరిమళద్రవ్యాలు పూసుకున్నాడు. చీనిచీనాంబరాలు కట్టుకున్నాడు. మహనీయమైన పూలదండలు వేసుకున్నాడు. నవరత్నాలతో ధగధగలాడుతూవున్న బంగారం భూషణాలు పెట్టుకున్నాడు. తమ్ముళ్ళనీ, తగినవాళ్ళని కొంతమందిని వెంటబెట్టుకున్నాడు. గమ్మ మంటూన్న సువాసనతైలాలుపోసి వెలిగించిన వేలాది దివిటీలమధ్య, రత్నాలు చెక్కిన బంగారంరథ మెక్కాడు. బెత్తాలుపట్టుకున్న బంట్రోతులు "తప్పుకోండి తప్పుకోండి" అని సందడిచేస్తూ దార్లోజనం తప్పించారు. వందిమాగధులు మధురంగా గేయాలు పాడుతూ పొగిడారు. వేదపాఠకులు మంగళకరమైన ఋక్కులు వల్లించారు.

మందగమనంతో నడిచి భీష్ముడి శిబిరంముందు ఆగింది రారాజు రథం. రథందిగాడు దుర్యోధనుడు. దుశ్శాసనుడి ముంజేయి చేతితో పట్టుకుని తగినవిధంగా లోపలికి నడిచాడు. తిన్నగా వెళ్ళి వెళ్ళడంతోనే తాతగారి పాదాలకి నమస్కారంచేశాడు. దగ్గిరిసా వొకబంగారం గద్దెమీద కూచున్నాడు. "నాదొక ప్రార్థన" అంటూ రెండు చేతులూ జోడించి మెల్లిమెల్లిగా ఉపక్రమించాడు — "నిన్ను నమ్ముకుని పాండవుల్ని గడ్డిపోచలాగ చూశాను నేను. అయితే ఏంలాభం! ఇన్నాళ్ళూ నీయుద్ధం చూస్తున్నాను. వాళ్ళని చంపడానికి పిసరంతా ప్రయత్నం చెయ్యలేదు నువ్వు. వాళ్ళంటే పక్షపాతం నీకు. ఏందారి? యుద్ధంలో నువ్వు ధనుస్సు పట్టుకుంటే హరిబ్రహ్మాదులు నీముందు నిలవలేరు. అదిబాగా తెలుసు నాకు. ఇవాళకి ఎనిమిదిరోజు లయింది. అరునుణ్ణి చంపావు కావు. పోనీ జమాలుమన్నట్టు వొక్కదెబ్బయినా కొట్టావుకావు. అదలా వుండనీ, ఏంచేస్తాం! అదంతా మాకర్మ. ఇప్పుడు వొక్కటే నాప్రార్థన. మరి నువ్వు రేపటినుంచీ యుద్ధానికి రాకు. నామనవి మన్నించు. కర్ణుణ్ణి యుద్ధానికి పంపించు" అన్నాడు.

ఆమాట శూలంలా తగిలింది భీష్ముడికి. ఆయన మొహంలో చిక్కతే నెత్తురుచుక్క లేదు. విచారంతో ఆయననోటమాట పెగల లేదు. తలవంచుకుని కొంతసేపుదాకా అలాగే వుండిపోయాడు. చివరికి వొక దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు.

“నీకోసం నాప్రాణాలుకూడా దాచుకోలేదు” మొహమెత్తి దుర్యోధనుణ్ణి చూస్తూ అన్నాడతడు – “సర్వశక్తులూ వినియోగించి పోరాడుతున్నాను. అంతా బూడిదలోపోసిన పన్నీరయిపోయింది. ఇలా అనడం సబబనే తోచిందా నీకు?”

అలా అంటూంటే రెండుకళ్ళూ ఎరుపెక్కాయి భీష్ముడికి. ఇంకా, ఇలా అన్నాడతడు – “అర్జునుణ్ణి చంపలేదంటున్నావు. నిందిస్తున్నావు. అర్జునుడంటే అంత మీదమీదమాటలా? నీకు మాత్రం అది తెలియదా? దేవతలతోసహా దేవేంద్రుణ్ణి త్రాహి త్రాహిమనిపించి ఖాండవవనం కాల్చేశాడే! శివుడంతవాణ్ణి వొక్కడే యుద్ధంలో మెప్పించి దివ్యాస్త్రాలు సంపాదించాడే! కర్ణుడూ, నీతమ్ములూ గంధర్వులతో వోడిపోయి తోకముడిచినప్పుడు నిన్ను విడిపించలేదూ? నిన్నూ, నన్నూ, ద్రోణుణ్ణీ, అశ్వత్థామనీ, కృపుణ్ణీ, నీకర్ణుణ్ణి – ఉత్తరగోగ్రహణమప్పుడు వొక్కడే వచ్చి ఏచేశాడు? ఇంకా ఎన్నోచోట్ల ఎంతమందిని ఏంచేసిందీ వినలేదూ మనం? అంతటిమహావీరుణ్ణి ఎదిరించి ఇన్నాళ్ళు ఇలా దెబ్బలాడాను. తుదకి నీచేత ఇంతటి దుర్భరమైనమాట వినవలసివచ్చింది. ఇది తగునూ, ఇది తగదూ అని ఆలోచించావుకావు. గెలవరానివాళ్ళతో పగ పట్టావు. సరే, ఇంతవూకదంపెందుకూ? యుద్ధంలోమగతనంచూపించు.

“ముప్పయిమూడుమార్లు చెప్పాను. ఇప్పుడూ చెపుతున్నాను. అర్జునుణ్ణి గెలవలేను నేను. శిఖండిని చంపను. ఎతుఇద్దరూ తప్పించి ంతటి మొనగాడు వచ్చినా సరే, వాడి ప్రాణాలు దక్కనివ్వను.

ఇంతెందుకూ, నేనూ, నా సైన్యమూ కలిసి పాంచాల, మత్స్య, యాదవ సేనలతో పోరాడతాం. తక్కిన పాండవుల్ని మీరు గెలవండి. అంతే కాని అర్ధరాత్రివచ్చి నన్ను అడ్డమాని మాటలూ ఆడినంతమాత్రాన జయం నీవాళ్ళో పడిపోతుందనుకున్నావా? వెయ్యిమాటలెందుకూ పద, రేపు యుద్ధానికినడు. నా చేతిచేవేదో చూపిస్తాను. నీరెండు కళ్ళతో నువ్వే చూద్దువుకాని" అన్నాడు.

"సరే" అని తలవూపాడు దుర్యోధనుడు. తన శిబిరానికి తిరిగి వచ్చేశాడు. ఆరాత్రి సుఖంగా నిద్రపోయాడు. తెలతెలవార కండానే మేలుకున్నాడు. ఉత్సాహంగా యుద్ధానికి సిద్ధపడ్డాడు. సేనలు రణస్థలానికి నడిచాయి.

## తొమ్మిదో రోజు

"ఇదిగో, మీరందరూ వినండి," రాజులందరి ఎదటా భీష్ముణ్ణి ఉద్దేశించి ఆరంభించాడు దుర్యోధనుడు — "పాంచాలసైన్యమూ మొదలైన శత్రుసైన్యం యావత్తూ చంపేసి, పాండవుల్ని గెలిచేస్తానని రాత్రి మాటఇచ్చాడీయన. అందేత మన చేవంతా చూపించి యుద్ధం చెయ్యాలి ఇవాళ" అన్నాడు. దుర్యోధను డలా తులువతనంగా అన్నమాటలు విని సిగ్గుపడ్డాడు భీష్ముడు. అసహ్యమూ, విచారమూ రెండూ కలిగా యతడికి. తన్ను తానే సంబాళించుకుని వూరుకున్నా డతడు.

"తమ్ముడూ మనమంతా తాతగారి దగ్గిరే వుందాం" భీష్ముడి ఇంగితం కనిపెట్టేసి దుశ్శాసనుడితో అన్నాడు దుర్యోధనుడు — "అంతేకాదు. మంచి ఎంపికయిన మొరికల్లాంటి రథికున్ని రెండువేల మందిని ఈయనముందు పెట్టు" అన్నాడు. అన్నగారి ఆదేశం అక్షరాలా పాలించాడు దుశ్శాసనుడు. సత్యవ్రతుడైన తాతయ్య శిఖండి

మీద చెయ్యి వేసుకోనని ఓం ప్రథమంగా మనం దండువిడిసిన నాడే చెప్పాడు'' ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా ఈముగ్గురితోనూ అన్నాడు దుర్యోధనుడు - "మీ అందరూ ఎరుగుదు రది. అంచేత ఆనీచుడికంట పడకుండా ఈయన్ని కాసుకు రావాలి మనం'' అన్నాడు. "తప్పకండా అలాగే చేద్దాం'' అన్నారు వాళ్లు.

అవాళ సర్వతో భద్రవ్యూహం పన్నాడు భీష్ముడు. ఆవ్యూహంలో కృపాచార్యులూ, కృతవర్మా, శల్యుడూ, సుదక్షిణుడూ, జయద్రథుడూ, కౌరవకుమార్లూ, భీష్ముడూ ముందు నుంచున్నారు. ద్రోణాచార్యులూ, భూరిశ్రవసుడూ, భగదత్తుడూ కుడిపక్క నుంచున్నారు. సోమదత్తూ, అశ్వత్థామా, విందానువిందులూ ఎడమపక్క నిలబడ్డారు. హాలాయుధుడూ, అలంబసుడూ, శ్రుతాయువూ వెనకతట్టు నిలబడ్డారు. సుశర్మా మొదలైన వాళ్ళతో రారాజు దుర్యోధనుడు మధ్య నుంచున్నాడు.

అంతకి ముందే వచ్చి పాండవులూ సిద్ధంగావున్నారు. అర్జునుడు మన సర్వతోభద్రవ్యూహం చూశాడు. "చూశావా భీష్ముణ్ణి!'' ధృష్టద్యుమ్నుడితో అన్నాడతడు - "ఆయనకి ఎదురుగా శిఖండిని నుంచోపెట్టు. మనమంతా గుంపుకట్టి ఇతణ్ణి కాపాడుకుంటూ వద్దాం. అంతేకాదు, వాళ్ళ సర్వతోభద్రవ్యూహానికి తగినట్టు మనసేనతో వొక గట్టి వ్యూహం నిర్మించు'' అన్నాడు.

బావుందన్నాడు ధృష్టద్యుమ్నుడు. మనవ్యూహాన్ని మించినట్టు వొక అభేద్యమైన వ్యూహం పన్నాడతడు. అందులో సాత్యకీ, విరాటరాజూ, కుడితట్టు నిలబడ్డారు. అభిమన్యుడూ, ద్రుపదుడూ, కేకయరాజులూ ఎడమపక్క నుంచున్నారు. నకులసహదేవులూ, ద్రౌపదికుమార్లూ, ధర్మరాజూ మధ్యనిలబడ్డారు. చేకితానుడూ, కుంతిభోజుడూ వెనకభాగంలో నుంచున్నారు. ఎదురుగుండా శిఖండి నిల

బడ్డాడు. అతడికి ఒాకపక్క భీముడూ, ఘటోత్కచుడూ, మరొక పక్క అర్జునుడూ, ధృష్టద్యుమ్నుడూ నిలబడ్డారు. తక్కినయోధు లందరూ కీలకస్థానాల్లో సర్దుకున్నారు.

ఇలా మనవాళ్ళూ, పాండవులూ వ్యూహాలుపన్ని కయ్యానికి కాలుదువ్వారు. ఉభయవ్యూహాలలోనూ శంఖాలు పూరిమాయి. భేరీలు మోగాయి. సింహనాదాలు గింగురుమన్నాయి. ఘోరమైన అపశకునాలవుపించాయి. వికారంగా అరుస్తూ పక్షులు ఆకాశంమీద ఎగిరాయి. ఉన్నట్టుండి సూర్యబింబం మాసిపోయినట్టయింది. పెను గాలి వీచింది. నక్కలు వూళవేశాయి. రక్తమూ, దుమ్మూలూ కలిసి బూడిదవాన కురిసింది. వాహనాలు కన్నీళ్ళుకార్చాయి; మల మూత్రాలు విడిచాయి.

రెండు సేనలూ ఒాకదాన్నొకటి డీకొన్నాయి. అభిమన్యుడు ఉద్ధృతంగా మనసేనమీదికి వచ్చాడు. కపిలవర్ణం గుర్రాలు పూసిన రథం వురకలుపెట్టించాడు. దూదికుప్పముట్టుకున్న అగ్నిహోత్రంలాగ మనసేనమీద పడ్డాడు. మెరుపులా మెరిశాడు. మండలాకారంగా తిరిగాడు. కొరివితిప్పినట్టు చెలరేగాడు. ద్రోణుడూ, కృపుడూ, జయద్రథుడూ మొదలైన మహాయోధులగుండెలు దిగులుపుట్టించి సింహనాదంచేశాడు. మనసేనలో అతణ్ణిఅడ్డుకునేవాడే లేకపోయాడు. అతడు తరుముకువస్తే, వెనక్కిమళ్ళిన సముద్రంలా అయిపోయింది మన సైన్యం.

"వీణ్ణి నువ్వే ఒాకచూపు చూడాలి" అభిమన్యుడిమీదికి అలంబసుణ్ణే పురికొల్పుతూ అన్నాడు దుర్యోధనుడు - "రెండో అర్జు నుడిలా వున్నాడు వీడు. మనవాళ్ళని మూడుచెరువులనీళ్ళూ తాగించే స్తున్నాడు. మేమంతా పాండవుల్ని అడ్డుకుంటాం. నువ్వు వీణ్ణి చంపెయ్యి" అన్నాడు.

భయంకరంగా బయలుదేరాడు అలంబసుడు. పెద్ద పెడబొబ్బలు పెట్టాడు. కొండలలాంటి రాక్షసయోధుల్ని ముందుపెట్టుకుని పాండవసేనమీదికి పరిగెత్తాడు. భయపడిపోయింది పాండవసేన. పెద్ద పెనుగాలివస్తే కారాకులు ఎగిరిపోయినట్టు రాక్షససేన రొప్పడంతోటే పిక్కబలంచూపించదది.

ధనుస్సులు మోగిస్తూ ద్రౌపదికుమార్లు అయిదుగురూ అలంబసుడి రాక్షససేనమీద కురికారు. కుప్పలుకుప్పలు రాక్షసుల్ని కూలగొట్టారు. పిడుగుల్లాంటి బాణాలు గబగబగబా అయిదుగురిమీదా గుప్పించాడు అలంబసుడు. యుగప్రళయంకాలివస్తే, చంద్రుణ్ణి పట్టిన అయిదుగ్రహాల్లాగ అయిదుగురూ అలంబసుణ్ణి ఘిరాయించారు. విషసర్పాల్లాంటి బాణాలు అతడిమీద నాటించి సింహనాదాలుచేశారు. అతడివొళ్ళంతా చీలికలుచేసి మంటలుపుట్టించారు. నల్లటి మేఘంలోంచి సూర్యకిరణాలు దూసుకువస్తే ఎలాఅవుపిస్తుంది, అదిగో బాణాలునాటిన శరీరంతో అలా అవుపించాడు అలంబసుడు. ఎడాపెడా దెబ్బలులుతినేసి మూర్ఛపోయాడతడు. జెండాకొయ్యా వూతపట్టుకోకపోతే రథంమీంచి కిందికే దొర్లిపోయేవాడు.

అయితే అంతలోనే తెలువుకున్నాడతడు. కాలయముడిలాగ భయంకరంగా ఇంతలేసి గుడ్లతో చూశాడు. నిప్పులుకక్కుతూ బాణాలు వొదిలిపెట్టాడు. ద్రౌపదికుమార్ల జెండాలు పడగొట్టాడు. వాళ్ళధనుస్సులు నరికేశాడు. పెద్ద అట్టహాసంచేసి వొక్కొక్కడిమీదా అయిదేసి మారణాస్త్రాలు ప్రయోగించాడు. వాళ్ళగుర్రాలు కూల్చేశాడు. సారథుల్ని చంపేశాడు. అయిదుగుర్నీ అమాంతంగా వూపేసి వొదిలిపెట్టాడు.

అది చూశాడు అభిమన్యుడు. ఒక్క వూపున వచ్చి అలంబసుడిమీద కలబడ్డాడు. ఉభయులూ విపరీతంగా పోట్లాడారు. ఉభయా

సేనలూ యుద్ధంమానేసి అరిచేతిలో ప్రాణాలుపెట్టుకుని వాళ్ళయుద్ధం చూస్తూ వుండిపోయాయి. అలంబసుడు మాయలో మహిరావణుడు. అభిమన్యుడు దివ్యాస్త్రాల్లో దేవేంద్రుడు. అంచేత ఏమవుతుందో అంటూ అందరూ వాళ్ళవైపే కళ్ళప్పగించి నుంచున్నారు.

వృత్రాసురుడూ, దేవేంద్రుడూ లాగ అలంబసుడూ, అభిమన్యుడూ కలబడ్డారు. ఇద్దరూ పరస్పరం బాణాలు గుప్పకున్నారు. కవచాలు పగలగొట్టుకున్నారు. శరీరాలు చీల్చుకున్నారు. రక్తాలు కార్చుకున్నారు. ఇద్దరూ జేగురునదులుప్రవహించిన రెండు కొండల్లాగ పాదుకదలకండా నుంచున్నారు.

అలంబసుడు మాయచేశాడు. కారుచీకట్లు కమ్మాయి. అభిమన్యుడు సూర్యబాణం వేశాడు. చీకట్లు పటాపంచలయిపోయాయి. దేవతలు భళీ అన్నారు. అలాగే ఎన్నో అన్ని మాయలుచేశాడు అలంబసుడు. అన్నిటికీ అన్ని దివ్యాస్త్రాలు వేశాడు అభిమన్యుడు. అతడి ముందు రాక్షసమాయ ఠవంతా పనికిరాలేదు.

మరింత నలి రేగిపోయాడు అభిమన్యుడు, అలంబసుడి వొళ్ళంతా తూంట్లుపడేట్టు బాణాలు కొట్టాడు. ఆగలేకపోయాడు అలంబసుడు. రథంమీాంచి దూకేశాడు. మళ్ళీ వెనక్కి-చూస్తే వొట్టు. వుంజాలు తెంపుకు పారిపోయాడు. అలంబసుడు తోకముడిచెయ్యడంతోనే మరింత పేట్రేగిపోయాడు అభిమన్యుడు. అతడి ఆటోపంచూసి అడిలిపోయింది కౌరవసైన్యం. దిక్కూ తెన్నూ లేకండా జాడుతియ్యడం మొదలెట్టింది.

బ్రహ్మాండమైన రథసేనతో భయంకరంగా లేచాడు భీష్ముడు. తిన్నగావెళ్ళి అభిమన్యుడిమీాద దాడిప్రారంభించాడు. అసలే అగ్గిపిడుగులా వున్నాడు అభిమన్యుడు. భీష్ముణ్ణీ, అతడి రథాలవాళ్ళనీ సుత [illegible] లక్ష్యపెట్టలే దతడు. [illegible] అన్ని [illegible]

యుద్ధంచేశాడు. అభిమన్యుణ్ణి భీష్ముడు ముట్టడించాడనడంతోటే డేగలా వచ్చి వాలాడు అర్జునుడు. గాండీవం మోగించాడు. భీష్ముణ్ణి బాణాలతో ముంచెత్తాడు. ఇటు భీష్ముడూ, అతడి రథసేనా, అటు అర్జునుడూ, అభిమన్యుడూ. ఉభయపక్షాలూ ఉప్పెనలా విజృంభించాయి. ఘోరంగా ద్వంద్వయుద్ధం చేశాయి.

అర్జునుడిమీదకి కృపాచార్యుడు వెళ్ళబోయాడు. అడ్డంగా వచ్చి అతణ్ణి అడ్డుకున్నాడు సాత్యకి. సాత్యకిమీద అశ్వత్థామ తిరగబడ్డాడు. అతడి ధనుస్సు పెళుక్కుమనిపించాడు. చప్పున మరొక బాణం పుచ్చుకున్నాడు సాత్యకి. ఉగ్రమైన బాణంతోడిగి అశ్వత్థామ మీద వేశాడు. దెబ్బతో జావాలుమనిపోయాడు అశ్వత్థామ. జెండాకొయ్య పట్టుకుని వొరిగిపోయాడు. అంతలోనే తెలువుకున్నాడు. తళతళా మెరుస్తున్న బాణంతీసి సాత్యకి గుండెలమీద తగిలించాడు. అతడి జెండా చించేశాడు. ఆకాశం గడగడలాడినట్టు సింహనాదం చేశాడు. నిలువునా మండిపోయాడు సాత్యకి. అశ్వత్థామని కరచరణాలాడనివ్వకండా బాణాలతో ముంచెత్తాడు. రాహువుపట్టిన సూర్యుడిలా అయిపోయాడు అశ్వత్థామ.

కొడుకుని రక్షించుకుందికి తడబడిపోతూ పరిగెత్తుకు వెళ్ళాడు ద్రోణాచార్యుడు. సాత్యకిని ముట్టడించాడు. అది చూశాడు అర్జునుడు. ఇద్దరి మధ్యకీ రథం పోనిచ్చాడు. ద్రోణాచార్యులమీదకి గాండీవం గురిపెట్టాడు.

ధృతరాష్ట్రుడు : అర్జునుడంటే ప్రాణంకదా ఆచార్యుడికి ! ఆచార్యుడన్నా అమితమైనభక్తి అర్జునుడికి. అలాంటివీ వాళ్ళిద్దరూ కలబడ్డారూ ! ఆం — చెప్పూ, చెప్పూ తరవాత ఏంజరిగిందో ! ఎలా యుద్ధం చేశారంటూ వాళ్ళు?

సంజయుడు : క్షాత్రమే ఆదర్శంగా పెట్టుకుని యుద్ధానికి సిద్ధపడ్డ వాళ్ళకి గురువేమిటి? శిష్యుడేమిటి? మహారాజా, గురువూ లేడూ, శిష్యుడూ లేడు. తండ్రీ లేడూ, కొడుకూ లేడు. అన్నా లేడూ, తమ్ముడూ లేడు. తాతా లేడూ, మనవడూ లేడు. మామా లేడూ, అల్లుడూ లేడు. ఎవరయినా సరే, పోరాడవలిసిందే. అదే క్షాత్ర ధర్మం. విను.

అర్జునుడు ద్రోణాచార్యులమీద మూడు బాణాలు కొట్టాడు. దాంతో బాణంమీద బాణం వర్షమే కురిపించాడు ద్రోణుడు. అర్జునుడుమాత్రం ఆగేరకమా? ద్రోణుడి శరీరం తూంట్లుపడ్డట్టు వరసపెట్టి కొట్టాడు వాడివాడి బాణాలు. ద్రోణుడికి సహాయంగా సుశర్మని పంపాడు దుర్యోధనుడు. కొడుకులతో కలిసి పెద్దసేనతో వెళ్ళాడు సుశర్మ. ద్రోణుణ్ణి వెనకపెట్టి అర్జునుడితో కలబడ్డాడతడు.

వాయవ్యాస్త్రం వేశాడు అర్జునుడు. పెనుగాలి రేగింది. మన సేనని తూలగొట్టింది. పర్వతబాణం వేశాడు ద్రోణుడు. ఎక్కడిసేన అక్కడ నిలబడింది. కళ్ళల్లో నిప్పులూ, ధనుస్సులో బాణాలూ కురిపించాడు అర్జునుడు. సుశర్మకుమాళ్ళని చావగొట్టాడు.

కృపాచార్యులూ, శల్యుడూ, బాహ్లీకుడూ, దుర్యోధనుడూ వెళ్ళి అర్జునుణ్ణి చుట్టుముట్టారు. అసలే అర్జునుడు-గన్నేరు ఆకులవంటి బాణాలువేసి అందరినీ చికాకుపెట్టేశాడు. ద్రోణుడూ మొదలైన మనవాళ్ళందరికీ అర్జునుడియుద్ధం తలమునకలయింది. భీష్ముడు ధర్మరాజుకేసి వెళ్ళాడు. పాండవసైనికుల తలకాయలు పడగొట్టడ మారంభించాడు. శకునీ భూరిశ్రవసుడూ నకులసహదేవుల మీదికి వెళ్ళారు. శ్రుతాయువూ, భగదత్తుడూ ఏనుగుసేనతో భీముడిమీద కలబడ్డారు. ఏనుగులు చూడగానే బుజాలు పొంగించాడు భీమసేనుడు. కొండమీంచి దిగిన సింహంలాగ రథంమీంచి దిగాడు. గద గిరగిరా తిప్పుతూ వేసు

గులమీాది కురికాడు. గాలికి తూలిపోయిన మేఘాల్లాగ వెనక్కి పరి గెత్తాయి ఏనుగులు. ఏనుగులు పారిపోయినా శ్రుతాయువూ, భగ దత్తుడూ మాత్రం కదలలేదు. ఎన్నోరకాల మహాస్త్రాలు ప్రయో గించారు వాళ్ళు. భీముడి కవచం పగలగొట్టేశారు. ఒళ్ళంతా బాణాలతో చీలికలు చీలికలు చేసేశారు.

భీష్ముడితో యుద్ధం దుర్భరమైపోయింది ధర్మరాజుకి. భీముడూ మొదలైనవాళ్ళని పేరుపేరున కేకవేసి చెయ్యిపూపాడు. అన్నగారి పిలుపు విన్నాడు భీముడు. శ్రుతాయువునీ, భగదత్తుణ్ణీ వొదిలేశాడు. పెదివికరుస్తూ ధర్మరాజుదగ్గిరికి పరిగెత్తాడు. కాళ్ళూ, చేతులూ, గుండే - అంతటా రక్తాలుకారుతున్నాయి భీముడికి. కొత్తగా చివురు పెట్టిన మామిడిగున్నలా వున్నాడతను. భీముడు వచ్చేసరికే ధృష్ట ద్యుమ్నుడూ, శిఖండీ, విరాటరాజూ, ద్రుపదుడూ, వచ్చి ధర్మరాజుకి అడ్డుపడ్డారు. ఎన్నోఅన్ని బాణాలురువ్వి భీష్ముణ్ణి ముంచెత్తారు. బాగా వొళ్ళుమండింది భీష్ముడికి. శిఖండినిమాత్రం వొదిలేసి మిగిలిన ముగ్గురునీ తలా మూడేసిబాణాలతో కొట్టాడు. వాళ్ళు ముగ్గురూ త్రేతాగ్నులమల్లే ప్రజ్వలించారు. బాణాగ్నులు కురిపించారు.

భీముడక్కడికి వెళ్ళడంచూసి కేకయులూ, సాత్యకీ, ద్రౌపది కుమాళ్ళూ - యావన్మందీ అక్కడికి పరిగెత్తారు. దాంతో కౌరవ సేనలో మొనగాళ్ళనుకున్న వారు అక్కడికే రథాలు పోనిచ్చారు. భీష్ముణ్ణి వెనకపెట్టి శత్రువులతో కలబడ్డారు. ఇలా ఉభయపక్షాలలో ముఖ్యులందరూ సంకులసమరం మొదలెట్టారు.

మధ్యాహ్నమయింది.

రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ నెత్తురువనములు దాటు కుంటూ పోరాడాయి. ఏటుకిఏటూ, వేటుకి వేటూ, పోటుకిపోటూ ఎవ్వరికెవ్వరూ తీసిపోకండా పోట్లాడారు పదాతులు.

"ధృతరాష్ట్రుడికీ అతడికుమాళ్ళకీ నిజంగా మతిపోయింది" విచారిస్తూ తమలో తాము చెప్పుకున్నారు మన సైనికులు - "పిరాన పట్టుకుంది వాళ్ళని. అంచేత ఇంత ప్రజాక్షయం చేస్తున్నారు. వెర్రి కాకపోతే, ధర్మరాజు నేమిటి గెలవడమేమిటి?" అనుకున్నారు.

"ఈ చెడ్డమాటలు చెవిని పెట్టకండి" సైనికులమాటలు చెవినిపడి తన యోధుల్ని హెచ్చరించాడు దుర్యోధనుడు. ఇటు సైనికులమాటలూ, అటు రారాజుమాటలూ ఏవీ విననట్టే వూరుకున్నారు యోధులు. ఆవేశంతో యుద్ధంలోనే మగ్నులయారువాళ్ళు.

సందడికయ్యంలో గదపందుగు మొదలెట్టాడుభీముడు. అంతలో అతడి రథం పట్టుకువచ్చాడు సారథి విశోకుడు. వెంటనే రథమెక్కాడు భీముడు. బాహ్లికుణ్ణి ఎదిరించి బాణాలవాన కురిపించాడు. అతడి గుర్రాలు నాలుగూ తారుమనిపించాడు. అతడిజెండా ఎగరగొట్టేశాడు.

మన చిత్రసేనుడు అభిమన్యుడితో కలబడ్డాడు. చిత్రవిచిత్రాలయిన బాణాలు వేసి అతణ్ణి చురచురలాడించాడు. సింహనాదంచేసి జంకించాడు. కనుబొమలు ముడివేశాడు అభిమన్యుడు. ఒక్కబాణం వొదిలిపెట్టాడు. చిత్రసేనుడి సారథిని హారీ అనిపించేశాడు. రెప్పపాటులో అతడి గుర్రాలూ కూల్చేశాడు. చిత్రసేనుడి పొగరు బుగ్గయింది. రథందూకేశా డతడు. ముచ్చెమట్లుపోసుకొని దుర్ముఖుడి రథంమీదికి పారిపోయాడు.

ద్రుపదుడూ ద్రోణుడూ పోట్లాడారు. మహాస్త్రాలు ప్రయోగించాడు ద్రుపదుడు. నిప్పులుకురిశాడుద్రోణుడు. చిటికెలో ద్రుపదుడి కవచం చీల్చేశాడు. చికిలిపట్టిన బాణాలు కొట్టి వొళ్ళంతా చిల్లులు పడేట్టు చేసేశాడు. నిభాయించుకో లేకపోయాడు ద్రుపదుడు. సిగ్గూ భిడియమూ వొదిలేశాడు. బతుకుజీవుడా అని పలాయనం చిత్తగించాడు.

అర్జునుడితో సుశర్మ కాయశక్తులా యుద్ధంచేశాడు. అర్జునుణ్ణీ అతడి సారథి శ్రీకృష్ణుణ్ణీ చురుక్కు-చురుక్కుమనిపించాడు. అరికాలి మంట నెత్తికెక్కింది అర్జునుడికి. కన్నుమూసి తెరిచేలోపల వందలు వందలు బాణాలు వొదిలిపెట్టాడు. సుశర్మా, అతడిసైన్యమూ కన పడలేదంటే నమ్మండి. జజ్జరిల్లిపోయారు త్రిగర్తులు. ముద్గరాలతో వాహనాలు బాదుకుంటూ దాడుతీశారు కొందరు. కొరడాలతో గుర్రాలుకొట్టి పారిపోయారు కొందరు. అంకుశాలతో ఏనుగులు పొడిచి పుడాయించారు కొందరు. ధనుస్సులు పారేసీ, కత్తులు జార్చేసీ, డాళ్ళు పడేసీ పరుగుచ్చుకున్నారు కొందరు. ఇలా నానా విధాలా భంగపడిపోయింది త్రిగర్తసేన.

అప్పుడు అర్జునుడిమీద భీష్ముడు ధ్వజమెత్తాడు. అడ్డంగా సాత్యకి మధ్యకివచ్చి అతణ్ణి అడ్డుకున్నాడు. భీకరంగా భీష్ముడు హుంకరించాడు. శక్తితీసి సాత్యకిమీద ప్రయోగించాడు. మెళు కువతో దానిని ఇట్టేపట్టేశాడు సాత్యకి. తిరిగి భీష్ముడిశక్తి, భీష్ముడి మీదేప్రయోగించాడు. తనదాకా రాకుండానే దాన్ని కొట్టేశాడు భీష్ముడు. అంతతో వూరుకోలేదాయన. వాడివాడి బాణాలు తొమ్మిది సాత్యకిమీద నాటించాడు. అంతలో ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, పదాతులూ, — ఉద్ధోలమైన పాండవుల చతురంగసేన వచ్చిపడింది. సాత్యకిని దాటుకుని భీష్ముణ్ణి ముట్టడించింది.

"తమ్ముడూ, అటుచూడు" భీష్ముడితట్టు చూపుతూ దుశ్శాసనుడితో అన్నాడు దుర్యోధనుడు— "భీష్ముణ్ణి పెద్దరాణువ ముట్టడిస్తోంది. వెళ్ళు. నువ్వూ, శకునీ తాతయ్యకి మద్దత్తుకండి" అన్నాడు.

శకునీ, దుశ్శాసనుడూ తమసైన్యాలతో పరిగెత్తారు. భీష్ముడికి దన్నుయి శత్రుసేనమీద కలబడ్డారు. అది కనిపెట్టాడు ధర్మరాజు. నకులసహదేవులతో కలిసి అక్కడికి పరిగెత్తుకు వచ్చాడు. [illegible]

దుర్యోధనుడు. శకుని దుశ్శాసనుల వెంట దిట్టమైన పదివేలమంది గుర్రపురౌతుల్ని పంపాడు. పదివేలగుర్రాలూ కదంతొక్కుతూ పరిగెత్తాయి. శకుని దుశ్శాసనుల్ని, భీష్ముణ్ణీ దాటుకుని పాండవసేనమీద కెరటం విరుచుకుపడినట్టు విరుచుకు పడ్డాయి. తిమింగలాలు చెలగాట మాడితే కలగుండు పడిపోయిన సముద్రంలాగ సంక్షోభపడిపోయింది పాండవసేన.

పట్టరాని కోపం వచ్చింది ధర్మరాజుకి. కోదండం సారించాడతడు. అన్నగారితోపాటు నకులసహదేవులూ ధనుస్సులు మోగించారు. ముగ్గురూ త్రిమూర్తుల్లా విజృంభించారు. తీక్షణంగా చికిలిపట్టిన బాణాలు గుక్కతిప్పుకోకండా గుప్పించారు; మనగుర్రపుసేన వేటాడారు.

ముందటి కాళ్ళు తెగిపోయిన గుర్రాలు మొహంవాల్చుకుని ముందుకి పడిపోయాయి. మోరలు బద్దలయిన గుర్రాలు అడ్డదిడ్డంగా కూలిపోయాయి. గుండెలు పగిలినవి ఎగిసిపడిచచ్చిపోయాయి. పగ్గాలు తెగినవి పుంజాలు తెంపుకు పరిగెత్తాయి. రౌతులు కింద వొరిగిపోయినవి పూరికే ఇటూ అటూ తిరిగాయి. ఇలా మన గుర్రపుసేన నానా ఇదీ అయిపోయింది. సేనసేనంతా విరిగిపోయింది. చెదిరిపోయింది. కకావికలయిపోయింది.

పాండవసేనలో విజయభేరీలు మోగాయి. శంఖాలు వురిమాయి. సేనసేనంతా వుప్పెనలా వుప్పొంగింది. మనవాళ్ళమీద విరుచుకుపడింది.

పాపం, నీ పెద్దకొడుకు మొహంలో చిక్కతే నెత్తురులేదు. "మామా" దీనంగా, శల్యుడికేసి చూస్తూ అన్నాడతడు — "ఇప్పుడు నువ్వే మామర్యాద దక్కించాలి. విరగబడి సముద్రంలా వచ్చేస్తూవుంది పాండవసేన. నువ్వే ఏనాపొడ్డులా దాన్ని నిలవరించాలి. ఎదిరించాలి. మమ్మల్ని ఆదుకోవాలి" అన్నాడు.

ఉద్ధృతంగా బయలుదేరాడు శల్యుడు. మండి రేగినట్టు పాండవసేనమీద పడ్డాడు. ధర్మరాజునీ, నకులసహదేవుల్నీ బాణాలతో ముంచెత్తాడు. భీముడూ, అర్జునుడూ అతణ్ణి ఎదిరించారు. కరుకయిన బాణాలు నాటించారు. భీష్ముడూ, ద్రోణుడూ శల్యుణ్ణి వెనకపెట్టి భీమార్జునులతో కలబడ్డారు. వాళ్ళవెంట మనసేనలూ వురకలు పెట్టాయి. అమీతుమీ తేల్చుకుందామన్నట్టు కురుపాండవ సేనలు రెండూ వొకదానిమీద వొకటి ఎగబడ్డాయి.

పొద్దువాలింది. సూర్యుడేమో చల్లబడుతున్నాడు. భీష్ముడు మాత్రం ఎండాకాలం సూర్యుడిలాగ ప్రతాపంతో వేడెక్కాడు. కిరణాలలాంటి బాణాలు విరజిమ్ముతూ విజృంభించాడు. ధర్మరాజునీ, భీముణ్ణీ చెరో పన్నెండు బాణాలు తగిలించాడు. నకులుణ్ణీ, సహదేవుణ్ణీ తలో మూడు బాణాలు కొట్టి మంటలు పుట్టించాడు. శత్రువులగుండెల్లో జడుపు పుట్టినట్టు సింహనాదం చేశాడు.

మహారాజా, అప్పుడు ఏమయిందో చెప్తాను, విను. కవ్వించినట్టు కలబడ్డారు పాండవులు. మత్స్య, పాండ్య, పాంచాల, మగధ, కాశీ, కరూశసైన్యాలు వొక్కపెట్టుని భీష్ముణ్ణి ఘిరాయించాయి.

ధృష్టద్యుమ్నుణ్ణి కలుసుకోకండా సాత్యకినీ, పాండవుల్నీ ద్రోణాచార్యులు అడ్డుకున్నాడు. ఎంతమంది ఎదిరించినా చలించలేదతడు. అందరికీ అన్నిరూపులయి ఘోరంగా యుద్ధం చేశాడు.

అన్ని సేనలూ, వొక్కపెట్టుని ముట్టడించాయి కదూ భీష్ముణ్ణి! రుద్రుడే అయిపోయాడతడు. కనీవినీ ఎరగని పరాక్రమం ప్రదర్శించాడు. అంతసేనా వూపేశాడంటే నమ్ము. అతడు వేసిన బాణాలకి అంతూపంతూ లేకపోయింది. పినరంత సందులేకండా ఎక్కడచూస్తే అక్కడే అతడి బాణాలు కనిపించాయి. చిత్రవిచిత్రమైన గతులతో

అతడి రథం పరుగులు పెట్టింది. తేరిచూడడానికి శక్యంకాకండా ప్రళయ తాండవం చేశాడతడు.

కాహళాలూ, దుందుభులూ, ఏనుగుల గంటలూ, గుర్రాల మువ్వలూ, జెండాల చిరుగంటలూ, ధనుస్సుల అల్లెతాళ్ళూ — ఒకటేమిటి, సర్వమూ పగలగొట్టీ, తుంచేసీ విరిచేసీ శత్రుసేన యావత్తూ సర్వనాశనంచేసేశాడు భీష్ముడు. భారతరణరంగమంతటి లోనూ అతడే మహావీరుడు. అతణ్ణి అడ్డుకునే మొనగాడు వొక్కడూ లేకపోయాడు. పట్టపగ్గాలే లేవు అతగాడికి. అంతపాండవులూ అడ లెత్తి పోయారు. ఒక్కడికీ కరచరణాలాడలేదు. అడుగడుక్కీ, క్షణ క్షణానికీ రెచ్చిపోయాడు భీష్ముడు. అడ్డులేని దివ్యాస్త్రాలూ ప్రయో గించాడు. ఎటుచూస్తే అటే, ఎక్కడ చూస్తే అక్కడే — అంతటా తానే అయి ప్రత్యక్షమయాడు. రథాలమీది రథికుల్నీ, ఏనుగుల మీది యోధుల్నీ, గుర్రాలమీది రౌతుల్నీ నరికేసి పారేశాడు. పదాతుల్ని పనసకాయ చెక్కేసినట్టు చెక్కేశాడు. ఇదికాలూ, ఇది చెయ్యీ, ఇది తలా, ఇది డొక్కా అని పొల్లిలేకండా చేసేశాడు. రకరకాల శబ్దాలు పుట్టేసట్టు రథాలు విరిచేశాడు. గుర్రాల ఎముకలూ, ఏనుగుల దుమ్ములూ ఫెళఫెళా విరగ్గొట్టాడు. వరసపెట్టి గొడుగులు విరిచేశాడు; ఎగరగొట్టేశాడు; చిందరవందర చేసేశాడు. రత్నాలు పొదిగిన కిరీటాలూ, నగలూ, రంగురంగుల చామరాలూ దుళ్ళగొట్టేశాడు.

మదపుటేనుగులు క్రీడించిన పూలవనంలా అయిపోయింది కొన్ని చోట్ల పాండవసేన. వంటకోసం మాంసాలుతరిగి కుప్పపోసినట్టయి పోయింది కొన్నిచోట్ల. వెదుళ్ళవనంలో కార్చిచ్చుముట్టుకున్న ట్టయి పోయింది కొన్నిచోట్ల. రెల్లువనంలో సుడిగాలి రేగిన ట్టయిపోయింది కొన్నిచోట్ల. పెద్ద కారెనుపోతు కలిచేసిన కలవలవనంలా అయి పోయింది కొన్నిచోట్ల. అలా దైన్యావస్థకి వచ్చేసింది పాండవసైన్యం.

కలగుండుపడిపోయింది. జీవచ్ఛవమయిపోయింది. కంగారుపడిపోయింది. వెనక్కి తగ్గేసింది. పరుగుచ్చుకుంది.

అదంతా వొక్కసారి తేరిచూశాడు శ్రీకృష్ణుడు.

"అర్జునా, చూస్తున్నావా భీష్ముణ్ణి!" అంటూ సాభిప్రాయంగా అతణ్ణి చూశాడు - "విపరీతమైన శౌర్యంతో మనసేన నాశనంచేస్తున్నాడతడు. ఉద్ధోలమైన భుజబలమూ, ప్రచండమైన విక్రమమూ చూపిస్తున్నాడు. మితిమీరిపోతున్నాడు. నీప్రతాపం ఇంకా ఎప్పుడు చూపిస్తావో అర్థంకాలేదు నాకు!" అన్నాడు.

పినరయినా కదలిక కనపరచలేదు అర్జునుడు. విచారంతో మొహంవేలవేసి వూరుకున్నాడు.

"మచ్చలేని చరిత్ర నిది" మళ్ళీ అందుకున్నాడు శ్రీకృష్ణుడు, "అర్జునా, మహారథులు నిన్ను నవ్వకండా చూడు. అవాళ విరాట నగరంలో పిడికిలిబిగించి ఏమన్నావు? మరిచిపోకు" అన్నాడు.

"బంధువులందరిని చంపేసి, కౌరవహీనమయిన రాజ్యం సంపాదించి, ఏం పుణ్యాం మోసుకుంటాను నేను!" నిట్టూరుస్తూ అన్నాడు అర్జునుడు. "యుద్ధానికి బుద్ధిపుట్టకండా వుంది. అయినా మాటిమాటికీ నీతో వాదనెందుకు! పద, రథం పోని. పడగొడతాను భీష్మిణ్ణి" అన్నాడు.

శ్రీకృష్ణుడు పగ్గాలు నడిలించాడు. గుర్రాలమీద చబుకు వేశాడు. భీష్ముడిరథానికి ఎదురుగ్గా రథం పరిగెత్తించాడు. అర్జునుడి రథం అలాపరిగెత్తడంతోనే, అంతవరకూ పారిపోతూవున్న పాండవ సైన్యాలు వెనక్కితిరిగాయి. అర్జునుడి వెంట భీష్ముడిమీదికి వచ్చాయి.

కవ్వించిన సింహంలా జంయ్యిమన్నాడు భీష్ముడు. మహాస్త్రాలు వేశాడు. శత్రుసైన్యం అఘగయినా ముందుకిరాకండా అడ్డేశాడు. సింహనాదం చేశాడు. ఉగ్రమైన బాణాలు అర్జునుడిమీదగుప్పించాడు.

అతణ్ణి బెంబేలు పెట్టేశాడు. కృష్ణుడి వొళ్ళంతా బాణమయం చేసేశాడు. అర్జునుడి గుర్రాలనోళ్ళూ నిష్ఠురంగా బాణాలతో కుట్టేశాడు. రథమంతా బాణాలమయం చేసేశాడు.

అర్జునుడి గుర్రాలు కుంగిపోయాయి. భరించలేక మొహాలు తిప్పేసుకున్నాయి. తనశరీరం మంటలుపెడుతూవున్నా గుర్రాలవొళ్ళు నిమిరాడు శ్రీకృష్ణుడు. వాటి బాణాలు వూడదీశాడు. వాటికి చురుకు వచ్చినట్టుచేసి భీష్ముడిమీదికి వురికించాడు.

చూసిచూసి వొక్క బాణం వేశాడుఅర్జునుడు. దెబ్బతో భీష్ముడి విల్లు విరిచేశాడు. మరొకవిల్లు తీశాడు భీష్ముడు. అదీ కొట్టేశాడు అర్జునుడు. "ఔరా, ఇంద్రుడి కొడుకా!" అంటూ చప్పున మరొక విల్లు అందుకున్నాడు భీష్ముడు. సింహంలాగ చూశాడు. బాణాల మీద బాణాలు ప్రవాహంలా వొదిలిపెట్టాడు. అర్జునుడి కరచరణాలాడకండా పడ మొత్తాడు.

బాగా దెబ్బలుతినేశాడు అర్జునుడు. శరీరం తూంట్లుపడిపోయింది. అయినా బంటుతనం నిలుపుకుంటూ మానసానికి పోరాడుతూ వచ్చాడతడు.

## "భీష్ముణ్ణి చంపుతాను"

అర్జునుడు దెబ్బలుతినేస్తూవుండడమూ, భీష్ముడు గర్వంతో రెచ్చిపోడమూ, ఆ ముఖాముఖియుద్ధంలో తక్కినవాళ్ళంతా దూరదూరం తప్పుకోడమూ – అంతా చూశాడు శ్రీకృష్ణుడు. హృదయంలో దారుణమైనరోషం పుట్టుకువచ్చిందతడికి. అంతవరకూ అంతా వోర్చుకున్నాడు. మరి భరించలేకపోయాడు. పగ్గాలు నొగలికి చుట్టబెట్టాడు. మునికోల పట్టుకున్నాడు. ఘోరంగా కుప్పించి రథం దూకాడు.

అలా శ్రీకృష్ణుడు దూకేసరికి భూచక్రం యావత్తూ ఒక్క సారి కదిలిపోయింది. దిగ్దంతుల మూపులు కుంగిపోయాయి. అతణ్ణి చూసి సేనలు దిగులుపడి పరుగుచ్చుకున్నాయి.

తిన్నగా భీష్ముడిమీదికి పరిగెత్తాడు శ్రీకృష్ణుడు. ఆరౌద్రమూ, ఉద్రేకమూ చూసి, దేవతలూ, గంధర్వులూ గడగడలాడిపోయారు, సింహనాదంచేస్తూ సున్నితమైన పసుపురంగు పట్టువస్త్రంతో అత డలా వెళుతూ వుంటే, ఉరుమూ, మెరుపూ కలిసిన కారుమేఘం కళ్ళముందు కట్టింది.

మన యోధులలో ఒక్కడికీ ప్రాణాలు లేవు. ఒక్కడి ముఖంలోనూ రక్తంచుక్క లేదు. "చచ్చాడు. చచ్చిపోయాడు భీష్ముడు" అంటూ మెడలు సారించి చూస్తూ వుండిపోయారు వాళ్ళు.

శ్రీకృష్ణుడు తనమీదికి రావడం చూశాడు భీష్ముడు. బ్రహ్మానందం కలిగిం దతడికి. "మహాత్మా!" చిన్న చిరునవ్వుతో అన్నాడతడు — "పుండరీకాక్షా! దివ్యంగావుం దిది. దయచెయ్యి. కృష్ణా! దయచెయ్యి. ఇదే నీకు ఇష్టమయితే, ఇంతకంటే నాకు కావలసిందేముంది, అనుగ్రహించు. ఇక్కడ శాశ్వతమైన కీర్తి, అక్కడ సద్గతీ ప్రసాదించు" అన్నాడు.

అంతలోనే రథం గెంతేసి, కృష్ణుడి వెనకాల పరిగెత్తుకు వచ్చాడు అర్జునుడు. రెండుచేతులతోనూ కౌగిలించుకుని అతణ్ణి పట్టుకున్నాడు. ఆగలేదు శ్రీకృష్ణుడు. అర్జునుణ్ణి ఈడ్చుకుంటూ ముందికిపోయాడు. పదడుగులు వెళ్ళాక ఎలాగో ఊడిగిలబడి, బల మంతా చిక్కబట్టుకుంటూ, కాళ్ళాని అతణ్ణి నిలిపాడు అర్జునుడు.

"నీ ఆశ్రితుణ్ణి" నిట్టూరుస్తూ అన్నాడు అర్జునుడు. నామానం కాస్త దక్కించు. రథంమీదికి దయచెయ్యి. యుద్ధం చెయ్యనని ప్రతిజ్ఞ పట్టావు. నువ్వే ప్రతిజ్ఞ తప్పితే ఏమవుతుంది లోకం! యుద్ధంలో

నేను రవంత అలిసిపోయాను అదొక తప్పనుకోకు. రా, నామీదికి వచ్చిన భీష్ముణ్ణి ఏంచేస్తానో నువ్వే చూద్దువుకాని" అంటూ బతిమాలాడు. కాళ్ళావేళ్ళా పడ్డాడు.

సంతోషించాడు శ్రీకృష్ణుడు. మాట్లాడకండా వెనక్కి వెళ్ళిపోయాడు. తిన్నగా వెళ్ళి రథమెక్కాడు. అతడివెంట అర్జునుడూ రథమెక్కాడు. ఇద్దరూ తిరిగి అలా రథంమీద కూచుంటే రెండు శిఖరాలతో వున్న పర్వతంలా అవుపించింది రథం.

అర్జునుడు సిద్ధపడడం చూశాడు భీష్ముడు. పెద్ద ప్రళయమేఘంలాగ భయంకరంగా గర్జించాడు. జడివానలాగ బాణాలు కురిపించాడు. కృష్ణార్జును లిద్దరినీ కరచరణాలాడకండా కంగారు పెట్టేశాడు. ఆవూపుని పాండవసేనమీదికి రథం పరిగెత్తించా డతడు. కనపడ్డ శత్రువునల్లా వెంటతరిమాడు. ప్రాణాలతో పోనివ్వకండా హతమార్చాడు. అలిసిపోయిన అర్జునుడూ, జంకిపోయిన భీముడూ మొదలైన యోధులూ ఎవ్వరూ ఏమీ చెయ్యలేకపోయారు. భీష్ముడి రథానికి కళ్ళప్పగించేసి బొమ్మల్లాగ నిలబడిపోయారు.

భీషణాకారుడై పోయాడు భీష్ముడు. చీమల్ని కాలితో రాసేసినట్టు పాంచాలసేనని పచ్చడిపచ్చడి చేసేశాడు.

సాయంకాల మయింది. తాను పడమటికొండ వెనక్కి వెళ్ళిపోకపోతే పాండవసేన మరింత కడతేరిపోతుందని దయదలిచినట్టు సూర్యుడు అస్తమించాడు. పాండవులపాల ఘోరమైన సంధ్యాసమయ మది. ఊబిలో దిగబడిపోయిన ఆవులా వున్న తన సేనదిక్కు తేరిచూశాడు ధర్మరాజు. విచారిస్తూ కొంతసేపు నుంచుండిపోయాడు. అప్పటికి ఆగిపోడమే కర్తవ్యమని నిశ్చయించాడు. సేనాధిపతుల్ని పిలిచి, యుద్ధం ఆపెయ్యండని ఆదేశించాడు. చిన్నబుచ్చుకున్న మొహంతో శిబిరానికి బయలుదేరాడు. "ఇవాళ భీష్ముడిచేత

ఎంతయినా భంగపడ్డాం'' అని విచారిస్తూ అర్జునుడూ మొదలైన యావన్మందీ ధర్మరాజువెంట శిబిరానికి నడిచారు.

మనవాళ్ళూ సైన్యం మళ్ళించారు. నీకుమాళ్ళందరూ భీష్ముడి చుట్టూ చేరారు. పదేపదే ఆయనకి నమస్కారాలు చేశారు. ఎన్నో విధాల పొగిడారు. కలకల్లాడుతూవున్న మొహాలతో నవ్వుతూ కేరుతూ యావన్మందీ శిబిరాలకి వచ్చేశారు. ఎన్నడూలేని కొత్త విభూతి వాళ్ళలో తాండవమాడింది అవాళ.

## ఆ లో చ న

తొమ్మిదోనాటి యుద్ధంలో అలా వోడిపోయి, ఎంతో అంత బాధబడ్డాడు ధర్మరాజు. తమ్ముళ్ళని వెంటబెట్టుకుని రహస్యంగా శ్రీకృష్ణుడిగుడారానికి వెళ్ళి అతడితో జాలిగా ఇలా ఆరంభించాడు - "కృష్ణా, భీష్ముడి ప్రతాపం కళ్ళారా చూశావుకదా! కార్చిచ్చు మృగాల్ని కాల్చేసినట్టు మనసేన దహించి వొదిలిపెట్టా డతడు. దురభిమానంవల్ల మనవాళ్ళు ఎవ్వరూ అతడిముందు నిలబడరు. ఇది ఇవాళ బాగా తేలిపోయింది. ముందేంచెయ్యాలో అర్థంకావడం లేదు నాకు. సర్వనాశనమయిందాకా యుద్ధం చెయ్యలేను. చస్తేమాత్రం సామ్రాజ్యంపొందినట్లవుతుందా? వద్దు తమ్ముళ్ళతోకలిసి అడవులకే పోతాను. ఏబెడదా లేకండా కళ్ళుమూసుకుని తపస్సు చేసుకుంటాను

"నామూలంగానే లోగడ ఎన్నోకష్టాలు అనుభవించారు నాతమ్ముళ్లు. వాళ్ళని కళ్ళారా చూసుకుంటాను. అంతేకానీ చూస్తూవీళ్ళని భీష్ముడికి బలిపెట్టలేను. నిజంగా మామీద నీకు దయే వుందంటావా, అయితే యుద్ధం మానిపించు'' అన్నాడు.

ధర్మరాజుమాటలు సావధానంగా విన్నాడు శ్రీకృష్ణుడు. ఎన్నోవిధాల మంచిమాటలుచెప్పి అతణ్ణి సముదాయించాడు. "సత్య

ప్రజ్ఞుడవి నువ్వు. అద్భుతమైన భావాలుశక్తికలవాళ్ళు నీతమ్ముళ్ళు. నీకేమిటి, దీనావస్థ రావడమేమిటి ? ఇంతకీ మంత్రినై నేను వుండనే వున్నాను. నీరాజ్యం నీఅరిచేతిలోపెట్టే బాధ్యత నాది. విచారించకు. అర్జునుడు తెగించకపోతే నేనే తెగిస్తాను. భీష్ముణ్ణి చంపేస్తాను. నీకు శత్రువన్నవాడు లేకండా చేసేస్తాను. నన్ను మళ్ళీ అర్జునుడు మళ్ళించకండా మాత్రం చూడు అంతే. అర్జునుడు నాకు సఖుడు, సంబంధి, శిష్యుడు. అతడికోసం నన్ను కండలుకోసి ఇమ్మంటే సంతోషంగా ఇస్తాను. నాకోసం అతడూ అంతేఅని నమ్ము.

"ఉపప్లావ్యంలో సంజయుడు వచ్చినప్పుడూ, ఉలూకుడు వచ్చి కారుకూతలు కూసినప్పుడూ జరిగినదానికి తగినంతా చెయ్యవలసేవుంది నేను. ఈరెండుచోట్లా ఎన్నో అన్నాను. ఒకళ్ళమాట వొకళ్ళం పాలించాలన్న నియమంకూడావుంది, అర్జునుడికీనాకూ." అన్నాడు.

"యుద్ధం చెయ్యనన్నావు నువ్వు" అంటూ అందుకున్నాడు ధర్మరాజు-"తగినసహాయంమాత్రమే చేస్తానన్నావు. నీచేత బొంకిస్తానా నేను! అయ్యో, ఇంతదైన్యం తెచ్చిపెట్టాడా దైవం నాకూ! వద్దు, వద్దు. కృష్ణా మాకోసం నువ్వు మాటతప్పి యుద్ధంచెయ్యవద్దు. నేను చెప్పేది విను. నాకూ భీష్ముడికీ వొక ఏర్పాటు జరిగింది. కౌరవుల పక్షం నిలిచి యుద్ధంచేసినా, మాకు హితమైన కార్యం చేసిపెట్టడానికే మాట ఇచ్చాడాయన. ఆయనే నాకు రాజ్యం ప్రసాదిస్తాడు" అన్నాడు. ఇలా అంటూవుంటే ధర్మరాజు గొంతుక గద్గదికపడింది. దుఃఖపడుతూ మళ్ళీ ఇలాఅన్నాడతడు- "అయ్యో, తండ్రిపోయాక తండ్రిలాగ మమ్మల్ని అరచేతిలోపెట్టుకు పెంచాడు తాతయ్య. పెద్దవాళ్ళని చేశాడు. అలాంటి ప్రేమమూర్తిని చంపడానికి తెగిస్తున్నాను అబ్బా, రాజధర్మం ఎంత ఘోరం."

ధర్మరాజు ఆంతర్యం గ్రహించాడు శ్రీకృష్ణుడు. 'యుద్ధం ఆరంభించినప్పుడు, అవసరమైనప్పుడు మళ్ళీ రమ్మన్నాడు భీష్ముడు. అంచేత ఇప్పుడు భీష్ముడిదగ్గిరికి వెళ్ళాలనుకుంటున్నా డితడు ' అంటూ తనలో తాను తర్కించుకున్నాడు.

"బావుంది" సాభిప్రాయంగా అన్నాడు శ్రీకృష్ణుడు — "నీఉద్దేశంనచ్చింది నాకు. నిజమే. అలా కాక, భీష్ముడే అలిగియుద్ధంలో నిలబడితే ఎంతటిశత్రువయితే నేంగాక, 'హతోస్మి' అనవలిసిందే, తప్పదు. కాబట్టి ఇప్పుడు మనం అతడిదగ్గిరికి వెళ్ళడమే మంచిది. నువ్వు అడిగావంటే, తనమృత్యురహస్యం తానే చెపుతాడు పద. రహస్యంగా మనమందరం ఇపుడే వెళదాం. భక్తిపూర్వకంగానమస్కారంచేద్దాం. నువ్వే కర్తవ్యం చెప్పమని వినయంగా ప్రార్థేయపడదాం. అతడువేం చెప్తే అదే చేద్దాం" అన్నాడు.

కృష్ణుడు చెప్పిన ఆలోచన స్థిరపరిచాడు ధర్మరాజు. తమ్ముళ్ళూ, తానూ సౌమ్యవేషాలు వేసుకున్నారు. కృష్ణుడితో కలిసి రహస్యంగా భీష్ముడి గుడారానికి వచ్చారు.

## " నిన్ను ఎలాచంపడమో నువ్వే చెప్పు "

అలా అర్థరాత్రి అంతమందీ వచ్చి తగినవిధంగా భీష్ముడిగుడారంలో ప్రవేశించారు. ఆయన దర్శనంచేసి, భక్తిపూర్వకంగాపాదాభివందనం చేశారు. ఎంతో అంత ఆదరం చూపించాడు భీష్ముడు. వేరువేరుగా అందరిక్షేమాలు విచారించాడు. "ఇంతమందీ ఇలావచ్చారు" ప్రసన్నమైన మొహంతో ప్రశ్నించా డతడు — "ఏమిటి పని? మీకు ఏది కావాలన్నా సందేహించకండాఅడగండి. ఇస్తాను. ఎంతకష్టమైన పనయినా సరే, మీకోసం చేస్తాను. చెప్పండి" అన్నాడు.

"మాకు సామ్రాజ్యం దక్కేమార్గం అనుగ్రహించు" దీనంగా అన్నాడు ధర్మరాజు — "మాసేనలు హతవారిపోకండా వుండే ఉపాయం ప్రసాదించు" అంటూ చేతులు జోడించాడు.

"అంతేనా" ప్రశాంతంగా అన్నాడు భీష్ముడు — "దాని కేముంది! నేను యుద్ధంచేస్తూవున్నంతసేపూ మీ సైన్యంనాశన కాక తప్పదు. మీకు సామ్రాజ్యమూ దక్కదు. నన్ను గెలుచుకోండి. మీ సైన్యమూదక్కుతుంది. సామ్రాజ్యమూ చేతికివస్తుంది" అన్నాడు.

"అందుకనే నిన్ను ఆశ్రయిస్తున్నాము" వెంటనే అందుకు న్నాడు ధర్మరాజు — "అగ్నినేత్రం మూసేసుకుని, త్రిశూలం దాచేసు కుని వచ్చిన రుద్రుడిలాగ వురుకుతావు నువ్వుయుద్ధానికి. నీముందు నిలబడే మొనగాడు ఎవ్వడున్నాడు? అంచేత మహాత్మా, నిన్ను ఎలాగెలవడమో నువ్వే చెప్పు" అన్నాడు.

"అవును" తలవూపుతూ అన్నాడు భీష్ముడు — "నువ్వు చెప్పినదాంట్లో అబద్ధమేమీ లేదు. నాచేతిలో ధనుస్సు వుందంటే దేవతలయినా నన్ను గెలవడం కల్ల. ఊఁ — ఇలాంటివాణ్ణని తెలిసే మీరు ఇలా వచ్చారు. బావుంది. మీరు ఇంతమందీ వచ్చి ఇలా అడుగుతూవుంటే, మీకు ప్రియమైనపని చెయ్యడంకంటే నాకు సుకృతం ఏముంటుంది! చెపుతాను, వినండి.

"ఆయుధాలు వొదిలేసి నేను అస్త్రసన్యాసంచేస్తే అవలీలగా జయించవచ్చు నన్ను. అదిమాత్రం ఎలా సంభవమంటారా? కవచం పగిలినవాణ్ణీ, ఆయుధం వొదిలేసినవాణ్ణీ, జెండా దించేసుకున్న వాణ్ణీ, ఆడదాన్నీ, లోగడ ఆడదిగాపుట్టినవాణ్ణీ, ఆడపేరు పెట్టుకున్న వాణ్ణీ, తలవాగాతీసేసుకున్న వాణ్ణీ,అన్నదమ్ములు లేనివాణ్ణీ,కుమార్తెలు లేనివాణ్ణీ చూస్తే నేను బాణంకొట్టను; కత్తివెయ్యను. అంతేకాదు, ఇంకొక వ్రతంకూడావుందినాకు. పుట్టినప్పుడుఆడదిగావుండి, మధ్యలోవికలంగా

మగతనంవచ్చిందనుకోండి, అలాంటివాడితోనూ యుద్ధంచెయ్యనునేను. అంచేత మీకు వొక ఉపాయం చెపుతాను వినండి. ద్రుపదుడి పెద్ద కొడుకు శిఖండి వున్నాడే వాడు ఇప్పుడు నేను చెప్పినవంటి వాడు. ఇది మీరున్నూ ఎరుగుదురు. పైగా పూర్వజన్మలో అతగాడు ఆడది. అంచేత అతడు ఎదిరించినా నేను అతడిమీద కలిగించుకోను. అతణ్ణి ముందు పెట్టుకుని అర్జునుడు నామీదికి వస్తే సరి. నేను బాణం పట్టు కోను. ఆసందుచూసుకుని అర్జునుడు నన్ను కొట్టేస్తాడు. సరిపోతుంది. ఆపైన, బంధువులూ, మిత్రులూ అయిన కౌరవుల్ని కడతేర్చడం సుళువే అయిపోతుంది మీకు. ఇది నేను బుద్ధిపూర్వకంగానే చెపు తున్నాను. నేనుచెప్పినట్టు చెయ్యండి.” అన్నాడు సహృదయంగా.

భీష్ముడు అలా చెప్పాక అందరూ మరోకసారి ఆయనకి నమ స్కరించారు. ఆయన దగ్గిర సెలవుతీసుకుని వెళ్ళిపోయారు.

భీష్ముడు అంతటి త్యాగానికి సమ్మతించడమూ, తాను కృత కంగా ఆయన్ని చంపవలసిరావడమూ— కడుపులో చెయ్యిపెట్టి కలిచి నట్టయింది అర్జునుడికి. అప్పుడు దారిలో కృష్ణుడితో ఇలా అన్నా డతడు. “గురువు. ప్రజ్ఞావంతుడు. ధర్మాత్ముడు. వయోవృద్ధుడు. లోకమాన్యుడు. దయామూర్తి— ఇలాంటి తాతయ్యని వంచనచేసి చంపడమంటే కృష్ణా, మనస్కరించడంలేదు నాకు. బుగ్గిలో నేను ఆడు కుంటూ వుంటే ప్రేమగా ఎత్తుకునేవాడు. నావొంటిదూళి తనవొంటికి తగిలేట్టు కౌగిలించుకునేవాడు. మానాన్నని తలుచుకుని కన్నీళ్ళు పెట్టుకునేవాడు. తండ్రిలేని మమ్మల్ని తండ్రిలా పెంచాడు. అలాంటి తాతయ్యని ఇలా చంపెయ్యడమా? అబ్బా! నాతరంకాదు ఆయన భుజబలం చూపించి మా సేనంతా చంపేసినా సరే, చూస్తాను కాని ఇంత అధర్మం సెట్టుకోలేను. ధర్మరాజు తమ్ముళ్లు ఇంత క్రూర కర్ములా!”

"పొరపడుతున్నావు" మెల్లగా అందుకున్నాడు శ్రీకృష్ణుడు – "నువ్వు ఏది క్రూరకర్మ అంటున్నావో అదే రాజధర్మం. నేనుఇవాళ కొత్తగా అంటున్నమాటకాదిది. 'క్రూరత్వ మనుకోకూడదు. విచారం పెట్టుకోకూడదు. ఎలా అయినా సరే, శత్రువుని సంహరించాలి. ప్రజాక్షేమమే ధ్యేయంగా పెట్టుకోవాలి. ధర్మం తప్పకండా పన్నులు పుచ్చుకోవాలి. అవి మంచిపనులకోసమే ఖర్చుపెట్టాలి' ఇలా దేవేంద్రుడికి బృహస్పతి చెప్పాడు.

"అదీకాక, 'యుద్ధంలో భీష్ముణ్ణి చంపేస్తాను' అని నువ్వు ప్రతిజ్ఞచేశావు. లోకమంతా ఎరుగు నిది. అది ఇవాళ కాదంటే ఎలా పొసుగుతుంది! నువ్వు చంపితీరాలి అతణ్ణి. ఇన్నిమాటలెందుకూ? భీష్ముణ్ణి చంపడానికే నిన్ను పుట్టించాడు బ్రహ్మ" అన్నాడు.

"భీష్మవధకోసమే శిఖండి పుట్టుక అంటారు" ఆలోచిస్తూ అన్నాడు అర్జునుడు– "అది తప్పదుకదా! శిఖండిని ఆయనకొట్టడు. ఇది నిశ్చయం. నేనేమోఆయన్ని కొడుతున్నట్టే నటిస్తాను. ఆయన్ని కొట్టకండా పక్కవాళ్ళని కొడుతూవుంటాను. శిఖండిమీదమాత్రం ఈగవాలకండా కాసుకుంటూ వుంటాను. శిఖండికి పట్టపగ్గాలుండవు. అతడే భీష్ముణ్ణి కొట్టేస్తాడు" అన్నాడు.

"పిచ్చిమాట!" – నవ్వుతూ అన్నాడు శ్రీకృష్ణుడు, "నువ్వే చంపుతావు భీష్ముణ్ణి. రేపు తెల్లవారనీ చూద్దువుగాని. అసలు నువ్వుతప్ప మరొకడుకొట్టనేలేడు భీష్ముణ్ణి. మచ్చలేని పరాక్రమవంతుడాయన. నువ్వు లక్షవిధాల ఆలోచించు, దైవనిర్ణయం మరోలాగ జరగదు. దాన్ని తప్పించడం మనతరం కాదు" అన్నాడు.

"సరే, చూసుకుందాం. అప్పటికి ఎలా అవసరమైతే అలాగే చేద్దాం" చివరికి తలవూపుతూ అన్నాడు అర్జునుడు. కృష్ణుడూ, ధర్మరాజూ సంతోషించారు. కృష్ణుణ్ణి తనగుడారానికి దిగబెట్టేసి

తమతమ గుడారాలు చేరుకున్నారు పాండవులు. ఆరాత్రి హాయిగా నిద్రపోయారు.

## పదో రోజు

ధృతరాష్ట్రుడు : తరవాత ? తరవాత ఏంజరిగింది ? మర్నాడు పాండవులు శిఖండిని ముందుపెట్టుకువచ్చారా ? పితామహుడిమీద ఘోరంగా కలబడ్డారా ? ఏం జరిగింది ? చెప్పు. సంజయా, ఏం జరిగిందో చెప్పు.

సంజయుడు : మర్నాడు సూర్యోదయమయేసరికి మంచి వ్యూహంపన్ని, సేనలతో సిద్ధపడ్డారు పాండవులు. అవును, శిఖండినే ముందుపెట్టారు. అతడి కుడి ఎడమల్లో భీముడూ, అర్జునుడూ నిలబడ్డారు. వెనకభాగంలో అభిమన్యుడూ, ద్రౌపదికుమారుళ్ళూ నిలబడ్డారు. వాళ్ళ రెండుపక్కలా చేకితానుడూ, సాత్యకీ నిలబడ్డారు. వ్యూహానికి చివర ధృష్టద్యుమ్నుడూ మొదలైన పాంచాలకుమారుళ్ళతో ధర్మరాజు నిలబడ్డాడు. అతడికొకపక్క నకులుడూ, మరొకపక్క సహదేవుడూ నిలబడ్డారు. వాళ్ళనాదుకుని ద్రుపదమహారాజూ, విరాటరాజూ, కేకయరాజులూ, ధృష్టకేతువూ నిలబడ్డారు. ఇలా ఏర్పడిన పాండవవ్యూహం శత్రువులికి భయంకరంగా కనపడింది.

అంతకిముందే మనవాళ్ళు సిద్ధపడ్డారు. సేనంతకీ ముందుభీష్ముడు నుంచున్నాడు. అతడి కుడిపక్క ద్రోణాచార్యులూ, ఎడమపక్క అశ్వత్థామా నుంచున్నారు. కృపాచార్యులూ, కృతవర్మా, భగదత్తుడూ మొదలైనవాళ్ళతో కలిసి దుర్యోధనుడు మధ్యభాగంలో నుంచున్నాడు. బృహద్బలుడూ, సుదక్షిణుడూ మొదలైన ముఖ్యులు యావన్మందీ దుర్యోధనుడిచుట్టూ పెట్టనికోటలా నుంచున్నారు. వెనక

భాగంలో సుశర్మ మొదలైన త్రిగర్తవీరులు నుంచున్నారు. ఇలా బలమైన వ్యూహం పన్ని ముందుకి నడిచారు కౌరవులు.

ఉభయసేనలలోనూ ఉన్న పాళాన వొక్కసారి తూర్యధ్వనులు పురిమాయి. భూమీ ఆకాశమూ ప్రతిధ్వనించాయి. ఆరంభమే ఘోరంగా వుంది, పదోనాటి భారతయుద్ధం. దేవాసురయుద్ధం దాని ముందు తీసికట్టే అనిపించింది. ఓంప్రథమంలోనే ఇటూ అటూ ఎంత మంది దుళ్ళిపోయారో చెప్పలేను. యముడిపట్నంలో ఇసకవేస్తే రాలనంత సందడయిందంటే నమ్ము.

నకులుడూ సహదేవుడూ చిచ్చులపిడుగుల్లాగ చెలరేగారు. మనసైన్యం మంటగలపడమారంభించారు. కో అంటే కో అంటూ అర్జునుడూ, భీముడూ వొక్కసారి ఎగబడ్డారు. ఉప్పెనలా తోసుకు వచ్చింది పాండవసేన. మోజా * విరిగిపడ్డట్టు మనసేనమీద పడింది.

చూశాడు మన భీష్మసేనాని. ప్రళయభైరవుడిలా భీకరమూర్తే అయిపోయాడతడు. బాణాల్లో అగ్నిహోత్రం కురిపించాడు. అతడు ధనుస్సు ఎత్తాడో లేదో, నారిని బాణం తొడిగాడో లేదో, కాలూ కాలూ పెనవేసుకుని తొట్రుపడిపోయారు పాండవుల పదాతులు. మోకరిల్లి పడిపోయాయి గుర్రాలు. పీనుగులయి దబీదబీ కూలిపోయాయి ఏనుగులు. రథాలు వొరిగిపోయాయి.

## "నువ్వుకొడితే నేను నవ్వుతాను"

భీష్ముడికి ఎదురుగుండా రథం పురికించాడు శిఖండి. క్రూరమైన బాణాలు మూడు తీశాడు. దుసెళ్ళిపోయినట్టు భీష్ముణ్ణి కొట్టాడు.

"శిఖండివీ" మొహం తిప్పేసుకుని నవ్వుతూ అన్నాడు భీష్ముడు- "నీ మదంకొద్దీ నువ్వు మూడు కాదు, మూడుకోట్లన్నా కొట్టు, నవ్వు

* మోజా : విరిగిపడే సముద్ర కెరటం. (విశాఖపట్నం జిల్లా మాట)

తాను, కాని కోపంరాదు నాకు. నామీద పగబట్టి మొగాడయిన ఆడదానిమీదా నేను చెయ్యిచేసుకుంటాను !" అన్నాడు.

"ఏమయినా సరే, ఇవాళ పోనివ్వను నిన్ను" తోకతొక్కిన తాచులాగ కస్సుమంటూ అన్నాడు శిఖండి. "రాజులందరినీ ఓడించావు. అంత పరశురాముణ్ణీ టకటకలాడించావు, హుఁ, ఏంలాభం ! నాముందు గాజులు తొడిగించుకుంటున్నావు ! నామీద చెయ్యిచేసుకుంటే నేం, పెడమొహం పెట్టుకుంటే నేం, నిన్నుమాత్రం ఇవాళ వొదిలి పెట్టను. భీష్మా, నేను ఎవ్వరై తే నేం, నా చేవ చూద్దువుగాని. నీరక్తం బొట్టుపెట్టుకుంటాను. నీఅంతుచూసి మరీ వొదిలిపెడతాను" అంటూ మరో అయిదుబాణాలు అతడిమీదనాటించాడు.

"ఇవాళ శిఖండి సంగతి విపరీతంగా వుంది" చకితుడవుతూ అనుకున్నాడు అర్జునుడు. "భీష్ముడి తుదిఘడియలు దగ్గిరపడడంతోనే దైవదత్తమైన ఉత్సాహం ఆవేశించిందేమో ఇతణ్ణి ! అంచేతే ఇలా అంటున్నాడితడు."

"ఊరికే బిగిరి ప్రయోజనమేమిటి బావా !" శిఖండిని రెచ్చగొడుతూ అన్నాడు అర్జునుడు — "అనడం సులభమే. అన్నంతా చెయ్యకపోతేమాత్రం నవ్వులపాలవుతావు. అయితే పరవాలేదులే. నేనంటూవుంటే సిగవువ్వయినా వాడదు నీకు. జంకకు. చేవకొద్దీ తగలనియ్యి భీష్ముణ్ణి" అన్నాడు.

పెడమొహం పెట్టుకుని మరోతట్టు రథంపోనిచ్చాడు భీష్ముడు. ఆవెళ్ళడంవెళ్ళి పాంచాలసేనమీద విరుచుకుపడ్డాడు. భీష్ముడు అటు తప్పుకోగానే అవకాశం దొరికింది పాండవసేనకి. అర్జునుణ్ణి ముందు పెట్టుకుని కౌరవసేన నురుమాడడం లంకించుకుంది. తట్టుకోలేక పోతుంది కౌరవసేన. మెల్లిమెల్లిగా వెనకడుగువెయ్యడం మొదలెట్టింది.

దుర్యోధనుడు భీష్ముడిదగ్గిరికి పరిగెత్తాడు. "మన సేనలు మంట గలిసిపోతూవుంటే నువ్వు పెడమొహమేసుకు వచ్చేశావు!" అంటూ లబోలబో మన్నాడు.

"విచారించకు" నముదాయిస్తూ అన్నాడు భీష్ముడు — "రోజూ పదివేలమందిని చంపుతానని మాట ఇచ్చాను నీకు. ఈపది రోజులూ నాప్రతిజ్ఞ నేను నెరవేర్చుకున్నాను. నీఅన్నంతిన్నందుకు నీరుణం తీర్చుకున్నాను. ఇకమీద బలంసన్నగిల్లిపోతుందనే అనిపిస్తూ వుంది. మహారాజా, ఇవాళసంగతి చూస్తే నన్ను పాండవులన్నా చంపాలి. నేను వాళ్ళనన్నా చంపాలి. రెండిటిలో ఏదో వొకటి తప్పదు. అయితే దైవబలంకలవాళ్ళు పాండవులు. మానవమాత్రులు వాళ్ళని గెలవలేరు. అయినా నాచేతిబలమేదో కాస్త చూపిస్తాను చూడు!" అంటూ ఉవ్వునలేచాడు. పొగలేని అగ్నిహోత్రుడిలా అవుపించాడు. జ్వాలల్లాంటి బాణాలు విరజిమ్మాడు. ప్రాణాంతక మయింది పాండవులికి. ఆయనదిక్కు తేరిచూడడమే కష్టమయింది వాళ్ళకి. భీష్ముడి ఆనరాతో నీకొడుకులూ విజృంభించారు. కన్ను మూసి కన్ను తెరిచేలోపల వందలూ వేలూ శత్రువులశిరస్సులు దుళ్ళగొట్టారు.

దాంతో పాండవులూ నలిరేగిపోయారు. పాంచాల, యాదవ, మత్స్య, పాండ్య, కేకయ సేనలు శివమెత్తినట్టు మనసేనలమీదపడ్డాయి. ఘోరంగా హోరెత్తిపోయింది రణరంగం.

"కలబడూ" శిఖండిని రెచ్చగొడుతూ అన్నాడు అర్జునుడు— "భీష్ముడికి భయపడకు. నేనున్నాను. భయమెందుకూ! బాణాలు కుమ్మరించి లిప్తలో అతణ్ణిచంపేస్తాను. ముందుకి వురుకు" అంటూ తొందరచేసేశాడు.

"యావన్మందీ భీష్ముడిమీద విరుచుకు పడండి" అర్జునుడు శిఖండితో అన్న మాటలు విని పాండవ మహాయోధులందరినీ హెచ్చరించాడు ధృష్టద్యుమ్నుడు – "అర్జునుడున్నాడు. మనం జంకవలసిన పనిలేదు" అంటూ సింహనాదం చేసి విరుగుకుంటూ ముందుకి వురికాడు.

ధర్మరాజూ, భీముడూ, నకులుడూ, సహదేవుడూ, అభిమన్యుడూ, ద్రౌపదికుమారుల్నూ, ద్రుపదుడూ, విరాటరాజూ, సాత్యకీ, చేకితానుడూ, ధృష్టకేతుడూ, కేకయులూ, మగధసహదేవుడూ – ఈ యావన్మందీ తమతమ సేనలతో భీష్ముడిమీదికి దాడితీశారు. మనవాళ్ళు అశ్వత్థామా, భూరిశ్రవసుడూ, కృతవర్మా, కృపాచార్యులూ, సుదక్షిణుడూ, వికర్ణుడూ, దుర్ముఖుడూ, వివింశతీ, చిత్రసేనుడూ మొదలైన పేరుపడ్డ యోధులు పరిగెత్తి, భీష్ముణ్ణి వెనక పెట్టి శత్రువులతో కలబడ్డారు. దారుణమైన సంకులసమరం జరిగిపోయింది. అదిచూసి తమ అనిమిషత్వం (రెప్పలు పడకండా వుండడం) సార్థక మయిందనుకున్నారు ఆకాశంమీద దేవతలు.

పూనికపట్టి శిఖండిని ముందుపెట్టుకున్నాడు అర్జునుడు. మన సేన తప్పించుకుంటూ భీష్ముడిమీదికి తరుముకుంటూ వచ్చాడు.

## దుశ్శాసనుడి దుస్సాహసం

ఉప్పెనలా తోసుకువస్తున్న అర్జునుణ్ణి యానాపొద్దులా అడ్డుకున్నాడు మన దుశ్శాసనుడు. అర్జునుణ్ణీ అతడిసారథి కృష్ణుణ్ణీ కరుకైనబాణాలతో చురచురలాడించాడు. కనుకొనలు ఎర్రపడ్డాయి అర్జునుడికి. గుక్కతిప్పుకుండా పందబాణాలు నాటించాడు దుశ్శాసనుడిమీద. అయినా ఆగలేదు దుశ్శాసనుడు. చికిలిపట్టిన అయిదుబాణాలు

* యానాపొద్దు: సముద్రపొద్దు (విశాఖమాండలిక శబ్దం)

అర్జునుడి నుదుటిమీద నాటించా డతడు. ఒక్కసారి తేరిచూశాడు అర్జునుడు. దుశ్శాసనుడి విల్లు పళుక్కు మనిపించేశాడు. మరిన్ని బాణాలు అతడిమీద నాటించాడు. అయినా ఆగలేదు దుశ్శాసనుడు. చప్పున మరొకవిల్లు తీశాడు. మంచివొక పాతిక బాణాలు అర్జునుడి మీద గుప్పించాడు. వాటిని దూరంనించే నరికేశాడు అర్జునుడు. తళ తళా మెరుస్తున్న వొక వాడిబాణం తీశాడు. దుశ్శాసనుడి గుండెల మీద దారుణంగా కొట్టాడు. గుండెలు దూసుకుపోయింది బాణం. సొమ్మసిల్లి పడిపోయాడు దుశ్శాసనుడు. భీష్ముడి రథం వెనక్కి అతడి రథం పట్టుకుపోయాడు సారథి.

అంతలోనే తెప్పిరిల్లాడు దుశ్శాసనుడు. లేచీలేవడంతో సార థిని గద్దించాడు. వెంటనే వచ్చి అర్జునుడి మీద మళ్ళీ కలబడ్డాడు. నిజంగా అతడి సాహసంచూసి ఆశ్చర్యమే వేసింది నాకు.

ఇలా అర్జునుడూ దుశ్శాసనుడూ యుద్ధంచేస్తున్నారు. సాత్యకితో అలంబసుడూ, భగదత్తుడూ కలబడ్డారు. అభిమన్యుడితో సుదక్షిణుడూ, విరాట ద్రుపదులతో అశ్వత్థామా, సహదేవుడితో కృపాచార్యులూ, నకులుడితో వికర్ణుడూ, ఘటోత్కచుడితో దుర్ముఖుడూ, చేకితానుడితో చిత్రసేనుడూ, భీముడితో భూరిశ్రవసుడూ, ధర్మరాజుతో ద్రోణాచార్యులూ, కలబడ్డారు. ఒకళ్ళనిమించి వొకళ్ళు ఘోరంగా పోరాడారు. ఒకళ్ళ జెండాలు వొకళ్ళు విరుచుకున్నారు. ఒకళ్ళ గుర్రాలు వొకళ్ళు నరుకుతున్నారు. ఒకళ్ళసారథులను వొకళ్ళు చంపుకున్నారు. ఒకళ్ళధనుస్సులు వొకళ్ళు ముక్కలుచేసుకున్నారు.

బాణాలకి బాణాలు రాపాడాయి; నిప్పులురాలి మెరుపుల్లా అవుపించాయి. అల్లెతాళ్ళు భీషణంగా మోగాయి; ఉరుముల్లా విని పించాయి. రక్తాలు ధారలుకట్టాయి; వర్షంలా అనిపించాయి. ఇలా వొక అపూర్వమైన వానాకాలంలా తయారయింది కురుక్షేత్రం.

ఏటవాలుగావుంటే బాగా యుద్ధం అవుపడదనుకున్నాడో ఏమో సూర్యుడు! సరిగ్గా నడినెత్తికి వచ్చేశాడు.

నువ్వా నేనా అంటూ అర్జునుడితో పోరాడాడు దుశ్శాసనుడు. అతణ్ణి బాణాలతో కప్పెట్టేశాడు. ఉగ్రుడే అయిపోయాడు అర్జునుడు. దుశ్శాసనుడి బాణాలు యీవత్తూ తుక్కుకింద కొట్టేశాడు. అయినా ఆగలేదు దుశ్శాసనుడు. మరింతమండిపడ్డాడు అర్జునుడు. అతడిధనుస్సు నరికేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. ఒళ్ళంతా తూంట్లుతూంట్లు చేసేశాడు. కీళ్ళలో బాణాలు నాటించాడు. తూలిపోయాడు దుశ్శాసనుడు. మరి నిభాయించలేకపోయాడు. రథంపరిగెత్తించుకుని అదే పారిపోడం పారిపోయాడు.

గట్టుతెగిన ప్రవాహంలా రెచ్చిపోయాడు అర్జునుడు. మెరుపులాగ రథం మెరిపించాడు. భీష్ముడిముందున్న కౌరవసేనమీద ఉరికించాడు. సంహారక్రీడ ప్రారంభించాడు. ఆకాశం బద్దలైనట్టు అల్లేతాడు మోగిస్తూ అతణ్ణిఅడ్డుకోబోయాడు ద్రోణాచార్యుడు. అడ్డంగా వచ్చి కలబడ్డాడు ధర్మరాజు. దెబ్బతిన్నపాములాగ బుసకొట్టాడు ద్రోణుడు. అంతద్రోణుణ్ణీ చెమట్లుకక్కించాడు ధర్మరాజు.

"బాబూ, ఇవాళఏదో ఘోరంజరిగిపోతుందోయి"- పక్కనే కుడిభుజంలా వున్న కుమారుడు అశ్వత్థామతో అన్నాడు ద్రోణాచార్యులు - "ఎన్నడూలేంది నా దివ్యాస్త్రాలు తడబడుతున్నాయి. మంత్రాలు తప్పిపోతున్నాయి. ధనుస్సు వొణుకుతూవుంది. మనస్సు స్వాధీనం తప్పుతూవుంది. చేష్టలు నిలకడలేకండా వున్నాయి. శరీరం చలనంతప్పుతూవుంది. ఇదంతాచూస్తే అర్జునుడు అన్నంతా చేసేస్తాడనిపిస్తూవుంది ఇవాళ.

"చూడూ చూడూ, అతడి ఎదటిదిక్కు తలెత్తిచూడూ, ఘోరాలు కూలిపోతున్నాయి. ఏనుగులు పీనుగులవుతున్నాయి.

రథాలు వాలిపోతున్నాయి. ప్రళయ యముడేవచ్చి సర్వసంహారానికి పూనుకున్నట్టుంది సందేహంలేదు. ప్రళయం ముంచుకువచ్చినట్టే వుంది. కౌరవసేనమీద గెద్ద లెగురుతున్నాయి. ఉల్కలు రాలుతున్నాయి. వికారంగా వరళ్ళు అరుస్తున్నాయి. ధర్మరాజు మొహమ్మీద క్రోధం తాండవమాడుతూవుంది. ఇదంతా చూస్తే మన భీష్ముడికి ఏదో ఆపద తప్పనట్టేవుంది. చప్పునవెళ్ళాలి నువ్వు. ద్రౌపది కుమారుల్నూ, నకులసహదేవులూ, తానూ కలిసి నన్ను కదలనివ్వడం లేదు ధర్మరాజు. వీళ్ళని వొదిలించుకువెళ్ళడం సాధ్యంకాకండావుంది. నువ్వే వెళ్ళు. భీష్ముడి కుడిఎడమల రెండుపక్కలా అండగా నిలబడు. ప్రాణాలు దాచుకునే సమయం కాదిది'' అన్నాడు.

తండ్రిమాటవిని పిడుగులా బయలుదేరాడు అశ్వత్థామ. శిఖండిని ముందుపెట్టుకుని భీష్ముడికట్టు సాగుతూ కౌరవసేన కడతేరుస్తున్నాడు అర్జునుడు. అగ్నిదేవుడికి గాలిదేవుడు సాయం, అతడితో భీముడున్నా తరుముకు వస్తున్నాడు. భీష్ముడు ఎదటవున్న చతురంగసేన దుళ్ళగొడుతున్నాడు. మహారాజా, భీషణంగావుంది యుద్ధం ప్రతీ నిమిషమూ ప్రాణాంతకంగావుంది.

భగదత్తుడూ, కృపాచార్యులూ, కృతవర్మా, శల్యుడూ, జయద్రథుడూ, చిత్రసేనుడూ, దుర్మర్షణుడూ, విందుడూ, అనువిందుడూ, వికర్ణుడూ – ఈపదిమందీ వొక్కమొగిని భీముడిముందు కురికారు. రకరకాల ఆయుధాలు అతడిమీద దిమ్మరించారు. ఎంతనొప్పించాలో అతణ్ణి అంతా నొప్పించారు. అసలే ఉద్దండుడు భీముడు. వజ్రశరీరమతడిది. అన్నిదెబ్బలు మీదపడుతున్నా పిసరంతా చలించలేదతడు.

భీముణ్ణి ముట్టడించిన పదిమందిదిక్కూ గాండీవంతిప్పాడు అర్జునుడు. పదిమంది బాణాలూ ముక్కలుచేసేశాడు. వాళ్ళ వింటిబద్దలు విరిచేశాడు. జెండాలు చించేశాడు. గొడుగులు ఎగరగొట్టేశాడు.

చామరాలు నరికేశాడు. ఆభరణాలు బుగ్గిలో కలిపేశాడు. అదంతా చూసి మొత్తుకున్నాడు దుర్యోధనుడు. సుశర్మా మొదలైనవాళ్ళని కేక వేసి పిలిచాడు. భీమార్జునుల మీదికి పురికొల్పాడు.

కృపాచార్యులూ మొదలైన పదిమందినీ, సుశర్మా మొదలైన త్రిగర్తరాజుల్నీ - ఇంతమందినీ మూడు చెరువులనీళ్ళు తాగించారు భీమార్జునులు. మిగిలిన సైన్యమంతటినీ ఉసికొల్పాడు దుర్యోధనుడు. అంతమందీ రావడంతోటే భీమార్జునులికి తలమునక లయింది యుద్ధం. అది కనిపెట్టేసి అభిమన్యుడూ సాత్యకీ మొదలైన మహారథులు పెద్ద సైన్యంతో వచ్చి భీమార్జునులతో కలిశారు. మారిమసగిసట్టు మనసేన మీద వాలారు. మహోద్ధృతంగా జరిగిపోయింది యుద్ధం. మహారాజా, ఆమహాయుద్ధంలో పాండవుల దే పై చెయ్యిలా అవుపించింది. ఘోరాతి ఘోరంగా పోరాడారు వాళ్ళు.

అదంతా చూశాడు భీష్ముడు. ఎన్నడూ లేనంత ఉద్రేకం తెచ్చుకున్నాడు. ఏనుగుమందలమీదికి లంఘించిన సింహంలాగ శత్రువులమీదికి పరిగెత్తాడు. సింహంగోళ్ళవంటి బాణాలతో వాళ్ళని చీల్చెయ్యడ మారంభించాడు. సారథుల్ని చంపేశాడు. గుర్రాలు కూల్చేశాడు. ఎక్కడచూస్తే అక్కడే ప్రత్యక్షమయాడు. శత్రుసేన బాణాలతో కప్పేశాడు. అడ్డూ ఆపూ లేకుండా ఎంతో అంత సేపు వీరవిహారం చేశాడు. ఎంతో అంత శత్రుసైన్యం హతమార్చేశాడు. అపరాహ్ణమయింది.

## "ఇంకెందుకూ ఆలస్యం"

సంహారక్రీడ చేసిచేసి, అప్పుడు ఇలా అనుకున్నాడు భీష్ముడు. "ఇవాళకి పదినాళ్ళయింది. ఉత్తమక్షత్రియుల్ని రోజుకి పదివేలమందిని హతమారుస్తూ వచ్చాను. విసుగెత్తినట్టుంది. ఇక శరీరంతో

సంబంధం వొదిలిపెట్టేస్తాను.'' ఇలా అనుకుంటూ ముందుకిచూశా డాయన. యుద్ధంచేస్తున్నట్టు సైన్యం తప్పించుకుని, ధర్మరాజుదగ్గిరికి వెళ్ళాడు. అతడి రథంపక్కనించి రథంపోనిస్తూ "ఇంకా ఎందుకూ ఆలస్యం ?'' అన్నాడు - "పుట్టినప్పటినుంచీ క్రూరంగా రాజుల్ని చంపుతూనే కాలం గడిచిపోయింది. విసిగిపోయాను. ఈరాక్షసప్పని మరిచెయ్యలేను. ధర్మరాజా, ఇంకెందుకునాయనా, ఆలస్యం ? నిజంగా మీరు నామేలుకోరితే మరి ఆలస్యం చెయ్యకండి. శిఖండిని ముందు పెట్టుకుని అందరూ వొక్కసారి మీాదపడండి. నన్ను హరీ అనిపించె య్యండి''అన్నాడు.

చెప్పవలసిన ఆకాస్త మాటా ధర్మరాజుతో చెప్పేశాడు భీష్ముడు యుద్ధంచేస్తున్నట్టే రథంమళ్ళించాడు. పాంచాలసేనమీాద బాణాలు కురిపించాడు.

"భీష్ముడిమాటలు విన్నావుకదా!'' పక్కనేవున్న ధృష్టద్యు మ్నుణ్ణి సాకూతంగా చూస్తూ అన్నాడు ధర్మరాజు – "నువ్వూ, భీముడూ కలిసి అర్జునుడితో వెళ్ళండి. మన బలగమంతటితోనూ భీష్మణ్ణి ముట్టడించండి త్వరపడండి'' అన్నాడు.

విరాటరాజూ, కేకయులూ మొదలైన రాజులికీ, శక్తిమంతు లైన యోధులికీ ఉప్పందించాడు ధృష్టద్యుమ్నుడు. భీష్మణ్ణి ముట్ట డించండంటూ చెయ్యివిసిరాడు. తమసేనాని చెయ్యివిసరడమే తడువు, కో అంటూ బయలు దేరారు శత్రుయోధులు. భీమార్జునుల ఆసరా చూసుకుని భీష్మణ్ణి ముట్టడించారు.

భీష్మణ్ణి కాపాడుకోవాలంటూ కంగారుపడిపోయాడు దుర్యో ధనుడు. పేరుపడ్డ యోధుల్ని, తమ్ముళ్ళనీ కూడగట్టుకుని భీష్మణ్ణి తప్పించుకుంటూ వెళ్ళి పాండవులమీాద కలబడ్డాడు. మంచి బింకంలో పడింది యుద్ధం. చెప్పలేనంత తీవ్రరూపం ధరించింది.

పులిపిల్లలా దుర్యోధనుడిమీదికి వురికాడు అభిమన్యుడు. ఒక ప్రవాహంలాగ బాణాలువేసి అతణ్ణి కీచుకీచుమనిపించాడు. అశ్వత్థామ సాత్యకిమీదపడి, అతడివొళ్ళంతా బాణాలతో చిల్లులుపెట్టేశాడు. ధృష్టకేతువూ పౌరవుడూ కలబడ్డారు. ఎవరికెవరూ తీసిపోకుండా కొట్టుకున్నారు. దుర్యోధనుడి ఏనుగుసేనమీద వాలాడు భీముడు. చేతికందిన ఏనుగునల్లా చిదగ్గొట్టి వొదిలిపెట్టాడు.

భీష్ముణ్ణి కాపాడుకోవాలని కౌరవులు ఎంత తెగించి యుద్ధం చేస్తున్నారో, అతణ్ణి పడగొట్టాలని పాండవులు అంత పోరాడుతున్నారు. ఉభయపక్షాలయోధులూ ప్రాణాలమీద ఆశవొదిలేసి పోరాడుతున్నారు.

అంతలో మళ్ళీ అర్జునుడిమీదికి దూసుకువచ్చాడు దుశ్శాసనుడు. సింహంమీదికి సింహందూకితే ఎలావుంటుంది, అదిగో అలాగ అనిపించింది నాకు. అడుగుతీసి అడుగు ముందుకి వెయ్యకండా అడ్డుకున్నాడు అర్జునుణ్ణి. అంతమందిలోనూ తానే మొనగాడు అనిపించాడు దుశ్శాసనుడు. అతడి దూకుడుచూసి శత్రువులే ముక్కుమీద వేలు వేసుకున్నారు. నిశ్చేరపోయి చూశారు దేవతలు.

కళ్ళుమొయ్యా కోపం తెచ్చుకున్నాడు అర్జునుడు. నల్లతాచుల్లాటి బాణాలు దుశ్శాసనుడి శరీరంనిండా నాటించాడు. ఆపాదమస్తకమూ మంటలు పుట్టించాడు. సహించలేకపోయాడు దుశ్శాసనుడు. మళ్ళీ భీష్ముడి వెనక్కి పారిపోయాడు.

దుశ్శాసనుణ్ణి తరిమేసి, భగదత్తుడిమీద పడ్డాడు అర్జునుడు. బాణంమీద బాణంకొట్టి అతణ్ణి కంగారు పెట్టేశాడు. అతడి తెల్ల ఏనుగు వొళ్ళంతా రక్తాలుకారించి ఎర్రఏనుగులా చేసేశాడు. అర్జునుడి ఎదటినించి పారిపోయి, ద్రుపదుడిమీద కలబడ్డాడు భగదత్తుడు.

శిఖండిని ముందుకి తోశాడు అర్జునుడు. ఒడుపుచూసి భీష్ముణ్ణి కొట్టమన్నాడు. మనవాళ్ళు భీష్ముణ్ణి దాటుకుని శిఖండిని అడ్డుకో బోయారు. కాని అర్జునుడి బాణవేగం భరించలేకపోయారు. పెను గాలికి తుళ్ళిపోయే మేఘాలలాగ వెనక్కి వచ్చేశారు. అడ్డులేక పోయింది అర్జునుడికి. ఆసందు చూసుకుని భీష్ముడిమీద బాణాలు గుప్పించాడు శిఖండి. శిఖండితట్టు మొహమే ఎత్తలేదు భీష్ముడు. అతడి పక్కపక్కవాళ్ళనే వేటాడుతూ వచ్చాడు.

"కొట్టూ, కొట్టూ" శిఖండిని తొందరపెట్టేశాడు అర్జునుడు. భీష్ముడి రెండుభుజాలమధ్యా గురిపెట్టాడు శిఖండి. బాణంమీద బాణం టపీటపీ తగిలించాడు. పిచికారీతో నీళ్ళుకొడితే లక్ష్యపెట్టని ఏనుగు లాగ శిఖండి బాణాలు పట్టించుకోనేలేదు భీష్ముడు. నవ్వుతూ వూరు కున్నా డతడు. పుంఖానుపుంఖాలు బాణాలు వేశాడు శిఖండి. తలుచుకుంటే వొక్కబాణమే చాలు శిఖండిమీదికి. కానిపూనుకో లేదు భీష్ముడు. అర్జునుడిమీద మాత్రం బాణాలు కొట్టా డతడు.

అప్పుడు మళ్ళీ దూసుకుంటూ వెళ్ళాడు దుశ్శాసనుడు. అర్జునుణ్ణి వొక్కవూపు వూపి మరీ వొదిలిపెట్టాడు. అయితే ఎక్కడ అర్జునుడు! ఎక్కడ దుశ్శాసనుడు! ఎంతోసేపు నిలువలేకపోయాడు. చావుదెబ్బలు తినేశాడు. మళ్ళీ పలాయనం చిత్తగించాడు.

శిఖండిని ముందుపెట్టుకుని అర్జునుడు భీష్ముడిమీదికి వచ్చేస్తు స్తున్నాడు. గజిబిజిపడిపోయాడు దుర్యోధనుడు. గావుకేకలు వేసేస్తూ సేనలికి చెయ్యివిసిరాడు. కళింగ, మాళవక, బాహ్లీక, విదేహ, శూరసేన సైన్యాల్ని పురికొలిపాడు. ఆసేనలన్నీ వొక్కసారి అర్జు నుణ్ణి చుట్టుముట్టాయి. ఊపిరాడనివ్వకండా ఆయుధాలతో అతణ్ణి ముంచెత్తాయి.

ఒక ధూమకేతువులాగ విజృంభించాడు అర్జునుడు. దివ్యాస్త్రాలు ప్రయోగించాడు. మనచతురంగ సేన తుక్కుతుక్కుకింద దుళ్ళగొట్టాడు. తెరిపిచూపించి శిఖండిని రెచ్చగొట్టాడు. సందు దొరకడమే తడువు, వడివడిగా వాడివాడి బాణాలు భీష్ముడిమీద నాటించాడు శిఖండి.

మళ్ళీ వెళ్ళాడు దుశ్శాసనుడు. ఈసారి కృపుణ్ణీ, శల్యుణ్ణీ, వివింశతినీ, వికర్ణుణ్ణీ వెంటపెట్టుకుమరీ వెళ్ళాడతడు. భీష్ముణ్ణి దాటి వెళ్ళి అర్జునుడితో కలబడ్డాడు. చూపులతోనే అయిదుగురినీ పురిమాడు అర్జునుడు. అరనిమిషంలో అయిదుగురి రథాలూ పడగొట్టేశాడు.

ప్రాణాలు పోయినా భీష్ముణ్ణి రక్షించాలంటూ పరిగెత్తాడు దుర్యోధనుడు. తమ్ముళ్ళందరినీ కూడా వేసుకుని ఉద్రేకంతో వెళ్ళి భీష్ముడికీ అర్జునుడికీ మధ్యనుంచున్నాడు. అర్జునుణ్ణీ, శిఖండినీ బాణాలతో ముంచెత్తాడు. రాజు వెళ్ళడంతోనే మనసేనలో యోధుడన్న వాడల్లా అక్కడికే దూసుకువెళ్ళారు. మంచి బింకంలోపడింది యుద్ధం.

తన కళ్ళముందు తన మనవలు, హేమాహేమీలయి యుద్ధం చేస్తున్నారు. సంతోషించాడు భీష్మపితామహుడు. కౌరవుల్నీ, పాండవుల్నీ ఉభయుల్నీ మెచ్చుకున్నాడు. చివరిసారిగా శత్రువుల మీద వొక దివ్యాస్త్రం వెయ్యాలనిపించిం దతడికి. అస్త్రంతీశాడు. ధనుస్సుకి తొడిగాడు. అల్లెతాడు చెవులదాకా లాగాడు. ఉత్తరక్షణంలో వెళ్ళిపోతుందిమహాస్త్రం. పాండవసేనలో ఎంతయినా నాశనం జరిగిపోతుంది. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ ఎన్నయినా కూలిపోతాయి. ఎంతమందయినా పదాతులు హతవారిపోతారు. అంతలో ఎదురుగ్గా అవుపించాడు శిఖండి. ఎత్తినధనుస్సు దించేశాడు భీష్ముడు. మొహం తిప్పేసుకున్నాడు. పాంచాలసేన దిక్కు రథం పోనిచ్చాడు. దానిమీదపడి పీనుగుపెంటలు చేశాడు. కరూశసైన్యం చేటాశాడు. మత్స్యదేశసేన మంటగలిపాడు.

# శ తా నీ కు డు

మహామారిలా మీదపడి తమసైన్యం భీష్ముడు సంహారించడం చూసి సహించలేకపోయాడు విరాటరాజుతమ్ముడు శతానీకుడు. ఉద్రేకంతో వచ్చి అతణ్ణి ఎదిరించాడు. సానపెట్టిన గట్టిగట్టి బాణాలు ప్రయోగించాడు. ఎన్నో అన్ని బాణాలు భీష్ముడిమీద నాటించాడు. అతడి సాహసంచూసి ఉభయపక్షాలయోధులూ భళీ అన్నారు.

జూలుపట్టిలాగిన సింహంలా గర్జించాడు భీష్ముడు. వెడల్పాటి దొక బాణం కొట్టాడు. శతానీకుడి విల్లు విరిచేశాడు. సరుదుకునే లోపున అతడి సారథిని చంపేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. గుర్రాలు కూల్చేశాడు. చప్పున శక్తితీశాడు శతానీకుడు. భీష్ముడి మీద ప్రయోగించాడు. అంతశక్తినీ గడ్డిపోచలా కొట్టేశాడు భీష్ముడు మరుక్షణంలో మహోగ్రమైనబాణం వొకటితీశాడు. శతానీకుడి శిరస్సు నరికేశాడు.

శతానీకుడు తెగిపోడంతోటే గగ్గోలు పెట్టేసింది మత్స్యసేన. పాండవసేనలు పరుగుచ్చుకున్నాయి. మట్టమధ్యాహ్నం సూర్యుడిలా ప్రజ్వరిల్లిపోయాడు భీష్ముడు.

"అర్జునా, ఇక మాటదక్కదు" అర్జునుణ్ణి హెచ్చరిస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు— "భీష్ముణ్ణి చూసి బెగిలిపోతున్నాయి మన సైన్యాలు. చూడు, కకావికలయిపోతున్నాయి. నువ్వు ఏమాత్రం ఉపేక్షించినా లాభంలేదు మరి. ఆలస్యం వినమిస్తుంది. త్వరపడు" అన్నాడు.

కృష్ణుడి నోట్లోమాట నోట్లోనే వుంది, గాండీవం గబగబ లాడించాడు అర్జునుడు. భీష్ముణ్ణీ, అతడి గుర్రాల్నీ, రథాన్నీ బాణాలతో వొక్కసారి ముంచెత్తాడు. అగ్నిదేవుడికి గాలిదేవుడిలాగ అర్జునుడి పక్కనేవుండి బాణాలు రువ్వాడు శిఖండి.

శిఖండిని కొట్టకుండా వూరుకున్నాడు భీష్ముడు. ఆసందు చూసి భీష్ముడి ధనుస్సు నరికేశాడు అర్జునుడు. ఆవూపున వెన్నో అన్ని బాణాలు గుప్పించాడు. అదంతా స్పష్టంగా చూశారు మనవాళ్ళు. శలుడూ, శల్యుడూ, కృతవర్మా, చిత్రసేనుడూ, భూరిశ్రవసుడూ మొదలైన వీరులు సహించలేకపోయారు. ఉద్రేకంతో విజృంభించారు. మహాస్త్రాలు ప్రయోగించారు. "రండీ, భీష్ముడికి అడ్డుపడండీ. ముందుకి వురకండీ" అంటూ కేకలువేస్తూ అర్జునుడిమీద దాడిచేశారు.

అటు భీముడూ, సాత్యకీ, అభిమన్యుడూ, విరాటరాజూ, ద్రుపదుడూ, ఘటోత్కచుడూ మొదలయిన హేమాహేమీలందరూ తమతమ సేనలతో తోసుకు వచ్చారు. మహారాజా, దేవాసుర యుద్ధంలా జరిగింది యుద్ధం. అందులో అర్జునుడి ప్రతాపం అద్భుతం. అందరితోనూ అన్నిరూపులై పోరాడాడతడు. ఇంద్రాస్త్రమూ, ఆగ్నేయాస్త్రమూ వంటి మహాస్త్రాలు ప్రయోగించాడు. మనసేన తనమీదికి రాకండా పారదోలాడు. శిఖండిమీద ఈగవాలకండా కాపాడాడు. "కొట్టూ, కొట్టూ" అంటూ హెచ్చరించి భీష్ముడిమీద బాణాలు వేయించాడు. ఆయన ఎన్నిధనుస్సులు ఎత్తితే అన్నీ లిప్తలో ముక్కలు చేసేశాడు. చూసిచూసి అర్జునుడిమీద ఘోరమైన శక్తి ప్రయోగించాడు భీష్ముడు. మీదికివస్తూన్న శక్తిని మధ్యలోనే తునకలుకింద కొట్టేశాడు అర్జునుడు. తాతగారి తాళధ్వజం ఎగరగొట్టేశాడు. సారథిని చంపేశాడు.

"ఇదంతా కృష్ణుడి చలవ" అర్జునుడి ఆటోపంచూసి అనుకున్నాడు భీష్ముడు. — "అతడి ప్రాపే లేకపోతే పాండవులేపాటి నాకు? ఒక్క నాధనుస్సుతోనే ఇంతమందినీ గెలిచేసేవాణ్ణి. సరే, అది అలా వుండనీ. కృష్ణుణ్ణి వెంటపెట్టుకువస్తే నన్నెలా చంపాలో చెప్పనే చెప్పాను వాళ్ళకి. ఇంకెందుకూ నేను విజృంభించడం? మానేస్తాను.

యుద్ధం చెయ్యను. శాంతిస్తాను. ఊరుకుంటాను" అని నిశ్చయించు కున్నాడు.

"దివ్యమైన సంకల్పం" భీష్ముడి చివరిసంకల్పం గ్రహించి ఆకాశంమీద దేవతలన్నారు—"మాకుకూడా నచ్చిందిది."

దేవతలన్న మాటలు భీష్ముడూ, వ్యాసులవారి అనుగ్రహంవల్ల నేనూ విన్నాము. చిన్న నీటితుంపర్లతో భీష్ముడిమీద చల్లగాలి వీచింది. పూలవాన కురిసింది. దేవదుందుభులు మోగాయి. అయితే మరెవరికీ అవుపించ లేదవి. వినిపించనూ లేదు.

అలా తుదినిశ్చయం చేసుకున్నాడు భీష్ముడు. కేవలం వూరు కుంటే ఎవటివాళ్ళకి వెటకారంగా అవుపిస్తుంది. అంచేత ధనుస్సు పుచ్చుకుని నిర్లిప్తతతో ఎక్కుపెట్టా డతడు. అంతలోనే ఉక్కుతునక ల్లాంటి బాణాలు విరామంలేకుండా వొదిలిపెట్టాడు శిఖండి. శరీర మంతటా బాణాలు నాటుకుంటున్నాయి. అయినా చలించలేదు కురువృద్ధుడు భీష్ముడు. రవంత అలసిపోనూ లే దతడు.

నవ్వుతూ భీష్ముణ్ణి బాణాలతో కొట్టాడు అర్జునుడు. భీష్ముడు సంతోషించాడు. తానూ అర్జునుణ్ణి బాణాలతో కొట్టాడు.

తాతగారి బాణాలన్నీ ముక్కలుచేసేశాడు అర్జునుడు. ఆయన ధనుస్సు ముక్కలు చేసేశాడు. దారుణమైన బాణాలు అతడిమీద నాటించాడు. అంతకంతకీ అర్జునుడితమకం రెచ్చిపోలుంది. ఉప్పొంగిన సముద్రంలా అవుపించా డతడు. మనయోధుల్లో వొక్కడూ అతడి ఎదటికి వెళ్ళడానికి సాహసించలేకపోయాడు. దుర్యోధనుడూ మొదలైనవాళ్ళు యావన్మందీ భయభ్రాంతు లయిపోయారు. పక్కపక్క లికి తప్పుకుని చూస్తూ నుంచుండిపోయారు.

"అర్జునుడు అసాధ్యుడు" చుట్టూ కలయచూసి, పక్కనే కనిపించిన దుర్యోధనుడితో అన్నాడు భీష్ముడు — "దేవతలే అనూ,

దానవులే అనూ యుద్ధంలో అతణ్ణి నిభాయించడం కల్ల. అలాంటిది అతడు కళ్ళెర్రచేస్తే మనుష్యమాత్రులు ఏమాత్రం? మలమలామాడి పూరుకుంటారు. ఇతణ్ణి వొక్కణ్ణే తప్పిస్తే, ఈ పాండవుల్ని యావన్మందినీ సైన్యసమేతంగా చంపెయ్యగలను నేను. నిజం చెప్తున్నాను, అర్జునుడిముందు ధనుస్సుపట్టేవాడు ముల్లోకాల్లోనూ లేడు" అన్నాడు.

భీష్ముడలా అంటూనే వున్నాడు, శిఖండి ధనుస్సు వెనక తన ధనుస్సు జోడించాడు అర్జునుడు. శిఖండి కొట్టినట్టు గట్టిగట్టి బాణాలు సంధించి భీష్ముణ్ణి కొట్టాడు.

అలా శిఖండిచాటునించి కొట్టినా, అవి అర్జునుడి బాణాలని గ్రహించేశాడు భీష్ముడు. పక్కనేవున్న దుశ్శాసనుడితో అన్నాడు- "బాణాలా ఇవి, పిడుగులు! బ్రహ్మదండాలు! యమదూతల్లాగ ప్రాణాలు తోడేస్తున్నాయి. ఎండ్రపీత గర్భంలాగ విచ్చిపోతూవుంది నా శరీరం! అర్జునుడివే ఇవి, శిఖండివి కావు. శిఖండి ఏమిటి, ఇలాంటి బాణాలు వెయ్యడమేమిటి? ఇంత మర్మభేద్యంగా గొట్టగలడా అసలు శిఖండి? ఇంత దృఢంగా, లక్ష్యశుద్ధిగా, తేజోవంతంగా, వాడిగా, వేడిగా అర్జునుడు తప్ప ఇంకెవడు కొడతాడు?" అన్నాడు.

అంటూనే ఘోరమైన శక్తి తీశాడతడు. అమాంతంగా అర్జునుడి మీద విసిరాడు. మూడు బాణాలతో దాన్ని ముక్కలుచేసేశాడు అర్జునుడు. కత్తీ డాలూ పుచ్చుకున్నాడు భీష్ముడు. రథంమీంచి కిందికి వురికాడు.

అతడలా వురికాడో లేదో, మెరుపుల్లాంటి బాణాలు కురిపించాడు అర్జునుడు. భీష్ముడి కత్తీడాలూ తునకలుచేసేశాడు. తన యోధుల్ని గొంతెత్తి హెచ్చరించాడు. "భయపడకండి. రండి. కలబడండి.

భీష్ముడిమీదవిరుచుకుపడండి. నేనున్నాను. భయమేమిటి ?" అంటూ వురిమాడు. మహారాజా, అంతా క్షణాలమీద జరిగిపోతూవుంది.

ఆవేశంతో పరవళ్ళుతొక్కింది పాండవసేన. "కొట్టండీ, బాదండీ, పొడవండీ, నరకండీ' — పొలికేకలుపెట్టుకుని భీష్ముడి, మీద తిరగబడింది. కో అంటె కో అంటూ కౌరవసేన పరిగెత్తింది పాండవ సేనమీదికి. హాహాకారాల ద్వంద్వ యుద్ధం జరిగిపోయింది.

ఏంజరిగితే ఏంలాభం ? అంతసేనా అర్జునుడిముందు ఆగలేక పోయింది. కౌరవసేన అంతా కకావికలుచేసేశాడతడు. శ్రీకృష్ణుడు సారథి అర్జునుడికి అడ్డేమిటి ? మనసేన వెనక్కితగ్గేసింది. పట్టపగ్గాలు లేకపోయాయి పాండవయోధులికి. ఒక్కసారి భీష్ముడిమీద విరుచుకు పడ్డారువాళ్ళు. ఎన్నివిధాలకొట్టాలో అన్నివిధాలా కొట్టేశారు భీష్ముణ్ణి. రకరకాల బాణాలూ, ఆయుధాలూ కుమ్మరించారు.

భీష్ముడివొంటిమీద వేలెడంత ఎడం లేకపోయింది. అంత దారుణంగా, నిష్ఠురంగా నాటుకున్నాయి బాణాలు. అయినా ఆమహా యోధుడు అలాగే నుంచున్నాడు.

## అంపశయ్య

సూర్యుడు అస్తమిస్తున్నాడు. క్రూరమైనబాణాలు కొట్టి భీష్ముణ్ణి పడగొట్టాడు అర్జునుడు.

నీకువాళ్ళు యావన్మందీ చూస్తూనేవున్నారు. తూర్పుదిక్కు తలపెట్టి పడిపోయాడు భీష్ముడు. గజగజలాడిపోయింది భూదేవి. పడమట సూర్యుడు పడిపోయినట్టే కిందపడిపోయాడు భీష్ముడు ఒంటినిండా బాణాలే. శరీరం నేలని తాకలేదు. బాణాలే వూతగా వుండిపోయాయి. బాణాలే పక్కలా అయాయి. అలా అంపశయ్య మీద పడిపోగానే ఆయనకి దేవత్వం వచ్చేసింది.

అయితే అది దక్షిణాయనం, "అంత పుణ్యాత్ముడూ దక్షిణాయనంలో కాలంచెయ్యడమా" అంటూ విచారించారు దేవతలు. అది తెలుసుకున్నాడు భీష్ముడు. "విచారించకండి. కాలగతి తెలుసు నాకు. అంచేతే ప్రాణాలు నిలుపుకున్నాను. సత్యవతీదేవి వివాహ సమయంలో నన్ను మెచ్చి మా తండ్రి నాకు వరమిచ్చాడు. అవధ్యత్వమూ, స్వచ్ఛందమరణమూ నాకు ప్రసాదించాడు. అంచేతే నాచావుకి నేనే వేచబడవలసి వచ్చింది. నాప్రాణాలు నావశంలోనే వున్నాయి" అన్నాడు.

సంతోషించారు దేవతలు. అంతేకాదు మహారాజా, అది దక్షిణాయనమని చెప్పడానికి కొంతమంది మునీశ్వర్లనీ పంపించింది అతడితల్లి గంగాదేవి. హంసలయి వచ్చారు వాళ్ళు. తాము చెప్ప దలచినది ఆయనకి తెలుసునని తెలుసుకుని వెళ్ళిపోయారు వాళ్ళు.

భీష్ముడిటు పడిపోయినప్పుడు ద్రోణాచార్యులు దూరంగా పోరాడుతున్నాడు. ఆయనతో చెప్పమని దుర్యోధనుడు దుశ్శాసనుణ్ణి పంపాడు. వినడంతోనే మూర్ఛపోయాడు ద్రోణుడు. కొంతసేపటికి కాని తెలివుకోలేకపోయాడు. లేచి దీనుడే అయిపోయా డతడు. పడుతూ లేస్తూ వరిగెత్తాడు భీష్ముడిదగ్గిరికి.

భీష్ముడు పడిపోడంతోనే మాత్స్యులూ, పాంచాల్యులూ, యాదవులూ — యావన్మందితోనూ ఘనంగా సంతోషించారు పాండవులు. కేకలతోనూ, సింహనాదాలతోనూ, తూర్యారవాలతోనూ మిన్నూ మన్నూ ఏకంచేసేశారు. మనయోధులూ, నీకుమాళ్ళూ గొంతెత్తి ఏడ్చారు. దేవతలు హాహాకారాలు చేశారు. మనసేనలో ఏడుపే ఏడుపు వినిపించింది. మనవాళ్ళకి ఎవళ్ళకీ కాళ్ళూ చేతులూ ఆడలేదు. పగిలిపోతూవున్న గుండెలతోనూ, వరదలు కడుతూవున్న కన్నీళ్ళ

తోనూ పాండవుల్ని చూస్తూ వుండిపోయారు. యుద్ధానికి అడుగు వేసే వాళ్ళే లేకపోయారు.

సూర్యుడు పశ్చిమ సముద్రంలో మునిగిపోయాడు.

ధృతరాష్ట్రుడు : బాణాలకంటే బాధగావున్నాయి నీమాటలు. రామో, ఇనుమో నాగుండె! పగిలిపోకండా వుంది. సంజయా, సంజయా, ఇంకా ఏంచెపుతావో చెప్పు.

సంజయుడు : సూర్యుడు పశ్చిమసముద్రంలో మునిగిపోయాడు. మనవాళ్ళు యావన్మందీ కవచాలు విప్పేశారు. ఆయుధాలు వొది లేశారు. అంతమందీ భీష్ముడిదగ్గిరికి వెళ్ళారు. పాండవులూ అలాగే ఆయుధాలూ అవీ కిందపడేశారు. బంధుమిత్రసహింతగా భీష్ముడి దగ్గిరికి వచ్చారు. అర్జునుడు మాత్రం గాండీవం పట్టుకునే వచ్చాడు. కౌరవులూ పాండవులూ సమయోచితంగా అప్పటికి మాత్రం పరస్పరం కావేషీలు మరిచిపోయారు. అలా వాళ్ళంతా తనచుట్టూ నుంచోడం చూశాడు భీష్ముడు. కులగురుడైన ఆమహానుభావుడు ఉభయుల్నీ అభినందించాడు. ఉభయులచేతా సేవ చేయించుకున్నాడు.

## తలగడ

భీష్ముడి శరీరమేమో అంపశయ్య మీద వుంది. తలమాత్రం కిందపడిపోతూవుంది. సాభిప్రాయంగా సేకుమాళ్ళ వేపు చూశాడాయన. మెత్తని తలగడలకోసం పరిగెత్తారు సేకుమాళ్ళు. చిరునవ్వు నవ్వాడు భీష్ముడు. అర్జునుణ్ణి పిలిచాడు. గాండీవం కిందపెట్టేసి, కన్నీళ్ళతో దగ్గిరికి వెళ్ళాడు అర్జునుడు.

"బాబూ, బాణాలతో తలగడ కావాలోయి" అన్నాడు భీష్ముడు. "చిత్త" మంటూ గాండీవం పుచ్చుకున్నాడు అర్జునుడు. తాతగారి అనుజ్ఞ తీసుకున్నాడు. అభిమంత్రించి మూడుబాణాలు

వేశాడు. మొదలు భీష్ముడి పెడతల ఎత్తిపట్టుకుని, మొనళ్ళు భూమిని మోసి తలగడగా తయారయాయి బాణాలు. సంతోషించాడు భీష్ముడు. "పక్కకి తగిన తలగడ పెట్టావోయి" అంటూ అర్జునుణ్ణి పొగిడాడు.

"సూర్యుడు ఉత్తరాయణు డయిందాకా సంతోషంగా అంపశయ్యమీదే వుంటాను" — చుట్టూవున్న మనవల్నీ యావన్మంది రాజుల్నీ చూస్తూ అన్నాడు భీష్ముడు — "అంతవరకూ దృఢమైన రక్షణ కల్పించాలి మీరు. తగినవాళ్ళని నియమించండి. అగడ్త ఏర్పరిచి, దిట్టమైన ప్రాకారం నిర్మించండి" అన్నాడు.

కౌరవులూ, పాండవులూ భక్తిభావంతో ఆయన ఆజ్ఞ శిరసా వహించారు. తగిన వాళ్ళని నియమించి ఆయనకి రక్షణ కల్పించారు. చుట్టూ అగడ్త నిర్మించారు. ప్రాకారం పెట్టారు.

అంతలో చికిత్సకులు వచ్చారు. శల్యచికిత్స చేస్తామన్నారు. భీష్ముడు నిరాకరించాడు. వాళ్ళుకోరుకున్న బహుమతులిచ్చి పంపించేశాడు. తరవాత సంగీతవిద్వాంసులూ, వాద్యనిపుణులూ, నృత్యప్రవీణులూ వచ్చారు. తమతమ విద్యాప్రావీణ్యం ప్రదర్శించారు. ఆయనకి వినోదం కలిగించారు.

## పాతాళగంగ

కొంతసేపయాక "దాహం, దాహం" అన్నాడు భీష్ముడు. చల్లని పానీయాలకోసం పదిమందీ పరిగెత్తారు సేవకులు. రకరకాల పానీయాలు పట్టుకువచ్చారు. "అంపశయ్యమీద వున్నాను. దివ్యాస్త్రంతో పుట్టిన పాతాళగంగతప్ప మరో నీరు ముట్టుకోను" అంటూ అవన్నీ నిరాకరించాడతడు.

ఏంచెయ్యాలో ఎవ్వరికీ తోచలేదు. కౌరవులూ తక్కిన యావ న్మంది రాజులూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. భయ పడి వూరుకున్నారు.

"అర్జును డేడీ?" అంటూ మళ్ళీ అతణ్ణే దగ్గిరికి పిలిచాడు భీష్ముడు — "బాబూ, బాణవేదన సర్వాంగాలూ దహించేస్తూ వుందోయి. చూడూ, పెదవులు ఎండిపోతున్నాయి. మహా ధనుర్ధరుడివి నువ్వు. నా దాహం తీర్చే నీళ్ళు నువ్వొక్కడివే తేగలవు. త్వరపడు నాయనా" అన్నాడు.

"చిత్త" మన్నాడు అర్జునుడు. ఆయనకి ప్రదక్షిణం చేశాడు. ఒక దివ్యాస్త్రంతీశాడు. గాండీవానికి సంధించాడు. పర్జన్యమంత్రంతో భూమిమీద కొట్టాడు. ఉత్తరక్షణంలో దివ్యమైన పాతాళగంగ పరిమళిస్తూ ధారగా ఉబికి పైకి వచ్చింది.

పాండవుల ఆనందానికి అంతంలేకపోయింది. శంఖాలు పూరిం చారు వాళ్ళు. కౌరవులు గడగడలాడారు. నిచ్చేరపోయారు. కళ్ళప్ప గించి బొమ్మలలాగ నుంచుండి పోయారు.

పాతాళగంగతో దాహంతీర్చుకున్నాడు భీష్ముడు. తృప్తిపడి అర్జునుడితో అన్నాడు: "బాబూ, నువ్వు నరుడివని ఎరుగుదునోయి. నారదుడు చెప్పాడు. నువ్వూ కృష్ణుడూ కలిస్తే అసాధ్యమే వుండదు. అసాధ్యుడివయిన నీతో విరోధం కూడదని చెవిలో గూడుకట్టి పోరా డాను. ఏంలాభం! విన్నాడుకాడు దుర్యోధనుడు. భీముడి చేతిలో ఇతడి ప్రాణం పోతుంది. తప్పదు."

తలవొంచుకుని కుంగిపోతూ దగ్గిరేనుంచున్నాడు దుర్యోధనుడు. అతణ్ణి చూసి ఇలా అన్నాడు భీష్ముడు — "ఎందుకూ విచారిస్తావూ! నామాట విను. అర్జునుడి అద్భుతమైన పరాక్రమం చూశావు కదా! పైగా ఇతడికి శ్రీకృష్ణుడు ఆప్తుడు. నమ్ము. ఎవ్వడూ జయించలేడు

వీళ్ళని. యుద్ధంవిడిచిపెట్టు. ధర్మరాజు ధర్మాత్ముడు. అతడి ఇంద్రప్రస్థం అతడికి ఇచ్చెయ్యి. నీఅర్ధరాజ్యం నువ్వు పెట్టుకో. మిగిలిన వాళ్ళయినా బతికి పోతారు. ఇది నయంకాదా! ఆలోచించు'' అని చెప్పి వూరుకున్నాడు. మరి మాటాడలేదు.

దుర్యోధనుడు మాట్లాడలేదు. తక్కినవాళ్ళూ పలుకూ వులుకూ లేదు. కౌరవులూ, పాండవులూ తాతగారికి నమస్కరించారు. సెలవుతీసుకుని ఎవళ్ళ శిబిరాలకి వాళ్ళు వెళ్ళిపోయారు.

"దేవతలైనా గెలవలేరు భీష్ముణ్ణి'' — దారిలో ధర్మరాజుతో అన్నాడు శ్రీకృష్ణుడు — "అలాంటి వాణ్ణి గెలవడమంటే ఎవడితరం! అద్భుతమైన మహాస్త్రాలు కలవాళ్ళు కనక మీకే తగిందిది'' అన్నాడు.

"మేమనగా ఏమాత్రం!'' అన్నాడు ధర్మరాజు - "మహామహుడివి నువ్వు. నీ ప్రాపువల్ల ఇంతటి పనులు చెయ్యగలుగుతున్నాం. నీభక్తులం. భక్తవత్సలుడివి నువ్వు.'' అన్నాడు.

ఇలా వొకళ్ళనొకళ్ళు ప్రశంసించుకుంటూ పాండవులు సకల పరివారంతోనూ కలిసి శిబిరంచేరుకున్నారు.

## శిక్షణ కాని కోపం కాదు

భీష్ముడిదగ్గరనించి అందరూ వెళ్ళిపోయారు. కాపలావాళ్ళు మాత్ర మున్నారు. అంపశయ్యమీద అరమూతకళ్ళతో వున్నాడు. భీష్ముడు. అప్పుడు ఆయనదగ్గిరికి కర్ణుడువచ్చాడు. భక్తివినయాలతో ఆయనకి పాదాభివందనం చేశాడు. "మహాత్మా, నువ్వు ఎప్పుడూ కోపగిస్తూవచ్చిన రాధకొడుకుని, కర్ణుణ్ణి. నమస్కరిస్తున్నాను. నన్ను కోపగించకు. కరుణించు. వాత్సల్యంతో చూసి, వొక చల్లనిమాట చెప్పు'' అంటూ బావురు మన్నాడు.

మెల్లిమెల్లిగా కళ్ళు విప్పాడు భీష్ముడు. ఒకచేత్తో కర్ణుణ్ణి దగ్గిరికి లాక్కున్నాడు. ఆదరంగా కౌగిలించుకున్నాడు. రక్షణకోసం దగ్గిర వున్నవాళ్ళని అవతలికి పంపేసి, కర్ణుడితో ఇలా అన్నాడు. "నీమీద నాకు కోపమేమిటోయి? దా. కులక్షురెచ్చిపోయినట్టు నువ్వు మాట్లాడినప్పుడు, బిడ్డల్ని చెడగొట్టకూడదని నిన్ను గదమాయించేవాణ్ణి. నిష్ఠురంగానూ అనేవాణ్ణి. నిజమే. అయితే అది శిక్షణ కాని కోపం కాదు. నమ్ము. అదీకాక, నిపుట్టుక దైవిక మయింది. మానవుల్లో నిన్ను పోలినవాడు లేడు. నువ్వు కుంతీ కుమారుడివి. రాధకొడుకువి కావు. ఇది రహస్యంగా నాతో వ్యాసముని చెప్పాడు. నీ తేజస్సు నేనుమాత్రం గుర్తించలేదూ? పాండురాజు కుమారుడివి కావడంచేత నీమీద వాత్సల్యమే కాని మత్సరమేనాడూ లేదునాకు. విన్నావూ, వొక్కమాట చెపుతాను విను. కురుపాండవుల వైరం కూడనిది. పాండవులు గెలవరానివాళ్ళు. అప్రమేయుడైన శ్రీకృష్ణుడు వాళ్ళవాడు. అంచేత వాళ్ళతో విరోధం తగదు. నువ్వు మరోలాగ భావించకు. పాండవులతో కలిసిమెలిసి సుఖపడు."

"కుంతి మా అమ్మ అని ఇంతకిముందున్నూ పెద్దలవల్ల విన్నాను" అన్నాడు కర్ణుడు - "అయినా ఇంతయాక ఇపుడు పాండవులతో పొత్తెలాకలుస్తుంది నాకు? వాళ్ళు మహాబలవంతులు. సందేహం లేదు. శ్రీకృష్ణుడు వాళ్ళకి వున్నాడు. నిజమే. యుద్ధంలో వాళ్ళని గెలవడం సాధ్యంకాదు. అదీ బాగా తెలుసు. కాని దుర్యోధన మహారాజు నామీదే భరోసా పెట్టుకున్నాడు. నేనంటే ప్రాణంలా చూస్తాడు. చెప్పలేనంత మన్నన చేస్తాడు. అతణ్ణి వొదిలేసి వెళ్ళడం వీరధర్మమేనా నాకు! నువ్వే ఆలోచించు.

అంతేకాదు, పాండవుల్ని ఎన్నోమాటలన్నాను. సభలో ఎన్నోసార్లు పరాభవించాను. వాళ్ళకి ఎప్పుడూ చెడే తలపెట్టాను.

విరోధమే రెచ్చగొట్టాను. ఇప్పుడు యుద్ధంతప్ప ఇంకో మార్గమే లేదు నాకు.

"అంతా దైవాధీనం. మన మేదీ తప్పించలేం. ఇంకోలాగ చెప్పకు. యుద్ధానికి అనుజ్ఞ దయచెయ్యి నాకు. శత్రువులమీదికి నన్ను పంపు. నా సేవాధర్మం నేను నిర్వహిస్తాను. అనుమతించు. అర్జునుణ్ణీ, కృష్ణుణ్ణీ మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాను" అంటూ చేతులు జోడించాడు.

"అంతటివాడివే నువ్వు; నే నెరుగుదును" అన్నాడు. భీష్ముడు - "దుర్యోధనుడికి నీ భుజబలమే ఆసరా. అదే అతడికి హితమున్నా. అలాగే కానీ. నీధర్మం నువ్వు నిర్వహించు. సందేహించకు. హృదయపూర్వకంగా నేను అనుమతిస్తున్నాను."

భీష్ముడి ఆదరమూ, బంధుభావమూ చూసి బ్రహ్మానందం కలిగింది కర్ణుడికి. మరోసారి ఆయనకి పాదాభివందనంచేసి సెలవుతీసుకున్నా డతడు.



# ద్రోణపర్వం



## మొదటి ఆశ్వాసం

భీష్ముడిపాటు విన్నాడు ధృతరాష్ట్రుడు. అయినా దుర్యోధనుడు గెలుస్తాడన్న ఆశ అతణ్ణి వొదలలేదు. యుద్ధవార్తలకోసం సంజయుణ్ణి తిరిగి కురుక్షేత్రం పంపాడు. ఏమవుతుందా అంటూ విచారిస్తూ కూచున్నాడు. భీష్ముణ్ణి తలుచుకుంటూ వుంటే అతడి గుండెలు బద్ద లయిపోతూ వుండేవి. దుఃఖపడుతూనే దినాలు గడుపుతున్నా డతడు. కొద్దిదినాలు గడిచాయి. ఒకనాటిరాత్రి మళ్ళీ వచ్చాడు సంజయుడు. వ్యాసముని ప్రసాదించిన మహిమవల్ల ఉభయసైన్యాల విశేషాలూ తెలుసుకుని సరాసరి కురుక్షేత్రం నించే హాస్తినాపురం వచ్చాడతను. తిన్నగా కోటలోకి వెళ్ళాడు. అంతఃపురం ప్రవేశించి సగౌరవంగా ధృతరాష్ట్రుణ్ణి దర్శించాడు.

ఆదరపూర్వకంగా సంజయుణ్ణి దగ్గిరకూచోపెట్టుకున్నాడు ధృత రాష్ట్రుడు. "తరవాత ఏంజరిగిం" దంటూ ఆతురతపడుతూ అడిగాడు. "సంజయా, యుద్ధంలో భీష్ముణ్ణి పోగొట్టుకున్నాక, మనవాళ్ళు ఏం చేశారు? ఎవర్ని సేనాధిపతి చేసుకున్నారు? ఎవరిప్రాపుచూసుకుని ప్రచండపరాక్రమవంతులైన పాండవులసైన్యం ముట్టడించారు? ఉభయ సేనలూ ఎలా కలబడ్డాయి? యుద్ధ మెలా జరిగింది?" అంటూ ప్రశ్న మీాద ప్రశ్న కురిపించాడు.

సంజయుడు : మహారాజా, నువ్వు అడిగినదంతా మనవిచే స్తాను. సావధానంగా విను. భీష్ముడు దేవభావం పొందినప్పుడు కౌర వులూ, పాండవులూ ఆయనదగ్గిరికి రావడమూ, ఆసమయంలో జరిగిన

యావత్తువృత్తాంతమూ ఆవాళ నీకు వినిపించాను కదా! అంపశయ్య మీదుంచి ఆయన చెప్పిన హితవచనాలు మనవాళ్ళకి రుచించలేదు. రోషంతో ఎరుపెక్కిన కళ్ళతోనే ఆయన్ని వొదిలి శిబిరానికి వెళ్ళారు కౌరవులు.

ఆరాత్రి వేకువని నీదగ్గిరనుంచి నేను కురుక్షేత్రం వెళ్ళేసరికి యుద్ధానికి సిద్ధపడుతున్నారు నీకుమాళ్ళు. యుద్ధవాద్యాలూ, శంఖాలూ వొక్కమొగిని మోగుతున్నాయి. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ - చతురంగబలాలు యావత్తూ ఆటోపంతో సిద్ధపడుతున్నాయి. యోధులందరూ వీరవేషాలు వేసుకుంటున్నారు; ఉత్సాహంలేని సైన్యాలు కూర్చుకుంటున్నారు. అదంతా ఎంతజరుగుతూవున్నా వొక్కరిమొహంలోనూ చిక్కతేమాత్రం రక్తంచుక్క లేదు. భీష్ముడులేనిలోపం రాజులు యావన్మంది హృదయంలోనూ బాధపెడుతూవుంది. అంతక్రితం పదిరోజులూవున్న చైతన్యం ఏమాత్రమూ వాళ్ళలో కనపడలేదు. ప్రతీవాళ్ళ చూపులోనూ దిగులే అవుపిస్తూ వుంది.

యావన్మంది యోధులూ దుర్యోధనుడిదగ్గిరికి బయలుదేరారు. అందరిమనస్సులూ కర్ణుడిదిక్కు పరుగెత్తుతున్నాయి. "అతడే రావాలిప్పుడు" అంటూ అందరూ కర్ణుణ్ణే తలుచుకున్నారు.

మహారాజా, భీష్ముడు లేకపోడంతోనే భర్తపోయినభార్యలా అయిపోయింది మనసేన. సొమ్ములజాపరిలేని సొమ్ములమంచలా అవుపించింది. వంటలేనిపొలంలాగా. సింహంలేని గుహలాగా అయిపోయింది. ఆమహానీయుణ్ణి యుద్ధంలో పాండవులు కబళించి, విక్రమంలో విజృంభించడంతోనే, ఆకలిగొన్న తోడేళ్ళు తనభర్తని మింగేసి, తనమీద పడితే, సర్వాంగాలూ చలించిపోయి, భయపడుతూ దిక్కులు చూస్తూవున్న ఆడలేడి ఎలావుంటుంది, అదిగో అలావుంది కౌరవసేన.

"కర్ణా, కర్ణా, అనాథులమయిపోయాం. దయచెయ్యి. కాపాడు." సైన్యంలో ఎక్కడవిన్నా ఈ మాటలే జాలిగా విని పించాయి.

"కర్ణుడు బలశాలి; విక్రమవంతుడు. అవాళ భీష్ముడన్న దానికి కోపం తెచ్చుకుని ఈపదిదినాలూ యుద్ధానికి రాలేదు. అతడి మంత్రులూ, బంధువులూ ఎక్కడూ తొంగిచూడలేదు. అతణ్ణి ఇప్పుడు పిలవండి. ఆలస్యంచెయ్యకండి" అంటూ కౌరవులూ, తక్కిన రాజులూ ఒకటేమాట అన్నారు. అందరూ అతడిమీదే ఆశపెట్టు కున్నారు. మహారాజా, అతడిసంగతి నువ్వూ విన్నదే కదా! అది ఏమిటంటావా? లోగడ మన యోధుల తరతమాలు నిర్ణయిస్తూ కర్ణుణ్ణి అర్ధరథుడికింద జమకట్టాడు భీష్ముడు. అది కర్ణుణ్ణి శూలంలా బాధించింది. అంతమంది రాజుల ఎదటా భీష్ముడితో సహాయ నిరా కరణంచేశాడతడు. 'నువ్వు యుద్ధానికి వెళ్తే నేను యుద్ధం చెయ్యను' అన్నాడు. 'నువ్వు గెలిస్తే నేను అడివికిపోతాను' అన్నాడు. 'నిన్ను శత్రువులు పడగొడితేమాత్రం వాళ్ళని నేను పడగొడతాను' అన్నాడు అంచేత అంతవరకూ యుద్ధానికి దూరంగా వుండిపోయాడతడు. అవాళ మా అందరి మనస్సులూ కర్ణుడిమీదికే పరిగెత్తాయి.

నడిసముద్రంలో మునిగిపోయిన వోడలోని జనంలావున్న మన వాళ్ళకి ఒక దీవిలా కనిపించాడు కర్ణుడు. తన శిబిరంలోంచి బయలు దేరి వచ్చాడతడు. అతణ్ణిచూసి ఎంతోఅంత సంతోషించాడు దుర్యో ధనుడు. హృదయపూర్వకంగా అతణ్ణి అభినందించాడు.

రాజులందరినీ ఒక్కసారి కలయజూశాడు కర్ణుడు. అతడి కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి. "భీష్ముడు" — అతడి కంఠం గద్గదికపడింది—"దమమూ, సత్యమూ, తపమూ, దానమూ, శీలమూ అస్త్రపాండిత్యమూ, శస్త్రవీర్యమూ—అన్నీ మూర్తీభవించిన మహా

తున్నాడు భీష్ముడు. అంతటివాడే యుద్ధంలో పడిపోయాడు. ఇంక ఎక్కడిది బాహుబలం ! ఎక్కడి సేనలు మనకి ! రాజరాజు సర్వసంపదలూ చల్లారిపోయాయి'' అంటూ వెక్కి-వెక్కి ఏడ్చాడతడు. చుట్టూవున్న రాజులు వొక్కసారి బావురుమన్నారు. అందరి మొహాలూ చిన్నపోయాయి; కన్నీళ్ళతో నిండిపోయాయి.

"కౌరవులందరికీ కన్నాకు భీష్మపితామహుడు'' తన్ను తాను సముదాయించుకుని, తక్కినవాళ్ళని వోదారుస్తూ అందుకున్నాడు కర్ణుడు — "మీాకళ్ళెదటే అర్జునుడితో వోడిపోయి, మేరువు వొరిగినట్టు వొరిగిపోయాడతడు. అయిపోయిందది. ఇక నాసంగతి వినండి. అర్జునుడి పొగరు నేనే అణిచేస్తాను. కలతపడిపోయిన సైన్యం కాపాడతాను. భీష్ముడిలాగే అన్నివిధాలా నాబాహుబలం చూపిస్తాను. మీాకళ్ళు చల్లబడ్డట్టు చేస్తాను. పాండవులు యుద్ధంలో ముక్కాకలు తేరినవాళ్ళే. సాత్యకిన్నీ అసాధ్యుడే. నాకు తెలుసు. కాని నాబాణాలతో వాళ్ళని చెండాడి వొదిలిపెడతాను. వాళ్ళని హతమార్చేస్తాను. సామ్రాజ్యలక్ష్మి దుర్యోధనుడికి కట్టబెడతాను.

"అది కానప్పుడు, వినండి, గాండీవమూ, సురదుందుభులూ వింటూ హాయిగా, శాశ్వతంగా కళ్ళుమూస్తాను. కౌరవుల్ని కాపాడుతూ, రణశూరులైన పాండవుల్ని నురుమాడుతూ, కీర్తికరంగా వీరవిహారంచేస్తూ భీష్ముడిదగ్గిరికి వెళ్ళిపోవడంకంటే గొప్పేముంది నాకు !'' అన్నాడు.

తరవాత తనసారథిని పిలిచాడతడు. "మణులతో మెరిసే మనరథం సిద్ధంచెయ్యి. గాలిలా పరిగెత్తే గుర్రాలు పూన్చు. ధనుస్సులూ, బాణాలూ, కత్తులూ—పరికరాలు యావత్తూ పెట్టించు. హాస్తికక్ష్య రత్నధ్వజ మెత్తించు. శంఖాలూ, మృదంగాలూ, నిస్సా

ణాలూ మొదలైనవాద్యాలు మోగిస్తూ ఏర్పాటుచేయించు. వెళ్ళు. త్వరగా కానీ” అన్నాడు.

నిమిషాలమీద అన్నీ సిద్ధంచేశాడు సారథి. అగ్నిలా మెరిసి పోతూవున్న రథం పట్టుకువచ్చాడు. ముందు దుర్యోధనమహారాజుకి నమస్కారంచేసి, ఠీవిగా రథమెక్కాడు కర్ణుడు. యావన్మందీ అతడికి జేజేలు చేశారు. ఉద్ధోలమైన తన బలగం మోగిస్తూ జెండాలతోనూ వాటితోనూ ఎంతోఅంత ఇదిగా వెంటనడిచింది. అలా బయలుదేరి ఓంప్రథమంగా భీష్ముడిదగ్గిరికి వెళ్ళాడు కర్ణుడు.

శోషించిన సముద్రంలాగ, విమానం విరిగిపడ్డ దేవతలాగ,కింద పడిపోయిన సూర్యుడిలాగ, రెక్కలు తెగిపోయిన మైనాకపర్వతంలాగ- అంపశయ్యమీద పడున్నాడు భీష్ముడు. యమునమడుగులో కూరుకు పోయి, అరమూతకళ్ళతో వున్న ఏనుగులాగ, అర్జునుడి బాణాలతో కప్పడిపోయి వీరశయనంలో వున్నాడాయన.

బయటే రథందిగాడుకర్ణుడు. నడుచుకుంటూ వెళ్ళాడు. “కర్ణుణ్ణి వచ్చాను” అంటూ, భీష్ముడికి పాదాభివందనంచేశాడు. “నీకా ఈపాటు? నీఉత్తమచరిత్రకి ఇదాఫలం! పాడుదైవాన్ని ఏమనాలి? వీరాగ్రణీ! ఒకసారి కళ్ళువిప్పి నన్ను చూడు. పవిత్రమైన నీమాటలు వినిపించి నన్ను ఆదరించు. సైన్యవ్యూహాలు నడిపించడమూ, ముఖా ముఖి నెదిరించడమూ, తీవ్రమైన బాణాగ్నిలో శత్రువుల్ని లిప్తలోబుగ్గి చేసెయ్యడమూ నీతో నేలయిపోయింది. ఇంకేముంది? పాండవులికి పట్ట పగ్గాలే వుండవిక. కౌరవులు కడతేరిపోతారు. తప్పదు. అర్జునుడనే అగ్నిహోత్రుడు బాణజిహ్వాలతో విజృంభిస్తాడు. శ్రీకృష్ణుడు పెను గాలిలా సాయపడతాడు. కారడవిలా కౌరవులు కాలిపోతారు. పాంచజన్యం దిక్కులు పగలగొడుతుంది. దేవదత్తం చెవులు దిమ్మె త్తిస్తుంది. కపిధ్వజం కళ్ళుమిరుమిట్లుగొలుపుతుంది. గాండీవం ప్రచండ

మైన బాణాలు విరజిమ్ముతుంది. నువ్వుతప్ప ఎవడు సహించగలడా ఉద్ధృతం? అర్జునుడంటే సామాన్యుడా? శివుడితో బాహాబాహీ పోరాడాడు. అతణ్ణి మెప్పించాడు. అతడిచేత వరాలుపొందాడు. దివ్యమైన శర్మదీప్తు డతడు. మహాపరాక్రమశాలివి నువ్వుతప్ప మరొక్కడతణ్ణి ఎదిరించడం కల్ల.” — ఇలా ఏవో అంటూన్న కర్ణుడిమాటలు విన్నాడు భీష్ముడు. మెల్లిమెల్లిగా కళ్ళువిప్పాడు. ఆదరదృష్టితో చూశాడు.

భీష్ముడు కళ్ళువిప్పడంతోటే మళ్ళీ నమస్కరించాడు కర్ణుడు. “మహాత్మా, నువ్వుపంపిస్తేచాలు. నేను వొక్కణ్ణే అర్జునుడి భుజ గర్వం అణిచేస్తాను. విషాగ్ని కక్కుతూవున్న మహాసర్పాన్ని మంత్రంతో కట్టేసినట్టు నా బాణాలతో అతణ్ణి పాతేస్తాను” అన్నాడు.

“అంత వాడివేనోయి నువ్వు” ఆదరపూర్వకంగా అన్నాడు భీష్ముడు. “నాకు తెలియదూ! అంబష్ఠ, విదేహ, పౌండ్ర దేశాల రాజుల్ని (ఉత్కల, కళింగ, ఆంధ్ర, గిరివ్రజ దేశాధిపతుల్ని) అవలీలగా గెలిచావు. దుర్యోధనుడిముందు వాళ్ళని దాసోహమనిపించావు. కర్ణా, కౌరవులికి దుర్యోధనుడెంతో, నువ్వూ అంతే. రక్తసంబంధంగా వచ్చినచుట్టరికంకంటే, స్నేహంవల్లా, సహవాసంవల్లా ఏర్పడిన చుట్టరికం గొప్పదంటారు. అంచేత రారాజు రాజ్యభారం నీదే అనుకోవాలి నువ్వు. మేఘంవల్ల ప్రాణులు బతుకుతాయి. సముద్రంవల్లే నదులు గొప్పవవుతాయి చిన్నవయినా విత్తనాలు భూమిమీదపడే వృద్ధి పొందుతాయి. అలాగే నిన్ను ఆధారంచేసుకుని, నీ ప్రాపువల్ల కౌరవులు పదికాలాల పాటు సుఖపడడమే కావాలి. పళ్ళచెట్టు పట్టుకుబతికిన పక్షుల్లాగ నిన్ను అంటిపెట్టుకుని సుఖపడాలి బంధువులు. దుర్యోధనుడు వొకటీ, నువ్వొకటీ కాదు నాకు. అంచేత మేలే చెపుతున్నాను. కౌరవుల్ని నడిపించు. రారాజుని గెలిపించు. వెళ్ళు” అన్నాడు.

పరమానందభరితుడయ్యాడు కర్ణుడు. మోకరించి భీష్ముడి పాదాలు శిరస్సుకి అద్దుకున్నాడు వినయంగా ఆయనదగ్గిర సెలవు తీసుకున్నాడు. రథమెక్కి మన సేనమధ్యకి వచ్చాడు. ఒక్కసారి సేనసేనంతా కలయజూశాడు. దిగాలుపడివున్న రాజులలో ఉత్సాహం రెచ్చగొట్టాడు. గుర్రాలూ, రథాలూ, ఏనుగులూ కాల్బలమూ భారీఎత్తున యుద్ధానికి సన్నాహపరిచాడు. అదంతా చూసి ఎంతో అంత సంతోషించాడు దుర్యోధనుడు.

అంతలో ద్రోణాచార్యుల రథం సేనమధ్య ప్రత్యక్షమయింది. ఎర్రగుర్రాలు పూన్చిన బంగారం రథ మది. వేదికాపతాకం రెపరెపలాడుతూ మెరిసిపోతూవుంది. రథంమీద పెద్దపులిలా వున్నాడు ద్రోణాచార్యులు. ఒంటిమీద బలిష్టమైన కవచం ఎంతో అందంగా వుంది. మొహాన రణోత్సాహం వుట్టిపడుతూ వుంది. అతణ్ణి చూసి యావన్మంది రాజులూ మహోత్సాహంతో జయజయధ్వానాలు చేశారు.

"కర్ణా, నీవల్ల మళ్ళీ దిక్కంటూ దొరికింది నాసేనకి" మెల్లి మెల్లిగా కర్ణుడి రథందగ్గిరికి తనరథం పోనిచ్చి, సంతోషంగా అన్నాడు దుర్యోధనుడు - "దివ్యంగావుం దిప్పుడు. ఇకమనం ఏంచెయ్యాలో నువ్వే చెప్పాలి" అన్నాడు.

"అదేమిటి" అంటూ అందుకున్నాడు కర్ణుడు - "నువ్వు రాజువి. రాజులు జనరక్షకులు. ఎంతో అంత బుద్ధిమంతులు. అంచేత నువ్వు చెప్పడమూ, నేను వినడమూ న్యాయం. చెప్పు. ఏమిటి ని అభిప్రాయం?" అన్నాడు.

"సేనాధిపతి కావాలికదా ఇప్పుడు" అన్నాడు దుర్యోధనుడు — "ఈపదిదినాలూ భీష్ముడి బాహుబులమాటుని నడిచాయి మన సేనలు. ఒక సేనానాయకుడంటూ ఎప్పుడి నడపకపోతే, సరంగు లేని వోడలా అయిపోయి, నాపుమాసిపోతాయి సైన్యాలు. నీకు

తెలియంది ఏముంది! కనక మన యోధుల్లో నీకు నచ్చినవాణ్ణి వాళ్ళణ్ణే నువ్వే నిర్ణయించాలి. చెప్పు, సేనాధిపతికి తగినయోధుడు ఎవడంటావు?" అని అడిగాడు.

"నీయోధుల్లో సేనాపతి పదవికి తగనివా డెవడు?" అంటూ ఎత్తుకున్నాడు కర్ణుడు– "మనవాడు ప్రతీవాడూ మహారథుడే. పరాక్రమంలోనూ, గొప్పతనంలోనూ ఎవరికి ఎవరూ తీసిపోరు. అయితే అందరినీ సేనాధిపతుల్ని చెయ్యలేం కదా! అదీకాక, వాళ్ళణ్ణి సేనాధిపతిచేస్తే, తక్కినవాళ్ళు మచ్చరించుకుని బాధపడకండా వుండాలి. అలాంటివాణ్ణే ఎంచుకోవాలి మనం. నాబుద్ధికి అన్నివిధాలా అలాంటివాడు ద్రోణాచార్యులు. బ్రాహ్మడు. ఆచార్యుడు. రకరకాల యుద్ధాల్లో ఆరితేరిన పండితుడు. వయోవృద్ధుడు. అమితమైన బలవంతుడు. శూరుడు. అన్నివిధాలా ఆయనే తగినవాడు. ఆయన్ని కాదన్నవా డుండడు. అంచేత ఆయన్ని సర్వసేనాధిపతిగా పట్టం కట్టు" అన్నాడు.

## సేనాధిపతి ద్రోణుడు

తగినరాజుల్ని వెంటవేసుకుని దుర్యోధనుడు ద్రోణుడి దగ్గిరికి వెళ్ళాడు. "గురుదేవా, ఇపుడు నువ్వే మమ్మల్ని నడిపించాలి" అంటూ వినయంగా ఆరంభించాడు– "ఒక్క ప్రాయంలోనే కాదు, ధైర్యంలోనూ, శీలంలోనూ, మహాస్త్రాలు ప్రయోగించడంలోనూ, భుజబలంలోనూ, కార్యతంత్రం నడపడంలోనూ – అన్నిటిలోనూ వృద్ధుడివే నువ్వు. మొదటినించీ నీగొప్పతనం చెపుతూనే వచ్చాడు తాతయ్య. అంచేత నువ్వే ఇపుడు మాఅందరికీ ఆదర్శం. నువ్వు ఎలా నడిపిస్తే అలాగ, వృషభం వెంటనడిచిన గోవుల్లాగ ఈ రాజులూ, సేనా యావన్మందిమీ నీ అడుగుజాడల్లో నడుచుకుంటాం.

"కుమారస్వామితో సమానమైనవాడివి నువ్వు. దేవసేన నాయకుడై ఆయన రాక్షసుల్ని గెలిచాడు. అలాగే నువ్వు కౌరవ సేనకి సర్వసేనాధిపతివయి పాండవుల్ని జయించు" అన్నాడు.

దుర్యోధనమహారాజుమాటలు యావన్మందిరాజులూ బలపరిచారు. ఎన్నోవిధాల ద్రోణాచార్యుల్ని ప్రశంసించారు. సేనాధిపత్యం వహించమని ప్రార్థించారు.

"నువ్వు మాకు సేనాధిపతివి కావడమంటే, పాండవులు మాతో వీగిపోడమన్నమాట" మళ్ళీ అందుకున్నాడు దుర్యోధనుడు. "భీష్ముడులేకపోడంతోనే అనాథుల మయిపోయాం. నువ్వే మమ్మల్ని కాపాడాలి. తప్పదు" అంటూ చేతులు జోడించాడు.

"ఇంతమంది చెపుతున్నారు మీరు" అందరినీ వొకసారి కలయజూసి అన్నాడు ద్రోణుడు- "రాజుకోర్కె తీర్చడం ధర్మం. అంచేత అవునూ కాదూ అనకండా అంగీకరిస్తున్నాను నేను. వేదాలూ, వేదాంగాలూ ఏవోకొన్ని ఎరుగుదును. ధైర్యమూ మొదలైన గుణాలూ ఏవోకొన్ని వున్నాయనుకోండి. అంతమా తానికే మీరు ఏదో ఇంతవాడూ, అంతవాడూ అంటున్నారంటే దానికి మీఆదరమే కారణం. సరే. సేనాధిపతిపట్టం కట్టండి. ఈమహాసేన యావత్తూ రక్షిస్తాను. కౌరవసేనలో మహోత్సాహం పుట్టిస్తాను. శత్రువుల్ని చించి చెండాడతాను. నాదివ్యాస్త్రాలతో పాండవుల్ని కప్పెట్టేస్తాను. వాళ్ళ నామరూపాలు లేకండా చేసేస్తాను" అన్నాడు.

సంతోషంతో ఉప్పొంగిపోయాడు దుర్యోధనుడు. వెంటనే బంగారం కలశాలతో పుణ్యజలాలు తెప్పించాడు. మంగళద్రవ్యాలు సమకూర్చాడు.

బ్రాహ్మలు పుణ్యాహాలు పలికారు. ఆశీర్వాదాలు చేశారు. మాగధులు గీతాలుపాడారు. వందిజనులు స్తోత్రాలుచేశారు. ముఖ్య

లైన రాజులూ, దుర్యోధనమహారాజూ ద్రోణుణ్ణి సర్వసేనాధిపతిగా అభిషేకించారు. రథికులు శంఖాలు పూరించారు. జయజయధ్వానాలు చేశారు. సైన్యమంతటా భేరీలూ, మృదంగాలూ, పణవాలూ, రక రకాలవాద్యాలూ మోగాయి. భూమీ ఆకాశమూ గింగురుమని పోయింది.

ద్రోణాచార్యులు సర్వసేనాధిపతి అయాడు. కౌరవసేనముందు తిలకంలా ప్రకాశించా డతడు. కర్ణుడూ మొదలయిన మహాయోధు లతో కలిసి పాండవులమీద ధ్వజమెత్తాడు. కనీ వినీ ఎరగని ధైర్య సాహసాలు చూపించాడు. అద్భుతమైన మహాస్త్రాలు ప్రయోగిం చాడు. అడ్డులేనిశౌర్యం ప్రదర్శించాడు. ఒక అక్షౌహిణికంటె అధికం పాండవసేన హతమార్చాడు. ఎందరినో యోధుల్ని పడగొట్టాడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కుప్పలుకుప్పలు కూలగొట్టాడు. గొడుగులూ, జెండాలూ, చామరాలూ, ఆయుధాలూ, కవచాలూ, భూషణాలూ తుక్కుతుక్కు చేసేసి నేల కప్పేశాడు. అసమానమైన వీరవిహారం చేశాడు. దేవతలతణ్ణి మెచ్చుకున్నారు. శత్రువులు ముక్కుమీద వేలుపెట్టుకున్నారు. అడివిలో దావాగ్నిలాగ, కొద్ది రోజులు శత్రుసేన బుగ్గిచేసేశాడు. తుదకి ద్రోణసేనాధిపతి, ఆమహా గ్నిహోత్రుడు ఆరిపోయాడు. ఆయనచావుకి దుష్టాత్ముడు ధృష్టద్యు మ్నుడు వొక్కడూ తప్పిస్తే, ఉభయసేనలలోనూ కంటతడిపెట్టని వాడులేడు. నీకొడుకుదుఃఖం ఇక చెప్పేఅక్కరలేదు.

ద్రోణుడు కాలంచేశాడనగానే గుండె జల్లుమని చెదిరిపోయింది ధృతరాష్ట్రుడికి. మొహం వెలవెలపోయింది. నిశ్చేష్టుడయిపోతూ డతడు. ఒకంతట నోట మాటపెగలలేదు. "సంజయా"- గద్గదిక పడింది కంఠం— "సంజయా, గురువునే చంపేశారా పాండవులు!" అంటూ గజగజా వణికిపోయా డతడు - "అన్ని అస్త్రవిద్యలు తెలి

సినవా డాయన! ఉపాయాలెరిగినవాడు. భుజవిక్రమంలో ఉద్దం డుడు. అంతవాడూ అలాపడిపోయాడూ? ధనుస్సు ముక్కలయిందా? రథం విరిగిపోయిందా? సారథి చచ్చిపోయాడా? ఉపేక్షించాడా ఆయన? ఆయాసపడిపోయో, శత్రువుని లక్ష్యపెట్టకో, పరాకుపడో వూరుకున్నాడా? చెప్పు. సంజయా, చెప్పు. నీచుడు ధృష్టద్యుమ్నుడు ఎలాచంపేశాడు ఆచార్యుణ్ణి? ఆశ్చర్యం! దైవమే వ్యతిరేకిస్తే పౌరుషమెందుకు పనికివస్తుంది? అయ్యో, అంతధైర్యశాలి, అంత ఉజ్వల మూర్తి, అంత గంభీరుడు, కళ్ళుమూశాడంటే, మేరువు వొరిగిపోయిందన్నమాట! సముద్రం ఇంకపోయిందన్నమాట! ఇంతకీ ఆచార్యుడు అస్తమించాడంటే వెయ్యిచెక్కలయిపోకండా వుంది, పాపాణమో ఏమో నాగుండె!

"పరాక్రమంలోనా లోకాతీతు డాయన. బుద్ధిలోనా బృహస్పతి. కురుకుమార్కుకి గురుదేవుడు. కుత్సితులైన నాకుమార్కులకోసమని కాలంచేశాడు. పరోపకారంకోసం ప్రాణాలర్పించాడు. మహానుభావుడు. విల్లుపట్టి వీరుడన్న వాడల్లా ఆయనదగ్గిరే నేర్చుకోవాలి మెలుకువలు. అలాంటివాణ్ణి అర్జునుడే నిలవరించివుంటాడు. ధృష్టద్యుమ్నుడి చేత అతడే చంపించివుంటాడు. అంతే. ఇంకొకడికి సాధ్యం కాని పని అది. పామునిపట్టిన చీమల్లాగ, పాండవసేన పడివుంటుంది మీద. అయిపోయింది. ఇక దిక్కేముంది మనకి!" ఇలా ఏమేమో పలవరిస్తూ సొమ్మసిల్లిపోయాడు ధృతరాష్ట్రుడు. అంతలోనే తెలువుకున్నాడు. ఆపాదమస్తకం వడికిపోతూ మళ్ళీ ఆరంభించాడు.

"అవును, ఉదయగిరిమీద పొడుచుకువచ్చిన సూర్యుడిలా తరుముకువచ్చివుంటాడు ధర్మరాజు. చీకట్లుపారిపోయినట్టు పారిపోక ఎవడడ్డుపడతాడు ద్రోణుడికి? మదమెక్కి మహోద్రేకంతో పరిగెత్తుకు వచ్చిన పెద్ద ఏనుగులాగ భీముడు మీదపడివుంటాడు. మనయోధుల్లో

ఎవడితరం అతణ్ణి వారించడం? ఉరుముతూ, ఉగ్రమైన పిడుగులు కక్కుతూ ఘోరంగాకమ్ముకువచ్చిన ప్రళయమేఘంలాగ, గాండీవం మోగిస్తూ దివ్యాస్త్రాలుముంచెత్తి వుంటాడు అర్జునుడు. అతడిముందు నిలబడే మొనగాడేడీ?

"అలా వాళ్ళు విరుచుకుపడుతూవుంటే ఎవడుపారిపోయాడో! ఎవడు మడమతిప్పకండా నిలబడ్డాడో!! ఎవడు పౌరుషంచూపి ప్రాణాలొడ్డాడో!!! సంజయా, ఎవడూ గురుదేవుణ్ణి కాపాడలేకపోయాడా? అయ్యో, తుదకి ఏమవుతుందో? ద్రోణుడు పడిపోయాడంటే కౌరవుల చతురంగబలాలూ - సమస్తసైన్యాలూ పడిపోయాయన్నమాట. అవును, ఎందుకుపడిపోవూ? ధర్మరాజు అదృష్టమిది. ఊరికే ఎలా పోతుంది?

"జంకంటే ఎరగనివాడు అశ్వత్థామ. తండ్రిచావప్పుడు దగ్గిరలేడా? వెనకపాటుని ఇంకోదగ్గిర యుద్ధంచేస్తున్నాడా? అర్జునుడి మూలంగా అడ్డుకోలేకపోయాడా? ధృష్టద్యుమ్నుడు చంపెయ్యడంతోనే దుఃఖంతో కుంగిపోయి, చూస్తూ వుండిపోయాడా?"

ఇలా పనివి పనివి ఏడ్చేశాడు ధృతరాష్ట్రుడు. క్షోభపడిపోయాడు.

"సంజయా, నాగుండెలు బద్దలయిపోతున్నాయి. ఇంకేమీ అడగను. నువ్వేమీ చెప్పకు" అంటూ బావురుమన్నాడు. కుమాళ్ళు గెలుస్తారన్న ఆశ మనసులోంచి ఎగిరిపోయింది. మళ్ళీ మూర్ఛపోయా డతడు.

అంతఃపురములోని ఆడంగులు యావన్మందీ గొల్లుమన్నారు. ధృతరాష్ట్రుణ్ణి చేతులమీాద సాయంపట్టి పక్కమీాద పడుకోబెట్టారు. శీతలోపచారాలుచేశారు. కొంతసేపటి తెలువుకున్నా డతడు. పక్కమీాద కూచుని సంజయుడితో మళ్ళీ ఇలా ఆరంభించాడు:

"సంజయా, పాండవుల్ని గెలవడం బ్రహ్మాతరం కాదు. ఏమంటావా, శ్రీకృష్ణుడు సారథి. అర్జునుడు రథి. ఆరథానికి అడ్డే ముంది? ఎంతంటే అంతా చేసితీరుతుం దది. అయిందా — ఇక నకుల సహదేవులు అసహాయశూరులు. సాత్యకి సత్యపరాక్రముడు. పాంచాలుడయిన ఉత్తమౌజుడు ఉద్దోలమైన బలశాలి. శిశుపాలుడి కొడుకు ధృష్టకేతువు ధీరుల్లో ధీరుడు. భీష్ముడి చావుకి కారకుడైన శిఖండి అఖండమైన పరాక్రమశాలి. అభిమన్యుడు అపరశివుడు. చేకితానుడు చెప్పరానంతి పౌరుషవంతుడు. ద్రౌపదికుమాళ్ళు అయిదుగురూ వెయ్యిమంది పెట్టు. యుయుత్సుడు ఉద్దండుడు. ద్రోణుణ్ణి చంపడం కోసమే పుట్టిన ధృష్టద్యుమ్నుడు భుజవిక్రమంలో ఎదురులేనివాడు. ఘటోత్కచుడు రావణాసురుడు. కృష్ణుడి దన్నున్న వృష్ణికుమాళ్ళు అసాధ్యులు. గద చేతిలో వుంటే భీముడు కాలయముడు. కౌరవ సైన్యం కడతేర్చడానికీ, పాండవసైన్యం కాపాటడానికీ తాను వొక్కడే చాలు. దానికితోడు సహాయసంపత్తీ, పరికరాలూ వుంటే ఇక చెప్పేదేముంది? ఎప్పుడు ఏదిచెయ్యాలో తెలిసిన వివేకవంతుడు ధర్మరాజు. ధర్మదేవత కొడు కతడు. ధర్మమూ, సత్యమూ ఎరిగిన గుణశాలి. శౌర్యవంతుడు. యుద్ధంలో స్థిరమైనవాడు. అలాంటి వాణ్ణి దేవతలైనా గెలవడం కష్టం. ఇంకో విశేషం, లోకరక్షణ కోసమే యాదవ వంశంలో పుట్టాడు శ్రీకృష్ణుడు. వ్రేపల్లెలో బాలుడయి నటించాడు, కంసుడూ మొదలైన రాక్షసుల్ని చంపాడు. దేవేంద్రుణ్ణి వోడించి పారిజాతం భూలోకానికి తెచ్చాడు. శిష్టులంటే ఇష్ట మతడికి. అలాంటి మహనీయుణ్ణి ఆశ్రయించారు పాండవులు. వాళ్ళనేమిటి గెలవడమేమిటి? అదీగాక అర్జునుడంటే శ్రీకృష్ణుడికి ప్రాణం కృష్ణుడే అర్జునుడికి ఆత్మ. ఇద్దరూ వొక్కటే వెలుగు.

లెత్తి చూస్తూనే వుంటారు. పట్టితెచ్చేస్తాను ధర్మరాజుని. సందేహం లేదు" అన్నాడు.

మహారాజా, నీకువాళ్ళు మూర్ఖులు. ద్రోణుడన్న దాంట్లో అంతర్యం అర్థంకాలేదు వాళ్ళకి. ధర్మరాజు దొరికిపోతాడంటే, దొరికి పోతాడే అనుకుని చంకలుగుద్దారు. పాండవుల విషయం సంకోచించకండా, ద్రోణాచార్యుల ప్రతిజ్ఞ సైన్యమంతటా, చాటించాడు దుర్యోధనుడు. అదివిని మనసేనల్లో ఎక్కడలేని ఉత్సాహమూ ఉబికింది. సైనికులు యావన్మందీ సింహనాదాలు చేశారు. ఓ! శంఖాలూ, భేరీలూ చెవులు బద్దలయిపోయాయి.

జరిగినవైనం యావత్తూ ధర్మరాజు చారులవల్ల విన్నాడు. తమ్ముళ్లు నలుగురినీ పిలిపించాడు.

"గురువుగారి ప్రతిజ్ఞ విన్నావు కదా!" అర్జునుణ్ణి చూస్తూ అన్నాడు ధర్మరాజు-" ఇది సాగకండా చేసెయ్యాలి మనం. నిన్ను తప్పించి చెప్పాడాయన. అంచేత ముఖ్యంగా నీతోనే చెపుతున్నాను. నేను వున్నదగ్గిరే వుండాలి నువ్వు. అప్రమత్తుడివయి యుద్ధం చేస్తూ వుండాలి. దుర్యోధనుడికోర్కి ఎంతమాత్రం జరగకూడదు" అన్నాడు.

"నాబొందెలో ప్రాణమున్నంతవరకూ అపనిజరగదన్నయ్యా," అన్నాడు అర్జునుడు - "గురువుని చంపడమూ, యుద్ధంలో నీకు నొప్పికలిగినట్టు నేను ఇతరత్రా వెళ్ళడమూ— రెండూ వొక్కటే నాకు. మహాపాపాలివి. ఇవిమాత్రం నేను ఎన్నటికీ చేస్తానని నమ్మకు. నాముక్కులో వూపిరివున్నంతవరకూ ద్రోణుడే కాదు, ప్రమథగణాలతో ఎత్తివచ్చిన శివుడికైనా సాధ్యం కాదు. సందేహించకు. తమ విలువా ఎదటివాళ్ళ విలువా తెలుసుకోలేదు కౌరవులు. ముూడులోకాలూ ఏకమయి వచ్చినా కన్నెత్తిచూడలేరు నిన్ను. నువ్వే యుద్ధంలో భంగపడితే ఈభూలోకం బద్దలయిపోదూ! నము

ద్రాలు ఇంకిపోవూ! వాళ్ళ ఊహ ఎన్నటికీ జరగదు గాక జరగదు. ఆ దురాత్ములచేతా నునకి పరాభవం? అసంభవం!" అన్నాడు.

తమ్ముడి మాటలు విని కుదుటపడ్డాడు ధర్మరాజు. వాళ్ళ సేనలో శంఖాలు పురిమాయి. భేరీలూ, మృదంగాలూ— మంగళ సూచకమైన యుద్ధవాద్యాలు యావత్తూ మోగాయి.

## పదకుండో రోజు

రణదాహంతో పాండవసైన్యాలు యుద్ధభూమికి నడిచాయి. అవాళ క్రౌంచవ్యూహం పన్నారు వాళ్ళు.

వ్యూహంముందు తెల్లగుర్రాలు పూసిన అర్జునుడి రథం వానర పతాకంతో ధగధగా మెరిసిపోతూ నుంచుంది. కాలచక్రంలావుందది. రథంమీద గాండీవంపట్టుకుని అర్జునుడూ, నొగలమీద పగ్గాలుపట్టు కుని శ్రీకృష్ణుడూ — శత్రువుల గుండెల్లో దిగులు పుట్టిస్తున్నారు. అర్జునుడిరథం పక్క నేధృష్టద్యుమ్నుడిరథం దివ్యమైన గుర్రాలతోనూ, ఉద్ధతుడైన సారథితోనూ నిలబడింది. భీముడూ, నకులసహదేవులూ, అభిమన్యుడూ మొదలైన కుమారుళ్ళూ, ద్రుపదుడూ మొదలైన బంధువులూ, ధృష్టకేతువూ మొదలైన దండనాయకులూ, తక్కిన యోధులూ ఎవళ్ళకితగిన కీలకస్థానాల్లో వాళ్ళు నిలబడ్డారు. వ్యూహం మధ్య దృఢమైనసేనతో ధర్మరాజు నిలబడ్డాడు.

మనవాళ్ళు శకటవ్యూహం పన్నారు. అందులో కుడిపక్క సింధురాజు జయద్రథుడూ, కళింగంరాజు శ్రుతాయువూ, వికర్ణుడూ కాశారు. వీళ్ళకి దన్నుగా పెద్దగుర్రాలసేనతో శకుని నుంచున్నాడు. ఎడమపక్క కృతవర్మా, వివింశతీ, చిత్రసేనుడూ, దుశ్శాసనుడూ కాశారు. వీళ్ళకి దన్నుగా కాంభోజరాజు సుదక్షిణుడూ, శక, యవనదేశాలరాజులూ నుంచున్నారు. మధ్య రారాజు దుర్యోధనుడు

కాశాడు. అతడిచుట్టూ త్రిగర్తరాజు సుశర్మా, మద్రదేశంరాజు శల్యుడూ, శిబీ, శూరసేనదేశంరాజులూ సేనాధిపతి ద్రోణుడూ నుంచున్నాడు. రాజరాజుముందు అంగదేశంయోధులతో కర్ణుడు నుంచున్నాడు. తక్కినవీరులు ఆయాకీలకస్థానాల్లో నుంచున్నారు. ఇలా ఎంతదిట్టంగా వుండాలో అంతదిట్టంగానూ వుంది శకటవ్యూహం.

మన సేనాముఖానికి తిలకంలా కనిపించాడు కర్ణుడు. అతడి దర్పమూ, తేజస్సూ చూడశక్యం కాలేదంటే నమ్ము. అతణ్ణి చూసి మనసేనలో ఈమూలనించి ఆమూలదాకా ఉత్సాహం వుప్పొంగి పోయింది. "పాండవులపని అయిపోతుంది" అంటూ గొంతెత్తి చెప్పుకోడం ప్రారంభించారు సైనికులు— "కర్ణుడితో దేవతలన్నా కలబడలేరు. భీష్ముడువారిమీద మచ్చరం పెట్టుకుని ఇన్నాళ్ళూ వూరుకున్నాడితడు. అంతేకాని ఇతడే యుద్ధంచేస్తే పాండవులు ఏమాత్రం? ఇంతవరకూ బతికి బట్టకట్టేవాళ్ళా వాళ్ళు!" అంటూ మీసాలు మెలిపెట్టుకున్నారు.

ద్రోణాచార్యులు చెయ్యి విసిరాడు. శకటవ్యూహం బయలు దేరింది. అది కదిలీ కదలడంతోటే ఆకాశంమీంచి రక్తవర్షం కురి సింది. మబ్బులేని పిడుగుపడింది. నెత్తురూ, మాంసం కండలూ దుమ్ములూ వొక్కసారి కురిశాయి. గుంపులుగుంపులు గెద్దలెగిరాయి. వరల్లు అరిచాయి. ఉల్కలు రాలాయి.

ఈ మహోత్పాతాలు చూసి పిసరంతా చలించలేదు మన వాళ్ళు. శంఖాలువూదారు భేరీలు మోయించారు. సింహనాదాలు చేశారు. ఉత్సాహంతోనూ, వూనికతోనూ ముందుకి నడిచారు. పాండవులమీద విరుచుకుపడ్డారు. పాండవులూ ముందుకి తోసుకు వచ్చారు.

ఇన్నాళ్ళూ అస్త్రసన్యాసంచేసిన కర్ణుడు ఇవాళ యుద్ధానికి ఉవ్విళ్ళూరుతున్నాడు. కసితో అర్జునుడిమీద కలబడాలని కత్తులు నూరుతున్నాడు. అర్జునుడున్నూ అలాగే కర్ణుడిమీదికి కాలు దువ్వుతున్నాడు. ఉభయసేనల్లోనూ ఉద్రేకం హెచ్చుగానే వుంది. రెండు సేనలూ ముఖాముఖి తారసిల్లాయి. ఇటు శకటవ్యూహమూ, అటు క్రౌంచవ్యూహమూ రెండూ వొకదాని ముందు వొకటి కొంచేవు కదలకండా నిలబడ్డాయి. రెండుసేనలూ చివురుపెట్టిన రెండు మామిడి తోటల్లా అవుపించాయి.

ముందు మనసేననించి ద్రోణాచార్యులు కలబడ్డాడు. అప్పుడే ఉదయిస్తూవున్న సూర్యుడిలాంటి తన బంగారం రథం దురుసుగా శత్రువులమీదికి ఉరికించాడతడు. దాంతో పొలో అంటే పొలోఅని మనసైన్యం అతడివెనక నడిచింది. పాండవులమీద విరుచుకుపడింది.

ఇటు ద్రోణుడిరథం కదలగానే అటు అర్జునుడిరథం కదిలింది. మనసేనమీద విరుచుకుపడ్డాడు అర్జునుడు. అతడితో పాండవ సైన్యమూ పొలికేకలు పెడుతూ విరగబడింది. యుద్ధం చూడడానికని వచ్చిన దేవతల విమానాలతో ఆకాశం నిండిపోయింది.

ఉభయసేనలూ ఉప్పెనలా కలబడ్డాయి. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ వరిగెత్తి ధూళిమయమయిపోయింది రణరంగం. భూమీ, ఆకాశమూ అన్నిదిక్కులూ వొక్కసారి నిండిపోయింది. ఇటూ అటూ ప్రయోగిస్తూవున్న బాణాలూ, రకరకాల ఆయుధాలూ మంటలులేచి సూర్యకిరణాలు కనడలేదు. ఏనుగుల కపాలాలు భళ్ళున పగిలీ, రథాలు ఫెళఫెళా విరిగీ ఉగ్రంగా వుంది ధ్వని. గుర్రాలూ, ఏనుగులూ, భటులూ లెక్కలేనంతమంది తెగిపోయారు. ఘోరంగా రక్తప్రవాహం ప్రవహించింది. ఆయుద్ధంచూసి దేవతలు ముక్కుమీద వేలు పెట్టుకున్నారు.

## ద్రోణుడి పరాక్రమం

ఆ దొమ్మీయుద్ధంలో ద్రోణాచార్యులు నలిరేగిపోయాడు. ఎర్ర గుర్రాలుపూసిన తన బంగారం రథం చిత్రవిచిత్రంగా పరిగెత్తించాడు. కొరివితిప్పినట్టు ఎక్కడపడి తేఅక్కడే ప్రత్యక్షమయింది రథం. పాండవ యోధులూ, పాంచాలవీరులూ అది వొకరథం కాదు ఎన్నో రథాలనుకున్నారు; తెల్లమొహాలు వేశారు. అలా వీరవిహారంచేస్తూ రకరకాల బాణాలు విరజమ్మాడు ద్రోణుడు. ఏనుగులు పీనుగులు చేశాడు. గుర్రాలు రక్తకళ్ళేలుచేశాడు. రథాలు గుండపిండిచేశాడు. కాల్బలాలు చిత్రవధ చేశాడు. రౌద్రమూర్తి అయిపోయి, మరిడి విరుచుకు పడ్డట్టు శత్రువులమీద విరుచుకుపడ్డాడు.

ద్రోణుడి రథచక్రాలు వినిపించేసరికి, వేదిక జెండా – ఎర్ర గుర్రాలూ అవుపించేసరికి పాయలు పాయలు అయిపోయేవి పాండవుల రథాలు. ఆయనబాణాలు పడేసరికి గర్జించుకు పరిగెత్తిన ప్రళయ మేఘాలలాగ పుంజాలు తెంపుకు పారిపోయేవి శత్రుసేనలు. అంతలోనే మళ్ళీ కలబడే వవి. అంతలోనే చీలిపోయేవి. అంతలోనే ఎదిరించేవి. అంతలోనే పారిపోయేవి. శత్రువుల చతురంగబలాలు యావత్తూ చిందరవందర చేసేశాడు ద్రోణుడు. కనీవినీ ఎరగని పరాక్రమం చూపించాడు. కళ్ళుమూసుకుపోయిన దివ్యాస్త్రాలు ప్రయోగించాడు. వరద వరదలయి రక్తనదులు ప్రవహించాయి. లెక్కాజమాలేకండా విరిగిపడ్డ తెల్లచామరాలే ఆనదిలో నురుగు. తెల్లగొడుగులు రాజ హంసలు. కత్తులు చేపలు. తలకాయలు తాళ్ళు. జుత్తులు నాచు. మాంసం బురద. కుప్పలుపడ్డ భటుల శవాలూ, ఏనుగుల పీనుగులూ, గుర్రాల కళేబరాలూ, విరిగిన రథాలు – ఇవి ఇసకదిబ్బలు. ఆరక్త

నదుల్లో భూతాలూ, భేతాళాలూ పట్టలేని సంతోషంతో ఈతా లాడాయి. మునకలు పెట్టాయి. విందులు కుడిచాయి.

మధ్యాహ్న మయింది. తేరిచూడడానికి వీలులేకండా మండి పోతున్నాడు సూర్యుడు. అంతకంటే ప్రతాపంతో ప్రకాశించాడు ద్రోణుడు. చూశాడు ధర్మరాజు. ఎక్కడలేని తొందరా పట్టుకుం దతడికి. "ఇతణ్ణి ఇప్పుడు అడ్డుకోకపోతే ప్రమాదిస్తుంది" అంటూ ధృష్టద్యుమ్నుణ్ణీ, అర్జునుణ్ణీ తొందరచేసేశాడు.

ధృష్టద్యుమ్నుడు రథం పరిగెత్తించాడు. గుర్రాలు పురకలు పెట్టాయి. రథంమీాది పతాకం రెపరెపలాడి మెరిసిపోయింది. అలా దురుసుగా వెళ్ళి ఘోరంగా ద్రోణుణ్ణి బాణాలతో ముంచెత్తా డతడు. ధృష్టద్యుమ్నుడివెంట అర్జునుడున్నూ వురికాడు. పెద్దరాణువ ద్రోణుడిమీాద వురికొల్పాడు. ఆరాణువరాణువంతా ధృష్టద్యుమ్నుడి రథం దాటుకుని ముందుకి వెళ్ళింది. ద్రోణుణ్ణి ఘిరాయించింది.

ద్రోణాచార్యుడి నేత్రాలు ఎర్రగా జ్యోతుల్లాగ మెరిశాయి. శరీరం పొంగింది. శివమెత్తినట్టు వొక్కసారి పాండవసేనమీాద విరుచుకు పడ్డా డతడు. అంతవృద్ధుడూ వొక యువకుడిలాగ విజృంభించాడు. శత్రుయోధులూ ఏమంత తక్కువతిన లేదు. తమ శాయశక్తులా మడమ తిప్పకండా పోరాడారు. ద్రోణుడి సారథినీ, గుర్రాలనీ రక్తాలు కారేటట్టు కొట్టారు.

ఉగ్రుడే అయిపోయాడు ద్రోణుడు. వాడివాడి బాణాలు వర్షంలా కురిపించాడు. శత్రువులఏనుగులూ, గుర్రాలూ, కాల్బలాలూ రక్తస్నానం చేసినట్టు కనిపించాయి. ఎర్రటిమేఘాలు ఆవరిస్తే ఆకాశం ఎలా అవుపిస్తుంది, అదిగో అలా అవుపించింది రణరంగం.

కళ్ళల్లో నిప్పులుకక్కాడు ధృష్టద్యుమ్నుడు. దారుణమైన మార్గణాస్త్రాలు ద్రోణుడిమీాద గుప్పించాడు. అతడిసైన్యం జర్జరిల్లి

నట్టు చేసేశాడు. ద్రోణుడు కొడుతూన్న బాణాలు వొకతట్టు కాసుకుంటూనే అతడిసేనని ఘోరంగా కొట్టాడు ధృష్టద్యుమ్నుడు. అతడి యుద్ధంచూసి సెబాసంటే సెబాసు అన్నారు దేవతలు.

పేరుపడ్డ మనయోధులు ద్రోణుడి రెండువైపులనించీ తరుము కుంటూ శత్రువులమీదికి వెళ్ళారు. అయితే వాళ్ళని వొక్కణ్ణీ ముందుకి రానియ్యలేదు అర్జునుడు. మెరుపుల్లాంటి బాణాలు రువ్వా డతడు. మనవాళ్ళ వొళ్ళు మంటలు పుట్టించాడు.

కన్నుమూసి కన్ను తెరిచేటంతలో వొక పదిబాణాలు ధృష్ట ద్యుమ్నుడి వొంటిమీద నాటించాడు ద్రోణుడు. దానికి పిసరంతా చలించలేదు ధృష్టద్యుమ్నుడు. చికిలిపట్టిన బాణాలు ద్రోణుడి మీద దిమ్మరించాడు. వాళ్ళిద్దరిబాణాలతోనూ ఆకాశం కప్పడి పోయిందంటేనమ్మూ.

అంతలో ధర్మరాజుముందున్న యోధులు ద్రోణుడిమీదికి తోసుకువచ్చారు. మనవాళ్ళలో ఎంపికయినవాళ్ళు వెళ్ళి వాళ్ళతో కలబడ్డారు. ఘోరమైన ద్వంద్వయుద్ధ మారంభమయింది. శకుని సహదేవుడిమీదికి వెళ్ళాడు. అతడిగుర్రాలు కొట్టేశాడు. అతడి జెండా నరికేశాడు. సహించలేకపోయాడు సహదేవుడు. ఉగ్రు డయిపోయాడు. శకునిజెండా ఎగరగొట్టేశాడు. అతడి గుర్రాలు కూల్చేశాడు. సారథినీ చంపేశాడు. శరీరం చీలిక లయినట్టు దారయిన బాణాలు గుప్పించాడు. గదపుచ్చుకుని రథంగెంతేశాడు శకుని. మెరుపులా వెళ్ళి సహదేవుడి సారథిని చంపేశాడు. సహదేవుడూ గదపట్టుకున్నాడు. రథంమీంచి దూకేసి శకునిమీది కురికాడు. ఇద్దరూ గదలుఎత్తి పట్టుకు నిలబడి శిఖరాలతోవున్న రెండుకొండల్లా అవుపించారు.

మన వివింశతి భీముడిమీదికి వెళ్ళాడు. అతడిమీద వాడి ఇరవై బాణాలు కొట్టాడు భీముడు. నవ్వుతూ వాడి వెడల్పాటిబాణం వేశాడు వివింశతి. దెబ్బతో భీముడిధనుస్సు రెండుముక్కలయి పోయింది. మన సేనలు పొలికేకలు వేశాయి. కవ్వించినట్టయి బాగా వొళ్ళుమండింది భీముడికి. లిప్తలో మరొకధనుస్సు తీశాడతడు. వివింశతి గుర్రాలు చంపేశాడు.

భూరిశ్రవుడు ధృష్టద్యుమ్నుడితో కలబడ్డాడు. అరనిమిషంలో అతడిరథం బాణాలతో కప్పేశాడు. "నిలబడవోయి, అటు వెళతావేం?" అని భూరిశ్రవుణ్ణి అదలిస్తూ అతడిమీద అంపవాన కురిపించి కంగారు పెట్టేశాడు శిఖండి!

అలంబసుడూ ఘటోత్కచుడూ కలబడ్డారు. ఇద్దరూ పిశాచాలు పూన్చినరథాలెక్కారు. నల్లటి ఎలుగుబంటితోళ్ళ కవచాలు వేసుకున్నారు. ఆకాశం పగిలిపోయినట్టు అరుస్తూ వొకరిమీద వొకరు కలబడ్డారు. ఒకణ్ణిమించినట్టు వున్నాడు మరొకడు. ఇద్దరూ నువ్వా నేనా అంటూ దెబ్బలాడారు. ఇద్దరూ కొట్టుకున్నారు. మాయలు చేసుకున్నారు. దెబ్బలాడి దెబ్బలాడి ఇద్దరూ మాయమయిపోయారు.

మన లక్ష్మణకుమారుడు క్షత్రదేవుడిమీదికి వెళ్ళాడు. అద్భుతమైన యుద్ధంచేశాడు.

అనువిందుడు చేకితానుడితో కలబడ్డాడు. ఇద్దరూ ఘోరంగా పోట్లాడారు.

శల్యుడు నకులుణ్ణి ఎదిరించాడు. నవ్వుతూ మేనల్లుడిమీద బాణాలువేసి నొప్పించాడు. నకులుడుమాత్రం సామాన్యుడా? నాగు పాముల్లాటి బాణాలు మేనమామమీద నాటించాడు. అతడి సారథిని చంపేశాడు. అతడి విల్లూ విరిచేశాడు. జెండా నరికేశాడు.

గొడుగు ఎగరగొట్టేశాడు. అలా అతణ్ణి రథంలేకుండా చేసేసి క్షణం పూరించాడు.

కృపాచార్యులు ధృష్టకేతువుతో కలబడ్డాడు. తీవ్రమైన బాణాలు వేసి అతణ్ణి కీచుకీచు మనిపించాడు ధృష్టకేతువు. వందలూ వేలూ బాణాలు రువ్వి అతణ్ణిముంచెత్తాడు కృపాచార్యులు.

సాత్యకీ కృతవర్మా కలబడ్డారు. కృతవర్మ ఎదురొమ్ముమీద వరసపెట్టి డబ్భయి బాణాలు నాటించాడు సాత్యకి. మరో ఏడు కలిపి డబ్భయిఏడు బాణాలు గుప్పించాడు కృతవర్మ.

ఇంతలో సుశర్మమీదికి దూసుకువచ్చాడు ధృష్టద్యుమ్నుడు. అతడి జీవస్థానాల్లో బాణాలునాటించాడు. దెబ్బలు తిని జంకలేదు సుశర్మ. సాత్యకి కొంకుల్లో గురిచూసి కొట్టా డతడు.

తన మత్స్యదేశంసేనతో వచ్చి కర్ణుడిమీద విరుచుకుపడ్డాడు విరాటరాజు. మత్స్యదేశసైన్యమూ. అంగదేశసైన్యమూ అద్భుతమైన యుద్ధం చేశాయి. కళ్ళు మొహమ్మూ కోపం వచ్చింది కర్ణుడికి. విరాటరాజు గుర్రాలూ, అతడి సారథీ ముక్కముక్క లయిపోయినట్టు కొట్టేశా డతడు. సీకొడుకులు సంతోషంతో వెర్రికేకలు వేశారు.

భగదత్తుడు ద్రుపదుడితో కలబడ్డాడు. ఇద్దరూ సమవుజ్జీలయి యుద్ధం చేశారు. ఒకళ్ళని మించిన అస్త్రబలం వొకళ్ళు చూపించారు. ఒకళ్ళని మించి వొకళ్ళు సింహనాదాలు చేశారు. వాళ్ళయుద్ధం చూస్తే కళ్ళుమూసుకుపోయాయి.

పౌరవుడు అభిమన్యుణ్ణి ఎదిరించాడు. దురుసుగా జడివానలా కురిపించాడు బాణాలు. అసలే అగ్గితునక అభిమన్యుడు. జూలుపట్టి లాగితే సింహంకొదమ ఎలా తిరగబడుతుంది, అదిగో అలా తిరగబడ్డా డతడు పౌరవుడిమీద. అతడి కోదండం విరిచేశాడు. జెండా చించేశాడు. గొడుగు ఎగరగొట్టేశాడు. అతడి నాలుగు గుర్రాలూ

నాలుగు బాణాలతో శారుమనిపించేశాడు. మరో బాణంతో సారథిని కీచుమనిపించాడు. ఏడు బాణాలు పౌరవుడి వొంటిమీద నాటించాడు. అంతటితోనూ వూరుకోలేదతను. ధనుస్సుని బాణం తొడిగి సరిగ్గా అతడికంఠం గురిచూశాడు. ఉత్తరక్షణంలో పౌరవుడి తల ఎగిరి పోతుంది. అది చూశాడు కృతవర్మ. చప్పున టపీటపీ రెండు బాణాలు కొట్టాడు. అభిమన్యుడి బాణమూ, ధనుస్సూ ముక్కలు చేసేశాడు.

కత్తీ, డాలూ అందుకున్నాడు అభిమన్యుడు. రథంమీంచి కిందికి దూకాడు. అమాంతంగా పౌరవుడిమీదికి పరిగెత్తాడు. అతడి గుర్రాలు నరికేశాడు. సారథిని పడదన్నాడు. పాముని పట్టిన గరుత్మంతుడిలాగ పౌరవుడిజుత్తు పట్టుకున్నాడు. క్షణంలో పౌరవుడి తల తెగిపోతుంది. అది చూశాడు సైంధవుడు జయద్రధుడు. తత్తర పడిపోతూ కత్తీ, డాలూ పట్టుకుని, రథం గెంతేసి, చువ్వలా వెళ్ళి, అభిమన్యుణ్ణిఅదిలించాడు. అభిమన్యుడి జనక ద్వేషి జయద్రధుడు. అతణ్ణి చూడగానే ఎక్కడలేని క్రోధమూ పుట్టుకువచ్చిం దతడికి. పౌరవుణ్ణి వొదిలేశాడు. ఉన్నపాళాన జయద్రధుడిమీదికి లంఘించాడు.

జయద్రధుడూ, అభిమన్యుడూ చిత్ర విచిత్రమైన గతులు చూపిస్తూ కత్తియుద్ధంచేశారు. ఒక సింహమూ, వొక శరభమూ రెక్కలుకట్టుకు పోరాడుతూవుంటే ఎలావుంటుంది, అదిగో ఆలావుంది వాళ్ళిద్దరూ పోరాడుతూవుంటే. ముక్కుమీద వేలువేసుకున్నారు చూసినవాళ్ళు.

మెరుపులా కత్తి ఝుళిపించి, తటాలున కొట్టాడు జయద్రధుడు. అభిమన్యుడి డాలుకి తగిలి చొచ్చుకుపోయింది కత్తి. ఒక్క కుదుపు కుదిపాడు అభిమన్యుడు. ముక్కలయి వూరుకుంది జయద్రధుడి కత్తి. ఔంకేశాడు జయద్రధుడు. వెనక్కి పారిపోయి రథమెక్కేశాడు. "ఓడి

పోయి వారిపోయావు. పిరికీ! పో పో'' అంటూ అతణ్ణి వొదిలేశాడు అభిమన్యుడు. సింధుసేనమీదపడి నరుకుడడం ప్రారంభించాడు.

ఎంతో మంది రాజులు చుట్టుముట్టారు అభిమన్యుణ్ణి. ధగధగా మెరిసిపోతూవున్న శక్తి తీసి విసిరాడు శల్యుడు. ఒకఆడపాముని వొడిసి పట్టిన గరుత్మంతుడిలాగ ముందుకి వురికి శల్యుడిశక్తి పట్టేశాడు అభిమన్యుడు. అలా పట్టేసి తిరిగి శల్యుడిమీదికే విసిరికొట్టాడు దాన్ని. శల్యుడి సారథిమీద పడిందది. నిండుప్రాణాలు నిలువునా వొదిలేశాడు సారథి పాండవసైనికులు సింహనాదాలు చేశారు. విరాటరాజూ, ద్రుపదుడూ, ధృష్టకేతువూ, ధర్మరాజూ, సాత్యకీ, కేకయరాజులూ, భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, నకుల సహదేవులూ, ద్రౌపదికొమాళ్ళూ - యావన్మందీ అభిమన్యుణ్ణి అదే పొగడడం పొగిడారు; సింహనాదాలు చేశారు. భూమీ ఆకాశమూ ప్రతిధ్వనించింది. విని వుల్లాసంతో వుప్పొంగిపోయాడు అభిమన్యుడు.

అదంతా చూసి మరింత కన్నుకుట్టింది నీకొమాళ్ళకి. రోషంతో రుసరుసలాడిపోయారు వాళ్ళు. అంతమందీ వొక్కసారి అభిమన్యుడి మీద పడ్డారు. ఎడాపెడా అంపవాన కురిపించారు. వాళ్ళని మెప్పించడానికి శల్యుడుకూడా గదపట్టుకు పరిగెత్తాడు.

ధృతరాష్ట్రుడు : ఎన్నో ద్వంద్వయుద్ధాలు విన్నాం. కాని ఇంతసేపు, ఇంత ఇదిగా ఎన్నడూ వినలేదు, సంజయా, ఇకముందు లోకంమీద కురుపాండవయుద్ధం చెప్పుకుని నివ్వెరపోతారు ప్రజలు. వింటూన్నకొద్దీ వినాలనే వుంది యుద్ధం. ఎంతవిన్నా తనివితీరడం లేదు. ఊఁ, చెప్పూ చెప్పూ. తరవాత ఏంజరిగింది? శల్యుడూ, అభిమన్యుడూ ఎలా యుద్ధం చేశారట !

సంజయుడు : సారథి చచ్చిపోయాడన్న ఉక్రోషంతో గద పుచ్చుకుని యముడిలాగ వస్తూన్న శల్యుణ్ణి చూశాడు అభిమన్యుడు.

తానూ వొక మంచి గదపుచ్చుకున్నాడు. "రా, రమ్మ"ంటూ శల్యుడి మీదికి హుంకరించాడు. మహారాజా, అభిమన్యుడి ఉగ్రమూర్తీ, ఆసాంతమూ చూసితీరవలసిందే అంటాను. సమస్త సేనలూ అతణ్ణి మెచ్చుకుంటూ, భయపడిపోతూ నుంచుండిపోయాయి చిత్రంలోలాగ.

## భీముడూ శల్యుడూ గదాయుద్ధం

అంతలో సింహంలా వచ్చివాలాడు భీముడు. అభిమన్యుణ్ణి వెనక్కి తోసేసి, ఉద్దండమైన గదాదండం పట్టుకుని, ప్రళయ యముడి లాగ వుంకించి నుంచున్నాడు. ఆహాంపూ, ఆతీవి అద్భుతం! అలా నుంచున్న భీముడిమీదికి అమాంతంగా వెళ్ళి కలబడ్డాడు శల్యుడు. వాళ్ళిద్దరూ కలబడగానే ఉభయ సేనలూ గొల్లుమన్నాయి. ఉభయ సేనల్లోనూ రణవాద్యాలు మోగాయి. ఇతడికి అతడే సాటి, అతడికి ఇతడే సాటి. వీళ్ళని ఎదిరించడానికి లోకంమీద మరొకడులేడు" - ఉభయ సేనల్లోనూ, ఇవే మాటలు.

భీముడూ, శల్యుడూ గదాయుద్ధ మారంభించారు. ఇద్దరూ వొడుపుగా గదలెత్తారు. మండలాకారంగా తిరిగారు. గదలతో చిత్రవిచిత్రంగా కొట్టుకున్నారు. గదాగదా ఖణేలుమనేసరికి నిప్పులు రాలాయి, ఒకరు చూసి కొట్టేసరికి వొకరు తప్పించుకునేవారు. వొడుపుచూపి, ఒకరినొకరు జంకించి కొట్టుకునేవారు. గభీమని దెబ్బ పడిందో రక్తాలు చిమ్మేవి. దభీమంటే దభీమని పడేవి అడుగులు. హుమ్మంటే హుమ్మంటూ దిక్కులికి వినిపించేవి హుంకారాలు. ఇద్దరూ సమవుజ్జీవులు. ఇద్దరూ సమబలవంతులు. పంత్వమూ, ఉద్రేకమూ, పంతమూ--ఎందులోనూ ఎవ్వరూ తీసిపోరు. వాళ్ళ గదా

యుద్ధంచూసి, మనుషుల సంగతి అలావుంచు — దేవతలే నాలికలు కరుచుకున్నారు.

అలా ఇద్దరూ ఎంతోసేపు పోట్లాడారు. తుదకి ఇద్దరూ గబా గబా కొట్టుకున్నారు. ఇద్దరికీ ఆయువుపట్లలో వొక్కసారే దెబ్బలు తగిలాయి. ఇద్దరూ వొక్కసారే మూర్ఛపోయారు. ఇటు మనవాళ్ళూ అటు పాండవులూ వొక్కసారే బెంబేలుపడిపోయారు. పెడబొబ్బలు పెట్టేశారు.

గెద్దలా వెళ్ళి వాలాడు కృతవర్మ. శల్యుణ్ణి ఎత్తి లిప్తలో పట్టుకువచ్చేశాడు. అంతలోనే భీముడు తెలువుకున్నాడు. లేచి విజయ గర్వంతో నుంచున్నాడు. ఒళ్ళు మండింది నీకు వాళ్ళకి. మదపుటేను గులతోనూ, రథాలతోనూ వెళ్ళి అతణ్ణి ముట్టడించారు. రకరకాల శస్త్రాలూ అస్త్రాలూ వేసి అతణ్ణి ముంచెత్తారు.

పెద్దఎత్తుని వచ్చి మనసేన తరిమికొట్టాడు ధర్మరాజు. నకుల సహదేవులూ, ఇంకా ఎంతోమంది యోధులూ అతడివెంట వచ్చారు. మనవాళ్ళమీద విరుచుకుపడ్డారు. పెనుగాలికి చెదిరిపోయిన మేఘా ల్లాగ చెల్లా చెదురయిపోయాయి మనసేనలు.

అంతలో అపరాహ్ణమయింది

కౌరవసైన్యం కకావికలయిపోడంతోనే శంఖాలు పూరించారు పాండవులు. భేరీలూ, మద్దెళ్ళూ మోయించారు. సింహనాదాలు చేస్తూ మరింత తరుముకువచ్చారు.

అదంతా చూసి, రోషావేశంతో మండిపోయాడు కర్ణుడి కొడుకు వృషసేనుడు. పిడుగుల్లాగ బాణాలు కురిపిస్తూ వెళ్ళి పాండ వుల్ని ఎదురుకున్నాడు. పాండవసేనలో ఏనుగుల పీనుగులూ, గుర్రాల కళేబరాలూ కుప్పలుపడ్డాయి. రథాలు గుండపిండయాయి. సారథులూ

రథికులూ కూలిపోయారు. కాల్బలం తుక్కుతుక్కయిపోయింది. రక్తం నదులయి పారింది. పిశాచాలు ఈతకొట్టి జలక్రీడలాడాయి.

అలా కనీవినని ప్రతాపంతో శత్రుసేన చెండాడుతూవున్న వృష సేనుడితో నకులుడి కొడుకు శతానీకుడు ఢీకొన్నాడు. మంచిబాగా చికిలిపెట్టిన పదిబాణాలు కొట్టి అతడి శరీరం చీలికలు చేసేశాడు. ఒక దారయినబాణం వేసి అతడి జెండా నరికేశాడు. ధనుస్సు విరిచేశాడు. అంతలో శతానీకుడి అన్నదమ్ములు ప్రతివింధ్యుడూ, శ్రుతసోముడూ, శ్రుతకీర్తీ, శ్రుతసేనుడూ వచ్చి కలిశారు. శతానీకుణ్ణి వెనకపెట్టి, రకరకాలబాణాలు బాగా సానపట్టినవి వృషసేనుడిమీద కురిపించారు. అశ్వత్థామా మొదలైన యోధులతో వెళ్ళి మనవాళ్ళు వాళ్ళని ఎదిరించారు. ఎన్నో అన్ని మహాస్త్రాలు వేసి ఉపపాండవుల్ని ముంచెత్తారు. అదిచూశాడు ధర్మరాజు. కేకయులూ, మాత్స్యులూ, పాంచాలులూ మొదలైన యోధులతో కలిసి మనవాళ్ళమీద విరుచుకుపడ్డాడు. దాంతో దేవాసుర యుద్ధంలా జరిగింది భారతయుద్ధం. అందులో ముఖ్యంగా భీముడూ, కర్ణుడూ, కృపుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, ధృష్టద్యుమ్నుడూ, విరాటరాజూ ప్రచండమూర్తులయిపోయారు. ఈ ఏడుగురూ ఏడుగురు సూర్యుల్లా ప్రకాశించారు. కొంతసేపు యుద్ధం జరిగేసరికి పాండవులదే పైచెయ్యి అయింది. వాళ్ళప్రతాపం భరించ లేక పోయింది మనసేన. దాంతో వెనకంజవెయ్యడ మారంభించింది.

ఎక్కడలేని వీరావేశమూ పుట్టుకువచ్చింది ద్రోణాచార్యులికి. "ఆగండీ, ఆగండీ" అంటూ అదలించాడు మనసైనికుల్ని. తూణీరం గట్టిగా బిగించుకున్నాడు. ధనుస్సు సారించాడు. "ధర్మరాజు దురుసుతనం చూశావా?" అంటూ తనసారథిని హెచ్చరించాడు – "పంతం వొదిలేసి పారిపోతున్నాయి మనసేనలు. ధర్మరాజు ఆట కట్టిస్తే కాని ఈగొగ్రెలముంద నిలబడదు. ధర్మరాజూ, భీముడూ, సాత్యకీ, విరాట

రాజూ, ద్రుపదుడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ — వీళ్ళు నాతో ధనుస్సుపట్టే వాళ్ళు! అర్జునుడు మాత్రం! నేను నేర్పిన విలువిద్యేకదూ అతడిది! అదీకాక, వాళ్ళు దాడిచేసే సమయం కాదిది. జయమూ, కీర్తి జూరుకోవలిసిన వేళ ఇది. నువ్వు అప్రమత్తుడివై రథం నడిపించు. చేతులు తీటతీరేట్టు ఈరథాల వాళ్ళని నేను వేటాడతాను" అన్నాడు.

## క్షణంలో తప్పిపోయాడు ధర్మరాజు

ద్రోణుడి హెచ్చరికతో శరీరం పులకించినట్లయింది అతడి సారథికి. పగ్గాలు సడిలించి గుర్రాలమీద చబుకువేశాడతడు. ధర్మరాజు చంద్రపతాకానికి సూటిగా పరిగెత్తింది రథం. ధర్మరాజుని వెనక్కిపెట్టి ముందుకివచ్చాయి పాండవసేనలు. ధర్మరాజుముందు పెట్టనికోటలా నుంచున్నాయవి. నాలుగుదంతాల మదపుటేనుగులాగ వాటిమీదికి వురికాడు ద్రోణసేనాని. అతడి దూకుడు చూసి పాయలయిపోయింది పాండవసైన్యం. బాణాలతో భూమీ ఆకాశమూ కప్పేస్తూ ధర్మరాజుమీద కలబడ్డాడు ద్రోణుడు.

చలించలేదు ధర్మరాజు. దెబ్బకి దెబ్బతీసి ఎదిరించాడతడు. బాణాలతో ముంచెత్తి వొదిలిపెట్టాడు ద్రోణాచార్యుణ్ణి. రవంతా ఆగలేదు ద్రోణుడు. వాడైన వొకబాణం వేసి ధర్మరాజు ధనుస్సు ఛళ్ళుమనిపించేసి, దగ్గిరికి దూసుకుపోయాడు.

సముద్రం పొంగినట్టు మీదికి వచ్చేస్తూవున్న ద్రోణుణ్ణి ఏనాపొద్దులాగ అడ్డుకున్నాడు, ధర్మరాజు చక్రరక్షకుడు పాంచాలకుమారుడు సుకుమారుడు, సానపట్టిన బాణమొకటి ద్రోణుడి ఎదురొమ్ము నాటుకుపోయినట్టు కొట్టాడతడు. సెబాసంటే సెబాసని సుకుమారుణ్ణి మెచ్చుకున్నారు పాండవ సైనికులు. సింహనాదాలు చేశారు.

పెద్దగా లిపిస్తే దెబ్బతగిలిన కాలి చక్రంలాగ తిరిగిపోయాడు ద్రోణాచార్యుడు. ఆ శిఖండి బాణాలు రువ్వి సుకుమారుణ్ణి పాతవాల్చేశాడు. అవ్యాఘ్రుని పెళ్ళి ధర్మరాజుమీద విరుచుకుపడ్డాడు.

ఒకణ్ణి తోసుకుంటూ ఒకడు ముందుకి వచ్చారు పాండవ యోధులు. ధర్మరాజుని వెనకపెట్టి ద్రోణుడితో కలబడ్డారు.

మరింత ఉద్రేకం తలకెక్కింది ద్రోణుడికి. అయిదు బాణాలు కొట్టి నకులుణ్ణి కీచుకీచుమనిపించాడు. ఏడు బాణాలు వేసి సహదేవుణ్ణి అడలెత్తించాడు. తొమ్మిది బాణాలతో విరాటరాజుని పీకగొట్టాడు. ఏడు బాణాలతో సాత్యకిని గిలగిలలాడించాడు. తలా మూడు బాణాలు రువ్వి ద్రౌపదీకుమారుల్ని తరిమాడు. ఇరవై బాణాలు గుప్పించి ఉత్తమౌజుణ్ణి హాహా అనిపించాడు. పన్నెండేసి బాణాలు కొట్టి శిఖండినీ, ధర్మరాజునీ నొప్పించాడు. ఎదురైన యోధుణ్ణల్లా ఎడా పెడా వొదిలిపెట్టాడు. అందరినీ అలా తరిమేసి ధర్మరాజుమీద పడ్డాడు. తళతళా మెరుస్తున్న బాణాలు అతడిమీద రువ్వడమారంభించాడు.

అంతలో యుగంధరుడని వొక రాజు మధ్యగా వచ్చి అడ్డుపడ్డాడు నవ్వాడు ద్రోణుడు. ఒకే ఒక్క బాణంతో అతణ్ణి హరీ అనిపించేశాడు.

కేకయరాజులూ, ద్రుపదుడూ, అతడి జ్ఞాతులు సింహసేనుడూ వ్యాఘ్రదత్తూ మొదలైన యోధానయోధులు ఎంతో అంతమంది వచ్చి ద్రోణుణ్ణి చుట్టుముట్టారు అద్భుతమైన శౌర్యపరాక్రమాలు ప్రదర్శించారు. సింహసేనుడూ, వ్యాఘ్రదత్తూ తెగించి పోరాడారు. నానారకాల అస్త్రాలూ ప్రయోగించి ద్రోణుణ్ణి నొప్పించారు.

కళ్ళల్లో చింతనిప్పులు కక్కాడు ద్రోణుడు. బాగా దారు పట్టిన రెండు బాణాలు వొదిలిపెట్టాడు. వ్యాఘ్రదత్తు, సింహసేనుల కంఠాలు నరికేశాడు. కుండలాలతో కూడా వాళ్ళతలకాయలు కింద

పడగొట్టాడు. ఇక తక్కినవాళ్ళని కాళ్ళూ చేతులూ కదపడానికి వీలులేకండా కంగారుచేసేశాడు, వెనక్కి తరిమేశాడు. మరుక్షణంలో మళ్ళీ ధర్మరాజుమీాది కురికాడు.

"దొరికిపోయాడు ధర్మరాజు."

"అదిగో, అదిగో పట్టేశాడు ద్రోణుడు."

"దుర్యోధనుడికి పట్టపగ్గా లుండవిక."

"అంధరాజు ఆనందించినట్టు హాస్తినాపురం పట్టుకుపోతాడు."

ఇలా వెర్రికేకలు వేస్తున్నారు పాండవసైనికులు. తడబడి పోతున్నారు వాళ్ళు. కలతపడిపోతున్నారు. ఇంతలో దిక్కులు బద్దలైనట్టు అదలిస్తూ అమాంతంగా వచ్చిపడ్డాడు అర్జునుడు. అతడి రథవేగానికి గడగడలాడిపోయింది భూమి. మెరుపుల్లా అవుపించాయి తెల్లగుర్రాలు. ఆకాశం కప్పేశాయి బాణాలు. రావడమూ, ద్రోణుడిమీాద కలబడడమూ లిప్తలో జరిగిపోయాయి. క్షణంలో తప్పిపోయాడు ధర్మరాజు.

అర్జునుడు రావడంతోటే కౌరవవీరులు యావన్మందీ సైన్యాలతో వొక్క పెట్టుని పరిగెత్తారు. ద్రోణుడికి దన్నయి అర్జునుణ్ణి ఎదిరించారు.

అసలే విభ్రాంతుడు అర్జునుడు. చిచ్చులపిడుగులా చెలగి పోయాడు. ఘోరాకారుడయిపోయాడు. వరసపెట్టి గాండీవం మోయించాడు. కరుకయిన బాణాలు జడివానలా వడివడిగా కురిపించాడు. రక్తనదులు పారించాడు. ఆరక్తనదుల్లో కపాలాలే రాళ్ళు. మెదడూ, మాంసమే బురద. ఎముకలపొడి ఇసక.

సూర్యుడు అస్తగిరిమాటుకి దిగిపోయాడు. అర్జునుడి బాణాలతో ఆకాశం కప్పేసి అసలే చీకటిగావుంది. దానికితోడు సాయంకాల

మయింది. చిమ్మచీకటిలా అయిపోయింది రణస్థలం. తమవాళ్ళెవరో, పయివాళ్ళెవరో కనబడలేదు కౌరవులికి.

ద్రోణుడూ, దుర్యోధనుడూ కలిసియుద్ధ మాపేశారు సైన్యాలు వెనక్కి మళ్ళించారు.

పాండవసేనలో విజయదుందుభులు మోగాయి. పాంచాలులూ, కేకయులూ మొదలైన తనవాళ్ళ ప్రశంసావాక్యాలు వింటూ అర్జునుడు తన సేనలు మళ్ళించాడు. అన్నగారిని సేవిస్తూ శిబిరానికి మళ్ళాడు. రెండుసేనలూ అలా విడిదలు చేరుకున్నాయి. యథోచితంగా ఆరాత్రి గడిపాయి.

## పన్నెండో రోజు

మర్నాడు తెలతెలవారేసరికి ఉభయపక్షాలవాళ్ళూ ఎంతో అంత ఆటోపంగా యుద్ధసన్నాహాలు మొదలుపెట్టారు. అప్పుడు మెల్లి మెల్లిగా దుర్యోధనుడి దగ్గిరికి వచ్చి ద్రోణాచార్యులు అన్నాడు. ఆయన మొహంలో సిగ్గూ, విచారమూ వ్యక్తపడుతున్నాయి. "మహారాజా, నేను ముందే చెప్పాను. అర్జునుడు దగ్గిరవుంటే ధర్మరాజుని పట్టుకోడం సాధ్యపడదు. ఎవరైనా వొకరు పౌరుషం చూపించి అతణ్ణి దూరంగా తప్పించారో - ఇక అడిగావా, వొంపుమీద పట్టేస్తాను ధర్మరాజుని. అర్జునుడు వొక్కడూ తప్పించి వెయ్యిమంది రాని దుళ్ళగొట్టేస్తాను. అర్జునుడు లేనప్పుడు ధర్మరాజు పారిపోకుండా నుంచున్నాడో దొరికిపోయాడన్నమాటే, సందేహం లేదు. లేదూ పారిపోతాడు, మరి కావలిసిందేముంది! మనం గెల్చేశా మన్నమాటే."

"మాదొకమాట మహారాజా" అంటూ అందుకున్నాడు సుశర్మ — "అర్జునుడు ఎప్పుడూ మమ్మల్ని అవమానం చేస్తూ

వుంటాడు. అంచేత అతడంటే ఎప్పుడూ మాగుండెల్లో మండుతూనే వుంటుంది. ఎప్పుడు అతణ్ణి చంపుదామా అని చూస్తూనే వుంటాం. అదీ కాక, నీకు మాటఇచ్చి ఎంతో కాలమయిపోయింది. ఇవాళ యుద్ధంలో అతడన్నా చావాలి, లేదా మేం త్రిగర్తులమన్నా చావాలి. అంతే. ఇంకోలాగ జరగడానికి వీలులేదు. అతడితో హోరాహోరి పోరాడతాం. ధర్మరాజునించి తప్పించి దూరం పట్టుకుపోతాం. నీఅభీష్టమూ నెరవేరుతుంది. మాక్రోధమూ తీరుతుంది. బావుందా?" అన్నాడు.

"అవును, అర్జునుడో మనమో ఇవాళ తేలిపోవాలి" సుశర్మని బలపరుస్తూ అన్నారు అతడి తమ్ముళ్లు సత్యవ్రతుడూ, సత్యకర్ముడూ, సత్యవర్ముడూను. త్రిగర్తసేనలోవున్న వేలాది రథాలవాళ్ళూ అదే మాట అన్నారు. తురగాలమీద పదివేలమంది అలాసిద్ధమయారు. శిలీంధ్ర, మగధ, మచ్ఛిల్లిక, తుండి, కేరళ, మాళవ దేశాల రాజులూ బంధుమిత్రసహితంగా వాళ్ళతో కలిశారు. వీరావేశంతో మీసాలు మెలివేశారు. ఉద్రేకంతో పంతాలు పలికారు. ఇలా లెక్కాజమా లేనంతమంది తయారయారు. అంతమందీ నేతులుపూసుకుని మంగళ స్నానాలుచేశారు. ఆభరణాలు పెట్టుకున్నారు. తుణీరాలు కట్టుకున్నారు. ధనుర్బాణాలు పట్టుకున్నారు. అగ్నులుపూజించారు. యావన్మందిఎదటా అగ్నిసాక్షిగా "అర్జునుణ్ణి చంపుతాం" అంటూ ప్రమాణాలు చేశారు. "అతణ్ణి చంపందే వెనకడుగు వేశామా, గోహత్యా, స్త్రీహత్యా, బ్రహ్మహత్యా చేసినపాపాన పోతాం. బ్రహ్మస్వం హరించినవాళ్ళూ, పరస్త్రీని హరించినవాళ్ళూ, పరధనం కాజేసినవాళ్ళూ, శరణన్నవాళ్ళని రక్షించనివాళ్ళూ, అబద్ధమాడిన వాళ్ళూ, కల్లుతాగినవాళ్ళూ, యాచకుల్ని బాధపెట్టిన వాళ్ళూ, కొంపలు తగలబెట్టినవాళ్ళూ, దాచుకున్నది దోచుకున్న వాళ్ళూ

ఎలాంటి దుర్గతుల పాలవుతారో అలాంటిదుర్గతుల పాలవుతాం. అర్జునుడు మీాదికి వస్తే ముఖాముఖి మడమతిప్పకండా యుద్ధం చేస్తాం. అంతం చూస్తాం. కీర్తి, స్వర్గమూ చూరగొంటాం" అంటూ వొట్టు పెట్టుకున్నారు.

ఇలా సంశప్తకులు (యుద్ధంలో వెనక్కి తిరగమని వొట్టుపెట్టు కున్నవాళ్ళు) యావన్మందీ రథాలెక్కి పెద్ద చతురంగసేనతో యుద్ధానికిబయలుదేరారు. చెప్పలేనంతసంతోషించాడుదుర్యోధనుడు.

అవాళ ద్రోణాచార్యులు గరుడవ్యూహం పన్నాడు. దానికి తానే చుంచువయి నుంచున్నాడు. దుర్యోధనుడూ, అతడితమ్ముళ్లూ దానికి తల. కృపాచార్యులూ, కృతవర్మా కళ్ళు. సింహాళం, ఆభీరం, శూరసేనం, కేకయదేశాల రాజులు మెడ. బాహ్లికుడూ, భూరి శ్రవుడూ, సోమదత్తూ, శల్యుడూ కుడిరెక్క. అశ్వత్థామా, సుదక్షి ణుడూ, విందానువిందులూ ఎడమరెక్క. శకునీ, పౌండ్రక, కళింగ, అంబష్ఠ, మాగధులు వెన్ను. నానాదేశాలరాజులూ, కర్ణుడూ తోక

జయద్రథుడూ మొదలైన మహారథులు శరీరమంతటా సర్దు కుని, వ్యూహానికి బలమూ, అందమూ తీసుకువచ్చారు. వ్యూహం వ్యూహమంతా తుఫానుసముద్రంలాగ, ఉత్సాహనృత్యం చేస్తున్నట్టు కళ్ళ వేదుకయి కనిపించింది. వ్యూహంమధ్య భగదత్తుడు పెద్ద ఏనుగు మీాద ఉదయపర్వంతంమీాది సూర్యుడిలా ప్రకాశించాడు.

## "యుద్ధానికి రా"

ఇక్కడ ఇలా గరుడవ్యూహం తయారవుతూవుంది. అక్కడ ముందువెళ్ళిన సంశప్తకులు — త్రిగర్తులూ మొదలైనవాళ్ళు పాండవ సేనకి దక్షిణంగా వెళ్ళారు. యుద్ధానికి రమ్మని అర్జునుణ్ణి కవ్వించారు.

"అన్నయ్యా. అనుమతించు" అన్నగారి అనుమతి కోరుతూ అన్నాడు అర్జునుడు – "సుశర్మా, అతడి తమ్ములూ యుద్ధానికి పిలుస్తున్నారు నన్ను. నన్ను కాదన్నట్టు పూరుకోడం పౌరుషం తక్కువ పని. అంచేత సెలవియ్యి. వాళ్ళని నురుమాడతాను. వెళ్ళకపోతే మాత్రం బాధపడతాను. ఇదేదో ప్రమాదమనుకోకు. ఈగన్నా వాలదు నీమీద" అన్నాడు.

"ద్రోణుడి బలమూ, శౌర్యమూ మనకి తెలుసుకదా ?" అన్నాడు ధర్మరాజు – "అతడి పూనిక బొంకుసెయ్యాలి మనం. దీనికి ఉపాయమేమిటో నువ్వే ఆలోచించు మరి."

"దానికి ఇదిగో ఇతడున్నాడు" పాంచాలవీరుడైన సత్యజిత్తుని చూపిస్తూ అన్నాడు అర్జునుడు – "పూనికా, బలమూ, ధైర్యమూ, శౌర్యమూ–అన్నిటిలోనూ అందె వేసిన చెయ్యి ఇతగాడు. అన్నివిధాలా నిన్ను కనిపెడతా డివాళ. ఇతడు వున్నంతవరకూ నీచుట్టుపక్కలికి రాలేడు ద్రోణుడు. రవంతా భయపడనక్కరలేదు నువ్వు. ఇతడు శత్రువులచేత కూలిపోయాడే అనుకో, అప్పుడు మరి యుద్ధంలో నిలవకూడదు నువ్వు. తప్పుకు వెళ్ళిపోడమే మంచిది. తప్పనిసరి వచ్చింది నాకు. కాకపోతే ఈఆలోచనే అక్కరలేకపోను. యుద్ధానికి పిలిస్తే వెళ్ళకపోడం మగతనం కాదుకదా! వాళ్ళని హతమార్చడానికి అనిమతించు. వెళ్ళివస్తాను" అన్నాడు

చివరికి "సరే" అని సమ్మతించాడు ధర్మరాజు. చేతులు జోడించి నమస్కరించాడు అర్జునుడు. అన్నగారి ఆశీర్వాదం పుచ్చుకున్నాడు. సంతోషంతో వుప్పొంగుతూ సంశప్తకులదిక్కు రథం నడిపించాడు.

అర్జునుడు అలా వెళ్ళడంతోనే మనవాళ్ళ సంతోషానికి సరిహద్దులు లేనట్టయింది. "కౌరవులు గరుడవ్యూహం పన్నారు."

అదంతా చూసి, ధృష్టద్యుమ్నుణ్ణి హెచ్చరిస్తూ అన్నాడు ధర్మరాజు- "దీనికి తగినట్టు మండలార్ధవ్యూహం పన్నాలి నువ్వు."

ధర్మరాజు ఆదేశప్రకారం మండలార్ధవ్యూహం పన్నాడు ధృష్టద్యుమ్నుడు. ఇలా దిట్టమైన సన్నాహంతో ఉభయసేనలూ యుద్ధానికి సిద్ధపడ్డాయి. శంఖాలూ, భేరీలూ మోగాయి. మంచి నడివానాకాలంలో పొంగిన గంగాయమునల్లాగ రెండు సైన్యాలూ కలబడ్డాయి.

"ఇదిగో, ఈ బ్రాహ్మడిచేతుల్లో నేను పడిపోకండా చూడాలి" ద్రోణుణ్ణి చూపిస్తూ ధృష్టద్యుమ్నుడితో అన్నాడు ధర్మరాజు – "వాడివాడి బాణాలు వేసి, నీప్రతాపమంతా చూపించాలి."

"నేనంటూ అడ్డుంటే –" నవ్వుతూ అన్నాడు ధృష్టద్యుమ్నుడు – "ద్రోణుడా నిదగ్గిరికి వస్తాడు? ఇంతెందుకూ, నన్ను అతడు గెలవడమంటే కల్లోవార్త అని నమ్ము."

ఇలా అంటూనే తనపావురం రంగు గుర్రాల రథం ద్రోణుడికి ఎదురుగ్గా పోనిచ్చాడు ధృష్టద్యుమ్నుడు. ఓంప్రథమంగా ధృష్టద్యుమ్నుడు ఎదురవడం తనకి అరిష్టదాయకం. అంచేత అతణ్ణి చూడడంతోనే మొహం చిన్నబుచ్చుకున్నాడు ద్రోణుడు. అతడి దిక్కు-కళ్ళెత్తిచూడలేకపోయాడు. చూసీచూడనట్టు మొహం తిప్పేసుకుని పాంచాలసేనమీద విరుచుకుపడ్డాడు. బాణాలమీద బాణాలు గుప్పించి సేనసేనంతా పాయలుపాయలుగా చేసేశాడు. ఇక్కడ ఇలా వుంది. అక్కడ అర్జునుడి సంగతి చెప్తాను, విను.

## సంశప్తకులు

ఆకలితోవున్న సింహం లేళ్ళమీదికి వెళ్ళినట్టు సంశప్తకుల మీదికి వెళ్ళాడు అర్జునుడు. అతడు వచ్చేసరికి నెలవంకలా వ్యూహం

వన్ని సిద్ధంగా వున్నారు సంశప్తకులు. అర్జునుణ్ణి చూడగానే పొలి కేకలుపెట్టి అదే తిరగబడడం తిరగబడ్డారు.

"కృష్ణా, చూశావా!" అదంతా చూసి, చిరునవ్వుతో కృష్ణుడితో అన్నాడు అర్జునుడు — "ఎందుకో వీళ్ళకీపొంగు! సంతోషంలో పడి తమసీ, ఎదటవాళ్ళనీ తెలుసుకోలేకపోతున్నారు! కొవ్వి పోయి పాపం, తమచావు తాము కోరుకుంటున్నారు. అయితే వొక విధంగా వీళ్ళ సంతోషమూ సార్థకమే అంటాను. ఏమంటావా? దుర్మార్గులికి లభించని సద్గతి, నాదివ్యాస్త్రాలపాలబడి లభిస్తుంది వీళ్ళకి. అంచేత యుద్ధంలోవీళ్ళనిర్భయత్వమూ,ఉత్సాహమూనిరర్థకం కాదు."

ఇలా అంటూనే దేవదత్తం పూరించాడు అర్జునుడు. ఆ శంఖ ధ్వని ఆకాశమంతటా వ్యాపించింది. సంశప్తకుల గుండెలు చెదిరి పోయాయి. వాళ్ళ అభిమానమూ, ధైర్యమూ పటాపంచలయి పోయాయి. చిత్రాల్లోని బొమ్మల్లాగ యావన్మందీ చలనం లేకండా వుండిపోయారు. ఒక్కడినోటా మాటలేదు. కొంతసేపటికి గాని తెలివిరాలేదు.

తెలివిరాగానే వొకళ్ళ నొకళ్ళు పురికొల్పుకున్నారు సంశప్తకులు. అంతమందీ వొక్కపెట్టుని అర్జునుడిమీదికి ఎగబడ్డారు. జడివానలాగ అదే కురిపించాయి బాణాలు.

అర్జునుడు గాండీవం సారించాడు. దూరదూరంగా వున్న పదిహేనువేలమంది రథాలవాళ్ళని క్షణాలమీద కూలగొట్టాడు. తలో పదేసిబాణాలు కొట్టారు సంశప్తకులు. మూడేసిబాణాలు కొట్టి మంటలు పుట్టించాడు అర్జునుడు. మళ్ళీ అయిదేసి బాణాలు కొట్టారు సంశప్తకులు. రెండేసిబాణాలు వేసి కెవ్వూ కెవ్వూ మని పించాడు అర్జునుడు

సుబాహుడు సూటిగా పదిబాణాలు అర్జునుడి కిరీటంమీద తగిలించాడు. అర్జునుడు వాళ్ళమీద వర్షంలా కుమ్మరించాడు బాణాలు సుశర్మా, సురథుడూ, సుధన్వుడూ, సుబాహుడికి తోడయారు. అర్జునుడిమీద విరగబడ్డారు.

వాళ్ళు ఇట్టే వచ్చారో లేదో వాళ్ళ జెండాలు ఎగరగొట్టేశాడు అర్జునుడు. సుధన్వుడిగుర్రాలు చంపేశాడు. ధనుస్సు విరిచేశాడు. ఉత్తరక్షణంలో అతడితలా నరికేశాడు. ఆవ్యూహపు తక్కినరథాల మీద పడి రెండువేలమంది రథికుల్ని తారుమారుచేశాడు. దాంతో జజ్జరిల్లిపోయారు సంశప్తకులు. అర్జునుడి ఎదటికి వెళ్ళడానికే జంకేశారు. దూరదూరం తప్పుకున్నారు. గుంపులు గుంపులయిపోయారు. దుర్యోధనుడిదండుపక్కకి చేరుకోడ మారంభించారు.

"భయపడకండీ, వెనక్కిమళ్ళండీ" భయభ్రాంతులయి వెనకంజ వేస్తూవున్న సంశప్తకసైన్యం హెచ్చరిస్తూ కేకలువేశాడు సుశర్మ - "అర్జునుణ్ణి ముందుమాత్రం ఎరగరా? రారాజుముందు పలికిన పంతాలు మరిచిపోయారా? ఊరికే వెళితే మనశపథం ఏమయినట్టు?" అంటూ ధైర్యంచెప్పి మళ్ళించాడు. అతడి హెచ్చరికతో సంశప్తకులు మళ్ళీ వెనక్కి తిరిగారు. ఒక్కపెట్టుని అర్జునుణ్ణి చుట్టుముట్టారు.

"ఎక్కడ! ఎక్కడ! ఏడీ అర్జునుడు!" అంటూ వచ్చి నారాయణగోపాలసేనకూడా సంశప్తకులతో కలిసింది. దాంతో మరింత ఉత్సాహంతో ఉప్పొంగింది సంశప్తకసేన. సేనసేనంతా రణవాద్యాలతో గుబగుబలాడిపోయింది.

"బొందిలో ప్రాణాలున్నంతవరకూ పూరుకోరు త్రిగర్తులు" కృష్ణుడితో అన్నాడు అర్జునుడు- "ఇప్పుడే వీళ్ళని హతమార్చి మరీపోదాం. అటూ, అటుపోనీరథం" అన్నాడు. అతడు ఎక్కడికిపోనీ

అంటే అక్కడికల్లా మనరథికులమీదికి రథంపోనిచ్చాడు శ్రీకృష్ణుడు. తెల్లని మేఘాలతో వున్న విమానంలాగ తెల్లగుర్రాలతో పరిగెత్తింది రథం, రథంమీద దేవేంద్రుడిలా అవుపించాడు అర్జునుడు. క్షణంలో మండలాకారంగా తిరిగేది రథం. క్షణంలో ముందుకి వురికేది. క్షణంలో వెనక్కి వచ్చేది.

అలా చిత్ర విచిత్రగతులతో నలిరేగిపోతూ వున్న అర్జునుడి రథంచూసి బాగా వొళ్ళుమండింది నారాయణగోపాలసేనకి. అర్జునుడూ, దుర్యోధనుడూ సహాయంకోసం ద్వారకానగరం వెళ్ళినప్పుడు తమనికాదని శ్రీకృష్ణుణ్ని కోరుకున్నాడు అర్జునుడు. ఆ ఈసు బాగా వుంది వాళ్ళకి. అంచేత అర్జునుణ్నీ, కృష్ణుణ్నీ రకరకాల బాణాలతో ముంచెత్తారు వాళ్ళు.

అర్జునుడు దేవదత్తం పూరించాడు. బ్రహ్మఇచ్చిన మహాస్త్రం ప్రయోగించాడు. మహారాజా, ఆమహాస్త్రం అద్భుతమైంది. సంశప్తకులలోనూ, నారాయణగోపాలసేనలోనూ ప్రతీ సైనికుడికీ తన ఎదటివాడు అర్జునుడిలా అవుపించాడు. దాంతో వొకణ్నొకడు చేతికి దొరికిన ఆయుధంతో కొట్టుకున్నారు. తమలో తామే చంపుకున్నారు. అలా కొంతసేపు తనపని తాను చేసేసి శాంతించిందా దివ్యాస్త్రం. హతమారిపోయినవాళ్ళు హతమారిపోగా మిగిలినవాళ్ళు మళ్ళీ విరుచుకు పడ్డారు అర్జునుడిమీద. అర్జునుడి రథమూ, గుర్రాలూ, జెండా కూడా కనపడకుండా దారుణమైన బాణాలతో కప్పెట్టారు.

అరికాలిమంట నెత్తికెక్కింది అర్జునుడికి. అగ్నిశిఖల్లాంటి బాణాలు వేశాడు. వాళ్ళబాణాలన్నీ కాల్చి బుగ్గిచేసేశాడు. లెక్కాజమా లేనంతమందిని యమలోకం పంపించాడు. భయంకరంగా అట్టహాసం చేశాడు.

అంతూ ఆపూ లేకండావుంది సంశప్తకసైన్యం. తుండీ, మగధా, కేరళా, మచ్చిల్లికా దేశాలవాళ్ళు అదేపనిగావచ్చి పడుతూనే వున్నారు. వాళ్ళందరినీ విడుపూ విరామంలేకండా అర్జునుడు చంపుతూనే వున్నాడు. రకరకాలబాణాలు వేస్తూనేవున్నాడు. పీనుగుపెంటలుచేస్తూనేవున్నాడు. ఎంతచంపుతూవుంటే అంత విరగబడుతూనే వున్నారు. ధారాపాతంగా శరవర్షం కురిపిస్తూనేవున్నారు. గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ, పదాతులూ వుప్పెనలా వచ్చి పడుతూనే వున్నారు. ఆశ్చర్యం! అంతమందిని చించిచెండాడుతూనే వున్నాడు అర్జునుడు.

తేనెటీగల్లాగ మాటిమాటికీ వొదలకండా మీదపడుతూనే వున్నారు సంశప్తకులు. కందిరీగల్లాగ ఆక్రమిస్తూనేవున్నారు. కాకుల్లాగ, కోతుల్లాగ—ఎన్నివిధాల చీకాకు పెట్టాలో అన్నివిధాలా చీకాకుపెట్టేస్తున్నారు. అందులో కొందరు మరీ వీరావేశం చూపెట్టారు. రథాలూ, ఏనుగులూవంటి దిట్టమైన వాహనాలు వొదిలేసి వాళ్లు గుర్రాలమీద సవారయారు. వెర్రిఉత్సాహంతో చిందులు తొక్కారు. కృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ పట్టేద్దామంటూ పొలికేకలు పెట్టారు. గుంపులుగుంపులు అతడిమీద పడ్డారు. అతడి కాలూ చేతులూ కదపనివ్వలేదు. కంటికి కనపడనివ్వలేదు.

"దొరికిపోయారు, దొరికిపోయారు కృష్ణార్జునులు"

"అయిపోయింది."

"అదిగో చచ్చిపోయారు."

అంటూ సింహనాదాలుచేశారు సంశప్తకులు. ఢణంఢణా రణదుందుభులు మోయించారు. శంఖాలు పూరించారు."

"అర్జునా, ఎక్కడున్నావు?" చెమట్లుపట్టిపోయి, ఉక్కిరిబిక్కిరి అయిపోయి కేకవేశాడు సారథి శ్రీకృష్ణుడు— "ఏమయి

పోయావు? నువ్వు కనపడ్డంలేదు. నాకు మతిపోతూవుంది. మరేమీ ప్రమాదం రాలేదుకదా! బతికేవున్నావుకదా! నీగొంతుకన్నా విని పించు'' అన్నాడు.

శ్రీకృష్ణుడి మానుషభావానికి తలపంకించాడు అర్జునుడు. ఉత్సాహంతో గాండీవం సారించాడు. వాయవ్యాస్త్రం ప్రయోగించాడు. తుఫాను గాలికి ఎండుటాకులు ఎగిరిపోయినట్టు దూరదూరం తుళ్ళిపోయారు సంశప్తకులు. సంతోషించాడు శ్రీకృష్ణుడు. అంతలో గబగబా వడగళ్ళవానలా బాణాలమీద బాణాలు విరజిమ్మాడు అర్జునుడు. కుప్పలుకుప్పలు కూలిపోయారు సంశప్తకులు. కొందరి తలలు తెగిపోయాయి. కొందరి కాళ్ళు ఎగిరిపోయాయి. కొందరి చేతులు విరిగిపోయాయి. ఏనుగులూ గుర్రాలూ పచ్చడయిపోయాయి. రథాలూ, ఆయుధాలూ గుండపిండి అయిపోయాయి. రణరంగమంతటా ఎక్కడచూస్తే అక్కడ ఇదే దృశ్యం.

ప్రళయరుద్రుడిలాగ పేట్రేగిపోయాడు అర్జునుడు. కన్నుమూసి కన్నుతెరిచేలోపున వేలకొద్దిమందిని చంపెయ్యడం మొదలెట్టాడు. చిత్రం! ఎంతచంపినా తరగడంలేదు సంశప్తకులు. చచ్చినవాళ్ళు చస్తూవుంటే మిగిలినవాళ్ళు వెనక్కి తగ్గడమూ లేదు. ప్రవాహంలాగ వడుతూనేవున్నారు. అలా కొడుతూనేవున్నాడు అర్జునుడు.

ఎటుచూస్తేఅటు ఘోరంగావుంది రణభూమి. ఏనుగులూ గుర్రాలూ, సైనికులూ ఎక్కడపడితే అక్కడ కూలిపోతూనే వున్నారు. గింజుకుంటున్నారు. విలావిలాతన్నుకుంటున్నారు. మూలుగుతున్నారు. ఒరిగిపోతున్నారు. దొర్లిపోతున్నారు.

ఇలా కృష్ణార్జునులు ఇద్దరూ ధర్మరాజుని వొదిలేసి సంశప్తకులతో అనమానమైన యుద్ధంలో మునిగిపోయున్నారు. ఇక అక్కడః

ధర్మరాజు ఇసారా ఇవ్వడంతోనే ఉద్దండమైన పాండవసైన్యాలు కౌరవసేనమీద విరుచుకుపడ్డాయి. బ్రహ్మాండమైన ప్రూనికతో వాటిని ఎదిరించాడు ద్రోణాచార్యులు. నీకొడుకు దుర్ముఖుడు ధృష్టద్యుమ్నుడి మీద కలబడ్డాడు. అతడి సాహసానికి సంతోషించాడు ద్రోణుడు. నీ తక్కినకుమాళ్ళు దుర్ముఖుడితో కలిశారు. పాంచాలరాజకుమాళ్ళు వాళ్ళమీదికి వచ్చారు. హోరాహోరి జరిగింది యుద్ధం.

ఎంత దట్టమైన మేఘమైతే ఏంగాక, పెనుగాలిముందు నిభాయించినిలవలేదు. అలాగే ద్రోణాచార్యుల ముఖాముఖి యుద్ధంముందు ధర్మరాజుసైన్యం తట్టుకోలేకపోయింది. చెదిరిపోడం మొదలెట్టింది.

చూశాడు ధర్మరాజు. వీరసుందరంగా చెయ్యి విసిరాడు. వెనక్కితగ్గుతూన్న సైన్యం ముందుకి పురికొల్పాడు. జారిపోతూవున్న ధైర్యం చిక్కబట్టుకున్నాయి అతడిసేనలు. ఉగ్రంగా కౌరవసేనమీద కలబడ్డాయి. అంతకంటే ఉగ్రంగా తిరగబడింది కౌరవసేన. దొమ్మీ యుద్ధం జరిగింది. ఆదొమ్మీలో పెద్దధూళి రేగింది; సూర్యబింబం కప్పేసింది, చీకట్లు కమ్మేసినట్టయింది. అయితే సైనికులు వేసుకున్న మణిభూషణాలుమాత్రం కాంతులు విరజిమ్మాయి. వాటికాంతిలో ఉభయసేనలూ పోరాడాయి. ఉభయసేనల్లోనూ రక్తాలు ధారలు కట్టాయి. రేగినధూళి చివరికి ఆరక్తధారలతో తడిసి అడిగిపోయింది. అప్పుడు ఇరుపక్షాలూ రెట్టించిన తమకంతో తలపడ్డాయి. ఉభయుల ఆయుధాలూ రాపాడి పొగలేని మంటలు రేగాయి. అలా చతురంగబలాలు యావత్తూ అద్భుతంగా పోరాడాయి. అందులో పదాతుల విజృంభణ మరీ ఇదిగావుండేది. ఏనుగుల మందలనికాదు, గుర్రాలబారులనికాదు, రథాల వరసలనికాదు — వేటిమీద పడితే వాటిమీద పడి చంపేసేవాళ్ళు వాళ్ళు. చంపడమే కాదు చచ్చిపోయేవాళ్ళు కూడా. వాళ్ళ యుద్ధంచూసి దేవతలే నిచ్చెరపోయారు.

రాతుల వీరవినోదం ఎంతో వేడుక కలిగించింది. రథాలు కూలగొట్టేసేవాళ్ళు వాళ్ళు. పదాతుల్ని పచ్చడిచేసేవాళ్ళు. వాళ్ళని నెత్తురులో ముంచేసేవాళ్ళు. ఎదురైన ఏనుగుల గుండెలు చీల్చేసేవాళ్ళు. కొండల్లాగ గుభీగుభీ కూలిపోయే వవి.

రథాలవాళ్ళని చెప్పక్కరలేదు. క్రోధంతో మండిపోతూ రథాలు పరుగెత్తించేవాళ్ళు వాళ్ళు. గుర్రాలు,ఏనుగులు, పదాతులు- ఎవరు వాళ్ళఎదటపడినా సరే, కింద దొర్లిపోవలిసిందే. అంతేనా శరీరం పిసరపిసరలయిపోవలిసిందే. ఎంతలేసి మూకలు పచ్చినాసరే, ఛిన్నాభిన్నమయిపోవలిసిందే. కుప్పలుకుప్పలు కూలిపోవలిసిందే. వాళ్ళు రథాలు పరిగెత్తించిన చోటల్లా రక్తాలు రొంపులు కావలిసిందే.

ఇక ఏనుగులు మరీ ఇదిగావుండేవి. రథాల్ని కొమ్ములతో పొడిచేసి, కాళ్ళతో కుమ్మేసే వవి. తొండాలతో పీకేసి విసిరేసేవి. చిందరవందర చేసేవి. రాతుని పట్టుకుని గుర్రంమీా దేసి బాదేసేవి. ఎదటి ఏనుగుదంతం పెరికేసి పక్క ఏనుగుమీాద కొట్టేసేవి. రథాలు పట్టి గిరగిరా తిప్పేసి ఆకాశంమీాదికి విసిరేసేవి.

ఒక దగ్గిర కూలిపోయిన సైనికుల రత్నభూషణాలు జిగేలు జిగేలు మెరిశాయి. గీపెడుతూ ఏనుగులు కూలిపోయాయి. వాటి నల్లటి కళేబరాలమీాంచి రక్తాలు ధారలు కట్టాయి. మెరుపులు మెరిసి, ఉరుములతో వర్షంకురుస్తూన్న నల్లటిమేఘాలతోవున్న ఆకాశం కళ్ళముందు కట్టినట్టయింది.

మరోకద గుర్రాలకళేబరాలూ రాతుల శరీరాలూ ముక్కముక్కలయిపోయాయి. రక్తం బురదలో తేలిపోయాయి. రౌద్రం,బీభత్సం, భయానకం వొక్కదగ్గిర తాండవమాడి వొళ్ళుజలదరించింది.

ఇంకోదగ్గిర రౌతులు కూలిపోయి దిక్కూ తెన్నూ తెలియకండా గుర్రాలు పరిగెత్తాయి. వాహనాలు కూలిపోయిన యోధులు దేబెల్లాగ తిరుగాడారు.

రక్తమూ, మాంసమూ, మెదడూ బురదబురదయి రొంపిలా తయారయింది. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ అందులో కూరుకుపోయేవి. కాళ్ళుతీసి కాళ్ళువెయ్యడానికి వీలయేది కాదు. గుర్రాల గొరిజలు దిగబడిపోయేవి. మెదలడానికి వీలులేక దిగాలు పడిపోయే వాళ్ళు యోధులు. పెనగులాడుతూ అలాగే పోరాడేవాళ్ళు వాళ్ళు.

యుద్ధభూమి వొక మహాసముద్రంలా వుంది. రక్తమే అందులో నీరు. గుర్రాలబారులు సుళ్ళు. ఏనుగులు కొండలు. రకరకాల వాహనాలు వోడలు. వీరులే వ్యాపారులు. తమవంటి వాళ్ళు ఎందరో అందులో మునిగిపోయారు. అయినా విజయవాంఛ వొదలడంలేదు వాళ్ళని, నిర్భయంగా ఆ మహాసముద్రంలోకి దిగుతూనే వున్నారు వాళ్ళు.

మహారాజా, ఆ దొమ్మీ యుద్ధరంగంలో దేన్ని చూసినా, ఎవర్ని చూసినా రక్తంతో ఎరుపెక్కి కనిపిస్తున్నారు. చిత్రమేమిటంటే, అంత మహాయుద్ధంలోనూ పిసరంత చెక్కు చెదరకండా మహోత్సాహంతో పోరాడుతున్నాడు ద్రోణాచార్యులు.

పెద్ద సింహనాదంచేసి విజృంభించాడాయన. ఏనుగుమందలోని పెద్దఏనుగుమీదికి లంఘించే సింహంలాగ ధర్మరాజుమీదికి పరిగెత్తాడు. అరిచేతిలో ప్రాణంపెట్టుకుని కళవిలపడిపోయింది ధర్మరాజు సైన్యం. ఈచివరినించి ఆచివరిదాకా భయంతో వొక కోలాహలం రేగిపోయింది. అయితే ధర్మరాజుమాత్రం జంకలేదు. మహోన్నత

మైన ధీరత్వం కనపరిచా డతడు. ఎత్తిన కోదండం దించకండా ద్రోణుడిమీాద బాణాలు గుప్పించాడు.

## సత్యజిత్తూ, వృకుడూ

అంతలో అమాంతంగా వచ్చాడు సత్యజిత్తు. అసాధారణ మైన బలశాలి అతడు. అద్భుతమైన ధైర్యంతో అతడు ద్రోణుడి మీాద కలబడ్డాడు. దారుణమైన బాణాలువేసి నొప్పించాడు. ఒక పది బాణాలతో అతడిసారథిని కొట్టి మంటలు పుట్టించాడు.

చివాల్న వొకబాణం వొదిలాడు ద్రోణుడు. సత్యజిత్తు ధనుస్సు నరికేశాడు. మరో ధనుస్సు తీశాడు సత్యజిత్తు. అందమైన వొడుపుతో వొక ముప్ఫయిబాణాలు ద్రోణుడిమీాద రువ్వాడు. అదేసమయంలో మరో పాంచాలకుమారుడు వృకుడు వచ్చి సత్య జిత్తుతో కలిశాడు. ఒక్కవూపుని అరవై బాణాలు కొట్టి ద్రోణాచా ర్యుల్ని ఉక్కిరిబిక్కిరి చేసేశాడు. కోలాహాలం చేసి అదే పొగడడం పొగిడారు పాండవసైనికులు.

కళ్ళల్లో నిప్పులుకురిశాడు ద్రోణాచార్యులు. వృకుడివొళ్ళంతా తూాంట్లు పడేట్టు బాణాలు గుప్పించాడు. సత్యజిత్తు శరీరమంతా మంటలు పుట్టించాడు. అతడు ఎంతతీవ్రంగా వచ్చినా తిట్టుకున్నారు వాళ్ళు. అతడిసారథిని కీచుకీచు మనిపించారు. గుర్రాలమీాద బాణాలు నాటించారు. అతడివేదికావ తాకం వొరిగిపోయినట్టుచేశారు.

వాళ్ళ దురుసుతనంచూసి పెదవులు బిగించాడు ద్రోణుడు. సత్యజిత్తుమీాద పదిబాణాలు నాటించాడు. నవ్వుతూ అతడి ధనుస్సు విరిచేశాడు. చప్పున మరొకధనుస్సు తీశాడు సత్యజిత్తు. అతడూ, వృకుడూ కలిసి ద్రోణుడి సారథినీ, అతడి గుర్రాలనీ చెడామడా కొట్టారు. అతడి వేదికావతాకమూ పడగొట్టేశారు.

చెప్పలేనంత కోపంవచ్చింది ద్రోణుడికి. మళ్ళీ సత్యజిత్తు ధనుస్సు ముక్కలుచేసేశాడతను. ఆవ్రూపుని మరో నాలుగుబాణాలు కొట్టాడు. వృకుడి నాలుగుగుర్రాలూ కూల్చేశాడు. ఇంకో బాణంతో అతడి సారథిని చంపేశాడు. మరొకటి వేసి వృకుడిశిరస్సు నరికేశాడు.

మరో ధనుస్సు పుచ్చుకున్నాడు సత్యజిత్తు. మహోద్రేకంతో విజృంభించాడతడు. ద్రోణుడిమీద అదే కురిపించడం కురిపించాడు బాణాలు.

అగ్ని బింబంలాగ ఎర్రబడిపోయింది ద్రోణాచార్యుల మొహం. పెదవులు బిగించి వొక్కబాణం వేశాడతడు. దెబ్బతో సత్యజిత్తు ధనుస్సు ఛళ్ళుమనిపోయింది. మరో ధనుస్సు తీశాడు సత్యజిత్తు. అది ఇట్టే అతడు తీశాడో లేదో, మళ్ళీ విరిచేశాడు ద్రోణుడు. అలా ఒకదానితరవాత వొకటి—ఎన్నో ధనుస్సులు విరిచేశాడతడు. ఎన్ని విరిచేస్తే అన్నీ తీస్తూనే వున్నాడు సత్యజిత్తు.

"ఉద్దండుడు వీడు. బతకనివ్వకూడదు. వీణ్ణి" అనుకున్నాడు ద్రోణుడు. మంచిదొక నెలవంక బాణం తీశాడు. ధనుస్సుని తొడిగాడు. చెవిదాక అల్లెతాడు లాగాడు; వొదిలిపెట్టాడు. రయ్యిమంటూ వెళ్ళింది బాణం. సత్యజిత్తుతల ఎగరేసుకు చక్కాపోయింది.

సత్యజిత్తు పడిపోడంతోనే తుళ్ళిపడ్డాడు ధర్మరాజు. తన ఉత్సాహమూ, పూనికా ఒక్కసారి చల్లారిపోయాయి. గుర్రాలు మళ్ళించి పారిపోడం ఆరంభించుకున్నాడతడు.

## ద్రోణుడు వెంటపడ్డాడు

పారిపోతున్న ధర్మరాజు వెంటపడ్డాడు ద్రోణాచార్యులు. పాండవసేనలు యావత్తూ ఒక్కపెట్టుని అతణ్ణి అడ్డుకున్నాయి. దూది

గుట్టలమీదికి పాకిన అగ్నిహోత్రుడిలాగ ఆ సేనలమీద పడ్డాడు ద్రోణుడు; మలమలా మాడ్చెయ్యడం మొదలెట్టాడు.

అమాంతంగా వచ్చి అతణ్ణి ఎదిరించాడు విరాటరాజు తమ్ముడు సూర్యదత్తు. దారైన ఆరుబాణాలుకొట్టి ద్రోణుణ్ణి నొప్పించాడు. ఉరిమినట్టు సింహనాదంచేశాడు. ఒళ్ళుమండింది ద్రోణుడికి. రెప్పపాటులో సూర్యదత్తుతల నరికిపారేశాడు. కుండలాలతో కూడా ఎగిరిపోయి కిందపడింది తలకాయ.

సూర్యదత్తుడు తెగిపోడంతోనే, మత్స్యదేశం సైన్యాలు చెట్టోపిట్ట అయిపోయాయి. ఆపూవున చేదీ, మగధా, కేకయదేశాల సైన్యాలు వెంటాడి క్షోభపెట్టేశాడు ద్రోణుడు. కలగుండు పెట్టేశాడు. అతడి ధనుస్సే మెరుపయింది. అల్లెతాడు ధ్వని వురుమయింది. బాణాలే వర్షమయాయి. అలారక్తం నదులు వరదలు పారించాడు. మహావీరుడు ద్రోణసేనాని.

ఆరక్తనదుల్లో వీరుల ఎముకలే ఇసక. భేరీలే కప్పలు. కవచాలే తరంగాలు. జెండాలే సుళ్ళు. ఏనుగులూ, గుర్రాలూ మొసళ్ళు. కత్తులు చేపలు. తలపాగాలు నురుగు.

ధర్మరాజుని పట్టెయ్యాలన్న తమకంతో తరుముకువెళుతూన్న ద్రోణుణ్ణి యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ, వసుధానుడూ, శిఖండీ అడ్డుకున్నారు; తలా అయిదేసిబాణాలు కొట్టారు. ఇంతలో సాత్యకి వచ్చి వందా ఇరవై బాణాలు వేశాడు. క్షత్రధర్ముడు వచ్చి పది బాణాలు గుప్పించాడు. అదంతాచూసి ధర్మరాజూ వెనక్కి తిరిగాడు. పన్నెండు బాణాలు కొట్టి ద్రోణుణ్ణి నొప్పించాడు.

ధృష్టద్యుమ్నుడూ, చేకితానుడూ వచ్చి ధర్మరాజు ముందు నుంచున్నారు. తలా మూడేసివందలు బాణాలు ద్రోణుడిమీద కురిపించారు. వీళ్ళేకాకండా ఇంకా ఎంతోమంది పాండవయోధులు

ద్రోణుణ్ణి ముట్టడించారు రకరకాలబాణాలతో అతణ్ణి ముంచెత్తారు. దాంతో, నువ్వు మన్నించేరాజులూ, రాజకుమారులూ, ఎంతోమంది ద్రోణుడితో కలిశారు; పాండవులమీద విరుచుకుపడ్డారు.

తేరిచూడడానికి శక్యంకాకండా వున్నాడు ద్రోణుడు. ఒక్క బాణంతో వసుధానుణ్ణి తారుమనిపించేశాడు. క్షేముణ్ణి యమలోకం పంపేశాడు. యుధామన్యుణ్ణీ, ఉత్తమౌజుణ్ణీ, శిఖండినీ, సాత్యకినీ ఎన్నో అన్ని బాణాలు రువ్వి కీచుకీచు మనిపించాడు. ఇంతమందినీ ఇన్ని చెరువులనీళ్ళూ తాగించి ధర్మరాజుమీదికి వురకలుపెట్టాడతడు. మళ్ళీ యుద్ధంలోంచి పారిపోయాడు ధర్మరాజు.

ద్రోణుడు వెంట పడ్డాడు. అడ్డంగావచ్చి అడ్డుకున్నాడు దృఢసేనుడు. వచ్చీరావడంతోనే అతడిగుర్రాలు చంపేశాడు ద్రోణుడు. అతడి సారథిని నరికేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. ధనుస్సు విరిచేశాడు. తుదకి అతణ్ణీ నరికిపారేశాడు.

ద్రోణుడిప్రతాపం దుర్భరమైపోయింది పాండవులికి. వారి సేనలు చెదిరిపోడ మారంభించాయి. కౌరవసేన వెంటదరమడం మొదలెట్టింది. పరిస్థితి మించివచ్చిందంటూ వార్ధక్షేమీ, చిత్రసేనుడూ, సేనాబిందుడూ, సువర్చసుడూ, ధృష్టద్యుమ్నుడూ, చేకితానుడూ, శిఖండీ, సాత్యకీ, సుమిత్రుడూ వొక్కమొగివి ద్రోణుణ్ణి ఎదిరించారు; బాణవర్షం కురిపించారు.

అందరికీ అన్నిరూపులయి యుద్ధంచేశాడు ద్రోణాచార్యులు. సుమిత్రుణ్ణి చంపేశాడు. దాంతో మాత్స్యులూ, పాంచాలులూ కలిసి అతడిమీద పడ్డారు. కాని అతడి బాణాగ్నికి ఆగలేకపోయారు. తోకముడిచేశారు. ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, సేనాబిందుడూ మొదలైన మహారథులు యావన్మందీ.నిశ్చేష్టులయి నిలబడిపోయారు.

ధృతరాష్ట్రుడు : ఆఁ! అలా నలిగేగిపోయిన ద్రోణాచార్యులు ముందు 'నే' నని నుంచునే మొనగాడు వొక్కడూ లేకపోయాడూ, పాండవుల్లో?

సంజయుడు : అవును. అదంతా చెపుతాను, విను. అలా తోక ముడిచేస్తూవున్న పాండవసైన్యం చూసి కలకలా నవ్వాడు దుర్యోధనుడు. "చూడూ, చూడూ" అంటూ కర్ణుడితో ఇలా అన్నాడు— "తుపానుగాలికి తూలిపోయిన అరణ్యంలా వుంది పాండవసేన. విన్నావూ, మళ్ళీ బతికివున్నంతకాలం ద్రోణుడిమీదికి రారు, ఈ పీగిపోయి పారిపోయినవాళ్ళు. అదిగో అదిగో, ఆభీముణ్ణి చూడూ! తన చుట్టుపట్ల వొక్కడూ నా అన్నవాడు లేడు. మొహం చూడూ, దిగాలుమంటూ ఎలా పీడ్చోడుతూ వుందో! ఎడా తెరిపీ లేకండా బాణాలు రువ్వుతూన్న ద్రోణుణ్ణి చూసి వీడి రాజ్యకాంక్ష పుస్సుమని పోయినట్టుంది. ఏమంటావు?"

"పొరపడుతున్నావు" అన్నాడు కర్ణుడు — "భీముడు అలాంటివాడని ఎన్నడూ అనుకోకు. శత్రువులపాలిటి బ్రహ్మరాక్షసి అతగాడు బొందెలో ప్రాణముండగా మనగెలుపు సహిస్తాడని నమ్మకు. బ్రహ్మాండమైన బలవంతులు పాండవులు. వాళ్ళేమిటి యుద్ధం మానెయ్యడమేమిటి! అసంభవం! అంతేకాదు, వాళ్ళని నువ్వు పెట్టిన పాట్లు వాళ్ళు కల్లోకూడా మరిచిపోతారనుకోకు. వాళ్ళసేనలో వున్న యోధులూ సామాన్యులు కారు. వీరత్వానికి పెట్టింది పేరు. భీముణ్ణి ముందు పెట్టుకుని, ఇదిగో ఇప్పుడే ద్రోణుణ్ణి ముట్టడిస్తారు. తప్పదు. చూస్తూవుండు. అంచేత ద్రోణుడికి ప్రమాదం రాకండా మనమంతా కాసుకోవా లిప్పుడు. అంతేకాని, పాండవులు వోడిపోయారనుకోడం ప్రమాదం. మొగమాటం లేకండా చెపుతున్నాను. నమ్ము" అన్నాడు.

కర్ణుడి నోట్లోమాట నోట్లోనే వుంది. హంసరంగు గుర్రాలతో ధర్మరాజురథం ప్రత్యక్షమయింది. పేరుపడ్డ పాండవయోధులు యావన్మందీ రకరకాల గుర్రాలుపూసిన రథాలతోనూ, బ్రహ్మాండమైన సైన్యాలతోనూ ద్రోణుడిమీదికి పరిగెత్తుకు వచ్చారు.

ధృతరాష్ట్రుడు : సంజయా, అలా ద్రోణుడిమీదికి వచ్చిన పాండవయోధుల గుర్రాలూ అవీ కాస్త విడమరిచి చెప్పూ, ఎవరెవరు ఎలా ఎలా వచ్చారో.

సంజయుడు : భయంకరమైన వేగంతో గాలిలా పరిగెత్తే గుర్రాలు ధర్మరాజువి. వాటి తోకలే నలుపు. శరీరం రాజహంసల్లాగా, ఏనుగుదంతంలాగా తెలుపు. అతడి జెండామీద గ్రహాలతో కూడా బంగారం చంద్రుడూ, నందా ఉపనందా అని రెండు దివ్యమృదంగాలూ వున్నాయి. యంత్రసహాయంతో ఆమృదంగాలు రెండూ ఎంతో ఇదిగా మోగుతూ వుంటాయి. తన విల్లు మహేంద్రం మోయిస్తూ వచ్చా డతడు. బంగారం రంగు గుర్రాలమీద ఎంతోమంది రౌతులు అతడివెంట వచ్చారు. వాళ్ళందరి రక్షణభారం తనమీద వేసుకుని, బంగారం కవచంతో వాళ్ళ వెనక వచ్చాడు మహాధనుర్ధరుడు ద్రుపదమహారాజు. ఎంతటి ధ్వనులయినా సహించుకునే గుర్రాలు అతడివి. నల్లచారలదుప్పిరంగుగుర్రాల రథంమీదవచ్చాడు భీముడు. చేతిలో విల్లు వాయవ్యం భయంకరంగా వుంది. జెండామీద వెండితోనూ, వైడూర్యాలతోనూ చెక్కిన మహాసింహం కళ్ళుజిగేలుమనిపిస్తూ వుంది. అతడివెంట వెండిరంగు గుర్రాలు పూసిన రథంతో వచ్చాడు యాదవవీరుడు సాత్యకి. చాతకపక్షిరంగు గుర్రాల రథం స్వయంగా తోలుకుంటూ వచ్చాడు యుధామన్యుడు. పావురాలరంగు గుర్రాలు పూసిన బంగారం కలశాల రథంమీద రభసంగా వచ్చాడు పాండవసేనాని ధృష్టద్యుమ్నుడు. యుద్ధోన్మాది సత్యధృతీ,

శ్రేణిమంతుడూ, వసుధానుడూ, కాశీరాజు పుత్రుడు అభిభుడూ — వీళ్ళంతా ధృష్టద్యుమ్నుడివెంట వచ్చారు. ప్రభద్రకవీరులూ, కాంభోజ దేశయోధులూ అరవై వేలమంది మంచి కాంభోజదేశం గుర్రాలతో వాళ్ళ ననుసరించారు. తండ్రి కుడిభుజంలాగ ఎర్రటిగుర్రాల రథంతో వచ్చాడు ధృష్టద్యుమ్నుడి కొడుకు క్షత్రధర్ముడు. మల్లి పువ్వుల్లాంటి కళ్ళూ, పద్మపత్రాల్లాంటి శరీరమూ కల బాహ్లీక దేశం గుర్రాల రథం పరిగెత్తిస్తూ వచ్చాడు శిఖండికొడుకు క్షత్రదేవుడు. చిలకరంగు కాంభోజదేశం గుర్రాల రథంమీద వచ్చాడు నకులుడు. వీపుమీద బంగారం మెరుస్తూవున్న శరభపతాక మతడిది. అతడి ధనుస్సు వైష్ణవం. మేఘవర్ణం గుర్రాల రథంతో వచ్చాడు ఉత్తమౌజుడు. మేఘంరంగు గుర్రాల రథంమీద గంటా, వెండిరాజ హంసలూ వున్న జెండాతో, ఆశ్వినం ధనుస్సు సారిస్తూ వాయు వేగంతో వచ్చాడు సహదేవుడు. పాటలపుష్పాలవంటి గుర్రాలు పూసిన రథంతో వచ్చాడు విరాటరాజు. కేకయులూ, శిఖండీ, ధృష్టకేతూ తమతమ సైన్యాలతో విరాటరాజు ననుసరించారు. పసుపువర్ణం గుర్రాలు గాలిలా పరిగెత్తిస్తూ వచ్చాడు విరాటరాజు కుమారుడు. కేకయరాజులు అయిదుగురూ ఆరుద్రపురుగులాంటి ఎర్రటి గుర్రాల రథాలమీద వచ్చారు. ఈ అయిదుగురి జెండాలూ ఎర్రగా బంగారంలా మెరుస్తూన్నాయి. కురుస్తూవున్న మేఘంలాగ బాణాలు విరజిమ్ముతూ పరుగులుపెడుతూ వచ్చారు వాళ్ళు. మామిడి చివుళ్ళరంగు గుర్రాలరథంమీద వచ్చాడు శిఖండి. తుంబురు డిచ్చిన గుర్రాలవి. పన్నెండు వేలమంది పాంచాల రథికుల్లో ఆరువేలమంది అతడివెంట వచ్చారు. లేళ్ళలాంటి చిత్రచిత్రాలరంగుగుర్రాలరథంతో వచ్చాడు శిశుపాలుడి కొడుకు ధృష్టకేతువు. ఎండుగడ్డి పొగలాంటి రంగు కాంభోజదేశం గుర్రాలుపూసిన రథంతో వచ్చాడు బృహత్క్ష

త్రుడు. పట్టుబట్టరంగు గుర్రాల రథంతో వచ్చాడు సేనాబిందుడు. క్రౌంచపక్షిరంగు గుర్రాలరథంతో వచ్చాడు కాశీరాజు కొడుకు విభుడు.

మనోవేగంతో పరిగెత్తే గుర్రాల రథమెక్కి వచ్చాడు ధర్మరాజు కొడుకు ప్రతివింధ్యుడు. అతడి గుర్రాల మెడలు మాత్రం నలుపు. శరీరాలు యావత్తూ పాలలా తెలుపు. అతడి పతాకంమీద ధర్మదేవతచిత్రముంటుంది. అతడి ధనుస్సు రౌద్రం.

మినపపువ్వురంగు (తెలుపు కలిసిన పసుపురంగు) గుర్రాల రథమెక్కి వచ్చాడు భీముడి కొడుకు సుతసోముడు. ఉదయేందుపురంలో ఇంద్రప్రస్థంలో సోమలతలమధ్య పుట్టాడు. వెయ్యి చంద్రబింబాల ప్రకాశమతడిది. అంచేతే అతడిపేరు సుతసోముడు. అతడి పతాకం మీద వాయుదేవుడి చిత్రముంటుంది. అతడి ధనుస్సు ఆగ్నేయం.

మద్దిపువ్వురంగు గుర్రాల రథం పరిగెత్తించుకుంటూ వచ్చాడు నకులుడికొడుకు శతానీకుడు. అతడిపతాకం మీద అశ్వనీదేవతల చిత్రముంటుంది. అతడి ధనుస్సు యామ్యం.

నెమలికంఠం రంగు గుర్రాలు పూసిన రథంమీద వచ్చాడు సహదేవుడికొడుకు శ్రుతసేనుడు. అతడి జెండామీదా అశ్వనీదేవతల చిత్రముంది. అతడి ధనుస్సు గిరీశం. పాలపిట్టరంగు గుర్రాల రథమెక్కి వచ్చాడు అర్జునుడికొడుకు శ్రుతకీర్తి. తండ్రితో సమానుడైన రథికుడతడు. దేవేంద్రుడిచిత్రంతో మెరిసిపోతూవుంది అతడి పతాకం. అతడి ధనుస్సు కౌబేరం. అలా ద్రౌపదికుమారుల్ని అయిదుగురి జెండాల మీదా వాళ్ళ తాతల చిత్రా లున్నాయి.

కపిలవర్ణం గుర్రాలరథం వురికిస్తూ వచ్చాడు మహావీరుడు అభిమన్యుడు. తండ్రి అర్జునుడికంటే, మేనమామ కృష్ణుడికంటే కూడా వీరత్వంలో సగం హెచ్చు అతగాడు. అతడి జెండామీద బంగారం

శార్ఙ్గపత్తి ధగధగా మెరిసిపోతూ వుంటుంది. అతడి ధనుస్సు రౌద్రం. మేనల్లుడి విలువిద్యకి మెచ్చి బలరాముడు ఇచ్చిన ధనుస్సు అది.

ఎండుగడ్డి రంగు గుర్రాల రథంతో వచ్చాడు యుయుత్సుడు. నీ వందమంది కుమార్ళనీ వొదిలేసి, ధర్మరాజు పక్షం వెళ్ళిన నీవైశ్య పుత్రు డతడు.

యుయుత్సుడి గుర్రాలవంటి గుర్రాలరథంతోనే వచ్చాడు వార్ధక్షేమి. నల్లకాళ్ళ గుర్రాలరథమెక్కి వచ్చాడు సత్యధృతి. ఎర్రపట్టురంగు గుర్రాలరథంతో వచ్చాడు శ్రేణిమంతుడు. సత్యధృతి ధనుర్వేదమూ, బ్రాహ్మవేదమూ రెండింటిలోనూ పారదర్శి అతడు. పింగళం పట్టురంగు గుర్రాల రథంతో వచ్చాడు చేకితానుడు. ఇంద్రధనుస్సురంగు గుర్రాల రథమెక్కి వచ్చాడు అర్జునుడి మేనమామ కుంతిభోజుడు. చుక్కలతోవున్న ఆకాశంలాంటి గుర్రాల రథమెక్కి వచ్చాడు రోచమానుడు. నల్లటి కాళ్ళూ, కర్బూరం రంగూ కల గుర్రాలరథంతో వచ్చాడు జరాసంధుడి కొడుకు సహదేవుడు. డేగలాగ పరిగెత్తే, తామరతూడురంగు గుర్రాల రథం మీద వచ్చాడు సుదాముడు. ఎర్రకుందేలురంగు గుర్రాలరథంతో వచ్చాడు పాంచాలరాజకుమారుడు, గోపతికొడుకు సింహసేనుడు. సరసావాలపువ్వురంగు గుర్రాలరథమెక్కి వచ్చాడు పాంచాల రాజకుమార్ళలో పేరుపడ్డ జనమేజయుడు. పెరుగువీపులు కల మినుముల రంగు గుర్రా లెక్కి ఎంతోమంది వచ్చారు పాంచాలరాజకుమార్ళు. పద్మకింజల్కాలరంగు కల భద్రదేశం గుర్రాల రథంమీద వచ్చాడు దండధరుడు. శరీరాలు గాడిదల్లాగూ, పృష్ఠాలు ఎలకల్లాగూ వున్న గుర్రాల రథంమీద వచ్చాడు వ్యాఘ్రదత్తు. చిత్రమైన నల్లగుర్రాల రథంతో వచ్చాడు పాంచాలవీరుడు సుధన్వుడు. అద్దంలా నునుపూ, ఆరుద్రపురుగులా ఎరుపూ అయిన గుర్రాలు పూసినరథం మీద

వచ్చాడు చిత్రాయుధుడు. అతడికవచమూ, పతాకమూ, ఆయుధమూ అన్నీ చిత్రమైనరంగువే. చక్రవాకపక్షులరంగు గుర్రాల రథంమీద వచ్చాడు కోసలరాజకుమారుడు సుక్షేత్రుడు. ఎత్తయిన చిత్రవర్ణం గుర్రాల రథంతో వచ్చాడు బంగారం దండలువేసుకుని క్షేముడి కుమారుడు సత్యధృతి. తెల్లటిమల్లిపువ్వులాంటిగుర్రాల రథంమీద వచ్చాడు శుక్లుడు. అతడి ధనుస్సూ, కవచమూ, పతాకమూ అన్నీ తెలుపే. సముద్రంలో పుట్టిన చంద్రవర్ణం గుర్రాలరథమెక్కి వచ్చాడు సముద్ర సేనుడికొడుకు చంద్రసేనుడు. నల్లకలువలరంగు గుర్రాలు పూసిన రథం మీద వచ్చాడు శిబిదేశంరాజు శైబ్యుడు. గుంజు సెనగపువ్వురంగు గుర్రాల రథంమీద వచ్చాడు రథసేనుడు. తెల్లగుర్రాల రథమెక్కి దేవేంద్రుడిలా వచ్చాడు మహాశూరుడు పటచ్చరరాజు. నీలవర్ణం పతాకమూ, నీలవర్ణం కవచమూ, నీలవర్ణం ధనుస్సూ కలిగి నీలవర్ణం గుర్రాల రథంతో వచ్చాడు నీలుడు. చిత్రచిత్రమైన రత్నకవచం వేసుకుని చిత్రవర్ణం పతాకంతో చిత్రవర్ణంగుర్రాలరథమెక్కి వచ్చాడు రోచమానుడి కొడుకు హేమవర్ణుడు. తెల్లటి కోడిగుడ్డురంగు భద్రకార దేశంగుర్రాల రథమెక్కి వచ్చాడు దండకేతు. వెన్నెలలాంటి గుర్రాల రథంమీద వచ్చాడు సాగరపతాకంతో పాండ్యరాజు మలయధ్వజుడు. అతడి తండ్రిని లోగడ కృష్ణుడు చంపేశాడు. అతడి ప్రాకార ద్వారం విరగ్గొట్టి అతడి బంధువుల్ని వెళ్ళగొట్టాడు. ఆక్రోధంతో అతడు భీష్ముడిదగ్గిరా, పరశురాముడిదగ్గిరా, ద్రోణుడిదగ్గిరా విలువిద్య నేర్చుకున్నాడు. దివ్యాస్త్రాలు సంపాదించాడు. రుక్మి, కర్ణుడూ, అర్జునుడూ, కృష్ణుడూ — వీళ్ళతో సమానమైన చెయ్యిగా తయారయాడు. ద్వారక నాశనం చెయ్యాలనీ, భూమండలం యావత్తూ జయించాలనీ సంకల్పించాడు. కాని మేలుకోరిన మిత్రుల ఉపదేశంవల్ల కృష్ణుడితో

విరోధం మానుకున్నాడు. అడ్డసరంపువ్వురంగు గుర్రాలమీద లక్షా నలభై వేలమంది రథికులు అతడివెంట వచ్చారు.

రకరకాల మొహాలూ, రకరకాల రంగులూ కల గుర్రాలు పూన్చిన రథమెక్కి వచ్చాడు రావణాసురుడులాంటి ఘటోత్కచుడు. అతడి రథచక్రాలూ, గొడుగూ, జెండా — అన్నీ చిత్ర చిత్రంగానే వున్నాయి. జెండామీద పెద్ద గెద్ద భయంకరంగా వుంది. అతడి ధనుస్సు పౌలస్త్యం. చుక్కలరంగు గుర్రాల రథంమీద పెద్ద జెండా ఎగరవేసుకుంటూ వచ్చాడు బృహంతుడు. భరతవంశీయుల యావన్మందిమాటా తోసేసి, ధర్మరాజుమీద భక్తితో వొంటరిగా వచ్చి పాండవులతో చేరా డతడు. తక్కిన యోధులూ ఉధృతంగా తమతమ రథాలతోనూ, జెండాలతోనూ వచ్చిపడ్డారు.

ఇలా దారుణమైన విక్రమంతోనూ ఉత్సాహంతోనూ పాండవ యోధులు వచ్చి, వొక కొండని కప్పేసిన మేఘాల్లాగ వొక్కసారి ద్రోణాచార్యుల్ని కప్పేశారు. ఆమహారాణువలో అతడు కనపడ కండా అయిపోయాడు. దాంతో అతడు హతవారిపోయాడన్న దిగులుపట్టుకుంది మనవాళ్ళకి.

## ద్వంద్వ యుద్ధం

అదంతా చూశాడు దుర్యోధనుడు. మనస్సనకి చెయ్యివిసిరి ముందుకి పరిగెత్తాడు. పాండవసేనంతటికీ ముందున్నాడు భీముడు, అతడిమీద కలబడ్డాడు. రాజు అలా వెళ్ళడంతోనే మనయోధులు యావన్మందీ వొక్కసారి రథాలు పరిగెత్తించారు. కృతవర్మ సాత్యకి మీదికి వెళ్ళాడు. జయద్రథుడు క్షత్రధర్ముణ్ణి డీకొన్నాడు. సుబా హుడు యుయుత్సుడిమీద కురికాడు. దుశ్శాసనుడు నకులుడిమీద పడ్డాడు. చిత్రకర్ముడు సహదేవుడితో కలబడ్డాడు. శల్యుడు సరాసరి

ధర్మరాజుమీదికి వెళ్ళాడు. బాహ్లీకుడు ద్రుపదుడితో తలపడ్డాడు. విందానువిందులు విరాటరాజుని ఎదిరించారు. వివింశతి శ్రుతకీర్తి మీదికి పరిగెత్తాడు. సాల్వుడు శ్రుతసేనుడిమీద విరుచుకుపడ్డాడు. చిత్రసేనుడు శ్రుతసోముడిమీది కురికాడు. శ్రుతవర్మ శతానీకుడి మీదికి పరిగెత్తాడు. అశ్వత్థామ ప్రతివింధ్యుడితో చెయిచేసుకున్నాడు. లక్ష్మణుడు అభిమన్యుడితో పోరాడాడు. వికర్ణుడు శిఖండితో దెబ్బలాడాడు. దుర్ముఖుడు కుంతిభోజుడితో కలగజేసుకున్నాడు. అలంబసుడు ఘటోత్కచుడిమీది కెగబడ్డాడు. కేకయులు అయిదుగురినీ కర్ణుడు నిలవరించాడు. జయుడు కాశీరాజునీ, జయత్సేనుడు మలయధ్వజుణ్ణీ ఎదిరించారు. బృహద్ధనుడూ, జయమిత్రుడూ ధృష్టద్యుమ్నుడి కొడుకులమీద పడ్డారు. కృపాచార్యులు వార్ధక్షేమిమీదికి వెళ్ళాడు. భూరిశ్రవుడు మణిమంతుడితో యుద్ధంచేశాడు.

మహారాజా, ఎంతని చెప్పనూ! తక్కినయోధులూ ఎవరి ఎదట పడ్డవాళ్ళమీద వాళ్ళు పడ్డారు; హోరాహోరి పోరాడారు.

ద్రోణాచార్యుల్ని చంపాలని పాండవులూ, అతణ్ణి కాపాడుకోవాలని కౌరవులూ అలా ప్రాణాలు తెగించి ఘోరంగా యుద్ధం చేశారు. ఒకళ్ళజెండాలు వొకళ్లు పడగొట్టుకున్నారు. ఒకళ్ళ గుర్రాలు వొకళ్ళు నరుక్కున్నారు. ఒకళ్ళ సారథులు వొకళ్ళు చంపుకున్నారు. ఒకళ్ళ రథాలు వొకళ్ళు విరగ్గొట్టుకున్నారు. గొడుగులూ, చామరాలూ తునకలుచేసుకున్నారు. ధనుస్సులు విరుచుకున్నారు. కవచాలు చీల్చుకున్నారు. నెత్తుర్లు పారించుకున్నారు.

ఇలా ఘోరంగా ద్వంద్వయుద్ధం జరిగిపోతూవుంది. మధ్యాహ్నమయింది.

ద్రోణాచార్యులు బాణాలువేసి, ధృష్టద్యుమ్నుణ్ణి అనాయాసంగా అడలుగొట్టేశాడు. పైగా ఎదటపడ్డ వీరుణ్ణల్లా కీచుకీచుమనిపించేశాడు.

ధృతరాష్ట్రుడు: బావుంది. ఇక్కడ ఇలా ద్వంద్వయుద్ధం జరుగుతూ వుంటే అక్కడ అర్జునుడితో పోట్లాడుతూవున్న సంశప్తకులు ఎలావున్నారో!

సంజయుడు: తరవాత చెపుతానది. ఇక్కడ ఇంకా ఏమయిందో విను. నీ కొడుకు దుర్యోధనుడు మదపుటేనుగులసేన భీముడిమీదికి రొప్పాడు. కళ్ళు మొయ్యా కోపంవచ్చింది భీముడికి. మేఘాల్లా వచ్చిపడుతూన్న ఏనుగుమందలు పెనుగాలివంటి బాణాలు రువ్వి పారదోలాడతడు. అవ్వాపుని దుర్యోధనుణ్ణి కూడా చెడామడా కొట్టాడు.

దుర్యోధనుడు దెబ్బలుతినడం చూశాడు వంగదేశంరాజు. తన మదపుటేనుగు పరిగెత్తించుకుంటూ వెళ్ళాడు. భీముడిమీద దివ్యాస్త్రాలు ప్రయోగించాడు. అరికాళ్ళమంట నెత్తికెక్కింది భీముడికి. పిడుగులాటి బాణం కొట్టి అతడి ఏనుగు చంపేశాడు. మరోబాణంతో అతడి తల నరికి పారేశాడు. దాంతో, వంగదేశం బలగం యావత్తూ కకావికలయిపోయింది.

## సుప్రతీకం

ఇంతలో సుప్రతీకం పరిగెత్తించుకుంటూ వెళ్ళాడు మన భగదత్తుడు. లోగడ దేవేంద్రుడు ఎక్కి రాక్షససంహారంచేశాడే ఐరావతం, అదిగో ఆఐరావతవంశం ఏనుగు సుప్రతీకం. పదివేల మదపుటేనుగులంతబలం దాంది. కోపావేశంతో అది వెళుతూవుంటే, నిప్పులు రాలుతూన్న దాని చూపులు వాలినచోటల్లా ఎరుపెక్కినట్టయేది. చెవులు మొగ్గించి వూపేసరికి రౌద్రరేఖ తాండవమాడేది, దబాయించి

తొండం ముందుకి వూపుతూవుంటే ప్రళయకాలంనాటి యమదండం కళ్ళకి కట్టేది. ముందుకి వురుకుతూ అడుగులు వేస్తూవుంటే భూమి గజ గజలాడి కదిలిపోయేది.

అలా వొక్కవూపుని వెళ్ళి భీముడిమీద వురికింది సుప్రతీకం. రెండుకాళ్ళూ ముందుకి చాచి అతడితట్టు తొండం చాచింది. గుర్రా లతో కలిపి పట్టుకుని రథం విసిరి పారేసింది. లాఘవంతో రథం మీంచిదూకేశాడు భీముడు. ప్రమాదంలేకండా వొడుపుతో తప్పించు కున్నాడు. అంజలివేధవిద్య తెలిసినవా డతడు. అంచేత చప్పున సుప్రతీకంకడుపుకింద దూరి ఆవిద్యతో దానిని కొట్టడం మొదలెట్టాడు. అతడికోసం కుమ్మరిసారెలా తిరిగింది సుప్రతీకం. దాని ఎదట నుంచున్నాడతడు. తొండం మెలిపెట్టి అతణ్ణి పట్టేసింది సుప్రతీకం. మెడపట్టి విసిరికొట్టాలని ప్రయత్నించింది. మెలకువతో పేచీవేసి తప్పు కున్నాడు భీముడు. తనవాళ్ళు సుప్రతీకాన్ని ముట్టడిస్తున్నారు. ఆసందుచూసుకుని అక్కణ్ణుంచి తప్పించుకు పోయాడతడు.

భీముడు కనపడక పోడంతోనే తల్లడిల్లి పోయాయి పాండవ సేనలు. "సుప్రతీకం భీముణ్ణి చంపేసిందంటే చంపేసిం" దన్న కేకలు రణస్థలమంతటా మారోగ్మోగిపోయాయి. పాండవసేన గగ్గోలు పడి పోయింది. నిలువునా కంపించిపోయాడు ధర్మరాజు. తన యావత్తు బలగమూ భగదత్తుడిమీదికి వురికొల్పాడతడు. రకరకాల ఆయుధా లతో అతణ్ణి ముంచెత్తాడు.

వాటన్నిటినీ తనచేతిఅంకుశంతోనే అడ్డుకున్నాడు భగదత్తుడు. అలా అడ్డుకుంటూనే ధర్మరాజుసేనమీద సుప్రతీకం రెచ్చగొట్టాడు. ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, కాలిబంట్లూ — చతురంగసేన యావత్తూ పచ్చడిపచ్చడి, గుండగుండ, పిండిపిండి చేసెయ్యడం ప్రారం భించింది సుప్రతీకం.

అదిచూసి సహించలేకపోయాడు దశార్ణదేశంరాజు హిరణ్య వర్మ. కళ్ళల్లో నిప్పులుకక్కుతూ తన మదపుటేనుగు పరిగెత్తించుకు వచ్చాడు. సుప్రతీకంమీదికి వురికించాడు. ఏనుగులు రెండూ కల బడ్డాయి. రెండూ రెండు రెక్కలున్న కొండల్లా అవుపించాయి. కన్నుమూసి కన్ను తెరిచేలోపల హిరణ్మయుడి ఏనుగుని పొడిచేసింది సుప్రతీకం. కళవిళపడిపోయాడు హిరణ్మయుడు. అతడిమీద ఏడు తోమరాలు విసిరాడు భగదత్తుడు. ప్రాణాలు వొదిలేశాడు హిరణ్మ యుడు.

హిరణ్మయుడు చచ్చిపోయాక మరింత రెచ్చిపోయింది సుప్ర తీకం. అడ్డూ ఆపూలేకండా పాండవసేనమీద విరుచుకుపడింది. కకా వికలయిపోయి పరుగు ప్రారంభించాయి పాండవసైన్యాలు.

సాహసించి అడ్డంగా వచ్చాడు సాత్యకి. గట్టిదొక బాణం తీసి సూటిగా సుప్రతీకానికి తగిలించాడు. జిర్రుమని సాత్యకి దిక్కు తిరిగింది సుప్రతీకం. తొండం చాపి అతడిరథం పట్టుకుంది. అమాంతంగా మీదకెత్తి విసిరేసింది. సాత్యకిమాత్రం చిత్రంగా రథం గెంతేశాడు; దాటిపోయాడు. ఇంకోతట్టు తిరిగింది సుప్రతీకం. ఎదురైన సేనలు చిందరవందరచేసేసి తొక్కేసింది.

సాత్యకిరథం విరగలేదు. గుర్రాలకీ ప్రమాదం కలగలేదు. ఎలాగో వాటిని సరిచేసి పట్టుకువచ్చాడు సారథి. సంతోషించాడు సాత్యకి. యథాప్రకారం రథమెక్కాడు. సుప్రతీకంమీదికి విజృంభిం చాడు.

ఈలోగా రథం సరిచేసుకుని మళ్ళీవచ్చి కలబడ్డాడు భీముడు. తొండంతో తుంపుర్లుచిమ్మింది సుప్రతీకం. జడివానలో తడిసినట్టు ముద్దయిపోయాయి భీముడి గుర్రాలు. జజ్జరిల్లిపోయా యవి. పొకదారీ వొక తెన్నూ లేకండా ఈడ్చుకు పారిపోయాయి రథం.

భీముడి యుద్ధానికి అలా విఘాతంరావడంతోనే చివాల్నవచ్చి సుప్రతీకంమీద కలబడ్డాడు సుపర్వుడు. హేమాహేమీలకే దిక్కు-లేనపుడు సుప్రతీకంముందు సుపర్వుడు ఏమాత్రం! ఇలా వచ్చాడో లేదో అలా చంపి పారేసింది సుప్రతీకం.

సుపర్వుడు కూలిపోడంచూసి అభిమన్యుడూ ద్రౌపదికుమారుళ్ళు ప్రతివింధ్యుడూ మొదలైన అయిదుగురూ, చేకితానుడూ, ధృష్టకేతూ, యుయుత్సుడూ వొక్క-పెట్టుని సుప్రతీకాన్ని చుట్టుముట్టారు; శర వర్షం కురిపించారు.

కోపంతో మరింత సలిరేగిపోయింది సుప్రతీకం. గుర్రాలు తొక్కే-స్తూ యుయుత్సుడి రథంమీదికి వెళ్ళింది. అతడి సారథిని చంపేసింది.

పిసరంతా జంకలేదు యుయుత్సుడు. గభీమని గెంతేశా డతడు. అభిమన్యుడి రథ మెక్కే-శాడు. అక్క-ణ్ణుంచే సుప్రతీకాన్ని కొట్టడ మారంభించాడు. అభిమన్యుడూ మొదలైన పేరుపడ్డయోధులు యీ వన్నుందీ సుప్రతీకంమీద బాణాలు కుమ్మరించారు. తెల్లమబ్బుమీద సూర్యకిరణాలు పడుతూ ఎలావుంటాయి, అదిగో అలా అవుపించాయి సుప్రతీకంమీద బాణాలు.

మరింత దురుసుగా సుప్రతీకం వుసికొల్పాడు భగదత్తుడు. భయంకరంగా శత్రువులమీద విరుచుకుపడిం దది. రథాలు పట్టుకు విసిరేసింది. ఏనుగులూ, గుర్రాలూ నేలవేసి బాదేసింది. పదాతి సైన్యం తొక్కే-సి పచ్చడిపచ్చడి చేసేసింది. ఎక్క-డచూస్తే అక్క-డ వొక్క-టే వెయ్యేనుగుల్లా ప్రత్యక్షమయింది. భీముడూ,అభిమన్యుడూ మొదలైనవాళ్ళ పూనిక వ్యర్థమయింది. చెట్టోపిట్టయి చెదరిపోయారు పాండవసైనికులు. సొమ్ములకాపరి సొమ్ములకదుపులు రొప్పుకు-వెళ్ళి నట్టు, డేగ కాకిమూకలు వెంటతరిమినట్టు శత్రుసేనలుతరుముకువెళ్ళాడు

భగదత్తుడు. బ్రహ్మాండమైన ధూళి రేగింది. ఇన్నూ మన్నూ కనపడలేదు. చెప్పలేనంత కోలాహలం - చెవులు దిమ్మెత్తి పోయాయి.

సుప్రతీకం సంగతి ఇక్కడ ఇలావుంది. ఇందాక సంశప్తకుల సంగతి అడిగావుకదూ, చెపుతాను విను.

సుప్రతీకం విజృంభించడంతోనే ఇక్కడి పరిస్థితి గ్రహించేశాడు అర్జునుడు. "మనం మనసేనలోకి వెళ్ళాలి" కృష్ణుడిదిక్కు చూస్తూ అన్నాడతడు "సుప్రతీకంముందు నిలబడియుద్ధం చెయ్యడం ఎంతటి వాడికైనా సాధ్యంకానిపని. ఎంత పోరాడినా అలిసిపోదది. బ్రహ్మాండమైనబలం దాంది. శస్త్రాలూ, మహాస్త్రాలూ పిసరంతా లక్ష్యపెట్టదు. నువ్వూ నేనూ లేకపోతే తలమునకలవుతుంది అన్నయ్యకి. భీముడూ నొచ్చుకుంటాడు. అంచేత కృష్ణా, మనసేనలోకి రథం పోనీ."

"సరే," అంటూ రథం మళ్ళించాడు శ్రీకృష్ణుడు. చూశారు సంశప్తకులు. పద్నాలుగు వేలమంది, రేచుల్లా వెంటపడ్డారు. కేకలు వేశారు. దుర్రుచ్చి కొట్టారు. బాణవర్షం కురిపించారు. ఏంచెయ్యాలో తోచలేదు అర్జునుడికి. సైన్యం రక్షించాలా? సంశప్తకుల్ని సంహరించాలా? ఏంచెయ్యాలిప్పుడు? ఇలా వితర్కించుకుని తుదకి సంశప్తకుల పనిపట్టించడమే కర్తవ్యమని నిశ్చయించుకున్నాడు. చప్పున రథం వెనక్కి మళ్ళించాడు. గాండీవం మోగించాడు. - ఆకాశం ప్రతిధ్వనించింది. దేవదత్తం పూరించాడు. - దిక్కులు బద్దలయాయి. దివ్యబాణాలు ప్రయోగించాడు. సంశప్తకుల జెండాలూ, చామరాలూ, గొడుగులూ, విసనకర్రలూ, భేరీలూ, శంఖాలూ, కాహళాలూ, మృదంగాలూ తుక్కుతుక్కయి కిందపడ్డాయి. కవచాలూ, కిరీటాలూ, ధనుస్సులూ, బాణాలూ, ముసలాలూ, ముద్గరాలూ, బాకులూ, అంకుశాలూ ముక్కముక్కలయి రాలిపడ్డాయి. హారాలూ, భుజకీర్తులూ, కంకణాలూ, ఉంగరాలూ పిప్పిపిప్పిఅయి కుప్పలుపడ్డాయి. శిరస్సులూ

కాళ్ళూ, చేతులూ, గుండెలూ, కడుపులూ, నడుములూ పచ్చడిపచ్చడి అయిపోయాయి. వీటన్నిటితోనూ రణస్థలం ఎంత ఘోరంగా వుందాలో అంత ఘోరంగానూ వుంది. ఎంత అందంగావుండాలో అంత అందం గానూ వుంది. సర్వభూతాలూ అర్జునుణ్ణి పొగిడాయి. శ్రీకృష్ణుడూ చెయ్యీ చెయ్యీ కలిపి అతణ్ణి మెచ్చుకున్నాడు.

ఇలా సంశప్తకుల్ని సంహరించి "ఇక మన సేనలోకి రథం పరిగెత్తించు" అన్నాడు అర్జునుడు.

రథం తిప్పాడు శ్రీకృష్ణుడు. "అర్జునా, అర్జునా ఆగూ! అంటూ తమ్ములతో కలసి పరిగెత్తుకు వచ్చాడు సుశర్మ — "పిలుస్తూవుంటే పారిపోతున్నావు. రా, యుద్ధంచెయ్యి" అంటూ జంకూ గొంకూ లేకండా కేకలు వేశాడతను; కవ్వించాడు.

"ఏంచెయ్యమంటావు?" కృష్ణుణ్ణి అడిగాడు అర్జునుడు– "పిలుస్తూవుంటే వెళ్ళిపోకూడదు. అటు సైన్యాలు కాపాడకపోతే వీల్లేదు. ఈస్థితిలో ఏంచెయ్యాలో నువ్వే నిర్ణయించు" అన్నాడు.

చఱ్ఱున సుశర్మదిక్కు రథం తిప్పాడు శ్రీకృష్ణుడు. కోపంనవ్వు నవ్వాడు అర్జునుడు. గాండీవం గురిపెట్టాడు. సుశర్మవిల్లు ముక్కలుచేసేశాడు. అతడి జెండా ఎగరగొట్టేశాడు. అతడి తమ్ముళ్ళని చంపేశాడు. అతడి ఎదురొమ్ము దుసెళ్ళిపోయినట్టు వాడివాడి బాణాలు తగిలించాడు. ఆగలేకపోయాడు సుశర్మ. రథంమీద మూర్ఛపడిపోయాడు.

"ఇక పద" కృష్ణుణ్ణి తొందరచేస్తూ అన్నాడు అర్జునుడు — "అదిగో మన సైన్యాలు పారిపోతున్నాయి. ధూళి ఆకాశం కప్పేస్తూ వుంది. అల్లకల్లోలంగావుంది రణరంగం. భగదత్తుడి సుప్రతీకం నలిగిపోతూవుంది. సూటిగా దానిమీదికే పోనీ రథం".

రథం తిప్పాడు శ్రీకృష్ణుడు. పగ్గాలు సడిలించాడు. గరుడపక్షుల్లాగ పరుగెత్తాయి గుఱ్ఱాలు. బరిమీద పాము లాగ మన సైన్యా

మీాదికి వచ్చేసింది రథం. కోపంతోనూ, పరాక్రమంతోనూ రుద్రుడే అయిపోయాడు అర్జునుడు. మెరుగు బాణాలతో కౌరవుల్ని నురుమాడుతూ సింహనాదంచేశా డతడు. దేవదత్తం పూరించాడు. గాండీవం మోయించాడు. అలా దిక్కులు బద్దలుగొడుతూ సూటిగా సుప్రతీకం ఎదటికివచ్చి అడ్డుకున్నాడు.

ధృతరాష్ట్రుడు: ఆఁ! తరవాత, తరవాత? అర్జునుడూ, భగదత్తుడూ ఎలా యుద్ధం చేశారట !

## భ గ ద త్తు డు

సంజయుడు : అర్జునుడు రావడంతోనే జూలుదులిపిన సింహం లాగ లేచాడు భగదత్తుడు. ఉగ్రమైన బాణాలు అర్జునుడిమీాద ప్రయోగించాడు. అవన్నీ అవలీలగా కొట్టేశాడు అర్జునుడు. పైగా సుప్రతీకాన్నీ భగదత్తుణ్ణీ దృఢమైన బాణాలతో చెడామడా కొట్టాడు.

చురుకైనబాణాలు తగలడంతోనే వెర్రెత్తినట్టయిపోయింది సుప్రతీకం. అంకుశం పొడిచి రెచ్చగొట్టాడు భగదత్తుడు. అర్జునుడి రథంమీాదికి అదేవురకడం ఉరికింది సుప్రతీకం. "కృష్ణుడూ అర్జునుడూ అయిపోయారంటే అయిపోయారు" అని గోలుగోలుమంది పాండవసేన.

వెర్రివూపుతో వెళ్ళిపడుతోంది సుప్రతీకం. ఒడుపుతో టపీమని ఎడమపక్కకి రథం తిప్పేశాడు శ్రీకృష్ణుడు. ఆవూపుని వెళ్ళి ఎదట వున్న సైన్యం పాయలుచేసేసింది సుప్రతీకం.

కృష్ణుణ్ణి ఏమీా అనలేకపోయాడు అర్జునుడు. తన పక్కనించి వెళుతూన్న సుప్రతీకాన్ని చంపెయ్యాలంటే చంపెయ్యగల డతడు అయితే అది ధర్మయుద్ధంమాత్ర కాదు. అంచేత వూరుకున్నాడు. "సుప్రతీకం ముందుకి పోనీ రథం" పెదవులు బిగిస్తూ కృష్ణుడితో

అన్నాడతడు. ఉత్తరక్షణంలో ఏనుగుముందికి రథం తోలుకువెళ్ళాడు కృష్ణుడు.

ఏనుగుమీంచి కృష్ణుణ్ణి గురిపెట్టి బాణాలు వేశాడు భగదత్తుడు. కళ్ళల్లో నిప్పులు కురిశాడు అర్జునుడు. భగదత్తుడి బాణాలు సగంలోనే కొట్టేసి, అతడి వొళ్ళు దూసుకుపోయినట్టు బాణాలమీద బాణాలు గుప్పించాడు. భయంకరమైన కోపంతో మండిపోయాడు భగదత్తుడు. గబాగబా పద్నాలుగు తోమరాలు విసిరాడు అర్జునుడిమీద. ప్రతీదీ మూడేసి ముక్కలు చేసి కొట్టేశాడు అర్జునుడు. ఆవ్రాపుని సుప్రతీకం కవచం చిన్న చిన్న పిసర్లకింద కొట్టిపారేశాడు. కవచంపోడంతోనే మేఘంవొదిలిపోయిన కొండలాగ అవుపించింది సుప్రతీకం. అమాంతంగా శక్తితీసి అర్జునుడిమీద విసిరాడు భగదత్తుడు. సగంలోనే దాన్ని మూడుముక్కలుకింద కొట్టేసి, భగదత్తుడి గొడుగు ఎగరగొట్టేశాడు అర్జునుడు. ముసిలిభగదత్తుడు మరింతకోపంతో వొడికిపోయాడు. ఎన్నోఅన్ని తోమరాలు వరసపెట్టి విసిరాడు. అర్జునుడి కిరీటం పగలగొట్టేశాడు. అతడి లాఘవం మెచ్చుకున్నాడు అర్జునుడు. కాని అతడి ఉద్ధృతానికి మండిపడ్డాడు.

"ఆఖరిసారి లోకం చూసెయ్యి. మరి చూడలేవు" కిరీటం సరిచేసుకుంటూ భగదత్తుణ్ణి గదమాయించాడు అర్జునుడు.

ఆమాటలు శూలాల్లాతగిలాయి భగదత్తుడికి. తళతళామెరుస్తూ వున్న ధనుస్సు తీశాడతడు. కృష్ణుడిమీదా అర్జునుడిమీదా శరవర్షం కురిపించేశాడు.

గాండీవం మోగించాడు అర్జునుడు. భగదత్తుడి ధనుస్సూ, తూణీరమూ తుక్కుతుక్కుకింద తుడిచిపారేశాడు. వరసపెట్టి వందానలభై బాణాలు అతడి ఆయువుపట్టుల్లో తగిలించాడు.

భరించలేకపోయాడు భగదత్తుడు. వైష్ణవాస్త్రమంత్రంతో తన అంకుశం అభిమంత్రించాడు. అర్జునుడి ఎదురొమ్ము గురిచూసి అమాంతంగా వొదిలిపెట్టాడు. మంటలు కక్కుకుంటూ ఘోరంగా వెళ్ళింది వైష్ణవాస్త్రం. హాహాకారాలుచేస్తూ పడిపోయాయి పాండవసైన్యాలు.

చప్పున నొగలమీద నుంచున్నాడు శ్రీకృష్ణుడు. వస్తూన్న వైష్ణవాస్త్రానికి ఎదురొమ్ము వొడ్డాడు. అంత మహాస్త్రమూ కృష్ణుడి గుండెలమీద పడి వైజయంతిమాలలా వేలాడింది. నల్లటిమేఘంమీద వొక మెరుపుతీగ కదలకండా నిలిచిపోతే ఎలావుంటుంది. అదిగో అలా అవుపించింది శ్రీకృష్ణుడి గుండెలమీద వైష్ణవాస్త్రం.

"ధర్మమేనా ఇది!" చిన్నబుచ్చుకుంటూ అన్నాడు అర్జునుడు- "దయతో నాకు సారథ్యంమాత్రం చేస్తానన్నావు. యుద్ధంచెయ్యనని మాటఇచ్చావు. నేను అశ్రద్ధచేస్తే, లేదా ఆమహాస్త్రం ఎదుర్కోలేకపోతే నువ్వు ఇలా చేసినా బావుండేది. అంతేకాని అనవసరంగా ఇలా చెయ్యడం న్యాయమేనా నీకు! నాచేతిలో ధనుస్సూ బాణాలూ వున్నంతవరకూ ముల్లోకాల్లోనూ ఎవరూ నన్ను మించలేరని నీకు తెలుసు కదా! తెలిసి తెలిసీ నన్ను చులకనచేశావు!" అంటూ కంటనపడ్డాడు.

"అర్జునా, పొరపడుతున్నావు" చిరునవ్వుతో అన్నాడు శ్రీకృష్ణుడు – "రహస్యమైన పాతకథ వుంది దీనికి. చెపుతాను, విను. లోకహితంకోసం నాలుగుమూర్తులు ధరిస్తాను నేను. అందులో వొకటి భూలోకంమీద తపస్సులో వుంటుంది. రెండోది లోకంలోని సత్కర్మలు అసత్కర్మలు చూస్తూ వుంటుంది. మూడోది మానవలోకం ఆశ్రయించి కర్మలు చేస్తూ వుంటుంది. నాలుగోది వేలాదిసంవత్సరాలు యోగనిద్రలో వుంటుంది. యోగనిద్రనించి మేలుకున్నప్పుడు ఉత్తములు కోరిన వరాలు ప్రసాదిస్తూ వుంటుందది. అలా వొకసారి యోగ

నిద్రనించి లేచినప్పుడు భూదేవి నా నాలుగోమూర్తి దగ్గిరికి వచ్చింది. నరకాసురుడు భూదేవి కుమారుడు కదూ! అతడికోసం వైష్ణవాస్త్రం అర్థించిందామె. నేను అంగీకరించాను. ఇచ్చాను. నరకాసురుడి కొడుకు కదా, ఈభగదత్తుడు. తండ్రిదగ్గిరనుంచి ఇతడికి వచ్చింది ఆవైష్ణవాస్త్రం. ఈమహాస్త్రంముందు నేనుతప్ప బ్రహ్మరుద్రులైనా ఆగలేరు. నిన్ను బతికించేదికాదిది. అదిగో అంచేత నాఅస్త్రం నేనే స్వీకరించాను. అంతేగాని నిన్ను అవమానించాలని కాదు" అంటూ నచ్చచెప్పాడు. "ఇదిగో వైష్ణవాస్త్రం పోడంతోనే దిగాలుపడిపోతున్నాడు భగదత్తుడు. ఇతడి తండ్రిని నేను చంపేసినట్టు వీణ్ణి నువ్వు చంపెయ్యి" అన్నాడు.

తేరుకున్నాడు అర్జునుడు. గాండీవం సారించాడు. దృఢముష్టితో లాగి వాడి బాణం వొదిలిపెట్టాడు. కొండమీద పడ్డ వజ్రాయుధంలాగ సుప్రతీకం నొసలుమీద తగిలి దూసెళ్ళిపోయిందది. దెబ్బతో దంతాలు భూతపెట్టుకుని ముందుకి వొరిగిపోయింది సుప్రతీకం. వెంటనే తళతళమంటూన్న నెలవంక బాణ మొకటి తగిలించాడు అర్జునుడు. భగదత్తుడి కంఠం తెగేసి చక్కాపోయింది బాణం.

## శకుని తమ్ములు

భగదత్తుణ్ణీ, అతడి ఏనుగు సుప్రతీకాన్నీ చంపేసి ఎదురులేకండా విజృంభించాడు అర్జునుడు. అతడిమీదికి శకునితమ్ములు వృషకుడూ, అచలుడూ వెళ్ళి కలబడ్డారు. కలబడీ కలబడడంతోటే వృషకుడిజెండా వాడిబాణంతో నరికేశాడు అర్జునుడు. అతడి గొడుగూ, చామరాలూ ఎగరగొట్టేశాడు. గుర్రాలు కూల్చేశాడు. సారథిని చంపేశాడు. రథమూ తుక్కుతుక్కుకింద కొట్టేశాడు. జజ్జరిల్లిపోయాడు వృషకుడు. కళ్ళుమూసుకుని అచలుడి రథంమీదికి పారిపోయాడు.

శకుని తమ్ముల వెంట అయిదువందలమంది గాంధార దేశం వీర రథికులు వెళ్ళారు. వాళ్ళలో వొక్కణ్ణీ మిగలనివ్వలేదు అర్జునుడు. అందరినీ యమలోకం పంపించేశాడు. ఒక్క రథం మీాంచే అన్నదమ్ములు వృషకుడూ, అచలుడూ అర్జునుడితో పోరాడారు.

ఇద్దరూ సులువుగా వొక్కదగ్గిరేవుండడం చూశాడు అర్జునుడు. ఒకేవొక్క బాణం కొట్టాడు. ఇద్దరినీ చంపేశాడు. మేనమామల చావు కళ్ళారా చూశారు నీకొడుకులు. బావురుమన్నారు. కన్నీళ్ళు కార్చారు. ఎంతో అంత దుఃఖపడ్డారు.

## మాయలు జూదంలో, కాని ఇక్కడా మామా!

తమ్ములు కూలిపోడంతోనే దురుసుగా పరిగెత్తాడు శకుని. అమాంతంగా అర్జునుడిమీాద నులుచుకు పడ్డాడు. మాయావి కనక అనేక మాయలు కల్పించాడు. మేఘాలు పుట్టించాడు. రాళ్ళవర్షం కురిపించాడు. చెట్లకి చెట్లే అర్జునుడిమీాద దిమ్మరించాడు. రకరకాల ఆయుధాలు కుమ్మరించాడు. చిమ్మచీకట్లు కమ్మించాడు. వరదలు తెప్పించాడు, ఉగ్రమైన పెద్దపులులు పుట్టించాడు. భయంకరమైన క్రూరజంతువులు వురికించాడు.

దివ్యాస్త్రాలు తెలిసిన మహావీరుడు అర్జునుడు. శకునిమాయలన్నీ మటుమాయంచేసేశాడతడు. "మాయలు జూదంలో, కాని ఇక్కడా మామా!" నవ్వుతూ అన్నాడతడు - "జూదంతోనే మాయలపని అయిపోయింది. నాబాణాలు పాచికలనుకోకు. బతకాలని వుంటే కాళ్ళకి బుద్ధిచెప్పు" అంటూ వేడివేడి బాణాలు శరీరం తూంట్లుపడేట్టు టపీటపీమనిపించాడు.

అర్జునుడి బాణాలకి ఆగలేకపోవాడు శకుని. ధైర్యమూ, మానమూ రెండూ వొదిలేశాడు. పుంజాలు తెంపుకుని పలాయనంచిత్త

గించాడు. అలా నీమరిది వుడాయిస్తూవుంటే పాండవులు పకాపకా నవ్వారు. ఈలలు వేశారు. లేవిడీలు కొట్టారు.

శకుని పారిపోయాక అక్కడున్న మనసైన్యం తుడిచేస్తూ ద్రోణుడూ దుర్యోధనుడూవున్నదిక్కు బయలుదేరాడు అర్జునుడు. అతడి రెండుపక్కలా సాత్యకీ, భీముడూ సింహానాదాలుచేస్తూ, శత్రువుల్ని చెండాడుతూ బయలుదేరారు.

మనబలం విరిగిపోయింది. రెండుపాయలయిపోయింది. పారిపోయి వచ్చి దుర్యోధనుడివెనకా, ద్రోణుడివెనకా తలదాచుకుంది.

"ద్రోణుణ్ణి ఆక్రమించండీ, పట్టుకోండీ" అంటూ పాండవసేనలు ఉప్పెనలాగ తరుముకువచ్చాయి. ద్రోణుణ్ణిపట్టుకోవాలని పాండవులూ, కాసుకోవాలని కౌరవులూ వొకళ్ళమీద వొకళ్ళు కలబడ్డారు. యుద్ధమనే జూదంలో ఉభయపక్షాలూ ద్రోణుణ్ణి పందెం పెట్టుకున్నట్టున్నారు.

ద్రోణుడు ఎక్కడెక్కడ యుద్ధంచేస్తుంటే, అక్కడక్కడికల్లా వెళ్ళి యుద్ధంచేశాడు ధృష్టద్యుమ్నుడు. పాండవసేన ధర్మరాజూ, కౌరవసేన దుర్యోధనుడూ పురికొల్పుతూవుంటే, ప్రాణాలమీద ఆశ వొదిలేసి ఘోరంగా పోరాడాయి. మహారాజా! వాళ్ళ రౌద్రమూ, ఆయుద్ధమూ ఏమనిచెప్పనూ! ఎన్నడూ, ఎక్కడా కనీవినీ ఎరగమంటే నమ్ము.

అంతలో నీలుడనేరాజు అశ్వత్థామమీదికి రథం పరిగెత్తించాడు. అతడు రావడమే తడువు తీసిపెట్టి వొక్కబాణం కొట్టాడు అశ్వత్థామ. కీలు తప్పించేస్తే పడిపోయిన యంత్రంలాగ దెబ్బతో రథంమీంచి కింద తుళ్ళిపోయాడు నీలుడు. "సెబాస్ అశ్వత్థామా" అంటూ మెచ్చుకున్నాడు దుర్యోధనుడు. నీలుడు అలా చచ్చిపోగానే వాళ్ళసైన్యాలు చెదరిపోడమారంభించాయి. రెప్పపాటులో అక్కడ

వచ్చి వాలాడు ధృష్టద్యుమ్నుడు. అతడు రావడంతోనే మళ్ళీ తిరగ బడ్డాయి వాళ్ళ సైన్యాలు. ఘోరంగా జరిగిపోయింది యుద్ధం.

ఇంతలో "ఏడీ. ఏడీ - అర్జును డెక్కడ ?" అంటూ నారాయణ గోపాలబలంతో వచ్చిపడ్డారు సంశప్తకులు - "ఎక్కడ దాక్కున్నా డతడు? మేం వోడిపోలేదే! యుద్ధంచేస్తున్న మమ్మల్ని వొదిలేసి వచ్చేస్తే గెలుపనుకున్నాడో!" అంటూ కేకలువేశారు; కవ్వించారు. దాంతో మళ్ళీ దక్షిణదిక్కు వెళ్ళి వాళ్ళతో యుద్ధం మొదలుపెట్టాడు అర్జునుడు.

అర్జునుడు అటు వెళ్ళగానే తెరిపిఇచ్చినట్టయింది కౌరవులికి. పాలో అంటే పాలో అని వొక్కసారి శత్రువుల్ని తరుముకు వెళ్ళారు. నిభాయించుకోలేకపోయింది పాండవసేన. వెనక్కితగ్గడం మొదలు పెట్టింది. పారిపోతూవున్న బలగం అదలిస్తూ ముందుకివచ్చాడు భీముడు. ఎదురుగుండా వస్తూవున్న బాహ్లీకుణ్ణి "ఆగూ, అడుగు ముందుకి వేశావో ఆబోతు దక్కదు" అంటూ గదమాయించాడు. గదమాయిస్తూనే అతడిమీద పరంపరగా బాణాలు గుప్పించాడు.

దుర్యోధనుడూ, ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా - నలుగురూ వొక్క మొగిని భీముడిమీద కలబడ్డారు. శరవర్షం కురిపించారు. అందరికీ అన్నిరూపులయి పోట్లాడాడు భీముడు. భూమీ ఆకాశమూ దద్దరిల్లినట్టు సింహనాదం చేశాడు.

భీముణ్ణి వొక్కణ్ణీ అంతమంది ఘిరాయించడం చూసి తన వాళ్ళని పురికొల్పాడు ధర్మరాజు. నకులుడూ, సాత్యకీ, సహదేవుడూ, అభిమన్యుడూ వచ్చి భీముడికి సహాయం కలిశారు. దుర్యోధనుడూ మొదలైనవాళ్ళతో కలబడ్డారు.

అపరాహ్ణమయింది.

ఉభయపక్షాలకీ హాహాకారి పోరాటం జరిగిపోయింది. రథాలు మీదపడుతూవుంటే ఏనుగులు దొర్లిపోయేవి. కత్తులు పడుతూ వుంటే ఏనుగుల కుంభస్థలాలు పగిలి ముత్యాలు తుళ్ళుతూ వుండేవి. గుర్రాలు డెక్కలకిందపడీ, ఏనుగుల దంతాల్లో చీల్చుకుపోయీ సైనికుల పేగులు పైకివచ్చి వేలాడుతుండేవి. ఏనుగులమీద మావత్తుల చేతులు తెగిపోయినీ అంకుశాలు వొదలకండా విలవిలాకొట్టుకునేవి. ఏనుగులు తొండాలతో ఎత్తేస్తూవుంటే గుర్రాలతోకూడా రౌతులు వేలాడుతూ వుండేవాళ్ళు. ఎకటికాళ్ళు నరికేస్తూవుంటే ఏనుగులు ముందుకి కూలిపోయేవి. చెదిరిపోయిన ఏనుగులు గుర్రాల్నీ, సారథుల్నీ తొక్కేస్తూవుంటే రథాలు గుండపిండి అయిపోయేవి. రౌతులు వొక్క బిగిని నరికి పారేస్తూవుంటే కాలిబంట్ల అవయవాలు ఆనవాలులేకండా అయిపోయి కుప్పపడేవి.

అలా జరిగిపోతూవున్న దొమ్మీయుద్ధంలో ద్రోణుణ్ణి చూపించి "ఇదేసమయం" అంటూ తనసేనని హెచ్చరించాడు ధృష్టద్యుమ్నుడు. ఒక్కదూకుడుతో వచ్చి ద్రోణుడిమీద కలబడ్డాడతడు. సేనాధిపతి ఇసారాతో "పట్టండీ, కొట్టండీ, నరకండీ, చంపండీ" అంటూ ద్రోణుణ్ణి చుట్టుముట్టారు పాండవసేన రథాలవాళ్ళు.

ప్రళయభైరవుడే అయిపోయాడు ద్రోణుడు. అతడి రెండుకళ్ళూ అగ్గినిప్పులు కురిశాయి. ఘోరమైన దివ్యాస్త్రాలు ప్రయోగించాడు. ఆదివ్యాస్త్రాలముందు నిలవలేకపోయారు పాండవయోధులు. వాళ్ళ కాళ్ళూ చేతులూ ఆడలేదు. బొమ్మల్లానుంచుండిపోయారు. మనవాళ్ళు అదే సమయమంటూ వాళ్ళమీద ఘోరంగా పడ్డారు. చిందరవందర అయిపోవచ్చింది పాండవసేన.

ఇంతలో సంశప్తకుల్ని పావగొట్టి ఇటు తిరిగాడు అర్జునుడు. భయంకరమైన వానరపతాకంకాంతులు ఆకాశం ప్రతిఫలింపచేస్తూ,

ఉద్ధృతంగా రథం తోలుకువచ్చాడు శ్రీకృష్ణుడు. అగ్నిదేవుడికి గాలి దేవుడు తోడయినట్టు భీముడికి అర్జునుడు తోడయాడు.

అర్జునుడు రావడంతోనే మనవాళ్ళు అడిలిపోయారు. పాండవులు వెంటదరిమారు. ద్రోణుణ్ణి మించిన దివ్యాస్త్రాలు వేశాడు అర్జునుడు. ఆచార్యుల ఆటకట్టించినట్టు చేసేసి, మనసేనమీద గాండీవం గురిపెట్టాడు. భీముడూ పక్కనించి తరుముకువచ్చాడు. అన్నదమ్ములిద్దరూ కౌరవసేన రక్తనదుల్లో ముంచెత్తి వొదిలిపెట్టారు.

మనసైన్యాలు తట్టుకోలేకపోయాయి. "కర్ణా, కర్ణా, రక్షించు" అంటూ కర్ణుడివెనక్కి పారిపోవచ్చాయి.

## కర్ణార్జునులయుద్ధం

"భయపడకండి" అంటూ పెద్దపులిలా అర్జునుడితో కలబడ్డాడు కర్ణుడు. కలబడీ కలబడడంతోనే ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. వారుణాస్త్రంవేశాడు అర్జునుడు. చల్లారి వూరుకుంది ఆగ్నేయాస్త్రం. అలా ఆగ్నేయాస్త్రం ఆర్పేసి గట్టిగట్టిబాణాలు కొట్టాడు అర్జునుడు. ఇంతలో భీముడూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ వచ్చి అర్జునుడితో కలిశారు. తలా మూడేసి బాణాలు కర్ణుడికి తగిలించారు. అర్జునుడి బాణాలు అడ్డుకుంటూనే వారి ముగ్గురి ధనుస్సులూ నవ్వుతూ విరగ్గొట్టేశాడు కర్ణుడు. ధనుస్సులు ముక్కలయిపోడంతోనే ముగ్గురూ మూడు కత్తులు విసిరారు. మూడుకత్తులూ ముక్కలుచేసేసి సింహనాదంచేశాడు కర్ణుడు.

తాచుపాముల్లాటి ఏడు బాణాలు కర్ణుణ్ణి దుసెళ్ళిపోయినట్టు కొట్టాడు అర్జునుడు. మరో ఆరుబాణాలు వేసి శత్రుంజయుణ్ణి చంపేశాడు. ఒక వెడల్పాటిబాణం వేసి విపాటుడికంఠం నరికేశాడు.

కర్ణుడిరథం దాటి మనసేనలోకి చొచ్చుకు వచ్చేశాడు. అడ్డం వెళ్ళిన కర్ణుడి తమ్ముళ్ళని ముగ్గురినీ భూదేవికి బలిపెట్టేశాడు.

ఆ దేనమయంలో గదపట్టుకుని రథం దిగాడు భీముడు. కర్ణుడి బంధువుల్ని వాళ్ళనీ పదివేలమందిని బాదేసి పచ్చడిచేసేశాడు. తిరిగి రథంమీదికి వెళ్ళి మరో ధనుస్సు పుచ్చుకున్నాడు. కర్ణుణ్ణి అతడి గుర్రాల్ని తూంట్లుపడేట్టు బాణాలు గుప్పించాడు.

కత్తీ, డాలూ పట్టుకుని ధృష్టద్యుమ్నుడు రథం దిగాడు. చంద్రవర్మమీదా, బృహత్క్షత్రుడిమీదా కలబడ్డాడు. వాళ్ళ శిరస్సులు నరికేశాడు. తిరిగీ రథమెక్కి మరోవిల్లు పుచ్చుకున్నాడు. డబ్బయిమూడు బాణాలు కర్ణుడిమీద కుమ్మరించాడు. సాత్యకి మరోధనుస్సు తీశాడు. అరవైనాలుగు బాణాలు కర్ణుడిమీద రువ్వాడు. అతడి సారథిని కొట్టేశాడు. అతడి జెండా చీలికలుచేసేశాడు. తలమునకలయింది కర్ణుడికి.

దుర్యోధనుడూ, ద్రోణుడూ, జయద్రథుడూ పరుగెత్తుకు వెళ్ళారు. శత్రుసముద్రంలో మునిగిపోకండా కర్ణుణ్ణి ఉద్ధరించారు.

నాయకుల్ని వొదిలేసి ఉభయసేనలూ దారుణమైన యుద్ధం చేశాయి. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాలిబంట్లూ ఎంతో అంతమంది తెక్కాజమాలేకండా కూలిపోయారు. రక్తం కాలవలయి పారింది. అందులో కళేబరాలు కొట్టుకుపోయాయి. పేగులు పోగులు పడ్డాయి, వాటిలో పొదిగినట్టు మాంసంముక్కలు కుప్పలుపడ్డాయి. ఏనుగుల కళేబరాలూ, గుర్రాల శవాలూ దొంతులు దొంతులు పడ్డాయి. వాటికింద మానవదేహాలు పచ్చడిపచ్చడి అయిపోయాయి. తలకాయలు గుట్టలు గుట్టలయాయి. తెగిన కాళ్ళూ, చేతులూ వాటికింద మిలమిలలాడుతూ మెదిలాయి. ఘోరమైన ఆరణరంగం యావత్తూ రౌద్ర, భీభత్సాల నాటకరంగంలా అవుపించింది.

సూర్యుడు పడమటికొండ శిఖరం వెనక్కి వెళ్ళిపోయాడు. సాయంకాలం ఎరుపు పడి మరింత ఎరుపెక్కిన రక్తంమడుగుల్లో భూతాలూ భేతాళాలూ పరవళ్లుతొక్కాయి. వరళ్లు వచ్చి శవాలు కొరకడం మొదలెట్టాయి. గెద్దలూ, రాబందులూ మాంసం పీక్కు తింటూ కోలాహాలంచేశాయి. ఆభీభత్సంచూసినీ, రాత్రికావచ్చినా అవాళ యుద్ధం చాలించాలనుకోలేదు పాండవసేనలు.

అర్జునుడిదాడి మనవాళ్ళకి తలమునకలయింది. పరిస్థితి గమనించాడు మనసేనాని ద్రోణుడు. "సైన్యాలు మళ్ళించండి" అంటూ నాయకుల్ని హెచ్చరించాడు. మనసేనలు మళ్ళడంతోనే పాండవులూ యుద్ధం ఆపేశారు.

ఉభయసేనలూ తమతమ శిబిరాలికి మళ్ళాయి. ద్రోణుడి ప్రతిజ్ఞ భంగంకావడమూ, అర్జునుడి ప్రతాపం అద్భుతంగా వుండడమూ, అర్జునుడంటే శ్రీకృష్ణుడు ప్రాణంపెట్టడమూ – ఇదంతా చెప్పుకుంటూ చిన్నపోయిన మొహాలతో వచ్చేశారు మనవాళ్ళు.

## పదమూడో రోజు

మర్నాడు తెల్లవారింది. అందరూ యుద్ధానికి సిద్ధపడ్డారు. నీకొడుకు దుర్యోధనుడి మొహంలో మాత్రం చిక్కితే నెత్తురు లేదు.

"కపటంతో లాలించి వెర్రివాణ్ణి చేస్తున్నావు నన్ను" మన యోధులందరూ వింటూవుండగా ద్రోణుడితో అన్నాడతడు – "నిన్న ఎన్నోసార్లు నీకుచిక్కాడు ధర్మరాజు. తలుచుకుంటే ఇట్టే పట్టెయ్యగలవు నువ్వు. చంపెయ్యాలన్నా చంపెయ్యగలవు. కాని ఉపేక్షించావు. ఊరుకోవాలనే వూరుకున్నావు. అంత డాబుచేసి వరమిచ్చావు. నాకంట్లో కారంచల్లుతున్నావు. దీనివల్ల నువ్వు నొల్లు

కున్న దేమిటో అర్థంకాదు నాకు! నమ్ముకున్న వాళ్ళని బుద్ధిమంతుడు ఎవడన్నా ఇలాచేస్తాడో !" అన్నాడు.

ఎంతకటువుగా వుండాలో అంత కటువుగానేవున్నాయిరారాజు మాటలు. అయినా కంటసపడలేదు ద్రోణుడు. "నవ్వుతాలకన్నా నామాట అబద్ధం కాదని నమ్ము" మెల్లిగా అంటున్నా డతడు – "అర్జునుడి పరాక్రమం నీకు తెలుసు కదా! అతడికి సాక్షాత్తూ శ్రీకృష్ణుడు సహాయమాయె! ధర్మరాజుమీద ఈగవాలితే తమ మీద ఏనుగుపడ్డట్టు చూస్తారు వాళ్ళు. అంతా తెలిసి తెలిసీ నన్ను అనడం ఏం న్యాయం? ఇంతెందుకూ, ఇవాళ ఎవళ్ళని ఏంచేస్తానో చూడు! అయితే అర్జునుడుమాత్రం అడ్డురాకండా చూడు. అతణ్ణి దూరంగా లాక్కుపోగల యోధుల్ని ఎవరినయినా నియోగించు" అన్నాడు.

"మేంతప్ప మరెవళ్ళూ అర్జునుణ్ణి నిభాయించలేరు" అన్నారు సంశప్తకులు- "మేమే అతణ్ణి దూరం తీసుకుపోతాం. యుద్ధంలో మూడుచెరువులనీళ్ళూ తాగిస్తాం" అంటూ బయలుదేరారు. వెళ్ళి అర్జునుణ్ణి కవ్వించి పిలిచారు. సంశప్తకులికీ అర్జునుడికీ ఘోరమైన యుద్ధం జరిగిపోయింది.

అర్జునుడు అలా వెళ్ళగానే ద్రోణాచార్యులు పద్మవ్యూహం పన్నాడు. ధర్మరాజుమాటమీద అభిమన్యుడు పద్మవ్యూహంలో చొర బడ్డాడు. బృహద్బలుడూ, మొదలైన రాజుల్నీ, లక్ష్మణుడూ మొద లైన రాజకుమార్ళనీ ఎంతోమందిని అతడు హతమార్చాడు. తుదకి అనేకమంది మహాయోధులమధ్య చిక్కుపడిపోయాడు. బ్రహ్మాండమైన పరాక్రమం ప్రదర్శించి తుదకి ప్రాణాలు వొదిలిపెట్టాడు. సంతోషిస్తూ మనవాళ్ళూ, దుఃఖపడుతూ పాండవులూ శిబిరాలు చేరుకున్నారు.

---

# ద్రోణపర్వం



## రెండో ఆశ్వాసం

"సంజయా, హృదయం తరుక్కుపోతూవుంది." దుంఖపడుతూ అన్నాడు ధృతరాష్ట్రుడు - "నామనవళ్లోకల్లా ఉత్తముడు అభిమన్యుడు. పురుషుల్లో సింహంవంటివాడు, గుణవంతుడు. కఠినాత్ములు పదిమందీ మీదపడి ఎంతకష్టపెట్టారో! పాపం, పువ్వులాంటి సుకుమారుడు. ఎంత బాధపడిపోయాడో! చెప్పు, సంజయా, చెప్పు. వివరంగా జరిగిందంతా చెప్పు" అన్నాడు.

### పద్మవ్యూహం

"ద్రోణాచార్యులు పద్మవ్యూహం పన్నాడు" సంజయుడు అందుకున్నాడు - "అభేద్యమైన వ్యూహ మది. చక్రాకారంగా వుండడంచేత చక్రవ్యూహమనీ అంటారు దాన్ని. దేశదేశాలరాజులు దానికి దళాలు. సమవయస్కులు పదివేలమంది రాజకుమార్లు కేసరాలు. కర్ణుడూ, దుశ్శాసనుడూ మొదలైనయోధులతోనూ, ఎంతో అంత సేనతోనూ, నాగుపాముజెండాతో మధ్య దుర్యోధనమహారాజు కర్ణిక. వ్యూహంముందు తెల్లగొడుగుతో స్వయంగా నుంచున్నాడు సేనాని ద్రోణుడు. ద్వారం దగ్గిర సైంధవుడు జయద్రథుడు పెట్టనికోట లాగ నుంచున్నాడు. అతడికి దన్ను అటూ ఇటూ శల్యుడూ, అశ్వత్థామా, భూరిశ్రవుడూ మొదలైన మేరికల్లాంటివాళ్ళు నిలబడ్డారు. అవసరమైన కీలకస్థానాల్లో కృపాచార్యులూ, శకునీ, కృతవర్మా,

శలుడూ, నీకొడుకులూ, మనవలూ మొదలైనవాళ్ళు బందోబస్తుగా సర్దుకున్నారు.

అందరూ ఎర్రటి పూలదండలే వేసుకున్నారు. ఎర్రటిగంధాలే పూసుకున్నారు. ఎర్రటి ఆభరణాలే పెట్టుకున్నారు. ఎర్రటి వస్త్రాలే కట్టుకున్నారు. అద్భుతంగావుంది పద్మవ్యూహం.

భీముణ్ణి ముందు పెట్టుకుని అటు పాండవబలగమూ తర్లివచ్చింది. సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, కుంతిభోజుడూ, చేకితానుడూ, క్షత్రధర్ముడూ, క్షత్రవర్ముడూ, ధృష్టకేతువూ, నకులసహదేవులూ, ఉత్తమౌజుడూ, శిఖండీ, యుధామన్యుడూ, ఘటోత్కచుడూ, విరాటరాజూ, ద్రుపదమహారాజూ, ద్రౌపదికుమారుళ్ళూ, కేకయులూ, సృంజయులూ మంచి ఉద్రేకంతో వచ్చి ద్రోణాచార్యుణ్ణి ఎదిరించారు.

వాళ్ళని చూచి పకాపక నవ్వాడు ద్రోణుడు. ఉగ్రమైన బాణాలు కురిపించాడు. తన ప్రతాపమంతా చూపించాడు. ఆ మహావీరుడిముందు వాళ్లు వొక్కళ్ళూ నిలవలేకపోయారు. అంత పాండవసైన్యమూ వెనక్కి తగ్గేసింది. సహించలేకపోయాడు ధర్మరాజు. భయంతోనూ, ఆశ్చర్యంతోనూ తెల్లపోయాడతడు. అతడి కరచరణాలాడలేదు.

## అభిమన్యుడు

పద్మవ్యూహం భేదించుకు వెళ్ళడానికి ధర్మరాజుసైన్యంలో అర్జునుడూ, తప్పిస్తే అభిమన్యుడూ – ఈఇద్దరే సమర్థులు. అర్జునుడు సంశప్తకులతో యుద్ధంచేస్తూ దూరంగా వున్నాడు. ఇప్పుడు అభిమన్యుడు వొక్కడే ఆధారం. ఉత్సాహంతోనూ, శౌర్యంతోనూ, తేరిచూడ్డానికి వీల్లేకండా అతడే అవుపిస్తున్నాడు. అతడికి తప్ప

ఆ మహావ్యూహం మరొకడికి సాధ్యం కాదు. అదే ఆలోచించాడు ధర్మరాజు.

"బాబూ నువ్వే ఇప్పుడు పూనుకోవాలోయి" – అభిమన్యుడితో అన్నాడతడు – "పద్మవ్యూహం భేదించడం మాకు ఎవ్వరికీ చేతకాదు. మీనాన్నా, ప్రద్యుమ్నుడూ, నువ్వూ – మీముగ్గురికే ఇది తెలుసు. ఇప్పుడు వీగిపోయి పూరకున్నామా మీనాన్న వచ్చి మనల్ని కమ్మలుకట్టి వొదిలిపెడతాడు. అలా కాకండా, పరాక్రమం చూపెట్టి పద్మవ్యూహం భేదించాలి నువ్వు" అన్నాడు.

"తప్పకండా" – కలకల్లాడుతూవున్న మొహంతో అన్నాడు అభిమన్యుడు– "పద్మవ్యూహం భేదించుకు పోతాను నేను. అయితే దీన్ని భేదించుకుని లోపలికి వెళ్ళడంమాత్రమే చెప్పాడు నాన్న. చించి చెండాడుకుంటూ వెళ్ళిపోతాను. అంతే. లోపల వాళ్ళంతా చుట్టుముట్టారో, తిరిగీ తప్పించుకు బైటపడలేను. అదిమాత్రం ఇంకా చెప్పలేదు నాన్న. అయినా వచ్చినచింత ఏమీలేదు. ఎలా చొచ్చుకు వెళ్ళిపోతానో మీరే చూద్దురుకాని" అన్నాడు.

"దారిచేసుకుని నువ్వు పోయావంటే చాలు. మేం యావన్మందిమీ చొరబడతాం" అన్నాడు ధర్మరాజు.

"నువ్వు రవంత దారిచేస్తే చాలు" అన్నాడు భీముడు – "ధృష్టద్యుమ్నుడూ, ద్రుపదుడూ, సాత్యకీ, మీతాతయ్య విరాటరాజూ, నేనూ చించి చిందరవందరచేసేస్తాం పద్మవ్యూహం" అన్నాడు.

"మీమాటకి తిరుగుంటుందా బాబయ్యగారూ" అన్నాడు అభిమన్యుడు – "పెదనాన్న ఇంత ఇదిగా చెప్పారు. ఇంతకంటే నాకు కావలిసింది ఏముంది! నాన్నా, అమ్మా ఇంతవాణ్ణి చేశారు నన్ను. ఇది పూరికే పోనిస్తానా, ఇదిగో, 'వొక కుర్రాడు పశువులు రొప్పి

నట్టు కౌరవయోధుల్ని వెంటకరిమాడు' అని జనం చెప్పుకోవాలి. ద్రోణాచార్యులు 'సెబాసంటే సెబాసు' అని మెచ్చుకోవాలి. మా మావయ్యా, మా నాన్నా బ్రహ్మానంద మనుభవించాలి. అదిగో అలాగ పద్మవ్యూహం చించి చీలికలుచేసి పారేస్తాను చూడండి. దుర్యోధనుడికి ఇవాళ ప్రళయం పుట్టిస్తాను'' అన్నాడు.

"నీధైర్యమూ, శౌర్యమూ, కీర్తి అసమానంగా వర్థిల్లాలోయి బాబూ'' - ఆనందిస్తూ ఆశీర్వదించాడు ధర్మరాజు.

సారథీ, ద్రోణుడిమీదికి రథం పోనీ'' తన సారథి సుమిత్రుణ్ణి ఆదేశించాడు అభిమన్యుడు.

"ఆలోచించు'' తటపటాయిస్తూ అన్నాడు సుమిత్రుడు — "నువ్వేమో యువకుడివి. ద్రోణుడూ మొదలైన సేనానాయకులు ఉద్దండులు; అనేకులు, ఇుంకా-కలు తేరినవాళ్ళు. యుద్ధమంటే ఇదే శ్రీకారం నీకు. వాళ్లు నీచేత కూలిపోతా రనుకోకు'' అన్నాడు.

"దేవతలందరితోనూ కలిసి దేవేంద్రుడే రానీ, వీగ్గొట్టి విడిచి పెడతాను'' నవ్వుతూ అన్నాడు అభిమన్యుడు — "లేదా, ప్రమథ గణాలతో పరమశివుడే రానీ - ఇంతెందుకూ మా అయ్య అర్జునుడూ, మామయ్య శ్రీకృష్ణుడూ రానీ - వీగిపోడమన్న మాట మనకి వుండ దనుకో. తెలిసిందా, ద్రోణుణ్ణీ గీణుణ్ణీ నేను లక్ష్య పెడతానా? అడ్డు చెప్పకు. పోదాం పద'' అన్నాడు. బదులు చెప్పకండా అతణ్ణి తొందరచేసేశాడు. ధనుస్సు రౌద్రం మోగించాడు.

అనుమానిస్తూనే పగ్గాలు సడిలించాడు సుమిత్రుడు. క్షణంలో పద్మవ్యూహంముందు వచ్చి నిలిచింది అభిమన్యుడి రథం. దాని వెనక అపారమైన పాండవబలం యీవత్తూ పరిగెత్తుకు వచ్చింది. పద్మ వ్యూహం ముఖద్వారంలో కొండల్లా నుంచునివున్నారు ద్రోణుడూ

మొదలైన మనవాళ్ళు. ఒకళ్ళనిమించి ఒకళ్ళు ముందుకి వెళ్ళారు. పాండవబలాన్ని భయంకరంగా ఎదిరించారు. దారుణంగా ఆరంభమయింది యుద్ధం.

మెరుపు మెరిసినట్టు మెరిసింది అభిమన్యుడి రథం. కర్ణికార పతాకం జిగేలుమంటే జిగేలుమంది. ద్రోణుణ్ణి బాణాలతో ఉక్కిరిబిక్కిరి చేసేసింది రౌద్రం. అంతే. పద్మవ్యూహం ఛేదించేశాడు అభిమన్యుడు. లోపల చొరబడిపోయాడు.

పద్మవ్యూహంలో దూసుకుపోయాడు అభిమన్యుడు. రౌద్రరసంతో ఉప్పొంగిపోయాడతడు. మహాసముద్రంలో తిరుగుతున్న మందరపర్వతంలాగ, మహారణ్యంలో దావాగ్నిలాగ, కాలం తీరిన మానవకోటిని మారణహోమంచేసేస్తున్న ప్రళయశివుడిలాగ చెలరేగిపోయాడు. వ్యూహం వ్యూహం యావత్తూ కలగుండుపెట్టేసి, పొడిపొడి చేసేసి, రూపుమాపేసి రణవిహారం చేశాడు. అతడు రువ్విన రకరకాల బాణాలూ, మహాస్త్రాలూ ఎదటి శత్రువుల ఆయుధాలికి తగిలి మంటలుమండాయి. ఏనుగుల్ని దూసుకుపోయాయి. రథాలు నరికేశాయి. గుర్రాలు కూల్చేశాయి. కూరలు తరిగినట్టు కాల్బలాలు తరిగేశాయి. ధనుస్సులు ముక్కలు చేశాయి. జెండాలు తెగేశాయి. గొడుగులు పొడిచేశాయి. రథాలగుర్రాలు నరికేశాయి. యోధుల కవచాలు పగలగొట్టాయి. సారథుల్ని చంపేశాయి. రథికుల భూషణాలు దుళ్ళగొట్టాయి. కత్తులు విరిచేశాయి. కళేబరాలు కుప్పలు పెట్టాయి. బాణాలు ముక్కలుచేశాయి. సైనికుల చేతులూ కాళ్ళూ తెగేశాయి. గదలూ, ముద్గరాలూ, ప్రాసలూ తుడిచేశాయి. తలకాయలు ఎగరగొట్టేశాయి. అంకుశాలు మళ్ళగొట్టాయి. కండలు చెక్కేశాయి. రక్తాలు వరదలుకట్టించాయి. ఎముకలు విరిచేశాయి.

దాంతో కలతపడిపోయి, సంకటపడిపోయి, సంక్షోభపడిపోయి, వారిగిపోయి, భయపడిపోయి, కకావికలయిపోయి నానా ఇదీ అయిపోయింది పద్మవ్యూహం

దుర్యోధనుడికి తేళ్ళూ జెర్రులూ పాకాయి. ఆకలితోవున్న సింహందగ్గిరికి బుద్ధిలేని ఏనుగు వెళ్ళినట్టు అభిమన్యుడిదగ్గిరికి అడ్డుకుందికి పరిగెత్తా డతడు.

"అభిమన్యుడిచేతిలో పడిపోయాడు దుర్యోధనుడు" — తన యోధులికి చెయ్యివిసిరి కేకలువేశాడు ద్రోణుడు - "పరిగెత్తండి. బాణాలు వెయ్యండి. అడ్డుపడండి. ఉరకండి. మీశూరత్వమంతా చూపెట్టండి" అంటూ పురికొలుపుతూ తనరథం అటుతిప్పాడు.

కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా, శలుడూ, శల్యుడూ, శకునీ, కర్ణుడూ, సౌమదత్తీ, పౌరవుడూ, వృషసేనుడూ మొదలైన మహావీరులు వొక్క మొగిని పరిగెత్తారు. దుర్యోధనుడు అభిమన్యుడి వాతపడకండా అడ్డుకున్నారు. అలా వాళ్ళు అడ్డుపడకపోతే రారాజు పని ఏమయేదో ఊహించలేం. దుర్యోధనుడు చెయ్యిజారిపోడంతోనే భీషణంగా హుంకరించాడు అభిమన్యుడు. నోటిలోని కండ లాక్కుపోతే పెద్దపులి ఎలా గర్జిస్తుంది, అదిగో అలా గర్జించా డతడు. ఒక్కసారి నలిరేగిపోయాడు. మనవాళ్ళని అంతమందినీ అడలగొట్టేశాడు. అతడి బాణాలముందు వొక్కడూ నిలవలేకపోయాడు. అంతమందీ పులిముందు లేళ్ళలా చెల్లాచెదరయిపోయారు. సింహనాదం చేశాడు అభిమన్యుడు.

అభిమన్యుణ్ణి అడ్డుకోడం మనవాళ్ళ తరంకాదని గ్రహించేశాడు ద్రోణాచార్యులు. దాంతో తానే స్వయంగా బయలుదేరాడు. అతడు వెళ్ళడం చూసి అంతవరకూ వెనక్కి తగ్గిన అశ్వత్థామా మొదలైన

యోధవన్నందీ అతడివెంట ఎగబడ్డారు. అభిమన్యుడిమీద బాణవర్షం కురిపించారు. మహారాజా, నీకు అబద్ధం, నాకు నిజం - అంతమంది బాణాలూ అద్భుతంగా ఇట్టే ఖండిస్తూ వచ్చాడు అభిమన్యుడు. ఇటు బాణాలు ఖండిస్తూనే వున్నాడు, అటు అందరినీ తూంట్లుపడేట్టు కొడుతూనే వున్నాడు. అతణ్ణి ఆక్రమించినవాళ్ళలో వొక్కడూ అతడి బాణాలు మూసుకుపోనివాడు లేడు. అయినా మనవాళ్ళు అతణ్ణి ముట్టడించడం మానలేదు.

అదే సమయమని తనసేనకి చెయ్యివిసిరాడు నీకొడుకు దుర్యోధనుడు. ఉప్పొంగిన పెద్ద సముద్రంలా విరుచుకుపడింది మనసేన. దానికి తగిన మానాపొడ్డులా అవుపించాడు అభిమన్యుడు.

కౌరవసేన అభిమన్యుణ్ణి ఘిరాయించింది. దుర్యోధనుడూ, కృపుడూ, భూరిశ్రవుడూ, అతడిమీద మూడేసిబాణాలు కొట్టారు. ద్రోణుడు పదిహేను కొట్టాడు. వివింశతి ఇరవై కొట్టాడు. అశ్వత్థామ అయిదూ, బృహద్బలుడు ఎనిమిదీ, శల్యుడు ఆరూ, కృతవర్మ ఏడూ, శకుని రెండూ, దుశ్శాసనుడు పన్నెండూ, దుస్సహుడు తొమ్మిదీ కొట్టారు. ఈఅందరినీ తలా అయిదేసి బాణాలతో కొట్టాడు అభిమన్యుడు.

ఇంతలో అశ్మకుడు దురుసుగా అభిమన్యుడిమీదికి తోసుకు వెళ్ళాడు. అతడి జెండా చించేసి, గుర్రాలు కూల్చేసి, సారథిని చంపేసి కట్టకడపట అతడి తలకాయ నరికేశాడు అభిమన్యుడు.

## అంతమందీ వొక్కసారి

అశ్మకుడు హతమైపోడంతోనే మన మహారథులందరూ తమతమ సైన్యాలు పారిపోకండా మళ్ళించారు. ద్రోణుడూ మొదలైన యోధులూ, నీకుమాళ్ళు కొందరూ - యోధవన్నందీ వొక్కసారి అభి

మన్యుడిమీద విరుచుకు పడ్డారు. ఎన్నో అన్ని అస్త్రాలూ, ఎన్నో అన్ని శస్త్రాలూ వొక్క మొగిని అతడిమీద కుమ్మరించారు.

భరించలేని కోపంతో పేట్రేగిపోయాడు అభిమన్యుడు. అంత మంది శరీరాలూ రక్తకళ్ళలుచేసి వొదిలిపెట్టాడు. ఆవ్యూహాన్ని వచ్చి కర్ణుడిమీద పడ్డాడతడు. అతడి కవచం చీల్చుకుని, వొళ్ళు దూసెళ్ళి పోయినట్టు క్రూరమైన ఉక్కుబాణ మొకటి కొట్టాడు. దెబ్బతో మూర్ఛపోయాడు కర్ణుడు. అలాంటి ఉక్కుబాణాలే సేనోడుకులమీదా ప్రయోగించాడు అభిమన్యుడు. వాళ్ళందరినీ వెనక్కి పరిగెత్తినట్టు చేశాడు. మిడతల్లాగ మీదికివెళ్ళుతూన్న రాజులందరినీ అగ్ని హోత్రుడిలాగ మాడ్చి మాడ్చి వొదిలిపెట్టాడు.

అలా చెలరేగిపోతూవున్న అభిమన్యుణ్ణి అడ్డుకోబోయాడు శల్యుడు. పిడుగుల్లాటి బాణాలు రువ్వాడు అభిమన్యుడు. మూర్ఛపోయి రథంమీద వొరిగిపోయాడు శల్యుడు. పట్టపగ్గాలు లేనట్టు మరింత విజృంభించాడు అభిమన్యుడు. పద్మవ్యూహమంతా జర్జరిల్లిపోయినట్టు సింహనాదంచేశాడు. అరిచేతిలో ప్రాణాలుపెట్టుకుని పక్కపక్కలికి తప్పుకున్నాయి మనసైన్యాలు. ద్రోణుడు కేకలువేస్తూనే వున్నాడు. హెచ్చరిస్తూనే వున్నాడు. లాభంలేకపోయింది.

అన్నగారి అవస్థ చూసి సహించలేకపోయాడు శల్యుడి తమ్ముడు. ఉద్రేకంతో అభిమన్యుడిమీదికి దూసుకువెళ్ళాడు. తీవ్రమైనబాణాలు పది అభిమన్యుడిమీద నాటించాడు. అరికాలిమంట నెత్తికెక్కినట్టయింది అభిమన్యుడికి. అతడి గుర్రాలు కూల్చేసి, సారథిని చంపేశాడు. జెండా పడగొట్టేశాడు. ధనుర్బాణాలతో రెండుచేతులూ నరికేశాడు. రథం ముక్కలుచేసేశాడు. చివర వొక పిడుగులాటిబాణం వేసి అతడి శిరస్సు నరికి కింద పడేశాడు. ఇదంతా వొక లిప్తలో

జరిగిపోయింది. చుట్టూవున్న రాజులూ, రాజకుమారులూ నిలువునా నీరువిడిచిపోయారు.

ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, కృతవర్మా, బృహద్బలుడూ, కర్ణుడూ మొదలైన మహాయోధులు వాళ్ళనొకళ్ళు వేరువేరుగా పిలుచుకున్నారు. తమతమ సైన్యాలు పురికొల్పుకున్నారు. అంతమందీ వొక్కసారి అభిమన్యుణ్ణి ఆక్రమించారు. ఓ, రథచక్రాలు, ఏనుగుల గంటలూ, గుర్రాల గజ్జలూ, వీరుల సింహనాదాలూ – ఆకాశం బద్దలయిపోయినట్టయింది. రౌద్రం మూర్తీభవించినట్టయింది.

అభిమన్యుడు అట్టహాసంచేశాడు. లాఘవమూ, లక్ష్యశుద్ధీ చిత్రత్వమూ, దృఢత్వమూ - అన్నిటిలోనూ అచ్చంగా అర్జునుడిలాగ, కృష్ణుడిలాగ అద్భుతంగా యుద్ధంచేశాడతడు. చక్రంలా వంగివున్న ధనుస్సుతో కిరణాలవంటి బాణాలు వీరజిమ్ముతూ, గుడికట్టి కిరణాలతో తేరిచూడడానికి వీల్లేని సూర్యుడిలా అవుపించాడు. అల్లెతాడు మోగిస్తూ భీషణంగా ఉక్కుబాణాలు విరజిమ్ముతూ, సింహనాదం చేస్తూ ఉరుములు వురుముతూ పిడుగులు కురుస్తూన్న ప్రళయ మేఘంలా విజృంభించాడు. * భల్లమూ, అంజలికమూ, క్షురప్రమూ, కూర్మనఖరమూ మొదలైన దారుణమైన బాణాలు పుంఖానుపుంఖంగా ప్రయోగించాడు. యావన్మందినీ జజ్జరిల్ల గొట్టేశాడు. కౌరవసేన కకావికలయిపోడ మారంభించింది. అంతద్రోణాచార్యులూ నిలవరించలేకపోయాడు. నిచ్చేరపోయి నిలబడిపోయాడు.

---

* భల్లం : వెడల్పాటి మొనబాణం. అంజలికం : నెలవంకవంటి మొన బాణం. క్షురప్రం గుర్రంనాడావంటి మొనబాణం. కూర్మనఖరం : తాబేలు గోరువంటి మొనబాణం.

ధృతరాష్ట్రుడు : సంతోషమూ - దుఃఖమూ - అబ్బా, కుదిపేస్తున్నాయి నన్ను. సంజయా, ఆఁ, చెప్పూ, చెప్పూ తరవాత ఏం జరిగిందట ?

సంజయుడు : పారిపోతూన్న మనసేననీ పోనివ్వలేదు అభిమన్యుడు. చుట్టూ తిప్పితిప్పి హతవార్చడం లంకించుకున్నాడు. కొరివి తిప్పినట్టు వెంటతరిమాడు. ఎదురైన వాళ్ళనల్లా పీనుగుపెంటలు చేశాడు.

అలా అద్భుతమైన పరాక్రమం ప్రదర్శిస్తూన్న అభిమన్యుణ్ణి చూసి అపరిమితానందం కలిగింది ద్రోణాచార్యులికి.

"నేను నమ్ముకున్న మన యోధుల్లో వొక్కడూ ఇతడిముందు దిగదుడుపుకన్నా పనికిరాలేదు" - దుర్యోధనుడికి అభిమానం కలగా లన్న అభిప్రాయంతో కృపాచార్యులతో అన్నా డతడు - "నిజంగా అభిమన్యుడంత యోధుడు లేడు. తమ్ములూ, అన్నలూ, స్నేహితులూ, తండ్రులూ, మామలూ, సేవకులూ - యావన్మందీ సంతోషించేట్టు ఎలా యుద్ధంచేస్తున్నాడో చూడూ! మన గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ వొక్కడే సర్వాదుంబాలా చేసేస్తున్నాడు" అన్నాడు.

చిక్కితే నెత్తురుచుక్కలేని మొహంతో చిన్నబుచ్చుకున్నాడు దుర్యోధనుడు. "విన్నారా మనగురువుగారి మాటలు!" నవ్వుకాని నవ్వుతో శల్యుడూ మొదలైన యోధులతో అన్నా డతడు - "విల్లుపట్టిన ప్రతివాడికీ గురువు ఈయన. ముక్కుపచ్చలారని నిన్నటికుర్రాడు అభిమన్యుడు. చిన్నతనమే ఇంకా వొదలలేదు. మంచీ చెడ్డా ఎరగడు. అలాంటివాణ్ణి కొట్టెయ్యడం మానేసి పైగా పొగుడుతున్నాడు! ఎంతచేస్తే ఏంలాభం! అర్జునుడిమీద వలపక్షంపోనిచ్చుకున్నాడు కాడు."

"ఈయన పూరుకోబట్టే అభిమన్యుడు ఇలా మిడిసిపడు తున్నాడు. అంతా తనప్రతాపమే అనుకుంటున్నాడు. తను ఏపాటి వాడో తనకే తెలియకుండావుంది. రండి. అందరూ వొక్కసారి మీాద పడండి. దృఢమైన అస్త్రాలువేసి వీడి తుదచూసెయ్యండి" అన్నాడు.

రాజు మాటప్రకారం మనవాళ్ళు యావన్మందీ వొక్కసారి ఉరకబోయారు.

## దుశ్శాసనుడి దురుసు

"మీారు ఆగండి" దురుసుగా ముందుకివెళ్ళి అన్నాడు దుశ్శా సనుడు - "నేను వొక్కణ్ణి చాలు వీడి బతుక్కి. సూర్యుణ్ణిమింగేసిన రాహువులాగ నిమిషంలో వీణ్ణి పూడ్చేస్తాను. వీడు చచ్చాడని వింటే చాలు కృష్ణుడూ, అర్జునుడూ దుఃఖంతో కుమిలిపోయి, చచ్చిపూరు కుంటారు. వాళ్లు ఇద్దరూ చస్తే కథే ఆగిపోతుంది. మనపగ తీరి పోతుంది. మీారు చూస్తూవుండండి, నాపరాక్రమం ఎలాచూపిస్తానో" అంటూ పెద్ద రంకెవేశాడు. బాణాలు విరజిమ్ముతూ అభిమన్యుడి మీాదికి పరిగెత్తాడు.

దగ్గిరికి చేరాడో లేదో దుశ్శాసనుడు, అరవై వొక్కబాణాలు గబగబా అతడివొంటిమీాద నాటించాడు అభిమన్యుడు. కోపంతో కళ్ళెర్రచేసి జడివానలా బాణాలు కురిపిస్తూ కలబడ్డాడు దుశ్శాసనుడు. వాళ్ళిద్దరి కరలాఘవమూా, శరలాఘవమూా, వొకరిమీాద వొకరు చిత్రచిత్ర గతుల్తో రథాలు పురికించడమూా - మహారాజా, చూసిన వాళ్ళంతా సెబాసంటే సెబాసు అన్నారు.

పెదవులు బిగించి బాణాలు వొదిలాడు అభిమన్యుడు. దుశ్శా సనుడి విల్లు ముక్కలు చేసేశాడు. "పారిపోకండా వొక్కక్షణం

నిలబడు" — శరీరం చెక్కుకు పోయినట్టు కొడుతూ అన్నాడతడు — "ఆవాళ మహాత్ముణ్ణి ధర్మరాజుని అంతేసిమాటలని నొప్పించావు. దానిఫలం ఇప్పుడే రుచిమూద్దువు కాని. నీచుడివి. క్రూరుడివి. నీతి మాలినవాడివి. మదాంధుడివి. నిన్ను చంపేస్తాను. నన్ను పెంచిన మా అయ్యల రుణం తీర్చుకుంటాను" అన్నాడు. అంటూనే దుశ్శాసనుడి కొంకుల్లో వొకబాణం తగిలించాడు. గుండెలమీద గబగబా ఎన్నో అన్ని బాణాలు నాటించాడు. దాంతో ఎన్నాళ్ళయో చచ్చిన వాడిలా రథంమీద తెలివిలేకండా పడిపోయాడు దుశ్శాసనుడు. అతడు మోడ్చపోడంతోనే రథంపట్టుకుని పారిపోయాడు అతడి సారథి.

అంతకిముందే అభిమన్యుడు వెళ్ళినదారిని సైన్యాలతో పద్మ వ్యూహం చొరబడబోతున్నారు పాండవులు. అడుగడుక్కీ అడ్డుపడుతూన్న కౌరవసేనలతో పోరాడుతున్నారు. తలెత్తి అభిమన్యుణ్ణి చూస్తున్నారు. అతడు శత్రువుల్ని నురుమాడుతుంటే సంతోషిస్తున్నారు. దుశ్శాసనుడు వీగిపోడం చూసి ఉప్పొంగిపోయారు. ఆకాశం బద్దలైనట్టు కేకలు వేశారు. అభిమన్యుణ్ణి అనేక విధాల అభినందించారు. మనసేనని తరుముకు వచ్చారు.

## కర్ణుడి పలాయనం

"అయ్యో, అభిమన్యుడిచేత తమ్ముడు చావుదెబ్బలు తినేశాడు, చూశావా" — నొచ్చుకుంటూ కర్ణుడితో అన్నాడు దుర్యోధనుడు. రాజు నోట్లోమాట నోట్లోనే వుంది, తనసైన్యమంతటితోనూ అభిమన్యుడిమీదికి వెళ్ళాడు కర్ణుడు. తన ఎదటికి వెళ్ళిన సేన క్షణంలో హరీ అనిపించేశాడు అభిమన్యుడు. కర్ణుడి వొంటినిండా నాటుకుపోయినట్టు దబ్బయిబాణాలు కొట్టాడు. రక్తంతో స్నానంచేసేశాడు కర్ణుడు. కోపంతో ఎర్రవారిపోయింది అతడి మొహం. అభిమన్యుడిమీద

దివ్యాస్త్రాలు ప్రయోగించా డతడు. అంతటి కర్ణుణ్ణీ గడ్డిపోచలా చూశాడు అభిమన్యుడు. అతణ్ణి మించినట్టు అద్భుతంగా పోరాడా డతడు. అలిసిపోయాడు కర్ణుడు.

కర్ణుడు అలిసిపోయాడని అతడి తమ్ముడు కనిపెట్టేశాడు. చప్పునవచ్చి అభిమన్యుడితో కలబడ్డాడు. అభిమన్యుడి గుర్రాల మీాదా, అతడి సారథిమీాదా, అతడిమీాదా పడాపడా బాణాలు కురిపించాడు. అభిమన్యుడి పద్మంలాంటి మొహంలో ఎర్రనవ్వు కలకల లాడింది. ధనుస్సుని బాణంతోడిగా డతడు. అల్లెతాడు చెవులదాకా లాగుతూవుంటే ఎంత భయంకరంగా వున్నాడో అంత అందంగానూ అవుపించాడు. రివ్వుమంది బాణం. కర్ణుడితమ్ముడి కంఠం తెగిపోయింది. తలకాయ కిందపడిపోయింది.

తమ్ముడిచావు చూశాడు కర్ణుడు. తన వొళ్ళు జలదరించింది. ఉత్తరక్షణంలో పలాయనం చిత్తగించా డతడు.

మిగిలిన మహాసైన్యంమీాద వురికాడు అభిమన్యుడు. మహా సముద్రంలో మందరపర్వతంలాగ మధించడం ప్రారంభించాడు. అలా మనసైన్యం చెండాడుతూ కర్ణుడిరథం వెళ్ళినదిక్కే వెళ్ళా డతడు. అభిమన్యుడు రావడంచూసి వున్నధైర్యం కూడా వూడిపోయింది కర్ణుడికి. తిరిగి చూడకండా పరుగుచ్చుకున్నా డతడు. అతణ్ణి చూసి తక్కిన కౌరవయోధులుకూడా పరుగు ప్రారంభించారు. సైన్యాలతో వాళ్లు అలా పారిపోతూవుంటే భూమి గజగజలాడింది.

అదంతా చూశాడు మనసేనాని ద్రోణుడు.

"నిలబడూ, నిలబడూ, కర్ణా! కృపాచార్యులూ, ఇంత భయ మేమిటి? ఆగూ! ఆగూ! శకునీ, బాహ్లికా, ఆగండి! దుర్యోధనా! నువ్వేపారిపోతే సైన్యమేంగానూ!" ఇలా గొంతుచించుకుంటూ

అరిచా డతడు. ఏంచెప్పేది? మహారాజా, ద్రోణుడెంత అరిచినా మన వాళ్ళలో వొక్కడైనా నిలబడితే వొట్టు!

ధారాపాతంగా పిడుగులు కురుస్తున్న ప్రళయమేఘంలాగ; నలి రేగిపోయిన అభిమన్యుడి బాణాలముందు నిలవలేక కకావికలయి పోయింది కౌరవసేన. సింహంకొదమలాగ సింహనాదంచేశాడు అభిమన్యుడు. శంఖం పూరించాడు. అల్లెతాడు మోగించాడు. చేసిన యుద్ధం తనివితీరలే దతడికి. పనికిరాని అడివిమీదపడ్డ కార్చిచ్చులాగ కౌరవసైన్యంమీద పడ్డా డతడు. హతవార్చి హతవార్చి వెంట తరిమాడు.

కౌరవరాణువలో రథాలు చిందరవందర అయిపోయాయి. ఎక్కడపడితే అక్కడ ఏనుగులు పీనుగులయాయి. గుర్రాలు కూలిపోయాయి. కాల్బలాలు హతవారిపోయి కుప్పలు పడ్డాయి. కాల్బలాల శవాలమీద గుర్రాలకళేబరాలు గుట్టలుపడ్డాయి. గుర్రాల మొండాలమీద రథాలు విరిగిపడ్డాయి. ఏనుగులకళేబరాలకింద కాళ్ళూ కాళ్ళూ పెనవేసుకుంటూ పచ్చడిపచ్చడి అయిపోయారు సైనికులు.

కంకణాలతోనూ, భుజకీర్తులతోనూ అందంగావున్న ఎన్నో అన్ని చేతులు కుప్పలుపడ్డాయి. కుండలాలతో తలకాయలు గుట్టలు పడ్డాయి. వీరకడియాలతో పెనవేసుకున్న కాళ్ళు పోగులుపడ్డాయి. దొర్లిపోతూ కబంధాలు దొంతులుపడ్డాయి.

గుండపిండయిన ధనుస్సులూ మొదలైన ఆయుధాలమీద అందంచెడకండా బాహువులతో కత్తులూ అవీ వందలూవేలూ పడ్డాయి. గొడుగులూ, చామరాలూ, జెండాలూ ఎక్కడపడితే అక్కడ రాసులురాసులు విరిగిపడ్డాయి. రణరంగం యావత్తూ ఘోరాతిఘోరంగా తయారయింది.

మధ్యాహ్న మయింది. ఆకాశమధ్యంలో వెలిగిపోతూవున్న సూర్యుడి రెండోమూర్తిలాగ పద్మవ్యూహంలో ఏకైకవీరుడయి ప్రకాశించాడు అభిమన్యకుమారుడు.

ధృతరాష్ట్రుడు: సంజయా, అంతా బాగుంది. కాని అంతసేపూ పద్మవ్యూహంలో అభిమన్యుడు వొక్కడే పోరాడడమేమి? చూస్తూ పాండవులు వూరుకున్నారా? ఒక్కడూ అతడికి సహాయం రాలేదా? ఏమిటిది?

## సైంధవు లడ్డు

సంజయుడు: అవును, వొక్కడూ రాలేదు. రాకపోడంకాదు. రాలేకపోయారు. దానంతటికీ సైంధవులడ్డే కారణం. చెపుతాను విను. బ్రహ్మాండమైన పరాక్రమంతో పద్మవ్యూహం చించుకుపోయాడు అభిమన్యుడు. అతడికి సహాయంగా అతడి వెంటపడ్డారు పాండవులు. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ పడగొడుతూ లోపలికి బయలుదేరారు. వాళ్ళ ఉధృతంముందు మనదండు ఆగలేకపోయింది. పాయలయిపోయి, వాళ్ళకి దారి ఇచ్చేసి ఇటూ అటూ వొరిగిపోయింది. నిశ్చేష్టితులయి నిలబడిపోయారు మనయోధులు. పాంచాలులూ, యాదవులూ, పాండ్యులూ, కేకయులూ, మాత్స్యులూ మొదలైన మహారాణువతో ఝంఝామారుతంలాగ తోసుకువస్తూవున్న ధర్మరాజుని పెద్దపర్వతంలాగ అడ్డేశాడు మనసైంధవుడు జయద్రథుడు అదీ కారణం పాండవులు అభిమన్యుడికి సహాయం రాలేకపోడానికి.

ధృతరాష్ట్రుడు: ఆఁ, మన జయద్రథుడా! ఆశ్చర్యం! ప్రాణంలా చూసుకుంటూవున్న కొడుకుకోసం, ప్రాణాలొడ్డిసైన్యాలతో విజృంభించిన పాండవుల్ని వొక్కడూ అడ్డేశాడూ? కౌరవసేనకల్లా

అతడే మకుటం అన్న మాట! అంత మహాబలం అతడికి ఏ తపస్సు వల్ల వచ్చిందో!

సంజయుడు: అవును, తపోబలమే అది. పాండవులు అరణ్యావాసంలో వున్నప్పుడు, ద్రౌపదికోసం భీముడిచేత చచ్చి బయట పడ్డాడు నీ అల్లుడు జయద్రథుడు. ఆ అవమానంతో శివుడికోసం తపస్సుచేశాడతడు. శివుడు ప్రత్యక్షమయాడు. వరం కోరమన్నాడు. 'పాండవుల్ని గెలవాలి' అన్నాడు సైంధవుడు. 'అర్జునుడు తప్ప తక్కిన నలుగుర్నీ వొక్కనాడుమాత్రం నువ్వు గెలుస్తావు' అంటూ వరమిచ్చాడు శివుడు. అదిగో ఆవరంవల్ల అంతబలమూ అవాళ అతగాడికి వచ్చింది. అతడు చూపినపరాక్రమం వివరిస్తాను, విను. వరగర్వంతో పాండవసేనల్ని ఒసరంతా లక్ష్యపెట్టలేదతడు. సింధుదేశం గుర్రాలుపూసిన స్థిరమైన రథంమీద సింహనాదం చేస్తూ నుంచున్నాడు. రథంమీద రత్నాలతో చెక్కిన వరాహపతాకం దేదీప్యమానంగా వెలుగుతోంది. ఉజ్వలమైన ఛత్ర చామరాలు చంద్రాతపంలా వున్నాయి. వజ్రాలూ, మంచిముత్యాలూ తాపినసగలు వాటిమీద ధగధగా మెరుస్తున్నాయి. అలా నీఅల్లుడు పద్మవ్యూహంలో పాండవులు అడుగుపెట్టకండా పెట్టనికోటలా అడ్డుకున్నాడు. అతడి సైంధవసేన యావత్తూ అతడితో నిలబడింది.

అలా అడ్డుకుని సాత్యకిని మూడుబాణాలతో కొట్టాడు జయద్రథుడు. భీముడిమీద ఎనిమిది బాణాలు వేశాడు. ధృష్టద్యుమ్నుణ్ణి ఇగవై బాణాలతో కొట్టాడు. విరాటరాజునీ, శిఖండినీ పదేసిబాణాలతో కొట్టాడు. ద్రుపదుడిమీద పదిబాణాలూ, ద్రౌపదికుమార్ళ మీద పదిహేనుబాణాలూ, కేకయులమీద పాతికబాణాలూ తగిలించాడు. ధర్మరాజుమీద డబ్భయిబాణాలు గుప్పించాడు.

సైంధవులు యావన్మందీ పాండవుల దండుమీద రకరకాల అయుధాలు కుమ్మరించారు.

అరికాలిమంటనెత్తికెక్కింది ధర్మరాజుకి. మంచిదొక బాణం వేశాడతడు. జయద్రథుడి ధనుస్సు విరిచేశాడు. తక్షణం మరో ధనుస్సు పుచ్చుకున్నాడు నీ అల్లుడు. అగ్గితునకల్లాంటి బాణాలు ధర్మరాజుమీదా, అతడి అనుచరులమీదా గుప్పించాడు.

భీకరంగా ముందుకివచ్చాడు భీముడు. మూడు బాణాలు కొట్టాడు. జయద్రథుడి గొడుగూ, అతడి విల్లూ, జెండా నరికేశాడు. చప్పున మరోవిల్లు తీశాడు జయద్రథుడు. భీముడి గొడుగు ఎగర గొట్టేశాడు. అతడి విల్లూ, జెండా నరికేశాడు. అతడి రథంకూడా పడగొట్టేశాడు. సాత్యకిరథ మెక్కేశాడు భీముడు. గొల్లుమని చప్పట్లుకొట్టారు సైంధవులు.

ఎన్నోఅన్ని అస్త్రాలు సైంధవులమీద ప్రయోగించారు పాండవులు. అన్నీ అల్లంతదూరాన్నే దుళ్ళగొట్టేశాడు జయద్రథుడు. అభిమన్యుడు పడగొట్టిన రథాలూ, గుర్రాలూ వాటితో ఎంతో ఇదిగావున్న నేలంతా రథాలూ, గుర్రాలూ పరిగెత్తించి సదునుచేసి మరీ యుద్ధంచేశారు పాండవులు. ఎంతచేసినా చలించకండా నిలబడ్డాడు జయద్రథుడు. ఉగ్రమైన బాణాలు గుప్పించాడు. పాండవుల ప్రతాపం పనికిరాకండా చేసేశాడు. మొదట పాయలయిపోయి, ఇటూ అటూ వొరిగిపోయిన కౌరవసేనకూడా కాలూని బలపడింది. దాంతో ఉభయసేనలూ ఘోరంగా పోరాడాయి. ఏమయినా సైంధవుల అడ్డు అద్భుతంగా పనిచేసింది. పాండవులలో వొక్కడూ పద్మవ్యూహంలో ప్రవేశించలేకపోయాడు. అభిమన్యుడు లోపల వొక్కడే అయిపోయాడు. వ్యూహం బైట ఇలావుంది. ఇక లోపల —

ద్రోణాచార్యులు శాయశక్తులా ప్రయత్నించాక పారిపోతూన్న మన సైన్యాలు వెనక్కి తిరిగాయి. ఒక్కసారి అభిమన్యుణ్ణి ముట్టడించాయి.

అలా మళ్ళీ ఎదురుతిరిగిన రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ—చతురంగబలాలు యావత్తూ పీనుగుపెంట చేసేశాడు అభిమన్యుడు. అదంతా సహించలేక వున్నపాళాన ముందుకి వురికాడు కర్ణుడికొడుకు వృషసేనుడు. కరుకైన బాణాలు అభిమన్యుడిమీద కురిపించాడు.

కళ్ళల్లో అగ్గికురిశాడు అభిమన్యుడు. వృషసేనుడి సారథిని హరీ అనిపించేశాడు. అతడి ధనుస్సు ఫెళ్ళుమనిపించేశాడు. గుర్రాల మొహాలమీద బాణాలు నాటించి జజ్జరగొట్టేశాడు. అతడి వొంటి నిండా మంటలుపుట్టించాడు. దెబ్బలుతినేసి మూర్ఛపోయాడు వృషసేనుడు. అరవీనుగుతో రథం ఈడ్చుకుంటూ పరిగెత్తుకు పోయాయి గుర్రాలు.

వృషసేనుడి రథం అలా పారిపోడంతోనే, ఆ తెరిపి చూసుకుని మనసేనమీదికి రథంవురికించాడు అభిమన్యుడు. అంతలో వసాతిరాజు రభసంగా వెళ్ళి అతణ్ణి ఎదిరించాడు. గుక్కతిప్పకండా అరవై బాణాలు కొట్టాడు. వాటన్నిటికీ వొకేవొక్కటి పిడుగులాటిబాణం తగిలించాడు అభిమన్యుడు. దాంతో అయిపోయింది వసాతిరాజుపని. దెబ్బతో తన్నుకుంటూ చచ్చివూరుకున్నాడతడు.

వసాతిచావు చూసి అక్కడున్న రాజులు యావన్మందీ అభిమన్యుడిమీదికి ఎగబడ్డారు. అభిమన్యుడు అగ్నిహోత్రమూ, వీళ్ళంతా మిడతలదండూ అనిపించిందపుడు.

రుద్రుడయిపోయి, రౌద్రం సారించి, అంతమందినీ హతవార్చడ మారంభించాడు అభిమన్యుడు. దీనదశకి వచ్చేసింది మనసైన్యం

మళ్ళీ కూడబలుక్కున్నారు మనవాళ్ళు. దేశదేశాల రాజులు వొకళ్ళ నొకళ్ళు పిలుచుకున్నారు. సింహనాదాలుచేశారు. ధనుస్సులు మోగించారు. పరస్పరం కుమ్మక్కు చేసుకుంటూ వొక్కమొగిని అభిమన్యుడి మీదికి వెళ్ళారు.

లేళ్ళమంద చూస్తే పెద్దపులి ఎలా వుబ్బిపోతుంది, అదిగో అలా వుబ్బిపోయాడు అభిమన్యుడు. నలిరేగిపోయి శత్రువుల్ని నురుమాడడ మారంభించాడు.

ముక్కముక్కలయి ఎర్రగా పడివున్న అవయవాలూ, విక్షతంగా కుప్పపడిన ఏనుగుల పీనుగులూ, గుర్రాల మొండాలూ, మానవుల కబంధాలూ, విరిగి చిందరవందరగావున్న ఆయుధాలూ, ఆభరణాలూ — ఈ అన్నిటితో ఎంతదారుణంగా వుందో అంత అందంగానూ అవుపడింది కురుక్షేత్ర రణరంగం.

అభిమన్యుడి ధాటికి ఆగలేకపోయాయి మనసైన్యాలు. దూర దూరం తప్పుకున్నాయి. అతణ్ణి తేరిచూసే యోధుడే లేకపోయాడు. అంతమందీ తెల్లపోయారు. బొమ్మల్లాగ నిలబడిపోయారు. దాంతో తరిమి తరిమి, తిప్పితిప్పి కొట్టడం లంకించుకున్నాడు అభిమన్యుడు. సత్యశ్రవుడూ మొదలైన రాజుల్ని యమలోకం పంపించాడు.

సత్యశ్రవుడి చావు చూసి మానసంకలరాజులు కొందరు తెగించి సాహసించారు. అభిమన్యుడితో కలబడ్డారు. కలబడ్డమేమో కలబడ్డారు. అంతే. పెద్ద సొరచేప మొహానపడ్డ చిన్నచేపల్లాగ, దావానలంలో వురికిన మృగాల్లాగ, సముద్రంలో చొరబడ్డ సెలయేళ్ళలాగ అభిమన్యుడి వాతపడి హతమారిపోయారు. అక్కడున్న సేన యావత్తూ భయభ్రాంతమయిపోయింది. పక్కపక్కలికి వొదిగిపోయింది.

## రుక్మరథుడు

"వీడికా భయపడతారు!" అంటూ దురుసుగా ముందుకి దూకాడు శల్యుడికొడుకు రుక్మరథుడు – "ఇదిగో నేను వచ్చాను. ప్రాణంతో పట్టితెస్తాను అభిమన్యుణ్ణి. కాదూపోదూ అని పెనగులాడాడో, చచ్చాడే అనుకోండి. నా పరాక్రమం చూడండి" అంటూ అభిమన్యుడి రథానికి ఎదురుగా ఎగబడ్డాడు. వెళుతూనే అభిమన్యుడి ఎదరొమ్ముమీద తొమ్మిదిబాణాలు తగిలించాడు. బుజాలమీద రెండు నాటించాడు. ఎడాపెడా బాణంమీద బాణం గుప్పించాడు.

మూడేమూడు బాణాలు తీశాడు అభిమన్యుడు. బాణంతో వున్న రుక్మరథుడి చెయ్యిని ఒక బాణంతో తెగేశాడు. ధనుస్సుతో వున్న చెయ్యి మరోదాంతో నరికేశాడు. కనుబొమలు ముడిపడి ఉగ్రంగావున్న అతడి శిరస్సు మూడోబాణంతో వూడ్చేశాడు.

అలా చిత్రకౌశలం చూపించి అభిమన్యుడు రుక్మరథుణ్ణి హతమార్చడంతోనే అతడి స్నేహితులు వందమంది మద్రదేశం రాజకుమారుళ్ళు రథాలతో వచ్చి పోలో అని అభిమన్యుణ్ణి ఘిరాయించారు. అతడిమీద బాణవర్షం కురిపించారు. అతడి రథమూ, గుర్రాలూ, సారథీ, జెండా కనపడకండా చేసేశారు. అదిచూసి నీ కుమారుళ్ళ సంతోషం చెప్పతరం కాలేదు.

అభిమన్యుడిపని అయిపోయిందనే అనుకున్నాడు దుర్యోధనుడు. చంకలుగుద్దాడు.

మదపుటేనుగుని బరికోలతో పొడిచినట్టయింది అభిమన్యుడికి. వెంటనే గాంధర్వమాయచేశాడతడు. లోగడ అర్జునుడి తపస్సుకి మెచ్చి తుంబురుడూ మొదలైనవాళ్ళు అతడికి ఇచ్చినవిద్య అది. తండ్రిదగ్గిరే అభిమన్యుడు అభ్యసించాడు. గాంధర్వమాయవల్ల అభి

మన్యుణ్ణి ఆక్రమించిన రాజకుమారుళ్ళ కళ్ళకి ఎంతో అంతమంది రథాల వాళ్ళు తమమీద పడ్డట్టూ, ఎన్నో అన్ని అస్త్రాలు, శస్త్రాలూ ప్రయోగించినట్టూ అవుపడింది. భయపడిపోయి, బెంబేలుపడిపోయి కాళ్ళూ చేతులూ కదపలేక నిలబడిపోయారు వాళ్ళు.

మండలగతితో రథం మెరిపించాడు అభిమన్యుడు. వాడివాడి బాణాలు ప్రయోగించాడు. వెడల్పాటిబాణాలతో వందమంది మద్ర రాజకుమారుళ్ళనీ నరికిపారేశాడు. అయిదోఏట చివురుపెట్టిన మామిడి గున్నలు నరికి పడేస్తే ఎలావుంటుంది, అదిగో అలా అయిందనుకో వాళ్ళవధ.

చూసి భరించలేకపోయాడు దుర్యోధనుడు. అడావుడిగా పరిగెత్తాడు. అభిమన్యుడిమీద కలబడ్డాడు. కలబడి అయిదునిమిషాలు యుద్ధంచేశాడో లేదో, అభిమన్యుడి వేడికి ఆగలేకపోయాడు. తప్పుకుని వచ్చేశాడు.

ధృతరాష్ట్రుడు : చిత్రంగావుంది. నమ్మలేక పోతున్నాను నీమాటలు! నిన్నగాక మొన్నటి కుర్రాడేమిటి, ఇంతమందిని చంపెయ్యడమేమిటి? ఇంతేసివాళ్ళని ఓడించడమేమిటి? నిజమే, సంశయానికేముందిలే! ధర్మం ధర్మమే. అధర్మం అధర్మమే. ధర్మానికి గెలుపు దైవమే రాసిపెట్టాడు. ఊఁ. తరవాత ఏంజరిగిందో చెప్పు.

సంజయుడు : అలా అంతమంది రాజులు చవ్వడమూ, దుర్యోధనుడు ఓడిపోడమూ చూసి నీకుమారుళ్ళకీ, తక్కిన యోధులికీ ముచ్చెమటలు పోశాయి. మొహాలు వెలవెలపోయాయి. నోళ్ళు ఎండిపోయాయి. కాళ్ళువణికాయి. గుండెలు జారిపోయాయి. మోళ్ళ లాగ నిలబడిపోయారు వాళ్లు దిక్కులు చూశారు. పిరికిమాత్ర పుచ్చుకున్నారు. పలాయనం చిత్తగించడం ప్రారంభించారు.

అప్పుడు మళ్ళీ వొక ప్రయత్నంచేశాడు దుర్యోధనుడు. అశ్వత్థామా, కృపాచార్యులూ, కృతవర్మా, కర్ణుడూ, బృహద్బలుడూ, శకునీ— ఈఆరుగురి కుమ్మక్కుతో మళ్ళీ అభిమన్యుణ్ణి ముట్టడించాడు.

అసలే విజయగర్వంతోవున్నాడు అభిమన్యుడు రవంతా లక్ష్యపెట్టలేదు వాళ్ళని. పిడుగులా గర్జించి వాళ్ళమీదికి వురికాడు. ఆగలేకపోయారు మనవాళ్ళు. ముందుకివెళ్ళిన రథాలు వెనకమొహం పట్టాయి.

## లక్ష్మణకుమారుడు

అంతమందీ అలా వెనక్కితగ్గేశారు. అప్పుడు నీ మనవడు లక్ష్మణకుమారుడు మాత్రం సాహసించాడు. అదలిస్తూ వెళ్ళాడు; అభిమన్యుడిమీద కలబడ్డాడు.

చావుమొహాన పడిపోతూవున్న కొడుకుని చూస్తూ వూరుకోలేకపోయాడు దుర్యోధనుడు. విచారించాడు. అభిమన్యుడిదిక్కు రథం పరిగెత్తించాడు.

రాజు వెళ్ళడం చూసి తక్కినవాళ్ళూ జల్దుకున్నారు. కొండమీదికి వెళ్ళిన మేఘాల్లాగ అభిమన్యుడిమీదకి పరిగెత్తారు. ఒక్కమొగిని ఆక్రమించారు. ఝంఝామారుతంలాగ బాణాలు రువ్వాడు అభిమన్యుడు. అంతమందినీ చెదరగొడుతూ లక్ష్మణుడిమీదికి వురికాడు. పులిపిల్లని సింహంకొదమ ఆక్రమిస్తే ఎలావుంటుంది, అదిగో అలా అనిపించింది లక్ష్మణుడిమీదికి అభిమన్యుడు రావడం.

వస్తూనే మాట్లాడకుండా లక్ష్మణుడి గుండెలమీదా, బాహువులమీదా వొక్కొక్కబాణం తగిలించాడు అభిమన్యుడు. "ఎరిగి ఎరిగీ ఇటే వచ్చావు. ఎటుపోతావు?" అంటూ దారుణంగా మరో బాణం కొట్టాడు. తండ్రి దుర్యోధనుడూ, తక్కిన మనవాళ్ళు

యోధవన్నీ చూస్తూ వుండగానే, అభిమన్యుడు లక్ష్మణకుమారుడి కంఠం నరికేశాడు. కుండలాలు తళతళలా మెరుస్తూ కిందపడిపోయింది లక్ష్మణకుమారుడి శిరస్సు. హాహాకారాలు చేస్తూ అల్లకల్లోల మైపోయింది మన సైన్యం.

"చంపెయ్యండి వీణ్ణి. అందరూ కలిసి కొట్టెయ్యండి" — దుఃఖంతోనూ కోపంతోనూ ఉక్కిరిబిక్కిరి అయిపోతూ అరిచాడు దుర్యోధనుడు.

కృతవర్మా, కృపుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కర్ణుడూ బృహద్బలుడూ — వాళ్ళు మొగిని ఆవేశంతో పరిగెత్తారు. అభిమన్యుడిమీద బాణవర్షం కుమ్మరించారు.

అందరిబాణాలూ గాలిలాగ వూదేశాడు అభిమన్యుడు. అంత మందినీ తరిమితరిమి కొట్టాడు. ఆవ్యూహంలో జయద్రథుడు పాండవుల్ని రాకండా పోరాడుతున్న దిక్కు రథం పరిగెత్తించాడు.

జయద్రథుడి దగ్గిరకి అభిమన్యుడు చేరుకున్నాడో కథ మరో లాగ మారేది. ఇంతలో కళింగులూ, నిషాదులూ పెద్ద ఏనుగుసేనతో అడ్డంగా వెళ్ళి అడ్డుకున్నా రతణ్ణి. వాళ్ళందరినీ కాయకూరలు తరిగేసి నట్టు తరిగెయ్యడం ఆరంభించాడు అభిమన్యుడు. కళింగులూ, నిషాదులూ వెళ్ళిన సందుచూసుకుని ఇందాక తొలిగిపోయిన కృతవర్మా మొదలైన ఆరుగురు యోధులూ వెళ్ళి కలిశారు. ఆబోతులు పెద్ద పులిమీదికి వెళ్ళినట్టు అభిమన్యుడిమీదికి వెళ్ళి కలబడ్డారు.

జయద్రథుడి దగ్గిరకి వెళ్ళలేకపోయాడు అభిమన్యుడు. తనని చుట్టుముట్టిన వాళ్ళతోనే హోరాహోరి పోరాడాడు.

జయద్రథుడు తన సైంధవసేనతో కలిసి ఘోరంగా పోరాడాడు. పాండవులు పద్మవ్యూహంలో అడుగుపెట్టకండా అడ్డేశాడు.

ద్రోణాచార్యులమీద యాభై బాణాలు కొట్టాడు అభిమన్యుడు. కృతవర్మమీద ఎనభై కొట్టాడు. అశ్వత్థామమీద పది నాటించాడు. ఒకే ఒక్క బాణం తగిలించి కర్ణుణ్ణి కీచుకీచుమనిపించాడు. కృపాచార్యుడి గుర్రాలు కూల్చేశాడు. అతడి చక్రరక్షకుల్ని తాచుమనిపించేశాడు. బృహద్బలుడి వొంటిమీద ముప్ఫయిబాణాలు నాటించాడు. ఈఆరుగురికీ కుమ్మక్కు వెళ్ళిన వేలాది సైనికుల్ని వరిచేను కోసినట్టు కోసిపారేశాడు. క్రోధలిప్తుడూ, బృందారకుడూ అనే రాజుల్ని ఇద్దరినీ నరికేశాడు.

కొత్తగుర్రాలతో రథం సిద్ధంచేసుకుని వచ్చాడు కృపాచార్యులు. మిగిలిన అయిదుగురితోనూ కలిసి అభిమన్యుణ్ణి ఆక్రమించాడు. పుంఖానుపుంఖంగా బాణాలు గుప్పించాడు.

## బృహద్బలుడు

క్షణక్షణానికీ రెచ్చిపోతూవచ్చాడు అభిమన్యుడు. మనవాళ్ళు యావన్మందినీ వొళ్ళు మంటలుచ్చుకున్నట్టు చేశాడు. ఒక్కడూ ఆగలేకపోయాడంటే నమ్ము. అపుడు అయోధ్యరాజు బృహద్బలుడు మాత్రం తెగించాడు. దారైనబాణాలు అభిమన్యుడిమీద అదేపనిగా కుమ్మరించాడు.

అగ్గిమీద గుగ్గిలం వేసినట్టయింది అభిమన్యుడికి. పూనిపట్టి వొక్క బాణం వొదిలాడు. బృహద్బలుడి జెండా వూడగొట్టేశాడు. అలాగే మరొకటి వేశాడు. అతడి సారథిని చంపేశాడు. మరొకటి కొట్టి గుర్రాల పనిపట్టేశాడు.

కోపం పట్టలేకపోయాడు బృహద్బలుడు. కత్తీ, డాలూ పుచ్చుకున్నాడు. రథంమీంచి దూకేశాడు. మెరుపులాగ అభిమన్యుడిమీదికి వరిగెత్తాడు.

పదడుగులు రానిచ్చాడు అభిమన్యుడు. దారుణమైన వొక బాణం కొట్టాడు. బృహద్బలుడి గుండెలు చీల్చిపారేసింది బాణం. నిండుప్రాణాలు నిలువునా వొదిలేశాడతడు.

బృహద్బలుడి చావుచూసి అతడి బంధువులూ, స్నేహితులూ వేలకొద్దీ వెళ్ళి అభిమన్యుడిమీద విరుచుకుపడ్డారు. వాళ్ళందరినీ వూడ్చేశాడు అభిమన్యుడు. అవూపుని కర్ణుడిమీదికి పరిగెత్తాడు. కర్ణికాః బాణాలు కొట్టి అతడివొళ్ళంతా చీలికలుచేసేశాడు. రక్త స్నానం చేయించాడు. అతడి మంత్రుల్ని ఆరుగురిని కాయ మని పించేశాడు.

కర్ణుడుమాత్రం అంత మీదిమీదివాడా! అతడూ దెబ్బకి దెబ్బతీస్తూ యుద్ధంచేశాడు. అభిమన్యుణ్ణి ముచ్చెమటలూ పోయిం చాడు. కర్ణుడూ, అభిమన్యుడూ — ఇద్దరూ సాయంకాలం సూర్య బింబాల్లా ప్రకాశించారు.

కర్ణుడూ, దుర్యోధనుడూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వ త్థామా, కృతవర్మా — ఆరుగురూ అభిమన్యుడితో వొక్కసారి యుద్ధం చేశారు. ఆరుగురినీ ఏడు చెరువులనీళ్ళు తాగించాడు అభి మన్యుడు. ఓతట్టు మనసేన చిత్రవధ చేస్తూనే వున్నాడు, వోతట్టు ఆరుగురి బాణాలూ అడ్డుకుంటూ వాళ్ళని బాదుతూ త్రాహిత్రాహి మనిపిస్తూనే వున్నాడతడు.

మహారాజా, అభిమన్యుడి యుద్ధం నిజంగా అద్భుతం.

## అశ్మంతకుడు

ఇంతలో మగధరాజకుమారుడు అశ్మంతకుడు (అశ్వకేతు) దురుసుగా ముందుకి దూకాడు. కుర్రాడయినా మెచ్చుతగ్గ పౌరుషం చూపించాడు.

పాతపగ వొక్కసారి కళ్ళకి కట్టినట్టయింది అభిమన్యుడికి. అశ్వంతకుడితలా, అతడి సారథితలా, అతడి గుర్రాలతలలూ రెప్పపాటులో టపీటపీ ఎగరగొట్టేశాడు; సింహనాదం చేశాడు. మార్తికావతిరాజైన కుంజరకేతుణ్ణి వొక్క కుప్పికోలవేసి కూల గొట్టేశాడు.

అభిమన్యుడి ఆటోపం చూసి ఆగలేకపోయాడు దుశ్శాసనుడి కొడుకు. అమాంతంగా వెళ్ళాడు. అభిమన్యుడిమీద పడ్డాడు. అతడి నాలుగుగుర్రాలమీదా నాలుగుబాణాలు నాటించాడు. అతడిసారథి మీద వొకబాణం తగిలించాడు. పట్టిపట్టి అభిమన్యుడిమీద పది బాణాలు కొట్టాడు.

ఎర్రకలవల్లాంటి కళ్ళతో చురచురా చూశాడు అభిమన్యుడు. సానపట్టిన ఏడు వుక్కుబాణాలు పొదిలోంచి తీశాడు. దుశ్శాసనుడి కొడుకు శరీరం చీల్చుకుపోయినట్టు కొట్టాడు.

"ఇందాక నీబాబు తోకముడిచేశాడు. ఇప్పుడు నువ్వు వూడి పడ్డావు. రా. ఎటుపోతావు?" అంటూ దగ్గిరగా వచ్చి ఘోరమైన వొకబాణం వొదిలిపెట్టాడు. ఆబాణమే అతడిమీదపడితే పాదుకదల కండా పడిపోయేవాడు దుశ్శాసనుడి కొడుకు. కాని మధ్యలోనే దాన్ని చప్పున కొట్టేశాడు అశ్వత్థామ.

అశ్వత్థామదిక్కు చూడనైనా చూడకండా నీ మనవడి మీదికే వురికాడు అభిమన్యుడు. ఒకబాణంతో అతడి ధనుస్సు పుటుక్కుమనిపించాడు. అతడి సారథిని నరికేశాడు. వరసపెట్టి గబా గబా ఆరుబాణాలు అతడి రొమ్ముమీద దిమ్మరించాడు. ఆగలేక పోయాడు దుశ్శాసనుడి కొడుకు. రథం దూకేశాడు. మరో రథం మీదికి పారిపోయాడు.

ఎర్రపొద్దుపడింది.

దుశ్శాసనుడికొడుకు తప్పుకోడంతోనే శత్రుంజయుడూ, చంద్రకేతుడూ, సువర్చసుడూ, సూర్యభానుడూ, మేఘవేగుడూ కమ్మక్కయి వెళ్ళారు. అభిమన్యుణ్ణి వొక్కబిగిని ముట్టడించారు.

రకరకాల అస్త్రాలు ప్రయోగించాడు అభిమన్యుడు. అందరినీ తునాతునకలుచేసేసి పారేశాడు.

అప్పుడు మీబావ శకునివెళ్ళి కలబడ్డాడు. ఆతడిమీద ఎన్నో రకాల అస్త్రాలు ప్రయోగించాడు అభిమన్యుడు. ఒళ్ళంతా రక్తంలో స్నానంచేయించి వొదిలిపెట్టాడు. సహించలేకపోయాడు శకుని వెనక్కి చూడకండా దౌడుతీశాడు.

దుర్యోధనుడిమీదికి రథం వురికించాడు అభిమన్యుడు.

"నువ్వు ఇలా వూరుకుంటే ఏందారి ?" తడబడిపోతూ ద్రోణుడితో అన్నాడు కర్ణుడు - "మహావీరుల్ని అందరినీ మంట కలిపేశాడు వీడు. పద్మవ్యూహం పీనుగుపెంట చేశాడు. అదిగో రారాజుమీద విరుచుకుపడుతున్నాడు. చప్పున ఏదో ఉపాయం ఆలోచించు" అంటూ దుర్యోధనుణ్ణి కాసుకోడానికి పరిగెత్తాడు.

"అర్జునుడూ, అభిమన్యుడూ వొక్కటే అనుకోండి" — అక్కడి యోధులందరినీ కలయజూసి అన్నాడు ద్రోణాచార్యులు - "చూస్తే చిన్నవాడే కాని అసాధ్యుడు. అంచేత అందరమూ వొక్కసారి ముట్టడిద్దాం" అంటూ అందరినీ వురికొల్పాడు. హాలో అంటే హాలోఅని అందరూ వొక్కసారి అభిమన్యుణ్ణి ముట్టడించారు. ప్రాణాలు తెగించి యుద్ధంచేశారు.

## మోసం

అభిమన్యుడిచేత చిత్తుగా దెబ్బలు తినేశాడు కర్ణుడు. ఒళ్ళంతా నెత్తురు కాలవలయి పారింది. "చూడు, ఆచార్యా, నాదిక్కు

చూడు" భరించలేని బాధతో ద్రోణుణ్ణి చూస్తూ అన్నాడతడు— "వీడి దెబ్బలికి ప్రాణాలు ఎగిరిపోతున్నాయి. పారిపోతే నలుగురూ నవ్వుతారని మర్యాదకోసం పెదవులు కరుచుకుని నిలబడుతున్నాను. అంతే. అబ్బ, అర్జునుడితో యుద్ధంచేశాం కాని ఇంత ఘోర మనిపించ లేదు. అగ్గిపిడుగు అభిమన్యుడు. నువ్వు వూరుకుంటే ఇక వీండారి!" అన్నాడు.

"అవును, వున్నమాట అన్నావు" తలపంకిస్తూ అన్నాడు ద్రోణాచార్యులు — "అగ్గిపిడుగే అభిమన్యుడు. 'కవచధారణం' అనే విద్య నేను అర్జునుడికి నేర్పాను. అతడిదగ్గిర ఇతడు నేర్చుకున్నాడు. అంచేత ఇతణ్ణి కొట్టడం హరి బ్రహ్మకి సాధ్యంకాదు. అయితే వొక్కటేమార్గముంది — మోసం. మోసంచేసి వెనకనించి విల్లు విరగ్గొట్టాలి. గుర్రాలు చంపెయ్యాలి. సారథిని నరికెయ్యాలి. చేత నయితే వెనకనించి నువ్వే విల్లు విరగ్గొట్టు. అంతేకాని, ఇతడి చేతిలో ధనుస్సు వున్నంతవరకూ దేవతలయినా ఇతడిముందు నిలవలేరు. అంచేత వొక్కమొగిని విల్లువిరిచేసి, గుర్రాలు కూల్చేసి, సారథిని చంపేసి, రథం ముక్కలుచేసేద్దాం. తరవాత ఆలోచిద్దాం. అలా కాక పోతే — మహావీరుడు వీడు, బలంతో న్యాయంగా వీణ్ణి వీగ్గొట్టగల మనుకోడం కల్లోవార్త" అన్నాడు.

ద్రోణుడిమాట విన్నాడు కర్ణుడు. మోసానికే తెగించా డతడు. ఎదురుగుండా పోరాడుతూ భయపడ్డట్టు నటించాడు. వెనక్కి తగ్గేశాడు. చుట్టూ తిరిగి అభిమన్యుడివెనక్కి వచ్చేశాడు. మోసానికి తోడుపడ్డ యోధులు అభిమన్యుడి ముందుదిక్కు తముకంతో పోరాడు తున్నట్టు నటించారు అసందు చూసుకుని వెనకనించి బాణం వొది లాడు కర్ణుడు. అభిమన్యుడివిల్లు విరిచేశాడు. అంతలోనే అతడి

గుర్రాలు కొట్టేశాడు ద్రోణుడు. అతడి సారథి సుమిత్రుణ్ణి కృపాచార్యులు చంపేశాడు.

అభిమన్యుడు రథమూ, ధనుస్సూ లేకుండా అయిపోయాడు. దాంతో భయంలేకండా ఎగబడ్డారు మనవాళ్ళు. శకునీ, కృతవర్మా, శలుడూ, బాహ్లీకుడూ, అశ్వత్థామా మొదలైన మహాయోధులు యావన్మందీ అతడిమీద రకరకాలబాణాలు కురిపించారు. చేతికి వచ్చిన ఆయుధాలు కుమ్మరించారు. ఊపిరాడకండా అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసేశారు.

కత్తీడాలూ పుచ్చుకున్నాడు అభిమన్యుడు. మెరుపు మెరసినట్టు ఆకాశంమీదికి లంఘించాడు. గరుత్మంతుడిలాగ తిరిగాడు. ఎవడిమీద అతడు పురుకుతాడో అని జడిసిపోయారు మనవాళ్ళు. మొహాలు మీదికెత్తి, అతడిదిక్కే కళ్ళప్పగించి నంచుండిపోయారు.

చూసిచూసి వొకబాణం వేశాడు ద్రోణాచార్యులు. అభిమన్యుడి చేతిలోని కత్తి పడగొట్టేశాడు. కర్ణుడు డాలు బద్దలుగొట్టేశాడు. అభిమన్యుడు కిందికి దూకేశాడు. తన రథంలోంచి వొకచక్రంతీసి పట్టుకున్నాడు. చక్రం పట్టుకున్న శ్రీకృష్ణుడిలాగ విజృంభించాడు.

మహారాజా, అభిమన్యుడి ఆ వీరమూర్తి అద్భుతమనిపించింది. రక్తంతో తడిసిపోయింది మొహం. కోపంతో ఉగ్రంగా ప్రకాశిస్తోంది. అతడు సింహనాదం చేస్తుంటే కౌరవులగుండెలు గడగడ లాడిపోతున్నాయి. రథచక్రం రత్నాలకాంతులు ఆకాశందాకా జిగేలుమంటున్నాయి. వాటితో చేతికంకణాలు మణులూ తళుక్కుమంటే తళుక్కుమంటున్నాయి బరికోల చూపిస్తే మదపుటేనుగు ఎలా మీదికి వస్తుంది, అదిగో అలాగ ద్రోణాచార్యులమీదికి వచ్చా

## అభిమన్యుడి ఆఖరు

మహారాజా, నీమనవలిద్దరూ కలబడడం మహోద్రేకంతో కలబడ్డారు. చూస్తూన్న మా అందరికీ ఆశ్చర్యం - దుఃఖం - దుర్భర మనిపించింది. ఒకళ్ళని మించిన కోపం వొకళ్ళది. ఒకళ్ళని మించిన ఉద్రేకం వొకళ్ళది. ఉభయులూ ఉగ్రులయి పోరాడారు.

గదలు మంటలు మండాయి. శరీరాలు రక్తాలు తుళ్ళాయి. మాంసఖండలు పిప్పిపిప్పి అయింది. ఎముకలు గుండగుండ అయాయి. ఆః! ఇద్దరూ-అభిమన్యుడూ, దుశ్శాసనుడి కుమారుడూ వొకేసారి నేలకి వొరిగిపోయారు. ఇద్దరూ వొకేసారి ప్రాణాలు వొదిలేశారు-

చెరువులో చొరబడి విహారంచేస్తూన్న అడివిఏనుగుని క్రూరులయిన బోయవాళ్ళు చుట్టుముట్టిచంపుతారే, అలాగఎంతో అంతమంది కౌరవులు కిష్మురంగా మీదపడి చంపేశారు అభిమన్యుణ్ణి.

ఎక్కడా ఎన్నడూ ఎవ్వరూ కనీ వినీ ఎరగని శూరత్వం చూపించాడు అభిమన్యుడు.

తన వంశానికి ఇంతా అంతా అనరాని అపూర్వమైన కీర్తి తీసుకువచ్చాడు. లెక్కా జమాలేనంతమంది శత్రువుల్ని సంహరించాడు. తుదకి శత్రువుల మోసంవల్ల ఇంకోమార్గంలేక అస్తమించాడు.

తేజస్సుతో లోకాలు వెలిగించి పడమటికొండచేరిన సూర్యుడిలాగ, అడవులు కాల్చి కాల్చి ఆరిపోయిన అగ్నిహోత్రుడిలాగ, ఆకాశమంత ఎత్తులేచిన కెరటాల నీళ్ళన్నీ ఇంకిపోయిన మహాసముద్రంలాగ, ఆకాశంమీంచి కిందపడిపోయి చిన్నపోయిన చందమామలాగ అస్తమించిన్నీ అద్భుతంగా అవుపించాడు అభిమన్యుడు.

రక్తంలో మునిగిన భూమి ఎర్రటి ఆకాశంలావుంది. అందుమీద చంద్రుడిలా పడున్నాడు అభిమన్యకుమారుడు. తళతళా

మెరుస్తున్న ఆయుధాలముక్కలూ, ఆభరణాల మణులూ చుక్కల్లా వున్నాయి.

ఏనుగుల కళేబరాలు కొండలు. గుర్రాల శవాలు మొసళ్ళు. మానవ కబంధాలు చేపలు. కత్తులూ, బాకులూ అవీ పాములు. రక్తంతో తడిసిన బాణాలు కెరటాలు. పీనుగుల పోగులు నురుగులు. రక్తం నీరు. నగలూ ఎముకలూ ఇసుక. రణరంగం మహాసముద్రం. ఆమహాసముద్రంలో యోగనిద్రలోవున్న మహావిష్ణువు అభిమన్యుడు.

అభిమన్యుడు పడిపోడంతోనే సంతోషంతో వెర్రికేకలు వేశారు సైనికులు. దుఃఖంతో కుంగిపోయారు పాండవులు. దీనులే అయిపోయారు వాళ్ళు. కన్నీళ్ళు కార్చారు. చిందరవందరయిన గుర్రాలూ, ఏనుగులూ అరుస్తూవుంటే అభిమన్యుడికోసం అవన్నీ ఏడుస్తున్నట్టనిపించింది.

చిత్రం! "ద్రోణుడూ మొదలైన ఆరుగురూ మోసంచేశారు. ఎంతోఅంతమంది యోధులు ఒక్క యువకుడిమీద పడి హత్య చేశారు. అన్యాయం! ఘోరం!!" అంటూ సమస్తభూతాలూ గట్టిగా అరిచాయి. అంతమందిమీ స్పష్టంగా విన్నాం.

అభిమన్యుడు అస్తమించడంతోనే నిర్వీర్యపోయింది పాండవ సైన్యం. యుద్ధం మానేసింది. చెదిరిపోడమారంభించింది.

"మాబాబు అభిమన్యుడికోసం విచారమెందుకూ!" దిగాలు పడిపోతూవున్న సైన్యం పురికొల్పుతూ అన్నాడు ధర్మరాజు – "పద్మవ్యూహం చించుకు వెళ్ళాడు. ఏనుగులు పీనుగులు చేశాడు గుర్రాలు కూలగొట్టాడు. రథాలు గుండచేశాడు. కాల్బలాలు నుసు మాడాడు. శత్రువుల చతురంగసేన స్మశానంచేశాడు. ద్రోణుడూ మొదలైన మహాయోధుల్ని మూడుచెరువులనీళ్ళు తాగించాడు. దేవతల్ని మెప్పించాడు. దేవలోకంవెళ్ళి, దేవతల్లో కలిసిపోయాడు.

[illegible] ముఖుపడకండి. శత్రువుల్ని హతమార్చడమే అతడికి శాంతి. కండి, వేగ పున్నంతివరకూ యుద్ధం చెయ్యండి. కౌరవుల్ని కడ తేర్చండి. విజయం సాధించండి" అంటూ హెచ్చరించాడు. వింటినారి మోగించాడు. శత్రుసంహారం సాగించాడు.

సాయంకాలమయింది. ఎర్రబడ్డ సూర్యబింబం పడమటికొండ తలమీద పద్మంలా ప్రకాశించింది. యుద్ధంజరగని వృత్తిచోట్లుకూడా రక్తంలో మునిగినట్టు ఎర్రబడ్డాయి. గుంపులుగుంపులు పిశాచాలు మహానందంతో మాంసం తిన్నాయి. రక్తం తాగాయి. ఆటలాడాయి. పాటలు పాడాయి. రాబందులూ, గెద్దలూ, కాకులూ శవాలు పీక్కు-తిన్నాయి. నక్కలూ, వరభ్యా మాంసం తింటూ, ఎముకలు కొరుకుతూ కోలాహలం చేశాయి. భయంకరంగావుంది సంధ్య.

ఉభయసైన్యాలూ యుద్ధం కట్టిపెట్టేశాయి. కురువాళ్ళు సంతోషంతో గెంతులేస్తూ శిబిరానికి వచ్చేశారు. పాండవులు మొహాలు దించుకుంటూ వెళ్ళారు.

## ధర్మరాజు దుఃఖం

తనశిబిరం చేరుకున్నాడు ధర్మరాజు. ఏసన్నాహమూ లేదు. [illegible]. దిగాలుపడి కూచున్నా డతడు. చుట్టూ పరివారం నిస్పృహపోయి కూచుంది. అందరి మొహాల్లోనూ శూన్యం తాండవమాడుతోంది. అభిమన్యుణ్ణి తలుచుకున్నకొద్దీ కడుపు దేవేస్తోంది ధర్మరాజుకి. దుఃఖం పొంగుకు వచ్చింది. ధైర్యం దిగజారిపోయింది. మొహం వెలవెలబోయింది.

"అన్నయ్యా, అభిమన్యుడు ఏడీ?" అంటే అర్జునుడికి ఏ! చెప్పేది?" బావురుమంటూ అన్నా డతడు — "బాబు, బాలుడు [illegible] యుద్ధం [illegible]. [illegible] నాచేతులా

పంపించాను. శ్రీకృష్ణుడికి మేనల్లుణ్ణి కోల్పోయాను. నేనే– నేనే– దీనంతటికీ నేనే కారణం! మొత్తం ... ?

"తండ్రన్నవాడు తిండికో, బట్టకో పంపుతాడు. ముస్తాబు చేసుకోమనో గంధం రాసుకోమనో సిద్ధం చేస్తాడు. అంతేకాని, నావంటి పాపాత్ముడు తప్ప చావు మొహానికి ఏ తండ్రీ పంపుతాడు? అయ్యో, మా చిట్టినాన్నతో నేనూ ఎందుకు వెళ్ళిపోకుండా వుండి పోయాను! అలా అయితే 'కొడుకా' అని ఏడ్చే అర్జునుడి మొహం చూడకుండా వుండేవాణ్ణి.

"ద్రోణుడూ, కృపుడూ వంటి మహాయోధులు కాపాడుతూ వున్న మహావ్యూహాల్లో పద్మవ్యూహం. దుర్భేద్యమైన వ్యూహమది. నన్ను సంతోషపెట్టడంకోసం లోపలికి వెళ్ళాడు మా బాబు. లేళ్ళమందలోకి సింహం వచ్చినట్టు చొరబడ్డాడు. ఎంతమంది శిరస్సులో వూడ్చేశాడు. దుర్మార్గుడూ, పంతగొట్టూ అయిన దుశ్శాసనుణ్ణి ఓడించడమూ, అన్ని చతురంగబలాలు చావగొట్ట డమూ అతడికే చెల్లింది.

"దేవేంద్రుడంతవాడి ఆపదకి అడ్డుపడ్డాడు తమ్ముడు. కాల కేయులవంటి అనాథ్యుల్ని క్షణంలో కడతేర్చేశాడు. అంతటివాడి కొడుక్కి ఒంటరిచావు పగవాళ్ళచేతికిపెట్టాడు భగవంతుడు! ఏం దారుణం!

"కుమ్మక్కుచేసి కొడుకుని చంపేశారన్న మాటవింటేచాలు భగ్గుమంటాడు అర్జునుడు. అందరినీ హతమార్చికాని నిద్రపోడు. అయితేమాత్రం పుత్రశోకం ఆగడమెలాగ? భూలోకంలోని యావత్తు ధనమూ, స్వర్గంలోని సమస్త వైభవమూ అభిమన్యుడి నవ్వు మొహం ముందు దిగదుడుపు" అంటూ ఎన్నోవిధాల పనివి పనివి దుఃఖపడుతూ ...మన్నాడు.

అంతలో దేవర్షిలాగ వచ్చాడు వ్యాసముని అక్కడికి. లేచి ఎదురువెళ్ళాడు ధర్మరాజు. దండప్రణామం చేశాడు. అర్ఘ్యమూ, ఆసనమూ ఇచ్చి పూజించాడు. అనంతరం అభిమన్యుడివధ వినిపించాడు.

"పద్మవ్యూహం భేదించమని పంపాను అభిమన్యుణ్ణి. అతడేమో భేదించుకు వెళ్ళిపోయాడు. మేం మాత్రం అతడి వెంట వెళ్ళలేకపోయాం. సైంధవుడు అడ్డుపడ్డాడు. అనుకున్నదొకటీ అయినదొకటీ అయింది. వెళ్ళాడు చిట్టితండ్రి. అంతే. మరి తిరిగి రాలేదు.

"అతడు ఒక్కడయిపోయాడు. అంతమందీ అతడిమీద పడ్డారు. చంపేశారు. సుకుమారుణ్ణి, కుమారుణ్ణి ఒంటిగా బాణాల పాలు కావడానికి పంపేసి, బతికివున్న పాపాత్ముడు ఎక్కడనా వుంటాడో! ఈ దుఃఖసముద్రంలో మునిగిపోతున్నాను. గుండెలు తరుక్కుపోతున్నాయి. ఏం దారి!" అన్నాడు.

"ధైర్యవంతుడివి, ధర్మరాజా, నువ్వే ఇలా విచారిస్తే ఏమనాలి!"— సముదాయిస్తూ అంటున్నాడు వ్యాసముని — "అంతమంది రాజుల్ని హతమార్చాడు అభిమన్యుడు. మహాబలశాలి. అతణ్ణి కుర్రాడనడమేమిటి! మహాయోధుడంటాను నేను. శత్రువులన్నవాళ్ళు బాణాలు కొట్టక పువ్వులు రువ్వుతారా మరి! వెర్రివాడివి. అతడికోసం విచారిస్తావేమిటి! ఎవరు ఎంత చేసినా విధి తప్పించలేరు కదా! చావు అంటే ఇంత ఇది కావచ్చా! దేవతలూ, దానవులూ, గరుడులూ, నాగులూ — ఒకరేమిటి దేహం దాల్చిన ప్రతిప్రాణీ చావడం చూస్తూనే వున్నాం కదా! ఆపదలో ఇంత అడిలిపోవచ్చా! విచారించకు. ధైర్యపడు" అన్నాడు.

"అయితే, మృత్యువు అంత తప్పనిసరా తండ్రీ!" కన్నీళ్ళతో ప్రశ్నించాడు ధర్మరాజు — "ఇన్ని ఉపాయాలూ, ఇంత పరాక్ర

మయూ, ఇంత భీకరత్వమూ వున్నాయే ఈ రాజులికి! చావు లేకండా తమప్రాణాలు నిలబెట్టుకోడం ఎవ్వరికీ సాధ్యమే కాదంటావా ?"

## అకంపనుడి కథ

"అడగవలిసినప్రశ్నే అడిగావు" అంటూ అందుకున్నాడు వ్యాసుడు — "లోగడ అకంపనుడని వొకరాజు వుండేవాడు. ఇలాగే పుత్రశోకంతో నారదుణ్ణి అడిగాడతడు. నారదుడు అతడికి మృత్యు ప్రభావం చెప్పాడు. • అది విని దుఃఖం విడిచిపెట్టాడు అకంపనుడు. అదే నీకు చెప్తాను. దుఃఖంపోయి నీమనస్సు శాంతిస్తుంది, విను.

"అనకంపనుడిమీద వొకసారి శత్రువులు దండెత్తి వచ్చారు. యుద్ధంలో అతణ్ణి పట్టేశారు. ఆతడికి వొక కుమారుడు వుండేవాడు. అతడిపేరు హరి. అద్భుతమైన పరాక్రమవంతుడు హరి. తండ్రిని శత్రువులు పట్టెయ్యడంతో అమాంతంగా వెళ్ళి వాళ్లమీద విరుచుకు పడ్డాడతడు. తండ్రిని విడిపించుకువచ్చేశాడు. అంతతో వూరుకుంటే బాగానేవుండేది. కాని అతడికి కసితీరలేదు. ఉద్ధృతంగా వెళ్లి శత్రువులమీద పడ్డాడు. రథాలు, గుర్రాలు, ఏనుగులు - చతురంగ బలం గూనత్తూ హతమార్చడ మారంభించాడు.

"శత్రువులుమాత్రం వూరుకుంటారా! ఉగ్రులయిపోయారు వాళ్ళు. మహాయోధులు అందరూ వొక్కటయి హరిమీద పడ్డారు. ఘోరమైన మహాస్త్రాలూ, శస్త్రాలూ ప్రయోగించారు, హరిని చంపేశారు.

కొడుకుమరణంతో పిచ్చివాడిలా అయిపోయాడు అకంపనుడు. ప్రాణాలమీద ఆశవొదిలేసి శత్రువులమీద విరుచుకుపడ్డాడు. హోరా

• చూ. శాంతిపర్వం. 5 అ.

పోరి యుద్ధంచేశాడు. కారడవిని కాల్చిన దావాగ్నిలాగ శత్రువుల్ని హతమార్చేశాడు. విజయోత్సవంతో దేవేంద్రుడిలాగ తనపట్నానికి వచ్చేశాడు.

విజయమైతే సాధించాడతను. కాని మనస్సులో మాత్రం శాంతి లేకపోయింది. పుత్రశోకం దుర్భరమైపోయింది. నిద్రాహారాలు మానేశాడు. షష్టి ఘడియలూ విచారిస్తూ కూచున్నాడు. అప్పుడు అతడిదగ్గిరికి నారదుడు వచ్చాడు. ఆసనమూ, అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి రుషిని పూజించాడు అకంపనుడు. తన దుఃఖం వివరించాడు. కొడుకుగుణాలు నివేదించాడు. అతడి మరణంవల్ల గెలుపు గెలుపులా లేదని తన వేదన వినిపించాడు. 'మునీంద్రా, లోకానికి మృత్యువే ప్రభువు' అంటారు. అదేమిటో, దానిపుట్టుపూర్వోత్తరాలు ఏమిటో వినాలని వుంది నాకు. నేను వినడం ఉచితమే అయితే అనుగ్రహించు, వినిపించు' అంటూ చేతులు జోడించాడు.

## మృత్యువు కథ

“'మంచిమాటే అడిగావు' – అనుకంపనుణ్ణి అనుగ్రహిస్తూ అందుకున్నాడు నారదముని – 'మృత్యువు కథ బంధుమరణంవల్ల కలిగిన దుఃఖం పోగొడుతుంది' చెపుతాను. సావధానంగా విను.

“'బ్రహ్మదేవుడు ప్రజల్ని సృష్టించాడు. కాని వాళ్ళ సంహారం లేకపోయింది. అందుచేత భూమికి భారం దుర్భరమయింది. దీనికి ఏమిటి సాధనమంటూ విచారిస్తూ కూచున్నాడతడు. దాంతో అతడి ఇంద్రియాల్లోంచి గొప్ప మంటలు పుట్టాయి. పదిదిక్కులా ఆ మంటలు వ్యాపించాయి. చరాచరాత్మకమైన భూతప్రపంచం యావత్తూ దహించడం మొదలుపెట్టాయి. అది శివుడు చూశాడు. లోకహితంకోసం బ్రహ్మదగ్గిరికి వెళ్ళాడతను. మంటలతో మహాదీనిగా

వున్నాడు బ్రహ్మ. శివుణ్ణి చూసి ఆదరహృదయంతో ప్రశ్నించాడు 'దేవా, అక్కడలేంది నీకోరిక. ఏంకోరివచ్చావో చెప్పు. నువ్వు ఏదంటే అదే చేస్తాను. ఆదేశించు" అన్నాడు.

" 'నువ్వు చేసిన సృష్టిమీద నువ్వే కోపించడం దేనికి ? " అన్నాడు శివుడు- "సమస్తసృష్టికీ నువ్వే కర్తవు. నువ్వు వుండబట్టే భూతకోటి యావత్తూ సుఖంగా వుంది. శాంతించు. నాకోసమైనా ఈభూతకోటిని దయచూడు" అన్నాడు.

" 'కోపం కాని, కామం కాని నాలో లేనేలేదు' అన్నాడు బ్రహ్మ — 'ప్రజాభారం అధికమయింది. భూదేవి భరించలేకపోయింది. వచ్చి మొరపెట్టుకుంది. ఆమెకి మేలుచెయ్యడంకోసం సంహారం తలపెట్టాను. కాని ఉపాయం తోచలేదు నాకు. అంచేత నన్ను క్రోధం ఆవేశించింది' అన్నాడు.

" 'మూడులోకాలికీ నాయకుడివి నువ్వు' — అందుకున్నాడు శివుడు — 'నీ దీనివల్లే లోకం పాలిస్తున్నాను నేను. నీకోపం వరసపెట్టి లోకం దహించేస్తోంది. చూడలేక జాలిపడి నీదగ్గిరికి పరిగెత్తుకు వచ్చాను. భూభారం తగ్గించడానికి చరాచర భూతకోటి నంతటినీ వొక్కపెట్టుని భస్మంచెయ్యడం దేనికి ? భూభారం తగ్గించాలంటే మరేదయినా తగిన సంహారవిధానం ఆలోచించు. కోపం విడిచిపెట్టు. ఈ వరం నాకు ప్రసాదించు" అన్నాడు.

శివుడి మాటలతో కోపం విడిచిపెట్టాడు బ్రహ్మ. అగ్ని ఆరిపోయింది. లోకం సంతోషించింది. బ్రహ్మదేవుణ్ణీ, శివుణ్ణీ అభినందించింది.

బ్రహ్మ కోపం విడిచిపెట్టినప్పుడు అతడి ఇంద్రియాల్లోంచి వొక స్త్రీమూర్తి పుట్టింది. ఆమె మొహం రక్తంలా ఎర్రగా వుంది. శరీరం నల్లగావుంది. కళ్ళు చింతనిప్పుల్లావున్నాయి. వస్త్రాలు కుంకంతో

ముంచినట్టు వున్నాయి. నవ్వుతూ, శివుణ్ణీ, బ్రహ్మనీ వొయ్యారంగా చూస్తూ దక్షిణందిక్కు బయలుదేరిం దామె.

"'మృత్యువా! ఓ మృత్యువా! ఎటు పోతున్నావు?' మనసుపెట్టి మరీమరీ ఆమెని పిలిచాడు బ్రహ్మ — 'చంపాలని నాకు సంకల్పం కలిగినప్పుడు నాకోపంలో పుట్టావు నువ్వు. అంచేత నిన్ను ఆదేశిస్తున్నాను. విచక్షణ అక్కరలేకండా సమస్త ప్రాణుల్నీ సంహరించాలి నువ్వు. నీకు మేలు కలుగుతుంది' అన్నాడు.

బ్రహ్మదేవుడి ఆదేశం విని వలవలా ఏడ్చింది మృత్యువు. ఆమె కన్నీటిబిందువులు దోసిలిలో పట్టాడు బ్రహ్మ. లోకహితం కోసం ఆమెని అనేక విధాల బోధపరిచాడు.

"'ఈ అధర్మానికి అడిలిపోతున్నాను' గాలికి అల్లాడిపోయిన తీగెలాగ వొణికిపోతూ అంది ఆమె — 'నువ్వు సృష్టించావు నన్ను. ఈక్రూరకర్మకి ఎలా నెట్టుకునేది? బంధువుల చావుకి మొత్తుకుంటారు జనం. పనివి పనివి ఏడుస్తారు వినలేను. ప్రభూ, నన్ను కరుణించు. ఈ ఘోరం నాచేత చేయించకు. తపస్సుచేసుకుంటాను. అనుమతించు. ఈమాత్రం వరం దయచెయ్యి, ధేనుకాశ్రమం పోతాను' అంటూ రెండుచేతులూ జోడించింది.

"'ప్రజల్ని చంపడంకోసమే పుట్టించాను నిన్ను' అన్నాడు బ్రహ్మ - 'అంచేత విచారించకు. ఇది ఇలాగే జరగాలి. ఇంకోవిధంగా జరగడానికి వీలులేదు. నింద లేకండా ప్రజల్ని సంహరించు. ఈపని తప్పదు నీకు' అన్నాడు.

"భయపడుతూ భయపడుతూ అప్పటికి వొప్పుకుందామె. మరి మారుమాట చెప్పలేక బ్రహ్మదేవుణ్ణే చూస్తూ నుంచుంది. సంతోషించాడు బ్రహ్మ. చల్లనిచూపుతో లోకాలుచూశాడు. తుష్టి

పొందాయి లోకాలు. ఎప్పటిలాగే సుఖపడ్డాయి. శివుడు అంతర్ధాన మయాడు.

" ' మృత్యుదేవి బ్రహ్మకి నమస్కరించి సెలవు తీసుకుంది. అక్కడినించి తిన్నగా ధేనుకాశ్రమానికే వెళ్ళిందామె. అక్కడ నియమపూర్వకంగా గంగా, కౌశికీనదుల్లో ఎన్నో అన్ని వ్రతాలు చేసింది. తీర్థాలన్నీ తిరిగింది. ఎంతోకాలం బ్రహ్మనుద్దేశించి దుష్కర మైన తపస్సుచేసింది. అలా హిమాలయం చేరుకుంది. ఇంద్రియాలు నిగ్రహించింది. ఘోరమైన తపస్సు ప్రారంభించింది.

" ' అక్కడే ఆమెకి ప్రత్యక్షమయాడు బ్రహ్మ. 'మృత్యు దేవీ! ఏమిటిది? ఇంత నిష్ఠురమైన నియమాలు ఆచరిస్తున్నావు. ఎందుకని ?' అని అడిగాడు.

" 'ప్రభూ, బతికున్న ప్రజల్ని పీకలు నులిపి చంపలేను' చేతులు జోడిస్తూ అంది మృత్యువు — 'ఈపనికి నన్ను పంపకు. అధర్మానికి భయపడుతున్నాను. ఆర్తురాలిని. ఆశ్రయిస్తున్నాను. అనుగ్రహించు" అని కాళ్ళమీదపడింది.

" 'నామాటమీద నడుచుకుంటే అధర్మమెలావస్తుంది నీకు ?' ఆమెకి నచ్చచెపుతూ అన్నాడు బ్రహ్మ — 'అధర్మంకాదు, పైగా ఉత్తమమైన ధర్మంచేసినదానివే అవుతావు. పుణ్యమూ, కీర్తీ కలిగేలాగ శివుడూ, నేనూ నీకు వరమిస్తాము. మేం నియమించిన పనికి భయమెందుకంటూ ? సంశయించకు. నామాటవిను. నాలుగురకాల ప్రాణుల్నీ సంహరించు' అన్నాడు.

"'దేవా, తప్పదంటే, నీ ఆజ్ఞ తలమీదపెట్టుకు నెరవేరుస్తాను' చివరికి సమ్మతిస్తూ అంది మృత్యువు — 'అయితే వొక్క మనవి మాత్రం చిత్తగించు. లోభమూ, క్రోధమూ, ఈర్ష్యా, అసూయా ప్రాణుల శరీరాల్లో వికృతి కలిగించాలి.'

" 'తప్పకుండా నువ్వు కోరినట్టే జరుగుతుంది' అన్నాడు బ్రహ్మ – 'అంతేకాదు, నువ్వు కార్చిన కన్నీళ్ళు ఎన్ని చుక్కలున్నాయో అన్నీ అన్ని రోగాలవుతాయి. అవే జనాన్ని చంపగలుగుతాయి. అంచేత అధర్మం నిన్ను చేరదు. ప్రాణుల ప్రాణం తియ్యడం నీకు పరమధర్మమవుతుంది. నీ శుభమే నేను కోరుతున్నాను. నువ్వు ధర్మస్వరూపానివి. ఈవిశ్వానికి ఈశ్వరివి. అంచేత ప్రాణం తియ్యడం నీ అధీనంలో వుంటుంది. కామమూ, రోషమూ లేకండా సమస్తప్రాణుల ప్రాణాలూ ఆకర్షించు. అదే ధర్మతత్త్వం. భయపడనక్కరలేదు నువ్వు. అసత్యంగా నడుచుకున్న వాళ్ళని అధర్మమే హతమారుస్తుంది. వెళ్ళు" అన్నాడు.

" 'కాదంటే శపిస్తాడేమో అన్న భయమూ, తనని అధర్మం పొందదన్న అతని మాట మీద నమ్మకమూ–బ్రహ్మ చెప్పినదానికి వొప్పుకున్నట్టు చేశాయి మృత్యువుని. ప్రాణిసంహారానికి అంగీకరించిందామె. రాజా, బ్రహ్మమాటప్రకారం ఆధివ్యాధులు ప్రాణులశరీరం చెడగొడతాయి. మృత్యువు ప్రాణాలు హరిస్తుంది. ప్రాణులు శరీరం వొదిలేసి, దేవాదిభావాలు పొందుతూ తిరిగీ మనుష్యగతి పొందుతూ వుంటాయి. శరీరం నిలపడానికీ, చెరపడానికీ కర్త గాలి. గాలి నిజంగా భయంకరుడు. అనంతమైన తేజస్సు కలవాడు. అతడి నాదమూ భయంకరమైంది. పోవడమూ, రావడమూ అతడికి వొక ఆట. అంతే.

"మనుషులు దేవతలవుతారు. దేవతలు మనుషులవుతారు. నీకొడుక్కి – శాశ్వతమైన దేవత్వం దొరికింది. అతడికోసం విచారించడమెందుకంటా, పచ్చి దుఃఖాలపుట్ట ఈ ప్రపంచం. ఇది వొదిలేశాడు నీ కొడుకు హరి. సుఖంతప్ప దుఃఖమన్నది లేని పుణ్యలోకం చేరుకున్నాడు. దీనికని దుఃఖపడకూడదు. బ్రహ్మ కల్పించిందే మరణం.

ఇది తెలుసుకుని ధీరులయినవాళ్ళు, మరణించినవాళ్ళకోసం విచారించరు' అన్నాడు.

"నారదుడు చెప్పిన మృత్యుకథ విని పుత్రశోకం విడిచిపెట్టాడు అకంపనుడు. అనంతరం నారదుడు తన ఆశ్రమం వెళ్లి పోయాడు.

"ధర్మరాజా, ఈకథ రాసినవాళ్ళకీ, చదివినవాళ్ళకీ, విన్న వాళ్ళకీ సకలశుభాలూ కలుగుతాయి. ఆయువూ, ఆరోగ్యమూ, ఐశ్వర్యమూ చేకూరుతాయి. విన్నావుకదూ! అభిమన్యుడు యుద్ధంలో మడమ తిప్పలేదు. ధనుస్సూ, బాణాలూ పుచ్చుకుని దివ్యాస్త్రాలతో శత్రుసంహారంచేశాడు. శాశ్వతమైన వీరస్వర్గం చేరుకున్నాడు. కీర్తి సంపాదించాడు. అతడికోసం విచారించడం అనవసరం" అన్నాడు.

వ్యాసముని చెప్పిందంతా విన్నాడు ధర్మరాజు. ఉత్తమ క్షత్రియధర్మమే ఇది అని సమాధానపడ్డాడు. శూరులు పుణ్యలోకంలో సుఖపడతారని మనస్సు సరిపెట్టుకున్నాడు.

"మునీంద్రా, లోగడ పుణ్యలోకాలు పొందిన, ప్రసిద్ధులైన మహారాజులు ఎలాంటి యజ్ఞాలు చేశారో!" దుఃఖం విడిచిపెడుతూ వ్యాసులవారిని అడిగాడు ధర్మరాజు.

"అవును, వెనకటి మహారాజులంతవాడు అభిమన్యుడు" ధర్మరాజుప్రశ్న అవగతంచేసుకుంటూ అన్నాడు వ్యాసముని — "అంచేత వాళ్ళకీ ఇతడికీ పుణ్యగతిలోవున్న తారతమ్యం తెలుసుకోవాలని నీ అభిప్రాయమనుకుంటాను, నువ్వు ఇలా అడగడం!" అన్నాడు.

"నా చిత్తానికి తట్టింది ఎలా కాదంటాను ? అదీ వినాలనే వుంది. సెలవియ్యి" అన్నాడు ధర్మరాజు.

"యుద్ధంలో మరణించిన వీరులతోనా వాళ్ళని పోటిచేస్తావు!" అంటూ అందుకున్నాడు వ్యాసుడు – "యజ్ఞాలుచేసినవాళ్ళూ, తపస్సులుచేసినవాళ్ళూ, దానాలుచేసివాళ్ళూ వీళ్ళంతా వెళ్లిన పుణ్యలోకాలు ఏవీకూడా యుద్ధవీరులు వెళ్ళిన లోకాలతో సరికావు. నమ్ము. అభిమన్యుడు మహత్తరమైన పుణ్యలోకంలో మహాసౌఖ్యం అనుభవిస్తూ వుంటాడు.

"అది అలా వుండనీ, అంతటి మహానుభావులయినా అంతరించే పోయారు మహారాజులు. ఒక్కడూ పుట్టికట్టుకు వుండిపోలేదు. అయితే మహానీయులైన మహరాజుల చరిత్రలు వినడమూ మంచిదే, నీదుఃఖం నివారిస్తుంది. చెపుతాను, విను.

## సువర్ణష్ఠీవికథ

"లోగడ శైబ్యుడికొడుకు సృంజయుడని ఒకరాజు వుండేవాడు. అతను చాలాగొప్పవాడు; పుణ్యమూర్తి. నాలుగుసముద్రాల మధ్యా వున్న భూప్రదేశం యావత్తూ ఒక్కడే అడ్డులేకండా పరిపాలించాడు. అన్నీవుండి అయిదోతనం లేనట్టు పుత్రసంతానంమాత్రం లేదు అతడికి. అందుకని ఎప్పుడూ బ్రాహ్మల్ని పూజిస్తూవుండేవాడు.

"నారదమునికీ అతడికీ స్నేహం. అంచేత సృంజయుడిదగ్గిరికి నారదముని తరుచుగా వస్తూవుండేవాడు. ♦ ఒకనాడు యథాప్రకారం మునివచ్చాడు. అవాళ బ్రాహ్మలందరూ కూడబలుక్కుని ముని దగ్గిరికి వచ్చారు. మహరాజుకోర్కె తీర్చవలిసిందంటూ అతడితో విన్నవించారు.

♦ చూ. శాంతిపర్వం.

"'ఏమిటి నీ కోర్కె? నాతో చెప్పలేదేం?' సృంజయుణ్ణి అడిగాడు నారదుడు.

"'కొడుకు కోసం దివారాత్రాలూ తపిస్తున్నాను' అన్నాడు సృంజయుడు—'బుద్ధిమంతుడూ, రూపవంతుడూ అయిన కుమారుడు కావాలి. అతడి మలమూత్రాలూ, తేపా, కన్నీళ్ళూ, చెమటా యావత్తూ బంగారం కావాలి' అన్నాడు.

"సృంజయుడు కోరినప్రకారం వరమిచ్చాడు నారదముని. అందమైనవాడూ, బుద్ధిమంతుడూ అయిన కుమారుడు కలిగాడు సృంజయుడికి. కుమారుడికి సువర్ణష్ఠీవి అని పేరుపెట్టాడతడు. అతణ్ణి అరిచేతినిమ్మపండులా పెంచాడు. అతడి మలమూ, మూత్రమూవల్ల రోజూ కొండలా పెరిగింది బంగారం. మంచాలూ, కుర్చీలూ, ఇల్లూ, వాకిలీ, ప్రాకారమూ అన్నీ బంగారమయంచేసేశాడు సృంజయుడు. చెప్పతరంకాని గొప్పతనమూ, ఆనందమూ అనుభవించాడు.

"ఇలావుండగా వొకనాడు కొందరు దుర్మార్గులు వచ్చి, సువర్ణష్ఠీవిని దొంగతనంగా ఎత్తుకుపోయారు. అతిడి నోట్లో గుడ్డలు కుక్కేసి అడివికి పట్టుకుపోయారు. కడుపులో బంగారం వుంటుందని అతడికడుపు చీల్చేశారు. ఒళ్ళంతా చీల్చిచీల్చి గాలించారు. ఎక్కడా పిసరంత బంగారం దొరకలేదు వాళ్ళకి. అతడిశవం అడివిలో పారేసి వచ్చేశారు వాళ్ళు. వచ్చేస్తూ దారిలో వాళ్ళలోవాళ్ళు దెబ్బలాడుకున్నారు. పాపఫలం ఎటుపోతుంది? ఒకళ్ళనొకళ్ళు నరుక్కున్నారు; చచ్చారు. కర్మఫలం అనుభవించారు; నరకానికిపోయారు.

కొడుకు కనపడకపోడంతోనే మతిపోయింది సృంజయుడికి. ఊరూ వాడా వెదికాడు. తుదకి అడివిలో కొడుకుశవం చూశాడు. అంత్యక్రియలుచేసి ఇంటికి వచ్చాడు. దుఃఖంతో నిద్రాహారాలు మానేశాడు.

అంతలో నారదముని వచ్చాడు. సృంజయుడు చేసిన పూజలూ అవీ అందుకున్నాడు. 'రాజా, ఏడిస్తే గర్భశోకం చచ్చినవాళ్ళు వస్తారా?' అంటూ ఓదార్చాడు— ' ఇలా నువ్వు ఏడుస్తూ కూచుంటే నీప్రాణం కూడా పోతుంది. నువ్వు నా స్నేహితుడివి. అంచేత నీమేలుకోరి చెప్పేది విను. జన్మెత్తినవాళ్ళు ఎవ్వరూ, ఎంత గొప్పవాళ్ళయినా సరే, శాశ్వతంగా ఈ నరలోకంమీద నిలవరు.

## పదహారుగురు రాజులూ ఏరీ?

" 'చూడూ, అవీక్షితుడి కొడుకు మరుత్తురాజు ఎంతగొప్ప వాడు? హిమాలయం కింద అద్భుతమైన యజ్ఞాలు చేశాడు. యజ్ఞ శాలా మొదలైనవి యావత్తూ బంగారంతోనే చేయించాడతడు. అతడియజ్ఞం బృహస్పతితమ్ముడు సంవర్తుడు ఉపద్రష్టగా వుండి నడిపించాడు. అన్నగారితో పంతంపెట్టుకుమరీ వచ్చాడు సంవర్తుడు. దేవేంద్రుడూ, వరుణుడూ మొదలైన దేవతలూ, మహామునులూ యజ్ఞానికి సహాయంచేశారు. పాలూ, పెరుగూ, పళ్ళూ సమృద్ధిగా సంతర్పణచేశాడు మరుత్తుడు. ఇన్నీ చేసి, ఏడీ, వుండిపోయాడా అతడు?*

" 'సుహోత్రుడు ఎంతగొప్పవాడు!‡ సన్మార్గానికి పెట్టింది పేరు అతడు. ఎంతమంది బ్రాహ్మల్నో పూజించాడు. ఎన్నోవ్రతాలు చేశాడు. దేవతల్ని మెప్పించాడు. అతడంటే అభిమానించి దేవేంద్రుడు బంగారంచేపలూ, తాబేళ్ళూ కురిపించేవాడు. ఆ బంగారమంతా అడిగినవాళ్ళకి పంచిపెట్టేవాడతడు. కురుజాంగలంలో ఎన్నో అన్ని అశ్వమేధయజ్ఞాలు చేశాడు. ఏడీ, అతడు ఎక్కడున్నాడు?

---

* చూ. అశ్వమేధపర్వం. అ. 1.

‡ భుమన్యుడి కొడుకు. హస్తినాపురం స్థాపించిన హస్తి తండ్రి. చూ. ఆదిపర్వం. పు. 100.

"'అంగరాజు ఏం సామాన్యుడా? * అతడూ ఎన్నో యజ్ఞాలు చేశాడు. బంగారంతో నిండిన ఎన్నో వేలు ఏనుగులు బ్రాహ్మణులికి దానం చేశాడు. జవసత్త్వాలతోనూ సర్వలక్షణాలతోనూ వున్న లక్షలకొద్దీ గుర్రాలిచ్చాడు. కొమ్ములికి బంగారం కట్టి కోట్లుకోట్లు గోవులూ, లెక్కాజమా లేని మేకలమందలూ ధారపోశాడు. చెప్పలేనంత మంది కన్యలూ, కుప్పలుకుప్పలు రత్నభూషణాలు అర్పించాడు. అంతటివాడూ వుండిపోయాడా?

"'శిబిచక్రవర్తి అంటే దిశలు తెల్లవారేవి ఏడుదీవుల్లోనూ తనరథం ఆటలాడింది. ఎక్కడా శత్రువన్నవాడు తలెత్తలేదు. అంత వైభవం వుండిన్నీ చిన్న చీమనికూడా నొప్పించలేదతడు. అతడి పుణ్యకర్మలు మెచ్చి తరుగులేనిధనం ప్రసాదించాడు శివుడు. గంగానది వొడ్డుని ఎన్నో యజ్ఞాలు చేశాడతడు. చుక్కలు లెక్కపెట్టవచ్చు, వానచినుకులు ఇన్నని చెప్పవచ్చు. కాని అతడు దానంచేసిన ఆవులు ఇన్ని అని చెప్పలేం. అలాంటివాడూ అంతమైపోలేదూ!

"'శ్రీరామచంద్రమూర్తి! మహానుభావుడు. అతణ్ణి తలుచుకుంటేనే పాపాలు పోతాయి. తండ్రిమాటమీద నడియౌవ్వనంలో అడివికి వెళ్ళిపోయాడు, మునిలాగ. సముద్రానికి సేతువు కట్టాడు. మూడులోకాలికీ ముల్లులా వున్న రావణాసురుణ్ణి చంపేశాడు తన రాజ్యంలో చిన్నపిల్లలచావు లేకండా ధర్మం నిలబెట్టాడు. రామరాజ్యమంటే దేవరాజ్యమనిపించాడు. అశ్వమేధం మొదలైన యజ్ఞాలు చేశాడు. అంతటివాడికీ ఏదీ చావు తప్పలేదే!

"'భగీరథుడు సామాన్యుడా? తన పూర్వుల్ని ఉద్ధరించడం కోసం స్వర్గంలోని గంగ భూలోకానికి పట్టించాడు. గంగ పేరు 'భాగీరథి' అనిపించాడు. పరాక్రమంలో దేవేంద్రుణ్ణి మెప్పించాడు.

* వేనరాజు తండ్రి. చూ. విష్ణుపురాణం 1. 13., భాగవతం. 4

అతడు అశ్వమేధాలు చేసినప్పుడు చేసిన దానం లోకంలో ఎవ్వరూ కనీవినీ ఎరగరు. వేలువేలు రథాలు కన్యలతో నింపాడు. రథానికి నూరేసి ఏనుగులు, ఏనుగుకి వెయ్యేసి గుర్రాలు, గుర్రానికి వెయ్యేసి ఆవులు, ఆవుకి లెక్కలేనంత బంగారం — ఇలా చేసి బ్రాహ్మలికి దానంచేశాడు. అంతవాడూ ఏడీ ఎటు పోయాడు?

" 'దిలీపుడు — ఎన్నో అన్ని అశ్వమేధాలు చేసి దేవేంద్రుణ్ణి మెప్పించాడు. అతడి యజ్ఞాల్లో కోరి విశ్వావసుడూ మొదలైన గంధర్వులు వాద్యాలు వాయించారు. అప్సరసలు పాటలు పాడారు; నాట్యంచేశారు. దేవతలు అలంకరణాలు చేశారు. దేవరుషులు పదే పదే ప్రశంసించారు. మానవప్రపంచం యావత్తూ బంగారమూ, ధాన్యమూ, వస్త్రభూషణాలూ దానంతో నింపేశాడు. నూరో అశ్వమేధయజ్ఞంలో దేవేంద్రుడు ఆసపడితే గుర్రం సమర్పించాడు. తుదకి ఏమయాడు? చూపించూ ఇప్పుడు?

" 'మాంధాత ఎంతటివాడు! * పుట్టింది మొదలు పన్నెండు దినాలదాకా దేవేంద్రుడి వేళ్ళలో అమృతమూ, పాలూ తాగి పెరిగాడు. పన్నెండుసంవత్సరాలకే రాజయాడు. సూర్యుడిఉదయాస్తమయాలమధ్య వున్న భూభాగం యావత్తూ వొక్కడే అనుభవించాడు. అన్నంకొండలూ, నేతినదులూ చేసి బ్రాహ్మలికి భోజనాలు పెట్టాడు. రాజసూయాలూ, అశ్వమేధాలూ చేశాడు. - ఏడీ, ఎక్కడున్నాడు?

" 'యయాతి తక్కువవాడా? దేవాసురయుద్ధంలో రాక్షసుల్ని సంహరించాడు. వర్ణాశ్రమాలు ఏర్పరిచాడు. అగ్నిష్టోమమూ, అశ్వమేధమూ, వాజిపేయమూ, అతిరాత్రమూ, పౌండరీకమూ మొదలైన అనేక యజ్ఞాలు చేశాడు. భూలోకంలోవున్న ధనంయావత్తూ బ్రాహ్మలికి ధారపోశాడు. తనకోసం చిల్లిగవ్వయినా వుంచుకోలేదు. ధర్మ

* చూ. అరణ్యపర్వం. పు. 579-580

తత్వం తెలిసినవాళ్ళలో అంతటివాడు లేడు. మృతసంజీవని తెలిసిన శుక్రాచార్యుడి అల్లుడు. అయితేనేం, చావు తప్పిందా? ♦

"'నాభాగుడి కొడుకు అంబరీషుడిసంగతి ఆలోచించూ! వేలాది రాజుల్ని వోడించా డతడు. ఎంతోమంది రాజులు వొక్కుమ్మడిగా అతడిమీద దండెత్తారు. అందరినీ అడలు కొట్టేశాడు. వాళ్ళ ఆయుధాలూ, వాహనాలూ, జెండాలూ నరికిపారేశాడు. గడగడలాడిపోయారు వాళ్ళు. శరణంటూ కాళ్ళబేరానికి వచ్చారు. అందరినీ క్షమించి వొదిలేశాడు. ఈ విశాలమైన భూలోకం యావత్తూ పాలించాడు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. బంగారం కవచాలతోవున్న రాజుల్ని బ్రాహ్మలికి దానంచేశాడు. నవరత్నాలు రాసులు దక్షిణలిచ్చాడు. పాయసాలూ, పిండివంటలూ, కజ్జాలూ వొద్దువొద్దు అన్నంతవరకూ తినిపించాడు. అంతవాడూ చావుతప్పించుకోగలిగాడా?

"'శశిబిందుడు సామాన్యు డంటావా? లక్షమంది భార్యలు అతడికి. ఒక్కొక్క భార్యకి వెయ్యేసిమందిచొప్పున పదికోట్లమంది కుమాళ్ళని కన్నాడు. ప్రతికొడుకుకీ వందేసిమంది కన్యలు బంగారం నగలతో కట్టబెట్టాడు. ప్రతికన్యకీ వందేసి ఏనుగులూ, ప్రతఏనుగుకీ వందేసి రథాలూ, ప్రతిరథానికీ ఎందేసిగుర్రాలూ, ప్రతి గుర్రానికీ వెయ్యేసి పాలావులూ, ప్రతిఆవుకి ఏభయ్యేసి మేకలూ ఇచ్చాడు. కొడుకులూ, తానూచేసిన అశ్వమేధయజ్ఞాలూ అవీ ఓ! లెక్కలేదంటే నమ్ము. అలాంటి శశిబిందుడు ఏమయాడు? బతికున్నాడా?

"'అమర్త్యరయుడి కొడుకు గయుడూ? నూరేళ్ళు బ్రహ్మాండమైన తపస్సుచేశా డతడు. అగ్నిదేవుడు ప్రత్యక్షమై వరంకోరమంటే బ్రహ్మచర్యమూ, దమమూ, శమమూ-కోరుకున్నాడు. గొప్పగొప్ప

♦ చూ. ఆదిపర్వం. పు. 73 - 87.

యజ్ఞాలు చేశాడు. ముప్ఫయి ఆరు యోజనాల పొడవైన పెద్ద బంగారం వేదిక చేయించాడు. దాని వెడల్పు ముప్ఫయియోజనాలు. ఎత్తు ఇరవై నాలుగు యోజనాలు. దానినిండా వజ్రాలూ, వైడూర్యాలూ నవరత్నాలు పొదిగించాడు. యజ్ఞం ముగిశాక అదంతా బ్రాహ్మలికి ఇచ్చేశాడు. అతడి పేరనే గయ పేరుపడింది. అయితేనేం, పుట్టికట్టుకు పుండిపోయాడా ?

" 'సంకృతికొడుకు రంతిదేవుడి సంగతి చూడూ ! అతిథులూ, అభ్యాగతులూ వాళ్ళకోసం వొకటొరకం వంటవాళ్ళని ఇరవై వేల మందిని పెట్టాడతడు. పగలూ, రాత్రీ అలా అటు వంటలు జరుగుతూ వుంటే ఇటు భోజనాలు జరుగుతూనే వుండేవి. అతడి సత్రయాగంలో పశువులు తమకి తామే ముక్తికోరి వచ్చి వధించమనేవి. ♦ దేవతలు మహానందంతో వచ్చి ప్రత్యక్షమయేవాళ్ళు. వాళ్ళకి కడుపారగా హవిర్భాగాలిచ్చేవాడతడు. రంతిదేవుడి సత్రయాగంలాంటి సత్రయాగం ఎక్కడా చూడలేదనేవాళ్లు ప్రజలు. అంత పుణ్యాత్ముడూ అంతరించిపోలేదూ !

" 'శకుంతలకొడుకు భరతుడు ఎంతవాడు కాడు ! ఆశ్రమంలో బాలుడుగా వున్నప్పుడు సింహాలూ, శరభాలూ, పెద్దపులులూ మొదలైన క్రూరమృగాలమీద స్వారీచేసేవాడు. గొర్రెలూ, మేకలూ కట్టేసినట్టు వాటిని కట్టేసేవాడు; కొట్టేవాడు. వాటితో ఆడుకునేవాడు. అందుకని అతణ్ణి 'సర్వదమనుడు' అన్నారు. మహారాజయూడతడు. గంగా, యమునా, సరస్వతుల వొడ్డున అశ్వమేధమూ, రాజసూయమూ మొదలైన మహాయజ్ఞాలు చేశాడు. బంగారం ఏనుగులూ, బంగారం గుర్రాలూ, బంగారం రథాలూ బ్రాహ్మలికి దానంచేశాడు. ఏడీ, అతడయినా వుండిపోయాడా ?

---

♦ చూ. అనుశాసనిక పర్వం. అ. 8.

" 'పృథుచక్రవర్తిమాట! భూమి మిట్టపల్లాలతో వుండేది. రథాలూ, గుర్రాలూ సుళువుగా నడవడానికి వీలయేదికాదు. అందు కని భూమియావత్తూ సదును చేశాడతడు. అతడిపేరనే ఈభూమికి 'పృథివి' అని పేరువచ్చింది. గోవురూపంలోవున్న భూదేవినించి ఓషధులూ, రత్నాలూ పిదికించాడు. లోకం రక్షించాడు. అతడు చేసిన యజ్ఞాలూ అవీ చెప్పనే అక్కరలేదు. అలాంటివాడూ కీర్తి శేషుడే అయిపోయాడు.

" 'ఇంతెందుకూ, పరశురాముడు మాత్రం! బ్రహ్మద్వేష మంటే భగ్గుమంటా డాయన. వెయ్యిచేతులున్నవాణ్ణి, ఎవ్వరూ గెలవ లేనివాణ్ణి కార్తవీర్యార్జునుణ్ణి కడతేర్చాడు. వరసపెట్టి ఇరవయ్యొక్క మార్లు రాజుల్ని హతమార్చాడు. భూమండలం యావత్తూ ధర్మం తప్పకండా పాలించాడు. రాజులూ, బ్రాహ్మలూ చెయ్యదగ్గ యజ్ఞాలు ఎన్నో అన్ని చేశాడు. భూలోకం కశ్యపుడికి ధారపోశాడు. అందుకనే భూమికి 'కాశ్యపి' అని పేరువచ్చింది. జగమెరిగిన విషయ మిది. అయితే కాలంతీరాక ఆయనా అంతమైపోతాడు. ♦

" 'విన్నావూ, రాజా! ఎలాచూసినా నీకంటే నాలుగురెట్లు గొప్పవాళ్ళు ఇప్పుడు నేను చెప్పిన వీళ్ళంతా. నీకొడుకూ వాళ్ళకంటే దొడ్డవాడే అనుకో. అయితే అందరికీ వున్నదే చావు. అందుకని ఇంత మనస్సు చెడగొట్టుకుని కూచోడం తగనిపని' అంటూ ఇలా ఆయువూ, పుణ్యమూ, ఐశ్వర్యమూ కలిగించే పదహారుగురు రాజుల చరిత్రా చెప్పాడు నారదుడు. అంతా విన్నాడు సృంజయుడు, మాట్లాడకండా వూరుకున్నాడు.

---

♦ పదహారుగురు రాజుల కథ : చూ. శాంతిపర్వం. అ. 1.

" 'నేను చెప్పింది ఏమయినా పనిచేసిందా ? బూడిదలో పోసిన పన్నీరయిందా ?' పలుకూ వులుకూ లేకండావున్న సృంజయుణ్ణి తేరిచూస్తూ అడిగాడు నారదుడు.

" 'పుణ్యకథ వినిపించావు' చేతులుజోడిస్తూ అన్నాడు సృంజయుడు- 'ధన్యుణ్ణయ్యాను. పుత్రశోకంపోయి నామనస్సు శాంతించింది' అన్నాడు.

"సంతోషించాడు నారదముని. 'నీ ఇష్టమైంది ఏదన్నా కోరుకో, ఇస్తాను' అన్నాడు.

" 'మునీంద్రా, నువ్వు ప్రసన్నుడివయ్యావు. ఇంతకంటే నాకు కావలసింది ఏముంది ? నీ దయ కలిగినవాళ్ళకి లోపమేముంటుంది ?' అన్నాడు సృంజయుడు.

" 'నీకుమారుణ్ణి తిరిగీ నీకు ఇస్తాను' అన్నాడు ముని — 'దొంగలచేత ప్రాణంపోయి, నరకంలో వున్నాడతడు. విచారించకు. ఇప్పుడే వచ్చేస్తాడు' అన్నాడు.

"నారదముని నోట్లోమాట నోట్లోనే వుంది. సువర్ణష్ఠీవి బతికి వచ్చేశాడు. సృంజయుడి ఆనందానికి హద్దూపద్దూ లేకపోయింది.

"అవాళనించీ కుమారుణ్ణి అతిజాగ్రత్తగా పెంచాడు సృంజయుడు. మంచి విలువిద్య నేర్పించాడు. వివాహంచేశాడు. సువర్ణష్ఠీవి ప్రయోజకుడయ్యాడు. ఎన్నో యాగాలుచేశాడు. భోగాలూ అనుభవించాడు. తండ్రి తలలో నాలికలా మసులుకున్నాడు.

"సువర్ణష్ఠీవి విలువిద్యనేర్వకముందు, వివాహమూ సంతానమూ లేకండావున్న సమయంలో దొంగలవాతపడి మరణించడంవల్ల నారదుడు కనికరించి బతికించాడు. అభిమన్యుడో, 'మేటివిలుకాడు' అనిపించుకున్నాడు. వివాహమూ చేసుకున్నాడు. శత్రువుల్ని సంహరిం

డాడు. స్వర్గలోకం చేరుకున్నాడు. అతడికోసం విచారించనేకూడ దంటాను.

" ఈ లోకం దుఃఖమయమైంది. అంచేత మానవులు తపస్సుచేస్తారు. దానాలుచేస్తారు. స్వర్గలోకసౌఖ్యంకోసం నానా పాట్లూ పడతారు. వాళ్ళు ఎవళ్ళూ పొందలేని పుణ్యలోకం చేరుకున్నాడు అభిమన్యుడు. అది తెలుసుకున్నావు కదా! పవిత్రులైన పదహారుగురు రాజులకథా విన్నావు కదా! దానాసీనా మనస్సు కుదుటపరుచుకోమంటాను. ధర్మరాజా, దుఃఖించ కిక. వెళ్ళొస్తాను" అంటూ అంతర్ధానమయాడు వ్యాసముని.

విచారమేమో విడిచిపెట్టేశాడు ధర్మరాజు. కాని అర్జునుడు వచ్చాక అతడితో ఏమని చెప్పడం? ఈ ఆలోచనతో మాట్లాడకండా కూచున్నాడతడు.

ధృతరాష్ట్రుడు : అర్జునుడు సంశప్తకులమీదికి వెళ్ళాడుకదా! ఏమయిందో అక్కడ? కొడుకు చావు ఎవ్వరూ చెప్పలేదా? విని ఏమయాడు?

సంజయుడు : మహారణ్యం తగలబెట్టిన కార్చిచ్చులాగ సంశప్తకుల్ని సంహరించాడు అర్జునుడు.

## అంతావున్నారు, అభిమన్యుడో?

"మనస్సు మనస్సులో వుండకండా వుందేం బావా!" సంశప్తకుల్ని సంహరించి తిరిగివస్తూ కృష్ణుడితో అన్నాడు అర్జునుడు, "దుశ్శకునాలు అవుపిస్తున్నాయి. కడుపులో కలిచేసినట్టు అవుతోంది. శరీరం స్తంభించిపోతోంది. ద్రోణుడు తక్కువవాడు కాడు. అన్నయ్యకి ఏంజరిగిందో!" అన్నాడు.

"ధర్మరాజుకి ఏమీ ప్రమాద సుండదు" — ఆలోచిస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు — "భీముడికీ, తమ్ముళ్లకీ ఏమీ రాకూడదు. ఇంకేదో చెడ్డకలిగివుంటుంది" అన్నాడు.

శిబిరానికివస్తూ దారిలో సంధ్యాకృత్యాలు తీర్చుకున్నారు కృష్ణార్జునులు. తరవాత శిబిరంలో ప్రవేశించారు. చిట్లిపోయిన చిత్రాలతోవున్న గోడ ఎలావుంటుంది, అదిగో అలాగ కళాకాంతులులేని జనంతో పాడోతుతూవుంది పాండవశిబిరం.

"ఏమిటి కృష్ణా," దిగులుగా అడిగాడు అర్జునుడు — "సైనికులు నన్ను చూసి మొహాలు వాల్చేసుకుంటున్నారు. తప్పుకు వెళ్ళిపోతున్నారు! వీణాగానం వినపడ దివాళ! పిల్లనగ్రలూ లేవు! శిబిరమంతా ఏమిటి ఇలావుంది? సందేహంలేదు, ఏదో ఘోరం జరిగిపోయింది. అన్నయ్యలో — తమ్ముళ్లో — ఎవరేమయ్యారో! ఏమో! ఊహించడానికి వీల్లేకండా వుంది.

"నా నకివింటే పరిగెత్తుకు వచ్చేస్తాడు అభిమన్యుడు! ఎదురు రాడు ఎంచేతో! ఎలాంటి చెడ్డవార్త వినాలో ఇవాళ? చెయ్యిపెట్టి కలిచేస్తున్నట్టుంది గుండె."

అర్జునుడు ఎంత ఇలా మాటాడుతున్నా పలుకూ వులుకూ లేదు శ్రీకృష్ణుడు.

మరింత గుండెలు బెదిరిపోయి, ఇంకా ఏమేమో అడుగుతూ, తిన్నగా ధర్మరాజువిడిదికి వెళ్ళాడు అర్జునుడు. మొహంలో చిక్కితే రక్తంచుక్క లేదు అతడికి.

తలవొంచుకు కూచున్నాడు ధర్మరాజు. బంధువులూ, స్నేహితులూ, రాజులూ దిగాలుపడ్డ మొహాలతో చుట్టూ మూగివున్నారు. **అంతమందీ దుఃఖంతో కుమిలిపోతున్నారు.**

అందరినీ కలయజూస్తూ వెళ్ళాడు అర్జునుడు. అందరూ వున్నారు. అభిమన్యుడు అవుపడలేదు. కాళ్ళు తొట్రుపడుతూ లోపలికి వెళ్ళాడు అర్జునుడు.

"అంతా వున్నారు, అభిమన్యుడో ?" ఎలుపురాసిన గొంతుకతో అడిగాడు అర్జునుడు — "మీ విచారం చూస్తే చెప్పకండానే తెలుస్తోంది, ఏదో వచ్చిపడిందని. ఏడీ అబ్బాయి? మాటాడరేం ?

"ద్రోణుడు పన్నిన పద్మవ్యూహంలోకి ఇంకొకడు వెళ్ళలేడు. మీరు ఏంచేసినా లాభంలేదు. నాకు తెలుసు.

"కొంపతీసి అబ్బాయిని పంపలేదు కదా మీరు! పద్మవ్యూహంలో ప్రవేశించడం మాత్రమే విన్నాడు వాడు. అంతే. పైకి రావడం వినలేదు అంచేత వాణ్ణి లోపలికి పంపి పాపం పోసుకోలేదు కదా మీరు!

"మీమాటమీద వెళ్ళిపోయి, నాకన్నతండ్రి కౌరవమూకలో కడతేరలేదు కదా ! చెప్పరేం?

"కృష్ణుడి మేనల్లుడు, కుంతీదేవి ముద్దుమనవఁడు, నాకళ్ళ వెలుగు — యుద్ధంలో సింహం, దివ్యాస్త్రాలు నేర్చిన మహావీరుడు — ఎవడు,— ఎవ్వడా చిచ్చులపిడుగుమీద చెయ్యివేశాడు?

"ఒక్కడిచేత వాడు ఎందుకు లొంగుతాడు? ఎంతోమందిని చించి చెండాడి పోరాడివుంటాడు. శౌర్యం, ధైర్యం, గాంభీర్యం — ఎందులో తక్కువ మాబాబు! యుద్ధంలో వెన్ను చూపుతాడన్న మాట సర్వాబద్ధం. ఏడీ? లేడంటే ఎలాభరించడం?

"ఆ నవ్వుమొహం, ఆ తెల్లకళ్ళు, ఆ వెడల్పాటి వక్షస్థలం — కళ్ళారా చూస్తేకాని ఎలా బతికేది?

"మాటాడరేం?

"అయ్యో, హంసతూలికా పానుపుమీద పరుండే శరీరం కరుకు నేలమీద పడిపోయిందో, ఇవాళ! గొడుగునీడ మీదపడుతూవుంటే కలకలలాడే మొహం ధూళిపాలయిపోయిందో! కన్యలమధ్య వుండే ఒగి వరళ్ళమధ్య పడుకున్నాడా! నానాప్రజలికీ నాథుడైన దొర అనాథుడయిపోయాడా ?

"వినయవంతుడు, హృదయం తెలిసినవాడు, సుభద్ర ముద్దు కొడుకు, మొనగాళ్ళకి మొనగాడు, మానధనుడు, దేవేంద్రుడి మన వడు, నా చెలికాడు, ముద్దులయ్య ఏడీ? లేడూ ?

"అయ్యో, మందభాగ్యుణ్ణి నేను. అలాంటి రత్నం ఎలా దక్కుతుంది నాకు! దయలేని దేవుడు, మంచివస్తువు చిరకాల మెలా వుంచుతాడు? సంశప్తకులు పిలిస్తే మొనగాణ్ణని ఎందుకు వెళ్ళాను! నాకన్నతండ్రిని, గుణాలకొండని పోగొట్టుకున్నాను" అంటూ చదికిల బడిపోయాడు.

"హా, కన్నతండ్రీ! నన్ను వొదిలేశావటోయి బాబూ ? మీ అమ్మని ఏడిపిస్తావటోయి నాన్నా ! ఇదిగో, మామయ్య కృష్ణుడు వచ్చాడు, రావోయి నాకన్నా! ఒంటిగా వెళ్ళిపోయావటోయి చిట్టీ ! నేనెటుపోయేది?

"అభీ! అభీ!! ఉత్తరని వొదార్చవా నాన్నా!"

ఇలా ఎన్నోవిధాల పనివి పనివి ఏడ్చాడు అర్జునుడు.

"భీముడు లేకపోయాడా అన్నయ్యా?" ధర్మరాజు మొహం చూస్తూ అడిగాడతడు—"ధృష్టద్యుమ్నుడు దగ్గరలేకపోయాడా ? ద్రుపద మహారాజుని ఇంకెక్కడికైనా పంపించావా ? సాత్యకి ఏమయాడు ? వాళ్ళతాత విరాటరాజు లేకపోయాడా ? నువ్వయినా రక్షించలేకపోయావా ? అంత అసాధ్యమయిపోయిందా ? ఎలాకళ్ళు మూశావురా నా అభీ ?

"అన్నయ్యా, శత్రువుల్ని చించి చెండాడి మరీ పడిపోయాడా నీకొడుకు? చెప్పు. మీ సహాయంకోసం చూడకండా యుద్ధంలో పురికాడా? అయ్యో, అనేకమంది వొక్క-మొగిని మీదపడివుంటారు. కత్తులూ, కటార్లూ, బాణాలూ, బల్లాలూ కొట్టీ, పొడిచీ చిత్రవధ చేసేసి వుంటారు. సహాయపడేవాళ్ళు లేక, నన్ను తలుచుకుని ఎంత ఎలాఅయిపోయాడో మా బాబు! 'నాన్నా, నాన్నా' అని ఎంత పిలిచి వుంటాడో! 'శత్రువులనించి నన్ను బతికించు' అని ఎంత గోలపెట్టేసి వుంటాడో! -

"ఉహ్హూం, తప్పు తలిచాను. అలాంటి దీనుడా నా అభి! కృష్ణుడి మేనల్లుడు యుద్ధంలో దీనాలాపాలాడతాడూ! ఆకాశం విరిగి మీదపడ్డా పరాక్రమం వొదిలేస్తాడూ నాకొడుకు! అసంభవం! అదిమాత్రం జరగదు.

"అబ్బా, చిరునవ్వుతో ముద్దుముద్దుమూటకడుతున్న మానాన్న మొహం కనపడకండావుంది. అయినా నాగుండె బద్దలయిపోకండా వుంది. రాత్రో చేశారేమో ఇది!

"అంతమందీ ఘోరంగా కుర్రాడిమీదపడి చంపేశారు! కృష్ణుణ్ణీ నన్నూ మరిచిపోయారా? ఎంతసాహసం!

"అయ్యో, రక్తంలో మునిగిపోయిన శరీరంతో ఎక్కడపడి వున్నాడూ నాకొడుకు! చూపించేవాళ్ళే లేరా?

"ఒక్కసారి చూస్తాను మానాన్నని!

"ఎక్కడ పడుంటేనేం, పొడిచిన చంద్రుడిలాగ ఆప్రదేశ మంతా వెలుగుచేస్తాడు మా అభి. -

"కొడుకుని చూడక ఎంత కుమిలిపోతుందో సుభద్ర!

"శత్రుసంహారం చేశాడు ఎదురుపోట్లకి పడిపోయాడు. నాకంటపడడమే మానేశాడు నాప్రాణం! -

"ద్రౌపదిదుఃఖం మాన్పించడం ఎవరితరం ?" ఇలా ఎన్నో విధాల దుఃఖపడ్డాడు అర్జునుడు. ధర్మరాజు మొహంచూసి గద్గదికమైన కంఠంతో ఇంకా ఇలా అన్నాడు :

"సంశప్తకులతో యుద్ధంచేస్తూ కౌరవుల సింహనాదాలు విన్నాను. యుయుత్సుడు కేకలువేస్తూ అన్నమాటలు వినిపించాయి. 'అర్జునుడితో యుద్ధంచెయ్యలేరు. కుర్రాణ్ణి ఇంతమందీ ఇలా చంపేశారు ! సంతోషిస్తారేమిటి ? ఏడవాలి మీరు ? కృష్ణుడికీ, అర్జునుడికీ అపరాధంచేసి శివుడన్నా బతకలేడు అదీకాక, ఈ మహాపాపం కట్టికుడుపుతుంది. ఒదిలిపెట్టదు' — ఇలా వాళ్లని అతడు అంటున్న మాటలు చెవులారా విన్నాను. కాని కానుకోలేకపోయాను. శ్రీకృష్ణుడూ విన్నాడు. అతడికి అర్థమయే వుంటుంది. అన్నయ్యా, తగిన సమయంలో పిసరంత నాచెవినివేసుంటే — నీకొడుకుమీద పడ్డ వాళ్ళని అందరినీ అక్కడే హతమార్చేద్దును. ఎంతపనయిపోయింది ! చేతులారా నాతండ్రిని పగవాళ్ళపాలుచేశాను !"

ఇలా కుమిలికుమిలి ఏడుస్తున్న అర్జునుణ్ణి రెండుచేతులా పొదివి పట్టుకున్నాడు శ్రీకృష్ణుడు. ఆయన హృదయమూ తరుక్కుపోతూనే వుంది.

"తెలుసుకోవలిసినదంతా తెలుసుకున్న పండితుడివి. నువ్వే ఇలాఅయితే ఏంచారి ? వీరులన్న యీావన్మందిగతీ ఇదే కదా! దీనికి విచారమెందుకూ ? సైన్యాలు పెట్టుకుని; ఆయుధజీవనానికి పూనుకునే పూనుకున్నాం. నీకొడుకు శత్రువుల్ని సంహరించాడు. కీర్తి నిలబెట్టాడు. స్వర్గం సంపాదించాడు. ప్రియమే కాని అప్రియం ఏముంది ఇందులో ?

"అర్జునా, విను. నీ దుఃఖంచూసి నీవాళ్ళందరూ ఏడుస్తున్నారు. వీళ్ళని ఓదార్చు. లే. తగినట్టు వీళ్ళతో మాట్లాడు" అన్నాడు.

"మానాన్న విషయం చెవులారా వినాలనివుంది" — దుర్భరమైన దుఃఖంతోనూ, గద్గదకంఠంతోనూ అన్నదమ్ములతో అన్నాడు అర్జునుడు — "ఎవడు — ఎవడు చంపాడు మాబాబుని ? చెప్పండి. అతడిదగ్గిరికే పంపిస్తాను వాణ్ణి. ఇవాళటి యుద్ధం వివరాలన్నీ వినిపించండి.

"బలమూ, శౌర్యమూ, పంతమూ, అస్త్రాలూ కలిగిన ఇంతమందీ వున్నారు మీరు ! మీముందు శివుడన్నా చంపలేడు, అగ్గి పిడుగులాంటి అభిమన్యుణ్ణి. ఎంత తలచించుకున్నా అర్థంకాకండా వుంది నాకు. ఎలా జరిగిపోయింది ఈ ఘోరం ?

"మిమ్మల్నీ, పాంచాలంవాళ్ళనీ నమ్మి చెడ్డాను. మీరు చేతకానివాళ్ళే అని తెలిస్తే, ఈగన్నా వాలకండా కాపాడుకుందును నాతండ్రిని.

"రథాలు వురికించేవుంటారు మీరు. విరుచుకు పడేవుంటారు వాళ్ళమీద. మిమ్మల్ని ఓడించేసి, వీరాభిమన్యుణ్ణి ఎవడు — ఎవడా చంపినవాడు ?"

అంతకంతకీ తెరలు తెరలుగా వుప్పొంగిపోతూవుంది అర్జునుడి దుఃఖం. ఇంకా ఇలా అన్నాడతడు :

"ఇంతకీ మీా అందరినీ ఏమనాలో తెలియకండావుంది నాకు ! పౌరుషమూ — బాణాలచేవా ఏముంది మీాకు ! ఇంతమందీ వొక్క బాలుణ్ణి కాపాడలేకపోయారు ! తక్కువకి తలవొగ్గారు ! చవటలు ! పిరికిదద్దమ్మలు ! తెలిసి తెలిసీ కుమారుణ్ణి వొంటరిగా వొదిలి వెళ్ళిన మూర్ఖుణ్ణి. నన్ను నేనే తిట్టుకోవాలి. మిమ్మల్ని అని ఏంలాభం !

పేరుకిమాత్రం మొనగాళ్ళలా వున్నారు. అంతే. నేను లేకపోయేసరికి నాకొడుకుని కాపాడలేకపోయారు! కవచాలూ, ఆయుధాలూ మీకు సింగారానికే కాని మానసానికి కనకనా !" అంటూ తూలనాడాడు. నిట్టూర్పులు విడిచాడు. మొహం చిట్లించుకున్నాడు. క్రోధం, దుఃఖం — ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు. కళ్ళనీళ్లు కారుస్తూ వూరు కున్నాడు.

అక్కడ వున్న యావన్మందీ వొక్కరూ నోరు మెదపలేక పోయారు. కళ్ళెత్తి అతణ్ణి తేరిచూడడానికే భయపడ్డారు. శ్రీకృష్ణుడు వొక్కడే వోదారుస్తూ మాట్లాడాడు. కోపంతో వున్న దేవేంద్రుడిలా అవుపించాడు అర్జునుడు.

## జయద్రథుణ్ణి చంపుతాను లేదా అగ్గిలో దూకుతాను

"పద్మవ్యూహం భేదించమని నేనే పంపాను అభిమన్యుణ్ణి" — వోదార్పుగొంతుకతో మెల్లిగా అన్నాడు ధర్మరాజు, చివరికి — "నువ్వు సంశప్తకుల సంహారానికి వెళ్ళావు. వ్యూహంకూర్చుకుని ద్రోణుడిమీదికి వెళ్ళాం మేము. అయితే అతణ్ణి నిభాయించలేక పోయాం. పద్మవ్యూహంలో అడుగుపెట్టడం అసాధ్యమయింది మాకు. ద్రోణుడి బాణాలముందు తేరిచూడలేకపోయాం. తిరిగి వచ్చేశాం. పద్మవ్యూహం భేదించడానికి అభిమన్యుణ్ణి పంపాలన్నబుద్ధి నాకే పుట్టింది. 'నువ్వు దారిచేసిపెట్టు. మేం నీవెంట చొరబడతాం' అన్నాను. నేను అనడమే తడువు, సముద్రంలో చొరబడ్డ ఏనుగులా పద్మవ్యూహం చొరబడ్డాడు బాబు. నువ్వు నేర్పిన విద్యా, తన భుజబలమూ — ఈ రెంటివల్లా క్షణంలో ద్రోణుణ్ణి దాటుకుని, పద్మ వ్యూహం పాయలుచేసేశాడు. కౌరవసైన్యం కకావికలయిపోయింది వొక్కమారు.

ద్రోణుడూ మొదలైన పెద్దపెద్ద మహారథికులు అతడిమీదికి పరిగెత్తారు. అతడి సహాయానికి మేము అందరమూ వెంటపడ్డాము. కాని అప్పనంలో పెల్లలాగ అడ్డుపడ్డాడు జయద్రథుడు. శివుడి వర ముంది వాడికి. వాణ్ణి గెలుచుకువెళ్ళడం అసాధ్యమయిపోయింది మాకు.

"ద్రోణుడూ, కర్ణుడూ, కృతవర్మా, కృపాచార్యులూ, అశ్వత్థామా మొదలైన కౌరవ యోధులు ఎంతోమంది ముట్ట డించారు అభిమన్యుని. అయితే పిసరంత చేవచెడలేదు అతడు. అప మానవమైన బలప్రతాపాలు ప్రదర్శించాడు. కర్ణుడూ మొదలైన వాళ్ళ కాళ్ళకి బుద్ధిచెప్పించాడు. బృహద్బలుడూ మొదలైన రాజులీ, లక్ష్మణుడూ మొదలైన కుమాళ్ళనీ హతమార్చాడు. పదిమందీ మీద పడ్డారు. రథమూ, ధనుస్సూ లేకండా చేసేశారు. గదపట్టుకుని నేల మీద పోరాడాడు బాబు.

"అంతలో దుశ్శాసనుడికొడుకు ఎదిరించాడు. అతడి రథం విరగ్గొట్టేశాడు అభిమన్యుడు. అతడూ గదపట్టుకుని కలబడ్డాడు. గదా యుద్ధంలో ఇద్దరూ పడిపోయారు.

"తండ్రులపేరూ, మామలపేరూ నిలబెట్టి యుద్ధంచేశాడు అభి మన్యుడు. కీర్తి ప్రతిష్ఠ స్థాపించాడు. స్వర్గలోక మలంకరించాడు" అన్నాడు.

వివరంగా కొడుకుచావు వినడంతోనే గుండె జల్లుమని చెదిరి పోయింది అర్జునుడికి. కీళ్ళు సడిలిపోయినట్టయింది. దుఃఖం దుర్భర మయింది. మూర్ఛపోయా డతడు.

బంధువులు యావన్మందికీ కరచరణా లాడలేదు. కృష్ణుడూ, ధర్మరాజూ చప్పున చేతులమీద లేవనెత్తారు. కొంతసేపటికి తెలివు కున్నా డతడు.

తెలుసుకోడంతోనే జయద్రథుడు కళ్ళకికట్టినట్టు కనిపించాడు అర్జునుడికి. పెదవి కొరిచాడతడు. మొహం ఎర్రబడింది. కనుబొమలు ముడిపడ్డాయి. ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. ఆపాదమస్తకం వణికింది.

"ఇదిగో" కోపంతో గట్టిగా అట్టహాసంచేస్తూ అన్నగారితో అన్నాడతడు — "నువ్వూ, ఈరాజులూ యావన్మందీ నాప్రతిజ్ఞ వినండి. రేపు జయద్రథుణ్ణి చంపుతాను. భయపడి పారిపోతే, లేదా నిన్నూ, నన్నూ, కృష్ణుణ్ణీ శరణుదూరితే మాత్రం చెప్పలేను. ఆబాల హంతకుణ్ణి — దుర్మార్గుణ్ణి కౌరవయోధుల్లో ఎవరు అడ్డుకున్నా సరే, వొదిలిపెట్టను. వాణ్ణి చంపకపోయానో — గురుద్రోహి పోయినగతికి పోతాను. బ్రాహ్మణ్ణి చంపిన పాపానపోతాను. కల్లుతాగినవాడూ, ఉత్తముల్ని నిందించినవాడూ పోయిన దుర్గతికి పోతాను. ఇంతేకాదు, ఇంకో ప్రతిజ్ఞ విను. దేవతలూ, దానవులూ, కింపురుషులూ — ఎవ్వరు అడ్డువచ్చి వాణ్ణి కాపాడినా సరే, రేపు పొద్దుగుంకేలోపున జయద్రథుణ్ణి చంపలేకపోతే గాండీవంపట్టుకుని అందరిఎదటా అగ్గిలో వురుకుతాను" అన్నాడు.

అంటూనే గాండీవం తీశాడు అర్జునుడు. ఎక్కుపెట్టి నారి మోగించాడు. దేవదత్తం పూరించాడు. శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. సైనికులు సింహనాదాలుచేశారు. రణదుందుభులు మోగాయి. ఆకాశం బద్దలయినట్టయింది.

అర్జునుడి గాండీవం నాట్యంచేస్తున్నట్టయింది. జమిలితూణీరాల నించి బాణాలు బైటికి దూకాయి; మంటలు మండాయి.

"తమ్ముడూ," అందాకా మాట్లాడకుండావుండి, అప్పుడే మేలుకున్నట్టయి అన్నాడు భీముడు — "భయంకరమైన నీప్రతిజ్ఞ బల

వరుస్తున్నట్టు వుంది పాంచజన్యం. ఇది వింటే చాలు, గుండెలు జారి పోతాయి దుర్యోధనుడుగారికి” అంటూ మెచ్చుకున్నాడు.

కోపమూ, ప్రతిజ్ఞా, భీముడి ప్రశంసా దుఃఖం కొంత తగ్గించాయి అర్జునుడికి. అప్పుడే వందిమాగధులూ స్తుతించా రతణ్ణి.

## జయద్రథుడి భయం

పాండవశిబిరంలో పాంచజన్యమూ, దేవదత్తమూ వినిపించే సరికి కౌరవశిబిరంలో కళవిళపాటు బయలుదేరింది. వేగులవాళ్లు వచ్చి అక్కడ జరిగిందంతా జయద్రథుడితో చెప్పారు. మతిపోయిం దతడికి. నిప్పులమీద పడ్డట్టయిపోయి, నిలవలేకపోయా డతడు. దుర్యోధనుడిదగ్గిరికి పరిగెత్తాడు.

కొలువులో వున్నాడు దుర్యోధనుడు. ఆప్తులయిన పెద్దపెద్ద రాజులు చుట్టూ కూచునివున్నారు. అంతమందిలోకీ వచ్చి, సిగ్గూ సెరమూ వొదిలేసి, భయంతో లబోలబోమన్నాడు జయద్రథుడు.

“నేను వొక్కణ్ణే అపరాధం చేశానో అతడికి! నామీదే పగపట్టాడు అర్జునుడు. ఏమిటిది? రేపు పొద్దుగూకేలోపల నన్ను చంపేస్తానని ప్రతిజ్ఞచేశాడు. దేవతలూ, దానవులూ, సిద్ధులూ, సాధ్యులూ — అతడి ప్రతిజ్ఞకి అడ్డుపడే వాళ్ళెవరు? నాకోసం మీకెందుకు క్షోభ? ఎటయినా పారిపోతాను” అంటూ కొలువంతా కలయజూశాడు.

“ద్రోణుడూ, కర్ణుడూ, శల్యుడూ, దుర్యోధనుడూ — వీళ్ళంతా యముడు పట్టుకున్న వాణ్ణయినా కాపాడగలవాళ్ళే పూను కుంటే. కాని పూనుకోకపోతే ఏందారి?” — పెదవులు తడుపుకుంటూ, కాళ్ళు కదపలేకుండా వడవడా వణికిపోతూ అన్నా డతడు —

"ఊఁహూఁ, లాభంలేదు. అర్జునుడికి అవుపడకండా పారిపోవాలి. మీ రందరూ అంగీకరించినట్టే కదూ! సెలవు. వెళ్ళివస్తాను" అన్నాడు.

"భయపడకు బావా!" తన కార్యమే లక్ష్యంగా పెట్టుకుని ధైర్యంచెపుతూ అన్నాడు దుర్యోధనుడు - "'యముడు పట్టినవాణ్ణయినా విడిపించగలమ'ని నువ్వే అన్నావుకదా మాలో కొందరిని! ద్రోణాచార్యులూ, కృతవర్మా, శకునీ, సోమదత్తూ, దుశ్శాసనుడూ— వీళ్ళచేవా, సాహసమూ, శౌర్యమూ నీకు తెలుసుకదా! ఇంతమందీ వుండి నిన్ను చావు మొహాన పడేస్తారూ! నామాట నమ్ము. నేనూ, నాతమ్ములూ పెట్టనికోటలా నుంచుంటాం నీకు. ఈ మహాయోధులు యావన్మందీ నుంచుంటే అర్జునుడేకాదు, వాడిబాబు దేవేంద్రుడే అయినా తేరిచూడలేడు నిన్ను" అంటూ చుట్టూవున్న రాజుల్ని చూపించాడు.

కొంత నెమ్మది కలిగింది జయద్రథుడికి. అయితే అంతటితోనూ ఆగలేదతడు. దుర్యోధనుణ్ణి తీసుకుని ద్రోణాచార్యులు దగ్గిరికి వెళ్ళాడు. అర్జునుడికీ తనకీ విలువిద్యలో తారతమ్యమేమిటో చెప్పమంటూ అడిగాడు.

"అర్జునుడికీ నీకూ గురువు నేర్పిన విద్యలో అంతరం లేదు. అయితే అతడు అన్నిరకాల అలజడీ ఓర్చుకుని అభ్యసించాడు. అంచేత గొప్పగొప్ప ప్రయోగాలు అనేకం సాధించాడు. కనక నీకంటే అతడు అధికుడు. దానిమాటకేం, అది అలా వుండనీ. కాని నేనంటూ వుండగా భయమెందుకూ నీకు? నాబాణాలచాటునివుంటే నిన్ను దేవతలైనా తేరిచూడగలరా? అర్జునుడు అడుగుపెట్టలేని అభేద్యమైన వ్యూహం పన్నుతాను. నీ కులధర్మం నువ్వు వొదలిపెట్టకు. యుద్ధంచెయ్యి.

"వేదాలు చదివావు. గొప్పగొప్ప యజ్ఞాలు చేశావు. కులం రక్షించావు. ఇంతటి మహారాజువి — సామాన్యుడిలాగ చావుకి భయపడతావూ! చావకుండా వుండిపోయేవా డెవడు? ఈ యాదవులూ, పాండవులూ వుట్టికట్టుకుని వూరేగుతారా, కలకాలం? ఎవ్వరూ వుండిపోరు. అందరూ పోవలసినవాళ్ళే.

"తపస్సులూ, దానాలూ చేసి పుణ్యలోకాలు సంపాదిస్తారు లోకులు. యుద్ధంలో నిర్భయంగా నిలబడిపోరాడితే చాలు, ఆలోకాలన్నీ కరతలామలకా లవుతాయి రాజులికి" అంటూ నచ్చచెప్పాడు.

దాంతో భయం విడిచిపెట్టేశాడు జయద్రథుడు. శిబిరానికి వచ్చేసి, తానూ దుర్యోధనుడూ యుద్ధప్రయత్నాల్లో మగ్నులయారు. రణవాద్యాలు మోగాయి. సైన్యాలు జల్దుకున్నాయి. యోధులు సింహనాదాలు చేశారు. కౌరవశిబిరాలన్నీ గుబగుబలాడాయి.

## వాళ్ళని నేనెరుగుదును నన్నూ వాళ్ళు ఎరుగుదురు

అక్కడ — ధర్మరాజు ద్రుపదుడూ, సాత్యకీ, విరాటరాజూ, మలయధ్వజుడూ, కేకయులూ మొదలైన రాజులు యావన్మందికీ విచారం విడిచిపెట్టడానికి తగినమాటలు చెప్పాడు. ఎవరి విడిదళ్ళకి వాళ్ళని పంపేశాడు. తమ్ముళ్ళూ, తానూ, కృష్ణుడూ మాత్రం కూచున్నారు.

"నాతో రవంత ఆలోచించనన్నా ఆలోచించావు కావు" అర్జునుడితో అన్నాడు శ్రీకృష్ణుడు — "ఇంతమంది రాజుల ఎదటా ఇలా ప్రతిజ్ఞ చేశావు. కోపం పట్టలేక సాహసించావు. ప్రమాదం తెచ్చిపెట్టావు. రేపు పొద్దుగూకకండా జయద్రథుణ్ణి చంపాలి. మనకి కష్టమైన కార్య మిది. అంతా తారుమారయిపోతుందేమోఅని విచారంగా వుంది. ఏమంటే, మన వేగులవాళ్ళు వచ్చారు. వాళ్ళు చెప్పింది విను.

నువ్వు ప్రతిజ్ఞ చేసినప్పుడు మోగిన శంఖాలు విన్నారు కౌరవులు. అభిమన్యుడిహత్య విని నువ్వు కోపంతో దండెత్తి వస్తావనుకుని భయపడ్డారు. అందుకని రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, సర్దుకోడం మొదలుపెట్టారు. ఇంతలో వేగులవాళ్ళవల్ల జయద్రథుడు నీప్రతిజ్ఞ విన్నాడు. అదలెత్తిపోయాడు. దుర్యోధనుడి దగ్గిరికి పరిగెత్తాడు. నీసామర్థ్యం వెళ్ళబుచ్చాడు. నీప్రతిజ్ఞ వివరించాడు. 'అర్జునుడు కోపగిస్తే మీరు ఎవళ్ళూ అడ్డుకోలేరు' అన్నాడు. సిగ్గూ బిడియం విడిచిపెట్టేశాడు. 'ఎక్కడికన్నా పారిపోతాను' అన్నాడు. 'భయపడకు' అని భరోసా ఇచ్చాడు దుర్యోధనుడు. 'ద్రోణుడూ, కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా, కర్ణుడూ, శల్యుడూ మొదలైనవాళ్ళూ, నేనూ, నాతమ్ముళ్లూ — ఇంతమందిమీ వున్నాం. చూపుకు వేలయినా నీతిట్టు చూపించగలడా అర్జునుడు !' అంటూ ధైర్యం చెప్పాడు. అభేద్యమైన వ్యూహంపన్నుతా నని మహోత్సాహంతో మాట ఇచ్చాడు ద్రోణాచార్యులు. నిజమే. వాళ్ళలో ప్రతీవొక్కడూ అసాధ్యుడు. అంతమందీ వొక్కటయి, వొక్కపనికే పూనుకుంటే ఇక చెప్పేదేముంది! గెలవడం అసాధ్యం కాదూ! అంచేత ఇప్పుడు ఏంచెయ్యాలో ఆలోచించాలి'' అన్నాడు.

"వాళ్ళని నే నెరుగుదును, నన్నూ వాళ్ళు ఎరుగుదురు'' నవ్వుతూ అన్నాడు అర్జునుడు — "నీ సహాయమే వుంటే, వాళ్ళా నాప్రతిజ్ఞ భంగపరిచేవాళ్ళు? నేను జయద్రథుణ్ణి చంపడానికి తమకించి తరిమినప్పుడు ఎవరడ్డుపడ్డా సరే, చించి చెండాడతాను. బాణపరంపర కుమ్మరిస్తాను. భటులూ, ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ సర్వదుంబాలా చేసేస్తాను. రణరంగమంతా రక్తప్రవాహంలో ముంచేస్తాను. కృష్ణా, కౌరవుల్ని గణిస్తావు! వాళ్ళయోధుల బాణాలు మనకి తెలియనివా! నామహాస్త్రాల ప్రవాహంముందు అవన్నీ నలుసులు!

సందేహించకు. ద్రోణుడూ, తక్కిన రథికులూ నిశ్చేష్టులై చూస్తూనే వుంటారు, జయద్రథుడి తల తెగేసి కిందపడేస్తాను. దుర్యోధనుడి సైన్యమే కాదు, ప్రపంచంలోని చరాచరమైన జీవరాశి యావత్తూ ఒక్కటయి అడ్డుపడినా సరే, ఓడించి, చంపేస్తాను జయద్రథుణ్ణి. తప్పదు.

"నీమీద ఒట్టువేసి చెపుతున్నాను. గాండీవంమీదా, నా దివ్యాస్త్రాలమీదా ఒట్టువేసి చెపుతున్నాను. రేపు జయద్రథుడి తల నరికివా రేస్తాను. ద్రోణుడి బలమూ, పంతమూ, ఉపాయమూ— అన్నీ బుగ్గిచేసేస్తాను. చూద్దువు కాని, జయద్రథుడికి అడ్డుపడి ముందుకి వచ్చిన రాజుల్ని కూర తరిగినట్టు తరిగేస్తాను. నగలతో వాళ్ళ చేతులూ, కాళ్ళూ, శిరస్సులూ దొంతులుపడి రణస్థలం ఎంత ఘోరంగా వుంటుందో, అంత అందంగానూ అగ్పిస్తుంది. రక్తమూ, మూలుగులూ పీల్చి భూతాలు తందనాలాడతాయి. కౌరవసేనలో కల్లోలం పుట్టిస్తాను. మనసైన్యాలు నవ్వుతూ కేరింతలాడతాయి. ఎవ్వరూ అడ్డుకోలేరు నన్ను. అంతకివస్తే దుర్యోధనుణ్ణి – ఆ ద్రోహిని నేనే తునకలు చేసేస్తాను.

"ఆయుధం గాండీవమట! యుద్ధం చేసేవాడు అర్జునుడట! సారథి శ్రీకృష్ణుడట! ఇంక శివుడనా మళ్ళించగలడా ఈరథం! ఏదో అనాలని అంటున్నావు కానీ! బావా, నేను దేనికి పూనుకుంటే నువ్వూ దానికి పూనుకోవద్దూ! నీచేతిలో వాణ్ణి నేను. నా ప్రతిజ్ఞ నేను నెరవేర్చినట్టు నువ్వే చెయ్యాలి కదా! అలా అంటావేం? లోకప్రభుడివి నువ్వు. నిరాఘాటంగా ఈప్రతిజ్ఞ నువ్వే గట్టెక్కించు. పరాక్రమంతో ప్రజ్వలిస్తాను నేను. మమ్మల్ని కాపాడేభారం ఎలాగూ నీమీద పెట్టుకునే వున్నావు వెళ్ళు. ఆలస్యమవుతోంది. నిద్రపో. ఉదయాన్నే రథం పూన్చాలి మరి!" అన్నాడు.

ఇక్కడ కృష్ణుడూ, అర్జునుడూ ఇలా మాట్లాడుకుంటున్నారు. పాములు బుసకొట్టినట్టు కోపంతో నిట్టూరుస్తున్నారు.

అక్కడ దేవలోకంలో దేవేంద్రుడూ మొదలైన దేవతలు గడగడ లాడిపోయారు. ఏం పుడుతుందో అని బెంగపెట్టుకు కూచున్నారు. సముద్రాలు సంక్షోభించాయి. నదీప్రవాహాలు అల్లకల్లోలమయాయి. అడవులూ, కొండలూ వాటితో భూమండలం కంపించింది. గుర్రాలా, ఏనుగులా నాశనం సూచిస్తూ మహోత్పాతాలు పుట్టాయి. విశేషించి కౌరవశిబిరంలో దారుణంగా గాలులు అస్తవ్యస్తంగా వీచాయి. నాలుగుదిక్కులా ఉల్కలు రాలాయి. పిడుగులుపడ్డాయి. గుర్రాలూ, ఏనుగులూ కన్నీళ్ళుకార్చాయి. ఎన్నో అన్ని దుశ్శకునాలు కనిపించాయి. పేరుపడ్డ రాజులూ, మహావీరులూ మొదలైనవాళ్ళు కొయ్యబారిపోయారు.

ధృతరాష్ట్రుడు : సరే, అలా కోపంతో ఉడుకెత్తిపోయీ, దుఃఖంతో కుమిలిపోయీ కృష్ణుడూ, అర్జునుడూ ఆరాత్రి ఎలా గడిపారంటావు ?

## కన్నకడుపు

సంజయుడు : అదే చెపుతున్నాను, విను. అంతకిముందు వొక్క నాడు సుభద్రా, ద్రౌపదీ, ఉత్తరా వచ్చి శిబిరంలో వున్నారు. వాళ్ళని ఓదార్చమంటూ కృష్ణుణ్ణి ప్రార్థించాడు అర్జునుడు. గుండెలు పీకుతున్న దుఃఖంతో చెల్లెలి మందిరానికి వెళ్ళాడు శ్రీకృష్ణుడు.

"తల్లికడుపు తరుక్కుపోతూవుంది సుభద్రకి. కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూవుం దామె, భూమి దేవేస్తూ.

"చెల్లీ, నువ్వే ఇలాఅయితే ఎలా చెప్పూ," ఓదారుస్తూ నెమ్మదిగా అన్నాడు శ్రీకృష్ణుడు. "యుద్ధంలో శత్రువుల్ని సంహా

రించడమూ. వెన్ను చూపకండా పోరాడి వీరస్వర్గం వెంచేయడమూ వున్న దేకదా, రాచబిడ్డకి. చూడూ, ఏడవకు. తుచ్ఛమైన ఈలోకం వొదిలేశాడు నీకొడుకు; పుణ్యలోకం చేరుకున్నాడు. దీనికోసం ఇంత విచారంపెట్టుకుంటే ఎలాగ? బ్రహ్మచర్యంచేసీ, తపస్సులుచేసీ, దానాలుచేసీ పొందే లోకాలకంటే ఉత్తమలోకంచేరాడు అబ్బాయి. క్షత్రియస్త్రీకి కావలిసింది ఏమిటి చెప్పూ! వీరుడైన భర్తని వరించడమూ, కుమారుణ్ణి కనడమూ వాడు వీరాధివీరుడయి కీర్తిప్రతిష్టలు సంపాదించడమూ. ఇదే కదా! నీకు ఈమూడూ లభించాయి. కొడుకు శౌర్యమూ, అతడి శత్రు సంహారమూ విన్నావు. సంతోషించాలి, కాని విచారిస్తావూ! కాలంతీరాక ఈలోకంలో నిలవడం ఎవ్వరికీ సాధ్యంకాదు. వివేకంలేనివాళ్ళలాగ నువ్వూ కొడుకుకోసం ఏడిస్తే ఏందారి చెప్పూ! ఇదిగో, కోడల్ని వోదార్చు. ధైర్యంకల దానివి నువ్వు. నువ్వే అధైర్యపడితే తక్కినవాళ్ళసంగతి ఏంకానూ! నిన్ను చూసుకునే దుఃఖం అపుకుంటున్నాం మేం.

"రేపు జయద్రథుడితల తెగనరికి తెస్తాడు అర్జునుడు. నీపాదాలికి పీఠంగా చేసుకోదాన్ని. అర్జునుడి ప్రతిజ్ఞ తప్పదు. అదే తప్పితే భూమి వొణికిపోతుంది. సూర్యుడు మాసిపోతాడు. సముద్రాలు ఇంకిపోతాయి. నామాట నమ్ము. నీకొడుకుచావుకి జయద్రథుడే కారణం. ఆ పాపాత్ముణ్ణి రేపు చంపేస్తాడు నీభర్త. దానికి నువ్వూ, అతడూ సంతోషించండి" అన్నాడు.

అన్నయ్యని చూడగానే 'నాఅభీ' అంటూ మరింత బావురుమంది సుభద్ర — "అయ్యో, నాతండ్రీ, నువ్వు లేకపోడంవల్ల ఈలోకమంతా పాడిల్లులా వుందోయి నాన్నా! నాకడుపులో చిచ్చుపెట్టి ఎక్కడికి వెళ్ళావోయి బాబూ! నిన్ను కన్నాను, అంతే. అంతే పుణ్యంచేసుకున్నాను. భక్తితో నువ్వు నన్ను ఎంతోకాలం

చూసే యోగం లేకపోయింది నాకు. నీకొడుకుల్ని ఎత్తుకుసేవ్యం చేసుకోలేదు నేను. నాకు దిక్కు-వ్వాళ్ళని చూపావోయి కన్నా! బాలుడి వయిస్నీ పట్టరాని బంటుతనం చూపెట్టావు. అంతలేసి రాజుల్ని హత వార్చావు. ద్రోణుకలాంటి కొమ్ములుతిరిగినవాళ్ళని గుంజిగుంజి వొదిలిపెట్టావు. అలాంటివాడివి ఇలా అయిపోయావంటే ముక్కు-మీద వేలుపెట్టుకుంటున్నారు జనం; కన్నీళ్ళతో చూస్తున్నారు నీరూపు రేఖలు.

"సగంశరీరం మెత్తని పక్కమీదా, సగంశరీరం నామీదా వేసుకుని ముద్దుగా నిద్రపోయేవాడు నాప్రాణం! అయ్యో, కటిక నేలని పడుకుని ఎలా వోర్చాడో నాయన! వందిమాగధుల స్తోత్రాలు వినేవాడు, పిశాచాల అరుపులువిని ఎంత బాధపడుతున్నాడో ఇప్పుడు!

"భీముడు మహాబలవంతుడంటారు పాండవులు! సాత్యకి శౌర్యశాలి అంటారు. ద్రుపదుడు యుద్ధంలో పరిపూర్ణుడంటారు. విరాటరాజు ఎదురులేనివాడంటారు. ఇంతమందీవుండి నిన్ను కాపాడ లేకపోయారూ!

"ఎంతలో ఎదిగి ప్రయోజకుడివయావోయి నాపాపా! ఎంతలో బంధువుల్ని మెప్పించావోయి! అంతా కలలా అయిపోయిందోయి నాకొండా!

"కృష్ణుడి మేనల్లుడివి. అర్జునుడి ముద్దుకొడుకువి. నువ్వా శత్రువులపాల పడ్డావు! ఎంత వింతరా దేవుడా!

"నీముద్దు మొహం మళ్ళీ ఎప్పుడు కనపడుతుందోయి నాకన్నా! 'అమ్మా' అని ఎప్పుడు పిలుస్తావోయి అభీ!"

"అభీ! అభీ! ఇదిగో, వొంపులుకుప్ప నీఉత్తర. మెత్తని మనిసన్న తల్లి, ఏడుస్తోంది చూడూ! నిన్ను తలివాలుకుంటాను.

బాబూ, రావోయి! దీని దుఃఖం చూడలేను. మంచిమాటలాడి ఓదార్చవూ! నాగుట్టూ! ఎక్కడున్నావోయి నాముత్యం!

"వ్రతాలూ, యాగాలూ, తపస్సులూ, దానాలూ చేసి పుణ్యలోకాలికి వెళతారు మహాత్ములు. అంతకంటే ఉజ్వలమైన సద్గతికి నువ్వు వెళ్ళావోయి, మచ్చలేని నాచిట్టితండ్రీ!"

వెక్కివెక్కి ఏడ్చింది సుభద్ర. ఇంతలో ద్రౌపదీ అక్కడికి వచ్చింది. ఉత్తరనీ, సుభద్రనీ పొదివి పట్టుకుంది. ముగ్గురూ కిందపడి ఏడ్చారు. కృష్ణుడికి దుఃఖం ముంచుకువచ్చింది. తన్ను తాను సంబాళించుకుని, చివరికి ఎలాగో వాళ్ళని తగినమాటలతో ఓదార్చి, పాండవుల దగ్గిరికి వచ్చేశాడు.

తమ్ముళ్ళనీ, శ్రీకృష్ణుణ్ణీ వాళ్ళవాళ్ళ విడిదలకి పంపేశాడు ధర్మరాజు. తాను అభ్యంతరమందిరానికి వెళ్ళిపోయాడు.

## దర్భశయ్య

శ్రీకృష్ణుడు తన విడిదికి వెళ్ళలేదు. అర్జునుడితో కలిసి అతడి విడిదికే వెళ్ళాడు. శుద్ధజలంతో ఆచమనం చేసుకున్నాడు. ఒక ఏకాంత ప్రదేశంలో దర్భశయ్య వేయించాడు. అక్షతలూ, గంధమూ, పువ్వులూ వాటితో అలంకరించాడు. ఆయుధాలు పూజించి శయ్య చుట్టూ పెట్టాడు. అర్జునుణ్ణి దర్భశయ్యమీద వుండమని నియోగించాడు.

"నువ్వు ఇంతకిముందు రాత్రిళ్ళు దేవపూజ చేసేవాడివి. అది ఇప్పుడు మానేశావు" అంటూ అర్జునుడికి జ్ఞాపకం చేశాడు.

అర్జునుడు పాదాలు కడుక్కున్నాడు. ఆచమనం చేసుకున్నాడు. తాను నిత్యమూ చేసే త్ర్యంబకపూజావిధానంతో

మాల్యమూ, అనులేపనమూ, ధూప, దీప, నైవేద్యాలూ శ్రీకృష్ణుడికి సమర్పించాడు.

శ్రీకృష్ణుడు సంతోషించాడు. అప్పుడైన ద్వారపాలకుల్ని ఆయుధాలతో కాపలాపెట్టి కట్టుదిట్టం చేశాడు. "నువ్వు సుఖంగా నిద్రపో. నీశుభం కోరుతున్నాను. వెళ్ళివస్తాను" అంటూ అర్జునుడితో చెప్పి, దారుకుడితో కలిసి తన విడిదికి వచ్చేశాడు. పలుకూ వులుకూ లేకండా పక్కమీద శరీరం వాల్చాడు. అలా అర్జునుడి చింతతోనే వుండి కొంతసేపటికి కన్నుమూశాడు. దారుకుడుమాత్రం అతణ్ణి కని పెట్టుకుని వున్నాడు.

పాండవశిబిరంలో ఆరాత్రి వొక్కడూ కన్నుమూయలేదు.

"అభిమన్యుడికోసం దుఃఖం ఆపలేక ఇంత ఘోరమైన ప్రతిజ్ఞ పట్టాడు అర్జునుడు! ఎలా అయినా దీన్ని తప్పించాలనే చూస్తారు కౌరవులు. బుద్ధిబలమూ, భుజబలమూ – రెండూవున్నవాళ్ళు అధికం గానేవున్నారు వాళ్ళకి. గొప్పప్రమాదమే వచ్చిపడింది మనకి. ఎలా దీన్ని నిర్వహిస్తాడో అర్జునుడు! పొద్దుగూకేలోపున జయద్రథుణ్ణి చంపాలి. తప్పితే అగ్గిలో పురకాలి. అబద్ధమాడేమనిషికాదు అర్జునుడు. ఎలా అవుతుందో ఇది! మన కేంధారి! మనం చేసిన సుకృతాలు ఫలించాలి. రేపు జయద్రథుణ్ణి అర్జునుడు చంపెయ్యాలి" – ఇలా భావిస్తూ యావన్మందీ దుఃఖంతో దిగాలుమని కూచున్నారు. వేదాలు పూజించారు. ప్రశ్నలువేసి చూసుకున్నారు. శుభం తేలడంతోనే సంతోషించారు. అదే వొకళ్ళతో వొకళ్ళు చెప్పుకున్నారు. "ద్రోణుడులాంటివాళ్ళు పదివేలు వచ్చినా సరే, రేపు జయద్రథుణ్ణి అర్జునుడు చంపగలిగినట్టు కరుణించండి దేవతలారా!" అంటూ వెయ్యి దేవుళ్ళకి మొక్కుకున్నారు.

## మనరథం సిద్ధంగా వుంచు

రాత్రి చాలా గడిచింది. శ్రీకృష్ణుడు మేలుకున్నాడు. "మన రథం సిద్ధంగా వుంచాలి రేపు" దారుకుడితో అన్నాడతడు — "అంతమంది రాజులఎదటా అలా ప్రతిజ్ఞచేసుకు కూచున్నాడు అర్జునుడు. పొద్దుగూకేలోపున కౌరవుల్ని గెలవడం సాధ్యమేనా? ఊహించలేకపోతున్నాను నేను. దుస్తరమైన కార్యమిది. అర్జునుడి ప్రతిజ్ఞ అన్నట్టు జరక్కపోయిందా — దుర్దశల పాలయిపోతాను నేను. నిందా నెత్తిమీదపడుతుంది. అర్జునుడంటే ప్రాణం నాకు. అతడు బతికివుంటేనే నేను బతికివుంటాను. అర్జునుడు లేడంటే బతుకేలేదన్న మాట నాకు. అంచేత ఏమైనా సరే, అర్జునుణ్ణి దక్కించుకోవాలి నేను. నాలో సగమే అర్జునుడు. దారుకా, అతడికోసం నేను యుద్ధం చేశానంటే వింతేముంది? చూడు, రేపు ఎలా వురుకుతానో! ఏలా శత్రువులు కూలిపోతారో! కౌరవసైన్యమూ నాముందు నిలబడుతుంది!

"రేపటియుద్ధంలో చరాచరమైన ప్రాణికోటి యావత్తూ చూస్తుంది, పాండవులంటే నాకు ఎంతప్రేమో? నాబలమూ, కౌశలమూ కూడా తెలుసుకుంటుంది. పొద్దుగూకకముందే జయద్రథుణ్ణి చంపేస్తాను. అడ్డుపడ్డ శత్రువుల్ని చిత్రవధ చేస్తాను. రౌద్రరసం తాండవమాడిస్తాను. ఒక్క జయద్రథుడే అన్నమాటేమిటి, గర్వాంధుడు దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్లూ, బంధువులూ, స్నేహితులూ ఎవ్వరడ్డువస్తే వాళ్ళే ఎగిరిపోతారు. పాండవులకీర్తి దిగ్గజాల దంతాల మీద వెల్లి పడుతుంది.

"సరే, అదంతా జరిగినప్పుడు చూడనే చూస్తావు. రేపు మనరథం సిద్ధంచేసి అట్టేపెట్టు. మనగుర్రాలు శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, వలాహకమూ రత్నాలుతాపిన బంగారంమాలలతో

అలంకరించి వుంచు. గరుడధ్వజం కట్టు, చక్రమూ, గదా, శార్ఙ్గమూ మొదలైన ఆయుధాలు వుండవలసినచోట్ల వుంచు. నువ్వు కవచం వేసుకుని రా. పాంచజన్యం నీకు వినపడేసరికి ఆగమేఘాలమీద తేవాలి రథం" అన్నాడు.

"నీ ఆజ్ఞప్రకారం యావత్తూ సిద్ధంచేస్తాను" వినయంగా విన్నవించాడు దారుకుడు – "కాని అంతవరకూ అవసరంవస్తుందా అని నామనవి. నువ్వు సారథ్యంచేస్తూవుంటే, అర్జునుణ్ణి ఎవ్వడు అడ్డుకునేవాడు ? నీరక్షణా, అర్జునిడి సామర్థ్యమూ లోకానికి తెలియనే తెలుస్తుం దిప్పుడు" అన్నాడు.

అలా కృష్ణుడితమకం నివారించి, పాంచజన్యం ఏసాంకేతికంతో పూరిస్తే రథం పట్టుకువెళ్ళాలో అడిగి తెలుసుకున్నాడు దారుకుడు. "ఆబోతు రంకెవేసినట్టు పాంచజన్యం పూరించగానే రథం పట్టుకు రావా ల"న్నాడు కృష్ణుడు. "వినీవినడంతోనే మెరుపులా వురికిస్తాను రథం" అన్నాడు దారుకుడు. ఇలా ఇక్కడ సారథితో మాట్లాడుతున్నాడు కృష్ణుడు. అక్కడ అర్జునుడు –

## అర్జునుడి కల

కృష్ణుడు ఏర్పరచిన దర్భశయ్యమీద పడుకుని, ప్రతిజ్ఞసాధించే విధానం ఆలోచిస్తూ నిద్రపోయాడు అర్జునుడు. నిద్రలో వొక కల :

శ్రీకృష్ణుడు తలదగ్గిరికి వచ్చాడు. ఎదురులేచాడు అర్జునుడు. తన దర్భశయ్య కృష్ణుడుకి ఇచ్చాడు. తాను పక్కకి తప్పుకుని నుంచున్నాడు.

"విచారించకు" దర్భశయ్యమీద కూచుంటూ అన్నాడు శ్రీకృష్ణుడు – "విచారించే మనిషి శత్రువులచేత కూలిపోతాడు. తన కార్యం తాను నెరవేర్చుకోలేడు. అంచేత విచారానికి అవకాశ మివ్వకు" అన్నాడు.

"ఎలా పోతుంది ఈ విచారం! ప్రతిజ్ఞ పూనాను కదా! నాబలమూ, పౌరుషమూ కాదనిపించి, ఎలాఅయినా నాప్రతిజ్ఞ భంగ పరచాలని చూస్తాడు గురువు ద్రోణాచార్యులు. కర్ణుణ్ణి ముందుపెట్టు కుని కౌరవబలం యావత్తూ అడ్డంపడుతుంది. అందరి వెనకా నిబ్బరంగా వుంటాడు జయద్రథుడు. ఇదంతా తెలుసుకుంటే విచారించకండా ఎలా వుండడం?" అన్నాడు అర్జునుడు.

"అవును. అది నిజమే" ఉపాయం ఆలోచిస్తూ అన్నాడు కృష్ణుడు. ఆచమనంచేసుకుని తూర్పుదిక్కు మొహంచేసుకుని నుంచున్నాడతడు. అర్జునుణ్ణి చూస్తూ మళ్ళీ ఇలా అన్నాడు.

"శివుడికి పరమసాధనం పాశుపతం. అది నీకు బాగా తెలిసిందో, జయద్రథుణ్ణి ఇట్టే చంపేస్తావు. ఆ మహాస్త్రం ముష్టికమూ స్థానకమూ మంత్రపూర్వకంగా తెలుసుకోడం మంచిది. అందుకోసం ఆ మహాదేవుణ్ణి మనస్సులో పెట్టుకుని, భక్తిపూర్వకంగా ధ్యానం చెయ్యి."

అర్జునుడు ఆచమనం చేసుకున్నాడు. నేలమీద కూచున్నాడు. శివుణ్ణి ధ్యానించాడు.

కృష్ణుడు అర్జునుడి కుడిచెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరూ ఆకాశం మీదికి ఎగిరారు. ఎగురుతూ ఉత్తరందిక్కు వెళ్ళారు. చారణులూ, సిద్ధులూ, గంధర్వులూ వున్న ప్రదేశాలు చూస్తూ, అలాఅలా తేలి పోతూ కైలాసం వెళ్ళారు.

సెలయేళ్ళతోనూ, సరోవరాలతోనూ, పూలతీగలుచుట్టుకున్న చెట్లతోపూలతోనూ ఎంతోఅంత గొప్పగావున్న కుబేరుడి విహార ప్రదేశాలు చూస్తూ ముందుకి తేలిపోయారు. అక్కడ వొకదగ్గిర గొప్పగొప్ప మణులతో ప్రకాశిస్తూవున్న వొక మహామందిరం కనిపించింది.

కృష్ణార్జునులు ఇద్దరూ ఆ మహామందిరం లోపలికి వెళ్ళారు. అందులో శివుడు పార్వతీదేవితో కొలువుతీర్చి కూచున్నాడు. వెయ్యి సూర్యబింబాలలా ప్రకాశిస్తూ వున్నాడతడు. ప్రమథులు చుట్టూ కిలకిలలాడుతున్నారు. దేవతలు సేవిస్తున్నారు. మహామునులు స్తోత్రాలు చేస్తున్నారు. అప్సరసలు సంగీతం పాడుతున్నారు.

కృష్ణార్జునులు చూశారు. ఓంకారపూర్వకంగా శివుడికి దండప్రణామం చేశారు. చిరునవ్వుకళ్ళతో చల్లని చూపు చూశాడు శివుడు. తియ్యనిమాటలతో ఇద్దరికీ స్వాగతం చెప్పాడు. "ఏం కావాలి? ఎందుకిలా వచ్చారో చెప్పండి. మీరు కోరింది వెంటనే ఇస్తాను" అన్నాడు.

కృష్ణార్జునులు అంజలిబంధాలు నుదుళ్ళమీద కీలించారు. భక్తిహృదయాలతో ఎన్నో విధాల శివుణ్ణి స్తుతించారు.

"పాశుపతం కోరుకో" అంటూ అర్జునుడికి బోధించాడు కృష్ణుడు. అందుకని శివుణ్ణి తదేక దృష్టితో చూశాడు అర్జునుడు. దర్భశయ్యమీద పడుకునేముందు కృష్ణుడికి తాను అర్పించిన పూజాద్రవ్యాలూ, మాలా, చందనమూ మొదలైనవి శివుడి దివ్యదేహం మీద కనిపించాయి. ఆశ్చర్యపోయాడు అర్జునుడు. శివుడూ, శ్రీకృష్ణుడూ ఇద్దరూ వొకటే అని గ్రహించాడతడు. తలవూపాడు. "దేవా, నీ దివ్యాస్త్రం పాశుపతం ప్రసాదించు" అని ప్రార్థించాడు.

కృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ చిరునవ్వుతో చూశాడు శివుడు. "అమృతమయమైన ఆ సరోవరంలో నా ధనుస్సూ, బాణాలూ వున్నాయి. అక్కడికి వెళ్ళి, అవి పట్టుకురండి" అన్నాడు.

శివుడిదగ్గిర వాళ్ళని కొందరిని వెంట పెట్టుకుని ఆయన సెలవిచ్చిన సరోవరం దగ్గిరికి వెళ్ళారు కృష్ణార్జునులు. ఆ సరోవరంలో రెండు ఘోరసర్పాలు కనిపించాయి. నాలుకలు చాస్తున్నాయవి. విష

జ్వాలలు కక్కుతున్నాయి. ఇద్దరూ ఆశ్చర్యపోయారు. అదంతా దివ్యాస్త్రాల విలాసం అంటూ అవగతం చేసుకున్నారు.

కృష్ణార్జునులు ఇద్దరూ పాదాలు కడుక్కున్నారు. ఆచమనం చేసుకున్నారు. పాములదగ్గిరికి వెళ్ళారు. ఉభయులూ వేదాలు తెలిసిన వాళ్ళే కనక శతరుద్రీయం జపించారు. శివుణ్ణి ధ్యానించారు.

రెండు పాములూ ధనుస్సూ, బాణమూ అయి ప్రత్యక్షమయాయి. కృష్ణార్జునుల సంతోషం చెప్పతరంకాదు. ఇద్దరూ ఆధనుర్బాణాలు తీసుకువచ్చారు. శివుడి సన్నిధిని పెట్టారు.

నీలలోహితవర్ణుడైన వాడు బాలబ్రహ్మచారి శివుడిపక్కనించి లేచాడు. అఖండమైన బలవంతుడిలా అవుపించా డతడు. తిన్నగా వచ్చి అతడు ధనుస్సు పుచ్చుకున్నాడు. ధనుస్సుకి బాణం తొడిగాడు. బాణంతోకూడా నారిలాగాడు. దాని స్థానకమూ, ముష్టిప్రకారమూ ఏకాగ్రదృష్టితో చూశాడు అర్జునుడు. అతడికి మంత్రం ప్రసాదించాడు శివుడు. పరిగ్రహించాడు అర్జునుడు.

శివుడు మళ్ళీ ఆజ్ఞాపించడంతోనే ధనుస్సూ, బాణమూ దివ్య సరస్సులో పెట్టివచ్చాడు అర్జునుడు. వికసించిన పద్మంలా వుంది శివుడి మొహం. చూశాడు అర్జునుడు.

లోగడ అడివిలో శివుడు ఇచ్చిన వరమూ, ఆనాటి దర్శనమూ కళ్ళముందు కట్టినట్టయింది అర్జునుడికి. అవగతమయింది శివుడికి. "అవును. నిజమే నువ్వు భావిస్తున్నది సందేహంలేదు" దయారసం వాలికిపోతూన్న చూపులతో అన్నా డతడు.

పాశుపతం ప్రస్ఫుటంగా గ్రహించాడు అర్జునుడు. అతడి శరీరం గగిర్పొడిచింది. తన అభిలాషకి ఇక అడ్డులేదని నిశ్చయించుకున్నాడు.

కృష్ణుడూ, అర్జునుడూ శివుడి పాదాలమీద నుదుళ్ళు మోపారు. పదేపదే నమస్కారాలు చేశారు. సంతోషంతో వాళ్ళ శరీరాలు పులకరించాయి. ఉభయులూ శివుడి సెలవుతీసుకున్నారు. శిబిరానికి వచ్చేశారు.

కల ముగిసింది. అర్జునుడు కళ్ళు విప్పాడు. తెలతెలవారుతూ వుంది.

అప్పటికి ఇంకా దారుకుడితో మాట్లాడుతూనే వున్నాడు శ్రీకృష్ణుడు.

---

# ద్రోణపర్వం



## మూడో ఆశ్వాసం

అర్జునుడు అలా ప్రతిజ్ఞ పట్టడమూ, అది సాధించడంకోసం ఆరాత్రి కృష్ణుడు అన్ని పోకడలు పోవడమూ విని గుండెలో రాయి పడ్డట్టు అయింది ధృతరాష్ట్రుడికి.

"తెల్లవారాక ఏంజరిగింది? పాండవులు ఏంచేశారు? నమ్ముకున్నారుకదా మనవాళ్ళు, అడ్డుపడ్డాడా ద్రోణాచార్యులు? సంజయా! చెప్పూ, బేజారయిపోతూవుంది నాగుండె" పెదవులు తడుపుకుంటూ అడిగాడు ధృతరాష్ట్రుడు.

"అదే చెపుతున్నాను విను" అంటూ అందుకున్నాడు సంజయుడు — "తెల్లవారింది. వందిమాగధులు మధురగీతాలు పాడారు. పాఠకులు వేదాలు చదివారు. ఆసందడి విని ధర్మరాజు మేలుకున్నాడు. కాలకృత్యాలు తీర్చుకున్నాడు. స్నానమందిరానికి వెళ్ళాడు. మంత్రాలతో పరిశుద్ధమైన నీళ్ళు పరిచారికలు బంగారం కలశాలతో పట్టుకువచ్చినవి స్నానంచేశాడు. చక్కగా ఉదికిపెట్టిన వస్త్రాలు కట్టుకున్నాడు. గమ్మనిపోతూవున్న గంధాలు పూసుకున్నాడు. ఘుమఘుమలాడుతూవున్న పూలమాలలు వేసుకున్నాడు. దేవతార్చన చేసుకున్నాడు. హోమమూ అదీ ముగించాడు. లోగిళ్ళుదాటి వాకిలిలోకి వచ్చాడు. అక్కడ ఆవులూ, బంగారమూ, వస్త్రాలూ, మణిభూషణాలూ బ్రాహ్మలికి దానంచేశాడు. వారి ఆశీర్వాదాలు పుచ్చుకున్నాడు. ఏనుగులమొగసాల దాటి ఆస్థానమండపానికి వచ్చాడు.

ఉదయపర్వతంమీద సూర్యుడిలాగ సింహాసనమెక్కి కూచున్నాడు. కొలువుతీర్చాడు.

విలాసవతులు చామరాలు వేశారు. తక్కిన పరిజనం ఎవరి పనుల్లో వాళ్ళు నిలిచి కొలువుచేశారు.

ఇంతలో ద్వారపాలకుడు వచ్చాడు. "శ్రీకృష్ణులవారు వేంచేశారు" అని విన్నవించాడు. "దయచేయమను" అన్నాడు ధర్మరాజు. శ్రీకృష్ణుడు కొలువులోకి వచ్చాడు. ఆయనకి తగిన ఆసనమిచ్చాడు ధర్మరాజు. ఎంతోఅంత ఆదరించాడు. గౌరవసత్కారాలు చేశాడు.

"రాత్రి సుఖంగా గడిచిందికదా !" అని కుశలప్రశ్న చేశాడు ధర్మరాజు.

"వేరే అడగాలా నువ్వు" అన్నాడు కృష్ణుడు – "నిన్ను చూస్తూవుంటే సుఖానికి కొదవేమిటి నాకు!"

అంతలో భీముడూ, నకుల సహదేవులూ, సాత్యకీ, ద్రౌపది కుమారుళ్ళూ, ఘటోత్కచుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన పాంచాలకుమారుళ్ళూ, విరాటరాజూ, కేకయులూ మొదలైనవాళ్ళు వచ్చారు. ఎవళ్ళకి తగిన ఆసనాలు వాళ్ళకి నియోగించాడు ధర్మరాజు. "సాత్యకిని తన ఆసనంపక్క కూచోపెట్టుకున్నాడు శ్రీకృష్ణుడు.

"కృష్ణా" అందరూ కూచున్నాక వినయంతో అన్నాడు ధర్మరాజు – "మాపడ్డపాట్లూ, మారాజ్యం పోగొట్టుకోడమూ నిన్ను కలతపెట్టాయి. అర్జునుణ్ణి గెలిపించాలని మాపక్షం వహించావు. భక్తవత్సలుడివి. అందుకనే అతడి సారథి వయావు. అలాంటపుడు – పైగా మమ్మల్ని రక్షించమని మేం మాటిమాటికీ చెప్పడమెందుకూ? అర్జునుడి ప్రతిజ్ఞమాత్రం మనస్సులో వుండనీ. దుఃఖ

మహాసముద్రం మధ్య వున్నాంమేం. మమ్మల్ని గట్టుచేర్చడానికి నువ్వే తెప్పవి."

"ఆచింత నువ్వు ఏమాత్రమూ పెట్టుకోవద్దు" అంటూ అందుకున్నాడు కృష్ణుడు — "అర్జునుడు ఇవాళ శత్రుసైన్యం చించి చెండాడేస్తాడు. భూతప్రేతాలు మాంసాలు తినీ, రక్తాలు తాగీ తందనాలాడేట్టు చేస్తాడు. నీమెప్పు సంపాదిస్తాడు. జయద్రథుణ్ణి హతమార్చుస్తాడు. శత్రువులగుండెలు బద్దలయేట్టు విజృంభిస్తాడు."

కృష్ణుడు ఇలా అంటూనే వున్నాడు, అర్జునుడు వచ్చి అన్నగారికి నమస్కరించాడు. లేచి తమ్ముణ్ణి కౌగిలించుకున్నాడు ధర్మరాజు "తమ్ముడూ, గెలుపు నిశ్చయం నీకు. తళతళమంటూవున్న నీవర్చస్సే చెపుతోంది. కృష్ణుడూ ప్రసన్నుడయి కనిపిస్తున్నాడు" ఆశీర్వదిస్తూ అన్నాడతడు.

"అన్నయ్యా, నీకు భద్రమేకదా !" అన్నాడు అర్జునుడు— కృష్ణుడి దయవల్ల అద్భుతమైన కలకన్నాను. అది నువ్వూ, మనవాళ్ళూ అందరూ వినాలి" అంటూ రాత్రి తనకి వచ్చిన కల పూసగుచ్చినట్టు వినిపించాడు. ధర్మరాజూ, అతడితోపాటు అక్కడ కొలువులోవున్న వాళ్ళు అందరూ ఆశ్చర్యమూ, ఆశ్చర్యానికి మించిన ఆనందమూ అనుభవించారు. కొలువు కొలువంతా తలవొంచి శివుకి నమస్కరించింది.

తరవాత అందరినీ యుద్ధసన్నాహాలకని ఆదేశించాడు ధర్మరాజు. యావన్మందియోధులూ, సంతోషంతోనూ, ఉత్సాహంతోనూ, బయలుదేరారు. చరచరా యుద్ధానికి సిద్ధపడ్డారు. కృష్ణార్జునులూ, సాత్యకీ ధర్మరాజుకి నమస్కరించి, ఉల్లాసంతో పైకివచ్చారు. ముగ్గురూ ముందు అర్జునుడి విడిదికి వెళ్ళారు. శ్రీకృష్ణుడు అర్జునుడి రథం సిద్ధంచేశాడు. గెలుపుకలిగించే మంత్రాలు ప్రయోగించి దాన్ని

ఉజ్వలం చేశాడు. అప్పుడే ఉదయిస్తూవున్న సూర్యుడిలా ప్రకాశించిం దది.

యుద్ధానికి సిద్ధంగా ధనుర్బాణాలు పట్టుకుని బయలుదేరాడు అర్జునుడు. బ్రాహ్మలు ఆశీర్వాదాలుచేశారు. తన మహారథానికి ప్రదక్షిణంచేశా డతడు. నమస్కరించి, మీదికెక్కాడు. మేరుపర్వత శిఖరంమీద ప్రకాశించిన సూర్యుడిలా ప్రకాశించాడు.

కృష్ణుడు నొగలమీద కూచున్నాడు. సాత్యకి అర్జునుడివెనక్క కూచున్నాడు. బుధశుక్రులమధ్యవున్న చంద్రుడిలా అవుపించాడు అర్జునుడు.

పుణ్యపాఠకులు వేదాలు చదివారు. వందిమాగధులు స్తోత్ర గీతాలు పాడారు. తమకి జయమూ, కౌరవులికి అపజయమూ సూచిస్తూ అనుకూలవాయువులు వీచాయి. శుభశకునాలు కనిపించాయి.

"మనం తప్పకండా గెలుస్తాం" అవన్నీ పరికిస్తూ సాత్యకితో అన్నాడు అర్జునుడు— "ఎన్నోశుభశకునాలు కనిపిస్తున్నాయి మనకి. నేనేమో నాప్రతిజ్ఞ నెరవేర్చడానికి వెళతాను. నువ్వుమాత్రం ధర్మ రాజరక్షణకోసం వుండాలి. ఏమంటావా? జయద్రథుణ్ణి చంపడం ఎంత అవసరమో, ధర్మరాజుని రక్షించుకోడమూ అంతే అవసరం మనకి. అంచేత వొకటి నేనూ, వొకటి నువ్వూ పంచుకోడం ధర్మం. నువ్వు వుంటే నేను వున్నట్టే భావిస్తాడు అన్నయ్య. నాకోసం నువ్వు ఏమీ భయపడకు. నాకోసం కృష్ణుడున్నాడు. నామీద ఈగన్నా వాలదు. అయితే అన్నయ్యదగ్గిర ఈయన లేడుకదూ! నువ్వే వుండాలి. బ్రహ్మాండమైన పరాక్రమవంతుడు ద్రోణాచార్యులు తెలుసు కదా నీకు! అంచేతే అన్నివిధాలా రాజరక్షణకోసం వుండితీరాలి నువ్వు."

అర్జునుడి మాటప్రకారం సాత్యకి ధర్మరాజు దగ్గిరికి వెళ్ళాడు. అప్పటికే ధర్మరాజు సర్వసన్నాహాలతో సిద్ధంగా వున్నాడు. అతడి మొహంలో యుద్ధోత్సాహం తాండవిస్తోంది. ఆకాశమంటుతూ చంద్రధ్వజం రెపరెపలాడుతోంది.

ధృతరాష్ట్రుడు : పుత్రశోకాగ్నీ, క్రోధాగ్నీ - రెండూ పెనవేసుకుని మృత్యువులాగ వచ్చివుంటాడు అర్జునుడు. ఎలాగూ అతణ్ణి ఎదిరించలేరు కౌరవులు. ఏం కొంప ములిగిందో! పట్నంలో ఒక్కసారి ఇంటింటా ఏడుపులు వినిపించాయి. జయద్రథుడి ఇంటివేపు మరింత గోల్లుమన్నారు.

నేనూ, ద్రోణుడూ, భీష్ముడూ నెత్తికొట్టుకున్నాం. ఏంలాభం! కృష్ణుడిమాట చెవినిపెట్టాడు కాదు దుర్యోధనుడు. కర్ణుడూ, శకుని, దుశ్శాసనుడూ సంఘ కాకండా వున్నాంకట్టుకున్నారు. అందరినీ ఇపుడు హతవార్చుకుంటున్నారు. అసహాయశూరుడు అర్జునుడు. శివుడితో సరితూగుతాడు. అతడు ఒక్కడే లోకాలన్నీ వూడేస్తాడు. అతడికి శ్రీకృష్ణుడు సారథట! ఇక చెప్పేదేముంది? ఎంత మొత్తుకున్నా తగ్గాడుకాదు నాకొడుకు. ఏంచేసేది? సరే, అదలా వుండనీ. న్యాయమైతేనేం, అన్యాయమైతేనేం! అర్జునుడు అలా రావడంతోనే, ఏకమయి కౌరవులు ఏంచేశారట!

సంజయుడు : మహారాజా, ఇప్పుడు ఎంతవిచారించినా నీరు పోయాక గట్టువెయ్యడమే అవుతుంది. ఆనాడు మాయజూదం మాన్పించావుకావు. సంధికి సమ్మతించావు కావు. లోకం లుబ్ధుడని నిందిస్తుంది నిన్ను. అధర్మపరుడివని దుమ్మెత్తిపోస్తుంది. ఎందుకు నిందించదూ అంట! పాండురాజు అంతఘనంగా పాలించాడు, రాజ్యం. వంశానికి పేరూ, ప్రతిష్ఠలూ తీసుకువచ్చారు పాండవులు. వాళ్ళతండ్రి వాట

వాళ్ళకి ఇవ్వడం మానేశావు. పైగా సాకు కొడుకుమీద పెడు తున్నావు. ఎందుకని! నీదుర్బుద్ధి తే ఇదంతా.

అసలు గాండీవం గర్జిస్తే - పాంచజన్యం ఘోషిస్తే - దేవతలే గజగజలాడతారు. తక్కినవాళ్ళు వొకలెక్కేమిటి? కౌరవులు ఏంచేశా రని అడుగుతున్నావు నువ్వు. కౌరవులు ఏంచేస్తారు? కపిధ్వజంతో విరుచుకుపడుతూన్న ఆమహారథంతో యుద్ధంచేశారు. అదే చెపుతు న్నాను. ధైర్యం తెచ్చుకో విచారించకు. విను.

## ప ద్నా లు గో రో జు

అవాళ పెందరాళే యుద్ధానికి బయలుదేరాడు ద్రోణాచార్యులు. ఉత్సాహంతో దేదీప్యమానంగా వున్నా డాయన. శంఖంపూరించి, వొక్కసారి సైన్యంలంతటా తిరిగాడు మన యోధులూ చకచకా ఆయుధాలు సవరించుకున్నారు. ఒకళ్ళతో వొకళ్ళు ప్రజ్ఞలు చెప్పుకున్నారు.

"ఏం, అర్జునుడు ఇంత ఆలస్యంచేశాడేం?"

"కృష్ణుడు తిరుమకుండాడేం?"

"భీమన్నగారి పత్తా ఫికరూ లేదే!"

అంటూ సింహనాదాలుచేశారు. శంఖాలు పూరించారు. అల్లె తాళ్ళు మోగించారు. ఓ, సేనసేనంతా సముద్రఘోషలా వుంది.

"నువ్వూ, భూరిశ్రవుడూ, కర్ణుడూ, శల్యుడూ, అశ్వత్థామా, వృషసేనుడూ, కృపాచార్యులూ కలిసి వుండండి" జయద్రథుడితో అన్నాడు ద్రోణాచార్యులు - "మన సైన్యాల్లోంచి మంచిమంచివి ఎంచి పద్నాలుగువేల ఏనుగులూ, అరవైవేల రథాలూ, లక్ష గుర్రాలూ, పదిలక్షల కాల్బలమూ దగ్గిరపెట్టుకోండి. నేను పన్నిన వ్యూహానికి వెనక మూడుయోజనాలమేర దిట్టంగా నిలవండి. దాంతో

దేవతలైనా నిన్ను తేరిచూడలేరు. పాండవులువాళ్ళ లెక్కేమిటి!” అన్నాడు.

ఈఏర్పాటుతో బాగా కుదుటపడ్డాడు జయద్రథుడు. ద్రోణుడు చెప్పిన యోధులూ, సైన్యమే కాక, తన సైంధవసైన్యంనించీ మంచి మంచి పదివేలమంది గుర్రపురౌతుల్ని దగ్గిరపెట్టుకున్నాడతడు.

## శకటవ్యూహం

ఇరవైనాలుగు కోసుల్ని పొడవూ, పదికోసుల్ని వెడల్పూ పెట్టి బ్రహ్మాండమైన శకటవ్యూహం పన్నాడు ద్రోణాచార్యులు. దానిలో వెనకటి సగంభాగంలో గర్భవ్యూహంగా పద్మవ్యూహం పన్నాడు. పద్మవ్యూహం మధ్య మొనలుపెట్టి తిన్నగా జయద్రథుడు వున్న సేన వరకూ సాగినట్టు సూచీవ్యూహం పన్నాడు. సూచీవ్యూహం ద్వారం దగ్గిర కృతవర్మని నిలబెట్టాడు. అతడి వెనక సుదక్షిణుణ్ణి పెట్టాడు. సుదక్షిణుడి వెనక ఆప్తులైనవాళ్ళ లక్షమంది యోధుల్ని ముందుపెట్టి దుర్యోధనుణ్ణి నిలబెట్టాడు. ఆ వెనక కర్ణుడూ మొదలైన యోధులతో సైన్యంపెట్టి జయద్రథుణ్ణి వుంచాడు. ఆమహావ్యూహం చూసి దేవతలే నివ్వెరపోయారు.

“నేను వొక్కణ్ణే అర్జునుణ్ణి అడ్డేస్తా” ఉద్రేకంతో అరిచాడు దుర్మర్షణుడు. తన చతురంగబలాలు వేసుకుని వ్యూహానికి ఆరువేల మూరలు ముందుకివచ్చి నుంచున్నాడతడు. దుశ్శాసనుడూ, వికర్ణుడూ కూడా తమబలాలతో అలాగే వచ్చి అతడి దగ్గిర నిలబడ్డారు.

అభేద్యంగా వుంది శకటవ్యూహం. ద్వారందగ్గిర ద్రోణసేనాని నిలబడ్డాడు. తెల్లటి వస్త్రాలు, తెల్లటి తలపాగా, తెల్లటి కవచం, ఎర్రటిగుర్రాలు, వేదికాపతాకం, చేతిలో జెర్రిపోతులాంటి ధనుస్సు—యముడిలా చూస్తున్నాడతడు. ఆమహారథి రక్షణకింద ఆమహాసైన్యం

సముద్రాలూ, కొండలూ, అడవులూ — అన్నిటితోనూ ఈభూమండలమే మింగెయ్యడానికి సిద్ధంగా వున్నట్టు వుంది. చూసి సంతోషం పట్టలేకపోయాడు దుర్యోధనమహారాజు.

అంతలో కళ్ళు జిగేలుమన్నట్టు కనబడింది అర్జునుడి వానర పతాకం. హనుమంతుడి విజృంభణతో భయంకరంగావుం దది. అర్జునుడి రథానికి చేరువగా వీరసైన్యాలు నడిపించుకువచ్చి ధృష్టద్యుమ్నుడూ, నకులుడి కొడుకు శతానీకుడూ బారులుతీర్చారు. శంఖాలూ మృదంగాలూ, భేరీలూ, సింహనాదాలూ వొక్కసారి చెలరేగాయి. అర్జునుడు దేవదత్తమూ, శ్రీకృష్ణుడు పాంచజన్యమూ పూరించారు. పతాకంమీద హనుమంతుడు అట్టహాసం చేశాడు. అదంతా విని మన సైన్యాల గుండెల్లో పిడుగులుపడ్డట్టయింది.

మనసేనలో రాళ్ళవాన కురిసింది. ఉల్కలు రాలాయి. పిడుగులుపడ్డాయి. వాటితో రణవాద్యాలూ మితిమీరాయి. కౌరవయోధులు వొకళ్ళ నొకళ్ళు పురికొల్పుకున్నారు. సింహనాదాలు చేశారు.

"సముద్రం నిలిపేసిన యానాపొడ్డులాగ అర్జునుణ్ణి నేనే అడ్డేస్తాను" ముందుకి వురుకుతూ వురిమాడు దుర్మర్షణుడు. పెద్ద ఏనుగు సైన్యం వేసుకుని అర్జునుడిమీదికి వెళ్ళాడు.

## తొలిముద్ద

"వీణ్ణి తొలిముద్ద చేసుకుంటాను" నవ్వుతూ కృష్ణుడితో అన్నాడు అర్జునుడు — "పోనీ మనరథం, వాడిమీదికి."

అర్జునుడి నోట్లోమాట నోట్లోనే వుంది, పగ్గాలు సడలించాడు కృష్ణుడు. బరిమీద పాంలాగ ముందుకు పరిగెత్తుకువచ్చింది రథం. మేఘాలు పర్వతాల కప్పేసినట్టు దుర్మర్షణుణ్ణీ, అతడి ఏనుగుల్నీ ముంచెత్తాయిఅర్జునుడి బాణాలు.

ఒక్కడేవచ్చాడు అర్జునుడంటూ లెక్కాజమా లేకండా ఘిరా యించారు మనరథాలవాళ్ళు. ఎంతమంది మీదికివస్తే అంత ఉల్లాసం అర్జునుడికి. తనచేతి చేవంతా చూపించడం మొదలుపెట్టాడతడు. క్షణాలమీద వందలు వందలు, వేలు వేలు తలకాయలురాలి రణ స్థలమంతా నిండిపోయాయి. కాంతయినా మాయని మొహాలతో ఆ ప్రదేశం పూసిన తామరచెరువులా అవుపించింది. నగలతో కూడా రక్తంలో మునిగి కుప్పలు కుప్పలు కూలిపోయాయి ఏనుగులు. జంట మెరుపులతో, ఎర్రటిసంధ్యలో మేఘాలు ఎలావుంటాయి, అలా అవు పించాయవి.

అలా శత్రుసేన హతమారుస్తూనేవున్నాడు అర్జునుడు. ఒక వంక మీదపడుతూనేవున్నారు శత్రువులు. రకరకాల బాణాలు కుమ్మ రిస్తూనేవున్నారు.

ఏనుగుతొండాలు ఎగిరిపోతున్నాయి. గుర్రాల మొండాలు కూలిపోతున్నాయి. రథికుల శిరస్సులు తుళ్ళిపోతున్నాయి. సారథుల తలకాయలు రాలిపోతున్నాయి. రథాలు గుండపిండయిపోతున్నాయి. పదాతుల శవాలు దొర్లిపోతున్నాయి. వీటన్నిటితో కాలుపెట్టడానికి వీలులేకండావుంది రణరంగం.

"అర్జునుణ్ణి ఆక్రమించండి."

"అర్జునా ఎటుపోతావు ?"

"అర్జునా ఇటురా !"

"అర్జునా, నిలూ నిలూ నరుకుతా."

"అర్జునుణ్ణి పట్టుకోండి." —

మనవ్యాకేకలు అంతూపంతూ లేకండావున్నాయి. శవాల మీద శవాలు పడిపోతూనేవున్నాయి. అయినా దొమ్మీగా అర్జునుడి మీద కలబడి పోరాడుతూనేవున్నారు మనవాళ్ళు.

అర్జునుడికి కళ్ళు కెంపుల్లా ఎర్రబడ్డాయి. ముందూ వెనకా, వల పటా దాపటా - ఎటో చూసినా అన్ని సెలయేళ్ళు వొక్కసారి పుట్టిపొంగి నట్టు వొక్కమొగిని విజృంభించాయి అతడి బాణాలు. దాంతో దుర్మర్షణుడి సేన చిందరవందర అయిపోయింది. వీరుల ధనుస్సులు విరిగిపోయాయి. నెత్తురు వరదలయింది. ఏనుగులు పీనుగులయాయి. కాల్బలము తునాతునకలయింది. గుర్రాలు కూలిపోయాయి. రథాలు తుక్కుతుక్కయాయి. రథికులు రాలిపోయారు. సారథులు చచ్చిపో యారు. ఇంకేముంది, తోకముడిచేశాడు దుర్మర్షణుడు. అతడివెంట సైన్యాలున్నూ వుడాయించాయి. నమ్మోట్లుబాదీ, అంకుశాలు పొడిచీ కొరడాలు ఛెళ్ళుమనిపించీ, గట్టిగా గదమాయించీ వాహనాలు రొప్పు కుని పటాపంచలయిపోయారు యోధులు.

ధృతరాష్ట్రుడు : అంతలో ఎవడయినా అర్జునుణ్ణి అడ్డుకున్నాడా? కాకపోతే, అందరూ కట్టగట్టుకుని ద్రోణాచార్యులు వెనక్కి పారి పోయారా ?

సంజయుడు : లేదు, దుర్మర్షణుడు పారిపోడంతోనే మన యువరాజు దుశ్శాసనుడు దురుసుగా తోసుకువెళ్ళాడు. అతడి ఏను గులు ముందుకి వురుకుతూవుంటే — గణాగణా గంటల మహాధ్వని చెవులు దిమ్మెత్తించింది.

అర్జునుణ్ణీ, అతడిరథాన్నీ బాణాలతో ముంచేశాడు దుశ్శాసనుడు.

అట్టహాసం చేశాడు అర్జునుడు. భూమీ ఆకాశం దద్దరిల్లిపోయి నట్టు దేవదత్తం పూరించాడు. గాండీవం మోగించాడు. చిత్రచిత్ర మైన రాకడలతో రథం పరిగెత్తించాడు. జడివానలాగ బాణాలు కురిపించాడు.

మన ఏనుగులు జర్జరిల్లిపోయాయి. బురదలో కూరుకుపోతే కదలలేకండా ఎలావుండిపోతాయి, అలా నిలబడిపోయాయి. పెద్దగాలికి రాలిపోయే తాటిపళ్ళలాగ ఏనుగులమీంది యోధుల శిరస్సులు కింద రాలాయి రకరకాల నాగుపాముల్లాగ బాహువులు కుప్పలుపడ్డాయి. కత్తులూ, గదలూ, ధనుస్సులూ ఆచేతుల్లో పట్టుకున్నవి పట్టుకున్నట్టే వున్నాయి. వాటన్నిటితో రణరంగం ఎంతో అంత ఘోరంగానూ, అందంగానూ అవుపించింది.

అర్జునుడి బాణాలు గబగబా అంతటా విరజిమ్ముకు పడుతూ వుంటే, ఎక్కడపడితే అక్కడ - ఏనుగులూ, గుర్రాలూ, పదాతులూ వందలువందలు, వేలువేలు హతమారిపోయారు. ఎటుచూస్తే అటు తునకలయిపోతున్న రూపాలే. రక్తం కారుతూన్న రూపాలే. బాధతో అడుస్తూన్న రూపాలే. గింజుకుంటూన్న రూపాలే. తూలిపోతూన్న రూపాలే. పడిపొర్లుతూన్న రూపాలే. నెత్తురు కక్కుతూన్న రూపాలే. చచ్చిపోతూన్న రూపాలే. నాశనమైపోతూన్న రూపాలే.

నిలవలేకపోయాడు దుశ్శాసనుడు. తన సైన్యంతో సహా పలాయనం చిత్తగించాడు.

"ఎటుపోతావు? నిలబడూ" అంటూ వెంటపడ్డాడు అర్జునుడు. "పౌరుషంవొదిలేసి పారిపోతే చావు తప్పుతుందా? ఆహా, ఆనాటి సభలో జంకూగొంకూ లేకండా అన్నవన్నీ మరిచిపోయావు. అవమానించావు. చావు తెచ్చుకున్నావు. మీ అన్నకీ తమ్ముళ్ళకీ తలవొంపులు? మీ పెద్దలు విచారిస్తారు. పారిపోకు" అంటూ వెంటాడాడు. వెన్నుమీద పదిబాణాలు ఫడీ ఫడీ తగిలించాడు. మళ్ళీ వెనక్కిచూస్తే వొట్టు నీకొడుకు. ద్రోణాచార్యులతట్టు చూస్తూ పుంజాలు తెంపుకు పారిపోయాడు.

## గురువూ – శిష్యుడూ

దుశ్శాసనుడు పారిపోయాడు. జయద్రథుడివేపే మనస్సంతా అర్జునుడికి. శకటవ్యూహంమీదికి వురికించాడు రథం. ద్వారందగ్గిర ద్రోణాచార్యుల్ని చూశాడు. అల్లంతదూరంనించే నమస్కరించాడు.

"పాండురాజూ, ధర్మరాజూ, శ్రీకృష్ణుడూ ఎంతో నువ్వూ అంతేనాకు" – శ్రీకృష్ణుడు చెప్పినప్రకారం చేతులు జోడిస్తూ ద్రోణుడితో అన్నాడు అర్జునుడు – "అశ్వత్థామనీ నన్నూ వొక్కలాగే ప్రాణంతో సమానంగా చూశావు నువ్వు. నామేలు విచారించు. నిన్ను ప్రార్థిస్తున్నాను. నీదయతో వ్యూహం ప్రవేశిస్తాను. ఆశీర్వదించు. జయద్రథుణ్ణి చంపి ప్రతిజ్ఞ నిలుపుకుంటాను" అన్నాడు.

"నన్ను గెలవకండా జయద్రథుడిదగ్గిరికి ఎలా వెళతావు?" చిరునవ్వుతో అర్జునుణ్ణిచూస్తూ అన్నాడు ద్రోణాచార్యులు. అంటూనే బాణాలు వేయడం లంకించుకున్నాడు. అర్జునుణ్ణీ, అతడి గుర్రాల్నీ, కృష్ణుణ్ణీ బాణాలతో ముంచెత్తాడు.

"అయితే యుద్ధానికి అనుజ్ఞ దయచెయ్యి" అన్నాడు అర్జునుడు. గురువు అనుమతిపొంది గాండీవం సారించాడు. రివ్వురివ్వుని తొమ్మిదిబాణాలు గురువుమీద రువ్వాడు. ఇట్టే వాటిని సగంలోనే నరికేశాడు ద్రోణుడు. పైగా కృష్ణునిమీదా, అర్జునుడిమీదా బాణాలు గుప్పించాడు.

ద్రోణుడి ధనుస్సు విరగ్గొట్టెయ్యాలనుకున్నాడు అర్జునుడు. ధనుర్వేదంలో మహాచార్యుడు ద్రోణుడు. చూపుల్లోనే అర్జునుడి అభిప్రాయం గ్రహించేశా డాయన. చప్పున అర్జునుడి అల్లెతాడు వొక బాణంతో నరికేశాడు. ఆవూపున అర్జునుణ్ణీ, అతడి సారథి కృష్ణుణ్ణీ, వానరపతాకాన్నీ బాణాలతో కప్పేసి, చిరునవ్వు నవ్వాడు.

అర్జునుడి కళ్ళల్లో కెంపులు మెరిశాయి. చటుక్కున గాండీవానికి అల్లెతాడు తొడిగాడు. ఎరుసపెట్టి గురువుమీద బాణాలు కురిపించాడు. అతడి రెండువేపులా వున్న సేనమీదా కరుకైన బాణాలు కుమ్మరించాడు.

గాండీవంనించి వచ్చిపడుతూన్న దారుణమైన బాణాలికి వజ్రాయుధం తగిలి కూలిపోయిన పర్వతాల్లాగ అస్తవ్యస్తంగా పడిపోయాయి మన ఏనుగులు. పెద్ద గాలికి తూలిపోయిన మేఘాల్లాగ నాలుగుదిక్కులా చెల్లాచెదరయిపోయాయి రథాలు. కీలుకాడ కీళ్ళు వూడదీసేస్తే విరిగిపడ్డబొమ్మల్లాలాగ దొర్లిపోయాయి గుర్రాలు. పెద్ద ప్రవాహం వచ్చి పడిపోయిన మహారణ్యాలాగ చాపకట్టుగా చచ్చి పడ్డారు పదాతులు.

చూశాడు ద్రోణుడు. గట్టి దొక బాణం గురిచూసి అర్జునుడి గుండెలమీద నాటించాడు. దెబ్బతో విలవిలలాడిపోయాడు అర్జునుడు. కాని అంతలోనే జల్దుకున్నాడు. మంచిదారైన బాణాలు ద్రోణుడి మీద తగిలించాడు.

అయిదుబాణాలు కృష్ణుడిమీద కొట్టాడు ద్రోణుడు. అర్జునుడి మీద డబ్బయిబాణాలు రువ్వాడు. వానరపతాకంమీద మూడు బాణాలు వేశాడు. రథంమీద దిమ్మరించిన బాణాలికి లెక్కాజమా లేదంటే నమ్ము. కిరణాలు విరజిమ్ముతూన్న సూర్యుణ్ణి వానమేఘాలు ముసురుకున్నట్టు బాణాలు విరజిమ్ముతూన్న అర్జునుణ్ణి శరవర్షంతో ఆక్రమించాడు ద్రోణాచార్యులు. ద్రోణుడి ఆసరాచూసుకుని అదే సమయమన్నట్టు మనసైనికులు ఎగబడ్డారు. అదిచూస్తేమూర్గం రాళ్ళు తేలిపోయి, బెండ్లు మునిగిపోతాయా అనిపించింది నాకు.

వయసులోవున్న అర్జునుడు ముసిలిద్రోణుడిదగ్గిర చిక్కుపడిపోయాడు. అతణ్ణి దాటి అవతలికి అడుగుపెట్టలేక పోయాడు.

"అనవసరమైన జాప్యం అనర్థకానికి హేతువు" పరిస్థితి చూసి హెచ్చరించాడు కృష్ణుడు – ద్రోణుడితో పంతం పెట్టుకోవద్దు" చెప్పాన శకటవ్యూహం ప్రవేశిద్దాం. మరోతలంపు పనికిరా దిప్పుడు" అన్నాడు.

"నువ్వు ఎలా చెపితే అలాగే చేస్తాను" అన్నాడు అర్జునుడు.

ద్రోణుడి కుడిపక్కనించి ప్రదక్షిణంగా రథం పోనిచ్చాడు శ్రీకృష్ణుడు. బాణాలు వేస్తూనే లోపలికి బయలుదేరాడు అర్జునుడు.

"ఏమిటోయి ఇదీ!" నవ్వుతూ అన్నాడు ద్రోణుడు – "శత్రువుని చంపకండా ఇష్టంవచ్చినట్టు బయల్దేరావు. గొప్పవాడివే. ఎక్కడైనా వుందా ఇదీ!" అంటూ వెంటబడ్డాడు.

"గురుదేవుడివి, శత్రువెలా అవుతావు!" అన్నాడు అర్జునుడు – "నువ్వు కోపం తెచ్చుకుంటే నాకు సాధ్యమేనా ఎదిరించడం? శివుడికేమో కాని" అంటూ శకటవ్యూహం చొచ్చుకుపోయాడు. అతడివెంట అతడి చక్రరక్షకులు పాంచాలకుమారులు యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ కూడా లోపల ప్రవేశించారు.

గర్భవ్యూహమైన పద్మవ్యూహం మధ్య, సూచీవ్యూహ ద్వారంలో కృతవర్మా, సుదక్షిణుడూ, శ్రుతవర్మా వున్నచోటే వుండి తలెత్తి కపిధ్వజమూ, దానివెంట వేదికాపతాకమూ చూశారు. అర్జునుడివెంట ద్రోణాచార్యులు రావడం గమనించారు. తామూ అర్జునుడికి అడ్డుపడాలని ఉత్సాహంతో గుటకలుమింగుతూ నడుములు బిగించారు.

మధ్యని అభిషాహులూ, శూరసేనులూ, శైబ్యులూ, వసాతులూ, మావెల్లకులూ, వివిథ్యులూ, కైకేయులూ, మద్రకులూ, ప్రభద్రకులూ, నారాయణగోపాలసైన్యమూ – వీళ్ళంతా అర్జునుణ్ణి చుట్టుముట్టారు.

ఎవరెంత అడ్డుకున్నా ఆగలేదు అర్జునుడు. తాను పూనిన ప్రతిజ్ఞ ఒక్కటే తన లక్ష్యం. ఏనుగు చెరువులో దొరబడినట్టు సేన సేనంతా పాయలు చేసేస్తూ లోపలికి వచ్చేస్తున్నా డతను.

వెంటాడుతూ వచ్చి కలుసుకున్నాడు ద్రోణాచార్యులు. పట్టు పట్టి పాతిక బాణాలు అర్జునుడిమీద గుప్పించాడు. సగంలోనే వాటిని పడగొట్టేసి, వెడల్పాటి బాణాలు ప్రయోగించాడు అర్జునుడు. అయితే వొక్కటీ దగ్గిరికి రానియ్యలేదు ద్రోణుడు. అంతంతదూరానే వాటిని ముక్కలు చేసి పారేశాడు.

మహారాజా, అర్జునుడు కొండ అయితే ద్రోణుడు వానమేఘ మనుకో. ద్రోణుడి బాణవర్షమంతా పటాపంచలు చేసేశాడు అర్జునుడు. కాని ద్రోణుడు మాత్రం ఆగలేదు. ఒక పాతిక బాణాలు అర్జునుడిమీదా, డబ్భయి బాణాలు కృష్ణుడిమీదా గబాగబా నాటించాడు. కృష్ణార్జునుల వొళ్ళంతా మంటలు పెట్టాయి. సహించడం కష్టమయింది. దాంతో ద్రోణుణ్ణి వంచించి, మెరుపులా కృతవర్మసైన్యంలో చొచ్చుకు వచ్చేశారు వాళ్ళు.

ఇక చేసేది లేకపోయింది ద్రోణుడికి. పైగా తక్కిన పాండవులు లోపలికి చొచ్చుకురాకండా చూసుకోవా లతడు. శకటవ్యూహం ముఖద్వారం రక్షించుకోవలిసిన భారం తనమీదే వుందాయె. అంచేత ద్వారందగ్గిరికి వెనక్కి వెళ్ళిపోయా డతడు.

సిద్ధంగానే వున్నాడు కృతవర్మ. అర్జునుడు రావడంతోనే పది బాణాలు తగిలించాడు. సానపట్టిన వొక్కకోల కృతవర్మ గుండెల మీద కొట్టాడు అర్జునుడు. దాని వెంటవెంటనే మరి మూడు బాణాలు నాటించాడు.

నవ్వుతూ కృష్ణుడిమీదా, అర్జునుడిమీదా చెరో పాతిక బాణాలు గుప్పించాడు కృతవర్మ. ఒకే వొక్క బాణం వేశాడు అర్జు

నుడు. కృతవర్మవిల్లు ఫెళ్ళుమనిపించేశాడు. అతడు ఇంకో ధనుస్సు పుచ్చుకునేలోపున ఇరవయ్యొక్క బాణాలు నాటించాడు.

చటుక్కున మరోవిల్లు పుచ్చుకున్నాడు కృతవర్మ. రెప్పపాటులో పదిబాణాలు అర్జునుడిమీద తగిలించాడు. పెదవులు బిగించాడు అర్జునుడు. తొమ్మిదిబాణాలు కృతవర్మమీద నాటించాడు. ఆవేశంతో వూగిపోయాడు కృతవర్మ. బాణంమీద బాణం వర్షంలా కురిపించాడు.

"మనకి ఆలస్యమయిపోతూవుంది" అర్జునుణ్ణి హెచ్చరిస్తూ అన్నాడు కృష్ణుడు— "బంధువని జాలిపడుతున్నావు నువ్వు. ఇతడెక్కడిబంధువు? కొట్టెయి" అన్నాడు.

కృష్ణుడు అలా అనడమే తడువు, క్రూరమైనబాణాలు తీశాడు అర్జునుడు. వరసపెట్టి వొదిలిపెట్టాడు. కీళ్ళు తీసేసిన బొమ్మలాగ మూర్ఛపడిపోయాడు కృతవర్మ.

కృతవర్మని అలా మూర్ఛపోయినట్టు కొట్టేసి కాంభోజసైన్యం చొరబడ్డాడు అర్జునుడు. అంతలోనే తెలువుకున్నాడు కృతవర్మ. అర్జునుడివెంట చొరబడి వస్తూన్న అతడి చక్రరక్షకుల్ని ఉత్తమాజుణ్ణీ, యుధామన్యుణ్ణీ అడ్డుకున్నాడు. ఉత్తమాజుడిమీద నాలుగుకోలలూ, యుధామన్యుడిమీద మూడుకోలలూ, గుప్పించాడు. ఆ ఇద్దరూ చెరి పదేసిబాణాలు వేశారు కృతవర్మమీద. అతడి ధనుస్సు విరగ్గొట్టేశారు.

చప్పున మరోవిల్లు తీశాడు కృతవర్మ. వాళ్ళ ఇద్దరి ధనుస్సులూ విరిచేసి, చెడామడా వాళ్ళ వొంటినిండా బాణాలు నాటించాడు. వాళ్ళిద్దరూ చెరోబాణం పుచ్చుకున్నారు. కృతవర్మమీద అంపవాన కురిపించారు. అతడిశరీరం చీలికలుచేసి, రక్తాలు పారించారు.

ఏమయినా గోడలా వాళ్ళని, అడ్డేశాడు కృతవర్మ. అతణ్ణి కాదని, సందుచేసుకుని అర్జునుడి రథంవెంట వెళ్ళడం ఏవిధంగానూ సాధ్యంకాలేదు వాళ్ళకి.

## శ్రుతాయుధుడు

చక్రరక్షకులులేకండానే అర్జునుడిరథంముందుకి చొచ్చుకు వచ్చేస్తోంది. అడ్డంగా వెళ్ళి అడ్డుకున్నాడు శ్రుతాయుధుడు. అర్జునుణ్ణి మూడుబాణాలతో కొట్టాడు. కృష్ణుడిమీద డబ్భయిబాణాలు రువ్వాడు. ఒక వెడల్పాటిబాణంతీసి వానరపతాకంమీద కొట్టాడు.

'హూ' మ్మంటూ తొంభై బాణాలు శ్రుతాయుధుడిమీద కుమ్మరించాడు అర్జునుడు. వాటిని కాసుకుంటూనే డబ్భయిబాణాలు వేశాడు శ్రుతాయుధుడు. ఒక్కబాణం గురిచూసి అతడి విల్లువిరిచేశాడు అర్జునుడు. అతడి రొమ్ముమీద ఏడుబాణాలు తగిలించాడు. కళ్లు చింతనిప్పుల్లా చేసుకున్నాడు శ్రుతాయుధుడు. తటుక్కున మరొక విల్లు తీశాడు. సానపెట్టిన చిల్లకోలలు అర్జునుడి గుండెలమీదా బుజాలమీదా కొట్టడం మొదలుపెట్టాడు.

చిన్న చిరునవ్వునవ్వాడు అర్జునుడు. ఒక బాణం రివ్వున వొదిలాడు. శ్రుతాయుధుడి సారథిని చంపేశాడు. అతడి నాలుగు గుర్రాలూ కూల్చేశాడు. టపీటపీ డబ్భయిబాణాలు అతడి ఆపాదమస్తకమూ తగిలించాడు.

రథం దూకేశాడు శ్రుతాయుధుడు. పెద్ద గద పట్టుకుని అర్జునుడి రథంతట్టు పరిగెత్తాడు.

మహారాజా, శ్రుతాయుధుడంటే ఎవరో నీకు కొంచెం చెప్పాలి. శ్రుతాయుధుడు వరుణుడి కుమారుడు. పర్ణాశనదిగర్భంలో పుట్టా

డతడు. తన కుమారుడికి శత్రువులచేత చావులేకండా వరమడిగింది పర్ణాశ. అప్పుడు ఈగద ఇచ్చాడు వరుణుడు. "ఈగద వున్నవాడు శత్రువులచేత చావడు" అనివరమిచ్చాడు. "కాని యుద్ధం చెయ్యని వాడిమీద ప్రయోగిస్తేమాత్రం అది ఎదురుతిరుగుతుంది. ప్రయోగించిన వాణ్ణే చంపేస్తుంది" అన్నాడు. ఈవిషయం పెద్దలవల్ల విన్నది. అయితే కాలం ప్రాప్తించింది శ్రుతాయుధుడికి. వరుణుడు పెట్టిన నియమం మరచిపోయాడతడు. అలా గబగబా అర్జునుడిరథంతట్టు వెళ్ళి యుద్ధంచెయ్యని కృష్ణుడిమీద విసిరాడు గద. ఏమయింది, వెళ్ళి పూలదండలా పడింది కృష్ణుడిమీద గద. ఉత్తరక్షణంలో పిడుగులా వెనక్కి మళ్ళింది. అమాంతంగా శ్రుతాయుధుడిమీద పడింది.

గద విసరడంతోనే అతడిరెండుచేతులూ నరికేశాడు అర్జునుడు. అంతలో గదా వచ్చిపడింది. దీనా దానా కొండ కూలినట్టు కూలిపోయాడు శ్రుతాయుధుడు.

శ్రుతాయుధుడు హతమారిపోడంతోనే అక్కడి సేనలూ రాజులూ నిశ్చేరపోయారు. జజ్జరిల్లిపోయారు. చెదిరిపోయారు. ముందుకి చీల్చుకు బయలుదేరాడు అర్జునుడు.

## సుదక్షిణుడు

ఉరకలువేస్తున్న అర్జునుడిరథాన్ని అడ్డంగావెళ్ళి అడ్డుకున్నాడు, కాంభోజంరాజు సుదక్షిణుడు. వెళ్ళీవెళ్ళడంతోనే అతణ్ణి అయిదు బాణాలతో కొట్టాడు అర్జునుడు.

సుదక్షిణుడు అర్జునుడిమీద పదిహేనుకోలలు గుప్పించాడు. కృష్ణుడిమీదా మూడు బాణాలు వేశాడు.

చక్రుమంది అర్జునుడికి. తళతళా మెరుస్తూన్న రెండుబాణాలు తీశా డతడు. సుదక్షిణుడి వొళ్ళుదుసెళ్ళిపోయినట్టు కొట్టాడు. దెబ్బ తినీ, మరిమూడుబాణాలుకొట్టాడు సుదక్షిణుడు. అంతేకాదు, బంగారం గంటలు ఘణేలు మంటూన్న శక్తితీసి అమాంతంగా అర్జునుడిమీద విసిరాడు. అర్జునుడి వొంటికి తగిలి, నిప్పులు చెదురుతూ పడింది శక్తి. జూమాలుమనిపోయాడు అర్జునుడు. సింహనాదంచేసి మరింత మిడిసి పడ్డాడు సుదక్షిణుడు.

క్షణంలో తెలుపుకున్నాడు అర్జునుడు. కళ్ళల్లో చింతనిప్పులు కక్కాడు. లిప్తలో పద్నాలుగు బాణాలు వేశాడు. సుదక్షిణుడి సారథిని చంపేశాడు. అతడి కోదండం నరికేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. గుర్రాలు నాలుగూ కూలగొట్టేశాడు. దారుణమయిన వొక బాణంవేసి సుదక్షిణుడి గుండెకాయ పగలగొట్టేశాడు. అయిపోయింది సుదక్షిణుడి పని. తుఫానుకి పెల్లగిల్లిపోయిన పెద్ద చెట్టులాగ కిందకూలపోయా డతడు.

సుదక్షిణుడు కూలిపోడంతోనే సూరసేన, శిబి, వసాతి దేశాల సైన్యాలు అర్జునుణ్ణి చుట్టుముట్టాయి చిచ్చులపిడుగులాగ విజృంభించాడు అర్జునుడు. పుంఖానుపుంఖంగా బాణాలు కుమ్మరి చాడు క్షణాల మీద ఆరువందలరథాలు ధ్వంసంచేశాడు. అడలెత్తిపోయి, చెల్లా చెదరయిపోయాయి ఆసేనలు.

## శ్రుతాయువూ, అయుతాయువూ

శ్రుతాయువూ, అయుతాయువూ అని మనసేనలోని రాజులు ఇద్దరు అది చూశారు. అర్జునుడి కుడి, ఎడమల రెండుపక్కలా వెళ్ళి ఎదిరించారు. ఇన్నీ అన్నీ అని చెప్పతరం కానన్ని బాణాలు రువ్వారు. శ్రుతాయువు తోమరం విసిరాడు. అమాంతంగావెళ్ళి అర్జునుడిమీద

పడింది దది. పిడుగుపడ్డవాణ్ణి కొరివితో కాల్చినట్టు ఆక్షణంలోనే అయు
తాయువూ అతడిమీద శూలం విసిరాడు. ఈరెండుదెబ్బలకీ తూలి
పోయినట్టు అయిపోయాడు అర్జునుడు. జెండాకర్ర పూతపట్టుకుని
నిభాయించుకున్నాడు.

అర్జునుడిఅవస్థచూసి శ్రీకృష్ణుడు చివుక్కుమనిపోయాడు. కౌరవ
సైన్యాలు సింహనాదాలుచేశాయి. రణదుందుభులు మోయించాయి

శ్రీకృష్ణుడు ప్రబోధించడంతోనే అర్జునుడు జల్దుకున్నాడు.
చటాలున ఇంద్రాస్త్రం ప్రయోగించాడు. ఆశ్చర్యం! రకరకాల ఆయు
ధాల ఆకారాలతో బైలుదేరింది ఇంద్రాస్త్రం. శ్రుతాయువూ, అయు
తాయువుల చేతులు నరికేసింది. కంఠాలు కత్తిరించేసింది. కిందదొర్లిం
చేసింది. వాళ్ళ అనుచరుల్ని అయిదువందల వీరుల్ని తుడిచిపెట్టేసింది.
అర్జునుడిరథం ముందుకి తరుముకు వచ్చేసింది.

## దీర్ఘాయువూ, నియుతాయువూ

శ్రుతాయుధుడి కొడుకు దీర్ఘాయువూ, అయుతాయుధుడి
కొడుకు నియుతాయువూ – ఇద్దరూ తమ తండ్రులచావు కళ్ళారా
చూశారు. దుఃఖంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయారు. కిందామీదా
కనపడలేదు వాళ్ళకి. జంకూ కొంకూ లేకండా పరుగెత్తారు. దూకు
డుగా అర్జునుడిమీదికి దూకారు. ఇలా దూకారు, అలా హరీ అనే
శారు. వాళ్ళనీ వాళ్ళ సారథుల్నీ, గుర్రాల్నీ మచ్చుకన్నా లేకండా
కొట్టేశాడు అర్జునుడు.

దీర్ఘాయువునీ, నియుతాయువునీ వాళ్ళ తండ్రులదగ్గిరికి పంపిం
చేసి, మహాసముద్రం మథించిన మందరపర్వతంలాగ మనసేనంతా
అల్లకల్లోలం చేసేసి, శకటవ్యూహంలోంచి చొచ్చుకువచ్చేస్తున్నాడు

అర్జునుడు. చూశాడు దుర్యోధనుడు. తన సేనలికి చెయ్యి విసిరాడు; పురికొల్పాడు.

రారాజుఇసారా అందుకుని తూర్పు దేశాలవాళ్ళూ, కళింగులూ, దక్షిణాదివాళ్ళూ, అంగదేశంవాళ్ళూ, మ్లేచ్ఛులూ బాహ్లికులూ యవనులూ, పారదులూ, శకులూ, బర్బరులూ పెద్దపెద్ద ఏనుగుమంద లతో వెళ్ళి అర్జునుణ్ణి ముట్టడించారు.

ఆసేనలు చూసి మరింత నలిరేగిపోతూను అర్జునుడు. కన్ను మూసి కన్ను తెరచేలోపల వందలూ, వేలూ బాణాలు గాండీవంలోంచి గుప్పించాడు. ఏం చెప్పేది మహారాజా! చేతులూ, తొండాలూ, తలలూ, కుంభస్థలాలూ రాలి నేలమీద అదే పొర్లాడడం పొర్లా డాయి. అంకుశాలూ, ఆయుధాలూ, తుక్కుతుక్కు అయిపోయి సందు లేకండా కిందపడ్డాయి. ఏమయినా సరే, అర్జునుడు ముందుకి రాకండా అడ్డుకుని పోరాడాయి మనసైన్యాలు.

మనవాళ్ళ తెగింపుచూసి అర్జునుడే ఆశ్చర్యపోయాడంటే నమ్ము.

అయితే అసలే యుద్ధంలో బీభత్సుడు అర్జునుడు. తుంగమడుగు కలిచేసిన మదపుటేనుగులాగ, అడివి ముట్టుకున్న అగ్నిహోత్రుడిలాగ ఆమహాసైన్యం యావత్తూ నానాఇదీ చేసేసి వొదలిపెట్టా డతడు. శ్రీకృష్ణుడు గాలి. అర్జునుడు అగ్నిహోత్రం. కారడివి కౌరవసైన్యం. ఆగాలి వీస్తూవుంటే, ఆ అగ్గి మండుతూవుంటే, ఆకారడవి కాలిపో డంలో వింతేముంది! కాలి బుగ్గయిపోయింది.

అర్జునుడు వానదేవుడు. అతడి బాణాలు వర్షధారలు —

కౌరవరక్తం వరదలా ప్రవహించింది. మిట్టా, పల్లమూ తెలియ కండా అయిపోయింది రణరంగం. ఆరక్తప్రవాహంలో భూతభేతా ళాలు ఈతకొట్టాయి.

## అంబష్ఠ శ్రుతాయువు

అడ్డూ ఆపూ లేకండావుంది అర్జునుడికి. ఇంతలో అంబష్ఠదేశం రాజు శ్రుతాయువు అమాంతంగా వెళ్ళాడు. అర్జునుడి రథంనొగకి తన రథంనొగ డీకొక్కలాడించాడు.

అరికాలిమంట నెత్తికెక్కింది అర్జునుడికి. అంబష్ఠరాజుగుర్రాలు నాలుగూ హతవార్చేశాడు అతడి ధనుస్సు పుటుక్కుమనిపించేశాడు.

పెద్ద గదతీశాడు శ్రుతాయువు. ఒక్కవూపువూపి కృష్ణుడు మీాద విసిరాడు. ఘోరంగా వచ్చేస్తోంది గద. సగంలోనే దాన్ని తుక్కుకింద కొట్టేశాడు అర్జునుడు. మరోగద తీశాడు శ్రుతాయువు. చేతిలోనిగద చేతిలోనే వుంది, అతడి రెండు బుజాలూ తెగేశాడు అర్జునుడు. మరుక్షణంలో అతడి కంఠమూ నరికేశాడు, దారుణంగా. కింద రాలిపడింది తలకాయ.

ఇలా ద్రోణాచార్యుల్ని తప్పించుకుని, కృతవర్మని మూర్ఛ కొట్టి, శ్రుతాయుధుణ్ణి దంపేసి, సుదక్షిణుణ్ణి పూడ్చేసి, శ్రుతాయువూ అయుతాయువూ, అంబష్ఠరాజూ మొదలైనవాళ్ళని హతవార్చేసి ముందుకి వురకలు పెట్టాడు అర్జునుడు. లెఖా-జమా లేకండా యోధుల ప్రాణాలు బాణాలికి బలిపెడుతూ జయద్రథుడికేసి పరిగెడుతున్నాడతడు.

ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకాయి దుర్యోధనుడికి. ఒక్కడూ ద్రోణాచార్యులదగ్గిరికి రథం పరిగెత్తించాడు.

## కప్పగొంతు పాము వి

"నిన్ను నమ్ముకుని మోసపోయాను" నొచ్చుకుంటూ ద్రోణుడితో అన్నాడు దుర్యోధనుడు- "చిటికెలో దాటేశాడు నిన్ను అర్జు

నుడు. చిందరవందరచేసేసి సైన్యాలు చించిచెండాడుతున్నాడు. తలెత్తి అటు చూడనన్నా చూడకండా వున్నావు. పాండవ పక్షపాతివి. నీమనస్సు ఎప్పుడూ అటే వుంటుంది. కప్పగొంతుకు పామువని బాగా బోధపడిం దిప్పుడు. వర మిచ్చావు — వరం! కళ్ళుతుడవడానికా? నిన్ను నమ్ముకుని వుండిపోయాడు జయద్రథుడు. ఎక్కడికన్నా పోయి వుంటే ఈక్షోభ తప్పేది. అతడి పీకలమీాదికి తేనెపూసిన కత్తివి, కాని మనిషివి కావు నువ్వు" — ఇన్ని అన్నాడు కాని కొండంతపని నెత్తి మీాద వుంది. అది గుర్తు తెచ్చుకున్నాడు. చటుక్కున రాజసం దిగతొక్కుకున్నాడు. మంచిమాటలు మొదలుపెట్టాడు. "బాధ కొద్దీ ఏదో అనేస్తున్నాను. అదంతా పట్టించుకోకు. చూడు, జయద్రథుణ్ణి కాపాడవలిసిన రాజులంతా తెల్లమొహాలు వేసేస్తున్నారు. ఎలాఅయినా అతడు చావకండా రక్షించాలి" అన్నాడు.

"నీమాటకి పట్టించుకుంటానా!" అన్నాడు ద్రోణుడు — "నువ్వు వొకటీ అశ్వత్థామ వొకటీనా నాకు! అర్జునుణ్ణి ఆపడమంటే అంత మీాదమీాదమాట అనుకుంటున్నావు. అదికాదు, కృష్ణుడి సారథ్యంవల్ల గాలిలా పరిగెడతాయి అతడి గుర్రాలు. రథం ముందుకి పోతూవుంటే అర్జునుడిబాణాలు వెనకవున్న సైన్యాలమీాద అగ్గి కురుస్తూంటాయి. చూస్తూ చూస్తూ నువ్వు ఇలా అంటే ఏమనేది నేను. అదీకాక ఇంకోసంగతి, వ్యూహంద్వారం వొదిలేసి అర్జునుణ్ణి వెంటాడి వెళ్ళాననుకో, పాండవబలాలు లోపల చొరబడతాయి. మనసేనలు చెల్లాచెదరయిపోతే, తరవాత జయద్రథుణ్ణి కాపాడడం కష్టమయిపోతుంది. ఇంకోమాట, రాజులందరి ఎదటా ప్రతిజ్ఞ చేశాను కదా, ధర్మరాజుని పట్టిఇస్తానని, అది నేను మరిచిపోతే ఎలాగ? అంచేత అతడికోసం కనిపెట్టుకుని వుంటున్నాను. విశేషించి నేను ముసిలాణ్ణి. పరుగులుపెట్టడానికి బలం చాలదు. అర్జునుడూ, నువ్వూ వొక్కవయసు

న్నులో వున్నారు. ఇద్దరూ వొకళ్ళలాంటివాళ్ళు. శంకలేకండా అత డితో శత్రుత్వం వహించావు నువ్వు. అంచేత తగినవాళ్ళని సహాయం తీసుకుని అతణ్ణి అడ్డుకో. చప్పున వెళ్ళు" అన్నాడు.

"నేనా అడ్డుకోడం!" పెదవులు చప్పరిస్తూ అన్నాడు దుర్యోధనుడు — "నిన్నూ, కృతవర్మా మొదలైనవాళ్ళని మూడు చెరువుల నీళ్ళు తాగించి ముందుకి వురుకుతూన్న అర్జునుణ్ణి నేనా అడ్డుకునేది! నేనేకాదు, దేవతలందరితోను వచ్చి దేవేంద్రుడైనా అడ్డుకోగలడా! ఇదే నీసలహా అయితే తప్పకండా వెళతాను. కాని అపకీర్తిమాత్రం రాకండా చూసుకో, తరవాత" అన్నాడు.

## దివ్యకవచం

"నువ్వు అన్నది నిజమే" సాకూతంగా అన్నాడు ద్రోణాచార్యులు — "అంతటివాడే అర్జునుడు. సందేహంలేదు. అయితే భయపడకు. ఇవాళ వొక అద్భుతం చూపిస్తాను. నీకు వొక కవచం ఇస్తాను. అది అన్నివిధాలా రక్షిస్తుంది నిన్ను. అది వేసుకుని అర్జునుడితో కలబడు. అతడి బాణం వొక్కటీ నీకు తగలదు. కృష్ణుడూ గ్రీష్ణుడూ నాలికలు కరుచుకుంటారు ఈచిత్రం చూసి" అని వొక బంగారు కవచం తీసి, దానికి ఆశక్తి ఆవహింపజేసి ఇచ్చాడు.

చెప్పలేనంత సంతోషించాడు దుర్యోధనుడు. ఆచమనమూ అదీ చేసుకుని, నియమపూర్వకంగా కవచం పుచ్చుకున్నాడు.

"ఇది లోగడ దేవరక్షణకోసం బ్రహ్మ దేవేంద్రుడికిచ్చాడు. దేవేంద్రుడు అంగిరసుడికిచ్చాడు. అంగిరసుడు బృహస్పతికిచ్చాడు. బృహస్పతి మాగురువయిన అగ్నివైశ్యుల కిచ్చాడు. ఆయన నాకు ప్రసాదించారు" అంటూ మంత్రపూర్వకంగా దుర్యోధనుడికి తొడి

గాడు ద్రోణాచార్యులు. ఎన్నో అన్నిరకాల దీవించాడు. వెళ్ళి రమ్మన్నాడు.

బోరవిరుచుకు బయలుదేరాడు దుర్యోధనమహారాజు. రకరకాల రణదుందుభులు మోగాయి. అనేకమైన రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ వెంటనడిచాయి. అలా బయలుదేరి రథం వురకలుపెట్టించి అర్జునుడి వెంటపడ్డాడు దుర్యోధనుడు.

వ్యూహంలో మాట అలావుంచి, బైటపరిస్థితి కొంచెం చెప్తాను. ఒక్కపెట్టుని పోలో అంటూ విరగబడింది పాండవసైన్యం. అది ఎంత ఉద్ధృతంగా వచ్చిపడిందో అంత ఉద్ధృతంగానూ ఎదిరించింది కౌరవసేన. అటు గంగా, ఇటు యమునా వుప్పొంగి వొకదాన్ని వొకటి కలుసుకుంటే ఎలావుంటుంది, అదిగో అలా అవుపడింది రెండు బలాలూ కలబడడం. ఎంతోసేపు ఘోరంగా జరిగింది యుద్ధం. అలాంటి యుద్ధం ఎన్నడూ కనీ వినీ ఎరగం.

మధ్యాహ్న మయింది. అటు ధృష్టద్యుమ్నుడూ, ఇటు ద్రోణుడూ హోరాహోరి పోరాడారు. చూడశక్యంకాని తేజస్సుతో మెరిసిపోయారు వాళ్ళు సూర్యుడితో వున్న ఆకాశం చూసి, దాన్ని మించిపోవాలని భూమి ఇద్దరుసూర్యులు ధరించిందా అన్నట్టు అవుపించింది.

ద్రోణుడిబాణాలు అడ్డుకుంటూ, మనసేనమీద వడగళ్ళవానలా బాణాలు కుమ్మరించాడు ధృష్టద్యుమ్నుడు. నెత్తురు వరదలా పారించాడు. అతడి ముఖాముఖి యుద్ధానికి ఆగలేకపోయింది మనసైన్యం. మూడు పాయలు అయిపోయింది.

ద్రోణాచార్యులు వీరావేశంతో రెచ్చిపోయాడు. అతడి ధాటికి ఆగలేక పాంచాల, కేకయ సైన్యాలు కలగుండుపడిపోయాయి. మన సేనలు మళ్ళీ విజృంభించాయి.

తమ్ముళ్లు మొదలైన యోధులందరితోనూ తరుముకు వచ్చాడు ధర్మరాజు. అది చూసి వికర్ణుడూ, వివింశతీ, చిత్రసేనుడూ తోసుకు వెళ్ళారు. భీముణ్ణి ముట్టడించారు. బాహ్లీకుడు ఉపపాండవుల్ని ముట్టడించాడు. దుశ్శాసనుడు సాత్యకిమీద కురికాడు. శకుని నకుల సహదేవులతోనూ, సోమదత్తుడు శిఖండితోనూ, అలంబుసుడు ఘటోత్కచుడితోనూ కలబడ్డారు.

శల్యుడు జయద్రథుడిదగ్గిరే వుండేవాడు. అతడి ఉత్సాహం ఇంతా అంతా కాదు. అంచేత వుండీ వుడికీ వ్యూహద్వారందగ్గిరికి వెళుతూ, మళ్ళీ వెనక్కి వచ్చేస్తూ వుండేవాడతడు. ఈసారి వెళ్ళేసరికి వ్యూహందగ్గిర ధర్మరాజుని చూశాడు. ఆగలేకపోయాడు. అతడిమీద తిరగబడ్డాడు. యుద్ధంచేశాడు.

ఇలా మహాయోధులు వొకరిమీద వొకరు కలబడి చిత్రవిచిత్రంగా పోరాడారు. అంతమందీ గాయపడ్డారు; బాగా చివుళ్ళతోనూ, పువ్వులతోనూ వున్న అశోకవనంలా అవుపించారు.

దుశ్శాసనుడు సాత్యకిని మూర్ఛపోయినట్టు కొట్టాడు. మూర్ఛపోయి. చప్పున తెలుసుకున్నాడు సాత్యకి. ఆవేశంతో వూగిపోయాడు. కవలబాణాలు గుప్పించడం లంకించుకున్నాడు. భరించలేకపోయాడు దుశ్శాసనుడు. తోకముడిచేశాడు. ద్రోణుడివెనక్కి పారిపోయాడు. మనసేన మళ్ళావెనక్కి తగ్గేసింది. గుంపులు గుంపులయిపోయింది. ఈ అవస్థ చూశాడు ద్రోణుడు. హుంకారంచేసి ముందుకి వురికాడు. ధృష్టద్యుమ్నుణ్ణీ, భీముణ్ణీ, ధర్మరాజునీ బాణాలతో కప్పెట్టేశాడు. నువ్వెంత అంటే నువ్వెంత అన్నట్టు ఉభయసేనలూ పోరాడాయి. ఉభయసేనల్లోనూ ఏనుగులు పీనుగులయాయి. గుర్రాలు కూలిపోయాయి. రథాలు గుండపిండయాయి. ఆయుద్ధంచూసి భయపడుతూ, ఆశ్చర్యపడుతూ మెచ్చుకున్నారు ఆకాశంమీద దేవతలు.

## ధృష్టద్యుమ్నుడూ ద్రోణుడూ

మహా ఇదిగా జరిగిపోతూవుంది సంకులసమరం. తనవ్యూహం చెక్కు చెదరకుండావుండేట్టు స్థిరమైన ఉత్సాహంతో విజృంభించాడు ద్రోణాచార్యులు. ధృష్టద్యుమ్నుణ్ణి మించిపోయి, శత్రుసేన చిత్రవధ చేయుడ మారంభించాడు.

ఎంత మండిపడాలో అంత మండిపడ్డాడు ధృష్టద్యుమ్నుడు. తన పావురాలరంగు గుర్రాలు ద్రోణుడి ఎర్రగుర్రాలు ఢీకొన్నట్టు రథంపురికించాడు. కత్తీ, డాలూ పుచ్చుకున్నాడు. సాహసంతో ద్రోణుడి రథం నొగలుమీద కాలూని, కాడిమీద చిత్రగతితో ఝుళిపించాడు. జడివానలా ద్రోణుడి బాణాలు వచ్చి పడుతూనేవున్నాయి. మెళుకువతో అవన్నీ తప్పించుకుంటూ, అంతలోనే కాలూ, చేతులూ కదపటానికి వీలు లేకండా అయిపోతూ తమకంతో కత్తివిసుళ్ళు విసిరాడు ధృష్టద్యుమ్నుడు. కత్తిచివరలు తన రథానికీ, గుర్రాలికీ తగలడంతోనే మించివచ్చిం దనుకున్నాడు ద్రోణుడు. చప్పున ధృష్టద్యుమ్నుడి ఖడ్గం ముక్కలుచేసేశాడు. కెండా విరగ్గొట్టేశాడు. డాలు వగలగొట్టేశాడు. గురిచూసి అతడిమీద పిడుగులాంటిబాణం వొదిలిపెట్టాడు. ఇంకేముంది రెప్పపాటులో ధృష్టద్యుమ్నుడి పీక ఎగిరిపోతుంది. ఇంతలో మహారాజా, ఎలా చూశాడో సాత్యకి, తటాలున వొకబాణంవేశాడు. సగంలోనే ద్రోణుడిబాణం ముక్కలుచేసేశాడు. ద్రోణుడు మరో బాణం ధనుస్సుని తొడిగేలోపున, సింహంపట్టబోయిన లేడిపిల్లని రక్షించినట్టు ధృష్టద్యుమ్నుణ్ణి పట్టుకుపోయాడ డతడు.

ధృతరాష్ట్రుడు: పులినోటికండ పట్టుకుపోయినట్టు ద్రోణుడి బారినించి ధృష్టద్యుమ్నుణ్ణి పట్టుకుపోయాడు సాత్యకి! ద్రోణుడి వొళ్ళు మండ లేదూ!

సంజయుడు. మండకపోడమేమిటి మహారాజా, రెక్కలున్న మహాసర్పంలాగ సాత్యకిమీదికి వురికాడతడు.

"ఇదిగో, ఈ బ్రాహ్మడు ధర్మరాజుమీద పగబట్టాడు" ద్రోణుడు తనమీదికి రావడంచూసి తనసారథితో అన్నాడు సాత్యకి – "ఇతడి మీద కలబడాలి మనం" అంటూ తనరథం ఆచార్యులికి ఎదురుగా పోనిమ్మన్నాడు. రెండుమేఘాలు రెండుదిక్కులనించీ కలబడితే ఎలా వుంటుంది, అదిగో అలా అనిపించింది. ద్రోణుడూ సాత్యకీ కలబడడం. బాణాలు మెరుపుల్లా తళతళా మెరిశాయి. వింటినారులు ఉరుముల్లా మోగాయి. తెరిపిలేని వర్షంలా బాణాలు కురిశాయి.

ఉభయులూ రెచ్చిపోయారు. ఉభయులూ బాణాలుమీద బాణాలు గుప్పించారు. గొడుగులు కూలిపోయాయి. జెండాలు ఎగిరి పోయాయి. మదగజాలికి మదం ధారలుకట్టినట్టు ఇద్దరికీ రక్తాలు ధారలు కట్టాయి. అదిచూసి కౌరవ పాండవసేనలు రెండూ భయపడ్డాయి. ఆకాశంమీద దేవతలు నిశ్చేష్టులు అయిపోయారు.

ద్రోణుడిధనుస్సు టపీమని విరగ్గొట్టేశాడు సాత్యకి. మరో విల్లు పుచ్చుకున్నాడాయన. లిప్తలో అదీ కొట్టేశాడు సాత్యకి. మరొకటి తీశాడు ద్రోణుడు. అదీ విరిచేశాడు సాత్యకి. ఇలా ధనుస్సుమీద ధనుస్సు ద్రోణుడు తియ్యడమూ, సాత్యకి విరిచెయ్యడమూ నిమిషాల మీద జరిగిపోయింది.

"పరశురాముడూ, కార్తవీర్యుడు, అర్జునుడూ, భీష్ముడూ— ఈనలుగురూ తప్పిస్తే ఇంతటి అస్త్రబలం మరొకడిదగ్గిర ఇంతవరకూ చూడలేదు నేను" లోలోపల సాత్యకిని మెచ్చుకుంటూ అనుకున్నాడు ద్రోణుడు – "ఇతడి వేగవిక్రమం అద్భుతంగా వుంది." సిద్ధులూ, సాధ్యులూకూడా అదేవిధంగా సాత్యకిని పొగిడారు.

ద్రోణుడు మరో విల్లు పుచ్చుకున్నాడు. గబగబా బాణాలు రువ్వాడు. అన్నీ అల్లంతదూరానే ముక్కలుచేసేశాడు సాత్యకి. మాసైన్యం కూడా అతణ్ణి భళిభళీ అంది. అది శూలంలా వేధించింది ద్రోణాచార్యుల్ని. ముందూ వెనకా చూడలేదతడు. చప్పున ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. ఆకాశం మంటలతో నిండిపోయింది.

సాత్యకిమాత్రం సామాన్యుడా! కళ్ళల్లో నిప్పులు కక్కాడు. ఉత్తరక్షణంలో వారుణాస్త్రం ప్రయోగించాడు. ఆగ్నేయాస్త్రమూ, వారుణాస్త్రమూ రెండూ, ఆకాశంమీద ఢీకొన్నాయి. భయంకరంగా పోట్లాడాయి. కౌరవ పాండవసేనలు రెండూ హాహాకారాలు చేశాయి. పోట్లాడి పోట్లాడి ఆ మహాస్త్రాలు రెండూ అలిసిపోయాయి. తుదకి శాంతించి వూరుకున్నాయి.

ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ సాత్యకితో కలిశారు. ద్రోణుడిమీద బాణవర్షం కురిపించారు. ధృష్టద్యుమ్నుడూ మొదలైనవీరులు వీళ్ళని దాటుకుంటూవచ్చి ద్రోణుణ్ణి ముట్టడించారు.

దుశ్శాసనుణ్ణి ముందుపెట్టుకుని మన రాజకుమార్లు ధృష్టద్యుమ్నుణ్ణి ఢీకొన్నారు. ఇలా ఇక్కడ హాహారావహోరి దోమీ్మయుద్ధం జరుగుతూ వుంది. వ్యూహంలోపల అర్జునుడు తనరథం పరిగెడుతూన్నంతమేరా తీవ్రమైన బాణాలు వేసి, మనసేనని చేనుకోసినట్టు కోసేస్తూ నడిచాడు. అన్నిటికంటె అవాళ శ్రీకృష్ణుడు రథంనడపడం మరీ ఆశ్చర్యమంటే నమ్మ.

## విందుడూ అనువిందుడూ

రౌద్రరసం వెలిగిపోతూ వుండగా అర్జునుడు జయద్రథుడివేపు సాగుతున్నాడు. ఇంతలో అవంతిరాజులు విందుడూ, అనువిందుడూ

వాళ్ళరథంమీద వెళ్ళి, తమసేనలతో అర్జునుణ్ణి అడ్డుకున్నారు. అర్జునుడిమీదా, అతడి సారథి శ్రీకృష్ణుడిమీదా, గుర్రాలమీదా వేలువేలుబాణాలు అదే రువ్వడం రువ్వారు.

దారుణమైన బాణాలు కొట్టాడు అర్జునుడు. అయినా వాళ్ళు చలించలేదు. మరింత రెచ్చిపోయారు. అర్జునుడిరథం బాణాలతో ముంచేశారు. కనుబొమలు ముడివేశాడు అర్జునుడు. రెప్పపాటులో వాళ్ళధనుస్సులు రెండూ నరికేశాడు. ఆ వెంటనే వాళ్ళ సారథిప్రాణాలు తీసేశాడు. వాళ్ళజెండా ఎగరగొట్టేశాడు. వాళ్ళ సైన్యాలు చెండాడాడు. ఒక గట్టిబాణం వేసి విందుడి తల నరికేశాడు. తల కింద తుళ్ళిపడింది. గాలికి పడిపోయిన చెట్టులా మొండెం రథంమీంచి పడిపోయింది.

కళ్ళఎదుట అన్నగారి చావు చూశాడు అనువిందుడు. దుఃఖంతోనూ, కోపంతోనూ వొణికిపోయాడు. గుర్రాలులేని రథంమీంచి గద పట్టుకుని దూకేశాడు. అమాంతంగా అర్జునుడి రథంమీదికి వెళ్ళాడు. గద సారించి కృష్ణుడి నుదటిమీద కొట్టాడు. పెద్ద సింహనాదం చేశాడు.

మంచిదొక బాణం వేశాడు అర్జునుడు అనువిందుడిగద ముక్కముక్కలు చేసేశాడు. మరోబాణం వేశాడు. అతడి కాళ్ళు రెండూ నరికేశాడు. ఇంకొకటివేసి అతడి బాహువులూ నరికేశాడు. శిరస్సూ నరికేసి, భూదేవికి అతణ్ణి బలిపెట్టేశాడు.

రాజులు చిత్రవధ అయిపోయినా అవంతిసేనలు పారిపోలేదు. కందిరీగల్లాగ వెళ్ళి అర్జునుణ్ణి చుట్టుముట్టాయి. కారుచిచ్చు కారడివి కాల్చి బుగ్గిచేసినట్టు అంతసేనా మాడ్చి వొదిలిపెట్టాడు అర్జునుడు.

అవంతిసేన హతమార్చి ముందుకి సాగుతున్నాడు అర్జునుడు. అయితే అతడు అలిసిపోయినట్టు అనిపించాడు మనవాళ్ళకి. అతడి

గుఱ్ఱాలు దప్పికతో వున్నాయి. జయద్రథుడు వున్న స్థలం ఇంకా ఎంతో దూరముంది. వేళచూస్తే ఎంతో లేదు. అదంతా కనిపెట్టి సింహనాదాలుచేశారు మనయోధులు. ఎలాఅయినా అతణ్ణి అడ్డెయ్యాలంటూ నిశ్చయించుకున్నారు. దురుసుగా వెళ్ళి అతణ్ణి ఘెరాయించారు.

మనవాళ్ళని చూసి చిరునవ్వు నవ్వాడు అర్జునుడు. "బావా, శరీరంలో బాణాలుంటే గుఱ్ఱాలు పరాక్రమించవు" కృష్ణుడితో అన్నాడు అర్జునుడు- "కౌరవుల్ని లెక్కచెయ్యకు. గుఱ్ఱాలు విప్పు. వాటిని నిమిరి సేద దేర్చు" అన్నాడు.

"అవును, నేనూ అదే అనుకుంటున్నాను" అంటూ రథం నిలిపాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు రథం దిగాడు. గాండీవం సారించాడు.

ఈఅవకాశం చూశారు మనవాళ్ళు. అదే ఎగబడడం ఎగబడ్డారు అర్జునుడిమీదికి. మహాస్త్రాలు ప్రయోగించారు. రకరకాల శస్త్రాలు కుమ్మరించారు.

వాటన్నిటినీ కొట్టిపారేశాడు అర్జునుడు. ఒక్కటీ దగ్గిరచేరకండా తిప్పికొట్టాడు. ఆకాశమంతా అద్భుతమైన మంటలుపుట్టించాడు. బలమూ, కౌశలమూ చూపించి మనవీరులు అతనిమీద కలబడ్డకొద్దీ అతడి బలమూ, కౌశలమూ వెల్లడవుతూవచ్చాయి. మన గుఱ్ఱాలూ, ఏనుగులూ, రథాలూ, కాల్బలమూ — చతురంగబలం యావత్తూ దెబ్బతినేసింది. నాశనమైనంత నాశనమైపోయింది. మిగిలింది చెదిరిపోయింది; పరుగుచ్చుకుంది; బెదిరిపోయింది.

ఈఆపదచూసి బైటిసేన లోపలికి తోసుకువచ్చింది. ఇదీ అదీ కిక్కిరిసిపోయి కేకలూ, పెడబొబ్బలూ వేసి అల్లకల్లోల మయిపోయింది.

అర్జునుడు కిందనుంచున్న మాత్రాన వివేకంలేకండా గెలిచెయ్యవచ్చు అన్నదురాశతో మనసేన పెద్దసముద్రంలా అతడిమీదికివెళ్ళింది. కెరటాలుముంచినట్టు బాణపరంపర ముంచింది. తూర్యారవాలుసముద్ర

ఘోషలాగే విజృంభించాయి. ఏనుగులూ, గుర్రాలూ, భటులూ, రథాలూ రకరకాల జలచరాల్లా అవుపించాయి. అంత సైన్యసము ద్రాన్నీ సముద్రపాడ్డులా చలించకండా అడ్డేశాడు అర్జునుడు. నిజంగా మహారాజా, విక్రమశుతూహలి అతగాడు. పిడుగుల్లాటి బాణాలు వేసి మనరథాలు గుండపిండిచేసేశాడు. అర్ధచంద్రబాణాలు కొట్టి ఏనుగులు దొర్లించేశాడు. మొనతేరినబాణాలతో గుర్రాలు కూలగొట్టేశాడు. వింతవింత అస్త్రాలు రువ్వి వంటకోసం మాంసం కై మాకొట్టినట్టు పదాతి సేన తరిగితరిగి వొదిలిపెట్టాడు. అదంతా చూస్తే బీభత్సం, రౌద్రం మూర్తిభవించినట్టనిపించింది అద్భుతంగా.

మన సైన్యమంతటా రక్తం, మాంసం, మెదడు, ఎముకలు నిండిపోయాయి. సేనసేనంతా క్షోభపడిపోయింది. అన్నిదిక్కులా మృత్యువు తాండవమాడింది.

"అర్జునా, గుర్రాల శరీరాల్లోంచి బాణాలన్నీ పెరికేశాను" శత్రుసంహారంచేస్తూ నవ్వుతూన్న అర్జునణ్ణిచూసి అన్నాడు కృష్ణుడు- "ఒళ్ళంతా బాగా నిమిరాను. కాని దాహంతో దహించుకుపోతున్నా యివి. నీళ్ళుతాగితేనే కాని తెప్పిరిల్లినట్టు లేవు. ఏమిటి సాధనం? వెన్నులు ములిగినట్టు స్నానంచెయ్యకపోతేపోయింది, తాగడానికి ఇన్ని నీళ్ళు దొరికితే చాలు, నిన్ను గెలిపించితీరతాయి."

"నీళ్ళేనా కావాలి!" కళ్ళతోనే నవ్వుతూ అన్నాడు అర్జునుడు- "ఇవిగో, కావలసినన్ని" అంటూ దివ్యాస్త్రం వొకటి తీశాడు. భూమిపగిలినట్టుకింద కొట్టాడు. ఉత్తరక్షణంలో వొకదివ్యమైనకోనేరు పుట్టుకు వచ్చింది. వెంటనే శరపరంపర గుప్పించా డతను. ఆకోనే రంతటిమీదా బాణాలతో వొకఇల్లు తయారుచేశాడు. ఈ అద్భుతం చూసి భయభ్రాంతులయిపోయారు మనవాళ్ళు. ముక్కుమీద వేలు పెటుకున్నారు దేవతలు. బ్రహ్మానందంపడిపోయి అర్జునణ్ణి మెచ్చు

కున్నాడు శ్రీకృష్ణుడు. మహారాజా, ఇంతకిముందు ఇలాంటి వింత మూడులోకాల్లోనూ చూసినవారు లేరంటే నమ్ము.

సంతోషంతో చిరునవ్వు నవ్వుతూ గుర్రాలు కోనేట్లోకి నడిపించాడు కృష్ణుడు. కడుపారా వాటికి నీళ్ళు తాగించాడు. ఒళ్ళంతా నిమిరి తీసుకువచ్చాడు. మన యోధులు దిగాలుపడి నుంచుండిపోయారు. దివ్యాస్త్రబలంతో పుట్టిన నీటితోనే కలిగిన దానా కడుపారా గుర్రాలికి మేపాడు కృష్ణుడు. గుర్రాలు మళ్ళీ యథాప్రకారం తాజాగా తయారయాయి. స్త్రీజనంమధ్య వొక విలాసపురుషుడు వొయ్యారంగా మసిలినట్టు మన సేనమధ్య వొయ్యారంగా గుర్రాలు రథానికిపూశాడు శ్రీకృష్ణుడు. గుర్రాలు నొగలికి కట్టడమే తడవు తీవిగా రథమెక్కాడూ అర్జునుడు.

కొంతదూరంనించి కృష్ణార్జునుల్ని చూశాడు దుర్యోధనుడు. గబగబా వాళ్ళదగ్గిరికి బయలుదేరాడు. అయితే మన యోధులుమాత్రం అతణ్ణి గమనించలేదు. అక్కడున్న రాజులు యావన్మందీ తెల్లమొహాలు వేసి, భయపడుతూ, మనస్సుల్లో బాధపడుతున్నారు.

“ఇంత చతురంగసేనా వచ్చి మీదపడింది. మంటలు పుట్టించి మహాస్త్రాలు కుమ్మరించింది. ఇంత ముట్టడీ ఉఫ్ఫుమని ఊదేశాడు అర్జునుడు. యుద్ధరంగం యావత్తూ పీనుగులపెంట చేసేశాడు. అతణ్ణి వేలెత్తి చూపడం ఎవడితరం? అంత కౌరవసేనా మీదపడితే పిసరంతా లక్ష్యంలేకండా చెండాడి పొగమంచు పారదోలిన సూర్యుడిలా ప్రకాశించాడు. ఇది నడియుద్ధమని రవంతా జంకలేదు. గుర్రాలు సేదదీర్చమని పంపాడు. చిత్రం! బాణాలతో కోనేరు పుట్టించాడు! బాణాలతో దానికి ఇల్లుకట్టాడు! సారథి గుర్రాలు సేదదీర్చినదాకా నవ్వుతూ బహిరంగంగా నుంచున్నాడు! ఇసంతా తనకి ప్రమేయం లేదన్నట్టు ఇపుడు వెళ్ళి తీవిగా రథమెక్కాడు! కిందనుంచున్నప్పుడే ఎవరూ

ఏమీ చెయ్యలేకపోయాడు. రథంమీద ఇతణ్ణి శివుడైనా తేరిచూడ లేడు ఇక లాభంలేదు. అర్జునుడిచేత జయద్రథుడు హతమారిపోతాడు" ఇలా అనుకుంటూ మన వీరులు కొయ్యబారిపోయారు. ఒక్కడూ ఎదిరించే మొనగాడు లేకపోయాడు.

చిన్నపిల్లలు ఎలా ఆడుతూ పాడుతూ బయలుదేరతారు, అదిగో అలాగ విలాసంగా విహరించి, అనాయాసంగా ముందుకి నడి చారు కృష్ణార్జునులు. అలా చొచ్చుకువస్తూ, పొద్దువాలడం చూసి శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరిం చాడు. కృష్ణుడు రథవేగం హెచ్చించాడు. మనసైన్యం రాజులలో వేడిపుట్టింది. ఒకళ్ళనొకళ్ళు పురికొల్పుకున్నారు వాళ్ళు. అర్జునుణ్ణి ఎది రించారు. అడ్డుపడి శాయశక్తులా పోరాడారు. కాని సముద్రంలో చొరబడ్డ నదుల్లాగ అడిగిపోయారు.

పెద్దవల చీల్చుకుని పైకివచ్చిన తిమింగలాలలాగ, రాహువు నోటినుంచి బైటికివచ్చిన సూర్యచంద్రులలాగ మన సైన్యసమూహం చీల్చుకుని కృష్ణార్జునులు ముందుకి సాగిపోతూవుంటే, మనవాళ్ళు జయద్రథుడిమీద ఆశ చాలించుకున్నారు.

కృష్ణుడూ, అర్జునుడూ జయద్రథుడున్నతట్టు తలఎత్తి చూశారు. తమలోతాము ఇలా అనుకున్నారు. "అదిగో వాడే జయ ద్రథుడు. వాడిచుట్టూ కృపాచార్యులూ, శల్యుడూ, అశ్వత్థామా, భూరిశ్రవుడూ, కర్ణుడూ, అతడి కొడుకూ— వీళ్ళంతా మొనగాళ్ళు కనక వొదలకుండా కాపలా కాస్తున్నారు."

జయద్రథుణ్ణి గురిగా చూసి ఇంకా ఇలా అనుకున్నారు వాళ్ళు. "వీళ్ళేనా జయద్రథుణ్ణి కాపాడేవాళ్ళు? వీళ్ళేకాదు, దేవతలూ, ఆ దేవేంద్రుడూ వచ్చినాసరే, జయద్రథుడు బతకడమన్నది వొట్టి మాట."

ఈమాటలు మనయోధులూ, నీకుమాళ్ళూ స్పష్టంగావిన్నారు. భయంకరమైన దుర్గాలు దాటి, లాభదేశం చేరబడ్డ వ్యాపారుల్లా వున్న కృష్ణార్జునులిద్దరినీ చూసి మనవాళ్ళు అనుకున్నారు. "అవును, ఎన్నో అన్ని నదులు ఈది రావడమూ, దారుణమైన పాముల బారి తప్పించుకోడమూ ఎలాంటిదో ద్రోణాచార్యులు మొకలైన శూర యోధుల్ని తప్పించుకురావడం అలాంటిది. అదిగో చూడండి, ద్రోణాచార్యులూ వాళ్ళూ ఎంతోమంది రథికులు వేసిన బాణాలు తగిలి కృష్ణుడూ అర్జునుడూ కొత్తగంట్లతో ఎలావున్నారో! పూసిన గోగు చెట్లతో వున్న రెండు కొండల్లా వున్నారు."

మహారాజా, అలా మనవాళ్ళు కృష్ణార్జునుల్ని ప్రశంసించారు. మీ అల్లుడు జయద్రథుడిమీద ఆశ వొదులుకున్నారు.

ఎర్రజీరలతో విప్పారిన కళ్ళతో కృష్ణార్జును లిద్దరూ జయద్రథుణ్ణి తేరిపార చూశారు. విక్రమంతో సింహనాదాలు చేశారు; ముందుకి వురికారు.

అంతలో చర్రున రథం పరిగెత్తించుకువచ్చి అందుకున్నాడు దుర్యోధనుడు. గురుదేవుడిచ్చిన కవచంవల్ల నిర్భయంగా అందరినీ తప్పించుకుని ముందుకి వెళ్ళి, జయద్రథుడున్న చోటికీ అర్జునుడి రథానికీ మధ్యగా రథం నిలబెట్టాడు. రాజరాజు అలా రాగానే మన ఉభయపార్శ్వాల శూరులూ సంతోషంతో సింహనాదాలు చేశారు. శంఖాలు పూరించారు. ఢణఢణఢణ రణదుందుభులు మోయించారు.

తమరథానికి ఎదురుగా దుర్యోధనుడు నిలవడంతోనే "అదిగదీ, అర్జునా! రథికుడంటే ఇతడే అంటాను" అర్జునుణ్ణి చూస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు—"ఆపదవచ్చినప్పుడే ఇలాధైర్యంతో ఎదిరించాలి. మీరంటే భగ్గుమంటూ డితడు. అస్త్రవిద్యావిశారదుడు. గర్విపోతు. బాల్యం నించీ గారాబంగా పెరిగాడు. మహాబలిష్ఠుడు. ఇంచేతే యుద్ధమంటే

జంకడు. ఉద్దోలమైన భుజబలం కలవాడు. దుర్మదుడు. జయద్రథుడు పందెంగా మనకీ ఇతడికీ పడింది జూదం. నీపౌద్ధత్యమంతా చూపించి ఇతణ్ణి గెలవాలి నువ్వు. ఇన్నాళ్ళయినా మనస్సులో రాజుతూవున్న ఈరారాజుమీద కోపమంతా ఇవాళ తీర్చుకోవాలి. ఇతడే మీఆపద లన్నిటికీ మూలం. మాయజూదంలో ఇతడే ధర్మరాజుని ఓడించాడు. పాపాత్ముడు. ఇతడే నిండుసభలో ద్రౌపదిని మానభంగంచేశాడు.

"నీఅదృష్టం బావుంది. ఈవాళ నీఎదటికే వచ్చాడితడు. నీచేతిచేవ ఇతడికి తెలియదు. తెలిస్తే వచ్చేవాడు కాడు. దేవుడు పెన్నిధి తెచ్చి మనముందు పెట్టాడీవాళ. కానీ, చప్పున ఇతణ్ణి హత మార్చు. ఇతడు అయిపోయాడో మన హృదయవేదన అంతమయి పోతుంది. రాజ్యంమీద దురాశతో గాండీవానికి ఎరగా వచ్చాడితడు. ఏమయినా ఇలా నిష్ఠురమైన శౌర్యంతో నీమీదికి రావడమంటే ఆశ్చర్యంగానే వుంది. ఇది నీపూర్వసుకృతం. సందేహంలేదు

"అర్జునా, ఇతడు చచ్చాడో ఇంతసైన్యమూ తోకముడు స్తుంది. జయద్రథుడు కలబడ్డాడో హరీ అనేస్తాడు. లేదూ, సిగ్గుమాలి పారిపోతాడూ, మన ప్రతిజ్ఞకి అడ్డేచాలు. ఊఁ, కానీ. ఆలోచించకు. ఈ రణయజ్ఞంలో దుర్యోధనుడిచావే అవభృథస్నానం కావాలి." ఇలా ఎన్నోవిధాల అర్జునుణ్ణి హెచ్చరించాడు శ్రీకృష్ణుడు.

"ఇంత చెప్పాలా కృష్ణా," అంటూ అందుకున్నాడు అర్జునుడు — "ఇతడు ద్రౌపదిని పెట్టిన పాట్లు హృదయంలో శల్యంలా బాధిస్తూనే వున్నాయి. మారాజ్యం లాక్కుని ఇతడు కులుకుతూ వుండడం అనుక్షణమూ నాక్రోధాగ్ని రగిలిస్తూనే వుంది. ఇప్పుడే చూద్దువు కాని. నువ్వు సెబాస్ అన్నట్టు ఇతడి చలమూ, బలమూ, అన్నీ అంతం చేసేస్తాను. ఇంకొకడిమీదికి వద్దు, తిన్నగా రథం ఇతడి మీదికే పోనీ " అన్నాడు.

సరాసరి దుర్యోధనుడిమీదికి రథం పోనిచ్చాడు శ్రీకృష్ణుడు. ఉరిమీద పాములాగ తనకి ఎదురుగా అర్జునుడిరథం వచ్చేస్తోంది, అయినా చలించ లేదు దుర్యోధనుడు. తానుకూడా అర్జునుడిమీదికి ఉరికించాడు రథం. విరగబడి అర్జునుడిమీదికి రారాజు వెళ్ళడం చూసి మన రాజులు భయపడ్డారు. కౌరవసేనలో ఘోరమైన కల్లోలం బయలుదేరింది.

కవ్విస్తూ అర్జునుణ్ణి యుద్ధానికి పిలిచాడు దుర్యోధనుడు. దాంతో మరింత ఉప్పొంగిపోయారు కృష్ణార్జునులు. పాంచజన్యమూ, దేవదత్తమూ పూరించారు. సింహాంకొదమల్లాగ వాళ్ళిద్దరూ వురుకుతూ వుంటే దుర్యోధనుడిమీద ఆశ వొదులుకున్నారు మనరాజులు. భ్రమపడి అగ్గిలో వురుకుతూన్న లేడిలావున్నాడు రారాజని విచారించారు.

"అయ్యో, రారాజు చచ్చిపోయాడు, చచ్చిపోయాడు" అంటూ మనయోధులు కేకలు వేశారు.

"భయపడకండి" అంటూ మనవాళ్ళని వారించాడు దుర్యోధనుడు "అర్జునుణ్ణీ, ఈకృష్ణుణ్ణీ కూడా నాబాణాలతో మాడ్చేస్తాను. మీాకళ్ళవేడుకగా ఇవాళ నాప్రతాపమంతా చూపిస్తాను, చూడండి."

అలా తనసేనలికి ధైర్యంచెప్పి అర్జునుడివేపు తిరిగి, గర్వంతో గర్జించాడతడు.

## పాండురాజు కొడుకువే అయితే పరాక్రమం చూపించవోయి!

"అర్జునా, నువ్వు ఏవో దివ్యబాణాలు తెలిసినవాడివటకదూ! నేను లేనిచోట నిఆటలన్నీ సాగిపోయాయి. ఇప్పుడు అపప్పూ వుడకదిక్కడ. నీబలమూ, మీాబావ కృష్ణుడి చాకచక్యమూ చూడాలనే యుద్ధానికి వచ్చాను. ఇదిగో నువ్వు నిజంగా పాండురాజు కొడుకువే

అయితే ఆపరాక్రమమేదో చూపించవోయి!'' అంటూ ఘోరమైన బాణాలు అర్జునుడిమీద కొట్టాడు దుర్యోధనుడు. నాలుగు బాణాలతో అతడి నాలుగు గుర్రాల్నీ కొట్టాడు. పది బాణాలు కృష్ణుడి గుండెలమీద గుచ్చుకున్నట్టు వేశాడు. ఒక బాణంవేసి అతడి ములుకోల ముక్కలు చేసేశాడు.

కళ్ళు మెరుస్తూ కోపం తెచ్చుకున్నాడు అర్జునుడు. రాతి మొనల బాణాలు గబాగబా పద్నాలుగు దుర్యోధనుడిమీద బాదాడు. అయితే అవన్నీ దుర్యోధనుడి కవచానికి తగిలి తుళ్ళిపోయాయి. మరో పద్నాలుగు వాడివాడి బాణాలు వేశాడు అర్జునుడు. అవన్నీ అలాగే తుళ్ళిపోయాయి. చరచరా మరో ఇరవయ్యొనిమిది తీక్ష్ణమైన బాణాలు గుప్పించాడు అర్జునుడు. చిత్రం, అవీ అలాగే వ్యర్థమై తుళ్ళిపోయాయి.

"ఎన్నడూ లేంది, ఏమిటిది?'' విచారంతో ఆతురపడుతూ అన్నాడు శ్రీకృష్ణుడు – "బాణాలు తుళ్ళిపోతున్నాయా! గాండీవం శక్తీ, నీభుజబలమూ వూరికే పోదమూ! చిత్రం! నీముష్టి స్థిరంగా లేదా? నారి ఆకర్షణ పట్టుతప్పిందా? బాణగతి మునుటిలా లేదూ! అసలు సంగతి ఏమిటో అర్జునా, నిజం చెప్పు. పిడుగుల్లా వెళ్ళి, శత్రువుల్ని చెండాడే నీబాణాలు ఇప్పుడు పొల్లుపోడమేమిటి? ఈమతిలేని జంతువు దుర్యోధనుడికి వినాశకాలంమూడి ఇలాంటి విపరీతం పుడుతోందా! అయోమయంగా వుంది నాకు. మనస్సు బాధపడిపోతూ వుంది.''

"విపరీతమేమీ కాదు'' అలా తన్ను తాను నిందించుకుంటూ అడిగిన శ్రీకృష్ణుణ్ణి చూస్తూ అన్నాడు అర్జునుడు – "ఇదొక కవచ ప్రభావం. ద్రోణాచార్యులు వొక్కడే ఎరుగు నిది. నాకుమాత్రం చెప్పాడు. ఇప్పుడు దుర్యోధనుడికి ఇచ్చినట్టుంది. ఈకవచం ముల్లోకాలికీ అభేద్యమైంది. అయితే బావా, నీకుమాత్రం తెలియంది కాదు.

తెలిసే నన్ను అడగడ మెందుకంటా! మూడులోకాల్లోనూ నీకు తెలి యని వస్తువులు ఏముంటాయి కనక! అదలా వుండనీ. దుర్యోధనుడు ఇది గురువుగారిదయవల్ల సంపాదించాడు. ఆడదానిలా శరీరానికి అడ్డు తగిలించుకుని వచ్చాడు. అంతే. ఇది వేసుకువస్తే తరవాత ఏమవు తుందోమాత్రం ఎరగడు. నా గాండీవం శక్తీ, చేతుల చేవా ఇప్పుడే చూద్దువు కాని. నీసంకోచం తొలిగిస్తాను. ఇతడికవచమూ, గివచమూ వూడగొట్టేస్తాను.

"లోగడ దేవేంద్రుడు అంగిరసుడికి వొక మహాస్త్రం ఇచ్చాడు. అంగిరసుడు బృహస్పతి కిచ్చాడు. బృహస్పతి తిరిగి దేవేంద్రుడి కిచ్చాడు. అది దేవేంద్రుడు నాకు ప్రసాదించాడు. సర్వకవచాలూ చీల్చిపారేసే మహాస్త్ర మది. దాంతో ఇతడి కవచం ముక్కలు చేసేస్తాను."

ఇలా అంటూనే ఆదివ్యాస్త్రం గాండీవానికి తొడిగాడు అర్జు నుడు. మంత్రం చదువుతూ నారి లాగి వొదిలిపెట్టాడు. అది చూశాడు అశ్వత్థామ. సర్వాస్త్రాలూ సంహరించే వొక మహాస్త్రం చప్పున ప్రయోగించాడు. దాంతో అర్జునుడు ప్రయోగించిన దివ్యా స్త్రం వ్యర్థమై వూరుకుంది.

చకితుడయాడు అర్జునుడు. "కృష్ణా, అశ్వత్థామ బాణంవల్ల నాదివ్యాస్త్రం నాశనమైపోయింది. మళ్ళీ ప్రయోగిస్తే ఇది మనకే హానిచేస్తుందని విన్నాను. సరే, మించిపోయిం దేమీలేదు. నాగాండీవ బలంతోనే ఇది సాధిస్తాను" అంటూ గాండీవం సారించాడు.

ఇంతలో తొమ్మిదిబాణాలు కృష్ణుడిమీదా, తొమ్మిదిబాణాలు అర్జునుడిమీదా తగిలించాడు దుర్యోధనుడు. అంతతోనూ వూరుకోలే దతడు. శరవర్షం కురిపించి అర్జునుడిరథం ముంచెత్తాడు. కౌరవసేనలో

రణతూర్యాలూ, ప్రశంసలూ, పెడబొబ్బలూ కీ, సింగురుమని పోయాయి.

కోపంతో పెదవి కరిచి గాండీవమెత్తాడు అర్జునుడు. దుర్యోధనుడిగుర్రాలు నరికేశాడు. అతడిసారథిని చంపేశాడు. రథం ముక్కలు చేసేశాడు. కన్నుమూసి కన్నువిప్పేలోపున అతడి అరిచేతుల్లో బాణాలు నాటించాడు. రథమూ పోయింది. చేతుల్లో బాణాలు గుచ్చుకుని బాధ పెడుతున్నాయి. దాంతో రారాజుకి మతిపోయింది. ద్రోణుడిచ్చిన కవచప్రభావం తెలియక విచారిస్తూ, అది పనికిరాలిందనుకున్నాడు. అవివేకంతో దానినితీసి పారేశాడు. మరో కవచం వేసుకున్నాడు.

రాజు ఆ పదలో పడిపోడంచూసి మనయోధులు చతురంగబలాలతో పరిగెత్తుకు వెళ్ళారు. అర్జునుణ్ణి ముట్టడించారు. బాణాలమీద బాణాలు కుమ్మరించారు. ఎంతమందివెళ్ళి ఆక్రమిస్తేమాత్రం అడ్డేముంది అర్జునుడికి! ఒక్కడే వెయ్యిమంది విలుకాళ్ళలా విజృంభించాడతడు. దాంతో రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కుప్పలుకుప్పలు కూలిపోయాయి. కాల్బలం పీనుగుపెంటయింది. భూమీ, ఆకాశమూ దద్దరిల్లిపోయినట్టు శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. భయంకరమైన అర్జునుడి దాడీ, ఘోరమైన శ్రీకృష్ణుడి శంఖధ్వనీ — ఈరెంటివల్లా కౌరవసైన్యం కంగారుపడిపోయింది. దిక్కూ మొక్కూ లేకండా చెల్లాచెదురయిపోయింది.

అలా భరించలేక భయపడి మనసేన చెదిరిపోయింది. అడిగివుండి, తగిన గాలి వీవడంతోనే మండిన మహాగ్నిలా అవుపించాడు అర్జునుడు.

జయద్రథుణ్ణి కాపాడుతూవున్న సేన సంక్షోభంతో విజృంభించింది. ఉత్సాహంతో శంఖాలు పూరించింది. భేరీలూ, పణవాలూ మోగించింది. సింహనాదాలుచేసింది. భూమీ ఆకాశమూ దద్దరిల్ల జేసే ఆ కోలాహలమూ, ఆతత్తరపాటూ చూసి శ్రీకృష్ణుడూ, అర్జు

నుడూ ఉల్లాసంతో చిరునవ్వులు నవ్వుతున్నారు. ఇద్దరూ శత్రువుల మీదికి విజృంభించారు.

అప్పుడు కర్ణుడి కొడుకు వృషసేనుడూ, సోమదత్తుమూడో కొడుకు శలుడూ, జయద్రథుడూ, కృపుడూ, కర్ణుడూ, అశ్వత్థామా, శల్యుడూ, భూరిశ్రవుడూ — ఈ ఎనమండుగురూ అమాంతంగా రథాలు ఉరికించి అర్జునుడిమీదికి వెళ్ళారు. తన ప్రతిజ్ఞ నెరవేర్చుకుందికి ముఖ్యోపాయమని, దుర్యోధనుణ్ణి పాతపార్చడానికి సిద్ధపడ్డ అర్జునుడిమీద ఒక్క మొగిని కలబడి ఈ ఎనమండుగురూ తమతమ శంఖాలు ఒక్కసారి పూరించారు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. లక్ష పిడుగులు ఒకసారి ఉరిమినట్టు ఉరిమింది దేవదత్తం. ఆధ్వానికి నీకుమాళ్ళ గుండెల్లో పిడుగులే పడ్డాయి. కౌరవసేనలో సైనికుడన్న వాడల్లా గడగడలాడిపోయాడు. గూబలు పగిలించే ఆధ్వానికి దుర్యోధనుడూ, కర్ణుడూ మొదలైన ముక్కాకలు తేరిన యోధులుమాత్రం చలించకుండా అర్జునుడిమీద బాణవర్షం కురిపించారు. జయద్రథుడి మీదికి అతడు వెళ్ళకుండా అడ్డునిలిచారు.

అప్పుడు అశ్వత్థామ ఏంచేశాడో తెలుసా? డెబ్బయిమూడు బాణాలు కృష్ణుడిమీద కురిపించాడు. మూడు బాణాలు అర్జునుడిమీద నాటించాడు. నాలుగుగుర్రాలమీదా నాలుగు బాణాలు తగిలించాడు. వానరపతాకంమీద ఒక బాణం కొట్టాడు.

అర్జునుడు వందాఆరు బాణాలు వరసపెట్టి అశ్వత్థామమీద తగిలించాడు. కర్ణుడిమీద పది బాణాలూ, వృషసేనుడిమీద మూడు బాణాలూ నాటించాడు. కత్తిలాంటి వెడల్పాటి బాణం వేసి శల్యుడి ధనుస్సు ముష్టిదగ్గిరికి నరికేశాడు.

వెంటనే మరో ధనుస్సు పుచ్చుకుని, తొమ్మిది బాణాలు వేశాడు శల్యుడు. భూరిశ్రవుడు మంచి వాడి మొనబాణాలు మూడు

కొట్టాడు. కర్ణుడు ముప్ఫయిరెండుబాణాలు గుప్పించాడు. వృషసేనుడు అయిదూ, కృపాచార్యులు పదీ కొట్టారు. అశ్వత్థామ అరవై బాణాలు రువ్వాడు. ఆసందడిలో వాళ్ళచాటునించి తక్కిటారి డబ్భయిమూడు బాణాలు వేశాడు జయద్రథుడు.

ఇంతమందీ ఇలా వొక్కసారి ఉక్కిరిబిక్కిరిగా బాణాలు గుప్పించడంతోనే కోపంనవ్వు నవ్వుతూ మూర్తీభవించిన రౌద్రరసంలా పేట్రేగిపోయాడు అర్జునుడు. రెప్పపాటులో కర్ణుణ్ణి పన్నెండుబాణాలతో కొట్టాడు. పన్నెండుబాణాలూ అతణ్ణి దూసెళ్ళిపోయాయి. వృషసేనుణ్ణి మూడుబాణాలతో కొట్టాడు. మూడూ అతణ్ణి దూసుకుపోయాయి. ఒకదారైన బాణం వేసి మళ్ళీ శల్యుడి ధనుస్సు ఫెళ్ళుమనిపించాడు. తిరిగి అతడు తమవుకునే లోపున అతడిమీద తొమ్మిది బాణాలు తగిలించాడు. తొమ్మిదిబాణాలూ అతడిశరీరం చీల్చుకుపోయాయి. భూరిశ్రవుడిమీద ఎనిమిది బాణాలు వేశాడు. ఎనిమిది బాణాలతోనూ కీచుకీచుమనిపోయాడతడు. అలాగే అశ్వత్థామని ఎనిమిదిబాణాలతోనూ, కృపాచార్యుల్ని పాతికబాణాలతోనూ జామాలుమనిపించాడు. అంతేకాదు, తళతళా మెరుస్తూన్న వాడివాడి బాణాలు మరో ఇరవై అశ్వత్థామ వొంటిమీద నాటించాడు. ఇలా ఇంతమందితోనూ అర్జునుడు పోరాడుతూవుంటే వొక్కొక్కసారి వొక్కొక్కరిమాటున అతడికి అవుపించేవాడు జయద్రథుడు. అతణ్ణి కొట్టడానికి సందు దొరికేది కాదు. అయినా అతడిమీద అర్జునుడు వేసిన బాణాలు ఎంతలేదన్నా వొక వందయినా వుంటాయి.

ఇంతలో భూరిశ్రవుడు టపీమని వొకబాణం వేశాడు. కృష్ణుడి చేతి మునికోల ముక్కలుచేసేశాడు. అర్జునుడిమీద డబ్భయిబాణాలు గుప్పించాడు. తక్కినవాళ్ళూ దారుణమైన బాణాలు వేశారు. దాంతో మహోగ్రమూర్తి అయిపోయాడు అర్జునుడు. ధనుష్టంకారం

చేశాడు. భూమినీ ఆకాశమూ దడదడలాడించేశాడు. ఘోరమైన బాణాలు వేసి అంతమంది యోధుల్నీ గడగడలాడించేశాడు. పెద్ద దావాగ్ని ఆర్పేసే ప్రళయమేఘంలా విజృంభించాడు. అతడి ధాటికి ఆగలేకపోయారు మన యోధులు. దూరదూరంగా చెదిరిపోయారు. మళ్ళీ సైన్యాలు చేర్చుకున్నారు. ఒకళ్ళ నొకళ్ళు పిలుచుకున్నారు. ఒక్కసారి కలబడ్డారు.

పుంఖానుపుంఖాలు బాణాలు విరజిమ్మాడు అర్జునుడు. మనసేన రక్తంమడుగుల్లో మునకలుపెట్టింది. ఇలా పారిపోతూ, మళ్ళీ కలబడుతూ మనసేనలు వొదలకండా పోరాడాయి.

ధృతరాష్ట్రుడు : అయితే సంజయా, అలా అక్కడ పోరాడిన రథికులలో ఎవరెవరిజెండాలు ఏయే గురుతులతో ఎలావున్నాయో కాస్త వివరించూ.

సంజయుడు : మహారాజా, ఆ మహావీరుల జెండాలు రకరకాలుగా వుండేవి. ఆ పతాకాల పేర్లూ, ఆకారాలూ, రంగులూ, వివరిస్తాను, విను. ముఖ్యులైన రథికుల పతాకాలు వాళ్ళ రథాలమీద రంగురంగుల అగ్నిశిఖల్లా మెరుస్తూవుండేవి. ఎటు చూస్తే అటు అవి చిత్రచిత్రంగా ఎంతో ఇదిగా వుండేవి బంగారంమాలికలతోనూ, బంగారం శిఖరాలతోనూవున్న ఆ బంగారం పతాకాలు మేరుపర్వతం మీద బంగారం శిఖరాల్లా ఎంతో అంతో అందంగా వుండేవి. గాలికి అవి కదులుతూ నటిస్తూవుంటే, రంగస్థలంమీద నాట్యకత్తెలు నృత్యం చేస్తున్నట్టు వుండేది. రంగురంగుల ఆ జెండాలన్నీ ఇంద్రధనుస్సులా అవుపించేవి.

అందులో అర్జునుడి రథంమీది వానరపతాకం భీషణంగా వుండేది. ఉగ్రమైన ముఖంతోనూ, సింహాంగూలకతోనూ పతాకంమీది వానరం మనసేనని అదరగొట్టించేది. అశ్వత్థామరథంమీద పతాకం

సింహంతోకతో బాలసూర్యుడిలా ప్రకాశిస్తూవుండేది. ఇంద్రధ్వజంలా అది కౌరవకుమాళ్ళని ఉత్సాహపరుస్తూవుండేది. కర్ణుడిపతాకం బంగారం ఏనుగుతాడు (హస్తికక్ష్య) చిహ్నంతో ఆకాశంమీద గాలిలో నాట్యంచేస్తూ వుండేది. ముల్లోకాలూ జయించిన శివుడి వృషభపతాకంలా కృపాచార్యుడి రథంమీద ఆబోతుపతాకం అందంగా వుండేది. కర్ణుడికొడుకు వృషసేనుడి రథంమీద రత్నాలుతాపిన బంగారం నెమలిపతాకం కార్తికేయుడి పతాకం జ్ఞాపకం చేస్తూవుండేది. సేనాముఖంలో వుండి ఆనెమలి ఏదో చెప్పడానికి సిద్ధపడుతోందా అన్నట్టు వుండేది. శల్యుడి అగ్నిశిఖలాంటి జెండామీద బంగారు నాగేటిచాలు దేదీప్యమానంగా వుండేది. మీ అల్లుడు జయద్రథుడి జెండామీద స్ఫటికలాంటి వెండి వరాహం కళ్ళు జిగేలుమనిపిస్తూవుండేది. దేవాసురయుద్ధంలో పూషుడిలా అవుపిస్తూవుండేవాడతడు, వరాహ పతాకంతో. భూరిశ్రవుడిజండామీద బంగారం యూపస్తంభం సూర్యుడిలా ప్రకాశిస్తూవుండేది. రాజసూయ మహాయజ్ఞంలోని యూపస్తంభంలాగ పొడవుగావుండేదది. చుట్టూ బంగారం నెమళ్ళూ మధ్య వెండిఏనుగూ కలిగి శలుడి పతాకం మనసేన అంతటిలోనూ అందంగా వుండేది. నీకుమారుడు దుర్యోధనుడి రథంమీద వందలువందలు చిరుగంటలతో బంగారం నాగుపాము జెండా ఎగురుతూ వుండేది. ఇలా ఈపది పతాకాలూ ఆకాశమంత ఎత్తుని అద్భుతంగా అవుపిస్తూ వుండేవి. అయితే మన తొమ్మిది జెండాలకంటే అర్జునుడి వానర పతాకమే ఉగ్రంగా కనపడేది.

ధృతరాష్ట్రుడు : సరే, ఇక్కడ అర్జునుడు ఇలా ఇంతగా పోరాడుతున్నాడు ! అక్కడ ద్రోణాచార్యులు అడ్డుకున్న ధర్మరాజు సైన్యాలు ఏమయాయి?

సంజయుడు: మహారాజా, ఆ అపరాహ్ణం దేవతలుకూడా భయపడే ఆమహాయుద్ధంలో ద్రోణాచార్యుల సేనకీ, ధర్మరాజు సేనకీ ఘోరాతిఘోరమైన ద్వంద్వయుద్ధం జరిగిపోయింది. ఆద్వంద్వయుద్ధంలో కేకయరాజు బృహత్క్షత్రుడితో క్షేమధూర్తీ, చేదిరాజు ధృష్టకేతుడితో త్రిగర్తనాయకుడు వీరధన్వుడూ, నకులుడితో వికర్ణుడూ, సహదేవుడితో దుర్ముఖుడూ, సాత్యకితో మగధరాజపుత్రుడు వ్యాఘ్రదత్తుడూ కలబడ్డారు. శలుడు సేనాముఖానికి వస్తూ పోతూ ఉండడంచేత సమయంచూసుకుని వెళ్ళి ద్రౌపదికొడుకులమీద కలబడ్డాడు. భీముడూ అలంబసుడూ డీకున్నారు. ధర్మరాజుని ద్రోణాచార్యులు ఎదిరించాడు.

## ధర్మరాజు పలాయనం

ద్రోణాచార్యులు తనని అడ్డగించడంతోనే చికిలిపట్టిన బాణాలు ఒకదానివెంట ఒకటి వరసపెట్టి తొమ్మిది అతడిమీద నాటించాడు ధర్మరాజు. బాగా ఒళ్ళు మండింది ఆచార్యుడికి. గబగబా ఒక పాతిక బాణాలు ధర్మరాజుగుండెలమీద కొట్టాడతడు. అంతేకాదు, ధర్మరాజురథమూ, గుర్రాలూ, సారథీ కనపడకుండా బాణాలతో కప్పెట్టేశాడు. అయితే, ధర్మరాజుహస్తలాఘవంమాత్రం తక్కువయింది కనక నా! ద్రోణుడు వేసిన బాణాలన్నీ లిప్తలమీద కొట్టి పారేసి, విల్లు విరిచి మండుతున్నాడతడు.

మరింత ఒళ్ళు మండింది ఆచార్యులికి. టపీమని ఒక బాణం వేశాడతడు. ధర్మరాజుధనుస్సు రెండు ముక్కలకింద కొట్టేశాడు. ధర్మరాజు కదుప్రకు చేతిక్షిప్త లెక్కాజగా చేసి బాణాలు కురిపించేశాడు. అతడి సారథీ, గుర్రాలూ, రథమూ కనపడకుండా ముంచె

త్తాడు. దాంతో ధర్మరాజు హతమై పోతాడో, పారిపోతాడో దొరికే పోతాడో అంటూ పాండవసేనలు అదలెత్తిపోయాయి. చివాల్న మరో ధనుస్సు అందుకున్నాడు ధర్మరాజు. ద్రోణుడిబాణాలు యావత్తూ ఖండించేశాడు. అంతతో పూరుకోలేదతడు. ఆవేశంతో శక్తితీశాడు. ద్రోణుడిమీద ప్రయోగించాడు. ఎనిమిదిగంటలతో గణగణమంటూ మంటలుకక్కుతూ వచ్చేస్తోంది శక్తి. మనసేనలు గడగడలాడాయి. ద్రోణాచార్యులపని అయిపోయిందంటే అయిపోయిందంటూ అంత మందీ తలలెత్తి చూశారు.

అంతలో ఆచార్యులు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. ఉగ్రరూపంతో వెళ్ళింది బ్రహ్మాస్త్రం. ధర్మరాజుశక్తిని మంటగలిపేసింది. శక్తిని మంటగలిపేసి పూరుకుందా అది! లేదు. నిప్పులుకక్కుతూ ధర్మరాజుమీదికి పరిగెత్తింది. చూశాడు ధర్మరాజు. అతడూ చప్పున బ్రహ్మాస్త్రంవేశాడు. ఉభయుల బ్రహ్మాస్త్రాలూ ఢీకొన్నాయి. ఘోరంగా పోరాడాయి. రెండూ చల్లారిపోయాయి.

అయిదుబాణాలు కొట్టాడు ధర్మరాజు. అయినా ద్రోణుడి శరీరం దుసెళ్ళిపోయాయి. అతడు తడువుకునేలోపున మరొకబాణం వేశాడు ధర్మరాజు. ద్రోణుడి ధనుస్సు నరికేశాడు. ధనుస్సు విరిగి పోడంతోనే చప్పున గదతీసి విసిరాడు ద్రోణుడు. ధర్మరాజుకూడా గదవిసిరాడు. గదలురెండూ ఖణేలుమంటే ఖణేలు మన్నాయి. మంటలులేచి ఆకాశమంతటా అలుముకున్నాయి.

చెప్పలేనంత కోపం వచ్చింది ద్రోణాచార్యులికి. ఉద్రేకంతో మరో విల్లు తీశాడతడు. దారుణమైన బాణాలు వేశాడు. ధర్మరాజుగుర్రాలు చంపేశాడు. అతడి ధనుస్సు తుంచేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. వాడివాడిబాణాలుకొట్టి అతడిఒళ్ళంతా మంటలు పుట్టించాడు. ఇక చేసేది లేకపోయింది ధర్మరాజుకి. రథం దిగిపోయూ

డతడు. నిరాయుధుడయిపోయి రెండుచేతులూ మోదికొత్తి నిలబడి పోయాడు.

అలా వూరికే నిలబడిపోయిన ధర్మరాజుమీద బాణం వెయ్యడానికి కాని, అతణ్ణి పొడవడానికి కాని చేతులాడలేదు ద్రోణాచార్యులికి. అతడి పక్క-పక్కలవున్న గుర్రాలూ, రథాలూ, ఏనుగులూ మాత్రం కొడుతూవచ్చాడతడు.

"పోనివ్వడు, ధర్మరాజుని పట్టేస్తాడు, ద్రోణుడు" అని అనుకుంటూవుండగానే సహదేవుడిరథమెక్కి తప్పుకుపోయాడు ధర్మరాజు.

ధర్మరాజు అలా వెళ్ళిపోయాడు. క్షేమధూర్తి దారయిన బాణాలువేసి బృహత్క్షత్రుడివిల్లు ముక్కలుచేశాడు. నవ్వుతూ మరో విల్లు పుచ్చుకున్నాడు బృహత్క్షత్రుడు. ఇలాపుచ్చుకున్నాడు, అలా క్షేమధూర్తిగుర్రాలు కొట్టేశాడు. అతడి సారథిని నరికేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. జెండా కిందపడిందో లేదో, అతడితలా నరికేశాడు. కుండలాలతో మెరుస్తూ కిందపడిపోయింది క్షేమధూర్తి శిరస్సు. క్షేమధూర్తిని చంపేసి, బృహత్క్షత్రుడు కౌరవసేనమీద పడ్డాడు.

వీరధన్వుడు ధృష్టకేతువు ధనుస్సు ముక్కలుచేశాడు. త్రిగర్తులు గొల్లుమన్నారు. నిప్పులు కురిశాడు ధృష్టకేతువు. ఒక్క వూపుని శక్తితీసి విసిరికొట్టాడు. దెబ్బతో గుండెపగిలి ప్రాణాలు వొదలేశాడు వీరధన్వుడు. త్రిగర్తుల మహారథుడు వీరధన్వుడు కూలిపోగానే సంతోషంతో వెర్రికేకలు వేసింది పాండవసేన.

అన్నగారిని అవతలపెట్టి సహదేవుడు తిరిగివచ్చాడు. మన దుర్ముఖుడిమీద కలబడ్డాడు. నువ్వా నేనా అన్నట్టు ఉభయులూ యుద్ధంచేశారు తుదకి సహదేవుడు దుర్ముఖుడి జెండా ఎగరగొట్టేశాడు. అతడి సారథికంఠం నరికేశాడు. గుర్రాలు కూలగొట్టేశాడు. ఎంచిఎంచి అయిదుబాణాలు అతడిమీద నాటించాడు. భరించలేక

పోయాడు దుర్ముఖుడు జజ్జరిల్లిపోయి, నిరమిత్రుడి రథంమీదికి పోగి పోయాడు. పాండవసేన కేరిడీలు కొట్టింది.

అయితే సహదేవుడుమాత్రం ఆగలేదు. నిరమిత్రుడివెంట పడ్డాడతడు. ఖరుడి తల నరికేసిన శ్రీరామచంద్రమూర్తిలాగ అతడి తల నరికేశాడు. త్రిగర్తసేన హాహాకారాలు చేసింది.

నకులుడితో కలబడ్డ సుకుమారుడు వికర్ణుడు ఒక్కసారికూడా అతడితో ముఖాముఖి పోరాడలేకపోయాడు. కొండని ఢీకొని వెనక్కి వచ్చేసిన పొట్టేలులాగ చివరికి పలాయనం చిత్తగించాడతడు.

వ్యాఘ్రదత్తుడూ, సాత్యకీ ఉద్ధోలమైన యుద్ధంచేశారు. సాత్యకి గుర్రాలూ, సారథీ, రథమూ కనబడకండా బాణాలతో కప్పేశాడు వ్యాఘ్రదత్తుడు. బాగా వొళ్ళు మండింది సాత్యకికి. వ్యాఘ్రదత్తుడి సారథినీ, అతడి గుర్రాల్నీ వూడ్చేశాడు. ఆ మరుక్షణంలో అతణ్ణీ చంపేశాడు. తమ రాజకుమారుడు పడిపోడంతోనే మగధసేన సాత్యకిమీద విరుచుకుపడింది. లెక్కాజమా లేని బాణాలు కుమ్మరించింది. వేలకివేలు తోమరాలూ, భిందిపాలాలూ, ప్రాసలూ, ముసలాలూ, ముద్గరాలూ అదే కురిపించడం కురిపించింది. అన్నీ అవలీలగా కొట్టిపారేశాడు సాత్యకి. ఒక్కటీ తనదగ్గిరికి చేరనివ్వలేదతడు. అంత మగధసేనా చించి చెండాడాడు. చచ్చినంత చచ్చి తక్కినసేన పరుగుచ్చుకుంది.

శలుడు ఉపపాండవులతో కలబడ్డాడని చెప్పానుకదూ! అయిదుగురినీ అయిదుబాణాలతో కొట్టాడతడు. వాళ్ళరథాలమీద ఎన్నో అన్ని బాణాలు గుప్పించాడు. అయిదుగురితోనూ అయిదు రూపాలయి పోరాడాడు. ఉపపాండవులు అయిదుగురూ అయిదు చేతుల్లాగ అతణ్ణి పట్టుకున్నారు. శ్రుతకీర్తి అతడి గుర్రాలు కూలగొట్టాడు. శ్రుతసోముడు అతడి ధనుస్సువిరిచేశాడు. ప్రతివింధ్యుడు అతడి జెండా

చీలికలు చేసేశాడు. శతానీకుడు అతడి సారథిని చంపేశాడు. శ్రుత సేనుడు అతడి కంఠమే ఉత్తరించేశాడు. అయిపోయింది శలుడిపని.

## అలంబుసుడు

"నేను లేకపోయాను కనక మాఅన్నని బకాసురుణ్ణి చంపేశావు. భీమా! నా దగ్గిర నీ ఆటలు సాగవు" అంటూ పిడుగుల్ని మించిన బాణాలు భీముడిమీద రువ్వుతూ వెళ్ళాడు రుష్యశృంగుడి కొడుకు అలంబుసుడు. మొదట ఆ బాణాలు తగిలి మూర్ఛపడిపోయాడు భీముడు. కాని అంతలోనే తెలువుకున్నాడు. మహాస్త్రాలుప్రయోగించి అలంబుసుణ్ణి చెడామడా కొట్టేశాడు. అతడివొళ్ళంతా తూట్లుపడిపోయింది. పెద్దకాటుకకొండలా వున్న అతడిశరీరం గాయాలతో, పూసిన మోదుగుచెట్టులా అవుపించింది.

మాయచెయ్యడం లంకించుకున్నాడు అలంబుసుడు. ఉగ్రమైన శరీరంతో ఎటుచూస్తే అటు అవుపించా డతడు. లెక్కలేనంత రాక్షససేన పుట్టించాడు. నెత్తురునదులు పారించాడు.

కళ్ళల్లో చింతనిప్పులు కక్కాడు భీముడు. ఘోరమైనబాణాలు గుప్పించాడు. మాయా గీయా మాయంచేసి, అలంబుసుణ్ణి తరిమి తరిమి కొట్టాడు.

ఇలా మనవాళ్ళలో గట్టిగట్టివాళ్ళు వోడిపోడమూ, చచ్చిపో డమూ చూసి మనసేన చెదురుమదురయిపోయింది. అదంతా చూసి నెత్తురుకక్కుతూన్న కళ్ళతో అందరినీ దాటి ముందుకి వెళ్ళాడు ద్రోణాచార్యులు. సాత్యకీ మొదలైన వీరులమీద క్రూరమైన బాణాలు కురిపించాడు. ఒక్క అడుగైనా వాళ్ళు వ్యూహంలోకి చొచ్చుకురాకండా అడ్డుకున్నాడు.

ద్రోణుడు అలా వెళ్ళగానే పెద్ద పెడబొబ్బలుపెడుతూ పరి
గెత్తుకువచ్చాడు ఘటోత్కచుడు. అతను రావడంతోనే అడ్డంగా
వెళ్ళిపడ్డాడు అలంబుసుడు. బాగా సానపట్టిన బాణాలు జడివానలాగ
కురిపించాడు. వాటిని ఎదుర్కోడానికి రథం వురికించాడు సాత్యకి.
కాని అతణ్ణి వెనక్కి తోసేసి, అన్నిబాణాలూ తానే తుక్కుకింద
కొట్టేశాడు ఘటోత్కచుడు. పెద్ద చక్రం తీసి విసిరాడు అలంబు
సుడు. గద వేసి దానిని గుండపిండిచేసేశాడు ఘటోత్కచుడు. ఆగుండ
మీదపడి కందిరీగలు పొడిచినంత పనయింది సైన్యాలికి. తనచక్రం
వ్యర్థమయిపోడంతోనే రకరకాల శక్తులు విసిరాడు అలంబుసుడు.
వాటన్నిటినీ నెలవంక బాణాలు వేసి నరికేశాడు ఘటోత్కచుడు. అలా
ఆఇద్దరు రాక్షసులూ ఎన్నో ఆయుధాలతోనూ, ఎన్నో మారామో
పాయాలతోనూ, ఎన్నో మాయరూపులతోనూ యుద్ధం చేశారు.
కొండాకొండా కిందామీదా పడితే ఎలావుంటుంది, అలాదెబ్బలాడారు
వాళ్ళు. భూమి గజగజలాడిపోయింది. అలంబసుడి ఆగడం చూసి
పాండవులు నలుగురూ అతడి వొంటినిండా బాణాలు నాటించారు.
మాయాబలంతో అతను వాటిన్నిటినీ తప్పించుకున్నాడు. దావాగ్ని
నించి బైటపడ్డ మదపుటేనుగులాగ పాండవుల బాణాగ్నినించి
బైటపడి పెడబొబ్బలు పెట్టాడు. సందుచూసి భీముడిమీద పాతిక
బాణాలు గుప్పించాడు. ధర్మరాజుమీదా, ద్రౌపదికొడుకులమీదా,
ఘటోత్కచుడి మీదా తలా అయిదేసి బాణాలు తగిలించాడు.
నకులుడిమీద డబ్భయిమూడు బాణాలైనా కుమ్మరించాడు. పెద్ద
సింహనాదమూ చేశాడు.

పాండవులూ, ఉపపాండవులూ, ఘటోత్కచుడూ— ఇంతమందీ
కలిసి అలంబసుణ్ణిబాణాలతో కప్పెట్టేశారు. అంతమందితోనూ

వొక్కడే వహోరావహోరీ పోరాడాడతను. ఇంతలో ఘటోత్కచుడు అతడిసారథిని నరికేశాడు. అతడి రథమూ ముక్కలుచేసేశాడు.

రథం పోయినా రవంతా జంకలేదు అలంబుసుడు. భోరవిరుచు కుని కిందికి దూకేశాడు. మాయచేసి బాణవర్షం కురిపించాడు. ఘటో త్కచుడూ రథంమీాంచి కిందికి దూకాడు. అతడూ మాయబాణాలు పుట్టించాడు. అలంబుసుడి మాయబాణవర్షం మాయం చేసేశాడు. ఉద్ధోలమైన గదతీసి అలంబుసుడిమీాదికి విసిరా డతడు. పిడుగులా తగిలింది గద. కత్తిపుచ్చుకుని ఆకాశంమీాదికి ఎగిరిపోయా డతడు. ఘటోత్కచుడూ కత్తిపుచ్చుకున్నాడు. అలంబుసుడి వెంట ఆకాశం మీాదికి ఎగిరాడు.

పెద్ద సుడిగాలిలోపడి తిరుగుళ్ళుపడ్డ నల్లమేఘాల్లాగ, ఎరకోసం పోట్లాడే డేగల్లాగ అలంబుసుడూ, ఘటోత్కచుడూ ఆకాశంమీాద చిత్రచిత్రగతులతో పోట్లాడారు. పోట్లాడి పోట్లాడి నేలమీాదికి దిగారు. పెద్దపులుల్లాగ కింద వొకళ్ళమీాద వొకళ్ళు కలబడ్డారు ఇద్దరూ రక్తస్నానాలుచేశారు. ఒకళ్ళకంఠం వొకళ్ళు గురిపెట్టుకుని కత్తులు విసురుకున్నారు. కత్తీ కత్తీ ఖణేలుమన్నాయి. మండుతూ కింద పడిపోయాయి.

ఉభయులూ మల్లయుద్ధ మారంభించారు. ఒకళ్ళమీాదికి వొకళ్ళు ఎగబడ్డారు. ఒకళ్ళనొకళ్ళు పట్టుకున్నారు చప్పున విడిపోయి, మళ్ళీ వొకళ్ళనొకళ్ళు వొడిసిపట్టుకున్నారు. ఒకళ్ళనొకళ్ళు పొడుచు కున్నారు. గుద్దుకున్నారు. బాహాబాహీ, కచాకచి, ముష్టాముష్టి — కొట్టుకున్నారు. ఉభయసేనలకీ దిగుల్పుట్టించారు. పోట్లాసి పోట్లాడి అలంబుసుడు అలిసిపోయాడు. అతణ్ణి కిందపడేసి ఘటోత్కచుడ గుండెలమీాద కూచున్నాడు. మునుకులతో తొక్కాడు. మోచేత ఎదో పొడిచాడు. పిడుగుల్లాగ పిడిగుద్దులుగుద్దాడు. తొడలూ, ఎము

కలూ వొక్కసారి పొడిపొడి చేసేశాడు. రైతు ధాన్యం నూర్చినట్టు అతణ్ణి నేలపెట్టి, కాళ్ళతో తొక్కేశాడు. చిత్రవధచేసి చంపేశాడు. సింహనాదంచేశాడు. తూర్యారవాలు గింగురు మంటూండగా వెళ్ళి ధర్మరాజుకి అభివందనం చేశాడు. సంతోషచిత్తంతో అతణ్ణి ఆలింగనం చేసుకున్నాడు ధర్మరాజు. ఒళ్ళునిమిరి శిరస్సు ముద్దాడాడు. మెచ్చుకుని ఆశీర్వదించాడు.

ధృతరాష్ట్రుడు : ఘటోత్కచుడికి అడ్డుపడవచ్చిన సాత్యకిని ద్రోణాచార్యులు ఎదిరించా డన్నావు కదా ! యముడిలాంటివాడు ఆచార్యులు. ఇద్దరికీ బాగానే పడివుంటుంది కాని పూరికేపోదు. చెప్పు, సంజయా ! వాళ్ళయుద్ధం ఎలా జరిగిందట !

సంజయుడు : తనమీదికి రాగానే సాత్యకి వొక పాతిక కుప్పె కోలలు (అలుగులులేని బాణాలు) ద్రోణుడిమీద ప్రయోగించాడు. అవన్నీ ఖరించేసి, బంగారంతొడిమల బాణాలుమూడు పూనిపూని కొట్టాడు ద్రోణుడు. మూడూ సాత్యకికవచం దూసుకుపోయాయి. బరి కోలచూపిన ఏనుగులాగ చెలరుమన్నాడు సాత్యకి. ఒక్కపూపుని యాభై బాణాలు గుప్పించాడు. ఆచార్యుడి వొళ్ళు మంటలుపుట్టించాడు. ఆవేశంతో పూగిపోయాడు ద్రోణుడు. ఎంచిఎంచి తొమ్మిది బాణాలు సూటిగా సాత్యకి ఎముకల్లోకి కొట్టాడు. ఒంటినిండా వొక వందబాణాలు నాటించాడు. కరచరణాలు ఆడలేదు. సాత్యకికి. నీ కుమాళ్ళ సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయాయి. అవి కేకలు కావు. అవి సింహనాదాలు కావు. ఓ, కోలాహలంచేసేశారు మనవాళ్ళు.

అదంతా విన్నాడు ధర్మరాజు. సాత్యకి అవస్థ చూశాడు. "సాత్యకికి సహాయపడండి" అంటూ ధృష్టద్యుమ్నుడూ మొదలైన యోధులికి చెయ్యివిసిరాడు— "పిల్లాడు తాడుకట్టి పిట్టని హింసపెట్టి ఆడుకుంటున్నట్టు ద్రోణుడు సాత్యకిని వేధిస్తున్నాడు. భీముడితో కలిసి

మీరంతా ద్రోణుణ్ణిచుట్టుముట్టండి" అంటూ తొందరచేశాడు. ధర్మ రాజు అలా చెయ్యివిసరడమే తడవు, వాళ్ళంతా వొక్కసారి ఎగ బడ్డారు. సాత్యకిని వెనకపెట్టి ద్రోణుణ్ణి ముట్టడించారు.

వాళ్ళందరూ రావడంతోనే విందుదొరికినట్టయింది ద్రోణు డికి. చిరునవ్వు నవ్వుతూ ధనుర్బాణాలికి పనిచెప్పాడతడు. అవ్పూ పుని పాతికమంది పాంచాలయోధుల్నీ, వందమంది కేకయుల్నీ నరికి పారేశాడు. తక్కిన పాండవసేన బురదలో కూరుకుపోయిన ఏనుగు మందలా అయిపోయింది, ద్రోణుడి బాణాల ముందు.

## సాత్యకీ! అర్జునుణ్ణి కాపాడు

మహారాజా, ద్రోణుడిధాటికి పాండవసైన్యం భరించలేకండా వున్న సమయంలో అక్కడ శ్రీకృష్ణుడి పాంచజన్యం ధర్మరాజుకి వినిపించింది. పాంచజన్యమేమో వినిపించింది. కాని అర్జునుడి గాండీవం ధనుష్టంకారంమాత్రం వినపడలేదు. దాంతో గుండెల్లో చెయ్యిపెట్టి కలిచినట్టయింది ధర్మరాజుకి. "ఒక్కడే వెళ్ళాడు తమ్ముడు" గద్గదిక పడ్డ గొంతుకతో సాత్యకినిచూసి అన్నాడతను - "అదిగో, అటు వ్యూహంలో దుమ్ము పైచ్చు రేగుతూవుంది. పాంచజన్యం జోరుగా మోగుతూవుంది. కౌరవాధముల చేతుల్లో పడిపోయాడో ఏమో తమ్ముడు! నువ్వుతప్ప ఈఆపదలో అడ్డువడే బంధువు మరొకడు లేడు. అన్నా, సాత్యకీ! నిన్ను బతిమాలుకుంటాను. చప్పున వెళ్ళు, నీ స్నేహితుడూ, గురువూ కదూ అర్జునుడు. సమయం వచ్చినప్పుడే కదా, ఉత్తములు సాయపడతారు! సమయం వచ్చిం దిప్పుడు. యుద్ధంలో బంధుమిత్రులికి తోడ్పడడం భూమియావత్తూ బ్రాహ్మ ణులికి దానంచెయ్యడంతో సమానమంటారు ధర్మంతెలిసిన పెద్దలు.

అర్జునుణ్ని కాపాడమంటే కృష్ణుణ్నీ, నన్నూ, నావాళ్ళందరినీ కాపాడడమన్నమాట. బాబూ, సాత్యకీ, అర్జునుణ్ని కాపాడు.

"సందేహంలేదు, అర్జునుడు ఆపదలో పడిపోయాడు. అశ్వత్థామా, కర్ణుడూ, శల్యుడూ, కృపుడూ, భూరిశ్రవుడూ - వీళ్ళంతా శత్రుభయంకరులు. జయద్రథుణ్ని ఎలాఅయినా కాపాడాలని వీళ్ళందరూ తమ్ముడిమీద విరుచుకుపడిపుంటారు. స్పష్టంగా అవుపిస్తూనే వుంది నాకు. అయ్యో, తమ్ముడి ఆ ముఖమూ, ఆ బుజాలూ, ఆ శరీరమూ- సాత్యకీ, ఎవరమైనా ఎక్కడైనా చూస్తామా! ఏం తల పెట్టాడో దేవుడు! ఏందారి? ఏమవుతుందో?

"ద్వైతవనంలో తమ్ముడు చెప్పాడు - 'సాత్యకిసహాయముంటే చాలు, శత్రువుల్ని ఇట్టేగెలిచేస్తాను' అని. అదిగో, దానికి తగినట్టు చప్పున వెళ్ళు. కృష్ణుడూ, నువ్వూ పరమాప్తులు. మీరిద్దరూ వుంటే ఎంతటిపనికైనా వెనకాడ డతడు. నిన్నే హానికి మచ్చలేకండా వెంటనే వెళ్ళాలి నువ్వు. దయతలచి - లేదా బంధుత్వ మాలోచించి - కాదంటే భుజబలం స్మరించి - అర్జునుణ్ని రక్షించడమే కర్తవ్యం నీకు. అతడికి మరోలాగ అయిందో నాకు వేరేగ తేముంది చెప్పూ! అందుకని, అన్నివిధాలా అతడికి తోడ్పడడం అవసరం నువ్వు. మహానుభావా! 'పాండవులికి పెట్టనికోట సాత్యకి, అమితబలశాలి. అతడంటూ వుంటే వాళ్ళని గెలవడం సాధ్యంకానిపని' అంటారు శత్రువులు. అదిగో ఆమాట నిజమని రుజువు చెయ్యాలి. కృష్ణుడూ, అర్జునుడూ ఇద్దరూ గురువులే నీకు. నీ గురువులు ఇద్దరికీ గురువుని - పెద్దవాణ్ణి నేను. వాళ్ళ ఆపదకి అడ్డుపడమని నిన్ను ప్రార్థిస్తున్నాను. నా పరమప్రార్థన మన్నించు. శకటవ్యూహం చొరబడు. నీ బాణాలబలం చూపించు. చప్పున తమ్ముణ్ని కలుసుకుని నాహృదయతాపం చల్లార్చు. లోకాలు యావన్మందీ నిన్ను మెచ్చుకుంటారు" అన్నాడు.

"ఇంక ఇలా చెప్పాలా మహారాజా," అంటూ అందు కున్నాడు సాత్యకి – "నువ్వన్నది అక్షరాలా నిజం. అర్జునుడికోసం యుద్ధంలో ప్రాణాలు దాచుకోను నేను. పైగా నువ్వు ఇంతగా చెప్పి పంపుతూవుంటే వూరుకుంటానా! అయితే, జయద్రథవధకోసం బయలు దేరుతూ అన్నయ్య వింటూండగా నాతో అర్జునుడు ఏం చెప్పాడో చెపుతాను విను – 'సాత్యకీ, మనం తప్పకండా గెలుస్తాం. ఎన్నో శుభశకునాలు కనిపిస్తున్నాయి. నేనేమో నాప్రతిజ్ఞ పూర్తికోసం వెళ తాను. నువ్వుమాత్రం ధర్మరాజురక్షణకోసం వుండాలి. ఏమంటావా? జయద్రథుణ్ణి చంపడం ఎంత అవసరమో, ధర్మరాజుని రక్షించుకో డమూ అంతే అవసరం మనకి. అంచేత వొకటి నేనూ, వొకటి నువ్వూ పంచుకోవాలి. అదే ధర్మం. నువ్వువుంటే నేను వున్నట్టే భావిస్తాడు అన్నయ్య. నాకోసం నువ్వేమీ భయపడకు. నాకోసం శ్రీకృష్ణు డున్నాడు. నామీద ఈగన్నా వాలదు. అయితే, అన్నయ్యదగ్గిర ఆయనలేడు కదూ! నువ్వేవుండాలి. బ్రహ్మాండమైన పరాక్రమవం తుడు ద్రోణాచార్యులు, తెలుసుకదా, నీకు! అంచేత అన్నివిధాలా రాజరక్షణకోసం వుండాలి నువ్వు' అన్నాడు. అతడిమాట ప్రకారం నిక్షేపం కనిపెట్టినట్టు వెయ్యికళ్ళతో కనిపెడుతున్నాను నిన్ను. ద్రోణుడు తాను అన్నతపనీ చేశాడో, అర్జునుడు జయద్రథుణ్ణి చంపినా ప్రయోజనం లేకండాపోతుంది. అదలావుండనీ, అనవసరంగా తగనిబెంగ మనసులోపెట్టుకుంటున్నావు నువ్వు. ఏమంటే, శ్రీకృష్ణుడు సారథిగా వుంటే, విజయుడైన అర్జునుడి రథానికి అడ్డుండదని తెలియనివిషయం కనకనా?"

"అది నిజమే అనుకో" –మళ్ళీ అందుకున్నాడు ధర్మరాజు – "అయినా, నన్ను కాసుకుని ఇక్కడ వుండడంకంటే అర్జునుడిదగ్గిరికి వెళ్ళడమే అవసరమని తోస్తోంది నాకు. నువ్వు వెళ్ళగానే నీ వెంట

భీముడూ వస్తాడు. అర్జునుడు క్షేమంగా వుంటేనే మనకి విజయం. ఇక్కడవచ్చిన ప్రమాదమేమీ లేదు. ద్రుపదుడూ, విరాటరాజూ, కేకయులూ ఉద్దండులు. ద్రౌపదికుమారుళ్ళు ఉగ్రమూర్తులు. ఘటోత్కచుడూ, శిఖండీ దురంధరులు. ధృష్టద్యుమ్నుడిమాట చెప్పే అక్కరలేదు. ద్రోణవధకోసమే అగ్నిగుండంలోంచి పుట్టుకువచ్చాడతడు. తక్కినవాళ్ళూ బ్రహ్మాండమైన బలశాలులు ఎంతోమంది వున్నారు. అంచేత నావిషయం సందేహమక్కరలేదు. ధృష్టద్యుమ్నుడు వొక్కడే చాలు ద్రోణుణ్ణి కాసుకుందికి."

ధర్మరాజు అలా అనడంతోనే కొంతసేపు ఆలోచించాడు సాత్యకి. "అర్జునుడిదగ్గిరికి వెళ్ళడం పౌరుషలోపం కాదు. ఈయనా ఇంత బలవంతపెడుతున్నారు. సరే, వెళతాను" అంటూ నిశ్చయం చేసుకున్నాడు.

"నీరక్షణకి బాధలేకపోతే ఇక కావలిసిందేముంది!" ధర్మరాజు మొహం చూస్తూ అన్నాడు సాత్యకి – "ఇదిగో భేరీధ్వనులతోనూ, గుర్రాల సకిలింపులతోనూ కోలాహలంగావున్న కౌరవసేనలో ఇట్టే చొరబడతాను. సేనసేనంతా తీన్తారుచేసేస్తాను. క్రోధంతో సముద్రంలో చొరబడ్డ పెద్ద తిమింగలంలాగ ద్రోణుడి సేనలో వురుకుతాను. అర్జునుడికి భయపడి జయద్రథుడు దాక్కున్నచోటికి వెళతాను. అర్జునుడికి సాయపడతాను. అర్జునుడున్నచోటు ఇక్కడికి మూడుయోజనాలుందనుకుంటాను. ఈమధ్య వ్యూహంలో అదిగో వేలువేలు ఏనుగు సేన కనిపిస్తోంది దాని పేరు అంజనకం. మేఘమాలికలా వుందది. యుద్ధమంటే పడిచచ్చే మ్లేచ్ఛులైన మావటీళ్ళు పురికొల్పుతూ వుంటే జంకడమే ఎరగవా ఏనుగులు. వాటిని హతమారిస్తే కాని ముందుకి పోలేం. అదిగో నేల ఈనినట్టు కనపడుతున్నారే వాళ్ళని రుక్మరథులంటారు. త్రిగర్తసైనికులువాళ్ళు. రథయుద్ధమన్నా, కత్తియుద్ధ

మన్నా, ముష్టియుద్ధమన్నా మొనగాళ్ళు. కర్ణుడిమాటమీద విశ్వాసముతో వున్నారు వాళ్ళు. కర్ణుడంటే ప్రాణంపెడతారు. అందుచేతే అర్జునుడితో విరోధం పెట్టుకున్నారు. వాళ్ళపని పట్టిస్తేకాని అర్జునుణ్ణి చేరడం పడదు. అదిగో ఆతరవాత అవుపిస్తున్నాయే అవి కిరాతులెక్కిన ఏనుగులు ఏడువందలు. దృఢమైన కవచాలతో వున్నాయవి. లోగడ దిగ్విజయమప్పుడు కిరాతరాజు ప్రాణభిక్ష పెట్టుకొని అర్జునుడికి సమర్పించిన వవి నీఅనుగులకి మడుగులొత్తుతూ వుండేవి. కాలవైపరీత్యం ! అవే ఇవాళ నీతో యుద్ధానికి సిద్ధపడ్డాయి. వాటిమీది కిరాతులు వహ్నియోధులు. ఏనుగులతోసహా వాళ్ళని హతమారుస్తాను చూడు ! తరవాత అదిగో ఐరావతాల్లా అవుపిస్తున్నాయి, దిగ్గజం అంజనం వంశంలో పుట్టిన మహాగజాలు. ఉత్తమపర్వతంనించి తీవ్ర దస్యులు తెచ్చిన వవి. గోయోనులూ, నరయోనులూ అయిన మ్లేచ్ఛవీరులు వాటిమీద వున్నారు. పెద్ద పొగలా అవుపిస్తున్నాయి ఏనుగులు. అదిగో బంగారంజెండాలతో కాంభోజరథికులు. లెక్కాజమా లేకుండా వున్నారు వాళ్ళు. ఈ రాణువనంతా కాండీవి కార్చిచ్చు కాల్చినట్టు ఎలామాడ్చేస్తానో చూడు. శక, యవన, మ్లేచ్ఛ, కాంభోజ సేనలతో బాగానే పడుతుంది భేటీ, ఇవాళ నాకు.

“నీఆజ్ఞే దీపం. ఈశత్రుబలంచీకట్లు దానిముందు ఏమాత్రం! దూరమనుకుంటున్నావేమో ! ఆసందేహం ఏమీ అక్కరలేదు నీకు. శత్రువుల కొవ్వు అడిచి మరీ వొదిలిపెడతాను. జయద్రథుడి వధకోసం సాగుతూన్న అర్జునుడు సెబాస్ అన్నట్టు యుద్ధంచేస్తాను.

“అయితే, నాగుర్రాలూ, సారథీ బాగా దాహంతో వున్నారు. వీళ్ళని సేదదీర్చాలి ముందు. ఆయుధాలూ వాటితో రథంబాగా సన్నాహంచేయాలి. మామూళ్ళకంటే అయిదురెట్లయినా ఆయుధాలు పెట్టించాలి” అన్నాడు.

సంతోషించాడు ధర్మరాజు. తగినవాళ్ళని నియమించి, సాత్యకి గుర్రాలికి నీళ్ళుపట్టించాడు. మంచిదానా పెట్టించాడు. బాగా మాలీసు చేయించాడు. దారుకుడి తమ్ముడైన సాత్యకిసారథికి మంచి భోజనమూ అదీ ఏర్పాటుచేయించాడు. భోజనాదికాలు ముగించుకుని సారథి సమస్తమైన ఆయుధాలతోనూ రథం సిద్ధంచేశాడు. రథానికి దివ్యమైన సింహపతాకం తగిలించాడు.

ఇంతలో సాత్యకి స్నానమూ అదీ ముగించుకున్నాడు. ఆప్యాయమైన కైలాతకమధువు పానం చేశాడు. అతడికళ్ళు కెంపుల్లా ప్రకాశించాయి. తృప్తిపడి వచ్చి ధర్మరాజుకి పాదాభివందనం చేశాడు. అతణ్ణి గుచ్చి కౌగలించుకున్నాడు ధర్మరాజు. గెలుపు సాధించుకు రమ్మని దీవించాడు.

పెళ్ళికి బయలుదేరినట్టు బయలుదేరి రథమెక్కాడు సాత్యకి. ఎక్కుపెట్టిన విల్లూ, ఎంచిపెట్టిన బాణాలూ తొడలమీద పెట్టుకుని, రథంమీద కూచున్నాడు.

రథం కదిలేసమయానికి భీముడు అన్నగారికి ప్రణామంచేసి, సాత్యకితో బయలుదేరడానికి సంసిద్ధుడయాడు.

“నువ్వు రావద్దు” భీముణ్ణి వారిస్తూ అన్నాడు సాత్యకి — “ఈసేన దాటివెళ్ళడం నావొక్కడికీ ఏమంత కష్టమని! నువ్వు ఇక్కడే వుండు. ద్రోణుడివల్ల ధర్మరాజుకి ఏఆపదా రాకూడదు” అన్నాడు.

“అయితే సరే,” అన్నాడు భీముడు — “నేను రాజరక్షణకోసం యిక్కడే వుంటాను. నువ్వు అప్రమత్తుడవై వెళ్ళు.”

"నీ అంతవాడు సహాయమున్నంటే ఇక నాకు ఎదురెవరు?" కలకల్లాడుతూన్న మొహంతో అన్నాడు సాత్యకి - "అర్జునుడు జయద్రథుడి తల తెగెయ్యగానే గెంతులేస్తూ వచ్చి నిన్నూ, మీ అన్ననీ కౌగిలించు కుంటాను."

అలా భీముణ్ణి ఆపి, లేళ్ళమంద చూసిన పెద్దపులిలా నీసేన చూస్తూ నడిచాడు సాత్యకి.



# ద్రోణపర్వం



## నాలుగో ఆశ్వాసం

### సాత్యకి శకటవ్యూహంలో చొరబడ్డాడు

ధృతరాష్ట్రుడు: అయితే సంజయా, అర్జునుణ్ణి కలవడానికి, మనవాళ్ళు వొదిలేశారూ సాత్యకిని?

సంజయుడు: అదే చెపుతున్నాను, విను. చిన్నమరిదిని తమ్ముడిదగ్గిరికి వెళ్ళమని, అతనివెనకాలే ద్రోణుడిమీదికి తరుము కుంటూ వెళ్ళాడు ధర్మరాజు. ధృష్టద్యుమ్నుడు గర్వంగా గొంతెత్తి పాండవసేన పురికొల్పాడు. హోలోమని వాళ్ళు రావడంతోనే మన వాళ్ళూ ఉద్రేకంతో కలబడ్డారు. అయితే, సాత్యకి ఎదటియుద్ధం దారుణమయిపోయింది. తలలూ, చేతులూ, కాళ్ళూ, తొడలూ, మొలలూ, గుండెలూ – వీటితోనే నిండిపోయింది నేల. భరించలేక పోయింది మీ సేన. సంక్షోభపడిపోయింది. చెదురుమదురయిపోయింది. అలా చెదిరిపోతూవున్న మూకలికి అడ్డంగా వెళ్ళారు వొక ఏడుగురు శూరులు, రాజులు. వాళ్ళ ఏడుగురినీ లిప్తలో యముడిదగ్గిరికి పంపే శాడు సాత్యకి. వాళ్ళపాటుచూసి తక్కినరాజులు పిరికిమందు పుచ్చు కున్నారు. అప్పుడు ద్రోణాచార్యులే సింహంలా వెళ్ళి సాత్యకిని ఎదిరించాడు. వెళ్ళీవెళ్ళడంతోనే ఏడుబాణాలు అతడిమీద నాటిం చాడు. అసలే కొత్తఉత్సాహంలో వున్నాడు సాత్యకి. తానూ ఏడు బాణాలు వేసి ద్రోణుణ్ణి చురచురమనిపించాడు. మరో ఆరుబాణాలు

వేసి సాత్యకినీ, అతడి సారథినీ, అతడి నాలుగు గుర్రాల్నీ కొట్టాడు ద్రోణాచార్యులు.

మూారెడెత్తు లేచాడు సాత్యకి. పదీ, ఏడూ, ఆరూ, ఎనిమిదీ, పద్దెనిమిదీ వాడివాడి బాణాలు-వరసపెట్టి ద్రోణుడిమీద తగిలించాడు. నాలుగు బాణాలుకొట్టి గుర్రాల్నీ, వొక్క-బాణంతో సారథినీ కీచుకీచు మనిపించి, సింహనాదంచేశాడు. అరికాళ్ళమంట నెత్తికెక్కింది ద్రోణుడికి.

నాచేతిచేవ చూసి నీగురువే వోడిపోయి పరిగెత్తాడు. కత్తుల లాంటి బాణాలతో సాత్యకిరథం కప్పేడుతూ అన్నాడు ద్రోణుడు — "ఇక నువ్వా నన్ను మించిపోతావు! ఎలా నిన్ను ఏడుచెరువులనీళ్ళు తాగిస్తానో చూద్దువుగాని" అన్నాడు.

"ఇంతమాట అనాలా?" సాకూతంగా అన్నాడు సాత్యకి — "ధర్మరాజుపంపాడు. అర్జునుడిదగ్గిరికి వెళుతున్నాను. ఆలస్యమవుతోంది అనుగ్రహించు. అనుగ్రహించడమే పెద్దలధర్మం. మాగురువు మార్గమే నేనూ అనుసరిస్తాను."

ఎలాఅయినా ఆచార్యుణ్ణి తప్పించుకుపోడమే కర్తవ్యమని నిశ్చయించుకున్నాడతడు.

"ద్రోణుడు మనల్ని పోనివ్వడు" సారథితో అన్నాడు సాత్యకి — "ఈసుపట్టి మరీ పోట్లాడతాడు. ఆలస్యం చేశామా అసలు చెడుతుంది. ఇతణ్ణి తప్పించుకు పోవాలి. అదిగో బాహ్లీకసేన, అదిగో అంగసైన్యం, అల్లదిగో దాక్షిణాత్యసేన. వీటిలో వేటిలో అయినా వొక సందుచూసుకుని చొచ్చుకుపోదాం. అడుపడ్డవాళ్ళని అంతం చేసేసి, చిక్కుపెట్టేసి, చిందరవందరచేసేసి దూసుకుపోదాం" అన్నాడు.

"సంయ్యే" అన్నాడు సారథి. ద్రోణుణ్ణి వొకపక్క తప్పించి రథం పోనిచ్చాడు. "ఆగూ" అంటూ తీవ్రమైన బాణాలతో వెంట వడ్డాడు ద్రోణుడు. అటు చూడకండా అంగదేశసైన్యం చీల్చుకుంటూ సింహంలాగ లోపలచొచ్చుకుపోయాడు సాత్యకి. కృతవర్మ అతణ్ణి డీకొన్నాడు. ఆరుబాణాలు అతడి కవచం దూసెళ్ళిపోయినట్టు కొట్టాడు. నాలుగు గుర్రాలమీాదా నాలుగుబాణాలు నాటించాడు.

కృతవర్మ కలగజేసుకోడంతోటే ద్రోణుడు ఆగిపోయాడు. సాత్యకిని వొదిలేసి ధర్మరాజుమీాదికి వెళ్ళాడు. ధర్మరాజుమీాదికి వెళ్ళడమేమో వెళ్ళాడు, సాత్యకిదిక్కు వొకకంట కనిపెడుతూనే వున్నాడు.

కృతవర్మ తనమీాదికి రావడంతోనే బాగా పదునుపెట్టిన బాణాలు పదహారు అతడిమీాద తగిలించాడు సాత్యకి. కోపంతో అగ్నిశిఖలా లేచాడు కృతవర్మ. లెక్కలేని బాణాలు సాత్యకివొళ్ళు దూసెళ్ళిపోయినట్టు కొట్టాడు. అంతేకాదు, అతడి ధనుస్సూ విరిచేశాడు. అతడిగుర్రాల్ని చెడామడా కొట్టాడు. ఉజ్వలంగా వెలిగిపోతూవున్న శక్తి తీశాడు సాత్యకి. కృతవర్మ దక్షిణబాహువుమీాద దారుణంగా కొట్టాడు. అంతతోనూ వూరుకోలేదతడు. ధైర్యంతో మరో ధనుస్సు పుచ్చుకున్నాడు, చలించకండా. దారుణమైన బాణం కొట్టి కృతవర్మసారథిని చంపేశాడు.

తడబడకండా తానే పగ్గాలు పుచ్చుకున్నాడు కృతవర్మ వొయ్యారంగా. కాని సాత్యకిని వొదిలిపెట్టేశాడు. పెద్ద సైన్యంతో వ్యూహద్వారందగ్గిర తిరుముకువస్తూవున్న భీముడిమీాదికి వెళ్ళాడు. విన్నావా, అదిగో అలాగ కృతవర్మని వోడించేసి, సాత్యకి ముందుకి సాగాడు.

ధృతరాష్ట్రుడు: సంజయా, ద్రోణుడూ, కృతవర్మా మొదలైన వాళ్ళు ఘోరమైన పరాక్రమవంతులు. అలాంటి మహారథుల్నీ, సముద్రమంత సైన్యాన్నీ బ్రహ్మాండమైన పరాక్రమంతో అర్జునుడు అలా తుక్కుకింద కొట్టేశాడు అదే చిత్రమనిపిస్తూవుంటే, ఇప్పుడు సాత్యకి కూడా మరీ చిత్రంగావుంది. ఆఁ, సాత్యకి అంత పరాక్రమం ప్రదర్శించాడూ !

కృష్ణుడూ, అర్జునుడూ అలా బాహుబలంతో వ్యూహంలో ప్రవేశించినందుకూ, మన దొరలూ, సేనలూ కూలిపోయినందుకూ పాపం, దుర్యోధనుడు ఎంత ఆతురతపడిపోయాడో కదా ! రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, పదాతులూ సాత్యకి సంహరించడం చూసి తమ్ముళ్ళూ తానూ ఎంత దుఃఖపడ్డారో కదా !

సంజయుడు: నీదుర్నీతివల్లే ఈ ఉపద్రవం వచ్చింది. ఇప్పుడు మొత్తుకుంటేమాత్రం తప్పుతుందా ! ఏమీ ఎరగనివాడిలా నువ్వు విచారించడం దేనికని ? కనక స్థిరంగా విను, యుద్ధం.

సాత్యకి అలా వెళ్ళి కాంభోజసేనలో పడ్డాడు. అందులోని పేరుపడ్డ మొనగాళ్ళు అతణ్ణి ఎదిరించారు.

కృతవర్మ సారథిలేకుండా రావడంచూశాడు ద్రోణుడు. చప్పున తగిన సారథిని నియమించాడు. తనచోట అతణ్ణిపెట్టి, సాత్యకిని వెంట తరమడానికి బయలుదేరాడు. ధర్మరాజుయోధులు అతడి వెంట పడ్డారు. కానివొక్కడైనా ముందుకి రాకుండా వాళ్ళందర్నీ అడ్డుకున్నాడు కృతవర్మ. దారుణమైన బాణాలువేసి వాళ్ళని తడబడిపోయినట్టు చేసేశాడు. ముందుకి సాగలేక, తెల్లమొహాలువేసేసి, వొకళ్ళనొకళ్ళు చూసుకున్నారు. వాళ్ళు. వాళ్ళని పురికొల్పుతూ, తమ్ములతోనూ కుమాళ్ళతోనూ వచ్చి కృతవర్మతో కలబడ్డాడు భీముడు. పాండవ యోధులందరూ వొక్క మొగిని వచ్చిపడ్డారు. భీముడూ,

ధృష్టద్యుమ్నుడూ మూడేసి బాణాలు కృతవర్మమీద వేశారు. ధర్మరాజూ, ద్రుపదుడూ ఐదేసి కొట్టారు. ఘటోత్కచుడు ఏడు బాణాలు కొట్టాడు. సహదేవుడు ఇరవై అయిదూ, విరాటరాజు పదీ, శిఖండి ఇరవై, ఉపపాండవులు డబ్బయ్యీ, నకులుడు వందా కొట్టారు.

అన్ని బాణాలూ అడ్డుకున్నాడు కృతవర్మ. అందరిమీదా ఐదేసి బాణాలు అంటించాడు. భీముణ్ణి ఏడు బాణాలతో చుర్రుమనిపించాడు. అతడివిల్లు విరిచేశాడు. పతాకం పడగొట్టేశాడు. ఆ వూపుని మరో డబ్బయి బాణాలు అతడి వొంటినిండా నాటించాడు. దాంతో సొమ్మసిల్లిపోయాడు భీముడు అప్పుడు అంతా కలిసికట్టై వొక్క మొగిని కృతవర్మమీద విరుచుకుపడ్డారు పాండవయోధులు.

అంతలో భీముడు తెలుసుకున్నాడు. శక్తితీసి అమాంతంగా కృతవర్మమీద విసిరాడు. మంటలుకక్కుతూ వచ్చేస్తోంది శక్తి. ఒకే వొక్క బాణం కొట్టాడు కృతవర్మ. దెబ్బతో మూడుముక్కలయి పోయింది శక్తి. అంతలో మరోమంచివిల్లు పుచ్చుకున్నాడు భీముడు. బాణంమీద బాణం గుప్పించాడు. కృతవర్మశరీరం రక్తం వరదలు కట్టించాడు. అన్ని దెబ్బలూ తింటూనే భీముణ్ణీ, తక్కిన యోధుల్నీ తలా మూడేసిబాణాలు కొట్టి కీచుకీచుమనిపించాడు కృతవర్మ.

అంతమందీ ఏకమయారు. వొక్కసారి కృతవర్మని ముట్టడించారు. తీవ్రమైన బాణాలు చెడామడా కొట్టారు.

ఉన్నట్టు వుండి వొక క్షురప్రలాంటి బాణం వేశాడు కృతవర్మ. శిఖండిధనుస్సు నరికేశాడు. మెరుపులా మెరిశాడు శిఖండి. విచ్చుకత్తి విసిరాడు. కృతవర్మవిల్లు నరికేశాడు. ఇంతలో పాండవయోధులందరూ కృతవర్మని చుట్టుముట్టారు. వాడివాడిబాణాలతో కప్పెట్టేశారు. ఏమైనా చలించలేదు కృతవర్మ. జారిపోతు

లాంటి మరో ధనుస్సు పుచ్చుకున్నాడు. భీముడూ మొదలైన రథికుల్ని మూడు చెరువులనీళ్ళూ తాగించాడు.

శిఖండి ఇంకో విల్లు తీశాడు. ఉగ్రుడయిపోయి కృతవర్మతో కలబడ్డాడు, మదపుటేనుగులాగ. సింహాంగోళ్ళవంటి ఘోరమైన బాణాలు వొక్కటిగిని తగిలించాడు కృతవర్మ. దాంతో రథం మీద మూర్ఛపోయాడు శిఖండి. రథం తప్పించుకు పట్టుకుపోయాడు సారథి, తడబడిపోతూ. ఉత్తరీయాలు ఎగరవేస్తూ అదేగోలచేసేశారు మనవాళ్ళు.

శిఖండి మూర్ఛపోడం చూసి, మత్స్య, చేది, కేకయదేశాల సైన్యాలు ఉద్రేకంతో విజృంభించాయి. దారుణమైన బాణాలు రువ్వాయి. వాటన్నిటినీ కలగుండుపెట్టేశాడు కృతవర్మ. ఆ కలకలం విన్నాడు సాత్యకి. పాండవసేన క్షోభ గమనించాడు. "అర్జునుడి దగ్గిరికి తరవాత వెళ్ళవచ్చు, ముందు ధర్మరాజుక్షేమం చూడాలి" అంటూ నిశ్చయించుకున్నాడు. ద్రోణుడితో యుద్ధం చాలించాడు. ముందుకి వస్తున్నవాడల్లా వెనక్కి తిరిగాడు. రథం పరిగెత్తించాడు. కృతవర్మతో కలబడ్డాడు. బాణాలమీద బాణాలు గుప్పించాడు.

సాత్యకిని చూసి పొగలేని మంటలా లేచాడు కృతవర్మ. మిడతలదండులా అతడిమీద బాణాలు గుప్పించాడు.

వాటిని సగంలోనే కొట్టేశాడు సాత్యకి. ఒక వెడల్పాటి బాణంవేసి కృతవర్మధనుస్సు విరికేశాడు. అది రెండుముక్కలయిందో లేదో, మరి నాలుగు బాణాలు వొదిలిపెట్టాడు. అతడి గుర్రాలు నాలుగూ చంపేశాడు. మరొకటివేశాడు. అతడి సారథి తల ఎగరగొట్టేశాడు. వెంటనే పెద్ద సింహనాదమూ చేసి, అతడి గుండెలు దడదడలాడించాడు.

కృతవర్మని ఓడించేసి, కలకల్లాడుతూన్న మొహంతో మళ్ళీ ఇటు తిరిగాడు సాత్యకి. త్రిగర్తులు అడ్డుకోబోయారు. కాని అగ్గిలోపడ్డ మిడతల్లా మాడిపోయారు.

కృతవర్మ రథంలేకండా అయిపోడంతోనే వుప్పెనలా వుప్పొంగింది పాండవసేన. సాత్యకివెంటపడడంకంటే ఆమహాసైన్యం శకట వ్యూహంలో చొరబడకండా అడ్డుకోడమే అవసరమని భావించాడు ద్రోణాచార్యులు. అంచేత సాత్యకిని వొదిలిపెట్టేశాడు. పాండవసేన చొచ్చుకురాకండా వ్యూహం ద్వారందగ్గిర నిలబడ్డాడు.

## జలసంధుడు

త్రిగర్తసేన వోడించి, వెంటతరుముతూ ముందుకి వచ్చేస్తున్నాడు సాత్యకి. పెద్ద మదపుటేనుగుతో వెళ్ళి అతణ్ణి అడ్డుకున్నాడు మగధరాజు జలసంధుడు. ప్రవాహంలా వచ్చి పడుతూన్న సాత్యకి బాణాలికి ఎదురీదుకుంటూ వెళ్ళింది జలసంధుడి మదపుటేనుగు. సాత్యకిరథం ముందుకి రాకండా నిలిపేసిందది. ఉగ్రుడిలా వురిమాడు జలసంధుడు. మంచి దొడ్డ బాణంవేశాడు. టపీమని సాత్యకివిల్లు విరిచేశాడు. నవ్వుతూ అరవంద బాణాలు అతడి గుండెలమీద కురిపించాడు.

నిలువునా మండిపోయాడు సాత్యకి. తటాలువ మరో విల్లు తీశాడు. లిప్తలో జలసంధుడి ధనుస్సు నరికేశాడు. అతడు తడువుకునే లోపల అరవై బాణాలు నాటించాడు.

పిసరంతా చలించలేదు జలసంధుడు. ఉద్ధోలమైన తోమరం తీసి విసిరాడతడు. సాత్యకి ఎడమబుజానికి పిడుగులా తగిలిందది. ఆ ఉత్తరక్షణంలో కత్తివిసిరి, అతడివిల్లూ నరికేశాడు జలసంధుడు.

ఉగ్రుడైపోయాడు సాత్యకి. చిటికెలో మరో విల్లు అందుకున్నాడు. కత్తుల్లాటి బాణాలు వేశాడు. జలసంధుడి రెండు చేతులూ నరికేశాడు. మరో బాణంతో అతడి తలకాయ తెగేశాడు. ఇంకో బాణంకొట్టి ఏనుగుని తారుమునిపించేశాడు. పెద్ద సింహనాదమూ చేశాడు. అక్కడున్న మన సైన్యాలు యావత్తూ జ్జర్జరిల్లిపోయాయి. కకావికలై పోయాయి.

అదంతా వోక కంటితో కనిపెడుతూనేవున్నాడు ద్రోణాచార్యులు. తనస్థానంలో కృతవర్మా మొదలైన గట్టిగట్టివాళ్ళని పెట్టి, సాత్యకిదగ్గిరికి రథం పరిగెత్తించాడు.

ద్రోణుడి ఆసరా చూసుకుని దుర్మర్షణుడూ, దుస్సహుడూ, వికర్ణుడూ, దుర్ముఖుడూ, దుశ్శాసనుడూ, చిత్రసేనుడూ మొదలైన నీకుమాళ్ళు వొక్కపెట్టుని వచ్చిపడ్డారు. ఢణఢణ రణవాద్యాలూ, శంఖాలూ మోయించారు. మిడతలదండు కప్పేసినట్టు బాణాలతో సాత్యకిని కప్పేశారు. ఆకోలాహలం కనిపెట్టి దుర్యోధనుడూ వెళ్ళాడు. తమ్ముల్లతో కలిశాడు. "ఇంతమందీ వచ్చారు. సాత్యకితో తలపడడానికి వీళ్ళు చాలు" అనుకుంటూ ద్రోణాచార్యులు తిరిగీ పాండవసేనని అడ్డుకోడానికి వెళ్ళిపోయాడు.

నీకుమాళ్ళందరికీ అన్నిరూపులయి పోరాడాడు సాత్యకి. వాళ్ళు వేసిన బాణాలన్నీ కొట్టిపారేశాడు. ఎన్నో అన్ని బాణాలు కొట్టి వొక్కొక్కణ్ణీ ముచ్చెమటలు పోయించాడు. ఉద్దండమైన ఆవేశంతో వెళ్ళి కలబడ్డాడు దుర్యోధనుడు. కోడికత్తుల్లాటి బాణాలు సాత్యకిమీద నాటించాడు.

నవ్వుతూ వొకబాణం వేశాడు సాత్యకి. దుర్యోధనుడి ధనుస్సు నరికేశాడు. తీవ్రమైన బాణాలు కొట్టి అతడి వొళ్ళంతా మంటలు పుట్టించాడు. అన్నగారు దెబ్బలుతినెయ్యడం చూసి నీకుమాళ్ళు

అందరూ వొక్కుమ్మడిగా మంచిమంచి బాణాలు సాత్యకిమీద కుమ్మరించారు. అవి ఏవీ తన చుట్టుపక్కలికి రాకుండా తప్పించుకుంటూ యుద్ధంచేశాడు సాత్యకి. నీకుమార్ని ప్రతివొక్కళ్ళే అయిదేసి దృఢమైన బాణాలతో కెవ్వుకెవ్వు మనిపించాడు. దుర్యోధనుడి రొమ్ముమీద ఎనిమిది పిడుగుల్లాంటి బాణాలు నాటించాడు. రత్నాలుతాపిన అతడి నాగుపాముజెండా కిందపడకొట్టేశాడు. అతడెత్తిన మరోవిల్లూ విరిచేశాడు. అతడి గుర్రాల్నీ, సారథినీ వొళ్ళు ఇంతింత చీలికలైనట్టు కొట్టేశాడు. గుండె బేజారయిపోయింది దుర్యోధనుడికి. రథంగెంతేసి అదే వుడాయించడం వుడాయించాడతడు. ఆవుడాయించడం వుడాయించి చిత్రరథుడి రథ మెక్కేశాడు. మన సేన బెంబేలుపడిపోయింది. పకపకా నవ్వుతూ చప్పట్లుకొట్టాడు సాత్యకి.

కృతవర్మ ఆకోలాహాలం విన్నాడు. తనరథం వురికిస్తూవెళ్ళి అక్కడ వాలాడు. అతడికి ముఖాముఖి తనరథం తిప్పించాడు సాత్యకి. ఇద్దరూ వొకళ్ళమీద వొకళ్ళు కలబడ్డారు, కోరివీ కోరివీ డీకున్నట్టు. గట్టిగట్టి బాణాలతో కొట్టుకున్నారు. ఘోరంగా యుద్ధంచేశారు. మహారాజా, ఆ ద్వంద్వయుద్ధంలో సాత్యకిదే పైచెయ్యి అయింది. యముడిలా విజృంభించాడతడు. కృతవర్మ గుర్రాల్నీ, అతడి సారథినీ చావుదెబ్బలు కొట్టేశాడు. అతడి ధనుస్సు నరికేశాడు. తళతళా మెరుస్తూన్న వొక బాణం కృతవర్మగుండెలు దూసెళ్ళిపోయినట్టు కొట్టాడు. దెబ్బతో చచ్చినట్టు మోకాళ్ళమీద బోర్లా పడిపోయాడతడు. అతడు చచ్చిపోయాడే అనుకున్నాడు సాత్యకి. ఆలస్యంకాకుండా అర్జునుణ్ణి కలుసుకోవాలంటూ ముందుకి సాగాడు.

అంతలోనే కృతవర్మ తెప్పిరిల్లాడు. లేచి మళ్ళీ సర్దుకున్నాడు. వ్యూహం ద్వారందగ్గిరికి వెళ్ళి, భీముడూ మొదలైన పాండవులతో పోట్లాడాడు. అదంతా కనిపెట్టి, పరిస్థితి గ్రహించేశాడు సేనాప

ద్రోణాచార్యులు. శౌర్యశాలి సాత్యకి అలాఅడ్డులేకండా వెళ్ళడం సహించలేకపోయాడు. "పాండవుల్ని అడ్డుకోడానికి కృతవర్మచాలు" అంటూ మళ్ళీసాత్యకిదగ్గిరికి వురకలువేస్తూ వచ్చాడు. వచ్చీరావడం తోనే మంచి వాడివాడిబాణాలు మూడు సాత్యకి నుదుటిమీద నాటించాడు. మూడుశిఖరాలకొండలా కనిపించాడు సాత్యకి.

రథికుల్లో చెప్పదగ్గవాడు సాత్యకి. ద్రోణుడి దెబ్బలు పిసరంతా లక్ష్యపెట్టలేదతడు. దెబ్బకి దెబ్బతీస్తూ పోట్లాడాడు. క్రూరమైన బాణాలు ఆచార్యుడిమీద కురిపించాడు. ఇద్దరూ నువ్వెంత అంటే నువ్వెంత అంటూ గట్టిగట్టి బాణాలు కొట్టుకున్నారు. ఒకళ్ళగుర్రాలు వొకళ్ళు రక్తం వరదలు కారించారు. సారథుల్ని కీచుకీచు మనిపించారు. అద్భుతమైన హస్తలాఘవం చూపించారు.

ఉండివుండి టపీమని సాత్యకివిల్లు విరిచేశాడు ద్రోణుడు. చివాల్న గదతీసి విసిరాడు సాత్యకి. పిడుగులాంటి బాణంవేసి దాన్ని ముక్కలుచేసేశాడు ద్రోణుడు. మరో ధనుస్సు అందుకున్నాడు సాత్యకి. దారుణమైన బాణాలు వరసపెట్టి కురిపించాడు. ఆకాశం బద్దలయిపోయినట్టు అల్లెతాడు మోగించాడు.

ద్రోణుడు శక్తివిసిరాడు. అయితే ఎలాగో అది రథానికి తగిలి పడిపోయింది. అంతలో వొకబాణం కొట్టాడు సాత్యకి. ఆచార్యుడి కుడిభుజం చొచ్చుకుపోయిందది.

తోకతొక్కిన పాములా లేచాడు ద్రోణుడు. ఒక నెలవంక బాణంతో సాత్యకిధనుస్సు నరకేశాడు. అతడిసారథిని మూర్ఛపోయినట్టు కొట్టేశాడు. పగ్గాలు పుచ్చుకుని తానే సారథ్యం చేసుకుంటూ యుద్ధంచేశాడు సాత్యకి. అంతలో సారథి తెలుపుకున్నాడు. అతడికి పగ్గాలు అందించి, యథాప్రకారం పోట్లాడాడు సాత్యకి. ఘోరమైన

బాణాలు ప్రయోగించాడు. ద్రోణుడి సారథిని మూర్ఛపోయినట్టు కొట్టేశాడు.

సారథి మూర్ఛపోగానే ద్రోణుడిగుర్రాలు బెదిరిపోయాయి. ఇష్టంవచ్చినట్టు రథం ఈడ్చుకుంటూ పరుగుతీశాయి. "ఆపండీ, గుర్రాలు పట్టుకోండీ" అంటూ ద్రోణుడి రథంవెంట పరిగెత్తారు అక్కడున్న మన రాజులు అలా విఫలమయిపోయి పరిగెత్తుకు పోయింది ద్రోణుడి రథం. అదే పారిపోడమూ అయింది.

తుదకి వొకదగ్గిర ఆగాడు ద్రోణాచార్యులు. మళ్ళీ అన్నీ సర్దుకుని చూసేసరికి పాంచాలసైన్యం తనసేనమీద పడి నానాక్షోభా పెట్టేస్తోంది. మూకమూకలయిపోయి పక్కపక్కలికి పారిపోతూ వున్నారు తనసైనికులు. వాళ్ళందరినీ పురికొల్పుకుంటూ వెళ్ళి సేనా ముఖంలో నిల్చుని పాండవసేనతో యుద్ధంచేశాడతను.

అదిగో అలాగ ద్రోణాచార్యుల్నీ, కృతవర్మనీ, దుర్యోధనుడూ మొదలైనయోధుల్నీ వోడించి ముందుకు సాగాడు సాత్యకి.

"ఇక్కడ వ్యూహంలో కృష్ణార్జునుల ప్రతాపమూ, అక్కడ బైట భీముడూ మొదలైనవాళ్ళ చేవా — ఇవే మనల్ని గెలిపించాయి" చిరునవ్వు నవ్వుతూ సారథితో అన్నాడు సాత్యకి — "శత్రుసేనలో చిక్కుపోకండా బైటపడ్డాం అదిగో అర్జును డున్న దిక్కు రథం తుణాలమీద పోనివ్వాలి" అన్నాడు.

దారుకుడి తమ్ముడు పగ్గాలు సడిలించాడు. మెరుపులా రథం పరిగెత్తింది. అందమైన ఆగుర్రాలు గాలిలా ఎగిరిపోతూవుంటే, ఎంత అందంగావుందో అంత భీషణంగానూ అవుపించింది మీవాళ్ళకి సాత్యకిరథం. ఆకాశంమీద సూర్యుడిరథంలాగ చూడశక్యంకాలే దంటే నమ్ము.

అలా మీదపడిపోతూవున్న సాత్యకి రథం మనసేనలోంచి సుదర్శను డనేరాజు అమాంతంగా అడ్డుకున్నాడు, అదిలిస్తూ. సాత్యకి వేస్తున్న బాణాలు తునాతునకలు చేసేసి పోట్లాడా డతను. సాత్యకీ, సుదర్శనుడూ దెబ్బలాడడం చూసి మనసేన ముక్కుమీద వేలు పెట్టుకుంది.

కళ్ళు మొయ్యా కోపం తెచ్చుకున్నాడు సాత్యకి. సుదర్శనుడి గుర్రాలు చంపేశాడు. సారథిని నరికేశాడు. ఒక దారైన బాణం వేసి సుదర్శనుడి తలకాయ ఎగరగొట్టేశాడు.

"ఇవాళ యుద్ధంలో అలిసిపోయేవు సుమా !" సుదర్శనుణ్ణి చంపేసి, తన సారథితో అన్నాడు సాత్యకి – "ద్రోణు డనే సముద్రమే దాటేశాం. ఇక ఈరాజులినా లెక్కపెడతాను ! వీళ్ళంతా పిల్లకాలవలు నాకు. సారథీ, రథం పోనీ."

"నీపరాక్రమమూ, నానైపుణ్యమూ రెంటికీజత, యుద్ధంలో" నవ్వుతూ అన్నాడు సారథి – "ఏంచెయ్యమంటావో చెప్పు. ఎవరిమీదికి రథం వురికించమంటావు!"

"ఇదిగో ఏనుగులూ, గుర్రాలూ, సైనికులూ చచ్చిపడున్నారు. అర్జునుడు కుప్పలుపెట్టిన శవాలు ఇవి. ఈశవాలజాడ పట్టుకుని మనరథం పోనీ. అదిగో ప్రచండనాదంతో వినిపిస్తోంది గాండీవం. అర్జునుడు నాకు ప్రసాదించిన అస్త్రవిద్యావిలాసం మెరిపించాలివాళ. పాండవుల మీద నాకున్న భక్తీ స్నేహమూ ప్రకటించాలి. నాచేవ చూసి దుర్యోధనుడు 'ఇద్దరు అర్జునులు' అనుకున్నట్టు చేస్తాను" అన్నాడు సాత్యకి.

సాత్యకి నోట్లోమాట నోట్లోనేవుంది – కాంభోజ, యవన సైన్యాలు అతడిమీద పడబోయాయి.

వింటినారి సారించాడు సాత్యకి. ఆసేనదిక్కు రథం పురికించాడు సారథి. రథంకంటే ముందు సాత్యకిబాణాలు పరిగెత్తాయి. ఎదటి పదాతులూ, గుర్రాలూ, ఏనుగులూ పీనుగుపెంట లయాయి. ఆపీనుగులమీంచే మహావేగంతో పరుగులుపెట్టింది రథం.

అలాగే కిరాత, శక, బర్బర, పారద, యవన మొదలైన మ్లేచ్ఛసేనలు హతవార్చాడు సాత్యకి. కౌరవసేన కంగారుపెట్టేశాడు. అతడి చిత్రకవచం పులిచారలులా కనపడింది. బాణాలు గోళ్ళనిపించాయి. ధనుస్సు తెరిచిననోరులా కనపడింది. మహారాజా, నిజంగా అతడు పెద్దపులిలాగే పురుకుతూ వచ్చాడనుకో.

అర్జునుడిదిక్కు వచ్చేస్తున్నాడు సాత్యకి. "ఆగూ," "వెళ్ళిపోకూ" – అంటూ వెనకనించి కేకలు వినిపించాయి. తిరిగిచూశాడు సాత్యకి. దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, చిత్రసేనుడూ, వివింశతీ, శకునీ, దుస్సహుడూ, దుర్ధర్షణుడూ, క్రథుడూ, మొదలైన రథికులు రథవంగా పెద్దకేకలుపెడుతూ తరుముకు వస్తున్నారు.

"మనరథం కొంచెం మెల్లగాపోనీ" ఆ కలకలం విని సారథితో అన్నాడు సాత్యకి – "నావెనకపడ్డ ఈసైన్యసాగరం నాబాణాగ్నిలో ఇట్టే ఇంకబెట్టేసి, నవ్వుతూ ముందుకి వెళదాం."

రథంవడి తగ్గించాడు సారథి. సముద్రంకెరటాల్లాగే వచ్చిపడింది మనసేన. కన్నుమూసి తెరిచేలోపున నాలుగువందలమంది రథాలవాళ్ళనీ, మూడువందల గుర్రాల్నీ కూలగొట్టేశాడు సాత్యకి, నవ్వుతూనే. అయినా ఆగలేదు మనవాళ్ళు. ఈసుళ్ళపుట్టలాగ అతణ్ణి చుట్టుముట్టారు. ఏంచెప్పనూ, నాకు నిజం, నీకు అబద్ధం. మన పదాతుల్లోనూ, రథాల్లోనూ, ఏనుగుల్లోనూ, గుర్రాల్లోనూ సాత్యకిబాణం తగలింది వొక్కటీ లేదంటే నమ్ము. అదిగో అలాగ బాణావర్షం కురిపించాడు ఆయాదవ వీరుడు.

"అర్జునుడితో సరిసమానుడో, ఇంకా మాట్లాడితే అతడికంటే అధికుడో అవుతాడు సాత్యకి" అంటూ ఆకాశంమీంచి ప్రశంసించారు దేవతలు, అతడియుద్ధం చూస్తూ.

దుర్యోధనుడూ, అతడి తోడిసైనికులూ ఎన్నో అన్ని బాణాలు సాత్యకిమీద రువ్వారు. చిరునవ్వుతోనే వాళ్ళని ఎదుర్కొన్నాడు సాత్యకి. వాళ్ళ ధనుస్సులు నరికేశాడు. గుర్రాలు కూల్చేశాడు. సారథుల్ని చంపేశాడు. జెండాలు చించేశాడు రథాలు విరిచేశాడు. సేనసేనంతా తీంతారుచేసేశాడు.

శకునిమామని పక్కనపెట్టుకుని దుర్యోధనుడు సాహసంతో సాత్యకిమీద కలబడ్డాడు. అతడి శారథిసి, గుర్రాల్ని గట్టిగట్టిదెబ్బలు కొట్టాడు. బాగా మెరుగుపెట్టిన బాణాలు సాత్యకి వొంటిమీద నాటించాడు.

కళ్ళల్లో నిప్పులు కక్కాడు సాత్యకి. ఒకబాణం వేసి శకుని విల్లు విరిచేశాడు. మరోవాడిబాణం వేసి దుర్యోధనుడి సారథికంఠం ఉత్తరించేశాడు. సారథి కూలిపోడమే తడువు, రథం ఈడ్చుకుంటూ పారిపోయాయి గుర్రాలు. అడ్డుకోడమే కష్టమయింది వాటిని. రారాజు రథం అలా వుడాయించడంతోనే దిగాలుమనిపోయారు మన యోధులు. తమ్ముళ్ళమాట ఇక చెప్పనేఅక్కరలేదు. అడలెత్తిపోయి అన్నగారివెంటే దౌడుతీశారు వాళ్ళు. సేన చెల్లాచెదరయిపోయింది. అడ్డే లేకపోయింది సాత్యకికి. అర్జునుడికేసి రథం పోనిచ్చాడతడు.

ధృతరాష్ట్రుడు: పులినిచూసిన పశువుల్లాగ ధైర్యమూ, పంతమూ, సిగ్గూ విడిచిపెట్టేసి, వొక్కమనిషి ఎదటియుద్ధం భరించలేక పరుగులుతీసిన కుమాళ్ళవిషయం ఏమని వినేది. ఎలా మొత్తుకోకండా వుండేది?

సంజయుడు : నువ్వు వినకపోతే ఎవరు వింటారు ? నువ్వూ, నీపెద్ద కొడుకూ కోరి తెచ్చుకున్నదే ఈఉపద్రవం మరి. తరవాత ఏంజరిగిందో విను. దెబ్బలుతినేసి, పారిపోయి, వల్లమాలిన కోపం తెచ్చుకున్నాడు దుర్యోధనుడు. ఆకోపంతో చుట్టుపట్లవున్న వాళ్ళని అందరినీ పురి కొల్పాడు. తొందరచేసేశాడు. అంబష్ఠ, కొంకణ, పారద దేశాల సేనలు దుశ్శాసనుణ్ణి ముందుపెట్టుకుని సాత్యకిని ఘిరాయించాయి. అన్నిటికీ సిద్ధంగానే వున్నాడు సాత్యకి. తనభుజపరాక్రమం చూపిస్తూ శరపరంపర కురిపించాడు. మనరథాలు విరిగాయి. ఏనుగులు పీనుగు లయాయి. గుర్రాలు కూలిపోయాయి. వీరభటుల శరీరాలు చిందర వందరలయాయి. రణరంగమంతా రక్తం ప్రవాహమయి పారింది.

కోపంతో బుసకొట్టాడు దుశ్శాసనుడు. రాళ్ళబాణాలికి పేరుపడ్డ కొండసేనల్ని రెచ్చగొట్టాడు. ఎలాఅయినా గెలవా లన్న పంతంతో వాళ్ళందరూ సాత్యకిమీద రాళ్ళవాన కురిపించారు.

సాత్యకి కళ్ళల్లో కెంపులు మెరిసాయి. కొండమూకలు వేసిన రాళ్ళన్నీ బాణాలతో అల్లంతదూరాన్నే కొట్టేశాడు. ముక్కముక్కలయిపోయాయి, ప్రయోగించిన వాళ్ళమీదికే తిరిగివెళ్ళిపడ్డా యవి. ఇంకేముంది, పిక్కబలంచూపించాయి కొండసేనలు. అంతతో వూరుకున్నాడా సాత్యకి. వాళ్ళని వెంటదరిమి, వెంటదరిమి బాది బాది వొదిలిపెట్టాడు. మన దుశ్శాసనుడూ, తక్కినయోధులూ తోక ముడిచేశారు. ఆ పారిపోడం పారిపోయి, ద్రోణాచార్యుడి వెనక్కి వెళ్ళి దాక్కున్నారు.

## ‘అంతతీపికదూ ప్రాణాలు!’

“ఏం యువరాజా!” అంతా వొకకంట కనిపెడుతూ, సాత్యకిదగ్గిర జరుగుతూన్న కోలాహలం వింటూన్న ద్రోణుడు

దుశ్శాసనుణ్ణి పలకరిస్తూ అన్నాడు — "రాజు క్షేమంగా వున్నాడా? జయద్రథుణ్ణి అర్జునుడు ఏమీ చేసెయ్యలేదు కదా! ఏం, ఈరథాల వాళ్ళతో పారిపోవచ్చావు? ఎక్కడ దూరతావు? అటుకులు మింగేస్తే సరా! కడుపుకొస్తే పుట్టినవ్వాడే తెలుస్తుంది మరి! పుంజాలు తెంపుకు పారొచ్చావు! ఆవాళ వాళ్ళు తెలియక పాండవుల్ని తరిమేసి, ఇవాళ వాళ్ళ సాత్యకికి భయపడి పారిపో వచ్చావే! భీమార్జునులపాలబడితే ఏమవుతావో!" అన్నాడు. అంటూనే వాళ్ళుమండి ఇంకా ఇలా అందుకున్నాడతడు— "లోకమంతటికీ మాన్యురాలు, గుణవంతురాలు, యజ్ఞంలో పుట్టింది ద్రౌపది. ఆ ఇల్లాల్ని పెట్టిన పాట్లు మరిచిపోయావా? పాండవుల్ని అన్నమాటలు ఇప్పుడు ఏమయిపోయాయీ అంటా! అవాళటి కొవ్వూ, కావరమూ ఎటుపోయాయి? రణధీరులు వాళ్ళు, వాళ్ళని రెచ్చగొట్టావు. తుదకి ఇలా పిరికిమందు పుచ్చుకున్నావు. అంత తీపికదూ ప్రాణాలు! ఇదిగో దుశ్శాసనా, బతకాలనివుంటే ఇప్పుడయినా పాండవులికి రాజ్యం పంచి ఇచ్చెయ్యమని మీఅన్నయ్యకి బుద్ధిచెప్పు. భీష్ముడిమాట వినక వూరికే చెడిపోయాడతడు.

"అదిచేతకా దంటావా, ఎటుపోతావు? నిన్ను నమ్ముకుని యుద్ధం చెయ్యాలనుకుంటూన్న ఈ వీరుల్ని వాళ్ళకే వెంటదరిమి కొడుతున్నాడు సాత్యకి. వెళ్ళు. అతడితో కలబడు. అంతేకాని ఇలా దాక్కోడం తగినపనేనా నీకు!"

వినీ విననట్టు చెవులుపెట్టాడు దుశ్శాసనుడు. ద్రోణుడి ప్రతి మాటా అతడికి శూలంలా తగిలింది. మాట్లాడకుండా తిన్నగా సాత్యకి దగ్గిరకే వెళ్ళి యుద్ధం చేశాడు.

తరవాత ద్రోణాచార్యులు ధర్మరాజు సేనమీద పడ్డాడు. వాడివాడిబాణాలతో తన వేడంతా చూపెట్టాడు. ధర్మరాజు సేనలు వెనక్కి తగ్గడం మొదలుపెట్టాయి.

ధర్మరాజు సైన్యాలు తగ్గేస్తున్న సమయంలో ద్రుపదకుమారుడు వీరకేతుడు ఉద్రేకంతో వచ్చి, ద్రోణుణ్ణి ఎదిరించాడు. అతడి సారథిని చెడామడా కొట్టాడు. ఒక అయిదుబాణాలు ద్రోణుడిమీదా నాటించాడు. చుర్రుమంది ద్రోణుడికి. యమదండంలాంటి వొకబాణం తీశాడు. దెబ్బతో వీరకేతుణ్ణి హరీ అనిపించేశాడు.

వీరకేతుడు పడిపోడంతోనే అతడి అన్నదమ్ములు చిత్రకేతుడూ, సుధన్వుడూ, చిత్రవర్మా, చిత్రరథుడూ ద్రోణాచార్యుల రథం బాణాల్తోముంచేసి వొదిలిపెట్టారు. నెయ్యిపోసిన అగ్నిశిఖలా లేచాడు ద్రోణుడు. వాళ్ళ గుర్రాలు కూల్చేశాడు. సారథుల్ని చంపేశాడు. పెద్దగాలి పువ్వులు రాల్చినట్టు ఆ పాంచాల రాజకుమాళ్ళ తలకాయలు కింద దుళ్ళగొట్టాడు.

చూశాడు ధృష్టద్యుమ్నుడు. ఎరుపెక్కిన అతడి కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి. ఒక ధూమకేతువులాగ ద్రోణుడిమీదికి వురికాడతడు. ప్రాణాంతకమైనబాణాలు ద్రోణుడి ఎదురొమ్మమీద తగిలించాడు. దాంతో కూలినచెట్టులాగ మూర్ఛపోయాడు ద్రోణాచార్యుడు.

మనసైన్యాలు హాహాకారాలు చేస్తూనే వున్నాయి. కత్తీ, డాలూ పట్టుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. రథంమీంచి కిందికి దూకేశాడు. మెరుపు మెరిసినట్టు ద్రోణుడి రథంమీదికి దూకాడు.

ద్రోణుణ్ణి సరికెయ్యడానికి కత్తిఎత్తాడు ధృష్టద్యుమ్నుడు. అంతలో కళ్ళువిప్పాడు ద్రోణుడు. క్షణంలో ఘోరం జరిగిపోతుంది. అయినా అధైర్యపడలేదతడు. శత్రువు మీదపడితే ఉపయోగించే

సాధనం - చేసి దేసి బాణాలు గబగబా ప్రయోగించాడు. కందిరీగలు పొడిచినట్టు కంగారుపడిపోయాడు ధృష్టద్యుమ్నుడు. చప్పున తిరిగి తన రథంమీదికి వెళ్ళిపోయాడు. విల్లూ అమ్ములూ పుచ్చుకున్నాడు. శరవర్షం కురిపించాడు.

వెన్ను విరిచిలేచాడు ద్రోణాచార్యులు. ధృష్టద్యుమ్నుడి సారథిని చంపేశాడు. గుర్రాలు రథం ఈడ్చుకుని పారిపోయాయి. ఇక ద్రోణుడికి అడ్డూ ఆపూ లేకపోయింది. పెద్ద అగ్నిపర్వతంలాగ విజృంభించాడతడు. పాండవసేనలో అతడిముందు నిలువగలవాడే లేకపోయాడు.

దుశ్శాసనుడు సాత్యకిమీదికి వెళ్ళాడని చెప్పాను కదూ! అది చూశాడు దుర్యోధనుడు. తమ్ముడికి సాయంగా త్రిగర్తసైన్యం పంపాడు. త్రిగర్తుల్లో ఎంపికైన సంశప్తకులు మూడు వేలమంది రథాల వాళ్ళు అహంకారంతో వెళ్ళారు. సాత్యకిని చుట్టవేశారు. క్షణాల మీద అయిదు వేలమంది రథికుల్ని హతమార్చేశాడు సాత్యకి. మిగిలిన చతురంగబలాన్ని రక్తనదుల్లో ముంచెత్తాడు. అంత త్రిగర్తరాజువాహినీ పిక్కబలం చూపెట్టింది. తిన్నగా ద్రోణాచార్యుల దగ్గిరికే దౌడుతీసింది. అయితే దుశ్శాసనుడుమాత్రం పౌరుషం వొదలలేదు. సాత్యకితో సరాసరి పోరాడాడు.

అతడి ధనుస్సు నరికేసి, పకపకా నవ్వాడు సాత్యకి. శక్తితీసి విసిరాడు నీకోడుకు. దాన్ని తుకుతుకింద కొట్టేశాడు సాత్యకి. మరో విల్లు తీసి, బాణంమీద బాణం కొట్టాడు దుశ్శాసనుడు. మళ్ళీ అతడి విల్లు విరిచేశాడు సాత్యకి. బాగా వొళ్ళుమండి, అతడి సారథిని పట్టేశాడు. గుర్రాలు కొట్టేశాడు. జెండా చించేశాడు. చెవులదాకా ధనుస్సులాగి గట్టిదొక బాణం వొదిలిపెట్టాడు. దెబ్బతో చచ్చినట్టు

మూర్ఛపోయాడు దుశ్శాసనుడు. తలుచుకుంటే పాదుకదలకుండా అక్కడే అతణ్ణి చంపేసేవాడు సాత్యకి. కాని భీముడి ప్రతిజ్ఞ తలుచుకుని వొదిలేశాడు. ఇంతలో అతణ్ణి త్రిగర్తరాజు తనరథంమీద వేసుకుని తీసుకుపోయాడు. సాత్యకి అర్జునుడితట్టు రథం మళ్ళించాడు.

సాత్యకి మనసేన మధించుకుపోతున్నాడని పాండవులకి అవగాహనఅయిపోయింది. ధృష్టద్యుమ్నుడూ మొదలైన యోధుల్ని ముందు పెట్టుకుని ధర్మరాజూ, భీముడూ, నకులసహదేవులూ మనవ్యూహం మీదికి తరుముకువచ్చారు. ఘోరంగా, సముద్రమూ సముద్రమూ ఢీకొన్నట్టు మనవాళ్ళూ వాళ్ళతో పోరాడారు.

సముద్రంలో ఈదుకుపోతూన్న పెద్ద సొరచేపలాగ మీసేన చీల్చుకుంటూ అర్జునుడితట్టు సాగుతున్నాడు సాత్యకి. ఇక అక్కడ అర్జునుడిసంగతి చెప్పేఅక్కరలేదు. ప్రళయకాల రుద్రుడిలాగ రౌద్రమూర్తిఅయిపోయి తన ముందున్న సేనయావత్తూ తుడిచేస్తున్నాడతడు.

ద్రోణాచార్యులు పాండవసేన నురుమాడుతున్నాడు. ఇలా ఈముగ్గురిచేతా అయిపోతూవున్న జనక్షయం ఇంతా అంతా కాదు.

ద్రోణాచార్యుల యుద్ధం చూసిపోదామంటూ వ్యూహంద్వారంగ్గిరికి వెళ్ళాడు దుర్యోధనుడు. పాండవసైనికుల సంరంభం చూశాడు. మనవాళ్ళందరినీ దాటేసి, వొక్కడూ పాండవసేనలో చొరబడ్డాడు, పద్మవనంచొచ్చిన మదపుటేనుగులాగ. అలా చొరబడి భీముణ్ణి పదిబాణాలతో కొట్టాడు. నకులసహదేవుల్ని, ద్రుపదవిరాటరాజుల్ని, ద్రోపదికుమాళ్ళనీ తలా మూడేసి బాణాలతో కొట్టాడు. కేకయరాజులు అయిదుగురిమీదా రెండేసి బాణాలు తగిలించాడు. ధృష్టద్యుమ్నుడిమీద ఇరవై బాణాలూ, శిఖండిమీద

మూడు బాణాలూ, ధర్మరాజుమీద అయిదు బాణాలూ నాటించాడు. ఇంకా రథాలమీదా, ఏనుగులమీదా, గుర్రాలమీదా, పదాతుల మీదా లెక్కాజమాలేనన్ని బాణాలు వేసి నొప్పించాడు.

ధర్మరాజు అతడి ధనుస్సు నరికేశాడు. తక్కినవాళ్ళు అతణ్ణి చుట్టుముట్టేశారు. మించివచ్చిందంటూ ద్రోణాచార్యులు విరుచుకు పడ్డాడు. అంతమందినీ తన బాణాలవరదలో ముంచెత్తాడు. రారాజుని చుట్టుముట్టిన శత్రుసేన యీపత్తూ దూరంగా తప్పుకుంది. దుర్యోధనుడు మళ్ళీ జయద్రథుడిదగ్గిరికి వచ్చేశాడు.

అప్పుడు కేకయరాజుల్లో పెద్దవాడు బృహత్క్షత్రుడు ద్రోణుడి మీదికి వచ్చాడు. ద్రోణుడువేసిన బాణాలన్నీ ఖండించేసి, తుదకి బ్రహ్మాస్త్రం వేశాడతడు. బ్రహ్మాస్త్రం బ్రహ్మాస్త్రంతోనే కొట్టేశాడు ద్రోణుడు. పైగా బృహత్క్షత్రుడి వొళ్ళంతా అరవై బాణాలు నాటించాడు. రవంతా జంకలేదు బృహత్క్షత్రుడు. మరింత పేట్రేగిపోయి, ద్రోణుడి సారథిని చావుదెబ్బలు కొట్టేశాడు. చిటికెలో వందలూ, వేలూ బాణాలు రువ్వాడు ద్రోణాచార్యులు. అతడి కరచరణాలు కదలకండా చేసేసి, తుదకి వొక దారుణమైన బాణం వొదిలాడు. బృహత్క్షత్రుడి గుండెలు దూసుకుపోయింది బాణం. దెబ్బతో ప్రాణాలు వొదిలేశాడతడు.

కేకయరాజు పడిపోడంతోనే శిశుపాలుడికొడుకు ధృష్టకేతుడు ముందుకి వచ్చాడు. మంటలో వురికిన శలభంలాగ ద్రోణుడి మీదికి వురికాడు. పెద్దపులిని కర్రతో పొడిచినట్టు అరవై బాణాలు ద్రోణుడిమీదా, అతడి సారథిమీదా, గుర్రాలమీదా కొట్టాడు. చుర్రుమంది ద్రోణుడికి. టపీమని వొక బాణం వేశాడు. ధృష్టకేతుడి విల్లు పటుక్కుమంది. మరోవిల్లుతీసి కొట్టాడతడు. మరింత కుతకుత మంది ద్రోణుడికి. అతడివిల్లూ, రథమూ ముక్కలుచేసి పారేశాడు.

అయినా తగ్గలేదు ధృష్టకేతు. గదతీసి ద్రోణుడిమీద విసిరాడు. అదీ ద్రోణుడు ముక్కలు చేసెయ్యడంతోనే, తోమరమూ, దాని వెంట శక్తీ విసిరాడు. ఆ రెండూ తునకలుచేసేశాడు ద్రోణుడు. ఉత్తరక్షణంలో తళతళమంటూన్న వాడి కత్తిలాంటి బాణం సూటిగా అతడి రొమ్ముమీద తగిలించాడు. దెబ్బతో విలవిలా తన్నుకుని కళ్ళుమూసేశాడు ధృష్టకేతుడు. తండ్రి చావుచూసి, దుఃఖంతోనూ, కోపంతోనూ ధృష్టకేతుడికొడుకు ద్రోణుడిమీదికి వురికాడు. లేడిపిల్లమీదపడ్డ పెద్దపులిలాగ అతడిమీదికి వెళ్ళాడు ద్రోణుడు. ఇలా వెళ్ళాడు, అలా నరికిపారేశాడతణ్ణి.

అలా బరిదిగిపోతూన్న ద్రోణుణ్ణి అమాంతంగావెళ్ళి అడ్డుకున్నాడు జరాసంధుడికొడుకు సహదేవుడు. అతణ్ణీ లిప్తలమీద చంపిపారేశాడు ద్రోణుడు. మగధసైనికులు నివ్వెరపోయి చూస్తూనే వున్నారు.

"అడ్డులేని తపస్సిద్ధికలవాడో ఈ బ్రాహ్మడు" గొంతెత్తి ధృష్టద్యుమ్నుడికి వినపడ్డట్టు అరిచాడు భీముడు — "బాణాలతోనే కాదు, చూపులతోనే కాల్చేస్తాడులా వుంది" అన్నాడు.

భీముడిమాట చెవినిపడిందో లేదో, ద్రోణుడికట్టు రథం తిప్పాడు ధృష్టద్యుమ్నుడు. ఇంతలో అతడికుమారుడు క్షత్రదేవుడు తోసుకుంటూ వచ్చి, వాడి బాణంతో ద్రోణుడి ధనుస్సు నరికేశాడు. తటుక్కున మరో విల్లు అందుకున్నాడు ద్రోణుడు. మెరుపులా వాడి బాణం మెరిసింది. అంతే — క్షత్రదేవుడి తలా మొండెమూ వేరై కిందపడిపోయాయి.

అప్పుడు చేకితానుడు పిడుగులావచ్చి ద్రోణుడితో కలబడ్డాడు. వరసపెట్టి వాడి వందబాణాలు అతడిమీద నాటించాడు. నాలుగు బాణాలు గుర్రాలమీదా, నాలుగు సారథిమీదా వేశాడు. అసలే

ఆచార్యుడు! గబగబా పదహారు బాణాలు చేకితానుడి కుడిబుజం మీద కొట్టాడు. మరో పదహారు అతడి జెండామీద వేసి పడగొట్టాడు. ఏడుబాణాలు గుప్పించి సారథిని గజగజలాడించాడు.

ద్రోణుడి బాణాలు భరించలేకపోయాయి చేకితానుడి గుర్రాలు. పగ్గాలూ గిగ్గాలూ లక్ష్యపెట్టకండా రథం ఈడ్చుకుంటూ పరుగుతీశాయి.

చేకితానుణ్ణి ఓడించేసి, చేది, పాంచాల, సృంజయసేనలు నురుమాడాడు ద్రోణాచార్యులు. తలంతా నెరిసిపోయి, ఎనభై అయిదేళ్ళ ముసిలిద్రోణుడు పదహారేళ్ళ యువకుడిలాగ యుద్ధంచేశాడు. ముక్కలు తేరిన యోధుల్ని ఎంతోమందిని హతమార్చేశాడు.

"అబ్బోతుల్లాటి రాజుల్ని నక్కలపాలు చేస్తున్నాడు ఆ బాపనాడు" పాండవసేన పురికొల్పుతూ అన్నాడు ద్రుపదమహారాజు—"ఇతడి ఆటకట్టించందే లాభంలేదు" అంటూ అద్భుతంగా యుద్ధం చేశాడతడు.

## భీమన్నా, నీ తమ్ముడు

యుద్ధంచేస్తున్నాడే కాని మనస్సు మనస్సులో లేదు ధర్మరాజుకి. "అర్జునుడు ఒంటిగా వెళ్ళాడని సాత్యకిని పంపాను. సాత్యకికూడా అసహాయశూరుడే. అయినా జయించరాని శత్రుసమ్మర్దంలో ఇద్దరూ ఏమయిపోయారో! శత్రుభయంకరుడు భీముడుకూడా వెళ్ళడం మంచిది. ఎలా సాధ్యమవుతుందో ఇది! 'తన తమ్ముళ్ళణ్ణే చూసుకున్నాడు. కృష్ణుణ్ణీ, అతడి తమ్ముళ్ణీ పంపేసి వూరుకున్నాడు. వాళ్ళ సంగతి విచారించాడు కాడు. ఎలాంటివాడో ధర్మరాజు!' అని జనం నన్ను నిందించకపోరు. ఎన్నోచోట్ల తెలిసేవుంది భీముడిబలం. ఇతణ్ణి పంపడానికి సందేహించనక్కరలేదు. ఇతడూ వెళ్ళాడంటే ఆ ఇద్దరూ

వంతోషిస్తారు. అంచేత తప్పకండా పంపుతాను. పంపితేనే నామనస్సు కుదుటపడుతుంది" అంటూ ఎన్నోవిధాల ఆలోచించి భీముడిదగ్గిరికి వెళ్ళాడతడు.

"భీమన్నా, నీతమ్ముడు — అర్జునుడు — " మరి మాట పెగల్లేదు ధర్మరాజుకి. కంఠం గద్గదికపడిపోయింది. కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి.

"ఏం వచ్చిందిపుడు అన్నయ్యా," ధర్మరాజు విచారంచూసి తడబడిపోతూ అన్నాడు భీముడు — "మేం కలతపడితే నీ మాటలు మాకు సేదదేర్చేవి. నువ్వే కలతపడితే ఇకనేం దారి? చెప్పు, ఏం చెయ్యమంటే అది చేస్తాను."

"ఇందాక పాంచజన్యం విన్నాను" అందుకన్నాడు ధర్మరాజు — "సాత్యకిని పంపాను. ఏంజరిగిందో ఇంతదాకా తెలియడం లేదు. మనస్సు మహా కలతపడిపోతూ వుంది. నువ్వు వెళ్ళి, తమ్ముణ్ణి కలుసుకో. అతడు క్షేమంగావుండడం చూడడంతోనే గట్టిగా సింహనాదం చెయ్యి. నేను కుదుటపడతాను.

"నీ తమ్ముడు భీమసేనా, అందమైనవాడోయి. నీతిమంతుడు. సుగుణాల పుట్ట. నేనంటే ప్రాణం. అతడికి ఏమైనా ప్రమాదంవస్తే నాగుండె బద్దలయిపోతుంది. అందుకనే మతిపోతుందినాకు" అన్నాడు.

"క్షిప్తంలో వెళతాను" అన్నాడు భీముడు — "కాని అన్నయ్యా, ఆరథమూ, ఆగుర్రాలూ, ఆసారథీ, ఆధనుస్సూ — అన్నీ ఎరుగుదువు. తమ్ముడి చేవా ఎరుగుదువు. అన్నీ ఎరిగి ఎరిగి ఈవిచారమెందుకంటా! నీఆజ్ఞ తలమీద పెట్టుకుంటున్నాను. ఇదిగో ఇప్పుడే శకటవ్యూహం ప్రవేశిస్తాను. తమ్ముణ్ణీ, కృష్ణుణ్ణీ, సాత్యకినీ కలుసుకుంటాను. నీకు తెలియపరుస్తాను" అన్నాడు.

"బావా," అన్నగారితో విన్నవించి, ధృష్టద్యుమ్నుణ్ణి చూస్తూ అన్నాడు భీముడు—"ద్రోణుడి సామర్థ్యం ఎరుగుదువు కదా! అతడి ప్రతిజ్ఞా ఎరుగుదువు. అంచేత వెయ్యికళ్ళతో కాయాలి నువ్వు. నేను వెళ్ళడం తగని పనే. అయినా రాజాజ్ఞ మన్నించి తీరాలి. తప్పదు."

"మా సేనాపతి బొందెలో ప్రాణాలు వుండగా ధర్మరాజుని ద్రోణుడు వేలెత్తి చూపుతాడని కల్లోకూడా అనుకోకు. సందేహించకు. వెళ్ళు. అర్జునుణ్ణి కలుసుకో" అన్నాడు ధృష్టద్యుమ్నుడు. తృప్తిపడ్డాడు భీముడు. అన్నగారికి పాదాభివందనం చేశాడు. తమ్ముణ్ణి గుచ్చి కౌగిలించుకున్నాడు ధర్మరాజు. ఆశీర్వదించాడు. ఇంతలో శ్రీకృష్ణుడి పాంచజన్యం వినిపించింది.

"విను, విను" తడబడుతూ తమ్ముడితో అన్నాడు ధర్మరాజు—"అదిగో పాంచజన్యం ఘోరంగా వినిపిస్తోంది. మరిదికి వచ్చిన ఆపద సహించలేక కృష్ణుడు యుద్ధంచేస్తున్న ఉద్వేగం అనుకుంటా నది. పరిగెత్తాలి నువ్వు, క్షణాలమీద వాలాలి వెళ్ళి" అంటూ తొందర చేసేశాడు.

భీషణమైన ధ్వనితో భీముడిరథం బయలుదేరింది. అన్నిరకాల ఆయుధాలతోనూ నిండుగా వుందది. రణతూర్యాలూ, భీముడి సింహనాదమూ, రథఘోషా దిక్కులు దద్దరిల్లిపోయాయి. సారథి విశోకుడు తన సామర్థ్యమంతా చూపించడానికి పూనుకున్నాడా అన్నట్టు తీవిగా పగ్గాలుపుచ్చుకు కూచున్నాడు నొగలమీద. భీముడు అల్లెతాడు సారించాడు. ఎర్రటిచూపులు కౌరవసేనమీద కురిపిస్తూ ముందుకి వురికాడు.

నీకుమాళ్ళు దుశ్శలుడూ, వివింశతి, దుర్ముఖుడూ, దుస్సహుడూ, బృందారకుడూ, సుహస్తుడూ, అభయుడూ, రౌద్ర

కర్ణుడూ, సువర్మా, దుర్విమోచనుడూ మొదలైనవాళ్ళు రకరకాల బాణాలు కుమ్మరిస్తూ అతణ్ణి ఎదిరించారు.

లేళ్ళమంద మీాస్తే పొంగిన సింహంలాగ వాళ్ళమీాదికి వచ్చాడు భీముడు. వాళ్ళ బాణాలన్నీ ఇట్టే కొట్టేశాడు తుక్కు-కింద. ఓంప్రథమంగా బృందారకుణ్ణి నరికేశాడు. అవూపుని అభయుణ్ణీ, రౌద్రకర్మణ్ణీ, దుర్విమోచనుణ్ణీ ముగ్గురునీ వెడల్పాటిబాణాలు వేసి వూడ్చేశాడు. అయినా తక్కినవాళ్ళు రోషంతో పోరాడే సరికి విందాను విందుల్నీ, సువర్మనీ చంపేశాడు. మిగిలినవాళ్ళు చెట్టోపిట్టయి పరిగెత్తారు.

పెద్ద సింహనాదంచేసి ముందుకి రథం పోనిచ్చాడు భీముడు. అలా ఉద్ధృతంగా వచ్చేస్తూన్న భీముణ్ణి బాణాలతో కప్పెట్టి నిలబెట్టేశాడు మన సేనాని ద్రోణాచార్యులు.

"నన్ను గెలవందే వ్యూహంలోకి ఎలా వెళతావు!" అర్జునుడిలాగే అతడూ తనని మన్నిస్తాడనుకుని భీముడి నుదుటిమీాదవొక బాణం నాటిస్తూ అన్నాడు ద్రోణుడు – "నీతమ్ముడు నాఅనుమతి మీాదే లోపలికి వెళ్ళగలిగాడు" అన్నాడు.

"అర్జునుడా వొక రథికుడి అనుమతిపొంది వెళతాడు! " కళ్ళల్లో నిప్పులుకక్కుతూ అన్నాడు భీముడు – "మనుష్యసేనమాట అలా వుండనీ, దేవసేన అయినా చించి చెండాడి మరీ వెళతాడతడు, తన ఇష్టంవచ్చిం దగ్గిరికి. దానికేం, అయిందే కట్టు, మంచి మాటలాడి, నిన్ను అనుసరించడానికి అర్జునుడు కాడు, శత్రువుల్ని చిదగ్గొట్టే భీముడు వీడు. నువ్వు గురువ్వనీ, తండ్రివనీ, హితుడివనీ అభిమానం చూపించానా నాశత్రువుకే జయంకూర్చినవా ణ్ణవుతాను. ఆ శషభిషలు నాదగ్గిర పనికిరావు. నాచేవేదో చూపెట్టే వొదిలిపెడతాను" అంటూ గద సారించాడు. చేతిసత్తువకొద్దీ చాచి విసిరి

కొట్టాడు. ఆకాశంమీద మంటలు కక్కుతూ వచ్చేస్తోంది గద, భయంకరమైన శబ్దంతో. చప్పున రథం గెంతేశాడు ద్రోణుడు. అతడిలా గెంతేశాడు అలా పిడుగులాగ రథంమీద పడింది గద. పడీపడడంతోనే గుర్రాలు పచ్చడయిపోయాయి. సారథి చచ్చి పూరుకున్నాడు. రథమూ మచ్చుకి లేకండా గుండయిపోయింది. మన రాణువప్రాణం నిలువునా ఎగిరిపోయినట్టయింది.

గదవిసిరి మన రాణువమీదికి బాణంలా వచ్చేశాడు భీముడు. నీకుమాళ్ళు మళ్ళీ అతణ్ణి అడ్డుకున్నారు. కాని అతడి ధాటి భరించలేక తోకముడిచేశారు, సిగ్గూ సెరమూ వొదిలేసి. అప్పుడు మరొక రథమెక్కి పరిగెత్తుకు వెళ్ళాడు ద్రోణాచార్యులు. గట్టిగట్టి బాణాలు భీముడిమీద గుప్పించాడు.

మరింత వొళ్ళుమండింది భీముడికి. దభీమని రథం దిగేశాడతడు. ద్రోణుడు వేస్తున్న బాణాలన్నీ తలవొంచుకుని వోర్చుకుంటూ పరిగెత్తుకు వచ్చాడు, వర్షంకురుస్తుంటే తలవొంచుకు పరిగెత్తుకువచ్చే అందమైన మంచి ఆబోతుకోడెలాగ. అలా వచ్చి ద్రోణుడిరథం నొగలతోకూడా పట్టుకుని అమాంతంగా విసిరి పారేశాడు. గుండపిండయిపోయింది రథం. ఒళ్ళు దులుపుకుని మరో రథమెక్కేశాడు ద్రోణుడు.

## భీముడు వ్యూహంలో చొరబడ్డాడు

సింహనాదములాగ తనరథమెక్కేశాడు భీముడు. మెరుపులా రథం మెరిపించాడు విశోకుడు. వ్యూహంలో చొరబడిపోయాడు భీముడు. అతడి ఉద్ధృతం వోర్వలేక భోజ కాంభోజ సైన్యాలూ, యవన మ్లేచ్ఛసేనలూ పులినిచూసిన పశువుల్లాగ పుంజాలు తెంపుకు పరుగుచ్చుకున్నాయి. అడ్డే లేకపోయింది భీముడికి.

అలా వెళ్ళి, సాత్యకిచేస్తున్న యుద్ధం చూస్తూ, అతణ్ణి దాటుకుని, అర్జునుడి దివ్యరథందగ్గిరికి చేరుకున్నా డతడు. కౌరవయోధులతో ఘనంగా యుద్ధం చేస్తూన్న అర్జునుణ్ణి చూశాడు. చూసీచూడ్డం తోనే బ్రహ్మాండమైన సింహనాదంచేశాడు.

భీముణ్ణి చూసి ఎంతో అంత ఆనందంతో అర్జునుడూ, కృష్ణుడూ కూడా సింహనాదాలుచేశారు, ఆకాశం మారుమోగినట్టు. ఆసింహ నాదాలు ధర్మరాజు చెవినిపడ్డాయి. ప్రాణం లేచివచ్చిం దతడికి. ముఖ్యంగా కృష్ణార్జునుల గొంతుకలు వినడంతోనే అతడికి బ్రహ్మానందం కలిగింది. భీముడి ఇంగితానికి సంతోషించి అతణ్ణి మనస్సులోనే మెచ్చుకున్నా డతడు. "ఇక పరవాలేదు. తమ్ముడు ప్రతిజ్ఞ పూర్తి చేసుకునే వస్తాడు. గుండెల కద్దుకుంటాను" అంటూ తృప్తిపడ్డాడు. "తమ్ములూ, బంధువులూ ఇలా కడ తేరిపోయాక అయినా ఈదుర్యో ధనుడు సంధికి వచ్చి, మిగిలినవాళ్ళనయినా బతికించుకుంటే బావుండేది" అనుకుంటూ యుద్ధం సాగించాడు.

ధృతరాష్ట్రుడు : సరే, అలా సింహనాదం చేసిన భీముణ్ణి ఎదుర్కొనే మొనగాడు మనసేనలో వొక్కడైనా బయలుదేరాడా, లేదా? అబ్బే, వొట్టిమాట. నాకుమాళ్ళని కాల్చడానికి పుట్టిన కార్చిచ్చు వాడు. వాణ్ణెవ డెదిరిస్తాడు?

సంజయుడు : ఎదిరించ కేం, కర్ణు డెదిరించాడు. ఎదిరించడ మేమో ఎదిరించాడు, తొలిదెబ్బతోనే దాడుతీశాడు. చెపుతాను విను.

భీముడు అలా సింహనాదం చెయ్యడంతోనే అక్కడి మన యోధులు గడగడలాడిపోయారు. ధనుస్సులూ, బాణాలూ చేతు ల్లోంచి జారవొదిలేశారు. గుర్రాలూ, ఏనుగులూ మలమూత్రాలు వొదిలిపెట్టాయి. కర్ణుడుమాత్రం వున్నపాళాన వచ్చిపడ్డాడు. గబా

గబా ఇరవై బాణాలు గుప్పించాడు. పెదవులుబిగించి అరవై మూడు బాణాలు కొట్టాడు భీముడు. ఒకటి అతడి జెండామీద వేసాడు. మరొకటివేసి అతడి ధనుస్సు నరికేశాడు. మరోవిల్లు అందుకున్నాడు కర్ణుడు. అదీ నరికేశాడు భీముడు. అంతతోనూ వూరుకోలే .దీసారి. అతడి సారథినీ, గుర్రాల్నీ కూడా నరికేశాడు. కర్ణుడి ఆట కట్టేసింది. కంగారుపడిపోయా డతడు. రథం గెంతేశాడు. పారిపోయి వృషభ సేనుడి రథ మెక్కేశాడు.

కర్ణుడు వోడిపోయి పారిపోడంతోనే మనసేన ఆచుట్టుపట్ల వుంటే వొట్టు ఇక.

## ఆ జూదం కాదు ఈ జూదం గెలవాలి

ఏంచెయ్యాలో తోచలేదు దుర్యోధనుడికి. చరచరా రథం పరి గెత్తించి ద్రోణాచార్యులు దగ్గిరికి వెళ్ళాడు.

"అర్జునుడూ, సాత్యకీ, భీముడూ—ముగ్గురూ మనసేన మంట గలిపేస్తున్నారు. జయద్రథుడిదగ్గిరిసా చేరుకున్నారు వాళ్ళు. అర్జు నుణ్ణి వొదిలేశావే అనుకో. ఈఇద్దరినీ వొదిలెయ్యడం తగినపనేనా నీకు. యుద్ధంలో నువ్వు వోడిపోడమంటే సముద్రం ఇంకిపోడమన్న మాట. ద్రోణుణ్ణి సాత్యకి వోడించేశాడని జనం ఆడిపోసుకోడమే మేలని భావించావా? ధనురాచార్యుడివి కదా పైగా! ఇలా నువ్వు అడిగిపోడం మాభాగ్యంకాకపోతే ఏమనాలి! ఇన్నిమాట లెందుకిక నీకడుపులో ఏముందో విప్పి చెప్పనా్నా చెప్పెయ్యి, బతికిపోతాం" అంటూ లబోలబోమన్నాడు.

"అసలు జయద్రథుణ్ణి రక్షించుకోడమే ఇపుడు కర్తవ్యం" అంటూ అందుకున్నాడు ద్రోణాచార్యులు — "అక్కడా ఇక్కడా మన

నేనకి కలిగే ఉపద్రవం వొక్క-రూపుతో కాసుకుంటూనే వున్నాను, నావోపినంత. ఇంతకంటే ఏంచేసేది నేను? ముఖ్యంగా అర్జునుడికి నీకూ పడిందిప్పుడు, జూదం. ఆవాళ శకుని మంత్రాంగంతో గెలిచిన గెలుపు గెలుపు కాదు. అస్థిర మది. ఈజూదంలో గెలవా లిప్పుడు. ఇందులో వోడిపోకండా బైటపడితేనే మన చాకచక్యమూ, సామర్థ్యమూ, గొప్పానూ. అంచేత నువ్వు ఇలా బెంబేలుపడిపోకు. అక్కడ కర్ణుడూ మొదలైన మహారథులు ఎంతోమంది వుండనే వున్నారు. అర్జునుడూ, సాత్యకీ, భీముడూ – ఈముగ్గురి ప్రాణాలికీ అంతమందీ చాలరో! వెళ్ళు. వాళ్ళతో కలిసి జయద్రథుడిప్రాణాలు రక్షించు. నేను వ్యూహం ద్వారం వొదిలేశానో ఈపాండవప్రవాహం వొక్క-సారి లోపలికి తోసుకు వచ్చేస్తుంది. అప్పుడు పరిస్థితి మన అయితి తప్పిపోతుంది. అందుకని నీతో రావడం తగనిపని నాకు. వెళ్ళు" అన్నాడు.

మారు మాటాడలేకపోయాడు దుర్యోధనుడు. తన్ను తానే పురికొల్పుకున్నాడు. జయద్రథుడిదగ్గిరికి బయులుదేరాడు.

## చక్రరక్షకులు అర్జునుణ్ణి కలుసుకున్నారు

అర్జునుడి చక్రరక్షకులు ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ కృతవర్మ అడ్డెయ్యడంవల్ల అర్జునుడితో వెళ్ళలేకపోయారని వెనక చెప్పాను. ఈలోగా వాళ్ళు పక్క-లికి పురికేసి, త్వరత్వరగా తెరల్చుకుంటూ బయులికి వచ్చేశారు. కపిధ్వజమూ, గాండీవం నారిమోతా పట్టి అర్జునుడున్న చోటుకని పెట్టి, మనసేన చీల్చుకుంటూ అతడిదగ్గిరికి వచ్చేస్తున్నారు. ద్రోణుడిదగ్గిరనించి వస్తూ దుర్యోధనుడు వాళ్ళని చూశాడు, అడ్డుకున్నాడు.

ఉత్తమౌజ యుధామన్యులూ దారుణమైన యుద్ధంచేశారు. ఉత్తమౌజుడు దుర్యోధనుడిధనుస్సు విరిచేశాడు. అతడి రొమ్మమీద చికిలిపట్టిన బాణాలు నాటించాడు. సింహనాదం చేశాడు. మరో ధనుస్సు తీశాడు దుర్యోధనుడు. ఉత్తమౌజుడి గుర్రాలు కొట్టేశాడు. సారథినని పట్టేశాడు. యుధామన్యుడిరథ మెక్కి యుద్ధంచేశాడు ఉత్తమౌజుడు. దుర్యోధనుడి సారథినీ, గుర్రాల్నీ చంపేశా డతడు. అయితే వూరుకోలేదు దుర్యోధనుడు. గదపట్టుకు చప్పున వెళ్ళాడు, చలించకండా. యుధామన్యుడి సారథినీ, గుర్రాల్నీ పచ్చడికింద కొట్టేశాడు. ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ రథం దూకేసి తప్పుకు పోయారు. నీ సేనలోని ఇద్దరు రథికుల్ని చంపేసి, వాళ్ళరథాల మీద అడ్డంగా వెళ్ళి అర్జునుణ్ణి కలుసుకున్నారు. దుర్యోధనుడు శల్యుడి రథ మెక్కాడు.

ధృతరాష్ట్రుడు: సరే, కాని కర్ణుడేమయాడట! అతడే పాండవుల్ని గెలుస్తాడని మనవాళ్ళందరూ ఆశపెట్టుకున్నారు. అతణ్ణితలుచుకుంటేనే ధర్మరాజుకి కంటిమీద రెప్పపడదు. అలాంటివీరుడు భీముడిచేత రథంలేకండా అయిపోయాడు; పారిపోయాడు. ఆపారిపోడం పారిపోయి మళ్ళీ యుద్ధానికి రాలేదా? అతడిసంగతి ముందు చెప్పూ ఏమయాడో!

## మళ్ళీ మళ్ళీ కర్ణుడు దౌడు తీశాడు

సంజయుడు: అదీ చెపుతాను, విను. కర్ణుణ్ణి వోడగొట్టి, భీముడు అర్జునుడివేపు బయలుదేరాడు, మదపు ఏనుగులాగ.

"ఆగవోయి భీమన్నా" కొత్తరథం సిద్ధంచేసుకుని వెనకనించి పేరెత్తి పిలిచాడు కర్ణుడు. సింహాన్ని జూలుపట్టి లాగితే ఎలా తిరగ

బడుతుంది, అలాగ వెనక్కి మళ్ళాడు భీముడు. ఇద్దరూ సూర్యుడంత ప్రతాపవంతులు. ఇద్దరూ వాొళ్ళమీద వాొళ్ళు బాణాలుగుప్పించు కున్నారు, దారుణంగా. ఒకళ్ళ బాణాలు వాొళ్ళు ముక్కలుచేశారు. ఒకళ్ళ సారథిని వాొళ్ళు కొట్టారు. ఒకళ్ళగుర్రాలు వాొళ్ళు వేటా డారు. జెండాలు విరుచుకున్నారు. కవచాలు చీల్చుకున్నారు. ఇద్దరూ రక్తస్నానాలు చేశారు. ఒకళ్ళనిమించి వాొళ్ళు పోరాడారు.

భీముడు కర్ణుడివిల్లు విరిచేశాడు. అతడి సారథినీ, గుర్రాల్నీ చంపేశాడు. పాముల్లాటిబాణాలు అతడివొంటినిండా గుచ్చేత్తాడు. కంగారుపడిపోయాడు కర్ణుడు. భరించలేకపోయాడు. సిగ్గూలజ్జావొది లేశాడు. కాళ్ళకిబుద్ధిచెప్పి దాడులేశాడు. ఆపారిపోడం పారిపోయి మరో రథ మెక్కేశాడు.

ధృతరాష్ట్రుడు: నమ్మినబంటు అలా పిరికిమందు పుచ్చుకు న్నాడూ? పాపం మందబుద్ధి మన దుర్యోధనుడు ఏమనుకున్నాడో మనస్సులో! అదలా వుండనీ. తరవాత ఏమయింది, కర్ణుడి పరా క్రమం?

సంజయుడు: ఒళ్ళంతా మండిపోతూ మళ్ళా వచ్చి కలబడ్డాడు కర్ణుడు, భీమణంగా. ఇద్దరికీ అద్భుతంగా యుద్ధం జరిగింది. మంచి డేగ ల్లాగ, పెద్దపులుల్లాగ, మదించిన ఏనుగుల్లాగ, కోపొక్కిన సింహాల్లాగ బలంతోనూ, పంతంతోనూ పోట్లాడారు వాళ్ళు. మన చతురంగసేన కూడా కర్ణుడితో కలిసింది. కలవడమే మో కలిసింది. మంత్రించినట్టు భీముడి బాణాలతో నాశనమయిపోయింది.

ధృతరాష్ట్రుడు: భీముణ్ణి ఎదిరించడం మీదమీదపని కాదు, నిజమే. అతడి భుజపరాక్రమం ఎన్నిసార్లు వినలేదు మనం! కర్ణుడి సంగతీ విన్నాం, లక్షసార్లు! ఉత్తిమేకపోతుగాంభీర్యం! తుచ్ఛుడు. వీడా గెలుస్తాడు పాండవుల్ని? ఈసూతుడికొడుకు ఏదో వూడపొడి

చేసి యుద్ధంలో పాండవుల్ని గెలిచేస్తాడని మిడిసిపడిపోయాడు మన మదాంధుడు దుర్యోధనుడు. శ్రీకృష్ణుణ్ణి తూలనాడాడు. సంధిచేసుకోరా బాబూ అంటే ససేమిరా కాదన్నాడు. అనుభవిస్తున్నాడు. నిజంగా మచ్చనలేవాళ్ళు పాండవులు. దేవుడు వాళ్ళకి ఎందుకు కీడు చేస్తాడు, యుద్ధంలో! తమ్ముళ్ళతో పిడే చెడతాడు దుర్యోధనుడు. అంతే. అంతకంటే ఇంకొకటి జరగదు. ఊఁ, చెప్పు, తరవాత ఏంజరిగిందో యుద్ధం?

సంజయుడు: భీముడితో మహారథసంగా తలపడ్డాడు కర్ణుడు, వచ్చిన మనసేన వొకకంటితో చూస్తూ. చరచరా ముప్ఫయి బాణాలు తగిలించి మరీ వెన్ను విరిచాడు. అరుణబింబంలాగ ఎరుపెక్కింది భీముడి మొహం. పెదవులు బిగించి వొక్కబాణం కొట్టాడతడు. కర్ణుడిధనుస్సు ఫెళ్ళుమంది. మరొకటి కొట్టాడు భీముడు. కర్ణుడిసారథితల ఎగిరిపోయింది. పగ్గాలు తానే పట్టుకుని, భీముడిమీద శక్తి విసిరాడు కర్ణుడు. దాన్ని ఎనిమిదిముక్కలు కొట్టేశాడు భీముడు. ఆవూపుని తొమ్మిదిబాణాలు వేసి కర్ణుడివొళ్ళు చీలికలు చేసేశాడు. మరో విల్లు పుచ్చుకునీ, క్రూరమైన అస్త్రాలు ప్రయోగించాడు కర్ణుడు. అవన్నీ అంతంతదూరంలోనే నరికేసి తీక్ష్ణమైన బాణాలు గుప్పించాడు భీముడు. అంతకంటే మించినట్టు కురిపించాడు కర్ణుడు.

ఊహించరాని వడితో ఉటకుతూ ఇద్దరూ పెద్ద ఆబోతుల్లా దెబ్బలాడారు. వాళ్ళసింహానాదాలు నిజంగా రంకెవేసినట్టే వుండేవి.

మళ్ళీ కర్ణుడి విల్లు విరిచేశాడు భీముడు. అతడి గుర్రాలవొళ్ళంతా రక్తాలు ధారలుకట్టించాడు. అతడి వొళ్ళు దుసెళ్ళిపోయినట్టు బాణాలు కొట్టి సింహానాదంచేశాడు. చూసి గుండె దడపట్టుకుంది దుర్యోధనుడికి. "తమ్ముడూ, కర్ణుడికి సహాయం చెయ్యి" అంటూ దుర్జయుణ్ణి పంపాడు.

తెగించిన సాహసంతో వెళ్ళాడు దుర్జయుడు, ఉద్ధృతంగా. అతడి సాహసానికి మనసేన నాలిక కరుచుకుంది. గట్టిగట్టి బాణాలు వేశాడు దుర్జయుడు. భీముడి గుర్రాల్నీ సారథినీ కంగారు పెట్టేశాడు.

తళతళమంటూన్న ఆరు బాణాలు కొట్టాడు భీముడు, యముడిలాగ గద్దిస్తూ. గుర్రాలతలలూ, సారథితలా, దుర్జయకుమారుడి తలా తెగిపోయి కింద దొర్లిపోయాయి. కళ్ళనీళ్ళు తిప్పుకున్నాడు కర్ణుడు. అప్పటికే మరో రథం సిద్ధంచేసుకున్నాడతడు. అంచేత ఆవ్రాపుని వెళ్ళి భీముడిమీద వురికాడు. మళ్ళీ ఇద్దరూ పరిపరివిధాల పోట్లాడారు. కోపాలూ, ఆటోపాలూ, బలాలూ, పంతాలూ, శౌర్యాలూ ధైర్యాలూ ఇద్దరివీ వొక్కలాగే ప్రకాశించాయి.

బలమంతా ఉపయోగించి బిరుసైన వొక్క బాణం కొట్టాడు కర్ణుడు. భీముడి గుండెలు దూసుకుపోయి భూమిమీద నాటుకుపోయిందది. గద విసిరి కర్ణుడి గుర్రాలు చంపేశాడు భీముడు. అంతేకాదు, ధనుస్సు సంధించి అతడి సారథినీ చంపేశాడు. అతడి జెండాకర్ర విరిచేశాడు. రథంపోయినా జంకలేదు కర్ణుడు. ఉగ్రుడైపోయి బాణవర్షం కురిపించాడు భీముడిమీద. నిజంగా అతణ్ణి చూస్తూంటే ఆశ్చర్యంవేసిం దప్పుడు.

మరో తమ్ముణ్ణి దుర్ముఖుణ్ణి కర్ణుడికి సహాయం పంపాడు దుర్యోధనుడు. అన్నగారి మాటమీద అడావుడిగా వెళ్ళాడు దుర్ముఖుడు.

కర్ణుడితో యుద్ధంచేస్తూనే తొమ్మిదిబాణాలు వేసి దుర్ముఖుణ్ణి వూడ్చేశాడు భీముడు. దుర్ముఖుడి పాటు చూసి కళ్ళు తడిచేసుకున్నాడు కర్ణుడు. అతడిరథమే ఎక్కేసి భీముడిమీద ధనుస్సు గురిపెట్టాడు.

బంగారం మొదళ్ళతోవున్న బాణాలు పద్నాలుగు కొట్టాడు భీముడు. అన్నిబాణాలే అతడి బుజంమీద నాటించాడు కర్ణుడు. కళ్ళు మొయ్యా కోపం తెచ్చుకున్నాడు భీముడు. శూలాల్లాటి మూడు

బాణాలు కర్ణుడి రొమ్ము దూసుకుపోయినట్టు కొట్టాడు. దాంతో మరి నిలవలేకపోయాడు కర్ణుడు. జజ్జరిల్లిపోయి అదే పారిపోడం పారిపోయాడు, పుంజాలు తెంపుకుని.

ధృతరాష్ట్రుడు: పౌరుషం గడ్డిపోచంత పనిచెయ్యదు. అంతా దైవబలంమీదే ఆధారపడివుంటుంది. సంజయా, సందేహంలేదు. అలా కాకపోతే కర్ణుడేమిటి, భీముడిదగ్గిర ఇలా అయిపోడమేమిటి? అయినా అలామాత్రం ఎందుకనుకోవాలిలే! ఏమంటే? దేవతలూ, దానవులూ, ఖచరులూ, నాగులూ – ఇలాంటివాళ్ళే భీముడిముందు నిలవలేనప్పుడు కర్ణుడూ గిర్ణుడూనా నిలబడతారు! అయితే, కర్ణుడే పాండవుల్ని గెలిచేస్తాడని కొండంత ఆసపెట్టుకున్న దుర్యోధనుడు మాత్రం కుంగిపోయి వుంటాడు.

కాని సంజయా, జరాసంధుడూ మొదలైనవాళ్ళనే చంపేశాడు కదా భీముడు! అలాంటివాడిమీదికి మన దుర్జయుణ్ణీ దుర్ముఖుణ్ణీ – ముక్కుపచ్చలారని కుర్రాళ్ళనా పంపుతాడు దుర్యోధనుడు, కర్ణుడికి సహాయం!

భీముడు వొక్కడేనా, తక్కిన పాండవులూ, సాత్యకీ కృష్ణుడూ – ఇంతమందీ వున్నారు. యుద్ధంలో ప్రాణాలుతియ్యకండా వొదిలిపెట్టరు. గెలవరానివాళ్ళు వాళ్ళు. వాళ్ళతో తగువు తెచ్చుకున్నాడు దుర్యోధనుడు.

సంజయుడు: కోరి విషం తాగేసి, అది బాధప్రారంభించేసరికి పైవాళ్ళని దుయ్యబట్టినట్టుంది నీవ్యవహారం! ముందు వచ్చేది కానకండా పాండవులికి ద్రోహంచేశావు. తీరా యిప్పుడు వీకలమీదికి వచ్చేసరికి వాళ్ళనీ వీళ్ళనీ ఎత్తిపోస్తున్నావు. ఎందుకిదీ? ఊరుకుని యుద్ధంసంగతి విను.

కర్ణుడు ఓడిపోడం సహించలేకపోయారు నీకుమారుళ్ళు. దుర్మర్షణుడూ, దుర్మదుడూ, దుస్సహుడూ, మరిద్దరూ భీముడిమీదికి పరిగెత్తారు. బాణవర్షం కురిపించారు. వాళ్ళు వెళ్ళడం చూసి, తానూ మళ్ళా వచ్చి కలిశాడు కర్ణుడు, బాణాలుగుప్పిస్తూ. వాళ్ళబాణాలన్నీ కొట్టేసి, నీకుమారుళ్ళని అయిదుగురినీ గుర్రాలతోనూ, సారథులతోనూ కూడా లిప్తలమీద నరికిపారేశాడు భీముడు, తలా ఆరేసి బాణాలు వేసి.

"ఛీ, ఎందుకీ బతుకు!" రాజకుమారుళ్ళ చావు చూసి తన్ను తాను తిట్టుకున్నాడు కర్ణుడు — "ఎప్పుడూ యుద్ధానికి రాకండా కొట్టెయ్యాలి భీముణ్ణి" అంటూ తెగించి అతడిమీదికి ఉరికాడు. డబ్భయిఅయిదు బాణాలు అతడి ఒంటినిండా నాటించి అట్టహాసంచేశాడు. అంతకి రెండింతలు వందా యాభై బాణాలు వేసి, ఒక బాణంతో అతడిధనుస్సు నరికేశాడు భీముడు.

మరో విల్లు తీశాడు కర్ణుడు. అదీ నరికేసి, మూరెడెత్తు పొంగాడు భీముడు. అతడి సారథినీ చంపేశాడు. గుర్రాలూ కొట్టేశాడు. కర్ణుడి నవ్వుకి మారునవ్వు నవ్వాడు, విరగబడి. ఇంతలో భయంకరమైన గద విసిరాడు కర్ణుడు. అది ముక్కలుకింద కొట్టేసి అంపవాన కురిపించాడు భీముడు. రథం లేకపోయినా వెనక్కి మళ్ళలేదు కర్ణుడు. మరో విల్లు అందుకుని భీముడికవచం చీలికలు చేశాడు, బాణాలతో ముంచెత్తి.

పిడుగులాగ ఉరుముతూ కర్ణుడి కవచం చీలికలు చేశాడు భీముడు. అతడి భుజంమీద దారుణమైన బాణాలు నాటించాడు. కిందేనుంచుని యుద్ధంచేస్తూన్న కర్ణుణ్ణి చూశాడు దుర్యోధనుడు. అతడి సహాయంకోసం తమ్ముళ్ళని పంపాడు. చిత్రుడూ, చిత్రాక్షుడూ, చారుచిత్రుడూ, చిత్రాయుధుడూ మొదలైనవారుఏడుగురు

వెళ్ళి వొక్కొక్కప్పుడు భీముణ్ణి ముట్టడించారు. ఇలా ముట్టడించారు, అలా ఆరిపోయారు. తుఫాను పడగొట్టిన వృక్షాలలాగ నీ ఏడుగురు కుమారులూ రథాలతోనూ, గుర్రాలతోనూ, సారథులతోనూ కూడా భీముడిచేత కూలిపోయారు.

ఇంతలో మరోరథమెక్కి మళ్ళావచ్చాడు కర్ణుడు. అరిబరిగా భీముడిమీద కలబడ్డాడు. గబగబా ఇద్దరిబాణాలూ ఎగిరాయి. ఇద్దరూ రక్తస్నానాలుచేసి, ప్రళయకాలసూర్యులలాగ ప్రకాశించారు. మహారాజా, నిజంగా కళ్ళున్నందుకు చూసితీరవలసిందే వాళ్ళయుద్ధం. గుదులుగుదులుగా వొకళ్ళమీద వొకళ్ళు బాణాలు గుప్పించేవాళ్ళు. ఒకళ్ళబాణాలు వొకళ్ళు నరికేసి, నేలమీద పడగొట్టేవాళ్ళు. ఉగ్రులయిపోయి, ఒకళ్ళశరీరం వొకళ్ళు చీల్చుకునేవాళ్ళు. ఒకళ్ళనిమించాలని వొకళ్ళు ఉద్రేకంతో పెనుగులాడేవాళ్ళు.

భీముడు కొట్టినప్పుడు కృష్ణుడూ, అర్జునుడూ ఆనందించేవాళ్ళు. కర్ణుడు కొట్టినప్పుడు తమ్ముళ్లూ, దుర్యోధనుడూ సంతోషించేవాళ్ళు.

కర్ణుడికోసం కలిగించుకుని వెళ్ళిన సేనలన్నీ యముడులాంటి భీముడిచేత చచ్చిచచ్చి తరిగిపోయాయి. చూసి పారిపోదామనే అనుకున్నాడు కర్ణుడు. కాని తెగేసిన మోళ్ళలా పడివున్న నీకుమారుళ్ళని చూసి దుఃఖం ముంచుకువచ్చిందతడికి. ఎక్కడలేని కోపమూ పుట్టుకువచ్చింది. ఆవేశంతో ధనుస్సు సంధించాడతడు. అతడి వింటి కొమ్ములలోంచి, గొడుగులోంచి, రథంలోంచి సెలయేళ్ళు పొంగిపారినట్టు బాణాలు ప్రవహించాయి భీముడిమీదికి.

ఏమాత్రమూ చలించలేదు భీముడు. తన మీదికి రాకండా వాటన్నిటినీ కొట్టిపారేసి, ఇరవై బాణాలువేసి కర్ణుడి కవచం పగలగొట్టాడు. కృష్ణార్జునులమాట అలావుంచు, మనవాళ్ళే పొగిడారు భీముడి పరాక్రమం.

"వెళ్ళండి, కర్ణుణ్ణి కాపాడండి" దగ్గిరున్న యోధుల్ని హెచ్చరించాడు దుర్యోధనుడు. చిత్రుడూ, చిత్రాయుధుడూ, వికర్ణుడూ మొదలైన నీకుమాళ్ళు ఏడుగురు కర్ణుణ్ణి కాపాడడం కోసం ఉద్ధృతంగా ముందుకి వురికారు. వాళ్ళు మొగిని భీముణ్ణి ముట్టడించారు. వర్షధారతో కొండని కప్పెట్టిన మేఘంలాగ దట్టమైన బాణాలతో అతణ్ణి కప్పెట్టారు.

గజమెత్తు లేచాడు భీముడు. దృఢమైన ముష్టితో ఏడేడు బాణాలు వేశాడు. ఏడుగురు కుమాళ్ళనీ నరికిపారేసి పెద్ద సింహనాదం చేశాడు. ధర్మరాజు అది విన్నాడు. భీముడు తన గెలుపు తెలుపుతున్నాడు అని గ్రహించాడు. ఆ సంతోషంతో ద్రోణుడిమీాదికి తరుముకు వెళ్ళాడు.

తమ్ముళ్ళు ఎంతోమంది హతమైపోడంతోనే "జూదం నాడు విదురుడు చెప్పినంతా జరుగుతోంది" అని లోలోపల ఎంతయినా దుఃఖపడ్డాడు దుర్యోధనుడు. అవాళ పాండవులికి చేసిన పాపఫలం అలా అనుభవించాడతడు.

ధృతరాష్ట్రుడు : గడిచినదానికి విచారించడ మెందుకూ? వాడు వెర్రాడు. నాబుద్ధి గడ్డితినే ఇంతదాకా వచ్చింది. అంతా వింటాను. ఓర్చుకుని. చెప్పవలసినదంతా చెప్పు.

సంజయుడు : భీముడు సింహనాదం చేయడంతోనే కర్ణుడు అతడిమీాదికి వురికాడు. ఘోరమైన యుద్ధంచేశాడు. నీసేన వెళ్ళి భీముణ్ణి ఘిరాయించింది. కత్తులలాటి బాణాలు, కరుకైన బాణాలు గుదులు గుదులు గుప్పించాడు భీముడు. రక్తం నదులయి పారింది, విరిగిన జెండాలూ, చామరాలూ, గొడుగులూ, గుండపిండయిన రథాలూ, తెగిన గుర్రాలూ ఏనుగులూ, సారథులూ రథికులూ పదాతులూ కళేబరాలూ ఆరక్తంనదుల్లో కొట్టుకుపోయాయి. చావగా

మిగిలిన చతురంగసేన అరచేతిలో ప్రాణంపెట్టుకుని బాణంవేటునేల అవతలకి పారిపోయి మిడుతూ మిడుతూ చూస్తూ నుంచుంది. కర్ణుడు మాత్రం వొదలకండా అద్భుతంగా పోరాడాడు. చిత్రవిచిత్రాలయిన బాణాలు రువ్వాడు. వాటిని వేటినీ లక్ష్యపెట్టకండా మంచి దారైన బాణం వేశాడు భీముడు. జుయ్యిని వచ్చింది బాణం కర్ణుకి చెవిలోని కుండలం రివ్వున ఎగరేసుకుపోయింది. ఆకాశంమీది కెగిరిపోయి చుక్క రాలినట్టు కిందరాలింది కుండలం. అంతలోనే మరొక బాణం కర్ణుడిగుండెలమీద కొట్టాడు భీముడు. పకపకా నవ్వుతూ మరి పది బాణాలు అతడి నుదుటిమీద తగిలించాడు. నల్లకలవలమాల వేసుకున్నట్టు కనిపించాడు కర్ణుడు. కళ్ళు జువూలు మన్నా యతడికి. రథందండెం పూతపట్టుకుని, కళ్ళుమూసుకు చేరగిలబడిపోయాడు. అంతలోనే తేరుకుని, రక్తంధారలుకడుతూన్న తన వొళ్ళు చూసి వెర్రికోపం తెచ్చుకున్నాడు. లిప్తలో వొక వందబాణాలు భీముడిమీద బాదేశాడు. అతడి ధనుస్సు నరికేశాడు. ప్రచండమైన బాణాలతో పట్టపగటి సూర్యుడిలా ప్రకాశించా డతడు. అతడివిల్లు ముడుచుకోడం, విడివడడం తెలియలేదు. గుండ్రంగా మంటలు కక్కుతూన్న చక్రంలా అవుపడింది. అంతవడికీ పిసరంతా ఇదవలేదు భీముడు. బంగారంపూసిన బాణాలు అతడు వేస్తూంటే ఆకాశలక్ష్మికి బంగారం నగల్లా కనిపించా యవి.

ఉగ్రనరసింహుడయిపోయాడు కర్ణుడు. భీముడివిల్లు విరిచేశాడు. అతడి గుర్రాలు నరికేశాడు. కాడితో ఇటూ అటూ పెనుగులాడిచచ్చాయి గుర్రాలు. ఇంతలో అతడి జెండా ఎగరగొట్టాడు కర్ణుడు. విశోకుణ్ణి వొళ్ళంతా చీల్చుకుపోయినట్టు కొట్టేశాడు. భరించలేకపోయాడు విశోకుడు. యుధామన్యుడి రథంవెనక్కి పారిపోయాడు ఉగ్రమైన శక్తి విసిరాడు భీముడు. పది బాణాలతో అది తుక్కుచేశాడు

కర్ణుడు. డాలు పట్టుకుని భీముడు కత్తితీసేలోపున డాలు పగలకొట్టే శాడు కర్ణుడు. కత్తి విసిరి కర్ణుడి ధనుస్సు విరిచేశాడు భీముడు. మరో ధనుస్సు కర్ణుడు తీసేలోపున పెద్దపులిలాగ అతడి రథంమీదికిదూకాడు. జవజవలాడిపోయింది రథం. జెండాకొయ్యకి కుదురుగా అమర్చిన పీఠం అడుగున చప్పుని దాక్కున్నాడు కర్ణుడు. రథంమీద అతడు కనబడక పోయేసరికి నాలుగుదిక్కులా చూశాడు భీముడు. పారిపోయాడో, రథంకింద దూరాడో అని వెదుకుతూ రథం దిగా డతడు. ఇంతలో గబుక్కున రథంమీదికి వచ్చి, చిత్రగతులతో రథంతిప్పి, చరచరా బాణాలువరస పెట్టాడు కర్ణుడు.

## తిండిపోతువి యుద్ధమెందుకోయి నీకు?

భీముడిచేతిలో ఆయుధంలేదు. అయినా మడమతిప్పలే దతడు. అర్జునుడు చంపి పడేసిన ఏనుగులు పట్టుకుని పోరాడాడు. ఒక ఏనుగు ఎడమచేత్తో ఎత్తిపట్టుకుని, కాసుకుంటూ కుడిచేత్తో ఏనుగులు కర్ణుడి మీదికి విసరడం ప్రారంభించాడు. అవన్నీ తునాతునకలు కొట్టేసి, భీముడి జీవస్థానాల్లో బాణాలు తగిలించాడు కర్ణుడు. పిడుగులాంటి పిడి కీలితో గుద్దేసి, కర్ణుణ్ణి చంపెయ్యాలన్నంతవరకూ వచ్చాడు భీముడు. తలుచుకుంటే అంతపనీ చేసేవాడే అతడు. కాని అర్జునుడిశపథం జ్ఞాపకంచేసుకుని వూరుకున్నాడు. అర్జునుడే చంపాలి కర్ణుణ్ణి. అదీ అతడి నిశ్చయం. అంచేత కర్ణుడి రథానికి అడ్డంకిగా వుంటుందనీ, అర్జునుడు చంపి పోయిన చతురంగసేనల శవాల కుప్పలమాటున దూరాడు భీముడు.

తనతోనూ, సేనలతోనూ పోరాడి పోరాడి, బాగా అలిసిపోయి, నిస్సహాయుడూ, నిరాయుధుడూ అయిపోయి నుంచున్న భీముణ్ణి చూశాడు కర్ణుడు. కుంతీదేవిమాటలు జ్ఞాపకం వచ్చాయి. బాణం

వెయ్యడం మానేశాడు. నవ్వుతూ దగ్గిరికి వెళ్ళాడు. "తిండిపోతువి, యుద్ధమెందుకోయి నీకూ!" వింటికొనతో భీముడి పొట్టమీద పొడుస్తూ అన్నాడు— "కూటికుండదగ్గిర కూచుని మనసారామింగి, ఇంటిపట్టున పడుకో. ఇక మిడిసిపడకు. అడవుల్లో దుంపలు తిని మునిలా వుండడమే కాని ధీరత్వంతో యుద్ధంచెయ్యడం చేతనవునా నీకు! వెళ్ళు. అడవికే పోయి, కడుపులో చల్లకదలకండా కాలంగడుపు. అంతమాత్రాన నీ వొళ్ళుతీట తీరదంటావా, చేతనయినంతవరకే యుద్ధం చెయ్యి. నావంటివాళ్ళతో చెయ్యిచేసుకోకు. అదిగో కృష్ణార్జునులు. వాళ్ళ దగ్గిరికి వెళ్ళి ప్రాణాలు నిలబెట్టుకో. ఊగ్రా ఇంతతో కట్టిపెట్టు" అన్నాడు ఈసడిస్తూ.

అప్పుడు కృష్ణుడు చెప్పడంతోనే అర్జునుడు గబగబా గట్టిగట్టిబాణాలు కొట్టాడు. కర్ణుడు వెనక్కి తగ్గాడు. ఇంతలో విశోకుడు రథం తయారుచేసి పట్టుకువచ్చాడు. రథమెక్కాడు భీముడు. అయితే చిక్కితే నెత్తురులేని మొహంతో అర్జునుడిదగ్గిరికి వెళ్ళిపోయాడు.

మంటలు రేగుతూన్న బాణాలు కర్ణుడిమీద వేశాడు అర్జునుడు. మధ్యవచ్చికలగజేసుకున్నాడు అశ్వత్థామ. అర్జునుడి బాణాలు అల్లంత దూరంనించి ఖండించి పారేశాడు. పైగా అరవైనాలుగు బాణాలు అర్జునుడిమీద నాటించాడు.

"ఆగవోయి, ఆగూ" అదిలిస్తూ అశ్వత్థామతట్టు తిరిగాడు అర్జునుడు. ఏనుగుసేనలోకి పారిపోయాడు అశ్వత్థామ. ఇంతలో సాత్యకీ అక్కడ అందుకున్నాడు అగ్గిపిడుగులాగ.

ధృతరాష్ట్రుడు: బలవంతులతో విరోధం బాగుచేస్తుందా మని పినీ! పాండవులికి అప్పుడే వంతిచ్చెయ్యవలిసింది. ఇప్పుడు రాజ్యమూ పోతుంది, కీర్తీ పోతుంది. విన్నావా, కాళ్ళమీదపడో, ఎంగిలితినో ఎలాగో వొకలాగ శత్రువులు తలఎత్తకండా చేసి బతకాలి మనిషి,

పగ దిగమింగుకుని. ఏమంటే, ఓడిపోతే ఇహమూ పరమూ రెండూ దక్కవుకదా! దుర్యోధనుడు పరమమూర్ఖుడు. తనకి తోచదూ, ఒకడు చెప్తే వినడు. దురభిమానికి చావూ, బతుకూ ఎలా తెలుస్తాయి? ఇంతకీ కన్నకొడుకు వాడు, ఏమని మొత్తుకునేది! అది అలా వుండనీ, ద్రోణుణ్ణి తోసిరాజని అర్జునుడు కౌరవసేనలో చొరబడ్డప్పుడే తేలిపోయింది. పులిమీద పుట్ర, అతడికితోడు అసహాయశూరులు సాత్యకీ, భీముడూ కూడా కలిశారు. ఇక జయద్రథుడు బతికేదేమిటి! అతడిచావు నిశ్చయమే. సరే, యుద్ధ మెలాజరిగిందో చెప్పు.

సంజయుడు: సాత్యకి భీమార్జునుల్ని కలిసేసరికి అలంబుసుడని ఒక రాజు అతడిమీదికి వచ్చాడు, వురుముతూ. ఇద్దరూ కొంచేపు చిత్రంగా యుద్ధంచేశారు. ఒకళ్ళబాణాలు ఒకళ్ళుముక్కలుచేశారు. ఒకళ్ళ కవచం ఒకళ్ళు పగలగొట్టారు. ఒకళ్ళ జీవస్థానాలు ఒకళ్ళు నొప్పించారు. మానవులే కాదు, దేవతలూ కూడా వాళ్ళ యుద్ధం చూసి ముక్కుమీద వేలుపెట్టుకున్నారు.

అలంబుసుడి గుర్రాలు కొట్టేశాడు సాత్యకి. అతడి సారథిని చంపేశాడు. వెడల్పాటి ఒక బాణంవేసి అతడి కంఠం నరికేశాడు. కుండలాలతో మెరుస్తూ కిందపడిపోయింది అలంబుసుడి తల.

దుశ్శాసనుణ్ణి ముందుపెట్టుకుని నీకుమాళ్ళు సాత్యకిని ముట్టడించారు. ఇట్టే దుశ్శాసనుడిగుర్రాలు కొట్టేసి, డేగలాగ అతడి రథం మీదికి వురికాడు సాత్యకి. గబుక్కున త్రిగర్తసేన అడ్డందూరింది. మెరికల్లాంటివాళ్ళని అయిదువందలమందిని హతమార్చాడుసాత్యకి. సేన సేనంతా చిందరవందర చేశాడు. చావగా మిగిలినవాళ్ళు తప్పుకున్నారు. అప్పుడు శూరసేనరాజువ దూసుకువెళ్ళింది. వాళ్ళనీ అంతేచేశాడు సాత్యకి. కళింగసేన వెళ్ళింది. దానిగతీ అంతే అయింది. ఇలా ఇంతసేనా చెండాడి, సరోవరంలోంచి ఒడ్డుకిచేరినఏనుగులాగ

మనసేనలోంచి బైటపడ్డాడు సాత్యకి. అర్జునుడి దగ్గిర చేరుకుని ఊపిరి తీశాడు.

"చూశావా నీశిష్యుడి పరాక్రమం!" సాత్యకిని చూస్తూ అర్జునుడితో అన్నాడు కృష్ణుడు – "కృతవర్మా మొదలైన వాళ్ళ సంగతి చెప్పడ మెందుకు, ముందు అంత ప్రభావశాలిని ద్రోణాచార్యుల్ని వొక్కడూ ఎలా వోడించాడూ అంటా? ఇంత ఇదిగా ఇతడు వచ్చాడంటే ధర్మరాజు పంపడమే కారణమయి వుంటుంది. నీమీాద ఎంత స్నేహముందోకూడా ఇలా చూపించాడితను. నిజంగా పరమానందంగా వుంది నాకు" అన్నాడు.

"నాకుమాత్రం ఇతడు రావడంనచ్చలేదు" అంటూ అందుకున్నాడు అర్జునుడు – "ఏమంటావా? ధర్మరాజురక్షణకోసం నియమించి వచ్చాను ఇతణ్ణి. ఇతడు వచ్చెయ్యడంతో అక్కడ ఏమవుతుందో తెలియదు ద్రోణుడి విషదృష్టిలోవున్నాడు ధర్మరాజు. ఇటు జయద్రథుడా చావలేదు. పొద్దు వాలిపోతూవుంది. ఇది ఇలా వుండనీ. ముక్కాకలుతీరిన కృతవర్మా మొదలైన ఎంతోమంది యోధులతో పోరాడి గుర్రాలూ, సారథీ తానూ అలిసిపోయాడు సాత్యకి. దగ పట్టిపోయాడు. కొంచెమతడు తెప్పరిల్లకండానే అదిగో భూరిశ్రవుడు నిప్పులుకక్కుతూ వురుకుతున్నాడు అతడిమీాదికి. పిసరంతా అలిసి పోలేదు భూరిశ్రవుడు. బ్రహ్మాండమైన బలగమూవుంది వెంట. కౌరవ వీరుల్లో వేళ్ళమీాద లెక్కకివచ్చేవాళ్ళలో అతడొకడు. శక్తీ, చాతుతుర్యమూ, శౌర్యమూ, ధైర్యమూ, అస్త్రబలమూ – అన్నిటిలోనూ అందెవేసిన చెయ్యి. అంచేత సాత్యకికి ప్రాణాంతకమైన ఘట్ట మిది. ఇక్కడికి ఇతణ్ణి ఎందుకు పంపాడో ధర్మరాజు? మాంసంకోసం పొంచి కూచున్న డేగలాగ తనకోసం కాచికూచున్నాడు ద్రోణుడు. అది గమనించవద్దూ తాను?"

## భూరిశ్రవుడు

అర్జునుడు ఇలా అంటూనేవున్నాడు, "ఆగవోయి, ఎటుపోతావు?" అంటూ వురుముతూ వురికాడు భూరిశ్రవుడు, యూపపతాకం ఎగురుతూన్న రథంతో — "బుద్ధిలేకండా నిన్ను పంపిన ధర్మరాజు తలవొంచుకున్నట్టు చేస్తాను. నిన్ను ఎదిరించి కళ్ళుమూసిన వీరుల భార్యలికి పరమానందం కలగజేస్తాను. నీరాక చల్లగా చూసిన కృష్ణుడిప్రాణం జల్లుమనిపిస్తాను. నిన్ను గెలిపిస్తానని ఆసపడుతున్నాడు అర్జునుడు, ఆ చేవేదో తేల్చేస్తాను. అదృష్టంకొద్దీ దొరికావు. తోక ముడిచెయ్యకండా నిలబడు. నీఆయుధాలు మాడ్చేస్తాను. గుర్రాలు కూల్చేస్తాను. సారథిని చంపేస్తాను. నిన్ను రక్తస్నానం చేయిస్తాను. భూదేవికి బలిపెడతాను" అన్నాడు.

"ఇలా తెగించి యుద్ధానికివచ్చిన యోధుణ్ణి చూస్తే పండుగేనోయి నాకు" నవ్వుతూ అన్నాడు సాత్యకి — "మీ అందరికీ కాలయముణ్ణి నేను; తెలుసా! ఎదురుగావుండి అడ్డుకోక ఇంతదూరం వచ్చావేం, వొంగీ వొదిగీ! పైగా పెచ్చురేగి నోటికివచ్చినట్టూ కూస్తున్నావు! నీనాలిక చీల్చేస్తాను. పొల్లుమాటలు కట్టిపెట్టి తిన్నగా నోరుమూసుకో" అన్నాడు.

ఇలా ఇద్దరూ కంటసమైనమాట లాడుకుంటూ వొకళ్ళమీద వొకళ్ళుకలబడ్డారు. రకరకాల బాణాలతో కొట్టుకున్నారు. ఒకళ్ళ బాణాలు వొకళ్ళు ముక్కలుచేశారు. ఒకళ్ళకవచం వొకళ్ళు పగలగొట్టారు. ఇద్దరూ రక్తస్నానాలుచేశారు. రెండుఏనుగులు దెబ్బలాడుతూవుంటే ఎలాచూస్తారు, అదిగో అలాగచూశారు మన వాళ్ళు వాళ్ళని.

ఇద్దరి గుర్రాలూ కూలిపోయాయి. ఇద్దరిసారథులూ మూర్ఛపోయారు. ఇద్దరిజెండాలూ ఎగిరిపోయాయి. ఇద్దరిధనుస్సులూ విరిగి

పోయాయి. ఇద్దరూ ఈసుతో కత్తులూ, డాళ్ళూ పట్టుకున్నారు. నేలకి దిగారు. చిత్రవిచిత్రమైన గతులతో కత్తియుద్ధం చేశారు. అంతలో కలబడేవాళ్ళు, అంతలో విడిపోయేవాళ్ళు. కొంచెపు అల సట తీర్చుకునేవాళ్ళు మళ్ళీ కలబడేవాళ్ళు.

ఇద్దరూ డాళ్ళు పగలగొట్టుకున్నారు. కత్తులతోనే కత్తులు ఆపుకుని శరీరాలు కాసుకున్నారు. వేట్లూ, పోట్లూ తప్పించుకున్నారు. కత్తులు విరిగిపోయాయి. ఒకళ్ళమీద వొకళ్ళు వురికేశారు. ఒకళ్ళని వొకళ్ళు అడిసి పట్టుకున్నారు. మల్లయుద్ధంలాగ పెనగులాడారు.

"అర్జునా, సాత్యకిని రక్షించాలి" పెనగులాటలో భూరిశ్రవుడిది పై చెయ్యి కావడం చూసి, అర్జునుణ్ణి తొందరచేస్తూ అన్నాడు కృష్ణుడు - "సింహంపాలబడ్డ ఏనుగులా అయ్యాడితడు. ముందే అంతసేనతోనూ పోరాడాడు. బాగా అలిసిపోయాడు. అంచేతే భూరిశ్రవుడిచేతిలో దెబ్బతినేశాడు చూస్తావేం? అర్జునా త్వరపడు. నీకోసమేకదా వచ్చాడు!"

ఇంతలో సాత్యకిని కిందపడేశాడు భూరిశ్రవుడు. కిందపడిన్ని వోపినంత పెనగులాడాడు సాత్యకి.

"అర్జునా, నీకు సాయపడవచ్చాడు. నీశిష్యుడు. శత్రువుచేత దురవస్థపడుతున్నాడు. ఊరుకుంటావేం? కాపాడు కాపాడు" మరింత తొందరచేశాడు కృష్ణుడు.

"ఇటు ఈరథాలు" ముమ్మరంగా తనని ముట్టడిస్తూన్న రథాలవాళ్ళనిచూస్తూ, సాత్యకితట్టు చూడకండానే అన్నాడు అర్జునుడు- "వొక్కపెట్టుని మనమీద పడుతున్నాయి. కృష్ణా, సాత్యకీ భూరిశ్రవుడూ ద్వంద్వయుద్ధం చేస్తున్నారు. నేను కలగజేసుకోడం తగనిపని. ఈరెండూ ఇలావుండగా, ప్రాణంతో సమానుడు సాత్యకి.

అతడిచావూ చూడలేను. సరే, ఈరథాలవాళ్ళనీ కాసుకుంటాను. సాత్యకినీ చూసుకుంటాను" అన్నాడు.

సాత్యకి అలిసిపోయాడు. భూరిశ్రవుడు సింహంలా అతడిమీద పడ్డాడు. అతడికుడిచేతిమీద ఒకకాలూ, గుండెలమీద ఒకకాలూ వేసి తొక్కిపెట్టాడు. మణికంకణాలతో మెరుస్తూన్నచేత్తో ఒకకత్తి ఎత్తి సాత్యకికంఠానికి గురిపెట్టాడు. ఇంద్రధ్వజంలా కనపడింది నీసేనకి భూరిశ్రవుడి చెయ్యి. ఒక్క క్షణమన్నా వ్యవధిలేదు, ఎగిరిపోతుంది సాత్యకి తల.

"కొట్టూ, కొట్టూ" తడబడిపోతూ అర్జునుణ్ణి మరింత తొందర చేసేశాడు కృష్ణుడు.

భూరిశ్రవుణ్ణి మనసులో మెచ్చుకుంటూనే వెడల్పాటి బాణం చప్పున గాండీవానికి తొడిగాడు అర్జునుడు. గాఢంగా లాగి, తీవ్రంగా వొదిలిపెట్టాడు. మెరుపులావెళ్ళింది బాణం. ఎగిరిపోయి పెద్దపాములా తుళ్ళిపడింది భూరిశ్రవుడిహస్తం. హాహాకారాలుచేసింది మనసైన్యం.

"నువ్వా ఇంత నీచప్పని చెయ్యడం?" చెయ్యి నరికేసి, తన ప్రయత్నం సాగకండాచేసినవాడు అర్జునుడే అని గ్రహించి పట్టరాని కోపంతో అరిచాడు భూరిశ్రవుడు - "నీ కేసి చూడనన్నా చూడలేదు. ఇంకొకడితో పోరాడుతున్నాను. నీచప్పని చేశావు. ద్రోణుడా, ఇంద్రుడా, శివుడా ఎవడు నేర్పాడు నీ కిది? కృష్ణుడే ఇంతపాపానికి పురికొల్పాడా?" అన్నాడు.

"మీరంతా ఏమంత తక్కువతిన్నారు?" ఓకారిస్తూ అన్నాడు అర్జునుడు— "అంతమందీపడి అభిమన్యుణ్ణి చంపెయ్యలేదూ! కావలిసినవాళ్ళకి యుద్ధంలో తోడ్పడడం నీచప్పనా రాజులికి? నీకుసహాయపడలేదని మీనాయకుల్ని తిట్టు కావలిస్తే. పాపం, బాగా అలిసివున్నప్పుడు సాత్యకిమీదపడి చంపబోయావు. నేనంటూ వుంటే అతడు

చచ్చిపోతాడా, వూరికే!" అని అతడి నోరు మూయించాడు. నకులుడూ, మరికొంతమంది రాజులూ అర్జునుణ్ణి నిందించారు. అంత మందినోళ్ళూ అలాగే కట్టించాడతడు. కాని భూరిశ్రవుణ్ణిచూసి అతడి మనస్సు కలుక్కుమంది. "పాడుక్షత్రియధర్మం!" భూరిశ్రవుణ్ణి ఓదారుస్తూ విచారంగా అన్నాడు అర్జునుడు — "నీలాంటివాడికి ఇంతబాధ కలిగించవలసి వచ్చింది. నాఎదట నావాళ్ళని చంపనివ్వనని నేనుచేసిన ప్రతిజ్ఞ విచారించు. మహాత్మా, దీనంతటికీ దుర్యోధనుడే మూలకందం. అతడు నరకానికి వెళతాడు. నువ్వు సద్గతి పొందుతావు" అన్నాడు.

సాత్యకిని వొదిలేశాడు భూరిశ్రవుడు. ఎడమచేత్తో బాణాలు పరుచుకున్నాడు. ప్రాయోపవేశం నిశ్చయించుకుని, ప్రాణాయామంతో యోగంలో కూచున్నాడు. ఇంతలో సాత్యకి జల్దుకుని లేచాడు. చర్రున కత్తి దూశాడు. శ్రీకృష్ణుడూ, అర్జునుడూ, భీముడూ, అశ్వత్థామా, కృపాచార్యులూ, కర్ణుడూ, వృషసేనుడూ— ఇంతమందీ "వద్దూ, వద్దూ" అని కేకలు వేస్తూనేవున్నారు. కాని కోపంతో వాళ్ళు తెలియకండా వురికాడు సాత్యకి. ఒక్క వేటుని భూరిశ్రవుడితల నరికిపారేశాడు. సిద్ధులూ, చారణులూ గుమికూడి, పొగుడుతూ భూరిశ్రవుణ్ణి పుణ్యలోకాలికి తీసుకుపోయారు.

"అభిమన్యుణ్ణి అన్యాయంగా చంపినప్పుడు 'వద్దువద్దు' అనలేకపోయారేం!" భూరిశ్రవుణ్ణి నరికేసి, తనని వద్దంటూన్న కౌరవులతట్టు తిరిగి వురిమాడు సాత్యకి — 'యుద్ధంలో నన్ను పడదోసి తన్నినవాణ్ణి, అతడు మునిఅయినా సరే చంపేస్తాను' అని లోగడ ప్రతిజ్ఞ చేశాను. అర్జునుడి అనుగ్రహంవల్ల ఇది ఇవాళ నిలుపుకున్నాను. అదీ

కాక, 'శత్రువుని ఏవిధంగా అయినా సరే, దెబ్బతీయ్యడమే కర్తవ్యం' అన్నాడు వాల్మీకి. ♦ అంచేత నేను చేసింది ధర్మసమ్మతమే."

"అబ్బ ఎంత పంతగొట్టో సాత్యకి!" అన్నారు మన సైనికులు కొందరు. "దెబ్బతిన్నవాడు వూరుకుంటాడటయ్యా?" అన్నారు కొందరు. "ఇదంతా విధివిధానం, ఎలా తప్పుతుంది?" అన్నారు మరి కొందరు.

ధృతరాష్ట్రుడు : ద్రోణాచార్యులూ, కృతవర్మా గెలవలేక పోయారు సాత్యకిని. అలాంటివాణ్ణి భూరిశ్రవుడు కిందపడదోశాడంటే చిత్రంగావుంది నాకు, అతడు ఎంత అలిసిపోతేనేంగాక!

సంజయుడు : అడగవలిసిన ప్రశ్నే అడిగావు. అయితే దానికి వొక కారణం వుంది. చెపుతాను, విను. చంద్రవంశంలో యయాతి కొడుకయిన యదుడి కులంలో దేవమీఢుడు పుట్టాడు. అతడి కుమారుడు శూరుడు. శూరుడికొడుకు వసుదేవుడు. చక్కని రూపమూ, రూపానికి తగిన గుణమూ కలిగి నవమన్మథుడిలా పెరుగుతున్నాడు వసుదేవుడు. ఇంతలో దేవకుడు అనే రాజు తనకూతురు దేవకికి స్వయంవరం చాటించాడు. ఆస్వయంవరంలో యాదవవీరుడు శిని వసుదేవుడికోసం దేవకిని పట్టుకువచ్చేశాడు స్వయంవరానికి వచ్చిన రాజుల్లో వొక్కడూ శిని పరాక్రమంముందు నిలవలేకవూరుకున్నారు. మన బాహ్లికుడి కొడుకు సోమదత్తుమాత్రం అతణ్ణి వొదిలిపెట్టలేదు. ఇద్దరూ హోరాహోరి పోట్లాడారు. ఇద్దరి రథాలూ విరిగిపోయాయి. ఇద్దరూ కత్తులూ, డాళ్ళూ పట్టుకుని కిందికి దూకేసి కలబడ్డారు. శిని సింహంలా ఆక్రమించాడు. సోమదత్తుని పట్టుకుని కిందపడదోశాడు. అయితే జాలిపడి చంపకండా వొదిలేశాడు ఆసిగ్గుతో తలెత్తి తిరగ

♦ పీడాకరమమిత్రాణాం యత్ స్యాత్ కర్తవ్యమేవ తత్ — వాల్మీకి రామాయణం. యుద్ధకాండ 81.30.

లేకపోయాడు సోమదత్తు. అడివికి వెళ్ళిపోయి, ఎంతో అంతకాలం తపస్సుచేశాడు. చివరికి శివుడు ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకో అన్నాడు. అప్పటికి శిని చచ్చిపోయాడు. అతడి కొడుకు సత్యకుడూ కాలంచేశాడు. సత్యకుడి కొడుకే సాత్యకి. శిని లేకపోతే ఏంగాక తన అవమానం బాధిస్తూనేవుంది సోమదత్తుని. అంచేత శినిమనవణ్ణయినా సరే, అవమానించాలి. అప్పటికిగాని తనక్రోధం శాంతించదు. కనక సాత్యకిని యుద్ధంలో కిందపడదోసి గుండెలమీద 'తన్ని'గలిగిన కుమారుణ్ణి ప్రసాదించమని శివుణ్ణి ప్రార్థించాడు. "అలాగే కానీ" అంటూ అంతర్ధానమయాడు శివుడు. అదిగో ఆవరప్రభావం వల్లే భూరిశ్రవుడు సాత్యకిని అలా కిందపడదోసి తన్నగలిగాడు.

ధృతరాష్ట్రుడు: ఆం! తరవాత యుద్ధమెలా సాగింది?

సంజయుడు : భూరిశ్రవుడు చచ్చాక, జయద్రథుకిశట్టు రథంపోనిమ్మన్నాడు అర్జునుడు. కృష్ణుడు పగ్గాలు సడలించాడో లేదో అశ్వత్థామా, కృపాచార్యులూ, శల్యుడు మొదలైనవీరులూ, దుర్యోధనుడూ అర్జునుణ్ణి అడ్డుకుని పోరాడారు.

## కర్ణుడూ - సాత్యకీ

కర్ణుడూ సాత్యకీ కలబడ్డారు. హోరాహోరి యుద్ధం జరిగింది. ఆవివరం చెప్తాను విను, జరిగిందీ, జరుగుతున్నదీ, జరగబోయేదీ అన్నీ తెలిసినవాడు శ్రీకృష్ణుడు. సాత్యకికి భూరిశ్రవుడివల్ల ఏంజరుగుతుందో ముందే తెలుసు నతడికి. కనకనే తొలినాటిరాత్రి తనసారథి దారుకుడితో అర్జునుడి ప్రతిజ్ఞ నెగ్గించాలి అన్న నెపంతో రథంసిద్ధంగా వుంచమన్నాడు. సాత్యకికి రథం లేదిప్పుడు. తగినసమయం వచ్చింది. తానుచెప్పిన ఆనవాలుప్రకారం శంఖంపూరించాడతడు. అభోతురంకె వేసినట్టు మోగింది పాంచజన్యం.

శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, వలాహకమూ పూసిన రథం గరుడధ్వజంతో ఆగమేఘాలమీద పట్టుకువచ్చాడు దారుకుడు. అతణ్ణి మెచ్చుకుని, రథం సాత్యకి కిచ్చాడు శ్రీకృష్ణుడు. అదంతా ఆశ్చర్యపోతూ చూశాడు అర్జునుడు. జరిగిన సంగతి వివరించాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడిరథ మెక్కాడు సాత్యకి. అర్జునుడికి సహాయపడుతూ ధనుస్సు సారించాడు. అంతలో ఆవేశంతో వచ్చి అతడిమీద కలబడ్డాడు కర్ణుడు.

"భూరిశ్రవుడిచావు సహించలేక సాత్యకిమీద కలబడ్డాడు కర్ణుడు" నవ్వుతూ కృష్ణుడితో అన్నాడు అర్జునుడు — "మనం చెప్పిన పరిగెత్తాలి. ఆలోచించకూడ దిక" అన్నాడు. అంతలో అర్జునుడి చక్రరక్షకులు ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ సాత్యకితో కలిసి కర్ణుడితో కలబడ్డారు.

"మనవాడు కర్ణుడి కేమీ తీసిపోడు. మన చక్రరక్షకులూ కలిశారు. కనక సాత్యకిచింత మనకి అక్కరలేదు" అంటూ జయద్రథుడి కేసి రథం తరిమాడు శ్రీకృష్ణుడు.

కర్ణుడూ సాత్యకీ దారుణంగా ఢీకొన్నారు. అంతమందీ అరిచేతిలో ప్రాణాలు పెట్టుకుని వాళ్ళయుద్ధం చూశారు. దేవతల్లోనూ, దానవుల్లోనూ, గంధర్వుల్లోనూ అలాంటి యుద్ధం జరగలేదంటే నమ్మొచ్చు.

పోరాడి పోరాడి కర్ణుడి వొళ్ళంతా రక్తం వరదలుచేశాడు సాత్యకి. అతడి సారథినీ, గుర్రాల్నీ కొట్టేశాడు. జెండా నరికేశాడు. గొడుగు విరిచేశాడు. రథం ముక్కలు చేసేశాడు. నీకొడుకు దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్ళూ కళ్ళప్పగించి నిలబడిపోయారు. మొనగాళ్ళయిన రాజులు కొందరు సాత్యకిని చుట్టుముట్టారు. చిత్రచిత్రంగా

రథం మెరిపించాడు సాత్యకి. అద్భుతమైన శరవేగం చూపించాడు. వేలవేల రథాలు కొట్టేశాడు; చిందరవందరచేసేశాడు. చావగా మిగిలిన రథాలవాళ్ళు పుంజాలు తెంపుకు పారిపోయారు.

ధృతరాష్ట్రుడు : సారథీ, రథమూ, గుర్రాలూ అన్నీ కృష్ణుడివి కావడంచేతకదూ, అంత ఉత్సాహమూ చూపించి, అంత మొనగాడయిపోయాడు సాత్యకి !

సంజయుడు : కృష్ణుడి రథమే కాదు, సాత్యకిరథమే పట్టుకు వచ్చాడు కొంతసేపటికి దారుకుడి తమ్ముడు. ఏమయిందంటే, దారుకుడు మహావేగంతో రథం తేవడం చూశాడతడు. కృష్ణుడు తెమ్మనడం తనకి తెలియదుకదూ ! అంతేత యుద్ధంలో ఏదో గజిబిజి జరిగిపోయిం దనుకుని, మంచిదొక రథంపూసి, ఆయుధాలతోనూ, సింహపతాకంతోనూ సిద్ధంచేసి, దారుకుడు రథం తెచ్చిన దారినే వచ్చి సాత్యకిని కలుసుకున్నాడు. అన్నగారి రథం వొదిలేసి, తనరథమే ఎక్కి యుద్ధంచేశాడు సాత్యకి. దారుకుడు రథం కృష్ణుడిదగ్గిరికే పట్టుకుపోయాడు. నీకుమాళ్ళు కర్ణుడికి మరో రథం సిద్ధంచేశారు.

ధృతరాష్ట్రుడు : భీముడు వచ్చి అర్జునుణ్ణి కలిశాడు కదా, అతగాడు ఏంచేశాడట !

సంజయుడు : కర్ణుడుచేసిన అవమానంతో చిన్నబుచ్చుకుని అర్జునుడి దగ్గిరికి వెళ్ళి తలవొంచుకున్నాడు భీముడు. కొంచేపు మాటే ఆడలేదు. తరవాత కర్ణుడన్న ప్రతిమాటా వొత్తివొత్తి చెప్పాడు. "ఏమయినాసరే, వాణ్ణి చంపేసికాని తిరిగిరాను" అన్నాడు చివర.

"నా చెవిని పడాలనే అలా అన్నాడువాడు" భీముణ్ణి వారిస్తూ అన్నాడు అర్జునుడు — "అంటే ఏమిటో తెలుసా ! నిన్ను కాదు, నన్నే అన్నాడన్నమాట. నీవనిలేదు, అలావుండు" అంటూ కర్ణుడికేసి తిరిగాడతడు.

"ఏంరా కర్ణా !" భీముణ్ణి సముదాయించి, కర్ణుడిమీద వురిమాడు అర్జునుడు — "భీముణ్ణి నోటికివచ్చినట్టు తిట్టేశావే! సిగ్గులేకండా ఎన్నిసార్లు తోకముడవలేదు నువ్వు. నిన్ను ఎవరైనా తిట్టారా! పొరపాటున పిసరంత గెలుపురావడంతోనే ఇంతగర్రా ఎందుకంటా! నిన్ను ఎరగనివాడు ఎవడున్నాడని! ఇప్పుడిప్పుడు సాత్యకి నిన్ను ఏంచేశాడు! గెలవడం, వోడిపోడం ఎంతవాడికైనా వుంటుంది, యుద్ధంలో. అంతమాత్రాన తగినవాళ్ళని ఇలా ఎవరైనా అంటారా? తలవిలవ నోరు చెపుతుంది. నీకులమూ, గుణమూమాత్రం లోకానికి తెలిసింది, నీకూతవల్ల. అది అలా వుండనీ. నేను లేనప్పుడు అధర్మంగా అభిమన్యుడి విల్లు విరిచేశావు. దానికి బదులు తీర్చేస్తాను. నీకళ్ళముందే వృషసేనుడితల నరుకుతాను, ధర్మయుద్ధంలో. అంతేకాదు, నీతోకలిసి ఆపాపం పంచుకున్న వాళ్ళని అందరినీ ఏంచేస్తానో చూద్దువు కాని" అంటూ అతడిమీదికి తరుముకు వచ్చాడు, మనసేనలూ పోలోమని అతడి మీదికి వెళ్ళాయి. దారుణమైన యుద్ధం జరిగిపోయింది.

సూర్యుడికాంతి చల్లబడుతూవచ్చింది.

"ఇంక కొంచేపులో పొద్దుగూకిపోతుంది" కర్ణుణ్ణి హెచ్చరిస్తూ అన్నాడు దుర్యోధనుడు — "ఇటు సాత్యకినీ, అటు భీముణ్ణీ పెట్టుకుని జయద్రథుడిమీదికి తరుముకువస్తున్నాడు అర్జునుడు. మరికొంచెం మనం ఆపుతూ పోరాడామా గూకేస్తుంది పొద్దు. దాంతో కథ ముగిసిపోతుంది. పోయీ కాలం వచ్చే, ప్రతిజ్ఞపట్టాడు అర్జునుడు. ఇంక ఎంతో సేపు లేదు. కొండంతవీరుడివి నువ్వు. శల్యుడూ, అశ్వత్థామా, కృపాచార్యులూ, దుశ్శాసనుడూ, నేనూ నీతో వుంటే నిభాయించగలవాడెవడు? అయ్యగారిపని అయిపోతుంది. ఇతడు అగ్గిలో దూకేస్తే ఇతడి అన్నదమ్ములూ, ఈమద్దత్తుదార్లూ చస్తారు. ఈభూమి యావత్తూ

మనమే ఏలుకుంటాం. ఇదిగో ఇప్పుడే నీచేవా నీపట్టూ చూపించాలి" అన్నాడు.

"ఎలా యుద్ధం చేస్తానో చూద్దువుకాని" ధనుస్సు సారిస్తూ అన్నాడు కర్ణుడు – "తరవాత దేవుడే వున్నాడు. రాజు మన్నించిన మొనగాడు యుద్ధంలో ఆమాత్రం సాధించకపోతే ఏముందిక! భీముడి బాణాలతో వొళ్ళంతా పచ్చిపుండులా వుంది. అయితేనేం, అర్జునుడా నన్ను మించిపోతాడు!" అన్నాడు.

కర్ణుడి మాటలతో ధైర్యం హెచ్చింది దుర్యోధనుడికి. గాలి దేవుడితో కలిసిన అగ్గిదేవుడిలాగ భీముడితోనూ, సాత్యకితోనూ కలిసి విజృంభించాడు అర్జునుడు. భల్లమూ, అంజలికమూ, క్షురప్రాసమూ మొదలైన బాణాలు నీసేనమీద కురిపించాడు. దాంతో చతురంగ బలాల అవయవాలు, ఛత్రచామరాలూ, జెండాలూ, ధనుస్సులూ, గదాదండాలూ, రకరకాల ఆయుధాలూ ముక్క ముక్కలయి రక్తనదుల్లో కొట్టుకుపోయి, కుప్పలుపడ్డాయి.

అప్పుడు దుర్యోధనుడూ, కర్ణుడూ, వృషసేనుడూ, శల్యుడూ, కృపుడూ, అశ్వత్థామా వొక్క మొగిని వురికారు. తమతోకూడా వురుకుతూన్న జయద్రథుణ్ణి వెనక్కితోసేసి ముందుకి వెళ్ళారు. పొద్దు పోతూన్నకొద్దీ చేవెక్కి అర్జునుడిమీద తీవ్రంగా బాణాలు గుప్పించారు. వాళ్లు వేసినబాణాలు వొక్కొక్కటీ ఎన్నోఅన్ని ముక్కలుకింద కొట్టేశాడు అర్జునుడు. అందరూ వొక్కసారి కలబడి వొక్కొక్కడూ ఎన్నోఅన్ని బాణాలు మళ్ళీమళ్ళీ కృష్ణుడిమీదా అర్జునుడిమీదా కుమ్మరించారు. మాట్లాడకుండా అంతమందినీ లెక్కాజమా లేనన్ని బాణాలు కొట్టి కీచుకీచుమనిపించాడు అర్జునుడు.

## కర్ణుడూ అర్జునుడూ కలబడ్డారు

కోపంతో ఇన్నూ మన్నూ కనపడలేదు కర్ణుడికి. భూమి అదిరి పోయినట్టు రథం పరిగెత్తించాడు. అమాంతంగా అర్జునుడిమీదికి వురికాడు. మెరుగుపెట్టిన మంచిమంచిబాణాలు పదిహేను తగిలించాడు అర్జునుడు. అలాంటివే భీముడు వొకమూడూ, సాత్యకి వొకమూడూ చురుక్కు చురుక్కుమనిపించారు. తొక తొక్కిన తాచులా లేచాడు కర్ణుడు. అర్జునుణ్ణీ, భీముణ్ణీ, సాత్యకినీ తలా అరవయ్యేసిబాణాలు కొట్టి ఇదీ నావడి అన్నట్టుచూశాడు. ఆశ్చర్యపోయారు జనం.

ఒక వందబాణాలు లిప్తలమీద తగిలించాడు అర్జునుడు. కర్ణుడి వొళ్ళంతా చీలికలు చేసేశాడు. రక్తం ధారలుకట్టించాడు. మరింత మండిపడ్డాడు కర్ణుడు. అమాంతంగా అయిదువందలబాణాలు అర్జునుడి మీద కురిపించాడు.

కర్ణుడిధనుస్సు అర్జునుడు నరికేశాడు. గుండెలు దూసుకుపోయి నట్టు తొమ్మిదిబాణాలు వేసి, ప్రాణాంతకమైన వొక మహాస్త్రం చప్పున వొదిలిపెట్టాడు. అడ్డంగా వొక అర్థచంద్రబాణం వేసి అది ముక్కలు చేసేశాడు అశ్వత్థామ.

జిగేలుమనిపోతూవున్న మరొక బంగారం ధనుస్సు తీశాడు కర్ణుడు. చరచరా శరవర్షం కురిపించేశాడు.

"ఆగవోయి కర్ణా! అర్జునుణ్ణి ఎరగవూ!" ప్రచండమైన బాణాలు మొంచెత్తుతూ వురిమాడు అర్జునుడు.

"ఆగూ, ఆగవోయి అర్జునా, కర్ణుడు కనపడలేదూ!" గట్టిగట్టి బాణాలతో కప్పేడుతూ గదిమాడు కర్ణుడు. ఒకళ్ళ బాణాల్లోవొకళ్ళు కప్పడిపోయి వొకళ్ళకి వొకళ్ళు కనపడకండా ఘోరంగా పోరాడారు వాళ్ళు.

"కర్ణుడికి సాయం చెయ్యండి! పరిగెత్తండి!" తనవాళ్ళవి హెచ్చరిస్తూ అరిచాడు దుర్యోధనుడు. మనవాళ్ళు విరగబడ్డారు. ఉగ్రనరసింహుడే అయిపోయాడు అర్జునుడు. కర్ణుడి గుర్రాలు చంపేశాడు. సారథిని నరికేశాడు. భయంకరమైన బాణాలువేసి కర్ణుణ్ణి గట్టిదెబ్బలు కొట్టేశాడు. కరచరణాలు ఆడలేదు కర్ణుడికి. అప్పుడు అతణ్ణి అమాంతంగా తనరథంమీదికి తెచ్చేశాడు అశ్వత్థామ.

శల్యుడూ, కృపుడూ, వృషసేనుడూ వాళ్ళపక్కచేరి, అర్జునుడిమీద బాణాలు గుప్పించారు. వాళ్ళ నలుగురివెనకా పొంచిపొంచి జయద్రథుడూ వొదిలాడు బాణాలు.

అశ్వత్థామా మొదలైనవాళ్ళ పరాక్రమానికి బదులుచెప్తుతూనే జయద్రథుడిమీద గబగబా బాణాలు వేశాడు అర్జునుడు. అదే సమయమంటూ సేనలికి చెయ్యివిసిరి ఉషారిచ్చాడు దుర్యోధనుడు. రకరకాల ఆయుధాలు కుమ్మరిస్తూ విజృంభించాయి మనసేనలు.

అసలే అర్జునుడు. అతడా అవి లక్ష్యపెడతాడు! ఆకాశం అదిరిపోయినట్టు గాండీవం మోయించాడు. ఘోరమైన మహాస్త్రాలు ప్రయోగించాడు. ఏనుగులు నరికేశాడు. రథాలు విరిచేశాడు. గుర్రాలు చంపేశాడు. సేనసేనంతా చిందరవందరచేసేసి వెంటతరిమాడు. మిట్టమధ్యాహ్నం సూర్యుడిలాగ చూడశక్యంకాకండా ప్రకాశించాడు. ఆకాశంమీద దేవతలే నాలికలు కరుచుకున్నారు.

కొంచేపటిలో మళ్ళీ మనయోధులు యావన్మందీ వొక్కమొగిని ఎగబడ్డారు. అంతమందినీ అదిలించేశాడు అర్జునుడు. బాణప్రవాహంలో ముంచెత్తాడు. కొట్టికొట్టి తరిమాడు. అగ్నిశిఖల్లాటి బాణాలు జయద్రథుడిమీద ప్రయోగించాడు.

మహారాజా, మనజయద్రథుడు పారిపోలేదు. అర్జునుడిమీదా, అతడి గుర్రాలమీదా, గాండీవంమీదా, కపిధ్వజంమీదా బాణం

మీద బాణం వేశాడు. భళీ అంటే భళీ అంది మనసేన. సెబాస్ అంటే సెబాస్ అన్నారు దేవతలు.

జయద్రథుడి వరాహపతాకం ఎగరగొట్టేశాడు. అర్జునుడు అతడి సారథితల నరికేశాడు. తామరాకుమీద సీటిబొట్టులాగ వొణికి పోయింది నీసైన్యం.

చేతిలో చేవవున్నంతవరకూ, కంఠంలో ప్రాణమున్నంతవరకూ బాణాలు వేసీ, పోరాడీ అడ్డుపడ్డారు సింధాలవాళ్ళు. కృపుడూ, అశ్వత్థామా, శల్యుడూ, వృషసేనుడూ ప్రాణాలికి తెగించి జయద్రథుడికి అడ్డుపడ్డారు. అతణ్ణి కొట్టడానికి సందుదొరకలేదు అర్జునుడికి. పెదవి కరుస్తూ అతడు పొద్దుదిక్కు చూశాడు.

## మాయ చీకటి

"పొద్దు గూకిపోతోంది" పడమటికి చూస్తూన్న అర్జునుడితో అన్నాడు శ్రీకృష్ణుడు - "పంతానికి కూచుని యుద్ధంచేస్తే సాగ దిక. దీనికి వొక ఉపాయం కల్పిస్తాను. దాంతో కాని శత్రువు చవ్వడు. ఏమిటంటావా? సూర్యబింబం మరుగుపడిపోయినట్టు చేస్తాను. మాయ చీకటి కల్పిస్తాను. పొద్దు గూకిపోతోందనే అనుకుంటారు కౌరవులు. చెంకలు గుద్దుతారు. నీప్రతిజ్ఞ కొండెక్కిపోయిం దనుకుంటారు. యుద్ధం మానేస్తారు. ఒకళ్ళని వొకళ్ళు మెచ్చుకుంటారు. విచ్చలవిడిగా గెంతుతారు. అదిగో ఆసమయంలో నీశపథం పూర్తిచేసుకో" అన్నాడు.

"పరాక్రమంమాత్రం పనికిరాలేదు" మొహం వేలవేసుకుంటూ అనుకున్నాడు అర్జునుడు. చిరునవ్వుతో అతణ్ణి చూస్తూ మాయచీకటి కల్పించాడు శ్రీకృష్ణుడు. సూర్యబింబం మాయమయింది.

పొద్దు గుంకిపోయిందనే అనుకున్నారు మనవాళ్ళు. సంతోషం పట్టలేకపోయారు. ఒకటే కోలాహాలం మొదలెట్టారు. జయద్రథుడు

బ్రహ్మానందంతో రథంమీద నుంచుని, తలెత్తి మాటిమాటికీ పడ మటికి చూశాడు.

"అదిగో అర్జునా, రథంమీద అర్రెత్తి చూస్తున్నాడు జయ ద్రథుడు. ఊఁ, తెగొయ్యి తలకాయ" అన్నాడు శ్రీకృష్ణుడు.

## జయద్రథుడివధ

చూశాడు అర్జునుడు. గంధంతోనూ, పువ్వులతోనూ పూజిం చిన వాడి బాణం వొకటి అమ్ములపొదిలోంచి తీశాడు. గాండీవానికి తొడిగాడు. జంయ్యిని వొదిలిపెట్టాడు. రివ్వున వెళ్ళింది బాణం. పిట్టని తన్నుకుపోయిన డేగలాగ జయద్రథుడిశిరస్సు ఎగరేసుకుపోయింది, ఆకాశం మీదికి.

"అర్జునా! అర్జునా! జయద్రథుడితల కిందపడనివ్వకు" తడ బడిపోతూ అన్నాడు శ్రీకృష్ణుడు — "అది ఆకాశంమీదే వుండనీ. కిందపడిందా కొంపమునుగుతుంది. చెపుతాను దాని సంగతి" అన్నాడు.

బాణంమీద బాణం వేస్తూ కిందపడకండా ఆకాశంమీదే ఆశిరస్సు నిలబెట్టాడు అర్జునుడు. ఎడమకీ, కుడికీ, ముందుకీ, వెనక్కీ బంతిలాగ ఎగరేశాడు.

మాయచీకటి మాయమయింది. సూర్యబింబం తిరిగీ అవుపిం చింది. మన మొనగాళ్ళంతా ఏకమై అర్జునుణ్ణి ముట్టడించారు. శరవర్షం కురిపించారు. రకరకాల బాణాలుకొట్టి వాళ్ళ ఉద్ధృతం అదలిస్తూనే ఆకాశంమీది శిరస్సుపడకండా ఆడిస్తూనేవున్నాడు అర్జునుడు. అద్భుత మైన హస్తలాఘవంచూపెట్టి వీరవిహారం చేశాడు.

"ఇలా ఎంతసేపు జయద్రథుడితల ఆకాశంమీద వుంచేది? " అర్జునుడు కృష్ణుణ్ణి అడిగాడు — "ఎక్కడ విసర్యమంటావు దీన్ని? అసలు ఎందు కిలా చెయ్యాలి?"

“చెపుతా” అంటూ అందుకున్నాడు కృష్ణుడు — “సింధు దేశంరాజు వృద్ధక్షత్రుడు సంతానంకోసం తపస్సుచేసి కన్నాడు జయద్రథుణ్ణి. ‘యుద్ధంలో పరాకుగా వున్నప్పుడు ఇతడితల తెగిపోతుంది’ అంది ఆకాశవాణి వొకనాడు. ‘అయితే వీడి శిరస్సు ఎవడు కింద వేస్తాడో వాడితల నూరుముక్కలయిపోతుంది’ అన్నాడు తపోబలంతో వృద్ధక్షత్రుడు. అతడిమాట అమోఘం.

“కుమారుడికి పట్టంకట్టి అడివికిపోయి తపస్సుచేసుకుంటున్నాడు వృద్ధక్షత్రుడు. ఇంచేత ఇతడితల నువ్వు కిందపడనివ్వకు. వృద్ధక్షత్రుడి తొడమీద పడెయ్యి. అయితే అది పాశుపతంవల్లకాని సాద్యంకాదు.

“వృద్ధక్షత్రుడు శమంతపంచకం సమీపంలో వున్నాడు. చప్పున పాశుపతాన్ని ప్రార్థించు” అన్నాడు.

భక్తిపూర్వకంగా నియమప్రకారం పాశుపతం ప్రయోగించాడు అర్జునుడు. బాణపరంపరగా పరిగెత్తింది పాశుపతం. జయద్రథుడితల మోసుకుని శమంతపంచకం వెలపల బృహత్క్షత్రుడిఆశ్రమానికి వెళ్ళింది. జపంలోవున్నాడు బృహత్క్షత్రుడు. అతడి తొడలమీద పడింది శిరస్సు. తుళ్ళిపడి, శిరస్సు కిందపడేశాడు బృహత్క్షత్రుడు. ఉత్తరక్షణంలో వందచెక్కలయిపోయింది అతడితల.

శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి మెచ్చుకున్నాడు. సకల భూతాలూ ఆశ్చర్యంలో ములిగిపోయాయి. అర్జునుడు పాశుపతం ఉపసంహరించాడు. మనసేనలు కొయ్యబారి నిలబడిపోయాయి. కొవ్వు అడిగిపోయి తలవొంచుకున్నారు మన యోధులు.

తల కిందపడ్డదాకా రథంమీద అలాగే నిలబడివుంది జయద్రథుడి మొండెం. అటు తల నేలపడింది, ఇటు మొండెం కిందపడింది.

అది మరీ చిత్రమనిపించింది చూసినవాళ్ళకి. అదిగో అలాగ ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు అర్జునుడు. కన్నీళ్ళు కార్చుకుంటూ దుఃఖంతో కుంగిపోయారు సైకువాళ్ళు. కృష్ణుడూ, అర్జునుడూ ఆనందంతో కల కల్లాడారు. భీముడు సింహనాదంచేశాడు. విని, కొండ అందుకున్నట్టు సంతోషించాడు ధర్మరాజు. మూరెడెత్తు పుష్పాంగారు వాళ్ళ యోధులు. కేకలూ, తూర్యధ్వనులూ పాండవసేన అంతటా ఓ, గింగురుమనిపోయాయి.

---

# ద్రోణపర్వం



## అయిదో ఆశ్వాసం

"తరవాత మనవాళ్ళు ఏమయారు?" కృష్ణార్జునుల విక్రమ విహారం విని బిక్కమొహం వేసి అడిగాడు ధృతరాష్ట్రుడు.

సంజయుడు: అలా వుప్పొంగిన పాండవసేన ద్రోణాచార్యుల మీద విరుచుకుపడింది; ఘోరంగా యుద్ధంచేసింది. ఇక ఇక్కడ— అశ్వత్థామా, కృపాచార్యులూ ఉగ్రులయిపోయి అర్జునుడిమీద పిడుగుల్లాటి బాణాలు కురిపించారు. అవన్నీ అనాయాసంగా కొట్టి పారేశాడు అర్జునుడు, కోపమన్నా తెచ్చుకోకుండా. ఎన్నో అన్ని బాణాలు ఇద్దరిమీదా గుప్పించాడు. రక్తం వరదలుకట్టి మూర్ఛ పోయాడు కృపాచార్యులు రథం తప్పించుకు పట్టుకుపోయాడు అతడి సారథి. అశ్వత్థామా తప్పుకుపోయాడు. తక్కిన రథికులూ ఎదిరించ లేక దూరదూరంగా నుంచుండిపోయారు. తన బాణాలు తగిలి కృపాచార్యులు మూర్ఛపోడం చూసి నొచ్చుకున్నాడు అర్జునుడు. క్షత్రియధర్మం నిందిస్తూ ఎంతో అంత విచారించాడు.

"నీభాగ్యమే భాగ్యమోయ్" అర్జునుణ్ణి కౌగిలించుకుంటూ అన్నాడు శ్రీకృష్ణుడు—"కౌరవబలం గెలవడం దేవతలకైనా సాధ్యం కాదు. అలాంటిది నువ్వు అవలీలగా గెలిచేశావు. ఎంతయినా పొగడ వచ్చునంటాను నీభుజబలం. ఇదిగో వృద్ధక్షత్రుణ్ణీ, జయద్రథుణ్ణీ హాత వార్చినట్టే కర్ణుణ్ణీ ఎప్పుడు కడతేరుస్తావో, అప్పుడూ నాకు తృప్తి" అన్నాడు.

"ఇదంతా నీచలవ బావా," వినయంగా అందుకున్నాడు అర్జునుడు — "నీదయవల్లే నాశపథం నెరవేర్చుకున్నాను. నీదయవల్ల పాండవుల మనోరథం సిద్ధించడంలో వింతేముంది! నీఆశ్రితులికి అపజయ మెలా కలుగుతుంది? భారమంతా నీదే. నీఆజ్ఞ నెరవేర్చడమే మా పని."

"పొద్దు గుంకిపోతోంది" చిరునవ్వుతో అన్నాడు శ్రీకృష్ణుడు— "పద ధర్మరాజుని కలుసుకుందాం."

అర్జునుడి రథం మళ్ళింది. భీముడూ, సాత్యకీ, యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ కులాసాగా సల్లాపాలాడుకుంటూ వెంటనడిచారు. ఒత్తుగా రక్తంపడి, ఘోరంగావున్న రణస్థలంమీంచి సాగాయి రథాలు.

"ఎంతటివాడివోయి నువ్వు!" అర్జునుణ్ణి పొగుడుతూ అన్నాడు శ్రీకృష్ణుడు — "ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, పదాతులూ, సేనాధిపతులూ, రాజులూ, అస్త్రశస్త్రాలూ, చామరాలూ, గొడుగులూ, జెండాలూ, ఆభరణాలూ – ఎలా పడున్నాయో చూడూ! రణభూమి చిత్రవస్త్రం కప్పినట్టుంది! ఇదంతా నీచేతిమహిమ కదూ!"

నిశ్చేరపోయి నించున్న శత్రుయోధుల మధ్యనించి నిరాఘాటంగా నడిచిపోయాయి అర్జునుడిరథమూ, అతడివెంట తనవాళ్ళ రథాలూనూ.

యుద్ధంచాలించి అప్పుడేవాళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు ధర్మరాజు. దగ్గిరపడగానే శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్త మూదాడు. రథం దిగి ఆనందబాష్పాలతో ఎదురు వచ్చాడు ధర్మరాజు. తడబడుతూ రథం దిగి, కాళ్ళనడకని వెళ్ళి నమస్కారంచేశారు కృష్ణార్జునులు. ఆనంద బాష్పాలు చేతులతో తుడిచేసు

కుని ఇద్దరినీ చూశాడు ధర్మరాజు. అతడి వొళ్ళు పులకరించింది. ఇద్ద రినీ గుచ్చి కౌగిలించుకున్నాడు, గాఢంగా.

"చెయ్యి నెత్తురుకాకండా జయద్రథుణ్ణి హతవార్చి, తిరిగి వచ్చారు" అర్జునుడితో అన్నాడు ధర్మరాజు – "నాభాగ్యం నేనే పొగుడుకుంటున్నాను. ఇదంతా శ్రీకృష్ణుడి అనుగ్రహం."

"ఇదంతా నీసత్యవ్రతమహిమ. ధర్మరాజా, నువ్వు గట్టిగా కళ్ళెర్రచేస్తే జయద్రథుడేఅన్న మాటేమిటి? ఎంతవాడైనా ఇట్టే మాడిపోతాడు" అన్నాడు శ్రీకృష్ణుడు.

"దేవా," శ్రీకృష్ణుణ్ణి స్తోత్రంచేస్తూ అందుకున్నాడు ధర్మ రాజు – "నువ్వే ఎర్రగా చూస్తేచాలు, దేవతలూ రాక్షసులూ మండిపోతారు. నీవాత్సల్యమే సకలలోకాలికీ సౌఖ్యం కలిగిస్తుంది. నీభక్తులు శత్రుసంహారం చేశారంటే వింతేముంది? భీష్ముడంతటి వీరుడు పడిపోడానికి నువ్వేకదా కారణం! నీకు కోపం తెప్పించడంవల్లే కౌరవులు చెడ్డారు" అన్నాడు.

"మహాధర్మాత్ముడివి నువ్వు. నీకు నష్టం కలిగించినవాడు చెడ కండా ఎలావుంటాడు?" అన్నాడు శ్రీకృష్ణుడు.

ఇంతలో భీముడూ, సాత్యకీ వచ్చారు. కొత్తగాయాలతో వాళ్ళ శరీరాలు అదో అందంగా వున్నాయి. ఇద్దరూ రథాలు దిగి ధర్మ రాజుకి పాదాభివందనం చేశారు. ఇద్దరినీ ఎత్తి కౌగిలించుకున్నాడు ధర్మరాజు. ద్రోణుణ్ణీ, కృతవర్మనీ వాళ్ళు వోడించడం ప్రశంసించాడు. వాళ్ళ వెనక యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ వచ్చి నమస్కరించారు. వాళ్ళనీ తగినమాటలతో సత్కరించాడు ధర్మరాజు. పాండవ సేనలో ఆనందమే ఆనందం తాండవమాడింది. చతురంగబలం యీలవేస్తూ కయ్యానికి కాలుదువ్వుతూ కేరింతలుకొట్టింది.

దుర్యోధనుడి దుఃఖం మహారాజా, ఇంతా అంతా కాదు. "ద్రోణుడూ, కర్ణుడూ, కృపుడూ, అశ్వత్థామా – వీళ్ళేకాదు, అర్జునుడికి బాగా కోపంవస్తే దేవతలైనా తేరిచూడలేరు. అది ఇవాళతో తేలిపోయింది. బ్రహ్మాండమైన పరాక్రమం అతడిది" అంటూ దిగాలు పడిపోయా డతడు. మనస్సు మనస్సులో లేక తిన్నగా ద్రోణాచార్యులదగ్గిరికి వెళ్ళాడు. శత్రువుల గెలుపూ, తనవాళ్ళచావూ వర్ణించి చెప్పాడు.

## "అర్జునుడంటే అభిమానం"

"భీష్ముణ్ణి పడగొట్టి, అన్నదమ్ములతో హాయిగా కులుకుతున్నాడు శిఖండి. ఇవాళ ఏడు అక్షౌహిణీలసేన హతమార్చాడు అర్జునుడు. జయద్రథుడివధ ఆశ్చర్యం! సుదక్షిణుడూ, శ్రుతాయుధుడూ, విందానువిందులూ, అలంబుసుడూ, జలసంధుడూ, సుదర్శనుడూ, భూరిశ్రవుడూ—ఎంతో మంది కూలిపోయారు. వీళ్ళతోపాటు హతమై పోడమో, పాంచాలంవాళ్ళనీ పాండవుల్నీ హతెయ్యడమో – ఈ రెంటిలో ఏదోఒకటి చేస్తేనే కాని నాకోసం ప్రాణాలిచ్చిన ఇంత మంది రుణమూ ఎలా తీరుతుంది !

"ఇంతకీ అర్జునుడంటే వల్లమాలిన అభిమానం నీకు. నీకు నచ్చిన బంటు అతగాడు. అంచేత అతడిమీద చెయ్యిచేసుకోవు నువ్వు. కర్ణుడు వొక్కడే కలగజేసుకుంటాడు నీలాటి వలపక్షాలూ, దుశ్చేష్టలూ లేవు అతడికి. నిజమైన వీరు డతడు. అయితే ఏంలాభం! ఒక్కడూ ఎంతని పెనుగులాడతాడు? పోరాడి పోరాడి చిట్టచివర జయద్రథుణ్ణి పోగొట్టుకున్నాడు!" అంటూ నిట్టూర్చాడు.

"అర్జునుణ్ణి గెలవడం కష్టసాధ్యమని లక్షసార్లు చెప్పాను" నొచ్చుకుంటూ ఎత్తుకున్నాడు ద్రోణాచార్యులు – "పూరికే నా

ప్రాణం కోరుక్కుతినేస్తే ఏంలాభం! దేవతలన్నా గెలవలేని భీష్ముణ్ణి అతడు కొట్టేసినప్పుడే అనిపించింది నాకు, కౌరవులు మరి బతకరని. ఊరికేఅభిమానం కాసుకోడానికిమాత్రం యుద్ధంచేస్తున్నాను. అంతే. శకుని వేసిన పాచికలూ, గాండీవం విడిచిన బాణాలూ నిన్ను వేధించ కండా ఎలా వొదులుతాయిప్పుడు? విదురుడు అలా మొత్తుకుంటున్నా వినకండా, పుణ్యసతిని ద్రౌపదిని పెట్టినపాట్లు – ఆపాపఫలం కట్టికుడప కండా ఎలా విడిచిపెడుతుంది? ఆసభలో నువ్వూ, దుశ్శాసనుడూ, కర్ణుడూ పుణ్యచరిత్రులయిన పాండవులికి చేసినకీడు మిమ్మల్ని చెరప కండా వూరుకుంటుందా?

"అన్నిపాట్లు పెట్టాక అయినా కనికారం లేకపోయింది మీకు. అన్యాయంగా అడవులపాలుచేశారు వాళ్ళని. తిరిగివచ్చి మాసగపాలు మాకు ఇమ్మని ప్రాధేయపడ్డారు వాళ్ళు. మొండిచెయ్యి చూపెట్టావు నువ్వు. పాపం, అలాంటివాళ్ళమీద కత్తికట్టడానికి తెగించాను నేను. నేనూ వొక బ్రాహ్మణ్ణేనా అంటూ! నువ్వూ నీవాళ్ళూ అక్కడ జయ ద్రథుణ్ణి కాపాడలేకపోయారు. నేనుమాత్రం నీవాణ్ణి కానా? నన్నే ఎందుకు నిందిస్తున్నావో అర్థంకావడంలేదు నాకు. పాంచాలవీరులూ, పాండవులూ పోగరెక్కి, తరిమితరిమి ఎంతచెయ్యాలో అంతాచేశారు. ఒళ్ళు మండిపోతూవుంది. కుళ్ళుమాటలాడి మరింత వేధిస్తున్నావు, కాలినపుండుమీద కారం చల్లినట్టు.

## పాంచాలంవాళ్ళని చంపందే కవచం వొదలను

"ఇన్నిమాటలతో పనిలేదిక. పాంచాలంవాళ్ళని చంపందే కవచం వొదలను. ఇదే నా శపథం. ఈరాత్రి యుద్ధానికే తలపడు తున్నారు వాళ్ళు ఉద్ధృతంగా. మనసైన్యాలు చేవచెడకండా యుద్ధం చేసేలా చూడు. నువ్వూ నీశక్తికి తగిన పరాక్రమం ప్రకటించు. కట్ట

కడపటి మాటలుగా నీకు చెపుతున్నాను. దుర్యోధనా, వృద్ధుల్ని సేవించు. ధర్మంగా ప్రవర్తించు. నా కుమారుడు అశ్వత్థామ విచార పడకండా చూడు. అతణ్ణి అన్నివిధాలా సముదాయించు. నాచేత చవ్వకండా మిగిలిపోయిన పాంచాలంవాళ్ళని చంపెయ్యమను. ఒక్కణ్ణీ మిగలనివ్వకూడదు వాళ్ళని" అన్నాడు.

మహారాజా, తుదితెగింపే చేసుకున్నాడు సేనాని ద్రోణాచార్యులు. దృఢమైన నిశ్చయంతో అతడి మొహం జేవురించింది. ఒక కొత్తకళతో ప్రకాశించింది. జూలుదులిపిన సింహంలాగ, కార్యతత్పరుడయ్యాడతడు. చెదురుమదురయిపోయిన నీసేనయావత్తూ వొకదగ్గిర చేర్చాడు. కొత్తఉత్సాహంతో యుద్ధానికి పురికొల్పాడు.

దుర్యోధనుడికిమాత్రం ద్రోణుడిఉద్యోగంతో ఉత్సాహం కలగ లేదు. కళా కాంతీలేని మొహంతో కర్ణుడిదగ్గిరికి వెళ్ళాడతడు.

"ఈముసిలిబ్రాహ్మణ్ణి పెట్టుకుని యుద్ధంచేస్తే ఇక తెల్లారినట్టే మనకి !" ద్రోణుణ్ణి దుయ్యబడుతూ కర్ణుడితో ఎత్తుకున్నాడు దుర్యోధనుడు – "మనం ఎంత చెడ్డవాళ్ళమో మరి! అర్జునుడంటే అంత ప్రేమ ఆచార్యుడికి ! అభేద్యమైన అంతవ్యూహం పన్నాడు. ఆఖరికి అర్జునుణ్ణి లోపలికి వొదిలేశాడు. ఇంత ఘోరానికీ అతడే కారణం. ఒక్కడు గాక వొక్కడు చొరబడ్డాడు అర్జునుడు. అంతమందిరాజుల్ని హాత వార్చేసి, జయద్రథుణ్ణి చంపేశాడు. ఏమిటీ అతడి పరాక్రమ ! ద్రోణుడే అడ్డేసివుంటే ? తనమాట నమ్మాం. జయద్రథుణ్ణి మనవ్యూహంలో పెట్టాం. ముందే తెలిసుంటే అతణ్ణి ఇంటిదగ్గిరే పెట్టి వచ్చే వాళ్ళం. మన ఇంతసేనా నాశనంకాకండా వుండేది. అతడూ బతికి పోయేవాడు" అన్నాడు.

"ద్రోణుణ్ణి నిందించి ఏంలాభం ?" సముదాయిస్తూ అన్నాడు. కర్ణుడు – "ఓపినంత పోరాడతాడు కాని అంతకంటే అతడుమాత్రం

ఏంచేస్తాడు ? అర్జునుడికి బలం అధికమైనప్పుడు ఎలా ఆపగలడతడు ? ఇంతకీ దైవమే వాళ్ళపక్షమున్నాడు. అలా కాకపోతే, విషం పెట్టాం, ఇల్లు కాల్చాం, అడివికి తరిమాం - అయినా చెక్కు చెదిరిందా వాళ్ళకి ! అంచేత దేవుడే చంపేశాడు మన జయద్రథుణ్ణి. యుద్ధంలో దుఃఖపడకూడదు; అధైర్యపడకూడదు. విధిచేసినదానికి విచారమెందుకూ ?" అన్నాడు.

ఇంతలో వ్యూహంకట్టుకుని మనసేనలమీదికి వచ్చాయి పాండవ సేనలు. అప్పటికే మనసేన సిద్ధంచేశాడు ద్రోణుడు. రెండు సేనలూ జంయ్యామని ఢీకొన్నాయి.

గుర్రంతో గుర్రం, ఏనుగుతో ఏనుగు, రథంతో రథం, భటుడితో భటుడు - ఉద్రేకంతో కలబడ్డారు. మహారాజా, ఆయుద్ధంబిగి ఏం చెప్పనూ, కళ్ళుమూసుకుపోయాయి. ఆయుధాలు వొకదానికి వొకటి తగిలి అగ్గినిప్పులు రాలాయి; పొడిపొడి అయిపోయి కిందపడ్డాయి. ఖణేలుమంటే ఖణేలుమన్నాయి.

జయద్రథుడిచావుతో గుండె చెదిరిపోయివున్నాడు దుర్యోధనుడు. తెగించి పిచ్చివాడిలా వురికాడు యుద్ధానికి. ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ అడ్డుకుని అతణ్ణి వెనకపెట్టి ముందుకివెళ్ళారు. చెప్పలేని ఆవేశంతో శత్రుసేనలో చొరబడ్డారు. రకరకాల తీవ్రమైనబాణాలు వడగళ్ళవానలాగ అదే కురిపించడం కురిపించారు.

పాండవుల చతురంగబలం యావత్తూ చిందరవందర అయిపోయింది. మదపుటేనుగు కలిచేసిన తామరచెరువులా అయిపోయింది. సమర్థులయిన శత్రుయోధులు వొక్క మొగిని దుర్యోధనుణ్ణి చుట్టుముట్టారు. అన్నిటికీ తెగించే వున్నాడతడు. భీముణ్ణి పదిహేనుబాణాలతోనూ, నకులసహదేవుల్నీ, ద్రుపదుణ్ణీ, విరాటరాజునీ, ద్రౌపదికుమారుళ్ళనీ మూడేసిబాణాలతోనూ, ధృష్టద్యుమ్నుణ్ణి డబ్భయిబాణాల

తోనూ, ధర్మరాజునీ, సాత్యకినీ ఐదేసి బాణాలతోనూ, ఘటోత్కచుణ్ణి నాలుగు బాణాలతోనూ గట్టిగా కొట్టాడు. కేకయ, చేది మొదలైన యోధులమీద ఎన్ని బాణాలు వేశాడో లెక్కాజమా లేదు. ఇంత మందినీ ఇలా చెడామడా తగిలించి పెద్ద సింహనాదం చేశాడతడు.

దాంతో అరికాలిమంట నెత్తికెక్కింది ధర్మరాజుకి. మంగలి కత్తిలాంటి దారైన బాణాలు కొట్టి దుర్యోధనుడి ధనుస్సు నరికేశాడు. తడువుకునేలోపున అతడి జీవస్థానాల్లో శూలాల్లాటి బాణాలు తగిలించాడు. తెలివితప్పిపోయి రథంమీద పడిపోయాడు దుర్యోధనుడు.

దుర్యోధనుడు చచ్చాడంటే చచ్చాడంటూ గావుకేకలు వేశారు పాండవసైనికులు. శంఖాలు పూరించారు. కాహళాలూ, భేరీలూ మోగించారు. చెవులు దిమ్మెత్తించారు. సేనసేనంతా ఆనందంతో ఆల్లకల్లోలమైపోయింది.

బాణంలా పరిగెత్తాడు ద్రోణుడు.

"ఆగూ, ధర్మరాజా, ఆగూ," అంతలోనే తెలుపుకుని ధర్మరాజుమీదికి ఉరికాడు దుర్యోధనుడు. ఉప్పెనలా వచ్చింది అతడి మీదికి పాండవసేన. అంతకంటే ఉద్రేకంతో వెళ్ళారు మన సైనికులు. భయంకరంగా జరిగింది యుద్ధం.

ధృతరాష్ట్రుడు: బాణంలా పరిగెత్తాడన్నావే ద్రోణాచార్యులు, శత్రువుల్ని ఎలా పాతిపెట్టాడు? ఇటూ, అటూ సమర్థులంతా ఎలా పోరాడారు?

సంజయుడు: ఉభయసేనలూ ఉద్ధృతంగా పోరాడుతున్నాయి. ఇంతలో బ్రహ్మాండమైన వడితో ధర్మరాజూ మొదలైన పాండవులూ, సాత్యకీ మొదలైన యాదవులూ, ద్రుపదుడూ మొదలైన పాంచాలం వాళ్ళూ, విరాటరాజూ మొదలైన మాత్స్యులూ, ప్రతివింధ్యుడూ మొదలైన కుమారుళ్ళూ, ఇంకా ఎంతోమంది దండనాయకులూ విజృం

భించారు. జడివానలా బాణాలు కురిపించి ద్రోణుణ్ణి ముట్టడించారు. అంతకంటే ఉద్రేకంతోనూ, వడితోనూ విజృంభించాడు ద్రోణాచార్యులు. అతడి రెండుపక్కలా కర్ణుడూ మొదలైన మహాయోధులు తమముకు వెళ్ళారు.

పడమట ఎరుపు మసక మసక అయి మాసిపోయింది. మునిమాపు మెల్లిమెల్లిగా ముంచుకువచ్చింది. కౌరవసేనదిక్కు వరళ్ళు అరిచాయి. పులుగుపిట్టలు కూశాయి. అయితే అదంతా లెక్క చెయ్యలేదు మనవాళ్ళు. భేరీల భాంకారాలూ, ఏనుగుల ఘీంకారాలూ, గుర్రాల సకిలింపులూ, రథాల క్రేంకారాలూ రెట్టించిమరీ యుద్ధం చేశారు.

చీకట్లు కమ్ముకువచ్చాయి. వాటికితోడు పెద్ద ధూళి రేగింది; కళ్ళు కనపడకండా చేసింది. తన పక్కవాడు పగవాడో తనవాడో తెలియలేదు సైనికులికి. ఈ అవస్థ ఎంతోసేపుమాత్రం లేదు. ఏనుగులా గుర్రాలా, సైనికులా శరీరాల్లోంచి ప్రవహించిన రక్తంతో ధూళంతా అడగారిపోయింది. ముక్కలయిపడ్డ బంగారం కవచాలూ, రత్నభూషణాలూ, రకరకాల ఆయుధాలూ మెరుస్తూ, చుక్కలతోవున్న ఆకాశంలా అవుపడింది రణస్థలం.

బంగారం భూషణాలతోవున్న ఏనుగులూ, రథాలూ మెరుపులతోవున్న మేఘాల్లా కనిపించాయి. దుర్యోధనుడు వాయువులా, రథగుల్మాలు ♦ మేఘాల్లా, రణవాయిద్యాలు వురుముల్లా, రత్నపతాకాలూ ఆయుధాలూ మెరుపుల్లా, గదలూ కత్తులూ పిడుగుల్లా, ద్రోణుడూ పాండవులూ తుఫానుమేఘాల్లా – ప్రళయమే ముంచుకు

---

♦ గుల్మం: తొమ్మిది రథాలూ, తొమ్మిది ఏనుగులూ ఇరవయ్యేడు గుర్రాలూ, నలభై అయిదుగురు పదాతులూ వున్న సేనాభాగం.

వచ్చినట్టనిపించింది ఆ రాత్రియుద్ధం. నెత్తురునదులు వరదలయి పరిగెత్తాయి.

కేకయులూ, ధృష్టద్యుమ్నుడి కుమార్లూ మొదలైనవాళ్ళని ఎంతోమందిని చంపేశాడు ద్రోణుడు. ఎంతోమందిని చావుదెబ్బలు కొట్టేశాడు. ఎంతో మందిని వెంటదరిమాడు. అతడి ఎదటపడ్డవాడు వొక్కడూ వూరికేపోలేదు. అలా పట్టపగ్గాలు లేకండా రెచ్చిపోతూ వున్న ద్రోణుణ్ణి ఉద్రేకంతో వెళ్ళి ఢీకొన్నాడు శిబిరాజు. అతడు రావడమే తడువు, పది ఇనపబాణాలు తగిలించాడు ద్రోణుడు. శిబి మాత్రం సామాన్యుడా ? సాహసరశికుడు. ముప్ఫయిబాణాలుద్రోణుడి మీద నాటించి, రెండు భల్లాస్త్రాలతో అతడి సారథితల నరికేశాడు.

మెరుపులా మెరిశాడు ద్రోణాచార్యులు. కత్తులలాంటి ఆరు బాణాలు గబగబా కొట్టాడు. శిబిగుర్రాలు నాలుగూ నరికేశాడు. అతడి సారథిని చంపేశాడు. కిరీటంతో ధగధగా మెరుస్తూన్న అతడి శిరస్సూ ఎగరగొట్టేశాడు. మరో సారథిని ద్రోణుడి రథంమీదికి పంపాడు దుర్యోధనుడు.

లోగడ భీముడు కళింగరాజు భానుమంతుణ్ణి చంపేశాడుకదూ ! ఆపగ మనస్సులో పెట్టుకుని భానుమంతుడి కొడుకు పెద్ద కళింగసేనతో భీముడిమీద విరుచుకుపడ్డాడు. బాణవర్షంకురిపించాడు. బాగా వొళ్ళు మండింది భీముడికి. చర్రున తనరథం అతడి రథానికి గుద్దించి, అతడి మీదికి వురికేశాడు. కాళ్ళతోనూ, చేతులతోనూ అతణ్ణి కుమ్మేసి, గుద్దేసి పచ్చడిముద్దచేసి చంపేశాడు. భీముడి భీకరమూర్తి చూసి పాంచాలసైనికులు సింహనాదాలు చేశారు.

సహించలేకపోయాడు కర్ణుడు. తమ్ముళ్ళతో కలిసి భీముణ్ణి ముట్టడించాడు. తాచుల్లాటి బాణాలు తగిలించాడు. అద్భుతంగా ధ్రువుడిరథంమీదికి వురికాడు భీముడు. పిడిగుద్దులు గుద్ది అతణ్ణి చంపే

శాడు. అక్కడినించి జయద్రథుడి రథంమీదికి గెంతాడు. అతడి కాళ్ళూ, అతడి సారథికాళ్ళూ రెండుచేతులతోనూ పట్టుకుని నేల మీద కొట్టి చంపేశాడు.

కళ్ళల్లో నిప్పులు కక్కాడు కర్ణుడు. అమాంతంగా శక్తితీసి విసిరాడు. ఒడుపుగా వొంగిదాన్ని పట్టేశాడు భీముడు. కర్ణుడిమీదే తిరిగి విసిరాడు. కర్ణుడిమీదికి వొచ్చేస్తోందిశక్తి. ఇంతలో వొకభల్లం వేసి, మధ్యలోనే దాన్ని కొట్టేశాడు శకుని.

నీకుమాళ్ళు వెళ్ళి భీముణ్ణి ఘిరాయించారు. పదునుపెట్టిన బాణాలు పడాపడా తగిలించారు. పళ్ళుకొరుకుతూ దుర్మదుడి రథం మీదికి వురికాడు భీముడు. అతడిగుర్రాల్ని గుద్దేశాడు. సారథిని చంపేశాడు. రథం గెంతేశాడు దుర్మదుడు. దుష్కర్ణుడి రథంమీదికి పారిపోయాడు. ఇద్దరూ కలిసి బాణాలు గుప్పించారు.

దుష్కర్ణుడి రథంమీదికే వచ్చాడు భీముడు. ఒక్కతాపుతో రథం గుండపిండి చేసేశాడు. దుర్యోధనుడూ, అశ్వత్థామా, కృపాచార్యులూ, కృతవర్మా, కర్ణుడూ, శల్యుడూ, బాహ్లీకుడూ -- ఇంతమందీ చూస్తూనేవున్నారు, - దుర్మదుణ్ణీ, దుష్కర్ణుణ్ణీ తాపుతో వొక్కణ్ణీ, గుద్దుతో వొక్కణ్ణీ చంపేశాడు భీముడు. అలా చిత్రవధచేస్తూ పేట్రేగిపోతూన్న భీముణ్ణిచూసి, "రుద్రుడే పాండవుల సహాయంకోసం ఇలా వచ్చాడు. మనిషేమిటి ? ఈరూపేమిటి ?" అనుకుంటూ నీవాళ్ళంతా జజ్జరిల్లిపోయారు. ఒకడు వెళ్ళినతోవని వొకడు వెళ్ళకుండా పరుగులు తీశారు. ఎర్రతామరవంటి కళ్ళతో తనసేనదిక్కు చూసి, ధర్మరాజుకి నమస్కరించాడు భీముడు. ఆఉగ్రమూర్తిని తేరిచూడడానికి జంకేసి, ధర్మరాజూ, నకులసహదేవులూ, ద్రుపదుడూ, విరాటరాజూ మూరు మొగాలతోనే మెచ్చుకున్నారు అతణ్ణి.

అప్పుడు ద్రోణాచార్యులు భీముడిమీదికి వెళ్ళాడు. కర్ణుడూ, నీకుమారుళ్ళూ అతడితో కలిశారు. ధర్మరాజూ, నకులసహదేవులూ, ద్రుపదుడూ, విరాటరాజూ, సాత్యకీ, సమర్థులైన తక్కిన యోధులూ భీముడితో కలిశారు. ఆచీకటిలో భయంకరంగా సాగింది యుద్ధం.

భూరిశ్రవుడితండ్రి సోమదత్తూ, సాత్యకీ వొకదగ్గిర ముఖాముఖి తారసిల్లారు.

"ప్రాయోపవేశానికికూచున్న భూరిశ్రవుణ్ణి చంపేశావు. కిరాతకృత్యం కాని రాజధర్మమేనా అది? ఈరాత్రి నానించి ఎలా బతికిపోతావో చూస్తాను" అంటూ సింహనాదం చేసి శంఖం పూరించాడు సోమదత్తు.

"భూరిశ్రవుణ్ణి న్యాయంగాచంపలేద నేనా నీవాదం?" డకారిస్తూ అన్నాడు సాత్యకి – "పోనీ నిన్ను న్యాయంగా చంపుతాను. ఇలారా. కలుడిచావు న్యాయమో అన్యాయమో చెప్పవేం? ఇదిగో మాఅన్న శ్రీకృష్ణుడి పాదాలసాక్షిగా చెపుతున్నాను. పాతాళంలో దాగినా నీప్రాణాలు దక్కనివ్వను."

అలా ఇద్దరూ ఎత్తిపొడుచుకని వొకళ్ళమీద వొకళ్ళు చెయ్యి చేసుకున్నారు. బాణాలతో కొట్టుకున్నారు. గుర్రాలూ, రథాలూ వేసుకువెళ్ళి సోమదత్తుడికి దుర్యోధనుడు తోడ్పడ్డాడు. శకునికూడా తన గాంధారసేనతో అతణ్ణి కలిశాడు. ఇలా ఇంతమందీ సాత్యకి వొక్కడిమీదాకలబడ్డారు. పెద్దసేనతోవచ్చి భీముడితోకలిసి వాళ్ళని ఎదిరించాడు ధృష్టద్యుమ్నుడు. క్షణక్షణమూ ఎవరు గెలుస్తారో, ఎవరు వీగిపోతారో చెప్పలేనంత ఇదిగా సాగింది యుద్ధం.

తొమ్మిదిబాణాలు సాత్యకిమీద వేశాడు సోమదత్తు. అన్నిబాణాలే వేసి విల్లు విరిచాడు సాత్యకి, చచ్చినట్టు మూర్ఛపోయాడు సోమదత్తు. తడబడిపోయి రథం పట్టుకుపోయాడు అతడి సారథి.

"సాత్యకిని చంపేస్తాను" అంటూ రభసంగా రథం పరిగెత్తిం చాడు అశ్వత్థామ. అడ్డంగా వచ్చి అడ్డుకున్నాడు, తన రాక్షససేన అంతటితోనూ వురికి ఘటోత్కచుడు దుర్యోధనుడూ, కర్ణుడూ, తక్కిన మొనగాళ్ళూ అతణ్ణి ముట్టడించారు. అసురసంజలో పెరిగిన బలంతో వున్నాడు రాక్షసుడు ఘటోత్కచుడు. అతడి ఎదటియుద్ధానికి వోర్వలేక మన మొనగాళ్ళు యావన్మందీ దూరదూరం తుళ్ళి పోయారు. అశ్వత్థామమాత్రం అడుగు వెనక్కి వెయ్యలేదు. ఘటోత్క చుడి గుండెలమీద దారుణంగా పదిబాణాలు నాటించాడు. పటపటా పళ్ళుకొరికాడు ఘటోత్కచుడు. చర్రుమని చక్రం విసిరాడు. మధ్య లోనే దాన్ని నరికేశాడు అశ్వత్థామ. పుణ్యం పోయిన మానవుడి సంకల్పంలాగ వ్యర్థమయిపోయిం దది.

## అంజనపర్వుడు

అప్పుడు ఘటోత్కచుడి కొడుకు అంజనపర్వుడు అశ్వత్థామ మీద విరుచుకుపడ్డాడు. పిడుగుల్లాటి బాణాలు దడదడా కుమ్మరిం చాడు. అసలే అశ్వత్థామ. అవి వొక లెక్కా అతడికి! క్షిప్తలో అం జనపర్వుడివిల్లు విరిచేశాడు. అతడిరథం ముక్కలుముక్కలు చేసేశాడు. విచ్చుకత్తి విసిరాడు అంజనపర్వుడు. అదీ తునకలుచేసేశాడు అశ్వ త్థామ. గద తిప్పి విసిరాడు అంజనపర్వుడు. తుక్కుతుక్కు చేసేశాడు అశ్వత్థామ. ఆకాశానికి ఎగిరాడు అంజనపర్వుడు. ఉరుముతూ రాళ్ళవాన కురిపించాడు. అదిన్నీ వూడ్చేశాడు అశ్వత్థామ. మేఘా ల్లోంచి చొచ్చుకుపోయి, సూర్యకిరణాల్లాగ అతడి వొళ్ళంతా బాణాలు నింపాడు. మరో రథంతో వురికాడు అంజనపర్వుడు. చప్పున తల నరి కేశాడు అశ్వత్థామ. అట్టహాసంచేసి పాండవసేనమీద పడ్డా డతడు.

"నిలబడూ బ్రాహ్మడా, ఎటుపోతావు?" వురుముతూ వురికాడు ఘటోత్కచుడు.

"వద్దు" మీదపడుతూన్న ఘటోత్కచుణ్ణి వారిస్తూ అన్నాడు అశ్వత్థామ. "కుర్రాడివి. నీతండ్రిని నేను. నీమీద కోపంకూడదు నాకు. వెళ్ళు. ఇంక ఎవరితోనన్నా యుద్ధం చెయ్యి" అన్నాడు.

"నువ్వా నాకు తండ్రివి?" కొడుకు చావుతో కుతకుతలాడిపోతూ అన్నాడు ఘటోత్కచుడు — "పాండవుల కొడుకునయి పగవాళ్ళనా సహిస్తాను? కొడుకుని కక్కిస్తాను. నీ కండలు చీల్చుకు తింటాను" అంటూ బాణాలుమీద బాణాలు బాదాడు. అతడు వేసిన బాణాలన్నీ సగంలోనే కొట్టేశాడు అశ్వత్థామ.

రాక్షసమాయ లంకించుకున్నాడు ఘటోత్కచుడు. పెద్దపర్వతమయిపోయి పరిగెత్తుకు వచ్చాడు. పిడుగులాటి బాణంవేసి కొట్టాడు అశ్వత్థామ. మేఘమయిపోయి అంపవాన కురిశాడు ఘటోత్కచుడు. గాలిబాణంవేసి పారదోలాడు అశ్వత్థామ. ఉగ్రనరసింహుడయిపోయాడు ఘటోత్కచుడు. ఏనుగులతోనూ, రథాలతోనూ, గుర్రాలతోనూ రాక్షససేన కౌరవసేనంతా ఆక్రమించేసింది. భీమ దూరడానికైనా సందు లేకపోయింది. తెల్లమొహంవేసేశాడు దుర్యోధనుడు.

"భయపడకు" ధైర్యం చెపుతూ అన్నాడు అశ్వత్థామ— "ఈయుద్ధంతో నీకేంపని? ఇక్కడ దానవుల్నీ, అక్కడ మానవుల్నీ చిటికెలో చంపేస్తాను" అన్నాడు.

"అశ్వత్థామ పాండవుల్ని హతవార్చేస్తాడు" శకుని కేసిచూసి అన్నాడు దుర్యోధనుడు - "ఇదే సమయం మామా, రథాలు వేసుకు వెళ్ళు. గెలుపు సాధించు. నువ్వూ, కృపాచార్యులూ, కృతవర్మా, కర్ణుడూ, వృషసేనుడూ, దుశ్శాసనుడూ మొదలైన తమ్ముళ్ళు కొందరూ వెళ్ళండి. శత్రువులమీద విరుచుకుపడండి."

మంచి బింకంతో బయలుదేరి వెళ్ళాడు శకుని. అశ్వత్థామ ఘటోత్కచుల యుద్ధం భయంకరంగా సాగింది. అశ్వత్థామ అడిలి పోయినట్టు గట్టిగట్టిబాణాలు కొట్టాడు ఘటోత్కచుడు. అతడిధనుస్సు విరిచేశాడు. మరో విల్లు అందుకున్నాడు అశ్వత్థామ. ఘటోత్కచుణ్ణి కీచుకీచు మనిపించాడు. అతడి రాక్షససేన నురుమాడాడు. "అదిగదీ అశ్వత్థామా" అని అదేమెచ్చుకోడం మెచ్చుకున్నాడు దుర్యోధనుడు. దెబ్బకిదెబ్బ తియ్యలేక నిచ్చెరపోయి నుంచుండిపోయింది పాండవసేన.

అయితే ఘటోత్కచుడు సామాన్యుడు కాడు. ఉద్దోలమైన పరాక్రమంతో విజృంభించా డతడు. ఒక్కడూ అసహాయశూరు డయి పోరాడాడు; భయంకరమైన పరిఘ విసిరాడు. అది ఇట్టే పట్టేసి, అతడిమీదే తిరిగి విసిరాడు అశ్వత్థామ. రథం గెంతేసి ధృష్టద్యుమ్నుడి రథమెక్కేశాడు ఘటోత్కచుడు. పరిఘ పడి అతడి రథమూ, గుర్రాలూ, సారథీ పచ్చడయిపోయారు.

ఒక్కరథంమీంచే ఘటోత్కచుడూ, ధృష్టద్యుమ్నుడూ అశ్వత్థామతో పోరాడారు. పెద్ద సేన వేసుకుని భీముడుకూడా వాళ్ళతో కలిశాడు. నవ్వుతూ ముగ్గురినీ ముచ్చెమటలు పోయించాడు అశ్వత్థామ. అంతూపంతూ లేకండా బాణాలు గుప్పించాడు. భటుల శవాలూ, గుర్రాల మొండాలూ, ఏనుగుల కళేబరాలూ, రథాల ముక్కలూ రణరంగమంతా నిండిపోయాయి. అయినా మిడతల దండులా వచ్చిపడుతూనే వుండేది పాండవసేన. ఎంత వస్తుంటే అంత దుళ్ళగొడుతూనే వుండేవాడు అశ్వత్థామ. రక్తకళ్ళేలుచేసేసి, ముక్కముక్కలు చెండేసి, మథించేసి మరీ వొదిలిపెట్టా డతడు.

అలా వొక అక్షౌహిణిసేన హతమార్చేశాడు అశ్వత్థామ. రక్తం నదులయి పారింది. అందులో గొడుగులే పద్మాలు. చామ

రాలే మాంసలు. జుత్తులే నాచు. ఆయుధాలే చేపలు. మాంసమూ, మేధస్సూ, మెదడూ బురద. రక్తమే వరద.

అప్పుడు పాంచాలరాజకుమాళ్ళు సురథుడూ, శత్రుంజయుడూ, బలానీకుడూ జయానీకుడూ, జయుడూ, పృషధ్రుడూ, చంద్రసేనుడూ, అశ్వత్థామని చుట్టుముట్టారు. బాణాలతో అతడి రథం కనపడకండా కప్పేట్టేశారు. అరిటిపిలకలు నరికేసినట్టు అందరినీ నరికేశాడు అశ్వత్థామ. ఒళ్ళుమండి కుంతిభోజుడి కుమాళ్ళు పద ముగ్గురు ఏకమయి అశ్వత్థామమీద వురికారు. ప్రాణాంతకమైన బాణాలువేసి పదముగ్గురినీ తారుమనిపించేశాడు అశ్వత్థామ. ఆవూ పుని యముడిలాగ గర్జించి, కాలదండంలాంటి బాణం ఘటోత్కచుడి మీద ప్రయోగించాడు. దెబ్బతో మూర్ఛపోయాడు ఘటోత్కచుడు. చప్పున రథం తప్పించుకు పట్టుకుపోయాడు ధృష్టద్యుమ్నుడు. సింహంలాగ గర్జించాడు అశ్వత్థామ.

ధర్మరాజూ, భీముడూ, సాత్యకీ, తరుముకువచ్చారు. అంతలో ఘటోత్కచుడు తెలువుకున్నాడు. మరోరథమెక్కి పరిగెత్తుకువచ్చాడు. ధృష్టద్యుమ్నుడూ వాళ్ళతో కలిశాడు. పాలో అని వాళ్ళ సైన్యాలూ విరగబడ్డాయి. సోమదత్తునీ బాహ్లీకుణ్ణీ ముందుపెట్టుకుని మనసేన విజృంభించింది. దారుణమైన దొమ్మీయుద్ధం జరిగిపోయింది.

చీకటి పేరుకుంటూం వచ్చింది. అయితే సైనికుల నగల మణికిరణాలూ, డాళ్ళమీదా, కవచాలమీదా గొడుగులమీదా జెండాల మీదా చెక్కిన రత్నాలకాంతులూ వెలుతురు కలిగిస్తూ వుండేవి.

## భీముడు బాహ్లీకుణ్ణి చంపేశాడు

సాత్యకీ సోమదత్తూ పోరాడారు. "మా మరిదికి ఈ కౌరవుడా వొకలెక్క" అంటూ భీముడూ వచ్చి చేతులు కలిపాడు. అగ్నిశిఖ

లాటి బాణం వేశాడు సాత్యకి. ముద్గరం విసిరికొట్టాడు ఘటోత్కచుడు. రెండూ తగిలి చచ్చినంతపని అయింది సోమదత్తుడికి. సొమ్మసిల్లి పోయాడతడు.

కొడుకు మూర్ఛపోడంతోనే వురకలు వేసుకుంటూ వెళ్ళాడు బాహ్లీకుడు. సాత్యకిరథం వెనకపెట్టేసి ముందుకి వురికాడు భీముడు. మెరుగుపెట్టిన బాణాలు బాహ్లీకుడిమీద తగిలించాడు. ఉగ్రమైన శక్తి ప్రయోగించాడు బాహ్లీకుడు. పిడుగులా పడింది శక్తి. మూర్ఛపోయాడు భీముడు. అయితే అంతలోనే తెలుపుకున్నాడు. ముద్గరంతో వొకటేబాదు బాదాడు. భళ్ళున శిలబద్దలయిపోయి, కులపర్వతంలా కూలిపోయాడు కురువృద్ధుడు బాహ్లీకుడు. సంతోషంతో వొకటే గోల చేసేశారు పాండవసైనికులు.

దశరథుడి కుమాళ్ళవంటి నీకుమాళ్ళు నాగదత్తుడూ, దృఢరథాశ్రయుడూ మొదలైన వాళ్ళు పదిమంది భీముణ్ణి ముట్టడించారు. పదిమందినీ పది వాడిబాణాలతో చంపిపారేశాడు భీముడు. కర్ణుడి తమ్ముడు వృకరథుడు తరుముకు వెళ్ళాడు. అతణ్ణీ హారీ అనిపించేశాడు భీముడు. శకుని తమ్ములు పన్నెండు మంది వెళ్ళారు పన్నెండుగురినీ పట్టించేశాడు భీముడు.

అలా పేట్రేగిపోతూన్న భీముడిమీద శూరసేన, వసాతి, మాళవ, త్రిగర్త దేశాల సేనలు వొక్కసారి కలబడ్డాయి. పెద్ద రాణువతో ధర్మరాజు తరుముకువచ్చాడు. తన పరాక్రమమంతా చూపెట్టాడు. చచ్చినంతసైన్యం చచ్చింది. పారిపోయినంత పారి పోయింది. చిక్కుపడినంత చిక్కుపడింది. అడిగిపోయినంత అడిగి పోయింది. మిగిలిన సేనంతా అడలెత్తిపోయి మిడుతూమిడుతూ కళ్ళప్పగించి నిలబడిపోయింది.

ద్రోణాచార్యుణ్ణి దుర్యోధనుడు పురికొల్పాడు. ఉద్ధృతంగా తరుముకువెళ్ళాడు. ద్రోణుడు వాయువ్యాస్త్రం, యామ్యాస్త్రం, వారుణాస్త్రం, ఆగ్నేయాస్త్రం, త్వాష్ట్రాస్త్రం, సావిత్ర్యాస్త్రం – వరసపెట్టి ప్రయోగించాడు ధర్మరాజుమీద. అన్నిటికీ అన్ని ఎదిరి బాణాలువేసి కొట్టేశాడు ధర్మరాజు. తన ప్రతిజ్ఞ నిలుపుకోడం కోసం ఐంద్రాస్త్రం ప్రయోగించాడు ఆచార్యుడు. దాన్ని కొట్టి పారేశాడు ధర్మరాజు. ఎక్కడలేనికోపమూ వచ్చింది ద్రోణుడికి. సకలభూతభయంకరమైన బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. బ్రహ్మాస్త్రం బ్రహ్మాస్త్రంతోనే కొట్టేశాడు ధర్మరాజు.

ఇద్దరికీ మధ్య ధృష్టద్యుమ్నుడు వురికాడు. అతణ్ణి వొదిలేసి ద్రుపదమహారాజుమీదికి వెళ్ళాడు ద్రోణుడు. భీముడూ, అర్జునుడూ అడ్డుకున్నారు. ఎడా పెడా ఎన్నో అన్ని బాణాలు పడబొడారు. మత్స్యసేనా, కేకయసైన్యమూ ఉప్పెనలా వచ్చిపడ్డాయి. నీసేనల్ని తరిమితరిమి కొట్టాయి.

## ఎందుకూ ఈ నోటికొవ్వు?

"ఇదిగో నీ సమయం వచ్చింది" కర్ణుణ్ణి హెచ్చరిస్తూ అన్నాడు దుర్యోధనుడు– "పాండవులూ, పాంచాలంవాళ్ళూ పేట్రేగి పోతున్నారు. తరిమి కొడుతున్నారు. మనసేన కకావికలయిపోతూ వుంది. నీమగతనం చూపించి కాపాడా లిప్పుడు."

"ఇదెంతలోమాట" మీసం దువ్వుతూ అన్నాడు కర్ణుడు – "నేను వొక్కణ్ణే చంపెయ్యగలను అర్జునుణ్ణి. భీముడూ, గీముడూ – వీళ్ళంతా నల్లులు. నేనంటూ వుండగా ఏపగవాడు తల ఎత్తగలడు? అందరినీ మాతవాఁర్చేస్తాను. సకలసామ్రాజ్యమూ నీచేత ఏలిస్తాను. నా తెంపూ, సొంపూ ఇప్పుడే చూద్దువుకాని."

"అవునవును" నవ్వుతూ అందుకున్నాడు కృపాచార్యులు - "మహాబావుంది. ఇలా మాటల్లో మగతనం చూపిస్తేనే చాలు. సామ్రాజ్యం ఏలేస్తాడు రాజరాజు. పాండవులూ పారిపోతారు. ఘోష యాత్రలోనూ, గోగ్రహణమప్పుడూ పేరుపడ్డనువ్వు ఎంతకైనా సమర్థుడివే. చాల్చాలు. నిన్నూ, పాండవుల్నీ యుద్ధంలో ఎన్నడూ చూడని వాళ్ళముందు కోసేసినట్టుకోస్తున్నావు. యుద్ధానికి ఈడొకదంపా పనికి వస్తుంది? ఒక్క అర్జునుడిముందు అందరకూ తోకముడిచింది ఎవ డెరగడు? ఇప్పుడు ఘటోత్కచుడూ, బంధువులూ, మిత్రులూ-ఇంత మందితోనూ కలిసి ఎత్తివస్తున్నా డతడు. అతణ్ణా ఒక్కడివీ చంపే స్తావు? ఎందుకూ ఈ నోటికొవ్వు!"

"చాలు, ఆగు" కస్సుమన్నాడు కర్ణుడు – "ఆఁటే పేలేవా, బ్రాహ్మడా, నీనాలిక కోసేస్తాను. అన్నంతా చెయ్యగలిగిన వీరుడు ఏమంటేనేం? ముందు వురిమి, తరవాతే కురుస్తుంది వానమేఘం. నీమాటవాక లెక్కేమిటి? అర్జునుణ్ణి ఆకాశానికి ఎత్తేస్తున్నావు. కౌరవ సైన్యం నిరుత్సాహపరుస్తున్నావు. ద్రోణుణ్ణీ, అతడికొడుకునీ, శల్యుణ్ణీ నన్నూ చచ్చులకింద కడుతున్నావు. ఒళ్ళుమండుతోంది జాగ్రత్త!"

మామని అలా తూలనాడడంతోటే అపుకోలేనంత కోపం వచ్చింది అశ్వత్థామకి. చర్రున వొరలోంచి కత్తిదూసి, కర్ణుడిమీదికి వరిగెత్తాడతడు. చప్పున మధ్యపడ్డాడు దుర్యోధనుడు. అతడితో కృపా చార్యులూ మధ్యపడ్డాడు. "కోపం కూడదు. శాంతించు" అంటూ ఇద్దరూ అశ్వత్థామని పట్టుకున్నారు "కాదు, వొదలండి" అంటూ పెనగులాడాడు అశ్వత్థామ.

"అంత మిడిసిపడుతూన్నవాణ్ణి ఆపుతావెందుకు? ఒదిలెయ్యి మహారాజా, వొదిలెయ్యి. నాచెయ్యితగిల్తేనే కాని అబిగురు తగ్గదు బాపనయ్యకి" అన్నాడు కర్ణుడు.

"రాజు మొహం చూసి అన్నీ సహిస్తున్నాను. నువ్వు ఏమన్నా చెల్లుతుంది. ఎందుకా తొందరపాటు!" సముదాయిస్తూ అన్నాడు కృపాచార్యులు.

"యుద్ధంలోనా ఈ కలతలు!" అశ్వత్థామని వారిస్తూ అన్నాడు దుర్యోధనుడు - "నన్ను సామ్రాజ్యం ఏలించడానికి ద్రోణుడూ, శల్యుడూ, కర్ణుడూ, కృపాచార్యులూ, శకునీ, నువ్వూ పూనుకున్నారు కదా! మీలో మీరే తగువులాడితే ఏం కాను? నా మొహంచూసైనా శాంతించు! క్షమించు."

శాంతించాడు అశ్వత్థామ. కర్ణుడూ చల్లబడ్డాడు. శత్రువులతట్టు తిరిగి ధనుస్సు మోగించాడు.

"వీడే పాండవుల పాట్లన్నిటికీ మూలం. వీణ్ణి చుట్టుముట్టండి. పోనీకండి. పడగొట్టండి" అంటూ కర్ణుడిమీద కలబడ్డారు శత్రుపక్షం రాజులు. తనపేరు చెక్కిన బాణాలు వాళ్ళమీద వరసపెట్టి వేశాడు కర్ణుడు. వాళ్ళ ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, పదాతులూ పడగొట్టాడు. వాళ్ళని రక్తాల్లో ముంచెత్తాడు. అది చూసి డేగలా వాలాడు అర్జునుడు. వచ్చీరావడంతోనే అతడిమీద మూడుబాణాలు నాటించాడు కర్ణుడు. అగ్నిశిఖలా లేచాడు అర్జునుడు. గబాగబా ముప్ఫయిబాణాలు వేసి కర్ణుడి కవచం చీల్చివొదిలిపెట్టాడు. మూపుమీద ఎన్నో బాణాలు నాటించాడు. దాంతో కర్ణుడిధనుస్సు చేతిలోంచి జారిపోయింది. జారిపోయిన ధనుస్సు తటుక్కున అందుకుని అర్జునుడు ఆశ్చర్యపోయినట్టు అద్భుతమైన వడి చూపించాడు కర్ణుడు.

అర్జునుడి కంటికొనలు ఎర్రగా మెరిశాయి. ఉగ్రమైన వడితో గాండీవం సంధించాడతడు. కర్ణుడి విల్లు విరిచేశాడు. గుర్రాల శరీరాలు కండలు కండలు చెక్కేశాడు. సారథితల ఎగర గొట్టేశాడు. అతడి వాళ్ళంతా తూంట్లుతూంట్లు చేసేశాడు. చావుతప్పి కన్నులొట్ట

పోయింది కర్ణుడికి. తోకముడిచేశాడతడు. పారిపోయి కృపాచార్యుల రథ మెక్కేశాడు, సిగ్గూ బిడియం వొదిలేసి.

కర్ణుడు వోడిపోయి పారిపోడంతోనే మనసేనలూ అతడివెంట దౌడుతీశాయి.

## "మమ్మల్నే కాదు ఎవ్వరినీ నమ్మవు నువ్వు"

"నిలవండీ!" పరిపోతూన్న సైనికుల్ని హెచ్చరిస్తూ అరిచాడు దుర్యోధనుడు— "నేనుండగా భయమేమిటి మీకు? అర్జునుణ్ణీ అతడి అన్నదమ్ముల్నీ అందరినీ వోడించేస్తాను. నాబలం చూడండి. వెనక్కి మళ్ళండి" అంటూ అర్జునుడిమీదికి పరిగెత్తించాడు రథం.

"కొంపమునిగింది" అశ్వత్థామని కేకేశాడు కృపాచార్యులు— "అగ్గిలోకి పరిగెత్తే మిడతలాగ అర్జునుడిమీదికి వెళుతున్నాడు దుర్యోధనుడు. అతడి బాణాగ్నిలో పడితే అడ్డుకోడం అసంభవం. నువ్వూ నేనూ వుండి మూర్ఖంగా ఇలా పోనివ్వకూడదు. పరిగెత్తు. ఆపూ రాజుని."

"అర్జునుడిపని నేను పట్టిస్తాను" బాణంలా వెళ్ళి, దుర్యోధనుణ్ణి ఆపుతూ అన్నాడు అశ్వత్థామ — "ఏం మూడిందని నువ్వు పరిగెడుతున్నావు? ఎందుకూ ఈవెర్రిసాహసం?"

"వద్దు" పెనుగులాడుతూ అన్నాడు దుర్యోధనుడు — "పాండవులంటే పడిచస్తాడు మీబాబు. అంచేత నువ్వూ అలా అలా మీద మీదే తప్పుకుచేస్తావు యుద్ధం. ఇదంతా నాఅదృష్టం! నువ్వే పూనుకుంటే నిన్ను మించిపోయేవాడు ఎవడుచెప్పూ?

"ఎంతోమంది బంధువులు నాకోసం ప్రాణాలిచ్చారు. చాలు. మీరు పాండవులతట్టు రావద్దు. పాంచాలంవాళ్ళనీ వాళ్ళనీ గెలవండి. నేనే పాండవుల్ని హతమారుస్తాను."

"మమ్మల్నే కాదు ఎవ్వర్నీ నమ్మవు నువ్వు" – నచ్చచెపుతూ అన్నాడు అశ్వత్థామ – "నమ్మకమే లేకపోతే కార్యమెలాసాగుతుంది? నాకూ, నాఅయ్యకీ పాండవులమీద ప్రేమే అనుకో. అయినా యుద్ధంలో చుట్టరికంమర్యాద వుంటుందా? ఎన్నో యుద్ధాల్లో చూశావు. కాని నన్నూ మాఅయ్యనీ నమ్మవు. పిసరంతా ప్రాణాలు దాచుకోలేదు మేం. ఓపినంత బలంతో పోరాడుతూనే వున్నాం. అయితే దైవగతి ఎలావుందో అలా జరుగుతోంది. పాండవులు బలవంతులు. నువ్వు అనుకున్నట్టు వాళ్ళని గెలవడమంటే అంత మీద మీద వుందా? నేనూ, మాఅయ్యా, మామయ్యా, మాకుతోడు కర్ణుడూ, కృతవర్మా, శల్యుడూ వున్నారు. పాండవసేన పడగొడతాం. నువ్వు ఆగు. పసువులమందలో పడ్డ పులిలాగ పాండవులదండులో పడతాను. చూస్తూ వుండు. నువ్వన్న పాంచాలంవాళ్ళనీ దుళ్ళ గొడతాను. పాండవుల్నీ వూడ్చేస్తాను" అని అతణ్ణి దాటుకుంటూ ముందుకి సాగాడు.

అర్జునుణ్ణి దాటుకుంటూ కేకయసేనా, పాంచాలంసేనా తోసుకు వచ్చాయి; అశ్వత్థామని ముట్టడించాయి. రకరకాల బాణాలు వేలకి వేలు వేశాడు అశ్వత్థామ. సేనసేనంతా చిందరవందర చేసేశాడు.

"ఆగూ, ఆగూ" అంటూ పదిమంది రాజులు పరిగెత్తుకు వచ్చారు. ఇలా వచ్చారో లేదో, అలా వూడ్చేశాడు అశ్వత్థామ.

"ఏదో కొందర్ని కొట్టేశావని మొనగాణ్ణనుకోకు. వచ్చిన వాణ్ణినేనూ" రోషంతో బుసకొడుతూ వచ్చి, వురిమాడు ధృష్ట ద్యుమ్నుడు.

"నీకోసమే వెదుకుతున్నానోయి!" వెకిలిగా నవ్వాడు అశ్వత్థామ – "రా, నాబాణాలు నీప్రాణాలకోసం నాలికలు చాస్తు న్నాయి" అన్నాడు.

"నీబాబుకే నేను మృత్యువుని" అన్నాడు ధృష్టద్యుమ్నుడు— "నువ్వనగా ఎంత! అది అలా వుండనీ. నీ చేవేదో చూద్దాం. పారిపోకు. దగ్గిరికి రా. ఉత్తిమాట లెందుకూ మనకి?"

ఇద్దరూ కలబడ్డారు. కరుకు కరుకు బాణాలతో నరుకు కున్నారు. ధృష్టద్యుమ్నుడి జెండా అశ్వత్థామ ఎగరగొట్టేశాడు. అతడి సారథిని చంపేశాడు. గుర్రాలు కూల్చేశాడు. గొడుగు పడగొట్టేశాడు. అతడి రెండుపక్కలావుండి యుద్ధంచేస్తున్న వీర యోధుల్ని పందమందిని వ్రాడ్చేశాడు. అతడు మన్నించే ముగ్గురి యోధుల్ని చంపేసి సింహనాదంచేశాడు. "అదిగదీ, అశ్వత్థామా!" అంటూ అదే పొగడడం పొగిడాడు దుర్యోధనుడు.

పాండవసేనలోనూ, పాంచాలసైన్యంలోనూ వొక్కడూ అశ్వత్థామముందు ఆగలేకపోయాడు. చెట్టొకపిట్టయి పారిపోయారు.

ధర్మరాజూ, భీముడూ తమసేన పురికొల్పుతూ వచ్చి ముట్టడించారు. ద్రోణుడూ, దుర్యోధనుడూ తమసేనలతో వురికారు. దారుణంగా అందుకుంది యుద్ధం.

అర్జునుడు మనసేనమీద పడ్డాడు. అంబష్ఠ, శిబిదేశాలసేనలు భీముడు చిదగ్గొట్టాడు. మగధ, మద్ర, వంగ దేశాల దండు అర్జునుడు మాతవార్చాడు. "పట్టండీ, కొట్టండీ, పొడవండీ" అంటూ పాంచాల సేన ద్రోణుడిమీదికి ఎగబడింది. ద్రోణుడు వాయువ్యబాణం వేశాడు చొక్కాకుల్లా ఆమహాసైన్యం దుళ్ళగొట్టాడు.

## సాత్యకి సోమదత్తుని చంపేశాడు

ఇటు భీముడూ, అటు అర్జునుడూ ద్రోణుడిమీద కలబడ్డారు. నిప్పులుకురుస్తూ. వెనకాడుతూన్న పాండవసైన్యం మళ్ళీ ఎగబడింది.

దుర్యోధనుడూ, ద్రోణుడూ తెగించినపూనికతో తరుముకు వెళ్ళారు. మన చతురంగబలాలు పోలోమంటూ వెళ్ళాయి. వాళ్ళ చతురంగసేనతో ఢీకొన్నాయి. అయితే గాండీవంలోంచి వచ్చే బాణాల వేడి భరించలేకపోయాయి పుంజాలు తెంపుకు పరుగుచ్చుకున్నాయి.

"నిలవండోయి, నిలవండి" అంటూ పాండవసేన తరుముకు వెళ్ళాడు సోమదత్తు.

"సారథీ, మనరథం సోమదత్తుమీదికి పోనీ. ఈకౄర వాధముణ్ణి చంపేసికాని తిరిగి రాను" దారకుడితమ్ముణ్ణి హెచ్చరించాడు సాత్యకి. పగ్గాలు సడిలించాడు సారథి. బరిమీద పాంలాగ పరిగెత్తింది రథం. ఉత్తరక్షణంలో సోమదత్తుముందు నిలిచింది.

ఇద్దరూ కలబడ్డారు. వానమేఘల్లాగ వొకళ్ళమీద వొకళ్ళు బాణాలు కురిపించారు. ఇద్దరూ రక్తస్నానాలు చేశారు. ఇద్దరూ వసంతంలో పూసిన మోదుగుల్లా అవుపించారు. ఒకళ్ళనొకళ్ళు కాల్చేసినట్టు, కళ్ళలో నిప్పులుకక్కుతూ చూశారు. రథాలు మండలగతులతో తిప్పి వొకళ్ళని వొకళ్ళు వేటాడుకున్నారు. శ్రావణమేఘాల్లా గర్జించారు. ఒంటినిండా బాణాలు గుచ్చుకుని ఇద్దరూ ముళ్ళపందుల్లా కనిపించారు. బంగారం మొదళ్ళబాణాలు వొళ్ళంతా నిండి ఇద్దరూ ఆచీకటిలో మిణుగుర్లతో నిండిన రెండు వృక్షాల్లా అవుపడ్డారు.

ఒక అర్ధచంద్రబాణం వేశాడు సోమదత్తు; సాత్యకివిల్లు నరికేశాడు. మరో ముప్ఫయిబాణాలు రువ్వి ముచ్చెమటలు పోయించాడు. మరో విల్లు అందుకున్నాడు సాత్యకి. అయిదుబాణాలు కొట్టాడు. సోమదత్తుడి బంగారంజెండా కిందపడగొట్టేశాడు. అతడిధనుస్సు నరికేశాడు. చిరునవ్వుతో మరో ధనుస్సు తీశాడు సోమదత్తు. లెక్కా జమాలేని బాణాలువేశాడు. సాత్యకిరథం కనపడకండా కప్పేశాడు.

సాత్యకితో భీముడు కలిశాడు. సోమదత్తుమీద పదిబాణాలు తగిలించాడు. అన్నిటికీ అన్ని బాణాలతో జవాబు చెప్పాడు సోమదత్తు పిడుగులాంటి పరిఘ తీశాడు సాత్యకి. గురిచూసి, సోమదత్తు రొమ్ము మీద కొట్టాడు. మధ్యలోనే దాన్ని ముక్కలుచేసేశాడు సోమదత్తు. సర్పంలా బుసకొట్టాడు సాత్యకి. ఒక వెడల్పాటిబాణంవేసి అతడి ధనుస్సు ఫెళ్ళుమనిపించాడు. అయిదుబాణాలు వేసి అతడి చేతికవచం చీలికలుచేశాడు. నాలుగుబాణాలువేసి అతడి నాలుగు గుర్రాలూ నరికేశాడు. మంగలికత్తిలాంటి భల్లబాణంవేసి సారథితల తుంచేశాడు. సూనెలో ముంచిన రాతిమొనబాణ మొకటి వింటికి తొడిగాడు. నవ్వుతూ ధనుస్సు చెవికొనదాకా లాగాడు. బలంకొద్దీ వొదిలిపెట్టాడు. బంగారం రెక్కలతో డేగలా వెళ్ళింది బాణం. సోమదత్తు రొమ్ము మధ్య తగిలింది. దెబ్బతో ఠాయమని ప్రాణం వొదిలేశాడు సోమదత్తు.

అతడు పడిపోడంతోనే మనవాళ్ళు సాత్యకిని చుట్టుముట్టారు. ధర్మరాజు వాళ్ళని తరిమికొట్టాడు. ద్రోణుడు తోసుకువెళ్ళాడు. అతడి ధనుస్సు నరికేశాడు. జెండా ఎగరగొట్టాడు. ఒళ్ళు దుసెళ్ళిపోయి నట్టు బాణాలు గుప్పించాడు. ఒళ్ళు తెలియలేదు ధర్మరాజుకి. లవు క్కున మరోవిల్లు తీశాడు. మెరుగుపెట్టిన బాణాలు చరచరా తగిలించాడు. ఒళ్ళంతా రక్తమయమయిపోయి రథంమీద మూర్ఛపోయాడు ద్రోణాచార్యులు. అయితే కొద్దిక్షణాల్లోనే తెలువుకున్నాడు. లేచీలేవడంతోటే వాయువ్యాస్త్రం ప్రయోగించాడు. అదేబాణంవేసి దాన్ని అడగ్గొట్టాడు ధర్మరాజు.

"నిన్ను పట్టియిస్తానని ద్రోణుడుచేసిన ప్రతిజ్ఞ ఎరుగుదువు కదూ!" ధర్మరాజుని వారిస్తూ అన్నాడు కృష్ణుడు — "తెగించి అతడితో పోరాడకూడదునువ్వు. భీముడు యుద్ధంచేస్తున్న వేపు వెళ్ళు.

కౌరవసేన కడతేర్చు. ఇతణ్ణి చంపడానికే ఎవడుపుట్టాడో అతడే ఇత డితో పోట్లాడతాడు."

ఒక్కక్షణం ఆలోచించాడు ధర్మరాజు. అక్కడినుంచి వెళ్ళిపో యాడు. ద్రోణుడు ద్రుపదుడి సైన్యంమీదపడ్డాడు.

ధర్మరాజు భీముడికి దన్నయి పోట్లాడాడు. భీముడూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ కలిసి విజృంభించారు. కృపుడూ, కర్ణుడూ, ద్రోణుడూ వాళ్ళని ఎదిరించారు. ఉభయవీరులూ కలబడ్డంతోనే ఉభయ సేనలూ కోలాహలంగా కలబడ్డాయి. పెద్ద ధూళి రేగింది. దాంతో మరింత దట్టమయింది చీకటి. కన్ను పొడుచుకున్నా కనపడలేదు. అయినా తమతమ పేళ్ళూ, బిరుదులూ చెప్పుకుంటూ, సంజ్ఞల తోనూ, చప్పుళ్ళతోనూ ఆపక్కవీరులూ, ఈపక్కవీరులూ యుద్ధం చేశారు.

చీకటి అంతకంతకీ పెరుకుంది. కాలూ చెయ్యీ కదపడమే కష్టమయింది. రెట్టించిన తమకంతో పోరాడారు పాండవులు. చీకాకు పడిపోయింది కౌరవసేన. దారీ తెన్నూ తెలియక ఎటుపడితే అటు తడువుకు పరిగెత్తింది. ద్రోణాచార్యులు మాత్రం ధైర్యం పోగొట్టుకోలేదు. దుర్యోధనుణ్ణి కూర్చుకుని బ్రహ్మాండమైన సామ ర్థ్యంతో చతురంగసేనయావత్తూ వొక్కదగ్గిర చేర్చాడు. వ్యూహంగా తయారుచేశాడు. ఎదటిభాగంలో తానే నుంచున్నాడు. అశ్వత్థామని కుడిపక్కా, శకునిని ఎడమపక్కా పెట్టాడు. వెనక శల్యుణ్ణి నిలబె ట్టాడు. మధ్య దుర్యోధనుణ్ణి పెట్టాడు.

ధృతరాష్ట్రుడు : వ్యూహంపన్నాడే అనుకో. కన్నూమన్నూ కనపడని చీకటిలో ఎలా యుద్ధం చేశారట!

దివిటీలు

సంజయుడు : అదే చెబుతున్నాను. తన పదాతుల్ని యావన్మందినీ పిలిచాడు దుర్యోధనుడు. వాళ్ళందరిచేతా దివిటీలు తెప్పించాడు. రథానికి అయిదేసి దివిటీలు పెట్టించాడు. ఏనుగుకి మూడేసీ, గుర్రానికి వొక్కొక్కటీ పట్టించాడు. వాటి పక్కలా, జెండాల దగ్గిరా, వ్యూహం ముందరా, వెనకా, రెండుపక్కలా వరసలుతీర్చి పొడావుగా పట్టించాడు. ఆదివిటీల వెలుగులో ఎంతోఅంత అందంగా అవుపించింది నీసేన.

అలాగే పాండవులూ దివిటీలు తెప్పించారు. రథానికి పదేసి దివిటీలు పట్టించారు. ఏనుగుకి ఏడూ, గుర్రానికి రెండూ చొప్పున పట్టించారు. ఉభయసేనలూ దివిటీల మయమే అయిపోయాయి. అందులో మిట్టమధ్యాహ్నం సూర్యుడిలా అవుపించాడు ద్రోణాచార్యులు.

"ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి దగ్గిరికి రాకండా కాయండి మీారు" తమ్ములతో అన్నాడు దుర్యోధనుడు - "శల్యుడూ, కృతవర్మా మొదలైన యోధులూ, మీారూ ఈపని వెయ్యికళ్ళతో చూడాలి. అతణ్ణి మనం కాసుకుంటే చాలు, పాండవుల నందరినీ అతడే వూడ్చేస్తాడు. తుదకి ధృష్టద్యుమ్నుణ్ణీ తుడిచేస్తాడు. అర్జునుణ్ణి కర్ణుడు చంపేస్తాడు. భీముణ్ణి నేను చూసేస్తాను" అంటూ సేనకి చెయ్యివిసిరి, ముందుకి వురికాడు.

రెండు సేనలూ కలబడ్డాయి. ఎన్నడూ ఎక్కడా జరగనియుద్ధం జరిగిపోయింది.

## ద్వంద్వయుద్ధం

"ద్రోణుణ్ణి ముట్టడించండి" తన యోధుల్ని పురికొల్పి తానూ తరుముకు వచ్చాడు ధర్మరాజు. అతడితో కృతవర్మ కలబడ్డాడు. సాత్యకితో భూరీ, సహదేవుడితో కర్ణుడూ, భీముడితో దుర్యోధనుడూ, నకులుడితో శకునీ, శిఖండితో కృపాచార్యులూ, ప్రతివింధ్యుడితో దుశ్శాసనుడూ, ఘటోత్కచుడితో అశ్వత్థామా, ద్రుపదుడితో వృషసేనుడూ, విరాటరాజుతో శల్యుడూ, శతానీకుడితో చిత్రసేనుడూ, అర్జునుడితో అలంబుసుడూ ద్వంద్వయుద్ధానికి సిద్ధపడ్డారు. ద్రోణుణ్ణి కొట్టెయ్యాలని పాండవులూ, అతణ్ణి రక్షించుకోవాలని కౌరవులూ శాయశక్తులా పెనగులాడారు. మారిమసిగినట్టు పాంచాల సేన హతమార్చడం లంకించుకున్నాడు ద్రోణాచార్యులు. అతడితో ధృష్టద్యుమ్నుడు కలబడ్డాడు.

ధర్మరాజు ధనుస్సు నరికేశాడు కృతవర్మ. మరో విల్లుతీసి కొట్టాడు ధర్మరాజు. కృతవర్మవిల్లు విరిచేసి, అతడిచేతిమీద శక్తి వేశాడు. మరో ధనుస్సు పుచ్చుకున్నాడు కృతవర్మ. ధర్మరాజు గుర్రాలు కొట్టేశాడు. అతడిసారథిని చంపేశాడు. ధనుస్సు తుంచేసి, బాణాలు నాటించాడు. చర్మున కత్తిదూశాడు ధర్మరాజు. అదీ ముక్కలు చేశాడు కృతవర్మ. తోమరం విసిరాడు ధర్మరాజు. అది సగంలోనే తునకలుచేశాడు కృతవర్మ. అతడికవచం పగలగొట్టేశాడు. ఒంటిమీద గబాగబా బాణాలు గుచ్చాడు. తట్టుకోలేక పోయాడు ధర్మరాజు. గిర్రునతిరిగి తప్పుకుపోయాడు. గగ్గోలుపెట్టేసి, దుర్రుచ్చి కొట్టింది కౌరవసేన.

భూరీ, సాత్యకీ ఘోరంగా పోరాడారు. ఒకళ్ళమీద వొకళ్ళు బాణాలు నాటించుకున్నారు. పెడల్పాటి బాణం వేసి భూరిధనుస్సు

తుంచేశాడు సాత్యకి అతడి వొళ్ళంతా చిల్లులుపడేట్టు కొట్టాడు. మరోవిల్లు తీశాడు భూరి. సాత్యకి ధనుస్సు విరిచేసి, గట్టిగట్టి బాణాలు కొట్టాడు. బాగా వొళ్ళుమండింది సాత్యకికి. శక్తితీసి చప్పున బాదేశాడు, చచ్చి వూరుకున్నాడు భూరి.

భూరిని చంపెయ్యడం చూసి, సాత్యకిమీదికి చర్రున పరిగెత్తాడు అశ్వత్థామ. "ఆగవోయి" అంటూ రంకెవేసి, గట్టి గట్టి బాణాలు కొట్టాడు ఘటోత్కచుడు. మధ్యనేవాటిని కొట్టేసి, ఎన్నో అన్ని బాణాలు రువ్వాడు అశ్వత్థామ. అవన్నీ వొళ్ళంతా గుచ్చుకుని ఏదుపందిలా అవుపించాడు ఘటోత్కచుడు. దాంతో పడాపడా పది బాణాలు అశ్వత్థామ గుండెలమీద తగిలించాడతడు. మూర్ఛవచ్చి జెండాకొయ్య వూతపట్టుకుని వాలిపోయాడు అశ్వత్థామ. అంతలోనే తేరుకొని, అయిదుబాణాలు పిడుగుల్లాంటివి ఘటోత్కచుడి గుండెల మీదబాదేశాడు. రథంమీద మూర్ఛపడిపోయాడు ఘటోత్కచుడు. తడబడిపోయి రథం పట్టుకుపోయాడు అతడి సారథి.

దుర్యోధనుడూ, భీముడూ వొకళ్ళమీద వొకళ్ళు బాణాలు గుప్పించుకున్నారు. మేఘాలు కప్పేస్తే సూర్యుడూ చంద్రుడూ ఎలా అవుపిస్తారు, అదిగో అలాగ వొకళ్ళబాణాల్లో వొకళ్ళు కప్పడిపోయి అవుపించారు వాళ్ళు. దుర్యోధనుడి ధనుస్సు నరికేసి, వొళ్ళంతా చీలికలు చేశాడు భీముడు. మరో దిట్టమైన ధనుస్సు తీసి, భీముడి ధనుస్సు కొట్టేసి ఎన్నో బాణాలు వేశాడు దుర్యోధనుడు. గబుక్కున ఇంకో విల్లు అందుకున్నాడు భీముడు. విషసర్పాల్లాటి బాణాలు ఏడు దుర్యోధనుడిమీద నాటించాడు. అతడి విల్లూ నరికేశాడు. మరో విల్లు పుచ్చుకున్నాడు దుర్యోధనుడు. అదీ పెళ్ళుమనిపించాడు భీముడు. అలా వరసపెట్టి నాలుగు ధనుస్సులు నరికేశాడు. గదతీసి, అతడి

నాలుగుగుర్రాలూ బాదేశాడు; సారథినీ చంపేశాడు. చెంగున రథం గెంతేసి పారిపోయాడు దుర్యోధనుడు. తిరిగి మళ్ళీ వెనక్కి చూస్తే వొట్టు. రారాజు కనపడకపోయేసరికి అతడు చచ్చాడే అనుకుని సింహనాదం చేశాడు భీముడు. మనసేనలూ దుర్యోధనుడు చచ్చిపోయాడనుకుని, హాహాకారాలు చేశాయి; తల్లడిల్లిపోయాయి. శత్రుసేనల సంతోషానికి అంతూపంతూ లేకపోయింది.

ఇంతలో మరో రథమెక్కి ప్రత్యక్షమయాడు రారాజు. అప్పుడూ మనవాళ్ళు అంతమందీ కుదుటపడ్డారు.

## "తలకిమించినవాళ్ళతో తలపడకు"

కర్ణుడూ, సహదేవుడూ హోరాహోరి పోరాడారు. సహదేవుడు తొమ్మిది బాణాలు కర్ణుడి జీవస్థానాల్లో తగిలించాడు. రోషంతో వొక వంద బాణాలు బాదేశాడు కర్ణుడు. సహదేవుడివిల్లు విరిచేశాడు. మరోవిల్లు అందుకునేలోపున అతడిగుర్రాలు కొట్టేసి, సారథిని తారుమనిపించాడు. కత్తీ, డాలూ పుచ్చుకున్నాడు సహదేవుడు. అవీ కొట్టేశాడు కర్ణుడు. గదతీసి విసిరాడు సహదేవుడు. నవ్వుతూ ముక్కలుచేసేశాడు కర్ణుడు. చివాల్న శక్తి ప్రయోగించాడు సహదేవుడు. అదీ ముక్కముక్కలు చేసి కొట్టేశాడు కర్ణుడు. రథచక్రంతీసి కర్ణుడి రథంమీద విసిరాడు సహదేవుడు. గుండపిండి చేసేశాడు కర్ణుడు. ఇలాగే చేతికి అందిందల్లా విసిరి, వోడిపోయాడు సహదేవుడు. చివరికి పారిపోబోయాడు. కదలనివ్వలేదు కర్ణుడు. చేసేదిలేక నిలబడిపోయాడు సహదేవుడు. కుంతిమాటలు కొట్టవచ్చినట్టు, జ్ఞప్తికి వచ్చాయి కర్ణుడికి. సహదేవుణ్ణి చంపడానికి చేతులాడలే దతనికి.

"తలకిమించినవాళ్ళతో తలపడకు" వింటికొనతో సహదేవుడి కడుపుమీద పొడుస్తూఅన్నాడు కర్ణుడు — "అడుగో మా అన్న

అర్జునుడు, కౌరవసేనతో మహా డాబుగా పోరాడుతున్నాడు. అతడి దగ్గిరికి పరిగెత్తు" అంటూ వాదిలేశాడు.

కర్ణుడిబాణాలతో అప్పటికే సలుపుతోంది సహదేవుడి శరీరం. ఈమాటలతో మరింత సలపరించింది హృదయం. తనబతుకు తనకే అసహ్యంవేసింది. చిన్నబుచ్చుకుని మరో రథమెక్కేశా డతడు.

విరాటరాజూ, శల్యుడూ జంభాసురుడూ దేవేంద్రుడూ దెబ్బలాడినట్టు దెబ్బలాడారు. విరాటరాజుగుర్రాల్నీ, సారథినీ చంపేశాడు శల్యుడు. అయినా శరవర్షం కురిపించి శల్యుణ్ణి వూపిరిసలవకండా చేశాడు విరాటరాజు. అన్నగారికి సాయంవచ్చి, శల్యుడిరథం బాణాలతో కప్పేశాడు శతానీకుడు.

శల్యుడు శతానీకుణ్ణి చంపేశాడు. తమ్ముడిరథమెక్కి, భయంతోనూ, క్రోధంతోనూ పోరాడాడు విరాటరాజు. చావుదెబ్బలుకొట్టేశాడు శల్యుడు సొమ్మసిల్లి పడిపోయాడు విరాటరాజు. సారథి రథం దూకేసి పారిపోయాడు. రథం ఈడ్చుకు దౌడుతీశాయి గుర్రాలు. రాజు భంగపాటుచూసి, తోకముడిచాయి మత్స్యసైన్యాలు. పారిపోతూన్న సేనలు హెచ్చరిస్తూ మళ్ళించాడు అర్జునుడు.

అర్జునుణ్ణి ఎదిరిస్తూ యుద్ధంచేశాడు అలంబుసుడు. వరసపెట్టి బాణాలు గుప్పించాడు. అతణ్ణి మూడ్చేసినట్టు చూశాడు అర్జునుడు. అతడి ధనుస్సు నరికేశాడు. సారథిని చంపేశాడు. గుర్రాలు కూల్చేశాడు. పెద్ద కత్తి పట్టుకుని వురికాడు అలంబుసుడు. కత్తి తుక్కుకింద కొట్టేసి, లిప్తలో నాలుగువందలబాణాలు కురిపించాడు అర్జునుడు. అడిలిపోయాడు అలంబుసుడు. మళ్ళీ అక్కడ నిలబడితే వొట్టు. వుంజాలుతెంపుకు అదే పారిపోడం పారిపోయాడు.

శతానీకుడు చిత్రసేనుడి కవచం చీల్చేశాడు. ధనుస్సు నరికేశాడు. జెండా విరిచేశాడు. అయినా చలించలేదు చిత్రసేనుడు. మరో

ధనుస్సుతీసి కొట్టడ మారంభించాడు. అతడిగుర్రాలు కొట్టేసి, సారథిని చంపేశాడు శతానీకుడు. చరచరా వొక పాతికబాణాలు బాదాడు చిత్రసేనుడు. మళ్ళీ ధనుస్సు నరికేశాడు శతానీకుడు. ఆగలేకపోయాడు చిత్రసేనుడు; కృతవర్మరథంమీదికి పారిపోయాడు.

ద్రుపదమహారాజూ, వృషసేనుడూ ఘోరమైన యుద్ధంచేశారు. ఇద్దరూ రక్తాల్లో మునిగి తేలారు. వృషసేనుడిది పైచెయ్యి కావడం చూసి, పాంచాలసేన ద్రుపదుణ్ణి దాటుకుంటూ ముందుకి తోసుకు వచ్చింది. వృషసేనుణ్ణి చుట్టుముట్టింది. అయితే అతడిబాణాగ్ని భరించ లేకపోయింది. వచ్చినదారినే పరుగుతీసింది. అగ్నిశిఖలా ప్రకాశిం చాడు వృషసేనుడు.

దుశ్శాసనుడిమీద కత్తుల్లాటి బాణాలు మూడు నాటించాడు ప్రతివింధ్యుడు మూడు శిఖరాల కొండలా అవుపించాడు దుశ్శాస నుడు. తొక్కతొక్కిన పాములా లేచా డతడు. ప్రతివింధ్యుడి జెండా ఎగరగొట్టాడు. సారథిని హతమార్చాడు. ఇంతింత పిసర్లకింద రథం చెక్కేశాడు. వింధ్యపర్వతంలా కదలకండా నుంచుని, ఉగ్రమూర్తి అయిపోయాడు ప్రతివింధ్యుడు. అగ్గిపిడుగుల్లాటి బాణాలు దుశ్శా సనుడిమీద కురిపించాడు. పొంలాగ బుసకొట్టాడు దుశ్శాసనుడు. వెడల్పాటి బాణం వేసి ప్రతివింధ్యుడి కోదండం నరికేశాడు. చికిలి పెట్టిన బాణాలు అతడిమీద నాటించాడు. అంతలో శ్రుతసోముడు వచ్చి అన్నతో కలిశాడు. అతడిరథమెక్కేసి, ఉద్దండమైన కోదండం పుచ్చుకున్నాడు ప్రతివింధ్యుడు. నువ్వాళ్ళూ వెళ్ళి దుశ్శాసనుడికి దన్నయి నుంచున్నారు. నువ్వా నేనా అన్నట్టు జరిగింది యుద్ధం.

నకులుడూ, సిమరిది శకునీ నువ్వెంతఅంటే నువ్వెంత అన్నట్టు పోట్లాడారు. పిడుగులాటి బాణం బలంకొద్దీ వేశాడు శకుని. నకు లుడి గుండెలు దూసుకుపోయిం దని. మూర్ఛపోయాడు నకులుడు.

ఆకాశం బద్దలైనట్టు అరిచాడు శకుని. అంతలో తెలుసుకున్నాడు నకులుడు. పూనిపెట్టి వొక్క బాణం వేశాడు. శకునిధనుస్సు రెండు ముక్కలయింది. మరొకటి వొదిలాడు నకులుడు. శకుని రథంమీది జెండా తెగి కిందపడింది. అదేవరసని మరిన్ని బాణాలు తగిలించాడు. చచ్చినంతపని అయింది శకునికి. మూర్ఛపోయి రథంమీద చచ్చిన శవంలా పడిపోయా డతడు. రథం పట్టుకు పారిపోయాడు సారథి.

ఒక నెలవంక బాణం వేసి, కృపాచార్యుల ధనుస్సు పుటుక్కుమనిపించాడు శిఖండి. శక్తిప్రయోగించాడు ఆచార్యులు. పది బాణాలు వేసి అది పడగొట్టాడు శిఖండి. మరో పెద్ద ధనుస్సు తీశాడు ఆచార్యులు. దారుణమైన బాణం వేశాడు. దెబ్బతో మూర్ఛపోయి, రథంమీద వొరిగిపోయాడు శిఖండి. ఆవ్రాపుని అతణ్ణి చూసేద్దామని మరో బాణం తొడిగాడు ఆచార్యులు. అంతలో అవతలి యోధులు ఎంతోఅంతమంది వొక్క పెట్టుని తరుముకు వచ్చారు. మనవాళ్ళూ కృపాచార్యుల్ని దాటుకుని వాళ్ళమీదికి వెళ్ళారు. ఇలా ద్వంద్వ యుద్ధమూ, దొమ్మీయుద్ధమూ ముమ్మరంగా జరిగింది.

ధనుస్సు మోగిస్తూ ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిమీదికి తరుముకు వచ్చాడు. అతడి రెండుపక్కలా పాండవయోధులు దూసుకు వచ్చారు. నికుమాళ్ళు ద్రోణుడి రెండుపక్కలా దన్నయి నడిచారు.

ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిగుర్రాలమీద అయిదు బాణాలు నాటించాడు. ఇరవయ్యేడు బాణాలు కొట్టి అతడి విల్లు తునాతునకలు చేశాడు ద్రోణుడు. పెదవికరుస్తూ మరోవిల్లు అందుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. చెవిదాకా అల్లెతాడు లాగి ఘోరమైన వొక బాణం వొదిలాడు. నిప్పులు కక్కుతూ వచ్చింది బాణం. ద్రోణుడు చచ్చాడంటే చచ్చాడు అంటూ అడలెత్తిపోయారు మనవాళ్ళు. ఇంతలో పదకుండు బాణాలు వొక్కముష్టిని సంధించి వొదిలిపెట్టాడు కర్ణుడు.

పన్నెండుముక్కలయి పడిపోయింది, ధృష్టద్యుమ్నుడి బాణం. దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, అశ్వత్థామా, శకుని, శల్యుడూ ద్రోణుడితోనూ, కర్ణుడితోనూ కలిశారు. ఈఏడుగురినీ ఏడు చెరువులనీళ్ళు తాగించాడు ధృష్టద్యుమ్నుడు. అందరికీ అన్నిరూపులయి యుద్ధం చేశాడు.

ద్రుమసేనుడు కర్ణుడిమీద అంపవాన కురిపించాడు. అతడికంఠం నరికేశాడు కర్ణుడు. కుండలాలతో ఎగిరి కిందపడిపోయింది తల.

ద్రుమసేనుడిచావు చూసి నిలువునా మండిపోయాడు ధృష్టద్యుమ్నుడు. కర్ణుడిధనుస్సు ముక్కలుకిందనరికేశాడు. చప్పున మరోవిల్లుతీసి కొట్టాడు కర్ణుడు. దుర్యోధనుడూ మొదలైనవాళ్ళు అతడితో కలిశారు.

"ఆగవోయి కర్ణా!" అదిలిస్తూ వచ్చి డేగలా వాలాడు సాత్యకి. ఇద్దరూ వొక్కలాగ విజృంభించారు. ఇద్దరూ హోరాహోరి పోరాడారు. తండ్రికి సహాయంగా పరిగెత్తుకువచ్చాడు వృషసేనుడు. సాత్యకిమీద జడివానలా కురిపించాడు సానపెట్టిన బాణాలు. కళ్ళల్లో అగ్గికురిశాడు సాత్యకి. బలంకొద్దీ తగిలించాడు బాణాలు. చచ్చినట్టు రథంమీద మూర్ఛపోయాడు వృషసేనుడు. కొడుకుఅవస్థ చూసి, నొచ్చుకుంటూ సాత్యకిని అదే కొట్టడం కొట్టాడు కర్ణుడు. అంతలోనే తెలువుకుని తండ్రితో కలిశాడు వృషసేనుడు. తండ్రీకొడుకు లిద్దరినీ సాగదీసి వొదిలిపెట్టాడు సాత్యకి.

అప్పుడు మహారాజా, పిడుగులు వురుముతూ వినపడింది గాండీవం. దిక్కులు పగిలిస్తూ మోగింది దేవదత్తం. దాంతో హాహాకారాలు మిన్నుముట్టాయి మనసేనలో.

## "అభిమన్యుడిలా సాత్యకిని చంపేద్దాం"

"అర్జునుడు మనసేనలు సంహరిస్తూన్న కోలాహల మది" దుర్యోధనుడితో అన్నాడు కర్ణుడు – "అర్జునుడు వచ్చి సాత్యకితో

కలుసుకోకముందే మనం జల్దుకోవాలి. మనబలగంతో సాత్యకిని ముట్ట డిద్దాం. అందరం కలిసి అభిమన్యుణ్ణి చంపినట్టు ఇతణ్ణి చంపేద్దాం. నీకు గెలుపు కొంగుబంగార మవుతుంది. మనం పదిమందిమీా వీణ్ణి చుట్టు ముట్టామని తెలిస్తేమాత్రం అర్జునుడు అగ్గిపిడుగులా వచ్చిపడతాడు. అంచేత అతణ్ణి అక్కడే నిలవరించి పోరాడగల మొనగాళ్ళని అక్కడికి పంపాలి" అన్నాడు.

"లక్షలు విలువచేసే సలహా" అన్నాడు దుర్యోధనుడు. "మామా" అపని శకునికి బెత్తాయిస్తూ అన్నాడతడు — పదివేల ఏనుగులూ, పదివేల రథాలూ పట్టుకుని నువ్వు అర్జునుడిమీాదికి వెళ్ళు. దుశ్శాసనుడూ, దుష్టధర్షణుడూ మొదలైన తమ్ముళ్లూ నీతో వస్తారు. అర్జునుడూ, తక్కిన పాండవులూ అటే వున్నారు. ఆ అయిదుగురినీ ఆక్రమించు; వోడించు" అన్నాడు.

దుశ్శాసనుడూ మొదలైన హేమాహేమీాలతో కలిసి శకుని అర్జునుడి మీాదికి వెళ్ళాడు. మంచి మెరికల్లాంటి రథికులూ, కర్ణుడూ సైన్యాలతో సాత్యకిమీాద విరుచుకుపడ్డారు. బాణాలమీాద బాణాలు కుప్పలు కుప్పలుగా గుప్పించారు. అసలే సానపెట్టిన వజ్రా యుధం సాత్యకి. ప్రచండమైన వేగంతో బాణాలు విరజల్లా డతడు. ఏనుగుల తొండాలు ఎగిరిపోయాయి. గుర్రాల శిరస్సులు కూలిపో యాయి. రథాలు ముక్కలయి రణరంగమంతటా చెదిరిపడ్డాయి. రక్త నదులు ప్రవహించి, వాటిలో ఇవన్నీ కొట్టుకుపోయాయి. అతడి పరా క్రమం వేడి తట్టుకోలేకపోయింది కౌరవసేన. చచ్చినంత చచ్చింది. చావగా మిగిలింది కాళ్ళకి బుద్ధిచెప్పింది. ఆపుకోలేకపోయాడు దుర్యో ధనుడు. సాత్యకిరథంమీాదికి తనరథం వురికించాడు. ఆ ఇద్దరియుద్ధమూ చూస్తూవుంటే కళ్ళుమూసుకు పోయాయంటే నమ్మి.

దుర్యోధనుడిగుర్రాలు చచ్చిపోయాయి. అతడిసారథీ తారు మనిపోయాడు. అయినా ఆగలేదతడు. సాత్యకి ఆయువుపట్లలో తగిలించాడు బాణాలు. జయించాని లేచాడు సాత్యకి. దుర్యోధనుడి ధనుస్సు నరికేశాడు. పక్కవాడి రథంమీదికి పారిపోయాడు దుర్యోధనుడు. కౌరవసేన తరిమికొట్టాడు సాత్యకి. అటు అర్జునుడిమీదికి వెళ్ళి మీామరిది శకుని అద్భుతంగా పోరాడాడు. బ్రహ్మాండమైన బలగం వెంటవుంది కనక. తండ్రిపక్కనుంచుని, చెప్పదగినట్టు యుద్ధంచేశాడు ఉలూకుడు. కృష్ణుడిమీదా, అర్జునుడిమీదా సానపట్టిన బాణాలు వందలూ, వేలూ వేశాడు.

శకుని సారథిని చంపేశాడు అర్జునుడు. అతడిగుర్రాలు బాదే శాడు. ధనుస్సు నరికేశాడు. కొడుకురథంమీదికి పారిపోయాడు శకుని. తండ్రీకొడుకులు ఇద్దరూ కొట్టడం మొదలెట్టారు అర్జునుణ్ణి. ఇద్దరినీ చావుదెబ్బలు కొట్టేశాడు అర్జునుడు. తక్కిన మనయోధుల్ని తుక్కుతుక్కు చేసేశాడు. గాండీవం కనబడితేచాలు కళ్ళుమూసుకు పరిగెత్తారు మనవాళ్ళు. గాండీవం వినపడితేచాలు గడగడ లాడారు. ఇలా అర్జునుడు. పేట్రేగిపోతూ వున్నప్పుడే అక్కడ ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి అల్లెతాడు లపుక్కన తెగేశాడు. మరొక విల్లుతీసి, ఉగ్రమైనబాణాలు వేశాడు ద్రోణుడు. అతడు వేసిన బాణాలన్నీ అంతంత దూరంనించే కొట్టేశాడు ధృష్టద్యుమ్నుడు. ఇటు అతడితో పోరాడుతూనే మనసేన నురుమాడా డతడు.

అదిగో అలాగ ధృష్టద్యుముడూ, సాత్యకీ, అర్జునుడూ మన సైన్యాలు తరిమికొట్టారు. తరిగిపోయి, విరిగిపోయి పరుగుపెట్టింది మీా సేన. మన కాందిశీకుల్ని చూసి పాంచజన్యం పూరించాడు కృష్ణుడు. దేవదత్తం పూరించాడు అర్జునుడు. పొలోమని వెంట దరిమాయి పాండవసేనలు.

కర్ణుడు వీరావేశంతో విజృంభించాడు. తలలూ, చేతులూ, కాళ్ళూ, మొండాలూ రణరంగమంతటా కుప్పలు కుప్పలు కూలగొట్టాడు. రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ చించి చెండాడాడు. కొట్టి కొట్టి వెంటదరిమాడు.

“చూస్తావేం తమ్ముడూ!” గుంపులుగుంపులు పరిగెడుతూన్న తన సైనికుల్ని వెంటాడి, వేటాడుతూన్న కర్ణుణ్ణి చూసి అర్జునుడితో అన్నాడు ధర్మరాజు – “ప్రచండసూర్యుడు అర్ధరాత్రి భూమ్మీదికి వచ్చాడాఅన్నట్టు వెలిగిపోతున్నాడు కర్ణుడు, కిరణాల్లాంటి బాణాలు విరజిమ్ముతూ. ఇలా ఇంకా కొంచేపు సాగిందా ఇక్కడి సేనంతా ఇప్పుడే నాశనమైపోతుంది, మిగలకండా. అంచేత ఎలా అయినా దీనికి ఎదురెత్తు వెయ్యాలి చప్పున” అన్నాడు.

“కర్ణుడిముందు ఆగలేక మనసేన పారిపోడం చూసి అన్నయ్య అడలిపోతున్నాడు” కృష్ణుడితో అన్నాడు అర్జునుడు – “అటు ద్రోణుడూ వొకపక్క మనవాళ్ళని నురువాడుతున్నాడు. ముందు కర్ణుణ్ణి చావగొట్టి, ఆచార్యుడి ఆట కట్టిస్తాను. అటుపోనీ మనరథం.”

“నువ్వు కాదు, ఘటోత్కచుడు వెళ్ళాలిప్పుడు కర్ణుడిమీదికి” అన్నాడు కృష్ణుడు – “రాత్రిళ్ళు రాక్షసులబలం హెచ్చు. అంచేత అతణ్ణే పంపుదాం కర్ణుడికోసం. సందేహించకు. మాయలూ, మహాస్త్రాలూ కోకొల్లలు మనవాడిదగ్గిర. అందాకా మనం మరొకదిక్కు నడుద్దాం” అంటూ ఘటోత్కచుణ్ణి పిలిచాడు.

“ఏం సెలవు” యుద్ధసన్నాహంతో వచ్చి వాలాడు ఘటోత్కచుడు.

“నీశౌర్యం చూపించవలసిన సమయం వచ్చిందోయి” ఘటోత్కచుణ్ణి పురెక్కిస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు – “నీప్రతాపానికి తగిన ఘట్టమిది. చూడూ చూడూ, కర్ణుడిదెబ్బకి మన సైన్యాలు

పరుగుచ్చుకుంటున్నాయి. అయితే రాత్రియుద్ధంలో నీముందు నల్లి కర్ణుడు. కనక అతణ్ణి చావగొట్టిమరీ వొదలాలి నువ్వు. తండ్రులికి జయం తేవడమేకదా, కొడుకులు కన్నందుకు ఫలం!'' అన్నాడు. అర్జునుడూ అదే చెప్పాడు. ఘటోత్కచుడు కర్ణుడిమీదికి వురికాడు.

## ఘటోత్కచుడు అలంబసుణ్ణి చంపేశాడు

అదేసమయానికి జటాసురుడికొడుకు అలంబుసుడు దుర్యోధనుడిదగ్గిరికి వచ్చాడు. "మహారాజా, మా అయ్యని భీముడు చంపేశాడు. అంచేత పాండవులంటే పట్టరానిపగ నాకు. పూర్వవిరోధం తీర్చుకునే సమయం చిక్కింది. వాళ్ళని వాళ్ళ మద్దత్తుదార్లనీ అందరినీ చంపేస్తాను. అమాంతంగా మింగేస్తాను. నీకు మహానందం కలిగిస్తాను. నువ్వు ఊఁ అను. అంతే చాలు'' అన్నాడు. "అంతకంటే కావలిసిందేముంది!'' అని అతణ్ణి అభినందించి పంపాడు దుర్యోధనమహారాజు.

కర్ణుడితో కలిశాడు అలంబుసుడు, ఘటోత్కచుడిమీద కలబడ్డాడు. ఇద్దరికీ ఘోరమైన యుద్ధం జరిగింది. ఇద్దరూ రథాలమీద కొంతసేపు దెబ్బలాడారు. ఎవ్వరికి ఎవ్వరూ తీసిపోలేదు. అంతలో రథాలు వొదిలేసి మాయలు మొదలెట్టారు. ఒకడు పెద్ద పామయితే వొకడు గరుత్మంతుడయ్యాడు. ఒకడు పెద్ద ఏనుగయితే, వొకడు పెద్ద సింహమయ్యాడు. ఒకడు సూర్యబింబ మయితే, ఒకడు రాహువయ్యాడు. ఒకడు మేఘమైతే, వొకడు గాలి అయ్యాడు. ఇలా రకరకాల రూపాలతో హోరాహోరి పోరాడారు వాళ్ళు. మహాపర్వతాల్లాగ శరీరాలు పెంచుకున్నారు. బాహాబాహీ, కచాకచి కలబడ్డారు.

లపుక్కున అలంబుసుణ్ణి కిందపడేశాడు ఘటోత్కచుడు. గుండెలమీద కాళ్ళతో తొక్కిపట్టాడు. అతడితల మొండెంలోంచి పీకేసి, సింహనాదంచేశాడు. రక్తం ధారలుకడుతున్న ఆతలకాయపట్టుకుని

ఘోరంగా, వొయ్యారంగా తిరిగాడు. "అదిగో, నీనేస్తం తలకాయ" అంటూ అది దుర్యోధనుడి రథంమీదికి విసిరేసి అరిచాడు—"దుర్యోధనా, ఇలాగే మీ కర్ణుడితలా పెరికేస్తాను. ఎవడనుకున్నావు నన్ను? భీముడి కొడుకుని!" అంటూ కర్ణుడి కేసి తిరిగాడు.

ఘటోత్కచుడి ఎర్రటి రథంమీద రాబందుజెండా ఎగురుతోంది. నల్లటి కళేబరానికి తగినట్టు పెద్ద కోరలూ, పింగళవర్ణం జడలూ—భూతంకంటే భయంకరంగా వున్నాడతడు. మోటయిన బంగారం నగలూ వేసుకున్నాడు. మెరుపులతోవుంటే మేఘం ఎలా అవుపిస్తుంది, అదిగో అలాగే అవుపిస్తున్నాడతడు వాటితో. అలాంటి విపరీతమైన రూపంతో వచ్చి, ఘోరమైన బాణాలు గుప్పించాడు కర్ణుడి మీద. అంతకంటే ఘోరమైన బాణాలు వేసి ఎదుర్కొన్నాడు కర్ణుడు.

కర్ణుడూ, ఘటోత్కచుడూ—మానవుడూ, దానవుడూ ఇద్దరూ కలబడి మహాద్భుతమైన యుద్ధంచేశారు. రకరకాలైన ఆయుధాలతో కొట్టుకున్నారు. రక్తాలు కారుతూన్నా కాలు కదపలేదు. ఇద్దరూ జేగురునదులు పారుతూన్న రెండు కొండల్లా అవుపించారు. ఎవరు ఎక్కువో, ఎవరు తక్కువో ఎంచిచెప్పడమే కష్టమయింది.

ఉండివుండి వొక దివ్యాస్త్రంవేశాడు కర్ణుడు. ఎదిరిబాణంవేసి దాన్ని కొట్టేసి, మాయసైన్యం పుట్టించాడు ఘటోత్కచుడు. నేల ఈనినట్టు పుట్టుకువచ్చింది రాక్షససేన. బాణాలూ, శూలాలూ, ముద్గరాలూ, ఈటెలూ, గండ్రగొడ్డళ్ళూ, రాళ్ళూ, మాంసంముక్కలూ దుమ్ములూ కురిపించింది. కౌరవసేన కకావికలయి పరుగుతీసింది.

కర్ణుడుమాత్రం కదలలేదు. మేరుపర్వతంలా నుంచున్నాడు. మహాస్త్రాలు వేశాడు. మాయసేన మాయంచేశాడు. పెద్ద చక్రం విసిరాడు ఘటోత్కచుడు. ముక్కలు చేసేశాడు కర్ణుడు. గద విసిరాడు ఘటోత్కచుడు. కొట్టి పారేశాడు కర్ణుడు. ఆకాశంమీదికి ఎగిరి రాళ్ళూ,

మాళ్ళూ కురిపించాడు ఘటోత్కచుడు. అవన్నీ కొట్టేసి, అతణ్ణి కిందికి దింపాడు కర్ణుడు. రథమెక్కి మీదికివచ్చాడు ఘటోత్కచుడు. సారథిని చంపేసి, గుర్రాలు కొట్టేసి, రథం ముక్కలు చేశాడు కర్ణుడు. ఏదు పందిలా అవుపించాడు ఘటోత్కచుడు. మాయ మొహం పెట్టుకుని కర్ణుడు వేసిన బాణాలన్నీ మింగెయ్యడం మొదలెట్టాడు. అదికూడా సాగకండా మహాస్త్రాలు వేశాడు కర్ణుడు. ఎన్నో తలకాయలతో పెద్ద భూతంలా మీదపడ్డాడు ఘటోత్కచుడు. తలకాయలన్నీ కొట్టిపారేశాడు కర్ణుడు. ఘటోత్కచుడు చచ్చాడంటే చచ్చాడంటూ గావు కేకలు వేశారు కౌరవులు. పడున్నట్టే పడుండి గబుక్కున లేచాడు ఘటోత్కచుడు. రకరకాల వికారరూపాలతో ప్రత్యక్షమయాడు, మైనాకపర్వతంలాగ పెద్ద కళేబరంతోనూ, వంద తలకాయలతోనూ కనబడ్డాడు. క్షణంలో వేలెడంత అయిపోయాడు. సముద్రకెరటంలా అడ్డంగా పెరిగి దొర్లుకుంటూ వచ్చాడు. వెయ్యి శిఖరాలతో అంజన పర్వతమై అవుపించాడు వజ్రబాణం వేశాడు కర్ణుడు. అంతలో రథమెక్కి, చతురంగబలాలతో తరుముకువచ్చాడు ఘటోత్కచుడు. గట్టి గట్టి బాణాలువేసి, రాక్షసరాణువ కకావికలుచేశాడు కర్ణుడు. పిడుగుల్లాటి బాణాలు బాది, కర్ణుడి ధనుస్సు నరికేశాడు ఘటోత్కచుడు.

అదేసమయానికి బకాసురుడి తమ్ముడు అలాయుధుడు దుర్యోధనుడి దగ్గిరికి వచ్చాడు. అన్నని చంపేశాడని భీముడిమీద పట్టరాని పగ అతడికి. ఎన్నాళ్ళనుంచో తగినసమయంకోసం కనిపెట్టుకుని వుండి, ఆరాత్రియుద్ధంలో సైన్యసమేతంగా వచ్చాడతడు.

"మహారాజా," దుర్యోధనుడితో అన్నాడతడు — "భీముణ్ణీ అతడి అన్నదమ్ముల్నీ చంపెయ్యడానికి వచ్చాను. కృష్ణుణ్ణీ, పాండవుల కుమాళ్ళనీ, వాళ్ళ బంధువుల్నీ, స్నేహితుల్నీ అందరినీ లటుక్కున

మింగేస్తాను. నీకూ, నీవాళ్ళకీ యుద్ధం గిద్ధం — ఈ బాదరబందే అక్కర లేదిక. అందరినీ వూదేస్తాను. ఏమంటావు?" అన్నాడు.

అలా అలాయుధుడు అంటూనే వున్నాడు. కాలయముడిలాగ కర్ణుడిమీద కలబడ్డాడు ఘటోత్కచుడు. ద్రోణుడూ, అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా, శల్యుడూ మొదలైన హేమాహేమీలు యావన్మందీ అడలెత్తిపోయి చూస్తూ నుంచుండిపోయారు. కర్ణుడిపని అయిపోయిందంటే, అయిపోయింది అంటూ మనసైన్యాలు నిరాశ చేసుకున్నాయి.

"ముందు ఆఘటోత్కచుణ్ణి మింగెయ్యి. మాయాబలంవల్ల వాడు నాసి రంపానపెడుతున్నాడు కర్ణుణ్ణి" అంటూ అలాయుధుణ్ణి ఘటోత్కచుడిమీదికి పంపాడు దుర్యోధనుడు.

అమాంతంగా ఘటోత్కచుడిమీదికి వురికాడు అలాయుధుడు. ఇద్దరి రూపులూ వొక్కలాగే వున్నాయి. ఇద్దరి వయస్సూ వొక్కలాగేవుంది. ఇద్దరి రథాలూ వొక్కలాగే వున్నాయి. ఇద్దరి ఆయుధాలూ, ఇద్దరి బలాలూ వొక్కలాగే వున్నాయి. సమవుజ్జీలయి ఆ ఇద్దరూ పోరాడుతూంటే, కర్ణుడు భీముడితో కలబడ్డాడు.

అలాయుధుడు ఘటోత్కచుణ్ణి ఏంచేసేస్తాడో అని, కర్ణుణ్ణి వొదిలేసి, అలాయుధుడిమీదికే వెళ్ళాడు భీముడు. కర్ణుడితోనేపోరాడాడు ఘటోత్కచుడు. అలాయుధుడి అపరిమితమైన రాక్షససేన భీముణ్ణి చుట్టుముట్టింది. కరుకుకత్తులలాంటి బాణాలు వేశాడు భీముడు. ఎన్నో అన్ని బాణాలు గుండకిందకొట్టేశాడు అలాయుధుడు. ఎన్నో అన్ని అతడి గుండెలమీద గుచ్చుకున్నాయి.

గదతీసి కొట్టాడు భీముడు. గదని గదతోనే బాదాడు అలాయుధుడు. అంతతోనూ ఆగిపోక, భయంకరమైనబాణాలు వందలూ,

వేలూ దిమ్మరించాడు. పాంచాల సేనమీద పడండని తన రాకాసి సేనని హెచ్చరించాడు.

"రాత్రియుద్ధంలో రాక్షసులు పేట్రేగిపోతున్నారు" అర్జునుడితో అన్నాడు శ్రీకృష్ణుడు — వీళ్ళని చంపడానికి నకులసహదేవుల్ని నియమించు. కర్ణుడిమీదికి శిఖండినీ, ధృష్టద్యుమ్నుణ్ణీ పంపు. ద్రోణుణ్ణీ, అతడి వెంటవున్న రాజుల్నీ నువ్వు నిలవరించు" అన్నాడు.

అలాయుధుడు భీముడిధనుస్సు నరికేశాడు. మరో ధనుస్సు అందుకునేలోపున అతడి సారథినీ, గుర్రాల్నీ కొట్టేశాడు. గదపట్టుకు దిగాడు భీముడు. అలాయుధుడూ గదపుచ్చుకున్నాడు. ఇద్దరూ కలబడ్డారు. ఖంగుమంటే ఖంగుమన్నాయి గదలు. గుండపిండయిపోయాయవి. రథచక్రాలూ, నొగలూ, ఇరుసులూ, ఏనుగుదంతాలూ — చేతికందినవాటితో బాదుకున్నారు వాళ్ళు.

కర్ణుడిమాట తరవాత చూద్దాం. ముందు అలాయుధుడి సంగతి చూడు" కర్ణుడితో యుద్ధంచేస్తున్న ఘటోత్కచుణ్ణి హెచ్చరించాడు శ్రీకృష్ణుడు. కర్ణుణ్ణి వొదిలేసి, అలాయుధుడితో కలబడ్డాడు ఘటోత్కచుడు.

నకులసహదేవులు రాక్షససేన దుళ్ళగొట్టారు. కర్ణుడు శిఖండినీ తక్కిన వాళ్ళనీ మూడుచెరువులనీళ్ళూ తాగించి, పాండవసేన పడగొట్టాడు. అంతకంతకీ అతడు రెచ్చిపోతూవుండడం చూసి, భీముడూ అతడిమీదికి వచ్చాడు. నకులుడూ మొనతైన మొనగాళ్ళు అతడికి తోడయారు. రకరకాల బాణాలు ప్రయోగించారు. అర్జునుడు పాంచాల సేన వెనకేసుకుని ద్రోణుడిసైన్యం చెండాడాడు.

## ఘటోత్కచుడు అలాయుధుణ్ణి చంపేశాడు

తనమీదికి రావడంతోనే ఘటోత్కచుణ్ణి పరిఘతో వొక్క-

మొత్తం మొత్తాడు అలాయుధుడు. జుమాలు మనిపోయాడు ఘటో త్కచుడు. అయితే మరుక్షణంలోనే తేరుకున్నాడు. తేరుకోడమూ, గదతిప్పి వొకటి అలాయుధుణ్ణి బాదెయ్యడమూ క్షణంలో చేశాడతడు. ఆదెబ్బతో అలాయుధుడి గుర్రాలూ, సారథీ, జెండా గుండ పిండి అయిపోయాయి. పెద్ద కారుమేఘమయిపోయి, ఆకాశం విరిగి పడినట్టు గర్జించాడు అలాయుధుడు. నెత్తురువానా, పిడుగులూ కుమ్మరించేశాడు. హుంమ్మని ఆకాశానికే ఎగిరాడు ఘటోత్కచుడు. తన మాయతో అలాయుధుడిమాయ మాయంచేశాడు. నేలకి దిగాడు అలాయుధుడు. ఘటోత్కచుడూ దిగాడు. ఇద్దరూ కలబడ్డారు. రాళ్ళతో కొట్టుకున్నారు. చెట్లతో బాదుకున్నారు. వాలీ సుగ్రీవుల్లాగ హోరాహోరి యుద్ధంచేశారు. రకరకాల ఆయుధాలతో మళ్ళీ కొట్టుకున్నారు.

చంద్రుస కత్తిదూశాడు ఘటోత్కచుడు. తటుక్కున అలాయుధుడిజుత్తు పట్టుకున్నాడు. దబాలున కిందపడేశాడు. మెడకాయ నరికేసి, పెద్ద రంకెవేశాడు. ధణధణ రణదుందుభులు మోగాయి. సింహనాదాలు చెలరేగాయి.

అలాయుధుడి తలకాయ దుర్యోధనుడిముందు పడేశాడు ఘటోత్కచుడు. దుర్యోధనుడూ, అతడి సైనికులూ దుఃఖపడ్డారు. అలాయుధుడివల్ల తానూ, తన మిగిలిన తమ్ముళ్ళూ బదికిపోదా మనుకున్నాడు దుర్యోధనుడు. అలాంటి అలాయుధుడు హతమైపోడంతోనే నడుం విరిగినట్టయిపోయిం దతడికి. "ఇంకేముంది, భీముడు అన్నంతపనీ చేసేస్తాడు" అనుకుంటూ కుంగిపోయా డతడు.

రకరకాలబాణాలు వేసి పాండవసేన చెండాడుతూనే వున్నాడు కర్ణుడు. చూసి, తన ఎర్రరథంతో అగ్నిపర్వతంలాగ వచ్చిపడ్డాడు ఘటోత్కచుడు. కర్ణుడూ ఘటోత్కచుడూ సరాసరి యుద్ధంచేశారు. కర్ణుడు ఘటోత్కచుడి గుర్రాలు కొట్టేశాడు. రథంతో మాయమయి

పోయాడు ఘటోత్కచుడు. ఎక్కడ వచ్చిపడతాడో, ఎవణ్ణి ఏం చేస్తాడో అంటూ గడగడలాడిపోయారు మనవాళ్ళు. తెల్లమొహం వేసి నాలుగు దిక్కులూ చూశారు నీ సైనికులు.

పెద్ద నల్లమేఘంలా ఆకాశంమీద అవుపించాడు ఘటోత్కచుడు. మెరుపులు మెరిశాడు ఉరుములు ఉరిమాడు. బాణాలూ, బల్లేలూ, కత్తులూ, కటార్లూ, ముసలాలూ, ముద్గరాలూ, పణుకుల్లాటి వడగళ్ళు విడుపూ విరామం లేకండా కురిపించాడు. అతడి తోడి రాక్షసులూ మేఘాలయి వొక్క మొగిని అతడిలాగే ఆయుధాలూ అవీ కురిపించారు. కరచరణాలు ఆడలేదు కర్ణుడికి. ఏం చెయ్యాలో తోచలేదు. కౌరవబలం ఘోరంగా కూలిపోడం మొదలయింది. రథాలు గుండపిండి అయాయి. ఏనుగులు పీనుగులయాయి. గుర్రాలు కుప్పలుకుప్పలు కూలిపోయాయి. ఎక్కడికైనా పారిపోదామన్న బుద్ధీ తట్టలేదు నీ యోధులికి. తలలు కట్టుకుని ఆకాశంమీద పడ్డట్టు అడగారిపోయారు వాళ్ళు. దేవతలతో దేవేంద్రుడువచ్చి ఆకాశంమీంచి ఇలా పాండవులికి తోడ్పడుతున్నాడని అడిలిపోయారు నీ సైనికులు.

## ఇంద్రుడిచ్చిన మహాశక్తి యింకెప్పుడు

ధీరత్వం వొక్కటే రక్షరేఖ అయింది కర్ణుడికి. ఒక్కడే కదలని మేరువులాగ నిలబడ్డాడతడు. అడ్డులేని దివ్యాస్త్రాలు వేశాడు. చిత్రం! పొద్దుదూరితే చూర్ణమయిపోయిన మంచులాగ ఆ దివ్యాస్త్రాలతో రాక్షసమాయ పటాపంచలయిపోయింది. మాయ మాయమైతేనేం, కొరకరానికొయ్య అయిపోయాడు ఘటోత్కచుడు. దివ్యబాణాలతో తీవ్రంగా విజృంభించాడు.

"వీడు వొకంతట పోడురా బాబూ" అంటూ నెత్తిమీద చేతులు పెట్టుకున్నారు మీవాళ్ళు.

"ముందు ప్రాణాలు కాసుకో" కదలకండా నుంచున్న కర్ణుణ్ణి చూసి, ఆశ్చర్యపోతూ అరిచారు మన యోధులు — "ఈరాకాసి ఇంతమందినీ చంపెయ్యకండా చూడు. నీకవచకుండలాలు పుచ్చుకున్నప్పుడు ఇంద్రుడు నీకిచ్చిన మహాశక్తి ఇంకెప్పటికని దాస్తావు? భీముడూ, అర్జునుడూ నిన్ను ఏంచేస్తారని? ముందు ఇప్పుడు బతికిపో. తరవాత చూసుకుందాం. ఆ మహాయుధం ఘటోత్కచుడిమీద ప్రయోగించు" అన్నారు.

కర్ణుణ్ణి చంపెయ్యడంకోసం ఫెళఫెళా విరుచుకుపడ్డాడు ఘటోత్కచుడు. ఉద్దోలమైనగదతో వొక్కబాదుబాదాడు. కర్ణుడిగుర్రాలు పచ్చడిచేసేశాడు. రథం గెంతేసి పరుగులంకించుకున్నాడు కర్ణుడు. వెంటతరిమి గదతో గబాగబా మొత్తేశాడు ఘటోత్కచుడు. చచ్చినంతపని అయింది కర్ణుడికి. "ఇంద్రుడు ఇచ్చిన శక్తి ఇంకెప్పుడు?" చెవుల్లో గింగురుమంది నీయోధుల మాట. అవును, "ఇంద్రుడు ఇచ్చిన శక్తి ఇంకెప్పుడు?" చావు తప్పాలంటే అది వొక్కటే ఆధారం ఇప్పుడు. ఇంద్రుణ్ణి అర్థించి, ప్రాణశత్రువు ప్రాణం తియ్యడానికి ప్రాణప్రదంగా దాచుకున్న సాధన మది. అయితేనేం, ఇంకో దారిలేదు. ముందు ఈ ఆపద గడవాలి. ప్రాణంమీదికి వచ్చాక "ఇంద్రుడు ఇచ్చిన శక్తి ఇంకెప్పుడు?"

## కర్ణుడు ఘటోత్కచుణ్ణి చంపేశాడు

ఇంద్రశక్తి పైకితీశాడు కర్ణుడు. ఘోరంగా నాలికలు చాస్తోందది. మంటల్లా మెరుస్తున్నాయి నాలికలు. ఖణేలుమంటున్నాయి దాని గంటలు. ఖణేలుమంటే ఖణేలుమని ప్రతిధ్వనిస్తోంది ఆకాశం. మృత్యువు తోబుట్టువులా వుంది ఇంద్రశక్తి. కర్ణుడు అది తియ్యడంతోటే గతుక్కుమన్నాడు ఘటోత్కచుడు. పారిపోవాలని గిరగిరా

తిరిగాడు. గురితప్పని దృష్టితోనూ, పట్టువిడని ముష్టితోనూ ఆమహా శక్తి ప్రయోగించాడు కర్ణుడు. ఆకాశంమీద గొల్లుమన్నాయి భూత సంఘాలు. మాయని ముందు మింగేసి, ఘటోత్కచుడి గుండెలు పగిలించి, వీపులోంచి దూసుకుంటూ ఆకాశమార్గాన ఎగిరిపోయింది శక్తి తెల్లపోయారు దేవతలు.

సోలిపోతూ బోరగిలా పడిపోయాడు ఘటోత్కచుడు. నాలిక వెళ్ళబెట్టేసి, కరుచుకుంటూ, చొంగలు కక్కుకుని, మొహం వికారమయిపోయి, ప్రాణంవొదిలేశాడు. శంఖాలూ, భేరీలూ, సింహనాదాలూ — మన సేనసేనంతా గందికతో గగ్గోలు గగ్గోలు అయిపోయింది. నీకొడుకు సంతోషానికి అంతూ పంతూ లేకపోయింది. బంధువులతోనూ, స్నేహితులతోనూ ఆనందనృత్యం చేసేశాడతడు. అమాంతంగా వెళ్ళి కర్ణుణ్ణి కౌగలించేసుకున్నాడు. అతణ్ణి తన రథంమీదికి తెచ్చేసి, అదే పొగడడం పొగిడేశాడు.

ధృతరాష్ట్రుడు : ఆఁ! ఆఁ! మాయలికి మహారావణుడు ఘటోత్కచుడు. అంతవాడు హతమైపోయాక నెత్తీ నోరూ మొత్తుకుని, మండలు కరుచుకునివుంటారు పాండవులు. ఏం! ఏంచేశారట, వాళ్ళు?

సంజయుడు : ఘటోత్కచుడి చావు చూసి, కన్నీళ్ళతో ఘోరంగా దుఃఖపడ్డారు పాండవులు. కృష్ణుడు మాత్రం సంతోషంతో సింహనాదంచేశాడు; పాంచజన్యం పూరించాడు. పగ్గాలు నొగలికి కట్టేసి, పిల్లగాలికి కదిలే కల్పవృక్షంలాగ నాట్యం చేస్తూ రథంమధ్యకి వెళ్ళి అర్జునుణ్ణి కౌగిలించుకున్నాడు. అతడి వీపుతట్టి, మళ్ళీ మళ్ళీ సింహనాదం చేశాడు.

## మేం ఏడుస్తుంటే నువ్వు నవ్వుతావేం?

"ఇదేమిటి?" ఆశ్చర్యపోతూ అడిగాడు అర్జునుడు — "మేం ఏడుస్తూవుంటే నువ్వు నవ్వుతావేం? ఘటోత్కచుడికోసం సేన సేనంతా బాధపడుతూవుంది. నీకు సంతోషమెలా వచ్చిందీ అంటా! నీ మహానీయస్వభావం మానేసి, ఇలా తేలికగా నటించడంలో ఏమిటి ఆంతర్యం నేను వినరాంది కాకపోతే మహాపురుషా, వినిపించు వింటాను."

"నవ్వేసమయం కనకనే నవ్వుతున్నాను" గంభీరంగా అన్నాడు కృష్ణుడు—"చెపుతాను, విను. కవచకుండలాలు పుచ్చుకున్నప్పుడు దేవేంద్రుడు శక్తి ఇచ్చాడు కదూ! అది కర్ణుడిదగ్గర వున్నంతకాలమూ నిన్ను బతికించడం తరం కాదనే భయం నాకు. అది ఇవాళతో తీరిపోయింది. అతని చేతిలో అది వుందో, గాండీవం పట్టుకున్న నువ్వూ, చక్రం పట్టుకున్న నేనూ చావు తప్పించుకోలేం. అర్జునా, దేవతలతో సమానుడు కర్ణుడు. దేవేంద్రుడు అడగ్గానే కవచకుండలాలు కత్తిరించి (వికర్తనంచేసి) ఇచ్చేశాడు. అంచేతే అతణ్ణి వైకర్తనుడు అన్నారు.* నీకోసం మీతండ్రి అలా చెయ్యకపోతే ఎదురేవుండదు కర్ణుడికి. కవచకుండలాలతో దేవత్వం పోగొట్టుకుని మానవసామాన్యుడయిపోడమూ, ఇంద్రశక్తి ఇపుడు దగ్గిర లేకపోడమూ — ఈ రెంటివల్లా ఇక అతణ్ణి గెలిచేస్తావు నువ్వు. ఏకలవ్యుణ్ణీ, శిశుపాలుణ్ణీ, జరాసంధుణ్ణీ ఒక్కొక్కణ్ణీ ఒక్కొక్కవిధంగా నీకోసమే నాశనంచేశాను. ఏమంటే? వాళ్ళు ఇప్పుడు బతికే వున్నారనుకో, దుర్యోధనుడు తప్పకండా వాళ్ళని తనపక్షం తెచ్చుకుంటాడు. అవునా? ఆముగ్గురూ ఏకమైతే ఎవడితరం గెలవడం? అంతేకాదు, కిమ్మీరుడూ, బకాసురుడూ,

*వైకర్తన శబ్దానికి చిత్రమైన వ్యుత్పత్తి ఇది. వికర్తనుడు అంటే సూర్యుడు. సూర్యుడి కొడుకు (కర్ణుడు) వైకర్తనుడు.

హిడింబాసురుడూ లాగే ఘటోత్కచుడూ ధర్మమంటే ద్వేషమూ, రోషమూ కలవాడు. ఎప్పుడైనా వీడికి బ్రహ్మద్రోహం రావచ్చు. అంచేత వాళ్ళలాగే వీడూ నాశనం కావడమే నా ఉద్దేశం. రావణాసురుడంత వాడు వీడు. ఇప్పుడు చావకపోతే తరవాత నేనే వీణ్ణి చంపవలసి వచ్చేది. అంచేత ఇది నవ్వవలసిన సమయం కాని ఏడవవలసింది కాదు. మన సైన్యాలు క్షోభపడుతూన్నాయి. కౌరవసేనలు కలబడుతున్నాయి. నువ్వు ఉత్సాహం తెచ్చుకోవాలి" అన్నాడు.

ధృతరాష్ట్రుడు : ఇంద్రశక్తి వొక్కణ్ణిమాత్రం చంపేసి వెళ్ళి పోతుందని తెలుసుకదా, కర్ణుడికి. అది పెట్టుకుని అర్జునుడిమీద ఎందుకు వెయ్యలేదు? శిబిరాల్లోకి వ్యర్థంగా ఎందుకు యుద్ధంచేశాడూ అంట? అర్జునుడు వొక్కడూ అయిపోతే కథే అయిపోయేదికదా! అర్జునుడు చస్తే అందరూ చచ్చినట్టే. ఇంక ఎవడు దెబ్బలాడతాడూ వాళ్ళలో? ఎంతపని చేశాడూ! కోరి కవ్వించి పిలిచి అయినా అతడి మీద శక్తి వేసెయ్యవలసింది! యుద్ధానికి వస్తుంటే వెళ్ళడమే అర్జునుడి వ్రతంగా! ఎంచేత అలా వూరుకున్నాడో కర్ణుడు? నా కుమాళ్ళు దద్దమ్మలు. కర్ణుణ్ణి అలా చెయ్యమని చెప్పడానికి వాళ్ళకి తోచలేదే అనుకో. నువ్వయినా చెప్పలేకపోయావా? చేతకానివాడి చేతి పండు తెలివైనవాడు దపాయించినట్టు వొడుపుగా తన్నుకు పోయాడు కృష్ణుడు.

సంజయుడు : చెప్పకేం మహారాజా, రోజూ రాత్రిళ్ళు కర్ణుడితో నీకుమాళ్ళూ, నేనూ చెపుతూనే వచ్చాం. కర్ణుడూ బాగా వినేవాడు. "రేపు అర్జునుణ్ణి చంపేస్తాను శక్తివేసి" అనేవాడు. "అర్జునుడు చస్తే పాండవుల్లో వొకణ్ణి పట్టంకడతాడు శ్రీకృష్ణుడు. కృష్ణుడే ఈ అనర్థానికంతా మూలం. అతడే చస్తే అన్నీ చల్లపడతాయి. సామ్రాజ్యం మనకే దక్కుతుంది. అంచేత ఇంద్రశక్తి

కృష్ణుడిమీదే వెయ్యడం మంచిది" అనేవాళ్ళం మేం. "కృష్ణుణ్ణో అర్జునుణ్ణో ఎవణ్ణో వొకణ్ణి రేపు తప్పకుండా చంపేస్తాను" అనేవాడు కర్ణుడు, మీసం మెలిపెడుతూ. అన్నిమాటలూ అయేవి రాత్రి. తెల్ల వారేది. యుద్ధానికి బయల్దేరడంతోనే అతడూ మరిచిపోయేవాడు, మేమూ మరిచిపోయేవాళ్ళం శక్తిమాట. తిరిగి రాత్రి శిబిరానికి చేరగానే జ్ఞాపకంవచ్చేది. మండ కరుచుకునేవాడు కర్ణుడు. దీనంత టికీ దేవుడే కారణం. దేవుడంటే ఎక్కడో లేడు. శ్రీకృష్ణుడే. ఏమంటే, అర్జునుడితో శ్రీకృష్ణుడు చెపుతూవున్నప్పుడు సాత్యకి అతణ్ణి అడిగాడు "ఇన్నాళ్ళూ కర్ణుడు అర్జునుడిమీద ఇంద్రశక్తి ఎంచేత వెయ్యలేదు?" అని. అప్పుడు కృష్ణుడు ఏమన్నాడో తెలుసా? "వాళ్ళువాళ్ళు రోజూ అదేమరిపోసేవాళ్ళు. అతడూ అదే నిశ్చయంతో బయలుదేరేవాడు. యుద్ధంలో అడుగుపెట్టేసరికి అతడూ, అతడివాళ్ళూ అందరూ మరిచిపోయినట్టు చేసేవాణ్ణి నేను, మన అర్జునుడికోసం" అన్నాడు. అంతేకాదు, ధృష్టద్యుమ్నుడూ మొదలైనవాళ్ళని పిలిచి, అందరిఎదటా సాత్యకితో ఇంకా ఇలా అన్నాడతడు "ఇదిగో మీరూ, నాతల్లిదండ్రులూ, ఈముల్లోకాలూ తుదకి నాప్రాణాలూ కూడా అర్జునుడికంటే తీపికాదు నాకు. ఇన్నాళ్ళూ వున్న బెంగ ఇవాళతో తీరిపోయింది. గుండెలమీద చెయ్యివేసి హాయిగా ఈరాత్రి నిద్రపోతాను" అన్నాడు. అంచేత మహారాజా, ఇదంతా దైవవిధానం. దీనికోసం విచారించి లాభంలేదు.

ధృతరాష్ట్రుడు: అవును సంజయా అవును. దైవమే మాకు ప్రతికూలంగా వున్నాడు. ఇంచేతే గడ్డిపరకలాటి ఘటోత్కచుడికోసం అమోఘమైన ఇంద్రశక్తి వ్యర్థమైపోయింది. ఇక మావాళ్ళు బతికి బట్టకట్టడం వొట్టిమాట. ఎంతబాధుకుంటేమాత్రం ఏంలాభం? తరవాత ఏంజరిగింది?

సంజయుడు : ఘటోత్కచుడి చావుతో దిగాలుమనిపోయాడు ధర్మరాజు. కుప్పకూలినట్టు రథంమీద చదికిలబడిపోయాడు. దుఃఖంతో కన్నీళ్ళు వరదలుకట్టాయతడికి.

"నువ్వే ఇలా అయితే ఇంకేం దారి?" చప్పున వచ్చి అతణ్ణి లేవదీస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు — "మామూలు వాళ్ళలాగ నువ్వూ విచారిస్తూ కూచుంటే నీసైన్యం యావత్తూ కుంగిపోతుంది. నీమీద వున్న మహాభారం మరిచిపోతున్నావు. విజయ మెలా లభిస్తుంది? లే. ఉత్సాహం తెచ్చుకో యుద్ధానికి" అని హెచ్చరించాడు.

"ఘటోత్కచుడిలాంటి కొడుకు పోతే కృష్ణా, ఎలా భరిస్తుంది గుండె?" కళ్ళనీళ్ళు చేతులతో తుడుచుకుంటూ ఎత్తుకున్నాడు ధర్మ రాజు — "కామ్యకవనంలోనూ, గంధమాదనంవెళ్ళినప్పుడూ ఎంత సహాయంచేశాడూ! నేనంటే ప్రాణంపెట్టేవాడు. గీసినగిరి దాటేవాడు కాడు. సహదేవుడికంటేనూ అతడిమీద ప్రేమ నాకు. అలాంటి కొడుకు పోయాక గుండెతరుక్కుపోకండా ఎలా వుండేది?"

దుఃఖమంతా కోపంకింద మారింది.

"దీనంతటికీ మూలకారణం ఆ కర్ణుడు" వురుముతూ మళ్ళీ అందుకున్నా డతడు — "ఆ దుర్మార్గుడే అభిమన్యుడి ధనుస్సు వెనక చాటున విరగ్గొట్టాడు. వాడే అంతమందిచేతా అబ్బాయిని అన్యా యంగా చంపించాడు. అప్పుడు జయద్రథుడు దూరంగానే వున్నాడు. అయినా అతడిమీదే పడింది పిడుగు. అతణ్ణే అర్జునుడు చంపేశాడు. అభిమన్యుడి హత్యకి ప్రతీకారమే కా దది. కుమాళ్ళు ఇద్దరి చావుకి ఈ కర్ణుడే కారణం. అంచేత కృష్ణా, కండలు కండలు కోసెయ్యాలి కర్ణుణ్ణి. అందాకా శాంతిలేదు నాకు" అంటూ దిగ్గున లేచాడు. "నిన్నా ఇవాళా ఆద్రోహికి తోడ్పడ్డ ద్రోణుణ్ణి తెగెయ్యాలి. ఆ పని భీముడు చేస్తాడు. నేను కర్ణున్ని కడముట్టిస్తాను" అని శంఖం

పూరించాడు. ధనుస్సు సారించాడు. "రథం పోనీ" అని సారథిని హెచ్చరించాడు.

ధర్మరాజురథం బయలుదేరింది. " 'నేనే చంపుతాను కర్ణుణ్ణి' అంటూ బయలుదేరాడు మీఅన్నయ్య" తన రథంమీదికి వచ్చేసి అర్జునుడితో అన్నాడు శ్రీకృష్ణుడు – "చూస్తూ వూరుకోకూడదు మనం. పద" అంటూ పగ్గాలు సడిలించాడు. ధర్మరాజు రథంవెంట అర్జునుడిరథం పరుగులు పెట్టింది.

## "ఐదురోజుల్లో సామ్రాజ్యం వస్తుంది"

క్రోధంతో ముందూ వెనకా కనపడకండా వెళుతున్నాడు ధర్మరాజు. చల్లనిచూపులతో ఎదురుగుండా ప్రత్యక్షమయాడు వ్యాసుడు పాదాభివందనంచేశాడు ధర్మరాజు. "ధర్మమే జయిస్తుంది" దీవిస్తూ నెమ్మదిగా అన్నాడు వ్యాసముని – "ధర్మరాజా, తడబడకు. దేవేంద్రుడిశక్తి అర్జునుణ్ణి చంపడంకోసం సంగ్రహించాడు కర్ణుడు. అది అతడి దగ్గిర వుందో, ఆప్రమాదం అసాధ్యమయేది. ఘటోత్కచుడి కాలం తీరిపోయింది. ఈ నెపంమీాద కళ్ళనూశా డతడు. ఇది మీకుమేలే, కాని కీడు కాదు. ఆపద రాకండా దైవం ఇలా రక్షించాడు. అంచేత ధర్మరాజా, తడబడకు. సేనా, సేనాధిపతులూ, రాజులూ, తమ్ములూ–వీరువాళ్ళందినీ కూడేసుకుని యుద్ధంచెయ్యి. నీప్రతాపం ప్రదర్శించు. విచారం విడిచిపెట్టు. ధర్మం ఎక్కడవుంటే అక్కడే జయం వుంటుంది. సర్వశుభాలూ అక్కడే వుంటాయి. ఐదురోజుల్లో సామ్రాజ్యం నిన్నువరిస్తుంది. సందేహం లేదు" అంటూ సముదాయించి అంతర్ధానమయాడు. సావధానుడయాడు ధర్మరాజు.

"ద్రోణుడిముందు కౌరవసేన హరాణంచేస్తున్నాడు భీముడు" ధృష్టద్యుమ్నుణ్ణి హెచ్చరిస్తూ అన్నాడు ధర్మరాజు – "నువ్వు

ద్రోణుడిపని పట్టించు. అతడి అంతు చూడడానికే అగ్నిలో పుట్టావు. జంకకు. శిఖండీ మొదలైన పాంచాలకుమారుల్ని వెంట వేసుకు వెళ్ళు" అన్నాడు. ఇంతలో అతడి వెంటవచ్చి, నకులసహదేవులూ, ద్రుపద మహారాజూ, విరాటరాజూ, ద్రౌపదికుమారుల్లూ, సాత్యకీ, కేకయ రాజులూ రెండుపక్కలా సమావేశమయారు.

"మీరు యావన్మందీ వెళ్ళండి" అందరినీ ఆదేశించాడు ధర్మ రాజు– "మీ వెంట అర్జునుడూ వస్తాడు. ఈ రాత్రి మళ్ళకండా చంపె య్యాలి ద్రోణుణ్ణి."

తమతమ బలాలతో పాండవయోధులు యావన్మందీ బయలు దేరారు. తనసైన్యాలు హెచ్చరిస్తూ దారుణంగా ఎదుర్కొన్నాడు ద్రోణుడు అద్భుతమనిపించింది అతడి ఉత్సాహం. బ్రహ్మాండమైన సన్నాహం చేశాడు దుర్యోధనుడు.

ఉదయంనించి ఏకటాకీని యుద్ధం చేస్తున్నారు సైనికులు. రెండు వేపులవాళ్ళూ దగఎత్తి తూలిపోతున్నారు. అందులో ముఖ్యంగా నీ సైనికులు దప్పికతోనూ, నిద్రమత్తుతోనూ కాలు కదపలేని స్థితికి వచ్చారు. యావన్మందికీ ఆమూడుజాములరాత్రీ వెయ్యిరాత్రిళ్ళులా అనిపించింది. కేవలం తమ ధర్మం తాము నిర్వహించడానికి మాత్రం పోరాడుతున్నారు వాళ్ళు. నిద్రమైకంతో దివిటీలవాళ్ళు దివిటీలలో నూనెపోయక కళ్ళు తేలేశారు. మినుకుమినుకుమంటున్నాయి దివిటీలు. చీకట్లు పేరుకుంటున్నాయి. కునుకుపాట్లుపడుతూ ఆయుధాలు వేస్తు న్నారు కొందరు. వాహనాలు ఎటులాక్కుపోతే అటు పోతున్నారు కొందరు. ఊగుతూ జోగుతూ తమవాళ్ళనే పొడిచేస్తున్నారు కొందరు. ఇలా అడ్డదిడ్డంగా తయారైన సైన్యాలు పరికించాడు అర్జునుడు.

"యావన్మందీ నిద్రవల్ల అలిసిపోయారు" ఉభయసేనల్నీ సంబోధిస్తూ అన్నాడతడు – "ఈమత్తుకాస్త వొదిలేదాకా రణస్థలం

లోనే అందరూ నిద్రపొండి. చంద్రోదయమయాక తిరిగీ యుద్ధం చేద్దురుగాని" అన్నాడు.

ఎంతో అంత సంతోషించారు మన సైనికులు. కర్ణ, దుశ్శా సనుల అనుమతి తీసుకుని ఎక్కడివాళ్ళు అక్కడ విశ్రమించారు. అర్జునుడి ధర్మభావానికి దేవతలూ మెచ్చుకున్నారు.

"అర్జునా, చల్లనితండ్రివి. బతికించావు. దేవతలు నీకోర్కెలు నెరవేరుస్తారు" అంటూ ఎన్నోవిధాల అర్జునుణ్ణి దీవించారు కౌరవ సైనికులు. అతణ్ణి పొగుడుతూ హాయిగా నిద్రపోయారు. రతిపార వశ్యంతో పడుచుభార్యల స్తనాలమీద వొరిగిన భర్తలలాగ యుద్ధంలో అలిసిపోయి ఏనుగులకుంభస్థలాలమీద వాలిపోయారు యోధులు. రౌతులు గుర్రాలమీదే నిద్రపోయారు. రథాలవాళ్ళు రథాలమీదే నిద్రపోయారు. పదాతులు నేలమీద వొళ్ళువాల్చారు.

చంద్రోదయ మయింది. కలవరేకులికి మెరుగుపెట్టడానికి చేసిన పాదరసం వుండలా వుంది చంద్రబింబం. ఉదయపర్వతంమీదచిగురు గుత్తులతో వున్న కల్పవృక్షంలాగూ వుంది. తూర్పుసముద్రందగ్గిర ఎర్రటి పగడాల పొరలాగూ వుంది. మెల్లిమెల్లిగా ఉదయించి, అంత కంతకీ అధికమవుతూ ఆకాశం మీదికి వచ్చింది చంద్రబింబం. దశ దిశలూ తెల్లవారాయి దాంతో.

అటు పాండవసేనా, ఇటు కౌరవసేనా — ఉభయసేనలూ మేలు కున్నాయి; యుద్ధానికి సిద్ధపడ్డాయి. దుర్యోధనుడు ద్రోణాచా ర్యులు దగ్గిరికి వెళ్ళాడు అతణ్ణి ఇంతవాడివీ, అంతవాడివీ అని పొగి డాడు. అతడి అస్త్రవీర్యమూ ఆతడి శౌర్యమూ ఇంతా అంతా కాదని ఆకాశానికి ఎత్తేశాడు. "ఇంత వాడివి నీకాలిగోటికైనా సరితూగని వాళ్ళని పెద్దచేసుకుని, శిష్యులని పక్షపాతంవల్ల వాళ్ళని

ఉపేక్షిస్తున్నావు. ఇదంతా నాభాగ్యం కాకపోతే ఏమిటి మరి!" అన్నాడు చివర.

"అవును" చీదరించుకుంటూ అన్నాడు ద్రోణుడు – "శిష్యుడని మన్నించే దేవేంద్రుడు ఖాండవం వొదులుకున్నాడు శిష్యుడని మన్నించే ఘోషయాత్రలో గంధర్వుడు చిత్రసేనుడు పట్టుకపోతున్న నిన్ను వొదిలేశాడు, అతడు రాగానే. శిష్యుడని మన్నించే నివాత కవచులూ కాలకేయులూ ప్రాణాలు వొదిలారు. ఎందుకూ ఈ ఆలునీ చూలునీ పొందని పాడుమాటలు!"

"నువ్వు అర్జునుడితో చాలలేవంటే చాలలేనట్టు వూరుకో" కళ్ళెర్రచేసి కస్సుమన్నాడు దుర్యోధనమహారాజు–"ఏదో కొంతమందిని వేసుకుని, నువ్వు గెలవగలవాళ్ళమీదికి వెళ్ళు. నేనూ, దుశ్శాసనుడూ, శకునీ, కర్ణుడూ అర్జునుడి అంతుచూస్తాం. సైన్యం రెండు భాగాలు చేసుకుని రెండు దిక్కులా ముట్టడిస్తాం" అన్నాడు.

"అదేక్షేమయినమాట" నవ్వుతూ అందుకున్నాడు ద్రోణుడు–"తప్పకండా అంతుచూడండి. వెళ్ళండి. తినదగిందంతా తిన్నావు. కట్టదగిందంతా కట్టావు. పెట్టదగిందంతా పెట్టావు. ప్రపంచంలోవున్న భోగాలన్నీ అనుభవించావు. ఇక మిగిలింది ఏముంది? రవంతాభయం మక్కరలేదు. వెళ్ళు. కలబడు అర్జునుడిమీద" అంటూ పాంచాలంసేనమీదికి చర్రున రథం పరిగెత్తించాడు ద్రోణుడు. ఆవేకువజాము వెన్నెలలో అపూర్వమైన యుద్ధం జరిగింది.

తూరుపు ఎరుపెక్కింది.

"రెండుదిక్కులా దండెత్తివచ్చాయి కౌరవసేనలు. వీటిని దాపలపెట్టి తరమాలి" అర్జునుణ్ణి హెచ్చరించాడు శ్రీకృష్ణుడు. "కానీ" అన్నాడు అర్జునుడు. అన్నట్టే రథంనడిపాడు శ్రీకృష్ణుడు. భీముడూ ఉత్సాహమైనమాటలతో పురెక్కించాడు అర్జునుణ్ణి. దుర్యో

ధనుడూ, దుశ్శాసనుడూ, శకునీ, కర్ణుడూ రెండుదిక్కులా అర్జునుణ్ణి ఆక్రమించారు. ఎడా తెరిపీ లేకుండా ఎడా పెడా కురిపించారు. అందరికీ అన్నిరూపులయి ఇటూ అటూ యుద్ధంచేశాడు అర్జునుడు. కౌరవ పాండవసేనలు రెండూ రెండుసముద్రాలు కలబడినట్టు కలబడ్డాయి.

## ద్రోణుడు విరాటరాజునీ ద్రుపదమహారాజునీ చంపేశాడు

వ్యూహంలో నిలబడలేదు ద్రోణాచార్యులు. ఒక్కడూ ఉత్తరంగా శత్రువులమీదకి తరుముకు వెళ్ళాడు. అతణ్ణిచూసి, పెద్దపులిని చూసిన లేళ్ళలా గడగడలాడారు పాండవసైనికులు. అలా తెగించి వెళ్ళి అక్కడివాళ్ళని యుద్ధానికి కవ్వించా డతడు. దానికి నిశ్చేరపో యారు కొందరు. కొందరు గుడ్లురచేశారు. ధైర్యం తెచ్చుకుని పురక బోయారు కొందరు. చిత్రంగా చూశారు కొందరు.

విరాటరాజూ, ద్రుపదమహారాజూ, అతడిమనవలు ముగ్గురూ, కేకయరాజులూ సేనలతో ద్రోణుణ్ణి చుట్టుముట్టారు. ప్రళయరుద్రుడి అవతారం ఎత్తాడు ద్రోణాచార్యులు. మత్స్య, చేది సేవల్లో ఎంతో మందిని లిప్తలమీద దుళ్ళగొట్టేశాడు. ద్రుపదుడి మనవలు ముగ్గురినీ వూడ్చేశాడు. కాడలు తుంచేసిన పద్మల్లాగ, కేకయుల పీకలు కోసేసి, శిరస్సులు తూలగొట్టాడు.

"ఇంక, ఎప్పుడూ మన పౌరుషం?" అంటూ విరాటరాజూ, ద్రుపదమహారాజూ ద్రోణుడిమీదికి వురికారు. ఇద్దరూ దారుణమైన బాణాలు కురిపించారు. వాళ్ళు వేసిన బాణాలన్నీ తుక్కుకింద కొట్టేశాడు ద్రోణుడు. వాడివాడి బాణాలు వేసి ఇద్దరి ధనుస్సులూ నరికేశాడు. మండిపడి పది తోమరాలు విసిరాడు విరాటరాజు. కాల సర్పంలాంటి శక్తి ప్రయోగించాడు ద్రుపదుడు. తోమరాలూ శక్తీ,

తుక్కు-కింద కొట్టేశాడు ద్రోణాచార్యులు. రెండేరెండు వెడల్పాటి బాణాలు తీశాడతడు. ద్రుపదుడితలా, విరాటరాజుతలా నరికిపారేశాడు. క్రోధంతోనూ, దుఃఖంతోనూ ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు ధృష్టద్యుమ్నుడు.

"ద్రోణుణ్ణి చంపుతాను. తప్పితే క్షత్రియకులాచారధర్మాలు తప్పినట్లే" అంటూ పదిమందీ వినేట్టు ప్రతిజ్ఞ చేశాడతడు. పెద్ద పాంచాల సైన్యంతో ద్రోణుడిమీదికి తుఫానులాగ తరుముకువెళ్ళాడు. దుర్యోధనుడూ, కర్ణుడూ, శకునీ ద్రోణుడికి కాపుగా బయలుదేరారు. ధృష్టద్యుమ్నుణ్ణి అడ్డుకున్నారు; ఘోరంగా పోరాడారు.

"ప్రతిజ్ఞచేసీ పస్తాయిస్తావేం?" దారిలోనే చిక్కడిపోయి, ద్రోణుడి మీదికి వెళ్ళలేక ముందూ వెనక లవుతూన్న ధృష్టద్యుమ్నుడికి ఉపారిస్తూ వురిమాడు భీముడు - "తండ్రిని చంపినవాణ్ణి తరిమి కొట్టు. ఇదిగో నేను నీవెనకవున్నాను" అంటూ నిప్పులు కక్కుతూ పిడుగులాగ తరుముకు వచ్చాడు. తనవాళ్ళని దుర్యోధనుడు హెచ్చరించాడు. కనీ వినీ ఎరగని దొమ్మీయుద్ధం జరిగిపోయింది.

## పదిహేనోరోజు

కరకరా పొద్దుపొడిచింది. ఉభయసేనలూ కాలకృత్యాలు తీర్చుకుని మళ్ళీ యుద్ధానికి సిద్ధపడ్డాయి. ఎండవేడీ, రాత్రి అలజడీ, ఆకలీ- ఈఅన్నిటితో అందరి శరీరాలూ పట్టుతప్పిపోతున్నట్టున్నాయి. అందరి మొహాలూ నోక్కుపోయాయి. అయినా ఉభయ పక్షాల్లోనూ పౌరుషంమాత్రం తగ్గినవాడు లేడు.

ఉభయసేనలూ వుప్పెనలా వుప్పొంగాయి. ఉత్సాహంతోనూ ఉద్రేకంతోనూ వొకదానితో వొకటి కలబడ్డాయి. ఎక్కడలేని ధూళీ రేగింది. గడిచినరాత్రి మళ్ళీ తిరిగివచ్చిందా అన్నంత చీకటి కమ్ము

శాడు శిష్యుడు. "గురువునిమించిన శిష్యుడు!" లోలోపల మెచ్చు కుంటూ యుద్ధం చేశాడు ద్రోణాచార్యులు.

"శివుడే రెండురూపాలతో వచ్చి పోరాడుతున్నట్టుంది" నిచ్చెరపోతూ మెచ్చుకున్నారు దేవతలు.

ఉన్నట్టుండి ఆపాళాన బ్రహ్మాస్త్రం తీశాడు ద్రోణుడు. మంత్ర పూర్వకంగా వింటినారితో సంధించాడు. కొండలు వూగాయి. భూమి వణికింది. సముద్రాలు సంక్షోభించాయి. అగ్గిగాడుపులు వీశాయి. దేవ తలు భయభ్రాంతులయ్యారు. ఉభయసేనాలూ గడగడలాడాయి.

బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు ద్రోణుడు. కదలని మేరువులా నిలబడ్డాడు అర్జునుడు. ఏదో వేడుకలా చూశాడు దాన్ని. బ్రహ్మాస్త్రం బ్రహ్మాస్త్రంతోనే ఇట్టే చల్లబెట్టేశాడు. అదిగో, అలా గెలుపూ వోటమీ లేకండా గురువూ శిష్యుడూ పోరాడారు. ద్వంద్వయుద్ధం జరుగుతోంది కనక పాంచాలసేనమీదికి ద్రోణుడూ, కౌరవసేనమీదికి అర్జునుడూ తప్పుకున్నారు.

ధృష్టద్యుమ్నుడితో దుశ్శాసనుడు వోడిపోయాడు ధృష్టద్యు మ్నుడు ద్రోణుడితో కలబడ్డాడు. నకులసహదేవులు అతడితో కలి శారు. కృతవర్మ, దుర్యోధనుడి తమ్ముళ్లు ముగ్గురూ వాళ్ళని అడ్డు కున్నారు. దారుణంగా అందుకుంది యుద్ధం. మహారాజా, ఉత్తములూ బుద్ధిమంతులూ అయిన ఉభయపక్షాల రాజులూ స్వర్గమే లక్ష్యంగా పెట్టుకుని యుద్ధం చేశారు. అడ్డుమొనల కర్ణిబాణాలు కానీ, విషంపులి మిన నాలీకాస్త్రాలుకానీ, ఎముకల్లో దూసుకుపోయే వస్తకాస్త్రాలుకానీ ముళ్ళముళ్ళ కపిశాస్త్రాలుకానీ, ఆవుకొమ్ముతోనూ, ఏనుగు దంతం తోనూ చేసినవీ, పూతికంపుకొడుతున్నవీ, వంకరటింకరగా వెళ్ళేవీ — ఇలాంటి కుటిలాస్త్రాలు కానీ వొక్కడూ వెయ్యలేదు.

నీముగ్గురు కొడుకులూ, కృతవర్మా — ఈనలుగురూ నకుల సహదేవులతో చెరో ఇద్దరయి పోరాడారు. దుర్యోధనుడూ, సాత్యకీ కలబడ్డారు. సాత్యకి దుర్యోధనులు చిన్ననాటి స్నేహితులు;సహాధ్యాయులు. శరీరాలు వేరు కాని మనస్సులు వొకటిగా వుండేవాళ్ళు అప్పుడు. అవన్నీ ఇద్దరూ వొకసారి చెప్పుకున్నారు. "ధర్మం ఎంత నిష్ఠురమైందీ!" అంటూనొచ్చుకున్నారు. తుదకి వొకరిమీద వొకరు బాణాలు గుప్పించుకున్నారు.

సాత్యకి దుర్యోధనుడివిల్లు విరిచేశాడు. వాడివాడిబాణాలు నాటించాడు. తగ్గేసి తప్పుకున్నాడు దుర్యోధనుడు. అలసటతీర్చుకుని మళ్ళీ వెళ్ళికలబడ్డాడు. సాత్యకిది పైచెయ్యికావడం చూసి, కర్ణుడు రాజుకి సాయంవెళ్ళాడు. భీముడు అతణ్ణి అడ్డుకున్నాడు. బాణంమీద బాణం తగిలించాడు. అవన్నీ ఇట్టే కొట్టేశాడు కర్ణుడు. నవ్వుతూ భీముడి సారథిని జుమాలుమనిపించాడు. అతడి విల్లు నరికేశాడు. పిడుగులాటి గదతీశాడు భీముడు. తిప్పితిప్పి దబాలున విసిరాడు. దెబ్బతో గుండయిపోయింది కర్ణుడిరథం. అతడి సారథీ తారుమనిపోయాడు. అయితే కర్ణుడుమాత్రం కాలు కదపలేదు. వరసపెట్టి బాణాలు వేస్తూనేవున్నాడు. చతురంగబలాలు మధ్యపడ్డాయి. మత్స్య సేన రెచ్చగొట్టి ధర్మరాజు ద్రోణుడితట్టు తరుముకువెళ్ళాడు.

మధ్యాహ్నమయింది.

"ద్రోణుడు పాంచాలసేనపాతేస్తున్నాడు" నకులసహదేవులూ, భీముడూ అర్జునుడిదిక్కు కేకలువేశారు — "ఎలాఅయినా ఈకౌరవసేన చీల్చెయ్యి నువ్వు. అక్కడిసేనే చాలు మనది, ద్రోణుడిపని పట్టడానికి" అంటూ ముగ్గురూ ద్రోణుడికేసి రథాలుపరిగెత్తించారు. ఎంత సేనవచ్చినా అంతసేనా అంతంచేసేస్తున్నాడు ఆచార్యులు, ఆకలితో వున్న సింహంలాగ.

ధర్మరాజూ, భీముడూ, నకులసహదేవులూ వాళ్ళదగ్గిర చేరారు. తమలో తాము ఇలా అనుకున్నారు: భయంకరంగా పేట్రేగిపోతు న్నాడు ఇవాళ ద్రోణుడు. ఏనుగులు చంపేస్తున్నాడు. గుర్రాలు కూల్చేస్తున్నాడు. రథాలు విరిచేస్తున్నాడు. పదాతుల్ని పాతేస్తు న్నాడు. రక్తంలో ముంచెత్తుతున్నాడు. యోధుల కండలు చెక్కే స్తున్నాడు. తుదకి మనల్ని పూడ్చేస్తాడు. ఇతణ్ణి నిలవరించడం ఎవ్వ డికీ సాధ్యంకాదు. గురువు అని ధర్మం విచారిస్తున్నాడు అర్జునుడు. తెగించకండా వూరుకుంటున్నాడు. తప్పుకుంటున్నాడు. ఏందారి ? "

దూరంనించే వాళ్ళవైఖరి కనిపెట్టేశాడు శ్రీకృష్ణుడు. చర చరా అక్కడికే రథం తోలుకుపోయి అన్నాడు: "యుద్ధంలో దేవతలూ దానవులూ ఎవ్వరైనా సరే, ఈమహాత్ముణ్ణి గెలవలేరు. దీనికి వొకటే ఉపాయముంది మందు. చెపుతాను, వినండి. 'కొడుకు చచ్చిపోయాడు' అని వింటే ఆయుధాలు వొదిలేస్తాడతడు. కొయ్య బారిపోతాడు. అదిగో అప్పుడూ అతణ్ణి చంపెయ్యవచ్చు. ఇది తప్పితే మరో ఉపాయం లేదు. అంచేత 'అశ్వత్థామ చచ్చాడు' అని ఎవరైనా అతడితో చెప్పాలి ఇప్పుడు. కనుచూపుమేర కనపడ కండా ఆకట్టు యుద్ధంచేస్తున్నాడు అశ్వత్థామ. అతడు వున్నదీ లేనిదీ అవగతం కావడం అసాధ్యం ద్రోణుడికి."

అక్కడివాళ్ళంతా బాగుందంటే బాగుందన్నారు. ఒక్క అర్జు నుడుమాత్రం వొప్పుకోలేదు. తటపటాయిస్తూ ధర్మసందేహంలో పడిపోయాడు ధర్మరాజు.

ఇంతలో మాలవరాజు ఇంద్రవర్మ పట్టపుటేనుగు గదతో బాది చంపేశాడు భీముడు. దానిపేరు అశ్వత్థామ. ఆ మిషపెట్టి భీముడు ద్రోణుడి దగ్గిరికి పరిగెత్తాడు. "అశ్వత్థామ చచ్చిపోయాడు" అని గట్టిగా అరిచాడు.

తుళ్ళిపడ్డాడు ద్రోణుడు. గుండె జల్లుమని చెదిరిపోయింది. అయితే అంతలోనే ధైర్యం తెచ్చుకున్నాడు. కొడుకు అస్త్రవీర్యమూ, శక్తిసామర్థ్యాలూ తలుచుకున్నాడు. భీముడిమాట పెడచెవిని పెట్టాడు. చలనం లేకండా ధృష్టద్యుమ్నుడితో పోరాడాడు. విడుపూ విరామం లేకండా వేలువేలు బాణాలు గుప్పించాడు. అడ్డువచ్చిన పాతికమంది పాంచాలం రథికుల్ని పాతేశాడు. మత్స్యదేశం సేనలో వురికి ఐదు వందల రథాలూ, పదివేల ఏనుగులూ, పదివేల గుర్రాలూ కూల్చేశాడు. సూటిగా రాజులమీదికి పరిగెత్తాడు.

అప్పుడు విశ్వామిత్రుడూ, జమదగ్ని, భరద్వాజుడూ, కశ్యపుడూ, వసిష్ఠుడూ మొదలైన మునులు ద్రోణుడి దగ్గిరికి వచ్చారు. "ద్రోణాచార్యా, నువ్వు బ్రాహ్మడివి. వేదాలూ, వేదాంగాలూ తెలిసినవాడివి. యుద్ధం ధర్మం కాదు నీకు. ఇంతవరకూ చేసిందేదో చేశావు. కాలం తీరిపోయింది. ఇక యుద్ధం చాలించడం మంచిది. మామాట విను. ఆయుధాలు వొదిలెయ్యి. శాంతి పొందు" అని అంతర్థానమయారు.

మునులమాటలూ, భీముడి పలుకులూ ఊహించుకున్నాడు ద్రోణుడు. తలెత్తి చూసేసరికి ఎదురుగుండా ధృష్టద్యుమ్నుడు కనిపించాడు. మనసు చలించింది. దుఃఖం పొర్లుకువచ్చింది. కొడుకు నిజంగా చచ్చాడో బతికేవున్నాడో? ధర్మరాజువల్ల నిజం తెలుస్తుంది అంటూ అతణ్ణే అడిగాడు.

## అశ్వత్థామ చచ్చాడు ఏనుగు

"ప్రాణం రక్షించుకోవలసి వచ్చినప్పుడు అబద్ధమాడితే తప్పు లేదు" ధర్మరాజుని తొందరచేస్తూ ప్రబోధించాడు శ్రీకృష్ణుడు — "ఇదిగో ఈ అపరాహ్ణం ద్రోణుడు యుద్ధంచేస్తే వొకపిట్టయినా మిగ

లదు మనసేన. ఇందులో పిసరంత అబద్ధంలేదు, నమ్ము. మమ్మల్ని ఇతడిపాలు చేసెయ్యకు. కాపాడు. అనూ, 'అశ్వద్ధామ చచ్చాడు' అను" అంటూ ముందుకి తోశాడు.

"ఇందాక కృష్ణుడు చెప్పినప్పుడే నామనస్సులోవుంది ఆమాట" అన్నగారికి వొత్తిచెప్పాడు భీముడు - "ఇంతలో ఇంద్రవర్మ ఏనుగు అశ్వత్థామ నాచేత చచ్చింది. అది నెపంపెట్టి 'అశ్వత్థామ చచ్చాడు' అని చెప్పాను. గతుక్కుమనిపోయి, అంతలోనే జల్దుకున్నాడాయన. నామాట నమ్మలేదు. అందుకని నిన్ను అడుగుతున్నాడు. నీమేలు కోసమే చెపుతున్నాడు శ్రీకృష్ణుడు. కాదనకు. అశ్వత్థామ చచ్చాడను. నీమాట నమ్ముతాడతడు. నమ్మి, యుద్ధంచెయ్యడానికి చెయ్యాడక చెడతాడు" అన్నాడు.

తమ్ముడిమాటా, కృష్ణుడిమాటా గుండెల్లో పట్టాయి ధర్మరాజుకి. అసలు అది అలాగే జరగవలసి వుంది. అంచేత తలవూపాడు ధర్మరాజు. యుద్ధం గెలవాలన్న తమకం అబద్ధమన్నభయం తగ్గించింది. దాంతో అనుమానం వొదిలేశాడు.

"అశ్వత్థామ చచ్చాడు" స్పష్టంగా వొత్తి ద్రోణుడితో అన్నాడు ధర్మరాజు. తరవాత "ఏనుగు" అని మెల్లిగా అన్నాడు, ద్రోణుడికి వినపడకండా.

మహారాజా, ఆశ్చర్యం! అంతవరకూ నేలకి బెత్తెడు ఎత్తుగా నడుస్తూవుండే ద్రోణుడి రథచక్రాలు యుద్ధంలో అపజయం సూచిస్తూ చప్పున నేలకి తాకుతూ నడిచాయి. దాంతోనే అనుకున్నాడు ద్రోణుడు పాండవులికి తాను ద్రోహంచేశాననీ; అందుకనే మునీశ్వర్లు అలా చెప్పారనీ. "అలా కాకపోతే ఈఅపశకున మేమిటి?"

## ద్రోణవధ

ధర్మరాజు చెప్పడంతోనే అశ్వత్థామ చావు నిజమే అని నమ్మాడు ద్రోణుడు. రణోద్రేకం వొదిలేశాడు. ధృష్టద్యుమ్నుడి మీద దృష్టినిలిపి, దిస్సపోయి వుండిపోయాడు. దుఃఖంతో స్మృతి చెదిరింది. చలనంలేకండా దీనంగా వొంగిపోయాడు. ద్రోణవధకోసమే ద్రుపదుడి హోమకుండంలో పుట్టాడు ధృష్టద్యుమ్నుడు. అంపవాన కురిపిస్తూ ఉగ్రమూర్తిలా వురికాడతడు. అగ్నిజ్వాలలాంటి ఘోరమైన బాణం ధనుస్సుకి తొడిగాడు. గూడుకట్టిన సూర్యబింబం ఎలావుంటుంది మధ్య, అదిగో అలా అవుపడింది చక్రాకారంగావున్న ధనుస్సు మధ్య బాణం. ఆ ఉగ్ర బాణం చూసి, ద్రోణుడికాలం తీరిపోయిందనే వొణికిపోయారు సైనికులు.

యుద్ధానికి మనసువొప్పడంలేదు ద్రోణుడికి. అయినాసహజ తేజశ్శాలికనక శత్రువు ఎదురుగుండా రోషంచూపిస్తూవుంటే సహించలేకపోయాడతడు. ధనుస్సుని దివ్యాస్త్రాలు సంధించాడు. అయితే అవి అతడి మాట వినలేదు. అంగిరసుడిచ్చిన ధనుస్సుతీశాడు. గట్టిగట్టి బాణాలు ధృష్టద్యుమ్నుడిమీద వేశాడు. అతడు వేసిన బాణాలు నరికాడు. అతడి ఎట్లావిరిచేశాడు. మరోవిల్లు అందుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. ద్రోణుడిగుండెలమీద దారుణమైన బాణాలుతగిలించాడు. ఒక్కక్షణం జామాలుమన్నాడు ద్రోణుడు. ఆఉత్తరక్షణంలో జల్దుకున్నాడు. వెడల్పాటిబాణం వేసి మళ్ళీ ధృష్టద్యుమ్నుడిధనుస్సు నరికాడు. అతడి రథం మీదికి రథం వురికించాడు. నొగానొగా రాపాడించాడు. ద్రోణుడి ఎఱ్ఱగుఱ్ఱాలు, ధృష్టద్యుమ్నుడి పారావతవర్ణంగుఱ్ఱాలతో కలిసి మెరుపు మేఘాల్లాఅవుపించాయి. ధృష్టద్యుమ్నుడి రథంకట్టూ, చక్రంకట్టూ, ఇరుసుకట్టూ తెగగొట్టేశాడు ద్రోణుడు. జెండాఎగరగొట్టాడు. ప్రమా

దంలో పడిపోయి గడఎత్తాడు ధృష్టద్యుమ్నుడు. అదిన్నీ కొట్టేశాడు ద్రోణుడు. వందచంద్రులు చెక్కిన డాలూ, దారుణమైన కత్తీ పట్టుకు లేచాడు ధృష్టద్యుమ్నుడు. తనరథం ఇరుసుమీదించి ద్రోణుడి నొగ మీదికి వురికాడు. అతడి గుండెలు గురిచూస్తూ, వొకప్పుడు నొగ కట్టుదగ్గిరా, వొకప్పుడు నొగలమీదా, వొకప్పుడు గుర్రాల వీపుల మీదా తిరుగుతూ, ఎరకోసం తిరిగిన డేగలాగ వుంకించాడు.

ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు ద్రోణుడు. చప్పున శక్తి ప్రయో గించాడు. ధృష్టద్యుమ్నుడి గుర్రాలు చంపేశాడు. అతడి రథంనించి తనరథం తప్పించాడు. ప్రళయయముడిలా అయిపోయాడు ధృష్ట ద్యుమ్నుడు. కత్తీ, డాలూ ఎత్తి ద్రోణుడిమీద వాలాడు, పాం మీద వాలిన గరుత్మంతుడిలాగ. ద్రోణుణ్ణి తుదిదెబ్బ కొట్టేద్దామనే అతడు అలా వురికాడు. కత్తీ డాలూ, ఉద్భ్రాంతమూ, ఆవిద్ధమూ, ఆప్లుతమూ, ప్రవృత్తమూ, పరివృత్తమూ, నివృత్తమూ, సంపాతమూ, సముదీర్ణమూ, భారతమూ, కౌశికమూ, సాత్వమూ మొదలైన ఇరవై కత్తిదాట్లతో అద్భుతంగా విజృంభించాడు.

గబగబా జానడేసిపొడవు బాణాలు వేలు వేలు గుప్పించాడు ద్రోణుడు. శత్రువు దగ్గిరపావచ్చి, మీదపడ్డప్పుడు, మరో ఆయుధం ఉపయోగించడానికి వీలులేనప్పుడు వేయవలిసిన బాణాలవి. ఈ జేన జేసి బాణాలు ద్రోణుడిదగ్గిరా, కృపాచార్యుల దగ్గిరా, అశ్వత్థామ దగ్గిరా, కర్ణుడిదగ్గిరా, అర్జునుడిదగ్గిరా, ప్రద్యుమ్నుడిదగ్గిరా, సాత్యకి దగ్గిరా మాత్రమే వున్నాయి. అభిమన్యుడిదగ్గిరా వుండేవి. అంతే. మరెవ్వరి దగ్గిరా లేవు.

అలా జానడేసి బాణాలు కొట్టి ధృష్టద్యుమ్నుడి డాలూ, కత్తీ కొట్టేశాడు ద్రోణుడు. అతడు మీదికి రాకండా తరిమేశాడు. ఘోర మైన బాణమొకటి ధనుస్సుకి తొడిగి, అతడి కంఠానికి గురిపెట్టాడు.

పక్కనే కృపాచార్యులతోనూ, కర్ణ, కృతవర్మలతోనూ యుద్ధంచేస్తున్నాడు సాత్యకి. ఇటు చూశాడు. తటుక్కున పది బాణాలువేసి ద్రోణుణ్ణి కొట్టాడు. అంతలోనే అమాంతంగా వచ్చాడు భీముడు. ద్రోణుడిపాలబడకండా ధృష్టద్యుమ్నుణ్ణి పట్టుకుపోయాడు.

"తప్పుకుపోయావు, పో" అన్నాడు ద్రోణుడు. ఎప్పటిలాగే గుండెల్లో దుఃఖం రగిలింది. దాంతో కదలకండా వుండిపోయాడతడు.

మహారాజా, అలా నాలుగు పగళ్ళూ, ఒకరాత్రీ, అయిదో రోజు ఇరవై గడియలూ యుద్ధంచేశాడు ద్రోణాచార్యులు. ఇరవై వేల మందిని హతమార్చాడు. మహారణ్యం మండబెట్టి చల్లారిపోయిన మహాగ్నిహోత్రంలాగ పాండవసేన పీనుగుపెంటచేసి వూరుకున్నాడు. యుద్ధంమీద మరి మనసులేదు. శాంతిపొందిన చిత్తంతో తనసేన దిక్కు చూశాడు.

"ఓకర్ణా! ఓకృపా! ఓదుర్యోధనా! వినండి" అని గొంతెత్తి పిలిచాడు— "నాచేతనయినంత నేను చేశాను. ఇక నిశ్చింతగా సద్గతికి పోవాలని, ధనుస్సూ బాణాలు వొదిలేస్తున్నాను. ఇటుపైని తెలివితేటలతో మీపని మీరు చూసుకోండి" అని ధనుస్సూ, బాణాలూ పడేశాడు. అస్త్రసన్యాసంచేసి రథంమీదచదికిలబడిపోయాడు. నిమీలితనేత్రాలతో పరిపూర్ణమైన యోగసమాధిలో కూచున్నాడు.

కత్తిపట్టుకుని కాళ్ళవడితో పరిగెత్తుకు వచ్చాడు ధృష్టద్యుమ్నుడు. అప్పటికే ప్రాణాలు వొదిలేశాడు ద్రోణాచార్యులు. తేజశ్శరీరంతో పైకిపోయి పరమస్థానం చేరుకున్నాడు. ఆపుణ్యపురుషుడి తేజశ్శరీరం నేను చూశాను. కృష్ణుడు చూశాడు. అర్జునుడూ, ధర్మరాజూ, కృపాచార్యులూ చూశారు. మా అయిదుగురం తప్ప మరెవ్వరూ చూడలేదు. దేవతలుచూసి సంతోషించారు.

ఉభయసైన్యాలూ హాహాకారాలు చేశాయి. పరిగెత్తుకు వచ్చి ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి రథం మీదికి వురికాడు. రుద్రుడయిపోయి చప్పున ద్రోణుడి జుత్తు ఎడమచేత్తో పట్టుకున్నాడు. "ఆగూ, ఆగూ" అంటూ పరిగెత్తుకు వస్తూనే వున్నాడు అర్జునుడు. "వద్దూ వద్దూ" అని అరుస్తూనే వున్నాడు ధర్మరాజు – ద్రోణుడి పీక నరికేశాడు ధృష్టద్యుమ్నుడు. మొండెం కిందతోసేశాడు. సింహనాదంచేసి శిరస్సు కౌరవసేనమధ్యకి విసిరేశాడు.

మహారాజా, నీ దురాలోచనవల్లే శతవృద్ధు ద్రోణాచార్యులు తెగిపోయాడు. ఆయన పడిపోడంతోనే ఇకేముంది, పాండవసేనలు మరింత పేట్రేగిపోయాయి. బెదిరిపోయి, చెదిరిపోయి, కౌరవసేనలు కకావికలయిపోయాయి. మొహాలు దించుకున్నారు మనయోధులు. దిగాలుమనిపోయి, వాళ్ళంతా కూడా వెనక్కి తిరిగారు నీకుమాళ్ళు. గుర్రాలూ, ఏనుగులూ ముందుపెట్టుకు నడుస్తూ దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, కృపాచార్యులూ, కర్ణుడూ, కృతవర్మా, శల్యుడూ ఉసూరు ఉసూరుమన్నారు.

"ఎంతపనయిపోయింది!"

"ఇంకేముంది?"

"ఏమిటి దారిక ?"

"ఏం చెయ్యడం ?"

"దీనికి అంతమెక్కడ ?"

ఇలా అనుకుంటూ, తిరిగి తిరిగి చూస్తూ వెనక్కి మళ్ళారు. "ఆగండీ ఆగండీ" అని వొకళ్ళని వొకళ్ళు పిలుచుకుంటూ, తల పాగాలైనా సర్దుకోకండా చెట్టో పిట్టయి పరిగెత్తారు పదాతులు.

అంతకిముందే మరోదిక్కు యుద్ధంచేస్తున్నాడు అశ్వత్థామ. ఈసేన ఇలా వెనక్కి పరిగెత్తడం చూశాడు. "ఏమిటిది ?"

దుర్యోధనుడిదగ్గిరికి వచ్చి అడిగా డతను— "మనసైన్యాలు పారిపోతు న్నాయి. కర్ణుడూ, కృపాచార్యులూ వాళ్ళూ ఇలా మొహాలు వోంచు కున్నారేం! నువ్వు మొదటిలాగ సైన్యాలు నిలవరించడానికి నిలకడ లేకండా వున్నావేం?"

మొహమెత్తి అశ్వత్థామని చూశాడు దుర్యోధనుడు. నోరు విప్పబోయాడు. గొంతుకలోంచి మాట పెగల్లేదు. వెలవెలబోతూనే ఎలాగో చివరికి కృపాచార్యులు చెప్పాడు. ద్రోణుడు పాండవసేన చెండాడడమూ, పాండవులు అందరూకలిసి ఆయనని ఆపలేక భయపడ డమూ, అశ్వత్థామచచ్చాడని భీముడు అబద్ధమాడడమూ, అదినమ్మక ద్రోణుడు ధర్మరాజుని అడగడమూ, భీముడు అశ్వత్థామ అనేఏనుగు చంపిన మిషమీద ధర్మరాజు అశ్వత్థామ చచ్చాడని చెప్పడమూ, ద్రోణుడు అస్త్రసన్యాసం చేయడమూ, ఆయన యోగనిష్ఠలో వున్న ప్పుడు ధర్మరాజూఅర్జునుడూ వద్దు వద్దూ అంటూన్నా ధృష్టద్యుమ్నుడు జుట్టు పట్టి తల నరకడమూ — అన్నీ పూసగుచ్చినట్టు చెప్పా డతడు. "ఇదిగో ఇంచేతే సేనలు తిరిగి పరిగెడుతున్నాయి. మేమూ నడుంలు విరిగి, దిగాలుమనిపోయాం. ఏనుగు పేరుమీద ఇంతపని జరిగిందంటే ఇది కృష్ణుడు చేసిన కపటోపాయం కాని మరొకటికాదు" అన్నాడు.

ధృతరాష్ట్రుడు: దివ్యాస్త్రాలు తెలిసిన అసహాయశూరుడు అశ్వ త్థామ. శ్రీరాముడితో సమానమైనవా డతడు. ధృష్టద్యుమ్నుడు తండ్రితల నరికేశాడంటే విని వూరుకున్నాడూ? మనవాళ్ళలాగే విచారిస్తూ కూచున్నాడా, కూలిపోయి, మండిపడి దండెత్తాడా? ధృష్టద్యుమ్నుణ్ణి చంపడంకోసమే అతణ్ణి కన్నాడు ద్రోణాచార్యులు. పరశురాముడిదగ్గిర తాను నేర్చిన అస్త్రవిద్య యావత్తూ అతడికి నేర్పాడు. అలాంటి తండ్రిని ద్రుపదుడి కొడుకు అంతపని చేస్తే ఏం చేశాడో అశ్వత్థామ?

## అశ్వత్థామ ప్రతిజ్ఞ

సంజయుడు: కృపాచార్యుల మాటలు విన్నాడు అశ్వత్థామ. క్రోధంతో అతడి రెండుకళ్ళూ చింతనిప్పుల్లా మెరిశాయి. దుఃఖంతో కన్నీళ్లు ధారలుకట్టాయి. ప్రళయయముడిలా వొణికిపోయాడు. "నీచులు నాతండ్రిని అబద్ధమాడి అస్త్రసన్యాసం చేయించి చంపేశారు" రెండు చేతులతోనూ కన్నీళ్ళుతుడుచుకుంటూ నిట్టూర్పులతో అన్నాడతడు- "ఈ పాపకార్యంతో ధర్మరాజు ధర్మధ్వజం బట్టబయలయింది. అనార్యుడు, నరహంతకుడు ధర్మరాజు. యుద్ధంలో గెలవడమో, వోడడమో ఏదో వొకటి తప్పదు. అయితే వోడిపోడంకంటే చావే నయం. యుద్ధంలో న్యాయమైనచావు బాధించదు. అసలు అలాంటిచావే ఉత్తమమయిం దన్నారు పండితులు. నాతండ్రి వీరలోకానికి వెళ్ళాడు. సందేహంలేదు. దానికోసం విచారం లేదునాకు. ఒక పగవాడు అంతటివాడి జుత్తుపట్టి తలనరికాడు. ఇదే వెయ్యిశూలాలతో పొడిచినట్టు బాధపెడుతోంది నన్ను. నాబొందెలో ప్రాణముండగానే, దిక్కులేనట్టు నాతండ్రి జుట్టుపట్టి తల నరికా డొకడు! నా దివ్యాస్త్రాలూ, నాబాహుబలమూ కాల్చడానికా అంటా! నేను లేననుకునే ఈఘోరం తలపెట్టాడా ధృష్టద్యుమ్నుడు? దీని ఫలం త్వరలోనే అనుభవిస్తాడు. అబద్ధాలకోరు, ధర్మద్రోహి ధర్మరాజు. కపటంచేసి గురువుని అస్త్రసన్యాసం చేయించాడు. భూదేవి అతడిరక్తం తాగుతుంది.

"దుర్యోధనమహారాజా! ప్రతిజ్ఞచేసి చెపుతున్నాను. పాంచాలంవాళ్ళని యావన్మందినీ హతమార్చకండా నేను బతికివుంటే సత్యం తప్పినవా ణ్ణవుతాను. దుష్టాత్ముణ్ణి ధృష్టద్యుమ్నుణ్ణి తప్పకండా సంహరిస్తాను. ఇహలోకంలో శత్రుభయమూ, పరలోకంలో పాపభయమూ లేకండా వుండడానికే కుమాళ్ళని కంటారు తండ్రులు. కాని మేరువులాంటి కుమారుణ్ణీ, శిష్యుణ్ణీ, నేను వుంటూండగానే నాతండ్రి దిక్కు-

లేనిచావు చచ్చాడు. నాఅంతకొడుకు వుండికూడా ద్రోణాచార్యులు జుట్టు పట్టి ఈడ్పించుకున్నా డంటే, నాదివ్యాస్త్రాలూ, నాబాహువీర్యమూ, నాపరాక్రమమూ తగలెయ్యడానికా అంటా! ఇదిగో, ఇప్పుడే దీని ప్రతీకారానికి పూనుకుంటాను. తండ్రిరుణం తీర్చుకుంటాను. కృష్ణుణ్ణీ పాండవుల్నీ దివ్యాస్త్రాలతో మాడేస్తాను. పదాతులూ, ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ కుప్పలు కుప్పలు కూల్చేస్తాను. దేవతలో, రాక్షసులో ఎవరు అడ్డుపడతారో చూస్తాను. తనగురించి తాను చెప్పుకోడం తప్పే. తండ్రి పరాభవంవల్ల హృదయం బాధపడి అలా ఏదో అనేశాను. అయితే అన్నంతా చేసితీరుతాను. ఒక్కమాటా పొల్లు కాదు నాది.

"మా తండ్రి నారాయణమూర్తిని ఆరాధించి వొక మహాస్త్రం సంపాదించాడు. చంపవలిసినవాళ్ళూ, చంపరానివాళ్ళూ అన్న భేదం లేకండా శత్రువిధ్వంసం చేస్తుంది ఆ దివ్యాస్త్రం. అదే ప్రయోగిస్తాను ఇప్పుడు. విజయం సాధిస్తాను. చూడు."

అశ్వత్థామ అలా ప్రతిజ్ఞచేయడంతోనే కౌరవుల్లో ఎక్కడలేని ఉత్సాహమూ వుప్పొంగింది. దుర్యోధనుడూ అతని తమ్ముళ్ళూ, సేనాపతులూ శంఖాలు పూరించారు. సింహనాదాలుచేశారు. తిరిగి వచ్చేస్తున్న వాళ్ళల్లా ముందుకి మళ్ళారు. చెదిరిపోయిన సేనలన్నీ మళ్ళీచేరుకున్నాయి. బూరాలూ, భేరీలూ, మృదంగాలూ మొదలైన యుద్ధవాద్యాలు ఆకాశం అదిరిపోయినట్టు మోగాయి. గుర్రాల డెక్కలూ, రథచక్రాలూ నేల గజగజలాడిస్తూ మన సేనలు పురకలుపెట్టాయి.

ధృతరాష్ట్రుడు: అప్పుడు పాండవులు ఏంచేశారట!

సంజయుడు: వాళ్ళూ యుద్ధానికే సిద్ధపడ్డారు.

"పారిపోతూన్నవారల్లా మళ్ళీ తిరగబడ్డారేం?" అర్జునుణ్ణి అడిగాడు ధర్మరాజు — "ద్రోణుడి చావుతో జజ్జరిల్లిపోయినవాళ్ళకి

ఇంతలోనే ఈ ధైర్యం ఎలా వచ్చిందో! భూమీ ఆకాశం వొక్కటే కోలాహలంగా వుందే! ద్రోణుడిచావుకి మండిపడి ఏ దేవేంద్రుడో వాళ్ళకి సహాయం వచ్చాడంటావా?"

"ఎవ్వరో ఎందుకు వస్తారూ!" అన్నగారితో అన్నాడు అర్జునుడు – "తండ్రిని అధర్మంగా జుత్తుపట్టి వొకడు నరికాడంటే వూరికే వూరుకుండాటా అశ్వత్థామ? మహాద్భుతమైన శౌర్యశాలి కదా అతగాడు! అతిమానుషమైన విక్రమం అతడిది. పుట్టినప్పుడే అతడు ఉచ్చైశ్శ్రవంలాగ సకిలించాడు. భూమి గడగడా వణికింది. అంచేతే అశ్వత్థామ అంది అశరీరవాణి అతణ్ణి. అదిగో అతడే ఈ కౌరవసేన ఇప్పుడు ఎత్తిరాడానికి కారణం.

## అన్నయ్యా అబద్ధమాడావు

"అన్నయ్యా, శిష్యుడివనీ, ధార్మికుడవనీ, అబద్ధమాడవనీ, నిజమే చెపుతావనీ నమ్మి నిన్నే అడిగాడు గురుదేవుడు. నువ్వు ధర్మం తప్పావు. అబద్ధమాడావు. నిజంగా కొడుకు చచ్చిపోయాడనే నమ్మాడు అతడు. ఈసుపట్టి ఇలాగా సంపాదించడం రాజ్యం? ఇలా వచ్చిన రాజ్యం వల్ల పేరా వూరా? నిజంగా లోకం ముందు చులకనే అయిపోయాం మనం. వాలివధ శ్రీరాముడి చరిత్రలో కలంకంలాగ, ద్రోణవధ నీచరిత్రలో మాయని మచ్చ. అదీ కాక, 'వద్దూ, వద్దూ' అంటూ నేను పరిగెడుతూనేవున్నాను. జుత్తుపట్టుకుని తలనరికాడు ధృష్టద్యుమ్నుడు. అధర్మమని ఆవంతా భావించాడు కాడు. ఈ అవమానంతో మండిపడి, అతడిమీద విరుచుకు పడకండా వూరుకుంటాడా అశ్వత్థామ? మనసైన్యం వూడ్చెయ్యడానికి ఉక్రోషంతో వస్తున్నాడు. అతణ్ణి ఎదిరించడానికీ, ధృష్టద్యుమ్నుణ్ణి రక్షించడానికీ నీకైనా, మరి ఎవడికైనా తరమేనా అంటూ, ఇక్కడ?"

"అడివిలో ముక్కుమూసుకున్న మునిలా చెపుతున్నావు రాజనీతి!" కస్సుమంటూ అన్నాడు భీముడు — "చంపడానికే యుద్ధానికి దిగాం. చంపకూడదు అంటే ఎలాగ? సభలో ద్రౌపదిని అన్నిపాట్లు పెట్టినవాళ్ళని ఏంచేసినా పాపంలేదు. శత్రువులు మనమీద వచ్చిపడుతున్నారు. మేం కళవిళపడుతున్నప్పుడే కాలినపుండుమీద కారంచల్లుతున్నావు. ఏమనాలి నిన్ను! కురువీరులు నన్ను ఎరుగుదురు. నేనూ వాళ్ళచేవకొంత ఎరుగుదును. బాణాలతోనో, పరిఘలతోనో, చివరికి పిడిగుద్దులతోనో వాళ్ళని బాదేస్తాను కాని వొదలను."

"అసలు అతణ్ణి చంపడంకోసమే అగ్నిగుండంలో పుట్టాను" అర్జునుణ్ణి ఆక్షేపిస్తూ అందుకున్నాడు ధృష్టద్యుమ్నుడు — "బలంలేని అక్కుపక్షుల్లాంటి సైనికులమీద దివ్యాస్త్రాలువేసి, వేలకువేలు చంపేశాడు ద్రోణుడు, అధర్మంగా. అతడు బ్రాహ్మడు కాడుసరికదా, క్షత్రియధర్మమైనా సరిగా పాటించలేదు. ఆలోచించకండా అనేస్తున్నావు నన్ను. తండ్రి స్నేహితుణ్ణి భగదత్తుణ్ణీ, తాతభీష్ముణ్ణీ నువ్వుచంపేశావు. అలాగేనేను ద్రోణుణ్ణి చంపాను. నీదిపుణ్యమూ, నాదిపాపమూనా? వంశగతమైన విరోధంకూడానూ మాది. ద్రౌపదిమొహం చూసీ, ఆమెకొడుకుల మొహం చూసీ, నువ్వన్నదంతా సహిస్తున్నాను, ఏనుగు తనమీద నిచ్చెన సహించినట్టు. ధర్మరాజు బొంకనూలేదు, నేను ధర్మం తప్పనూలేను. ఎందుకూ అనవసరంగా అభాండాలు వేస్తావు? శిష్యవంచకుడయి నీద్రోణుడు తనపాపంవల్ల తానే చచ్చాడు. అదంతా వొదిలెయ్యి. శత్రువు ముంచుకొస్తున్నాడు. లే, యుద్ధం చెయ్యి, గెలుపు నీచేతిలో వుంది" అన్నాడు.

ధృతరాష్ట్రుడు: రుషిలాంటివాడు ద్రోణాచార్యులు అతణ్ణి అంతపనిచేసి, పైగా అలా కూశాడూ దుష్టు ధృష్టద్యుమ్నుడు! అక్కడివాళ్ళంతా వింటూ వూరుకున్నారూ?

సంజయుడు : ఇంతింతగుడ్లుచేసి చూశాడు అర్జునుడు. బొట బొటా కన్నీళ్ళు కార్చాడు. "ఎందుకీ రోతమాటలు" అని నిట్టూర్పులు విడిచాడు. కృష్ణుడూ, ధర్మరాజూ వాళ్ళూ తలలు వొంచుకున్నారు. ఒక్కరూ పల్లెత్తు మాటాడలేదు.

"నీ నాలిక చీలికలయిపోదేం ?" అంటూ సాత్యకిమాత్రం పురిమాడు — "నీతల చెక్కలయిపోదేం? గురువుని అవమానించావు· పైగా నోటికివచ్చినట్టు కూస్తున్నావు. ఈరాజుదగ్గిర కనక బతికిపో యావు మళ్ళీ మాట్లాడేవో, చూడు. నీనోరు పగలగొడతాను."

"అర్జునుడు చంపాడంటున్నావు భీష్ముణ్ణి. తనతట్టు కళ్ళెత్తి చూడనన్నా చూడని భీష్ముణ్ణి నీతమ్ముడు శిఖండే చంపాడు. నువ్వూ నీతమ్ముడూ పాలవంటి పాంచాలకులంలో తప్పబుట్టారు. ఇటు ఏడు తరాలూ, అటు ఏడుతరాలూ నరకంలో తోశారు" అన్నాడు.

"గురివిందగింజ తనకింది నలుపు గుర్తించదట !" తొక్క తొక్కిన పాంలా లేచాడు దృష్టద్యుమ్నుడు — "ఇంకొకడు చెయ్యినరి కేసిన భూరిశ్రవుడి తల నరికెయ్యడం వీరత్వమా ? వివేకమా? అతడు నీరొమ్ము తొక్కినప్పుడు కిక్కురుమనలేక పోయావు. ద్రోణుణ్ణి ఎన్ని సార్లు ఎన్ని చెరువులనీళ్ళు తాగించలేదు నేను! నీలాగ చిత్తయి వెల్ల కిలబడ్డానా? తప్పుడు కూతలు కూసి నన్ను మండించకు. తల పగల గొడతాను. అదిగో శత్రువు తరుముకు వస్తున్నాడు. పద. ముందు యుద్ధం చేద్దాం" అన్నాడు.

అగ్గిమీద గుగ్గిలంలా భగ్గుమన్నాడు సాత్యకి. ధనుస్సు రథం మీద పెట్టేశాడు. "మాటలికి మంటయితే దెబ్బలతో దిగదీస్తాను" అంటూ గదపట్టుకుని కిందికి గెంతాడు. కృష్ణుడు చెప్పడంతోనే భీముడు చప్పునవచ్చి సాత్యకిని సందిటలో పట్టుకున్నాడు. అంత భీముణ్ణే పదడుగులు ఈడ్చుకుపోయాడు సాత్యకి.

"సాత్యకీ, శాంతించు" రథందిగి పరిగెత్తుకువచ్చి సముదాయించాడు సహదేవుడు- "వృష్ణులూ, అంధకులూ పాంచాలంవాళ్ళూ-వీళ్ళని మించిన బంధువులు మాకు లేరు. అలాగే వృష్ణులికీ, అంధకులికీ, ముఖ్యంగా శ్రీకృష్ణుడికి మమ్మల్ని మించిన బంధువులులేరు. పాంచాలం వాళ్ళకీన్నీ వృష్ణి, అంధకులవంటి బంధువులు కంచుకాగడాలతో వెదికినా ఎక్కడా కనిపించరు. అంచేత మీరూ మేమూ ఎలాంటి బంధువులమో ఈధృష్టద్యుమ్నుడూ మీరూ పరస్పరం అలాంటి బంధువులే. అయినప్పుడు మీలోమీరు తగువులాడడం తగనిపని. కోపం విడిచిపెట్టు" అన్నాడు.

"పట్టుకోకు, వొదిలెయ్యి" భీముడితో అన్నాడు ధృష్టద్యుమ్నుడు – "నాచేత కాని నీచేత ఆగదు. చెయ్యిలేని భూరిశ్రవుడు అనుకుంటున్నాడేమో! మిడిసి పడుతున్నాడు."

భీముడినందెట్లో పెనగులాడుతూ తాచుపాంలా బుసకొట్టాడు సాత్యకి. మించివచ్చిందంటూ శ్రీకృష్ణుడు సాత్యకినీ, ధర్మరాజు ధృష్టద్యుమ్నుణ్ణీ ఎంతో ప్రయత్నంమీద శాంతపరిచారు.

ధృతరాష్ట్రుడు : తరవాత ?

సంజయుడు : భేరీలూ, మద్దెళ్ళూ, శంఖాలూ బ్రహ్మాండంగా మోగిస్తూ పాండవసేనమీద కలబడింది కౌరవసేన. రెండూ రెండు సముద్రాలు ఢీకొన్నట్టు ఢీకొన్నాయి. ద్రోణుణ్ణి చంపేశామన్న పొగరుతో పాండవసేనా, అశ్వత్థామ వున్నాడన్న దిలాసతో కౌరవసేనా మహోద్రేకంతో పోరాడాయి.

## నారాయణాస్త్రం

"అబద్ధమాడి బతుకుదా మనుకున్నాడు ధర్మరాజు. అతడిసేన ఎలా బుగ్గిలో కలిసిపోతుందో, ఎలా పుంజాలు తెంపుకు పారిపోతుందో ఇప్పుడు కళ్ళారా చూడండి" అంటూ నారాయణాస్త్రం వేశాడు

అశ్వత్థామ. మహారాజా, ఏం చెప్పనూ, తలచుకుంటే ఇప్పుడు గుండెలు జారిపోతున్నాయి. భూచక్రం యావత్తూ గిరిగిరా తిరిగి పోయింది. సూర్యుడు మాసిపోయినట్టు అయిపోయాడు. దిక్కులు వణికాయి. ఆకాశం గడగడలాడింది. పర్వతాలు వూగిపోయాయి. సముద్రాలు అల్లకల్లోలమయాయి. పిడుగులు ఘోరంగా గర్జించాయి.

అడ్డూ, అపూలేని ఆమహాస్త్రం మండలమూ, అర్ధచంద్రమూ, భల్లమూ, నారాచమూ, క్షురమూ మొదలైన రకరకాలబాణాల రూపం ధరించి, భయంకరమైన మంటలుకక్కుతూ పాండవసేనమీదికి పరిగెత్తింది. సేనసేనంతా వొక్కపాయలా ముట్టడించింది. తెగించి ఆ సైనికులు రకరకాలబాణాలు వేసి మళ్ళించబోయారు. అగ్నిసముద్రంలా మరింత పొంగిం దది. భూమీ ఆకాశమూ మధ్యభాగమంతా భయంకరమైన మంటలతో నిండిపోయింది. ఎదురుతిరిగినంతమేరా గుర్రాలూ, ఏనుగులూ, పదాతులూ, రథాలూ మచ్చుకిలేకండా మాత వారుస్తూ ముందుకిసాగింది. అరిచేతిలో ప్రాణాలు పెట్టుకుని పరుగులుపెట్టింది పాండవసేన. చూస్తూ వూరుకున్నాడు అర్జునుడు.

"ధృష్టద్యుమ్నా !" భయభ్రాంతు డయిపోయి, కృష్ణుడూ అర్జునుడూ వినేట్టు అన్నాడు ధర్మరాజు – "పాంచాలసేనతో ఎక్కడికైనా పారిపో నువ్వు. సాత్యకీ! యాదవసేనతో నువ్వూ పారిపో. తక్కినవాళ్ళు యావన్మందీ పారిపోండి. తప్పించుకోండి. బతికిపోండి. అందరూ వినండి. నేను తమ్ముళ్ళతో అగ్గిలో పడతాను. అర్జునుడి అభిలాష తీరుతుంది. ధర్మాత్ముడైన శ్రీకృష్ణుడు తనకితోచింది తాను చేస్తాడు. భయంకరమైన భీష్మసముద్రమూ, ద్రోణసాగరమూ దాటేశాను. గోష్పాదమంత అశ్వత్థామ గుమ్మిలో మునిగిపోతాను. దుర్యోధనుడి కోరికే నెరవేరనీ.

"అవును, అన్నెమూ పున్నెమూ ఎరుగడు ఆచార్యుడు!

ద్రౌపదిని సభలో అన్ని పాట్లు పెట్టినప్పుడు ఏంచేశాడు గురువు! ఆమె ధర్మం చెప్పండంటే తండ్రీ కొడుకూ నోరు మెదపలేదు. మమ్మల్ని దుర్యోధనుడూ రాజు అడవులపాలు చేస్తూవుంటే చూస్తూ వూరుకున్నాడు. పదిమందినీ కూర్చి, ముక్కుపచ్చలారని అభిమన్యుణ్ణి అన్యాయంగా చంపేశాడు. మంచి విషమసంధిలో దుర్యోధనుడికి అభేద్య కవచం తొడిగి అర్జునుడి మీదికి పంపాడు. కొంచెం మించిపోతే అగ్నిలో దూకి చచ్చేవాడు అర్జునుడు. అతడికి సహాయమన్నా చేయనీయకుండా అడ్డేశాడు మనల్ని. అంత శిష్యవాత్సల్యం మామీద! అలాంటి 'గురుదేవుడు' చచ్చిపోయాడు! కనక నావాళ్ళు అస్త్రమరణం పొందాలి. నేను అగ్నిలో మాతవైపోవాలి!" అన్నాడు, ఆవేశంతో అలిసిపోతూ.

ధర్మరాజుమాటలు విని తడబడిపోయాడు శ్రీకృష్ణుడు. "సైనికులారా!" పెద్దగొంతుకతో ఎత్తుకున్నాడు - "ఆయుధాలు వొదిలెయ్యండి! గుర్రాలమీంచీ, ఏనుగులమీంచీ, రథాలమీంచీ దిగిపోండి! నిరాయుధులయి, నేలమీద నుంచున్న వాళ్ళని ఏమీ చెయ్యదు నారాయణాస్త్రం. దీన్ని ఇచ్చిన మహాత్ముడు ఇదే నియమం పెట్టాడు" అన్నాడు.

కృష్ణుడిమాటమీద యావన్మందిసైనికులూ ఆయుధాలు పడేసి వాహనాలు దిగబోయారు.

"వద్దూ" గద్దిస్తూ అరిచాడు భీముడు - "పౌరుషం మంట గలపకండి. ఆయుధాలు వొదలకండి. వాహనాలు దిగకండి. నామహాస్త్రాలతోనూ, గదాదండంతోనూ అశ్వత్థామ మహాస్త్రం మాతవాటుస్తాను" అంటూ శంఖం పూరించాడు. పెద్ద సింహనాదంచేశాడు. అశ్వత్థామమీదికి రథం పరిగెత్తించాడు.

అదిలిస్తూ, నారాయణాస్త్రం భీముడి మీదికి రెచ్చగొట్టాడు అశ్వత్థామ. అగ్నిశిఖల్లాంటి బాణాలు ఎన్నో అన్ని భీముడిరథం చుట్టు

ముట్టాయి. అక్కడున్న యోధులు యావన్మందీ ఆయుధాలు వొది లేశారు. వాహనాలు దిగేశారు. పదాతులు ఆయుధాలు పడేశారు. వాళ్ళని ఎవళ్ళనీ బాధించలేదు నారాయణాస్త్రం. భీముడిమీదికే భయంకరంగా నాలికలు చాచింది.

భీముడి రక్షణకోసం అర్జునుడు చప్పున వారుణాస్త్రం వేశాడు. కొంచెం చల్లబడింది వేడి. మరింత ప్రజ్వలింపచేశాడు అశ్వత్థామ. కార్చిచ్చులాగ భుగభుగలాడింది నారాయణాస్త్రం. సూర్యమండలం చొచ్చిన అగ్నిహోత్రుడిలాగా, అగ్నిలో చొచ్చిన సూర్యుడిలాగా నారాయణాస్త్రం మంటల్లో అవుపించాడు భీముడు. హాహాకారాలు చేశాయి సైన్యాలు. ధర్మరాజూ మొదలైన పాండవులికి కరచరణా లాడలేదు. మంటల్లో మాడిపోయేవాడే భీముడు. అయితే అర్జునుడి వారుణాస్త్రమే రవంత రక్షరేకగా కాపాడింది.

శ్రీకృష్ణుడు చప్పున రథం దిగాడు. ఆయుధాలు పడేసి అతడి వెంట అర్జునుడూ దిగాడు. ఇద్దరూ భీముడిదగ్గరికి పరిగెత్తారు. భీమున్ని రథంమీంచి కిందికిలాగారు. బిర్రబిగిసి పెనగులాడాడు భీముడు.

"నామాట విను" కిందికిలాగుతూ అన్నాడు కృష్ణుడు - "ఈ మహాస్త్రం మళ్ళించడానికి ఎవ్వడికీ తరంకాదు. ఏమాత్రంపిరైనా వూరుకుంటామా మేం? దిగు, రథం దిగు" అంటూ తొందర చేసే శాడు. అర్జునుడూ కృష్ణుడికి తోడ్పడ్డాడు. ఇద్దరూ ఎలా అయితేనేం భీముడిచేతి ఆయుధాలు లాక్కుని పడేశారు. ఎంతో బలవంతం మీద రథం దించేశారు.

దాంతో చల్లబడి వూరుకుంది నారాయణాస్త్రం. అప్పుడు మళ్ళీ కృష్ణుడు చెప్పడంతోనే పాండవసైనికులు యావన్మందీ ఆయు ధాలు పట్టుకున్నారు. వాహనాలెక్కారు. కౌరవులమీదయుద్ధానికి కాలుదువ్వారు. ధణధణధణ రణదుందుభులు మోగించారు.

"చూస్తావేం? మళ్ళీ నారాయణాస్త్రం ప్రయోగించు" అశ్వత్థామని పురికొల్పాడు దుర్యోధనుడు. "మళ్ళీ ప్రయోగిస్తే మన మీదికే వస్తుంది" ఉసూరుమంటూ అన్నాడు అశ్వత్థామ - "వొక్కసారి మాత్రమే ప్రయోగించాలిది. మా తండ్రికి ప్రసాదించినప్పుడు అదే ఆజ్ఞాపించాడు నారాయణమూర్తి. చావూ, వోడిపోడమూ రెండూ వొకటే, అంచేత చంపడానికి బదులు వోడించి వూరుకుంది నారాయణాస్త్రం. కృష్ణుడు పన్నిన ఉపాయమిది. పాండవుల్ని బతికించేశాడతడు. మనం చేసేదేమీ లేదిప్పుడు."

ధృతరాష్ట్రుడు: చంపకుండా చల్లారిపోయిందో నారాయణాస్త్రం! అశ్వత్థామా, మా దుర్యోధనుడూ తరవాత ఏంచేశారు?

సంజయుడు: అశ్వత్థామ అలా అనడంతోనే "పోనీ, మరొక మహాస్త్రంతో మాడ్చెయ్యి వాళ్ళని" అన్నాడు దుర్యోధనుడు.

తండ్రిమరణం దావాగ్నిలాగ దహించేస్తూవుంది అశ్వత్థామ హృదయం. ఆ బాధతో వొళ్ళు తెలియకుండా ధృష్టద్యుమ్నుడి మీదికి వెళ్ళాడతడు. ప్రాణాంతకమైన బాణాలు అతడిమీద ప్రయోగించాడు. పాముల్లాంటి బాణాలు అతడి వొంటిమీద నాటించాడు. అతడు సర్దుకునేలోపున మరో పాతిక వదిలించాడు. చలించకుండా బాణాలతోనే జవాబు చెప్పాడు ధృష్టద్యుమ్నుడు.

అగ్నిహోత్రుడే అయిపోయాడు అశ్వత్థామ. ధృష్టద్యుమ్నుడి సారథిని, గుర్రాల్ని చంపేశాడు. ధనుస్సు నరికేశాడు. జెండా ఎగరగొట్టాడు. అప్పుడు చివాల్న సాత్యకి పరిగెత్తుకు వచ్చాడు. అశ్వత్థామ గుర్రాల్నీ సారథినీ చావుదెబ్బలు కొట్టేశాడు. ధనుస్సు నరికేశాడు. సింహంతోకపతాకం చించేశాడు. రథం గుండచేసేసి, ఇరవైఎనిమిది బాణాలు అతడివొళ్ళు తూట్లుపడేట్టు కొట్టాడు. దాంతో అశ్వత్థామ మూర్ఛపోయాడు. కృపాచా

ర్యులూ, కర్ణుడూ, కృతవర్మా, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, వృషసేనుడూ వాళ్ళు ఎక్కువలో అశ్వత్థామని దాటుకుంటూ వెళ్ళి సాత్యకిని ముట్టడించారు.

అంతలోనే తెలివొచ్చుకున్నాడు అశ్వత్థామ. మరొక రథ మెక్కి సాత్యకిమీదికి పరిగెత్తాడు. మళ్ళీ అతడి రథం విరిచేశాడు సాత్యకి. సింహనాదాలు చేశారు పాండవులు. శంఖాలు పూరించారు. పేట్రేగి పోయాడు సాత్యకి. వృషసేనుడి మూడు వేలమంది రథాల వాళ్ళని చంపేశాడు. కృపాచార్యుల పదివేల ఏనుగులు పాతేశాడు. శకుని గుర్రాలు పదివేలు పడగొట్టేశాడు.

మరొక రథమెక్కి పరిగెత్తాడు అశ్వత్థామ. ఘోరమైన బాణం వొకేవొకటి బలంకొద్దీ కొట్టాడు. దెబ్బతో కెవ్వుమన్నాడు సాత్యకి. రథంమీద మూర్ఛపోయాడు. ఆవూపుని ధృష్టద్యుమ్నుడి నుదుటి మీద పిడుగులాటి బాణం తగిలించా డతడు. దెబ్బతో వొరిగిపోయి సొమ్మసిల్లిపోయాడు ధృష్టద్యుమ్నుడు.

చూసి, దుఃఖమూ క్రోధమూ వొక్కసారి పుట్టుకువచ్చాయి అర్జునుడికి. అతడూ, అతడివెంట భీముడూ అశ్వత్థామమీదికి వురికారు రథాలు దాటిస్తూ. శిశుపాలుడి మనవడు చేదియువరాజూ, మాళవ దేశం సుదర్శనుడూ, పురువంశం వృద్ధక్షత్రుడూ వాళ్ళకి దన్నువచ్చారు. అయిదుగురూ అయిదు బాణాలు అశ్వత్థామమీద వేశారు. అయిదు బాణాలూ పాతిక బాణాలతో తుక్కుతుక్కు చేశాడు అశ్వత్థామ. అందరికీ అన్ని రూపులయి పోరాడాడు. మూడు వెడల్పాటి బాణాలు కొట్టాడు. సుదర్శనుడి భుజాలూ, శిరస్సూ నరికేశాడు. వృద్ధక్షత్రుడి రథంచెక్కేసి, అతడి తల నరికాడు. చేది యువరాజుని తారుమనిపించేసి సింహనాదంచేశాడు. పాండవసేనలూ, పాంచాల సైన్యాలూ భయపడిపోయాయి. పరుగులుతీశాయి. భీముడూ, అర్జునుడూ వాటినిమళ్ళించి, యుద్ధం చేశారు.

"అశ్వత్థామా! ఆగు" కలబడుతూ గర్జించాడు అర్జునుడు — "దుర్యోధనుడంటే నీకు ఎంత అభిమానమో నీదగ్గిర ఎంతేసి మహాస్త్రాలు వున్నాయో అంతా తెలుస్తూనేవుంది. అయితే పారిపోకండా మాత్రం నిలబడు" అంటూ గాండీవం మోగించాడు.

అసలే మండిపోతున్నాడు అశ్వత్థామ. తటాలున ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు బ్రహ్మాండమైన అగ్నిజ్వాలలతో విజృంభించిందది. గుర్రాలూ, రథాలూ, ఏనుగులూ, పదాతులూ — చతురంగ సేన యావత్తూ కాల్చెయ్యడ మారంభించింది. ప్రళయకాలసంహారంలాగ వొక అక్షౌహిణిసైన్యం మాడ్చేసింది.

"కృష్ణుడూ, అర్జునుడూ ఈ మహాగ్నిహోత్రంలో మండిపోతారు" అంటూ కౌరవసేన ఉబ్బిగెంతులు వేసింది. రణవాద్యాలతో ఇన్నూ మన్నూ ఏకంచేసేసింది.

అన్ని మహాస్త్రాలూ అంతంచేసే బ్రహ్మాస్త్రం మంత్రనిష్ఠతో ప్రయోగించాడు అర్జునుడు. అంత ఆగ్నేయాస్త్రమూ వుస్సుమని వూరుకుంది. శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం వూదాడు. పాండవయోధులు సింహనాదాలుచేశారు. శంఖాలూ భేరీలూ ఆకాశం బద్దలైపోయింది. కౌరవసేన మొహం వేలవేసింది.

"ఛా, దివ్యాస్త్రాల బలం లేందే యుద్ధమేమిటి, సిగ్గుమాలినపని కాకపోతే!" అని మనసులో తిట్టుకుంటూ ధనుస్సు పారేశాడు అశ్వత్థామ. రథం దిగేసి, వెళ్ళిపోడానికి చరచరా బయలుదేరాడు. ఆకాశగంగ నేలకి దిగినట్టు ఎదురుగుండా వ్యాసముని అవుపించాడు.

"మునీంద్రా!" వినయంతో నమస్కారంచేసి, గద్గదకంఠంతో అన్నాడు అశ్వత్థామ — "నా ఆగ్నేయాస్త్రం వ్యర్థమైపోయింది. ఏమిటీ మాయ? దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ — ఎవ్వరికీ సాధ్యంకాని దివ్యాస్త్రం అది. మానవ మాత్రులైన కృష్ణార్జునుల్ని దహించలేకపోయింది" అని అడిగాడు.

"అడగవలిసిన ప్రశ్నే అడిగావు" అంటూ అందుకున్నాడు వ్యాసముని — "నీసందేహం తీరుస్తాను. సావధానంగా విను. ఆది దేవుడైన విష్ణుమూర్తి లోకసంరక్షణకోసం జన్మించి, మైనాకపర్వతం మీద మహాతపస్సు చేశాడు. గాలిమాత్రం ఆహారం చేసుకుని, చేతులు మీదికెత్తి ఘోరమైన నిష్ఠతో ఎంతోకాలం శివుణ్ణి ధ్యానించాడు. తుదకి ప్రసన్నుడయాడు శివుడు. నెలవంక జడముడితోనూ, శూలమూ పినాకమూ మొదలైనఆయుధాలతోనూ ప్రత్యక్షమయాడు. సాష్టాంగ నమస్కారంచేసి నుంచున్నాడు విష్ణుమూర్తి. అంజలిబంధం నుదుట కీలించాడు. ఎన్నోవిధాల స్తోత్రంచేశాడు. "దేవా, ఎవ్వరికీలేని ప్రభావం నాకు ప్రసాదించు" అని ప్రార్థించాడు.

చల్లనిచూపు చూశాడు శివుడు. మానవులూ, దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ, కిన్నరులూ, గరుడులూ — ఈ యావన్మందినీ, సర్వభూతాలనీ ఇట్టే జయిస్తావు నువ్వు. పరమతేజస్సుతో ప్రకాశిస్తావు. అస్త్రాలూ, శస్త్రాలూ, అగ్నీ, నీరూ ఏదీ ఏమీ చెయ్యలేదు నిన్ను. తడీ, పొడీ, స్థావరమూ, జంగమమూ ఏదీ నిన్ను బాధించలేదు. చావన్నది లేనేలేదు నీకు. అంతకీ వస్తే నన్నే జయించేస్తావు" అని వరమిచ్చాడు. అందుకనే శ్రీమన్నారాయణమూర్తి గెలవరానివాడయాడు. ఆనారాయణమూర్తి లోంచే పుట్టి నరుడూ అంతవాడే అయాడు. నరనారాయణులు ఇద్దరూ ఒకళ్ళని వొకళ్ళు విడిచిపెట్టరు. నరుడికినేస్తం నారాయణుడు. నిజమాయావిశేషంతో జగన్మోహనుడై విహరిస్తాడతడు. ఆఇద్దరూ, రాక్షసుల్ని వధించడానికీ, ధర్మం స్థాపించడానికీ ఆవసరమైనప్పుడు అవతరిస్తూ వుంటారు. అదిగో ఆనరనారాయణులే ఈ అర్జునుడూ, కృష్ణుడూనూ.

"నువ్వూ లోగడ తపస్సుచేసినవాడివే. తేజశ్శాలివే. విద్యావిభవం కలవాడివే. అయినా, వాళ్ళకీ నీకూ ఎంతో అంతరం వుంది. చెపుతాను, విను.

"తొలిజన్మలో నువ్వు మట్టితో ప్రతిమచేసి, అందులో పరమే శ్వరుణ్ణి ఆవహింపజేసి పూజించావు. వాళ్ళు లింగం ప్రతిష్ఠించి పూజించారు. ఎలాచేసినా పరమేశ్వరారాధన సర్వార్థాలు సాధించి పెడుతుంది. అందులోనూ లింగపూజ ప్రతిమపూజకంటే శ్రేష్ఠమైంది. అంచేత లింగారాధనచేసిన కృష్ణార్జునుల్ని ప్రతిమారాధకుడివైన నువ్వు ఎలా గెలుస్తావు? మీమీ పూర్వజన్మల పూజాఫలాలు తారతమ్యాలతో మీరు అనుభవించక తప్పదు కదా!" అన్నాడు.

వ్యాసముని చెప్పిందంతా విన్నాడు అశ్వత్థామ. అతడిశరీరం పులకరించింది. శివుణ్ణి ధ్యానించి నమస్కరించాడు. శ్రీకృష్ణుణ్ణి మనసారా ప్రశంసించాడు. వ్యాసమునికి పాదాభివందనం చేశాడు.

వ్యాసముని అంతర్థానమయాడు. అశ్వత్థామ తిరిగి తన రథం మీదికి వచ్చేశాడు. పడమట అస్తమిస్తూన్న సూర్యబింబం చూస్తూ దుర్యోధనుడిదగ్గిరికి వచ్చాడు. "పొద్దుగూకిపోతోంది. సైన్యాలు మళ్ళించు" అని హెచ్చరించాడు.

దిగాలుమంటూవున్న మొహాలతో కౌరవులు శిబిరంచేరారు. ఎన్నో అన్ని యుద్ధవాద్యాలు మోగిస్తూ, సింహనాదాలు చేస్తూ, పొంగిన సముద్రంలా ఉల్లాసంతోవున్న సైన్యంమళ్ళించుకుని, నిశ్చింతగా, నవ్వుతూ, కేరుతూ శిబిరాలికి వెళ్ళారు పాండవులు.

శిబిరం చేరాక అర్జునుడి గుడారానికి వ్యాసముని వెళ్ళాడు. దూరంనించే చూశాడు అర్జునుడు. తడబడిపోతూ ఎదురువెళ్ళాడు. ఎంతో వినయంతో దండప్రణామంచేసి తోడితెచ్చాడు. ఆసనమూ, అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి పూజించాడు. చేతులు జోడించి నేల మీద కూచున్నాడు. ప్రసన్నంగావున్న మునిమొహంచూస్తూ మెల్లి మెల్లిగా ఇలా అడిగాడు: "తండ్రీ, ఎన్నాళ్ళనించో అడగాలనుకుంటాను. ఇవాళ నీ అనుగ్రహం కలిగింది. యుద్ధంలో నేను శత్రువుల్ని కొట్టడానికి పూనుకున్నప్పుడల్లా నాముందట అగ్నిహోత్రుడిలాంటి

దివ్యపురుషుడు వొకడు అవుపిస్తాడు. అతడి శరీరం కిరణాలతో ప్రకాశిస్తూ వుంటుంది. చేతిలో శూలముంటుంది. అందులోంచి ఘోరమైన శూలాలు పరంపరగా బైలుదేరుతూ వుంటాయి. అవే శత్రువుల్ని చంపేస్తూ వుంటాయి. నేను వెనకనించి బాణాలువేస్తూ చంపాననుకుంటాను, గెలుపు సాధిస్తూ.

"ఆ దివ్యపురుషుడు ఎవ్వడో అని ఎప్పుడూ అనుకుంటూ వుంటాను. మహాత్మా, ఎవరో అతడు ?"

"అర్జునా," ఆదరంగా అన్నాడు ముని – "అదృష్టవంతుడివోయి నువ్వు. ఆదివ్యపురుషుడు సాక్షాత్తూ పరమశివుడు. ఆదిదేవుడు. ముల్లోకాలికీ అతడే ప్రభువు. పేదకి పెన్నిధి దొరికినట్టు దొరికాడు నీకు. కృతార్థుడివయ్యావు. ఆయనవల్ల ఎంతటిశత్రువయినా నాశనమవుతాడు. ఆయన పూనుకున్నాడు కనకనే శత్రుసంహారం అంత సులువయింది నీకు. లోగడ దర్శనమిచ్చి, దివ్యాస్త్రాలు ప్రసాదించాడు. అంతతో తనివితీరలేదు ఆమహాదేవుడికి. భక్తులంటే ఆయనకి ప్రాణం. కనక ఇలా తనవాత్సల్యం ప్రకటిస్తున్నాడు. నువ్వు పుణ్యాత్ముడివి నాయనా ఆపరమాత్ముణ్ణి ఆత్మలో నిలిపి నమస్కరించు. సర్వలోకాలికీ ఆయనే ఆశ్రయం. అతణ్ణి ఆశ్రయించు. కరుణాకరుడతడు. తన శరణార్థులికి ఆయుస్సూ, ఆరోగ్యమూ, ఐశ్వర్యమూ అన్నీ అనుగ్రహిస్తాడు" అన్నాడు.

వ్యాసముని మాటలు ఆశ్చర్యంగా విన్నాడు అర్జునుడు. భక్తిపూర్వకంగా శివుణ్ణి ధ్యానించాడు; దండప్రణామం చేశాడు. వ్యాసమునికి పాదాభివందనం చేశాడు.

"సుఖపడు" అంటూ దీవించి వ్యాసముని అంతర్థానమయాడు.

వ్యాసహరికాంధ్ర మహాభారతం

ద్రోణపర్వం

సంపూర్ణం.

ప్రాచీన గ్రంథావళి: 21

సంపాదకుడు, పురిపండా అప్పలస్వామి

# వ్యావహారికాంధ్ర

# మహాభారతం

## కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు

## సంపుటం 5

కళాప్రపూర్ణ

పురిపండా అప్పలస్వామి



ప్రాచీన గ్రంథావళి
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయసూచిక

## కర్ణ పర్వం



## శల్య పర్వం

## సౌప్తిక పర్వం

### ఒకటో ఆశ్వాసం



### రెండో ఆశ్వాసం



## స్త్రీ పర్వం

### ఒకటో ఆశ్వాసం



### రెండో ఆశ్వాసం

# కర్ణపర్వం



## ఒకటో ఆశ్వాసం

ద్రోణవధ చెప్పి వెళ్ళాక మహాప్రాజ్ఞుడైన సంజయుడు రెండు రోజుల తరవాత దండునించి మళ్ళీ హస్తినాపురం వచ్చాడు. ధృతరాష్ట్రుడి మందిరానికి వెళ్ళి అంతఃపురంలో అతణ్ణి చూసి నమస్కారం చేశాడు. ధృతరాష్ట్రుడు ఆదరించాక కూచుని యుద్ధవార్తలు వినిపించాడు.

"మహారాజా, రెండుదినాల యుద్ధం చూసి వచ్చాను. మనవాళ్ళూ పాండవులూ అద్భుతంగా పోరాడారు. ఆరోజు కర్ణుడి యుద్ధం, కళ్ళు మూసుకుపోయాయంటే నమ్ము. పాండవసైన్యం గడ్డిపోచలా చూశాడతడు. ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, పదాతులూ తన పరాక్రమం ముందు చెల్లాచెదరయిపోయేవి. పారిపోయేవి. ముచ్చెమటలు పోసుకునేవి. మచ్చుకిలేకండా మాసిపోయేవి. అతడి భుజబలం చూసి దేవతలే ముక్కుమీద వేలు పెట్టుకున్నారు. మూడుచెరువులనీళ్ళు తాగించాడు పాండవుల్ని. అయితే ఏం లాభం? ఎంత ఆబోతైతే మాత్రం పెద్దపులికి లోకువే అయినట్టు అయింది. తనకంటే చిన్నవాడే అర్జునుడు, అయినా అతడి బాహుశక్తి నిభాయించలేక పోయాడు కర్ణుడు; తుదకి తెగిపోయాడు. పాండవులికి ప్రాణశత్రువు లేకండా అయిపోయింది."

చెపుతూ చెపుతూ దుఃఖం పొర్లుకువచ్చింది సంజయుడికి. గొంతుక గద్గదకపడింది. నిట్టూరుస్తూ ఇంకా ఇలా అంటున్నాడతడు.

"అది వొకటేనన్న మాటేమిటి, మహారాజా! కౌరవసేనల అసలన్నీ కడముట్టిపోయా యిక. భీముడు మన దుశ్శాసనుణ్ణి చంపే శాడు. అతడి గుండెలుచీల్చి రక్తం తాగేశాడు. చివరికి ఇంతా జరుగుతుందని అప్పుడే చెప్పారు మన ఆప్తులు. అయితే నువ్వు పేరాస పెట్టుకున్నావు. కొడుకులు రాజ్యమంతా గెలిచేస్తారనే అనుకున్నావు. అంచేతే వాళ్ళుచేసిన అగడాలన్నీ చూస్తూ వూరుకున్నావు అదంతా కట్టికుడపకండా ఎటు పోతుంది!"

ధృతరాష్ట్రుడిమీద పిడుగుపడినట్టయింది. దుర్యోధనుడూ తెగి పోయాడనే భయభ్రాంతుడయిపోయి మూర్ఛపోయా డతడు. అంతః పురంలోని స్త్రీజనమంతా తల్లడిల్లిపోయారు. ఏడ్పులతోనూ, మొర్రల తోనూ, కన్నీళ్ళు కారుస్తూ నేలమీద వాలిపోయారు. సంజయుడూ, అంతకుముందే అక్కడికి వచ్చిన విదురుడూ చన్నీళ్ళుచిలకరించీ, మృదువుగా విసనకర్రలతో విసిరీ ధృతరాష్ట్రుణ్ణీ, స్త్రీలనీ సేదదేర్చారు. ఎలాగో ఆనుకుని కూచున్నాడు ధృతరాష్ట్రుడు. నిట్టూరుస్తూ, దుఃఖ పడుతూ లోలోపల దైవాన్ని తిట్టుకున్నాడు. పాండవుల్ని మెచ్చు కుంటూ, తన బుద్ధీ, శకుని మంత్రాంగమూ నిందించుకుని, తను తాను సముదాయించుకుని. తుదకి ధైర్యం కూడబట్టుకుంటూ అన్నాడు:

"సంజయా, నువ్వు ఏమంటున్నావో తెలియడంలేదు నాకు; వినబడడమూ లేదు. దుర్యోధనుడు తెగిపోలేదు కదా! చెప్పు, చెప్పు. ఏంచెప్పావో మళ్ళీ చెప్పు."

సంజయుడు: దారుణంగా యుద్ధంచేసి దురోధనుడి తమ్ముళ్ళూ కర్ణుడూ తెగిపోయారు. ఘోరంగా దుశ్శాసనుడిగుండెలు చీల్చేసి వచ్చి నెత్తురు తాగాడు భీముడు, మహానందంగా.

ధృతరాష్ట్రుడు: చెప్పకు సంజయా! చెప్పకు. ఊరుకో. నా

మనస్సు భ్రాంతిలో మునిగిపోతోంది. నువ్వు ఏమంటున్నావో విన పడలేదు ..... ...

హృదయం బద్ధలయిపోతూ వుంది. దుర్భరంగా వుంది. నా, దుర్ణయం వల్లా, దుర్యోధనుడి బుద్ధితక్కువ వల్లా ఇదంతా వచ్చింది. ఈ దుఃఖంనించి ఎలా గట్టెక్కడ మనుకుంటున్నాను. నా సందేహం తీరేట్టు మొదటినించీ ఇప్పటిదాకా యుద్ధంలో కాలంచేసిన మన వాళ్ళనీ, వాళ్ళవాళ్ళనీ వివరించి చెప్పు.

ధృతరాష్ట్రుడు అలా అడగగానే "మనవాళ్ళలో భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, వికర్ణుడూ, వృషసేనుడూ, దుశ్శాసనుడూ, లక్ష్మణుడూ మొదలైనవాళ్ళు కాలంచేశారు. వాళ్ళలో విరాటరాజూ. శంఖుడూ, ఉత్తరుడూ, ద్రుపదుడూ, అభిమన్యుడూ, ఘటోత్కచుడూ, పాండ్యరాజూ మొదలైనవాళ్ళు కళ్ళుమూశారు" అంటూ పేరుపేర చెప్పాడు సంజయుడు. ఎవరెవరు ఎవరెవరిచేత కూలిపోయారో వివరించాడు.

"అయితే ఇంకా మనసేనలో ఎవరున్నారు!" — అడిగాడు ధృతరాష్ట్రుడు.

"అశ్వత్థామా, కృతవర్మా, శల్యుడూ, శకునీ, కృపాచార్యుడూ వున్నారు" అంటూ అప్పటికి ఒలికున్న దుర్యోధనుడి తమ్ముళ్ళనీ, కర్ణుడి కొడుకులలో మిగిలినవాళ్ళనీ, తక్కిన యోధుల్నీ చెప్పాడు సంజయుడు. "తేజస్సులేనిఅగ్ని ఎలా వేడిపోకుండా వుంటుందో అదిగో, అలాగ ఈమిగిలినవాళ్ళతో యుద్ధానికి పూనుకుని, గెలుపు సాధిస్తానని ధైర్యంతో వున్నాడు దుర్యోధనుడు" అన్నాడు.

కొడుకుధైర్యం విని మెల్లిమెల్లిగా కుదుటపడ్డాడు ధృతరాష్ట్రుడు. అయితే తనవాళ్ళు ఎంతో మంది చచ్చిపోయా రనిమాత్రం కుంగిపోయాడు. కొంచేపు పూరుకు, కర్ణుడిచావు తలుచుకుని బావురుమన్నాడు

"ఆలమందలో ఆబోతులాగ, కౌరవబలంలో మదపుటేనుగు లాగ వుండేవాడు. సర్వాంగసుందరుడు. అఖండమైనపరాక్రమశాలి— అయ్యో మరి లేడు!" అంటూ హాహాకారాలు చేశాడు; గొంతెత్తి ఏడ్చాడు.

"సంజయా, కృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ గడ్డిపరకలా చూసేవాడు. దేవేంద్రుణ్ణయినా ఇట్టే ఓడిస్తాననేవాడు. అలాంటి కర్ణుడు అంతమై పోయాడా, యుద్ధంలో? అతడి ఆసరా చూసుకునే దుర్యోధనుడు పాండవులమీద పగపట్టాడు. అతడి పరాక్రమంవల్లే విదేహ, పౌండ్ర దేశాల రాజులు మనకి అరిగాపులయారు. అతడి అండ చూసుకునే మనసైన్యాలు శత్రువుల్ని లక్ష్యపెట్టకండా యుద్ధంచేశాయి. అతడి దివ్యాస్త్రాలమహిమకి దేవతలే నాలికలు కరుచుకునేవాళ్ళు. అలాంటి కర్ణుడు పడిపోయాడంటే ఇంకెక్కడి బతుకు మనకి! ఎక్కడియుద్ధం! ఇంతమాట విని పగిలిపోకండావుంది నాహృదయం, రాయో, ఇనుమో ఏమో మరి?

"బంధువులూ, పుత్రులూ, మిత్రులూ ఒకరితరవాత ఒకరు కూలిపోడం వింటూ ఇలాగ ఎవ్వరైనా బతికివుంటారా, నేనువొక్కణ్ణీ తప్ప? ఇంతకష్టం ఎవ్వరికైనా వుంటుందా? సంజయా, ఇక బతికి బట్ట కట్టేదేముంది నేను? నీళ్ళలో దూకుతాను అగ్గిలో వురుకుతాను. విషం తాగుతాను. ప్రాయోపవేశం చేసుకుంటాను" అన్నాడు.

సంజయుడు: సంపదా, పరాక్రమమూ, కీర్తి—ఇన్నిటిలోనూ పూర్వరాజులతో సరితూగుతావు నువ్వు. నీ అంతవాడు ఇలా దుఃఖంలో కుంగిపోడం తగదు. గౌరవమూ, కీర్తి నిలబడేట్టు ధీరత్వం వహించు. చలించకు.

ధృతరాష్ట్రుడు: కర్ణుడిచావు హృదయంలో శల్యంలా బాధిస్తోంది. దుఃఖసముద్రంలోంచి ఎలాఒడ్డుచేరగలనంటావు? పౌరుషం

పినరంతా పనికిరాదు. అంతా దైవాధీనం. అలాకాకపోతే మహా వీరుడు కర్ణుడేమిటి అర్జునుడిచేత చచ్చిపోడమేమిటి ! కర్ణుడు కళ్ళు మూశాడూ అనగానే నాగుండెలు వెయ్యిచెక్కలు కావలసింది. కాలేదు. ఇంచేత నా ఆయువుకి అంతంలేనట్టుంది. ఇంతదాకా లోకంలో గౌరవాదరాలు పొందాను. ఇప్పుడు నా అన్నవాడల్లా వెళ్ళిపోతున్నారు. ఇక దుఃఖాలపాలై దురవస్థ అనుభవించాలి. ఎలా భరించమంటూ విది ? జయద్రథుడూ, ద్రోణుడూ, కర్ణుడూ కాలం చేయడం విని నాహృదయం దుఃఖంతో కుంగిపోతూవుంది. అందు లోనూ కర్ణుడు కళ్ళుమూశాడంటే గుండెలు దేవేస్తున్నాయి. దుర్యో ధనుడిమీద ఆసే వొదులుకుంటున్నానిక. ఏమంటావా ? అన్ని విధాలా కర్ణుడే ఆధారంగా వుండేవాడు మావాడికి. ఇక ఎవరున్నారు? దిక్కులేనివాడై పోయాడు దుర్యోధనుడు. మనబలం చేవతగ్గిపోయింది. పాండవసేనకివున్న ఆశా స్తంభయినూ పోయింది. అయ్యో, జంభా సురుడు దేవేంద్రుడిచేత కూలిపోయినట్టు, అర్జునుడిచేత తెగిపోయి పడి వున్నాడన్నమాట కర్ణుడు, రణభూమిలో ! కాళ్ళులేనివాడు పరిగెత్తా లనుకోడమూ, ముసీలినిరుపేద సానిదాన్ని కోరడమూ ఎలావుంటుందో దుర్యోధనుడు జయం కోరడమూ అలాగే వుంది.

మనలో మనకి కయ్యమెందుకని మొత్తుకున్నాడు ధర్మరాజు. కాయిలామనిషికి పత్యం రుచించనట్టు మీరాజుకి అది రుచించలేదు. అంపశయ్యమీద వుండి భీష్ముడు పాతాళగంగ తెప్పించుకున్నాడు అర్జునుడిచేత. అలా అతడి అస్త్రప్రభావం వ్యక్తంచేసి, పాండవులతో బంధుత్వం పెట్టుకోమన్నాడు. ఇంతతో యుద్ధం చాలించమన్నాడు. శాంతించి, రాజ్యం పంచుకుని బతకమన్నాడు. చెవినిపెట్టలేదు దుర్యో ధనుడు. ఇపుడు దుఃఖసముద్రంలో తలమునకలవుతుంటాడు ! పిల్లలు ఈకలూడ్చేసి ఆడుకుంటూంటే పిట్ట ఎలా కొట్టుకుంటుంది, అదుగా

అలాగే వుంది నాఅవస్థ. ఎందులో దూకేది? ఈదుఃఖం తీర్చడానికి ఎవరున్నారు, దిక్కు!

అయ్యో! కర్ణుడు అర్జునుడితో పోరాడినప్పుడు అతడిప్రతాపం నిభాయించుకున్నాడా? దెబ్బకిదెబ్బతీసి ఉభయసేనలూ భళీఅన్నట్టు, ధూనికతో విజృంభించాడా? పేరూ, పెంపూ మంటకలిపెయ్యలేదు కదా, తెల్లమొహం వేసి? మిగిలిన సైనికులంతా అతణ్ణి వొదిలేసి పారిపోయారా! లేకూ, శాయశక్తులా ఎంతోమంది అతడికోసం పోరాడి, పీనుగుపెంటలై కూలిపోయారా? శిఖండిని ముందుపెట్టుకుని భీష్ముణ్ణి కొట్టేశాడు అర్జునుడు, కపటంచేసి. అలాంటిదే ఏదైనా పన్ని కొట్టేశారా, కర్ణుణ్ణి? ఏనుగుచస్తే అశ్వత్థామ చచ్చాడని బొంకాడు ధర్మరాజు, గురువుని చంపడంకోసం. అలాటిదే ఏమైనా చేశారా, ఇప్పుడు కూడా? భీష్ముడూ, ద్రోణుడూ మాయోపాయంవల్ల పడిపోయారు. అలా కాకండా ధర్మయుద్ధంలో వాళ్ళని పడగొట్టడం ఎవడితరం?

పరశురాముడిదగ్గిర బ్రహ్మాస్త్రం సంపాదించాడు. సర్పాస్త్రం సామాన్యమైందా? ఇవేనా, ఇంకాఎన్నో దివ్యాస్త్రాలున్నాయి అతడి దగ్గిర. అభిమన్యుడిధనుస్సు ఎవడైనా నరకగలిగాడా, అతడు తప్ప! పదివేల ఏనుగుల బలశాలిని భీముణ్ణి పరాభవంచేసి వొదిలిపెట్టాడు? సహదేవుణ్ణి తలకొట్టేసినంతపని చేశాడు. వేలువేలు సేన చొక్కాకుల్లాగ దుళ్ళగొట్టేశాడు. మాయల మహిరావణుణ్ణి ఘటోత్కచుణ్ణి చంపేశాడు—అలాటి జగజ్జెట్టికి చావు ఎలావచ్చిందీఅంటూ, యుద్ధంలో. రథానికో, సారథికో, అస్త్రాలకో ఏదైవశాపంవల్లో, ఏదో చేటుమూడిందా? రథం ఏమీకాకండా వుండి, సారథిసారథ్యం సమర్థంగావుండి, విధివశాత్తూ మహాస్త్రాలు వుత్తిపోకండా వుంటే యుద్ధంలో దేవేంద్రుడైనా గెలవగలడా, కర్ణుణ్ణి?

అతడి సారథి ఎవడు చెప్పూ? శల్యుడూ, శకునీ, కృపాచార్యులూ, అశ్వత్థామా అపుడు ఎలా తోడ్పడ్డారు? కృతవర్మ వరాక్రమంమీద బోలెడంతనమ్మకం దుర్యోధనుడికి. కృష్ణుణ్ణి పునస్కరించుకుని కృతవర్మ అర్జునుడిమీద పక్షపాతం చూపించాడా, అప్పుడు?

వీళ్ళంతా రెండుపక్కలా వుంటే, దుర్యోధనుడు వెనకనే వుంటే కర్ణుడు ఎలాకడతేరిపోయాడో ఆశ్చర్యంగా వుందినాకు! చెప్పు, సంజయా! చెప్పూ పాండవులు కర్ణుణ్ణి ఎలాముట్టడించారు? కర్ణుడిసర్పముఖబాణంతో చచ్చిపోకండా అర్జునుడు ఎలా బతికిపోయాడు? తక్కిన నలుగురు పాండవులూ ఎలా పోరాడారు? వాళ్ళసేనా మనసేనా ఈ రెండురోజులూ ఎలా యుద్ధంచేసింది?

సంజయుడు: ఈ రెండురోజులూ యుద్ధం ఎలా జరిగిందీ మొదటినుంచీ చెపుతాను, విను. ద్రోణుడు తెగిపోయిన తరవాత, అశ్వత్థామ తన వోపినంతవరకూ యుద్ధంచేసి, చాలించి, సేనలు మళ్ళించి, శిబిరానికి వచ్చేశాక, దుర్యోధనుడు శిబిరంలో కొలువుతీర్చాడు. అశ్వత్థామా మొదలైన మొనగాళ్ళని చూసి "ఇకమీద మనం ఏం చెయ్యాలి?" అని అడిగాడు.

"ఇంతవరకూ ఏశౌర్యంతో కార్యం జరిగించావో ఆశౌర్యంతోనే పూనుకుని ఇకముందు కార్యం కూడా సాగించు" అంటూ అందుకున్నాడు అశ్వత్థామ—"సంకల్పమూ, పూనికా, సామర్థ్యమూ, నీతీ-ఈసద్గుణాలు వుంటే ఏపని అయినా సఫలం అవుతుంది. అయితే దైవసహాయం మాత్రం కావాలి. ఈసద్గుణాలికి ఆటపట్టయిన మహాత్ములు వెళ్ళిపోయారు. అయినా వున్న మహారథికులు కూడా తక్కువ వాళ్ళు కారుకదా! మన పూనికబట్టి దైవమూ మనకి తోడ్పడతాడు. మనలో బలానికీ, శౌర్యానికీ ఘనుడు మన కర్ణుడు. కావలిసిన సద్గుణాలన్నీ ఇతడిలో వున్నాయి. ఇతణ్ణి సేనాధిపతిని చేసుకుని శత్రు

సంహారంచేద్దాం. దివ్యాస్త్రాలన్నీ ఇతడి వేళ్ళమీద వుంటాయి. అంచేత యముడిలాగ శత్రువుల్ని చంపేస్తాడు" అన్నాడు.

అశ్వత్థామమాటలు విని సంతోషించాడు దుర్యోధనుడు. "అవును" కర్ణుడు పాండవుల్ని గెలిచెయ్యగలడన్న ఆశ అధికంగా పెట్టుకుని అతడితో అన్నాడు- "కర్ణా, నీప్రతాపమూ, నామీద నీకు వున్న స్నేహమూ లోకమంతా ఎరుగును. భీష్ముడూ, ద్రోణుడూ పడిపోయారు. ఇక నువ్వే కౌరవసేన కాపాడాలి. వాళ్ళువున్నారుకదా అని ఉపేక్షించావు కాని నువ్వే అయితే ఇన్నాళ్ళా జరిగేది యుద్ధం? లిప్తలమీద గెలిచేసివుందుం పాండవుల్ని. నువ్వు ప్రాజ్ఞుడివి. ప్రబలుడివి. పైగా నాకు ఏకుగడవి. నాకు మేలుచెయ్యడమే నీపని. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ అవమానించేవాళ్ళం, నిజమే. కాని వాళ్ళుయుద్ధంలో పడి పోయాక మనం వొదిగి వుండగలమా? పనుంకట్టు. చీకట్లకి సూర్యోదయం లాగ నీపూనిక పగవాళ్ళకి దుర్భరమవుతుంది. కుమారస్వామి దేవసేన నడిపినట్టు కౌరవసేన నడిపించు. నన్ను గెలిపించు. నిన్ను నువ్వే సర్వసేనాధిపత్యానికి పట్టంకట్టుకో.".

"మహారాజా," సంతోషంతో రాజులందరి ముందూ దుర్యోధనుడితో అన్నాడు కర్ణుడు—"నీకు ఇచ్చినమాట మరిచిపోలేదు నేను. వీరత్వం, బాహుబలం, ధైర్యం, అస్త్రబలం- అన్నిటిలోనూ పాండవుల కండకావరం పిండేస్తాను. లోకమంతా 'భళీ' అన్నట్టు చేస్తాను. విపరంతా అనుమానం అక్కరలేదు నీకు. నువ్వువూరికే అలా నుంచుని చూస్తూవుండు, నాయుద్ధం. మంచిదే, నన్ను సర్వసేనాధిపత్యానికి పట్టం కట్టు."

## కర్ణుడి సర్వసేనాధిపత్యం

కర్ణుడిమాటలు మరీ సంతోషం కలిగించాయి దుర్యోధనమహారాజుకి. బంగారంకుండలతో పవిత్రజలాలు తెప్పించాడు. మహానీయ

మైన పీఠాన్ని, మంచిమంచి పుష్పాలూ, ఓషధులూ, గంధమూ, అక్షతలూ మంత్రించాడు. మేడికర్ర పీఠంమీద పట్టువస్త్రాలు పరిపించాడు. కర్ణుణ్ణి దానిమీద శాస్త్రోక్తంగా కూచోపెట్టాడు. పుణ్యాహఘోషలూ, యుద్ధవాద్యాలూ, వందిమాగధుల స్తోత్రాలూ దిక్కులు ప్రతిధ్వనించాయి. అలా అన్ని లాంఛనాలతోనూ రాజులు యావన్మందితోనూ కలిసి కర్ణుడికి సర్వసేనాధిపతిగా అభిషేకించాడు దుర్యోధనుడు. బ్రాహ్మణులకీ, వందిమాగధులకీ చేతికి ఎముక లేకుండా దానం చేశాడు కర్ణుడు. శూరయోధులు యావన్మందీ జయజయధ్వానాలు చేశారు. రాజులు అభినందించారు "కృష్ణుడితో సహా పాండవుల్ని జయించు" అంటూ మాగధులు దీవించారు. ఈ అన్నిటితోనూ ఆకాశం గింగురుమనిపోయింది.

"దుర్యోధనమహారాజా" అప్పుడే ఉదయిస్తూవున్న సూర్యుడిలా వెలిగిపోతూ ఉత్సాహంతో అన్నాడు కర్ణుడు – "రణదుందుభులతోనూ స్నేహితులతోనూ కలిపి అర్జునుణ్ణి హతమార్చేస్తాను. సామ్రాజ్యలక్ష్మి నీ కాళ్ళముందు పడేస్తాను. పుత్ర పౌత్ర పారంపర్యంగా ఈ భూమండలం పరిపాలించు. సకలభోగాలూ అనుభవించు. సత్యమూ, ధర్మమూ కల మనిషికి లిప్తలమీద కార్యసిద్ధి అవుతుంది. అలాగే శౌర్యమూ, బాహుపరాక్రమమూ కలిగిన నాకు యుద్ధంలో ఇట్టే జయం లభిస్తుంది.

కర్ణుణ్ణి సర్వసేనాధిపతిని చేసి, గొప్ప వైభవంతో అతణ్ణి తన గుడారానికి పంపించాడు దుర్యోధనుడు. తరవాత తక్కిన రాజుల్ని తమతమ విడిదలకి పంపించేసి, సంతోషంతో తన గుడారంలోకి దయచేశాడు. అదిగో ఆ రాత్రే నేను ఇక్కడికి వచ్చి ద్రోణుడి వృత్తాంతం నీకు వినిపించి వెళ్ళాను. సూర్యోదయమయ్యేసరికి కురుక్షేత్రం చేరి, మన శిబిరం ప్రవేశించాను.

అప్పటికే మహాసేనాని కర్ణుడు యుద్ధానికి బయలు దేరుతున్నాడు.

దంతంలాగ తళతళలాడుతూవున్న జెండామీద హస్తికక్ష్య (ఏనుగు తాడు) మెరుస్తోంది. హంసరంగు గుర్రాలతో సూర్యబింబంలాగ ప్రకాశిస్తూవుందిరథం. బంగారంపూతపూసిన ధనుస్సు ఎక్కుపెట్టి చేతిలో వెలిగిపోతూవుంది. శిబిరమంతటినీ యుద్ధానికిరెచ్చగొడుతూ, తన పక్క శంఖాలు భయంకరంగా మోగుతున్నాయి. రణోత్సాహం మొహానికివింతవిలాసం కలిగిస్తోంది. యుద్ధంకబుర్లే చెప్పుకుంటూ ఆ ప్రజనం రెండుపక్కలా రథాలమీదబారులుతీరి వున్నారు. అలా ఎంతో అందచందాలతో యుద్ధానికి సిద్ధపడ్డాడు కర్ణుడు.

అతడు సేనాధిపతుల్ని పంపి పిలిపించడంతోనే యావన్మంది రాజులూ యుద్ధానికి బయలుదేరారు. అలా సకలసైన్యాలూ నడవడంతో, గుర్రాల డెక్కలవల్ల రేగిన ధూళి నాలుగుదిక్కులా నిండిపోయింది. ఏనుగుల చెక్కిళ్ళలోంచి ప్రవహించిన మదజలం ఆధూళి అడిచేసింది. రకరకాల యుద్ధవాద్యాలు భయంకరంగా మోగాయి; ఆకాశం బద్దలుచేశాయి. ధనుష్టంకారాలూ, సింహనాదాలూ, వాటిని మరింత అధికం చేశాయి. రథాలవాళ్ళు వేసుకున్నవగల కాంతులూ, జెండాలమీదా, ఛత్ర చామరాలమీదా చెక్కిన మణులూ, సైనికుల ఆయుధాల తళతళలూ - వీటి అన్నిటిలోనూ, పట్టపగటి దీపంలా అయిపోయాడు సూర్యుడు.

ఉప్పొంగిపోతూవున్న హృదయాలతో, తనివితీరనట్టు కర్ణుణ్ణి చూశారు సైనికులు. భీష్ముడూ, ద్రోణుడూ పోయారన్న విచారం విడిచిపెట్టేశారు.

## పదహారో రోజు

అలా యావత్తు సైన్యమూ వేసుకుని యుద్ధభూమికి వెళ్ళి దున్నహమైన మకరవ్యూహం పన్నాడు కర్ణుడు. వ్యూహం నోటిదగ్గిర

తానుస్వయంగా నుంచున్నాడు. కళ్ళదగ్గిరశకునినీ, ఉలూకణ్ణీ పెట్టాడు. శిరస్సులోఅశ్వత్థామనినిలిపాడు. కంఠందగ్గిర దుర్యోధనుడితమ్ముళ్ళని పెట్టాడు. కడుపుదగ్గిర దుర్యోధనుణ్ణే నిలిపాడు. ఎదటి ఎడమపాదం దగ్గిర నారాయణగోపాల సైన్యంతో కృతవర్మనీ, కుడిపాదం దగ్గిర త్రిగర్త, దక్షిణాది సేనాలతో కృపాచార్యుల్ని నుంచోపెట్టాడు. వెనక ఎడమకాలు దగ్గిర నానాదేశాల దండుతో శల్యుణ్ణీ, కుడికాలు దగ్గిర ఎన్నో అన్ని రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ ఇచ్చి సుషేణరాజునీ పెట్టాడు. తోకలో బ్రహ్మాండమైన రాణువతో చిత్రుణ్ణీ, అతడితమ్ముడు చిత్రసేనుణ్ణీ నిలబెట్టాడు. తక్కినవాళ్ళని అక్కడా అక్కడా అవసరమైన చోట్లల్లా సర్ది పెట్టాడు.

అంతకి ముందే బలిష్ఠమైన చతురంగసేన వేసుకుని ఉత్సాహంతో వచ్చాడు ధర్మరాజు.

"తమ్ముడూ, చూశావా!" మన మకరవ్యూహం చూసి, అర్జునుడితో అన్నాడతడు—'బాగా తగ్గిపోయింది కౌరవసైన్యం. కర్ణుడు వ్యూహంపన్ని తానే స్వయంగా మొహం దగ్గరనుంచున్నాడు యుద్ధమంతా తనమీదే పెట్టుకుని, పరాక్రమమంతా ప్రకటించాలని ఉవిశిసిపడుతున్నాడు. నీ బాణాలతో అతడి పని పట్టెయ్యాలిప్పుడు. పన్నెండేళ్ళు మనం అడవులు పట్టిపోయి, పడరానిపాట్లూ పడి, ఈఅవస్థకి వచ్చాం. అదంతా తీరిపోయినట్టు బాణాల్తో ముంచెయ్యాలి ఇతణ్ణి. ఇతడు పోకడేదుర్యోధనుడిపక్షంలో వాడిచూపి పోరాడగల మొనగాడు. నీపరాక్రమమంతా చూపించి ఇతణ్ణి హరీ అనిపించెయ్యి. దాంతో దుర్యోధనుడు పళ్ళూడిన పాము అయిపోతాడు. గెలుపు నీ కాళ్ళకిందికి వస్తుంది. నీకు నచ్చిన వ్యూహం పన్ను."

అన్నగారు అలా అనగానే అర్ధచంద్రవ్యూహంపన్నాడు అర్జునుడు. తాను మధ్యప్రదేశంలో నుంచున్నాడు. తన చక్రరక్షకులు

యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ రణోత్సాహం రేకెత్తిన మొహాలతో ఇరుపక్కలా కలకలలాడారు. కుడి ఎడమకొమ్ములలో ధృష్టద్యుమ్నుణ్ణీ, భీముణ్ణీ పెట్టాడు. ధర్మరాజునీ, నకులసహదేవుల్నీ వెనకభాగంలో నిలబెట్టాడు. తక్కిన యోధులు ఎవళ్ళకితగినస్థానాల్లో వాళ్ళు సర్దుకున్నారు. ఇలా ఉభయసేనలూ వ్యూహాలుపన్నుకుని కయ్యానికి కాలుదువ్వుతూ నుంచున్నాయి.

"కృష్ణుడూ, పాండవులూ ఇవాళ యమలోకం దయచేస్తారు" అంటూ సంతోషించాడు దుర్యోధనుడు. "కర్ణుడితోసహా కడతేరిపోతాడు దుర్యోధనుడు" అంటూ ఆనందించాడు ధర్మరాజు. రెండు సేనలూవొకదాన్నిమించి వొకటివుప్పొంగాయి. భేరీలూ మొదలైన రణవాద్యాలు మోగాయి, ఆకాశం దిమ్మెత్తిపోయినట్టు. శంఖాలు మోగాయి, చెవులు తాళాలు పడినట్టు. ఉత్సాహంతోనూ, తమకంతోనూ కలబడడానికి రెండుసేనలూ వురకలుపెట్టాయి.

ఏనుగులగంటల గణగణలూ వాటి ఘీంకారాలూ, రథచక్రాల క్రేంకారాలూ, జెండాలమీది చిరుగంటల గలగలలూ, గుర్రాల డెక్కల టకాటక శబ్దాలూ, వాటి సకిలింపులూ, వీరభటులు జబ్బలు చరిచిన చప్పుళ్ళూ వాళ్ళ సింహనాదాలూ—ఇవన్నీ దిక్కులు పగలగొట్టాయి. యుద్ధం చూడడానికి కుతూహలంతో దేవతలూ, ఖచరులూ, సిద్ధులూ, యక్షులూ, గరుడులూ వచ్చి ఇసకవేస్తేరాలకండా నిండిపోయారు, ఆకాశంనిండా.

రెండుసేనలూ కలబడ్డాయి; హోరాహోరి పోరాడాయి. గరుత్మంతుడు చీల్చిపడేసిన అయిదుతలల పాముల్లాంటి బాహువులతోనూ చంద్రుడిలాంటి అందమూ, సూర్యుడిలాంటి ప్రకాశమూ, పద్మాల్లాంటి పరిమళమూ కలిగిన మొహాలతోనూ రణరంగం నిండిపోయింది. పుణ్యం చెల్లిపోయాక స్వర్గంనించి భూలోకానికి పడిపోతున్న మహాత్ముల్లా కని

పించారు, మణిభూషణాలు మెరుస్తూ వాహనాలమీంచి కూలిపోతూ వున్న సైనికులు. రథాలతో రథాలూ, ఏనుగులతో ఏనుగులూ, గుర్రాలతో గుర్రాలూ, భటులతో భటులూ పోరాడి కూలిపోయారు. ఏనుగులు రేగి రథాలు పడగొట్టాయి. రౌతులు రేగి ఏనుగులు కూలగొట్టారు. పదాతులు రేగి గుర్రాలుపడగొట్టారు. రథాలు రేగి పదాతుల్ని పచ్చడిచేశాయి. అలా ఆదొమ్మీయుద్ధంలో అందరూ అన్నివిధాలా పోట్లాడారు; రౌద్రరసం ప్రకటించారు. సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, చేకితానుడూ, ద్రౌపది కుమాళ్ళూ, ప్రభద్రక, చేది, పాండ్య, చోళ మగధ, వంగ దేశాలసేనలతో కలిసి యుద్ధం చేశారు; తరుముకు మరీ వురికారు.

భయంకరమైన ఉద్రేకంతో ఏనుగుసేన విజృంభించింది పెద్ద మదపుటేనుగుమీద ఎక్కి వచ్చి కలబడ్డాడు, ఉడ్డోలమైన బలంతో భీముడు. ఉదయపర్వతంమీద సూర్యుడిలాగ, కిరణాల్లాటి తీవ్ర బాణాలు విరజిమ్ముతూ మదపుటేనుగుమీద ప్రకాశించాడతడు.

## క్షేమధూర్తి భీముడి చేత చచ్చాడు

ఆ మహావీరుణ్ణి చూసి కులూత దేశంరాజు క్షేమధూర్తి తన సైన్యాలు పురికొల్పుకుని ముందుకి వెళ్ళాడు. భీముణ్ణియుద్ధానికి పిలుస్తూ తన ఏనుగు వురికించాడు. కొండాకొండా గుద్దుకున్నట్టు రెండుఏనుగులూ ఢీకొన్నాయి. భీముడూ, క్షేమధూర్తీ తోమరాల్తో కొట్టుకున్నారు, సింహనాదాలు చేశారు. ఉద్దండమైన పరాక్రమంతో ఏనుగులు ముందుకీ వెనక్కీ పక్కలికీ దాట్లు వేస్తూవుంటే, కలబడుతూ వుంటే, ఎంతో కళ్ళవేడుకగానూ, ఎంతో గుండెదడగానూ వుండేది. ఒకళ్ళని ఒకళ్ళు చుట్టివస్తూ భీముడూ, క్షేమధూర్తీ దారుణంగా పోరాడారు.

ధనువులు పుచ్చుకుని చేతులబలంకొద్దీ యుద్ధంచేశారు. ఒకళ్ళ

ధనుస్సు వొకళ్ళు నరుక్కున్నారు. ఒకళ్ళనిమించిన వడి వొకళ్ళు చూపెట్టారు ఒకళ్ళనిమించిన కోపం వొకళ్ళు కనపరిచారు. శక్తులతో కొట్టుకున్నారు. తోమరాలతో బాదుకున్నారు. భీముడి ఎదురుగుండా మీద వొక్కవూపుని పదు తోమరాలు కొట్టాడు క్షేమధూర్తి. సూర్య బింబంలా మెరిసిపోతున్న తోమరం వొకటి విసిరాడు భీముడు. కరూశ దేశంరాజు మధ్యనేదాన్ని చిత్రంగా కొట్టేశాడు. పైగా భీముడిమీద అరవై బాణాలు చెప్పుకోదగ్గవి తగిలించాడతడు. అతడు వొక లెక్క చేయలేదు భీముడు. అతడివేపు చూడన్నా చూడలేదు. మంచి వొక ధనుస్సు తీశాడు. క్షేమధూర్తిని బాణాలతో కప్పేశాడు. అతడిఏనుగు వొంటినిండా బాణాలునాటించాడు భరించలేకపోయింది ఏనుగు. గిర్రున వెనక్కితిరిగింది. పరుగు ప్రారంభించింది. పోనివ్వలేదు భీముడు, వెంట పడ్డాడు. బ్రహ్మాండ:మీద ఏనుగు వెనక్కితిప్పాడు క్షేమధూర్తి. భీముడి మీదా, అతడిఏనుగుమీదా వాడివాడిబాణాలు గుప్పించాడు. హుంక రించాడు భీముడు. అతడి ధనుస్సు నరికేశాడు. అతడి ఏనుగుని చావు దెబ్బలు కొట్టాడు మగతనంతో మరోవిల్లు అందుకున్నాడు క్షేమ ధూర్తి. తళతళా మెరుస్తున్న చిల్లకోల తొడిగాడు. భీముణ్ణిచుర్రుమని పించాడు. అతడి ఏనుగుని మోకరిల్లి పడిపోయినట్టు కొట్టాడు. "బలే బలే క్షేమధూర్తీ" అంటూ సేన గావుకేకలు వేసింది.

గదపట్టుకుని ఏనుగుదిగాడు భీముడు. ఒక్క దెబ్బతో క్షేమ ధూర్తి ఏనుగుని తాచుమనిపించాడు. కత్తిపట్టుకుని మీదకిపరి గెత్తాడు క్షేమధూర్తి. ఏనుగుని బాదిన గదతోనే అతణ్ణి బాదేశాడు భీముడు. చచ్చివూరుకున్నాడు క్షేమధూర్తి. వజ్రాయుధంతో కూలి పోయిన కొండలా పడుంది అతడి ఏనుగు. దానిపక్కనే, పిడుగుపడి చచ్చిన సింహంలా పడిపోయాడు క్షేమధూర్తి. దాంతో మనసేన తద్దరిల్లిపోయింది, పరుగుతీసింది. పాండవసేన వెంటపడింది.

ఆ సేనమీద కర్ణుడు ధ్వజమెత్తాడు. తెరిపిలేని బాణాలు వేశాడు ఆకాశం కనపడకుండా అయిపోయింది. అది చూసి మనసేన ధైర్యం తెచ్చుకుంది శత్రుసేనమీద తిరగబడింది. దాంతో వల్లమాలిన వీరావేశంతో కలబడ్డారు పాండవులు. మంచి పట్టులో పడింది యుద్ధం.

కర్ణుడి బాణాలు దూసుకెళ్ళి పోతూంటే ఏనుగులు పడ్డేవి; సొమ్మసిల్లి పోయేవి; దొర్లిపోయేవి; తప్పుకునేవి; తూలిపోయేవి; గిర్రుమని తిరిగిపోయేవి; పారిపోయేవి; చచ్చిపోయేవి. అప్పుడు నకులుడు వచ్చి అతడితో కలబడ్డాడు. భీముడు అశ్వత్థామతో యుద్ధం చేశాడు. సాత్యకి కైకేయులైన విందానువిందులతో పోరాడాడు. అర్జునుడు సంశప్తకులతో పోట్లాడాడు. ధర్మరాజు దుర్యోధనుడితో దెబ్బలాడాడు. ధృష్టద్యుమ్నుడు కృపాచార్యుడితోనూ, చిత్రసేనుడనే రాజు శ్రుతవర్మతోనూ ప్రతివింధ్యుడు చిత్రుడు అనే రాజుతోనూ, శిఖండి కృతవర్మతోనూ, శ్రుతకీర్తి శల్యుడితోనూ సహదేవుడు దుశ్శాసనుడితోనూ కలబడ్డారు.

విందానువిందులు సాత్యకితో రేచల్లా పోరాడారు. నిలువునా మండిపోయాడు సాత్యకి. వాళ్ళ ఇద్దరి ధనస్సులూ నరికేశాడు. ఇద్దరి శరీరాలు బాణాలతో నింపేశాడు. తటుక్కున చెరో విల్లూ తీశారు విందానువిందులు. వరసపెట్టి సాత్యకిమీద బాణాలమీద బాణాలు నాటించారు. చెరో బాణం వేసి అతడి ధనుస్సు నరికేశారు. మెరుపులా మెరిశాడు సాత్యకి. మంచిది మరోవిల్లు అందుకున్నాడు. ఇలా ధనుస్సు తీశాడు, అలా ఒక భల్లబాణం వేశాడు. అనువిందుడి తల ఎగర గొట్టేశాడు. రత్నకుండలాలు ప్రకాశిస్తూ కింద పడిపోయింది తల. హాహాకారాలు చేసింది కైకేయసేన. ఒళ్ళు తెలియని కోపంతో వూగిపోయాడు విందుడు. గబాగబా బాణాలు గుప్పించాడు. గాయాలతో సాత్యకి వొళ్ళంతా రక్తాలుకారాయి.

పూసిన మోదుగుల్లాగ అవుపించాడతను. వరసపెట్టి వందాతిక్కనై బాణాలు కొట్టాడు సాత్యకి. అలా ఇద్దరూ సమానేనా అన్నట్టు యుద్ధంచేశారు. నిప్పులు మెరిసే కళ్ళతో వొకళ్ళనొకళ్ళు చురచురా చూసుకున్నారు. ఒకళ్ళసారథిని వొకళ్ళు చంపేసుకున్నారు. ఒకళ్ళ ధనుస్సు వొకళ్ళు విరుచుకున్నారు. కత్తులూ డాళ్ళూ పట్టుకుని ఇద్దరూ రథాలుదిగారు. ఇద్దరూ మండలప్రచారాలతో విజృంభించారు. ఎన్నో చిత్రగతులతో పోరాడారు. ఒకళ్ళ కత్తివేట్లు వొకళ్ళు అడ్డుకున్నారు. ఇద్దరిడాళ్ళూ పగిలిపోయాయి; ముక్కలైపోయాయి. దూరాని, దాటాడు సాత్యకి. ఒడుపుచూసి. జందెపువేటువేశాడు. రెండు ముక్కలుచేసి విందుణ్ణి నరికేశాడు.

అలా విందుణ్ణీ, అనువిందుణ్ణీ నరికేసి యుధామన్యుడిరథమెక్కేశాడు సాత్యకి. వెంటనే మరోరథం సిద్ధంచేసుకున్నాడు కైకేయ సేన హతమార్చడం ఆరంభించాడు.

శ్రుతకర్ముడు అయిదు దారైనబాణాలు వేసి చిత్రసేనుణ్ణి కెవ్వోకెవ్వో మనిపించాడు. తొమ్మిది బాణాలుకొట్టి అతణ్ణి నొప్పించాడు చిత్రసేనుడు. మరో అయిదు బాణాలు కొట్టి అతడి సారథిని కుంగదీశాడు చివ్వుమని లేచాడు శ్రుతకర్ముడు. ప్రాణాంతకమైన వొక బాణం తొడిగాడు. చిత్రసేనుడి కొంకల్లోతగిలించాడు దెబ్బతో మూర్ఛపోయాడతడు. అయినా వూరుకోలేదు నీమనవుడు. బాణం మీదబాణం గుప్పించాడు. అయితే, అంతలోనే తెలువుకుని అతడి ధనుస్సు నరికేశాడు చిత్రసేనుడు. మరోధనుస్సు తీశాడు. శ్రుతకర్ముడు విడుపూ విరామం లేకండా బాణాలు విరజిమ్మాడు. ఏదుపంది పొంగి ముళ్ళు విప్పితే ఎలా అవుపిస్తుంది, వొంటినిండా బాణాలతో అలా అవుపించాడు చిత్రసేనుడు. బాగా పదునెక్కించిన బాణం వొకటి తీశాడతడు. శ్రుతకర్ముడి గుండెలు దుసెళ్ళిపోయినట్టు తగిలించాడు.

దాంతో మరీ వూగిపోయాడు శ్రుతకర్ముడు. తళతళా మెరిసిపోతున్న ఖడ్గం తోడిగాడు. చేతుల బలంకొద్దీ లాగివొదిలిపెట్టాడు. చిత్రసేనుడి తలకాయ తెగి కిందపడింది.

చిత్రసేనుడు పడిపోగానే అతడి సేన వొక్కపెట్టుని శ్రుతకర్ముణ్ణి ఘెరాయించింది. ఉగ్రుడే అయిపోయాడు శ్రుతకర్మ. జడివానలాగ బాణాలు కురిపించాడు. సేనసేనంతా ముంచెత్తి వొదిలిపెట్టాడు

ప్రతివింధ్యుడు చిత్రుడిపనిపట్టేశాడు. అదీ ఎలాజరిగిందో చెప్తాను విను. కలబడీ కలబడడంతోనే అయిదు బాణాలు చిత్రుడిమీద వేశాడు ప్రతివింధ్యుడు. అతడిసారథిగుండెలమీద మూడు బాణాలు నాటించాడు. ఒక బాణంతో అతడి పతాకం పడగొట్టాడు. ఉగ్రమైన బాణాలు వేశాడు చిత్రుడు. అతడి విల్లువిరిచేశాడు ప్రతివింధ్యుడు. అతడు సర్దుకునేలోపున మరో అయిదు బాణాలు తగిలించాడు. దారుణమైనశక్తి ప్రయోగించాడు చిత్రుడు. నాలుగుముక్కలుచేసి కొట్టేశాడు ప్రతివింధ్యుడు. గదతీసి అతడి గుర్రాలు చిదగ్గొట్టాడు చిత్రుడు. అతడి సారథినీ బాదేశాడు. ఆపాపుని ప్రతివింధ్యుడి చేతిమీద విసిరికొట్టాడు గద. దెబ్బతిని మండిపడ్డాడు ప్రతివింధ్యుడు. అమాంతంగా తోమరం ఎత్తిపట్టుకున్నాడు. అతడి ఉగ్రరూపం చూసింది కౌరవసేన; గడగడలాడిపోయింది. ఉత్తరక్షణంలో చిత్రుడిమీద పడింది తోమరం అతడి కవచం పగలగొట్టి, శరీరం దూసుకుపోయింది. వజ్రాయుధం దెబ్బకి పడిపోయిన పర్వతంలాగ ఫెళ్ళున కూలిపోయాడు చిత్రుడు.

చిత్రుడు కూలిపోగానే మన యోధులు ప్రతివింధ్యుడి మీదికి పరిగెత్తారు. అస్త్రాలూ శస్త్రాలూ ఎన్నో అన్ని కుమ్మరించారు. సింహంలాగ నేలకి వురికాడు ప్రతివింధ్యుడు. ఉరుములు వురిమినట్టు ధనుస్సు మోగించాడు. తెరిపిలేని బాణవర్షం కురిపించాడు. ఇంతలో వుష్పినలా

వచ్చి అతడికి తోడ్పడింది పాండవసేన. దాంతో మనవాళ్ళు పిరికి మందు పుచ్చుకున్నారు.

అశ్వత్థామా భీముడూ ఘోరమైన యుద్ధంచేశారు. తొంభై బాణాలు వేశాడు అశ్వత్థామ; భీముడిరథం కప్పేశాడు. ఒక్కవూపుని లెక్కాజమాలేని బాణాలు వేసి భీముణ్ణి వూపిరాడకుండా చేశాడు. పళ్ళుపటపట మనిపించాడు భీముడు. అశ్వత్థామ వేసిన బాణాలన్నీ తిప్పికొట్టాడు. అతడి నుదుటిమీద పిడుగుల్లాంటి బాణాలు తగిలించాడు అశ్వత్థామ. అతడి లలాటంమీద శూలాల్లాంటి బాణాలు నాటించాడు భీముడు. దాంతో ఇద్దరూ దిమ్మలపిడుగుల్లాగ విజృంభించారు. ఇద్దరూ ఇద్దరే. ఇద్దరూ ప్రళయకాల సూర్యుల్లాగ ప్రకాశించారు. ఇద్దరూ చిత్రగతులతో రథాలు నడిపించారు.

"వీళ్ళ బలమూ, వీళ్ళ చలమూ, వీళ్ళ సామర్థ్యమూ, వాడు పూ—వా! వీళ్ళ యుద్ధంలాంటి యుద్ధం ఎక్కడా చూడలేదు మనం" అంటూ మెచ్చుకున్నారు ఆకాశంమీద దేవతలు.

ఇద్దరూ పరస్పరం జెండాలు నరుక్కున్నారు. సారథుల్ని చంపుకున్నారు. గుర్రాలు బాదుకున్నారు. శరీరాలు పుచ్చిపోయినట్టు గట్టిగట్టి బాణాలు కొట్టుకున్నారు. ఇద్దరూ ఒక్కసారి రథాలమీద వాలిపోయారు; మూర్ఛపోయారు. అటు భీముడి సారథీ, ఇటు అశ్వత్థామ సారథీ భయపడిపోయారు. ఇద్దరూ రథాలు తప్పించిపట్టుకుపోయారు.

శ్రుతకీర్తీ శల్యుడూ చెప్పుకోదగినయుద్ధంచేశారు. వరసపెట్టి మూడుపదులు బాణాలు శల్యుడిమీద నాటించాడు శ్రుతకీర్తి. దారుణమైన మూడుబాణాలు అతడి శరీరం దూసుకుపోయినట్టు కొట్టాడు శల్యుడు. అతడి సారథిని దద్దరిల్లిపోయినట్టు కొట్టేశాడు. మరో తొమ్మిది కోలలు శల్యుడిమీద నాటించాడు శ్రుతకీర్తి. వాడివాడి బాణాలు మూడు అతడి సారథిమీద తగిలించాడు. అవూపుని మరి

అయిదు శల్యుడిమీద వేశాడు. దాంతో బాగా వొళ్లుమండింది శల్యుడికి. తటుక్కున వొక బాణం వొదిలాడు శ్రుతకీర్తివిల్లు నరికేశాడు. గబగబా మరోఏడు బాణాలు గుచ్చాడు శ్రుతకీర్తివొళ్ళంతా మంటలు పుట్టించాడు

చివాల్న ఇంకో విల్లు తీశాడు శ్రుతకీర్తి. కన్నుమూసి తెరిచే లోపున అరవైనాలుగు బాణాలు శల్యుడిమీద కురిపించాడు. తొంభై బాణాలు వేశాడు శల్యుడు. శ్రుతకీర్తి వేసిన బాణాలన్నీ కొట్టేశాడు. మళ్ళీ అతడి విల్లు విరిచేశాడు. గద విసిరాడు శ్రుతకీర్తి. తుక్కుకింద కొట్టేశాడు శల్యుడు. శక్తి ప్రయోగించాడు శ్రుతకీర్తి. అదీ ముక్కలు చేసేశాడు శల్యుడు. ఒక భల్లబాణం వేశాడు. శ్రుతకీర్తి సారథి తల నరికేశాడు. గాలిలా ఎగిరిపోయే అతడిగుర్రాలు రథం ఈడ్చుకుంటూ అదేపారిపోడం పారిపోయాయి యుద్ధంనుంచి. అరిఒరిగా పాండవసేనలో చొరబడిపోయాడు శల్యుడు; వీరవిహారం ప్రారంభించాడు. కోనేట్లోదూరి కలగుండు పెట్టేసిన మదపుటేనుగులాగ, లేళ్ళ మంద మీదవాల్చిన సింహంలాగ, ఎండిన అడివి మండబెట్టిన దావాగ్ని లాగ, త్రిపురసంహారం చేసిన ఫాలాక్షుడిలాగ శత్రుసేన కలిచేసి, చెండేసి, సర్వదుంబాలా చేసేశాడు.

సహదేవుడూ, మన యువరాజు దుశ్శాసనుడూ కళ్లు మూసుకు పోయినట్టు యుద్ధంచేశారు. వాళ్లు సింహనాదాలు చేస్తూంటే ఏనుగులగుండెలు దడదడలాడేవి. ఆకాశం అదిరిపోయేది. మణిహారాల్తో విశాలంగావున్న దుశ్శాసనుడి వక్షస్థలంమీద ఎంచి ఎంచి మంచివి మూడు బాణాలు కొట్టాడు సహదేవుడు. గుక్కతిప్పనివ్వకండా మరో డబ్బయి బాణాలు కురిపించాడు. అతడి సారథినిమూడు బాణాలతో కొట్టేశాడు. కోపంతో వొణికి పోయాడు దుశ్శాసనుడు వాడైన బాణం ముకటి వొదిలాడు సహదేవుడి ధనుస్సు నరికేశాడు.

వరసపెట్టి డబ్బయి బాణాలు అతడి వొంటినిండా నాటించాడు. చక్రమని కత్తితీశాడు సహదేవుడు; గురిచూసి విసిరాడు. దుశ్శాసనుడి ధనుస్సుకి తగిలింది కత్తి. తునకలైపోయింది ధనుస్సు. అతడు సర్దుకునేలోపున మరో ధనుస్సుతీశాడు సహదేవుడు. మంటలుకక్కుతూన్న బాణమొకటి వొదిలిపెట్టాడు.

చప్పున కత్తిదూశాడు దుశ్శాసనుడు. సహదేవుడి బాణం నరికేసి, అతడిమీదికి కత్తివిసిరాడు. మధ్యలోనే దాన్ని బాణాలువేసి ముక్కలు కొట్టేశాడు సహదేవుడు. ఇంతలో ఉద్దోలమైన మరోధనుస్సు పుచ్చుకున్నాడు దుశ్శాసనుడు. వాడివాడి బాణాలు అరవైనాలుగు ఏకటాకీని గుప్పించాడు. ఒక్కొక్క బాణానికీ అయిదేసి వేసి అన్నీ కొట్టేశాడు సహదేవుడు. అంతకంతకీ రెచ్చిపోయాడతడు. గట్టిగట్టి బాణాలు ప్రయోగించాడు. అన్నీ తునకలుచేసేశాడు దుశ్శాసనుడు. పిడుగుల్లాంటి బాణాలు రెండు కొట్టాడు. సహదేవుణ్ణీ, అతడి సారథినీ నొప్పించాడు. ఆకాశం బద్దలైపోయినట్టు పెద్ద సింహనాదం చేశాడు.

యముడిలాగ కనుబొమలు ముడిపెట్టాడు సహదేవుడు. తళతళా మెరిసిపోతున్న బాణమొకటి ధనుస్సుకి తొడిగాడు. బలంకొద్దీ అల్లెతాడు లాగి వొదిలిపెట్టాడు. గర్జిస్తూ వెళ్ళింది బాణం. దుశ్శాసనుడి కవచం చీల్చేసి, నెత్తురంటకుండా గుండెలు దూసుకుపోయింది. ఊగిపోయాడు దుశ్శాసనుడు. రథంమీద పడిపోయాడు. మూర్ఛపోయాడు. భయపడిపోయాడు సారథి. తడబడిపోయాడు. రథం ఎగరేసుకు పట్టుకుపోయాడు.

దుశ్శాసనుడిసేనమీదవురికాడు సహదేవుడు. ఎదురైనవాణ్ణల్లా ఊడ్చిపారేశాడు. సింహనాదాలతో చిందులు తొక్కింది పాండవసేన

# తాహతు తెలిసి దెబ్బలాడు

నకులుడూ, కర్ణుడూ నువ్వా నేనా అన్నట్టు యుద్ధం చేశారు.

"ఇన్నాళ్ళకి నాచేతపడ్డావు" ఉరుముతూ చూసి కర్ణుడితో అన్నాడు నకులుడు—"దేవుడు ఇవాళ నామీద దయచూపాడులా వుంది. కౌరవులికీ పాండవులికీ ఈవిరోధమంతా నీవల్లే వచ్చింది. కర్ణుడు లేని మహాభారతమా! నిన్ను నా బాణానికి బలిపెడితే కాని కసితీరదు".

"రాజకుమారుడివి నువ్వు" కస్సుమన్నాడు కర్ణుడు—"మహా శాస్త్రాలు తెలిసినవాడివి. ఇలా మాట్లాడతావేం, తేలికగా! అయినా వూకదంపులతో ఏముంది? క్రియలో చూపించాలి ఏదైనా. చెప్పుకో దగిన దెబ్బకొట్టి అప్పుడూ మాట్లాడాలి. ఏదీ నిలబడి చూపించు నీ బిగువూ, నీచేవా, నీభుజశక్తీ మరి—"

డబ్భయిమూడు బాణాలు కురిపించాడుకర్ణుడు. కళ్ళల్లో నిప్పులెగిరాయి నకులుడికి. లిప్తలమీద వంద బాణాలు వేశాడతడు. అతడి ధనుస్సు పుటుక్కుమనిపించాడు కర్ణుడు. అతడి ఒంటిమీద ముప్ఫయి చువ్వలు నాటించాడు. మరో మంచి విల్లు అందుకున్నాడు నకులుడు. డబ్భయి బాణాలు కొట్టాడు. కర్ణుడి వొళ్ళంతా మంట లెత్తించాడు. అతడి సారథిమీద మూడుబాణాలు గుచ్చాడు. ఒక భల్లం వేశాడు. అతడి విల్లు నరికేశాడు. అపూర్వుని మహారాజా, అద్భుతం — మూడు వందల బాణాలు కర్ణుడిమీద కుమ్మరించేశాడు. నిష్ఠురమైన అట్టహాసం చేశాడు.

మరో గట్టిధనుస్సు తీశాడు కర్ణుడు. గురిపెట్టి నకులుడి గుండెల మీద అయిదుబాణాలు కొట్టాడు. పిడుగుల్లాంటి ఏడుబాణాలుకొట్టాడు నకులుడు. టపీమని మళ్ళీ అతడి ధనుస్సు నరికేశాడు. మరో మంచివిల్లు అందుకున్నాడు కర్ణుడు ఒకక్షణించి వొకడు ఇద్దరూ హాహాకారి

పోట్లాడారు. బాణాలతో బాణాలు నరుకుకున్నారు. ఇద్దరి శరీరాలూ రక్తాలు వరదలు కట్టాయి. ఇద్దరూ రకరకాల బాణాలు ప్రయోగించారు. మిడతల దండులాగ ఆకాశం కప్పేశాయి బాణాలు. నకులుడికి పాంచాలసేన సాయంవచ్చింది. కర్ణుడి బాణాలు భరించలేకపోయింది; పలాయనం చిత్తగించింది. కర్ణుడికి కౌరవసేన దన్నయి నిల్చింది. నకులుడి బాణాలు తాళుకోలేక పోయింది. కాళ్ళకి బుద్ధిచెప్పింది. అలా ఉభయుల సేనలూ దూరదూరం పారిపోయాయి; ఉభయుల యుద్ధమూ చూస్తూ నిలబడిపోయాయి.

అటు నకులుడూ, ఇటు కర్ణుడూ ఎంత ఘోరంగా కనిపించారో అంత చూడతగ్గట్టూ అవుపించారు. భల్లమూ, అంజలికమూ, క్షురప్రమూ మొదలైన బాణాలు పుంఖానుపుంఖాలు గుప్పించుకున్నారు. ఇద్దరూ మేఘాలు కమ్మిన సూర్యచంద్రుల్లా కనిపించారు. దివ్యాస్త్రాలు ప్రయోగించుకున్నారు. ఒకరు వేసిన మహాస్త్రం ఇంకొకరు ఖండించుకున్నారు.

కాలరుద్రుడే అయిపోయాడు కర్ణుడు. నకులుడి విల్లు నరికేశాడు అతడి సారథిని చంపేశాడు. గుర్రాలు కొట్టేశాడు. అతడి చక్రరక్షకుల తలలు ఎగరగొట్టేశాడు. విజయగర్వంతో మందహాసం చేశాడు.

మండిపడ్డాడు నకులుడు. కత్తీ డాలూ పట్టుకున్నాడు. తుక్కుతుక్కు చేసేశాడు కర్ణుడు. గద ఎత్తాడు నకులుడు. ముక్కలుచేసేశాడు కర్ణుడు. పరిఘ పట్టుకుని రథం దూకాడు నకులుడు. పరిఘ పిప్పి చేసేశాడు కర్ణుడు. బాణంమీద బాణం వేశాడు. హస్తలాఘవం చూపించాడు. ప్రాణాంతకంగా వున్నాయి అతడి బాణాలు మర్మభేద్యంగా వున్నాయి. నరాలు తోడేస్తున్నాయి. ఆగలేకపోయాడు నకులుడు. సిగ్గూ సెరమూ వొదిలేశాడు ఓడిపోయాడు. అంతమంది ఎదటా పరుగులంకించుకున్నాడు.

వెంటపడ్డాడు కర్ణుడు. ధనుస్సు నకులుడి మెడకి తగిలించి పట్టుకున్నాడు. హరివిల్లు చుట్టుకున్న మేఘంలా అవుపించాడు నకులుడు.

"ఏం, అన్ని బీరాలు బిగిరావు!" అవమానిస్తూ చిరునవ్వుతో అన్నాడు కర్ణుడు — "పూర్వం నన్ను అన్ని మాటలు అన్నావు. ఇక నీఇష్టంవచ్చినన్ని అను. ఫరవాలేదు. నీతో నేను వదిపోనులే. అదికాదు, నాచేవేదో నీకు వంటపట్టింది. బాగా తెలుసుకున్నావు అంతే చాలు నాకు. దెబ్బలాడాలని వుంటే నీ తాహతు తెలిసుకుని దెబ్బలాడు. కాదంటే యుద్ధంలోంచి తోకముడిచెయ్యి. వెళ్ళు. స్వేచ్ఛగా మీ అర్జునుడిదగ్గిరికి పారిపో" అంటూ కుంతిమాటలు మనస్సులో వుండడం చేత చంపకుండా వొదిలిపెట్టేశాడు. తలకొట్టేసినంత అయిపోయింది నకులుడికి. మొహం వొంచుకు వెళ్ళిపోయి ధర్మరాజు రథం ఎక్కేశాడు. కుండలో పెట్టిన పాంలాగ నిట్టూరుస్తూ వూరుకున్నాడు.

మట్టమధ్యాహ్నం సూర్యుడిలాగ వెలిగిపోయాడు కర్ణుడు. తెల్లగుర్రాలతోనూ, తెల్లజెండాతోనూ దేదీప్యమానంగా వున్నతన రథం పాంచాలసేనమీదికి పరిగెత్తించాడు. మెరుపుల్లాటి రకరకాల బాణాలు వడగళ్ళవానలాగ కురిపించాడు. సారథుల్ని చంపేశాడు. జెండాలు చించేశాడు. గుర్రాలు కూల్చేశాడు. గొడుగులు పడగొట్టేశాడు. చామరాలూ, భూషణాలూ గుండచేసేశాడు. రథికుల శిరస్సులు ఎగరగొట్టేశాడు. ఏనుగుల కొమ్ములు నరికేశాడు. తొండాలు చెండేశాడు. కుంభస్థలాలు పగలగొట్టేశాడు. మావత్తుల అంకుశాలు తునకలుచేసేశాడు. యోధుల శరీరాలు చీల్చేశాడు. గుర్రాల మోరలు కళ్ళాలతోకూడా చెక్కలుచేసేశాడు. మూపులు పగలగొట్టేశాడు. కాళ్ళునరికేశాడు రౌతుల్ని చంపేశాడు. డాళ్ళూ, బాణాలూ, బరిసెలూ, ముసలాలూ, ముద్గరాలూ మొదలైన ఆయుధాలు

తుక్కు తుక్కు, పిండి పిండి చేసేస్తాడు. పతాకాల్ని పచ్చడి పచ్చడి చేసేశాడు. పట్టపగ్గాలు లేకుండా బరిదిగిపోయాడు.

నీ కోమటికొడుకు యుయుత్సుడు కొండలాంటి ఉలూకుడితో కలబడ్డాడు. పిడుగుల్లాంటి బాణాలు వేశాడు. గుద్ధు వురిమాడు ఉలూకుడు. యుయుత్సుడి విల్లు విరిచేశాడు. మరోవిల్లు తీశాడు యుయుత్సుడు. వరసపెట్టి అరవై బాణాలు ఉలూకుడిమీద నాటించాడు. మూడు బాణాలు వేసి అతడి సారథిని కీమకీము మనిపించాడు. ఆగకుండా మరిన్ని చువ్వలు రువ్వాడు. ఊగిపోయాడు ఉలూకుడు. వరసపెట్టి ఇరవై బాణాలు గుప్పించాడు: యుయుత్సుడి జెండా కింద పడగొట్టాడు. దారైన అయిదు బాణాలు అతడి రొమ్ముమీద తగిలించాడు యుయుత్సుడు. చివ్వుమంది ఉలూకుడికి. ఎక్కడలేని ఆవేశమూ హెచ్చిపోయింది. ఒక వెకల్పాటి బాణం వేశాడు. యుయుత్సుడి సారథిని నరికేశాడు. నాలుగు కోలలు కొట్టాడు. అతడి గుర్రాలు నాలుగూ కూల్చేశాడు. కత్తుల్లాంటి అయిదు బాణాలు వేశాడు. అతడి వాళ్ళు చీలికలు చేసేశాడు. దద్దరిల్లిపోయాడు నీకొడుకు యుయుత్సుడు. పారిపోయాడు. మరో రథమెక్కేశాడు. గెలుపుతో శరీరం పుప్పొంగిపోయింది ఉలూకుడికి. పిడుగులా వెళ్ళాడు. పాంచాలసేనమీద పడ్డాడు. తన చేవంతా చూపించాడు. సేన సేనంతా అల్లకల్లోలం చేసేశాడు.

శ్రుతకర్మ శతానీకుణ్ణి ఢీకొన్నాడు. అతడిగుర్రాలు కొట్టేశాడు. సారథిని తాడుమనిపించాడు. గదపట్టుకుని దిగాడు శతానీకుడు. శ్రుతకర్మ గుర్రాల్ని, అతడి సారథినీ చంపేశాడు. అతడి జెండా ఎగర గొట్టాడు. ఇద్దరి రథాలూ పోడంతోనే ఇటు శ్రుతకర్మా, అటు శతానీకుడూ తప్పుకుపోయారు. కొత్త రథా లెక్కేశారు.

శ్రుతసోముడూ మన శకునీ కలబడ్డారు. శ్రుతసోముడి బాణా లన్నీ కొట్టేశాడు శకుని. ఎంచి ఎంచి మంచి మంచివి మూడు బాణాలు దుసెళ్ళిపోయినట్టు వేశాడు. అతడిరథమూ, గుర్రాలూ, జెండా చిన్న చిన్న పిసర్లకింద కొట్టేశాడు. రథంపోయినా జంకలేదు శ్రుతసోముడు. మేరువులాగ కింద నిలబడ్డాడు. వేలు వేలు బాణాలు గుప్పించాడు. మీ బావ రథం కనపడకండా అయిపోయిందంటే నమ్ము. ఒకువు చూసి అతడి కోదండం నరికేశాడు శకుని. చర్మున వొరలోంచి కత్తి లాగాడు శ్రుతసోముడు. శకుని వేసిన బాణాలు నరికిపారేశాడు. మంచి వాడైన భల్లం వేశాడు శకుని. శ్రుతసోముడి కత్తిముక్కలు చేశాడు. అయినా మడను తిప్పలేదు శ్రుతసోముడు. చేతిలోమిగిలిన కత్తిముక్క విసిరాడు. శకుని ధనుస్సు రెండు ముక్కలు చేసేశాడు. తప్పుకువెళ్ళి శ్రుతకీర్తిరథం ఎక్కాడు. మరో ధనుస్సు తీశాడుశకుని. ఎదట శ్రుతసోముడు లేడు. అదేనందుచూసుకుని పాండవుల రథసేన మీదికి పరిగెత్తాడు శకుని.

## వ్యర్థపరాక్రమం కూడదు

ధృష్టద్యుమ్నుణ్ణి ఘోరంగా ముట్టడించాడు కృపాచార్యుడు. అతడి ఆటోపంచూసి పాండవసైనికులు తమలో తాముఅనుకున్నారు: "ద్రోణాచార్యులికి జరిగిన పరాభవం ఈయనహృదయంలో మండు తున్నాది. ధృష్టద్యుమ్నుడి తుద చూస్తేకాని వూరుకుండేట్టు లేడు. అంతలో వూరుకుంటే నయమే. మెరుపుల్లాంటి బాణాలువేసి మన సేనంతా పీనుగుపెంట చేసేస్తాడు. అతడేం సామాన్యుడా ఏమన్నానా? అఖండమైన పరాక్రమశాలి. ప్రసిద్ధమైన దివ్యాస్త్రాలుకలవాడు.ఎంతటి శత్రువునైనా గడ్డిపరకలా చూస్తాడు. పల్లమాలినకోపంతో వున్నాడు ఇవాళ. మనల్ని పాతవార్చిమరీ వొదిలిపెడతాడు. అతడి ఉగ్రమూర్తి ముందు మన ధృష్టద్యుమ్నుడు తెలతెల్లపోతున్నాడు."

మహారాజా, వాళ్ళు అనుకున్నంతసులువుగా లొంగిందంటే నమ్ము. యమపాశాల్లాంటి బాణాలు వేశాడు కృపాచార్యుడు. ధృష్టద్యుమ్నుడి గుర్రాలు, సారథీ కీచుకీచుమన్నట్టు చేశాడు. ధృష్టద్యుమ్నుడివొళ్ళంతా నెత్తురు వరదలు కట్టించాడు. అతడి కరచరణాలాడకుండా చేశాడు.

“రథం తప్పించుకుపోదాం” అన్నాడు సారథి-“ఈ బ్రాహ్మడి వడి దుర్భరంగా వుంది. నీ బాణాలు పిసరంతా ఇతడిదగ్గిర పనిచెయ్యడం లేదు. ఇదేదో దైవమాయలావుంది. ఇలాంటి యుద్ధం ఎన్నడూ చూడలేదు. నీలాంటివాడి పరాక్రమం - వొట్టుపెట్టినట్టు పనిచెయ్యలేదంటే, ఈమహాత్ముడు చంపరానివాడనిపిస్తోంది నాకు. నామాట విను. తప్పుకుపోదాం.”

“అవును” తానూ అదే నిశ్చయానికి వచ్చి, హీనస్వరంతో అన్నాడు ధృష్టద్యుమ్నుడు -” కాళ్ళూ చేతులూ గడగడలాడుతున్నాయి. శరీరం విలవిలపోతూవుంది మనస్సు స్వాధీనం తప్పుతోంది. నువ్వు అన్నదే కర్తవ్యం. వ్యర్థపరాక్రమం కూడదు. భీముడి దగ్గిరికో, అర్జునుడి దగ్గిరికో పోనీ రథం”

ధృష్టద్యుమ్నుడి నోట్లోమాట నోట్లోనే వుంది. భీముడిదగ్గిరికి రథం తప్పించుకుపోయాడు సారథి.

శంఖం పూరించాడు కృపాచార్యులు. ధనస్సు మోగించాడు. బాణంమీద బాణం వేసి, కొండని వెంటాడిన దేవేంద్రుడిలాగ ధృష్టద్యుమ్నుణ్ణి వెంటతరిమి నుంచున్నాడు.

కృతవర్మ బోరమీద శిఖండి అయిదు బాణాలు నాటించాడు. కృతవర్మ అతడిమీద ఆరు బాణాలు వేశాడు. అతడి ధనుస్సు నరికేశాడు. మరో విల్లు తీశాడు శిఖండి. గుక్కతిప్పుకండా తొంభై బాణాలు రువ్వాడు. అన్నీ అంతంతలోనే కొట్టేశాడు కృతవర్మ. అతడి విల్లు విరిచేశాడు శిఖండి. కొమ్ములు విరిగిన ఆబోతులా అయిపోయాడు

కృతవర్మ. అదను చూసుకుని వర్షం కురిపించేశాడు శిఖండి. అతడి వొళ్ళంతా తూట్లు కొట్టేశాడు; రక్తమయం చేసేశాడు. అగ్గిమీద గుగ్గిలం వేసినట్టు భగ్గుమన్నాడు కృతవర్మ. జెర్రిపోతులాంటి మరో ధనుస్సు తీశాడు. పూనిపూని డబ్భయి బాణాలు గుప్పించాడు. శిఖండి వొళ్ళంతా చీల్చిచీల్చి వొదిలిపెట్టాడు. రక్తాలు కారుతూన్నా వొదిలి పెట్టలేదు శిఖండి. చిత్రవిచిత్రమైన గతులతో రథం నడిపించాడు; హోరాహోరీ పోరాడాడు. కృతవర్మని ముచ్చెమటలు పోయించాడు. అతడి కొంకుల్లో మూడు బాణాలు తగిలించాడు. ఉగ్రుడే అయిపోయాడు కృతవర్మ. విషసర్పాల్లాటి బాణాలు వేశాడు. గట్టిగట్టి దెబ్బలు తినేశాడు శిఖండి. ఉన్నపాళాన రథంమీద మూర్ఛపోయాడు. భయపడిపోయాడు సారథి. వెనక్కితిప్పేసి అదేపట్టుకుపోడం పట్టుకుపోయాడు. రథం. అతడితో అతడిసేనకూడా అడలెత్తిపోయింది; పరుగులుతీసింది.

అర్జునుడి వీరవిహారం తప్పుకుంటూ త్రిగర్త, సాల్వ, సంశప్తక, నారాయణగోపాలక సేనలూ, సత్యసేనుడూ, చంద్రదేవుడూ, మిత్రదేవుడూ, మిత్రవర్మా, సౌశ్రుతీ, సువర్మా మొదలైన సోదరులూ, కుమాళ్ళూ యావన్మందితో కలిసి వల్లమాలిన యుద్ధంచేశాడు త్రిగర్తదేశంరాజు. అందరూ వొక్కుమ్మడిగా అర్జునుడిమీద పడ్డారు. సత్యసేనుడు మూడు బాణాలు వేశాడు. మిత్రదేవుడు అరవైమూడు కొట్టాడు. చంద్రదేవుడు ఏడూ, మిత్రవర్మ డబ్భయిమూడూ, సౌశ్రుతి ఏడూ, శత్రుంజయుడు ఇరవై, సుశర్మ తొమ్మిదీ వేశారు వర్షం పడుతూవుంటే నుంచున్న పర్వతంలాగ అన్నిబాణాలూ పడుతూవుంటే కదలకండా స్థిరంగానుంచున్నాడు అర్జునుడు. అన్నిబాణాలూ అడ్డుకున్నాడు. మిత్రదేవుడిమీద వందబాణాలు నాటించాడు. సత్యసేనుడిమీద మూడూ, సుశర్మమీద ఎనిమిదీ, మిత్రవర్మమీద తొమ్మిదీ తగిలించాడు. శత్రుంజయుడిమీద ఇరవై వాడిమొనబాణాలు వేశాడు

కూరుమనిపించాడు. సౌశ్రుతిమీద పాతిక వేశాడు; పాతిపెట్టేశాడు. చంద్రదేవుడిమీద ఎనిమిది వేశాడు; హరీ అనిపించేశాడు.

బంగారం పిడితోవున్న తోమరం తీశాడు సత్యసేనుడు. బలం కొద్దీ విసిరికొట్టాడు. కృష్ణుడి ఎడమభుజంమీద తగిలింది తోమరం; చీల్చుకుపోయింది భుజం. చేతిలోని మునికోల జారిపోయింది; కింద పడిపోయింది. పగ్గాలుజారిపోయాయి; నొగలమీద పడిపోయాయి.

అర్జునుడికళ్లల్లో అగ్గినిప్పులు రాలాయి. "వాడి రథందగ్గిరికి రథంపోనీ" కృష్ణుణ్ణి చూస్తూ అన్నాడతను. చప్పున మరో మునికోల తీశాడు కృష్ణుడు. గుర్రాలు అదిలించాడు. ఉత్తరక్షణంలో రథం సత్యసేనుడిరథందగ్గిర వురికింది. నవ్వుతూ వొక భల్లబాణం వేశాడు అర్జునుడు. సత్యసేనుడి శిరస్సు నరికిపారేశాడు. ఒక వత్సదంతబాణం కొట్టాడు. మిత్రవర్మని కూరుమనిపించాడు. మరో చిల్లకోల కొట్టాడు. అతడి సారథిని చంపేశాడు. ఎత్తినధనుస్సు దించకుండా త్రిగర్తసేన నురుమాడాడు.

అంతయినా సుశర్మజ్ఞాతులు వొదిలిపెట్టలేదు. సరాసరిపోరాడుతూనేవున్నారు. వెండితొడిమ చేసిన వెడల్పాటి బాణం కొట్టాడు అర్జునుడు; మిత్రసేనుడి శిరస్సు ఎగిరిపోయింది. సుశర్మ కొంకుల్లో మొనలు తేరిన బాణాలు నాటించాడు అర్జునుడు.

ఆకాశం బద్దలైనట్టు పొలికేకలు చేసింది సంశప్తకసేన; నాలుగుదిక్కులనించీ వొక్కసారి అర్జునుడిమీదపడింది. దారుణమైన ఆయుధాలు కుమ్మరించింది. కోపంచిరునవ్వు నవ్వాడు అర్జునుడు; ఇంద్రాస్త్రం వేశాడు. మంటలుకక్కింది ఇంద్రాస్త్రం. ఎన్నో అన్ని అంజలికాలూ, భల్లాలూ, వత్సదంతాలూ, రకరకాల బాణాలు పుట్టుకువచ్చాయి. చెక్కలు చెక్కలై ఎగిరిపోయాయి రథాలు. తునాతునకలైపోయాయి ధనుస్సులు. ముక్కముక్కలైపోయాయి గుర్రాలు.

నగలూ, కత్తులూ, తోమరాలూ, పరిఘలూ, ధనుస్సులూ, బాణాలూ, గదలూ ముక్కముక్కలై తుళ్ళిపోయాయి. గుండపిండి అయిపోయాయి. గొడుగులూ, చామరాలూ, జెండాలూ, కవచాలూ తుక్కుతుక్కు అయిపోయాయి; ధూళిలో కలిసిపోయాయి. రథికలూ, రౌతులూ, మావత్తులూ పచ్చడిపచ్చడి అయిపోయారు. రక్తంలో మునిగిపోయారు; పేగుల్లో చుట్టుకున్నారు; మెదళ్ళలో పులుముకుపోయారు. రణభూమి మావత్తూ ఘోరంగా తయారయింది. బీభత్సం తాండవించింది. ఆకాశంమీద దేవతల గుండెల్లో అద్భుతమూ, బీభత్సమూ ఆవరించాయి.

ఏనుగుల పీనుగులతోనూ, గుర్రాల కళేబరాలతోనూ, భటుల శవాలతోనూ, విరిగిన రథాలతోనూ దారీతెన్నూ లేకండా అయిపోయిన రణభూమిలో చిక్కిపోకండా, నెత్తురు రొంపిలో కూరుకుపోకండా మెళుకువతో తప్పించుకు నడిచాయి అర్జునుడి గుర్రాలు. అతడి తీవ్రబాణాలు తట్టుకోలేక చవ్వగా మిగిలిన సంశప్తకసేన పిక్కబలం చూపించింది. పొగ పోయిన అగ్నిహోత్రుడిలాగ ప్రకాశించాడు అర్జునుడు.

దుర్యోధనుడూ, ధర్మరాజూ ఉద్రేకంతో యుద్ధం చేశారు. దుర్యోధనుడు ధర్మరాజుమీద తొమ్మిది బాణాలు నాటించాడు. అతడి సారథిమీద వొకటి దిగిలించాడు. నిప్పులు కురిశాడు ధర్మరాజు. పదమూడు బాణాలు వొదిలాడు. దుర్యోధనుడి వొళ్ళంతా మంటలు పుట్టించాడు. నాలుగుబాణాలువేసి అతడి గుర్రాలు కొట్టేశాడు. అయిదో బాణంవేసి సారథిని చంపేశాడు. ఆరోదివేసి జెండాకొయ్య విరిచేశాడు. ఏడోదివేసి ధనుస్సు నరికేశాడు.

మండిపోయాడు దుర్యోధనుడు. కత్తిదూశాడు. ఎనిమిదో బాణం వేశాడు ధర్మరాజు. దుర్యోధనుడి కత్తి ముక్కలుచేశాడు.

జవ్రాపుని మరో అయిదు బాణాలు అతడి రొమ్ములమీద తగిలించాడు. ఝల్లరిల్లిపోయాడు దుర్యోధనుడు. రథంమీంచి దూకేశాడు.

ప్రమాదంలో పడిపోయిన రాజుని చూశారు మనవాళ్లు. అశ్వత్థామా, కర్ణుడూ, కృపుడూ, సైన్యనాయకులూ చుట్టున పరిగెత్తారు. ధర్మరాజుని ముట్టడించారు. అదిచూశారు అతడి తమ్ములు. గాలిలా వచ్చి అతడిదగ్గిర వాలారు.
అపరాహ్న మయింది.

ఉభయపక్షాల మొనగాళ్ళూ ఒకదగ్గిర చేరడంతోనే ఉభయ సేనలూ ఒకదగ్గిరచేరాయి; కలబడ్డాయి. చెప్పనలవికాని దొమ్మీ యుద్ధం జరిగిపోయింది. శంఖాలమోతా, పొలికేకల గోలా, బాణాలూ, కత్తులూ, గదలూ, ముసలాలూ, తోమరాలూ, పరిఘలూ, ఈటెలూ, బాకులూ ఒకదానికొకటి తగిలినశబ్దాలూ, రథాలు విరుగుతున్న ఫెళఫెళలూ, ఎముకలూ, కపాలాలూ పగులుతున్న చప్పుళ్ళూ - అబ్బా, దిక్కులు పగిలిపోతున్నాయి. చెవులు దిమ్మెత్తిపోతున్నాయి. ఏనుగుల దంతాల్లో చిక్కుకుని వేలాడేవి గుర్రాలు. ఒడుపుచూసి చొరబడేవాళ్లు సైనికులు; నరికేసేవాళ్లు; పొడిచేసేవాళ్ళు; కూలిపోయేవి ఏనుగులు. ఉరికి పురికి తునాతునకలు నరికేసేవాళ్ళు రౌతులు; దున్నపోతులు చొచ్చిన చెరువుల్లా అయిపోయేది కాల్బలం. ఆవేశంతో వీరవిహారంచేసేవాళ్ళు రథికులు; గుండపిండి అయిపోయేవి రథాలు. భళ్ళు భళ్ళునరక్తం కాలవలై పారింది. కండలు కండలు గుట్టలుపడ్డాయి. పేగులు పోగులుపడ్డాయి. దుమ్ములు రాసులుపడ్డాయి. రణరంగమంతా రౌద్రరసం తాండవమాడింది.

ధృతరాష్ట్రుడు: రణరంగం రణరంగం అంటూ యుద్ధంసంగతే పాడుతున్నావు. దుర్యోధనుడిసంగతి చెప్పవేం? ధర్మరాజుచేత రథం పోయాక ఏమయాడట, నాకొడుకు? మానం మరిచిపోయి, పూనిక

వొదిలేసి పారిపోయాడా? కాక, తిరిగి ధర్మరాజుమీద తిరగబడ్డాడా? చెప్పు సంజయా, నిజం చెప్పు. కొడుకు దెబ్బతినేశాడంటే గుండెలు తరుక్కుపోతున్నాయి.

సంజయుడు : రథంపోయినా వెన్ను చూపలేదు దుర్యోధనుడు. మరోరథం సిద్ధంచేసుకున్నాడు; యుద్ధానికి పూనుకున్నాడు. "సారథీ!" క్రోధంతో బుసకొడుతూ సారథితో అన్నాడు — "అదిగో తెల్లజెండా, తెల్లగొడుగూ వున్న రథం చూడు. అతడే ధర్మరాజు అక్కడికే మనరథం పోనీ చప్పున"

బరిమీద పాంలాగ పరిగెత్తింది నీకొడుకు రథం. నీకొడుకూ ధర్మరాజూ ఇద్దరూ ఇద్దరే; అతిరథులు; అద్భుతమైన యుద్ధంచేశారు. తొలికలయికలోనే ధర్మరాజు ధనుస్సు నరికేశాడు దుర్యోధనుడు. దబాలున మరోమంచి ధనుస్సు తీశాడు ధర్మరాజు; దుర్యోధనుడి విల్లు విరిచేశాడు. మెరుపులా మరోవిల్లు తీశాడు దుర్యోధనుడు. బాణంమీదబాణం గుప్పించాడు. రకరకాలబాణాలు రువ్వాడు ధర్మరాజు. ఆకాశమూ దిక్కులూ అపుపడలేదు. ఇద్దరి వొళ్ళూ రక్తాలు వరదలుకట్టాయి. పూసిన మోదుగల్లా కనిపించారు. ఘోరమైన శక్తి తీశాడు దుర్యోధనుడు; వున్నపాళాన ప్రయోగించాడు. మంటలు మండుతూ వెళుతోంది శక్తి. సగంలోనే కొట్టేశాడు ధర్మరాజు. దుర్యోధనుడు సర్రునతేలోపున అయిదుకోలలు గుండెలమీద నాటించాడు. దెబ్బతినీ ఆగలేదు దుర్యోధనుడు. ఎంచి ఎంచి మంచి మంచివి తొమ్మిది వెడల్పాటిబాణాలు వొదిలిపెట్టాడు. బాగా వొళ్ళుమండింది ధర్మరాజుకి. పిడుగులాటి బాణం ధనుస్సుకి తొడిగాడు. బలంకొద్దీలాగి వొదిలిపెట్టాడు. దుర్యోధనుడి గుండెలు దుసెళ్ళిపోయిం దది. అప్పుడే యుద్ధానికి స్వస్తి చెప్పేస్తాడా అన్నట్టు లేచాడు దుర్యోధనుడు. గద పట్టుకున్నాడు. రథం దూకేశాడు. ధర్మరాజుమీదికి పరిగెత్తాడు.

ఉగ్రమైన శక్తి తీశాడు ధర్మరాజు పరిగెత్తి వస్తున్న దుర్యోధనుడి గుండెలమీద కొట్టాడు. దెబ్బతో జోగిపోయాడు దుర్యోధనుడు; వెనక్కి వచ్చేశాడు — రథమెక్కాడు. ధనుస్సు పట్టుకున్నాడు. ఇలా ధనుస్సు ఎత్తాడో లేదో, రక్తం వరదలు కట్టి మూర్ఛపోయాడు. పెద్దపులిలా వెళ్ళి మధ్యపడ్డాడు కృతవర్మ. సింహంలా ఉరికి అతడి మీద కలబడ్డాడు భీముడు. సుడిగాలికి రేగిన సముద్రంలా వెళ్ళింది మనసేన; కృతవర్మకి తోడ్పడింది. చూశాడు అర్జునుడు. అమాతంగా వచ్చి విరుచుకుపడ్డాడు. చేతులు తీటతీరేట్టు బాణాలు వేశాడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలమూ కూరలు తరిగినట్టు నురుమాడాడు. అంతలో తెలవుకున్నాడు దుర్యోధనుడు. అర్జునుడి మీద కలబడ్డాడు. నిష్ఠురమైన బాణాలు గుప్పించాడు.

అసలే అర్జునుడు. నిలువునా మండిపోయాడు. ఒకేవొక్క బాణం వేశాడు. దుర్యోధనుడి ధనుస్సు నరికేశాడు. ఉత్తరక్షణంలో మరొకటి వేశాడు. నాగుపాం జెండా ఎగరగొట్టేశాడు. మరి నాలుగు వేశాడు; నాలుగు గుర్రాలూ నరికేశాడు మరొకటి కొట్టాడు; సారథిని చంపేశాడు. ఇంకో పెద్ద ధనుస్సు పుచ్చుకున్నాడు దుర్యోధనుడు. ఇలా ఎత్తాడో లేదో, వెడల్పాటి బాణం వేశాడు అర్జునుడు; రెండుముక్కలుచేసి తుంచేశాడు. తడువుకునేలోపున మరో ప్రాణాంతకమైన బాణం వేశాడు. క్షణంలో మనకి దక్కకండాపోయేవాడు రారాజు. కాని అశ్వత్థామ కలగజేసుకున్నాడు. వరసపెట్టి ఆరు బాణాలు వేశాడు. అర్జునుడి బాణం తునాతునకలు చేశాడు.

అశ్వత్థామతట్టు తిరిగాడు అర్జునుడు. అతని కోదండం నరికేశాడు. గుర్రాలు కూల్చేశాడు ఇంతలో కృపాచార్యుడు ఎదురు వచ్చాడు. అతడి ధనుస్సూ పుటుక్కుమనిపించాడు అర్జునుడు. కృతవర్మ వెళ్ళి కలబడ్డాడు అతడివిల్లూ విరిచేశాడు అర్జునుడు. అతడి

నాలుగుగుర్రాలూ నరికేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. దుశ్శాసనుడు దూకుడుగా వెళ్లాడు. అతడి ధనుస్సు ముక్కలుచేసేశాడు అర్జునుడు. గాండీవం మోగించాడు. దిక్కులు ప్రతిధ్వనించాయి. కర్ణుడిమీద కలబడ్డాడు.

నల్లతాచులాగ కస్సుమన్నాడు కర్ణుడు. అర్జునుడిమీద మూడు వాడి బాణాలువేశాడు. కృష్ణుడిమీద ఇరవై బాణాలు కురిపించాడు. కృష్ణుడి వొళ్ళంతా రక్తాలు చిమ్మాయి. మరోమూడు చిల్లకోలలు అర్జునుడిమీద కొట్టాడు కర్ణుడు.

అర్జునుడు కలబడేసరికి సాత్యకితో యుద్ధంచేస్తున్నాడు కర్ణుడు. అర్జునుడు రావడంతోనే అటు తిరిగాడు. ఇటు సాత్యకీ పూపుతూనే వున్నాడు. అర్జునుడికీ కర్ణుడికీ మధ్యగా వచ్చాడు సాత్యకి. గుక్కతిప్పకండా గబాగబా తొంభైతొమ్మిదిబాణాలు కురిపించాడు. ఆపూపుని ఇంకో నూరుబాణాలు గుప్పించాడు.

కర్ణుడుమాత్రం సామాన్యుడా? అన్నీ పుష్పస పూడేశాడు. శరవర్షం కురిపించాడు. సాత్యకిసారథినీ, గుర్రాల్నీ, జెండాతోకూడా రథాన్నీ కనపడకండా కప్పేశాడు.

ప్రభద్రక, చేది, కరూశ, మాత్స్య, కేకయ, వత్సదేశాల సైన్యాలూ, యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ, శిఖండీ, ద్రౌపది కుమారుళ్ళూ, యుయుత్సుడూ, నకులసహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ చేకితానుడూ — ఇంతమందీ వొక్కుమ్మొగిని కర్ణుణ్ణి ఘిరాయించారు. ధర్మరాజు ఉత్సాహం రెండింతలైనట్టు రకరకాల శస్త్రాలూ, అస్త్రాలూ ఏకటాకీని కుమ్మరించారు.

అంతమందినీ పూపేశాడు కర్ణుడు. వాళ్ళ ఆయుధాలన్నీ కొట్టి పారేశాడు. పెద్దతుఫాను రేగి అడివి చిందరవందరచేసినట్టు పదా

తులూ, ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ — సేనసేనంతా అల్లకల్లోలం చేసేశాడు. రౌద్రతాండవం చేశాడు. ధనుస్సు మోగించి భూమీ, ఆకాశమూ దద్దరిల్ల జేశాడు దేవతలగుండెలూ దడ దడలాడించాడు.

అదంతా చూశాడు అర్జునుడు. పెదవులు బిగించాడు. కనుబొమలు ముడిపెట్టాడు. గాండీవం సారించాడు కర్ణుడిబాణాలన్నీ ముక్కముక్కలు చేసి కొట్టేశాడు అగ్గిపిడుగుల్లాంటి బాణాలు గుప్పించాడు. కారడవిలో కార్చిచ్చు రగులుకుంటే మృగాలు జజ్జరిల్లి పారిపోయినట్టు మనసేనలు జజ్జరిల్లిపోయాయి. దిక్కూ తెన్నూ లేకుండా దౌడు తీశాయి. గాలికి చెదిరిపోయిన మేఘాల్లా చెదిరిపోయాయి.

పొద్దు పడమటికొండ వెనక్కి జారిపోయింది సేనల కలకలంతో దట్టంగా ధూళి రేగింది. దాంతో సందెచీకటి కలిసింది. ఏదీ కనపడకండా అయిపోయింది. మనవాళ్ళ గుండెల్లో దిగులుపట్టుకుంది. రాత్రి యుద్ధానికి భయపడ్డారు మన సేనానాయకులు. పాండవసైనికులు వెంట తరిమారు. అగలేకపోయింది మనసేన. తోకముడిచేసింది. శిబిరందారి పట్టింది. గెలుపు సాధించారు పాండవులు. మనవాళ్ళని తోడీలుకొట్టారు. అర్జునణ్ణి, శ్రీకృష్ణుణ్ణీ మెచ్చుకుంటూ శిబిరానికి మళ్ళిపోయారు. ఉభయసేనలూ రాత్రి విశ్రాంతి తీసుకున్నాయి.

ధృతరాష్ట్రుడు : సంజయా, పూరికే మన దుర్యోధనుడు పెనుగులాడుతున్నాడు. నా యావన్మందినీ హతమార్చి గాని అర్జునుడు పూరుకోడు ముమ్మాటికీ నిశ్చయమిది. దుర్యోధనుడే అన్నమాటేమిటి, యముడూ అగ్నిహోత్రుడూ అయినా అతణ్ణి ఎదిరించి, బతికి బట్టకడతాడు అన్నమాటకల. అతడి పరాక్రమం లోకవిఖ్యాతమైంది. అంతమంది యాదవవీరుల్నీ ఓడించి సుభద్రని ఎత్తుకువచ్చాడు. ఖాండవం కాల్చేసి అగ్నిహోత్రుణ్ణి తృప్తిపరిచాడు. చెంచువేషంలోవచ్చిన

శివుడితో పోరాడాడు; మెప్పించాడు. ఘోషయాత్రలో గంధర్వులు
పట్టుకుపోతున్న దుర్యోధనుణ్ణి విడిపించాడు. కాలకేయుల్ని కడముట్టిం
చాడు. దిగ్విజయం చేశాడు; రాజులందర్నీ యుద్ధంలో తలవొగ్గిం
చాడు. ఇదంతా ఒక్కడూ ధనుస్సు పట్టుకునేకదా, సాధించాడు!
అంచేత అర్జునుడితో ఓడిపోయారని దోషం మోపి క్షమించనక్కర లేదు
మనవాళ్ళని. అంతటి జగజ్జెట్టితో కలబడి యుద్ధంచేసినందుకే మెచ్చు
కోవాలి. సరే, తరవాత ఏం జరిగింది?

సంజయుడు: అలా తిరిగి వచ్చేశారు కౌరవులు. ఒళ్ళంతా
హూనాలైపోయి, నోళ్ళు ఆర్చుకుపోయి, దుర్యోధనుడూ, సేనాధి
పతులూ ఉసూరుమంటూ కూచున్నారు. చూశాడు కర్ణుడు అర్జునుడి
మీద కోపంతో నాగుపాంలాగ బుసకొట్టాడు. మెల్లిమెల్లిగా దుర్యో
ధనుడితో అన్నాడు: "సామర్థ్యమూ, చాకచక్యమూ — అన్నిటిలోనూ
పేరుపడ్డవాడు అర్జునుడు. పైగా అన్నివిషయాల్లోనూ శ్రీకృష్ణుడి
సలహా వుండనేవుంది. చూడూ శ్రీకృష్ణుడు మనల్ని ఎలా వంచిం
చాడో! ఇంద్రుడి శక్తిమీదికి ఘటోత్కచుణ్ణి ప్రయోగించాడు.
అర్జునుడికి ఆపద రాకండా తప్పించాడు. కానీ, మరేం మిగిలిపోలేదు.
అతడి మగతనం రేపు చూసేస్తాను. ఈలోకంలో నీకు శత్రువన్న
వాడు లేకండా చేసేస్తాను."

సంతోషించాడు దుర్యోధనుడు. కర్ణుణ్ణీ, తక్కిన నాయకుల్నీ
తమతమ డేరాలికి పంపించేశాడు. తాను అభ్యంతర మందిరానికి వెళ్ళి
పోయాడు. ఆరాత్రి సుఖంగా నిద్రపోయాడు.

## పదిహేడో రోజు

మర్నాడు పెందరాళే అందరూ లేచారు; యుద్ధానికి సిద్ధ
పడ్డారు.

పాండవసేనలు మంచి ఉత్సాహంతో వచ్చాయి. బృహస్పతి కల్పించిన చొరరానివ్యూహం పన్నాడు ధర్మరాజు. దానికి సరైన వ్యూహం పన్నడానికని మనవాళ్ళు కర్ణుడికోసం కనిపెట్టి చూశారు.

ధృతరాష్ట్రుడు: చలితో కొరకుబారిపోయినజనం సూర్యోదయంకోసం కాసుకూర్చున్నట్టు కర్ణుడికోసం కనిపెట్టుకు కూచున్నా రన్నమాట మనవాళ్ళు! వచ్చి, తన ప్రతాపంతో ఉద్ధరించాడా అతను! ధర్మరాజుదెబ్బకి తోలినాడు దుర్యోధనుడి నాడు చూసిన్ని యుద్ధం మానేసి పరిగెత్తిన బంటు మర్నాడు ఎలాంటిసుగతనం చూపాడూ అంట! తన బలమేమో తాను ఎరగడు మూఢుడు. అంతకంటే మరి రెండాకులు చదివాడు కర్ణుడు! ఏంచేసేది! దుర్యోధనుడికి మతి పోయింది కాని, కర్ణుడా కృష్ణుణ్ణీ పాండవుల్నీ గెలుస్తాడా! తనవ్రేలే తనని చెడగొడుతోంది మూఢుణ్ణి. శకుని మంత్రాంగమూ, కర్ణుడి భుజబలమూ తన నెత్తిని కిరీటం పెడతాయని కలలు కంటున్నాడు పాపం! జూదంనాడే ఆరంభమైంది ఈదుర్దశ. సంజయా, దుఃఖం మీద దుఃఖం హృదయం బద్దలయిపోతూ ఉంది. దుర్యోధనుడి దుర్నయాలవల్ల వచ్చిన కష్టాలన్నీ మనసారా వింటున్నాను. ప్రతీకారం చెయ్యలేక కుంగిపోతున్నాను.

ఇంతవరకూ పాండవుల్లో ఒక్కడికీ - తలపువ్వు వాడలేదు. ఆడంగులమధ్యతిరుగుతున్నట్టు కౌరవుల మధ్య పూలరంగళ్ళయి తిరుగుతున్నారు వాళ్ళు. ఇంతకీ దైవం బలీయమైంది.

సంజయుడు: గడచిపోయింది తిరిగి రాదు. విచారించి ఏం లాభం, మనస్సు మరింత బాధపడడంతప్ప? అదీకాక, నువ్వు చేసుకున్నదే ఇదంతా, ఇలా ఫలించింది. యుద్ధం వద్దని ఎన్నివిధాల మొత్తుకున్నా విన్నావు కావు. పాండవులకీడే తలపెట్టావు. పాపం మూటకట్టావు. నీవల్ల ఈజనక్షయం కలిగింది. కనక, అయిపోయిం

చేదో అయిపోయింది. దుఃఖశక్తి లాఘవంలేక, యుద్ధం ఘోరంగా జరిగింది. ఆలకించు.

ధృతరాష్ట్రుడు : వింటాను సంజయా, వింటాను. అయితే కర్ణుడికోసం మనసేనలు ఎదురుచూస్తున్నాయన్నావు. అతడు రావడం ఆలస్యం ఎందుకు చేశాడు ?

సంజయుడు : పెందరాళే సేనలన్నీ బయలుదేరాయి. రాజులూ పయనమయ్యారు. శిష్యుళ్ళతో నీకొడుకూ బయలుదేరాడు. వాళ్ళలో కర్ణుడు కూడా నడిచాడు. దుర్యోధనుడి రథంపక్క రథం పోనిస్తూ అన్నాడతడు :

"మహారాజా. ఎన్నోసార్లు నాకు కోపంవచ్చింది. అర్జునుడికీ అలాగే జరిగింది. అయితే, పంతంపట్టి పోదలకండా యుద్ధంచేసే అవకాశం చిక్కలేదు. ఇకముందు పోకేమొనతో జరుగుతుంది యుద్ధం. కనక మాఇద్దరికీ భేటీపడుతుంది. అమీ తుమీ తేల్చుకునే అవకాశం చిక్కుతుంది. అతడు నన్నూ, నేను అతణ్ణీ చంపడానికి ప్రయత్నిస్తాం. దేవేంద్రుడు ఇచ్చినశక్తి నాదగ్గిరనించి పోయింది. అంచేత నామీదికి జడుపూ గిడుపూ లేకండా తరుముకు వస్తాడతడు. అదిగో అప్పుడే అతడిపని పట్టెయ్యాలి. చెయ్యి నెత్తురుకాకండా చంపెయ్యాలి. చెపుతాను విను.

"దివ్యాస్త్రాలు చూస్తే అతడూ నేనూ సమానంగా సరితూగుతాం. దృఢత్వంలోనూ, లాఘవంలోనూ నాదగ్గిర తీసికట్టు అర్జునుడు. దూరంగా బాణంవెయ్యవలసివస్తే తడబడతాడు. యుద్ధచాతుర్యం ధైర్యం, శౌర్యం, బాహువిక్రమం — దేనిలో చూసినా దిగదుడుపే నాకు. నాధనుస్సు విజయం. దేవేంద్రుడికోసం లోగడ విశ్వకర్మ చేశాడిది. దాంతోనే ఎంతోమంది రాక్షసుల్ని సంహరించాడతడు. దీని చప్పుడు వింటేనే చాలు, మూర్ఛపోయేవాళ్ళు రాక్షసులు. దినం

అలాంటిది నావిజయం. దేవేంద్రుడు పరశురాముడికి ఇచ్చాడిది. దాంతోనే ఇరవైయొక్కమార్లు రాజుల్ని హతమార్చాడాయన. ఆమహాధనుస్సు శిష్యుణ్ణి కనక వాత్సల్యంతో నాకు ప్రసాదించాడు.

అదిగో ఆవిజయంతోనే అర్జునుడి పని పట్టేస్తాను, ఇవాళ ఇవాళే యుద్ధానికి స్వస్తి పాడేస్తాను. భూసామ్రాజ్యం యావత్తూ నిష్కంటకం చేసేస్తాను; నీపాదాలముందు పడేస్తాను. పుత్రపౌత్ర పారంపర్యంగా అనుభవించు. హాయిగా దేవేంద్రభోగా లనుభవించు. నరలోకం సమస్తం నీఅడుగులికి మడుగులొత్తుతుంది.

"నావిజయమూ, అర్జునుడి గాండీవమూ, రెండూ సమానమైనవే. ఏమీ తేడా లేదు. అయితే అతడి అస్త్రతాడు తెగదు. జమిలితూణీరాలు అక్షయమైనవి రథం దివ్యమైంది; అగ్ని దేవుడిచ్చింది అతడి గుర్రాలూ చావులేనివి. నాకు అవి లేవు. ఇందులో ఎక్కువే అతడు. నిజమే. అయినా వాటికి అంత లెక్కచెయ్యను. బాణాలూ మొదలైన దారుణమైన ఆయుధాలు బళ్ళతో పట్టించుకు వస్తాను. మంచిమంచి రథాలూ, దృఢమైన గుర్రాలూ, లెక్కాజమాలేకుండా నారథం వెనక అమర్చిపెడతాను. అయితే ఒక్కటే-కృష్ణుడు అతడికి సారథిగా వున్నాడు. ప్రపంచమే ఇట్టేతిప్పెయ్యగల దక్షుడు. అందుకనే అర్జునుడి ప్రతాపం అసాధ్యంగా వుంటోంది. అయితే యుద్ధవిద్యలోనూ, సారథ్యంలోనూ కృష్ణుడితో సమానమైనచెయ్యి శల్యుడు. కనక శల్యుణ్ణి నాకు సారథిగా నియమించు. ఎలాఅయినాసరే, నాబలమంతా వినియోగిస్తాను. అర్జునుణ్ణి హారి అనిపించేస్తాను. గుర్రాలవిషయం కృష్ణుడికంటే అధికం తెలిసినవాడు శల్యుడు; సందేహంలేదు. అలాగే బలంలోనూ, యుద్ధవిద్యలోనూ అర్జునుడికంటే అధికుణ్ణి నేను. ఈమాత్రం కోర్కె చెల్లించు. ఈమాత్రంచేస్తే అన్నీ చేసినట్టే భావిస్తాను. అప్పుడు నువ్వే చూద్దువుగాని, ఎలా యుద్ధంచేస్తానో, వేలువేలు గుచ్చి పారేస్తాను.

దేవతలు వచ్చినా సరే మట్టిగొట్టేస్తాను. సుయోధనుడూ, పాండవులూ వాళ్ళ లెక్కే, మిత్రమా? ల్లుం.!”

“నాకు తెలుసు, అన్నందుకనే చేస్తాను” పుప్పొంగిపోతూ అందుకున్నాడు దుర్యోధనుడు - “తప్పకుండా శల్యుణ్ణి నీసారథిగా చేస్తాను బళ్ళతో బాణాలు తెప్పిస్తాను. రథాలూ, గుర్రాలూ లక్షలు లక్షలు నీవెంట నడిపిస్తాను” అన్నాడు.

వికసించిన ముఖంతో కలకల్లాడాడు కర్ణుడు. అతణ్ణి వెంట పెట్టుకుని శల్యుడిదగ్గిరికి వెళ్ళాడు దుర్యోధనుడు. మర్యాదగా భక్తితో ప్రణామంచేశాడు, “మామా, వొక వరం కోరడానికి వచ్చాను” అంటూ వినయంగా అందుకున్నాడు - “సత్యవ్రతుడివి, శత్రుసంహారమూ, గొప్పతనమూ నైజగుణాలు నీకు నేనంటే వల్లమాలిన అభిమానం, అందుకనే నువ్వంటే ఎక్కడలేని గౌరవంకూడా నాకు. నీ సద్భావం తెలిసినవాణ్ణి కనుక ఇంతమంది రాజుల్లోనూ వినయంగానిన్ను ప్రార్థిస్తున్నాను. అర్జునుణ్ణిహతమార్చెయ్యాలి ఇవాళ. అందుకు ఇదిగో ఇతణ్ణి కాపాడాలి” అంటూ కర్ణుణ్ణి చూపించాడు. “ఇతడి రథం నడపాలి నువ్వు. నువ్వు సారథిగా కూచుంటే శత్రువుల్ని మచ్చుకేనా లేకుండా చేసేస్తాడు కర్ణుడు.

“భీష్ముడూ, ద్రోణుడూ వెళ్ళిపోయారు. సైన్యమూ సన్నగిల్లి పోయింది. అయినా గెలుపుకోరి యుద్ధంచేస్తున్నాను అంటే - భుజపరాక్రమానికి పేరుపడ్డ పాండవుల్ని ఎదిరించడానికి నిశ్చయించానూ అంటే – ఎవళ్ళని నమ్ముకుని? నిన్నూ, కర్ణుణ్ణీ నమ్ముకుని. నీకు మాత్రం తెలియదు కనక నా? అంచేత మహాశయా, సూర్యుడికి వరుణ దేవుడిలాగ కర్ణుడికి నువ్వు సారథ్యం చెయ్యి. చీకట్లు చెదిరిపోయినట్లు

లు రూపుమాసిపోతారు” అన్నాడు.

దుర్యోధనుడి మాటలు విన్నాడు శల్యుడు. అతడి రెండుకళ్ళూ ఎర్రపడ్డాయి. నుదురు చెమటపట్టింది. అంతంత గుడ్లుచేసి నీకొడుకుని చూశాడు.

“ఇంత నీచప్పనా నాకు చెపుతున్నావు?” కణతలదురుతూ అన్నా డతడు — ‘వర్ణధర్మాలు ఎరగనా నువ్వు? మూర్ధాభిషిక్తులైన రాజులు ఎప్పుడైనా శూద్రులసేవ చెయ్యడం కద్దా? ఏంమాట లివి? సూతుడికొడుకు కర్ణుడు. అతణ్ణి నాయకుణ్ణిచేసి, సారథ్యం చెయ్యలేను. నువ్వేదో అతణ్ణే నాకంటే మహాబలశాలి అనుకుంటున్నావు. ఇంత అవమానం ఎక్కడైనా వుంటా?

“పగవాళ్ళలో ఎవడిమీదకి పంపుతావో పంపు నన్ను. ఎంతవాడైనా సరే, వాడి తుదచూసేసి, వెళ్ళిపోతాను. అలా చాలదంటావా, వరసపెట్టి శత్రువుల్ని యావన్మందినీ హతమార్చేస్తాను. విను, నేను పేట్రేగిపోయానంటే నన్ను తేరిచూసేటంత మొనగాడే వుండడనుకో. కులపర్వతాలు పగలగొడతాను సముద్రాలు కలగుండుపెట్టేస్తాను. భూగోళం చెక్కలు చేసేస్తాను.

“దుర్యోధనమహారాజా, నాబాహువులు కనపళ్ళేదూ నీకు? నాబలం తెలియక నువ్వు అన్నావే అనుకో అంతమాత్రాన నేను మహారథుణ్ణి కాకండా పోతానా? ఒకడికి సారథినై కూచుంటానా? ఈసూతుడికొడుకు నా పదహారో కళకైనా సాటిరాడు. అర్జునుడూ, కృష్ణుడూ గడ్డిపరక నాకు.

“ఇది తెలియక చెప్పావు నువ్వు. కాదూ తెలిసి తెలిసీ కర్ణుడిమీద పక్షపాతంవల్ల చెప్పి, నన్ను అవమానిస్తున్నావా, అయితే ఇదిగో వెళ్ళొస్తాను మాదేశానికి” అంటూ రాజుల్లోంచి వెళ్ళిపోడానికే బయలుదేరా డతడు, చప్పున.

బతిమాలుతూ అడుగుతున్నాడు దుర్యోధనుడు. "కర్ణుడే అర్జును మాటేమిటి, నిన్ను మించిన రథికులే లేరు లోకంలో" – బోధపరుస్తూ వినయంగా నమ్మకమైన మాటలతో అంటున్నాడూ "బాహుబలంతో శత్రువులికి హృదయశల్యం నువ్వు. అందుకే శల్యుడని పేరువచ్చింది నీకు. నాఅభిప్రాయం విను. రథికుల్లో అర్జునుణ్ణి మించినవాడు కర్ణుడు. అలాగే అశ్వహృదయ జ్ఞానంలో కృష్ణుడికంటే గొప్పవాడివి నువ్వు. అర్జునుడిమీదికి కర్ణుణ్ణి పెట్టాం మనం. అది సాగనివ్వకండా! తోలిస్తున్నాడు కృష్ణుడు. కృష్ణుడు చేసేందానికి తగినట్టు చెయ్యడానికి నిన్ను ప్రార్థిస్తున్నాము. ఇంతటిపని నీకుతప్ప మరొకళ్ళకి శక్యమవుతుందే ఎలా నువ్వే చెప్పు."

ఈ మాటలతో అరిచేతిలో స్వర్గం దొరికి పోయినట్టు అయిపోయాడు శల్యుడు.

"కృష్ణుడికంటే గొప్పవాణ్ణని ఇంతమంది రాజులఎదుటా చెప్తున్నావు, అంతే చాలు నాకు. మచ్చలేని కీర్తిశాలి కర్ణుడు. అతనికి తప్పకండా సారథ్యం చేస్తాను" అన్నాడు.

కర్ణుడివేపు చూస్తూ ఇంకా ఇలా అన్నాడతడు: "అయితే పొగడ్తమాత్రం పొసగకపోవాలి నాకు ఏంతోస్తే అది విప్పులవిగా అతడితో మాట్లాడతాను. ఏమన్నా తప్పుపట్టకూడదు మరి. అలా అయితేనే పొత్తుకుదురుతుంది. లేదంటే నాదారిని నేను పోయివస్తాను."

"కానీ, అంతమాత్రాన మనకి పోయేదేముంది?" గౌరవంగా కర్ణుణ్ణి చూస్తూ అన్నాడు దుర్యోధనుడు. శల్యుడితట్టు తిరిగి "మంచిదే అలాగే కానీ" అన్నాడు.

అంతా అయింది. అయినా ఇంకా శల్యుడిమనస్సు తిన్నగా ముందూ అవుతుందే లేదా అన్న సందేహం పోదన్లేదు దుర్యోధనుణ్ణి. "నాకూ సారథ్యం చేస్తున్నానని విచారించకు" మళ్ళీ

అందుకన్నా డతడు — "దీనికి దేవతల కథ వొకటి వుంది. వెనకటికి మార్కండేయముని మాతండ్రితో చెప్పాడది. దగ్గిరేవుండి నేను విన్నాను. చెపుతాను, ఆలకించు.

## త్రిపురాసురుల వృత్తాంతం

"దేవాసురయుద్ధంలో రాక్షసులరాజు తారకాసురుడు తెగిపోయాడు. కుమార్లు విద్యున్మాలీ, తారకాక్షుడూ, కమలాక్షుడూ — ముగ్గురూ బ్రహ్మకోసం నిష్ఠతో ఘోరమైన తపస్సు చేసారు. బ్రహ్మ దయతలిచాడు; ప్రత్యక్షమయాడు. 'వరం కోరండి' అన్నాడు.

"ఎప్పుడూ మాకు చావు వుండకూడదు. ఏప్రాణీ మమ్మల్ని చంపకూడదు" ముగ్గురూ కలిసి వొకేసారి అన్నారు రాక్షసులు.

"'ఎక్కడైనా వుందా ఈమాట?' అన్నాడు బ్రహ్మ — నేను ఇవ్వడానికీ, మీరు పుచ్చుకోడానికీ తగినట్టు వుండాలి వరం. అలాటిది కోరండి సంతోషంతో ఇస్తాను."

"అయితే మాముగ్గురికీ మూడుపురాలు (పట్నాలు) ఇవ్వండి అన్నిసుఖాలూ అందులో వుండాలి. కామగమనంకలిగి ఎక్కడికి వెళ్ళమంటే అక్కడికి వెళ్ళాలవి. దేవతలూ, దానవులూ, యక్షులూ, నాగులూ - ఎవ్వరూ నాశనం చెయ్యలేకపోవాలి. ఈవరం దయచెయ్యండి. మీ అనుగ్రహంవల్ల నిర్భయంగా సంచరిస్తాం" అన్నారు రాక్షసులు:

"'ఇది బాగుంది' అన్నాడు బ్రహ్మ — 'అయితే మూడు పట్నాలు వొక్కదగ్గిర చేరితేమాత్రం నాశనమైపోతాయి. అలా కాకండా జాగ్రత్తగా మసులుకోండి."

"'మూడుపట్టణాలూ వొక్కదగ్గిర చేరినప్పుడు, అంత బలవంతుడు ఎవడైనా పూనుకుంటే నాశనం కావచ్చు. దీనికి వొప్పు

కుంటున్నాం. మూడూ వొక్కదగ్గిర చేరకపోతే మాత్రం హరిహరా దులు ఎవ్వరూ నాశనం చెయ్యలేకపోవాలి' అన్నారు వాళ్ళు.

"'అంగీకరించాను. మీరు పట్టణాలు సంపాదించుకోండి. మీరు కోరినశక్తులు వాటికి ప్రసాదించాను'" అంటూ అంతర్థానమయాడు బ్రహ్మ.

"వరంపొందిన రాక్షసులు ముగ్గురూ రాక్షసశిల్పి మయుణ్ణి పిలిచారు. అద్భుతమైన పట్టణాలు మూడూ తయారుచేసిఇమ్మన్నారు. ముగ్గురికీ మూడు పట్నాలు అపూర్వమైనవి తయారుచేసి ఇచ్చాడు మయుడు. ఒకటి బంగారం పట్టణం. రెండోది వెండిపట్నం. మూడోది ఇనుం. ప్రతిపట్టణమూ పొడవు వందేసి యోజనాలు. అలాగే వెడల్పూ వందేసి యోజనాలు. బంగారంపట్నం స్వర్గంలోనూ, వెండిది అంతరిక్షంలోనూ, ఇనుంపట్నం భూలోకంలోనూ వుండేవి. ఇష్టంవచ్చినట్టు విచ్చలవిడిగా సంచరిస్తూ వుండేవి. బంగారంపట్నానికి తారకాక్షుడు రాజయాడు. వెండిపట్నానికి కమలాక్షుడు రాజయాడు. ఇనపపట్నానికి విద్యున్మాలి రాజు. ముగ్గురూ ముగ్గురే,ముగ్గురూ దివ్యవస్త్రాలుకట్టుకునేవాళ్ళు. దివ్యాభరణాలు వేసుకునేవాళ్ళు. దివ్యహారాలూ, దివ్యగంధాలూ ధరించేవాళ్ళు. దివ్యభోగాలు అనుభవించేవాళ్ళు. అలా మూడుపట్నాల్లోనూ సంచరిస్తూ మూడులోకాలు ఆక్రమించారు వాళ్ళు. అడ్డూ ఆపూ లేకండా ప్రవర్తించారు. ముగురూ మయుణ్ణి ఆశ్రయించారు. అందుచేత వాళ్ళు ఎప్పుడు ఏదికావాలంటే అప్పుడది తన మాయాబలంతో సిద్ధంచేసి సమకూర్చేవాడు మయుడు. వాళ్ళ యోగక్షేమాలు కనిపెడుతూవుండేవాడు. ఎందులోనూ ఏమాత్రమూ లోపంలేకండా వుండేది. అలా ఎన్నో కోట్ల సంవత్సరాలు గడిచి పోయాయి.

"తారకాక్షుడికి వొక కొడుకుపుట్టాడు. అతడి పేరు హరి

అతడూ బ్రహ్మకోసం గొప్పతపస్సుచేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమయాడు; వరం కోరమన్నాడు.

“‘చిత్రమైన మహిమతో ఒక నుయ్యికావాలి. ఆనూతిలో నీళ్ళు ఎన్నటికీ ఇంకిపోకూడదు. మామూలు మనుష్యుల్లోనూ ఎవళ్ళయినా ఆయుధాలతో చచ్చిపోతే, వాళ్ళని ఆనీళ్ళలో వేస్తే, వాళ్ళు ఒక్కొక్కడికి పదిమంది పుట్టుకు రావాలి. వెనకటికంటే రెండింతలు బలమూ, పౌరుషమూ వుండాలి వాళ్ళకి. ఇలాంటి వరం దయచెయ్యి” అన్నాడు హరి రాక్షసుడు.

సరే ఇచ్చాను అని అంతర్ధానమయాడు బ్రహ్మ.

‘బ్రహ్మవరం ప్రకారం వింతనుయ్యి ఏర్పడింది. దాంతో యుద్ధమంటే భయంపోయింది వాళ్ళకి. దేవతలమీద విరుచుకుపడ్డారు రాక్షసులు. లోకాలన్నీ పీడించుకు తిన్నారు. మితిలేకండా విరగబడ్డారు. ఆతురతంపరగా పెరిగిపోయారు. లోభం, మోహం పెంచుకున్నారు. ఆడిందే ఆటా, పాడిందే పాటగా తిరిగారు. దేవలోకమూ, పితృలోకమూ, మునిపల్లెలూ, పట్టణాలూ సర్వధ్వంసం చేసేశారు.

“దేవతలతో దేవేంద్రుడు వాళ్ళమీద దండెత్తాడు. కాని శత్రువుల్ని క్షీణింపలేకపోయాడు. విచారిస్తూ వచ్చేశాడు. దేవతలూ, మునులూ, అంతాకలిసి బ్రహ్మదగ్గిరికి వెళ్ళారు. ప్రణామం చేశారు. త్రిపురాసురుల దౌష్ట్యం వివరించారు. ‘వాళ్ళని ఎలా ఎదిరించవచ్చునో సెలవియ్యి’ అని ప్రార్థించారు.

“‘మహాదేవుడున్నాడుగా ఒక్క బాణంతో నాశనం చెయ్యాలి’ అన్నాట్ట బ్రహ్మ – ‘మరో మార్గం లేదు. అంతపని శివుడికే కాని ఇంకొకడికి సాధ్యం కాదు. పదండి శివుడిదగ్గిరికే. వెళ్ళండి.

“‘మహాప్రసాదం’ అంటూ వచ్చేశారు దేవతలు. వెళ్ళి దివ్యస్తోత్రాలు, నిష్ఠతో తపస్సు చేశారు. చిత్తశుద్ధితో శివుడి

దగ్గరికి బయలుదేరారు. బయలుదేరేముందు బ్రహ్మని ప్రార్థించారు. అతణ్ణి ముందుపెట్టుకుని శివుడిదగ్గిరికి వెళ్ళారు.

"వరాలు ఇచ్చే మహాదేవుడు శివుడు. శరణు అంటే రక్షిస్తాడు. సర్వసుఖాలూ ప్రసాదిస్తాడు. సర్వభూతాలికీ ఈశ్వరుడతడు. తలమీద నెలవంక భూషణం అతడికి. యోగులికి సులభుడు. మన్మథుణ్ణి మసిచేసేశాడు. పరమాత్ముడు. అలాంటిశివుణ్ణి దర్శించారు దేవతలు. నుదుళ్ళు నేలకి మోపి ప్రణామం చేశారు.

" 'మీరంతా ఎందుకువచ్చారు?'" అడిగాడు శివుడు. లేచి నుంచున్నారు దేవతలు. చేతులు జోడించారు. ఎన్నో అన్నివిధాల స్తోత్రం చేశారు. శివుడు ప్రసన్నుడయాడు. 'భయపడకండి' అభయహస్తమిచ్చాడు; ఆదరించాడు. 'మీకు ఏంకావాలో చెప్పండి: మీరు కోరినట్టే చేస్తాను' అన్నాడు.

శివుడినోట చల్లనిమాట విని మునులూ, దేవతలూ, బ్రహ్మా ఆనందం అనుభవించారు. 'దేవా!' చేతులు జోడించి విన్నవించాడు బ్రహ్మ— 'నన్ను ప్రజాపతిని చేశావు. పదవిలోవుండి తారకాసురుడి కుమారుళ్ళకి ఇష్టంవచ్చినట్టు వరమిచ్చాను. ముగ్గురూ మూడుపట్నాలు సంపాదించారు. మూడులోకాలూ వేధిస్తున్నారు. దారుణమైన అకృత్యాలు చేస్తున్నారు. వాళ్ళని నాశనంచెయ్యడం మరొకళ్ళవల్లకాదు. నువ్వే ఆపనికి పూనుకోవాలి. వెంటనే. ఈ దేవతలూ, మునులూ నేనూ నీశరణువేడుతున్నాం. దయచూడు. రక్షించు. భూతనాథా! నువ్వుతప్ప లోకాలు కాపాడేవాళ్ళు మరి ఎవ్వరున్నారు?'" అన్నాడు.

" 'అవును, హాతమార్చవలసిందే వాళ్ళని' అన్నాడు శివుడు — అయితేవాళ్ళు అసాధ్యులు. ఒక్కణ్ణే ఆపనికిపూనుకోలేను. నా తేజస్సు

లోంచీ, బలంలోంచీ సగం పుచ్చుకోండి మీరు. మీరందరూ వెళ్ళి దుష్టరాక్షసుల్ని యావన్మందినీ సంహరించండి'

" 'మాఅందరి తేజోబలాలకంటే ఆరాక్షసుల తేజోబలాలు రెట్టింపు' అన్నారు దేవతలు - 'అంచేత మాచేత వాళ్ళు చావరు. అంతేకాకండా నీతేజోబలాలు భరించడానికీ మాకు శక్తిచాలదు. మాఅందరి తేజోబలాల్లోంచీ సగంపుచ్చుకుని నువ్వే వాళ్ళపనిపట్టించు. అన్నివిధాలా నువ్వేమా రక్షకుడివి. రక్షించు.'

" 'దేవతలకీ, రాక్షసులకీ సమానమైనవాణ్ణినేను' అందు కున్నాడుశివుడు— 'సమస్తభూతాలకీ సమానంగా శివం (శుభం) కలిగి స్తాను. అంచేతే శివుడని మన్నిస్తారునన్ను. అయినా మీకు ద్రోహం చేస్తున్నారు కనక వాళ్ళని సంహరిస్తాను. మీకు సంతోషంకలిగిస్తాను. ఏమంటె, దుర్మార్గులైన మూఢుల గర్వనాశనంకోసమే వున్నారు మీరు. ధర్మంగానడుచుకుంటున్నారు. సరే, మీఅందరూ తేజస్సూ, బలమూసగం నాకివ్వండి. మరొకమాట, లోకమంతటికీ పశుత్వమూ' నాకుపశుపతిత్వమూ కావాలి. అప్పుడు పశువుల్నిచంపడంలో పాప ముండదు.

" 'దివ్యమైనరథంకూడా తయారుచేయండి. సారథీ, గుర్రాలూ, ధనుస్సూ, బాణమూ తయారుచేయండి. అలా అయితే ఇట్టే త్రిపుర సంహారం చేస్తాను.'

"పశుత్వానికి శంకించారు దేవతలు, తలలు వొంచుకున్నారు. గ్రహించాడు శివుడు. 'భయపడకండి. పశుభావం వొదిలించుకునే విధానం లేకపోలేదు. చెపుతాను, వినండి. పాశుపతవ్రతం చేస్తే పశుత్వం వొదిలిపోతుంది. అదిపన్నెండేళ్ళు జరపాలి. నిండు నిష్ఠతో వొక సంవత్సరం, ఆరుమాసాలు, వొకరుతువు, మాసం, తుదకి పన్నెండు రోజులు జరిగించినా చాలు.'

"శివుడు చెప్పాక సరే అన్నారు దేవతలు. లోకాలకి పశుత్వమూ, శివుడికి పశుపతిత్వమూ ఒప్పుకున్నారు. అతణ్ణి పశుపతి అన్నారు. తమ తేజోబలాల్లో సగం అతడికి సమర్పించారు. దాంతో మహాబలవంతుడయ్యాడు శివుడు. ఎంతో అంత తేజస్సుతో ప్రకాశించాడు. అప్పుడు దేవతలందరూ త్రిపురసంహారంకోసం అతణ్ణి అభిషేకించారు. దివ్యమైనరథం తయారుచెయ్యమని బ్రహ్మని కోరారు. తపఃప్రభావంతో మహనీయుడైన విశ్వకర్మని నియోగించాడు బ్రహ్మ. తన సామర్థ్యమంతా వినియోగించాడు విశ్వకర్మ. భూమండలం రథంగా తయారుచేశాడు సూర్యచంద్రులు చక్రాలుచేశాడు సముద్రం ఇరుసుచేశాడు. హిమాచలం, వింధ్యాచలం, అస్తాచలం, ఉదయాచల-వీటితో బలమైన భాగాలు తీర్చిపెట్టాడు మూడు అగ్నులతోనూ నొగకట్లుచేశాడు. మేరుపర్వతం గొడుగుచేశాడు. నాలుగు వేదాలూ నాలుగు గుర్రాలుచేశాడు. సంవత్సరం, ధనుస్సు చేశాడు. విష్ణువుని బాణంచేశాడు. గ్రహనక్షత్రాల ఆకాశం కవచం చేశాడు.

"కవచం వేసుకున్నాడుశివుడు. ధనుర్బాణాలుపుచ్చుకున్నాడు. చరాచరాత్మకంగా వెలిగిపోతూవున్న రథ మెక్కాడు. వృషభధ్వజ మెత్తించాడు. అప్సరసలు నాట్యంచేశారు. మునులు స్తోత్రాలు చేశారు.

'సారథి ఎవరు?' నవ్వుతూ అడిగాడు శివుడు.

'నీఇష్టం వచ్చినవాళ్ళని ఎంచుకో' అన్నారు దేవతలు.

'అలాకాదు' అందుకున్నాడు శివుడు — 'నాకంటే అధికుడు సారథి కావాలి. అంచేత మీరే ఎంచి పంపండి.'

"మునులూ, దేవతలూ ఆలోచించారు. వినయంగా బ్రహ్మకి నమస్కరించారు. 'దేవా, నీవల్లే శివుడు ప్రసన్నుడయ్యాడు. నీఆజ్ఞవల్లే రథమూ, ధనుర్బాణాలూ తయారయ్యాయి. తీరా అన్నీ సిద్ధమయ్యాక

సారథి లేకుండా పోయాడు. ఏం దారి? సారథ్యం చెయ్యవలసినవాడు మంచి బలసత్వాలు కలవాడు కావాలి. భూమి రథం. వేదాలు గుర్రాలు. రుద్రుడు రథికుడు. సారథి సామాన్యుడైతే ఎలా నువ్వే దీనికి పూనుకోవాలి. నీకంటే గొప్పవాడు లేడు. భయభ్రాంతులమై ఉన్నాం మేం. సారథివై మమ్మల్ని రక్షించు. నువ్వే మాకు దిక్కు. నీదయవల్ల బతికిపోతాం' అంటూ సాష్టాంగపడ్డారు. ఆదరంగా అంత మందినీ లేవనెత్తాడు బ్రహ్మ.

'మీరు నిజమే చెప్పారు' దయతో చూస్తూ అన్నాడతడు— 'మంచి నేర్పూ, బలమూ వున్నవాడే సారథి కావాలి. అలాంటివాడైతేనే రథికుణ్ణి గెలిపిస్తాడు. మీ కోరిక ప్రకారం సారథి నవుతాను. నా బుద్ధిబలమంతా వినియోగిస్తాను. శివుణ్ణి మెప్పిస్తాను. వేదాలగుర్రాలు నడిపిస్తాను.'

"చేతి కమండలం వాటి దగ్గిర పెట్టాడు బ్రహ్మ. జడలు ముడివేసి బిగించాడు. లేడిచర్మం గట్టిగా కట్టుకున్నాడు. విశ్వకర్మ ఓంకారంతో చేసిన ముల్లుకోల పట్టుకున్నాడు. నొగలెక్కి కూచున్నాడు. అదిగో అలాగ బ్రహ్మదేవుణ్ణి దేవతలు సారథ్యం చేయించారు.

"శివుడూ, బ్రహ్మ - ఇద్దరి బరువూ మొయ్యలేకపోయాయి గుర్రాలు. నాలుగూ మోకాళ్ళమీద పడిపోయాయి. కౌశలంతోనూ, బలంతోనూ పగ్గాలు పట్టుకున్నాడు బ్రహ్మ. గుర్రాలు లేవదీశాడు. వాటికి కావలసినంత శౌర్యమూ, వీర్యమూ ప్రసాదించాడు. రథం నడపడం మొదలెట్టాడు.

"బాగుంది" సారథికౌశలం మెచ్చుకుంటూ అన్నాడు శివుడు— రాక్షసులపట్నాలమీదికి రథంపోనీ. లోకాల అలజడి అంతం చేస్తాను. ఇవాళ: నా చేతిచేత చూద్దువు గాని.'

"వేదాలగుర్రాలు అదిలించాడు బ్రహ్మ. మనోవేగం, వాయు

వేగంలో ఎగిరిపోయాయి గుర్రాలు. అధర్వుడూ, అంగిరసుడూ చక్రరక్షకులై బయలుదేరారు. క్షణంలో రాక్షసపట్నాల దగ్గిర వాలింది రథం.

“ అసలే ఉగ్రుడు శివుడు. కోపంతో ప్రళయరూపం ధరించాడతను. ధనుస్సు సారించాడు నారికి బాణంతొడిగాడు. పాశుపతాస్త్రం సంధించాడు. రాక్షసుల మూడుపట్నాలూ వొక్కసారి తలుచుకున్నాడు. శివుడు తలుచుకోడమే తడువు, మూడుపట్నాలూ వొక్కదగ్గిర చేరుకున్నాయి. మునులూ, దేవతలూ సంతోషించారు. ‘శానీ జయించు’ అంటూ హెచ్చరించారు.

“తెగేసి బాణంవొదిలిపెట్టాడు శివుడు. బ్రహ్మాండమైనఅగ్ని - కళ్ళుమూసుకుపోయాయి. రాక్షసులతో కూడా మూడుపట్నాలూ భగ్గుమనిపోయాయి. కాలిపోయాయి. బుగ్గయిపోయి పడమటిసముద్రంలో పడిపోయాయి. బాణాగ్నిసూత్రం లోకాలుదహించడం మొదలెట్టింది. చప్పున దాన్ని చల్లారబెట్టేశాడు శివుడు. జంతుకోటి సంతోషించింది. దేవతలూ, మునులూ పొగిడారు. ♦ శివుడిదగ్గిరసెలవు తీసుకున్నారు. తమతమ నివాసాలికి వెళ్ళిపోయారు. అలా లోకహితం కోసం శివుడికి సారథ్యంచేశాడు బ్రహ్మ. అలాగే నువ్వూ నాహితం కోసం కర్ణుడికి సారథ్యంచెయ్యి. నాగౌరవం నిలబెట్టు. ఈకర్ణుడికంటే, అర్జునుడికంటే, కృష్ణుడికంటే కూడా నువ్వ గొప్పవాడివి. బలంలో అయితేనేం, శౌర్యంలో అయితేనేం నీతరవాతే వాళ్ళు. నారాజ్యమే కాదు, నాజీవితమే నీచేతుల్లో వుంది. నీళ్ళుముంచినా, పాలముంచినా నువ్వే దిక్కు. ఈమాత్రంకోర్కె చెల్లించు. నన్నురక్షించు” అంటూ ప్రార్థించాడు.

---

♦ చూ. తైత్తిరీయ సంహిత 6. 2. 3.

“మరో ఇతిహాసం చెపుతాను, విను” మళ్ళీ ఎత్తుకున్నాడు దుర్యోధనుడు— “నానాన్నగారిదగ్గిరికి వొకసారి సర్వధర్మాలూ తెలిసిన వొక బ్రాహ్మణు వచ్చాడు. నేను దగ్గిరే వున్నాను. అతడు చెప్పిందే నీకు చెపుతున్నాను.

“‘భార్గవవంశంలో సుప్రసిద్ధుడు జమదగ్ని. అతడికి పరశురాముడు జన్మించాడు. శివుడికోసం బ్రహ్మాండమైన తపస్సుచేశాడు. శివుడు ప్రత్యక్షమయాడు. దివ్యాస్త్రాలు కోరాడు పరశురాముడు. ‘నువ్వు కోరిన మహాస్త్రాలు అశుచులైనవాళ్ళని కాల్చేస్తాయి. నువ్వు ముందు బాగా శుచివికా మహాస్త్రాలు యావత్తూ నీస్వాధీనమవుతాయి’ ఆదరంగా అన్నాడు శివుడు.

“‘మహాప్రసాదం’ అన్నాడు పరశురాముడు — ‘నాకుఅర్హత ఎప్పుడువస్తేఅప్పుడు నువ్వే ప్రసాదించు. కాని నీకుశుశ్రూష చేస్తూవుండడానికిమాత్రం అనుమతించు’ అని విన్నవించాడు. దయతో ఆవరం ఇచ్చి అంతర్ధానమయాడు శివుడు.

“నియమనిష్ఠలతో ఎన్నోసంవత్సరాలు శివుణ్ణిపూజించాడు పరశురాముడు. ఒకనాడు ప్రసన్నచిత్తంతో అతణ్ణి పార్వతికిచూపిస్తూ అన్నాడు శివుడు: ‘చూడు, పరమభక్తుడు పరశురాముడు. నిర్మలమైన వ్రతదీక్షాపరుడు’ సరిగ్గా ఆదేసమయానికి బలవంతులైన రాక్షసులచేత నానాఅవస్థలు పడి దేవతలు అక్కడికి వచ్చారు. భయంతో వొణికిపోతున్నారు వాళ్ళు. వచ్చి తమ పాట్లన్నీ మొర పెట్టుకున్నారు.

“‘చప్పున వెళ్ళు’ పరశురాముడితో అన్నాడుశివుడు-‘రాక్షససంహారం చెయ్యి. దేవకార్యం నిర్వహించు. వాళ్ళని సంతోషపెట్టు.’ “పరశురాముడి ఆనందానికిఅంతంలేకపోయింది. ‘అస్త్రవిద్యలేదునాకు,’

చేతులు జోడిస్తూ అన్నాడతను – 'బాణవిద్యలో చేతులుతిరిగినవాళ్ళు రాక్షసులు. వాళ్ళని గెలవడం ఎలా సాధ్యం గాకు ?'

"'నా మనస్సు నీమీద నిలుపుతాను దాంతో శత్రువుల్ని క్షణంలో సంహరిస్తావు. చిరకాలంనించీ వున్న నీ ఖ్యాతి ఇంకా పెరుగుతుంది. వెళ్ళు. ఆలస్యం చెయ్యకు' అన్నాడు శివుడు.

"'చిత్తం' అంటూ లేచాడు పరశురాముడు. ప్రళయంలా వెళ్ళాడు. రాక్షసులమీద పడ్డాడు. దారుణమైన ఆయుధాలు ప్రయోగించాడు. అందరినీ పూర్తిచేశాడు. కాని వాళ్ళు కొట్టిన దెబ్బలికి వొళ్ళంతా గాయాలైపోయి తిరిగివచ్చాడు. చల్లని చేతులతో నిమిరాడు శివుడు నుచ్చుకున్నా లేకుండా అయిపోయాయి గాయాలు. 'నన్ను చూడకుండా యుద్ధం చేసినప్పుడు ఎంత వాడిఅయిన బాణాలు తగిలినా నొప్పుడు నీకు. శత్రువుల్ని అవలీల జయిస్తావు. నువ్వు మొదట కోరిన వరానికి ఇదే సమయం. పుచ్చుకో' అంటూ దివ్యాస్త్రాలు ప్రసాదించాడు శివుడు. అందుకుని సాష్టాంగపడ్డాడు పరశురాముడు. లోకగురువయిన గురుదేవుడి సెలవుతీసుకున్నాడు. తన నివాసానికి వచ్చేశాడు. అదిగో అంతతపస్సుచేసి శివుడిదగ్గిర సంపాదించిన దివ్యాస్త్రాలు ప్రీతిపూర్వకంగా కర్ణుడికి ఇచ్చాడు పరశురాముడు. కర్ణుడు తక్కువ కులం వాడే అయితే పరశురాముడంతటి మహాత్ముడు చేరదీస్తాడా? అంతవాడు ఆదరించాడూ అంటే కర్ణుడు ఉత్తమ జాతివాడే అని భావిస్తాను. మొహం, వక్షస్థలం, బాహువులు చూస్తే దేవకుమారుడిలాగ వున్నాడు మామయ్యా! ఆడది కుండలాలతోనూ, పవిత్రకవచంతోనూ వున్న సూర్యుడిలాటి కొడుకుని కనగలదా అసలు ? లేడికడుపులో సింహం పుడుతుందా ? సూతుడి ఇంట పెరిగిన దోషంమాత్రం పట్టింది ఇతడికి అంతే. శివుడి శిష్యుడైన పరశురాముడి శిష్యుడు; అంగరాజు, కర్ణుడు వుడికి సారథ్యం చేసిన బ్రహ్మలాగ కర్ణుడికి సారథ్యం చెయ్యి నువ్వు

'అన్నివిధాలా రథికుడికంటె సారథి అధికుడైనవాడు కావాలి' అన్న నీతి నువ్వు ప్రసన్నుడివైనందువల్ల సిద్ధించింది."

## ఉన్నమాట చెపుతాను

"ఆమాత్రంనాచేవ గుర్తించావునువ్వు" దుర్యోధనుణ్ణి గుచ్చి కౌగిలించుకుంటూ అన్నాడుశల్యుడు- "అంతేచాలునాకు. నీకోర్కె నెరవేరుస్తాను. సారథ్యంచేస్తాను. అయితే చెవికి చేదైనా ఉన్నమాట చెపుతాను. హితం పలుకుతాను. దానికి కర్ణుడూ, నువ్వూ ఓర్చుకోవాలి. కోసం తెచ్చుకోకూడదు."

"శివుడికి బ్రహ్మ, అర్జునుడికి కృష్ణుడూ ఎలాగో అలాగే నీబుద్ధి పరాక్రమాలతో నాకు సాహాయ్యం చెయ్యాలి నువ్వు" అన్నాడుకర్ణుడు.

"తప్పకుండా" సాగదీశాడు శల్యుడు – "పొగడినా, తెగడినా ఏమీ అనుకోరు బుద్ధిమంతులు. మంచి చెప్పవలసివచ్చినప్పుడు తెగడవలసీ వస్తుంది, పొగడవలసీ వస్తుంది. అయితే బుద్ధిమంతులుమాత్రం ఓర్చుకోవాలి అవి. దేవేంద్రుడి దివ్యరథమైనా నడపగలను నేను. ఉచితమైనమాట చెపుతాను, రథికుణ్ణి ఏమరుపాటుగా వుండనివ్వను. కృష్ణుడు సారథిగా వున్న అర్జునుణ్ణే గెలవాలనుకుంటున్నావు నువ్వు. నీరథం నడపడం ఎంతైనా తగివుంది నాకు."

"మాతలి ఈయన ముందు తీసికట్టు" శల్యుణ్ణి ఎత్తేస్తూ, కర్ణుడితో అన్నాడు దుర్యోధనుడు— "కృష్ణుడూ గ్రిష్ణుడూ దిగదుడుపే అనుకో. మనభాగ్యంవల్ల నీకు సారథిగా దొరికాడు. ఈయన సహాయంతో అర్జునుడి అహంకారం అంతంచెయ్యి."

వినయంగా శల్యుడితో ఇంకా ఇలాఅన్నాడతడు - "మామా, సామర్థ్యంతోనూ, చాకచక్యంతోనూ, నువ్వు కాపాడుకుంటూ వస్తే, యుద్ధంలో అర్జునుణ్ణీవూ చేస్తాడు కర్ణుడు. సందేహం లేదు."

"సందేహం లేదు" సారథ్యంకోసం సిద్ధపడుతూ అన్నాడు శల్యుడు.

ఉత్సాహంతో పొంగిపోయాడు కర్ణుడు. తనసారథినిచూసి, "తగిన రథం తయారుచేసి చప్పునపట్టుకురా" అన్నాడు. తుణాల మీద దృఢమైన రథం సిద్ధంచేశాడు సారథి. "తప్పక జయించు" అని ఆశీర్వదిస్తూ కర్ణుడికిముందు పెట్టాడు. రథం పూజించమని పురోహితుడికి ఆజ్ఞాపించాడు కర్ణుడు. పురోహితుడి మంగళ విధానంపూర్తయాక, తానూ పూజించాడు. ప్రదక్షిణం చేశాడు. నమస్కరించాడు. సూర్యోపాసన ముగించాడు. రథం ఎక్కమని శల్యుడికి నమస్కరించాడు. కొండమీదికి లంఘించిన సింహంలాగ నొగలెక్కి కూచున్నాడు శల్యుడు. మెరుపుతోవున్న మేఘంమీద ప్రకాశించిన సూర్యుడిలాగ శల్యుడితోవున్న రథం ఎక్కి వెలిగిపోయాడు కర్ణుడు.

# కర్ణపర్వం



## రెండో ఆశ్వాసం

ధృతరాష్ట్రుడు : అంత ప్రార్థించాడు కదా, మా దుర్యోధనుడు తగిన ఉపకారం చేశాడా, శల్యుడు? అంతకోరుకుని అతణ్ణి సారథిగా పెట్టుకున్న వీరుడు కర్ణుడు ఎలా యుద్ధం చేశాడు?

సంజయుడు : వంది మాగధులు స్తోత్రాలు చేశారు. రథి కర్ణుడూ, సారథై శల్యుడూ రథంమీంచి దుర్యోధనుడివేపు చూశారు.

"కర్ణా" ఉత్సాహంతో ఎత్తుకున్నాడు దుర్యోధనుడు "భీష్ముడూ ద్రోణుడూ కృష్ణార్జునుల కంటె అధికులు. వీళ్ళిద్దరూ వాళ్ళపని పట్టేస్తారని నమ్మాను. అది జరగలేదు. వాళ్ళిద్దరూ చెయ్యలేని పని నువ్వు చెయ్యాలి. ధర్మరాజుని పట్టెయ్యాలి. అతడే అన్నమాటేమిటి? పాండవుల్ని అందరినీ వరసపెట్టి చంపెయ్యాలి. నువ్వే విజయధ్వజం స్థాపించాలి. పద" అన్నాడు.

### శల్యసారథ్యం

రథంపోనియ్యమన్నాడు కర్ణుడు. పగ్గాలు సడలించాడు శల్యుడు. కర్ణుడి రథం కదిలింది. శంఖాలు గింగురుమన్నాయి. భేరీలూ, పణవాలూ ధణధణలాడాయి. దిక్కులు ప్రతిధ్వనించాయి.

రథం నడుస్తోంది. కర్ణుడి కళ్ళల్లో గర్వరేఖ తాండవమాడుతోంది. "సారథీ!" మీసాలు మెలివేస్తూ అన్నాడు కర్ణుడు — "అడ్డులేని నా పరాక్రమమంతా ఇవాళ చూపిస్తాను. మహోగ్రమైన నా

బాణాలికి పాండవులు జజ్జనల్లిపోయేట్టు చేస్తాను. దేవతలు ముక్కు మీద వేలు పెట్టుకోవాలన్నమాట. పొన్నాళ్ళాదూ, నువ్వే భళీ అంటావు."

"పాండవుల్ని అంత తేలిగ్గా కట్టెయ్యకు, కర్ణా!" అందుకున్నాడు శల్యుడు— "సత్యపరాక్రములు వాళ్ళు. శౌర్యధనులు. భుజవీర్యంలో అఖండులు. తేజోధనులు. మహాస్త్రాలన్ని వాళ్ళచేతిలో వున్నాయి. దేవేంద్రుడైనా వాళ్ళ పేరుచెబితే జంకుతాడు. గాండీవం కర్ణకఠోరంగా వినపడింకో, భీముడిగద తళుక్కుమని కంటపడిందో, వొణుకు పుట్టి నోరు పెగల్దంటే నమ్ము. అర్జునుడి బాణాలతో రథాలమీద రథాలు కూలిపోయినప్పుడు, భీముడి గదతో ఏనుగులు పీనుగలయినప్పుడు, నకుల సహదేవులూ ధర్మరాజూ విరుచుకుపడితే, మనసేనాధిపతులు తోకలు ముడిచినప్పుడు— అప్పుడూ ఇప్పుడు అన్నమాట అంటే రాణిస్తుంది."

శల్యుడిమాటలు ఏవీ వినిపించుకోనట్టు నటించి బొమలు ఎగరవేస్తూ మళ్ళీ అన్నాడు కర్ణుడు: "నాచేతి చేవ ఇప్పుడే చూద్దువుగాని"

ఉరకలువేస్తూ వస్తున్న కర్ణుణ్ణిచూసింది కౌరవసేన. సముద్రం పొంగినట్టు పొంగింది. యోధులు సింహనాదాలుచేశారు. గుర్రాలు సకిలించాయి. ఏనుగులు గీపెట్టాయి. ఆకాశం గర్జించింది. మబ్బులేని పిడుగులు పడ్డాయి. నెత్తురువాన కురిసింది. ఉల్కలు రాలాయి. పెద్ద గాలిలేచింది. ధూళి ఎగజిమ్మింది. కౌరవనాశనం కనపరుస్తూ ఎన్నో ఉత్పాతాలు పుట్టాయి. అవేవీ లెక్కచెయ్యలేదు మనవాళ్ళు. విధి వాళ్ళ కళ్ళు కప్పింది. శల్యుణ్ణి సారథిగా పెట్టుకువచ్చిన కర్ణుణ్ణి చూడ గానే ఎక్కడలేనిఆశా కలిగింది వాళ్ళకి కర్ణుడిచేతిలో పాండవులు చచ్చిపోతారనే నమ్మారు వాళ్ళు.

"భీష్ముడూ, ద్రోణుడూ నాముందువీపాటి? పాండవులచేతపడి

పోయారు !" అంటూ సేనకి ముందు నడిచాడు కర్ణుడు. అర్జునుడిపరాక్రమం తలుచుకుంటూన్నకొద్దీ అతడిక్రోధం అధికమవుతూవచ్చింది. పెద్దపెద్ద నిట్టూర్పులు వచ్చాయి. మానమూ, దర్పోన్మాదమూ రెట్టించాయి.

"ద్రోణుణ్ణీ, భీష్ముణ్ణీ కొట్టేశామని మహా మిడిసిపడుతున్నారు పాండవులు" శల్యుడితో అన్నాడు కర్ణుడు — "పుచ్చకాయల్లాగ వాళ్ళ తలకాయలు చెక్కేస్తాను చూడు. ధనస్సు పట్టుకుని రథమెక్కి, యుద్ధానికి బయలుదేరానో దేవేంద్రుడైనా గడ్డిపరకే అనుకో నాకు. భీష్ముడూ, ద్రోణుడూ ఎంతో వీరులు కదా, అంత చచ్చుచావు చచ్చారేం అంటావ్? చంపరాని అలోకవీరుల్ని చంపేశాడు అర్జునుడు. అలాంటివాళ్ళనే ఎంతోమందిరాజుల్ని కొట్టేశాడు. గర్వంతో మిడి-పోతున్నాడు. పరసపట్టిన మృత్యువులాగ యుద్ధానికిదిగబడుతున్నాడు. సారథీ, అతణ్ణి నేనే చంపేస్తాను చూడు. ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ కూడబలుక్కుని వొక్కుమ్మడై వచ్చి మీదపడ్డారో తీవ్రమైనబాణాలతో వాళ్ళని వొక్కొక్కళ్ళే చెక్కేస్తాను; పడుకోబెడతాను. లోకముడిచారా సరే సరి. కాదూపోదూ అని కలబడ్డారో కండలుకండలు చెండేస్తాను.

"భీష్ముడు పోయినా ద్రోణుడి పరాక్రమంమీద ఆశవుండేది. ద్రోణుడు నిజంగా ఎన్నో అన్ని మహాస్త్రాలు కలవాడు. భుజబలశాలి, శౌర్యసంపన్నుడు. అఖండమైన పరాక్రమశాలి అతిరథుల్లో మొదటివాడు. అంతటిమహారథుడు పడిపోగానే నడుం విరిగిపోయింది కౌరవులికి. ఆప్తులైన సైనికులు దిగులుపడిపోయారు. ఇదంతా నీకు తెలుసు. అయినా పరశురాముడి దయవల్ల సంపాదించిన ఈరథమూ, ధనుస్సూ, దారుణమైన దివ్యాస్త్రాలూ వున్నాయి. వీటితో అర్జునుణ్ణి చంపేస్తాను.

దేవతలైనా అడ్డుకోలేరంటే నమ్ము. ప్రాణాలికి ఆశపడను. రారాజు చేసిన మన్ననకి ఇవాళ అప్పుతీర్చుకుంటాను" అన్నాడు.

"ఎందుకూ ఈపూకదంపు!" సాగదీశాడు శల్యుడు — "విన్న వాళ్ళు నవ్విపోతారు. పిచ్చాడి వంటారు. అర్జునుడి బలమూ, శౌర్యమూ తెలియవు కనకనా మాకు? నిన్నూ, అర్జునుణ్ణీ యుద్ధంలో బాగా ఎరుగును లోకం. అద్భుతమైన పరాక్రమశాలి అర్జునుడు. నువ్వో పౌరుష హీనుడివి.

"అర్జునుడితో అర్ధరాత్రి యుద్ధంచేసి ఓడిపోయాడు అంగార పర్ణుడు. మీ ఘోషయాత్రనాడు దుర్యోధనుణ్ణి పట్టుకుపోయినప్పుడు మానం పోగొట్టుకున్నాడు చిత్రసేనుడు. ఖాండవవనం కాసుకోలేక సిగ్గుపడిపోయాడు దేవేంద్రుడు. మాయకిరాతుడై పందికోసం దెబ్బలాడి లొంగిపోయాడు పరమశివుడు. ఇదిగో వీళ్ళందరికంటే అధికుడైన వీరుడైతే 'పొడిచేస్తాను, చంపేస్తాను' అంటే చెల్లుతుంది. అంతేకాని కర్ణా, మనబోట్లు అర్జునుణ్ణి గెలుస్తానంటే చెల్లదు, నోటిదురుసుతప్ప.

"ఇంతఎందుకూ? ద్రోణుడూ, భీష్ముడూ, దుర్యోధనుడూ, కృపుడూ, అశ్వత్థామా, నువ్వూ అంతరాణువ వేసుకుని పెద్ద దండయాత్రచేశారు మత్స్యదేశంఆలమందలమీద. ఏమయింది? ఒక్క అర్జునుడిముందు అంతమందితోనూ తోకముడిచేశావు. ఇప్పుడు పెద్ద కబుర్లు చెప్పుతున్నావు! అప్పటికీ ఇప్పటికీ అతడి బాణాలు తుప్పుపట్టి పోయాయనుకున్నావా? 'వెనకటిలాగ పారిపోను. ఇవాళ అతడితో స్థిరంగా నిలబడి దెబ్బలాడతాను. ప్రాణాలు దాచుకోను. నింద భరించలేను' అని వున్నమాట అను. బాగుంటుంది. నిజం పలికి తుదకి మరణించినా మంచిదే. మరణం — ఎలాగూ తప్పదు. యుద్ధంలో అర్జునుడిపాలబడితే మరణం కొంగుబంగారం" అన్నాడు.

ఒళ్ళుమండింది కర్ణుడికి. అయినా ఆపుకుంటూ అన్నాడు:

"అర్జునుడి పక్షం మాట్లాడుతున్నావు. పనికిమాలినమాట లెందుకూ? జంకులేకుండా నేను అతడిమీదికి వెళ్ళినప్పుడు నువ్వే చూద్దువుగాని. బాహుశక్తీ, ధీరత్వమూ, కౌశలమూ, పూనికా — ఇవి ఎవళ్ళలో ఎక్కువకనిపిస్తే వాళ్ళని పొగుడు. అంతవరకూమాత్రం పూరుకో."

"సరే, అప్పుడే కానీ" పూరుకున్నాడు శల్యుడు. "రథం పోనీ" తొందరచేశాడు కర్ణుడు. గుర్రాలు అదిలించాడు శల్యుడు. పరిగెత్తింది రథం. రణరంగానికి వచ్చేసింది. మన సైనికులు సంతోషించారు. రణరంగమంతా వొకసారి కలయజూశాడు కర్ణుడు. పాండవసేనవేపు తిరిగి అన్నాడు: "ఓహో, సైనికులూ! మీరంతా నామాట వినండి. మీలో ఎవరైనా సరే, అర్జునుణ్ణి ఇప్పుడు నాకు చూపిడితే చాలు, తగిన గుర్రాలతో బంగారం రథాలు ఒహుమానం చేస్తాను. ఇంకా కావాలంటే బలమైనవి, గాలిలా ఎగిరిపోయే కాంభోజదేశం గుర్రాలు ఇస్తాను. ఇంకా కావాలంటే కొండల్లాటి ఏనుగులు ఇస్తాను. మాంచి పికపికలాడుతూవున్న అందమైన ఆడాళ్ళని ఇస్తాను. గ్రామాలిస్తాను. ఇంకా ఏదికావాలంటే అది ఇస్తాను. ఇంకా చెపుతున్నాను వినండి. అర్జునుడి రథం ఇదిగో అని చూపించినవాడికి, కృష్ణుణ్ణీ అర్జునుణ్ణీ చంపేసి వాళ్ళ యాపదాస్తులూ ఇచ్చేస్తాను" అంటూ శంఖం పూరించాడు.

కర్ణుడి ఉత్సాహంచూసి దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్లూ పట్టలేని సంతోషం పొందారు. రణదుందుభులు ధణంధణా- దిక్కులు దిమ్మెత్తిపోయాయి. యోధులు సింహనాదాలు చేశారు. సైనికులు పొలికేకలు వేశారు.

"ఎవ్వరో చూపించడ మెందుకూ?" నవ్వుతూ మొదలెట్టాడు శల్యుడు— "ఇప్పుడే చూస్తావు అర్జునుణ్ణి. కొవ్వెక్కినట్టు వాళ్ళకీ వీళ్ళకీ ధారపోస్తానంటావేం, ధనం! వద్దు. నవ్వుతారు. అంత ధనం [illegible]

తూవుంటే మరేదైనా మంచిపనికి వినియోగించు. అపాత్రదానం కూడదు.

"అంతరం తెలియకుండా అర్జునుణ్ణీ కృష్ణుణ్ణీ యుద్ధంలో గెలుస్తా నంటున్నావు. ఎప్పుడైనా ఎక్కడైనా నక్క సింహాన్ని గెలవడం చూశామా? అగ్గిలో దూకుతా నన్నట్టు అర్జునుడిమీదికి వురుకుతా నంటున్నావు. వద్దు. బతికి బట్టకట్టాలనివుంటే ఆపని ఎద్దు. చెడతావు. నువ్వు అన్నట్టు ఎవ్వరూ అనలేరు; అనరు. అంతకాలం దగ్గిరపడ్డట్టు వుంది నీకు. నామాట కొంచెం చెవినిపెట్టు. ఒంటిగా వెళ్ళవద్దు. యోధులతోనూ, సేనలతోనూ కలిసివెళ్ళి యుద్ధం చెయ్యడం మంచిది. కౌరవుల హితం కోరి మాట్లాడుతున్నాను. నీకు కష్టం అనిపించ వచ్చు. మరోలా అనుకోకు. దురాగ్రహం తెచ్చుకోకు" అన్నాడు.

"నాబలం నమ్ముకు నేను బయలుదేరాను" కస్సుమన్నాడు కర్ణుడు — "నాపూనిక మాన్పించడానికి ఇంద్రుడికైనా తరంకాదు. నీకా శక్యమవుతుంది? ఎవో ఆప్తుడు చెప్పినట్టు చెప్పి పిరికిమందు పోస్తు న్నావు. బెదిరిస్తే బెదిరిపోయేరకం కాదు నేను" అంటూ రుసరుస లాడాడు.

"ఇప్పుడు నేను చెపితే అలాగే వుంటుంది" మరింత కుంగించా లంటూ అందుకున్నాడు శల్యుడు — "గాండీవం మోగిస్తూవచ్చి గట్టి గట్టి బాణాలతో అర్జునుడే బుద్ధిచెప్తాడు. అప్పుడు తెలిసివస్తుంది. సింహంతో లేడీ, ఏనుగుతో కుందేలూ, పెద్దపులితో కుక్కా, గెద్దతో పామూ పోట్లాడి చవ్వడం ఎలాటిదో అర్జునుడితో నువ్వు పోరాడి చవ్వడమూ అలాటిదే అనుకో. అంతేకాని నీకు వున్న బలమేమిటి, దాన్ని నమ్ముకోడమేమిటి, బయలుదేరడమేమిటి!"

శల్యుడి మాటలు శల్యాలా వేధించాయి కర్ణుణ్ణి. రెండుకళ్ళూ చింతనిప్పుల్లా మండాయి. "ఉత్తముడి గుణాలు ఉత్తముడు కాని

గ్రహించలేదు" చురచురా శల్యుణ్ణి చూస్తూ అన్నాడతడు – "గుణంలేనివాడివి నువ్వు. 'ఇతడిలో ఈగుణం వుంది' అని గణించే నైపుణ్యం లేదు నీకు. అర్జునుడి అస్త్రవిద్య ఏపాటిదో నాకు తెలిసినంత నీకు తెలియదు. అతడిశక్తి, కృష్ణుడి దేవా తెలుసు నాశక్తి ఏపాటిదో నాకు తెలుసు. ఇది తెలిసే నాదివ్యాస్త్రాలతో వాళ్ళని మూడ్చేస్తానని నిశ్చయించుకున్నాను. అది ఎలాగో కూడా చెపుతాను, విను. ఎంతోకాలమైనా అమ్ములపొదిలో వుంది నాగాస్త్రం. పువ్వులూ, గంధమూ పెట్టి పూజిస్తున్నాను. ఎదురు లేదు దానికి. దారుణమైంది. ఎంతటివాణ్ణయినా నంజేసుకుంటుంది. దాంతోనే కృష్ణుణ్ణో, అర్జునుణ్ణో ఎవణ్ణో ఒకణ్ణి లేదనిపించేస్తాను. భార్గవాస్త్రంతో రెండో వాణ్ణి పూడ్చేస్తాను. యాదవుల్లో కృష్ణుడిమీదా, పాండవుల్లో అర్జునుడి మీదా విజయలక్ష్మి ఆధారపడివుంది. వాళ్ళిద్దరితోనూ యుద్ధం చెయ్యడంకంటే కావలిసిం దేముంది? వాళ్ళ చక్రమూ గాండీవమూ పిరికి వాళ్ళని భయపెడతాయి. గరుడధ్వజమూ, కపిధ్వజమూ బలంలేని వాళ్ళని బెంబేలుపెడతాయి. కాని నాకో – నాకు ఉల్లాసం కలిగిస్తాయి. ఉత్సాహం రేకెత్తిస్తాయి. వెయ్యిమంది కృష్ణులూ, పదివేల మంది అర్జునులూ ఎత్తివచ్చినా సరే, పోరాడతాను. యుద్ధమంటే బాగా తెలియదు నీకు. అంచేతే పిరికిమందు పుచ్చుకుంటున్నావు. కాకికూతలు కూస్తున్నావు. అంతేకాక మేనల్లుళ్ళని పక్షపాతంతో లా పేల్తున్నావో ఏమో తెలియదు. ఇదిగో ఇపుడే చెపుతున్నాను. ఇంకా ఇలా పేలావో నీప్రాణాలు నీకు దక్కవనుకో.

"పాపిష్టిదేశంలో పుట్టావు. చెడ్డబుద్ధి కాకపోతే మంచిబుద్ధి ఎలావస్తుంది నీకు? రాజుల్లో అధముడివి. మీ నీచవ్యవహారం ఆబాల గోపాలమూ చెప్పుకుంటారు. 'మద్రదేశంవాడివి స్నేహపాత్రుడు కాడు. తడిగుడ్డతో గొంతుక కోస్తాడు. స్నేహితులకే ద్రోహం

చేస్తాడు. స్నేహితులచెడ్డ చాటుకాడు. దుష్టుడు. పాపిష్టి' అన్నమాట అక్షరాలా నిజమైంది ఇప్పుడు. మీదేశంలో వావీ వరసా లేకండా స్త్రీలూ, పురుషులూ పడుచుకుంటారు. వ్యభిచారమంటే తప్పేలేదు మీకు. ముందు కల్లూ, తరవాత చనుబాలూ అయి పెరుగుతారు. మీగుణాలు చెప్పేదేముంది?

"లోకంలో వున్న పాపాలన్నీ మద్రదేశంలోనే వున్నాయి. మీదేశంలో తండ్రీ కొడుకూ, అత్తా కోడలూ, తల్లీ కూతురూ, మేనమామా అల్లుడూ, అన్నా తమ్ముడూ, మామా అల్లుడూ, తాతా మనవలూ, బంధువులూ స్నేహితులూ ఇంటికి వచ్చినవాళ్ళూ నౌకర్లూ, దాసీలూ అందరూ కలిసి ఆడామగా భేదంలేకండా కల్లుతాగి తందనాలాడతారు. గొడ్డుమాంసం తింటారు. బూతుపాటలు పాడతారు. మద్రదేశం వాళ్ళకి స్నానమూ, గాంధారంవాళ్ళకిశుచీ శూన్యం. మీదేశం ఆడంగులు కల్లుతాగి బట్టలు విప్పేసి నాట్యంచేస్తారు. స్వేచ్ఛగా వ్యభిచరిస్తారు. గాడిదల్లాగ, లొటిపిటాల్లాగ నిలబడి వొంటేలు పోసుకుంటారు. మద్రదేశం ఆడదాన్ని ఇన్ని తరవాణినివ్వు అడిగితే 'అమ్మో, తరవాణి నాప్రాణం' అంటూ పిర్రలు బాదుకుంటుంది. 'కావలిస్తే నాకొడుకుని ఇచ్చేస్తాను. లేదంటే నామొగుణ్ణి ఇచ్చేస్తాను. కాని తరవాణిమాత్రం ఇవ్వను' అంటుంది. సమర్తాడని పడుచుగుంటలు తిండిపోతులై తిరుగుతారు. సిగ్గూ, లజ్జా వొదిలేస్తారు. శుచీశుభ్రం లేకండా గొంగళ్ళు కప్పుకుని మసులుతారు. అలాటి స్త్రీలకి పుట్టావు నువ్వు; మంచిమాటలు ఎలావస్తాయి? పదిమందికి పుట్టి, కల్లుతాగుతూ పెరిగినవాళ్ళకి మంచిబుద్ధి ఎలా అబ్బుతుంది? విన్నావ్రా, శల్యా! అట్టే మాట్లాడకు. యుద్ధానికి పద ముందుకు.

"ఇంకోమాట, అమానుషమైన విక్రమంతో వీరవిహారంచేసి శత్రువుల్ని సంహరించి, వీరమరణంపొందినా మంచిదే అని నాపూనిక. నీలాంటివాళ్ళా నా గొప్పతనం కాదన్న వాళ్ళు."

"అట్టే నాకు కోపం తెప్పించకు. గదతీసి తలచిదగ్గొడతాను. మాట్లాడకుండా తిన్నగా రథం నడుపు" అన్నాడు.

"మంచి చెప్పడానికే తగనంటావా!" మళ్ళీ ఎత్తుకున్నాడు శల్యుడు—"నీరథం నడుపుతున్నాను అంటే ఏమన్నమాట! దుర్యోధనమహారాజుపని చేస్తున్నా నన్నమాట ఆతడిమంచికోసం వున్న మాట చెప్పకపోతే ఎలా! సారథి అయినవాడు దక్షతకలిగివుండాలి. రథికుడిచేవా, గుర్రాలబలమూ, ఆయుధాల మంచీ, యుద్ధంతీరూ మంచీ చెడ్డా నిర్ధారణచేసి హితం చెప్పడం సారథి ధర్మం. కోపం తెచ్చుకుని నువ్వు నన్ను, తిట్టినా నేనుమాత్రంచెప్పడం మానను.

"ఏం తప్పచేశానని గదతో తల చిదగ్గొడతావు! నువ్వు అన్నావు కదా అని మంచిచెప్పడం మానేస్తానా! నేను చెప్పినట్టు చేసినా మంచిదే, చెయ్యకపోయినా మంచిదే. కాని వొక దృష్టాంతం చెపుతాను ఆలకించు.

## కాకీహంసా

సముద్రంలో లోగడ వొకలంక వుండేది. అక్కడ ధర్మవర్తి అనే రాజుగారి పట్నంలో వొక కోమటి వుండేవాడు. ఎంతో దనం కలవాడతడు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. ఎన్నో దానాలు చేశాడు. పాడీ పంటా ఇంట్లో మస్తుగా వుండేవి. ఇంటిల్లిపాదీ పిల్లలు కలకల్లాడుతూ వుండేవాళ్ళు. ఇలా వుండగా వొక కాకి వాళ్ళ పెంట్లో చేరింది. కోమటి కొడుకులు ఎంగిళ్ళువేసి దాన్ని పెంచారు. కడుపారా ఎంగిళ్లు తింటూ మస్తుగా పెరిగింది కాకి. బాగా కొవ్వింది. కళ్ళు నెత్తి

కెళ్ళాయి. ఎలాంటిపక్షులైనా సరే తనకింద దిగదుడుపు అనకుంటూ వచ్చింది, బోంఏరుచూసుని విచ్చలవిడిగా తిరిగింది.

"ఒకనాడు కొన్ని హంసలు సముద్రపొడ్డుకి వచ్చాయి. రెక్కల బలంలో గరుత్మంతుడితో సమానం అవి. కోమటికొడుకులు హంసలు చూశారు. వాటిని చూపిస్తూ కాకితో అన్నారు: 'పక్షుల్లో నిన్ను మించిన పక్షి లేదు. ఇదిగో ఆకాశమార్గాన వెళుతున్నాయి హంసలు. వీటితో ఎగిరి గెలుచుకోవాలి నువ్వు.'

"తారతమ్యజ్ఞానం లేకండా బుద్ధిలేని కోమటికుర్రాళ్లు చెప్పారే అనుకో, తనకిమాత్రం బుద్ధివుండవద్దూ? ఎగిర్లుదని కొవ్వెందికదూ, మూర్ఖబుద్ధితో తానూ హంసలంతటిదాన్నే అనుకుంది కాకి. తిన్నగా హంసల దగ్గిరికి వెళ్ళింది. వాటిల్లో అన్నిటికంటె బలమైన హంసని చూసింది. దాని దగ్గిరికే వెళ్ళింది. ఎగురుదాం రమ్మని కవ్వించింది. హంసలు కాకిని చూశాయి. నవ్వుకున్నాయి.

'కాకులు హంసలతో పోటీపడడం లోకంలో ఎక్కడైనా వుందా?' అన్నాయి హంసలు— 'మానససరోవరంలో వుంటాంమేం మాబలమూ, వడీ ఇంతా అంతా కాదు. పక్షులన్నీ మమ్మల్ని పొగుడుతాయి. హంసలంకనక ఎంత దూరమైనా పరవాలేదు మాకు. అలాంటి మాలో బలమైన హంసని ఎగురుదాం రమ్మని పిలుస్తున్నావు. పిచ్చికాకిలా వున్నావు!'

'నూటా వొక్క గతులు తెలుసు నాకు' అంది కాకి— 'వొక్కొక్క గతితోనూ వందేసి యోజనాలు ఎగరగలను పొడావుగా మీదికి ఎగరడమూ, అక్కణ్ణుంచి చక్కా కిందికి సమవేగంతో దిగడమూ, దూరం ఎగరడమూ, హెచ్చుతగ్గులు లేకండా సమంగా ఎగరడమూ, వొకేక్రమంలో ఎగరడమూ, విచిత్రగతితో ఎగరడమూ,

వక్రగతితో ఎగరడమూ, సుళ్లు తిరిగి ఎగరడమూ * వీటిలో వేటిలో అయినా సరే, మీరు ఎలా కోరుకుంటే అలాగ ఎగిరి, మీ మొనగాణ్ణి ఓడించేస్తాను. తక్కిన హంసలు అడిలిపోవాలి. మా కాకిచుట్టాలు జయపతాక ఎగరేస్తాయి; సంతోషిస్తాయి" అంది.

"'అమ్మో, వందరకాలు ఎగురుతావు నువ్వు!' హంసల మొనగాడు అంది- "అన్ని పోకిళ్ళు తెలియవు నాకు. పిట్టలన్నీ ఆకాశం మీద ఎలా ఎగిరి దూరంవెళతాయో అలా ఎగిరవెళదాం, సముద్రం మీంచి. రా!'

"కాకులన్నీ గొల్లుమన్నాయి. లేవిడీలు కొట్టాయి. 'వంద గతులు తెలుసు మావాడికి. ఒక్కటే తెలుసు నీకు నువ్వేమిటి' మావాడితో పందెం వెయ్యడమేమిటి!' అన్నాయి.

"కాకులగోల వినిపించుకోలేదు హంస. 'ఊఁ, కానీ' అంటూ రెక్కలు విసిరింది; ముందుకి సాగింది. ఎంగిళ్ళకాకీ ఎగిరివెళ్ళింది. హంసా, కాకీ రెండూ ఆకాశమెత్తున సముద్రం మీద ఎగురుతూ బయలు దేరాయి. ఒడుదుడుకులు లేకండా నెమ్మదిగా ఎగిరింది హంస. వెర్రి పరుగులు పెట్టింది కాకి. ఎంతో వేగంతో ఎగిరింది. ముందికి జాయ్యి మని కొంతదూరం వెళ్ళిపోయేది. తిరిగివెనక్కి వచ్చేది; హంసని పిలిచేది. దాని ముక్కుమీద ముక్కుమోపేది చుట్టూ తిరిగేది. రెక్కలతో

* ఉడ్డీనం (ఊర్ధ్వగతి), అవడీనం (అధోగతి), ప్రడీనం (వేగగతి) డీనం (సమగతి) నిడీనం (ధీరగతి), సండీనం (సఖ్యగతి), తిర్యగ్డీనం (వక్రగతి), విడీనం (విచిత్రగతి), పరిడీనం (సర్వదిగ్గతి), పరాడీనం (పశ్చాద్గతి), సుడీనం (సుకుమారగతి), అభిడీనం (ప్రచండగతి), మహాడీనం (దీర్ఘగతి), ఖడీనం (మండలగతి), అతిడీనం (మృదుగతి), సండీనడీనకం (సర్వదిక్సుగతి) సండీనోడ్డీనడీనకం (శృంగారోత్సాహగతి), డీనవిడీనకం (వేగ ఊర్ధ్వగతి), సంపాతకం (శోభనగతి) సముదీర్ణం (మండలాకార అధఃపతనం), వ్యతిరిక్తం (శోభనభావ ఊర్ధ్వగమనం), గతాగతికం (శోభనభావ అధోగమనం), ప్రతిగతం (గుంపుతో కలిసి వెళ్ళడం), పరిగతం (పరస్పర ఉత్సాహగతి.)

రెక్కలు టపాడించేది. తోకను ఆడించేది. చిత్ర-విచిత్రంగా తిరిగేది. కుంటి కేది. కూత పెట్టేది. నవ్వేది. అలా రకరకాల ఎగురుతూ వెళుతూన్న కాకిని చూసి, కావుకావుమంటూ గావుకేకలు వేశాయి కాకులు. హంసల్ని వేళాకోళాలు కొట్టాయి. నవ్వుతూ, కేరుతూ, చప్పట్లు కొడుతూ, తుళ్ళుతూ గోలగోల చేసేశాయి. 'హంసపని అయిపోతుంది. ఓడిపోడం తప్పదు' అంటూ గొంతు చించుకు అరిచాయి.

"ఈ కాకుల గోలంతా వింది హంస. మంచి ఉత్సాహం తెచ్చుకుంది. పడమటి దిక్కు తిరిగింది. రెక్కలు విసిరింది. బాణంలా ముందుకి సాగింది. ప్రాణాలు బిగపట్టింది కాకి. హంసతో కూడా వేగంగా ఎగిరింది. వెళ్ళి వెళ్ళి అలిసిపోయింది. రివ్వుమని వేగం హెచ్చించింది హంస. కాకిపని అయిపోయింది. అవయవాలన్నీ చచ్చుబడిపోయాయి. గుండెల్లో దడపుట్టింది. కింద సముద్రం. మీద ఆకాశం. కనుచూపు మేరలో ద్వీపం కనిపించదు. 'నేరక పోయామకున్నాను. కాలు మోపడానికి తావులేదు. చెట్లూ చేమలూ, లతలూ, తుప్పలూ, పొదలూ ఏమీ లేవు. నీటిజంతువులతో భయంకరంగా వుంది సముద్రం. వాటి వాలకంతో నా ప్రాణం పోతుంది. ఏం దారి?' అంటూ దీనంగా మొహం వేలవేసింది. దిగులు పడిపోయింది.

"దాహం. గొంతుక ఆర్చుకుపోతోంది. శరీరం పట్టు తప్పిపోతోంది. రెక్కలు తేలిపోతున్నాయి. ఎగరలేకపోతోంది. కిందికి పడిపోతోంది కాకి.

"'ఏం కాకా! రకరకాల గతులు తెలుసునీకు. ఏం గతి ఇది? ఏ గతిని ఎగురుతున్నావు? వినపడదూ? కాకన్నా, వెనక్కి తగ్గేస్తున్నావేం!' అంది హంస.

"ఆపసోపాలు పడిపోయింది కాకి. రెక్కలు సముద్రం కెరటాలకి తగులుతున్నాయి. ముక్కు నీటికి తగులుతోంది. ఎగరలేక ఎగుర

లేక, దీనంగా, దిగాలుగా సముద్రంలో పడిపోయింది. మునగానా తేలానా — చావుబతుకుల కొగవస్థలో పడిపోయింది.

"'ఏం, అయిపోయిందా?' అంది హంస — 'చెప్పవచ్చు చెప్పినట్టు చెయ్యడం కష్టం'

"'కా కా కాపాడు' ప్రాధేయపడుతూ అంది కాకి — 'నా తాహత్తు ఏమిటో ఇప్పుడు అర్థమైంది. ఎంగిళ్ళు తిని కొవ్విపోయాను. కానలేక పోయాను కళ్ళుమూసుకుపోయాయి నాకంటే గొప్పపక్షి లేదనుకున్నాను. కరుణించు. కాపాడు. కావు కావు. తిరిగి కాకుల్లో నన్ను కలుపు' అంటూ కంగారుపడిపోయింది. 'కా కా కావు కావు'—నోరుచాపేసింది. కెరటాల్లోపడి చావుచూపులు చూసింది.

"కనికరించింది హంస. జాగ్రత్తగా కాకిని కాళ్ళలో ఇరికించుకుని పైకి తీసింది. చస్తూ చస్తూ వున్న దాన్ని బతికించింది. బలమంతా వినియోగించింది. మెల్లిగా వీపుమీద పెట్టుకుంది. మోసుకువచ్చింది. బైలుదేరిన చోటికి తెచ్చి దించింది. చూసిన పిట్టలన్నీ హంసని మెచ్చుకున్నాయి. కొంచేపటికి తెప్పిరిల్లింది కాకి.

"'ఇలాంటి వెర్రివేషాలు ఎప్పుడూ వెయ్యకు' కాకులన్నీ విన్నట్టు అంది హంస. తరవాత తన మందతో కలిసి తన దారిని తాను వెళ్ళిపోయింది.

"విన్నావా, కర్ణా, కోమటి కొడుకుల ఎంగిలికూడు తిని పెరిగిన కాకిలాగ, కౌరవకుమార్ల ఎంగిలికూడు తిని కొవ్వి, పెద్దవాళ్ళని ధిక్కరిస్తున్నావు నువ్వు. నీ తాహతేమిటో నువ్వు ఎరగవు. దీనివల్ల చెడ్డతప్ప ఇంకొకటిలేదు. ఉన్నమాట అంటే వులుకుతావెందుకు? విను:

"విరాటరాజు ఆవులు మళ్ళించి, నీతమ్ముణ్ణి తెగేసినప్పుడు అర్జునుణ్ణి తాకలేక పోయావు; ఎక్కడికి వెళ్ళావు? ఘోషయాత్రలో

దుర్యోధనుణ్ణి వొదిలేశావు; ఎక్కడికి పారిపోయావు? అదలా వుండనీ, అవాళ కౌరవసభలో జామదగ్ని స్వయంగా చెప్పలేదూ, అర్జునుడి పరాక్రమమూ, శ్రీకృష్ణుడి మహాత్మ్యంకూడా? భీష్ముడూ, ద్రోణుడూ, ఎన్నిసార్లు చెప్పారు, వాళ్ళని గెలువలేమని? తెలిసి తెలిసీ ఎందుకూ ఈ తెలివితక్కువ మాటలు?

"కృష్ణార్జునుల్ని వొంటిగా శివుడన్నా గెలవలేడు. ఈ వెర్రి వేషాలు కట్టిపెట్టు. తగిన రథికులతో కలిసి వెళదాం; యుద్ధం చేద్దాం. శత్రువుల్ని అడలెత్తిద్దాం. అర్జునుడూ కృష్ణుడూ సూర్యచంద్రులైతే నువ్వు మిణుగురనుకో."

"కృష్ణుడి గొప్పతనమూ, అర్జునుడి బలమూ తెలియకుండానే వాళ్ళమీదికి వెళుతున్నానా?" తలపంకిస్తూ అన్నాడు కర్ణుడు - "నువ్వు ఎంతవద్దన్నా వాళ్ళని వొదిలిపెట్టను. వాళ్ళయినా వుండాలి, నేనైనా వుండాలి. అంతే మూడోమార్గం లేదిక. కారుకూతలు కుయ్యకు. ఊరుకో" అంటూ అక్కడి రాజులందరూ వినేట్టు శల్యుడితో ఇంకా ఇలా అన్నాడతడు:

## గురువు కోపం

"తలుచుకుంటే విచారం వేస్తుంది. గురువు పరశురాముడి కోపమూ, బ్రాహ్మడి శాపమూ. అవే లేకపోతే శివుణ్ణే లెక్కపెట్టను. అర్జునుడు ఏమాత్రం? ఏమయిందో చెపుతాను విను: అస్త్రవిద్యకోసం పరశురాముడి దగ్గిరికి మహేంద్ర పర్వతానికి వెళ్ళాను. చల్లనిచూపు చూసి, కులమేమిటని అడిగా డాయన. అసత్యదోషం వస్తే వచ్చింది గాక అని, బ్రహ్మాస్త్రానికి ఆశపడి, బ్రాహ్మణ్ణని బొంకాను. భయభక్తులతో ఆయన పాదాలు సేవించాను. గొప్పగొప్ప దివ్యాస్త్రాలు నేర్పాడు గురుదేవుడు. అస్త్రవిద్యలో అఖండుణ్ణి చేశాడు.

భార్గవాస్త్రమూ మొదలైనమహాస్త్రాలు ప్రసాదించాడు. తుదకి బ్రహ్మాస్త్రంకూడా అనుగ్రహించాడు. యుద్ధంలో పీకలమీదికి వచ్చినప్పుడు ఇదో ప్రయోగించమని సెలవిచ్చాడు.

"మర్నాడు గురుదేవుడు నాతొడలమీద తలపెట్టి నిద్రపోతున్నాడు. ఒకపురుగు వచ్చింది. నాతొడకింద దొలచడం మొదలెట్టింది. గురువు నిద్రాభంగ మవుతుందని భయపడ్డాను. కదలకండా కూచున్నాను. కొంచేపయింది. నిద్ర లేచాడాయన. రక్తంచూశాడు. 'ఏమిటిది' అని ప్రశ్నించాడు. జరిగింది విన్నవించాను. నాధైర్యానికి ఆశ్చర్యపోయాడు. 'నువ్వు బ్రాహ్మణుడివి కావు. ఎవడివో నిజం చెప్పు!' వొత్తి వొత్తి అడిగాడు. భయపడి పోయాను. 'సూతుణ్ణి' నిజం చెప్పేశాను. తొడ దొలిచిన పురుగు చూశాను, ఎంతో వికారంగా వుంది. ఎన్నడూ అలాంటి పురుగు చూసి ఎరగను. దేవేంద్రుడే అర్జునుడికి మేలుచెయ్యడంకోసం పురుగులా వచ్చి అలా చేశాడో ఏమో!

"కళ్ళెమెర్రా కోపంవచ్చింది గురుదేవుడికి. కపటంచేసి, బ్రహ్మాస్త్రం సంపాదించావు. అవసరానికి స్ఫురించకండా పోతుంది. చచ్చేముందుమాత్రం స్ఫురిస్తుంది. ఆపదలో అది స్ఫురించదు అని శపించాడు. ఇది పరశురాముడి కోపం సంగతి. ఇక బ్రాహ్మడి శాపం విను.

## బ్రా హ్మ డి శా పం

"అభ్యాసంచేసుకుంటున్నాను నేను. బాణాలు వాడుతున్నాను. అక్కడికి వొక ఆవుపెయ్య పరికింది. నాకు తెలియకండా వొక బాణం తగిలింది; చచ్చిపోయింది. అది వొక బ్రాహ్మణుడిది. నా హోమధేనువు' ఇది అంటూ వచ్చి మండిపడ్డాడతడు – 'బాణం కొట్టి చంపేశావు. నామాట బాణం. తగిలి చస్తావు. యుద్ధం మహాధుమ్ముగంలో వున్నప్పుడు నీరథచక్రం భూమిలో కూరుకుపోతుంది.

ఎవణ్ణి గెలవాలని పెనుగులాడతావో వాడిచేతే చస్తావు' అని శాపం పెట్టాడు. నాకు ప్రాణాలు నిలువునా ఎగిరిపోయినట్టయాయి. అతడి కాళ్ళావేళ్ళా పడ్డాను. వెయ్యి ఆవులూ, ఆరువందల ఎడ్లూ, వంద రథాలూ మెరుపుతీగల్లాటి వందమంది స్త్రీలూ, ఏడువందల ఏనుగులూ ఇచ్చాను. శాంతించమని బతిమిలాడాను. శాంతించలేదు బ్రాహ్మడు. అగ్నిహోత్రుడిలాగ మండిపోయాడు. 'నాదగ్గరవున్న సొమ్ములన్నీ ఇచ్చేస్తాను. కటాక్షించు' అని ప్రాధేయపడ్డాను. లాభం లేకపోయింది. 'ఈ కారు కూతలు కట్టిపెట్టు' అని చప్పున వెళ్ళిపోయాడు బ్రాహ్మడు. వెళుతూ వెళుతూ వెనక్కి తిరిగాడు. నిప్పులు కక్కుతూ ఉరిమాడు. 'నా మాట తప్పదు. అయితే గోవుని చంపిన పాపం పరలోకంలో నిన్ను బాధించదు. ఇక్కడ జరిగిందే నీకు ప్రాయశ్చిత్తమవుతుంది. వెళ్ళు' అన్నాడు.

"అంచేత శల్యా, నిజం చెప్తున్నాను. గురువు శాపానికీ, ఆ బ్రాహ్మడి శాపానికీ భయపడుతున్నాను. ఈ రాజులు నాతో కూడా సుఖ దుఃఖాలు అనుభవించవలసిన వాళ్ళే కనక కృష్ణార్జునులికి భయపడను. వజ్రాయుధంతో ఇంద్రుడూ, మృత్యుదండంతో యముడూ, పాశాలు పట్టుకుని వరుణుడూ, గదపట్టుకుని కుబేరుడూ వచ్చి కలబడినా బెదరను. తక్కినవాళ్ళ లెక్కేమిటి! ఇప్పుడు బ్రహ్మాస్త్రం స్ఫురిస్తూనే వుంది. పద, అర్జునుడిదగ్గిరికి రథం పోనీ. కర్ణుడిపేరు కలకాలమూ చెప్పుకో వాలి లోకులు. నా ధనుర్విద్యకి ప్రపంచం ముక్కుమీద వేలుపెట్టుకో వాలి. మహారథుడైన అర్జునుణ్ణి యమలోకం పంపిస్తాను.

"బాణాల కెరటాలతో శత్రువుల్ని ముంచేస్తే సముద్రుడు అర్జును డైతే నేను సముద్రపొడ్డు నవుతాను. బాణాల కిరణాలతో శత్రువుల్ని ఛేదించే సూర్యుడతడైతే నేను మేఘమవుతాను. బాణాల జ్వాలలతో శత్రువుల్ని కాల్చేసే అగ్నిహోత్రుడతడైతే నేను సరస్సునవుతాను. బాణాల వేగంతో శత్రువుల్ని కూలగొట్టే పెనుగాలి అతడైతే నేను

కొండవవుతాను. విల్లుపట్టినవా ళ్ళందరిలోకీ ఘనుడనికదా అంటు న్నారు అర్జునుణ్ణి! నేను కాకపోతే ప్రాణానికి ఆనపడే పిరికిపందలా అతణ్ణి ఎదిరిస్తారు? " అన్నాడు.

"నామంత్రం బాగా పనిచేసింది" అనుకున్నాడు శల్యుడు – "పీడి గుండెలు జారిపోయాయి. అర్జునుడి చేతి చావు తప్పదని రూఢిచేసు కున్నాడు. అందుకనే తాను చాలలేడనకండా గురువు కోపమూ, బ్రాహ్మడిశాపమూ సాకు చెపుతున్నాడు. ఆత్మస్తుతిపరాయణుడు. అర్జునుడి గుణవిశేషాలు చెప్పి మదం అడిచాను. అంచేతే కలిగింది ఈ జంకు. ధర్మరాజుకి నేను ఇచ్చినవరం సఫలమైంది."

కాని శల్యుడు చెప్పిన హంసా కాకీ కథ శల్యంలా వేధించింది కర్ణుణ్ణి. అంచేత ఇంకా ఇలా అన్నా డతడు.

"శల్యా, దృష్టాంతం చెపుతానని నన్ను కాకితో పోల్చావు. దురాత్ముడా! అర్జునుణ్ణి రాజసంసచేశావు నీచమైనకథ చెప్పావు. స్నేహితుడు చెయ్యవలసినపనేనా ఇది? పరుషంగా కారుకూతలు కుయ్యడమే నిచులబలం. నీచుడివి నువ్వు. కనక నే ఇలా కూస్తున్నావు. తలవి-ంవ నోరు తెలుపుతుంది. అయితేమాత్రం భయమనుకున్నావా నాకు? ఇకనైనా ఇవి కట్టిపెట్టు. 'అర్జునుడి భుజబలం ఏపాటి?' అని అడిగానా నిన్ను? రాజులందరి ఎదటా భట్రాజులాగ పొగుడుతున్నావు అర్జునుణ్ణి. యుద్ధంలో శత్రువుని పొగడడం మూర్ఖత్వం కాదా? ఇలాంటి దుష్టుల్ని సహించవచ్చా? సహించవలిసివచ్చి, చంపకండా వొదిలి పెడుతున్నాను నిన్ను. యుద్ధం పీకలమీదికి వచ్చింది. నిన్ను సారథిగా పెట్టాడు దుర్యోధనుడు. అంచేతే సహిస్తున్నాను. చంపకండా వూరు కుంటున్నాను.

"కల్లా కపటం లేనివాణ్ణి నేను. నాతోనే కపటం చేస్తున్నావు. మిత్రవంచన ఇది. ఏడుమాటలు మాట్లాడితేనే స్నేహితులవుతా

రంటారు. దేన్ని స్నేహమంటారో, అది పూర్తిగా వుంది దుర్యోధనుడి దగ్గిర. దేన్ని శత్రుత్వమంటారో అది నిండుగా వుంది నీ దగ్గిర. నా ధనస్సు బాగా విరిగిపోయింది. నీ కళ్ళలో కారం కొట్టినట్టు, దుర్యోధనుడి కళ్ళు చల్లబడినట్టు నా బాహుబలం చూపిస్తాను. కృష్ణార్జునుల మీద విరుచుకుపడతాను. వాళ్ళని వోడిస్తాను. నా మగతనం నిలుపుకుంటాను. ఇవాళ అర్జునుడిచేత చావకుండా బతికిపోయానో, చావన్నది వుండనే వుండదు అనిపిస్తోంది నాకు. సందేహం లేదు. నాది మీద చెయ్యి అయితే చాలు. నా రథచక్రం కుంగిపోకుండా వుండాలి. అర్జునణ్ణి పుష్పవ వూదేస్తాను. హరీ అనిపించేస్తాను. ఎలాంటి బాణం వేస్తాడో వెయ్యనీ. ఎంతటి మహాస్త్రం వేస్తాడో వెయ్యనీ. గడ్డిపరకలా కొట్టేస్తాను. శల్యా, భయపెట్టాలనివుంటే పాండవుల్ని భయపెట్టు. కర్ణుడు పరాక్రమంకోసం పుట్టాడు; భయపడడంకోసం కాదు. కీర్తికోసం పుట్టాడు; అపకీర్తి కోసం కాదు. సారథ్యానికి వొప్పుకుని, రాజుతో నువ్వు వొప్పందం చేసుకున్నందువల్ల బతికిపోయావు."

"కర్ణా," వెటకారంగా అన్నాడు శల్యుడు - "నువ్వు వెయ్యి చెప్పూ, లక్ష చెప్పూ అర్జునుణ్ణి గెలవలేవు. వెయ్యిమంది కర్ణులైనా వొక్క అర్జునుడిపెట్టు కారు."

కళ్ళు రెండూ చింతనిప్పుల్లా కణకణలాడాయి కర్ణుడికి. "శల్యా" కోపంనవ్వు నవ్వుతూ అన్నాడతను - "ధృతరాష్ట్రసభలో ఒకనాడు మంచి బ్రాహ్మణగోష్ఠి జరిగింది. ఆ గోష్ఠిలో సమస్త దేశాచారాలూ తెలిసిన బ్రాహ్మణోత్తముడు చెప్పిన మాటలు చెపుతాను ఆలకించు: 'బాహ్లీక దేశంవాళ్ళు గోమాంసం తింటారు. కల్లు తాగుతారు. బట్టలు విప్పుకు తిరుగుతారు. పచ్చిబూతులు మాట్లాడతారు. పెళ్ళికాని పడుచులతో వ్యభిచరిస్తారు. కోడిమాంసం, పందిమాంసం, గాడిదమాంసం, వొంటె

మాంసం తింటారు భార్యలు దిసమొలలతో గంతులేస్తారు. పొద్దుటి మొద్దుపాటలు పాడతారు గాడిదల్లాగా, లొటిపిటల్లాగా, అరుస్తారు. బట్టలువిప్పేసుకుని స్వేచ్ఛగా సంభోగిస్తారు. పండగదినాల్లో తెయితెక్కలాడతారు. 'చచ్చినదానా! మొగుణ్ణి చంపుకుతిన్న దానా!' అని వొకళ్ళ నొకళ్ళు తిట్టుకుంటారు. — అలాంటి బాహ్లీకులికి రాజువి నువ్వు. వాళ్ళ పాపపుణ్యాల్లో ఆరోవంతు నీకు ముడుతుంది. బాహ్లీకులకంటే మద్రదేశంవాళ్ళు మరీ నీతిమాలిన వాళ్ళు. ఇంకేంచెప్పాలి నీకు! ఇంతతో నోరుమూసుకో. వూరుకో."

## అంగదేశం వాళ్ళేనా నంగనాచులు

"ఎందుకలా మండిపోతావు?" అందుకున్నాడు శల్యుడు — "రథులూ, అతిరథులూ నిర్ణయించినప్పుడు ఎవళ్ళు ఎంతటివాళ్ళో చెప్పనే చెప్పాడు భీష్ముడు అది వొకసారి జ్ఞాపకం చేసుకో. మద్రదేశంవాళ్ళనీ, బాహ్లీక దేశం వాళ్ళనీ నిందిస్తున్నావు. అంగదేశం వాళ్ళేనా నంగనాచులు? డబ్బిస్తే పెళ్ళాలని అమ్మేస్తారు మీఅంగదేశం వాళ్ళు. బంధువుల్నీ, ఆస్తుల్నీ వొదిలేస్తారు. అలాంటి దేశంరాజువి నువ్వు. పైవాళ్ళని ఆడిపోస్తావేం, పైగా? గులివిందగింజకి తన నలుపు కనిపించదు, కిందని వుంటుంది కనక. పైవాళ్ళతప్పులు చెప్తావూ తమ తప్పులు కానలేరు నీచులు. చేతకాని వాడికి శౌర్యం హెచ్చు. కోపంతో కిందా మీదా కనపడకుండా వుంది నీకు. అట్టే పదరకు. ప్రతిదేశంలోనూ మంచివాళ్ళుంటారు. చెడ్డవాళ్ళూ వుంటారు. తెలిసిన వాళ్ళూ మధ్యస్థులూ ఇదీఅదీ కూడా వివరిస్తారు. పూర్తిగా చెడ్డదేశం ఎక్కడావుండదు. సదాచారమూ, దురాచారమూ దేవుడెరుగును. నిన్నునువ్వు ఎరగవు. మాట్లాడ తేక."

ఇద్దరి కలహమూ ముదురుపాకం పట్టింది. దుర్యోధనుడు కలగజేసుకున్నాడు; సరిపెట్టాడు. స్నేహ ధర్మం ఉపదేశించాడు. కర్ణుడి రాజగౌరవం ప్రశంసించాడు. శల్యుణ్ణి శాంతపరిచాడు.

"పదపద, రథం పోనీ" నవ్వుతూ శల్యుడితో అన్నాడు కర్ణుడు పగ్గాలు సడిలించాడు శల్యుడు. రథం ముందుకి నడిచింది.

"అర్జునుడంటే సామాన్యుడు కాడు, తెలుసా?" మెల్లిమెల్లిగా నవ్వుతూ మళ్ళీ సాగతీశాడు శల్యుడు — "కృష్ణుడు సారథి. గాండీవం ధనస్సు. అడ్డులేని మహావీరుడు అర్జునుడు. కర్ణా, అతడితో నిభాయించుకు వచ్చావంటే నిజంగా మా అందరికీ నువ్వే రాజువన్న మాట. అతడి రథం మన సేనలో చొరబడి తింతారు చేసేస్తుందనే తోస్తోంది. మనం జాగ్రత్తగా వుండాలి.

## అపశకునాలు చూడు

"అపశకునాలు ఎలావున్నాయో చూడు. మనపక్కనే వరళ్ళు అరుస్తున్నాయి. ఎదురుగాలి వీస్తోంది. గెద్దలు తలమీద ఎగురుతున్నాయి. వికారంగా కాకులు కూస్తున్నాయి. మన జెండాకొయ్య ఎలా వొణుకుతోందో చూడు. రథంచుట్టూ కట్టిన చిన్న జెండాల్లోంచి మంటలు రేగుతున్నాయి. యుద్ధం తలమునకలవుతుంది, ఇవాళ" అన్నాడు.

పాండవసేన చూశాడు కర్ణుడు. దుర్భేద్యంగావుంది దుర్గమ వ్యూహం. పాండవసేనాని ధృష్టద్యుమ్నుడు వెయ్యికళ్ళతో కనిపెడుతున్నాడు దాన్ని. శత్రువ్యూహానికి తగిన మంచి వ్యూహం పన్నాడు కర్ణుడు. ఏరథికుణ్ణి ఎక్కడపెట్టాలో అక్కడ పెట్టాడు. పావురాల మీదికి వురికించిన డేగలాగ పాండవవ్యూహం వేపు వురికించాడు.

"అల్లదిగో" తలెత్తిచూస్తూ అన్నాడు శల్యుడు — "అదిగో అర్జునుడి జెండా, ఎలా ఎగురుతోందో చూడు. వానరం ఎలా గెంతు లేస్తోందో! అదిగో, త్రిగర్తులు ముట్టడించా రతణ్ణి. బాణాలు ప్రవాహంలా వొదులుతున్నాడు అర్జునుడు. సంశప్తకుల్ని ముంచేస్తున్నాడు. గాండీవధ్వని, అబ్బా, చెవులు పగిలిపోతున్నాయి."

"చూడకేం, చూశాను" కరుకుగా అన్నాడు కర్ణుడు — "సంశప్తకులు చుట్టుముట్టేసరికి మేఘాలు కమ్మేసిన సూర్యుడిలాగ వెలవెలపోతున్నాడు అర్జునుడు, చూడు."

"అర్జునుడా యుద్ధంలో వెలవెలపోతాడు?" అందుకున్నాడు శల్యుడు — "నీళ్ళుపడితే వరుణుడా చెడిపోతాడు? పుడకలుపడితే అగ్గి ఆరిపోతుందా? గాలిని వోడించేవాడెవడు? దేవతలే అర్జునుణ్ణి యుద్ధంలో చిన్నపుచ్చలేరు. మన సంశప్తకులా జడిపిస్తారు? దగ్గిరికి వెళ్ళకండా, దూరదూరంగా పెద్దకబుర్లుచెపుతూ సంతోషించు.

"చూడూ చూడూ, మెరుపులా వున్నాడు భీముడు. ఎంత గొప్పగా వున్నాడో, సత్యసంధుడు ధర్మరాజు! అదుగో నకులసహదేవులు, మహాపరాక్రమవంతులు. ద్రౌపదికొడుకులు అయిదుగుర్నీ చూడూ, కొదమసింహాల్లా వున్నారు! కర్ణా, పాండవులు ధర్మపరులు. ధర్మం ఎక్కడవుంటే అక్కడ జయం తప్పదు."

ఇంతలో సంశప్తకుల్ని చూసి కౌరవసేనా, అర్జునుణ్ణి చూసి పాండవసేనా విజృంభించాయి. ఒకదాంతోవొకటి ఢీకొన్నాయి. గంగా, యమునా రెండునదులూ కలుసుకుంటే ఎలావుంటుంది, అదిగో అలా అవుపడింది.

"శూరులికి ఏదిప్రియమైందో అదే దివ్యంగా దొరికింది మీకు" కర్ణుణ్ణీ శల్యుణ్ణీ ముఖ్యులైన రాజుల్నీ ఆదరంగా చూస్తూ హెచ్చరించాడు దుర్యోధనుడు — "పరాక్రమమే పాటించం డిప్పుడు. ఉగ్రమైన

శౌర్యంతో విజృంభించండి. పాండవుల్ని చంపారో, సాటిలేని సామ్రాజ్య భోగాలు అనుభవిస్తారు. వాళ్ళచేత మరణించారా స్వర్గసౌఖ్యాలూ అనుభవిస్తారు. కనక, ఉరకండి యుద్ధానికి."

రారాజుమాట విని మనవాళ్ళు యావన్మందీ పుబ్బి సింహనాదాలుచేశారు. రణవాద్యాలు మోగాయి. సైన్యం ఈచివరనించి ఆచివరికి ఉత్సాహం పరుగులుపెట్టింది.

## చంపికాని కవచం వొదలను

రథికులు యావన్మందీ సంతోషించినట్టు అశ్వత్థామ అన్నాడు: "ఆయుధం వొదిలేసిన ఆచార్యుణ్ణి నాతండ్రిని మీఅందరిఎదటా చంపాడు దుష్టు ధృష్టద్యుమ్నుడు. వాణ్ణి చంపికాని కవచం వొదలను. భీముడూ, అర్జునుడూ అడ్డుపడ్డారో వాళ్ళపని అయిపోతుంది, నా బాణాగ్నిలో పడి."

అతడి నోట్లోమాట నోట్లోనేవుంది, పొలోమని విరగబడింది మనసేన. పాండవసేనమీదికి పరిగెత్తింది. అంతకంటే ఉద్రేకంతో ఎదిరించింది పాండవసేన. రెండు సేనలూ ఢీకొన్నాయి. నివ్వెరపోతూ చూశారు దేవతలు. ఎంతో ఉద్ధృతంగా జరిగింది యుద్ధం. ఎంత సేన కూలిపోయిందో లెక్కాజమా లేదు. ప్రళయకాలం వచ్చిందనిపించింది నాకు. కాకపోతే ఇంత దారుణం ఎక్కడైనా వుందా అనిపించింది. కాలంచేసినవీరుల్ని వరించడానికి గుంపులుగుంపులు వచ్చారు అప్సరసలు. చందనం చల్లారు, పూలవాన కురిపించారు. సైనికుల చెమట చల్లారుస్తూ, సువాసనతో చల్లగాలి వీచింది.

పెద్ద ఏనుగుసేనతో దుర్యోధనుడు భీముడిమీదికి వెళ్ళాడు. ఘోరమైన బాణాలు వేశాడు. దారుణమైన యుద్ధంచేశాడు.

కర్ణుడు ధర్మరాజువేపు పరిగెత్తాడు. అతడి రథఘోషతో

ఆకాశం మారుమోగింది. ధనుష్టంకారం దిక్కులు పగిలించింది. "కర్ణుడు ధర్మరాజుమీదికి వెళుతున్నాడు" అనుకున్నారు మనసైని కులు– "అర్జునుడువచ్చి అడ్డుపడతాడు. అతడికీ కర్ణుడికీ పడుతుంది. భయంకరమైనయుద్ధం జరుగుతుంది. అర్జునుణ్ణి కర్ణుడు చంపేస్తాడు. దుర్యోధనమహారాజుకి శత్రుబాధ తీరిపోతుంది. సుఖపడతాడు. రండి. రథందగ్గిర వుండి ఇతడి మహాస్త్రాల మహిమ చూద్దాం. కర్ణుడే గెలుస్తా డనిపిస్తోంది, ఇప్పుడు. ఇప్పుడు ఇలాగే వుంటుంది. యుద్ధంలోమాత్రం తల్లకిందవుతుంది" అనుకుంటూ శత్రువుల రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, గుండపిండిచేసేస్తూ విజృంభించారు.

ప్రచండమైన వడితో యుద్ధంచేశాడు కర్ణుడు. ధర్మరాజుని ముచ్చెమటలు పోయించాడు. తలకొట్టేసినట్టు నానా మాటలూ అన్నాడు. అడ్డుపడడానికి వచ్చిన యోధుల్ని వాళ్ళ-కక్కణ్ణే శృంగ భంగంచేసి వొదిలిపెట్టాడు.

ధృతరాష్ట్రుడు: అయితే, అర్జునుడు ఎక్కడవున్నాడు అప్పుడు? అతడే అన్నదగ్గిరవుంటే అంతపని చెయ్యగలడా కర్ణుడు? దేవతలతో కలిసి దేవేంద్రుడు వచ్చినా అర్జునుడికో చాలలేదు; ఖాండవం కాసుకోలేకపోయాడు. కర్ణుడుతప్ప బతుకుమీద ఆశవున్నవాడు ఎవడు వెళతాడు అర్జునుడిమీదికి? సరే, చెప్పూ, చెప్పూ. కర్ణుడు ఎలా వ్యూహం పన్నాడు? ధర్మరాజు సైన్యసన్నాహం ఎలావుంది?

సంజయుడు: అవును, అర్జునుడు అన్నగారిదగ్గిర లేడు. కర్ణుడు పన్నిన వ్యూహమూ, ధర్మరాజుసైన్యసన్నాహమూ విను. తరవాత యుద్ధం ఎలా జరిగిందో వివరిస్తాను. మనవ్యూహంలో కృపాచార్యుడూ, కృతవర్మా, మగధయోధులూ కుడిపక్క నుంచున్నారు. వాళ్ళకి దన్ను శకునీ, ఉలూకుడూ గుర్రాలవాళ్ళతో నుంచున్నారు. ఇరవై నాలుగు వేలరథాల సంశప్తకసేన ఎడమపక్కని లబిసింది. వాళ్ళతరవాత

కాంభోజ, శక, యవనసేనలతో నీకొడుకులు కొంతమంది నుంచున్నారు. పెద్దరాజువతో దుశ్శాసనుడు వెనక నిలబడ్డాడు. కొంతమంది తమ్ముళ్ళతో కలిసి దుర్యోధనుడు తరవాత నిలబడ్డాడు. సేనాముఖానికి తిలకంలా నిలబడ్డాడు కర్ణసేనాని. తనచుట్టూ తనకుమాళ్ళు నుంచున్నారు. అశ్వత్థామా మొదలైన యోధులు కర్ణుడికి దన్ను నుంచున్నారు. మన ఏనుగుసేన అధికంగావుంది. మేఘాలదొంతరలా వుంది. నడిపించుకు వెళ్ళాడు కర్ణుడు.

"కర్ణుడి వ్యూహం చూశావా!" అర్జునుణ్ణి పిలిచి అన్నాడు ధర్మరాజు — "తోసుకురాకండా నిలవరించాలి. ఏంచేస్తావో ఆలోచించు."

"ఆలోచనకి ఏముంది?" అందుకున్నాడు అర్జునుడు - "ఎంత పురకలు వేసుకు వస్తుందో రానీ, కర్ణుడిసేన. దీనికి వొక్కటే మందు, కర్ణుణ్ణి కాజెయ్యడమే. అది ఏమంతపనా నాకు!"

"అయితే నువ్వు కర్ణుణ్ణి కాసుకో. భీముడు దుర్యోధనుడి పని పట్టేస్తాడు. నకులుడు వృషసేనుణ్ణీ, సహదేవుడు శకునినీ, శతానీకుడు దుశ్శాసనుణ్ణీ, సాత్యకి కృతవర్మనీ, ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామనీ, ద్రౌపదికొడుకులూ, శిఖండీ దుర్యోధనుడి తమ్ముళ్ళని సర్దుకుంటారు. నేను కృపాచార్యుడి మీదికి వెడతాను" అన్నాడు ధర్మరాజు.

"బాగుంది" అన్నాడు అర్జునుడు. వ్యూహంలో తనచోటికి వెళ్ళిపోయాడు. అన్నగారిఆజ్ఞ సేనాధిపతులందరికీ చాటిచెప్పాడు.

ధర్మరాజువ్యూహం ఎలావుందని అడిగావుకదూ! చెపుతా, సేనకి ముందు కుడిపక్క అర్జునుడు నిలబడ్డాడు. ఎడమపక్క భీముడు నిలబడ్డాడు. సాత్యకీ, ద్రౌపదికుమార్ళూ వాళ్ళతో కలిసి ధర్మరాజు మధ్య నుంచున్నాడు. అంత ఉద్ధృతంగా వెళ్ళిందా మనసేన, పిసరంతా లక్ష్యపెట్టలేదు వాళ్ళు. అంతకంటే ఉద్ధృతంగా వచ్చి విరుచుకుపడ్డారు.

ధృతరాష్ట్రుడు: ధర్మరాజు ఇలా చెప్పాడంటున్నా విన్నాడు. ఇందాక అర్జునుడు సంశప్తకులతో పోరాడుతున్నా డన్నావు. ధర్మ రాజుని కర్ణుడు ముట్టడించి ముచ్చెమటలుపోయించాడన్నావు. చిత్రం గావుంది యుద్ధం. అసలు ఏంజరిగిందో స్పష్టంగా వివరించు.

సంజయుడు: ధర్మరాజు చెప్పడమేమో చెప్పాడు. కాని రెండు సేనలూ కలబడేసరికి ఆనియమం ఏమీ సాగదు. యుద్ధంటేనే అంత. ఒకలాగ అనుకుంటే వొకలాగ అవుతుంది. రెండు సేనలూ కలబడడంతోనే కర్ణుడికెట్టు తిరిగాడు అర్జునుడు. కపిధ్వజం కనిపించడంతోనే వుప్పెనలాగ వెళ్ళి అతణ్ణి ఘిరాయించారు సంశప్తకులు. సముద్రపొడ్డులాగ అడ్డుకున్నాడు అర్జునుడు. వరస బాణాలు విరజిమ్మాడు. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ కుప్పలుకుప్పలు కూలగొట్టాడు. ఎంతకొడుతుంటే అంత సేన సముద్రంలా మీదపడుతూ వుండేది. బడబాగ్నిజ్వాలల్లాటి బాణాలు వేసి అంతం చేస్తూనేవుండేవాడు అర్జునుడు. అదిగో అప్పుడే కర్ణుడితో అన్నాడు శల్యుడు: "అల్లదిగో అర్జునుడిజెండా ఎలా ఎగురుతోందో చూడు. వానరం ఎలా గెంతులేస్తోందో! అదిగో త్రిగర్తులు ముట్టడించారతణ్ణి బాణాలు ప్రవాహంలా వొదులుతున్నాడు అర్జునుడు. సంశప్తకుల్ని ముంచేస్తున్నాడు. గాండీవధ్వని, అబ్బా, చెవులు పగిలిపోతున్నాయి" అని.

"ధృష్టద్యుమ్నుణ్ణి చంపికాని కవచం వొదలను" అన్నాడు కదూ అశ్వత్థామ. ఆతడిమాటలు విని మనవాళ్ళు కలబడ్డాక దారుణంగా యుద్ధం జరిగిందని చెప్పాను కదూ! అదంతా చెపుతాను, ఆలకించు.

కృపాచార్యుడూ, కృతవర్మా, శకునీ నలిరేగిపోతూన్న శత్రువులమీదికి రథాలు పరిగెత్తించారు. కాశ కైకేయ, మాత్స్య, కోసల సేనలమీద కలబడ్డారు. రెండుసేనలూ హోరాహోరి యుద్ధం

చేశాయి. ఆయుధాలూ ఆయుధాలూ తగిలి ఆకాశంమీద మంటలు రేగాయి పొడిపొడి అయి కింద రాలిపడ్డాయి. ధూళి రేగి చీకట్లు కమ్మాయి. రక్తాలు ధారలుకట్టి ధూళి అడిగిపోయింది. చీకట్లు పటాపంచలయాయి. రథాలు గుండపిండయిపోయాయి. ఏనుగులు పీనుగుపెంటలయాయి. గుర్రాలు కూలిపోయాయి. కాల్బలాలు పచ్చడిపచ్చడి అయిపోయాయి. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ శవాలమీంచి నడవడమే కష్టమైంది. అయినా పోరాడుతూనేవున్నారు యోధులు.

పాంచాలం వాళ్ళమీదికి సుడిగాలిలా వెళ్ళాడు కర్ణుడు. పెద్ద చతురంగ సేనతో అతడికి సహాయ్యం వెళ్ళాడు దుర్యోధనుడు. అతడి తమ్ముళ్లూ వెంటవెళ్ళారు. ఆకాశమంతఎత్తు దుమ్ము రేగింది. చేది సైన్యమూ, పాండవసేనా పాంచాలకుమాళ్ళకి దన్ను నిలిచింది; కౌరవ సేనమీద కలబడింది. కాలయముడే అయిపోయాడు కర్ణుడు. యమపాశాల్లాటి బాణాలు వేశాడు. శత్రుసేన పీనుగుపెంటలు చేశాడు. ఎదటపడ్డ శత్రుయోధులందరికీ కీర్తి, స్వర్గమూ ప్రసాదించాడు. రకరకాలుగా, చిత్ర చిత్రాలుగా రథం పరిగెత్తించాడు. కౌరవులికి కళ్ళ వేడుక కలిగించాడు. కృపుడూ వాళ్ళతో పోరాడుతున్న రాణువనీ కలిచేసి వొదిలిపెట్టాడు. రక్తనదులు పారించాడు. ఆనదుల్లో రక్తమే వరద. మాంసం, మజ్జా, మెదడూ బురద. విరిగినగొడుగులు రాజహంసలు –

ధృతరాష్ట్రుడు: ధర్మరాజుని కర్ణుడు ముట్టడించాడన్నావుకదా! అప్పుడు అతడికి ఎవ్వరు అడ్డుపడ్డారు అక్కడ? కర్ణుడికి ఎవ్వరు సాయం చేశారు?

సంజయుడు: అదే చెపుతున్నాను. శత్రుసేన చెండాడుతూ ధర్మరాజు జెండా వున్నచోటికి చొచ్చుకుపోయాడు కర్ణుడు. తన బంధువులందరితోనూ వచ్చి అడ్డుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. అతణ్ణే దాటు

కుంటూ వచ్చి కర్ణుడితో కలబడ్డారు ప్రభద్రకులు. పట్టపగ్గాలు లేకపోయాయి కర్ణుడికి. నిప్పులుగక్కిన బాణాలు గుప్పించాడు. డబ్భయి ఏడుగురు ప్రభద్రక యోధుల్ని చిటికెలో రూపుమాపించాడు.

సహించలేకపోయింది పాంచాలసేన. ఒక్కసారి తిరగబడింది. కాలరుద్రుడై పోయాడు కర్ణుడు. వెడల్పాటి బాణాలు పాతిక వేశాడు. పాతికమంది పాంచాలవీరుల్ని నరికేశాడు. ప్రాణాంతకమైన బాణాలు మరో అయిదు వొదిలాడు భానుదేవుడూ, చిత్రసేనుడూ, సేనాబిందుడూ, తపనుడూ, శూరసేనుడూ — ఈ అయిదుగురు పాంచాలరాజకుమాళ్ళనీ వూడ్చేశాడు తనకుమాళ్ళు సుషేణుడూ, సత్యసేనుడూ తన చక్రరక్షకులై నడిచారు. వృషసేనుడు పృష్ఠరక్షకుడై విజృంభించాడు. కొడుకుల వీరత్వంతో తండ్రిప్రతాపం రెండింతలైంది. పాండవసేనకి తలమునకలైంది.

పాంచాలకుమాళ్ళు ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, జనమేజయుడూ మొదలైనవాళ్ళూ, సాత్యకీ, నకులసహదేవులూ, ద్రౌపదికుమాళ్ళూ భీముణ్ణి ముందు పెట్టుకుని, కేకయ మాత్స్య యోధులతో కలిసి కర్ణుడితో కలబడ్డారు. పెద్దపెద్ద మేఘాలు కొండమీద జడివాన కురిసినట్టు రకరకాల అస్త్రాలూ, శస్త్రాలూ కురిపించారు.

దుర్యోధనుడు చూశాడు. దుశ్శాసనుడూ, శకునీ, శకుని కొడుకులూ మొదలైనవాళ్ళతో కలిసి పెద్ద ఏనుగుసేనతో వెళ్ళాడు; భీముణ్ణి ఢీకొన్నాడు. చికిలిపెట్టిన బాణాలు కురిపించాడు. అంతసేననీ ఆడించేశాడు భీముడు. మదం కారుతూన్న ఏనుగులు బాణాలతో మాడ్చి వొదిలి పెట్టాడు. దుర్యోధనుడూ, అతడి రాజులూ తట్టుకోలేక పోయారు. పెద్ద సుడిగాలివీస్తే చెదిరిపోయినమబ్బుల్లాగ, సూర్యోదయమైతే మాయమైన చీకట్లలాగ చెల్లాచెదురైపోయి, పటాపంచలయిపోయి వెలవెలపోయింది మనసేన.

కృపాచార్యులూ మొదలైనయోధులు కర్ణ దుర్యోధనుల్ని దాటుకుంటూ ముందుకి వెళ్ళారు. భీముడి రెండుపక్కలా తరుముకు వస్తూన్న ధృష్టద్యుమ్నుడూ వాళ్ళని ఎదురించారు. దుశ్శాసనుడూ కృపాచార్యుడితో కలిశాడు. కర్ణుడి కొడుకులు భీముడితో కలబడ్డారు. సుషేణుడు మంచి బాణం కొట్టాడు. భీముడి ధనుస్సు నరికేశాడు. గబాగబా అతడి గుండెమీద ఏడుబాణాలు వేశాడు. సింహనాదం చేశాడు. దేవతలు మెచ్చుకున్నారు. చఱుమన్నాడు భీముడు. మరో విల్లు తీశాడు. సుషేణుడి ధనుస్సు ఫెళ్ళుమనిపించాడు. పద్నాలుగు బాణాలు అతడిమీద కొట్టాడు. చూశాడు కర్ణుడు; పులిలాగ వురికాడు. వరసపెట్టి డబ్బయిమూడు బాణాలు వేశాడు. ఉక్కిరిబిక్కిరిచేసేశాడు. అంతలో సత్యసేనుడు తోసుకు వెళ్ళాడు. అతడి గుఱ్ఱాలు చంపేశాడు భీముడు. సారథిని కొట్టేశాడు. విల్లు విరిచేశాడు. జెండా తుంచేశాడు. ఏడుబాణాలతో ఇంతపనీచేశాడు. మూడు బాణాలు అతడిమీద తగిలించాడు. కత్తిలాటి మరో బాణం వేశాడు. అతడి తల నరికేశాడు. పూసినపద్మం తూడునించి తుంచేసినట్టు తెగిపడింది శిరస్సు.

ఆవూపుని మఱింత రెచ్చిపోయాడు భీముడు. కృపుడి ధనుస్సు నరికేశాడు. కృతవర్మవిల్లు విరిచేశాడు. వాళ్ళ వాళ్ళంతా తూంట్లు కొట్టేశాడు. దుశ్శాసనుడిమీద మూడు బాణాలు నాటించాడు. శకుని మీద ఆరు కొట్టాడు. ఉలూకుడి రథం గుండచేసేశాడు. అతడి తమ్ముడి రథం కొట్టేశాడు. "ఒరే, చచ్చావురా" అంటూ సుషేణుడిమీద పిడుగులాటి బాణం వేశాడు. సగంలో దాన్ని నరికేశాడు కర్ణుడు. మూడు కోలలు భీముడిమీద వేశాడు. లక్ష్యపెట్టలేదు భీముడు. అలాంటిదే మరొకటి సుషేణుడిమీద వొదిలాడు. అదీ సగంలోనే కొట్టేశాడు కర్ణుడు. గుక్కతిప్పుకండా డబ్బయి బాణాలు గుప్పించేశాడు. ఇంతలో నకులుడు వచ్చాడు. అయిదు బాణాలు అతడిమీద వేశాడు

వృషసేనుడు. ఒళ్ళంతా రక్తాలు కారించాడు. పైన్నలు బిగించాడు నకులుడు. ఇరవై బాణాలు గుప్పించాడు. వృషసేనుణ్ణి కెవ్వు కెవ్వా మనిపించాడు. సింహనాదంచేశాడు. కర్ణుడిమనస్సు చివ్వుమంది.

కోడెనాగులా లేచాడు సుషేణుడు. తొమ్మిదిబాణాలు నకులుడి మీద నాటించాడు. ధనుస్సు నరికేశాడు. బోరవిరిచి చూశాడు. నాగుపాంలాటి బాణం తీశాడు నకులుడు. సుషేణుడి ధనుస్సు మధ్యకి నరికేశాడు. అతణ్ణీ, అతడి సారథినీ పూ పేశాడు. మరో మంచివిల్లు పుచ్చుకున్నాడు సుషేణుడు. ఒక్కబిగిని అరవై బాణాలు రువ్వాడు. సహదేవుడు అన్నకి సాయంవచ్చాడు. అతడిమీద ఏడు బాణాలువేశాడు వృషసేనుడు. అటు నకులసహదేవులూ, ఇటు వృషసేనుడూ దేవ దానవయుద్ధం చేసేశారు.

సాత్యకివచ్చి వృషసేనుడిమీద కలబడ్డాడు. డబ్బయిబాణాలు వేశాడు. అతడిరథం కనపడకండా కప్పెట్టాడు. మూడుబాణాలు సారథిమీద కొట్టాడు. మంచి వాడైన బాణం తొడిగాడు వృషసేనుడు. సాత్యకికణతమీద తగిలించాడు. అతడికళ్ళల్లో నిప్పులు మెరిశాయి. ఎంచిఎంచి మూడుబాణాలు వేశాడతడు. సుషేణుడి సారథిని చంపే శాడు. వాడైనబాణం మరొకటి వేశాడు. అతడి ధనుస్సు నరికేశాడు. ఏడుబాణాలు వేసి గుర్రాలు కూల్చేశాడు. మరొకటికొట్టాడు. జెండా కొయ్యతోంచేశాడు. గుండెలు దుసెళ్ళిపోయినట్టు మూడుబాణాలు తగి లించాడు జూమాలుమనిపోయాడు వృషసేనుడు. కాని వెంటనే తేరు కున్నాడు. కత్తీ, డాలూ పట్టుకున్నాడు. రథందూకి సాత్యకిమీదికి పరిగెత్తాడు. కత్తిముక్కలు చేసేశాడు సాత్యకి. డాలు పగలగొట్టే శాడు. నిరాయుధుడై పోయాడు వృషసేనుడు. క్షణంలో అతడిపని అయిపోయేది. గెద్దలా వాలాడు దుశ్శాసనుడు. అతణ్ణి తనరథం

మీద ఎక్కించుకు పట్టుకుపోయాడు. మరో రథమెక్కి, కర్ణుడి రథానికి వెనకదన్నుగా వచ్చేశాడు వృషసేనుడు.

కర్ణుడు సాత్యకితో కలబడ్డాడు. తొమ్మిది బాణాలుకొట్టి అతడి గుర్రాలూ, సారథీ, జెండా కూలగొట్టాడు. అతడి నుదుటిమీద మూడుబాణాలు నాటించాడు. చప్పున మరో రథమెక్కి వచ్చాడు సాత్యకి. కర్ణుడి సేనమీద కలబడ్డాడు. కర్ణుడిమీద ఏడుబాణాలు గుప్పించాడు అతడితో శతానీకుడు కలిశాడు. కర్ణుడిమీద ఏడు బాణాలు వేశాడు. ఉపపాండవులూ వురికారు. డబ్భయిమూడు బాణాలు కురిపించారు. ధృష్టద్యుమ్నుడూ, అతడివెంట శిఖండీ దూసుకువచ్చారు తలా పదేసి బాణాలు బాదేశారు. భీముడు అరవైనాలుగూ, సహదేవుడు ఏడూ, నకులుడు ముప్ఫయీ, సాత్యకి ఏడూ వొక్కమొగిని కుమ్మరించారు. ధర్మరాజూ పరిగెత్తుకు వచ్చాడు వరసపెట్టి వంద బాణాలు కురిపించాడు.

తలా పదేసిబాణాలు కొట్టాడు కర్ణుడు. అంతమందినీ అడలెత్తించాడు. చిత్రవిచిత్రమైనగతులతో రథం తిప్పాడు. అసాధ్యుడే అయిపోయాడతడు. సాత్యకీ భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, ద్రౌపదీకొడుకులూ — అంతమందీ వొక్కమొగిని కలబడ్డారు. రకరకాలబాణాలు గుప్పించారు. అంతమందినీ వూపేశాడు కర్ణుడు. ముచ్చెమటలుపోయించాడు. ముక్కుమీద వేలుపెట్టుకున్నారు దేవతలు. ప్రవాహంలా బాణాలు వేశాడు. అంతమందినీ ముంచెత్తాడు. అతడి బాణాలికి విడుపూ విరామం లేకపోయింది. ఆకాశం కప్పడిపోయింది. చీకట్లు కమ్మాయి. ఆపసోపాలు పడిపోయారు శత్రువులు పక్కకి వొరిగిపోయారు. దూరదూరం తప్పుకున్నారు. మళ్ళిపోయారు. సారథులు చచ్చి, గుర్రాలు కూలి, రథాలు విరిగి దైన్య స్థితికి వచ్చేశారు.

ధర్మరాజువేపు చూశాడు కర్ణుడు. ఒక్కొక్కపూపు పూపాలనిపించింది అతణ్ణి. పులిలాగ అతడిమీదికి పరిగెత్తాడు. చేదిసేన మధ్య పడింది. శంఖాలు మోగాయి. యుద్ధవాద్యాలు ఘోరుమన్నాయి. చేదిసైన్యంమధ్యకి దూసుకుపోయాడు కర్ణుడు. చేతులు తీటలుతీరినట్టు బాణాలువేశాడు. ఒక్కొక్కపూపుని మూడువందలమందియోధుల్ని పూడ్చేశాడు. అటూఇటూ ఎటుపడితే అటు రథం పరిగెత్తించాడు.

సాత్యకీ, శిఖండీ కొత్తరథాలతో ముందుకి వురికారు. అక్కడివీరులు వాళ్ళతో కలిశారు. ఉగ్రమైనబాణాలు వేశారు. మన కౌరవయోధులు వాళ్ళని అడ్డుకున్నారు. అద్భుతమైన దొమ్మీయుద్ధం జరిగిపోయింది.

కార్చిచ్చులా రెచ్చిపోయాడు కర్ణుడు. అడవికాల్చినట్టు శత్రుసేన కాల్చడం మొదలెట్టాడు. బాణాలు జ్వాలల్లా ఆకాశం నిండిపోయాయి. పెదుళ్ళుపగిలినట్టు ఛటచ్ఛటా ధనుష్టంకారం వినిపించింది. దేవతలు కనుబొమలు ఎగరవేశారు. మా సంతోషానికి అంతమే లేకపోయింది. ముందుకివచ్చిన మొనగాళ్ళల్లా ముక్కుమీద వేలేసుకు నిలబడిపోయారు.

## చంపుతానని భయపడకు

ధర్మరాజుమీదికి రథం వురికించాడు కర్ణుడు. బాణంమీద బాణం తగిలించాడు ధర్మరాజు. అన్నిఇట్టేకొట్టేశాడు కర్ణుడు. అతడిధనుస్సు నరికేశాడు. మరుక్షణంలో తొంభై బాణాలు గుప్పించాడు. అతడి కవచం చిన్నచిన్న పిసర్లకింద కొట్టేశాడు. మెరుపులమేఘం సూర్యుడికి అడ్డంగా వుండి, గాలికి తొలిగిపోయినట్టు రత్నాల కవచం ధర్మరాజువొంటిమీంచి జారి పడిపోయింది. చుక్కల ఆకాశంలాగ మణిహారాలతో అవుపడింది ధర్మరాజు శరీరం. రక్తాలు చిమ్మిచివురుపెట్టిన కల్పవృక్షంలా కనపడ్డా డతడు.

క్షత్రియధర్మం పాటించి చలించలేదు ధర్మరాజు. శక్తితీసి ప్రయోగించాడు. అగ్గిపిడుగులాగ బయలుదేరింది శక్తి. ఆకాశంనిండా మెరుపులు మెరిసినట్టయింది. ఏడు భల్లబాణాలు వేశాడు కర్ణుడు. ముక్కముక్కలుచేశాడుశక్తి. అతడి రొమ్ముమీదా, చేతులమీదా, నుదుటిమీదా నాలుగు తోమరాలు తదిలించాడు ధర్మరాజు. రక్తాలు కారాయి. సింహనాదంచేశాడు ధర్మరాజు. కళ్ళమొయ్యాకోపం తెచ్చుకున్నాడు కర్ణుడు. ధర్మరాజుసారథిని చంపేశాడు. అతడిజెండా ఎగరగొట్టేశాడు. ఒళ్ళంతా తూట్లుతూట్లు చేసేశాడు.

సాత్యకీ, శిఖండీ మధ్యపడ్డారు. శరవర్షం కురిపించారు. మరింత మండిపోయాడు కర్ణుడు. వాళ్ళ రథాలు విరగ్గొట్టేశాడు. ధనుస్సులు నరికేశాడు పాముల్లాంటి బాణాలు నాటించాడు. జజ్జరిల్లగొట్టేశాడు.

వాళ్ళని దాటుకుంటూ ముందుకి ఉరికాడు. ధర్మరాజుమీద పడ్డాడు. నాగుపాముల్లాంటి కోలలు నాటించాడు ఒళ్ళంతా చిల్లులు చేసేశాడు. తట్టుకోలేకపోయాడు ధర్మరాజు. సారథిలేని రథం తానే తోలుకుంటూ వెనక్కిపరిగెత్తాడు. కర్ణుడువెంటపడ్డాడు. అడ్డుకున్నాడు.

"రాజకులంలో పుట్టావు" నవ్వుతూఅన్నాడు కర్ణుడు- "మంచీ చెడ్డా తెలిసినవాడివి. యుద్ధంలో పారిపోడం నీవంటివాడికి తగినపనేనా! ప్రాణాలు అంత తీపా! నీబుద్ధి నువ్వు చూపెట్టుకున్నావు. రాజనీతి ఎరగవు. బ్రాహ్మల ఆచారమే తెలుసునీకు. వెళ్ళు. యజ్ఞాలూ అవీ చేసుకు బతుకు. యుద్ధం వద్దు. నాలాంటివాడితో చెయ్యిచేసుకుంటే ఇంకా అధ్వాన్నమవుతుంది నీబతుకు. ఇంటికి పరిగెత్తు. లేదంటే మా కృష్ణుడిదగ్గిరికీ, అర్జునుడిదగ్గిరికీ పారిపో. చంపుతానని భయపడకు. అంత పని చెయ్యనులే. వెళ్ళు"

కుంతిమాటలు మనస్సులో మెలుగుతున్నాయి కర్ణుడికి. అందు

కనే ధర్మరాజును చంపడానికి తెగించలే దతను. ఒదిలేశాడు. చప్పున రథం తిప్పాడు. పాండవుల సేనమీద విరుచుకుపడ్డాడు.

సిగ్గుపడిపోయాడు ధర్మరాజు. నిలవకుండా వెళ్ళిపోయాడు. అతడి సైన్యం విరిగిపోయింది. పలాయనం చిత్తగించింది. కర్ణుడూ, నీకొడుకులూ వెంటదరిమారు. సింహనాదాలు చేశారు. ధనుస్సులు మోగించారు. శంఖాలు పూదారు. రణదుందుభులు ధణంధణ లాడించారు. దిక్కులు ప్రతిధ్వనించాయి చెవులు దిమ్మెత్తిపోయాయి.

చూశాడు ధర్మరాజు. చ(రున వెనక్కి తిరిగాడు. "పారిపో కండి" తనయోధుల్ని హెచ్చరించాడు. "కౌరవుల్ని కడ తేర్చండి" సైనికుల్ని పురికొల్పాడు. అతడికేకలు మంత్రంలా పనిచేశాయి. పాండవయోధులికి కొండంతధైర్యం వచ్చింది పారిపోతున్న వాళ్ళల్లా తిరగబడ్డారు. ప్రాణాలమీద ఆశవొదిలిపెట్టేసి పోరాడారు. ఘోర మైన దొమ్మీయుద్ధం జరిగింది. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ కుప్పలుగుప్పలు కూలిపోయాయి కాల్బలంసంగతి చెప్పేఅక్కరలేదు. రక్తం నదులై పారింది.

భీముడూ, సాత్యకీ పేట్రేగిపోయారు. ధృష్టద్యుమ్నుడూ మొదలైన యోధులు వాళ్ళతో కలిశారు. క్షణంలో యుద్ధం తల్ల కిందులయింది. పాండవుల దే పై చెయ్యి.

కౌరవసేన ఆగలేకపోయింది. తోకముడిచేసింది. "ఆగండి, ఆగండి" - చేయెత్తి అదిలించాడు కర్ణుడు. లాభంలేకపోయింది. చేసు పీక పోగొట్టుకున్నట్లైపోయా డతడు ఎంతోఅంత ప్రయత్నంమీద అందరినీ మళ్ళించాడు. ఎలాఅయితేనేం చివరికి మొగకట్టి నిలిచింది మనసేన.

భీముడివేపు రథం తిప్పాడు కర్ణుడు. కనిపెట్టాడు భీముడు. అప్ప

టికి శ్రుతకీర్తి రథంమీద వున్నాడు ధర్మరాజు. సాత్యకికీ, ధృష్టద్యుమ్నుడికీ అతణ్ణి గాపెడుతూ అన్నాడు భీముడు: "బాగా దెబ్బలు తినేసి ఇదైపోయాడు అన్నయ్య. దురాత్ముడు దుర్యోధనుణ్ణి మెప్పించడం కోసం, నాకళ్ళముందే ఇంతపనిచేశాడు కర్ణుడు మీచేతిలో కుదువపెట్టి వెళుతున్నాను మహారాజుని. కర్ణుణ్ణి చంపితేనే కాని నాకసి తీరదు. నేనైనా చావాలి, వీడైనా చావాలి తప్పదు. అన్నయ్యని కాసుకుంటూ యుద్ధంచెయ్యండి మీరు" అని ఆకాశం పగిలినట్టు సింహనాదంచేశాడు. కర్ణుడిమీదికి రథం వురికించాడు.

"ఇదిగో వచ్చాడు భీముడు" కర్ణుడితో అన్నాడు శల్యుడు — "ప్రచండమైన కోపంతో వస్తున్నాడు. ముల్లోకాలూ పెల్లగించేస్తాడు. అభిమన్యుడూ, ఘటోత్కచుడూ కూలిపోయినప్పుడూ ఇంత కోపం తెచ్చుకోలేదితడు. నీచేవేదో చూడాలిప్పుడు."

"అవును, అంతవాడే ఇతడు" భీముణ్ణి చూస్తూ అన్నాడు కర్ణుడు — "నువ్వన్నట్టు నాచేవేదో చూపిస్తాను. అర్జునుణ్ణి చంపడానికి మంచి సులువైనమార్గం దొరికింది. భీముడిపని పట్టేస్తాను అర్జునుడు పరిగెత్తుకువస్తాడు. అదిగో, అప్పుడూ చూద్దువుగాని, నాచేవ. భీముడు, భీముడు అంటున్నావు. భీముడు తక్కువకాడు, నాకు తెలుసు. వందమంది కీచకుల్ని వరసపెట్టి చంపేశాడు. తనంతటి బలమైనవాడు లోకంలో లేడని పేరుపడ్డాడు. అయితే నాదగ్గిర ఏమాత్రం? శల్యా. పద. రథం పోనీ అతడిమీదికి."

పగ్గాలు వదిలించాడు శల్యుడు. భయంకరంగా పరిగెత్తింది రథం. యుద్ధవాద్యాలు వురిమాయి. యముడిలా వచ్చాడు భీముడు. రణరంగం దడదడలాడింది. కోదండమెత్తాడు కర్ణుడు. గట్టిదొక బాణం భీముడి గుండెలమీద తగిలించాడు. సింహంకొదమలాగ రెచ్చిపోయాడు భీముడు. దారుణమైన బాణాలు గుప్పించాడు. కర్ణుడి వొళ్ళు

దూసెళ్ళిపోయాయి బాణాలు. భీముడి ఉద్రేకం చూసి అడలిపోయారు కౌరవులు. భీముడి విల్లు విరిచేశాడు కర్ణుడు దారుణమైన బాణం ధనుస్సుకి తొడిగాడు. చెవులదాకా లాగి వొదిలిపెట్టాడు. భీముడివొళ్ళు దూసుకుపోయింది బాణం.

మరో ధనుస్సు పట్టుకున్నాడు భీముడు. చిచ్చులపిడుగులాటి బాణం తొడిగాడు. కర్ణుడి బొరమీద తగిలించాడు. కంపించిపోయాడు కర్ణుడు. సింహనాదంచేశాడు భీముడు. కాలు కదపలేదు కర్ణుడు. దారుణమైన వొక బాణం వొదిలాడు. భీముడి కవచం దూరి, శరీరం దూసుకుపోయి, నేలమీద నాటుకుంది బాణం.

కనుబొమలు ముడివేశాడు భీముడు. కళ్ళల్లో నిప్పులు కురిశాడు. పిడుగులాటి బాణం వేశాడు. కర్ణుడి రొమ్ములమధ్య తగిలింది బాణం. దెబ్బతో మూర్ఛపోయాడతడు. చచ్చినట్టు రథంమీద పడిపోయాడు. అతడిసేన అడలిపోయింది.

## నాలుక కోసేస్తాను

కర్ణుడిరథంమీదికి రథంపెట్టాడు భీముడు. "ఈ నీచుడి నాలుక కోసేస్తాను" అంటూ కత్తిదూశాడు. కర్ణుడిరథంమీదికి వురికాడు.

"వద్దూ వద్దూ" అడ్డుకున్నాడు శల్యుడు– ఇది మూర్ఛ కాని మరణం కాదు. ఈఅవస్థలో నాలిక కోసేస్తే చచ్చి వూరుకుంటాడు. మీకేనష్ట మది. ఏమంటావా? కర్ణుణ్ణి చంపుతానని అర్జునుడు శపథం పట్టాడు. ఇప్పుడు నువ్వు చంపేశావో అతడు విచారిస్తాడు" అన్నాడు.

"అవును" ఆగిపోయాడు భీముడు – "వీడు అన్నయ్యని బాధించడంవల్ల క్రోధంతో మరిచిపోయాను. మూర్ఛలో నాలిక కోస్తే చస్తాడనీ తెలుసు. అదికూడదనీ తెలుసు. సమయానికి జ్ఞాపకంచేశావు. మంచిపనిచేశావు. ఈదురాత్ముడు సభలో ద్రౌపదిని కారుకూతలు

కూశాడు అది అప్పటినించీ గుండెలో మెలుగుతోంది. అన్నయ్య కష్టపడతాడని ఆపుకుంటూవచ్చాను. ఆకసి ఇవాళ తీర్చుకోవాలని పించింది. అలాచేశానో మానసంకలవాడు అర్జునుడు. తనశపథం నెర వేరకపోడంతోనే, విచారంతో ప్రాయోపవేశంచేసుకుంటాడు. అతడే వుండకపోతే కృష్ణుడూ ధర్మరాజూ వుండరు. ఇంతప్రమాదం వచ్చి పడేది. తెలిసి తప్పించావు. మహోపకారం చేశావు. మామా, నీఆజ్ఞ జవదాటను.”

తిరిగిపోయాడు భీముడు. సంతోషించాడు శల్యుడు. రథం తప్పించుకు పట్టుకుపోయాడు.

ధృతరాష్ట్రుడు: “పొడిచేస్తాడు పొడిచేస్తాడు” అని కర్ణుణ్ణి పొగుడుతాడు మీరాజు. ఆకొవ్వ కాస్తా కరిగించేశాడు భీముడు. ఇదిగో ఇంత మొనగాడు కర్ణుడు! సరే, తరవాత?

సంజయుడు: కర్ణుడి అవస్థ దూరంనించి చూశాడు దుర్యోధనుడు. “భీముడు కర్ణుణ్ణి మూర్ఛకొట్టేసినట్టున్నాడు. వేగం వరిగెత్తండి” తమ్ముళ్ళని తొందరచేశాడు. శ్రుతవర్మా మొదలైన నీకుమాళ్ళు సేనలతో వరిగెత్తారు. భీముడిమీద కలబడ్డారు. వాళ్ళ సేనలో వందాయాభై మంది వీరరథికుల్ని చంపేశాడు భీముడు. ఒక వెడల్పాటి బాణం వేశాడు. శ్రుతవర్మశిరస్సు నరికేశాడు. చంద్ర బింబం భూమ్మీదపడ్డట్టు. మెరుస్తున్నకిరీటంతో కిందపడింది శిరస్సు. మరో రెండు బాణాలతో వికటాననుణ్ణీ, సముణ్ణీ కొట్టాడు. పెనుగాలికి కూలిపోయిన రెండు చెట్లలాగ ఇద్దరూ కూలిపోయారు. అదే వరసని కాథుణ్ణి, నందుణ్ణీ, ఉపనందుణ్ణీ ఎగరగొట్టేశాడు. ఇలా అరుగురూ పడిపోయేసరికి తక్కినవాళ్ళు కాళ్ళకి బుద్ధిచెప్పేశారు సేనా తోకముడిచేసింది.

ఇంతలో కర్ణుడు కళ్ళిప్పాడు. మళ్ళీ ఎప్పటిలాగే యుద్ధం అందుకుంది. మళ్ళీ భీముడిదగ్గిరికి పరిగెత్తాడు కర్ణుడు. కరుకైన బాణాలు రువ్వాడు. అవన్నీ కొట్టేసి, ఏడు బాణాలు కర్ణుడిమీద వేశాడు భీముడు. లెక్కాజమాలేని బాణాలు రువ్వాడు కర్ణుడు. అంతకంటే అధికం గుప్పించాడు భీముడు. భయంకరంగా రెచ్చిపోయాడు కర్ణుడు. ఎంచిఎంచి పదిబాణాలు వదిలాడు. భీముడి ధనుస్సు నరికేశాడు. గద విసిరాడు భీముడు. కొట్టేశాడు కర్ణుడు. మరో ధనుస్సు ఎత్తాడు భీముడు. రకరకాల బాణాలు వేశాడు. పాముల్లాంటి పదిబాణాలు వేశాడు కర్ణుడు భీముడివొళ్ళు దుసెళ్ళిపోయాయి. దాంతో ఉగ్రుడై పోయాడతడు. పూనిపూని ఒక బాణం కొట్టాడు. కర్ణుడి గుండెల మీద తగిలింది కవచం చీల్చుకుని, గుండెల్లోదూరి, వీపులోంచి దూసుకుపోయింది. భూకంపానికి చలించిపోయిన కొండలాగ చలించి పోయాడు కర్ణుడు. రోషంతో కందిపోయింది మొహం. గబగబా పాతిక బాణాలు బాదేశాడు. భీముడి ధనుస్సు నరికేశాడు. గుర్రాలు చంపేశాడు. పకాపక నవ్వాడు. ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు భీముడు. శత్రుభయంకరమైన గద పట్టుకున్నాడు. రథం దూకేశాడు కర్ణుడిమీదికి పరిగెత్తాడు.

చూశాడు దుర్యోధనుడు. పదిహేడు మదపుటేనుగులు భీముడిమీదికి రెచ్చగొట్టాడు. సూర్యుణ్ణి కమ్మేసే మేఘాల్లాగ భీముణ్ణి ముట్టడించాయి ఏనుగులు ఏనుగుల్నీ, ఏనుగులమీది యోధుల్నీ కలిపి పచ్చడిచేసేశాడు భీముడు. మూడు వేల గుర్రపుదళంతో శకుని వెళ్ళాడు. ఒక్క మొగిని భీముణ్ణి చుట్టుముట్టారు. ఎన్నో అన్ని రథాలూ, ఎంతో అంత కాల్బలమూ వెళ్ళింది. పేట్రేగిపోయాడు భీముడు. గదపండుగ చేయడం మొదలెట్టాడు మండుతూన్న మహాగ్నిలో చర్మం వేస్తే ఎలా అయిపోతుంది, అదిగో, అంతసేనా అలాఅయిపోయింది భీముడి

దెబ్బలికి. శకునిరథికులు అయిదువందలమంది అతడిమీదపడ్డారు. రథాలూ, గుర్రాలూ కలిపి అంతమందినీ అంతంచేశాడతడు. యవన దేశం గుర్రపురౌతుల్ని మూడువేలమందిని పురికొల్పాడు శకుని. గుర్రాలతోకూడా కూలగొట్టేశాడు భీముడు. కార్చిచ్చు వెదుళ్ళఅడివి కాల్చినట్టు చప్పుడయిం దప్పుడు. అలా గదపంచుగచేసి, మరోరథ మెక్కి యుద్ధంచేశాడు భీముడు.

కర్ణుడు మళ్ళీ ధర్మరాజుని ఢీకొన్నాడు. తీవ్రమైనబాణాలు కురి పించాడు, అతణ్ణీ; అతడి రథాన్ని కప్పేశాడు. అతడి సారథిని చంపేశాడు. రథం ఈడ్చుకుంటూ పరిగెత్తాయి గుర్రాలు వెంట బడ్డాడు కర్ణుడు.

అది చూశాడు భీముడు. అదిలిస్తూ, రథం పరిగెత్తించాడు. సింహంలాగ కలబడ్డాడు, ఆగాడు కర్ణుడు. రథం భీముడివేపు తిప్పాడు. ఇద్దరూ వొకళ్ళమీద వొకళ్ళు బాణాలు గుప్పించుకున్నారు. వాళ్ళ అస్త్రనైపుణ్యం ఉభయసేనలూ నిచ్చెరపోయి చూశాయి. భళీఅంటే భళీ అన్నాయి ఇంతలో సాత్యకి రెక్కలుకట్టుకు వాలా డక్కడ. భీముణ్ణి దాటుకుని కర్ణుడిమీద కలబడ్డాడు. నిప్పులు కక్కుతూన్న బాణాలు ఇద్దరూ గుప్పించుకున్నారు. వాళ్ళ బాణాలతో మట్ట మధ్యాహ్న సూర్యుడు మాటుమణిగిపోయాడు. ఒకళ్ళబాణాలుఒకళ్ళు తుంచుకున్నారు. మధ్యాహ్నసూర్యుడు శమంతపంచకంలో ప్రతిబిం బించాడు. కిరణాలచేతులుచాచి మెచ్చుకున్నదిచాలక, సంతోషంతో పద్మినిదేవిని కౌగిలించుకున్నట్టు శమంతకపంచకం పద్మపుష్పాల తేనెల్లో తేలాడినట్టుంది ప్రతిబింబం.

కృపాచార్యుడూ, కృతవర్మా, శకునీ, అశ్వత్థామా కర్ణుడికి సాయం పరిగెత్తారు. దాంతో మరింత రెచ్చిపోయాడు కర్ణుడు. అతడి ఆటోపంతో పుష్పించపుష్పించినట్టు పుష్పించింది మనసేన. అంతకంటే

ఉద్రేకంతో విరుచుకుపడింది వాళ్ళసేన. రెండు సేనలూ రెండు సముద్రాల్లా ఢీకొన్నాయి. అదలింపులూ, అట్టహాసాలూ, పెడబొబ్బలూ, పొగుడుకోడాలూ, తూలనాడుకోడాలూ రణవాద్యాలని మించిపోయాయి రణభూమియావత్తూ రక్తంపారి భూదేవి ఎర్రముసుగు వేసుకున్న ఆడదిలా అవుపించింది. తలలూ మొదలైన అవయవాలూ, ధనుస్సులూ మొదలైన ఆయుధాలూ, కిరీటాలూ, భూషణాలూ, గొడుగులూ, జెండాలూ, చామరాలూ గుండపిండై తుక్కుతుక్కై అందగానూ, భయంకరంగానూ తయారైంది రణరంగం. ఏనుగులూ, గుర్రాలూ, భటులూ రక్తంలో మునిగి తేలి అకాలంగా లేతఎండ కాస్తున్నట్టయింది. మిగిలిన ఏనుగులు కాయశక్తులా పోరాడాయి. బంగారం పూతపూసినబాణాలు వొళ్ళంతా గుచ్చుకుని మంటలుమండుతూన్న కొండల్లా కనిపించాయి.

ఉప్పెనలా వచ్చిపడుతూన్న ఉభయపక్షాల చతురంగసేనవల్ల ఎక్కడిరక్తం అక్కడ అడిగిపోయింది. ధూళి రేగింది. అంతా ధూళి. చిట్టచీకటి. కనీవినీఎరగని ద్వంద్వయుద్ధం జరిగింది. ఎదటివాడెవడో, పక్కవాడెవడో గుర్తురాలేదు. నేను ఫలానా అంటే నేను ఫలానా అని చెప్పుకుంటూ దెబ్బలాడారు యోధులు. తల్లిపేరూ, తండ్రిపేరూ చెప్పుకు పోరాడారు. బిరుదులు తెలుపుకు పోట్లాడారు. ముందుకు చొరబడి యుద్ధం చేసినవాళ్ళని దేవతలు పొగిడారు.

వల్లమాలిన రక్తం పారింది. భూతభేతాళాలు నాట్యంచేశాయి. పరభృ్య, రాంబందులూ, గెద్దలూ రక్తంతాగీ, మాంసాలు తిని తెయితెక్కలాడాయి. ఆకాశంమీద కబందాలు అల్లాడాయి.

తనివితీరలేదు సైనికులికి. తమకం హెచ్చిపోతూవుంది. మృత్యువు తాండవనృత్యం చేసింది. సింహనాదాలూ, మూలుగులూ, ఏడుపులూ, మొర్రలూ గగ్గోలు గగ్గోలుగావుంది.

ఇక్కడ ఇలా వుంది. అక్కడ అర్జునుడిదగ్గిర: త్రిగర్తసేనా, కోసలం దండూ, నారాయణగోపాలసేనా అర్జునుణ్ణి ఆక్రమించాయి. అంతసేనా అల్లకల్లోలం చేసేశాడు అర్జునుడు. గాండీవం పిడుగులు మోగింది. అగ్నులు విరజిమ్మింది. ఉద్ధృతంగా వెళ్ళాడు సుశర్మ పడాపడా పదిబాణాలు తగిలించాడు. కృష్ణుడి భుజంమీద మూడు బాణాలు నాటించాడు. వెడల్పాటి బాణం జెండాకొయ్యమీద కొట్టాడు. జివ్వున చలించింది జెండాకొయ్య. జెండామీది కపిరాజు గర్జించాడు. ఆగర్జనకి గడగడలాడారు సంశప్తకులు అంతలోనే జల్దు కున్నారు. ఒక్కమొగిని అర్జునుడి రథంమీద పడ్డారు. గుర్రాలూ, కృష్ణుడి చేతులూ, రథంనొగలూ, కాడీ, చక్రాలూ పట్టుకు వేలాడారు. అర్జునుడి కాళ్ళూచేతులూ అడిసి పట్టుకున్నారు. అద్భుతం! మదపు టేనుగు తొండంతో విదిలించినట్టు కొందరిని విసిరేశాడు కృష్ణుడు. కాళ్ళతో నెరివేసి కొంతమందిని చంపేశాడు అర్జునుడు. జానెడేసి పొట్టిబాణాలతో కొంతమందిని కొట్టేశాడు. దాంతో కొంచెం వూపి రాడినట్టు అయింది.

"కృష్ణా," నవ్వుతూ అన్నాడు అర్జునుడు—"కదలకండా శత్రు వులుకలబడి పట్టుకుంటున్నారు.పనికిరాని క్షత్రియుణ్ణినేనుతప్ప తిరగబడ కండా ఎవడు వూరుకుంటాడు చెప్పూ? అయితే, ఏంచేస్తానో ఇప్పుడే చూడు" అని నాగాస్త్రం వేశాడు. అంతమంది కాళ్ళూ కదలకండా కట్టేసింది నాగాస్త్రం. ఆ తెరిపి చూసుకుని శరవర్షం కురిపించా డతడు. అప్పుడు కాని రథం వొదల్లేదు సంశప్తకులు.

చప్పున గారుడాస్త్రం వేశాడు సుశర్మ. చిత్రం! వందలు వందలు, వేలువేలు గరుడపక్షులు పుట్టాయి. నాగపాశాలు చీల్చి పారేసాయి రెచ్చిపోయారు సంశప్తకులు. జడివాన కురిపించారు బాణాలు. ఘోరమైన బాణంవేశాడు సుశర్మ. మంటలు మండుతూ

వెళ్ళింది బాణం. అర్జునుడి రొమ్ముమీద గుచ్చుకుంది. మూర్ఛపోయా డతడు. రథంమీద చదికిలబడిపోయాడు. చచ్చాడంటే చచ్చాడని కేకలువేశారు సంశప్తకులు. శంఖాలుగింగురుమనిపించారు. రణదుందుభులు వాయించారు. ఆకాశం ప్రతిధ్వనించింది. దిక్కులు దిమ్మెత్తి పోయాయి.

తేరుకున్నాడు అర్జునుడు. ప్రళయరుద్రుడై విజృంభించాడు. గాండీవంతో పిడుగులు కురిశాడు. వైరిమొహం వేశాడు సుశర్మ. నవ్వుతూ ఇంద్రాస్త్రం వేశాడు అర్జునుడు. రకరకాల బాణాలు కక్కింది ఇంద్రాస్త్రం. కూరలు తరిగేసినట్టు తరిగింది సంశప్తకుల్ని. క్షణంలో పదివేలమంది మొరికల్లాంటివాళ్లు తెగిపోయారు. తక్కిన వాళ్ళకి కరచరణాలాడలేదు. ఎక్కడివాళ్ళక్కడ వుండిపోయారు. బొమ్మల్లాగ నిలబడిపోయారు. పొగలేని నిప్పులా ప్రకాశించాడు అర్జునుడు. చావగా మిగిలిన సంశప్తకులు పద్నాలుగువేలమంది ముఖ్యయోధులు అర్జునుడిగెలుపు సహించలేకపోయారు. కూడ బలుక్కున్నారు. సైన్యాలతో వెళ్ళి వొక్కవ్యూహపుని పడ్డారు. దారుణమైనపోరు జరిగింది.

తక్కినపాండవులతో యుద్ధంచేస్తున్న కౌరవసేన కాళ్ళకి బుద్ధి చెప్పింది. కృతవర్మా, అశ్వత్థామా, కృపాచార్యుడూ, శకునీ, ఉలూకుడూ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ తక్కిన కుమారుల్లా వల్లమాలిన ధైర్యం చేశారు. సేనల దైన్యం పోగొట్టారు.

కృపాచార్యుడు పాంచాలంవాళ్ళమీద పడ్డాడు. వరసబాణాలు కురిపించాడు. అతడితో శిఖండి కలబడ్డాడు. ఇద్దరూ రామరావణయుద్ధం చేశారు. శిఖండిగుర్రాలు చంపేశాడు కృపాచార్యులు. అతడి సారథిని కొట్టేశాడు. కత్తీ, డాలూ పట్టుకున్నాడు శిఖండి. రథం దూకేశాడు. వరస బాణాలు రువ్వాడు కృపాచార్యుడు. అడుగు ముందుకి వెయ్య

లేకపోయాడు శిఖండి. అన్నదమ్ముడికోసం అడ్డంగా పరిగెత్తాడు ధృష్టద్యుమ్నుడు. అడ్డుకున్నాడు కృతవర్మ ధర్మరాజునీ, ద్రౌపది కుమాళ్ళనీ అశ్వత్థామ ఎదిరించాడు. నకులసహదేవులతో దుర్యోధనుడు తలపడ్డాడు.

శిఖండి డాలు పగలగొట్టాడు కృపాచార్యులు. జంకలేదు శిఖండి. కత్తితోనే కలబడ్డాడు. చికిలిపట్టినబాణాలు వొళ్ళంతా నాటించాడు కృపాచార్యులు. చిత్రకేతుడికొడుకు సుకేతుడు పరిగెత్తుకువచ్చాడు. కృపుడిమీద బాణజ్వాలలు కురిపించాడు. భయంకరంగా పోరాడాడు. శిఖండి తప్పుకున్నాడు ఇరవై ఆరుబాణాలు కొట్టాడు సుకేతుడు. కృపుడివొళ్లుతూంట్లుకొట్టేశాడు. అతడిధనుస్సు నరికేశాడు ఇంకోవిల్లు ఎత్తాడు కృపుడు. అదీనరికేశాడు సుకేతుడు. నర్దుకునేలోపున ఉతడి గుర్రాలమీద బాణాలు కొట్టాడు. సారథిని నొప్పించాడు.

మరోవిల్లు తీశాడు కృపుడు. ముప్ఫయిబాణాలు రువ్వాడు. ఆదెబ్బలికి వూగిపోయాడు సుకేతుడు కత్తిలాంటి వాడిబాణం వేశాడు కృపాచార్యుడు. సుకేతుడి తల తెగిపోయింది కుండలాలతో మెరుస్తూ కిందపడింది.

పాంచాలకుమారుడు సుకేతుడు పడిపోగానే అతడిసేన పారిపోయింది.

కృతవర్మ బోరమీద తొమ్మిదిబాణాలు గుచ్చాడు ధృష్టద్యుమ్నుడు. అతడి గుర్రాలూ, రథమూ, జెండా అన్నీ కప్పెట్టాడు కృతవర్మ. మేఘం కప్పినసూర్యుడిలా అపుపించాడు ధృష్టద్యుమ్నుడు. జయద్రథుడి వధనాడు తనపావురాారంగుగుర్రాలు ద్రోణుడిగుర్రాలతో కలిపినట్టు కృపుడి నొగతో నొగ రాపాడించా డతడు. ద్రోణుడిమీద వురికినట్టే అతడిమీదికివురకబోయాడు. గదతీశాడు కృతవర్మ. అయినా

ఆగలేకపోయాడు. పంతం వొదిలేశాడు. వెనకనించి రథం దూకే శాడు. ద్రోణుడిలా కాకండా వంచకుడై పోయాడు కృతవర్మ. ధృష్ట ద్యుమ్నుడు అతడి రథంమీదికి లంఘించాడు. అతడు కనబడకపోడం తోనే అతడి సారథితల నరికేశాడు. "ఇదిగో ఇక్కడా" కిందనించి చప్పట్లుకొట్టాడు కృతవర్మ. వురికాడు ధృష్టద్యుమ్నుడు. రథమెక్కే శాడు కృతవర్మ. ధనుస్సు సారించాడు. ఇంతలో మన రథికుడొకడు చప్పున వెళ్ళాడు. కృతవర్మనితనరథంమీద పెట్టుకుని పట్టుకుపోయాడు. కౌరవసేనమీద పడ్డాడు ధృష్టద్యుమ్నుడు.

ధర్మరాజూ, అశ్వత్థామా దారుణంగా పోరాడారు. సాత్యకి ధర్మరాజుతో కలిశాడు. ద్రౌపదికొడుకులూ తోడయారు. అంత మందినీ ఆడించేస్తూ యుద్ధంచేశాడు అశ్వత్థామ. అతడి బాణాలతో ఆకాశం అవుపడ లేదు. చిమ్మచీకటి కమ్మినట్టయింది. నిప్పులు కురిశాడు ధర్మరాజు. శరవర్షం కురిపించాడు సాత్యకి. వరసబాణాలు కొట్టారు ఉపపాండవులు. ఎత్తినబాణం దించలేదు అశ్వత్థామ. ఒక్కొక్కడి మీదా లెక్కాజమాలేని బాణాలువేశాడు. శ్రుతకీర్తివిల్లునరికేశాడు. మరో విల్లు తీశా డతడు. మూడుబాణాలు అశ్వత్థామమీద నాటించాడు. అగ్గిలామండాడుఅశ్వత్థామ. శ్రుతకీర్తినీ, అతడి పక్కల వాళ్ళనీ బాణాజ్వాలలతో ముంచెత్తాడు.

భయంకరంగా కలబడ్డాడు ధర్మరాజు. అతడిధనుస్సునరికేశాడు అశ్వత్థామ. పిడుగుల్లాటి బాణాలు మూడు తగిలించాడు. ఇంకోవిల్లు ఎత్తాడు ధర్మరాజు. అరవై మూడు బాణాలు అశ్వత్థామమీద కురిపిం చాడు. సాత్యకి వొక అర్ధచంద్రబాణం వేశాడు. అశ్వత్థామధనుస్సు ముక్కలయింది. అగ్నిశిఖలా లేచాడు అశ్వత్థామ శక్తిప్రయోగిం చాడు. సాత్యకిసారథిని చంపేశాడు. ఇంకో విల్లు తీశాడు. జడివాన కురిపించాడు బాణాలు.

సారథిలేక రథం ఈడ్చుకుంటూ పారిపోయాయి సాత్యకి గుర్రాలు. ధర్మరాజునండు అశ్వత్థామమీద పడింది. బాణాలతో ముంచెత్తింది. అసలే అశ్వత్థామ. కార్చిచ్చులా రెచ్చిపోయాడు. అడవికాల్చినట్టు ధర్మరాజుసేన కాల్చిపారేశాడు. ఆదెబ్బతో పాండవులు అశ్వత్థామచేత అంతమే అయిపోయారు అనుకున్నాడు దుర్యోధనుడు.

"నీసామర్థ్యం నాకు బాగా తెలుసు" బాణాలు గుప్పిస్తూ అశ్వత్థామతో అన్నాడు ధర్మరాజు – "నువ్వు చెప్పినట్టు వింటాయి బాణాలు. అదంతా ధృష్టద్యుమ్నుడిదగ్గిర చూపిస్తే తెలుస్తుంది. స్నేహమూ, కృతజ్ఞతా, మంచీచెడ్డా ఏకోశానా లేవు నీకు. బ్రాహ్మడివి. తపస్సుచేసుకోక యుద్ధానికి దిగబడ్డావు. ఎంతమిడిసిపడినా సరు, కౌరవకులంమాత్రం కాపాడలేవు. అప్ప ఆరాటమే కాని బావ బతకడు. నువ్వు కళ్ళల్లో వేలుపెట్టుకు చూస్తూనే వుంటావు. తప్పకండా మేమే గెలుస్తాం."

అశ్వత్థామ మాటాడలేదు. విరామంలేకండా బాణాలు విరజిమ్మాడు. తట్టుకోలేకపోయాడు ధర్మరాజు. తప్పుకు వెళిపోయాడు. గెలుపుగర్వంతో నిలబడ్డాడు అశ్వత్థామ. తన కుడి ఎడమల తనవాళ్ళని తేరిచూశాడు. ఎదటి శత్రుసేనమీద విరుచుకుపడ్డాడు.

భీముడితో యుద్ధంచేస్తున్నాడు కర్ణుడు. కరూశసేనా, చేదిరాజువా, పాంచాలసైన్యమూ అతణ్ణి చుట్టుముట్టాయి. భీముణ్ణి వొదిలేసి ఆదండుమీద పడ్డాడు కర్ణుడు. భీముడు కౌరవసేనమీద పడ్డాడు. అర్జునుడిముందు సేనలు పీనుగుపెంట లవుతూవున్నట్టే, కర్ణుడి ఎదటా, భీముడిముందూ పీనుగుపెంట లయాయి. ధృతరాష్ట్రమహారాజా, ఇదంతా నీదురాలోచనవల్లే సంభవించింది.

దుర్యోధనుడూ, నకులసహదేవులూ దేవదానవయుద్ధం చేశారు. నకులుడిమీద తొమ్మిది కోలలు కొట్టాడు దుర్యోధనుడు. సహదేవుడి బంగారం జెండా నరికేశాడు. నకులుడు ఎనిమిది బాణాలూ సహదేవుడు పదిబాణాలూ దుర్యోధనుడిమీద వేశారు. ఇద్దరి ధనుస్సులూ తుంచేశాడు దుర్యోధనుడు. అన్నదమ్ములిద్దరూ కొత్త ధనుస్సులు తీశారు. ఒకణ్ణిమించి ఒకడు అంపవాన కురిపించారు. వల్లమాలిన ఆవేశం తెచ్చుకున్నాడు దుర్యోధనుడు. ఘోరమైన మహాస్త్రాలు ప్రయోగించాడు. నకులసహదేవులపని అయిపోయిందనే అనుకున్నారు సైనికులు. పెద్దపులిలా వచ్చి అడ్డుపడ్డాడు ధృష్టద్యుమ్నుడు.

ఇలా వచ్చాడు, అలా దుర్యోధనుణ్ణి బాదేశాడు ధృష్టద్యుమ్నుడు. అతడిమీద పాతిక బాణాలు నాటించాడు దుర్యోధనుడు. మండిపోయాడు పాండవసేనాని. అరవై అయిదు బాణాలు మోతపెట్టి కువ్వరించాడు. అతడి ధనుస్సు నరికేశాడు దుర్యోధనుడు. అంతకంటే గట్టివిల్లు తీశాడు ధృష్టద్యుమ్నుడు. మెరుపుల్లాటి పది హేను బాణాలు రారాజుమీద తగిలించాడు. రక్తంబుకారి పూసిన మోదుగులా అవుపించాడు దుర్యోధనుడు. మళ్ళీ ధృష్టద్యుమ్నుడి ధనుస్సు నరికేశా డతడు. అతడి నుదుటిమీద ఇనప బాణాలు నాటించాడు. తామరపువ్వుమీద తుమ్మెదలు వాలినట్టు కనపడింది ధృష్టద్యుమ్నుడి మొహం.

ప్రేటేగిపోయాడు ధృష్టద్యుమ్నుడు. ఇంకోధనుస్సు ఎత్తాడు. క్రూరమైన భల్లబాణాలు కొట్టాడు. దుర్యోధనుడి సారథిని తారుమని పించాడు. అతడి విల్లు విరిచేశాడు. రథం ముక్కలుకొట్టేశాడు. చలించ లేదు దుర్యోధనుడు. అమాంతంగా శక్తిప్రయోగించాడు తుక్కు చేసేశాడు ధృష్టద్యుమ్నుడు. కత్తిదూశాడు దుర్యోధనుడు. తునకలు

చేసేశాడు ధృష్టద్యుమ్నుడు గద ఎత్తాడు సుయోధనుడు. గుండెపిండి చేసేశాడు ధృష్టద్యుమ్నుడు. రత్నాల నాగుపాంజెండా నరికేశాడు.

దుర్యోధనుడి తమ్ముడు దండధారుడు రథం పరుగెత్తించుకు వెళ్ళాడు. అన్నగారిని పట్టుకువచ్చేశాడు. సాత్యకితో యుద్ధంచేస్తూ అదిమేశాడు కర్ణుడు. అతణ్ణి వాదిలేశాడు. ధృష్టద్యుమ్నుడివేపు రథం పరిగెత్తించాడు. బాణాలు గుప్పిస్తూ సాత్యకి వెంటపడ్డాడు.

ఇద్దరు సేనానులూ కలబడ్డారు. రెండుసేనలూ పొలోమని లేచాయి. కొత్త ఉత్సాహంతో పోరాడాయి. ఘోరంగా జరిగింది యుద్ధం.

ధృష్టద్యుమ్నుడికి దన్ను పాంచాలకుమాళ్ళు, వ్యాఘ్రకేతుడూ, సుశర్మా, శుక్లుడూ, చిత్రాయుధుడూ, ఉగ్రాయుధుడూ, జయుడూ, రోచమానుడూ, సింహసేనుడూ రథాలసేనతో వచ్చారు. కర్ణుణ్ణి ముట్టడించారు.

ఎనిమిది భల్లబాణాలు వేశాడు కర్ణుడు ఎనమండుగురినీ చంపేశాడు.

చేదిరథవీరులు జిష్ణుడూ, జిష్ణుకర్ముడూ, దేవాపి, భద్రుడూ, దండుడూ, చిత్రుడూ, చిత్రాయుధుడూ, హరీ, సింహకేతుడూ, రోచమానుడూ, శలభుడూ సైన్యాలతో కర్ణుడిమీద పడ్డారు. పదకొండు మందినీ వూడ్చిపారేశాడు కర్ణుడు. పేరుపడ్డ మొనగాళ్ళనీ, వాళ్ళ రాణువనీ చావుదెబ్బలు కొట్టేశాడు. నలిచేశాడు. అల్లకల్లోలం చేసేశాడు. భీష్ముడూ, ద్రోణుడూ కూడా ఇంత ఇలా వీరవిహారం చెయ్యలేదనిపించాడు. శత్రువులే నిచ్చెరపోయారు.

సింహంపాలబడ్డ ఏనుగుల్లాగ, పులి మొహానబడ్డ జింకల్లాగ, అగ్గిలోపడ్డ మిడతల్లాగ, పాంచాలయోధులూ, చేదివీరులూ కర్ణుడి బాణాలకి బలిఅయిపోయారు. అయినా తనివితీర లేదు కర్ణుడికి. ధర్మ

రాజు మీదికి రథం పరిగెత్తించాడు దశసు. ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపది కుమారుల్నూ, సహదేవుడూ, శిఖండీ, సాత్యకీ, నకులుడూ, పేరుపడ్డ రాజులూ—ఇంతమందీ అడ్డుకున్నారు; కలబడ్డారు. పాములతో పోరాడిన గరుత్మంతుడిలా పోరాడాడు కర్ణుడు.

భీముడు కూల్చేసిన మన చతురంగసేనతో రణరంగమంతా మూసుకుపోయినట్టయిపోయింది. చావగా మిగిలిన సేన నిస్తేజమైపోయింది. కెరటాల్లేని సముద్రంలా అయిపోయింది.

ఇక అర్జునుడిసంగతి ఏంచెప్పనూ! ముక్కా-కలు తేరిన సంశప్తక సేన చేను కోసేసినట్టు కోసి పారేశాడతడు. చావగా మిగిలినవాళ్ళు పిరికిమందుపుచ్చుకున్నారు.

"చూడూ చూడూ" వాళ్ళని చూపిస్తూ కృష్ణుడితో అన్నాడు అర్జునుడు – " దేవతలకైనా లొంగనివాళ్ళు వీళ్ళు. నా బాణాలికి భయపడి ఎలా పరిగెడుతున్నారో చూడు. భీముడిఎదటా నిలవలేక పోతున్నారు కౌరవులు. కర్ణుడు వొక్కడే జెండా ఎగరేస్తున్నాడు. సముద్రంలో మందరంలాగ మనసైన్యం మథించేస్తున్నాడు. అతడివేపు పోనీ రథం. "

"అవును" నవ్వుతూ అన్నాడు కృష్ణుడు – " నీబాణాల్లో మునిగితేనే కాని కౌరవుల రణదాహం తగ్గదు."

తెల్లగుర్రాలు అదిలించాడు శ్రీకృష్ణుడు. పగ్గాలు సడిలించాడు. అర్జునుడిరథం పరిగెత్తింది. సింహంచూసిన లేళ్ళమందలాగ పరిగెత్తింది కౌరవసేన. సంశప్తకుల్ని పురికొల్పాడు దుర్యోధనుడు. రెండువేల రథాలూ, మూడువందల ఏనుగులూ, పద్నాలుగువేల గుర్రాలూ, రెండులక్షలపదాతులూ వెళ్ళి అర్జునుణ్ణి అడ్డుకున్నాయి. గాండీవం పురిటించాడు అర్జునుడు. బాణాలతో ఆకాశం కప్పేశాడు. పదివేల

మందిని మచ్చుకిలేకండా కొట్టేశాడు. కాంభోజసేన వెళ్ళి నిలబడింది. రథంతో సేనమధ్యకి వురికాడు అర్జునుడు. తుపానులాగ, సుడిగాలి లాగ చెలరేగిపోయాడు. చేతులూ, శిరస్సులూ నరికి కుప్ప పెట్టాడు. కూలిన అడివిలా అయిపోయింది కాంభోజసేన. సుదక్షిణుడితమ్ముడు దురుసుగా తోసుకువెళ్ళాడు. వాడివాడి బాణాలు గుప్పించాడు. అర్ధచంద్రబాణాలు వేశాడు అర్జునుడు. అతడి రెండుచేతులూ నరికేశాడు. ఒక భల్లబాణం కొట్టి శిరస్సు చెక్కేశాడు. యవనసేన వెళ్ళింది. శక సైన్యం పరిగెత్తింది. రకరకాల ఆయుధాలు కుమ్మరించింది. హనుమంతుడిముందా కుప్పిగెంతులు! ఆటలాగ కొట్టిపారేశాడు అర్జునుడు. రక్తం నదులు పారించాడు.

ఒక్కమొగిని మీదపడ్డారు సంశప్తకులు. పెద్దగాలి మేఘాలు చెదరగొట్టినట్టు చెదరగొట్టాడు అర్జునుడు. కృష్ణుడి సారథ్యం చాకచక్యంవల్లా, తెల్లగుర్రాల చురుకుదనంవల్లా, అర్జునుడిరథం మెరుపులు మెరిసినట్టు పరిగెత్తేది. జడివానలా బాణాలు కురిసేవాడు అర్జునుడు. అద్భుతమైన విక్రమంచూపెట్టాడు. అతణ్ణి చూడాలంటే రెండుకళ్ళు చాలవు. పదివేలు కావాలి. దేవేంద్రుడే పొగిడాడు. దేవదుందుభులు మోగించాడు. పూలవాన కురిపించాడు. అందరూ వినేట్టు ఆకాశవాణి అంది: "పరమమునులు వీళ్ళు. నరనారాయణులు. సూర్యచంద్రులులా ప్రకాశిస్తారు. లోగడ వొకేరథమెక్కిన బ్రహ్మ, శివుడూ లాగ విజృంభిస్తారు."

ఆ మహాశ్చర్యంచూసీ, వినీ కూడా అర్జునుడిమీద వురికాడు అశ్వత్థామ.

## యు ద్ధ మే ఆ తి థ్యం

"తగిన అతిథి అని మన్నిస్తావా నన్ను!" బాణం పట్టుకున్న

కుడిచేత్తో అర్జునుణ్ణి పిలుస్తూ అన్నాడతను- "అలా అయితేనే నీదగ్గిరికి వస్తాను. అర్జునా, యుద్ధమే నాకు కావలిసిన ఆతిథ్యం."

"అశ్వత్థామని గెలవకపోతే తలకొట్టేసిన ట్టవుతుంది" కృష్ణుణ్ణి అడిగాడు అర్జునుడు-" ఇటు సంశప్తకుల పనిపట్టించాలి. పంచెయ్యాల్లో నువ్వే ఆదేశించు. ఏది నీకు నచ్చితే అదే చేస్తాను."

"మంచిది" రథం అతడి వేపు తిప్పుతూ అశ్వత్థామతో అన్నాడు శ్రీకృష్ణుడు — "యుద్ధమే ఆతిథ్యం పుచ్చుకో. కౌరవరాజు రుణం తీర్చుకో. అర్జునుడిముందు వెన్ను చూపించకండా మాత్రం నిలబడు."

మండిపడ్డాడు అశ్వత్థామ. "అలాగే కానీ" అంటూ కృష్ణుడి మీద అరవై బాణాలు వేశాడు మరో మూడు అర్జునుడిమీద కొట్టాడు. టపీమని అతడి ధనుస్సు తుంచేశాడు అర్జునుడు. ఇంకో విల్లు అందుకున్నాడు అశ్వత్థామ. వడివడిగా వాడివాడి బాణాలు - చేతుల్లోంచి, కాళ్ళలోంచి, మొహంలోంచి, వింటికొమ్ముల్లోంచి పుట్టుకు వచ్చినట్టు- వేలకి వేలు కురిపించాడు. కృష్ణుడూ, అర్జునుడూ, రథమూ, గుర్రాలూ, కపిధ్వజమూ కనపడకండా కప్పడిపోయాయి. కృష్ణార్జునులూ కాళ్ళూ చేతులూ కదపలేకపోయారు. దిగులుపడిపోయారు. సింహనాదం చేశాడు అశ్వత్థామ. తన పరాక్రమం అంతమైపోయిందనే అనుకున్నాడు అర్జునుడు. పాండవసేన హాహాకారాలు చేసింది. లోకాలు రక్షించవలసినవాళ్ళు కృష్ణార్జునులు. వాళ్ళిద్దరూ నిశ్చేష్టులైపోడం చూసి చారణులూ, సిద్ధులూ "లోకాలు బతుకుతాయా ఇక !" అన్నారు.

"చిత్రంగా వుంది" కళ్ళెర్రచేసి అర్జునుడితో అన్నాడు శ్రీకృష్ణుడు- 'అశ్వత్థామా నిన్ను మించిపోడం ? గాండీవం సరిగా లేదా ? ముష్టి సడిలిపోతోందా ? చేతుల్లో బలం తగ్గిందా ? ఏమిటిది ? గురువుగారి కొడుకని మెత్తబడుతున్నానా ? ఆవేగమే అవుపడదేం?"

"అలాగా!" రోషంతో చర్రుమన్నాడు అర్జునుడు-"బాణాలతో మనల్ని ముంచేసి కేంకలుగుద్దుతున్నాడు బ్రాహ్మడు. ఇదిగో ఇప్పుడే ఏంచేస్తానో, నన్నూ గాండీవాన్నీ చూడు" అంటూ వెడల్పాటి బాణాలు తొడిగాడు. అశ్వత్థామబాణాలన్నీ కొట్టిపారేశాడు అతడి ధనుస్సు మళ్ళీ తుంచేశాడు. జెండా ఎగరగొట్టాడు. గొడుగు విరిచేశాడు ఒరలోంచి కత్తిలాగాడు అశ్వత్థామ తునకలుచేసేశాడు అర్జునుడు. గదపట్టుకున్నాడు అశ్వత్థామ. తుళ్ళగొట్టేశాడు అర్జునుడు. మంచుకరిగించేసిన సూర్యుడిలాగ అశ్వత్థామ ఆటోపం అణగగొట్టేశాడతడు. పూర్తయింది ఆతిథ్యం.

సంశప్తకులు అర్జునుడిమీద పడ్డారు. గాండీవం గుబగుబలాడింది. తెల్లగుర్రాలు పురకలువేశాయి. కపిధ్వజం రెపరెపలాడింది. ప్రతిసంశప్తకుడూ తనమీదికే అర్జునుడిరథం వురికేస్తోందనుకున్నాడు. ఎడా పెడా ఎటుచూసినా అర్జునుడి బాణాలే అవుపించాయి. ఇటు సంశప్తకుల్ని చండాడుతూనే అశ్వత్థామతో యుద్ధంచేశాడు అర్జునుడు. పిడుగులే పిడుగులు కురిపించాడు. కొండలా సహించాడు అశ్వత్థామ. శాయశక్తులా యుద్ధంచేశాడు.

చేతుల తీటదీరా బాణాలు రువ్వాడు అర్జునుడు. సంశప్తకసేన నురుమాడాడు. చేతులూ, తలలూ తుంచితుంచి కుప్పపెట్టాడు. ఏనుగులూ, గుర్రాలూ పీనుగుపెంట లయాయి. రణవాద్యాలూ, నగలూ, జెండాలూ, చామరాలూ, గొడుగులూ గుండపిండయాయి. రక్తం నదులై వాటిని తోసుకుపోయింది. మేటలు వేసింది.

అంగ, వంగ, కళింగ, నిషాదసేనలు అర్జుణ్ణి ముట్టడించాయి. అదే సమయమన్నాడు అశ్వత్థామ. అర్జునుడిమీదా కృష్ణుడిమీదా బాణంమీద బాణం తగిలించాడు. సింహనాదంచేశాడు. అశ్వత్థామనీ, అతడితో వచ్చిన రాజులనీ ముచ్చెమటలు పోయించాడు అర్జునుడు.

అగ్గిలా భగ్గుమన్నాడు అశ్వత్థామ. క్రూరమైనబాణాలు గుప్పించాడు. అతడి దురుసుతనం సహించలేకపోయాడు శ్రీకృష్ణుడు. "అర్జునా, రోగం ముదరకముందే మందు వెయ్యాలి. బ్రాహ్మడు మితి మీరుతున్నాడు. చూస్తావేం?" అన్నాడు

అతడిమాట పూర్తికానేలేదు, అల్లెతాడుసారించాడు అరునుడు. అశ్వత్థామ కంఠంమీదా, చేతులమీదా, కాళ్ళమీదా, గుండెల మీదా వాడివాడి బాణాలు నాటించాడు. ఒకబాణం కొట్టి పగ్గాలు నరికేశాడు. రథం ఈడ్చుకుంటూ ఎంతోదూరం పరిగెత్తిపోయాయి గుర్రాలు. ఉత్సాహం కుంగిపోయి కర్ణుడిదగ్గిరికి వెళ్ళిపోయాడు అశ్వత్థామ.

## దండధారుడూ దండుడూ

సంశప్తకులమీదికి రథం మళ్ళించాడు శ్రీకృష్ణుడు. రథం నడుపుతూ పాండవసేనలో కోలాహలం విన్నాడు. చూశాడు. అర్జునుడితో అన్నాడు:

"అదిగో ఆ కల్లోలం విన్నావా? మగధదండధారుడు ఏనుగు మీద మనసైన్యం చెండాడుతున్నాడు. భగదత్తుడంతవాడితడు. ముందు ఇతడి పనిపట్టించేసి,తరవాత ఏంచెయ్యాలో చూసుకుందాం."

చూశాడు అర్జునుడు. రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ చెండాడుతున్నాడు దండధారుడు. "అవును, పద –" కృష్ణుణ్ణి తొందరచేశాడు అర్జునుడు. బరిమీద సాంలాగ పరిగెత్తింది రథం. దండధరుడి ఏనుగుని అడ్డగించాడు అర్జునుడు. దిగ్గజంలా వుంది ఏనుగు. అర్జునుడిమీదికి వురికించాడు దండధరుడు. బాణాలు కురిపించాడు గుర్రాలు కప్పెట్టాడు. కృష్ణార్జునుల్ని ముంచెత్తాడు. అగ్గికురిసేశాడు

అర్జునుడు. గాండీవ మెత్తాడు. బాణాలు సంధించాడు. దండధరుడి రెండుచేతులూ నరికేశాడు. అతడి శిరస్సు తెగేశాడు. ఏనుగునీ చంపేశాడు.

దండధరుడితమ్ముడు దండుడు అర్జునుడిమీద వురికాడు. తోమరంమీద తోమరం కొట్టాడు. అతడి అన్నని చేసినట్టే, చేతులూ తలా నరికి చంపేశాడు అర్జునుడు.

దండధరుడి ఏనుగుసేన తిరగబడింది. సుడిగాలి మేఘాలు చెదరగొట్టినట్టు చెల్లాచెదురుచేసి కొట్టాడు అర్జునుడు. మగధసేన మర్దించి, సంశప్తకులమీదికి వెళ్ళాడు. కృష్ణసారథ్యం - ఎక్కడపడితే, అక్కడ అవుపడ్డాయి తెల్లగుర్రాలు తళుక్కుమంటే తళుక్కుమంది వానరపతాకం. భల్లబాణాలూ, కనపబాణాలూ వేలువేలు విరజిమ్మాడు అర్జునుడు. మహాసముద్రంలో మందరంలా మనదండులో అవుపించింది అర్జునుడి దివ్యరథం. ఎంతకొడితే అంతవచ్చిపడుతున్నారు త్రిగర్తులు. రకరకాల బాణాలు గుప్పించారు. అన్నీ కొట్టేశాడు అర్జునుడు. వాళ్ళని కండలుకండలు చెక్కేశాడు. గుర్రాలూ, ఏనుగులూ చిందరవందరచేసి నరికాడు. తామరచెరువులో కేళీ విహారంచేసిన మదపుటేనుగులాగ వీరవిహారం చేశాడు. శత్రువన్నవాణ్ణల్లా స్వర్గానికి పంపించాడు. చచ్చినంత చచ్చారు. మిగిలినవాళ్ళు పిక్కబలంచూపించారు. వాళ్ళని దూరంగా వెంటాడాడు అర్జునుడు. "అర్జునా, నీవిక్రమవిహారం చూడు" రథంమళ్ళించి తెస్తూ అన్నాడు కృష్ణుడు. తుక్కుతుక్కయిన రకరకాల ఆయుధాలూ, పచ్చడి పచ్చడి అయిపోయిన ఏనుగులూ, గుర్రాలూ, వదాతులూ, గుండ పిండైపోయిన రథాలూ, పొడిపొడి అయిపోయిన ఆభరణాలూ, గొడుగులూ, జెండాలూ, చామరాలూ — అద్భుతంగా భయానకంగా భీభత్సంగా వుంది రణభూమి. ఏనుగులూ, గుర్రాలూ,

కొన్ని కొనప్రాణంతో మూలుగుతున్నాయి. అరుస్తున్నాయి. పోతూ పోతూ వున్న ప్రాణాలతో పదాతులు కొందరుఏడుస్తున్నారు. కన్నీళ్ళు కారుస్తున్నారు. పెళ్ళాం బిడ్డల్ని తలుచుకుంటున్నారు. కుయ్యో మొర్రోమంటున్నారు. అవన్నీ చూస్తూ జాలిపడుతూ రథం పోని చ్చారు కృష్ణార్జునులు. ఇంతలో పాండవసేనలో కలకలం వినపడింది. పగ్గాలు సడిలించాడు కృష్ణుడు. పరుగులు పెట్టింది రథం.

అంతకిముందు కురుకుమాళ్ళసేన వొకతట్టూ, కర్ణుడిసేన వొక తట్టూ రెండూ రెండుమొహాల పోరాడుతూ యుద్ధం ఔచిత్యం ప్రకారం రెండూ కలుసుకున్నాయి. ఆంధ్ర, పుళింద, బాహ్లీక, భోజ, కొంకణసేనలు పురికొల్పాడు దుర్యోధనుడు. కర్ణుడితో కలిసి విజృంభించా యవి. పాండవసేనకి తలమునకలయింది.

## మలయధ్వజుడు

పాండ్యరాజు మలయధ్వజుడు ముందుకి వచ్చాడు. కౌరవసేన మీద కలబడ్డాడు ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, కాల్బలమూ కూలగొట్టాడు భీష్ముడూ, ద్రోణుడూ తనతో సమానులంటే సహించ డతడు. అర్జునుడూ, కృష్ణుడూ తనకంటే అధికులంటే అస హ్యించుకుంటాడు. అంత వాడు మలయధ్వజుడు.

"లేళ్ళు చంపిన సింహంలా శత్రువుల్ని చంపేస్తున్నావు. ఒకసారి నావేపు రా చూద్దాం" అతణ్ణి చూసి, నవ్వుతూ అన్నాడు అశ్వత్థామ. అతడి మాట ముగిసిందో లేదో, దుసెళ్ళిపోయినట్టు వొక బాణం కొట్టాడు మలయధ్వజుడు. అల్లెతాడు ప్రయోగించాడు. వరస బాణాలు గుప్పించాడు.

ఎంచిఎంచి తొమ్మిదిబాణాలు వేశాడు అశ్వత్థామ. తొమ్మి దింటికీ తొమ్మిది కొట్టాడు మలయధ్వజుడు. అశ్వత్థామ బాణాల్లో అయిదు తునకలై పోయాయి. తక్కిననాలుగూ మలయధ్వజుడి గుర్రా

లకి తగిలాయి. గుర్రాలు కూలిపోయాయి. ఆపూవుని మరిన్ని రువ్వాడు అశ్వత్థామ. అతడి అల్లెతాడు పుటుక్కుమనిపించాడు మలయధ్వజుడు. గబుక్కున మరో అల్లెతాడు సంధించాడు అశ్వత్థామ. బాణాలతో ఆకాశం కనపడకుండా చేశాడు. తనపరివారం కొత్త గుర్రాలు సిద్ధంచేసింది మలయధ్వజుడికి. వాయువ్యాస్త్రం వేశాడతను. అశ్వత్థామబాణాలన్నీ ఎగరగొట్టేశాడు. అతడి చక్రరక్షకుల్ని చంపేశాడు. సింహనాదం చేశాడు. ఆపలేని కోపం తెచ్చుకున్నాడు అశ్వత్థామ. మలయధ్వజుడికి దన్నుయి వచ్చిన యోధుల్ని చంపేశాడు. రత్నాలతోనూ, అగరు చందనాలతోనూ అందంగా మలయపర్వతంలా వున్న మలయధ్వజుడి జెండా పడగొట్టాడు. అతడి గుర్రాలు కూల్చేశాడు. ధనుస్సు తుంచేశాడు. రథం గుండచేశాడు. అతను ప్రయోగించిన ప్రతిఆయుధమూ తునకలుచేసేశాడు. తలుచుకుంటే అంతతోనే పూడ్చేసేవాడతణ్ణి. కాని యుద్ధంమీద వేడుకతో కొంచెం ఆగాడు.

కొండశిఖరమెక్కిన సింహంలాగ యోధుడు కూలిపోయిన వాళ్ళ ఏనుగుమీద ఎక్కివచ్చాడు మలయధ్వజుడు. దారుణమైన తోమరం తీశాడు. అశ్వత్థామమీద విసిరికొట్టాడు. పిడుగులా వచ్చింది తోమరం. అశ్వత్థామరత్నకిరీటం కిందపడగొట్టింది. తోక తొక్కిన పాములాగ లేచాడు అశ్వత్థామ. మలయధ్వజుడి రెండుపక్కలా యుద్ధంచేస్తున్న ఆరుగురురథికుల్ని అమాంతంగా ఎగరగొట్టాడు. మలయధ్వజుడుఎక్కినఏనుగు తొండామూ, నాలుగుకాళ్ళూనరికేశాడు. అంతతోనూ వూరుకోలేదు. మలయధ్వజుడి కాళ్ళూ చేతులూ తెగేశాడు అతడి శిరస్సు పూడ్చేశాడు. దాంతో శత్రుసేన జజ్జరిల్లిపోయింది. కకావికలైపోయింది. "అదిగదీ అశ్వత్థామా!" – బుజాలెగరేస్తూ మెచ్చుకున్నాడు దుర్యోధనుడు.

"ఆగండీ ఆగండీ" — చెదిరిపోతున్న సైన్యం చేరదీసి మన సేనమీద విరుచుకుపడ్డాడు భీముడు. ధృష్టద్యుమ్నుడూ మొదలైన యోధులు అతడితో కలిశారు. ఆగలేకపోయింది కౌరవసేన. పక్కపక్కలికి తప్పుకుంది. అదిలించి మళ్ళించాడు కర్ణుడు పాండవుల రథసేనమీదికి రథం పరిగెత్తించాడు అతడితో అశ్వత్థామా కలిశాడు. ఎంతో పాంచాలసేన తెగిపోయింది.

అదిగో అప్పుడే కలకలం విని కృష్ణార్జునులు రథం పరిగెత్తించుకు వచ్చారు. మలయధ్వజుడి మరణం అర్జునుడికి చూపించాడు కృష్ణుడు. భీముడూ, కర్ణుడూ మొదలైన ఉభయపక్షాల రథికుల పరాక్రమం వేరు వేరుగా నిరూపించాడు. "మన సేనలోకి రథం పోనీ" — అర్జునుడు తొందరచేశాడు. అర్జునుడిరథం అవుపడగానే చంద్రోదయమైన సముద్రంలాగ వుప్పొంగింది పాండవసేన. కర్ణుడూ, అశ్వత్థామా పురికొల్పడంతో కౌరవసేనా రెచ్చిపోయింది. రెండుసేనలూ, రెండుసముద్రాల్లాగ కలబడ్డాయి. ముమ్మరమైంది దొమ్మీ యుద్ధం.

కర్ణుడూ, ధృష్టద్యుమ్నుడూ — సేనాధిపతులు ఇద్దరికీ పడింది భేటీ. ఇద్దరూ బాణాలు గుప్పించుకున్నారు. ఒకళ్ళబాణాలు వొకళ్ళు నరుక్కున్నారు. గొడుగులు పడగొట్టుకున్నారు. జెండాలు ఎగరగొట్టుకున్నారు. కవచాలు పగలగొట్టుకున్నారు. శరీరాలు చీల్చుకున్నారు. రక్తాలు కార్చుకున్నారు.

## ధృష్టద్యుమ్నుడూ — అశ్వత్థామా

"గురుద్రోహీ, నిలబడూ"—కర్ణుణ్ణి దాటుకుంటూ ముందుకి వురికాడు అశ్వత్థామ—"నేను వుండగా నీప్రాణాలు దక్కవు. మాతండ్రి విషయంలో నువ్వుచేసిన పాపానికి పశువుని చంపినట్టు నిన్ను చంపు

తాను. అర్జునుడు అడ్డుపడకండా వుండాలి. నువ్వు పారిపోకండానూ నిలవాలి" అన్నాడు.

"నీ బాబుని నరికినకత్తే నీకోసం అట్టేపెట్టాను" పిడుగులు వురిమాడు ధృష్టద్యుమ్నుడు— "దాంతోనే నీతల నరుకుతాను. నీ తాబు కూతలికి అదే నీకు తగినశాస్తి. దుర్మార్గుడా, నన్ను గురుద్రోహి అంటున్నావు. దొంగబ్రాహ్మణ్ణి చంపాను నేను గురుద్రోహిని కాను. నీ బాబుదగ్గిరికే నిన్ను పంపుతాను."

ఒకళ్ళ నొకళ్ళు తూలనాడుకున్నారు. ఇద్దరూ కలబడ్డారు బాణాలు కొట్టుకున్నారు. ఇన్నూ మన్నూ కనపడకండా చేశారు.

యుధామన్యుడూ, ఉత్తమౌజుడు, సాత్యకీ, ద్రౌపదికుమారుల్నూ, పేరుపడ్డ పాంచాలయోధులూ, పాండవశూరులూ కర్ణుణ్ణి ముట్టడించారు. భయంకరమైన యుద్ధంచేశాడు కర్ణుడు.

ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామ ధనుస్సు తుంచేశాడు. మండిపోతూ మరోవిల్లు ఎత్తాడు అశ్వత్థామ. ఎదురులేని బాణాలు వేశాడు. ధృష్టద్యుమ్నుడి సారథిని చంపేశాడు. నాలుగు గుర్రాలూ నరికేశాడు. ధనుస్సు విరిచేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. రథం ముక్కలు చెక్కేశాడు. శక్తి పట్టుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. కొట్టిపారేశాడు అశ్వత్థామ. గద ఎత్తాడు ధృష్టద్యుమ్నుడు. దుళ్ళగొట్టాడు అశ్వత్థామ కత్తీ, డాలూ పట్టుకుని వురికాడు ధృష్టద్యుమ్నుడు. కత్తి ముక్కలుచేసేసి, డాలు పగలగొట్టాడు అశ్వత్థామ. వరసబాణాలు కొట్టాడు. చలించకండా నిలబడ్డాడు ధృష్టద్యుమ్నుడు భయపడ్డాడు అశ్వత్థామ; తొందరపడ్డాడు. ధనుస్సువదేసి, కత్తిపెరికాడు. పాంమీదికి పరుగెత్తిన గరుత్మంతుడిలాగ ధృష్టద్యుమ్నుడి మీదికి పరుగెత్తాడు.

దూరంనించే అది చూశాడు కృష్ణుడు. "ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామకి దొరికిపోయినట్టున్నాడు" అంటూ రథం పరిగెత్తించాడు. క్రూరమైన ఇనపశలాకాలు కొడుతూ కలబడ్డాడు అర్జునుడు. అడుగు ముందుకి వెయ్యలేకపోయాడు అశ్వత్థామ. రథంమీదికి వచ్చేశాడు. సహదేవుడు వచ్చి, ధృష్టద్యుమ్నుణ్ణి పట్టుకుపోయాడు.

అశ్వత్థామ అర్జునుడితో కలబడ్డాడు. చావుదెబ్బలు కొట్టాడు అర్జునుడు. మూర్ఛపోయాడు అశ్వత్థామ. అలా సేనాధిపతిని కాపాడి, అశ్వత్థామని ఓడించాడు అర్జునుడు. సింహనాదాలు చేశారు పాండవ యోధులు. భోరుమని రణదుందుభులు మోగించారు.

అర్జునుణ్ణి చూశాడు కర్ణుడు: నిప్పులు కక్కాడు అతడివేపు రథం తిప్పాడు. సరిగ్గా అప్పుడే సంశప్తకులు అర్జునుడిమీదికి వురికారు.

"కర్ణుడు మనమీదికి కాలుదువ్వుతూన్నాడు" కృష్ణుడితో అన్నాడు అర్జునుడు — "సంశప్తకులూ వురుకుతున్నారు. కర్ణుడిదగ్గర చిక్కుకున్నామా, సంశప్తకులికి జంకేసినట్టవుతుంది. కనక ముందు వాళ్ళపనే పట్టిద్దాం."

సంశప్తకులతట్టు రథం తిప్పాడు కృష్ణుడు. హతమార్చడం ఆరంభించాడు అర్జునుడు.

కర్ణుడు ధర్మరాజుమీదికి వెళ్ళాడు. ఇద్దరూ కలబడ్డారు. ఉభయసేనలూ కలబడ్డాయి. ఘోరంగా జరిగింది యుద్ధం. అన్నిరోజులూ యుద్ధం చూశారు. ఆ నాటియుద్ధంలాంటియుద్ధం చూడలేదు. అంతా ఆశ్చర్యంగా జరిగిపోయింది. సేనలు పోరాడుతున్నాయో కూలిపోతున్నాయో తెలియకుండా అయోమయమైపోయింది.

పాంచాలకులవాళ్ళని అయిదుగురిని, పదిమందిని, ఏడుగురిని వరసపెట్టి చంపాడు కర్ణుడు. వాళ్ళరథాలూ, గుర్రాలూ, సారథులూ

కూలగొట్టాడు. తుంగనుడుగు చొచ్చినమదపుటేనుగులాగ, పాండవ సేన కలగుండు పెట్టేశాడు. నకులుడూ, సహదేవుడూ, ద్రుపద కుమారుళ్ళూ, ద్రౌపదికొడుకులూ, సాత్యకీ పెద్దపెద్దసేనలతో కర్ణులు ముట్టడించారు. ఉగ్రుడే అయిపోయాడు కర్ణుడు. ఉగ్రమైన బాణాణ్ణి కురిపించాడు. అంతమందినీ ఆడించేశాడు.

ఉబ్బిపోయాడు దుర్యోధనుడు. ఏనుగుయుద్ధంలో పేరుపడ్డ అంగ, వంగ, కళింగ, మగధ, సుహ్మ, పౌండ్రసేనలు పాండవసేన మీాద పురికొల్పాడు. కొండలమందలా బయలుదేరింది ఏదుగుసేన. పాండవుల చతురంగసేన మట్టేస్తూ, చిత్రవధచేస్తూ విజృంభించింది. పాండవయోధులూ, చేకితాన ప్రభద్రకులూ ఏనుగుసేనమీాదపడ్డారు. చించి చెండాడారు.

వంగదేశంరాజుని ఏనుగుతో కూలగొట్టాడు సాత్యకి. సహదేవుడు పౌండ్రదేశంరాజుని చంపేశాడు. నకులుడు సుహ్మదేశం రాజుని నరికేశాడు. అతణ్ణి ఎన్నో ఏనుగులు చుట్టుముట్టాయి. ఘీంకారాలు చేశాయి. అందులో ఎనిమిది ఏనుగులు చంపేశాడు సహదేవుడు. ధృష్టద్యుమ్నుడూ వాళ్ళూ ఎన్నో అన్ని ఏనుగులు పీనుగులుచేశారు. కర్ణుడిమీాద కలబడ్డారు. మంచి బింకంలో పడింది యుద్ధం. రక్తం కాలువలుకట్టింది. రేగినధూళి అడిగిపోయింది. ఉభయ సేనలూ స్పష్టంగా కనిపించాయి. బిరుదుచిహ్నలతోనూ, గొడుగుల తోనూ, జెండాలతోనూ ప్రకాశించాయి.

ఏదో కొంచెం తప్ప సంశప్తకసేన యావత్తూ వూడ్చేశాడు అర్జునుడు.

"చూడు చూడు" యుద్ధంచూపిస్తూ అర్జునుడితో అన్నాడు కృష్ణుడు - "ధర్మరాజుని పట్టుకోవాలని శాయశక్తులా కాస్తున్నాడు దుర్యోధనుడు. అమృతం ఆనపడ్డ రాక్షసుల్ని ఇంద్రుడూ, అగ్నితరిమి

నట్టు భీముడూ, సాత్యకీ తరుముతున్నారు. పడబాదుతున్నారు. అయినా ఆగలేదు కౌరవులు. అదిగో దుర్యోధనుడూ, కర్ణుడూ, కృపుడూ, అశ్వత్థామా ఆఇద్దరినీ బాణాలతో ముంచేస్తున్నారు. అదిగో ధర్మరాజుకవచం చీల్చేశారు. కర్ణుకు పట్టపగ్గాలు లేన ట్టున్నారు. ధృతరాష్ట్రుడి కొడుకులు సింహనాదాలు చేస్తున్నారు. సుళ్ళుతిరిగి భీముడు వాళ్ళని బాదేస్తున్నాడు. కర్ణుడూ, వాళ్ళూ ధర్మరాజుమీద బాణాలు కురిపిస్తున్నారు. నకులసహదేవుల్నీ, సాత్యకినీ, ధృష్టద్యుమ్నుణ్ణీ ద్రౌపదికుమాళ్ళనీ, పాండవపాంచాలయోధుల్నీ సుళ్ళుతిప్పేస్తున్నాడు కర్ణుడు. తామరచెరువులో తాండవమాడు తూన్న మదపుటేనుగులావున్నాడు. మన కపిధ్వజంవేపు చూపులు విసురుతున్నాడు. నువ్వు రావాలనే కోరుతున్నాడు. మంటలో మిడతలాగ నీమీద వురకాలనే చూస్తున్నాడు. ఊరుకోకూడదు. ఊదెయ్యాలి.

"అదిగో, దుర్యోధనుణ్ణిచూడూ, కర్ణుడికి అన్నివిధాలాతోడ్ప డుతున్నాడు. నిన్ను గెలవాలనివున్న సేనలన్నీ కర్ణుడిదగ్గిరచేర్చాడు. మదపుటేనుగు గున్నమామిడిచెట్టు పీకేసినట్టు ఇతణ్ణి వూడ్చెయ్యాలి. కర్ణుడు వొక్కడూ అయిపోతే సరి, రాజ్యం నీచేతిలో పడుతుంది" అన్నాడు.

## దొమ్మీయుద్ధం

ఇంతలో భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ త్రిమూర్తు ల్లాగ మనసేనమీద పడ్డారు. వల్లమాలిన పరాక్రమం చూపెట్టారు. కొత్తధైర్యం వచ్చింది పాండవసేనకి. పొలోమని విరుచుకుపడింది. ప్రళయరుద్రుడైపోయాడు భీముడు. పెద్ద సింహనాదం చేశాడు. తరుముకువచ్చాడు. పరుగుతీసింది కౌరవసేన. ఒకళ్ళమీద వొకళ్ళు

పడిపోయారు సైనికులు. తడబడిపోయారు. తమనితామే తొక్కేసుకున్నారు. వచ్చడివచ్చడి అయిపోయారు. గుర్రాలూ, ఏనుగులూ భయపడిపోయాయి. కూకరిల్లి పడిపోయాయి. వాహనాలు దిగేసి పరిగెత్తారు యోధులు. వాళ్ళ మొహాలతోపాటు జెండాలు కిందికి వాలిపోయాయి. కకావికలై పోయింది కౌరవసేన.

అప్పుడు నిషాదరాజుకొడుకు పెద్ద ఏనుగుమీద వెళ్ళాడు. భీముణ్ణి అడ్డుకున్నాడు. మెరుపుల్లాటి బాణాలు నాలుగువేశాడుభీముడు అతడి కాళ్ళూ చేతులూ నరికేశాడు. శిరస్సుఎగరగొట్టేశాడు. ఏనుగు తొండం వూడ్చేశాడు. భీముడిముందు మూడుఅక్షౌహిణీలసేన నిలవలేకపోయింది. అతణ్ణి తేరిచూసే మొనగాడే లేకపోయాడు. అదంతా చూపించి అర్జునుణ్ణి హెచ్చరించాడు కృష్ణుడు.

ధృతరాష్ట్రుడు: నువ్వు చెప్పింది చూస్తే కౌరవసేన కాలిపోయిందనే అనిపిస్తోంది. నాకుమాళ్ళ అవస్థ ఏమయింది, తరవాత? సంజయా, చెప్పు మనవాళ్ళు ఏమయారో చెప్పు.

సంజయుడు: అంతమందిమీా అంత పోరిపోరిచెప్పాం. పెడచెవినిపెట్టాడు నీపెద్దకొడుకు, నువ్వుచేసిన దుర్ణయమే ఇలాఫలించింది. విచారించి లాభమేముం దిప్పుడు? యుద్ధం వివరంగా ఆలకించు.

భీముడి పరాక్రమం చూశాడు అర్జునుడు. తనముందు చిన్న చిన్న గుంపులు చెదరగొడుతూ, తనసేన చేరుకున్నాడు.

"నిలబడు"—భీముణ్ణి గద్దిస్తూ వెళ్ళాడు దుర్యోధనుడు—"ఎక్కడికి ఇలాతోసుకు వచ్చేస్తున్నావు? నేనుండగానేనా ఈ విరగబాటు? ఇప్పుడే ని అంతుచూసేస్తాను" అంటూ గుడ్లు వురిమాడు. వేడివేడి బాణాలు గుప్పించాడు.

కార్చిచ్చులా విజృంభించాడు కర్ణుడు. ఆకాశం బద్దలైనట్టు

సింహనాదం చేశాడు. పిడుగులు మోగించాడు ధనుస్సు. తనయోధుల్ని పురికొల్పాడు.

దుర్యోధనుడూ, కర్ణుడూ — ఇద్దరి ఉద్ధృతమూ కౌరవసేనలో వల్లమాలిన ఉద్రేకం రేకెత్తించింది. పారిపోతున్న చతురంగబలం వెనక్కిమళ్ళింది. యుద్ధం చేసింది. ఉభయసేనల్లోనూ పేరుపడ్డ యోధవీరులు ప్రాణాలు దాచుకోకుండా పోరాడారు. భయంకరంగా జరిగింది యుద్ధం.

శిఖండిగుర్రాలు కూల్చేశాడు కర్ణుడు. అతడి సారథిని చంపేశాడు. జెండా పడగొట్టేశాడు. ధనుస్సు నరికేశాడు. ఒళ్ళంతా తూట్లుకొట్టేశాడు. తట్టుకోలేకపోయాడు శిఖండి. తోకముడిచేశాడు.

దుశ్శాసనుడూ, ధృష్టద్యుమ్నుడూ సరాసరి పోట్లాడారు. గట్టిగట్టి బాణాలతో కొట్టుకున్నారు. ఇద్దరిసేనలూ మధ్య దూరాయి. హోరాహోరి యుద్ధం చేశాయి.

కర్ణుడి కళ్ళెదటే వృషసేనుడిసారథితల తెగేశాడు నకులుడు. అతడిపక్కసేన అడిలిపోయింది. పారిపోకుండా ఆపాడు కర్ణుడు. మరో సారథిని పెట్టుకున్నాడు వృషసేనుడు. తండ్రి చక్రరక్షకుడై నిలబడ్డాడు. నకులుడు మరోవేపు రథం తిప్పాడు.

సహదేవుడు ఉలూకుడిమీద పురికాడు. రథంలేకుండా కొట్టేశాడు. పరుగుతీశాడు ఉలూకుడు. వెంటదరిమాడు సహదేవుడు.

సాత్యకీ శకునీ కలబడ్డారు. జెండాలు నరుక్కున్నారు. కవచాలు చీల్చుకున్నారు. శకునిగుర్రాలు చంపేశాడు సాత్యకి. రథం గెంతేసి దౌడుతీశాడు శకుని. సహదేవుడు వెంటదరిమినప్పుడు పారిపోయి మరోరథం తెచ్చుకున్నాడు ఉలూకుడు. తండ్రిని దానిమీద ఎక్కించుకుని పట్టుకుపోయాడు. వెనక్కి తగ్గేసింది శకునిసేన. కాని భీముడిపాలబడి నాశనమైపోయింది.

దుర్యోధనుడిసారథి చచ్చిపోయాడు. గుర్రాలు కూలిపోయాయి. భయపడిపోయా డతడు. రథం గెంతేశాడు. శాశ్మకిబుద్ధిచెప్పేశాడు. నీయోధులు భీముడిచుట్టూ మూగారు. యుద్ధంచేశారు. చచ్చారు.

యుధామన్యుడు కృపాచార్యుడి ధనుస్సు తుంచేశాడు. అతడు ఇంకో ధనుస్సు తీశాడు. సానపట్టిన బాణాలు కొట్టాడు. యుధామన్యుడి జెండా నరికేశాడు. గొడుగు పడగొట్టాడు. సారథిని కొట్టేశాడు. ఒణికిపోయాడు యుధామన్యుడు. రథం తిప్పేశాడు. ఒకటేపారిపోడం పారిపోయాడు.

కృతవర్మ వొంటినిండా బాణాలు గుచ్చాడు ఉత్తమౌజుడు మండిపోయాడు కృతవర్మ. అగ్గిపిడుగులాటి బాణం వొదిలాడు. మూర్ఛపోయాడు ఉత్తమౌజుడు. అతడి సారథి రథంతప్పించుకు పారి పోయాడు.

## అర్జునుడూ - అశ్వత్థామా

ఎంతోమంది రథికులతో కలిసి విజృంభించారు అశ్వత్థామ. కృష్ణుణ్ణీ అర్జునుణ్ణీ బాణాలతో ముంచేశాడు. ఒళ్ళుమండింది అర్జునుడికి. ఇంద్రాస్త్రమూ మొదలైన మహాస్త్రాలు ప్రయోగించాడు. అన్నిటికీ అన్నీ మారాస్త్రాలు వేశాడు అశ్వత్థామ. అన్నీ కొట్టిపారేశాడు. దారుణమైన బాణాలు కొట్టాడు.మూడుబాణాలు అర్జునుడి కుడిబుజం దూసుకుపోయాయి. మరింత మండిపోయా డతడు. అశ్వత్థామ రెండు పక్కలా వుండి పోరాడుతున్న మన మహాసేన కుప్పలుకుప్పలు కూలగొట్టాడు. మరింత రెచ్చిపోయాడు అశ్వత్థామ. అర్జునుడి తెల్ల గుర్రాలూ, వానరపతాకమూ బాణాలతో నింపేశాడు. సారథి కృష్ణుడిమీదా, అర్జునుడిమీదా పుంఖానుపుంఖాలు బాణాలు నాటించాడు. అర్జునుడికి తలమునకలైనట్టు మహాయుద్ధంచేశాడు.

ధర్మరాజు చిత్రసేనుణ్ణి కీచుకీచుమనిపించాడు. తన ఎదటిసేన తరిమితరిమి కొట్టాడు. చిందరవందర చేశాడు. దుర్యోధనుడూ, సోదరులూ అతణ్ణి పట్టిచుట్టాలని చుట్టుముట్టారు. భీముడూ,నకుల సహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ వాళ్ళమీద కలబడ్డారు అదేసమయానికి పెద్దపులిలా అక్కడ వురికాడు కర్ణుడు. తీవ్రమైన బాణాలు జడివాన కురిపించాడు ఆకాశం అదిరినట్టు అల్లెతాడు మోగించాడు.

దుర్యోధనుడిమీద ఇరవై బాణాలు కొట్టాడు సహదేవుడు. బాధతో చుట్టుకుపోయాడు దుర్యోధనుడు. జజ్జరిల్లిపోయింది మనసేన. చూసి సహించలేకపోయాడు కర్ణుడు.దివ్యాస్త్రాలు వేశాడు. పరిగెత్తింది పాండవసేన.

## ధర్మరాజు పలాయనం

ధర్మరాజుమీద విరుచుకుపడ్డాడు కర్ణుడు. మండిపడ్డాడు ధర్మరాజు. అంపవానకురిపించాడు. చిరునవ్వుతో కరుకైన బాణాలు కొట్టాడు కర్ణుడు. కట్టిదొక ఇనపబాణంకొట్టాడు. ధర్మరాజుగుండెలు దూసెళ్ళిపోయింది బాణం. దెబ్బతో చదికిలబడిపోయాడతడు. దుర్భరమనిపించింది బాధ. "రథం మళ్ళించి తోలుకుపద" – సారథితో అన్నాడు.

ధర్మరాజురథం మళ్ళిపోయింది.

"పోనీకండి. పట్టుకోండి" – కేకలువేస్తూ వెంటపడ్డారు కౌరవులు. కేకయ పాంచాలసేనలు అడ్డుపడ్డాయి; పోరాడాయి.

"ఆగూ, ఆగూ, నిలబడూ" – గద్దిస్తూ దుర్యోధనుడి వెంటపడ్డాడు భీముడు.బాణాలతో కప్పెట్టాడు. కేకయ పాంచాలసేనమీద శరవర్షం కురిపించాడు కర్ణుడు. అడలెత్తిపోయి, భీముడివెనక్కి పారిపోయిందది. ధర్మరాజు రథం వెంటాడాడు కరుడు.

గుండెలు చొచ్చుకుపోయిన బాణంబాధతో శిబిరానికే వెళిపో తున్నాడు ధర్మరాజు. వెంటపడి, మరి మూడుబాణాలు నాటిం చాడు కర్ణుడు. వెళిపోతున్నావాడల్లా వెనక్కి తిరిగాడు ధర్మరాజు. గబగబా కర్ణుడిమీద గట్టిగట్టిబాణాలు తగిలించాడు. అతడిసారథి మీద మూడుబాణాలు కొట్టాడు నాలుగుగుర్రాలమీదా నాలుగు నాటించాడు. చక్రరక్షకులై వున్న నకులసహదేవులు అన్నగారి దుర వస్థ చూశారు. కర్ణుడిమీద కలబడ్డారు. వరస బాణాలు కురిపించారు.

ఇద్దరినీ దద్దరిల్లగొట్టాడు కర్ణుడు. ఏనుగుదంతంలాటి శరీ రమూ, నల్లటి అందమైనతోకలూ కలిగిన ధర్మరాజుగుర్రాలు చంపే శాడు. బాణంమీద బాణం కొట్టాడు. అతడి రత్నకిరీటం తుక్కు తుక్కు చేసేశాడు. నకులుడిధనుస్సు నరికేశాడు. అతడిగుర్రాలు కూల్చేశాడు. ధర్మరాజూ, నకులుడూ సహదేవుడిరథ మెక్కేశారు. అన్నదమ్ములు ముగ్గురినీ రక్తాలుకారినట్టు గట్టిగట్టిదెబ్బలు కొట్టాడు కర్ణుడు. రకరకాలబాణాలు వొళ్ళనిండా నాటించాడు.

"ధర్మరాజుమీద ఇంత విరుచుకుపడతావేం?" — కర్ణుణ్ణి మంద లిస్తూ అన్నాడు శల్యుడు— "ఇతణ్ణి నువ్వు చంపేసినా అర్జునుడు నిన్ను వొదిలిపెట్టడు. నిన్నూ, నీవారవుల్నీ అతఃపాతాళానికి పాతేస్తాడు. ధర్మరాజు మరణించినా ఫలంమాత్రం దక్కదు. చంపితే అర్జునుణ్ణి చంపు. అదీ పౌరుషం. దుర్యోధనుడికి సామ్రాజ్యం సిద్ధిస్తుంది. నామాట విను. ధర్మరాజుని వొదిలిపెట్టు.

"అదీకాక, అదిగో అటు చూడు. దుర్యోధనుడి పని అయి పోతోంది. దిగాలుపడిపోయి, భీముడి పిడికిలిలో చిక్కిపోయాడు. నువ్వు తప్ప అతణ్ణి అడ్డుకునే మొనగాడు లేడు. భీముడిచేత దుర్యోధ నుడు చచ్చాడో, నువ్వు ధర్మరాజునీ, నకులసహదేవుల్నీ చంపడం వృథాప్రయాస అయిపోతుంది" అన్నాడు.

అంత్రలో దుర్యోధనుడిదిక్కు చూశాడు కర్ణుడు. భీముడిచేత చావుబతుకుల్లో వున్నాడు దుర్యోధనుడు. రాజుని కాపాడాలి ముందు. చప్పున రథం మళ్ళించాడు కర్ణుడు.

సహదేవుడి రథంమీద తమ్ములిద్దరితోనూ గబగబా శిబిరానికి వెళ్ళిపోయాడు ధర్మరాజు.

---

# కర్ణపర్వం



## మూడో ఆశ్వాసం

కర్ణుడు ధర్మరాజుని వొదిలిపెట్టేశాడని విన్నాడు ధృతరాష్ట్రుడు "మోసం జరిగిపోయింది" అని మనస్సులో బాధపడ్డాడు – "భీముడితో చాలలేడా నా కొడుకు! అలా చేతికిచిక్కిన ధర్మరాజుని వొదిలెయ్యడం తెలివైనపనేనా! పొరపాటుచేశాడు కర్ణుడు" అంటూ ఎంతో అంత నొచ్చుకున్నాడు. పైకి కనపడకండా, అడిగాడు. "ఆఁ, ధర్మరాజు పారిపోయాక ఏమైంది యుద్ధం?"

సంజయుడు: ధర్మరాజు శిబిరానికి వెళ్ళిపోయాడు. రథం దిగి లోపల ప్రవేశించాడు. పక్కమీద పడుకుని శరీరంలో నాటుకున్న బాణాలు పెరికించుకున్నాడు. పరాభవంతో హృదయం దహించుకుపోతోంది. బాధపడుతూ తమ్ముళ్ళని చూశాడు. "మీరు భీముడిదగ్గిరికి వెళ్ళండి" అంటూ వాళ్ళని యుద్ధానికి పంపించేశాడు. అప్పటికే నకులుడు మరోరథం సిద్ధంచేసుకున్నాడు. అన్నదమ్ములిద్దరూ అన్నగారిమాటప్రకారం రణక్షేత్రానికి వచ్చేశారు. మహామేఘంలా గర్జిస్తూ యుద్ధంచేస్తున్నాడు భీముడు. అతడిదగ్గిరికే వచ్చి కౌరవసేనమీద కలబడ్డారు కవలతమ్ములు.

అశ్వత్థామతో హోరాహోరి పోరాడుతున్నాడు అర్జునుడు, అన్నగారి సంగతి ఏమయిందో తెలియలే దతడికి. మెరుపుల్లాటి బాణాలు చరచరా అశ్వత్థామ రొమ్ముమీద తగిలించాడతడు. అమాంతం గదవిసిరాడు అశ్వత్థామ. కొట్టిపారేశాడు అర్జునుడు.

మరోపది బాణాలు అశ్వత్థామమీద నాటించాడు. ఒకబాణం వేసి సారథిని చంపేశాడు. తనే పగ్గాలు పట్టుకున్నాడు అశ్వత్థామ. రథం నడుపుకుంటూ యుద్ధంచేశాడు. కృష్ణుడిమీదా, అర్జునుడిమీదా బాణాలు గుప్పించాడు. అతడి యుద్ధం చూసి, దేవతలే నిచ్చెర పోయారు.

అద్భుతమైన అశ్వత్థామప్రతాపం సహించలేకపోయాడు అర్జునుడు. వెడల్పాటిది వొకబాణం వేశాడు. అశ్వత్థామపగ్గాలు నరికేశాడు. రథం ఈడ్చుకుంటూ పారిపోయాయి గుర్రాలు. దాంతో మనసైన్యాలు నిలవలేకపోయాయి. అరిచేతిలో ప్రాణాలు పెట్టుకుని పరుగులు తీశాయి. రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ వేసుకుని భూమిగజగజలాడినట్టు పాండవసేనలు వెంటతరిమాయి.

"నీకళ్ళముందే నాసేన ఇలా బాధపడి పారిపోతూవుంది" కర్ణుణ్ణి హెచ్చరించాడు దుర్యోధనుడు— "బ్రహ్మాండమైన పరాక్రమం నీది. పాండవులా నీకు సాటి? చూస్తావేం? నీబలమూ, చేవా చూపించాలి, ఇప్పుడు."

## భార్గవాస్త్రం

బోగవిరిచి శల్యుణ్ణి చూశాడు కర్ణుడు. "నీసామర్థ్యమంతా చూపించి రథం నడపాలి. చూడు, ఇప్పుడే కృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ, భీముణ్ణీ చంపేస్తాను. నాభుజబలమూ, అస్త్రబలమూ, శౌర్యమూ లోకానికి వెల్లడిస్తాను. ఇన్నాళ్ళఫున్నానిక ఇవాళతీర్చుకుంటాను. దుర్యోధనుడు ఒక్కడే స్థిరంగా శాంతింగా సామ్రాజ్యం ఏలుకున్నట్టుచేస్తాను" అన్నాడు.

"గాండీవమా నీకు సాటి?" చేతిలో విల్లు విజయాన్ని చూస్తూ అన్నాడు. అల్లెతాడు సారించాడు. పాండవసేనని చెయ్యెత్తి పిలి

చాడు. భార్గవాస్త్రం ప్రయోగించాడు. అద్భుతమైన మహాస్త్రం భార్గవాస్త్రం. రకరకాలైన బాణాలు ఘోరంగా వెలిగక్కింది. మహాసంక్షోభం కలిగించింది. రథాలు గుండపిండిచేసింది. ఏనుగుల పీనుగులు చేసింది. గుర్రాలు కూలగొట్టింది. కాల్బలం కనుపుగొట్టింది. రక్తం వరదలై పారింది. కళేబరాలూ, రథాలూ ములుగుతూ తేలుతూ కొట్టుకుపోయాయి.

భార్గవాస్త్రంతో నానాబాధలూ పడిపోయింది పాండవసేన. దద్దరిల్లిపోయింది. అరిచేతిలో ప్రాణాలుపెట్టుకుపరుగులుపెట్టింది కౌరవ సేన వెంటపడింది. తరిమితరిమికొట్టింది. దిక్కులు గజగజలాడిస్తూ సింహనాదంచేశాడు కర్ణుడు. వొదలకుండా వెంటపడ్డాడు. అంపవాన కురిపించాడు. పొగలేని మంటలా ప్రకాశించాడు. భరించలేకపోయింది పాండవసేన. హాహాకారాలుచేసింది. కుయ్యో మొర్రోమంది. తహతహలాడిపోయింది. "కృష్ణా! కృష్ణా!! అర్జునా! అర్జునా!!" — ఆర్తనాదాలుచేసింది.

"చూడూ చూడూ, కృష్ణా!" కర్ణుణ్ణి చూపిస్తూ అన్నాడు అర్జునుడు — "పట్టపగటిసూర్యుడిలా వెలిగిపోతున్నాడు కర్ణుడు. తెగించి మహాదర్పం చూపుతున్నాడు. తేరిచూడడానికి వల్లకాకుండా మండిపోతున్నాడు. ఇప్పుడు అతడి ఎదటికి వెళ్ళడమంటే మృత్యువు మొహానికి వెళ్ళడమే. అపజయం తెచ్చుకోడమే. సందేహంలేదు. కావాలంటే గెలుపు రాదు. శరీరమంటూ వుంటే అంతావుంది. సమయం వచ్చినప్పుడు శత్రువుని గెలవవచ్చు. బతికివుంటే శుభం పొందవచ్చు. కష్ణా, మళ్ళించు, మళ్ళించు మనరథం"

అర్జునుడిమాటలు విన్నాడు కృష్ణుడు. భీముడివేపు చూశాడు. కర్ణుణ్ణి ఎదిరించి, పాండవసేన నిలవరిస్తూన్నాడు భీముడు. ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ, ద్రౌపదికుమారుళ్ళూ మొదలైన రథికులు

కర్ణుడిమీద కలబడుతున్నారు. భీముడు కౌరవసేన తరిమితరిమి కొడు తున్నాడు. అతడి బిగువు అప్పటికి శత్రువుని అడ్డుకోడానికి చాలుతుందని గ్రహించాడు కృష్ణుడు. "కర్ణుడు ఇతర్లతో యుద్ధం చేసి బాగా అలిసిపోడమూ అవసరమే. అర్జునుడు కొంత అలసట తీర్చుకోడమూ మంచిదే" అని ఊహించాడు. కర్ణుడు యుద్ధంచేస్తున్న చోటికి దూరంగా రథం పట్టుకుపోయాడు.

## అన్న య్యే ఏ డీ ?

"మీ అన్నయ్యసంగతి ముందు తెలుసుకోవాలి" అర్జునుడితో అన్నాడు కృష్ణుడు— "మనం అశ్వత్థామతో యుద్ధంలోమునిగివున్న ప్పుడు కర్ణుడికి లొంగిపోయాడు ధర్మరాజు. అతడిచేత బాగా దెబ్బలు తినేశాడనుకుంటాను. అంచేత ముందు అతడిఅవస్థ తెలుసుకోవాలి. తరవాత కర్ణుడిపని పట్టించవచ్చు."

అన్నగారు దెబ్బలు తినేశా డనగానే గుండెలో పొడిచినట్ట యింది అర్జునుడికి. తమ సేనంతా వొక్కసారి కలయజూశాడు. ఎక్కడా ధర్మరాజు జెండా అవుపడలేదు గబగబా భీముడిదగ్గిరికి వెళ్ళిఅడిగాడు — "భీమన్నా ! అన్నయ్యేడీ?

"అన్నయ్య యుద్ధంలో లేడు" అన్నాడు భీముడు — "నేను కౌరవుల్ని హతమారుస్తున్నాను. కర్ణుడు అన్నయ్యని వెంటాడాడు. ఒంటినిండా ఎన్నో బాణాలు కొట్టేశాడు. భరించలేకపోయాడు అన్నయ్య. తప్పుకు వెళిపోయాడు. ఏమయిందో కనుక్కో నువ్వు. ఇంతకీ మనపాల మనకృష్ణుడే వున్నాడు. మరోలా జరగదు."

"శిబిరానికే వెళిపోయుంటాడు" అందుకున్నాడు అర్జునుడు— "క్రూరమైన కర్ణుడిబాణాలు వొళ్ళంతా నాటుకునుంటాయి. బాధ పడిపోయుంటాడు అన్నయ్య. భరించలేకపోయుంటాడు. శిబిరానికే

వెళ్ళిపోయుంటాడు. అవును, అలాగే అయుంటుంది. ద్రోణుడంత వాడి ఉగ్రమైన బాణాలు సహించాడు. అతడు పడిపోయాక కర్ణుడిచేత కష్టపడిపోయాడు. భీమన్నా, పరిగెత్తు. అన్నయ్య ఎలావున్నాడో చూసిరా. సేనముందు నేను వుంటా నిక్కడ" అన్నాడు.

"అదినీకు చెల్లుతుంది" అన్నాడు భీముడు — "నేను వెళ్ళానో, వీళ్ళకి భయపడి పారిపోయానంటారు."

"అదికాదు" అన్నాడు అర్జునుడు — "అదిగో, సంశప్తకులు నామీదికి వస్తున్నారు. వాళ్ళని కాదని ఎలా వెళ్ళడం?"

"ఫరవాలేదు" వురకలు వేస్తూ వస్తున్న సంశప్తకుల్ని చూస్తూ అన్నాడు భీముడు - "నేనే వీళ్ళపని పట్టేస్తాను. నువ్వే వెళ్ళు అన్నయ్యకోసం."

"సరే" అన్నాడు అర్జునుడు. "రథం చప్పున పోనీ. అన్నయ్యని చూసిందాకా మనస్సు కుదుటపడకుండావుంది" - కృష్ణుణ్ణి తొందర చేశాడు.

"మీ అన్నయ్యక్షేమం చూడడం ముఖ్యమైనపని" రథం తిప్పుతూ భీముడితో అన్నాడు కృష్ణుడు - "మేం వెళుతున్నాం. కౌరవసేన హతమార్చడం నీకు వొక పెద్దపని కాదు. గెలుపు సాధించు" అంటూ పొగిడినట్టు దీవించాడు. పగ్గాలు సడిలించాడు. గుర్రాలు పరిగెత్తించాడు. అలా కృష్ణార్జునులు భీముణ్ణి యుద్ధానికి నియోగించి శిబిరానికి వెళ్ళారు.

## ధర్మరాజు శిబిరంలో

ధర్మరాజు శిబిరంముందు అర్జునుడిరథం ఆగింది. కృష్ణుడూ, అర్జునుడూ రథం దిగారు. ధర్మరాజుమందిరంలో ప్రవేశించారు. పక్క మీదవొక్కడే వున్నాడు ధర్మరాజు. అతడు క్షేమంగా వుండడం

కృష్ణుడూ, అర్జునుడూ చూశారు. ఇద్దరిగుండెలూ కుదుట పడ్డాయి. సంతోషిస్తూ వెళ్ళారు. ధర్మరాజుకి పాదాభివందనం చేశారు.

తమ్ముణ్ణీ, కృష్ణుణ్ణీ చూశాడు ధర్మరాజు. కర్ణుణ్ణి చంపేసే వచ్చారని భావించాడు. పట్టరానిసంతోషం కలిగిం దతడికి. చిరు నవ్వు నవ్వుతూ ఇద్దరినీ అభినందించాడు.

"మహానందంగా వుంది నాకు" ఇద్దరి మొహాలూచూస్తూ అంటున్నాడు ధర్మరాజు — "దేవతలైనా కర్ణుణ్ణి గెలవలేరు. పరశు రాముడి మహాస్త్రాలు కలవా డతడు అగ్నిహోత్రుణ్ణి మించిన తేజ శ్శాలి. వాయుదేవుడంత బలవంతుడు. రణవిద్యలో సాటిలేని సమ ర్థుడు ధైర్యానికీ, గాంభీర్యానికీ పెట్టింది పేరు. అంతటి ఉద్దండుణ్ణి చెక్కు-చెదరకండా చంపేసి వచ్చారు మీరు. నాహృదయంలో వున్న చింతంతా వొదిలిపోయింది.

"అతడికీ నాకూ ఇప్పుడిప్పుడే యుద్ధం జరిగింది. ధృష్టద్యు మ్నుడూ, సాత్యకీ, శిఖండీ, ద్రౌపదికుమారుళ్ళూ - ఇంతమందీ చూస్తూనే వున్నారు. నా సారథిని చంపేశాడు కర్ణుడు. గుర్రాలు కూల్చేశాడు, జెండా నరికేశాడు. నా వొళ్ళంతా బాణాలతో నింపే శాడు. తడబడిపోయాను నేను. అప్పుడు భీముడిచేత దుర్యోధనుడికి పీకలమీదికి రావడం చూసి నన్ను వొదిలేసి, అటు పరిగెత్తాడతడు. నేను ఇటు వచ్చేశాను.

"తమ్ముడూ, కర్ణుణ్ణి ఎలా గెలవడం అన్నవిచారంతో పద మూడేళ్ళు రాత్రింబగళ్ళు నిద్రాహారాలు రుచించలేదు నాకు. బ్రాహ్మలు పట్టితెచ్చిన యజ్ఞపశువులాగ భయపడుతూనే ఇన్నాళ్ళూ గడిపాను. ఎప్పుడూ నాకళ్ళకి కట్టినట్టే వుండేవాడు. భీష్ముడిచేతా, ద్రోణుడిచేతా కూడా పరాభవ మెరగను వీడిచేత ఇంత దైన్యం అను భవించాను. నీలాంటితమ్ముడు వుండబట్టి అంతవిచారమూ తీరిపోయింది.

బతికి బట్టకట్టాను. కౌశలమూ, సామర్థ్యమూ, శౌర్యమూ, దివ్యాస్త్రాలూ - అన్నీ వున్నాయి కర్ణుడికి. అతడికొడుకులూ, స్నేహితులూ వొక్కొక్కడూ యుద్ధంలో ఉద్దండులు దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్ళూ, పరిజనులూ కర్ణుడంటే ప్రాణాలు అడ్డువేస్తారు. అలాంటి వాణ్ణి ఎలా చంపేశావు?

"తలపువ్వు వాడకుండా మహాబలశాలి కర్ణుణ్ణి చంపేశావు. మహాశ్చర్యమైన విషయ మిది. దుర్యోధనుడు సంతోషించాలని 'అర్జునుణ్ణి నేను వొక్కణ్ణే చంపేస్తాను' అనేవా డతడు, గర్వంగా. అది సాగనివ్వకుండా చేశావు, ఇవాళ. నీ భుజపరాక్రమమంతా ప్రకటించావు బిరుసుకూతలుకూ టడం సేవకధర్మం. దానికేం. కాని ఆవాళ జూదంనాడు ద్రౌపదిని అంతేసిమాట లన్నాడు. బాణాలు గుచ్చుకున్నట్టు గుండెల్లో బాధిస్తున్నా యవి. ఆబాధ తమ్ముడూ, ఇవాళతో లేకుండా చేశా వోయి. నాదుఃఖమంతా తుడిచి పారేశావు.

"ఎలా చంపావు వాణ్ణి? గర్వంతో లొంగని వాడిశిరస్సు నీ బాణంతో తెగేశావా? తనవాళ్ళందరూ కన్నీళ్ళతో చూస్తూవుండగా రణభూమిమీద దొర్లిపోయిందా వాడి తలకాయ? వాడు పగపట్టి బాణాలు జడివాన కురిపిస్తే, నువ్వు మండిపడి గుండెమీద గట్టిబాణం తగిలిస్తే తాకుమనిపోయాడా? " - ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించాడు.

"నేను సంశప్తకులతో పోరాడుతున్నాను" మెల్లిమెల్లిగా అందుకున్నాడు అర్జునుడు - "ఎంతమందినో రథాలవాళ్ళని వెంట వేసుకుని అశ్వత్థామ నన్ను ముట్టడించాడు. అతడు రావడమే తడువు, అయిదువందల రథాలు వూడ్చేశాను నేను. అగ్గికురిశాడుఅశ్వత్థామ. సుళ్ళుతిరిగిచిమ్ముల పిడుగులాగ తిరగబడ్డాడు. అగ్నిచక్రంలాగ ధనుస్సు తిప్పుతూ ప్రచండమైన బాణాలు ప్రయోగించాడు. శుక్రుడు స్వాతి

నక్షత్రంతో కలిస్తే కుంభవృష్టి కురిపించినట్టు శరవర్షం కురిపించాడు. ఎటుచూస్తే అటు తనరథం మెరిపించాడు. తళతళా మెరుస్తున్న వాడి వాడి బాణాలతో కృష్ణుణ్ణీ నన్నూ కప్పెట్టాడు. తడబడిపోయాను నేను. దారీ తెన్నూ కనపడలేదు. తుదకి ఎలాగో అతణ్ణి సాధించాను. సిగ్గుపడిపోయాడతడు; వెళ్ళిపోయాడు.

"తరవాత నువ్వు ఎక్కడున్నావని చూశాను. మన దండంతా గాలించాను. సింహంలా నుంచున్న భీముణ్ణి వొక్కణ్ణీ తప్పిస్తే మన చతురంగసేన అంతటిలోనూ కర్ణుడిముందు తూలిపోని మొనగాణ్ణి వొక్కణ్ణీ చూడలేను. భీముడిదగ్గిరే విన్నాను, నువ్వు వచ్చేశావని. విని, ముందు నీక్షేమం తెలుసుకోవాలని పరిగెత్తుకు వచ్చాం. భీముడు సైన్యం నిభాయిస్తున్నాడు. నువ్వు క్షేమంగా వుండడం చూశాను. మనస్సు కుదుటపడింది. ఇదిగో ఇప్పుడే వెళతాను. కర్ణుడితల తెగేస్తాను. దయచెయ్యి. కళ్ళవేడుకగా చూద్దువుకాని. మనసేనంతా సంతోషించినట్టు కర్ణుణ్ణి కడతేర్చేస్తాను. దుర్యోధనుడి కోరిక పూర్తి చేస్తాను. నీమనస్సులోని దుఃఖం మాయంచేస్తాను.

"ద్రోణుడు చచ్చాక, దుర్యోధనుణ్ణీ, అతడి తమ్ముళ్ళనీ, అతడి సేనల్నీ కాపాడాలని కంకణంకట్టుకున్నాడు కర్ణుడు. ఆపాటి చెయ్యకండా ఎలా వూరుకుంటాడు? ఆరిపోయేముందు దీపంలా ఎంత మండుతాడో మండనీ. ఆ ఆర్పడమేదో నేనే ఆర్పేస్తాను. అన్నయ్యా, ఆశీర్వదించి పంపు. కర్ణుణ్ణి చంపకండా వస్తే, బ్రాహ్మడికి దానమిస్తానని తప్పినపాపాత్ముణ్ణి మూసినట్టు నువ్వూ, కృష్ణుడూ చూద్దురుకాని నన్ను. భీముడు సేనాముఖంలో వున్నాడు. తలమునకలుగా వుంటుందతడికి యుద్ధం. నేను ఆలస్యం చెయ్యడం తగనిపని. వెళతాను. సెలవియ్యి" అన్నాడు.

కర్ణుడు బతికేవున్నాడని వినడంతోనే చుర్రుమంది ధర్మరాజుకి.

కర్ణుడి బాణాలతో ఆయిన గాయాలన్నీ వొక్కసారి మండాయి. దాంతో వాళ్ళు తెలియుతే దతడికి.

## గాండీవం కృష్ణుడికిచ్చెయ్యి

"మరెందుకూ యుద్ధానికి వెళ్ళడం?" అంటూ అందుకున్నా డతడు - "యుద్ధంలో క్షోభపడడమూ, పక్కకి తప్పుకోడమూ ఎక్కడా వున్నదే. కాని దెబ్బతిన్నా యుద్ధంలోంచి పారిపోకూడదు. నేను పారిపోవచ్చాను. చులకనై పోయాను. ఎలాగూ కర్ణుడితో వోడిపోయాను నేను. చెప్పే అక్కరలేదది. నువ్వూ వోడిపోయా విప్పుడు. భీముడూ, నకులసహదేవులూ ముందే వోడిపోయారు. మనతో పాటు ఈకృష్ణుడూ వోడిపోయాడు. అంచేత మరి యుద్ధానికి వెళ్ళక్కరలేదు. పదండి, అందరమూ అడివికి పోదాం. ముక్కుమూసుకు తపస్సుచేసుకుందాం కాదంటావా, బిరుదులు కట్టిపెట్టి, బుద్ధికలిగి,వినయంగా, దుర్యోధనుడు ఏపని చెప్తే ఆపని చేద్దాం. అతడిదయమీద బతుకుదాం."

ఎర్రబడ్డకళ్ళతో అర్జునుణ్ణిచూసి, ఇంకా ఇలా అన్నాడు:

"ఇదే నీసంగతైతే యుద్ధానికెందుకు పూనుకున్నావు? ఈ మాట ద్వైతవనంలోనే ఎందుకు చెప్పావు కాదు? 'కర్ణుడు ఉద్దోలమైన బలవంతుడు. అతడితో పోయిచేసుకోడం శక్యంకాదు నాకు' అని అవాళే చెప్పేస్తే ఇలా ఎందుకు వస్తాను నేను? శక్తిలేనివాడు రాజ్యం ఆసపడడమేమిటి? కర్ణుణ్ణి చంపేస్తానని ప్రతిజ్ఞచేశావు. నన్ను యుద్ధంలో దించేశావు తునకి ఇంతపని చేశావు. పగవాళ్ళమధ్య మీదకి ఎత్తికింద కుదేశావు. కృష్ణుడిముందు అన్న మాట అబద్ధం చేశావు. నువ్వు పుట్టినప్పుడు ఆకాశవాణే అబద్ధమాడింది. 'కౌరవుల్ని

చంపేస్తాను. యుద్ధంలో మడమతిప్పడు' అని బొంకింది. 'పుణ్యాత్ముడు' అని మునీశ్వర్లూ పొగిడారు. ఇంతమంది మమ్మల్ని ఇలా మభ్యపెట్టారు. అవన్నీ నమ్మాను. దుర్యోధనుడితో పగపెట్టుకున్నాను. కర్ణుడంటే తోకముడిచేస్తావని కానలేకపోయాను.

"దేవత లిచ్చిన రథమూ గుర్రాలూ వున్నాయి. వానరపతాక ముంది. దివ్యమైన గాండీవముంది, తాటిపట్టెలాగ. స్వయంగా శ్రీకృష్ణుడు సారథ్యంచేస్తున్నాడు. ఇలాటి పరికరాలు వుండీకూడా కర్ణుడిదగ్గిర తోకముడిచేశావు. కర్ణుణ్ణిచూస్తే పరుగుచ్చుకుంటా వన్నాడు దుర్యోధనుడు. వైరివాణ్ణి, అతడిమాట నమ్మక మోసపోయాను. నా వైరితనంవల్లే పాంచాలులూ, మాత్స్యులూ, పాండ్యులూ బంధువులూ, స్నేహితులూ నిష్కారణంగా నాశనమైపోయారు."

కృష్ణుడి మొహంచూసి ఇంకా ఇలా అన్నాడు:

"కర్ణుణ్ణి గెలవడం కష్టమైంది. దుర్యోధనుడూ, అందరూ చూస్తూవుండగానే పరాభవం పొందాను నేను. ఇంతఅయీ బతికి వుండడంకంటే కష్టమేముంటుంది? ఇంతకీ భీముడివల్ల చావుతప్పింది నాకు. అతడు వొక్కడే ప్రాణాలు దాచుకోకండా శత్రుసేన సంహరిస్తున్నాడు."

మళ్ళీ అర్జునుణ్ణి చురచురా చూసి, ఇలా అన్నాడు:

"అభిమన్యుడో, ఘటోత్కచుడో వుంటే ఇలా జరిగేదా, ఇవాళ? చేసుకున్నది అనుభవించకండా ఎలా తప్పుతుంది? నిన్ను గడ్డిపరకలా చూశాడు దురాత్ముడు కర్ణుడు. దిక్కులేనివాణ్ణి తరిమికొట్టినట్టు నన్ను తరిమికొట్టాడు. నిజమే, ఎంతమంది వుంటే ఏంలాభం, ఆపదకి అడ్డుపడనప్పుడు? ఆపదకి ఆదుకున్నవాడే బంధువు.

"పెట్టనికోటలా శ్రీకృష్ణుడు దగ్గిరే వున్నాడుకదా, భయపడి పారిపోవచ్చావేం? గాండీవం కృష్ణుడికి ఇచ్చేసి, నువ్వు నొగలెక్కలేక

పోయావూ? కృష్ణుడు రథికుడై కూడుంటే కర్ణుణ్ణీ, గిర్ణుణ్ణీ క్షణంలో చంపేసేవాడు. దుర్యోధనుణ్ణీ బంధుమిత్రులతో దుళ్ళగొట్టేసేవాడు.

"కొడుకువై కుంతికడుపులో పడకపోయినా బాగుండేది నువ్వు. పడినా పిండంగా గర్భపాతమైపోయినా నయంగా వుండేది ఇంతరభసా లేకండా పోయేది—."

## ధర్మరాజుతల పగలగొడతాను

చివరిమాట ధర్మరాజునోట్లోనే వుంది. అతణ్ణి నరికెయ్యడానికి ఒరలోంచి కత్తిదూశాడు అర్జునుడు.

"ఏమిటిది?" — చప్పున అతడి చెయ్యి పట్టుకున్నాడు కృష్ణుడు—"కత్తిదూశావేం? కౌరవులెవ్వరూ లేరే ఇక్కడ? కత్తితో పనేం వచ్చింది? ధర్మరాజుక్షేమం చూడాలని వచ్చాం మనం. కుశలంగా వుండడం చూశాం. సంతోషసమయం కాని కోపసమయం కాదిది. చంపవలసినవాళ్ళు ఎవరున్నారిక్కడ? ఎందుకూ ఈకోపం చెప్పూ?"

"ఇతడితల పగలగొడతాను" ధర్మరాజువేపు చురచురా చూస్తూ అన్నాడు అర్జునుడు—"గాండీవం ఇంకొకళ్ళ కిమ్మని ఎవళ్ళంటే వాళ్ళ తల పగలగొడతాను" వెనక నేను రహస్యంగా ప్రతిజ్ఞచేశాను. నువ్వు వింటూనే వున్నావు, అదే అన్నాడితడు ఎంత ధర్మాత్ముడైతేనేం, చంపేస్తాను. ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటాను. అసత్యదోషం రాకండా కాసుకుంటాను. దీనికి ఏమంటావో నువ్వే చెప్పు? సర్వం తెలిసినవాడివి. నువ్వు ఎలా చెప్తే అలాచేస్తాను."

"ఛీ ఛీ ఏంమాట లివి?" అదిలిస్తూ అందుకున్నాడు కృష్ణుడు—"నువ్వు వృద్ధుల్ని సేవించలేదని తెలుస్తోంది దీనివల్ల. ధర్మం తెలిసినవాడు ఎవ్వడూ ఇలా చెయ్యడు. ఏది చెయ్యవచ్చో, ఏది

చెయ్యరాదో, ఎక్కడ ఏది చెయ్యాలో ఏది చెయ్యకూడదో తెలిసి నడుచుకున్నవాడే బుద్ధిమంతుడు; ధర్మం తెలిసినవాడు. సత్యమూ, అహింసా— రెండూ ఉత్తమధర్మాలే. అయితే సమయంవచ్చినప్పుడు అహింసతోనే సత్యం కాపాడుకోడం ధర్మం. అంతేకాదు, అసత్యం చెప్పయినా అహింసే కాపాడాలంటారు పండితులు. ధర్మసూక్ష్మం తెలియదు నీకు సత్యంనిలుపుకోడంకోసంఅన్నని, ధర్మాత్ముణ్ణి, రాజుని, మహాత్ముణ్ణి చంపుతానంటున్నావు ధర్మమార్గమేనా ఇది? చిన్నతనం వల్ల తెలియక తగని ప్రతిజ్ఞ చేశావు. అదీకాక, సత్యమేదో అసత్యమేదో నువ్వు భావించినట్టు తెలిసినవాళ్ళు భావించరు. ఎలా అంటావా? ప్రాణాలమీదికి వచ్చినప్పుడూ, ధనం యావత్తూ పోతున్నప్పుడూ సత్యం అసత్యమవుతుందనీ, అసత్యం సత్యమవుతుందనీ పెద్దలంటారు * ఇదీ ధర్మసూక్ష్మం.

## కౌ శి కు డి క థ *

"లోగడ కౌశికుడు అని వొక బ్రాహ్మడు వుండేవాడు. ధర్మ సూక్ష్మం తెలియదతడికి. ప్రసిద్ధమైన ఒక వూరికి కొంచెం దూరంగా, నదులు కలిసిన పుణ్యక్షేత్రంలో వుండేవాడతడు. అబద్ధం చెప్పననీ, సత్యమే చెపుతాననీ వ్రతం పట్టి తపస్సు చేసుకుంటూ వుండేవాడు. సత్యవాది అని జనులు పొగిడేవాళ్ళు అతణ్ణి. ఒకనాడు కొంతమంది దొంగలు కొందర్ని వెంటతరుముకు వచ్చారు, దొంగలభయంతో వచ్చి, వాళ్ళు కౌశికుడిఆశ్రమంపక్క పొదల్లోదూరి దాగున్నారు. దొంగలు వచ్చారు. వాళ్ళు ఎక్కడికివెళ్ళారని కౌశికుణ్ణి అడిగారు. అబద్ధం చెపితే పాపంవస్తుందని భయపడి 'అదిగో ఆపొదల్లో దూరారు' అనిచెప్పే శాడు కౌశికుడు. దొంగలు వాళ్ళని పట్టుకున్నారు. చంపేశారు. వాళ

*చూ. శాంతిపర్వం అ. 3.

ధనం దోచుకున్నారు. నిజమే చెప్పాననుకున్నాడు కౌశికుడు. కాని అసత్యదోషం వచ్చిందతడికి. ఆ దోషంవల్ల నరకం అనుభవించాడు.

"అంచేత హింసాకరమైన సత్యం ధర్మం కాదు. ఈ ధర్మసూత్రాలు పెద్దలనడిగి తెలుసుకోక, మూఢులు తమకి తోచిందే ధర్మమనుకుంటారు. దుర్గతుల పాలవుతారు. కనక ఇది విచారించి ధర్మరాజుని చంపవచ్చో, చంపరాదో నువ్వే నిశ్చయించు."

"తల్లిలాగ తండ్రిలాగ హితం చెప్పావు" అన్నాడు అర్జునుడు—"తగనిపని చెయ్యకుండా తప్పించావు. నీకు తెలియని ధర్మాలు లేవు. ప్రతిజ్ఞనిలుపుకోలేదని నన్ను జనం నిందించకుండా అన్నయ్యతలవువ్వాడకుండా ఇపుడు ఏం చెయ్యాలో ఆదేశించు."

"అయితే చెపుతాను, విను." అందుకున్నాడు కృష్ణుడు—"కర్ణుడిబాణాలవల్ల బాధపడి నిన్ను ఏదో అన్నాడు ధర్మరాజు. అంతే కాని, నీమీద కోపమూ అతడికి? నువ్వూ, భీముడూ, నకులసహదేవులూ అతడిమాట జవదాటరు కదా! అన్నకనక అతడు అన్నది పట్టించుకోకూడదు నువ్వు. నీప్రతిజ్ఞమాట అంటావా? దానికి భంగం రాని మార్గం వుంది. 'నువ్వు ఇలాంటివాడివి, అలాంటివాడివి' అని అతణ్ణి తూలనాడు. చంపినట్టే అవుతుందది. తరవాత వినయంగా ప్రార్థించి ప్రసన్నుణ్ణిచేసుకో. అలా అయితే అసత్యదోషం రాదు. గురువధపాతకమూ తప్పిపోతుంది అనంతరం అతడి అనుమతి పుచ్చుకుని కర్ణుణ్ణి చంపడానికి వెళదాం."

## అన్నగారికి తిట్లు

ధర్మరాజుతిట్టు తిరిగాడు అర్జునుడు.

"యుద్ధంచేస్తున్నభీముడు నన్ను అన్నా చెల్లుతుంది. పారిపో వచ్చిననువ్వా అనడం? నన్ను ఎరిగి ఎరిగీ ఇంతమాట అన్నావు.

సినాలిక చీలికలై పోదేమంటూ? యుద్ధంలో నువ్వెవ్వారు ఏం చేశావో చెప్పూ, ఇలా అవడానికి? నకులుడూ సహదేవుడూ బ్రహ్మాండమైన పరాక్రమంతో పోరాడతారు. శత్రుసేన వీనుగులపెంట చేస్తారు. వాళ్ళయినా నోటికి వచ్చినట్టు ఇలా అన్నారా ఎప్పుడైనా?

"కౌరవులతో విరోధం ఎవళ్ళవల్ల వచ్చింది? నువ్వు జూద మాడడంవల్ల వచ్చింది. రాజ్యనాశనం, అరణ్యవాసం, హానిపతనం, దుఃఖం – అన్నీ జూదంవల్లే తెచ్చుకున్నావు. పైగా సిగ్గులేకండా వుంది నీకు యుద్ధంలో చేతకాకపోతే వోర్చుకోవాలి. నోటికివచ్చినట్టు కూస్తే ఏం లాభం, మరింత లోకువైపోడం తప్ప? ఇంతవరకూ చేసిందేదో చేశావు. ఇకనైనా దుర్బుద్ధి విడిచిపెట్టు. మేం పౌరుషం చూపిస్తాం. చూస్తూవూరుకో. కష్టపడ్డవాళ్ళు మాటలు పడతారా!"

దేవుడులాంటి అన్నగారిని అనరానిమాటలు అనేశాడు అర్జునుడు. దాంతో ఎక్కడలేని దుఃఖమూ పొర్లుకువచ్చిం దతడికి. ఒరలో పెట్టేసినకత్తి మళ్ళీ చప్పున దూశాడు.

"మళ్ళీ ఇదేమిటి!" – అడిగాడు కృష్ణుడు.

"అన్నయ్యని అనరానిమాట లన్నాను. ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. తలకోసుకుంటాను" అన్నాడు అర్జునుడు.

"చావేనా కావలిసింది!" అన్నాడు కృష్ణుడు – "తనని తాను పొగుడుకోడం చావుతో సమానం అంటారు పెద్దలు. అంచేత నిన్ను నువ్వు పొగుడుకో. అదే ప్రాయశ్చిత్తం."

"నువ్వు చెప్పినట్టు చెయ్యడమే ధర్మం. చెయ్యకపోడమే అధర్మం" అంటూ గాండీవం తీసి పట్టుకున్నాడు అర్జునుడు. ధర్మరాజు కేసి తిరిగాడు; అంటుకున్నాడు:

"శివుడు వొక్కడూ తప్పిస్తే విల్లుపట్టినవాళ్ళలో నాతో సాటి వచ్చేవాడు ముల్లోకాల్లోనూ లేడు. దిగ్విజయం చేశాను. కోట్లుకోట్లు

ధనం నీ రాజసూయందక్షిణలకోసం తెచ్చిపోశాను. సాటిలేని సంశప్తక సైన్యం సంహరించాను. నాచేత కూలిపోయిన కౌరవసేన ఎలావుందో చూడు" అన్నాడు. వెంటనే దండప్రణామం చేశాడు. లేచి నుంచున్నాడు. చేతులుజోడించాడు. ప్రార్థించాడు:

"అన్నయ్యా, అనుగ్రహించు. ఏవో కారుకూతలు కూశాను. లెక్కచెయ్యకు. అన్యథా భావించకు. దయచూడు. విను. నిజం చెప్తున్నాను. ఈతనువూ, ప్రాణాలూ నీసొమ్ము. నీసేవకుణ్ణి. ఆశీర్వదించు. భీముడిదగ్గిరికి పంపించు. అతడి రణభారం తగ్గిస్తాను. కౌరవసేన కడతేరుస్తాను. కర్ణుడితల తెగేస్తాను. దుర్యోధనుడి దురభిమానం తుదముట్టిస్తాను. రాధకి కొడుకులేకండా చేసేస్తాను. తప్పితే కుంతికే కొడుకు లేడనుకో" అన్నాడు.

"నావల్లమీరు పడరానిపాట్లు పడ్డారు" పక్కదిగిపోతూ అన్నాడు ధర్మరాజు — "కులానికి అంతటికీ అపకారంచేసిన అవినీతిపరుణ్ణి. పాపాత్ముణ్ణి. పగలగొట్టవలిసిందే నాతల. సందేహంలేదు. దయతలిచి నువ్వు వొదిలేసినా, నేనే అడివికి పోతాను. నేను వొదిలిపోతాక, సుఖంగా వుండు నువ్వు. బలంలేనివాణ్ణి. యుద్ధమంటే భయపడేవాణ్ణి రాజుచెయ్యడం తగదు. యుద్ధంచేస్తున్నాడు భీముడు. అతడికే పట్టంకట్టు" అంటూ అడివికి ప్రయాణమయాడు.

"నీపాదాలు పట్టుకు శరణువేడుతున్నాను" చప్పున కాళ్ళమీద పడుతూ అన్నాడు శ్రీకృష్ణుడు: "మాఇద్దరిదీని ఈతప్పు. దయతో క్షమించు. అర్జునుడి ప్రతిజ్ఞఅంటే ఏమిటో తెలియంది కాదు నీకు. కోపంవల్ల మేం చెప్పినమాటలు పట్టించుకోకండా వున్నావు. 'గాండీవం మరొకళ్ళకిమ్మని తిరస్కరించినవాణ్ణి చంపేస్తానని శపథం చేశాడు అర్జునుడు. భావ్యంకాని ఆమాట నువ్వు అన్నావు. అసత్య

దోషానికి అతడు భయపడడం చూసి నేనే నిన్ను తూలనాడమన్నాను అతణ్ణి. పెద్దల్ని తూలనాడడమూ చంపడమూ వొకటే కనక.

"కర్ణుకి కంఠం తెగుతుందివాళ. అతడిరక్తం నేలమీద పారుతుంది. నువ్వు ఎర్రగా చూసినప్పుడే అతడు చచ్చాడు. నిజం చెపుతున్నాను. ఆవిచారం ఇక పెట్టుకోకు. మమ్మల్ని పంపు" అన్నాడు.

తడబడిపోయాడు ధర్మరాజు. శ్రీకృష్ణుడు లేవనెత్తాడు. చేతులు జోడించి నుంచున్నాడు కృష్ణుడు.

"అవును" నెమ్మదిగా ఎత్తుకున్నాడు ధర్మరాజు — "నేనే పొరపడ్డాను. ఏమేమో అనేశాను. మనస్సు మనస్సులో లేక మంచీ చెడ్డా తోచలేదు. అలాంటి నన్ను దయతోనూ, ప్రేమతోనూ వోదార్చావు. తెలియని మా అన్నదమ్ముల్ని ఆపదసముద్రంలో మునిగిపోకండా అడ్డుకున్నావు."

"ఇలా విచారిస్తూ నుంచోడం కాదు, ఇప్పుడు చెయ్యవలిసింది" కళా కాంతీ లేకండా మొహం వేలేసుకు నుంచున్న అర్జునుడు హెచ్చరించాడు కృష్ణుడు — "అన్నగారి అనుమతి తీసుకుని వెంటనే కర్ణుడిపని పట్టించాలి మనం. ఆలస్యం అమృతంవిషమవుతుంది. అన్నయ్యని మెప్పించి మాట్లాడినందుకే ఇంత బాధపడిపోతున్నావు. నిజంగా చంపేసివుంటే ఏమయేవాడివో! దైవం దయవల్లా, ఆప్తబంధువులు చేసుకున్న పుణ్యంవల్లా అంత ఘోరం జరక్కుండా తప్పింది."

కన్నీళ్ళతో అన్నగారి పాదాలమీద వాలిపోయాడు అర్జునుడు. కన్నీళ్ళు వొలికిపోతూన్న మొహంతో తమ్ముడిమీద వొరిగిపోయాడు ధర్మరాజు. ఇద్దరూ వొకళ్ళని పట్టుకుని వొకళ్ళు ఏడ్చారు. ఇద్దరినీ వోదార్చాడు శ్రీకృష్ణుడు; శాంతపరిచాడు. సేవకులు నీళ్ళు తెచ్చిచ్చారు. అన్నదమ్ములిద్దరూ మొహాలు కడుక్కున్నారు. ధర్మరాజు అర్జునుణ్ణి కౌగిలించుకున్నాడు. శిరస్సు ముద్దాడాడు.

"మనల్ని ఇంతపనిచేశాడు కర్ణుడు" తమ్ముడి మొహం చూస్తూ చిరునవ్వుతో అన్నాడు ధర్మరాజు - "అందరిఎదటా నాజెండా ఎగర గొట్టేశాడు విల్లు విరిచేశాడు. గుర్రాలు కూల్చేశాడు. సారథిని చంపేశాడు. నన్ను నానాహంగామా చేసేశాడు. గెల్చుకున్నాడు. తమ్ముడూ, ఇప్పుడే చంపెయ్యాలి వాణ్ణి. అలా కాకపోతే నేను బతికి లాభంలేదు"

"నీపాదాలు ముట్టి చెపుతున్నాను" ముకుపుటా లదిరిస్తూ అన్నాడు అర్జునుడు - "అతడి బంధువులతో కర్ణుణ్ణి చంపేసి వస్తాను. అతణ్ణి చంపకండా ఏ మొహంపెట్టుకుని నీఎదటపడతాను? సారథి కృష్ణుడు మాత్రం ఎలా మొహమెత్తి తిరుగుతాడు?" అంటూ కృష్ణుడికేసి తిరిగాడు

"బావా, కర్ణుడు కడ తేరిపోవాలని కొంచెం భావించు. అదే నాకు వెయ్యి ఏనుగులబలం ఇస్తుంది కర్ణుణ్ణి కొట్టేస్తాను.

"అంతవాడివేనోయి నువ్వు" ఉత్సాహంతో అర్జునుడి బుజం తడుతూ అన్నాడు శ్రీకృష్ణుడు.

ఆయుధాలన్నిటితోనూ రథం సిద్ధంచేయించాడు అర్జునుడు. గుర్రాలికి సమృద్ధిగా దానాపెట్టించాడు. నీళ్ళుపట్టించాడు. రథానికి పూయించాడు. యుద్ధానికి బయులుదేరుతూ అన్నగారివేపు చూశాడు.

"తమ్ముణ్ణి దయతో చూడు. దీవించి పంపు" ధర్మరాజుతో అన్నాడు కృష్ణుడు.

అర్జునుణ్ణి దగ్గిరికి లాక్కున్నాడు ధర్మరాజు. గట్టిగా కౌగిలించు కున్నాడు. "కృష్ణుడు చెప్పడంవల్ల నన్ను అలా అన్నావు నువ్వు. అదంతా అవగతమైంది నాకు. తెలియకండా ఏదో అన్నాను. విచారించకుమీ!" అని ప్రేమగా సమిరాడు. కలకల్లాడుతున్న

ముఖంతో అన్నగారిపాదాలమీద నుదురుమోపాడు అర్జునుడు. తమ్ముణ్ణి గుచ్చి కౌగిలించుకున్నాడు ధర్మరాజు

"కర్ణుణ్ణి గెలుస్తావు. జయం నీకు శాశ్వతమవుతుంది"— దీవించాడు.

"నిన్ను నొప్పించాడు కర్ణుడు? పాపకర్ముడు. అతణ్ణి చంపేసి ఇప్పుడే వచ్చేస్తాను" - అంజలిబంధం నొసటగీలిస్తూ అన్నాడు అర్జునుడు. అన్నగారి అనుమతి తీసుకున్నాడు.

కృష్ణుడూ, అర్జునుడూ రథమెక్కారు. శ్రీకృష్ణుడు పగ్గాలు సడిలించాడు. బయలుదేరింది రథం. ఎదురుగుండా శుభశకునాలు కనిపించాయి.

కర్ణుణ్ణి ఎలా కొట్టడం? — ఈవిచారంతో అర్జునుడివొళ్ళంతా చెమట్లుపోశాయి.

"అర్జునా" హెచ్చరించాడు కృష్ణుడు— "దేవతలైనా గెలవలేనివాళ్ళని ఎంతో మందిని గెలిచావు. కర్ణుడికోసరూ కలతపడుతున్నావు? నీకున్న దివ్యబాణాలూ, ధనుర్వేదంలో నీకున్న కౌశలమూ ఎవరికున్నాయి? భీష్ముడూ, ద్రోణుడూ నీ మహాస్త్రాల్లో మండిపోయారు. జయద్రథుణ్ణి అద్భుతంగా సంహరించావు. అందరికంటే బలవంతుడనీ, శౌర్యవంతుడనీ, తేజోవంతుడనీ కర్ణుడునమ్ముకున్నారు కౌరవులు. కనకనే నీమీదికి పెట్టారతణ్ణి, నీబాణాలతో ప్రాణాలు వొదులుతా డతడు, అఖండమైన కీర్తి దక్కుతుంది నీకు. దుర్యోధనుడి ఆశలన్నీ అడుగంటించు. కర్ణుణ్ణి కడముట్టించు విజయలక్ష్మి వరించు. నీవాళ్ళని సంతోషంలో వోలలాడించు

"మీసేనకంటే ఎంత అధికంగా వుండేది కౌరవసేన? ఆఏనుగులూ, ఆగుర్రాలూ ఆరథాలూ, ఆవీరభటులూ ఏమయారు?

నీబాణాలపాలబడి సముద్రమంతకాసబవ గోష్పాదంలా అయిపోలేదూ ఇప్పుడు!

"కౌరవసేనాధిపతి అయి పదిరోజులు యుద్ధంచేశాడు భీష్ముడు. అయితేనేం, మీ సేనాధిపతిని మించగలిగాడా? తరవాత ద్రోణుడు సేనాధిపతి అయాడు. అయిదురోజులు యుద్ధంచేశాడు. అయినా మీ సేనాధిపతిని గెలవగలిగాడా? లేదు. ఎంచేత? ఇదంతా ఎవరివల్ల జరిగింది? నీవల్ల, నువ్వు మీ సేనాధిపతిని కంటికి రెప్పలాగ కాపాడడంవల్ల. అడ్డులేని నీపరాక్రమం ఉభయపక్షాలూ చూస్తూనేవున్నాయి రోజూ. భీముడు అలా వీరవిహారంచేస్తున్నాడంటే, నీదన్నే దానికి కారణం. నీమహాస్త్రాలికి ఎదురులేదు. వాటిబలంబాగా తెలుసు నాకు. కర్ణుడే కాదు కృపుడూ, అశ్వత్థామా, కృతవర్మా, శల్యుడూ— ఇంత మందీ నీచేత పడిపోతారు. దయదలచి కృపుణ్ణీ, అశ్వత్థామనీ చంప వద్దనుకుంటే, వోడించి వొదిలిపెట్టు. కృతవర్మ చుట్టమని వస్తాయించకు; కొట్టెయ్యి. శల్యుడు మేనమామ అని సందేహించకు. పగవాళ్ళతో చేరినవాడి ప్రాణాలు తీస్తే పాపంలేదు.

"కర్ణుడు — కర్ణుడులేని భారతయుద్ధం లేదు. లక్క-ఇల్లు కాల్చడమూ, కపటజూద మాడడమూ — దుర్యోధనుడి దుర్నయా లన్నిటికీ కర్ణుడే మూలం. పాపాత్ముడు, అవాళ జూదంనాడు సభలో ఏమన్నాడు ద్రౌపదిని? 'ఇక్కడ నీమొగుళ్ళు ఎవరూలేరు' అన్నాడు. 'వాళ్ళుజూదంలో వోడిపోయి నిన్ను వొదిలేశారు' అన్నాడు. 'నీమీద వలపున్న మొగుణ్ణే మరొకణ్ణి చూసుకో' అన్నాడు.

"నేను సంధికి వెళ్ళాను. ధృతరాష్ట్రుడి కొడుకుల మనస్సుల్లో ఇతడే పగరాజబెట్టాడు. నన్ను పట్టుకోవాలని ప్రయత్నించాడు. అర్జునా, మీ ఆపదలన్నిటికీ ఇతడే మూలకందం.

మోసంచేసి, అభిమన్యుడివిల్లు వెనకనించి నరికేశాను. అంచేతే

అంతమందీ మీదపడి చంపేశారు. అది ఆరనిచిచ్చయి పగలూ, రాత్రీ మండుతోంది మనస్సులో. నీబాణాలికి వాణ్ణి బలిపెడితే కాని ఆరదు ఈఅగ్గి. సభలో ఆదుష్టుచేసిన దుర్ణయాలుచూసి, ఎంతో బాధపడ్డారు బంధువులు. గెద్దలూ, రాంబందులూ వాణ్ణిపొలుచుకు తినడం చూస్తే కాని వాళ్ళమనస్సు చల్లబడదు. వాడువొక్కడూ పడిపోతే చాలు. తక్కినరాజులూ, కౌరవులూ నీచుట్టుపట్లకి రారు."

కృష్ణుడు ఇలా అంటూనేవున్నాడు, రణస్థలందగ్గిరికి వచ్చేసింది రథం. అర్రెత్తిచూశాడు కృష్ణుడు.

"అదిగో చూడు, ఎలాయుద్ధంచేస్తున్నాడోవాడు !" అంటూ కర్ణుడియుద్ధం అర్జునుడికి చూపించాడు. "ఆఏనుగుతాడుజెండా ఎగర గొట్టెయ్యాలి. గుర్రాలు నరికేసి రథం గుండచేసెయ్యాలి. పీక తెగేసి అతడి తలకాయ కింద దొర్లించెయ్యాలి. చూసి, నోరెండిపోయి పరి గెత్తిపోవాలి శల్యుడు. విన్నావా, కలతపడకు. గాండీవం సారించు. లోకం జేజేలు పడుతుంది నీకు" అన్నాడు.

కృష్ణుడిమాటలు మంత్రంలా పనిచేశాయి. "నీ సహాయమే వుంటే స్వర్గలోకమే జయిస్తాను" ఉత్సాహంతో అన్నాడు అర్జునుడు- "ఇదిగో ఇప్పుడే కర్ణుడిపని పట్టేస్తాను. నువ్వు భళీ అన్నట్టుచేస్తాను" అంటూ శేషసర్పంలాటి చెయ్యెత్తి గాండీవం పట్టుకున్నాడు నారి తొడిగాడు. 'కృష్ణా, ఇవాళ నాబాణాలూ, ధనుస్సూ, రథమూ చూసి దుర్యోధనుడూ, శకునీ పాచికలూ, పాళీ, ఆమండపమూ తలుచుకుంటారు. తాను నమ్మినబంటు కర్ణుడు నాబాణాలతో తెగి పోడం చూసి, విదురుడిమాట వినకపోయినందుకు విచారిస్తాడు దుర్యో ధనుడు. తన చేతకానితనం తలుచుకుని తన్నుతాను నిందించుకుంటాడు విని ధృతరాష్ట్రుడు. రాజ్యంకోసం కొడుకులూ, కొడుకులకోసం తండ్రీ నీళ్ళధార పోసుకుంటారు.

"దుర్యోధనుణ్ణి వొదిలి రాజ్యసంపద ధర్మరాజుని చేరుతుంది. సాత్యకీ, నకులసహదేవులూ, భీముడూ నన్ను బ్రహ్మరథం పడతారు. కర్ణుడి కంఠం నరికేస్తాను. దేవతలూ, గరుడులూ, నాగులూ, విద్యాధరులూ—యావన్మందీ నన్ను పొగుడుతూ ఇళ్ళకిమళ్ళుతారు" అన్నాడు.

అర్జునుడిరథం పాండవసేనతో కలుసుకుంది.

అర్జునుడు ధర్మరాజుదగ్గిరికి వెళ్ళివచ్చిన ఈవ్యవధిలో కౌరవ పాండవసేనలు రెండిటిలోనూ పేరుపడ్డయోధులు పరస్పరం కలబడ్డారు. ఘోరంగా జరిగింది యుద్ధం. కర్ణుడికుమాళ్ళలో వొకణ్ణి ఉత్తమౌజుడు చంపేశాడు. దుఃఖంతోనూ, కోపంతోనూ ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు కర్ణుడు. ఉత్తమౌజుడి జెండా నరికేసి, అతడి గుర్రాలు కొట్టేశాడు. కత్తిదూసి, రథం దూకాడు ఉత్తమౌజుడు. కృపాచార్యుడి గుర్రాలు నరికేసి, శిఖండిరథ మెక్కేశాడు. రథం దిగి యుద్ధానికి సిద్ధపడ్డాడు కృపాచార్యుడు. పాదచారికావడంచేత అతడిమీద బాణం వెయ్యడం మానేశాడు శిఖండి. అశ్వత్థామ పరిగెత్తుకు వెళ్ళాడు. కృపాచార్యుణ్ణి తన రథంమీద పట్టుకుపోయాడు.

పట్టపగ్గాలు లేవు భీముడికి. అవి బాణాలు కావు, యమపాశాలు. అవి సింహనాదాలు కావు, మృత్యుఘోషలు. నడినెత్తిసూర్యుడిలాగ మండిపోయాడతడు. అతడి వడీ, అతడి వేడీ భరించలేకపోయింది నీసేన. దూరదూరం తొలిగిపోయింది.

"అర్జునుడు ఆలశ్యంచేస్తున్నాడేం ?" విశోకుడితో విచారిస్తూ అన్నాడు భీముడు – "అన్నగారిఅవస్థ చూడడానికి వెళ్ళాడతడు. ఆయనదుర్దశ చూసి దుఃఖపడి ఏమయాడో తమ్ముడు ? ఇద్దరూ మరోలా ఏమీ కాలేదుకదా ! అలాగే ఏమైనా అయితే మనం కౌరవులందరినీ చంపేసి గెలుపుసాధించినా ఏమిటి లాభం ? సారథీ ! మనస్సు కుదుటపడకుండా వుంది. ఈరాజుల్నీ, దుర్యోధనుణ్ణీ, సేనల్నీ చంపెయ్యడం

తప్పమరో మందేముంది, ఇప్పుడు !" అంటూ మనసేనవేపు జెండాలు విశోకుడికి చూపించి– "ఆజెండాలు ఎవరెవరివో విడివిడిగా చూసుకో. మనబాణాలూ అవీ ఏమాత్రమున్నాయో చూడు" అన్నాడు.

"జెండాలు ఎవరివైతేనేం" అందుకున్నాడు విశోకుడు– "నువ్వు కళ్ళెర్రచేస్తే తోకముడవని మొనగాడు ఎవడున్నాడు ? మనబాణాల సంగతి అడగక్కరలేదు. ఇవాళ తెచ్చినవాటిలో ఇంకా పదివేలు బాణాలున్నాయి. పదివేలు క్షురప్రాలున్నాయి. పదివేల భల్లాలు న్నాయి. రెండువేల ఇనపబాణాలున్నాయి. మూడువేల ప్రదరాలు న్నాయి. ఇంతేకాదు, ఆరెడ్లు లాగుతున్న ఆయుధాలబండి పిసరంతా వెల్తికాలేదు; అలాగేవుంది. అదీకాక, నీయుద్ధానికి మూలధనమైన గదాదండం వుండనే వుంది కదా ! ఆయుధాలు వున్నా లేకపోయినా అదే అన్నిపనులికీ సరిపోతుంది."

"విశోకా, నువ్వు వేడుకచూస్తూ వుండు" అతణ్ణి తడుతూ అన్నాడు భీముడు – "అవాళ విదురుడు చెప్పనే చెప్పాడు. వరస పెట్టి కౌరవుల్ని ఎలాదుళ్ళగొడతానో చూడు. 'ధర్మరాజుతమ్ముడు అబద్ధమాడడు. అన్నంతా చేస్తాడు' అని దుర్యోధనుడి ఆప్తులు దుఃఖ పడాలి. ఇలాంటిజూదం ఆడిఎరగడు దుర్యోధనుడు. 'ఇది మంచిపని; ఇది ఇలా చెయ్యి' అని చెప్పేవాడు లేడు నాకిప్పుడు. ఏంచెయ్యాలో నేనే చేస్తాను" అంటూ కౌరవసేనంతా వొకసారి కలయచూశాడు. ఒకవక్కసేన అల్లకల్లోలమవుతూ అవుపించింది.

"చూడూ చూడూ" విశోకుడితో అన్నాడతడు – 'నేను కొట్టందే అటు అల్లకల్లోలమవుతోంది కౌరవసేన. అర్జునుడు వచ్చి వురికాడో ఏమో ?

"అదుగో అర్జునుడు" పరిశీలనగా చూసి, సంతోషంతో అన్నాడు విశోకుడు – "కౌరవుల ఏనుగుసేనమీద కలబడ్డాడు, అదుగో

కపిధ్వజం. మేఘాలమీద మెరుపుల్లాగ మెరుస్తోంది. శ్రీకృష్ణుడి శరీరకాంతీ, అర్జునుడి కిరీటం రత్నాలకాంతులూ కమ్ముకుని, రథమూ గుర్రాలూ చిత్రచిత్రమైన కాంతులతో ప్రకాశిస్తున్నాయి."

అర్జునుడు వచ్చేశా డనగానే పట్టరాని ఆనందం కలిగింది భీముడికి. మూరెడెత్తు పొంగింది శరీరం.

"సారథీ, చల్లనికబురు చెప్పావు" విశోకుడితో అన్నాడతడు–"వందమంది సేవకుల్ని బహుమానమిస్తాను నీకు. మంచిమంచి గుర్రాలు ఇరవై ఇస్తాను. పదిగ్రామాలు ఇస్తాను."

మన ఏనుగులు వీనుగు పెంటలుచేస్తూ, "కృష్ణా, రథం భీముడి దగ్గిరికి పోనీ" అన్నాడు అర్జునుడు.

పగ్గాలు సడిలించాడు కృష్ణుడు. భీముడికేసి పరిగెత్తింది రథం. అడ్డంగా అడ్డుకుంది మనసేన. ఎదురైన చతురంగసేన నేలపాలు చేశాడు అర్జునుడు. మందరం మథించిన సముద్రంఘోమని మించిపోయింది, అర్జునుడు తరిమికొట్టిన మనసేన కల్లోలం. జెండాలూ, చామరాలూ, గొడుగులూ, భూషణాలూ ముక్కముక్కలుచేసి, రణభూమిని ముస్తాబు చేసినట్టున్నాడు అర్జునుడు. కర్ణుణ్ణి కడముట్టించడానికి తొందరపడుతూ మనసేన తరిమితరిమి కొట్టాడతడు.

పారిపోతూ పారిపోతూ మళ్ళీ అతణ్ణి చుట్టుముట్టారు మనవాళ్ళు. చిచ్చులపిడుగులా చెలరేగిపోయాడతడు. పేరుకలవాళ్ళని, ముఖ్యులైన రథాలవాళ్ళని నాలుగువందలమందిని, సారథులతోనూ రథాలతోనూ గుర్రాలతోనూ కలిపి గుండపిండి చేశాడు. ఆ వేడి భరించలేక అక్కడి రాణువ కకావికలైపోయింది.

కర్ణుడిముందున్న సేనలు అర్జుడిమీదికి పురకలు పెట్టాయి. పాములమీద వాలిన గరుత్మంతుడిలాగ వాటిమీద పురికాడు అర్జునుడు. తమ్ముడి ఉద్రేకం చూశాడు భీముడు. తనముందున్న

కౌరవసేన కూరలుతరిగినట్టు నరకడం లంకించుకున్నాడు. అది చూశాడు దుర్యోధనుడు. "ఇతడు వొక్కడూ చస్తే పాండవుల బలమంతా చస్తుంది" ముఖ్యులైన సైనికుల్ని హెచ్చరించాడు—"మీరు యావన్మందీ వెళ్ళండి. ఒక్కమొగిని ముట్టడించండి" అన్నాడు. ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, కాల్బలమూ వేసుకుని పొలోమని వెళ్ళారు వాళ్ళు. భీముణ్ణి చుట్టుముట్టారు. బాణాలూ అవీ వర్షం కురిపించారు. అవన్నీ కొట్టేస్తూ, వల చించుకుపోయిన సొరచేపలాగ మన సేనలో చొరబడ్డాడుభీముడు. రక్తనది పారించాడు. ఆనదిలో, తెగిన సైనికులతలలు తాబేళ్ళలా తేలాయి. చేతులు పాముల్లా పాకాయి.

భరించలేక పోయాడు దుర్యోధనుడు. శకుని మావని పురికొల్పాడు. ఉగ్రంగా వెళ్ళి కలబడ్డాడు శకుని. భీముడి రొమ్ములమీద అంపవాన కురిపించాడు. పిసరంతా లక్ష్యపెట్టలేదు భీముడు. గట్టిదొక ఇనపబాణం తొడిగాడు. బలంకొద్దీ ధనుస్సులాగి వొదిలిపెట్టాడు. ఆరు బాణాలు వేసి దాన్ని ముక్కలు చేశాడు శకుని. పెదవులు బిగించాడు భీముడు. వాడి దొక బాణం సంధించాడు. నవ్వుతూ శకునివిల్లు విరిచేశాడు. మరోవిల్లు తీశాడు నీ మరిది. మెరుపుల్లాటి పదహారు భల్ల బాణాలు కొట్టాడు. భీముడిమీదా, అతడి సారథిమీదా వాడివాడి కోలలు నాటించాడు. అతడి జెండా ఎగరగొట్టాడు. ధనుస్సు నరికేశాడు. గుర్రాలుకీచుకీచు మనిపించాడు. సారథి వొళ్ళుకండలు చెక్కేశాడు; రక్తాలు కారించాడు. "అదిగదీ మామా!" - దుర్యోధనుడు మెచ్చుకున్నాడు.

కళ్ళమొయ్యా కోపంవచ్చింది భీముడికి. యముడి నాలికలాటి శక్తితీశాడు; శకునిమీద విసిరాడు. ఒడుపుగా అది పట్టేశాడు శకుని. తిప్పి భీముణ్ణి కొట్టాడు. భీముడి భుజం దూసుకు పోయింది. శక్తి. గగ్గోలుపెట్టేసింది; కౌరవసేన. మరింత వొళ్ళుమండింది భీముడికి.

మరో పెద్ద ధనుస్సు తీశాడు. టపీమని శకుని ధనుస్సు తుంచేశాడు. ఛడాఛడి వాడివాడి బాణాలు వొళ్ళంతా నాటించాడు. రథంమీంచి కింద పడిపోయాడు శకుని. చచ్చినట్టు మూర్ఛపోయాడు. తడబడి పోతూ పరిగెత్తుకు వెళ్ళాడు దుర్యోధనుడు. మామని రథంమీద పట్టుకుపోయాడు. నాయకులిద్దరూ తప్పుకుపోడంతోటే సైన్యాలు కాళ్ళకి బుద్ధిచెప్పాయి. పడవ పగిలిపోతే జనం దీవి చేరుకున్నట్టు పారిపోయిన సేనలు కర్ణుడిదగ్గిర చేరుకుని, వూపిరి తీశాయి.

ధృతరాష్ట్రుడు: కృతవర్మా, అశ్వత్థామా, కృపాచార్యుడూ, దుర్యోధనుడూ, కర్ణుడూ వొక్కడూ దగ్గిర చేరలేకపోయాడూ? అంత ఉద్ధృతంగా వుందా భీముడి యుద్ధం? తరవాత?

సంజయుడు: కరూశ, పాంచాల, చేదిసైన్యాలు మన రాణువని వెంటతరిమాయి. చూసి, కలబడ్డాడు కర్ణుడు. మనసేనలు ధైర్యం తెచ్చుకున్నాయి. కర్ణుడివెంట పరిగెత్తాయి. భీముణ్ణి చుట్టుముట్టాయి. పాండవసేనలు కర్ణుణ్ణి ఘిరాయించాయి. ఉద్వేలమైన ఉద్రేకంతో ఎగసిపడ్డాడు కర్ణుడు. ఉగ్రమైన రకరకాల బాణాలు గుప్పించాడు. తట్టుకోలేకపోయింది పాండవసేన. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, భటులూ కలగుండుపడిపోయారు.

భీముడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపది కుమార్తులూ, సాత్యకీ వొక్కసారి కర్ణుడిమీద కలబడ్డారు. అందరికీ అన్నివైపులై కలబడ్డాడు కర్ణుడు. అందరి శరీరాలూ తూంట్లుచేశాడు. అంతమందినీ ముచ్చెమటలు పోయించాడు. జెండాకొయ్యలు ఎగరకొట్టాడు.

నకులుడూ, సహదేవుడూ వచ్చిపడ్డారు. విషసర్పాల్లాటి బాణాలు విరజిమ్మారు. కసింతా జంకలేదు కర్ణుడు. కవలతమ్ములు ఇద్దరినీ దద్దరిల్లగొట్టేశాడు. అతడి రణకేళి ఆశ్చర్యం వేసింది.

మొనగాళ్ళని తరిమికొట్టినా వెనకాడలేదు శత్రుసేన. పాంచాల

చేదిసేనలు రకరకాల ఆయుధాలతో అతణ్ణి ఆక్రమించాయి. ఎత్తిన విల్లు దించలేదు కర్ణుడు. ప్రచండమైన బాణాలు సేనంతా నింపేశాడు. కాళ్ళలమూ, గుర్రాలసేనా, ఏనుగు దండూ ముక్కలుముక్కలు అయిన అవయవాలతో కుప్పలుకుప్పలు కూలిపోయాయి. రథాలు గుండపిం డయాయి. ఆయుధాలూ, గొడుగులూ, చామరాలూ, జెండాలూ, భూషణాలూ పోడిపోడి అయిపోయాయి. రక్తంకాలవలై పారింది.

వరసవరసలు పోరాడారు పాండవయోధులు. అంతకంతకీ రెచ్చిపోయాడు కర్ణుడు. ఆవులు రొప్పిన పులిలాగ తరుముకువెళ్ళాడు శత్రువుల్ని. తెగించి తిరగబడ్డారు పాంచాలయోధులు. వందమంది రథికుల్ని వూడ్చేశాడు కర్ణుడు. కాలయముడిలా కనిపించాడు. ఉప్పెనలా విరగబడింది కౌరవసేన. శంఖాలూ, బూరాలూ, దుందుభులూ ఘోరుమన్నాయి. కర్ణుడికుమాళ్ళూ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, అశ్వత్థామా, శకునీ, కృతవర్మా – ఇంతమందీ విరుచుకుపడ్డారు. చేను కోసినట్టు పాండవసేన కోతప్రారంభించారు.

భరించలేకపోయారు శత్రువులు. ప్రాణాలు బిగబట్టి పరిగెత్తారు. "ఆగండీ, నిలవండీ" – భీముడూ, నకుల సహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, ఉపపాండవులూ కేకలువేశారు. సేనలు మళ్ళించారు. కౌరవసేన నురుమాడారు. దారుణమైంది యుద్ధం. ఇటుకౌరవసేనా, అటు పాండవసేనా కూలిపోతూ వుంది. ఒకమూల తనసేనకి ఉత్సాహం కలిగిస్తూ మనసేన రక్తంనదుల్లో ముంచెత్తాడు అర్జునుడు.

"అదుగో కర్ణుడి జెండా" మెడచాచి చూస్తూ కృష్ణుడితో అన్నాడు అర్జునుడు – "భీముడూ మొదలైన మనయోధులతో మహాయుద్ధంచేస్తున్నాడతడు. అతడిప్రాపుతో అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా దుర్యోధనుడిమీద ఈగవాలకండా పాంచాలసేన వడ

గొడుతున్నారు. పద పద. చప్పున కర్ణుడిపని పట్టిద్దాం. రథం పరిగెత్తించు. "

గుర్రాలు తట్టాడు కృష్ణుడు. ఉరకలుపెట్టింది రథం.

"అదిగో కర్ణా," మహావేగంతో పరిగెత్తుకువస్తూన్న అర్జునుడి రథం చూపిస్తూ అన్నాడు శల్యుడు - "జెండామీద వానరం భయంకరంగా ఎలావుందో చూడు. కృష్ణుడి సారథ్యం, అబ్బా! ఎలా వురుకుతున్నాయో తెల్లగుర్రాలు! అదిగో రథంమీద ఆ మహావీరుణ్ణి చూడూ! ఓహోహో, నవ్వుతున్న తలలు నవ్వుతున్నట్టే వూడ్చేస్తున్నాడు. కాళ్ళూ, కొన్ని బిరుదులతో వున్న చేతులూ చెక్కేసి పారేస్తున్నాడు. నోళ్ళుతెరిచిన గుర్రాల తలలూ, కొండశిఖరాల్లాటి ఏనుగుల శిరస్సులూ వేలువేలు కూలగొడుతున్నాడు. పాత్రి లేకండా, పులుసులోకి దుమ్ములేకండా తరిగేస్తున్నాడు. అన్నిటితోనూ నేల కప్పెడుతున్నాడు. ప్రవాహంలాగ బాణాలువేస్తున్నాడు. ఎవ్వరడ్డువడ్డా ఆగకండావున్నాడు. మాటిమాటికీ మనవేపే చూస్తున్నాడు. అదిగో ఇటే-ఇటే వస్తున్నాడు. మండిపడి నీమీదికే వస్తున్నాడు. నువ్వు కోరుకున్నదే కదూ, ఇది! ఇప్పుడు గెలూ చూద్దాం పాయలైపోయింది మనసేన. ఎదురుకునే మొనగాడు వొక్కడూ లేడు. ఎదిరిస్తే మనమే ఎదిరించాలి మరి!"

"అవును, నేనే ఎదిరిస్తాను" అర్జునుడిరథం చూస్తూ అన్నాడు కర్ణుడు - "శల్యా! అర్జునుడి బాహుబలం అసమానమైంది. అతడి శౌర్య మెలాంటిదో, అతడి తపస్సూ అలాంటిదే. శివుడంతవాడితో దెబ్బలాడాడు; పాశుపతం సంపాదించాడు. దేవేంద్రుడు గెలవలేని కాలకేయుల్ని సంహరించాడు. ఒక్కడే విరాటరాజు పశువులు మళ్ళించుకుపోయాడు. రథికుణ్ణి మించిన సారథి కృష్ణుడు. ప్రపంచ

మంతా ఎరుగును అతడి గొప్పతనం ఇలాంటివాళ్ళని నేను వొక్కణ్ణే ఎదిరిస్తాను. మద మడిగిస్తాను. వాళ్ళరథానికి ఎదురుగా మనరథంపోనీ:"

అర్జునుడి రథంమీదికి రథం పోనిచ్చాడు శల్యుడు. చూశాడు దుర్యోధనుడు. చెయ్యెత్తి మనవాళ్ళని పురికొల్పాడు. కృపాచార్యుడూ, కృతవర్మా, అశ్వత్థామా, శకునీ, నీకుమాళ్ళు కొంతమందీఉద్ధృతంగా బయలుదేరారు. కర్ణుణ్ణి దాటుకుని అర్జునుడిమీదికి ఎగబడ్డారు.

లేళ్ళమందచూసిన సింహంలాగ మనరథికులమీదికి పురికాడు అర్జునుడు. రకరకాలబాణాలు గుప్పించాడు. ధనుస్సులు విరిచేశాడు. గుర్రాలు చంపేశాడు. సారథుల్ని కూల్చేశాడు. సేనసేనంతా చిందర వందర చేశాడు. చెదరగొట్టాడు. వాళ్ళని దాటి, పక్కనే యుద్ధంచేస్తున్న భీముడిదగ్గిరికి వెళ్ళాడు. సముద్రంలాటి శత్రుసేనతో పోరాడుతున్నాడు భీముడు. అర్జునుడు తోడ్పడ్డాడు. ఊపిరి సలిపినట్టయింది భీముడికి; సంతోషించాడు. అన్నగారి కుశలం వివరించాడు అర్జునుడు. "నువ్వు కొంచెం ఆయాసం తీర్చుకో" అంటూ ఉద్రేకంతో పురుకుతున్న నీసేనమీద విరుచుకుపడ్డాడు.

పెద్దపెద్ద సింహనాదాలుచేస్తూ నీ కుమాళ్ళు పదిమంది అర్జునుణ్ణి చుట్టుముట్టారు. వాళ్ళ సారథుల్ని చంపేసి, గుర్రాలు కూల్చేసి, జెండాలుచెండేశాడు అర్జునుడు. పదేపది బాణాలు కొట్టాడు. పదిమంది పీకలూనరికేశాడు. పదితలలూ రణభూమికి బలిపెట్టాడు. గడగడలాడారు కౌరవులు. తొంభైమంది రథికులు అతడిమీదికి పరిగెత్తారు. తొంభైతలలూ నేలమీద దొర్లించాడు అర్జునుడు. వెయ్యీ మూడువందలు మదపుటేనుగులతోఆభీర, మ్లేచ్ఛసేనలు అడ్డుతగిలాయి. ఎడాపెడా బాణాలు తగిలించాడు అర్జునుడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలాలూ తెరలుతెరలు కెరటాల్లాగ అతణ్ణి కమ్ముకున్నాయి.

చూసి, భీముడూ వురికాడు. అయినా వొదల్లేదు మనవాళ్లు. గదపట్టుకు రథందిగాడు భీముడు. రథాలూ, గుర్రాలూ, కాల్బలమూ, ఏనుగులూ పచ్చడిపచ్చడిచేసి బాదేశాడు. వాడివాడి బాణాలు కురిపించాడు అర్జునుడు. అంత మనసేనలోనూ రక్తంలోములిగి తేలని భటుడుకాని, రథంకాని, ఏనుగుకాని, గుర్రంకాని వొక్కటీ లేదంటే నమ్ము. కార్చిచ్చు ముట్టుకుంటే, ఎండిన అడివి ఎలా అయిపోతుంది, అదిగో అలా అయిపోయింది కౌరవసేన. కర్ణా, కర్ణా! కాపాడు, కాపాడు" అంటూ చావగా మిగిలినవాళ్ళు కర్ణుడివెనక్కి పారిపోవచ్చారు. సీకుమాళ్ళూ అతడిచుట్టూ చేరుకున్నారు. యుద్ధసముద్రంలో దీవిలా కాపాడాడు కర్ణుడు. అల్లైతాడు మోగించాడు. అర్జునుడి కేసి రథం సాగించాడు.

అంతకి ముందే రథమెక్కి అర్జునుణ్ణి కలుసుకున్నాడు భీముడు. ఆ ఇద్దరినీ దాటుకుంటూ పాంచాలంవాళ్ళు కర్ణుడిమీద కలబడ్డారు. ద్రౌపదికుమాళ్ళూ, సాత్యకీ సేనలతో వచ్చి వాళ్ళతో కలిశారు. అందరికీ అన్నిరూపులై పోరాడాడు కర్ణుడు. అంజలికాలువేసి జనమేజయుడి సారథిని చంపేశాడు. గుర్రాలు కొట్టేశాడు. శ్రుతసోముడి ధనుస్సు నరికేశాడు. ధృష్టద్యుమ్నుడి గుర్రాలూ, సాత్యకిగుర్రాలూ కూల్చేశాడు. కేకయకుమారుడు విశోకుణ్ణి తారుమనిపించాడు.

కొడుకుచావు చూసి, యముడిలా లేచాడు కేకయుడు. కర్ణుణ్ణి బాణాలతో కొట్టాడు. అతడు చూస్తూవుండగానే అతడి కొడుకుని ప్రసేనుడు నరికిపారేశాడు.

పుత్రశోకమూ, కోపమూ - పూగిపోయాడు కర్ణుడు. మూడు అర్ధచంద్రబాణాలు వేశాడు. కేకయుడి చేతులూ, తలా నరికేశాడు. వేగేగుర్రాలు పూసుకు వచ్చాడు సాత్యకి. వచ్చీరావడంతోటే కర్ణుడి

కొడుకు సుషేణుడితో కలబడ్డాడు. అతడి గుర్రాలు కొట్టేశాడు. ముప్ఫయిబాణాలు వేసి అతణ్ణి చంపేశాడు.

"చచ్చావురా సాత్యకీ!" - నిప్పులుకక్కుతూ సాత్యకిమీద వురికాడు కర్ణుడు. మహోగ్రమైన బాణంవేశాడు. మూడుబాణాలు వేసి సగంలోనే కొట్టేశాడు శిఖండి. అప్పూపుని మరో మూడు కర్ణుడి మీద నాటించాడు.

మరింత మండిపోయాడు కర్ణుడు. రెండు క్షురప్రాలు ప్రయోగించాడు. శిఖండిజెండా ఎగరగొట్టేశాడు. అతడి ధనుస్సు తుంచేశాడు. తండ్రులు కళ్ళముందే ధృష్టద్యుమ్నుడి కొడుకు సుదేవుడి తల నరికేశాడు. మీదికి వచ్చిన శ్రుతసోముణ్ణి చావుదెబ్బలు కొట్టేశాడు.

పాంచాలరథికులు కర్ణుడిమీదికి పరిగెత్తుకువచ్చారు. భీముడితో కలిసి వాళ్ళని దాటుకుంటూ కర్ణుడివేపు రథం పోనిచ్చాడు అర్జునుడు.

ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ అర్జునుణ్ణి తప్పించుకుని కర్ణుణ్ణి ముట్టడించారు. కాని ఆత్మదృఢమున్న వాణ్ణి ఇంద్రియాలు చలింపచెయ్యలేనట్టు అతడు కదిలించలేకపోయారు. వాళ్ళ సారథుల్ని చంపేశాడు కర్ణుడు. గుర్రాలు పడ్డేశాడు. జెండాలూ, గొడుగులూ, ధనుస్సులూ, తూణీరాలూ తుక్కుతుక్కు చేసేశాడు. ఒళ్ళంతా తూంట్లుకొట్టేశాడు. సింహనాదంచేశాడు.

ప్రతివింధ్యుడూ, శ్రుతసోముడూ, శ్రుతకీర్తి, శతానీకుడూ, శ్రుతసేనుడూ— అయిదుగురు అన్నదమ్ములూ వొక్కసారి కర్ణుడు మీదికి వురికారు. వాళ్ళతో సాత్యకి కలిశాడు. వాళ్ళమీద కర్ణుడు వేసిన బాణాలన్ని ఖండించాడు. దుర్యోధనుడు పరుగెత్తివెళ్ళాడు. అతడిమీద ఎనిమిది సానపట్టిన శరాలు నాటించాడు సాత్యకి.

మండిపడి తిరగబడ్డాడు దుర్యోధనుడు. అతడి రెండు పక్కలా

కర్ణుడూ, కృపుడూ, కృతవర్మా బాణవర్షం కురిపిస్తూ సాత్యకిని తరిమారు. నలుగురినీ ముచ్చెమటలు పోయించాడు సాత్యకి.

నాయకుల్ని దాటుకుంటూ అటు పాండవసేనా, ఇటు కౌరవసేనా వొకదానిమీద వొకటి కలబడ్డాయి. ఘోరమైన దొమ్మీ యుద్ధం జరిగింది. ఆ దొమ్మీలో దుశ్శాసనుడూ భీముడూ వొక్క దగ్గిర తారసిల్లారు.

## ర క్త పా న ం

భీముడూ, దుశ్శాసనుడూ ఇద్దరూ సమవుజ్జీలులా కనిపించారు. ఇద్దరిసారథులూ ఉత్సాహంతో పగ్గాలు సడిలించారు. ఇద్దరిగుర్రాలూ ఉద్రేకంతో ముందుకి వురికాయి. ఇద్దరూ వొకళ్ళమీద వొకళ్ళు బాణాలు గుప్పించుకున్నారు కళ్ళు వేసుకగా చూశారు ప్రేక్షకులు.

"తమ్ముడూ, సమయానికి వచ్చావోయి" - మూరెడెత్తు పెరిగాడు భీముడు – "అవాళ సభలో నువ్వుచేసిందంతా వడ్డీతో తీర్చేస్తా నివ్వాడు. పారిపోకండా నిలబడు. చేసిన ప్రతిజ్ఞ చెల్లించుకుంటాను. నిజంగా అదృష్టమంటే నాదే ఇవాళ. నా పుణ్యం పండింది. నా ఎదటికి తోశాడు దేవుడు నిన్ను" అన్నాడు.

"ఎందుకీ వూకదంపు!" వెటకారంగా అన్నాడు దుశ్శాసనుడు – "మేం పెట్టినపాట్లు మరిచిపోయా వేమో! లక్కఇంట్లో నిప్పు పెట్టాం. శకునిచేత జూదమాడించి రాజ్యం లాక్కున్నాం. అడివికి వెళ్ళగొట్టాం. అష్టకష్టాలు పెట్టాం. విరాటరాజుదగ్గిర బానిసకొలువు చేయించాం. అప్పుడే మరచిపోయావో నువ్వు! నేనుమాత్రం మరిచి పోలేదు. యుద్ధానికి వచ్చినవాడివి వూకదంపుమాట లెందుకోయి!"

అతడి నోట్లోమాట నోట్లోనే వుంది, నిప్పులుకురిసిన చిరునవ్వు నవ్వాడు భీముడు. మూడు వెడల్పాటి బాణాలు కొట్టాడు. దుశ్శాసనుడి

జెండా తెగి నేల పడింది. ధనుస్సు పటపటమంది. సారథి తల తెగి కిందపడింది. మరుక్షణంలో మరో బాణం కొట్టాడు భీముడు. దుశ్శాసనుడి నుదుటిమీద నాటుకుపోయిందది.

చలించలేదు దుశ్శాసనుడు. తానే పగ్గాలు పట్టుకున్నాడు. ఒడుపుతో చప్పున మరో కోదండం తీశాడు. గబాగబా పన్నెండు బాణాలు భీముడిమీద తగిలించాడు. అతడి ధనుస్సు తుంచేశాడు. విశోకుడిమీద ఆరుకోలలు నాటించాడు. మరో ముప్ఫయిరెండు భీముడిమీద రువ్వాడు.

చర్రున మరోవిల్లు తీశాడు భీముడు. ఎడమియ్యకుండా యాభై బాణాలు దుశ్శాసనుడిఒళ్ళు దూసుకుపోయినట్టు తగిలించాడు. నిలువునా మండిపోయాడు దుశ్శాసనుడు. తళతళలాడుతున్న భల్లాలు రెండుజతలు పూనిపూని కొట్టాడు. భీముడి నాలుగుగుర్రాలూ నరికేశాడు.

రథం లేకుండా అయిపోయింది భీముడికి. భయంకరంగా శరీరం పొంగించాడతడు. గదపట్టుకున్నాడు. యముడిలాగ రథం దూకాడు. దుశ్శాసనుడి గుర్రాలు పచ్చడికింద బాదేశాడు. అతడిరథం పిప్పి చేసేశాడు. పెద్ద తోమరం పట్టుకున్నాడు దుశ్శాసనుడు. కిందికి దూకాడు ఇటు దూకాడు, అటు భీముడి గుండెలు గురిచూసి తోమరం విసిరాడు.

పదమూడేళ్ళు తాముపడ్డ పాట్లు వొక్కసారి భీముడిగుండెల్లో కలిచినట్టయింది. జూదంనాడు తాను చేసిన ప్రతిజ్ఞ తలుచుకున్నాడు. ఉద్దండమైన గద ఎత్తాడు. బలంకొద్దీ దుశ్శాసనుణ్ణి బాదేశాడు. దెబ్బతో భళ్ళున రక్తం కక్కుకుంటూ పడిపోయాడు దుశ్శాసనుడు. చంగున దూకాడు భీముడు. లేడికోదమని పొదివి పట్టుకున్న పెద్దపులిలాగ దుశ్శాసనుడి మెడ తొక్కిపట్టుకున్నాడు.

"అవాళ సభలో అన్నదాంతో తనివితీరక, వెదుక్కుంటూ వచ్చావురా, ఇలాగ!" పట్టి దబాయిస్తూ వురిమాడు భీముడు — "ఏమంటావో అను ఇప్పుడు. నీమాటలు వినడానికే నాకోపం వేడుక పడుతోంది."

కుంపటినిప్పులాగ అంతంతగుడ్లుచేసి మన సేనదిక్కు చూశా డతడు. దావాగ్నిమంట చూస్తే మృగాలు ఎలా పారిపోతాయి, అదిగో అలాగ అతడి ఉగ్రమూర్తిచూసి, జ్జరిల్లిపోయి, దిక్కూ తెన్నూ తెలియకండా పారిపోయాయి మనసేనలు. రణస్థలం మధ్య వొక్కడే భీముడు భీకరంగా ప్రకాశించాడు వేరుపడ్డ మొనగాళ్ళు కొందరు చూశారు. ఘోరమైన భీముడితేజస్సు వాళ్ళ కళ్ళకి మిరు మిట్లుగొలిపింది. కాళ్ళు వణికాయి. నిచ్చెరపోయి నిలబడిపోయారు.

చప్పున లేచాడు భీముడు రెండుచేతులతోనూ దుశ్శాసనుణ్ణి పట్టుకున్నాడు. ఒక మదపుటేనుగు చెలరేగి ఆటలాడితే ఎలా అందంగా, భయంకరంగా వుంటుంది, అదిగో అలాగ అవుపించా డతడు. గిరగిరా దుశ్శాసనుణ్ణి తిప్పాడు. ఆకాశమంతఎత్తున మీదికి విసిరాడు. పట్టుకుని నేలమీద విసిరికొట్టాడు. కాలుతో బంతిలా తన్నాడు. మొహంమీద కొట్టాడు. నాలుగుదిక్కులా వురిమి చూశాడు. మోకాలు మెడమీద తొక్కిపెట్టాడు. లేవబోతే మళ్ళీ కాళ్ళతో తొక్కిపెట్టాడు. పకపకా నవ్వాడు. ఎన్నోమార్లు ఇలా చేశాడు. తుదకి అతడి మొహంచూస్తూ అన్నాడు:

"ఒరే దుస్సా! నీగుండెలు చీలుస్తాను. తేనెతాగినట్టు నీరక్తం తాగుతాను. అడ్డుకునే మొగాడు మీవాళ్ళలో ఎవడున్నాడో రమ్మను" అంటూనే బాకుతీశాడు. అతడి మొహంమీద ఆడించాడు కస్సున గుండెలో పొడిచాడు. ఉగ్రనరసింహామూర్తి హిరణ్యకశిపుణ్ణి చీల్చేసినట్టు ఘోరంగా అతడి గుండెలు చీల్చేశాడు. ఉబికి వచ్చిన రక్తం

దోసిళ్ళతో తాగాడు. రుచికి మెచ్చుకుంటూ మొహంనిండా పులుముకున్నాడు. ఒంటినిండా పోసుకున్నాడు. భూతంలాగ మాటి మాటికీ దుశ్శాసనుణ్ణి పులుకూపులుకూ చూశాడు.

దారుణంగా తన శపథం పూర్తిచేసుకున్నాడు భీముడు. "మాఅమ్మ చనుపాలకంటే రుచిగావుంది ఈరక్తం. తేనెకంటే, జున్ను కంటే తియ్యగావుంది. కండచక్కెర కలిపిన పాలకంటే తియ్యగా వుంది" అంటూ కేకలువేశాడు. నాట్యంచేశాడు. తుళ్ళుతూ, తిరుతూ గెంతులువేశాడు. అరిచాడు. బుజాలు తట్టాడు.

మనసైనికులూ, వాళ్ళసైనికులూ చూసి అడిలిపోయారు. "రాకాసిరా బాబూ" అంటూ వొణికిపోయారు. ఆయుధాలు జార్చేసి మూర్ఛపోయారు కొందరు. విలవిలలాడిపోయి; యుద్ధం మానేసి, కూలబడిపోయారు కొందరు.

గదపట్టుకున్నాడు భీముడు. ప్రళయయముడిలా బోరనిలిచాడు. ఒళ్ళంతా ఎర్రటిరక్తం. ఎంత ఉగ్రంగావున్నాడో, అంత అందంగానూ అవుపించాడు. వెర్రెత్తిన మదపుటేనుగులాగ మనసేన తరిమాడు. మళ్ళీవెళ్ళి దుశ్శాసనుడిమీద పడ్డాడు. కోపంతో అతడికాలు పట్టుకున్నాడు. "ఏంరా, 'పశువులు' అని కుయ్యవేం?" — చురచురా అతడి మొహం చూశాడు — "ఆ కారుకూతలన్నీ ఏమయాయి? పశువా! నీమాట నీకుఅప్పగిస్తున్నాం. ఏదీ ఎవ్వడూ మాటాడడేం? ఆమాత్రం ఆలోచన లేకపోయింది మీకు! నీళ్ళలో తోశారు. విషం పెట్టారు. పాములతో కరిపించారు. బాగానేవుంది. బంధువులూ, స్నేహితులూ, పెద్దలూ అంతమందీ వున్నసభలో అన్యాయంగా అంతపనిచేశారు. జూదాలు గెల్చిన వాళ్ళంతా మీలాగే చేశారా?" అంటూ గదతిప్పుతూ మనసేనకేసి పరిగెత్తి, మళ్ళీ చుట్టివచ్చాడు.

ఇంకా దుశ్శాసనుడిమీద కోపం తీరక, తిరిగీ అతడిదగ్గిరికి పరిగెత్తాడు. గుడ్లురుముతూ అన్నాడు:

"నిందపోసుకున్నాడు కాని ఏంనోల్లుకున్నాడు ధృతరాష్ట్రుడు? అతడే కూడదంటే అంతపని ఆసభలో జరిగేదా? భర్త లేరన్న ఇల్లాలు నీకళ్ళముందే భర్త విజృంభించి కలకల్లాడింది. సంపదతో తులికిన మొగుళ్ళున్న మీ భార్యలు ఎలా ముండమోసి మూలుగు తున్నారో చూడు!

"విన్నావురా, వాకే, నేను పట్టిన శపథాల్లో వొకటి పూర్తయింది. దుర్మార్గుణ్ణి దుర్యోధనుణ్ణి తొడలు విరగ్గొట్టి తల తంతానన్న రెండోది కూడా ఇప్పుడే పూర్తిచేస్తాను" అంటూ గొంతెత్తి చెప్పాడు. అలాదుశ్శాసనుణ్ణి చంపేసి పెద్ద సింహనాదం చేశాడు భీమసేను.

కర్ణుడూ మొదలైన మనయోధుల గుండెల్లో పిడుగులు పడ్డాయి. వల్లమాలిన భయంతో వొణికిపోయారు. కీళ్ళుకీళ్ళూ సడిలి పోయినట్టయి, యుద్ధం మానేసి, నిచ్చేరపోయి నిలబడిపోయారు.

దుర్యోధనుడూ, కృపాచార్యుడూ మొదలైనవాళ్ళు యావన్మంది ఎదటా అలా మూర్తీభవించిన క్రౌర్యంలాగ, ఉగ్రనరసింహుడై పోయి, దుశ్శాసనుణ్ణి చిత్రవధ చేశాడు భీముడు. చూసి, సహించలేక పోయారు నీకుమాళ్ళు. కవచీ, నిషంగీ, పాశీ, దండధారుడూ, ధనుర్గ్రహుడూ, అలోపుడూ, సహుడూ, షండుడూ, వాతవేగుడూ, సువర్చసుడూ వొక్క మొగిని చుట్టుముట్టారు. రకరకాల బాణాలు భీముడిమీద వేశారు.

అంతా కనిపెడుతూనే వున్నాడు అర్జునుడు. రక్తపానంచేసి భీముడు ప్రతిజ్ఞ తీర్చుకున్నందుకు సంతోషించాడు. అతడిమీదికి ఎవ్వరు వురుకుతారా అని వొక కంటితో చూస్తున్నాడు. నీకొడుకులు పదిమందీ పరిగెత్తడం చూసి పది భల్లాలు వేశాడు. పదిమందితలలూ

పరికి పారేశాడు. అసలు భీముణ్ణిచూసే భయపడుతున్న మనసేనలు అర్జునుడూ అంపుకోడంతోనే మరింత పిరికిమందు పుచ్చుకున్నాయి. కర్ణుడూ గజగజలాడాడు. తెల్ల మొహం వేశాడు. ఊరుకున్నాడు.

"నువ్వూ వెర్రిమొహంవేస్తే ఎలా?" కర్ణుణ్ణి హెచ్చరించాడు శల్యుడు— "భీముడు ఉగ్రుడై పోయి, దుశ్శాసుడి గుండెలు చీల్చేసి, నెత్తురు తాగడం చూసి దుర్యోధనుడి బొందెలో ప్రాణంలేదు. నువ్వూ అలాగే అయిపోతున్నావు. ఏందారి? మొనగాళ్ళయిన రాజులు పుంజాలు తెంపుకు పారిపోతున్నారు. కృపుడూ మొదలైనవాళ్ళు నీఆసరాతో శత్రువుల మీదికి వెళ్ళాలని నుంచున్నారు. లే. వాళ్ళని కూడగట్టుకో. నువ్వు దిగాలుపడి పోడం చూసి, అదిగో వృషసేనుడు వొక్కడే తెగిస్తున్నాడు. పాండవులమీదికి పరిగెడుతున్నాడు. ఇదే సమయం అర్జునుడిమీద వురకడానికి. యుద్ధం భారమంతా నీమీదే పెట్టాడు దుర్యోధనుడు. అదిమాత్రం మరిచిపోకు."

జల్దుకున్నాడు కర్ణుడు. యుద్ధానికి సిద్ధపడ్డాడు.

## వృషసేనుడు

వృషసేనుడు భీముడిమీదికి పరిగెత్తాడు. నకులుడు అడ్డువచ్చి కున్నాడు. అతడి జెండా ఎగరగొట్టేసి గొడుగు పడగొట్టేసి ధనుస్సు నరికేశాడు. కవచం పగలగొట్టి, గట్టిగట్టి బాణాలు నాటించాడు.

అగ్నిశిఖలా లేచాడు వృషసేనుడు. గబుక్కున మరో మంచి ధనుస్సు తీశాడు. నకులుడి గుర్రాలు నరికేశాడు. రథంముక్క ముక్కలు చెక్కేశాడు. కత్తీ, డాలూ పట్టుకున్నాడు నకులుడు. రెక్కలు చాచిన డేగలాగ రథం గెంతేసి ముఖాముఖి కలబడ్డాడు. హోరాహోరి యుద్ధంచేశాడు. వృషసేనుడితో వెళ్ళిన యోధుల్ని కసీబిసీ నరకడం మొదలెట్టాడు.

అతడిడాలుచిదగ్గొట్టాడు వృషసేనుడు. నల్లతాచులాటి అతడి కత్తిముక్కలుకింద నరికేశాడు. నాగుపాముల్లాటి బాణాలు అతడి వొంటినిండా నాటించాడు. పకాపక నవ్వాడు. భీముడిరథంమీాదికి వెళిపోయాడు నకులుడు.

ధృష్టద్యుమ్నుడూ, యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ, శిఖండీ, జనమేజయుడూ, సాత్యకీ, ఉపపాండవులూ - ఈ పదకొండుమందీ ఏకాదశ రుద్రుల్లాగ వృషసేనుణ్ణి ఘిరాయించారు. కృతవర్మా, కృపాచార్యుడూ, అశ్వత్థామా, దుర్యోధనుడూ, శకునీ, అతడితమ్ముళ్లు కొందరూ వాళ్ళ మొగిని వెళ్ళారు. అడ్డూ, ఆపూ లేని బాణాలతో వాళ్ళని కప్పెట్టారు. ఏనుగుయుద్ధంలో పేరుపడ్డ కుళిందులు మనవాళ్ళ మీాద పడ్డారు కృతవర్మని కీచుకీచు మనిపించారు. దుర్యోధనుణ్ణి ముచ్చెమటలు పోయించారు. శకునిని మూాడుచెరువులనీళ్ళు తాగించారు. అతడి తమ్ముళ్ళని పడగొట్టేశారు. ధనుస్సులు మోగించారు. సింహనాదాలు చేశారు. పట్టపగ్గాలు లేకంజా చెలరేగారు.

బాగా వొళ్ళుమండింది కృతవర్మకి. కొండలు కూల్చిన దేవేంద్రుడిలాగ కుళిందుల ఏనుగులు కూలగొట్టాడు. దుర్యోధనుడూ, శకునీ, వాళ్ళతో కలిశారు. ముగ్గురూ ముగ్గురు కుళిందకుమాళ్ళని చంపేశారు. తక్కిన మన రథికులూ వాళ్ళతో చేతులు కలిపారు. ఎదురైన ఏనుగునల్లా పీనుగు చేశారు. తరిమితరిమి కొట్టారు. రణస్థలం రక్తం రొంపి చేశారు.

పిడుగులా వురికాడు భీముడు. వులి తరిమినట్టు తరిమాడు మన వాళ్ళని. అతడి రథంవెంట ఎంతోఅంత పాండవసేన వచ్చింది. పేరుపడ్డవీరులు విరుచుకుపడ్డారు. వాడివాడి బాణాలుగుప్పించారు. దారుణ మయింది యుద్ధం.

కర్ణుడి ఎడటిభాగంలో మన ఏనుగుసేనమీద పడ్డాడు నకులుడి కొడుకు శతానీకుడు. అతణ్ణి బాణాలతో ముంచేశాడు వృషసేనుడు. అతడి సారథిశిరస్సు ఎగరగొట్టేశాడు. అర్జునుడూ, భీముడూ అదిలిస్తూ వృషసేనుణ్ణి ముట్టడించారు. తలో మూడుబాణాలు తగిలించాడు వృషసేనుడు. శతానీకుడిమీద మరోమూడు నాటించాడు. నకులుడి మీద ఏడువేశాడు. కృష్ణుడిమీద వన్నెండు కొట్టాడు.

"అదిగదీ, వృషసేనా! తండ్రికి తగిన కొడుకువోయి" – మెచ్చుకున్నారు కౌరవులు. కాని వెంటనే అర్జునుడి ప్రతాపం తలుచుకుని గజగజలాడారు.

మెరుపు మెరిసినట్టు మెరిసిందిఅర్జునుడి రథం. వక్కయోధుల్ని వొత్తిగించుకుని వృషసేనుడిమీదికి వచ్చాడు అర్జునుడు. రావడమూ బాణాలమీద బాణాలు వెయ్యడమూ వొక్కసారి జరిగిపోయింది.

ఒరిగితాచులా వున్నాడు వృషసేనుడు. అర్జునుడి భుజంమీద వరసపెట్టి పదిబాణాలు తగిలించాడు. కృష్ణుడిమీదతొమ్మిదిబాణాలు గుచ్చాడు. ఆకాశం వగిలినట్టు సింహనాదం చేశాడు.

కనుబొమ్మలు ముడివేశాడు అర్జునుడు. వృషసేనుడి విల్లు విరిచేశాడు, అతడి రెండుచేతులూ నరికేశాడు. తలకాయఎగరగొట్టాడు. అంతా లిప్తలో అయిపోయింది. తెల్లపోయి కర్ణుడూ, దుర్యోధనుడూ చూస్తూనే వున్నారు.

కొడుకుచావు కళ్ళారా చూశాడు కర్ణుడు. కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. కోపంతో మండిపోయాడు "అర్జునా! అర్జునా!!" కవ్విస్తూ అర్జునుడిమీదికి రథం పరిగెత్తించాడు. జూలుపట్టిలాగిన సింహంలాగ చూశాడు అర్జునుడు.

## అర్జునుడు గెలవాలి

కర్ణుడూ అర్జునుడూ కలబడ్డారు. ఉభయసేనలూ వాళ్ళ యుద్ధం చూస్తూ యుద్ధం మానేశాయి. ఇద్దరూ ఇద్దరే. ఇద్దరూ రాముల్లా అవు పించారు. ఇద్దరు శివుల్లాగ, ఇద్దరు సూర్యుల్లాగ కనిపించారు. వాళ్ళ ద్వంద్వయుద్ధం చూడాలని కుతూహలంతో దేవతలూ, పితృదేవతలూ, విద్యాధరులూ, ఋషులూ, దేవేంద్రుడూ, బ్రహ్మ, శివుడూ యావ న్మందీ వచ్చి ఆకాశం నిండిపోయారు.

బ్రహ్మ శివుడితో అన్నాడు: "దేవా! కర్ణుడూ అర్జునుడూ ఇద్దరూ అతిరథులే. ఇద్దరూ పరాక్రమవంతులే. ఇద్దరూ శూరులే. ఇద్దరూ సమవుజ్జీలు. వీళ్ళు ఇద్దరూ యుద్ధం చేస్తే లోకం నాశన మవుతుంది అంచేత మాన్పించరాదా ఈ యుద్ధం?

"అడ్డులేని మహావీరులు వీళ్ళు. తప్పనిసరి వీళ్ళ యుద్ధం. అంచేత ఆమాట విడిచిపెట్టు" అన్నాడు శివుడు.

ఇద్దరిమాటలూ ఇంద్రుడు విన్నాడు. ప్రణామంచేసి బ్రహ్మతో అన్నాడు: "శౌర్యమూ, శౌర్యానికితగిన బలమూ బలాన్నిమించిన తపనూ—అన్నీ వున్నాయి అర్జునుడికి. యుద్ధంలో కౌశలం కలిగి అతడే జయించాలి అని ఆశీర్వదించు. కృష్ణుడూ అర్జునుడూ పురాణపురుషులు. యుద్ధంలో ఆక్రమించినశత్రువుల్ని చూసి, వాళ్ళేమండిపడితే ప్రపంచం ఎలా నిలుస్తుంది? నరనారాయణులికి అపజయమన్నది వుండదని లోగడ నువ్వే చెప్పావు. వాళ్ళవిజయం లోకకల్యాణంకోసం. భీష్ముడూ, ద్రోణుడూ వెళ్ళే పుణ్యలోకాలికే వెళతాడు కర్ణుడు. ఎంతోకాలం అష్టకష్టాలుపడ్డాడు అర్జునుడు. రాజ్యసుఖా లనుభవించాలి ఇక"

"వీళ్ళ జయాపజయాలు నిశ్చయించడం దేని కంటాను?" అడిగాడు బ్రహ్మ.

"నిశ్చయిస్తే నష్టమేముంది, మేలేకాని? తప్పకండా నిశ్చయిద్దాం" అన్నాడు శివుడు.

శివుడూ, బ్రహ్మ దేవేంద్రుణ్ణి చూస్తూ అన్నారు:

"కృష్ణార్జునులు మహామునులు. భేదంలేదు వీళ్ళకి. లోకకల్యాణం కోసం పుట్టారు. వీళ్ళని శత్రువులు జయించడం లోకానికి హితంకాదు. ఇంచేత వీళ్ళకి జయంతప్పదు. అర్జునుడు జయించాలి."

దేవతల్నీ మునుల్నీ కలియచూశాడు దేవేంద్రుడు. "దేవదేవులు ఇద్దరూ ఏకమతంగా లోకహితంకోసం సెలవిచ్చినమాట విన్నారా? మీ యావన్మంది మనస్సులూ దీనికి అనుకూలం కావాలి" అన్నాడు.

"అవును, అలాగే జరుగుతుంది. అర్జునుడు గెలవాలి. ఇంకోలాగ జరగకూడదు" అన్నారు వాళ్ళు.

యావన్మంది దేవతలూ పూలవాన కురిపించారు. దివ్యదుందుభులు మోగించారు సమస్తభూతాలూ కర్ణార్జునుల మహాద్వంద్వయుద్ధం చూడాలని వేడుకపడ్డాయి, ఆశ్చర్యంతోనూ, ఉల్లాసంతోనూ వాళ్ళంతా కళ్ళుచేసుకు కూచున్నాయి.

శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. శల్యుడూ, కర్ణుడూ తమతమ శంఖాలు పూరించారు. రెండుసేనల్లోనూ వేలువేలు శంఖాలు మోగాయి. భేరీలు, మద్దెళ్ళూ లెక్కలేని రణవాద్యాలూ మోగాయి. భూమీ ఆకాశమూ మారుమోగింది. చిత్రం — రెండుసేనలూ నిశ్చలంగా నుంచున్నాయి.

వానరపతాకం అర్జునుడూ, హస్తికక్ష్య (ఏనుగుతాడు) జెండా కర్ణుడూ తపోబలంవల్ల సంపాదించినవి. ప్రాణమూ, బుద్ధీ వున్నవవి. అర్జునుడి జెండామీది వానరం అమాంతంగా హస్తికక్ష్యమీదికి ఎగిరింది. నల్లతాచులా తిరగబడింది హస్తికక్ష్య. రెండూ నరానరి పోరాడాయి. హస్తికక్ష్య ఓడిపోయింది.

సారథులు ఇద్దరూ – కృష్ణుడూ, శల్యుడూ చురచురా చూసుకున్నారు; కళ్ళతోనే కయ్యమాడారు. అర్జునుడూ, కర్ణుడూ వాళ్ళ మొహం వాళ్ళు గుర్రుగుమంటూ చూసుకున్నారు. కృష్ణార్జునుల పోటూ, కర్ణశల్యుల పోటితనమూ స్పష్టంగా కనబడింది.

అప్పుడు కర్ణుడు శల్యుణ్ణి అడిగాడు: "శల్యా, అర్జునుడు నన్ను కొట్టేస్తాడనుకో, అప్పుడు నువ్వు ఏంచేస్తావో చెప్పు?"

"కృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ ఇద్దరినీ నా బాణాలికి బలిపెట్టేస్తాను" అన్నాడు శల్యుడు.

"బావా!" కృష్ణుడు అర్జునుడు అడిగాడు– "కర్ణుడు నన్ను కొట్టేశాడనుకో, అప్పుడు నువ్వు ఏంచేస్తావట?"

"అర్జునా!" నవ్వుతూ అన్నాడు కృష్ణుడు – "సూర్యుడు కూలిపోయినా, భూమి బద్దలైపోయినా, మేరుపర్వతం వొరిగిపోయినా కర్ణుడు అర్జునుడు కొట్టెయ్యడం జరగదనుకో. ఒకవేళ అలాటి పరవస్థ సంభవించిందో, కర్ణుడు, శల్యుడు క్షణంలో చంపేస్తాను. నల్లులు నలి పేసినట్టు నలిపేస్తాను. కౌరవుల్ని వాళ్ళ పురుగన్నా లేకండా చేసేస్తాను. ధర్మరాజుకి పట్టంకడతాను.

"నవ్వుతాలకన్నాను" నవ్వుతూ అన్నాడు అర్జునుడు – "కర్ణుడూ శల్యుడూ నన్ను మించిపోతారు? ద్రౌపది సభలో పడ్డ పాట్లు హృదయంలో శల్యంలా మెలుగుతూ నేవున్నాయి. సహాయం కోసం ఇంతకాలం ఆగుతూ వచ్చాను. ఇక త్రిమూర్తులు వచ్చినా సరే, కర్ణుణ్ణి కడతేర్చేస్తాను. అతడి గుర్రాలూ, జెండా, రథమూ, ధనుస్సూ, బాణాలూ గుండపిండి చేసేస్తాను. శల్యుడివొళ్ళు చీలికలు చేసేస్తాను. దుర్యోధనుడి చూపులు బుగ్గయిపోయినట్టు ఇదిగో ఇప్పుడే కర్ణుడికంఠం నరికేస్తాను. కళ్ళవేడుకగా నువ్వు చూద్దువుగాని. కర్ణ శల్యుల భార్యల్ని ముండమోయించేస్తాను. నవ్వుతూ నువ్వు ధర్మ

రాజు చెవులకి తృప్తికలిగిద్దువుకాని. ద్రౌపదికి చెవులపండుగు చేద్దువు కాని. కుంతీదేవికి సంతోషవార్త చెప్పిపంపుదువుకాని. ఏనుగు చెట్టు కూల్చేసినట్టు నేను కర్ణుణ్ణి కడతేర్చడం చల్లగా చూద్దువుకాని.”

ఆ దేసమయానికి ఆకాశంమీద దేవతలూ, ఆడుతూ పాడుతూ అప్సరసలూ ఉభయసేనల్లో యావన్మందికి అవుపించారు. అంతమందీ ఆశ్చర్యపోతూ కళ్ళప్పగించి నుంచున్నారు. కర్ణుడూ, దుర్యోధనుడూ మాత్రం ఒకే నిశ్చయంతో వుండడంవల్ల ఆశ్చర్యపో లేదు. యుద్ధం మీదే లక్ష్యం పెట్టుకున్నారు.

“అర్జునుడికీ కర్ణుడికీ ఎదురుగా ముందుకి తోసుకువెళ్ళకూడదు” అని భయపడుతూ, ఉభయపక్షాలసైనికులూ వాళ్ళరథాలకిదూరంగా చుట్టూ నుంచున్నారు.

కర్ణుడూ, అర్జునుడూ ప్రళయకాలసూర్యబింబాల్లా ప్రకాశించారు. ఇద్దరి ధనుస్సులూ గాండీవమూ, విజయమూ తళతళా మెరిశాయి. ఇద్దరిబాణాలూ జిగేలుమంటే జిగేలుమన్నాయి. ఒకళ్ళని గెలవాలని వొకళ్ళు విజృంభించారు.

## ఇప్పుడైనా మించిపోలేదు

అప్పుడు అశ్వత్థామ మెల్లిమెల్లిగా దుర్యోధనుడి దగ్గిరికి వెళ్ళాడు. చేతిలో చెయ్యిచేర్చి వ్రాపుతూ బోధపరిచేగొంతుకతో అందుకున్నాడు:

“మహారాజా, ఇప్పుడైనా మించిపోలేదు నామాట విను మాతండ్రీ, భీష్ముడూ అర్జునుడిచేత అంతమైపోయారు. వాళ్ళకంటే అధికుడుకాడు కర్ణుడు. తప్పకండా తెగిపోతాడు. నేను కూడదంటే అర్జునుడు ఆగిపోతాడు. నువ్వు కర్ణుణ్ణిమానిపించు. ధర్మరాజుకి బోధ పరిస్తే అతడు. వినుకుంటాడు. కృష్ణుడు కాదనడు. ధర్మరా-

చెపితే భీముడూ, నకులసహదేవులూ ఆగిపోతారు. కౌరవకులానికీ, మన సేనలోని రాజులికీ హితమైనమాట చెబుతున్నాను. కాదనకు. నేనూ, కృపుడూ చావులేనివాళ్ళం కదా అని, అర్జునుణ్ణి గెలిచేస్తామనుకోకు. భీష్ముడూ, ద్రోణుడూ కూడా ఇంకొకళ్ళచేత చావులేని వాళ్ళే. లోకమంతా ఎరుగునిది. అయినా ఏమయారు? కృష్ణుడి ప్రభావంవల్ల కూలిపోయారు. కనక పౌరుషంవల్ల పనిలేదిక్కడ. ఇప్పుడైనా మించిపోలేదు. సంధిచేసుకో.

“కృష్ణుడు సంధికి వచ్చినప్పుడు కాదని కొట్టిపారేశాం కదా, ఇప్పుడు సంధి ఎలా కుదురుతుంది అని సంశయించకు. మీ అయ్యనే రాజుచేస్తాడు ధర్మరాజు. పాండురాజు భాగమే పుచ్చుకుని అయిదుగురికీ పంచిపెడతాడు. కాని రాజ్యమంతా కబళించడు. పాండవులలాగే కర్ణుడూ నామాట వినుకుంటాడు. బతుకుతెరువు పట్టి, ప్రాణాలు నిలుపుకుంటే అన్నిశుభాలూ కలుగుతాయి, తరవాత. ఈసు వొదిలిపెట్టు. చచ్చి సాధించేదేముంది? మరోమాట మానేసి, సంధికి సమ్మతించు. ఇదే క్షేమం నీకు. కాదంటావా కష్టం తప్పదు. ఈసమయంలో తప్పుకోడమంటే పురిలోంచి తప్పుకోడమే అనుకో.”

“దుశ్శాసనుడి నెత్తురు తాగి భీముడు అన్నది విన్నాక ఇంకా సందేహమేమిటి?” అన్నాడు దుర్యోధనుడు — “అయినా నీ తెలివి తక్కువ కాని కర్ణుడా అర్జునుడిదగ్గిర వోడిపోతాడు? అర్జునుడు బాగా అలిసిపోయి వున్నాడు. కర్ణుడు కొట్టెయ్యడం గగనంకాదిప్పుడు. అగ్గి మంచులయిపోయినా, కులపర్వతాలు వొణికిపోయినా అర్జునుడిచేత కర్ణుడి తలపువ్వు వాడదు” అని తన సైనికులికి చెయ్యి విసిరాడు.

“ఓహో, సైనికులారా! చూస్తారేం? ఉరకండీ! శత్రువుల మీద విరుచుకుపడండీ!” — గొంతెత్తి పురికొల్పాడు. ఢంకా, నగా

రాలూ, తప్పెట్లూ, శంఖాలూ — భోరుభోరు మన్నాయి. అలాగే పాండవుల దండులోనూ రణదుందుభులు గింగురుమన్నాయి.

## కర్ణుడూ అర్జునుడూ ద్వంద్వయుద్ధం

కర్ణుడూ, అర్జునుడూ కలబడ్డారు. ఏనుగూ ఏనుగూ కలబడినట్టు కలబడ్డారు. కొండాకొండా ఢీకొన్నట్టు ఢీకొన్నారు. మేఘమూ, మేఘమూ తలపడినట్టు తలపడ్డారు. ఆకాశం ప్రతిధ్వనించింది. భూమి గడగడ వొణికింది. తెల్లగుర్రాలు మెరిశాయి రథాలు తళుక్కుమంటే తళుక్కుమన్నాయి. బాణాలు ఆకాశంమీద మంటలు కక్కాయి.

వాళ్ళ తొలితాకుడు దిగులు పుట్టించింది. ఉభయసేనల్లోనూ, కేకలూ హెచ్చరింపులూ ఆకాశం హోరెత్తిపోయింది.

"కొట్టూ, అర్జునా! కొట్టూ" పాంచాలం వాళ్ళు అర్జునుణ్ణి హెచ్చరించారు — "వాడివాడి బాణాలు వొక్కసారి తగిలించు. కర్ణుడివొళ్లు దుసెళ్ళిపోసి. దుర్యోధనుడి రాజ్యకాంక్ష పుటుక్కుమనిపించు. కోదండపాండిత్యంలో నీదగ్గిరా కర్ణుడు? నీచేతిచేవంతా చూపించు."

కౌరవులూ కర్ణుణ్ణి వూదరగొట్టారు.

"కానీ కర్ణా! కానీ. నీబాణాలతో అర్జునుడువొక్కడూ అయిపోతే చాలు. పాండవుల పసపుస్సుమనిపోతుంది. యుద్ధంగిద్ధం అంతా అయిపోతుంది. దుర్యోధన మహారాజు భూచక్రం యావత్తూ ఏకైక చక్రవర్తి అయి ఏలుకుంటాడు"

బాగా వాలిపోయింది పొద్దు.

కర్ణుడు గట్టిగట్టి బాణాలు పది అర్జునుడిమీద నాటించాడు, తళతళా మెరుస్తూన్న బాణాలు పద్ధెనిమిది కర్ణుడిమీద కొట్టాడు

అర్జునుడు. ఉగ్రమైనఇనపబాణాలుపదికొట్టి చుగ్రమనిపించాడు కర్ణుడు. అలాంటివే పది అతడిగుండెలమీద తగిలించాడు అర్జునుడు. అతడి రొమ్ముమీద కత్తుల్లాటి బాణాలు వేశాడు కర్ణుడు. కృష్ణుడిమీద రెండు నాటించాడు. మెరుపుల్లాటి అయిదు బాణాలు వేశాడు అర్జునుడు. కర్ణుడి వొళ్ళంతా రక్తాలు కారించాడు.

కళ్ళు మొయ్యా కోపం తెచ్చుకున్నాడు కర్ణుడు. కృష్ణార్జునుల్ని తీవ్రమైనబాణాలతో ముంచెత్తాడు. చిరునవ్వుతో గాండీవం సారించాడు అర్జునుడు. నారాచాలూ(ఇనుపబాణాలు)నాలీకాలూ, వరాహకర్ణాలూ, వత్సదంతాలూ, అంజలికాలూ, అర్ధచంద్రాలూ ఛడాఛడి తగిలించాడు. శరీరమంతా శరవర్షం కురిపించాడు. కర్ణుడి రథమూ, గుర్రాలూ ఏనుగుమోకు జెండా, సారథిశల్యుడూ అవుపడకండా చేశాడు. అంత కంటే వడి కనపరిచాడు కర్ణుడు. ఆటలాగ అర్జునుడు, కృష్ణుణ్ణీ వాడి వాడి బాణాలతో కప్పెట్టాడు. వానరపతాకమూ, తెల్లగుర్రాలూ రథమూ అవుపడకండా చేశాడు.

ఇద్దరూ అలా హోరాహోరి పోరాడారు ఆగ్నేయాస్త్రం ఆరిపోశాడు అర్జునుడు. కర్ణుడు కాల్చెయ్యాలంటూ దారుణంగా ప్రయోగించా డది. అగ్నిమంటలు ఆకాశమంతా అల్లుకున్నాయి. యముడి కోపాగ్నిలాగ ఇన్నూ మన్నూ ఆక్రమించింది ఆగ్నేయాస్త్రం. కసింతా కదల్లేదు కర్ణుడు. ధీమాగా వారుణాస్త్రం ప్రయోగించాడు. అగ్నిబాణం ఆరిపోయింది. మహానందమైంది మాకు.

అర్జునుడు మేఘబాణం వేశాడు. భూమీ ఆకాశం మేఘాలు నిండిపోయాయి చిమ్మచీకట్లు కమ్మాయి. గాలిబాణం వేశాడు కర్ణుడు. పటాపంచలై పోయాయి మేఘాలు, చీకట్లు చెదిరిపోయాయి. అభి మంత్రించి ఇంద్రాస్త్రం ప్రయోగించాడు అర్జునుడు. అద్భుతం దాని ప్రభావం. వందలు వందలు వేలువేలు క్షురప్రాలూ, అంజలికాలూ

అర్ధచంద్రాలూ, నాలీకాలూ, నారాచాలూ, వరాహకర్ణాలూ, వత్సదంతాలూ పుట్టుకువచ్చాయి. కర్ణుడూ, అతని సారథీ, గుర్రాలూ, రథమూ కప్పడిపోయాయి. అతడి వొళ్ళంతా రక్తమయమైపోయింది. గజగజలాడారు కౌరవులు. విజయం మోగించాడు కర్ణుడు. భార్గవ బాణం సంధించాడు. మంత్రించి ప్రయోగించాడు. అడ్డులేని మహాస్త్రం భార్గవాస్త్రం. అంత ఇంద్రాస్త్రమూ ఆడించేసిం దది. మరిన్ని మంచి మంచి బాణాలు అర్జునుడిమీద గుప్పించాడు కర్ణుడు.

అదంతా చూశాడు భీముడు. నిప్పులుకక్కుతూ నిట్టూర్చాడు. "అర్జునా!" — తమ్ముణ్ణి హెచ్చరిస్తూ పురిమాడు — "నీ ఎదట పడి చవ్వలేదు పరికదా, పైగా నీబాణాలు మాపేసి నిన్ను ఆడిస్తున్నాడూ కర్ణుడు! ఇంద్రుణ్ణి అడలెత్తించి ఖాండవం కాల్చావే, ఆ సామర్థ్యం ఏమయింది ఇప్పుడు? ఆ ప్రతాపం చూపించు. కర్ణుణ్ణి కడతేర్చు. తెగించి వచ్చాడు. మనచేత చిక్కాడు. పాదుకదలకుండా గదతో కపాలం పగలగొట్టేదా, చెప్పు? కాదు నీప్రతిజ్ఞ అంటావా, అయితే కత్తిలాటి బాణం వెయ్యి. కంఠం తెగనరుకు."

"గాండీవం పనిచెయ్యలేదా?" అందుకున్నాడు. కృష్ణుడు— "నీ దివ్యబాణాలు తీసికట్టయిపోడమూ, నిన్ను కొట్టి కర్ణుడు జోర విరవడమూనా? నువ్వు దిన్నపోడం చూసి, గావుకేకలు వేస్తున్నారు కౌరవులు. పాంచాలంవాళ్ళు వెనక్కి తగ్గేస్తున్నారు. చూస్తున్నావా? చూసిన్నీ చేసేదిలేక తగ్గేస్తున్నావా? అయితే చక్రమిస్తాను పుచ్చుకో. కర్ణుడి కంఠం తెగెయ్యి."

నవ్వుతూ బ్రహ్మాస్త్రం వేశాడు అర్జునుడు. ప్రళయంలా వచ్చింది బ్రహ్మాస్త్రం. బ్రహ్మాస్త్రం బ్రహ్మాస్త్రంతోనే కొట్టేశాడు కర్ణుడు. కృష్ణుడిమీద మూడూ, అర్జునుడిమీద మూడూ చికిలిపట్టిన బాణాలు నాటించాడు. తొమ్మిదిబాణాలు కొట్టాడు అర్జునుడు. కర్ణుడి వొళ్ళు

చీలికలుచేశాడు. అలాగే శల్యుడిమీద తొమ్మిది వేశాడు. రక్తాలు ధారలుకట్టించాడు. వరసని మూడూ, ఎనిమిదీ, రెండూ, నాలుగూ, పదీ పిడుగుల్లాటి బాణాలు కర్ణుడిమీద తగిలించాడు.

అర్జునుడి అల్లెతాడు పూడగొట్టాడు కర్ణుడు. గబగబా గట్టి గట్టి బాణాలు గుప్పించాడు. చప్పున అల్లెతాడు తొడిగాడు అర్జునుడు. బాణాల జడివాన కురిపించాడు.

"అర్జునుడి అల్లెతాడు తెగదు" - గ్రహించేశాడు కర్ణుడు. ఇంతలో అతడి నారి పుటుక్కుమనిపించాడు అర్జునుడు. చిరునవ్వు నవ్వుతూ అతడి కవచం చీలికలు చేశాడు. ఒళ్ళంతా బాణాలుగుచ్చేసి, రక్తాలు కారించాడు.

కదల్లేదు కర్ణుడు. గబుక్కున మరో అల్లెతాడు విజయానికి తొడిగాడు. అంపవాన కురిపించాడు. కృష్ణుడిమీద అయిదుబాణాలు గట్టిగా నాటించాడు. ఆబాణాలు వరంవల్ల సంపాదించినవి. అంచేత కృష్ణుడికి తగిలి, తిరిగి కర్ణుడిదగ్గిరికి వచ్చేశాయవి. మళ్ళీ అవే నిష్ఠురంగా కృష్ణుడిమీద ప్రయోగించాడతడు.

రెండేరెండు బాణాలు వేశాడు అర్జునుడు. కర్ణుడి అయిదు బాణాలూ మూడేసిముక్కలుచేసి కొట్టేశాడు. దారుణమైన కోలలు కర్ణుడిమీద నాటించాడు. అతడి జీవస్థానాల్లో గట్టిగట్టిబాణాలు గుచ్చాడు. మెరుపుల్లాటి బాణాలు వేశాడు కర్ణుడు. హోరాహోరి పోరాడాడు. గాండీవానికి విడుపూ విరామం లేకండా చేశాడు అర్జునుడు. ఎడాపెడా గుప్పించాడు బాణాలు. ఆకాశమంతా బాణాలే బాణాలు. చిమ్మచీకట్లు కమ్మాయి. కర్ణుడి చక్రరక్షకులూ, అతడి పృష్ఠరక్షకులూ సిగ్గూ సెరమూ వొదిలేశారు. వెనక్కి చూడకండా దౌడుతీశారు.

కర్ణుడి చక్రరక్షకులు పారిపోడం చూశాడు దుర్యోధనుడు. భీముడూ మొదలైన పాండవయోధులు యుద్ధంమానేసి నుంచోడమూ చూశాడు. చిన్నబుచ్చుకున్నాడు. ఇది కూడునూ, ఇది కూడదూ అన్న జ్ఞానంలేనిస్థితిలో వున్నాడతడు. అంచేత తనపక్కలవున్న తనసేన చూసి అరిచాడు: "చూస్తారేం? కలబడండి. పట్టుకోండి అర్జునుణ్ణి. కొట్టండి! పొడవండి! పోనివ్వకండి! చంపెయ్యండి! ఒక్కమొగిని మీదపడండి!" — పొలికేకలు వేశాడు. "ఊఁ, వురకండి" చెయ్యి విసిరాడు.

అతడు వురికొల్పడంతోనే మన రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలమూ రెపరెపలాడింది. అయితే, తగిన మొనగాళ్ళు మాత్రం కలగజేసుకోలేదు. చూస్తూ నుంచుండిపోయారు. ఎదటిసేన యుద్ధంచెయ్యనప్పుడు తాము కలబడడం ధర్మంకాదని ఆగిపోయారు.

అర్జునుడు గాండీవం మోగించాడు. భూమీ, ఆకాశమూ దడదడలాడించాడు. ఛడాఛడి బాణాలు కురిపించాడు. తట్టుకోలేక పోయింది కౌరవసేన. తోకముడిచేసింది.

"చేవగల మీరందరూ పూరుకుంటారేం?" మనయోధుల్ని వురికొల్పుతూ అరిచాడు దుర్యోధనుడు- "యుద్ధమంతా కర్ణుడిమీదే తోసేసి, అర్జునుణ్ణివొదిలేస్తున్నారు. ఆయుధం పట్టినవాళ్ళ ధర్మమేనా ఇది?"

లేనిఉత్సాహం తెచ్చుకున్నారు మన మహారథులు. అంతమందీ అర్జునుణ్ణి ఆక్రమించారు. అగ్గిపిడుగులా లేచాడు అర్జునుడు. వాళ్ళ జెండాలుచించేశాడు. సారథుల్ని పూడ్చేశాడు. ధనుస్సులు తుంచేశాడు. గుర్రాలుకూల్చేశాడు. నానా ఇదీ అయిపోయారు మన వాళ్ళు. కాళ్ళకి బుద్ధిచెప్పేశారు. కకావికలై పోయారు.

కేకలువేశాడు దుర్యోధనుడు. మళ్ళీ మళ్ళీ పురికొల్పాడు. అయినా అడిలిపోయి, ఒక్కడూ ముందుకి వెళ్ళలేదు. బాణంవేటు దూరంలో వుండిపోయారు.

అర్జునుడూ, కర్ణుడూ ఇద్దరేవున్నారు బరిమీద. చుట్టూఖాళీ. ఇద్దరూ ఇద్దరే. అద్భుతం వాళ్ళయుద్ధం.

ఇద్దరూ అలిసిపోయారు. అయినా ఎవరికి ఎవరూ తీసిపోలేదు. రకరకాల బాణాలు గుప్పించుకున్నారు. ఆ తమకం, ఆ శౌర్యం, ఆ బాహూవీర్యం—ఉభయసేనల రాజులూ వాలికలు కరుచుకున్నారు.

## సర్పబాణం

అర్జునుడితల తెగెయ్యడంకోసం సర్పబాణం తీశాడు కర్ణుడు. ఖాండవం కాల్చినప్పటినించీ నాగకుమారుడు అశ్వసేనుడు అర్జునుడి మీద పగపట్టాడు * తక్షకుడికొడుకతడు. పినతండ్రి ఐరావతుడిదగ్గిర పెరిగి ప్రయోజకుడయాడు. అర్జునుణ్ణి చంపడంకోసం సర్పముఖ బాణమై కర్ణుడిదగ్గిర వున్నాడు. బంగారంపొదిలోపెట్టి రోజూ అక్షతలూ, గంధమూ, పువ్వులూ అర్పిస్తూవుండేవాడు కర్ణుడు.

అదిగో ఆ సర్పబాణమే తీసి అరిపోశాడతడు. మంటలు, విషజ్వాలలు లేచి ఆకాశమంతా అల్లుకున్నాయి. హాహాకారాలు చేశారు చూసేవాళ్ళు. అర్జునుడి కంఠానికి గురిపెట్టాడు కర్ణుడు. అల్లె తాడులాగాడు. ఆగురి కంఠానికి కాక కడకంటికి సూటిగా కనపడింది. చూశాడు శల్యుడు. అది మిసపెట్టి, అతనిమనస్సు కలతపెట్టాలని నిశ్చయించాడు.

* ఆదిపర్వం. పుట 302 - 303.

"కర్ణా, ఈగురి కంఠానికి సరిగ్గా లేదయ్యా. సరిగ్గా సంధించు బాణం" అన్నాడు. కస్సుమన్నాడు కర్ణుడు. చురచురా చూశాడు.

"నా అంత యోధుణ్ణి కాదన్నంత తెలిసినవాడివా నువ్వు! కర్ణుడా రెండుసార్లు బాణం తొడుగుతాడు? పగవాళ్ళు నవ్వరూ?" అంటూ "అర్జునా! చచ్చావు" అని కేక వేశాడు. సర్పబాణం వొదిలి పెట్టాడు. మంటలుకక్కుతూ రయ్యిమని వెళ్ళింది బాణం. చూశాడు కృష్ణుడు. అయిదుఅంగుళాలు కిందికి అడిచేశాడు రథం. దేవతలూ, గరుడులూ, ఖచరులూ, ఖేచరులూ, విద్యాధరులూ, ఆకాశం ప్రతిధ్వనించినట్టు కృష్ణుణ్ణి పొగిడారు.

అయిదు అంగుళాలు అడిగిపోయింది అర్జునుడి రథం. ఉగ్రంగా వెళ్ళింది సర్పబాణం. కొండశిఖరం పడగొట్టిన వజ్రాయుధంలాగ అర్జునుడి తలమీద రత్నకిరీటం ఎగరేసుకుపోయింది. దిస్సపోయినట్టు అవుపించాడు అర్జునుడు. అల్లకల్లోలమైపోయారు పాండవులు.

దేవేంద్రుడు తపస్సుచేస్తే, బహుమానంగా బ్రహ్మ ఇచ్చిన కిరీట మది. శత్రుభీషణమైంది. కీర్తికరమైంది. తనకి సాధ్యంకాని నివాతకవచుల్ని సంహరించినందుకు మెచ్చి అతడు అర్జునుడికి ఇచ్చాడది. దిక్పాలకులుకూడా పడగొట్టలేని దివ్యకిరీట మది. అలాటి కిరీటం పాంబాణంతో పడగొట్టేశాడు కర్ణుడు. మహారాజా, ఎన్నడూ కనీ వినీ ఎరగని అద్భుతం—సర్పబాణం విషాగ్నిజ్వాలలు ఘోరంగా తగిలి భగ్గున మండిపోయి కిందపడిపోయిందికిరీటం. పడమటిసముద్రంలో సూర్యుడు పడిపోయినట్టు అనిపించింది.

కిరీటంలేని అర్జునుడు శిఖరంలేని నల్లకొండలా కనిపించాడు. వెంటనే తెల్లటి తలపాగా చుట్టుకున్నాడతడు. తూరుపు కొండమీద చంద్రుడు ఉదయిస్తే ఎలా అందంగా వుంటుంది, అదిగో అలాగ అవుపించాడప్పుడు.

అర్జునుడి కిరీటం ముందకెట్టి వూకుకోలేదు సర్పబాణం. విషం కక్కుతూ మళ్ళీ అర్జునుడివేపు మళ్ళిందది.

"అర్జునా, మళ్ళా మనమీదికి వస్తోంది పాము" అన్నాడు కృష్ణుడు.

"ఇదెక్కడిపాం బావా, మళ్ళీ రావడమేమిటి?- అడిగాడు అర్జునుడు.

"మరిచిపోయావేమో, దీన్ని?" అందుకున్నాడు కృష్ణుడు "ఖాండవం కాల్చినప్పుడు తల్లి నిపట్టుకుని అగ్గిలోంచి పారిపోబోయాడు కదూ, అశ్వసేనుడు! నువ్వువేసిన బాణంతో అగ్గిలోపడి చచ్చిపోయింది తల్లి. వాడు తప్పించుకుపోయాడు. అవాళనించీ పగబట్టి కర్ణుడిదగ్గిర చేరాడు. అదిగో ఆ అశ్వసేనుడే ఈ మహాసర్పం— సర్పబాణం. కర్ణుడు ప్రయోగించాడు. నీ కిరీటం పడగొట్టింది. కోపం చల్లారలేదు. నిన్ను చంపెయ్యాలని నాలుక చాచుకు వస్తోంది."

కృష్ణుడినోట్లోమాట నోట్లోనేవుంది. ఆరు దారైనబాణాలు వేశాడు అర్జునుడు. అశ్వసేనుణ్ణి ముక్కముక్కలుచేసి కొట్టేశాడు.

పాముబాణంతో అర్జునుడు చవ్వకపోడం చూసి, గతుక్కుమన్నాడు కర్ణుడు. ఇంతలో పదిబాణాలు నాటించాడు అర్జునుడు వెంటనే మరో పన్నెండు తగిలించాడు. సర్దుకోనేలోపున మరో గట్టి ఇనపబాణం కొట్టాడు. కర్ణుడిరక్తం తాగుతూ శరీరం దూసుకుపోయిందది. దెబ్బతిన్నతాచులాగ మండిపోయాడు కర్ణుడు. విజయం సారించాడు. పన్నెండుబాణాలు కృష్ణుడిమీద నాటించాడు. గుక్కతిప్పకుండా తొంభైతొమ్మిదిబాణాలు అరునుడిమీద గుప్పించాడు. ఎంచిఎంచి వొక క్రూరమైనబాణం అతడి రొమ్ముమీద నాటించాడు, పొలికేక పెట్టాడు. ఆకాశం అదిరినట్టు అట్టహాసం చేశాడు; కళ్ళలో అగ్గికురిశాడు అర్జునుడు. కత్తుల్లాటి బాణాలు కొట్టాడు. కర్ణుడి కవచం

22

కసీబిసీ నరికేశాడు. కిరీటం ముక్కలు చేసేశాడు. కుండలాలు దుళ్ళ కొట్టేశాడు. తలా, చెవులూ రక్తం ధారలుకట్టింది కర్ణుడికి. తీసిన బాణాలికీ, వేసిన బాణాలికీ ఎడా తెరిపీ లేకండా కురిపించా డతడు. అన్నీ అల్లంతదూరంలోనే కొట్టేశాడు అర్జునుడు. వరసపెట్టి నాలుగు వందల బాణాలు బాదేశాడు. ఒళ్ళంతా రక్తాలు కారి, జేగురు సెల యేళ్ళ కొండలా కనిపించాడు కర్ణుడు. ఆగలేదు అర్జునుడు. తళతళ లాడుతూన్న దూడపళ్ళబాణాలు గబగబా గుప్పించాడు. కర్ణుడి గుర్రాలూ, అతడి సారథీ, జెండా, రథమూ కప్పెట్టేశాడు. మేఘాలు కమ్మిన పర్వతంలా కనిపించింది కర్ణుడిరథం. ఒళ్ళంతా రక్తమైపోయి, మెరుస్తున్న బాణాలు రువ్వుతూ, అస్తగిరిమీద సూర్యుడిలా కనిపించాడు కర్ణుడు. అన్ని దెబ్బలు తగిలినా మడమతిప్పని బంటు తనంతో పోరాడాడతడు. జంటమెరుగులు ఆకాశంమీద తళుక్కు మంటే తళుక్కుమన్నట్టు అర్జునుడిబాణాలు ఖండించాడు. ఎన్నో అన్నిబాణాలు గుండపిండిచేసేస్తూ నువ్వా నేనా అని పోరాడాడు. అర్జునుడు దివ్యాస్త్రాలు తీశాడు. పరశురాముడు ప్రసాదించిన భార్గ వాస్త్రం కర్ణుడికి స్ఫురించకండా పోయిం దప్పుడు.

## రథచక్రం ఎత్తేదాకా ఆగు

కర్ణుడి రథచక్రం కుంగిపోతుంది. బ్రాహ్మణశాపం దగ్గిరపడింది. కర్ణుడు కడతేఁపోయాడు''- కనపడకండా అన్నాడు కాలుడు. ఉభయ సేనలూ ఆమాటస్పష్టంగా విన్నాయి.

కాలుడి నోట్లోమాట నోట్లోనే వుంది. కర్ణుడి దావలిచక్రం కుంగిపోయింది. రథం వొరిగిపోయింది. పరశురాముడి శాపంవల్ల అస్త్రబలంపోయీ, బ్రాహ్మడిశాపంవల్ల రథం కుంగిపోయీ, సర్ప బాణం వ్యర్థమైపోయీ ఎంతోఅంత కలతపడ్డాడు కర్ణుడు.

"ధర్మపరుల్ని ధర్మం రక్షిస్తుందంటారు ధర్మవాదులు. ఎంతో ధర్మపరుడు నేను. నావిషయంలో అది బొంకుచేశాడు ధర్మ దేవత." చెయ్యెదులువుతూ ధర్మదేవతని నిందించాడు కర్ణుడు. ఇంతలో అర్జునుడిబాణాలు మరిన్ని ఛడాఛడి తగిలాయి. దాంతో దుఃఖపడుతూ మరింత తిట్టుకున్నాడు కర్ణుడు. మండిపడ్డాడు. కృష్ణుణ్ని, అర్జునుణ్ని తూంట్లు పడినట్లు కొట్టాడు.

బాగా వొళ్ళుమండింది అర్జునుడికి. విషనాగుల్లాటి బాణాలు ఏకటాకీని గుప్పించాడు. ఒళ్ళంతా మంటలు పుట్టాయి కర్ణుడికి. పళ్ళు కొరికాడు. బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అర్జునుడు ఇంద్రాస్త్రం వేశాడు. బ్రహ్మాస్త్రంముందు ఇట్టే వోడిపోయింది ఇంద్రాస్త్రం.

"నీ బాణం కర్ణుడి బాణంముందు గడ్డిపరకా? చిత్రం!" విచారిస్తూ అన్నాడు కృష్ణుడు.

చప్పున బ్రహ్మాస్త్రం వేశాడు అర్జునుడు. కర్ణుడి బ్రహ్మాస్త్రం కొట్టేశాడు. బాణాలమీద బాణాలు కురిపించాడు.

అర్జునుడి అల్లెతాడు వూడగొట్టేశాడు కర్ణుడు. గబుక్కున అమర్చుకున్నాడు అర్జునుడు చరచగా బాణాలు తగిలించాడు. మళ్ళీ వూడగొట్టేశాడు కర్ణుడు. మళ్ళీ అమర్చుకున్నాడు అర్జునుడు. చరచరా బాణాలు తగిలించాడు. అలా పదకుండుమార్లు అర్జునుడి అల్లెతాడు వూడగొట్టాడు కర్ణుడు. ఇటు వూడిపోడంతోనే అటు అమిర్చేసుకునేవాడు అర్జునుడు. అది వూడిందో లేదో కనిపెట్టలేకపోయాడు కర్ణుడు. అర్జునుడిబాణాలు అడ్డుకుంటూ అతడిమీద గుదులుగుదులు బాణాలు గుచ్చి నొప్పించాడు.

"కర్ణుడా నిన్ను నొప్పించడం!" అర్జునుడు వురెక్కించాడు కృష్ణుడు — "సాటిలేని శరవిలాసం ఇంకెప్పుడు? అర్జునా, తెగెయ్యి, తెగెయ్యి కర్ణుడికంఠం — "

కృష్ణుడిమాట ఇంకా పూర్తికాలేదు, వల్లతాములాటిబాణం అరిపోశాడు కర్ణుడు. అర్జునుడిప్రాణం తీసెయ్యడానికి రౌద్రమంత్రంతో అది గురిపెట్టాడు. అదేసమయానికి అంతకిముందు కొంచెం కుంగివ్వ రథచక్రం తూముదాకా దిగబడిపోయింది భూమిలోకి. ఏటవాలయిపోయింది రథం. దానిమీంచి బాణంవెయ్యడం అనువుకాకండా పోయింది. కుంగిపోయాడు కర్ణుడు. ఏంచెయ్యడానికీ వల్లకాని రోషంతోనూ, దుఃఖంతోనూ, కళ్ళనీళ్ళు తిప్పుకున్నాడు.

"రధచక్రం ఎత్తేదాకా ఆగు" రథందిగుతూ అర్జునుడితో అన్నాడు కర్ణుడు – "నేను కిందవున్నాను. నువ్వు రథంమీద వున్నావు. ఆగడం ధర్మం. తలవిరబోసుకున్న వాణ్ణి, రధంలేనివాణ్ణి, ఆయుధం కిందపెట్టినవాణ్ణి శూరులు కొట్టరు. నువ్వు శూరుడువి. ఉత్తమకులంలో పుట్టినవాడివి. రణధర్మం తెలిసినవాడివి. ఇలాంటినువ్వు ధర్మయుద్ధమే చెయ్యాలి. ఇలా నిన్ను అంటున్నానూ అంటే నీకూ, నీకృష్ణుడికీ భయపడికాదు. ధర్మంకోసమే చెపుతున్నాను."

"ఈతగువూ, ఈధర్మమూ ఇవాళే నీమనసులో పుట్టాయో" అందుకున్నాడు కృష్ణుడు – "ఆబిగురూ అదీ ఎటుపోయిందంటా? ఆగర్వమూ, దురభిమానమూ మరిచిపోయావేమో ! ధర్మంధర్మం అంటున్నావు. పరమధర్మపరులు పాండవులు. సర్వశుభాలూ సమకూడతాయి వాళ్ళకి. మీరో, అధర్మానికి పుట్టిళ్ళు ఇలాగే చెడ్డ నెత్తిని పడుతుంది మీకు. నొచ్చుకుంటే ఏలాభం? చేసినపాపం కట్టి కుడపకండా పోదు.

"కుమాళ్ళతో కుంతి నిద్రపోతూవుంటే లక్క ఇంట్లో నిప్పు పెట్టించాడు మీదుర్యోధనమహారాజు. మాయజూద మాడించాడు. ధర్మరాజుసంపద చపాయించాడు. అంతతోనూ కసితీరలేదు, ద్రౌప

దిని సభలోకి తెచ్చి మానభంగం చేయించావు. అడవికి పంపించావు. అక్కడ వాళ్ళని చంపాలని గొల్లపల్లెల మిష పెట్టి దండయాత్ర చేశావు. బాలుడైన అభిమన్యుడిమీద అంతమందిని పంపి చంపించావు. దీనంత టికీ కర్ణా, నువ్వే మూలకందం. ఇప్పుడు చెపుతున్న నీ ధర్మపన్నాగాలు ఇవన్నీ చేసినప్పుడు ఏమయాయి ?"

కృష్ణుడి మాటలతో అర్జునుడి మనస్సులోని రోషాగ్ని తన రోమకూపాల్లోంచి బైటికి వచ్చింది. ఆశ్చర్య మనిపించింది. ఉగ్ర నరసింహుడిలా అవుపించా డతడు. ప్రవాహంలాగ బాణాలు గుప్పించాడు. అవన్నీ అడ్డుకుంటూనే అర్జునుడిమీద బాణాలు రువ్వాడు కర్ణుడు. అద్భుతం అనిపించిందిమాకు. వెనకాడకండా పోరాడుతూ చురకత్తుల్లాటి బాణాలు పదిఅర్జునుడిమీదతగిలించాడు. మండుతున్న అగ్గిలోనెయ్యిపోసినట్టు నిలువునా మండిపోయాడు అర్జునుడు. బంగారం మొదళ్ళతో తళతళలాడుతున్న భల్లబాణం గాండీవానికి తొడిగాడు. బంగారంమీా మణులుచెక్కిన హస్తికక్ష్యపతాకం ఎగరగొట్టి పారేశాడు. శత్రుభయంకరమైన కర్ణుడిజెండా పడిపోడంతోనే తమ కీర్తి, బలమూ, దర్పమూ, ఉల్లాసమూ — అన్నీపడిపోయినట్టు హాహాకారాలుచేశారు కౌరవులు. కర్ణుడిమీద ఆశ వొదులుకున్నారు.

పతాకం పడిపోడం భరించలేకపోయాడు కర్ణుడు. క్రూరమైన ఇనపబాణాలు కురిపించాడు. అర్జునుణ్ణి తడబడినట్టు చేసేసి, తనరథం వెనక్కి వెళ్ళి, ఎడమకొమ్ముకింద బుజంపెట్టి, బలంకొద్దీ ఎత్తాడు. రథచక్రం వొదలకండా కులపర్వతాలూ, అడవులూ, సముద్రాలూనహితంగా ఆరుఅంగుళాలు మీాదికి ఉబికింది భూమి. రథమెక్కి, మీాదికి వెళ్ళిఎప్పటిలాగ బాణంసంధించాడు కర్ణుడు. ఇట్టే బాణంతొడిగాడో లేదో, మళ్ళీ కుంగిపోయింది రథచక్రం. మళ్ళీ దిగిఎత్తాడు కర్ణుడు.

# కర్ణవధ

"ఇదే సమయం కానీ" అన్నాడు కృష్ణుడు. పిడుగులాంటి అంజలికాస్త్రం తీశాడు అర్జునుడు. ఆకలితో వచ్చిన యముడునోరులా వుంది అంజలికం. కృష్ణుడిచక్రంకంటే, శివుడి శూలంకంటే ఘోరంగా వుందది. ఆ మహాస్త్రం తొడిగాడు అర్జునుడు. చెవిదాకా అల్లెతాడు లాగాడు. "తపస్సూ, దానమూ, గురుజనసేవా నిష్ఠతో నిత్యమూ చేస్తూవున్నవాణ్ణే అయితే ఈబాణం కర్ణుడి తల తెగనరుకుతుంది" అంటూ అల్లెతాడు మరింత లాగి వొదిలిపెట్టాడు. భూమీ, ఆకాశమూ మెరుపులు మెరిపిస్తూ వచ్చిందిఅంజలికం. రెండు సేనలవాళ్ళూమూర్ఛపోయారంటే నమ్మం. జవ్వుమన్న శబ్దంతో ఆకాశం పగిలిస్తూ, ప్రాణికోటి యావత్తూ గడగడలాడిస్తూ, కర్ణుడి కంఠం తెగనరికేసింది అంజలికం. పడమటికొండమీంచి పడిపోయిన సూర్యబింబంలాగ కిందపడిపోయింది కర్ణుడి తల, వజ్రాయుధం తగిలి కూలిపోయిన కేగురుకొండలాగ రక్తంలో మునిగి, కిందపడిపోయింది మొండెం. ఎంతోఅంతకాంతితో మెరిసిపోతున్న అందమైన శరీరం కిందపడిపోడంతోనే, అంతమందిమీ చూస్తూనే వున్నాం, ఉజ్వలమైన అతడి బొందెలోంచి వెలిగిపోతూ వొక తేజస్సు బయలుదేరింది. ఆశ్చర్యం! తిన్నగా వెళ్ళి అస్త మిస్తూవున్న సూర్యబింబంలో చొచ్చుకుపోయింది.

కర్ణుడు కడతేరిపోడంతోనే బ్రాహ్మణశాపం తీరిపోయిందో ఏమో, కుంగిపోయిన్న రథచక్రం ఎప్పటిలాగ భూమిమీద నిలబడింది.

దారుణమైన బాణాలు కిరణాలతో శత్రుసేన మాడ్చిమాడ్చి, దాటరాని అర్జునుడనే కాలాన్ని దాటడానికి శక్తిలేక కర్ణుడనే సూర్యుడు అస్తమించిపోయాడు.

కర్ణుడు పడిపోడం తడువు పొలికేకలు పెట్టారు పాంచాలంవాళ్ళు.

ఆనందంతో రణవాద్యాలు వాయించారు పాండవులు. సేన సేనంతా సంతోషమే సంతోషం తాండవమాడింది.

పొడవాటి చేతులూ, బలిసిన తొడలూ, వెడల్పాటి రొమ్మూ వెల్లకిలా పడివున్న కర్ణుడి మొండెం చూసి, దుఃఖపడుతూ కుంగి పోయాడు సూర్యుడు. దుఃఖంకొద్దీ అతడి శవం తన కిరణాల చేతులతో ముట్టుకోడంవల్ల మైలపడి, స్నానానికి వెళుతున్నట్టు పడమటి సముద్రంలోకి దిగిపోయాడు.

కాడనించి తెగిపోయిన పద్మంలా వున్న కర్ణుడి శిరస్సూ, పదారువన్నె బంగారంలా మెరుస్తూన్న మొండెమూ చూసి, కుంగి పోయి మోడైన రథం మళ్ళించాడు శల్యుడు.

మందలోని ఆబోతుని పట్టుకుపోయిన పులినిచూసి మంద మందంతా పారిపోయినట్టు కర్ణుణ్ణి చంపేసిన అర్జునుణ్ణిచూసి కకావికలై పోయారు కౌరవులు. పాంచాలంవాళ్ళు పొలికేకలు పెడుతూంటే, సేనలూ, శల్యుడూ అర్జునుడి వానరపతాకం దీనంగా తిరిగితిరిగిచూస్తూ పరుగులుతీశారు.

అదంతా చూశాడు భీముడు. ఉబ్బిపోతు బ్రహ్మాండమైన సింహ నాదంచేశాడు. మరింత వుప్పొంగిపోయారు పాండవసైనికులు. మన వాళ్ళు దుఃఖంతో కుంగిపోయారు.

రథంతోలుకుని దుర్యోధనుడి దగ్గిరికివచ్చాడు శల్యుడు. కన్నీళ్లు కారుస్తూ దీనంగావున్నాడు దుర్యోధనుడు. దుఃఖంతో గుండెలు పగిలిపోతున్నాయి. వేడివేడి నిట్టూర్పులు రేగుతున్నాయి.

"మహారాజా," మెల్లిమెల్లిగా అన్నాడు శల్యుడు — "ఎన్నో యుద్ధాలు చూశాం. కాని కర్ణుడూ అర్జునుడూ చేసినలాంటి యుద్ధం ఎక్కడా, ఎన్నడూ చూడలేదు; వినలేదు. దేవతలే నాలికలు కరుచు

కున్నారు. కర్ణుడి వీరత్వం చూసి, అర్జునుడూ, కృష్ణుడూ అడిలి పోయారు. అయితే ఏంలాభం? విధి ఎదురుతిరిగింది.

చూడు, భూచక్రం యావత్తూ నువ్వే ఏలాలని ప్రాణాలు దాచుకోకుండా పోరాడి రణభూమిలో పడివున్న ఈ రాజుల్ని చూడు! రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ కూలి చుట్టూ ఎలా వికృతంగా వున్నాయో చూడు! దేవేంద్రుడంతటివాళ్ళు వీళ్ళు. యముడూ, వరుణుడూ, కుబేరుడూ అంతవాళ్ళు. ఇంతేసి మొనగాళ్ళు మనకోసం హోరాహోరి పోరాడారు. అయినా ఫలం దక్కలేదంటే, ఇది విధి కృతం కాని మరొకటి కాదు. కనక, విచారించి లాభంలేదు.

"నీ కోసం యుద్ధం చేసి కూలిపోయిన సైన్యం చూడు! ధనుస్సులూ, ఆయుధాలూ, జెండాలూ, గొడుగులూ, చామరాలూ ఎలా తుక్కుతుక్కైపడున్నాయో చూడు! ఏనుగుల గంటలూ, గుర్రాల గజ్జెలూ, యోధుల కంకణాలూ, భుజకీర్తులూ, హారాలూ, కిరీటాలూ ఎలా గుండపిండి అయిపోయాయో చూడు! ఎంత భయంకరంగా వుందో అంత అందంగా వుంది రణరంగం."

శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. భూమీ ఆకాశమూ బద్దలైనట్టయింది. కౌరవులగుండెల్లో పిడుగులు పడ్డాయి. ఇంద్రజిత్తుని సంహరించిన లక్ష్మణుడు చేసిన సింహనాదానికి దద్దరిల్లిపారిపోయిన రాక్షససేనలాగ దుర్యోధనుడు వున్న చోటు వొదిలేసి పారిపోయాయి కౌరవసేనలు. తెల్లమొహంవేశాడు దుర్యోధనుడు.

"సాయంకాలమైపోయింది. ఇవాళకి యుద్ధం చాలించు. రేపు తెల్లవారాక ఏంచెయ్యాలో చూసుకుందాం" అన్నాడు శల్యుడు.

కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా, శకునీ, సుశర్మా మొదలైన మొనగాళ్ళు దీనంగా మొహాలు వేలవేసుకుని నిట్టూర్పులుతీస్తూ దుర్యో

ధనుడి దగ్గిర చేరుకున్నారు. పారిపోతున్న సేనలు మళ్ళించడం దుస్తరమని గ్రహించాడు దుర్యోధనుడు. సేనానాయకుల నిరుత్సాహమూ కనిపెట్టాడు. శల్యుడి మాటప్రకారం వెనక్కి తిరిగాడు. కర్ణుణ్ణి తలుచుకుని "హా కర్ణా! హా కర్ణా!" అని గోలుగోలుమన్నాడు. సేనలు శిబిరానికి మళ్ళించమన్నాడు. దుఃఖపడుతూ, తలవొంచుకుని శిబిరానికి నడిచాడు. కౌరవులందరూ దీనంగా వెంటనడిచారు. జూదంలో ఓడిపోయి పాండవులు అడివికి నడిచారే, అదిగో అలాగ అనిపించింది కౌరవులు అలా తిరిగి రావడం.

కౌరవులు పారిపోయారు. ఒళ్ళనిండా కర్ణుడిబాణాలతో సూర్యచంద్రుల్లాగ కృష్ణుడూ, అర్జునుడూ రణభూమిలో ప్రకాశించారు. బాణాలు పెరికేసుకుని ఇద్దరూ వాళ్ళని వాళ్ళు చూసుకున్నారు.

సాయంకాలమైంది.

"శత్రువుల వెంటపడడానికి ఇది సమయంకాదు" అంటూ తమసేనలు మళ్ళించారు పాండవులు. బలాసురుణ్ణి చంపేసి వచ్చిన విష్ణువూ ఇంద్రుడూలాగ కర్ణుణ్ణి చంపేసి, తమవాళ్ళనికలుసుకున్నారు కృష్ణార్జునులు. వాళ్ళిద్దరినీ ఎన్నోవిధాల పొగుడుతూ తమతమ నివాసాలకి వెళ్ళిపోయారు దేవతలు. అర్జునుడికి జేజేలుపడుతూ విడిదలు చేరి, ధర్మరాజు మొగసాల చేరారు పాండవులు. అందరికంటే ముందు పాంచాలంవాళ్ళు వెళ్ళి శుభవార్త వినిపించారు ధర్మరాజుకి.

ఇంతలో రథందిగి చరచరా వెళ్ళి అన్నగారికి పాదాభివందనం చేశాడు అర్జునుడు. అమాంతంగా గుచ్చి కౌగలించుకున్నాడు ధర్మరాజు. శిరస్సు మూచూశాడు. భీముడూ, నకులుడూ, సహదేవుడూ అన్నగారిపాదాలికి మొక్కారు. అర్జునుణ్ణి కౌగిలించుకున్నారు.

కృష్ణుడూ, సాత్యకీ ధర్మరాజుకి నమస్కరించాడు. ఇద్దరినీ అభినందించాడు ధర్మరాజు.

## నీ కోపమే కర్ణుణ్ణి చంపింది

"మహారాజా," ధర్మరాజుతో అన్నాడు కృష్ణుడు- "ప్రపంచాలన్నీ వొకళ్లైనా కర్ణుణ్ణి చంపడం కష్టం. నీకోపమే అతణ్ణి చంపింది. కౌరవుల్లోకల్లా కర్ణుడే మొనగాడు. అతడు అయిపోయాడంటే అంతా అయిపోయారనే నమ్ము. నీకు ఎదురు లేదిక నిశ్చింతగా వుండు."

"ఇదంతా కృష్ణా, నీప్రసాదం" అందుకున్నాడు ధర్మరాజు – "నీ దయకి నేనా పాత్రుణ్ణి! నీ దయ అంటూ వుంటే, శత్రువుల్ని గెలవడం ఏమాత్రం! నీ అనుగ్రహంవల్ల సర్వసంపదలూ కరతలామలకం మాకు. అఖిలరక్షకుడివి నువ్వు. నీ భక్తులం మేం నా దుఃఖమంతా పోయింది. భయం తీరిపోయింది. హాయిగా నిద్రపోతాను, ఇవాళ."

"నీ స్నేహంవల్ల నన్ను ఇలా అంటున్నావు" అన్నాడు కృష్ణుణ్ణి – "బాగానేవుంది కాని మీగెలుపుకి నేను వుత్తి నిమిత్త మాత్రుణ్ణి. ఏమంటావు, నీతమ్ముళ్లూ, నీమరుదులూ మహాద్భుతమైన పరాక్రమవంతులు నిన్ను ఎదిరించి ఎవడు బతికి బట్టకడతాడు?"

ఇలా వొకళ్ళతో వొకళ్ళు సల్లాపాలాడుకున్నారు.

రణస్థలం చూడాలనివుంది" అన్నాడు ధర్మరాజు. "సరే," అన్నాడు కృష్ణుడు. నల్లతోకల తెల్లగుర్రాలు రథానికి పూయించాడు ధర్మరాజు. వేలువేలు దివిటీలు పట్టించాడు. రథమెక్కి, తమ్ముళ్ళతోనూ, బంధుమిత్రుల యావన్మందితోనూ బయలుదేరాడు. వెళుతూ వెళుతూ దారిలో కృష్ణుడితో అన్నాడతడు:

"ఉద్దండుడైన శత్రువు హతమైపోయాడు. సమస్తసామ్రాజ్యానికీ సామ్రాట్టునయాను. ఇదంతా నీదయవల్ల ఇట్టే చేకూరింది."

అర్జునుణ్ణి మెచ్చుకుంటూ యుద్ధభూమికి వచ్చాడు ధర్మరాజు. కర్ణునిశిరస్సు కళ్ళారా చూశాడు. అతడి కొడుకులశవాలూ చూశాడు. కర్ణునిశవం చూసి తనకి తిరిగి పునర్జన్మ కలిగినట్టు సంతోషించాడు. "ఆపదలన్నీ ఇవాళ్ళకి గట్టెక్కాయి. సర్వసంపదలూ సమకూడాయి" అంటూ తృప్తిపడ్డాడు. మహారాజా, అదిగో అలాగ కర్ణుడనే మహాసముద్రం ఈది, గట్టుచేరారు పాండవులు; పరమానందం పొందారు.



# శల్య పర్వం

## ఒకటో ఆశ్వాసం

కర్ణుడు హతమైపోయాక చావగా మిగిలిన రాజులతోనూ, సేనలతోనూ శిబిరానికి వచ్చాడు దుర్యోధనుడు. బంధువులూ, స్నేహితులూ ఓదార్చిన మీదట ఎలాగో విచారం వొదిలిపెట్టాడు. ధైర్యం తెచ్చుకున్నాడు. శల్యుణ్ణి సేనాధిపతిచేశాడు. మర్నాడు తెల్లవారాక సైన్యాలు కూర్చుకుని యుద్ధానికి నడిచాడు. పాండవులూ సేనలతో వచ్చిపడ్డారు ఉభయసేనలకీ దేవాసురయుద్ధమంత యుద్ధం జరిగింది. మధ్యాహ్నమయేసరికి ధర్మరాజు శల్యుణ్ణి చంపేశాడు. దుర్యోధనుడి బంధువులూ, స్నేహితులూ, సైనికులూ తెగిపోయారు. దిగాలుమనిపోయాడు దుర్యోధనుడు. యుద్ధం మానేశాడు. ఒక్కడూ పారిపోయాడు. ఒక మడుగులో దూరి దాక్కున్నాడు. గెలిచినసంతోషంతో పెచ్చురేగిపోయారు పాండవులు. దుర్యోధనుడు దాక్కున్న చోటు తెలుసుకున్నారు. అక్కడికి పరిగెత్తారు. నలిరేగిపోయి మడుగు చుట్టుముట్టారు. కవ్వించి కవ్వించి పిలిచారు. నీళ్ళలోంచి పైకి వచ్చేశాడు దుర్యోధనుడు. భీముడితో ఎంతోసేపు గదాయుద్ధంచేశాడు. పొద్దు వాలిపోతూ వాలిపోతూ వుండగా భీముడిగదతో తొడలు విరిగి పడిపోయాడు. అర్ధరాత్రి కృపాచార్య కృతవర్మలని వెంటపెట్టుకుని అశ్వత్థామ ధర్మరాజుశిబిరం ముట్టడించాడు. యుద్ధంలో మిగిలిపోయిన పాంచాలంవాళ్ళనీ, ప్రభద్రకుల్నీ, మాత్స్యుల్నీ యావన్మందినీ చంపేశాడు. మర్నాడు పొద్దుటపూట సంజయుడుకురుక్షేత్రంనించి హాస్తినా

పురం వచ్చాడు. రెండుచేతులూ మీదికెత్తి "అయ్యో దుర్యోధనా, అయ్యోరాజరాజా," అంటూ ఏడుస్తూ వచ్చాడతడు. మొహమంతా కన్నీళ్ళు కమ్ముకుంటున్నాయి. కాళ్ళు తొట్రుపడుతున్నాయి. శరీరం తూగిపోతూవుంది. దైన్యం మూర్తీభవించినట్టు వున్నాడతడు. అతణ్ణి చూసి హస్తినాపురం జనులు గుంపులుగుంపులు ఎదురువచ్చారు. ఎదురైనవాళ్ళతో నల్లా గోలుగోలుమన్నాడు సంజయుడు. "దుర్యోధన మహారాజు మరిలేడు. మన రాజరాజు అస్తమించాడు. తగని విధంగా కళ్ళుమూశాడు." అంటూ వెక్కివెక్కి చెప్పాడు. అలా రాజవీధిని నడుచుకుంటూ వెళ్ళి, ధృతరాష్ట్రుడి మందిరం ప్రవేశించాడు.

లోపలికొలువులో వున్నాడు ధృతరాష్ట్రుడు. కర్ణుడిచావుకి దుఃఖపడుతూ కూచున్నాడు. గాంధారీ, కోడళ్ళూ, విదురుడూ వాళ్ళూ చుట్టూవున్నారు.

"మహారాజా, నేను సంజయుణ్ణి" బావురుమంటూ పాదాల మీద పడ్డాడు సంజయుడు." అంతా అయిపోయింది మహారాజా" - వెక్కివెక్కి ఏడ్చాడు - "శల్యుడు చచ్చిపోయాడు. శకుని కళ్ళు మూశాడు. ఉలూకుడు రాలిపోయాడు. సంశప్తకులు అందరూ అయిపోయారు. కాంభోజులూ, యవనులూ, కొండదొరలూ, మ్లేచ్ఛులూ చతురంగబలాలతోసహా యావన్మందీ హతమైపోయారు. నాలుగు దిక్కుల దేశదేశాల రాజులూ, మహారాజులూ, నీఅందరికొడుకులూ. కర్ణుడికొడుకులూ తెగిపోయారు. అన్నంతపనీ చేశాడు భీముడు, దుశ్శాసనుడి గుండెలుచీల్చి నెత్తురుతాగాడు. దుర్యోధనుడి రెండు తొడలూ విరగ్గొట్టి పడేశాడు. తొడలు విరిగిపోయి కూలిపోయాడు రాజరాజు. బుగ్గిలో బుగ్గయిపోయాడు.

"ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ, మొదలైన పాంచాలరాజకుమాళ్ళు చల్లారిపోయారు. నీమనవలు

ప్రతివింధ్యుడూ మొదలైన ద్రౌపదికుమారుళ్ళు అయిదుగురూ అస్త మించారు. చేది, మాత్స్య, ప్రభద్రకులు చతురంగబలాలతోకూడా నాశనమైపోయారు. కౌరవశిబిరంలోనూ, పాండవశిబిరంలోనూ ఆడం గులు తప్ప మొగపురుగన్నది లేకండా అయిపోయింది. మనవాళ్ళలో అశ్వత్థామా, కృతవర్మా,కృపాచార్యుడూ, వాళ్ళలో పంచపాండవులూ, కృష్ణుడూ, సాత్యకీ, నీకొడుకు యుయుత్సుడూ ఇలా మొత్తంపదకుండు మంది మాత్రం మిగిలారు.మన పదకుండు అక్షౌహిణీలసేనా, వాళ్ళ ఏడు అక్షౌహిణీల సేనా మచ్చుకైనా లేకండా దుర్యోధనుడికోసం నాశనమై పోయింది'' అన్నాడు.

## తండ్రి దుఃఖం

విని మూర్ఛపోయాడు ధృతరాష్ట్రుడు. విదురుడూ సొమ్మసిల్లి వొరిగిపోయాడు. గాంధారీ, కోడళ్ళూ తెలివితప్పి నేలమీద పడి పోయారు, తక్కిన బంధువులు బొమ్మల్లాగ ఎక్కడివాళ్ళక్కడ చదికిల బడిపోయారు. ఎవరిమొహంలోనూ చిక్కితే రక్తం లేదు. సంజయుడి ప్రయత్నంమీద అందరూ మెల్లిమెల్లిగా తెలువుకున్నారు. ఒళ్ళంతా వొణికిపోతూ, నాలుగుదిక్కులా మొహంతిప్పి విదురుడిదిక్కు తిరిగాడు ధృతరాష్ట్రుడు:

తమ్ముడూ, పుత్రహీనుణ్ణీ, అనాథుణ్ణీ అయిపోయాను. ఇక మీద నువ్వేదిక్కు నాకు'' అంటూ మళ్ళీ మూర్ఛపోయాడు. విదురుడూ, రాణులూ చన్నీళ్ళుచల్లీ, విసిరీ ఉపచారాలు చేశాక కొంచేపటికి తేరుకున్నాడు; కూచున్నాడు, కుండలో పెట్టిన పాంలాగ నిట్టూరుస్తూ పూరుకున్నాడు. చూసి, సంజయుడూ, రాణులూ, కోడళ్ళూ గోలుగోలుమని ఏడ్చారు,

"తమ్ముడూ," గద్గదకంఠంతో దీనంగా విదురుడితో అన్నాడు ధృతరాష్ట్రుడు - "మనస్సు స్వాధీనం కాకుండా వుంది. మీ వదినెనీ, కోడళ్ళనీ లోపలికి పంపించెయ్యి."

ఎవళ్ళకి చెప్పవలసినట్టు వాళ్ళకి బోధించి చెప్పాడు విదురుడు. ఏడుస్తూ అంతమందీ తమతమ మందిరాలికివెళ్ళారు. దుఃఖంతో కుమిలి పోతూ కూచున్నాడు సంజయుడు.

'ఇక నా గతేమిటి?' వల్లమాలిన దుఃఖంతో చేతులు దులు పుతూ సంజయుడిదిక్కు తిరిగి అన్నాడు ధృతరాష్ట్రుడు—"కొడుకు లందరూ కూలిపోయారని విని పగిలిపోకుండావుంది, వజ్రమో ఏమో నా గుండె! వందమంది కొడుకులూ తెగిపోయారు. పాండవులు అయిదు గురూ చెక్కుచెదరలేదు అన్న నీపలుకులు ములుకులై పోయి హృదయం వేధించేస్తున్నాయి. పుట్టుగుడ్డిని, కొడుకుల ఆటలూ, వాళ్ళ అందచుం దాలూ కళ్ళారా చూడలేకపోయాను బంధువులు వాళ్ళని వర్ణించిన మాటలువిన్న చెవులు ఇప్పుడు కొరివిపెట్టినట్టు మండుతున్నాయి.

"బాబూ, దుర్యోధనా! ఇటు రావోయితండ్రీ! నన్ను కౌగిలించు కోవూ? మీఅమ్మని వూరుకోబెట్టవూ! వృద్ధుల్ని మమ్మల్ని వొదిలేసి పోయావు,ఏసంగతి చెప్పావు నాయనా,మాకు! రాజరాజా! గుడ్డివాళ్ళని చూడక ఉపేక్షిస్తున్నావా బాబూ! నాన్నమీద దయా, ప్రేమా ఎక్కడికి పోయాయోయి తండ్రీ! రాజులు సేవించే నువ్వు వొంటిగా వడివున్నావా కన్నా! అంత బలవంతుడివి, అడ్డులేని మహారాజువి, పాండవులచేత చవ్వరానిచావు చచ్చావా బాబూ! రోజూ వచ్చి, నాన్నా అని నన్ను ఎవరు పిలుస్తారిక? ఎవరు ఆదరిస్తారు? ఎవ రున్నారునాకు?

"యుద్ధంమాటవచ్చినప్పుడు 'భీష్ముడూ,ద్రోణుడూ, కృపుడూ' అశ్వత్థామా- వీళ్ళలో ఏ వొక్కడి ముందైనా పాండవులు ఏపాటి,

అన్నావు. కర్ణుడు వొక్కడే నిన్ను గెలిపిస్తాడన్నావు. అయిదుగురినీ నువ్వే చంపేస్తానన్నావు. వీళ్ళే కాక బాహ్లీకుడూ, భగదత్తుడూ, సోమదత్తూ, భూరిశ్రవుడూ, శకునీ, శలుడూ, శల్యుడూ, జయద్రథుడూ, విందానువిందులూ వున్నారన్నావు. 'నేనూ కర్ణుడూ, తమ్ములూ వుంటే చాలు పాండవుల్ని గెలిచేస్తాం, నమ్ము' అన్నావు. ఇన్ని మాటలూ చెప్పి నన్ను వూరడించావు. అడ్డే వుండదనుకున్నాను నీకు. నీపరాక్రమంతో పాండవులు కూలిపోతారనే నమ్మాను. నువ్వే వాళ్ళచేత కూలిపోయావు.

"సింహంలాటివాడు భీష్ముడు. నక్కలాంటి శిఖండిని పెట్టుకుని అంతటి మహాత్ముణ్ణీ అర్జునుడు కొట్టేశాడు. విధికి అసాధ్యం ఏముంది? ద్రోణుడు, జయద్రథుడు, బాహ్లీకుడు, సోమదత్తు, భూరిశ్రవుడు, భగదత్తుడు— ఇంతేసి మహావీరులు! ఇట్టే చచ్చిపోయారంటే ఏమనాలి దైవాన్ని!

"నువ్వు నమ్ముకున్న కర్ణుడిచేత పాండవుల్లో వొక్కడూ చెక్కు చెదరలేదు. శల్యుడంటే దిక్కులు గడగడలాడతా యంటారు. అతడి వల్లా రవంత లాభంలేకపోయింది. దొంగల్ని చంపినట్టు ఇంతమందినీ చంపేశారు శత్రువులు! దైవమూ తుకాకపోతే ఏమిటిది?

'కొడుకా! తమ్ముళ్ళతో శత్రువుల్ని చంపేస్తానన్నావోయి! ఒక్కడూ దక్కకుండా తమ్ముళ్ళని తుడుచుకుపోయాడు పాడుదైవం! ఏందారి నాకు, చెప్పూ! భీముడి గదతో తొడలు విరిగి పడినప్పుడు ఏమనుకున్నావోయి తండ్రీ!

"భాగ్యవంతులికే కాని పాపాత్ములికి శుభ మెలా వస్తుంది? కొడుకులు కూలిపోయారు. అడివికి పోడంతప్ప ఇంకేముంది నాకు? కాదని వుండికత్తి వున్నానో మాటలతోనే మాడుస్తాడు భీముడు.

"సంజయా, దుర్యోధనుణ్ణీ, దుశ్శాసనుణ్ణీ, తిట్టితిట్టి రోజూ చంపుతాడు నన్ను. ఇంచేత అడివికి పోడమే మేలు నాకు."

ఇలా ఎన్నో విధాల పనివి పనివి దుఃఖపడ్డాడు ధృతరాష్ట్రుడు. నిట్టూరుస్తూ సంజయుడితో ఇంకా ఇలా అన్నాడు:

"భీష్ముడూ, ద్రోణుడూ; తుదకి కర్ణుడూ కడతేరిపోయారు కదా, మరి ఎవళ్ళని నమ్ముకుని యుద్ధానికి బయలు దేరారు మనవాళ్ళు. తమ్ముడు విదురుడు అనాళ్ళే చెప్పాడు, దుర్యోధనుడు మూర్ఖుడని. అతడి మూర్ఖత్వం ప్రపంచజననాశనం కలిగిస్తుందని. బుద్ధిలేని కొందరు అది పాటించలేదు. దైవయోగంవల్ల నామనస్సూ కుచ్చితమైపోయింది. అప్పుడు తమ్ముడు చెప్పింది వినక పోయిందానికి ఇప్పుడు అనుభవించక ఎలా తప్పుతుంది? చెప్పు, సంజయా, కర్ణుడితరవాత సేనాపతి ఎవరయారు? అర్జునుణ్ణి ఎదిరించగలిగిన మొనగాడు ఎవడు దొరికాడు? శల్యుడు ఎవరిచేత తెగిపోయాడు? కౌరవులంతా నశించిపోయి, దుర్యోధనుడు భీముడిగదచేత ఎలా పడిపోయాడు? కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా ఎలాబతికిపోయారు? ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, మొదలైన పాంచాలంవాళ్ళూ, చేది, మాత్స్య, ప్రభద్రక బలాలూ, ప్రతివింధ్యుడూ మొదలైన ద్రౌపదికొడుకులూ, తక్కిన యోధవీరులూ ఎలా చచ్చిపోయారు? పాండవులు అయిదుగురూ, కృష్ణుడూ, సాత్యకీ, యుయుత్సుడూ తెగిపోక ఎలా తప్పిపోయారు? చెప్పు, సంజయా, అంతా వివరించి చెప్పు."

ధృతరాష్ట్రుడు అలా అడగడంతోనే ఇలా ఎత్తుకున్నాడు సంజయుడు:

మొన్న కర్ణుడు తెగిపోయాక చావగా మిగిలిన తక్కువ సైన్యంతో శిబిరానికి వచ్చేశాడు దుర్యోధనుడు. తన మందిరంలో

ప్రవేశించకండా వొక మైదానంమీద ఆగాడు. బంధువులూ, స్నేహితులూ, పరిజనులూ అందరూ చుట్టూ మూగారు.

## ఇప్పుడైనా మించిపోలేదు

దుర్యోధనుణ్ని చూసి జాలిపడుతూ అందుకున్నాడు కృపాచార్యుడు "యుద్ధం మీలాంటివాళ్ళకి ఉత్తమధర్మం. కీర్తి సుగతీ కోరి వెనకటి రాజులూ ఇదే తమ కర్తవ్యంగా భావించారు. యుద్ధాలు చేశారు. అయినా వ్యతిరేకంగా వొకమాట చెపుతాను. బాగావిని అది మంచిదైతేనే చేద్దువుగాని. కాకపోతే మానేద్దువుగాని. ఆలకించు.

"భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ యుద్ధంలో ముక్కాకలు తేరినవాళ్ళు; మహావీరులు. తక్కినరాజులు అలాంటివాళ్ళే. మన వాళ్ళు యావన్మందీ అలాంటివాళ్ళే. అయితే భుజశక్తీ, దైవబలమూ అధికమైంది పాండవులికి. అందరినీ చంపేశారు. మనలో సమర్థులు రాలిపోయారు. మిగిలినవాళ్ళూ దెబ్బలుతినేశారు; బాగా ఇడ్డైపోయారు. వాళ్ళని కంటికి రెప్పలా కాపాడుతున్నాడు శ్రీకృష్ణుడు. అంచేత చెక్కుచెదరకండా వున్నారు వాళ్ళు.

"అర్జునుడు ఐరావతం. తెల్లగుర్రాలు నాలుగూ నాలుగు దంతాలు. కౌరవసేన వరస్సు, విచ్చలడి విహారం చేస్తున్నా డతడు,

"అర్జునుడు సింహం. అతడి ధనుష్టంకారం గర్జన. బాణాలు గోళ్లు. శత్రువులు ఏనుగుమంద. చీలుస్తున్నా అతడు. అతణ్ణి తేరి చూడడం అసంభవం.

"ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా, శల్యుడూ, నేనూ, నువ్వూ, నీతమ్ముళ్లూ — ఇంతమంది మీ ప్రాణాలు వొడ్డి పోరాడినా జయద్రథుడితల నరికేశా డతడు మనిషిమాత్రుడు చెయ్యగల పనేనా అది!

"ఇవాళకి పదిహేనుదినాలు యుద్ధంజరిగింది. అలిసిపోయి, బాగా చిదికిపోయారు మనవాళ్లు. అర్జునుడి పరాక్రమంవల్ల, పాండవయోధులు చెక్కుచెదరలేదు. చీకూ చింతా లేకండా చెల రేగుతున్నారు. బలపరాక్రమాలు కూలిపోయి కళ్ళులేని కబోదిలా వుంది కౌరవసేన. ఈతక్కువ సేన చంపడం అర్జునుడికి నిమిషాలమీదపని.

"అశ్వత్థామా, కృతవర్మా, నేనూ వున్నామే అనుకో. అయినా సాత్యకీ, భీముడూ రెండువక్కలా వుంటే మేమందరమూ వొకకడి అనుకో అర్జునుడికి. భీముడుచేసిన ప్రతిజ్ఞల్లో వొకటి తీర్చేసుకున్నాడు. రెండోదికూడా పూర్తిచెయ్యకండా వొదిలిపెట్టడు. అయితే ఇప్పుడైనా మించిపోలేదు. ధర్మరాజు మెత్తదనం పురస్కరించుకుని సంధిచేసుకోవలిసిన సమయమిది. ఆగ్రహం వొదిలిపెట్టు. కారణంలేని పగవల్ల వచ్చిపడింది ఈయుద్ధం. రాజులందరూ రాలిపోయారు. భరతవంశంలో ఉత్తములందరూవూడ్చుకుపోయారు. దీర్ఘకోపంకూడదు. దీర్ఘకోపంకలరాజు ఆపదలపాలవుతాడు. తమకి బలం హెచ్చినప్పుడుయుద్ధం చెయ్యడమూ, తగ్గినప్పుడు సంధిచేసుకోడమూ కర్తవ్యమంటారుపెద్దలు. సమర్థులందరూ చచ్చిపోయారు. ఇక భారమంతా నీనెత్తిమీదే వుంది. కనక నామాట విను, ఆత్మనాశనం మహాపాతక మన్నారు పండితులు. పనికిమాలిన ప్రయత్నంవల్ల ఫలమేమిటి చెప్పు? మాకోసం కాదు నేను చెప్పడం: నిన్ను నువ్వు కాపాడుకోమంటున్నాను. నువ్వువుంటే అంతా వుంది. ధర్మరాజు దగ్గిరకి పద. రాజునని గర్వంలే దతడికి, రాజ్యం ధృతరాష్ట్రుడికీ, నీకూ, మిగిలిన తమ్ముళ్ళకీ పంచిపెడతాడు. పెద్దలశుశ్రూషే అతడు ఎప్పుడూ కోరుకుంటాడు. శ్రీకృష్ణుడూ కాదనడు. ధర్మరాజూ, అతడూ కనికారం కలవాళ్ళు. వాళ్ళిద్దరూ చెపితే భీముడూ, అర్జునుడూ, నకులసహదేవులూ అడ్డుచెప్పరు. కనక ఈసు వొదిలిపెట్టు. సంధిచేసుకో. ఇంతచెప్తున్నానూ అంటే, యుద్ధానికి

భయపడి, నా ప్రాణాలు రక్షించుకోడానికి మాత్రం కాదు. నీ మంచి కోసమే చెపుతున్నాను. నామాట విను. విననంటావా, తరవాత నువ్వే తలుచుకుంటావు"

ఇలా, దుఃఖంతో తొణికిసలాడుతూన్న హృదయంతో ఎన్నో విధాల నచ్చచెప్పాడు కృపాచార్యుడు.

## ఇందాక వచ్చి ఇప్పుడా సంధి?

తలవొంచుకుని అన్నీ విన్నాడు దుర్యోధనుడు. వేడివేడి నిట్టూర్పులు విడిచాడు. కొంచేపు విచారిస్తూ వూరుకున్నాడు.

"ఇంతవరకూ వచ్చి ఇప్పుడా సంధి?" వాల్చిన కళ్ళెత్తి, కృపాచార్యుల మొహం చూస్తూ అందుకున్నాడతడు- "నేను నాశనం కావడం సహించలేక హితం చెప్పావు. అనురాగం వున్న ఆప్తులు బుద్ధులు చెప్పడం ధర్మం. యుద్ధంతలమునకలయి, అవసరం వచ్చినప్పుడు ఆదుకుంటావని తెలుసు నాకు. నీ ప్రేమవల్ల, నాకుఆపద రాకండా చెయ్యాలని, సంధిచేసుకోడం మంచిదంటున్నావు. కాని, ఇంతవరకూ వచ్చాక ఇప్పుడు సంధి నచ్చలేదు నాకు. ఏమంటావా? కపటజూద మాడించి రాజ్యం లాక్కున్నాం. ఒంటిబట్టతోవున్న రజస్వలని ద్రౌపదిని జుత్తు పట్టి సభకి ఈడ్చుకువచ్చాం. సంధికోసం కృష్ణుడు వచ్చినప్పుడు కాదు పొమ్మన్నాం. అంతమందిమీ కలిసి అభిమన్యుణ్ణి హతమార్చాం. ఇవాళ భీముడు దుశ్శాసనుడి రొమ్ముచీల్చి రక్తంతాగడం చూసి, మిగిలిన ప్రతిజ్ఞ పూర్తిచేస్తాడని భయపడి, స్నేహానికి చేతులుచాస్తే మాత్రం ఎలాకుదురుతుంది సంధి? కడుపులోలేంది కౌగిలించుకుంటే వస్తుందా? రాజులు కొలుస్తూవుంటే, భూమండలమంతా పరిపాలించాను. అయినవాళ్ళని పోషించాను. కానివాళ్ళ కంటిమంటగా వెలిగాను. తీరా ఇప్పుడు వొకడి దయకోసం చెయ్యిచాచడం ఈజన్మకి

జరగదు. యుద్ధం - యుద్ధంతప్ప బిచ్చమెత్తిన రాజ్యసౌఖ్యం అక్కర లేదు నాకు, ఇదే నానిశ్చయం. యుద్ధంతప్పదు. నీమాట వినలేదను కోకు. యుద్ధానికి అంగీకరించు. వైభవమూ, ప్రతాపమూ, కీర్తి మంట కలపలేను. ధర్మరాజు ముందు తలవొగ్గలేను. సబ్బరంగా యుద్ధంచేస్తాను. భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, జయద్రథుడూ మొదలైన బంధువులూ, స్నేహితులూ పోయిన ఉత్తమగతికి పోయి సుఖపడతాను.

"అయినా మగతనానికి అన్నాను కాని అంతవరకూ ఎందుకు వస్తుంది? ఈవున్న రథికులతోనే తెగించి యుద్ధం చేస్తాను. పాండవుల్ని పడగొడతాను. నువ్వేచూసి మెచ్చుకుందువు కాని" అన్నాడు.

దుర్యోధనుడి నిశ్చయం విని చుట్టూవున్న రాజులు సంతోషించారు. యావన్మందిహృదయాల్లోనూ రణోత్సాహం రగులుకుంది. ఓడిపోయిన చింతా వంతా మరచిపోయారు. దుర్యోధనుణ్ణి మెచ్చుకున్నారు. తమతమ సేనలికి ఉత్సాహం కలిగిస్తూ వీరాలాపాలాడారు.

## సరస్వతి వొడ్డున

అప్పుడు కృపాచార్యులూ, అశ్వత్థామా, కృతవర్మా, శకునీ, శల్యుడూ ఆలోచించి దుర్యోధనుడితో అన్నారు: "మహారాజా ఈ రాత్రి మనం శిబిరంలో నిద్రపోకూడదు. ఏమంటావా? కర్ణుణ్ణి చంపిన ఉత్సాహంతో వుప్పొంగిపోతూవుంటారు పాండవులు. అంచేత శిబిరం మీద దండెత్తి ఆక్రమించినా ఆక్రమించవచ్చు వాళ్ళు. వాళ్ళకళ్ళలో కారంకొట్టాలి మనం. దూరంగా వెళిపోదాం. చతురంగ బలాలు సరి చేసుకుందాం. అడలుపుట్టించి రేపు వాళ్ళమీద విరుచుకుపడదాం. అలా అయితే గెలుపు మన చేతిలో వుంటుంది."

"మంచిది, నాకు నచ్చినమాట చెప్పారు" అన్నాడు దుర్యోధనుడు. తగిన సేనానాయకులందరికీ ఆదేశించాడు. కదిలి, అక్కడి

నించి రెండామడల దూరంలో సరస్వతీనది దగ్గిరికి వచ్చేశాడు. అక్కడ మైదానంమీద దండు విడిశారు. యావన్మందితోనూ సరస్వతిలో మనసారా స్నానాలు చేశారు. ఏనుగుల్నీ గుర్రాల్నీ స్నానాలు చేయించాడు. శిబిరంనించి భోజనాలూ అవీ తెప్పించాడు రకరకాల పదార్థాలతో తృప్తిగా యావన్మందీ భోజనాలు చేశారు. కులాసాగా కబుర్లుచెప్పుకుంటూ కూచున్నారు.

కృపాచార్యులూ, అశ్వత్థామా, కృతవర్మా, శకునీ, చిత్రసేనుడూ మొదలైన నీకుమారుల్నూ, కర్ణుడికొడుకు సత్యసేనుడూ మొదలైన ఆప్తులు ఆలోచించుకుని దుర్యోధనుడితో అన్నారు: "మహారాజా, తగిన సర్వసేనాధిపతి కావాలి, ఇప్పుడు, రణకౌశలమూ, సామర్థ్యమూ, పరాక్రమమూ అన్నీ కలిగి, శత్రువుల్ని చెండాడుతూ, ముందుకి నడిచి, సేనలు నడిపించగల ధీరుణ్ణి ఎంచాలి నువ్వు."

"అవును," ఆదరంగా అశ్వత్థామతట్టు చూశాడు దుర్యోధనుడు "గురువు తరవాత గురువంతవాడివినువ్వు అతడిలాగే మా అందరికీ నియంతవు. దివ్యాస్త్రాలు తెలిసినవాడివి. కనక నువ్వే ఇప్పుడు హితం చెప్పాలి. సర్వసేనాధిపతిగా ఎవరు తగినవాళ్ళో నువ్వేనిర్ణయించాలి." అన్నాడు.

"శల్యుడే సర్వసేనాధిపతి కాతగినవాడు"అందుకున్నాడు అశ్వత్థామ- "యుద్ధంలో నైపుణ్యం చెప్పుకోవలసి వచ్చినా, మహనీయమైన శౌర్యం చెప్పవలసివచ్చినా, బలం,బాణప్రయోగం,పరాక్రమం ధైర్యం ఏది చెప్పవలసివచ్చినా,శల్యుడిపేరు మొదటి వరసలోచెప్పాలి. నిన్నుపట్టి, తన సొంత మేనల్లుళ్ళని పాండవుల్ని వొదిలేశాడు. ఇతడికంటే పరమహితులు ఎవరున్నారు మనకి? లోకమాన్యుడితడు. అంచేత శల్యుడికి సర్వసేనాధిపతిపట్టం కట్టు. కుమారస్వామిని సేనాధిపతిని చేసుకుని దేవతలు రాక్షసుల్ని గెలిచినట్టుశత్రువుల్ని గెలుద్దాంమనం."

అశ్వత్థామ శల్యుడిపేరు చెప్పగానే రాజులు యావన్మందీ జయజయశబ్దాలతో శల్యుడిచుట్టూ చేరారు. యుద్ధోత్సాహంతో ఉదుకెత్తి పంతాలు పలికారు.

గద్దెదిగాడు దుర్యోధనుడు. వినయంగా శల్యుడిదగ్గిరకి వెళ్ళాడు. "ఆపదలో ఆదుకొనే స్నేహితుడివి నువ్వు. మహనీయుడివి. నువ్వు అడ్డుపడవలసిన ఆపదసమయం ఇది. నాసేనల ఆధిపత్యం వహించు. నన్ను గెలిపించు. కృతార్థుణ్ణి చెయ్యి. నిన్ను ఆశ్రయించాను. నీకు అడ్డేముంది కశ? నేనూ, నేను నమ్మిన నావాళ్ళూ, ఈరాజులూ, సమస్త సేనలతోనూ నీపరిజనులమై నడుచుకుంటాం. మమ్మల్ని నడిపించు" అన్నాడు.

"ఇంతప్రార్థన ఎందుకు మహారాజా," అందుకన్నాడు శల్యుడు "నీదగ్గిరికి ఎప్పుడు వచ్చానో అప్పుడే నాధనమూ, నాప్రాణమూ, సైన్యమూ నీకు సమర్పించేశాను. నువ్వు ఏదిచెపితే అది చేస్తాను. కౌరవసేన కాపాడతాను. కృష్ణుడూ, అర్జునుడూ నాభుజపరాక్రమం ముందు ఉసికట్టు. నేనే కళ్ళెర్రచేస్తే దేవతలైనా పరిగెడతారు. నా వడికి పాండవులా నిలబడతారు? రెండుసైన్యాలూ దద్దరిల్లిపోయినట్టు విజృంభిస్తాను. నాబాణాలతో క్షోభపెట్టేస్తాను. నాఎదటపడి యుద్ధం చేసిన వీరుణ్ణల్లా నరికిపారేస్తాను. ఆకాశంమీద చూస్తున్న దేవతలంతా ఆశ్చర్యపోయినట్టు చేస్తాను. పారిపోకండ నిలబడాలి, పాండవులు అయిదుగురినీ అంతం చేస్తాను. 'భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ మించిపోయాడు, ఎవడీ అసహాయశూరుడు' అనిపిస్తాను, శల్యుడివంటి మొనగాడు ఇంతవరకూ చూడలేదంటూ చూసేవాళ్ళు చెప్పుకున్నట్టు నా ధనుర్విద్యాకౌశల్యం అంతా చూపిస్తాను" అన్నాడు.

# సర్వసేనాని శల్యుడు

తృప్తిపడ్డాడు దుర్యోధనుడు; సంతోషించాడు. బంగారం కడవలతో సరస్వతినీళ్ళు తెప్పించాడు. శాస్త్రప్రకారం తగిన రాజులూ, తానూ దండుమధ్య వైభవంగా అభిషేకించి శల్యుడికి సర్వసేనాధిపతి పట్టం కట్టాడు. శంఖాలూ, భేరీలూ మొదలైన మంగళవాద్యాలు మోగాయి. సైనికులు సింహనాదాలుచేశారు. దీవించవలసినవాళ్ళు దీవించారు. యావన్మందీ పొగిడారు. దశదిశలూ ప్రతిధ్వనించాయి. ఇదంతా అయాక సకలపరివారంతోనూ సంతోషంగా విశ్రాంతి తీసుకున్నాడు దుర్యోధనుడు ఆవాళకి.

ఇక అక్కడ— యుద్ధంలో గెలుపు సంపాదించి ఉత్సాహంతో పుప్పొంగిపోతూ శిబిరానికి వెళ్ళాడు ధర్మరాజు. బంధువులూ, స్నేహితులూ వాళ్ళతో వొకమైదానంలో కొలువు తీర్చాడు. మనవాళ్ళ గుట్టూమట్టూ తెలుసుకోడానికి అంతకిముందే వేగులవాళ్ళని పంపాడు. వాళ్లువచ్చేదాకా ఆమాటా ఈమాటా చెప్పుకుంటూ వినోదాలతో కాలక్షేపం చేశాడు. ఇంతలో వేగులవాళ్లు తిరిగివచ్చారు. మనవాళ్ళ విశేషాలన్నీ చెప్పారు.

"శల్యుడికి సర్వసేనాధిపతిపట్టం కట్టాడు దుర్యోధనుడు" వేగులవాళ్ళు చెప్పింది విని కృష్ణుడి మొహంచూస్తూ అన్నాడు ధర్మరాజు— "మంచి వుషారుగావుంది కౌరవసేన. ఇప్పుడు మనం ఎంచెయ్యాలో పాండవరక్షకుడివి నువ్వే చెప్పాలి. నువ్వు ఎలా చెపితే అలా చేస్తాను."

"శల్యుణ్ణి బాగా ఎరుగుదును" అందుకున్నాడు కృష్ణుడు— "ఉద్దోలమైన బాహుబల మతడిది. బలానికి తగిన శౌర్యమూ, శౌర్యానికి తగిన ధైర్యమూ అతడివి. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ మించినవాడు - కాదంటే సమానుడే అవుతాడు, కాని తగ్గిపోడు.

దుర్యోధనుడు అతణ్ణి గౌరవించాడు; సేనాధిపతి చేశాడు. అంచేత అతడు మరింత పేట్రేగిపోతాడు. భీముడూ, అర్జునుడూ అతడి మీదికి పనికిరారు. సాత్యకి సరిపోడు. ధృష్టద్యుమ్నుడూ, అతడితమ్ముళ్లూ బతికి తిరిగారు. శల్యుడితో సమవుజ్జీ మనసేనలో మరొకడు లేడు. పెద్దపులిలాగ నువ్వేకనబడుతున్నావు. ఇంకొకడైతే ఎన్నో దినాలు పోరాడతా డతడు. నీసేన మిగలకండా చంపేస్తాడు. శత్రుసంహారుడివి నువ్వయితేనా, రేపే అతడి పనిపట్టేస్తావు. మేనమామకదా అని జాలిపడకు. క్షత్రియధర్మం పురస్కరించుకుని శత్రువుని సంహరించు. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ దాటుకు వచ్చాం. శల్యుణ్ణి నువ్వు సంహరించు. దాంతో దుర్యోధనుడిపని అయిపోతుంది."

"నువ్వు చెప్పినట్టే చేస్తాను" అన్నాడు ధర్మరాజు – "అవాళ ఉద్యోగమప్పుడు చెప్పనే చెప్పాను 'శల్యుడు నావంతు' అని. రాత్రి ఎంతో కావచ్చింది. విడిదికి వెళ్లు సుఖంగా నిద్రపో."

కృష్ణుణ్ణీ, తమ్ముళ్ళని, ధృష్టద్యుమ్నుడూ శిఖండీ సాత్యకీ మొదలైనవాళ్ళనీ, తక్కిన పరిజనుల్నీ వాళ్ళవాళ్ళ డేరాలికి పంపించేశాడు. శయ్యామందిరంప్రవేశించాడు. శరీరంలోంచి బాణం పెరికేశాక సుఖంగా నిద్రపోయిన ఏనుగులాగ హాయిగా ఆరాత్రి నిద్రపోయాడు.

సేనసేనంతా నిశ్చింతగా నిద్రపోయింది. ఆరాత్రే నేనువచ్చి కర్ణుడిసంగతి నీకు వినిపించాను. నువ్వు పంపగా రాత్రికిరాత్రి కురుక్షేత్రం వెళ్ళాను. తెలతెలవారేసరికి మనసేన విడిసిన మైదానం చేరుకున్నాను.

నేను వెళ్ళేసరికే సైన్యాలు సిద్ధంచేయడంకోసం నాయకుల్ని సేనానాయకుల దగ్గిరికి పంపుతున్నాడు దుర్యోధనుడు. సేనలో అంతటా ఉత్సాహం వుప్పొంగిపోతూవుంది. యావన్మందీ తమతమ చతురంగ బలాలు సిద్ధంచేసుకుంటున్నారు. రణవాద్యాలు ద్రమాంద్రమ

మోగాయి, ఒకళ్ళనొకళ్ళు పిలుచుకున్నారు. కేకలూ, పేరాలూ పాలూ ఆకాశం హోరెత్తిపోయింది. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, భటులూ బయలుదేరి భూమి దడదడలాడింది. ఆ రాణువ కలకలం చంద్రోదయమప్పుడు ఉప్పొంగిన మహాసముద్రంలా అనిపించింది.

శల్యుడూ, శకుని, కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా, తక్కిన యోధులూ కలిసి తమ్ముళ్ళతో వొకదగ్గిరవున్న దుర్యోధనుడిదగ్గిరికి వచ్చారు. అతడు వినేట్టు తమలో తాము మాట్లాడుకున్నారు:

"మనం వొక్కొక్కళ్ళం పాండవులతో కలబడకూడదు. సేనలతో అందరం వొక్కగుంపుగా కలబడాలి. అప్పుడూ వాళ్ళని అవలీలగా అంతం చెయ్యడం! మనం వొకళ్ళకి వొకళ్ళం దన్నయి, పట్టుదలతో యుద్ధంచేస్తే ఇట్టే గెలుపు సాధించవచ్చు. ఇది మన శపథమన్నమాట. "ఒంటిగా యుద్ధంచేసినా, ఒంటిగా యుద్ధంచేస్తున్న వాడితో కలియక పోయినా పంచమహాపాపాలు చేసినట్టు" అని వొట్టు పెట్టుకున్నారు.

## కౌరవసేన కదిలింది

కౌరవసేన కదిలింది. ఉద్ధోలమైనబలంతో సర్వసేనాని శల్యుడు ముందునడిచాడు. ఏనుగులు నడిచాయి; భూమి గజగజలాడింది. ఝుంకారంతో, మదధారలకోసం తుమ్మెదలు పరిగెత్తుకు వచ్చాయి. చిరుగజ్జెల చెవులతో వాటిని రొప్పుతూ ఝుళంఝుళ శబ్దంచేశాయి ఏనుగులు. రేగిన దుమ్ము తొండాల తుంపర్లతో అడగగొట్టాయి. వాటి మెడగంటలు గణగణా మోగాయి. వాటినినుంచి అవి గీపెట్టాయి. మేఘాల్లా అవికదులుతూ అందంగా, భయంకరంగా అవుపించాయి.

కదంతొక్కుతూ, ఝుణఝుణా చిరుగంటలు మోయిస్తూ ఇకిలిస్తూ బయలు దేరాయి గుర్రాలు. మగడి గోటినొక్కులతో ఆడది

ఎలా అవుపిస్తుంది, అదిగో అలాగ వాటి డెక్కలగుర్తులతో అవుపించింది భూదేవి.

బిరుదు జెండాలు ఎగరేస్తూ, ఉరకలేస్తూ పరిగెత్తాయి రథాలు. మీదికి కాళ్లుచాస్తూ పురకలుపెట్టాయి గుర్రాలు పెళ్ళికిబయలుదేరినట్టు నొగలమీద కూచున్నారు సారథులు ఎంత చక్కగా అలంకరించివున్నారో అంత దిగులుపుట్టిస్తున్నాయవి. మొహాల్లో వీరరసం వొలికిపోతున్న చిరునవ్వులు, మెడల్లో మెరిసిపోతున్న హారాలు, వీపులికి అందమైన అంపపొదలు. రక్తాంకళ్ళతో కూచున్నారు రథికులు.

ధైర్యమూ, బలమూ కరిగి పోతపోసినట్టున్న శరీరాలతోనూ, అంతకంటే దృఢమైన మనస్సులతోనూ పురకలువేస్తూ నడిచారు వీరభటులు.

కౌరవసేన రణస్థలం చేరేసరికి అటు పాండవసైన్యమూ వచ్చి చేరింది.

ధృతరాష్ట్రుడు: భీష్ముడిపాటూ, ద్రోణుడిచావూ, కర్ణుడి మరణమూ విన్న నాచెవులికి సంజయా, శల్యుడిచావూ, దుర్యోధనుడి మరణమూ వినిపించు, ఆ ఆనందంకూడా కానీ. శల్యుణ్ణి ధర్మరాజు ఎలా చంపాడు? మా దుర్యోధనుణ్ణి ఎలాకొట్టాడు — భీముడు? యుద్ధ మెలాజరిగింది?

సంజయుడు: ఏడ్చేస్థితి దాటిపోయింది మహారాజా, ధైర్యంతో యుద్ధవార్తలు విను. భీష్ముణ్ణీ ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ పాండవులు పడగొట్టడం కన్నా రాచూసీ కూడా శల్యుడు వాళ్ళని చంపేస్తాడని పేరాసపెట్టుకున్నారు నీకొడుకులు. దిక్కుమాలిన్నీ, అడియాసపెట్టుకుని, తాను నంపన్నుణ్ణే అనుకున్నాడు దుర్యోధనుడు. తమ్ముళ్ళతో కలిసి ఆదరంగా శల్యుడి దగ్గిరకి వెళ్ళాడతడు. కర్ణుడు తెగిపోగానే సంతోషంతో భీముడుచేసిన సింహనాదంతో వాళ్ళ గుండెలు ఇంకా దడదడలాడు

తూనేవున్నాయి. ఓదార్చి, ధైర్యంచెప్పాడు శల్యుడు. వల్లమాలిన ఉత్సాహంతో యుద్ధానికి సిద్ధపడ్డాడతను. సైన్యం పరిచూశాడు. వర్వతోభద్రవ్యూహం పన్నాడు. వ్యూహముఖంలో కుమారులతోనూ, కర్ణుడి కొడుకులతోనూ తాను నుంచున్నాడు. వలపట శక, యవన సేనలతో కృపుడు నిలబడ్డాడు. దాపట త్రిగర్తసేనతో కృతవర్మ నుంచున్నాడు. వెనక కాంభోజసైన్యంతో అశ్వత్థామ నిలబడ్డాడు మధ్య కురువీరులతో దుర్యోధనుడు నించున్నాడు. అతడి ముందు ఏనుగుసేనతోనూ, పెద్ద చతురంగ సేనతోనూ శకుని నిలబడ్డాడు.

అంతకిముందే పాండవులు మూడుదిక్కుల మూడువ్యూహాలు పన్నుకువచ్చారు. ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ ముందు నుంచున్నారు. భీముడూ, అర్జునుడూ ధర్మరాజు ముందుభాగంలో నిలబడ్డారు.

ఉభయసేనలూ అలా వ్యూహాలుపన్నుకుని కయ్యానికి కాలుదువ్వాయి. నాగేటిచాలుతో రెపరెపలాడుతూన్న శల్యుడి జెండా చూశారు పాండవులు. దానికి సూటిగా కేకలువేస్తూ ముందుకి తోసుకువచ్చారు.

ధృతరాష్ట్రుడు. అయితే సంజయా, అప్పటికి మనసేన ఎంతవుందో చెప్పు? పాండవులసేన ఎంతవుంది?

సంజయుడు: మనకి పదకొండువేల రథాలున్నాయి. పదివేల అయిదువందలు ఏనుగులున్నాయి. రెండులక్షల గుర్రాలూ, మూడు కోట్ల పదాతిసేనా వున్నాయి. పాండవులికి ఆరువేల రథాలున్నాయి. మూడువేల ఏనుగులున్నాయి. లక్షగుర్రాలూ, ఒకకోటి పదాతి సేనావున్నాయి.

ఒకదాన్ని వొకటి గెలవాలని రెండుసైన్యాలూ ముఖాముఖి తారసిల్లాయి. ఆ మహాభారతయుద్ధం చూడాలని కుతూహలంకొద్దీ కొండమీద ఎక్కాడా అన్నట్టుతూర్పుకొండమీద తొంగిచూశాడు

సూర్యుడు. ఆలోచించి భవిష్యత్తు గ్రహించేసి, పాండవులు కలకల్లాడి నట్టు పద్మాలు వికసించాయి. కౌరవులు మొహాలు ముడుచుకున్నారా అన్నట్టు కలువలు ముడుచుకుపోయాయి. ఏనుగుల కుంభస్థలాల సిందూరంమీద, జెండాల మాణిక్యాలమీద, సైనికుల వక్షస్థలాల కుంకుమపువ్వుపూతలమీద, సేనానాయకుల కడకంటి కెంపులమీద, దోబూచులాడాడు బాలసూర్యుడు. ఉభయసేనల ధనుస్సులమీదా, బాణాలమీదా, రకరకాల ఆయుధాలమీదా తళతళా మెరిశాడు.

## పద్దెనిమిదో రోజు

సూర్యోదయం అవుతూ అవుతూ వుంది. కురుపాండవసేనలు రెండూ కలబడ్డాయి. వేలువేలు శంఖాలు మోగాయి. వేలువేలు భేరీలు వాగాయి. భూమీ ఆకాశమూ గుబగుబలాడిపోయింది.

రథాలతో రథాలు తలపడ్డాయి. ఏనుగులతో ఏనుగులు ఢీకొన్నాయి. గుర్రాలతో గుర్రాలు, భటులతో భటులు కలబడ్డారు.

ఉగ్రంగా గర్జిస్తూ జడివానకురిసిన మేఘాల్లాగ, మీదియోధులు బాణాలుకురుస్తూవుంటే, ఫీంకారంచేస్తూ రథాలుమట్టడించాయి ఏనుగులు. రక్తంనదిలో తేలాయి రథాలు. రథాలమీదపడి, కదలకండా చేశాయి ఏనుగులు. మళ్ళిపోయినగుర్రాల్నీ, రథికుల్నీ, సారథుల్నీ పచ్చడిపచ్చడిచేసేశాయి. ఒక్కొ మొగిని రాతులూ రథాలు చుట్టుముట్టారు. గుండపిండి చేశారు. అంతా చిత్రంగా జరిగిపోతోంది. ఒక్కణ్ణి పదిమంది చంపేసేవాళ్ళు. పదిమందిని వొక్కడే కొట్టేవాడు. గుంపులుగుంపులు కలబడేవాళ్లు. ఘోరంగా చంపుకునేవాళ్లు. కదలకండా పోరాడుతున్న కాల్బలంమీద అక్రమంగా రథాలూ, ఏనుగులూ గుర్రాలూ విరుచుకుపడేవి. ఇంకింకపిసర్లుచేసి కొట్టేసేవి. తెల్లటి

చామరాలతో ముస్తాబై, వరసలుతీరిపరిగెత్తే గుర్రాలు రెక్కలుచాచి ఎగురుతూన్న హంసల్లా అవుపించాయి. అల్లైతాళ్ళ మోతా, రథచక్రాల క్రేంకారమూ, గుర్రాలడెక్కల చప్పుడూ, ఏనుగుల గంటల గణగణా, ఆయుధాల రాపిళ్ళ ఘోషా — అబ్బా, హోరెత్తిపోయాయి చెవులు. రక్తాలుకారుతూ పోరాడుతూన్న వీరులు పూస్తూన్న మోదుగుల్లా అవుపించారు. చటుక్కున తెగిపోయేవి యోధుల చేతులు; మహాసర్పాల్లా అల్లాడేవి. రక్తం నేలంతా మడుగులు కట్టింది; ఎర్రకలవల చెరువులా అవుపించింది. కుప్పలుకుప్పలు కూలిపోయాయి ఏనుగులు; విరిగిపడిన కొండల్లా కనిపించాయి. యోధుల తొడలూ, ఏనుగుల తొండాలూ తునకలై పడ్డాయి; కలగాపులగమైపోయాయి; అందంగానూ, భయంకరంగానూ అవుపించాయి. రక్తం నదులై పారింది. మెదళ్ళు రొంపి అయాయి. గుండపిండై దుమ్ములు ఇసక అయాయి. తెల్లచామరాలు హంసలయాయి. వాహనాలు వోడలయాయి. అదంతా వోడలయుద్ధంలా కనపడింది.

భీముడూ, అర్జునుడూ నలిరేగిపోయారు. ఇనపకోలలూ అవీ పుంఖానుపుంఖాలు గుప్పించారు. కూరలు తరిగినట్టు మనసేన నురుమాడారు. దద్దరిల్లిపోయింది కౌరవసేన. తిరుగుముఖంపట్టింది. పౌండ్రం పూరించాడు భీముడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ ధర్మరాజుని ముందుపెట్టుకుని తరుముకు వచ్చారు వాళ్ళవెంట నకులుడూ, సహదేవుడూ ఉరికారు. వాళ్ళవడిభరించలేకపోయింది కౌరవసేన. హాహాకారాలుచేసింది. పరుగులుతీసింది.

“అదిగో తెల్లగొడుగు” అదంతా చూసి, సారథితో అన్నాడు శల్యుడు — “అదే, ఆతెల్లగుర్రాలదే ధర్మరాజురథం. మహా వడిగా వస్తున్నాడతడు. తీవ్రంగా కలబడాలి మనం. ఆ దురుసు కాస్తా కట్టించాలి. పులిలాగ ఉరికించు మనరథం. శల్యుడంటే ఏమిటో అందరికీ

చూపిస్తాను. సారథీ, దేవతలే రానీ, దుళ్ళగొట్టేస్తాను. పాండవులు ఏపాటి నాకు, గడ్డిపరకలు ! నువ్వు 'భళీ' అన్నట్టు నా యుద్ధనైపుణ్య మంతా చూపిస్తాను."

శల్యుడిరథం పాండవుల మీాదికి పరిగెత్తింది. సముద్రంలాగ తోసుకువచ్చింది పాండవసేన. ఒడ్డులా అడ్డేశాడు శల్యుడు. ఆశ్చర్యం వేసింది మాకు. శల్యుడి విక్రమం చూసి, పారిపోతున్న మనసేనలు తిరగబడ్డాయి. హోరాహోరి జరిగింది యుద్ధం.

## కర్ణుడి కొడుకులు

నకులుడూ, కర్ణుడికొడుకు చిత్రసేనుడూ యుద్ధంచేశారు. ఇద్దరూ యుద్ధనైపుణ్యం చూపెట్టారు. ఒకళ్ళమీాద వొకళ్ళు బాణాలు గుప్పించు కున్నారు నకులుడి ధనుస్సు నరికేశాడు చిత్రసేనుడు. అతడి నుదుటి మీాద మూడుబాణాలు నాటించాడు. గుర్రాలుకొట్టేశాడు. జెండా వూడ్చేశాడు. సారథిని చంపేశాడు. కత్తీ డాలూ పట్టుకున్నాడు నకులుడు. రథం దూకేశాడు. చికిలిపట్టిన చిల్లకోలలు కొట్టాడు చిత్ర సేనుడు డాలుతో అడ్డుకుంటూ అతడి రథంమీాద వురికాడు నకులుడు. ఒక్కవేటులో చిత్రసేనుడిశిల నరికేశాడు. కుండలాలూ, కిరీటమూ రత్నకాంతులు మెరుస్తూ రాలిపడింది శిరస్సు. పొలికేకలుపెట్టింది పాండవసేన పొర్లుకువచ్చిన దుఃఖంతోనూ, రెచ్చిపోయిన రోషం తోనూ చిత్రసేనుడి సోదరులు సత్యసేనుడూ, సుశర్మా నకులుడిమీాదికి వురికారు. మరో రథమెక్కాడు నకులుడు. యముడిలాగ కోదండ మెత్తాడు. భల్లబాణాలువేసి, అతడిరథం చెక్కెయ్యడం మొదలు పెట్టారు కర్ణుడి కొడుకులు. చిరునవ్వు నవ్వాడు నకులుడు. సత్యసేనుడి గుర్రాలు చంపేశాడు. అతడి ధనుస్సు నరికేశాడు. మరో రథం ఎక్కేశాడు సత్యసేనుడు, మరోధనుస్సు ఎక్కుపెట్టాడు, తలో రెండు

బాణాలుకొట్టి అన్నదమ్ములిద్దర్నీ కిముకీమనిపించాడు నకులుడు. అతడి విల్లు విరిచేశాడు సుశర్మ. ఇంకో విల్లు తీశాడు నకులుడు. కత్తిలాంటిబాణం వేశాడు. సుశర్మజెండా నరికేశాడు. సత్యసేనుడి ధనుస్సు తుంచేశాడు. ఉగ్రుడైపోయాడు సత్యసేనుడు. గబుక్కున ఇంకోధనుస్సు తీశాడు. గబగబా బాణాలు కురిపించాడు. అన్నీ కొట్టిపారేశాడు నకులుడు. క్రూరమైన బాణాలు తొడిగాడు. సత్యసేనుడి గుండెలమీద తగిలించాడు. సుశర్మమీద రెండు నాటించాడు. ఇద్దరూ ఒక్కసారి ఎగబడ్డారు. నకులుడి సారథితల నరికేశారు. సింహనాదాలుచేశారు. అతడి విల్లు విరిచేశారు. రథం ముక్కలుముక్కలు చెక్కలుచెక్కలు నరికేశారు. ఒళ్ళంతా తూంట్లుకొట్టేశారు.

మండిపడ్డాడు నకులుడు. ఉగ్రంగా నాలుకచాచిన మహాసర్పం లాంటి శక్తి తీశాడు. బలంకొద్దీ విసిరి సత్యసేనుణ్ణి ఠారుమనిపించాడు. అన్నపాటు చూశాడు సుశర్మ. దుఃఖంతోనూ, కోపంతోనూ వూగిపోయాడు. శరవర్షం కురిపించాడు. నకులుణ్ణి కప్పెట్టాడు. అంతలో భీముడికొడుకు శ్రుతసోముడు పరిగెత్తుకువచ్చాడు. అతడి రథమెక్కాడు నకులుడు. ఇద్దరూ కలిసి సుశర్మమీద పడ్డారు. బాణాలతో ముంచేశారు.

మడమతిప్పలేదు సుశర్మ. కర్ణుడికి తగిన కొడుకు అనిపించుకున్నాడు. నకులుడిమీదమూడుబాణాలు నాటించాడు. ఇరవై బాణాలు శ్రుతసోముడి రొమ్ముమీద బాదేశాడు. నాగుపాంలాగ లేచాడు నకులుడు. తళతళలాడుతూన్న అర్ధచంద్రబాణం వేశాడు. సుశర్మతల ఎగరగొట్టేశాడు.

కర్ణుడి ముగ్గురుకొడుకుల్నీ నరికెయ్యడంతోనే కాళ్ళకి బుద్ధిచెప్పేసింది కౌరవసేన.

సింహనాదంచేశాడు శల్యుడు. అట్టహాసం మోగించాడు రౌద్రసూచకంగా చెయ్యెత్తి, "ఎలవండీ, నిలవండీ" అంటూ అదిలించాడు. పారిపోతున్న సేన మళ్ళించాడు. మళ్ళీ తిరగబడింది మనసేన, ఘోరాతిఘోరంగా జరిగిపోయింది యుద్ధం. అర్జునుడూ మొదలైన యోధులు అటూ, నీకొడుకులు మొదలైన వీరులు ఇటూ ఉద్ధృతంగా విజృంభించారు. రెండుసేనలూ భయంకరమైన శస్త్రాగ్నిలో మండిపోయాయి.

ఉభయసేనల్లో ఏదీ పౌరుషం వొదిలిపెట్టలేదు. వడి తగ్గించలేదు. పూనిక సడిలించలేదు. భయపడలేదు. ఆకాశంమీద చూస్తున్న దేవతలకి కళ్ళువేడుకగా దారుణమైన యుద్ధంచేశాయి. ఏనుగుల ఘీంకారాలూ, గంటల గణగణలూ, రథచక్రాల క్రేంకారాలూ, జెండాల చిరుగంటల ఝణఝణలూ, గుర్రాల డెక్కల టకటకలూ, వాటి సకిలింపులూ, యోధులు జబ్బలు చరిచిన చప్పుళ్ళూ, వాళ్ళ సింహనాదాలూ దిక్కులు ప్రతిధ్వనించాయి. ప్రతీవీరుడూ, ప్రతిసైనికుడూ అద్భుతమైన ఉత్సాహంతో దెబ్బలాడాడు.

పాండవులమీద ఈగవాలకండా కాపాడుతూ వచ్చాడు కృష్ణుడు. వాళ్ళ బలమూ, శౌర్యమూ అంతకంతకీ అధికమవుతూ వచ్చింది. ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ మొదలైన మొనగాళ్ళు దారుణంగా తరుముకువచ్చారు. కార్చిచ్చుముట్టుకుంటే కళవిళపడిపోయిన లేళ్ళమందలాగ కళవిళపడిపోయింది కౌరవసేన. రొంపిలో దిగబడిపోయిన ఆవుని ఎత్తినట్టు కౌరవసేన నిలబెట్టాడు శల్యుడు.

మన దండులో పుల్కలురాలాయి. ఎన్నో అపశకునాలు పుట్టాయి. ఏవీ లెక్కచెయ్యలేదు నీకొడుకులు. తగిన రాణువతో వెనక చూడకండా పోరాడారు.

అందరినీ దాటుకుంటూ ముందుకి తోసుకు వెళ్ళాడు శల్యసేనాని. వరదలా బాణాలు కుమ్మరించాడు. భీముడూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, ద్రౌపది కుమారుళ్ళూ, నకులసహదేవులూ — ఇంత మందీ ధర్మరాజు ముందుభాగంలో వుంకి పోరాడారు. ఇంతమంది మీదా వడిచూపించాడు శల్యుడు. ప్రతివాణ్ణీ పదేసిబాణాలతో నొప్పించాడు. ధర్మరాజుమీద పదిబాణాలు తగిలించాడు.

పాంచాల, ప్రభద్రకసేనలు శల్యుణ్ణి ఘిరాయించాయి. ఏక టాకీని రెచ్చిపోయాడు శల్యుడు. ఉద్ధోలమైన పరాక్రమం చూపించాడు. కుప్పలు కుప్పలు ఏనుగులు కూలగొట్టాడు. గుర్రాలు తెగేశాడు. రథాలు విరగ్గొట్టాడు. కీర్త్యతప్పించినట్టు జెండాలు పడగొట్టాడు. తెశాక్కాజమూలేని కాల్బలం వూడ్చేశాడు. పేగులు పోగులు పెట్టాడు. రక్తం నదులు పారించాడు.అతడి క్రూరాస్త్రాలు పడినచోటల్లా పీనుగు పెంట అయింది. మనవాళ్ళ సంతోషం ఇంతాఅంతా కాదు, అప్పుడు. దారుణమైన శల్యుడి బాణపరంపరకి భయపడిపోయింది పాండవ సేన. ధర్మరాజు వెనక్కి పారిపోయి తలదాచుకుంది. తన్ను తాను పురికొల్పుకున్నాడు ధర్మరాజు. సరాసరి శల్యుడిమీద వురికేశాడు. వాడివాడి బాణాలు వర్షం కురిపించాడు. అతడి వొళ్లు దుసెళ్ళిపోయినట్టు క్రూరమైన ఇనపబాణం కొట్టాడు శల్యుడు. ధర్మరాజుని దాటుకుని ముందుకివచ్చాడు భీముడు. ఏడుబాణాలు శల్యుడిమీద కొట్టాడు. అలాగే వచ్చి అయిదుబాణాలు తగిలించాడు సహదేవుడు. నకులుడు వచ్చి తొమ్మిది కొట్టాడు. ప్రతివింధ్యుడూ మొదలైన అయిదుగురు అన్నదమ్ములూ చెప్పలేనన్ని బాణాలు గుప్పించారు.

కృపాచార్యుడూ, కృతవర్మా,శకునీ,ఉలూకుడూ, సికుమారుళ్ళూ శల్యుణ్ణే దాటుకువెళ్ళి వాళ్ళని ఎదిరించారు. నవ్వుతూ వెళ్ళి అశ్వత్థామకూడా కలిశాడు.

కృపుడూ, ధృష్టద్యుమ్నుడూ ద్వంద్వయుద్ధంచేశారు. పాండవులు అయిదుగురిమీదా పాతిక బాణాలు బాదేసి, చిరునవ్వునవ్వాడు అశ్వత్థామ. భీముడి చిత్రవర్ణం గుర్రాలు చంపేశాడు శల్యుడు. రథం గెంతేశాడు భీముడు. గదపట్టుకున్నాడు, కౌరవసేనమీద పడ్డాడు. అదేసమయంలో మేనమామ శల్యుడిమీద కలబడ్డాడు సహదేవుడు. తన శూరత్వమంతా చూపించాడు శల్యుడు. అంపవాన కురిపించాడు. అతడి గుర్రాలు కూల్చేశాడు శల్యుడు. సహదేవుణ్ణి దాటుకుని ముందుకి వచ్చింది పాండవసేన. శల్యుణ్ణి ముట్టడించింది. శల్యుడికొడుకు సహదేవుడిమీదికి రథం తోలాడు. కళ్ళల్లో కెంపులు కురిశాడు సహదేవుడు. కత్తి దూసి కిందికి దూకాడు. శల్యుడికొడుకు వేస్తున్న బాణాలు నరికేస్తూ అతడి రథంమీదికి వురికేశాడు. అతడి శిరస్సు నరికేశాడు. దిగి మరో రథ మెక్కేశాడు. కళ్ళముందు కొడుకుతల తెగిపోడం చూశాడు శల్యుడు. దుఃఖం, దుఃఖాన్ని మించిన క్రోధం-వూగిపోయా డతడు. పదునుపట్టిన బాణాలు వర్షం కురిపించాడు-పాండవసేన వుడగొట్టాడు.

## శల్యుడూ భీముడూ గదాయుద్ధం

రథాలవాళ్ళని పాయలుచేసేసి తిన్నగా ధర్మరాజు రథంమీదికి రథం పోనిచ్చాడు శల్యుడు. చికిలిపట్టిన బాణాలు అతడిమీద నిగిడించాడు. చూశాడు భీముడు. భయంకరంగా కనుబొమలు ముడివేశాడు. ఏనుగురక్తంతో ఎరుపెక్కిన ఎనిమిదంచుల గద తీశాడు. వజ్రాయుధంలావుం దది. పొరవదలిన మహాసర్పంలా వుంది. కొండశిఖరంలా వుంది. భయంకరంగా వుంది. దారుణంగా వుంది. ఉగ్రంగా ఎత్తి పట్టుకున్నా డది. ఉద్రేకంతో వురికాడు. రౌద్రంమూర్తీభవించినట్టు దాటి శల్యుడిగుర్రాలు చంపేశాడు. చర్రున తోమరం తీశాడు

శల్యుడు. భీముడి గుండెలమీద నాటించాడు. ఎడమచేత్తో తోమరం పెరికేసుకుని, అదే తిప్పి శల్యుడి సారథిమీద కొట్టాడు భీముడు. దెబ్బతో బోరగిలాపడి ప్రాణాలు వొదిలేశాడు సారథి. రథంలేకుండా అయిపోయాడు శల్యుడు. అయితే చలించలేదతడు. ఘోరమైన గద తీశాడు. గుడ్లురుముతూ రథం దిగాడు. వజ్రాయుధంతో ఇంద్రుడిలాగ, మృత్యుదండంతో యముడిలాగ, త్రిశూలంతో శివుడిలాగ గదఎత్తి భీముడిమీదికి ఉరికేశాడు.

భీముడూ, శల్యుడూ గదాయుద్ధం ఆరంభించారు. శంఖాలూ భేరీలూ — రణవాద్యాలన్నీ ఒక్కసారి గుబగుబలాడాయి. ఏనుగుల యుద్ధంచూసినట్టు రెండుపక్షాలవాళ్ళూ వాళ్ళ గదాయుద్ధం చూస్తూ నుంచుండిపోయారు. "శల్యుడు తప్ప భీముడితో గదాయుద్ధంలో చేతులుకలిపే మొనగాడెవడు ?" అన్నారు కొందరు. "భీముడు తప్పిస్తే శల్యుడిమీద కలబడే మొనగాడెవడు ?" అన్నారుకొందరు. అంతమంది ఆశ్చర్యంగా కళ్ళప్పగించి చుట్టూ నిలబడ్డారు.

మండలగతులతో హుంహుమ్మంటే హుంహుమ్మంటూ, మారుతిరిగి, రంకెలువేస్తూ ఆబోతుల్లాగ కలబడ్డారువాళ్ళు. ఇద్దరూగదలుతిప్పారు. ఖణేలుమంటే ఖణేలుమన్నాయి గదలు. నిప్పులు తుళ్ళి, ఆకాశంమీద జిగేలుమంటే జిగేలుమన్నాయి. ఒకళ్ళ నొకళ్ళు ధిక్కరించుకున్నారు. అడుగులు దభీమనిపిస్తూ జంకించుకున్నారు. ఒకళ్ళని మించినబలం ఒకళ్ళు చూపించారు. ఒకళ్ళనిమించిన మెళుకువతో ఒకళ్ళు పోరాడారు. ఒకళ్ళనిమించిన వడితో ఒకళ్లు ఎనిమిదేసి అడుగులు వెనక్కి వెళ్ళి గభీమని వచ్చి కలబడ్డారు. పొట్టేళ్ళలాగ డీకొన్నారు. ఏనుగులలాగ దెబ్బలాడారు. దిగ్గజం కొమ్ములతో పొడిస్తే కదలని కొండల్లాగ ఒకడు కొడితేఒకడు కదలకుండా నిలబడ్డారు. ఇద్దరికి ఇద్దరూ శౌర్యంలోనూ, పటుత్వంలోనూ, త్రాసులోపెట్టి తూచినా

సమానంగా వుంటూ రసిపించారు. ఇద్దరూ బాగా కొట్టుకుని, రక్తాలు చిమ్ముతూ పూచిన మోదుగుల్లా అవుపించారు. బాగా అలిసిపోయారు. అయినా వడితగ్గకండా పోరాడారు. క్రోధంతో బుసకొట్టారు. కుడి ఎడమలు చూడకండా బాదుకున్నారు. భీముడిగద శల్యుడి మెడ జమ్మలమీద తగిలింది. ఇద్దరూ మూర్ఛపోయారు; పడిపోయారు. ఇటు కౌరవసేనా, అటు పాండవసేనా హాహాకారాలు చేశాయి.

శల్యుడిదగ్గిరికి రథం పరిగెత్తించాడు కృపాచార్యుడు. మూర్ఛపోయినా గద వొదలకండా పడివున్న శల్యుణ్ణి అమాంతంగా ఎత్తి రథంమీద పట్టుకు వచ్చేశాడు. అంతలో తేరుకున్నాడు భీముడు. గదఎత్తి శల్యుణ్ణి పిలిచాడు. అయితే అప్పటికి ఇంకా తెలువుకోలేదు శల్యుడు.

భీముడి ఉద్ధృతం సహించలేకపోయాడు దుర్యోధనుడు. సింహనాదంచేశాడు. తన ఎదటి సేనలతో తరుముకువెళ్ళాడు. ధర్మరాజు ముందున్న రథాలవాళ్ళు చేకితానుణ్ణి ముందుపెట్టుకుని, పొలికేకలతో ఆకాశం పగిలిస్తూ, భీముణ్ణి దాటుకుని మనసేనమీదికి వచ్చారు. పిడుగులాటి బల్లెం విసిరాడు దుర్యోధనుడు. మంటలుకక్కుతూ వెళ్ళింది బల్లెం. చేకితానుడిమీద పడింది. దెబ్బతో చచ్చిపోయాడు చేకితానుడు. పట్టరానికోపంతో మనసేమీద పడ్డారు పాండవులు. వడగళ్ళవానలా కురిపించారు బాణాలు.

శల్యుడు తెలువుకున్నాడు. ధర్మరాజుమీదికి వెళ్ళాడు. దుర్యోధనుడు పురికొల్పడంతో అశ్వత్థామా, త్రిగర్తులూ మూడువేలరథాల వాళ్ళూ అర్జునుణ్ణి ముట్టడించారు. దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడితో ఢీకొన్నాడు. తక్కినయోధులు వొక్కుమ్మొగిని పాండవసేన మథించారు. ఆకాశం ఎత్తున ధూళిరేగింది. కన్నూకన్నూ కనపళ్ళేదు. సింహనాదాలుచేస్తూ, బిరుదులు చెప్పుకుంటూ ప్రాణాలమీద ఆశమాని

పోరాడారు సైనికులు. రక్తం కాలవలుపారింది. దాంతో ధూళి అడగారి పోయింది. "కొట్టండి, పొడవండి, నరకండి" ఆకాశం బద్దలు చేశాయి కేకలు. దారుణంగా జరిగింది దొమ్మియుద్ధం

## శల్యుడి పరాక్రమం

ధర్మరాజుమీద అమ్ములవాన కురిపించాడు శల్యుడు. చిన్న చిరునవ్వుతో పద్నాలుగు బాణాలు నాటించాడు ధర్మరాజు. గట్టి దోకబాణం అతడి బోరమీదతగిలించాడు శల్యుడు. చుర్రుమంది ధర్మరాజుకి. శల్యుడి చక్రరక్షకుణ్ణి చంద్రసేనుణ్ణి చంపేశాడు. తొమ్మిది బాణాలుకొట్టి అతడిసారథిని కెవ్వ్వాకెవ్వ్వామనిపించాడు.

సాత్యకీ, భీముడూ, చేదిసేనా కలిసి శల్యుడిమీదిపడ్డారు. ఎంచి ఎంచి అయిదుబాణాలు భీముడిమీద వేశాడు శల్యుడు సాత్యకిమీద ఇరవైఏడువేసి నొప్పించాడు. తీవ్రమైనబాణాలు కొట్టి పాతికమంది చేదిరథికుల్ని చెండాడాడు. నకులుడూ, సహదేవుడూ వచ్చారు. ఇద్దరు మేనల్లుళ్ళనీ ముచ్చెమటలుపోయించాడు శల్యుడు. ఒళ్ళంతా చిల్లులు పడేట్టు కొట్టాడు.

చూశాడు ధర్మరాజు. పులిలాగ ఉరికాడు. ఛడాఛడి బాణాలు తగిలించాడు. శల్యుడిజెండా ఎగరగొట్టేశాడు. మరింత మండిపోయాడు శల్యుడు తన బాణాల వేడంతా చూపెట్టాడు. భీముణ్ణీ నకులసహదేవుల్నీ పదేసిబాణాలతో నొప్పించాడు. ధర్మరాజు వొళ్ళంతా రక్తాలు కారించాడు. చూసి, భీముడూ, సాత్యకీ, నకులసహదేవులూ నిప్పులు కక్కేరు పాముల్లాటి బాణాలు గుప్పించారు. అన్నీ నరికేశాడు శల్యుడు. అందరిమీదా బాణాలు రువ్వాడు. మరోజెండా రథంమీద ఎత్తించాడు.

# మామా ఎటుపోతావు?

ఉరికి, పిడుగులాంటిబాణం శల్యుడిమీద వేశాడు భీముడు. ఆవ్రావుని మరి ఏడు బాణాలు గుప్పించాడు. వరసపెట్టి వంద బాణాలు కొట్టాడు సాత్యకి. నకులుడు అయిదూ, సహదేవుడు పద్నాలుగూ తీవ్రమైనకోలలు కొట్టారు. రుద్రుడే అయిపోయాడు శల్యుడు. భీముడి మీద డబ్భయిమూడు బాణాలు వేశాడు. అదేవరసని సాత్యకిని పాతిక బాణాలతోనూ, నకులుణ్ణిఅయిదుబాణాలతోనూ, సహదేవుణ్ణి మూడు బాణాలతోనూ, ముచ్చెమటలు పోయించాడు ఒక భల్లంవేసి సహదేవుడి ధనుస్సు తునకలుచేసేశాడు.

"మామా, ఎటుపోతావు!" అంటూ మరో ధనుస్సు అందుకున్నాడు సహదేవుడు. ఉగ్రమైనబాణాలు వేశాడు. భీముడూ, సాత్యకీ మంచిమంచి బాణాలుకొట్టారు. శరీరమంతా తూంట్లుపడేటట్టు శరవర్షం కురిపించాడు ధర్మరాజు. రక్తాలుకారుతూ సెలవేళ్ళపర్వతంలాగ అవుపించాడు శల్యుడు. ఉగ్రమూర్తి అయిపోయాడు అందరికీ అన్నిరూపులై పోరాడాడు. అయిదేసి బాణాలు కొట్టి అంతమందినీ నొప్పించాడు. ధర్మరాజు ధనుస్సు తుంచేశాడు.

"దీంతో నీ అంతం చూస్తాను" అంటూ దబ్బున ఇంకో ధనుస్సు అందుకున్నాడు ధర్మరాజు. శల్యుడి సారథిమీదా, గుర్రాల మీదా దారుణమైన బాణాలుకొట్టాడు. అతడిజెండా ఎగరగొట్టేశాడు.

పట్టరానికోపంవచ్చింది శల్యుడికి. పెదవులు బిగించాడు. పదిబాణాలు ధర్మరాజుమీద గుప్పించాడు. భరించలేకపోయాడు ధర్మరాజు. సొమ్మసిల్లి పడిపోయాడు.

సహించలేకపోయాడు సాత్యకి. రకరకాలబాణాలతో శల్యుణ్ణి కప్పెట్టాడు. దార్లైన భల్లంవేశాడు శల్యుడు. సాత్యకివిల్లునరికేశాడు.

అతడు సర్దుకునేలోపుగ అతణ్ణీ నకులుణ్ణీ భీముణ్ణీ, సహదేవుణ్ణీ మూడేసిబాణాలు కొట్టి నొప్పించాడు.

ధర్మరాజు తెలుసుకున్నాడు. అమాంతంగా ముద్గరం తీశాడు. శల్యుడిమీద విసిరికొట్టాడు. సాత్యకి తోమరం కొట్టాడు. భీముడు భల్లంవేశాడు నకులుడు శక్తిప్రయోగించాడు. సహదేవుడు గద విసిరాడు. వెడల్పాటిబాణాలు గబగబా వేశాడు శల్యుడు. అన్నీ అంతంతదూరంనుంచే కొట్టి పారేశాడు. సింహనాదం చేశాడు. శల్యుడి బాణాలతో పాండవుల ఆయుధాలు తునకలైపోయి ఆకాశం మీదా నిప్పులు మెరిశాయి. కళ్ళుమూసుకుపోయాయి చూశారు.

రోషంతో ఆపాదమస్తకం వణికిపోయాడు సాత్యకి. మంచి మంచిబాణాలు మూడు శల్యుడి సారథిమీద వేశాడు. రెండుబాణాలు శల్యుడిమీద కొట్టాడు. రెండూ శల్యుడివొళ్ళు దూసెళ్ళిపోయాయి. మరింత మండిపోయాడు శల్యుడు. ప్రచండమైన బాణాలు వేశాడు. ధర్మరాజునీ, సాత్యకినీ, భీముణ్ణీ, నకులసహదేవుల్నీ కీచుకీచుమనిపించాడు. ఆప్పాపుని అతడు పాండవుల్ని చంపేస్తాడనే అనుకున్నాడు దుర్యోధనుడు.

తెగించి శల్యుడిమీదికి ఉరికేశాడు భీముడు. సాత్యకీ, నకులసహదేవులూ అతడితో కలిశారు. నలుగురినీ ఊపేస్తూ పోట్లాడాడు శల్యుడు. అతడి మరో చక్రరక్షకుణ్ణి ద్యుమత్సేనుణ్ణి చంపేశాడు ధర్మరాజు చక్రరక్షకులు లేకపోయినా జంకలేదు శల్యుడు. జూలుబట్టి లాగిన సింహంలాగ విజృంభించాడు. భీముణ్ణీ, నకులసహదేవుల్నీ, సాత్యకినీ బాణాలతో కప్పెట్టాడు. వాళ్ళ గుర్రాలమీదా, సారథుల మీద రకరకాల బాణాలు వేశాడు. రక్తాలు కారించాడు.

గుండెల్లో దిగులుపుట్టింది ధర్మరాజుకి. "కృష్ణుడిమాట అబద్ధం కాదుకదా"!- తనలో తాను విచారించాడు- "భీముడూ

మొదలైన మొనగాళ్ళు తట్టుకోలేకపోతున్నాం" అనుకుంటూ సేనకి చెయ్యూపిసిరాజు. సముద్రంకెరటాల్లాగ పాండవుల చతురంగసేన శల్యుడి మీదికి నడిచింది. అది మహాసముద్రమైతే శల్యుడు మందరపర్వతమై పోయాడు మహారాజా, మహాధైర్యశాలి శల్యుడు. అంతసేనా అల్లకల్లోలంచేసేశాడు. పాంచాలకుమాళ్ళు మొదలైన యావన్మందినీ, ధర్మరాజునీ బాణాలతో ముంచేశాడు. అతడి రణదాహం అద్భుతం. అతడి బాణపరాక్రమంచూసి మా కళ్ళే మేం నమ్మలేకపోయాం. దేవతలూ, గరుడులూ, ఖచరులూ అతణ్ణి వెయ్యినోళ్ళతో మెచ్చుకున్నారు.

## అర్జునుడూ అశ్వత్థామా

అశ్వత్థామని ముందుపెట్టుకుని అర్జునుడిమీద దాడిచేశారు సంశప్తకులు. రకరకాల ఆయుధాలు కుమ్మరించారు. అందరికీ అన్నిరూపులై పోరాడాడు అర్జునుడు. అంతమందినీ బాణాలతో మంటలు పుట్టించాడు. ఎంతకొడితే అంత మీదపడ్డారు సంశప్తకులు. అతడి గుర్రాలమీదా, సారథి కృష్ణుడిమీదా, రథంమీదా, వానరపతాకం మీదా, అతడిమీదా ఘోరంగా బాణాలవాన కురిపించారు. కాలూ చెయ్యీ కదపలేకపోయాడు అర్జునుడు. గావుకేకలువేశారు కౌరవులు.

వీరావేశంతో విజృంభించాడు అర్జునుడు. భల్లమూ, అర్ధచంద్రమూ, క్షురికాముఖమూ, నారాచమూ మొదలైన బాణాలు గుప్పించాడు. అవి గుర్రాలు కూల్చేశాయి. జెండాలు తుంచేశాయి. బాణాలు నరికేశాయి. ధనుస్సులు విరిచేశాయి. సారథుల్ని చంపేశాయి. రథాలు చెక్కేశాయి. కవచాలు చించేశాయి. చామరాలు కొట్టేశాయి. గొడుగులు విరిచేశాయి రక్తాలు కారించాయి. కండలు తరిగేశాయి. ఎముకలు పగిలించాయి. కాళ్ళు తుంచేశాయి. చేతులు

నరికేశాయి. గుండెలు చీల్చేశాయి. మర్మస్థానాల్లో చొంబడ్డాయి. కిరీటాలు దుళ్ళగొట్టాయి. తలకాయలు రాలగొట్టాయి. ప్రాణాలు పీల్చేశాయి. రౌద్రంపూని, ప్రళయరుద్రుడు ప్రళయతాండవం చేసినట్టు కనపడింది. రెండువేలమంది రథికులు తెగిపోయారు. పెద్ద అడివి దహించిన అగ్నిహోత్రుడిలాగ అవుపించాడు అర్జునుడు. అతడి తేజో మహిమ సహించలేకపోయాడు అశ్వత్థామ. పులిలాగ అతడిమీదికి దూకాడు. కత్తుల్లాటి బాణాలు పన్నెండు నాటించాడు. కృష్ణుడిమీద పది తగిలించాడు.

మెచ్చుకుంటూ చిరునవ్వు నవ్వాడు అర్జునుడు. అతడి గుర్రాలు నాలుగూ నరికేశాడు. సారథిని తారుమనిపించాడు. నిండా నారి లాక్కుండానే వేసి అతడిమీద మూడుబాణాలు నాటాడు. ముసలం విసిరాడు అశ్వత్థామ. అయిదు బాణాలతో కొట్టేశాడు అర్జునుడు. పరిఘ విసిరాడు అశ్వత్థామ. ఆరుకోలలతో కొట్టేశాడు అర్జునుడు. మరోమూడు బాణాలు అతడిమీద వేశాడు. ఇంతలో సంశప్తకసేన అశ్వత్థామని తోసుకుంటూ వెళ్ళింది. అర్జునుణ్ణి చుట్టుముట్టింది.

పాంచాలకుమారుడు సురథుడు అశ్వత్థామ మీదికివచ్చాడు. గబగబా వర్షంకురిపించాడు బాణాలు. ఒకేఒక్క బాణంతోడిగాడు అశ్వత్థామ. సురథుణ్ణి చంపేశాడు. అతడి రథం ఎక్కేశాడు. ప్రచండ మైన బాణాలువేసి అర్జునుణ్ణి ముట్టడించాడు. ఉప్పొంగిపోయారు సంశప్తకులు.

పగలు రెండు జాములయింది.

దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుణ్ణి కదలనివ్వలేదు. అయిదు బాణాలు కొట్టి అతణ్ణి నొప్పించాడు. మరో తొంభై బాణాలు వొంటి నిండా నాటించాడు. విషసర్పాల్లాటి బాణాలు డబ్బయి కొట్టాడు ధృష్టద్యుమ్నుడు. కీచుకీచుమనిపోయాడు దుర్యోధనుడు. అతడి

తమ్ముళ్ళు పెద్దసేనతో వెళ్ళారు. ధృష్టద్యుమ్నుణ్ణి ముట్టడించారు. అస్త్రాలూ, శస్త్రాలూ కుమ్మరించారు. బొమలు ముడివేశాడు ధృష్టద్యుమ్నుడు, పెదవులు కొరుకుతూ విజృంభించాడు. తీవ్రమైన బాణాలు కురిపించాడు. టూటాలు ఖండించాడు సోకొడుకులు.

కృపుడిమీదా, కృతవర్మమీదా శిఖండిదాడిచేశాడు. అతడికి ప్రభద్రకులు తోడ్పడ్డారు వల్లమాలినవడి చూపించారు. కృపుడూ, కృతవర్మా నిలువునా మండిపోయారు. తమ చేవంతా చూపించారు. అద్భుతంగా పోరాడారు. శత్రువుల్ని ముచ్చెమటలు పోయించారు.

## మామా అల్లుళ్ళు

ధర్మరాజునీ, భీముణ్ణీ, నకులసహదేవుల్నీ, సాత్యకీ మొదలైన వాళ్ళనీ ముప్పతిప్పలు పెట్టాడు శల్యుడు. బాణాలమీద బాణాలు వేసి నొప్పించాడు. నకులుడు పదిబాణాలు అతడి గుండెలమీద కొట్టాడు. బొమలు ముడివేశాడు శల్యుడు. మూడుబాణాలు మేనల్లుడి మీద తగిలించాడు. తక్కిన మేనల్లుళ్ళు ముగ్గురూ వొక్కుమ్మిగిని అతడిమీద పడ్డారు. వాళ్ళతో సాత్యకి కలిశాడు. నలుగురినీ ఉగ్రమైన బాణాలతో కప్పెట్టాడు శల్యుడు. మంగలికత్తిలాటి బాణం కొట్టి నకులుడి ధనుస్సు నరికేశాడు.

నాగుపాంలాగ లేచాడు నకులుడు. మరో మంచిధనుస్సుఅందుకున్నాడు. వరసబాణాలు కురిపించాడు. సాత్యకి తొమ్మిది వేశాడు. ధర్మరాజు పదీ, సహదేవుడు పదీ తగిలించారు. డబ్భైతొమ్మిది బాణాలు బాదేసి సాత్యకిని గిప్పెట్టించాడు శల్యుడు. కత్తిలాటి బాణం వేశాడు. అతడి ధనుస్సు నరికేశాడు. గుర్రాలు కూల్చేసి, వంద బాణాలు అతడిమీద నాటించాడు. అలా అతడికొవ్వు అడిచేశాడు శల్యుడు. మేనల్లుళ్ళ బాణాలు మీదికి రాకండా కాసుకున్నాడు.

మధ్యలోనే వాటిని తుంచేశాడు. ఒక్కడూ అతడిదగ్గరికి చేరలేక పోయారు.

మరో రథంవేసుకు మళ్ళా పరిగెత్తుకువచ్చాడు సాత్యకి. వడి వడిగా వాడివాడి బాణాలు గుప్పించాడు. ధర్మరాజూ, తక్కిన ముగ్గురుతమ్ములూ అతడితో కలిశారు ఘోరంగా శల్యుణ్ణి ముట్ట డించారు. అయిదుగురితోనూ అసహాయశూరుడై పోరాడాడుశల్యుడు. అతడి బాణాలతో ఆకాశం చీకట్లుకమ్మింది. అతడిచేవా, అతడిలాఘవా అసాధారణమనిపించాయి శత్రుయోధులు అంతమందీ అతడిచేత భంగపడ్డారు. సేనసేనంతా అటే తిరగబడింది.

కృష్ణుడూ, అర్జునుడూ అది చూశారు. సేనయావత్తూ ఏక ముఖంచేశారు. తరుముకువచ్చారు. కృపుడూ, కృతవర్మా అర్జునుణ్ణి ఆక్రమించారు. సహదేవుడూ శకునీ కలబడ్డారు. ద్రౌపదికొడుకులూ, కొందరు రాజులూ, శిఖండీ అశ్వత్థామని ఆక్రమించారు. భీముడు దుర్యోధనుడిమీద పడ్డాడు. నకులునితో కలిసి ధర్మరాజు శల్యునితో తలపడ్డాడు. ఉభయపక్షాల యోధులూ పరస్పరం డీకొన్నారు. రెండుసేనలూ ఉద్ధృతంగా విరగబడ్డాయి అంతకంతకీ అధికంగా రాజుకుంది యుద్ధం.

రౌద్రం మూర్తీభవించినట్టురెచ్చిపోయాడు శల్యుడు. పాంచా లంవాళ్ళూ, యాదవులూ మొదలైన మహారథికులూ, పాండవ యోధులూ- ఇంతమందీ అతణ్ణి అడ్డుకోలేకపోయారు. చిత్రవిచిత్ర మైన గతుల్లో రథం మెరిపించా డతడు. ఎక్కడపడితే అక్కడ ప్రత్యక్ష మయాడు. రకరకాలబాణాలు విరజిమ్మాడు. ఆకాశం కప్పెట్టాడు. మధ్యాహ్నమయినస్నీ సూర్యబింబం అవుపడకుండా అయిపోయింది.

ఏనుగులుచంపుతూకొండలుకూల్చినదేవేంద్రుడిలా కనిపించాడు శల్యుడు. రథాలు ధ్వంసంచేస్తూ మేఘాలుచెదరగొట్టిన పెనుగాలిలా

అవుపించాడు. గాత్రాలు కూలగొడుతూ లేళ్ళమంద చంపుతూన్న పులిలా కనిపించాడు. కాల్బలం రాలగొడుతూ కారడివి కాల్చిన కార్చిచ్చులా కనపడ్డాడు. సర్వసంహారానికి పూనుకున్న యముడిలాగ, ప్రళయరుద్రుడిలాగ, హఠాత్తుగా లేగిన మృత్యుముఖంలాగ శత్రుసంహారం చేశాడతడు. అతడి అద్భుతపరాక్రమంచూసి ఉభయసేనలూ తలలూపాయి.

అంతకంతకీ మరింత మరింత రెచ్చిపోయాడతడు. సేనసేనంతా రకరకాల బాణాలతో నింపేశాడు. అంతకంతకీ భయంకరమైంది అతడి వడి. ధర్మరాజుసేన తట్టుకోలేకపోయింది. పడుతూ లేస్తూ పరుగులు తీసింది. "ఆగండీ, ఆగండీ"– చెయ్యెత్తి కేకలువేశాడు ధర్మరాజు. అదిలించాడు. గద్దించాడు, ఆగలేదు పాండవసేన. తెగించాడు ధర్మరాజు "మామా" అంటూ శల్యుడిమీదికి రథం పరిగెత్తించాడు. రాజు వెళ్ళడంచూసి, పారిపోతున్న సేన వెనక్కి మళ్ళింది. మళ్ళా యుద్ధానికి పూనుకుంది.

## నేను మామనో. నన్ను మామో

తమ్ముళ్ళనీ తన సేనానాయకుల్నీ దగ్గిరికి పిలిచాడు ధర్మరాజు. అందరినీ చూస్తూ అందుకున్నాడు:

"భీష్ముడూ మొదలైన మహావీరుల్ని పడగొట్టారు మీరు. మీ భుజబలం విశ్వవిఖ్యాతమైంది. ఇవాళ మనకి శల్యంలా వున్నాడు శల్యుడు. ఇతడు నావాంతుకి పడ్డాడు. ఇది అడ్డులేకండా సాగేపద్ధతి చెపుతాను, వినండి. నా రథానికి వలపట నకులుడూ, సాత్యకీ, దాపట సహదేవుడూ, ధృష్టద్యుమ్నుడూ చక్రరక్షకులై నడవాలి. వెనక అర్జునుడు పృష్ఠరక్షకుడై రావాలి. భీముడు ముందు నడవాలి. ఇదంతా ఎందుకంటారా? ఇవాళ నేను మామనో, నన్ను మామో

చంపెయ్యడం తప్పదు. తెంపుచేసుకుని బయలుదేరుతున్నాను నేను. కనక గట్టిప్రయత్నంచెయ్యడం కర్తవ్యంనాకు. కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా, శకునీ, దుర్యోధనుడూ శల్యుణ్ణి కాయడానికి శాయ శక్తులా ప్రయత్నిస్తారు. మీరు వాళ్ళని చూసుకుంటే చాలు, నేను శల్యుణ్ణి చంపేస్తాను" అన్నాడు.

అందరూ ధర్మరాజు పూనిక అంగీకరించారు; మెచ్చుకున్నారు. అతడిరథం సర్వాయుధాలతోనూ నింపారు. అతడు చెప్పినప్రకారం అంత మందీ సిద్ధపడ్డారు. ఉత్సాహంతో పుప్పొంగింది పాండవసేన. గణగణా ఏనుగులగంటలు మోగాయి. రథచక్రాలు పురుములు పురిమాయి. గుర్రాల మువ్వలు ఘల్లుఘల్లుమన్నాయి. ధణంధణా నిస్సాణాలు శేగాయి. భటులు సింహనాదాలుచేశారు. రణరంగమంతా హోరెత్తి పోయింది. దిక్కులు ప్రతిధ్వనించాయి.

అలా పెద్దఎత్తుమీదవచ్చాకు ధర్మరాజు. చూశాడు శల్యుడు. ఉద్రేకంతో పుప్పొంగిపోయాడు. తనసేనని హెచ్చరిస్తూ అతడివెంట వెళ్ళాడు దుర్యోధనుడు. సేనల ఉద్ధృతానికి గజగజలాడింది భూమి.

పులీ, పులీ, కలబడినట్టు ధర్మరాజూ, శల్యుడూ కలబడ్డారు పిడుగుల్లాంటి బాణాలు గుప్పించుకున్నారు. ఆ ఇద్దరూ కలబడడమే తడువు, పోలోమంటేపోలోమనికౌరవసేనా, పాండవసేనా కలబడ్డాయి. దొమ్మీయుద్ధం జరిగింది.

భీముడూ, దుర్యోధనుడూ పోట్లాడారు. ఒక అర్ధచంద్రబాణం వేశాడు దుర్యోధనుడు. భీముడి సింహంజెండా సరికేశాడు. మణుల తోనూ, చిరుగంటలతోనూ ఝణఝణలాడుతూ కిందపడిపోయింది సింహపతాకం. అది ఇలాపడిందో లేదో, మరో వెడల్పాటి బాణం కొట్టాడు నీకొడుకు. భీముడి ధనుస్సు తుంచేశాడు. పటపటా పళ్ళుకొరి కాడు భీముడు. భయంకరమైన శక్తితీశాడు. బలంకొద్దీ విసిరికొట్టాడు.

దుర్యోధనుడికుండలా దూసుకుపోయింది శక్తి. మూర్ఛపోయాడతడు మరోధనుస్సు ఎత్తాడు భీముడు. మంగలకత్తిలాటి బాణం వేశాడు దుర్యోధనుడి సారథికల వూడ్చేశాడు. రథం ఈడ్చుకుంటూ పారి పోయాయి గుర్రాలు. కకావికలైపోయింది కౌరవసేన.

కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా అది చూశారు. పాండవ సేనమీదికి పరిగెత్తారు. అమాంతంగా వచ్చాడు అర్జునుడు. వాళ్ళని అడ్డుకున్నాడు. రామరావణ యుద్ధం జరిగిపోయింది.

తిరగబడింది కౌరవసేన శల్యుణ్ణి దాటుకుంటూ వెళ్ళింది. ధర్మరాజుని ముట్టడించింది రకరకాల బాణాలు కురిపించింది. దారుణ మైన ఆయుధాలు కుమ్మరించింది.

యమధర్మరాజులా రెచ్చిపోయాడు ధర్మరాజు. చిత్రచిత్రమైన గతులతో రథం పరిగెత్తించాడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలమూ కూలగొట్టాడు చతురంగసేన తునాతునకలై పోయింది. పోగులుపడింది. రక్తంతో రొంపిరొంపి అయిపోయింది రణరంగం. అందులో మునిగి తేలాయి కళేబరాలు. వీరవిహారంచేశాడు ధర్మ రాజు. ధర్మరాజుని మెత్తనివాడనే వాళ్ళు జనులు. శత్రువులికిమాత్రం నిష్ఠురుడైపోయాడతడు. "ద్రోణాచార్యుల శిక్షణ వ్యర్థంకాలేదు"- ఆశ్చర్యపోతూ మెచ్చుకున్నారు దేవతలు.

శల్యుడి ఎదటి సైన్యభాగమంతా బయలైపోయింది. క్షణ క్షణానికీ నలిరేగిపోయాడు ధర్మరాజు. వాడివాడి బాణాలతో వేడి చూపించాడు శల్యుడు. మేనమామఅని మెత్తపడలేదు ధర్మరాజు. అతడి బాణాలన్నీ కొట్టిపారేశాడు. చిన్నచిరునవ్వుతో బాణంమీద బాణం తగిలించాడు.

ధర్మరాజు అనంతవిజయం పూరించాడు. శల్యుడు తన శంఖం

పూడాడు. అటూ, ఇటూ భేరీలూ అవీ భోరుభోరున మోగాయి. ఆకాశం గింగురుమంది. రెండు సేనలూ గుబగుబలాడాయి.

ధర్మరాజూ, శల్యుడూ ఘోరమైన బాణాలు గుప్పించుకున్నారు. రక్తాలుకారి, ఇద్దరూ పూచిన బూరుగుచెట్లలా అవుపించారు. కాకలానికీ, సామర్థ్యానికీ, చేవకీ ఇద్దరూ వొక్కలావున్నారు. "శల్యుణ్ణి చంపేసి, ధర్మరాజే రాజ్యమేలుతాడో, ధర్మరాజునికొట్టేసి, శల్యుడు దుర్యోధనుణ్ణే రాజుచేస్తాడో"- సందేహంలోపడ్డారు చూసేవాళ్ళు.

ధర్మరాజు ధనుస్సు తుంచేశాడు శల్యుడు. ఏకటాకీని వంద బాణాలు బాదేశాడు. నిలువునా సిప్పులుగురిశాడు ధర్మరాజు. ఇంకో ధనుస్సు తీశాడు. గుక్కతిప్పుకోండా మూడు వందల బాణాలు గుప్పించేశాడు. శల్యుడిగుర్రాలు కొట్టేశాడు. సారథిని పూడ్చేశాడు. జెండా ఎగరగొట్టేశాడు, కాలూ, చెయ్యీ కదపలేకపోయాడు శల్యుడు. క్షణంలో అయిపోయేవాడతడు. తలవెంట్రుకవాసి తప్పిపోయింది. గెద్దలా వాలాడు అశ్వత్థామ. అమాంతంగా రథంమీదికి తెచ్చేశాడు. తప్పించి పట్టుకువచ్చేశాడు. సింహనాదంచేశాడు ధర్మరాజు. కౌరవసేన వెంటతరిమాడు.

మరో రథం కూర్చుకున్నాడు శల్యుడు. శరవర్షంకురిపిస్తూ ధర్మరాజు మీదికి పరిగెత్తాడు. పాండవసేనతో పేరుపడ్డ మొనగాళ్ళందరూ సేనలతో అతడిమీదికివచ్చారు. సాత్యకిమీద పది బాణాలు కొట్టాడు శల్యుడు. భీముడిమీదా, నకులసహదేవులమీదా తలో మూడూతగిలించాడు. పట్టపగ్గాలు లేకపోయాయతడికి. బాణవేగంతో పాండవసేనలో చొరబడిపోయాడు. వీరవిహారంచేశాడు. చెరువు కలిచేసిన మదపుటేనుగులాగ, లేళ్ళగుంపమీద పడిన సింహంలాగ, ఎండిన అడివిలో దావాగ్నిలాగ, త్రిపురసంహారంచేసిన ఫాలాక్షుడిలాగ శత్రుసేనకలిచేసి, చంపేసి, మాడ్చేసి, సర్వదుంపనాశనంచేసేశాడు.

ధర్మరాజు ముందున్న చతురంగసేన హాతవార్తశాడు ధర్మరాజు మీాద కలబడ్డాడు. నకులసహదేవులూ, సాత్యకీ, భీముడూ — వీళ్ళని వెంటపెట్టుకుని ఎదిరించాడు ధర్మరాజు. నల్లతాచుల్లాటి బాణాలు తొడిగాడు. మేనమామ గుండెలమీాద నాటించాడు.

మనసేన పురికొల్పాడు దుర్యోధనుడు. పొలోమని తోసుకు వెళ్ళారు మన సైనికులు. పాండవయోధులతో పోరాడారు.

ధర్మరాజు వొళ్ళు తూంట్లు పడేట్లు ఏడుబాణాలు కొట్టాడు శల్యుడు. తొమ్మిదిబాణాలు కొట్టాడు ధర్మరాజు. పెద్దపులుల్లాగ, మదపుటేనుగుల్లాగ, సింహంకొదమల్లాగ ఇద్దరూ యుద్ధం చేశారు. ఒకళ్ళని వొకళ్లు నొప్పించారు. ఒకళ్ళని వొకళ్ళు కీచుకీచు మనిపించారు. దిట్టమైన ఎనప బాణాలు అరిపోశాడు శల్యుడు. ధర్మరాజు రొమ్ములమధ్య నాటించాడు. అంతకంటే ఘోరమైన బాణం నాటించాడు ధర్మరాజు. దెబ్బతో తెలివితప్పిపోయాడు శల్యుడు. సింహనాదంచేశాడు ధర్మరాజు. అంతలోనే తెలివుకున్నాడు శల్యుడు. కళ్ళల్లోనిప్పులుకక్కాడు. అగ్గిపిడుగులాటి బాణంవేశాడు. ధర్మరాజుని నొప్పించాడు. ఒకటిమీాద వొకటి ఆరుబాణాలు వేశాడు ధర్మరాజు. శల్యుడి బంగారుకవచం నరికేశాడు. తొమ్మిదిబాణాలు అతడిగుండెలు దుసెళ్ళిపోయినట్టు కొట్టాడు. మంగలికత్తుల్లాటి రెండు బాణాలు వేశాడు శల్యుడు. ధర్మరాజుధనుష్షుతునకలుచేశాడు. ఇంకోధనుస్సు అందుకున్నాడు ధర్మరాజు. శల్యుడివొళ్ళు చీలికలుచేశాడు.

ధర్మరాజుకి దన్నయి పోరాడాడు భీముడు. పిడుగుల్లాటి బాణాలు గుప్పించాడు. మరో కవచం వేసుకున్నాడు శల్యుడు ధర్మరాజు కవచమూా, భీముడికవచమూా నరికేశాడు. బుజాలు దూసుకుపోలునట్టు అన్నమీాద తొమ్మిది బాణాలూ, తమ్ముడిమీాద నెండూ తగిలించాడు.

కృపాచార్యుడు ధర్మరాజు సారథిని చంపేశాడు. శల్యుడు గుర్రాలు కూల్చేశాడు.

"కృష్ణుడిమాట అబద్ధం కాదు కదా!" దిగాలుమని, తనలో తాను శంకించాడు ధర్మరాజు-"శల్యుణ్ణి గెలవమన్నాడు నన్ను. దైవ బలం ఎలా వుందో, ఏమవుతుందో?" అనుకున్నాడు. అంతలోనే, ధైర్యం తెచ్చుకున్నాడు. "జగన్నాథుడు శ్రీకృష్ణుడు. అతడిమాట అబద్ధమెందుకవుతుంది? కృష్ణా, నీమాట అమోఘం కావాలి." మనస్సులో కృష్ణుణ్ణి ప్రార్థించాడు. శివుణ్ణి ధ్యానించాడు. "మూడుకళ్ళ దేవుణ్ణి త్రిశూలంతో తేజరిల్లేవాణ్ణి, నిర్గుణుణ్ణి, రాక్షసుల్ని సంహరించేవాణ్ణి, చతుర్భుజుణ్ణి ఆశ్రయిస్తున్నాను. యుద్ధంచేస్తున్న అర్జునుడి ఎదటి భాగాన ప్రచండమూ, ఉగ్రమూ అయిన త్రిశూలం పట్టుకొని, శత్రు కోటి సంహరిస్తూ, నాకళ్ళముందు కేళిచేస్తున్న దేవుణ్ణి, పురుషో త్తముణ్ణి జయంకోసం ప్రార్థిస్తున్నాను."

ఉన్నతమూ, అపూర్వమూ అయిన శరీరకాంతితో ప్రకా శించాడు ధర్మరాజు మెల్లిమెల్లిగా శల్యుడిమీద బాణాలు వేశాడు. ఆబాణాలు చూసి, ధర్మరాజుశక్తి చల్లబడిపోయిం దనుకున్నాడు శల్యుడు. చెల రేగిపోయాడు. గబగబా బాణాలు గుప్పించాడు.

చూసి, పళ్ళుబిగించాడు భీముడు. ఒక వాడిబాణం వేశాడు. శల్యుడివిల్లు తుంచేశాడు. నిప్పులు కక్కిన బాణాలు గుప్పించాడు. అతడి వొళ్ళంతా రక్తాలుకారించాడు. గుర్రాలు చంపేశాడు. సారథి పీక తెగేశాడు కత్తుల్లాటిబాణాలు కొట్టాడు. శల్యుడికవచం చీల్చేసి కిందపడగొట్టేశాడు. అదంతా లిప్తలమీద చేసేశాడు.

రథంపోయీ, ధనస్సువిరిగీ, కవచంలేకండా అయిపోయాడు శల్యుడు. డాలూ కాలసర్పంలాటి కత్తీ పుచ్చుకుని రథందిగాడు. కళ్ళల్లో అగ్గి కురిశాడు. ధర్మరాజు మీదికి పరిగెత్తాడు. పట్టుమని

పదిఅంగుళాలు వేళాడ్తో లేదో, అతని కత్తీ, డాలూ ముక్కలకింద కొట్టేశాడు భీముడు. కేకలూ,రణవాద్యాలూహోరెత్తించారు పాండవులు.

## శల్యాదివధ

నేర్పూ, చేవా కల శల్యుడి పరిజనులు చప్పున కవచమూ, గదా అతడికి అందించారు. రెప్పపాటులో కవచం వేసుకున్నాడు శల్యుడు గదతిప్పుతూ, ధర్మరాజుమీదికి వేగలా పరిగెత్తాడు. సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, ద్రౌపదికొడుకులూ, నకులసహదేవులూ రకరకాల బాణాలు కురిపించారు. లక్ష్యపెట్టలేదు శల్యుడు. చిత్రవిచిత్రంగా గదతిప్పుతూ, అవన్నీ అడ్డుకుంటూ ముందుకిసాగాడు భీముడు. అడ్డు తగులుతూనే వున్నారు. అయినా ఆగలేదతడు. గుర్రాలూ, సారథీ లేని రథంమీదవున్న ధర్మరాజుమీదికి సింహం లాగ వురకలు పెట్టాడు. నిప్పులుకురుస్తూ చూశాడు ధర్మరాజు.

"ఇతడు నావంతు అన్నాడు శ్రీకృష్ణుడు. నువ్వే హతమార్చాలి అని నన్ను పంపాడు" అనుకుంటూ శక్తివేపు చూశాడు. కృష్ణుణ్ణి తలుచుకున్నాడు. "నీభక్తుణ్ణి. జయం చేకూర్చు" అని ప్రార్థించాడు. రోజా పువ్వులూ, గంధమూ పెట్టి తాను పూజిస్తూ వచ్చినశక్తికి నమస్కరించాడు. మణులతో జిగేలుమనిపోతూ, బంగారం చిరుగంటలతో రణరణమంటూ, ఘోరంగావుంది శక్తి. చప్పున తీశాడు. దృఢముష్టితో పట్టుకున్నాడు.

రౌద్రోద్రేకంతో శక్తి పట్టుకున్నాడు ధర్మరాజు. త్రిపుర సంహారంచేసిన శివుడిలాగ మనోహరంగా, భయంకరంగా కనిపించాడు. కళ్ళల్లో ప్రళయాగ్ని మండుతోంది. మీదికి వురుకుతూన్న శల్యుణ్ణి చురచురా చూశాడు. ఆచూపుకి శల్యుడు మసికాకపోడమే చిత్రమనిపించింది.

ఊరికేస్తున్నాడు శల్యుడు. ఇక లిప్తలో ధర్మరాజుమీద పడ తాడు. గదతో బాదేస్తాడు. తరవాత!-

బాహువులు కుంచించాడు ధర్మరాజు. విశాలమైన వక్షస్థలం బాగా చాచాడు. వజ్రాయుధంలాగ జిగేలుమంటూన్న శక్తి బలం కొద్దీ శల్యుడిమీద కొట్టేశాడు. శల్యుడి కవచం దూరి, గుండెలు దూసుకుపోయి, వెన్నుపూస పగిలించి వెళ్ళి, భూమిమీద చొచ్చుకు పోయింది శక్తి. గుండెల్లోంచి, ముక్కులోంచి, చెవులోంచి, కళ్ళ ల్లోంచి రక్తంవాలికి, వొళ్ళంతా అయిపోయింది. రెండుచేతులూ చాసేసి, ధర్మరాజు దిక్కు తలపెట్టి వొరగిలా పడిపోయాడు శల్యుడు. వజ్రాయుధం తగిలి పెద్ద కొండశిఖరం పడిపోతే ఎలా అనిపిస్తుంది, అదిగో అలా అనిపించింది. భూమిమీద బోర్లా పడిన శల్యుడు, భార్య గుండెలమీద వాలిన ప్రాణనాథుడిలా కనిపించాడు ధర్మయుద్ధంలో ధర్మరాజుచేత చచ్చిపడివున్న అతడు విధియుక్తంగా హోమంచేసి వొదిలిపెట్టాక ఆరిపోయిన అగ్నిహోత్రంలా అవుపించాడు.

శల్యుడు కూలిపోగానే అతడి తమ్ముడు ఉగ్రుడైపోయి ధర్మ రాజుమీదికి పరిగెత్తాడు. అందమైన ధనుస్సు అందుకున్నాడు ధర్మ రాజు. అటలాగ, శల్యుడితమ్ముడి ధనుస్సు నరికేశాడు. అతడిరెండా వ్రూడగొట్టేశాడు ఒక వెడల్పాటి బాణంవేసి, అతడి తల నరికేశాడు. కుండలాలతో మెరిసిపోతూ కింద దొర్లిపోయింది అతడితల. వృత్రుణ్ణి చంపిన దేవేంద్రుణ్ణి దేవతలు పొగిడినట్టు ధర్మరాజుని పొగి డారు పాండవసైనికులు. రణదుందుభులు మోగించారు. శంఖాలు పూరించారు. సింహనాదాలు చేశారు. చెదిరిపోతున్న కౌరవసేనని "పట్టండి. కొట్టండి" అంటూ సాత్యకి వెంటతరిమాడు. అతణ్ణి కృత వర్మ అడ్డుకున్నాడు, యాదవవీరులు ఇద్దరూ సింహాల్లాగ పోరాడారు.

కృతవర్మ పదిబాణాలు వేసి సాత్యకిని నొప్పించాడు. గుర్రాలు కీచుకీచుమనిపించాడు. అతడి ధనుస్సు తెంచేశాడు. అంతకంటే మంచిది మరోధనుస్సు తీశాడు సాత్యకి. మెరుపుల్లాటిబాణాలు కృత వర్మ రొమ్ముమధ్య నాటించాడు. గుర్రాలు పొట్టేశాడు. రథం ఇరుసు నరికేశాడు. సారథిని హారుమనిపించేశాడు.

చూసి, రథంపరిగెత్తించాడు కృపాచార్యుడు. కృతవర్మని తన రథంమీద పట్టుకువచ్చేశాడు. మనసేన శోకముడిచేసింది. వెంటతరుముకు వచ్చారు పాండవులు. ఒక్కడేవెళ్ళిఅడ్డుకున్నాడు దుర్యోధనుడు. మరోరథం వేసుకు పరిగెత్తాడు కృతవర్మ. అతడిగుర్రాలు కూల్చేశాడు ధర్మరాజు. అశ్వత్థామ కృతవర్మని తన రథంమీదికి పట్టుకుపోయాడు. కృపాచార్యుడు ధర్మరాజుతో కలబడ్డాడు. అతడి ఎముకల్లో ఆరుబాణాలు నాటించాడు ధర్మరాజు. ఆరుకి పదికలిపి పదహారుబాణాలు వేశాడు కృపాచార్యుడు. అతడిగుర్రాలు కీచుకీచుమనిపించాడు.

## శల్యాదిచుట్టాలు

అప్పుడు, చామరాలూ, తెల్లగొడుగూ అవీ పట్టించి, పెద్ద భద్రగజమెక్కి బయలుదేరాడు దుర్యోధనుడు. ఉత్సాహంతో పుప్పొంగింది కౌరవసేన. పొలికేకలు పెడుతూ శల్యాదిచుట్టాలు ఎంతో మంది దుర్యోధనుడి ఎదటికి వచ్చారు రథాలతోనూ వాటితోనూ పెద్ద పుప్పెనలాగ తోసుకు వెళ్ళారు.

"మీరు ముందుకి తోసుకు వెళ్ళకండి. నాదగ్గిర నిలవండి" — వాళ్ళని వారిస్తూ అన్నాడు దుర్యోధనుడు. కాని వినలేదు వాళ్ళు. నిలవలేదు. "ఏడీ ధర్మరాజు? ఏడీ?" అంటూ పాండవసేనలో దూసుకువెళ్లారు. ధర్మరాజుమీద కలబడ్డారు. రకరకాల బాణాలువేసి

అశ్వత్థ్థని నొప్పించారు. భీముడూ, అర్జునుడూ, నకులసహదేవులూ, ద్రౌపదికుమారుళ్ళూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ చతురంగ సేనలతో ఆరథికుల్ని చుట్టుముట్టారు. వెర్రెత్తిన మొసళ్ళు సముద్రంలో తిరుగాడినట్టు పాండవసేన అల్లకల్లోలంచేస్తూ పోరాడారు శల్యుడి చుట్టాలు.

"వాళ్ళు అలా పోరాడుతున్నారు. మనం చూస్తూ వూరుకోడ మేమిటి?" దుర్యోధనుడిదగ్గిరికివచ్చి అన్నాడు శకుని.

"వాళ్ళు నామాట వింటేనా?" అందుకున్నాడు దుర్యోధనుడు – "నేను వొద్దంటూవుంటే పరిగెత్తారు. మనమేం చేస్తాం? మామా, ఏంచెయ్యాలో నువ్వే చెప్పు నన్నూ, నాపరివారాన్నీ రక్షించడానికి నువ్వే ఆధారం, ఇప్పుడు. ఒకబుద్ధి చెప్పనంపెనచ్చినా, నువ్వే తగినవాడివి."

ఆమాటతో పొంగిపోయాడు శకుని. సైన్యం పరిపాలించడమూ, చెప్పవలసిన మంత్రాంగం చెప్పడమూ తనపనే అని మురిసిపోయాడు. "మహారాజా," మొదలెట్టాడు శకుని. తనకి తోచిన నాలుగుముక్కలూ ఉపదేశించాడు.

"సైనికులు పరాక్రమం చూపించి, సాహసంతో శత్రుసేన మధ్య చొరబడినప్పుడు రాజు వాళ్ళని రక్షించడం ధర్మం. అలా రక్షించని రాజుని లక్ష్యపెట్టరు సైనికులు" అన్నాడు.

"అయితే పదండి" – ఎగపడ్డాడు దుర్యోధనుడు. రణదుందుభులు మోగాయి. పాలికేకలు రేగాయి. చతురంగసేనతో పాండవుల మీదికి పరిగెత్తాడు దుర్యోధనుడు.

అర్జునుడూ, భీముడూ మొదలైన పాండవవీరులు శల్యుడి చుట్టాల్ని చావుదెబ్బలు కొట్టేశారు. ముచ్చెమటలూ పోయించారు. తుదకి అందరినీ చంపేశారు. ఆడత్సాహంతో దుర్యోధనుడి సేనమీద

పడింది పాండవసేన. మనసేన బాగా దెబ్బతినేసింది. గుంపులుగుంపులు కూలిపోయింది. వెనకంజ వేసేసింది. కకావికలైపోయింది. దిగాలు పడిపోయాడు దుర్యోధనుడు. భీష్ముడు పడిపోయినప్పుడూ, ద్రోణుడు కూలిపోయినప్పుడూ, కర్ణుడు తెగిపోయినప్పుడూ ఎలా దుఃఖపడ్డారో అలా దుఃఖపడ్డారు మనవాళ్ళు.

"ధర్మరాజే ఇక మహారాజు, లోకానికి" ఒకళ్ళతో వొకళ్ళు చెప్పుకున్నారు పాండవసైనికులు – "ఇవాళ దుర్యోధనుడు అయిపోతాడు. తప్పదు. పాండవుల గెలుపు విని కుమిలిపోతాడు ధృతరాష్ట్రుడు. ధర్మపరులు గెలవడంలో ఆశ్చర్యమేముంది? హరిభక్తులికి ఐశ్వర్యం తప్పదు"

"మనసేన యుద్ధానికి భయపడి పారిపోయింది" తన సారథిని చూసి అన్నాడు దుర్యోధనుడు – 'నేను ధైర్యంచేస్తే కాని నిలవదు. దానికి రథంతప్ప వీలుండదు. చప్పున మనరథం పట్టుకురా."

గుర్రాలమీద రథం పట్టుకువచ్చాడు సారథి. ఏనుగు దిగి రథమెక్కాడు దుర్యోధనుడు. పౌరుషంతో వొళ్ళుపొంగించాడు. సేనలికి అడ్డంగా రథం వరిగెత్తించాడు.

"ఎక్కడికి పారిపోతారు?" చేయెత్తి హెచ్చరించాడు – "కొండలెక్కినా ఎక్కివస్తారు శత్రువులు. అడవిలోదూరినా వెంటాడతారు. చంపేసి కాని వొదిలిపెట్టరు. అలాంటి పిరికిచావుచచ్చి దుర్గతిపాలు కావడంకంటే, నిల్చి పోరాడండి. చచ్చి స్వర్గానికి వెళ్ళడమో, చంపి గెలుపు సాధించడమో మంచిది. భయపడకండి. పాండవసేన పల్చబడిపోయింది. కృష్ణుడూ, అర్జునుడూ బాగా అలిసిపోయారు. అయిపోవచ్చింది వాళ్ళపని. ఇప్పుడే మనం ఆక్రమిస్తే, ఇట్టే జయం మనచేతిలో పడుతుంది. పదండి, పదండి, కలబడండి" తొందరచేసేశాడు. పారిపోతూవున్న మనసేన మళ్ళింది.

దుర్యోధనుణ్ణి మెచ్చుకుంటూ పాండవులమీదికి నడిచింది. ముందు దుర్యోధనుడిరథం సాగింది. పోటెక్కిన సముద్రంలా వస్తున్న పాండవ సేన సముద్రపొడ్డులా అడ్డేశాడు దుర్యోధనుడు.

తుఫానులాగ తోసుకువస్తున్న భీముణ్ణి చుట్టుకుంది కౌరవ సేన. రకరకాల బాణాలు కురిపించింది. ఎన్నో అన్ని ఆయుధాలు కుమ్మరించింది. అరికాలిమంట నెత్తికెక్కింది భీముడికి. గదపట్టుకున్నాడు. రథం దిగాడు. ఘోరంగా సేనమీద పడ్డాడు. మహారణ్యం పడగొట్టిన సుడిగాలిలాగ వరసపెట్టి ఇరవై వేల కాల్బలం బాదేశాడు. పచ్చడి చేసేశాడు.

ఏనుగులూ, గుర్రాలూ అర్జునుడు పంచుకున్నాడు. నిష్ఠురమైన బాణాలు గాండీవానికి తొడిగాడు. కుప్పలుకుప్పలు కౌరవసేన కూలగొట్టాడు.

నకులసహదేవులూ, సాత్యకీ శకునిమీద పడ్డారు. వాడివాడి చిల్లకోలలు గుప్పించాడు. శకునిమాత్రం సామాన్యుడా? దెబ్బకి దెబ్బతీసి నువ్వా నేనా అని పోరాడాడు.

## సాల్వుడు

మదించిన పెద్దఏనుగెక్కి పాండవసేనలో చొరబడ్డాడు సాల్వుడు గుర్రపుదళాలు కలిచేస్తూ, ఏనుగుమందలు తరిమేస్తూ, రథాలు విరిచేస్తూ, కాల్బలాలు కూలగొడుతూ వీరవిహారం చేశాడు. ధృష్టద్యుమ్నుడు అతడిమీదికి రథం పరిగెత్తించాడు. అతణ్ణి మట్టించెయ్యాలని మదపుటేనుగు పురిగొల్పాడు సాల్వుడు. పిడుగుల్లాంటి ఇనుపబాణాలు తొడిగాడు ధృష్టద్యుమ్నుడు. గబగబా ఏనుగు కుంభస్థలంమీద నాటించాడు. భరించలేకపోయింది ఏనుగు. గీపెట్టింది; పరుగుతీసింది. తన చేవంతా చూపించాడు సాల్వుడు. పారిపోతున్న ఏనుగుని చిత్రంగా

మళ్ళించాడు. “అద్గదీ అలావుండాలి”— మనన్నందీ మెచ్చుకున్నా రతణ్ణి.

వెర్రికోపంతో వెళ్ళింది ఏనుగు అమాంతంగా ధృష్టద్యుమ్నుడి రథం తొండంతో మెలేసి పట్టుకుంది. అదిలిపోయాడు ధృష్టద్యుమ్నుడు. గదపట్టుకుని చప్పున నేలకి దూకేశాడు. గుర్రాలతోనూ, సారథితోనూ కలిపి రథం ఆకాశంమీదికి ఎత్తేసింది ఏనుగు. తిప్పితిప్పి ఆటలాడింది. నేలమీద కొట్టేసింది. కాళ్ళతో తొక్కేసింది. గుండ పిండి చేసేసింది.

భీముడూ, శిఖండీ, సాత్యకీ సాల్వుణ్ణి చుట్టుముట్టారు. బాణం వర్షం కురిపించారు, అందరిబాణాలూ కొట్టేసి, అద్భుతమైన అస్త్ర నైపుణ్యం కనపరిచాడు సాల్వుడు. దేవతలు నిచ్చెరపోయారు.

ఇంతలో ధైర్యం తెచ్చుకున్నాడు ధృష్టద్యుమ్నుడు. ఒడుపు చూచి సింహంలా వురికాడు. గదతో ఏనుగుకుంభస్థలం భళ్ళుమని పించాడు. దెబ్బతో కొండలా కూలిపోయింది సాల్వుడి ఏనుగు. ఇటు ఏనుగు కూలిందో లేదో అటు వెడల్పాటి ధారైన బాణం వేశాడు సాత్యకి. సాల్వుడిశిరస్సు నరికిపారేశాడు. దాంతో పిక్కబలం చూపెట్టింది మనసేన.

కృతవర్మ విజృంభించాడు. కేకలువేసి మనసేన మళ్ళించాడు. వల్లమాలిన విక్రమం కనపరిచాడు.ఆటకి వచ్చినట్టు వచ్చి, అతడిమీద పడ్డాడు సాత్యకి. హోరాహోరి పోరాడారు వాళ్ళు. ఉభయపక్షాల యోధులూ నిచ్చెరపోయి చూశారు.

ఎనిమిది బాణాలుకొట్టాడు సాత్యకి.కృతవర్మని ముచ్చెమటలూ పోయించాడు. అతడి విల్లు తుంచేశాడు కృతవర్మ. అంతకంటే మంచి విల్లు పుచ్చుకున్నాడు సాత్యకి. కృతవర్మగుర్రాలు కూల్చేశాడు. సారథిని చంపేశాడు. పెద్ద శూలం తీశాడు కృతవర్మ. గురిచూసి

విసిగాడు. దారైన భల్లం వేశాడు సాత్యకి ముక్కలైపోయింది శూలం. ఇంకేముంది? క్షణంలో అయిపోతుంది కృతవర్మపని చప్పున కృపుడు వెళ్ళాడు కృతవర్మని పట్టుకువచ్చేశాడు.

మనసేన పిరికిమందు పుచ్చుకుంది. అంతమందీ తప్పుకున్నారు. దుర్యోధనుడు వొక్కడేఅయిపోయాడు. పాండవులతోనూ. అక్కడిరథులతోనూ వొక్కడే పోరాడాడు ఢడాఢడి బాణాలు గుప్పించాడు. శత్రువుల చతురంగ సేనలో అతడి బాణం తగలనిసారథికాని, ఏనుగుగాని, గుర్రంకాని, భటుడుకాని కనపడలేదు. అప్పుడు రెండుసేనల్లోనూ అతడి పాటిమొనగాడు మరొకడు లేడనిపించింది నాకు. పాండవులూ, పేరుపడ్డ వాళ్ళ మొనగాళ్ళుయావన్మందీ అతణ్ణి వొంటిగాణ్ణిచేసి ముట్టడించారు. అందరికీ అన్నిరూపులై పోరాడాడు దుర్యోధనుడు. ధర్మరాజుమీద వంద బాణాలు తగిలించాడు. భీముడిమీద డబ్బయి వేశాడు. సహదేవుణ్ణి మీద అయిదూ, నకులుడిమీద అరవై, ధృష్టద్యుమ్నుడిమీద ఏడూ, ద్రౌపదికొడుకులమీద తలా అయిదేసీ. సాత్యకిమీద మూడూ కొట్టాడు. సహదేవుడి ధనుస్సు తెగగొట్టాడు.

చప్పున మరొక ధనుస్సు తీశాడు సహదేవుడు. దూకుడుగా దుర్యోధనుడిమీద కలబడ్డాడు. తక్కిన రథికులూ అతడితో కలిశారు. ఒక్కొక్కడూ లెక్కాజమాలేని బాణాలు రువ్వారు. ఆటలాడినట్టు అన్నీ కొట్టేశాడు దుర్యోధనుడు. అంతమందినీ రక్తాలు కారించాడు. అలా అతడు ఏకైకవీరుడై పోరాడడం చూసి, మనయోధులూ వెళ్ళి వురికారు. పాండవయోధులతో సరాసరి పోరాడారు. పోయినధైర్యం తిరిగి తెచ్చుకుంది కౌరవసేన. హోలోమని రణరంగానికి మళ్ళింది. పాండవసేనమీద పడింది. భయంకరమైన దొమ్మీయుద్ధం జరిగింది.

భీముడూ, అశ్వత్థామా నువ్వా నేనా అంటూ యుద్ధంచేశారు.

ధర్మరాజుగుర్రాలు నాలుగూ చంపేశాడు శకుని. అన్నగారిని తన రథంమీద పట్టుకుపోయాడు సహదేవుడు. ఇంకో రథం వేసుకు వచ్చాడు ధర్మరాజు. శకునిమీద కలబడ్డాడు. ఇద్దరూ హోరాహోరి యుద్ధంచేశారు.

ఉలూకుడూ, నకులుడూ ఒకడిమీద ఒకడు విరుచుకుపడ్డారు ఎవరికి ఎవరూ తీసిపోకుండా పోట్లాడారు.

సాత్యకీ, కృతవర్మా—యాదవవీరులిద్దరూ ఘోరమైన ద్వంద్వ యుద్ధంచేశారు.

దుర్యోధనుడూ, ధృష్టద్యుమ్నుడూ తలబడ్డారు. దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడి ధనుస్సు విరిచేశాడు. ఇంకో ధనుస్సు ఎత్తాడు ధృష్టద్యుమ్నుడు. వర్షం కురిపించేశాడు బాణాలు. ఇద్దరూ అద్భుతంగా పోరాడారు. అంతలో ద్రౌపదికుమాళ్ళు అయిదుగురూ దుర్యోధనుణ్ణి చుట్టుముట్టారు. మూర్ఖుణ్ణి అయిదుఇంద్రియాలూ పీడించినట్టు పీడించారు. పిసరంతా వెనకాడిలేదు దుర్యోధనుడు. వరస బాణాలు కొట్టాడు. అయిదుగురినీ అడలెత్తించేశాడు.

తక్కినవాళ్ళున్నూ ఒకళ్ళమీద ఒకళ్ళు కలబడ్డారు. అంతకంతకీ గందిక అధికమైంది. కనీ వినీ ఎరగని దొమ్మీయుద్ధం జరిగింది. బ్రహ్మాండమైనదుమ్ము రేగింది. సూర్యబింబం కనపడకండా కప్పేసింది. అయితే అంతలోనే ఏనుగులూ, గుర్రాలూ, భటులూ తెగి, రక్తం ధారలుకట్టింది. రేగినధూళి అడగారిపోయింది. పాండవులు పేట్రేగిపోయారు. మనయోధులు జంకేశారు. కాని వాళ్ళని పారిపోనివ్వలేదు నీకుమాళ్ళు. అంతమందినీ పురికొల్పారు. తరుముకువెళ్ళారు.

కోపంతో తిరగబడ్డాడు ధర్మరాజు. మూడుఇనపబాణాలు కొట్టి కృపాచార్యుణ్ణి వెనక్కి తరిమాడు. కృతవర్మగుర్రాలు నాలుగూ నరికేశాడు. అతణ్ణి అశ్వత్థామ తనరథంమీద పట్టుకుపోయాడు.

అగ్గయిపోయాడు దుర్యోధనుడు. ధర్మరాజుమీదికి ఏడువందల రథాలు పంపాడు. మేఘాలు వచ్చి సూర్యుణ్ణి కప్పేసినట్లు ఏడువందల రథాలూ వొక్కుమ్మడిని ధర్మరాజుని ఘిరాయించాయి. శిఖండీ మొదలైన యోధులు ధర్మరాజుని దాటుకుంటూ వచ్చారు. మన రథాల వాళ్ళని వరసపెట్టి దుళ్ళగొట్టారు.

అప్పుడు మనదండులో ఉల్కలు రాలాయి. రాళ్ళవాన కురిసింది. ఇంకా ఎన్నో ఉత్పాతాలువుట్టాయి. అవేవీ లెక్కచెయ్యకండా మనయోధుల్ని పిలిచాడు శకుని. "మీరు ఎదటియుద్ధం చెయ్యండి. నేను పక్కనించి ముట్టడిస్తాను. ధర్మరాజుని చంపేస్తాను" అని బోధించాడు. శల్యుడిరాణువతో కలిసి కౌరవసేనపాండవులమీద పడింది. తరిమికొట్టారు పాండవులు. నిభాయించుకోలేకపోయాడు మనవాళ్ళు. పిక్కబలం చూపెట్టారు.

ఏమైనా శకునిమాత్రం జంకలేదు. పదివేలగుర్రాలతో బయలుదేరాడు. "నేనంటూ వుంటే భయమేమిటి మీకు?" - పారిపోతూన్న సేనల్ని హెచ్చరించాడు; మళ్ళించాడు. హోలోమని వెళ్ళి పాండవుల మీద పడ్డాడు. శకునివడికి నిలవలేకపోయింది పాండవసేన. తగ్గుమొహం పట్టింది.

## శకునీ - సహదేవుడూ

"తమ్ముడూ," సహదేవుణ్ణి పురికొల్పాడు ధర్మరాజు - "నువ్వూ, ద్రౌపదికుమారుళ్ళూ వెళ్ళండి. అయిదువేల గుర్రాలతో శకునిమీద కలబడండి" అన్నాడు. అన్నగారు ఆజ్ఞాపించడమే తడువు, కుమారుళ్ళతోనూ, అయిదువేల గుర్రాలవాళ్ళతోనూ శకునిమీద పురికాడు సహదేవుడు. ఘోరమైన గుర్రాలయుద్ధం జరిగింది.

ఉభయసేనల రౌతులూ ఉద్రేకంతో పోరాడారు. బాణాలతో చంపుకున్నారు. ఈటెలతో పొడుచుకున్నారు. కత్తులతో నరుక్కున్నారు. పడదోసి కండలు కండలు కోసుకున్నారు బాకులతో చీల్చుకున్నారు. ఒకళ్ళమీద ఒకళ్ళుపడి నల్లుల్లాగా పెనుగులాడారు మెడలువట్టి వొంచుకున్నారు. పీకలమీద ఎక్కి తొక్కుకున్నారు. ఒక్కడిమీద ఎంతోమంది పడ్డారు. ఎంతోమందిమీద ఒక్కడు తిరగబడ్డాడు. రకరకాల కీలుబొమ్మల్లాగ పోట్లాడారు. ఎన్నెన్ని రకాలో యుద్ధంచేశారు. అయితే తుదకి సహదేవుడితో చాలలేక పోయాడు శకుని. పిరికిమందు పుచ్చుకున్నాడు. నాలుగువేల గుర్రాలూ, రౌతులూ కూలిపోయారు. మిగిలిన ఆరువేలగుర్రాలతో తోకముడిచేశాడు. మూడువేలగుర్రాలతో అన్నగారిదగ్గిరకి వెళ్ళి పోయాడు సహదేవుడు.

చుట్టివచ్చాడు శకుని. ధృష్టద్యుమ్నుడి సేనమీద పడ్డాడు. పెచ్చురేగిపోయాడు ధృష్టద్యుమ్నుడు. రౌద్రం మూర్తీభవించినట్టు అనిపించింది. శకునిగుర్రాలుఅయిదువేల మూడువందలు హతమార్చేశాడు. ఆయుధాలు ముక్కలైన ధ్వనులూ ఎముకలు విరిగినచప్పుళ్ళూ వినీ, రక్తం, మాంసం, మేదస్సు, మెదడు పడివున్న రణరంగంచూసీ, ఆ దుర్గంధం పీల్చి మతిపోయినట్టయిపోయారు యోధులు.

కబంధాలు నాట్యమాడినట్టుపోరాడాడు శకుని. చవ్వగా మిగిలినగుర్రాలతో దాడుతీశాడు ఒక తెగినతల ఒకచేతా, రక్తంలో మునిగిన కత్తి ఒకచేతా పట్టుకుని "ఏడీ, దుర్యోధనుడు ఎక్కడ?" అంటూ అక్కడివాళ్ళని అడిగాడు.

"అదుగో పున్నమచంద్రుడిలా అవుపిస్తోంది తెల్లగొడుగు. అదే దుర్యోధనుడిరథం. భయంకరమైన యుద్ధంచేస్తున్నాడక్కడ. వెళ్ళు" అన్నారు వాళ్ళు.

తలెత్తి చూశాడు శకుని. తిన్నగా దుర్యోధనుడిదగ్గిరికి వెళ్ళి అన్నాడు.

"వాళ్ళ గుర్రాలు కూల్చేశాడు. ఇక రథాలపని పట్టెయ్యాలి. ప్రాణాలు దాచుకుంటే పాండవుల్ని గెలవలేం. రథాలూ, ఏనుగులూ తెగాక కాని కాల్బలం కడ తేర్చడం సాగదు" అన్నాడు.

శకునిమాటలు విని లేనిధైర్యం తెచ్చుకున్నారు మహాసైనికులు. అమ్ములపొదులు బిగించుకున్నారు. ధనుస్సులు సవరించుకున్నారు. అల్లెత్రాళ్ళు మోగించారు. సింహనాదాలుచేశారు. ఉద్రేకంతో విజృంభించాడు దుర్యోధనుడు.

## చచ్చిందాకా వొదలడు

"తరుముకు వస్తున్నాడు దుర్యోధనుడు" మనసేన చూస్తూ కృష్ణుడితో అన్నాడు అర్జునుడు – "అతడి సేనమీదికి మనరథం పోనీ. గాండీవంతో కడముట్టించేస్తాను. చూడూ, పద్దెనిమిది దినాలు విడుపు లేకండా యుద్ధంచేశాను. సముద్రంలాంటి కౌరవసేన గోష్పాదమంత అయిపోయింది. దైవం ఏంచేయ్యాడు? కనుపులో చల్లకదలకండా కూచోక ఘోరమైన యుద్ధానికి దిగబడ్డారు గుడ్డిరాజుకొడుకులు. భీష్ముడు పడిపోయినప్పుడు వీళ్ళబుద్ధి మారుతుం దనుకున్నాను. సంధికి వస్తారని నమ్మాను. అయినా చెప్పి దుర్యోధనుణ్ణి దారికి తేవాలని చూశాను. ఎన్ని చెప్పినా మూర్ఖుడి బుద్ధి తిరిగిందికాదు. భీష్ముడంతవాడు పడిపోయాక మళ్ళా యుద్ధం చెయ్యవచ్చా! వీళ్ళు పరమ మూర్ఖులని అప్పుడు గ్రహించాను. ఏనుగుతో భగదత్తుడుకూలిపోడం కళ్ళారా చూశాడు. జయద్రథుడూ, అతడికి అడ్డుపడాలని వచ్చిన రాజులూ, తెగిపోడం చూశాడు. ద్రోణుడి మరణమూ చూశాడు. అయినాబుద్ధిరాలేదు దుర్యోధనుడికి,ఎంతమూర్ఖుడో కాని! తమ్ముళ్ళూ

దుశ్శాసనుడూ, బంధువులతోసహా కర్ణుమా కళ్ళుమూయడంచూశాడు. అయినా తెలివిరాలేదంటే ఏఁవనుకోవాలి? అంతా అయింది, శల్యుడు అయిపోయాక అయినా ధర్మరాజు బలవంతుడన్న జ్ఞానం రాలేదు. ఏమాత్రమైనా వివేకముందా ఇతడికి! కృష్ణా, చచ్చిందాకా, ధర్మరాజుకి రాజ్యం వొదలడు దుర్యోధనుడు. తెల్లారదాకూడా తీర్చెయ్యాలి, ఇప్పుడు."

"అవును" అందుకున్నాడు కృష్ణుడు — "నేను సంధికోసం హస్తిన వెళ్ళినప్పుడు అదే అన్నాడు విదురుడు. 'కృష్ణా, ఎందుకు వచ్చావు? వివేకంలేనివాడు దుర్యోధనుడు. దుర్మదాంధుడు. ఇతడా నీమాట వింటాడు? ముక్కులో వూపిరి వున్నంతదాకా రాజ్యం వొదలడు. అంచేత యుద్ధంతప్ప మరోమార్గం లేదు, అన్నాడు. అంతేకాక, ఇతడు పుట్టినప్పుడే 'ఈపాపాత్ముడివల్ల క్షత్రియకులం నాశనమవుతుంది' అని చెప్పారు మునులు" అన్నాడు.

"వాళ్ళు అన్నంతా అయింది" అన్నాడు అర్జునుడు- "వున్న వాళ్ళందరినీ మింగేసి, తాను తెగిపోయాక కాని ధర్మరాజుకి రాజ్యం ఇవ్వడు. ఈమిగిలినసేన కూడా వూడ్చేస్తాను. నవనాళ్ళూ తెగి దుర్యోధనుడు వెర్రిమొహం వేసినట్టు చేస్తాను. పోనీ, మనరథం పోనీ."

మహారాజా, ఏంచెప్పనూ! దుర్యోధనుడిసేన కారడివి అనుకో. ఏనుగులు కొండలనుకో. రథాలు తుప్పలనుకో. గుర్రాలు ఎండినచెట్లనుకో. కాల్బలం పెరిగిన తీగెలనుకో. అలాంటి అడివి అగ్నిహోత్రుడిలా ముట్టడించాడు అర్జునుడు. అగ్గిదేవుడికి గాలిదేవుడు శ్రీకృష్ణుడు సారథిగా తోడయాడు. అగ్నిహోత్రుడి నాలికల్లా అర్జునుడి బాణాలు మంటలుకక్కుతూ విజృంభించాయి. భూమీ ఆకాశమూ భుగభుగలాడిపోయింది.

దారుణంగా రణవిహారం చేశాడు అర్జునుడు. మనసేనంతా చంపినంత చంపాడు. కొట్టినంత కొట్టాడు. దిగాలు మనిపించాడు. వెంట తరిమాడు.

దుర్యోధనుడు మాత్రం చలించలేదు. కదలలేదు. "నిలవండోయి నిలవండి" పారిపోతున్న సేనని చెయ్యెత్తి కేకలు వేశాడు. మళ్ళించాడు. రథచక్రాలధ్వనులూ, ఏనుగుల ఘీంకారనాదాలూ, గుర్రాల మువ్వల చప్పుళ్ళూ, గింగురుమనిపిస్తూ పాండవసేన ముట్టడించాయి. ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, శతానీకుడూ ఎదిరించారు. రకరకాల బాణాలు వర్షం కురిపించారు.

ధృష్టద్యుమ్నుడి రథందగ్గిరికి రథం పోనిచ్చాడు దుర్యోధనుడు. అతడి రొమ్ములమీద గట్టిగట్టి బాణాలు గుచ్చాడు. నిలువునా నిప్పులు కురిశాడు ధృష్టద్యుమ్నుడు. ఛడాఛడీ బాణాలు తగిలించాడు. దుర్యోధనుడి గుర్రాలు నరికేశాడు. సారథిని రాయుమనిపించాడు. దిన్నపోయాడు. దుర్యోధనుడు రథందిగేసి గుర్రమెక్కాడు.

గుర్రమెక్కి పక్కకి తప్పుకున్నాడు దుర్యోధనుడు. కాని వూరుకోలే దతడు. ఏనుగుసేన పురికొల్పాడు. అర్జునుడిరథం చుట్టుముట్టాయి ఏనుగులు. ఘోరమైనబాణాలువేశాడు అర్జునుడు. గదపట్టుకు భీముడు వురికాడు. తొండాలు తెగిపోయీ, దంతాలు విరిగిపోయీ, కుంభస్థలాలు పగిలిపోయీ, డొక్కలు చెక్కలయీ, వెన్నులు విరిగిపోయీ, కింద దొర్లిపోతూ, రక్తాలు కక్కుకుంటూ, చుట్టుకుంటూ నానా బీభత్సమైపోయాయి ఏనుగులు. అయినా వొదలకండా పోరాడింది మన ఏనుగుసేన. మరీమరీ తరుముకువెళ్ళింది. చూసి, ధర్మరాజూ, నకులుడూ, సహదేవుడూ, ధృష్టద్యుమ్నుడూ నాలుగుదిక్కులా తరిమి తరిమి కొట్టారు.

రథాలమధ్య కనబడలేదు దుర్యోధనుడు. "యుద్ధంలో తెగి పోలేదు కదా!" అనుమానిస్తూ అశ్వత్థామా, కృతవర్మా, కృపాచార్యుడూ వెదికారు. "దుర్యోధనమహారాజు ఎక్కడ?" — అక్కడి రాజుల్ని అడిగారు.

"శకునిమామతో వెళ్ళాడు" అన్నారు కొందరు. "అతణ్ణి వెదకడమెందుకు? బతికివుంటే తరవాత చూద్దాం. ముందు పాండవులమీద వురికి పోరాడదాం" అన్నారు మిగిలినవాళ్ళు. అయినా ఆగలేదు వాళ్ళు. ముగ్గురూ తమసేనలతో శకునిదగ్గిరికి వెళ్ళారు.

దిక్కుమాలిపోయింది మనసేన. పాంచాలసేనా, పాండవసేనా తరిమితరిమి కొట్టింది.

## నన్ను పట్టేశారు

మహారాజా, మనవాళ్ళు అలా ఓడిపోతూవుండడం చూశాను. అయిదుగురు యోధుల్లో ఒకణ్ణయిన నేనూ పాంచాలంవాళ్ళతో పోరాడాను. ధృష్టద్యుమ్నుడితో మాకు తీవ్రమైన యుద్ధం జరిగింది. మేం ఓడిపోయాం. ఎలాగో అతణ్ణి తప్పించుకున్నాను నేను. కాని నాలుగువందల రథాలవాళ్ళతో సాత్యకి ముట్టడించాడు. రెండుగడియలు శాయశక్తులా పోరాడాను. నాఆయుధాలన్నీ కొట్టేశాడు సాత్యకి. నేను మూర్ఛపోయాను. ప్రాణాలతో నన్ను పట్టేశాడతడు. దొరికిపోయాను.

ఏనుగుసేన చిదగ్గొడుతూ పెద్ద సింహనాదంచేశాడు భీముడు. సహించలేకపోయారు నీకుమారుళ్ళు. దుర్విమర్షుడూ, దుష్ప్రధర్షుడూ మొదలైన కుమారుళ్ళు కలబడ్డారు. బాణవాన కురిపించారు. దభాలున రథమెక్కాడు భీముడు. భల్లమూ, నారాచమూ మొదలైనబాణాలు వేశాడు. చావగా మిగిలినసేన దుఃఖంతోనూ, క్రోధంతోనూ అతణ్ణి ఆక్రమించింది. అసలే భీముడు — అడ్డేముంది అతడికి? అయిదువందల

రథాలూ, ఏడువందల ఏనుగులూ, ఎనిమిదివందల గుర్రాలూ, పది వేల కాల్బలమూ క్షణాలమీద తన బాణాలికి బలిపెట్టాడు. దాంతో మిగిలినవాళ్ళు ఛటాపంచలై పోయారు. నీకుమాళ్ళని చంపడం మరింత తేలికయిపోయింది భీముడికి. "దుర్యోధనుణ్ణి తమ్ముళ్ళులేకండా చేసే శాను" అనుకున్నాడతడు. "కృతార్థుణ్ణయాను" అని తృప్తిపడ్డాడు. తన్ను తాను పొగుడుకున్నాడు. బొబ్బలు చరిచాడు. చావగా మిగిలిన కౌరవసేన దీనంగా తెల్ల మొహం వేసింది.

## జూదంలో పోయింది బాణంతో తెస్తాను

గుర్రాలదండులో వొకేవొక్క తమ్ముడితో వున్నాడు దుర్యోధనుడు. చూశాడు శ్రీకృష్ణుడు. అర్జునుడితో అన్నాడు:

"శత్రువులు నశించారు. నీఅన్నదమ్ములు నీరక్షణవల్ల నిక్షేపంలా వున్నారు. సంజయుణ్ణి సిగపట్టుకు లాక్కువచ్చాడు సాత్యకి. సేనాధిపతి ధృష్టద్యుమ్నుడు జెండా ఎగరేస్తూనే వున్నాడు. అల్లదిగో తెల్లగొడుగు. గుర్రాలవాళ్ళ మధ్య నివురుకప్పిన నిప్పులా వున్నాడు దుర్యోధనుడు సేన పరిచేస్తూ దిక్కులుచూస్తున్నాడు. నీబాణాలతో అతడిపనిపట్టించు. కృతకృత్యుడి వవుతావు. లోకం కేకేలుపడుతుంది. విను, ధృతరాష్ట్రుడికొడుకులు అందరూ అయిపోయారు. అదిగో ఒక్క తమ్ముడు సుదర్శనుడితో మిగిలాడు దుర్యోధనుడు. ఇద్దరూ ఎలాగూ చస్తారిప్పుడు."

"ఇదంతానీప్రసాదం" వినయంగా అందుకున్నాడు అర్జునుడు — "భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ, అక్షౌహిణీలకొద్దీసేనల్నీ నీప్రసాదమహిమే హతమార్చింది. ఈ గోష్పాదమంత సేన ఏమాత్రం? రెండువందల రథాలూ, వంద ఏనుగులూ, రెండువేల కాల్బలమూ, శకునిదగ్గిర అయిదువందల గుర్రాలూ — ఇదీ కౌరవసేన ఇప్పుడు. అశ్వత్థామా,

కృతవర్మా, కృపాచార్యుడూ శాయశక్తులా ఇంతే నిలపగలిగారు మరి! నేను గాండీవమెత్తానా, ఇంతా వూడ్చిపారేస్తాను, లిప్తలో. ఇది వచ్చింది వచ్చి, పారిపోయింది పారిపోయాక, తనచుట్టూ వొట్టి బయలు మిగిలిపోయి దుర్యోధనుడు ఏమవుతాడో చూడు! కలబడ్డాడో నామీద, జూదంలో పోయిన రాజ్యం బాణంమొనతో తీసుకువస్తాను. నాబాణాగ్నికి అతణ్ణి ఆహుతిచేస్తాను. ధర్మరాజు చింతా వంతా అంతా తీర్చేస్తాను. అన్నిపనులూ పూర్తయిపోతాయి. హస్తినపురం స్త్రీలు తమభర్తలూ, కొడుకులూ పోయారని విని పాండవుల బాహువీర్యంముందు శిరస్సులు వొంచాలి."

"అదీ మొగతనం" అంటూ దుర్యోధనుడివేపు రథంపోనిచ్చాడు కృష్ణుడు. అర్జునుడిరథం రెండుపక్కలా భీముడూ, సహదేవుడూ రథాలు నడిపించారు. అలాఅన్నదమ్ములు ముగ్గురూ దుర్యోధనుణ్ణి కాజెయ్యాలని వురికారు. ఉగ్రుడైపోయి, వున్న గుర్రాల సేనతో శకుని వాళ్ళని అడ్డుకున్నాడు. తక్కినవాళ్ళు అతడితో కలిశారు.

శకునీ, త్రిగర్తరాజు సుశర్మా అర్జునుడితో కలబడ్డారు. సుదర్శనుడు భీముడితోనూ, దుర్యోధనుడు సహదేవుడితోనూ పోరాడారు.

భీముణ్ణి దాటుకుంటూ వెళ్ళాడు సహదేవుడు. దుర్యోధనుడిమీద కత్తుల్లాంటిబాణాలు తగిలించాడు. అతడి నుదుటిమీదగట్టిదొక ఇనపబాణం నాటించాడు దుర్యోధనుడు. దెబ్బతో విలవిలలాడిపోయాడు సహదేవుడు మూర్ఛపోకండామాత్రం చప్పున తేరుకున్నాడు. నాగుల్లాంటి చిల్లకోలలు గబగబా అతడిమీదనాటించాడు.

## సుశర్మ

తీసిపోని ధీరత్వంతో అర్జునుడిమీద పడ్డారు గాంధారదేశం రౌతులు. శక్తులు వేసీ తోమరాలు కొట్టీ అతణ్ణి కప్పెట్టేశారు,

క్రూరమైనభల్లాలు తొడిగాడు అర్జునుడు. తాటికాయలురాల్చినట్టు వాళ్ళతలకాయలు దుళ్ళగొట్టాడు. అంతలో త్రిగర్తసేన చుట్టుముట్టింది. లెక్కాజమాలేని బాణాలు కృష్ణుడిమీాదా అర్జునుడిమీాదా కుమ్మరించింది. లేళ్ళమీాద లంఘించిన సింహంలాగ వాళ్ళమీాద వురికాడు అర్జునుడు సత్యకర్ముడి కంఠం తెగేశాడు. కుండలాలతో అతడితల కాయ కింద దొర్లించేశాడు. సత్యేషుణ్ణి తాయచునిపించాడు. చిర కాలంనించీరాజుతూవున్న కోపాగ్ని మూర్తీభవించినట్టు నిప్పులురుముతూ సుశర్మని చూశాడు. ప్రాణాంతకమైనబాణాలు అతడిమీాద వేశాడు. త్రిగర్తరథాలు వొక్కపెట్టుని అర్జునుడిమీాద పడ్డాయి. ఒక్కటీమిగలకండా వూడ్చేశాడు అర్జునుడు. అదే వడితో సుశర్మ గుర్రాలు నాలుగూ కొట్టేశాడు. అతడిగుండెలుచీల్చుకుపోయినట్టు ఘోరమైన భల్లబాణం వేశాడు. దెబ్బతో ప్రాణాలు వొదిలేశాడు సుశర్మ. మనవాళ్ళు దుఃపడ్డారు. పాండవులు సంతోషించారు.

సుశర్మని చంపేసి, అతడి కొడుకుల్ని ఏడుగుర్ని, ఎనమండు గుర్ని, ముప్ఫయిమందిని మూాడేసిమూాడేసి బాణాలువేసి తలలు నరికేశాడు అర్జునుడు. మిగిలిన అతడి సేనంతా చిందరవందరచేసి కొట్టాడు.

సుదర్శనుణ్ణి బాణాలతో కప్పేశాడు భీముడు. ఒక దారైన బాణం వేసి అతడికంఠం నరికేశాడు. అతడితో దుర్యోధనుడి తమ్ములు తొంభైతొమ్మండుగురు తెగిపోయారు. శోకంతోనూ, దుఃఖంతోనూ, కోపంతోనూ సుదర్శనుడిసేన భీముడిమీాద పడింది. క్రూరమైన బాణాలు కురిపించాడు భీముడు. చేనుకోసినట్టుకోసిపారేశాడు. దుర్యోధనుడి ఎకటిసేన సహించలేకపోయింది. ఎక్కడలేని ధైర్యం తెచ్చుకుంది. భీముడిమీాద తిరగబడింది. పాండవసేన దాన్ని ఎదిరించింది. రెండుసేనలూ దారుణంగా పోరాడాయి.

## ఉలూకుడు

అదేసమయంలో శకుని సహదేవుడిమీద వురికాడు. అతడి కొడుకు ఉలూకుడు తండ్రితో కలిశాడు. భీముడు సహదేవుడికి తోడయ్యాడు. మూడు భల్లాలు కొట్టాడు శకుని. సహదేవుణ్ణి చుర్రుమనిపించాడు. ఆవ్రావుని మరో పది ఇనపబాణాలు బాదేశాడు. తోక తొక్కిన పాములా లేచాడు సహదేవుడు. అతడికి భీముడు తోడయ్యాడు. ఇద్దరూ వర్షం కురిపించారు బాణాలు. ఏం చెప్పనూ, శకుని గుర్రాలలో రౌతుల కవచాలు పగిలిపోయాయి. కత్తులు విరిగిపోయాయి. తలలు ఎగిరిపోయాయి. చేతులు తునకలయాయి. కాళ్లు తెగిపోయాయి. గుర్రాల జీనులు తుక్కుతుక్కు అయాయి మోరలు పగిలిపోయాయి. పీకలు తెగిపోయాయి. డొక్కలు చెక్కలయాయి. వాటన్నిటితో రణస్థలమంతా బొమ్మవేసినట్టు అవుపించింది. తన గుర్రాలు కూలిపోయినా తమకం వొదిలిపెట్టలేదు నీమరిది. సహదేవుడి కణతమీద దారుణంగా బల్లెంతో పొడిచాడు. దెబ్బతో మూర్ఛపోయాడు సహదేవుడు. రథంమీద పడిపోయాడు.

దుర్యోధనుని సేనమీద వురికేశాడు భీముడు. ఘోరమైన ఇనపబాణాలు గుప్పించాడు. చచ్చినంత చచ్చింది కౌరవసేన. మిగిలింది మడమతిప్పేసింది. అదిలించి మళ్ళించాడు దుర్యోధనుడు. గాలిలా ఎగిరిపోయే గుర్రాలు పూన్చిన రథమెక్కి సేనలికి ఉత్సాహం కలిగించాడు. హెచ్చరించాడు. పురికొల్పాడు., శకునితో కలిసి భీముడితో యుద్ధంచేశాడు. ఉప్పెనలా ఎదురుకుంది పాండవసేన.

సహదేవుడు తేరుకున్నాడు. శకునిమీద పదిబాణాలు గుప్పించాడు. అతడి ధనుస్సు నరికేశాడు. ఇంకో ధనుస్సు తీశాడు శకుని. నకులుడూ, శకుని అతడిమీద కలబడ్డారు. ఇద్దరిమీదా ఎన్నో అన్ని

బాణాలు వేశాడు శకుని. తండ్రికి తోడై భీముడిమీదా సహదేవుడి మీదా మంచిమంచి బాణాలురువ్వాడు ఉలూకుడు. వరసబాణాలు వేశాడు భీముడు. ఉలూకుణ్ణి కీచుకీచుమనిపించాడు. శకునిమీద అరవై కోలలు నాటించాడు. అతడి అనుచరుల్ని అడలెత్తించాడు.

వల్లమాలిన వడి చూపించాడు ఉలూకుడు. సహదేవుణ్ణి బాణాలతో ముంచేశాడు. మంచి దొక భల్లం అరిపోశాడు సహదేవుడు. ఉలాకుడి శిరస్సు నరికేశాడు. అన్నలిద్దరూ ఆనందించారు. "భళీ అంటే భళీ" అన్నారు.

## ఆఖరిముద్ద శకుని

కొడుకుచావు కళ్ళారా చూశాడు శకుని. కడుపు తరుక్కుపోయింది. కన్నుకొనలనించి కన్నీళ్ళు జలజలా రాలాయి. విదురుడు అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి. దుఃఖపడ్డాడు. పాంలాగ నిట్టూర్చాడు. నిప్పులు కురిశాడు. మూడు ఇనపబాణాలు సహదేవుడిమీద తగిలించాడు.

మూడు ముక్కలుచేశాడు సహదేవుడు. వెడల్పాటి బాణం కొట్టాడు. అతడి ధనుస్సు తుంచేశాడు. కత్తి పెరికి విసిరాడు శకుని. వప్పుతూ తునకలు చేసేశాడు సహదేవుడు. గద విసిరాడు శకుని. తుక్కుచేసేశాడు సహదేవుడు. ముద్గరం విసిరాడు శకుని. ముక్కముక్కలుచేసేశాడు సహదేవుడు. ఘోరమైన శక్తి ప్రయోగించాడు శకుని. నుగ్గునుగ్గుచేసేశాడు సహదేవుడు.

శకుని రెండుపక్కలసేనా పారిపోయింది. ఇకేముంది, శకుని కూడా తోకముడిచేశాడు. ఉల్లాసంతో వుప్పొంగిపోయారు పాండవులు. దుఃఖంతో కుంగిపోయాడు దుర్యోధనుడు.

పారిపోతున్న శకునిని పోనివ్వలేదు సహదేవుడు. మెరుపులా రథం పరిగెత్తించాడు; వెంటపడ్డాడు; ఆక్రమించాడు. బాణాలు కురిపించాడు. పారిపోతున్న గానసేన మళ్ళింది. లేనిధైర్యం తెచ్చుకున్నాడు శకుని. మిగిలిన గుర్రాలతో తెగించాడు. సహదేవుడిమీద కలబడ్డాడు.

"భయపడతావేం మామా!" అల్లెతాడు సారిస్తూ అన్నాడు సహదేవుడు — "నిలబడి ఎదిరించడం రాజధర్మం కాదూ! జూదం నెపంపెట్టి, మహానీయుణ్ణి ధర్మరాజుని అనరానిమాటలు అన్నావు. మురిసిపోయావు. దానిఫలం ఇప్పుడే అనుభవిస్తావు. మీలో మూర్ఖులు వరసగా అందరూ చచ్చారు. ఆఖరిముద్ద నువ్వు. మమ్మల్ని ఊకారించిన వాళ్ళలో నీతరవాత, కురుకులం తగలబెట్టిన దుష్టు దుర్యోధనుడు మాత్రం మిగిలాడు. అతడు చూస్తూవుండగానే కర్రతో తాటిపండు పడగొట్టినట్టు భల్లంతో నీతలకాయ పడగొడతాను. దాడు తియ్యకు. నిలబడు."

అంటూనే బాణంమీద బాణం తగిలించాడు సహదేవుడు. శకునివేసిన బాణాలు అంతంత దూరంలోనే కొట్టిపారేశాడు. అతడి వొళ్ళు దుసెళ్ళిపోయినట్లు పది బాణాలు కొట్టాడు. అతడి గుర్రాలు కూల్చేశాడు. జెండా వూడగొట్టాడు. గొడుగు విరిచేశాడు. విల్లు తుంచేసి సింహనాదం చేశాడు. లేనిసాహసంతో తిరగబడ్డాడు శకుని. నిష్ఠురమైన శక్తితీశాడు. సహదేవుడిగుండెలు గురిచూసి విసిరాడు.

భల్లంవేసి శక్తినరికేశాడు సహదేవుడు. మరిరెండు మంచి మంచి భల్లాలు వేశాడు. అతడి రెండుచేతులూ సరికేశాడు. నవ్వుతూ మరొకటి వేశాడు. శకునికంఠం తెగేశాడు. తల తుళ్ళిపోయింది. నేలమీదపడి దొర్లిపోయింది, మొండెం దభీమని కిందపడి గింజుకుంది.

కౌరవుల దుర్నయాలకి మూలమైన శకునిని తెగేసి, సింహనాదం చేశాడు సహదేవుడు. తమ్ముణ్ణి చూసి అన్నదమ్ములు నలుగురూ సంతోషించారు. శంఖాలు పూరించారు. శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. దిక్కులు దిమ్మెత్తిపోయాయి.

దుర్యోధనుడి సేనా, శకుని గాంధారసేనా సహదేవుడిమీద పడ్డాయి. అస్త్రాలూ, శస్త్రాలూ అనేకం పించడం కురిపించాయి. అర్జునుడూ, భీముడూ అందుకున్నారు. అవన్నీ పొల్లుచేసి కొట్టేశారు. సేనసేనంతా చిందరవందరగ చేసేసి, ఉల్లాసంతో కలకల్లాడారు. దుఃఖంతో కుంగిపోయాడు దుర్యోధనుడు. చావగా మిగిలిన సైనికుల్ని కాయశక్తులా పురికొల్పాడు

రక్షించేవాళ్ళు లేరు కౌరవసేనకి, అయినా పౌరుషం వొదలలేదది. ఆఖరియత్నంగా అర్జునుడిమీద పడింది. అతడి బాణాగ్నిలో ఆహుతి అయిపోయింది.

దుర్యోధనుడి చుట్టూ బయలైపోయింది. కలయచూశాడతడు. ఎదట పాండవులు యముళ్ళలా అవుపిస్తున్నారు. తప్పుకుపోడమే కర్తవ్యమిప్పుడు.

ధృతరాష్ట్రుడు : మనసేనంతా తుడుచుకుపోయిందీ? పాండవులసేన ఏమాత్రం మిగిలింది? అయ్యో, నాకొడుకు ఏమయాడు?

సంజయుడు: అప్పటికి గుర్రంమీద వున్నాడు దుర్యోధనుడు. తగ్గిపోతూవున్న సేనలో కాలు నిలవలే దతడికి. గుర్రం దిగేశాడు. గద బుజంమీద వేసుకుని వొక్కడూ వెళ్ళిపోయాడు.

---

# శల్యపర్వం



## రెండో ఆశ్వాసం

ధృతిరాష్ట్రుడు: ఓడిపోయి, వొక్కడూ కాల్నడకని ఎక్కడికి బయులుదేరాడు నా రాజరాజు? సంజయా, రాజులికి రావలిసిన ఆపదలేనా ఇవి? చెప్పు; తరవాత ఏంజరిగిందో చెప్పు.

### పలాయనం

సంజయుడు : పదకొండు అక్షౌహిణీలసేనకి అధిపతి, రాజరాజు వెనకవొక్కడూ లేకండా, వొంటిగాడై నడుచుకుంటూ వెళ్ళిపోయాడు. విదురుడి మాటలు తలుచుకుంటూ తలవొంచుకు వెళ్ళిపోయాడు. "నామంచి కోరి అంత నెత్తీనోరు మొత్తుకున్నాడు విదురుడు. విన్నాను కాను" అని దుఃఖపడుతూ వెళ్ళిపోయాడు. గద భుజంమీద వేసుకుని తూర్పుతట్టు వెళ్ళిపోయాడు. ఎంతవాడైతేనేం, దైవం ఏంచెయ్య లేదు కనక !

అక్కడికి కొంతదూరంలో కొంచెం ఉత్తరంగా తూర్పున వొక మడుగు వుంది. అందులో తలదాచుకుందామని వెళ్ళిపోయాడు.

ఇంకా అక్కడా అక్కడా మిగిలిన మన సైనికులు లేని ధైర్యంతో శత్రువుల్ని ఎదిరించారు. ఒక్కణ్ణీ మిగల్చకండా వూడ్చే శాడు అర్జునుడు. పెద్ద గాలికి కూలిపోయిన మహారణ్యంలాగ రణ రంగంలో కనపడింది సేన.

తెల్లగుర్రాలతోనూ, వానరపతాకంతోనూ, నొగలమీద శ్రీకృష్ణుడితోనూ దేదీప్యమానంగా వున్న దివ్యరథంమీద దేవేంద్రుడిలా వెలిగిపోయాడు అర్జునుడు. దేవేంద్రుణ్ణి దేవతలు కొలిచినట్టు బంధువులూ, స్నేహితులూ అభినందిస్తూ అతడిచుట్టూ మూగారు.

మనవాళ్ళలో అశ్వత్థామా, కృతవర్మా, కృపాచార్యుడూ ముగ్గురుమాత్రం బతికిపోయారు.

అప్పుడు ధృష్టద్యుమ్నుడు నన్ను చూచి, సాత్యకితో అన్నాడు: "విణ్ణి ఎందుకు పట్టుకున్నావు? వీడు బతికి ఎక్కడ బట్టకడతాడు? ఏం చెయ్యగలడని వూరికే పట్టుకున్నావు? ఒదిలెయ్యి".

"వీడుద్రోహి వీణ్ణా వొదుల్తాను? తల తెగేస్తాను" అంటూ చర్రున వొరదూసి కత్తిదూశాడు సాత్యకి. ఏముంది మహారాజా, చిటికెలో నాతల తెగి కిందపడేది. కాని "ఆగూ" అంటూ వ్యాసుల వారు ప్రత్యక్షమయారు. "సంజయుణ్ణి చంపడం తగనిపని. అతడి జుత్తు వొదిలెయ్యి" అన్నారు.

"బతికిపోయావు. ఎక్కడికైనా పారిపో" అని నన్ను వొదిలేశాడు సాత్యకి. వ్యాసులవారికి వినయంగా పాదాభివందనం చేశాడు. వ్యాసముని అంతర్ధానమైపోయాడు

## సమయం చూసి పగ తీర్చుకుంటాను

బతుకుజీవుడా అని అక్కణ్ణుంచి బయలుదేరాను నేను. దుర్యోధనుడు వెళ్ళినదారినే కోసెడుదూరం వెళ్ళాను. అక్కడ ద్వైపాయన హ్రదందగ్గిర అతణ్ణి మాశాను. కన్నీళ్ళు కారుస్తూ నా మొహం తిన్నగా చూడలేకపోయాడు మహారాజు. ఒరిగివొరిగిచూస్తూ దుఃఖంతో నోట మాటరాక దీనంగా వూరుకున్నాడు. కొంతసేపటిదాకా నా

నోటమాట పెగల్లేదు. తువకి ఎలాగో నోరువిప్పాను. వ్యాసులవారి దయవల్ల నేను బతికివ వైనం వినిపించాను.

"మనవాళ్ళు ఎవరైనా బతికున్నారా?" జాలిగా అడిగాడు మహారాజు. "అశ్వత్థామా, కృతవర్మా, కృపాచార్యులూ తప్పిస్తే మరో పిట్టమనిషి మిగల్లేదు" అన్నాను. పెద్ద నిట్టూర్పు విడుస్తూ, నాబుజంమీద చెయ్యివేశాడు మహారాజు.

"నాన్నగారితో చెప్పు" నన్ను సిదగ్గిరికి పంపుతూ అన్నాడతడు – "అంతమందీ అయిపోయారని విన్నవించు. పాండవులూ, వాళ్ళకి కావలసినవాళ్ళూ చెక్కుచెదరకండా బతికివున్నారని చెప్పు. చావుదెబ్బలు తినేసినా, చవ్వకండా తప్పుకుని నేను బైటపడ్డానని చెప్పు. పాండవుల పాలపడలేను, ఈ సిరి చాలునని చెప్పు. రాజ్యమంతా వాళ్ళేనెత్తినిపెట్టుకు పోసీ. వాళ్ళిచ్చిన ఎత్తుబత్తెం – అపాడు కూడు వొల్లనని చెప్పు. తమ్ముళ్ళనీ, కుమాళ్ళనీ, నాయావన్మందినీ చంపేసి వాళ్ళు కులుకుతూవుంటే చూడలేను. రాజన్నవాడు ఎవడు సహిస్తాడిది?

"ఈమడుగులో దాగుంటాను. అనుకూలం చూసుకుని ఎక్కడికైనా వెళిపోతాను. తగినవిధంగా తప్పుకునివుండి, ఎలాఅయినా సమయంకనిపెట్టి పగతీర్చుకుంటాను. అని చెప్పు."

మడుగులో ప్రవేశించాడు మహారాజు. మాయాబలంతో నీళ్ళు తనవొంటికి అంటకండా జలస్తంభనంచేసుకుని అందులోదాగున్నాడు.

ఇంతలో అశ్వత్థామా, కృతవర్మా, కృపాచార్యులూ దుర్యోధనుణ్ణి వెతుక్కుంటూ రథాలతో అక్కడికివచ్చారు. గుర్రాలు బాగా అలిసిపోయాయి; వూగాడిపోతున్నాయి. అస్త్రాలూ, శస్త్రాలూ తగిలి శరీరాలు గాయాలుగాయాలుగా వున్నాయి. హటాత్తుగా నన్ను

చూశారు. సంజయా బతికున్నావా? మహారాజు ప్రాణాలతో వున్నాడా?" — ఆతురతతో అడిగారు.

ఒక్కడూవచ్చి మహారాజు నీళ్ళలో దాగున్న విషయంవాళ్ళతో చెప్పాను. మేం ఇద్దరమూ మాట్లాడుకున్న మాటలు వివరించాను.

"మేం తెగిపోకండా బతికున్నామన్న సంగతి ఎరగడు మహారాజు" నొచ్చుకుంటూ అన్నారు వాళ్ళు. అశ్చర్యపడి వచ్చేశాడు. నువ్వు చెప్పాక తెలిసినా మళ్ళామమ్మల్ని కలియగట్టుకోడం కష్టమనుకుని వుంటాడు. శత్రువుల కంటపడకండా నీళ్ళలో దాగున్నాడు. భూలోకమంతా ఏలుకోవలిసిన రాజరాజుకా ఈదుర్దశ!

"ఈయన ప్రాపై నిలబడివుంటే పగవాళ్ళతో ఎంతైనా పోరాడేవాళ్ళం" అంటూ ఎంతో దుఃఖపడ్డారు.

గెలుపుసంతోషంతోవున్న పాండవులు అంతలో ఆ ప్రాంతానికి వచ్చిన సవ్వడి వినపడింది మాకు. ఇక అక్కడ వుండడం తగదని, నన్ను కృపాచార్యుల రథంమీద పెట్టుకుని, ముగ్గురూ మనశిబిరానికి వచ్చేశారు. దీం దీంమంటోంది మన శిబిరం. అంతటా గోలుగోలుమంటున్నారు స్త్రీలు. కంటికీ మంటికీ ధారలు కడుతున్నాయి వాళ్ళకన్నీళ్ళు జుట్టులు విడిపోయి వీపులమీద వేలాడుతున్నాయి. భర్తల్నీ, అన్నదమ్ముళ్ళనీ, కొడుకుల్నీ తలుచుకుంటూ, గుండెలు బాదుకుంటూ, రాగాలుతీసి ఏడుస్తున్నారు వాళ్ళు. జెండాలూ, గొడుగులూ, చామరాలూ అవీ పట్టుకునే సేవకుల్లో చావగా మిగిలినవాళ్ళు చెపుతూ వుంటే. సేనయావత్తూ చల్లారిపోడం వింటూ, కిందపడి పొర్లుతూ, లేస్తూ జాలిగా రోదనం చేస్తున్నారు. మాన్యులైన ఆడంగుల్ని కావలివాళ్ళు తగిన వాహనాలమీద ఇక్కడికి తీసుకువచ్చేశారు. తక్కినవాళ్ళు దిక్కూ తెన్నూ లేక చెదిరిపోయారు.

"పదకొండు అక్షౌహిణీల భర్త పుర్నల్లోపెట్టి చూసుకున్న అందరకంటేతైలకా ఈపాటు!" విచారిస్తూ అనుకున్నాడు నీకొడుకు యుయుత్సుడు— "భీష్ముడు మొదలుకుని కౌరవకులం యావత్తూ యుద్ధంలో కూలిపోయింది. ఒక్కడూ రాజరాజు పాండవులికి భయపడి పారిపోయాడు. నాబొందెలో మాత్రం ప్రాణాలు మిగిల్చాడు విధి! అయిందేదో అయింది. ఈ స్త్రీజనం భద్రంగా హస్తినాపురం చేర్చడం నావిధి" అంటూ రథం దిగాడు. కృష్ణుడితోనూ, ధర్మరాజుతోనూ తనసంకల్పం విన్నవించాడు.

దయకి పెట్టిందిపేరు ధర్మరాజు. "చక్కని ఆలోచన" కృష్ణుడి మొహంచూస్తూ అన్నాడతడు. కృష్ణుడు అనుమతించాక యుయుత్సుణ్ణి కౌగిలించుకున్నాడు. "తమ్ముడూ, తప్పకుండా దిగబెట్టిరా" అన్నాడు.

రథమెక్కి గబగబా బయలుదేరాడు యుయుత్సుడు. దుర్యోధనుడి ప్రియురాళ్ళు ముసిలికంచుకులతో కలుసుకున్నాడు. రాజకాంతల్ని ఓదార్చాడు. వాళ్ళతో పట్నం ప్రవేశించాడు. ఎదురుగుండా విదురుడు కనిపించాడు. ప్రశ్నించాడు. శల్యుడూ, శకునీ మొదలైన యావన్మందీ యుద్ధంలో తెగిపోడమూ, గుర్రందిగి వొంటరిగా దుర్యోధనుడు పారిపోడమూ అంతా పూసగుచ్చినట్టు చెప్పాడు యుయుత్సుడు. "ధర్మరాజు పంపడంవల్ల స్త్రీలని ఇల్లుచేర్చడంకోసం వచ్చాను" అన్నాడు.

ఎంతో అంత దుఃఖపడ్డాడు విదురుడు. "అవసరంవచ్చినప్పుడు ఆదుకున్నావు. మంచిపనిచేశావు" యుయుత్సుణ్ణి మెచ్చుకున్నాడు. "ఎప్పుడూ సంజయుడు వచ్చి యుద్ధవార్తలు చెప్పడం రివాజు. ఇవాళా అతడే వచ్చి చెపుతాడు. ముందు మనం వినిపించకూడదు. మరోలాగ ఈవార్త పట్నంలో వ్యాపించకండా కట్టుదిట్టం చెయ్యాలి.

దుర్యోధనుడి ప్రియురాళ్ళనీ, వాళ్ళ రక్షకుల్నీ వెంటపెట్టుకుని నీ మందిరానికి వెళ్ళు. తక్కినవాళ్ళనీ తగినట్లు నియమించాలి" అన్నాడు.

యుయుత్సుడితో కలిసి అదంతా జాగ్రత్తగా నిర్వహించాడు విదురుడు. పెద్ద ముంగిసాలలో తగినవాళ్ళని కాపలా పెట్టి తాను లోపల ప్రవేశించాడు. లోగడ ఏనుగుల ఘీంకారాలతోనూ, గుర్రాల సకిలింపులతోనూ, భటుల కలకలంతోనూ ఇంకో శబ్దం చెవులికి వినపడకుండా వుండే ఆ శిబిరం నిశ్శబ్దంగా, సైన్యశూన్యంగా వుంది, చెప్పాడు.

ధృతరాష్ట్రుడు : మీ రేమయారు? దుర్యోధనుడు మడుగులో ఏమయాడు?

సంజయుడు : మేం మన శిబిరంలో వున్నాం. ఇంతలో దుర్యోధనుణ్ణి వెదుకుతూ సైన్యంతో సహా అక్కడికి వచ్చి పడ్డారు పాండవులు. వాళ్ళు వస్తూన్న కలకలం విని, నన్ను వెంటపెట్టుకుని అశ్వత్థామా, కృతవర్మా, కృపాచార్యుడూ ఇంకో చోటికి వచ్చేశారు. ఇటు మేం వచ్చేశామో లేదో, అటు పాండవులు శిబిరంలో చొరబడ్డారు. దుర్యోధనుడికోసం మూలమూలలు గాలించారు. ఎక్కడా అతడు కనపడక పోడంతో చీ విసుక్కుంటూ, వెళ్ళిపోయారు. అప్పుడు ధర్మరాజు దుర్యోధనుడి విడిదలోని వాళ్ళని చూసి "భయపడకండి" అని ధైర్యం చెప్పి వెళ్ళాడు; వాళ్ళు వెళ్ళిపోయాక నలుగురమూ మడుగు దగ్గిరికి వెళ్ళాం. మా గుండెలు మాత్రం దడదడమంటూనే వున్నాయి.

## ఇప్పుడు కాదు రేపు

మడుగు దగ్గిరికి వచ్చి అశ్వత్థామా వాళ్ళూ నూరాక చెప్పి "మహారాజా, పైకి దయచెయ్యి" అంటూ దుర్యోధనుణ్ణి పిలిచారు— "మమ్మల్ని పెట్టుకుని పాండవుల్ని పడగొట్టు. బతులు లేదు. శంకించకు. వాళ్ళ సేన నీచేత అంతమవుతుంది. జయించి సామ్రాజ్యం ఏలడమో,

చచ్చి స్వర్గానికి పోడమో, ఈరెండూతప్పిస్తే ఇంకోటి కర్తవ్యంకాదు నీవంటివాడికి" అన్నారు.

"ఇప్పుడు కాదు, రేపు" మడుగులోంచి అన్నాడు దుర్యోధనుడు. దారుణమైన అస్త్రాలూ, శస్త్రాలూ తగిలి వొళ్ళంతా పచ్చి పుండయిపోయింది. ఆయాసంగా వుంది. మనస్సు వశంలో లేదు. మీ మాటలు చూస్తే మీరూ బాగా అయాసపడిపోయినట్టున్నారు. మన వెనకవచ్చే అనుచరులున్నూ లేరు. అంచేత ఇవాళకి తప్పుకోండి. రేపు బలం తెచ్చుకుందాం."

"నీకు ఆ అనుమానం అక్కరలేదు" అందుకున్నాడు అశ్వత్థామ — "నేనే అందరినీ హతమార్చేస్తాను ఇవాళతోనే విరోధానికి స్వస్తి పాడేస్తాను. పాంచాలంవాళ్ళందరినీ పడగొట్టికాని కవచం విప్పను. ఇది నాప్రతిజ్ఞ. నామాట నమ్ము. నీకూ నాతండ్రికీ తృప్తి కలిగిస్తాను."

ఇంతలో భీముకి వేటకాళ్ళు మాంసాలు మోసుకుంటూ, అలిసిపోయి, నీళ్ళకోసం అమడుగుదగ్గిరికి వచ్చారు. అంతకిముందు వొక బోయవాణ్ణిపిలిచి "దుర్యోధనుడు పారిపోయాడు. తుప్పల్లో, డొంకల్లో ఎక్కడ దాగున్నాడో మీరు తిరిగినచోట్ల వెదకండి" అని చెప్పి పంపించాడు ధర్మరాజు. వాడున్నూ ఈవేట కాళ్ళలోవాడే. కనక ఎదురువెళ్ళి తనవాళ్ళకి ఆమాట చెప్పా డతడు. అపని మనసులో వున్న ఆబోయవాళ్లు మడుగుదగ్గిర జంకులేకండా మాట్లాడుతున్న మనవాళ్ళ మాటలు విన్నారు. పూర్వంవున్న అభ్యాసంవల్ల ఆమాటల అర్థం చప్పున గ్రహించేసి దుర్యోధనుడు మడుగులో దాగున్నాడని తెలుసుకున్నారు.

"ఈముగ్గురు రథికులూ యుద్ధానికి పురికొల్పుతున్నారు. బైలుదేరకండా వున్నాడు దుర్యోధనుడు. నీళ్ళలో దాగున్నాడు.

దబ్బున వెళ్ళి ధర్మరాజుతో చెప్పాలి మనం. మంచి బహుమానం ఇస్తాడతడు. ముందు భీమయ్యగారితో చెపుదాం. మెచ్చుకుని ఆయనే రాజుగారిదర్శనం చేయిస్తాడు పదండి. పరిగెడదాం. మాంసాలు ఇక్కడే వుండనీ" అంటూ మాంసంమోపులు వొదిలేసి చువ్వల్లా పరిగెత్తారు వాళ్లు.

అప్పటికే దుర్యోధనుణ్ణి వెదకడానికి ఎంతోమంది వేగులవాళ్ళని రణస్థలానికి పంపారు పాండవులు. ఎక్కడా అతడి అంతు చిక్కక విచారంగా వున్నారు. ఇంతలో ఈబోయలు భీముడి గుడారానికి వెళ్ళారు. ద్వారపాలకుల్ని తోసుకుంటూ లోపల దూరారు. ద్వైపాయనం మడుగులో దుర్యోధనుడు దాగున్నాడని వుప్పు అందించారు. తాము విన్నమాటలన్నీ పూసగుచ్చినట్టు వివరించారు.

సంతోషం పట్టలేకపోయాడు భీముడు. వాళ్లు మొయ్యలేనంత ధనం బహుమానంచేశాడు. వాళ్ళని తీసుకువెళ్ళి అన్నగారి దర్శనం చేయించాడు. "అన్నయ్యా, దుర్యోధనుడు ద్వైపాయనం మడుగులో వాడు క్షుద్రవిద్యతో జలస్తంభనంచేసుకుని దాగున్నాడు. ఇదిగో వీళ్ళు తెలుసుకు వచ్చారు" అని విన్నవించాడు. అశ్వత్థామా దుర్యోధనుడూ అనుకున్న మాటలూ వివరించాడు.

పరమానందంతో వాళ్ళకి రకరకాల బహుమానాలిచ్చాడు ధర్మరాజు. తక్కిన తమ్ముళ్ళకీ, కృష్ణుడికీ తెలియపరిచాడు. వాళ్ళూ, తక్కిన బంధువులూ, స్నేహితులూ యావన్మందితోనూ కలిసి వున్న పాళాన బైలుదేరాడు. గుర్రాలూ, రథాలూ, ఏనుగులూ బైలుదేరాయి. భూమి దడదడలాడిపోయింది. శంఖాలూ, పణవాలూ, భేరీలూ, కాహళాలూ- దిక్కులు దిమ్మెత్తిపోయాయి.

అశ్వత్థామా వాళ్ళూ యుద్ధానికి లెమ్మని దుర్యోధనుణ్ణి నిర్బంధిస్తున్నారు. ఈకలకలం విన్నారు. "మహారాజా, అదిగో పాండ

వులు ఇటే వచ్చిపడుతున్నారు. ఏమంటావు? ఇపుడే వీళ్ళమీద కల బడదామంటే కలబడదాం, కాదంటే తప్పుకుపోతాం. ఎక్కడైనా కనబడకండా వుండి, నువ్వు ఎక్కడికి, ఎప్పుడు రమ్మంటే, అప్పుడు వచ్చి కలుసుకుంటాం" అన్నారు

"ఇప్పుడు కాదు, రేపు" అన్నాడు దుర్యోధనుడు — "ఇప్పటికి ఎక్కడికన్నా తప్పించుకు వెళ్ళిపోండి. తిరిగి పొద్దుపోయాక, రాత్రికి రండి. పాండవులు హస్తినాపురం వెళుతున్నట్టున్నారు. అడ్డులేకండా వెళ్ళిపోనీ. ఇక్కడికి వచ్చినా ఈమడుగులో నేను వున్నట్టు కనిపెట్టలేరు. కనిపెట్టినా నాదగ్గిరికి చేరలేరు. నా విద్యాబలంవల్ల స్తంభించిన ఈనీటి కోటలో నిర్భయంగా వుంటాను వెళ్ళండి" అన్నాడు.

చేసేదిలేక మండుతున్న హృదయాలతో ముగ్గురు మహా యోధులూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు. దుర్యోధనుడు వున్న నీళ్లు రాయిలా స్తంభించిపోయాయి. అంతటా పాండవుల వేగులవాళ్లు తిరుగుతూ వుండడం వల్ల అప్పుడు దుర్యోధనుడు బైటికి రాకపోడమే మంచిదనిపించింది నాకు అదీకాక అతడి జల స్తంభన విజ్ఞానం బాగా తెలిసినవాణ్ణి కనక మరేమీ ప్రమాదం రాదని మనస్సు సమాధాన పరచుకున్నాను. మొదటిలాగే వాళ్ళతో బయలుదేరాను. పట్టుమని పది అడుగులు వెళ్ళానోలేదో, మనస్సు బాధపడింది. మరి వెళ్ళలేక పోయాను. అక్కడే ఎక్కడో వాదిగివుంటానని వాళ్ళతో చెప్పి రథం దిగేశాను. ఆమడుగుపక్క పెద్దపొదలో దూరి, పొంచి కూచున్నాను. అశ్వత్థామా వాళ్ళూ దూరంగా వెళ్ళిపోయి,వొక పెద్ద మర్రిచెట్టుకింద రథాలు ఆపి విశ్రాంతి తీసుకున్నారు. వాళ్ళ బొందెలుమాత్రం అక్కడ వున్నాయి. హృదయాలేమో నీకొడుకుదగ్గిరే వున్నాయి. అతడి విషయమే చెప్పుకుంటూ కూచున్నారు వాళ్లు.

ఉద్ధృతంగా మడుగుఒగ్గిరికి వచ్చారు పాండవులు. నవ్వుతూ, కేరుతూ పాంచాలరాజకుమార్లూ వాళ్లతో వచ్చారు.

"కృష్ణా," మడుగుచూపిస్తూ కృష్ణుడితో అన్నాడు ధర్మరాజు – 'మనిషిమాత్రుడు చొరబడలేడు ఈమడుగు. మాయలమారి కనక నిర్భయంగా దాగున్నాడు దుర్యోధనుడు. ఇందులో దూరితే మాత్రం బతికిపోతాడా ఇతడు? దేవేంద్రుడు అడ్డువచ్చినా దుర్యోధనుడి ప్రాణం దక్కదు.'

"మాయలుకల దుష్టులికి మాయతే మందు" మెల్లిగా అందుకున్నాడు కృష్ణుడు– "మాయలేని పరాక్రమం పనిచెయ్యదు వీళ్ల దగ్గిర. రాక్షసులు మాయోపాయాలతో అసాధ్యులైనప్పుడు దేవేంద్రుడూ, విష్ణువూ వాళ్లని మాయాబలంతోనేకదా, సంహరించారు! హిరణ్యకశిపుడివధా, వృత్రాసురుడివధా నునకి తెలిసిందే కదా! రావణాసురుడి పరాక్రమంతగలబెట్టేకదా, శ్రీరాముడు అతణ్ణి ఇట్టే చంపగలిగాడు! నరకాసురుణ్ణి నేను చంపినవిధానం నువ్వు ఎరిగిందే మరి! కనక ఇతడు బైటికివచ్చే విధానం చూసుకో, ఇప్పుడు."

## మగాడివై తే మడుగులోంచిరా

"దుర్యోధనా!" కవ్విస్తూ ఎత్తుకున్నాడు ధర్మరాజు – "ఇదినీకు తగునటోయి తమ్ముడూ? ఎక్కడైనా కనీవినీ ఎరుగుదుమా ఇలాంటి వైన్యం లోకంమీద. ఛా? ఎంతోమంది రాజులు నీకోసమని వీరమరణం పొందారు. బంధువులూ, మిత్రులూ హేమాహేమీలు యుద్ధంలో తెగిపోయారు. కళ్ళారా చూశావు. నీళ్లలో మునిగావు. అయినా చావు తప్పుతుందా, చెప్పూ! శూరుడంటారే నిన్ను! మడుగులో దూరడమేనా శూరత్వం? మానంకోసం పడిచచ్చే

వాడివే, అదంతా ఎక్కడికిపోయిందోయి? రాజన్న వాడు యుద్ధంలో తోకముడుస్తాడా? రాజువే కావు; రారాజువి. కౌరవవంశంలో పుట్టావు కష్టపుచావా తెచ్చుకుంటావు? పేరూ పెంపూ మంటకలిపేస్తావా? శత్రువులచేత నవ్వులపాలవుతావా? క్షత్రియధర్మం వొదిలేస్తే ఇహమూ, పరమూ రెండూ చెడతాయి. అవాళ నిండుసభలో అలా కూశావే, మరిచిపోయావా? అవిపోల్లులైతే కష్టపాటు కాక ప్రాణమెలా కాపాడుకుంటావు? కొడుకులూ, తమ్ముళ్ళూ యుద్ధంలో ఘోరంగా చవ్వడం చూశాక, వాళ్ళు దాచుకోడానికి ఎలా మనస్కరించిందోయి? విధి ఈమడుగులోకి ఈడ్చుకువచ్చింది నిన్ను. ఎంత నీచానికి వొడబడ్డావోయి! ప్రాణంకంటే మానంహెచ్చు అన్నమాట విన్నా వినలేదటోయి! 'పాండవులికి భయపడి రాజరాజు నీళ్లలో దూరాడు. ఛీ, ఛీ! చచ్చేముందు గాంభీర్యమూ, ధైర్యమూ, పౌరుషమూ వొదిలేశాడు. మానం మంటకలిపాడు' అని లోకం దుయ్యబట్టదూ? కర్ణుడూ, శకునీ, దుశ్శాసనుడూ ఘనులనుకున్నావు. వాళ్ళని పెట్టుకుని మమ్మల్ని గెలిచేద్దామనుకున్నావు. అన్నిపాట్లూ పెట్టావు మమ్మల్ని. ఇంకా కొంకూ లేకపోయింది నీకు! నీఆసలు అడియాసలయాయి. ముసలం నెత్తిమీదపడింది. నీచేవ ఎంతో చూశాం. అవుపించావు. ఇక ఎటుపోతావు? భయం విడిచిపెట్టు. వీరత్వం పాటించు. పౌరుషం వహించు. యుద్ధం చెయ్యి. చావో, గెలుపో సాధించు. బయటికిరా. పోరాడు. పేరు నిలబడుతుంది. దాగుంటే దైన్యంతప్ప మరేమీ దక్కదు. యుద్ధంలో మమ్మల్ని గెలిచావా, భూమండలమంతా ఏలుతుంటావు. చచ్చావా స్వర్గం సంపాదిస్తావు ఈరెండూ తప్పితే ఇంకోమార్గం లేదు. దాక్కోడం నగుబాటు. ప్రాణానికిచేటు. తెగించి మామీదపడకడమే నీకు ధాత నిర్మించిన పరమధర్మం. మగాడివైతే మడుగులోంచి బైటికి రా ”

“మనిషికి ప్రాణభయం సహజం” మడుగులోంచే జవాబు చెప్పాడు దుర్యోధనుడు – “ఇందులో చిత్రమేమీ లేదు. నాకిప్పుడు రథం లేదు. గుర్రాలులేవు. సారథిలేడు ఆయుధాలు లేవు. పరివారం లేదు. బంధువులూ, స్నేహితులూ, సహాయులూ అందరూ చచ్చి పోయారు. ఒళ్ళంతా గాయాలు. యమబాధగావుంది. ఆయాసంగా వుంది. యుద్ధానికి అంగీకరించడంలేదు మనస్సు. అందుకనే తప్పించుకు వచ్చేశాను. సేదదీర్చుకుంటాను. తరవాత యుద్ధంచేస్తాను. నువ్వూ, మీవాళ్ళూ అందాకా అలసట తీర్చుకోండి. తరవాత రండి”

“ఇంతవరకూ అలసట తీర్చుకుంటూనేవున్నాం” మళ్ళాఅందుకున్నాడు ధర్మరాజు – “వెదికి వెదికి నిన్ను కనుక్కున్నాం. నువ్వున్నా సేదదీరావు, బాగా. కనక ఇక దయచెయ్యి. యుద్ధంచెయ్యి.”

“నేను ఇక యుద్ధం చెయ్యను” అన్నాడు దుర్యోధనుడు – “ఓడిపోయి వచ్చేశాను. మళ్ళీ బిగురెందుకు నాకు? శాంతంగా అడివికి పోతాను. నారలు కట్టుకుంటాను మునులమధ్య తపస్సుచేసుకుంటాను. ఈరాజ్యం యావత్తూ నీకే ఇచ్చేశాను. ఏలుకో క్రోధం మాను. గుర్రాలూ, ఏనుగులూలేని బయలు నీనెత్తినే కట్టుకో. ఎవరికోసం రాజ్యమూ, సమస్తభోగాలూ కోరుకుంటామో ఆ కుమాళ్ళూ, తమ్ముళ్ళూ లేరు నాకు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ లేకండా శూన్యమే అయిపోయింది భూమి. ఇంక దేనికోసం యుద్ధం? ద్రుపదుడికుమాళ్ళని గెలిచి, మీ అయిదుగురినీ హతంచేసి సర్వసామ్రాజ్యాధిపత్యం సాధించానే అనుకో, ఏంలాభం? ఎవరుతినాలి? వృథా రభస? కర్ణుడూ, భీష్ముడూ, ద్రోణుడూ లేని రాజ్యం మనస్కరించదు నాకు. తనవాళ్ళతో కలిసి అనుభవించని రాజ్యం రాజ్యమేనా రాజుకి? నీతమ్ముళ్ళు బతికారు. పరిజనులూ వున్నారు నీకు. కనక నువ్వే ఏలుకో రాజ్యం.”

"నీదగ్గిర దానం పుచ్చుకుని రాజునికాను నేను" నవ్వుతూ అన్నాడు ధర్మరాజు — "రాజన్నవాడు దానంచేస్తాడే కాని పుచ్చుకోడు. నిన్ను యుద్ధంలో పడగొట్టి రాజ్యం ఏలుకుంటాను. కాదు, నన్నే నువ్వు కాజేస్తావూ, నువ్వే మహారాజు ఐపుతావు రాజ్యమంతా ఏలుకుంటావు. కుమారుళ్ళూ, తమ్ముళ్ళూ లేరుకనక రాజ్యం అక్కరలేదంటున్నావు. తమ్ముళ్ళూ, కుమారుళ్ళూ, ఆప్తులూ చచ్చేదాకా కళ్ళుణ్ణిపెట్టుకుని మమ్మల్ని గెలవాలనుకున్నావు. రాజ్యం కట్టుకోవాలనుకున్నావు. ఎందుకూ ఈకాకిమొ(ర? మగాడివే అయితే మడుగులోంచి రా. యుద్ధం చెయ్యి. రాజ్యం ఇచ్చేస్తానంటున్నావు. ఏమొహంతో అంటున్నావు ఈమాట? నువ్వే రాజ్యం ఇస్తే ఈ అవస్థ ఎందుకు పడుతుంది,కురుకులానికి? శాంతిసందేశం తీసుకుని సంధికోసం వచ్చాడు శ్రీకృష్ణుడు. అతిడిమాట కొట్టేశావు. సూదిమొన మోపినంతనేలా ఇవ్వను పొమ్మన్నావు. ఇప్పుడు రాజ్యం ధారపోస్తావా? ఎలా ధారపోస్తావు? ఏదీ రాజ్యం'

"శత్రువులికి రాజ్యం ఇచ్చేస్తా నన్న బుద్ధిలేనివాణ్ణి నిన్నే చూశాను. నువ్వు రాజ్యం ఇచ్చినా నిన్ను చంపకండా వొదిలిపెట్టను. రా. కలబడు. యుద్ధంచెయ్యి. నాచేత నీ(పాణాలున్నాయి. నీచత్వం తగదు నీకు. రాజులా ప్రవర్తించు.

"లక్కయిల్లు కాల్చావు. పాములు కరిపించావు. నీళ్ళలో తోశావు. అన్నంలో విషం పెట్టావు. ఎన్ని కపటోపాయాలు చేసినా చెక్కుచెదరలేదు మేం ఇక ఈమాటలతో ప్రయోజనం లేదు. మగతనమే వుంటే మడుగులోంచి రా. పోరాడు. అదే నీకు మేలు. ఇంకోమార్గంలేదు. ఎందుకిలా దాక్కుని అవస్థపడతావు?"

ధర్మరాజులాగే తక్కినవాళ్ళూ కవ్వించారు.

ధృతరాష్ట్రుడు : అందరూ అలా ధిక్కరించారూ? జంకన్నది ఏకోశానా ఎరగడు మా దుర్యోధనుడు. భూమినాలుగు చెరగులా తనమాట తలవొగ్గుతూ వుండేది. ఎదురులేకండా బతికాడు. పరిజనులు లేకపోయి దీనుడై పోడంతోనే శత్రువులు చుట్టుముట్టారు. నిష్ఠురమైన మాటలు ఎలాభరించాడు రాజరాజు? ఎలాప్రాణాలు నిలుపుకున్నాడు?

## ఒక్కొక్కడే రండి

సంజయుడు : ధర్మరాజూ, అతడి తమ్ముళ్ళూ, కుమాళ్ళూ కుళ్లుపోట్లలాటి మాటలాడారు? కవ్వించారు. భరించలేకపోయాడు దుర్యోధనుడు. మనస్సు క్షోభపడింది. మొహం ఎరుపెక్కింది.

"ఒక్కొక్కడే రండి" యుద్ధం నిశ్చయించుకుని, చేతులు దులుపుతూ అన్నాడు దుర్యోధనుడు – "అయిదుగురు వున్నారు మీరు. పరివారమూ వుంది. బంధువులూ, స్నేహితులూ వున్నారు. సమస్తమైన ఆయుధాలూ వున్నాయి. గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ అన్నీ వున్నాయి మీకు. ఒక్కణ్ణే నేను. సహచరులు లేరు. ఆయుధాలు లేవు. వాహనాలు లేవు. ఎలా యుద్ధంచేసేది? అదీకాక గాయాలతో బాగా అలిసిపోయాను నేను. ఆయాసంలేకండా వున్నారు మీరు. పదిమందీ వొక్కడిమీదపడి యుద్ధంచెయ్యడం ధర్మంకాదు. అంచేత వరసగా వొక్కొక్కడూ రండి. యుద్ధంచెయ్యండి. మీ అందరినీ వూడ్చేస్తాను. మీ స్నేహితుల్నీ బంధువుల్నీ చంపేస్తాను. అలా వొక్కొక్కళ్ళూ చాలలేమంటారా, నీతమ్ముళ్ళనీ, నిన్నూ, కృష్ణుణ్ణే, సాత్యకినీ, ద్రౌపది అన్నదమ్ముళ్ళనీ ఇంతమందినీ వొక్కణ్ణే –చుక్కల్ని సూర్యుడు మాపేసినట్టు మాపేస్తాను. ఇదిగో వస్తున్నాను. నిబ్బరంగా నిలబడండి.

"మొదట అలా అన్నానంటే నీకూ, కృష్ణుడికీ భయపడి కాదు. అంతటావున్న యుద్ధధర్మం చెప్పాను. మీఅందరినీ చంపే స్తాను. భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, భగదత్తుడూ, బాహ్లీకుడూ, జయద్రథుడూ, శల్యుడూ, శకునీ మొదలైన బంధుమిత్రుల యావ న్మంది రుణమూ తీర్చుకుంటాను."

"అదిగదీ మాట" అందుకున్నాడు ధర్మరాజు — "యుద్ధ ధర్మం తెలుసుకుని, శత్రువుని గెలవడానికి పూనుకోడం క్షేమయిన సంగతి. ఒక్కడివే మామీద వురుకుతాననీ, చంపుతాననీ అనడం మగతనం కలమాటఅయితే నువ్వు అన్నావు కదా అని మేంమాత్రం పదిమందిమీ నీమీదపడతా మనుకోకు. ఆయుధాలూ, వాహనాలూ లేవని సంకోచించకు. నీకు కావలిసిన ఆయుధం కోరుకో. కావలిసిన వాహనం పుచ్చుకో. మాలో వొక్కణ్ణి గెలిచినా చాలు.

"ఇంకోఆయుధం అనవసరం నాకు" అన్నాడు దుర్యోధనుడు— "వాహనాలూ అక్కరలేదు. ఇంతవరకూ రథాలమీద యుద్ధం చెయ్యనే చేశాం. రకరకాల బాణాలతో పోరాడాం. నేలమీదే ఇక యుద్ధం. గదాయుద్ధమే మేలనిపిస్తోంది నాకు. ఇదే నా నిశ్చయం. వింతవింత కూరలు వింతవింత రుచి. అలాగే యుద్ధంలో కొత్తకొత్త పద్ధతులు వేడుకకలిగిస్తాయి, కనక గదపట్టుకుని నిన్నూ, నీతమ్ము ళ్ళనీ, తక్కిన యోధుల్నీ పడమొత్తుతాను."

"క్షేమయిన మాట" సంతోషిస్తూ అన్నాడు ధర్మరాజు — "నేనే గదపట్టుకుంటాను. నా బాహుబలంతో నీప్రాణాలు పుచ్చు కుంటాను."

ధర్మరాజు పలుకులు ములుకుల్లాగ తగిలాయి దుర్యోధనుడికి. పుట్టలో పాంలాగ బుసకొట్టా డతడు. ఒళ్ళు ఝాంగించాడు. చబుకు ఛెళ్ళుమంటే చెంగుమన్న పెంకిగుర్రంలాగ లేచాడు. జలస్తంభనం వొది

లేశాడు. గద బుజంమీద వేసుకున్నాడు. మడుగు సంక్షోభించినట్టు పైకిలేచాడు. గదతో అలా మడుగులోంచి లేస్తూవుంటే శిఖరంతో లేచినకొండలా అవుపించాడు దుర్యోధనుడు. కాలదండం పట్టుకు లేచిన యముడే అనుకున్నారు సైనికులు.

దుర్యోధనుణ్ణి చూశారు పాండవులు. పాంచాలంవాళ్ళూ, వాళ్ళూ చిరునవ్వులతో వొాకళ్ళమొహం వొాకళ్ళు సాకూతంగాచూసుకున్నారు. ఆ అపహాస్యం గ్రహించేశాడు దుర్యోధనుడు. బొమలు ముడివేశాడు. కళ్ళల్లో చింతనిప్పులు కురిశాడు.

"ఈ గెలుపల్లా వూడగొట్టేస్తాను" ఉరిమాడు దుర్యోధనుడు – "అందాకా ఆగండి" అంటూ వళ్ళుకొరికాడు. అందరినీ చురచురా చూశాడు. అతడి గాయాల్లోంచి రక్తాలుచిమ్మాయి. జేగురు సెలయేళ్ళ కులపర్వతంలా అవుపించా డతడు. నిటారుగా నుంచున్నాడు. బంధుమిత్రులతో పాండవులుమీదపడతారని శంకిస్తూ సిద్ధపడ్డాడు. ధర్మరాజువేపు తిరిగాడు. "రండి, -ఒక్కొక్కడూ రండి. ఎంతోమంది మీారు. ఒక్కణ్ణి నేను. గాయాలతో బాగా ఆయాసపడి వున్నాను." అన్నాడు.

"కుర్రాణ్ణిచేసి, అంతమంది వీరులూ మీాదపడి అభిమన్యుణ్ణి చంపెయ్యలేదూ, అదిగోఅలాగే అనుకో" దెప్పిపొడిచాడు ధర్మరాజు.

దుర్యోధనుడినోట మాట పెగల్లేదు. అలాగే నుంచుండిపోయాడు.

## ఒ క్క ణ్ణి గె లి చి నా నీ దే రా జ్య ం

"ఊరికే దాఖలాచూపించి అన్నాను" మళ్ళీ అందుకున్నాడు ధర్మరాజు – "భయపడకు. అది యుద్ధధర్మం కాదని ఎరుగుదును. నీమీాదికి నాసైనికుణ్ణి వొాక్కణ్ణే రానివ్వను. నిర్భయంగా యుద్ధానికి

సిద్ధపడు. తల చక్కగా ముడివేసుకో. దట్టీ బిగించి కట్టుకో. కిరీటం కవచం అన్నీ ఇస్తాను. మరో మాట చెపుతాను, ఆశ్చర్యంతో నువ్వే మెచ్చుకుంటావు.

"ఇదిగో, మా అయిదుగురిలోనూ నీఇష్టంవచ్చినవాణ్ణి వొకణ్ణి ఏరుకో. నువ్వు కోరుకున్నవాడే నీతో యుద్ధంచేస్తాడు. అతణ్ణిగెలిస్తే చాలు, నీదే రాజ్యం. ఇంకొకడు మళ్ళీ నీతో యుద్ధం చెయ్యడు. గెలిచావా సామ్రాజ్యం. చచ్చావా స్వర్గం. నేను శపథం చేస్తున్నాను. ఒక్కణ్ణి గెలిచినా రాజ్యం నీదే" అన్నాడు.

దేదీప్యమైన ఆయుధాలూ, కిరీటాలూ, కవచాలూ రకరకాలవి అతడిముందు పెట్టించాడు. ఇంకా ఇలాఅన్నాడు: "తమ్ముడూ, విను. ప్రాణంతో నిన్ను పోనివ్వడం తప్పించి, ఈయుద్ధంలో నువ్వుఏదికోరితే అది నీకు ఇస్తాను. ఇంతలోనే చెడిపోయాయా మన అన్నదమ్ముల ప్రేమలు ? "

"అవును, నామీద ఎన్నడూ కోపంలేదు నీకు" అన్నాడు దుర్యోధనుడు. రత్నాలు చెక్కిన బంగారం కిరీటం వేసుకున్నాడు. కవచం తొడిగాడు. బంగారం కొండలా కనిపించాడు.

"రండి" గదపట్టుకుని, ధర్మరాజుని చూస్తూపిలిచాడు దుర్యోధనుడు— "నకులుడో, సహదేవుడో, అర్జునుడో, భీముడో, నువ్వో — ఎవరొస్తారో రండి. గదపట్టుకుని ద్వంద్వయుద్ధానికి రండి. చిటికలో పనిపట్టేస్తాను. వరసపట్టి వొకడితరువాత వొక్కణ్ణి కూలగొట్టేస్తాను! ఇంకా మీవాళ్ళలో ఎవడు కలబడినా సరే, నా గదకి బలివేస్తాను. గదాయుద్ధంలో శివుడన్నా తేరిచూడలేడు నన్ను. మీరెటుపోతారు. నల్లులు" అంటూ పెద్దపెద్ద కేకలువేశాడు గర్జించాడు.

"జూదంనాటి మాటేనా మళ్ళీ" దుర్యోధనుడు వినకండా ధర్మరాజుని మందలించాడు కృష్ణుడు — "ఒక్కణ్ణి గెలిచినా రాజ్యం

నీదే అంటున్నావు. జూదంలో పదమూడేళ్ళూ రాజ్యం వొదిలెయ్యడానికి పందెంవేసినట్టే వుంది ఇది. ఇంతా చచ్చీచెడీ, ఇంతమంది శత్రువుల్ని చంపడమల్లా తుదకి ఈపందెం వెయ్యడానికేనా? తమ్ముణ్ణి చూడగానే దయపుట్టేసింది నీకు. దాంతో వున్నమతి వూడిపోయింది. గదాయుద్ధానికి నిన్నే పిలిచాడనుకో, ఏమవుతుంది? వీళ్ళకి బుద్ధిలేదా అనుకోరూ విన్నవాళ్ళు? సాహసానికి ఇదాసమయం? ఇతడితో ద్వంద్వయుద్ధానికి భీముణ్ణిపంపినా ప్రమాదం రాదనుకోలేం. భీముడికి బలం హెచ్చునిజమే. కాని గదాయుద్ధంలో కౌశలం హెచ్చుదుర్యోధనుడికి. కౌశలంముందు బలం బలాదూరు" అన్నాడు.

"ఈమాత్రానికే అంత నిక్కచ్చిచేస్తావేం, అన్నయ్యా!" అందుకున్నాడు భీముడు. "గదపట్టుకున్నానంటే పద్నాలుగులోకాలూ వచ్చడిచేస్తాను. మదమెక్కి వాగుతున్నాడు దుర్యోధనుడు. నన్నెదిరించి బతికిపోతాడు? ఇతడిగద నాకు జీలుగుబెండు. నాగదతో బాదేస్తాను. చంపేస్తాను. నువ్వే ఛళీ అందువుకాని."

"అంతవాడివే నువ్వు" సంతోషించి, భీముడికి వురెక్కేస్తూ అన్నాడు కృష్ణుడు - "మాకు నీబలం తెలియదూ! హిడింబుణ్ణి చంపేశావు బకుడిపని పట్టేశావు. జరాసంధుణ్ణి చీల్చేశావు. మానవ మాత్రుడు చెయ్యగల పనులేనా అవి? మరచిపోయి ఏదో అన్నాను, కాని ఒక మనిషి నీముందు ఏమాత్రం? ఈమహాభారతయుద్ధంలో వేలకివేలు ఏనుగులు కాలికింద నెరివేశావు. కళింగులూ మొదలైన రాజులూ, కౌరవకుమారుళ్ళూ నీబాహుబలంతో హతమారిపోయారు."

దుర్యోధనుణ్ణి కడకంటితో చూస్తూ ఇంకా అన్నాడు కృష్ణుడు:

"నువ్వు దుశ్శాసనుడి గుండెలు చీల్చేసి, రక్తం తాగేస్తుంటే అడలెత్తిపోయి, చూస్తూ వుండిపోయాడే కాని వొక్క అడుగైనా ముందికి వేశాడా దుర్యోధనుడు ?

"దాగుని అవుపడ్డాడిప్పుడు. విరగబడుతున్నాడు, దొరికిపోయి. ఇతడు ఆడినమాటలికి పదిమందిమీ కలిసి చంపెయ్య వలసింది. అలా చెయ్యలేదు సరికదా, పందెం వేశాడు మీ అన్న. ఇది కూడదన్నాను. భయపడ్డాను కాని నీబలం తలుచుకుని కుదుటబడ్డాను. తుంటరులై ధృతరాష్ట్రుడి కొడుకులు మీ ద్రౌపదిని జుట్టుపట్టుకుని సభకి ఈడ్చుకు వచ్చారు. బట్టలు విప్పారు. భీమసేనా, అప్పుడు నువ్వు రెండు ప్రతిజ్ఞలు చేశావు. దుశ్శాసనుడి రక్తం తాగి వొకటి పూర్తిచేశావు. ఇంకొకటి మిగిలింది. నీచేతుల కసితీరా అది పూర్తిచేసుకోవాలి, ఇప్పుడు.దాంలో రెండూ పూర్తవుతాయి. చప్పునశత్రువుని జయించు. అన్నకి సామ్రాజ్యం కట్టిపెట్టు. బంధువులందరికీ కళ్ళవేడుక కలిగించు. నువ్వూ నీతమ్ముళ్లూ సుఖంగా జీవితం గడపండి.

"ఐతే, దుర్యోధనుడు అంత తేలికైన వాడు కాదు. ఉద్దోలమైన బలశాలి. మొక్కా-కలు తేరినవాడు. నువ్వు ఎంతో మెలకువతో పోట్లాడాలిసుమా!"

సాత్యకికూడా భీముణ్ణి పొగిడాడు. పురెక్కించాడు. ధృష్టద్యుమ్నుడూ మొదలైన పాంచాలరాజకుమారుళ్ళూ, తక్కిన యావన్మంది రాజులూ భీముణ్ణి పురికొల్పారు.

"అన్నయ్యా" ధర్మరాజుమొహం చూస్తూ అన్నాడు భీముడు –"ఈ కులహంతకుడిమీద చిరకాలం నించీ మండుతోంది నాకోపం. అర్జునుడు ఖాండవం కాల్చినట్టు నాకోపాగ్నితో కాల్చేస్తాను, ఇతణ్ణి. గదతో తారుమనిపించేస్తాను. అడ్డులేకండా సామ్రాజ్యం ఏలుకుంటావు నువ్వు. కీర్తి పువ్వులదండ నీ మెడలో వేస్తాను. కొడుకు చచ్చిన చావు

కబురు చల్లగా వింటాడు గడ్డిరాజు. శకునిబుద్ధి ఇంత తెచ్చిందని తెలుసుకుంటాడు. కుమిలిపోతాడు.”

గదపట్టుకున్నాడు భీముడు. వృత్రాసురుడి వేపుతిరిగిన దేవేంద్రు డిలాగ దుర్యోధనుడిదిక్కు తిరిగాడు. అడ్డులేని ఆబోతులాచూస్తున్న దుర్యోధనుణ్ణి సింహంలా చూశాడు. తన అన్నదమ్ములు సంతోషించి నట్టు దుర్యోధనుడితో ఇలా అన్నాడు:

“క్రూరకర్మఅనిజంకకండా లక్కఇంట్లోచిచ్చుపెట్టావు. మాయ జూదమాడించావు; ధర్మరాజుని వోడించావు. ద్రౌపదిని భంగ పెట్టావు. దురాత్ముడా. ఆపాపఫలం అనుభవిస్తా విప్పుడు. భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, శల్యుడూ, బంధువులూ, స్నేహితులూ నీ మూలంగానే తుడుచుకుపోయారు. సాయంవచ్చిన రాజులందరూ చచ్చారు. తోడబుట్టువులు అందరూ గుటుక్కుమన్నారు. దీనంతటికీ మూలమైన శకునిమామా చచ్చాడు. ఒక్కడివీ మిగిలావు. నిన్ను నాగదకి బలివేస్తాను. ఎందుకలా గర్జిస్తావు? రా, సిద్ధపడు. నాతో యుద్ధం చెయ్యి.”

“ఎందుకోయి, ఈ తాటాకుచప్పుడు?” వురిమాడు దుర్యోధ నుడు- “గదతో సిద్ధంగానే వున్నాను. నీచేవ ఏమాత్రమో రా చూపెడుదువుకాని. ఇలా నన్ను నువ్వూ, నిన్ను నేనూ తూలనాడు కుంటే ఏముంది? గదాయుద్ధంలో దేవేంద్రుడైనా నాముందు తీసికట్టు. ధర్మంతప్పకండా నాతో దెబ్బలాడు. ప్రాణాలతో బైటపడవు.”

పాంచాలంవాళ్ళూ, తక్కిన రాజులూ దుర్యోధనుణ్ణి మెచ్చు కున్నారు. తాళాలతోనూ వాటితోనూ మదపుటేనుగుని రెచ్చగొట్టి నట్టు దుర్యోధనుడికి ఉల్లాసం కలిగించారు. ఏనుగులు గీపెట్టాయి. గుర్రాలు సకిలించాయి. ఆయుధాలు తళతళలాడాయి. అంతమందీ దూరంగా తప్పుకు కూచున్నారు. భీముడూ, దుర్యోధనుడూ-మహా

వీరులు ఇద్దరూ చురచురా చూసుకున్నారు. ఒకళ్ళమీద వొకళ్ళు కలబడడానికి సిద్ధపడ్డారు.

## బలరాముడు వచ్చాడు

సరిగ్గా అదేసమయానికి గదాయుద్ధం చూడడానికి బలరాముడు అక్కడికి వచ్చాడు. ఇంతకిముందే ఈ వార్త విన్నాడతడు. భీముడూ, దుర్యోధనుడూ అతడిదగ్గిరే గదాయుద్ధం నేర్చుకున్నారు. అంచేత విని వినడంతోటే శిష్యుల గదాయుద్ధం చూడడంకోసం గాలిలా పరిగెత్తే రథంమీద సరాసరి ద్వైపాయనంమడుగుదగ్గిరికి వచ్చాడు. అల్లంత దూరంలో అతడు అవుపించగానే అంతమందీ ఎదురువెళ్ళారు. గౌరవాదరాలతో ప్రణామంచేశారు. అతడూ ప్రత్యభివందనంచేశాడు. ధర్మరాజు అతణ్ణి సంతోషంతో కౌగిలించుకున్నాడు. అర్జునుడూ, నకుల సహదేవులూ, ద్రౌపదికుమారుళ్ళూ నమస్కారంచేశారు. తగిన మాటలతో అంతమందినీ ఆదరించాడతడు. కృష్ణుడూ సాత్యకీ పాదాభివందనంచేశారు. ప్రేమగా ఇద్దరినీ గుచ్చి కౌగిలించుకున్నాడు బలరాముడు. అంతమందీ కుశలప్రశ్నలువేశారు. ఎవళ్ళకి తగినట్టు వాళ్ళకి జవాబులుచెప్పాడతడు.

“నేను తీర్థయాత్రకి వెళ్ళి ఎన్నోదినాలు అయిపోయింది. మీఅందరినీ చూడాలనీ, నాశిష్యులగదాయుద్ధం చూడాలనీ వచ్చాను అన్నాడు.

దుర్యోధనుడూ, భీముడూ గదలుపట్టుకునే భక్తిపూర్వకంగా బలరాముడికి నమస్కరించారు. ఇద్దరినీ ఆదరించాడతడు.

“అన్నదమ్ముల ద్వంద్వయుద్ధం చిత్తగించు” అంటూ ఇద్దరూ గదాయుద్ధానికి సిద్ధమైనవైనం చెప్పాడు ధర్మరాజు.

"మంచిది, కానివ్వండి" అనుమతించాడు బలరాముడు. అలా బలరాముడిరాక ధృతరాష్ట్రుడితో సంజయుడు చెప్పాడు.

కౌరవపాండవసేనలు యుద్ధానికిసిద్ధపడుతున్నప్పుడుబలరాముడు సరస్వతీ తీర్థానికి వెళిపోయాడు. 'కృష్ణుడు పాండవపక్షపాతి, అతడికి తెలియని ధర్మమూ, పురుషార్థమూ నాకు తెలియవు. కాని ఈనిష్ఠురత్వం నేను చూడలేను, వినలేను. మీతో చెప్పి తీర్థయాత్రకి పోవాలని వచ్చాను. అని విరాటరాజూ మొదలైన బంధువులతో చెప్పి, ధర్మరాజునీ, కృష్ణుణ్ణీ వొప్పించి వెళ్ళిపోయాడు. పుష్యమీనక్షత్రం నాడు పాండవులు కురుక్షేత్రం బయలుదేరారు. బలరాముడు అనూరాధ నక్షత్రంనాడు తీర్థయాత్రకి బయలుదేరాడు. దానాలూ వాటికోసం ఆవులూ, బంగారమూ, ఇతరపదార్థాలూ అవీ తేడానికీ, తన అగ్నిహోత్రాలు పట్టుకురావడానికీ తగినవాళ్ళని నియోగించాడు. ఎంతోమంది బ్రాహ్మల్నీ, ఋత్విక్కుల్నీ వెంటపెట్టుకున్నాడు, కావలిసిన రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, భోజనసామగ్రులూ తెప్పించాడు. అలా పెద్దపరివారంతో తీర్థయాత్రకి బయలుదేరి సరస్వతీనదీ సముద్రమూ కలిసేచోటికి వెళ్ళాడు. అదే పేరుబడ్డ ప్రభాసతీర్థం.

ప్రభాసం సేవించి, అక్కణ్ణుంచి మజిలీలువేస్తూ, వొడ్డంబడే సరస్వతీ తీర్థాలుయాపత్తూ దర్శించాడు. అన్నపానాలిచ్చీ, వాహనాలూ అవీ ఇచ్చీ, ఆవులూ, బంగారమూ, రత్నాలూ, నగలూ, వస్త్రాలూ దానంచేసీ బ్రాహ్మల్ని సంతృప్తిపరిచాడు. పిల్లలూ, ముసిలాళ్ళూ, స్త్రీలూ, గుడ్డివాళ్ళూ, గూనివాళ్ళూ, కుంటివాళ్ళూ అలిసిపోతే వాళ్ళకి సహాయం ఏర్పాటుచేశాడు. ఇలా ఎన్నో ధర్మాలు చేస్తూ కురుక్షేత్రం వచ్చాడు.

## ఆడాళ్ళకి అన్యాయం చెయ్యకూడదు

ముందు ప్రభాసతీర్థానికి వెళ్ళాడని చెప్పానుకదూ! మహత్తరమైన తీర్థమది. అక్కడే చంద్రుడు క్షయరోగం పోగొట్టుకున్నాడు. దక్షప్రజాపతికూతుళ్ళని అశ్విని మొదలైన ఇరవైఏడుగురిని చంద్రుడు పెళ్ళిచేసుకున్నాడు. వాళ్ళందరిలోకీ రోహిణి చక్కనిచుక్క. ఆమె అంటే చంద్రుడికిప్రాణంగా వుండేది. తక్కినభార్యల్ని బాగాచూసే వాడుకాడు. అందుకని వాళ్ళందరూ బాధపడ్డారు. తండ్రిదగ్గిరికి వెళ్ళి మొరపెట్టుకున్నారు. దక్షుడు చంద్రుణ్ణి గదమాయించాడు, "ఇది అన్యాయం. ఇకముందు ఇలాచేస్తే శపిస్తాను" అన్నాడు. చంద్రుడు లక్ష్యపెట్టలేదు. రోహిణితోనే కులికాడు. దక్షుడికి వొళ్ళుమండింది. "క్షయరోగం పట్టుకోవాలి" అని శపించాడు. నానాటికీ క్షీణించి పోతూడు చంద్రుడు. ఓషధులికి అధిపతికదా, చంద్రుడు అతడితో పాటు ఓషధులూ క్షీణించిపోయాయి. పసలేకండా అయిపోయాయి. ప్రజలఆయాసం అధికమైంది. చంద్రుడు క్షీణించిపోడమే దీనికికారణమని గ్రహించారు దేవతలు. చంద్రుడిదగ్గిరికి వెళ్ళారు. "ఎందుకిలా కృశించిపోతున్నావు?" అని అడిగారు. జరిగినసంగతి దాచకండా చెప్పాడు చంద్రుడు.

అతణ్ణి వెంటపెట్టుకుని దక్షుడిదగ్గిరికి వచ్చి ప్రార్థించారు దేవతలు.

"భార్యలందరినీ సమానంగా చూడాలి, చంద్రుడు" ప్రసన్నుడై అన్నాడుదక్షుడు - అంతేకాదు, సరస్వతీ, సముద్రమూకలిసే చోట స్నానంచెయ్యాలి. క్రమంగా పదిహేనుదినాలు పెరుగుతూ, పదిహేనుదినాలు తగుగుతూ వుంటాడు. అమావాస్య అమావాస్యా ఆతీర్థంలో మునిగి, పెరుగుతూ ప్రకాశిస్తాడు" అని శాపానికివిరుగుడు చెప్పాడు. దేవతల్ని సాగనంపాడు

"ఆడాళ్ళని అవమానించకు. అలాగే బ్రాహ్మల్నీ అవమానించకు" - అల్లుడికి బుద్ధిచెప్పి పంపేశాడు. శాపవిమోచనం పొంది చంద్రుడు సరస్వతీ, సముద్రమూ కలిసిన తీర్థానికి వచ్చాడు. అందులో స్నానంచేసి రోగం పోగొట్టుకున్నాడు. ప్రభాసుడయాడు. అంటే బాగా ప్రకాశించాడు. అందుచేతే దానికి ప్రభాసతీర్థమని పేరువచ్చింది.

ప్రభాసతీర్థంనించి చమసోద్భవ తీర్థానికి వెళ్ళాడు బలరాముడు. అక్కడ వొకరాత్రి వుండి ఉదపాన తీర్థానికి వెళ్ళాడు*

## చెరపకురా చెడేవు

వెనకటి గౌతముడని వొక తపస్వి వుండేవాడు. అతడికి త్రితుడూ, ద్వితుడూ, ఏకతుడూ అని ముగ్గురు కుమాళ్ళువుండేవాళ్ళు. రాజులచేత యజ్ఞాలు చేయించి ఎన్నో ఆవులు సంపాదించారు వాళ్ళు. కలిసి అవి తోలుకువస్తూ ఏకతుడూ, ద్వితుడూ అన్నని వంచించి ఆవులన్నీ తామే అపహరించాలని ఎత్తువేశారు. దారిలో వొక తోడేలు కనపడింది. త్రితుడు ముందునడుస్తున్నాడు. భయపడి పరిగెత్తాడు. సరస్వతివొడ్డునే వొక పాడునుయ్యివుంది ప్రమాదవశాత్తూ త్రితుడు అందులో పడిపోయాడు. అసలే పాపబుద్ధితో వున్నారు తమ్ములు. మంచిపని అయిందంటూ చెంగలుగుద్దారు. అన్నని నూతిలో వొదిలేశారు. ఆవులు పట్టుకుని ఇంటికి వచ్చేశారు.

యజ్ఞకర్మలో అద్వితీయుడు త్రితుడు. నాలుగువేదాలూ అతడికి మంచినీళ్ళప్రాయంగావుండేవి. నీళ్ళులేని పాడునూతిలోంచి బైటికి రావాలంటే సోమపానం చెయ్యాలి అని సంకల్పించాడు. యజ్ఞసాధనాలూ, ప్రతినిధులూ సంకల్పరూపంలోనే సంపాదించుకుని యజ్ఞంచేశాడు. దేవతలు వచ్చారు. హవిర్భాగాలు పుచ్చుకున్నారు. సరస్వతీ

* ఉదపానం : నుయ్యి.

నీళ్ళు ఆనూతిలోంచి పొంగిపోర్లాయి. నీళ్ళతో త్రితుడు బైటికి వచ్చే శాడు. దేవతలు వరంకోరమన్నారు. "ఈనూతిలో స్నానంచేసిన వాళ్ళు సోమపానం చేసినఫలం పొందాలి." ఈవరం ప్రసాదించారు దేవతలు. స్వర్గానికి వెళ్ళిపోయారు.

ఇంటికి వచ్చాడు త్రితుడు. తమ్ముళ్ళని తోడేళ్ళయి పొండని శపించాడు. చెరపబోయారు, చెడ్డారు వాళ్ళు. అదిగో అదీ ఉదపాన తీర్థం.

ఉదపానంలో స్నానమాడి వినశనతీర్థానికి వెళ్ళాడు బలరాముడు. తక్కువజాతివాళ్ళకి అక్కడ సరస్వతి అవుపించదు. అంచేత దానికి వినశనమని పేరు. వినశనంలో స్నానంచేసి అవతలివొడ్డున భూమిక తీర్థం వెళ్లాడు బలరాముడు. అప్సరసలు పాటలుపాడుతూ, నాట్యం చేస్తూ విహరిస్తారక్కడ. కనకనే దానికి భూమిక అని పేరు.

భూమిక సేవించి, గంధర్వతీర్థానికి వెళ్ళాడు బలరాముడు. విశ్వావసుడూ మొదలైన గంధర్వులు తపస్సిద్ధి పొందిన క్షేత్రమది. అక్కణ్ణుంచి గర్గస్రోతానికి వెళ్లాడు. గర్గుడు మునులతో కలిసి ఎంతోకాలం నివసించిన క్షేత్రమది. అక్కడే అతడికి కాలజ్ఞానమూ జ్యోతిర్విద్యా శుభగతులూ అవగతమయాయి. అక్కణ్ణుంచి శంఖతీర్థం వెళ్లాడు బలరాముడు. అక్కడ మహాశంఖం అని మహావృక్షం చూశాడు. అక్కణ్ణుంచి నైసర్గికమూ, నాగధన్వమూ వెళ్లాడు.

నాగధన్వం వాసుకి నివాసస్థానం. అక్కడే అతణ్ణి నాగరాజుగా అభిషేకించారు దేవతలు. నాగధన్వంనించి నైమిషారణ్యానికి వెళ్లాడు బలరాముడు. కృతయుగంలో నైమిషారణ్యానికి సరస్వతి దూరంగా వుండేది. మునులు పన్నెండేళ్లు సత్రయాగం చేశారక్కడ. వాళ్ళని సన్మానించడంకోసం నైమిషందిక్కు మళ్ళింది సరస్వతి. ఆవిశేషం విని ఆశ్చర్యపోయాడు బలరాముడు. అక్కణ్ణుంచి సారస్వతానికి వెళ్ళాడు.

అదే మంకణముని నివాసస్థానం. సరస్వతితీర్థాలు అన్నిటిలోకీ ఉత్తమ తీర్థ మది.

లోగడ బ్రహ్మపుష్కరం దగ్గిర సత్రయాగం చేశాడు. అపుడు సరస్వతి స్త్రీరూపంలో అక్కడ ప్రత్యక్షమయింది. సుప్రభ అయింది. అలాగే నైమిషారణ్యంలో మునులు యజ్ఞంచేసినప్పుడు కన పడి కన కాక్షి అయింది. గయుడు యజ్ఞంచేసినప్పుడు గయలో అవుపించి విశాల అయింది. ఉద్దాలకముని యజ్ఞంలో ఉత్తరకోసలంలో దర్శనమిచ్చి సుతన్వ అయింది. వశిష్ఠుడి సప్తతంతువు (యజ్ఞం) దగ్గిరకివెళ్ళి ఓఘ మాల అయింది. కురుమహారాజు యజ్ఞంలో కురుక్షేత్రంలో కనిపించి సువేణి అయింది. మరొకసారి హిమాలయందగ్గిర బ్రహ్మయజ్ఞం చేసినప్పుడు ప్రత్యక్షమైంది,విమలోదక అయింది. ఈసప్తసరస్వతులూ మంకణముని ఆశ్రమందగ్గిర కలిశాయి.అందుచే తేనప్త సారస్వతమైం దది. మంకణముని చరిత్ర చిత్రమైంది.

## మంకణముని

సుకన్యగర్భంలో వాయుదేవుడికి జన్మించినవాడు మంకణుడు. అతడు వొకసారి సరస్వతిలో స్నానంచేస్తున్నాడు. ఆదగ్గిరే వొక అందకత్తె దిగమొలతో స్నానంచేస్తోంది. చూసి, మునిమనస్సు చలించింది. వీర్యస్ఖలనం అయిపోయింది. అతడు అది వొక కుండలో జాగర్తచేశాడు. అది ఏడుభాగాలయింది. వాయువేగుడూ, వాయు బలుడూ, వాయుఘ్నుడూ, వాయుమండలుడూ, వాయుజ్వాలుడూ, వాయురేతుడూ, వాయుచక్రుడూ అని ఏడుగురు మహామునులు పుట్టారు. వాళ్ళే మరుద్గణాల తండ్రులు.

ఒకనాడు మంకణముని వేలు దర్భతగిలి గంటుపడింది. దాన్లోంచి కాయకూరలపసరు కారింది. తనతపస్సిద్ధికి సంతోషించాడు

మంకణుడు. నాట్యం మొదలెట్టాడు. అతడినాట్యంతో లోకాలు సంక్షోభించాయి దేవతలు భయపడ్డారు. శివుడిదగ్గిరికి వెళ్ళి మొరపెట్టారు. శివుడు మంకణుడిదగ్గిరికి వచ్చాడు.

"ఇదేమంత విశేషం? ఈమాత్రానికే ఇంత గెంతుతున్నావు! ఆగు" అంటూ అతడివేలుతో తనవేలుగీకాడు. శివుడివేలు గంటు పడింది. దాన్లోంచి భస్మంకారింది. సిగ్గుపడ్డాడు మంకణుడు. అతడు శివుడని గ్రహించాడు.

"దేవా! నువ్వే దేవదేవుడివి. నువ్వే లోకాల ఏడుగడ. నువ్వే కర్మఫలదాతవి. నువ్వే కర్మకారుడవి. కరుణించు" అని ఎన్నో అన్నివిధాల స్తోత్రం చేశాడు.

శివుడు ప్రసన్నుడయాడు. మంకణుడి తపఃప్రభావం తగ్గకుండా వరమిచ్చాడు; అంతర్ధానమయ్యాడు.

మంకణముని నాట్యం మానేశాడు. లోకాల సంక్షోభం శాంతించింది. అదిగో అలాంటిమహాత్ముడు మంకణుడు * అతడినివాస స్థలం సప్తసారస్వతతీర్థం. అక్కడ ఒకరాత్రివుండి ఔసనతీర్థానికి వెళ్ళాడు బలరాముడు.

లోగడ దండకారణ్యంలో శ్రీరామచంద్రమూర్తి ఒకరాక్షసుడితల నరికాడు. ఆరాక్షసుడి తలపుర్రె మహోదరుడని ఒకముని కాలికి గుచ్చుకుంది. అది వూడిరాక యమయాతనపడిపోయాడతడు.

"ఔసనతీర్థంలో శుక్రుడు తపస్సుచేస్తున్నాడు. అక్కడికి వెళితే నీబాధ పోతుంది" అన్నారు మునులు. మహోదరుడు ఔసనతీర్థానికి వెళ్ళాడు. కాలినించి పుర్రెవొదిలింది. అందుకనే ఔసనతీర్థానికి కపాలమోక్షమనికూడా అంటారు. అక్కడినించి పృథూదకం వెళ్ళాడు బలరాముడు.

---

*చూ. అరణ్యపర్వం, పు. 527.

పృథూదకంలోనే రుష్టిసేనుడికొడుకూ, సింధుద్వీపుడూ, దేవాపీ, విశ్వామిత్రుడూ బ్రాహ్మణులయ్యారు. విశ్వామిత్రుడికథ ప్రసిద్ధమైంది. గాధిరాజుకొడుకు విశ్వామిత్రుడు. తండ్రిలాగే రాజ్యంపరిపాలిస్తూవుండేవాడతడు. ఒకనాడు రాక్షససంహారానికి బైలుదేరి వెళుతూ వశిష్ఠాశ్రమందగ్గిర దండువిడిశాడు. అతడి పరిజనులు అక్కడ నానాదుర్నయాలూ చేశారు. వశిష్ఠుడికి వొళ్ళుమండింది తన కామధేనువుని పురికొల్పాడు అది తన మహాత్మ్యంవల్ల ఘోరాకారులైన వీరుల్ని పుట్టించింది. వాళ్ళువిశ్వామిత్రుడి దండుమీదపడ్డారు. చవ్వగా మిగిలినసేన పారిపోయింది. అన్నిశక్తులకంటే తపశ్శక్తి గొప్పదని నిశ్చయించుకున్నాడు విశ్వామిత్రుడు. పృథూదకంలో తపస్సుచేశాడు. ఎన్నో విఘ్నాలు కల్పించాడు దేవేంద్రుడు. అయినా నిష్ఠతో ఘోరమైన తపస్సుచేశాడు విశ్వామిత్రుడు బ్రహ్మచేత బ్రాహ్మణత్వం పొందాడు.

పృథూదకంనించి బకదాల్భ్యుడి ఆశ్రమానికి వెళ్ళాడు బలరాముడు. ఒకప్పుడు బకదాల్భ్యుడు ఆవులకోసం ధృతరాష్ట్రుడిదగ్గిరికి వెళ్ళాడు. చచ్చినఆవులు పట్టుకుపొమ్మన్నాడు ధృతరాష్ట్రుడు. కసిరికొట్టాడు. మండిపడ్డాడు బకదాల్భ్యుడు. చచ్చినఆవులే పట్టించుకు వెళ్ళాడు. ధృతరాష్ట్రుడి రాష్ట్రం నాశనం కావాలని వాటి మాంసంతో సరస్వతివొడ్డున హోమం మొదలెట్టాడు. నరికిన అడివిలాగ ధృతరాష్ట్రుడి రాష్ట్రంలో అన్ని జంతువులూ చచ్చిపోడం మొదలైంది. బెంబేలుపడి పోయాడు ధృతరాష్ట్రుడు. బకదాల్భ్యుడి దగ్గిరికి వెళ్ళాడు. కాళ్ళావేళ్ళాపడ్డాడు. ఆవులవల్లే ఇంతా పుట్టిందికనక ఎన్నో ఆవులు అతడికి సమర్పించాడు. ముని శాంతించాడు. తిరిగీ ధృతరాష్ట్రుడి రాష్ట్రం కలకల్లాడింది.

బకదాల్భ్యుడి ఆశ్రమంనించి యయాతితీర్థానికి వెళ్ళాడు బలరాముడు. అక్కడే లోగడ యయాతి యజ్ఞంచేశాడు. భోజనాలప్పుడు బ్రాహ్మలు ఏదికోరితే అది వడ్డించింది సరస్వతి. యయాతంనించి వశిష్ఠావగాహానికి వెళ్ళాడు బలరాముడు. అక్కడ మహావేగంతో పారుతుంది సరస్వతి. శివుడు తపస్సుచేసిన స్థాణుతీర్థంలోనే వశిష్ఠాశ్రమం వుంది అక్కడ. ఇవతలివొడ్డున తూర్పున విశ్వామిత్రుడి ఆశ్రమం. అవతలివొడ్డున వశిష్ఠాశ్రమం. ఇద్దరికీ మధ్యపచ్చగడ్డివేస్తే భగ్గుమనేది. తపస్సులో మచ్చరంపెట్టుకున్నాడు విశ్వామిత్రుడు. వశిష్ఠుణ్ణి చంపెయ్యడంకోసం సరస్వతిని తలుచుకున్నాడు. సౌమ్యవేషంతో వచ్చింది సరస్వతి. "ఏంసెలవు?" - వినయంగా అడిగింది "వశిష్ఠుణ్ణి నాదగ్గిరికి పట్టుకురా" అన్నాడు విశ్వామిత్రుడు. వాళ్ళ ఇద్దరి తపశ్శక్తికీ భయపడుతూ వశిష్ఠుడిదగ్గిరికి వెళ్ళింది సరస్వతి. విశ్వామిత్రుడి మాట వినయంగా విన్నవించింది.

"సంకోచించకు. నన్ను తీసుకువెళ్ళు. కాదంటే నిన్ను శపిస్తాడు విశ్వామిత్రుడు" అన్నాడు వశిష్ఠుడు.

అతడు వొడ్డున తపస్సుచేసుకుంటూవున్న సమయంచూసి పెద్ద వరదగా వచ్చింది సరస్వతి. ఒడ్డుతోసహా తెచ్చి విశ్వామిత్రుడి ముందు పెట్టింది. సంతోషించాడు విశ్వామిత్రుడు. సరస్వతిని మెచ్చుకున్నాడు. వశిష్ఠుణ్ణి చంపడానికి సాధనం వెదకపోయాడు. అంతలో అతణ్ణి వంచించి వశిష్ఠుణ్ణి పట్టుకుపోయింది వరద. కోపం తెచ్చుకున్నాడు విశ్వామిత్రుడు. రక్తవాహినివి కమ్మని సరస్వతిని శపించాడు. రక్తం నది అయిపోయింది సరస్వతి. సంవత్సరంపాటు రాక్షసులే దాన్ని సేవించారు. ఒకనాడు కొందరుమునులువచ్చారు. చూసి ఇదేమిటని అడిగారు. జరిగిందంతా తెలుసుకున్నారు. భగీరథప్రయత్నంమీద దాన్ని యథారూపానికి తెచ్చారు. స్నానమాడి కృతార్థులయారు.

అప్పుడు కొంతమంది బ్రహ్మరాక్షసులు వచ్చారు. మునులికి ప్రణామంచేశారు. బ్రహ్మద్వేషమూ, పెద్దవాళ్ళని అవమానించడమూ, దుష్టాన్నం తినడమూ మొదలైన పాపాలుచేసి బ్రహ్మరాక్షసులయ్యాగ వాళ్ళు. తమతమ పాపాలు మునులికి విన్నవించారు. "మాకు ముక్తి ప్రసాదించండి" అని ప్రార్థించారు.

"వీళ్ళని ఉద్ధరించు" - సరస్వతిని ప్రార్థించారుమునులు. అరుణా నదివల్ల ఆపని నెరవేరుతుందని సరస్వతికి తెలుసు. రహస్యంగా అరుణని తనలోకి తెచ్చుకుంది. "స్నానంచెయ్యండి" అని బ్రహ్మరాక్షసులికి చెప్పింది. స్నానాలాడారు బ్రహ్మరాక్షసులు. శరీరాలు విడిచారు. ధర్మపరులుపోయిన పుణ్యలోకానికిపోయారు. అరుణ సరస్వతిలో రహస్యంగా వుండడం తెలుసుకున్నాడు దేవేంద్రుడు. నమ్మించి నముచిని చంపిన పాపం స్నానంచేసి పోగొట్టుకున్నాడు. అదిగో అలాంటిది వశిష్ఠాపగాహం.

అక్కణ్ణించి సోమతీర్థం వెళ్ళాడు బలరాముడు. చంద్రుడు రాజసూయంచేసిన చోటు అది. అక్కడే దేవతలు కుమారస్వామిని దేవసేనాధిపతిగా అభిషేకించారు. అతడు తారకాసురుడూ మొదలైన రాక్షసుల్ని సంహరించాడు. ఎన్నిమార్లయినా వినదగింది కుమారస్వామి కథ.

## కుమారస్వామి

శివుడు తనవీర్యం అగ్నిలో విడిచిపెట్టాడు. భరించలేకపోయాడు అగ్ని. బ్రహ్మతో చెప్పుకున్నాడు. అతడి మాటమీద గంగలో విడిచిపెట్టాడు. తేజోమయమైన శివవీర్యం గంగకూడా భరించలేకపోయింది. హిమాలయంమీద విడిచిపెట్టింది. బంగారం కొల్లుగడ్డదగ్గర ఆవీర్యంలో అగ్నిలాంటి కుమారుడు పుట్టాడు. కృత్తికలు చూశారు,

నాకొడుకు అంటే నాకొడుకు అని అందరూ వొక్కసారి చేతులు చాచారు. ఎత్తుకున్నారు చన్నులు చేపాయి. చంద్రబింబాల్లాంటి ఆరు మొహాలతో కృత్తికల ఏడుగురిపాలూ తాగాడు కుమారస్వామి ఆశ్చర్యపోయారు కృత్తికలు. ఎలావున్నవాణ్ణి అలా వుంచేశారు. అగ్నికొడుకూ, గంగకొడుకూ, శరజన్ముడూ, కార్తికేయుడూ అయాడు కుమారస్వామి. బృహస్పతి వచ్చి జాతకర్మలూ అవీ నిర్వర్తించాడు. కుమారస్వామి మహిమవల్ల ఆప్రదేశం బంగారంతో నిండివుంటుంది.

బ్రహ్మాండమైన తపస్సుచేశాడు కుమారస్వామి. నాలుగు వేదాలూ మూర్తిమంతాలై అతణ్ణి సేవించాయి. ధనుర్వేదం అతడి చెప్పుచేతల్లో నుంచుంది.

ఒకనాడు కుమారుణ్ణి చూడడంకోసం శివుడూ పార్వతీ వచ్చారు. రకరకాల మొహాలతోనూ, చిత్రచిత్రమైన శరీరాలతోనూ ప్రమథగణాలు వాళ్ళవెంట వచ్చాయి. బ్రహ్మ, విష్ణువూ, ఇంద్రుడూ మొదలైన దిక్పాలులూ, రుద్రులూ, ఆదిత్యులూ, మరుత్తులూ, కింపురుషులూ, సిద్ధులూ, విద్యాధరులూ, యక్షులూ, మునులూ, పితృదేవతలూ వచ్చారు. ఓషధులూ, నదులూ, సముద్రాలూ, పర్వతాలూ మూర్తిమంతాలై వచ్చాయి. ఆమహాదేవతలకి ఎదురువెళ్ళాడు కుమారస్వామి.

చూశాడు శివుడు. "పార్వతీ, అగ్ని, గంగా వున్నారు. వీళ్ళని వొదిలేసి, తండ్రినని భక్తితో నాదగ్గిరికి వస్తాడో వీడు ?" అనుకున్నాడు. పార్వతీ, అగ్ని, గంగా అలాగే అనుకున్నారు. అదంతా తన దివ్యచిత్తంలో గ్రహించాడు కుమారస్వామి. యోగకౌశలంతో నాలుగురూపాలై నలుగురిదగ్గిరికీ వొకేసమయంలో వెళ్ళాడు. అందరూ ఆనందించారు. అంతలో వొక్కడై నుంచున్నాడు కుమారస్వామి.

శివుడూ, గంగా, అగ్ని, పార్వతీ బ్రహ్మకి నమస్కరించారు. "కుమారుడికి తగిన పదవి ప్రసాదించు" అన్నారు. దేవహితపరుడు బ్రహ్మ ఆలోచించాడు. దేవసేనకి అధిపతినిచేయాలని నిశ్చయించాడు. ఇంద్రుడూ మొదలైన దిక్పాలకుల్ని కుమారుడికి చూపించాడు. వీళ్ళు నీకు రక్షకులు అని అప్పగించాడు. దేవతలందరూ అతడికి అభిషేకించ డానికి బ్రహ్మని పురస్కరించుకుని సరస్వతిదగ్గిరికి వచ్చారు.

నవరత్నాల పీఠం హిమవంతుడు అమిర్చాడు. కుమారస్వామిని దానిమీద కూచోపెట్టారు. బృహస్పతి హోమకార్యం నిర్వహించాడు. బ్రహ్మ, విష్ణువూ, మహేశ్వరుడూ- మొదలైన దేవతలూ అభిషేక ద్రవ్యాలు తెచ్చారు. మణికలశాలతో సరస్వతిజలాలు నింపి పట్టు కున్నారు. గంధర్వులు సంగీతం పాడారు. అప్సరసలు మంగళగీతాలు ఆలాపించారు. మహామునులు పుణ్యాహవచనాలు ఘోషించారు. పార్వతీ, లక్ష్మి, సరస్వతీ మొదలైన పుణ్యాంగనలు దీవనలతో సేసలు పోశారు. అభిషేకించి కుమారస్వామికి దేవసేనాధిపత్యం కట్టారు.

లోగడ అక్కడే దేవతలు జలాధిపత్యానికి వరుణుణ్ణి అభిషే కించారు. వరుణుడి అభిషేకంకంటే కుమారస్వామి అభిషేకం గొప్పగా జరిగింది.

శివుడూ, బ్రహ్మ, విష్ణువూ, ఇంద్రుడూ మొదలైన ప్రభువులు తమతమ అనుచరుల్లో రూపమూ, గుణమూ, బలమూ పరాక్రమమూ అధికంగా వున్న వాళ్ళని ఏరి భీముడూ, ఘంటాకర్ణుడూ, సంక్రముడూ, దండధరుడూ మొదలైన అనేకమంది వీరుల్ని అతడికి ఇచ్చారు. తగిన సేనలు మూలబలంగా ఏర్పరిచారు. చిత్రాభరణాలూ, కవచాలూ, ఆయుధాలూ ధరించిన రకరకాల రూపాల వాళ్ళని, గజ కర్ణుడూ, నికుంభుడూ, కుముదుడూ మొదలైన వీరులతో అభేద్యంగా

తయారైంది సేన. శత్రుభయంకరమైన ప్రభాసాధీ, విశాలాక్షీ, పాలితా మొదలైన మాతృగణం అనుసరించింది.

అప్పుడే ఉదయిస్తూన్న సూర్యుడిలాంటి ధ్వజం ఇచ్చాడు శివుడు. రాక్షసుల్ని చంపడానికి అనువైన శక్తిఇచ్చాడు దేవేంద్రుడు. బలం వృద్ధిచేసే వనమాల ఇచ్చాడు విష్ణువు. ఎప్పుడూ మాయని తెల్లటి పట్టుజత ఇచ్చింది పార్వతి. ఉజ్వలమైన కమండలం ఇచ్చింది పార్వతి. గరుత్మంతుడు నెమిలి ఇచ్చాడు. వరుణుడు ఎర్రజుత్తు కోడి ఇచ్చాడు. కుబేరుడు మంచి మేక ఇచ్చాడు. బ్రహ్మ నల్లటి కృష్ణాజిన మిచ్చాడు. యుద్ధంలో అతణ్ణి ఎవ్వరూ గెలవకండా వరమిచ్చాడు.

కుమారుణ్ణి తనివితీరకండా చూశాడు శివుడు ఆయాసం లేకండా రాక్షసుల్ని చంపడానికి భూతసేన ఇచ్చాడు. దేవేంద్రుడూ మొదలైన దేవతలు తమతమ సేనలతో అతడిచుట్టూ చేరారు. శంఖాలూ, భేరీలూ, పణవాలూ, గోముఖాలూ మొదలైన రణ వాద్యాలు మోగాయి. దిక్కులు దిమ్మెత్తిపోయాయి.

అలా దేవసేనాధిపత్యం వహించాడు కుమారస్వామి. "ఎవ ణ్ణయినా చంపవలసివుంటే చెప్పండి" అన్నాడు - కుమారస్వామి "వాడు ఎంతబలవంతుడైనా సరే, చంపేస్తాను" అని వరమిచ్చాడు. ఎంతో సంతోషించారు దేపతలు. దేవసేన సింహనాదంచేసింది. మూడు లోకాలూ నాదమయమైపోయాయి.

బ్రహ్మ, విష్ణువూ, మహేశ్వరుడూ తమతమ నివాసాలకి వెళ్ళి పోయారు. దేవతలుతారకాసురుడివల్ల బాధపడుతున్నారని తెలుసు కున్నాడు కుమారస్వామి. దేవసేనతో అతడిమీదికి దండెత్తాడు. బహ్మాండమైన రాక్షససేనతో ఎదిరించాడు తారకాసురుడు. అద్భుత మైన యుద్ధం జరిగింది.

శక్తితీశాడు కుమారస్వామి కోటానుకోట్లు శక్తులు పుట్టాయి. రకరకాల వికృతరూపుల్ని రాక్షసుల్ని పడగొట్టాయి. వెయ్యిపుల్కలు రాలినట్టు, లక్షపిడుగులు పురిమినట్టు శక్తిప్రయోగించాడు కుమారస్వామి. రాక్షససేనాధిపతుల్ని మహిషుణ్ణీ, త్రిపాదుణ్ణీ, హృతోదరుణ్ణీ తారుమనిపించాడు. దేవసేన రాక్షససేనమీాద పడింది. చంపేసింది.

మాటిమాటికీ శక్తి ప్రయోగించేవాడు కుమారుడు. రాక్షసుల్ని చంపేసి తిరిగివచ్చేది శక్తి. తరుముకువచ్చాడు తారకాసురుడు. శక్తివేశాడు కుమారుడు. చచ్చిపూరుకున్నాడు తారకుడు. విజయం సాధించాడు కుమారుడు.

బలికొడుకు బాణాసురుడు బలవంతుడై వుండేవాడు. దేవతల్ని సాధించేవాడు. క్రౌంచపర్వతంమీాద వుండేవాడతడు. తెలుసుకున్నాడు కుమారస్వామి. సరాసరివెళ్లాడు. క్రౌంచం ముట్టడించాడు. బాణాసురుడిసేన చంపేశాడు. దేవతలూ, మునులూ సంతోషించారు. దేవదుందుభులు మోగాయి. పూలవాన కురిసింది. ముల్లోకాలూ సంతోషించాయి.

సోమతీర్థంలో ప్రతిష్ఠితుడైన కుమారస్వామికి ప్రదక్షిణాపూర్వకంగా ప్రణామంచేశాడు బలరాముడు అక్కడిమునులు కుమారస్వామి అభిషేకంకథ చెప్పారు. చెవులపండువుగా విన్నాడు బలరాముడు. అక్కణ్ణుంచి అగ్నితీర్థం వెళ్ళాడు.

లోగడ భృగువు సర్వభక్షకుడివి కమ్మని అగ్నిని శపించాడు. అప్పుడు అగ్ని అక్కడే శమీగర్భంలో దాగున్నాడు. బ్రహ్మ, దేవతలూ వచ్చి సర్వభక్షకుడివైనా త్రిభువనపావనుడి వవుతావు" అని వరమిచ్చారు. ఆతీర్థం పరమపావనమైందని వెళ్ళేముందు స్నానాలు చేసి వెళ్ళారు.

అగ్నితీర్థంనించి కౌబేరతీర్థం వెళ్ళాడు బలరాముడు. కుబేరుడు తపస్సుచేసిన చోటు అది. ధనాధిపత్యంమొదలైన వరాలు అక్కడే పొందాడతడు.

## ఉడకని రేగుపళ్ళు

అక్కణ్ణుంచి బదరిపాచనతీర్థానికి వెళ్ళాడు బలరాముడు. లోగడ భరద్వాజుడి కూతురు ప్రభావతి (శ్రుతావతి?) దేవేంద్రుడు భర్తకావాలని అక్కడే ఎన్నోసంవత్సరాలు తపస్సుచేసింది. వశిష్ఠుడి రూపంలో దేవేంద్రుడు ప్రత్యక్షమయాడు. నిజంగా వశిష్ఠుడే అనుకుందామె. అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చింది. భక్తితో ప్రణామంచేసింది "దేవేంద్రుణ్ణే వివాహమాడాలని తపస్సుచేస్తున్నాను అది వొక్కటి మట్టుకు తప్పించి నువ్వు ఏంచెయ్యమంటే అదిచేస్తాను. ఆజ్ఞాపించు" అంది "నువ్వు అన్నట్టే కానీ" అన్నాడు దేవేంద్రుడు. "ఇదిగో వీటిని వుడకపెట్టి ఇయ్యి" అని కొన్ని రేగుపళ్ళు ఆమెకిచ్చి వెళ్ళాడు.

స్నానంచేసింది ప్రభావతి. మడికట్టుకుంది. పొయ్యిరాజేసింది. నీళ్ళలోవేసి రేగుపళ్ళు పొయ్యిమీద పెట్టింది. వంట ప్రారంభించింది. ఎంతకీ వుడకలేదు రేగుపళ్ళు. తాను దాచుకున్న వంటచెరుకంతా అయిపోయింది. రేగుపళ్ళు వుడకలేదు పైకివెళ్ళి కర్రలు తేవాలంటే తెచ్చేలోపున అగ్గి చల్లారిపోతుంది. పాకం చెడుతుంది. ఏందారి? ఆలోచించిందామె. తనకాళ్ళు పొయ్యిలో పెట్టేసింది. వంట ప్రారంభించింది. నిచ్చెరపోయాడు దేవేంద్రుడు. నిజరూపంతో ప్రత్యక్షమయాడు. "నీనిష్ఠకి మెచ్చాను. నువ్వు కోరిన వరమిచ్చాను. నీశరీరం విడిచిపెట్టు. స్వర్గానికి రా. ఈతీర్థం అన్ని పాపాలు పోగొడుతుంది. మూడులోకాల్లోనూ పేరుపడుతుంది.

"పూర్వం ఇక్కడే సప్తరుషులు అరుంధతిని వొదిలి పళ్ళూ, దుంపలూ అవీ తేడానికి హిమాలయపర్వతానికి వెళ్ళారు. పన్నెండేళ్ళు వొక్కలాగ వర్షాలు పడలేదు అన్నాళ్ళూ వాళ్ళు హిమాలయంమీదే వుండిపోయారు. అరుంధతి వొక్కతే వుండేది. తపస్సుచేసుకునేది శివుడు బ్రాహ్మణుడై అరుంధతిదగ్గిరికి వచ్చాడు. భిక్ష మడిగాడు. "రేగుపళ్ళుమాత్రం వున్నాయి. స్వీకరించు" అంది అరుంధతి. 'అయితే అవి వుడకపెట్టి ఇయ్యి' అన్నాడు శివుడు. వాటిని వుడకపెట్టి ఇచ్చిందామె. అతడు చెప్పిన పుణ్యకథలు వింటూ కాలక్షేపంచేసింది. రేగుపళ్ళు వుడకపెడుతూ, పుణ్యకథలు వింటూ పన్నెండేళ్ళూ పన్నెండుదినాల్లా గడిపేసింది అరుంధతి. అనావృష్టి అంతమైంది. పళ్ళూ అవీ పట్టుకుని హిమాలయంనించి వచ్చారు సప్తరుషులు. శివుడు నిజరూపంతో ప్రత్యక్షమయాడు. అరుంధతి చరిత్ర మహాఋషులికి వివరించాడు "మీరు హిమాలయంలో చేసిన తపస్సుకంటే ఈమె ఇక్కడ చేసినతపస్సు గొప్పది. పన్నెండేళ్ళూ రేగుపళ్ళు వుడికిస్తూ ఈమె ఉపవాసంలో గడిపింది" అన్నాడు. 'ఏం వరం కావాలో కోరుకో అమ్మా' అంటూ అరుంధతి వేపు దయా దృష్టితో చూశాడు.

"'ప్రభూ!' చేతులు జోడించింది అరుంధతి—'నామీద దయే వుంటే ఈస్థలం బదరిపాచనం అన్న పేరుతో గొప్పతీర్థం అయేట్టుఅను గ్రహించు' అంది. 'అలాగే కానీ' వరమిచ్చాడు శివుడు; అంతర్థాన మయాడు."

దేవేంద్రుడు చెప్పిన అరుంధతికథ వింది ప్రభావతి. దేవేంద్రుడి ప్రియురాలైంది.

పూర్వం ఘృతాచిని చూసి భరద్వాజుడికి రేతస్ఖలనమైంది. అతను దొన్నెలో అది భద్రపరిచాడతడు. అందులోంచి పుట్టింది ప్రభావతి.

బదరిపాచనం నించి ఇంద్రతీర్థం వెళ్ళాడు బలరాముడు. అక్కడే వందయజ్ఞాలు చేసి శతక్రతుడు అని పేరుపడ్డాడు దేవేంద్రుడు. అక్కణ్ణించి రామతీర్థం వెళ్ళాడు బలరాముడు. ఇరవయ్యొక్కమార్లు రాజుల్ని చంపి, ప్రాయశ్చిత్తంకోసం అక్కడ రాజసూయాలూ, అశ్వమేధాలూ, వాజపేయాలూ చేశాడు పరశురాముడు. కశ్యపుణ్ణి ద్రష్టగా పెట్టి, భూమియావత్తూ అతడికి దక్షిణగా యిచ్చాడు.

రామతీర్థంనించి యామునతీర్థంవెళ్ళాడు బలరాముడు. వరుణుడు రాజసూయాలు చేసిన చోటు అది. ఆయజ్ఞాలు పూర్తయాక అక్కడే రాక్షసులికీ, దేవతలికీ సమస్తప్రాణుల నాశనకరమైన మహా యుద్ధం జరిగింది.

అక్కణ్ణించి ఆదిత్యతీర్థం వెళ్ళాడు బలరాముడు. అక్కడ సూర్యుడు యజ్ఞంచేశాడు; జ్యోతిషాధిపతి అయాడు. ద్వైపాయనుడూ, శుకుడూ, కృష్ణుడూ, జైమినీ, ఇంకా ఎంతో మంది దేవ యోనులు ఇక్కడ అద్భుతమైన యోగసిద్ధి పొందారు. అసిత దేవలుడూ ఇక్కడే సిద్ధిపొందాడు.

ఆదిత్యతీర్థంనించి సారస్వతమనే వశిష్ఠతీర్థానికి వెళ్ళాడు బలరాముడు. అక్కడ పూర్వం దధీచి ఎన్నో వ్రతాలుచేశాడు. అది చూసి సంశయం పట్టుకుంది ఇంద్రుడికి. విఘ్నం కలిగించడంకోసం అలంబస అప్సరసని పంపాడు. ఆమెని చూశాడు దధీచి. అతడి వీర్యం స్ఖలనమైంది; సరస్వతిలో పడింది. సరస్వతి గర్భంధరించింది. కుమారుణ్ణి కంది. మునులగోష్ఠిలో వున్న దధీచిదగ్గిరికి తీసుకువెళ్ళింది. "వీడు నీకొడుకు. నీ తేజం వృథాపోకండా నేను గర్భంధరించాను; కన్నాను. స్వీకరించు" అంది.

కుమారుణ్ణి ఎత్తుకున్నాడు దధీచి. కౌగిలించుకున్నాడు. శిరస్సు మూచూశాడు. సరస్వతిని ప్రశంసించాడు. "బ్రహ్మసరస్సులో

పుట్టావు నువ్వు. పుణ్యనదులన్నిటిలోకీ ఉత్తమురాలివి. నీ నీళ్ళతో తర్పణంచేస్తే విశ్వదేవతలూ, పితృదేవతలూ, గంధర్వులూ తృప్తి పడతారు" అని అనుగ్రహించాడు. ఈ కుమారుడు సారస్వతుడు అని నీపేర ప్రసిద్ధుడవుతాడు. ముందుముందు పన్నెండేళ్ళు అనావృష్టి పడుతుంది ఆ ఆపదలోంచి ఎంతోమంది మునీశ్వరుల్ని రక్షిస్తాడు. వేదాలు చదివిస్తాడు" అని చెప్పి కుమారుణ్ణి ఆమెకే అప్పగించాడు. సరస్వతి సంతోషించింది. కుమారుణ్ణి తీసుకు వచ్చేసింది.

దేవతలికీ రాక్షసులికీ యుద్ధం జరిగింది. తగిన ఆయుధాల కోసం మూడులోకాలూ గాలించాడు దేవేంద్రుడు ఎక్కడా దొరక లేదు. "దధీచిముని ఎముకలతో తగిన ఆయుధాలు తయారవుతాయి. వెళ్ళి అతణ్ణి ప్రార్థించండి" అని దేవతల్ని పంపాడు దేవతలు వచ్చి దధీచిని ప్రార్థించారు. శరీరం వొదిలిపెట్టాడు దధీచి. పుణ్యలోకానికి పోయాడు. అతడి ఎముకలతో వజ్రాయుధం తయారుచేశాడు దేవేంద్రుడు. రాక్షసుల్ని చంపాడు.

అన్నట్టుగానే పన్నెండేళ్ళు వర్షాలు కురవలేదు. వయస్సులో చిన్నవాడైనా, సంకోచించకండా సారస్వతుడిదగ్గిరచేరి అరవైఅయిదు గురు మునులు అతడి శిష్యులయారు. సరస్వతి ప్రసాదించిన ఆహారంతో పన్నెండేళ్ళూ వాళ్ళని పోషించాడు సారస్వతుడు. వేదాలు చదివించాడు.

## ఒకే రాత్రి దాంపత్యం

అక్కణ్ణుంచి వృద్ధకన్యాశ్రమానికి వెళ్ళాడు బలరాముడు. అక్కడ గర్గవంశంలో పుట్టిన ఋని అని వొకముని వుండేవాడు. తపస్సువల్ల వొక కన్యని కనిపెంచాడతడు. కొన్నాళ్ళయాక అతడు స్వర్గస్థుడయాడు. భర్తని వరించక కన్యగానే వుండిపోయింది అతడి కూతురు.

బ్రహ్మచర్యంతో కాలం గడిపింది. శతవృద్ధఅయి పరలోకానికి పోవాలనుకుంది. అప్పుడు ఆమెదగ్గిరకి నారదుడు వచ్చాడు. "పెళ్ళిచేసుకోని కన్యకి పుణ్యలోకం దొరకదు" అన్నాడు. "ఏఉపాయంచేత అయినా తగిన వరుణ్ణి వరించు" అన్నాడు.

అంగీకరించిందామె. తన తపస్సులో సగం లంచమిచ్చి, కాల వరుపీ కుమారుణ్ణి, ప్రాక్ఛృంగుణ్ణి వరించింది. అయితే అతడు వొక షరతు పెట్టాడు. "ఒక్క-రాత్రి మాత్రం నీతో వుంటాను" అన్నాడు. అంగీకరించింది ముసిలికన్య. అతణ్ణి పెళ్ళిచేసుకుంది. దైవయోగం వల్ల ఆరాత్రి మంచి యవ్వనంతో నవనవలాడిందామె దివ్యగంధాలు పూసుకుంది. పూలదండలు వేసుకుంది. రత్నాలనగలు పెట్టుకుంది. రతీదేవిలాగ ప్రాక్ఛృంగుణ్ణి సుఖపెట్టింది. ఒళ్ళుమరిచిపోయాడతడు.

రాత్రిగడిచింది. తెల్లవారింది. "ఒక్క-రాత్రే మన దాంపత్యం అన్నావు. మన షరతు అయిపోయింది. ఇక వెళ్ళివస్తాను" అంటూ స్వర్గానికి బయలుదేరిందామె. దుఃఖపడ్డాడు ప్రాక్ఛృంగుడు.

"ఈ తీర్థంలో దేవతలికీ, పితృదేవతలికీ, ఋషులికీ తర్పణంచేసి, వొకనాడు ఉపవాసంచేసినవాడు పదిహేనుసంవత్సరాలు పూర్తిగా బహ్మచర్యం చేసినంత ఫలం పొందుతాడు" అంది వృద్ధకన్య. శరీరం విడిచిపెట్టింది. స్వర్గానికి పోయింది. అదీ వృద్ధకన్యాశ్రమం.

శల్యుడు మరణించినవార్త వృద్ధకన్యాశ్రమంలోనే విన్నాడు బలరాముడు. విచారించాడు. అక్కడికి దగ్గిరగావున్న శమంతకపంచకానికి వచ్చాడు. అక్కడి విశేషాలు అక్కడి మునుల్ని అడిగాడు.

"ఇది ప్రజాపతి ఉత్తరవేది" అన్నారు వాళ్లు – "దేవతలందరూ ఇక్కడ గొప్పగొప్ప సత్రయాగాలుచేశారు. కురుమహారాజు దున్నడంచేత కురుక్షేత్రమయిందిది" అన్నారు.

"కురుమహారాజు దేనికోసం దున్నాడు?" — అడిగాడు బల రాముడు.

## కురుక్షేత్రం

"ఇక్కడ పుట్టినవాళ్ళు స్వర్గానికి వెళ్ళాలని సంకల్పించి దున్నాడు కురుమహారాజు. అతడు దున్నుతూవుంటే దేవేంద్రుడు వచ్చాడు. 'ఇక్కడ ఎందుకు దున్నుతున్నావు?' అని అడిగాడు. తన సంకల్పం చెప్పాడు కురుమహారాజు. హేళనచేశాడు దేవేంద్రుడు వెళ్ళిపోయాడు దున్నడం మానలేదు కురు రాజు. నిష్ఠతో దున్నుతూనే వున్నాడు. తనకి వరమివ్వడానికి నిశ్చయించాడు ఇంద్రుడు. దేవత లతో సహా దిగివచ్చాడు.

"'ఈ పుణ్యక్షేత్రంలో నిరాహారులై శరీరం విడిచిన వాళ్ళకీ, యుద్ధంలో వీరమరణం పొందిన ప్రాణులందరికీ స్వర్గం లభిస్తుంది' అని వరమిచ్చాడు; వెళ్ళిపోయాడు. వెళుతూ వెళుతూ కురుమహారాజుని సమ్మానిస్తూ ఇంకో ఇలా అన్నారు: 'కురుక్షేత్రం గాలిసోకినా, ఇంత ధూళితాకినా చేసినపాపాలు పోతాయి. సద్గతి లభిస్తుంది.'

కృతకృత్యుడయాడు కురుమహారాజు. బ్రహ్మానందం అనుభ వించాడు" అన్నారు.

విని సంతోషించాడుబలరాముడు. తనపూర్వాశ్రమంచూశాడు. "ఇది ఎవ్వరిది?" అని అడిగాడు. రావిచెట్లతోనూ, ఇప్పచెట్లతోనూ, మామిడితోపులతోనూ, మారేడుచెట్లతోనూ ఎంతో అందంగా వుంది ఆశ్రమం.

"లోగడ విష్ణుదేవుడు తపస్సుచేసిన చోటు ఇది. ఇక్కడే శాండిల్యుడూ మొదలైనవాళ్ళు యోగసిద్ధిపొందారు" అని విన్న వించారు మునులు. ఆశ్రమం మెచ్చుకున్నాడు బలరాముడు. అక్కడ

బహిఃపరివారం వొదిలేశాడు. ఒక పవిత్రమైన కొండ ఎక్కాడు. సముద్ర ప్రదేశంలో మునులతో గోష్ఠితీర్చాడు.

అప్పుడు కయ్యాలమారి నారదుడు అక్కడికి వచ్చాడు జటామండలంతో వున్నాడతడు. చేతిలో మణికమండలమూ, పసిడిదండమూ, కచ్ఛపవీణా వున్నాయి. అందరూ లేచారు. ఎదురు వెళ్ళారు. ప్రణామం చేశారు. తెచ్చి కూచోబెట్టారు. చుట్టూ కూచున్నారు. కురుక్షేత్రం యుద్ధంకబుర్లు అడిగాడు బలరాముడు. భీష్ముడు పడిపోడం దగ్గరనించీ ఆరంభించాడు నారదుడు. ద్రోణుడూ, కర్ణుడూ, శల్యుడూ తెగిపోడమూ, కౌరవకుమారుళ్ళూ, తక్కినయోధులూ కూలిపోడమూ వివరించాడు. పద్ధెనిమిదిరోజుల భారతయుద్ధం టూకీగా వర్ణించాడు. దుర్యోధనుడి వదకొండు అక్షోణీలసేనా నాశనం కావడమూ, అశ్వత్థామా, కృతవర్మా, కృపుడూ మాత్రం బతికివుండడమూ దుర్యోధనుడు వోడిపోయి, పారిపోయి, ద్వైపాయనహ్రదంలో దూరడమూ, జలస్తంభనంచేసుకు దాగోడమూ తెలియజేశాడు. అది ఎరిగి పాండవులు వెళ్ళి సపరివారంగా ముట్టడించడమూ, కవ్వించి మాట్లాడడమూ, వాళ్ళమండి దుర్యోధనుడు బయటికి రావడమూ, మహాయోధులైన శత్రువులు ఎంతోమంది అతణ్ణిచుట్టు ముట్టడమూ విశదపరిచాడు.

"అంతమంది చుట్టుముట్టినా పౌరుషం చలించకండా పెద్ద పులిలా నుంచున్నాడు దుర్యోధనుడు. ఆ వీరత్వం చూస్తే మెచ్చుకుంటావు నువ్వు. అతడికీ, భీముడికీ గదాయుద్ధం జరుగుతుంది. ఇద్దరూ నీప్రియశిష్యులు. ఉద్దండులు. నువ్వు చక్కగా తీర్చిదిద్దినవాళ్ళు. వాళ్ల గదాయుద్ధం, ద్వంద్వయుద్ధం చూడాలంటే చప్పున బయులుదేరు" అన్నాడు.

నారదుణ్ణీ, తక్కిన మునుల్నీ సాగనంపి, కొండదిగాడు బలరాముడు. అభ్యంతరపరిజనాన్ని ద్వారక పంపించేశాడు. సరస్వతి

వొడ్డున రథందగ్గిరికి వెళ్ళాడు. సరస్వతినిచూసి, చేతులుజోడించి శిరస్సుమీద పెట్టుకున్నాడు.

"పుణ్యనదుల్లో మేటి సరస్వతి. ఒక్కరోజు ఇందులో మునిగినా చాలు, ఇహపరసౌఖ్యాలు రెండూ లభిస్తాయి. దేవేంద్రుడూ మొదలైన దేవతలందరూ మేలుకోరి వస్తారిక్కడికి. స్మరిస్తేచాలు, సిద్ధికలుగుతుంది. — అంటూ మాటిమాటికీ చూస్తూ, నమస్కారం చేస్తూ రథమెక్కాడు. గాలిలా రథం ఎగిరిపోయింది, ద్వైపాయనం మడుగు దగ్గిరవాలింది.

ద్వంద్వయుద్ధానికి బలరాముడు అనుమతించాడని విని ధృతరాష్ట్రుడు అడిగాడు :

"బలరాముణ్ణి చూడగానే కొండంతబలం వచ్చివుంటుంది మా దుర్యోధనుడికి. కదూ ? తరవాత ఏంజరిగింది ?

## గ దా యు ద్ధ ం

సంజయుడు : అవును, బలరాముణ్ణి చూడగానే పట్టరాని ఉత్సాహం కలిగింది దుర్యోధనుడికి. మూపులు పొంగాయి. మొహం వికసించింది. ధర్మరాజువేపు చూసి అన్నాడతడు :

"శమంతకపంచకం పుణ్యక్షేత్రం. బ్రహ్మదేవుడి ఉత్తరవేది అని ప్రసిద్ధి. అక్కడ యుద్ధంలో కాలంచేసినవాళ్ళకి తప్పక సద్గతి లభిస్తుందని వినికిడి. అంచేత ఎప్పటిలాగ అక్కడికే వెళ్ళి యుద్ధం చేద్దాం."

ద్వైపాయనంమడుగు శమంతకపంచకంవాద్దులోది కాదు. ధర్మరాజుకి తెలుసు. అంచేత దుర్యోధనుడిసూచన అంగీకరించాడతడు. శమంతకపంచకంవేపు నడిచారు. ఉప్పొంగిన బుజంమీద గద వేసుకుని మదపుటేనుగులాగ నడుచుకుంటూ యుద్ధానికి సిద్ధపడి వెళ్ళాడు దుర్యో

ధనుడు. చుట్టూమూగి పాండవులు నడిచారు. శంఖాలూ, భేరీలూ- రకరకాల రణవాద్యాలు మోగాయి.

ఈర్ష్యతో మండిపోతూ, సరస్వతి దక్షిణంవొడ్డుని రణ భూమిలో నుంచున్నాడు దుర్యోధనుడు. పెద్ద తీర్థంలాగ చుట్టూ మూగారు పాండవసైనికులు. జిగేలుమనిపోతూవున్న బంగారంకవచం వేసుకుని, తళతళలాడుతూన్న గదపట్టుకుని, దుర్యోధనుడికి ఎదురుగా, పెద్ద బంగారంపర్వతంలా నుంచున్నాడు భీముడు.

"మా గదాయుద్ధం చూడాలని ప్రవాహంలాగ వచ్చి పడుతు న్నారు ప్రజలు. ఇలా గందికగా వొకళ్ళమీద వొకళ్ళు పడడంకంటే అంతమందీ కూచుని నెమ్మదిగా చూడడం మంచిది. అందరికీ అవు పిస్తుంది" నెమ్మదిగా ధర్మరాజుతో అన్నాడు దుర్యోధనుడు. రాజు లందరితట్టూ చూశాడతడు.

పాంచాలంవాళ్ళూ మొదలైన యావన్మందినీ కూచోపెట్టాడు ధర్మరాజు. బలరామకృష్ణులతో కలిసి తానూ తగినచోట కూచు న్నాడు. అంతమంది రాజుల్లోనూ చుక్కల్లో చంద్రుడులా అవు పించాడు బలరాముడు.

భీముడూ దుర్యోధనుడూ వొకళ్ళనివొకళ్ళు చురచురా చూసు కున్నారు. భయంకరంగా రంకెలు వేశారు. ఆబోతుల్లా అవుపించారు. రోషంతో బుసకొట్టారు; మహాసర్పాల్లాకనిపించారు. మదంతో ఘీజృం భించారు; మదపుటేనుగుల్లా అవుపించారు. శిఖరాల్లాంటి గదలు పట్టు కున్నారు ; కొండల్లా కనిపించారు. ఇద్దరు కృష్ణులూ, ఇద్దరు వరు ణులూ, ఇద్దరు కుబేరులూ, ఇద్దరు రాములూలాగ — ఇద్దరూ ఇద్దరే కళ్ళవేడుకగా కనిపించారు ఉప్పొంగిన రెండు సముద్రాల్లా అవు పించారు.

ఒకళ్ళమీద వొకళ్ళు గుర్రుమన్నారు. గుండెలు చీల్చేసినట్టు దారుణమైన మాటలు అనుకున్నారు.

ధృతరాష్ట్రుడు: పదకొండు అక్షౌహిణీలు పదసేవచేసిన మహారాజు నాకొడుకు. లోకంలోని రాజులందరినీ కనుసన్నలలో తిప్పుకున్న రాజరాజు. సంజయా, వొంటిగాడై పోయాడు! ఒక పదాతి అయి పోయాడు! భూమండలం అంతటికీ రాజై, సర్వసంపదలికీ యోగ్యుడైనకౌరవరాజు దిక్కులేనివాడిలాగ, గద చేత్తోపట్టుకుని యుద్ధానికి నడుచుకుంటూ వెళ్ళాడు కదూ! అయ్యో దైవం ఎంతైనాచేస్తుంది! అని ప్రలాపించాడు; పూరుకున్నాడు.

సంజయుడు: రణోల్లాసంతో శరీరం పొంగించాడు దుర్యోధనుడు. రంకెవేసినట్టు భీముణ్ణి యుద్ధానికి పిలిచాడు.

భూమండలం గడగడలాడింది. అమావాస్యకాందే సూర్యుణ్ణి రాహువు మింగింది. పర్వతాలు విరిగిపడ్డాయి. వరళ్ళు కూశాయి. రాళ్ళవాన పడింది. పిడుగులు రాలాయి. మహోత్పాతాలు పుట్టాయి.

అవన్నీ కనిపెట్టాడు భీముడు. "ఇట్టే గెలుస్తాను" దుర్యోధనుణ్ణి చూపిస్తూ ధర్మరాజుతో అన్నాడు — "చూసేవాళ్ళు భళీ అన్నట్టు పోరాడతాను. గదతో తొడలు విరగ్గొడతాను. ఈనీచుణ్ణి చంపేస్తాను. వీడిఆయువు అయిపోయింది. కలబడ్డాక, తిరిగీ ఈకులపాంశుణ్ణి హాస్తినాపురం వెళ్ళనిస్తా ననుకోకు. ధృతరాష్ట్రుడు మొర్రో మనాలి. తప్పదు. సౌఖ్యమన్నది ముసిలాడికి సున్నా అనుకో. వీడు మనమీదపడి పెట్టిన పాట్లన్నీ ఇవాళతో స్వస్తి. ఇప్పుడే నీకు మహానందం కలిగిస్తాను."

దుర్యోధనుడివేపు తిరిగాడు భీముడు:

"దుర్యోధనా, ఆఖరిక్షణాలు గుణించు సిద్ధంగా వున్నాను. అన్యాయంగా పాండవుల్ని పెట్టిన పాట్లకి తగినఫలం అనుభవించాడు,

అంటూ సంతోషిస్తారు జనులు. నన్ను మెచ్చుకుంటారు. నా పాల బడ్డావు. ఎటుపోతావు? — చచ్చిపూరుకుంటావు" అన్నాడు.

"యుద్ధంమానేసి, ఎందుకూ ఇలా పేల్తావు?" వురిమాడు దుర్యోధనుడు– "తలబిరుసుమాటలతో భయపెడుతున్నావు. దుర్యోధను డంటే ఎవడనుకున్నావు? ఉద్దోలమైన బలవంతుడు దుర్యోధనుడు. నీపాల యముడు. నిన్ను హతమారుస్తాడు. మాటలు మాను. ధైర్యంతో యుద్ధంచెయ్యి. సైన్యం లేదని తక్కువగా చూస్తున్నావేమో, నన్ను? భీమన్నా, యమదండం నాగదాదండం. మదించివున్న నీశరీరం ఎలా పచ్చడిచేస్తుందో చూద్దువుగాని. నన్నే భళీ అంటారు చూసినవాళ్ళు. మొర్రోమంటారు మీవాళ్ళు. పినాకం పట్టుకుని శివుడు వచ్చినా గడ్డిపరకనాకు, నాచేతిలో గదవుంటే. నువ్వెటుపోతావు? భీముడితో గదాయుద్ధం ఎప్పుడు ఎప్పుడుఅని ఎన్నాళ్ళయో ఉవ్విళ్ళూరుతున్నాను. విధివశాత్తూ ఇప్పుడు జతపడింది. కృతార్థుణ్ణయాను. తిన్నగా సిద్ధపడిరా" అన్నాడు.

ఈమాటలువిని అంతమందీ నీకొడుకుని మెచ్చుకున్నారు. శత్రువీరులే అలా పొగడడం ఉత్సాహంతో విన్నాడతడు. వల్లమాలిన వీరత్వంతో బోరవిరుచుకు నుంచున్నాడు.

గద ఎత్తాడు భీముడు. దుర్యోధనుడిమీదికి వురికేశాడు. ఏనుగులు గీపెట్టాయి. గుర్రాలు సకిలించాయి. అదిలించాడు దుర్యోధనుడు గదఎత్తాడు; ఎదురుకున్నాడు. మహోగ్రమైన వాళ్ళ తొలి తాకిడికి కళ్ళుమూసుకుపోయాయి మాకు. గదమీద గద దభీమని పడింది; ఆకాశంమీదికి నిప్పులు తుళ్ళాయి. పిడుగుల్లా పడ్డాయి వాళ్ళఅంగలు; భూమి కంపించింది. క్రోధోద్రేకమైన చూపుల్లో అగ్గి మెరిసింది. దారుణమైన గద్దింపులు పర్వతగుహల్లో ప్రతిధ్వనించాయి. దేవతలకళ్ళు మిరుమిట్లుగొల్పాయి. భూమినిమోస్తున్న వాసుకీ,

అదిసార్వ్యమూ కూలిపడిపోతూను. సూర్యుడికిరణాలు వెలవెల పోయాయి దిగ్గజాలు వులిక్కిపడ్డాయి.

భీముడూ, దుర్యోధనుడూ అదిగో అలా కలబడ్డారు. మండల గతులతో రకరకాల దాట్లు వేశారు. చిత్రచిత్రంగా గదలు తిప్పాను దారుణంగా పోరాడారు. ఆవడీ, అబలమూ, ఆనేర్పూ, ఆదర్పమూ చూసేవాళ్ళగుండెల్లో దడపుట్టించింది. అంతకంతకీ వాళ్ళబాహుబలం అధికమవుతూ వచ్చింది. నైపుణ్యం పెరుగుతూ వచ్చింది. జనులు పొగుడుతూ గోలచేశారు. ఇద్దరి ఉత్సాహమూ హెచ్చింది. తమకం పెరిగింది. వొకణ్ణి వొకడు గడ్డిపోచలా చూశాడు. ఇద్దరూ జంభాసురుడూ దేవేంద్రుడూ లాగ యుద్ధం చేశారు. ఎడాపెడా గదలు తగిలి కిరీటాలు తుక్కుతుక్కు యాయి. కవచాలు ముక్కముక్కలయాయి ; కింద పడిపోయాయి.

ఒకతట్టు జంకించి ఇంకోతట్టు కొట్టేవాడు భీముడు. వంచించి ఎదటివేటు తప్పుకునేవాడు. అంతలోనే వురికేవాడు. దభీమనిపించే వాడు. ఎదటిఎత్తు తప్పించేవాడు. వడితగ్గకండా నొప్పించేవాడు. పంతంపట్టి గద తుళ్ళగొట్టేవాడు. అతడే అంటే అతణ్ణి మించిపోయే వాడు దుర్యోధనుడు.

ఇద్దరూ తమ తమ గదాయుద్ధకౌశలమంతా చూపించారు. గదా గదా మోదివేసి లాగేవాళ్ళు. చెంగున లంఘించేవాళ్ళు వెనక్కి వక్కలికీ వుంకించేవాళ్ళు. మళ్ళీమళ్ళీ కలబడేవాళ్ళు. విడిపోయేవాళ్ళు. కాళ్ళూ, చేతులూ, పిరుదులూ, నడుములూ, ఎదురొమ్ములూ తృణానికి వొకరకం వొంపుతో అవుపడేవి. వేటు తప్పిపోయినప్పుడూ, ఎదటి వాడు మీదపడినప్పుడూ. ఇద్దరూ రకరకాలయే వాళ్ళు. కోపాలతో రక్తాలు చిమ్మి చిత్రచిత్రంగా అవుపించేవాళ్లు. మితిమీరిన వీరావేశంతో ఇద్దరిహృదయాలూ మండిపోయాయి. ఒకళ్ళని మించిపోవాలని

వాళ్ళు—ఇద్దరి అవయవాల్లోనూ ఔద్ధత్యమూ, ఆటోపమూ తొణికిస లాడాయి. గెలుపుమీదివాంఛ తమనితాము రక్షించుకోడానికైనా పుణ్యంలేకుండా చేసింది. అడ్డులేని దెబ్బలు ఇద్దరిమీదా పడ్డాయి రక్తాలు వరదలు కట్టాయి. ఇద్దరూ జమాలుమనిపోయారు. ఎడమచేతుల్తో గదలు పట్టుకుని నిలబడిపోయారు. అంతలోనే మళ్ళీ కలబడ్డారు. ఎన్నోసార్లు అలా అయింది. అద్భుతమనిపించింది. రౌద్రోల్లాసం మూర్తిమంత మైనట్టు అనిపించింది. కొత్తరక్తంలో తడిసి, ఉగ్రంగా కనిపించాయి గదలు. సంధ్యాకాశంలో రెండు సూర్యబింబాల్లా అవుపించాయవి. ఆశ్చర్యమూ, మెప్పూ పెనవేసుకుంటున్న హృదయాలతో ఎంతోసేపు చూశారు దేవతలు. ఇద్దరిలో ఎవరు గెలుస్తారో, ఎవరు వోడిపోతారో నిరూపించలేకపోయారు.

అప్పుడే కలబడినట్టు ఇద్దరిశరీరాలూ వుప్పొంగాయి. శరీరాలు రక్తాలు చిమ్మాయి. విరగపూసిన నడమోదుగుల్లాగ ఇద్దరూ అవుపించారు, నీకుమాళ్ళు. ఎవరికి ఎవరూ తగ్గిపోలేదు. ఇద్దరూ మహావీరులు. మహాసంరంభంతో యుద్ధంచేశారు. దుర్యోధనుడు వెలపల నించి చుట్టుకువచ్చాడు. లెక్కచెయ్యకుండా దాపలనించి తిరిగివచ్చాడు భీముడు. ఈసుతో వొళ్ళుమండింది దుర్యోధనుడికి. భీముడి పక్క ఎముకలు పగిలినట్టు ఒక్కటి వేశాడు. మరుక్షణంలో అతడిచేతిమీద తీసికొట్టాడు భీముడు. దెబ్బతో దుర్యోధనుడిచేతిలోని గద తుళ్ళిపోయింది మెరుపులా మెరిశాడు దుర్యోధనుడు; గదతీసి పట్టుకున్నాడు. సులువుగా తిరిగాడు. భీముడి నెత్తిమీద బాదేశాడు. ఆశ్చర్యం, పిసరంతా చలించలేదతడు. కోపంతో తిరగబడ్డాడు భీముడు. దుర్యోధనుడి విశాలమైన గుండె గురిచూసి, లాఘవంతో గదతిప్పి, ఘోరంగా కొట్టాడు. చప్పున వొదిగి తప్పించుకున్నాడు దుర్యోధనుడు. భూమి చలించినట్టు కిందపడింది గద. అతడు వొదిగిన సందు చూసుకున్నాడు

భీముడు. అద్భుతమైన వేగంతో వురికేసి, గద పుచ్చుకున్నాడు. అవకాశం చూసుకుని అతడి గుండెలమీద దారుణమైన దెబ్బ తగిలించాడు దుర్యోధనుడు. జుమ్మనిపోయాడు భీముడు. పాండవులూ, పాంచాలంవాళ్ళూ భయపడ్డారు.

అంతలోనే తెలువుకున్నాడు భీముడు. బలమూ, విక్రమమూ మెరిపించాడు. దుర్యోధనుడికి పక్కమీద పిడుగులాంటి దెబ్బ తగిలించాడు మోకరిల్లి పడిపోయాడు దుర్యోధనుడు. పకాలుమని నవ్వారు పాండవులు. కేకలు వేశారు. చెక్కుచెదరకండా లేచాడు దుర్యోధనుడు. భీముడి చెవులికీ నుదురుకీ మధ్య పగిలిపోయినట్టు బాదేశాడు. నవ్వినవాళ్ళు సిగ్గుపడిపోయారు; తలవొంచుకున్నారు మూర్ఛపోయాడు భీముడు. కాని చప్పున తేరుకున్నాడు. చెంపల మీంచి రక్తం కారుతూ, మదంకారిన మదపుటేనుగులాగ కనిపించాడు. తొండంలాంటిగద చాపాడు. దుర్యోధనుడి మెడజిమ్మలమీద బాదేశాడు. పెనుగాలికి పడిపోయిన పెద్దచెట్టులాగ నేలమీద వొరిగిపోయాడు నీకొడుకు. ధర్మరాజూ మొదలైనవాళ్ళు సంతోషించారు. గబుక్కున యముడిలాగ లేచాడు దుర్యోధనుడు. చిత్రగతులతో జంకించాడు. దెబ్బమీద దెబ్బతగిలించాడు. చచ్చినట్టు పడిపోయాడు భీముడు. చచ్చిపోయాడే అనుకున్నాడు దుర్యోధనుడు. సింహనాదం చేశాడు. అది చావు కాదని తెలుసుకున్నారు దేవతలు. దుర్యోధనుడి యుద్ధం మెచ్చుకున్నారు. పూలవాన కురిపించారు. పాండవులు భయపడ్డారు. అంతలోనే తేరుకున్నాడు భీముడు అంతంతగుడ్లుచేశాడు. వీరగర్వంతో నుంచున్నాడు.

సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, నకులసహదేవులూ ఏమేమో అంటూ దుర్యోధనుణ్ణి యుద్ధానికి పిలిచారు. వద్దంటూ వారించాడు

భీముడు. దేవేంద్రుడు నముచిమీద కలబడినట్టు దుర్యోధనుడిమీద కలబడ్డాడు. చిత్రచిత్రమైన గతులతో పోట్లాడాడు.

## ఎవరిది పైచెయ్యి

"కృష్ణా!" ఇద్దరియుద్ధమూ పరిశీలనగా చూస్తూ కృష్ణుణ్ణి అడిగాడు అర్జునుడు — "ఇద్దరిలోనూ ఎవరిలో వడి ఎలావుందంటావు? ఎవరిది పైచెయ్యి? నీకు ఎలాతోస్తోందో చెప్పూ?"

"గురువుశిక్షణ ఇద్దరిలోనూ సమానంగానేవుంది" అందుకున్నాడు కృష్ణుడు—"భీముడిలోబలం హెచ్చు. దుర్యోధనుడు పూనికతో పరిశ్రమ చేశాడు. అంచేత అతడిలో కౌశలం అధికం. బలం వున్నవాడు కనక మున్ముందుగా దూసుకుపోతున్నాడు మనవాడు. దుర్యోధనుడి ఉపాయంవల్ల దెబ్బలు తినేస్తున్నాడు. కనక ధర్మయుద్ధంలో గెలవడం గగన మవుతుంది భీముడికి. అన్యాయంగానే దుర్యోధనుణ్ణి అంతం చెయ్యాలి. మాయలు కల వగవాళ్ళని మాయలతోనే పనిపట్టించాలి. ఇంద్రుడు వృత్రుణ్ణి ఎలాచంపాడో వినలేదూ? అదీకాక జూదమప్పుడు దుర్యోధనుడి తొడలు విరగ్గొడతానని ప్రతిజ్ఞ చేశాడు భీముడు. అయితే గదాయుద్ధంలో నాభికి కిందకొట్టడం ధర్మంకాదు. అది అట్టేపెట్టి పరాభవం తీర్చుకోవాలి. తొడలు విరగ్గొట్టి శపథం పూర్తిచేసుకోవాలి. ఇది మరిచిపోయి, ఇలాగే మనవాడు పోట్లాడాడా, ధర్మరాజుకి దైన్యం తప్పదు. అంచేత శపథంపేర తొడలు విరగ్గొట్టి చంపడంతప్ప మరో ఉపాయంలేదు.

"ధర్మరాజువల్ల కొత్త ఉపద్రవం వచ్చిపడింది. భీష్ముడూ, ద్రోణుడూవంటి బలవంతుల్ని పడగొట్టాం. జయమూ, కీర్తి సాధించాం. అవి సంధిగ్ధంలో పెట్టేశాడు మీఅన్నయ్య. 'ఒకళ్ళణ్ణి గెలిస్తే నీదే రాజ్యం' అని దుర్యోధనుడితో పందెంవేశాడు. గదాయుద్ధానికి

భీముణ్ణి పెట్టాను. ఇంతమూర్ఖుడనుకోలేదు ధర్మరాజు. బంధువులూ, స్నేహితులూ, పరివారమూ అంతా పోయి, తనంత తాను రాజ్యం వొదిలేసి మడుగులో దూరినవాణ్ణి వెదికి, బైటికిలాగి, ద్వంద్వ యుద్ధానికి పిలుస్తారా? మచ్చరంపట్టి భీముణ్ణి గెలవడంకోసం పదమూడేళ్లు గదా పరిశ్రమ చేశాడు దుర్యోధనుడు. ఊర్ధ్వగతులతోనూ తిర్యగ్గతులతోనూ, విజృంభిస్తున్నాడు. అతడిలాగ భీముడు ఎంతోకాలం పరిశ్రమ చెయ్యలేదు. అందుకనే ధర్మం వొదిలిపెట్టి అయినా ఈ కులపాంసుణ్ణి కూలగొట్టకపోతే, మరికొంచేపట్లో భీముడే అయిపోతాడు. అప్పుడు ఈపాపాత్ముడే రాజవుతాడు. అది భరించగలరా మీరు?"

## సైగ

పరిస్థితి గ్రహించేశాడు అర్జునుడు. ఇంతలో భీముడు అతడి వేపుచూశాడు. తొడ చరుచుకున్నాడు అర్జునుడు. అది సైగ అని తెలుసుకున్నాడు భీముడు. "అధర్మంగా తొడలు విరగ్గొట్టమని కృష్ణుడి సలహామీద సూచించాడు తమ్ముడు. ఇంకోవిధంగా వీడు లొంగకపోతే అదే చేస్తాను" అని మనస్సులో నిశ్చయించుకున్నాడు. రకరకాల గతులతో పోట్లాడాడు. అంతకంటే చిత్రగతులు కనపరిచాడు దుర్యోధనుడు. పాంమాంసంకోసం పోరాడిన రెండు గరుడపక్షుల్లాగ, ఇద్దరూ అద్భుతంగా పోరాడారు.

భీముడు చాచిపెట్టి గద విసిరాడు. చెంగున దాటాడు దుర్యోధనుడు; తప్పించుకున్నాడు కిందపడిపోయింది గద. చప్పున వురికి పట్టుకున్నాడు భీముడు. ఆలోపున సాచి కొట్టాడు దుర్యోధనుడు. జుమాలుమన్నాడు భీముడు. అయితే ఆదెబ్బ అతడికి తగిలినట్టు గుర్తించలేకపోయాడు దుర్యోధనుడు. ఆటలో దాటినట్టు దాట్లు వేశాడు. తేరుకున్నాడు భీముడు. ఉరికాడు. దురోధనుడిమీద గద

వేశాడు. చెంగున పైకి దాటాడు దుర్యోధనుడు. అదే సమయంలో బలంకొద్దీ తొడలుమీద బాదేశాడు భీముడు. వజ్రాయుధంతో పడిన కొండలాగ, తొడలువిరిగి పడిపోయాడు దుర్యోధనుడు

ఉల్కలు రాలాయి. దుమ్మూ, రక్తమూ, మాంసమూ కురిశాయి. వికారంగా ఏనుగులు గీపెట్టాయి. గుర్రాలు సకిలించాయి. నూతులూ, చెరువులూ రక్తం వెళ్ళకక్కాయి. నదులు ఎదురు పారాయి. పురుషులికి స్త్రీచిహ్నాలూ, స్త్రీలకి పురుషచిహ్నాలూ కనిపించాయి. ఎన్నో ఉత్పాతాలు పుట్టాయి. పాండవులూ, పాంచాలులూ ఉద్విగ్న చిత్తులయారు. ఆకాశమంతటా ఈగదాయుద్ధమే చెప్పుకుంటూ దేవతలూ, గరుడులూ, ఖచరులూ తమతమ నివాసాలకి వెళ్ళారు.

## నరకమైనా స్వర్గమైనా పొక్కే

గదతగిలి తొడలువిరిగిపడిపోయాడు దుర్యోధనుడు. సింహంచేత కూలిన మదపుటేనుగులాగ పడిపోయాడు. దగ్గిరికి వెళ్ళాడు భీముడు. "దుష్టాత్ముడా! ఒంటిబట్టతో వున్న ద్రౌపదిని ఈడ్పించి తెచ్చి, సభలో భంగపరిచిన పాపఫలం అనుభవించు" అంటూ ఎడమకాలితో తలమీద తన్నాడు.

ఇంకా తనకోపం చల్లారలేదు.

"బంధుద్రోహీ!" అతడి మొహంచూస్తూ పురిమాడు–"మమ్మల్ని పశువులని కూసి హేళనచేసిన ధర్మహీనుల్ని, రాజధర్మంతో ఇదిగో ఇక్కడ "పశువులు" అని తిరిగీ గద్దిస్తున్నాము. దురాత్మా, ఆలకించు. కపటపాచికలు పట్టుకుని మాయజూదం ఆడలేదు. బాహుబలంతో శత్రుసంహారంచేశాను" అంటూ పెద్ద నవ్వు నవ్వాడు.

ధర్మరాజునీ, శ్రీకృష్ణుణ్ణీ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన వాళ్ళనీ, తక్కిన రాజుల్నీ, అర్జునుణ్ణీ, నకులసహదేవుల్నీ కలయ చూశాడు; అందుకున్నాడు :

"ఇదిగో అందరూ చూడండి. శంక లేకండా ద్రౌపదిని, ఒంటి చీరెతో వున్న దాన్ని, సాధ్విని జుత్తుపట్టి సభలోకి ఈడ్పించిన ఘనుణ్ణి చూడండి. ద్రౌపదిచేసిన తపస్సు పండింది ఈశుభం కలిగింది మాకు"

అంతమందీ విన్నారు; సంతోషించారు.

పట్టలేనిసంతోషంతో నాట్యంచేసేశాడు భీముడు.

"గొడ్డుపోయారని మూఢులై మమ్మల్ని అప్పుడు కూసిన దుర్జనుల్ని ధృతరాష్ట్రుడి కొడుకుల్ని సేనలతోనూ, బంధుమిత్రులతోనూ, పుత్రులతోనూ యుద్ధంలో వూడ్చేశాం. ఇక స్వర్గమైనా, నరకమైనా వొకటే మాకు" అంటూ గదపట్టుకుని నీకొడుకుమీదికి వురికాడు. అతడి మెడపట్టి అదిమాడు. మళ్ళీ తలమీద తన్నాడు.

మొదట తన్నినప్పుడే నొచ్చుకున్నాడు ధర్మరాజు. సంతోషంతో వొళ్ళు తెలియక భీముడు అదేపారపాటుమళ్ళీ చెయ్యడంతోనే అతడు మరింత నొచ్చుకున్నాడు.

"తలమీదతంతావేం?" తమ్ముణ్ణి అదిలిస్తూ అన్నాడతడు— "అధర్మమని ఆలోచించవేం? తమ్ముళ్ళూ, బంధువులూ, సేనలూ అన్నీ అయిపోయినా గౌరవంకోసం పోరాడాడు దుర్యోధనుడు. యుద్ధంలో పడిపోయాడు. అతడి తలమీద తంతున్నావు. తుచ్ఛవ్వని లోకం మెచ్చుతుందా? ఇంతవరకూ నువ్వు ధర్మపరుడివంటున్నారు జనులు. అలాంటివాడివి, ఇలా ఉచితంకానిపనికి తెగించవచ్చా? దీని వల్ల వచ్చే లాభ మేముంది? తప్పుడుగర్వం కూడదు."

దుర్యోధనుణ్ణి చూసి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు ధర్మరాజు, ఇలా అన్నాడు. "తమ్ముడూ విధి ప్రతికూలమైంది. మనలో మనకి విరోధం పుట్టింది. మాకు నవ్వూ నీకు మేమూ కోపంతో ద్రోహం తలపెట్టుకున్నాం. ఇంతవరకూ వచ్చింది నీ అధర్మబుద్ధీ, మదమూ, లోభమూ, క్రోధమూ నిన్ను ఇంతవరకూ తెచ్చాయి. నీవల్ల నాకు బంధునాశనం సంభవించింది. దుఃఖకారణమైన వైధవ్యంవల్ల ధృతరాష్ట్రుడి కోడళ్ళు నన్ను తిట్టిపోస్తారు" అన్నాడు. ముంచుకు వచ్చిన శోకంతో ఎంతో అంత దుఃఖపడ్డాడు

ధృతరాష్ట్రుడు : గదాయుద్ధ ధర్మం బాగా ఎరిగినవాడు బలరాముడు. అతడి కళ్ళముందే భీముడు అధర్మంగా దుర్యోధనుణ్ణి కొట్టేస్తే చూస్తూవూరుకున్నాడా ? ఏమన్నాడు ? తమ్ముళ్ళనీ, మరుదులనీ మొగమోటపడే మనిషి కాడే అతడు !

## బలరాముడి కోపం

సంజయుడు : ఊరుకోలేదు బలరాముడు. కోపంతో అతడి మొహం కందిపోయింది. "రాజులారా !" అంటూ చేతులెత్తి లేచాడతడు-"చూశారా, భీముడి దురుసు ! ఇలాంటివాణ్ణి మన దేశాల్లో ఎక్కడైనా చూశామా ? గదాయుద్ధంలో బొడ్డుకి కింద కొట్టకూడదని శాస్త్రం. వీడు ధర్మం తగలబెట్టాడు. విచ్చలవిడిగా తెగించాడు" అన్నాడు. మండిపోయాడు. రథంమీది నాగలితీసి భుజంమీద వేసుకున్నాడు. భూమిగజగజలాడిస్తూ సింహంలాగ భీముడిమీదికినడిచాడు.

చలించలేదు భీముడు. తనబలమూ, తన అన్నదమ్ములబలమూ తెలిసిన మనోబలంతో కదలకండా నిలబడ్డాడు.

ఉన్న పాళాన లేచాడు శ్రీకృష్ణుడు. వినయంగా వెళ్ళాడు. అన్నగారిని అడ్డుకున్నాడు. పొడవుగా గుండ్రగావున్న తన బలమైన

చేతులతో అతణ్ణి పట్టుకున్నాడు. కైలాసపర్వతం దగ్గిరచేరిన అంజన పర్వతంలా అవుపించాడు.

"అన్నయ్యా!" గంభీరంగా అందుకున్నాడు కృష్ణుడు -"తన బాగూ, తనమిత్రుడి బాగూ, మిత్రుడి మిత్రుడిబాగూ, శత్రువుకీడూ అతడి మిత్రుడి కీడూ, అతడి మిత్రుడి మిత్రుడికీడూ - ఈ ఆరూ మని షికి శుభం కలిగిస్తాయి. దీనికి విపరీతమైతే హానికలిగిస్తాయి. కనక మిత్రుడికి కీడువచ్చిపడిందంటే స్నేహపరుడైన పౌరుషశాలినేర్పుతో అది గట్టెక్క జేస్తాడు. సత్యపరాక్రములైన పాండవులు మనకి పరమ మిత్రులు. విశేషించి మన మేనత్త కొడుకులు. అవినీతి పరులచేత పరాభవం పొందినవాళ్ళు. కనక వీళ్ళకి మేలుకలిగించడం నీకర్తవ్యం.

"ప్రతిజ్ఞ పూర్తిచెయ్యడం రాజులికి పరమధర్మంకదా! నువ్వే ఆలోచించు. గదతో దుర్యోధనుడి తొడలు విరగ్గొడతానని సభలో ప్రతిజ్ఞ చేశాడు భీముడు. అదీకాక తొడలు విరిగి తెగిపోతాడని మైత్రే యముని శాపంకూడావుంది దుర్యోధనుడికి. అదే అయిందిప్పుడు. కనక ఇందులో దోషమేమీ కనపడదు. కోపం విడిచిపెట్టు. కుంతీ కుమారుళ్ళ అభివృద్ధి మనకి సమృద్ధి కలిగిస్తుంది"

"అదికాదు" అన్నాడు బలరాముడు -"ధర్మమూ, అర్థమూ, కామమూ వొకదానివల్ల వొకటి నాశనం కాకండా చూసుకోవాలి. అంతేకాని ధర్మం తగలపెట్టి అర్థమూ, కామమూ కోరే పురుషుడు నిందలపాలు కాడా అంటా? మునిశాపమూ, భీముడి ప్రతిజ్ఞా చెపు తున్నావు. ఉంటే వుండుగాక ఇవి. ధర్మం తప్పకండా అవి నెరవేర్చు కోవాలి. నీతీ నియమమూ మంటకలిపాడు భీముడు."

"అన్నయ్యా!" మళ్ళీ అందుకున్నాడు కృష్ణుడు—"నువ్వు ధర్మ పరుడివనీ, శాంతమూర్తివనీ, కోపం లేనివాడివనీ లోకంనిన్ను స్తుతి చేస్తూ వుంటుంది. మహాత్ముడివి నువ్వు. శాంతించు భీముడు తన ప్రతిజ్ఞ

కోసమే దుర్యోధనుణ్ణి గదతో కొట్టాడు. అది అధర్మంకాదు. పైగా నిలిచి, కలబడినప్పుడు కొట్టలేదు. నడుస్తూవున్నప్పుడూ కొట్టలేదు. మీదికి ఎగిరి, తనమీదికి వురికినప్పుడు, తన్ను తాను కాసుకోడానికి కొట్టాడు. నాభికి కిందకదా అని పూరుకుసి చవ్వడం మంచిదంటావా? గదతో తొడలు విరగ్గొడతా నని భీముడుచేసిన శపథం పదమూడేళ్లు దాచి పెట్టుకున్నది. ఈకులపాంసనుడికి దుర్యోధనుడికి జ్ఞాపకంలేదా అది? మరిచిపోయాడంటావా? అయితే అందుకే చెడ్డాడు మనకేం?

"కలియుగం ప్రవేశిస్తోంది. ఇలాంటివి ధర్మంకింద చెల్లుబడి కాకపోవు, ఇక. అదీ కాక, పుట్టినప్పటినించీ కపటంతోనే అపకారాలు చేస్తున్న వీణ్ణి, కపటంతో పడగొట్టడం అధర్మమని తోచదు. పాండవ యాదవ వంశవర్ధనుడైన అభిమన్యుణ్ణి వీడు ఎలా చంపేశాడో తెలియదా!" అన్నాడు.

"ఇలాటి తుచ్ఛమైన గెలుపు గెలిచి భీముడు మెప్పుపొందితే పొందనీ" మొహం చిట్లిస్తూ అన్నాడు బలరాముడు- "దుర్యోధనుడు ధర్మాత్ముడు. యుద్ధధర్మం తప్పకండా పోరాడాడు. పుణ్యలోకం పొందుతాడు" అన్నాడు, చక్రున రథమెక్కి ద్వారక వెళ్ళిపోయాడు పాండవులు చిన్నబుచ్చుకున్నారు. కృష్ణుడు ధర్మరాజు వేపుచూశాడు. దీనమైన మొహం పెట్టుకుని, విచారంగా చూస్తూ వూరుకున్నాడు ధర్మరాజు.

"ఎందుకూ ఈవిచారం!" అందుకున్నాడు శ్రీకృష్ణుడు - "బంధునాశకుడు దుర్యోధనుడు. పాపాత్ముడు. ఇతణ్ణి యుద్ధంలో పడగొట్టాడు భీముడు, తలమీద తన్నాడు. ఇందులో అధర్మమేముంది? అదీగాక, 'తలమీద తంతాను' అనికూడా శపథంచేశాడు భీముడు మరి!" అన్నాడు.

"కౌరవకులం నాశనమైనందుకే దహించుకుపోతోంది నా మనస్సు పైగా రాజరాజుని తలమీద తన్ని పరాభవించాడుభీముడు. విచారంకాక సంతోషం ఎలావస్తుంది? దుర్యోధనుడు పెట్టిన పాట్లకి హృదయం మండి ధర్మంవొదిలేశాడు భీముడు. ఏం చెయ్యడం! పోనీ. పుణ్యమూ పాపమూ ఆలోచించడం ఎందుకిక ? "

"అవును, దీనికింత ఇదవడ మెందుకు? " అన్నాడు కృష్ణుడు. భీముడిమీద వున్న పక్షపాతంవల్ల ధర్మరాజు వింత పోగొట్టా డతడు. అర్జునుడికిమాత్రం నచ్చలేదు. మంచీ చెడ్డా అనకండా వూరుకున్నా డతడు. సంతోషంతో అంజలిబంధం నుదుట మోపుకుంటూ, చేరడేసి కళ్ళతో అన్నగారిదగ్గిరికి వచ్చాడు భీముడు.

"మన పరాభవాలన్నిటికీ మూలం ఈకులపాంసనుడు కూలి పోయాడు. విరోధం పెంచిన పాపాత్ములు దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీ చచ్చారు. భూమండల మంతటికీ నువ్వే రాజువి. దేవేంద్ర వైభవంగా పరిపాలించు ఇక" అన్నాడు.

"ప్రతిజ్ఞా, పగా రెండూ తీర్చుకున్నావోయి" తమ్ముణ్ణి ఆద రిస్తూ అన్నాడు ధర్మరాజు — "కృష్ణుడికోర్కె నెరవేరింది. దుర్యో ధనుణ్ణి పడగొట్టావు. దైవబలమూ, భుజబలమూ రెండూ వున్నాయి నీకు. "

ధృతరాష్ట్రుడు. అయ్యో, తొడలువిరిగిపడిపోయాడురాజరాజు. తరవాత ఏంచేశారు పాండవులు ?

సంజయుడు : ఏంచెప్పేది మహారాజా ! పాండవులూ, పాంచా లులూ, తక్కిన రాజులూ, కృష్ణుడూఉల్లాసంతో ఉప్పొంగిపోయారు. కొందరు ఉత్తరీయాలు ఎగరవేశారు. ధనుస్సులు విసిరారు కొందరు. కొందరు అల్లెతాళ్ళు మోగించారు. శంఖాలుపూరించారు కొందరు. కొందరు భేరీలూ, పణవాలూ మోగించారు. పొలికేకలు పెట్టారు

కొందరు. అదంతా భూమికి బరువైనట్టనిపించింది. అగ్గజమైనట్టని పించింది. అంతమందీ భీముడి రెండుపక్కలా చేరారు. అతణ్ణి అదే పొగడడం పొగిడారు.

"గదనేర్పులో సాటిలేని ప్రతాపశాలి దుర్యోధనుడు. అంత వాడు పురికేసరికి వంచించి కొట్టేశావు. తొడలువిరిగి నేలపడ్డాడు. నువ్వు అలా కొట్టేసేసరికి మావాళ్ళు గరిపొడిచింది. ఇంకా ఇప్పుడూ గగుర్పాటు తగ్గలేదు, చూడు. ఇంకొకడికి సాధ్యంకానిపని ఇది. ఇట్టే సాధించావు. దేవేంద్రుడు వృత్రాసురుణ్ణి కూల్చేసినట్టు కూల్చే శావు. దేవతలు దేవేంద్రుణ్ణి పొగిడినట్టు మేం నిన్ను పొగుడుతాం. అవమానించిన అవినీతిపరుల్ని, దుశ్శాసనుడూ మొదలైనవాళ్ళని తుడిచి పారేశావు. శత్రువు నడినెత్తిని కాలుపెట్టావు. నీఅంతవాళ్ళు లోకంలోలేరు" అంటూ ఎన్నో అన్నివిధాల పొగిడారు.

భీముడు అధర్మయుద్ధంచేశాడని, పరాయిరాజులమనస్సుల్లో వుంటుందేమో అని శంకించాడు శ్రీకృష్ణుడు. అంతమందిరాజుల్నీ కలయచూశాడు. ఇలాఅన్నాడు:

"అధర్మయుద్ధంచేసి భీముడు దుర్యోధనుణ్ణి కొట్టేశా డనుకో కండి. కనికరంలేకండా అన్నికష్టాలు పెట్టాడు దుర్యోధనుడు. కుల పతిని అంతచేసినా దయమానలేదు ధర్మరాజు. తన తండ్రివంతు మాత్రం తాను అడిగాడు. లేదుపొమ్మన్నాడు దుష్టు. ఇలాంటిచావే ఇతడికి తగింది. విదురుడూవాళ్ళూ నెత్తీనోరూ మొత్తుకున్నారు. సనే మిరా ఇవ్వనన్నాడు. అయిదూళ్ళయినా ఇమ్మని అడిగారు పాండ వులు. సూదిమొన మోపినంత నేలా ఇవ్వనన్నాడు మహానీయుడు. భీముడు శపథంపట్టాక పాండవులికి అడ్డేముంది? కిందకూలి, మానులా పడున్నాడు పాపకర్ముడు. ఇతడిగురించి ధర్మమూ, అధర్మమూ-అన్న చర్చ ఎందుకూ? పదండి. రథాలెక్కండి."

తనని ఆక్షేపించడం విన్నాడు దుర్యోధనుడు. కోపంతో మండిపోయాడు. చేతులు నేలమీద ఆనుకున్నాడు. పిరుదులు మోపి లేచాడు. బొమలుముడి వేశాడు. కృష్ణుడికేసి చురచురా చూశాడు. తోకతొక్కితే కన్నుమని పడగెత్తిన మహానాగులాగ అవుపించాడతడు. ప్రాణాలుతోడేస్తున్న వేదన లక్ష్యపెట్టకండా కూచున్నాడు. కృష్ణుడు అర్జునుడితో గుసగుసలాడడమూ, అర్జునుడు తొడచరుచుకోడమూ ముందే కొద్దికొద్దిగా చూశాడతడు. అంచేత భీముడిదెబ్బతో తొడలువిరిగి పడినప్పుడు ఆబుడిబుడిమాటలూ, ఆసైగా దీనికోసమే అని గ్రహించేశాడు. చేసేదిలేక పెదవులు కరుచుకున్నాడు. కనక మాటలతో నిప్పులు చెరిగాడు:

## గురివిందగింజ తననలుపు కానదు

"కంసదాసుడి కొడుకువి" అందుకున్నాడు దుర్యోధనుడు — "నీ దురాచారాలు నువ్వు కానవు. జాలిలేకండా పేల్తున్నావు. సిగ్గులేకండా కూస్తున్నావు. నువ్వు సలహా యిచ్చావు. అర్జునుడు సైగ చేశాడు. గదాయుద్ధధర్మం వొదిలేసి ఈపాపకర్ముడు తొడలమీద కొట్టేశాడు. ధర్మయుద్ధమే అయితే ఇట్టే మీఅందరినీ నేలపాలు చేసేసవాణ్ణి. శిఖండిమీద నెపంపెట్టి అర్జునుడిచేత భీష్ముణ్ణి కొట్టించావు. ధర్మరాజుచేత అబద్ధమాడించి గురువుని చంపించావు. రథం కుంగిపోయిన సమయంచూసి కర్ణుడితల నరికించావు. మరొకడితో పోరాడుతున్న భూరిశ్రవుడిచెయ్యి నరికించావు. పొడిచీకటి కల్పించి జయద్రథుడితల కొట్టించావు ఇలాంటినువ్వా మాట్లాడుతున్నావు, పైగా? నన్నూ, భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ, భూరిశ్రవుణ్ణీ జయద్రథుణ్ణీ ధర్మయుద్ధంలో చంపగలరా పాండవులు? కపట చరిత్రుడివి. దుశ్చరిత్రుడివి" అన్నాడు.

"గురివిందగింజ తనసలుపు కానదు" అందుకున్నాడు కృష్ణుడు— "చిన్నప్పుడే భీముణ్ణి పాములచేత కరిపించావు. విషంపెట్టావు నీళ్ళలో తోశావు. ఎన్నోసార్లు చంపడానికి తెగించావు. అయిదుగురు కొడుకులతోనూ కుంతి నిద్రపోతూ వుంటే లక్కఇంట్లో నిప్పు పెట్టించావు. అజాతశత్రుడు ధర్మరాజు మాయజూదంలో అతడిరాజ్యం చపాయించావు. అంతతో నీకవివి తీరలేదు. యజ్ఞకుండంలోపుట్టిన ద్రౌపదిని ఏకవస్త్రని రజస్వలని కొలువుకి లాక్కొచ్చావు; భంగ పరిచావు. అప్పుడే నీకు ఈదురవస్థ రావలసింది. శపథంకోసం నువ్వు చేసిన ఈపాడుపనులన్నీ సహించాడు ధర్మరాజు. సహించి, తన రాజ్యభాగం తనకి ఇమ్మని నన్ను సంధికి పంపాడు. కాదుగాక కాద న్నావు. పొమ్మన్నావు. నిదోషంవల్లే నువ్వు ఇలా అయావు. నీలోభంవల్ల, నీపాపసంకల్పంవల్ల నిమదంవల్ల పాపం, శాంతచిత్తు డైన భీష్ముడు పడిపోయాడు. ద్రోణుడు కళ్ళుమూశాడు.

"విను. ద్రుపదుడి తపఃప్రభావంవల్లా, యజ్ఞమహిమవల్లా అందు కోసమే పుట్టిన శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ భీష్మద్రోణుల మరణానికి కారకులయారు. ఎంతోమందితో పోరాడి అలిసిపోయిన సాత్యకిమీద పడి చంపబోయాడు భూరిశ్రవుడు. చంపకండా పూరుకుంటా మను కున్నావా, చూసి! ఎంతోమంది ముక్కాకాలు తేరిన యోధులు ఒక్కణ్ణి పాపం, కుర్రాణ్ణి అభిమన్యుణ్ణి చంపినప్పుడు, పాండవులు పద్మవ్యూహంలో అడుగుపెట్టకండా అడ్డుకున్నవాణ్ణి, పుణ్యాత్మ ద్రౌపదినిఅడివిలో ఎత్తుకుపోయిన పాపాత్ముణ్ణి జయద్రథుణ్ణి బతకనుని వొదిలేసి, అర్జునుడు అగ్నిలో దూకుతా డనుకున్నావా?

"పాండవులు నీతిపరులు. కల్మషంలేని చరిత్రవాళ్ళది. గొల్ల పల్లెలికి వెళ్ళినప్పుడు గంధర్వులు నిన్ను పట్టుకుపోతూవుంటే నీ వాళ్ళంతా తోకముడిచేశారు. అర్జునుడు నిన్ను విడిపించలేదూ?

భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా,కృపుడూ—ఇంతమంది
తోనూ పెద్దపెద్ద సేనలతోనూ విరాటనగరం వెళ్ళావు. విరాటరాజు
ఆలమందలు పట్టుకున్నావు. అప్పుడు మీవాళ్ళందరూ సమ్మోహ
నాస్త్రంతో చచ్చినట్టు పడున్నప్పుడు అర్జునుడు నిన్ను చంపకుండా
వొదిలెయ్యలేదూ? నువ్వుచేసిన పాపాలన్నిటికీ మూలం కర్ణుడు. అతడి
రథంకుంగిపోతేఅర్జునుడు కాసుకుకూచోవాలా కొట్టకుండా? కూచుంటే
మాత్రం బ్రాహ్మణశాపంవల్ల కుంగిపోయిన రథానికి ముక్తి కలుగు
తుందా? అంచేత ఆసీచుణ్ణి తెగెయ్యడమే తగినపని. ఇంకా నయమే
శల్యుణ్ణి ధర్మరాజు చంపడంకూడా అన్యాయమనలేదు, రక్షించావు.

"పాండవులు పుట్టిందిమొదలు నేటిదాకా నీకు వ్యతిరేకమైన
పని చెయ్యలేదు. కౌరవకులానికి కాష్ఠంపేర్చి మాయజూదానికి నువ్వే
కాలుదువ్వావు అదిగో ఆజూదంవల్లే ఇంతా పుట్టింది. భీముడుచేసిన
ప్రతిజ్ఞ ఎరగవా, నువ్వు? గదతో తొడలువిరగ్గొడతాను అన్నవాడు
పిడికిలితో పొడుస్తా డనుకున్నావా? ఎందుకూ ఊపొల్లు పేలాపన?
నోరుమూసుకో."

"నాలుగువేదాలూ చదివాను" కృష్ణుడిమాటలు విన్నాక
ఎత్తుకున్నాడు దుర్యోధనుడు— "ఘనంగా యజ్ఞాలుచేశాను. సర్వ
సంపదలతోనూ తులతూగాను. రాజులందరూ తలలొగ్గారు. చంప
గలిగినంతమంది శత్రువుల్ని చంపాను తుదకి బంధుమిత్రులతో కలిసి
యుద్ధంలో ప్రాణాలు వొదులుతున్నాను స్వర్గానికిపోతాను. ఇంత
కంటే ఏంకావాలి? నువ్వు నన్ను ఎలాటివాడని అనుకుంటే నాకేం?
ఇంక పశ్చాత్తాపంతో కుములుతూ వుండురుకానిమీరు."

దుర్యోధనుడు అలా అంటూవుంటే అతడిమీద పూలవాన
కురిసింది. దివ్యదుందుభులు మోగాయి. దిశలు తెల్లవారాయి. చల్ల
గాలి మెల్లిమెల్లిగా ఘుమఘుమలాడుతూ వీచింది.

అంతా చూశారు పాండవులు. తాముధర్మంతప్పి భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, దుర్యోధనుడూ మొదలైనవాళ్ళని చంపడం కళ్ళముందు కట్టినట్టయింది. మనస్సుల్లో విచారమూ, సిగ్గూపుట్టాయి. అదంతా మొహాల్లో ప్రతిబింబించింది. చిన్నబుచ్చుకున్నారు.

"సంతోషసమయంలో ఈవిచారమేమిటి? " హెచ్చరించాడు శ్రీకృష్ణుడు– "భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ, దుర్యోధనుణ్ణీ ధర్మ యుద్ధంలో పడగొట్టలేకపోయామనేనా మీ విచారం? ఉగ్రాస్త్రాలు తెలిసినవాళ్ళు వాళ్ళు. ధర్మయుద్ధంలో సరాసరి వాళ్ళని గెలవడం అసంభవం. అందుకనే నేను బహువిధాల మాయోపాయాలు పన్నాను. ఇలా అంతా సాంతంచేశాను. అలా కాకపోతేఅంత మీద మీదపోతారా వాళ్ళు? అదీకాక వాళ్ళ విధే వాళ్ళనిఅలాచంపింది. దైవఘటన తప్పించడం మీ తరమా? దేవతలురాక్షసుల్ని ఇలాగే గెలిచారు.

"కృతకృత్యులయాం, బాగాపొద్దుపోయింది. నేనా, సైనిక యోధులూ విశ్రమించాలి. పోదాం పదండి" అన్నాడు.

తెలుపుకున్నారు పాండవులు. యావన్మందీ సంతోషించారు.

శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. ధర్మరాజు అనంతవిజయమూ, నకులుడుసుఘోషమూ, సహదేవుడు మణిపుష్పకమూ పూరించారు. తక్కిన యావన్మందిరథి కులూ తమతమశంఖాలు పూరించారు. భేరీలూ, పణవాలూ మొద లైన రణవాద్యాలు మోగాయి. రకరకాల ధ్వనులతో ఆకాశం నిండి పోయింది. దిక్కులు ప్రతిధ్వనించాయి. వల్లమాలిన పొంగుతో అంత మందీ అక్కడినించి కదిలారు.

పాండవులు కౌరవశిబిరానికి వెళ్ళారు. సాత్యకీ వాళ్ళవెంట వెళ్ళాడు. ధృష్టద్యుమ్నుడూ మొదలైన ద్రుపదుడి జ్ఞాతులూ,

ద్రౌపదికుమారుల్నూ, తక్కినరాజులూ తమతమ విడిదల్లోనే కాని విశ్రమించడానికి వీలుపడదని పాండవులశిబిరానికి వెళ్ళిపోయారు. ఆరాత్రి అక్కడఆగి, తెల్లవారగానే హస్తినాపురం బయలుదేరుతామని విన్నవించి ధర్మరాజు అనుమతి తీసుకున్నారు. సేనలతోకూడా శిబిరానికి వెళ్ళిపోయారు.

పాండవులూ, శ్రీకృష్ణుడూ, సాత్యకీ కౌరవశిబిరం ప్రవేశించారు. సంగీతసంఘాలు వాదిలేసివెళ్ళాక వృత్తిపోయిన రంగస్థలంలా వుంది కౌరవశిబిరం. దుర్యోధనుడిమందిరంలోకి వెళ్ళారు పాండవులు. అక్కడవున్న పరిచారకులూ, వాళ్ళసహచరులూ, మణులూ బంగారమూ మొదలైన వస్తువుల కోశాధికార్లూ ధర్మరాజుని చూశారు. అందరినీ ఆదరించాడు ధర్మరాజు.

## అ ర్జు ను డి ర థ ం త గ ల బ డి పో యి ం ది

పాండవులు రథాలు దిగేముందు శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి చూసి, "జమిలితూణీరాలూ, గాండీవమూ అవతల పెట్టించు. నువ్వు ముందు రథం దిగు. తరవాత నేను దిగుతాను. శుభమవుతుంది" అన్నాడు;

అతడిమాటప్రకారం జమిలితూణీరాలూ, గాండీవమూ పట్టుకుని రథందిగాడు అర్జునుడు. పగ్గాలు నొగలికి ముడిచి శ్రీకృష్ణుడు దిగిపోయాడు. వానరపతాకం భూతగణాలతో తప్పుకుపోయింది. ఉత్తరక్షణంలో గుర్రాలతోకూడా భగ్గున మండిపోయింది రథం. నిర్ఘాంతపోయాడు అర్జునుడు.

"ఏమిటీ చిత్రం!" చేతులు నుదుట జోడించి వినయంగా అడిగాడు అర్జునుడు — "రథం ఇలా మండిపోయిందేం! ఏమిటి కారణం? నేను వినదగిందైతే సెలవియ్యి."

"ద్రోణుడూ కర్ణుడూ ప్రయోగించిన మహాస్త్రాలతో ఇంతకి ముందే కాలిపోయిందిది. నేను అడ్డుపడి ఇంతవరకూ మండిపోకండా రక్షించాను. యుద్ధం ముగిసింది, వొదిలేశాను. మండిపోయింది" అన్నాడు కృష్ణమూర్తి కలకలలాడుతున్న మొహంతో తక్కినపాండవుల్ని చిరునవ్వునవ్వుతూ చూశాడు. ధర్మరాజుని కౌగిలించుకున్నాడు.

"నేను ఉపప్లావ్యం వచ్చినప్పుడు నువ్వు నాకు మధుపర్కం ఇచ్చి 'అర్జునుణ్ణి కాపాడాలి సుమా' అని అప్పగించావు. నేను వొప్పుకున్నాను. ఇడిగో మీఅర్జునుడు, నాస్నేహితుడు. వీరవిహారంచేశాడు. అన్నదమ్ములతోనహా మహాభారతయుద్ధం దాటుకువచ్చాడు. విజయుడు, విజయంసాధించాడు. ఇకమీద అవసరమైన కార్యాలు నిర్వహించు" అన్నాడు.

"ఇదంతా నీప్రసాదం" అన్నాడు ధర్మరాజు —" ద్రోణుడి దివ్యాస్త్రాలూ, కర్ణుడి మహాస్త్రాలూ క్రూరంగా మామీద పడినప్పుడు నువ్వే రక్షించకపోతే బతికి బట్టకట్టేవాళ్ళమేనా మేం; శ్రీకృష్ణుడు ఏవేపువుంటే ఆవేపు జయం తప్పదు' అని వ్యాసముని చెప్పనేచెప్పాడు నాకు."

"మనకీ కౌరవులకీ పద్దెనిమిది అక్షౌహిణీలసేన వుండేదికదా," మళ్ళీ ఎత్తుకున్నాడు కృష్ణుడు. "ఈపద్దెనిమిది అక్షౌహిణీలలోనూ ఏదీ అర్జునుడితో సమానమైనవాణ్ణి వొకణ్ణి చూపించూ? శివుడు మహాస్త్రాలు ప్రసాదించినప్పుడు 'నాతో సమానమైనవాడివి కావాలోయి నువ్వు' అన్నాడు, వాత్సల్యంతో. నిజానికి శివుడంతటివాడే అర్జునుడు. జాలిపడి శత్రువుల్ని చంపడానికి వెనకతీశాడితడు. నేను పురికొల్పిన తరవాత భీష్ముణ్ణీ వాళ్ళనీ పడగొట్టాడు, పరాక్రమంచూపి చిత్రమేమిటంటే, చంపడం ఇష్టంలేకండానే ఇన్నాళ్ళూ యుద్ధంచేశాడు. నేను హితంచెప్పాను. కపటంలేకండా గ్రహించాడు. నేను చెప్పానుకనక

గౌరవించాడు. కాని నాఅంతటివాడే ఇతడు, దేనికైనా. అరనిమిషంలో దేవతలతో సహా ముూడులోకాలూ వోడించి పారేస్తాడు, కోపంవస్తే కౌరవబలం అనగా ఏపాటి, ఇతగాడికి?

అలా సల్లాపాలాడుకుంటూ, దుర్యోధనుడి కోశాగారానికి వెళ్ళారు పాండవులు. అందమైన ఆభరణాలూ, బంగారంరాసులూ, రత్నాలూ మొదలైన గొప్పగొప్ప వస్తువులు ఎన్నో స్వాధీనం చేసుకున్నారు. అవాళయుద్ధానికి వెళ్ళకండా శిబిరంలోవున్న రథాలూ గుర్రాలూ, ఏనుగులూ చూసుకున్నారు. దాసదాసీజనమూ, కుబ్జ, వామన పరివారమూ స్వాధీనంచేసుకున్నారు. కొంతసేపు ఎంతో ఆనందంతో గడిపారు.

"దండు పాడుపడివుంది" అన్నాడు కృష్ణుడు - "ఇక్కడ మసల కూడదు మనం. విశ్రాంతి ఇక్కడ కూడదు. శుభంకోరి శుచిప్రదేశానికి వెళదాం. అక్కడ ఈ రాత్రి గడుపుదాం."

పంచపాండవుల్నీ, తమ్ముడు సాత్యకినీ వెంటపెట్టుకుని శిబిరం నించి బయలుదేరాడు శ్రీకృష్ణుడు.

ఎప్పుడూ దారుకుడు రథం సిద్ధంగా పెట్టుకుని శిబిరంలో వుండడం రివాజు. దుర్యోధనుడు మడుగులో దాగున్నాడని బోయ వాళ్లు వచ్చి చెప్పారు కదూ! అప్పుడు బయలుదేరిన పాండవులతో దండుదండంతా బయలుదేరింది. రథానికి శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, వలాహకమూ పూంసి తానుకూడా వాళ్ళతో వెళ్ళాడు దారుకుడు. తిరుగుదలలో పాండవులవెంట తానున్నా కౌరవ శిబిరానికి వచ్చాడు. కనక శ్రీకృష్ణుడు శిబిరంనించి బైటికి వచ్చేసరికి అతడిఎదట పెట్టాడు రథం. ధర్మరాజూ, తక్కినతమ్ములూ, సాత్యకీ తగిన వాహనాలు తెప్పించుకుని ఎక్కారు. శ్రీకృష్ణుడు తన రథమెక్కాడు.

అక్కణ్ణుంచి బైల్దేరి ఓఘవతి నదిదగ్గిరికి వెళ్ళారు పాండవులు. ఓఘవతివొడ్డున వొక మంచిప్రదేశంలో సంతోషంతో గడిపారు.

అలా సంజయుడు ధృతరాష్ట్రుడికి పాండవుల విజయంచెప్పాడు. అప్పుడు ఓఘవతివొడ్డున ధర్మరాజు కృష్ణుడితో అన్నాడు. "కృష్ణా, నువ్వు హస్తినాపురం వెళ్ళాలి."

"ఎందుకు?" అడిగాడు కృష్ణుడు.

"గాంధారని వోదార్చి రావాలి. ఏమంటావా? అర్జునుడు సైగచేసినమీదట, అధర్మంగా తొడలువిరిచి దుర్యోధనుణ్ణి పడగొట్టాడు భీముడు. అదివింటే గాంధారి శపించవచ్చు. అదీ నాభయం అని ప్రార్థించాడు ధర్మరాజు.

వెంటనే రథమెక్కాడు కృష్ణుడు. గాలిలా ఎగిరిపోయి హస్తిన చేరాడు. మొగసాలదగ్గిర ఆగి ధృతరాష్ట్రుడికి తనరాక కబురుచేశాడు. లోపలికి వెళ్ళాడు.

గాంధారితో కూచుని కొడుకులకోసం గోలుగోలుమంటున్న ధృతరాష్ట్రుడిదగ్గిరికి అంతకిముందే వచ్చి కూచున్నాడు వ్యాసముని. చూసి, తడబడిపోతూ వినయంగా అతడికి పాదాభివందనంచేశాడు శ్రీకృష్ణుడు. ధృతరాష్ట్రుడికీ గాంధారికీ నమస్కారంచేశాడు. కులపతి వ్యాసముని దగ్గిరవున్నందువల్ల కిందనేకూచున్నాడు ధృతరాష్ట్రుడు. అతడిపక్కనే కూచున్నాడు శ్రీకృష్ణుడు. మెల్లిమెల్లిగా ధృతరాష్ట్రుణ్ణి చెయ్యి తనచేత్తో పట్టుకున్నాడు. కన్నీళ్ళు కార్చాడు. గద్గదకంఠంతో దుఃఖపడ్డాడు. పక్కనేవున్న బంగారంకలశంనీళ్ళతో మొహంకడుక్కున్నాడు. గొంతుకసవరించుకున్నాడు. మెల్లిమెల్లిగా అందుకున్నాడు.

"అయ్యో, నిష్కారణంగా కులమంతా నాశనమైపోయింది. ఇదిగో ఇంచేతే దీనికి పాండవులు ఇష్టపడలే దప్పుడు. నీకు తెలుసుకదా

ఈర్ష్యా, క్రోధమూ మానేసి సంధికోసం నన్ను ఇక్కడికి పంపారు. ఆలోచించు, ఎంత బాగుండేదో అది.

"జూదం గెలిచేవాళ్ళు లేనేలేరా? అయినా పుణ్యకాంతని జుట్టుపట్టుకు ఈడ్చుకువస్తారా? బట్టలు విప్పిస్తారా? ఏమనుకోవాలి దీన్ని? దానికే గుండెలు మండిపోతూ అడివికి పోయారు వాళ్ళు; అష్ట కష్టాలుపడ్డారు. విరాటనగరంలో బానిసలై బతికారు. కాని తిరగ బడలేదు, చూశావుకదా !

"అయిదుగురికీ అయిదువూళ్ళు ఇమ్మని బతిమిలాడారు. నేను ఎంతైనా పోరి చెప్పాను. లోభం వొదిలిపెట్టలేకపోయారు నీకొడుకులు. నువ్వూ వాళ్ళకే వెనక పాట పాడావు. విదురుడూ మొదలైన బంధువులు వెయ్యిమంది చెవిలో గూడుకట్టుకు చెప్పారు. ఒక్కడిమాటా చెవిని పెట్టావు కావు. కాలంతీరిన వాళ్ళకి మేలిబాట కనిపించదు. అదంతా అనుకుని ఏంలాభం ఇప్పుడు? దేవుడుచేతి కీలుబొమ్మలు మనుషులు

"ఇంతకీ నేను చెప్పేదల్లా వొక్కటి, పాండవులు పాపచిత్తులు కారు. మీరు న్యాయంచెయ్యలేదు. స్నేహం చూపలేదు. బాగా ఆలోచించు. అంచేత నమస్కరించి వేడుకుంటున్నాను. పాండవుల మీద కోపం పెట్టుకోకు. అదీకాక, నీకూ గాంధారికీ పరలోక క్రియలు జరపవలసినవాళ్ళు పాండవులే. మరెవ్వరూ లేరు. వాళ్ళశుభంకోరడమే నీకుక్షేమం. నీమనస్సునొప్పించానని ఎంతయినా దుఃఖపడుతున్నాడు ధర్మరాజు. నీకే తెలుస్తుంది తరవాత."

గాంధారిదిక్కు తిరిగి ఇంకా ఇలా అన్నాడు:

"నీతో సమానురాలైన మహారాణి భూలోకంమీద ఎక్కడా లేదు. రాజులందరూ వింటూవుండగా కొడుకుని తగినమాటలతో ఒత్తిచెప్పావు. అవాళనించీ నామనస్సులో నాటుకుందది. ఎప్పుడూ మెచ్చుకుంటూనే వుంటాను. చపలుడు దుర్యోధనుడు. తెలుసుకోలేక

పోయాడు. అవివేకమూ, గర్వమూ వొదులుకోలేకపోయాడు. లోక విరుద్ధంగా ప్రవర్తించాడు. నీమాట తోసెయ్యకండా అవాళే అతడు తలవూపివుంటే ఎంతబాగుండేది? ఏదో కొంతభూమి ఇచ్చేసివుంటే ఇంత వుట్టేదికాదు.

"కీడు పుడుతుందని చెప్పావు. నువ్వు చెప్పినంతా అయింది పాండవుల తప్పులేదని తెలుసునీకు. అంచేత వాళ్ళమీద కోపంపెట్టు కోకు. నువ్వే కళ్ళెర్రచేస్తే మూడులోకాలూ బుగ్గిబుగ్గిఅయిపోతాయి. అలాంటి తపఃప్రభావం నీది. నిన్ను ప్రార్థిస్తున్నాను."

"నువ్వు అన్నదంతా నిజమే నాయనా" అంది గాంధారి — "కడుపు తరుక్కుపోతోంది. దేవుడిలా వచ్చావు. నీమాటలవల్ల కొంత కుదుటపడుతోందిమనస్సు. అంధుడు, దీనుడు, శతవృద్ధు ఈమహారాజు. ఈయనకి ఎవరున్నారు మరి? నువ్వూ పాండవులూఆదుకోవాలి ఇక."

చీరకొంగు మొహానికి అదుముకుని ఏడ్చిందామె.

ఎన్నోవిధాల చెప్పి వోదార్చాడు శ్రీకృష్ణుడు. ధృతరాష్ట్రుణ్ణీ ఎంతో సముదాయించాడు.

ఇంతలోఅశ్వత్థామవూనిక హృదయంలో మెరుపులా మెరిసింది కృష్ణుడికి. దిగ్గున లేచాడు. వ్యాసమునికి పాదాభివందనంచేశాడు. ధృతరాష్ట్రుడికి నమస్కరించి అన్నాడు:

"పాండవులమీద పగపట్టి పాంలాగ వున్నాడు అశ్వత్థామ. ఈరాత్రి తప్పకండా కాటు వేస్తాడు, నేనుచప్పునవెళ్ళాలి, విచారించకు. వెళ్ళివస్తాను" అన్నాడు.

"అయితే ఆలస్యంచెయ్యకుబాబూ, దబాల్నవెళ్ళు" అన్నారు గాంధారీ ధృతరాష్ట్రులు — "ఎలాఅయినా పాండవుల్ని కాపాడు అదే కీర్తి నీకు. నిన్నే ఆశ్రయించారు వాళ్ళు. వాళ్ళ భారమంతా నీదే. వెళ్ళు. మళ్ళా కలుసుకుందాం."

కృష్ణుడు వెళ్ళిపోయాడు.

"మిమ్మల్ని వోదారుస్తూ శ్రీకృష్ణుడు చెప్పినమాటలు మీరు ఆదరించదగినవి" అంటూ ఎన్నో అన్ని చెప్పి వోదార్చి, అంతర్థానమయాడు వ్యాసముని.

శ్రీకృష్ణుడు కార్యంనెగ్గించుకుని, రథమెక్కి, లిప్తలమీద వేగంగా ఓఘవతి వొడ్డుకి వచ్చేశాడు. పాండవుల్ని కలుసుకున్నాడు. ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ తానుచూసిరావడమూ, వాళ్ళకి దుర్యోధనుడు తెగిపోయాడని పూర్తిగా చెప్పకుండా నిష్ఠూరాలాడుతూ, ధృతరాష్ట్రుడి ఉపేక్షా, అతడికొడుకుల దుర్ణయాలూ కౌరవకులనాశనానికి కారణమని చెప్పి, ఆసందున పాండవులవల్ల పాపంలేదని చెప్పడమూ. వాళ్ళు పాండవుల్ని కోపించకుండా ప్రార్థించడమూ, ఉపచారం మాటలమధ్య ఆముసిలిదంపతులికి పాండవులే నిస్తారకులని సూచించడమూ, విశేషించి గాంధారితో తగినమాటలు చెప్పి ఉపశాంతి కలిగించడమూ, వాళ్ళు అదంతా, ఆపత్సమయంలో తాను పలకరించడానికి వచ్చినట్టే కాని మరోలాగ అనుకోకపోడమూ, గాంధారి తనకి ముసిలిరాజుని అప్పగించడమూ అన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు. తాను వచ్చేశాక వ్యాసుడుకూడా తనమాటలుసమర్థించి వుంటాడనీ చెప్పాడు.

ఓఘవతీ తీరానికి పాండవులు వెళ్ళారని సంజయుడు చెప్పాక దుఃఖంతో కుంగిపోయాడు ధృతరాష్ట్రుడు. "తొడలువిరిగి నేలపడి వున్న రాజరాజుని భీముడు తలమీద తన్ని, పాండవులువెళ్ళిపోయాక ఏమయాడతడు?" అనిఅడిగాడు.

సంజయుడు: నేను పొదలో వుండి ధర్మరాజుయుద్ధానికి మరతు పెట్టాక, నీకొడుకు యుద్ధభూమికి నడిచినప్పుడు పైకివచ్చాను. పాండవులసైనికులతో కలిసి నేనూ రణభూమికి వెళ్ళాను. దుర్యోధనుడికంట

పడకండా గదాయుద్ధం చూశాను. పాండవులు వెళ్ళిపోయాక, గోలు గోలుమంటూ దుర్యోధనుడిదగ్గిరికి వెళ్ళాను.

## తొడలు విరిగిన దుర్యోధనుడు

ధూళితోనిండిన మొహంమీద చెదిరిపడిన జుత్తు ఎగదోసి కొంటూ నామొహంచూశాడు మహారాజు. ధర్మరాజుని నిందిస్తూ, పెదవులు కరుచుకున్నాడు. గుడ్లనిళ్ళుతిప్పుకున్నాడు. నిట్టూర్చాడు.

"సంజయా!" గద్గదకంఠంతో అన్నాడు మహారాజు — "నేల నాలుగుచెరగులూ ఏలాను. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ— వీళ్ళమీద కార్యభారం నిలిపాను. అలాంటివాణ్ణి తుదకి ఇలా అయి పోయాను. కాలంతప్పించుకోడం ఎవరికీతరంకాదు. పదకొండు అక్షౌ ణీల సేన కొలిచింది నన్ను. రాజులు యావన్మందీ నేను ఏదిచెప్తేఅది చేశారు. ఆదివ్యవైభవం చూశావు. ఆకళ్ళతోనే ఈదురవస్థాచూస్తు న్నావు. గదాయుద్ధంలో ధర్మంవొదిలేశాడు భీముడు. నింద నెత్తిని వేసుకున్నాడు. ఈపాడుపని చేశాడు. మిగిలిన మనవాళ్ళందరితోనూ ఇది చెప్పు.

"భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, భూరిశ్రవుణ్ణీ, కర్ణుణ్ణీ రణధర్మం పాటించ కండా చంపినదానికీ, నన్ను ఇలా చేసినదానికీ లోకులు పాండవుల్ని వదదిట్టకపోరు. గెలుపుకాని గెలుపు వాళ్ళది; ఏమంత గొప్ప? మగ తనంకల మగాడెవడైనా భీముడిలాగ దొంగదెబ్బకొట్టి సంతోషిస్తాడా కీర్తికోరి? మరొకమాట విన్నావా, భీముడు చేసిన పని? తొడలువిరిగి నేను పడుంటే, వచ్చి నాతలమీద తన్నాడు. విజృంభించిన శత్రువుని పరాభవిస్తారు, కాని పడిపోయినవాణ్ణి పరాభవిస్తేలోకంనవ్విపోదూ? నొచ్చుకోదూ? మనరాజూ, రాణులూ యుద్ధధర్మం నిరూపిస్తారు. సంజయా, భీముడుచేసిన పని వివరించి వినిపించు.

"బంధువుల్నీ, స్నేహితుల్నీ కాపాడాను. అడిగినవాళ్ళకి చేతికి ఎముకలేకండా ఇచ్చాను. బ్రాహ్మల్ని పోషించాను. పేరూ, పెంపూ దిక్కువిదిక్కులా పాకినట్టు యజ్ఞాలు చేశాను. ఎవ్వరూచేయనిదానాలు చేశాను. సర్వసంపదలతోనూ తులతూగాను. దేవేంద్రభోగా లనుభవించాను. సాటిలేనిభుజపరాక్రమంతో ప్రకాశించాను. పగవాళ్ళని ఆశ్రయించకండా బతికాను. మగతనమూ, భుజబలాభిమానమూ భళీ అన్నట్టు వెలిగించాను. చచ్చిందాకా నిత్యకల్యాణం పచ్చతోరణంగా గడిపాను. శమంతపంచకందగ్గిరధర్మయుద్ధంచేశాను. ఉత్తమలోకానికి పోతాను. ఇంక కావలిసింది ఏముంది, నాకు ?

"శత్రువు యుద్ధం చెయ్యలేకపోయాడు. నిద్దరలో చంపినట్టు, విషంపెట్టినట్టు, కొంపకి అగ్గిపెట్టినట్టు – ఇంతచేసి రాజ్యం నెత్తినికట్టుకోనీ పాండవులు.

"పాపకర్ములు పాండవులు యుద్ధధర్మం వొదిలేసి, గెలుపు సాధించినమాట మనఅశ్వత్థామకీ, కృతవర్మకీ, కృపాచార్యులికీ తెలియచెయ్యి, స్పష్టంగా. దేవతల్లాటి భీష్మణ్ణీ, ద్రోణుణ్ణి, కర్ణుణ్ణీఅధర్మంగా పడగొట్టినవిషయమున్నూజ్ఞాపకంచెయ్యి. గోముఖవ్యాఘ్రాలు పాండవులు. కపటధర్మకవచం వేసుకున్నారేకానినిజమైనధర్మపరులుకారు. గుండెకాయతీసి చేతిలోపెట్టినా నమ్మకూడదు వాళ్ళని. ఇది నామాటగా మనవాళ్ళతో చెప్పు" అన్నాడు.

దగ్గిరపల్లెలవాళ్ళు చూడడానికి వచ్చారు. వాళ్ళందరినీ కలయచూశాడు మహారాజు భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన బంధువుల పేళ్లూ, స్నేహితులపేళ్లూ, లక్ష్మణుడూ మొదలైన కుమాళ్ళపేళ్ళూ వాళ్ళతో చెప్పి, వాళ్ళుముందే కాలంచెయ్యడం వివరించాడు. వాళ్ళు వెళ్ళిన పుణ్యలోకానికే తానువెళతానన్నాడు. తనరాణులూ, చెల్లెలు దుస్సలా తాను గతించినందుకు గుండెలు బాదుకుంటారంటూ పనిఛి

వనివి చెప్పాడు. విని, కన్నీళ్ళు కారుస్తూ, దుఃఖపడుతూ వెళ్ళిపోయారు ప్రజలు.

అశ్వత్థామా వాళ్ళూ వున్నచోటు తెలిసి, కొందరు పరిగెత్తారు. రాజరాజు వైనం తెలియచేశారు. వినీవినడంతోనే పరిగెత్తుకు వచ్చి, రథాలు దిగారు వాళ్ళు.

## అశ్వత్థామకి సేనాధిపత్యం

పెద్దగాలికి కూలిపోయిన గొప్ప మద్దిచెట్టులాగ, కిరాతుడి బాణం తగిలి పడిపోయిన అడివిఏనుగులాగ, ప్రళయాగ్నికి ఆరిపోయిన మహాసముద్రంలాగ, కాలవైపరీత్యంవల్ల కిందపడిన పూర్ణచంద్రుడిలాగ బాధతో నేలమీద పడుండిన్నీ అందం చెడకండా వున్న రాజరాజునిచూసి అశ్వత్థామావాళ్ళ గుండెలు తరుక్కుపోయాయి. తొట్రుపడుతూ, తూలిపోతూ, వెళ్ళి ముగ్గురూ అతడిచుట్టూ కూచున్నారు.

"మహారాజా," బావురుమన్నాడు అశ్వత్థామ — "ఎప్పుడూ ఎంతోమంది రాజులు కొలుస్తూండే నువ్వు వొక్కడివే పడున్నావు! మహోన్నతమైన రత్నపీఠంమీద కూచునేనిన్ను నేలమీద తెగిపోయినట్టు చేశాడు మాయబ్రహ్మ! నీసైన్యాలు ఎక్కడికి పోయాయి? సేనాధిపతులు ఏమయారు? నీచుట్టూవున్న గొడుగులు ఏవీ? వింజామరలు పట్టరేం నీకు? మొహంనిండా ధూళి అలుముకుందేం? జలకమాడవేం ?

"భీష్ముడూ, ద్రోణుడూ, నీకు కళ్ళవెలుగుగా వుండేవాళ్ళు. కర్ణుడూ, వికర్ణుడూ, దుశ్శాసనుడూ అరనిమిషం నిన్ను వొదిలేవాళ్ళు కారు. అయ్యో, ఎంతనీతిమాలినవాళ్ళు మహారాజా వాళ్ళు! ఒక్కమారైనా ఇక్కడికి రారేం? నీఅంతవాణ్ణి వొదిలిపోయింది సిరి. ఇంక

ఎవ్వడిదగ్గిర స్థిరంగావుంటుంది? ఎంతవాళ్ళని ఎంత చెయ్యాదు? విధిని ఏంచేసేది నేను!"

ఏడవడం మొదలుపెట్టా డతడు.

"మనిషికి మరణం బ్రహ్మ రాసిపెట్టిందే" రెండుచేతులతోనూ కన్నీళ్ళు తుడుచుకుంటూ, గద్గదం పోతున్న గొంతుకనవరించుకుంటూ అన్నాడు దుర్యోధనుడు — "సుఖమూ, దుఃఖమూ కాలక్రమాన వస్తూవుంటాయి. ఇది తెలుసుకోవాలి."

ముగ్గురినీ చూసి ఇంకా ఇలా అన్నాడు:

"ఎన్ని ఆపదలు వచ్చినా ఉత్సాహం వొదలకండా యుద్ధం చేసి శత్రువుల్ని చంపిన బంధులూ, స్నేహితులూ, తమ్ముళ్లూ, కుమారుళ్ళూ సైన్యాలతోసహా వెళ్ళిపోయారు. ఒక్కణ్ణే వుండడం ఏమంత బాగుంటుంది? సాధైర్యమూ, బాహుప్రతాపమూ తలమున్కలైంది పాండవులికి. ధర్మయుద్ధం చెయ్యలేకపోయారు. దొంగదెబ్బ కొట్టేశారు. నేను ధర్మయుద్ధంచేశాను. సద్గతి కలుగుతుంది. మేలే అయింది నాకు.

"కృష్ణుడుమహానుభావుడని, తెలిసి తెలిసీ, మీఆసరాచూసుకుని యుద్ధానికి పూనుకున్నాను. జయిస్తానని మీరూ మీబలశౌర్యాలు కించిత్తయినా దాచుకోకండా చెప్పుకోదగినట్టు యుద్ధంచేశారు. కథ అడ్డంతిరిగింది. ఏంచేస్తాం? విచారించకండి" అన్నాడు. నేను పొదలో పొంచివుండినప్పటినించీ మొదలుపెట్టి, భీముడు తనతలమీద తన్నినంతవరకూ జరిగిందంతా వాళ్ళతో పూసగుచ్చినట్టు చెప్పాడు.

విని ప్రళయరుద్రుడైపోయాడు అశ్వత్థామ. "పాండవు డన్న పురుగు వొక్కటీ దక్కకండా పాతేస్తాను" పెదవులు కరుస్తూ పిడుగులు పురిమాడు — "అవాళ మాతండ్రిని చంపినప్పుడూ ఇంతతరుక్కుపోలేదు నాగుండె. ఇదిగో ఇప్పుడే వెళతాను. నామహాస్త్రాలతో అంత

మందినీ భస్మంచేసేస్తాను. నిజంచెప్తున్నాను మహారాజా, పాంచాలం వాళ్ళతోసహా పాండవుల బంధుమిత్రులు యావన్మందినీ కృష్ణుడి కళ్ళ ముందే కాల్చేస్తాను. ఆజ్ఞాపించు" అన్నాడు

సంతోషించాడు దుర్యోధనుడు. కృపాచార్యుణ్ణి చూశాడు. "ఒకకలశంతో నీళ్ళు ముంచుకురా" అన్నాడు. తమని చూడవచ్చిన సమీపంలోని ఆశ్రమాల మునికుమార్ళని అడిగి ఒకకలశం తెప్పించాడు కృపాచార్యుడు. దాంతో నిండా నీళ్ళుపట్టుకువచ్చాడు.

"అశ్వత్థామని అభిషేకించు" అన్నాడు దుర్యోధనుడు — "ఇతడికి సర్వసేనాధిపత్యం ఇస్తున్నాను. రాజుఅనుమతిమీద బ్రాహ్మడు యుద్ధంచెయ్యడం జగమెరిగినధర్మం. కనకనే ఇది అవసరం" అన్నాడు.

సంతోషించాడు కృపాచార్యుడు. అశ్వత్థామని సేనాధిపతిగా అభిషేకించాడు.

మహానందంతో దుర్యోధనుణ్ణి గుచ్చి కౌగిలించుకున్నాడు అశ్వత్థామ. బ్రహ్మాండమైన సింహనాదంచేశాడు. దృఢప్రతిజ్ఞతో అక్కణ్ణుంచి బయలుదేరాడు. కృతవర్మా, కృపాచార్యుడూ అతడి రెండువక్కలా నడిచారు.

శత్రునాశనంచేసి మహానందంతో పాండవుల కుమార్ళూ బంధువులూ వాళ్ళూ తుళ్ళుతూ, కేరుతూ వున్న పాండవశిబిరంవేపు మూడు రథాలూ పరిగెత్తాయి.



# సౌప్తికపర్వం

## ఒకటో ఆశ్వాసం

ధృతరాష్ట్రుడు : అసహాయశూరుడు అశ్వత్థామ. అతడికి సహాయం కృపాచార్యుడూ, కృతవర్మా—బాగుంది. ముగ్గురూ ముందుకొచ్చి ఏంచేశారు ?

సంజయుడు : పాండవశిబిరానికి దగ్గరగా ముగ్గురూ వెళ్ళారు; ఆలకించారు. పడుతూ లేస్తూ వుంది పాండవశిబిరం గెలిచిన ఆనందంతో దండుదండంతా అదేగోలగా వుంది. అంతమందీ సంతోషంతో కేకలువేస్తున్నారు. నవ్వుతున్నారు. మహా ఇదిగావున్నారు. అదంతా ఆలకించారు వాళ్ళు. అక్కడికి వెళ్ళడానికి జంకేశారు. తమని వెదకడానికే ఆసేనలు బయలుదేరుతూ అలా సందడిచేస్తున్నాయని భావించారు. భయపడ్డారు. వెళ్ళడం మానేశారు. ఎక్కడో తప్పుకుని వొరిగివుండి ఏంచెయ్యాలో ఆలోచిద్దామనుకున్నారు. ముగ్గురూ వెనక్కిమళ్ళారు. తూర్పుగా కొంతదూరం వెళ్ళారు

ధృతరాష్ట్రుడు : సంజయా, ఇలాటిచావా రాజరాజుకి, భీముడిచేత! బలమూ, శౌర్యమూ కలవాడనీ, అతణ్ణి ఎవ్వరూ గెలవలేరనీ నమ్మాను. వందమందికొడుకులచావు విని పగిలిపోకండావుంది నాగుండె, రాతితో చేసిందో ఏమో! పాండవుల పాదసేవకుణ్ణాయి పడివుండలేను. ఎక్కడికైనా పోతాను. అంతటి రాజరాజుతండ్రినై, దేవేంద్ర వైభవంతో బతికిన నేను భీముడు పుల్లవిరుపు మాటలాడుతూ వుంటే వింటూ బానిసబతుకు భరించలేను,

అశ్వత్థామా వాళ్ళూ ఏంచేశారు తరవాత ?

సంజయుడు : అలా తిరిగివచ్చి అడివిలో ప్రవేశించారు వాళ్లు అక్కడ వోక మడుగుదగ్గిర రథాలు ఆపారు. నీళ్లుపట్టడానికి సారథులు గుర్రాలు విప్పారు. మనవాళ్లు ముగ్గురూ రథాలుదిగారు. మడుగులోకి వెళ్ళి నీళ్లుతాగారు. పాండవశిబిరంలోంచి కోలాహాలం వినిపిస్తూనే వుంది వాళ్ళకి

సూర్యుడు పడమటికొండవెనక వాలిపోయాడు. ముగ్గురూ సాయంకాలప్పనులు పూర్తిచేసుకున్నారు. తరవాత వోకమర్రిచెట్టు కింద చదికిలబడ్డారు. వాళ్ళమొహాలలాగే పద్మాలు ముడుచుకు పోయాయి. వాళ్ళ దుఃఖంలాగే చీకట్లు కమ్ముకున్నాయి వాళ్ళ ఆలోచనలలాగే భూతభేతాళాలు సంచారం మొదలెట్టాయి. "అశ్వత్థామ ఎలాగూ యుద్ధంచేస్తాడు, చూద్దాం అని వచ్చారియా అన్నట్టు ఆకాశంనిండా అవుపించాయి చుక్కలు.

రాత్రి ముంచుకొచ్చింది. పగటిజంతువులన్నీ విశ్రాంతికోసం మాటుమణిగాయి. రాత్రిజంతువులు సంచారం మొదలెట్టాయి.

అశ్వత్థామా, కృతవర్మా, కృపాచార్యుడూ నిష్కారణంగా కౌరవకులంనాశనమైపోయిందంటూ బాధపడుతూన్న హృదయాలతో యుద్ధంవిషయం మాట్లాడుకుంటూ కూచున్నారు. బాగాఅలసిపోయి వున్నారామో, అంచేత కొంచేపటికి నేలమీదే శరీరాలువాల్చారు. మరి కొంచేపటికి కృతవర్మా, కృపాచార్యుడూ నిద్రపోయారు. క్రోధంతో మండిపోతున్నాడు కనక అశ్వత్థామకి నిద్రరాలేదు.

జాబుగావుంది మర్రిచెట్టు. చూస్తూ ఆలోచిస్తున్నాడు అశ్వత్థామ. దాని కొమ్మల్లో రకరకాలకాకులు వొళ్లు మరిచి నిద్రపోతున్నాయి.

# పులుగుపిట్ట

ఇంతలో మిణుగురుల్లా మెరుస్తున్న మిడిగుడ్లతో వాకపూలుగ, పిట్ట వచ్చింది. కావిరంగుతో మెరుస్తున్నాయి రెక్కలు. పెక్షచప్పుడు చేస్తూ వేళ్ళతో లేచివచ్చిన కొండలా వచ్చిందది. ఉగ్రమైన మొహం ఇటూ అటూ తిప్పుతూ మాంసంకోసం వెదుక్కుంటూ వచ్చింది. అక్కడి బయలంతా తానే అయిపోయి, ఘోరంగా అరుచుకుంటూ వచ్చింది. ప్రచండమైనవేగంతో వచ్చింది. ప్రాణులన్నీ ప్రాణ భయంతో గడగడలాడిపోయాయి.

వచ్చి మర్రిచెట్టుమీద వాలిం దది. కాకుల్ని చూసింది. శరీరం కుంచించింది. జాగ్రత్తగా లోపలచొరబడింది కాకుల్ని ఆక్ర మించింది. కొన్నిటి పీకలు నులిపేసింది. కొన్నిటికాళ్ళు తుంచేసింది. కొన్నిటిరెక్కలు తెంచేసింది. కొన్నిటిపొట్టలు చీల్చేసింది. కొన్నిటిని అదిమిపట్టుకుంది. వెన్నెముకలు విరిచేసింది. క్షణాలమీద కాకులన్ని టినీ చంపేసింది పులుగుపిట్ట. నిద్రలోవున్న కాకుల్ని అలా చిత్రవధ చేసేసి, శత్రువుల్ని మట్టుపెట్టించి హతవార్చిన మహావీరుడిలాగకులికింది.

అంతా చూశాడు అశ్వత్థామ. "అదిగదీ" అంటూ జల్దు కున్నాడు. "ఇదే నేనున్నూ చెయ్యవలిసిన పని" అనుకుంటూ సంతోషించాడు. "ఈపిట్ట నాకు ఉపదేశం చేసింది. ఇంతవరకూ తోచలేదిది. శత్రువులు నిద్రపోయాక వెళతాను. విరుచుకుపడతాను. 'బంధువులూ, కుమాళ్ళు యావన్మందితోనూ పాండవుల్ని చంపేస్తాను' అని దుర్యోధనమహారాజుతో అన్నాను. బలవంతులు వాళ్ళు. ముఖా ముఖవెళ్ళి మీదపడడం బుద్ధిమంతుల లక్షణంకాదు. జంకూ కొంకూ లేకండా వెళ్ళి వాళ్ళమీద వురకడమంటే అగ్గిలో మిడతవురకడమే అవుతుంది.

"ఇవాళకాక, పాండవుల్ని రేపుచంపినా లాభంలేదు. దుర్యోధనుడు అందాకా వుండడు, చచ్చిపోతాడు. అతడే పోయాక ఆవని మెచ్చేవాడెవడు? ధర్మయుద్ధంలో ఆమహావీరుల్ని గెలవడం గగన మైనమాట. ఇలా వూగులాడుతూవున్న మనస్సుతో విచారంగావున్న నాకు ఈపులుగుపిట్ట చేసినపని కళ్ళపడింది. శత్రువుని చంపవలిసివచ్చి నప్పుడు అన్యాయం అట్టేపెట్టి, దొరికిన ఉపాయంతో పనిచెయ్యడం శాస్త్రసిద్ధమైన విషయం. 'ఎత్తివచ్చినప్పుడూ, విడిసినప్పుడూ, ఇర కాటంలో పడినప్పుడూ, వల్లమాలి తిరగబడినప్పుడూ నిద్రపోయి నప్పుడూ శత్రులమీద పడి చంపాలి' అని నీతివాక్యాలు వింటున్నాను. క్షత్రియధర్మం అవలంబించినవాడి కర్తవ్యాలే ఇవి. అదీకాక, పాండవులు మాత్రం ధర్మంగానే యుద్ధంచేశారుగనకనా? తాత అయిన భీష్ముణ్ణీ, గురువైన నాతండ్రినీ అన్యాయంగానే పడగొట్టారు. కర్ణుణ్ణీ, ఇప్పుడిప్పుడు రారాజునీ ఎలా పడగొట్టారు? కనక పాపిష్టిఉపాయాలు అవలంబించిన పాండవుల్ని నిద్రపోయినప్పుడు చంపడం తగినపనే, తప్పుకాదు."

ఈఘోరానికి నిశ్చయించుకోడమే తడువు, తన మామనీ కృతవర్మనీ లేపాడు అశ్వత్థామ. ఇలాంటిసమయంలోనూ నిద్ర పోతున్నామే అని సిగ్గుపడుతూ లేచారు వాళ్ళు.

## అశ్వత్థామ ఆలోచన

"మనం ముగ్గురమూ యుద్ధానికి పెడమొహంపెట్టి వచ్చేశాం" ఎత్తుకున్నాడు అశ్వత్థామ – "ఒక్కణ్ణిచేసి రాజరాజుని అవమానం చేశారు పాండవులు, తమవాళ్లతో కలిసి. పదకొండు అక్షోణీల మహా రాజు అలా వొక్కడూ పోరాడుతూ ధర్మంతప్పలేదు. అధర్మయుద్ధం చేసి, దొంగదెబ్బకొట్టేశాడు పాపాత్ముడు భీముడు. అంతతో వూరుకో

లేదు. కౌరవసామ్రాజ్యానికి అభిషిక్తమైన అతని శిరస్సు కాలితో తన్నాడు. తొడలువిరిగి ప్రాణాంతకమైన వేదనకంటె ఈ పరాభవం బాధించింది మహారాజుని.

"సమర్థులైన అంతమంది మహావీరులు అన్నిదినాలు ఆ మహారాజుకోసం ప్రాణాలొడ్డి పోరాడారు. ఏవిధంగానూ గెలుపు సాధించలేకపోయారు. ఏమనాలి? ఎవరు ఏంచేస్తే ఏంలాభం, దైవం మరోలా తలచినప్పుడు! అంతకాలం రాజరత్నంగా తుదకి ఇలా అయిపోయిందన్నమాట! ఇదంతా మీకు బాధగా లేదూ? చెప్పండి, ఈ ఆపదసమయంలో ఏమిటి కర్తవ్యం?"

"నువ్వు చెప్పవలసిందంతా చెప్పావు కదా," అంటున్నాడు కృపాచార్యుడు - "మమ్మల్ని అడిగావు కనక చెబుతాను విను, ప్రతి ప్రయత్నానికీ పౌరుషమూ, దైవమూ రెండూ సాధనాలు. వీటిలో ఏది తక్కువైనా కార్యం ఫలించదు. ఎలాఅంటావా? ఊరికే వర్షం కురిసినంతమాత్రాన ధాన్యం పండుతాయా పొలం దున్నకుండా? అలా అని ఊరికే దున్నినంతమాత్రం పంట పండుతుందా, వాన పడకండా? బాగా దున్నడమూ, వానలు కురవడమూ రెండూ కావాలి మరి. అలాగే ప్రయత్నమూ, దైవసహాయమూ రెండూ కావాలి అదీకాక, పూనుకున్న పని తగినదై వుండాలి ధర్మం తెలిసిన హితులకి నచ్చినట్టున్నూ నడపాలది. అప్పుడూ దైవసహాయంతో అది అడ్డు లేకండా నెరవేరుతుంది. ధర్మంతప్పకండా పనిచేస్తేనే ఫలం సిద్ధిస్తుంది, అలా కానప్పుడు అంతా తల్లకిందవుతుంది. నింద నెత్తికెక్కుతుంది. నీతి వొదిలేసి, ఆగ్రహంతో తొందరపడి చేసినపని సిద్ధించినా, దాని వల్ల భీతీ, జుగుప్సా కలుగుతాయి. లోకం దుయ్యపడుతుంది. ఇక, సిద్ధించకపోయిందా ఎన్నయినా ఆపదలు వచ్చిపడతాయి, ఘోరంగా. మంచివాళ్ళమాటలు వినకండా క్రోధంతోనూ, లోభంతోనూ

భయంతోనూ చెడ్డపనులుచేసే దుర్జనుడు ఆపదలపాలుకాక పోడు తుదకి. సంపదలుపోయి మనోవ్యధకి గురికాకపోడు.

"దుర్యోధనుడు వివేకంలేనివాడు. క్రోధమూ, లోభమూ పెట్టుకున్నాడు. హితులు ఎంతపోరినా దురభిమానంతో పెడచెవిని పెట్టాడు. పాండవుల్ని పరాభవించాడు. నిందలపాలయాడు. చెడ్డదారి తొక్కినవాడికి చెడ్డ తప్పుతుందా మరి!

"ఇప్పుడు ఏమిటి కర్తవ్యం? అని అడుగుతున్నావు. దుర్యోధనుడుతొక్కినదారే తొక్కితే కీడు తప్పదు. తుదకి దుఃఖంమాత్రం మిగులుతుంది. అదీకాక, ఇప్పుడు మనం కర్తవ్యం ఎలా నిర్ణయిస్తాం? న్యాయమైనమాట చెపుతాను విను. మనంముగ్గురం ధృతరాష్ట్రుడిదగ్గరికి వెళదాం. కార్యసూత్రం అతడివల్ల వినాలి. అతడు ఏంచెపితే అదే మన కర్తవ్యం. తానూ, గాంధారీ ఆలోచించి ఏంచెపితే అది కాదన కండా చేద్దాం. అదే మనకి పేరుతెస్తుంది. వాళ్ళదగ్గిర విదురుడూ వుంటాడు. వాళ్ళు ముగ్గురూ ఆలోచించి చెప్పిందానికి ఆక్షేపణ వుండదు. అలాకాకండా ఏంచేసినా, దైవం తోడ్పడదు. కార్యం సిద్ధించదు. తొందరపడవద్దు. ఆలోచించిచేద్దాం, ఏంచేసినా" అన్నాడు.

"ప్రతీవాడూ ఆలోచిస్తాడు" దుఃఖం దహించుకుపోతూన్న హృదయంతో మళ్ళా ఎత్తుకున్నాడు అశ్వత్థామ — "ఇదిమంచీ, ఇది చెడ్డా అని ప్రతీవాడూ తనకి తెలిసినట్టు తనవని చూసుకుంటాడు. ఇతరులు చెప్పినవి పట్టించుకోడు. తనబుద్ధే మంచిదనుకుంటాడు. ఇతర్ల చిత్తవృత్తులు నిందిస్తాడు. రకరకాలుపోయే మనస్సుని కనిపెట్ట లేను. బాల్యంలో అనుకున్నది యౌవ్వనంలో మార్చుకూంటాడు. ముసిలి తనం వొచ్చాక అదీమార్చుకుంటాడు; ఇంకోలా అనుకుంటాడు. ఆపద వచ్చినప్పుడు మరోలా ప్రవర్తిస్తాడు. సంపదలువచ్చినప్పుడు ఇంకోలా

నడుచుకుంటాడు. మంచిదని మరణానికి తెగించి వినప్పుడు ఎవ్వరు చెప్పినా వినుకోడు. తనదారే తగుననుకుంటాడు. ఇంతులో మీకు తెలియంది లేదు. మనఅందరిదుఃఖమూ దూరంచేసేపద్ధతి, నాకు తోచింది చెప్తాను, వినండి.

"బ్రహ్మ ప్రజల్ని సృష్టించినప్పుడు బ్రాహ్మడికి ఇంద్రియ నిగ్రహమూ, క్షత్రియుడికి ప్రతాపమూ, వైశ్యుడికి దక్షత్వమూ, శూద్రుడికి ఈమూడుజాతులికీ అనుకూలంగా వుండడమూ విధించి పెట్టాడు. కనక శాంతుడుకాని బ్రాహ్మడూ, ప్రతాపంలేని క్షత్రియుడూ, దక్షుడుకాని కోమటీ, వీళ్లకి అనుకూలుడుకాని శూద్రుడూ నిందలపాలవుతారు. అది అలా వుండనివ్వండి. నేను బ్రాహ్మణ కులంలో — అందులోనూ జనం పూజించే వంశంలోపుట్టాను. దుర దృష్టంవల్ల క్షత్రియధర్మం అనుసరించాను మధ్యని ఇది వొదిలేసి, బ్రాహ్మణధర్మం అనుసరించడం మంచిదనిపించలేదు నాకు.

"అదీకాక, బ్రహ్మాండమైన ధనుస్సూ, దివ్యాస్త్రాలూపట్టుకుని ప్రకాశిస్తున్నాను. తండ్రిని యుద్ధంలో వొకడుచంపేశాడు. శిగకి పువ్వులుచుట్టుకుని వాడు తిరుగుతూవుంటే తలెత్తి ఎలాతిరిగేది నేను? ఈబాధ భరించలేను. వాణ్ణీ, వాడితో తక్కిన శత్రువుల్నీ చంపేస్తాను. దానికి మంచిఉపాయం ఆలోచించాను. శత్రువులు అంతమైపోయారని ఆదమరిచి నిద్రపోతుంటారు వాళ్ళు. ఆయుధాలమీదా, వాహనాల మీదా, ఆదర ముండ దిప్పుకు. ఓడిపోయి, ఆయానంతోమనంఎచ్చట్లో, ఏపుట్లో చేరి వొదిగివుంటామనుకుంటారు. ఇదిగో ఇదే సమయం. ఏమరిపాటున వాళ్ళమీదవెళ్ళి పడతాను. బాణాలికి ఎంతోమందిని బలివేస్తాను. పరిఘతో కొంతమందిని బాదేస్తాను. కత్తితో కొందరి పీకలు కోసేస్తాను. సరసరా రక్తాలు పారిస్తాను. గెలుపుకైపుతో శవాల్లా నిద్రపోతున్న ఆమొనగాళ్లని చంపేస్తాను. పీనుగు పెంటలు

చేసేస్తాను. భూతాలు గెంతిస్తాను. ఏనుగుల కళేబరాలూ, గుర్రాల మొండాలూ, సైనికుల శవాలూ, రథాల ముక్కలూ చెక్కలూ – ఆమధ్య ద్రుపదుడి కొడుకుల పీనుగులు పడివుంటే, కళ్ళారా చూస్తేనే కాని ఈపరాభవతాపం చల్లారదు.

"ధృష్టద్యుమ్నుడిమీద విరుచుకుపడతాను; పశువునిచంపినట్టు చంపుతాను; ఉత్కృష్టమైన అస్త్రంతో చంపను. ఇదే నాకు నచ్చిన కోరిక. ఇలాగే పాండవుల్ని పశువుల్లాగ నరుకుతాను. ప్రళయరుద్రుడిలాగ వాళ్ల శిబిరంలో చొరబడతాను. శత్రువుల్ని అందరినీ అంతంచేస్తాను. తండ్రికుణం తీర్చుకుంటాను. పాండవులకొడుకుల్ని చంపేస్తాను. కృతార్థుణ్ణవుతాను. అక్కడికి కాని నాకడుపుడుకు చల్లబడదు."

"బాగుంది" అందుకున్నాడు కృపాచార్యుడు – "దెబ్బతీసిన వాళ్ళని తిరిగీ దెబ్బతియ్యడానికి పూనుకోడం గొప్పసంగతి. దైవయోగంవల్ల నీమనస్సులో ఈపూనిక పుట్టింది. సమ్మతమే మాకు. దీనికి నీతో చేతులుకలపవలిసినవాళ్ళమే మేము అయితే బాగా అలసిపోయున్నావు నువ్వు. నిద్రలేదు. అంచేత తొందరపడతా వెందుకు? కొంచెం ఆయాసంతీర్చుకో. నిద్రపో. తెల్లవారాక కొత్త శక్తితో బైల్దేరు. మేమూ నీతో వస్తాం. ఇస్టే శత్రువుల్ని గెలుస్తావు.

"దివ్యాస్త్రాలు తెలిసిన అశ్వత్థామ బయలుదేరితే, కృతవర్మా, కృపుడూ వెంటవుంటే మానవయోధులే కాదు, దేవతలుకూడా తేరి చూడలేరు. కృతవర్మ సామాన్యుడా? దివ్యాస్త్రాలుకలవాడు. నాసంగతి నీకువేరే చెప్పక్కరలేదు. అపరద్రోణాచార్యుడివి నువ్వు. ఇలాంటి రథికులం మనం తెగిస్తే ఎంతైనా చేస్తాం శత్రువుల్ని. అంచేత ధనుస్సు ఎక్కుదించు. కవచం విప్పెయ్యి. నిద్రపో. నిద్ర ముంచుకువస్తూ జడులమై వున్నాం. తెల్లవారితే అందరం తేరుకుంటాం అప్పుడు వెళ్ళి

పాండవులపని పట్టేద్దాం మనం వాళ్ళని చంపడమో, వాళ్ళచేత మనం చచ్చడమో కాకండా వూరికే తిరిగి రా మనుకో."

## చంపం దే ని ద్ర పో ను

"నిద్రపోడమా మామా!" అంటున్నాడు అశ్వత్థామ — "కోపం పుట్టినవాడికీ, డబ్బుచింత పట్టుకున్నవాడికీ, గర్వంతోవున్న వాడికీ, కామవేదనపడుతున్నవాడికి నిద్ర ఎలావస్తుంది? ఎందుకూ నన్ను బాధపెడతావు? ఈనాలుగింటిలో ఏవొకటివున్నా కంటిమీద రెప్పపడదు మనిషికి. నాలుగు కాదు, నలభై బాధిస్తున్నాయి నన్ను శత్రువుని తలుచుకుంటే వొళ్ళుమండిపోతోంది. తండ్రిచావుకి గుండె తరుక్కుపోతోంది. అధర్మయుద్ధం తలుచుకుంటే తల తిరిగిపోతోంది. రారాజుని సంతోషపెట్టడానికి మనస్సు మరిగిపోతోంది. ఇంక నిద్ర పట్టడమెక్కడ చెప్పూ నాకు?

"గురుదేవుడి తలనరకడం కళ్ళారా చూడనే చూశావు నువ్వు. ఆపరాభవం అలా వుండనీ. తొడలు విరిగిపడివున్న దుర్యోధనుడు దీనంగా అన్నమాటలు చెవులారా విన్న నేను ఈరాత్రి నిద్రపోడమా? అసంభవం.

"మనం విన్నాం, అలా ప్రలాపించాడు మహారాజు. ఎవరిగుండె తరుక్కుపోదు! దుఃఖం లేకపోతే ఎవడికైనా ఏడుపు వస్తుందా? కన్నీళ్లు పుడతాయా?

"రాజేకాదు, ప్రాణస్నేహితుడు నాకు దుర్యోధనుడు. నావొంటిమీద దెబ్బపడకండా అతడు శత్రువులచేత పరాభవం పొందాడు. అది కళ్ళారా చూశాను చూసినవాళ్ళూ చెప్పారు, మహారాజుఅవస్థా, పాండవుల మండగమూ విన్నాను. గుండె చెక్కలై పోతోంది. నిద్రపడుతుందా, కళ్ళకి?

"రేపు పగలా? కృష్ణుడూ, అర్జునుడూ కంటికి రెప్పలా కాసుకొచ్చుంటారు పగలు. తేరిచూడదలేం శిబిరం. ఎలాఅయినా శత్రువుని జయించడమే పౌరుషం అంచేత ఈరాత్రే విరుచుకుపడ్డానా తలవుప్పు వాడకండా వాళ్ళని గెలుస్తాను. ఇంత నిశ్చయంతో వున్న నన్ను వొద్దంటున్నావు. రాజు మన్నన కోసం చెయ్యకతప్పదిది. నిద్రపోతున్న వాళ్ళని చతురంగబలాలతో కూడా చంపుతాను. పాండవుల్నీ పాంచాలంవాళ్ళనీ వొక్కణ్ణి దక్కనివ్వను. అదిగో అది పూర్తిచేశాక వూపిరితీస్తాను; హాయిగా నిద్రపోతాను. అందాకానిద్ర పేరుచెప్పకు."

"మనిషి కోపంతోవున్నప్పుడు తనకి తోచదు, వొకడు చెపితే వినడు" మళ్ళీ ఎత్తుకున్నాడు కృపాచార్యుడు — "ఎంత తెలిసినవాడికైనా స్నేహితులూ, బంధువులూ హెచ్చరించినప్పుడే కాని తోచదు. ఎల్లప్పుడూ ధర్మం విచారిస్తూ వుండాలి. పైగా స్నేహితులు చెప్పినట్లు నడుచుకోవాలి. అప్పుడే శుభంకలుగుతుంది. చెడుదారిని అడుగుపెట్టకండా తప్పిస్తారు స్నేహితులు. అదృష్టవంతుడైతే వాళ్ళమాట వింటాడు; తప్పుకుంటాడు. భాగ్యహీనుడైతేమాత్రం వినుకోడు; తప్పుకోడు. బుద్ధివున్నవాళ్ళకే హితులూ, తెలిసినవాళ్ళూ చెవుతారు. కార్యంచెడకండా చెవిలో గూడుకట్టి పోరాడుతారు. నామాటవిను. ఆగ్రహం వొదిలిపెట్టు. సౌమ్యంవహించు. పట్టుదల కూడదు. కోపం పాపహేతువు. క్రూరత్వం తగదు. తరవాత నువ్వే పశ్చాత్తాపపడతావు.

"నిద్రపోతున్న వాళ్ళనీ, ఆయుధాలు వొదిలిశేసిన వాళ్ళనీ, వాహనాలు లేనివాళ్ళనీ, శరణుజొచ్చినవాళ్ళనీ చంపడం ధర్మంకాదు. దండుదండంతా నిద్రపోతూవుంటుంది. నిద్రచావుతో సమానం. పీనుగులవంటివాళ్ళని చంపి, పాపం కట్టుకుని, నరకానికి వెళ్ళడం మంచిదా? మహాస్త్రాలు తెలిసిన వాళ్ళలో మేటి వనిపించుకున్నావు.

ఇంతదాకా ఎందులోనూ మచ్చపడి ఎరగవు. నీవంటివాడు ఇలాంటి దుష్కర్మ చెయ్యవచ్చా! మంచిబుద్ధికి మసితగిలినట్టవుతుంది. సూర్యుడి వంటివాడివి నువ్వు. సూర్యోదయమయాక ప్రకాశవంతమైన పరాక్రమానికి ఉపక్రమించు."

"నువ్వు చెప్పిందంతా నిజమే" మళ్ళీ ఆరంభించాడు అశ్వత్థామ— "నన్ను శాసించదగినవాడివి నువ్వు. నామంచికే చెపుతున్నావు. కాని నేను చెప్పేది విను. అంతమంది రాజులఎదుట నాతండ్రిని— అస్త్రసన్యాసంచేసినవాణ్ణి — దుష్ట ధృష్టద్యుమ్నుడు జుట్టుపట్టుకుని నరికాడు. మహాపాపమని పిసరంతా జంకాడుకాదు. శిఖండి నెపంపెట్టి భీష్ముణ్ణి పడగొట్టాడు అర్జునుడు. రథం కుంగిపోతే ఎత్తనివ్వకండా కర్ణుణ్ణి చంపాడు. భూరిశ్రవుడి చెయ్యినరికాడు, ఒంటిచెయ్యితో ప్రాయోపవేశానికి కూచున్నవాణ్ణి మొనగాడై సాత్యకి తలనరికాడు. పదిమందీ దుర్యోధనుణ్ణి చుట్టూముట్టారు. పాపకర్మ అని శంకలేకండా తొడలు విరగ్గొట్టమని భీముణ్ణి పురికొల్పారు. ఇన్నివిధాలా వాళ్ళే ముందుగా అధర్మయుద్ధంచేశారు. వాళ్ళని నిందించవు. నన్నే అడ్డుకుంటున్నావు.

"తొడలు విరిగి పడివుండి దుర్యోధనుడు నన్ను చూసి దీనంగా కొన్నిమాటలు చెప్పాడు. అవి అగ్నిహోత్రంలా వుడుకెత్తిస్తున్నాయి నన్ను. చల్లార్చుకుంటేనే కాని ఆగలేను. నాతండ్రినిచంపి కులుకుతున్న ధృష్టద్యుమ్నుణ్ణీ వాళ్ళనీ అధర్మంగానే చంపుతాను. అందువల్ల నాకు పురుగుజన్మ వచ్చినా మేలే. పూనికమాత్రం మానను. నన్ను అడ్డుకోడం ఎవరికీ శక్యంకాదనుకో" అన్నాడు. చర్రునలేచాడు రథమెక్కాడు.

అప్పుడు కృపాచార్యుడూ, కృతవర్మా ఇద్దరూ అన్నారు:

"రాజావనిమీద ముగ్గురమూ వొక్కనిశ్చయంతో వచ్చాం, ఇక్కడికి. మమ్మల్ని వొదిలేసి వొక్కడివే వెళ్ళడం బాగుందా, నీకు?"

"మీరూ రండి" అన్నాడు అశ్వత్థామ- "ధృష్టద్యుమ్నుణ్ణీ పాండవుల్నీ చంపుతాను, పాపానపోయినా సరే. మీరు వస్తారూ, అంత కంటే కావలసింది ఏముంది? రండి మరోఆలోచనలేకుండా రండి."

అంటూనే బయలుదేరాడు అశ్వత్థామ. కృపుడూ, కృతవర్మా రథాలెక్కారు. అతడివెంట బయలుదేరారు. ముగ్గురూ ముగ్గురే త్రేతాగ్నుల్లా ప్రకాశించారు. ముగ్గురూ పాండవశిబిరం దగ్గిరికి వెళ్ళారు. శిబిరం దూవత్తూ నిద్రలో మునిగివుంది. నిశ్శబ్దంగావుంది.

ధృతరాష్ట్రుడు: రాజుని పడగొట్టేసి, జయంసాధించి, బ్రహ్మాండమైన ప్రతాపంతో వున్నారు శత్రువులు. అలాంటివాళ్ళ శిబిరం మీదికి ముచ్చికాయముగ్గురూ దాడివెళ్ళారూ? ఆశ్చర్యం! ఆఁ, వెళ్ళి? ఏంచేశారు?

## భూతం

సంజయుడు: శిబిరం దగ్గిర మామనీ, కృతవర్మనీ వెనకేసి, వొళ్ళుమరిచిన ఉద్రేకంతో ముందుకి సాగాడుఅశ్వత్థామ. పట్టుమని పదడుగులు వెళ్ళాడో లేదో, పెద్ద భూతం ఎదురుగుండా నుంచుంది. రక్తంకారుతూన్న పులితోలు చుట్టుకుం దది. జందాలూ, హారాలూ, భుజకీర్తులూ పాములే పాములు. దారైన కోరలతో పెద్ద గుహాలా వుంది నోరు. రెండుకాదు, మూడుకాదు వేలువేలు కళ్ళు. అంతేసి గుడ్లు. ఎంత ఉగ్రంగా వుందో అంత సుందరంగానూ వుంది ఆభూతం. ఎంత ఉజ్వలంగా వుందో అంత ఆశ్చర్యంగా వుంది. విను, ఆభూతంఇలా వుందని దేవతలైనా చెప్పడం కష్టం. దాన్ని చూస్తే కొండలాంటి దైనా పగిలిపోతుందంటే నమ్ము. ఘోరమైన గుహాలాంటి దాని

నోట్లోంచీ, ముక్కురంధ్రాల్లోంచీ, చెవుల్లోంచీ, కళ్ళల్లోంచీ మంటలు మంటలు—భయంకరమైన మంటలు లేచాయి. ఆకాశమంత ఎత్తున మండాయవి. మంటల వెలుగులోంచి శంఖాలూ, చక్రాలూ, గదలూ పట్టుకుని ఎంతో మంది విష్ణుమూర్తులు బయలు దేరారు.

భూతభయంకరమైన ఆమహాభూతం చూశాడు అశ్వత్థామ. నిజంగా మహావీరు డతడు. పిసరంతా కలతపడలేదు. ధనుస్సు సారించాడు. భల్లమూ, అంజలికమూ మొదలైన బాణాలు వేశాడు. మహాస్త్రాలు ప్రయోగించాడు. సముద్రం నీళ్ళు తాగేసిన బడబాగ్ని లాగ అన్ని బాణాలూ తాగేసింది భూతం, నోరువిప్పి. మహాస్త్రాలు వృథా అయిపోగానే మంటలు కక్కుతూన్న శక్తి విసిరాడు అశ్వత్థామ. భూతంమీదపిడుగులా పడిం దది. ప్రళయకాలంలో సూర్య మండలానికి తగిలి పగిలిన పెద్దవుల్కలాగ తునకలై తుళ్ళిపోయింది.

గతుక్కుమన్నాడు అశ్వత్థామ. పుట్టలోంచి పామునిలాగినట్టు వొరలోంచి కత్తిలాగాడు. బలంకొద్దీ విసిరికొట్టాడు. భూతానికి తగిలి దూదిపింజలా అయిపోయింది కత్తి. గబగబా తోమరాలు విసిరాడు అశ్వత్థామ. చక్రాలు విసిరాడు. నవ్వుతూ అన్నీ మింగేసింది భూతం. అగ్గి పిడుగులాంటి గద విసిరాడు అశ్వత్థామ. మాంసం ముక్క మింగేసిన మొసలిలాగ అంతగదా గుటుక్కుమనిపించేసింది భూతం.

అన్ని ఆయుధాలూ అయిపోయాయి. తెల్ల మొహంవేసేశాడు అశ్వత్థామ. అటూ ఇటూ చూశాడు. ఎటుచూస్తే అటు, కిందా మీదా, విష్ణుమూర్తులే అవుపించారతడికి, ఎంతోమంది. అంతమందీ భయంకరంగానే అవుపించారు.

"మామచెప్పినమాట విన్నానుకాను" విచారించాడు అశ్వత్థామ— "శాస్త్రంసమ్మతించే మార్గం వొదిలేసి, తనకితోచినట్టు పగవాళ్ళమీదికి పరిగెత్తినవాడికి తన అధర్మమే తనని చెరుస్తుంది.

తప్పదు. ఆవునీ, గురువునీ, బ్రాహ్మణ్ణీ, బాలుణ్ణీ, వృద్ధుణ్ణీ, సేహితుణ్ణీ, గుడ్డివాణ్ణీ, తోడబుట్టువునీ, జడుణ్ణీ, మత్తుణ్ణీ, ప్రమత్తుణ్ణీ, చిన్మత్తుణ్ణీ, ఉన్మత్తుణ్ణీ, నిద్రపోతున్న వాణ్ణీ, భయంతో వున్న వాణ్ణీ, ఆడదాన్నీ ఆయుధాలతో బాధించకూడదంటారు ఆర్యులు. అలాంటి ధర్మమార్గం వొదిలేశాను. చెడ్డబుద్ధితో పగతీర్చుకోడానికి బైలుదేరాను. రాక్షసత్వానికి తెగించాను. ఇలాంటివాడికి కార్యసిద్ధి ఎలాకలుగుతుంది, నాశనంతప్ప! పాపబుద్ధితో వున్నవాడికి మంచీచెడ్డా ఎలా తెలుస్తుంది? పెద్దపూనిక పూని భయంతో తిరిగిపోడం కంటే చావు నయం. అయితే దైవందగ్గిర బలంచెల్లదు. ఏందారి ?

"అక్రమంగా నడిస్తే ఆపదతప్పదు. నిజమే. కాని ద్రోణాచార్యుల కొడుకా భయపడిపోయాడని నిందపాలు కావడం? కాని ఈవింత ఏమిటి? ఈభూతమేమిటి? ఆశ్చర్యం!"

ఎన్నోవిధాల విచారించాడు అశ్వత్థామ. చలించిన హృదయం చిక్కబట్టుకున్నాడు. శివుణ్ణి ధ్యానించడానికి పూనుకున్నాడు.

"ఆపదలనే చీకట్లకి సూర్యుడు శివుడు. అతణ్ణే ఆశ్రయిస్తాను. అతడే లోకాలు పుట్టిస్తాడు; పెంచుతాడు; లయంచేస్తాడు. ఆమహాదేవుణ్ణి, పార్వతీప్రియుణ్ణి ప్రార్థిస్తాను. దేవేంద్రుడూ మొదలైన దేవతలు అతణ్ణే పూజిస్తారు. సర్వదేవతా స్వరూపుడు అతడు. ఆమహాదేవుణ్ణే సేవిస్తాను. దైవికంగావచ్చిన అన్ని ఆపదలూ అతడేహరిస్తాడు. ఆపరమేశ్వరుణ్ణి భక్తితో పూజిస్తాను. ఈఆపదలోంచిబైటపడతాను" అనుకుంటూ రథందిగాడు. కిందకూచున్నాడు. శివుణ్ణి ధ్యానించాడు.

"ఉగ్రుణ్ణి, స్థాణువుని, శివుణ్ణి, రుద్రుణ్ణి, శర్వుణ్ణి, ఈశానుణ్ణి, భద్రప్రదుణ్ణి; శంభుణ్ణి, గిరీశుణ్ణి, అవ్యయుణ్ణి, శ్రీకంఠుణ్ణి, హరుణ్ణి, పరమేశ్వరుణ్ణి, పురహరుణ్ణి, అజుణ్ణి, శంకరుణ్ణి, త్రినేత్రుణ్ణి, బహురూపుణ్ణి, విశ్వరూపుణ్ణి, పార్వతీపతిని, గణనాథుణ్ణి, విభుణ్ణి, శూల

ఖట్వాంగధరుణ్ణి, ♦ జటామండలధారిని, అభవుణ్ణి ఆశ్రయిస్తున్నాను. ఆయనకి ఆత్మోపహారమిస్తున్నాను. నీళ్లముంచినా, పాలముంచినా ఆమహేశ్వరుడే నాకు గతి. ఈఆపదగడిస్తే ప్రమథగణం సంతోషించి నట్టు సర్వభూతోపహారంతో ఆయన్ని అర్చిస్తాను.'' అంటూ మనసా భావించాడు.

అప్పుడు అతడిముందు అద్భుతమైన బంగారంవేదిక వొకటి ప్రత్యక్షమైంది. అందులో కళ్ళు మిరుమిట్లు గొలుపుతూ మంటలతో అగ్నిహోత్రుడు పుట్టాడు. ఆమంటల్లోంచి మండుతూన్న కళ్ళతోనూ, మండుతూన్న మొహాలతోనూ ఎంతోమంది ప్రమథులు పుట్టుకు వచ్చారు. కొంతమంది వొకేవొక్క కాలుతోవున్నారు కొంతమంది ఏనుగు మొహాలతోవున్నారు, గుర్రం మొహాలవాళ్ళూ, సింహం మొహాల వాళ్ళూ, పంది మొహాల వాళ్ళూ కొంతమంది. పెద్దపెద్ద కోరలవాళ్లూ, ఎన్నోరకాల మొహాలవాళ్ళూ వికారశరీరాలవాళ్ళూ, పొడుగు దేహాల వాళ్ళూ, పొట్టిదేహాలవాళ్ళూ, స్థూలకాయులూ కొంతమంది. బక్క దేహాలవాళ్ళూ, కోతిరంగు దేహాలవాళ్ళూ, కుండమసిలాంటివాళ్ళూ, రంగు రంగుల దేహాలవాళ్ళూ కొంతమంది. అయిదుశిఖలవాళ్ళూ,జటాధారులూ, రకరకాలజుత్తువాళ్ళూ, వికృతస్వరూపులూ కొంతమంది. చిత్రచిత్రాల వస్త్రాలు కట్టుకున్నవాళ్ళూ, రంగురంగుల పూలమాలలు వేసుకున్నవాళ్ళూ కొంతమంది. గంధాలుపూసుకున్నవాళ్ళూ, రత్నహారాలువేసుకున్నవాళ్ళూ, పాములూ, పునుకలూ దండలుగా చేసుకున్న వాళ్ళూ, ధనుస్సులూ, బాణాలూ, కత్తులూ, ముసలాలూ,ముద్గరాలూ, భిండివాలాలూ, శూలాలూ పట్టుకున్నవాళ్ళూ కొంతమంది. మృదంగాలువాయించేవాళ్ళూ, పణవాలూ, డమరుకాలూ, గంటలూ గోముఖాలూ మోయించేవాళ్ళూ కొంతమంది. ధ్వజాలూ,

♦ ఖట్వాంగం : శివుడి వొక ఆయుధం.

పతాకాలూ పట్టుకుని ఆడుతూ, పాడుతూ, కేకలు వేస్తూ, బొబ్బలు పెడుతూ, తుళ్ళుతూ, కేరుతూ, పరుగులుపెడుతూ, ఏనుగుల్లా గీపెడుతూ, సింహాల్లా గర్జిస్తూ, శంఖాలు మోగించినట్టు అరుస్తూ, భేరీలు మోగినట్టు హుంకరిస్తూ, ఊరికాలకూతలుకూస్తూ, బ్రహ్మద్వేషుల మాంసాలూ, రక్తాలూపుర్రెల్లో తింటూ, తాగుతూ, తెయితెక్కలాడారు కొందరు. సోమపానమూ, శమమూ, దమమూ, తపస్సూ, బ్రహ్మచర్యమూ మొదలైన తమ పవిత్రకర్మలకి శివుడు తెల్లపోవాలి. కాని అష్టగుణమైనఐశ్వర్యం కలిగిన్నీ తెల్లపోరు వాళ్ళు. పార్వతికంటే, గణపతికంటే, కుమారస్వామికంటే వాళ్ళంటే ప్రేమ శివుడికి.

వాళ్ళంతా అశ్వత్థామ తెంపు తెలుసుకోడానికీ నిద్రపోతూ వున్న పాండవశిబిరంలో జరగబోయే ఘోరంచూసి వినోదించడానికీ అలా ప్రత్యక్షమయారక్కడ. అశ్వత్థామకి బెదురుపుట్టిస్తూ అతడి ఎదట భయంకరంగా చెలరేగారు.

అసాధ్యుడు అశ్వత్థామ. పిసరంతా చెదరలేదు. చిరునవ్వుతో మరింత తెగించి కూచున్నాడు. రథంమీాంచి కోదండంతీసి పట్టుకున్నాడు. అంతులేని పూనికతో అగ్గిలో వురకడానికి బైలుదేరాడు. వేదికదగ్గిరికి వెళ్ళాడు. అయితే అతడు వెళ్ళేసరికి శరీరం దహించడానికి సరిపోయిన అగ్గిలేదు వేదికలో. అందుకని తనరథంమీాద ధనుస్సులూ, బాణాలూ తెచ్చి వేదికలోని అగ్గిలో వేశాడు. భుగభుగా మండింది అగ్ని. మనస్సా తెంపుచేసుకున్నాడు అశ్వత్థామ "ప్రభూ !" అంటూ శివుణ్ణి పిలిచాడు — "ఏంచెయ్యాలో కర్తవ్యం తెలియదు నాకు. నాఆత్మ ఉపహారం ఇస్తున్నాను నీకు. పగవాళ్లని సంహారించేశక్తికలిగినట్టు వరం దయచెయ్యి" అంటూ ప్రార్థించాడు. "అంగిరసకులంలోపుట్టిన ఈశరీరం నీమీాద భక్తితో అగ్గిలోవేసి,

ఆహుతిచేస్తున్నాను. కృతార్థుణ్ణవుతున్నాను” అంటూ రెండుచేతులూ మీదికెత్తి అమాంతంగా, మండుతూన్న వేదికమీదికి దూకేశాడు.

## శివ ఖడ్గం

అగ్నిలో దూకి చివరంతా తెలివితప్పిపోలేదతడు. చల్లని కోనేట్లో వున్నట్టు అగ్నిలో నుంచున్నాడు. దయతో అతడికి శివుడు ప్రత్యక్షమయాడు. చిరునవ్వుతో చల్లని చూపు చూశాడు,

“నీ సాహసానికి మహానందం కలిగింది. వర మివ్వడానికి వచ్చాను” అన్నాడు.

ఒళ్ళంతా పులకలు పులకలుఅయింది అశ్వత్థామకి. హృదయం ఆనందంతో నిండిపోయింది. చప్పున వేదికనించి బైటికి వచ్చాడు. సాష్టాంగనమస్కారం చేశాడు లేచాడు. రెండుచేతులూ నుదుటిమీద జోడించాడు.

“ అశ్వత్థామా,” తియ్యనిచూపుచూస్తూ అన్నాడు శివుడు— “కృష్ణుడంటే ప్రాణంనాకు. తపస్సూ, సత్యమూ, ధృతీ, శౌచమూ, నిశ్చలమైన భక్తీ అన్నీకలిగి అతడు నన్ను ఆరాధిస్తాడు. అతడి మీదవున్న గౌరవంవల్లే నిన్ను భూతంలా అడ్డగించాను. నీమనస్సు పరీక్షించడంకోసం ఇన్నిమాయలుచేశాను. ఆయుధాలు మింగేశాను. కృష్ణుడిసన్మానమేమో జరిగింది. కాని పాంచాలం వాళ్ళకి కాలం దగ్గిర పడింది. అందుకని నువ్వు నాఅనుగ్రహంపొందావు” అని పెద్దకత్తి వొకటి అశ్వద్ధామచేతిలో పెట్టాడు. అతడికి తెలియకండా తేజో రూపంగా అతడి శరీరంలో ఆవేశించాడు.

శివఖడ్గం పుచ్చుకున్నాడు అశ్వత్థామ.సంతోషంతో పుప్పొంగి పోయాడు. భూతం మింగేసిన ఆయుధాలూ, వేదికమంటలోవేసిన ధనుస్సులూ, బాణాలూ అన్నీ ఎప్పటిలాగ తన రథంమీదికి వచ్చే

శాయి. శివుణ్ణి కొలిచినట్టు ప్రమథగణాలు అవుపడకండా తనచుట్టూ మూగాయి.

రథమెక్కాడు అశ్వత్థామ. పాండవుల శిబిరంలోకి నడిచాడు. కృతవర్మా, కృపాచార్యుడూ వెంటవెళ్ళారు.

ధృతరాష్ట్రుడు; ఇలా వెళ్ళి పాంచాలంవాళ్ళనీ, ద్రౌపది కొడుకుల్నీ శివఖడ్గంతో నరికిపారేశాడా అశ్వత్థామ? శిబిరమంతా రక్త నదులు పారించాడా, ఘోరంగా ? నాకొడుకుఅవస్థే అంతమందికీ పట్టిందా ? కృతవర్మా, కృపాచార్యుడూ చివరంటా అశ్వత్థామతో వెళ్ళారా? కాక, 'అతడు వరాలుపొందాడు, అతడితో మనకి సాటే మిటి?' అనుకుని, భయపడివెనక్కి వచ్చేశారా?

సంజయుడు: లేదు కొంచెమైనా వెనకాడలేదు వాళ్ళు. అశ్వత్థామతో నరాసరి ఇద్దరూ రెండుపక్కలా నడిచారు. అయితే అశ్వత్థామే వాళ్ళని వాకిట్లో వుండమని వుంచేశాడు. "మీరూ రావడం సంతోషంగావుంది. మీఆసరాతోనే నేను లోపలికి వెళతాను. అంత మందినీ చంపేస్తాను" అని తాను వొక్కడే లోపల ప్రవేశించాడు, ధనుర్బాణాలు పట్టుకుని, రథంమీద.

వచ్చేపోయేవాళ్ళ ప్రసంగాలవల్ల ఆశిబిరం విశేషాలన్నీ అంతకి ముందే అతడికి బాగా తెలుసు. ఎవరిడేరా ఎక్కడుందో, ఎవరిమంది రం ఎలావుంటుందో అన్నీ వినేవున్నాడు. శిబిరం శిబిరమంతా నిద్రలో వుంది. ఓం ప్రథమంగా ధృష్టద్యుమ్నుడి డేరాకి వెళ్ళాడు అశ్వత్థామ. అన్ని విధాల ఆయుధాలతోనూ నిండుగా వున్న రథం దిగాడు. శివుణ్ణి ధ్యానించాడు: "ప్రభూ, పూనిక పూనాను. రకరకాల ప్రాణులు ఉపహారమిస్తాను. కొత్తరకం పూజచేస్తాను. స్వీకరించు. ప్రసన్ను డివికా" అంటూ లోపలదూరాడు.

# నిద్రలో ప్రళయం

పగలంతా చేసిన యుద్ధంవల్ల బాగా అలిసిపోయీ, మొదలంటా శత్రువుని నాశనంచేశాం కదా, అని పూరటపొందీ అక్కడవాళ్లంతా వొళ్లుమరిచి నిద్రపోతున్నారు. మెల్లిమెల్లిగా అడుగులువేస్తూ లోపల దూరాడు అశ్వత్థామ. మందిరమంతా కలయచూశాడు. మంచిమంచి తెరలతోనూ చక్కని చందువాలతోనూ, గొప్పగావుంది గుడారం. దివ్యమైన పక్కమీద నిశ్చింతగా నిద్రపోతున్నాడు గురువుని నరికిన ధృష్టద్యుమ్నుడు. చూసీచూడడంతోనే కోపం భగ్గుమంది అశ్వత్థామకి. తృణీకారంగా పాదంతో నేలమీద తన్ని చప్పుడు చేశాడు. కళ్ళిప్పాడు ధృష్టద్యుమ్నుడు. ఎదట అశ్వత్థామ. చలించలేదు ధృష్టద్యుమ్నుడు. దిగ్గున లేచాడు. అతడి జుత్తుపట్టుకుని వెనక్కి వొంచాడు అశ్వత్థామ.

పులిలాగ లిరగబడ్డాడు అశ్వత్థామ. ధృష్టద్యుమ్నుణ్ణి వెల్లకిలా నేలమీద పడేశాడు. నిష్ఠురంగా గుండెలమీద మోకాలితో అదిమి పట్టాడు. మొహంమీద పిడుగుల్లాటి గుద్దులు గుద్దాడు. అసలే నిద్ర బద్ధకం. హటాత్తుగా మీదపడడంవల్ల బెంబేలై బుద్ధితోచకపోడం — ఇట్టే అలిసిపోయాడు ధృష్టద్యుమ్నుడు. భయపడిపోయాడు. తడబడిపోయాడు. ధనుస్సునించి అల్లెతాడు తీశాడు అశ్వత్థామ. అతడిమెడకి తగిలించాడు. పశువుని చంపినట్టు అతణ్ణి చంపాలని తన ప్రయత్నం. గుండెలమీద వొకకాలూ, పీకమీద వొకకాలూ తొక్కిపెట్టాడు. బలంకొద్దీ తోశాడు. ధృష్టద్యుమ్నుడు తొయ్యలేకపోయాడు. గోళ్ళతో రక్కాడు. లాభంలేకపోయింది.

"అశ్వత్థామా," పెగిలీ పెగలని మాటలతో కష్టంగాఅన్నాడు ధృష్టద్యుమ్నుడు — "ఆయుధాలతో చంపెయ్యి. ఆలస్య మెందుకు

చేస్తావు ? పగవాణ్ణయినా పుణ్యగతి దొరికినట్టు చెయ్యడం మంచిది."

"గురుద్రోహివి," అగ్గిచూస్తూ పురిమాడు అశ్వత్థామ – "నీకా ఉత్తమగతి ? గురువుని ఎలా నికృష్టంగా నరికావు ? అలాగే పశువు చంపినట్టు చంపుతాను" అన్నాడు. మరింత పీకమీదా గుండెల మీదా అణిచి తొక్కాడు. దబాదబా బాదాడు

ఆ చప్పుడికి అక్కడి వాళ్ళంతా మేలుకున్నారు. చూశారు. పిశాచమనుకున్నారు. పక్కలికి వొదిగిపోయారు.

కాళ్ళతో తొక్కేసీ, చేతులతో బాదేసీ, పొడిచేసీ మదపు టేనుగు చంపిన సింహంలాగ, ఉగ్రుడైపోయి ధృష్టద్యుమ్నుణ్ణి చంపే శాడు అశ్వత్థామ బాధపడీ బాధపడీ మూలిగీ, నిట్టూర్చి, దొర్లి దొర్లి, చొంగకార్చుకుంటూ ప్రాణాలువొదిలేశాడు ధృష్టద్యుమ్నుడు.

అతణ్ణి అలా నికృష్టంగా చంపేసి తృప్తిగా వూపిరి తీశాడు అశ్వత్థామ. ధనుస్సుకి అల్లెతాడు తొడిగాడు. గుడారం లోంచి బైటికి వచ్చాడు. చిరునవ్వుతో సారథిమొహం చూస్తూ రథమెక్కాడు. అవాళే శిబిరమంతా వూడ్చెయ్యాలని వూనుకున్నా డతడు, వొక్కణ్ణీ మిగల్చకండా. శత్రువీరులగుడారాలు ఆనవాళ్లు ఊహిస్తూ రథం ముందుకిపోనిచ్చాడు. అతడిరథం వెళుతూవుంటే, రథ చక్రాల ధ్వని విని, భూతభేతాళగణాలు ఉల్లాసంతో వుప్పొంగాయి.

చచ్చిపడున్న ధృష్టద్యుమ్నుణ్ణి చూసి, కావలివాళ్ళూ, అతడి రాణులూ గోలుగోలుమన్నారు. ఆకలకలానికి చుట్టుపక్కల రాజులు లేచిపోయారు. "ఏమిటిది ? ఏమిటిది ? " అంటూ మూగారు.

"రాక్షసుడో, మనిషో ఎరగం. ఎవడో వొక దురాత్ముడు వచ్చి మహారాజుని చంపేశాడు. రథంమీద పారిపోతున్నాడు. పరిగె త్తండి" మొత్తుకుంటూ చెప్పారు కావలివాళ్ళు.

తలలెత్తి చూశారు రాజులు. "పోనివ్వకండోహో, పట్టుకోండి! పట్టుకోండి" అంటూ పరివారాలతో పరిగెత్తారు. అశ్వత్థామని చుట్టుముట్టారు.

చిచ్చులపిడుగులా తిరిగాడు అశ్వత్థామ. బుజాలు పొంగించాడు ధనుస్సు సారించాడు. కరుకుకరుకుబాణాలు చరచరా కురిపించాడు. ఆటలాడినట్టు రాజుల్నీ, సేనల్నీ చంపేశాడు.

అక్కణ్ణుంచి తిన్నగా ఉత్తమౌజుడి లోగిలిలోచొరబడ్డాడు. కత్తిపట్టుకున్నాడు. రథందిగాడు. గుడారంలో దూరాడు. అలికిడి చేశాడు. ఉత్తమౌజుడు లేచాడు. లేచీలేవడంతోనే ధృష్టద్యుమ్నుణ్ణి పట్టినట్టే అతడిజుత్తు పట్టుకున్నాడు అశ్వత్థామ. ఈడ్చి కిందపడేశాడు. పశువునిచంపినట్టు చంపేశాడు.

ఆపక్కగుడారంలోనే నిద్రపోతున్నాడు యుధామన్యుడు. చప్పుడువిని పరుగెత్తుకువచ్చాడు. అశ్వత్థామని చూశాడు. రాక్షసుడే అనుకున్నాడు. జంకకండా గదతో వొక్కటి బాదాడు. దెబ్బతినీ తిరగబడ్డాడుఅశ్వత్థామ. ఒక్కవుదుటు వురికాడు. అతడి అన్నని చంపినట్టే అతణ్ణీ చంపేశాడు. అంతేకాని కత్తిమాత్రం ఉపయోగించలేదు. ద్రుపదకుమారుళ్ళని అలా ముగ్గురిని చంపాక కత్తి పుచ్చుకున్నాడు. శివఖడ్గమది.

యముడిలాగ ఆవేశం తెచ్చుకున్నాడు అశ్వత్థామ. ఒక్కొక్కగుడారమూ దూరాడు. పాంచాల రాజకుమారుళ్ళని తునాతునకలు నరికాడు. మాంసాలు తింటూ, రక్తాలు తాగుతూ భూతభేతాళాలు తెయితెక్కలాడాయి.

నిద్రపోతున్న వాళ్ళని, కునికిపాట్లు పడుతున్న వాళ్ళని, లేచీలేవని వాళ్ళని, లేచి మీదికివస్తున్న వాళ్ళని — వరసపెట్టి నరికేశాడు అశ్వత్థామ. ఆవూపుని ఏనుగుసాలలమీదికి వెళ్ళాడు. ఏనుగులు నరి

కేశాడు. తొండాలు చెండేశాడు. ముత్యాలు తుళ్ళినట్టు కుంభస్థలాలు పగలగొట్టాడు. పేగులు పోగులుపెట్టాడు. డొక్కలు చెక్కేశాడు. రక్తాలు కాలవలు కట్టించాడు. గుఱ్ఱపుసాలలమీద పడ్డాడు. కొన్నిటి కాళ్ళు నరికేశాడు. కొన్నిటి మూరలు పగలగొట్టాడు. కొన్నిటి కంఠాలు తెగేశాడు. కొన్నిటి వీపులు చీల్చాడు. కొన్నిటిని కూరలు తరిగినట్టు తరిగాడు. అలా పాంచాలం దండంతా పీనుగు పెంటలు చేశాడు.

అక్కణ్ణుంచి వెళ్ళి లంగోటీలూ, కాసెకోకలూ మొదలైనవి కట్టుకునే లోగిళ్ళలో దూరాడు. మొనగాళ్ళని కొట్టేస్తూ, ఏనుగులూ, గుఱ్ఱాలూ వున్న మండపాలు ముట్టడించాడు. శత్రువులు మేలుకుని ఎదిరించినదగ్గిరల్లా మారిమసగినట్టు, మృత్యువు చెలరేగినట్టు, యముడు నలిరేగినట్టు పేట్రేగిపోయాడు విడుపులేదు శివఖడ్గానికి; విరామం లేదు.

కాలూ కాలూ పెనవేసుకున్న పీనుగులూ, బంగారంరత్నకంకణాలతో తెగిపడిన చేతులూ, ఏనుగుతొండాలతో సయ్యాటలాడుతున్నట్టు విలవిలా కొట్టుకొంటున్న కాళ్ళూ, ఆవులిస్తున్న తలకాయలూ ముక్కలైన ఏనుగుదంతాలూ, గుఱ్ఱాల కళేబరాలూ, గుండపిండైన రథాలూ, మడుగులు కడుతూన్న రక్తాలూ, కుప్పలుపడిన కండలూ పెనవేసుకున్న పేగులూ, గుట్టలుపడిన ఎముకలూ — శిబిరమంతా అద్భుతమూ, భయానకమూ, బీభత్సమూ మూర్తీభవించినట్టు కనపడింది. భూతభేతాళాలు శివాలాడాయి.

చతురంగబలాలు పరిగెత్తినా, వెలవెలపోయినా, క్షోభపడినా, తడబడి తప్పుకున్నా, బాధపడినా వొదిలిపెట్టినపాపానపోలేదు అశ్వత్థామ. ముట్టడించీ, మీదికురికీ, నరికీ, చంపీ అల్లకల్లోలంచేసేశాడు. ఉత్సాహమూ, వడీ, మెలుకువా, విధానమూ వొక్కలాగ కనపరిచాడు. ఒక్కరథమూ, వొక్కఏనుగూ, వొక్కగుఱ్ఱమూ, వొక్క

పదాతీ పోనివ్వలేగు; చంపేశాడు. కోపమూ, ఆటోపమూ అంత కంతకి హెచ్చిపోయి పెచ్చురేగిపోయాడు.

కిందా మీాదా ఎటుచూస్తే అటు శివఖడ్గం! శివఖడ్గం! దాని వాతికి తగులుకున్న ఎముకలముక్కలు దవడకోరల్లా వున్నాయి. రక్తంలోమునిగినపలక శత్రుసంహారానికి అశ్వత్థామకి సహాయంవచ్చిన రాకాసిలావుంది.

ఒళ్ళు తెలియకుండా ప్రళయతాండవంచేశాడు అశ్వత్థామ. తామర చెరువు చొచ్చిన పెద్ద ఎనుపోతులాగ, కారడవిముట్టడించిన కార్చిచ్చులాగ చేదిసేనలో విహరించాడు అవసరమైనచోట్ల రథ మెక్కి, కిందికి దూకీ, శత్రురక్తంలో ఆపాదమస్తకం తడిసిపోయి, పేద్ద రాకాసిలాగ, చూసినవాళ్ళగుండెలు గుభిల్లుమనిపిస్తూ ఘోరంగా విజృంభించాడు. పాండవులగుడారాలికి పరిగెత్తాడు.

అప్పటికే అక్కడిదండంతా మేలుకుంది. ఆనోటా ఈనోటా జరిగిందంతా విని శిఖండీ, ద్రౌపదికుమారుల్యూ వాళ్ళూ ఎదిరించడానికి సిద్ధపడుతున్నారు. "ఎక్కడ? ఎక్కడ?" అంటూ పాంచాలసేనా, ప్రభద్రకసైన్యమూ వెంటపెట్టుకుని ఎదురువచ్చారు. అశ్వత్థామని ముట్టడించారు. శస్త్రాలూ, అస్త్రాలూ కుమ్మరించారు.

చూశాడు అశ్వత్థామ. లేళ్ళమందచూసి, కొండదిగిన సింహం లాగ రథందిగాడు. ఒకచేత్తో కత్తీ, వొకచేత్తో డాలూ పట్టుకుని వాళ్ళమీాద విరుకుపడ్డాడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, పదాతులూ తునాతునకలు నరుకుతూ, ప్రతివింద్యుడిమీాద వురికాడు. ఉరికీ వురకడంతోనే వొక్కవేటుతో అతణ్ణి నడుందగ్గిరికి రెండుముక్కలు చేసి నరికేశాడు. సింహనాదంచేశాడు.

చూసినవాళ్ళ కళ్ళుమూసుకుపోయాయి. క్రోధంతోనూ, దుఃఖంతోనూ వొణికిపోయాడు శ్రుతసోముడు. గుర్రం దాటించాడు.

పిడుగులాటి ప్రాసం అశ్వత్థామమీద వేశాడు. అది నుగ్గుచేసేసి, చిటికెలో అతడితల ఎగరగొట్టేసి, ఘరంనరికేశాడు అశ్వత్థామ.

చూశాడు శతానీకుడు. "అన్నయ్యా, ఇదిగో నీవెనకాలే వస్తున్నాడువీడు" అంటూ భయంకరమైన చక్రం అశ్వత్థామ గుండెలమీద కొట్టాడు. జివ్వున రక్తం చిమ్మింది అంతదెబ్బ ఆపుకుని కత్తితో వొక్కటివేశాడు అశ్వత్థామ. మొండెం వొకతట్టూ, శిరస్సు వొకతట్టూ అయిపడ్డాడు శతానీకుడు. శ్రుతసేనుడి కళ్ళల్లో నిప్పులు మెరిశాయి. పెద్ద గదపట్టుకుని అశ్వత్థామ బుజంమీద బాదేశాడు. జందెపువేటగా అతడిమొహం నరికేశాడు అశ్వత్థామ భరించలేకపోయాడు శ్రుతకీర్తి. ఆకాశం వొణికిపోయినట్టు ధనుష్టంకారం చేశాడు. జడివానలాగ బాణాలు కురిపించాడు. అన్నిబాణాలూ, డాలుతో అడ్డుకున్నాడు అశ్వత్థామ. ఏనుగుమీదికి వురికిన సింహంలాగ శ్రుతకీర్తి మీదికి వురికాడు. అతడి కంఠం నరికేశాడు. *

మేనల్లుళ్ళు అయిదుగురూ చిత్రవధ అయిపోడంచూసి మతిపోయింది శిఖండికి. అతడు, ప్రభద్రక సేనతో అశ్వత్థామ మీద పడ్డాడు. బాణాలూ, తోమరాలూ, చక్రాలూ దిమ్మరించింది. ముద్గరాలూ, కత్తులూ, ఈటెలూ విసిరి కప్పెట్టింది, ప్రభద్రకుల్ని దారుణంగా హతమార్చాడు అశ్వత్థామ. శిఖండి గట్టిగట్టిబాణాలు అతడి కనుబొమల మధ్య తగిలించాడు. అగ్గిలా భగ్గుమన్నాడు అశ్వత్థామ. కత్తితో శిఖండి నెత్తిమీద కొట్టాడు. దెబ్బతో రెండు చెక్కలై పోయింది శిఖండి శిరస్సు.

మొనగాళ్ళంతా అయిపోయారు. మిగిలిన పాంచాల, ప్రభద్రక, మత్స్యసేనలు అశ్వత్థామని చుట్టుముట్టాయి. శాయశక్తులాపోరాడాయి.

---

* ఉపపాండవుల మరణానికి వొకశాపం వివరిస్తోంది పద్మపురాణం.

ఏనుగులు చంపిన సింహంమీద లేళ్ళమంద తిరగబడితే ఏంచేస్తుందది, అదిగో అలాగ అంతసేనా అంతంచేసి అట్టహాసంచేశాడు అశ్వత్థామ. ఆసేనలన్నీ గాలించాడతడు. కృష్ణుడూ, సాత్యకీ, పంచపాండవులూ ఎక్కడా అంతుచిక్కలేదు. వాళ్ళు శిబిరంలో లేరని గ్రహించేశాడు.

అదిగో అంత అయాక అతడు అశ్వత్థామ అని తట్టింది అక్కడి వాళ్ళకి. దానికి వొక కారణంకూడా వుంది. ఏమిటంటావా ? మహా భారతయుద్ధం ఆరంభమైన దినంనించీ రాత్రిళ్లు అక్కడివాళ్ళకి నల్లటి శరీరంతోనూ, రక్తంలాంటి మొహంతోనూ, ఎఱ్ఱటి చింతనిప్పులలాటి కళ్ళతోనూ వొక స్త్రీ కలలోకి వచ్చేది. తమ శిబిరంవాళ్ళు నిద్ర పోతూవున్నట్టూ, జుత్తులు విడిపోయి, శరీరాలు వికృతంగా వేలాడు తూవుండగా ఆమెవాళ్ళని ఏనుగులతోనూ, గుర్రాలతోనూ కట్టేసి అశ్వత్థామముందు పెట్టినట్టూ, అందరినీ అతడు చంపేసినట్టూ, అరుస్తు న్నట్టూ కలకనేవాళ్లు. ఇప్పుడు నిద్రలోవున్న వాళ్ళని చంపడమూ, సరిగ్గా కలలో అరిచినట్టే అరవడమూ సరిపెట్టుకుని, ఆకలే ఇలా పరిణ మించిందని భావించారు. అశ్వత్థామే వచ్చాడని గ్రహించేశారు. మెరుపుమెరిసినట్టు రకరకాల దాట్లు వేస్తూ, అతడు విజృంభిస్తూ వుంటే చూసి, వెనక్కితగ్గకండా ఉద్రేకంతో దెబ్బలాడారు.

అసలే శివుడు పూనిన అశ్వత్థామ. కొంతమంది తలలు నరికే శాడు. కొందరి కాళ్లు చెక్కేశాడు. చేతులు వూడ్చేశాడు. నెత్తురు నదులు పారించాడు. ఏనుగులూ, గుర్రాలూ కూరలుతరిగినట్టు తరిగాడు. మెదడుముద్దలూ, మాంసంకండలూ రాకాసులికి విందుచేశాడు. పక పకా విరగబడినవ్వాడు. రాగాలుతీసి పాటలుపాడాడు. గెలుపువెర్రి తో గెంతులువేశాడు. చావగా మిగిలినవాళ్ళు పారిపోతూవుంటే, వెంటతరిమాడు, బాణాలు రువ్వాడు. ఒక్కణ్ణీ వొదలకూడదని అతడి సంకల్పం.

భయపడిపోయి సైనికులు చెల్లాచెదురై నక్కిన స్థలాలు గాలించాడు. మూలమూలల బాణాలు కొట్టాడు. దండు చివర్లకి రథం పరిగెత్తించాడు.

ఆకోలాహలంలో ఏనుగులూ, గుర్రాలూ కట్లు తెంచుకున్నాయి; అడ్డదిడ్డంగా పరిగెత్తాయి. ఆడగుర్రాలకోసం కరచుకుంటూ పోట్లాడాయి గుర్రాలు. మదంవాసన సహించలేక పోరాడాయి ఏనుగులు.

కత్తీ,డాలూ పట్టుకుని రథందిగాడు అశ్వత్థామ. గుర్రాలూ, ఏనుగులూ చంపేశాడు. పదాతులమాట చెప్పే అక్కరలేదు. కాళ్లు తెగీ, చేతులు నలిగీ, గుండెలు పగిలీ, వెన్నులు విరిగీ, పక్కలు చెక్కలయీ తలలు బద్దలయీ, చాపచుట్టగా పడి చిదిగిపోయీ సర్వనాశనమైపోయారు. మూలమూలల, సందుసందుల, ఇరుకుఇరుకుల శవాలే శవాలు ; కుప్పలు కుప్పలు.

తెలువుకునీ తెలువుకోకండా కొందరు బెంబేలు పడిపోయారు. భయంతో కాళ్ళు తొట్రుపుకుని కూలబడిపోయారు. నోళ్ళు తడబడిపోయి అడ్డదిడ్డంగా అరిచారు. తండ్రుల్ని పిలిచారు కొందరు. అన్నదమ్ములకోసం అరిచారు కొందరు. తమవాళ్ళే అనుకుని పైవాళ్ళ చేతులు పట్టుకున్నారు కొందరు. నిద్రకళ్ళతో మీదపడ్డ స్నేహితుల్ని, బంధువుల్ని శత్రువులనుకుని చంపేశారు కొందరు. ఎదురుగా పరిగెత్తుకువస్తున్న వాళ్లని "ఏమిటిది ? ఏమిటిది ?" అని ఆతురతగా అడిగారు కొందరు.

"అశ్వత్థామ — అశ్వత్థామ - చంపేస్తున్నాడు" అన్నారు కొందరు "కృష్ణుడూ, అర్జునుడూ లేకపోడంచూసి ఈ పాపాత్ముడు ఇంతపనిచేశాడు. వాళ్ళేవుంటే బతకనిచ్చేవాళ్ళా వీణ్ణి ?" అన్నారు కొందరు "ఇలాంటి ఘోరంచూసి అర్జునుడైతే అసహ్యించుకుంటాడు. ఎన్నడైనా ఇలాంటిపని చేశాడా అతడు. వాహనాలులేనివాళ్ళనీ,

ఆయుధాలులేనివాళ్ళనీ, భయపడ్డవాళ్ళనీ,నిద్రపోతున్న వాళ్ళనీ ముట్టు కుంటాడా మహానుభావుడు" అని అర్జునుణ్ణి పొగిడారు కొందరు.

దుర్యోధనుడికి జరిగిన పరాభవం తలుచుకుంటూ తమకంతో మరింత రెచ్చిపోయాడు అశ్వత్థామ. జంకూ గొంకూ లేకండా మరింత మరింత క్రూరత్వానికి తెగించాడు. సర్వనాశనం చేశాడు. అతడి బారిపడకండా తలగుడ్డలు విడిపోతూ, కాళ్ళుతడబడిపోతూ, పడుతూ లేస్తూ కొందరురాజులూ, సైనికులూ బైటికి పరిగెత్తారు. శిబిరంవాకి టికి వెళ్ళేసరికి యములలాగ కృతవర్మా, కృపుడూ ఎదురయ్యారు. వాళ్ళనిచూసి ఎండిపోతున్న పెదవులు తడుపుకుంటూ, జాలిగా "రక్షించండి, రక్షించండి" అంటూ కాళ్ళావేళ్ళాపడ్డారు. రాక్షసా వేశంతో వాళ్ళు తెలియకండా వున్నారు వాళ్ళు అంచేత బాణాల మీద బాణాలువేసి అంతమందినీ చంపేశారు. దెబ్బలుతిని, శక్తి పోయి వొరిగిపోయిన ఏనుగులూ, గుర్రాలూ, సైనికులా మూలుగులూ, ఏడుపులూ, మొర్రలూ శిబిరమంతటా కారుణ్యం నింపేశాయి. దిక్కూ మొక్కూలేక వాళ్ళరోదనం అరణ్యరోదనసమయింది.

అప్పుడు సందడిగా వచ్చిపడ్డారు రాకాసులు. పెళ్ళాంపిల్లల తోనూ, పరివారాలతోనూ వచ్చారు వాళ్ళు. రక్తాలూ, మాంసాలూ కోకొల్లలుగా పడున్న పాండవశిబిరంలో విందులుకుడిచారు. రక రకాల ఉగ్రధ్వనులుచేసి, ఆకాశం బద్దలుచేశారు. కోరలుపైకితీసి ఘోరంగా అరిచారు. భయంకరంగా నల్లాపాలుచేశారు. భీషణంగా హుంకారాలుచేశారు. వింతవింతల మొహాల రాకాసులు, రకరకాల కాళ్ళూ, చిత్రచిత్రమైన చేతులూ కల రాకాసులు, తుకిడీతుకిడీలు, జట్టుజట్లు దిగబడ్డారు. మెదడుముద్దలు జుర్రుతూ, మాంసంముక్కలు నములుతూ, రుచిఅయినమాంసాలు తమ పెళ్ళాం బిడ్డలికీ, స్నేహితు లికీ, బంధువులికీ పెట్టారు. ఒక జట్టుదగ్గిర మరోజట్టు చేరిందో, ఒక

తుకిడీదగ్గిర మరోతుకిడీ చేరిందో తోపులాడీ వాళ్ళదగ్గిర మాంసం వీళ్ళూ, వీళ్ళదగ్గిర మాంసాలు వాళ్ళూ లాక్కున్నారు. రక్తం తాగి మత్తెక్కిపోయారు. తెయితెక్కలాడారు. తదంనా లాడారు.

క్రమంగా పీనుగుల మూలుగులూ, ఏడుపులూ తగ్గిపోయాయి. రాకాసుల కలకలం అగిపోయింది. లోకాలు కాల్చేసి ఆగిన కాలాగ్ని లాగ పాండవశిబిరమంతా వొక్క ప్రాణీ మిగలకండా సీదాగాచంపేసి, చల్లారి, రక్తంలో మునిగిన చేతులతో బైటికి వచ్చాడు అశ్వత్థామ. తాను ముందు ప్రవేశించినప్పుడు ఎలా నిశ్శబ్దంగావుందో, వచ్చేసి నప్పుడూ అలాగే నిశ్శబ్దగా వుంది శిబిరం.

తెల తెలవారుతూ వుంది బైటికివచ్చి కృతవర్మనీ, కృపాచార్యుణ్ణీ కలుసుకున్నాడు అశ్వత్థామ.

"పాంచాలంవాళ్ళు అందరూ చచ్చారు" ఆవేశంతోఅన్నాడు అశ్వత్థామ – "ద్రౌపదికొడుకులు అయిదుగురూ అయిపోయారు. చేది, మాత్స్య, ప్రభద్రకసేనలు పిట్టమనిషి మిగలకండా వూడ్చుకు పోయాయి. వెయ్యిమాటలెందుకూ, శిబిరంలో వొక్క ఏనుగూ, వొక్క గుర్రమూ, వొక్క మనిషీ మచ్చుకైనాలేరు. పాండవులు అయిదుగురూ, కృష్ణుడూ, సాత్యకీ, ఎక్కడికి వెళ్ళారో, లేరు. తండ్రి రుణమూ, రాజురుణమూ తీర్చుకున్నాను. శివుడివరమూ, మీ ప్రాపూ దొరికి ఎంతచెయ్యాలో అంతాచేసి వొదిలిపెట్టాను."

రాక్షసావేశంవల్ల నీచపరాక్రమానికి పూనుకొని, నిరాయుధుల్ని – రక్షించమనికాళ్ళా వేళ్ళాపడుతున్నవాళ్ళని – చంపేసి, తరవాత తెలివితెచ్చుకుని, అప్పటికే – విచారపడుతున్నారు వాళ్ళు అంచేత అశ్వత్థామచేసిన ఘనకార్యం గొప్పగా పొగడడం ఇష్టంలేక వూరుకున్నారు. తలలువొంచుకున్నారు. అయితే తమ మనోవికారం

అతడికి తెలియకుండా ఏకోవాకలాగ "మంచిపనిచేశావు" అని పొగిడారు.

"ఏంమంచిపని!" అందుకున్నాడు అశ్వత్థామ - "పాండవుల్ని చంపేసివుంటే మీరు పొగిడినా బావుంది. ఈచవటల్ని చంపడంలో పౌరుషమేముంది?"

"అదేమన్నమాట? ధృష్టద్యుమ్నుడూ మొదలైన ద్రుపదకుమార్లనీ, పాంచాల, మాత్స్య, చేది, ప్రభద్రక సేనల్నీ, ప్రతివింధ్యుడూ మొదలైన ద్రౌపదికుమార్ళనీ వొక్కడివీ రెండుజాముల్లో చంపేశావంటే సామాన్యమైనపనా?" అంటూ కృతవర్మా, కృపుడూ అతణ్ణి కౌగిలించుకున్నారు.

ధృతరాష్ట్రుడు : ఈపని అప్పుడే చేశాడుకాదేం అశ్వత్థామ? తీరా దుర్యోధనుడు పడిపోయాక పూనుకున్నాడు?

సంజయుడు : పాండవులపరాక్రమంముందు వోడిపోయి వూరేకున్నాడతడు, విచారిస్తూ. అయితే దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టి, భీముడు తలమీద తన్నడంతోనే ఆగలేకపోయాడు. దుఃఖమూ, దుఃఖానికిమించిన కోపమూ అతణ్ణి రాక్షసుణ్ణిచేశాయి. తండ్రి చావుతో మనస్సు మరుగుతూనేవుంది. ఒళ్ళుమరచిపోయాడు. దానికి తోడు దుర్యోధనుడు అభిషేకించి, ఆదేశించాడు. దాంతో అంతపని చేసేశాడతడు.

అంతేకాదు, కాలంకూడా కలిసివచ్చింది. సమయానికి పాండవులు శిబిరంలో లేరు. వాళ్ళేవుంటే వొక్క అశ్వత్థామకాదు, పదిమంది అశ్వత్థామలైనా అంతపని చెయ్యలేరు. అంతా విధి. విధిఎలా జరగాలని వుంటే అలా జరక్క తప్పదు.

కృతవర్మా, కృపుడూ అలా పొగిడాక అశ్వత్థామ అన్నాడు: "ఇక మనం దుర్యోధనుడిదగ్గిరికి వెళ్ళాలి. ఆలస్యం చెయ్యకూడదు.

మనపుణ్యంవల్ల మనం వెళ్ళేదాకా అతడు బతికివుంటే ఈవార్త విని పిద్దాం, పదండి."

ముగ్గురూ బయలుదేరారు. మాట్లాడుకుంటూ గబగబా రథాలు పరిగెత్తించారు. దుర్యోధనుడిదగ్గిరికి వచ్చారు.

## ఆఖరిఘడియలు

రక్తంతో తడిసిన నేలమీద బాధపడుతూ వచ్చేప్రాణం పోయేప్రాణంతో పొర్లుతున్నాడు దుర్యోధనుడు చూసి, అశ్వత్థామా, కృతవర్మా, కృపుడూ దుఃఖంతో గబుక్కున రథాలు దిగారు. శరీరాలు వాలిపోతున్నాయి. కన్నీళ్ళు ముంచుకొస్తున్నాయి. నోళ్ళు తడబడుతున్నాయి. దైన్యం మూర్తీభవించినట్టు తూలిపోతూ, శాంత దృష్టితో చూస్తూ వెళ్ళి ముగ్గురూ దుర్యోధనుడిదగ్గిర కూచున్నారు. అతడిశరీరం తడివారు. కౌగిలించుకున్నారు. వెక్కివెక్కి ఏడ్చారు.

"అయ్యో, ప్రపంచమంతా నీఆజ్ఞకి తలవొగ్గేది. అలాంటి ప్రభువుకి ఈదశ వచ్చింది! పాపిష్టిదేవుడు ఏంచెయ్యడు! మహారాజా! మహారాజా! మమ్మల్ని పోల్చావా?" అన్నారు.

మెల్లిమెల్లిగా ఆమాటలు విన్నాడు దుర్యోధనుడు. మెల్లిగా కళ్లు విప్పాడు.

అతడి మొహం చూస్తూ గద్గదకంఠంతో ఆరంభించాడు అశ్వత్థామ :

"ఉద్దోలమైన బలమూ, సాటిలేనిప్రతాపమూ, అద్భుతమైన ధీరత్వమూ, అడ్డులేని గదాపరిశ్రమా — ఇన్నిటిలోనూ పేరుపడ్డావు నువ్వు. ధర్మయుద్ధంలో నిన్ను ఎదిరించలేక దొంగదెబ్బ కొట్టాడు వాకడు. వీరుడన్నవాడికి ఎవడికి అపాయం కలగకండా వుంటుంది, ఇక? దేవుడేకోపిస్తే చేసేదేముంది? అద్భుతంగా యుద్ధంచేశావు.

సాటిలేని చేవా పెంపూ కనపరిచావు. పవిత్రమైన శమంతక పంచకంలో ప్రాణం విడిచి స్వర్గానికి పోతావు. నీకోసం దుఃఖించలేదు. ధృతరాష్ట్ర మహారాజూ, నీరాణులూ, బంధువులూ బిచ్చమెత్తుకు తిరుగుతారిక. వాళ్ళకోసం కడుపు తరుక్కుపోతోంది నాకు.

"తన శిష్యుల్లోకల్లా నిన్ను తలమీద పెట్టుకునేవాడు బలరాముడు. అడ్డులేని పరాక్రమవంతుడివని మెచ్చుకునేవాడు నిన్ను. అదంతా నవ్వులపాలుచేసేశాడు మాలదేవుడు! భీముణ్ణి గెలిపించాడు ఏం గెలుపది, పాడుగెలుపు! దొంగగెలుపుతోనా దొరతనం."

"మహారాజా నీమగతనమూ, ద్వంద్వయుద్ధమూ, బలమూ, పూనికా తలమున్కలైంది భీముడికి. అతడికి చచ్చినంతపని చేశాయి. అర్జునుణ్ణి అదలెత్తించాయి. కృష్ణుడికి దిగులుపుట్టించాయి. అధర్మానికి వాళ్ళని పురికొల్పాయి. అంతా దేవతలు చూశారు. ఇంకేం కావాలి?

"అధర్మానికి నెట్టుకున్నాడు దుర్మార్గుడు భీముడు. గదతో తొడలు విరగ్గొట్టాడు. అంతతో పోక ఎడమకాలితో తలమీద తన్నాడు. చూస్తూ ఊరుకున్నాడు ధర్మరాజు. పైకిమాత్రం ధర్మరాజు లోపలంతా విషం. ఈగెలుపుగెలుపేనా తనకి? దైన్యం రాదో! కీర్తి మాసిపోదో!

"నీగదాయుద్ధం లోకమంతా చెప్పుకుంటారు. కీర్తిస్తారు. నీకీర్తి నిర్మలమై కలకాలం నిలుస్తుంది.

"కూటికీ, గుడ్డకీ విచారంలేకండా పెంచావు నన్ను. బంధువులికీ పెట్టగలిగినట్టు, యజ్ఞాలూ, ధర్మాలూ చెయ్యగలిగినట్టు కావలిసినంత సిరీ సంపదా ఇచ్చావు. కొండంత గౌరవంతో చూశావు. అలాంటి నువ్వు కళ్ళుమూస్తూ వుంటే శరీరం పట్టుకు బతుకుతున్నాను, నేనూ వొక సేవకుణ్ణేనా?

" ధర్మయుద్ధంచేసి స్వర్గానికి వెళుతున్నావు. నీతో రాగల పుణ్యం చేసుకోలేదు నేను. కాని నీకు సంతోషంకలిగినట్టు శత్రువుల్ని చంపగలిగిన భాగ్యం మాత్రం సంపాదించాను.

" స్వర్గంలో మాతండ్రిని చూస్తావు. 'గురుద్రోహిని, ధృష్టద్యుమ్నుణ్ణి నీకొడుకు చంపేశాడు'అని చూడగానే చెప్పు,మొదటిమాట. నాకుమారుగా నమస్కరించు; కౌగిలించుకో. బాహ్లికుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ, జయద్రథుడూ మొదలైన నీ బంధువులు యావన్మందికీ నా కుశలప్రశ్నలు వినిపించు.

" అది అలా వుండనీ — రాత్రిజరిగింది చెవుల్లో అమృతంపోసినట్టు వినిపిస్తాను, ఆలకించు. అర్ధరాత్రి నిద్రలోవున్నప్పుడు వాళ్ళ బిరంప్రవేశించాను. ఓంప్రథమంగా ధృష్టద్యుమ్నుణ్ణి చంపేశాను. పశువునిచంపినట్టు చంపేశాను. తరవాత కలబడి, వాడితమ్ముళ్ళనీ, బంధువుల్నీ పూడ్చేశాను. ద్రౌపదికొడుకులు అయిదుగుర్నీ అంతం చేసేశాను. ఏనుగులూ, గుర్రాలూ, పదాతులూ — అందరినీ నరికేశాను. శిబిరంయావత్తూ పీనుగు పెంటలుచేసేశాను. పాండవులు అయిదుగురూ కృష్ణుడూ, సాత్యకీ - ఈఏడుగురూమాత్రం నాఎదటపడలేదు. మేం అటు వెళతామని ముందే పసికట్టి కృష్ణుడు వాళ్ళని పట్టుకు, పోయి ఎక్కడన్నా దాచేశాడో, దేనికోసమైనా, ఎక్కడికైనా వెళ్ళాడో తెలియలేదు. అధర్మయుద్ధంలో వాళ్ళుసాధించిన గెలుపు వాళ్ళకి దక్కకండాపోయింది. వాళ్ళుఏమైతేనేం, మనపని నెరవేరింది. మాముగ్గురినీ చూడు. ఇదిగో వీళ్ళ ఇద్దరిప్రాపూ వుంటే నేనే కాదు. ఉప్పూ ప్రతీ లేనివాళ్ళుకూడాశత్రువుల్ని చంపేస్తారు'' అన్నాడు.

అశ్వత్థామమాటలు అమృతంలా అనిపించాయి దుర్యోధనుడికి. లేనిబలం నాలికకి వచ్చింది.

" అశ్వత్థామా,'' మెల్లిమెల్లిగా అన్నాడతడు - " సంతో

షంగా వుండయ్యా - నువ్వొ ఈ యోధులూ నాశ్రతువుల్ని చంపేశారు - ఆహా, దుష్కరమైనపని సాధించావయ్యా - భీష్ముడూ, ద్రోణుడూ కూడా ఇంతపని చెయ్యలేదు. కర్ణుణ్ణి అంత గొప్పగా పొగుడుతాం. అంతకంటే శల్యుడు అధికు డంటారు. వాళ్ళయినా ఇంతపని చెయ్యగలిగారా, నేను సంతోషించినట్టు ?"

ముగ్గురి మొహాలూ వొకసారి తేరిచూశాడు మహారాజు.

"మీారు కృతకృత్యులయారు. సుఖంగా వుండండి. తిరిగీ స్వర్గంలో కలుసుకుందాం. విచారించకండి. వెళ్ళండి" అన్నాడు. ప్రాణం వొదిలేశాడు.

ముగ్గురూ ఆఖరిసారిగా అతణ్ణి కౌగిలించుకున్నారు. ప్రదక్షిణంచేశారు. తిరిగితిరిగి చూస్తూ రథాలెక్కి వెళ్ళిపోయారు.

భళ్ళున తెల్లవారింది. తూర్పుకొండశిఖరంమీాద ఎర్రరేఖలు తొంగిచూశాయి. ఇదంతా నీకు వినిపించడానికి ఇలా వచ్చేశాను నేను. యుద్ధవార్తలు వినిపించడానికి ఆవాళ నన్ను నియోగించి వ్యాసముని ప్రసాదించిన దివ్యదర్శనం దుర్యోధనుడితో వెళిపోయింది.

---

# సౌప్తికపర్వం

…○○…

## రెండో ఆశ్వాసం

పొద్దు దూరుతూ దూరుతూవుంది. ఓఘవతివొడ్డున తమ్ముళ్ళతోనూ, కృష్ణసాత్యకులతోనూ కూచున్న ధర్మరాజుదగ్గిరికి ధృష్టద్యుమ్నుడిసారథి రోజుకుండూ వచ్చాడు.

“మహారాజా” సాష్టాంగపడి లేచి, చేతులుజోడించి అందుకున్నాడు – “అర్ధరాత్రి అశ్వత్థామ మన దండుమీాద పడ్డాడు. అందరినీ చంపేశాడు. కృతవర్మనీ, కృపుణ్ణీ వెంటపెట్టుకు వచ్చాడు. నిద్రపోతున్న దండుమీాద విరుచుకుపడ్డాడు. మొట్టమొదట ధృష్టద్యుమ్నుణ్ణి చంపేశాడు. అతడి అన్నదమ్ములందరినీ చంపేశాడు. పాంచాలంరాణువ యావత్తూ వూడ్చేశాడు. అక్రమంగా చెప్పరానివిధంగా చంపేశాడు. చేదిసైన్యం నాశనంచేసేశాడు.

“అంతలో మత్స్యసేనా, ప్రభద్రకసైన్యమూ మేలుకుంది. శిఖండీ, ద్రౌపదికుమారుల్యూ అతణ్ణిముట్టడించారు. ఘోరం మహారాజా అంతమందినీ అశ్వత్థామ చంపేశాడు.

“దండు దండంతా తల్లడిల్లిపోయింది. రాక్షసుడు అనుకుని అదిలిపోయింది. సైనికుడన్నవాడి తలకాయల్లా తరిగేశాడు. ఏనుగులూ, గుర్రాలూ వొక్కటీ మిగలలేదు. అతడి కత్తి కత్తికాదు కాలసర్పం. అడివి నరుచుతుంటే పిట్టలుగోలపెట్టినట్టు రాణువంతా గగ్గోలువడిపోయింది.

"ఏడ్చినా మొత్తుకున్నా, పారిపోయినా, వేళ్ళుకరుచుకు తుంచున్నా కనికరించలేదు కఠినాత్ముడు. ఉరికి ఉరికి అందరినీ నరికాడు.

"పారిపోదామన్నా దిక్కులేకపోయింది. ముందు నయ్యి, వెనక గొయ్యి. వాకిట్లో కృతవర్మా, కృపుడూ రాకాసుల్లా కాశారు. భయంతో పారిపోయినవాళ్ళని అందరినీ బాణాలతో చంపేశారు. శిబిరం లోపల్లాగే వాకిలికూడా పీనుగుపెంటలయింది. ఒక్కమనిషికాని, వొక్క ఏనుగుకాని, వొక్క గుర్రంకాని మిగలలేదు. ఆయువు మిగిలి వుండడంవల్ల కృతవర్మచేత పట్టుపడిన్నీ, అతడు జాత్తు వొదిలెయ్యడంతోనే పడుతూ లేస్తూ వచ్చేశాను" అంటూ గోలుగోలుమన్నాడు.

విని అంతమందీ దుఃఖంలో మునిగిపోయారు. ధర్మరాజు మూర్ఛపోయాడు. చప్పున భీముడూ, నకుల సహదేవులూ, సాత్యకీ అతణ్ణి పట్టుకున్నారు.

## స్థిరంలేని జయం అపజయంతో సమానం

"ఇటువచ్చాను, అటు అంతా అయిపోయింది" కొంచేపటికి మూర్ఛ తేరి, వొణుకుతూన్న గొంతుకతో అన్నాడు ధర్మరాజు — "ఎంతటివాళ్ళకయినా ఎప్పుడు కీడువస్తుందో, ఎప్పుడు మేలుకలుగుతుందో తెలియదు. అంత ప్రతాపంతో బంధువులూ, పుత్రులూ, మిత్రులూ, మంత్రులూ అందరితో కలిసి శత్రువుని సంహరించాను. విజయం సాధించి, ఉప్పొంగుతూ ఇక్కడికి వచ్చాను ఇంతలో అంతా తారుమారై పోయింది. బంధువులూ, మిత్రులూ, పుత్రులూ, మంత్రులూ అందరితోనూ నాసేన ఘోరంగా శత్రువుపాలై పోయింది. స్థిరంలేనిజయం అపజయంతో సమానమంటారు.

"బాణజ్వాలలతో అడివికాల్చినట్టు శత్రుసేన కాల్చేసిన ద్రోణాగ్నిలోంచి బైటపడ్డారు ద్రౌపదికొడుకులు. పెద్దపులిలాటి

కర్ణుడిపాలబడకండా బతికారు. మహాసముద్రంలాటి భీష్ముడివాతపడ కండా గట్టుచేరారు. అయినా చావుతప్పలేదు వాళ్ళకి. పట్టుకు పోయాడు విధి! నిద్రమత్తులో పడి పౌరుషం వ్యర్థమైపోయింటుంది.

"అంతసేనగెల్చిన! రాజులు ముగ్గిరిదగ్గిర వోడిపోయారు. సముద్రం ఈదుకువచ్చాక పిల్లకాలవలో మునిగిపోయారు.

"తండ్రిచావుకే తల్లడిల్లిపోతూవుంది ద్రౌపది. కొడుకులూ, అన్నదమ్ములూ పోయారంటే ఏమవుతుందో! మొదలుసరికిన చెట్టు లాగ మూర్ఛపోతుంది. ఎలాభరిస్తుంది, ఈదుంఖం! ఎన్నడూ ఇలాంటిదుఃఖం ఎరగదు; వినిఏమవుతుందో, పాపం!"

అలా ఎంతోఅంత దుఃఖపడ్డాడు ధర్మరాజు. ద్రౌపదిని పిలిపిం చడంకోసం నకులుడివేపు చూశాడు.

ద్రుపదుడూ, కుమాళ్ళూ, విరాటనగరంవచ్చినప్పుడు కోడ ళ్ళతోకూడా వచ్చి అక్కడే వుండేవి ద్రుపదుమహారాజు రాణీ. విరాట రాజూ, ద్రుపదుడూ కాలంచేసిన మర్నాడు వాళ్ళరాణుల్ని వోదార్చడంకోసం సుభద్రనీ; ఉత్తరనీ తోడిచ్చి ద్రౌపదిని ఉప ప్లావ్యం పంపాడు ధర్మరాజు. అర్జునుడి అనుమతిమీద సుభద్ర మాత్రం ద్వారక వెళ్ళింది. ద్రౌపది ఉపప్లావ్యంలోనేవుంది.

అంచేత ద్రౌపదకోసం నకులుణ్ణి ఉపప్లావ్యం పంపాడు ధర్మ రాజు. "క్షణాలమీద వెళ్ళాలినాయినా! మంచిరథం తీసికో. గాలిలా ఎగిరిపోయే గుర్రాలు పూన్చు. ద్రౌపదినీ, తక్కిన మనవాళ్ళనందరినీ, ద్రుపద విరాటరాజుల రాణుల్నీ అందరినీ తీసుకుని మనశిబిరానికిరా. మేమూ అక్కడికే వెళుతున్నాం" అన్నాడు.

నకులుడు ఉపప్లావ్యం వెళ్ళాడు.

ఏడుస్తూ శిబిరానికి బయులుదేరాడు ధర్మరాజు. తక్కిన తమ్ములూ, కృష్ణుడూ, సాత్యకీ దుఃఖపడుతూ వెంటనడిచారు. కౌరవ

శిబిరంలోని పరివారమూ ఏడుస్తూ వాళ్ళతో కలిశారు. అంతమందీ పాండవ శిబిరానికి వెళ్ళారు.

అశ్వత్థామఖడ్గంతో ఇది కాలూ, ఇది చెయ్యీ, ఇది మొండెమూ, ఇది తలా అని గుర్తించడానికి వీలులేకుండా తుంగాతునకలై వున్న బంధువులూ, కుమారులూ, స్నేహితులూ పడున్న శిబిరం చూశాడు ధర్మరాజు. జజ్జరిల్లిపోయాడు. మూర్ఛపోయి, కిందపడిపోయాడు. తమ్ముళ్లూ, కృష్ణుడూ కూడా మూర్ఛపోయారు. సాత్యకిప్రయత్నంవల్ల కొంచేపటికి తెలువుకున్నారు ధర్మరాజు తెలువుకుని, మాటిమాటికీ మూర్ఛపోయాడు. మతిపోయినట్టయి పోయాడు. కన్నీళ్ళతో కొడుకులమీద వాలాడు వదిలి వదిలి ఏడ్చాడు. కృష్ణుడూ, అర్జునుడూ ధైర్యం చెప్పారు; ఓదార్చారు. తక్కినవాళ్ళూ తగినమాటలతో వూరుకోపెట్టారు ఎంతో సేపటికి గాని అతను కుదుటపడలేదు. ఏడుస్తూ కుమారులకీ, బంధువులకీ అగ్నికార్యాలు నిర్వహించాడు. కుమిలిపోతూ, కుంగిపోతూ ద్రౌపదికోసం వాకదగ్గిర కూచున్నాడు.

ఉపప్లావ్యం వెళ్ళాడు నకులుడు. అన్నదమ్ముళ్లూ, కొడుకులూ మరణించారని విని ద్రౌపది దుఃఖంతో ఆమెకడుపు తరుక్కుపోయింది. నోరు ఎండిపోయింది. మూర్ఛపోయిందామె. లేచి గోలుగోలుమంది మాటికి మాటికీ తెలివితప్పి పడిపోయింది. తెలువుకుంది. ఏడుస్తూ, మొత్తుకుంటూ నకులుడివెంట బయలుదేరింది. తక్కిన రాజకాంతలు అంతమందీ ఏడుస్తూ తగిన వాహనాలమీద ఆమెవెంట బయలుదేరారు. కురుక్షేత్రం వచ్చారు.

అంతదూరంనించే ధర్మరాజుని చూసింది ద్రౌపది. భరించలేని దుఃఖంతో భోరుమని ఏడ్చింది భద్రంగా రథంమీంచి దింపాడు నకులుడు. తక్కినస్త్రీలున్నూ ఏడ్పులతోనూ, మొరలతోనూ తమ తమ వాహనాలు దిగారు.

మంచుతో నిండిన పద్మంలాగ మొహమంతా కన్నీళ్ళతో కొడుకుల్ని పనిపేరని ఏడుస్తూ, కాళ్ళు తడబడుతూ, దీనంగా నడిచింది ద్రౌపది. పట్టుమని పది అడుగులు వేసిందో లేదో మొదలు నరికిన చెట్టులాగ పడిపోయింది ద్రౌపది ఆమెనిచ్చి ఎత్తి ధర్మరాజు దగ్గిరికి తెచ్చాడు భీముడు.

లేచి నిలబడింది ద్రౌపది. "మహారాజా" అని వొణుకుతూన్న కంఠంతో ధర్మరాజు మొహం చూస్తూ కాంద్రుమంది. "దైవసహాయమూ, పురుషప్రయత్నమూ రెండూ కలిసివచ్చాయి నీకు. మహారాజువయ్యావు కుమాళ్ళనే యమలోకం పంపేశావా? నీసామ్రాజ్య వైభవానికి తగినట్టు నాకొడుకులు నీదగ్గిర మసులుతూవుంటే చూసే యోగం లేకపోయిందా. నాకు? కొండంతకొడుకు అభిమన్యుడూ దగాచేశాడు. ఎన్ని రాజ్యభోగాలు కలిగితేమాత్రం మరవగలమా నా బంగారు బాబుల్ని!" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

## అశ్వత్థామని చంపకపోతే ప్రాయోపవేశం చేస్తాను

అశ్వత్థామచేసిన ఘోరానికి అగ్నిహోత్రంలా మండింది ఆమె హృదయం. సిందూరం ముద్దలాగ ఎర్రపడింది మొహం. "మహారాజా," ముకుపుటాలు అదరిస్తూ అందుకుందామె — "నిద్రపోతున్న నాకొడుకులమీద పడి క్రూరంగా చంపేశాడు పాపకర్ముడు అశ్వత్థామ. అది ఆరనిచిచ్చయి దహిస్తోంది మనస్సు. అతడు చస్తే తప్ప ఇది చల్లారదు. భీముణ్ణి పంపించి అతణ్ణి చంపించావో చంపించు. లేదంటావా, చెపుతున్నాను విను, ప్రాయోపవేశం చేసుకుంటాను. శరీరం వొదిలిపెడతాను" అంది.

"అవును, అశ్వత్థామని చంపాలి" అన్నాడు ధర్మరాజు — "నేనూ అదే అనుకుంటున్నాను.విచారించకు. తెలిసిందానివి నువ్వు,

రాచబిడ్డలు యుద్ధంలో కాలంచెయ్యడంకంటె కావలిసిందేముంది ? నీకొడుకులూ, అన్నదమ్ములూ యుద్ధంలో కళ్ళుమూశారు. పుణ్య లోకాలికి పోయారు.

"అయితే అశ్వత్థామ అడవులుపట్టిపోయుంటాడు. అతణ్ణి చంపినట్టు నీకు ఏమిటి నిదర్శనం ? "

"ఆపాపాత్ముడికి సహజమైన శిరోరత్నం వుంది. దాన్ని తెస్తే చూసి బతుకుతాను" అంది ద్రౌపది. భీముడిమీద చెయ్యివేసింది. "నువ్వే నాదుఃఖమూ, కోపమూ చల్లార్చాలి. క్షత్రియధర్మం మనస్సులో పెట్టుకుని చివాల్న వెళ్ళాలి. ఆపాపకర్ముణ్ణి అశ్వత్థామని పట్టుకుని చంపెయ్యాలి.

"లక్క ఇల్లుముట్టించినప్పుడు చూపిన పౌరుషమూ, హిడింబుణ్ణి చంపినప్పుడు పూనిన నిష్ఠురత్వమూ, యక్షులు కలబడినప్పుడు కనపరిచిన మహాబలమూ, కీచకుణ్ణి సంహరించినప్పుడు చూపిన విక్రమమూ-అన్నీ ఇప్పుడు అవుపించాలి. లోకం పొగిడినట్టు నీబలమంతా వినియోగించాలి. మనల్ని గెలిచేశానని కులుకుతూన్న బ్రాహ్మణ్ణి కూల్చెయ్యాలి" అంది.

అప్పటికే అశ్వత్థామమీద కారాలూ మిరియాలూ నూరుతున్నాడు భీముడు. ద్రౌపది రాజవెయ్యడంతో మరింతమండింది అతడి కోపం. ఒళ్ళు పొంగింది. ద్రౌపదితో ధర్మరాజు అన్నమాటలే అనుమతిగా తీసుకున్నాడతేడు. మణులుచెక్కిన తన బంగారం రథం సిద్ధంచెయ్యమన్నాడు నకులుణ్ణి. భీముడిలాగే నకులుడివొళ్ళు మండుతోంది అశ్వత్థామమీద. లిప్తలమీద ఆయుధాలతో సిద్ధంచేశాడు రథం. తనే సారథిగా కూచున్నాడు.

రథమెక్కాడుభీముడు. శిబిరంలోంచి మహావేగంతో బయులుదేరాడు. అశ్వత్థామా వాళ్ళరథాలుపోయిన గుర్తులు పట్టుకుని కొంత

దూరం వెళ్ళాడు. కురుక్షేత్రం దగ్గిర తిరుగాడుతూన్న వాళ్ళని చూసి అడిగాడు : "అశ్వత్థామ ఎక్కడున్నాడో ఎరుగుదురా !"

"అతడూ, కృపుడూ, కృతవర్మా కలిసి హస్తినాపురంతట్టు వెళ్ళారు. అక్కణ్ణుంచి తిరిగివచ్చి గంగానదివొడ్డుకి వెళ్ళారు. అక్కడ కృతవర్మా, కృపుడూ విడిపోయారు. అశ్వత్థామ వ్యాసుల వారి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడే వున్నాడు" అన్నారు వాళ్లు. "తమ్ముడూ, వ్యాసాశ్రమానికి రథంపోనీవోయి" అన్నాడు భీముడు. ఉరకలువేస్తూ పరిగెత్తింది రథం.

"దుఃఖమూ కోపమూ పట్టలేక పరిగెత్తాడు భీముడు –" ధర్మరాజుతో అన్నాడు కృష్ణుడు - "ఒక్కడే వెళ్ళాడు, ప్రమాదం. మనంకూడా వెళ్ళడంమంచిది. ఏమంటావా ? మహాస్త్రం బ్రహ్మశిరం అశ్వత్థామదగ్గిరవుంది ప్రపంచమంతా కాల్చెయ్యగలదు అది. కొడుకుకదా అని ద్రోణుడిచ్చాడు. శిష్యవాత్సల్యంతో మన అర్జును డికీ ఇచ్చాడు. అందుకనే అర్జునుడిమీద మచ్చరం అశ్వత్థామకి. మనుషులమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించకూడదు. పాండవులమీద అశ్వత్థామ ప్రయోగంచేస్తాడేమో అని సందేహించి, ధర్మం తెలిసిన వాడు కనుక ద్రోణుడు వారిస్తూ వొకనాడు ప్రసంగవశాత్తూ చెప్పనూ చెప్పాడు : 'మనుషులమీద బ్రహ్మశిరం ప్రయోగిస్తే ఎన్నో ఆపదలు వస్తాయి. ఎంతప్రమాదంవచ్చినా సరే, తక్కిన ఉపాయాల తోనే తప్పించుకో. ఇదిమాత్రం ఉపయోగించకు' అని. అయితే కొడుకుసంగతి తెలుసు వతడికి. మనస్సులోనిభావం ఆగలేదు. "వీడు ఎలాగూ మంచిమాట వినడు" అనేశాడు. విని మొహం బుంగలా పెట్టుకున్నాడు అశ్వత్థామ. తండ్రిచేసిన సదుపదేశం వొంటపట్టిం చుకోలేదు.

"అంతేకాదు. పల్లమాలిన గురభిమాని అశ్వత్థామ. తనకి మరణం లేదనీ, శివుడివరం వుందనీ, దివ్యాస్త్రాల విద్యారహస్యాల మూలమైన అగస్త్యుడిదగ్గిర ద్రోణుడు సంపాదించిన బ్రహ్మశిరం తన దగ్గిర వుందనీ, ముల్లోకాలూ భస్మంచేసెయ్యగలననీ అహంకార మతడికి.

మీరు వనవాసంలో వున్నప్పుడు అతడు మా ద్వారకవచ్చాడు. యాదవకుమాళ్ళతో వినోదాలతో గడుపుతూ కొన్నాళ్ళున్నాడు. నేను ఒంటరిగా వుండడం చూసి, ఒకనాడు నాదగ్గిరికి వచ్చాడు నవ్వుతూ అన్నాడు :

"మా తండ్రితపస్సుకి మెచ్చి అగస్త్యుడు బ్రహ్మశిరం ఇచ్చాడు. ఆయన నాకిచ్చాడు. అద్భుతమైన దివ్యాస్త్రం అది అది నీకు ఇస్తాను. నువ్వు నాకు సుదర్శనం ఇవ్వాలి."

దురభిమానంతో నామీద స్పర్థకలిగి అడుగుతున్నాడని నాకు తెలుసు. అందుకని మరేమీ అనకండా నాగదా, చక్రమూ, కత్తీ చూపించాను. 'ఏది ఉపయోగించగలిగితే అది పుచ్చుకో' అన్నాను. 'నీ బ్రహ్మశిరం నాకు ఇవ్వక్కరలేదు. ఏమంటే, స్నేహితుడు కోరింది ఇచ్చి దానికి మారుగా మరొకటి పుచ్చుకోడం తగదు. సుదర్శనమే కావాలంటావా, పుచ్చుకో' అన్నాను.

అసలే మూఢుడు అశ్వత్థామ నామాటలు విని సంతోషించాడు. ఎడమచేత్తో సుదర్శనచక్రం ఎత్తబోయాడు. ఎత్తలేక పోయాడు. కుడిచేయి తీశాడు. కదిలించలేకపోయాడు. రెండుచేతుల తోనూ పట్టి బలమంతా ఉపయోగించాడు. అలిసిపోయాడు. చక్రం కదలలేదు. విచారిస్తూ నిలబడిపోయాడు.

చూశాను. బ్రహ్మాండమైన బ్రహ్మచర్యం పూని, రుక్మిణితో కూడా హిమాలయంమీద పన్నెండేళ్ళు ఉగ్రమైనతపస్సుచేసి సంపా

దించాను ఇది. ఇది వుండబట్టే దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ— ఎవ్వరూ నాతో సాటిరారు. దీని మహాత్మ్యం అలాంటిది. బలరాముడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ ఎవ్వరూ చక్రం ఇమ్మని అడగలేదు నన్ను. తపోబలంవల్ల తెల్లగుర్రాలూ, కపిధ్వజమూ సంపాదించాడు అర్జునుడు. ద్వంద్వయుద్ధంలో శివుణ్ణి మెప్పించాడు. పాశుపతం సంపాదించాడు. ప్రాణంకంటె అధికంగా చూస్తా నతణ్ణి. దేవసము డతడు. అతడికే నేను ఇవ్వలేదు చక్రం. అలాంటిది, నువ్వు కావాలని అడిగావు. బావుంది, కాని వొకమాట అడుగుతాను చెప్పూ, ఇది పుచ్చుకుని ఎవరితో యుద్ధంచెయ్యాలని నీఉద్దేశం?' అని అడిగాను.

"నువ్వు చక్రం ఇచ్చావంటే పుచ్చుకుని, నీపాదాలు పట్టుకుని అయినా నీతోనే యుద్ధంచేసి, నిన్ను గెలవాలనుకున్నాను. అయితే నువ్వు ధరించడానికే తగింది ఈచక్రం. నాకు ఇది లేకపోయినా వచ్చే లోటేమీలేదు ఉన్నమహాస్త్రాలు చాలు, నీతో యుద్ధంచెయ్యడానికి" అన్నాడతడు.

'సరే, అలాగేకానీ' అని నవ్వుతూ అనేశాను ద్రోణాచార్యుల కొడుకుకదా అని మంచిమంచి గుర్రాలూ, గొప్పగొప్ప రత్నాభరణాలూ ఇచ్చి పంపించాను.

"అదిగో అంత మహాంకారానికి కారణమైన బ్రహ్మశిరం వుండడంచేత అడ్డులేనివాడు అశ్వత్థామ. అధర్మప్రవర్తకు డతడు. క్రూరకర్ముడు. అతడిచేత భీముడు ఏమైనా కావచ్చు" అన్నాడు.

సాత్యకినీ, సహదేవుణ్ణీ చూసి, మీరు శిబిరంలో వుండండి అని నియోగించాడు. అన్ని ఆయుధాలతోనూ నిండిన తన రత్నాల రథం తీయించాడు. సైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, వలాహకమూ — నాలుగు గుర్రాలూ పూన్పించాడు. భయంకరమైన గరుడ పతాకం ఎత్తించాడు. నొగలెక్కి తాను కూచున్నాడు. జమిలితూణీ

రాలు కట్టుకున్నాడు అర్జునుడు. గాండీవం పట్టుకుని రథమెక్కాడు. అతడితో ధర్మరాజూ ఎక్కాడు. దేవేంద్రుడూ, అశ్వినీదేవతలూ లాగ ముగ్గురూ రథంమీద ప్రకాశించారు.

శ్రీకృష్ణుడు రథంనడిపాడు. గాలిలా ఎగిరిపోయింది రథం. సగందారిలోనే భీముడిరథంతో కలుసుకుంది.

అశ్వత్థామకోసం గంగవొడ్డంబడే వ్యాసాశ్రమానికి ఉద్రేకంతో మండిపోతూ పరిగెడుతున్నాడు భీముడు. కృష్ణుడూ, ధర్మరాజూ ఆగమన్నా ఆగలేదతడు.

అలా వెళ్ళి గంగవొడ్డుని మునీశ్వర్లు కొలుస్తూ చుక్కల్లో చంద్రుడిలా వున్న వ్యాసమునిని చూశాడు భీముడు ముందుకి వెళ్ళకుండా మనస్సులోనే నమస్కారంచేశాడు. ఈపక్కా ఆపక్కా చూపులతోనే వెదికాడు.

ఒంటినిండా విభూతి పూసుకుని, ముక్కుమూసుకు వొకదగ్గిర తపస్సులో కూచున్నాడు అశ్వత్థామ. చూశాడు భీముడు ధనుస్సు సంధించాడు. మంచిదొక బాణం తొడిగాడు. కనుబొమలు ముడివేశాడు. "ఒరే, బ్రాహ్మణాధముడా !" పిడుగులాగ గద్దించాడు - "క్రూరకర్ముడా ! కపటధార్మికుడా ! రాత్రి అంత ఘోరంచేసి, ఎంత వేగం తపస్వివై పోయావురా ! దాగుంటే చావుతప్పుతుందా ? లే ! దొంగతపస్సు చాలు. యుద్ధానికిరా !" అంటూ కఠినంగా రంకె వేశాడు.

## "అపాండవం"

భీముణ్ణి చూశాడు అశ్వత్థామ. వెనకవస్తున్న అర్జునుణ్ణీ, ధర్మరాజునీ చూశాడు. గుండెల్లో గుబులుబిగుసైంది వాళ్ళ దివ్యాస్త్రాలు వొక్కసారి ఊహించాడు. రాత్రి తానుచేసిన ఘోరాలు తలుచు

కున్నాడు. గడగడలాడాడు. వెంటనే బ్రహ్మశిరం తలుచుకున్నాడు. ఒక రెల్లుపరక తీశాడు. దానిలో ఆ మహాస్త్రం ఆవహింపచేశాడు. "అపాండవం కావాలి" అంటూ రోషం కక్కుతూ దారుణంగా ప్రయోగించాడు.

ఆ దివ్యాస్త్రంలోంచి ఘోరమైన అగ్నిహోత్రం పుట్టింది. ప్రపంచమంతా భస్మీభూతం చేసేస్తుందా అన్నట్టు అన్ని దిక్కులా మంటలుకక్కుతూ విజృంభించింది. భయపడ్డాడు శ్రీకృష్ణుడు.

"అర్జునా, అర్జునా, ఇది బ్రహ్మశిరం. మహాస్త్రం. మరో అస్త్రంతో ఆగదిది. నువ్వూ బ్రహ్మశిరం ప్రయోగించు. నిన్నూ, నీ అన్నదమ్ముల్నీ రక్షించుకో. ఊఁ, త్వరపడు" అంటూ తొందర చేశాడు.

గభాలున రథందిగాడు అర్జునుడు. నియమపూర్వకంగా గురుదేవుణ్ణి ద్రోణాచార్యుణ్ణి స్మరించాడు. గాండీవం సారించాడు. మంత్రంతో బాణం సంధించాడు. అశ్వత్థామకి అపాయం రాకండా వుండాలని ప్రార్థించాడు. తనకీ, తన అన్నదమ్ములికీ శుభం కలగాలని కోరాడు. అస్త్రదేవతకి నమస్కరించాడు. "అస్త్రం అస్త్రాన్ని హతమార్చాలి" అంటూ శుభం కోరుతూ బ్రహ్మశిరం ప్రయోగించాడు.

ప్రళయాగ్నిలాగ పెద్ద పెద్ద మంటలు కక్కింది అర్జునుడి మహాస్త్రం. ఆకాశమంతటా ఆక్రమించింది. అశ్వత్థామ మహాస్త్రంతో ఢీకొంది. కాని అది తగ్గలేదు మరింత విజృంభించింది. రెండు మహాస్త్రాలూ ఆటోపంతో పోరాడాయి. సముద్రాలు ఘూర్ణిల్లాయి. ఉల్కలు రాలాయి. సూర్యబింబం మాసిపోయింది. కులపర్వతాలు వూగిపోయాయి. రాళ్లవాన కురిసింది. భూమీ, ఆకాశమూ గిఱ

గిరా తిరిగాయి. పిడుగులు వురిమాయి. ఆశ్చర్యం! భయం! విస్తు పోయారు ప్రజలు.

ధర్మాత్ముడైన నారదుడు అప్పుడు చప్పున వ్యాసముని దగ్గిర ప్రత్యక్షమయాడు. అతడూ, వ్యాసమునీ మధ్యకి వచ్చారు. అర్జునుణ్ణీ అశ్వత్థామనీ శాంతింపజేయడంకోసం, ఇద్దరూ వినేట్టు అన్నారు :

"మహాస్త్రాలుకల వీరులు ఎంతోమంది పుట్టారు, పోయారు. కాని మనుషులమీద ఎవరైనా బ్రహ్మశిరం ప్రయోగించారా?"

అన్ని ధర్మాలూ రక్షించి, అన్నిలోకాలికీ మేలుచేసే ఆమహా మునులు బ్రహ్మశిరమహాస్త్రాల మంటల్లో ఏమాత్రమూ చలించకండా నుంచున్నారు. చూశాడు అర్జునుడు. కర్తవ్యం ఊహించాడు.

"అస్త్రంతో అస్త్రం శాంతింపచెయ్యడం కోసమే విధిలేక నేను ప్రయోగించాను మరోదుర్భిప్రాయం లేదు నాకు. ఉపసంహరించమంటే ఉపసంహరిస్తాను. నేను నా అస్త్రం ఉపసంహరిస్తే ఈపాపాత్ముడు మమ్మల్ని కాల్చి బూడిద చేస్తాడు. కనక మాక్షేమం మాత్రం విచారించండి మీరు" అన్నాడు. బ్రహ్మశిరం ఉపసంహరించాడు. మహామునులు మెచ్చుకున్నారు. కాని అశ్వత్థామ మహాస్త్రం తలుచుకుని భయపడ్డారు.

తపస్సూ బ్రహ్మచర్యమూ, దానమూ, సత్యమూ అన్నీ వున్న అర్జునుడికితప్ప బ్రహ్మశిరం ప్రయోగించి, తిరిగీ ఉపసంహరించడానికి ఇంకొకడికి శక్యంకాదు. రాజులేకాదు, దేవతలుకూడా ఆపని చెయ్యలేరు. బ్రహ్మతేజోమయమైన ఆ మహాస్త్రం ప్రయోగించి, ఉపసంహరిస్తే, ఉపసంహరించిన వాళ్ళనే చంపుతుంటది. గురుభక్తి, తపశ్శక్తి అధికంగా వున్నవాడు అర్జునుడు. కనక ఇట్టే ఉపసంహరించగలిగాడు. ఉపసంహరించడానికి వల్లకాని బ్రహ్మశిరం ఉపసంహరించడం చూసి ముక్కుమీద వేలేసుకున్నారు మునులు.

అశ్వత్థామా ఉపసంహరించబోయాడు. కాని సాధ్యంకాలేదు. తెల్ల మొహంవేశాడు. వ్యాసమునితో అన్నాడు :

"దుర్యోధనుణ్ణి అధర్మయుద్ధంలో చంపాడు భీముడు. అంతతో పోక నన్ను చంపడానికి వచ్చాడు. పరాభవరోషంవల్లా, ప్రాణభయం వల్లా మతిపోయింది నాకు. బ్రహ్మశిరం ప్రయోగించాను. ఇది అపాండవంచేసి వొదిలిపెడుతుంది కాని వూరుకోదు. పాండవ సంతతి సంతటినీ తుడిచేస్తుంది ఇప్పుడు. ఇదిపాపమే అంటావా, కాని. తల వొగ్గుతాను."

"నామాట విను" అశ్వత్థామ మొహంమీద చూపు నిలిపి గంభీరంగా అన్నాడు వ్యాసుడు - "వాత్సల్యంతో మీతండ్రి ఈమహాస్త్రం అర్జునుడికి ఇచ్చాడు. నీకు కీడుతలపెట్టలేదితడు. నీఅస్త్రం ఉపశమించడంకోసమే తానుప్రయోగించాడు. మేం వొద్దనగానే ఉపసంహరించాడు. ఇలా అస్త్రవిద్యలో పేరూ పెంపూ వున్న అర్జునుణ్ణి చంపుతానంటున్నావు. నీతరంకానిపని అది. నీఅస్త్రం ఇతడిఅస్త్రంతో అడగారిపోతుంది.

" అది అలా వుండనీ. ఈమహాస్త్రం మనుష్యులమీద ప్రయోగించినవాడికి కీడు తప్పదు. ఒకడు ప్రయోగించిన ఈఅస్త్రం మరొకడి అస్త్రంతో అడగారిపోయిందో, అది జరిగిన దేశంలో పన్నెండేళ్ళు వానలుపడవు. కనక నిమేలూ, దేశంమేలూ కోరి చెపుతున్నాము. ఎలా అయినా సరే, దీన్ని ఉపసంహరించు.

"తపస్సుకోసం బయులుదేరావు. రోషం విడిచిపెట్టు. సుఖపడు. ధర్మం విచారించాడు అర్జునుడు. గెలుపుకావాలని కూచోలేదు. అంచేత అతడు తృప్తిపడి వెళ్ళాలి. నీశిరోరత్నం అతడికిచ్చి పంపించు. దాంతో అతడేకాదు, పాండవులందరూ సంతోషిస్తారు. నీప్రాణం

పుచ్చుకున్నట్టే తృప్తిపడతారు. ఇది తగిన సంధిమార్గం. ఇలా చెయ్యడమే మంచిది.”

“పాండవులికి రత్నాలు కరువా?” కంటసపడుతూ అన్నాడు అశ్వత్థామ — “దుర్యోధనుడి రత్నభండారమంతా లాక్కున్నారు వాళ్ళు. పాములభయమూ, దొంగలభయమూ, రాక్షసులభయమూ, దేవతల భయమూ వుండదు ఈమణివల్ల. ఆకలి బాధించదు. దాహమూ, నిద్రా, రోగమూ బాధించవు. ఇలాంటిరత్నం విళ్ళకి ఇచ్చెయ్యగలనా? అయితే నీఆజ్ఞ జవదాటరాంది. కనక ఇచ్చేస్తాను. నామహాస్త్రంమాత్రం పూరికేపోదు పాండవస్త్రీల గర్భాలు పాడు చేస్తుంది. అప్పటికికాని శాంతించదు.”

“అలాగే కాని. మరి వాళదాసకి ఆసపడకు” అన్నాడు వ్యాసుడు.

వ్యాసుడి మాటలోని మెలి కనిపెట్టాడు అశ్వత్థామ. తెలియు నట్టు నటించాడు. “ఒక్కటిమాత్రం ఎందుకు వాదిలెయ్యాలి ? అన్నీ అంతంచేస్తాను” అని తనలోతాను నిశ్చయించుకున్నాడు. పైకి మాత్రం అలాగేచేస్తాను!” అన్నాడు ద్వంద్వంగా.

వాళ్ళ ఇద్దరిమాటల్లో వున్నరహస్యం గ్రహించేశాడు శ్రీకృష్ణుడు. “వీడు వ్యాసమునిమాట కొట్టిపారేసి, తన ఇష్టంవచ్చినట్టు చెయ్యబోతున్నాడు. ఈపాపాత్ముడిపనికి అడ్డుపడి చూస్తాను. కాన ప్పుడు తుదకి నేను చెయ్యవలసిన విధానం వుండనేవుంది” అని తర్కించుకున్నాడు. అశ్వత్థామమనసులో మాట వ్యాసముని గ్రహించాడు. అది కృష్ణుడు తెలుసుకోడమూ గ్రహించాడు. అతడు అశ్వత్థామతో మాట్లాడదలుచుకోడమూ తెలుసుకున్నాడు. ఊరు కున్నాడు.

# "పరిక్షితుని రక్షిస్తాను"

"పాండవులసంతానం పాడుచేసి పాపంపోసుకుంటున్నావు" అశ్వత్థామతో అన్నాడు కృష్ణుడు – "అన్నిగర్భాలూ అంతంచేస్తున్నావు. ఒక్కటయినా మిగల్చడం ధర్మం. ఒక్క వంశాంకురం నిలబెట్టు. ధర్మాలూ, దానాలూ చేస్తాడతను. యజ్ఞాలుచేసి పేరూ, ప్రఖ్యాతీ సంపాదిస్తాడు. ఆవొక్కగర్భం వొదిలిపెట్టు. నీఅస్త్రంతో దగ్ధంకాకండా తప్పించు"

"పక్షపాతంతో చెపుతున్నావు" అంటున్నాడు అశ్వత్థామ – "నువ్వు చెప్పినంతమాత్రాన చేస్తానా, నేను? నాఅస్త్రానికి లక్ష్యంగా వొక్కగర్భమేనా వుంటే వుంటుంది, లేకపోతే లేకపోతుంది. అదలా వుండనీ. నాకు తెలుసు. విరాటరాజుకూతురు ఉత్తరగర్భం రక్షించాలని చూస్తున్నావు నువ్వు. ఆపనికి నువ్వు పూనుకున్నా నేనుమాత్రం వొదిలిపెట్టను. తప్పకండా అదీ వూడ్చేస్తాను" అన్నాడు.

"అభిమన్యుడితేజస్సు ఉత్తరగర్భంలో వుంది. నువ్వు పాడుచేసినా నేను రక్షిస్తాను ఉత్తరకుమారుడికి దీర్ఘాయువు పోస్తాను" అన్నాడు కృష్ణుడు.

"అస్త్రంతో దగ్ధమైనవాణ్ణి బతికిస్తానంటున్నావు, మంచిమాట. నీనేర్పరితనం చూద్దాం" నవ్వుతూ అన్నాడు అశ్వత్థామ.

పరమాదరణీయులు వ్యాసమునీ, శ్రీకృష్ణుడున్నూ వాళ్ళిద్దరిమాటలూ ఆదరించలేదు అశ్వత్థామ. "పాండవస్త్రీల గర్భాలన్నీ నాశనం కావాలి" అంటూ బ్రహ్మశిరం వొదిలిపెట్టాడు.

"నీకళ్ళముందే ఉత్తర కొడుకూ, ఆమెమనవడూ పదికాలాలపాటు కలకల్లాడతారు" అన్నాడు శ్రీకృష్ణుడు– "నువ్వేచూద్దువుకాని నాతపస్సూ, నాసత్యమూ ఎంతప్రభావంకలవో! త్రికాలవేది వొక

బ్రాహ్మడు ఉపప్లావ్యం వచ్చాడు. ఉత్తరని చూసి జోస్యం చెప్పాడు. 'నీపుణ్యంవల్ల ప్రాణంపరిక్షీణమైన కొడుకు పుడతాడు. అంచేత అతడి పేరు పరిక్షితు అవుతుంది' అన్నాడు. ఆ మహాత్ముడిమాట అబద్ధం కాదు. నువ్వుచేసినపని వ్యర్థమవుతుంది. పరిక్షితు పాండవుల వంశకర్త అవుతాడు. నేను పరిక్షితుని రక్షిస్తాను. కృపాచార్యులు ధనుర్విద్య నేర్పుతాడు. శస్త్రాలూ, అస్త్రాలూ యాచవత్తూ సంపాదిస్తాడు. ఎంతో కాలం రాజ్యం పరిపాలిస్తాడు అతడికి జనమేజయుడని కొడుకు పుడతాడు. శుక్లపక్షచంద్రుడిలాగ పెరుగుతాడు. ప్రయోజకుడవుతాడు.

## తిండికి లేకండా తిరుగుతావు

"కడుపులో పిల్లల్ని చంపినపాపం నిన్ను కట్టికుడుపుతుంది. తిండికి లేకండా తిరుగుతావు. అన్నమో రామచంద్రాఅని అల్లాడతావు కంపురక్తం వొంటికి పూసుకుని మూడు వేలసంవత్సరాలు దేవులాడతావు'' అని శపించాడు

"అవును'' వ్యాసమునికూడా అశ్వత్థామని శపించాడు - "బ్రాహ్మణపుట్టుక పుట్టి ఇంత ఘోరానికి నెట్టుకున్నావు. నామాట గడ్డిపరకలా కొట్టిపారేశావు కృష్ణుడు చెప్పినట్టు తిండికిలేకండా తిరుగుతావు సహాయం లేకండా, మూడు వేల సంవత్సరాలు దుర్గంధ రక్తంతో దేవులాడతావు. నీచకర్ముడా ! పో -'' అన్నాడు.

వ్యాసుడిమొహం పులుకూపులుకూ చూశాడు అశ్వత్థామ "మీరిద్దరూ సత్యవాదులే కండి'' ప్రతిశాప మిచ్చాడు — "నువ్వు మనుషులలోనే వుంటావు నీదగ్గిరే నేను వుంటాను'' అన్నాడు. శిరో రత్నంతీసి, పాండవులకి ఇచ్చేశాడు తపోవనంలోకి వెళ్ళిపోయాడు.

పాండవులూ, కృష్ణుడూ వ్యాసమునికి నమస్కారంచేశారు. సెలవుతీసుకుని త్వరగా శిబిరానికి వచ్చేశారు. రథాలు దిగారు.

దుఃఖంతో కుంగిపోతూ, కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూవున్న ద్రౌపదిని చూశారు. కుమిలిపోతూ దగ్గిరికి వెళ్ళారు. చుట్టూ కూచున్నారు ధర్మరాజు మాటమీద అశ్వత్థామశిరోరత్నం భీముడు ద్రౌపదికి ఇచ్చాడు.

"శత్రువుని చక్కపెట్టేశాం" వోదారుస్తూ అన్నాడతడు — "విచారించకు. వీరమాతవి. ఓర్చుకోవాలి. నీవోర్పు అన్నయ్య దుఃఖం తగ్గిస్తుంది.

"కృష్ణుడు సంధికి వెళ్ళినప్పుడు నువ్వు చెప్పిన రాజసంమాటలు తలుచుకో. ఏడవవలిసిన పనేముంది ? చంపక పూలబాణాలు వేస్తారా పగవాళ్ళు ? కృష్ణుడిదయా, అర్జునుడి ఆసరా పెట్టుకుని ధృతరాష్ట్రుడి వంశంలో మగపురుగులేకండా చంపేశాను. దుశ్శాసనుడి గుండెలుచీల్చి రక్తం తాగాను. రాజులందరూ సంతోషించినట్టు దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టాను తలమీద తన్నాను. ఇది సంతోషసమయం కాని దుఃఖ సమయంకాదు.

"గురువుగారి కొడుకని కనికరించాడు అర్జునుడు. చంపడం మానేశాడు. పరాభవంచేసి వొదిలిపెట్టాడు. శిరోమణి పోడంతోనే చచ్చిపోయాడు అశ్వత్థామ. కీర్తిశరీరం పోయింది. మురికిబొంది మిగిలింది. శత్రుత్వమన్నది మొదలంటా నశించింది. ఎవరికైనా సాధ్య మవుతుందా ఇది ? వేలెత్తిచూపేవాడు లేడు ధర్మరాజుకి. నిర్మల మైన కీర్తితో ప్రకాశిస్తాడిక.

కొంచేపటికి తేరుకుని లేచింది ద్రౌపది. కాంతులుచిమ్ముతున్న అశ్వత్థామశిరోరత్నం పద్మరాగమణి అరిచేతిలో పెట్టుకుంది. ధర్మ రాజుని చూసింది. భీముడితో అంది :

"కళ్ళారా ఇది చూశాక కడుపుకోత కొంతచల్లారింది. ఇది చాలు నాకు. మహనీయమైన ఈమణి ధరించటానికి మీఅన్నయ్యే అన్నివిధాలా అర్హుడు."

మణి ధర్మరాజుచేతిలో పెట్టింది ద్రౌపది. సంతోషంతో అందుకున్నాడు ధర్మరాజు. తలమీద పెట్టుకున్నాడు. ఉదయిస్తూవున్న చంద్రబింబంతో ప్రకాశించిన ఉదయపర్వతంలా అవుపించాడు.

ద్రౌపదిని సంతోషపెట్టి, ఆమే, తక్కినస్త్రీలూ, సహదేవుడూ సాత్యకీ అందరూ విన్నట్టు అశ్వత్థామ పరాభవం వినిపించాడు ధర్మరాజు. భీముడూ అశ్వత్థామనిచూసింది మొదలు, శిరోరత్నం పుచ్చుకున్నదాకా జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించాడు.

బ్రహ్మశిరంవల్ల సంతాననాశనం విని అందరూ విచారించారు. అయితే శ్రీకృష్ణుడి ప్రతివిధానం విని ఊరటపొందారు. అయినా ఎలావుంటుందో అన్న శంకతో బాధపడ్డారు.

ఉత్తరకితప్ప, గర్భవతులైవుండిన పాండవస్త్రీల యావన్మంది గర్భాలూ నాశనమైపోయాయి. ఉత్తరగర్భంలోవున్న పిండం బ్రహ్మశిరం బాధించడం అశ్వత్థామతో మాట్లాడుతున్నప్పుడే గ్రహించాడు శ్రీకృష్ణుడు. అది బాధించకండా మనస్సులోనే సంకల్పించాడు. దాంతో ఉత్తరగర్భానికి బాధలేకండా అయింది. ఈవిషయం ఉత్తరకి కాని, తక్కినవాళ్ళకి కాని తెలియలేదు.

అయిదుగురుకుమాళ్ళూ దుర్మరణంపాలుకావడం ఎంతైనా బాధిస్తోంది ధర్మరాజుని.

"ఆశ్చర్యం," విచారిస్తూ కృష్ణుడితోఅన్నాడతడు — "బలం, శౌర్యం, పరాక్రమం — ఎందులో తక్కువ ద్రౌపదికొడుకులు! బలంలేనివాళ్ళని చంపేసినట్టు వొక్కడే చంపేశాడు అశ్వత్థామ. ఇంతశక్తి అతడికి ఎలావచ్చింది? ఎవ్వరూ గెలవలేని పరాక్రమశాలి

ధృష్టద్యుమ్నుడు. ద్రోణుడంతవాడు అతడిముందు తలెత్తలేకపో యాడు. అతడంటే అర్జునుడికి బహూకరించమైన నమస్కారం. యుద్ధంలో అందెవేసినచెయ్యి. అలాంటివాడు అశ్వత్థామని అడ్డుకోలేకపోయాడు; హతుడై పోయాడు. అతణ్ణీ, తక్కిన పాంచాలయోధుల్నీ, అంతసేననీ వొక్కడూ నరికిపారేశాడు. దేనివల్ల ఇంత ఘనుడయ్యాడు అశ్వత్థామ ?''

## శివ ప్రభావం

"అతడిలో ఏముంది ?'' అందుకున్నాడు కృష్ణుడు — "అంతా శివప్రభావం. శివుణ్ణి ఆశ్రయించి అంతపని చెయ్యగలిగాడు అశ్వత్థామ. శివుడు ప్రసన్నుడైతే తక్కువచేస్తాడా ? చావులేకపోడమూ దేవేంద్రుణ్ణి గెలవగలగడమూ — ఏదికావాలంటే అదే ప్రసాదిస్తాడు. అంతమందిశత్రువుల్ని గెలవగలశక్తి ఇవ్వడంలో ఆశ్చర్యమేముంది ? శివుణ్ణి బాగా ఎరుగుదును. ఈప్రాణికోటియావత్తూ పుట్టడమూ, పెరగడమూ, నాశనంకావడమూ అతడే చేస్తున్నాడు. అతడి సంకల్పం వల్లే ఈలోకాలన్నీ నడుస్తున్నాయి. ఆమహాదేవుడిలీలలు చెపుతాను, విను.

బ్రహ్మ శివుడిదగ్గిరికి వెళ్ళాడు. "ప్రాణికోటి సృష్టించు'' అన్నాడు. "సరే,'' అని ఏపనికైనా తపస్సు మొదటిసాధనంకదా అనుకుని నీళ్ళలో మునిగి ఎంతోకాలం తపస్సుచేశాడు. ఎన్నోవేల సంవత్సరాలు శివుడికోసం ఎదురుచూశాడు బ్రహ్మ. ఎప్పటికీ రాలేదు శివుడు. అప్పుడు తనప్రభావంతో దక్షప్రజాపతిని సృష్టించాడు. 'ప్రజల్ని సృష్టించు' అన్నాడు. "పెద్దలు ఎవరూ లేకపోతే సృష్టిస్తాను'' అన్నాడు దక్షుడు. "శివుడు నీళ్ళలో మునిగున్నాడు. నేను నిన్ను నియోగిస్తున్నాను. మరి పెద్దలెవ్వరూ లేరు. నువ్వేప్రజాసృష్టి చెయ్యి' అన్నాడు బ్రహ్మ. దేవతల్నీ, మనుషుల్నీ, తిర్యగ్జంతువుల్నీ

వుల్నీ — యావత్ప్రాణికోటినీ సృష్టించాడు దక్షప్రజాపతి. ఈ ప్రాణికోటి ఆకలితో దక్షుణ్ణే తినెయ్యడానికి వురికింది. బ్రహ్మదగ్గిరికి పరిగెత్తాడు దక్షుడు. 'ఈ ప్రాణికోటి నామీద పడకండా చెయ్యి' అని మొర పెట్టాడు.

పళ్ళూ, దుంపలూ కాసే చెట్లూ, లతలూ, తుప్పలూ పుట్టించాడు బ్రహ్మ. వాటిని ప్రాణులికి ఆహారంగా ఏర్పరిచాడు. దుర్బలమైన ప్రాణులు బలమైన ప్రాణులికి ఆహారంకావాలని ఆదేశించాడు. దాంతో తృప్తిపడ్డాయి ప్రాణులు. అలా వృద్ధిపొందుతూ వచ్చాయి. సంతానంకంటూ పెరిగాయి.

"ఎంతో కాలం గడిచాక నీళ్ళలోంచి లేచివచ్చాడు శివుడు. ప్రాణికోటి చూశాడు. మండిపడ్డాడు. తనలింగం తీసి నేలమీద పెట్టాడు. చూశాడు బ్రహ్మ. నెమ్మదైనమాటలతో శివుణ్ణివోదార్చాడు. 'ఇలా లింగం నేలమీద పెట్టావేం?' అని అడిగాడు.

"ప్రాణిసృష్టికోసం, నీళ్ళలో మునిగి, ఉగ్రమైన తపస్సుచేసి వచ్చాను. మరొకడు సృష్టిచేసేశాడు. ప్రాణుల్ని సృష్టించడానికి కాని లింగం నాకు ఎందుకూ, ఇక ?" అంటూ చిందులుతొక్కాడు. మాల్యవంతంవెళ్ళిపోయి తపస్సులోకూచున్నాడు.

"దేదీప్యమానంగా ప్రకాశించింది శివలింగం. బ్రహ్మ, దేవేంద్రుడూ మొదలైన దేవతలు పూజించారు దాన్ని.

"ఎంతో కాలం గడిచింది. దేవయుగం వెళ్ళిపోయింది. దేవతలు వొక మహాయజ్ఞం తలపెట్టారు. యజ్ఞానికి కావలిసిన సామగ్రులన్నీ సమకూర్చారు. హవిర్భాగాలు పొంద వలిసిన దేవతల్ని నిశ్చయించారు. యజ్ఞానికి సిద్ధపడ్డారు. అయితే శివుడి గొప్పతనం తెలియక అతడికి భాగంకల్పించకండా వూరుకున్నారు.

తనకి యజ్ఞభాగం లేకండా చెయ్యడం తెలుసుకుని ఉగ్రుడై పోయాడు శివుడు. లోకయజ్ఞంతో నృయజ్ఞంతో అద్భుతంగా, అయిదు బాణాలుపొడుగు ధనుస్సు సృష్టించాడు. అప్పుడే ఉదయిస్తూవున్న సూర్యబింబంలాగ ప్రకాశించిం దది. దానికి వషట్కారమే అల్లెతాడు. లోకయజ్ఞం, క్రియాయజ్ఞం, గృహయజ్ఞం, పంచభూత నృయజ్ఞం — ఈనాలుగు యజ్ఞాలూ దానికి సన్నాహ సాధనాలు. అది పట్టుకుని నిప్పులుకక్కుతూ వచ్చిపడ్డాడు శివుడు.

భూచక్రం దిద్దిరా తిరిగింది. పాతాళం తల్లకిందు లయింది. కొండలు వూడిపడ్డాయి. దిక్కులు గడగడలాడాయి. సూర్యుడూ, చంద్రుడూ మాసిపోయారు. దేవలోకం తల్లడిల్లింది. దేవతలు భయపడ్డారు. నిశ్చేష్టులైపోయారు. యజ్ఞం చెయ్యడానికి కాలూ చేతులూ ఆడలేదు. చిత్రంలో బొమ్మల్లాగ వుండిపోయారు. రౌద్ర బాణం యజ్ఞంమీాద వేశాడు శివుడు. లేడిరూపంతో అగ్నులతో సహా ఆకాశంమీాదికి పారిపోయింది యజ్ఞం. వెంటపడ్డాడు శివుడు. అదే రూపంతో ఆకాశంమీాద ప్రకాశించిం దది.

"యజ్ఞం అలా పలాయనంకావడంతోనే తెలివితప్పిపోయారు దేవతలు. అప్పుడు ధనుస్సుకొనతో సవితృడిచేతులు నరికేశాడు శివుడు. పూషుడిపళ్ళు విరగ్గొట్టేశాడు. భగుడి కళ్ళు పొడిచేశాడు. దాంతో తెలుపుకుని యజ్ఞాంగాలంతో కూడా చెట్టోపిట్టయి పరిగెత్తారు దేవతలు.

పోకండా అందరినీ వెంటాడాడు శివుడు. కోదండంచాచి, భయపెడుతూ అడ్డుకున్నాడు. అంతమందినీ వొక్కదగ్గిర చేర్చాడు. కొట్టకండా అవమానంచేసి వొదిలిపెట్టాడు.

"అల్లెతాడు తెగిపోవాలి" అంటూ దేవతలందరూ వొక్కసారి అరిచారు. ముక్కముక్కలై పోయింది అల్లెతాడు. అంతలో

యజ్ఞమూ, దేవతలూ 'శరణు శరణు' అంటూ శివుడి కాళ్ళమీద పడ్డారు. శరణాగతవత్సలుడు శివుడు. కనికరించాడు; ప్రసన్నుడయాడు. తనకోపం నీళ్ళలో వేశాడు. దేవతల్ని ఆదరదృష్టితో చూశాడు. శివుడికోపం అగ్నిరూపంతో నీళ్ళు ఇంకించింది.

"అలా దేవతల్ని దయచూసి సవితృడికి చేతులూ, పూషుడికి పళ్ళూ, భగుడికి కళ్ళూ ప్రసాదించాడు. యజ్ఞం ఎప్పటిలాగ వుండే టట్టు అనుగ్రహించాడు. భక్తితో శివుడికి యజ్ఞభాగం కల్పించారు దేవతలు. అంగీకరించాడు శివుడు. తృప్తిపడ్డాడు. లోకాలు సంతో షించాయి.

"అదిగో అలాంటివి శివలీలలు. అతడు కళ్ళెర్రచేస్తే లోకాలు మండిపోతాయి. ప్రసన్నుడైతే మహానందం అనుభవిస్తాయి.

"అశ్వత్థామకి శివుడు ప్రత్యక్షమయాడు. కనకనే వొక్కడూ శిబిరంలో ప్రవేశించాడు. అంతపని చేశాడు. అంతేకాని అతడిశక్తి కాదు. కనక అది మనస్సులో పెట్టుకోకు. దైవబలమూ, మానుష బలమూ తోడై భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, శల్యుడూ, మొదలైన మహావీరుల్ని పడగొట్టగలిగినందుకూ, ధృతరాష్ట్రుడి కొడుకుల్లో కల్లా దురుసుపోతు దుశ్శాసనుడి గుండెలుచీల్చి, రక్తంతాగి, దుర్మార్గుడైన దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టి భీముడు ప్రతిజ్ఞ పూర్తిచేసి నందుకూ సంతోషించు" అంటూ ధర్మరాజుని వోదార్చాడు.

# స్త్రీ పర్వం



## ఒకటో ఆశ్వాసం

### తండ్రి దుఃఖం

వందమంది కొడుకులూ శత్రువులచేత తెగిపోడంతోనే కొమ్మలు నరికేసిన మోడులా అయిపోయాడు ధృతరాష్ట్రుడు. దుఃఖంతో హృదయం కుతకుతలాడిపోయి మాటామంతీ లేకండా వూరుకున్నాడు.

"అందరిలాగే నువ్వూ దుఃఖపడితే ఏందారి?" ఓదార్చాడు. సంజయుడు – "ఎవళ్ళనిచూసి ఏడుస్తావు? దుఃఖానికి ఇక అంతమే ముంది? వద్దు, వూరుకో. పద్ధెనిమిది అక్షౌణీలూ అంతమై పోయాయి. తాతలూ, తండ్రులూ, అన్నదమ్ములూ, కుమారుళ్ళూ, మనవలూ, స్నేహితులూ, బంధువులూ, సహాయులూ అందరూ తెగి పోయారు. ఏడవతగనివాళ్ళు ఎవరున్నారు, ఇందులో? దేనికని ఏడుస్తావు? అందరికీ అగ్నికార్యాలు నిర్వర్తించాలి. తగిన వాళ్లకి తిలోదకాలివ్వాలి. యుద్ధభూమికి బయలుదేరు."

ఆమాటలు విన్నాడు ధృతరాష్ట్రుడు. వల్లమాలిన దుఃఖం ముంచుకువచ్చింది. ధైర్యం జారిపోయింది. పెద్దగాలికి కూలిపోయిన చెట్టులాగ కింద పడిపోయాడు.

"అయ్యో, కొడుకులందరూ చచ్చిపోయారు" తల ఇటూ అటూ తిప్పుతూ ఏడ్చాడు ధృతరాష్ట్రుడు — "వైభవమంతా అయి పోయింది. దుఃఖపడుతూ దీనంగా వుండలేను పైవాళ్ళ దయ

ఆశ్రయించి బతకలేను. రెక్కలు తెగిన పక్షినై పోయాను. తేజస్సు పోయిన సూర్యుడిలా అయిపోయాను. బంధువులందరూ తెగిపోయారు. వైభవంపోయి డిండిం మంటున్న బతుకూ ఒక బతుకేనా !

"సంధికోసం కృష్ణుడు వచ్చాడు. ఎన్నో విధాల చెప్పాడు. భీష్ముడూ, ద్రోణుడూ అంతంతమాటలన్నారు. మునులూ ఎన్ని ఎన్ని చెప్పారు. దుర్బుద్ధిని నేను. ఆబుద్ధులు విన్నాను కాను. పాండురాజుభాగం తనకుమాళ్ళకి ఇవ్వడం మానేశాను. నావల్లే నాకొడుకులు చచ్చిపోయారు నావల్లే నాచుట్టాలూ, స్నేహితులూ, సహాయులూ అందరూ పోయారు. ధైర్యమెలా కలుగుతుంది ? కర్మ చెయ్యడానికి మనస్సెలా పుడుతుంది ? ప్రాణా లెలా నిలుస్తాయి ? నాకీడు నేను కానలేకపోయాను. పాండవుల్ని సిరికి దూరంచేశాను. రవంతన్యాయంచేయడం మానేశాను. కొడుకుల్నీ, బంధువుల్నీ పోగొట్టుకున్నాను. ఇంక ఎలా బతికేది ? పూర్వజన్మసుకృతం లేదు నాకు. దుఃఖాలపాలుచేశాడు దైవం. వయస్సు పండి పంచభూత క్షయం సంభవించింది. దుర్వినయం పండి బంధునాశనం కలిగింది. సమయానికి సమకూడా యిది. ఇక బ్రహ్మపదప్రాప్తి ఒక్కటే తగివుంది. పాండవులు కళ్ళారా అదకూడా చూడనీ" అన్నాడు.

"చావుకి రాజులు దుఃఖపడతారా, మహారాజా ?" ఓదార్చాడు సంజయుడు – "వేదాలూ, శాస్త్రాలూ పెద్దలదగ్గిర విన్నావు. శాంతి అలవరుచుకోవలిసినవాడివి. ఇలా విచారిస్తే ఏమంటారు బుద్ధిమంతులు ! లోగడ సృంజయుడు పుత్రశోకంతో బాధపడినప్పుడు నారదుడు చెప్పిన ఇతిహాసం అభిమన్యుడు పోయినప్పుడు విచారిస్తూ కూచున్న ధర్మరాజుకి వ్యాసుడు చెప్పింది నీకు అవాళ వినిపించనే వినిపించాను.

"అదీకాక, హితులమాటలు వినిపించుకోలేదని నువ్వే అంటున్నావు కదా! మరి విచారించి లాభ మేముంది? నీకూ, నీకొడుక్కీ శకునీ, దుశ్శాసనుడూ, కర్ణుడూనా మంత్రులు? ఏంచెప్పడ మిక! సాహసానికి తెగించాడేకాని కర్తవ్యానికి ఎన్నడూ పూనుకోలేదు నీకొడుకు. అతడి మగతనమూ, బలమూ నమ్మావు నువ్వు. లోభం పట్టుకుంది. అతణ్ణి కాదన్నావుకావు. సమయానుకూలంగా పనిచేస్తారు ఆర్యులు. మచ్చరంపెట్టుకుని, దానికి వ్యతిరేకంగా చేసి, ఆపదలువచ్చిపడ్డాక మొత్తుకుంటారు అనార్యులు. ప్రమాదకరమైనచోట తేనెపట్టుచూసి నోరూరి, పురికి చచ్చిన తిండిపోతులాగ అయింది నీబతుకు. ఇక విచారించి లాభ మేముంది? విచారిస్తేమాత్రం పోయిందివెనక్కివస్తుందా? ఏడిస్తే లోకులు హర్షిస్తారా? విచారం నరకహేతువు. అన్నివిధాలా విచారం విడిచిపెట్టడమే కర్తవ్యం. తనకితానే చుట్టూ అగ్గిముట్టించుకుని తీరాఅది మీదికివచ్చేసరికి భరించలేక లబోలబోమన్న అప్రయోజకుడిలాగ నువ్వు ఇప్పుడు దుఃఖపడితే చూసినవాళ్ళు నవ్విపోతారు.

"నువ్వూ, నీకొడుకూ ఆడిన నిష్ఠురాలు గాలిలా రెచ్చగొట్టాయి. అర్జునుడిరోషం అగ్గిలాగ మండింది. నీవాళ్ళు మిడతల్లా అందులో పడ్డారు; మాడిపోయారు. మరి విచారించి లాభ మేముంది!"

ఇలా ఎన్నోవిధాల సముదాయించి చెప్పాడు సంజయుడు. కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు ధృతరాష్ట్రుడు.

"ఎందుకలా కింద దొర్లుతావు!" విదురుడూ వోదార్చాడు — "పెరగడం తరగడంకోసమే. రుచి అరుచికోసమే. పుట్టడం చవ్వడంకోసమే. కలియడం విడిపోడంకోసమే. లోకంలో సహజవిషయమిది. ఎవ్వరూ తప్పించడానికి సాధ్యంకాదది. శూరుణ్ణయినా, పిరికివాణ్ణయినా యముడు వొదిలిపెట్టడు. సామార్థ్యమూ, చాకచక్యమూ

మనిషిచావు మాన్పలేవు. యుద్ధం చెయ్యకపోతేమాత్రం చావు రాదా? దీనికి హార్దేముంది? అంతమందినీ అయిపోవలిసినవాళ్ళమే. తప్పదు. కనక ఇంతదుఃఖం దేనికి?

"నీకుమాళ్ళు యుద్ధంచేశారు. దేవేంద్రుడికి అతిథులై దేవలోకం వెళ్ళారు. యజ్ఞాలూ, దానాలూ, చదువులూ, తపస్సులూ చేసిన వాళ్ళకి లభించే పుణ్యగతులు యుద్ధంలో కాలంచేసిన వాళ్ళకి లభిస్తాయంటారు పండితులు. కనక కుమాళ్ళకోసం విచారపడవలిసిన పని లేదు.

"సంసారంలో ఎన్ని పుట్టుకలు పుట్టామో మనం! ఎంతమంది తండ్రులూ, ఎంతమంది తల్లులూ, ఎంతమంది అన్నదమ్ములూ, కుమాళ్ళూ అయారో మనకి! ఎవరికోసం ఏడుస్తావు?

"యవ్వనమూ, అందమూ, జీవితమూ, ధనమూ ఎన్నడూ నిత్యంకావు.అనిత్యమైన ఇవి పోయాయని దుఃఖపడడం తెలివితక్కువ. అంచేత తెలిసినవాళ్ళు వీటికోసం విచారించరు. తెలిసినవాడివి నువ్వు. బంధువులు చచ్చిపోయారని విచారించవచ్చా? ఊరుకోడం మంచిది. విను, ప్రతీదినమూ వెయ్యి దుఃఖకారణాలూ, వెయ్యి భయకారణాలూ కలుగుతూ వుంటాయి, మూఢుడైనవాడికి. తెలిసినవాడు వాటికి లొంగడు.

"విచారంవల్ల దుఃఖం ఎుంచుకువస్తుంది. అంచేత బుద్ధిమంతుడు విచారం దగ్గిరికి రానివ్వడు. నిర్వికారుడై అంతః పరితాపం తొలిగించుకుంటాడు. ప్రియమైన వస్తువు పోడమూ, కష్టాలు కలగడమూ జ్ఞానంలేని అల్పబుద్ధులికి దుఃఖం కలిగిస్తాయి. బుద్ధిమంతులికి కలత పెట్టలేవు."

విని అతడివేపు మొహంతిప్పి చూచున్నాడు ధృతరాష్ట్రుడు. "తమ్ముడూ, నీమంచిమాటలు నాదుఃఖం తేలిక పరుస్తున్నాయి.

మంచిసెబ్బరలవల్ల బుద్ధిమంతులు చలించకండా ఎలావుంటారో విని పించు తండ్రీ!" అన్నాడు.

## శరీరం మట్టికుండ

"లోకం నిస్సారమైంది" అందుకున్నాడు విదురుడు - "అరిటి చెట్టువంటిది. ఇది తెలుసుకుని సంసారంలో పెనగులాడనివాడికి దుఃఖం కలగదు. నిజంవిచారిస్తే తనశరీరమే తనకి ఎరువుసొమ్ము. అలాంటప్పుడు పరాయిశరీరాలు శాశ్వతమెలా అవుతాయి, తనకి? ఇది తెలుసుకున్న వాడు విచారించడు.

"చావంటే ఏమిటి? ఒకశరీరం వొదిలేసి మరొకశరీరం ధరించడమన్నమాట. ఒకఇంటినించి మరొకఇంటికి వెళ్ళడమన్నమాట. ఒకబట్టవొదిలేసి మరొకబట్ట కట్టడమన్నమాట.

"ఒక మట్టికుండ వుందనుకో. అది మన్ను కుమ్మరిసారెమీద పెట్టినప్పుడే చెడిపోవచ్చు. లేదా, సరిగా పట్టకండానే పాడైపోవచ్చు. తయారుచేసి ఎత్తేటప్పుడూ పగిలిపోవచ్చు. ఎత్తివొకచోట వుంచినప్పుడూ విరిగిపోవచ్చు. ఎండబెట్టినప్పుడూ చిట్లిపోవచ్చు. ఆవంలో కాలీకాలకండా పగిలిపోవచ్చు. ఇన్నీ దాటినా వాడుకున్నప్పుడైనా చెక్కలైపోవచ్చు. శరీరంకూడా అంతే అనుకో. శరీరం మట్టికుండ.

"గర్భాధానమప్పుడూ, పిండావస్థలోనూ, ప్రసవమైనప్పుడూ, బాల్యంలోనూ, యవ్వనమప్పుడూ, ప్రౌఢవయస్సులోనూ, ముసలికాలంలోనూ ఎప్పుడో వొకప్పుడు ఈశరీరం పోకండా వుండిపోదు, కర్మననుసరించి. ఇది కొట్టిపారెయ్యవలసిన మాట కాదు. అంచేత తమతమ సుకృతమూ, దుష్కృతమూబట్టి నీకుమాళ్ళు శరీరాలు వొదిలిపెట్టారు. దానికి దుఃఖపడడం తగదు.

"సంసారం దుఃఖమయమైంది; కీకారణ్యం. బుద్ధిమంతులు ఇది తెలుసుకుంటారు; దుఃఖంలో పడరు; శాశ్వతమైన సుఖం అనుభవిస్తారు.

"శుక్లమూ, శోణితమూ కలిసి కరుడుకడుతుంది. పురీషంలో పెరిగి పిండమవుతుంది. క్రమంగా దానికి అవయవా లేర్పడతాయి. శిశువవుతుంది. గాలితాకిడికి తల్లకిందులై బైటికివస్తుంది. వచ్చేటప్పుడు ఎంతో బాధ పడుతుంది. గింజుకుంటుంది. యోనిలో నొక్కుకుపోతుంది. ఎలాగో బైటపడుతుంది. భూమిమీద పడీ పడడంతోనే గ్రహాలూ, భూతాలూ ఆక్రమిస్తాయి. ఎన్నో ఆపదలు తెచ్చిపెడతాయి.

"పుట్టాక మనిషి చిన్నప్పుడు అవివేకంతో పెరుగుతాడు. శుచీ అశుచీ వొక్కలాగే చూస్తాడు. జుగుప్సబుద్ధితో చెయ్యరానిపనులు చేస్తాడు. యవ్వనం వస్తుంది. విషయలోలత్వం నానాఅవస్థా పెడుతుంది. తొక్కరాని దారులు తొక్కుతాడు. చెయ్యరాని పనులు చేస్తాడు. చివరికి ముసిలివాడవుతాడు. బలం సీదాగా పోతుంది. ఉత్సాహం వుడిగిపోతుంది. దుర్బుద్ధి పెరుగుతుంది. ఇంద్రియాలు పటుత్వం తప్పిపోతాయి. చేసినదోషాలవల్ల రోగాలు పుడతాయి. రూపం చెడుతుంది. తుదకి యముడు పాశాలువేసి లాగుతాడు. అయిపోతుంది జీవితం. కనక సంసారం దుఃఖమయం ; స్పష్టం.

"లోభమూ, క్రోధమూ, మదమూ – వీటితో ఉన్మత్తులై దుర్మతులైనవాళ్ళు ఇందులోనే క్రీడిస్తారు. పిసరంత సుఖంకోసం వొకళ్ళని వొకళ్ళు చెరుపుకుంటారు ; చంపుకుంటారు. ధర్మమార్గం తప్పి ఆఖరుకి యమకింకరుల చేతిలో చిక్కుకుంటారు. మంచివాళ్ళు ఇది పండితులవల్ల తెలుసుకుంటారు. సన్మార్గంలో సంచరిస్తారు ;

నిత్యానందస్వరూపు లవుతారు గని గహనత్వం పెద్దలవల్ల విన్నది చెపుతాను, విను,

## సంసారం కీకారణ్యం

అడుగుపెట్టడానికి వల్లకాని కీకారణ్యంలో వొక బ్రాహ్మడు వెళుతూ వున్నాడు. ఘోరమైన అడివిమృగాలూ, శరభాలూ, సింహాలూ, పులులూ మొదలైనవి దారిలో భయపెట్టాయి వెంట తరిమాయి. దారితప్పీ, ధైర్యంతప్పీ తిరిగా డతడు. దొంగలు వెంట పడ్డారు. ఒళ్ళు గరిపొడిచింది బ్రాహ్మడికి వడవడా వొణికిపోయాడు. కాళ్ళు తడబడ్డాయి. దాక్కోడానికి చోటులేదు. ప్రాణభయం. ఎంతనడిచినా తరగదు అడివి. క్రూరమృగాలు. దిక్కులు చూశాడు బ్రాహ్మడు. బెంబేలుపడిపోయాడు.

అడివంతటా ఎటుచూస్తే అటు దట్టంగావొడ్డిన వురులు కన పడ్డాయి. ఘోరమైన రూపంతో వొక ఆడది వచ్చింది. అతణ్ణి గట్టిగా కౌగిలించుకుంది. అయిదేసి తలలతో పెద్దపెద్ద కొండల్లాటి ఏనుగులు ఎదట అవుపించాయి. పక్కని వొక నుయ్యి. తీగెలూ అవీ కప్పేసి, ఆకులతోనూ వాటితోనూ కనపడకండా వుంది నుయ్యి. నూతిలో పడిపోయాడు బ్రాహ్మడు. ఒక తీగెకి తగులుకున్నాడు కొమ్మని వేలాడిన పనసపండులాగ వేలాడాడు.

ఆ అవస్థలో నూతిలో వొకమహాసర్పం నాలుకచాస్తూ కన పడింది అతడికి. ఆరుతలలతోనూ పన్నెండు కాళ్ళతోనూ నల్లటి చిత్రవర్ణం ఏనుగు వొకటి నూతివొడ్డు చెట్టుదగ్గిరికి వచ్చింది. చిన్నవీ పెద్దవీ ఎన్నో అన్ని కొమ్మలతోవుంది చెట్టు. ఆకొమ్మల్లో రంగు రంగుల తేనెటీగలు తేనెపట్టు పెట్టాయి తెల్లటి నల్లటి ఎలకలు చెట్టుమొదలు కొరుకుతున్నాయి. చెట్టుమీది తేనెపట్లనించి తేనె

పడుతూవుంది అపేక్షతో బ్రాహ్మడు చప్పరిస్తూ వుండేవాడు. తృప్తి వుండేదికాదు. దుఃఖభాజనమైన బతుకు అది; దుస్తరమైంది. అయినా అలాగే వుండేవా డతడు. క్రూరమృగాలూ, దొంగల వురులూ, ఘోరమైనఅడవీ, అయిదుతలల ఏనుగులూ,నూతిలోని మహాసర్పమూ, నూతిగట్టు ఏనుగూ, తెలుపు నలుపు ఎలకలవల్ల కూలిపోడానికి సిద్ధంగా వున్న చెట్టూ, తేనెటీగలూ – వీటన్నిటివల్లా వికలమైపోతూవున్నా జీవితంమీద ఆశవొదలలే దతడికి"

"పాపం", విదురుడుచెప్పింది విని అడిగాడు ధృతరాష్ట్రుడు – "బ్రాహ్మడిఅవస్థ వింటే జాలేస్తోంది. అయితే ఆ దురవస్థనించి ఎలా బయటపడ్డా డతడు ?"

"బుద్ధిమంతులు చెప్పిన కథ ఇది" వివరించాడు విదురుడు – "లోకులికి మోక్షకాంక్ష కలిగించడానికి కల్పించిన కథ. దీని గూడార్థం విను.

"కీకారణ్యం సంసారం. మృగాలూ, దొంగలూ రోగాలు. అడవి ముసిలితనం. అయిదుతలల ఏనుగులు ఇంద్రియాలు. నూతిలోని మహాసర్పం యముడు. తీగ జీవితాశ. నూతివొడ్డుచెట్టు ఆయువు. దానివేపు నడిచిన ఏనుగు సంవత్సరం. తలలుఆరూ ఆరు ఋతువులు. కాళ్ళు పన్నెండూ పన్నెండు మాసాలు. తెలుపు నలుపు ఎలకలు రాత్రింబగళ్ళు. తేనెటీగలు కోరికలు. తేనెలు కోరికల రసాలు. తేనెవట్లు ఆయువు. వీటివల్ల మానవులు ఆసక్తులవుతారు ఈసంసార చక్ర పరివర్తనం పండితులు ఎరుగుదురు. వాళ్ళే దీని పాశాలు తెంచగలరు." అన్నాడు.

"తమ్ముడూ, నిర్మలమైన మనస్సుతో హితంఉపదేశిస్తున్నావు. ఇంకా విస్తరించిచెప్పు బాబూ" అన్నాడు ధృతరాష్ట్రుడు.

వివరించాడు విదురుడు :

"విషయాలు బురదవంటివి. అందులో ఎప్పుడూ మునుగుతూ తేలుతూ వుంటాడు ప్రాణి. కాలం కబళిస్తుంది. రోగమూ, ముసిలితనమూ బాధకలిగిస్తాయి. క్రమంగా దేహమూ, రొప్పూ, అందమూ హరిస్తాయి. ఎందుకూ పనికిరాకుండా తుదకి తగనిచావు ప్రాప్తిస్తుంది.

"శరీరం రథం. సత్వం సారథి. ఇంద్రియాలు గుర్రాలు. బుద్ధి వ్యాపారాలు పగ్గాలు. గుర్రాలవశీ అనుసరించి తిరుగుతూవుంటాడు ప్రాణి. వశంతప్పిపోయి సంసారచక్రంలోపడి భ్రమిస్తాడు. గుర్రాలు విచ్చలవిడిగా పోనివ్వకండా ఆపగలిగిన పురుషుడు సంసారదుఃఖం దాటగలుగుతాడు. శరీరరథం యముడి ఆధీనంలో వుంటుంది. దుఃఖాలకి మూల మది. వివేకంతో దీన్ని వశంచేసుకుంటారు బుద్ధిమంతులు. శీలమనే ఉపాయంతో పగ్గాలు పట్టుకుని పరిగెత్తకండా నిలవగలుగుతారు. చావుపుట్టుకల భయం వుండదు వాళ్ళకి. సుఖంగా కాలం గడుపుతారు. కనక ఇది నువ్వు తెలుసుకో; శాంతించు. కుమాళ్ళకీ, జ్ఞాతులికీ అపరకర్మలు చేయించు. సుఖపడు" అన్నాడు.

అన్నీ విన్నాడు ధృతరాష్ట్రుడు. చివర కుమాళ్ళ అపరక్రియలు అన్నమాట చెవినిపడగానే అన్నీ మరిచిపోయాడు. దుఃఖంతో మళ్ళీ మూర్ఛపోయాడు.

అప్పుడు అక్కడ వ్యాసముని ప్రత్యక్షమయాడు. విదురుడూ, సంజయుడూ తడబడుతూ ఎదురువెళ్ళారు. ప్రణామంచేసి కూచోపెట్టారు. ధృతరాష్ట్రుడిమీద చల్లని నీళ్లు చల్లారు. మెల్లిమెల్లిగా విసిరారు. లేవదీశారు. తెలువుకున్నాక వ్యాసమునిరాక తెలియచేశారు.

"తండ్రీ!" — వ్యాసముని పాదాలమీద వాలిపోయాడు ధృతరాష్ట్రుడు. — "మనిషి జన్మ దుఃఖదాయకమైంది. ఇది కొల్పినా

తండ్రీ!” అంటూ బావురుమన్నాడు — “సంపదంతా పోయీ, కొడుకులందరూ చచ్చీ, బంధువులందరూపోయీ, దైన్యం వచ్చాక మనిషన్నవాడు ఎవడు భరిస్తాడు? దుఃఖం అగ్గయి కాల్చకండా ఎలా ఆగుతుంది? తండ్రీ! నిర్భాగ్యుణ్ణి. చావు రాకండా వుంది. రాతిగుండె పగిలిపోకండా వుంది. మూర్ఛలో ప్రాణంపోకండా మళ్ళీ లేచాను. ఏందారి? ఏంచేసేది?” అని మాట్లాడకండా వూరుకున్నాడు.

“ధర్మం తెలిసినవాడివి కదా, నాయనా!” వోదార్చాడు వ్యాసముని— “నీతులు తెలిసినవాడివి కనకనే నిన్ను వోదార్చడానికి వచ్చాను. దుఃఖంమాను. ప్రాణాలు శాశ్వతమైనవికావు. ఇది వొక్కటీ ఎప్పుడూ నీమనస్సులో వుంచుకో. ఇదే దుఃఖాలన్నిటికీ మందు. జీవలోకం ధ్రువంకాదని, మనిషన్నవాడికి చావు తప్పదనీ వినేవున్నావు నువ్వు. తెలిసి తెలిసీ మరచిపోతున్నావు. కొడుకులో అని దుఃఖపడుతున్నావు.

“ఇంతకీ నువ్వు ఎరగకండా వచ్చిందా, కౌరవులికీ పాండవులికీ విరోధం? నీకొడుకే దీనంతటికీ కారణం. విధివిధానం అది. కౌరవజాతి నాశనం తప్పనిసరిగా జరగవలిసివుండేది, జరిగింది. ఇందులో కొత్తఏమీలేదు. బంధువులు యుద్ధంలో పోయారు, సద్గతిపొందారు. వాళ్ళకోసం విచార మెందుకూ?

“బుద్ధిమంతుడు విదురుడు జూదంనాడే చెప్పాడు, ఇంతాజరుగుతుందని. విన్నావుకావు. దేవతలుచేసినపని బుద్ధిమంతులైనా ఆపలేరు. కనక దుఃఖం వొదిలిపెట్టు.

“దేవకార్యమిది. నేను ప్రత్యక్షంగా విన్నాను. నీమేలు కోరి చెపుతున్నా నది విను. ఎక్కడికిపడితే అక్కడికి శ్రమలేకండా వెళ్ళగలను నేను. లోగడ వొకసారి దేవసభకి వెళ్ళాను. దేవేంద్రుడూ మొదలైన దేవతల్నీ చూశాను. నారదుడూ మొదలైన మహాము

నుల్ని చూశాను. సుఖంగా గోష్ఠిలోవున్నాను. అక్కడికి భూదేవి వచ్చింది. దేవతల్తో అంది :

"'దేవతలారా! బరువు మొయ్యలేకపోతున్నాను. నాబరువు తగ్గించడానికి ద క్షుతలిచారు మీరు. బ్రహ్మతో విన్నవించారు. అయితే ఆలస్యమెందుకుచేస్తూన్నారు ? కష్టంగావుంది నాకు.'

లోకాలునమస్కరించే నారాయణమూర్తి అక్కడేవున్నాడు" నవ్వుతూ భూదేవితో అన్నాడు : విచారించకు. ధృతరాష్ట్రుడు అనే రాజు వందమంది కొడుకులు కంటాడు. అతడి పెద్దకొడుకు దుర్యోధనుడు నీబరువుతగ్గిస్తాడు. త్వరలోనే జరుగుతుం దిది. ఎలా అంటావా ! అతణ్ణి చంపడానికీ, అతణ్ణి బతికించడానికీ లోకంలోని రాజులు ఇటూ అటూ పూనుకుంటారు. ఈసుపట్టి సేనలతో కురుక్షేత్రంలో పోరాడతారు ; చస్తారు. వందమందితమ్ముళ్ళతో తానూ తెగిపోతాడు దుర్యోధనుడు. దాంతో నీబరువు తగ్గిపోతుంది. నిశ్చింతగా వుండు. వెళ్ళు. ప్రాణికోటిని ధరించు" అని ఆమెని సాగనంపాడు.

"పైగా ప్రజానాశన కారణమైన కలిఅంశలో పుట్టాడు దుర్యోధనుడు. బలవంతుడు, క్రోధి, శూరుడు, వాకళ్ళు చెపితే వినేఘటం కాదు. దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీ అతడికి తగినమంత్రులు కుదిరారు. వాళ్ళు నాశనమైపోయారంటే వింతేముంది ? తమతప్పువల్ల తాము నాశనమైపోయారు నీకొడుకులు. వాళ్ళకోసం విచారం అనవసరం. శాంతించు" అన్నాడు.

ధర్మరాజు తనకి అవమానిస్తాడేమోఅని బెంగగావుంది ధృతరాష్ట్రుడికి. అది దివ్యచిత్తంలో తెలుసుకున్నాడు వ్యాసుడు. ఇలా అన్నాడు :

"పాండవులవల్ల పిసరంతా దోషంలేదు. పాండురాజు భాగం అతనికుమాళ్ళకి ఇవ్వకండా భూభాగం అంతామింగేశారు నీకొడుకులు.

అంచేతే వొక్కడూ మిగలకుండా పోయారు. అంతమంది రాజులూ, సర్వసైన్యాలూ కూలిపోయారు. ఇదంతా ముందే తెలుసు నాకు. కనకనే నారదుడు ధర్మరాజుతో చెప్పాడు. జాలిగుండె ధర్మరాజుది హింస ఇష్టంలేక సంధికోసం ఎంతైనా పెనుగులాడాడు. నేనూ అతడితో చెప్పాను. అతడి ప్రయత్నలోపంలేదు. అయినా లాభంలేకపోయింది. విరోధుళ్ళ మాన్పించలేక పోయాడు. యుద్ధం తప్పలేదు. విధి ఎవడు తప్పించగలడు? ఇదంతా తెలుసు నాకు. అంచేతే నువ్వు దుఃఖాగ్నిలో కాలిపోకుండా వుండడంకోసం జాలికలిగి దేవరహస్యం చెప్పాను నీకు.

"గురువుల శిక్ష పొందావు. ధర్మం తెలిసినవాడివి. ఇలా దుఃఖాగ్నిలోపడి దహించుకుపోతే ధర్మరాజు ఎంతైనా బాధపడతాడు. పశువులుబాధ పడినా, పక్షులుబాధపడినా జాలిపడతాడు ధర్మరాజు. అజాతశత్రువతడు. నీ కుమారుడు. నీకున్నూ కొంత తెలుసుకదా, అతడిసంగతి! నీమీద అతడికి విముఖత్వం కలగదు. భక్తితోనూ, విశ్వాసంతోనూ నీదగ్గిర మసులుకుంటాడు. నమ్ము. అతడంటే నువ్వూ ప్రేమిస్తావు దయతో చూస్తావు. అయిదుగురు అన్నదమ్ములూ నిన్ను సేవిస్తారు. అయిదుగురూ కన్నకొడుకులే అని భావించు. దైవకృత్యం తెలుసుకో. నామాట విను. పుత్రశోకం విడిచిపెట్టు. పాండవులు నీకొడుకులు. నిన్ను సేవించడానికి తగినవాళ్ళు. వాళ్ళని కన్నకొడుకులని భావించు. కీర్తీ, ధర్మమూ సంపాదించు.

"దుఃఖం అగ్గి. ఎరుక అనే నీళ్ళతో దాన్ని ఆర్పు. ఆత్మహత్య తలపెట్టకు. తగినట్టు ప్రవర్తించు"

తేజోధనుడూ, మహామునీ అయిన వ్యాసుడి మహోపదేశం విన్నాడు ధృతరాష్ట్రుడు. కొంచెపు ఆలోచిస్తూ వూరుకున్నాడు- చివరికి అన్నాడు:

"తండ్రీ, నీమాటలు హృదయం తేలికపరుస్తున్నాయి. పుత్ర శోకాగ్నిలో వేగిపోయి ఏదీ తెలుసుకోలేకపోయాను. అనుగ్రహించావు. కుదుటబడుతున్నాను. ఆత్మహత్య చేసుకోను. పుత్రశోకం విడిచిపెడ తాను. భావిస్తాను, భావిస్తాను. పాండవులే నా సొంతకొడుకులు. పాండవులే నా సొంతకొడుకులు."

అంతర్ధాన మయాడు వ్యాసముని.

## యుద్ధభూమికి పయనం

కొంచేపు అలాగే కూచున్నాడు ధృతరాష్ట్రుడు. తరవాత సంజయుణ్ణి సంబోధించాడు. "ప్రయాణానికి సిద్ధం చెయ్యి" అన్నాడు. విదురుడితట్టు తిరిగాడు. "తమ్ముడూ, గాంధారినీ, కుంతినీ, తక్కిన కౌరవస్త్రీల నందరినీ తీసుకురా. కురుక్షేత్రానికి వెళుతున్నాం మనం" అన్నాడు.

ప్రయాణానికి అవసరమైన అన్ని ఏర్పాట్లూ చేశాడు సంజయుడు కౌరవస్త్రీలని అందరిని పయనంచేశాడు విదురుడు.

విండిన శోకభారంతో తూలిపోతూ, తెలివితప్పిపోతూ ధృతరాష్ట్రుడి దగ్గిరకి వచ్చింది గాంధారి. చూసిన వాళ్ళందరూ గోలుగోలు మన్నారు. కుంతీ మొదలైనస్త్రీలు యావన్మందీ పరివారజనంతో కూడా ఏడుస్తూవచ్చారు. కౌరవకుమాళ్ళ రాణులు చేతులతో నడి నెత్తులు మొత్తుకుంటూ వచ్చారు. శోకం మూర్తీభవించినట్టు వున్నారు వాళ్ళు. జుత్తులు విడిపోయి వెన్నులమీద వేలాడుతున్నాయి. కన్నీళ్ళు మొహాలు కప్పేస్తున్నాయి ఒంటిమీద అలంకారాలు లేవు. భర్తల్నీ, అన్నల్నీ, తమ్ముళ్ళనీ, కొడుకుల్నీ, బంధువుల్నీ తలుచుకుంటూ, నోళ్ళు ఎండిపోతూ, పనివిపనివి ఏడుస్తూ వచ్చారు వాళ్ళు.

పైటకొంగు ఇంత జారిపోతే చెలికత్తెలు చూస్తారేమో అని సిగ్గుపడే ఆరాజస్త్రీలు అత్తలఎదట వొంటిచీరెలతో వొళ్ళుకానకండా నడిచారు. విచారం కలిగితే వొకళ్ళు నొకళ్ళు వోదార్చుకునేవాళ్ళు. అప్పుడు పరస్పరం దుఃఖంతో ములిగి, వోదార్చేవాళ్ళే లేక మూర్ఛ పోతున్నారు.

వేటవాళ్ళు భర్తల్ని చంపేస్తే కొండగుహల్లోంచి బైటికి వరిగెత్తే ఆడసింహాల్లాగ పెద్ద పెద్ద మేడల్లోంచి బయటికి వచ్చారు వాళ్ళు.

ముందు ఎన్నడూ, ఎవ్వరికీ కంటపడని రాజకాంతలు,గుంపులు గుంపులు ప్రజలు నిలిచి చూస్తూవుంటే, వాళ్ళముందు నడిచివెళ్ళారు వాళ్ళు. చూసినవాళ్ళు కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. దుఃఖపడ్డారు. కౌరవ వీరుల ఇళ్ళల్లోంచి హాహాకారాలు చెలరేగాయి. అలా ఆ స్త్రీలు వచ్చి ధృతరాష్ట్రుడి రెండుపక్కలా గోలుగోలుమంటూ నుంచున్నారు. గద్గదకంఠంతో వాళ్ళని వోదారుస్తూ, తగినవాళ్ళకి వాహనాలూ అవీ ఏర్పరిచాడు విదురుడు.

తగిన రథంమీద ఎక్కి బయలుదేరాడు ధృతరాష్ట్రుడు. గాంధారీ మొదలైన యావన్మంది స్త్రీజనమూ, విదురుడూ, సంజయుడూ బయలుదేరారు. పిన్నలూ, పెద్దలూ అనకండా పౌరులు అందరూ భరించలేని దుఃఖంతో ఏడ్చారు. ప్రళయాగ్ని మంటలు ముట్టుకుని అల్లకల్లోలమైన జంతువులలాగ గోలుగోలుమన్నారు. పట్నంలోని కోమట్లూ పాటకజనమూ, శిల్పులూ, కమ్మర్లూ, వడ్రంగులూ, బంగారప్పనివాళ్ళూ, చాకళ్ళూ, మంగళ్ళూ ధృతరాష్ట్రుడితో బయలుదేరారు.

ఒక కోసెడుదూరం వెళ్ళేసరికి అశ్వత్థామా, కృతవర్మా, కృపాచార్యుడూ ఎదురువచ్చారు. అంతదూరంనించే చూసి రథాలు దిగారు. దుఃఖంతో తూలిపోతూ, కన్నీళ్ళు కారుస్తూ ధృతరాష్ట్రుణ్ణి చూశారు. గద్గదకంఠాలతో అన్నారు :

"మహారాజా, దుర్యోధనమహారాజు అడ్డులేనిశౌర్యంతో యుద్ధంచేశాడు. బ్రహ్మాండమైన బలపరాక్రమాలు చూపించాడు. దేవేంద్రుడూ మొదలైన దేవతల్ని మెప్పించాడు. దేవతల అతిథి అయి దేవలోకం వెంచేశాడు పరమసుఖమనుభవిస్తున్నాడు మన సేనలన్నీ ఆమహారాజుతో వెళిపోయాయి మేం ముగ్గురంమాత్రం మిగిలాం." పుత్రశోకంతో కుంగిపోతున్న గాంధారిని చూశాడు కృపాచార్యుడు. దుఃఖం పొర్లుకు వచ్చింది దగ్గిరికివెళ్ళాడు ఓదార్చాడు :

"దేవీ, విచారించకు. శత్రువుల్ని చంపి నీకొడుకులు స్వర్గానికి వెళ్ళారు. అక్కడ ఇంద్రభోగాలనుభవిస్తున్నారు. వందమందిలోనూ వొక్కడూ యుద్ధానికి భయపడలేదు; మడమతిప్పలేదు. వీరులై పోరాడారు; ఉత్తమగతులుపొందారు. యుదంలో వెనకడుగు వేయకండా, శత్రువుల్ని చంపి, వొళ్ళంతా అస్త్రాలు తగిలి, కళ్ళుమూయడమే వీరులికి ఉత్తమమరణం. వేదాలు ఘోషిస్తున్న మాట ఇది. దానాలూ, ధర్మాలూచేసినవాళ్ళకి లభించినపుణ్యలోకాలకంటే ధర్మయుద్ధంలో పోయినవాళ్ళకి దొరికిన పుణ్యలోకాలు ఉత్తమమైనవంటారు. అంచేత, కుమాళ్ళమరణం పొగడదగినమరణం కాని సామాన్యమైంది కాదు. అదలా వుండనీ, గెలిచామన్నకులుకు లేదు పాండవులికి. ఏమంటావా? గదాయుద్ధంలో అన్యాయం దెబ్బకొట్టి దుర్యోధనుణ్ణి చంపాడు భీముడు. అది తెలిసి, గతరాత్రి మేం ముగ్గురమూ పాండవశిబిరంమీద పడ్డాం. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలమూ తుడిచిపారేశాం. ద్రౌపదీకొడుకుల్ని వొక్కణ్ణీ మిగల్చలేదు. అయిదుగుర్నీ నరికేశాం. వాళ్ళ మేనమామల్ని పాంచాల రాజకుమాళ్ళని అందరినీ చంపేశాం. అంచేతవాళ్ళగెలుపు గెలుపు కాకుండాపోయింది.

"ఇక మా నిశ్చయం విను. నిశిరాత్రి మేం శిబిరం ముట్టడించినప్పుడు శిబిరంలో పాండవులు లేరు. కనక నే అంతపని చెయ్యగలిగాం. వాళ్ళని ఎదుర్కోడం తరం కాదు మాకు. తమకుమాళ్ళూ, సేనలూ చావడం విని దుఃఖంతోనూ, క్రోధంతోనూ మమ్మల్ని వెంటాడతారు వాళ్ళు. తప్పదు. వాళ్ళకి దొరక్కుండా తప్పించుకుపోవాలి మేం. అనుమతించు. విచారించకు" అన్నాడు.

ధృతరాష్ట్రుడితోనూ అలాగే అన్నాడతడు : "మహారాజా, పాండవులు వెంటపడతారు. భయపడుతున్నాం. పారిపోడమే ఇప్పుడు కర్తవ్యం మాకు. మీ అనుమతి పుచ్చుకుంటున్నాం. దైవకృతం తప్పనిసరి. విచారించకు. సెలవు"

ముగ్గురూ గాంధారికీ, ధృతరాష్ట్రుడికీ ప్రదక్షిణం చేశారు. తిరిగి తిరిగి చూస్తూ, రథాలెక్కి, భయపడుతూ రథాలు పరిగెత్తించారు. పారిపోయారు. ఆ వెళ్ళడం వెళ్ళడం గంగవొడ్డుకి వెళ్ళారు. అక్కడ వాళ్ళలో వాళ్ళు చెప్పుకుని విడిపోయారు. కృపాచార్యుడు హస్తినాపురం వెళ్ళిపోయాడు. కృతవర్మ ద్వారక చేరుకున్నాడు. అశ్వత్థామ వ్యాసాశ్రమం ఆశ్రయించాడు ; మునివేషం వేసుకున్నాడు.

అశ్వత్థామా వాళ్ళూ వెళ్ళిపోయేక మరింత కొత్త దుఃఖంతో హృదయం కుమిలిపోతూ, దారిలో అక్కడా అక్కడా ఆగుతూ, బాధపడుతూ, బయలుదేరాడు ధృతరాష్ట్రుడు.

అశ్వత్థామ శిరోరత్నం తెచ్చి, ద్రౌపదిని ఓదార్చాక, ధృతరాష్ట్రుడు వస్తున్న వార్త అందింది ధర్మరాజుకి. ఎదురువెళ్ళడానికి సిద్ధపడ్డా డతడు. "కొడుకులందరూ కూలిపోయారని విని హృదయం దహించుకుపోయి వస్తున్నాడు తండ్రి" అని జాలిపడుతూ, చిన్నబోతున్న మొహంతో కృష్ణుణ్ణి చూశాడు. "పదండి, మహారాజుని చూడాలి. తప్పదు" అన్నాడు. రణస్థలానికి బయలుదేరాడు.

కృష్ణుడూ, సాత్యకీ, భీముడూ, అర్జునుడూ, నకులసహదేవులూ రెండుపక్కలా నడిచారు. పుట్టెడుదుఃఖంతో ద్రౌపది వెంటనడిచింది. మత్స్య, పాంచాలదేశాల చుట్టాల స్త్రీలు ఆమెచుట్టూ నడిచారు. దుర్యోధనుడిప్రియురాళ్ళని తోలినాడు యుయుత్సుడు హస్తిన తీసుకు వెళ్ళి, రాత్రిఅక్కడవుండి, ఉదయానికి ధృతరాష్ట్రుడు బయలుదేరిపో డంవల్ల వెంటనే తిరిగివచ్చేశాడు. కనక అతడూ, ధర్మరాజుతో బయలుదేరాడు.

అలా అంతమందితోనూ ధర్మరాజు రణస్థలానికి వెళ్ళేసరికి ధృతరాష్ట్రుడుకూడా అక్కడికి వచ్చాడు. అతడిముందున్న స్త్రీలు ధర్మరాజుని చూడడంతోనే చేతులెత్తి ఏడుస్తూ రాగాలుతీశారు.

"ధర్మమేంతెలుసు ఈరాజుకి ? తండ్రుల్నీ, తాతల్నీ చంపే శాడు" అన్నారు కొందరు. "మామల్నీతోడబుట్టువుల్నీ, కొడు కుల్నీ క్రూరంగా చంపేశాడు, దయమాలినవాడు" అన్నారు కొందరు. "గురువుల్నీ, స్నేహితుల్నీ, వియ్యంకుల్నీ చంపేశాడు, జాలిమాలినవాడు" అన్నారు కొందరు. "భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, చంప డానికి చేతులెలా వచ్చాయి ?" దగ్గరసావచ్చి అన్నారు కొందరు. "చెల్లెలిమొగుణ్ణి జయద్రథుణ్ణి చంపావు, ఎందుకూ నీరాజ్యం ?" అన్నారు కొందరు. "ఇంతమందిని చంపానని కులుకుతున్నావు. ద్రౌపదికొడుకుల్నీ, అభిమన్యుణ్ణీ, మరుదుల్నీ మింగేశావు. ఎందుకూ నీసంపదా ?" అన్నారు కొందరు. అన్నిటికీ తలవొంచుకుని నడి చాడు ధర్మరాజు.

కొడుకులచావుకి దుఃఖపడుతూ,కొడుకులచావుకిదుఃఖపడుతున్న ధృతరాష్ట్రుడిదగ్గిరికి వెళ్ళాడు ధర్మరాజు. పాదాలమీద పడ్డాడు.

"ధర్మరాజు" — అని ధృతరాష్ట్రుడికి పక్కవాళ్లు విన్న వించారు.

వినగానే అప్రియం కలిగింది ధృతరాష్ట్రుడికి. హృదయంలో కొత్త దుఃఖం జ్వాలలా లేచింది. వాడిపోయిన మొహంతో ధర్మరాజుని ఎత్తి కౌగిలించుకున్నాడు. ఓదారుస్తూ శిరస్సు నిమిరాడు. తరువాత వరసగా భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ వచ్చారు. దగ్గరవాళ్లు పేరుపేరున వాళ్ళని తెలియచేశారు ధృతరాష్ట్రుడికి.

## ఇనపభీముడు

"భీముడు" అన్న మాట వినగానే ధృతరాష్ట్రుడు అనే అడివిలో భయంకరమైన కోపం అగ్గిలా భగ్గుమంది. పాపానికే సిద్ధపడ్డాడు గుడ్డి రాజు. కనిపెట్టేశాడు శ్రీకృష్ణుడు. అతడి మనసులోమాట ఇట్టే గ్రహించేశాడు. "దురాత్ముడు, ఎంతపనికి పూనుకుంటున్నాడో" అనుకున్నాడు. నాలిక కరుచుకున్నాడు. త్రికాలవేది శ్రీకృష్ణుడు. ధృతరాష్ట్రుడు అలాంటివాడని ముందే తెలుసు నతడికి. అందుకనే అంతకి ముందే ఇనుంతో భీముడివిగ్రహం తయారుచేయించి రహస్యంగా దాచివుంచాడు. ధృతరాష్ట్రుడి మొహం వైఖరి కనిపెట్టి, తటుక్కున అది తెప్పించి ధృతరాష్ట్రుడి ముందు పెట్టించాడు. భీముణ్ణి వెనక్కిలాగేశాడు. ఇనపభీముణ్ణి నిజమైనభీముడే అనుకున్నాడు ధృతరాష్ట్రుడు. పదివేల ఏనుగుల బలశాలి అతను. వల్లమాలిన కోపంతో రెండుచేతులతోనూ ఇనపభీముణ్ణి పట్టుకున్నాడు. గాఢంగా కౌగిలించుకున్నాడు. బలంకొద్దీ గుండెలికి అదుముకున్నాడు. గాట్టిగా నొక్కేశాడు. తన శరీరం పొంగింది. ముక్కురంధ్రాల్లోంచి రక్తం కారింది. అంత ఇనప విగ్రహమూ పెళపెళా విరిగిపోయింది. ముక్కముక్కలై పోయింది. "కొడుకులతోపాటు వీడూ చచ్చాడు. కడుపుడుకుతీరింది" అంటూ లోలోపల సంతోషించాడు. పైకిమాత్రం "అయ్యో, అయ్యో

భీమసేనా! వచ్చిపోయావా తండ్రీ!" కళ్లలోంచి నీళ్లు కారుతూ ముద్ద లెట్టాడు.

"ఏమిటిది ఏమిటి?" చిరునవ్వు నవ్వుతూ ఎత్తాడు శ్రీకృష్ణుడు- "భీముడు నిక్షేపంలా వున్నాడు. చెక్కుచెదరకుండా వున్నాడు. నువ్వు గుండె పిసింది భీముడు కాదు, ఇనుపభీముడు. నీకోపం పసికట్టి భీముణ్ణి వెనక్కి లాగేశాను. అతడి ఇనపవిగ్రహం నీముందు పెట్టాను. బలానికి నీతో సమానమైనవాడు ఎవడున్నాడు, మరొకడు? నీచేతులు రెండూ ప్రళయయముడి కోరలు వాటిలో పడ్డవాడు బతికి బట్టకట్ట డమే, మళ్ళీ? భీముణ్ణి బతికించడంకోసం నేనే ఈపని చేశాను. కొడుకులు పోయారన్న దుఃఖంతో అధర్మానికి తెగించావు. భీముణ్ణి చంపేయ్యడానికి పూనుకున్నావు ఆ దుర్మార్గుడున్నవాడు అగ్గిలో వేసినా చావడు. విధివిధానం తెలుసుకోలేక పోయావు; వెర్రివాడివి. భీముణ్ణే కాదు, పాండవులు అయిదుగుర్నీ చంపేసినా నీకొడుకులు తిరిగి బతికివస్తారా? అనవసరంగా అన్యాయంగా తలపడ్డావు. మేం నీకొడుకుచేతిలో పడ్డపాట్లు విచారించు. బంధుత్వం విచారించు. అనుకూలమైన మార్గం అవలంబించు. పాతివ్రత్యాలు మన్నించు" అన్నాడు.

ధృతరాష్ట్రుడి పరిచారకులు అతడి వొంటిమీద రక్తం కడుక్కుందికి నీళ్ళు తెచ్చి, విన్నవించారు. కడుక్కున్నాడతడు.

మళ్ళీ అందుకున్నాడు శ్రీకృష్ణుడు.

"వేదాలు చదివావు. శాస్త్రాలు విన్నావు. వృద్ధులగోష్ఠిలో మసిలావు. పురాణాలు తెలుసుకున్నావు. అన్ని ధర్మాలూ ఎరుగుదువు. నీతిపరీ నువ్వు తెలుసుకోకుండా వున్నావు. దుఃఖపడుతున్నావు. మండిపడుతున్నావు. నేనూ, భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ చెవిలోగూడుకట్టుకుని పోరపోరా చెప్పాము. సంజయుడూ మొత్తుకున్నాడు, ఉభయబలాలూ వివరించి. అవేవీ చెవినిపెట్టావుకావు.

ఏంచెయ్యడం? భీమార్జునుల భయంకరయుద్ధం తెలిసి తెలిసీ మనిషన్న వాడు ఎవడు వెళతాడు వాళ్ళమీదికి, వెర్రికాకపోతే?

తనమేలూ, తనకీడూ తాను తెలుసుకునీ హితులు చెప్పిన హితం అనుసరించీ మంచిగా నడుచుకునే రాజు పశ్చాత్తాపపడవలిసిన అవసరమేవుండదు. న్యాయంతలిచి నువ్వు చెయ్యవలిసింది చెయ్యలేక పోయావు. చెడుతోవనడుస్తున్న కొడుకునీ మళ్ళించలేకపోయావు. జూదంగెలిచామన్న నెపంతో కులకాంతని జుట్టుపట్టి ఈడ్చుకువచ్చారు. నిండుసభలో బట్టలువిప్పించారు. ఆకోపంతో నీకొడుకుల్ని చంపాడు భీముడు. కొడుకుల్ని చంపేశాడు కదా అని అతణ్ణి చంపడానికిపూను కున్నావు నువ్వు. ఏంన్యాయ మిది? నీ అవినీతి, కొడుకుల దుశ్చరిత్రమూ తలుచుకో. శోకం వొదిలిపెట్టు. శాంతించు" అన్నాడు.

కృష్ణుడి వేపు తిరిగాడు ధృతరాష్ట్రుడు:

"నువ్వుచెప్పిందంతా నిజమే. కొడుకులుపోయారన్న దుఃఖంతో వొర్పుపోయింది. కోపం ఆపుకోలేకపోయాను. అధర్మానికి నెట్టు కున్నాను. అవును నన్ను అనవలిసిందే నువ్వు. నీమాటలతో తెలివి వచ్చింది నాకు. కొడుకులకోసం బాధపడను, ఇక. తమ్ముడికొడుకులే నాకొడుకులు. వాళ్ళు నన్ను చూసుకున్నట్టు నడుచుకుంటాను" అన్నాడు.

అప్పుడు భీముడూ, అర్జునుడూ నకులసహదేవులూ వరసగా వెళ్ళి ధృతరాష్ట్రుడికి నమస్కరించారు. ఒక్కొక్కణ్ణీ కౌగిలించుకున్నాడు ధృతరాష్ట్రుడు. దీవించాడు. తరవాత యుయుత్సుణ్ణి ఎదటపెట్టాడు శ్రీకృష్ణుడు. వాత్సల్యంతో అతణ్ణీ కౌగిలించుకున్నాడు ధృతరాష్ట్రుడు. అదంతా అయాక ధర్మరాజుకేసి తిరిగాడు. "మీఅన్నదమ్ములు అయిదుగురూ గాంధారిదగ్గిరికి వెళ్ళండి" అన్నాడు.

# దీవించలేదు గాంధారి

కృష్ణుడితో కలిసి పాండవులు అయిదుగురూ గాంధారిదగ్గిరికి వెళ్ళారు. వినయంగా నమస్కారం చేశారు. దీవించలేదు గాంధారి. వందమంది కొడుకులూ పోయి కడుపు చెరువై పోతోంది ఆమెకి. శపించాలని ధర్మరాజు కేసి తిరిగింది.

అన్ని ప్రాణుల మనస్సులో నిమాటా దివ్యబోధవల్ల తెలుసుకునేవాడూ, మనోవేగం కలవాడూ, సర్వలోకపూజ్యుడూ అయిన వ్యాసముని అది తెలుసుకున్నాడు. ఉత్తరక్షణంలో అక్కడ ప్రత్యక్షమయాడు. అంతమందీ చేస్తున్న నమస్కారాలు అందుకుంటూ "ఓహో గాంధారీ ఆగూ ఆగూ" అని ఆమెఎదట నుంచున్నాడు — "ధర్మరాజు ధర్మపరుడు. అతడిమీద కోపం విడిచిపెట్టు. ఆదరించి కొంచెం ఆలకించు. దుర్యోధనుడు యుద్ధానికి బయలు దేరుతూ 'అమ్మా దీవించు' అంటే ఏమన్నావు? 'ఎక్కడ ధర్మంవుంటే అక్కడే జయం వుంటుంది' అన్నావు. మహాభారతయుద్ధంలో పాండవులు జయించారు. కనక వాళ్ళే ధర్మపరులు. నీమాటే నిజమయింది. అసూయలేని బుద్ధితో చూడు వాళ్ళని. గడిచిందేదో గడిచిపోయింది. దానికోసం కోపమెందుకు? నువ్వు శాంతురాలివని ఎప్పుడూ అనుకుంటాను నేను. మచ్చరం మాను. జనులు నిన్ను పొగుడుతారు. ధర్మం పరిగ్రహించు. పాండవులు నీకొడుకులు. రోషం విడిచిపెట్టు" అన్నాడు.

"కుంతికి ఎంతో నాకూ అంతే పాండవులు" అందుకుంది గాంధారి— "అసూయ లేదు నాకు. కొడుకులమీదా మచ్చరం? కడుపుకోత భరించలేక పోయాను. క్షణికమైన కోపానికి లొంగిపోయాను. అంతే. అవును, దుర్యోధనుడి తుంటరితనమే ఇంతా తెచ్చింది. శకుని కర్ణుడూ, దుశ్శాసనుడూ దుష్టాత్ములు తోడయ్యారు. కౌరవకులం కడతేరిపోయింది. యుద్ధధర్మం ప్రకారం పాండవులు చంపారు. దానికి

బాధించలేదు మనస్సు కాని, కృష్ణుడు కళ్ళెదుట గదాయుద్ధంలో నాభికి కింద అన్యాయంగా కొట్టాడు భీముడు. అది గుండెల్లో అగ్నిహోత్రంలాగ దహించేస్తోంది. యుద్ధంలో శూరులు ప్రాణాలు వొదిలిపెట్టారు, సహజమే. లోకంలో వున్నదే అది. కాని అన్యాయానికి ఎవరి కడుపు వుడకదు చెప్పు?" అంది.

గాంధారి గదాయుద్ధంసంగతి ఎత్తేసరికి గడగడలాడాడు భీముడు.

"తల్లీ," చేతులుజోడించి వినయంగా అంటున్నాడు — "ధర్మమో అధర్మమో, ప్రాణభయంతో అలా చేశాను నేను. దయతో క్షమించు. బలమూ, నేర్పూ రెండూ కలవాడు నీ కొడుకు. అలా కాకపోతే అతడితో అసాధ్యమే అయేది నాకు. అదలా వుండనీ — ధర్మరాజుని ధర్మంతోనే గెలిచాడా జూదంలో, దుర్యోధనుడు? ముట్టుతో వున్నదాన్ని, వొంటిచీరెతో వున్నదాన్ని ద్రౌపదిని దయమాలి కొలువులోకి తెప్పించి ఏమన్నాడు! వినలేదా నువ్వు? కూచోమని తన తొడలు చూపించలేదూ! ఆకోపం దహించుకుపోయి, తొడలు విరగ్గొడతానని నిండు సభలో శపథం చేశాను. చేసినశపథం చెల్లించుకోకపోతే క్షత్రియధర్మం తెలిసినవాళ్ళు నిందిస్తారు కదా! అసలు ఆసభలోనే ఆపని చేసివుండేవాణ్ణి. అన్నయ్య ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ అయి, అతడి పందానికి కట్టుపడిపోయాను అడవికి నడిచాను. అడవిలో అష్టకష్టాలూ పడి తిరిగివచ్చాం. సంధికోసం కృష్ణుణ్ణి కౌరవసభకి పంపాడు అన్నయ్య. అప్పుడు నేనూ కబురుపంపాను దుర్యోధనుడిదగ్గిరికి : 'నువ్వూ మేమూ అన్నదమ్ములం. మనలో మనం కొట్లాడుకుంటే పైవాళ్ళు చప్పట్లు కొడతారు. ఇదేమంత మంచిపని? మీరూ, మేమూ మన పెద్దలు చెప్పినట్టు వినుకుందాం. మనరాజ్యం మనం పంచుకుందాం' అన్నాను వినుకున్నాడా అతడు? లేదు. ఈసుపట్టాడు.

విరోధం పెంచావు. అందుకని అన్నగారు రాజ్యంకోసం యుద్ధంచెయ్యడమూ, నేను నాశపథం తీర్చుకోడమూ తప్పనిసరి అయింది. ఏవిధంగా అయినా పగతీర్చుకోవలసి వచ్చింది. అన్నీ తెలిసినతల్లివి. నువ్వే ఆలోచించు" అన్నాడు.

"అవునోయి తండ్రీ" అంది గాంధారి — "అలాంటిచావు చావ వలసిందే అనీగాను. నువ్వు చెప్పినవన్నీ నిజమే నాయనా, నిజమే. నీశపథం ప్రకారం నువ్వు చేశావు. తప్పేముంది? అయితే, శత్రువుని యుద్ధంలో చంపుతారే కాని, గుండెచీల్చి, పచ్చినెత్తురు తాగిన క్రూరాత్ములు ఎవరైనా వుంటారా, నువ్వు తప్ప? ఎక్కడన్నా విన్నామా ఈ ఘోరం? కోడేలూ, రాకాసీ చెయ్యవలసినపని కాని, మనిషి చెయ్యవలసినపనేనా ఇది?"

"ఇదీ శపథంకోసం చేసినపనేనమ్మా" అన్నాడు భీముడు — "ద్రౌపదిని జుట్టుపట్టి సభకి ఈడ్చుకువచ్చి, దుశ్శాసనుడు ఆమెబట్టలు విప్పడంలోనే కోపంలో వొళ్ళు తెలియడంలేదు నాకు. గుండెరక్తం తాగుతానని శపథంచేశాను అయితే నిజంగా రక్తం తాగాననే అనుకున్నావా తల్లీ! లేదు. నమ్ము చేసినశపథం చెల్లించుకోడానికి పెదవులు తగిలించాను, అంతే. అదీకాక అతడిమీద నేను కలబడినప్పుడు కౌరవసేనలోని వీరులు ఉద్వేలమైన బలంతోనూ, వల్లమాలిన తమకంతోనూ తెగించి నామీద విరుచుకుపడ్డారు వాళ్ళుభయపడాలనే రక్తం మొహానికి పూసుకున్నాను. అదిగో ఆ రెండుపనులకోసమే రక్తం తాగినట్టు నటించాను.

"ఇతరుల రక్తం తాగితేనే ఎంతో పాపమంటారు. అలాంటిది తమ్ముడిరక్తం తాగడానికి అంతవెర్రివాణ్ణా అమ్మా? అంత పాపకర్ముణ్ణా? అంతకఠినాత్ముణ్ణా?"

"గుడ్డివాళ్ళకి వూతకోలగా వొక్కణ్ణయినా వొదిలావు కాదోయి నాయనా! వందమందినీ మింగేశావు. వందమందిలోనూ వొక్కడైనా లేకపోయాడా, మీకు చెడ్డచెయ్యనివాడు? ఒక్కణ్ణి నువ్వు చంపకండా వొదిలేసివుంటే, నీశపథం తప్పిపోయేదా? నిస్సహాయుడైన ఆవొక్కడూ మీఅన్నయ్యని రాజ్యంఏలనివ్వకండా చేసేవాడా, చెప్పూ" అంది గాంధారి.

తల్లికడుపు కొడుకుల్ని తలుచుకున్నకొద్దీ తెరలు తెరలై వుప్పొంగింది. దుఃఖం. "దీనంతటికీ కారణం ధర్మరాజు." ఆమెముక్కు పుటాలు అదిరాయి. "ఏడీ ధర్మరాజు ఎక్కడ?" - క్రోధంతో కఠినంగా అడిగిందామె.

గజగజా వొణికిపోయాడు ధర్మరాజు వినయంగా చేతులు జోడించాడు, "అమ్మా, అమ్మా, ఇదిగో వున్నాను" మెత్తనిగొంతుకతో అన్నాడు. దగ్గిరికి వెళ్ళాడు - "నీకొడుకుల్ని చంపిన పాపాత్ముణ్ణి. క్రూరుణ్ణి. నిందార్హుణ్ణి. శాపంపెట్టు. చంపు. రాజులందరి చావుకీ నేనే కారణం. బంధువులచావుకి నేనే మూలం. నేనే తల్లీ, నేనే ఇంత నిష్ఠురంవహించాను. దండించు. అమ్మా, దండించు ధర్మరాజుని. స్నేహితుల్నీ, చుట్టాల్నీ, కొడుకుల్నీ అందరినీ చంపుకున్న ద్రోహికి రాజ్యమెందుకు? ప్రాణమెందుకు? భోగాలెందుకు?" అన్నాడు. తలవొంచుకు నుంచున్నాడు.

మరొకమాట అవడానికి నాలుకాడలేదు గాంధారికి. వేడివేడి నిట్టూర్పులు వొదులుతూ వూరుకుందామె. చేతులుజోడించి అలాగే నుంచున్నాడు ధర్మరాజు. కళ్ళకి కట్టివున్న గుడ్డఅంచుకింద సందులోంచి పతివ్రతఅయిన గాంధారిచూపు ధర్మరాజు కాలిగోళ్ళమీద పడింది. కందిపోయాయి గోళ్ళు. చూసి, కృష్ణుడి వెనక్కితప్పు

కున్నాడు అర్జునుడు. భీముడూ, నకులసహదేవులూ కూడా వెనక్కి తగ్గేశారు.

క్రోధంవొదిలేసింది గాంధారి. పాండవులమీద మాతృభావం కుదుర్చుకుంది. ఓదార్పుగొంతుకతో, వాళ్ళని కుంతిదగ్గిరికి వెళ్ళమంది. కుదుటపడ్డారు పాండవులు. అందరూ కలిసి కుంతిదగ్గిరికి వెళ్ళారు.

## "వచ్చారా నాయనా"

పదమూడేళ్ళతరవాత కొడుకుల్ని చూసింది కుంతి. అంతకాలానికి వాళ్ళనిచూసిన ప్రేమా, వాళ్ళు ఆపదలపాలైనదానికి దుఃఖమూ — కన్నీళ్ళుకారుస్తూ, వగరుస్తూ బావురు మంది ఆమె. తల్లికంటె దీనంగా ఏడుస్తూ అయిదుగురుకొడుకులూ "అమ్మా" అంటూ ఆమెపాదాలమీద వాలిపోయారు.

"వచ్చారా నాయనా" అంటూ, ఏడుస్తూ అయిదుగురిమీదా చేతులువేసి నిమిరింది కుంతి. ఒక్కొక్కణ్ణీ ఎత్తింది ఒక్కొక్కడివొళ్ళూ తడివింది. దారుణమైన అస్త్రాలూ శస్త్రాలూ తగిలిన గాయాలు చూసింది; చేతులతో తడివింది. వేడి వేడి నిట్టూర్పులు తీసింది. తపించిపోయింది. ఒక్కొక్కణ్ణీ గుచ్చి కౌగిలించుకుంది. వెక్కి వెక్కి ఏడ్చింది.

పాదాలు తడబడుతూ, మొహమంతా కన్నీళ్ళుచేసుకుని, మూర్తీభవించిన శోకదేవతలాగ వచ్చి కుంతిపాదాలమీద వాలిపోయింది ద్రౌపది. "అభిమన్యుడూ ప్రతివింధ్యుడూ — నీముద్దుమనవలు ఏరమ్మా, అత్తయ్యా!" అంటూ బొంగురుమంది — "నాన్నమ్మా, అని దగ్గిరికి రారేం తల్లీ! ఏరీ నాబాబులు? ఏడీ నా శ్రుతసోముడు? శ్రుతకీర్తి, శతానీకుడూ, శ్రుతసేనుడూ ఏరీ? ఏదీ నా బంగారు

తండ్రులు!" అంటూ తెగిపోయిన పూలతీగె ఎండకి వాడిపోయి వడిపోయినట్టు వార్లిపోయింది.

కోడలిమీద వొరిగిపోయింది కుంతి. పెద్దగొంతుకతో ఏడ్చింది. కోడల్ని ఎత్తి గుండెలికి అద్దుకుంది. ఓదార్చింది.

అందరూ కలిసి గాంధారిదగ్గిరికి వచ్చారు. గాంధారిపాదాల మీద పడి వెక్కి-వెక్కి ఏడ్చింది ద్రౌపది.

"ఊరుకో అమ్మా, వూరుకో" వోదారుస్తూ అంది గాంధారి- "నీవొళ్ళు చెడిపోతుందే అమ్మా, వూరుకో. నువ్వు ఏడుస్తున్నావు. నీభర్తలూ కుమిలిపోతున్నారు. మనవలుఃపోయి కుంగిపోతున్న కుంతికి ఎవరు ధైర్యం చెపుతారు?

"నిన్ను నేను వోదారుస్తున్నాను. నన్ను నువ్వోదార్చవద్దా అమ్మా! వంశమందికొడుకుల్ని మింగేశాను. మన ఇద్దరిబతుకూ వొక్కలాగే వుందే తల్లీ! దేవుడు మనమీదే పడ్డాడే అమ్మా!

"ఇంతా అవుతుందని తెలిసే విదురుడు అంతమొత్తుకున్నాడు సభలో. వినీ, పాపిష్ఠిరాలిని అడ్డుపడ లేకపోయానే తల్లీ! కొంప కూల్చుకున్నాను. పుట్టిముంచుకున్నాను. ఎవళ్ళమేం చెయ్యగలం? కాలవశాన, జరగవలసింది జరిగిపోయింది. ఊరుకో."

---

# స్త్రీపర్వం



## రెండో ఆశ్వాసం

ద్రౌపదిని ఓదార్చాక, వ్యాసమునిఅనుగ్రహంవల్ల గాంధారికి దివ్యదృష్టిలభించింది. తనవ్రతభంగంకాకండా, కళ్ళకట్టు విప్పనక్కర లేకండా యుద్ధభూమియావత్తూ ఆమెకి అద్దంలా అవుపించింది.

### రణభూమి

అబ్బా! దారుణంగా వుంది రణభూమి. గొడుగులు చీలికలై పోగులు పడివున్నాయి. జెండాకొయ్యలు విరిగిపోయి చెల్లాచెదురై వున్నాయి. జెండాలు చిరిగిపోయి, డాళ్ళు ముక్కలై పడున్నాయి. పచ్చడిపచ్చడి అయిపోయున్నారు పదాతులు. గుండపిండి అయిపోయు న్నాయి రథాలు. రథాలగుర్రాలూ, సారథులూ దొంతులుదొంతులు వొరిగిపోయున్నారు. రౌతులూ మావత్తులూ పొత్తిక లేకండా పడు న్నారు. ఏనుగులూ, గుర్రాలూ పీనుగుపెంటలై వున్నాయి. పేగులు పోగులు, కండలు కొండలు, మెదళ్ళూరక్తమూ మడుగులు మడుగులు – మహాభీభత్సంగావుంది.

చచ్చినీ్న బతికేవున్నట్టు కలకలలాడుతూన్న మొహాలతో పడు న్నారు రాజులు. హృదయాలమీద రత్నహారాలు మెరుస్తున్నాయి. భుజకీర్తుల ఇంద్రనీలమణులు జిగేలు మంటున్నాయి. కిరీటాల వజ్రాలు తళతళలాడుతున్నాయి. కంకణాల గరుడపచ్చలు మెరిసిపోతున్నాయి. అంతమందీ తెగిపోయి రక్తాల్లో మునిగి పడున్నారు.

బాణాలూ, ధనుస్సులూ, పరిఘలూ, తోమరాలూ, ఈటెలూ, కత్తులూ, ముసలాలూ, చక్రాలూ ముక్కలుముక్కలై వున్నాయి. కండకండలు మాంసాలూ, విరిగిన ఎముకలూ, పగిలిన కపాలాలూ అన్నీ కలగాపులగమై ఘోరంగావుంది రణరంగం.

మెడలోతు రక్తంలో దోసిళ్ళు దోసిళ్ళు రక్తం తాగుతూ తేనుస్తున్నారు రాకాసులు. రక్తంలో మునిగి ఎగురెక్కి నాట్యాలు చేస్తున్నారు. విరగబడి నవ్వుతున్నారు. తన్నుకుంటున్నారు. తిట్టు కుంటున్నారు. ఒకళ్ళని వొకళ్ళు ఎత్తుకుని గెంతుతున్నారు. కలిసి మాంసాలు తింటున్నారు.

వరళ్ళూ, రాంబందులూ, గెద్దలూ, కాకులూ, తోడేళ్ళూ పేగులు లాక్కుతింటున్నాయి. కండలు పీకుతున్నాయి. మెదళ్ళు జుర్రుతున్నాయి. రక్తాలు గటగటా తాగుతున్నాయి. కళ్ళగుడ్లు వొలుచుకు మింగుతున్నాయి. గుండెకాయలు కబళిస్తున్నాయి. కొవ్వు వూడతీసి చప్పరిస్తున్నాయి. మూలుగులు పీలుస్తున్నాయి. చస్తూ చస్తూ ఏనుగులూ, గుర్రాలూ మూలుగుతున్నాయి; తన్నుకుంటు న్నాయి. భటులు గింజుకుంటున్నారు. రాంబందులూ అవీ బెదిరి తప్పుకుంటున్నాయి. తిరిగీ వచ్చి కాట్లాడుతున్నాయి. కబళిస్తున్నాయి. కలబడుతున్నాయి. గుండెలు పగిలించేస్తోంది రణభూమి.

అంతా చూసింది గాంధారి. దద్దరిల్లిపోయింది. కలతపడిపో యింది. బేజారైపోయింది. ఆమె పెదవులు ఎండిపోయాయి. తల తిరిగిపోయింది.

వ్యాసముని పాండవుల్ని పిలిచాడు. "బంధువులకవాలికి అగ్నిసంస్కారం చెయ్యండి" అని చెప్పాడు; అంతర్థానమయాడు.

శ్రీకృష్ణుణ్ణి వెంటపెట్టుకుని, ధృతరాష్ట్రుడితో కలిసి అగ్ని సంస్కారానికి పూనుకున్నారు పాండవులు. కౌరవకాంతలందరినీ

శవాలదగ్గిరికి నడిపించారు. భర్తలూ, కొడుకులూ, అన్నదమ్ములూ, మనవలూ, బంధువులూ, స్నేహితులూ పీనుగులై పడుండడం చూసి మతులుపోయాయి కౌరవస్త్రీలకి. రాగాలుతీసి ఏడ్చారు కొందరు. గోలుగోమన్నారు కొందరు. కిందపడి దొర్లారు కొందరు. జుత్తులు వీపులమీద వేలాడుతూ వెర్రిగా తిరిగారు కొందరు. పనివిపనివి ఏడ్చారు కొందరు. గుణాలువల్లిస్తూ రాగాలుతీశారు కొందరు. నిశ్చేష్టులై నిలబడిపోయారు కొందరు. నెత్తీ మొహమూ మొత్తుకున్నారు కొందరు.

## గాంధారి దుఃఖం

"చూడూ చూడూ కృష్ణా!" ముంచుకువస్తూన దుఃఖంతో కృష్ణుణ్ణి పిలిచి అంది గాంధారి— "తలచెడినవాళ్ళని ధృతరాష్ట్ర మహారాజు కొడుకళ్ళని చూడు కంటికీ మంటికీ కన్నీళ్ళతో దీనంగా ఎలా దేవులాడుతున్నారో చూడు. ఏమి టేమిటో పనివిపనివి ఏడుస్తున్నారు. ఒకళ్ళనొకళ్ళు అన్నల్నీ తమ్ముళ్ళనీ నిరూపించి చూపించుకుంటున్నారు. ఒకళ్ళమొహం ఒకళ్ళు చూసి వలవలా ఏడుస్తున్నారు. తలలు విరబోసుకుని మొత్తుకుంటున్నారు. భర్తలుపోయిన వీరపత్నులు! కొడుకులుపోయిన వీరమాతలు! భర్తలశవాలమీద కాకులు వాలుతూ వుంటే తగలడానికైనా చేతులురాక నిశ్చేష్టులై నిలబడిపోతున్నారు నాకోడళ్ళు. పగవాళ్ళకి పండుగగా వుందికదూ, ఇది!

"చూడు! శల్యుడూ, ద్రుపదుడూ, కర్ణుడూ, ద్రోణుడూ కళ్ళుమూసినీ కాంతిపోకండా వున్నారు. తేజస్సు మాయకండా వున్నారు. మంటలారిపోయినా కాంతిమాయని నిప్పుల్లా వున్నారు. అందరినీ మించిపోయి వెలిగిపోతున్నాడు చిట్టితండ్రి సుభద్రకొడుకు.

"అక్కడా అక్కడా ప్రభువులు పడున్నారు. చుట్టూ వీర యోధులు పడున్నారు; వెలిగిపోతున్నారు. గ్రహాలతోనూ, చుక్కల తోనూ వెలిగిపోతున్న ఆకాశంలావుంది యుద్ధభూమి.

"అర్జునుడూ, భీష్ముడూ, ద్రోణుడూ, భీముడూ, కర్ణుడూ — మహావీరులు ప్రయోగించిన దివ్యాస్త్రాలు తగలడంచేత చెడకండా వికృతంకాకండావున్న యోధవీరులశరీరాలు రాబందులూ, నక్కలూ, గెద్దలూ, కాకులూ పీక్కుతిని ఎంగిలిచేశాయి.

"అయ్యో, హంసతూలికాతల్పాలమీద కాని పడుకోని ఈ మహాభోగుల మృదుదేహాలు చూడు. కరుకునేలమీద పొర్లాడుతు న్నాయి. గుండెలు పగిలిపోతున్నాయి చూసి.

"చెవికి ఇంపైన వీణపాటా, మురళిపాటా, నిత్యోత్సవంగావినే రాజులదగ్గిర నక్కలు వూళవేస్తున్నాయి. మంచి గంధమూ కస్తూరీ పులుముకునే మహారాజులు నెత్తురు బురదలో పొర్లుతున్నారు. యౌవన వతులు సున్నితంగా, నేర్పుగా తీసిపెట్టే వీర హారాలూ అందమైన అలంకారాలూ గెద్దలు పీకుతున్నాయి. ఏరాతిగుండె భరిస్తుం దిది చూసి?

"ప్రాణాలు వొదిలితేసినా ఆయుధాలు వొదలలేదు కొందరు భటులు, బతికున్నట్టే కనిపిస్తున్నారు, చూడూ! రణభూమికి కళతెస్తున్నారు.

"ఊపకొక్క, ఆపకొక్క వందిమాగధులు పొగుడుతూవుండే రాజులచుట్టూ స్త్రీలు వనిపవనివి ఏడుస్తున్నారు.

"నిద్రలోవున్న సేనలాగ కవచాలతోనూ, ఆయుధాలతోనూ కొందరు పడున్నారు. బతికేవున్నారని రాంబందులూ గెద్దలూ దగ్గిరికి చేరకండా వున్నాయి.

"కృష్ణా ! నువ్వే, నువ్వే చేయించిన పని ఇదంతా.

"చూడు, పాంచాలస్త్రీలూ, కౌరవస్త్రీలూ ఎలా వలవలా ఏడుస్తున్నారో చూడు. భర్తల శవాలదగ్గిర, తండ్రుల శవాలదగ్గిర, కొడుకుల శవాలదగ్గిర, అన్నల శవాలదగ్గిర, తమ్ముళ్ల శవాలదగ్గిర ఎలా దేవులాడుతున్నారో చూడు.

"మొండాలదగ్గిర శిరస్సులు కానక బాధపడుతూ నాలుగు దిక్కులా వెదుకుతున్నారు కొందరు. తలలు చేతులతో పట్టుకుని మొండాలకోసం పీనుగుల్లో తడుముతున్నారు కొందరు. తలలూ, మొండాలూ చేర్చి, మొహాలు బాదుకుంటూ బావురుమంటున్నారు కొందరు. ముక్కముక్కలైన అవయవాలు వొక్కొక్కటీ చేర్చి, స్వరూపం ఏర్పడడంతోనే చూసి, మూర్ఛపోతున్నారు కొందరు. రాబందులూ, వరళ్ళూ పీక్కుతినేసి ఎంత వెదకినా స్వరూపం దొరక్క మొర్రోమంటున్నారు కొందరు. ఇవన్నీ చూడడానికి గతజన్మలో ఏంచేసుకున్నానో నేను ? "

## దుర్యోధనుడి కళేబరం

ఇంతలో దుర్యోధనుడి కళేబరం కనపడింది గాంధారికి. కెవ్వున కేక వేసి, మొదలునరికిన అరటిచెట్టులాగ పడిపోయిందామె; మూర్ఛ పోయింది. కొంచేపటికి తెలువుకుంది. పరిచారికల ఊతపట్టుకుని కొడుకుశవందగ్గిరికి వెళ్ళింది. "హా రాజరాజా" అంటూ గుండెల మీద కన్నీళ్ళు కారుస్తూ వాలిపోయింది. "బంగారంలాంటి శరీరం నాయనా, ఏమైపోయిందోయి! మీ అమ్మ వచ్చిందోయి బాబూ! భక్తి చూపించవేమోయి తండ్రీ! పరాయిదాన్ని చేసేశావా కన్న తండ్రీ!" అంటూ వనివివనివి ఏడ్చింది. హాహాకారాలు చేసింది. తన వెంటనే మెల్లిమెల్లిగా వచ్చిన కృష్ణుడితో అంది :

"యుద్ధానికివస్తూ "అమ్మా, దీవించు అన్నాడు నాబాబు, చేతులుజోడించి. 'ధర్మం ఎక్కడుంటే జయమూ అక్కడే నాయినా' అన్నాను. అలా ఎందుకన్నాననంటావా? జూదంనాడు జరిగింది చూసి భయపడి, కౌరవులకి అది హాతవాఁరుస్తుంది కాని పూరికేపోదు అన్నారు ప్రజలు అందుకే వున్నమాట నోటమ్మట వచ్చేసింది నాకు. కొడుకని కొడుకుమాటలంటే ధర్మహాని కాదూ? దీవించడంమానేసి మధ్యస్తంగా మాట్లాడడమే కాదు, ఇంకా ఏమన్నానో విను : 'యుద్ధంలో భయపడి పారిపోతే అపకీర్తి వస్తుంది. అపకీర్తికంటే చావు మేలు. కనక యుద్ధంచేసి స్వర్గానికి వెళ్ళు. అమరత్వంపొందు" అన్నాను. నేనున్నట్టేచేశాడు నాబాబు. పేరూ, పెంపూనిలబెట్టాడు. తనకేం! కన్నకడుపు కనక దేవేస్తోంది నాకు. శత్రువుల్ని చంపాడు. ధర్మయుద్ధం చేశాడు. స్వర్గానికి వెళ్ళాడు. నాకన్నతండ్రికోసం విచారమెందుకూ అనుకుంటే, దిక్కులేకండా అయిపోయిన అంధ రాజునిచూసి కడుపుచెరువైపోతోంది.

"మణికిరీటాలతో దేవేంద్రుల్లాటి రాజులు ఆపక్కా ఈపక్కా సేవిస్తూవుండేవారు నాతండ్రిని. అంత వైభవం అనుభవించిన నారాజ రాజుని పాపిష్టిదైవం ఎంతపాడుదశపెట్టాడో, చివరికి !

"రత్నాల బంగారంపీఠంమీద కూచునేవాడు నా బాబు. అందకత్తెలు పట్టువిసనకర్రలతో విసిరేవాళ్ళు. అయ్యో, రాబందులు రెక్కలతోవిసురుతున్నాయి, ఇప్పుడు.

భీముడిపాలబడి, సింహంచంపేసిన మదపుటేనుగులాగ పడు న్నాడు మానాయన. విదురుడూ, తండ్రీ పదివేల విధాల నూరి పోశాడు. వినకున్నాడుకాను. పోయ్యాకాలం ముంచుకువస్తుంటే మంచి మాట ఎలావింటాడు, మనిషి ? పదకుండు అక్షౌహిణీలసేన అడుగులికి మడుగులొత్తిన మహారాజు మాబాబు. వెనక వాక్కనుమనిషి లేకండా

అయిపోయాడు కుమారుడు! గదపట్టుకుని ఒక్కడే పోరాడాడు; కళ్ళు మూశాడు!

"కృష్ణా, లెక్కాజవాలేని ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ-అన్నిటితోనూ కొడుకులు అష్టైశ్వర్యాల్లో ఓలలాడడం చూశాను. అన్నీ అయిపోయాయి. పరాధీనమే అయిపోయింది బతుకు. ఇదీ ఈకళ్ళతోనే చూశాను, ఇప్పుడు.

"చూడు, అదిగో కోడలు భానుమతి. కొడుకు చావుకంటే కోడలిదుఃఖం గుండె బద్దలుచేస్తోంది. దావాగ్నిలా దహించేస్తోంది దుఃఖం. అంతమెక్కడ దీనికి?

"కొడుకు లక్ష్మణుణ్ణి చూసి, ఇటు భర్తకేసి మొహం తిప్పుతోంది భానుమతి. చేతులతో మొహం మొత్తుకుంటోంది. మళ్ళీ కొడుకుకేసి వెళుతోంది. అతడి చందమామ మొహంమీద మొహం పెట్టి మూర్ఛపోతోంది. తెలువుకుని భర్తదగ్గిరికి వస్తోంది. గుండెల మీద గుండెలుపెట్టి వారిగిపోతోంది. కన్నీళ్ళు కారుస్తోంది. నిశ్చేష్టురాలై వూరుకుంటోంది. చెలికత్తెలమీద పడి ఏడుస్తోంది. తలవిరబోసుకు తిరుగుతోంది. కందిరీగలాటినడుం నాచిట్టితల్లిది. మాబాబు చేతుల్లో బుజ్జగింపుతో కులుకుతూవుండేది. ఇక ఎలా చూసేది దీన్ని? అయ్యో, ఎంతపాపిష్టిదాన్ని! కొడుకూ మనవడూ ఇలా పడుంటే చూసి భరిస్తున్నాను. ఇంకా బతికేవున్నాను! ఇనపగుండె, పగిలిపోకుండావుంది. ఇంతకఠినమైంది. నాశనంలేదు దీనికి! కృష్ణా! ఇంత దారుణం భరించినవాళ్ళు ఎక్కడైనా, ఎన్నడైనా వుంటారా మరొకళ్ళు, నేను తప్ప?

"తల్లీ భార్యా ఏమైతేనేం అనుకున్నాడు నాదుర్యోధనుడు; దగాచేసి వెళ్ళిపోయాడు. వేదాల్లోని మాటే నమ్ముకున్నాడు; తన

మాటే ఇది తాను చూసుకున్నాడు. స్వర్గానికి దారితీశాడు. న్యాయమేనా ఇది నా బాబుకి?"

ఇలా ఎన్నో విధాల దుఃఖపడింది గాంధారి. తక్కిన కొడుకుల శవాలు చూసింది. ఏడుస్తూ కృష్ణుడితో అంది :

"చూడు కృష్ణా, చూడు? నావందమంది కొడుకులూ భీముడి చేతుల్లో ఘోరంగా చచ్చి, ఎలా అడ్డదిడ్డంగా పడివున్నారో చూడు. మొహాలు వికారంగా అయిపోయీ, కాళ్ళూ చేతులూ విరిగిపోయీ ఎలా పడివున్నారో నా కన్నతండ్రులు! ఏతల్లి భరిస్తుంది చెప్పూ, చూసి? భార్యలు మూగి ఎలా గోలుగోలు మంటున్నారో చూడు! చందనం పూసిన చీడీలమీద అడుగుపెట్టడానికి అసహ్యించుకునేవాళ్ళు నాకోడళ్ళు. రక్తంతో తేమదేరిన నేలమీద ఎలా పొరులుతున్నారో చూడు!

"బాలలూ, తరుణులూ, ప్రౌఢలూ విరహం అగ్గిలా మాడ్చేస్తూవుంటే ఎలా క్షోభపడిపోతున్నారో చూడు! బలమూ, ధైర్యమూ, శౌర్యమూ ఎందునా లోపంలేని కౌరవకుమాళ్ళభార్యలు దిక్కుమాలినవాళ్ళయిపోయారు. దైన్యంగా ఏడుస్తున్నారు. దైవం ఏంచెయ్యడు?

"అలంకారాలూ, గొడుగులూ, జెండాలూ, కవచాలూ అన్నిటితోనూ కలిసి ముక్కముక్కలైపోయాయి మాబాబుల శరీరాలు. కృష్ణా ఎలా భరించడం చూసి? దేవుకుపోతోంది కడుపు. తల్లీ, తండ్రీ తొలిజన్మలో చేసుకున్న పాపంకాకపోతే నావందమంది కొడుకుల్ని మింగేస్తాడా, ధర్మరాజు?

## దుశ్శాసనుడి కళేబరం

"ఇదుగో నా దుశ్శాసనుడు. గదతో కొట్టేశాడు భీముడు. ఒంటిరక్తమంతా తాగేశాడు, తనివితీరినట్టు. అయ్యో ఎలా పడు

న్నాడో నాతండ్రి ? ద్రౌపదిని దుడుకుతనంతో సభలోకి ఈడ్చుకు వచ్చాడు. దుర్యోధనుడికీ, కర్ణుడికి సంతోషం కలిగినట్టు ఆమెని అవమానపరిచాడు. ఎంతో బాధపడింది ఆయిల్లాలు. భీముడిహృదయం మండింది. అదిగో దానివల్లే ఇంతా వుట్టింది.

"సభలో ద్రౌపదిని ఏదు అవస్థపెట్టడం తెలిసి వుచ్చచీవాట్లు పెట్టాను దుర్యోధనుణ్ణి. కృష్ణుడు కంటికి రెప్పలా చూస్తూన్నాడు ద్రౌపదిని. కిందామీదా కానకండా ఇలా నీచంగా ఆమెని పరాభవంచేశారు. ఆమెకన్నీళ్ళు కట్టికుడుపుతాయి. శత్రువులు అనే తుప్పల మీదికి ఏనుగు భీముడు. మాటల బరికోలలతో అతణ్ణి రేపుతున్నారు. మంచికేనా ఇది? మూర్ఖత్వం వొదిలిపెట్టు. మన వంశంలోకల్లా పవిత్రురాలు ద్రౌపది. ఆమెని గౌరవించు. క్రూరాత్ముడు, నీచుడు, మా అన్నయ్య శకుని. అతడి సాంగత్యం వొదలిపెట్టు. పుణ్యాత్ములు పాండవులు. వాళ్ళతో కలిసీ మెలిసీ మసులుకో. కౌరవకులం చల్లాగా పదికాలాలు బతుకుతుంది అని ఎన్నోవిధాల నూరిపోశాను. ఈచెవిని విని ఆచెవిని వొదిలిపెట్టేశాడు నామాటలు. గర్వపోతుకి మంచి రుచించదు. ఇంతకీ దైవగతి తప్పించడం ఎవరిశక్యం ?

"అవాళమాటలు గుండెల్లో నాటుకునే వున్నాయి భీముడికి ; బాధిస్తూనేవున్నాయి. సమయంకోసం కాసుకునేవున్నాడు; పగపట్టిన పాంలాగ. ఇవాళ ఇంతపనీ చేసేశాడు. కాని ఇలా పగతీర్చుకోడం ఎక్కడన్నా కద్దా ? గుండెలుచీల్చి రక్తం తాగాడు. ఎందునాలేని ఘోరంచేశాడు. వీరులుచెయ్యవలిసిన పనేనాఇది ? కాళ్ళూ చేతులూ బారసాగిపోయి, గుండెలు చీలిపోయి, వికారంగా వెల్లకిలా పడున్నాడు కొడుకు! సింహం గోళ్ళతో చీల్చేసిన ఏనుగులా పడున్నాడు. ఏతల్లి ప్రాణం భరిస్తుంది చూసి ?

"ఇదుగో నాముద్దుతండ్రి వికర్ణుడు. మేఘాల్లో చంద్రుడిలాగ ఏనుగులమధ్య పడున్నాడు. అల్లైతాడులాగి కాయలుకాసిన మా నాన్న ముంజేయి పిల్లరాబందు కరిచిన్ని చీరలేకపోతోంది చూడు! భార్య వలవలా ఏడుస్తోంది. కన్నీళ్ళతో చుట్టూ తిరిగి కాకులూ, గెద్దలూ రొప్పుతోంది. పోకండా వున్నాయవి. అయ్యయ్యో, తల్లులు చూడవలిసిన దృశ్యమేనా, ఇది? ఉగ్రమైన భీముడిబాణం తగిలి చచ్చి చవ్వనట్టే కలకల్లాడుతున్నాడు నాకన్న.

"యుద్ధంలో ఎవ్వరూ తేరిచూడలేనంత బలశాలి దుర్ముఖుడు. భీముడిచేత చచ్చి బుగ్గిలో ఎలా మాసిపోయి పడున్నాడో చూడు! నక్కా తోడేలూ పీడిమొహం సగంసగం తినేశాయి. అయినా వున్న అందం పోయి సప్తమినాటి చందమామలా వుంది నాబాబు మొహం.

"అదుగో శూరసేనుడు. తోడేళ్ళు, రాంబందులూ పీక్కు తినేసి వికారంగా వున్నాడు. చుట్టూ భోరుభోరున ఏడుస్తున్నారు భార్యలు.

"ఇదుగో ఇదుగో నా వివింశతి. బంగారునాన్న. పువ్వులాంటి సుకుమారుడు. చాతుర్యానికి పెట్టింది పేరు. అప్సరసలమధ్య దేవేంద్రుడిలాగ అందకత్తెల మధ్యవుండే నారాజు చుట్టూ కాకులూ, గెద్దలూ వాలుతున్నాయి. అగరూ, కస్తూరీ, మంచిగంధం పూసుకునే నా నాన్న శరీరం రక్తంలో మునిగి తేలుతోంది. సంగీతమంటే చెవికోసుకునేవాడు. పక్కని నక్కలు వూళవేస్తున్నా యివ్వాళ!

"అయ్యో, నాబిడ్డదుర్మ్వహుడు! బంగారం తొడిమల బాణాలు వొంటినిండా గుచ్చుకుని పడున్నాడు, కర్ణికార పువ్వులుపూసిన కొమ్మలాగ.

# అభిమన్యుడి కళేబరం

ఇదుగో నీ మేనల్లుడు అభిమన్యుడు. అంత పెద్ద పద్మవ్యూహం గడ్డిపరకలా చూశాడు. కొండంత ధైర్యంతో మెరుపు మెరిసినట్టు చొరబడ్డాడు. గుండెలుతీసిన యుద్ధం చేశాడు. దుర్యోధనుణ్ణి గడగడలాడించాడు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలమూ కాల్చి వొదిలిపెట్టాడు. ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా, శల్యుడూ, కృపుడూ—ఇంతమందీ వొక్కడిమీద పడ్డారు. దేవతల్ని మెప్పించాడు చిట్టితండ్రి. తుదకి కళ్ళుమూశాడు. పాడిమాలి పదిమందీ మీదపడితే పోరిపోరి, అలిసిపోయి, నిద్రపోతున్నాడు. అంతే. చచ్చిపోయిన వాడికి ఇంత అందం ఏలావుంటుంది!

"చూడు కృష్ణా, చూడు! ఉత్తర అతడి గుండెలమీద ఎలా వాలిపోతోందో చూడు. మొహంమీద మొహం పెడుతోంది. ముందు చెలికత్తెల చాటునించి వోరచూపులు చూసేది; సిగ్గుపడేది. దుఃఖంతో ఇప్పుడు మాటిమాటికీ భర్త మొహం చూస్తోంది. గట్టిగా కౌగిలించుకుంటోంది. శిరస్సు తొడలమీద పెట్టుకుని ఏడుస్తోంది. నీకేసి జాలిగా చూస్తోంది. కన్నీళ్ళు తుడుచుకుంటోంది; దుఃఖంలో మునుగుతోంది; తేలుతోంది.

"వినూ కృష్ణా; వినూ ఉత్తర ఎలా ఏడుస్తోందో విను. 'అమ్మ సుభద్రని వొదిలి ఎక్కడికి వెళ్ళిపోయావు! దేవతల్లాంటి తండ్రుల్ని వొదిలేశావా! అర్జునుడి కొడుకుని శ్రీకృష్ణుడి మేనల్లుణ్ణి యుద్ధంలో ఎవరు చంపగలిగారు! ఇన్ని మాటలాడుతున్నాను. నాతో మాటాడవేం! ద్రోణుడూ, అశ్వత్థామా, కృపుడూ, కర్ణుడూ ధర్మం తెలిసిన వాళ్ళంటారే! నిన్ను కుర్రాణ్ణి వొక్కణ్ణే ఎలా ముట్టడించారు! ముక్కాకలా తీరిన వాళ్ళ మగతనమేనా ఇది! ఇంత తక్కువపనికి ఎలా తెగించారు! నువ్వు వారికి అన్నప్పుడు ఏమనిపించింది, వాళ్ళకటిక గుండెలో పాండ

వులూ పాంచాలంవాళ్ళూ మహావీరులు. వాళ్ళకళ్ళముందు జంకన్నా లేకండా కొట్టి చంపేశారు కౌరవులు. ఇంతకంటె చిత్రమేముంది? మామయ్య లేకపోడం చూసి వంచనచేసి చంపేశారు నిన్ను. ఎంత ఫుడికిపోయిందో మామయ్య మనస్సు!

"'శత్రువులందరినీ చంపారు పాండవులు. సామ్రాజ్యమంతా సంపాదించారు. దేవేంద్ర వైభవం అనుభవిస్తే మాత్రం నువ్వు లేందే సంతోషముందా తండ్రులికి! నీశరీరంలో ప్రాణంలేదని తెలిశాక నా శరీరంలోంచి ప్రాణమెందుకు పోకండావుందో!

"'ఎంతలో వెన్నెల చీకటైపోయింది? మన ముచ్చటంతా ఆరునెలలతోనే అంతమైపోయింది. ఇంతేనా ఈజన్మకి నోచుకున్నాను

"'దేవలోకంలో ఎవతెతో ముచ్చటలాడుతున్నావు? నాకు మల్లే ఎవతెముంగుర్లు దువ్వి లాలిస్తున్నావు? దేవతాస్త్రీల మనస్సులు కరిగిస్తావు కాని పూరుకోవు. వాళ్ళగోష్ఠిలో నా నడవడి తలుచు కుంటావో' అంటోంది విను.

"అదిగో ఉత్తరతల్లి వాళ్ళూ ఆమెని తీసుకుపోతున్నారు, గోలుగోలుమని.

"ద్రోణుడి బాణాలతో కూలిపోయి పడున్నాడు విరాటరాజు. రక్తంలో మునిగిన శరీరంనిండా ధూళికప్పేసింది గాలి. రాబందులూ, గెద్దలూ ఎంతతరిమినా పోకండా మూగుతున్నాయి. అతడి భార్యా కూతుళ్ళు ఎలాఏడుస్తున్నారో చూడు! అ సొ్యా ఉత్తరుడు యువకుడు. అంతకంటె యువకుడు కాంభోజుడు. వాడివాడి ఆయుధాలు తగిలి అభిమన్యుడూ, లక్ష్మణకుమారుడూ వొరిగిపోయారు.

### కర్ణుడి కళేబరం

"ఇడుగో కర్ణుడు. ఇతడి ప్రాపు చూసుకునే పాండవుల భుజ బలానికి జంకకండాయుద్ధానికిదిగాడు దుర్యోధనుడు. ధర్మరాజుపక్కలో

బల్లెమింతడు. ఇతడిపేరు చెపితే కంటిమీంద కొప్పుపడేది కా దతడికి. ఎంతమందిమహావీరుల్నో చంపాడు. వల్లమాలిన కోపంకలవాడు. నోటికిఅడ్డూ ఆపూ లేనిమనిషి. బ్రహ్మాండమైన ధైర్యశాలి. శౌర్య శాలి. ఏనుగుతోకూలిపోయిన ఏనుగులాగ అర్జునుడితో దెబ్బతినేసి తెగిపోయాడు.

“వెనక దుర్యోధనుణ్ణి, ముందు శత్రువుల్నీ, అరిచేతిలో ప్రాణాల్నీ పెట్టుకుని తిరిగాడితడు. చూడు చుట్టూ కేకరాణులు ఎలా గొల్లుమంటున్నారో, చూడు ! అందులో వృషసేనుడితల్లి, అదిగోకింద పడి దొర్లుతోంది:

“కర్ణా మొనగాళ్ళకి మొనగాడివి. పరశురాముడి శాపంతో బాణం పనికిరాకండా పోయింది. బ్రాహ్మడికోపంతో రథం కూరుకు పోయింది. అర్జునుడిబాణం ప్రాణంతీసింది !”

ఇలా ఎన్నోవిధాల దుఃఖపడింది గాంధారి. నిలబడి చూసింది. ఇంకా ఇలా అంది :

“కృష్ణా, చూడూ చూడూ, కాకులూ గెద్దలూ బాగాతినేసి కృష్ణచతుర్దశినాటి చంద్రుడిలావుంది కర్ణుడిమొహం. ఆమొహంమీదే మొహంమోపి, ఏడుస్తోంది అతడిరాణి.

“ఇదుగో, ఎన్నిసేనలు మీదపడినా వెన్నుచూపని శూరుడు బాహ్లీకుడు. నిద్రపోతున్న పెద్దపులిలాగ పడున్నాడు. చచ్చినీ బతికున్నట్టే వున్నాడు. శరీరంలో ప్రాణంలేకపోయినా ఈ కురు వృద్ధుడి మొహం పున్నమచంద్రుడిలా వుంది.

## జయద్రథుడి కళేబరం

“ఇదుగో అల్లుడు జయద్రథుడు. అన్నమాట నిలబెట్టుకున్నాడు అర్జునుడు. అంతమంది యోధవీరులూ, దుర్యోధనుడూ, అంతపెద్దసేనా

అడ్డుకున్నా లాభంలేకపోయింది. అంతమందినీ ముళ్ళగొట్టేసి మొత్తసరి చేరాడు అర్జునుడు. దుస్సలమొహంచూసి, దయతలిచి పాండవులు అప్పుడు ప్రాణంతో వొదిలేశారు కాని, అడివిలో ద్రౌపదిమీద చెయ్యివేసినప్పుడే చచ్చిపోయేవా డితడు. విధి తప్పిందికాదు. చెల్లెలు దుస్సలమీద దయతప్పింది వాళ్ళకి.

"భర్తశిరస్సు కానక దుఃఖంలేనట్టు అటూ ఇటూ వెతుకుతూ తిరుగుతోంది కూతురు. ఇది చూడడంకంటే దుఃఖమేముంది నాకు? అవాళరాత్రి అర్జునుడు ప్రతిజ్ఞచేశాడు. వేగులవాళ్ళవల్ల వింది పిల్ల. అప్పుడు భర్తకి చెప్పిన బుద్ధులు వనివివనివి ఏడుస్తోంది వింటూ "'అర్జునుడి ప్రతిజ్ఞకి భయపడుతో కాల్లోనా అడ్డులే దన్నాను. అన్నివిధాలా అతడు అధికు డన్నాను. కౌరవసైన్యం సముద్రంతోకు అన్నాను. ద్రోణుడు అర్జునుడిమీద చెయ్యిచేసుకో డన్నాను. అర్జునుణ్ణి ఎవ్వరూ ఆడ్డలే రన్నాను. అతడితో నువ్వు చాలలే వన్నాను. నామాటవిను, ధర్మరాజుని శరణు వేడు అన్నాను. అతడే నిన్ను రక్షిస్తాడు అన్నాను. కాళ్ళావేళ్ళా పడి బతిమిలాడాను. మహారాజా, విన్నావు కావు' అంటోంది. 'చెల్లెల్ని ముండమోపించి సంతోషిస్తున్నారా అన్నదమ్ములు' అంటోంది. పాండవుల్ని ఆడిపోస్తోంది.

"కొడుకుని రక్షించుకుందామని ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ శాయశక్తులా ప్రయత్నించారు. పేరుపడ్డయోధు లందరూ ఎత్తివచ్చారు. సర్వసేనలూ ముట్టడించాయి. అంతమందినీ ఒక్కడే అడ్డేశాడు జయద్రథుడు. ఒక్కణ్ణీ పద్మవ్యూహంలో అడుగు పెట్టనివ్వలేదు. నిజంగా జగజ్జేత వీరుడు జయద్రథుడు. తప్పు జయద్రథుడిది అవునో కాదో, అర్జునుడుమాత్రం అతడిమీదే శపథం పట్టాడు. అవును, తానే అందరినీ అడ్డేశాడు. అదే అభిమన్యుడిచావుకి కారణమయింది. తప్పే జయద్రథుడిది.

"ఇదుగో శల్యుడు. జేరగిలాపడిపోయాడు పాపం! ఒకపక్క నుదురు నేలకి మోసింది. నిద్రలోలాగేవుంది మొహం. పిసరంతా వాడిపోలేదు. పైకివచ్చిన నాలిక కాకులు పీక్కుతినేస్తున్నాయి. మాద్రి తోడబుట్టువు అయినా ఆలోచించలేదు ధర్మరాజు. దారుణంగా చంపేశాడు. బంధుత్వం చూస్తారా రాజులు!

"అన్నిగుణాల్లోనూ ధర్మరాజుతో సరివస్తా ననుకునేవాడు శల్యుడు. తుదకి అతడిచేత ప్రాణంవొదిలేశాడు. దుర్యోధనుడికోరిక మీద కర్ణుడికి సారథ్యంచేశాడు. అతడు సారథికావడం చూసి, శత్రువులు గడగడ లాడారు. అయితే ఏంలాభం, ములుకుల్లాటి మాటలతో కర్ణుణ్ణి కుల్లుపోట్లు పొడిశాడు.

"బురదలో కూరుకుపోయిన ఆబోతుచుట్టూ ఆలకదపులాగ తనచుట్టూ తనరాణులు మూగి ఏడుస్తున్నారు.

"ఇదుగో భగదత్తుడు. దేవేంద్రుడితో బలాసురుడుపోరాడి నట్టు అర్జునుడితో పోరాడాడు. కృష్ణా, అర్జునుడిమీద అభిమానంవల్ల ఇతడికి ఈపాట్లు పెట్టావు. రాబందులూ, నక్కలూ తెల దోలు చుకు తినేశాయి. అయినా తలమీద బంగారందండ అందంచెడకుండా వుంది.

"అయ్యో, భీష్ముడుమామయ్య! బలానికీ, శౌర్యానికీ తనసాటి మనిషి మరొకడు లేడు. అలాంటి మహావీరుడు యుద్ధంలో పడిపోయాడు. పాండవులమీద కనికరించి తన చావుగుట్టు తానే చెప్పాడు చంపండని. కాకపోతే ఈయననేమిటి గెలవడ మేమిటి! పొరపాటునైనా ప్రతినిష్ఠ వొదలి ఎరగడు. తండ్రికోసం రాజ్యంవొదిలేశాడు. బ్రహ్మచర్యం పూనాడు. పౌరుషానికి పెట్టింది పేరు. కురువంశం విచ్ఛిన్నంకావచ్చినప్పుడు పరమోపాయంతో ఈయనే నిలబెట్టాడు. తుదకి కౌరవసంతతితోనే కళ్ళుమూశాడు. ఇష్టంవచ్చినప్పుడు ప్రాణం

వొదిలిపెడతానని మృత్యువుని పిడికిల్లో పెట్టుకు కూచున్నాడు. దేవుడే కాని మనిషా ఈయన?

“పదిదినాలపాటు చీకట్లవంటి పాండవసేనలు పడగొట్టి అస్తమించాడు భీష్మభానుడు. శరవణం (రెల్లు) లో కుమారస్వామిలాగ శరశయ్యమీదవున్నాడు. మూడుబాణాలు తలగడ పెట్టాడు అర్జునుడు. బాణంతో పాతాళగంగ పోసి దాహం తీర్చాడు. కల్పాంతంలో కిందపడిన సూర్యబింబంలాగ వీరశయనంలో వెలుగుతున్నాడు.

“ఈయన స్వర్గానికి పోయాక ధర్మసందేహాలు ఎవళ్ళనడిగి తెలుసుకుంటారు కౌరవులు?

## ద్రోణుడి కళేబరం

శత్రుసేనలనే కారడివి కాల్చికాల్చిచల్లారిపోయిన దావాగ్ని - అదుగో గురుదేవుడు, ద్రోణాచార్యుడు. ఎన్నిమహాస్త్రాలు దేవేంద్రుడు ఎరుగునో అన్నీ ఎరుగును ఈయన. అన్నిటిలోనూ సిద్ధహస్తుడు. పరశురాముడిలాగ ధనుర్వేదం వేళ్ళమీద వుండేది. నాలుగు వేదాలూ నాలికచివర తాండవమాడేవి. ఈయనశిక్షణకిందే ధనుర్విద్యలో మొనగాడు అర్జునుడు. అర్జునుడేఅన్న మాటేమిటి? కౌరవ రాజకుమార్ళూ సాత్యకీ ఈయననాశ్రయించే తలెత్తారు. ఇంతటి యోధుడు మరిలేడు, లోకంమీద కాలం ఇంతా చేసింది. సమయానికి మహాస్త్రాలు స్ఫురించకండాచేసింది. కాకపోతే చుట్టుపట్లచేరగలిగే వాళ్ళా శత్రువులు? గురువుని ముందుపెట్టుకునేకదా, శూరులైన పాండవుల్ని యుద్ధానికి పిలిచారు నాకుమార్ళు. అంతటివాడు శత్రువు తలనరికేస్తే ఎలా పడున్నాడో చూడు!

“చూడు కృష్ణా! ముప్పూటలా శిష్యులు వినయంతో నమ

స్మరించే ఈపాదాలు ందూ నక్కలు కొరికితినేశాయి. దైవం ఏంచెయ్యాడు !

"ఎంతవాడైతేనేం. ఏమైనా చేస్తుంది విధి. కాకపోతే ద్రుపదుడికొడుకేమిటి, ద్రోణాచార్యుడి తల నరకడమేమిటి ? అసంభవం.

"కృపాచార్యుడి తోబుట్టువు కృపి తలవిరబోసుకుని ఎలువు రేసినగొంతుకతో భర్తదగ్గిర ఎలాఏడుస్తోందో చూడు. అదిగో ఏంతోమంది ద్రోణుడి శిష్యులు అస్త్రశస్త్రాలతోనూ, రథాలచెక్కలతోనూ చితి పేర్చారు సామగానం చేస్తున్నారు. సామమేజాలిగా పాడుతోంది. అగ్గిమీద మరో అగ్గి పెట్టినట్టు చితిమీద ద్రోణుణ్ణి పెట్టారు. అగ్గిముట్టించారు. కృపీ, ఆమెవెంట శిష్యులూ చితికి అపసవ్యంగాతిరిగి గోలుగోలుమంటూ గంగానదికి వెళ్ళారు. అయ్యో, బాణవిద్య భూమిమీద తెగలబడిపోయింది.

"భూరిశ్రవసుణ్ణి చూడు. సాత్యకి అక్రమంగా తలనరికేస్తే వొరిగిపోయాడు. గద్దలు వొలుచుకుతినేస్తున్నాయి. అదుగో తండ్రి సోమదత్తుడు. పుత్రశోకంతో వుండి, సాత్యకితో కలబడినప్పుడు, అక్రమంగా తనకొడుకుని అతను చంపినమాట ఎత్తి గద్దిస్తున్నట్టే ఇప్పుడూ అవుపిస్తోంది మొహం. అదుగో భూరిశ్రవుసుడి తల్లి కోడళ్ళని చూసి వలవలా ఏడుస్తోంది. భర్తని ఉద్దేశించిఎలాఏడుస్తోందో వినూ, వినూ.

" 'కల్పాంతంలాగ కౌరవకులం హతవారిపోయింది చూడవేం' అంటోంది. 'దానాలతో ఎన్నోయజ్ఞాలు చేశాడు నీముద్దుకొడుకు భూరిశ్రవసుడు. అక్రమంగా అర్జునుడు చెయ్యి నరికేశాడు. సాత్యకి తల నరికేశాడు. ఈపుణ్యావంతతిదిక్కు చూడవేం, మహారాజా ! కోడళ్ళదుఃఖం కన్నెత్తిచూడవేం ? వీళ్ళు ఎవరో చూడూ ! ఒంటిబట్టలతో తలలు విరబోసుకుని బెదరిపోయిన బెగ్గురుపక్షుల్లాగ అరుస్తు

న్నారు. యుద్ధానికి బైలుదేరినప్పుడు నీబంగారంగోడుగు కవచానుడి కిచ్చావు. అతడికే అది అందమన్నావు. ముక్కలై అది రథంమీద పడుంది చూడు, అని పనివిపనివి ఏడుస్తోంది. కృష్ణా, ఊతల్లినీ, కోడళ్ళనీ ఎలా చూడడం ? ఎంతనీచప్పనిచేశాడో అర్జునుడు !

"సాత్యకిప్రాణం రక్షించడంకోసం తెగించి అర్జునుడు చెయ్యి నరికేశాడే అనుకో, ధర్మమే అందాం దాన్ని. కాని ముక్కుమూసుకు కూచున్న మహాత్ముణ్ణి ఏమొహంపెట్టుకు తలనరికాడంటూ, సాత్యకి ? ఇంత నికృష్టప్పని ఏలోకంలో అయినా వుంటుందా, చెప్పూ ? అతడి భార్యల్లో వొక చక్కనిచుక్క భర్తచెయ్యి అడ్డాల్లో పట్టుకుని తడివి తడివి పనివిపనివి ఏడుస్తోంది విను.

" 'అయ్యో ఈచెయ్యి – మెల్లిమెల్లిగా నామొలనూలిమణులు కదిలించేది ; తడివేది : ప్రేమపుట్టించేది చన్నులు మర్దించేది ! సిగ్గు మళ్ళించేది. నాభీ, తొడల్లూ, పిరుదులూ మెత్తమెత్తగా వొత్తేది ! మనస్సు కరిగించేది. మెలకువతో పోకముడి విప్పేది ; మైమరుపు కలిగించేది. అలాంటి ఈచెయ్యి అగ్గిలోపెట్టి బుగ్గిచెయ్యవలిసివచ్చింది. ఇంకొకడితోపోట్లాడుతూవుంటే, ప్రక్కనించి కృష్ణుడికళ్ళఎదట చెయ్యి నరికేశాడు అర్జునుడి. సిగ్గన్నా లేకపోయింది. సభలో ఇది ఎలా పొగుడుతాడో కృష్ణుడు ? అర్జునుడుమాత్రం ఎలా మెచ్చుకుంటాడో తనని ?" అని ఏడ్చిఏడ్చి వూరుకుంది. అదిగో ఆమెని తక్కినస్త్రీలు ఏలిపదానిలాగ చుట్టూ మూగుతున్నారు.

## శకునికళేబరం

"ఇదుగో నూఅన్న శకుని. మేనల్లుడు సహదేవుడి బాణాలతో చచ్చిపడున్నాడు. రాబందులు పీక్కుతింటున్నాయి. మాయలికి గురువు. అయితే, అన్ని మాయలూ నీచేతమాయమయ్యాయి. మాయ

జూదమాడాను. ధర్మరాజు రాజ్యం లాక్కున్నాను. చేసిన కర్మ ఫలిం చింది, ఇప్పుడు మహాయుద్ధంలో [illegible] గెలిచాను. యుద్ధ జూదంలో ప్రాణం పోడాను. ఇతను [illegible]లాట చేస్కోడమల్లా కౌరవకులనాశనంకోసమే అయింది. పాండవులతో విరోధానికంతా ఇతడే కారణం; మూలకర్త. [illegible] వచ్చాడు. మోస గాడై మేనల్లుడిప్రాణాలు తీశాడు. [illegible], [illegible] నూ [illegible] వచ్చాడు. [illegible] నాళ్ళు. వాళ్ళతో ఆతగువులు [illegible] చేసుకున్నాడు. బుద్ధిలేనివాళ్ళు నాకొడుకులు. యుద్ధంకోసం వాళ్ళని [illegible]. [illegible]. అన్నదమ్ములమధ్య విరోదంపెట్టాడు.

"ఇదుగో కళింగరాజు. యుద్ధంలో వెన్ను చూపని ధీరుడు. ఒళ్ళంతా బాణాలై పడున్నాడు. మట్టిగా [illegible] ఎండకి వాడి పోయిన పూలదండల్లాగ, దుఃఖంతో [illegible] ఉన్నారు

"మగధరాజు జయత్సేనుణ్ణి చూడు [illegible] స్త్రీలు మొత్తుకుంటున్నారు. [illegible] ఎక్కడా [illegible] ఇలాంటి ఏడుపు. గుండె నీరైపోతోంది నాకు.

"అదుగో కోసలరాజు బృహద్బలుడు. అభిమన్యుడుకొట్టిన బాణాలు చెమట్లుపోస్తున్న చేతులతో పెరుకుతున్నారు భార్యలు. బావురుమంటున్నారు. మూర్ఛపోతున్నారు. మాటిమాటికీ మొహం చూస్తున్నారు. విధిని తిడుతున్నారు. దుఃఖాగ్నిలో దహించుకుపోతు న్నారు. తుంచేశాక ఎండతగిలి వాడిపోయినా అందంచెడని పద్మాల్లా వున్నాయి వాళ్ళ మొహాలు.

"ద్రోణుడిబాణాలతో ప్రాణాలుపోయి పడున్నారు ధృష్టద్యు మ్నుడికొడుకులు. భుజకీర్తులూ, కంకణాలూ, హారాలూ ఒంటిమీద

వెలిగిపోతున్నాయి. రణభూమికి అలంకారంలా అవుపిస్తున్నారు వాళ్ళు.

"ఇదుగో కేకయరాజులు. అగ్నిహోత్రుడై మండాడు ద్రోణుడు. రథంగుర్రాలవడి గాలిఅయింది; రెచ్చగొట్టింది. బాణాలు మంటలై విజృంభించాయి. మిడతలై కేకయులు అయిదుగురూ మాడిపోయారు.

"అదుగో ద్రుపదమహారాజు. సింహంచంపిన ఏనుగులాగ ద్రోణుడిచేత చచ్చిపోయాడు. ఈయన తెల్లగొడుగు చూశు, ఎక్కడా బాణంతగులకండా రణరంగమన్న ఆకాశంమీద శరత్కాలం పూర్ణ చంద్రుడిలా అవుపిస్తోంది.

"భార్యలూ, కోడళ్ళూ అతడికి అగ్ని సంస్కారం చేశారు. ఏడుస్తూ అదుగో గంగవేపు వెళుతున్నారు.

"అదుగో చేదిరాజు ధృష్టకేతుడు. సీమేనమరిది శిశుపాలుడి కొడుకు. ఎంతమందినో చంపాడు. ద్రోణుడంతవాణ్ణి ముచ్చెమటలు పోయించాడు. తుదికి అతడిబాణాలికి బలిఅయిపోయాడు. అతడితలా కాళ్ళూ తొడలమీద పెట్టుకుని ఏడుస్తూన్నారు భార్యలు.

"అదుగో అతడికొడుకు సుకేతుడు. ఇతణ్ణీ ద్రోణుడే చంపే శాడు. ఈతండ్రీకొడుకుల్ని చూస్తే మా దుర్యోధనుడూ, లక్ష్మణ కుమారుడూ జ్ఞాపకం వస్తున్నారు. కడుపుదేవుకుపోతోంది. నాకే ఇలా వుంది. వాళ్ళ తల్లులు ఎంత తల్లడిల్లిపోతారో పాపం!

"అదుగో అవంతిరాజులు విందానువిందులు. పూచిన మద్దిచెట్లు కూలిపోయినట్టు, వొంటినిండా నగలతో చచ్చి పడున్నారు. చూడు కృష్ణా, చూడు.

"ఇంతమందీ బుగ్గిలో కలిసిపోయారు. భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, భూరిశ్రవుడూ, అశ్వత్థామా, కృపుడూ, జయద్రథుడూ

కృతవర్మా, దుర్యోధనుడూ, శల్యుడూ సామాన్యులా? అమానుషులు. మహారథికులు. వీళ్ళు కళ్ళెర్రచేస్తే దేవతలైనా తెగిపోతారు. అలాంటి వీరుల పాలబడినన్నీ నువ్వూ నీమగుడులు పాండవులూ, తమ్ముడు సాత్యకీ చెక్కుచెదరిన పాపానపోలేదు. మహాద్భుతం ఇది. భీష్ముణ్ణీ మొదలైనవాళ్ళని ఎవళ్ళయినా గెలవగలరా? దైవానికి అసాధ్యం లేదు. నావందమంది బిడ్డల్నీ ఎత్తుకుపోయాడు.

"ఆవాళ సంధికి నువ్వు వచ్చావు; తిరిగిపోయావు. ఆవాళఎంత చెప్పావో అంతాఅయింది. భీష్ముడూ, విదురుడూ మొత్తుకున్నారు. విన్నానుకాను. మహామతులు వాళ్ళు. వాళ్ళమాట ఎలాతప్పుతుంది? అన్నంతా జరిగింది."

## గాంధారిశాపం

పశ్చాత్తాపదుఃఖంతో మూర్ఛపోయింది గాంధారి; లేచింది. పుత్రశోకం హృదయంలో దావాగ్నిలా మండింది! పొంగుతుంది. కృష్ణుడి వేపు తిరిగింది. దుఃఖం కోపంకింద మారింది.

"కృష్ణా," వొణుకుతున్న పెదవులతో అంది గాంధారి — "కౌరవులూ, పాండవులూ ఈర్ష్యతో కయ్యానికి కాలుదువ్వారు. అడ్డుపడ్డావు కావు. తగిన జనబలం వుంది నీదగ్గిర. మంచీ చెడ్డాఏడమ్మిచ్చి చెప్పగల సమర్థుడివి. నువ్వు చెయ్యలేందంటూ లోకంలో లేదు. అయినా ఉపేక్షచేశావు. దుర్యోధనుణ్ణి తుదముట్టించడానికే పూనుకున్నావు. అంతమంది రాజుల్నీ, సేనలతోకూడా అంతం చేశావు. అన్ని రాజ్యాలూ పాడైపోయాయి. దానికి తగినఫలం అనుభవించు. శపిస్తాను.

"నాపాతివ్రత్యపుణ్య ఫలంతో సంపాదించిన తపోబలంతో శపిస్తున్నాను. ఉత్తముజ్ఞాతులు తమలోతాము కొట్టుకు చచ్చినట్టు

చేశావు. నీ జాతిజనులూ, నువ్వూ ఇవాళ్టినుంచి ముప్పయిఆరు సంవత్సరాలు నిండేసరికి ఇలాగే కొట్టుకుచస్తారు. దిక్కులేనిచావు చస్తావు నువ్వు. నాలాగే మీ ఆడాళ్ళు గోలుగోలు మంటారు. నాలాగే భర్తల్నీ, కొడుకుల్నీ, బంధువుల్నీ పేరుపేరునీ ఏడుస్తారు" అంటూ అదురుతూన్న పెదవులతో పలికింది.

చిరునవ్వునవ్వుతూ సమమనస్సుతో విన్నాడు శ్రీకృష్ణుడు. "గాంధారీ!" గంభీరంగా అన్నాడు - "యాదవులికి వుండనేవుంది మునిశాపం. నువ్వు కొత్తగా చెప్పింది ఏముంది, నమిలిందే నమలడం కాని? యాదవులికి ఎలాగూ నాశనం తప్పదు. దేవతలైనా వాళ్ళని చంపలేరు. వాళ్ళలో వాళ్ళే కొట్టుకులాడి చస్తారు."

కృష్ణుడిమాటలు విని గడగడలాడారు పాండవులు. బతుకుమీద ఆశవొదులుకున్నారు.

"లేవమ్మా, లే. కాలంచేసిన బంధువులికి అగ్నికార్యాలు చేయించాలి" అంటూ గాంధారితో ఇంకా ఇలా అన్నాడు కృష్ణుడు; "అయినా నువ్వు ఇంత ఏడిచిపోతున్నావెందుకు? నీకొడుకు చేసిన దుర్మార్గాలు నువ్వు ఎరగవా? తల్లికీ, తండ్రికీ, తాతకీ, గురువుకీ, బాహ్లీకుడికీ లొంగనివాడు నీకు లొంగుతాడా? దురభిమానంతో ఈస్థితికి వచ్చాడు. మీ అపరాధం మీరు అనుభవించారు. నేనేం చేశాను, మధ్యన? ధైర్యం తెచ్చుకో. దుఃఖం విడిచి పెట్టు. బిడ్డకీ, చావుకీ ఏడ్చినకొద్దీ మనస్సు బాధపడుతుంది. యుద్ధంలో వురికే కొడుకుల్నే కోరుకుంటారుకదా, రాజులకూతుళ్ళు!"

కృష్ణుడిమాటలు చెవి చుర్రుమన్నట్టు వింది గాంధారి. జవాబు చెప్పకుండా వూరుకుంది.

అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజుని అడిగాడు;

"బాబూ, మనసేనల్లో వున్నవాళ్ళ లెక్క తెలుసు నీకు. చచ్చినవాళ్ళు ఎంతమందో తెలిస్తే చెప్పూ?"

76,00,44,320

"తెలిసిన పేరుపడ్డవాళ్ళు డబ్భయిఆరుకోట్లా, ఇరవై వేలమంది కాలంచేశారు. సామాన్యులు ఇరవైనాలుగువేల మున్నూటా, ఇరవై మంది మరణించారు. మొత్తం డబ్భయి ఆరుకోట్లా, నలభైనాలుగు వేలా, మూడువందల ఇరవైమంది." అన్నాడు ధర్మరాజు.

"వీళ్ళంతా ఏగతికి పోతారో?" అడిగాడు ధృతరాష్ట్రుడు.

"అస్త్రాగ్నిలో శరీరాలు ఆహుతి చేసినవాళ్ళు యావన్మందీ స్వర్గానికే వెళతారు" అన్నాడు ధర్మరాజు — "దేవకన్యలతో కూడా దేవేంద్రుడు వాళ్ళని పూజిస్తాడు. ఇక, ఆయుధాలు తగిలి, పిరికిమందు పుచ్చుకుని, చచ్చినవాళ్ళు గుహ్యాలోకానికి వెళతారు. యుద్ధంలో ఎలా చచ్చినా సరే, ఉత్తమలోకాలికే పోతారు; అధోగతికి పోరు. తెలిసినవాళ్ళు చెప్పినమాట ఇది."

"అయితే, దిక్కువున్నవాళ్ళకీ, దిక్కులేనివాళ్ళకీ అందరికీ అగ్నిసంస్కారం చెయ్యించవచ్చుకదా?" అడిగాడు ధృతరాష్ట్రుడు.

"అవును" అందుకున్నాడు ధర్మరాజు - "అందరూ ఆహితాగ్నుల లాంటివాళ్ళే. అయితే ఇంతమందికి ఉదక క్రియలు జరిగించడానికి తగినవాళ్ళు లేరు. మనమే పూనుకుని వీలైనంతవరకూ ఈపని చెయ్యాలి" అన్నాడు.

అజ్ఞాతవాసం తరవాత విరాటరాజు దగ్గిర బయలుపడిన నాటినించీ తమతోనే వుండి శాంతిక, పౌష్టిక, శ్రౌత, స్మార్త క్రియలన్నీ నడుపుతూన్న ధౌమ్యుణ్ణి పిలిచాడు. విదురుణ్ణీ, సంజయుణ్ణీ చూసి అన్నాడు:

భరతకులం వాళ్ళకీ, ఎవ్వరూ లేని తక్కిన యావన్మందికీ విధి ప్రకారం అగ్నిసంస్కారం జరిగించండి."

అలా వాళ్ళని నియోగించాడు. వాళ్ళకి సహాయంకోసం సారథుల్నీ, అప్పుడు హాస్తినాపురంనించివచ్చిన వాళ్ళలో తగినవాళ్ళనీ నియమించాడు. అంతకిముందే తెప్పించిన చందనంకర్రలూ, అగురు ఖండాలూ, పట్టువస్త్రాలూ, కస్తూరీ, కుంకమూ, నేతికుండలూ, నూనె కడవలూ మొదలైన వస్తువులు ధౌమ్యులపరం చేశాడు.

విదురుడూ, సంజయుడూ, ధౌమ్యుడూ సంస్కారకార్యానికి పూనుకున్నారు. బ్రాహ్మలతోకూడా వెళ్ళి దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, కర్ణుడూ, శల్యుడూ, అభిమన్యుడూ, ఘటోత్కచుడూ, విరాటరాజూ, ధృష్టకేతుడూ మొదలైనవాళ్ళకీ, పేర్లు తెలిసిన నానాదేశాల రాజులకీ కర్రలతోనూ, విరిగిన రథాలచెక్కలతోనూ, ఈటెలూ, ధనుస్సులూ, బాణాలూ మొదలైన ఆయుధాలతోనూ చితులు పేర్పించారు. పితృమేధక్రియలు నడిపి, నిప్పుముట్టించారు. ఎవ్వరూలేని రాజుల్ని వేలువేలు పోగులుపెట్టి బాగా కర్రలు పేర్పించి, అగ్గి ముట్టించేశారు. ఋగ్వేదమూ, యజుర్వేదమూ పఠించారు బ్రాహ్మలు. సామగానంచేశారు. స్త్రీజనంఏడుపులు భూమీ, ఆకాశమూ ప్రతిధ్వనించాయి. చితులపొగలు అంతటా నిండిపోయాయి. చేతనంకల ప్రాణికోటి యావత్తూ ఏడ్చింది.

## కొంగున అగ్గి ఎలా దాచావమ్మా!

అంతా అయాక వినయంగా ధృతరాష్ట్రుణ్ణి ముందుపెట్టుకుని గంగానదికి బయలుదేరాడుధర్మరాజు. బంధువులూ, స్త్రీలూఅందరూ వెంటనడిచారు. అంతమందీ గంగలోస్నానంచేశారు. కాలంచేసిన కౌరవులికి తిలోదకా లిచ్చారు.

అప్పుడు మొహంనిండా కన్నీళ్ళుచేసుకుని, ధర్మరాజు దగ్గిరికి వచ్చింది కుంతి.

"కర్ణుడికి కూడా తిలోదకా లివ్వండి నాయనా" అంటూ ప్రారంభించింది - "కౌరవులికి తన విల్లే పెట్టనికోటగా, యుద్ధంచేశాడు నాతండ్రి. మీ సేనలికీ, మీ అయిదుగురికీ తలమునకలైనట్టు పోరాడాడు. అర్జునుడి బాణంతో తల తెగి కళుమూశాడు. లోకమంతా రాధకొడుకు, రాధకొడుకు అన్నారు. మీరూ అలాగే నమ్మారు. కాని కర్ణుడు నాతొలికొడుకు నాయనా! మీఅయిదుగురికీ అన్న. సూర్యనారాయణమూర్తి అనుగ్రహంవల్ల కవచకుండలాలతో నాకడుపున పుట్టాడు" అంది.

చెవుల్లో నిప్పులుపోసినట్టు అయింది పాండవులికి దుఃఖంతో తలతిరిగిపోయింది. భీముడూ వాళ్ళూ నిశ్చేష్టులైపోయి నిలబడిపోయారు.

"కొంగున అగ్ని ఎలా దాచావమ్మా ?" తరుక్కుపోతున్న హృదయంతో తల్లడిల్లిపోతూ అన్నాడు ధర్మరాజు— "అతడి అపరాక్రమం చూసుకునే భీముడితోనూ, అర్జునుడితోనూ కలబడ్డాడు దుర్యోధనుడు. అతడిపరాక్రమంవల్లే విదేహ, పౌండ్రదేశాల రాజులు అరికాపులయారు. అతడి విక్రమంముందు మనసేన పటాపంచలయేది. అతడి దివ్యాస్త్రాలమహిమకి దేవతలే ముక్కుమీద వేలుపెట్టుకునేవాళ్ళు. మాఅందరికీ అతడిశక్తి తలమునకలయింది; నానాతిప్పలూ పెట్టింది. అలాంటి కర్ణుణ్ణి వొడిలో దాచిన అగ్గిలాగ ఎలాదాచావమ్మా? అర్జునుడు వొక్కడూ తప్పిస్తే ఆమహావీరుడి రథంముందు ధనుస్సుపట్టగల మొనగాడు ఎవడున్నాడమ్మా? అయ్యో, కర్ణుణ్ణి తొలిచూలుగా ఎందుకు కన్నావమ్మా! అంతటిబలశాలిని అన్నయ్యని చేజేతులా చంపుకున్నాం. నువ్వు కర్ణుణ్ణి మరుగు పెట్టడంచేత,నీమంత్రం మాఅందరికీ దుఃఖకారణ మైయిందే తల్లీ! గుండెలు తరుక్కుపోతున్నాయి.

బంధువులందరికీ బాధగా వుంది. అభిమన్యుడు అస్తమించినప్పుడూ ఇంత దుఃఖం కలగలేదు. ద్రౌపదికొడుకులు పోయినప్పుడూ ఇంత బాధ కలగలేదు. ద్రుపదుడికొడుకులూ, ధృతరాష్ట్రుడి వందమందికుమార్లూ గతించినా ఇంత వేదన కలగలేదు.

"అమ్మా! కర్ణుడు మాఅన్న అని ముందే తెలిసుంటే కౌరవ కులం నాశనం కాకుండా వుండేదికదా, అమ్మా! అందరమూ హాయిగా వుండేవాళ్ళం. ఇంత జననాశనం వూరికేఅయిపోయిందికదా, తల్లీ! అయ్యో, అయ్యో, ఎంతపని అయిపోయింది!"

అలా ఎంతో దుఃఖించాడు ధర్మరాజు. తడబడుతూ గోత్రనామాలుపలుకుతూ కర్ణుడికి తిలోదకాలు ఇచ్చాడు. అతడితరవాత భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ తిలోదకాలిచ్చారు.

కర్ణుడు పాండవుల అన్న అని తెలియడంతోనే కౌరవస్త్రీలు గోలుగోలుమన్నారు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ అందరూ కర్ణుడికి తిలోదకాలిచ్చారు.

పరిచారికలతో సహా కర్ణుడి భార్యల్ని పిలిపించాడు ధర్మరాజు. తగినవిధంగా గౌరవించాడు. పుష్కలమైన దక్షిణలతో అన్నకోసం ఎన్నో అన్ని పుణ్యకార్యాలు చేశాడు.

యావన్మంది బంధువులతోనూ, తిలోదకాలు అవీ పూర్తి చేసి గంగానదినించి బైటికి వచ్చాడు ధర్మరాజు.

వ్యావహారికాంధ్ర మహాభారతం

స్త్రీ పర్వం

ముగిసింది.

# VYAVAHĀRIKĀNDHRA MAHĀBHĀRATAM

(CANTO SANTI)

Vol 6

By

PURIPANDA APPALASWAMY

First Edition – October 1966
Second Edition – June 1976

Price Rs 12-50
Printed at Saraswathi Power Press, Rajahmundry





PRĀCHFENA GRANDHĀVALI
RAJAHMUNDRY
Editor : PURIPANDA APPALASWAMY

# విషయ సూచిక



## శాంతి పర్వం (2343 – 2730)

### ఒకటో ఆశ్వాసం 2343



### రెండో ఆశ్వాసం 2409



### మూడో ఆశ్వాసం 2474



### నాలుగో ఆశ్వాసం 2533

ఐదో ఆశ్వాసం 2592



ఆరో ఆశ్వాసం 2661

# శాంతిపర్వం

## ఒకటో ఆశ్వాసం

### ధర్మరాజు దుఃఖం

యుద్ధంలో గతించిన యావన్మంది బంధువులకీ, స్నేహితులకీ తిలోదకాలూ అవీ పూర్తిచేశారు పాండవులు. గంగవొడ్డున వాళ్ళ సమప్రదేశంలో డేరాలు వేయించారు. ధృతరాష్ట్రుడితోనూ, విదురుడితోనూ, భారతవీరుల భార్యలందరితోనూ కలిసి, సూతకంమైల వొదిలించుకోడం కోసం వొకనెల అక్కడ వున్నారు. వ్యాసుడూ, నారదుడూ, దేవలుడూ దేవస్థానుడూ మొదలైన మునీశ్వరులు తమ తమ శిష్యులతో కూడా ధర్మరాజుని చూడడానికి వచ్చారు. ఎదురు వెళ్ళి ప్రణామం చేశాడు ధర్మరాజు. పాద్యమూ, ఆసనాలూ ఇచ్చి సన్మానించాడు. తగినవిధంగా పూజించి అంతమందినీ సంతోషపరిచాడు. శ్రీకృష్ణుడితోనూ, తమ్ములతోనూ వాళ్ళని సేవించాడు. ఎన్నోవిధాల మంచిమాటలతో అతణ్ణి గౌరవించారు మునులు.

నారదుడు మహామునులకేసి చూసి, ధర్మరాజుని కుశల మడుగుతా నంటూ ఇలా అందుకున్నాడు :

“మహారాజా, కృష్ణుడు ఎప్పుడూ మీకు శుభమే కోరాడు. బ్రహ్మాండమైన బాహుబలంతో గాండీవం పుచ్చుకుని అర్జునుడు రణ పాండిత్యం చూపించాడు. ప్రపంచమంతా జేజేలుపట్టింది. సామ్రాజ్యం సంపాదించావు. ప్రపంచభయంకరమైన యుద్ధాల్లో నువ్వూ, నీతమ్ములూ బయటపడడం మంచిదైంది. ఉపాయం ప్రయోగించవలసి

వచ్చినప్పుడూ, కోపం చూపవలిసి వచ్చినప్పుడూ ధర్మం తప్పలేదు నువ్వు. ఇది ఎంతైనా గొప్పవిషయం. దుఃఖం విడిచిపెట్టి ఇప్పుడు సంతోషంగా వున్నావు కదా ?" అన్నాడు.

"మునీంద్రా," నారదముని అడిగినదానికి జవాబు చెప్పాడు ధర్మరాజు — "కృష్ణుడి దయవల్లా, బ్రాహ్మణుల అనుగ్రహంవల్లా, భీమార్జునుల బాహుబలంవల్లా రాజ్యమంతా చేతికి వచ్చింది. కాని ఎంతో ఘోరమైన జ్ఞాతివధవల్లా, గుణాలపుట్ట అభిమన్యుణ్ణీ, కులభూషణులు ద్రౌపది కుమారుల్నీ అయిదుగురినీ పోగొట్టుకోడంవల్లా గెలుపు గెలుపనిపించడంలేదు నాకు. అదీ కాక, మరొక విషయం హృదయం కలిచేస్తూ వుంది. విన్నవిస్తాను, విను. మహాభుజపరాక్రమశాలి, కౌరవులందరికీ పట్టుకొమ్మ, మమ్మల్ని యుద్ధంలో మూడుచెరువుల నీళ్ళు తాగించిన మహాత్ముడు కర్ణుడు మాఅమ్మ కుంతీదేవి తొలికొడుకనీ, తిలోదకాలు ఇచ్చినప్పుడు అతడికి కూడా తిలోదకాలు ఇవ్వండనీ ఆమె చెపితే విన్నాను. అప్పటినించీ మనస్సు నిప్పులో పడినట్టుంది. మాఅమ్మ సూర్యుడివరంవల్ల అతణ్ణి కని, పారేసింది. అతడు ధృతరాష్ట్రుడి కుమారుళ్ళదగ్గిర మొనగాడయ్యాడు. మాకూ వాళ్ళకీ కలహం పుట్టాక, అదిమాన్పించడం కోసం మా అమ్మ కర్ణుడి దగ్గిరకి వెళ్ళింది. రహస్యంగా అతడి పుట్టుకగుట్టు చెప్పింది. ఇదంతా ఆమే మాకు రోజూ చెపుతూ వుంటుందిప్పుడు.

"అతడు తన కొడుకని చెప్పి, కర్ణుణ్ణి తమ్ముళ్ళలోకి వచ్చెయ్యమంది మాఅమ్మ. అతడు ఏమన్నాడో తెలుసా, మునీంద్రా ? 'దుర్యోధనుణ్ణి వొదిలేసి వస్తే కృతఘ్నుణ్ణి అవుతాను' అన్నాడు—'అదీ కాక అర్జునుడితో యుద్ధం చెయ్యడానికి భయపడిపోయాను అంటారు లోకులు. అర్జునుణ్ణి కలుపుకుని, లేదా నన్ను కలుపుకుని వెరసి నీకు అయిదుగురు కొడుకులే అనుకో. ఆరుగురు మాత్రం ఇప్పుడు అనకు' అన్నాడు.

'అయితే, తక్కిన నలుగురు తమ్ముళ్ళకీ అభయ మియ్యి నాయనా !' అంది మా అమ్మ. 'అలాగే కానీ' అని అభయ మిచ్చాడు కర్ణుడు. అన్నమాట తప్పలేదు మా అన్న. మా నలుగురినీ యుద్ధంలో ఆక్రమించుకున్నాడే కాని చంపడానికి తెగించలేదు.

"అతడు తన కొడుకన్నమాట మొదట మా అమ్మే దాచింది. తరవాత కర్ణుడు వొద్దనడంచేత కూడా దాచింది. అంచేత అతడు మా అన్న అని మా అయిదుగురమూ ఎరగం. కనకనే ఇంత వరకూ వచ్చింది.

"అవాళ జూదంనాడు దుర్యోధనుడి మెప్పుకోసం అనరాని మాటలన్నీ అన్నాడు కర్ణుడు. అయినా అతడిమీద నామనస్సులో కోపం కలగలేదు. అతడిశరీరంలో మాఅమ్మ కుంతీదేవి పోలికలు కనపడేవి నాకు. ఏమిటా కారణం అనుకునేవాణ్ణి. అంతా అయిపోయింది. ఇప్పుడు ఏం చెయ్యనూ ?

"కౌరవులు చేసే అపకారానికి వొళ్ళు మండేది. అయితే కర్ణుడి మొహం చూడగానే అది చల్లారిపోయేది నాకు.

"అవాళ అర్జునుణ్ణి కఠినంగా అన్నాను. 'అర్జునా, కర్ణుణ్ణి చంపకండా వచ్చావా, నాకు తమ్ముడివి కావు' అని మూర్ఖంగా అన్నాను. అన్నని చంపుకున్నాను. దురాత్ముణ్ణి. ఈ దుఃఖం నన్ను దహించేస్తూ వుంది. ఎలా సహించడం ? మించిపోయింది. కర్ణుడూ, మేమూ వొక్కళ్ళైవుంటే, దేవతలైనా మమ్మల్ని తేరిచూసేవాళ్ళా?

"మునీంద్రా, మాఅన్న కర్ణుడి రథచక్రం భూమిలోకి దిగిపోయింది. ఏమిటి కారణం దానికి? అంతవీరుడు పరశురాముడిచేత శాపం ఎలా పొందాడు? ఇదంతా వివరంగా వినా లనిపిస్తోంది. లోకంలో నీకు తెలియని నడతలు లేవు. అందుకని నిన్ను ప్రార్థిస్తున్నాను."

"అదంతా వివరిస్తాను, విను" అంటూ అందుకున్నాడు నారదుడు :

## కర్ణుడి కథ

"దూర్వాసముని ఇచ్చిన మంత్రంతో కుంతీదేవి కన్యగా వున్నప్పుడు, వేడుకగా సూర్యుణ్ణి ప్రత్యక్షం చేసుకుంది. కొడుకుని కంది. అయితే సిగ్గుచేత ఈవిషయం వెల్లడిచెయ్యలేదు. కన్యాత్వం చెడకండా సూర్యుడు వరమిచ్చాడు. అంచేత మంచివంశంలో వివాహ మాడింది. ఇదంతా దేవ రహస్యం. కని పారేసిన కుర్రాణ్ణి సూతుడు తీసుకుపోయాడు. సూతుడి కొడుకన్న పేరుతో పెరిగాడు కర్ణుడు. నీ నేర్పూ, భీముడి బలమూ, అర్జునుడి విలువిద్యా, అతడికీ కృష్ణుడికీ వున్న స్నేహమూ - ఇదంతా చూసి మనస్సు మండేది కర్ణుడికి. ఎంతో బాధపడేవాడు. నకుల సహదేవుల నీతివిద్యా, శత్రునైపుణ్యమూ చూసి, ప్రజలు వాళ్ళంటే ప్రేమగా వుండడమూ, మిమ్మల్ని మెచ్చుకోడమూ అతడు సహించలేక పోయేవాడు. మచ్చరించుకునే వాడు. దుఃఖపడేవాడు. అది అతడి స్వభావం. అంతేకాదు. దైవ ఘటనా అలాగే వుంది. ఆమచ్చరం వల్లే అతడికి మీామీాద ఈసు పుట్టింది. ఆ ఈసుతో అతడు దుర్యోధనుడితో చేరాడు.

"తరవాత, అర్జునుడి విలువిద్య సామర్థ్యం చూసి ఈసుతో ద్రోణుడి దగ్గిరికి వెళ్ళాడు. రహస్యంగా, తనకీ బ్రహ్మాస్త్రం ఉపదేశించమని కోరాడు. 'యుద్ధంలో నేను అర్జునుడితో సమానమైన వాణ్ణి కావాలని కోరి వచ్చాను. శిష్యులందరూ వొకటే నీకు. నీ దయవల్ల నేను మాత్రం విలువిద్యలో పై చెయ్యి కావద్దూ?' అన్నాడు.

" 'నీకు బ్రహ్మాస్త్రం ఇవ్వడం ధర్మంకాదు' అన్నాడు ద్రోణుడు – 'వ్రతనిష్ఠతో వున్న బ్రాహ్మడూ, లేదా గొప్ప తపస్సు

చేసి పుణ్యం సంపాదించిన రాజూ తప్ప ఇతర్లు బ్రహ్మాస్త్రం పుచ్చుకుందికి అర్హులు కారు' అన్నాడు.

"సరే, అని ఇంటికి వెళ్ళిపోయాడు కర్ణుడు. మర్నాడు బయలుదేరి మహేంద్ర పర్వతానికి వెళ్ళాడు. పరశురాముడి దర్శనం చేశాడు. వినయంగా నమస్కరించాడు. 'నేను బ్రాహ్మణ్ణి. భృగు వంశంలో పుట్టినవాణ్ణి. అస్త్రవిద్య నేర్చుకోడం కోసం నిన్ను ఆశ్రయిస్తున్నాను' అన్నాడు. సంతోషించాడు పరశురాముడు. శిష్యుడిగా చేరదీశాడు. అస్త్రవిద్య నేర్పాడు.

"పరశురాముడి ఆశ్రమంలో అస్త్రవిద్య నేర్చుకుంటున్నాడు కర్ణుడు. ఒకనాడు ఒక్కడూ లాఘవంగా బాణాలు ప్రయోగిస్తున్నాడు. ఇంతలో ఒక బ్రాహ్మణుడి హోమధేనువు దూడ అడ్డంగా పరిగెత్తింది. కర్ణుడి బాణం తగిలి చచ్చిపోయింది. చూసి, కోపంతో మండిపడ్డాడు బ్రాహ్మణుడు. శాపం పెట్టాడు. అదుగో ఆశాపంవల్లే కర్ణుడి రథం భూమిలో దిగబడిపోయింది."

"ఇక పరశురాముడు శపించిన సంగతి చెపుతాను, విను. పరశురాముడి దగ్గిర ఎంతో భక్తితో పరిశ్రమచేశాడు కర్ణుడు. బ్రహ్మాస్త్రమూ మొదలైన ఎన్నో అస్త్రాలు అనుగ్రహించాడు పరశురాముడు.

"ఒకనాడు కర్ణుడి తొడమీద తల పెట్టుకుని పరశురాముడు నిద్రపోయాడు. ఇంతలో అళికం అని ఒక పురుగు వచ్చింది. వికారంగా ఘోరమైన రూపంతో వుంది. కర్ణుడి కిందితొడ దొలవడం మొదలెట్టింది. గురువుకి నిద్రాభంగం కలుగుతుందని భయపడ్డాడు కర్ణుడు. అళికం తొడ దొలిచేస్తూవుంటే, ధైర్యంగా సహించుకున్నాడు. కదలకండా కూచున్నాడు. రక్తం కారుతూ పరశురాముడి శరీరానికి తగిలింది. మేలుకున్నాడతడు. 'రక్తం ఎక్కణ్ణుంచి వచ్చింది?' అంటూ అడిగాడు. తొడపెత్తి పురుగు చూపించాడు కర్ణుడు. 'ఇది నాతొడ

దొలిచేసింది. మీకు నిద్రాభంగం అవుతుందని భయపడి కదల కుండా కూచున్నాను' అన్నాడు.

"పరశురాముడి దృష్టి పడడంతోనే పురుగు చచ్చిపోయింది. ఒక రాక్షసుడై ఆకాశంమీద నిలబడింది 'దయామయా! నీవల్ల దారుణమైన శాపం నన్ను వొదిలింది. ఎప్పటిరూపం వచ్చింది. నన్ను గ్రస్తు అంటారు. రాక్షసుణ్ణి. భృగుమహారుషి భార్యని ఎత్తుకు పోయాను ఆమహారుషి పెట్టిన శాపంవల్ల పురుగు నయి ఇంతవరకూ బతికాను. నీచూపు అమృతం చిలకరించింది. సుఖపడ్డాను' అంటూ నమస్కరించి, తన దారిని తాను వెళ్ళిపోయాడు రాక్షసుడు.

"కర్ణుడి ధైర్యం ఆలోచించాడు పరశురాముడు. 'ఈవోర్పు బ్రాహ్మణజాతికి లేదు. నిజమైనమాట అది. నువ్వు ఎవడివి?" అంటూ కర్ణుణ్ణి నిలదీశాడు.

"భయపడిపోయాడు కర్ణుడు. 'నేను సూతకులం వాణ్ణి' అని నిజం చెప్పేశాడు. భగ్గుమన్నాడు పరశురాముడు. 'బ్రాహ్మణ్ణని కపటంచేశావు. దీనిఫలం అనుభవించాలినువ్వు' అంటూ 'అస్త్రవిద్య చెడిపోవాలి' అని శాపంపెట్టాడు. చేసేది లేక కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ వచ్చేశాడు కర్ణుడు.

"దుర్యోధనుడి దగ్గిరికి వచ్చి, 'మహారాజా, పరశురాముణ్ణి ఆశ్రయించాను. అస్త్రాలన్నీ సంపాదించాను. విలువిద్యలో ఆరితేరాను. యుద్ధంలో నన్ను ఎదిరించగల మొనగాళ్ళు లోకంలో లేరు' అన్నాడు. ఎంతో సంతోషించాడు దుర్యోధనుడు.

"ఇవీ మీఅన్న పోయిన పోకడలు. దుర్యోధనుడికి నచ్చిన నేస్తమై వుండేవాడు. ఇలా వుండగా కళింగ దేశం రాజు చిత్రాంగదుడు తన కూతురు సుభాంగి స్వయంవర మహోత్సవం చాటించాడు. శిశు పాలుడూ, నీలుడూ, జరాసంధుడూ, రుక్మి మొదలైన ఎంతోమంది

రాజులు చిత్రాంగదుడి రాజధాని రాజపురం వెళ్ళారు. దుర్యోధనుడు కూడా బయలుదేరాడు. యుద్ధం మీద అభిలాషతో తగిన చతురంగ బలాలూ, మంచి రథమూ వేసుకుని, కర్ణుణ్ణి సహాయంతీసుకు వెళ్ళాడతడు. ఇంతమంది రాజుల్ని తగిన మర్యాదచేసి ఆదరించాడు చిత్రాంగదుడు. స్వయంవర కార్యం ప్రారంభించాడు.

"రాజకుమారి స్వయంవరం సభకి వచ్చింది. చెలికత్తెలూ, దాదులూ రాజుల్ని ఆమెకి వేరువేరుగా పరిచయం చేసి చెప్తున్నారు. చేతిలో పూలదండ పట్టుకుని, ఒక్కొక్కళ్ళనీ చూస్తూ, రాజులమధ్యనించి మెల్లిమెల్లిగా నడుస్తూ దుర్యోధనుణ్ణి దాటి ముందుకి వెళ్ళిపోయింది రాజకుమారి. అయితే ఆమెని పోనివ్వలేదు దుర్యోధనుడు. అడ్డుకున్నాడు. పట్టుకుని తన రథంమీద పెట్టుకున్నాడు. తెలిసి రాజులందరూ తిరగబడ్డారు. అంతమందీ వొక్కళ్ళై వొక్కమారు అతణ్ణి ముట్టడించారు. దుర్యోధనుడు మాత్రం జంకలేదు. బలమూ, శౌర్యమూ లోకం మెచ్చుకున్నట్టు యుద్ధం చేశాడు.

"అప్పుడు ఉగ్రంగా బాణాలువేసి రాజుల తలకాయలు దొర్ల గొట్టాడు కర్ణుడు. చిత్రమైన లాఘవంతోనూ, ఆటోపంతోనూ, దర్పంతోనూ చెలరేగాడు. ఏనుగు గుంపులూ, రథాలవరసలూ, గుర్రాల బారులూ, పదాతుల మూకలూ ఉల్లాసంతో రూపుమాపాడు యుద్ధంలో అతణ్ణి అడ్డేవాడే లేకపోయాడు.

"ఇలా విక్రమించిన ఆ వీరాధివీరుడి బాహువీర్యానికి భయపడిపోయారు రాజులు. చావగా మిగిలినవాళ్ళు పిక్కబలం చూపెట్టారు. ఎంతో సంతోషించాడు దుర్యోధనుడు. కళింగరాజు కూతుర్ని తీసుకుని హస్తినాపురం వచ్చేశాడు.

"ఆ పగ మనసులో పెట్టుకున్నాడు జరాసంధుడు. కర్ణుణ్ణి ద్వంద్వయుద్ధానికి పిలిచాడు. వెళ్ళాడు కర్ణుడు. ఇద్దరూ ద్వంద్వ

యుద్ధంచేశారు. గొప్పగొప్ప దివ్యాస్త్రాలున్న జరాసంధుడి ధనుస్సులూ, బాణాలూ, రకరకాల యుద్ధసాధనాలూ యావత్తూ కర్ణుడు నాశనంచేసేశాడు. ఇద్దరూ రథాలు దిగారు. మంచి పూనికతో వాళ్ళమీద వాళ్ళు కలబడ్డారు. బాహాబాహీ పోరాడారు. జరాసంధుడి కీళ్ళన్నీ విరిగిపోయాయి. బాధ భరించలేకపోయాడతడు. యుద్ధం ఆపేశాడు. కర్ణుణ్ణి మర్యాదచేశాడు. తనకి తగినట్టు విలువైన మాలినీనగరం ఇచ్చి గౌరవించాడు. మంచి ప్రతాపంతో తిరిగి వచ్చాడు కర్ణుడు.

"అతడి ఈ రెండుపనులూ నువ్వూ కొంత ఎరుగుదువు. ఇలా పేరుపడ్డ కర్ణుడి బలం తరచడంకోసం దేవేంద్రుడు అతడి కవచకుండలాలు అడిగి తీసుకున్నాడు. నీకు మేలుచేశాడు. అందువల్లే అర్జునుడు అతణ్ణి చంపగలిగాడు.

"మహారాజా, బ్రాహ్మడు శాపంపెట్టాడు. పరశురాముడు శపించాడు. దేవేంద్రుడు మోసంచేశాడు. వరమని కోరి కుంతి అడ్డుకుంది. అర్థరథుడని. కోపంతో భీష్ముడు బాధపెట్టాడు. అనరాని మాటలూ అని శల్యుడు మనస్సు కలిచేశాడు. కృష్ణుడు విధిఅయాడు. యుద్ధంలో అర్జునుడు హారీ అనిపించేశాడు. విన్నావుకదా !

"అదీకాక శివుడూ, దేవేంద్రుడూ, యముడూ, వరుణుడూ, ద్రోణుడూ, కృపుడూ ఎన్నో అన్ని దివ్యబాణాలు ఇచ్చారు అర్జునుడికి. ఇంత శక్తి వెనక వుంది కనకనే కర్ణుడి తేజస్సు సహించి నిలబడగలిగాడు అర్జునుడు."

నారదుడు చెప్పినమాటలు విని శోకంతో మరింత బాధపడ్డాడు ధర్మరాజు. కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. నిట్టూర్చాడు.

దగ్గిరే వుంది తల్లి కుంతీదేవి. అతడి దుఃఖం పోగొట్టడంకోసం ఇలా అందుకుంది :

"నాయనా, అతడి పుట్టుకగుట్టు చెప్పి నేను పిలిచానోయి కొడుకుమీద దయవల్ల 'నిజంరా బాబూ' అని సూర్యుడు కూడా చెప్పాడు. అయితే దేనివల్లాకూడా నీతో కలవడానికి ఒప్పుకోలేదు కర్ణుడు. దుర్యోధనుణ్ణే పట్టుకు కూచున్నాడు. అలాటివాడికోసం ఇంత ఇలా మనోవ్యథ ఎందుకు తండ్రీ!" అంది.

ఈమాటలు సహించలేక నొచ్చుకున్నాడు ధర్మరాజు. 'ఏ దేశంలో అయినా సరే, స్త్రీజాతి మనస్సులో రహస్యం దాచే శక్తిలేకండాపోవాలి' అని శపించాడు. అలా శపించడంతో వూరుకోలేదు. కుంతిదాచిన కర్ణుడి రహస్యప్రసంగంతో జరిగిపోయినవన్నీ తలుచుకున్నాడు. తనవల్ల మరణించిన ఉభయపక్షాల బంధువుల్నీ స్నేహితుల్నీ తనువుకి తెచ్చుకున్నాడు. కలతపడ్డాడు. ముఖ్యంగా కర్ణుడి చావుకి ఎంతైనా విచారించాడు. బాధపడ్డాడు. అర్జునుడికేసి చూశాడు.

"తమ్ముడూ," దుఃఖంతో అన్నాడు – "రాజ్యం ఎందుకోయి మనకి? ఏదో వొక పల్లెటూరు పోయి, భిక్షమెత్తుకుంటూ బతుకుదాం. అలా అయితేనే సుఖపడతాం. దాయాదులందరినీ చంపుకున్నాం. ఇది మనల్ని మనం చంపుకోడమే అన్నమాట. రాజధర్మం తగలబెట్టు. అహింసా, సత్యమూ, ఓర్పూ, మచ్చరం లేకండా వుండడమూ – ఇవి వనవాసంచేసేవాళ్ళకి శాస్త్రాలు చెప్పిన విధులు. ఆహా ఎంత గొప్పవి ఇవి! కనక అడివిలోనే బతకడం మంచిది. రాజ్యంలో సుఖంలేదు. మాంసం ముక్కకి కాట్లడే కుక్కల్లాగ తమలో తాము కాట్లాడుకుని కులం నాశనం చేసుకుని కుచ్ఛితం బతుకు బతకవలిసి వచ్చింది కదా, అని కుసిల్లిపోతున్నాను. ముల్లోకాల సామ్రాజ్యమైనా సంతోషం కలగదు నాకు. అంచేత ఈరాజ్యం అక్కరలేదు నాకు. మీరే పుచ్చుకోండి.

"మన బాబయ్య ధృతరాష్ట్రుడి కొడుకు దుర్యోధనుణ్ణి అదుపులో పెట్టలేకపోయాను. ఆ నీచుడు ఎలా నడుచుకుంటే అలాగే నడుచుకోనిచ్చాడు. సరైన దారికి మళ్ళించలేదు. దురాత్ముడు దుర్యోధనుడు. కులక్షయం చేశాను. అయితే అతణ్ణి చంపడంతోనే కోపం తీరిపోయింది. తుదకి మనస్సు దుఃఖంతో నిండిపోయింది. ఆ దుష్టు ఏం చెయ్యాలో తెలియక దురభిమానం పూనాడే అనుకో. నేనైనా వూరుకుని తప్పుకున్నాను కాను. రాజ్యం తెచ్చుకోవాలన్న ఆస పట్టుకుంది. ఇంతటి పాపానికి నెట్టుకున్నాను. పుచ్చుకున్న దోషం తిరిగి ఇచ్చెయ్యడంతో కాని పోదు. పుచ్చుకున్నది ఇచ్చేసిన త్యాగశీలుడు చావుపుట్టుకా, పాపాలూ పొందడని వేదాలు చెపుతున్నాయి. ఒకడు సకల ధర్మాలూ అనుష్ఠించడం సాధ్యం కాదు కదా! పుచ్చుకున్నది ఇచ్చెయ్యడం- ఈ ఒక్కటైనా చేసి పరిశుద్ధుణ్ణవుతాను. మీరు రాజ్యం ఏలాలన్న అభిప్రాయంతో వుండండి. వర్ణాశ్రమ ధర్మాలు రక్షించండి. నేను అడవికిపోతాను. మునులదగ్గిర సుఖంగా బతుకుతాను" అన్నాడు.

అన్నగారి మాటలు అర్జునుడికి కంటక మనిపించాయి. రోషమూ, విచారమూ కలిగాయి. ఆ వికారం కనపడనివ్వకండా చిరునవ్వుతో కప్పిపుచ్చి, ఇలా ఎత్తుకున్నాడతడు :

"ఇది కూడానా అన్నయ్యా? చిత్రం! తీరా భుజబలంతో శత్రువుల్ని చంపాక, గొప్పతనం పాడుచేసుకుని, బిచ్చమెత్తుకు బతుకుదామనడం న్యాయమేనా? ధర్మమార్గంగా రాజ్యం లభించింది. ఇది పరిపాలించకండా బలగౌరవాలు విడిచిపెట్టడం బాగుందా? అలా అయితే ఆలకించు, ముందుగా రాజుల్ని ఎందుకు చంపావు? ఇప్పుడు అడవికి వెళ్ళితే వెర్రివాడంటారు లోకులు. కాని మంచిదంటారా చెప్పు?

"పాపమని శంక కలిగితే అశ్వమేధం మొదలైన పుణ్యకర్మల వల్ల పోదూ ? వంశధర్మం విడిచిపెట్టి, నీచకర్మ కోరుతున్నావు. సకల ధర్మాలకీ ధనం మూలం 'ధనం లేనివాడు నడపీనుగు' అన్నాడు నహుషుడు, వినలేదూ ? ఈనీతి గమనించవద్దూ ?

"దరిద్రుడూ, పతితుడూ, కృతఘ్నుడూ, జడుడూ సమాన మంటారు పెద్దలు. ధర్మమూ, కామమూ, మోక్షమూ, ధనంవల్లే లభిస్తాయి. ధనమే చుట్టాలు చేరుస్తుంది. ధనమే స్నేహితుల్ని చేరుస్తుంది. ధనమే శౌర్యవంతు డనిపిస్తుంది. ధనమే అంతమందిచేతా బుద్ధిమంతు డనిపిస్తుంది. శరీరం కృశించినవాడు దుర్బలుడు కాడు. ధనంలేని వాడే దుర్బలుడు. దరిద్రుడై బంధువులూ, స్నేహితులూ లేనివాణ్ణే దుర్బలు డనాలి. అంచేత ధనం సంపాదించడమూ, బంధువుల్నీ, స్నేహితుల్నీ పోషించడమూ రాజులికి పరమ పురుషార్థం. అదీకాక, జ్ఞాతులైన రాక్షసుల్ని నాశనం చెయ్యడంవల్లే కదా, యావన్మంది దేవతలూ వృద్ధిపొందారు ? 'యుద్ధంచేసి, చంపి శత్రువులదగ్గిర పుచ్చుకోకండా అణిగివుంటే ధనం దొరుకుతుందా ? 'అంటారు పెద్దలు.

"వేదాలూ ఇలాగే చెపుతున్నాయి. బలవంతంగా రాజ్యం లాక్కుని. ధనం సంపాదిస్తారు రాజులు. యజ్ఞాలూ అవీచేసి దేవేంద్రుడూ మొదలైన దేవతల్ని సంతోషపెట్టి ఉత్తమలోకాలు పొందుతారు. ఈమార్గమే పట్టి దిలీపుడూ, నృగుడూ, నహుషుడూ, అంబరీషుడూ, మాంధాతా నడుచుకున్నారని విన్నాం. ఆచక్రవర్తుల పదవే నీకూ లభించింది ఇప్పుడు. వాళ్ళలాగే పుష్కలంగా దక్షిణలతో గొప్ప గొప్ప యజ్ఞాలు చెయ్యి. పాపం పోతుంది. అశ్వమేధం చేసిన వాళ్ళు అవభృథస్నానంతో పుణ్యాత్ములవుతారు."

అర్జునుడు చెప్పిందంతా కష్టంతో విన్నాడు ధర్మరాజు. కొంచేపు విచారిస్తూ వూరుకున్నాడు. మనస్సు మరింత కలతపడింది.

"తమ్ముడూ" మళ్ళీఅన్నాడు – "క్షేమమైన మార్గం వొక్కటే వుందోయి. అదే నాకు నచ్చింది. అది ఏమిటని అడుగు. అడక్కపోతే నేం, చెపుతాను విను. మునీంద్రులు కూడా బాగుం దంటా రది.

"సారంలేని సంసారసుఖాలు విడిచిపెట్టేసి వొంటిగా అడివికి పోతాను. అమృతంలాటి మునుల మాటలు చెవులారా వింటాను. స్నేహమూ, విరోధమూ అన్న భేదాలు వొదిలేస్తాను. నిందా, స్తుతీ వొక్కలాగే భావిస్తాను. ఒకడు కత్తి వేసినా, మరొకడు చందనం పూసినా మనస్సులో ఇద్దరినీ సమానంగానే చూస్తాను. మూగివాడి లాగ, జడుడిలాగ మసులుకుంటాను. తగిన వేళల్లో పర్ణశాలలకి వెళ్ళి బిచ్చమెత్తుకుంటాను. ఎవరు ఏం ఇస్తే అదే పుచ్చుకుంటాను. నాలుగైదు చోట్లమాత్రం దొరికిందాంతో తృప్తిపడతాను. ఇదే మంచిది.

"అలా కాకండా కర్మగతికి చిక్కపోయినా, తక్కువఫలంతో అటూ ఇటూ తిరుగుతూ, ముక్తికి దూరమైపోతాను. అంచేత నాకు దొరికిన నిర్మలమైన ప్రజ్ఞామృతం వొదులుకోను. ఇదే శాశ్వతపదం సమకూరుస్తుంది."

"అన్నగారూ" ధర్మరాజు చెప్పిందంతా విని అందుకున్నాడు భీముడు – "వేదాలు చెప్పిన కర్మలు స్థాపించదగినవాడివి నువ్వు. లోకాతీతమైందీ, జ్ఞానంతోకూడింది, ఋషులు మాత్రం ఆచరించదగిందీ అయిన మునివృత్తి నీకు సాధ్యమేనా? బాగా ఆలోచించు.

"విచారంవల్ల రాజధర్మాలమీద ఇప్పుడు అసహ్యం కలిగింది నీకు. ముందే ఇలా నిస్పృహుడివయి వుంటే, కులంలోవాళ్ళూ ఈ భూలోకంమీది రాజులూ ఏ బాధాలేకండా బతికిపోదురు. మేంకూడా అస్త్రజీవనం వొదిలిపెట్టేసివుందుం. బిచ్చమెత్తుకునే బతుకుదుం.

"ఆపలేని కోపంతో లోకమంతా నాశనంచేసే యుద్ధం చేశాం. తీరా ఇప్పుడు దుఃఖంతో అడివికి వెళతాను అంటే లోకంలో జనం నవ్విపోరా ?

"పనిపట్టి ఆరంభించి మధ్యలో వదిలేసి చెయ్యకుండా వదిలేసిన వాడిలాగ, చెట్టుమీదికి ఎగబాకి తేనె తెట్టుచేత్తో పుచ్చుకుని తేనె తాగనివాడిలాగ ఆకలితో వుండి వండిన అన్నం పళ్ళెంలో వడ్డించాక తినని వాడిలాగ, మోహపడి వశం చేసుకున్న ఆడదాన్ని అనుభవించనివాడిలాగ తీరా బలవంతులూ, శౌర్యవంతులూ అయిన శత్రువుల్ని యుద్ధంలో గెల్చుకుని పూజ్యమైన రాజ్యం కాళ్ళదగ్గిరకి వస్తే వొల్లనంటున్నావు. అడివికి పోతానంటున్నావు. ఈ పద్ధతి సరికాదని తెలిసి రావాలి.

"నువ్వు అడివికి నడుస్తావు. నీ వెంట లొంగి నీవెంట మేమూ బయలుదేరతాం. మమ్మల్ని చూసి లోకులు ఏమంటారు ? 'ఈపిచ్చివాళ్ళు ధర్మరాజుని మానిపించలేక పోయారో' అని నిందిస్తారు.

"మహారాజా, నీ తమ్ముళ్ళని రాజ్యభోగాలకి దూరం చేస్తావా ? నిందలుపాలచేసి, అడవుల్లో తోస్తావా ? నాలుగు సముద్రాలమధ్యా వున్న భూప్రపంచం ప్రజలందరినీ అలో లక్షణా అని వదిలిస్తావా ?

"ఆదికాక అన్నయ్యా, కేవలం కర్మచెయ్యకుండా వుంటేనే మోక్షం దొరికితే కొండలూ, చెట్టుచేమలూ మోక్షం పొందుతాయన్నమాట ! అడివిలో వుండడమే మోక్షమా ? కర్మఫలం ఈశ్వరార్పణం చేసి కర్మచెయ్యాలి మనిషి. యథార్థజ్ఞానం కలగడంతోనే కర్మఫలం దానంతటది కలుగుతుంది. అంచేత కర్మ చెయ్యకుండా వుంటేనే మోక్షం రాదు" అన్నాడు.

"ఒక ఇతిహాసం వుంది ఆలకించు" మళ్ళీ అందుకున్నాడు అర్జునుడు – "బాపన కుర్రాళ్ళు కొందరు తమ కులానికి తగిన ఆచా

రాలు వొదిలిపెట్టేసి అడవికి వెళిపోయారు. దేవేంద్రుడు కనికరించి, పక్షి రూపంతో వాళ్ళదగ్గిరికి వచ్చాడు. 'మీరు తొక్కినదారి బాగాలేదు' అన్నాడు. బాపనకుర్రాళ్ళు విన్నారు. 'ఈపక్షి చిత్రంగావుంది. అన్ని విషయాలూ తెలిసినట్టున్నాయి దీనికి' అనుకున్నారు. 'మహాత్మా! ఏది మంచిదారి చెప్పూ?' అని అడిగారు. 'నాలుగుకాళ్ళ జంతువుల్లో ఆవూ, శబ్దాల్లో మంత్రమూ, లోహాల్లో బంగారమూ, మనుషుల్లో బ్రాహ్మడూ శ్రేష్ఠంఅంటారు ఇలా ఉత్తముడైన బ్రాహ్మడు మంచిసమయాలలో కర్మలు నడిపించడం బంగారంలో రత్నం పొదిగినట్టు శోభకొదగింది. సోమారితనంవల్లా, కోపంవల్లా, శోకంవల్లా అకర్మలు మానెయ్యడం పాపం. అజ్ఞానులూ, చిల్లిగవ్వ చేతిలో లేనివాళ్ళూ, సన్యసించవలసినకాలం తెలుసుకోలేక, వివేకంలేకండా తొందరపడిపోయి రెంటికీచెడిన రేవడ లవుతారు. గృహస్థధర్మం నడుపుతూ, అతిథుల్నీ దేవతల్నీ పితృదేవతల్నీ సంతృప్తి పరుస్తూ, మిగిలిన అన్నం భోజనంచేసే పుణ్యులికి పుణ్యలోకాలు అరిచేతిలో వుంటాయి. ఈశ్వరార్పితంగా చేసిన సత్కర్మలు మహానందం కలిగిస్తాయి' అంది పక్షి.

"అది విని తెలివి తెచ్చుకున్నారు బాపన కుర్రాళ్లు. గృహస్థులై మంచి కర్మలు చెయ్యడంకోసం ఇళ్ళకి వెళ్లిపోవచ్చారు. కనక అన్నయ్యా, రాజ్యం ఏలుకో. సంతోషంగా యజ్ఞాలు చెయ్యి" అన్నాడు.

"అవును," అంటూ నకులుడూ ఎత్తుకున్నాడు — "వేదం చెప్పినట్టే నడుచుకుంటారు దేవతలు. బ్రాహ్మలూ వాళ్ళలాగే వేదాలకి దాసులై పాపాలు పోగొట్టుకుంటున్నారు. దేవతలలాగే శాశ్వతమైన ఐశ్వర్యం అనుభవిస్తున్నారు.

యజ్ఞాలూ అవీ మహానియంతం తగినపనీనా అంటావా? న్యాయంగా ధనం గడించాలి. దేవబ్రాహ్మణ పూజకోసం వినియోగించాలి. అప్పుడూ దాని ఫలం చెడకండా క్రోధమూ, దుఃఖమూ, మదమూ వొదిలేసి, చెట్టుమొదట యోగాభ్యాసం చేసుకుంటూ ముక్కుమూసుకు కూచున్నవాడు సరైన త్యాగంతో సన్యాసం పుచ్చుకున్నవాడవుతాడు. అయితే అది రాజులికి మాత్రం తగునా అంటే, తగదు. నాలుగు ఆశ్రమాల్లో మూడు ఆశ్రమాలు వొకవేపూ, గృహస్థాశ్రమం వొకవేపూ తక్కెడలో పెట్టితూస్తే, మూడిటితోనూ గృహస్థాశ్రమమే సమానంగా తూగుతుందంటారు పండితులు.

"కనక మహారాజా, గృహస్థాశ్రమధర్మమే ఆచరించదగింది. అదీకాక, ప్రయత్నించి ధనం కూడబెట్టి యజ్ఞాలూ అవీ చేసి దేవతల్ని తృప్తిపరచకపోడం మహాపాపమంటారు వేదాలు తెలిసినవాళ్ళు.

"విన్నావా? ఈశ్వరుడని వొకడు చీకటిమయమైన ఈ ప్రపంచం వెలిగిస్తున్నాడు. వర్ణాలూ, ఆశ్రమాలూ అతడేకదా చేశాడు! అన్ని కర్మవిధానాలూ, ఆశ్రమాలూ అతడి కల్పనే. అంచేత, విచారం కలిగిందని అతడి ఆజ్ఞ తప్పడం ధర్మమా?

"హింసవల్ల దోషం కలుగుతుందని సందేహం కూడదు. ఏమంటావా? చెపుతాను, విను.

"శత్రువుల్ని చంపకండా పూర్వం రాజుల్లో ఎవడు రాజ్యం చేశాడు చెప్పూ? వాళ్ళందరూ పాపాలపాలు కాకండా పుణ్యలోకాలకే వెళ్ళారు. అలాగే నువ్వూ నడుచుకోడం మంచిది.

"ప్రజలు రక్షణ కోరుతారు. దక్షుడైన రాజు తన యోగక్షేమం కోసమే ప్రజలకి సుఖం కలిగించాలి. ఉపేక్షించడం పాపం.

"తగినవాళ్ళని చూసి విధిప్రకారం ఆవులూ, గుర్రాలూ, ఏనుగులూ, సేవకులూ ప్రీతిగా దానం చెయ్యి. సంతోషంగా అన్ని

రకాల ధాన్యాలూ, గ్రామాలూ, ఇళ్ళూ, బంగారం నాణాలూ, చేతికి ఎముక లేకండా ఇయ్యి. ఇవన్నీ వ్యర్థంగా వొదిలిపెట్టి అడివికి వెళ్ళిపోతా నంటున్నావు. నీవంటి మహానుభావుడికి తగినపనేనా ఇది?" అన్నాడు.

సహదేవుడు ఇలా అన్నాడు :

"మహారాజా, మనిషి మీదమీద అన్నీ విడిచిపెట్టాశాడే అనుకో. అయితే కర్మచేస్తూనే కదా శరీరయాత్ర నడుపుకోవాలి? కనక అది విడిచిపెట్టేసినట్టు కాదు. శరీరసౌఖ్యం వొదిలేసి, బాహ్య విషయాలు పాటించి, నిజ వంశధర్మాలు వొదలకండా తగినట్టు నడుచుకో. మమతసంసారబంధం కల్పిస్తుంది. మమత లేకండా వుండడమే విడుదల మనువూ మొదలైనవాళ్ళు ఇదంతా తెలుసినవాళ్ళు కనకనే సంతోషంగా రాజ్యం చేశారు. వెయ్యిమాట లెందుకూ, నువ్వు అడివికి వెళ్ళినా అక్కడ కావలిసిన పదార్థాలమీంది మమత పెట్టుకోవాలి కదా? అదికూడా సంసారచక్రం ముయ్యడమే కాదా?

"అన్నయ్యా, మాకు నువ్వే చుట్టానివి. నువ్వే తోడునీడవి. నువ్వే స్నేహితుడివి. నువ్వే తల్లివి. నువ్వే తండ్రివి. నువ్వే గురువువి. నువ్వే దేవుడివి కనక దుఃఖంతో నేను అన్నమాటలు క్షమించు. నామాటలు సత్యమైనా అసత్యమైనా భక్తితో మనవిచేస్తున్నాను. కనికరించు. వ్యర్థం కాకండా హితమైనవిగా పరిగ్రహించు."

అన్నదమ్ములు నలుగురూ ఇంత చెప్పినా మాటాడలేదు ధర్మరాజు. భద్రగజాల్లావున్న భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ మధ్య మందలో పెద్దఏనుగులా వున్న ధర్మరాజుదగ్గిరికి మెల్లిమెల్లిగా వచ్చింది ద్రౌపది. అతడంటే వల్లమాలిన గౌరవం ఆమెకి. అతడూ ఆమెని ఎప్పుడూ లాలిస్తూనే వుంటాడు. పైగా ధర్మాధర్మాలు నిరూపించగల బుద్ధిమంతురాలు

ఆమె. "నాకు శోభించని మాట నేనూ చెప్పలేను" అంటూనే నవ్వుని పుచ్చుకొని, విశాలమైన నేత్రాలతో ధర్మరాజు ముఖం చూస్తూ, వినయంగా అందుకుందామె.

"మహారాజా, అసలే శోకాగ్నిలో కుమిలిపోతున్నారు నీ తమ్ములు. అమృతంలాంటి నీ ఓదార్పు మాటలతో శాంతి కలిగించు. అడవులంబడి తిరిగి వీళ్ళు ఆయాసపడడం చూసి, వనవాసం గడువు గడిచాక వెళ్ళి, దుర్యోధనుణ్ణి చంపేస్తామనీ, భోగాలు అనుభవిద్దామనీ, దానాలూ యజ్ఞాలూ చేద్దామనీ, సుఖంగా వుందామనీ వూరడించావు కదా! తీరా శత్రువుల్ని హతంచేసి, రాజ్యం చేతికి వచ్చాక, అడవికి వెళ్ళిపోతానని ఇప్పుడు గోల పెట్టడం ధర్మమేనా? ధర్మమూ, సత్యమూ, మంచీ చెడ్డా నీకంటే తెలిసినవాళ్ళెవరు?" అంటూ మనస్సుకి నాటినట్టు చెప్పి, ఇంకా ఇలా అంది:

"మహారాజా, రాజు పిరికి మనస్సుతో వుండడం మంచిది కాదు. లోకం రక్షించడం కోసమూ, పోషించడం కోసమూ దిక్పాలకుల అంశతో రాజుల్ని పుట్టించాడు బ్రహ్మ. మనిషి రూపంలో వున్న దేవుడే రాజు. * అతడు బాలుడైనా సరే, 'పిల్లడేమిటి? పోనిస్తూ' అని తేలిక చేసిన దుర్మతులు కీడు పొందుతారు.

"తెలియక దగ్గిర చేరినవాణ్ణి వొక్కణ్ణే కాలుస్తుంది అగ్ని. మండుతున్న రాజాగ్ని మాత్రం సంశమంతా బుగ్గి చేసేస్తుంది. కౌరవులు పొగరెక్కి కన్ను కానలేదు. నిన్ను పరాభవించారు. నీ కోపాగ్నిలో పడి మండిపోయారు. దీనికోసం ఇంత విచారం దేనికంటా?

"రాజులో దండనీతి ప్రతిష్ఠించాడు బ్రహ్మ. తనక అపరాధం తెలుసుకుని దండించే రాజుకి ఇహమూ, పరమూ రెండూ లభిస్తాయి.

---

* చూ. పురిపండా రామాయణం. కిష్కింధా కాండ సర్గ 18.

తప్పుచేసిన బ్రాహ్మణుడైనా సరే, నుదుటిమీద ముద్రవేసి దేశం వెళ్ళగొడతాడు రాజు. దేవతలూ అది మెచ్చుకుంటారు.

"ఒంటి చీరెతో వున్న నన్ను, రజస్వలగా వున్నానని కూడా ఆలోచించకుండా ఈడ్చి, సభకి తెచ్చాడు దుశ్శాసనుడు. తన తొడలు చూపించాడు దుర్యోధనుడు. అనరానిమాటలు అన్నాడు కర్ణుడు. ఇలా ముగ్గురూ చేసిన తప్పులు చూశావు. దండించావు. దీనివల్ల దోషమే ముంది ?

"విషంపెట్టినవాణ్ణీ, కొంపలు కాల్చినవాణ్ణీ, రాజుచేసే రహస్యాలోచన బైట పెట్టేవాణ్ణీ, హత్యాప్రయత్నం చేసినవాణ్ణీ, పరస్త్రీని చెరిచినవాణ్ణీ, బంధువుల్ని చంపినవాణ్ణీ, ఇతర్లధనం ఎత్తుకుపోయిన వాణ్ణీ చంపినరాజు పుణ్యవంతుడవుతాడు. దండించవలిసిన వాళ్ళని దండించని రాజు దేవేంద్రుడంతవాడు అయితే ఏంగాక, దారుణమైన పాపాలు చుట్టుకుంటాయి అతణ్ణి. రాజు దండనీతి నడుపుతూ వుంటేనే పేదా సాదా సుఖపడతారు. వేదాలూ, మునులూ — వెయ్యి మాటలెందుకూ దేవతలూ కూడా హాయిగా వుంటారు. తగిన దండనీతితో ప్రజారక్షణ చెయ్యడం క్షత్రియుల విధి. అంతేకాని బ్రాహ్మణులాగ శమమూ, దమమూ మాత్రం మనసులో పెట్టుకోడం రాజధర్మమా ?"

అంతతోనూ ఆగలేదామె. చనువుచేసుకుని సరాగంగా ఇంకా ఇలా అంది :

"వేదాలు చెప్పినప్రకారం ధర్మం రక్షించేవాడివి నువ్వు. ప్రజలంటే ప్రాణం నీకు. కానైతే నీమనస్సుకి పిచ్చి పట్టుకుంది. మామ్మూలు మనుషుల పిచ్చిలాగ పొడుం పట్లతో తగ్గదు ఇది. నీ తమ్ముళ్ళమీద వున్న ఆదరంతో దయామృతం నీమనస్సుకి పట్టించు.

"చూడు, నాలాగ ఇన్ని పాట్లుపడిన ఆడంగులు ఎక్కడైనా వున్నారా? నీ ధర్మాభాగం అంతమౌతుందన్న భయంతో నేనుకూడా గృహధర్మం వాంఛలడం లేదు.

"కౌరవులు తాము చేసుకున్న పాపంవల్ల తామే చెడ్డారు. దానివల్ల పాపమేముంది మనకి? లోకమంతటికీ హితమైనట్టు రాజ్యభారం వహించు. అధికంగా యజ్ఞాలు చెయ్యి. బృహస్పతీ, శుక్రుడూ తగినవిధంగా దండనీతి చెప్పారు. అదంతా కరతలామలకం నీకు. తమ్ముళ్ళని చేతిలో పెట్టుకుని రాజ్యం నడిపించు."

ద్రౌపది ఇన్ని చెప్పినా మాటాడలేదు ధర్మరాజు. అప్పుడు అర్జునుడు మళ్ళీ అందుకున్నాడు:

"అన్నయ్యా, రాజు సమర్థుడై దండనీతి ప్రయోగించకపోతే సన్యాసులు కూడా తప్పుదారి పడతాయి. ప్రజలు వొకళ్ళధనం వొకళ్ళు దోచుకుంటారు. ఒకళ్ళధాన్యం వొకళ్ళూ, వొకళ్ళ పశువులు వొకళ్ళూ, వొకళ్ళ పొలాలు వొకళ్ళూ అపహరిస్తారు. ఒకళ్ళ భార్యని వొకళ్ళు ఎత్తుకుపోతారు. ఆపాపం యావత్తూ రాజుకే చుట్టుకుంటుంది.

"దండన హింస అని భావించకూడదు. దుర్మార్గుల్ని చంపిన శివుణ్ణీ, విష్ణుమూర్తినీ, ఇంద్రుణ్ణీ, కుమారస్వామినీ చూడు. మహాత్ములు దుర్మార్గుల్ని దండించడం వినలేదూ మనం? దండనవల్లే అధర్మం అణగారిపోతుంది. ధర్మం వృద్ధిపొందుతుంది. అర్థమూ, కామమూ కూడా సిద్ధిస్తాయి. దండనీతి ప్రజలందరినీ రక్షించే రాజుకి తప్పనిసరి. అంతే కాదు, తగిన హింస చెయ్యకుండా తప్పించుకోడం ఎవ్వరికీ తరం కాదు. ఏమంటావా? కాయల్లోనూ, పళ్ళలోనూ, నీళ్ళలోనూ సూక్ష్మజీవులు వుండనే వున్నాయి. వాటిని మునులలాంటివాళ్ళు కూడా హింసిస్తూనే వున్నారా లేదా? జీవనానికి ఆధారం కనక కంద

మూలాలు తప్పుతున్నారా లేదా? హింసచెయ్యకుండా ప్రాణం నిలుపుకోడం ఎవ్వరికీ శక్యం కాదు. ప్రాణి మరొక ప్రాణికి ఆహారంగా చేసి పెట్టాడు విధి. ప్రపంచం అంతటా కళ్ళకి కనపడని సూక్ష్మజంతువులు నిండివున్నాయి. ఊహతో తప్ప వాటిని కనుక్కోలేం. మనం కంటిరెప్ప కదిలిస్తే చాలు, కాళ్ళూ చేతులూ విరిగి కింద పడుతున్నాయి అవి. ఉచితమైన హింస అహింస గానే గ్రహించాలి. యజ్ఞాల్లో పశువులు చంపినవాణ్ణి ధర్మపరుడనే వేదాలు మెచ్చుకుంటాయి. కనక వీరులైన పగవాళ్ళని న్యాయమైన యుద్ధంలో చంపడం దోషమెందుకవుతుంది?* పాండురాజు పాలించిన రాజ్యం కోరడం నీకు తగని పనా? నువ్వు తొక్కిన దారి ధర్మమో, అధర్మమో, దేవుడెరుగును. అనవసరమైన చింత విడిచిపెట్టు. ధైర్యం తెచ్చుకో. రాజ్యంపాలించు. యజ్ఞాలు మొదలైనవి చెయ్యి" అన్నాడు.

అయినా మాట్లాడలేదు ధర్మరాజు. చూసి, సిరసిరలాడింది భీముడికి.

"మహారాజా," తన చిరాకు పైకి కనపడకుండా అన్నాడు - "ధర్మమార్గాలు యావత్తూ తెలిసినవాడివి నువ్వు. నీ చరిత్రలో వంకలు దిద్దడం మాత్రం కాదు. ఈ మాటల్లో కలగచేసుకోకూడదనుకునీ కూడా వుబుకుతూన్న దుఃఖం వోర్చు పోగొడుతూ వుంది. అంచేత ఇంత చెప్పవలిసి వస్తోంది.

"చేతికి దొరికిన రాజ్యం విచారంవల్ల విడిచిపెట్టేస్తే అంత మందీ నిన్ను పిరికివాడని తిట్టిపోస్తారు. మమ్మల్ని భీ అనడం చెప్పే అక్కరలేదు.

---

* నదోషో హింసాయా మాహవే గౌతమ ధర్మసూత్రాలు. 2-1-17 (యుద్ధంలో హింస దోషం కాదు)

"మాయజూదంలో పరాభవం కలిగినప్పుడు సత్యంమీద నిలబడ్డావు నువ్వు. మమ్మల్ని చులకనచేసి పారేశావు. నీగొప్ప నువ్వు పాడుచేసుకున్నావు. చెప్పరాని దుఃఖాలు సహించావు. అడవులపాలయ్యావు. యుద్ధంలో పాపాత్ముణ్ణి దుర్యోధనుణ్ణి హత మార్చడంచేత అదంతా లోకంలో ప్రకాశనసీయమైంది. ఇంతా అసాధ్యులైన శత్రువుల్ని గెలుచుకుని గడించిన రాజ్యసంపద వృథా చేసి అడివికి పోతా నంటున్నావు. ఈ అవమానం ఎలా మాపు కుంటావు ?

"అక్కడికాక ఆ నాళ సభలో పడిన అవమానమూ, అడవుల్లో తిరిగినప్పుడు దుష్ట రాక్షసులచేతా, సైంధవుడిచేతా అవస్థపడిన దుఃఖమూ, పరమదైన్యం పొర్చుకుని విరాటరాజు దగ్గిర కొలువు చేసిన విచారమూ-ఇదంతా ద్రోహుల్ని చంపి పోదిలించుకుంటా నను కున్నావు. కృష్ణుడి నిశ్చయం ఆధారం చేసుకుని, యుద్ధం చేయడమే ధర్మమని తెలుసుకున్నావు. అలాగే యుద్ధంచేశావు. నిన్ను కౌర వులో, వాళ్ళని నువ్వో చంపాలని అప్పుడు ఎరగవూ? ఇప్పుడు ఏడవ డం అసందర్భం. నిజమైనమాట చెపుతున్నాను.

"నీచెప్పుచేతల్లో మేం నడుచుకుంటాం. దుష్టుల్ని దండించు. శిష్టుల్ని రక్షించు. కురుకులంలో తలమానికంలా రాజ్యంపాలించు. మహాయజ్ఞాలుచేసి ప్రకాశించు" అన్నాడు.

"మదమూ, రాగమూ, భయమూ, మానమూ మొదలైన పాపాలు మనసులో పెట్టుకుని రాజ్యం చెయ్యడం మేలంటున్నావు" భీముడి మాటమీద అన్నాడు ధర్మరాజు— "మాంసంమీద ఆసక్తి (శరీరంమీది మమత) దుఃఖానికి మూలం అన్నారు పెద్దలు. ఈ భూమంతా పరిపాలించినా తుదకి నరకం తప్పదు. రాజుకి సుఖంలేదు. కనక ఉపశాంతి మంచిది.

"కామభోగాలు మేలుసకూడదు. అవి విడిచిపెట్టిచూడు ఎంతో సుఖంగా వుంటుంది. కాయలూ, ఆకులూ, నీళ్ళూ, గాలీ అనుభవిస్తున్న మునీంద్రులు వెర్రివాళ్ళా? శరీరానికి చెందిన కర్మలు పాటించి దుర్మతులు బాధాల్లో చిక్కుకుంటారు. బుద్ధిమంతులు ఈ కెరటాలు దాటి, ఏ మమతా లేకండా ముక్తి సంపాదిస్తారు. జనకుడు చెప్పిన మాటలు వినలేదూ? అవి చెప్తాను విను 'దేనిమీదా తృష్ణలేదు నాకు. ఏదీ లేదన్న కొరతేలేదు. మిథిలాపట్నం కాలిపోతూవుంటే, అందులో ఏపదార్థమూ కాలిపోతున్నట్టే అనిపించదు నాకు. నిజం' అన్నాడతడు. అతణ్ణి నిందించారా ప్రజలు? 'మనస్సులో శాంతి పొంది, సంసారంవొల్లనివాడు నిస్వార్థుడు' అని అనడం భీమన్నా, నీకేతగింది. విన్నావూ, కొండమీదవున్న మనిషి నేలమీద తిరుగుతున్న మనిషిని ఎలా చూస్తాడు, అదుగో అలాగ ప్రజ్ఞావంతుడై దుఃఖాలు వొదిలేసిన వాడు సంసార దుఃఖాల్లో పడి కొట్టుకుంటున్న వాళ్ళని చూస్తాడు. తెలిసిందా?"

ఇలా అని వూరుకున్న ధర్మరాజుతో అర్జునుడు అన్నాడు:

"మహారాజా, నువ్వు చెప్పిన జనకమహారాజుకీ అతడి భార్యకీ జరిగిన సంవాదం మనవిచేస్తాను, ఆలకించు.

"ఆమహారాజు పూజ్యమైన రాజ్యం వొదిలేసి, బిచ్చమెత్తుకోడానికి బయలుదేరాడు. అప్పుడు బుద్ధిమంతురాలైన అతడి రాణి ఇలా అంది. 'రాజ్యం వొదిలేసి బిచ్చమెత్తుకుందికి వెళుతున్నావు. బాగుంది. అయితే అతిథిపూజా, దేవతర్పణమూ, పితృదేవతర్పణమూ ఎలా జరుగుతాయి? కాషాయాలు కట్టుకుని, తల బోడిచేసుకుని, కూటికోసం ఇల్లిల్లూ తిరగాలి కదా? గృహస్థుడేకదా అంతమందికీ దయతో అన్నదానం చేస్తాడు? 'అన్నిధర్మాలకంటే అన్నదానం గొప్పది' అన్నమాట వింటున్నాం కదా! పెట్టేవాడూ,

చెయ్యి పట్టేవాడూ — ఈఇద్దరిలోనూ పట్టేవాడే గొప్పవాడు. నిజమిది. ఈమాత్రం ఆలోచించక ఇంకా దీనవృత్తికి బయలుదేరతావా ?

"దేవా, వేదాలెరిగిన మహాత్ములు నీవల్ల బతకాలనుకుంటున్నారు. సన్యసించడంవల్ల నువ్వు ఇంతమందినీ చెడగొడతావు. ఇది ధర్మం కాదు. ఈబుద్ధి విడిచిపెట్టు. నీ తల్లిమనస్సు దుఃఖసముద్రంలో ముంచి, భార్యని శోకాగ్నిలో తోసి, కులధర్మం వొదిలేసి వెళ్ళిపోయి ఏగతిపాలవుతావో తెలియకండా వుంది నాకు ! చలిపందిరిలాగ, పళ్ళ చెట్టులాగ ప్రజల శ్రమతీర్చడంకోసం సిద్ధంగావున్న మహానుభావుడివి నువ్వు. ఇలాంటి తేలికపనికి పూనుకోవచ్చా ? ఇది ధర్మవిరోధం. దీనివల్ల మోక్షం కలుగుతుం దనడం నామట్టుకు సందేహమే' అంది."

"తమ్ముడూ," అర్జునుడి మాటమీద అన్నాడు ధర్మరాజు — "కర్మ చెయ్యమనే వేదాలు చెపుతున్నాయి. మళ్ళీ కర్మ వొదిలెయ్యడంవల్ల సద్గతి లభిస్తుందనీ నొక్కి చెపుతున్నాయి. ఈ రెండూ మనోవ్యాపారంతో తెలుసుకోవాలి. అంతేకాని ఇవి వింటూ కూచుంటే మనస్సు కలతపడుతుంది. తత్వంతోకూడినైన జ్ఞానమూ, సత్కర్మలవల్ల దొరికిన స్వర్గమూ వొకటేనా ? కాదు.

"తత్వజ్ఞానం తెలిసినవాడు నన్ను దూషించడు. నువ్వు అన్నమీదవున్న స్నేహంవల్ల కర్మ వొదిలిపెట్టడం అధర్మం అంటున్నావు. ఒప్పుకున్నాను. లోకమూ నీమాటకే తలవూపుతుంది. భీముడు వాయుబలమూ, నువ్వు దేవేంద్రబలమూ కలిగివున్నారు. అంచేత మిమ్మల్ని మరొకడు జయించలేడు. ఆబలం కృష్ణుడి దయవల్ల తగినట్టు మీలో సంక్రమించివుంటుంది. మీ ఇద్దరూ యుద్ధవిద్యలో మొనగాళ్ళు. కాదనను. కానైతే, తత్వజ్ఞానంకలవాళ్ళా మీరు ? సంసారం నిస్సారమైన అరటిబోదెలా వుందనే అన్నారు

తెలిసిన బుద్ధిమంతులు. ప్రసిద్ధమైన మాట అది. విన్నావా? తృష్ణ అణుచుకుని, కర్మప్రవృత్తి విడిచిపెట్టి, దేనిమీదా ఆధారపడని మన స్సుతో వున్నవాడు సుఖంగా వుంటాడో, పాపాలపుట్టా, దుఃఖాలగనీ అయిన ధనం కోరినవాడు సుఖంగా వుంటాడో నువ్వే చెప్పు.

"మిడిమిడిజ్ఞానంతో ఉపదేశానికి పూనుకున్నవాళ్ళు అపే క్షతో పూర్వశాస్త్రాల అర్థాలు చక్కగా తెలుసుకోలేరు. తత్వ జ్ఞానం అనే అమృతం చవిచూడలేరు. శాశ్వతమైన సౌఖ్యం పొంద లేరు. కర్మే మేలని వాదిస్తారువాళ్ళు. శాంతి పనికిరాదని నిందిస్తూ లోకంలో ఎటుపడితే అటు తిరుగుతారు.

"నిర్మలమైన జ్ఞానమూ, ఇంద్రియనిగ్రహమూ, త్యాగమూ — ఇవే శాశ్వతమైన సుఖానందానికి మూలం అంటారు వివేకవంతులు. తప్పకండా అవే అనుసరిస్తారు."

ధర్మరాజు మాటవిని దేవస్థానుడు కలగజేసుకుని ఇలా ఎత్తు కున్నాడు :

"ధర్మరాజా, 'ధనంగొప్పది' అన్నాడు అర్జునుడు. అది నిజమే అని భావించు. యోగం ఉన్నతమైంది. దానిమీదికి దారి మెట్లలా వుంటుంది. ఒక్కొక్క మెట్టూ ఎక్కాలి. అంతేకాని వొక్కసాటుతో వెళ్ళడం సాధ్యంకాదు నీకు. భోగంకోసం ధనం సంగ్రహించాలి. ధనం చెడుగుకూడా చెయ్యడం కద్దు. అయితే యజ్ఞాలకోసం విని యోగించే ధనం బ్రహ్మపదం చేరడానికి నిచ్చెనవంటిది. అలా సత్క ర్మలకి వినియోగించగా మిగిలినధనం అనుభవించడంవల్ల ఆత్మకి కలం కం తగలదు. దానివల్ల శమమూ, దమమూ పట్టువడతాయి. అవి తత్వజ్ఞానం కలిగిస్తాయి. అంచేత మంచి మంచి యజ్ఞాలు చెయ్యి. పుష్కలంగా దక్షిణలియ్యి. సర్వమేధం అనే యజ్ఞం చెయ్యబట్టే శివుడు అంతగొప్పగా ప్రకాశించాడు. బ్రహ్మదేవుడూ, దేవేంద్రుడూ

యావన్మంది దేవతలూ గొప్పగొప్ప యజ్ఞాలు చేసి పేరుపడ్డారు. మరుత్తులూ మొదలైన రాజులు ధర్మంగా రాజ్యమేలి, యజ్ఞాలు చేశారు. ప్రసిద్ధులయారు.

"ఇంద్రుడు అడిగితే సన్మార్గం ఉపదేశించి బృహస్పతి ఏం చెప్పాడో విను. 'దేవేంద్రా, కామమూ, క్రోధమూ, విచారమూ విడిచిపెట్టి, పరిపాలనలో ఏమరుపాటులేకండా, ఎవ్వళ్ళనీ నొప్పించకండా, బాధించకండా లోకంపాలించే పుణ్యాత్ముడైన రాజుకి సర్వమహిమలూ పట్టువడతాయి' అన్నాడు.

"ఇంకా విను. కర్మ చెయ్యడమూ మానెయ్యడమూ, రెండూ మేలంటే ఏలా సరిపడుతుంది ? కర్మఫలం ఈశ్వరార్పణం చెయ్యడం ఉత్తమధర్మం. ఇంతకీ విచారంతో మనస్సు బాధపడుతూవుంటే, ధర్మమార్గంలో ఇది మంచిది అని నిర్ణయించడం ఎలా సాధ్యపడుతుంది ? అంచేత ఇది సిద్ధించిందీ, ఇది సిద్ధించలేదూ అన్న వికారం పొందకండా, ఎక్కడా ద్రోహం చెయ్యకండా నీకులధర్మం రక్షించడంకోసం రాజ్యం ఏలుకో. లోగడ రాజులు ఇలాగే చేశారు. చివర తమకుమాళ్ళని గద్దెలమీద కూచోపెట్టికదా, దృఢమైన జ్ఞానంతో అడవులికి వెళ్ళారు వాళ్లు !" అన్నాడు.

దేవస్థానుడు చెప్పింది విని విచారిస్తూ వూరుకున్నాడు ధర్మరాజు. అర్జునుడు మళ్ళీ అందుకున్నాడు :

"క్షత్రియధర్మం నిలబెట్టి యుద్ధంచేశావు. శస్త్రాలు తగిలి పుణ్యాత్ములై శత్రువులు సద్గతికి పోయారు. రాజగికంచేసిన బ్రాహ్మడైనా ఇలా రుద్రుడు కాక తప్పదు. చిన్నపిల్లడికైనా తెలుసు నిడి. అయినా పెద్దలు చెప్పిన రాజనీతి పాపం కలిగిస్తుందా ? ఒకడు

చెయ్యెత్తి ఇచ్చింది భుచ్చుకుని తినడం రాజన్నవాడికి తగదంటూ వుంటే, కౌరవవంశంలో కల్లా మణిపూసవంటివాడివి, నీకు తగునా! విచారం విడిచిపెట్టు. రాజులమనస్సు వజ్రంతో సమానంకదూ!

"అదీకాక, నువ్వు శత్రువుల్ని చంపడం తప్పనిసరికావడమూ, శత్రువులు నీచేత చచ్చి సద్గతికి పోడమూ – ఇవి విధి ఏర్పరచిన విధానంవల్ల జరిగిన పనులు. దీనికోసం చింతించడమెందుకూ? ధర్మం వ్యాప్తిచెయ్యవలిసినవాడివి నువ్వు. కనక ధైర్యం తెచ్చుకో. రాజధర్మప్రకారం పూజ్యమైన సామ్రాజ్యం నీచేతికి వచ్చింది. పరిపాలించు. పుణ్యకార్యాలు సాగించు" అన్నాడు.

మాటాడలేదు ధర్మరాజు. అప్పుడు వ్యాసుడు ఇలా అన్నాడు.

"ధర్మరాజా! అర్జునుడు నిజమే చెప్పాడయ్యా. న్యాయమైన మాట చెప్పాడు. గృహస్థాశ్రమే ఉత్తమధర్మం అన్నారు పెద్దలు. పశువులూ పక్షులూ మొదలైన ప్రాణులికి ఆశ్రయం అది. రాజులికి అదితప్ప తపస్సూ, దమమూ, బ్రహ్మచర్యమూ ధర్మాలు కావు. ధనంతో తృప్తిపడడమూ, యుద్ధంలో వెన్నుచూపడమూ, ప్రజల్ని పోషించకపోడమూ – ఇవి రాజులికి పాపాలంటారు. వేదాలు చెప్పినట్టే నడుచుకునే మనస్సు నీది. ఇలా తప్పుదారికి ఎందుకు పోనిస్తావు? ఓపిక పట్టు. రాజ్యం పాలించు పెద్దలు చెప్పినట్టు నడుచుకునేవాడివి నువ్వు. వర్ణాశ్రమధర్మాలు వినాలని వుందా? రాజైనవాడికి ఎన్నిధర్మాలైనా దండనీతితో సరికావు. సుద్యుమ్నుడనే రాజు దండనీతివల్లే మోక్షం సంపాదించాడు."

వ్యాసుడు సుద్యుమ్నుడిమాట చెప్పగానే అతడివృత్తాంతం ఏమిటో సెలవియ్యి అన్నాడు ధర్మరాజు. వ్యాసుడు చెప్పాడు.

# సుద్యుమ్నుడి కథ

"బాహుదా నది వొడ్డున శంఖుడూ, లిఖితుడూ అని ఇద్దరు అన్నదమ్ములు వుండేవాళ్లు. ఇద్దరూ ధర్మపరులు; మంచి బ్రాహ్మణులు. వాళ్ళ ఆశ్రమంలో రకరకాల పళ్ళచెట్లూ, పూలచెట్లూ ముమ్మరంగా వుండేవి. ఒకనాడు అన్న శంఖుడు ఆశ్రమంలో లేనప్పుడు లిఖితుడు వెళ్ళి వొక చెట్టునుండి ఆరముగ్గినపళ్లు కోసుకువచ్చి తినడం మొదలెట్టాడు. ఇంతలో శంఖుడు వచ్చాడు. 'తమ్ముడూ, ఎక్కడివోయి ఈపళ్ళు?' అని అడిగాడు. అన్నకి నమస్కరించి 'ఇక్కడివే అన్నయ్యా,' అన్నాడు లిఖితుడు. 'నన్ను అడగకండా ఇలా పళ్లు కోసుకువచ్చావు, తమ్ముడూ?' అన్నాడు అన్న - 'ఇది దొంగతనం కాదూ? నిన్ను పాపం చుట్టుకుంది. రాజుచేత శిక్షపొంది పాపం వొదుల్చుకో. వెంటనే రాజుదగ్గిరికి వెళ్లు. నువ్వు చేసిన పని చెప్పు. దండించమని ప్రార్థించు' అన్నమాట విని సరే, అన్నాడు లిఖితుడు.

"ఆ దేశం రాజు సుద్యుమ్నుడు. అన్నగా అతడిదగ్గిరికి బైలుదేరాడు లిఖితుడు. కోటవాకిట నిలబడ్డాడు. అతడు వచ్చిన వైనం ద్వారపాలకులు సుద్యుమ్నుడికి తెలియచేశారు. మంత్రులూవాళ్ళతో కలిసి, ఉన్నపాళాన లిఖితుని దగ్గిరికి వచ్చాడు సుద్యుమ్నుడు. 'ఏం పనిమీద దయచేశారు?' అని వినయంగా అడిగాడు - 'ఏం చెపితే అది చేస్తాను' అన్నాడు. 'రాజా, ఏం చెపితే అది చేస్తాను అని మాట ఇచ్చావు. అన్నమాట తిరగకూడదు, మరచిపోకు' అంటూ నొక్కిచెప్పాడు లిఖితుడు. 'మా అన్నగారి అనుమతి లేకండా అతడి చెట్టునించి పళ్ళు కోసుకు తిన్నాను. అది దొంగతనం. అంచేత దొంగల్ని దండించినట్టే నన్ను దండించు. నాకు పాపం లేకండా చెయ్యి. రాజు దండించినవాళ్ళకి యమదండన వుండదని

పెద్దలు చెపుతారు. దండన అనుభవించని పాపం నాకు లేకండా వుండాలి' అంటూ వివరించి చెప్పాడు.

"విని ఎంతో విచారించాడు సుద్యుమ్నుడు. 'మహాత్మా, ఇలా నన్ను నియోగించకు' అంటూ మంత్రులూ తానూ బతిమాలాడు. భక్తితో ప్రాధేయపడ్డాడు. ఒప్పుకోలేదు లిఖితుడు. తుదకి తప్పనిసరిగా తగిన దండన విచారించి లిఖితుడి రెండుచేతులూ తెగగొట్టించాడు సుద్యుమ్నుడు. రాజుని దీవించి అన్న దగ్గిరికి వచ్చాడు లిఖితుడు 'శిక్ష పొందాను' అంటూ తెగిన చేతులు చూపెట్టాడు. సంతోషించాడు శంఖుడు. 'తమ్ముడూ, ధర్మమార్గం తప్పకూడదు. అందుకనే ఈప్రాయశ్చిత్తం అవసరమైంది. నీవల్ల మనకులం యావత్తూ తరించింది. వెళ్ళు, బాహుద పవిత్రజలాల్లో దేవతర్పణం, ఋషితర్పణం, పితృదేవతలతర్పణం చెయ్యి. కల్లు తాగడమూ, గురుభార్యతో పోడమూ, బ్రాహ్మణ్ణి చంపడమూ, అతడి డబ్బు కాజెయ్యడమూ, ఇవి చేసిన క్రూరులతో జట్టు కూడడమూ మహాపాపాలు. ఈ అయిదు మహాపాపాల్లో ఏవొక్కటి చేసినా ఏజాతివాడైనా సరే, శిక్ష పొందవలిసిందే. విశేషించి దొంగ శరీర దండన అనుభవించాలి. చేసినతప్పుకి రాజుచేత శిక్షపొందినవాళ్ళు పుణ్యం చేసినవాళ్ళ మల్లేనే పుణ్యలోకాలు పొందుతారు. నువ్వు సుద్యుమ్న మహారాజుచేత దండన పొందావు. పుణ్యాత్ముడివయావు. వంశం ఉద్ధరించగలిగావు. సంతోషంగా వెళ్ళు' అన్నాడు.

"అన్న చెప్పినప్రకారం లిఖితుడు వెళ్ళి బాహుదానదిలో మునకపెట్టగానే అతడిచేతులు యథాప్రకారం మొలుచుకువచ్చాయి. ఆశ్చర్యపోయాడతడు. సంతోషంతో అన్న దగ్గిరికి పరిగెత్తుకు వచ్చాడు.

* మనుస్మృతి. అ 8. శ్లో. 316, చూ. పురిపండా రామాయణం. కిష్కింధా కాండ. సర్గ - 18.

ఎర్రపద్మాల్లావున్న తనచేతులు చూపెట్టాడు. 'దీనికి ఆశ్చర్యమెందుకు తమ్ముడూ ?' అన్నాడు శంఖుడు — 'ఇది నా తపస్సు ప్రభావం. దైవ విశేషం. నువ్వు పాపం పోగొట్టుకున్నావు. శుచివయ్యావు. దేవుడికి నచ్చింది.'

“సుద్యుమ్నుడు కూడా తన పితృదేవతలతో సహా పరిశుద్ధుడయ్యాడు. అంచేత ధర్మరాజా, నువ్వు కూడా తగినట్టు దండనీతిప్రకారం ప్రజల్ని పరిపాలించు. నీతమ్ముడు చెప్పిన మాట వేదసమ్మతంగా వుంది. 'రాజనీతి, దండనవల్లే కాని తల బోడిచేసుకుని సన్యసించడంవల్ల పొసగదు' అంటారు పెద్దలు. విచారం విడిచిపెట్టు. రాజ్యం పరిపాలించు. తృప్తి కలిగినట్టు గొప్పగొప్ప యజ్ఞాలు చెయ్యి” అంటూ ఇంకా ఇలా చెప్పాడు వ్యాసముని.

“అడవుల్లో మీరు వున్నప్పుడు పాపం, నీతమ్ములు ఎన్నో కోరికలు మనసులో పెట్టుకు దినాలు గడిపారు. దయలేకుండా వీళ్ళని వొదిలెయ్యకు. నువ్వు రాజ్యంచేసి, వీళ్ళు అన్నిభోగాలు అనుభవించడానికి అవకాశం కలిగించు. అశ్వమేధం మొదలైన యజ్ఞాలు చెయ్యి. కీర్తి సంపాదించు. నీతమ్ములూ ఎన్నో యజ్ఞాలు చేస్తారు. ఆతరవాత ద్వంద్వాలు అతిక్రమించి బైటపడవచ్చు. విన్నావూ, మేం వెర్రివాళ్ళం కాం కదా ? నీమనస్సులోని మంచి తెలుసు మాకు. అతిథుల ఋణమూ, దేవతల ఋణమూ, పితృదేవతల ఋణమూ తీర్చకుండా ఇది నీకు తగదు. ధర్మశాస్త్రం తెలుసుకుని, మనుషుల ఇంగితాలూ స్వభావాలూ చేష్టలూ ఎరిగి, వాళ్ళ మంచి గుణాలూ చెడ్డగుణాలూ గ్రహించి దండనీతి ప్రయోగించే రాజు సకలశుభాలూ పొందవచ్చు. ప్రజల ఆదాయంనించి ఆరోవంతు పుచ్చుకుంటూ, ప్రజలందరినీ దయతో తండ్రిలాగ పక్షపాతం లేకుండా రాజ్యం పాలించడంవల్ల ముక్తి లభిస్తుంది. అంచేత దయ

పడకు. సంశయించకు. ఇలా కాకుండా కొవ్వెక్కి, కామక్రోధాలు మనసులో పెట్టుకుని నడుచుకునే రాజుకి మాత్రం ప్రజలు చేసిన పాపంలో నాలుగోవంతు చుట్టుకుంటుంది, తప్పదు. న్యాయంగా అయితే శత్రువులతో కలిసినా నడవచ్చు. కానప్పుడు చంపడమే ధర్మం. ఏమంటే పాపకర్ములైన రాజులతో సంధి చేసుకోడం పాపం. రాజైనవాడు రాజ్యం అమ్ముకోని, యుద్ధం మానవచ్చా? యుద్ధంలో జయించి, రాజ్యం ఏలుకోడం కంటే మించినధర్మం మరొకటి వుందా? రాజవంశంలో పుట్టిన నువ్వు 'యుద్ధం చెయ్యకుండా వుండలేక పోయాను. దుర్యోధనుడితో సంధిచేసుకోని హింసకి పాలువడ్డాను' అనుకోడం అవివేకం. వెనకటికి హయగ్రీవుడు భూప్రపంచం యావత్తూ ఆక్రమించాడు. సద్బుద్ధితో ప్రజల్ని పాలించాడు; పోషించాడు; దండించాడు; యజ్ఞాలు చేశాడు. అగ్గిలో నెయ్యివేల్చినట్టు యుద్ధంలో శత్రువుల్ని ఆహుతిచేశాడు. తుదిని శరీరంమీద ఆశ వొదిలిపెట్టాడు. ఉత్తమసిద్ధి పొందాడు. నిజంగా రాజులికి ఆటలవంటివి యుద్ధాలు. యుద్ధంలో చంపడమూ, చావడమూ, ప్రజాపరిపాలన చేస్తూ తగినట్టు దండించడమూ ఉత్తమక్షత్రియధర్మాలు. హింసఅన్న శంక విడిచిపెట్టు. అన్వీక్షకి, త్రయీ, వార్తా, దండనీతీ* – ఈ రాజవిద్యల్లో ప్రవీణులైనవాళ్ళు సహాయంతో అన్నివ్యవహారాలూ నిర్వహిస్తే మోక్షం కరతలామలకం అవుతుంది. దుఃఖం విడిచిపెట్టు" అన్నాడు.

అయినా తెలువుకోలేదు ధర్మరాజు. చిరాకు వేసింది అర్జునుడికి. అయితే అది మొహంలో మాత్రం కనపడనివ్వలేదతడు.

"భర్తలు పోయి మొత్తుకుంటున్నారు స్త్రీజనం" వ్యాసముని మొహం చూస్తూ అన్నాడు ధర్మరాజు — "పిళ్ళ చనుపులూ, శోక

---

* అన్వీక్షకి : తర్కవేదాంతాలు తెలుపుతుంది. త్రయి : ధర్మార్థకామాం వివరిస్తుంది. వార్త : అర్థానర్థాలు బోధిస్తుంది. దండనీతి : మంచీచెడ్డా, న్యాయలు అన్యాయం వ్యక్తం చేస్తుంది – శుక్రనీతి, అ. 1. రాజకృత్యప్రకరణం.

వంతా పాలూ కుళ్ళగించేస్తూ వుంటే రాజ్యమెలా ఏలేది? ఏలినంత మాత్రాన ఈదుఃఖం ఎలా వొదులుతుంది?"

"దుఃఖం పొమ్మంటే పోతుందా?" అన్నాడు వ్యాసముని — "సుఖం రమ్మంటే వస్తుందా? సాధ్యమా ఇది. వెనకజన్మలో చేసుకున్న పాపపుణ్యాలబట్టి వస్తాయివి సుఖమూ, దుఃఖమూ రెండూ స్థిరం కావు. వాటి కాలంలో అవి వస్తూ పోతూ వుంటాయి. కాలం కలిసివస్తే, బుద్ధిలేనివాడికైనా డబ్బు చేతికి వస్తుంది. కాని కాలం వస్తే ఎంతటి గొప్పవాళ్ళైనా సరే, చిల్లిగవ్వ సంపాదించలేరు. గాలీ, వానా, ఎండా, వెన్నెలా — ఇవి అన్నీ కాలంబట్టే పుడుతున్నాయి. బాగా ఆలోచిస్తే మంత్రాలూ, కళలూ, మందుమాకులూ కాలంబట్టే మేలు కలిగిస్తాయి. పద్మాలూ, కలవలూ వికసించడమూ, తీగెలు పువ్వులు పుయ్యడమూ, చెట్లు పళ్ళు పండడమూ, పక్షులూ మృగాలూ మదించడమూ ఇదంతా కాలం బట్టే జరుగుతుంది. చావుపుట్టుకలూ, హానివృద్ధులూ మొదలైన యీ వస్తువిషయాలూ కాలంబట్టే జరుగుతాయి. కనక నువ్వు విచారించవలిసిన పనిలేదు. లోగడ సేనజిత్తు అని వొక రాజు వుండేవాడు. అతడి కొడుకు చచ్చిపోయాడు. దుఃఖం ముంచుకువచ్చింది. తుదకి తనలో తానే తెలుసుకుని బుద్ధిమంతుల ఎదట ఇలా అన్నాడతడు.

"'తాను కొందరికి బాధకలిగించడమూ, కొందరిచేత బాధపడడమూ, లోకంలో వున్నదే. ఇవి రెండూ కాలంబట్టే కలుగుతాయి. జ్ఞానం కలిగిన మనిషి వొకళ్ళని బాధపెట్టాను అని సంతోషించడు. ఒకళ్ళు బాధపెట్టారు అని విచారించడు. ధనమూ, భార్యా, బిడ్డలూ, బంధువులూ పోయారని ఏడవడం తెలివితక్కువ. ఏడిస్తే మాత్రం కీడు తప్పుతుందా! పోయినవాళ్ళు వస్తారా? కనక ఏడవకూడదు. దుఃఖానికీ, భయానికీ లోకంలో ఎన్నో కారణాలున్నాయి. వాటికి పండి

తుడు మనస్సులో చోటివ్వడు. మూఢుడు మాత్రం అవి తప్పించుకో లేడు. దుఃఖంలో మునిగిపోతాడు. వినండి. సుఖమూ, దుఃఖమూ ఏదీ శాశ్వతం కాదు. శాంతికోరే మనుషులు సుఖంవస్తే సంతోషించనూ కూడదు. దుఃఖంవస్తే దుఃఖించనూ కూడదు. ఇదే తగినపని. కేవలం మూఢులైనవాళ్ళూ, బాగా వివేకం కలవాళ్ళూ సుఖంగా వుంటారు. మిడిమిడిజ్ఞానంతో తెలిసీ తెలియనివాళ్ళుమాత్రమే దుఃఖపడతారు. సందేహంలేదు.'

"ఇవి సేవజిత్తు మాటలు. నిజంగా ఎంతో వివేకవంతుడతడు. పండితులు ఆదరించదగిన మాటలు చెప్పాడు. ఆతడన్న మాటల అర్థం మనస్సుకి పట్టించుకో. విచారం విడిచిపెట్టు. ఇంకావిను.

"వర్ణాలూ, ఆశ్రమాలూ బాగా తెలుసుకుని, అవి చక్కగా నడిపించి రాజ్యం పాలించు. తగినవిధంగా దండనీతి నడిపించు. ఇదిగో ఇదీ నీకు తగిన వృత్తి.

"స్వర్గానికి వెళ్ళినా కూడా ప్రజలు ఎవడి గుణాలు పొగుడు తారో అతడే సత్పురుషుడు అంటారు పెద్దలు. అంతమందికీ ప్రియమైన రాజ్యపరిపాలన నీ కులధర్మం. అదే నీకర్తవ్యం. అదే ఉచితంకూడా" అన్నాడు.

"మునీంద్రా," దుఃఖంతో ఎత్తుకున్నాడు ధర్మరాజు — "నా కన్నతండ్రి అభిమన్యుణ్ణి ఎలా మరిచిపోయేది? ద్రౌపది అయిదుగురు కుమాళ్ళూ, అన్న కర్ణుడూ, విరాటరాజూ, ద్రుపదమహారాజూ, ధృష్టకేతుడూ ఎలా తనువుకి రాకండా వుంటారు? చెప్పూ, ఎలా కలుగుతుంది నాకు శాంతి?

"చిన్నప్పుడు నన్ను ముద్దుగా తొడలమీద పెట్టుకుని లాలించిన తాతని భీష్ముణ్ణి చంపుకున్నాను. అర్జునుడి బాణాలు శరీరం చేల్చేస్తూవుంటే, అతడు శిఖండివేపు కన్నెత్తి చూడలేదు. కళ్ళారా

చూశా నది. ఎల్లప్పుడూ అది మనస్సు శాల్యిస్తూనే వుంటుంది. అంతే కాదు, ఆస్థితిలోకూడా శిఖండిమీద అతను బాణం వెయ్యకపోడం తలుచుకుంటే గుండె తరుక్కుపోతుంది. పరశురాముణ్ణి జయించిన బలవంతుడు. కాశీరాజుకూతుళ్ళకోసం లోకంలోని రాజులందరినీ గెలిచిన వీరుడు. అంతవాడు యుద్ధంలో తుళ్ళిపోడం ఊహించుకుంటే దుఃఖం పొర్లుకువస్తుంది. మూనాళ్ళ ముచ్చట రాజ్యంకోసం అంతటి కీర్తిశాలిని, వృద్ధసింహంలాంటి తాతయ్యని, వంశానికి తలమానికం వంటివాణ్ణి చంపాను. దుఃఖంతో మనస్సు కుంగిపోదూ, చెప్పూ?

"లోకమంతా పాదపూజచేసే గురుదేవుడు, దుఃఖంతో తన కొడుకుకోసం ఎంతో నమ్మి నన్ను అడిగాడు. ఏనుగుచావు మనసులో పెట్టుకుని, బతికున్న అశ్వత్థామ చచ్చిపోయాడు, నిజమే అని అబద్ధమాడాను. గురుద్రోహిని. రాజ్యం ఏలడానికి అర్హత ఎక్కడుంది నాకు? మునీంద్రా, చెప్పు. రాజ్యంకోసం ఆశపడి పాపం పోసుకున్నాను. గురువుని చంపుకున్నాను. నావంటి క్రూరాత్ముడు ఏగతికి పోతాడు చెప్పు?

"అన్న, మహాత్ముడు, కర్ణుడు. అతణ్ణి చంపించి ఏలుకున్న రాజ్యం, ఏంసుఖం కలిగిస్తుంది? బాధలపాలు చెయ్యదూ?

"మహావీరుడు ద్రోణాచార్యుడు కాస్తూ, మండుతూన్న అగ్నిహోత్రంలా వున్న పద్మవ్యూహం చూసి, ఇది ప్రాణాంతకం అని ఆలోచించకండా కొడుకుని చంపేశాను. సుభద్రా అర్జునులలాగ ఇంత దారుణం సహించిన తల్లీ తండ్రీ ఎక్కడైనా వుంటారా? అయ్యో, అభిమన్యుడంతవాడు లోకానికి రాజెందుకవుతాడు?

"దుఃఖానికి తగని ఇల్లాలు ద్రౌపది. మేరువుల్లాంటి అయిదుగురు కొడుకుల్ని యముడు పట్టుకుపోయి, కుంగిపోతూవుంది, ఎలా చూడనూ ఇది? ఎంతో కుసిల్లిపోతున్నాను. అయిదు కులపర్వతాలు

కూలిపోయి, పాడుపడిన భూదేవిలాగా వుంది ఆమె. గృహభారం నెమ్మదిగా ఎలా నిర్వహిస్తుంది?

"ప్రాయోపవేశంచేసుకుని ఈశరీరం వొదిలిపెట్టెయ్యాలని బుద్ధిపుడుతోంది. దుఃఖంతో వున్నాను. నన్ను కనికరించండి. సన్యసించి అడివికి పోనివ్వండి."

బంధుమరణదుఃఖంతో అలా వ్యాకులపడుతున్న అతణ్ణి వోదారుస్తూ మళ్ళీ అందుకున్నాడు వ్యాసముని.

"పుణ్యాత్ముడివి నువ్వు, ఇలా అనవచ్చా? నీవంటి ధైర్యవంతుడు ఇలా దుఃఖపడడంవల్ల ఛగేప దే చెవ్వచలిపిస్తోంది. మనసుపెట్టి నామాటవిను.

"ఏపదార్థాలైనా తరగడంకోసమే పెరుగుతాయి. పడిపోడంకోసమే ఎదుగుతాయి. ఎడబాటుకోసమే దగ్గరచేరతాయి. నాశనంకోసమే పుడతాయి. దుఃఖంకోసమే సుఖపడతాయి.

"స్నేహితులు చేసినపని సుఖం కలిగిస్తుం దనడమూ, శత్రువులు చేసినపని దుఃఖం కలిగిస్తుం దనడమూ, ధనంవల్ల మంచిబుద్ధి కలుగుతుం దనడమూ, సుఖాలన్నిటికీ అదే సాధనమనడమూ — ఇదంతా చిత్రచరిత్రుడైన విధి అనుకూలంగా వుంటేనే. అది లేకపోతే అంతా నీటిమీద రాతే అయిపోతుంది. అందుచేత ధర్మరాజా, దుఃఖంతో బాధపడకు. విధి నిన్ను ఏధర్మంకోసం పుట్టించాడో అది నడిపించు. ఏమంటే, నువ్వు విధిచేతి కీలుబొమ్మవే కాని నీకు నువ్వు ప్రభువ్వి కావు కదా!

"విదేహరాజు జనకుడు, తన వివేకం పరిపక్వం కాకముందు వొకప్పుడు బంధువియోగంవల్ల బాధపడి, ఇల్లువొదిలి వెళ్ళిపోడానికి సిద్ధపడ్డాడు. ఇంతలో అశ్మకుడని ఒక బ్రాహ్మడు అతడి దగ్గిరికి వచ్చాడు. జనకుడు అతణ్ణి తగినట్టు పూజించాడు.

"మహాత్మా, ధనమూ, బంధువులూ కలిగినప్పుడు సంతోషమూ, అవి పోయినప్పుడు దుఃఖమూ ఎలా కలగకండా వుంటాయో సెలవియ్యి" అని అడిగాడు.

"అశ్మకుడు ఇలా వివరించాడు.

"సుఖమూ, దుఃఖమూ రెండూ సంసారంలో అంటిపెట్టుకునే వుంటాయి. వాటికి లొంగిపోయిన మనిషి ఆత్మని, అవి మేఘాలు చెదరగొట్టిన గాలిలాగ చెడగొడతాయి. కేవలం సుఖమే అనుభవించేవాడు కానీ, కేవలం దుఃఖమే అనుభవించేవాడు కానీ లోకంలో లేడు. ఈవిషయం తెలుసుకోడమే దీనికి మందు. ముసిలితనం రాకండా తప్పించుకోడం ఎవళ్ళకైనా తరమవుతుందా? చావకండావుండడం ఎవళ్ళకైనా శక్యమా? భూలోకమంతా ఏలిన మహారాజే అవుగాక వాడు! అంచేత మహారాజా, ఎప్పుడు ఏదివస్తే అది అనుభవించవలిసిందే అనుకుని ధైర్యంగా వుండడమే తెలివైన పని. సరసాన్నాలూ, ఆసనాలూ, వాహనాలూ కాలంబట్టే లభిస్తాయి మనిషికి. కాలంబట్టే పోతూ వుంటాయి. కనక వాటిని నమ్ముకోపోడమే మంచిది. మంచి ఉపాయం తెలిసిన వైద్యులు శాస్త్రాలు అధ్యసించి మందులు తయారు చేస్తారు. శరీరరోగాలు తెలుసుకుని రోగులికి చికిత్స చేస్తారు. రోగాలు కుదురుతున్నాయికదా! అయితే వైద్యులుమాత్రం రోగులు కాకండా వుండిపోతున్నారా? విధి ప్రతికూలమైనప్పుడు మనిషి చాకచక్యం ఎందుకూ పనికిరాదు. మంచివంశంలో పుట్టుకా, సౌందర్యమూ, బలమూ, సంపదా, భోగాలూ-ఇవన్నీ కాలంబట్టే కలుగుతాయి. గర్భదరిద్రులికి గంపెడు పిల్లలు పుడతారు. సిరీ, సంపదా వున్నవాళ్ళు వెయ్యి దేవుళ్ళకి మొక్కుకున్నా సంతానం కలగదు. దరిద్రులు కడుపుమంటతో రాళ్ళు తిన్నా అరిగించుకుంటారు. అగర్భ శ్రీమంతులు తిన్నతిండి తిన్నగా అరిగించుకోలేరు. అడదీ, తాగుడూ, జూదమూ,

వేటా – ఎంతమాత్రం కూడదు. ఇవి తెలిసి తెలిసీ, ఉపాయ మెరిగిన వాళ్ళుకూడా పీటివల్ల బాధపడం కద్దు. విధికృత్యం ఇలాగే వుంటుంది. అంచేత ఆలోచిస్తే కష్టాలకి కారణాలు కనపడవు. బంధువులు కలగడమూ, వాళ్ళు గతించడమూ వరదలో కర్రపుల్లలు కలుసుకుని విడిపోడం వంటిది. సంసారంలో వందలూ వేలూ తల్లులూ, తండ్రులూ, భార్యలూ, కుమారుళ్ళూ, అన్నదమ్ములూ గతించారు మనిషికి. అందులో ఎవళ్ళకోసం ఏడవడం? అంచేత అంతా అశాశ్వతమైందని భావించడమే తెలివైనపని. కాలం మహాసముద్రం. పుట్టుకా, ముసలితనమూ, చావూ ఇవే ఇందులోని మొసళ్ళు. లోకమంతా ఈమహాసముద్రంలో మునిగి వుంది. ఇది తెలుసుకున్నవాడు విచారం విడిచిపెడతాడు. ధర్మమార్గంలో నడుచుకుంటాడు. తనశరీరమే తనకి శాశ్వతంకాదు మనిషికి, బంధువులా శాశ్వతం? ఏడిస్తేమాత్రం చచ్చినప్రాణి తిరిగి వస్తుందా? మనస్సు మరింత బాధపడడం తప్ప మరో లాభంలేదు. కనక రాజా! విచారం విడిచిపెట్టు. నీ కులధర్మప్రకారం కర్మలు మొదలెట్టు. సత్పురుషుల సహవాసంచెయ్యి. పాపాలు పోగొట్టుకో. పవిత్రుడివి కా. లోకం పొగిడేనట్టు కీర్తి సంపాదిస్తావు. నామాట మనసులో పట్టించుకో' అన్నాడు.

"అశ్మకుడి ఉపదేశంలో వివేకం తెచ్చుకున్నాడు జనకుడు. అతణ్ణి సాగనంపి, తన కర్మలు తాను నిర్వహించడంకోసం ఇంటిదగ్గిరే వుండిపోయాడు. అంచేత ధర్మరాజా! నువ్వూ అలాగే విచారం విడిచిపెట్టు. ఉత్తమక్షత్రియుల పంథా అనుసరించు. రాజ్యం పాలించు. మరో ఆలోచన పెట్టుకోకు" అన్నాడు.

మాట్లాడలేదు ధర్మరాజు. అన్నగారి వైఖరి చూసి కృష్ణుడితో అన్నాడు అర్జునుడు — "కృష్ణా! బంధుమరణంవల్ల దుఃఖం

ముంచుకువచ్చి వివేకం హరించింది అన్నయ్యకి. బుద్ధిబలం వికల మైంది. తగినమాటలు చెప్పి నువ్వే నోదార్చాలివ్వాను."

అర్జునుడు అలా చెప్పడంతోనే శ్రీకృష్ణుడు ధర్మరాజు దగ్గిరికి వచ్చాడు. నమస్కారం చేసి, అతడి చెయ్యిపట్టుకున్నాడు. తామరపువ్వులాటి మొహంతో కలకల్లాడుతూ ఇంపైనమాటలతో ఇలా ఎత్తుకున్నాడు :

"ధర్మరాజా ! పురుషుల్లో పెద్దపులివి నువ్వు. మనస్సు కష్ట పెట్టుకుంటూ ఇలా విచారిస్తా వెందుకూ ? మీబంధువులు పోరాటంలో అద్భుతమైన సాహసం చూపించారు. స్వర్గానికి వెళిపోయారు. ఈరాజుల సంగతంతా కల. రాజులమాటే ఎందుకూ, మనిషన్నవాడు ఎవడు చిరకాలం పుట్టికట్టుకు వూరేగుతాడు చెప్పూ ?

"వెనకటికి సృంజయుడని వొక రాజు వుండేవాడు. అతడు కొడుకుపోయి, ఎంతో దుఃఖంలో మునిగిపోయాడు. అప్పుడు ఇదిగో ఈనారదముని అతడికి పదహారుగురు రాజుల వృత్తాంతం చెప్పి వోదార్చాడు" అంటూ నారదమునిని చూపించి, "ఈమహాత్ముడు అలా మరుత్తుడూ, సుహోత్రుడూ మొదలైన రాజుల ఘనకార్యాలు వివరించి, అంతటివాళ్ళకీ కూడా కాలం తప్పించుకోడం సాధ్యంకాకపోడం తెలియచెప్పాడు సృంజయుడికి. అభిమన్యుడు కాలంచేసి, నువ్వు విచారంతో వున్నప్పుడు జాలిపడి వ్యాసుడు నీకు అవి వివరించాడు. అదిగో ఆమాటలే నేనూ ఇప్పుడు చెప్తూతున్నాను, ఆలకించు" అంటూ పదహారుగురు రాజుల కథలూ చెప్పాడు. *

---

* చూ. ద్రోణపర్వం. పు. 1682.

శ్రీకృష్ణుడు ఇలా చెప్పడంతోనే "సృంజయుడి కొడుకు సువర్ణష్ఠీవి పుట్టుకా, అతడి చావూ లోగడ విన్నాను. అయినా వివరంగా వినాలనిపిస్తోంది, వినిపించు" అన్నాడు ధర్మరాజు.

"అవును," అంటున్నాడు కృష్ణుడు — "సువర్ణష్ఠీవి కథ నారదుడికి సంబంధించినంతవరకే చెప్పాడు వ్యాసముని. ఆకథలో పర్వతుడు కూడా వున్నాడు. అదంతా వినిపిస్తాను, విను.

### పర్వత నారదుల కథ

"నారదుడి చెల్లెలి కొడుకు పర్వతుడు. పర్వతుడూ, నారదుడూ ఇద్దరూ భూలోకంలో తిరగడంకోసం కలిసి స్వర్గంనించి దిగారు. ఒకళ్ళ మనసులోనిమాట వొకళ్ళకి దాచకూడదని ఇద్దరూ కూడబలుక్కున్నారు. దాస్తే శాపంపాలు కావాలని వొట్టు వేసుకున్నారు. అలా తిరుగుతూ వొకనాడు సృంజయుడి దగ్గిరికి వెళ్ళారు. ఎంతో భక్తితో వాళ్ళని పూజించాడు సృంజయుడు. 'మీ ఇంట కొన్నాళ్ళు వుండాలని వుంది. ఏమంటావు?' అన్నారు పర్వత నారదులు. 'అంతకంటేనా' అంటూ సంతోషించాడు సృంజయుడు.

"అతడికి వొక కుమార్తె వుండేది. ఆమెపేరు సుకుమారి. ఆమెని పిలిచి 'ఈబిడ్డ మీకు పరిచర్య చేస్తుంది హాయిగా వుండండి' అన్నాడు సృంజయుడు. 'అమ్మా. దేవతలని ఆరాధించినట్టు వీళ్ళని ఆరాధించు' అని సుకుమారితో చెప్పాడు. అవసరమైన వస్తువులన్నీ సమగ్రంగా సమకూర్చాడు.

"అలా సుఖంగా మునీశ్వర్లు ఇద్దరూ సృంజయుడి ఇంట వుంటూ వచ్చారు.

"అందమైన సుకుమారి శరీరానికి కొనుగుపెడుతున్న పాదాలూ, కనపడీ కనపడకుండా వింతగా పుట్టుకువస్తున్న నూగారూ,

ఏర్పడీ ఏర్పడని చిరునవ్వు ముఖకళలూ, సన్నని నడుమూ, పొటమరిస్తూ చుట్టూ జిగి ఎక్కుతున్న స్తనాలూ, చుట్టూ తెల్లగా మధ్య నల్లగా అందం పుట్టిస్తున్న నేత్రాలూ - తొలియవ్వనంలో నవనవలాడుతూ రాజకుమారి సుకుమారి, దగ్గిర తిరుగుతూ వుంటే నారదముని మనస్సు ఆమెమీద తగులుకుంది. మన్మథబాధతో అతడి ధైర్యం దిగజారిపోయింది. ఆ విచారంతో బాగా చిక్కిపోతూ వచ్చాడతడు. లోలోపల బాధపడుతూ అది మేనల్లుడితో చెప్పడానికి సిగ్గుపడ్డాడు.

"మేనమామ అలా పాలిపోయిన మొహంతో దిగాలుపడి వుండడమూ, ఎప్పుడూ విచారంగా వుండడమూ కనిపెట్టాడు పర్వతుడు. ఏమా అని ఆలోచించాడు. దివ్యదృష్టితో చూసి తెలుసుకున్నాడు. 'మామా! ఒట్టుతప్పిపోయావు. నాపట్ల కపటం చేశావు కదా! రాజకూతురుమీద మనసుపుట్టడం నాతో చెప్పావు కావు. దాచావు. శపిస్తున్నాను. కామం బలీయమైంది. కనక ఈ లేడికళ్ళ చిన్నదాన్ని వరించకుండా నిలవలేవు నువ్వు. అయితే దీన్ని పెళ్ళిచేసుకున్న తరవాత నీ మొహం కోతిమొహమైపోతుంది' అని శాపం పెట్టాడు. నారదుడు నొచ్చుకున్నాడు 'స్వర్గానికి వెళ్ళే శక్తిలేకుండా వుండాలి నీకు' అని మేనల్లుడికి ప్రతిశాపం పెట్టాడు. పర్వతుడు అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. ప్రజల పూజ లందుకుంటూ ఎక్కడెక్కడో తిరిగాడు.

"శాపం వచ్చినా రానీ అనుకున్నాడు నారదుడు. సుకుమారిని ఇమ్మని సృంజయుణ్ణి అడిగాడు. సమ్మతించాడు సృంజయుడు. సుకుమారిని నారదుడు పెళ్ళిచేసుకున్నాడు. మూడుముళ్ళూ ఇట్టే పడేసరికి కోతిమొహం తయారైంది నారదమునికి. అయితే అసహ్యించుకో

లేదు సుకుమారి. అన్నివిధాలా భర్తని సంతోషపెడుతూ వచ్చింది. పతివ్రతగా అతణ్ణి ఆరాధించింది.

"ఇలా వుండగా ఏదో పనిమీద వొకనాడు నారదుడు అడివికి వెళ్ళాడు. అక్కడ పర్వతుడు అవుపించాడు. నమస్కరించాడు. 'మామా! నువ్వు పెట్టిన శాపం మళ్ళించవూ?' అని ప్రాధేయ పడ్డాడు. 'నువ్వుముందు శపించావు. కనక నువ్వే ముందు మళ్ళించాలి' అన్నాడు నారదుడు, 'సరే,' అని అంగీకరించాడు పర్వతుడు ఇద్దరూ అలా రాజీపడ్డారు. ఒకళ్ళశాపం వొకళ్ళు మళ్ళించారు. అల్లుడూ మామలు కలిసి సృంజయుడి ఇంటికి వచ్చారు. నారదుణ్ణి చూసింది సుకుమారి. కోతిమొహం లేకపోడంతోనే ఇంకెవడో అనుకుంది. మాటాడకండా మొహం తిప్పేసుకుని లోపలికి వెళ్ళి పోయింది.

"నవ్వుతూ అంతా విప్పి చెప్పాడు పర్వతుడు. శాపాలూ అవీ మళ్ళించడమూ వివరించి 'ఇతడే నీ భర్త' అంటూ ఆమె సందేహం తీర్చాడు. ఇదీ నువ్వు అడిగిన కథకి పూర్వకథ. సువర్ణష్ఠీవి కథ స్వయంగా నారదుడే చెపుతాడు విను" అన్నాడు.

"అవును" ధర్మరాజువేపు తిరిగి ఎత్తుకున్నాడు నారదుడు— "కృష్ణుడు చెప్పింది నిజమే. సువర్ణష్ఠీవిచరిత్ర చెపుతాను, ఆలకించు.

## సువర్ణష్ఠీవి కథ

"అలా నేనూ, అల్లుడు పర్వతుడూ సంతోషంగా సృంజయ రాజు ఇంట్లో వున్నాం. కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఇక అక్కణ్ణుంచి వెళిపోదామని బుద్ధిపుట్టింది మాకు. సృంజయుణ్ణి ఆశ్ర యించుకు వున్న బ్రాహ్మణ ప్రార్థనతో ఆరాజుకి ఉపకారం చెయ్యాలని

అతడిదగ్గిరికి వెళ్ళాం. 'ఏదైనా వరం కోరుకో' అన్నాం. 'మీరు సంతోషించడంకంటే నాకు కావలసిన వరా లేమున్నాయి!' అన్నాడు సృంజయుడు.

"దేవతల్ని మించిన కొడుకు కావాలని వుంది నాకు" అన్నాం మేము — "కనక అలాంటి కొడుకునే కను" అన్నాం. దేవేంద్రుడి తేజస్సు కాపాడాలన్న అభిప్రాయంతో 'కాని అతడు చిరకాలం బతకడు' అన్నాడు మాపర్వతుడు. దానికి ఎంతో దుఃఖించాడు సృంజయుడు. 'ఇలా అన్నావేం మహాత్మా? నన్ను అనుగ్రహించాలికదా!' అని ప్రార్థించాడు. అయినా మాటాడలేదు పర్వతుడు. నాకుమాత్రం జాలివేసింది. 'రాజా! ఇంద్రుడివల్ల భయంలేకండా కాయశక్తులా నువ్వు కొడుకుని కాపాడు. అయినా అతడు కాలం చేస్తే నన్ను తలుచుకో. నేను చావు మళ్ళిస్తాను. నీకొడుకు మలమూత్రాలూ, ఉమ్మీ బంగారమవుతుంది. అతడిపేరు సువర్ణష్ఠీవి అవుతుంది. సంతోషించు' అని వోదార్చాను. దాంతో, అతడి సంతోషానికి అంతంలేకపోయింది. మా దారిని మేం వచ్చేశాం.

"సృంజయుడికి అనుకున్నప్రకారం కొడుకు పుట్టాడు. వాడి మలమూత్రాలూ, ఉమ్మీ, కన్నీళ్ళూ, చెమటా అంతా బంగారంగా వుండేది. అలా పెరుగుతూ వుండేవాడు వాడు. ఇలా వుండగా సమయం కనిపెట్టి, మూర్ఖులు కొంతమంది దొంగలు ఆబాలుణ్ణి ఎత్తుకుపోయారు. నోట్లో గుడ్డలు కుక్కి అడివికి పట్టుకుపోయారు. ఒళ్ళంతా శోధించి, బంగారం దొరక్కపోడంతోనే చంపేశారు. పీనుగు పారేసి వెళ్ళిపోయారు.

తనకొడుకుని ఇంద్రుడే ఎత్తుకుపోయాడనుకున్నాడు సృంజయుడు. ఏడుస్తూ నన్ను తలుచుకున్నాడు. వెంటనే నేను వెళ్ళాను. ఇప్పుడు కృష్ణుడు చెప్పిన రాజుల విషయం చెప్పి వోదార్చాను. విచారం

పోగొట్టాను. పిల్లాణ్ణి తెలివితక్కువగా దొంగలు చంపిన సంగతి చెప్పాను. “దొంగల మూఢత్వంవల్ల చచ్చి నరకానికి పోకూడదు నీకొడుకు. వాణ్ణి తెచ్చి నీకు మళ్ళీ ఇస్తాను. విచారించకు” అన్నాను. మనస్సులోనే దీవించాను. అద్భుతంగా వెంటనే బతికి వచ్చేశాడు సువర్ణష్ఠీవి. సృంజయుడి సంతోషం ఇంతా అంతా కాదు.

“అతడి దగ్గిరనించి వచ్చేస్తూ, ఇదిగో ఇది ఇంద్రుడు చేసినపని కాదు. ముందు ముందు ఇతణ్ణి చంపడంకోసం కాసుకునే వున్నాడు ఇంద్రుడు. కనక కంటికి రెప్పలా కాపాడాలి. మరిచిపోకు” అని చెప్పాను.

“కొంతకాలం గడిచింది. సువర్ణష్ఠీవి తనని మించిపోతాడని సందేహించాడు దేవేంద్రుడు. అతణ్ణి చంపడానికి పూనుకున్నాడు. అయితే నన్నూ, పర్వతుణ్ణీ తలుచుకుని భయపడ్డాడు. బృహస్పతితో ఆలోచించాడు. అతడు ధైర్యం చెప్పాడు. భయంపోగొట్టాడు. స్వర్గంలో వుండడంవల్ల బుద్ధికలిగివుంది వజ్రాయుధం. దాన్నిచూసి, “నువ్వో పెద్దపులివై వెళ్ళు. సృంజయుడి కొడుకు సువర్ణష్ఠీవిని చంపేసిరా” అన్నాడు ఇంద్రుడు. పెద్దపులై బయలుదేరింది వజ్రాయుధం.

“అదేసమయానికి సిరిసంపదలతో సంతోషిస్తూ, ప్రియభార్యలతోనూ, కుమారుడితోనూ గంగవొడ్డున అడవుల్లో విహరిస్తున్నాడు సృంజయుడు. పువ్వులూ అవీకోసుకుంటూ, కేళీవినోదాల్లో తేలుతూ, మరో తలపు లేకండా వున్నాడతను. వంచనతో అక్కడ వజ్రాయుధం పొంచుండి, వోనుపు చూసుకుని, మదపుటేనుగులా నడుస్తున్న సువర్ణష్ఠీవిమీద పడింది. అతణ్ణి చీల్చేసి మాయమైపోయింది. చచ్చిన కుమారుణ్ణి చూసి, కెవ్వున కేకవేసింది దాది. గోలుగోలుమంది.

భార్యలతో కూడా పరిగెత్తుకు వచ్చాడు సృంజయుడు. చచ్చిన కొడుకుని చూసి, అంతమందీ గుండెలు బాదుకు ఏడ్చారు.

"మళ్ళీ నన్ను తలుచుకున్నాడు సృంజయుడు. దేవేంద్రుడి మనసులోని కోపం పోగొట్టి, ఉత్తరక్షణంలో సృంజయుడి దగ్గిరికి వెళ్ళాను. సువర్ణష్ఠీవిని బతికించాను. సంతోషంతో రాజుతో కొంచెం సేపు మాటామంతీ ఆడుతూ గడిపి, అతను అనుమతించాక వెళిపోవచ్చాను.

"తండ్రి సంతోషించినట్టు నడుచుకున్నాడు సువర్ణష్ఠీవి. తండ్రి తరవాత రాజ్యానికి వచ్చాడు. మంచివాళ్ళని ఆదరించాడు. చెడ్డ వాళ్ళని దండించాడు. యజ్ఞాలు చేశాడు. పదకొండువందల సంవత్సరాలు రాజ్యం చేశాడు.

"విన్నావుకదూ, ధర్మరాజా! కృష్ణమూర్తీ, వ్యాసమునీ ఎంతో ఆదరణతో చెప్పిన మాటలు గొప్ప అర్థవంతమైనవి. వాళ్ళ మహోపదేశం మనస్సుకి పట్టించుకో. భూభారం వహించు. మహాకీర్తి కలుగుతుంది. ధర్మమూ పెరుగుతుంది" అన్నాడు.

మాటాడలేదు ధర్మరాజు. కనికరిస్తూ మళ్ళీ అందుకున్నాడు వ్యాసముని.

"క్షత్రియులకి ప్రజాపరిపాలన మించి ధర్మం మరొకటి లేదు. దానివల్లే, వేదాలు చెప్పిన బ్రాహ్మణకర్మలు చక్కగా సాగుతాయి. ప్రజాపరిపాలన లేకపోతే అవి చెడతాయి. అవి బాగా సాగితే పుణ్యం కలుగుతుంది. చెడితే పాపం చుట్టుకుంటుంది అంచేత ధర్మరాజా, ప్రజాపరిపాలన సాగించు" అన్నాడు.

"మీరు చెపుతూవుంటే అవుననీ, కాదనీ అనలేను" అన్నాడు ధర్మరాజు— "కాని రాజ్యకాంక్ష పట్టుకుని, చంపరాని వాళ్ళని ఎంతోమందిని చంపాను ఈ క్రూరత్వం మనస్సు దహించేస్తూ వుంది. ఏం చెయ్యనూ?"

"చెయ్యడానికన్నా, మానడానికన్నా మనుషు లెవరయ్యా!" ధర్మరాజు మాటమీద వళ్ళీ అందుకున్నాడు వ్యాసుడు—"అంతా ఈశ్వరాజ్ఞనల్ల జరుగుతుంది. గొడ్డలి పట్టుకున్న వాడు చెట్టు నరుకుతూవుంటే గొడ్డలిదా పాపం? జనులు పాపం పొందరు. ఏమంటే అన్నిటికీ ఈశ్వరుడే కర్త. ఈనిశ్చయం మనసులో పెట్టుకుంటే చాలు. కర్మఫలం ఈశ్వరుడిదే. ఈశ్వరార్పణంగానే, వేదాలు వివరించిన కర్మలు చేస్తారు తెలిసినవాళ్ళు. తనకి సరిపడక పోయినా సరే, కులధర్మమే ఉత్తమగతి కలిగిస్తుంది. తనకి ఇష్టంగా వుండినా కూడా పరధర్మం పాపమే అంటారు పెద్దలు. కనక నీ కులధర్మం నువ్వు పాలించు.

"పగవాళ్ళని చంపడం పాపం అని మనస్సులో బాధగావుంటే తగిన ప్రాయశ్చిత్తం చేసుకో. అంతేకాని సంసారం వొదులుకు పోతాననడం ఏం న్యాయం? కీడుకోసం చావడం మంచిదా?"

ఈమాటతో ధర్మరాజు వ్యాసముని మొహం చూశాడు "కొడుకులూ, మనవలూ, అన్నలూ, తమ్ములూ, తండ్రులూ, తాతలూ, మామలూ, గురువులూ, బంధువులూ, సఖులూ, బావలూ, మరుదులూ, పుణ్యాత్ములైన రాజులూ చచ్చిపోయారు. భర్తలూ కొడుకులూ పోయి, అన్నదమ్ములూ తండ్రులూ పోయి వాళ్ళ స్త్రీజనం దుఃఖంతో పనవి పసవి ప్రాణాలు విడిచిపెడతారు. కనక సూక్ష్మంగా విచారిస్తే స్త్రీవధపాతకం కూడా చుట్టుకుటుంది నాకు. ఈపాపాలు తుదముట్టి ఎలా బైటపడతాను అని కొట్టుకుంటున్న మనసుతో రాజ్యం ఎలా రుచిస్తుంది? ఉగ్రమైన తపస్సుతో శరీరం వొదులుకోడం తప్ప మరోదారి కనపడకండా వుంది నాకు" అన్నాడు.

"అదికాదు విను," తన బుద్ధినైపుణ్యం చూపుతూ అన్నాడు వ్యాసుడు "విచారం విడిచిపెట్టు. నువ్వు చెప్పిన వాళ్ళందరూ రాజ్యాల

కోసం ఆశపడి యుద్ధంచేసి చచ్చినవాళ్ళే. ఆధిక్యమూ, ప్రతాపమూ, పేరూ కోరి, ఈసుతో పోరాడి తెగపోయినవాళ్ళే. ఎలాటికర్మగతులు వాళ్ళకి చావు తెచ్చిపెట్టాయో నీకు తెలుసా? అదంతా యముడికి తెలుసు. ఎవడికి ఎప్పుడు కాలంతీరితే వాణ్ణి అప్పుడు చంపుతా డతడు. అది నువ్వు చేసినపనేకాదు. దీనికోసం విచారం పెట్టుకోడం వెర్రి. పైగా దీనికోసం ఇల్లు వొదిలి పోతాననడం అంతకంటే పెద్దవెర్రి.

"నేర్పుకలవాడు రకరకాలుగా ఆడిస్తే ఆడుతున్న బొమ్మల్లాగ కాలం ఎలా ఆడిస్తే అలా ఆడతారు మనుషులు. నీకూ పాపానికీ సంబంధం లేదు. విచారించకు.

"మనసులో దయకలిగి వుండడం మంచిదే. చచ్చిపోయిన రాజుల రాజ్యాలు అరమర లేకండా వాళ్ళ కొడుకులకే ఇయ్యి. కొడుకులు లేనిచోట కూతుళ్ళ కియ్యి. దాంతో వాళ్ళ తల్లులు సంతోషిస్తారు. నీకూ తృప్తికలుగుతుంది. పుణ్యమూ, కీర్తికూడాదక్కుతాయి.

"జ్ఞాతుల్ని చంపానే అని సందేహించకు. దేవేంద్రుడి తోడబుట్టువులే కదా దైత్యులు? రక్తం నదులు పారినట్టు నలిగేగిపోయి, వాళ్ళని చంపలేదూ అతడు? తునాతునకలు చేసి నరికి పారెయ్యలేదూ? మునులు అతణ్ణి సేవించడం మానేశారా? అతడిచేత యజ్ఞాలు చేయించడం మానేశారా? స్వర్గలోకం పరిపాలించడంలేదూ అతడు ధర్మరాజా! దేవేంద్రుడు రాక్షసుల్ని చంపినట్టే నువ్వూ, ధర్మవిరోధులూ ప్రజాకంటకులూ అయినవాళ్ళని చంపావు. పూజ్యమార్గమే అవలంబించావు. రాజధర్మం అనుసరించావు. వీరులైన తమ్ముళ్ళతో కలిసి భయంకరమైన యుద్ధంలో శత్రువుల్ని హతమార్చావు. అందుకనే మహామునులు కూడా సేవిస్తున్నారు నిన్ను. కావాలంటే ఇంద్రుడిలాగే యజ్ఞాలు చెయ్యి. రాజధర్మం ప్రకారం రాజ్యంచెయ్యి. మొట్టమొదట అశ్వమేధం చెయ్యి."

"మునీంద్రా" అంతా విని కలత తేరిన మనస్సుతో అడిగాడు ధర్మరాజు—"ఎలాటి పనులు చేస్తే పాపం? ఏపాపానికి ఏది ప్రాయశ్చిత్తం?"

## ధ ర్మా ధ ర్మా లు

వ్యాసుడు—వేదాలు చెప్పిన పని చెయ్యకపోడమూ, చెప్పని పని చెయ్యడమూ ఇవే పాపాలన్నారు పెద్దలు. ఇది పాపానికి సామాన్యమైన నిర్వచనం. ఇక విశేషం చెప్తాను, విను.

"పొద్దు దూరుతున్నప్పుడూ పొడుస్తున్నప్పుడూ నిద్రపోడమూ, పరాయిస్త్రీతో పోడమూ, తగినవాడు ఇంటికి వచ్చినప్పుడు అతణ్ణి పూజించకపోడమూ, గురువులకి ఎదురుతిరగడమూ, గ్రామం పాడు చెయ్యడమూ, వేదాలు విక్రయించడమూ, రసాలు విక్రయించడమూ, సేవకుల్ని పోషించకపోడమూ, అబద్ధాలాడడమూ, అడివి కాల్చడమూ, తనకులధర్మం కాని పని చెయ్యడమూ, కులధర్మం వొదిలిపెట్టడమూ, వ్యర్థంగా పశువుల్ని కొట్టడమూ, బ్రాహ్మల సొమ్ము అపహరించడమూ, శరణన్న వాళ్ళని రక్షించకపోడమూ, బ్రాహ్మల్ని చంపడమూ, - ఇవన్నీ పాపాలే అన్నారు పండితులు.

"ఇక పాపాలమల్లేనే వుండి పాపాలు కానివి చెప్తాను. యుద్ధంలో ఆయుధం పట్టుకుని చంపడానికి వచ్చినవాణ్ణి, అతడు వేదాంతరహస్యాలు తెలిసిన పండితుడైనా సరే, చంపితే పాపంరాదు. బ్రాహ్మడి సొత్తు ఎత్తుకుపోతున్నవాణ్ణి చంపడంవల్ల పిసరంతా పాపం రాదంటారు ధర్మం తెలిసినవాళ్ళు. ప్రాణసంకటం వచ్చినప్పుడూ, మరో ఆహారం దొరకనప్పుడూ కల్లు తాగినా, అది కల్లు అని తెలియకండా తాగినా ఆ పాపం అధికంగా ధర్మంచేస్తే పోతుంది. గురువుల్ని రక్షించడంకోసమూ, పెద్ద ఆపద వచ్చినప్పుడూ బ్రాహ్మల సొమ్ము

తప్పించి ఇతర్ల సొమ్ము దొంగతనంగా ఎత్తుకురావచ్చు, పాపం లేదు. ఒకళ్ళప్రాణం రక్షించడానికీ, పెళ్ళిసందర్భంలోనూ, గురుజనుల కార్యంకోసమూ, ఆడాళ్ళతో మంతనాలాడినప్పుడూ, ధనమంతా పోయినప్పుడూ అబద్ధం చెప్పినా పాపం లేదు.

"కలలో వీర్యస్ఖలనం జరిగినా బ్రహ్మచర్యం చెడదు. అగ్నిహోత్రంలో నెయ్యి హోమంచేస్తే ఆ పాపం పోతుంది.

"అన్న పతితుడైనా, లేదా సన్యాసం పుచ్చుకున్నా అతడికంటే ముందు తమ్ముడు పెళ్ళిచేసుకుంటే పాపంలేదంటారు పండితులు.

"ఆవులకోసం అడివి కాల్చినా, యజ్ఞంలో పశువు చంపినా, తెలియక అపాత్రుడికి దానం చేసినా, తగని సేవకుణ్ణి పోషించకపోయినా పాపంలేదు.

## ప్రాయశ్చిత్తాలు

"ఇక ప్రాయశ్చిత్తాల విషయం — తపస్సూ, దానమూ, తగిన పుణ్యకర్మలూ — వీటివల్ల పాపాలు పోతాయి. ఇవి సామాన్యమైనవి. విశేషంగా చెయ్యవలిసిన ప్రాయశ్చిత్తాలు చెపుతాను.

"బ్రాహ్మణ్ణి చంపినవాడు తాను చేసినపని చెప్పుకుంటూ తిరగాలి. మనిషిపుర్రెలో బిచ్చమెత్తుకుంటూ రోజుకి వొక్కపూట మాత్రం తినాలి. పుర్రె తగిలించినకర్ర పట్టుకోవాలి. బ్రహ్మచర్యం చేస్తూ కింద పడుకోవాలి. ఇలా పన్నెండేళ్ళుచేస్తే ఆ పాపం పోతుంది.* కృచ్ఛ్రవ్రతం † చేస్తే ఆరేళ్ళలో పోతుంది. చాంద్రాయణవ్రతం

*చూ. గౌతమ ధర్మసూత్రాలు 3 4 4.

† మూడు పగళ్ళూ, తరవాత మూడు రాత్రిళ్ళు భోజనం చేసి, తరవాత మూడురోజులు అయాచితంగా దొరికింది మాత్రం తిని, తక్కిన మూడు రోజులూ ఉపవాసముండాలి. ఇలా పన్నెండు దినాలకి వొక కృచ్ఛ్రం పూర్తవుతుంది. ప్రాజాపత్యం, సాంతపనం, పరాకం. అతికృచ్ఛ్రం, పూర్ణకృచ్ఛ్రం, సౌమ్య

చేస్తే మూడేళ్ళలో పోతుంది. నియమంతో ఒకసారి భోజనం చేస్తే ఒక ఏడాదిలోనే పోతుంది. అశ్వమేధ యజ్ఞం చేస్తేమాత్రం ఉపవాసాలూ, వ్రతాలు ఏవీ అక్కరలేదు. అశ్వమేధం పూర్తయాక, అవభృథజలంలో స్నానంచేసిన ఇతర పాపులు కూడా పరిశుద్ధులవుతారు. అలాంటప్పుడు అశ్వమేధంచేసినవాడు ముఖ్యంగా పరిశుద్ధుడై లోకపూజితుడు కావడంలో వింతేముంది ?

"పుష్టిగావున్న లక్ష ఆవులు కానీ,, వంద కాంభోజ దేశంగుర్రాలు కానీ బ్రాహ్మలకి దానంచేసినా, లేదా బ్రాహ్మడిధనం ఇంకొకడు ఎత్తుకుపోతుంటే వాడితో పోరాడి చచ్చిపోయినా బ్రహ్మహత్యా దోషం పోతుంది.

"కల్లుతాగిన పాపం పోడానికి ప్రాయశ్చిత్తం : కల్లు నిప్పులా ఎర్రగా మరిగించి తాగాలి.[1] లేదా కళ్ళు మూసుకుని కొండ మీంచి పురకాలి. అగ్గిలో దూకాలి. మహాప్రస్థానం చెయ్యాలి. [2] అదీ కాకపోతే బృహస్పతిసవనం అనే యజ్ఞం చెయ్యాలి. మంచి భూదానమైనా చెయ్యాలి.

కృచ్ఛ్రం (చూ. గరుడపురాణం) శిశుకృచ్ఛ్రం కృచ్ఛ్రం అని వివిధరకాలు. చూ. మనుస్మృతి, అ. 11. శ్లో 211, గౌతమ ధర్మసూత్రాలు. 3 8. 1–25., యాజ్ఞవల్క్యస్మృతి. అ. శ్లో. 321

‡‡ ప్రతిదినం మూపూటలూ స్నానం చేసి, పున్నమనాడు 15 కబళాలు తిని మర్నాడు కృష్ణపాడ్యమి మొదలు ఒక్కొక్క కబళం తగ్గిస్తూ చతుర్దశినాడు ఒక్క కబళమే తినాలి. అమావాస్యనాడు ఉపవాసముండి, శుద్ధపాడ్యమి నించి ఒక్కొక్క కబళం పెంచి పున్నమనాడు 15 కబళాలు తినాలి. చూ. మనుస్మృతి అ. 11. శ్లో. 211., 217–319., అ. పరాశరస్మృతి అ. 10. శ్లో. 2.3. గౌ. ధ. సూ. 3 9. 1–18.

(1) చూ. మనుస్మృతి. అ 11. శ్లో. 90 గౌతమధర్మసూత్రాలు. 3. 5. 1. పరాశరస్మృతి. అ. 12.76

(2) చచ్చేదాకా చేసే తీర్థయాత్ర.

గురువు భార్యతో సంగమం చేసినవాడు కనకనా కాల్తూన్న ఇనప స్త్రీ విగ్రహం కౌగిలించుకోవాలి.[1] లేదా శిశ్నం కోసుకుని, చేత్తో పట్టుకుని ఆకాశం చూస్తూ చచ్చిందాకా నడవాలి.[2] లేదా గురువుకోసం యుద్ధంలో చచ్చినా, భక్తితో బ్రాహ్మలకి ధనం ధార పోసినా ప్రాయశ్చిత్త మవుతుంది.

బ్రాహ్మడి బంగారం దొంగిలించినవాడు అంత మరింత బంగారం అలాటిదే వినయంగా తిరిగి ఇచ్చుకోడమే ప్రాయశ్చిత్తం.

అబద్ధమాడిన పాపం, వొక సంవత్సరం పాటు నియమంగా వుండి, కృచ్ఛ్రవ్రతాలు చేస్తే పోతుంది.

వావిలేని స్త్రీతో పోయిన పాపం ఆరు నెలలు తడిబట్ట కట్టుకుని, బూడిదమీద పడుకుంటూ నియమంతో వుంటే పోతుంది.

పరాయి మగాడితో పోయి, పాపంతో వున్న ఆడది, కంచు పాత్ర బూడిదతో పవిత్రమైనట్టు బహిష్ఠ కావడంతోనే పరిశుద్ధురాలవుతుంది.

నరకరాని మాను నరికినా, చంపరాని జంతువు చంపినా, తానుచేసినపని చెప్పుకుంటూ మూనాళ్ళు గాలిమాత్రం తింటూ గడిపితే పాపం పోతుంది.

మితంగా భోజనంచేస్తూ, నిర్జనమైనచోట గాయత్రి జపంచేసుకుంటూ, తగినట్టు రాత్రిళ్ళు, మేలుకుని ఏమరుపాటులేకండా గడిపితే పాపాలు పోతాయి. పుణ్యకర్మలు చేస్తూ, బ్రాహ్మలకి దానాలిస్తూ వుంటే చేసిన పాపాలన్నీ పోతాయి.

---

(1) చూ. గౌతమ ధర్మ సూత్రాలు. 3. 5. 9, ఔశనస్మృతి. అ 8. 22 మనుస్మృతి. 11. 103.

(2) చూ. గౌ. ధ. సూ. 3. 5. 10 ఔశన స్మృతి. అ. 8. 29., మను. 11. 104

అయితే ఈ ప్రాయశ్చిత్తాలు ఆస్తికబుద్ధీ, శ్రద్ధా, వినయమూ కలవాళ్ళకే. అవి లేకుండా ఎన్ని చేసినా పాపాలుమాత్రం పోవు.

ధర్మరాజా! ఆస్తికబుద్ధీ, శ్రద్ధా, వినయమూ నీకు సహజం గానే వున్నాయి కనక తక్కువ ప్రాయశ్చిత్తాలతోనే నువ్వు పాపాలు పోగొట్టుకోవచ్చు. భారతవీరుల్ని చంపడమేకదా, పాపమని సందేహిస్తున్నావు? అది ధర్మగతికోసం చేసింది కనక, ఉత్తమ క్షత్రియ ధర్మం ప్రకారం ఆలోచిస్తే నీకు పాపం లేనేలేదు. అదీకాక, ఇప్పుడు నీ మనస్సులో పుట్టిన జాలీ, పశ్చాత్తాపమూ నిన్ను పరిశుద్ధుణ్ణి చేశాయి. అంచేత ప్రాణాంతకమైన తపస్సు నీకు అవసరం లేదు. కురుకులం తల మానికానికి మూలమైన ప్రజాపాలన సాగించు.

ధర్మరాజు – తాగరాని పదార్థాలేవి? తినకూడనివేవి? దాన మివ్వడానికి తగనివాళ్ళెవరు?

వ్యాసుడు – గుర్రంపాలూ, లొటిపిటపాలూ, గాడిదపాలూ తాగకూడదు. బ్రాహ్మలూ మొదలైనవాళ్ళు వాటి చుట్టుపట్లకి వెళ్ళితేనే పాపం వస్తుంది. మనిషిపాలూ, ఈనిన పదిదినాల్లో ఆవు పాలూ తాగకూడదు. ప్రేతాన్నమూ, సూతకాన్నమూ, తలారి అన్నమూ, లంజకూడూ, ఆడాళ్ళని పెట్టుకు పశువృత్తితో బతుకు తున్న వాళ్ళఅన్నమూ, నృత్యమూగీతమూ వృత్తికలవాళ్ళఅన్నమూ, జూదగాళ్ళ అన్నమూ, హంతకుల అన్నమూ, వెలివేసినవాళ్ళ అన్నమూ, అన్నకంటే ముందు పెళ్ళిచేసుకున్నవాడి అన్నమూ, భట్రాజుల అన్నమూ తినకూడదు. పాచివస్తువులూ, ఎండిన పదార్థాలూ తినకూడదు.

కల్లుతో కలిపి తెచ్చిన పదార్థం, అది ఎంత మంచిదైనా సరే, మంచిచెడ్డ లెరిగిన పెద్దలు తినరు.

పులగమూ, పాయసమూ, అట్లూ, మాంసమూ దేవతలకి అర్పించకండా తినకూడదు. అందుకని ఇష్టంవచ్చినట్టు ఇవి వండుకు తినరు తినదగినవైనా అతిథుల్నీ, దేవతల్నీ, తల్లిదండ్రుల్నీ పూజించి కాని గృహస్థులు తినకూడదు యజ్ఞంలో మిగిలిన పదార్థాలు మాత్రమే అమృతం అంటారు పెద్దలు.

గృహస్థు ఆలుబిడ్డలతోనూ, బంధువులతోనూ సంబంధం వుంచుకుంటూనే, వాళ్ళమీద మమత లేకండా పరలోకం చూసుకోవాలి.

ఇక దానం చెయ్యకూడని వాళ్ళని చెప్తాను, ఆలకించు. నాట్యం చేసి సంగీతం పాడీ హాస్యం చెప్పుకునీ జీవించేవాళ్ళూ, దుష్టులూ, కుంటీ గుడ్డీ మొదలైనవాళ్ళూ, కుమతులూ, దొంగలూ, పిచ్చివాళ్ళూ నపుంసకులూ, క్రూరులూ, మాటలతో మరపించేవాళ్ళూ తక్కువ వాళ్ళూ, వేదాలు చదవనివాళ్ళూ, నిజవృత్తి చెయ్యనివాళ్ళూ, దురాచారులూ దానం పట్టడానికి పనికిరారంటారు పెద్దలు. దీనులూ, ఆపదలో వున్నవాళ్ళూ ఎవరైనాసరే, దానానికి అర్హులు. నిందించదగిన అవగుణం కలవాళ్ళకి దయతలచి దానంచేశామే కట్టూ దానివల్ల ఫలం మాత్రం లేదు. ఇదీ పాత్ర నిశ్చయం. అపాత్రులకి దానంచేసి, పాపం పోగొట్టుకుందా మనుకోడమూ, బండరాయి తెప్పకొయ్య చేసుకు సముద్రం దాటుదామనుకోడమూ వొకటే. పుర్రెలోనూ, కుక్కతోలుతిత్తిలోనూ పోసిన పాలూ, నీళ్ళూ ఎందుకూ పనికిరానట్టు అపాత్రులకి ఇచ్చేదానం కూడా వృథా అయిపోతుంది. అందేత ఇచ్చేచోట ముందు పాత్రని తెలుసుకోవాలి. నపుంసకుడికి కన్య నివ్వడమూ, బూడిదలో నెయ్యిపోసి హోమం చెయ్యడమూ, ఓటికడవలో నీళ్ళు పట్టడమూ, అపాత్రుడికి దానమివ్వడమూ వొకటే. బాగా ఆలోచిస్తే అపాత్రదానం కీడు కూడా

చేస్తుంది. అదే తగినవాడికి స్తే, ఇచ్చినవాడికీ పుచ్చుకున్నవాడికీకూడా మేలు కలిగిస్తుంది. అంచేత పుచ్చుకున్నవాడు ఉత్తముడైతేనే ఇచ్చిన దానం శాస్త్రసమ్మత మవుతుంది. అప్పుడే అది ఇచ్చినవాడికీ పుచ్చుకున్నవాడికీ ఇహపరసాధక మవుతుంది.

ధర్మరాజా! నీకు నీతులు చెప్పడానికి పూనుకుని, మంచీ చెడ్డా సంక్షేపంగా చెప్పాను. ఇవి మనసుకి పట్టించుకుని విధిప్రకారం నడుచుకో.

ధర్మరాజు — నీదయవల్ల ఈ ఉపదేశం సంతోషం కలిగించింది. అయితే, పాపం గాకండా ధర్మమార్గం అవలంబించి రాజ్యతంత్రం ఎలా నడిపేది? ఆవిధానంకూడా దయచేసి సెలవియ్యి. రాజధర్మాలూ, తక్కిన వర్ణాశ్రమధర్మాలూ, ఆపద్ధర్మాలూ మొదలైన తెలుసుకోవలిసిన ధర్మాలు అన్నీ సెలవియ్యి. రాజ్యమూ, ధర్మమూ రెండూ పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్నాయి. అందుకనే ఇలా విన్నవించుకుంటున్నాను.

సంతోషించాడు వ్యాసముని. "ఈమహారాజు భీష్ముడిదగ్గిరికి వెళ్ళాలి" నారదుణ్ణి చూస్తూ అన్నాడు — "ఆమహాత్ముడివల్ల అన్ని ధర్మాలూ వింటాడు."

"అవును. అదే మంచిది" అన్నాడు నారదుడు.

"కురు పితామహుడు భీష్ముడు మహా బుద్ధిమంతుడు" నారదుడు కూడా సమ్మతించడంతోనే ధర్మరాజుతో అన్నాడు వ్యాసుడు "దేవేంద్రుడు కూడా గౌరవించదగ్గవాడు కల్లా కపటం లేని మహా నీయుడు; పరశురాముడి విలువిద్యా మొదలైన సుగుణాలన్నీ అతడిలో మూర్తీభవించి వున్నాయి. గంగాదేవి కడుపు పంట అతడు. గొప్పవ్రతశక్తి సుడు. అన్నిధర్మాలూ అతడివేళ్ళమీద వున్నాయి. చ్యవనుడూ, మార్కండేయుడూ, వశిష్ఠుడూ మొదలైన మహాత్మా

జ్ఞులు ప్రేమతో అతడికి సర్వధర్మాలూ వినిపించారు. అన్నీ క్షుణ్ణంగా నేర్చుకున్నా డతడు. శాంతమూర్తి. అద్భుతచరిత్రుడు. తన ఇష్టం వచ్చినప్పుడు వొదిలిపెట్టడంకోసం ప్రాణాలు నిలుపుకున్నాడు. మను ష్యుల్లో అంతవాడు ఎవడున్నాడు మరి?

"నువ్వంటే ఎంతో ప్రేమ అతడికి. అంచేత, ధర్మరాజా! అతడి దగ్గిరికి వెళ్ళు. అన్ని ధర్మాలూ తేటతెల్లంగా నీకు ఉపదే శిస్తాడతడు. ఇదే మా అభిప్రాయం. దీనివల్ల నీకు కీర్తి వస్తుంది. తగిన ధర్మమూ పెరుగుతుంది.

"ఆమహాత్ముడు పుణ్యలోకాలకి పోయే సమయం దగ్గిరపడు తోంది. ఆలస్యం చెయ్యకు, వెళ్ళు."

"అంతమంది బంధువుల్ని చంపి పాపం పోసుకున్నాను. ఆపూజ్యుడి ఎదటికి ఏ మొహం పెట్టుకు వెళ్ళనూ, తగుదునని! అదీకాక, కపటంలేని యుద్ధం చేసిన ఆగుణవంతుణ్ణి, కపటయుద్ధంలో కూల దోశాను. తిరిగీ ఆమహాత్ముడి మొహం చూసి, నాకు ధర్మం ఉపదే శించమని ఏనోరు పెట్టుకు అడిగేది?" అన్నాడు ధర్మరాజు.

"ఇంత బలవంత మెందుకూ?" అంటూ అందుకున్నాడు శ్రీకృష్ణుడు—"ఈమునింద్రులు చెప్పినట్టు చెయ్యి, అన్ని గౌరవాలకీ పాత్రుడి వవుతావు. విచారంతో ఏదైనా ఎందుకూ చెయ్యడం? ఈపాళాన ముందు హాస్తినాపురం వెళ్ళు. తరవాత భీష్ముడి దగ్గిరికి వస్తే మంచిది. నితమ్ముళ్ళూ, బ్రాహ్మణ్ణులూ, రాజ్యంలోని యావ న్మంది ప్రజలూ వానకోసం చూస్తున్న చాతక పక్షుల్లాగ నీకోసం ఎదురుచూస్తున్నారు. దయచూపి, ఇంతమందినీ ఆదరించు. అందరి కోరికా చెల్లించు" అని ప్రార్థించాడు.

అర్జునుడూ, ద్రౌపదీ, వ్యాసుడూ, నారదుడూ, దేవలుడూ, దేవస్థానుడూ, కృష్ణుడూ—ఇంతమందీ ఇన్నివిధాలా చెప్పిన మాట

లతో ధర్మరాజు మనస్సు తేలికయింది. రాజ్యం చేసే ఉత్సాహం మొలకెత్తింది. శిశిరరుతువు ఆరంభంలో వికసించిన పద్మంలాగ మొహం కలకల్లాడింది. వ్యాసుడూ మొదలైన మునులకి ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించాడతడు. రాజ్యం పరిపాలించడానికి వాళ్ళ అనుజ్ఞపుచ్చుకున్నాడు. ఆశీర్వాదాలు పొందాడు. తమతమ నివాసాలకి వెళ్ళిపోయారు వాళ్ళు.

తరవాత క్రమంగా దేవబ్రాహ్మణపూజలు ముగించాడు ధర్మరాజు.

ఇంతలో "అక్కడక్కడ మరుగుపడున్న రాజులు వచ్చి కనిపెట్టుకు వున్నారు" అని కృష్ణుడు చెప్పాడు. విని సంసిద్ధుడయాడు ధర్మరాజు. గంధం పూసుగున్నాడు. ఆభరణాలు వేసుకున్నాడు. తెల్ల మడతలు కట్టుకున్నాడు. కొలువు తీర్చాడు. మణులూ, బంగారమూ, ఏనుగులూ, గుర్రాలూ, స్త్రీలూ కానుకలిచ్చారు రాజులు వాళ్ళందరిని సంతోషపెట్టాడు ధర్మరాజు

ఆ రాజులూ, శ్రీకృష్ణుడూ, తమ్ముళ్ళూ, తక్కిన బంధువులూ, స్నేహితులూ, ధౌమ్యుడూ మొదలైన పెద్దలూ — ఇంతమంది మధ్యా కొలువులో చుక్కల్లో చంద్రుడిలాగ ప్రకాశించాడు ధర్మరాజు.

మర్నాడు వేకువనే లేచాడతడు. కాల్యకృత్యాలు తీర్చుకున్నాడు. తెల్లగంధం పూసుకున్నాడు. తెల్లటి పూలదండలు వేసుకున్నాడు. తెల్లవస్త్రాలు కట్టుకున్నాడు. ఆభరణాలు పెట్టుకున్నాడు. కొత్త రథం సిద్ధంచేయించాడు. దానికి పదహారు తెల్ల గుర్రాలు పూయించాడు అమృతరథ మెక్కిన చంద్రుడిలాగ ఆరథ మెక్కాడు.

భీముడు సారథ్యం చేశాడు. అర్జునుడు తెల్లగొడుగు పట్టాడు. నకులుడూ, సహదేవుడూ చామరాలు వీచారు. దేదీప్యమానంగా

అపుపించింది రథం. అయిదుగురు అన్నదమ్ములూ ఆ రథంమీద పంచాగ్నులలాగ ప్రకాశించారు. సముద్రం ఘోషించినట్టు వొక్క సారి తూర్యధ్వనులు భోరుమన్నాయి.

## హస్తినాపుర ప్రవేశం

ఇలా దివ్యంగా వెలిగిపోతూ బయలుదేరాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ మంచిమంచి పల్లకీ లెక్కించి ముందు నడిపించాడు. శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, వలాహకమూ— నాలుగుగుర్రాలూపూసిన రథంమీద సాత్యకితోకూడా శ్రీకృష్ణుడు వెనక బయలుదేరాడు. అశని పక్క మనోవేగంతో పరిగెత్తే గుర్రాలు పూసిన తెల్లరథంమీద యుయుత్సుడు బయలుదేరాడు. కుంతీదేవి మొదలైన రాణివాసం స్త్రీలని మేనాలమీద ఎక్కించి, తగిన వాహనమెక్కి విదురుడు వెనక నడిచాడు. సేనలతోకూడా నానాముఖాలా కొలిచి వెంట నడిచారు రాజులు. ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, కాల్బలమూ, తూర్యాలూ, వింజామరలూ, గొడుగులూ, జెండాలూ - ఓ దివ్యంగా నడిచింది ధర్మరాజు పయనం. భట్రాజులుస్తోత్రాలుచేశారు. పాఠకులు గీతాలు చదివారు. మాగధులు పాటలు పాడారు. తగినంత మెల్లిగా నడిచింది ఉత్సవం.

అలా వెళ్ళి హస్తినాపురంప్రవేశించాడు ధర్మరాజు. మహారాజు వస్తున్నాడని అంతకిముందే పట్టణంలో ధ్వజస్తంభాలకి బంగారం కలవ పువ్వుల దండలు వేలాడదీశారు. నగరద్వారాలకి అరటిస్తంభాలూ, పోకచెట్లూ కట్టారు. పూర్ణకుంభాలూ పెట్టారు. ఊరంతా కస్తూరికల్లాపు చల్లారు. కర్పూరంముగ్గులు పెట్టారు. పూలదండలు వేలాడగట్టారు. పువ్వులు కానుకలుంచారు. పట్టణమంతా భూలోక స్వర్గంలా అలంకరించారు. పిల్లలనించి ముసలాళ్ళదాకా ముస్తాబు

తయారు. మంచిమంచి బట్టలు కట్టుకున్నారు. నగలు పెట్టుకున్నారు. గంధాలు పూసుకున్నారు. పూలదండలు వేసుకున్నారు. సంతోషం వుప్పొంగుతున్న జనంతో వీధులన్నీ కిటకిటలాడాయి.

రాజమార్గం చేరాడు ధర్మరాజు. మేడలమీంచి నిత్యపుణ్య స్త్రీలు సానులు మంచిముత్యాలు అక్షతలు చల్లారు. కల్పవృక్షాలనించి పూలవాన కురిసినట్టు అనిపించింది.

చూడవచ్చిన పౌరులూ, పల్లెటూళ్ళ ప్రజా ధర్మరాజుని చూసి, రకరకాలు చెప్పుకున్నారు:

“దిగ్విజయంచేసి ప్రతాపవంతుడైనా శత్రువులేలేరు ఈమహారాజుకి”

“రాజసూయం చేశాడు. బ్రాహ్మలకొంపలు బంగారంతోనూ, రత్నాలతోనూ నింపేశాడు.”

“నిత్యవ్రతంగా సత్యంపాటించాడు. ఎన్నడూ దానికి భంగం రానివ్వలేదు.”

“ధర్మతత్పరు డెవడయ్యా అంటే, ధర్మరాజే అని కోడై కూస్తోంది లోకం.”

“బలంతో ధర్మయుద్ధం చేశాడు. శత్రువన్న పురుగు లేకండా ఏరి పారేశాడు.”

ఇలా వెయ్యివిధాల పొగిడారు. భీముడూ, అర్జునుడూ, నకుల సహదేవులూ చూపిన బలాలూ, ఉపాయాలూ, నేర్పులూ, సామర్థ్యాలూ, సాటిలేని సాహసకార్యాలూ ఎన్నోవిధాల పొగిడారు.

“వ్రతచర్యా, భాగ్యమూ, ధైర్యమూ, బుద్ధీ — ఎందులో చూసినా ద్రౌపదీదేవితో సాటివచ్చే మహారాణి లోకంలో లేదు” అన్నారు.

జనంనోట ఎక్కడచూసినా ఇవే మాటలు వినిపించాయి. ప్రతి ఇంటా ఈమాటలే ప్రతిధ్వనించాయి. చంద్రోదయంతో పొంగిన మహాసముద్రంలాగ పట్టణమంతా గుబగుబలాడిపోయింది.

కోట సింహద్వారంచేరాడు ధర్మరాజు. ఎన్నో అన్ని మంగళ ద్రవ్యాలు పట్టుకుని తగిన బ్రాహ్మలూ, పుణ్యస్త్రీలూ ఎదురు వచ్చారు. అవన్నీ అందుకుంటూ లోపల ప్రవేశించాడు ధర్మరాజు. ఏనుగు మొగసాల దగ్గిర రథం దిగాడు. ధౌమ్యుణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ ముందుపెట్టుకుని లోపలి లోగిలికి వెళ్ళాడు. గృహదేవతలని పూజించి, తిరిగి వెలపలి లోగిలికి వచ్చాడు. నగరదేవతలకి పూజలు చేయించడానికి తగినవాళ్ళని పంపాడు. బ్రాహ్మల్ని చూసి, బంగారమూ, ఆవులూ అవీ దానంచేశాడు. వాళ్ళ ఆశీర్వాదాలూ, శంఖాలూ, భేరీలూ మొదలైన తూర్యారవాలూ భూమీ, ఆకాశమూ ప్రతిధ్వనించాయి. అనంతరం యావన్మంది ప్రజలూ నిశ్శబ్దంగా ధర్మరాజు దర్శనంచేస్తూ నుంచున్నారు.

## చార్వాకుడు

ఇంతలో చర్వాకుడని వొక రాక్షసుడు బ్రాహ్మడిలా అక్కడికి వచ్చాడు. దుర్యోధనుడి స్నేహితుడతడు త్రిదండిసన్యాసి వేషంతో బ్రాహ్మలమధ్య నుంచుని ధర్మరాజుతో ఇలా అన్నాడు:

"మహారాజా! విను, బ్రహ్మలందరూ కలిసి నన్ను పంపారు. 'ఏం రాజయ్యా ఇతడూ ధరంరాజు? పాపాల భైరవుడు. తండ్రినీ అన్నదమ్ముడనీ, కొడుకనీ కంకాగింకా లేకండా అందరిని చంపేశాడు. గురువనికూడా రవంత జంకాడు కాడు. వీణ్ణి తగలెయ్యా' అని అనమన్నారు. ఇలా మంచివాళ్ళు అసహ్యించుకుంటున్న రాజ్యం ఎందు

కని నీకు? బంధువుల్ని చంపుకుని ఏం నోల్లుకుంటావు? పాపం పోసుకున్నావు అంతే "

ఈమాటలతో అక్కడి బ్రాహ్మలంతా నొచ్చుకున్నారు. ఒకళ్ళ మొహాలు వొకళ్ళు చూసుకున్నారు. "ఏమిటిది?" అంటూ క్షోభపడ్డారు.

సిగ్గుపడి తలవొంచుకున్నాడు ధర్మరాజు. చేతులు జోడించి నుదుటిమీద పెట్టుకున్నాడు.

"నమస్కారం చేస్తున్నాను. వేడుకుంటున్నాను నన్ను తిరస్కరించకండి. ఆదరించండి. మునుల అనుమతి పుచ్చుకుని, నిశ్చలమైన మనస్సుతో ఇక్కడికి వచ్చాను" అన్నాడు.

భయంతో కేకబడిపోయారు బ్రాహ్మలు.

"దేవా! ఈమాటలు మావల్ల పుట్టలేదు. ఇదేమీ తెలి యనే తెలియదు మాకు. ఉత్తమ క్షత్రియధర్మంతో రాజ్యసంపద గడించావు నువ్వు. నీసిరి సుస్థిరంగా వుండాలి" అంటూ ఆశీర్వ దించారు.

మాయసన్యాసిని చార్వాకుణ్ణి చూశారు. దివ్యజ్ఞానంతో ఆ అధముణ్ణి తెలుసుకున్నారు.

"వీడు రాక్షసుడు. దుర్యోధనుడి స్నేహితుడు. సన్యాసి వేషంలో వచ్చాడు. అతడికి మేలుచెయ్యడంకోసం ఈ తప్పుడుకూత కూశాడు. ఈకుక్క మొరిగిందని పాలసముద్రంలాంటి నువ్వు కలత పడకు. ధర్మాత్ములైన తమ్ములతో పూజ్యమైన సామ్రాజ్యం పరిపా లించు" అంటూ ఆదరించారు.

చార్వాకుణ్ణి చూసి, కోపంతో నిప్పులు కక్కారు. హుంకారం చేశారు. భయంకరమైన రాక్షసరూపంతో చచ్చి కింద కూలి పోయా

దతడు. బ్రాహ్మల తపశ్శక్తి తగిలి, పిడుగుపడిన చెట్టులా పడిపోయిన రాక్షసుణ్ణి చూశాడు ధర్మరాజు. సంతోషంతో కలకల్లాడాడు. గొప్పగా బ్రాహ్మల్ని పూజించి, సాగనంపాడు.

బ్రాహ్మల్ని పొగుడుతూ కృష్ణుడు ఇలా అందుకున్నాడు. "కృతయుగంలో చార్వాకుడు తపస్సుచేశాడు. బ్రహ్మప్రత్యక్షమ య్యాడు. ప్రాణుల య్యావన్మందివల్లా భయంలేకండా వరంకోరాడు చార్వాకుడు. 'ఇచ్చాను, కాని బ్రాహ్మలకి అనిష్టం చెయ్యకండావుండు. ఎప్పుడు వాళ్ళకి అనిష్టమైనపని చేస్తావో అప్పుడే నీ అంతం అనుకో' అని వరమిచ్చాడు బ్రహ్మ. వరంపొంది విర్రవీగాడు చార్వాకుడు. దేవ తల్ని నానా బాధలూ పెట్టాడు. వాళ్లు బ్రహ్మదగ్గిర మొరపెట్టు కున్నారు. 'నేను తెలిసే వాడికి వరమిచ్చాను' అన్నాడు బ్రహ్మ – 'దుర్యోధను డని లోకరాజుకి వాడు స్నేహితు డవుతాడు. అతడికి ఉపకారం చెయ్యడానికి వెళ్ళి బ్రాహ్మల మనస్సు బాధించేపని చేస్తాడు వాడు. వాళ్లకోపంతో చస్తాడు' అన్నాడు. అదిగో ఆ రాక్ష సుడు ఇవాళ ఇక్కడికి వచ్చాడు. తనచెడ్డవల్ల బ్రాహ్మల దండనతో చచ్చిపడ్డాడు" అనిచెప్పి పీనుగు బైటికి తీయించాడు.

"మహారాజా!" ఇంకా ఇలా అన్నాడు కృష్ణుడు – "ఎదురు తిరిగివాళ్లని భస్మంచెయ్యి. ప్రజల్ని శ్రద్ధతో పాలించు. బ్రాహ్మల్ని రక్షించు. యావన్మందిబంధువుల్నీ, ఆశ్రితుల్నీ ఆదరించి వాళ్లకి సుఖ వృత్తులు కల్పించు. వైభవ మనుభవించు. పట్టాభిషేకం చేసుకో. నిత్యకళ్యాణం పచ్చతోరణంగా పరిపాలించు."

ఇలా చెప్పి అభిషేకానికి అవసరమైన ద్రవ్యాలు తేవడం కోసం తగినవాళ్ళని నియమించాడు. వెలపలి పెద్దకొలువుకూటంలో ధర్మరాజుకోసం మహోన్నతమైన బంగారం సింహాసనం పెట్టించాడు.

అవసరమైన వాళ్ళందరికీ తగిన ఆసనాలూ అవీ ఏర్పరచడంకోసం అర్జునుణ్ణి నియమించాడు.

మనస్సులో ఏ కలంకమూ లేకండా తేరుకున్నాడు ధర్మరాజు. ధగధగా మెరిసిపోతున్న తన పీఠంమీద తూర్పుమొహంగా కూచున్నాడు. అతడి కట్టెదట తళతళలాడుతున్న బంగారం ఆసనంమీద సాత్యకితో కలిసి కృష్ణుడు కూచున్నాడు. మణిపీఠాలమీద కుడివేపు భీముడూ, ఎడమవేపు అర్జునుడూ కూచున్నారు. వెనకవేపు ఎత్తూ, వెడల్పూ తక్కువగా వున్న బంగారం ఆసనాలమీద రెండువేపులా నకుల సహదేవులతో కుంతీదేవి కూచుంది. కృష్ణుడి కుడివేపు అగ్నిహోత్రంలా ప్రకాశిస్తున్న ఆసనంమీద ధృతరాష్ట్రుడు కూచున్నాడు. అతడి తూర్పువేపు ప్రకాశిస్తున్న పీఠాలమీద విదురుడూ, ధౌమ్యుడూ కూచున్నారు. ధృతరాష్ట్రుడి వెనక తగిన పీఠాలమీద గాంధారీ, యుయుత్సుడూ, సంజయుడూ కూచున్నారు.

అప్పుడు దయాబుద్ధితో కృష్ణుడు కృపాచార్యుణ్ణి తగినవిధంగా ధర్మరాజుముందు పెట్టాడు. యోగ్యమైన ఆసనమిచ్చి అతణ్ణిధౌమ్యుడి దగ్గిర కూచోపెట్టాడు.

తెల్లపువ్వులూ, అక్షతలూ, బంగారమూ, వెండీ, భూమీ ముట్టుకున్నాడు ధర్మరాజు.

పండితులూ, దేశదేశాల రాజులూ, పనులు చేయించే అధికారులూ, ధనం వసూలుచేసే ఉద్యోగులూ, ఎన్నోపనులుచేసే పరిచారికజనమూ, కోమట్లూ మొదలైన పౌరులూ, ముఖ్యులైన రైతులూ, పల్లెప్రజలూ, వీణలు వాయించేవాళ్ళూ, గాయకులూ, పిల్లంగోళ్ళు వూది వినోదాలు చేసేవాళ్లూ, సానులూ యావన్మందీ గుంపులు గుంపులు వచ్చారు. ధర్మరాజు దర్శనం చేశారు. ఎవళ్ళకి తగినట్టు

వాళ్ళని సత్కరించాడు ధర్మరాజు అంతమందీ సంతోషించారు. ఎంతో వైభవమనిపించింది కొలువు.

## ధర్మరాజు పట్టాభిషేకం

అభిషేకానికి అవసరమైన వస్తువులన్నీ వచ్చేశాయి. శ్రీకృష్ణుడి అనుమతి పొంది ధౌమ్యపురోహితుడు తూర్పుఉత్తరాల వేపుగా వేదిక అలంకరించాడు. దృఢమైన కోళ్ళతో రత్నాలు తాపిన బంగారం భద్రపీఠం ప్రతిష్ఠించాడు. దానిమీద పులితోలు పరిచాడు. పూజించాడు. బంగారం తీగెలు కట్టిన ఉత్కృష్టమైన మహాశంఖం తగిన స్థండిలం * మీద పెట్టి పూజించాడు. దానిమీదా, దానిచుట్టూ మట్టివి, బంగారానివి, వెండివి, రత్నాలతో చేసినవి కడవలు పెట్టాడు. వాటిలో గంగాజలం నింపాడు. అన్నిటికీ శుభప్రదమైన రత్నాలూ, చివుళ్ళూ, పువ్వులూ, పంచగవ్యమూ† వాటితో మంత్ర పూర్వకంగా సంస్కారం జరిగించాడు. విర్యవంతాలైన వివిధ మంత్రాలు చదువుతూ, ఉత్తములైన బ్రాహ్మలతో కలిసి ధర్మరాజుని తీసుకువెళ్ళాడు. భద్రపీఠంమీద కూచోపెట్టాడు. శోభనంగా ముస్తాబైన ద్రౌపదిని అతడి ఎడమవేపు అదే పీఠంమీద కూచో పెట్టాడు. అగ్నిహోత్రంలో హోమకార్యం చేశాడు.

శుభలగ్నం రాగానే గంగాజలం నిండిన మహాశంఖం పుచ్చుకున్నాడు. "భూమికి మహారాజువి కా" అంటూ ధర్మరాజుని సంతోషంగా అభిషేకించాడు.

పవిత్రజలాలతో నిండిన కలశాల్లోంచి వొక ఉజ్వలమైన పూర్ణ కలశం ధృతరాష్ట్రుడికి అందించాడు ధౌమ్యుడు. అందుకుని సరైన

---

* మూరెడు చదరంగా ఇసుకతో చేసిన వేదిక, (వసిష్ఠసంహిత)

† ఆవుపాలూ, పెరుగూ, నెయ్యీ, పంచితమూ, పేడా.

మనస్సుతో, కలకల్లాడుతున్న మొహంతో అదిఎత్తి ధర్మరాజుని అభిషేకించాడు ధృతరాష్ట్రుడు. తరవాత పవిత్రాత్ములైన రాజులూ మరికొందరు అలాగే అభిషేకించారు. శంఖాలూ, తప్పెటలూ మొదలైన మంగళవాద్యాలూ, వీరుల సింహనాదాలూ వొక్కసారి చెలరేగాయి. ఇలా స్నేహితులందరూ సంతోషించినట్టు అభిషేకం చేసుకుని, సామ్రాజ్యపదవి పొందాడు ధర్మరాజు. దిక్కులేనివాళ్ళకీ, దీనులకీ, బ్రాహ్మణులూ మొదలైనవాళ్ళకీ ఎన్నోవిధాల ధనం దానం చేశాడు.

పండితులైన బ్రాహ్మణులూ మొదలైన ప్రసిద్ధపురుషులు ధర్మరాజుముందు నిలబడి "దేవా! దైవసహాయంవల్లా, పురుషప్రయత్నంవల్లా, మనుష్యశక్తికి మించిన విజయమూ, సామ్రాజ్యమూ సంపాదించావు. ఎంత గొప్పగా వుందిది!" అన్నారు.

"ఉండనీ, మాననీ మీఅంతవాళ్ళు నాలో గొప్పగుణాలున్నాయంటున్నారు. కనక పాండురాజు కుమాళ్ళమైన మేము ధన్యాత్ములం" అన్నాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుణ్ణి చూపిస్తూ ఇంకా ఇలా అన్నాడు—"తండ్రయినా, గురువైనా, దేవుడైనా ఇదుగో ఇతడే మాకు. మీరు యావన్మందీ ఈ మహారాజు ఆజ్ఞప్రకారం నడుచుకోవాలి. ఇతడికి ప్రీతికలిగిస్తే నే వేనవేలు విధాలుగా మాకు ప్రీతికలిగించినట్లు. దేశంలోని ప్రజలూ, పట్నంలోని పౌరులూ, మీరూ వెనకటిలాగే ఈ మహారాజు దగ్గిర వినయంతో నడుచుకుంటేనే నాకుతృప్తి.

"అంతమంది జ్ఞాతుల్ని చంపుకున్నాను. అయినా ఈయనసేవ చేయడంకోసమే గృహస్థధర్మం స్వీకరించాను. ఈ ఐశ్వర్యమంతటికీ, మనకీ ఈ మహారాజే ప్రభువు. ఇదిమాత్రం మరిచిపోకండి."

"మీ ఇష్టంవచ్చినట్టు సుఖంగా వుండండి" అంటూ ధృతరాష్ట్రుడితోనూ, గాంధారితోనూ వినయంగా చెప్పి లోపలికి పంపిం

చాడు. పౌరులూ, పల్లెప్రజలూ, కృపాచార్యులూ సెలవు తీసుకుని సగౌరవంగా ఇళ్ళకి వెళ్ళారు.

భీముణ్ణి యువరాజు చేశాడు ధర్మరాజు. కర్తవ్యవిచారం కోసమూ, కార్యనిశ్చయంకోసమూ సంధీ విగ్రహమూ మొదలైన ఆరుగుణాలూ ఆలోచించడకోసమూ ప్రియమైనమాటలు చెప్పే విదురుణ్ణి నియోగించాడు. వెనకా ముందూ చూసి చెప్పడానికీ, ఆదాయ వ్యయాలు చూడడానికీ సంజయుణ్ణి ఏర్పరిచాడు. తిరగబడిన రాజుల్ని అదుపులో వుంచడానికీ, రాజ్యం విస్తీర్ణం చెయ్యడానికీ అర్జునుణ్ణి నియమించాడు. సేనల హెచ్చుతగ్గులు చూడడానికీ, భృత్యుల జీతాలు ఇవ్వడానికీ, కర్మకలాపాలు జరిగించడానికీ నకులుణ్ణి నియమించాడు. బ్రాహ్మణకార్యాలూ, వైదికకర్మలూ వాటికీ ధౌమ్యపురోహితుణ్ణి పెట్టాడు. "నాకు రహస్యరక్షకుడివై సర్వావస్థలలోనూ నాదగ్గిర నువ్వు వుండాలి" అంటూ సహదేవుణ్ణి ఆజ్ఞాపించాడు. అవసరమైన అధికారాలన్నీ కల్పించి ఎవళ్ళకి తగిన పనులు వాళ్ళకి అప్పగించాడు. యుయుత్సుణ్ణీ, విదురుణ్ణీ, సంజయుణ్ణీ చూసి, "గాంధారీ, ధృతరాష్ట్రుల యోగక్షేమాలు నేనెలా చూస్తానో అలాగ ప్రతిరోజూ మీరు చూడాలి. రాజ్యంలోనివాళ్ళ పనులూ, దేశప్రజల పనులూ మహారాజు ధృతరాష్ట్రుడికీ, మహారాణి గాంధారీదేవికీ నివేదించాలి. వాళ్ళు చెప్పినట్టు అన్నీ నడిపించాలి" అన్నాడు. ద్రౌపదిని వెంటపెట్టి తల్లి కుంతీదేవిని అంతఃపురంలోకి పంపించాడు.

ఇదంతా అయాక, తేనెకోసం ఆనపడి, పూసిన పద్మంమీదికి పరిగెత్తే తుమ్మెదల్లాగ, శ్రీకృష్ణుడి ముఖపద్మంమీదికి ప్రేమతోనూ, వినయంతోనూ పరిగెత్తాయి ధర్మరాజు చూపులు. అతణ్ణీ, సాత్యకినీ గౌరవంగా విడిదికి తీసుకువెళ్ళడానికి తమ్ముళ్ళని నియమించాడతను.

అలా అన్ని పనులూ చక్కపెట్టాడు ధర్మరాజు. యుద్ధంలో కాలం చేసినవాళ్ళందరినీ తలుచుకుని, బ్రాహ్మలతో ఆలోచించి బంధువులందరికీ విడివిడిగా గొప్పగా శ్రాద్ధకర్మలు చేయించాడు. భక్తితో రత్నాలూ, బంగారమూ దక్షిణ లిచ్చాడు. ద్రోణాచార్యులకీ, ద్రుపదమహారాజుకీ, అతడి బంధువులకీ, విరాటరాజుకీ, అతడి జ్ఞాతులకీ, ప్రత్యేకంగా కర్ణుడూ, అభిమన్యుడూ మొదలైనవాళ్ళకీ గొప్ప గొప్ప దక్షిణలూ వాటితో పరలోకక్రియలు నిర్వహించాడు. అంతకంటె ఘనంగా దుర్యోధనుడూ మొదలైనవాళ్ళకి ధృతరాష్ట్రుడిచేత ఆబ్దికక్రియలు చేయించాడు. తాను ఎరిగినవాళ్ళందరికీ శ్రాద్ధకర్మలు జరపడానికీ, బంధువులు లేని రాజులకోసం తగిన దానాలు చేయడానికీ ధౌమ్యుణ్ణి నియోగించాడు.

అంతేకాక బంధువులు యావన్మందికీ సద్గతులు కలగడంకోసం గొప్పగొప్ప చలిపందిళ్ళు వేయించాడు. సత్రాలు పెట్టించాడు. చెరువులు తవ్వించాడు. దేవాలయాలు కట్టించాడు. లోకంలో వున్న బ్రాహ్మలందరికీ ఆవులూ, బంగారమూ రకరకాల వస్తువులూ కోకొల్లలు భక్తితో పంచిపెట్టాడు.

ఇలా యావన్మంది బంధువులకీ, స్నేహితులకీ పరలోకక్రియలు జరిగించి, ఋణం తీర్చుకున్నాడు. లోకంమెప్పు సంపాదించాడు. కృతార్థుడయ్యాడు. అఖండమైన సామ్రాజ్యం పరిపాలించడం మొదలెట్టాడు.

ఒకనాడు తగినసమయం చూసి, కృష్ణుడిముందు చేతులు జోడించి అందుకున్నాడు ధర్మరాజు.

"కృష్ణా ! నీ మహానుగ్రహంవల్ల తండ్రితాతలనాటి పుణ్యమైన సామ్రాజ్యానికి ప్రభువు నయ్యాను. కృతార్థుణ్ణయ్యాను. సంతోషంగా వుంది. భావమరుదులని మమ్మల్ని దయచూశావు. ప్రేమతో

కంటికి రెప్పలా కాపాడావు. మాలో వొకడివై కలిసిమెలిసి తిరిగావు. మమ్మల్ని మన్నించావు. మంచీ చెడ్డా మరిచిపోయి, నీదగ్గిర చనువుతో మసులుకున్నాం. నీ మహానుభావత్వమూ, నీ మాహాత్మ్యమూ తెలుసుకోలేకపోయాం. నిన్ను పొగడడానికి మేమేపాటి వాళ్ళం?

"దామోదరా! నువ్వు ఆది పురుషుడి వని ఘోషిస్తున్న వేదాలు కూడా 'నువ్వు ఇలాటి వాడివి' అని చెప్పలేకపోతున్నాయి. అలాంటప్పుడు ఇతరులా నీమహత్తు తెలుసుకుంటారు?

"పురుషోత్తమా! ఎన్నో పేర్లున్నాయి నీకు. పాపాలు పోగొడతాయవి. పుణ్యం ప్రసాదిస్తాయి. ముక్తిమార్గం చూపుతాయి. భుక్తీ, ముక్తీ అనుగ్రహించే నన్ను ఇంద్రియాలు జయించిన మునులు భక్తిపూర్వకంగా ఎల్లప్పుడూ ధ్యానిస్తారు నమస్కారాలు చేసి అంతంలేని మహిమ సంపాదిస్తారు" అన్నాడు.

"విష్ణూ! జిష్ణూ! వాసుదేవా! జనార్దనా! దామోదరా!" అంటూ ప్రసిద్ధమైన పేర్లతో స్తోత్రం చేశాడు.

సంతోషించాడు శ్రీకృష్ణుడు. ఎన్నో చెప్పి ధర్మరాజుని అభినందించాడు. కొలువులో వున్న వాళ్ళని సెలవిచ్చి పంపాక తమ్ముళ్ళ వేపు చూశాడు ధర్మరాజు.

"అడవుల్లో పడరానిపాట్లు పడ్డారు. విరాటరాజు కొలువులో చెయ్యరాని సేవచేశారు. ఎన్నో బాధలు పడ్డారు. శత్రువుల ఉగ్రమైన శస్త్రాలతో శరీరాలు గాయాలయాయి. అభేద్యమైన స్థైర్యంతో అన్ని దుఃఖాలూ నాకోసం సహించారు. నన్ను ధన్యుణ్ణి చేశారు. శ్రీకృష్ణుడి అనుగ్రంవల్ల లభించిన ఈ జయశోభనం మీ మనస్సుకి

వచ్చినట్లు సుఖంగా అనుభవించండి. మెలకువతో రాజ్యాంగాలు ఏడూ* కనిపెడుతూ వుండండి'' అన్నాడు.

ధృతరాష్ట్రుడి అనుమతి పుచ్చుకుని, దుర్యోధనుడి భవనం భీముడికిచ్చాడు. దుశ్శాసనుడిలోగిలి అర్జునుడి కిచ్చాడు. దుర్మర్షణుడి మందిరమూ, దుర్ముఖుడి మందిరమూ నకుల సహదేవుల కిచ్చాడు. ఈభవనాలన్నీ ఎన్నో రత్నాలు తాపిన మేడలతోనూ, మండపాల తోనూ ఎంతో అందంగా వున్నాయి. దాసదాసీజనంతో నిండి వున్నాయి. ధర్మరాజుభవనంతో సమానమైన వైభవంతోవున్నాయి. అతడి భవనంకంటే కూడా అధికమైన ధనధాన్యాలతో తుల తూగుతూ, సౌఖ్యంగా వున్నాయి. కుబేరుడి భవనంతో సమానమైన ధనసంపదతో వున్నాయి. అందమైన ఆడాళ్ళతో కలకల్లాడుతు న్నాయి. ఇదిలేదూ అనకండా అన్ని వస్తువులతోనూ నిండివున్నాయి.

ఇదయ్యాక విదురుణ్ణీ, యుయుత్సుణ్ణీ, సంజయుణ్ణీ చూసి ''మీ మీ భవనాలు మీరు తీసుకోండి'' అన్నాడు ధర్మరాజు, వృద్ధమహా రాజు ధృతరాష్ట్రుణ్ణి, లోగడ అతడు సుఖంగా వుండిన పెద్దకోటలోని మేడలోకే పంపాడు. ఇలాభవనాలువిభజించి ఇచ్చాక, కృష్ణుణ్ణీ సాత్య కినీ అర్జునుడి భవనంలో విడిదిపెట్టించాడు. అందరినీ సాగనంపాక, తాను లోపలి లోగిలికి వెళ్ళి స్వేచ్ఛగా కాలం గడిపాడు. భీముడూ మొదలైనవాళ్ళు తమకి ఇచ్చిన భవనాల్లో సమస్తవైభవాలూ అనుభవిస్తూ సుఖంగా గడిపారు.

---

* రాజూ, మంత్రీ, మిత్రుడూ, ధనాగారమూ, రాష్ట్రమూ, కోటా, సేనా

# శాంతిపర్వం



## రెండో ఆశ్వాసం

### ధర్మరాజు మనుగడ

సామ్రాజ్యం పొంది, మహా ఉజ్వలంగా ప్రకాశించాడు ధర్మరాజు. బ్రాహ్మల్నీ, ఆశ్రితుల్నీ, యాచకుల్నీ వాళ్లు అడిగింది లేదనకుండా ఇచ్చి పోషించాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, విదురుడూ—ఈ ముగ్గురిపరంగా రాజ్యం సమర్పించాడు! "ఇంతటికీ మీరే ప్రభువులు. మీరు ఏంచెపితే అది చేస్తాను నేను, ఏంపెడితే అది తింటాను" అన్నాడు. నిత్యమూ వాళ్ళ అనుమతి పుచ్చుకునే తగినట్టు ప్రజల్ని పాలించాడు. పూర్వంకంటె వాళ్ళని అన్నివిధాలా సంతోషపెట్టాడు. భర్తలుపోయిన స్త్రీలని దుఃఖం కలగకుండా దయతో కనిపెట్టాడు. కృపాచార్యుడూ, యుయుత్సుడూ, సంజయుడూ, కౌరవమంత్రులూ — ఈ యావన్మందినీ గౌరవించాడు. తల్లి కుంతీదేవి శుశ్రూషలు చేశాడు. ద్రౌపదిని సంతోషపెట్టాడు. ధౌమ్యుడికి సకలసంపదలూ ఇచ్చాడు. అతడిద్వారా దేవపూజలూ, అతిథిసంతర్పణలూ, విదేశాలనించి వచ్చిన బ్రాహ్మల అర్చనలూ, దీనులా అనాథులా పోషణలూ జరిపించాడు. శ్రీకృష్ణుణ్ణి ఆరాధించాడు. పౌరుల్నీ, పల్లెలవాళ్ళనీ సంతోషపెట్టాడు.

ఇలావుండగా వొకనాడు ఉదయాన్నే కృష్ణుడి విడిదికి వెళ్లాడు

### శ్రీకృష్ణుడి ధ్యానం

ధర్మరాజు వెళ్ళేసరికి రత్నాల బంగారం మంచంమీద కూచున్నాడు శ్రీకృష్ణుడు. బంగారంలో పొదిగిన ఇంద్రనీలమణిలా

వున్నాడతడు. ధగధగా మెరిసిపోతున్న ఆభరణాలతో చుక్కలతో వున్న ఆకాశంలావున్నాడు. పసుప్పచ్చటిపట్టువస్త్రంతో మేరుపర్వతం దాపున వున్నమేఘంలా వున్నాడు. వక్షస్థలంమీద వెలిగిపోతున్న కౌస్తుభమణితో సూర్యుడుఉదయిస్తున్న ఉదయపర్వతంలావున్నాడు.

చూసి, భక్తిపూర్వకంగా చేతులుజోడించాడు ధర్మరాజు. “కృష్ణా !” సంతోషంగా అడిగాడు - “రాత్రి సుఖంగా గడిపావా ? మనస్సు కులాసాగా వుందా ? దైవికమైన నీబుద్ధివల్ల ధర్మమార్గంలో సామ్రాజ్యం సంపాదించాను. ముల్లోకాలూ వ్యాపించిన విక్రముడివి నువ్వు. నీకటాక్ష భాగ్యంవల్లే మూడులోకాల్లోనూగౌరవం పొందాను” అంటూ దగ్గిరికి వెళ్ళాడు.

తగినవిధంగాంగా తాను అడిగిందానికి వొకదానికీ బదులు చెప్పలేదు శ్రీకృష్ణుడు. గాలి, కదలికా లేని దీపంలా ధ్యానమగ్నుడై వూరుకున్నాడు. అది కనిపెట్టాడు ధర్మరాజు.

“ఏమిటిది? పంచభూతాలకీ ఆత్మఅయిన వాయువు బంధించి వుంది. ఇంద్రియాలు మనస్సులో అణిగివున్నాయి. ఇంద్రియాలూ, మనస్సూ బుద్ధిలో వొదిగించి, నాలుగోదారిని* ఇన్నీ స్థిరంగా జీవుడిలో కూర్చిపెట్టావు. ఈ పరమధ్యానం ఎంచేత కలిగింది ? ఆశ్చర్యం !

* నాలుగోదారి (ప్రత్యాహారమార్గం) : ఇంద్రియ విషయాలుఇంద్రియాలలో కలపడం మొదటిమార్గం ఇంద్రియాలు మనసులో అణుచుకోడం రెండోమార్గం. ఇంద్రియాలూ, మనస్సూ బుద్ధిలో వొదిగించడం మూడోమార్గం. ఇవన్నీ యోగంలో నిలపడం నాలుగోమార్గం.

చరతాం చక్షురాదీనాం విషయేషు యథాక్రమం.
యత్ప్రత్యాహరణం తేషాం ప్రత్యాహారః ప్రకీర్తితః

ప్రత్యాహారమార్గం విపులంగా తెలుసుకోవాలంటే చూ. యోగతత్త్వం, సూతసంహిత మొ.

ఏ వింతా లేకండా లోకాలు నిత్యదిగా వున్నాయికదా! ఇది నేను వినగలిగిందే అయితే వినిపించు" అని ప్రార్థించాడు.

"నువ్వే గురుడివి నువ్వే ఆత్మగురుడివి. అంతటికీ నువ్వేకర్తవి. నువ్వే ఆదిగతివి. నువ్వే అంత్యగతివి. నువ్వు వాక్కుడివే పురుషోత్తముడివి. కృష్ణా! ప్రసన్నుడివి కా. నా సందేహం తొలగించు" అని విన్నవించాడు.

"భీష్ముడు నన్ను తలుచుకున్నాడు" చిరునవ్వుతో అన్నాడు శ్రీకృష్ణుడు — 'అందుకే అతడి దగ్గిరకి పోయింది నా మనస్సు. అతణ్ణి నవమాసాలూ మోసి గంగాదేవి పేరుపడింది. అతడు శిష్యుడైనందువల్ల పరశురాముడికి గురుత్వం వచ్చింది. అంతటి పరశురాముడూ అతడితో యుద్ధంచేసి ఇరవైమూడు దినాల్లో ఓడిపోయాడు. కాశీరాజు కన్యలకోసం పోరాడి అంతమంది రాజులూ అతడితో ఓడిపోయారు. నాలుగు వేదాలూ, ధనుర్వేదమూ, మహాస్త్రాలూ అతడి వేళ్ళమీద వున్నాయి. అలాంటి భీష్ముడు నన్ను తలుచుకుంటున్నాడు.

"ఆరిపోతూన్న అగ్నిహోత్రంలా వున్నాడతడు. పరలోకం మీద చూపు పెట్టుకుని, ఇంద్రియాలు మనస్సులో అణుచుకుని నన్ను తలుచుకుంటున్నాడు.

"అంపశయ్యమీదుండి నన్నే శరణంటూ ఆశ్రయించి ముక్తి కోరుతున్నాడు, ధర్మరాజా! విన్నావుకదా, అందుకని అతడి మీదికి పోయింది నా మనస్సు. ఇదీ నా ధ్యానానికి కారణం.

"భీష్ముడు వశిష్ఠుడిశిష్యుడు. జరిగిపోయిందీ, జరుగుతూవున్నదీ, జరగబోయేదీ తెలిసినవాడు. అన్నివిద్యలకీ ఆధారభూతుడతడు. అతడు అస్తమించడంతోనే లోకమంతా చంద్రుడు అస్తమించిన

రాత్రిలా అయిపోతుంది. అన్ని జ్ఞానాలూ నిలవనీడలేకండా అయిపోతాయి. అంచేత అతడి దగ్గిరికి వెళ్ళి నువ్వు అడగవలిసిన ధర్మాలు అడిగి తెలుసుకో. సంపూర్ణంగా సందేహాలు తీర్చుకో" అన్నాడు.

"అవును" గద్గదకంఠంతో అన్నాడు ధర్మరాజు— "భీష్ముడి గొప్పతనం యావత్తూ మునులు చెప్పగా లోగడే విన్నాను. అంతవాడే అతడు. నీతో కలిసి వెళ్ళి భక్తితో ఆయనదర్శనం చెయ్యాలని వుంది. నువ్వు రావడంతోనే ఆమహాత్ముడు ఎంతో సంతోషిస్తాడు. ఉత్తరాయనం కోసం కనిపెట్టుకున్నాడాయన. పరబ్రహ్మస్వరూపుడివైన నీదర్శనం కోరుతున్నాడు. నామీంది అనుగ్రహంతోనూ, అతడి మీంది ఆదరంతోనూ దయచెయ్యాలి నువ్వు."

పక్కనే వున్న సాత్యకిని చూశాడు కృష్ణుడు. — "రథం సిద్ధం చెయ్యమని దారుకుడితో చెప్పు" అన్నాడు. భీముణ్ణీ, అర్జునుణ్ణీ, సంజయుణ్ణీ పిలవమన్నాడు. అన్నగారు చెప్పిందంతా క్షణాలమీద చేశాడు సాత్యకి.

దారుకుడు రథం సిద్ధంచేశాడు. రత్నాల కాంతులతో అప్పుడే ఉదయిస్తూన్న సూర్యుడిలా ప్రకాశిస్తోంది రథం. సుగ్రీవమూ మొదలైన గుర్రాలు పూన్చి, గాలిలా ఎగిరిపోడానికి సిద్ధంగా వుంది. మంచి బలంగానూ, ఎంతో అందంగానూ వుంది.

## భీష్ముడి స్తోత్రం

సరిగ్గా అదే సమయంలో వ్యాసుడూ, నారదుడూ, దేవలుడూ, దేవస్థానుడూ, వాత్స్యుడూ, వామదేవుడూ మొదలైన మహామునులు భీష్ముడిదగ్గిరికి వెళ్ళారు. వాళ్ళమధ్య గ్రహాలమధ్య చంద్రుడిలా అంపశయ్యమీద ప్రకాశిస్తున్నాడు భీష్ముడు.

శ్రీకృష్ణుణ్ణి నిష్ఠతో మనసులో నిలుపుకుని, చేతులు జోడించాడు. గంభీరమైన కంఠస్వరంతో ఇలా స్తోత్రం చేశాడతడు.

"శుచీ, వాసుడూ[1], శుచిమత్తూ[2], పరముడూ[3], పరమేష్ఠీ అయిన పుణ్యమూర్తిని సేవిస్తాను. మునులూ, దేవతలూ స్వరూప మెరగని పురుషుణ్ణి, సర్వమూ తెలిసినవాణ్ణి సేవిస్తాను. దుఃఖాలకి మందు అని వేదాలు చెప్పగా పండితులు తెలుసుకునే పుణ్యమూర్తిని సేవిస్తాను. లోకాలన్నీ పుట్టీ, పెరిగీ, తనలో కలసిపోతూన్న మహోత్తరుణ్ణి సేవిస్తాను. పక్షికి పంజరంలాగ, ముత్యాలపేరుకి దారంలాగ, పువ్వులదండకి నారలాగ ప్రపంచమంతటికీ ఆధారభూతుడైన శ్రీకృష్ణుణ్ణి సేవిస్తాను.

"హరిని, వెయ్యి తలలవాణ్ణి, వెయ్యి కన్నులవాణ్ణి, వెయ్యి పాదాలవాణ్ణి, వేదస్వరూపుణ్ణి, చిన్నవాళ్ళకంటె చిన్నవాణ్ణి, పెద్దలకంటె పెద్దవాణ్ణి దయాళుణ్ణి సేవిస్తాను. అమృతమయుణ్ణి ఋగ్వేదమూ, యజుర్వేదమూ, సామవేదమూ, ఉపనిషత్తులూ పొగుడుతున్న పురుషోత్తముణ్ణి, సత్యస్వరూపుణ్ణి, భక్తితో తెలుసుకోదగినవాణ్ణి స్మరిస్తాను. బ్రహ్మకర్మలూ, యజ్ఞాలూ, వేదాలూ రక్షించడం కోసం అరణిలో అగ్గిలాగ దేవకిగర్భంలో పుట్టిన వసుదేవ కుమారుణ్ణి స్థిరభక్తితో భజిస్తాను. ఒక్కడే పన్నెండుమూర్తులైనట్టు బంగారం రంగు గర్భం ధరించి అదితి కన్న సూర్యస్వరూపుణ్ణి, రాక్షససంహారుణ్ణి, విష్ణుమూర్తిని స్తోత్రం చేస్తాను.

"దేవతలకీ,పితృదేవతలకీశుక్లపక్షంలోనూ, కృష్ణపక్షంలోనూ అమృతపానం కలిగిస్తూ ప్రకాశించే చంద్రస్వరూపుణ్ణి, ఆత్మేశ్వరుణ్ణి శ్రీకృష్ణుణ్ణి సేవిస్తాను.

---

* 1, వ్యాప్తుడు 2. లోకాలు పవిత్రం చేసేవాడు. 3 ఉత్తముడు 4. ఉత్తమ స్థానంలో వున్నవాడు.

"విశ్వసృష్టిచేసే మునులు వెయ్యిసంవత్సరాలు చేసిన మహా యజ్ఞంలో కశ్యపబ్రహ్మ కన్న గుణత్మాంతస్వరూపుణ్ణి శ్రీకృష్ణుణ్ణి తలుచుకుంటాను. కనపడుతూన్న క్షేత్రంలో (శరీరంలో) కనపడకండా వుండి వెలుగుతూన్న ఆత్మస్వరూపుణ్ణి, దామోదరుడైన శ్రీకృష్ణుణ్ణి స్తోత్రంచేస్తాను.

"ప్రకృతి వికృతులనే పదహారువికారాలూ *పొంది, ప్రకృతి వికృతిత్వం (చావు పుట్టుక) పొందనివాణ్ణిగా మునులు చూసేవాణ్ణి, సాంఖ్యస్వరూపిణ్ణి శ్రీకృష్ణుణ్ణి స్మరిస్తాను.

"లోపల సంచరించే వాయువులు అణిచిపట్టి, సోమరితనం లేకండా శాంతీ, దాంతీ కలవాళ్ళు దర్శించే అంతర్యామిని, యోగి స్వరూపుణ్ణి, పాలసముద్రంలో పవళించేవాణ్ణి శ్రీకృష్ణుణ్ణి సేవిస్తాను.

"ఇంద్రియాలు జయించిన శాంతులు జన్మజన్మాల పాపపుణ్యాలు వొదులుకుని పొందే ఆనందమూర్తిని, మోక్షస్వరూపుణ్ణి విష్ణుమూర్తిని స్మరిస్తాను.

"భూమి అతడి పాదాలు. అంతరిక్షంనాభి. స్వర్గం శిరస్సు. కళ్ళు సూర్యచంద్రులు. మొహం అగ్ని. దిక్కులు చెవులు. ఆమహాకాయుణ్ణి, విశ్వరూపుణ్ణి, హరిని స్మరిస్తాను.

"ప్రాణికోటి యావతూ మింగేసి. ఈలోకాలన్నీ నీటిమయం చేసేసి, ఆత్మవశం చేసుకుని బాలుడై, నీళ్ళలో తేలే మాయాస్వరూపుణ్ణి కృష్ణుణ్ణి తలుచుకుంటాను. తలవెంట్రుకలలో మేఘాలూ, అవయవాల సంధుల్లో నదులూ, కడుపులో సముద్రాలూ వున్న దేవదేవుణ్ణి, జలస్వరూపిణ్ణి దేవకీదేవి కుమారుణ్ణి శ్రీకృష్ణమూర్తిని సేవిస్తాను.

---

* జ్ఞానేంద్రియాలు అయిదూ, కర్మేంద్రియాలు అయిదూ, మనస్సూ, బుద్ధీ, అహంకారమూ, రజోగుణమూ, సత్వగుణమూ, తమోగుణమూ.

"మొహమూ, బాహువులూ, తొడలూ, కాళ్ళూ బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రుల జన్మస్థలాలైన మహామూర్తిని, నాలుగు కులాల స్వరూపుణ్ణి, విష్ణుమూర్తిని స్తోత్రం చేస్తాను.

"మాసాలూ, ఋతువులూ, ఆయనాలూ, సంవత్సరాలూ అయి, చివరికి సృష్టిప్రళయంచేసి, ప్రకాశించే కాలస్వరూపుణ్ణి, యోగేశ్వరుణ్ణి, శ్రీకృష్ణుణ్ణి సేవిస్తాను.

"మునులూ, దేవతలూ అనంతుడంటూ పొగుడుతున్న శేష మూర్తిని, జగత్తుకి ఆధారభూతుడైన విష్ణుదేవుణ్ణి, కృష్ణుణ్ణి భక్తితో ప్రార్థిస్తాను.

"ఆదిత్యులూ, మరుత్తులూ, రుద్రులూ మొదలైన దేవతలు యావన్మందీ అవయవాలైన దేవుణ్ణి దేవస్వరూపుణ్ణి, కృష్ణుణ్ణి వేడుకుంటాను.

"అన్నిటిలోనూ అతడే వున్నాడు. అన్నీ అతడిలోనే వున్నాయి. అన్నీ అతడివల్లే జరుగుతున్నాయి. అన్వరూపుణ్ణి, వృష్ణికుల శ్రేష్ఠుణ్ణి కృష్ణుణ్ణి ఆశ్రయిస్తాను.

"మత్స్యావతారమెత్తి, పాతాళంనించి వేదాలు తెచ్చి బ్రహ్మ కిచ్చి, దేవతల సన్మానం పొందిన కృష్ణుణ్ణి సేవిస్తాను.

"కూర్మావతారమెత్తి, అమృతమథనమప్పుడు తేలికగా మందరపర్వతం మోసి దేవతల మేలుచేసిన కృష్ణుణ్ణి ప్రార్థిస్తాను.

"నరసింహావతారమెత్తి, ఘనుడైన హిరణ్యకశిపుణ్ణి కరుకు గోళ్ళతో చీల్చేసిన తేజోమూర్తిని, స్వయంభువుణ్ణి, కృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నాను.

"వామనావతారమెత్తి, ఉద్ధోలమైన బలవంతుణ్ణి బలిచక్ర వర్తిని అడగదొక్కి ముల్లోకాలూ ఆక్రమించిన అద్భుతమూర్తిని కృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నాను.

"పరశురామావతారమూర్తి, జమదగ్ని మునికి జన్మించి, ఇరవై ఒక్కమాట్లు రాజుల్ని తెగనరికిన క్రోధస్వరూపుణ్ణి ప్రార్థిస్తున్నాను.

"శ్రీరామావతారమూర్తి, దశరథమహారాజు కుమారుడై, శత్రుభయంకరుడైన రావణుణ్ణి లిప్తలో చంపేసిన క్షాత్రస్వరూపుణ్ణి కృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నాను.

"బలరామావతారమూర్తి, నాగలీ, రోకలీ పట్టుకున్న దయామూర్తిని, రోహిణీదేవి కొడుకుని, తెల్లశరీరంతో మేఘంలాంటి వస్త్రాలు కట్టుకుంటున్న శూరుణ్ణి, ప్రాణుల కష్టసుఖాలు విచారిస్తూ, మహాభోగా లనుభవిస్తున్న దేవుణ్ణి కృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నాను.

"కృష్ణావతారమూర్తి, క్రీడకోసం యదువంశంలో వసుదేవుడి కుమారుడై పుట్టి, దుర్మదులైన రాక్షసుల్ని చంపి, అర్జునుడికి సారథ్యంచేసి ముల్లోకాలూ పొగిడినట్టు దేవతలా, మునులా సన్మానం స్వీకరిస్తూ, భూభారం తొలిగించిన చక్రధరుణ్ణి కృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నాను.

"కల్క్యవతారమూర్తి, కలికాలంలో చెడిన ధర్మం తిరిగి నిలపడంకోసం గుర్రమెక్కి, మ్లేచ్ఛులందరినీ వూడ్చిపారేసే శుభచరిత్రుణ్ణి కృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నాను.

"నశించే ప్రాణికోట్లలో నాశనంలేకండా వుండి వెలుగుతూ కర్మసాక్షిగా వున్న సూక్ష్మస్వరూపుణ్ణి, స్థిరజ్ఞానమూర్తి కృష్ణుణ్ణి తలుచుకుంటాను.

"పరమేశా! పుణ్యమూర్తీ! సుబ్రహ్మణ్యా! భక్తవత్సలా! మహాదేవా! విశ్వప్రకాశకరణా! హృషీకేశా! వరదా! నారాయణా! పుండరీకాక్షా! హిరణ్యనాభా! అన్నిలోకాలూ నమస్కరిస్తున్న పాదపద్మాలు కలవాడా! యజ్ఞస్వరూపా! అచ్యుతా! అమృతస్వరూపా! శ్రీహరీ. నన్ను దయచూడు ప్రభూ! అవిసిపువ్వురంగు

పట్టువస్త్రం ధరించిన నిన్ను తలుచుకున్న వాళ్ళకి ఎప్పుడూ, ఎక్కడా ఎందులోనూ భయముండదు. సర్వశుభాలకీ నువ్వే ఆధారం కదూ!

"మంగళమూర్తి విష్ణుదేవుడు మహామంగళమూర్తి మధువైరి. మంగళమూర్తి శ్రీకృష్ణుడు. సర్వమంగళమూర్తి గరుడధ్వజుడు. నారాయణుడు. అతడిపాదాలే పరబ్రహ్మం: పరమపదం; సత్యం; తపస్సు. అవి పూజించినవాళ్ళకి ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ నాలుగు పురుషార్థాలూ సిద్ధిస్తాయి.

"అగ్నిహోత్రం విష్ణుస్వరూపం. హవిస్సూ విష్ణుస్వరూపమే. అంతా విష్ణుస్వరూపంగానే చూస్తున్నాను. అంచేత ఎక్కడా కల్మషమే కనపడలేదు నాకు.

"కృష్ణా! కృష్ణా! నిన్ను శరణు వేడుతున్నాను. నీభక్తుణ్ణి. మోక్షం కోరుతున్నాను. నన్ను దయచూడు. నాకు ఏదిమేలైన చోటో అదిప్రసాదించు ప్రభూ!

"తపస్సుకీ, విద్యకీ ఆధారమైనవాణ్ణి, చావూ పుట్టుకాలేని వాణ్ణి. యజ్ఞస్వరూపుణ్ణి కృష్ణుణ్ణి వాఙ్మయ యజ్ఞంతో పూజించాను. ఆ జనార్దనుడు నాభజనతో ప్రీతుడు కావాలి."

ఇలా ఎంతో స్తోత్రంచేశాడు భీష్ముడు. శ్రీకృష్ణుణ్ణిపూజించాడు. "నమఃకృష్ణాయ" (కృష్ణుడికి నమస్కారం) అంటూ తలవొంచి భక్తితో మొక్కాడు.

భీష్ముడు చేసిన ఈస్తోత్రం శ్రేష్ఠమైంది మునులు పొగిడింది. ఇది అమృత సముద్రం వంటిది. ముక్తి కలిగిస్తుంది ఉత్తమోత్తమమైన ఈస్తోత్రం చదివినా, విన్నా, గాసినా సిరీ, ఆయువూ, కీర్తీ కలిగిస్తుంది.

ఇలా కృష్ణుణ్ణి స్తోత్రంచేసి కళ్ళు మూసుకుని, శాంతంగా పూరుకున్నాడు భీష్ముడు. అక్కడ చుట్టూవున్న పరమమునులు కూడా దద్గదకంఠంతో కృష్ణుణ్ణి కీర్తించారు.

ఇక్కడ కృష్ణుడు భీష్ముడి భక్తికి సంతోషించాడు. అతడి మనస్సులో దివ్యజ్ఞానం కలిగినట్టు అనుగ్రహించాడు. దయతో పానుపు దిగాడు. ధర్మరాజు మొహంచూసి, "పద, భీష్ముడి దగ్గిరికివెళదాం" అన్నాడు. సర్వపరికరాలతోనూ రథమెక్కాడు తన వెనక సాత్యకిని కూచోపెట్టుకున్నాడు.

ధర్మరాజూ, అర్జునుడూ వొక రథమెక్కారు. భీముడూ, నకుల సహదేవులూ వొకరథమెక్కారు. కృపుడూ, యుయుత్సుడూ వొక రథమెక్కారు.

రథాలు బయలుదేరాయి. రథచక్రాల చప్పుడు దిక్కులు ప్రతిధ్వనించింది. తగినపరివారమూ వెంటనడిచింది.

కురుక్షేత్రం సమీపించాయి రథాలు. ఎముకలూ, తలవెంట్రుకలూ, ఏనుగుల కుంభస్థలాలూ, గుర్రాల కళేబరాలూ, రథాల ముక్కలూ, నవరత్నాలు తాపిన బంగారం నగలతో ముక్కలైన నర కపాలాలూ పడి, ప్రేతపతి అనుభవించి విడిచిన కల్లుపెంటలా వుంది కురుక్షేత్రం.

"దూరంగా అవుగో అయిదు మడుగులు అవుపిస్తున్నాయి చూడూ," కురుక్షేత్రం చేరడంతోనే ధర్మరాజుతో అన్నాడు శ్రీకృష్ణుడు – "వాటిలోనే రాజుల రక్తంతో పితృతర్పణం చేశాడు పరశురాముడు. వ్రతంపట్టి లోకంలోని రాజుల్ని తుదముట్టా ఇరవై వొక్కమాట్లు చంపాక శాంతించాడతను."

"ఇంత క్రూరమైన పనికి ఎందుకు పూనుకున్నాడు పరశురాముడు?" అడిగాడు ధర్మరాజు – "మళ్ళీ ఈ భూమంతా ఎలాఆక్రమించారు రాజులు?"

ధర్మరాజు అలా అడగడంతోనే "పరశురాముడి అట్టుపుట్టూ అతడు రాజుల్ని చంపడమూ, తిరిగీ రాజవంశం పెరగడమూ నేను

మునులవల్ల విన్నది విన్నట్టు చెపుతాను, విను'' అంటూ అందు కున్నాడు కృష్ణుడు.

## పరశురాముడి చరిత్ర

"జహ్నుడని ఒక రాజు వుండేవాడు. అతడి కొడుకు అజ హ్నుడు. అజహ్నుడి కొడుకు పల్లవుడు. అతడికొడుకు కుశికుడు. కుశి కుడు నిష్ఠతో తపస్సుచేసి, దేవేంద్రుణ్ణి మెప్పించాడు. లోకాలన్నిటి లోనూ మేటి అయిన కొడుకు కావాలని కోరుకున్నాడు. అలాగే అతడికి గాధి పుట్టాడు. గాధి తన కూతురు సత్యవతిని రుచికమునికి ఇచ్చిపెళ్ళిచేశాడు సంతానవాంఛతో కర్మనిష్ఠపూని తనకోసమూ, తనమామ గాధిరాజు కోసమూ రెండు చరువులు (హవ్యపాయసాలు) సిద్ధంచేశాడు.

"చరువులు రెండూ తన భార్య సత్యవతిముందు పెట్టి 'ఇదిగో ఇది మీ అమ్మకియ్యి. ఈచరువువల్ల ఉత్తముడైన క్షత్రియుడు పుడ తాడు. క్షత్రియుల్ని చంపుతాడు. వాణ్ణిమాత్రం క్షత్రియులు చంప లేరు. ఇదిగో ఇది నువ్వు పుచ్చుకో. దీనివల్ల ఉత్తముడైన బ్రాహ్మడు పుడతాడు. తపస్సూ, ధృతీ, శమమూ కలిగినవాడవుతాడు.' అని రెండూ విడివిడిగా ఏర్పరిచాడు. 'ఇక మీఅమ్మా, నాన్నా ఇప్పుడే ఇక్కడికి వస్తారు.' అనిచెప్పి స్నానంకోసం నదికి వెళ్ళాడు.

"ఇంతలో అన్నట్టుగానే తీర్థయాత్రలకి బైలుదేరిన గాధిరాజు భార్యతోసహా రుచికుడి ఆశ్రమానికి వచ్చాడు. భర్తసిద్ధంచేసి పెట్టిన చరువులు రెండూ తల్లికి చూపెట్టింది సత్యవతి. వాటి ప్రభావంలో తేడా వివరించింది. సంతోషించింది గాధిభార్య. స్నానంచేసివచ్చి, చరువు పుచ్చుకుంది. అయితే పొరపాటున తనకోసం పెట్టిన చరువు కూతురుకిచ్చింది. కూతురు కోసంపెట్టిన చరువు తాను పుచ్చుకుంది. తనుపులేక సత్యవతి కూడా తల్లి ఇచ్చినప్రకారం పుచ్చేసుకుంది.

"ఇంతలో నదినించి రుచికుడు వచ్చాడు. భార్యని చూశాడు. దివ్యజ్ఞానంతో జరిగింది తెలుసుకున్నాడు. 'క్షత్రియుల్ని చంపేగర్భం ధరించావునువ్వు' అన్నాడు.

"భర్తకాళ్ళమీద పడింది సత్యవతి. 'మీరు ఇలా అనవచ్చా? అంటూ వడవడా వణికిపోయింది. చేతులు జోడించి నుంచుంది. 'ఇదంతా నీబుద్ధివల్ల జరగలేదు. తెలియక మీతల్లి చేసింది. నీది మీఅమ్మా, మీఅమ్మది నువ్వూ పుచ్చుకున్నారు. క్రూరుడూ, మహాబలవంతుడూ అయిన కొడుకు పుడతాడు నీకు. బ్రహ్మభూతుడూ, తపోధనుడూ అయిన కొడుకు పుడతాడు ఆమెకి. ఆమెపుచ్చుకున్న చరువులో విశ్వబ్రహ్మం ఆవహింపచేశాను' అన్నాడు రుచికముని. 'ముల్లోకాలూ తల్లకిందులు చెయ్యగలరు మీరు. ఎలాఅయినా నా మీద దయచూడండి' అని ప్రాధేయపడింది సత్యవతి. 'క్రూర కర్ముడైన కొడుకుని కనడం సహించలేను' అంది.

"కనికరించాడు రుచికుడు. 'సరే. నీఇష్టమే కానీ. ఆక్రూరత్వం నాకుమారుడికి బదులు నామనవడికి వస్తుంది' అన్నాడు.

"తపశ్శాలీ, శాంతుడూ, దాంతుడూ అయిన జమదగ్నిని కంది సత్యవతి. బ్రహ్మరుషివంటి విశ్వామిత్రుణ్ణి కంది గాధిభార్య. అదిగో ఆజమదగ్ని అన్ని విద్యలకీ ఆటపట్టూ, ఉత్తమగుణాల పుట్టా, ధనుర్వేదానికి నిధీ అయిన మహనీయుణ్ణి పరశురాముణ్ణి కన్నాడు. రాజుల పాలిటి పిడుగయా డతడు. అగ్నిహోత్రుడిలా పవిత్రమూర్తి పరశురాముడు.

"ఆదినాల్లో హైహయవంశంలో కార్తవీర్యార్జునుడని గొప్ప రాజు వుండేవాడు. ఎవ్వరూ గెలవలేని పరాక్రమవంతుడతడు. మచ్చలేని బుద్ధిమంతుడు. వెయ్యి భుజాల బలవంతుడు. ఏడుదీవులూ నీతి తప్పకండా శూరత్వంతో ఏలుతూవుండేవాడు. ఎంతటి ధర్మపరుడో

అంతటి మహాస్త్రబలం కలవాడు. అందుచేత లోకంలోని రాజులందరూ అతడంటే తలొగ్గేవాళ్ళు.

"ఒకసారి అగ్ని దేవుడు వెళ్ళి ఆహారం కావాలన్నాడు. అడవులూ, కొండలూ, కొండపల్లెలూ, పట్నాలూ అన్నీ అగ్నిహోత్రుడికి ఆహారంగా ఇచ్చేశాడు కార్తవీర్యుడు. వరసగా అన్నీ దగ్ధం చేస్తూ ఆపవముని (వరుణుడి కుమారుడు) ఆశ్రమంకూడా కాల్చేశాడు అగ్ని. అది తెలిసి వచ్చాడు ఆపవుడు. అగ్నికి సహాయంగా వున్న కార్తవీర్యుణ్ణి చూశాడు. మండిపడ్డాడు. 'నువ్వు నా తపోవనంకూడా వొదిలిపెట్టావు కావు. అన్ని అడవుల్లాటిదే ఇదీ అనుకుని కాల్చేశావు. కనక నీచేతులు పరశురాముడు నరుకుతాడు' అని శపించాడు. సహస్రబాహువు కార్తవీర్యుడు ఎంతో విచారించాడు. శ్రద్ధతో ధర్మకార్యాలు నడుపుతూ వచ్చాడు. శాపంవల్ల అతడికి నీతిమాలిన కుమారుళ్ళు కలిగారు. సింహాల్లాటి వాళ్ళు వాళ్ళు. బలంతో విరగబడే వాళ్ళు. దురుసుతనంతో తిరిగేవాళ్ళు. భూమంతా తిరుగుతూ వొకనాడు జమదగ్ని ఆశ్రమానికివచ్చారు. పరశురాముడు లేని సమయం చూసి, హోమంకోసం పెట్టుకున్న ఆవూ, దాని దూడా తీసుకుపోయారు. అయితే ఈసంగతిమాత్రం కార్తవీర్యుడు ఎరగడు.

"ఆవు పట్టుకుపోయినసంగతి తెలిసి, ఉగ్రుడైపోయాడు పరశురాముడు. ధనుస్సూ, గండ్రగొడ్డలీ మొదలైన ఘోరాస్త్రాలు పట్టుకుని రివ్వున వెళ్ళి కార్తవీర్యార్జునుడిమీద పడ్డాడు. అతణ్ణి వోడించాడు. అతడి బాహువులు నరికేసి వెళ్ళిపోయాడు.

"పరశురాముడు సమిధలూ, దర్భలూ తేవడంకోసం అడివికి వెళ్ళిన సమయం చూసి కార్తవీర్యుడి కుమారుళ్ళు కోపంతో వెళ్ళి ఆశ్రమం మీద పడ్డారు. జమదగ్ని తల నరికేసి సంతోషిస్తూ వచ్చేశారు.

"పరశురాముడు ఆశ్రమానికి వచ్చి, తల్లి వల్ల జరిగిందంతా విన్నాడు. అగ్నిజ్వాలలాగ లేచాడు. కార్తవీర్యుల కుమార్ళనీ, రాజవంశంలో యావన్మందినీ గండ్రగొడ్డలితో నరికేశాడు. యుద్ధంలో రుద్రుడిలా చెలరేగిపోయాడు. భూమంతా రక్తంనదులు పారించాడు.

"కోపం శాంతించాక, జాలిహృదయంతో తపోవనానికి వెళ్ళిపోయాడు. ఎన్నో సంవత్సరాలు గడిచాక విశ్వామిత్రుడి మనవడు పరావసుడని రాజు పొగరెక్కి పరశురాముణ్ణి ఆక్షేపించాడు. 'రాజులకి భయపడి అడివిలో దాక్కున్నావు' అని పెద్దలముందు ఆడిపోశాడు. కుర్రాళ్ళూ, ముసలాళ్ళూ అని పరశురాముడు చంపకండా వొదిలేసిన ప్రతర్దనుడూ మొకలైన రాజుల్ని పొగిడాడు. 'వాళ్ళు రాజులు కారా! అబద్ధాల ప్రతిజ్ఞచేసి, పైగా దురభిమానంకూడా అధికం నీకు' అని ఎత్తిపొడిచాడు.

"దాంతో మళ్ళీ రోషమెత్తింది పరశురాముడికి. ఘోరంగా పిల్లల్నీ, ముసలాళ్ళని కూడా నరికిపారేశాడు. గర్భంలోవున్న పిల్లల్నీ, ఎన్నోవిధాల యుద్ధంలో తప్పించుకుపోయి రాజ్యంచేస్తున్న రాజుల్నీ పదేపదే వెదుకుతూ చంపేశాడు. ఇలా ఇరవై ఒక్క మార్లు భూలోకమంతా క్షత్రియుల్ని వూడ్చిపారేశాడు. అశ్వమేధ యజ్ఞం చేసి, దక్షిణగా భూమంతా కశ్యపుడికి ధారపోశాడు. 'భూమంతా దక్షిణగా ఇచ్చేశావు నాకు. ఇక నీకు అధికారం లేదు. కనక దక్షిణసముద్రతీరానికి వెళ్ళిపో' అన్నాడు కశ్యపుడు.

"ఏదోవిధంగా ఏమారుమూలో మిగిలిన రాజులు నాశనం కాకండా బతకాలనే అలా అన్నాడు కశ్యపుడు. 'అలాగే కానీ' అంటూ వెళ్ళిపోయాడు పరశురాముడు. అతడికి భయపడి దక్షిణ సముద్రుడు చేటలావున్న కొంకణప్రదేశం అతడికి విహారస్థానంగా కల్పించాడు.

"ఇలా కశ్యపముని భూమంతా పుచ్చుకుని, అదంతా బ్రాహ్మలకి పంచేసి తపోవనానికి వెళ్ళిపోయాడు. భూమి అతడిపేర కాశ్యపి అయింది. కొంతకాలమయాక, వైశ్యులూ, శూద్రులూ ప్రజలు లయారు. బ్రాహ్మల భార్యల్ని ఎత్తుకుపోయారు. వాళ్ళ ధనధాన్యాలు కొల్లగొట్టారు. పైగా బ్రాహ్మలు ధర్మం తప్పిపోయారు కల్లుతాగారు. హత్యలు చేశారు. సన్మార్గంలో నడుచుకుంటున్న మంచివాళ్ళ ధనం చపాయించారు. ఎన్ని పాడుపనులు చెయ్యాలో అన్నీ చేశారు. యజ్ఞాలూ మొదలైన మంచిపనులు మూలపడ్డాయి. అన్ని వేపులా దొంగతనాలూ, బందిపోట్లూ, తరుచయాయి. అరాజకంవల్ల అధర్మం హెచ్చింది. ధర్మంనశించింది. బాధపడిభూమి పాతాళానికి పోయింది. అప్పుడు ఊరువులు (తొడలు) దాపుపెట్టి ఎత్తిపట్టాడు కశ్యపుడు. అందుకనే భూమికి ఉర్వీఅని పేరువచ్చింది. అలా ఉద్ధరించినప్పుడే భూమి కశ్యపుణ్ణి వేడుకుంది. ఉత్తమక్షత్రియులు దండనీతి ప్రయోగించి, ధర్మం రక్షించి, తనని కాపాడడం కోసం వరమడిగింది. 'పరశురాముడి ప్రతాపానికి అందని రాజులు నాలో అక్కడక్కడ వున్నారు. ఉత్తములు వాళ్ళు. బుద్ధిమంతులు. ఆ రాజులు నన్ను రక్షించేటట్టు నియమించు' అంది.

"తాను కాపాడడంవల్ల కొందరు హైహయులు చావుతప్పి బతికివున్న సంగతి వివరించింది. 'కౌరవవంశంరాజు విదూరథుడికొడుకు ఋక్షపర్వతంలో వున్నాడు. ఎలుగులు అతణ్ణి రక్షిస్తున్నారు. సౌదాస వంశంలోనివాడు వొకడు పరాశరముని యజ్ఞం చేస్తున్నప్పుడు అతణ్ణి ఆశ్రయించాడు. ముని దయతలిచి అతణ్ణి శూద్రుడిలా చేసి, సర్వకర్మలూ చేయించుకుని రక్షించాడు. అందుకని అతడిపేరు సర్వకర్ముడయింది. శిబి మనవడు గోపతిని అడవిలో ఆవులు కాపాడుతున్నాయి. ప్రతర్దనుడి కొడుకు వత్సుడు. అతణ్ణి దూడలు రక్షిస్తు

న్నాయి. విదూరథుని కొడుకైన దధివాహనుడి కొడుకు అంగుడు గంగ ఒడ్డున గౌతమముని సాకుగున నిర్భయంగా బతుకుతున్నాడు బృహద్రథుడివంశంలోని భూతి గృధ్రకూటపర్వతంమీద వున్నాడు. వానరులు రక్షిస్తున్నారతణ్ణి. మరుత్తరాజువంశంలోవాళ్ళు నాలుగేళ్ళ ప్రాయంవాళ్ళు ముగ్గురు సముద్రపొడ్డున పెరుగుతున్నారు. సముద్రుడే రక్షిస్తున్నాడు వాళ్ళని. వీళ్ళంతా ఉత్తమ క్షత్రియులు. వీళ్ళు తగినట్టు పరిపాలన సాగించి నన్ను ఏలుకునేట్టు అనుగ్రహించు నేను చలించకుండా కుదుటపడతాను' అంది. 'వీళ్ళపెద్దలందరూ నాకోసం యుద్ధంలో పరశురాముడిచేత చాలంచేశారు. వీళ్ళనే నాకు రాజులుగా చేయడం ధర్మం. కనకనే నేను వీళ్ళని కోరుకున్నాను' అంది.

"భూమి చెప్పిన రాజులందరినీ రప్పించాడు కశ్యపుడు. వాళ్ళంతా బలవంతులు. యోగ్యులు. రాజ్యాలు పంచి వాళ్ళని అభిషేకించాడు కశ్యపుడు. ఆ రాజుల వంశంలో నానా రాజులూ పుట్టారు. అలాగ రాజవంశాలు మళ్ళీ పెరిగాయి. రాజులు వ్యాపించారు. రాజరికాలూ వ్యాపించాయి. అలా పెరిగిన రాజులు ఇప్పుడు ఈ భారతయుద్ధంలో కుప్పలు కుప్పలు కూలిపోయారు. ఎక్కడో వొకడు తప్ప లోకంలో మరి మిగలలేదు. ఇదీ నువ్వు అడిగిన పూర్వకథ."

"ఆఁ, ఇంతవాడా పరశురాముడు!" అంతావిని అన్నాడు ధర్మరాజు — "కోపంతోనూ పరాక్రమంతోనూ అద్భుతంగా భూమ్మీద రాచపురుగు లేకుండా చేసేశాడూ!

"భూమీ, ఎలుగులు, పరాశరుడూ, ఆవులూ, దూడలూ, వానరులూ, సముద్రమూ ఇంత పుణ్యంకట్టుకున్నా రన్నమాట! జనం చేసుకున్న పుణ్యం ఫలించింది కదూ!"

ఇలా మాటామంతీ ఆడుకుంటూ కృష్ణుడూ, ధర్మరాజూ ఓఘవతినది దగ్గిరకి వచ్చారు. భీష్ముడు అంపశయ్యమీద వున్న చోటికి దగ్గిరగా రథం దిగారు. భీముడూ, కృపుడూ మొదలైన వాళ్ళూ రథాలు దిగారు. అందరూ నిశ్చలమైన మనస్సులతో వెళ్ళారు. శాంతవిధంగా భీష్ముణ్ణి చూశారు. చుట్టూ కూచున్నారు.

భీష్ముణ్ణి చూసి దుఃఖంతో అడిగాడు కృష్ణుడు—"వెనకటి లాగే మనస్సు కలత లేకండావుందా మహారాజా? మనోవేదనకంటే శరీరవేదన గొప్పదంటారు పండితులు. ఒక్క బాణం వొంట్లో గుచ్చుకుంటేనే ఎంతో బాధపెడుతుంది. ఇన్ని బాణాలు గుచ్చుకుని శరీరంలో బాధ ఇక చెప్పే దేముంది? ఇలా వుండీకూడా పిసరంత దుఃఖం లేకండా వున్నావు, నీతండ్రి వరప్రభావం! కలిమికి వుబ్బకండా, లేమికి కుంగకండా దేవతలకైనా ఉపదేశిస్తావు నువ్వు. నీకు మరొకరు ఉపదేశించవలసింది ఏముంది? ప్రాణుల పుట్టుకా, మనుగడా, భూతభవిష్యద్వర్తమానాలూ, కర్మగతీ అన్నీ నీ అరిచేతిలో వున్నాయి.

"రాజువి అయినా విరాగివి! అందకాడివీ, ఐశ్వర్యవంతుడివీ అయినా మచ్చలేని మనుగడ గడిపావు. స్త్రీల మనస్సు కరిగించగల చతురుడివి, అయినా బ్రహ్మచారివి. ఎక్కడైనా వుంటుందా ఇలాటి పుట్టుక?

"దేవతలూ, రాక్షసులూ, యక్షులూ, నాగులూ, గంధర్వులూ అంతమందీ వచ్చి, మీదపడినా వొక్కడివే ఉగ్రమైన బాణాలతో వోడించగలవు.

"దమమూ, సత్యమూ, తపమూ, వేదాలూ, ధనుర్వేదమూ—ఇన్నింటిలోనూ నీకు వున్న నైపుణ్యమూ, నీధర్మబుద్ధీ

శత్రువుల్ని అణిచే నీ శౌర్యమూ అద్భుతమైనవి. నీకు నువ్వే సాటి. నీవంటివాడు మరొకడు పుట్టడు.

"వెయ్యిమాట లెందుకూ — అంపశయ్యమీద పడుకుని 'చావను, నాఇష్టం' అన్న మనిషిని ఏయుగంలో అయినా వింటామా? ఎక్కడైనా చూస్తామా?

"వస్తువులలో పెద్దవి. గుణాలలో దేవేంద్రుడూ మొదలైన దేవతలకంటే గొప్పవాడివి. మునులు చెప్పగా ఎంతో విన్నాను నీ మహిమ. నా మనస్సుకీ తెలుసు" అన్నాడు. ధర్మరాజుని చూపించి ఇంకా ఇలా అన్నాడు — "హితులూ, ఆప్తులూ, గతించి ఎంతో దుఃఖపడుతున్నా డితడు. ఎంతో తపశ్శాలివి నువ్వు. జగత్తులన్నీ భావంలోనే చూడగలవు. నీ పుణ్యవాక్యాలతో ఇతడి దుఃఖం పోగొట్టు.

"నాలుగు వర్ణాలూ, నాలుగు ఆశ్రమాలూ ఇలా వుండాలని నాలుగు వేదాలూ చెప్పిన ధర్మాలన్నీ నీకు తెలుసు. సంసారమూ, సన్యాసమూ, సాంఖ్యయోగమూ, పురాణాలూ, ఇతిహాసాలూ, ధర్మశాస్త్రాలూ అన్నీ నీ వేళ్ళచివర వున్నాయి. అన్నిసందేహాలూ తీర్చగల సమర్థుడివి నువ్వు. ఈధర్మరాజుని ఆదరించు. శోకంతోనూ, మోహంతోనూ వున్నవాళ్ళని ఉద్ధరించడమే కదా, మీవంటివాళ్ళ వివేకానికి ప్రయోజనం!"

శ్రీకృష్ణుడి మాటలు విని మొహం కొంచెంమీదికెత్తాడు భీష్ముడు. "కృష్ణా!" చేతులు జోడించి అన్నాడు — "యోగేశ్వరా! లోకాలన్నిటికీ నువ్వేకర్తవి. నువ్వేభర్తవి. ఆశ్రితుల ఘోరమైన కష్టాలు నివారిస్తావని నీకే పేరుంది" అంటూ ఎన్నోవిధాల ప్రశంసించాడు. "ప్రభూ! నాకు ఏది మేలో అది నీ దివ్యచిత్తంలో భావించు" అన్నాడు.

"తపస్వరూపుడివి నువ్వు" అందుకున్నాడు కృష్ణుడు — "భీష్మా! నామీద నీకు ఎప్పుడూ చలించని భక్తి. అందుకని నీమనస్సులో నా దివ్యరూపం ప్రతిష్ఠించాను. బ్రహ్మానందానికి పాత్రుడి వయావు. వేరే మేలు భావించడ మెందుకూ?

"భక్తి, సరళమైన నడవడీ కలిగిన మనస్సులో నేను ఆసక్తితో నివసిస్తాను. ఇందులో ఏవొక్కటి లేకపోయినా వుండను.

"ఇంక యాభైఆరు దినాల్లో సూర్యుడు ఉత్తరాయనంలో ప్రవేశిస్తాడు. (మకర రాశిలోకి వస్తాడు.) అప్పుడు శరీరం విడిచిపెట్టు నీఇష్టంప్రకారం మళ్ళీ జన్మలేకండా వుండే పుణ్యపదం చేరుకో

"అరుగో వసువులు విమానాలతో అంతరిక్షంలో అవుపడకండా నీరాకకోసం ఎదురుచూస్తున్నారు. అదలా వుండని. నువ్వు గతించడంతోనే ఈలోకంలో జ్ఞానం గతిస్తుంది. అంచేత వీళ్ళంతా సమస్తధర్మాలూ నీదగ్గిర తెలుసుకోడంకోసం వచ్చి వూగారు" అంటూ అక్కడ వున్న సౌఖ్యులందరినీ చూపించాడు. ధర్మరాజుని చూపిస్తూ "ఇతడు దుఃఖంవల్ల, వున్న జ్ఞానం పోగొట్టుకుంటు న్నాడు. ధర్మోపదేశం చేసి, ఇతను తెలుపుకున్నట్టు అనుగ్రహించు" అన్నాడు.

"కృష్ణా! శివా! (శుభుడా,) నారాయణా! (నీరు నివాసం కలవాడా!, అచ్యుతా! (నాశనం లేనివాడా!) నీమాటలు చెవుల్లో పడి అమృతరసంలో తేలుతున్నట్టు బ్రహ్మానందంగా వుంది నాకు. లోకనాథా! శబ్దబ్రహ్మనికి నువ్వే అధిపతివి. నీమాటల్లోనే అంతా వుంది. నీసన్నిధిని మాటాడే యోగ్యత నాకేది? బ్రహ్మదేవుడు కూడా నీముందు నోరు విప్పలేడు.

"విషాగ్నిలాటి బాణాలు దహించేస్తున్నాయి నన్ను. శరీరమూ, మనసూనూ వశంతప్పిపోతున్నాయి. జవాబు చెప్పడానికి శక్తి లేకండా వుంది. దుర్బలత్వంతో గొంతుకు ఆర్చుకుపోతూవుంది. నాలుక తడబడుతూ వుంది. ఎలా మాట్లాడగలను? మారుపలకడానికే శక్తిలేదు. అంచేత దయచూడు నన్ను. ధర్మరాజుకి హితమైన మాటలు నువ్వే చెప్పు. నువ్వు వుండగా నేను చెప్పడం గురువు వుండగా శిష్యుడు చెప్పడం అవుతుంది" అన్నాడు భీష్ముడు.

భక్తులదుఃఖం పోగొట్టే దయామూర్తి కృష్ణమూర్తి. భీష్ముడి మాట విని, నెమ్మదిగా అన్నాడు — "కౌరవవంశంలో పుట్టి, పరమార్థం తెలిసిన నీకు తగినట్టేవుంది నీ వినయం. అవును, బాణాలతో భరించలేని బాధపడుతున్నావు. కనక మూడు వరాలిస్తాను. స్వీకరించు. బాణాలవల్ల తెలివితప్పిపోకండా, బాధా ఆయాసమూ లేకండా, అసలు దెబ్బతగలనివాడిలాగే సుఖంగావుండు. ఆకలీ, దాహమూ, నిద్రా బాధించకండా పరిపూర్ణమైన శక్తి నీకు కలగాలని సంకల్పిస్తున్నాను. అన్ని ప్రాణుల నడవడీ పరికించినప్పుడు చిక్కుపడకండా నీబుద్ధి అంతటా వ్యాపించగలుగుతుంది. అన్ని విషయాలూ అవగాహన అయే దివ్యశక్తి లభిస్తుంది. నా అనుగ్రహం వల్ల ఇలా పరిపూర్ణజ్ఞానంతో ప్రకాశించు."

కృష్ణుడు ఇలా అనగానే వ్యాసమునీ మొదలైన మహామునులు అతణ్ణి ఎంతోగొప్పగా మెచ్చుకున్నారు. స్వర్గంలో దేవదుందుభులు మోగాయి. కృష్ణుడిమీదా, భీష్ముడిమీదా, ధర్మరాజుమీదా పూలవాన కురిసింది అప్సరసల గానం వినిపించింది. అక్కడ వున్న యావన్మందీ ఆశ్చర్యపోతూ ఆనందించారు.

ఇంతలో ఎర్రపొద్దుపడింది. మల్లిగా పడమటికొండమీదికి వెళ్ళిపోయింది.

కృష్ణుడితోనూ, భీష్ముడితోనూ, ధర్మరాజుతోనూ చెప్పి అనుమతి తీసుకుని మునులు బయలుదేరడానికి సిద్ధపడ్డారు. కృష్ణుడూ, ధర్మరాజూ, భీమార్జునులూ, నకులసహదేవులూ, కృపుడూ, యుయుత్సుడూ, సంజయుడూ వాళ్ళకి ప్రణామంచేశారు. "రేపువస్తాం" అంటూ మునులు తమతమ ఆశ్రమాలకి వెళ్ళిపోయారు. కృష్ణుడూ మొదలైనవాళ్ళు యావన్మందీ భీష్ముడిముందు నుంచుని "రేపుమళ్ళీ వస్తాం" అంటూ ప్రదక్షిణంచేసి సెలవుతీసుకున్నారు. తిన్నగా వచ్చి రథ మెక్కారు. వాళ్ళవెంట వచ్చిన ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ కాల్బలమూ. బైలుదేరింది. ఈశరాణువా హస్తినాపురం చేరుకునేసరికి వెన్నెల పొడిచింది.

పగలంతా ఎండకాసి రసం పీల్చెయ్యడంతో వాడిపోయిన చెట్లన్నీ తెలువుకున్నట్టు చేయగలశేర్వరి చందమామ. తన అమృత కిరణాలతో చకోరపక్షుల్ని సంతోషపెట్టడంకోసం ఉదయపర్వతం మీాద విలాసంగా ఉదయించాడు. ధర్మరాజుసేనకి ఎంతో ఆనందం కలిగింది.

కన్నులపండువుగా వున్న వెన్నెలలో వైభవంగా కృష్ణుడు మొదలైన వాళ్ళు యావన్మందీ పట్నంలో ప్రవేశించారు. ఎవరి లోగిళ్ళకి వాళ్ళు వెళ్ళి, ఆరాత్రి తగినట్టు గడిపారు.

వేకువకాగానే పాఠకుల మధురధ్వనులూ, మాగధుల మధుర కంఠాలూ వింటూ మేలుకున్నాడు శ్రీకృష్ణుడు. కాలకృత్యాలు తీర్చుకున్నాడు. బ్రాహ్మల్ని పూజించాడు. శుభంగా అలంకరించు కున్నాడు. అద్దంలో తనరూపం చూసుకున్నాడు. దగ్గిరున్న సాత్యకిని చూసి, భీష్ముడిదగ్గిరకి వెళ్ళడానికి ధర్మరాజు సిద్ధంగావున్న సంగతి తెలుసుకుని, మనం బయలుదేరడానికి సిద్ధంగా వున్నామని చెప్పు" అన్నాడు.

అంతకిముందే పుణ్యకీర్తనలూ, ఆశీర్వాదాలూ చెవులారావిని మేలుకున్నాడు ధర్మరాజు. కాల్యకృత్యాలన్నీ తీర్చుకుని సిద్ధపడుతున్నాడు. ఇంతలో సాత్యకి వచ్చాడు. "భీష్ముడి దగ్గిరికని రథం పూయించి సిద్ధంగా వున్నాడు అన్నయ్యా" అని చెప్పాడు.

అర్జునుణ్ణిచూసి, "రథంసిద్ధంచేయించు" అన్నాడు ధర్మరాజు "ఇవాళనించీ అక్కడికిసైనికుల్ని రానివ్వకు. దగ్గిరుండే పరివారంకూడా రానివ్వకు. భీష్ముడితగ్గిర సందడి పనికిరాదు. పైగామంచి రహస్యార్థాలుమనకి అనుగ్రహిస్తాడాయన. కసక గందిక లేకండా సేవించాలి మనం." కొంచెం ఆలోచించి తగిన రాజుల్ని కొందర్ని చెప్పి, "వాళ్ళూ, ధృతరాష్ట్రుడూ, గాంధారీ, విదురుడూ వస్తారేమో కబురుచెయ్యి" అన్నాడు.

అన్నగారి ఆదేశంప్రకారం చేశాడు అర్జునుడు. రథం సిద్ధం చేసి అతడూ, ధర్మరాజూ ఎక్కారు. భీముడూ, చిన్నతమ్ములూ ముగ్గురూ వొక రథ మెక్కారు. పంచమహాభూతాలూ మూర్తిమంతమై వెళ్ళినట్టు అయిదుగురు అన్నదమ్ములూ కృష్ణుడి విడిదికి వెళ్ళారు. వడికల రథాలతో కృపుడూ, యుయుత్సుడూ, సంజయుడూ వచ్చి కలుసుకున్నారు. దారుకుడు పూసిన రథంమీద బయలుదేరాడు శ్రీకృష్ణుడు. చక్రాలకమ్ములు ఎంతో ధ్వనిచేస్తూ నాలుగు రథాలూ బైలుదేరాయి.

అంతకిపూర్వమే నారదుడూ మొదలైన మునులు, బృహస్పతి దగ్గిరికి దేవతలు వచ్చినట్టు భీష్ముడి దగ్గిరికి వచ్చారు. చుట్టూ కూచున్నారు.

కృష్ణుడూ మొదలైనవాళ్ళు వెళ్ళి రథాలు దిగారు. ధర్మరాజుని ముందు పెట్టుకుని భీష్ముడిదగ్గిరికి వెళ్ళారు. ముందు మునీశ్వర్లకి

నమస్కారం చేశారు. తరవాత భక్తితో భీష్ముడి చుట్టూ చేరి నమస్క రించారు; ప్రార్థించారు.

ధర్మరాజు కబురందుకుని ధృతరాష్ట్రుడూ, రాజులూ వెనక వచ్చారు. తగినట్టు భీష్ముణ్ణి కొలిచి కూచున్నారు.

ధర్మరాజునీ, రాజుల్నీ నారదుడు చూశాడు. "అస్తమిస్తున్న సూర్యుడిలా వున్నాడు భీష్ముడు. ఇతడు కళ్ళుమూయ్యకముందే మన సులోని ధర్మసంశయాలన్నీ అడిగి తెలుసుకోండి" అన్నాడు.

అయితే ప్రశ్న అడిగే సత్తా లేక అంతమందీ వాళ్ళ మొహాలు వాళ్ళు చూస్తూ వూరుకున్నారు. కృష్ణుడివేపు చూశాడు ధర్మ రాజు. "నువ్వు తప్ప భీష్ముడితో ప్రసంగం చెయ్యగలవాళ్ళు ఎవరు న్నారు! ధర్మం తెలిసినవాళ్ళందరికీ నువ్వే గురుడివి. కనక నువ్వే ఆరంభించు సంభాషణ" అన్నాడు.

భీష్ముడికి బాగా దగ్గరగా వెళ్ళాడు కృష్ణుడు. "శరీరమూ, మనసూ బాగున్నాయి కదా!" అని కుశలప్రశ్న చేశాడు.

"దేవా!" జవాబు చెప్పాడు భీష్ముడు— "నీ అనుగ్రహంవల్ల బాధా, ఆయాసమూ లేవు. మనసూ, ఇంద్రియాలూ పటుత్వంగా వున్నాయి. వేదవిద్యావైభవమూ, పరతత్వమూ, హృదయానికి పరి స్ఫుటంగా అవగతమవుతున్నాయి. దయాసముద్రుడివి. నీ దివ్యచిత్తంలో నన్ను తలుచుకున్నావు. అంచేత ముసలాణ్ణయినా యువకుడిలా వున్నా నిప్పుడు. చెప్పవలిసినవన్నీ చెపుతాను. కాని, ప్రభూ! పాండవులకి, మేలుకలిగేవన్నీ నువ్వే ఎందుకు చెప్పవు! ఏమిటి నీ అభిప్రాయం, చెప్పూ!" అన్నాడు.

"శ్రేయస్సుకీ యశస్సుకీ నేనే మూలం. కనక 'చంద్రుడు చల్లనివాడు' అంటే వింతేముంది! ఇప్పుడు యశస్సు సంపాదించినంత మాత్రాన మళ్ళీ కొత్త గౌరవం ఏదైనా నాకు పెరుగుతుందా? నీకు

ఉత్తమమైన కీర్తి రావాలనే ఇలా సంకల్పించాను. నాబుద్ధిప్రభావం నీమనస్సులో ప్రవేశపెట్టాను. భూలోకం వున్నంతకాలమూ నీకీర్తి స్థిరంగా, ఉజ్వలంగా వుంటుంది. నువ్వు చెప్పిన మంచిమాటలు వేద వాక్యాలై నిలుస్తాయి. నువ్వు ధర్మరాజుకి చేసిన ధర్మబోధ నిర్మల మనస్సుతో ప్రశంసించిన ధార్మికులు ఇహమూ, పరమూ రెండూ సాధిస్తారు. నీధర్మవిజ్ఞానం మరీ ప్రకాశించినట్టు, నీ మనవలు ధర్మరాజూ, భీమార్జునులూ, నకులసహదేవులూ, ఈరాజులూ విని ధన్యులైనట్టు అన్నివిధాలా విడమర్చివివరించు" అన్నాడు శ్రీకృష్ణుడు.

"అలాగే కానీ" సంతోషంతో అన్నాడు భీష్ముడు- "ధర్మరాజు, అవును – అతను పుట్టడంతోనే అంతమందిజనులూ ఆనందించారు. పరమధార్మికమైన భరతవంశంరాజుల్లో అతడి సమానులైన రాజులు ఎవ్వరూ లేరు. సత్యమూ, దాంతీ, శుచీ, శాంతీ అతడిలోనే వున్నాయి. పాత్రఎరిగి దానమివ్వడమూ, యజ్ఞాలు చెయ్యడమూ, బంధువుల్ని రక్షించడమూ మొదలైన ధర్మాలంటే ఎప్పుడూ ప్రాణమతడికి. కామంవల్లా, లోభంవల్లా, భయంవల్లా అధర్మమార్గం తొక్కడతడు. ఏమిటి అడుగుతాడో అడగనీ."

"నీ ఎదటికిరాడానికి జంకుతున్నాడు ధర్మరాజు" అన్నాడు కృష్ణుడు– "గురువుల్నీ, బంధువుల్నీ, స్నేహితుల్నీ క్రూరమైన బాణాలతో యుద్ధంలోచంపాను కదూ అంచేత నువ్వు 'వీడు దయలేని కఠినాత్ముడు' అని దూషిస్తావని భయపడుతున్నాడు."

"భయమెందుకూ?" నెమ్మదిగా అన్నాడు భీష్ముడు– "బ్రాహ్మలకి అధ్యయనమూ, దానమూ, యజ్ఞమూ మొదలైన కర్మలు ఎలాగో రాజులకి యుద్ధం అలాగే కులధర్మం. తండ్రుల్నీ, కొడుకుల్నీ, మనవల్నీ, గురువుల్నీ ఎవళ్ళనైనా సరే, పాపంచేసిన

గాళ్ళని యుద్ధంలో చంపడమే ధర్మం. ఒడంబడిక మీద్దేసి, లోభం ల్ల అన్యాయానికి నెట్టుకున్న వాళ్ళని ఎవళ్ళనైనా యుద్ధంలో చంప లిగితే అది పుణ్యమే అవుతుంది. అంతేకాదు, రణరంగంలో శత్రు ల జుత్తులే నాచుగా, రక్తమే వరదగా చిత్రమైన రక్తంనదులు పారిం న రాజుని ధర్మజ్ఞుడనే అనాలి.''

భీష్ముడు అలా అనడంతోనే చేతులు జోడించి, మెల్లిగా దగ్గి కి వెళ్ళాడు ధర్మరాజు. అతడి పాదాలు చేతులతో పట్టుకున్నాడు. రస్సువోంచి వందనంచేశాడు.

ధర్మరాజుని చేరదీశాడు భీష్ముడు. అభినందించాడు. అతడి తలమీద మొహంపెట్టి మూచూశాడు. ఆదరించి కూచోపెట్టాడు, "సందేహించకు. ఏంతెలుసుకోవాలనివుందో అడుగు'' అన్నాడు.

## రాజధర్మం

శ్రీకృష్ణుడికి నమస్కరించాడు ధర్మరాజు వ్యాసుడూ మొద లైన మునీశ్వర్లకి జోహారుచేశాడు. యావన్మంది అనుమతీ తీసుకు న్నాడు. తాతగారివేపు తిరిగి రెండుచేతులూ జోడించాడు. "ఆలో చిస్తే మూడువర్గాలూ* రాజధర్మమే నడుపుతుంది. అదే వాటికి ఆధారం. మోక్షధర్మానికీ అదే పూత. గుర్రానికి కళ్ళెంలాగ, ఏనుగుకి అంకుశంలాగ జగత్తుని రాజధర్మమే అదుపులో వుంచుతుంది. వెనకటిరాజులు అంగీకరించిన రాజధర్మం అంగీకరించకపోయామా లోకస్థితి నశిస్తుంది. పొద్దుపొడిచి చీకటిని పోగొట్టినట్టు, రాజు తన ధర్మంతో_లోకంలోని కల్మషమంతా పోగొడతాడు.

---

* ధర్మమూ, అర్థమూ, కామమూ, సత్వమూ, రజస్సూ, తమస్సూ అని వృద్ధీ, క్షయమూ.

"నీబుద్ధి లోకాతీతమైంది. అంచేత తెలుసుకోవలిసిన ధర్మాలు నీదగ్గిరే తెలుసుకో" అన్నాడు శ్రీకృష్ణుడు. రాజు ధర్మస్వరూపుడు అని చెప్పగా విన్నాను. అయితే అతడు చెయ్యవలిసినపని భారమైంది అనే అనిపిస్తోంది. కనక ముందుగా రాజధర్మాలు వినాలని వుంది. సెలవియ్యి" అన్నాడు.

మహాత్ముడూ పూర్ణమైన ధర్మం తెలుసుకున్నాడు భీష్ముడు. బ్రహ్మస్వరూపుడైన మహానీయుణ్ణీ, శ్రీకృష్ణుణ్ణీ, వేదమూర్తులనదగిన మునీశ్వర్లనీ మనస్సులో పెట్టుకున్నాడు. భక్తితో నమస్కరించాడు. ఆదరభావంతో ధర్మరాజు మొహం చూస్తూ అందుకున్నాడు.

"స్పష్టమైన మాటలతో రాజధర్మాలన్నీ నీకు ఉపదేశిస్తాను. ఎంతో ఫలవంతమైన ధర్మమార్గం వివరిస్తాను. సావధానంగా ఆలకించు. తన మేలుకోరుకునే రాజు దేవబ్రాహ్మణపూజ చేసి క్రమంగా ప్రయత్నానికి పూనుకోవాలి. పురుషప్రయత్నమూ, దైవానుకూల్యమూ — ఈ రెండూ కార్యసిద్ధి కలిగిస్తాయి. ఈ రెంటిలోనూ ప్రయత్నమే గొప్పది. ప్రయత్నపరుడికే దైవం తోడ్పడతాడు. అప్పుడే ఫలసిద్ధి కలుగుతుంది. మనిషిప్రయత్నం ఒకొక్కప్పుడు సిద్ధించదు. అయితే దానికి విచారించకూడదు. దైవం అనుకూలించలేదనే అనుకోవాలి,

"శాంతీ, దాంతీ, ఆత్మనిగ్రహమూ కల రాజు శ్రీమంతుడవుతాడు. కీర్తిమంతుడవుతాడు. ఎంతో సౌఖ్యవంతుడూ అవుతాడు. రాజూ, మంత్రీ మొదలైన ఏడు ప్రకృతులూ సక్రమంగా నడవాలి. దానికి నిర్మలమైన నడవడా, సత్యమూ ఆధారాలు. అంతటికీ దండనీతివిధానిమే రక్ష. తగిన మెలకువతో సాగిస్తేనే అది

రాణిస్తుంది. బుద్ధిమంతులు మాత్రం బ్రాహ్మల మీద దండనీతి ప్రయోగించరు. దీనికి మనువుమాటే ప్రమాణం. చెపుతాను, విను.

"ఇనుము రాళ్ళలో పుట్టింది. అగ్ని నీళ్ళలో పుట్టింది. బ్రాహ్మల వల్ల రాజులు పుట్టారు. ఇది నిజమైన మాట. కనక వీళ్ళ ప్రతాపం ఎక్కడైనా చెల్లుతుంది కాని పుట్టినచోట చెడుతుంది. రాతిని పగల గొడితే ఇనుము చెడుతుంది. నీళ్ళని కాల్చబోతే అగ్ని ఆరిపోతుంది. బ్రాహ్మలమీద అలిగి వాళ్ళని చెరపబోతే రాజు తానే పాడవుతాడు. ఈమాటలు ఎప్పుడూ నువ్వు మనసులో పెట్టుకో. బ్రాహ్మల మీద దయకలిగి వుండు. దండనీతి సద్భావంతో తక్కినవాళ్ళమీద ప్రయోగించు. శాంతస్వరూపులైన బ్రాహ్మల నాలికమీదే వుంటుంది బ్రహ్మం. అందుకనే బ్రాహ్మణ్ణి దేవుడంటారు పండితులు. అయితే బ్రాహ్మణ్ణి దండించవలిసినపట్లూ వున్నాయి. శుక్రుడూ అదే చెప్పాడు. శాంతుడు కాక, యుద్ధంలో ఆయుధంపట్టుకుని కల బడిన బ్రాహ్మణ్ణి, వాడు వేదాంతం చదివినవాడైనా సరే, చంపడమే ధర్మం. వేదాలూ ఇదే చెప్పాయి. గురువు భార్యతో పోయినవాడూ, భ్రూణహత్య చేసినవాడూ, రాజుతో విరోధం తెచ్చుకున్నవాడూ, బ్రాహ్మణ్ణి చంపినవాడూ — బ్రాహ్మడైనాసరే, రాజ్యం వెళ్ళగొట్టాలి. బంధించకూడదు.

"దుర్గాలు అనేకవిధాలు. వాటిలో నరదుర్గం గొప్పది. అంచేత నాలుగువర్ణాలమీదా దయగా వుండాలి రాజు. అయితే కేవలం క్షమావంతుడైతేమాత్రం నెమ్మదైన ఏనుగులా అయిపోతాడు. ఈవిషయంలో బృహస్పతి చెప్పినమాటలున్నాయి. వివరిస్తాను: 'రాజు అతిగా మెత్తనివాడైతే, నీచపు ప్రజలు లోకువకట్టేస్తారు. ఏనుగుమీద మావటివాడిలాగ మీదెక్కి ఆటలాడుకొంటారు. ధర్మం తప్పిపోతారు. అంచేత వసంతఋతువులో సూర్యుడిలా వుండాలి రాజు.

ఉచితన్యాయంతో ప్రజల్ని పాలించాలి. అంత పదునూ కాక, అంత నెమ్మదీ కాకండా ఏలుకోవాలి. ఇదే రాజధర్మాలన్నిటిలో కల్లా రాజు. అదీకాక దండనీతి బాగా ఆలోచించి మరీ ప్రయోగించాలి. తన ఇష్టంవచ్చినట్టు తొందరపడి ప్రజకి నొప్పితగిలినట్టు నడవకూడదు రాజు.

"గర్భంతోవున్న ఆడది కడుపులోబిడ్డ బతకడంకోసం తగిన ఆహారం పుచ్చుకున్నట్టు ప్రజలు మనుగడకి తగినట్టు నడుచుకోవాలి రాజు. తొందరపడకూడదు. స్వార్థపరుడు కాకూడదు.

"సేవకులతో పరాచికాలాడుతూ సంతోషించే రాజుని వాళ్లు లోకువకట్టేస్తారు. ఎంత ఇచ్చినా మెచ్చరు. పనిలో మోసంచేస్తారు. నిందిస్తారు. నవ్వులాట్లోనూ, వేషభాషల్లోనూ సరిసమానంగా తయారై మితిమీరిపోతారు. తమకి తగని పదవులు కావాలంటారు. ఎదు రెత్తులు వేసి రాజ్యం ముక్కలుచేస్తారు అంచేత సేవకులతో అతిగా చనువిచ్చి అగౌరవంగా నడుచుకోకూడదు. సప్తాంగాల విషయంలో వ్యతిరేకంగా నడిచినవాణ్ణి ఎవణ్ణయినా సరే, వొదిలిపెట్టాలి రాజు. గర్వించి,కర్తవ్యవివేకం లేకండా ఇష్టంవచ్చినట్టు,నీతిమాలి ప్రవర్తించే వాడు గురువైనా సరే, వొదిలిపెట్టాలి. బృహస్పతి మరుత్తుడనే రాజుకి ఇలా చెప్పాడు అంచేత గురువూ, స్నేహితుడూ, కుమారుడూ అని మన్నించకూడదు. తప్పు చేసినవాణ్ణి దండించవలసిందే రాజు. పట్నంలో పిల్లల్ని బాధపెట్టడం తెలిసి, కన్నకొడుకుని అసమంజసుణ్ణి రాజ్యం వెళ్ళగొట్టాడు సగరచక్రవర్తి. బ్రాహ్మల మీద అబద్ధాలూ, అపవాదాలూ ప్రచారంచేశాడని కుమారుణ్ణి శ్వేతకేతుణ్ణి వొదిలిపెట్టేశాడు ఉద్దాలకముని. మనం విన్నవిష యాలే కదూ, ఇవి ?

"ప్రజారంజకుడు కావాలి రాజు. సత్యమూ, న్యాయమూ కలిగివుండాలి రాజు. ప్రజల మనస్సు నొప్పించకూడదు ఇవ్వవలిసి

నవి తగినసమయంలో ఇవ్వాలి. ఓర్పుతో ప్రవర్తించాలి. ఇలా అయితేనే అభివృద్ధి పొందుతాడు రాజు.

"తనకి వచ్చేకీడు వైదికవిధానాలతో పోగొట్టుకోవాలి. మరో విధంగా మేలు కలగదు. రాజన్నవాడు ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ పాటించాలనే శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. సకలవర్ణాల ధర్మాలూ రక్షించడమూ, సంధీవిగ్రహామూ మొదలైన ఆరుగుణాలూ చక్కగా ఆలోచించడమూ, న్యాయంగా ధనం సంపాదించడమూ ఎప్పుడూ సాగిస్తూ వుండాలి రాజు.

"చాడీలు వినకూడదు. తనకునచ్చిన తప్పుదారుల్లో అయినా సరే, రాజు దుర్మార్గులధనం లాక్కుని మంచివాళ్ళకి పంచిపెట్టడం మంచిదంటారు పండితులు.

"అతిగా నమ్మడమూ, నమ్మకపోవడమూ బుద్ధిమంతులలక్షణం కాదు. ఎక్కడైనా సరే. మనస్సుపెట్టి మంచీచెడ్డా ఆలోచించి తెలుసుకోవాలి.

"ధనం అపహరించడమే ఎప్పుడూ తన పనిగా పెట్టుకుని బతికే లుబ్ధుడైన రాజుకి శత్రువులవల్ల రాకముందు తన ప్రజలవల్లే వస్తుంది ఆపద. ధర్మపరులూ, ధనంసంపాదించడంలో చతురులూ, చంచలస్వభావం లేనివాళ్ళూ, క్రమశిక్షణ కలవాళ్ళూ, నీతి నైపుణ్యమూ కలవాళ్ళూ, కులీనులూ అయిన పరిజనులు హెచ్చుగా వుంటేనే రాజుకి మేలు.

"రాజ్యంలోని ప్రజలు కపటంలేకండా మసులుకోవాలి. తమ సంపద దాచుకోకూడదు. తమలో తాము స్నేహంగా వుండాలి. రాజుని కన్నకొడుకులా ప్రేమించాలి. అదిగో అలాటి రాజునే రాజని అంటారు, కాని మరో రాజుని రాజని అంగీకరిస్తారా యోగ్యులు ?

"సమర్థుడై రక్షించే రాజు లేకపోతే డబ్బూ, పెళ్ళాంపిల్లలూ రక్షించుకోడం సాధ్యమేనా ప్రజకి ?" అన్నాడు శుక్రుడు.

"'అధ్యయనంఎరగని బ్రాహ్మడూ, రాజ్యంరక్షించలేని రాజూ వొకటే' అన్నాడు మనువు.

"'ప్రజల్ని రక్షించడమే రాజత్వానికి మూలం' అన్నారు మహేంద్రుడూ, భరద్వాజుడూ, బృహస్పతీ మొదలైన రాజధర్మకర్తలు. అంచేత ఎలాఅయినా ప్రజారక్షణమే రాజుకి అవశ్యమైన కర్తవ్యం.

"న్యాయంగానో, అన్యాయంగానో ఎవ్వడూ ప్రయత్నంచేసి శత్రువుల్ని చంపితీరాలి రాజు. చిన్నవాడే అయినా అగ్నినిప్పులాగ, విషంలాగ బాధిస్తాడు పగవాడు.

"రాజ్యం మాంసంముక్కవంటిది. అదిలాక్కోడానికి అనేకులు ప్రాణాపాయం కల్పిస్తూ వుంటారు. అయినా, ధీరుడైన రాజు ఏమరుపాటుగా వుండడు. పండితులు మెచ్చుకున్నట్టు అదిదక్కించుకుంటాడు.

"బాబూ, ధర్మరాజా ! సంక్షేపంగా రాజధర్మాలు నీకు చెప్పానోయి, ఇందులో నీకు సందేహం ఎక్కడన్నా వుంటే అడుగు" అన్నాడు.

"పొద్దు గూకిపోవస్తోంది. ఇవాళకి సెలవుతీసుకుంటాను. రేపు వచ్చిఅడుగుతాను" అంటూ అతడిపాదాలకి నమస్కరించి బయలుదేరాడు ధర్మరాజు. శ్రీకృష్ణుడూ మొదలైనవాళ్ళు కూడా సెలవుతీసుకున్నారు. అంతమందీ మునీశ్వర్లకీ అభివాదాలు చేశారు. మునులందరూ తమతమ ఆశ్రమాలకి వెళ్ళాక, మహానది దృషద్వతిలో సంధ్యవార్చుకుని హాస్తినాపురం వచ్చేశారు. సంతోషంగా ఆరాత్రి గడిపారు. వేకువనే లేచి కాలకృత్యాలు ముగించుకున్నారు. భీష్ముడి

దగ్గిరికి వెళ్ళారు. అంతకిముందు వచ్చివున్న మునీశ్వర్లకి నమస్కరించారు. వినయంగా కుశలప్రశ్న లడుగుతూ వెళ్ళి భీష్ముడిచుట్టూ కూచున్నారు.

చేతులుజోడించి అడిగాడుధర్మరాజు:— "పూర్వం 'రాజు' అని వొకడు వుండేవాడట కదూ? పేరుకి తగినట్టు మహా అద్భుత చరిత్రుడట అతడు. దానికి ఏదో పెద్ద విశేషం వుంటుంది. ఆవిశేషం ఏమిటో సెలవియ్యి. అవయవాలూ, ప్రాణమూ, మనస్సూ చావు పుట్టుకలూ, శరీరయాత్రలూ అందరికీ ఎలాగో అతడికీ అలాగే కాని భేదం కనపడదు. ఇలాటి రాజు వొకడు మహా ప్రతాపవంతుడు బుద్ధి మంతులైన ప్రజల్ని ఎలా తన వశంచేసుకున్నాడు? ఎలా నిలుపు కున్నాడు? దండించి భూమి యావత్తూ ఎలా ఏలుకున్నాడు? దేవుడి లాగ నమస్కారంపొందడానికి ఎలా సమర్థుడయాడు? ఇదంతా విడ మర్చి వినాలని వుంది."

## నీతిశాస్త్రంకథ

"విను," అంటూ అందుకున్నాడు భీష్ముడు — "లోగడ కృతయుగంలో ప్రజమీద దండనీతి ప్రయోగించి, రాజు అని వొకడు పరిపాలించలేదు. అప్పటి ధర్మమే అలా వుండేదంటారు. ఒకళ్ళకి వొకళ్ళు రక్షకులుగా వుండేవాళ్ళప్పుడు. రానురాను ధర్మం చెడింది దైన్యం హెచ్చింది. ఒకళ్ళనిమించి వొకళ్ళకి లోభం పెరిగింది. పాడు పనులు మొదలెట్టారు ప్రజలు. క్రమంగా తమ మనస్సుల్లో కామమూ, రాగమూ పుట్టి మదమెక్కింది. బుద్ధి చలించింది. విచ్చలవిడిగా తప్పుతోవలు తొక్కారు జనులు. వేదాలు పాడుచేశారు. ధర్మం వొదిలేశారు. దేవేంద్రుడూ, దేవతలూ వైదికకర్మలు చెడ్డాయని

భయపడ్డారు. మునులతో కలిసి బ్రహ్మదగ్గిరికి వెళ్ళారు. 'మానవ లోకంలో వేదాలూ, కర్మలూ అడుగంటాయి. యజ్ఞాలు లేక మేం కూడా దుర్బలులమయాం. భయపడి నీ దర్శనానికి వచ్చాం. రక్షించు' అని మొరపెట్టారు. 'దీనికి ప్రతివిధానం చేస్తాను. మీరు భయపడకండి' అన్నాడు బ్రహ్మ. అన్నిలోకాలకీ మేలు కలిగినట్టు అనేకవిషయాలతో నీతిశాస్త్రం రాసి ఇచ్చాడు. నూరువేల అధ్యాయాల గ్రంథ మది. అందులో రాజూ, మంత్రీ, రాష్ట్రమూ, కోటా, కోశమూ, స్నేహితులూ, సేనా, అష్టప్రకృతీ, త్రయియూ, వార్తా, దండనీతీ, అరీ (పక్క దేశం రాజు), మిత్రుడూ (అరి తరవాతి రాజు), ఉదాసీనుడూ (మిత్రుడి తరవాతి రాజు) మొదలైన పన్నెండు విధాల రాజులూ, సంధీ, విగ్రహమూ, యానమూ, ఆసనమూ, ద్వైధీభావమూ, సమాశ్రయమూ మొదలైనవీ ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ నాలుగింటికీ సాధకమైనట్టు ఎన్నో వివరించాడు. 'ఇది లోకుల నడవడి నిర్మలంగా ఉంచడానికి సాధన మవుతుంది' అని అనుగ్రహించాడు.

"బ్రహ్మలలాటంలో, ఆదీ అంతమూ లేని విశ్వకర్తా, సర్వభూత స్వరూపుడూ, సనాతనుడూ అయిన శివుడు విశాలాక్షుడన్న పేరుతో పుట్టాడు. నీతిశాస్త్రమంతా చదివాడు. అది అభ్యసించాలంటే మనుషుల ఆయువూ, బుద్ధీ చాలవని విచారించాడు. మహనీయమైన ఆగ్రంథం కుదించి పదివేల అధ్యాయాల్లో రాశాడు. దానిపేరు వైశాలాక్ష మైంది. అది శివుడిదగ్గిర గ్రహించి, అయిదువేల అధ్యాయాలుగా కుదించాడు దేవేంద్రుడు. దాన్నే బృహస్పతి మూడువేల అధ్యాయాలుగా కుదించి రాశాడు. అదే శుక్రుడు వెయ్యి అధ్యాయాలలో కుదించాడు. మనుషుల శక్తి తెలిసి

"తరవాత వేనరాజు కుడికాలు మథించారు మునులు. అందు లోంచి వైన్యుడు పుట్టాడు. చక్కని ఆకారంతో అందంగా వున్నా డతడు. ధగధగలాడుతున్న కవచం వేసుకున్నాడు. ధనుస్సూ, బాణాలూ పట్టుకున్నాడు. తూణీరం కట్టుకున్నాడు. వేదాలూ, వేదాంగాలూ, ధనుర్వేదమూ, ఆచారమూ, దండనీతీ పుట్టుకతోనే అబ్బాయి అతడికి. మునుల ఎదట నిలబడి వినయంగా చేతులు జోడించాడతడు 'మహాత్ములారా! ధర్మమూ, అర్థమూ కలిసిన సూక్ష్మమైన పని ఏదైనా నాకు సెలవియ్యండి' అన్నాడు.

"మునులూ, అక్కడికి అప్పుడు వచ్చిన దేవతలూ అతణ్ణి అభినందించారు. 'గర్వమూ, లోభమూ, కామమూ, క్రోధమూ విడిచిపెట్టు. సర్వజంతువుల్నీ సమంగా చూడు. విధించిన ధర్మాలన్నీ సందేహంలేకండా నడిపించు. ప్రియం కలిగితే సంతోషించకు. అప్రియం కలిగితే విచారించకు. 'దండనీతి (నీతిశాస్త్రం) ప్రకారమే ఈపని చేస్తాను. సావధానంగా వేదాలు కాపాడతాను. వర్ణసంకరం కానివ్వను. బ్రాహ్మణ్ణి దండించను. ప్రజల్ని పాలిస్తాను' అన్న ప్రతిజ్ఞతో మహాధికారం వహించు' అన్నారు. "బ్రాహ్మలు నాకు సహాయంచేస్తే అలాగే చేస్తాను' అన్నాడు వైన్యుడు.

"మునులూ, దేవతలూ సంతోషించారు. బ్రాహ్మలు సహాయపడడానికి అంగీకరించారు. బ్రహ్మ, విష్ణువూ చాలామంది దేవతలతో కూడా అక్కడికి వచ్చారు. వాళ్ళూ, ఋషులూ వైన్యుడికి భూమండలం అంతటికీ సామ్రాజ్యపట్టాభిషేకం చేశారు. శుక్రుడు పురోహితుడయ్యాడు. వాలఖిల్యులలో సారస్వతులు మంత్రులయ్యారు. గర్గుడు జ్యోతిష్కుడయ్యాడు.

"అవకతవకగా, ఎగుడు దిగుడుగా వున్న భూమి వైన్యుడే సరి చేశాడని వినికిడి. కాళ్ళూ చేతులూ మొదలైన అవయవాలతో భూమీ, కొండలూ, సముద్రాలూ అతణ్ణి సేవించాయి. దేవేంద్రుడు ఐశ్వర్య మిచ్చాడు. మేరువు బంగార మిచ్చింది. కుబేరుడు కోరిన సంపద ఇచ్చాడు. ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ, భటులూ, తలుచుకున్నంతలో కొరుగులేకండా లభించారు. మహనీయమైన ప్రభుత్వాధికారంలో వుండి శాస్త్రాల్లో చెప్పిన ప్రకారం ధర్మం తప్ప కండా దండనీతి పరిపాలించాడు వైన్యుడు.

"అతడి ఏలుబడిలో లోకంలోని ప్రజలు హాయిగా బతికారు. పాములభయం లేదు. ఒకళ్ళతో వొకళ్ళకి విరోధం లేదు. వ్యాధులూ మనోవ్యాధులూ లేవు. పాడీపంటా కొరుగులేదు. బ్రాహ్మణ క్షత త్రాణ తత్పరత—అంటే, బ్రాహ్మణులకి గాయం కాకండా రక్షించడం వల్ల క్షత్రియుడని పేరు వచ్చింది అతడికి. ప్రజలందరినీ రంజింప చేయడం వల్ల రాజని పేరువచ్చింది. అతడి సంతతి వాళ్ళందరూ అతడిలాగే రాజ్యంచేశారు. దండనీతి పాలించారు. రాజని వొకడు పుట్టడమూ, తక్కిన వాళ్ళు రాజునిమించి నడవకూడ దనడమూ - ఇదంతా విష్ణువే చెప్పాడు. రాజుల నిజాంశల్లో విష్ణువు ప్రవేశించే వుంటాడు. అందు కనే యావన్మందిచేతా మొక్కులు పొందదగినవాడు రాజు. అంత మందినీ అతడు రక్షిస్తాడు. లోకమంతా ఆవొక్కడి వంశంలో వుండడం దేవతాంశవల్ల కాకపోతే మరోలా ఎలా అవుతుంది?

"విష్ణువు లలాటంలో పుట్టిన సిరి ధర్మానికి భార్య అయింది. సిరి 'ధనం' అనే కొడుకుని కంది. ధనమూ, ధర్మమూ, సిరీ — ఈముగ్గురూ రాజునే ఆశ్రయిస్తారు. అంతేకాక దేవభోగా లనుభ వించదగిన పుణ్యాత్ముడు కాని, సామాన్యుడు కాడు రాజు. దండనీతి నడపడంకోసం స్వర్గంనించి వచ్చినవాడు రాజు. మహత్వం కల

మహానుభావు డతడు. కనక నే వర్ణాలూ, ఆశ్రమాలూ, వాటి ఆచారాలూ, వేదాలూ, పురాణాలూ, ఇతిహాసాలూ రాజు అధీనంలో వుంటాయి. వాటి మహాత్మ్యంవల్ల నే అతడిలో సౌందర్యమూ శౌర్యమూ, చాతుర్యమూ మొదలైన గుణాలు కలుగుతున్నాయనిఅంటారు జనులు. అతడి ఆజ్ఞకిలోబడి నడుచుకుంటారు. ఇదీ రాజులు దేవతలతో సమానులైన విధం. తెలిసిందా, ఇంకా అడగవలసినవి అడుగు'' అన్నాడు.

ధర్మరాజు — నాలుగు వర్ణాలలోనూ ఎన్నెన్ని ఆశ్రమాలున్నాయి? ఏ ఆశ్రమధర్మం ఎలావుంటుంది? అవన్నీ విడివిడిగా సెలవియ్యి. విశ్వంలోని రాజధర్మాలన్నీ వివరించు.

## వర్ణాశ్రమధర్మాలు

భీష్ముడు — కోపంలేకడా వుండడమూ, సత్యం మాట్లాడడమూ, తనభార్యతోనే భోగాలనుభవించడమూ, శుచిగా అడకువగా వుండడమూ—ఇవన్నీ అన్ని వర్ణాలవాళ్ళూ అనుసరించవలిసిన ధర్మాలు.

బ్రాహ్మడికి తపస్సు పరమధర్మం. వేదాలు ముఖ్యంగా చదవాలతడు. వేదాల్లోనే అన్నికర్మలూ శాసించి వున్నాయి. అవన్నీ నియమంతో నడపాలి బ్రాహ్మడు — ఉపేక్ష చెయ్యకూడదు. కానిదారి తొక్కకూడదు. దయా, శాంతీ కలిగి నడుచుకోవాలి. అధికంగా ధనం దొరికితే తనవాళ్ళకి కాకండా ధర్మబుద్ధితో యాచకులి. పంచిపెట్టాలి, అహంకారం లేకండా వుండాలి.

యజ్ఞాలు చెయ్యడమూ, దానమివ్వడమూ, వేదం చదవడమూ, దొంగల్ని దండించడమూ; అనురాగంతో ప్రజల్ని పాలించడమూ, యుద్ధంలో నిశ్చయంగా విజృంభించడమూ — ఇవి రాజధర్మాలు. ఇందులో యుద్ధంముఖ్యమైన ధర్మం.

అధ్యయనమూ, దానమూ, యజ్ఞాలు చెయ్యడమూ న్యాయంగా ధనం సంపాదించడమూ, పశువులు రక్షించడమూ— ఇవి వైశ్యుల పనులు. ఇందులో పశుసంరక్షణ పరమధర్మం.

ఈ మూడువర్ణాలవాళ్ళకీ మంచిగా పనులుచెయ్యడం శూద్ర ధర్మం. బ్రహ్మపెట్టిన బతుకే అది. రాజు అనుమతి లేకండా ధన ధాన్యాలు కూడబెట్టకూడదతడు. అయితే దానంకోసమనికూడబెడితే దోషంలేదు. అది పవిత్రకార్యం కనక. బ్రాహ్మలూ, రాజులూ, కోమట్లూ ఈమూడువర్ణాలవాళ్ళకీ యజ్ఞానికి మించిన ధర్మం లేదు. యజ్ఞంచేసినవాడే వీళ్ళలోకల్లా గొప్పవాడు.

ఇక ఆశ్రమధర్మాలు ఆలకించు — గురుశుశ్రూషా, వేదాలు చదవడమూ, గోష్ఠికి దూరంగా వుండడమూ, ఆత్మహత్యకి పూను కోకపోడమూ, భిక్షాన్నంతో బతకడమూ, ఉత్తమమైన ఆరుకర్మల మీంద రాగద్వేషాలు లేకండా వుండడమూ — ఇవి బ్రహ్మచర్యాశ్రమధర్మాలు.

తాను కట్టుకున్న భార్యతో మాత్రం కాలక్షేపంచెయ్యడమూ, దయకలిగి వుండడమూ, సత్యమూ వోర్పూ మంచివాళ్ళ స్నేహమూ దేవతల్ని పితృదేవతల్నీ అతిథుల్నీ శ్రద్ధగా అర్చించడమూ, దేవతల్ని పూజించడమూ, నాలుగాశ్రమాలవాళ్ళనీ శక్తికొద్దీ పోషించడమూ— ఇవి గృహస్థాశ్రమధర్మాలు.

సంతానంమీంద స్నేహం తెంచుకుని, భార్యతోకలసి కాని, వొక్కడూ కాని అడివికి పోడమూ, మానమూ అహంకారమూ వొది లేసి ఇంద్రియాలు జయించి అడివిలోనే జడలు ధరించి తాపసశాస్త్రాలు చదువుతూ, పండితులగోష్ఠిలో కాలం గడపడమూ వానప్రస్థాశ్రమ ధర్మాలు.

ఎక్కడైనా తలదాచుకోడమూ, ఏదైనా తిని ఆకలితీర్చుకోడమూ, ఎక్కడ చీకటిపడితే అక్కడ పడుకోడమూ, అగ్నిహోత్రం మానెయ్యడమూ, ఏదీకోరకుండా వుండడమూ, ఇంద్రియాలు జయించడమూ, భోగాలంటే ఇలనా పాలనా లేకుండా వుండడమూ. దేనిమీదా మమకారం లేకుండా వుండడమూ సన్యాసాశ్రమధర్మాలు.

ఈనాలుగాశ్రమాలూ అవలంబించవలిసినవాడు బ్రాహ్మణుడు. రాజూ, కోమటీ కూడా నిర్మలమైన హృదయముంటేనే ఇవి అవలంబించాలి. మూడువర్ణాలవాళ్ళనీ సమానమనసుతో కొలిచి, రాజు అనుమతిమీద గృహస్థాశ్రమం నించి వానప్రస్థాశ్రమం స్వీకరించవచ్చు శూద్రుడు. సన్యాసాశ్రమంమాత్రం అతడికి కూడదు.

కులధర్మం తప్పని మంచిబ్రాహ్మణుడుమాత్రమే దానంపుచ్చుకోడానికీ, యజ్ఞంచేయించడానికీ అర్హుడు. అలాగే రాజులూ మొదలైన మూడువర్గాలవాళ్ళూ తమతమ కులధర్మాలు తప్పకండా నడుచుకుంటేనే గౌరవం.

నాలుగాశ్రమాలూ తగినట్టు నడిపించాలి రాజు. అలా అయితేనే ఇహమూ, పరమూ రెండూ దక్కుతాయి. ఆశ్రమధర్మాలు తప్పని శిష్టులు రాజ్యంలోవుండే రాజుకి దేవేంద్రుడైనా సాటిరాడు

ఏనుగుపాదంలో అన్నిజంతువుల పాదాలూ ఇమిడిపోయినట్టు క్షత్రియధర్మంలో అన్నిధర్మాలూ ఇమిడివుంటాయి ! దండనీతి లేకపోతే యజ్ఞాలూ, వేదాలూ, శుభకార్యాలూ అన్నీ చెడిపోతాయి. సంస్కారంలేకండా భూలోకం హీనదశ పొందుతుంది. ప్రజల కష్టాలపాలవుతారు. రాజు పరిపాలిస్తే సుఖపడతారు. అంచేత రాజు సర్వోత్తముడు. ధర్మాలన్నిటిలోకీ రాజధర్మమే గొప్పది. రాజంటే ధర్మదేవతే అనుకోవాలి.

వెనకటికి మాంధాత విష్ణుదర్శనంకోసం ఒక మహాయజ్ఞం చేశాడు. అతడికి దేవేంద్రుడు ప్రత్యక్షమయాడు. మాంధాతా, యజ్ఞానికివచ్చిన రాజులూ సంతోషంతో సాగిలపడి మొక్కారు. లేచి చేతులు జోడించి నుంచున్నారు.

'మాంధాతా! విష్ణువుదర్శనంకోసం వేడుకపడ్డావు నువ్వు. నాకూ, బ్రహ్మకీకూడా అది దుర్లభం. కనక నువ్వు ఏం కోరతావో కోరు, ఇస్తాను' అన్నాడు దేవేంద్రుడు.

'అయితే ఈసంసారంనుంచి నన్ను ముక్తుణ్ణిచెయ్యి. బిచ్చమెత్తుకు బతకడానికి నామనస్సు ఒప్పదు. నన్ను ధన్యుణ్ణిచెయ్యి' అన్నాడు మాంధాత.

నవ్వాడు దేవేంద్రుడు. 'రాజా, ధర్మాలన్నిటిలోనూ రాజధర్మం ఉత్తమమైంది. ఎలా చూసినా సిద్ధిపొందుతాడు రాజు. కామమూ, క్రోధమూ మళ్ళించి, న్యాయవిచారణచేస్తూ, దండనీతితో రాజ్యం పాలించే రాజు పొందే సద్గతి ఎవడు పొందగలడు?' అన్నాడు. రాజులందరినీ ఒకసారి తేరిచూశాడు. 'దిక్పాలకుల అంశలో పుట్టారు మీరు. బిచ్చమెత్తుకు బతకడం తగినపనేనా మీకు? ప్రజని పోషించడమూ, యుద్ధంలో శరీరం విడిచిపెట్టడమూ మీరు కోరిన ముక్తి కలిగిస్తాయి. సందేహంలేదు. మహా ఉన్నతమైన పదంమీది' అని చెప్పి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

అదంతా ఎందుకూ? వేదాల్లోనూ, పురాణాల్లోనూ ఎన్నో చోట్ల ప్రసిద్ధులైన పండితులు వెయ్యిమాట్లు చూసి, జనులందరిలోనూ రాజే గొప్పవాడనీ, దండనీతికి మించిన ధర్మం లేదనీ ఘంటాపథంగా చాటుతూనే వున్నారు. మనం వింటూనే వున్నాం. అంచేత కామమూ, క్రోధమూ అణుచుకుంటూ, ఆశ్రమాలు కాపాడుతూ,

ఎక్కడైనా తలదాచుకోడమూ, ఏదైనా తిని ఆకలితీర్చుకోడమూ, ఎక్కడ పొద్దుపడితే అక్కడ పడుకోడమూ, అగ్నిహోత్రం మానెయ్యడమూ, ఏదీకోరకుండా వుండడమూ, ఇంద్రియాలు జయించడమూ, భోగాలంటే ఆలనా పాలనాలేకుండా వుండడమూ. దేనిమీదా మమకారం లేకుండా వుండడమూ సన్యాసాశ్రమధర్మాలు.

ఈనాలుగాశ్రమాలూ అవలంబించవలిసినవాడు బ్రాహ్మణుడు. రాజూ, కోమటీ కూడా నిర్మలమైన హృదయముంటేనే ఇవి అవలంబించాలి. మూడువర్ణాలవాళ్ళనీ మంచిమనసుతో కొలిచి, రాజు అనుమతిమీద గృహస్థాశ్రమం నించి వానప్రస్థాశ్రమం స్వీకరించవచ్చు శూద్రుడు. సన్యాసాశ్రమంమాత్రం అతడికి కూడదు.

కులధర్మం తప్పని మంచిబ్రాహ్మణుడుమాత్రమే దానంపుచ్చుకోడానికీ, యజ్ఞంచేయించడానికీ అర్హుడు. అలాగే రాజులూ మొదలైన మూడువర్ణాలవాళ్ళూ తమతమ కులధర్మాలు తప్పకుండా నడుచుకుంటేనే గౌరవం.

నాలుగాశ్రమాలూ తగినట్టు నడిపించాలి రాజు. అలా అయితేనే ఇహమూ, పరమూ రెండూ దక్కుతాయి. ఆశ్రమధర్మాలు తప్పని శిష్టులు రాజ్యంలోవుండే రాజుకి దేవేంద్రుడైనా సాటిరాడు

ఏనుగుపాదంలో అన్నిజంతువుల పాదాలూ ఇమిడిపోయినట్టు క్షత్రియధర్మంలో అన్నిధర్మాలూ ఇమిడివుంటాయి! దండనీతి లేకపోతే యజ్ఞాలూ, వేదాలూ, శుభకార్యాలూ అన్నీ చెడిపోతాయి. సంస్కారంలేకుండా భూలోకం హీనదశ పొందుతుంది. ప్రజల కష్టాల పాలవుతారు. రాజు పరిపాలిస్తే సుఖపడతారు. అంచేత రాజు సర్వోత్తముడు. ధర్మాలన్నిటిలోకీ రాజధర్మమే గొప్పది. రాజంటే ధర్మదేవతే అనుకోవాలి.

వెనకటికి మాంధాత విష్ణుదర్శనంకోసం ఒక మహాయజ్ఞం చేశాడు. అతడికి దేవేంద్రుడు ప్రత్యక్షమయాడు. మాంధాతా, యజ్ఞానికివచ్చిన రాజులూ సంతోషంతో సాగిలపడి మొక్కారు. లేచి చేతులు జోడించి నుంచున్నారు.

'మాంధాంతా! విష్ణువుదర్శనంకోసం వేడుకపడ్డావు నువ్వు. నాకూ. బ్రహ్మకీకూడా అది దుర్లభం. కనక నువ్వు ఏం కోరతావో కోరు, ఇస్తాను' అన్నాడు దేవేంద్రుడు.

'అయితే ఈసంసారంనుంచి నన్ను ముక్తుణ్ణిచెయ్యి. బిచ్చమెత్తుకు బతకడానికి నామనస్సు ధృఢపరుచు. నన్ను ధన్యుణ్ణిచెయ్యి' అన్నాడు మాంధాత.

నవ్వాడు దేవేంద్రుడు.'రాజా,ధర్మాలన్నిటిలోనూ రాజధర్మం ఉత్తమమైంది. ఎలా చూసినా సిద్ధిపొందుతాడు రాజు. కామమూ, క్రోధమూ మళ్ళించి, న్యాయవిచారణచేస్తూ, దండనీతితో రాజ్యం పాలించే రాజు పొందే సద్గతి ఎవడు పొందగలడు?' అన్నాడు. రాజులందరినీ ఒకసారి తేరిచూశాడు. 'దిక్పాలకుల అంశలో పుట్టారు మీరు. బిచ్చమెత్తుకు బతకడం తగినపనేనామీకు? ప్రజని పోషించడమూ, యుద్ధంలో శరీరం విడిచిపెట్టడమూ మీరు కోరిన ముక్తి కలిగిస్తాయి. సందేహంలేదు. మహా ఉన్నతమైన పదంమీది' అని చెప్పి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

అదంతా ఎందుకూ! వేదాల్లోనూ, పురాణాల్లోనూ ఎన్నో చోట్ల ప్రసిద్ధులైన పండితులు వెయ్యిమాట్లు చూసి, జనులందరలోనూ రాజే గొప్పవాడనీ, దండనీతికి మించిన ధర్మం లేదనీ ఘంటాపథంగా చాటుతూనే వున్నారు. మనం వింటూనే వున్నాం. అంచేత కామమూ, క్రోధమూ అణుకుంటూ, ఆశ్రమాలు కాపాడుతూ,

న్యాయం తప్పకండా ప్రజల్ని పరిపాలిస్తూ, రాజ్యంచెయ్యడమే మేలు. సన్న్యాసధర్మమూ మొదలైనవాటివల్ల లభించే ఫలమంతా అప్రయత్నంగా రాజనీతివల్లే లభిస్తుంది.

అతిథుల్ని, దీనుల్ని, ధనాశలేని సన్న్యాసుల్ని దయచూడు. సంతోషమూ, మదమూ, గర్వమూ, విచారమూ విడిచిపెట్టు. 'నా శరీరసుఖం చూసుకోకండా ప్రజని పాలిస్తాను' అని శపథం పూను. ఈమాత్రం చేస్తే చాలు. సమస్తధర్మాలూ సిద్ధిస్తాయి.

ధర్మరాజు — వర్ణాశ్రమధర్మాలూ, వాటి రక్షణా, దానివల్ల వచ్చేమంచీ సెలవిచ్చావు. రాష్ట్రంలోని ప్రజలు ఎలావుంటే సుఖపడతారు?

## ప్రజాధర్మం

భీష్ముడు — ఉత్తమగుణాలు కల రాజుని రాజ్యానికి అభిషేకం చేసుకోవాలి ప్రజ. అన్నిపనులూ అతడిమూలంగానే జరిగితేనే ప్రజకి సుఖం. ఒకడు రాజుగా పాలించకపోతే, ఒకళ్ళభార్యని వొకళ్లు ఎత్తుకుపోతారు. చిన్నచేపని పెద్దచేప మింగేసినట్టు బలంలేనివాళ్ళని బలవంతులు తినేస్తారు. రాజులేని ప్రజలు బతకలేరు. సేద్యమూ, వ్యాపారమూ ఏదీ సాగదు. గోరక్షణ కూలిపోతుంది. బతుకుతెరువులన్నీ మంటకలిసిపోతాయి.

వెనకటికి వొకమాటు ప్రజలందరూ తమలోతాము కూడబలుక్కున్నారు. శపథంచేసుకున్నారు. క్రౌర్యమూ, దొంగతనమూ, రంకుతనమూ కూడదనుకున్నారు. అలా చేసిన దుర్జనుణ్ణి అంతమందీ కలిసి శాసించాలని నిశ్చయించుకున్నారు. తమమీద వొకడు రాజుగా అక్కరలేదనుకున్నారు. కానైతే ఎన్నో చిక్కులచేత నడనడి చిక్కుల్లోపడిపోయింది. విచారిస్తూ బ్రహ్మదగ్గిరికి వెళ్ళారు

వాళ్ళు. 'మాకు రక్షణకోసం రాజు కావాలి. చూపించు' అన్నారు. "అతణ్ణి సేవించి బతుకుతాం'' అన్నారు, కరుణించాడు బ్రహ్మ. మనువుని చూపించాడు. కాని నరులు అసత్యచరిత్రులని అంగీకరించ లేదు మనువు. అప్పుడు "సంకోచించకు పశువుల్లోనూ, బంగారం లోనూ యాభయ్యోవాలూ, ధాన్యంలో పదోవంతూ ప్రజలదగ్గిర కప్పం పుచ్చుకో ఆయుధాలతో జీవించే వాళ్ళందరిని నీవాళ్ళని చేసుకో బలవంతుడివై దుష్టుల్ని దండించు. శిష్టుల్ని పాలించు. మేం అందరమూ నీకు లోబడి నడుచుకుంటాం. అధర్మంగా నడుచు కున్న వాళ్ళు నీచేత చెడతారు. ధర్మపరులు చేసిన ధర్మంలో ఆరో వంతు నీకు చేరుతుంది. దీనికి మేమంతా అంగీకరిస్తున్నాం. దేవేం ద్రుడు దేవతల్ని రక్షించినట్టు నువ్వు మమ్మల్ని రక్షిస్తూ సుఖంగా వుండు'' అన్నారు ప్రజలు

మనువు ఒడబడ్డాడు. అలా అతిబలవంతుడై నీతిమంతుడై పరాక్రమంతో భూమి పరిపాలించాడు. యావన్మంది జనులూ సుఖపడ్డారు.

అంచేత రాజుమాటప్రకారం నడుచుకుంటేనే మేలు ప్రజకి. తగినవిధంగా దేవతల్ని పూజించినట్టు రాజుని పూజించాలి ప్రజ. అప్పుడు రవంత పొరపాటువచ్చినా సహిస్తాడు రాజు. రాజుని ప్రజ గౌరవిస్తేనే శత్రువులు దాసోహమంటారు. తనవాళ్ళు గౌరవించని రాజుని శత్రువులు లెక్కచెయ్యరు. అది ప్రజకే నష్టం. అంచేత ప్రజ రాజుకి లోబడి వుండాలి.

రాజు ప్రజతో చిరునవ్వుతో మాటాడాలి. నిజమే మాటా డాలి మంచీ చెడ్డా నిర్ణయించగలగాలి. అందరిని సమంగా చూడాలి. కృతజ్ఞుడై వుండాలి. ఇంద్రియనిగ్రహమూ ఓర్పూ కలిగి

న్యాయం తప్పకండా ప్రజల్ని పరిపాలిస్తూ, రాజ్యం చెయ్యడమే మేలు. సన్యాసధర్మమూ మొదలైనవాటివల్ల లభించే ఫలమంతా అప్రయత్నంగా రాజనీతివల్లే లభిస్తుంది.

అతిథుల్నీ, దీనుల్నీ, ధనాశలేని సన్యాసుల్నీ దయచూడు. సంతోషమూ, మదమూ, గర్వమూ, విచారమూ విడిచిపెట్టు. 'నా శరీరసుఖం చూసుకోకండా ప్రజని పాలిస్తాను' అని శపథం పూను. ఈమాత్రం చేస్తే చాలు. సమస్తధర్మాలూ సిద్ధిస్తాయి.

ధర్మరాజు — వర్ణాశ్రమధర్మాలూ, వాటి రక్షణా, దానివల్ల వచ్చేమంచీ సెలవిచ్చావు. రాష్ట్రంలోని ప్రజలు ఎలావుంటే సుఖపడతారు?

## ప్రజాధర్మం

భీష్ముడు — ఉత్తమగుణాలు కల రాజుని రాజ్యానికి అభిషేకం చేసుకోవాలి ప్రజ. అన్నిపనులూ అతడిమూలంగానే జరిగితేనే ప్రజకి సుఖం. ఒకడు రాజుగా పాలించకపోతే, ఒకళ్ళభార్యని వొకళ్లు ఎత్తుకుపోతారు. చిన్నచేపని పెద్దచేప మింగేసినట్టు బలంలేనివాళ్ళని బలవంతులు తినేస్తారు. రాజులేని ప్రజలు బతకలేరు. సేద్యమూ, వ్యాపారమూ ఏదీ సాగదు. గోరక్షణ కూలిపోతుంది. బతుకుతెరువులన్నీ మంటకలిసిపోతాయి.

వెనకటికి వొకమాటు ప్రజలందరూ తమలోతాము కూడబలుక్కున్నారు. శపథంచేసుకున్నారు. క్రౌర్యమూ, దొందతనమూ రంకుతనమూ కూడదనుకున్నారు. అలా చేసిన దుర్జనుణ్ణి అంతమందీ కలిసి శాసించాలని నిశ్చయించుకున్నారు. తమమీద వొకడు రాజుగా అక్కరలేదనుకున్నారు. కానైతే ఎన్నో చిక్కులచేత నలిగి నడి చిక్కుల్లోపడిపోయింది. విచారిస్తూ బ్రహ్మదగ్గిరికి వెళ్ళార

వాళ్ళు. 'మాకురక్షణకోసం రాజు కావాలి. చూపించు' అన్నారు. "అతణ్ణి సేవించి బతుకుతాం" అన్నారు, కరుణించాడు బ్రహ్మ. మనువుని చూపించాడు. కాని జనులు అసత్యచరిత్రులని అంగీకరించ లేదు మనువు. అప్పుడు "సంకోచించకు పశువుల్లోనూ, బంగారం లోనూ యాభయ్యోపాలూ, ధాన్యంలో పదోవంతూ ప్రజలదగ్గిర కప్పం పుచ్చుకో. ఆయుధాలతో జీవించే వాళ్ళందరిని నీవాళ్ళని చేసుకో. బలవంతుడివై దుష్టుల్ని దండించు. శిష్టుల్ని పాలించు. మేం అందరమూ నీకు లోబడి నడుచుకుంటాం. అధర్మంగా నడుచు కున్న వాళ్ళు నీచేత చెడతారు. ధర్మపరులు చేసిన ధర్మంలో ఆరో వంతు నీకు చేరుతుంది. దీనికి మేమంతా అంగీకరిస్తున్నాం. దేవేం ద్రుడు దేవతల్ని రక్షించినట్టు నువ్వు మమ్మల్ని రక్షిస్తూ సుఖంగా వుండు" అన్నారు ప్రజలు

మనువు ఒడబడ్డాడు. అలా అతిబలవంతుడై నీతిమంతుడై పరాక్రమంతో భూమి పరిపాలించాడు. యావన్మంది జనులూ సుఖపడ్డారు.

అంచేత రాజుమాటప్రకారం నడుచుకుంటేనే మేలు ప్రజకి. తగినవిధంగా దేవతల్ని పూజించినట్టు రాజుని పూజించాలి ప్రజ. అప్పుడు రవంత పొరపాటువచ్చినా సహిస్తాడు రాజు. రాజుని ప్రజ గౌరవిస్తేనే శత్రువులు దాసోహమంటారు. తనవాళ్ళు గౌరవించని రాజుని శత్రువులు లెక్కచెయ్యరు. అది ప్రజకే నష్టం. అంచేత ప్రజ రాజుకి లోబడి వుండాలి.

రాజు ప్రజతో చిరునవ్వుతో మాటాడాలి. నిజమే మాటా డాలి మంచీ చెడ్డా నిర్ణయించగలగాలి. అందరిని సమంగా చూడాలి. కృతజ్ఞుడై వుండాలి. ఇంద్రియనిగ్రహమూ ఓరిమీ కలిగి

వుండాలి. రాజ్యానికి తండ్రిలా వుండాలి. అలా అయితేనే రాణిస్తుంది.

ధర్మరాజు — అవును "మనుషులందరికీ రాజే ప్రభువు. రాజే దేవుడు" అని చెప్పారు బ్రాహ్మలు. దీనికి కారణం ఏమిటో అనుకునేవాణ్ణి, అది నీవల్ల స్పష్టంగా విన్నాను.

భీష్ముడు — ఇంకా విను. పూర్వం వసుమనుడు అనే రాజు మన్ను అడిగివచ్చి బృహస్పతిని అడిగాడు. బృహస్పతి అతడికి చెప్పిన మాటలే నీకు చెపుతాను. ఆలకించు.

"లోకాలకీ లోకధర్మాలకీ కూడా రాజే మూలం. రాజులేని రాజ్యంలో ప్రజలు నీళ్ళింకిన చెరువులో చేపల్లా బాధపడతారు. తగిన పరిపాలనే లేకపోతే సూర్యచంద్రుల వెలుగు లేనట్టు జనులు చెప్పరాని పాపాలు చేసి చెడిపోతారు. రాజంటూ లేకపోతే, ఇది నా ధనమనీ, ఇది నాభార్య అనీ నెమ్మదిగా నిర్భయంగా బతకలేరు. భయపడుతూ, హాహాకారాలు చేస్తూ అల్లకల్లోలమైపోతారు. రాజు లేకపోతే ఏదీ లేదనుకో. రాజుంటేనే అన్నీ వుంటాయి. రాజు రక్షిస్తూ వుంటేనే యజ్ఞాలూ, భోగాలూ, త్యాగాలూ, ధర్మాలూ అన్నీ వైభవంగా జరుగుతాయి. రాజు వాకడిమీద కళ్ళెర్ర చేశాడా, అతడే బంగారమూ, రత్నాలూ సర్వసంపదలూ లాక్కుంటాడు. ఒకణ్ణి దయచూశాడా అన్నీ ఇస్తాడు. అతణ్ణే కుబేరుడే అంటారు అప్పుడు.

రాజుకి చాలా శక్తుంది. అందుకనే రాజుని సూర్యుడే అంటారు పెద్దలు. శత్రువుల్ని చంపినప్పుడు యముడంటారు. అందుకే అతడు దేవతాత్ముడు. సందేహం లేదు. సామ్రాట్టనీ, విరాట్టనీ రాజుని వేదాలు పొగుడుతున్నాయి. అలాటప్పుడు అతణ్ణే పూజించ

కంటా వుండవచ్చా ప్రజ? ఇంద్రియాలు జయించి, వినయంతోనూ భక్తితోనూ రాజుని సేవించేవాణ్ణి సర్వసంపన్నుణ్ణి చేస్తా డతడు.

రాజుకి ప్రజ శరీరం. ప్రజకి రాజు ఆత్మ. రాజూ ప్రజా వొకళ్ళ నొకళ్ళు రక్షించుకోవాలి, ఒకళ్ళ నొకళ్ళు పూజించుకోవాలి."

ఇదీ బృహస్పతి ఉపదేశం. ఆయిడి ఉపదేశం ప్రకారమే రాజ్యం చేశాడు వసుమనస్సుడు.

ధర్మరాజు — రాజు దేశంఎలాపాలుకోవాలి? ఎలాశత్రువుల్ని హతమార్చాలి?

భీష్ముడు — తన్ను తాను గెలవాలి రాజు. తరవాత పగవాళ్ళని గెలవాలి. తన్ను తానుగెలవని రాజు పగ వాళ్ళని గెలవగలడా? తన్ను తాను గెలవడం అంటే మరేమీ లేదు. ఇంద్రియాలు అయిదూ అదుపులో పెట్టుకోడమే. అదే జితేంద్రియత్వం. జితేంద్రియుడైన రాజే పగ వాళ్ళని గెలవగలడు.

తాను తిరిగే ఉద్యానవనమూ, దేశం సరిహద్దులూ, పురద్వారాలూ, కోటా కట్టుదిట్టంగా కాపలాపెట్టాలి రాజు. శత్రువులదగ్గిరా, సొంతరాజ్యంలోనూ, అన్నదమ్ములదగ్గిరా కూతుళ్ళదగ్గిరా, బంధువులదగ్గిరా, స్నేహితులదగ్గిరా వేషభాషలైన వేగుల వాళ్ళనిపెట్టాలి ★ ఒకళ్ళని వొకళ్ళు తెలుసుకోకూడదు వాళ్ళు.

చారులవల్ల శత్రువు తనకంటే బలవంతుడని తెలుస్తే అతడికి ధనమిచ్చి అయినా సరే, సంధిచేసుకుని తనరాజ్యాన్ని కాపాడుకోవాలి. శత్రువు మత్తుడూ, వొళ్ళు కానని వాడూ ఇంద్రియలోలుడూ, దుర్బలుడూ అని తెలిస్తే, ఆశక్తిమీద దండెత్తాలి అగ్నిముట్టించీ, విషం పెట్టించీ అతణ్ణి వేధించాలి.

---

★ చూ. కామందకం సర. 12

కయ్యానికి కాలుదువ్వకండా ముందు సామోపాయంతోనూ భేదోపాయంతోనూ పగవాడిమనస్సు మెత్తబెట్టి లోబరుచుకోవాలి. ఉపాయంతో ఆపద తప్పించుకోడమే మేలు.

కన్నదండ్రిలాగ ప్రజల్ని పరిపాలించాలి రాజు. వాళ్ళ ఆదాయంలో ఆరోపాలు పన్ను పుచ్చుకోవాలి. అన్నివిధాలా సమర్థులైన ఆప్తుల్ని చూసి, ధనం లభించే అడవులూ, ఆలమందలూ, కొండలూ మొదలైనవి చూడడానికి పంపాలి. అన్నిటినీ వేగ కంటితో కనిపెడుతూ వుండాలి. కోట వెయ్యికళ్ళతో చూసుకోవాలి. గడ్డీ, ఉలవలూ మొదలైన పశుగ్రాసమూ, ధాన్యమూ, వంటచెరుకూ, నెయ్యీ, నూనే, ఆయుధాలూ, మందులూ, భయంకరమైన యంత్రాలూ, నూతులూ అన్నీ కోటలో పూర్తిగా వుండాలి. ధైర్యానికీ, శౌర్యానికీ పేరుపడ్డ యోధుల్ని తగినంతమందిని వుంచుకోవాలి. పగవాళ్ళు దండెత్తివస్తే దారిలో గడ్డీ, కట్టెలూ, నీళ్ళూ, వడ్లూ లేకండా చెయ్యాలి. మిత్రులైన రాజుల్ని సహాయంకోసం వర్తమానం చెయ్యాలి.

రాజూ, మంత్రీ, రాజ్యమూ, ధనాగారమూ, సేనా, స్నేహితులూ, కోటా — ఈ రాజ్యాంగాలూ ఏడూ ★ కంటికిరెప్పలా కాపాడాలి. సంధీ, విగ్రహమూ, యానమూ, ఆసనమూ, ద్వైదీభావమూ వమూ, సమాశ్రయమూ ఈఆరుగుణాలూ♦ నడిపించాలి. ధర్మమూ, అర్థమూ, కామమూ — ఈమూడువర్గాలూ పాటించాలి ప్రమాదం

* రాజు శిరస్సు. మంత్రి కళ్ళు. స్నేహితులు చెవులు. ధనాగారం ముఖం. సేన మనస్సు. కోట చేతులు. రాజ్యం పాదాలు - శుక్రనీతిసారం. అ. 1.

♦ సంధి: శత్రువులతో పొందుబడిక. విగ్రహం ' కలహం. యానం దండయాత్ర. ఆసనం ఆగడం. ద్వైదీభావం ఒకశత్రువుతో కలిసి, మరోశత్రువు మీద దండెత్తడం. సమాశ్రయం : ధనమిచ్చి అయినా బలవంతుడితో కలవడం.

వల్ల అర్థమూ, కామమూ కోరతపడినా ధర్మనిష్ఠ వుంటే రాజ్యపాలన సుస్థిరంగా వుంటుంది. బృహస్పతీ, శుక్రుడూ మొదలైన పెద్దలు ఇదే చెప్పారు. చెవీ చర్మమూ కన్నూ నాలికా ముక్కూ - ఈ బుద్ధీంద్రియాలూ, నోరూ చేతులూ కాళ్ళూ మలద్వారమూ మూత్ర ద్వారమూ — ఈకర్మేంద్రియాలూ మనస్సూ వెరశి పదకుండు ఇంద్రియాలూ జయించాలి. కామంవల్ల పుట్టిన జూదమూ, వేటా, ఆడాళ్ళమీాద వాంఛా, తాగుడూ, డబ్బు పాడుచెయ్యడమూ, క్రోధం వల్ల పుట్టిన తిట్టడమూ కొట్టడమూ, మొత్తం ఏడు వ్యసనాలూ విడిచి పెట్టాలి. శ్రద్ధగా యజ్ఞాలు చెయ్యాలి. వేదాలు చదవాలి. దానాలు చెయ్యాలి. చెడ్డమంత్రుల కుటిలవ్యాపారాలకి లొంగిపోకూడదు. నయమూ, విక్రమమూ, క్రమమూ తెలిసిన మంత్రులతో దేవతల విషయమూ, మనుషుల విషయమూ ఆలోచించాలి. దేవతలనీ, బ్రాహ్మలనీ తృప్తిపరచాలి. అశుభాలు తొలిగించుకోవాలి. శుభాలు కలిగించుకోవాలి. ఇలా ప్రజాపాలనచేసిన రాజు ఉభయలోక సిద్ధి పొందుతాడు.

ధర్మరాజు - రాజ్యమూ, దండనీతీ - ఈ రెండూ ఎలా కార్య సిద్ధి కలిగిస్తాయి ?

భీష్ముడు — రాజు కాలానికి కారణం. ఎలా అంటావా? కృత యుగంలో రాజు పరిపూర్ణమైన ధర్మంతో దండనీతి నడుపుతాడు. ఆయుగంలో ధర్మం పెరుగుతుంది. వైదికకర్మలు ఫలిస్తాయి. అన్ని ఋతువులూ ప్రజలకి క్షేమం కలిగిస్తాయి. ఆయువు అధిక మవుతుంది. దున్నకండా భూమి పండుతుంది.

త్రేతాయుగంలో ధర్మం మూడుభాగాలు నడుపుతాడు రాజు. ఆయుగంలో ముప్పాతికపాలే ప్రజకి సంతోషం కలుగుతుంది.

ద్వాపరయుగంలో సగం ధర్మమే పాలిస్తాడు. ఆ యుగంలో సగ పాలే మేలు కలుగుతుంది ప్రజకి.

కలియుగంలో రాజు ధర్మం ఉపేక్షిస్తాడు. లోకంలో ధర్మం వ్యాపించదు. అంతటా అధర్మం అధికమవుతుంది. వర్ణాశ్రమాలు దారితప్పుతాయి.

కాలప్రభావం అది. అయినా రాజు పరిపూర్ణమైన ధర్మం పాలిస్తే అది కృతయుగంలాగే వుంటుంది. రాజుధర్మం ఎప్పుడెప్పుడు ఎలాఎలా అనుసరిస్తే ఆయా సమయాలు ఆయా యుగాల మల్లేనే అవుతాయి.

ధర్మరాజు – రాజు ఎలా నడుచుకుంటే శుభంకలుగుతుంది?

భీష్ముడు – 'ఈరాజు తగినవాడు. న్యాయం విచారిస్తాడు. చేసినమేలు మరిచిపోడు. మదంకానీ, లోభంకానీ ఇతడికి రవంతా లేదు. ముష్కరుడు కాడితడు. ఆత్మస్తుతి చేసుకోడు. నీమంతో పరిపాలిస్తాడు. చేతికి ఎముక లేదు. శూరుడు. గర్వంలేదు. స్త్రీలోలుడు కాడు. శఠుడు కాడు.' ఇలా ప్రజలు మెచ్చుకున్న రాజుకి శుభాలు కొదవేమిటి?

వేదవేదాంగాలు తెలిసిన పురోహితుడు ఎప్పుడూ కోటలో వుండాలి. న్యాయమూ, దయా, నీతీ కల మంత్రి కానుకలూ, పన్నులూ విచారించాలి. పీడించి పన్నులు పుచ్చుకోకూడదు. పాలు కోసం పొదుగు కొయ్యడమే అవుతుంది. పాలు పిదకాలంటే ఆవు బాగు విచారించవద్దూ? ఆవులాంటిదే ప్రజ. తోటవాడు పువ్వులూ, పళ్ళూ కోసుకున్నట్టే రాజు పన్నులు వసూలు చెయ్యాలి. అంతేకాని బొగ్గులకోసం తోటనంతా తగలబెట్టినట్టు చేస్తే రాజ్యమే పాడవుతుంది. దయతో ప్రజని పాలించడంతో ఏ తపస్సులూ సరికావు. ఏ యజ్ఞాలూ

సాటి కావు. ప్రజా పాలన వల్ల జయమూ, సిరీ, కీర్తి, ముక్తీ అన్నీ కలుగుతాయి రాజుకి.

## పురోహితుడు

ముఖ్యంగా పురోహితుణ్ణి మన్నించాలి. పూర్వం ఇలకొడుకు పురూరవుడు 'భూమి రాజులదా? బ్రాహ్మలదా? ఎవళ్ళ సొత్తు?' అని వాయుదేవుణ్ణి అడిగాడు. వాయుదేవుడు ఏమన్నాడో తెలుసా? 'బ్రహ్మదేవుడి మొహంలో బ్రాహ్మలు పుట్టారు. బాహువుల్లో రాజులు పుట్టారు. తొడల్లో కోమట్లూ, పాదాల్లో శూద్రులూ పుట్టారు. ఉత్కృష్టస్థానంలో పుట్టి అన్ని వర్ణాలకీ అన్న అయిన బ్రాహ్మడే ఈభూప్రపంచంలోని ధనధాన్యాలు అన్నీ అనుభవించడానికీ, ఇతర్లకి ఇవ్వడానికీ తగినవాడు. అందుకనే దండనీతి నడపడానికి అతడు క్షత్రియుణ్ణి నియమించాడు. బ్రాహ్మడి శాంతిపర్యతంవల్లే క్షత్రియుడికి ఆధిపత్యం వచ్చింది. మగడు లేని ఆడది మరిదిని కట్టుకున్నట్టుంది. భూమిసంగతి. అంచేత కులధర్మం పాటిస్తూవున్న విద్వాంసుడూ, శాంతుడూ అయిన పురోహితుడికి సర్వసంపదలూ సమర్పించాలి రాజు. గర్వం లేకండా అతడి శుశ్రూషచెయ్యాలి. దండనీతి సాగించాలి. అలా అయితేనే ఇహంలోనూ, పరంలోనూ కూడా శుభం పొందుతాడు.

భయంతో వున్న ప్రజ మనస్సుకి రుచీ, వాసనా అనుభవానికి రావు. అలాంటి భయం పోగొట్టగలడు రాజు. అందుకనే సాటిలేని ప్రభుత్వం వచ్చింది అతడికి.''

ధర్మరాజు — దేనివల్ల పురోహితుడు పూజించదగినవాడు?

భీష్ముడు—పురోహితుడిగురించి శుక్రుడు చెప్పిన మాటలు విను. "రాజు యజ్ఞాలు చేస్తాడు. గరుడులూ, గంధర్వులూ, విద్యాధరులూ

మొదలైన దేవతలు యావన్మందినీ తృప్తిపరుస్తాడు. పరమశుభాలు పొందుతాడు. దీనికల్లా తగిన పురోహితుడి బుద్ధే మూలం. సమర్థుడైన పురోహితుడి మంత్రశక్తిలేని రాజుని రాక్షసులూ, పిశాచులూ, సిద్ధులూ, యక్షులూ మొదలైనవాళ్ళు బాధపెడతారు. రకరకాల ఉపద్రవాలూ, రాజగృహాల్లో కలిగే కీడులూ వీటిన్నిటికీ వెంటవెంటనే పురోహితుడిచేత శాంతివిధానం చేయిస్తేనే ఎప్పుడూ శుభం కలుగుతుంది" అన్నాడతను. ఈమాటలు బాగా అవగతం చేసుకో. బృహస్పతి కూడా "శాంతికమూ, పౌష్టికమూ, శత్రునాశనమూ మంత్రాలెరిగిన పురోహితుడివల్లే సాధ్యం" అన్నాడు. అంచేత నువ్వుకూడా పురోహితుణ్ణి పూజించు.

పరిశుద్ధిలేని కుచ్ఛితపురోహితులుమాత్రం నీచదశలపాలవుతారు. రాజనగళ్ళలో పౌరోహిత్యం చెయ్యడం సామాన్యంకాదు. ఆరోగ్యవంతుడైన ఉత్తముణ్ణే పురోహితుడిగా నియమించాలి రాజు. అతడూ, తానూ చేసే పనులన్నీ వొకే-మనస్సుతో చెయ్యాలి. బ్రహ్మక్షత్రియులు కలిసి కపటంలేకండా చేసినమంచిపనులు బ్రహ్మ మొదలైన దేవతలు హర్షిస్తారు. దీనికి ఐల, కశ్యప సంవాదమని వొక ఇతిహాసం వుంది. బ్రహ్మక్షత్రియుల విషయం ఐలుడు కశ్యపుణ్ణి అడిగాడు. కశ్యపుడు ఇలా చెప్పాడు - "క్షత్రియుడికి పుట్టుకపట్టు బ్రాహ్మడు. బ్రాహ్మడికి యోని రాజు. కనక ఉభయులూ వొకళ్ళనికట్టి వొకళ్ళు వృద్ధిపొందుతారు. కాదంటే ఇద్దరూ మాసిపోతారు. బ్రాహ్మడూ, రాజూ పొందు కలిగివుంటేనే జనం సేవిస్తుంది. ఉభయుల్లో భేదం వచ్చిందో, ఉభయుల్ని మన్నించరు. పైగా శత్రువులు ప్రజమీద పడతారు. బ్రాహ్మణక్షత్రియుల విభేదంతో శివుడికి కోపం వస్తుంది. దాంతో సర్వనాశనం సంభవిస్తుంది. అంచేత రాజూ, పురోహితుడూ ఏకంగా వుండాలి. ముఖ్యంగా పుట్టుకతో వచ్చిన ఆధిక్యంవల్ల పురో

హితుడిదగ్గిర రాజు వినయంగా వుండాలి. అప్పుడే ఉభయులకీ, ప్రజకి కూడా సుఖజీవనం సాగుతుంది.'

పురోహితుడి విషయమే ముచికుందుడికీ కుబేరుడికీ వాదన జరిగింది. అదికూడా విను. ముచికుంద రాజు దిగ్విజయంచేసి ప్రపంచమంతా జయించాడు. ఇంకా తన బలం తెలుసుకోవాలని కుబేరుడి మీద దండెత్తాడు. కుబేరుడు రాక్షససేన పంపాడు. దారిలోనే అడ్డుకుంది రాక్షససేన. ముచికుందుడి సైన్యాలు చిందరవందరచేసి పారేసింది. ఎంతో కించపడ్డాడు ముచికుందుడు. తన పురోహితుణ్ణి తిట్టాడు. తపస్సుతోనూ, మంత్రాలతోనూ రాజుసేనకి మంచి పటుత్వం కలిగించాడు పురోహితుడు. బ్రహ్మశక్తితో రాజుసేన రాక్షససైన్యం వోడించింది. అవూపురివెళ్ళి అలకాపట్నం ముట్టడించాడు ముచికుందుడు. బైటికివచ్చి యుద్ధంచేశాడు కుబేరుడు.

'ముచికుందా! బ్రహ్మశక్తివల్ల ఇంత సమర్థుడివయావు అందుకనే నీబాహుశక్తి శత్రువుల్ని క్షోభపెట్టింది. ఏం, అంతేనా! అన్నాడు.

'అదేమన్నమాట! బ్రాహ్మణుల్నీ, రాజుల్నీ వొక్కగర్భంలోంచే పుట్టించాడు బ్రహ్మ. యోగక్షేమాలు కలిపే నియమించాడు' అన్నాడు ముచికుందుడు.

'సరే, నీకూ నాకూ యుద్ధమెందుకూ? ' నెమ్మదిగా అన్నాడు కుబేరుడు - 'భూమంతా నీకే ఇస్తున్నాను. ఒక్కడివే ఏలుకో.'

నవ్వాడు ముచికుందుడు. 'ఒకళ్ళిచ్చిన దానమూ? ఈకుచ్ఛిత ప్రభుత్వం నాకునచ్చదు. శత్రుభయంకరమైన నా భుజబలంతో గడించిన ప్రభుత్వమే గౌరవంగా అనుభవిస్తాను' అన్నాడు.

'ఒప్పుకున్నాను, నువ్వే గొప్పవాడివి. నీ ఇష్టమే కానీ' అంటూ ఆదరించాడు కుబేరుడు. సంతోషించి వచ్చేశాడు ముచికుందుడు. అడ్డులేని పరాక్రమంతో భూలోకం యావత్తూ పరిపాలించాడు.

ధర్మరాజు—అయితే రాజధర్మాల్లో ఏవి, ఇటు ఐశ్వర్యమూ అటు పుణ్యలోకమూ ప్రసాదిస్తుంది?

భీష్ముడు—మంచివాళ్ళ భయంపోగొట్టి, వాళ్ళకి సౌఖ్యం కలిగించడమే రాజధర్మంలో ఉత్తమధర్మం. చూడూ, మేఘం పళ్ళ చెట్లనీ, పక్షుల్నీ, అన్ని ప్రాణుల్నీ ఎలా పోషిస్తుంది, అలాగ నీ బంధువుల్నీ, సజ్జనుల్నీ నువ్వు పోషించు. అదే యోగ్యమైన రాజధర్మం.

## వృత్తి నిబట్టే కులం

ధర్మరాజు—బ్రాహ్మలూ మొదలైలవాళ్ళు తమ కులధర్మం వల్ల జీవనం గడవనప్పుడు ఏం చెయ్యాలి?

భీష్ముడు—ఆపద వచ్చినప్పుడు ఇతరజాతుల వృత్తులు అవలంబించవచ్చు. తప్పులేదు. అయితే బ్రాహ్మడు ఆయుధాలు పట్టుకుని క్షత్రియధర్మంతో జీవనోపాయం చేసుకుంటే క్షత్రియులతో సమానుడే అవుతాడు. అతడి బ్రాహ్మణ్యం చెడుతుంది. వర్తకం మొదలైన వైశ్యవృత్తి చేసుకుంటే కోమట్లతో సమానుడవుతాడు. నిత్యకర్మలూ అవీ మానేసి, ధనాశతో శూద్రుడిలా నడుచుకుంటే శూద్రులతో సమానుడవుతాడు. తక్కినవాళ్ళూ అలాగే తమ కులవృత్తులు మానేసి కింది వృత్తులు అవలంబిస్తే, కులహీనులై కింది వాళ్ళతో సమానులవుతారు. వాళ్ళు తమ మొదటి కులంలోని ఉత్తమకృత్యాలకి పాత్రులు కారు. ఈవిషయం తెలుసుకోవాలి రాజు తగినట్టు ప్రజల్ని నడిపిస్తూ రక్షించాలి అప్పుడే ప్రజల ధర్మంలోంచి నాలుగోభాగం రాజుకి దక్కుతుంది. ప్రజాపాపంలో

పడకుండా చూడని రాజుని, దండనీతి లేని రాజుని ప్రజల పాపంలో నాలుగో వంతు పాపం చుట్టుకుంటుంది. నాలుగో వంతే కాదు, పూర్తిగా అంత పాపమూ అలాటి రాజుని చుట్టుకుంటుందంటారు కొందరు పండితులు.

ధర్మరాజు—తండ్రీ! సుఖాలు అనుభవించాలని లేదు నాకు. రాజ్యవైభవంమీద ఆశకంటే లేదు. ధర్మం రక్షించడం భారమైన పని. దానికి లోపం కలుగుతుందన్న దిగులూ అధికంగా వుంది. ఎన్నో దోషాలపుట్ట రాజ్యభారం ఇది అక్కరలేదు నాకు. కఠినమైన దండనీతి నాకెందుకు! సన్యసిస్తాను అడవికి పోతాను.

భీష్ముడు — ఇది జడత్వంకాని రాజధర్మం కాదు. ఎంతో మెత్తని మనసు నీది. ఇదికూడదు. నీకు వొత్తి చెప్పడానికి పాండురాజు లేడు కదా! విచిత్రవీర్యుడూ లేడు. శంతనుడూ లేడు. నామాట విను ఇంతకీ ఈ కాలంత ధర్మం తప్పకుండా నడుచుకున్నారా వెనకటి రాజులు? కామమూ క్రోధమూకూడా లేనిదండనీతి పూనాలి, కాని, ఇదేమిటి?

దానం చెయ్యడమూ, వేదాలు చదవడమూ, యజ్ఞాలు చెయ్యడమూ — వీటితో ప్రజల్ని కాపాడడమూ — ఇదీ రాజధర్మం. బ్రహ్మకల్పించిన ధర్మం ఇది. ఇది మానడం అంటే నరకానికి దారి తియ్యడం అన్నమాట. అంచేత ఎలా అయినా సరే, వర్ణాశ్రమధర్మాలు సక్రమంగా సాగించు. ఇహపరాలు రెండూ లభిస్తాయి.

దీనికి ఒక ఇతిహాసం చెపుతాను, విను. కేకయరాజు నియమంగా వేదాలూ అవీ చదివాడు. ఒకనాడు అతను అడవిప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ అతణ్ణి ఒక మహారాక్షసుడు పట్టుకున్నాడు. మంచిబలవంతుడు రాక్షసుడు. అతణ్ణి విడిపించుకోలేక పోయాడు కేకయుడు.

'దొంగతనమూ, రంకుతనమూ నారాజ్యంలో ఎక్కడాలేవు. బ్రాహ్మలు వేదాలు చదువుతున్నారు. దానాలతో యజ్ఞాలు చేస్తున్నారు రాజులు. బ్రాహ్మల్ని పూజిస్తున్నారు. యుద్ధాల్లో మడమ తిప్పరు. అదే వ్రతం వాళ్ళకి. కోమట్లు గోరక్షణా మొదలైన కుల ధర్మాలు నడుపుతున్నారు. కులధర్మాలన్నీ చక్కగా సాగుతున్నాయి. ఏం లోపం చూసి ఇలా నువ్వు నిర్భయంగా ఘోరంగా నన్ను పట్టుకున్నావు? ఇది నీకు తగినపనేనా చెప్పూ?' అని అడిగాడు.

సంతోషించాడు రాక్షసుడు. 'అవును కులధర్మాలు చక్కగా నడిపిస్తున్నావు నువ్వు. అందుకనే సంతోషించి ఇలావచ్చాను. నిర్మల మైన మనస్సుతో కులాలు కాపాడుతున్న రాజుకి ఏకీడూ రాదు. ఇది చెప్పడానికే నిన్ను పట్టుకున్నాను. స్థిరంగా, సౌఖ్యంగా ఇలాగే ప్రజల్ని రక్షిస్తూ వుండు' అని, కేకయరాజుతో స్నేహంచేసుకుని వెళ్ళిపోయాడు.

ధర్మరాజు — బతుకు గడవని బ్రాహ్మడు క్షత్రియ వృత్తిని శక్తిలేకపోతే ఎలా బతుకుతాడు?

భీష్ముడు — బ్రాహ్మడికి అలాంటి ఆపద వచ్చినప్పుడు కోమటి వృత్తి చెయ్యవచ్చు. అయితే ఉప్పూ, నువ్వులూ, మాంసమూ ఆవులూ, ఎడ్లూ, అన్నమూ, కల్లూ, నెయ్యీ, నూనే, తేనే, జూలున్న జంతువులూ అమ్మకూడదు. ఎంతలాభంవచ్చినా సరే, అవిఅమ్ముదా మని అనుకోనూ కూడదు.

ధర్మరాజు — యజ్ఞాలు ఎలాచేస్తే మంచిది?

భీష్ముడు — ముఖ్యంగా శ్రద్ధ కావాలి. యజ్ఞంచేసేవాడు అబద్ధం ఆడకూడదు. వేదాలు దూషించకూడదు. తగిన దక్షిణ లివ్వాలి. దక్షిణాలు మంత్రార్థాలని పోషిస్తాయంటారు పెద్దలు. ఇలా శ్రద్ధతో

యజ్ఞం చేసినవాడు చంద్రుడికి అప్పుడవుతాడు. దానివల్ల చంద్ర లోకంలో మహాసౌఖ్యం కలుగుతుందని వేదాలు చెపుతున్నాయి.

అయితే యజ్ఞంకంటే తపస్సు గొప్పది. తపస్సంటే శరీరం ఎండగట్టుకోడం కాదు. అహింసా, సత్యమూ, దమమూ, దయా కలిగివుండడమే.

## మంత్రి

ధర్మరాజు - మంచి స్నేహితుడు లేకపోతే న్యాయం నడప లేడు రాజు. అంచేత ఎలాంటివాణ్ణి స్నేహితుడని నమ్మవచ్చు?

భీష్ముడు — రాజు ఎవళ్ళనీ అసలే నమ్మకపోడం మృత్యువు. పూర్తిగా నమ్మడం అపమృత్యువు. అంచేత నమ్మాలి, నమ్మకండా వుండాలి. అల పనులు చేయించుకోవాలి. అన్నీ సూక్ష్మ బుద్ధితో తానే చూసుకుంటూ వుండాలి. తనకి మేలుచేసేవాడే స్నేహితుడు. అతడు చేసేపనులే శుభంకలిగిస్తాయి. ఏమరుపాటు లేకండా స్నేహితులతో పనులుచేయించుకోవాలి. గౌరవానికి పొంగి పోకండా, అవమానానికి కుంగిపోకండా, వొక్కలాగే పరిశుద్ధంగా పనులుచేసే స్నేహితుడికి తనలాగే సిరీ సంపదా, అధికారమూ ఇచ్చి, గొప్పవాణ్ణిచెయ్యాలి రాజు. అప్పుడే తనకి అన్నిసుఖాలూ అలవడ తాయి. సందేహం లేదు.

అయితే అలాటి మిత్రుడైన మంత్రి కామమూ, క్రోధమూ, లోభమూ, భయమూ — వీటివల్ల ఏపనిలో అయినా వూనికవొదల కూడదు. నేర్పు నడుచుకోవాలి.

అన్నదమ్ములంటే ఉన్నతే కలుగుతుంది రాజుకి. వాళ్ళు ఎంత పనికిమాలినవాళ్ళయినా సరే, వాళ్ళని గౌరవించాలి. వాళ్ళకి ధనమివ్వాలి. ఏలోపమూ లేకండా ఆదరించాలి. ఏమంటే బలగం

వున్న రాజు బలవంతుడని పొరుగురాజులు గొప్పగా చూస్తారు. బలగంలేనిరాజుని, అతడు ఎంత శూరుడైనా సరే చులకనచేస్తారు. ఎక్కువ తక్కువమాటలాడడమూ, కఠినంగా మాటాడడమూ జ్ఞాతుల స్వభావం. బందిపోట్లుకూడా చేసి నష్టం కలిగిస్తారు వాళ్ళు. అన్న దమ్ములవిషయంలో అవన్నీ సహించుకోడమే మంచిది రాజా. లోవ ల్లోపల కుములుతూ వుంటారు వాళ్ళు. కత్తులు నూరుతూ వుంటారు. పాపం తలపెడతారు. సమర్థులై పక్కలో బల్లెంలా భయపెడతారు. వాళ్ళని పొడుపుగా తనవేపు తిప్పుకోడమే దానికి మందు. ఏమంటే, రాజుకి కీడూ చెయ్యగలరు, మేలూ చెయ్యగలరు వాళ్ళు అంచేత కీడు చెయ్యకండా కాసుకోవాలి వాళ్ళని. వాళ్ళని కూడగట్టుకుని నడుపుకోడమే మంచిది.

ధర్మరాజు — రాజు ఎలా ధనం గడించాలి?

భీష్ముడు — ధనం రాబట్టగలిగిన సమర్థుడు రాజుదగ్గిర వుండాలి. అయితే ప్రజలు యావన్మందీ అతడికి కీడుచెయ్యాలనే చూస్తారు. అందుకని అతణ్ణి కంటికి రెప్పలా కాపాడాలి రాజు.

వెనకటికి కోసలదేశంలో క్షేమదర్శి అని వొక రాజు వుండే వాడు. కాలవృక్షీయుడని వొక ముని, పంజరంలో వొక కాకిని పట్టుకుని కోసలదేశం వచ్చాడు. "ఈ కాకికి జరిగిందీ, జరుగుతున్నదీ, జరగబోయేదీ తెలుసు" అని అందరితోనూ చెపుతూ తిరిగాడు, క్రమంగా తుదకి రాజుదగ్గిరకి వెళ్ళాడు. కాకిని చూపించి, "రాజా! ధనసంపాదనా మొదలైన రాచకార్యాలు నీరాజ్యంలో సరిగాలేవు. ఈవిషయంలో కలుగుతున్న చెడుగు ఈ కాకి నీకు చెపుతుంది. నీకు నష్టం కలిగిస్తున్న దొంగల్ని పట్టి ఇస్తుంది" అన్నాడు. రాజుచేసిన గౌరవం పొంది, ఒనకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రాజాధికారులు ఎలాగో కాకిని చంపేశారు. మర్నాడు కాలవృక్షీయుడు రహస్యంగా రాజుని కలుసుకున్నాడు. 'నీ ఉద్యోగుల కపటోపాయంవల్లే కాకి చచ్చిపోయింది' అని మెలకువతో తెలియ చేశాడు. తనపేరు చెప్పాడు. నేను మీ మంత్రి స్నేహితుణ్ణి. అతడు కాలం చేశాక, ఇక్కడ వుండకుండా అడివికి వెళ్ళి తపస్సు చేసుకుంటున్నాను. నీమీదవున్న స్నేహంవల్ల నీ యోగక్షేమాలు తెలుసుకోవాలని వచ్చాను. ఈరాజ్యంలోనూ, రాజధానిలోనూ తిరిగాను. నీరాజ్యలక్ష్మి గొప్పది. అయినా అధములైన ఉద్యోగుల వల్ల దొంగలున్న కావేరిలాగ ఉపయోగంలేకుండా పోతూవుంది. ఇది నీకు చెప్పడంకోసమే వృత్తినే కాకినెపం పెట్టుకు వచ్చాను. దుర్మతులైన ద్రోహులు దాన్ని చంపడంవల్ల లోపలికుట్ర నీకు కొంత బోధ పడింది కదా? కనువిప్పు కలిగి కనిపెడితే ఇంకా తేటపడుతుంది. నా స్నేహమూ, కార్యవివేకమూ నమ్ము. నా ఉపదేశం ఆదరించు. నన్ను ఇప్పుడేమీ ఆదరించకు; వొదిలెయ్యి. వంచకులైన అధికార్లని కనిపెట్టు. మెల్లి మెల్లిగా వాళ్ళలో వాళ్ళకి విరోధం కలిగించు. వాళ్ళ ఐకమత్యం చెడగొట్టు. ఒడుపుగా నొక్కొక్కణ్ణీ దండించు' అంటూ ఉద్యోగుల పేర్లూ వివరించాడు.

కాలవృక్షీయుడు చెప్పినట్టేచేశాడు క్షేమదర్శి. తనరాజ్యాని కంతటికీ అతణ్ణే మంత్రిచేశాడు. ధనధాన్యాలతో తులతూగాడు సంతోషంగా జీవించాడు. సుఖమూ, కీర్తి పొందాడు.

ధర్మరాజు—మంత్రి ఎలాటివాడై వుండాలి?

భీష్ముడు—మంత్రి జ్ఞానపరుడై వుండాలి. రాజ్యంలో వాళ్ళకీ పట్నంలో వాళ్ళకీ ఆప్తుడై వుండాలి. కార్యం తెలిసినవాడై వుండాలి ధైర్యవంతుడూ, శౌర్యవంతుడూ అయివుండాలి. క్రౌర్యంలేనివాడూ, నిర్మలమైన మనస్సు కలవాడూ అయివుండాలి. రాజుమీద భక్తీ,

అనురాగమూ, అడగ... కలిగివుండాలి. సుఖమైనా, దుఃఖమైనా వొక్కలాగే భావించేవాడై వుండాలి. చెమటచుక్క నెత్తురుబొట్టులా చూసేవాడై వుండాలి. తెలియక తనమీద తప్పుపెట్టినా, కోపం వచ్చి తిట్టినా నొచ్చుకోనివాడై వుండాలి. తీర్చి చెపితే స్నేహం చెడనివాడై వుండాలి. రాజ్యంలోని లోపాలు పైకిపోక్కకండా వుంచి, శత్రువుల లోపాలుకనిపెట్టి, వాళ్ళనిచిక్కుపెట్టగల నిపుణుడూ అయివుండాలి. ఇదిగో, ఇలాటివాడే ముఖ్యమంత్రికి తగినవాడు. ♦

రాజు మృదువుగా, మధురంగా, చిరునవ్వుతో మాట్లాడుతూ మంత్రుల్నీ, ప్రజల్నీ సంతోషపెడుతూ వుండాలి. అదే ఎంతైనా ఔన్నత్యం కలిగిస్తుంది రాజుకి. దానమూ, ప్రియంగామాట్లాడడమూ ఈరెంటివల్లే ప్రజలు సంతోషిస్తారు. పుచ్చుకున్నప్పుడు మంచిమాట లాడడంవల్ల ఎదటివాళ్ళమనస్సు నొప్పికలగదు. ఈకిటుకు తెలుసు కోవాలి రాజు.

## తగువు తీర్పు

ధర్మరాజు— నిందపడకండా, పాపం రాకండా రాజు, ప్రజల తగువు తీర్చడం ఎలాగ ?

భీష్ముడు - వ్యవహారశుద్ధి సర్వజన ప్రియకారి. అదే రాజుకి ధర్మమూ, కీర్తీ కలిగిస్తుంది. సత్యవంతులూ, ధర్మపరులూ అయిన బ్రాహ్మలూ, నువ్వూ కలిసి, త్రాసులా మనస్సు పెట్టుకుని తగువు తీర్చాలి. పక్షపాతం లేకండా తగువు వినాలి. ధనవాంఛతో ధన వంతులవేపు మొగ్గి తీర్పు చెప్పకూడదు. ధర్మమార్గం తప్పకండా న్యాయవిచారణ చెయ్యాలి. దండించవలసినచోట తగినట్టుదండించాలి.

♦ మూ. కౌటిలీయార్థశాస్త్రం. 1. 5. 9., శుక్రనీతిసారం, కామందకం.

వలపక్షంతో తీర్పు చెపితే ప్రజలు దగ్గిర చేరరు. డేగని చూసిన పిట్టల మందలా చెదిరిపోతారు.

తల నరకడమూ, ధనం లాక్కోడమూ, ఖైదులో పెట్టడమూ, కట్టటమూ, కొట్టడమూ, బాధపెట్టడమూ — ఇలా ఎన్నోరకాల శిక్షలున్నాయి.

తనదగ్గిరికి వచ్చి ముఁగమాటం లేకండా మాటాడిన దూత మాటలు విని రాజు కోపం తెచ్చుకో కూడదు. దూతని చంపితే నరకం తప్పదంటారు పెద్దలు.♦ కులమూ, శీలమూ, హితమైన మాటలు చెప్పే నేర్పూ, కార్యంసాధించే మాటపొందికా, గౌరవబుద్ధీ, జ్ఞాపకశక్తీ, దక్షతా — ఈ ఏడూ దూతకి వుండవలసిన గొప్ప గుణాలు.

సేన వ్యూహంపన్నే నేర్పూ, ఎన్నో యంత్రాలు అమర్చగల తెలివీ, ఆయుధాలు కల్పించే శక్తీ, యుద్ధాల్లో చాకచక్యమూ, స్వభావసిద్ధంగా వుండాలి సేనాపతికి.

కన్నకొడుకున్నయినా సరే, గుడ్డిగా నమ్మకూడదు రాజు. నమ్మితే సంపద పోతుంది. చాతుర్యంతో అందరినీ నమ్మినట్టే నటించాలికాని నమ్మకూడదు. అదే ఉత్తమమైన పద్ధతి.

ధర్మరాజు - పట్టణం ఎలా వుంచుకోవాలి?

భీష్ముడు - దిట్టమైన కోట ఏర్పరచుకోవాలి ముందు. చుట్టూ వెడల్పూ, లోతూ అయిన అగడ్త వుంచాలి. తగిన వాకిళ్ళు వుంచాలి. కట్టుదిట్టమైన కాపలా పెట్టాలి. అందమైన ఇళ్ళతోనూ, తీర్చిన వీధులతోనూ చక్కగా కట్టాలి పట్నం. మంచి తగుమనుషులతో కలకల్లాడా లది. ధాన్యాలూ, నెయ్యీ మొదలైన రసద్రవ్యాలూ, ర

♦ మా నా. రామాయణం. సుందరకాండ.

రకాల యంత్రాలూ, ఎన్నో విధాలఆయుధాలూ సమృద్ధిగా పట్నంలో దొరకాలి. పేరెక్కినపండితులూ, యోధులూ, సానులూ, దూతలూ మొదలైన సేవకులూ చాలినంతమంది వుండాలి. ఇలా నిత్యకల్యాణం పచ్చతోరణంగా కన్నులపండువుగా వుండాలి పట్టణం.

అలాటి పట్టణంలో అన్నిరకాల రత్నాలూ, బంగారమూ, మొదలైన పదార్థాలనీ, బంధువుల్నీ భద్రంగా రక్షించేవాడు రాజు. ఇదీ రాజ్యం పరిపాలించే తీరు.

దేశంలో పేరున్న ప్రతీవూళ్ళోనూ ఉపాయం తెలిసిన నమ్మకస్థుల్ని, అధికారమిచ్చి నియమించాలి రాజు. వాళ్ళు కుల ధర్మాలు కాపాడాలి.

దొంగలు దోచుకోకండా, హంతకులు హత్యలుచెయ్యకండా, జారులు చెలరేగకండా ప్రజని రక్షించాలి రాజు. ఎంత నేర్పరితన మైనా ప్రజారక్షణకోసమే వినియోగించాలి.

వర్తకమూ, వ్యవసాయమూ, సాగుబడీ, పశుసంరక్షణా — ఇవన్నీ వొక్కసాటివే. అంచేత పశువులున్న కాపుల్ని కన్నకొడుకుల్లాగ కనిపెట్టాలి రాజు.

పన్నులు అధికంగా పుచ్చుకోడమంటే దూడకి లేకండా పాలు పితకడమన్నమాట. అంచేత ప్రజదగ్గిర తగినట్టు పన్ను పుచ్చుకోడం దూడనిపెంచినట్టన్నమాట.

## ధనం ఎలా రాబట్టాలి

ధర్మరాజు — రాజు ధనం ఎలా రాబట్టాలి?

భీష్ముడు — ధనం రాబట్టడానికి దేశంలో ఎన్నో ప్రదేశాలున్నాయి. అందులోకల్లా కర్షకులూ, వర్తకులూ, గోరక్షకులూ

ముఖ్యాలు. ధనమూ, ధాన్యమూ ఆదాయంవచ్చే స్థలాలు. రవంతా దెబ్బతినకండా ధనం రాబట్టుకోవాలి రాజు. పులి తనకూనలు తిన్నట్టు చేస్తే అంతతోనే ఆగిపోతుంది రాబడి. మళ్ళీ ఎలావస్తుంది? అంచేత జలగ రక్తం పీల్చినట్టు పన్నులు పిండుకోవాలి. ప్రజకి అభ్యుదయం కలిగించి, ఏటేటా పన్నులు హెచ్చుచేయువచ్చు. ఉపాయంతో పెంచుకుంటే ఎంతైనా పెరుగుతుంది ధనం.

దండించవలసినవాళ్ళని సమయంలో దండించి, వాళ్ళ సంపద తన ఖజానాకొట్టులో చేర్చుకుంటాడు రాజు. అప్పటికి లోకమూ సంతోషిస్తుంది. అయితే, ధనవంతుల ధనమూ-సి కన్నుకుట్టి తప్పులు వెదికి. వాళ్ళది కాస్తా కాజెయ్యకూడదు. అంతమందినీ దయ చూడాలి రాజు.

ఇటు ఉద్యోగుల్ని మన్నిస్తూ సంతోషపరచాలి. అటు కాపులు భయపడకండా చెయ్యాలి. ఇలా రాబట్టిన ధనంవల్ల ఇహమూ. పరమూ కూడా సిద్ధిస్తుంది. ధనం రాబట్టడానికి ఉపాయాలన్నీ ధర్మంతప్పకండా చేస్తేనే రాజుకిక్షేమం. మోసం ఎన్నడూ కూడదు.

తగనిపనికి ఖారపోస్తేమాత్రం ధనం సంపాదించి ప్రయోజనం లేదు. సద్వినియోగం చేస్తే అది సంపదకి రక్షణే అవుతుంది.

ఇదిగో ఇలా అయితే కోశమూ, స్నేహితులూ, రాష్ట్రమూ అభివృద్ధి పొందుతాయి. నువ్వు ఇలాగే చేసి, ప్రజని రక్షించు. యుద్ధాలకి విసుక్కోక, శత్రువుల్ని సంహరించు. యజ్ఞాలు చెయ్యి. కూటికిపేదలైన బ్రాహ్మలూ మొదలైన సాధువుల్ని కనిపెట్టు. వాళ్ళ కుటుంబాలు పోషించు. మాంధాతకి అంగిరసుడైన ఉతథ్యుడు చెప్పినహితవాక్యాలువిను: 'ప్రాణుల అభివృద్ధులూ, ధనలాభాలూ ధర్మంవల్లే కలుగుతాయి. రాజన్నవాడు ధర్మం రక్షించడానికే

పుట్టాడు. అంచేత అతడు కామక్రోధాలు లేనివాడై ధర్మపరుడు కావాలి. ధర్మం బ్రాహ్మల్లో పుట్టింది. కనక రాజు అసూయ వొదిలిపెట్టి, బ్రాహ్మల్ని గౌరవించాలి. వెనకటికి బలిచక్రవర్తి దేవతల్ని అడలగొట్టాడు. బ్రాహ్మల్ని అసహ్యించుకున్నాడు. అంచేత సిరీ, సంపదా లేకండా అయిపోయాడు. తరవాత తెలివి తెచ్చుకున్నాడు; భక్తుడయాడు. సౌఖ్యమూ, వైభవమూ అనుభవించాడు. ధర్మంవల్ల ధనమూ, ధనంవల్ల గర్వమూ పుడుతున్నాయి. ధర్మమూ, ధనమూ సరిగా వినియోగించకండా గర్వానికి లొంగిపోతే దేవతలూ, మునులూ కూడా చెడిపోతారు ♦ కనక గర్వం గెలవాలి రాజు. తప్పదు.

రాజు పరస్త్రీలతో పోతే రాజ్యంలో వర్షాలుండవు. ప్రజలు కష్టాలు పాలవుతారు. ఎన్నో రోగాలు పుడతాయి. బలమూ, కాంతీ మాసిపోతాయి. పగవాళ్ళు బాధపెడతారు. బంధువులు బాధల పాలవుతారు. అంచేత రాజన్నవాడు తగనిపనులు ఏవీ చెయ్యకూడదు. ధర్మంగా నడుచుకోవాలి. అప్పుడే సంతానమూ, చుట్టాలూ, పజా, తానూ, శుభంగా సుఖపడతారు.'

ఉతథ్యుడు ఇలా చెప్పడంతోనే తెలుసుకుని ధర్మంగా నడుచుకున్నాడు. మాంధాత. ఎంతో ఐశ్వర్యం అనుభవించాడు. నువ్వూ అలాగే నడుచుకో.

ధర్మరాజు – ధర్మంగా నడుచుకోడం ఎలాగ ?

భీష్ముడు – కోసలదేశం రాజు వసుమనస్సుడు వామదేవమహాముని నువ్వు అడిగినట్టే అడిగాడు. అతడు ఏం చెప్పాడో విను. 'ధనంకంటె ధర్మం గొప్పది. ధర్మం సిద్ధిస్తే అన్నీ సిద్ధిస్తాయి. కీర్తీ, ముక్తీ, కూడా లభిస్తాయి. ధనం కోసం ధర్మం ఉపేక్షిస్తే

♦ చూ. కామందకం. 1. 49.

ఆధనం చెరుతుంది. అపకీర్తీ, దుర్గతికూడా వస్తుంది. ధర్మం తప్పకుండా, సన్మార్గంలో ధనం సంపాదిస్తేనే ఇహపరాలు సిద్ధిస్తాయి. వేదాలూ ఇదే చెపుతున్నాయి. ధర్మంతో నడుచుకుంటూ, ఇంకా ధర్మవృద్ధి కావాలని ధర్మతృష్ణతోనే వుంటాడు బుద్ధిమంతుడు.' ఇలా చెప్పి, రాజ్యతంత్రాలకల్లా ఆధారభూతమైన సామ దాన భేద దండోపాయాలు ప్రయోగించే విధానమూ వివరించాడు వామదేవుడు.

'మూలబలం తృప్తిగా, లాలనగా వున్నప్పుడే దుర్బలరాజ్యం చూసి దండోపాయం ప్రయోగించాలి రాజు. అప్పుడే అది ఫలిస్తుంది. దండోపాయం, అంటే యుద్ధం సాహసంతోకూడిన పని. ఆవిధంగా శత్రువుదగ్గిర ధనం తెచ్చుకోడం అంత క్షేమం కాదు. గర్వమూ, కోపమూ లేని రాజుకి శత్రువులు వుండరు. కనక తినతో సమానుడైన రాజుదగ్గిర సామోపాయమే మంచిది.

తన భటులు అనుకూలంగా లేనప్పుడు, శత్రువు ఎంత తక్కువవాడైనా సరే, అతణ్ణి దానంతో శాంతపరచుకోవాలి. తనకంటే శత్రువు అధికుడైతే ఇక చెప్పేదేముంది? ఎప్పుడూ ధనమిస్తూ సంతోష పెట్టడమే మంచిది.

ఈమూడు ఉపాయాలకీ లొంగని శత్రువుదగ్గిర భేదోపాయమే మందు అతడి రాజ్యంలో లోపాలు కనిపెట్టగలిగినవాళ్ళని పంపి, ఇతరులతో అతడికి విరోధం కల్పించాలి.

ఈనాలుగు ఉపాయాలే కాదు, అయిదో ఉపాయం కూడా వుంది. దానిపేరు ఉపేక్ష. అది ఎలా ప్రయోగించాలో విను. శత్రువులు తమలో తాము యుద్ధంచేస్తూవుంటే, తాను ఎటూచేరక ఉపేక్ష వహించాలి పిశాచులూ, రాక్షసులూ యుద్ధంచూస్తున్నట్టు చూస్తూ వూరుకోవాలి. ముల్లుతో ముల్లు తీసినట్టు అవుతుందది. చెడ్డవాళ్ళయిన మంత్రుల పొగరుకూడా ఇలాగే నాశనంచెయ్యాలి రాజు.'

వామదేవుడి హితవు విన్నాడు వసుమనస్సుడు. దివ్యంగా రాజ్యంచేశాడు. నువ్వూ అలాగే నడుచుకో. సుఖపడు.

## యుద్ధంలో ధర్మం

ధర్మరాజు- యుద్ధంలో శత్రువుల్ని జయించినప్పుడు ఎలా నడుచుకోడం ధర్మం ?

భీష్ముడు- పగవాడు సేనలతో వస్తే తానూ సేనలు వేసుకు పోరాడాలి. లేదా ఒంటరిగా యుద్ధానికివస్తే, తానూ ఒంటరిగా యుద్ధంచెయ్యాలి. శత్రువు మాయచేస్తాడూ, తానుకూడా మాయ చేసి గెలవవచ్చు.

పారిపోతున్న శత్రువుని చంపకూడదు. ప్రమాదంలో పడి పోయినా, అతడి ఆయుధం విరిగిపోయినా, శరణన్నా, చేతులు జోడించినా, గుర్రాలు కూలిపోయినా, ఇంకొకడితో యుద్ధంచేస్తున్నా కూడా ఎలాటి పగవాణ్ణీ చంపకూడదు. అధర్మంగా చంపడంకంటే, ధర్మయుద్ధంలో చచ్చిపోడం మేలు. రాజు పానుపుమీద చావడం తగదు. అంచేత యుద్ధంలో వెన్ను చూపకూడదు.

ఎముకమొనల ఆయుధాలూ, విషంపూసిన శస్త్రాలూ ఎంతటి పగవాడిమీదా ప్రయోగించకూడదు. అలా ప్రయోగించిన రాజు నరకంలో పడతాడు.

యుద్ధంలో తనకి సాయంవచ్చినవాడు దెబ్బతిన్నప్పుడు అతడికి అవసరమైన ఉపచారం చెయ్యకండా ఊరుకున్న రాజుకి పాపం చుట్టుకుంటుంది. ఆపాపం అంతా ఇంతా కాదు.

శత్రువుమీదికి దాడివెళ్ళి, అతడిపట్టణం ముట్టడించినప్పుడు, అక్కడి ప్రజని బాధపెట్టడం అధర్మం. అయితే అలా చెయ్యడం

తప్పనిసరి అయినప్పుడు బ్రాహ్మణకొంపలూ, దేవాలయాలూ కొల్లగొట్టకూడదు.

ధర్మరాజు - రాజధర్మంకంటే పాపకర్మ మరొకటిలేనట్టుంది. రాజుకి అధోగతి తప్పదు.

భీష్ముడు- కాదు. శరణుచొచ్చినవాణ్ణి కాపాడీ, పగవాళ్ళచేత దెబ్బతిన్నవాణ్ణిరక్షించీ, బ్రాహ్మల్ని పోషించీ, యజ్ఞాలుచేసీ పాపాలు పోగొట్టుకుంటాడు రాజు.

ధర్మరాజు- యుద్ధంలో శౌర్యం చూపించి, శరీరం విడిచిన వాళ్ళకి ఎలాంటి పుణ్యగతి కలుగుతుంది ?

## సుదేవుడికథ

భీష్ముడు - దీనికి ఇంద్రుడికీ అంబరీషుడికీ జరిగిన సంవాదం వినిపిస్తాను. నువ్వు అడిగినదానికి సమాధానం అవుతుందది. ఎన్నో యజ్ఞాలుచేశాడు అంబరీషుడు. తుదకి దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళాడు. అక్కడ స్వర్గంలో దివ్యవిమానంమీద హాయిగా తిరుగుతూన్న తన భటుణ్ణి సుదేవుణ్ణి చూశాడు. 'వీడు నా సేవకుడు. యజ్ఞాలూ అవీ చేసి ఎరగడు. అయినా నాకంటే అధికంగావున్నాడిక్కడ. ఏమిటి కారణం ? ' అని దేవేంద్రుణ్ణి అడిగాడు. 'ఈమహాత్ముడి సంగతి చిత్రమైంది' అంటూ ఎత్తుకున్నాడు దేవేంద్రుడు- 'వినాలంటే చెప్తాను విను. శతశృంగుడని వొక రాక్షసుడు. అతడికి సదముడూ, విదముడూ, దముడూ అని ముగ్గురు కుమాళ్ళు. ఆయుధాలు పట్టుకుని, బ్రహ్మాండమైన సేనలు వేసుకుని వాళ్ళు భూమంతా గడగడలాడించి నీమీదికి యుద్ధానికి వచ్చారు. ముట్టడివేసి, ప్రజల్ని నానాబాధలూ పెట్టారు. ధనం దోచుకున్నారు. అప్పుడు మండిపడుతూ నువ్వు సైన్యాలిచ్చి, ఈ సుదేవుణ్ణి వాళ్ళమీదికి పంపావు. 'నీరణప్రావీణ్యం చూపించి రాక్షసుల్ని చంపెయ్యాలి. ప్రజని సంతోషపెట్టాలి. గెలిచివచ్చావా

వచ్చినట్టు. గెలవకండా వచ్చావో చచ్చావన్నమాట. సందేహంలేదు' అన్నాడు. 'సరే' అన్నాడితడు. యుద్ధానికి బయలుదేరాడు. వేగుల వాళ్ళవల్ల రాక్షసుల సైన్యమూ, వాళ్ళ ఆటోపమూ తెలుసుకున్నాడు. ఆలోచించాడు. వీళ్ళమీదికి వెళితే సైన్యం చంపుకోడమన్నమాట. దేశం శత్రువుపాలు కానివ్వను. శివుణ్ణి సేవిస్తాను. శిరసుకోసి అతడికి సమర్పిస్తాను అని నిశ్చయించుకున్నాడు. యుద్ధం చెయ్యకండా సైన్యం వెనక్కి పంపేశాడు. దృఢమైన ఉత్సాహంతో స్మశానంలోకి వెళ్ళాడు. శివుణ్ణి మనసులో స్మరించి కంఠంమీద కత్తిపెట్టాడు. శివుడు ప్రత్యక్ష మయాడు. చప్పున కత్తి పట్టుకున్నాడు. 'ఇలా తెగించవచ్చా? ఎందుకని? దేనికోసం ఈపని?' అని అడిగాడు. సాగిలపడ్డాడితడు. శిరసు కింద మోపి నమస్కరించాడు. శివుడి మనసు కరిగినట్టు జరిగిందంతా విన్నవించాడు. కనికరించాడు శివుడు. ఒక దివ్యమైన రథమిచ్చాడు. ధనుస్సూ, బాణాలూ ఇచ్చాడు. 'యుద్ధంలో నీ పరాక్రమం దేవతలూ, రాక్షసులూ కూడా సహించలేరు. వెళ్ళు, పగవాళ్ళపని పట్టించు. అయితే భూమిమీద అడుగు పెట్టకండా మాత్రం పోనాకు' అని అంతర్ధానమయిపోయాడు.

'సంతోషంతో రథమెక్కాడితడు. రాక్షససేన లక్ష్యపెట్టకండా పీనుగుపెంట చేశాడు. కనపడ్డవాణ్ణల్లా నరికిపారేశాడు. సదముడూ, దముడూ కూలిపోయారు. చూసి, ఉగ్రుడైపోయాడు విదముడు. కవ్వించి యుద్ధానికి పిలిచాడు. కోపంతో వొళ్ళుమరిచి పోయాడితడు. రథందిగి పిడుగులా పరిగెత్తాడు.

'బ్రహ్మసంకల్పమది. భూమ్మీద అడుగుపెట్టి, విదముడిమీద పడ్డాడు. చిత్రంగా కత్తి ఝుళిపించి, అతడిమీద వేశాడు. విదముడూ కత్తితో ఇతణ్ణి కొట్టాడు. ఇద్దరూ వొకసారే ఠారుమని పోయారు. చావగా మిగిలిన రాక్షససేన పలాయనం చిత్తగించింది.

'శత్రువుల్ని తుదముట్టా ఇలా ఇతడు చంపెయ్యడంవల్ల నీ రాజ్యం పూజ్యమైంది. ప్రజలూ సంతోషించారు. ఇతడు సుకృతవంతుడయ్యాడు. ఈపదవికి ఇక్కడ అర్హుడయ్యాడు. ఎన్ని యజ్ఞాలైనా రణయజ్ఞానికి సాటి రావు.

'విన్నావుకదూ, వీరుల తలకాయలే వేదిక. కత్తులూ, బాణాలూ సమిధలూ, స్రుక్స్రువాలు. రక్తమే నెయ్యి, మాంసం పురోడాశం. వీరవ్రతదీక్ష పూనినవాడు రణయజ్ఞంచేసి, రక్తప్రవాహంగానూ, మెదడు బురదగానూ, జుత్తు నాచుగానూ, పేగులు నురుగుగానూ, రణదుందుభులు కప్పలరొదగానూ, కత్తులు చేపలుగానూ, ఏనుగుకళేబరాలు ఇసకగానూ, యుద్ధమనే పుణ్యనదిలో అవబృథస్నానంచేసినవాడు నాలోకంలో నివసిస్తాడు. కీర్తిమంతుడై చిరకాలం మహాపదవిలో వుంటాడు. పుణ్యాత్ముడు కావడానికి యుద్ధంలో ప్రాణంవిడిచిపెట్టనక్కరలేదు. తెగించి వెనకాడకండా యుద్ధంచేస్తే చాలు. ఇలా యుద్ధంచేసిన ప్రభావంవల్ల నేనున్నూ బలవంతులైన రాక్షసుల్ని చంపాను..

యుద్ధంలో వెనకాడని శూరుల పుణ్యం ఇంద్రుడివల్ల తెలుసుకొని అంబరీషుడు మెచ్చుకున్నాడు.

పూర్వం జనకుడికీ, ప్రతర్దనుడికీ యుద్ధంజరిగింది. అప్పుడు తన మాహాత్మ్యంతో స్వర్గమూ, నరకమూ చూపించాడు జనకుడు. 'ఇదిగో ఇది స్వర్గం అన్నిభోగాలూ వున్నాయిక్కడ. అందమైన ఆడాళ్ళు కోకొల్లలు. మడమతిప్పకండా యుద్ధంచేసిన వాళ్ళచోటు ఇది. అది నరకం. యుద్ధంలో పిరికిపందల చోటు. అన్నాడు. చూశారు అతడి సైనికులు. సాటిలేని సాహసంతో వురికారు. పగవాళ్ళని చంపారు.

యుద్ధంలో సాహసమే లక్ష్మి. సాహసమే స్వర్గం. కనక శూరుడు బహుపుణ్యవంతుడు.

---

# శాంతిపర్వం



## మూడో ఆశ్వాసం

### యుద్ధం మెలుకువలు

ధర్మరాజు — ఏ కాలంలో యుద్ధానికి బయలుదేరాలి? దానికి తగిన ఉపాయాలేమిటి?

భీష్ముడు — వానాకాలమూ, చలికాలమూ యుద్ధానికి బైలుదేరకూడదు. ఎండలు ముదరకండా, పంటలు కోతకివచ్చినప్పుడు దండయాత్ర మొదలెట్టాలి. గడ్డీ, కర్రలూ, నీళ్ళూ బాగా దొరికే దారిని వెళ్ళాలి. జెండాలూ, కవచాలూ, కత్తులూ, డాళ్ళూ, ధనుస్సులూ మొదలైన ఆయుధాలూ, రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ అమర్చుకోవాలి. అపురూపంగా వుండాలి దాడి. శత్రువు జజ్జరిల్లి పోయేట్టువుండాలి. శంఖాలూ, బాకాలూ, తప్పెటలూ, ఢంకాలూ మొదలైన రణవాద్యాలు బాగా మోగుతూ వుండాలి. దండువిడిసే చోటు సమతలంగా చదరంగా వుండడం మంచిది.

వేగులవాళ్ళని పంపి శత్రువుల రహస్యాలు కనుక్కుంటూ వుండాలి. శత్రువులు యుద్ధానికి వస్తూవుంటే, వాళ్ళు దండువిడిసిన మజిలీలో కఠినమైన చోటూ, నీళ్ళూ అవీ లేక వాళ్ళు దాహంతో అలిసివున్న చోటూ గమనించి ఆక్రమించాలి.

శత్రువులు నిద్రపోతున్నప్పుడూ, నీళ్ళు తాగుతున్నప్పుడూ, అన్నాలు తింటున్నప్పుడూ అలిసి వెనక్కి తగ్గినప్పుడూ, చెదిరి వున్నప్పుడూ చుట్టుముట్టాలి.

చెట్లూ, రాళ్ళూ, మొరకా పల్లమూ లేని నేల కాల్బలం నేల. నీరూ, బురదా లేని విశాలమైన నేల గుర్రాల నేల. చక్రాలకమ్ములు కుంగిపోకండా, రొంపీ గింపీ లేని నేల రథాల నేల. అక్కడక్కడ మాకులూ, మడుగులూ వున్న నేల ఏనుగుల నేల.

తనకి ఏసేన అధికం వుంటే ఆనేల తనకి అనుకూలమైన యుద్ధభూమి అని ఎంచుకోవాలి. ఎండకీ, చలిగాలికీ వెనకచేసి సేన నడిపించుకు వెళితే జయం కలుగుతుంది.

డాళ్ళుపట్టుకున్న సేన ముందు వుండాలి. దానివెనక విళ్ళమ్ముల సేనా, గుర్రాలసేనా, ఏనుగులదండూ, రథాల రాణువా ఇలా వరసగా నిలవాలి. అంతటా ఆరితేరిన యోధుల్ని నిలబెట్టాలి. అలా అయితేనే బలంగా వుంటుంద సైన్యం.

సైన్యం కలబడినప్పుడు 'పోయారు, పోయారు' అంటూఉత్సాహంతో బంట్లు బొబ్బలూ, పొలికేకలూ వేస్తూ జంఝ్యమని వురికేనట్టు వుషారు చెయ్యాలి రాజు.

ధర్మరాజు — బంట్లు ఎలాంటివాళ్ళయి వుండాలి ?

## బంట్లు

భీష్ముడు—ఏనుగు మరోఏనుగుని చూసినప్పుడు ఎలా వుబ్బుతుంది, అలాగ శత్రువుని చూసి ఉప్పొంగాలి బంటు. పెద్దపులిలాగ సింహంలాగ ఉగ్రత్వమూ, గట్టి మెళుకువా కలిగివుండాలి. అలాటి యోధులే అవసరం యుద్ధానికి.

ఏదేశం భటులు ఎలా వుంటారో విను. గాంధారం, సింధు, సౌవీరదేశాల్లో కత్తులూ, ఈటెలూ బాగా ప్రయోగించడం నేర్చుకుంటారు. బలశౌర్యాలతో అన్ని ఆయుధాలూ ఉపయోగించగలరు. ఉశీనర దేశం భటులు అన్ని ఆయుధాల్లోనూ ఆరతేరినవాళ్ళు; మంచి

సత్త్వవంతులు. తూర్పుదేశం భటులు ఏనుగులెక్కి యుద్ధంచేస్తారు; కపటయుద్ధంలోనూ ఘటికులు వాళ్ళు. యవనులూ, కాంభోజులూ మథుర చుట్టుపట్ల దేశాలవాళ్ళూ గుర్రాలెక్కి యుద్ధంచేస్తారు. ఘూర్జరులు కత్తీ, డాలూ పట్టుకుని పోరాడడంలో సమర్థులు. మాళవులు రథాలూ మొదలైన చతురంగబలాలతో మంచి యుద్ధంచేస్తారు. ఒకొక్కడూ ఎందరెందరినో ఎదిరిస్తారు.

ఇంకా ఎన్నో దేశాల భటులు ఎన్నోవిధాల యుద్ధంచేస్తారు. కొంతకొంతమందినే చెప్పాను. వాళ్ళందరినీ తెలుసుకుని, వాళ్ళ సామర్థ్యంచూపి యుద్ధం వాళ్ళచేత చేయించి, గెలుపు సాధించాలి.

## శకునాలూ — అపశకునాలూ

ధర్మరాజు — గెలిచే సేనలో కనిపించే లక్షణా లేమిటి ?

భీష్ముడు - గెలిచే సేనలో సైనికుల మనస్సు ఉత్సాహంగా వుంటుంది. గుర్రాల సకిలింపు కమ్మగా వినిపిస్తుంది. ఏనుగులు హుషారీగా వుంటాయి. సైన్యంలో మంచిమాటలే పుడతాయి. మృగాలు ప్రదక్షిణంగా తిరుగుతాయి. పక్షులుమీదికెగురుతాయి. వెనకనించి పిల్లగాలి హాయిగా వీస్తుంది. బయలుదేరినప్పుడు అగ్నులు ప్రకాశవంతంగా వెలుగుతాయి. మంటలు వలపలివేపు సుళ్లు తిరుగుతాయి. రణవాద్యాలు ఇంపుగా గంభీరంగా వినిపిస్తాయి.

అయితే ఒక్కమాట, తనమీదికివచ్చిన శత్రువునిమాత్రం చంపడం న్యాయం. అంతేకాని తానై కయ్యానికి కాలుదువ్వడం ఎలాటిరాజుకైనా పాపమే అవుతుంది. చెరువుగట్టు తెగినా, మృగాలు భయంతో చెదిరి పరిగెత్తినా, ధైర్యం చెడి సైన్యాలు పారిపోయినా ఎంతబలవంతులైనా ఆగలేరు. తక్కువమంది అయినా తెగించి, మీద పడి, పౌరుషంతో పోరాడితే ఎంతసేనైనా కేమాత్రం ఏం లాభం ?

తోకముడిచేస్తుంది. బలవంతుడైనా యుద్ధంలో గెలవడం శక్యం కాదు అంచేత ఓర్పే మంచిది. అలా అని మితిమీరిన ఓర్పు మంచిది కాదు; దైన్యం తెచ్చి పెడుతుంది. శత్రువు పొగరెక్కినప్పుడు యుద్ధం తప్పనిసరి. అయితే గెలిచాక, మిగిలిన శత్రుసేనమీద దయా, ఓర్పూ చూపించడం మంచిది.

ధర్మరాజు – రాజు పగవాళ్ళని ఎలా చూడాలి?

భీష్ముడు – వెనక దేవేంద్రుడికి బృహస్పతి ఇదే చెప్పాడు. పగవాణ్ణి చంపడానికీ, చెరపడానికీ వేచివుండడం మంచిది. పొరు పాలు పలికీ, పుల్లవిరుపుమాటలాడీ, బొంకులాడీ శత్రువుని కలతపెట్టి రెచ్చగొడితే మాత్రం తన సంకల్పం నెరవేరదు. అరమరలేకండా వున్నట్టు కనపడాలి. తియ్యని మాటలాడుతూ వుండాలి. నమ్మినట్టే నటిస్తూ లోపల నమ్మకండా వుండాలి. శత్రువుమీద దండెత్తి వెళ్ళినప్పుడు, వాళ్ళవాళ్ళు వింటున్నట్టు తేనెలొలికిస్తూ ప్రియంగా మాట్లాడడం మంచిది. పెంపుడుపిట్టతో కూతపెట్టిస్తాడు వేటకాడు. ఆకూత వల్లే తనకి చిక్కిన జంతువుని పొదకి చంపుతాడు. మాటిమాటికీ పగవాణ్ణి పరాభవించడమూ, వూరికే విరోధం మనసులో పెట్టుకోడమూ మంచిది కాదు. సమయం వచ్చినప్పుడు సంధి చేసుకోడం కానీ, శత్రువు ఎలా అయినా తెగిపోతాడు అని రూఢీ, ద్దాక ఆ దేశం పాడు చెయ్యడం కానీ కూడదు. కాలం కలిసిరానప్పుడు మొక్కుకుని అయినా సరే, పగవాడితో స్నేహం చెయ్యాలి. అతడి స్వభావం తెలుసుకుని సమయం చిక్కినప్పుడు పూర్తిగా అతణ్ణి తుదముట్టించాలి. అంత మెత్తగా కాకుండా, అంత బిరుసుగా కాకుండా వ్యవహరిస్తూ, వొడ్డుకోసేసిన ఏరులాగ క్రమక్రమంగా శత్రువుని ఆక్రమించాలి.

హెచ్చుమందితో వొక్కసారికేసు పెట్టుకోకూడదు. ఓటుగా వున్న శత్రువుమీద కలబడాలి. తక్కినవాళ్ళతో చుట్టరికం కలుపుతూ వుండాలి.

ధర్మరాజు — సొంతపరివారం చేసిన తప్పువల్లో, లేదా ఇతర్ల వల్లో సంపద చెడి, ఆపదపాలైనప్పుడు, ఏంచేసి, దుఃఖం పోగొట్టు కోవాలి ?

భీష్ముడు — పూర్వం కోసలరాజు క్షేమదర్శి విదేహరాజుచేత రాజ్యం పోగొట్టుకున్నాడు. కాలకవృక్షీయమునిని ఆశ్రయించాడు. కాలకవృక్షీయుడు వెనక అతడికి మంత్రిగా వుండేవాడు. అప్పటికి అడివికిపోయి హాయిగా జీవిస్తున్నాడు. ఇప్పుడు నువ్వు అడిగిన ప్రశ్నే అతణ్ణి అడిగాడు క్షేమదర్శి. కాలకవృక్షీయుడు చెప్పినమాటలే చెపుతాను, విను.

‘ఐశ్వర్యవంతుడుగా వుండి, భోగాలనుభవించినప్పుడు, ఇదంతా అస్థిరం. ఇలాగే ఎప్పుడూ వుండదు. నేనూ స్థిరంకాదు’ అని అనుకోవాలి. ఇలా అనుకున్నవాడు ఏది ఎలా అయినా విచారించడు. వ్యతిరేకించినట్టే వుండి చక్కబడతాయి పనులు. బాగున్నట్టే వుండి చెడిపోతాయి. చక్కబడినప్పుడు సంతోషం కలుగుతుంది. చెడిపోయినప్పుడు విచారం కలుగుతుంది. అయితే, పండితుడుమాత్రం రెండూ వొక్కలాగే చూస్తాడు. తల్లిదండ్రులూ, స్నేహితులూ కాలంచేసినప్పుడు అడ్డుకోమని అందరికీ తెలిసిందే. వాళ్ళకంటే ధనంగొప్పదా? దుఃఖం వీటిని మళ్ళిస్తుందా? అంచేత గడిచిందానికి విచారించకూడదు రాబోయేదానికోసం నోరు తెరుచుకు కూచోకూడదు. దైన్యం పొందకండా ‘దైవం ఎలా నడిపితే అలా పోతాను’ అని అనుకోవాలి మనిషి. ఉపాయం తెలిసినవాళ్ళూ, బలవంతులూ లోకంలో ఎంతమందిలేరు! ఎవళ్ళకైనా సిరి శాశ్వతమా ? కనక ధీరుడైనవాడు

ఐశ్వర్యం పోయిందని దుఃఖపడకు. మనిషి అనుకోకుండానే సిరి పోతుంది. అలాగే దేవుడి దయ కలిగితే కోరకుండానే సంపద వచ్చి పడుతుంది. మనిషిని సిరి వొదిలేస్తుంది. మనిషీ సిరి వొదలేస్తాడు. ఇందులో వింతేమీ లేదు. పళ్ళూ దుంపలూ తిని, ముముక్షువుగా జీవించడం మేలు. కలగుండుపడినా పెద్దమడుగు తేరుకుంటుంది. అలాగే ఎంతేసి కష్టాలువచ్చినా ధీరుడైనవాడు తనంత తానే తేరుకుంటాడు.

ఇదీ! అణిగివుండవలిసిన పద్ధతి. ఇక ఇప్పుడు నువ్వు అనుసరించవలసిన నీతి వివరిస్తాను విను' అన్నాడు కాలకవృక్షీయుడు.

'అవును, మహాత్మా! నిన్ను ఆశ్రయించాను. నా కష్టాలు గట్టెక్కాలి. సెలవియ్యి' అన్నాడు క్షేమదర్శి.

'కోపం అణచుకోవాలి' అందుకున్నాడు కాలకవృక్షీయుడు – 'పేదరికం వోర్చుకోవాలి. శత్రువుదగ్గిర వొదిగి మసులుకోవాలి. మన్నె రాజుల రాజ్యాలుకొట్టి, మెల్లిమెల్లిగా సైన్యం కూర్చుకోవాలి. అప్పుడూ శత్రువుమీద తిరగబడాలి. తనకంటే బలమైనవాణ్ణి పూజించి, అతడిసేన సాయంపుచ్చుకుని శత్రువుమీద దెబ్బతియ్యాలి. విషం ప్రయోగించీ, మంత్రప్రయోగంచేసీ, మందూమాకూ పెట్టీ వొదలకండా పగవాణ్ణి హతమార్చాలి. సమయం కనిపెట్టి భేదం పుట్టించో, ఆడాళ్ళని పంపి వాళ్ళమాయల్లో పడదోసో, ఇంక ఎన్నెన్నో ఉపాయాలు చేసో శత్రువుని సాధించాలి. సాహసం మాత్రం వొదల కూడదు' అన్నాడు.

అయితే 'అధర్మంతో కూడిన ఉపాయాలుమాత్రం అనుసరించలేను' అన్నాడు క్షేమదర్శి. అప్పుడు అతడి శత్రువైన విదేహరాజుని పిలిపించాడు కాలకవృక్షీయుడు. ఏకాంతంగా క్షేమదర్శివిష

యం వివరించాడు. 'ఇతడి రాజ్యం లాక్కున్నావు నువ్వు. ఈ రాజు మహోలా పని చెయ్యడం మంచిది కాదు. కనక సంధి చేసుకో' అని నేర్పుతో బోధించాడు; ఒప్పించాడు. ఇద్దరికీ సంధి కుదిర్చాడు. స్నేహం కలిపి పంపాడు.

విదేహరాజు క్షేమదర్శిని తీసుకువెళ్ళి తన కూతురునిచ్చి పెళ్ళి చేశాడు. ఏనుగులూ, గుర్రాలూ, ఎన్నో పదార్థాలూ అరణమిచ్చాడు. కోసల దేశం సాగనంపాడు. కనక రాజులకి జయాపజయాలు అనుభవించవలిసినవే. జయించినప్పుడు సంతోషమూ, అపజయం కలిగినప్పుడు దుఃఖమూ మాత్రం కూడదు.

ధర్మరాజు— సంఘాలుగా వున్న పరిజనుల్ని ఎలా ఏలుకోవాలి?

భీష్ముడు—ధనం గడించేవాళ్ళూ, కార్యనైపుణ్యం కలవాళ్ళూ, ఆయుధాలతో బతికేవాళ్ళూ – ఇలాటి వాళ్ళే సంఘంగా వుంటారు. రాజు వాళ్ళతో కలిసి తిరిగి వాడుకతో వాళ్ళ సంగతి కనిపెడుతూ, వాళ్ళకి కావలిసిన మేళ్లు చేస్తూ వుండాలి. సంఘంగా వున్న వాళ్ళ కులం వొకటే అయినా, వొకనీతి నియమమూ వుండదు వాళ్ళకి. బుద్ధీ, శౌర్యమూ, గొప్పతనమూ లెక్కచెయ్యరు వాళ్లు. ఎలాటివాళ్ళతో అయినా కయ్యమాడతారు. అంచేత లోపల విరోధం కనిపెట్టి, శత్రువులు వీళ్ళలో కొందరిని చేరదీస్తారు. అది రాజ్యానికి ముప్పు. కనక రాజు వాళ్ళందరినీ మంచిమాటలతోనూ, దానంతోనూ, గౌరవాదరాలతోనూ వాళ్ళని చెదిరిపోనివ్వకండా పిడికిళ్లో వుంచుకోవాలి. విడిపోకండా పనులు చేయించుకోవాలి. ఈ సంఘాలు పాడైతే రాజ్యం అందమే పాడైపోతుంది. ఏ కార్యానికైనా సరే. ఈ సంఘంగా వున్న జనం వొకటిగా వుంటేనే రాజుకి సంపద. అందుకనే ఈ తెగల వాళ్ళని పూనికతో కనిపెడుతూ వుండాలి.

ధర్మరాజు — ధర్మాలు బహుశాఖలుగా వుంటాయి. అన్నీ అనుసరించడం సాధ్యమా? కనక ఏదిచేస్తే పురుషుడు ఐహికమూ ఆముష్మికమూ సాధించి సుఖపడతాడు?

భీష్ముడు — తల్లీ, తండ్రీ, గురువూ — వీళ్ళు సేవించవలసినవాళ్ళు. ఎప్పుడూ భక్తితో వాళ్ళసేవచెయ్యాలి మనిషి. వాళ్ళు ఏది చెపితే అది చెయ్యడమే గొప్పధర్మం. ఈముగ్గురూ మూడు వేదాలు; మూడు అగ్నులు; మూడులోకాలు; ముగ్గురుదేవతలు ఈముగ్గురిలోనూ గౌరవంలో తల్లి అధికం. తల్లిని భక్తితో పూజించినవాణ్ణి ఇహలోకంలోనూ, పరలోకంలోనూ పూజిస్తారు. పితృభక్తి కలవాడూ అంతే. గురువుపాదాలు పూజించినవాడు అంతులేని ఆనందం అనుభవిస్తాడు.

ధర్మరాజు — లోకంలో సత్యమూ, అసత్యమూ రెండూ వున్నాయి. వాటి విషయంలో మనిషి ఎలా నడుచుకోవాలి?

## అబద్ధం నిజం, నిజం అబద్ధం

భీష్ముడు — అన్ని ధర్మాల్లోకీ సత్యమే గొప్పది. అలాగే పాపాలన్నిటిలోకి అసత్యం మహాపాపం. అయితే ఇందులోనూ విశేషముంది. ఒకళ్ళప్రాణమూ, ధనమూ అపహరించాలనుకునే పాపులతో నిజం చెప్పడం పాపం. అబద్ధమాడి వాళ్ళని హింసించడం ధర్మం. ఇంతెందుకూ ప్రాణులకి మేలుకలిగే అబద్ధాలన్నీ ధర్మాలే ప్రాణులకి బాధకలిగే నిజాలన్నీ అబద్ధాలే; అధర్మాలే; అయితే ప్రాణుల మంచి చెడ్డలు సూక్ష్మవివేకంతోకాని తెలియవు. కనక అవి చూసుకోవాలి.

ధర్మరాజు — ఎలాటివాళ్ళు పాపాలు తప్పించుకుంటారు?

భీష్ముడు — వర్ణాశ్రమాచారవంతులూ, విషయాసక్తులు కాని వాళ్ళూ, ప్రతీకారం చెయ్యగలిగివుండికూడా తిట్లుతిని ఊరుకునే వినయులూ ఉదారులూ, అతిథిపూజ చేసేవాళ్ళూ, అధ్యయనపరులూ, అగ్ని

మహోగ్రతపస్కులూ, యుద్ధంలో మడమతిప్పని సాహసవంతులూ, సత్యవాదులూ, సాధుజనపోషకులూ, దేవతలందరినీ సమంగా చూస్తూ మనసుకుగిరిని మూర్తిని భక్తితో కొలిచేవాళ్ళూ పాపాలు తప్పించుకుంటారు.

బాబూ! పురాణపురుషుడు, మనస్సుకిఅందనివాడు, చలనంలేనివాడు, శ్రీకృష్ణుడు ఉత్తమభక్తుల్ని కంటికిరెప్పలా కాపాడతాడోయి. ఈగోవిందుడు నీకు సఖుడు; బంధువు. నీకార్యాలన్నీ నెరవేరుస్తూ కాపాడుతున్నాడు. పాపం పేరుకైనా నిన్ను అంటుతుందా, చెప్పూ?

## పులీ నక్కా

ధర్మరాజు — సౌమ్యులు మూర్ఖుల్లా అవుపిస్తారు. మూర్ఖులు సౌమ్యుల్లా అవుపిస్తారు. తెలుసుకోలేం. వాళ్ళ నిజానిజాలు తెలుసుకోవాలంటే ఏమిటి సాధనం?

భీష్ముడు — దీనికి పులీ నక్కా సంవాదమని ఒక కథ వుంది. పురికి అని ఒక వూరు. పౌరికుడని ఆవూరి రాజు. క్రూరకార్యాలు చేయడంలో పేరెక్కాడతడు. అతడు చచ్చిపోయి నక్కఅయి పుట్టాడు. వెనకజన్మజ్ఞాపకంవుండేది ఆనక్కకి. అంచేత అది వ్రతనిష్ఠతో వుండేది మాంసం తినేది కాదు. హింసచేసేది కాదు. అడివిలో రాలిన పళ్ళూ ఆకులూ మాత్రం తింటూ తిరిగేది. తోడి నక్కలు అది చూసి 'ఇదేక్కడి వ్రతం! మేం మాంసం తెచ్చియిస్తాం. తిను. హాయిగావుండు' అని ప్రార్థించాయి. అయినా ఆజోలికి పోలేదది. దృఢనిశ్చయంతోనే వుండేది.

ఈసంగతి క్రమంగా పెద్దపులికి తెలిసింది. పులివచ్చి నక్కని చూసింది. 'నువ్వు సౌమ్యుడివని తెలుసుకున్నాను. పుణ్యాత్ముడా!

నాదగ్గిర వుండు. కాగా సుఖపడు. క్షేమంగా వుంటుంది నన్ను లోకం క్రూరుడంటోంది. నీశిక్షణతో అది నివారణ. నాతో చుట్టరికం చెయ్యి' అంది

'మహాత్మా!' పులిమాటమీద అంది నక్క — 'ఆశ్రయించ దగినవాడివే నువ్వు, సందేహం లేదు. కాని, నా మనస్సు భోగాల మీద లేదు. అందుకని నీమాటలు నాకు నచ్చడంలేదు. అది అలా వుండగా పోనీ భోగాలు మానేసి, నీకు మంచీచెడ్డా ఉపదేశిస్తూ స్నేహంగా వుండకూడదా అంటే, అదికూడా కూడనిపనే. ఏమంటే నీ మూలభృత్యులు అసూయపడి వికటిస్తారు. దానితో విరోధం పుడుతుంది. అయితే నువ్వు వాళ్ళమాటలు వినననీ, నామాట వింటాననీ శపథంచేసి నన్ను మన్నిస్తానంటే నీదగ్గిర వుంటాను.'

అంగీకరించింది పులి. సంతోషంగా శపథంచేసింది. తృప్తి పడింది నక్క. పులికి బుద్ధులు చెపుతూ, సంతోషపెడుతూ దాని ఇంట్లో వుంటూవచ్చింది. కొంతకాలమయేసరికి, పులి మన్నించడమూ, నక్క దాని మంచీచెడ్డా విచారిస్తూ మంత్రిత్వం చెయ్యడమూ చూసి పులి ముఖ్యసేవకుల కన్ను కుట్టింది. తమలో తాము ఆలోచించాయి. ఒకనాడు పులితినే మాంసం పొంచుచూసి అపహరించాయి. నక్కవున్న కొండలో వోకమూల దాచేశాయి.

పులిఆహారం తానే జాగ్రత్త చేసేది నక్క. తీరావచ్చి చూస్తే సమయానికి మాంసం కనపడలేదు. ఎవరో దొంగిలించుకు పోయారని తెలుసుకుంది. పులితో చెప్పింది. పులి దొంగతనం విచారించింది. అప్పుడు సేవకులు కుట్రపన్ని పులితో కలిసి తాముకూడా వెదుకుతున్నట్టు నటించి, నక్కకొండలో మాంసం పట్టియిచ్చాయి. దాంతో నక్కమీద మనసువిరిగిపోయింది పులికి. సేవకులు అది పసికట్టాయి.

'నక్కకి ప్రశమేమిటి ప్రభూ? నీ మాంసం చపాయించడానికే జంకనప్పుడు ఏమైనా చెయ్యగలదిది. పాపబుద్ధి. కపటధర్మమే కవచం దీనికి. నక్కలు, మాంసం తినవట! ఇన్నాళ్ళూ నీకళ్ళల్లో కారం కొట్టింది. ఇన్నిపనులూ అది చేస్తూవుంటే, నీ ఆజ్ఞకి భయపడి మేం మాట్లాడకుండా నోరుమూసుకు వూరుకున్నాం' అన్నాయి.

దాంతో ఎక్కడలేని కోపం పుట్టుకువచ్చింది పులికి 'పట్టుకోండి నక్కని, చంపెయ్యండి' అంది.

ఇదంతా పులితల్లి వింది. చప్పున వచ్చి కొడుకుతో అంది — 'అయ్యో, నాయనా! నీ తెలివి ఏమైపోయిందోయి? ఇలాంటి కృత్రిమా లెరుగునా నక్క? వెర్రాడివి. పుట్టినప్పటినించీ ఇలాంటి కపటాల్లో పెరిగారు సేవకులు. ఎంతేసిపనులైనా చేస్తారు వీళ్ళు. మంచివాళ్ళని చూసి చెడ్డవాళ్ళూ, అధికుల్ని చూసి హీనులూ, అందగాణ్ణి చూసి కురూపులూ ఈసు పెట్టుకుంటారు; అసూయపడతారు. ఈమాత్రం తెలుసుకోఅక్కరలేదా బాబూ? ధర్మం అధర్మంలాగా, అధర్మం ధర్మంలాగా అవుపిస్తుంది. ధర్మం కావలిసినవాడు నిర్మలమైన మనస్సుతో కనిపెట్టాలి. విన్నావా? ఈనక్క వచ్చినప్పటి నించీ మనకి చేసిన మేళ్ళు చూసైనా గ్రహించవద్దూ? ఈరకం వాడు ఇలా చేస్తాడా అని ఆలోచించ నక్కరలేదూ? కుటిలుల కపటోపాయానికి లొంగిపోయి, హితుడైన మంత్రిని చంపడానికి నిశ్చయిస్తారా? రాజైనవాడు పరీక్షించకుండా వొకపని చేసెయ్యడమేనా?' అంది.

తల్లిమాటలతో తెలివి తెచ్చుకుంది పులి. నక్కని పిలిచింది. కౌగిలించుకుంది. కన్నీళ్ళతో మంచిమాటలాడి గౌరవించింది.

'మృగరాజా! అప్పుడు సభలో నన్ను 'ఏను మంచివాడు' అని పొగిడావు. ఇప్పుడు పూర్తిగా నాగౌరవమూ, మానమూ తుడిచి

పాలేశావు. నన్ను పదవిలో వుంచినప్పుడు ముందే నీ భృత్యులమాట విననని, నా బుద్ధి వింటాననీ శపథంచేశావు. అదీకాక, తెలిసైనా తెలీకైనా వొకళ్ళణ్ణి అవమానంచేసి, తరవాతఅనుకూలపరుచుకోడం ఎంత సిరిగలవాడికైనా మంచిదా? అవమానంపొంది, తిరిగి వుండడం మాత్రం నాకు క్షేమమా?' అంటూ అడివిలోకి వెళ్ళిపోయింది నక్క. నిరాహారదీక్షపూనింది. సద్భావంతో సద్గతిపొందింది. ధర్మరాజా! ఈకథ పూర్వాపరసందర్భాలు ఆలోచించు, నీకే అర్థమవుతుంది. మాటలతో మోసపోకూడదు. మంచీచెడ్డా ఆలోచించాలి. చెడ్డవాణ్ణీ, మంచివాణ్ణీ నిర్ణయించడం నేర్చివుండాలి.

## లొటిపిట కథ

ధర్మరాజు—ఎలానడుచుకుంటే రాజు సుఖపడతాడు?

భీష్ముడు—సోమరితనమూ, సహాయసంపద లేకండా వుండడమూ రాజుకి తగదు. ఇవి లేనిరాజు సుఖపడతాడు. వెనకటికి వొక లొటిపిట ఎవ్వరికీ సాధ్యంకాని తపస్సు చేసింది. మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమయాడు. 'ఏంకావాలి?' అని అడిగాడు. 'నా మెడ నూరు ఆమడల పొడవు కావాలి' అంది లొటిపిట. 'అలాగే కానీ' అని అంతర్థానమయాడు బ్రహ్మ. వరం దొరకడంతోనే కిందా మీదా కనపళ్ళేదు లొటిపిటకి. ఏ సహాయమూ అక్కరలేదనుకుంది తనకి. సోమరిపోతై కూచుంది.

ఇలా వుండగా వొకనాడు అడివిలో అది మేతమేస్తూవుంది, పెద్ద వానవచ్చింది. తనమెడ సాగినంత మేరా చూచి, వొకగుహలో తలపెట్టుకుని నిద్రపోయింది. ఇంతలో వొక నక్కా, దాని భార్యా ఆగుహలోకి వచ్చాయి. బాగా ఆకలితో వున్నాయవి. లొటిపిట

మొండ కొరికేశాయి. నోరూ కండ కీళ్ళూ తినడం మొదలెట్టాయి. తుళ్ళిపడి లేచింది లాటిపిట. మిగిలిన మొండ నరాలు కూడా కొరికేశాయి పక్కులు. చచ్చివూరుకుంది లాటిపిట. కనక అలా సోమరి పోతువి కాకూడదు నువ్వు. సహాయసంపన్నుడివి కావాలి.

ధర్మరాజు — రాజు ఆపద ఎలా తప్పించుకోవాలి?

## సముద్రమూ - నదులూ

భీష్ముడు — సముద్రమూ, నదులూ సంవాదమని వొక కథ వుంది. నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధాన మవుతుందది. సముద్రం నదులతో కులాసాగా కబుర్లు చెపుతూ వొకనాడు అడిగింది. 'మీరు పొంగి, పొర్లి, పారినప్పుడు మీగట్లమీది చెట్లు కూలిపోతాయి. తుంగ కూలిపోదేమీ? అవి మీకు ఏం మేలు చేశాయని? లేదంటే, వాటిని వూడపెరకడానికి మీకు శక్తిలేదా? ఏమిటి కారణం?'

సముద్రం ప్రశ్నకి గంగ ఇలా సమాధానం చెప్పింది — బింకం వొదిలిపెట్టకండా నిలబడతాయి చెట్లు. అంచేత కూలిపోతాయి. తుంగ అలా కాదు. మావడిముందు అణుకువతో తల వొంచుకుంటాయి. మా వరద వేగం గడిచిపోయాక ఎప్పటిలా తల లెత్తుతాయి. వృద్ధిపొందుతాయి.'

ఆ తుంగమనుగడే ఆదర్శ మనుకో. తన బలమూ, ఎదటి పగవాడిబలమూ తెలుసుకోవాలి. మూర్ఖత్వంతో ఎదిరించకూడదు. దుర్బలుడైన రాజు నమ్రతతో శత్రువు ప్రతాపం సహించుకోవాలి. ఆపద తప్పించుకోవాలి.

ధర్మరాజు — తగిన పదవులకి కులీనులైన పరిజనం దొరకనప్పుడు రాజు ఏంచేయాలి?

## కుక్క కథ

భీష్ముడు — ఒక మునీశ్వరుడు వుండేవాడు. గొప్పతపస్సు చేస్తూవుండేవా డతడు. అతడి దయాభావంవల్ల ఆశ్రమంలో అన్ని జంతువులూ సుఖంగా వుండేవి. వాటిలో వొక కుక్క ఎప్పుడూ అతణ్ణి సేవిస్తూ వుండేది. ముని ఎక్కడికి వెళితే అక్కడికి వెళుతూ వుండేది. ఒకదుప్పి దానిమీద పగపట్టింది. దాన్ని కరవడానికి వచ్చింది. కుక్క మునిదగ్గిరికి పరిగెత్తింది. చూశాడు ముని. కుక్కని బలమైన దుప్పిచేసేశాడు. తనమీదికి వచ్చిన దుప్పిమీద కలబడింద‌ది. దాంతో మొదటిదుప్పి తోకముడిచేసింది. ఇలాగే వొక పెద్దపులి పగపట్టి వచ్చింది. కుక్కని పెద్దపులిచేసి గెలిపించాడు ముని. అలాగే వొక సింహం వస్తే, దానికంటే బలమైన సింహంచేసి కుక్కని గెలిపించాడు ముని. చివరికి వొక శరభమృగం వచ్చింది. అంత కంటే బలమూ, ఉత్సాహమూ కల శరభమృగంచేసి, కుక్కని వొదిలిపెట్టాడు ముని. ఇలా క్రమంగా గొప్ప శక్తిసంపాదించి, గర్వంతో తిరుగుతూవుండేది కుక్క. అయితే పూర్వవాసన మాత్రం దాన్ని వొదలలేదు. 'నన్ను చూసి, మరోమృగం భయపడి పరిగెడుతుంది. ముని మరోమృగంమీద దయతలిచి, దాన్ని నాకంటే బలమైన శరభంచేసేస్తే?' తననీచమనోభావంతో ఆలోచించిం దది— 'అప్పుడు నాఉద్ధృతం మరి సాగదు. కనక వొడుపుచూసి, ఈమునినే చంపేస్తాను. హాయిగా వుంటాను' అని నిశ్చయించుకుంది.

కుక్కదురాలోచన దివ్యజ్ఞానంతో తెలుసుకున్నాడు ముని. 'తక్కువజాతి కుక్క ఇది. ఉన్నతస్థితి దీనికి ఏం తెలుసు? వెనకటి లాగ కుక్కగానే వుండాలి' అన్నాడు. ఏముంది, కుక్కకుక్కే అయి పోయింది. అంచేత తక్కువవాళ్ళు గౌరవనీయులు కారు. అయితే

ఇంకొక విశేషం కూడా వుంది. కులం వాడని మంచీచెడ్డా చూడకుండా దుష్టుడికి అధికారం కట్టిపెట్టకూడదు. భృత్యుల మనస్సు తెలుసుకొని, ఉత్తములకి ఉత్తమపదవీ, మధ్యములకి మధ్యమపదవీ, అధములకి తక్కువపదవీ ఇవ్వాలి. శౌర్యమూ, సత్యమూ, సత్కార్యజ్ఞానమూ, భక్తి తాత్పర్యమూ, గాంభీర్యమూ వుంటే కులంతో ప్రయోజనం లేదు. ఈగుణాలున్నవాడే ఉన్నతాధికారానికి తగినవాడు. అయితే ఇదే సిద్ధాంతం అనుకోకూడదు. ఎలా అయినా ఉన్నతవంశంవాణ్ణి, గొప్ప గుణాలు కలవాణ్ణి వెదికి తెచ్చి మరీ పెద్దపదవిలో వుంచాలి. భయంకరమైన సింహమైనా సరే ధైర్యమూ, బలమూ కల మంచిమృగాల తోడు వుంటేనే తప్ప గొప్పపనులు చెయ్యలేదు. ఇవేవీ అనుకుని కుక్కల్ని చేరుస్తుంటే తన కోర్కెలు నెరవేరతాయా? నేస్తం, కులమూ లేని పరివారం కోటిమంది వుంటే మాత్రం ఏం లాభం? నేస్తం, పూనికా, భక్తీ, మంచినడవడీ వున్న స్నేహితుల బలం వుంటే ప్రపంచమంతా పరిపాలించవచ్చు రాజు. వెయ్యిమాటలెందుకూ? ఇంతకీ రాజు నెమ్మదిగా వుండాలి. శూరుడై వుండాలి. నెమలిలాగ బహుచిత్రంగా నటించి, ప్రజల మనస్సు లోబరుచుకోవాలి. నెమలి నెమ్మదిగా కూస్తుంది. రాజు మృదువుగా మాట్లాడాలి. శరత్కాలంలో నెమలి నోరు విప్పదు. అలాగే తన మంత్రాంగం పెదవి దాటనివ్వకూడదు రాజు. నెమలి తలమీద జుత్తు పెట్టుకుంటుంది. అలాగే ధర్మం తలమీద పెట్టుకోవాలి రాజు. రెక్కలు విప్పి పరిగెత్తుతుంది నెమలి. పక్షబలంతో పయనం చెయ్యాలి రాజు. రంగురంగుల పురితో గొప్పగా వుంటుంది నెమలి. అలాగే ఇతర్లు తనని ఆశ్రయించదగినంత గొప్పగా వుండాలి రాజు. వానకారు రాగానే చెలరేగుతుంది నెమలి. అలాగే సమయం రాగానే విజృంభించాలి

రాజు. కుటిలగతీ, నీచగతీ లేకుండావుంటుంది నేసులి. నీచగతీ కుటిల గతీ కల శత్రువుల్ని హాకపారర్యాలి రాజు. ఇదే తగిన నీతి రాజుకి.

సూర్యుడిలా వుండాలి రాజు. సూర్యుడు ఎలా సందు గొం దుల్లో తన కిరణాలు ప్రవేశపెడతాడు, అలాగే చాతుర్యంకల పరిజ నుల్ని అంతటా ప్రవేశపెట్టి శత్రువుల పనులు కనిపెట్టాలి రాజు. కోపంవచ్చినప్పుడుకోపమూ, స్నేహంవచ్చినప్పుడు స్నేహమూ ఫలిస్తూ వుంటాయి. అన్ని పనులూ విచారిస్తూ నిత్యవిధులు నెరవేరుస్తూ వుండాలి. ఆదాయవ్యయాలు గమనిస్తూ, కోశమూ, సంపదా చూసు కుంటూవుండాలి.

## దండనీతి

ధర్మరాజు — రాజులకి దండనీతి సర్వసాధారణమైంది. దాని స్వరూపం వినాలని వుంది.

భీష్ముడు — నల్లకలవలరంగు శరీం. నాలుగు కోరలు. నాలుగు చేతులు. రెండు నాలుకలు. ఎనిమిది పాదాలు. ఎన్నోఅన్ని చెవులు. ఎన్నో నేత్రాలు. మీదికిపొడిచిన రోమాలు ఉగ్రమైన ఎర్రటి మొహం. కపిలజడలు. ఇదీ దండనీతి స్వరూపం. గదా, శక్తీ, ధనుస్సూ, ముసలమూ, చక్రమూ, ఈటే, బాణమూ, తోమరమూ, త్రిశూలమూ, గండ్రగొడ్డలీ మొదలైనవి సాధనాలు. వీటితో పాపా త్ముల్ని తరతరంగా నరకడం, కొట్టడం తన పని. వాళ్ళని తలఎత్త కండా చేసి, సజ్జనుల్ని సంతోష పెట్టడం ఆదర్శం.

ఉత్తముడూ, అసంగుడూ (సంసారబంధం లేనివాడు) ధర్మ పాలుడూ, ధర్ముడూ, విజయుడూ, శాస్త్రిడూ, చంపేవాడూ, లోకం ధరించినవాడూ, అక్షరుడూ, జాగరుడూ, చేరతరంకానివాడూ, అతి సత్యవంతుడూ, నిత్యుడూ, శాసించేవాడూ, వేదపురుషుడూ

శస్త్రమూ, బ్రహ్మమూ, తీక్ష్ణమైన కవచం ధరించినవాడూ, ప్రజా శుభకరుడూ, కౌమారీ, క్రోధుడూ, శ్రీగర్భుడూ, వ్యవహార తంత్రాణుడూ, రక్షకుడూ, మంత్రమూ అన్న పేర్లతో వున్న యజ్ఞ స్వరూపుడు విష్ణుమూర్తే దండమై పరిణమిస్తాడు. శ్రీ అనీ, సరస్వతి అనీ దండనీతి పేర్లు.

ధర్మాధర్మాలూ, సుఖదుఃఖాలూ, మంచిచెడ్డలూ అర్థా, నర్థాలూ, దయానిర్దయలూ మొదలైన అన్ని అవస్థలూ దండంవల్ల చక్కబడుతున్నాయి. సరైనవిధానంతో దండం ప్రయోగించడం వల్ల ప్రజారక్షణ జరుగుతుంది. రాజూ అభివృద్ధి పొందుతాడు. దండనీతి రాజుకు మహోత్కృష్టమైంది.

సత్యంతో నిత్యమూ ధర్మం అనుసరించాలి. అది చక్కని నీతితో అనుసరిస్తే దేవేంద్రుడు సంతోషిస్తాడు. అన్నం ప్రసాదించి ఉన్నతి కలిగిస్తాడు. దండం ఎంతయినా పొగడదగింది.

పురుషుడు, ఈశ్వరుడు, భూతాత్ముడు, జీవుడు, ప్రాణుడు, అక్షయుడు, ప్రజాపతి ఈఎనిమిదీ దండదేవుడి పేర్లు. దండనీతి సాక్షాత్తూ దేవుడే. దీనికి వొక ఇతిహాసం వుంది.

అంగదేశంలో వసుహోముడని వొక రాజు వుండేవాడు. అతడు హిమాలయంలో మంజుపృష్ఠం అని ప్రసిద్ధమైన శిఖరంమీద భార్యతో సహా వెళ్ళి నివసించాడు. మునులు పూజించేటట్టు నడుచుకున్నాడు. ఒకనాడు వసుహోముడి దగ్గిరికి మాంధాతవచ్చి వినయంగా ప్రణామంచేశాడు. అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి, ఉపచారాలు చేశాడు వసుహోముడు. 'వచ్చిన పనేమిటి?' అని అడిగాడు. 'సవిస్తరంగా నీదగ్గిర దండనీతి వినాలని నిన్ను ఆశ్రయించాను' అన్నాడు మాంధాత. వసుహోముడు ఇలా వివరించాడు:

'పూర్వం బ్రహ్మ ఒక యజ్ఞం తలపెట్టాడు. తనలాంటి రుత్విజుడికోసం గాలించాడు. ఎక్కడా దొరకలేదు. తానే ఒక గర్భం ధరించాడు. వెయ్యేళ్ళయాక తుమ్మి, కుమారుణ్ణి కన్నాడు. క్షుతం (తుమ్ము) వల్ల కలిగాడు కనక అతడిపేరు క్షుపుడు అయింది. ఆ క్షుతప్రజాపతి రుత్విజుడుగా కూచున్నాడు. యజ్ఞంచేయిస్తూ వుండగా, కోరినట్టు నడిచేది కనక దండం మాయమైంది. దాంతో కార్యమూ, అకార్యమూ అన్నభేదంలేకండా పోయింది. మర్యాద తారుమారైంది. భూదేవి ఖేదపడింది.

అప్పుడు బ్రహ్మ విష్ణువుదగ్గిరికి వెళ్ళాడు. ప్రార్థించాడు. అతణ్ణి తీసుకుని శివుడిదగ్గిరికి వెళ్ళాడు. 'ఇతడు నీ సఖుడు, ఇతడు వచ్చినపని దయతో చిత్తగించు' అంటూ దండం మాయమైనసంగతివినిపించాడు దండంలేక ప్రపంచం క్షోభపడడం విన్నవించాడు. నిజప్రభావంవల్ల దండం కల్పించాడు శివుడు. దండనీతికి ఆశ్రయుడయాడు.

రుగ్వేదమూ మొదలైన నాలుగు వేదాలూ, కల్పమూ మొదలైన ఆరు వేదాంగాలూ వెరశి పదివిద్యలూ, పురాణాలన్నీ ఒక విద్యా, ధర్మం తెలిసినవాళ్ళు చెప్పిన శాస్త్రాలన్నీ ఒక విద్యా, న్యాయశాస్త్రమంతా ఒక విద్యా, మీమాంస ఒక విద్యా—ఇలా పద్నాలుగు విద్యలు. ఆయుర్వేదమూ, ధనుర్వేదమూ, గాంధర్వ వేదమూ, అర్థశాస్త్రమైన నీతివిద్యా, దానితో కలిసిన వృత్తీ ఇన్నీ కలిసి మొత్తం పద్ధెనిమిది విద్యలూ శివుడు ముల్లోకాల క్షేమంకోసం ఏర్పరిచాడు. ఇవన్నీ నీతిప్రపంచాలైన విద్యలు. ఇవి విష్ణుమూర్తి అధీనంచేశాడు శివుడు. బ్రహ్మని సంతోషపెట్టాడు. దండనీతిపరిపూర్ణ రూపంతో ప్రకాశించింది. లోకాలు సంతోషించాయి. బ్రహ్మ యజ్ఞం దివ్యంగా నడిచింది.

విష్ణువు దండనీతిశాస్త్రం యావత్తూ అంగిరసుడికిచ్చాడు. అంగిరసుడు దేవేంద్రుడికీ, మరీచికీ ఇచ్చాడు. మరీచి భృగుడికిచ్చాడు. భృగుడు ఎంతోమంది మునులకి ఉపదేశించాడు. ఇలా ఇది లోకంలో వ్యాపించింది. దండనీతిని బట్టే లోకాలు మర్యాద తప్పకుండా నడిచాయి. శంకరుడూ, రుద్రుడూ, కపర్దీ, భవుడూ, స్థాణువూ, ఉమాపతీ అన్న పేర్లతో వుండే దండదేవుణ్ణి బాగా ధర్మంతో నడిపే రాజు ఐహికసుఖమూ, ఆముష్మికసుఖమూ కూడా అనుభవిస్తాడు.'

వసుహోముడు చెప్పింది విన్నాడు మాంధాత. దండస్వరూపం తెలుసుకున్నాడు. దండనీతి ప్రకారం రాజ్యంచేశాడు.

ఈకథ విని న్యాయంతో ప్రజాపాలనచేసే రాజు చిరకాలం జీవిస్తాడు. పుణ్యాత్ముడవుతాడు.

## ధర్మార్థకామాలు

ధర్మరాజు — ధర్మమూ, అర్థమూ, కామమూ — ఇవి ఎలా వుండాలి?

భీష్ముడు — వెనకటికి ఆంగరిష్ఠుడని రాజు కామందకమునిని ఇలాగే అడిగాడు. అతడు ఏం చెప్పేడో విను. 'ఎప్పుడూ అధికమవుతూ వున్న కామంవల్ల అర్థమూ, ధర్మమూ నశిస్తాయి. కామతంత్రంలో తగులుకున్న రాజు మంచిదారిలో పడడు. దుష్టుల్ని దండించడు. అలాటి రాజుదగ్గిర సాధుపురుషులూ, పూజ్యులూ, మంచిస్నేహితులూ చేరరు. అంచేత ఎంత చెడ్డరావాలో అంతా వస్తుంది. తుదకి చావు కూడా ప్రాప్తిస్తుంది. అర్థం ధర్మసిద్ధికి మూలం. అంచేత ఎలాఅయినా ధర్మాభిలాషతోనే అర్థచింత వుండాలి. కామంలో మనసు పెట్టకండా న్యాయంగావచ్చే సౌఖ్యాలుమాత్రమే అభిలషించాలి. ఇలా రాజ్యం చేసే రాజు గొప్పవాడవుతాడు' అన్నాడు.

## శీలం

ధర్మరాజు - శీలం గొప్పదని మెచ్చుకుంటూ ఉంటారు జనులు. దాని స్వరూపం వివరించు.

భీష్ముడు—లోగడ ఇంద్రప్రస్థంలో తమ్ముళ్లతో కలిసి నువ్వు గొప్పగా వుండడం దుర్యోధనుడి కన్ను కుట్టింది. ఎంత సుఖపడాలో అంత దుఃఖపడ్డాడు. నీ మయసభ అందమూ, నువ్వు రాజసూయం చేసి గౌరవం పొందడమూ మచ్చరించుకున్నాడు. నీ ఇంట నిత్యమూ పదివేలమంది బ్రాహ్మలు బంగారు పళ్ళేలలో పాయసం భోజనం చేస్తున్నారనీ, మహా ఐశ్వర్యంతో తులతూగుతున్నావనీ ధృతరాష్ట్రుడితో చెప్పి, ఏడ్చుకున్నాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు ఏమన్నాడో తెలుసా? 'కమ్మని అన్నపానాలూ, మణిభూషణాలూ, మంచిమంచి వాహనాలూ—ఇన్నిటితోనూ నీ ఐశ్వర్యం మహోజ్వలంగా వుంది. ఏమంత తక్కువగా వుందా? అయితే ధర్మరాజు వొక్క విషయంలో మాత్రం ఎక్కువ, శీలంలో. శీలం వుంటే సిరి దానంతట అదే వస్తుంది. ధర్మరాజు దగ్గిర శీలం అధికం. కనక నువ్వు శీలం అలవరచుకో. ధర్మరాజు సిరికంటే అధికం సిరి నీ వాళ్ళ దగ్గిరికి వస్తుంది. మాంధాతా, నాభాగుడూ మొదలైన మహారాజులు శీలంవల్లే లోకంలో గొప్పవాళ్ళయారు. ఈ విషయంలో వొక ఇతిహాసం చెప్తాను, ఆలకించు. రాక్షసరాజు ప్రహ్లాదుడు శీలంవల్లే దేవేంద్రుడి రాజ్యలక్ష్మి ధర్మంగా తనవశం చేసుకున్నాడు. అప్పుడు దేవేంద్రుడు విచారించి, బృహస్పతితో ఆలోచించాడు. 'శుక్రాచార్యుణ్ణి చూడు' అన్నాడు బృహస్పతి - 'అతడే దయతలిచి ఉపాయం చెప్తాడు' అన్నాడు. గురువుమాట ప్రకారం శుక్రుడిదగ్గిరికి వెళ్ళాడు దేవేంద్రుడు. 'నాకు మేలు కలిగే ఉపాయం ఉపదేశించు' అని ప్రార్థించాడు.

'నన్ను కాదు ప్రహ్లాదుణ్ణి అడుగు' అన్నాడు శుక్రాచార్యుడు– 'అతడే చెప్తాడు. అతను చెప్పిన ఉపాయం చేస్తే మేలు కలుగుతుంది' అన్నాడు

బ్రాహ్మణవేషం వేసుకుని ప్రహ్లాదుడిదగ్గిరికి వెళ్ళాడు దేవేంద్రుడు. అతడి శిష్యుడిగా చేరి సేవచేశాడు. అతని సేవకి సంతోషించాడు ప్రహ్లాదుడు. సమయం చూసి, 'నీకు ముల్లోకాల అధికారం ఎలా వచ్చింది?' అని అడిగాడు దేవేంద్రుడు.

'నేను రాజునని ఎప్పుడూ గర్వం తెచ్చుకోలేదు బ్రాహ్మల మనస్సు నొప్పించలేదు వాళ్ళకి ధనం సంతోషంగా దానంచెయ్యడంలో లోపం చెయ్యలేదు. వాళ్ళు చెప్పినట్టు శీలంతో నడుచుకుంటున్నాను. దీనివల్లే ఇంత గొప్పవాణ్ణయాను' అన్నాడు.

'అయితే మహాత్మా! నీశీలం నాకు ప్రసాదించు. మహాత్ముల్ని ఆశ్రయించినవాళ్ళు సుఖపడాలికదా!' అంటూ దీనంగా బతిమాలాడు దేవేంద్రుడు. జాలిపడ్డాడు ప్రహ్లాదుడు. 'ఇతడు బ్రాహ్మణమాత్రుడు కాడు' అని భయంకూడా కలిగి, తనశీలం అతనికి ధారపోశాడు. పుచ్చుకుని శీలసంపన్నుడై వెళ్ళాడు దేవేంద్రుడు. తరవాత ప్రహ్లాదుడి శరీరంనించి తేజోవంతుడైన పురుషుడొకడు బైటికివచ్చాడు. 'నువ్వు ఎవరు?' అని అడిగాడు ప్రహ్లాదుడు. 'శీలం అంటారు నన్ను. నువ్వు ఇచ్చేశావుకదూ, ఆ బ్రాహ్మడి దగ్గిరికే వెళ్ళిపోతున్నాను' అని అతణ్ణి వొదిలేసి వెళ్ళిపోయాడతడు. అలాగే క్రమంగా తేజోమయ రూపాలు ప్రహ్లాదుడి దేహంనుంచి వొకొక్కటే బైటికివచ్చాయి. అన్నిటినీ అలాగే అడిగాడతడు. వరసగా ఉత్తమ ధర్మమూ, సత్యమూ నడవడీ, బలమూ అన్నీ చెప్పి వెళ్ళిపోయాయి. ఎంతో విచారించాడు ప్రహ్లాదుడు. తుదకి వొక మహత్తరమూర్తి, పద్మంలాంటి మొహంతో వొక ఆడది బైటికివచ్చింది. 'నువ్వు ఎవతెవి?' అని అడిగాడు ప్రహ్లా

దుడు. 'నేను సిరిని' దీనంగా అంది ఆమె — 'బలం ఎక్కడికిపోతే నేనూ అక్కడికే పోతాను. అందుకే బైలుదేరాను.'

భయపడ్డాడు ప్రహ్లాదుడు. 'పరమేశ్వరీ! ఎంతో వినయంతో నాకుఉపచారాలు చేశాడు ఆబ్రాహ్మడు. ఎవరతడు?' అని అడిగాడు.

'అతడు దేవేంద్రుడు' అంది సిరి— 'నీ రాజ్యసంపద యావత్తూ తీసుకోడానికే నిన్ను ఆశ్రయించాడు. నువ్వు నీశీలం ఇలా పోగొట్టుకున్నావు శీలంవల్లే ధర్మం పెరుగుతుంది. ధర్మంవల్ల సత్యం పెరుగుతుంది. సడవడివల్ల బలం పెరుగుతుంది. బలంవల్ల నేను కలుగుతాను. అన్నిటికీ శీలమే మూలం' అంటూ సిరి, ధర్మం మొదలైన వాటితో ఇంద్రుడి దగ్గిరికి వెళ్ళిపోయింది.'

ఇలా ధృతరాష్ట్రుడు చెప్పాక దుర్యోధనుడు 'అయితే శీలం అంటే ఏమిటి?' అని అడిగాడు. 'మనస్సూ, వాక్కూ, కర్మా— ఈమూడింటిచేతా ప్రాణిమీద ద్రోహభావం లేకండా వుండడమే శీలం. అదే మేలుకలిగిస్తుంది. ఇదే నీమనస్సులో పెట్టుకో. ఇతర్లకి మేలు చెయ్యడమూ, అపకీర్తిపనులు చెయ్యవద్దని ఎదటివాళ్ళకి బోధించడమూ, జనం మెచ్చుకునేట్టు నడుచుకోడమూ ఇవి శీలానికి అంగాలు' అన్నాడు ధృతరాష్ట్రుడు.

ధర్మరాజా! శీలం నీకు సహజగుణమే. అయినా నేను చెప్పాను. స్థిరంగా మనసులో వుంచుకో.

ధర్మరాజు — ఆశకి అంతం లేదు. అది ఫలించకపోతే దుఃఖం కలుగుతుంది. దుర్యోధనుణ్ణి మంచిదారికి తిప్పి కలిసివుందామనే చూశాడు ఆమహాత్ముడు దారికి రాలేదు. నాఆశ నిరాశచేశాడు. నన్ను దుర్బుద్ధిగాచేశాడు. ఇదే దుఃఖంగావుంది నాకు. ఆశ అడుచుకోడం కష్టంకదా!

# సుమిత్రుడి కథ

భీష్ముడు—ఆశ వొదులుకుందికి వొక కథ వుంది. హైహయ వంశంలో సుమిత్రుడని వొకరాజు వుండేవాడు. అతను వొకనాడు వేటకి వెళ్ళాడు అక్కడి బాణం తగిలి వొకలేడి బాణంతోనే పరిగెత్తుకు పోయింది అతను వెంటపడ్డాడు. అది వొకమారు సమీపించేది. ఒకమారు దూరమైపోయేది. ఒకమాటు కంటికి కనపడకుండా పోయేది. అలిసిపోయేది. పారిపోయేది. అంతలోనే అవుపడేది. అలా ఆశపుట్టిస్తూ వెళ్ళి అడివిలో మాయమైపోయింది. బాగా అలిసిపోయాడు సుమిత్రుడు. ఒక మునిపల్లెకి వెళ్ళాడు. పళ్ళూ, నీళ్ళూ ఇచ్చి తృప్తి పరిచారు మునులు. అతడు వేద దేరాక గుమభుడు అని వొకముని అడిగాడు 'రాజా, అడివిలో వొక్కడివీ ఏంపనిమీద వచ్చావు? ఇలా ఎంతో విచారిస్తున్నావెందుకూ?' 'ఒక మృగం వేశాను. అది బాణం తోనే పారిపోవచ్చింది. దానివెంట ఆసపడి వచ్చాను. నన్ను ముప్పుతిప్పలూ పెట్టి అడివిలో మాయమైంది. వేటకాడు తాను వేసిన మృగం తప్పించుకుపోతే ఎంతయినా దుఃఖపడతాడు. ఆస ఇంత తప్పించుకోరాందా?' అన్నాడు రాజు.

'విను అందుకున్నాడు ముని — 'నేను తీర్థయాత్రకి వెళ్ళాను. బదరికాశ్రమంలో దమనుడని వొక మునీశ్వరుణ్ణిచూశాను. బాగా బక్కచిక్కిపోయివున్నాడతడు. చూసి భక్తితో ప్రణామదంచేశాను. ముని ఆతిథ్యమిచ్చాడు. సంతోషించాను. అతడి దగ్గిర ధర్మబోధ వింటూ కూచున్నాను.

ఇంతలో వీరద్యుమ్నుడని వొకరాజు అక్కడికి వచ్చాడు. ఎంతో విచారంతో వున్నాడతడు. పరివారంతోనూ, భార్యతోనూ కూడా దీనంగా వచ్చాడు. అతిథిపూజా, సత్కారమూ చేశాడు ముని. వచ్చిన కారణం అడిగాడు.

'నాకు ఒక్కడే కొడుకు. గుణవంతుడు. ఆడుకుంటూ అడవికి వచ్చేశాడు. కనపడలేదు. అందుకని వెదుకుతూ వచ్చాను' అన్నాడు రాజు. మొహం వంచుకుని మాటాడకుండా ఊరుకుంటాడు ముని. అతడి విచారం చూసి అన్నాడు రాజు—'ఫలం దుర్లభమైనప్పుడు మనస్సుని ఇంత బాధపెడుతుందా ఆశ!'

అతడి మొహం తేరిచూశాడు ముని, 'విచారించకుండా ధైర్యం గావున్నవాడికి, ఎక్కడా ఏదీ దుర్లభం కాదనుకో. లోకంలో ఒక్కటే దుర్లభం, ఏమిటంటావా! అడిగినవాణ్ణి అవమానపరచకుండా, కోరిక తీర్చి పంపే ధన్యుడు మాత్రం దుర్లభం. వెనకటికి ఒక బుద్ధిమంతుడు ధనవంతుడైన ఒక రాజుదగ్గిరికి వెళ్ళాడు. కూటికీ, గుడ్డకీ ఇంత డబ్బు ఇమ్మన్నాడు. రాజు మూర్ఖత్వంవల్ల హతాశుడై తిరిగివచ్చేశాడు. సిగ్గుచేటైన ఆశ విడిచిపెట్టేశాడు. అన్ని విషయాలూ వొదిలేసి వైరాగ్యవ్రతం పూనాడు. తపస్వి అయాడు. రాజా! ఆ తపస్వి ఎవ్వరో కాదు, నేనే. ఆ రాజు ఎవ్వరో కాదు, నువ్వే. జ్ఞాపకం చేసుకో' అని వెనుకటి సంగతి తలుచుకు చెప్పాడు ముని. సాకూతంగా చూశాడు.

'ఇస్తానని ఇయ్యని వాడిమీద మనసులో పగపెట్టుకుంటే చెడుగే కలుగుతుంది. సిరిలేని వాడిదగ్గిర ఆసపెట్టుకుంటే, నీచురాలైన ఆడదాని కోసం ఆసపడినట్టే అవుతుంది. దరిద్రం మిగుల్తుంది. వైరిపరుగుల ఆస వొదలిపెడితేనే సుఖం' అని బోధించాడు. దయతలిచి అతడి కొడుకు భూరిద్యుమ్నుణ్ణి తన తపోమహిమవల్ల ఆకర్షించి అక్కడికి తెప్పించాడు. కుమారుడితో వీరద్యుమ్నుణ్ణి సాగనంపాడు.'

ఈకథ చెప్పి రుషభముని సుమిత్రుడి మనస్సు వేటమీంచి మళ్ళించాడు. ధర్మరాజా! నువ్వూ ఈమాటలు పట్టించుకో. ఆస విడిచి పెట్టు. విచారం లేకండా సుఖపడు.

ధర్మరాజు—అమృతంలాటి నీమాటలు ఎంత ఆస్వాదించినా తనివితీరడంలేదు. ఇంకా మరిన్ని ధర్మాలు సెలవియ్యి.

భీష్ముడు—తన రాజ్యంలోనూ, శత్రురాజ్యంలోనూ ధనం సంపాదించాలి రాజు. రాజ్యానికీ, ధర్మానికీ కూడా ధనమే మూలం. కాఠిన్యంవల్ల కానీ మెత్తదనం వల్ల కాని ధనం దొరకదు. మెలకువ కలిగి లాలించి, తన అదుపుఆజ్ఞల్లో ప్రజల్ని పెట్టుకోవాలి రాజు. ధనభండారం పెరగని రాజుకి సేనలూ వుండవు, స్నేహితులూ వుండరు. సేనా, స్నేహితులూ లేకపోతే రాజ్యం నిలబడుతుందా? వైభవం మాత్రం నిలబడుతుందా? కనక అంతటికీ ధనమే మూలం. అయితే తన శక్తికిమించిన ప్రయత్నంచేసి ధనం వెదచల్లడం కూడదు. అది తన మొదటి సంపదకే మోసం తెస్తుంది. తుదికి ప్రాణంకూడా తీస్తుంది. తన శక్తికి తగిన ఉపాయాలు చేసి, ధనంగడించడమే రాజుకి మంచిగుణం. ధనంలేని రాజుని తన కన్నకొడుకులే చులకన చేస్తారు. పగవాళ్ళు లక్ష్యపెట్టరు. దారికొట్టి, దొంగతనాలు చేసి, మొనగాళ్ళయిన క్రూరులమూక కల దొరల్ని రాజు చేరదియ్యకూడదు. వాళ్ళవల్ల ఎంతైనా దైన్యంకలుగుతుంది అన్యాయంగా ప్రవర్తించే సేనవల్ల యుద్ధంలో జయం కలగదు. శత్రువులైనా సరే, మంచిగా వున్నవాళ్ళకే గౌరవం కలుగుతుంది. దీనికి ఉదాహరణ వొకకథ చెపుతాను.

## కాపవ్యుడి కథ

పారియాత్రపర్వతంమీద కాపవ్యుడని వొక బోయవాడు వుండేవాడు. ధర్మబుద్ధికలవాడతడు. మంచి విలుకాడు. జంతువుల స్వభావం తెలిసినవాడు. అడవుల్లో తిరిగేవాడు. తల్లిదండ్రులమీద వల్లమాలిన భక్తి అతడికి. పళ్ళూ, దుంపలూ, తేనే, మాంసమూ మంచి కూడూ, కూరలూ ఎప్పటికప్పుడు తెచ్చి ఇస్తూ వాళ్ళని తృప్తి

పరిచేవాడు. పక్కలూ, ఆసనాలూ ఎందుకోసమూ లోపంలేకండా చూసేవాడు. మునీశ్వర్లకి కావలిసినవి ఇచ్చేవాడు. శత్రువులంటే మాత్రం చంపేసేవాడు యుద్ధంలో ఉగ్రుడైపోయి వొక్కడే వెయ్యి మందిని చంపేసేవాడు. అతడిప్రతాపం చూసి, ఆదేశంలో దొంగలందరూ ఆలోచించారు. 'మనల్ని రక్షించగలనాయకుడు కావాలి' అంటూ కాపవ్యుడిదగ్గిరికి వచ్చారు.

'బలమూ, విక్రమమూ కలవాడివి నువ్వు. నాటితేసి నడవడి నీది. ప్రభువ్వయి మమ్మల్ని కొడుకుల్లా రక్షించు. నీకు కావలసిన పనులు మాచేత చేయించుకో' అన్నారు.

'మీరు కోరినట్టు మీనాయకుడిగా వుంటాను. స్నేహంగా మీయోగక్షేమాలు చూస్తాను. కాని మీరు నేను చెప్పినట్టు వినాలి' అన్నాడు కాపవ్యుడు.

'శిశువుల్నీ, మునుల్నీ, స్త్రీలనీ చంపకూడదు. ఎలాటివాడైనా సరే, అతడు మీదకలబడకండా చంపకూడదు, ఆడాళ్ళని చెరపట్టకూడదు. ముఖ్యంగా జంతువుల్లో ఆడజంతువుని చంపకూడదు. ఆవుల్నీ, బ్రాహ్మల్నీ బాధపెట్టకూడదు. వాళ్ళ మేలుకోరి యుద్ధం చెయ్యాలి. పైరువంటలు పాడుచెయ్యకూడదు. ప్రజల్ని బాధపెట్టి పొట్టనింపుకునేవాడు, శవాలు దోలుచుకుతినే పురుగు శవంతోనే నాశనమైనట్టు నాశనమైపోతాడు' అన్నాడు.

సంతోషంగా అంగీకరించారు దొంగలు. అతడు చెప్పినట్టే నడుచుకున్నారు. ఇలా కాపవ్యుడు దొంగల్ని సాధువులుగా మార్చేశాడు. వాళ్ళపాపాలు పోగొట్టాడు. ఇహమూ పరమూ సాధించాడు ప్రసిద్ధుడయాడు.

ఇది కాపవ్యోపాఖ్యానం ఇది చదివినా, విన్నా అడివిలో కూడా ఆపద రాదు. దొంగలవల్లా క్రూరమృగాలవల్లా బాధకలగదు.

# చేపలకథ

ఇంకొకకథ విను. ఎన్నో నీటిజంతువులతో వొక ఏటిమడుగు వుండేది అందులో దీర్ఘదర్శీ, ప్రాప్తకాలజ్ఞుడూ, దీర్ఘసూత్రుడూ అని మూడు చేపలు వుండేవి. మూడూ స్నేహంగా వుండేవి.

ఇంతలో ఎండాకాలం వచ్చింది. దీర్ఘదర్శి తక్కిన రెంటితోనూ అన్నాడు — 'మడుగు ఇంకిపోతూవుంది. నీరు బాగా ఎండిపోయాక, మరొకదగ్గిరికి వెళ్ళలేం. ఇలాటప్పుడే ఎప్పుడూ నీళ్ళు ఇంకని మడుగులోకి వెళ్ళిపోదాం.'

దానిమీద ప్రాప్తకాలజ్ఞుడు అందుకున్నాడు— 'సమయంవచ్చినప్పుడు జాగర్తపడి, అప్పటికి తగిన ఉపాయం అప్పుడు ఆలోచించి చేద్దాం' అన్నాడు.

'సముద్రంలా వుంది ఈమడుగు. ఇప్పుడే ఏంమునిగిందని ఇంత తొందర? విచారించకండి. అంత ఎండిపోతే అప్పుడు చూసుకుందాం' అన్నాడు దీర్ఘసూత్రుడు.

'అది కాదు చెయ్యవలిసిన పని' అంటూ దీర్ఘదర్శి మడుగు వొదిలేశాడు. నీటిప్రవాహంతో నిర్భయంగావున్న దారిపట్టాడు. మరో పెద్దమడుగులోకి వెళ్ళిపోయి హాయిగా జీవించాడు. తక్కిన రెండుచేపలూ మొదటి మడుగులోనే వుండిపోయాయి. కొన్నాళ్ళు గడిచేసరికి ఎండలు ముదిరాయి. పారేనీరు ఆగిపోయింది. వాటికి భయంపుట్టింది మడుగులో నీళ్ళు ఇంకిపోవడం మొదలెట్టాయి. కుతూహలంతో జాలారులు దిగబడ్డారు. ఊజులూ, వలలూ పట్టుకుని చేపలుపట్టి వాళ్ళు సంతోషంతో తాళ్ళకూర్చడం కనిపెట్టాడు 'ప్రాప్తకాలజ్ఞుడు. ఆలోచించాడు. ఈ తాళ్ళలో వొకటి కరిచి పట్టుకుంటాను. చచ్చినట్టు పడివుంటాను. వీళ్ళ సందడి తగ్గాక, చప్పున ఆతాడు వొదిలేసి మడుగులో చేరుకుంటాను, అని గుదిగుచ్చుతున్న

చేపలమధ్య కుదురుగా దూరి తాడు దవడలతో కరచి పట్టుకున్నాడు. గుచ్చిన చేపలాగే తెలివిలేనట్లు వూరుకున్నాడు.

చేపలుపట్టడం ముగించి, గుదిగుచ్చిన చేపలుపట్టుకుని జాలారి వాటి బురద కడగడానికి నీరు గలిగినమడుగులోకి వెళ్ళాడు. గుది నీళ్ళలో వేసీవెయ్యగానే తాను జారిపోయాడు ప్రాప్తకాలజ్ఞుడు. ఆపద తప్పించుకున్నాడు. జాగ్రత్తని తప్పించుకున్న వొకటి. రెండూ చేపలు వున్న దగ్గరికి పారిపోయాడు.

దీర్ఘసూత్రుడు మాత్రం తప్పించుకోలేకపోయాడు. ఎటు పోడానికీ ఉపాయం తోచక, వొక జాలానికి దొరికిపోయాడు. గుండె దిగజారిపోయింది. మతి యింది.

దూరం ఆలోచించి అవసరమైనపని ముందే చెయ్యాలి మనిషి. దీర్ఘసూత్రుడిలాగే ఆపదపాలవుతాడు. అప్పటికి తోచినట్టు తప్ప కండా సమయానికి ధైర్యంతో పనిచేసినవాడు ప్రాప్తకాలజ్ఞుడిలాగ చావుబతుకుల సంశయంలో పడి బతుకుతాడు. రాబోయేది ముందే ఊహించి, తగిన పనిచేసే నీతిమంతుడు దివ్యంగా దీర్ఘదర్శి లాగ సుఖపడతాడు.

## ఎలకాపిల్లి

ధర్మరాజు--బలహీనుడైన రాజు, హెచ్చుమంది పగవాళ్ళ ఎదురుకున్నప్పుడు ఆపద ఎలా తప్పించు కుంటాడు?

భీష్ముడు—ఎలకా పిల్లి కథ వొకటి వుంది. అది నువ్వు అడిగిన ప్రశ్నకి మంచి సమాధానమవుతుంది.

అడివిలో వొక మర్రిచెట్టు వుండేది. దాని కింద కలుగులో పలితుడు అని వొక ఎలక వుండేది. ఆ చెట్టుమీద ఎప్పుడూ రోమ శుడు అని వొక పిల్లి వుండేది. ఆసమీపంలో రోజూ సాయంకాలం

పరిఘుడని వొక హరిజనుడు మృగాలకి వురులుపన్ని వెళ్ళేవాడు. వేకువనే వచ్చి, దొరికినవి పట్టుకుపోయేవాడు.

ఒకనాడు ఆహారంకోసం తిరుగుతూ అక్కడికి వెళ్ళింది ఎలక. ఉరిలోపిల్లి పడివుండడం చూసింది. భయంలేకండా ఆహారంకోసం అటూ, ఇటూ తిరిగింది. చంద్రుడని వొక గుడ్లగూబా, హరిక అని వొక ముంగిసా అక్కడే అవుపించాయి. మేతకోసం వచ్చిన ఎలక వాటినించి తప్పించుకునే దారిలేక బెంగపెట్టుకుంది. అంతలోనే ధైర్యం తెచ్చుకుంది. ఉపాయం ఊహించింది. పిల్లి దగ్గిరకి వెళ్ళింది

'ఉరి కొరికేస్తాను. సులువుగా నిన్ను విడిపించేస్తాను. ఇది నీఅదృష్టం అనుకో. పగమానేసి నాతో నేస్తంకట్టు ముంగిసీ, గుడ్లగూబనీ చూసి నా వొళ్ళంతా వొణుకుతోంది. నీనేస్తం కలిస్తే నీ వొళ్ళోకూచుని వాటిభయం తప్పించుకుంటాను' అంది.

'ఆపదలో వున్నప్పుడు ఆదుకున్నవాడే వవుతావు' అంది పిల్లి—'మహాత్మా! నీకు మేలుచెయ్యనూ? దేవుడితోడు. తప్పకండా సాయంచేస్తాను. భయపడకు. నాదగ్గిరకిరా. ముంగీ, గూబా నన్ను చూస్తేనే భయపడతాయి. నీచుట్టుపట్లకి రావు'

'అవును. అది తెలిసే నీతో సంధిచేసుకోవాలనిపించింది. దీనివల్ల నేను బతికిపోతాను నువ్వు విడుదలా పొందుతావు. తప్పదు' అంటూ వెళ్ళి శంకలేకండా పిల్లివొళ్ళో కూచింది ఎలక. అదిచూసి ముంగీ, గుడ్లగూబా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాయి. సంతోషించింది ఎలక. కాని అన్న ప్రకారం వురితాళ్ళుమాత్రం కొరకలేదు. మెల్లి మెల్లిగా కరుస్తూ వూరుకుంది. అది కనిపెట్టింది పిల్లి. 'ఇది బావుందా నేస్తం? నీ అపాయం తప్పిపోయింది. ఇప్పుడు వురి కొరకకండా జాప్యం చేస్తున్నావు. ఇలా కృతఘ్నత చెయ్యడం తగునా? ద్రోహంచేస్తావా' అంది జాలిగా.

'ఆశ్రయించిన వాళ్ళని రక్షించే స్వభావం నీది. నీకు అపద రానిస్తానా? అంతఅన్యాయం చేస్తానా? అయినా భయపడుతున్నాను. నిన్ను నమ్మలేక పోతున్నాను. అంచేత వురి కొరకడం ఆలస్యం చేస్తున్నాను. ఇదినీపట్లద్రోహం అనుకోకు. హరిజనుడు అవుపడడంతోనే వురితాళ్ళు కొరికేస్తాను. ఏమంటే, వురినించి బైటపడి నువ్వు ఏంతల పెడతావో పగవల్ల! బలవంతుడితో ఉపాయంతో సంధి చేసుకున్నా అతణ్ణి నమ్మకండా వుండడమే నీతి అంటారు పండితులు. హరిజనుడు అవుపడీ అవుపడడంతోనే నువ్వు భయపడి చెట్టు మీదకి వెళ్ళిపోవాలి. నేను నా ఇంట్లో దూరడానికి అదే సమయం. అలాగు కాగానే నీకు మేలు చేస్తాను. నిజం. నీకు మాత్రం తెలియందేముంది?' అంది ఎలక.

'అలా అనుకుంటా వెందుకూ?' అంది పిల్లి — 'నీ ప్రాణం నేను రక్షించాను. అలాగే నువ్వూ నా ఆపద గట్టెక్కించాలి కదా చప్పున?'

'తొందరపడకు. తగిన సమయంలో చేసిన ప్రయత్నమే పూర్తిగా ఫలిస్తుంది. మరోలా అనుకోకు. ఊరుకో' అంది ఎలక.

ఇంతలో వేకువపడింది. కుక్కలూ, కొందరు సహాయులూ వెంట వేసుకుని, అడావుడిగా యముడిలా ప్రత్యక్షమయ్యాడు పాపాత్ముడు పరిఘుడు. చూసింది పిల్లి. నిలువునా ప్రాణాలెగిరిపోయినట్టయింది. 'నేస్తం, ఏం దారిక? అడుగో యమదూతలా వచ్చేశాడు పరిఘుడు' అంది పిల్లి.

'భయపడకు' అంది ఎలక. చరచరా వురితాళ్ళు కొరికిపారేసింది. భయపడుతూ వొక్క పరుగున వెళ్ళి చెట్టెక్కిపోయింది పిల్లి. కన్నంలో దూరి తొంగిచూసింది ఎలక.

సందడిగా వచ్చి చూశాడు పరిఘుడు. ఉరి తుక్కు తుక్కు అయిపోయి వుంది. విచారిస్తూ వెళిపోయాడతడు.

అప్పుడు కమ్మని మాటలు చెప్పింది పిల్లి— 'మేలుచేసి, తగిన స్నేహితుణ్ణి సంపాదించాక, అతడి మంచిగుణాల సుఖం అనుభవించకుండా విడిగా వుండడం నీతిమంతుల లక్షణం కాదు. భయపడడం తెలివితక్కువ. మొదట ప్రేమగా నన్ను నమ్మావు. భయం పోగొట్టుకున్నావు. నాకు మేలుచేశావు. చివరికి నమ్మకపోడం న్యాయమేనా చెప్పు? నా సిరిసంపదలకి నువ్వుకూడా వారసుడివే అనుకో. ప్రీతిగా అనుభవించు. రా. బలవంతులైన నా చుట్టాలూ, నేనూ నీకు సాయం చేస్తాము. కలిసిమెలిసి హాయిగా వుందాం. సందేహించకు. కోరికలు తీర్చుకో' అంది.

'నువ్వు అన్నది న్యాయమే' అంది ఎలక — 'కాని నామాటలు విను. పగవాళ్ళని, స్నేహితుల్ని తెలుసుకోడం ఎంత సూక్ష్మమైన పని. ఆ నేర్పు ఎంతో దుర్లభం. పగవాళ్ళలా అవుపడుతున్నా, స్నేహభావమే చూపుతారు కొందరు. స్నేహితుల్లాగే వుండి పీకలు తీస్తారు కొందరు. లోకంలో అంతటా చూస్తూనేవున్నా మిది. అంచేత నేను రాసుకు తిరగడం కూడనిపని. నువ్వూ అలాగే నాకు లోబడి, అజాగ్రత్తగా వుండడం తగదు ఏమంటావా? బలవంతులైన శత్రువులు ప్రయోజనంకోసం లోబడతారు. మాటులో వుంచిన వాటికోసం ఏనుగులు దొరికిపోడంలేదూ? అవసరంపడి ఒకప్పుడు పగవాడితో స్నేహంచేసినా, పాము పట్టుకుని, దాన్ని నమ్మక, దాని నోటివిషం తీసిపారేసిన మనిషిలాగ జాగ్రత్తపడడమే మంచిది. కనక మరేమీ అనుకోకు. నీ పొరుగునే వుంటాను. నీకు ఎప్పుడు ఏం కావలసినా చేసిపెడతాను. నీకు నేను ఆహారం. నిన్ను నమ్మి, దగ్గిర చేరితే ఎప్పుడు ఎలావుంటుందో నీమనసు? ఎప్పుడు ఏం చెయ్యాలని బుద్ధిపుడుతుందో? నువ్వు వూరుకున్నా, నీకొడుకులూ, స్నేహితులూ వూరుకోరు కదా! అంచేత దయతో క్షమించు. ఇలాగే వుంటాను.

'అంతేకాదు, పురిలోపడి రాత్రంతా ఆకలితో వున్నావు. చల్దితిండి కావాలి నీకు. అందుకే నన్ను పిలుస్తున్నావు. నాకు తెలియదూ? నువ్వు పిలిచినంతమాత్రాన వచ్చేస్తానూ నేను?' అంది.

'అయ్యో, నేస్తం! ఇలా అనుకోవచ్చా? నా ప్రాణం కాపాడావు. నిన్ను శత్రువనుకుంటానా? ఆమాత్రం కృతజ్ఞత లేదూ నాకు? పౌరుషవంతుణ్ణి కానూ? భయపడకు' అంది పిల్లి.

'నీవల్ల నేను బతికాను. నావల్ల నువ్వూ బతికావు, హరిజనుడి కంటపడకండా. ఇలా జరిగిన స్నేహం చాలు. ఇకమీద నేను నీదగ్గిరికి రాకూడదు. దీనికి వెనక శుక్రాచార్యులు చెప్పిన మాటలు విను. 'బలవంతుడైన శత్రువుతో అవసరం కలిగి స్నేహం చేసినా, అవసరం తీరిపోయాక దూరంగానే వుండాలి. కాకపోతే చివరికి కీడు తప్పదు. నమ్మదగని వాళ్ళని నమ్మకండానే వుండాలి. నమ్మదగిన వాళ్ళనైనా మితిమీరి నమ్మకూడదు. తనని ఇతర్లు నమ్మేటట్టు నడుచుకుంటూనే తానేమో ఇతర్లని నమ్మకూడదు. ఇదే నీతి' అన్నాడు శుక్రుడు. బతకవలసిన పద్ధతే ఇది. అంచేత నీబోటి వాళ్ళని నమ్మకండానే నేను బతుకుతాను. నువ్వుకూడా వేటగాడివంటి వాళ్ళ మాయల్లో పడకుండా హాయిగా బతుకు, వెళ్ళు' అంది ఎలక.

విని సిగ్గుపడిపోయింది పిల్లి. తన చోటికి తాను వెళ్ళిపోయింది. ఎలక మరో కన్నం దూరి సుఖంగా బతికింది.

ధర్మరాజా! బలమైన శత్రువుల ఆపద తప్పించుకోడానికి హీనుడైన పగవాణ్ణయినా తనలో కలుపుకోవాలి అని ఎలకా పిల్లీ ఉపాయం ఉపదేశించాయి.

ధర్మరాజు—ఎవళ్ళనీ నమ్మకపోతే మనస్సుకి శాంతివుండదు. నమ్మితే కష్టాలు తప్పవు. అంచేత నమ్మడమూ, నమ్మకపోడమూ ఈ రెంటిలో ఏది కర్తవ్యమో నిశ్చయించలేకపోతున్నాను.

## మైనగోరకథ

భీష్ముడు—దీనికీ వొక కథవుంది. బ్రహ్మదత్తుడని వొకరాజు వుండేవాడు. అతడిపట్నంలో పూజని అని వొక మైనగోర వుండేది. ఎంచక్కా మాట్లాడేవది. అదివొక పిల్లపెట్టింది. కమ్మని పళ్ళూ అవీ తెచ్చి, దానికి పెట్టేది. వాటిలో మంచిపళ్ళు ఎంచి కొన్ని రాజు కొడుక్కి ఇచ్చేది. వాడూ వచ్చి, మచ్చికతో దాంతో ఆడుకునేవాడు. ఒకనాడు వాడి దగ్గిరలేనప్పుడు రాజుకొడుకు తలపగలగొట్టి పిట్టపిల్లని చంపేశాడు. దాని తల్లి వచ్చి చూసింది. గోలు గోలుమంది. 'అయ్యో, ఏదైనా పంచుకుని, కలిసీ మెలిసీ ఆడుకునేవాళ్ళు. పాపిష్టి బాలుడు పొగరెక్కి చంపేశాడు దీన్ని! రాజుకొడుకుకదూ! రాజ వాళ్ళకి స్నేహమేమిటి? దయాదాక్షిణ్యా లుండవు. మేలు మరిచి పోతారు. రాజులు నమ్మదగినవాళ్ళు కారు. మత్తులు. క్రూరులు' అంటూ తిట్టిపోసింది. 'పగతీర్చుకుంటాను' అంటూ గోళ్ళతో రక్కేసి, రాజు కొడుకు గుడ్లు రెండూ వూడపెరికేసింది. చప్పున ఆకాశం మీదికి ఎగిరిపోయింది. అక్కణ్ణుంచే బ్రహ్మదత్తుడితో అంది—'రాజా! నీకొడుకు నాబిడ్డని చంపేశాడు. పాపం పోసుకున్నాడు. దానిఫలం వెంటనే అనుభవించాడు. అంతేకాని మీ పిల్లాడిపట్ల నేను చేసిన క్రౌర్యం ఏమీ లేదు. చేసిందానికి ప్రతీకారం చేశాను. నాకు ఏపాపమూ అంటదు.'

'నువ్వు అన్నది సరిగానే వుంది' అన్నాడు రాజు—'నిజమే, అయితే నువ్వు వెళ్ళిపోడంమాత్రం నేను సహించలేను. నామనస్సు ఎంతైనా బాధపడుతుంది. కనక ఎప్పటిలాగే వచ్చి వుండు.'

'పరస్పరం కలిగిన ఈపగ శాంతించదు' అంది పూజని— 'నీతీపిమాటలకి మోసపోయి మళ్ళీ నీదగ్గిరచేరడం తగదు.'

'చేసినదానికి ప్రతీకారం చేయడంతోనే పగ తీరిపోతుంది. చేరినవాళ్ళని ఆదరించక ఎలాటి తుచ్ఛులైనా తప్పు మోపుతారా చెప్పూ?' అన్నాడు బ్రహ్మదత్తు.

'సేహం చెడిపోయాక, తియ్యనిమాటలతో పగ మరిచి, చేరితే చావైనా సంభవిస్తుంది, కయ్యమైనా వస్తుంది, లేదా కీడైనా మూడుతుంది. అంతేకాని మేలు కలుగుతుందా! భూమివల్లా, దాయాదులవల్లా, ఆడాళ్ళవల్లా, మాటపట్టింపువల్లా, కీడువల్లా— ఈఅయిదింటివల్లా పగ పుడుతుంది. పగపుట్టాక వొకంతట పోదు. మానులోవున్న అగ్గిలాగ గూఢంగా వుంటుంది. అంచేత నమ్మిన మూర్ఖుడు ఎప్పుడైనా చెడతాడు. సందేహం లేదు. తల్లిదండ్రుల్నీ, కుమాళ్ళనీ, అన్నదమ్ముల్నీ, స్నేహితుల్నీ నమ్మరాదన్నప్పుడు, మనసులో పగవున్న వాళ్ళని నమ్మవచ్చునా? ఈచాతుర్యంమాటలు కట్టిపెట్టు' అంది పూజని.

'కాలాన్ని పట్టి జనులకి కీడూ, మేలూ కలుగుతూవుంటాయి. నువ్వూ, నేనూ చెప్పగలమా అవి? ఇంతెందుకూ, నిన్ను వొదిలిపోడానికి అంత మూర్ఖుణ్ణా నేను?' అన్నాడు రాజు.

అయినా నమ్మలేదు మైనగోర. రాజు మొహం తేరిచూసి, 'చల్లనిమాటల్లోనే అడిగివుండి గుప్పుమంటుంది కోపం. సముద్రంలోనే ఆరిపోకండావుంటుంది బడబాగ్ని' అంటూ రాజుమాటకి లొంగకండా తనకి నచ్చినచోటికి వెళ్ళిపోయిందది.

తన సిరి కాపాడుకుందికి ప్రజల్లో ఎవళ్ళనీ రాజు నమ్మకూడదనే చెపుతారు బృహస్పతీ మొదలైనవాళ్లు. ఆమాటలు గమనించాలి.

ఇదేవిషయం సౌవీర దేశంరాజు శత్రుంజయునికి కణికుడు ఉపదేశించాడు. ఆహితవాక్యాలు ఆలకించు. 'నవ్వుమొహంతో శత్రువుల బంధువులతో మాట్లాడాలి రాజు. కడుపులో కత్తైరా,

నాలుకమీద బెల్లము పెట్టుకు మాట్లాడాలి. తన దాయాదుల్ని నమ్మి, వెంటపెట్టుకు వెళ్ళి, శత్రువుల్ని గెలవాలి. రాజ్యం సంపాదించాక, వాళ్ళను సంతోషపెట్టాలి. సుఖం కలిగించాలి. అయితే మనసులో ఎన్నడూ వాళ్ళను నమ్మకూడదు. పామున్న ఇంట్లో వున్నట్టు జాగ్రత్తగా వుండాలి. సమయంవస్తే పగవాణ్ణి వీపుమీద మొయ్యాలి. రాతిమీద ఎత్తేసి కుండలాగ సమయంచూసి కుదేసి, కడతేర్చాలి.

'ఆగ్రహమూ, జూదమూ, వేటా, ఆడదీ—ఇవి రాజులకి తగదు. అయినా మితిమీరితే మాత్రం ఆపద తెస్తాయి.

'తన కార్యం నెరవేరేదాకా ఎవ్వడికీ లోబడకూడదు రాజు. ప్రజల విషయంలో వినీ విననివాడిలాగ, చూసీ చూడనివాడిలాగ వుండాలి.

'తన ఇష్టంలేని కార్యం, ఆస కనపరుస్తూ దినాలు గడిపి కాలక్షేపం చెయ్యాలి. ఏవో అడ్డుసాకులు చెప్పి, తోసిపుచ్చవచ్చు తరవాత.

'గర్వపోతై మంచిచెడ్డా తెలియకుండా అన్యాయంగా ప్రవర్తించినవాణ్ణి, అతను గురువైనా సరే, దండించాలనే అంటారు పండితులు.

'అప్పు పూర్తిగా తీర్చకపోయినా, అగ్ని పూర్తిగా ఆర్పకపోయినా, పగ పూర్తిగా నాశనం చెయ్యకపోయినా ఆ మిగిలినవే పెంగి పెరిగి తుదకి ప్రాణం తీస్తాయి.

'మృదుత్వంతో మృదుత్వాన్ని నరకెయ్యవచ్చు. మృదుత్వంతో శత్రువుని తెగెయ్యవచ్చు. మృదుత్వంతో సాగనిదంటూ లేదు. కనక మృదుత్వమే అన్నిటికంటె వాడి సుమా!'

ధర్మరాజు— ధర్మం నశించి, కరువూ కాటకాలూ వచ్చి, పాపాలు దుస్తరమై, ఈతిబాధలూ దాపురిస్తే బ్రాహ్మణులూ, రాజులూ, కోమట్లూ మొదలైనవాళ్ళు ఎలా ప్రాణాలు నిలుపుకోవాలి?

## విశ్వామిత్రుడు కుక్కమాంసం తిన్నకథ

భీష్ముడు — విశ్వామిత్రుడు కుక్కమాంసం తిన్నకథ నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధానం అవుతుంది.

త్రేతా ద్వాపరయుగాల సంధిలో ప్రజల పాపంవల్ల పన్నెండేళ్ళు వర్షంలేకండా పోయింది. భూమి తపించిపోయింది. ఏళ్ళూ, చెరువులూ ఎండిపోయాయి. అంతటా వ్యవసాయాలు చెడిపోయాయి. చెట్లూ చేమా మాడిపోయాయి. భూమి సారంలేకండా అయిపోయింది. ఆవులూ, గేదెలూ చచ్చిపోయాయి. రాజులు మేరతప్పిపోయారు. రాజ్యంలో ధాన్యం కొల్లగొట్టారు. అధర్మం అంతకంతకీ అధికమైంది. బలవంతులు దిక్కులేనివాళ్ళని బాధపెట్టారు. యజ్ఞాలూ, దేవతాపూజలూ అడుగంటాయి. బ్రాహ్మణులు జాతీ, నీతీ లేకండా అయిపోయారు. తిండికిలేని జనులు ఎక్కడపడితే అక్కడ కూలిపోయారు. ఘోరంగా అంతటా పీనుగుపెంటలే కనపడ్డాయి.

అప్పుడు మునీశ్వరుడు విశ్వామిత్రుడు ఆకలితో అంతటా తిరిగాడు. అతడి ధైర్యం దిగజారిపోయింది. అవుపడ్డవాళ్ళనల్లా అన్నమూ, మాంసమూ, పళ్ళూ, దుంపలూ అడిగాడు. ఎక్కడా ఏమీ దొరకలేదు. ఆకలితో అల్లాడిపోయాడు

తిరిగి తిరిగి ఒక మాలపల్లె చేరాడు. గొడ్డుపేగులు పోగులు పడివున్నాయక్కడ. పందుల డొక్కలు కుప్పలు పడున్నాయి.

కుక్కల మాంసాలు దొర్లుతున్నాయి. ఎప్పుడూ జంతువులు చంపుతూ, దుర్వ్యసనంలో మునిగి తేలుతున్న మాలపల్లె అది.

బాధతో మరి కదలలేకపోయాడు విశ్వామిత్రుడు. అడుగుతీసి అడుగు వెయ్యలేకపోయాడు. కిందపడిపోయాడు. ప్రాణాలు పోతుంటే ఊరుకోకూడదనుకున్నాడు. ఉపాయం ఆలోచించాడు. అప్పుడే చంపి, తిత్తి వొలిచి, గాలికి ఆరవేసిన కుక్క మాంసం చూశాడు. ఇది తప్ప ప్రాణం నిలుపుకుందికి మార్గం దొరకదు ఇప్పుడు. ఇదైనా దొంగతనం చేసి సంపాదించాలి నేను. ప్రాణం పోకుండా అపుకుందికి మరో ఉపాయం ఏదీ లేకపోయినప్పుడు దొంగతనమైనా ధర్మమే అవుతుంది, తక్కువ వాడిధనమైనా తీసుకోడం తప్పుకాదు. కనక చండాలుడిసొత్తు కుక్క మాంసం దొంగతనం చేస్తాను. ప్రాణం నిలుపుకుంటాను' అని నిశ్చయించుకున్నాడు.

అర్ధరాత్రయింది. మాలలందరూ నిద్రపోతున్నారు. మెల్లిగా లేచాడు విశ్వామిత్రుడు. మాంసంపట్టి లాగేసరికి ఆదగ్గరే నిద్రపోతున్న మాల దైవికంగా మేలుకున్నాడు. 'ఎవడివి నువ్వు? మాంసం ఎత్తుకుపోతున్నావు! నేను నిద్రపోతూ ఉన్నాననుకున్నావా? నిన్ను చంపేస్తాను' అంటూ లేచాడు. భయపడిపోయాడు విశ్వామిత్రుడు. 'నేను విశ్వామిత్రుణ్ణి' అన్నాడు.

వినయంగా పక్కమీంచి దిగాడు మాల. జాలిగా కన్నీళ్లు పెట్టుకుంటూ చేతులు జోడించాడు. 'మహాత్మా! ఏమిటి నీ ఉద్దేశం?' అని అడిగాడు.

'ఆకలి దహించుకు పోతోంది' నెమ్మదిగా అన్నాడు విశ్వామిత్రుడు—'ప్రాణం నిలబెట్టుకుందికి, ఇది పాపమైనా, కుక్కమాంసం దొంగిలిస్తున్నాను. అగ్ని ఎంతో శుచిమంతుడు. అయినా అన్నీ తింటాడు. అలాగే అనుకో నన్ను.'

'జంతువు లన్నిటిలోనూ కుచ్ఛితమైంది కుక్క. కుక్క మాంసం తిని ధర్మమెందుకు పోగొట్టుకుంటావు? మరో ఉపాయం చూసుకో' అన్నాడు మాల.

'బ్రహ్మతేజస్సు నాకు ప్రాపుగా వుంది. భయందేనికి? ఎలా అయినా బొందిలో ప్రాణం నిలుపుకోడమే ధర్మం. బతికివుంటే తపస్సు చేతా, విద్యచేతా పాపం వొదిలించుకోవచ్చు. కనక జీవనాధారమైన ఈమాంసం వొదిలిపెట్టను' అన్నాడు ముని.

'ఇది నీచవృత్తి స్వామీ!' అన్నాడు మాల—'ధర్మం కాదు. మీలాటివాళ్ళే ఇలా చెయ్యవచ్చా?'

'అదేమిటి? అంత గొప్ప అగస్త్యుడు రాక్షసమాంసం తిన లేదూ? అతడి తేజస్సూ, గొప్పా తరిగిపోయాయా?' అన్నాడు విశ్వామిత్రుడు.

'పరోపకారంకోసం తిన్నాడు అగస్త్యుడు. పుణ్యాత్ముడయాడు. పరోపకారంకోసం పాపంచేసినా అధర్మం రాదు' అన్నాడు మాల.

'నాహృదయం బ్రాహ్మణధర్మానికీ, బ్రహ్మవిద్యకీ ఆధారం. అందుకనే ఈపని చేస్తున్నాను. కనక పాపంలేదు. నువ్వు మాత్రం అడ్డురాకు' అన్నాడు ముని.

'మాంసం వొదలలేక ఇలా అంటున్నా ననుకోకు. నీ తేజస్సు బుగ్గయిపోతుందని బాధగావుంది నాకు' అన్నాడు మాల.

'నిజంగా నామీద నీకు జాలిగావుంటే, ప్రాణం నిలుపుకుంటాను మాంసం ఇయ్యి. అలా అయితే దొంగతనంకూడా కాదు. అబద్ధ మాడకండా సంపాదించిన వస్తువువల్ల పాపంలేదు' అన్నాడు ముని.

'మహా పుణ్యాత్ములు మీరు. ఒక నీచుడి దగ్గిర దానంపుచ్చు కుంటారా స్వామీ? అయితే ఇంతకంటే అధికం అనడానికి నాకే

భయంగా వుంది. సరే, మీ ఇష్టమే కానీ' అంటూ కుక్క మాంసం మునిచేతిలో పెట్టాడు మాల.

పుచ్చుకున్నాడు విశ్వామిత్రుడు. కుక్కమాంసం తిని ప్రాణం రక్షించుకున్నాడు.* అనంతరం లోకం చల్లబడినట్లు వానకురిశాడు దేవేంద్రుడు. విశ్వామిత్రుడు సంతోషించాడు తపస్సుచేసి, దోషం పోగొట్టుకున్నాడు. నిశ్వ్రవతంతో ప్రకాశించాడు. ఆపత్సమయంలో విషయం ఇలా వుంటుంది.

ధర్మరాజు — ధర్మసూక్ష్మం తెలుసుకోడం ఇంత కష్టం అన్నమాట! ఈకథవిని ఎంతో విచారం కలిగింది.

భీష్ముడు — ధర్మం ఎన్నోవిధాలుగా వుంటుంది. అన్నీ తెలుసుకోవాలి రాజా. దీనికి విచార మెందుకూ?

ధర్మరాజు — శరణంటే రక్షించేవాళ్ళకి ఏమాత్రం పుణ్యం దొరుకుతుంది?

## గువ్వకథ

భీష్ముడు — ముచికుంద మహారాజుకి శుక్రాచార్యుడు ఓ గువ్వకథ చెప్పాడు. అది వింటేనే పాపాలుపోతాయి. నువ్వు అడిగినదానికి అది సమాధానమవుతుంది.

ఒకబోయవాడు వుండేవాడు. పరమపాపాత్ముడతడు. ఎప్పుడూ పక్షులు చంపడమే అతడి పని. తిన్నవి తినేవాడు. మిగిలినవి అమ్ముకునేవాడు. ఇదే బతుకు అతడిది. దానికి కావలసిన సాధనాలన్నీ పట్టుకుని అడివిలో తిరిగేవాడు. ఒకనాడు పెద్ద గాలీవానా వచ్చింది.

* వామదేవమహారుషి ఇలాగే కుక్కమాంసంతిని ప్రాణం నిలుపుకున్నాడు' చూ. మనుస్మృతి, అధ్యా. 10. 106., ఉషస్తిరుషి ఎంగిలి తిని ఆకలి తీర్చుకున్నాడు' చూ. ఛాందోగ్యోపనిషత్తు. 1. 10.

జంతువులన్నిటికీ నాశనం తెచ్చిపెట్టింది గాలి. అడివంతా నీటిమయమై పోయింది. బెంగపెట్టుకున్నాడు బోయ. వరదలో ఈదుకు పోయి వొక మూరకి చేరాడు. అక్కడ జీబుగా వున్న వొక చెట్టుకింద తలదాచుకున్నారు.

రాత్రిపడింది. ఒక బండ పక్కచేసుకొని, చలితో వొణికి పోయాడు. చెట్టుకూ దిక్కు చూసి చేతులు జోడించాడు. 'దయతలచి నన్ను రక్షించడంకోసం ఇక్కడి ప్రాణికోటిని ప్రార్థిస్తున్నాను. శరణు వేడుతున్నాను' అంటూ రాతిమీద పడుకున్నాడు.

ఆ చెట్టు తొర్రలో వొక ముసలి గువ్వ నివసిస్తూ వుండేది. తన భార్య ఎక్కడికో మేతకి వెళ్ళి రాలేదని అది విచారిస్తూ వుంది. 'ఎక్కడుందో! ఇంచేపయింది. నన్ను వొదిలేసి ఎక్కడుంటుంది? ఏమిటి కారణం? ఏమయిందో! గాలిదెబ్బకి చచ్చిపోయిందేమో! అది లేక పోతే నా బతుకు వృథా. ప్రేమ అధికంగా వున్న భార్యే భర్తకి ఇహ పరసుఖసాధనం. ఏం చేసేది! నా ఇల్లు పాడుపాడుగా వుంది' అంటూ ఎంతో దుఃఖపడింది.

బోయవలలోనే వుంది దాని భార్య. భర్త దుఃఖం విని. ఎంతో సంతోషించింది. 'మగడికి నచ్చిన ఆడదే పుణ్యాత్మురాలు' అనుకుంది. 'ఇటువంటి ప్రేమ వినగలిగాను. ధన్యురాలి నయాను. యముణ్ణి గెలిచాను'. అనుకుంటూ భర్తకి తన స్థితి చెప్పింది. 'విధి కృతానికి దుఃఖించి లాభంలేదు. శరణన్నవాణ్ణి రక్షించడం పుణ్యమంటారు పండితులు. ఈ బోయ శరణువొచ్చాడు. చలితో కొంకరపోతున్నాడు. నీ చేతనైనంత సహాయం చేసి, ఇతడు ఆపదపాలు కాకండా చూడు' అంది.

భార్యమాటలు వింది గువ్వ. విచారం విడిచిపెట్టేసింది. జాలి పడి బోయతో మనిషి భావంతో మాటాడింది— 'అన్నా, ఆలిసి

పోయావు. మా ఇంటికి అతిథివై వచ్చావు. వెంటనే నీకు నేను ఏం ఆతిథ్యం చెయ్యాలో, నీకోరిక ఏమిటో చెప్పు' అని అడిగింది.

ప్రాణం లేచివచ్చింది బోయకి. 'పక్షివర్యా! చలిలో అవయవాలన్నీ తెగిపోతున్నాయి. ఇది తప్పించాలి' అన్నాడు.

కనికరించింది గువ్వ. చప్పున ఇన్ని ఎండుపుల్లలు ఏరి తెచ్చింది. పక్కపల్లెకి ఎగిరి వెళ్ళి, ఒక పుడక కొసని నిప్పు తెచ్చింది. పుల్లలు ముట్టించింది. 'అన్నా, ఈఅగ్గిలో వొళ్ళు కాచుకో. లే.' అంది.

బోయ లేచాడు. చలి కాచుకున్నాడు చలిబాధ తీరింది. ఆకలి ముంచుకువచ్చింది. గువ్వతో చెప్పాడు. మరో ఉపాయం లేక విచారించింది గువ్వ. తెల్లపోతూ తల వొంచుకుంది. 'అన్నా, పక్షుల బతుకులో దాచిపెట్టుకోడమంటూ లేదు. దొరికింది తింటాం. ఆకలి తీర్చుకుంటాం. అంతే. అయితే నువ్వు అతిథివి. అలిసిపోయావు. నీకు ఆతిథ్యం ఇచ్చితీరాలి నేను. నా శరీరమే ఆహారంగా ఇస్తున్నాను. పుచ్చుకో' అంటూ చప్పున ప్రదక్షిణంచేసి అగ్గి మంటలో పడిపోయింది.

నిచ్చెరపోయాడు బోయ. కొంతసేపు కొయ్యబారిపోయాడు. 'లోకంలో ఎక్కడైనా వుందా ఇది!' అనుకున్నాడు— 'శరీరమే ఇచ్చేసింది పక్షి! నానడవడి మాత్రం నిందకి పుట్టిల్లయింది. ఎంత చెడ్డవాణ్ణి నేను! ఘోరమైన ఈ క్రూరవృత్తి ఇకమీద మానేస్తాను.

ఈ పక్షి నిజంగా గురువై బుద్ధిచెప్పింది నాకు' అంటూ వైరాగ్యం తెచ్చుకున్నాడు.

'ఇది భార్యనీ, బంధువుల్నీ వొదిలేసి, అగ్గిలో వురికింది. ఎంత గొప్పపని చేసింది! ఇలాంటిసాహసమే నేనుచేస్తాను. పాపాలుపోడానికి మహాప్రస్థానం చేస్తాను. పుణ్యంసంపాదిస్తాను' అనుకున్నాడు. మోహం

విడిచిపెట్టేశాడు. మనస్సు శాంతి చేసుకున్నాడు వలలోని పిట్టలన్నీ వొదిలేశాడు. పిట్టల్ని వేటాడే సాధనసామగ్రి యావత్తూ పారేశాడు. వ్రతం పూని వెళ్ళిపోయాడు.

తనభర్త అగ్గిలో పడడంవల్ల ఆడగువ్వ దుఃఖంతో కన్నీళ్లు కార్చింది. ఎంతో ఏడ్చింది. 'నేను ఆకలితో వుంటే సహించవు. ఏమైనా నేను తింటేనే కాని తినవు. నేను ఆయాసపడితే ఏడ్చేవాడివి. అలాటి నువ్వు నన్ను వొదలేశావా! న్యాయమేనా నీకు? చిగురు గుత్తులతో అందంగావున్న పొదలపక్కకి నన్ను తీసుకు వెళ్ళేవాడివి. సెలయేళ్ళ తేటనీళ్ళలో స్నానమాడించేవాడివి. కొండకొమ్ముల తెప్ప వెక్కించేవాడివి. మామిడి మొక్కల తోపుల్లోకి తీసుకు వెళ్ళేవాడివి. పూసిన పువ్వులు నిండిన నేల బావుల పక్కకి మెల్లిగా చేర్చేవాడివి. ఆనందంగా నాతో విహారించేవాడివి. మరిచిపోగలనా నిన్ను! నాథా! నీతోనే వస్తాను. భర్తతో శరీరంవొదలిన ఆడది, భర్తతో కలిసి పుణ్యలోకంలో సుఖపడుతుం దంటారు.'

ఇలా ఏడ్చి ఏడ్చి అగ్గిమండించింది. భర్తని తలుచుకుంటూ ప్రదక్షిణంచేసింది. మంటలో వురికి భర్తని కలుసుకుంది.

దేవతలు దివ్యవిమానం తెచ్చారు. గువ్వదంపతుల్ని రత్న భూషణాలతో తీసుకుపోయారు. దేవతాస్త్రీలుఅభివందనాలు చేశారు. పుణ్యవ్రతం పూనిన బోయకి అదంతా అవుపడింది.

'నేనూ ఇలాగే అవుతాను' అని ఉత్సాహంతో బైలుదేరా డతడు. ముళ్లు గీరుకుపోయి, వొళ్ళు రక్తాలు కారుతున్నా కాన కండా అడివిలోంచి తోసుకు పోయాడు. ఒక దగ్గిర దావానలం మండు తోంది. అడివంతా కాల్చేస్తోంది. చూసి సంతోషించాడు బోయ. అందులో వురికేశాడు. శరీరంవొదలి దేవత్వం పొందాడు.

ఈ గాథ విన్నా, చదివినా గోవుని చంపిన పాపమైనా వొదిలిపోతుంది. వెయ్యియాగఫలాల సౌఖ్యం కలుగుతుంది. శరణన్నవాణ్ణి రక్షించకపోతే మాత్రం పాపం చుట్టుకుంటుంది. ఎన్నడూ వొదలదు.

ధర్మరాజు— బుద్ధిపూర్వకంగా చెయ్యని పాపం ఎలా వొదుల్చుకుంటాడు మనిషి?

భీష్ముడు — పూర్వం పరీక్షిత్తు మహారాజు కొడుకు జనమేజయ మహారాజు బుద్ధిపూర్వకంగా చెయ్యని బ్రహ్మహత్యాపాపం వొదుల్చుకున్నాడు. ఇది పురాణకథ మునులు చెప్పింది.

బ్రహ్మహత్యాపాపం పట్టడంవల్ల ప్రజలు వొదిలేశారు జనమేజయుణ్ణి. బ్రాహ్మణులు నిందించారు. ఎంతో బాధపడిపోయాడు అతడు. దుఃఖపడుతూ పట్నం వొదిలి వెళ్ళిపోయాడు. ఒక్కడూ అడివిలో దూరాడు. వెదుక్కుంటూ శౌనక మునిఆశ్రమం చేరాడు. మునికి దండప్రణామం చేశాడు. వినయంగా చేతులుజోడించి నుంచున్నాడు.

'ఏమిటిది! చెమటకంపు కొడుతోంది. నిన్ను చూస్తే పీనుగు చూసినట్టుంది. ఇక్కడికి ఎందుకు వచ్చావు! ఇంకెక్కడికైనా పో. ఈజన్మలో తల్లకిందుగా వేలాడతావు. చచ్చాక నిన్ను కాకులు పొడుచుకు తింటాయి. నరకంలో పడతావు' అన్నాడు శౌనకుడు.

'నిందించదగిన మనుష్యుణ్ణే నేను. పుణ్యవ్రతులైన నీ బోట్లు ఇలా అనడం న్యాయమే. అందుకనే నీ పాదాలకి మొక్కి, నీవల్ల పాపం పోగొట్టుకోవాలని వచ్చాను. దయచూపి ఆదరించు' అంటూ వేడుకున్నాడు రాజు.

కనికరించాడు శౌనకముని. 'అల్పబుద్ధులు కొందరు నన్ను ధిక్కరించి నవ్వితే నవ్వని. వాళ్ళని లెక్కచెయ్యను. పండితులు మెచ్చుకునేమాట చెపుతాను, విను. తెలివితక్కువవాడు మాత్రం చేసిందానికి మొత్తుకుంటాడు చివర. ప్రజ్ఞావంతుడు విచారించడు. ఏమంటే

చేసినపాపం పోగొట్టుకోగల దశకు. నువ్వు చేసిన పాపానికి పశ్చాత్తాపపడి, ధర్మబుద్ధితో వున్నావు అది చెప్పుకుంటాను. తరవాత ప్రజలకోసం చెయ్యవలసినది చెపుతాను' అన్నాడు.

'మునీంద్రా! పాపాగ్నిజ్వాలలో పరితపిస్తున్నాను. ధర్మభావంతో నే నీదయకోసం [illegible] నన్ను రక్షించు' అన్నాడు రాజు.

'రాజా! ఆతురతతో నాదగ్గిరికి వచ్చావు. అందుకనే ఉత్సాహంతో ధర్మం బోధించవలసి వచ్చింది. శ్రద్ధగా విను. బ్రాహ్మలకి మేలు కలిగినట్టు నడుచుకో. [illegible] ద్వేషభావం విడిచిపెట్టి ప్రతిజ్ఞ చెయ్యి' అన్నాడు ముని.

'ధర్మంగా నడుచుకోడమే నా సహజగుణం. పాపమంటే భయపడతాను. బ్రాహ్మల్ని గౌరవిస్తాను ఏవిధంగానూ వాళ్ళకి ద్రోహం చెయ్యను. నీపాదాలు ముట్టుకుని ప్రమాణం చేస్తున్నాను' అంటూ శౌనకముని పాదాలు ముట్టుకుని శపథం చేశాడు జనమేజయుడు.

దయతలిచాడు ముని. ఆదరభావంతో చూశాడు. 'అయితే చెపుతాను. సావధానంగా విను' అంటూ అందుకున్నాడు— 'శ్రీమంతుడూ, బలవంతుడూ అయినరాజు భోగమూ, దర్పమూ, గర్వమూ వొదిలిపెట్టాలి. ధర్మం పూనాలి. తపస్సూ, దానమూ, అధ్యయనమూ, యజ్ఞాలూ చెయ్యాలి. ప్రాణికోటి యావత్తూ అతణ్ణిచూసి ఆశ్చర్యపోతుంది. అనుగ్రహిస్తుంది. దీనికి యయాతి చెప్పిన మాటలు ఆలకించు. సరస్వతీ దృషద్వతీ పుణ్యనదుల్లో మునిగి, తీర్థయాత్ర చేస్తూ, వేదాలు చదువుతూ, దానాలు చేస్తూ, మోహం వొదిలిపెట్టి, దయ కలిగి నడుచుకుంటే పాపం అనే పెనుభూతం తప్పకుండా వొదిలిపోతుంది. అదీకాక, [illegible] పాపంచేసి పశ్చాత్తాపపడినా, 'మరెప్పుడూ ఇలా చెయ్యను' అని నిశ్చయించుకున్నా,

'ధర్మంగా నడుచుకుంటాను' అని వ్రతంపూనినా, ధర్మం తప్పకుండా పనులు చేసినా— ఈ నాలుగింటివల్లా నాలుగు పాదాల పాపమూ క్రమంగా వొదిలిపోతుంది. సందేహం లేదు.

'దేవేంద్రుడు అడిగినప్పుడు బృహస్పతి ఇదే చెప్పాడు. బుద్ధిపూర్వకంగా చెయ్యని పాపాలు, బుద్ధిపూర్వకంగాచేసిన పుణ్యాలవల్ల బట్టకి పట్టిన మురికి చవిటికారంతో పోయినట్టు వొదిలిపోతాయి. వేదం చెప్పిన మాట ఇది' అంటూ దయాశాలి శౌనకముని జనమేజయుడికి బోధించాడు. పుణ్యతీర్థాలు సేవించడమూ మొదలైన ప్రాయశ్చిత్తంవల్ల పాపాలు పోగొట్టాడు. అశ్వమేధం చేయించాడు. మహోజ్వలంగా తనరాజ్యం తాను తిరిగీ ఏలుకున్నాడు జనమేజయుడు.

## గెద్దా నక్కా కథ

ఇంకా విను. విదిశాపట్నంలో వొక బాలుడు చచ్చిపోయాడు. మృతశరీరం బంధువులు వల్లకాటికి తీసుకుపోయారు. వల్లమాలిన దుఃఖంతో ఏడుస్తూ కూచున్నారు. ఇంతలో అక్కడికి వొకగెద్ద వచ్చింది. 'ఇలాభయంలేకండా ఇక్కడ మీరు ఏడుస్తూ కూచో కూడదు. అదిగో పొద్దుగూకుతోంది. రాక్షసులూ, పిశాచాలూ, భూతాలూచీల్చుకు తినడానికి విరగబడతాయి. చావుపుట్టుకల్లోవింతేముంది? చచ్చిన పిల్లాడితో అందరూ చచ్చిపోతారా? పీనుగు పడేసి వెళిపోండి. మీ వెర్రికాని, చచ్చినవాడు ఏడిస్తేమాత్రం వస్తాడా? ఊరుకోండి. ఆలస్యంచేస్తే మీరూ చస్తారు' అంది.

'అవును, నిజమే' అంటూ అంతమందీ భయపడ్డారు. శవం పడేసి వెళిపోడానికి సిద్ధపడ్డారు.

ఇంతలో వొక నక్క బొక్కలోంచి లేచివచ్చింది. 'గెద్ద మాటలువిని భయపడతా రేవిటి?' అంది— 'పద్మంలాంటి మొహం

పిల్లాణ్ణి పారేసి వెళ్ళిపోతారా? మీచేతులెలా వచ్చాయి? కొంచేపు కూచుని ఏడవన్నా ఏడవండి. దేవుడు దయచూస్తే, ఏమో మళ్ళీ బతుకుతాడేమో! తెలుసా? ఇప్పుడే పొద్దుపోదు. భయపడకండి. ఆగండి' అంది.

వాళ్ళకీ ఆశపుట్టింది. వెళ్ళిపోతున్న వాళ్ళల్లా వెనక్కి మళ్ళారు.

'ఈ బుద్ధిలేని నక్కమాటలా వింటారు? చూడండీ, పీనుగు చెడిపోయింది వికారంగా. దీనికా మళ్ళీ ప్రాణం వస్తుంది? యముడు కఠినాత్ముడు. మనం మొర్రోమంటూనే వుంటాం, ఎత్తుకు పోతాడు. పోయినవాడు ఎలాగూ రాడు. దానాలూ, ధర్మాలూ చేసి, పిల్లాడికి పుణ్యగతి లభించినట్టు చూడండి' అంది గెద్ద.

'మాక్రూరమైంది గెద్ద' ఆక్షేపిస్తూ అందుకుంది నక్క—'ఇంత చక్కని బాబుని చూస్తూ వొదిలేసి వెళ్ళడానికి మీకాళ్ళెలావస్తాయి? నాలాటివాళ్ళకే చూస్తే కన్నీళ్ళు కారుతున్నాయి. దయమాలి వెళ్ళిపోకండి. ప్రయత్నించండి. దైవం సాయపడవచ్చు. బతికితే బతుకు తాడు. లేదూ, బతకదూ, అప్పుడే వెళ్ళిపోవచ్చు' అంది.

'నేను పుట్టి వెయ్యాఅయిదువందల సంవత్సరాలైంది' ఎత్తు కుంది గెద్ద — 'కుర్రాడుకానీ, నడివయసువాడుకానీ, మూడుకాళ్ళ ముసిలి కానీ — చచ్చిబతికినవాణ్ణి చూడలేదు. ఒకటిమాత్రం వుంది. చచ్చినవాళ్ళు మరో కడుపులో పుడతారన్నమాట నిజం. అంతే.

'నక్కకేం బుద్ధుంది? పీనుగా బతుకుతుంది? ఒక్కడైనా ఇలా వింతలుంటాయా? ' అంది.

దాంతో పిల్లాడిశవం పడేసి వెళ్ళిపోయారు వాళ్ళు. అడ్డుకుంది నక్క. 'వినండి. చచ్చిపోయిన బ్రాహ్మలకుర్రాణ్ణి శ్రీరాముడుబతికించ లేదూ? సృంజయుడి కొడుకు చచ్చిపోతేనారదుడు బతికించలేదూ?ఏం,

అలాగే మీ మాటను విని, ఎవడైనా వొక సిద్ధుడు వచ్చి దయతో పిల్లాణ్ణి బతికించకూడదా? అది మంచిదికాదా? వెళ్ళిపోతారేం?' అంది.

మళ్ళీతిరిగివచ్చారు వాళ్ళు. పిల్లాడి శవంచుట్టూ కూచున్నారు. వనివి వనివి ఘోరంగా ఏడ్చారు. అంతలో పొద్దుగూకిపోయింది.

గెద్ద, నక్కా ఆకలితో బాధపడుతూ కూచున్నాయి. పిల్లాడి పీనుగు పీక్కుతిందామనే గెద్దా, నక్కా తమతమ చాతుర్యంకొద్దీ అలా బోధించాయి. పొద్దుగూకితే అక్కడ వుండదు కనక గెద్ద వాళ్ళని వెళ్ళిపోమంది. రాత్రిపడితే తనకిమేలు కనక నక్క వుండమంది. వాటి తీరు అది.

ఇంతలో స్మశానంలో తిరిగే శివుడు దయాస్వరూపుడు కనక జాలిగా ఏడుస్తున్న పిల్లాడిబంధువుల్ని చూసి, ప్రత్యక్షమయాడు. 'ఏం కావాలో వరమడగండి' అన్నాడు. మహానందంతో, తడబడిపోతూ సాగిలపడి మొక్కారు వాళ్ళు 'దయాహృదయా! పార్వతీ ప్రియా! చంద్రధరా! దేవోత్తమా! పిల్లాడుపోయి, దుఃఖంలో మునిగివున్నాం. నువ్వే మా మొర్రవిన్నావు. బతికిపోయాం' అంటూ నిలబడ్డారు. పిల్లాణ్ణి బతికించాడు శివుడు. 'ఏడు నూరేళ్ళు బతుకుతాడు' అన్నాడు. గెద్దకీ, నక్కకీ ఆకలి లేకండా వరమిచ్చాడు. అంతర్ధానమై వెళ్ళిపోయాడు.

పిల్లాడు బతకడంతోనే వాడి బంధువుల సంతోషం ఇంతాఅంతా కాదు. ఎత్తుకుని, మళ్ళీమళ్ళీ చూసుకుంటూ ఇంటికి వచ్చేశారు. గెద్దా, నక్కా కూడా సంతోషిస్తూ వెళ్ళిపోయాయి.

ఆపదలోవున్న ప్రజల కన్నీళ్ళు తుడవడం ప్రభువుల కర్తవ్యమనీ, తమతమ సొంతపనులు సాధించుకుండికి మోసగాళ్లు నేర్పుమాటలతో బోధిస్తారని తెలుసుకోడానికి ఉదాహరణ ఈగెద్దా నక్కకథ.

ఇది చదివినా, విన్నా, రాసినా, దీన్ని మెచ్చుకున్నా పాపాలు పోతా యి. ధర్మపరుడవుతాడు మనిషి. ఆయువూ, సంపదా పెరుగుతాయి.

## గాలీ బూరుగు చెట్టూ కథ

ఇంకోకథవిను. హిమాలయపర్వతంమీద వొకబూరుగుమాను వుండేది. ఏనాటి ముదరచెట్టో అది! ఎన్నో కొమ్మలతోనూ, దృఢమైన వేళ్ళతోనూవుండేదది. ఒకనాడు నారదముని దానిదగ్గిరికి వెళ్ళాడు; సంతోషంతో అడిగాడు. 'బూరుగుచెట్టూ! ఇంత విశాలంగా, పొడా వుగా వున్నావు నువ్వు. మృగాలకీ, పక్షులకీ ఆశ్రయంగా వున్నావు. నిన్నుచూస్తే సంతోషంగావుంది. అందుకే అడుగుతున్నాను, చెప్పూ. చెట్లన్నీ గాలికి కూలిపోతాయి. నువ్వుపడకుండావున్నావేమీా' గాలికీ నీకూ నేస్తమా? కనక నిన్ను దయతలిచి వూరుకుంటున్నాడా? లేదంటే అతడికి ప్రాధేయపడి బతికిపోతున్నావా? నిజం చెప్పూ?' అన్నాడు.

'అదేమిటయ్యా!' అంది బూరుగుమాను – 'గాలిబలం ఏమా త్రం? నాబలంతో సాటివస్తుందా? నాలో పద్ధెనిమిదో భాగమన్నా వుండదు దానిబలం' అంది.

'అమ్మరొయ్యా!' వింతపడుతూ అన్నాడు నారదుడు – 'అలా అనకు. కొండలు కొంకలే ఎగరేస్తాడు గాలి. మాకు తెలీదుమా? అన్నిప్రాణులూ గాలివల్లేకదా బతుకుతున్నాయి!'

'గొప్పవేళ్ళు నావి. గొప్పకొమ్మలు. గెలవరానిదాన్ని నేను. నన్ను తాకితే అప్పుడూ తెలుస్తుంది గాలిసంగతి. అతడి ప్రభంజనం అన్నపేరు వూడిపోతుంది' పెద్దగొంతుకతో గర్వంగా అంది బూరుగు

సరే, ఈవిడుకు మాటు మంచిపోకు. నువ్విలా అనడంఎలాగా తెలుసుకుంటాడు గాలి' అంటూ వెళిపోయాడు నారదుడు. ఇదంతా గాలితో వూదేశాడు' జుయ్యుమని బూరుగుదగ్గిరికి వచ్చాడు గాలి

అంత మొనగాడివా నువ్వు! బూరుగుమానూ! నిన్ను తాకితే నాపేరు మాసిపోతుందికనూ! సరే, ఇన్ని మాటలెందుకూ? సిపని అయిపోయిం దనుకో' అంటూ కోపంతో వురిమాడు.

'ఇంత తేలికగా మాటాడుతున్నావు. నువ్వు అన్నంతతక్కువా నేను? వెర్రాడా లోకంలోని చెట్లూ నేనూ వొకక్కటే అనుకుంటు న్నావా?' అంది బూరుగుమాను.

నవ్వుతూ హేళనగా అన్నాడు గాలి — 'ఒకనాడు హటాత్తుగా బ్రహ్మ నీ నీడకి వచ్చాడు. ఆ మేలుతృప్తికలిగి, మన్నించి, ఆదరించాను నేను. దాంతో కళ్ళు పెడతలకెక్కాయి నీకు. ఇవాళ కాదు. రేపు ఈ మాటకుయ్యి' అని ఆక్రోశిస్తూ వెళ్ళిపోయాడు గాలి.

భయపడిపోయింది బూరుగుమాను. 'బతుకు బుగ్గయిపోతుం దేమో! నారదముని మాట విన్నాను కాను. నా బలం ఏమాత్రం? మహాబలుడుగాలి. ఉగ్రంగా వస్తే నాశిరమూ భరించడం? ఇలా కాదు. ఒక ఉపాయంచేసి గెలుస్తాను' అంటూ రాత్రికాగానే తనకొమ్మలూ, ఆకులూ, చివుళ్ళూ తానే పరిచేసుకుంది. మోడై కూచుంది.

మర్నాడు, ఛళ్ళున తెల్లవారింది. చేసిన శపథంప్రకారంభయం కరంగా పరిగెత్తుకువచ్చాడు గాలి. బూరుగుమాను చూసింది. 'ప్చ! ఇదేవిటి? నేను చెయ్యవలిసిన పనిను వ్వే చేసేసుకున్నావు! ఈధైర్యా నికి నువ్వే సంతోషించు. ఇలా విర్రవీగే నిబంధువులతో ఇలాటి సదు పాయమే మేలని చప్పు' అంటూ వేళాకోళం చేసివెళ్ళిపోయాడు. ఇలా గాలిచేత భంగపడి విచారించింది బూరుగుమాను. బలవంతుడితో బల హీనుడు మచ్చరిస్తే భంగపడతాడు. ఈనీతే చెపుతుంది ఈపుణ్యకథ.

ధర్మరాజు—పాపం ఎక్కడుంటుంది?

## లోభం

భీష్ముడు—పాపానికి ఉనికిపట్టులోభం. అదే కామం కలిగిస్తుంది. క్రోధమూ, మచ్చరమూ, ద్రోహబుద్ధీ పుట్టిస్తుంది పరధనంమీద ఆశా, పరభార్యలమీద వాంఛా కలిగిస్తుంది. దైన్యం తెస్తుంది. సిగ్గూ శార్యా లేకండా చేస్తుంది. సత్యంమీద వెగటు పుట్టిస్తుంది. మనిషిని సిగ్గుమాలినవాణ్ణి చేసేసి, దేనికైనా చెయిచాపినట్లు చేస్తుంది. కనుక లోభమనే సుడిగుండంలో పడని సత్యవ్రతుల్ని, పాపభీతిపరుల్ని ఏపనికైనా నియోగించాలి. నీమనస్సులో లోభానికి చోటివ్వకు.

ధర్మరాజు - అజ్ఞానం ఆపదలకీ, పాపాలకీ మూలం అని విన్నాను. దీనివిషయం వివరించు.

భీష్ముడు—రోషమూ, శోకమూ, ప్రేమా, ద్వేషమూ, అభిమానమూ, దర్పమూ, తొందరపాటూ, సోమరితనమూ, మంకుపట్టూ—వీటినే అజ్ఞానం అంటారు పండితులు. లోభమూ, అజ్ఞానమూ ఒక్కలాటివే. లోభంలోంచే అజ్ఞానం పుడుతుంది. అంచేత లోభం వొదిలిపెడితేనే సుఖం.

ధర్మరాజు—ధర్మం ఎన్నోవిధాలు వినబడుతుంది. అయితే విశిష్టమైన ధర్మమేది?

భీష్ముడు—తమతమ అనుభవాలబట్టి బుద్ధిమంతులు నానా మార్గాలు చెప్పారుధర్మం. ధర్మంలోకల్లా దమం(ఇంద్రియనిగ్రహం పరమధర్మం. దమమే మోక్షం. దమమేఉత్తమపుణ్యం. దమమేధర్మసారం. దమంలేకపోతే ఏధర్మమూ సిద్ధించదు. దమంతో బుద్ధికలిస్తే లభించని భాగ్యమే లేదనుకో. నాలుగాశ్రమాల్లోనూ దమం మించినధర్మంలేదు. దమం కలవాడు కామమూ, క్రోధమూ, లోభమూ, మదమూ,

మోహమూ, మచ్చరమూ అన్నీ జయిస్తాడు. మునీశ్వర్లకి ఆధారమైన శీలమూ, స్నేహమూ కరుణా, ఆశలేకపోడమూ, వోర్పూ మొదలైన సద్గుణాలు అన్నీ దమంవల్లే కలుగుతాయి. గహనమైన బ్రహ్మపదం దమం కలవాడికి దగ్గిరే వుంటుంది.

## తపస్సు

ధర్మరాజు—దమం వివరించావు. అమృతం పుచ్చుకున్నట్టు అనిపించింది. తపస్సురీతి సెలవియ్యి.

భీష్ముడు — ధర్మాలన్నిటికీ తపస్సే గీటురాయి. తపస్సు పూనిన మహాత్ములు పళ్ళూ, దుంపలూ తిని, నీళ్ళు తాగి తృప్తిపడతారు. తిండిని గెలవడమే తపస్సు. అదే మహాధర్మం. తపోధనం కలవాడికి స్థావర జంగమ స్వరూపమైన లోకమంతా లోబడివుంటుంది. తపస్సువల్ల పంచమహాపాతకాలు పటాపంచలవుతాయి, సత్యమూ, శౌచమూ అన్నీ తపస్సువల్లే లభిస్తాయి. తపస్సువల్ల అన్నిసిద్ధులూ అరిచేతిలో వుంటాయి.

## సత్యం

ధర్మరాజు — దేవతలూ, పితృదేవతలూ అందరూ సత్యం పొగుడుతారు. దాని స్వరూప మేమిటి? అది ఎలా పట్టుపడుతుంది?

భీష్ముడు— సమత్వమూ, దమమూ, వోర్పూ, మచ్చరం లేకండా వుండడమూ, లజ్జా, ధైర్యమూ, అసూయలేకండా వుండడమూ, గొప్పతనమూ, అహింసా, దానమూ, క్షమా, యజ్ఞమూ, నిజాయితీ — ఇవన్నీ సత్యం స్వరూపాలు. ఎప్పుడూ ఆచరిస్తూ, యోగసిద్ధి కలవాడికి సత్యస్వరూపం సులభమవుతుంది. సుఖప్రదమవుతుంది. సందేహంలేదు.

అన్నిధర్మాలకీ సత్యమే కుదురు. యోగమూ, మోక్షమూ సత్యంవల్లే సిద్ధిస్తాయి. అసత్యంకంటే మరో పాపం లేదు. వెయ్యి అశ్వమేధాలైనా వొక సత్యంతో సాటిరావు.

## అరిషడ్వర్గాలు

ధర్మరాజు — అరిషడ్వర్గాలు ఎలా పుడతాయి? ఎలా నశిస్తాయి?

భీష్ముడు — కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం—ఈఆరూ అరిషడ్వర్గాలు. ఆరు శత్రువులు). సంకల్పం వల్ల కామం పుడుతుంది. దాని స్వరూపం తెలుసుకుంటే అది నశిస్తుంది. పరుల దోషంవల్ల క్రోధం పుడుతుంది. ఓర్పువల్ల అది నశిస్తుంది. ప్రాణుల అస్థిరత్వం తెలియక లోభం పుడుతుంది. ఇది తెలుసుకుంటే అది నశిస్తుంది అజ్ఞానంవల్ల మోహం పుడుతుంది. అధర్మం విడిచిపెడితే అది నశిస్తుంది. కులమూ, విద్యా, ధనమూ, వీటివల్ల మదం పుడుతుంది. వాటి తత్వం తెలుసుకుంటే అది నశిస్తుంది. సాత్విక భావం లేకపోతే మచ్చరం పుడుతుంది. సాధుసేవ వల్ల అది నశిస్తుంది.

ఈ ఆరింటివల్లే అన్ని అపాయాలూ వస్తాయి. ఇవి తొలిగించుకో గలిగిన బుద్ధిమంతుడికి శుభమూ, సద్గతీ లభిస్తాయి. ధైర్యం లేని మనిషిమీద ఇవి తోడేళ్ళలా కలబడతాయి. ధైర్యవంతుడి చుట్టుపట్లమాత్రం చేరవు. ఇదీ వీటి రీతి. ధృతరాష్ట్రుడి కొడుకుల దగ్గిర ఇవి కోకొల్లలు. నీదగ్గిరమాత్రం వొక్కటీలేదు. ధైర్యంకల బుద్ధిమంతుడివి నువ్వు. కనక అరిషడ్వర్గాలు జయించగలవు.

హింసచేసి బతికే దుర్మార్గుడు ఈ అరుగుణాలూ వున్నవాడికంటే కూడా చెడ్డవాడు.

చుట్టాలూ, పక్కాలూ చూస్తూవుంటే తాను వొక్కడూ మాత్రం భోగాలనుభవించేవాడు మనిషి కాదు పశువు. పంచుకుతిన్న వాడు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ సుఖపడతాడు. కుటుంబానికీ, పరిజనానికీ మూడేళ్ళకి సరిపోయిన జీవనోపాధి కలవాడూ, అంతకిమించి వున్నవాడూ యజ్ఞంచెయ్యడానికి అర్హులు. యజ్ఞాలు చేస్తున్న బ్రాహ్మడికి అవి పూర్తిచెయ్యడానికీ, దానాలూ అవీ ఇవ్వడానికీ దుర్గతివల్ల ధనం తక్కువవచ్చినప్పుడు తెలుసుకుని తగినట్టు సాయపడాలి రాజు.

ధనధాన్యాలూ, పశుసంపదా సమృద్ధిగా వున్న కోమటి యజ్ఞం చెయ్యకపోతే రాజు అతడి ధనం బలవంతంగా లాక్కుని బ్రాహ్మల యజ్ఞానికి ఇచ్చెయ్యవచ్చు.

కడుపుకి తినకండా, వొకడికి పెట్టకండా శూద్రుడు అధికంగా ధనధాన్యాలు కూడపెడితే, రాజు సగం తీసుకుని పుణ్యకార్యాలకి ఇచ్చెయ్యాలి.

బ్రాహ్మలు పేదవాళ్ళయారంటే, దానికి రాజు తెలివితక్కువే కారణం. తల్లిదండ్రుల్లాగ వాళ్ళని కాపాడాలి రాజు. అలా అయితేనే అతడికి శుభం.

ఆడదీ, ఉడకని పదార్థమూ, మణీ — ఇవి శుచిపదార్థాలు. కనకనే కులం లేకపోయినా, తక్కువవాళ్ళదగ్గిరవున్నా, పొలంలో వున్నా, ఆడదీ. రత్నమూ, ధాన్యమూ యోగ్యమైనవే అన్నారు మునులు.

అమృతమూ, విద్యా పరోపకారం చేస్తాయి. అందుకనే బుద్ధిమంతులు విషంలోవున్నా అమృతమూ, నీచజనందగ్గిరనించైనా విద్యా పుచ్చుకుంటారు.

పంచమహాపాపాలు చేసినవాళ్ళూ, పతితులూ ప్రాణాంతక మైన ప్రాయశ్చిత్తం చేసుకుని పాపాలు పోగొట్టుకుంటారు.

పతితుడితో చేరి బళ్ళమీదా పాటిమీదా ప్రయాణం చేసినా, కలిసి కూచున్నా, ఒకపంక్తిని భోజనం చేసినా, నీళ్ళు తాగినా తాను కూడా పతితుడైపోతాడు. తపస్సూ మొదలైన ధర్మకార్యాలు చేసుకుంటేకాని ఆపాపం పోదు.

అబద్ధమాడడం పాపమే అయినా అవసరంవచ్చి ఆడాళ్ళతోనూ, పెళ్ళిసందర్భంలోనూ, నవ్వులాటకీ, ప్రాణంమీదికి వచ్చినప్పుడూ, ధనమంతా పోతున్నప్పుడూ అబద్ధమాడితేమాత్రం పాపంరాదు.

ఏపాపమూ లేంది దుర్మార్గంగా వొకడిమీద పాపం మోపితే, ఆ మోపినపాపం తనకే వస్తుందంటారు పెద్దలు.

అకారణంగా తల్లినీ, తండ్రినీ విడిచిపెట్టడం పాపం. బ్రహ్మచారులకి ఆసనమూ, పక్కా, కూడూ, గుడ్డా ఇస్తే, ఆపాపం పోతుంది.

## కత్తిప్రభావం

భీష్ముడు ఇలా చెప్పాక నకులుడు ముందుకివచ్చి నమస్కరించాడు. వినయంగా అడిగాడు — "ధనుస్సు ఉత్తమమైన ఆయుధం అంటారు. అది అందరూ అంగీకరించిందే. ధనుస్సూ, బాణాలూ భంగమైనప్పుడు శత్రువుని కొట్టడానికీ, తన్ను తాను రక్షించుకోడానికీ కత్తి మేలంటారు. అదేమిటో తెలుసుకోవాలనివుంది. దాని పుట్టుపూర్వోత్తరా లేమిటి? అది మొదట ఉపయోగించిన ఆచార్యు లెవరు?"

భీష్ముడు—బ్రహ్మ, లోకాలు సృష్టించాడు. దేవతలూ, దైత్యులూ, తక్కిన జంతువులూ అతడు విధించిన ప్రకారం తిరుగుతూ, బతుకుతూ వుండేవి. దైత్యులు ఉద్దండులై, అధర్మం పట్టుకున్నారు.

దేవతల్ని, మునుల్ని యమయాతన పెట్టగా. అప్పుడు బ్రహ్మ హిమాలయందగ్గిర వెయ్యేసంవత్సరాలు గొప్ప తపస్సుచేశాడు. నియమంతో యజ్ఞంచేశాడు. అగ్నికుండంలోంచి లోకభయంకరంగా వొక ఉగ్రభూతం పుట్టింది. పెద్దపెద్ద కోరలతో, నల్లగా తెల్లగా వుందది. భూతంచూసి సూర్యుడు మాసిపోయాడు. గాలి సుళ్ళుతిరిగింది. ఉల్కలు రాలాయి దేవతలూ, మునులూ భయపడిపోయారు.

'భయపడకండి' ధైర్యంచెప్పాడు బ్రహ్మ — 'ఇది నా సంకల్పంవల్ల పుట్టింది. మరేమీ కాదు. వినండి. ఇది రాక్షసనాశనంకోసం పుట్టిన ఉత్పాతం. లోకాలు రక్షించడానికీ, రాక్షసుల్ని చంపడానికీ సాధనంగా కత్తి కల్పించాను' అన్నాడు.

బ్రహ్మ నోట్లోమాట నోట్లోనే వుంది, భూతం కత్తిగా మారిపోయింది. దిక్కులు ప్రకాశించునట్టు తళతళా మెరిసింది. బ్రహ్మ భక్తితో శివుణ్ణి తలుచుకున్నాడు. దయతలిచాడు శివుడు. నుదుటి కంటిమంటతో ప్రత్యక్షమయ్యాడు. బ్రహ్మ పాదాభివందనంచేసి కత్తి ఇచ్చాడు. గొప్పగా ప్రకాశించాడు శివుడు. అక్కడి సభంతా ఆశ్చర్యపడింది. సంతోషించింది.

కత్తి పుచ్చుకుని శరీరం పెంచాడు శివుడు. పెద్దనవ్వు నవ్వాడు. గొప్ప సింహనాదం చేశాడు. విన్నారు రాక్షసులు. గుంపులుగుంపులు వచ్చి విరగబడ్డారు అంతమందినీ వరసపెట్టి నరికేశాడు శివుడు. భూమంతా రక్తంతో ముంచేశాడు. దయామూర్తి శివుడు. కత్తితో రాక్షసుల్ని చంపాడు. ధర్మంనిలబెట్టాడు. శాంతించాడు. ముల్లోకాలూ రక్షించే విష్ణుమూర్తిని పిలిపించాడు. మహనీయమైన ఆ కత్తి అతడికిచ్చాడు. దుష్టుల్ని శిక్షిస్తూ విష్ణుమూర్తి ఆకత్తి తరవాత మరీచికి ఇచ్చాడు. మరీచి భార్గవుడి కిచ్చాడు. భార్గవుడు మునీశ్వర్ల కిచ్చాడు. మునీశ్వర్లు ఇంద్రుడి కిచ్చారు. ఇంద్రుడు లోకపాలకుల కిచ్చాడు.

క్రమంగా మనువూ మొదలైన రాజులు సంపాదించారు. వాళ్ళనించి సంతతికిస్తూ వచ్చారు. అందులో దుష్యంతుడు భరతుడికిచ్చాడు. భరతుడి వంశంలో కత్తిసంప్రదాయం పెరిగింది. ఒక ముని అనుగ్రహంవల్ల సంపాదించి ద్రోణుడు కృపుడికిచ్చాడు. కృపుడివల్ల మీ అన్నదమ్ములు అయిదుగురూ సంపాదించారు. ముఖ్యంగా ఈ విద్యలో నీకు ఆదరణ హెచ్చింది. మంచి నైపుణ్యం సంపాదించావు.

కత్తికి నక్షత్రం కృత్తిక. అధిదేవత అగ్ని. ఆచార్యుడు శివుడు. అసి (చిమ్మేది), విశసనం (హింసించేది), ఖడ్గం (నరికేది), శ్రీగర్భం (సంపదకలది), తీక్ష్ణవర్త్మం (కరుకైనది), దురాసదం (చేరరానిది), విజయం (గెలుపుకలది), ధర్మపాలం (ధర్మంపాలించేది) - ఈ ఎనిమిదీ కత్తి పేర్లు. ఆయుధాల్లోకల్లా ప్రధానమైన ఆయుధం కత్తి. సందేహం లేదు. కత్తి ప్రభావం పుణ్యకథ. వింటే కీర్తి కలుగుతుంది. సంతోషమూ, సద్గతి కలుగుతాయి.

కత్తిప్రభావం విన్నాడు ధర్మరాజు. పట్నంవెళ్ళే వేళ కావడంతోనే భీష్ముడిదగ్గిర వినయంగా సెలవుతీసుకున్నాడు. హస్తినాపురం వచ్చేశాడు. కాల్యకృత్యాలు తీర్చుకున్నాడు. సభతీర్చి, విదురుణ్ణీ తమ్ముళ్ళనీ చూసి, "ధర్మమూ, అర్థమూ, కామమూ — ఈమూడింటిలో ఏది ఉత్తమమైంది? ఏది మధ్యమమైంది? ఏది అధమమైంది? నిరూపించండి, చూదాం" అన్నాడు.

విదురుడు ఇలా అన్నాడు— "ధర్మంవల్లే ధనంసిద్ధిస్తుంది. ధనంవల్ల కామం సిద్ధిస్తుంది. అంచేత ధర్మం ఉత్తమం. ధనం మధ్యమం. కామం అధమం" అన్నాడు.

అర్జునుడిలా అన్నాడు — "ధర్మానికీ, కామానికీ అర్థమే మూలం. అలా కాకుండా విరక్తి పొంది, జడలు ధరించుకుని తిరిగేవాళ్ళకి కూడా దేహధర్మాలకోసం ధనం కావాలి. అంచేతే కణ్వుడూ

మొదలైన మహాఋషులు ధనమే ఉత్తమమైంది అన్నారు. కనక అర్థమే ఉత్తమమైంది."

నకులసహదేవులు ఇలా అన్నారు—"అర్థమూ, ధర్మమూ వొకదానొకటి ఆశ్రయించి వున్నాయి. అంచేత ఈ రెంటిలో ఏదో వొకటి ఆశ్రయించి రెండోది వొదిలిపెడితే లోకం నానా బాధలూ పడుతుంది. పుష్కలంగా ధనం లేని వాడికి కామం గగనకుసుమం. ధర్మమూ, అర్థమూ సమానం. అర్థానికి ఫలం కామం. అంచేత నిజంగా అర్థమే ఉత్తమమైంది."

భీముడు ఇలా అన్నాడు—"పెరుగులో సారం వెన్న. అలాగే ధర్మార్థాల సారం కామం. అది అధమం అవడం సుఖానికి విరోధం. ఆలోచించు, నీకే బోధపడుతుంది. తుమ్మెద పువ్వుల్లో తేనె తాగినట్టు, కామంవల్ల హాయిగా సుఖపడవచ్చు. వెన్ను వెయ్యని పైరూ, సుఖపడని వాడి సంపదా వొక్కటే. అయితే ధర్మమూ, అర్థమూ, కామమూ మూడింటిలో ఏదో వొకటి పట్టి కూచున్న మనిషి అధముడు. రెండూ అనుసరించినవాడు మధ్యముడు. మూడూ అనుసరించినవాడు ఉత్తమనాయకుడు."

ఇలా అందరూ చెప్పాక విని, చిరునవ్వు నవ్వాడు ధర్మరాజు. అంతమందినీ వొకసారి కలయచూశాడు. "నేను అడిగినదానికి విదురుడి వాక్యం సిద్ధాంతం. తక్కినవాళ్ళని కొంతకొంత మాత్రమే వొప్పుకోవచ్చు. సరే, నా మతం వినండి.

"ప్రాణులందరికీ ముసిలితనమూ, చావూ సహజం. కనక ఈషణాత్రయం (దారేషణ, ధనేషణ, పుత్రేషణ) తో దుఃఖం సహించడంకంటే మోక్షం కోరుకోడమే మంచిది. 'కోరుకుంటే మాత్రం అది దొరుకుతుందా?' అంటారేమో! ధర్మమూ, అర్థమూ, కామమూ ఏదీ మనస్సులో తగులుకోనివ్వకూడదు. అవి బాగుండి సుఖం వచ్చి

నపుడు మదమూ, చెడి దుఃఖం వచ్చినపుడు దైన్యమూ పొందకుండా వుంటే మోక్షం తప్పకండా దొరుకుతుంది" అన్నాడు.

ధర్మరాజుతీర్పు విని అందరూ ఆనందించారు.

మర్నాడు అంతఃపురం దిశగా వెళ్ళి భీష్ముణ్ణి సేవించాడు ధర్మరాజు. "రాజుకి కావలసిన వాళ్ళు ఎవరు? అక్కర లేని వాళ్ళు ఎవరు?" అని అడిగాడు.

భీష్ముడు— బాగా యోగ్యులవాళ్ళూ ధర్మం తెలిసినవాళ్ళూ, సత్యవంతులూ, చంచలబుద్ధి లేనివాళ్ళూ, శీలవంతులూ, క్రోధం లోభం మదం లేనివాళ్ళూ మాటనేర్పరులూ, పనిమీద దృష్టికల వాళ్ళూ రాజుకి కావలసినవాళ్ళూ. ఇలాంటి భృత్యులు రాజుని భాగ్యవంతుణ్ణి చేస్తారు.

క్రూరులూ, లోభులూ, మూర్ఖులూ, చాడీకోర్లూ, జడులూ, కృతఘ్నులూ, చేతకానివాళ్ళూ, అబద్ధాలకోర్లూ నింద లక్ష్యంలేని వాళ్ళూ, పిరికిపందలూ, ధైర్యం లేనివాళ్ళూ, దుర్నయ మతులూ, వ్యసనపరులూ రాజుకి అక్కరలేని వాళ్ళూ వీళ్ళు దగ్గిరవుంటే నష్టం తప్పదు. ఈఅధముల్లోకల్లా కృతఘ్నుడు మరీ అయోగ్యుడు. గౌతమాఖ్యానమని పెద్దలు సభల్లో చెప్పుకునే వొక కథవుంది దీనికి. విను.

## నాడీజంఘుడి కథ

వొక బ్రాహ్మణుడుండేవాడు. అతడు కులవృత్తి వొదిలేసి, వొక బోయదాన్ని పెళ్ళి చేసుకున్నాడు. ఆ దురాత్ముడు కిరాతులతో కలసి వేటకి వెళ్ళేవాడు. మాంసం తినేవాడు భోగపరుడు కనుక ధనం సంపాదించడంకోసం వర్తకులతో స్నేహంచేశాడు. కొందరు కోమట్లు వర్తకంకోసం దేశాంతరం బయలుదేరడం చూసి, తానూ వాళ్ళతో బయలుదేరి వెళ్ళాడు.

కొండలతో గహనంగా అడుగు పెట్టడానికి వల్లకాని వొకచోట వొక అడివిఏనుగు వచ్చి వర్తకుల బిడారులో పడింది. వెర్రెత్తినట్లు మనుషుల్ని తొక్కేసింది. చిందరవందర చేసింది. అంత మందీ భయపడిపోయారు. చెట్టోపిట్టయి పారిపోయారు.

బ్రాహ్మడు ఉత్తరంవేపు దారితీసాడు. వెళ్ళగా వెళ్ళగా ఎంతో దూరంలో వొక దారి కనపడింది ఆదారంబడే వెళుతూ వొక పెద్ద మర్రిచెట్టు చూశాడతను. దట్టమైన పొదలమధ్య గుబురుగా, విశాలంగా, జిబుగా ఎంతో బాగుంవది. సంతోషించి, దాని నీడలో చేరాడు బ్రాహ్మడు. అడివి లతల పూలగాలి చల్లగా వీచింది. హాయిగా అక్కడ కూచున్నాడతడు.

ఇంతలో పెద్దకొంగ వచ్చిం దక్కడికి. బ్రహ్మదేవుడిదయ సంపాదించిన కొంగ అది. నాళీకజంఘుడూ, రాజధర్ముడూ అని దాని పేళ్ళు ఆమ్రరి చెప్తే దాసఖల్లు. బ్రాహ్మణ్ణి చూసి దయతో ఆదరించాడు నాళీకజంఘుడు.

'ఎక్కణ్ణుంచి వచ్చావు బాపనయ్యా? ఏం పనిమీద ఎక్కడికి వెళుతున్నావు? నిన్ను చూసి సంతోషం కలిగింది. నాకు అతిథివి. నీపంగతేమిటో చెప్పూ!, అని అడిగింది.

'మధ్య దేశం నాది' అన్నాడు బ్రాహ్మడు— 'గౌతముడనే మహానియుడి కుమారుణ్ణి. బద్ధకంవల్ల వేదాధ్యయనమూ మొదలైన బ్రాహ్మణకర్మ మానేశాను. కామంలో పడి బోయదాన్ని కట్టుకున్నాను. కిరాతుల్లో కలిశాను. బీదరికంవల్ల కోమట్లతో కలిసి పరదేశం బయలుదేరాను. కొండకోనల్లో వొకదగ్గిర అడివిఏనుగు వొకటి వర్తకులమీద పడింది. జనం తొక్కి చంపేసింది. పారిపోవచ్చి నేను అడివిలో దూరాను. దిక్కు తప్పిపోయాను. అదృష్టంవల్ల నీఇల్లు చేరగలిగాను' అన్నాడు.

'మంచిదే అయింది. నీ దరిద్రం పోగొడతాను. విచారించకు. ఈలోపల నా ఆతిథ్యం పుచ్చుకో' అంది కొంగ. రుచికరమైన గంగానదిచేపలు బాగా కాల్చి ఇచ్చింది. తియ్యటి అడవిపళ్ళు తెచ్చి ఇచ్చింది. తృప్తిగా ఆహారం పెట్టింది. రాత్రిపడగానే పువ్వులూ, ఆకులూ, మెత్తగాపరిచి పక్క వేసింది. అతడితో మాటామంతీ ఆడి, హాయిగా నిద్రపోయింది.

రాత్రి గడిచింది. వేకువజాగానే బ్రాహ్మణ్ణి లేపింది కొంగ. 'స్నేహితుడూ, వెండీ, బంగారమూ, బుద్ధీ— ఈనాలుగూ మనిషి దరిద్రంపోగొడతాయి' అని బృహస్పతి చెప్పాడు. అయితే నాలుగింటి లోనూ స్నేహితుడు అధికుడు. కాశ్యపవంశంలో పుట్టినవాడివి నువ్వు. నీతో మంచి స్నేహంచేసాను ఇక నీకు సిరీ సంపదా లోటుండదు. నాకు ఒక రాక్షసుడు స్నేహితుడున్నాడు. అతడిపేరు విరూపాక్షుడు. అతడు మధువజం రాజు ఇక్కడికి మధువ్రజం మూడుయోజనాల దూరంలో వుంది ఇదిగో ఈ దారంబడే వెళ్ళు. ఆ రాక్షసరాజుని చూడు నేను పంపానని చెప్పు. సంతోషిస్తాడతడు. బంగారమూ, రత్నాలూ వెంటనే ఇస్తాడు నీ కరువు తీరిపోతుంది' అంటూ మధువ్రజం దారి చూపెట్టింది.

కొంగచెప్పిన దారంబడే వెళ్ళాడు బ్రాహ్మడు. విరూపాక్షుణ్ణి చూశాడు. 'ఎ డీజ. ఘు! ప్రియస్నేహితుణ్ణి. అతడు పంపితే వచ్చాను. ధనం కావలిసి వచ్చాను' అంటూ తగినట్టు వివరించాడు.

విన్నాడు రాక్షసరాజు విరూపాక్షుడు బ్రాహ్మణ్ణి కిందా మీదా చూశాడు. 'ఈబ్రాహ్మడు నీచుడిలా వున్నాడు. కనుక్కోవాలి' అనుకున్నాడు. 'నీకులమూ, నీవిద్యా, నడవడీ వున్నది వున్నట్టు చెప్పు' అని అడిగాడు.

అంత రాత్రివేళ రాజు దగ్గిరా జంకలేదు బ్రాహ్మడు. తన సంగతంతా చెప్పాక, 'సరే' అనుకున్నాడు విరూపాక్షుడు. 'ఇతడు ఎలాటివాడైతే నేం? నా స్నేహితుడి స్నేహితుడు కదా! ఈవాళ్క యోగ్యతే చాలు, ఇతడు తగినవాడనడానికి. ధనం తృప్తిగా ఇస్తాను' అని నిశ్చయించుకున్నాడు. అతడికి భోజనమూ, మంచి బట్టలూ ఇవ్వడానికి తగినవాళ్ళని నియమించాడు.

మర్నాడు కార్తీకపౌర్ణమి నాడు చేత బంగారంపళ్ళేలలో భోజనం చేసి, పుష్కలంగా దక్షిణలు పుచ్చుకోడానికి వేలకొద్దీ బ్రాహ్మలు విరూపాక్షుడి ఇంటికి వచ్చారు. వాళ్ళంతా కర్మనిష్ఠ కలిగిన మహాజనులు. నాడీజంఘుడు పంపిన బ్రాహ్మణ్ణి వాళ్ళతో కలిపి గొప్పగా పూజించాడు విరూపాక్షుడు. తృప్తిగా భోజనం చేయించాడు. మొయ్యలేనంత బరువు రత్నాలూ, బంగారమూ, అతడు భోజనం చేసిన బంగారం పళ్ళేమూ ఇచ్చాడు. సంతోషంగా సాగనంపాడు. వల్లమాలినంత సంతోషించాడు బ్రాహ్మడు. అన్నీ మోసుకు బైలుదేరాడు. మెడా, భుజాలూ, వీపూ కుంగిపోతూవున్నా సహించుకొని, గబగబా నడిచి మర్రిచెట్టుదగ్గిరికి వచ్చాడు. చూశాడు నాడీజంఘుడు, సంతోషించాడు. అతడి అయాసంతీరేట్టు రెండు రెక్కలతోనూ విసిరాడు. తృప్తిగా భోజనం పెట్టాడు.

రాత్రిపడింది. సుఖంగా నిద్రపోయింది కొంగ. పాడుబ్రాహ్మడు నిద్రపోలేదు 'రేపు ప్రయాణంలో ఏమిటి భోజనం?' అంటూ ఆలోచించాడు —'ఈకొంగ బాగా కొవ్వివుంది. కావలిసినంత మాంసం వుంది. ఆదమరచి నిద్రపోతున్నది. చంపేసి, మూటకట్టుకు పోతాను' అని పాపం తలచుకున్నాడు. బట బిగించి కట్టుకున్నాడు. రెండుచేతులతోనూ పొడవు కర్ర పట్టుకున్నాడు. పూని కొంగ మెడమీదా, తలమీదా దెబ్బమీద దెబ్బ బాదేశాడు. చంపేసి సంతోషించాడు.

వెం(టుకలన్నీ పీకేశాడు. పీక కోసేశాడు. కడుపు చీల్చి, పేగులు తీసి పారేశాడు. మాంసం పొదుపుగా మూటకట్టుకున్నాడు. వేకువనే లేచి బయలు దేరిపోయాడు.

ఆ దేనమయానికి మధు(వజంలో రాక్షసరాజు విరూపాక్షుడు లేచాడు. 'మాంసంవాసన కొడుతున్నది. ఏం కీడు కలుగుతుందో?' అనుకున్నాడు.

మనస్సు కలిచేస్తోనేవుంది. 'ఏమిటిది?' అంటూ మం(తులతో ఆలోచించాడు. జాం పొద్దెక్కింది. స్నేహితుణ్ణి నాళీకజంఘుణ్ణి తలుచుకున్నాడు. 'ఉదయాన్నే రావాలి నేస్తం. ఇంతవేళయినా రాలేదు. నిన్నటి (బాహ్మడు దుర్మార్గుడనే అనుకున్నాను. నీచుడు ఏంచేశాడో? కల్లా కపటం లేదు నాళీకజంఘుడికి. నమ్మేస్తాడు. ఏం జరుగుతుందో దేవుడా!' అంటూ విచారించాడు. చూసిరండని కొంతమందిభటుల్ని వెంటనేపంపాడు.

భటులు వెళ్ళారు. కొంగ ఎముకలగూడు చూసి, పరిగెత్తుకు వచ్చారు. రాక్షసరాజుతో చెప్పారు. (బాహ్మడు వెళ్ళిన జాడపట్టి గుంపులు గుంపులు పరిగెత్తారు. దార్లోనే అతణ్ణి పట్టేశారు. పెడ రెక్కలు విరిచికట్టి లాక్కువచ్చారు. రాజుముందు నిలబెట్టారు.

చూశాడు విరూపాక్షుడు. 'ఈ కృతఘ్నుణ్ణి నాఎదటికి తేకండి. చంపేసి, తినెయ్యండి చప్పున' అన్నాడు.

'అంత దిక్కుమాలిన వాళ్ళమా (ప్రభూ?' అన్నారు భటులు— 'ఈపాపాత్ముడి శరీరమా తింటాం?ఛీ! మమ్మల్నీ పట్టు కుంటుంది పాపం' అని తిరస్కరించారు.

'నిజమే, తినకండి, ఇంకేమైనా చేసేయ్యండి. నాఎదటికి ఎందుకు తెచ్చారు,' అన్నాడు రాజు.

బ్రాహ్మణ్ణి వూరుకోటికి ఈడ్చుకుపోయారు రాక్షసభటులు. రక్తాలు కారేటట్టు శరీరం కండలు కండలు కోసి పారేశారు. కుక్కలు గుంపులు గుంపులు వచ్చాయి. కాని అవికూడా బ్రాహ్మడిమాంసం ముట్టలేదు. ఆకలితోనే వెళ్ళిపోయాయి.

ధర్మరాజా. అది నిజమే. కృతఘ్నుడి శరీరం కుక్కలుకూడా తినవు. అసహ్యించుకుంటాయి. వేదాలూ అదే చెపుతాయి. ఇక్కడ అది అక్షరాలా నిజమైంది.

స్నేహితుడికోసం వెక్కి వెక్కి ఏడ్చాడు రాక్షసరాజు. కొంగ ఎముకలగూడు తెప్పించాడు. స్నేహితులతో కలిసి, అగ్నిసంస్కారం చేసి వచ్చాడు. అంతలో జాలిపడి దేవేంద్రుడు ప్రత్యక్షమయాడు.

వినయంతో సాగిలపడ్డాడు విరూపాక్షుడు. కన్నీళ్ళతో దీనంగా ఏడ్చాడు. 'నా నాళీకజంఘుణ్ణి ఇప్పించు ప్రభూ!' అంటూ ప్రార్థించాడు.

'నీ నేస్తం బ్రహ్మకి స్నేహితుడు కదా! అతడికోసం విచారమెందుకూ? రోజూ తనదగ్గిరికి నాళీకజంఘుడు రావాలని కోరతాడు బ్రహ్మ. అలా తరచు రాకపోడంవల్ల విచారపడుతూ వుంటాడు. అంచేత అతడు ఇలా అయాడు. నేస్తం కనక అతడి కంకాళానికి గొప్పగా అగ్నిసంస్కారం చేశావు. మంచిదే అయింది.

'అగ్ని ముట్టించి నువ్వు వచ్చాక, ఒక ఆవు దూడకిపాలు పెడుతూ అక్కడికి వెళ్ళింది. పాలుతాగుతున్న దూడ నోటి నురుగు సుడిగాలికి కొంగ చితిమీద పడింది. దాంతో నాళీకజంఘుడు తిరిగి బతికాడు, ఎప్పటి శరీరంతో ఇదిగో ఇక్కడికే వస్తున్నాడు. ఇలా జరగడానికి బ్రహ్మదేవుడి ప్రభావమే కారణం' అన్నాడు దేవేంద్రుడు.

అతడు ఇలా అంటూనే వున్నాడు, నాళీకజంఘుడు అక్కడికి వచ్చాడు. రాక్షసరాజు సంతోషం ఇంతా అంతా కాదు.

అంతకిముందే బ్రహ్మమాటమీద బ్రాహ్మణ్ణి పాశాలతో కట్టేశాడు దేవేంద్రుడు.

అంతా తెలుసుకున్నాడు నాళీకజంఘుడు. తనవల్లే బ్రాహ్మడికి ఆ అవస్థ వచ్చిందికదా, అని విచారించాడు. సహించలేకపోయాడు అతణ్ణి వొదలిపెట్టమని దేవేంద్రుణ్ణి ప్రార్థించాడు. వరమడిగాడు.

అప్పుడు బ్రహ్మకూడా కనికరించాడు. దివ్యబోధవల్ల తెలుసుకున్నాడు దేవేంద్రుడు. వినయంగా ప్రార్థిస్తున్న నాళీకజంఘుడి కోరిక చెల్లించాడు. బతికిపోయాడు బ్రాహ్మడు. అతడికి వచ్చిన ధనంకూడా తిరిగి ఇచ్చేశాడు రాక్షసరాజు.

రాజుదగ్గిరా, కొంగదగ్గిరా సెలవుతీసుకున్నాడు బ్రాహ్మడు ధనం మోసుకుని, తిరిగి తిరిగి చూస్తూ ఇంటిదారి పట్టాడు.

దేవేంద్రుడు దేవలోకం వెళ్ళిపోయాడు. రాక్షసరాజు తృప్తి పడ్డాడు. అతడు సెలవిచ్చాక నాళీకజంఘుడు తన మర్రిఇంటికి వెళ్ళి పోయాడు.

ధర్మరాజా! బ్రాహ్మణ్ణి చంపినవాడికైనా ప్రాయశ్చిత్త ముంది. కాని కృతఘ్నుడికి మాత్రం లేదు. స్నేహితుడికి ద్రోహం చెయ్యడం కృతఘ్నతకంటేకూడా పాపం. కృతఘ్నుణ్ణి, మిత్రద్రోహినీ వాళ్ళు ఆప్తులైనా సరే, విరోధం పెట్టుకొని విడిచి పెట్టెయ్యాలి.

ఇహపరాలు రెండూ సమకూరుస్తాడు స్నేహితుడు. స్నేహితుడూ, ధనమూ— ఈ రెంటిలో స్నేహితుడే హెచ్చు. ఈమాటే మెచ్చుకుంటారు ప్రాజ్ఞులు. అందుచేత శుభం కోరుకునేవాడు మంచి స్నేహితుడి మనసు నచ్చినట్టు పొత్తుకలిగి మసులుకోవాలి.

# శాంతిపర్వం

## నాలుగో ఆశ్వాసం

ఎన్నో విధాల భీష్ముడు చెప్పిన ధర్మాలు విన్నాడు ధర్మరాజు. తమ్ముళ్ళతో కలిసి సంతోషించాడు.

"బాబూ, నాకు తెలిసినట్టు నాలుగు మంచిమాటలు చెప్పాను. ఇంకా ఏమిటి అడుగుతావో అడుగు" అన్నాడు భీష్ముడు. వినయంగా నమస్కరించాడు ధర్మరాజు.

"తండ్రీ! రాజధర్మాలు విడమర్చి చెప్పావు. లోకంలో అంత మందికీ హితమైన ధర్మాల్లో ఏది ఉత్తమధర్మమో సెలవియ్యి" అని అడిగాడు.

భీష్ముడు—ధర్మాలు అనేకవిధాలు. అందులో నిష్ఫలమైంద దంటూ ఏదీ లేదు. అయితే ఆత్మకి మోక్షం కలిగించే ధర్మమే ఉత్తమధర్మం అంటారు తత్వం తెలిసినవాళ్ళు. ప్రియాలూ, అప్రియాలూ మనస్సులో పట్టించుకోకండావుండడమే మోక్షం కలిగించే ధర్మం. దీనికి ఒక కథ చెపుతాను విను.

### సేనజిత్తు కథ

సేనజిత్తుడని ఒక రాజు వుండేవాడు. కొడుకుపోయి ఎంతో దుఃఖిస్తూ కూచున్నాడతడు. అదిచూసి అప్పుడైన బ్రాహ్మడొకడు 'ఏమిటిది?' అంటూ ఓదార్చాడు — 'ఇంత విచారిస్తావెందుకు? పుట్టినవాళ్ళందరిదారీ ఇదే, నీకొడుకు ఒక్కడిదే కాదు అంచేత

విచారం విడిచిపెట్టు, మూఢుడిలాగ ఏడుస్తూ కూచోవచ్చా?' అన్నాడు.

'అయితే నాదుఃఖం ఎలా పోతుందో చెప్పు' అని అడిగాడు రాజు.

'రాజా! నదిలో రెండు కర్రపుల్లలు కలుసుకుంటాయి. కొంచే పయాక విడిపోతాయి. అదుగో అలాటిదే తండ్రికొడుకుల సంబంధమూ, బంధువుల సంబంధమూనూ, తనకి తానే ఎరువుఅన్నప్పుడు ఇక బంధువులా శాశ్వతం? ఈవివేకంతో ఎవ్వరిమీదా ప్రేమపెట్టుకోను నేను. కనకనే నాకు దుఃఖంకలగదు. సుఖమూ, దుఃఖమూ వొకదానివెంట వొకటి వస్తాయి. ఏదైనా కేవలం వొక్కటే రాదు కదా? అంచేత దుఃఖం వస్తే విచారించకూడదు. సుఖంవస్తే సంతోషించ కూడదు. ఏదైనా ఇది నాది అనుకుని మనసులోపెట్టుకు కూచుంటే మాత్రం చివరికి అది వల్లమాలిన దుఃఖం కలిగిస్తుంది. వెనకజన్మలో చేసిన కర్మఫలం ఎంతప్రాజ్ఞుడికైనా తప్పదు. దానికి వొకటేమందు—ధైర్యం.

'ఆస వొదిలిపెట్టడమే సుఖం. పింగళ అనే సాని ఈమాట చెప్పింది, స్పష్టంగా.

'పింగళ తన ప్రియుడికోసం ఎంచేపో కనిపెట్టుకు కూచుంది. ఎంతకీ అతడు రాకపోడంతోనే 'నేను అతగాడికోసం వెర్రెత్తి పోతున్నాను. అతడుకూడా ఇలా వెర్రెత్తినట్టు చెయ్యడానికి ఉపాయముందా? భ్రాంతి వొదిలేస్తాను. ఈ వొంటిస్తంభం మేడ (శరీరం) తొమ్మిది వాకిళ్ళూ (నవరంధ్రాలు) పూర్తిగా మూసేస్తాను. నిద్ర పోతాను. నాదగ్గిరికి వచ్చినవాణ్ణే మగడని భావిస్తాను. ఇలాతృప్తిపడి, మనసులో మరో చింత లేకండా వుంటేనే సుఖం కలుగుతుంది. ఆసే ఇంద్రియాలు గెలవకండా చేస్తుంది. అందుకని ఆస విడిచిపెట్టేస్తాను.

ఆశ దుఃఖం. నిరాశ సుఖం' అని నిశ్చయించుకుంది. హాయిగా నిద్ర పోయింది.'

ఇలా ఉపదేశించిన బ్రాహ్మడిమాటలు విని విచారం విడిచి పెట్టాడు సేనజిత్తు. సుఖపడ్డాడు. నువ్వూ ఇందులోని తాత్పర్యం మననం చేసుకో సుఖపడు. శాంతిపొందు.

## మేధావికథ

ధర్మరాజు - ప్రాణుల నాశనం కోసం మృత్యువు సమీపిస్తూ వుంటే మనుషుల కర్తవ్యం ఏమిటి?

భీష్ముడు—తండ్రీకొడుకుల సంవాదం అని పాతకథవుంది. అది నువ్వు అడిగినదానికి సమాధానంగా వుంటుంది.

మేధావి అనిపాక బ్రాహ్మణకుమారుడు వుండేవాడు. వేదాలు తెలిసినవాడతడు. బుద్ధిమంతుడు. ఒకనాడు తండ్రినిచూసి, 'నాన్నా! మనుషుల ఆయువు పరిగెత్తిపోతూ వుంటుంది. ఇది చూస్తూకూడా ధైర్యంతో మంచికోసం ఎలా పాకులాడతారోకదా జనులు?' అని అడిగాడు.

'బాబూ! ఇల్లాలిని కట్టుకుని సంతానం కనాలి మనిషి. యజ్ఞాలుచేసి దేవతల్ని తృప్తిపరచాలి. ఇంద్రియాలు గెలిచి, అడివికి పోయి, సౌమ్యవృత్తితో ముక్తి సాధించాలి. ఇలా నియమంగా మృత్యువుని జయించాలి' అన్నాడు తండ్రి.

'కాలం నీచేతిలోనే వున్నట్టు చెపుతున్నావు' అన్నాడు మేధావి— 'తల్లికడుపులో ప్రవేశించినప్పటినించీ మృత్యువు వెదుకుతూనేవుంటుందనుకో ఎత్తుకుపోడానికి. భార్యాబిడ్డలమీద ఆసక్తి పెట్టుకున్నవాడు ఎండిననీటిలో చేపవంటివాడు కాదూ? అడివిలో ఆదమరిచి నిద్రపోయిన మనిషిని పులి ఎత్తుకుపోయినట్టు మృత్యువు

ఎత్తుకు పోతుంది. చేసిందీ, చెయ్య బోతున్నదీ, చెయ్యవలసిందీ — ఈపనుల్లో తగులుకున్నవాణ్ణి మృత్యువు తన వలలో వేసుకుంటుంది. కనక కాలం మీద ఆదమరుపు కూడదు పిరికివాడనీ, శూరుడనీ, జడుడనీ, నేర్పరి అనీ, బలంలేనివాడనీ, బలవంతుడనీ చూడదు మృత్యువు. ఎవళ్ళనైనా సరే, ఎత్తుకుపోతుంది. అడ్డులేదు దానికి. సంసారం చావుకి పుసికిపట్టు. ఎవళ్ళతోనూ సాంగత్యం లేకండా వుండడమే స్వర్గం. ఇది తెలుసుకుని సంసారబంధాలు తెంపుకో.

'అమృతం సత్యం. మృత్యువు మోహం.♦ సుఖమూ, దుఃఖమూ సమానంగా చూసుకుంటాను నేను. శాంతిపరుణ్ణాయి, సత్యంతోనే మృత్యువుని గెలుస్తాను. నాకు సంతానం గతి కల్పిస్తుంది అనవద్దు. నేనే సంతానమై పుడతాను. నన్ను నేనే చూసుకుంటే అదే మోక్ష సాధనం అవుతుంది. ఆశ జయించడమే సంతానప్రాప్తి. పశుయజ్ఞం హింస. అహంకారంతో కూడిందది. అనంతమైనఫలం ఎన్నటికీ ఇవ్వదది. వాక్కుతోనూ, మనస్సుతోనూ చేసినయజ్ఞమే యజ్ఞం. అదే అనంతమైన ఆనందం ఇస్తుంది.

'కామం, క్రోధం మొదలైన మనోవికారాలు ఇవి వొదులుకుని, వొక్కడివే గుహలో కూచుని నిన్ను నువ్వు తెలుసుకోడం మేలు. తక్కినవన్నీ వొదిలిపెట్టు' అన్నాడు.

మేధావి చెప్పినట్టే చేశాడు తండ్రి. సుఖపడ్డాడు. కనక ధర్మరాజా! సత్యమైన ఈధర్మసూక్ష్మం తెలుసుకుని అనుసరించు. †

ధర్మరాజు—లోకంలో ధనవంతులూ వున్నారు. దరిద్రులూ వున్నారు. వాళ్ళలో సుఖంగా వున్నవాళ్ళెవరు?

♦అమృతం: మోక్షం. మృత్యువు: సంసారం. † చూ. మార్కండేయపు.

భీష్ముడు—శమ్యాకుడని ఒక బ్రాహ్మణుడుండేవాడు. శాంతి పరాయణుడతడు. సంసారమంటే విరక్తితో వుండేవాడు. కూటికీ, గుడ్డకీ బాధపడేవాడు. అతడు ఒకనాడు నాదగ్గిరికివచ్చాడు. అతడు ఉపదేశించిన మాటలు చెపుతాను విను.

'ధనమూ, దరిద్రమూ త్రాసులో వేసి చూస్తే దరిద్రంవేపే ముల్లు తూగింది ఎలా అంటావా? వాటిగుణదోషాలు వివరిస్తాను, ఆలకించు. ధనవంతుడు మృత్యువునోట్లో వున్నట్టు వుంటాడు. అగ్గికీ, దొంగలకీ భయపడుతూ, కుతకుతా మరుగుతూ వుంటాడు. కోపమూ, లోభమూ అధికమై ఎప్పుడూ చింతతో వేగిపోతూ వుంటాడు. అదంతా దుఃఖం కాక, సుఖమా మరి?

'దరిద్రుడు ఎక్కడైనా స్వేచ్ఛగానే వుంటాడు. భయమన్న మాటే వుండదతడికి. అసత్యానికి పూనుకోడతడు. శాంతంగా మాటాడతాడు. అలాటివాణ్ణి దేవతలైనా మెచ్చుకుంటారు కదా! లోకంతీరు తెలుసుకోవాలి. ఇచ్చింది వ్యర్థంకాదని గ్రహించి ధనం విడిచిపెట్టాలి. అదే నేర్పు. ధనవంతుడుగావుండడం దుఃఖహేతువు. ఇది తెలుసుకుని, ధనంమీద కాంక్ష వొదిలిపెట్టాలి. పేదరికంవల్ల కలిగిన ఆత్మస్వేచ్ఛ అంతులేని సుఖం కలిగిస్తుంది' అన్నాడతడు.

## మంకి బ్రాహ్మడి కథ

ధర్మరాజు—ధనదాహంతో వున్న మనిషి ఎలా సుఖపడతాడు?

భీష్ముడు—ధనం గడించడంతో విసిగిపోయి విరక్తిచెందినప్పుడే సుఖపడతాడు. ఈరహస్యంబోధించే ఒక కథ చెపుతాను.

మంకి అని ఒక బ్రాహ్మడు వుండేవాడు. అతడి ధనదాహం ఇంతాఅంతా కాదు. మప్పవలిసిన గిత్తలజత ఒకటి కొన్నాడతడు.

బాగా మదించివున్నాయి గిత్తలు. ఒక్క కన్నెత్తో లంకవేసి కట్టి విడిచిపెట్టాడుమంకి. దారిలో వాకదగ్గిర వాక లొట్టిపిట్ట పడుకుని వుంది దానిమీదుంచి వరిగెత్తాయి గిత్తలు. బెదిరి చప్పున లేచింది లొట్టిపిట్ట. గిత్తలకన్న దానిమీద తగులుకుంది. ఉరిపోసినట్టు రెండువేపులా వేలాడి గిత్తలు రెండూ చచ్చిపోయాయి. గోలుగోలుమన్నాడు మంకి. 'రత్నాల్లాటి కోడెదూడలు వొంటెమీద వేలాడుతున్నాయి' చుట్టూమూగిన వాళ్ళతో ఏడుస్తూ చెప్పుకున్నాడతడు — 'ఆలోచిస్తే పురుషప్రయత్నం కంటే దైవబలమే ముఖ్యం కార్యసిద్ధికి. ఎక్కడైనా మనిషిప్రయత్నం ఫలించినట్టు కనిపించినా, అది దైవబలంవల్ల జరిగిందనే అనుకోవాలి. సుఖం కోరే మనిషి ధనం సంపాదించే అతి వ్యాపారం విడిచిపెట్టడమే మంచిది' అన్నాడు. 'కామం రాకాసి. దాన్ని వొదిలిపెడితేనే కాని మనస్సుకి ముక్తిలేదు' అంటూ విచారించాడు. అది దూరం చేసుకుందికి నిశ్చయించాడు. తగిన చిత్తవృత్తి కుదుర్చుకున్నాడు. 'కామమా! నీమూలం నేను తెలుసుకున్నాను. నీమాయలలో పడను.

'సొమ్ము కోరినంతమాత్రంచేత సుఖం కలగదు. అది సంపాదిస్తే మాత్రం సిద్ధిస్తుందా? సిద్ధించినా చింతలపాలు చేస్తుంది. అది పోయిందా చావుతో సమానంగా వుంటుంది. ఎందుకని ఈ పుర్రాకులు? కనక కోరిక మానుకోడమే సుఖం.

'కామమా! దుఃఖానికీ, కష్టానికీ, ఆసక్తికీ నువ్వే మూలం. నీపాలబడ్డవాడు ఏంచెయ్యాలో తెలుసుకోలేడు. అంచేత నీకు దూరంగా వుంటాను; సుఖపడతాను. నువ్వు ఆసపెడితే ధనం సంపాదిస్తానే కట్టు ఆ ధనం నాశనమైనప్పుడు అడ్డుకోడం నీతరమా? కనక నువ్వుపోతే ఏవిచారమూ వుండదు. ఏదైన్యమూ పెరగదు. సులభమో, దుర్ల

భయమో అని చూడడం ఎరగవు నువ్వు. చూసిందానిమీదికే దూసుకు పోతావు. కష్టాలు పడతావు. తృప్తి అన్నమాట లేనేలేదు నీకు. అనర్థమైన పాతాళం నీదారి. నీదారిని నేను పోను. నిన్ను మాయాభోగాసక్తుని తగులుకున్నట్టు తిరుగుతాను. ధనం చెడి నామనస్సు విసిగి పోయింది. నిన్ను వొదిలిపెట్టాను. శాంతీ, దాంతీ, సత్యమూ, శమమూ, భూతదయా పూనాను. లోభమూ మొదలైనవి నా చుట్టుపట్లకి రావిక. కామసుఖాలూ దివ్యసుఖాలూ కాంక్షవొదలిన సుఖంలో పదహారో వంతైనా కావు. శత్రువుని చంపినట్టు నిన్ను చంపుతాను. భ్రాంతి వొదిలి బ్రహ్మలోకం చేరతాను, అన్నాడు. కోడెలు చచ్చినకారణంగా పుట్టిన విచారంతో అన్నికోర్కెలూ విడిచిపెట్టేశాడు. దేవతలతో సమానుడయాడు. ముక్తి పొందాడు.

## అజగర చరిత్ర

ధర్మరాజు — ఎలా నడుచుకుంటే మనిషి దుఃఖం లేకండా వుంటాడు? దేనివల్ల ముక్తి సంపాదిస్తాడు?

భీష్ముడు—నువ్వు అడిగిందానికి అజగరచరిత్ర చెపుతాను విను. అజగరుడని వొక బ్రాహ్మడు వుండేవాడు. శమం విషయం వివరించమని ప్రహ్లాదుడు అతణ్ణి అడిగాడు. అజగరుడు ఇలా చెప్పాడు— 'ప్రాణులు పుట్టడానికి వొక కారణమంటూ లేదు. ప్రాణులు శాశ్వతం కూడా కావు. ఈరహస్యం తెలుసుకుంటే అవి పెరిగితే సంతోషం కలగదు. తరిగితే విచారమూ కలగదు. వరదలో రెండు కర్రపుల్లలు కలియడంలాటిది బంధువుల సాంగత్యం. అవి విడిపోడం ఎలాటిదో బంధువుల వియోగమూ అలాటిదే. ఇది తెలుసుకున్నవాడికి దుఃఖమే వుండదు. ఇవన్నీ నాకు తెలుసు. నాదగ్గిర శాంతిభావం చూసేకదూ,

నన్ను శమంవిషయం అడిగావు! మేలూ కావాలనను. దుఃఖపడి కీడు తోసెయ్యను. కీడూ, మేలూ రెండూ మానంతో ఉపేక్షిస్తాను. సరైనదారిని నడుచుకు పోతాను. రసాలతో అన్నమైనా, తెలక పిండైనా వొక్కలాగే తింటాను. మెత్తటి దూదిపరుపుమీదా, కటిక నేలమీదా వొక్కలాగే నిద్రపోతాను. నారబట్టలైనా, చక్కటి చీనాపట్టుబట్టలైనా వొక్కలాగే కట్టుకుంటాను. దానికి విచారం, దీనికి సంతోషం అని వుండదు. రూపమూ, రసమూ మొదలైనవాటి వెంట కళ్ళూ, నాలుకా మొదలైన ఇంద్రియాలు పరిగెత్తవు.'

చలించకుండా వుండడమూ, చావు పుట్టుకలు గణించకుండా వుండడమూ, దేహాభిమానం కలవాళ్ళని హేళనచేసి సంతోషించక పోడమూ, ఐశ్వర్యం పాటించకుండా వుండడమూ 'ఇలాంటి ఆహారమే తినాలి—ఇలాంటి ప్రదేశాల్లోనే తిరగాలి — ఇలాంటి పక్కల మీదే పడుకోవాలి' అనుకోకపోడమూ, 'విధి ఎలా వుంటే అలా నడుస్తుంది' అని నిశ్చింతగా వుండడమూ, తృప్తీ శుచీ వోర్పూ సమత్వమూ కలిగి వుండడమూ, ఇది చిదానందం అని తెలుసుకోడమూ ఇదంతా అజగరవ్రతం. తెలియనివాళ్ళకి దుర్లభం ఇది. తెలిసిన వాళ్ళకి సులభం ఇదీ శమం తీరు.

అజగరవ్రతం అవలంబించిన నిర్మలచిత్తుడికి పాపమూ, భయమూ, దైన్యమూ, శోకమూ గెలవడం అసాధ్యం కాదు. మోక్షం కరతలామలకం అతడికి.

ధర్మరాజు — బంధువులూ, కర్మా, ధనమూ, ప్రజ్ఞా ఏది మనిషికి ప్రతిష్ఠ కలిగిస్తుంది?

భీష్ముడు — ప్రజ్ఞ. ప్రజ్ఞే ప్రతిష్ఠ. ప్రజ్ఞే లాభం. ప్రజ్ఞే స్వర్గం, ప్రజ్ఞే కైవల్యం. ప్రజ్ఞవల్లసాధ్యంకాని పనులే లేవు బలీ, ప్రహ్లాదుడూ

మంకి మొదలైన వాళ్ళు ప్రజ్ఞవల్లే అంతవాళ్ళయారు. కాశ్యపు డని వొక బ్రాహ్మడు వొక గర్వపోతురథం తగిలి పడిపోయాడు. ఆ అవమానంతో బాధపడి ప్రాణాలు విడిచిపెట్టడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు దేవేంద్రుడు నక్కరూపంలో అతని దగ్గిరికి వచ్చాడు. ప్రజ్ఞ కలిగించే మాటలాడి మనశ్శాంతి కలిగించాడు. అన్నివిధాలా ప్రజ్ఞేగొప్పది.

ధర్మరాజు — దానమూ, తపస్సూ, గురుశుశ్రూషా, యజ్ఞాలూ ఎలా పరిణతి పొందుతాయి?

భీష్ముడు — మేలుకి మేలూ, కీడుకి కీడూ తప్పదు. పాపాలు చేస్తే కరువుమీద కరువూ, భయంమీద భయమూ, కష్టాలమీద కష్టాలూ అనుభవిస్తూ బాధపడుతూనే వుంటాడు మనిషి. పుణ్యం చేస్తే పండుగ మీద పండుగా, సుఖంమీద సుఖమూ, పుణ్యంమీద పుణ్యమూ అనుభవిస్తాడు. పక్షుల్లో కంపు పురుగులాగ, ధాన్యంలో పొల్లుగింజలాగ, మనుషుల్లో ధర్మం చెయ్యని వాళ్ళునీచులనుకో.

మనిషిచేసిన కీడూ, మేలూ వొదలవు. అతడు వెళ్తే అవీ వెళతాయి. అతడు వుంటే అవీ వుంటాయి. ఏం చేస్తున్నా అవీ కలిసి చేస్తూనే వుంటాయి. నీడలా అంటిపెట్టుకునే వుంటాయి. రుతువు రాగానే చెట్లలో పువ్వులు పూసి, పళ్ళు పండినట్టు మనిషి చేసుకున్న కర్మ అనుభవించవలిసిన కాలం వచ్చేసరికి ప్రయత్నం అక్కరలేకుండానే సుఖదుఃఖాలు వచ్చేస్తాయి. పెద్దలు నడిచిన దారి చూసీ కూడా తెలుసుకోలేరు తక్కిన వాళ్ళు. ఆకాశంమీద పక్షులూ, నీళ్ళలో చేపలూ పోయే దారులు తెలుసుకోగలమూ? అయినా తెలుసుకోవాలని దృఢమైన మనస్సుతో పెద్దల ఉపదేశాలు వింటూ, ధర్మంగా నడుచుకుంటే మాత్రం తప్పకుండా ఫలిస్తుంది.

## భూతసృష్టి

ధర్మరాజు—భూతసృష్టి ఎవరివల్ల జరిగింది? ఎలా జరిగింది?

భీష్ముడు—ఈవిషయమూ, మరికొన్ని విషయాలూ భరద్వాజుడు అడిగితే భృగుడు చెప్పాడు.♦

కైలాసశిఖరంమీద వున్న భృగుడిదగ్గిరికి భరద్వాజుడు వెళ్ళి 'మునీంద్రా, భూతసృష్టి ఎలా జరిగిందో సెలవి య్యి' అని అడిగాడు. భృగువు ఇలా చెప్పాడు – 'నాశనంలేని అనంతుడు, నారాయణుడు భూతసృష్టిచేయడానికి పూనుకున్నాడు. ముందు తనలో వెయ్యో భాగంతో అవ్యక్తుడని వొకణ్ణి తన మనస్సులో పుట్టించాడు. ముసిలి తనమూ, మరణమూ లేవు అతడికి. ఇలా వుంటాడని చెప్పడమూ సాధ్యంకాదు అతడివల్ల మహత్తు అని తత్వం పుట్టించి నారాయణుడే దివ్యతేజస్సుతో నిండిన పద్మం వొకటి పుట్టించాడు. అందులోంచి బ్రహ్మపుట్టాడు. అతడి సంకల్పంవల్ల ఆకాశం పుట్టింది. ఆకాశంలోంచి నీళ్ళు పుట్టాయి. నీటిలో అగ్గి పుట్టింది. గాలీ పుట్టింది. అగ్గీ గాలీ కలియడంతో భూమి పుట్టింది.

'సర్వభూతాలూ శరీరంగా కలవాడు బ్రహ్మ. ఎలా అంటావా? కొండలు అతడి ఎముకలు. భూమి మేదస్సూ, మాంసమున్నూ. సముద్రాలు నెత్తురు. ఆకాశం కడుపు. గాలి వూపిరి. అగ్ని తేజస్సు. ఏళ్ళు నరాలు. సూర్యచంద్రులు నేత్రాలు. మీది లోకం శిరస్సు. పాతాళం పాదాలు. దిక్కులు చేతులు. అనంతాత్ముడు విష్ణువు. విష్ణువు వల్లే విశ్వం కలిగింది' అన్నాడు.

ఆకాశం మొదలైన పంచమహాభూతాల ప్రమాణం అడిగాడు భరద్వాజుడు. 'అవి అనంతాలు' అన్నాడు భృగువు— 'వాటి

---

♦మా. నారదపురాణం భృగు భరద్వాజ సంవాదం.

ప్రమాణం దేవతలుకూడా కొలవలేరు. ఒక చోటు చెప్పి. ఈభూతం ఇంతనించి పైన లేదు అనలేం. పంచభూతాలూ మేరలేనివి అది ఎలా అంటారా? గుణంపట్టి విష్ణువుకి అనంతుడు అని పేరుంది కదా! విష్ణువు విశ్వమూర్తి అతడి శరీరంలోని మహాభూతాలు మితిలేనివి కాకపోతాయా?

'నీళ్ళలో పుట్టిందికదా, పద్మం? మరి ఆ పద్మం బ్రహ్మకంటె ముందు ఎలా పుట్టింది?' అని అడిగాడు భరద్వాజుడు.

'విష్ణువు మనస్సులో పుట్టాడు బ్రహ్మ. అంచేత ఆతడే మొదటి వాడు. పద్మం అతడికి ఆసనంగా కల్పితమైంది. ముందూ, వెనకా అన్న మాటే లేదు ఇక్కడ. బ్రహ్మ పద్మంలోంచి పుట్టా డంటారు. ఆ పద్మమే భూమి. ఆకాశం అంటుతూన్న మేరుపర్వ తమే దాని కర్ణిక. అక్కడినించే అన్నిప్రాణుల్నీ సృష్టిస్తాడు బ్రహ్మ' అన్నాడు భృగువు.

'భూతాలు అయిదు ఎలా అయాయి?' అని అడిగాడు భరద్వాజుడు.

'కదిలినప్పుడు గాలి. శబ్దించినప్పుడు ఆకాశం. ద్రవంగా వున్న ప్పుడు నీరు. వేడిగా వున్నప్పుడు అగ్ని, కఠినంగా వున్నప్పుడు భూమి. ఇలా అయిదువిధాలు భూతాలు. ఈ అయిదింటివల్లే కదిలే ప్రాణులూ, కదలనిప్రాణులూ పుట్టాయి' అన్నాడు భృగువు.

'కదలనివాటిలో పంచభూతాల గుణాలు ఎలా తెలిశాయి?' అని అడిగాడు భరద్వాజుడు.

'పిడుగు పురిమిందంటే చెట్టువికారం పొందుతుందా లేదా?' భరద్వాజుడి ప్రశ్నకి విడమర్చి చెప్పాడు భృగువు — 'శబ్దం వినే చెవి లేకపోతే ఎలా వికారం పొందింది? ఈ వినడానికి ఆకాశంశక్తే

కారణం ఎండ తగిలితే చెట్టు వాడిపోతుంది. చర్మంతో ఈ స్పర్శ తెలియడానికి గాలి శక్తి కారణం. కళ్ళతో వెలుగుదారి చూసి కొనలు సాగుతుంది చెట్టు అగ్ని శక్తితో ఈ తేజస్సు చూడడం జరుగుతుంది. చెట్టుకి పాదాలే (వేళ్ళు) నాలుకలు. పాదాలతో అది నీళ్ళు తాగుతుంది. అంచేత పాదపం అని చెట్టుకి పేరు. ఈ నాలుకలతో తాగడం జలశక్తి. ధూపాలూ, పువ్వులూ మొదలైనవాటి వాసన చెట్టు పీలుస్తుందని వేదాలు చెపుతున్నాయి. ముక్కు లేకపోతే ఎలా వాసనచూస్తుంది? ఈవాసన చూడడం భూశక్తి. ఇలా పంచభూతాలతోనూ, వుందన్నమాటే కదా కదలని ప్రాణి చెట్టు? ఇలాగే కొండలూ మొదలైనవీ అని భావించాలి. ఇతర విధాలు కూడా వుంటాయి. పంచ భూతాలు లేని ప్రాణే లేదు. ఇది వేదాలు నిశ్చయించిన మాట.'

'భూమీ మొదలైన పంచభూతాలకి గంధమూ మొదలైన గుణాలు వున్నాయికదా! అవి అనుభవించడం ఎలా జరుగుతుంది?' అని అడిగాడు భరద్వాజుడు.

'అంతరాత్మకి ఇంద్రియాలూ? మనస్సూ సాధనాలు. ఈ సాధనాలతో విషయాలు అనుభవిస్తుందది. దానివల్ల కలిగే సుఖదుఃఖాలు పొందుతుంది అంతరాత్మే క్షేత్రజ్ఞుడు; జీవుడు. అన్ని శరీరాల్లోనూ వుంటాడు జీవుడు. రకరకాల పేర్లతో అంతటా గాలితో కలిసి వుంటాడు. సత్వమూ, రజస్సూ తమస్సూ— ఈమూడుగుణాల వికారాలూదాటి ఆత్మ మొదటిస్థితికి వచ్చి ముక్తి పొందుతుంది. పండితుడు సూక్ష్మబుద్ధితో అంతరాత్మని తెలుసుకుంటాడు. దాని మీద మనస్సు నిలుపుతాడు. కీడూమేలూ పొందక, శుద్ధమైన శాంతితో పరమసుఖం పొందుతాడు.

'ఇంకా విను. వేదాలూ, సత్యమూ, ధర్మమూ, ఆచారమూ, తపస్సూ—వీటికి పునికిపట్టుగా ముందు బ్రహ్మ బ్రాహ్మల్ని పుట్టించాడు. తరువాత రాజుల్ని, కోమట్లల్ని శూద్రుల్ని కల్పించాడు. ఈనాలుగు జాతుల ఉజ్వలచ్ఛాయలు వరసగా తెలుపూ, ఎరుపూ, పసుపూ, నలుపూ అని పెద్దలు చెపుతారు తనజాతి పని విడిచి పెట్టి కిందిజాతిపని చేసిన జాతి వ్యభిచార జాతి అయిపోతుంది. తెలుపూ, ఎరుపూ, పసుపూ, నలుపూ, రంగులు వొకటికొకటికలిసితగ్గిపోతాయి. కనక జాతికర్మలో కూడా ఇదే ప్రమాణంగా గ్రహించాలి.

'సత్యమే ధర్మం సత్యమేతపం. సత్యమే ప్రజల్ని సృజిస్తుంది. సత్యమే లోకం పుట్టిస్తుంది; నిలుపుతుంది. అయితే సత్యం అసత్యంచేత మరుగు పడిపోతుంది. సత్యమంటే ధర్మం అసత్యమంటే అధర్మం. సత్యమంటే వెలుగు. అసత్యం అంటే చీకటి. సత్యం అంటే జ్ఞానం. అసత్యం అంటే అజ్ఞానం. సత్యం అంటే స్వర్గం. అసత్యం అంటే నరకం. సత్యం అంటే సుఖం. అసత్యం అంటే దుఃఖం. పండితుల వ్యావహారిక నామాలు ఇవి. అసత్యం అణచడానికే పండితులు ఎప్పుడూ తపస్సు చేస్తారు.

'ముసిలితనమూ రోగమూ మొదలైనవి శరీరసంబంధమైనవి సంతోషమూ, దుఃఖమూ మొదలైనవి మనస్సుకి సంబంధించినవి. ఇలా రెండువిధాల దుఃఖాలు మనిషిని బాధిస్తాయి శరీరమూ, మనసూ రెండూ తన్ను బాధించకండా కోరుకోవాలి. నియమంతో ప్రతీకారం చెయ్యాలి. అప్పుడే సుఖం. దుఃఖాలు విడిచిపెట్టి సుఖాల్లో మునిగిపోకండా విరక్తి చెందినవాడే ముక్తిపొందుతాడు' అన్నాడు భృగువు.

ఆశ్రమాలగీతులు వివరంగా వినిపించమన్నాడు భరద్వాజుడు.

'గురుభక్తి కలిగి వేదాలు చదవడమూ, ఆచారంతోనూ, వినయంతోనూ మసులుకోడమూ, ముప్పూటలా సవనస్నానం చేసి సూర్యుణ్ణీ అగ్నినీ పూజించడమూ బ్రహ్మచారి ధర్మం.

'న్యాయంగా ధనధాన్యాలు గడించడమూ, ముందు అతిథి పూజచేసి అనంతరం అన్నపానాలు అనుభవించడమూ గృహస్థ ధర్మం. దుంపాదుల్లా తిని, నేలమీద నిద్రపోయి, అడవుల్లో వొకళ్ళ సాంగత్యం లేకండా వుండడం వానప్రస్థధర్మం. బిచ్చమెత్తుకుని శాంతంగా బతకడం యతి ధర్మం. ఈ కర్మలన్నీ ఫలం కోరకండా నియమంతో చేస్తే మోక్షంచేరుస్తాయి' అన్నాడు భృగువు.

'పరలోకమనివొకటి వుందంటున్నావు. ఈలోకానికీ, ఆలోకానికీ ఏమిటి విశేషం?' అని అడిగాడు భరద్వాజుడు.

'ఇది కర్మభూమి' అన్నాడు భృగువు — 'అది భోగాలు అనుభవించే చోటు. ధర్మపరులకి సులభ మది. సత్యమూ, శుచిత్వమూ, సౌజన్యమూ లేనివాళ్ళకి దొరక దది ఈలోకం దుఃఖాల పుట్ట. ఆ లోకం సుఖాల గని. అక్కడ ఏదుఃఖమూ వుండదు. అంతా కలిసీ మెలిసీ వుంటా రక్కడ. ఇళ్ళూ, పక్కలూ, ఆసనాలూ, బట్టలూ, గంధాలూ, పూలదండలూ, ఆటపాటలూ, వాద్యాలూ, ఉద్యానాలూ, స్త్రీలూ—అన్నిటిలోనూ ఆలోకానికీ ఈలోకానికీ హాస్తి మశకాంతరం వారా.

'ఇవి పుణ్యలోక విషయాలు. ఇంక అధమలోక ముంది. ధర్మంలేని జనం అక్కడికి వెళతారు. అక్కడి దుఃఖాల సంగతి మరి చెప్పనే అక్కరలేదు. మనస్సులో మమకారం లేనివాళ్ళకి పుణ్యపాపాలు లేవు. వాళ్ళు ఈలోకం వెళ్ళరు. శాశ్వతానందం పొందుతారు. బ్రహ్మచెప్పిన ధర్మాలు సంక్షేపంగా నీకు వినిపించాను.'

అన్నాడు భృగువు. సంతోషించాడు భరద్వాజుడు. మెచ్చుకుని నమస్కరించాడు. సెలవుతీసుకు వెళ్ళాడు.

ధర్మరాజు—ఆచార విధులు వినాలని వుంది.

## ఆచారం

భీష్ముడు—దురాచారం కష్టం కలిగిస్తుంది. కనక ఆచార విధులు తెలుసుకోడం మంచిదే.

రాజమార్గంలోనూ, రచ్చపట్లలోనూ, ఆలమందలలోనూ మల మూత్రాలు విడవకూడదు.♦ శుచి అయి, ఆచమనంచేసి, నిష్ఠతో నీళ్ళలో దిగాలి. ఉదయమూ, సాయంకాలమూ సూర్యుణ్ణి పూజిం చాలి. సూర్యుడు ఉదయిస్తున్నప్పుడూ, అస్తమిస్తున్నప్పుడూ నిద్రపోకూడదు. తడిపాదాలతో పడుకోకూడదు. కాళ్ళూ, చేతులూ, నోరూ కడుక్కుని అన్నం తినాలి. అన్నం నిందించకూడదు. ఇవన్నీ సదాచారాలు సత్కర్మలు తెలిసిన నారదముని చెప్పినమాట లివి.

ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూడకూడదు. బట్టవిప్పుకున్న ఆడదాన్ని చూడకూడదు. తన మలం తాను చూడకూడదు. తనపాపం తాను దాచకూడదు స్త్రీసంగమం గుప్తంగా వుంచాలి. గురువులసేవా, మునులసేవా చెయ్యాలి. ఆయువు అధికం చేస్తాయివి. సిరీ, సంపదా కలిగిస్తాయి. పుణ్యలోకాలు ప్రసాదిస్తాయి.

ధర్మరాజు—అధ్యాత్మవిద్య సెలవియ్యి.

భీష్ముడు—జీవుడిలో సముద్రంకెరటాల్లాగ భూమీ మొదలైన పంచభూతాలూ పుడుతూ, అడిగిపోతూ వుంటాయి. శబ్ద, స్పర్శ,

♦ చూ. విజ్ఞానేశ్వరం. 1-35

రూప, రస, గంధాలు పంచభూతాల గుణాలు. చెవీ, చర్మమూ, కన్నూ, నాలుకా, ముక్కూ ఈపంచేంద్రియాలూ తెడ్లవంటివి, ఇంద్రియాలకి మనస్సు ఆధారం. మనస్సు నిర్ణయించేస్తే మనిషి ఇంద్రియవ్యాపారాలు సాగుతాయి. అలా కాకుండా ఇంద్రియాలు మళ్ళించి, మనస్సుతో చేర్చి, దాంతోపాటు బుద్ధితో అణచుకుంటే, బుద్ధి విషయాలనించి ఆత్మని చేరుతుంది.

క్షేత్రజ్ఞుడూ, భూతాత్ముడూ, పురుషుడూ, పరమేశుడూ, బుద్ధిసాక్షీ, జననరహితుడూ అని ఆత్ముడి పేర్లు.

తనకి తెలిసిన విషయాలు తనఅనుభవానికి వస్తాయి. మాయలో పుట్టిన స్వప్నంలాగ ఆత్మకి తన్ను తాను కానలేని అజ్ఞానం కలిగిస్తా యవి. సత్త్వమూ మొదలైన గుణాలు మాయకి శరీరం. అది తెలుసుకుని తమస్సూ రజస్సూ అణచుకోవాలి. సత్త్వగుణమే ఆశ్రయించాలి. వివేకంతో అదికూడా వొదలేస్తే, జ్ఞానవంతు డవు తాడు. ఆలోచిస్తే సత్త్వగుణమే సుఖానికి మూలం. రజోగుణం దుఃఖా నికి మూలం. తమోగుణం జ్ఞానం పోగొడుతుంది. సమత్వం కలిగి ఈ అవస్థల్లో పడకండా వుండడమే మాయకి మందు.

## యోగం

ఇక యోగవిషయం చెపుతాను విను. తెలివితో మనస్సు నిశ్చలంగా, గురిగా వుంచడంకోసం నిష్ఠకి అవసరం. మేఘంలో మెరుపు లాగ తామరాకుమీద నీటిబొట్టులాగ మనస్సు ఆలోచనలవేపు పరిగెడుతుంది. దాని గతి గాలిలా వుంటుంది. కనక గాలి అదుపులో వుంచుకోడం మంచిది. అయితే గాలి క్రమసాధన వల్ల కాని నిల వదు. సోమరితనం పనికిరాదు. విసుగుదల కూడదు. యమ నియ

మాలు ♦ఎనిమిదీ అభ్యాసంతో అలవరుచుకుంటే ఆలోచన పట్టువడుతుంది. వితర్కం ఏర్పడుతుంది. దాంతో వివేకం గాలిని దారికి తెస్తుంది.

గాలి అంతర్నాడిలోంచి కపాలం తాకినప్పుడు మనస్సు శాంతి పొందుతుంది; ఆనందం అనుభవిస్తుంది; ఆనందంలోనే లీనమవుతుంది.

## జపం

ధర్మరాజు — జపవిధీ, జపతత్పరులు పొందే గతీ సెలవియ్యి.

భీష్ముడు — ఈవిషయంలో యముడూ, కాలుడూ, మృత్యువూ, ఇక్ష్వాకువూ, కౌశికుడూ వాదించారు. ఆకథ నాకు తెలిసింది చెపుతాను.

వేదాంతం తెలిసినవాళ్ళు జపకర్మ ఆమోదించారు. శుచికలిగి సమమైన నేలమీద దర్భాసనం వేసుకుని దర్భనపట్టుకు కూచోవాలి. నిర్మలమైన చిత్తవృత్తితో వుండాలి. ఇంద్రియాలు విషయాలమీదికి పోకండా అరికట్టాలి. మచ్చరమూ, అహంకారమూ, గర్వమూ వొదిలిపెట్టాలి. బ్రహ్మచర్యం పాలిస్తూ జపంచేసే పురుషుడు విరక్తితో అన్నిలోకాలూ జయిస్తాడు. ఈ జపచర్యతోనే దుఃఖమూ, సంతోషమూ, మోహమూ అన్నీ గెలుచుకుంటాడు. తుదకి ముక్తిపదం చేరుకుంటాడు.

శుచిత్వంలేకండా చేస్తేమాత్రం జపం చెడుతుంది. దానివల్ల మంచి లేదు సరికదా, పైగా నరకంకూడా వస్తుంది.

కౌశికుడని వొక బ్రాహ్మడు వుండేవాడు. వేదవేదాంగాలు తెలిసినవాడతడు. శాస్త్రప్రకారం వెయ్యిసంవత్సరాలు గాయత్రి

♦ యమం, నియమం, ఆసనం. ప్రాణాయామం, ప్రత్యాహారం, ధారణా ధ్యానం, సమాధి.

జపంచేశాడు. సావిత్రీదేవి ప్రత్యక్షమైంది. కౌశికుడు భక్తితో సాగిల బడ్డాడు. 'వరమిస్తాను అడుగు' అంది సావిత్రి. జపనిష్ఠ కోరు కున్నాడు కౌశికుడు. ఇచ్చింది సావిత్రి. 'నీకు గొప్ప పదవి కూడా దొరుకుతుంది. ధర్మదేవత నీదగ్గిరికి వస్తాడు. యముడూ, కాలుడూ, మృత్యువూ వస్తారు. వాళ్ళకి, నీకూ వాదం జరుగుతుంది' అని చెప్పి అంతర్ధానమైంది.

జపంచేస్తూ కూచున్నాడు కౌశికుడు. వంద దేవసంవత్సరాలు (36500) గడిచాయి. ధర్మదేవతవచ్చి ప్రత్యక్షమయాడు. 'నీజపం వల్ల సాటిలేని పుణ్యలోకాలు నీకు సిద్ధించాయి. తనువూ, మనసూ వొదిలి సంతోషంగా ఆ పుణ్యలోకాలకి వెళ్ళు' అన్నాడు.

'తనువు వొదిలి వెళ్ళే లోకాలు నాకు అక్కరలేదు. నువ్వు చెప్పింది మంచిదే అయినా, దుఃఖాలు వోర్చుకుని నా ఇష్టానికి అనుగుణంగావుం దిది. ఇది విడిచి పెట్టవచ్చా?' అన్నాడు కౌశికుడు.

'తనువు వొదిలిపెట్టడం ఎలాగూ తప్పదు కదా! ఎంతో రమ్యంగా వుంటుంది స్వర్గం, తెలియదూ?' అన్నాడు ధర్మదేవత.

'ఉఁహూఁ, శరీరం విడిచిపెట్టి స్వర్గానికి వెళ్ళను' అన్నాడు కౌశికుడు.

'శరీరం వొదిలిపెట్టడం సమ్మతించవు కదూ? ఇదిగో యముడూ, కాలుడూ, మృత్యువూ వచ్చారు చూడు!' అన్నాడు ధర్మదేవత. అతడలా అంటూనేవున్నాడు, తమపేర్లు చెప్పుకుంటూ కౌశికుడిముందు ప్రత్యక్షమయారు వాళ్ళు.

'నీ జపఫలం సిద్ధించింది' అన్నాడు యముడు. 'నువ్వు స్వర్గం వెళ్ళవలసిన కాలం వచ్చింది. అందుకే నేను వచ్చాను' అన్నాడు కాలుడు. 'కాలం ప్రేరేపిస్తోంది. నిన్ను పట్టుకుపోతాను' అన్నాడు మృత్యువు.

ఈమాటలు ఏవీ వినిపించుకోలేదు కౌశికుడు. వినయంగా వాళ్ళ మొహాలు చూశాడు. 'మీకు నేను ఏంచెయ్యాలో సెలవియ్యం'డి అన్నాడు.

ఇంతలో పుణ్యతీర్థాలు సేవిస్తూ ఇక్ష్వాకు మహారాజు అక్కడికి వచ్చాడు. వాళ్ళందరికీ మొక్కాడు. అతణ్ణి అతిథిగా గ్రహించి ఆనందించాడు కౌశికుడు. 'నాకు ఉన్నదంతా ఇస్తాను, నీకు ఏంకావాలో అడుగు' అన్నాడు.

'రాజులు దానం ఇస్తారు. కాని పుచ్చుకుంటారా? నీకు ఏంకావాలో అడుగు. ఇస్తాను' అన్నాడు ఇక్ష్వాకుడు.

'సంసారులు పుచ్చుకుంటారు. కాని సన్యాసులు పుచ్చుకుంటారా, రాజా? నామనసులో ఏ కోరికలూ లేవు. కనక ఏదీ పుచ్చుకోను, నువ్వు కోరుకో, ఇస్తాను. పూజామాపంగా ఇచ్చింది అతిథి పుచ్చుకోడం తప్పుకాదు' అన్నాడు కౌశికుడు.

'ఇవ్వాలనే వుంటే సరే, నీ జపఫలం యావత్తూ ఇయ్యి' అని అడిగాడు ఇక్ష్వాకుడు.

'నా జపఫలంలో సగం ఇస్తాను. కాదంటావా అంతా తీసుకో ఇచ్చేస్తాను' అన్నాడు కౌశికుడు.

'అయితే ఏమిటి ఆ జపఫలం?' అని అడిగాడు ఇక్ష్వాకుడు

'నేను ఫలం కోరకండానే జపం చేశాను. అంచేత దీనికి ఫలం ఇది అని ఎరగను. ఇంకొకర్ని అడగాలని లేదునాకు. వద్దైతే అది. ఆఫలం నువ్వు పుచ్చుకో. తత్వం తెలిసినవాళ్ళవల్ల దానంతట అదే తెలుస్తుంది' అన్నాడు కౌశికుడు.

'ఫలం నీకు తెలియదూ? అయితే నేను పుచ్చుకోను అన్నాడు ఇక్ష్వాకుడు.

'నువ్వు అడిగావు. నేను ఇచ్చాను. సత్యం చెడకూడదు పుచ్చుకో' అన్నాడు కౌశికుడు.

'రాజులకి యుద్ధం ధర్మం. కనక నీతో నేను వివాదయుద్ధం చేశాను. అంతే' అన్నాడు ఇక్ష్వాకుడు 'నువ్వేవంచేస్తేనేం? ఇస్తానని ఇవ్వకపోడమూ, పుచ్చుకుంటా నని పుచ్చుకోకపోడమూ అసత్యాలవుతాయి. సత్యవ్రతం విడిచి పెట్టడం ధర్మమా? సత్యమే తపం. సత్యమే యజ్ఞం. సత్యమే వేదం. సత్యమే శాంతి. సత్యమే దాంతి. సత్యం విడిచితే నిర్మలమైన నిత్యానుష్ఠానా లన్నీ నిష్ఫలమే.

వాళ్ళ ఇద్దరిమాటలూ విని యముడూ మొదలైన వాళ్ళు విన్నట్టు 'వీళ్ళిద్దరికీ కయ్యమెందుకూ? కౌశికుడు దానఫలమూ, ఇక్ష్వాకుడు సత్యఫలమూ పొందుతారు' అన్నాడు ధర్మదేవత.

అంతలో మనిషిరూపంలో స్వర్గం అక్కడ అవతరించింది. నేను ఫలానా అని చెప్పి 'వాదన ఎందుకూ? మీరు ఇద్దరూ సమానమైన ఫలమే పొందుతారు' అంది.

'అలా అయితే ఈ మునికూడా నేను ఇచ్చింది పుచ్చుకో వాలి' అన్నాడు ఇక్ష్వాకుడు.

'నేను తపస్సూ, అధ్యయనమూ చేసుకునేవాణ్ణి. పుచ్చుకోడం మానుకున్నాను' అన్నాడు కౌశికుడు.

'నేనూ, నువ్వూ సమానంగా వుండాలని కోరుతున్నాను. నీపుణ్యఫలం నాకు ఇచ్చావు. నాపుణ్యఫలం నువ్వుపుచ్చుకో, అనుగ్రహించు' అని ప్రార్థించాడు ఇక్ష్వాకుడు.

ఇంతలో వికృతవేషాలతో ఇద్దరు పురుషులు వాళ్ళలో వాళ్ళు దెబ్బలాడుకుంటూ అక్కడికి వచ్చారు. ఇక్ష్వాకుణ్ణి చూసి 'ఇతడు మనల్ని శాసించే రాజు' అంటూ ముందు నిలబడ్డారు.

వాళ్ళసంగతి ఏమిటంటే, ఒకడు గోదానం చేశాడు. రెండో వాడు ఆఫలం కోరాడు. అప్రకారం మొదటివాడు ఫలం ఇచ్చేశాడు. అది తక్కువ అనుకుని రెండోవాడు మంచి ఆవులు రెండు అమ్మి సత్పాత్రుడికి దానంచేసి, ఆఫలం మొదటి వాడికి ఇవ్వబోయాడు. ఒప్పుకున్నట్టేవుండి, జాప్యంచేసి, తిరస్కరించాడు మొదటివాడు. దాంతో ఇద్దరికీ తగువు పుట్టింది. అదంత స్పష్టంగా రాజుకి విన్నవించారు వాళ్ళు.

'ఇతడు కోరాడు. నేను ఇచ్చాను. తిరిగి పుచ్చుకోడం నాకు ఇష్టంలేదు. నన్ను నిర్బంధించవచ్చా ఇతడు?' అని ఫిర్యాదుచేశాడు మొదటివాడు.

'అదికాదు, దానంపుచ్చుకుంటానని మొదటవొప్పుకున్నాడు. ఇప్పుడు పుచ్చుకో నంటున్నాడు. ఇది అన్యాయం. పాపం. కర్మకాండ తెలిసినవాళ్ళు అందరూ ఎరుగుదు రిది' అన్నాడు మొదటివాడు.

'ఇతడిమాటలు విన్నావా?' అంటూ ఇక్ష్వాకుణ్ణి అడిగాడు కౌశికుడు— 'రాజా! నువ్వు నాజపఫలం అడిగావు. నేను సమ్మతించాను. ఇప్పుడు కాదంటున్నావు. శపిస్తాను. స్పష్టంగా చెపుతున్నాను' అన్నాడు కఠినంగా.

భయపడ్డాడు ఇక్ష్వాకుడు. 'ఒకళ్ళు ఇచ్చిందానికి చెయ్యి చాచనివాణ్ణి నేను. తప్పిందికాదు' అంటూ చెయ్యిచాచాడు.

'ఎన్నోసంవత్సరాలు నేను చేసిన జపఫలం యావత్తూ నీకు ఇస్తున్నాను' అంటూ నీళ్ళు ధారపోశాడు కౌశికుడు.

'మునీంద్రా, నాచేతిలో నీళ్ళు పడ్డాయి. మన ఇద్దరికీ సత్కర్మ సమంగా వుండవద్దూ? నేను చేసిన యజ్ఞఫలం నీకు ధారపోస్తాను. పుచ్చుకో' అన్నాడు ఇ ్వకుడు.

'రాజా!' వికృతవేషంతో వచ్చిన పురుషులు ఇద్దరూ ఇక్ష్వాకుడితో అన్నారు—'మేం ఇద్దరమూ కామక్రోధులం. ధర్మదేవతా, యముడూ మొదలైనవాళ్ళచేతా, మాచేతా మీ పరీక్ష జరిగింది. ఇవ్వడమూ, పుచ్చుకోడమూ దైవం పనులు. మీపనులు కావు.

'జపవిధిలో శ్రద్ధా, బలమూ సావిత్రీదేవి నాకు అనుగ్రహించింది. మరొకటి చెయ్యకూడదు నేను. అయినా ఇంతమంది ఎదటా నువ్వు కోరావు. కనక నీకోరిక కాదనలేను. పుచ్చుకుంటున్నాను. నీసుకృతం ఎటు లాగితే అటు వెళ్ళు' అన్నాడు కౌశికుడు.

కౌశికుడూ, ఇక్ష్వాకుడూ చేసిన పనికి బ్రహ్మ మొదలైన దేవతలు సంతోషించారు. వాళ్ళమీద పూలవాన కురిపించారు, వాళ్ళముందు ప్రత్యక్షమై మెచ్చుకున్నారు. దేవదుందుభులు మోగాయి. అప్సరసలు నాట్యంచేశారు.

ఇక్ష్వాకు మహారాజునీ, కౌశికమునినీ చూసి స్వర్గం ఇలా అంది—'పుణ్యాత్ములారా! మీరు పరిశుద్ధులయారు. ఇక ఆలస్యమెందుకూ? ఉత్తమలోకాలకి బయలుదేరండి.'

మచ్చరమూ మొదలైన బంధాలు వొదులుకున్నాడు కౌశికుడు. ధర్మదేవతనీ, యముడూ మొదలైనవాళ్ళనీ, ఇతర దేవతల్నీ నమస్కారపూర్వకంగా సాగనంపాడు. ప్రాణం మొదలైన వాయువులు నియమంతో బంధించి, కనుబొమలమధ్య నిలిపాడు. శరీరచేష్టలు మాని, వాటిని శిరస్సునించి తాలువులో చేర్చాడు. అతడి బ్రహ్మరంధ్రం నించి అగ్నిజ్వాలలా వెలుగుతూ లోడితెజు పురుషుడు బైటికి వచ్చాడు.

'వచ్చావా?' అని అతడికి ఎదురువచ్చాడు బ్రహ్మ— 'జపంచేసేవాళ్ళకీ, యోగులకీ పుణ్యగతి సమానమే. ఆమాటకి వస్తే

జపంచేసేవాళ్ళ శక్తే అధికం, అంటూ నోరు తెరిచి రమ్మన్నాడు. బ్రహ్మరంధ్రంనించి ప్రాణాలు విడిచిన బ్రాహ్మడు బ్రహ్మనోట్లో ప్రవేశించాడు. ఆశ్చర్యపోయారు దేవతలు. బ్రహ్మనీ, కాశికుణ్ణీ, ఇక్ష్వాకుణ్ణీ మెచ్చుకున్నారు. బ్రహ్మ ధర్మాన్ని పొగిడి అంతర్ధాన మయాడు. తక్కినవాళ్ళు యెవాళ్ళందీ ఎవళ్ళ ఇళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు.

జపంసంగతీ దానివల్ల కలిగే పుణ్యగతీ చెప్పాను. ఇంకా ఏంవినాలని వుందో అడుగు.

## జ్ఞాన యోగం

ధర్మరాజు — జ్ఞానయోగం సెలవియ్యి.

భీష్ముడు — మనువూ బృహస్పతి సంవాదమని వొక కథ వుంది. నువ్వు అడిగిందానికే అది సమాధానంగా వుంటుంది. మనువు తన గురువు బృహస్పతికి నమస్కరించి జ్ఞానయోగం ఉపదేశించమన్నాడు బృహస్పతి ఇలా చెప్పాడు — 'శ్రద్ధతో సత్కర్మ చెయ్యడం జ్ఞాన యోగానికి మూలం. ఇష్టంలేంది వొదిలిపెట్టడానికీ, ఇష్టమైంది తెచ్చు కోడానికీ మనిషి కర్మచేస్తూ వుంటాడు. సుఖంగావున్న వే కొంతకాలానికి దుఃఖంగా మారతాయి. ఇది తెలుసుకుని, ఫలంమీద ఆసపెట్టుకోకండా సమబుద్ధితో సుఖదుఃఖాలు విడిచిపెట్టి, కామక్రోధాలకి లొంగకండా వివేకంతో నడుచుకుంటే ఉత్తమపదవి దొరుకుతుంది.

పరమాత్మకి వాక్కు ఆలంబన లేదు; వాక్కు శబ్దం లేదు. రసమూ, గంధమూ, స్పర్శనూ, రూపమూ ఏదీ లేదు ఇంద్రియాలకి వశం కాదది. పోల్చడం సాధ్యం కాదు. స్త్రీత్వం కానీ, పుంస్త్వం కానీ, నపుంస

కత్వం కానీ ఆపరతత్వానికి లేదు. ఏశరీరంలో వుంటే ఆవ్యాపారంతో వుంటుంది. వెలుగుతున్న దీపం, ఇతరవస్తువులు ప్రకాశింపచేసినట్టు జ్ఞానజ్యోతి ఇంద్రియాలూ, మనస్సూ మందకొడిగా వుండకండా చేస్తుంది. రాజుదగ్గిర మంత్రుల్లాగ పురుషునిదగ్గిర ఇంద్రియాలూ, మనస్సూ పనిచేస్తూ వుంటాయి.

'తరిచితే తప్ప, గొడ్డలితో నరికితే కర్రలో అగ్గిపుట్టదు. అలాగే వేదాలు చెప్పినట్టు మథిస్తేకాని, ఈశరీరం నలగచేసినంత మాత్రాన పరతత్వం కనపడదు. మనస్సుకీ, ఇంద్రియాలకీ అందక పోయినంతమాత్రాన పరతత్వం లేకపోతుందా? వెనకభాగం మన కళ్ళకి కనపడదు. అంతమాత్రాన అదిలేకండా పోతుందా? వలా, వురీ, మాటుగో య్యా, గాలమూ వీటితోకదా లేడీ, పిట్టా, ఏనుగూ, చేపలూ, పడతారు! అలాగే విజ్ఞానంతో ఆత్మని కనిపెడతారు పండితులు.

'పాం కాళ్ళు పాముకే తెలుసు. అలాగే బుద్ధిమంతుడు బుద్ధికి సాక్షిగావున్న పరమపురుషుణ్ణి తెలుసుకుంటాడు.

'అమావాస్యనాడు చంద్రుడు అవుపడడు. అవుపడనంత మాత్రాన అతడు లేనట్టా? అలాగే మనస్సుకి కనపడనంత మాత్రాన పరతత్వం లేనట్టవుతుందా? రాహువు మింగిన సూర్యుడు వుండీ వుండనట్టే వుంటాడు. అలాగే అధీనుడై వున్న ఆత్మకి అజ్ఞానంవల్ల మోహమూ, నిర్మోహమూ లేకపోయినా వున్నట్టే అనిపిస్తుంది. తేటనీటిలో రూపం కనిపిస్తుంది. కలిగిన నీటిలో కనపడదు. అలాగే మనస్సు నిర్మలంగా వుంటేనే పురుషుడు తనని చూస్తాడు. కల్మషంగా వుంటే కానలేడు.

'ఇంద్రియాలు ఇటూ అటూ విచ్చలవిడిగా తిరిగితే దుఃఖాలు తెస్తాయి. అవి కట్టుపడ్డాయో సుఖం కలిగిస్తాయి. ఇంద్రియాలు దొంగలు. దొంగలపాల పడకండా ఆత్మని రక్షించాలి.

పాపం పాడుచేసి, జ్ఞానం సంపాదిస్తే మెరుగుటద్దంలో కనవడి నట్టు, ఆత్మస్వరూపంలో తనంత తాను అవుపిస్తాడు. పరమాత్మ.

'ధ్యానయోగంతో నిశ్చలంగా వున్న మనస్సు, సత్వ రజ స్తమోగుణాలు దూరం తరుముతుంది. పరమ శాంతంగా వున్న పరమాత్మలో కలుస్తుంది. అదే ఉత్తమదశ. దానికి మించిందిలేదు.

'జ్ఞానాన్ని మాయ మరుగుపరుస్తుంది. దాని మోసం స్పష్టంగా వివరిస్తాను.

'మాయ ఇలా వుంటుంది అని తెలుసుకుందుకి ఉపాయం లేదు. నేలమీద అడుగుపెట్టని జంతువుజాడ ఎలా తెలుసుకోలేమో, అలా దానిజాడ తెలుసుకోలేం. మాయ గుణమూర్తి. అంటే సత్వ రజ స్తమోగుణాలు దాని రూపం. ఆమాయని లక్ష్యపెడితే జ్ఞానం నశి స్తుంది. గుణాలకి దూరమైతే మాయ దూరంగా పోతుంది. అఖండ మైన తేజస్సు కలుగుతుంది. ఆ తేజస్సులో తన్నుతాను చూడగలుగు తాడు పురుషుడు. సత్వమూ, రజస్సూ, తమస్సూ— ఈమూడు గుణాలూ ముప్పిరిపెట్టి, ఆత్మని చుట్టుకుంటాయి. వైరాగ్యమనే కొడవలితో కానీ మరో దాంతో తెగవు.

'మణిపూసలూ, బంగారంపూసలూ, వెండిపూసలూ, మట్టి పూసలూ— ఇలా రకరకాల పూసలపేర్లలో దారం ఎలావుంటుందో, అలాగే ప్రాణికోటిలో ఆత్మ వుంటుంది.

'ఒకేవిధమైన పొలంలో అనేకరకాలపంట పండినట్టు ఒకేరకం బుద్ధే ఎన్నోరకాల కర్మలవెంట పోతుంది.

'భూమికంటే నీరు పెద్దది. నీరుకంటే తేజస్సు పెద్దది. తేజస్సుకంటే గాలిపెద్దది. గాలికంటే ఆకాశంపెద్దది. ఆకాశంకంటే కూడా మనస్సు పెద్దది. మనస్సుకంటే బుద్ధి పెద్దది. పంచభూతల

కంటే, మనస్సుకంటే, బుద్ధికంటే కూడా మహత్తరమైంది కాలం. కాలతత్వాన్ని మించినవాడు విష్ణువు. అతడే ఈ లోకాలన్నిటి ప్రభువు. ఆ దేవదేవుడికి మొదలు లేదు. నడిమి లేదు. తుదీ లేదు. అంచేత నాశనమే లేదు అతడికి. వేదాలకీ, వాదాలకీ అతడే ఆధారం. అతడే పుట్టుకలు ఎగజిమ్ముతాడు. ఇంద్రియవిషయాలు గెలిచి, శాంతితో చూడవలసిందే అతణ్ణి ఎప్పుడూ వెలుగులాగే ప్రకాశిస్తాడతడు. ఊహాకీ, తర్కానికీ అందడు. కర్మలకి కనపడడు. మనసుతో మనసూ, బుద్ధితో బుద్ధీ, చూపుతో చూపూ క్రమంగా వొదిలించుకుంటే అక్షరుడూ, జ్ఞానస్వరూపుడూ అయిన విష్ణువుని చూస్తాడు పండితుడు. అమృతమూ (చావులేంది), అచ్యుతమూ (చ్యుతంకానిది), అనంతమూ, నిర్మలమూ, అమేయమూ (చేరరానిది) అయిన విష్ణు తేజం యమమూ మొదలైనవి అలవడిన మనస్సుతో ఇంద్రియాలు జయిస్తేనే పట్టుపడుతుంది.'

ఇలా బృహస్పతి చెప్పిన జ్ఞానయోగం విని కృతార్థుడయాడు మనువు. పండితులు మెచ్చుకోదగినవాడివి నువ్వు. ధర్మరాజా! ఈ వాక్యాల అర్థం శ్రద్ధగా మనస్సుకి పట్టించుకో.

## కృష్ణ మాహాత్మ్యం

ధర్మరాజు—మహాత్మా! మహనీయుడైన కృష్ణుడి మాహాత్మ్యం వినాలని వుంది. వినిపించు.

భీష్ముడు - కృష్ణుడే విష్ణువు; ప్రభువు. తన కార్యసామర్థ్యం కనబరచడంకోసం గాలీ, అగ్గీ, నీరూ, ఆకాశమూ, భూమీ తన దివ్యశక్తితో కల్పించాడు. నీళ్ళలో తగిన పాన్పుమీద పడుకున్నాడు. అతడి నాభినించి పద్మం పుట్టింది. పద్మంనించి బ్రహ్మ పుట్టాడు.

బ్రహ్మమనస్సులో మరీచీ, అత్రీ, అంగిరసుడూ, పులస్త్యుడూ, పులహుడూ, క్రతువూ, దక్షుడూ అని ఏడుగురు కుమారుళ్ళు పుట్టారు. అందులో మరీచికి కశ్యపప్రజాపతి పుట్టాడు. అతడివల్ల దేవతలూ, అసురులూ, గరుడులూ, నాలుగూ మొదలైన జాతులు పుట్టాయి. కశ్యపుడికి సూర్యుడూ, అత్రికి చంద్రుడూ పుట్టారు. రాజవంశాలకి మూలమయ్యారు. సూర్యచంద్రవంశాలరాజులు అనేక దేశాలు ఏలారు. దేశకాలాలబట్టి, రాజవంశాలు బహుశాఖలుగా విస్తరిల్లాయి. వాటన్నిటిని తనకి కావలసినప్పుడు కృష్ణుడు పరస్పర విరోధం కల్పిస్తాడు. యుద్ధాలు నిమిత్తమాత్రంగా చేసి నాశనం చేస్తాడు. వాసుదేవుడూ, సంకర్షణుడూ, ప్రద్యుమ్నుడూ, అనిరుద్ధుడూ అన్న పేర్లతో నాలుగు దివ్యరూపాలు ధరించి లోకం రక్షిస్తూ వుంటాడు. ఆటకోసమే జన్మలెత్తుతూ ఆడుకుంటూ వుంటాడతడు.

ప్రాణుల ప్రభువు ఈకృష్ణుణ్ణి సామాన్యదృష్టితో చూడడం అజ్ఞానం. భక్తపరతంత్రుడితడు. పుణ్యాత్ములు చేసే పూజకి పాత్రుడు. దయామయుడు. భోగమూ, మోక్షమూ ప్రసాదిస్తాడు. నారదుడూ, పరశురాముడూ, మార్కండేయుడూ, వ్యాసుడూ, వాల్మీకి మొదలైనవాళ్ళు చెప్పగా విన్నదే చెప్పాను.

## విష్ణుమంత్రం

ధర్మరాజు—ఎవళ్ళని తెలుసుకుంటే మోక్షం దొరుకుతుంది! ఏ ఉపాయంతో సంకల్పం నెరవేరుతుంది?

భీష్ముడు — నారదమునిదగ్గర విన్నది వివరిస్తాను, విను. పరముడూ, అక్షరుడూ అయిన విష్ణువుని స్తుతించి, చేతులుజోడించి, తల వొంచుకొని భక్తిపూర్వకమైన మనస్సుతో నారదుడు,—'దేవా!

మోక్షంకోరే జనులు నిన్ను ఎలా తెలుసుకుంటారు? ఎలా జపిస్తారు దయతో సెలవియ్యి' అని ప్రార్థించాడు.

దేవముని ప్రార్థన మన్నించా. విష్ణువు. 'పరమభక్తీ, నిర్మలమైన శ్రద్ధా, ఇంద్రియనిగ్రహామూ - ఇవినన్ను ధ్యానించడానికి మంత్రాలవంటివి. పాపాలు విడచినవాడికే ఇవి పట్టుపడతాయి. నేను మెచ్చిన ఉత్తమసాధనం అనుస్మృతి నియమంగా జపించవలిసిన విషయం.

'ఓమ్, అనే ప్రణవం మొదట వుంచి, 'నమః' అనే శబ్దం దానికి చేర్చి, షడ్గుణైశ్వర్య వాచకమైన ♦ 'భగవత్' శబ్దమూ, సర్వమూ వుంటుందని తెలిపే 'వాసుదేవ' పదమూచేర్చి, చతుర్థీ విభక్తి 'య' చేరిస్తే ఆవాక్యం మంత్రమవుతుంది.‡ ముందు ముందు ఈమంత్రం నిశ్చలమైన భక్తితో జపించి, అనుస్మృతి జపించాలి. దాంతో ధర్మార్థకామమోక్షాలు సిద్ధిస్తాయి' అన్నాడు. దయతో అనుస్మృతి కూడా ఉపదేశించాడు. మనస్సుకి ప్రియమైన స్తోత్రమది.

## అనుస్మృతి

అవ్యక్తుణ్ణి, శాశ్వతుణ్ణి, అన్నిటి పుట్టుకభూమి అయినవాణ్ణి, భక్తవత్సలుణ్ణి. పరమపురుషుణ్ణి, అక్షరుణ్ణి అంజలిబంధంచేసి ఆశ్రయి

♦ శ్లో. ఐశ్వర్యశ్య సమగ్రస్య ధర్మస్య యశసాశ్రియః,
జ్ఞానవైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా.

విష్ణుపురాణం. 6.5.74

[పరిపూర్ణమైన ఐశ్వర్యమూ, ధర్మమూ, యశస్సూ, సిరీ, జ్ఞానమూ, వైరాగ్యమూ ఈ ఆరింటికీ భగమని పేరు.]

‡ ద్వాదశాక్షర మంత్రం - ఓమ్ నమోభగవతే వాసుదేవాయ. చూ. భాగవతం, ధ్రువోపాఖ్యానం. ఇదే మంత్రం స్వాయంభువమనువు జపించాడు. చూ. విష్ణు పురాణం.1.11.55–56.

స్తాను. తెల్లతామరపత్రాల్లాటి నేత్రాలవాణ్ణి, లోకసాక్షిని, నిత్యుణ్ణి, పురాణపురుషుణ్ణి, లోకనాథుణ్ణి, భవుణ్ణి సేవిస్తాను. భూతభవ్యుణ్ణి, జగత్ప్రభుణ్ణి, అంతటా వ్యాపించినవాణ్ణి, ప్రాణుల్లో వున్నవాణ్ణి, అమృతుణ్ణి, అచ్యుతుణ్ణి, అనంతుణ్ణి, హృషీకేశుణ్ణి, వెయ్యిసూర్యులతో సమానమైనవాణ్ణి, హిరణ్యగర్భుణ్ణి, ప్రభువుని, భక్తిచేత లభించేవాణ్ణి, చలించనివాణ్ణి, సూక్ష్మ పుణ్ణి, శరణ్యుణ్ణి, వెయ్యితలలవాణ్ణి, భయం తొలగించేవాణ్ణి, శిరసులేనివాణ్ణి, నారాయణుణ్ణి, నూతనుణ్ణి, యోగమూర్తిని, లోకాతీతుణ్ణి, ధ్రువుణ్ణి, ఈశ్వరుణ్ణి, హరిని భక్తితో కొలుస్తాను.

ఎవడు సచరాచరమైన ప్రాణికోటికి గురువు? ఎవడినాభిపద్మం బ్రహ్మని కంది? ఎవడిచేత ప్రపంచాలన్నీ వర్ధిల్లుతున్నాయి? ఆముకుందుణ్ణి ఎప్పుడూ కొలుస్తాను.

కదలనివీ, కదిలేవీ పిపీలికనించి బ్రహ్మదాకా అన్ని జంతువులూ ప్రళయంపొందినకాలంలో వొక్కడేవుండే నిత్యసత్యమూర్తిని, శార్ఙ్గ ధనుస్సు ధరించేవాణ్ణి దయతో రక్షించడంకోసం కొలుస్తాను.

కాలమూ, మేఘాలూ, నేలా, పైరూ, కర్మా, అకర్మా, ధర్మస్వరూపమూ అన్నీ తానే అయి, మహిమతో ఆటలాడే వాసుదేవుణ్ణి స్తోత్రంచేస్తాను.

అగ్ని, సూర్యచంద్రులూ, గ్రహనక్షత్రాలూ ఎవడినించి తేజస్సు పొందుతున్నాయో ఆ విశ్వరూపుణ్ణి, మచ్చలేని తేజోరాశిని సేవిస్తాను.

నాలుగింటా, మళ్ళీ నాలుగింటా, రెండింటా, ఐదింటా, మళ్ళీ రెండింటా ♦ హోమం చేసి యజ్ఞాలుచేసేవాళ్ళు ఆరాధించే విష్ణువు నాకు ప్రసన్నుడు కావాలి.

---

♦ 'అశ్రావయ' నాలుగు. 'అస్తుశ్రౌషట్' నాలుగు. 'యజ' రెండు. 'యేయజామహే' అయిదు, 'వషట్' రెండు.

యజ్ఞధరుడూ, పంచయజ్ఞుడూ, లక్ష్మికి పునికిపట్టూ, యోగా నికి మూలమూ, అంతటికీ ఇష్టప్రదేశమూ అయిన వరదుణ్ణి, పర ముణ్ణి ఆశ్రయిస్తాను.

చూరరానివాణ్ణి, తెలియరానివాణ్ణి, అన్నిలోకాలూ భరించే వాణ్ణి, రూపంలేనివాణ్ణి, సముద్రంలాటి జ్ఞానమూర్తిని, అయిదు కాలాలూ ఎరిగినవాణ్ణి, గుణాలు లేకండా వెలుగుతున్నవాణ్ణి సేవిస్తాను.

వ్యక్తం అనే ఈప్రపంచానికి జన్మకారణమైనవాణ్ణి, తెలియ రానివాణ్ణి, తెలియరానిదాని అవతల అనే మాటకి ఆధారమైనవాణ్ణి, భక్తపరాధీనుణ్ణి, యోగ్యులు స్తుతించేవాణ్ణి స్తుతిస్తాను.

జ్ఞానధ్యానపరాయణులైన మహాత్ములు, ఇంద్రియాలు జయిం చినవాళ్ళు ఎవణ్ణి పొంది మళ్ళీ రారో, అతణ్ణిశరణు వేడుతున్నాను. పుణ్యాత్మున్నయి బతుకుతాను.

లోకమంతా ఏకాంశతో నిర్వహిస్తున్నవాణ్ణి, అందరాని ఆకారంతో ప్రకాశిస్తున్నవాణ్ణి, పద్మనాభుణ్ణి స్తుతిస్తాను.

అయిదురకాల ప్రకృతి అయిదు ముఖాలతో అనుభవించే క్షేత్రజ్ఞుణ్ణి♦, సత్వమూ మొదలైన గుణాలు మూడూ విలాసంగా ధరించిన శక్తిమంతుణ్ణి ఆత్మప్రకాశంకోసం ఆశ్రయిస్తాను.

భక్తులూ, యోగులూ అయిన మహాత్ములు ఎవణ్ణి చూసి తిరిగిరాని పుణ్యగతి పొందుతారో ఆ పరమాత్ముణ్ణి, తర్కించరాని వైభవుణ్ణి స్మరిస్తాను.

సూర్యబింబంలోనూ, చంద్రబింబంలోనూ చలించకండా వెలు గుతున్న తేజోమూర్తిని, నిరంజనుణ్ణి, అంతరాత్ముణ్ణి ఆశ్రయిస్తాను.

---

♦ గంధమూ మొదలైన అయిదుగుణాలూ కల పంచభూతాలు ముక్కు మొదలైన పంచేంద్రియాలతో అనుభవించే ఆత్ముణ్ణి.

సూర్యచంద్రాగ్నిమయుణ్ణి, నక్షత్రమయుణ్ణి, నిత్యసుస్థిరుణ్ణి, తేజోమయుణ్ణి, ఆత్మారాముణ్ణి ఆరాధిస్తాను.

గుణాలకి ఆది అయినవాణ్ణి, నిర్గుణాలకీ ఆది అయినవాణ్ణి, రూపవంతుణ్ణి, పుట్టుకలేనివాణ్ణి, సూక్ష్ముణ్ణి, పరముణ్ణి, అంతటావున్న వాణ్ణి ప్రసన్నుడు కావాలని ప్రార్థిస్తున్నాను.

అంతటా పూర్ణంగా తలలూ, కళ్ళూ, మొహాలూ కల నిర్మలుణ్ణి, నిర్వికారుణ్ణి, సర్వసాక్షిని, గోవిందుణ్ణి, హరిని నిన్ను సేవిస్తాను.

నిన్ను తెలుసుకో లేకపోతే సంసారంలో మునిగిపోడం తప్పదు. మనస్సుకీ, ఇంద్రియాలకీ అందవు నువ్వు. నిన్ను నేను ఏమనుకునేది? నారాయణా! చిరకాలం యోగమూ, తపస్సూ చేసిన సిద్ధులు కామం, క్రోధం, మోహం, ద్వేషం లేకండా నిన్ను వాంఛేగతి కలవాడని భక్తితో కొలుస్తారు.

హరీ! ఫలం కోరకండా కర్మచేస్తూ, వాటిని జ్ఞానాగ్నిలో పుటంపెడుతూ, ద్వంద్వాలు విడిచిన యోగులే నిన్ను చూస్తారు.

కృష్ణా! దేహంలో వున్నవాడివి నువ్వు. దేహం లేనివాడివి. దేహధారులందరినీ సమంగా చూస్తావు. పాపపుణ్యాలు మోహం. లేకండా నిరసించే మహాయోగులు భక్తితో నిన్ను తెలుసుకుంటారు.

కేశవా! ప్రకృతీ, బుద్ధీ, అహంకారమూ, భావమూ, పంచ భూతాలూ, ఇంద్రియాలు నిన్నే ఆశ్రయిస్తాయి. ఈ అన్నిటిలోనూ నువ్వు ప్రసన్నుడివై వుంటావు. అవి నీకూ, నువ్వు వాటికీ ఆధారం ఇది నిజం.

శార్ఙ్గీ! ఏకత్వమూ, అవ్యక్తమూ, అనేకత్వమూ ఇదీ నీ నుహిమ నీ స్వరూపం తెలుసుకున్న పుణ్యాత్ములకి మోక్షం కరతలామలకం.

దేవా! మణులు సూత్రంలో వున్నట్టు చరాచరములైన ప్రాణి కోట్లు యావత్తూ నీలో వున్నాయి. నిన్ను ప్రార్థిస్తున్నాను. సమత్వమూ, భక్తి నాకు ప్రసాదించు.

ముకుందా! హేతువు ... డివి నువ్వు. కర్తవి. ప్రాణుల్ని సృజించేవాడివి. సర్వమూ అనుభవించేవాడివి. మహత్తూ మొదలైన తత్త్వాల్లో చేరవు. అయినా నువ్వే తత్త్వమవుతావు. నువ్వే జగన్నాయకుడివి. నువ్వే పురుషుడివి.

గోవిందా! ద్వేషించదగిందీ, ప్రేమించదగిందీ అన్న భేదం లేదునీకు. ప్రాణికోటి అంతా సమమే. ప్రాణులతో కూడడమూ, బుద్ధి అహంకారాలతో కలిసిపుండడమూ లేదు. ఆరంభమూ లేదు నీకు. ధర్మాధర్మాలు లేవు. ఇంద్రియాల పొందు లేదు. ఇంద్రియ విషయాల అభిరుచిలేదు. మునలితనమూ, చావూ లేని మోక్షంకోరు తున్నాను. కరుణించు. నా ముక్కు (ఘ్రాణేంద్రియం) భూమిలోనూ, నాలుక (రసనేంద్రియం) నీటిలోనూ, కన్ను (నేత్రేంద్రియం) తేజస్సులోనూ, చర్మం (స్పర్శేంద్రియం) గాలిలోనూ, చెవి (శ్రోత్రేంద్రియం) ఆకాశంలోనూ కలిపి ఆనందం ప్రసాదించు.

భూమి నీళ్ళలోనూ, నీళ్ళు అగ్నిలోనూ, అగ్ని గాలిలోనూ, గాలి ఆకాశంలోనూ, ఆకాశం మనస్సులోనూ, మనస్సు అహంకారంలోనూ, అహంకారం బుద్ధిలోనూ ఇముడ్చాలి. ఇదంతా అవ్యక్తంగా చేర్చి, అవ్యక్తం గుణాలలో కలపాలి. సృష్టికి కారణమైన పంచభూతాలూ ముట్టకుండా తప్పించాలి. అప్పుడే పరమానందం దొరుకుతుంది. నేనే నువ్వు అన్న జ్ఞానం కలుగుతుంది. చావు పుట్టుకలు లేని ఈ మోక్షం ప్రసాదించు.

హరిలో నే నున్నాను. నాలో హరి వున్నాడు. హరి నన్నూ, నేను హరిని వొదలిపెట్టం. మాకు నాశనం లేదు. హరి దయకంటే లోకంలో గొప్పది మరొకటి లేదు.

కృష్ణా! బుద్ధీ, ప్రాణమూ నిన్ను పొందగలిగిన భక్తి ప్రసాదించు. పూర్వకర్మఫలాలు వుండనీ. ఆ ఋణాలు తీరి సుఖపడతాను.

వాసుదేవా! దేవదేవా! ఎప్పుడూ నిన్ను స్మరిస్తాను. 'వీడు నావాడు' అని నన్ను దయచూడు.

బుద్ధికి అందని అచ్యుతుణ్ణి, సనాతనుణ్ణి, తెలియరానివాణ్ణి, చిన్మయుణ్ణి, మళ్లీమళ్లీ పుట్టుక కలగకుండా వుండడంకోసం చలించని నియమంతో స్మరిస్తాను.

పరమాత్ముణ్ణి, నారాయణుణ్ణి, పురాణపురుషుణ్ణి, భక్తుల మనస్సు గ్రహించేవాణ్ణి, ఆరువిధాల సంపదా కలవాణ్ణి మ్రొక్కుతున్నాను.

'ఇలా జపించి నన్ను సర్వావస్థల్లోనూ భక్తితో నమస్కరించినవాడు సకలపాపాలూ పోయి శాంతిపొందుతాడు. ముక్తిపొంది శాశ్వతమైన ఆనందం అనుభవిస్తాడు.

'ఈఅనుస్మృతి వైష్ణవస్తోత్రం. పాపాలు పోగొడుతుంది ఇది. ప్రాజ్ఞుడైనా, మూఢుడైనా యజ్ఞసమయాల్లో ఇది పఠిస్తే, యజ్ఞఫలం నూరింత లవుతుంది, దేవపూజలోనూ, పితృపూజలోనూ, అగ్నిపూజలోనూ, భక్తితో నన్ను తలుచుకుంటూ నియమంతో ఇది చదివినవాడు పుణ్యలోకాలు వెళతాడు. నన్నుభక్తితో సేవించే ప్రజలకి అమావాస్యా, పౌర్ణమీ, ద్వాదశిదినాల్లో ఈఅనుస్మృతి వినిపిస్తే సర్వసంపదలూ లభిస్తాయి. ఇదచదువుతూవుంటే మొక్కిన వారి జనుడికి ప్రసిద్ధమైన పుణ్యలోకం దొరుకుతుంది. ఇక తక్కిన వాళ్ల సంగతి చెప్పేదేముంది?

'కర్మఫలాలన్నీ అంతంకావడంతోనే నాభక్తులకి అనంతపదం దొరుకుతుంది అంటేక నారదా! నన్ను తలుచుకో నైకంఠం చేయుచుంటావు.

'జ్ఞానం లేనివాడిమీద దయతలిచి జ్ఞానం కలిగిస్తే, అది భూమియావత్తూ దానంచేసిన దానికంటే హెచ్చుఫలమిస్తుంది. కనక నీకు చెప్పిన ఈ విధానమంతా నిర్మలమైన మనస్సు కలవాళ్ళకి, పుణ్యా స్వభావులకి ఉపదేశించు. సర్వశుభాలూ కలుగుతాయి వెయ్యిఅశ్వమేధాలు చేసినా దొరకని ఉన్నతిపదం నాభక్తులకి దొరుకుతుంది' అని చెప్పాడు.

ఆ దేశివుడు అడిగినప్పుడు నారదముని చెప్పాడు. ధర్మరాజా! అదే నీకు విడమర్చి చెప్పాను. నువ్వూకూడా నారదమునిలాగే ఏకాగ్రచిత్తంతో భక్తిశ్రద్ధలతో పరమాత్మున్ని స్మరించు. అనుస్మృతి పరమరహస్యమైంది. పూజ్యమైంది. మాననీయమైంది. దీన్ని జపిస్తే బుద్ధి పెరుగుతుంది. దుఃఖం పోతుంది బంధాలు తెగిపోతాయి. శాశ్వతమైన శుభం కలుగుతుంది.

## మోక్షమార్గం

ధర్మరాజు — సంతోషంగా వుంది. నమస్కరిస్తున్నాను. మోక్షమార్గం సెలవియ్యి.

భీష్ముడు — వార్ష్ణేయాధ్యాత్మం అని వొక ఇతిహాసముందిఅది నువ్వు అడిగిందానికి సమాధానమవుతుంది.

వార్ష్ణేయుడని వొక మునివుండేవాడు. అతడు తీరికగా కూచున్నప్పుడు అతడి శిష్యుడు నిలబడి 'మోక్షమార్గం సెలవియ్యి' అనివినయంగా ప్రార్థించాడు. పాదాభివందనం చేశాడు. జ్ఞానమూర్తి వార్ష్ణేయుడు ఇలా అందుకున్నాడు— 'భక్తి కలవాడివి నువ్వు. బుద్ధిమంతుడివి. యోగ్యుడవి. నా సదుపదేశం సావధానంగా విను.

కాలచక్రం హద్దులేంది. దీనిలో సర్గాలూ ప్రళయాలూ సాగుతూవుంటాయి.

ప్రళయంలో పరమాత్మ ప్రకృతిని పొంది కల్పాదిలో మళ్ళీ సృజించాడు. ప్రాణికోటితో మహామునులూ పుట్టారు. ప్రళయంలో కనపడకండా పోయిన వేదాలూ, శాస్త్రాలూ ఆ దేవుడి దయవల్ల తిరిగీ పొందారు. న్యాయశాస్త్రం మొదలైన ఎన్నో శాస్త్రాలు చేశారు. ప్రజలందరూ అనుసరించదగిన ఆచారాలు విడమర్చి చెప్పారు. అవి విన్నా, చెప్పినా పరమాత్మస్వరూపం తెలుస్తుంది. దేవతలకీ, మునులకీ కూడా సహజంగా తెలియదది. విష్ణువుకి మాత్రమే అంతా తెలుసు. అన్నిదుఃఖాలకీ మందైన ఆ పద్ధతి ఆ పురాణపురుషుడి దయవల్ల మునులు గ్రహించారు. క్రమక్రమంగా అలవరుచుకున్నారు.

ఆత్మతో కలిసి శరీరం జీవం పొందుతుంది, దానివల్ల బుద్ధి పుడుతుంది. బుద్ధిలోంచి అహంకారం పుడుతుంది. బుద్ధి, అహంకారమూ జ్ఞానాన్ని ఆశ్రయిస్తాయి. అహంకారం నించి ఆకాశం పుట్టింది. ఆకాశంవల్ల గాలి పుట్టింది. క్రమంగా అగ్నీ, నీరూ, భూమీ నొకదాన్నించి వొకటి పుట్టాయి. బుద్ధికి మహత్తని పేరు. బుద్ధీ, అహంకారమూ, పంచభూతాలూ — ఈ ఏడూ ప్రకృతులు. కర్మేంద్రియాలు అయిదూ, జ్ఞానేంద్రియాలు అయిదూ, ఇంద్రియవిషయాలు అయిదూ, మనస్సూ ఈ పదహారూ వికారషోడశకం

*సర్గాలు : సృష్టులు. మహత్సర్గం, అహంకారసర్గం, భూతసర్గం. ఇంద్రియసర్గం దేవసర్గం (ఇది ఎనిమిది విధాలు) తమస్సర్గం (ఇది ఆరువిధాలు) వనస్పత్యాది సర్గం (ఇది ఆరువిధాలు) తిర్యక్సర్గం (ఇంకా ఎనిమిది విధాలు) మనుష్యసర్గం (ఇది మూడువిధాలు) ఇలా సృష్టి తొమ్మిదివిధాలు. కుమారసర్గం అని ఇంకొకటికూడా వుంది. ఇది కలుపుకుంటే పది శ. ర.

ఇవన్నీ కలిస్తేనే దేహం. ఇది పరమాత్మకి వునికిపట్టయి, అతణ్ణి సేవిస్తుంది. తొమ్మిది ద్వారాల పుణ్యపట్టణం దేహం. ఈసమస్త భావాలతోనూ, ఈపట్నంలో ఎరగరాని వ్యాప్తితో పరమాత్మ పడుకుంటాడు. అందుకనే అతణ్ణి పురుషుడంటారు. ఈపురుషుడికి చావు లేదు. తరుగు లేదు. ముసలితనం లేదు చేరశక్యం కానివాడతడు. నిర్మలస్వభావుడు. చెట్టులో అగ్గిలాగ మధిస్తేనే కాని దేహంలో తెలియరాదు పరమాత్మ తేజస్సు యోగంతో మథిస్తేనే కనబడుతుంది. జ్ఞానస్వరూపమది అన్ని ప్రాణుల గుణాలకీ అదే ఆశ్రయం. అందుకనే వినడమూ, చూడడమూ మొదలైన పనులు చేస్తుం దది.

ప్రాణులు అవ్యక్తంవల్లే పుడుతున్నాయి. అవ్యక్తంలోనే పెరుగుతున్నాయి. అవ్యక్తంలోనే నాశనమవుతున్నాయి. పురుషుడు దీనంతటికీ సాక్షిగా మాత్రమే వుంటాడు.

## కాలచక్రం

కాలచక్రం — దీని అంచులు ఏడూ అవుపడతాయి. నాభి కనపడదు. పదహారు వికారాలూ దీని మండలం. ఆత్మ అధిష్టించి, కాలానికి లొంగి నిలకడగా తిరుగుతూ వుంటుందిది. చరాచరమైన లోకం, చక్రంలో నిలకడలేకుండా, వశంలేకండా, కనపడకండా చరిస్తూ వుంటుంది. తత్వపరిశోధన దృష్టితో చూసుకోవాలది.

గాలితో ధూళి చేరినట్టు పరిశుద్ధుడైన అంతరాత్మణ్ణి సత్వమూ, రజస్సూ, తమస్సూ చేరతాయి. పండితుడు వివేకంతో కనిపెట్టి ఆగుణాలు తప్పించుకోవాలి. వేదాంతం తెలిసినవాడు దొరకడం దుర్లభం. ఆదరం సంసారవృత్తి ధర్మం. అందులో ధర్మం వుండినా సంసారసౌఖ్యంలో పడ్డవాడికి విడుదల వుండదు.

కొందరు పెద్దలు అవలంబించవలసిన ధర్మాలు అవలంబిస్తూనే సంసారకార్యాలవల్ల కామం, క్రోధం, మదం, భయం వొదలరు. ఏమంటే, ఎంత శాంతుడికైనా దేహాభిమానంతో ఇవన్నీ వొదిలెయ్యడం సాధ్యం కాదు. అందుకనే దేహాభిమానం వొదిలే దృష్టి అభ్యసిస్తాడు వేదాంతం తెలిసినవాడు. అడివిలో దూరి ఎంత చూసినా చూడాలనే వుంటుంది సంసారమూ వొక అడివే.

రోగం పోగొట్టడానికి చికిత్స మొదలెట్టినట్టే మోహం పోగొట్టుకుందుకి మనస్సులో సత్యమూ, శౌచమూ, శమమూ, దమమూ నిలుపుకోవాలి.

భూమీ మొదలైన పంచభూతాలకీ, ఇంద్రియాలకీ సత్యమూ మొదలైన గుణాలకీ, ప్రపంచాలకీ, ఈశ్వరుడికీ అహంకార తత్వమే పునికిపట్టు.

కృతజ్ఞతా, ప్రీతి, దయా మొదలైనవి సత్వగుణంలో పుట్టాయి. మోహమూ, లోభమూ, రోషమూ మొదలైనవి రజోగుణంవల్ల పుట్టాయి. గర్వమూ, దుఃఖమూ మొదలైనవి తమోగుణంవల్ల పుట్టాయి. జ్ఞానానికి ఈగుణాలు అడ్డంకి. కనక వీటిని అడిచెయ్యాలి. ధైర్యంతో ముందు సాత్వికగుణం నిలుపుకోవాలి. సాత్వికం స్థిరపడితే రాజసమూ, తామసమూ తొలిగిపోతాయి. పైగా సత్వం జ్ఞానహేతు వవుతుంది.

అహంకారంవల్ల కర్మలు కలుగుతాయి. కర్మలవల్ల దేహసంబంధం వొదలకండా, తిరిగి తిరిగి ఎన్నో జన్మలు ఎత్తాలి. జన్మ అంటే స్త్రీ పురుషుల శుక్లశోణితాలు కలిసిన జీవనం. గర్భంలో మలమూత్రాల్లో పెరిగి బైటికి వచ్చి, బంధాల్లో పడి, అంతులేని సంసార దుఃఖంలో మునిగిపోతాడు మనిషి. దీనంతటికీ ఆశ అనే తంతువే మూలం. ఆతంతువు పొకడానికి ఊతకొయ్య అడది. ఇది తెలుసుకుని ఆశ వొదలిపెడితేనే ముక్తి కలుగుతుంది.

జ్ఞానానికీ, అజ్ఞానానికీ బుద్ధి ఆధారం. తత్వాహంకారం కలది జ్ఞానం. బుద్ధే జీవుడంటాయి శ్రుతులు. కాలవశంగా చేసిన కర్మ వల్ల కలకన్నట్లు ఇంద్రియాలతో కలిసి సంసారంలో తిరుగుతూ వుంటాడు మనిషి.

మనస్సు మోహంతో కలిసి ఇంద్రియాలు సుఖం మరగకండా ఆపుకుంటే, ఎంత తెగని సంసారబంధాలైనా పుటుక్కుమంటాయి.

ప్రాణికోటిలోకల్లా పురుషులు ఉత్తములు. పురుషుల్లో బ్రాహ్మలూ, బ్రాహ్మల్లో వేదాలు తెలిసినవాళ్ళూ ఉత్తములు వాళ్ళకంటేకూడా జ్ఞానవంతులు ఉత్తములు. జ్ఞానమే మనిషికి నేత్రం జ్ఞానంలేనివాడి నడవడి గుడ్డివాడి నడకతో సమానం. ఈరహస్యం తెలుసుకుని జ్ఞానం సంపాదించాలి.

ఓర్పూ, సత్యమూ, శౌచమూ ఉత్తమధర్మాలు. బ్రహ్మచర్యం అంతకంటే ఉత్తమధర్మం ధైర్యంతో ఇవన్నీ అభ్యసించాలి.

ఆడాళ్ళని చూడడమూ, వాళ్ళతో మాటామంతీ ఆడడమూ, వాళ్ళతో పరాచికా లాడడమూ తప్పు. 'దీనికేముందిలే' అని పూనుకో కూడదు. సందిస్తే మనసులోదూరి తిష్టవేస్తారు ఆడాళ్ళు. వాళ్ళు దేహాలూ ఎముకలూ, మాంసమే అన్న సద్వివేకం పెట్టుకుంటే వాళ్లమీద మనసు పోదు. దానికి నాడీశుద్ధి ఆధారం. శరీరశుద్ధికి పదినాడులూ మొదటికారణం. ఇంద్రియాలకి ఆధారమైనవి మరి పదివున్నాయి. స్థూలమైనవి పది. సూక్ష్మమైనవి అయిదు. ఇంతకంటే సూక్ష్మమైంది హృదయం మధ్య వున్ననాడి. అదే అంతటా వ్యాపించి వుంటుంది. ఈ చూపు మరిగితే విరుచులకీ పరిగెత్తదు మనస్సు. పరిగెత్తినా మళ్ళించుకోవచ్చు. బైటిరుచులు వొదులుకుంటే లోపలిరుచులు మరిగి పరమాత్మణ్ణి చూస్తుంది.

శుక్రగతి తెలిసిన మనస్సుకే కాని ఈవిధానం పట్టువడదు. శుక్రం మనస్సువల్లే పుడుతుంది. శుక్రానికి సర్వాంగాలూ వునికిపట్టు. తాకడంవల్ల శుక్రం జారుతుందా ? జారదు. సంకల్పరతి వుంటుందా ? వుండదు. మనస్సులో సంకల్పం మొదలకండా వుండాలి.

'శుక్రం ఇంద్రదైవత్యం' అని మునులతో అత్రి అన్నాడు. అందుకనే శుక్రం పేరు ఇంద్రియం అయింది. ధాతువు లన్నిటిలోకీ ఉత్తమమైన ధాతువు ఇంద్రియం. దాని విధం విను. శుక్రానిక్కి మనస్సూ సూక్ష్మరూపం. మనస్సు వేగం అరికట్టడానికి బుద్ధి పక్వమైననాడే సమర్థుడు. జ్ఞానంలేనివాళ్ళు కనక శుక్రాళ్ళూ, దుర్బల బుద్ధులు కనక వృద్ధులూ సమర్థులు కారు. శుక్రం నిలువుకోడం పుణ్య కర్మ. దీనికోసం పెద్దలు తొక్కిన యమనియమాల దారితొక్కాలి. విషయాల పొంతకి పోకూడదు. ఎంతో దురంతమైనవి విషయాలు. వాటిలో పడితే చెడ్డ తప్పదు. వాటిని వొదులుకున్న మహాను భావులు పుణ్యలోకాలు పొందుతారు.

పుట్టుకా, ముసలితనమూ, చావూ మొదలైన దుఃఖాలు లోకంలో చూసి, పండితుడైనవాడు మోక్షంకోసం పవిత్రమైన మనస్సుతో ప్రయత్నిస్తాడు.

మాటా, మనస్సూ, శరీరమూ శుచిగావుంచుకోవాలి. అహం కారం వొదిలిపెట్టాలి. మనస్సు శాంతంచేసుకోవాలి కోరికలు మానుకోవాలి. భూతదయ కలిగి వుండాలి. అదుగో అప్పుడూ జ్ఞానంకలుగుతుంది.

ధనం కోసం దొంగలు మనస్సూ, మాటా, శరీరమూ అదుపులో పెట్టుకుంటారు. సాధిస్తారు. మోక్షం కావలసినవాడూ అలాగే నడుచుకోవాలి.

బుద్ధితో మనస్సు అరికట్టాలి. మనస్సుతో ఇంద్రియాలు అపుకుని, విషయాలు విడిచిపెట్టినవాడికి దేవతలు ప్రత్యక్షమవుతారు. దేవతల అనుగ్రహంవల్ల యోగతంత్రాలు పట్టుపడతాయి. దాంతో మనస్సు నిశ్చల మవుతుంది. అన్నపానాలమీద ఆశా వొదిలిపోతుంది. కాయకూరలూ, దుంపలూ వాటితో ఆకలి తీర్చుకోవాలి. నిర్విచారంగా, నిశ్చలంగా వుండాలి.

జ్ఞానమే పుడకలు చేసి, విజ్ఞానాగ్ని రగిలిస్తే ముసిలితనమూ, చావూ, నానావిధాల దుఃఖాలూ లేసి మోక్షం దొరుకుతుంది.

నిద్రాదోషంవల్ల కలలు పుడతాయి. రజస్తమోగుణాల వికారం వల్ల మనస్సు తిరగబడుతుంది సేర్చిన ధర్మాలు మరుపుకి వస్తాయి. ఈ చెడు బుద్ధి అలవడుతుంది. అది యోగికి పనికిరాదు. జ్ఞానమార్గం వల్ల యోగి మెలకువ పొందుతాడు. ఎదో వొకప్పుడు నిద్రపోతాడు. చివరికి అదీ వొదిలేస్తాడు.

ఇంద్రియాలకి నాశనం వచ్చి, కలలోతనకి శరీరం వున్నట్టూ, విషయానుభవం కలిగినట్టూ మసులుతాడు దేహి. ఆభావగతి ఎలాటిదో మరి!

ఇలాగే వితర్కించుకుంటూ క్రమంగా వ్యాపీ కేశుడైన పురుషోత్తముణ్ణి తెలుసుకున్న మునులు శిష్యులికి బోధిస్తారు.

శ్రమతో ఇంద్రియాలులీనం కావడమే నిద్ర. అందులోఅవత్యమైన విషయప్రాప్తికల. కలకికూడా దేహ సాక్షిగానే వుంటాడు. వాతమూ, పిత్తమూ మొదలైన దోషాలవల్ల సత్వమూ మొదలైన గుణాలతో కలిసిన మనోవికారమే కల. అది రాబోయే మంచీ, చెడ్డా ముందు సూచించడమూ కద్దు.

నిద్రావస్థలో ప్రపంచమే లేనట్టు వుంటుంది. అప్పుడు కూడా ఆత్మ తెలివిగానే వెలుగుతూ వుంటుంది. ఇదే అధ్యాత్మం.

జాగృతీ, స్వప్నమూ, సుషుప్తీ మూడు అవస్థలు. శుద్ధమైన జ్ఞానానందం అనుభవించే యోగి ఈమూడు అవస్థలూ పోదిలెయ్య గలడు. సందేహం లేదు.

వ్యక్తమూ, అవ్యక్తమూ రెండూ తెలియకపోతే మోక్ష మార్గం కనపడదు. 'వ్యక్తమంటే మృత్యువు. అవ్యక్తం అంటే అమృతం' అన్నాడు నారాయణుడు. వ్యక్తం ముల్లోకాలకీ అధారం. దాన్నే మోక్షమార్గం అని చాటుతున్నాయి వేదాలు. ప్రవృత్తి ధర్మం (సంసార ధర్మం) బ్రహ్మవల్ల పుట్టింది చావు పుట్టుకలు కలిగి స్తుం దది. మోక్షమార్గం బ్రహ్మం. అదే మోక్షం కలిగిస్తుం దంటున్నాయి వేదాలు.

కట్టిన వాచంలాగా, కప్పుకున్న ఉత్తరీయంలాగా, తలకి చుట్టుకున్న తలగుడ్డలాగా గుణాలుమూడూ ఆత్మని చుట్టుకున్నాయి. సత్వరజస్తమోగుణాల గుంజలాటకి అవతల వెలుగుతున్న నాలుగో నిరంజనతత్వం ఉత్తమమైంది. అదే భావించవలిసింది అంటాయి వేదాలు.

మనస్సూ, మాటా, శరీరమూ వొకట్టిచేసుకుని శుచిగా చేసిన తపస్సు నేతికి వెన్నలాగ జ్ఞానసంపదకి జన్మస్థానం.

బ్రహ్మచర్యమూ అహింసా పరమధర్మాలు; ఉత్తమ తప స్సులు. ఇవికలవాడుజ్ఞానయోగం కలవాడు. అన్నీ చూడగలడతడు.

సంసారం బలీయమైంది. ఆశాపాశాలతో అల్లుకుపోయి దృఢంగా వుంటుంది. అందులో పడకండా తప్పించుకోడమే తపస్సు. అదే దానికి మందు.

వికసించిన ఆశాలతకి తపస్సే కొడవలి. తపస్సనే కొడవలితో ఆశాలత కోస్తే నే భూతాలనీ, జీవాత్మనీ. పరమాత్మనీ జ్ఞానదృష్టితో చూస్తాడు యోగి.

ఇలా వార్ష్ణేయుడు బోధించడంతోనే విని శిష్యుడు కృతార్థుడయాడు. ధర్మరాజా! ఈమాటల అర్థం నువ్వూ అవగతం చేసుకోవాలోయి.

## తత్త్వోపదేశం

ధర్మరాజు — జనకుడు మోక్షం ఎలా సంపాదించాడు?

భీష్ముడు — జనకుడిదగ్గర వందమంది ఆచార్యులు వుండేవాళ్ళు. వేరువేరువిధాల తత్త్వం నిరూపించే శాస్త్రాలు అతడికి ఉపదేశిస్తూవుండేవాళ్ళు. ఏ ఆచార్యుడు ఎలా చెపితే అలా నడుచుకునేవాడు జనకుడు.

ఇలావుండగా పంచశిఖుడు అని వొక మునీశ్వరుడు దేశసంచారంచేస్తూ మిథిల వచ్చాడు. తత్త్వజ్ఞానంలో ఆరితేరినవాడతడు. ద్వంద్వాలు గెలిచినవాడు. సంశయాలు పోగొట్టుకున్నవాడు. గురువు భార్య కపిల చనుబాలుతాగి పెరిగినవాడు. కనక కాపిలేయుడనీఅంటారు అతణ్ణి.

జనకుడి వందమంద ఆచార్యులనీ హేతువాదంలో వోడించాడు పంచశిఖుడు. అతడి గొప్పతనం తెలుసుకున్నాడు జనకుడు. తన వందమంది ఆచార్యులనీ వొదిలిపెట్టేశాడు పంచశిఖుణ్ణి ఆశ్రయించాడు. తన్ను ప్రబోధించమని ప్రార్థించాడు. దయతలిచి మోక్షోపాయం ఉపదేశించాడు పంచశిఖుడు.

'అజ్ఞానం కామానికి పుట్టిల్లు. కామం కర్మకి పుట్టిల్లు. అదే పునర్జన్మకి కారణమంటారు తత్త్వం తెలిసిన మునులు.

'లోభమూ, మోహమూ ఆవరించి పాపాలు చేయిస్తాయి. దానికి అజ్ఞానం క్షేత్రమన్నమాట. అజ్ఞానక్షేత్రంలో ఎన్నోకర్మలు మొలకలెత్తి చివురిస్తాయి.

'మంచి ఇచ్ఛలు మనసులో అల్లుకుంటాయి ఎన్నో కర్మలకి పూనుకుంటాడు మనిషి. శరీరం నాశనం కావడం కానదు. ముసిలి తనంవల్లా, రోగాలవల్లా చెడతాడు.

'సంపదలూ, బంధువులూ, భోగాలూ ఏవీ స్థిరం కావు. ఇవి దూరంగా వుంచుకుంటేనే ఆత్మకి శాంతి. శాంతే మోక్షం కలిగి స్తుంది' అన్నాడు పంచశిఖుడు.

'కేవలం వైరాగ్యమే మోక్షం కలిగిస్తే, విరక్తులైన ప్రతీ మనిషీ ముక్తుడు కావాలికదా!' అని అడిగాడు జనకుడు.

'సంతోషమూ, స్నేహమూ, సుఖమూ, ఆనందమూ, శాంతీ ఇవి సాత్త్విక భావాలు. దుఃఖమూ, సంతోషం లేకండా వుండడమూ, ఏడుపూ, లోక వ్యామోహమూ, ఓర్పులేకండా వుండడమూ ఈ ఎని మిదీ రాజసభావాలు. అదేపనిగా తలపులూ, కలలూ, ఏమరు పాటూ, భ్రమా, సోమరితనమూ ఇవి తామసభావాలు. ఈమూడు రకాల భావాలూ కారణముండీ పుడతాయి. కారణంలేకా పుడ తాయి. ఒక స్థిరమంటూ లేదు విటికి. మారుతూనే వుంటాయి.

'సౌఖ్యం కలిగినప్పుడు అది సాత్త్విక భావం అనుకోవాలి. దుఃఖం కలిగినప్పుడు రాజసభావం అనుకోవాలి. జడత్వం కలిగినప్పుడు తామసభావం అనుకోవాలి. విటికి లోబడకండా పరమాత్మమీదే దృష్టి లగ్నం చేసుకుంటే మోక్షం అరిచేతిలో వుంటుంది. దీనికి వైరాగ్యం మూలం.

'సాత్త్వికం మొదలైన గుణాలు ఆత్మలో లీనం చేసుకుంటే పర మాత్మ అవగిత మవుతుంది. సముద్రంలో కలిసిపోయిన నదుల్లాగ స్వరూపం లేకండా అయిపోతాయి గుణాలు.

"సుఖదుఃఖాల వెంటపోకండా మనస్సు మళ్ళించి ఆత్మతో చేరిస్తే; నీళ్ళలో కలిసిపోయిన వుప్పులాగ అందులోనే లీనమవుతుంది.

"పొరవొదిలిన పాం లాగ కర్మఫలాన్ని వొదిలిపెట్టి ప్రకాశిస్తాడు జ్ఞాని" అన్నాడు పంచశిఖుడు.

అతడి తత్వోపదేశం విన్లేకదూ, జనకుడు తన మిథిలాపట్నం తగలబడిపోతూ వుంటే పిసరంతా విచారించకుండా, ఏవస్తువూ నాది లేదని నిబ్బరంగా అన్నాడు!

ధర్మరాజా ! ఈ ఇతిహాసం చదివితే శాంతి కలుగుతుంది. దుఃఖాలు పోతాయి మోక్షానికి యోగ్యత కలుగుతుంది.

ధర్మరాజు — సుఖమూ, శుభమూ, నిశ్చయమూ ఎవడికి దొరుకుతాయి?

భీష్ముడు—ఇంద్రియాలు అదుపులో వుంచుకున్న వాడికి అన్ని వర్ణాలవాళ్ళూ, అన్ని ఆశ్రమాలవాళ్ళూ ఇంద్రియాలు అదుపులో వుంచుకోడమూ, దమమూ, శమమూ అవలంబించడమూ అవసరం. అందులో బ్రాహ్మలకి మరీ ముఖ్యం.

దమమంటే సద్గుణాల పుట్ట. అవి ఏవంటావా? శుచిత్వమూ శాంతమూ, సంతోషమూ, సదాచారమూ, అసూయ లేకండా వుండడమూ, దైన్యం లేకండా బదకడమూ, జాగ్రత్తా, దురభిమానం లేకండా వుండడమూ, అతిగా వాదించకండా వుండడమూ, భూత దయా, గురుపూజా, నిందాస్తుతులు లేకండా వుండడమూ, సాధు వుల సాహసమూ, అబద్ధాలు ఆడకండా వుండడమూ, నిస్పృహతా, అహింసా, మంచిభావమూ, ఇంద్రియాలు జయించడమూ ఇవి దమం సద్గుణాలు. ఇవి వున్న పుణ్యపురుషుడు భయంలేకండా వుంటాడు. ఐహికంగా, ఆముష్మికంగా శాంతి, శుభమూ పొందుతాడు జ్ఞాన వంతుడూ అవుతాడు.

ధర్మరాజు — వ్రతం పూనినవాళ్ళు అప్పుడప్పుడు భోజనాలు చేస్తారు. అందువల్ల వ్రతహాని కలగదు కదా?

భీష్ముడు — వేదాలు చెప్పిన ప్రకారం బ్రాహ్మలు భోజనాలు చేస్తే వ్రతహాని కలగదు. నిజం చెప్పాలంటే మనిషి సదా ఉపవాసి కావాలి. సదా బ్రహ్మచారి కావాలి. మాంసం తినని వాడూ, మిగిలింది తిన్నవాడూ, అమృతం తిన్నవాడూ, కలలు కనని వాడూ కావాలి.

రెండు పూటలూ తిని, మధ్య మధ్య తినకండా వున్నవాడు సదా ఉపవాసి. రుతుకాలంల్లో మాత్రం పెట్టుకున్న భార్యతో సంగమం చేసినవాడు సదాబ్రహ్మచారి. దేవతలకీ, పితృదేవతలకీ, అతిథులకీ పెట్టి తిన్నవాడు మాంసం తిననివాడు. తనతో సమానంగా పంక్తి వాళ్ళకి పెట్టి తిన్నవాడు మిగిలింది తిన్నవాడు. భృత్యులు తిన్నతరవాత తిన్నవాడు అమృతం తిన్నవాడు. పగలు నిద్రపోనివాడు కలలు కననివాడు. ఈ వ్రతాలు మితిమీరితే మాత్రం దేహానికి బాధ కలిగిస్తాయి.

## ఇంద్ర ప్రహ్లాద సంవాదం

ధర్మరాజు — సంకల్పయోగంబట్టి కర్మలు శుభమూ, అశుభమూ, కలిగిస్తాయి. వాటికి కర్త పురుషుడా, కాదా?

భీష్ముడు — దేవేంద్రుడికీ, ప్రహ్లాదుడికీ జరిగిన సంవాదం వింటే నీసందేహం తీరుతుంది.

సత్యగుణసంపన్నుడు ప్రహ్లాదుడు. ఇంద్రియాలు గెలిచినవాడు. అహంకారమూ, సంతోషమూ, క్రోధమూ లేనివాడు. నిందా, స్తుతీ వొక్కటే అతడికి. మన్నూ, బంగారమూ వొక్కటే.

విష్ణుపాదాల ధ్యానమే అతడి వ్రతం. అతడి మనస్సు పరీక్షచేయడం కోసం ఒకనాడు అతడిదగ్గిరికి దేవేంద్రుడు వెళ్ళాడు.

'ప్రహ్లాదా! సంపదలేకపోతే విచారించవు. శత్రువులచేత చిక్కిపోయినా చింతించవు. ఊరుకోడమే గొప్ప అనుకుంటావు. ఏం పిచ్చాడివయ్యా?' అన్నాడు.

'భాగ్యం అనీ, దరిద్రం అనీ రెండు వున్నాయి. ప్రయత్నం వల్ల భాగ్యం రాదు. ప్రయత్నం లేకపోడంవల్ల దరిద్రమూ రాదు. ప్రయత్నించకపోయినా వస్తుంది భాగ్యం. ప్రయత్నించినా పోతుంది. అంతా దైవాధీనం. పురుషప్రయత్నం వృథా. శత్రువులు చంపడమూ, మిత్రులు బ్రతికించడమూ, అప్రయత్నంగా ఆపదలు రావడమూ, సంపదలు కలగడమూ ఇవన్నీ దైవంచేసే పనులు. భావాలు తమ స్వభావంవల్ల పుడతాయి, నశిస్తాయి. అవి అనర్థానికి ఆటపట్లు. ఇది తెలుసుకుంటే భావాల్లో తగుల్కోదు మనస్సు.

'దేనికైనా నేనే కర్తనని అనుకోడం అజ్ఞానం. తానే కర్త అయితే ఏదీ చెడకండా అన్నిపనులూ చేస్తున్నాడా, మనిషి? కనక తాను కర్త కాదు.

'దైవికంగా వచ్చిన ఫలాలు తనపనులవల్లే అనుకుంటాడు అహంకారి. అహంకారికానివాడు అలా అనుకోడు. అనుకోడు కనక ఫలమూ కోరడు.

'దైవం పనులు పూరికే చూస్తూ, భాగ్యమూ, దారిద్ర్యమూ వల్ల కలిగే సుఖదుఃఖాలుపట్టించుకోకండా వుండడమే ఉత్తమమార్గం.

ప్రాణులు శాశ్వతం కావని ఎప్పుడూ భావిస్తుంటాను నేను. సంసారబంధాలు తెంపుకుని, సంతోషంగా వున్నాను. దాంతుడూ, శాంతుడూ, ప్రజ్ఞావంతుడూ అయినవాడి మనస్సు ఆయాసపడదు. కనకనే నిశ్చింతగా వున్నాను' అన్నాడు ప్రహ్లాదుడు.

'ఈ శాంతి ఎలా పట్టుపడింది నీకు?' అని అడిగాడు దేవేంద్రుడు.

'మంచి నడతా, ప్రసన్నతా, ఆత్మజ్ఞానమూ, జాగ్రత్తా, వృద్ధసేవా మేలుచేశాయి. కాలం కలిసివచ్చింది. శాంతి దానంతట అదే పట్టుపడింది' అన్నాడు ప్రహ్లాదుడు.

ఆశ్చర్యపోయాడు దేవేంద్రుడు. ప్రహ్లాదుణ్ణి మెచ్చుకుని వెళ్ళి పోయాడు.

## ఇంద్రబలిసంవాదం

ధర్మరాజు—రాజుకి దేనివల్ల దరిద్రం పడుతుంది?

భీష్ముడు — ఇంద్రుడికీ, బలిచక్రవర్తికీ జరిగిన సంవాదం వింటే నీప్రశ్నకి సమాధానం దొరుకుతుంది. ఇంద్రుడు బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి వినయంగాఅడిగాడు. — 'బలిచక్రవర్తి మహాసంపదతో తులతూగుతూ ఉండేవాడు. ఇప్పుడు ఎక్కడా అతడి పికరులేదు. ఎక్కడున్నాడో?'

'నీ! అభిప్రాయం సరైంది కాదు' అన్నాడు బ్రహ్మ 'నాకు తెలుసు. అయినా చెపుతున్నాను. అబద్ధమాడకు. ఒంటెల్లోనో, గాడిదల్లోనో, ఆలమందల్లోనో—ఏదో వొకరూపంలో అణగివున్నాడు. అతణ్ణి చంపడం తగదు' అని చెప్పాడు బ్రహ్మ.

'చంపను' అన్నాడు దేవేంద్రుడు 'కనపడితే మాట్లాడతాను. అంతే' అని సెలవు తీసుకున్నాడు. ప్రపంచమంతా వెదికాడు. ఒక దగ్గిర గాడిదరూపంలో సంతోషంగా వున్న బలిని చూశాడు.

'గాడిద ఏమిటా నా బలిచక్రవర్తీ?' అడిగాడు దేవేంద్రుడూ 'ఏనుగులు వెంట వస్తూవుంటే, పట్టపు ఏనుగుమీద వచ్చేవాడివి.

మణులు తాపిన గొడుగులు తలమీద మెరుస్తూవుండేవి. మమ్మల్ని చిల్లిగవ్వకింద చూసేవాడివి. గాడిదవయ్యావు? బంగారం యూప స్తంభాలు పాతి యజ్ఞాలు చేసేవాడివి. అప్పటి నీగొప్ప, ఇప్పటి ఈ స్థితిచూసి దుఃఖంవస్తోంది నాకు. ఊక తింటున్నా విప్పుడు వెన కటి స్థితి తెలుచుకుని దుఃఖపడుతున్నావో లేదో? నిజం చెప్పు అన్నాడు.

'దేవేంద్రా! నీకంటికి నావైభవం కనపడదయ్యా. గుహలో గుప్తంగా వుంది అది కావాలన్నప్పుడల్లా నాకు కనబడుతుంది. అది అలా వుండనీ. నువ్వుగొప్పవాడివి. తక్కువవాళ్ళ దగ్గిరడాబులు పలకడం ఏం గొప్ప చెప్పు? చ్యవనుడి దగ్గిర నీ ప్రజ్ఞలు ఏమ యాయి? నీ దారిని నువ్వు పో' అన్నాడు బలి.

నవ్వుతూ మళ్లీ మొదటిలాగే అన్నాడు దేవేంద్రుడు. అప్పుడు బలి ఇలా అన్నాడు. 'మంచులాపుట్టి, మంచులా నశిస్తుంది ప్రాణి కోటి. దానికోసం బుద్ధిమంతులు విచారించరు. ఈ మాత్రం ఎర గవా నువ్వు? ధనమూ, దరిద్రమూ, చావూ బతుకూ, సుఖమూ దుఃఖమూ వొక్కలాగే చూశాను నేను. బలమూ, అందమూ, బుద్ధీ, ప్రౌఢత్వమూ కలవాళ్ళనీ, ఇవి లేనివాళ్ళనీ వొక్కలాగే చూస్తాడు యముడు. సమయం రావడంతోనే తన్నుకు పోతాడు. ఇది నాకు తెలుసు. అందుకనే దుఃఖమూ, సంతోషమూ మందుకైనా మనసులో లేవు నాకు.

'గాడిద రూపంలో వున్నాననీ, ఊక తింటున్నాననీ హేళన చేస్తున్నావు. శాంతిసమయం ఇది. కనక నువ్వు మరిన్ని మాట లన్నా నామనస్సులో రవంతా కోపం పుట్టదు. వెనక ఇలా అనగలి గానా నువ్వు? నిన్ను ఎరగనూ? నన్ను నువ్వు తెలుసుకోవద్దూ?

'సంతోషమూ, దుఃఖమూ, కోరి తెచ్చుకున్నవా? విధివిధానం బలీయమైందని ఎరగవూ? పెద్దవాడివి కదా, వివేకం అక్కరలేదూ?

'ఇలా గర్వించడం నీచత్వం. పో, నీదారిని నువ్వుపో. ఈ కుళ్లు విడిచిపెట్టు. నేను ఎర్రగా చూస్తే, నువ్వూ, నీ వజ్రాయుధమూ వాక్కపిడికిలితో వారిగిపోతారు. ఇంతకీ ఇది సరసంగా అన్నమాట. విధికృత్యం మహాచిత్రమైంది. అంచేత మనసులో పొగరులేదు నాకు ఈ కుళ్ళువల్ల చివరికి నువ్వే మోసపోతావు. కనక శాంతించు'

ఇంతలో బలిచక్రవర్తి శరీరంలోంచి చక్కని చుక్కవొక పడుచు బైటికి వచ్చింది. చూసి, నిచ్చెరపోయాడు దేవేంద్రుడు. 'ఈ ఆడది ఎవరు?' అని బలిని అడిగాడు.

'ఎవరో ఎరగను. ఆమెనే అడుగు' అన్నాడు బలి.

'నువ్వు ఎవరో చెప్పు?' ఆమె మొహం చూస్తూ అడిగాడు దేవేంద్రుడు.

'శ్రీ, భూతి, లక్ష్మి అనినాపేర్లు. మీరు నన్ను ఎరక్కపోడం పెద్దవిషయం కాదు. ఇంద్రా! ఏలోకంలోనూ, ఏయుగం లోనూ, ఎవ్వరూ నన్ను ఎరగరు' అందామె.

'ఈ బలిని వొదిలేశావేం?' అడిగాడు దేవేంద్రుడు.

'సత్యమూ, ధర్మమూ, తపమూ, దానమూ నా వునికి పట్టు. అవి వున్న పరాక్రమవంతులదగ్గిర వుంటాను. ఈబలిచక్రవర్తి వెనక అలాగే వుండేవాడు. అవినీతివల్లా. బ్రాహ్మలంటే అసూయవల్లా ఇప్పుడు వెనకటి నడవళ్ళన్నీ వొదిలేశాడు. అంచేత ఇతణ్ణి వొదిలేశాను నీతో వచ్చేస్తాను. నీ దగ్గిర వుంటాను, మీద చెప్పిన గుణాలూ, వేదాలు చెప్పిన నడవళ్ళూ నీదగ్గిర చూశాను. నిన్ను పొందుతున్నాను. వీటిమీద ఎన్నడూ ఏమరుపాటుగా వుండకూడదు నువ్వు' అంది లక్ష్మి.

"అయనభేదంవల్ల సూర్యుడు కాంతితగ్గి వుంటాడు" అన్నాడు బలి – "అలాగే ప్రతాపం తగ్గివున్న నన్ను చూసి మిడిసిపడకు. ఇంద్రా! దేవాసుర యుద్ధంలో నిన్ను గెలుచుకుంటాను" అన్నాడు బలిచక్రవర్తి.

"అది అలా వుండనీ. నీతో వాదన అనవసరం. ఏమంటే, బ్రహ్మమాట పాటించాలి నేను. అంచేత నీమీద వజ్రాయుధం వెయ్యను. సంతోషించు" అన్నాడు ఇంద్రుడు.

మాటాడకండా దక్షిణం వేపు వెళిపోయాడు బలి. తూర్పుగా స్వర్గానికి వెళిపోయాడు ఇంద్రుడు.

## ఇంద్ర నముచి సంవాదం

ఇంద్ర నముచి సంవాదం కూడా చెపుతాను విను. అది నీమనస్సుకి సంతోషం కలిగిస్తుంది.

సిరి, సంపదా పోయి, కెరటాలమోత లేని సముద్రంలాగ వొక ఏకాంతస్థలంలో వున్నాడు నముచి. అతడిదగ్గిరికి వెళ్ళాడు దేవేంద్రుడు. "పేదవాడివై పోయావు కదూ! ప్రియజనులు లేరు. పరివారమూ లేదు. ఈఅవస్థకి ఎంత దుఃఖపడుతున్నావో పాపం!" అన్నాడు.

'దుఃఖ మెందుకూ? అందుకున్నాడు నముచి – పోయిన వస్తువు కావాలని ఏడిస్తే వస్తుందా? రాదు. శరీరమూ, మనస్సూ మరింత మరుగుతుంది దుఃఖంవల్ల. ధర్మం నశిస్తుంది. ఈమాత్రం తెలుసు నాకు. కనక దేనికీ విచారించను. అన్నిప్రాణుల్నీ శాసించేవాడంటూ వొకడు వున్నాడు. నీళ్ళు పల్లానికి పారినట్టు అతడి సంకల్పంవల్లే అన్నీ జరుగుతాయి. "ఇది నాకు వచ్చింది, రావలసే వచ్చింది. అన్న గాఢ నిశ్చయం మనసులో వున్నవాడికి సుఖదుఃఖాలూ, సంపదలూ,

ఆపదలూ వుండవు. ధైర్యంవల్లా, వీర్యంవల్లా, శౌర్యంవల్లా, ప్రజ్ఞవల్లా పొందరాంది పొందగలడా మనిషి? వివేకవంతుడికి ఇది తెలుసు. కనక విచారించడు.

"కాలంబట్టి మంచీ, చెడ్డా వస్తాయి. కావాలంటే రావు, పోవాలంటే పోవు. అంచేత విచార మెందుకూ?"

విని మెచ్చుకుని వెళ్ళిపోయాడు దేవేంద్రుడున్నీ ధర్మరాజా! ఇంకా ఏంకావాలనివుందో అడుగు నాయనా!

## ధైర్యం

ధర్మరాజు—ఏదైనా ఆపద వచ్చినప్పుడు ఎలా నడుచుకోవాలి?

భీష్ముడు — ఎలాంటి ఆపదకైనా ధైర్యమే మందు. ధైర్యంవల్ల మనస్సు చేవ దేరుతుంది. దృఢనిశ్చయం ఏర్పడుతుంది. దుఃఖం కలగదు. ధైర్యం ఆరోగ్యం కలిగిస్తుంది, సిరీ, సంపదా కలిగిస్తుంది. కీర్తి కలిగిస్తుంది. కాలం తారుమారైనా ధైర్య విడిచిపెట్టకూడదు.

దేవాసుర యుద్ధంలో విష్ణుప్రభావంవల్ల దేవతలు గెలిచారు, రుద్రులూ, ఆదిత్యులూ, మరుత్తులూ, వసువులూ, గంధర్వులూ, సిద్ధులూ చుట్టూ మూగి, దేవేంద్రుడు ఐరావతం ఎక్కి మూడు లోకాలూ తిరిగాడు. ఒకనాడు సముద్రపొడ్డున వొక కొండగుహ దగ్గిర బలిని చూశాడు. దగ్గిరికి వెళ్ళాడు. దేవేంద్రుణ్ణి చూసి పిసరంతా తడబడలేదు బలి. ఏమాత్రమూ మనోవికారమూ లేదతడికి. అది కనిపెట్టాడు దేవేంద్రుడు.

"హీనస్థితిలో వున్నావు. వైభవమూ లేదు. అయినా పగవాళ్ళ గొప్పతనం చూసి విచారించవు. ఇలా ఎలా వున్నావు? ఏమిటి కారణం! శౌర్యంవల్లా? వృద్ధుల్ని సేవించడంవల్లా? తపస్సు చేతనా? ఇంకేదైనా కారణం వుందా?" అని అడిగాడు,

'యజ్ఞాలుచేసినా, దేవవ్రతాలుచేసినా మంచిప్రవర్తనవున్నా కాలాన్ని దాటడం కష్టం. కాలగతి చలించరాంది' అన్నాడు బలి,

విని, మనసులో తడబాటు అణుచుకుంటూ అడిగాడు దేవేంద్రుడు-'అయ్యో, బలీ! నీమనసులో వికారమే లేదే? వివేకమూ. శాంతీ, వినయమూ కలిగి నిండు ధైర్యంతో వున్నావు. ఏం తపస్సు చేశావయ్యా నువ్వు?'

'వికారంలేకండా వుండడమూ, ధైర్యమూ, వివేకమూ ఎక్కణ్ణుంచైనా? ఎరువు తెచ్చానా కాలప్రభావం తెలుసు కనక కలతపడను. కాలం వల్లే అన్నీ కలుగుతాయి ఆగకండా కాలం గడిచిపోతూనే వుంటుంది. అజాగ్రత్తగా వున్నవాడు మాత్రం భంగపడతాడు. తప్పదు కళలూ, కాష్ఠలూ మొదలైనసూక్ష్మభాగాలు కూర్చుకుని వడ్డీ వ్యాపారస్తుడిలాగ వశపరుచుకుంటుంది కాలం. కొండని ఏరు కోసేసినట్టు, కాలం మనని లోబరుచుకుంటుంది.

'కామక్రోధాల్లో పడిపోయినవాడు కాలగతి కానలేడు 'ఇంతకి ముందు చూశాను. అతడు అందంగా వుండేవాడు. ఎంతవేగం చచ్చిపోయాడు? చిత్రం!, అంటాడు వాకడు. మూర్ఖత్వం వల్ల తనసంగతి విచారించడు. భావమూఅభావమూ, తెలుసుకుని ఉత్తమమైన తపస్సు చేస్తాడు పండితుడు. అరిచేతిలో ఉసిరికాయలాగ కాలగతి కనుక్కుంటాడు. కాలగతి కనుక్కోడం శాంతికి మూలం మవుతుంది. మనస్సులో ఆత్మమయత్వానికి ఆలంబన కలిగిస్తుంది. అలాటివాడు క్షోభ పడడు.' అన్నాడు బలి.

విని ఆశ్చర్యపోయి, మెచ్చుకున్నాడు దేవేంద్రుడు. 'కాలచరిత్ర తెలుసుకున్నావు. పవిత్రవీరుడివయావు. ధన్యుడివి. ఉత్తములందరూ నీలాగే వుండాలి. లోకాలన్నీ అరిచేతిలో వున్నట్టే చూస్తావు. సత్వమూ మొదలైన మూడు గుణాలూ విడిచిపెట్టావు.

గుణాలు లేకుండా ప్రకాశించే ఆత్మని చూస్తున్నావు. నీ భాగ్యమే భాగ్యం. తేరిచూడలేని ధైర్యంతో వున్నావు. నీ దీనదశ తొలిగి పోవాలి. శుభం కలగాలి. పరమస్వేచ్ఛగా సుఖం అనుభవించు' అన్నాడు దేవేంద్రుడు. వెళ్ళివస్తా నన్నాడు. ఆకాశవీథిని ఐరావతం మీద బయలుదేరాడు. దేవతలూ, మునులూ, వెంట వెళ్ళారు. బలి వాక్యామృతంతో, అమృతం తాగినంతకంటే ఆనందిస్తూ అంత మందీ అమరావతి చేరారు.

---

# శాంతి పర్వం
## అయిదో ఆశ్వాసం

ధర్మరాజు — మనిషి ధనవంతు డెలా అవుతాడు? దరిద్రు డెలా అవుతాడు?

### ఇంద్ర లక్ష్మీ సంవాదం

భీష్ముడు— దీనికి ఇంద్ర లక్ష్మీసంవాదం అని వొక కథ వుంది నారదముని అంతటా తిరుగుతూ, వొకనాడు గంగానదికి వెళ్ళిస్నానం చేశాడు. గంగలో స్నానంచేసి, అక్కడ జపంచేస్తున్న దేవేంద్రుణ్ణి, చూసాడు. ఇద్దరూ కులాసాగా మాట్లాడుకున్నారు. ఇంతలో ఆకాశంమీద ఉదయిస్తున్న సూర్యబింబాన్ని మించిపోయి, వొక పెద్ద వెలుగు కనిపించింది. చూస్తూవుండగా వొక కన్య విమానం దిగి వచ్చింది. దేవేంద్రుడి ముందు చేతులు జోడించింది.

'ఎవరు నువ్వు?' ఆదరంగా అడిగాడు దేవేంద్రుడు— 'ఎక్కణ్ణుంచి వచ్చావు? ఎక్కడికి వెళతావు?'

'నన్ను లక్ష్మి అంటారు' నెమ్మదిగా చెప్పిందామె — 'బాల సూర్యుడిచేత వికసించిన పద్మంలో నా పుట్టుక. శ్రీ అనీ, భూతిఅనీ పిలుస్తారు నన్ను. దేవ పితృకర్మలూ, బుద్ధీ, మేధస్సూ కలిగి వుండడంచేత రాక్షసుల్ని మెచ్చి ఇన్నాళ్ళూ వాళ్ళదగ్గిర వున్నాను. ఇప్పుడు వాళ్ళదగ్గిరనించి నీదగ్గిరికి వచ్చేశాను. వాళ్ళంటే ఏమీా నచ్చలేదు నాకు' అంది.

'రాక్షసుల్ని ముందు మెచ్చుకున్నావూ? ఎందుకనీ? ఇప్పుడు నచ్చకపోడం దేనికి?' అని అడిగాడు దేవేంద్రుడు.

"దానమూ, అధ్యయనమూ, అతిథిపూజా మొదలైన ఉత్తమ గుణాలు వాళ్ళదగ్గిర వుండడంచేత రాక్షసుల్ని ముందు మెచ్చుకున్నాను. అందుకనే వాళ్ళదగ్గిర వున్నాను. ఇప్పుడు అవన్నీ వొదిలి పెట్టే శారు వాళ్ళు. గర్వపోతులై పోయారు. అంచేత నచ్చక వచ్చేశాను. నువ్వు సత్యపరుడివి. ధర్మపరుడివి. కనకనే నీ దగ్గిర వుండాలని రుచి పుట్టి వచ్చాను.

'గురుభక్తి కలవాళ్ళూ, దేవపూజా, పితృపూజా చేసేవాళ్ళూ, నిజంచెప్పే వాళ్ళూ, దానగుణం కలవాళ్ళూ, పరులధనమూ, పరుల భార్యలూ కోరనివాళ్ళూ, బ్రాహ్మణ ప్రియులూ, పగలు నిద్రపోని వాళ్ళూ, వృద్ధుల్ని, దుర్బలుల్ని, పేదల్ని, ఆడాళ్ళనీ దయచూసే వాళ్ళూ, శుచిమంతులూ, అతిథులు భోజనం చెయ్యగా మిగిలింది తినే వాళ్ళూ నేను మెచ్చే జనులు.

'గర్వపోతులూ, ధర్మం వొదిలేసినవాళ్ళూ, కామ క్రోధాల్లో మునిగి తేలుతున్న వాళ్ళూ, బలీ, భిక్షా ఇవ్వనివాళ్ళూ, పరుషంగా మాట్లాడే వాళ్ళూ, క్రూరచరిత్రులూ నాకు నచ్చరు.

'బుద్దీ, ధృతీ, నీతీ, శ్రద్ధా, సమ్మతీ, వోర్పూ, శాంతీ ఈపదు గురు దేవతలూ నన్ను ప్రేమిస్తారు. ఇదే వేదాలు చాటుతున్నాయి. నేను ఎనిమిదో దేవతని. కష్టాత్ములని కనిపెట్టి రాక్షసుల్ని వొదిలే శాను. దేవతల చరిత్ర నాకు తృప్తి కలిగించింది. కనక వాళ్ళదగ్గిర వుంటాను' అంది.

విని, దేవతలూ, దేవముని నారదుడూ మెచ్చు కున్నారు. సువాసనతో చల్లగాలి వీచింది. పూలవాన కురిసింది. దేవేంద్రుడు

భులు పోగాయి. శ్రీదేవి వరించి, కొత్తఅందంతో దేవతల కళ్ళ వేడుకగా దేవలోకం వెళ్ళాడు దేవేంద్రుడు.

ధర్మరాజా! లక్ష్మీదేవేంద్రుల సంవాదం విన్నా, చదివినా సిరీ, సంపదా లభిస్తాయి. దీని తాత్పర్యం నీమనస్సుకి పట్టించుకో. దృఢమైన శీలం సంపాదించుకో. లక్ష్మి నీదగ్గిర స్థిరంగా నిలుస్తుంది.

## దేవల జైగీషవ్య సంవాదం

ధర్మరాజు — ఏ ఆచారం, ఏశీలం, ఎలాటి విద్య అలవరుచుకుంటే మనిషి ముక్తి పొందుతాడు?

భీష్ముడు — అసితుడైన దేవలుడు జైగీషుడనే మునితో 'నవృత్తాంతం చెప్పవలిసింది' అని అడిగాడు. ఆమహాత్ముడు ఇలా చెప్పాడు — 'శాంతవంతులైన సౌమ్యుల నడవడి ఎంతో ఇష్టం నాకు పొగిడితే సంతోషం కానీ, తిడితే విచారం కానీ లేకండావుండాలి. కొట్టినా కోపం తెచ్చుకోకూడదు. ఇవి పెద్దలు ఎంపికచేసిన గుణాలు. ఒకటి కోరి, దానికోసం దుఃఖపడకండా వుండడమూ, ఏది సంభవించినా తృప్తికలిగి వుండడమూ, కార్యం చెడిపోతే విచారించకపోడమూ ఉత్తమగుణాలు. సంతోషమూ, మానమూ, కోపమూ, అపరాధమూ, మదమూ, గౌరవాగౌరవభావనా, పెద్దలసహవాసం లేకండా వుండడమూ— ఇవి దుష్టగుణాలు. ఓర్పుకలవాడు అవమానం జరిగితే అమృతం తాగినట్టు ఆనందిస్తాడు. సన్మానం జరిగితే విషం తిన్నట్టు విచారిస్తాడు వివేకవంతుడికి వీడు చుట్టమనీ, వీడు పగవాడని ఎవళ్ళకూ దా భేదభావ ముండదు. ఎప్పుడూ ఎక్కడా ఏపని వల్లా అతడి ఆనందానికి భంగంకలగదు. ఇంద్రియాలు గెలిచి, మనసులో శాంతి సంపాదించి, వికారంలేకండా వున్నవాడు పొందే

ఉత్తమగతి దేవతలుకూడా పొందలేరు' అన్నాడు. ఈమాటలే నీప్రశ్నకి సమాధానంగా భావించు.

## ఉగ్రసేన శ్రీకృష్ణసంవాదం

నారదముని విషయంలో వెనక ఉగ్రసేనుడికీ శ్రీకృష్ణుడికీ సంవాదం జరిగింది. అది వింటే నీసందేహం తీరుతుంది.

'నారదుడంటే అంతమందీ ప్రియంగా చూస్తారు. ఎంతో పొగుడుతారు. నిజంగా అతడు అంతటివాడా? అని కృష్ణుణ్ణి అడిగాడు ఉగ్రసేనుడు.

'అవును' అంటూ అందుకున్నాడు కృష్ణుడు-'వినికిడీ, ఆచారమూ అధికం అతడికి. అహంకారం అసలు లేదు. ఎంతో చక్కని శీలం. వేషంలో వికారం లేదు. మచ్చరమూ, గర్వమూ, మదమూ మచ్చుకైనా లేవు. పుట్టుకా, తపస్సూ, తేజస్సూ, బుద్ధీ, వినయమూ, నీతీ, ధైర్యమూ చెప్పనేఅక్కరలేదు. శఠత్వమూ, దైన్యమూ, క్రోధమూ, లోభమూ — ఇవి ఏనాడో తృణీకరించాడు. ఉత్సాహం అతడి నైజగుణం. ఈసూ, అసూయా, తెలివితక్కువతనమూ ఎరగనే ఎరగడతడు. అలాంటి మునీంద్రుడు అంతమందికీ ప్రియమైనవాడు కావడం వింతేముంది?' అన్నాడు. నిజంగా ఇలాంటి గుణాలు అంతమందికీ ప్రియమైనవి.

## కాలస్వరూపం

ధర్మరాజు — కాలస్వరూపం సెలవియ్యి.

భీష్ముడు — లోగడ శుకుడు వేదవ్యాసుణ్ణి ఇలాగే అడిగాడు. వ్యాసుడు చెప్పిందీ, మరికొంతా వివరిస్తాను విను. కాలానికీ, భూతాలకీ ఆధారభూతమైన పరమ తేజస్సు, తనమహిమవల్ల కార్యరూపంతో

వెలుగుతూ వుంది. అయినా నిజంగా అది కార్యాత్మకం కాదు, భావించదగిందిమాత్రమే. 'పద్దెనిమిది నిమిషాలు వొక కాష్ఠ. ముప్పయి కాష్ఠలు వొక కళ. మూడువందల అరవై కళలు వొక ముహూర్తం. ముప్ఫయి ముహూర్తాలు వొక దినం. ముప్పయి దినాలు వొకమాసం. రెండు మాసాలు వొక రుతువు ఆరు రుతువులు వొక సంవత్సరం. మూడు రుతువులు వొక అయనం. ఉత్తరాయనమనీ, దక్షిణాయనమనీ సంవత్సరానికి రెండు అయనాలు. ఒకటి పగలనీ, వొకటి రాత్రనీ వీటిని అంటారు యోగులు. ఉత్తరాయనం అంటే అగ్ని అనీ, దక్షిణాయనం అంటే పొగ అని అంటారు. అంతేకాదు, ఉత్తరాయనం సుగతికీ, దక్షిణాయనం దుర్గతికీ హేతువులు అందుకని ఉత్తరాయనం శుక్లమనీ (తెలుపు), దక్షిణాయనం కృష్ణమని (నలుపు) అంటారు. మనుషుల నెలలు పితృదేవతల దినాలు మనుషుల సంవత్సరాలు దేవతలకి దినాలు.

దేవతల పన్నెండు వేల సంవత్సరాలు నాలుగు యుగాలవుతాయి. అందులో నాలుగుపాళ్ళు, కృతయుగం, మూడు పాళ్ళు త్రేతాయుగం. రెండుపాళ్ళు ద్వాపరయుగం ఒక్కపాలు కలియుగం. అంటే—నాలుగువేల ఎనిమిదివందల దేవసంవత్సరాలు కృతయుగం. మూడువేల ఆరువందల సంవత్సరాలు త్రేతాయుగం. రెండు వేల నాలుగువందల సంవత్సరాలు ద్వాపరయుగం. పన్నెండువందల సంవత్సరాలు కలియుగం. వీటిని మూడువందల అరవై చేత ఎచ్చవేస్తే మనుషుల సంవత్సరాలు వస్తాయి. అప్పుడు కృతయుగానికి (4800 × 360 = 17,28,000) పదిహేడు లక్షల ఇరవై ఎనిమిది వేలు సంవత్సరాలూ, త్రేతాయుగానికి(3600 × 360 = 12,96,000 పన్నెండు లక్షల తొంభై ఆరు వేల సంవత్సరాలూ ద్వాపరానికి (2400 × 360 = 8,64,000) ఎనిమిదిలక్షలఅరవై నాలుగు వేలసంవత్సరాలూ, కలియుగా

నికి)1200 × 360=4,32,000) నాలుగులక్షల ముప్ఫయిరెండు వేలసంవత్సరాలూ అవుతాయి. ఇందులో సంధ్యలూ సంధ్యాంశలూ వున్నాయి. యుగాల మార్పువల్ల ఈసంధ్యలూ, సంధ్యాంశలూ ప్రతీయుగం ఆరంభంలోనూ, అంత్యంలోనూ కలుగుతాయి. అవి దేవసంవత్సరాలలోనే చెపుతాను.

కృతయుగానికి సంధ్యలు నాలుగువందల సంవత్సరాలు. త్రేతాయుగానికి మూడువందల సంవత్సరాలు. ద్వాపర యుగానికి రెండువందల సంవత్సరాలు. కలియుగానికి వంద సంవత్సరాలు. క్రమంగా సంధ్యాంశలూ అంతే. అంటే మనుషుల సంవత్సరాల లెక్కని కృతయుగానికి సంధ్యలు(400 × 360=1,44,000)లక్షానలభై నాలుగువేల సంవత్సరాలు. దానికి సంధ్యాంశలూ అంతే. త్రేతాయుగానికి సంధ్యలు (300 × 360=1,08,000)లక్షాఎనిమిది వేలసంవత్సరాలు. దాని సంధ్యాంశలూ అంతే. ద్వాపరానికి సంధ్యలు (200 × 360 = 72,000) డబ్బయిరెండు వేల సంవత్సరాలు దాని సంధ్యాంశలూఅంతే. కలికి (100 × 360=36,000)ముప్ఫయిఆరు వేల సంవత్సరాలు. దాని సంధ్యాంశలూ అంతే.

కృతయుగంలో తపస్సూ, త్రేతాయుగంలో జ్ఞానమూ, ద్వాపరంలో యజ్ఞమూ, కలియుగంలో దానమూ ప్రధానం మనుషులకి. త్రేతాయుగం దగ్గరనించి ప్రతీయుగంలోనూ మనుషుల న్యాయమూ, ధర్మమూ, ఆయువూ, బలమూ క్రమంగా తగ్గిపోతూవుంటాయి.

ఈనాలుగుయుగాలూ కలిస్తే వొక మహాయుగం. వెయ్యి మహాయుగాలు బ్రహ్మదేవుడికి వొక పగలు. అలాగే అన్ని మహాయుగాలు వొకరాత్రి. ఇది తెలిసినవాళ్ళే పగలూ రాత్రీ తెలిసినవాళ్ళు.

బ్రహ్మ రాత్రి నిద్రపోయినప్పుడు లోకాలకి ప్రళయం. తెల్లవారి, అతడు మేలుకున్న పగలు ప్రాణికోట్ల సృష్టి జరుగుతుంది. మాటిమాటికీ ఇలాగే జరుగుతూ వుంటుంది.

బ్రహ్మం తేజ స్స్వరూపం. దాని ప్రకాశం తెలుపు. దాని సారరమే విశ్వం. అదే కాలానికి కట్టువడి బహువిధాల భూతసృష్టి చేస్తుంది. దాని విధానం ఎలా అంటే, ఆ మహనీయతత్వంవల్ల మహత్తూ, మనస్సూ, ఆకాశమూ గాలి, అగ్ని నీరూ, భూమీ — ఈ ఏడు రూపాలూ ఒకదానినించి ఒకటి పరస్పరం పుడుతున్నాయి. శబ్దమూ, సర్శమూ, రూపమూ, రసమూ గంధమూ, సద్భావమూ క్రమంగా ఆకాశమూ, గాలీ, అగ్నీ, నీరూ, భూమీ — ఈఅయిదు భూతాలకీ గుణాలు.

మీాద చెప్పిన ఏడు స్వరూపాలూ సృష్టికి ఆధారం. కనక వీటిని పురుషు లన్నారు మునులు. ఈ పురుషులు కలియకపోతే సృష్టి జరగదు.

ఇలా మహిమ కలిగి తేజోరూపం, బ్రహ్మం, ప్రాజాపత్యం అని ఆత్మ ఎల్లప్పుడూ ప్రకాశిస్తూ వుంటుంది సత్వమహిమలో నిష్కళం కంగా వుంటుంది. వ్యాపకుడూ, సృష్టికర్తా, బ్రహ్మ, ప్రజాపతీ అని ఎల్లప్పుడూసత్యస్వరూపమే అయి, దేనినీ అంటకుండా వెలుగుతూ వుంటుంది. తానే తన దివ్యభావంలో తలుచుకుని దేవతలూ, మునులూ, గరుడులూ, నాగులూ, నదులూ, అడవులూ, సముద్రాలూ అయి ఆయూపనులు చేస్తుంది.

ఇలా నడుస్తున్న లోకంలో పురుష ప్రయత్నమే ఫలిస్తుందంటారు కొందరు. కాదు. దైవంవల్లే అంతా జరుగుతుందంటారు కొందరు. అదీ కాదు, ఇదీకాదు అంతా మహాభూతాలస్వభావం

వల్లే కలుగుతుంది అంటారు మరికొందరు. ఇవి కర్మలు చేసేవాళ్ళ రీతులు. సత్వగుణం కలవాళ్ళుమాత్రం అన్నీ సమంగానే చూస్తారు.

తపస్సు శుభప్రదమైంది. శమమూ, దమమూ దాని సంపద. స్వాధ్యాయం దానికి ఫలమిస్తుంది.

ఆకాశమూ, దాని గుణం శబ్దమూ రెండూ బ్రహ్మమే. శబ్దబ్రహ్మం సేవించినవాడు పరబ్రహ్మపదం చేరుకుంటాడు.

తాను ఏదీ చెయ్యనట్టే వుంటుంది పరబ్రహ్మ. అయినా ప్రకృతిసంబంధంవల్ల వింతరంగులు పొందుతుంది. ప్రాణికోటిని సృష్టిస్తుంది. అదే మింగుతుంది.

సృష్టివిధానం చెప్పనే చెప్పాను. ఇక సంహారవిధానం వివరిస్తాను, విను. స్థావరాలూ, జంగమాలూ తనని కలిసినా, తనలో లీనమైపోయినా, కుండ అడుగుభాగంలాగ అలాగే వుంటుంది బ్రహ్మం.

భూమిని నీరు మింగేస్తుంది. నీటిని అగ్గీ, అగ్గిని గాలీ, గాలిని ఆకాశమూ మింగేస్తాయి. ఆకాశాన్ని మనస్సు తాగేస్తుంది. గంధమూ మొదలైన గుణాలతో భూతాలూ ఇలా నశించాక, మనసునీ మింగేస్తుంది ఆత్మ. ఆత్మని సంకల్పం ఆవరించుకుని వుంది. జ్ఞానంవల్ల అదినశిస్తుంది. సంకల్పంనశిస్తేనే జ్ఞానమార్గం స్ఫురిస్తుంది. దాంతో జన్మలకీ కాలానికీ దూర మేర్పడుతుంది కాలం దూరమైతే అధ్యాత్మజ్ఞానం విలసిస్తుంది. ఆ దివ్యజ్ఞానమే బ్రహ్మం అంటున్నాయి వేదాలు.

సంహారంకూడా ఆతత్వంచేతిలోనేవుంది. అదే పగలూ రాత్రీ చేస్తూ, ప్రాణికోట్ల చావుపుట్టుకలు కలిగిస్తూ ఆటలాడుతూ వుంటుంది.

ఇంకా ఇలా చెప్పాడు వ్యాసుడు — 'బ్రాహ్మడు పుట్టి జాతకకర్మ, చౌళకర్మ, ఉపనయనమూ మొదలైన సంస్కారాలు

జరుపుకోవాలి. గురువుదగ్గిర విద్య నేర్చుకోవాలి. గురువుఅనుమతి పొంది, తక్కిన మూడు ఆశ్రమాలూ క్రమంగా పుచ్చుకోవాలి. మూడు ఆశ్రమాల్లోనూ గృహస్థాశ్రమం ముఖ్యమైంది. గృహస్థాశ్రమంలో దేవతల రుణమూ, పితృదేవతల రుణమూ తీర్చుకోవాలి. బ్రహ్మచర్యాశ్రమంలో రుషుల రుణం తీర్చుకోవాలి. కాషాయవస్త్రాలు కట్టుకుని సన్యాసాశ్రమం పుచ్చుకోడం చివర మంచిది. యజ్ఞాలు చేయడమూ, చేయించడమూ, వేదాలు చదవడమూ, చదివించడమూ, దానంచేయడమూ, పుచ్చుకోడమూ ఈ ఆరుకర్మలూ ఇంతవరకే బ్రాహ్మలు చెయ్యదగిన వంటారు.

## దానం సర్వవర్ణాలకీ సామాన్యం

'దానం అన్ని వర్ణాలకీ సామాన్య ధర్మం. పుణ్యాపరులకి ఇవ్వరాని వస్తువంటూ లేదు. కాశ్యుడని వొకరాజు తనప్రాణం దానమిచి. ఒక బ్రాహ్మడి ప్రాణం కాపాడాడు. శిబి తన శరీరం కోసి ఇచ్చాడు కన్న కొడుకుని బ్రాహ్మలకోసం ఇచ్చేశాడు కాశీరాజు. ప్రతర్దనుడు తన కళ్ళే తీసి దానంచేశాడు. జనకుడూ, పరశురాముడూ గయుడూ ప్రపంచమంతా దానంచేశారు. పాంచాలం రాజు బ్రహ్మదత్తుడు శంఖనిధి* దానం చేశాడు. ఆవులూ, బంగారమూ, మణులూ, కన్యలూ, శరీరాలూ, ప్రాణాలూ కూడా ఎంతో మంది దానాలు చేశారు. వాళ్ళకి లభించిన సద్గతి చెప్పతరం కాదు.

'దానమూ, అధ్యయనమూ, యజ్ఞమూ మొదలైన వాటితో అన్ని పాపాలూ పోతాయి. వీటికి శక్తిలేనప్పుడు జీవహింసచెయ్య

*పద్మం, మహాపద్మం, శంఖం, మకర , కచ్ఛపం, ముకుందం, నీలం, ఖర్వం అని నిధులు తొమ్మిది.

కండా వుండాలి. పాపాలు వొదిలించుకున్న పుణ్యాత్ముడు మితంగా భోజనం చేస్తూ, ఇంద్రియాలు గెలిచి బ్రహ్మపదం చేరుకుంటాడు.

'సారంలేని సంసారం పెద్దఏరు. ఇంద్రియాలే ఈవటిలో నీరు. క్రోధమూ, శోకమూ, దైన్యమూ, బురద. లోభం గట్టు, ఘోరమైన ఈసంసారనది పుణ్యాత్ముడు ఈదుకుపోతాడు. ప్రజ్ఞ అనే తెప్పతో దాటుకుపోతాడు. కామక్రోధాలకి లొంగిపోయిన వాడుమాత్రం ఎంత ప్రయత్నిస్తే అంత చిక్కుపడతాడే కాని దాటలేడు

'సంతోషమూ, భయమూ, క్రోధమూ, వొదిలేసిన ధైర్యవంతుడూ, జాగ్రత్తపరుడైన బుద్ధిమంతుడూ, ధర్మపరుడూ, దాంతుడూ నాశనం పొందడు.

'కర్మల్లో వొకొక్కప్పుడు, ధర్మం అధర్మంలా అవుపిస్తుంది. అధర్మం ధర్మంలా తడుతుంది. ధర్మసూక్ష్మం శాస్త్రాలవల్ల తెలుసుకోవాలి.

జ్ఞానం సంపాదించడం కోసం మాటా, మనసూ నియమంగా వుంచుకుంటారు, బుద్ధిమంతులు. శాంతికోసం ఆత్మనియమంగా వుంచుకుంటారు. ఇలా జ్ఞానమార్గం అవలంబిస్తే వేదాలెరిగిన వాడూ, సంప్రదాయం తెలిసినవాడూ, ధర్మం, తెలిసినవాడూ, పాపాత్ముడూ కూడా వొక్కలాగే సంసార సముద్రం సులువుగా దాటేస్తారు.

'యోగం వొక రథం. ఆచారమే దాని చక్రాలు. ప్రాణమే కాడి. అపానమే ఇరుసు. లజ్జ సీల. ఉపాయమూ, అపాయమూ, నొగలు. ముక్కూ చెవులూ వాహనాలు. జ్ఞానం సారథి. ధర్మం మునికోల. త్యాగం పగ్గం. ఈ యోగరథ మెక్కిన ఉపాయశాలి రథికుడు ముక్తిపదం చేరుకుంటాడు. ఆ రథికుడు ఆత్మతంత్ర ప్రభావం వల్ల వరసగా భూమీ, గాలీ, ఆకాశమూ, తేజస్సూ గెలుచుకుంటాడు. బల మెక్కి అహంకారం అణగదొక్కుతాడు. బుద్ధి స్వాధీ

నంలో పెట్టుకుంటాడు. ప్రకృతిని గెలుస్తాడు. అగ్గి పోగరాజుకుని, నిప్పుకణాలు చెరిగి, నుసిలేనిమంట మండినట్టు — మహా భూతమైన భూమిని జయించి క్రమంగా శక్తిమంతు డవుతాడు పురుషుడు. అహంకారం గెలిస్తే, ఐహికాలమీద ఆసక్తికల బుద్ధి లొంగుబాటుకి వస్తుంది. దానివల్ల మహానుభావం కలుగుతుంది. ఇది యోగపద్ధతి.

ఇంద్రియాలు విషయాలమీదికి పోకండా వాటిని మనస్సుతో అరికట్టడం సాంఖ్యుల పద్ధతి. సాంఖ్యమూ, యోగమూ, రెండూ వొకటే. నిజానికి సాంఖ్యులూ, యోగులూ, ఉభయులూ మమత వొదిలి పెట్టాలనే అంటారు. నిస్సారమైన సంసారానికి మమత్వమే కారణం. సందేహం లేదు.

'ప్రాణుల తారతమ్యం చెపుతాను విను. నడిచేవి, నడవనివీ అయిన ప్రాణుల్లో నడిచేవి శ్రేష్ఠం. మూపీ, గుడ్లూ, చెట్టుచేమలూ — వీటివల్లపుడతాయి ప్రాణులు. రెండుకాళ్ళు మొదలు ఎన్నో అన్ని కాళ్ళదాకా కలిగివుంటాయవి. ప్రాణుల్లో మనుషులు శ్రేష్ఠులు. మనుషుల్లో కులధర్మాలు కలవాళ్లు శ్రేష్ఠులు. కులధర్మాలు కలవాళ్ళలో కల్లా బ్రాహ్మణు ఉత్తములు. వాళ్ళలో వేదాలు తెలిసిన వాళ్ళు ఉత్తములు. వేదాలు తెలిసినవాళ్ళలో అవి చదివించే వాళ్లు గొప్పవాళ్ళు. వాళ్ళలోనూ ఆత్మజ్ఞానం కలవాళ్ళు గొప్ప వాళ్ళు. వాళ్ళే అన్నిధర్మాలూ ఎరిగినవాళ్లు. వాళ్ళే సత్యసంకల్పులు. వాళ్ళే అధ్యాత్మమూ, అధిభూతమూ, అధిదైవమూ తెలిసిన వాళ్ళు. అలాటివాళ్ళనే దేవతలు బ్రాహ్మణులంటారు. అంతమందీ ఆరాధించ దగ్గవాళ్ళు వాళ్ళు. వాళ్ళతో సాటివచ్చేవాళ్ళు లేరు. అన్ని లోకాలూ వాళ్ళ మీదే ఆధారపడి నడుస్తున్నాయి.

'ఇక బ్రాహ్మణుకు ముఖ్యంగా చెయ్యవలసినపని చెపుతాను. జ్ఞానంతోనూ, నిష్ఠతోనూ కర్మలుచెయ్యాలి బ్రాహ్మణుడు. దాంతో

సంశయాలు పోయి శాంతి కలుగుతుంది తపస్సువల్ల పరమాత్మ సిద్ధిస్తుంది. దయాగుణం వంటి ధర్మం మరొకటి లేదు బ్రాహ్మణుడికి. దయవుంటే ఏకాగ్రత, ఏకుబుద్ధి అక్కరలేదు. దయవల్ల వివేకం కలుగుతుంది. నమ్ము.'

తండ్రి చెప్పిందంతా విన్నాడు శుకుడు. 'అయితే పరబ్రహ్మ పదం పొందాలంటే ఎలాగ?' అని అడిగాడు— యజ్ఞాలవల్లా? ప్రజ్ఞా బలం వల్లా? యోగంవల్లా? సాంఖ్యంవల్లా?

కుమారుడి ప్రశ్న విని పరబ్రహ్మప్రాప్తిసాధనం వివరించాడు వ్యాసుడు.

## పరబ్రహ్మప్రాప్తిసాధనం

నువ్వు వరస పెట్టిన యజ్ఞాలూ, ప్రజ్ఞాబలమూ, యోగమూ సాంఖ్యమూ ఇన్నీ మంచివే. తపస్సూ, ఇంద్రియనిగ్రహమూ, కామ క్రోధాల విజయమూ, విద్యా వున్న పుణ్యాత్ముడు పరబ్రహ్మపదం పొందగలడు. అయితే ఒక విశేషం వుంది. ఇంద్రియాలుఅయిదూ, ఇవే అడ్డంకి. వీటిని అణచడానికి నేర్పరయిన మనస్సువుంటే చాలు. మనస్సు నియమంలోపడితే భూతాత్ముడి ప్రయత్నం ఫలిస్తుంది. నియమానికి లోబడి మనస్సు ఇంద్రియాలు అదుపులో పెడితే శబ్దమూ మొదలైన విషయాలు వొదిలిపోయి సిద్ధి లభిస్తుంది. చూడడమూ, వినడమూ మొదలైన గుణాలు కల ఇంద్రియాలకీ, బుద్ధికీ అందదు పరబ్రహ్మం. దానికి వొక రూపమంటూ లేదు ఒక శబ్దమంటూ లేదు. ఒకగుణమంటూ లేదు. దివ్యంగా వెలుగుతూ వుంటుందది.

'ఆవునీ, పసుగుని, విద్యా వినయమూ కల బ్రాహ్మణ్ణీ ఎందుకూకాని కుక్కనీ, దాన్ని చంపి తెచ్చుకు తినే మాలనీ

వాళ్కలాగే చూసే పండితులు సమదర్శనులు. కుక్కా, బ్రాహ్మడూ మాలా మొదలైన యావన్మందిలోనూ వుండే అంతరాత్మని, ఆ నిరంజనుణ్ణి చూసినవాళ్లు ఎవళ్లు. స్థావరాలని జంగమాలనీ కాదు. అన్నిటిలోనూ వుంటుంది పరమాత్మ. అలాగే దానిలో అన్నీ వుంటాయి. ఈరహస్యం తెలియడమే పరబ్రహ్మని చేరుకోడం.

'క్షరమూ, అక్షరమూ అని అన్ని భూతాత్మలకీ రెండుమూర్తులున్నాయి. మొదటిది మృత (క్షరం). రెండోదిఅమృతం (అక్షరం). స్వర్గంలో వుంటుందది. ఈ రెండూ తెలిసిన వాడే పండితుడు.

'లోకాలన్నిటిని కాలం పక్వం చేస్తూవుంది. కాలం పక్వం తెలిసినవాడే, ముసలితనమూ, చావూలేని సత్యస్వరూపమైన పరబ్రహ్మం చూస్తాడు.

'తొమ్మిది వాకిళ్ళ పట్నంలో (శరీరంలో) వెలుగుతూ వుంటుంది పరమాత్మ. దాన్నే అక్షరమనీ, అమృతం (చావులేంది) అనీ అంటారు యోగులు. యోగ్యమైన సత్కర్మలు అభ్యాసంచేసిన వైరాగ్యపరుడే ఈతత్వవిధానం తెలుసుకుంటాడు.

'కామమూ, క్రోధమూ, భయమూ, నిద్రా, లోభమూ యోగులకి ఎంతమాత్రమూ తగవు. ఈఅయిదూ పట్టుపట్టి వొదిలి పెట్టాలి వాళ్ళు.

'పండితుడైనవాడు దృఢమైన మనస్సుతో, సంకల్పం మానుకుని కామం విడిచిపెడతాడు. సత్వగుణంతో నిద్రా, మోహమూ అణుచుకుంటాడు. ప్రాజ్ఞుల్ని సేవించి లోభం వొదిలిపెడతాడు. శాంతంపూని క్రోధం మళ్ళిస్తాడు. జాగ్రత్తవల్ల భయం జయిస్తాడు జాగ్రత్తకలవాడు ధైర్యంతో శిశ్నమూ (స్త్రీవాంఛ), కడుపూ (ఆకలి) రక్షించుకుంటాడు. చూపుతో కాళ్ళూ చేతులూ, శుద్ధమైనమనస్సుతో చూపూ, వినికీ, విద్యతో మనస్సూ మాటా కాపాడుకుంటాడు.

'ఇంకా యోగ విధానం విను. ఇంద్రియాల్లో ఏదైనా వొకటి పట్టువడలేదనుకో. నాగలి పత్తువ కర్రులోనే కదా వుంటుంది. కనక మనస్సు ముందు ఆపుకుంటే సరి, వినికీ మొదలైన అయిదూ ఆపుకో వచ్చు క్రమంగా మనస్సూ, ఇంద్రియాలూ ఆత్మలో వొదిగినట్టు చేసుకుంటే, తేజస్సుతో అది పొగలేని అగ్నిలాగ ప్రకాశిస్తుంది.* మనస్సు నిలకడగా వుండడంకోసం జనసమ్మర్దం వొదిలిపెట్టాలి. శూన్యంగృహం లోనో, గుహలోనో, వొంటరిగా అడివిలోనో, దేవాలయం మొదలైన వాటిలోనో నివాసం ఏర్పరుచుకోవాలి. ఎవన్నా మన్నిస్తే సంతోషంకానీ, కీడుచేస్తే కోపంకానీ మనస్సుకి పట్టించుకో కూడదు. చీకూ చింతా లేకండా వుండాలి. రాయీ, బంగారమూ వొక్కలాగే చూస్తూ యోగవృత్తి అవలంబిస్తే ఆరుమాసాల్లో శబ్ద బ్రహ్మం అతిక్రమిస్తాడు యోగి. అతడే పరమాత్మని చూస్తాడు.

పరబ్రహ్మప్రాప్తిసాధనం విని, మళ్ళీ అడిగాడు శుకుడు— కర్మలు చెయ్యమనీ చెపుతుంది, చెయ్యొద్దనీ చెపుతుంది వేదం. ఈ రెండూ పరస్పర విరుద్ధంగా వున్నాయి. ఇందులో కర్మచేస్తే ఏం వస్తుంది? కర్మ చెయ్యకపోతే ఏంవస్తుంది?

కుమారుడు అడిగినదానికి ఇలా చెప్పాడు వ్యాసుడు_ 'ప్రవృత్తి కర్మ. నివృత్తి నిష్కర్మ. అంటే, ఇంద్రియవ్యాపారం ప్రవృత్తి. అది వొదిలి పెట్టడం నివృత్తి. ప్రవృత్తి బంధకం. నివృత్తి మోక్షం. అందు కని బుద్ధిమంతులు కర్మకి పూనుకోరు. కొందరు కర్మ చెయ్యడమే మెచ్చుకుంటారు. అలాటి వాళ్ళు చావుపుట్టుకల్లో పడి కొట్టుకుంటారు, తప్పదు. కర్మ వొదిలిపెట్టినవాళ్ళు మాత్రం ముక్తులవుతారు; మహా నందం అనుభవిస్తారు. చిత్తశుద్ధితో చేసినా అవిద్యామూలకమైందే కర్మ. అంచేత కర్మమానుకోడమే అధ్యాత్మ విద్యా ధర్మం. అదే

*చూ. అనుశాసనిక పర్వం.అ. 3

మోతుం మిస్తుంది గుమ్మడి పువ్వులో చేనెలాంటిది కర్మఫల సంపద. నూతిలోని చంద్రకాంతి వంటిది. అధ్యాత్మవిద్య మాత్రం అలా కాదు. తేనెవరదలాటి దది పున్నమ చందమామలాటిది. ఫలప్రద మైంది. అఖండసౌఖ్య ప్రదమైంది. సన్నని రేఖామాత్రం కని పించే నెలవంక వంటిది జీవుడు. కృష్ణపక్షంవంటిది అజ్ఞానం. అది పోడంతోనే, విజ్ఞానానందంలో ఆ నెలవంక నిండు చందమామ అవు తుంది' అన్నాడు.

## బ్రహ్మవిద్య

'అయితే బ్రహ్మవిద్య ఎలా పట్టువడుతుంది?' అని అడిగాడు శుకుడు. వ్యాసుడు వివరించాడు— 'అడివిలో వానప్రస్థాశ్రమంలో వున్న మునులదగ్గిర వుండాలి. బ్రహ్మచర్యంతో తపస్సు చెయ్యాలి ఉచితమైన వేళల్లో పర్ణశాలలకి వెళ్ళి భిక్ష మెత్తుకు తినాలి. పొగడ్తా, నమస్కారమూ పొందకండా తిరగాలి. మంచీచెడ్డా అన్న విచారం విడిచి పెట్టాలి. గోష్ఠిలోచేర కూడదు. ఇలాఅయితే బ్రహ్మవిద్య పట్టు వడుతుంది.'

'కర్మలు వొదలకూడ దనే అంటారు వేదాలు తెలిసినవాళ్లు. ఇది అంగీకరించాలా? కూడదా?' అని అడిగాడు శుకుడు.

'కర్మలు వొదలీ పెట్టాలి, వొదిలిపెట్టకండానూ వుండాలి. వివరిస్తాను, విను. బ్రహ్మచారులు, గృహస్థులూ, వానప్రస్థులూ, సన్యాసులూ, కర్మలు చేస్తూనే సిద్ధిపొందుతున్నారు. చివరి స్థానం పరమపదం ఎక్కడానికి ఈనాలుగు ఆశ్రమాలూ నాలుగు మెట్ల నిచ్చెన వంటివి. ఈ క్రమవర్తనమే సులువైన మార్గం, బ్రహ్మచర్య వ్రతం చేసేవాడు తన ఆయుఫులో నాల్గో భాగం గురువు దగ్గర దాసుడిలాగ వుంటూ గురువుగారి పనలన్నీ చేసి, దక్షిణసంతోషం

పడతాడు. అతడు భోజనం చేశాక తాను తింటాడు. గురువు పక్క మీద వాలాక, అతడి కాళ్ళు పడతాడు. అతడు నిద్రపోయాక నిద్రపోతాడు. రుచులమీదా, గంధాలూ మొదలైన వాటిమీదా వేడుక పడడు. గురువుకి ఇష్టమైన వేళల్లో నియమంతో వేదం నేర్చుకుంటాడు. ఇది బ్రహ్మచారివిధానం ఇక తక్కిన ఆశ్రమాల్లో నడుచుకునే విధం చెపుతాను.

'వినయంగా తన శక్తికి తగినట్టు గురువుకి దక్షిణ ఇచ్చి, అతడి మాటమీద సమావర్తనకార్యం ఒక (ఇంటివాడివి కమ్మని గురువు గారి అనుమతి పొందడం నడిపి, పెళ్ళిచేసుకుని బ్రహ్మచారి గృహస్థుడవుతాడు. హవ్యకవ్యాలూ, అతిథిపూజలూ జరుపుతాడు. బంధువుల్ని పోషిస్తాడు. సత్యం పాలిస్తాడు. తనభార్యతోనే తృప్తిపడతాడు. కుమాళ్ళని కంటాడు. వాళ్ళని ప్రయోజకుల్ని చేస్తాడు. యజ్ఞాలూ అవీ చేస్తూ జీవితంలో వొకభాగం గడుపుతాడు. గృహస్థధర్మంలో కృతకృత్యుడవుతాడు.

తరువాత అగ్నులు వొదలకండా అడివికి వెళ్ళి వానప్రస్థాశ్రమంలో ప్రవేశిస్తాడు. గింజా గట్రా, కాయా పండూ, దుంపా దుట్రా కూర్చుకుని, వాటితోనే భిక్షువుల్ని పూజిస్తాడు. వాళ్ళకిపెట్టాక మిగిలింది తింటాడు.

'ఆయువులో ఇలా వొకభాగం వానప్రస్థాశ్రమంలో గడిచాక, చివరిభాగం శాంతంగా సన్యాసాశ్రమంలో గడుపుతాడు. ఇదే ఉత్తమ ధర్మం.

'బిచ్చమెత్తుకునే సన్యాసి ఆత్మలో అగ్ని ఆరోపించుకుని, మనస్సులోనే యజ్ఞం చెయ్యాలి. స్నేహమూ, విరోధమూ మనసులో వుంచుకోకూడదు. ఎవ్వరిదగ్గిరా ఏదీ పుచ్చుకోకూడదు. తల బోడి చేసుకోవాలి. ఎక్కడా వొక్క దగ్గిరవుండకూడదు. తన ఇల్లంటూ

వుంచుకోకూడదు. ఏ చెట్టుకిందో కూచోవాలి. కపాలం పట్టుకు బిచ్చ మెత్తుకోవాలి. ఒంటరిగా వుండాలి. కామమూ, క్రోధమూ, శోకమూ విడిచిపెట్టాలి. నిందా స్తుతీ సమానంగా భావించాలి. ఇతర్లతో మాట్లాడకూడదు. అంతటా తానే వున్నట్టు అనుకోవాలి. ఏది దొరికితే అదే తిని తృప్తిపడాలి. ఏదివుంటే అదే కట్టుకోవాలి. ఎక్కడో వొకదగ్గిర నిద్రపోవాలి. అదిగో అలాంటి వాణ్ణే బ్రాహ్మ డంటారు దేవతలు. జనసంచారం చూస్తే పాముని చూసినట్టు చూస్తాడు సన్యాసి. ఆడదాన్ని ఏనుగులా చూస్తాడు. తనని ఆదరిస్తే నరకంలా బాధపడతాడు. తనవల్ల ప్రాణికోటికి ఏబాధ కలగనివ్వడు. ఏప్రాణివల్లా అతడు బాధపడడు; భయపడడు. ఎన్నిదానాలైనా అభయదానంతో సాటిరా వంటారు పెద్దలు. జంతువుల అడుగులన్నీ ఏనుగు అడుగులో ఇమిడిపోయినట్టు అన్ని ధర్మాలూ అహింసలో ఇమిడివున్నాయి. అంచేత కర్మ వొదిలేసినా సరే, అహింస అవసరం. అహింసావ్రతుడు లోకాలన్నిటికీ శరణ్యుడై వుంటాడు. అమృత హృదయుడై వుంటాడు. దేనినీ అంటని ఆకాశంలా వుంటాడు.

## అంతర్యజ్ఞం

'హృదయ వేదికలో జ్ఞానాగ్ని వెలిగించి, అందులో ప్రాణం వేల్చి, సోమయాజిలాగే అంతర్యజ్ఞం చేసినవాడు పాపాలు పోగొట్టు కుంటాడు. 'ఆత్మతీర్థంలో మునిగేవిధం తెలిసినవాడు ఇక్కడికీ, అక్కడికీ యాత్రలు వెళ్ళడ మెందుకూ?' అని ఉపదేశిస్తారు బ్రహ్మ విద్య తెలిసిన వాళ్ళు.

'భూమిని తాకకండా ఆకాశంమీద ఇంతా అంతా అని చెప్పతే ... పిట్ట నొ...టుంది. గుడ్డుమధ్య ఉజ్వలమైన రెక్కలతో

వెలుగుతూ వుంటది. యోగం తెలిసినవాడే దాన్ని తెలుసుకుంటాడు.

'ఆరు అంచులూ, పన్నెండు ధారలూ కలిగి లోకమంతా నోటితో ఆక్రమించుకుని తిరుగుతూ వుంటుంది కాలం. అర్థం కాదది గుహలో అడిగి పోతుంది

'శిక్షణలేని గుర్రాలు నడిపిన రథికుడిలాగ మనస్సూ ఇంద్రియాలూ నడుపుతున్నాడు పురుషుడు. ఈనడపడంలో అవి ఈడ్చుకుపోయాయా చెడ్డ తప్పదు. ఎన్ని అవదలైనావస్తాయి, శాంతికలగక. శాంతి కలిగితే మాత్రం ఆనందప్రదమైన బ్రహ్మపదం సిద్ధిస్తుంది. కనక దానికి ఉపాయం చెపుతాను. అన్ని సంకల్పాలూ వొదులుకోవాలి. మనసులోసత్వగుణం నిలుపుకోవాలి. సత్వగుణంకల మనస్సు శాంతిపొందుతుంది. శాంతుడై కాలం గడపడమే ఉత్తమం. గాలిలేనిచోట దీపం నిలిచినట్టు అంతరాత్మ ప్రకాశించడమే శాంతివిధానం శాంతిమంతుడు తన్ను తనలోనే చూస్తాడు. నియమాహారంతో బ్రహ్మపదం చేరుకుంటాము. నాయనా! వేదాంతశాస్త్ర మహాసముద్రం చిలికి తీసిన వెన్న నీకు ఇచ్చాను. ఆదరంగా అందుకో నువ్వు అనుభవించి, ఉత్తమ తపస్వికి ప్రసాదించు. అన్ని రత్నాలతోనిండిన భూమండలం యావత్తూ దానంచేసినా, వేదాలసారమైన అధ్యాత్మ విద్యాదానంతో సాటిరాదు. ఇంకా ఏం వినాలనుందో అడుగు' అన్నాడు.

'దీనికంటే వినవలసిందేముంది? ఇదే ఇంకా దృఢంగా అనుగ్రహించు' అన్నాడు శుకుడు. మళ్ళీ ఎత్తుకున్నాడు వ్యాసుడు—

'భూతాత్ముడు (ఈశ్వరుడు) ప్రాణికోట్లు పుట్టిస్తూ వుంటాడు. తిరిగి తనలోనే లయంచేసుకుంటాడు. ఇలా ప్రాణుల్ని హతమార్చడం తన వునికి వ్యక్తంచెయ్యడానికే అనుకో. తాబేలు తన అవయవాలు లోపలికి ముడుచుకుంటుంది. అలాగే ప్రాణుల్ని అతడు పుట్టించీ

తనలో కలుపుకుంటాడు. మాయా విలాసంతో అలా చెయ్యడం తప్పనిసరి అయి ప్రాణికోటి సృష్టిచేస్తున్నాడతడు. ఆ మాయ తొలిగించడమే ప్రాణుల నాశనం.

'చెవి మొదలైన ఇంద్రియాలకి శబ్దమూ మొదలైనవి విషయాలు. ఇవి ఆకాశమూ మొదలైన మహాభూతాల గుణాలు. విషయాలూ, ఇంద్రియాలూ అన్నీ అణచివేస్తుంది శాంతి. ఇంద్రియాలు అయిదు. మనస్సు ఆరోది. బుద్ధిఏడోది. ఆత్మకలిస్తే ఎనిమిది అవుతుంది. సర్వసాక్షి. క్షేత్రజ్ఞుడు అంతరాత్మ మనస్సుతో తెలుసుకుంటాడు. బుద్ధితో నిశ్చయిస్తాడు. అతడి వెలుగే సత్త్వమూ మొదలైన గుణాలకీ కూరుస్తుంది. స్వస్థతా, కష్టమూ, జడత్వమూ, తెలివీ, సత్త్వరజస్తమోగుణాలఉత్పత్తినాశనాలూ, ఇంద్రియాల ఉద్ధృతమూ, వొదగడమూ— ఇవన్నీ బుద్ధిచేసే పనులు. ఇంద్రియాలూ, విషయాలూ, మనస్సూ, బుద్ధీ, ఆత్మా వొకదానికంటే వొకటి గొప్పది. బుద్ధి అన్నిటిలోనూ వుంటుంది. అంచేత ఆత్మకీ, బుద్ధికీ ఎంతో తేడా లేదు. బుద్ధి ఆత్మలో నిలిచి కన్నయి చూస్తుంది. చెవ్వయి వింటుంది. నాలిక అయి రుచిచూస్తుంది ముక్కయి వాసన చూస్తుంది. తనువై స్పర్శ అనుభవిస్తుంది. సంతోషంవల్ల పెరుగుతుంది. దుఃఖంవల్ల తరుగుతుంది. రెండూ లేక సమత్వంతో నిలుస్తుంది. నాయకత్వం వహించు గుణాలు నడుపుతుంది. దాని స్వభావం తెలుసుకుని, ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ— ఈ పదింటివెంట పడకండా తన్ను తాను చూస్తున్న వాణ్ణి దుఃఖమూ, దైన్యమూ, సుఖమూ, ప్రమాదమూ ఏదీ అంటదు.

నీటిలో వుండి నీటిపిట్ట మునగదు. బొడ్డపండు పురుగుల వల్ల చెడిపోదు. అలాగే విషయాలమధ్య వుండినా ఆత్మ చెడిపోదు. సాలె

పురుగు దారం తనకు తానే చేసినట్టు సత్త్వం గుణాలు పుట్టిస్తుంది. ఆత్మ అది ఉదాసీనంగా చూస్తుంది, కాని వికారం పొందదు.

'ఆదీ అంతమూ లేని పరమాత్మని ఆశ్రయించి, గుణాలు వొదిలిపెట్టి, క్రోధమూ లోభమూ, దగ్గిర చేరనివ్వని మునీ, మనసు ముడి విడదీసి మోక్షం పొందుతాడు.

'కామక్రోధాలు లేకుండా వుండాలి. వినయసారం పట్టువడితే భయమూ, శోకమూ, మానమూ వుండవు. శాంతీ, ఆత్మజ్ఞానమూ పండితుల లక్షణాలు. ఈ రెండూ వుంటే, మోక్షసాధనకి వేరే కల్పనే అక్కరలేదు' అన్నాడు.

'ధర్మాల్లోకల్లా ఉత్తమమైన ధర్మమేది?' అని అడిగాడు శుకుడు. మళ్ళీ అందుకున్నాడు వ్యాసుడు:

## ఉత్తమధర్మం

'పిల్లల్ని అదుపులో పెట్టిన తండ్రిలాగ, ఇంద్రియాలు మనసులో నిలిపి, ఏకాగ్రభావం పొందడమే ఉత్తమధర్మం అదే శాంతి. ధర్మాలన్నిటికీ అదే చివరిధర్మం. అంచేత ఇంద్రియాలు మనసులో కుదించు. బుద్ధితో కలుపు. అలాచేసి, సంకల్పాలు మానుకుంటే మోక్షం కరతలామలకం అవుతుంది.

'తన పువ్వు తాను వాసన చూడలేదు చెట్టు; తనపండు తాను తినలేదు. అలాగే పరతత్త్వం తన స్వభావం తాను చూడలేదు. కాళ్లంతో అంతరాత్మని చూస్తే చాలు, పాము పొర విడిచినట్టు పాపాలు వొదిలి పెట్టేస్తావు. ఇలా శాంతిపొంది లోభమనే నదిని సత్త్వమనే రేవులో దాటాలి. లోభనది పుట్టుక ఎక్కడో తెలియదు. సంకల్పమే దీనిగట్టు. క్రోధమే బురద. ఇంద్రియాలే అందులో మొసళ్లు. కామమే పాములు. మోహమనే గరిక దాన్ని కప్పేసి వుంటుంది. నాయనా! ఈ

లోభనది దాటి నువ్వు ప్రసన్నాత్ముడివి కా. కొండకొప్పుమీద వున్న వాడు కిందివాళ్ళని చూసినట్టు ఈ ప్రాణికోట్లని తృప్తితో చూడు.

'వేదాలూ, వేదాంగాలూ చదివినా, మంచికర్మలు చేసినా ప్రశాంతి లేకపోతే బ్రాహ్మణత్వం దక్కదు. ఒకళ్ళని భయపెట్టకండా, ఒకళ్ళకి భయపడకండా నడుచుకునే పరిణతచిత్తుడే బ్రాహ్మడు.

'బంధనాలన్నిటిలోకీ పరమబంధనం కామం. అది వొదిలి పోయిందా, మేఘాలు వొదిలిపోయిన నిండుచందమామలాగ వెలుగుతుంది ఆత్మ. పరబ్రహ్మాని ఉపాసిస్తూ, కామం లేకండా వుండిన పురుషుడి సుఖం శుక్లపక్షచంద్రుడిలాగ హెచ్చుతూ వుంటుంది.

'భూతాల గుణాలు తెలుసుకుంటే, సూర్యోదయంతో చీకట్లు పోయినట్టు దుఃఖాలు వొదిలిపోతాయి.

'తనది అనుకోకండానే దేనివల్ల సుఖంకలుగుతుందో, తినకండానే దేనివల్ల తృప్తి కలుగుతుందో, ఇచ్ఛా పొందూ లేకండానే ఏది సుఖమిస్తుందో దాన్ని తెలుసుకోవాలి. అదే వేదాల అభిప్రాయం.

'క్రమంగా కర్మలూ, గుణాలూ వొదులుకుని, విషయాల పొంతకి పోనివాణ్ణి ముసలితనమూ, మృత్యువూ తొంగిచూడవు.

'ఆత్మ సూక్ష్మమైంది. దేహం కంటే వేరైంది. శాంతులైన పండితులు శాస్త్రప్రమాణం దాన్ని తెలుసుకుంటారు.

'సూర్యుడి రూపం నీటిలో అవుపడుతుంది. బుద్ధిలో ఆత్మ ప్రతిబింబిస్తుంది. ఆత్మని పరమార్థంగా భావించే సాత్త్వికుడికి నిజం పట్టు పడుతుంది.

'సూర్యుడికి పగలూ రాత్రి లేదు. అలాగే యోగంతో వుండే మునికి వివేకమూ, అవివేకమూ అని వుండవు. సాధనాలు వుండినా, వుండకపోయినా శాంతికల యోగికి స్థిరమైన యోగసమాధి సిద్ధిస్తుందన్నాడు శాండిలమునీంద్రుడు.

'మోహం అనే విత్తనంవల్ల కామం అనే చెట్టు పుడుతుంది. అజ్ఞానం అనే వేళ్ళతో ప్రమాదం అనే నీళ్ళు పీల్చి పెరుగుతుంది. అసూయ అనే ఆకులతో అందంగా శృంగారవృతుంది. గర్వమనే మొదలుతో ధృఢపడుతుంది. శోకమనే కొమ్మలూ, చింతలనే రెమ్మలూ వేస్తుంది. వెనకటి కర్మ అనే బలుపుతో బలుస్తుంది. ఆశలు అనే తీగలతో అల్లుకుంటుంది. దాని పళ్ళకోసం లోభులు పరిగెడతారు. త్యాగమనే కత్తితో పండితులు దాన్ని తెగనరుకుతారు. దుఃఖాలు తొలిగించుకుంటారు.

'ఈ శరీరం వొక పట్టణం. ఈపట్టణానికి బుద్ధి రాజు. మనస్సు మంత్రి. విషయాలు పురోహితులు. ఇంద్రియాలు పౌరులు. రాజస తామసగుణాలు శత్రువులు. బుద్ధి మనస్సుతో వేరయిందో శత్రువుల చేతిలో పడిపోతుంది. బుద్ధీ, మనస్సూ వొక్కటైతే మాత్రం శత్రువులు అణగిపోతారు. రాజ్యసుఖానికి భంగముండదు.'
ఇలా తండ్రి ఉపదేశం విని కృతార్థుడయాడు శుకుడు.

## మృతువు

ధర్మరాజు—శౌర్యబలమూ, వీర్యబలమూ, మనోబలమూ వున్న రాజులు ఎంతోమంది ఈ యుద్ధంలో చచ్చిపోయారు. ప్రాణాలు రక్షించుకోలేకపోయారు. అంతమందినీ మృత్యువు కబళించింది. అయితే మృత్యువంటే ఏమిటి? మనుషుల్ని ఎలా చంపుతుందది?

భీష్ముడు— అకంపనుడని వొకరాజు వుండేవాడు. యుద్ధంలో అతడి కొడుకు చచ్చిపోయాడు. అందుకని దుఃఖిస్తూ కూచున్నాడతడు. ఇంతలో నారదుడు అక్కడికి వచ్చాడు భక్తితో ఆతిథ్యమిచ్చాడు అకంపనుడు. తన దుఃఖంవివరించాడు. అతణ్ణి వోదారుస్తూ

ఒక కథ చెప్పాడు నారదుడు. ధర్మరాజా! అది వింటే నీ సందేహం తీరుతుంది విను.

'బ్రహ్మదేవుడు లోకాలు సృష్టించాడు. జంతుకోటి పెరిగింది. సమ్మర్దం అధికమైంది. ఊపిరాడడమే కష్టమైంది. బాధపడ్డాడు బ్రహ్మ. ప్రాణుల్ని చంపే ఉపాయం ఆలోచించాడు. ఆలోచన తీవ్రంలో అతడి మనసునుంచి అగ్నిహోత్రుడు పుట్టాడు. లోకాలు కాల్చెయ్యడం మొదలెట్టాడు. శివుడు వచ్చి, బ్రహ్మని సేద దేర్చాడు. బ్రహ్మ తెలుసుకొని, అగ్ని ఆపాడు. అప్పుడు బ్రహ్మ ఇంద్రియాల లోంచి ఒక ఆడది పుట్టింది. ఆమె శరీరం ఉజ్జ్వలంగా వుంది. కళ్ళు ఎర్రగా వున్నాయి. పుట్టీపుట్టడంతోనే దక్షిణంవేపు బయలుదేరిందామె.

'మృత్యూ!' అని ఆమెని పిలిచాడు బ్రహ్మ — 'బలవంతులనీ, బలహీనులనీ భేదం లేకుండా ప్రజల్ని చంపు' అన్నాడు. కళ్ళు నీళ్ళు పెట్టుకుందామె. 'నీకు పుట్టి క్రూరకర్మ చేస్తానా? ధర్మకార్యం నాకు నియోగించు' అంది. ఆమె కన్నీటిబొట్లు దోసిట పట్టాడు బ్రహ్మ. 'ప్రజల్ని చంపడానికే నువ్వు పుట్టావు. కనక చంపాలి నువ్వు' అన్నాడు. గాలికి వణికిపోయిన తీగెలాగ వణికిపోయిందామె.' 'మనుషుల్ని చంపి, వాళ్ళ బంధువులు ఏడుస్తూ వుంటే చూడలేను. తపస్సు చేసుకుంటాను. దయతో అనుజ్ఞ దయచెయ్యి' అంది. సాష్టాంగ పడింది. 'అదెలా జరుగుతుంది?' నవ్వుతూ అన్నాడు బ్రహ్మ — 'ప్రాణుల్ని చంపడమే నీపని. అది చెయ్యకపోడమే నీకు అధర్మం' అంటూ నిర్బంధించాడు. మాట్లాడకుండా ధేనుకాశ్రమం వెళ్ళిపోయిందామె. ఎంతోకాలం అక్కడ ఘోరమైన తపస్సుచేసింది. కౌశికా, గంగ, నందానదులకి వెళ్ళి, గాలిమాత్రం ఆహారం చేసుకుని నిష్ఠ

రమైన వ్రతాలుచేసింది. హిమాలయం చివరి శిఖరంమీదికి వెళ్ళి సంయమనం పూని కూచుంది.

'అక్కడే ప్రత్యక్షమయాడు బ్రహ్మ 'కుమారీ! ఇలా తపస్సులో కూచుంటే ఏమిటి ప్రయోజనం? ఇదంతా వొదిలిపెట్టు' అన్నాడు.

'నిన్ను శరణు వేడుతున్నాను. నన్ను దయచూడు' అంది మృత్యువు.

'నామాట అబద్ధం కాదు. ప్రజల్ని చంపడమే నీధర్మం అన్ని విధాలా నువ్వు చేసి తీరవలసిందే' ఇది. నామాట కాదనకూడదు అన్నాడు బ్రహ్మ — 'ఇంకో విశేషం చెపుతాను విను. నీకన్నీళ్ళు నేను దోసిటిలో పట్టాను కదూ? అవి రకరకాల వ్యాధులై మనుషుల్ని బాధపెడతాయి. కామక్రోధాలు వాటికి తోడుపడతాయి. వాటితో వాళ్ళు చస్తారు. నువ్వు నిమిత్తమాత్రం. నీకు వరమిస్తాను. మగాణ్ణి చంపినపుడు మగాడివి కా. ఆడదాన్ని చంపినప్పుడు ఆడదానివి కా. నపుంసకుణ్ణి చంపినప్పుడు నపుంసకుడివి కా. నిన్ను పాపం అంటదు. ఇది ధర్మమే అవుతుంది నీకు' అన్నాడు.

ఇక వొప్పుకోకపోతే శాపంపెడతాడని భయపడింది మృత్యువు. బ్రహ్మచెప్పింది న్యాయమే అని భావించింది. ప్రజల్ని చంపే అధికారం పుచ్చుకుంది.

ధర్మరాజా! అదుగో అలాగ మృత్యువు ప్రాణుల్ని చంపుతుంది. ప్రాణులు దేహాలు వొదిలిపెడతారు. దేవాదిభావాలు పొంది తిరిగి మనుషులై పుడతారు. భీమనాదుడు, భయంకరుడు, ఉద్దాముడు, ఊహించలేని బ్రహ్మాండమైన తేజోమయుడు, జగత్తుకి ప్రాణం గాలి దేవుడు. శరీరం బతికించడానికీ, చెరచడానికీ అతడే ప్రభువు. పోవడమూ, రావడమూ అతడికి వింత కాదు.

ధర్మరాజు వెనకకూడ ఇది విన్నాను.♦ అప్పుడు దుఃఖంతో వున్నాను. అంచేత ఆ వినడం పూరికేపోయింది. ఇవాళ దీని అర్థం అవగతమైంది.

ధర్మమంటే సజ్జనులు భయపడతారు. అంత గొప్పదా అది?

భీష్ముడు— వేదాలమీద భక్తీ, దృఢమైన స్మృతీ, సదాచారమూ— ఇవి ధర్మరూపాలు. అరంకూడా దాని నాలుగో స్వరూపమే అంటారుకొందరు. అయినా న్యాయం తప్పీ, లొంకీ ధనం కూడబెట్టడం మహాపాపం. లొంకకండా వుండడమూ, పరాయిధనం ఆసపడకండా వుండడమూ, ధర్మాల్లో గొప్పధర్మాలు. శాస్త్రసమ్మతంకాని ధర్మం చవిటినేల నాటిన విత్తనంలా వృథా. ఆలోచించి చేసిన ధర్మం ఇహాపర సాధనం.

ధర్మవిధానం ఎంతో సూక్ష్మమైంది. ధర్మాలు ఎన్నోవిధాలు. అంచేత ధర్మాల స్వరూపమూ, స్వభావమూ నిగ్గుతేల్చి వివరిస్తాను.

ఇతరులు ఏంచేస్తే తన మనస్సుకి బాధకలుగుతుందో అది తాను ఇతర్లపట్ల చెయ్యకండా వుండడమే, ధర్మాలన్నిటిలోకీ ఉత్తమమార్గం.

ధర్మరాజు—ధర్మస్వరూపం ఇంతగొప్పదా? సంతోషంగావుంది. నమస్కరిస్తున్నాను. గుచ్చిగుచ్చి అడుగుతున్నాను. ఆగ్రహించకు. మన్నించు. అవసరంలేంది అడగను. తెలుసుకోడానికే అవసరమైంది అడుగుతాను. బాగా అవగతం చేసుకుందికి అడిగిందే అడగడంకూడా జరుగుతుంది. దయతో ఆదరించు. సదాచారం ధర్మస్వరూపమన్నావు. ఉత్తమసదాచారం కూడా సెలవియ్యి.

భీష్ముడు— ఆచారాలు ఎన్నోవిధాలని చెపుతాయి వేదాలు

♦ చూ. భీష్మపర్వం. ఆశ్వాసం 2

మహాత్ములు ఆచరించిందే ఉత్తమమైన ఆచారం. అంతకంటే వేరే సదాచారం లేదు.

## జాజలీ – తులాధారుడూ

వెనక జాజలిమునికీ, తులాధారుడు అనే వర్తకుడికీ ఈవిషయంలో సంవాదం జరిగింది. చెపుతాను, విను. జాజలి నిశ్చలంగా తపస్సులో కూచున్నాడు. అతడి తలమీద రెండు పిచ్చికలు గూడు కట్టాయి. గుడ్లు పెట్టాయి. గుడ్లు పిల్లలయాయి. రెక్కలు వచ్చి, తిండికి ఎగిరివెళ్ళి వస్తూవుండేవవి. పిచ్చికదంపతులూ, పిల్లలూ తలమీద గూటిలో వుంటూవుంటే, దయతో చూసేవాడు జాజలి. వాటిని తరిమేవాడు కాడు.

అయితే 'నాలాంటి ధర్మపరుడు ఎక్కడా లేడు' అనుకున్నాడు జాజలి. 'ఇలా అనుకుంటాడేమిా ఈముని! మహాధర్మపరుడు తులాధారుడున్నాడు' అంది ఆకాశవాణి. భయపడ్డాడు జాజలి. 'తులాధారుడు ఎక్కడున్నాడు?' అన్నాడు. 'వారాణాసిలో వున్నాడు' అంది ఆకాశవాణి. మచ్చరంతో వారణాసి వెళ్ళాడు జాజలి. వర్తకంలో వూపిరాడకండా వున్నాడు తులాధారుడు. చూశాడు జాజలి. ఉచితరీతిని అతణ్ణి సత్కరించాడు తులాధారుడు.

'పిచ్చికలు తలమీద గూడు పెట్టాయా? అవీ, వాటి పిల్లలూ తలమీద సుఖంగా బతుకుతున్నాయా? మనస్సులో వికారంలేకండా ఎలా తపస్సు చేస్తున్నావు మహాత్మా! నిజంగా మెచ్చుకోదగినవాడివి నువ్వు' అన్నాడతడు.

'ఎలా తెలుసుకున్నాడితడు?' అంటూ నివ్వెరపోయాడు జాజలి. 'వర్తకంలో మునిగివున్నావు నువ్వు. ధర్మంలో ఇంతమహిమ ఎలా గడించావు?' అని అడిగాడు.

'ఏముంది? కొనడంలోనూ, అమ్మడంలోనూ మోసం చెయ్యను. తగినంత లాభమే తీసుకుంటాను. లాభనష్టాలు వొకలాగే చూసుకుంటాను. మట్టిపెళ్ళా, బంగారంముక్కా వొకటే నాకు. నిందా స్తుతీ వొకటే. హింసా, ఆత్మప్రశంసా మనస్సులో లేవు. ప్రాణులన్నిటినీ దయతో చూస్తాను. అభయదక్షిణతో సత్యయజ్ఞం చేస్తాను. భోగమూ, కీర్తి కోరను. ఎవరికైనా మేలుచేసి, 'ఇంత చేశానుకదా' అని అనుకోను. దేనిమీదా మమత పెట్టుకోను. ఒల్లడమూ, వొల్లకపోడమూ రెండూ లేవు నాకు. లోకమంతటిని చిత్రంగా చూస్తాను. అంచేతే తామరాకుమీద నీటిబొట్టులాగ మనస్సు దేనిమీదా అంటి పెట్టకండా వుంటుంది' అన్నాడు తులాధారుడు.

'తపస్సూ, యజ్ఞమూ ధర్మమని అనడమేలేదే నువ్వు? ఈకర్మలు ధర్మమని వేదాలు చెప్పలేదా?' అని అడుగాడు జాజలి.

'అహంకారంతోనూ, కోరికతోనూ చేసిన తపస్సూ, ఫలం కోరి చేసిన యజ్ఞమూ దేవతలు మెచ్చరు. వాటివల్ల పదేపదే చావు పుట్టుకలు తప్పవు. అంచేత అవి చెడ్డే కాని మేలు కాదు. ఎప్పుడూ తృప్తిగావుండి, సత్యయజ్ఞం చేసే వాణ్ణి చూసి దేవతలు తృప్తిపడతారు. దేవతలు తృప్తిపడతే బ్రహ్మానందం కలుగుతుంది' అన్నాడు తులాధారుడు.

'అయితే నువ్వు కర్మ మానలేదేమీ?' అడిగాడు జాజలి.

'ధర్మంతప్పకండా, సంసారంమీద మోహం లేకండా కర్మలు చేసే పుణ్యాత్ముడు కర్మలు చెయ్యనట్టే సిద్ధిపొందుతాడు. బురదలేని పవిత్రమైన ఆత్మతీర్థం తెలుకున్న వాడికి ప్రతీపర్వతమూ పుణ్యపర్వతమే. ప్రతీనదీ పుణ్యనదే. ఏదో కారణంవల్ల ఆరంభించిందైనా కర్మ ప్రారబ్ధకర్మలాగే ఉత్తమగతికి కారణమవుతుంది. విన్నావా? నేను చెప్పిన ఈసిశిసరైందా? కాదో మంచివాళ్ళదగ్గిర అడిగినందేహం

తీర్చుకుందామంటావా ? అపని మనమే చేసుకోవచ్చు. నువ్వు తండ్రిలా పెంచిన పిచ్చికలు మచ్చికపడి నీతలమీదుగా ఆకాశం మీద ఎగురుతున్నాయి. వాటిని పిలు. చేతులమీద పెట్టుకుని బుజ్జగించు' అన్నాడు తులాధారుడు.

జాజలి పిచ్చికల్ని పిలిచాడు. ఆకాశంమీంచే ఇలా అన్నాయవి.

'మునీంద్రా ! ధర్మదేవత పంపితే నిన్ను పరీక్షించడానికివచ్చిన భటులం మేము. చెపుతాం విను. ఈసూ, కలతా, విరోధమూ మచ్చరం కల మనస్సులో పుడతాయి. దీనివల్ల హింస పుడుతుంది. మచ్చరం మానుకుంటేనే మునులు సుఖపడతారు. స్పర్థవల్ల ధర్మం నాశనమవుతుంది. ధర్మనాశనంవల్ల మనిషి బుద్ధికూడా నాశనమవుతుంది. శ్రద్ధపూనాలి. స్పర్థ విడిచిపెట్టాలి.

'శ్రద్ధ సూర్యుడిబిడ్డ; సాత్విక; జ్ఞానదాత్రి; మనశ్శుద్ధిస్వరూప. అందుకనే జ్ఞానవంతుడు శ్రద్ధ ఆత్మతో సమానంగా భావిస్తాడు. శ్రద్ధ లేని తపస్సూ, యజ్ఞమూ దేవతలు మెచ్చరు. అది వుంటేమాత్రం మెచ్చుకుంటారు. అంచేత శ్రద్ధ గొప్పది. మాటా, మనస్సూ కాపాడుతుంది శ్రద్ధ. జీవాత్మ ప్రసన్నత్వమే శ్రద్ధ.

## బ్రహ్మగీతలు

'బ్రహ్మగీతలు విను. యజ్ఞాల్లో శ్రద్ధవుండినా త్రికరణశుద్ధి లేనివాడూ, శుద్ధివుండినా శ్రద్ధలేనివాడూ వొకటే అని నిర్ణయించారు దేవతలు. శ్రద్ధ పవిత్రమైందని చాటిచెప్పాడు బ్రహ్మ. శ్రద్ధకలవాడు గౌరవశ్రేష్ఠుడనీ, అతడిఅన్నం భుజించదగిందనీ దేవతలతో చెప్పాడు. వడ్డీ వ్యాపారంతో బతుకుతూ దానంచేసినవాడూ, దానంచెయ్యని వేదపండితుడూ వొకటే అన్నారు దేవతలు. 'అయితే ఆఇద్దరిలో

దానంచేసినవాడు యజ్ఞంకూడా చేస్తే అధికు డవుతాడు' అన్నాడు బ్రహ్మ. శ్రద్ధలేనివాడికి దానగుణంలేదు. బ్రహ్మనిశ్చయంఇది. కనక శ్రద్ధకలవాడివి కావాలి నువ్వు. పాము పొరవొదిలినట్టు శ్రద్ధకలవాడు పాపాలువొదిలేస్తాడు. కనక శ్రద్ధఅలవరుచుకోడంమంచిది. శ్రద్ధవుంటే మనసులో మచరమూ, మాలిన్యమూ వుండవు.'

పిచ్చుకల మాటలు విని తేరుకున్నాడు జాజలి. 'మునులదగ్గిర తత్వంవినకపోవడంవల్ల ఇలా అయిందినాకు. ఇప్పుడు తెలుసుకున్నాను. శాంతి అలవరచుకుంటాను!' అంటూ తులాధారుణ్ణి మెచ్చుకున్నాడు.

'ఏకర్మఅయినా శ్రద్ధగా చెయ్యడమే మంచిది. నివృత్తిపొంది, దానిమీద శ్రద్ధవుంటే నేర్పుసంపాదించాలి' అన్నాడు తులాధారుడు.

'అవును' అంటూ వెళ్లిపోయాడు జాజలి. ఇహాపరసుఖాలు రెండూ అనుభవించి సుఖపడ్డాడు తులాధారుడు. అతడు చెప్పిన ధర్మ పద్ధతి మనస్సుకి పట్టించుకో. పాపాలు వొదిలించుకో.

ధర్మరాజు – ఏపనైనా ఆలోచించి, ఆలస్యంగా చెయ్యడం మంచిదా ! త్వరపడి చప్పున చేసెయ్యడం మంచిదా !

భీష్ముడు-త్వరపడి, ఎప్పుడూఏపనీ చెయ్యకూడదు. ఆలోచించి, మెల్లిగా చెయ్యాలి అలా అయితే ఏచెడ్డా రాదు. పైగా ఫలంకూడా సిద్ధిస్తుంది. ఓర్పులేనివాళ్ళు ఆలోచించి పనిచేసేవాళ్ళని సోమరిపోతు లంటారు. అది బుద్ధిలేనిమాట. మేధాతిథి మునికొడుకు చిరకారి అని వొకడు వుండేవాడు. అతడి కథవింటే నీప్రశ్నకి సధానం దొరు కుతుంది.

## చిరకారి కథ

ఏపనిచేసినా అతడు చిరకాలం ఆలోచించి చేసేవాడు. అందు కనే అతడిపేరు చిరకారి.

మేధాతిథికి ఏదో కారణంవల్ల తనభార్యమీద కోపంవచ్చింది. ఆమెని చంపెయ్యమని చిరకారితో చెప్పి ఎటో వెళ్ళిపోయాడతడు. ఏది చేసినా ఎంతోసేపు విచారించిచేస్తాడు కనక ఆలోచన మొదలెట్టాడు చిరకారి.

'తండ్రిచెప్పినపని చెయ్యకుండా వుండకూడదు. అలాఅని తల్లిని చంపకూడదు. తండ్రిమాట జవదాటడం పాపమంటారు పెద్దలు. ఏమైనా తల్లిని రక్షించడం కర్తవ్యం. ఏందారి ? పుత్రభావంలో స్వాతంత్ర్యం లేదు. పాపం ఎలా తప్పించుకోడం ? తల్లిని చంపితే నరకం తప్పదు. అలా అని తండ్రిని అవమానపరిస్తేమాత్రం నరకం తప్పుతుందా ?

'తల్లి క్షేత్రం. వంశాభివృద్ధికోసం క్షేత్రంలో బీజంవేస్తాడు తండ్రి. తల్లిదండ్రుల ఇద్దరిసంగతీ ఇది. ఇద్దరికీ కావలసినవాణ్ణే నేను. అమ్మనా, నాన్ననా, ఎవళ్ళని వొదిలిపెట్టేది ?

'తండ్రే నేనై పుట్టాను. తండ్రిచెప్పినట్టుచేస్తే కొడుకుపాపాలు పోతాయని విన్నాను. అప్పుడూ-మరో ఆలోచన ఎందుకూ? తండ్రే తపస్సు తండ్రే ధర్మం. తండ్రేవిద్య. తండ్రే పరమదైవం. అంచేత తండ్రి సంతోషించిన పని చేస్తే దేవతలు సంతోషిస్తారు.

'అగ్నిహోత్రానికి అరణిలాగ, నేనుపుట్టడానికి తల్లిసాధనం. కొడుకుకోసం దుర్భరమైన గర్భవేదన అనుభవిస్తుంది తల్లి. తన శరీరంమీద చింతవొదిలేస్తుంది. ఎన్నోపాట్లు పడుతుంది. వచ్చీ పోతూ చూస్తాడే కాని అమ్మలాగ కొడుకుకోసం కష్టాలుపడడు నాన్న. అమ్మ అన్నిటికంటే గౌరవనీయురాలు అని చాటుతున్నాయి ధర్మశాస్త్రాలు. కొడుపసికందైనా, వయసులోవున్నా, ముసిలాడైనా అమ్మప్రేమ వొక్కలాగే వుంటుంది. అమ్మప్రేమే జగత్తంతటికీ కారణం. క్షుద్రజంతువులు మొదలుకుని దేవతలదాకా వొకేలాటిది

తల్లి. మంచివస్తువుదగ్గిరతప్పు, మరోదగ్గిర పూరట ఎలాకలుగుతుంది ? అమ్మపోయిందంటే అంతా పోయిందన్నమాట. అమ్మతోనే శక్తి పోతుంది. దుఃఖం ముంచుకువస్తుంది. లోకమంతా పాడిల్లులా తయారవుతుంది. ధనవంతుడనీ, దరిద్రుడనీ, బలవంతుడనీ, బలంలేనివాడనీ, మూఢుడనీ, బుద్ధిమంతుడనీ భేదంలేదు. అమ్మంటూ బ్రతికివుంటే అందరినీ సుఖపెడుతుంది. ఇలాటి అమ్మని చంపడమంటే పాపసముద్రంలో మునిగిపోడమన్నమాట. సొమ్ములు కాసుకున్నవాడికైనా తెలుస్తుందది. అమ్మని చంపడానికి కటికివాడికైనా చేతులెలా వస్తాయి ?'

ఇలా ఎన్నెన్నివిధాలో ఆలోచించాడతడు. అసలే చిరకారి. కనక త్వరపడి ఏదీ చెయ్యకండా ఎంతోసేపు విచారిస్తూ అలాగే కూచున్నాడు.

ఇంతలో 'చిన్నతప్పుకి భార్యని చంపెయ్యమని కొడుకుతో చెప్పివచ్చాను. ఎంతక్రూరుణ్ణి ! కొడుకుచంపేశాడేమో ?' అని కంట తడి పెట్టుకుంటూ విచారిస్తూ ఇంటికి బైలుదేరాడు మేధాతిథి.

'చిరకారి కొడుకు. పేరుకి తగినట్టు తొందరపడడు. ఆలస్యం చేస్తాడు. నాకు దుఃఖం కలిగించడు. బుద్ధిమంతుడు. అందులో ఇలాటి పనికి అసలే తొందరపడడు' దారికడాకూ ఇలా అనుకుంటూ కొడుకుని తలచుకుంటూ నడిచాడతడు.

'నాయనా చిరకారీ ! చిరకాలం మీఅమ్మ గర్భంలోవున్నావోయి నువ్వు. నిన్నుప్రాణంలా పెంచిందోయిమీఅమ్మ. ఈమాత్రం ఆలోచించి, మీఅమ్మని చంపకండా వున్నావా, నీ చిరకారిపేరు చిరకాలం వుండిపోతుందోయి ! నాకూ, నాతపస్సుకీ నిందరాకండా తల్లినిచంపిన పాపం నిన్ను చుట్టుకోకండా వూరుకున్నావా, సర్వ

భూతాలూ నిన్ను మెచ్చుకుంటాయి' అంటూ గబగబా ఇంటికి వచ్చాడు.

తండ్రిని చూశాడు చిరకారి. తల్లిని చంపడానికి పట్టుకున్న ఆయుధం కిందపడేశాడు తండ్రికి ఎదురువెళ్ళి పాదాభివందనంచేశాడు. ఇంతలో లోపలినించి మేధాతిథి భార్య వచ్చింది. భర్తపాదాల మీదవాలింది. భార్యనీ, కొడుకునీ లేవనెత్తాడు మేధాతిథి. అతడి దుఃఖబాష్పాలు ఆనందబాష్పాలై ప్రవహించాయి. కొడుకుని గట్టిగా కౌగిలించుకున్నాడు. శిరస్సు ముద్దాడాడు. మెచ్చుకున్నాడు.

ముగ్గురూ సుఖంగాంకూచున్నాక, 'ఏపనైనా ధైర్యంతో ఎంతోసేపు ఆలోచించే చెయ్యాలి. మనిషిచేసిన పనిబట్టే 'వీడుగొప్ప వాడూ, వీడు తక్కువవాడూ' అని నిర్ణయిస్తారు పెద్దలు. సావ కాశంగా ఆలోచించినవాడే సజ్జనుడు. అతడే మిత్రత్వమూ, శత్రు త్వమూ తెలుసుకుంటాడు. పాత్రతా, అపాత్రతా గ్రహిస్తాడు. శుభాలుఅనుభవిస్తాడు' అన్నాడు మేధాతిథి చిరకారి చిరకారిత్వం సఫలమై పేరుపడింది.

కనక ఏపనైనా ఆలోచించి చెయ్యాలి. తొందర పడకూడదు. ఆలోచించి సావధానంగా చేసినపని సఫల మవుతుంది. తొందరపడి పనిచేసినవాడు తరవాత పశ్చాత్తాప పడతాడు.

## ప్రజల్ని ఎలా శిక్షించాలి?

ధర్మరాజు— ప్రజల్ని ఎలా శిక్షించాలి?

భీష్ముడు—పూర్వం ద్యుమత్సేనుడు తనకొడుకు సత్యవంతుడితో చెప్పిన మాటలు వింటే నీకు సమాధానం దొరుకుతుంది. తండ్రీ కొడుకులు ప్రజాశిక్షణ విధానమే మాట్లాడుకుంటూ 'చంపడం ధర్మమే అంటారు పండితులు' అన్నాడు ద్యుమత్సేనుడు. 'హింసే

ధర్మమైతే మరి చెయ్యరాని పనంటూ ఏముంటుంది?' అన్నాడు సత్యవంతుడు. 'దొంగలూ, దుర్మార్గులూ చావకపోతే లోకం బతుకుతుందా?' అన్నాడు ద్యుమత్సేనుడు. 'వాళ్ళని చంపడం కంటే మరో శిక్ష వెయ్యడం మంచిదికాదా ?' అని అడిగాడు సత్యవంతుడు. 'అలా కాదు. తప్పుకి తగినట్టు వుండాలి శిక్ష. కళ్ళతో దండించడమూ, నోటితో దండించడమూ, జరిమానా వెయ్యడమూ, దెబ్బలు కొట్టడమూ, మరణదండన విధించడమూ-ఇలా తప్పుల హెచ్చుతక్కువలనిబట్టి శిక్షలు వెయ్యాలి. చంపదగిన తప్పుచేస్తే చంపితీరాలి. ఆప్తుడనీ, బంధువనీ, అన్నదమ్ముడనీ, కొడుకనీ దుష్టుడిమీద మన్నన వుండడం పాపం రాజుకి. తాను ముందు వినయవంతుడు కావాలి రాజు. మంత్రుల్నీ, కుమాళ్ళనీ, భృత్యుల్నీ వినయవంతుల్ని చేసి ప్రజల్ని రక్షించాలి. అలాటిరాజు ఇహపరాలు రెండూ సాధిస్తాడు. కామక్రోధాలూ, వైషమ్యాలూ లేకండా, దోషం తెలుసుకుని తగిన శిక్ష విధించగడం ధర్మం. దుష్టులు హాని చేస్తూవుంటే వూరుకోడమూ, చంపుతూవుంటే దండించకపోడమూ పాపం. అహింసావ్రతానికి భంగకరం. ప్రజలకి ఆపదరాకండా రక్షించడమే రాజైనవాడికి అహింసావ్రతం' అన్నాడు ద్యుమత్సేనుడు.

## కపిలగోసంవాదం

ధర్మరాజు-గృహస్థధర్మమూ, సన్యాసధర్మమూ, ఏది ముఖ్యం?

భీష్ముడు-రెండూ గొప్పధర్మాలే కపిల గోసంవాదమని దీనికి ఒక ఇతిహాస ముంది. విను.

నహుషుడు మెచ్చుకునే ఒక ఆవు వుండేది. ఎంతో అందమైందది. భయమంటే ఎరగదు. కపిలుడని ఒక మునీశ్వరుడు దాన్ని చూసి'నువ్వు వేదస్వరూపం కదా!' అన్నాడు. ఆమాట పక్కనున్న

స్యూమరస్మి అనే ముని విన్నాడు. వేదాలమీద ఆదరం లేకపోడం చేత కపిలముని అలా అన్నాడని భావించాడతడు. సూక్ష్మరూపంతో ఆవులో ప్రవేశించాడు.

'వేదాలు పొట్టిడాబులని అంటారు యతులు. అవి అంతమందీ గౌరవిస్తున్నారు. నీకు వాటిమీద గౌరవం వుందో లేదో ?' అంటూ ఆవులోంచి అడిగాడు.

'వేదాలమీద నాకు ఆదరమూ లేదూ, అనాదరమూ లేదు. ఎందుకిలా అడిగావు ? ఇంత తెలివితక్కువ వుంటుందా ? అయినా నాకు తెలిసినంత చెపుతాను. బ్రహ్మచర్యాశ్రమమూ, గృహస్థాశ్రమమూ, వానప్రస్థ, సన్యాసాశ్రమాలూ దేవతలు నడిచేవే. సంసారులుకూడా అలా నడుచుకోవాలి. వాళ్ళకి వేదాల్లో చెప్పిన ఆచారాలు అవసరం. అయితే పొక్కటి, జీవహింస చెయ్యడం మంచిదా, చెడ్డదా ?' అని అడిగాడు కపిలుడు.

'పశువులూ, ధాన్యాలూ యజ్ఞాలకోసమే పుట్టించాడు బ్రహ్మ. తానూ యజ్ఞాలు చేశాడా లేదా ? మూఢుడూ, ప్రాజ్ఞుడూ ఇద్దరూ సుఖమే కోరుతారు. యజ్ఞాలు చెయ్యకపోతే స్వర్గం దొరుకుతుందా చెప్పు ? గృహస్థధర్మంలో ఉత్తమ కార్యం యజ్ఞం. యజ్ఞం పాపాలు పోగొడుతుంది. దేవతలుకూడా మన్నిస్తారు యజ్ఞం. అలాంటి యజ్ఞం హింస అనుకోవచ్చా ?' అన్నాడు ఆవులోంచి స్యూమరశ్మి.

'ఆత్మసుఖం అనుభవించినవాడు ఇతరసుఖాలు మెచ్చడు. శోకమూ, కామమూ, సంసారసాంగత్యమూ వొదిలేస్తాడు. అతడికి ఇవన్నీ వృథా. మదం కలిగించే ఈలోకమే వొల్లడతడు. గృహస్థధర్మం అసలే అక్కరలేదతడికి. సనాతనమైన మోక్షమే అతడి లక్ష్యం' అన్నాడు కపిలముని.

‘బిడ్డలు తల్లిని చేరినట్టు తక్కిన ఆశ్రమాలవాళ్ళందరూ గృహస్థునే ఆశ్రయించి బతుకుతారు. ఏమంటే, ధాన్యాలూ మొదలైన వాటన్నిటికి గృహస్థే అధికారి. వేదసారం తెలిసినవాడివి నువ్వు. గృహస్థధర్మంలో మోక్షం లభించదని ఎవడు ఎక్కడ చెప్పాడో చెప్పూ ? అన్ని ఆశ్రమాలకీ గృహస్థాశ్రమమే ఆధారం. సోమరిపోతులు దరిద్రులై పనిచెయ్యడం మానేస్తారు. అలా మానెయ్యడం క్రమంతప్పడమే. దానివల్ల మోక్షం రాదు. వేదాలు వొదిలిపెడితే నరకంతప్పదు. గర్భాదానం మొదలుకుని వేదమంత్రాలన్నీ సర్వసంపదలూ కలిగిస్తాయి. సందేహంలేదు. అలాటప్పుడు వేదాలు వొల్లకపోడం తగునా ?’ అన్నాడు ఆవులోంచి స్యూమరశ్మి.

‘వేదాలు ఆచారాలు వివరిస్తాయి. అమృతంతాగి తృప్తిపడినట్టు ఆచారాలతో తృప్తిపడతారు బ్రాహ్మలు. అది అలా వుండనీ. చెయ్యీ, ఉపస్థా, కడుపూ, నోరూ ఇవి దేవతలకికూడా మూయరాని వాకిళ్ళు. పండితుడుమాత్రం ఆత్మపురుషుణ్ణిరక్షించుకుందుకి ఇవితిరంగా ముయ్యగలుగుతాడు. ఎదట బంగారంకుప్పపోసినా ముట్టుకోనివాడు, కోపం వచ్చినా కొట్టనివాడు, తిట్టనివాడు చెయ్యి అనే వాకిలి దిట్టంగా మూసుకుంటాడు. ఎలాటిఆడదాన్నయినాసరే, సంగమానికి కోరనివాడు, తనలోనేభార్యవున్నట్టు భావించేవాడు వ్రతంతో ఉపస్థ అనే వాకిలి మూసుకుంటాడు. జీవయాత్రకోసమే అన్నం తినేవాడు, నిండుగా ఎన్నడూ తిననివాడు, అపేక్షతోఎప్పుడూ కావాలననివాడు కడుపువాకిలి మూసుకున్నట్టేకదా ? అబద్ధమాడనివాడు, కలుపుగోరుగా మాటాడేవాడు, ఒక తిట్టన్నా తిట్టనివాడు, వాదించని బుద్ధిమంతుడు నోటి వాకిలి మూసుకుంటాడు.

‘ఇలా నాలుగువాకిళ్ళూ ముయ్యగలవాడే బ్రాహ్మడు. అల్లా

టివాడికి తపస్సెందుకు ? యజ్ఞాలెందుకు ? దానాలెందుకు ? వ్రతాలు చెయ్యడమూ వేదాలకి దాసులు కావడమూ ఇదంతా బాదరబందీ.

'బ్రహ్మజ్ఞానం కలవాడు ద్వంద్వాలు లేకండా వుంటాడు. గొప్పతనానికి మిడిసిపడడు. ప్రకృతి వికారాలు కనిపెడుతూ వుంటాడు. ఈ సదాచారం చెయ్యలేనివాడే ఫలంకోరి కర్మల వెంట పరిగెడతాడు' అన్నాడు కపిలముని.

దాంతో ఆవులోంచి బైటికి వచ్చాడు స్యూమరశ్మి. తనపేరు చెప్పుకుని 'మహాత్మా, ధర్మనిర్ణయం తెలుసుకోడంకోసం ఆవులోంచి మాట్లాడాను కాని మరేమీ కాదు. నిన్ను ఆశ్రయించాను. వేదాలు ఆశ్రయించి కర్మ చెయ్యడమూ, చెయ్యకండా వొదిలెయ్యడమూ రెండూ వున్నాయి. ఇందులో ఏది ముఖ్యమో సెలవియ్యి. ధర్మసూక్ష్మాలు తెలిసినవాడివి నువ్వు. నేను నీ శుశ్రూషచేసేవాణ్ణి. అనుశాసించు' అని ప్రార్థించాడు.

సంతోషించాడు కపిలముని. 'జ్ఞానం ఆశ్రయించినవాడికి ఏకీడూ కలగదు' అంటూ అందుకున్నాడు. 'జ్ఞానంలేనివాడు కామానికి లోబడి, కర్మలవెంట ముప్పుతిప్పలు పడతాడు. అహంకారమూ, క్రోధమూ, తృష్ణా లేనివాడికి శుభమూ, అశుభమూ అన్న భేదముండదు. త్యాగంతో అన్నీ వొకలాగే చూస్తాడు జ్ఞాని. మీరందరూ జ్ఞానంకలవాళ్ళే. కాని అన్నిప్రాణుల్నీ వొక్కలాగేచూసేవాడు మాత్రం ఎక్కడో వొక్కడు వుంటాడు. అదుగో అతడే కర్మలు వొదిలిపెడతాడు' అన్నాడు.

'వేదశాస్త్రాలు వొదిలి పెట్టడం తప్పుదారి తొక్కడమనీ, దానివల్ల మోక్షం రాదనీ విన్నాను. అంచేత వేదాలు వొదిలి పెట్టడం పాప మనుకుంటున్నాను. నాసందేహం తీర్చు' అన్నాడు స్యూమరశ్మి.

‘వేదాలు వొదిలిపెట్టమని ఎవరన్నారు?’ మళ్ళీ ఎత్తుకున్నాడు కపిలుడు- ‘వేదాలే లోకాలకి ప్రమాణం కదా! శబ్దబ్రహ్మం అనీ, పరబ్రహ్మం అనీ రెండు. శబ్దబ్రహ్మం సేవించినవాడు పరబ్రహ్మం చేరుకుంటాడు. శమమూ, దమమూ కలిగిన జ్ఞానవంతుడైన గృహస్థు ధర్మం తెలుసుకుని, వేదాలు చెప్పినట్టు నడచుకుంటాడు. అసూయ పెట్టుకోడు. అహంకారం విడిచిపెట్టి, భూతదయ కలిగిన పుణ్యాత్ముడు దృఢమైన ఆత్మనిష్ఠతో వుంటాడు. విధి నిర్వహిస్తాడు. ప్రాయశ్చిత్తం కోరడు. శాంతులైన బ్రాహ్మలూ, రాజులూ గృహస్థులుగా వుండే వ్రతాలూ అవీ చేస్తారు. ముక్తి పొందుతారు. ధర్మం వొక్కటే. నాలుగాశ్రమాలూ దానికి నాలుగు పాదాలు. ఎందులో నడుచుకుంటే ఏముంది? అన్ని కర్మల స్వరూపమూ వొక్కటే కదా! సంతోషమే అమృతం. దాంతో సుఖంగా వున్నవాడు ఇంట్లో వున్నా వొకటే అడివిలో వున్నా వొకటే. ఎక్కడున్నా హాయిగా వుంటాడతడు.

‘కోరికలు నశించిన మహాజనులు సన్యాసాశ్రమంలో ప్రవేశిస్తారు. ఉపనిషత్తులు చెప్పిన విధానం అది. అవైదికం అనవచ్చా అది? ధర్మానికి జ్ఞానం పాదు. సంతోషం వేళ్ళు. త్యాగం రూపం. ఆనందం ఆధారం. ఈమాటే వేదాలూ చెపుతున్నాయి. నాలుగాశ్రమాలూ చెయ్యకూడదంటూ లేదు. శుచులై ఏ ఆశ్రమంలో వున్నా సంసార సముద్రం దాటగలుగుతారు పండితులు. శాంతుడు పొందే గతే సద్గతి అంటారు వేదాంతులు. నిజం కూడా అంతే. వేదాల తాత్పర్యం తెలుసుకున్నవాళ్ళే వేదా లెరిగినవాళ్ళు. తాత్పర్యం ఎరగనివాళ్ళు వొట్టి వేదధారులు మాత్రమే. అన్నీ వేదాల్లోనే వున్నాయి.

‘మోక్షంకోరేవాడికి త్యాగం వొక గమ్యస్థానం. దానిమీది మెట్టు శమం. అంతకంటే మీదిమెట్టు ఆనందం.

'తెలుసుకోదగినదీ, తెలిసిందీ, సత్యమైనదీ, స్థావరజంగమాలు ధరించిందీ, అన్నిటిలోనూ వున్నదీ, - శుభమూ, అవ్యక్తమూ, బ్రహ్మమూ, శివమూ, ప్రభవమూ, అవ్యయమూ, శాంతీ, తేజమూ, క్షమా, ధ్రువమూ, అనామయమూ అన్న పేర్లతో ప్రసిద్ధిచెంది. సూక్ష్మ బుద్ధికిమాత్రం అ నగతమయే ఆపగతత్వానికి నమస్కారం. వేదాల తాత్పర్యమెరిగిన బ్రహ్మజ్ఞానులకి జోహారు' అన్నాడు.

విని సంతోషించాడు స్యూమరశ్మి. ధర్మరాజా! ఈ ఇతిహాస తాత్పర్యం మనస్సుకి పట్టించుకో.

## కుండధారుడి కథ

ధర్మరాజు — ధర్మార్థకామాలు మూడూ వేదాలు వివరిస్తున్నాయి. అయితే వీటిలో దేనివల్ల హెచ్చు లాభం?

భీష్ముడు — దేవానుచరుడు కుండధారుడు తన భక్తుడికి ఉపకారంచేసిన కథ నువ్వు అడిగినప్రశ్నకి సమాధాన మవుతుంది.

ఒక బ్రాహ్మణుడు యజ్ఞంకోసం ధనం కావలసివచ్చి తపస్సు మొదలెట్టాడు. కుండధారుడు అక్కడికి వచ్చి, 'ఏమిటి నీకోరిక? ' అని అడిగాడు. 'ధనం కావాలి' అన్నాడు బ్రాహ్మడు. కుబేరుడి భృత్యుడైన మాణిభద్రుణ్ణి తలుచుకున్నాడు కుండధారుడు. మాణిభద్రుడు ప్రత్యక్షమయాడు. 'ఈ బ్రాహ్మడు నా ఆశ్రితుడు. ఇతడికి పుష్కలంగా ధన మియ్యి' అన్నాడు కుండధారుడు. 'ఎంత ధనం కావలిస్తే అంతా ఇస్తాను' అన్నాడు మాణిభద్రుడు.

'మనిషి బతుకు అస్థిరం కదా' అని ఆలోచించాడు కుండధారుడు—'అయినా ఈ బ్రాహ్మడికి ధనమెందుకూ? తపస్సూ, ధర్మమూ చాలు. తపస్సులోనే సర్వసంపదలూ కలుగుతాయి ' అని నిశ్చ

యించాడు. నెమ్మదిగా ఈ ఆలోచన మాణిభద్రుడితో చెప్పాడు. సంతోషించాడు మాణిభద్రుడు. 'అయితే అలాగే కానీ' అన్నాడు.

బ్రాహ్మడు భక్తితో దేవతల్ని ప్రార్థించాడు. అవాళనించీ అతడిమనస్సు భక్తి పరిపూర్ణమైంది. సంతోషించి కుండధారుడితో అన్నాడతడు – 'మహాత్మా నీదయవల్ల మనస్సు తెలువుకుంది. ఏ ధనమూ అక్కరలేదు నాకు. తపస్సు చేసుకుంటాను అనుజ్ఞ దయచెయ్యి. '

'అలాగే కానీ' అని వెళ్ళిపోయాడు కుండధారుడు. దుంపా దుట్రా, ఆకూ అలమూ తింటూ ఎంతో తపస్సుచేశాడు బ్రాహ్మడు. క్రమంగా ఆకూ అలమూ కూడా మానేశాడు. నీరు గాలీ మాత్రం ఆహారం చేసుకుని ఘోరమైన తపస్సుచేశాడు. దేవత్వం పొందాడు. సిద్ధుడయ్యాడు. 'నన్ను ఎవళ్ళయినా ఆశ్రయిస్తే ధనమిస్తాను. రాజ్య మిస్తాను. వాళ్ళపాపాలు పోగొడతాను' అన్న పూనికా,ఉత్సాహమూ అతడిమనసులో పుట్టాయి. ఇలా మహానుభావుడై కుండధారుణ్ణితలుచు కున్నాడతడు. కుండధారుడు ప్రత్యక్షంకావడంతోనే తన శక్తి వల్ల పుట్టిన గంధాలతోనూ, పువ్వులతోనూ అతణ్ణి పూజించాడు. సాగిలపడి మొక్కాడు. ఎత్తి కౌగిలించుకున్నాడు కుండధారుడు. 'ధర్మార్థకామాలు మూడూ కలిపి చెపుతోంది వేదం. అయినా ధర్మమే పురుషార్థం. అదే ఆశ్రయించదగింది' అంటూ ధర్మాన్ని మెచ్చుకున్నాడు. 'సుకృతం కడముట్టా అనుభవించు. యోగాభ్యాసం చేస్తూ, శిష్టుల సాంగత్యం చెయ్యి' అని వెళ్ళిపోయాడు కుండధారుడు. మునుల పూజలందుకుంటూ, దేవతల మెప్పులందుకుంటూ స్వేచ్ఛగా తిరిగాడు బ్రాహ్మడు.

ధర్మరాజా! మరో ధర్మసూత్రం చెపుతాను. ఒకబ్రాహ్మడు తన భార్యతోకూడా అడివిలో వుండేవాడు. ఉంఛవృత్తితో బతుకుతూ

వుండేవాడు. అతడికి యజ్ఞం చెయ్యాలని బుద్ధిపుట్టింది అహింసా వరుడు కనక పశువుని చంపడం మానేసి పళ్ళూ, దుంపలూ హవిస్సుగా ఉపయోగించా లనుకున్నాడు. అది శాస్త్రసమ్మతం కాదని తెలిసీకూడా, వొద్దంటే శపిస్తాడేమో అని భయపడి అడ్డు చెప్పలేదు భార్య. ఇంద్రుడూ మొదలైన దేవతలు హవిర్భాగాలు పుచ్చుకో దానికి రావడం మానేశారు. అగ్నికూడా అవి పచనం చెయ్యలేదు. అదగ్గిరసా మేస్తున్న వొక లేడి మనిషి భాషలో అతడి భార్యని తిట్టి, బ్రాహ్మడి ఎదటికి వచ్చింది. 'నన్ను చంపి యజ్ఞం చెయ్యి' అంది. 'అలా చెయ్యను పో' మ్మన్నాడు బ్రాహ్మడు. నాలు గడుగులు వెళ్ళిపోయి, తిరిగి వచ్చింది లేడి. 'బ్రాహ్మడా! దివ్యదృష్టి ఇస్తాను. దాంతో చూడు. నేను చెప్పినట్టు యజ్ఞం చేశావా నిన్ను అభినందించడాని కని అరుగో అప్సరస్త్రీలూ, గంధర్వులూ విమానాల మీద వచ్చారు' అంది. దేవత్వం సిద్ధిస్తుంది కదా, అని ఆసపడ్డాడు బ్రాహ్మడు. లేడిని చంపడానికి పూనుకున్నాడు. దాంతో అతడి తపస్సుకి ఉత్పాతం కలిగింది. లేడిరూపంతో వచ్చిన ధర్మదేవత నిజస్వరూపంతో ప్రత్యక్షమయాడు. 'బ్రాహ్మడా! నీయజ్ఞ శ్రద్ధకి సంతోషించాను. ధర్మసూక్ష్మం చెప్పడానికే ఇలా వచ్చాను. యోగ్యమైన హింస అహింసావ్రతానికి భంగం కలిగించదు. యజ్ఞం కదా అని తగని హింసకూడా పనికిరాదు' అని ధర్మరహస్యం నిర్దేశించాడు. అతడి భార్యని వోదార్చాడు. తపశ్శక్తి ప్రసాదించాడు. వరమిచ్చి, యజ్ఞవిధానం పూర్తి చేశాడు. ఈ ఇతిహాసం నాకు నారదుడు చెప్పాడు.

## ముక్తిమార్గం

ధర్మరాజు - మనిషి పాప మెందుకు చేస్తాడు? ధర్మచర్యకి ఏది మూలం? దుఃఖం లేకండా ఎలా వుండడం? మోక్షం ఎలా పొందడం?

భీష్ముడు - గంధమూ, రసమూ మొదలైనవాటిమీద కాంక్ష లోభమూ మోహమూ రేపుతుంది. దానికి మనస్సు లొంగిపోతే ధర్మం లోపిస్తుంది. ధర్మం లోపించడంతోనే పాపం చెయ్యాలని బుద్ధి పుడుతుంది. ప్రజ్ఞవల్ల దాని చెడుగు భావించి, సత్పురుషుల సహవాసం చేసి విషయాలు మళ్ళించుకుంటే ధర్మబుద్ధి రేకెత్తుతుంది. ధర్మాచరణతో తృప్తిపడకండా ద్వంద్వాలు వొదులుకుంటే అపాయం లేని ఉపాయంతో ముక్తి లభిస్తుంది.

ధర్మరాజు — అపాయంలేని ఉపాయంతో ముక్తి లభిస్తుందన్నావు. ఏమిటది?

భీష్ముడు - కుండ చెయ్యాలంటే దానికి వొక సాధనం వుండాలి కదా? తూర్పుసముద్రానికి వెళ్ళేమార్గం పడమటి సముద్రానికి వెళుతుందా? దేనికి కావలిసిన ఉపాయం దానికి కావాలి. అడిగావు, మంచిపని చేశావు. ఓర్పుతో క్రోధమూ, సంకల్పం మానడంతో కామమూ, సత్వగుణంతో గాఢనిద్రా, ధైర్యంతో రాగద్వేషాలూ, జాగ్రత్తతో భయమూ, మంచినడవడితో మోహమూ, మితభోజనంతో రోగాలూ, ప్రాణుల్ని చూడడంతో నిశ్వాసమూ, వైరాగ్యంతో విషయాలూ, సంతృప్తితో లుబ్ధత్వమూ, దయతో అధర్మమూ, ఉచిత కర్మలతో హెచ్చరికతో ధర్మమూ అవతలకి తరిమెయ్యడమే ముక్తిమార్గం. కామమూ, క్రోధమూ మొదలైనవాటిని తొలిగిస్తుందే కాని ఇది ముక్తిని తెచ్చి ఇయ్యదు. కనక అపాయంలేని ఉపాయం అనడం.

## ఆశ

ధర్మరాజు - ఆశవల్ల అన్నదమ్ములూ మొదలైన బంధువుల్ని అంతమ[illegible] చంపవలసివచ్చింది. ఆశ ఎలా వొదిలిపెట్టడం?

భీష్ముడు—మాండవ్యుడితో జనకుడు చెప్పినమాటలు విను. ఆశ ఎలా వొదులుకోడమో తెలుస్తుంది.

జనకుడి దగ్గిరికి వెళ్ళి ఆశ ఎలా వొదులుకోడమో ఉపదేశించమన్నాడు మాండవ్యుడు. అతణ్ణి ఆదరించి ఇలా చెప్పాడు జనకుడు — 'ధనం దుఃఖానికి మూలం. దేనికీకూడా ఆశలేకపోడంవల్ల దుఃఖమే వుండదు నాకు. మిథిల కాలిపోయింది, కానీ ఏదీ కాలినట్లే అనిపించలేదు నాకు. కామసౌఖ్యాలూ, స్వర్గసుఖాలూ కూడా ఆసవొదిలేస్తే కలిగే సౌఖ్యంతో సరిపోవు. ఆవు పెరుగుతూ వుంటే దాంతో దాని కొమ్ములూ పెరుగుతూ వుంటాయి. అలాగే ధనం పెరుగుతూవుంటే, దాంతో ఆశకూడా పెరుగుతూ వుంటుంది. ఆశపెరిగి, మమత కలుగుతుంది. ఒక్కటే – మా ఇల్లూ, మాచుట్టాలూ, మాడబ్బూ అన్నమాట లేకపోతే ఆశాసముద్రం ఆర్చుకుపోతుంది. దొరికితే అనుభవించడమూ, దొరక్కపోతే వూరుకోడమూ—ఇలా నిబ్బరంగావున్నవాడి మనస్సులో ఆశ పిసరంతా తొంగిచూడదు. దురాత్మున్ణి ఆశ వొదలదు. శరీరం ముసిలై పోయినా ఆశమాత్రం ముసిల్ది కాదు. ప్రాణాంతకమైన రోగం ఆశ. ఆశ వొదిలించుకున్నవాడు అద్భుతమైన ఆనందం అనుభవిస్తాడు. ద్వంద్వాలకి లోబడడు.

'మునీంద్రా, నీమనస్సు శాంతిగా వుంచుకో. ఆశ నీదగ్గిరికి రాదు. శాశ్వతమైన సౌఖ్యం కలుగుతుంది.' సంతోషించాడు మాండవ్యముని. జనకచక్రవర్తిని మెచ్చుకున్నాడు. శాంతుడై ఆశ వొదలిపెట్టాడు. సుఖపడ్డాడు.

ధర్మరాజు— సర్వభూత భయంకరంగా కాలం గడిచిపోతూ వుంది. మనిషి ఏంచెయ్యడంమంచిది ? ఇది వెనకకూడా అడిగి తెలుసుకున్నాను. అయినా ఇంకా విపులంగా వినాలని అడుగుతున్నాను.

# తండ్రీకొడుకుల సంవాదం

భీష్ముడు — వెనక చెప్పిన మేధావికథ తండ్రీకొడుకుల సంవాదమే నీప్రశ్నకి సమాధానం. అందులో కొన్నిమాటలు అప్పుడు చెప్పలేదు. మేధావి తండ్రిని అడిగాడు — 'అంతకంతకీ ఆయువు తగ్గిపోతూ వుంది ధీరుడైనవాడు ఏంచెయ్యాలి ?' అని

'బ్రహ్మచర్యమూ, వేదాభ్యాసమూ, సంతానం కనడమూ, యజ్ఞాలుచెయ్యడమూ చేసి' వానప్రస్థ ధర్మం నడిపి సన్యాసి కావాలి' అన్నాడు తండ్రి.

'ముసిలితనమూ, మృత్యువూ పుట్టినదగ్గిరనించీ వెంటాడుతూనే వుంటాయి. వలలోపడ్డ చేపలాగ చావు తెలియకండా గెంతులువేస్తుంటాడు మనిషి. అంచేత రేపు చేస్తానన్న పని ఇప్పుడే చెయ్యాలి. ఏమంటే మనుషుల పనికోసం మృత్యువు ఆగుతుందా ? ఇది చేసింది, ఇది చెయ్యంది అని తన మేలు మరిచి ఆలోచనలోపడిన మనుషిని యముడు తన పట్నానికి పట్టుకుపోతాడు. మృత్యువూ (చావు),అమృతమూ (చావకండావుండడం.) రెండూ దేహంలోనే వున్నాయి. మోహమే మృత్యువు. మోహం విడిపోడమే అమృతం. తండ్రీ ! పశుయజ్ఞంచేసి నావంటివాడు హింసచెయ్యవచ్చా ? హింసలేని శాంతియజ్ఞంతో నియమంగా బ్రహ్మయజ్ఞం చేస్తాను. యోగమూ, త్యాగమూ, తపస్సూ,ఇవితప్పిస్తే మనిషికి హితమైనవి మరేమున్నాయి? అనురాగంవంటి దుఃఖం లేదు. త్యాగంవంటి సుఖమూలేదు.

'నేనే సంతానమై పుడతాను. కనక సంతానం నన్ను ఉద్ధరిస్తుందన్న ఆశ నాకు లేదు. సంతానం వొదిలిపెడుతున్నాను. ఇదే నాకు ముక్తి కలిగిస్తుంది. లోకం నాశనం కావడం చూస్తూ, పాపాలు పోగొట్టుకో నువ్వు. శాంతి, సమభావమూ, నిష్ఠా అలవరుచుకో.

గుహాలో వున్నట్టు భావించుకుని ఆత్మని దర్శించు' అన్నాడు మేధావి. కొడుకు చెప్పిన జ్ఞానంప్రకారం నడుచుకున్నాడు తండ్రి. కృతార్థుడయాడు.

ధర్మరాజా! నేను చెప్పిన ఈ ఇతిహాసం అవగతంచేసుకో నాయనా! నువ్వుకూడ అమృతమైన సత్యరూపం చూడగలుగుతావు.

## హారీత గీత

ధర్మరాజు-ఎలాటి శీలం వుంటే బ్రహ్మపదం దొరుకుతుంది ?

భీష్ముడు-నియమితాహారంతో, ఇంద్రియాలు జయించి, మోక్ష శాస్త్రాలు చెప్పిన ధర్మం అనుసరిస్తే తంగేడు తేనెతెట్టులా దొరుకుతుంది బ్రహ్మపదం. దీనికి హారీతగీత చెపుతాను, విను.

హారీతమునిని సన్యాసధర్మం ఎరిగించమని కోరారు పండితులు. ఇలా చెప్పాడతడు- 'నిర్మలమైన మనస్సుతో ఇల్లు వొదిలెయ్యాలి సన్యాసి. కోరకలు మానుకోవాలి. చూపులోనూ, మాటలోనూ, మనసులోనూ కూడా జనానికి కీడు చెయ్యకూడదు. అందరనీ స్నేహంతోనూ, దయతోనూ, చూడాలి. సందిస్తే విచారించకూడదు. పొగిడితే సంతోషించనూకూడదు. పాడుకొంపలోనూ, వొంటరి గుడిసెలోనూ, చెట్టునీడా, గుహాలోనూ జీవితం గడపాలి. ప్రజల దంపుళ్ళకీ, వంటకాలకీ, భోజనాలకీ తగిన వేళ గడిచాక, భిక్షం అడిగి తెచ్చుకోవాలి. ప్రేమతోనూ, గౌరవంతోనూ, అధికంగా భిక్షం పెట్టేచోట్లు మానుకోవాలి. కొత్తచోట్లకి వెళుతూ వుండాలి. ఇలాటి సన్యాసి ఎప్పుడూ ఆత్మానందం అనుభవిస్తూనే వుంటాడు.'

హారీతుడు చెప్పిన సన్యాసధర్మం విని సంతోషించారు పండితులు. అతణ్ణి మెచ్చుకున్నారు.

ధర్మరాజు- ఇంతకీ భావశుద్ధి వుండడం గొప్ప విషయం. రాజు నని అహంకారం మాని, ఇంద్రియాలు గెలిచి, సత్యమూ మొదలైన గుణాలు దూరం పెట్టి, శాంతిసుఖం మీద ఎప్పుడు ఆసక్తుణ్ణవుతానో నేను?

## వృత్రగీత

భీష్ముడు- తొందరెందుకోయి నీకు? అన్నిటికీ కాలం కలిసి రావాలి. కులధర్మం అనుసరిస్తే నే క్రమంగా మనస్సు పక్వానికి వస్తుంది. బుద్ధి సన్యాసధర్మానికి పరిపక్వం కాందే సన్యసించడానికి రాజకుమారుడు తగడు. ఈ విషయంలో వృత్రగీత వివరిస్తాను విను

వృత్రాసురుడు యుద్ధంలో పడిపోయాడు. అతణ్ణి పట్టుకుపోయి వాళ్ళ దగ్గిర పెట్టారు. అలాటి అవస్థలో వున్నా పిసరంతా విచారించలేదతడు. అది చూశాడు శుక్రుడు. 'నీవైభవమంతా పగవాళ్ళు అపహరించారు. అయినా మనోవ్యాధి లేదు నీకు. ఏమిటి కారణం? ' అని అడిగాడు.

'కలిమీ, లేమీ కాలాన్ని బట్టి కలుగుతాయి తెలియనివాళ్ళకి గర్వమూ, దైన్యమూ, సుఖమూ దుఃఖమూ, కలిగిస్తాయి. సిరీ, సంపదా స్థిరం కాదని గ్రహించిన వాళ్ళకి మనోవ్యథ ఎందుకు కలుగుతుంది? సంపద స్థిరం కాకపోవడమే కాదు, ప్రాణికోటి కర్మకి లోబడి, వికారం పొందుతుంది. దైవత్వమూ, మానుషత్వమూ, పశుత్వమూ, వెయ్యివిధాల తిరిగినదాని వెంట తిరుగుతూ వుంటాయి. ఇదంతా తెలుసు నాకు. అంచేత విచారం కానీ, సంతోషం కానీ వుండవు నాకు' అన్నాడు వృత్రుడు.

'ఇలాటి మానసహీనమైన మాట నీవంటి రాక్షసప్రభువుకి తగునా? ' అన్నాడు శుక్రుడు అతడి మనస్సుద్ధి తెలుసుకోవాలని

ఎన్నో రోషం కలిగించే మాటలు కల్పించాడు. అయినా చలించలేదు వృత్రుడు.

'గెలవడంకోసమే నేను తపస్సు చెయ్యకమూ, ఆసుకృతంవల్ల ముల్లోకాలూ గెలవడమూ ఎరగనా నువ్వు? ఐశ్వర్యం హరించిపోడానికి కారణంకూడా వుంది. ఒక్క పాపకు ఇంత దుస్థితికి తెచ్చింది. దీని కోసం విచార మెందుకూ? ఇంక పుణ్యమూ చెయ్యను, పాపమూ చెయ్యను. సాటిలేని, నాశనంలేని, అంతంలేని, విడపరాని విష్ణువుని ఆశ్రయిస్తాను. ఇంద్రుడితో యుద్ధంచేసినప్పుడు ఆ దేవుణ్ణి చూశాను. ఆచార్యా! అతడి మహిమ నాకువివరించు. అతణ్ణిదర్శించడమెలాగ? ఆజ్ఞానం నాకు అనుగ్రహించు' అన్నాడు.

'అలాగేకానీ' అన్నాడు శుక్రుడు. ఇంతలో మునులతో కలిసి సనత్కుమారుడు అక్కడికి వచ్చాడు. పూజలందుకుని వొక దివ్యాస నంమీద కూచున్నాడు. 'విష్ణుమాహాత్మ్యం ఈ రాక్షసరాజుకి వివ రించు' అని ప్రార్థించాడుశుక్రుడు. ప్రసన్నవదనంతో అందుకున్నాడు సనత్కుమారుడు.

'విష్ణువులోంచే అంతా పుడుతుంది, పెరుగుతుంది. తిరిగీ అంతా అతడిలోనే కలిసిపోతుంది. ఇంద్రియాలు గెలిచినవాళ్ళకే విష్ణుభక్తి పట్టుపడుతుంది. దానాలవల్లా, ధర్మాలవల్లా కాదు. అలాఅని వాటి ప్రయోజనం లేదనికాదు.

'భూమి అతడి పాదాలు. ఆకాశం శిరస్సు. దిశలు బాహువులు. అంతమంది దేవతలూ అతడిలోనే వున్నారు. అయిదుభూతాలూ ఆడించడమూ, సంహారంచేయడమూ అతడి మానసక్రీడలు, జీవావస్థలు ఛాయలై వుంటాయి. ఆదశావిశేషాలు ఆరు: నలుపూ, పొగరంగూ, ఆకుపచ్చా, పసుపూ, ఎరుపూ, తెలుపు. సృష్టిసంహారాల్లోపడి జీవుడు కర్మకిలోబడి చస్తూ పుడుతూ వుంటాడు. తుదకి విష్ణువునే చేరతాడు.

ఉత్తమ, మధ్యమ, అధమ చ్ఛాయలు తనని పొందుతూ వుంటాయి. దేవత్వమూ మొదలైన భావాలు పొంది జీవుడు హెచ్చుతగ్గులు పొందుతూవుంటాడు. మంచిచేస్తే మంచిఛాయ వస్తుంది. చెడ్డచేస్తే చెడ్డఛాయలు వస్తాయి. రసవాదం తెలిసినవాడు వెండిని బంగారం చెయ్యడానికని శుద్ధిచేసినట్లు, జీవుణ్ణి పరిశుద్ధం చెయ్యాలి. పువ్వుల వాసనతో నువ్వులు పరిమళిస్తాయి అలాగే జీవుడు పుణ్యకార్యాలతో పరిశుద్ధు డవుతాడు. పుణ్యకర్మలు అధికమై ఎక్కువఛాయతో ప్రకాశిస్తాడు. పాపాలు వొదిలిపోయి పరిశుద్ధు డవుతాడు. సంతోషామృతంలో తేలాడుతాడు.

'ఛాయల్లో తెలుపు శ్రేష్ఠమైంది జీవుడు తెల్లటిఛాయతో ప్రకాశించినప్పుడే విష్ణువుని ధ్యానించగలడు. అతణ్ణిపొందడమే పరమ పదం' అన్నాడు.

సనత్కుమారుడు చెప్పిన విష్ణుమహిమ విన్నాడు వృత్రాసురుడు. 'అమృతంవంటి నీమాటలు విన్నాను. పరిశుద్ధుణ్ణయ్యాను' అంటూ ప్రాణాలు విడిచిపెట్టాడు. విష్ణుదేవుణ్ణి చేరుకున్నాడు.

ధర్మరాజు—వృతుడి విజ్ఞానమూ, విష్ణుభక్తీ అంత గొప్పవారి అయితే అతడూ, ఇంద్రుడూ ఎలాయుద్ధం చేశారు ?

## ఇం ద్ర వృ త్రు ల యు ద్ధం క థ

భీష్ముడు — ఇంద్రుడు మంచి కాంతివంతమైన రథమెక్కాడు. దేవసేనతో వృత్రాసురుడిమీద దాడిచేశాడు. రాక్షససైన్యంతో ఎదురుపడ్డా డతడు. ఆయుద్ధంలో ఇంద్రుడు భయపడిపోయాడు. పెద్దకొండలా వున్నవృత్రుడి ఉద్ధృతంచూసి వొణికిపోయాడు. అతడి మాయాబలంతో మూర్ఛపోయాడు. అపుడు వశిష్ఠుడు వచ్చి రథంతర సామశక్తితో మూర్ఛపోగొట్టాడు. బ్రహ్మ, విష్ణువూ, మహేశ్వరుడూ

యుద్ధం చూడడానికి వచ్చి, పోరాడు' అని పురికొల్పారు. తిరిగీ ఇంద్రుడు యుద్ధంచేశాడు. అతడి జయంకోరుతూ బృహస్పతీ, మునీంద్రులూ శివుణ్ణి ప్రార్థించారు. శివుని తేజస్సు జ్వరమై వృత్రుణ్ణి పట్టుకుంది. విష్ణువు ఇంద్రుడి వజ్రాయుధంలో ప్రవేశించాడు.

'దేవేంద్రా!' శివుడన్నాడు — 'అరవైవేల దివ్యసంవత్సరాలు మహాతపస్సుచేశాడు వృత్రాసురుడు. ఉగ్రమైన బల మిచ్చాడు బ్రహ్మ. ఆ బలమంతా నా తేజస్సుతో అణగారిపోతుంది. యుద్ధం చెయ్యి.'

వజ్రాయుధంతో కొట్టాడు దేవేంద్రుడు. దెబ్బతో పడిపోయాడు వృత్రాసురుడు. మునులు సంతోషించారు. దేవతలు సింహనాదాలు చేశారు. దివ్యదుందుభులు మోగాయి. ఋషులు శివుణ్ణీ, విష్ణువునీ మెచ్చుకున్నారు. విష్ణువు తాకడంచేత వృత్రుడి పాపాలుపోయాయి. అతణ్ణి చూడగలిగాడతడు. మనసులో శాంతిపొందాడు.

అలా వృత్రుణ్ణి గెలిచి, శివునికి మొక్కాడు దేవేంద్రుడు. 'మీదయవల్ల ఆపద గట్టెక్కింది. సుఖపడ్డాను' అంటూ సెలవు తీసుకున్నాడు. అయితే బ్రహ్మహత్య పట్టుకుంటతడికి తామర తూడులో దాగున్నాడు. అక్కడకూడా వెంటాడింది బ్రహ్మహత్య బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి ప్రార్థించాడతడు. 'ఇది పోదిలే ఉపాయం అనుగ్రహించు' అన్నాడు.

ఆలోచించాడు బ్రహ్మ. అగ్గినీ, చెట్లనీ, ఆడాళ్ళనీ, నీళ్ళనీ పిలిచాడు. 'వృత్రాసురుణ్ణి చంపడంచేత దేవేంద్రుణ్ణి పట్టిన బ్రహ్మ హత్యాపాతకం నాలుగు భాగాలు చేశాను. మీరు వొకొక్క భాగం పుచ్చుకోండి' అన్నాడు. 'మమ్మల్ని ఈపాపం ఎలా వొదులుంది?' అని అడిగారు వాళ్ళు.

'నువ్వు మండందే నీలో హవిస్సు పోసినవాళ్ళకి నీపాపం పోతుంది' అని అగ్నితో చెప్పాడు బ్రహ్మ. 'అమావాస్య, పున్నమ రోజుల్లో మిమ్మల్ని కోసినవాళ్ళకి మీపాపం పోతుంది' అని చెట్లతో చెప్పాడు. మీరు రజస్వలలై వున్నప్పుడు మీతో సంగమం చేసిన వాళ్ళకి మీపాపం పోతుంది, అని ఆడాళ్ళతోనూ, 'మీలో మల మూత్రాలు విడిచినవాళ్ళకి మీపాపం పోతుంది. అని నీళ్ళతోనూ చెప్పాడు. సంతోషించారు వాళ్ళు. ఇంద్రుడి దగ్గిర బ్రహ్మహత్యా పాతకం పంచుకున్నారు. పాపంపోయి, బ్రహ్మచెప్పిన ప్రకారం అశ్వ మేధంచేశాడు ఇంద్రుడు. స్వర్గరాజ్యం పరిపాలించాడు.

వృత్రాసురుడు వజ్రాయుధంతో దెబ్బతిని పడిపోయి నప్పుడు అతడి రక్తంలో బుడగలు లేచాయి. పుట్టగొడుగు లయాయి. మను షుల తిండికి ఉపయోగపడ్డాయి. బ్రాహ్మలూ మొదలైన జాతులు మాత్రం అవి తినకూడదు.

పున్నమీ మొదలైన పర్వదినాల్లో ఇంద్ర వృత్రాసురయుద్ధం కథ చదివినవాడు పాపాలుపోయి, ధర్మపరు డవుతాడు.

## జ్వరం కథ

ధర్మరాజు – వృత్రుణ్ణి శివజ్వరం పట్టిం దన్నావు, జ్వరం పుట్టు పూర్వోత్తరా లేమిటి

భీష్ముడు – వెండికొండ రతనాల శిఖలంమీద శివుడు పార్వతీ దేవితో సుఖంగావున్నాడు. నారదుడూ, కుబేరుడూ సేవిస్తూవుండగా వొకనాడు ఆదారిని దేవతలూ, మునులూ గుంపులు గుంపులు వెళు తున్నారు 'వీళ్ళు ఎక్కడికి ఇలా వెళుతున్నారు?' అని పార్వతి భర్తని అడిగింది. 'మీనాన్నదక్షుడు యజ్ఞం చేస్తున్నాడు. కనకహవి ర్భాగాలకోసం వీళ్ళు వెళుతున్నారు అన్నాడు శివుడు. 'మరి నువ్వు

వెళ్ళవేం ?' అని అడిగింది పార్వతి. 'నాకు హావిర్భాగం తొలినించీ ఏర్పరచలేదు' అన్నాడు శివుడు— 'అందుకే నేను వెళ్ళలేదు.'

తన భర్తకి తండ్రి దక్షుడు హావిర్భాగం ఏర్పరచలేదంతోనే ఉగ్రరూపం ధరించింది పార్వతి. కనుబొమలు ముడివేసి, మాట్లాడకుండా కూచుంది.

దేవిమనస్సు గ్రహించాడు శివుడు. దక్షుడి యజ్ఞం ధ్వంసం చెయ్యడంకోసం ప్రమథగణాలతో వెళ్ళాడు. రక్తాలుపోసియజ్ఞకుండం ఆర్పేశారు ప్రమథులు. నానా బాధలూ పెట్టారు. లేడిరూపంతో ఆకాశంమీదికి ఎగిరిపోయింది యజ్ఞం. కోపంతో శివుడి నుదుటినించి చెమటబొట్లు కిందపడి, పెద్దపెద్ద మంటలు లేచాయి. అందులోంచి ఎర్రకళ్ళతోనూ, ఊర్ధ్వరోమాలతోనూ, ఘోరమైన శరీరంతోనూ యజ్ఞం దహించీ పురుషుడు వొకడు పుట్టాడు. దేవతలూ, మునులూ భయంతో పరుగులుతీశారు. బ్రహ్మ వచ్చి వినయంతో శివుడికి మొక్కాడు.

దేవతలు హావిర్భాగం నీకు కల్పిస్తారు. స్వామీ! శాంతించు అని విన్నవించాడు.

శాంతించాడు శివుడు. నవ్వుతూ మునుల్నీ దేవతల్నీ గౌరవించాడు. దేవతలు అతడికి హావిర్భాగం కల్పించారు. ప్రసన్నుడయాడు శివుడు.

'దేవా! నీ చెమటలో పుట్టిన పురుషుడు జ్వరమన్న పేరుతో, అంతటా తిరుగుతాడు. అయితే ఈజ్వరం ఏకముఖంగా వుంటే భూమి భరించలేదు. అందుచేత బహువిధాలుగా సృష్టించు' అన్నాడు బ్రహ్మ.

ఏనుగుల తలవేడి, పాముల పొరా, ఆవుల డెక్కల్లో నొప్పీ, నాలుగు కాళ్ళ జంతువులు తమ రూపం తాము చూడలేకపోడమూ,

గుర్రాల పక్కలు కృశించిపోడమూ, నెమళ్ళ పింఛాలు చీలికలై పోడమూ, కోకిలల కళ్ళమంటా, చిలకలఎక్కిళ్ళూ, మేకలచిత్తభ్రమణమూ, పులుల శ్రమా, మనుషుల చావుపుట్టుకల వేదనా- ఇలాజ్వరం విభాగించాడు శివుడు. ఇదీ జ్వరం కథ జ్వరం శివుడి తేజసు కనక అంతమందీ నమస్కరించదగింది. మన్నించదగింది

జ్వరంకథ విన్నా, చదివినా మనిషికి ఆరోగ్యం కలుగుతుంది. తేజస్సు కలుగుతుంది. చిత్తసమాధి కుదురుతుంది. కోరికలు ఫలిస్తాయి పాపాలు పోతాయి.

## శాస్త్రం తెలియనివాడు ఏంచెయ్యాలి ?

ధర్మరాజు _ శాస్త్రతత్వం తెలియని సంశయాత్ము డుంటాడు. పరమార్థం ఇలాంటిది అని అతడికి తెలియదు. అలాంటివాడు ఏం చెయ్యాలి ?

భీష్ముడు - గురువుల్ని పూజించాలి. వృద్ధుల్ని సేవించాలి. విద్యాప్రసంగాలు వినాలి. ఇదే నారదుడూ, గాలవుడూ చర్చించుకున్నారు. విను.

గాలవుడు నారదుణ్ణి ఆశ్రయించి, మహాత్మా! నువ్వు సంపూర్ణమైన వివేకం కలవాడివి. అన్ని శాస్త్రార్థాలూ ఎరిగిన వాడివి. విజ్ఞానంలేనివాణ్ణి నేను. నాకు జ్ఞానం ప్రసాదించు' అని ప్రార్థించాడు. నారదుడు ఇలా ఉపదేశించాడు :

'నాలుగు ఆశ్రమాల వివరాలూ పరీక్షించి, అందులో ప్రవేశించాలి మనిషి. సూక్ష్మవృత్తితో ధర్మమూ, అర్థమూ, కామమూ నిర్వహించాలి. సౌమ్యుడు కావాలి. పాపకర్మలు విడిచిపెట్టాలి. శుద్ధమైన మనస్సుతో పుణ్యకర్మలు చెయ్యాలి. సజ్జనసహవాసం చెయ్యాలి. అన్నిప్రాణులమీదా దయకలిగి వుండాలి. మధురంగా మాట్లాడాలి. సదాచారంతో దేవపూజా పితృపూజా చెయ్యాలి.

అహంకారం కూడదు. ఎవ్వరినీ, ఏదీ కోరకూడదు. వివరాల్లో తలుదూర్చుకోకూడదు. ఇతరుల్ని నిందించకూడదు. తన్ను తాను పొగుడుకోకూడదు. సోమరిపోతూ, గర్వపోతూ, వదరపోతూ, మచ్చరగొట్టూ, కోపగొట్టూ కాకూడదు. శక్తికొద్దీ అతిథిపూజ చెయ్యాలి. వేదవేదాంగాలు అభ్యసించాలి. యజ్ఞాలు చెయ్యాలి.

ఇలా మంచి నడవడితో నడుచుకుంటూవుంటే మనస్సు నిర్మలమవుతుంది. జ్ఞానం కలుగుతుంది, అన్నాడు.

## సగర అరిష్టనేముల ప్రసంగం

ధర్మరాజు — నాబోటివాడు కాలపాశాలు తెంచుకోవాలంటే ఏం చెయ్యాలి ?

భీష్ముడు — నువ్వు అడిగినట్టే సగరుడు అరిష్టనేమిని అడిగాడు. అతడు చెప్పినమాటలు వింటే నీకు శాంతి కలుగుతుంది. సగరచక్రవర్తిని ప్రభోధిస్తూ అరిష్టనేమి ఇలా అన్నాడు—'ధనమూ, ధాన్యమూ, పశువులూ, భార్యాబిడ్డలూ — ఈసందడిలో పడిపోయి, మనస్సు కొట్టుకుంటే ముక్తిమార్గం అగమ్యమైపోతుంది.

'శాంతి, వైరాగ్యమూ కలవాడు, వృద్ధురాలైనభార్యనీ, బుద్ధిమంతులైన కుమారుల్నీ వొదిలిపెట్టి, నిబ్బరంగా ఏకాంతప్రదేశం చేరుకోవాలి. కుమారులు వున్నారూ, లేరూ, అన్న భేదం అక్కరలేదు. బంధువుల్ని పోషించాలన్న చింతతో సంసారలంపటంలోవున్నవాడు వెర్రికుట్టు. తాను చచ్చినప్పుడు వాళ్ళని పోషించ గలడా? అది తెలుసుకుని ముక్తికోసం ప్రయత్నించాలి కదా? కాదూ, పోదూ అంటే వాళ్ళు తనకోసం అడ్డుపడతారా అప్పుడు? అదికూడా ఆలోచించవద్దా? ప్రాణుల పుట్టుకా, పునికీ, చావూ కనిపెట్టే నేర్పుకలవాడు మోక్షమార్గం తెలుసుకుంటాడు. మనస్సు మూఢమైతే బావరబందిలో

పడిపోతాడు. ముక్తి దొరకదు. జొన్నకూడూ, వరికూడూ, కటిక నేలా, దూదిపరుపూ, నారగుడ్డలూ, పట్టుబట్టలూ వొక్కలాగ చూసుకున్న వాడే ముక్తిపొందుతాడు.

'ప్రపంచమంతా పరిపాలించిన ప్రభువులూ చచ్చిపోతారు. శక్తి వుడిగిపోయి, చూపు తగ్గిపోయి శరీరం పనికిరాకండా అయిపోతుంది. ఇది భావించగలినవాడు ముక్తిపొందుతాడు. ధనయోగం దుర్లభమనీ, కష్టం సులభమనీ ఊహిస్తూ, మనిషిజన్మ మంచిది కాదని భావించినవాడు ముక్తిపొందుతాడు. కనక గృహస్థధర్మంలో అతిగా మునిగిపోకు. ధర్మంతో రాజ్యం పరిపాలించు. ముక్తిపొందుతావు.

అరిష్టనేమి బోధవిని సగరుడు జ్ఞానవంతుడయాడు. ధర్మం తప్పకండా రాజ్యంచేశాడు. నువ్వూ అలాగే రాజ్యం పరిపాలించు.

## శుక్రుడు

ధర్మరాజు— ధర్మద్రోహులైన రాక్షసుల మంత్రి భార్గవుడికి శుక్రుడని ఎలా పేరు వచ్చింది?

భీష్ముడు— అతడు యోగబలంతో కుబేరుణ్ణి మోసంచేశాడు. అతడి ధనమంతా అపహరించాడు. బాధపడి శివుడితో మొరపెట్టుకున్నాడు కుబేరుడు. కళ్ళల్లో నిప్పులు కక్కాడు శివుడు. త్రిశూలమెత్తాడు. 'ఏడీ ఎక్కడున్నాడు భార్గవుడు?' అంటూ మండిపడ్డాడు. భయపడిపోయాడు భార్గవుడు. పరుగుచ్చుకున్నాడు. ఎంతో దూరంపోయి తుప్పల్లో దాగున్నాడు, అయినాఆగలేకపోయాడు. తల్లడిల్లిపోయాడు. బాధపడిపోయి, శివుడిచేతిలో చిక్కిపోయాడు. దొరకడమే తడువు, అతణ్ణి లపుక్కున మింగేశాడు శివుడు. అతడి కడుపులో గింజుకున్నాడు భార్గవుడు. బైటికి రాకండా శరీరరంధ్రాలన్నీ మూసేశాడు శివుడు. ఒక్క శిశ్న ద్వారంమాత్రం ముయ్యకండా తెరచి

వుంచాడు. 'బైటకిరా' అంటూ శిశ్నమార్గమే కనపరిచాడు. అందు లోంచే బైటబడ్డాడు భార్గవుడు. అతణ్ణి చురచురా చూశాడు శివుడు. పార్వతి అడ్డుకుంది. 'ప్రభూ! నికడుపులోంచి పుట్టాడు! అంచేత నాకుమారు డయాడు. నాకొడుకుమీద కోపం తగునా నీకు. ఇతణ్ణి దయచూడు. సుఖపెట్టు' అని ప్రార్థించింది. కాపాడాడు శివుడు. భార్గవుడికి బలం ప్రసాదించాడు. 'దేవీ! శుక్రమార్గమైన శిశ్నంలోంచి బైటపడ్డాడు కనక ఈభార్గవుడిపేరు శుక్రుడవుతుంది' అన్నాడు. ఇదీ భార్గవుడు శుక్రుడైన కథ.

## పరాశరగీత

ధర్మరాజు — తండ్రీ! నీవాక్యామృతం తనివితీరకండా వుంది. ఇంకా ధర్మం సెలవియ్యి.

భీష్ముడు — పరాశరగీత చెపుతాను, విను. జనకచక్రవర్తి అడగ్గా పరాశరముని ధర్మం ప్రభోధిస్తూ ఇలా చెప్పాడు— 'బీజంవల్ల పండు పండుతుంది. అలాగే ధర్మంవల్ల ఇహపరసౌఖ్యాలు ఫలిస్తాయి. పాపం కష్టం కలిగిస్తుంది. పుణ్యం సుఖం కలిగిస్తుంది. మనస్సులోనూ, మాటలోనూ అన్యాయం మానుకుంటే సన్మార్గం మీద అభిరుచిపుడుతుంది. సత్యమూ, శమమూ, దమమూ, అహింసా ఇవి సన్మార్గాలు.

'మనస్సు రథం. ఇంద్రియాలు గుర్రాలు. అవి చెడుదారిని పరిగెత్తకండా పుణ్యాత్ముడు విజ్ఞానం అనే పగ్గాలతో ఆపుకుంటాడు.

'ఆయువు దుర్లభమైంది. అది దేహానికి లభించినప్పుడు దుర్మార్గమైన పనులతో వ్యర్థంచెయ్య కూడదు. పుణ్యకార్యాలుచేసి మెరుగుపెట్టాలి. పాపాలుచేస్తూ మేలుకోరడం బురదలో దిగిస్నానం

చెయ్యడం వంటిది. సమబుద్ధితో ప్రాణులన్నీ తనవంటివే అని భావిస్తూ న్యాయబుద్ధికలవాడు పూజనీయుడు.

'ధర్మంగా గడించిన ధనం కొంచెమైనా సత్పాత్రుడి చేతిలో పెడితే గొప్పఫలమే ఇస్తుందంటారు వేదాలు తెలిసినవాళ్ళు.

'వేదాలు చదివి మునుల రుణం తీర్చుకోవాలి. యజ్ఞాలుచేసి దేవతలరుణం తీర్చుకోవాలి. పూజలతో అతిథులరుణమూ, దానాలూ వ్రతాలూ చేసి మనుషుల రుణమూ, శ్రాద్ధాలుచేసి పితృదేవతల రుణమూ తీర్చుకోవాలి.

'నారదుడూ, పర్వతుడూ, దేవలుడూ, భరద్వాజుడూ, మొదలైన పరమమునులు ధర్మంచేసే గౌరవం పొందారు. కనక తప్పకుండా ధర్మం చెయ్యాలి.

'తగనివాడైనా విష్ణువుని స్తుతించి, తపస్సుచేసి, ధర్మంపాలించి జ్ఞానం సంపాదిస్తాడు.

'తండ్రీ, గురువూ, ముక్తీ, తపస్సూ, తేజస్సూ, బలమూ, ధైర్యమూ, బుద్ధీ అన్నీ అగ్నిహోత్రమే. కనక విధిపూర్వకంగా అగ్నిహోత్రగృహంలో ఎప్పుడూ అగ్ని స్థాపించినవాణ్ణి పుణ్యాత్ముడంటాయి వేదాలు.

'మంచివాళ్ళ సాంగత్యంచేస్తే, చెడ్డవాడైనా మంచివాడవుతాడు. శూద్రుడు బ్రాహ్మణసాంగత్యంతో ఇహపరాలు సాధిస్తాడు.

'జీవనం శాశ్వతం కాదు. ఇది తెలుసుకుని, సుఖదుఃఖాలలో ధర్మం తప్పకూడదు.

'ఎంత గొప్పఫలం లభించినా సరే, కొంచెమైనా పాపంచెయ్యకూడదు. ఫలం కొంచెమైనా పుణ్యమే చెయ్యాలి. పుణ్యంవల్లే ఇహపరాలు సిద్ధిస్తాయి.

'యజ్ఞం చెయ్యని బ్రాహ్మణుడూ, రక్షకుడు కాని రాజూ, గడించని కోమటీ, శుశ్రూష లేని శూద్రుడూ ఎన్ని ధర్మాలు చేసినా అధర్మపరుల కిందే లెక్క.

'ధర్మంగా గడించిన డబ్బు పాతిక దానం చేసినా హెచ్చు ఫలమిస్తుంది. పాపం డబ్బు కోట్లు కోట్లు దానం చేసినా నిష్ఫలమే అంటారు దానశాస్త్రం తెలిసినవాళ్ళు.

'బతుకు గడవనప్పుడు క్షత్రియ ధర్మమూ, వైశ్యధర్మమూ బ్రాహ్మణుడికి పాపం లేదు. శూద్రకర్మమాత్రం తగదు. రాజుకి ఆయుధమే బతుకు తెరువు. ఆపదకాలంలో అయినా కోమటి కల్లూ మాంసమూ అమ్మకూడదు. శూద్రుడికి వ్యవసాయమూ, పశుపాలనమూ ధర్మం. దానివల్ల ఎవళ్ళవృత్తులూ భంగం కావు.

పనక మనుషులు ధర్మంతో నడుచుకుంటూ వుండేవాళ్ళు. రాక్షసులు సహించలేకపోయారు. కోపంతో మనుషుల్లో చేరారు. మనుషుల్లో అధర్మం అధికమైంది. వేదాలూ, యజ్ఞాలూ నశించాయి. దేవతలు విచారించారు. శివుడితో మొరపెట్టారు. త్రిశూలం వేశాడు శివుడు. రాక్షసుల పొగరు అణిచేశాడు. అతడి అనుగ్రహంవల్ల వేదాలూ, యజ్ఞాలూ ఎప్పటిలా స్థిరపడ్డాయి. దేవతలు సంతోషించారు; సుఖపడ్డారు.

'జనక మహారాజా! నువ్వు ధర్మం పాలించు. రాజ్యం రక్షించు. ఇంకా తపస్సు గొప్ప చెపుతాను విను. విద్యాధరులూ, మునులూ, దేవతలూ తపస్సువల్లే మహావైభవం పొందారు. తపస్సువల్లే బ్రహ్మ లోకాలు సృష్టించాడు. పనకటి రాజులు తపస్సువల్లే అంత గొప్పవాళ్ళయ్యారు. ఆహారాలూ, గంధాలూ, పూలదండలూ, పక్కలూ అన్నీ తపస్సువల్లే లభిస్తాయి. ధనమూ, స్నేహితులూ, భార్యా,

బిడ్డలూ – వీటి అన్నిటివల్లా మనస్సు కలతపడినప్పుడు తపస్సు శాంతి కలిగిస్తుంది.

'లోభం దుఃఖం కలిగిస్తుంది. సంతోషం సుఖం కలిగిస్తుంది. ఎందుచేత? తపస్సు లేకపోడంచేత. సుఖంవచ్చినప్పుడు సంతోషమూ, కష్టంవచ్చినప్పుడు విచారమూ లేకుండా, దొరికిందాంతో తృప్తిపడడం తపస్వియొక్క భావం అంటారు పండితులు. ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ ఈనాలుగు పురుషార్థాలూ తపస్సుతోనే సాధిస్తాడు నేర్పరి.'

పరాశరుడు ఇలా చెప్పాక, వర్ణాల తారతమ్యాలూ, తానే పుత్రుడవుతా డన్నవిషయమూ వివరించమని అడిగాడు జనకుడు. మళ్ళీ ఇలా అందుకున్నాడు పరాశరుడు – 'బ్రహ్మ మొహంలోనూ, బుజాల్లోనూ, తొడల్లోనూ, పాదాల్లోనూ పుట్టడంవల్ల బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రవర్ణాలు పుట్టుకస్థానాలప్రకారం తారతమ్యం పొందాయి.

'ఇక తానే పుత్రుడై పుడతా డన్నవిషయం – మునులు తమ వీర్యం ఎక్కడ ప్రయోగించినా ఋశ్యశృంగుడిలాగ మునులే పుట్టారు. కనక తండ్రే కొడుకు అన్నమాట నిజం' అన్నాడు.

'విన్నవే అయినా వర్ణాశ్రమధర్మాల సాధారణ విశేషాలు వినాలనిపిస్తోంది. మరికొన్ని సెలవియ్యి' అని అడిగాడు జనకుడు.

'విను. దానంపుచ్చుకోడమూ యజ్ఞాలు చేయించడమూ వేదాలు చదవడమూ బ్రాహ్మణుడికీ ప్రజల రక్షించడం రాజుకీ, పశుపాలనా కృషీ వ్యాపారమూ కోమటికీ, శుశ్రూష శూద్రుడికీ విశేషధర్మాలని వేదాలు చెపుతున్నాయి. సత్యమూ, శుచిత్వమూ, అహింసా, అతిథిపూజా, అసహ్యం లేకుండా వుండడమూ, శ్రాద్ధకర్మా, తనభార్యతోనే సంగమించడమూ – ఇవి సర్వసాధారణ ధర్మాలు. ఎవళ్ళ వృత్తులు వాళ్ళుచేసుకుంటూ, ఈసర్వసాధారణ ధర్మాలు అన్నివర్ణాల

వాళ్ళూ అనుసరించడం ఇహపర సౌఖ్యాలకి మూలం. తక్కిన విధులు కూడనవి.

'నాద్యష్టి' విష్ణువు దేవుడు. అతణ్ణి ధ్యానిస్తే అన్నివర్ణాల వాళ్ళూ ముక్తిపొందుతారు' అన్నాడు.

విని, 'హింస అంటే ఏమిటి?' అని అడిగాడు జనకుడు. పరాశరుడు వివరించాడు - 'శమమూ, దమమూ లేకపోవడంవల్ల హింసచేస్తాడు మనిషి. అందచేత ఎప్పుడూ శమమూ దమమూ కలిగి వుండాలంటారు పండితులు యుద్ధంలో గెలవడంకోసం రాజులు హింస చెయ్యక తీరదు. అప్పుడుకూడా చెయ్యరాని పనులున్నాయి, పగవాడు వశిపోయినా, పారిపోయినా, అతడి ఆయుధం పడిపోయినా, వాహనం పడిపోయినా అతణ్ణి చంపకూడదు. ఎక్కడైనా సరే, అహింసని మించిన పుణ్యం లేనే లేదు. ధర్మయుద్ధంలో బాణాగ్ని దహించి శరీరంవిడిచి పెట్టిన పురుషుడు మోక్షలక్ష్మిని వరిస్తాడు. తనతో సమానశత్రువునో, తనకంటే అధికుడైన శత్రువునో యుద్ధంలో చంపిన రాజు పుణ్యలోకసిద్ధి పొందుతాడు.

'భూతాలూ, ఇంద్రియాలూ, సత్వమూ మొదలైన గుణాలూ శరీరమవుతాయి. ఇది తెలిశాక అధర్మకార్యాలుచేస్తాడా మనిషి?

'పుట్టినవాడు చావడం తప్పదు. భూతాలు శాశ్వతం కావు. ఎప్పుడుపడితే అప్పుడు పోయే శరీరంకోసం బుద్ధిమంతుడు ధర్మం తప్పడు.

'ఉత్తరాయణంలోనూ, యుద్ధాల్లోనూ చావడం సత్కర్మలు చేసినవాళ్ళకే తటస్థిస్తుంది. చెడుకాలాలూ, పులీ, విషమూ మొదలైనవి దుష్టచరిత్రులచావుకి జతపడతాయి.

'అజ్ఞానంవంటి శత్రువు మరొకటిలేదు. అజ్ఞానంవల్లే అసంగతమైన పనులు చేస్తాడు మనిషి. అజ్ఞానంవల్లే నాశనం పొందుతాడు.

'మానవజన్మ దొడ్డది. హీనజాతిలో పుట్టినా మనిషిజన్మవల్ల ముక్తిపొందవచ్చు.

'ఫలాపేక్ష లేకండా దానాలూ, పుణ్యతీర్థస్నానాలూ, అతిథి పూజలూ చేస్తూ మనిషిజన్మని గౌరవించేవాడు ముక్తిపొందుతాడు అన్నాడు.

'ఏది మంచిది? ఏది పరమగతి? ఏది నాశనంలేని పని?' అని అడిగాడు జనకుడు.

'నిస్సంగత్వం మంచిది. జ్ఞానం పరమగతి. తపస్సు నాశనంలేని పని. వేదాల అన్నిటి సారమూ ఇదే.

'బుద్ధిమంతుడు విషయాల్లో తగులుకుని వుండినా తామరాకు మీంచ నీటిబొట్టులాగే అంటకండా వుంటాడు. విజ్ఞానం ప్రయోజనమే అది. మూఢుడిమనస్సులో విషయాలు కర్రని లక్కలా అంటిపెట్టుకొని వొదలవు. ఇది తెలుసుకోవడమే శమం.

'ఎండలో రాయి మెరిసినట్టు మంచిభావనవల్ల మనస్సు ప్రకాశిస్తుంది. అదే ఉత్తమసిద్ధికి మూలం.

'అరటిబోదెలా నిస్సారమైంది సంసారం. ఇది తెలుసుకుంటే చావుపుట్టుకలు దగ్గిర చేరవు. తెలుసుకోకపోతే బాధపెడుతూనే వుంటాయి.

'పరాయివాళ్ళకోసం తనమంచి మానెయ్యడం ఎలాటిదో, ఇంద్రియాలకి లోబడిపోయి, ఆత్మని ఉద్ధరించకపోడమూ అలాటిదే.

'గుడ్డివాడు అలవాటుబట్టి తన ఇంట్లో తిరుగుతాడు. అలాగే మూఢుడు సంసారంలో తిరుగుతూవుంటాడు. మోక్షపదం ఎరగడు. తామరతూడుని అంటిన బురద నీళ్ళతో వొదిలినట్లు, జ్ఞానంతో సంసారం వొదిలిపోతుంది.

'శిశ్నోదరపరాయణుడైన దుర్జనుడు మరేదీ చూడడు. తుదకి ఎలకని పట్టిన పిల్లిలాగ అతణ్ణి మృత్యువు పట్టుకుంటుంది. దాంతో ముక్తిలేకండా గుటుక్కుమంటాడు.

'అనుభవించే దుఃఖాలు అపరిమితం. సుఖాలుస్వల్పం. ఈ సంసారంలో మేలేముంది? కనక దీన్ని వొదిలిపెట్టడమే శుభం.

'స్నేహితులూ, భార్యలూ, అన్నదమ్ములూ, కొడుకులూ అందరూ స్వార్థపరులే. ఎలాచూసినా జ్ఞానమొక్కటే ఆత్మని రక్షిస్తుంది. సూర్యుణ్ణి తేజస్సులాగ, భేదభావంలేని ధీరపురుషుణ్ణి జ్ఞానం ఎప్పుడూ వొదిలిపెట్టదు.'

ఇలా అమోఘమైన ప్రజ్ఞతో ఎన్నోవిధాల ఉపదేశించాడు పరాశరుడు. విని ఎంతో సంతోషించాడు జనకుడు.

ధర్మరాజు — దమమూ, సత్యమూ, క్షమా అంతటా పొగుడుతారు. అవి అంత మంచివా?

## హంసగీత

భీష్ముడు — నీప్రశ్నకి హంసగీత సమాధానమవుతుంది. విను.

బ్రహ్మ బంగారంహంస అయి విలాసంగా తిరుగుతున్నాడు. ఒక దగ్గిర కొంతమంది సాధ్యులు ఆ హంసనిచూసి, 'పక్షిరాజా! అన్ని విద్యల్లోనూ నువ్వు ఆరితేరినవాడివని విన్నాము. నిన్ను ఆశ్రయిస్తున్నాం. మేంసాధ్యులం' అంటూవినయంగా అడిగారు- 'ఏదిఉత్తమమైంది? నీమనస్సు ఎక్కడ ఆనందిస్తుంది? దేంతో కర్మబంధాలు వొదిలిపోతాయి? దయతో ఈధర్మం సెలవియ్యి' అన్నారు.

'శమమూ, దమమూ, సత్యమూ – ఇవి గొప్పమహిమ కలవని వినికిడి. ధర్మాలన్నిటిలోనూ చెప్పదగిన విని. వీటివల్ల హృదయ గ్రంథులు (కోరికలూ, అనుబంధాలూ) విడిపోతాయి.

'ఇతర్ల మనస్సు నొప్పించే మాటలు మంచిమనిషి నోటపట్టడు. నీతితప్పినమాటలూ, ధర్మవిరుద్ధమైనమాటలూ, నిష్ఠురమైనమాటలూ మాట్లాడడు. ఏమంటే, ఇవన్నీ సత్యానునవి కావు అవమానించినా, నిందించినా ఓర్చుకుంటాడు శాంతాత్ముడు. దానివల్ల నిందించిన వాళ్ళపుణ్యం అతనికి లభిస్తుంది న్న చెడ్డమాట లంటూవుంటే నేను మంచిమాటలే అంటూవుంటాను కొడుతూవుంటే చిగునవ్వుతో జారిపోతాను నామనస్సుకి ఎన్నడూ క్రోధం తట్టదు. విన్నారా ? వేదాలసారం సత్యం. సత్యసారం మం. దమంసారం మోక్షం. ఈపద్ధతి ఆదరించినవాళ్ళకి ముక్తిద్వారం తెరుతుంది. దమంతో కర్మేంద్రియాలు జయించినవాడు అన్నిధర్మాలూ సాధించగలడు. పాపాలన్నీ వొదుల్చుకుంటాడు. దాంతో మబ్బువొదిలిన చంద్రబింబంలా ప్రకాశిస్తుంది ఆత్మ. అదుగో అదే మోక్షం. మనసూ, మాటా వశం చేసుకున్న వాడు వేదాలూ, తపస్సూ, దానాలూ వశంచేసుకోగలడు. ఎప్పుడూ మునులు ఈమాటే చెపుతూవుంటారు.

'తిట్లుపడినవాడి పాపాలు తిట్టినవాణ్ణి చుట్టుకుంటాయి. కన వొకణ్ణి తిట్టడమెందుకు ? అతడి పాపాలు పోసుకోడ మెందుకు ?

'కోపం తెచ్చుకున్నవాడి వ్రతాలూ, జపాలూ, దేవపూజలూ, పితృపూజలూ, తపస్సూ, దానమూ యముడులాక్కుంటాడు కోప్పడి.

'ఊరికే వుండడంకంటే మాట్లాడడం మేలు. ఆమాట్లాడడం మంచిగామాట్లాడడం మంచిది నిజంమాట్లాడడం అంతకంటేమంచిది. ధర్మంగామాట్లాడడం మరీమంచిది. అందరికీ ప్రియంగా మాట్లాడడం

అన్నిటికంటే మంచిది. ఈనాలుగువిధాలా మాట్లాడేవాణ్ణి దేవతలు మెచ్చుకుంటారు.

సత్యమూ, క్షమా, దమమూ, మోక్షపదానికి నిచ్చెనవంటివి. ఇవి సహవాసంవల్లకాని సమకూడవు. కనక సత్సాంగత్యం ముఖ్యం' అంది హంస.

విని కృతార్థులయూరు సాధ్యులు. సంతోషించి మళ్ళీ అడిగారు— 'లోకం దేంతో చట్టుకునివుంది? దేంచేత మనిషి ప్రకాశించడు? ఎంచేత స్నేహితులు వొదిలిలేస్తారు? దేనివల్ల మోక్షం దొరకదు?'

'లోకం అజ్ఞానంతో చుట్టుకునివుంది' అంది హంస— 'మనిషి మచ్చరంవల్ల ప్రకాశించడు. లోభంవల్ల స్నేహితులు వొదిలేస్తారు. సంసారబంధం వల్ల ముక్తి దొరకదు?'

'ఒక్కడూ ఎవడు సంతోషిస్తాడు?' అని అడిగారు సాధ్యులు— 'ఎంతోమందిని ఎవడు సంతోషపెడతాడు? ఎవడు బలవంతుడు? ఎవడు కయ్యానికి కాలుదువ్వడు?'

'ప్రాజ్ఞుడు' అంది హంస— ప్రాజ్ఞుడేవొక్కడూ సంతోషిస్తాడు. ప్రాజ్ఞుడే ఎంతో మందిని సంతోషపెడతాడు? ప్రాజ్ఞుడే బలవంతుడు. ప్రాజ్ఞుడే కయ్యానికి కాలుదువ్వడు.'

'బ్రాహ్మడు దేవత్వం ఎలా పొందుతాడు?' అని అడిగారు సాధ్యులు - 'సాధుత్వం ఎలా పెంపొందుతుంది? అసాధుత్వం ఎలా వస్తుంది? దేనివల్ల దేవత్వం పోయి మానవత్వం వస్తుంది?'

'వేదాధ్యయనంవల్ల బ్రాహ్మడు దేవత్వం పొందుతాడు' అంది హంస— 'వ్రతాల వల్ల సాధుత్వం పొందుతాడు. అపవాదువల్ల అసాధుత్వం వస్తుంది శుచిత్వం లేక, మృత్యుభయంతో దేవత్వం పోయి, మానవత్వం వస్తుంది.'

ఇలా చెప్పి తన నిజరూపం కనపరిచాడు బ్రహ్మ. సాధ్యులు పూజించారు. నవ్వుతూ తనలోకం వెళ్ళిపోయాడు బ్రహ్మ.

సాధ్యుల్ని సంతోషపెట్టడానికే ఈసంవాదం చేశాడు బ్రహ్మ. ఈహంసగీత, విన్నా, చదివినా ఆయుస్సూ, యశస్సూ, శుభాలూ, కుమారుళ్ళూ ప్రసాదిస్తుంది.

## సాంఖ్యమూ - యోగమూ

ధర్మరాజు— సాంఖ్యమూ, యోగమూ— ఈ రెంటి తారతమ్యాలు సెలవియ్యి. వీటి స్వరూపాలు వివరించు.

భీష్ముడు - సాంఖ్యులు తమమార్గం మంచి దంటారు. యోగులు తమమార్గం మంచి దంటారు. ఉభయులూ కారణాలు కనబరుస్తారు. కాని నాకుమాత్రం రెండూ వొకటే అనిపిస్తుంది. యోగులు ప్రతీదానికీ హేతువులు చూపిస్తారు. అంచేత ప్రత్యక్ష హేతువాదులు వాళ్ళు. సాంఖ్యులు శాస్త్రార్థాలు నిరూపించడంలో నేర్పరులు. సద్గతిమాత్రం ఉభయులకీ వొక్కటే. పైకిమాత్రం రెండూ విడిగా అవుపిస్తాయి. కాని భూతదయా, వ్రతచర్యా, శుచిత్వమూ ఉభయులకీ వున్నాయి.

ధర్మరాజు—భూతదయా, వ్రతచర్యా, శుచిత్వమూ వొక్కటే అయితే చూపుకిమాత్రం విడిగా ఎలా అవుపిస్తాయి?

భీష్ముడు — యోగులు యోగబలంవల్ల క్రమంగా ప్రేమా, మోహమూ, కామమూ, కోపమూ, సత్వ రాజస తామసగుణాలూ, వొదుల్చుకుని ఉన్నతిపొందుతారు. పెద్దచేప వల చించుకుని తిరిగినట్టు గొప్ప మృగం వురులు తెంచుకు తిరిగినట్టు, యోగతంత్రానికి అడ్డంకి అయిన లోభగుణాలు చంపుకుని పుణ్యమార్గం లో విచ్చలవిడిగా తిరుగుతాడు యోగి. యోగబలంలేని వొకరకం యోగి, చేవలేనిచేప వలచించలేనట్టు, ఏపులేనిమృగం వురులు తెంచలేక పడివున్నట్టు పాపంలోపడి

వుంటాడు. తక్కువగావున్న నిప్పుమీద కట్టెలు వెయ్యగానే ఆరిపో తుంది. అలాగే బలంలేని యోగం మనిషికి బరువై పోతుంది. దాంతో అతడు తేజస్సు పోగొట్టుకుంటాడు. మండుతున్న అగ్గిలో కర్రలువేస్తే మరింత మంట అధికమవుతుంది. అలాగే సంపూర్ణంగా బలమున్న యోగం, వ్రతాలు అధికమైనకొద్దీ అధికమవుతుంది. బలంలేనివాణ్ణి ప్రవాహ వేగం తోసుకుపోతుంది. అలాగే యోగబలం లేనివాణ్ణి విషయాలు ఈడ్చుకుపోతాయి. బలమైన మదగజం ప్రవాహవేగం ఆపు కుంటుంది. అలాగే యోగసిద్ధితో మనోనిశ్చయంకలవాడు విషయాల ఉధృతం ఆపుకుంటాడు. కోపించిన యముడూ, క్రోధంతో నిప్పులు కక్కుతూన్న మృత్యువూకూడా యోగబలమున్న వాడివేపు తేరిచూడ లేరు. అడ్డూ ఆపూ లేకండా తిరుగుతా డతడు. భోగమూ, తపస్సూ, మోక్షమూ, నిర్మోహమూ మనస్సులో ఆటల్లా భావించి అనుభవిస్తూ, మానుతూ వుంటాడు యోగి. దేనికీ చిక్కడు. ఇదీ స్థూలంగా యోగ స్వరూపం. సూక్ష్మమైన మార్గాలు సావధానంగా వింటే నీమనస్సు తేరుకుంటుంది. విలుకాడు గురిచూసి వేసినట్టు యోగి ఏక లక్ష్యంతో మోక్షం సాధిస్తాడు. నేతికుండ పట్టుకుని పాకుతూ సోపానాలు ఎక్కిన నేర్పరిలాగ, యోగపరిణతికల యోగి ఆత్మమీద గురి పెట్టుకుని ముక్తి మెట్లు ఎక్కాలి. రథికుడికి సారథిలాగ, పోడ ఎక్కిన వాడికి పరంగులాగ ఆత్మని మంచిమార్గంలో నడిపించాలి యోగి. తలా, నాభీ, హృదయమూ, రొమ్మూ, చెవులూ, రెండుపక్కలూ ముఖ్యస్థానాలు. ఆత్మలో వీటిని శ్రద్ధగా చూస్తాడు యోగి.

ధర్మరాజు - యోగి ఎలాటి ఆహారం వొదిలిపెట్టాలి ? ఎలాటి ఆహారం పుచ్చుకోవాలి ?

భీష్ముడు - యోగిరుచికలపదార్థాలు విడిచిపెట్టాలి. నీరసమైన ఆహారంతోనూ, నీళ్ళతోనూఆకలితీర్చుకోవాలి. అవైనా కడుపునిండా హెచ్చుగా తినకండా వుంటేనే బలం కలిగిస్తాయి.

కామమూ, క్రోధమూ, నిద్రా, తృష్ణా, భయమూ, రతీ, విచారమూ, వాయువుగతీ విడిచి యోగధారణతో నిశ్చలుడై, తన్ను తాను చూస్తూవుండే యోగి, దుఃఖస్థానమైన శరీరం విడిచిపెట్టి, సుఖస్థానమైన మోక్షం చేరుకుంటాడు. వ్రతధారణాశక్తి కత్తిమీాద సాము. దిట్టుపడిన యోగికి అసాధ్యమైన కార్యమే లేదు. యోగం రూఢిపడినవాడు సంసారంలో వున్నా, సంసారంవిడిచిపెట్టేసినా సంతోషంగానే వుంటాడు. జననంగత్యమూ, చావూ, దైన్యమూ, భోగాభోగాలూ, సుఖదుఃఖాలూ అతడికిలేవు. శాంతంగా వార్క్షదగ్గరేవున్నా, నదులూ, సముద్రాలూ, కొండలూ, దీవులూ అన్నీ కేళీస్థానాలే అతడికి. గుహ్యా, గుహాలూ నివాసస్థలాలే.

ధర్మరాజు - యోగతంత్ర విధానం నీఅనుగ్రహంవల్ల అవగతమైంది. సాంఖ్యరూపం సెలవియ్యి.

భీష్ముడు — కపిలుడూ మొదలైన మహామునులు చూపిన మార్గం సాంఖ్యం. దృఢమైన జ్ఞానంతో విషయాలవిధానం విమర్శించాలి. పశువులూ, పక్షులూ, మనుష్యులూ, గరుడులూ, దేవతలూ, సిద్ధులూ, గంధర్వులూ, కిన్నరులూ అందరిలోనూ విషయాలు వేరువేరుగా వుంటాయి. వేదవాక్యాలవల్ల వ్యక్తమవుతాయవి. 'ఈ భేదాలు తెలుసుకోడం దేనికి ?' అని అనుకోకూడదు. తెలుసుకుంటేనే అందులో దోషాలు తోచినప్పుడు దూరం తప్పుకోవచ్చు. ఆయువు ఇంతేకదా అనీ, సుఖదుఃఖాలు కాలంవల్లకలుగుతాయనీ, కర్మలు ఇలాటివనీ, వేదాలవివిధ మార్గాలు ఇలాటివనీ, సత్వరజస్తమోగుణాల ప్రవర్తనలు ఇలాటివనీ తెలుసుకోడంవల్ల ఎంతో మేలు కలుగుతుంది.

ఇంద్రియాలవిషయాలు అయిదింటిలో అయిదు ఇంద్రియాలూ, నట్టింటిలో నిప్పూ, బయల్లో గాలీ, అగ్గిలో నీరూ, నీటిలో భూమీా, ఇంద్రుడిలో బలమూ, విష్ణువులో తేజస్సూ, ధనంలో లోభమూ,

తమోగుణంలో బుద్ధీ, రజోగుణంలో తమస్సూ, సత్వంలో రజస్సూ, ఆత్మలో సత్వమూ తగిలివుంటాయి. నారాయణుడూ, మహేశ్వరుడూ ఆత్మ. బ్రహ్మంలో లగ్నమై వుంటుందని బ్రహ్మం మోక్షంలో వుంటుంది. ఎందులోనూ లగ్నంకాదు బ్రహ్మ.

పదహారు వికారాలకీ ప్రకృతిఆశ్రయం* ఆత్మకీ అదేవునికిపట్టు. ఆత్మ నిష్కల్మషమైన తేజస్సుతో ప్రకృతీ, వికృతీ కాకండా ప్రకాశిస్తుంది. ఆత్మకి రెండురూపాలున్నాయి. ఒకటి విషయ సాంగత్యం కలిగి వుంటుంది. మరొకటి అదిలేకండా సుధ్యస్థభావంతో వెలుగుతూ వుంటుంరి.

గాలి వొక్కటే ప్రాణమూ, అపానమూ, ఉదానమూ, సమానమూ, వ్యానమూ ఈఅయిదు భేదాలూ దానివే. వాటివిధం తెలుసుకుంటే అది నిశ్చల మవుతుంది. ఆ సుకృతం అంతరాత్మ చూపుతుంది. గర్భవాసదుఃఖమూ, జన్మదుఃఖమూ, బాల్యదుఃఖమూ, మూఢత్వమూ, మోహమూ, కష్టమూ, ముసిలితనంవల్ల పుట్టిన కృపణతలూ చూపుతుంది. బంధాలు విడిపిస్తుంది.

జీవుడు పుణ్యాలుచేసి దేవత్వం పొందుతున్నాడు. మధ్యరకం కర్మలుచేసి మనిషై పుడుతున్నాడు. పాపకర్మలు చేసి పశువై పుడుతున్నాడు. ఈభేదాలు తెలుసుకున్నవాడు ముక్తిపొందుతాడు. చంద్రుడూ, సముద్రమూ మొదలైనవి తరుగుతూ, పెరుగుతూవున్నాయి. మూఢుడు ఇది తెలుసుకోడు. బంధునాశనం కోసం విచారిస్తాడు. ఇది తెలుసుకుంటే ముక్తి దొరుకుతుంది.

తనదేహంలోని దోషాలు కనుక్కొని ముక్తికి ప్రయత్నించేవాడు వెయ్యిమందిలో ఏవొక్కడో వుంటాడు. అహంకారంవల్ల హెచ్చుమంది వుండరు.

* పదహారు వికారాలు : జ్ఞానేంద్రియాలు ఐదు. కర్మేంద్రియాలు ఐదు మనస్సూ, బుద్ధీ, అహంకారమూ, సత్వగుణమూ, రజోగుణమూ, తమోగుణమూ.

ధర్మరాజు — దేహదోషాలంటే ఏమిటి ?

భీష్ముడు — కామమూ, క్రోధమూ, భయమూ, నిద్రా, ఊపిరీ - ఈఅయిదూ దేహంలోని దోషాలు ఇవి వొదుల్చుకునే ఉపాయం విను. సంకల్పం మానుకోడం కామానికి శత్రువు. ఓర్పు క్రోధానికి శత్రువు. జాగ్రత్త భయానికి శత్రువు. సత్యవ్రతం నిద్రకీ, మితభోజనం ఊపిరికీ శత్రువులు. ఆయాదోషాలు వాటివాటి శత్రువులతో తొలగించుకోవాలి. దోషాలు వొదుల్చుకునే మార్గాలు ఇంకా ఎన్నో వున్నాయి. తెలివికలవాడు వాటిని తెలుసుకుంటాడు. గోడమీాది చిత్రాల్లాగ, నీటిమీాది నురుగులాగ ఈలోపాలన్నీ విష్ణుమాయతో కనిపిస్తున్నాయి. పండితుడు వీటిని గణించడు; మోక్షమార్గం వెదుకుతాడు. ఇది సాంఖ్యప్రకారం.

సంసారం వొక సముద్రం. దుఃఖమే దీని నీరు. రోగాలూ, మృత్యువూ ఇందులోని మొసళ్ళు. భయం పాము. హింస వడి. ప్రేమ బురద. ఆశ సుడి. ప్రీతి రత్నం. సత్యం రేవు. వెలపలి స్పర్శలు తపస్సనే దుడ్డుకర్రతో తరిమేసి సాంఖ్యం వొడ చేసుకునే పూజ్యుడు ప్రజ్ఞఅనే చుక్కాని పట్టుకుని సంసారసముద్రం దాటేస్తాడు. అక్కడ సూర్యకిరణాలమీాద, తామరతూడులోని పొగలాటి దారిలో ప్రవేశించి, వెళ్ళగా వెళ్ళగా సూక్ష్ముడూ, చల్లనివాడూ, సుగంధీ, సుఖంగా తాకేవాడూ, సప్తమారుతశ్రేష్ఠుడూ అయిన గాలి ఎదురొక్కాని ఆకాశమనే ఉత్తమగతి చేరుస్తాడు. ఆకాశం రజఃపరమగతి చేరుస్తుంది. రజస్సు సత్త్వపరమగతి చేరుస్తుంది. సత్త్వం నారాయణుణ్ణి చేరుస్తుంది. నారాయణుడు పరమగతి చేరుస్తాడు. అందులో కలిసి తన్మయుడై అమృతత్వం పొందుతాడు సాంఖ్యుడు. శాశ్వతుడవుతాడు.

ధర్మరాజు — అలా అమృతస్వరూపుడై, శాశ్వతుడైన ఆమహాత్ముడు తన పూర్వవృత్తాంతం తలుచుకుంటాడో, తలుచుకోడో ?

దాని నిశ్చయవిషయం అయోమయం. మోక్షంకోసం కేవలం జ్ఞానికావడంవల్ల మనిషికి ఎలాటిగతి ప్రాప్తమవుతుందో? ఈ సంశయంవల్ల ప్రవృత్తిధర్మంకంటే ఇది మేలనిపించకండా వుంది. ఈరెండు మార్గాలూ చెప్పడానికి నీకంటే లోకంలో మరొకళ్ళు లేరు.

భీష్ముడు — అడగవలిసి ప్రశ్నే అడిగావు. చిక్కయిన విషయమే ఇది. ఎంత తెలిసినవాళ్ళయినా ఇక్కడ తటపటాయిస్తారు. ఈవిషయంలో కపిల దర్శనం తెలిసిన మునీంద్రుల ఉత్తమ మతం విడమరచి చెపుతాను. సావధానంగా విను.

ఇంద్రియాలు మనస్సులో వుంటాయి. అంచేత అవి ఆత్మని ఎరగవు. మనస్సాంగత్యంవల్ల ఇంద్రియాలు తెలుసుకుంటుంది ఆత్మ. ముక్తిపొందినాపొందకపోయినా ఆత్మకి వొక్కటే అది. విజ్ఞానామృతస్వరూపమైన ఆత్మ, విషంలేనిపాముల్లావున్న ఇంద్రియాలు చూసినా, చూడకపోయినా వొకటే. ఆత్మవొదిలిపోగానే ఇంద్రియాలు కర్రలాగ, గోడలాగ, పొణకలాగ మిగిలిపోతాయి. సముద్రం నురుగులా తేలిపోతాయి. ఇదంతా ఈశ్వరలీల.

ఇంద్రియాలతో కలిసివున్నా ఆత్మ, తాను తెలుపుకుంటే మాత్రం వాటి సూక్ష్మగతులు తెలుసుకుని వికారాలకి లోబడదు.

భూతాలూ, గుణాలూ, బుద్ధీ, మనస్సూ అణుచుకుని జీవుడు నారాయణుణ్ణి చేరుకుంటాడు. నారాయణమహాత్మ్యంవల్లపరమపదం పొందుతాడు. అంచేత జీవుడికి పుణ్యపాపాలు లేవు. పరమపదంచేరిన జీవుడు తిరిగి పుట్టడు. అదుగో అదే మోక్షం. అంతకి మించిందిలేదు.

మోక్షం నిరూపించడంలో శ్రద్ధకలిగి, గురువు ఆజ్ఞప్రకారం నియతిసాధించే పురుషుడు శాంతిపొందుతాడు.

ధర్మరాజా! ఇదీ సాంఖ్యమంటే. బ్రహ్మగౌరవించిన ధర్మమిది. బ్రహ్మత్వం పొందాలంటే దీన్నిమించిన ఉపాయంలేదు. సందేహించ

కండా సాంఖ్యపద్ధతిని శరీరం వొదిలిపెట్టిన వాడికి మళ్ళీ పుట్టుక వుండదు. ఏళ్ళకి సముద్రంలాగ — వేదాలూ, శాస్త్రాలూ, పురాణాలూ చదివి సంపాదించిన జ్ఞానాలన్నిటికీ సాంఖ్యమే గమ్యస్థానం.

యోగులూ, సాంఖ్యులూ అనుసరించే మార్గాలు వివరించాను. ఇవి ఇలా వున్నాయి కనక నే పైకిమాత్రం భేదంగా వున్నట్టు కనిపిస్తున్నాయి అన్నాను. ఆభేదం కూడా ఎంతో తక్కువ. అదీ కాక, యోగి చూసినట్టే సాంఖ్యుడూ చూస్తాడు. సాంఖ్యుడు చూసినట్టే యోగీ చూస్తాడు. అంచేత ఇద్దరూ ఒక్కలాటివాళ్ళే అంటారు మునీశ్వర్లు.

యోగమార్గంలోనూ, సాంఖ్యమార్గంలోనూ ఏవిధంగానో తప్పినా చెడడు. స్వర్గసౌఖ్యం పూర్తిగా అనుభవిస్తాడు. తిరిగి పండిత వంశంలో పుడతాడు. ఈమార్గాలు మనసుకి పట్టించుకుంటే ముక్తి పొందే యోగ్యత కలుగుతుంది. ఈమార్గం నారాయణుడే చూపగలడు. ధర్మరాజా! అక్షరమైన పరమాత్మని చూపే ఈవిధానం అలవరుచుకో

---

# శాంతిపర్వం

## ఆరో ఆశ్వాసం

---

"తండ్రీ!" యోగులూ, సాంఖ్యులూ అక్షరులై ఆనంద స్వరూపు లవుతారు అన్నది విని భీష్ముడితో అన్నాడు ధర్మరాజు— "నువ్వు జ్ఞాననిధివని వేదాలెరిగిన బ్రాహ్మలు చెప్పడమూ, సాంఖ్యయతులూ, యోగులైన మునులూ నిన్ను పొగడడమూ వింటూ ఆనందిస్తున్నాము. దక్షిణాయనం ఇంక కొద్దిదినాలే మిగిలుంది. సూర్యుడు ఉత్తరాయనం ప్రవేశించడంతోనే నువ్వు మోక్షం చేరుకుంటావు. మేం మరి ఎవళ్ళదగ్గిర వింటాం? కౌరవవంశానికి ప్రజ్ఞాఘృతంతో వెలుగుతున్న దీపం నువ్వు. నీ తేజస్సునే ఆశ్రయిస్తున్నాం. నువ్వు నిర్దేశించిన అక్షరం అంటే ఏమిటి? క్షరమంటే ఏమిటి? సెలవియ్యి" అని అడిగాడతడు.

### క్షరమూ - అక్షరమూ

భీష్ముడు – వశిష్ఠ జనక సంవాదం అని వొక ఇతిహాసం వుంది. అది వింటే నువ్వు అడిగింది తెలుస్తుంది. ఇంక కొంత కూడా అవగతమవుతుంది.

వశిష్ఠమునికి పాదాభివందనంచేసి, వినయంగా అడిగాడు జనకుడు – 'ఏది అక్షరమైంది? ఏది పురాతనమైంది? ఏది శుభప్రదమైంది? ఏది ముక్తిప్రదమైంది?'

అక్షరతత్వం ఇలా చెప్పాడు వశిష్ఠుడు – 'అంతటా కళ్ళూ, మొహాలూ, చేతులూ, పాదాలూ కలిగి, తరుగుదలా, పెరుగుదలా లేకండా వొక్కటేఅయున తత్వమే అక్షరం అంటారు పండితులు.

దానివల్ల పుడుతూ, చస్తూ వున్న తత్వాలు క్షరమంటారు. అవి ఇరవై నాలుగు.

'అక్షరం వికారమైన వన్నెలతో వుంటుంది. ఆ వికారానికే ప్రకృతి అనీ, ప్రధానమనీ, అవ్యక్తమనీ పేళ్ళు. దానిలోంచే మహత్తు అనే తత్వం పుడుతుంది. మహత్తులోంచి అహంకారం పుడుతుంది. అహంకారంలోంచి ఆకాశమూ, గాలీ, తేజస్సూ, నీరూ, నేలా - అయిదు భూతాలూ, శబ్దమూ, స్పర్శా, రూపమూ, రసమూ, గంధమూ - అయిదు గుణాలూ, వాక్కూ, చెయ్యీ, పాదమూ, గుదమూ, ఉపస్థా - అయిదు కర్మేంద్రియాలూ, చెవీ, చర్మమూ, కన్నూ, నాలుకా, ముక్కూ - అయిదు జ్ఞానేంద్రియాలూ, మనస్సూ, పుడతాయి. ఈ ఇరవైనాలుగూ క్షరాలు. అక్షరం క్షరం కాదు. ఈ అక్షరవిలాసాలే క్షరతత్వాలు. ఈ ఇరవైనాలుగూ విజ్ఞానంవల్ల తెలుస్తాయి. ఇరవైఅయిదో తత్వమైన అక్షరం పరమ తత్వం. అది తెలుసుకోడం అసాధ్యం. దానికి నాశనమంటూ లేదు. కలంక మంటూ లేదు. రాగమంటూ లేదు. మరణమంటూ లేదు. అంతటా వినయంగా సంచరిస్తుం దది. రజస్సూ, తమస్సూ, సత్వమూ - మూడుగుణాల దోహదంతో అది, తనకి ప్రబోధం లేకపోయినా రకరకాల యోనుల్లో పుడుతూవుంటుంది. ఆగుణాల అనుసరణవల్ల రకరకాలయోనుల్లో పుట్టిన ఆ అక్షరతత్వం తన్ను తాను చూడలేక అవే తాను అనుకుంటుంది.

'గుణాల వశమైన అక్షరం సత్వగుణంతో ధర్మాలుచేసి సివ్యత్వంపొందుతుంది; సుఖపడుతుంది; తెలుపుగా మారుతుంది. రజోగుణంతో తాగుబోతుపనులుచేసి, మానవత్వం పొందుతుంది; దుఃఖపడుతుంది; ఎరుపుగా మారుతుంది. తమోగుణంతో పాపాలుచేది పశువుజన్మా, పక్షిజన్మా ఎత్తుతుంది; నరకం అనుభవిస్తుంది; నలుపుగా

మారుతుంది. గుణమంటూ ఏదీ లేందేఅయినా అహంకారం కలిగిందో, గుణాలు పొందుతుంది. అహంకారమూ, వికారమూ అంటకపోతే గుణాలూ అంటవు. నిర్వికారంగా ప్రకాశిస్తుంది.

'మొదటిదీ, చ్యుతంకానిదీ, నిర్మలమైందీ అయిన అక్షరం మేలుకోక, తన్ను తాను చూడక, యజ్ఞాలూ యాత్రలూ ఉపవాసాలూ వ్రతాలూ చేస్తూ, నేలమీద నిద్రపోతూ, జడలూ నారబట్టలూ కడుతూ శరీరం కష్టపెడుతుంది. చావూ, పుట్టుకా, ముసిలితనమూ, మాలిన్యమూ లేంది అక్షరం. అయినా మమకారంవల్ల అవి తనకి వున్నాయని అనుకుంటుంది. తనకిగుణాలూ లేవు. అయినా తన్ను తాను బంధించుకొనే పొత్తినూలికాయ పురుగులాగ, ప్రకృతిగుణంలో పడి, గుణాలు చుట్టుకుంటుంది. నిర్మలమైన వాయువు సేవించి, నిర్మలత్వంతో పదహారుకళల పూర్ణచంద్రుడిలాగ, అఖండమైన శాంతిబోధతో ప్రకాశిస్తుంది' అన్నాడు.

విని, 'ఆడదీ మగాడూ వొకళ్ళతో వొకళ్ళు కలియగలరు. అంతేకాని ప్రత్యేకంగా వొక రూపం పుట్టించేనేర్పు వాళ్ళకి లేదు. వేదమతం ఇది. చర్మమూ, మాంసమూ, రక్తమూ ఇవి స్త్రీగుణాలు. మూలుగులూ, నరాలూ, ఎముకలూ పురుషుడిగుణాలు. పశువుల్లోనూ, పక్షుల్లోనూ, మనుషుల్లోనూ అందరిలోనూ ఇలాగే వుంటుంది పుట్టుక. స్త్రీపురుష సంయోగమే ఆత్మకీ ప్రకృతికీ గల సంబంధం. అన్నిటి పుట్టుకా ఇలాగే వుంటుందని వేదాలు చెపుతున్నాయి. ప్రకృతి పురుషుల సంబంధం భావిస్తే ముక్తికి మార్గమే కనపడదు. కనక మోక్ష మార్గం సెలవియ్యి. సాటిలేందీ, ఇంద్రియాలు గెలిచిందీ, ముసిలితనమూ శాస్త్రాలూ అంతమూలేందీ, నిర్మలమైందీ అయిన వొక వెలుగు వుందని వేదాలు చెప్పడం విన్నాను. అదేమిటి?' అని అడిగాడు జనకుడు.

మళ్ళీ అందుకున్నాడు వశిష్ఠుడు - 'రాజా! నువ్వు గ్రంథాలు చూశావు. కాని అర్థం బోధపడలేదు నీకు. అర్థం బోధపడని గ్రంథ పఠన వ్యర్థం. కనక చెపుతాను విను. సాంఖ్యమూ, యోగమూ వొకటే అంటారు పండితులు. రెంటికీ వేదమే తల్లి. పుల్లింగమూ, స్త్రీలింగమూ, నపుంసకలింగమూ అని లింగం మూడువిధాలు. ఆత్మ ఈమూడు లింగాలకీ చెందదు. అలింగం అది. ఇదే చెపుతున్నాయి వేదాలు. బీజంలో బీజం పుడుతుంది. దేహంలో దేహం పుడుతుంది. ఇంద్రియాలవల్ల ఇంద్రియాలూ, మనస్సువల్ల మనస్సూ పుడుతున్నాయి. ఆత్మకి బీజంలేదని, దేహంలేదనీ, ఇంద్రియాలూ, మనస్సూ లేవనీ చెపుతున్నాయి వేదాలు. గుణాలులేవు కనక పుట్టుకా, దుఃఖమూ, కర్మా మొదలైనవికూడా లేవు. ప్రకృతికికూడా వొక లింగమంటూ లేదు. దానివల్ల పుట్టినవాటికి మాత్రం లింగ ముంది. లింగాలు కలవాటి సాంగత్యంవల్ల లింగాలున్నట్టు కనపడుతుంది తాను. మూర్తి లేకపోయినా గుణాలు ప్రకృతివే. ఆత్మకి గుణాలులేవు. మంచిది చెడ్డదవుతుందా? ఇది అక్షర (ఆత్మ) క్షర (ప్రకృతి) వివేకం.

'ఏకమూ - అనేకమూ, దర్శనమూ - అదర్శనమూ, నిస్తత్వమూ - తత్వమూ, అపవర్గమూ - వర్గమూ అని అక్షర - క్షరాల పర్యాయపదాలు. అజ్ఞానులు అక్షరం చూడలేరు. బుద్ధికి అంద దది. జ్ఞానం కల సాంఖ్యులూ, యోగులూ మాత్రం చూడ గల రది' అన్నాడు.

మళ్ళీ అడిగాడు జనకుడు - 'ఆత్మకి ఎన్నో తత్వాలున్నాయనీ, అవిద్యా, విద్యా రెండూ వున్నాయనీ విన్నాను. అక్షర క్షరాల భేదం చెప్పావు. కాని మందబుద్ధినాది. మరిచిపోయాను. సాంఖ్యమూ, యోగమూ వీటి వివరం సెలవియ్యి.'

'యోగమంటే ధ్యానం' అన్నాడు వశిష్ఠుడు — 'ప్రాణాయామ మనీ, ఏకాగ్రవృత్తి అనీ రెండువిధాలు. ఒకటి సగుణం. రెండోది నిర్గుణం. అవి ఎలా ఆచరించాలో విను.

'మలమూత్రాలు విడిచినప్పుడూ, భోజనంచేశాక యోగం తాలూకు ఈరెండుమార్గాలూ కూడదంటారు పూర్వాచార్యులు.

'మితంగా భోజనంచేస్తాడు యోగి, సంసారం బాదరబందివొదిలేస్తాడు. ఇంద్రియాలవెంటపోడు. శబ్దమూ మొదలైన విషయాలు మనసులో సందడిచెయ్యనివ్వడు. మంచిబుద్ధి దృఢసాధనం చేసుకుంటాడు. ఇంద్రియాలు మళ్ళిస్తాడు. ఆత్మలో మనస్సులగ్నంచేస్తాడు సంకల్పాలు వొదులుకుంటాడు. రాయిలాగ, మోడులాగ పడివుంటాడు. పగలూ, రాత్రీ యోగంలోనే వుంటాడు. గాలిలేని దీపంలాగ వెలుగుతున్న తనమూర్తిని చూస్తూ మధ్యమధ్య విరమణకాలాలు గడుపుతూ ఆనందిస్తాడు. ఇది యోగవిధానం.

'సాంఖ్యంవిను. ప్రకృతివాదులు అవ్యక్తాన్ని ప్రకృతి అంటారు. పుట్టించడమే ధర్మం ప్రకృతికి. కనక బుద్ధీ, అహంకారమూ, పంచభూతాలూ, విషయాలూ, ఇంద్రియాలూ - ఇలా తన్నుతాను పెంచుకుంటుం దది. ఆత్మవల్లేఇవన్నీ కలుగుతాయి. అదే అన్నిటికీ అధిదేవత. ఆత్మ ఎగుబాటువల్ల సృష్టిజరుగుతుంది. దిగుబాటువల్ల నాశనం జరుగుతుంది. సృష్టివల్ల బహుత్వమూ, నాశనంవల్ల ఏకత్వమూ సంక్రమిస్తుంది. క్షేత్రమూ. అవ్యక్తమూ, ప్రకృతీ, ప్రధానమూ - ఇన్ని పేర్లతోనూ వున్న తత్వంవొక్కటే. జీవుడు క్షేత్రం తెలుసుకుంటాడు. కనక క్షేత్రజ్ఞుడనిపించుకుంటాడు. అవ్యక్తపురంలో

పుట్టాడు కనక పురుషు డనిపించుకుంటాడు. క్షేత్రమూ, క్షేత్రజ్ఞుడూ, వేరన్నమాట స్పష్టం. క్షేత్రం జ్ఞానమనీ, పురుషుడు దానివల్ల తెలుసుకోదగినవాడనీ, క్షేత్రం గుణాలు కలదనీ, పురుషుడు గుణాలు లేనివాడనీ, సాంఖ్యుల మతం. ఈక్రమంలో జీవుడు ఇరవైనాలుగుతత్త్వాలూ విస్మరించి. తన్ను తాను కనుక్కొని ముక్తుడవుతాడు. ముక్తి అంటే మళ్ళీ పుట్టకండా వుండడమే. తత్త్వాలు ఇరవైనాలుగూ నాశనమైపోతాయి. ఇరవైఅయిదో తత్త్వం ఆత్మకి నాశనంలేదు. అదే తెలుసుకోదగింది. ఇది తెలుసుకున్నవాళ్ళు నిర్భయులవుతారు. రాజా! యోగం చెప్పాను. సాంఖ్యం చెప్పాను అక్షరమూ, క్షరమూ చెప్పాను విద్యా అవిద్యా ఆలకించు.

## విద్యా అవిద్యా

'విద్య అంటే ఇరవైఅయిదో తత్త్వం అక్షరమే. అవిద్యఅంటే క్షరం. విశేషంగా విడమర్చి చెపుతాను. కర్మేంద్రియాలకి బుద్ధీంద్రియాలు విద్య. బుద్ధీంద్రియాలకి మనస్సు విద్య. మనస్సుకి పంచభూతాలు విద్య. పంచభూతాలకీ హాంకారంవిద్య. అఅహాంకారానికి బుద్ధివిద్య. బుద్ధికి ప్రకృతి విద్య. ప్రకృతికి ఆత్మవిద్య.

'క్షరమూ, అక్షరమూ రెండూ వివరించాను కదూ! ఇంకోకటి సావధానంగా విను. జీవుడు అక్షరం. ప్రకృతి క్షరం. అయితే ఈరెండూ క్షరములే, రెండూఅక్షరములే అంటారు పెద్దలు. ఏమంటే రెంటికీ తుదీ, మొదలూ లేదు. రెంటిలోనూ ఈశ్వరత్వం వుంది. రెండూ తత్త్వాలే. అంచేత రెండూ సమానమే. ప్రకృతిగుణాలైన మహత్తూ, అహంకారమూ మొదలైనవాటితో కలిసినప్పుడు ఆత్మ ప్రకృతి అనుకుంటుంది. అంచేత క్షరమని చెప్పవచ్చుదాన్ని. ప్రకృతి

తానే ఆత్మతో కలిసినప్పుడు గుణవికారాలు లేకండా వుంటుంది. అప్పుడు దాన్ని అక్షరం అనవచ్చు.

'ఆత్మ తెలుసుకుని' 'ఇంతకాలంనించీ తెలియక సంసారంలో పడి తెలివిమాలిన ప్రకృతి నే నన్నాను. సాంగత్యం వొదులుకునే దారి కనపడదు. చేప వేరూ, చేపవున్న నీరు వేరూ అయినట్టే ప్రకృతివేరూ, నేను వేరూ అయినా అహంకారంవల్ల అదే నేను అన్నాను. గుణాలతో ప్రకృతి రకరకాలై నన్ను వెర్రెత్తించింది. కలంకం లేని నేను, రూపం లేనినేను ప్రకృతినించి వేరై నిలబడతాను. ఈ అపరాధం ప్రకృతిచేసిందా? కాదు. నేనే చేసుకున్నాను. సాంగత్యంలేని నేను దాంతో ఎందుకు కలవాలి? దాంతో కలియడం వల్లేకదా, ఇన్నిరూపాలు కలిగాయి నాకు? మోహంవల్లే ఇన్నిజన్మ లెత్తాను. ఇది వొదిలేస్తాను. నానాయోనుల్లో పుట్టడమూ, చావడమూ మానుకుంటాను. పరిశుద్ధుణ్ణయిన నాకు ప్రకృతి ఆశ్రయ మెందుకూ? ఎన్నిరూపాలతో వచ్చినా ఎలా అవుపించినా దాన్ని నేను చూడను. అహంకారమూ మమతా దగ్గిర చేరనివ్వను. ఇక ప్రకృతి ఎలా కనిపిస్తుంది? చేతనంలేని దుశ్చేష్టల ప్రకృతిని వొదిలి పెడతాను. నిశ్చయసంకల్పంతో నిరామయమైన, నిశ్చలమైన, నిర్మల మైన ఆనందం అనుభవిస్తాను' అనుకుంటుంది. ఈ తెలివితో క్షరమైన ప్రకృతితో వేరుపడుతుంది.

'అక్షరంకంటే ఉత్తమమైన ఇరవైఏడో తత్వం ఎంతో మంది ఎరగరు. సూక్ష్మదర్శకులైన సాంఖ్యులు తెలుసుకుంటారు. క్షరమూ, అక్షరమూ కంటే ఉత్తమమైంది ప్రబుద్ధమూ, బుధ్యమానమూ, బుద్ధమూ అనిపించుకుంటుంది. బుద్ధమూ, విమలమూ, అప్రమే యమూ, సనాతనమూ అయిన పరతత్వం 'ఇరవై ఆరోది. ఇరవై అయిదో తత్వాన్నీ, ఇరవైనాలుగో తత్వాన్నీ చూస్తూ ప్రకాశిస్తుం

దది. కనపడే జీవానికీ, కనపడని పరతత్వానికీ బ్రహ్మమనే పేరు ప్రకృతికి అది లేదు. ఇక అక్షరస్వరూపం వివరిస్తాను.

'ప్రకృతిసంబంధం వొదిలిపెట్టి తన్ను తాను చూస్తున్న జీవుడు పరతత్వం చూస్తాడు. దాంతో ప్రకృతిగుణాలు వొదిలి పెట్టి తన్మయత్వంతో జీవుడు కేవలత్వసిద్ధి పొందుతాడు. కేవలుడైన జీవుడు తన్ను పరమతత్వంగా తెలుసుకునితల్లీనత్వంతో ప్రకాశించడమే అనంతపదమైన మోక్షం. నిర్మలమైన మనస్సుతో శాస్త్రాల అర్థమూ, తాత్పర్యమూ తెలుసుకుంటేనే, జీవుడి ఏకత్వమూ, అనే కత్వమూ అవగతమవుతుంది. అదే మోక్షమార్గం. జీవుడు తానే ప్రకృతి అనుకుని కట్టుపడడంచేత అతడికే మోక్షం అవసరం. సంబంధం వొదులుకుని పరతత్వంలో కలిసిన జీవుడికి కేవలత్వంఅలవడు తుంది. శుచిత్వమూ, స్వాతంత్ర్యమూ, సత్వగుణమూ అబ్బుతాయి. సనాతనమైన, అవికారమైన బ్రహ్మానదం నీకు వివరించాను. కనక భయం విడిచిపెట్టు. దృఢత్వం అలవరచుకో, భక్తి, శమమూ, దమమూ వున్న వాళ్ళకి ఈవిద్య ఉపదేశించు. లేని వాళ్ళకి చెప్పకు. అపాత్రదానం కూడదు. భూమండలం యావత్తూ ఇచ్చేసినా ఇచ్చెయ్యి, కాని యోగ్యతలేనివాడికి ఈవిద్య ఉపదేశించకు. తగిన పాత్ర దొరికితే మాత్రం తక్షణం ఉపదేశించు.

వశిష్ఠముని చెప్పిందంతా సావధానంగా విన్నాడు జనకుడు. కృతార్థుడయాడు. ఇది వశిష్ఠుడికి బ్రహ్మ చెప్పాడు. అతడు నారదు డికి చెప్పాడు. నారదుడు నాకు అనుగ్రహించాడు. వశిష్ఠుడు చెప్పి నట్టే నేను నీకు చెప్పాను. నిర్మలమైన మనస్సుతో ఈజ్ఞానం అలవర చుకో. పరమానందం అనుభవిస్తావు. క్షరమూ, అక్షరమూ, పర తత్వమూ, తెలుసుకున్నావు. శోకమూ, భయమూ, మోహమూ విడిచిపెట్టు. మోక్షం కలిగించే ప్రబోధం అనుసరిం

ఇంకో కథ చెపుతాను. విను. జనకచక్రవర్తికొడుకు వసుమంతుడు వేటకని అడివికి వెళ్ళాడు. ఒక దగ్గిర భృగువంశమునీశ్వరుణ్ణి ఒకణ్ణి చూశాడు. వినయంగా నమస్కరించాడు. 'ఎలానడుచుకుంటే ఇహమూ పరమూ సిద్ధిస్తుంది?' అనిఅడిగాడు. 'పేరాసతో ప్రాణులకి కీడుచేస్తే దుఃఖమూ, మేలుచేస్తే సుఖమూ కలుగుతాయి. కనక అదిమనసులో వొదిలిపెట్టడం క్షేమం. తేనెకోసం ఆశపడి మనుష్యులు దుఃఖమనే కొండచరియమీద కెక్కి చెయ్యీ, కాలూ విరుచుకుంటామని తెలుసుకోరు. ధర్మమూ, జ్ఞానమూ, నిర్మలమైనమనస్సుతో అలవరించుకుని ఎప్పుడూ ధర్మంతో వుంటే ఉభయలోకాల్లోనూ సౌఖ్యం కలుగుతుంది. మునులూ, బ్రాహ్మలూ కోరేపనులు చెయ్యి. పాత్రోచితమైన దానంచెయ్యి. ఇచ్చి విచారించకు. క్రోధం విడిచిపెడితే కామం దూరమవుతుంది. ధైర్యం సడలనివ్వకు. ధైర్యంలేకపోడంచేతే మహాభిష మహారాజు స్వర్గభ్రష్టుడయాడు. ధైర్యం పూనడంచేత యయాతి అదే ఆపద తప్పించుకున్నాడు.'

ఆముని ఉపదేశం ప్రకారం వసుమంతుడు కామక్రోధాలు వొదిలేశాడు. ధైర్యంతో ధర్మం అవలంబించాడు.

ధర్మరాజు - ధర్మాధర్మాలూ, సంశయాలూ లేంది ఏది? చావుపుట్టుకలు లేందీ, శాశ్వతమైందీ ఏది? శుభమైందీ, నాశనంలేందీ, పవిత్రమైందీ, ఉత్తమమైందీ ఏది?

## యాజ్ఞవల్క్య జనక సంవాదం

భీష్ముడు -- విజ్ఞానంలో పేరెక్కినవాడు యాజ్ఞవల్క్యముని. అతణ్ణి వినయంగా అడిగాడు జనకుడు - 'మునీంద్రా! ఇంద్రియాలూ, అవ్యక్తమూ, బ్రహ్మమూ, పరమూ, భూతసృష్టీ, ప్రళయమూ, ఆయాకాలాల పరిణామాలూ సెలవియ్యి.'

యాజ్ఞవల్క్యుడు వివరించిన మాటలు నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధానమవుతాయి. విను. 'సృష్టిని ప్రళయం అవ్యక్తంచేస్తుంది' అంటూ అందుకున్నాడు యాజ్ఞవల్క్యుడు - 'ఆ కాలసంఖ్య విను. ఒక పగలు పది కల్పాలు. రాత్రీ అంతే. పగలు సృష్టి జరుగుతుంది. రాత్రి ప్రళయం అంతా వ్యాప్తిస్తుంది. అంతులేని జీవరాసులకోసం ముందు ఓషధులు పుట్టించడానికని బ్రహ్మ బంగారం బ్రహ్మాండం పుట్టిస్తాడు. అన్ని భూతాలూ అతడే పుట్టిస్తాడు. భూమీ మొదలైన భూతాలూ, గంధమూ మొదలైన గుణాలూ, చెవీ మొదలైన ఇంద్రియాలూ అతడే పుట్టిస్తాడు. ఇంద్రియాల అధిపతి మనస్సు. అది ఎలా అంటావా? వినడానికీ, చూడడానికీ చెవీ, కన్నూ కదా, సాధనం? అయితే మనః ప్రభావంలేకపోతే ,వాటంతట అవి వినడంకాని, చూడడం కాని చెయ్యగలవా? చెయ్యలేవు. ఇంద్రియాలు అన్నీ అంతే. మరోదగ్గర మనస్సుంటే ఏ ఇంద్రియమూ పని చెయ్యదు. మూఢుడికైనా ఈవిషయం తెలుస్తుంది. ఇంద్రియాల మహిమలన్నీ మనస్సు చేతిలోనే వున్నాయి. మనస్సు వూరుకుంటే ఇంద్రియాలు అడిగిపోతాయి. ఇంద్రియాలు వూరుకున్నంతమాత్రాన మనస్సు అణిగిపోదు. విషయతృష్ణలో పడుతుంది. కనక ఇంద్రియాలచేష్టలు ఎటూ పోకుండా మనస్సు అరికట్టాలి.

'ప్రళయం విషయం విను. రాత్రికావడంతోనే అవ్యక్తం అహంకారమనే పురుషుణ్ణి కల్పించి ఉద్రేకపరుస్తుంది. అహంకార పురుషుడు పన్నెండుమూర్తులు ధరిస్తాడు. మనుషులు మొదలుకుని సర్వప్రాణుల్నీ సంహరిస్తాడు. తాబేలు మోపులాటిభూమి యావత్తూ నీటిమయం అయిపోతుంది. కాలాగ్ని లోకమంతా నిండిపోతుంది. నీరంతా పీల్చేస్తుంది. మంటలతో భయంకరమైన కాలాగ్ని, గాలి వల్ల ఆరిపోతుంది. అంతటా తానే అయి చెలరేగిన గాలిని ఆకాశం

మింగేస్తుంది. ఇంతా అంతా కాదు అకాశతత్వం. దాన్ని మనస్సు మింగేస్తుంది. మనస్సుని అంహాకారపురుషుడు కబళిస్తాడు. అతణ్ణి అవ్యక్తం లోబరుచుకుంటుంది. ఇలా రాత్రి గడిచిపోతుంది. పగలవుతుంది. మళ్ళీ అంతా ఎప్పటిలాగ సృష్టి జరుగుతుంది.

## అధ్యాత్మ అధిభూత అధిదైవతాలు

'అధ్యాత్మమూ, అధిభూతమూ, అధిదైవతమూ - ఈ మూడిటి వ్యాఖ్యానమూ చెపుతాను. అది నీకు ప్రబోధం కలిగిస్తుంది. పాదమూ, గుదమూ, ఉపస్థా, చెయ్యీ, వాక్కూ- అధ్యాత్మలు. ఈ అయిదింటికీ వరసగా నటకా, విసర్జనా, ఆనందించడమూ, చేయడమూ, మాట్లాడడమూ ఇవి అధిభూతాలు. వరసగా విష్ణువూ, సూర్యుడూ, బ్రహ్మ, ఇంద్రుడూ, అగ్ని అధిదైవతలు. కన్నూ, నాలికా, ముక్కూ, చర్మమూ, చెవీ అధ్యాత్మలు. రూపమూ, రసమూ, గంధమూ, స్పర్శా, శబ్దమూ అధిభూతాలు. వీటికి సూర్యుడూ, నీరూ, భూమీ, గాలీ, దిక్కులూ అధిదైవతలు. ఇదే వేదం తెలిసిన పెద్దలు చెపుతారు.

'బుద్ధి అధ్యాత్మ. దాన్ని తెలుసుకోదగింది అధిభూతం. ఆత్మ అధిదైవతం. అహంకారం అధ్యాత్మం. దానికి గర్వం అధిభూతం. రుద్రుడు అధిదేవత. చిత్తం అధ్యాత్మం. చిత్తవ్యాపారం అధిభూతం. బ్రహ్మం అధిదైవతం.

## సత్వరజస్తమోగుణాలు

'ప్రకృతీ, ఆత్మా – వీటి రీతులు తెలుసుకుంటే మనస్సు వికారంలేకండా వుంటుంది. ప్రకృతి తన ఇష్టంవచ్చినట్టు ఆటలకోసం సత్వమూ మొదలైనగుణాలూ, రకరకాల వికారాలూ పొంది ఎన్నో

విధాలుగా అవుపిస్తుంది. ఒక దీపంతో ఎన్నో దీపాలు వ్యాపించినట్టు ఎన్నో గుణాలూ, రూపాలూ కనపడుతుంది ప్రకృతి.

'సంతోషమూ, ఆనందమూ, ఆరోగ్యమూ, శాంతమూ, శీలమూ, శుద్ధీ, ప్రకాశమూ, సుస్థిరత్వమూ, అహింసా, శ్రద్ధా, నీతీ, లజ్జా, సత్యమూ, శౌచమూ, సమతా, ఆచారమూ, కార్పణ్యం లేకండావుండడమూ, పిసినిగొట్టు కాకండావుండడమూ, కామం లేకండా వుండడమూ — ఇవి సత్వగుణాలు.

'విరోధమూ, దర్పమూ, అవమానమూ, కామమూ, క్రోధమూ, మచ్చరమూ, దయ లేకపోడమూ, భోగకాంక్షా, అహంకారమూ, దుఃఖమూ — ఇవి రజోగుణాలు.

'అప్రకాశమూ, మోహమూ, హెచ్చుతిండీ, వాదమూ, ప్రమాదమూ, మూర్ఖత్వమూ, మరణమూ — ఇవి తమోగుణాలు.

'అంతరాత్మనీ తనగుణాలతో లోబరుచుకుంది ప్రకృతి. వేనవేలు వికారాలు పొందుతుంది అది దాని స్వభావం. ఆత్మ ప్రాణం కలది. ప్రకృతి ప్రాణంలేంది. ఆత్మ వెలుగువల్లా జగత్తు ధారంవల్లా, ప్రాణంధరిస్తుందది. ఆత్మని తన వేపుకి లాగుతుంది. ప్రకృతిపనులవల్ల ఆత్మ మోహంలో పడి తన్ను తాను తెలుసుకో లేదు. సత్వ రజస్తమోగుణాలకి లోబడిపోతుంది. పుణ్యంచేస్తే పుణ్యలోకాలకి వెళుతుంది పాపపుణ్యాలు చేసి మనుష్యత్వం పొందుతుంది. పాపాలుచేసి కాననరకంలో పడుతుంది తన్ను తాను తెలుసుకుంటేమాత్రం అవ్యక్తం వెంటపడదు. ముసలితనం లేకండా శాశ్వతమూ, నిర్మలమూఅయిన పరమపదం చేరుకుంటుంది. అక్షరంగా స్వయం ప్రకాశంతో ప్రకాశిస్తుంది.'

ఇలా యాజ్ఞవల్క్యుడు చెప్పింది విని 'ఆత్మా, ప్రకృతీ రెండూ ఆదీ, అంతమూ లేనివేకదా? తడబాటూ, చలనమూ లేనివేకదా?

అయితే ఈరెంటిలో వొకదానికి ప్రాణం లేకపోడమూ, వొకదానికి ప్రాణం వుండడమూ ఎంచేత?' అని అడిగాడు జనకుడు.

'గుణాలున్నది గుణాలు లేం దవుతుందా?' అన్నాడు యాజ్ఞవల్క్యుడు - 'అలాగే గుణాలు లేంది గుణాలున్న దవుతుందా? ప్రకృతి ఎప్పుడూ గుణాలు కలిగివుంటుంది. ఆత్మవంటిది కాదది. ఆత్మస్వరూపం తెలుసుకునేశక్తి ప్రకృతికి లేదు. ఆత్మప్రకృతిని తెలుసుకోగలదు. తనకంటే గొప్పది లేదనీ తనకి తెలుసు ఆత్మకి. ప్రకృతికి ప్రాణం లేదు. ఆత్మకి ప్రాణముంది. ఇదే చెప్పారు తెలిసిన మునులు.

నీటిలో చేపల్లాగ, బొడ్డవండులో పురుగుల్లాగ ఆత్మ ప్రకృతిలోనూ, ప్రకృతి ఆత్మలోనూ వుంటుంది అలావుండినా ప్రకృతివల్ల ఆత్మ వికారంపొందదు. నీటిలోవుండినా నీళ్ళంటని తామరరేకులాగ ప్రకృతిలో అంటి అంటకండానే వుంటుంది ఆత్మ. ఇది సాంఖ్యమతానుభవం. ఇక యోగమార్గం చెపుతాను.

'సాంఖ్యంతో సమానమైన జ్ఞానమూ, యోగంతో సమానమైన బలమూ ఎక్కడా లేవు. ఈ రెండూ విడివిడిగా చూస్తాడు మూర్ఖుడు. నేనుమాత్రం వొక్కటిగానే చూస్తాను.

'మనోధారణా (మనస్సు వశపరచుకోడం), ప్రాణాయామవిధీ-ఈరెండూ నిర్గుణతంత్రమూ, సగుణతంత్రమూ అని యోగానికి వినియోగపడతాయి. ప్రాణాలుపోకండా ప్రాణాయామంచేస్తూ, ముక్కుచివర చూపు నిలిపి, విషయాలు వొదిలిపెట్టి యోగసిద్ధి పొందాలి. ఎలా అంటావా? నియమంతోవుండి క్రమక్రమంగా శరీరానికి బాధకలగకుండా రాత్రీ పగలూ ప్రాణాయామం చెయ్యాలి. అలాచేస్తూవుంటే మనసూ, శరీరమూ దృఢపడతాయి అది సిద్ధికి మూలమవుతుంది. ఇది సగుణతంత్రం. ఇక నిర్గుణతంత్రం విను.

'ఇంద్రియాలు మనస్సులోనూ, మనస్సు అహంకారంలోనూ, అహంకారం బుద్ధిలోనూ, బుద్ధి ప్రకృతిలోనూ అణుచుకుంటే ధ్యానం మీద తత్పరత కలుగుతుంది. ధ్యానతత్పరుడైనవాడు ముసిలితనం లేని నిర్మలమైన ఆనంద సత్యస్వరూపం, ఉత్తమమైన శుద్ధ జ్ఞానస్వరూపం చూడగలుగుతాడు. పరిపూర్ణజ్ఞానంకల యోగికి నిశ్చలమైన దీపవైభవమూ, నిద్రరహస్యమూ, మేఘాల్లేని ఆకాశం అంతమూ అలవడతాయి. పైకి కెరటాలు విరగబడుతున్నా లోపల చలించని సముద్రంలాగ నిశ్చలత్వం అబ్బుతుంది. భేరీలూ, శంఖాలూ మొదలైన రకరకాల వాద్యాలు ఘోషపెడుతున్నా కలత కలగ దతడికి. ఆకాశంలాగ గంభీరుడై వికారంలేకండా వుంటాడతడు. తేనె కడవ పట్టుకుని మెట్లెక్కినట్టు, ఆత్మానంద రసం వొలకచుక్కయినా పడనివ్వకండా తుదిదాకా ఎక్కిపోతాడు. ఇది యోగమార్గం.

'ఇందులో సోమరితనంలేకండా వెళ్ళగలిగిన యోగి నిరోగి. అతడే కృతార్థుడు. ఇతర్లకి అందని పరమపదం చేరుకుంటాడతడు.

'పాదాలూ, పిక్కలూ, మోకాళ్ళూ, గుదమూ, ఉపస్థా, తొడలూ, పక్కలూ, బొడ్డూ, బుజాలూ, రొమ్మూ, కంఠమూ, నోరూ, చెవులూ, ముక్కూ, కళ్ళూ, నుదురూ, తలా, –ఇవి ప్రాణాలు లేచిపోయే ప్రదేశాలు. వీటిలో వొక్కొక్కదాని లోనూ వరసగా విష్ణువూ, వసువులూ, సాధ్యులూ, సూర్యుడూ, భూమీ, ప్రజాపతీ, మరుత్తులూ, ఇంద్రుడూ, శివుడూ, మహాముని నరుడూ, విశ్వదేవతలూ, దిక్కులూ, గాలీ, అగ్నీ, అశ్వినీదేవతలూ, పితృదేవతలూ, బహ్మ ప్రకాశిస్తూవుంటారు. హృదయం ఆవరించిన గాలులు క్రమంగా వొదిలిపెట్టగలిగితే యోగి ఆదేవతల్ని పొందుతాడు.

## మ ర ణ సూ చ న లు

'అరిష్టాలు వివరిస్తాను విను. ధృవమండలంలో అరుంధతీ నక్షత్రం చూసేశక్తి కంటికి తగ్గిపోయినా, ముక్కు కుడితట్టు సెరం లేనట్టు అనిపించినా, పూర్ణచంద్రుడు మలినంగా కనపడినా ఏొక సంవత్సరంలో చచ్చిపోతాడు మనిషి.

'శరీరకాంతి వెనకటిలా కాక, బాగా అధికమైనా, లేదా బాగా మాసిపోయినా, బుద్ధిబలం కొత్తగా పెరిగిపోయినా, లేదా తరిగిపోయినా మనిషి ఆరునెలల్లో చచ్చిపోతాడు.'

'చంద్రమండలంలోనూ, సూర్యుడిలోనూ వగులుకనిపిస్తే వొక వారంలో చచ్చిపోతాడు. దేవాలయంలో వున్నప్పుడు, అక్కడి సుగంధద్రవ్యాలు మాంసం కంపుకొడితే ఆరుదినాల్లో చచ్చిపోతాడు. ముక్కు వాలిపోడమూ, చెవులు వొంగిపోడమూ, వళ్ళకాంతి మాసిపోడమూ, కళ్ళు కళతప్పడమూ, శరీరం చల్లబారడమూ, మనస్సు చెడడమూ - ఇవన్నీ అప్పుడే చావువస్తుం దనడానికి సూచనలు. కారణం లేకండా ఎడమకన్ను నీరుకారినా, నెత్తిపక్క పొగలేచినా తక్షణం చావువస్తుంది. బ్రహ్మ చెప్పిన సూచన లివి. యోగి ఈ అరిష్టాలు తెలుసుకుని ఎప్పుడూ యోగమార్గమూ, సాంఖ్యమూ నడుపుతూ కాలం కబళిస్తాడు.

ఇలా కాలం కబళించి, యోగి మృత్యువుని గెలుచుకుంటాడు. శాశ్వతమూ, నిశ్చలమూ, శుభప్రదమూ అయిన అమృతపదం చేరుకుంటాడు.

## ప ర త త్వం

'జనకమహారాజా ! పరం విడమర్చి చెప్పమన్నావు. సూక్ష్మమైన ప్రశ్న వేశావు. సమాధానం విను. గొప్ప తపస్సుచేశాను

నేను. సూర్యుడు ప్రత్యక్షమయాడు. 'వరమిస్తాను. ఏం కావాలో కోరకో' అన్నాడు. సాష్టాంగపడ్డాను. 'యజుర్వేదం అనుగ్రహించు' అని ప్రార్థించాను. 'అయితే సరస్వతిని ఆవహింపజేస్తాను. నోరువిప్పు' అన్నాడు సూర్యుడు. సంతోషించాను. నోరు విప్పాను. సరస్వతి నా శరీరంలో ప్రవేశించింది. దాహం హెచ్చింది. నన్ను నేను కానలేక పోయాను. భయపడ్డాను. 'కొంచేపులో చల్లపడుతుంది' అన్నాడు సూర్యుడు. అలాగే కొద్దిసేపటిలో చల్లబడింది. 'యాజ్ఞవల్క్యా! నీలో వేదం వికసిస్తుంది. ఎల్లప్పుడూ ప్రతిపత్తి కలుగుతుంది. బుద్ధి ఉల్లాసం పొందుతుంది. సాంఖ్యమతయోగాలు కరతలామలక మవుతాయి. యోగసిద్ధీ, సాంఖ్యసిద్ధీ పొంది సంతోషంతో యథేచ్ఛగా వెళ్ళు' ఇంపైన మాటలు చెప్పి, మృదువుగా సెలవిచ్చాడు సూర్యుడు. అమృతవర్షంలో స్నానమాడినట్టు అనిపించింది నాకు.

'అనంతరం అస్తగిరి చేరుకున్నాడు సూర్యుడు. మహానందంతో ఇంటికివచ్చేశాను నేను. సరస్వతిని తలుచుకుంటూ కూచున్నాను. అచ్చులూ, హల్లులూ అలంకరించుకుని, ఓంకారంమీద కూచుని, అందమైన తెల్లతామరపువ్వులాటి శరీరకాంతితో సరస్వతి ప్రత్యక్షమైంది. భక్తితో నమస్కరించాను. సూర్యుడి అనుగ్రహం వల్ల లభించిన ఉత్తరసంహిత పదిహేనుశాఖల యజుర్వేదం వివరించాను. శిష్యుల్ని చేర్చుకుని, అధ్యయనం చేయిస్తూ, ఈవాఙ్మయ బ్రహ్మాండంలో తెలుసుకోదగింది ఏదో అని ఆలోచించాను. సూర్యుడి మహిమవల్లే యోగస్వరూపమూ, సాంఖ్యస్వరూపమూ తెలుసుకునే ఉపాయం తట్టింది. వెంటనే దాంతో తెలుసుకోవలిసిన తత్త్వమూ స్ఫురించింది.

'కొంతకాలానికి విశ్వావసు డనే గంధర్వరాజు నాదగ్గిరికి వచ్చాడు. నేను చేసిన అతిథిపూజ ఆదరంగా అందుకున్నాడు.

వేదాల్లో వివరించిన విశ్వావిశ్వాలూ, మిత్రావరుణులూ, జ్ఞానజ్ఞేయాలూ, తపోతపాలూ, సూర్యాతిసూర్యులూ, విద్యావిద్యలూ, వేద్యావేద్యాలూ, చలాచలాలూ తేటతెల్లంగా వివరించు' అని అడిగాడు. నేను ఇలా తేటపరిచి చెప్పాను - 'భూతభవిష్యద్వర్తమానాలుచేసే అవ్యక్తప్రకృతి విశ్వం. గుణాలు లేని ఆత్మ అవిశ్వం. ఆత్మ మిత్రుడు. ప్రకృతి వరుణుడు. జ్ఞానం ఆత్మ. జ్ఞేయం (తెలుసుకోవలిసింది) ప్రకృతి. తపస్సు ఆత్మ. అతపస్సు ప్రకృతి. సూర్యుడు ఆత్మ. అతిసూర్యుడు ప్రకృతి. విద్య ఆత్మ. అవిద్య ప్రకృతి. వేద్యం ఆత్మ. అవేద్యం ప్రకృతి. అచలం ఆత్మ. చలం ప్రకృతి. 'అఖండంగా వున్నప్పుడు ప్రకృతీ ఆత్మవంటిదే అవుతుంది. అంచేత రెంటికీ ఆదీ అంతమూ లేవు. రెండూ ఇంద్రియాలకి అందవు. అర్థం తెలియకండా వేదాలు చదవడమూ, వాటిని మొయ్యడమూ ఆయాసం తప్ప మరో లాభంలేదు. వేదాలఅర్థం విచారిస్తే క్షరమూ అక్షరమూ అర్థమవుతాయి. క్షరమూ, అక్షరమూ దంపతులనుకో. ఇందులో మొదటిది వొదలిపెట్టి రెండోది ఆశ్రయించాలి. అక్షరం ఇరవైఅయిదో తత్త్వం. దానిమీద లక్ష్యం నిలపెడితే కేవలత్వం కుదురుతుంది. కేవలత్వంతో ఇరవైఆరో తత్త్వం పరమాత్మ పట్టువడుతుంది. తన్మయత్వం కలుగుతుంది. ఆత్మని ప్రకృతి రెండు రూపాలుగా భావిస్తుంది. ఆత్మాపరమాత్మా రెండుకాదు. ఆత్మేవరమాత్మ. సందేహం లేదు. పరమాత్మ ఇరవైఆరోతత్త్వం. దానికే పరమేశ్వరుడనిపేరు. జ్ఞానానందంవల్లకాని పరమాత్మ పట్టువడదు.'

'ఇలా చెప్పాక విశ్వావసుడు మళ్ళీ అడిగాడు - ఇరవైఅయిదో తత్త్వమైన ఆత్మకంటే, మరో పరమతత్త్వంవుందనీ, ఆలోచిస్తే రెండూ వొకటే అనీ నారదుడూ, దేవలుడూ, కపిలుడూ, శుకుడూ, సుమంత్రుడూ, పైలుడూ మొదలైన మునుల గోష్ఠిలో విన్నాను.

అయినా సంశయం వదలలేదు. అందుకనే నిన్ను ఆశ్రయించాను. మునిలోకమూ, దేవలోకమూ, బ్రహ్మలోకమూ పేరెక్కిన ప్రజ్ఞానిధివి నువ్వు. నా సందేహం నివారించు' అని ప్రాధేయపడ్డాడు. ఆదరించి, వివరించాను నేను – 'మునిగోష్ఠిలో లోపంలేదు నీకు. కాని నీమనస్సు కల్మషం పోలేదు. అందుకే సంశయం వొదల్లేదు. నిర్మలమైన మనస్సుతో విను. ఆత్మకి ప్రకృతిసాంగత్యంవల్ల రకరకాల రూపాలు కలుగుతున్నాయి. చావుపుట్టుకల తెర మాటై మూఢులు తెలియక ఆత్మని పరమాత్మ అనరు. ప్రకృతి ఆత్మని కానదు. ఆత్మ ప్రకృతిని చూస్తుంది. అంచేత పరమాత్మని కానలేదు. పరమాత్మ ఆత్మనీ, ప్రకృతినీ రెంటినీ చూస్తుంది. పరమాత్మని చూడడమే ఆత్మకి ముఖ్యం. స్నేహ సహవాసాలతో మోహం అధికమై, కాలానికి కట్టువడి, అహంకారమూ, మమకారమూ ఆశ అధికంచేసి ఆత్మ, తాను ప్రకృతి ననుకుంటుంది, అది వొదిలేసి ప్రకృతిని నీళ్ళుగానూ, తన్ను చేపగానూ భావించుకుని నడుచుకుంటే దాంతో వేరవడం కుదురుతుంది. ఆత్మకి వివేకం కుదిరితే ప్రకృతిని వొదిలిపెట్టి తన్ను తాను గుర్తిస్తుంది; పరమాత్మని దర్శిస్తుంది.

'చావు పుట్టుకలకి భయపడి, యోగం కలిసిన సాంఖ్యం ఆశ్రయించి యతులు మమత్వం వొదిలిపెడతారు. పరమపదం చేరుకుంటారు. చావు పుట్టుకలు లేనిచోటు పరమపదం.

'జ్ఞానంవల్ల ఉత్తమమైన ఆనందం కలుగుతుంది ఆత్మకి. వికారాలు వొదిలిపోతాయి. పరమాత్మా, ఆత్మా వేరుగావుండడం కద్దు. అయితే పరమాత్మతో ఆత్మని కలిపే నేర్పుతో ఏకత్వమహిమ వ్యక్తమవుతుంది. ఇది విజ్ఞానం చేసే పని. విజ్ఞానం కలవాడే గమ్యస్థానం చేరతాడు. శాంతిలేని అల్పబుద్ధికి అది దుర్లభం. మమత వొదిలాక మోక్షం దొరుకుతుంది.'

'ఇలా నేను చేసినబోధ విని సంతోషించాడు విశ్వావసుడు 'నీఅనుగ్రహంవల్ల పథ్యమూ, హితమూ, సత్యమూ అయిన పరమపదం తెలుసుకున్నాను. సంశయాలు తీరిపోయాయి. పవిత్రుణ్ణయాను' అంటూ భక్తితో మొక్కి సెలవుతీసుకున్నాడు.

'జనకమహారాజా! బ్రహ్మ మొదలైన దేవతలమతం ఇది. మోక్షానికి ఎవళ్ళకైనా ఇదేమార్గం. మరో మార్గం లేదు. జ్ఞానం వల్ల కాని పుట్టుకా, ముసిలితనమూ, చావూ జయించే మోక్షపదం దొరకదు. అంచేత అన్నివిధాలా జ్ఞానం గడించాలి. గురువుఎవడైనా సరే, ఈమోక్షమార్గం ఉపదేశించినవాడు దేవత అనే భావించాలి. ఇంతకీ శ్రద్ధముఖ్యం. శ్రద్ధలేనివాడికి చావుపుట్టుకలు తప్పవు. అజ్ఞానం వల్ల కర్మలు చుట్టుకుంటాయి. కర్మలతో చావుపుట్టుకలు వెంబడిస్తాయి. విజ్ఞానం కలవాడు తేలికగా మోక్షంపొందుతాడు.

'నువ్వూ ఈఉపాయమే అవలంబించు. నువ్వు అడిగిందంతా చెప్పాను. దుఃఖమూ, మోహమూవిడిచిపెట్టు. ధైర్యం వొదిలిపెట్టకు.

యాజ్ఞవల్క్యుడు చెప్పింది విని సంతోషించాడు జనకుడు.' విచారంవిడిచిపెట్టాడు. బ్రహ్మధ్యానంతో ఆనందించాడు. ధర్మరాజా! యాజ్ఞవల్క్యుడి మాటలతోనే మహనీయమైన జ్ఞానం నీకు ఉపదేశించాను. దీనిలోని తాత్పర్యం మనస్సుకి పట్టించుకో. దుఃఖమూ, మోహమూ విడిచిపెట్టు. సుఖపడు.

## జనకుడూ సులభా

ధర్మరాజు - గృహస్థధర్మం వొదిలిపెట్టకండా మోక్షం సంపాదించవచ్చా? ఇది మనస్సులో బాధిస్తోంది.

భీష్ముడు — జనక సులభ సంవాదం అని వొక ఇతిహాసముంది. దాంతో నీసందేహం తీరిపోతుంది విను.

సులభ అని వొకామె యోగనిష్ఠతో వున్న జనకుడి విషయం వింది. అతణ్ణి పరీక్షించాలని మిథిల వచ్చింది. తపస్సుతో బక్క చిక్కిన తన శరీరం యోగశక్తితో మరుగుపరచి అందమైన సుకుమార శరీరంతో జనకుణ్ణి భిక్ష అడిగింది. పాద్యమూ, ఆసనమూ ఇచ్చి పూజించాడు జనకుడు మంచి భోజనమూ పెట్టాడు.

అతడి ఎదుట వొక మంచి ఆ సంమీద కూచుని, అతడు ముక్తుడో, కాడో తెలుసుకోవాల తన మహిమతో అతడి మనసులో ప్రవేశించిందామె మన్మథవికారంతో వలపుచూపులు అతడి మొహం మీద విసిరింది. ఆమె భావం తెలుసుకున్నాడు జనకుడు, చిరునవ్వు నవ్వాడు.

'ఎక్కణ్ణుంచి వస్తున్నావు? ఎక్కడికి వెళతావు? ఎవరిదానివి? ఏమిటి నీవృత్తి? సరే, అది అలా వుండనీ నేను వొకమాట చెపుతాను. కొంచెం వోపిక పెట్టి విను. పంచముఖుడు అనే పరమమునీశ్వరుడి శిష్యుణ్ణి నేను. సాంఖ్యమూ, యోగమూ, రాజ్యపాలనమూ — ఈమూడు మోక్షమార్గాలూ ఆయన నేర్పాడు నాకు, ఏకోరికా లేకుండా ఈమూడు మార్గాల్లోనూ నడుచుకుంటున్నాను. ముక్తికి దూరం కాను. వైరాగ్యం ముక్తికి మూలం. దృఢమైన జ్ఞానంవల్లే వైరాగ్యం కలుగుతుంది. వైరాగ్యం పట్టువడిన బుద్ధికి ద్వంద్వాలుండవు. గృహస్థుగానే వున్నాను. అయినా సంసారంమీద మోహంలేదు నాకు. గంధం పూసినా, కత్తితో కోసినా వొక్కటే నాకు. బంగారం ఎంతో మట్టిముక్కా అంతే.

'తమ తమ శాస్త్రాల ప్రకారం జ్ఞానమూ, కర్మా — ఈ రెంటినీ సంయోగ నిష్ఠ లంటారు మోక్షమెరిగినవాళ్ళు. నాగురువు శాసనం

సులువైన మార్గం వైరాగ్యం. ఏదో వొకకష్టం వస్తే వొకడు గృహస్థ ధర్మం విడిచిపెట్టేసి సన్యసిస్తాడు. అంతమాత్రాన అతడి బంధనాలు వొదిలిపోవు. ఏమంటే, అలా సంసారం వొల్లకపోడమూ వలపే కదా? దండమూ, కాషాయవస్త్రమూ, బోడితలా కమండలమూ మోక్షమివ్వవు. వీటికి జ్ఞానమిచ్చేశక్తి లేదుకదా? దుఃఖం పోవాలని ఈగుర్తులు ధరిస్తారు. ఈగుర్తులులాంటిదే కదా, గొడుగు' ఆలోచిస్తే గొడుగుకూడా మోక్షమివ్వాలి కదా? జ్ఞానంవల్ల కలగాలే కాని ఈవేషాలవల్ల ముక్తి కలగదు. రాజ్యబంధమూ, ప్రేమబంధమూ, అన్ని భోగబంధాలూ ప్రజ్ఞఅనే కత్తితో కోసిపారేశాను. ఇలా ముక్తుణ్ణయివున్న నన్ను ముక్తుడో కాడో అని పరీక్షించడాని. వచ్చావు. మెల్లిగా నామనసులో దూరావు. ఇది ప్రయోజనంలేని పని. పైగా నువ్వు బ్రాహ్మణవడుచువి. యోగినివి. పరస్త్రీవి భర్త దగ్గిరలేడు. నేను రాజకుమారుణ్ణి. గృహస్థుణ్ణి. ఆచారవంతుణ్ణి. మనం ఇద్దరం సంగమంచేస్తే నింద నెత్తినిపడదూ? స్వతంత్రురాలివై నువ్వుచేసిన ఈదుష్కృతంవల్ల ఏదివచ్చినా అది నీకే చెందుతుంది. నన్ను గెలవాలన్న నైపుణ్యంలోపమే కాని నామీద మోహంవల్లా ఇలా అయావు? యోగశక్తివుండి కనకనా, మాయలు మానకుండా వున్నావు? నిన్ను నువ్వు మరుగుపెట్టుకున్నావు. కుటిల భావంతో ఈచెడునడత నడిచావు. ముక్తుల పద్ధతేనా ఇది? నేను బైట వేసినా ఈచెడుచూపులు మానవద్దా?' అంటూ తనవైరాగ్యమూ జ్ఞానమూ స్పష్టపరుస్తూ మాటలాడాడు. ఆమె రవంతా లక్ష్యపెట్ట కుండా ఇంకా ఇలా అన్నాడు—'నీశరీరం అందంగా వుంది. యవ్వనం వనవవలాడుతూ వుంది. ఇంత వేగం యోగంలో ఇంత చొరవ ఎలా పట్టుపడింది నీకు చెప్పూ? ఎందుకూ దాస్తావు?'

జనకుడు ఇలాఅనడంతో నేజంకూగొంకూ లేంకడా చాతుర్యంతో అందుకుంది సులభ — 'రాజా! ఏదైనా మాట అంటే విన్నవాళ్ళకీ, తనకీ ప్రియంగావుంటేనే అది తగినమాట అనిపించుకుంటుంది. అలా కాకండా మాటాడడం మూర్ఖులు చెయ్యవలిసిన పని. నీమాటల్లో నేర్పు అదిగో అలాగే వుంది. 'ఎవరిదానివి నువ్వు? ఎక్కణ్ణుంచి వచ్చావు?' అని మొదలుపెట్టావు. సావధానంగా విను. నీళ్ళకీ, ధూళికీ, లక్కకీ, పుడకలకీ ఎలాటి సంబంధమో ప్రాణుల పరస్పర సంబంధం అలాటిది. ఇందులో వొకదానికి వొకటి లోబడడమంటూ వుందా? ఒక్కశరీరంలోనే పంచభూతాలూ, పది ఇంద్రియాలూ, మనసూ, బుద్ధీ, ప్రకృతీ వున్నాయి. అయినా దేనిదారి దాందే కదా? నిజానికి ఎవ్వరివాళ్ళూ ఎవ్వరూ కారని ఎరగవా? అన్నిలోకాల్లోనూ పంచకల్యాణి గుర్రంలాగ పరిగెడుతూ వుంటుంది ప్రకృతి. ఇది తెలిసిన్నీ ఎవళ్ళనైనా ఎక్కడివాళ్ళని అడగవచ్చునా? ఆమాటికి ఏమిటి ప్రయోజనం చెప్పూ? నిన్ను నువ్వు చూసుకున్నట్టే ఇతర్లని చూసుకోవద్దా? తననీ, ఇతర్లనీ, వొక్కలాగ చూసుకునే మగాడు 'ఎక్కడి దానివి? ఎవ్వరిదానివి?' అంటాడా? శత్రువుల గతులూ, మిత్రుల గతులూ, మధ్యస్థుల గతులూ తెలుసుకుంటూ, సంధీ, విగ్రహామూ మొదలైన ఆరుగుణాలు కలిగినవాడికి ముక్తి మార్గం ఎక్కడిదీ? నువ్వే చెప్పూ?

'కనక నువ్వు ముక్తుడివి కావు. అయినా నీమట్టుకు నువ్వు ముక్తుణ్ణే అనుకుంటున్నావు. ఈదోషం చూపెట్టి నీబంధువులు నీకు బుద్ధిచెప్పడం మంచిది. పిచ్చెత్తినవాడికి మందూమాకూ ఇచ్చి బాగు చేయిస్తున్నామా లేదా? అలాగే. 'నేను ఎలా ముక్తుణ్ణి కాను?' అంటావా? చెపుతాను, ఆలకించు.

'వర్గత్రయంలోనూ,♦ సప్తాంగాలలోనూ† మునిగి తేలుతూ వుంటారు రాజులు. స్నానమూ, భోజనమూ, నిద్రా వీటిలోనే పడి వుంటారు. ప్రజల విన్నపాలు విని ఆజ్ఞాపిస్తూ వుంటారు. మంత్రుల చేతిలోనూ, వలపుకత్తెల చేతుల్లోనూ కీలుబొమ్మలై వుంటారు. యాచకుల తిండి కొసుకుతారు. ధనం పోగుచెయ్యాలన్న ఆసతో తమలో తాము కయ్యమాడతారు. మనస్సు చిక్కుపెట్టుకుంటారు. ఎంతోమంది రాజ్యం లాక్కోడానికి దండెత్తి వస్తుంటే అడ్డుకుంటూ పెనగులాడతారు. ఇలా అధికదుఃఖమూ, తక్కువసౌఖ్యమూ అనుభవిస్తూ వుంటారు. ఇదీ రాజ్యంతీరు. కనక రాజులు ముక్తులు కారన్న మాట స్పష్టం.

'అది అలా వుండనీ. పైగా నీకు దయాబుద్ధితో పంచముఖ ముని మోక్షమార్గం చెప్పాడన్నావు. నేను నీమనసులో దూరితే సహించలేకపోయావు. ఇదేనా ముక్తిమార్గం? కోరికలులేనివాడైతే ఏది ఎలాపోతే ఏమని వికలతా లేకండా వూరుకోడా శాంతంగా?

'శూన్యస్థానంలో వుండాలికదా, యతి? ముక్తుడి హృదయం శూన్యంగా వుంటుందని భ్రమపడి ప్రవేశించాను. నువ్వు ముక్తుడివి కావు. కనక తప్పే చేశాను. అదీకాక కాలూ, చెయ్యీ మొదలైన నా అవయవాల్లో ఏదీ నిన్ను తాకలేదు. ఊరికేసంకటపడి ఎందుకూ ఇలా నన్ను తిడతావూ?' అంటూ జనకుడి మంత్రులవేపు తిరిగి ఇంకా ఇలా అందామె.

'వీళ్ళంతా పెద్దలు. వీళ్ళు వింటూండగా ఇలాటి నీచం మాటలు అనవచ్చా రాజు? ఎదటివాళ్ళని అవమానించకమే గొప్పా? తగదని

♦వర్గత్రయం: ధర్మమూ, అర్థమూ, కామమూ, †రాజూ, మంత్రీ, స్నేహితుడూ, ఖజానా, రాష్ట్రమూ, కోటా, సేనా.

ఆమాత్రం ఆలోచనైనా వద్దా? ఆడాళ్ళకి మగాళ్ళమీద పుట్టిన విషయం ప్రకటించడం దుష్టత్వం ఎంతనీచుడైనా ఈపని చెయ్యడు. రాసబిడ్డడివి కదా, నీకుతగునా ఇది? తామరాకుమీద నీటిబొట్టులాగ, సంసారబంధాలు అంటకండా వున్నదాన్ని నేను. తెలుసుకోలేక పోయావు. పంచశిఖముని నీకు ముక్తిమార్గం ఉపదేశించాడన్న మాట వుత్తి బొంకయింది. ఇన్నిమాటలెందుకూ? గృహస్థధర్మం పోగొట్టు కున్నావు. మోక్షమార్గమూ తెలియలేదునీకు. అటూకాక ఇటూకాక కల్లబొల్లిజ్ఞానమే దక్కింది. ఆకాశంతో ఆకాశం కలిసినట్టు ముక్తు లతో ముక్తులు కలవడం న్యాయం. నేను నిన్ను కలవడం మోహంవల్ల అన్నావు. ఇదేచాలు, నువ్వు ముక్తుడివికావని రుజువు చెయ్యడానికి.

'మనం ముక్తులంకాకపోయినా మనసాంగత్యం తప్పుకాదు. ఎలాఅంటావా? జనం మెచ్చుకునే ప్రసిద్ధమైన రాజవంశంలో పుట్టావు నువ్వు. నాపేరు సులభ. నాపూర్వులు శతశృంగందగ్గిరా, ద్రోణం దగ్గిరా, శక్రద్వారంలోనూ మహాయజ్ఞాలుచేశారు. దేవేంద్రుడు వాళ్ళదగ్గిరికి వచ్చాడు. అతడి గోష్ఠితో వాళ్ళు పరమార్థచింత చేశారు. నాకు తగిన మగాడు దొరక్క నేను మోక్షధర్మం అవలంబించాను. కనక నువ్వు అన్నట్టు బ్రాహ్మణపడుచు రాచబిడ్డడితో కలియడంవల్ల వర్ణసాంకర్యంఏర్పడుతుం దన్నమాట మనవిషయంలో చెల్లదు.

'నీదగ్గిర నాకు మరుగెందుకూ? దానివల్ల లాభమేముంది? చక్రవర్తి ముక్తిపొందాడో లేదో అని పరీక్షించడానికి వచ్చాను. ఇది తప్పా?' అని అంది.

మాటాడలేదు జనకుడు. అతడి మొహంమీద చూపులు నిలిపి, నవ్వుతూ మళ్ళీ ఇలాఅంది సులభ — 'అగ్గి చల్లగావుందో, వేడిగా వుందో అని సందేహించడమూ, నువ్వుముక్తుడివో కావో అని సంశ యించడమూ వొక్కటే. మహారాజా! నామూర్ఖత్వమే అనుకో ఇది.

నీమాటల్లో అబద్ధంలేదు. మహామునులు ఎంపిక చేసిన వాడివి నువ్వు. మోక్షం నీఅరిచేతిలో వుంది. తెలిసీకూడా నిన్ను పరీక్షించడంకోసం మరోలా మాటాడాను. నీమన్నవల్ల నాసంశయం తీరింది. అన్నీ అబద్ధాలు. నిన్ను పరీక్ష చెయ్యడానికి వచ్చిన మాటమాత్రం నిజం. ఈఅపరాధం నీసౌజన్యంతో మన్నించు. నాపేరు సులభ. సంసారం లోల్లకండా తిరగడమే వున్నసంగతి. నువ్వు మునులు సేవించదగిన వాడివి. కనక ఇవాళకి ఇక్కడ వుంటాను' అంది.

సులభమాటలు విని మంత్రులతోకూడా నవ్వాడు జనకుడు. ఆమెని మెచ్చుకున్నాడు. ఆవాళంతా ఆమెతో కాలక్షేపంచేశాడు. మర్నాడు అతడి అనుమతితీసుకుని తనదారిని తాను వెళ్ళిపోయింది సులభ.

## వైరాగ్యం

ధర్మరాజు— శుకుడికి వైరాగ్యం ఎలా పట్టువడింది?

భీష్ముడు— సామాన్యమైన మనిషిలాగ తిరుగుతూ వుండేవాడు శుకుడు. విషయాల్లోపడి, చావుపుట్టుకల సంగతి పట్టించుకోలేదు. అతణ్ణి చూసి వ్యాసముని ఇలా ఉపదేశించాడు — 'నాయనా! మనసూ, ఇంద్రియాలూ లోబరుచుకోవోయి. విచ్చలవిడిగా పోనివ్వక. శాంతమూ, సత్యమూ, శమమూ, శీలమూ, తపమూ, దమమూ, అహింసా ఇవన్నీ ధర్మస్వరూపాలు. వీటిని పాలించు. ఆకలి దప్పులు నేర్పుతో అణుచుకో. దేవతలకీ, అతిథులకీ పెట్టి, మిగిలింది అనుభవించు.

'నురుగుతో చేసిన పంజరంలోవున్న పిట్టలాగ శరీరంలోవుంది జీవం. ఇది మరచిపోవచ్చా నువ్వు? లెక్క పెడుతూ వుండగానే ఏళ్ళుగడిచిపోతాయి. ఇలా ఆయువు తరిగిపోయి, జీవహాని కలుగుతుంది. కనక ఏమరుపాటుతో నిద్రపోవచ్చా, మోహంలో మునిగి?

రక్తమాంసాలు పెంచుకుని లౌకికవిషయాలలో మునిగిన నాస్తికులు పరలోకమంటూ వొకటి వుందని కానరు. పండితులమాట పాటించరు. బుద్ధిమంతులు తొక్కిన దారిలో కాక, తప్పు దారి పట్టడం, అప్పటికి సుఖంగానే అనిపిస్తుంది. తరువాత మాత్రం ఆపద కలిగిస్తుంది. తమ తమ ధర్మాలు నడిపి దాంతో తృప్తిపడిన శాంతభావంతో నడిచేవాళ్ళు చెప్పే ధర్మమార్గం విను. సత్సంగం చేసుకో. పొత్తినూలుపురుగులా కాకు. తన్ను తాను బంధించునేవాడు. మూర్ఖుడు.

'సంసారం వొక సముద్రం. అస్థిరమైన ఇంద్రియాలే ఇందులో నీళ్ళు. కామక్రోధాలు మొసళ్ళూ, పాములూను. వీటితో కల్లోలంగా వున్న ఈసముద్రం ధైర్యమనే పడవతో దాటు. కామం మొదలైనవాటితో తృప్తుడై, వొళ్ళు మరిచిన మూఢుణ్ణి, గొర్రెని పట్టుకుపోయిన పులిలాగ ఎత్తుకుపోతుంది మృత్యువు. కనక మూఢుడిలా కాకు నువ్వు.

'బ్రాహ్మణజన్మ దుర్లభం. తీరా అదిపొంది తపమూ, దమమూ వివేకమూ కలిగి, చెడుసాంగత్యం మానుకుని సార్థక పరుచుకోవద్దా? బ్రాహ్మడి శరీరం సుఖాలకోసమా? కాదు. నియమంతో ఇహంలో కష్టపడడానికీ, పరలోకంలో శాశ్వతసౌఖ్యాలు అనుభవించడానికీ పుట్టింది. ఊళ్ళో నివసించడమంటే వురిలో తగులుకోడమన్నమాట. ఆవురితాళ్ళు తెంపుకుంటారు బుద్ధిమంతులు. బైటపడి సుఖపడతారు. దురాత్ములు అది ఎరగరు. ఉరిలో తగులుకుంటారు.

'తాను గతించాక, చుట్టాలూ పక్కాలూ, పెళ్ళాం బిడ్డలూ, స్నేహితులూ వుండి ఏమిటిలాభం? అంచేత సంకల్పం వొదిలిపెట్టి నిశ్చింతంగా గుహలో కూచుని తన్ను తాను చూసుకోవాలి.

'ముసలితనమూ, చావూ మనిషి పుట్టినప్పటినుంచీ వెంటాడుతూనే వుంటాయి. దగ్గిర కనిపెట్టుకునే వుంటాయి. అంచేత రేపు చేస్తా

వనకండా మంచిపని ఇప్పుడే చెయ్యి. మనిషిపనికోసం చావు కని పెట్టుకు కూచుంటుందా?

'చుట్టాలూ వల్లకాటిదాకే వస్తారు. అగ్గిలో బుగ్గిచేసి, జ్ఞాతులు మళ్ళిపోతారు. ఇదివిచారించక అందరిమీదా మమత పెంచుకుంటాడు మూర్ఖుడు.

'లోకం కాలంచేత ఇలా వ్యాకులపడుతూ వుండడం చూ ధైర్యంతో ధర్మం అవలంబించవద్దూ? కాలవికారం తప్పించుకోవ...

'మనిషిజన్మ దుర్లభం. ముక్తిమార్గానికి అది మెట్టు. ఇది తెలుసుకుని, వెనకటిగతి మళ్ళీ రాకండా మెలుకువతో మసులు కోవాలి.

'తపోవనంలో పుట్టినా చావుపుట్టుకలు తప్పనప్పుడు ముక్తుడు కాడు మనిషి. మనస్సు కామ వికారాలలో వుంటే చావుపుట్టుకలు తప్పవు. భోగాలు విడిచిపెట్టు. వైరాగ్యం భావంతో వొక్కడే ఇంట్లో తపస్సు చేసినా సంసారసముద్రం దాటవచ్చు.

'వెనక జన్మలో ఆలూ, బిడ్డలూ, స్నేహితులూ ఎందరో గతించారు. తరవాతజన్మలో వాళ్ళు లేరని నీకు కాని, నువ్వులేవని వాళ్ళకి కానీ కొరత కలిగిందా ఏమైనా?

'నాకు నేనే వున్నాను. నాఅన్నవాణ్ణి ఎక్కడా కానను. కనక నేను ఎవ్వరివాణ్ణీ కాను' అనుకోవద్దూ?

'పెళ్ళాంకోసం ఆశపడి మనిషి ఇహమూ పరమూ, పోగొట్టు కుంటాడు. అందుకనే బుద్ధిమంతుడు పెళ్ళాంకోసం ప్రయత్నించడు.

'భోగమూ, దానమూ లేని ధనం ఎందుకూ? శత్రువుని చంప లేని బలమూ, దర్పమూ దేనికి? ధర్మంగా నడవనప్పుడు శాస్త్రాలు

విని ఏం లాభం? ఇంద్రియాలు గెలవలేని ఆత్మవిచార మెందుకు?' అన్నాడు.

తండ్రి ఉపదేశం విని వైరాగ్యభావంతో వెళ్ళిపోయాడు శుకుడు.

## శుకుడి వివరం

ధర్మరాజు — శుకుడు వ్యాసదేవుడి కుమారుడని మాత్రం ఎరుగుదును. అతడి జన్మవృత్తాంత మెరగను. అతడి తల్లివిషయమూ, బాల్యమూ, అతడు సిద్ధిపొందిన వైనమూ ఎరగను.

భీష్ముడు — మేరుపర్వతం దగ్గర కొక కొండగోగుఅడివి వుంది. అందులో పార్వతీదేవితో కలిసి శివుడు క్రీడిస్తూవుండేవాడు. ప్రమథులు సేవిస్తూవుండేవాళ్ళు. అక్కడికి కొళ్ళి కుమారుడు కావాలని యోగబలంతో తపస్సు చేశాడు వ్యాసముని యోగబలంతో రాజసూయాలూ, అశ్వమేధాలూ సరికావు.

వ్యాసముని తపస్సుకి మెచ్చాడు శివుడు. ప్రత్యక్షమయాడు. 'ఏమిటి కావాలో కోరు' అన్నాడు. భక్తితో సాగిలబడ్డాడు వ్యాసుడు. 'నీరూ, గాలీ, ఆకాశమూ, భూమీ, అగ్నీ - వీటితో సమానుడైన కుమారుణ్ణి అనుగ్రహించు' అన్నాడు. 'ఇచ్చాను' అని అంతర్థానమయాడు శివుడు.

వరం పుచ్చుకుని వ్యాసముని హోమంకోసం అరణితీసి మథించాడు. ఇంతలో అప్సరస ఘృతాచి అతడి కంటపడింది. అతడి మనస్సు చలించింది. అది కనిపెట్టింది ఘృతాచి. వంచనచేసి చిలక రూపం ధరించింది. మనసు బిగబడుతూ అరణి మథిస్తూనేవున్నాడు వ్యాసముని. మన్మథుడు బలవంతుడుకదా! అప్సరస చక్కదనంమీదే వుంది ముని మనస్సు దాంతో అతడి రేతస్సు స్ఖలనమైంది. అరణిలో పడింది. ఆగలేదు వ్యాసముని. శంకలేని మనసుతో అరణి మథించాడు.

అదుగో ఆ అరణిలోంచే పుట్టాడు శుకుడు. తండ్రిని పోలిన రూపం తోనూ, మంచి తేజస్సుతోనూ యజ్ఞంలో హవిస్సుతో వెలిగే అగ్ని హోత్రుడిలా ప్రకాశించాడు.

గంగానది మూర్తిమంతమై వచ్చింది. మంగళస్నానం చేయించింది. లేడిచర్మమూ, యోగదండమూ, ఆకాశంమీంచి పడ్డాయి. అద్భుతంగా దివ్యదుందుభులు మోగాయి. దేవతాస్త్రీలు పాటలు పాడారు. పూలవాన కురిసింది. దేవేంద్రుడూ మొదలైన దేవతలు చూడవచ్చారు. పార్వతీదేవితో కలిసి పరమేశ్వరుడు వచ్చాడు. బాలుడికి ఉపనయనం చేయించాడు. ఇంద్రుడు కమండల మిచ్చాడు. దేవతలు ఎన్నడూ మాయని బట్టలిచ్చారు. మృగాలూ, పక్షులూ మొదలైన చరాచర ప్రాణికోటి యావత్తూ ఆనందంతో పులకించిపోయింది.

తనతండ్రిలాగే పుట్టీపుట్టడంతోనే శుకుడికి వేదాలన్నీ అవగతమయాయి. బృహస్పతిని గురువుగా వరించాడతను. వేదవేదాంగాలూ, ధర్మశాస్త్రాలూ, రాజనీతీ, సమస్తవిద్యలూ చదివాడు. వ్రతనిష్ఠతో అక్కడే బాల్యం గడిపాడు. దేవతలకి కూడా బుద్ధులు చెప్పగలవాడయాడు. మహామాననీయుడయాడు.

తన ఆశ్రమంలోవున్న తండ్రిదగ్గిరికివచ్చి అతణ్ణే అనుసరించి తిరుగుతూవుండేవాడతడు. చుట్టుపట్ల మునికుమాళ్ళతో కలిసి, ఆటలు మరిగి, లోకంతోపాటే ఆత్మానంధానం మానేశాడు. అప్పుడు సాంఖ్యశాస్త్రమూ, యోగశాస్త్రమూ బోధపరిచాడు తండ్రి వ్యాసముని. శరీరంమీద అహంకారమూ, బంధువులమీద మమకారమూ వొదలిపోయే వాక్యాలు ఉపదేశించాడు. దాంతో జ్ఞానంకలిగి బ్రహ్మచర్యాశ్రమమూ, గృహస్థాశ్రమమూ, వానప్రస్థాశ్రమమూ మూడింటిమీదా

మనసు పుట్టలేదు శుకుడికి. మోక్షం ఎలా దొరుకుతుందో ఉపదేశించ మన్నాడు తండ్రిని.

'మోక్షమార్గ మెరిగినవాడు జనక చక్రవర్తి. వెళ్ళి వినయంగా అతణ్ణి చూడు. ఆకాశమార్గంలో మిథిల వెళ్ళకు. నడిచే వెళ్ళు. మోక్షమార్గం చెపుతా డతడు. నన్నుకూడా మన్నించదగిన గుణవంతుడు జనకుడు. అతడిదగ్గిర అహంకారం పనికిరాదు. మమకారం కూడదు. వినయమే సాధనం' అన్నాడు వ్యాసముని.

'సరే' అన్నాడు శుకుడు. మేరువూ మొదలైన పర్వతాలూ, ఎన్నో నదులూ, ఇతరకాల దేశాలూ, తీర్థాలూ ఇట్టే దాటేసి భరతఖండం వచ్చాడు. దారికడాకూ ఏపదార్థం చూసినా చూడనట్టే వచ్చాడు. విదేహదేశం చేరాడు. మిథిలాపురం ఉపవనం చేరాడు. నగరప్రాకారందగ్గిరికి వెళ్ళేసరికి ద్వారపాలకులు అడ్డుకున్నారు. శాంతంగా వూరుకున్నాడు శుకుడు. భయపడ్డారు ద్వారపాలకులు. లోపలికి కబురంపి, వినయంగా అతణ్ణి వెళ్ళనిచ్చారు.

రాజగృహం చేరాడు శుకుడు. లోపలికి వెళ్ళబోయాడు. అక్కడి కావలావాళ్ళు అడ్డేశారు. మొదటిలాగే శాంతంగా వూరుకున్నాడు శుకుడు. తడబడిపోయారు కాపలావాళ్ళు. లోపలికి పరిగెత్తారు. జనకుడితో విన్నవించారు.

తెలుసుకు రమ్మని పురోహితుణ్ణి పంపాడు జనకుడు. చూసి వెళ్ళి, వున్నది వున్నట్టు విన్నవించాడు పురోహితుడు. మంత్రులతోనూ, పండితులతోనూ తడబడిపోతూ భక్తివినయాలతో తల మీద అర్ఘ్యపాత్రపట్టుకుని గబగబా వచ్చాడు జనకుడు. గురుపుత్రుడైన శుకుణ్ణి గౌరవాదరాలతో అంతఃపురంలో వొక మంచిభవనంలోకి తీసుకు వెళ్ళాను. రత్నాలుతాపిన బంగారంపీఠంమీద కూచోపెట్టాడు. పాదాలు కడిగాడు. అక్షతలతోనూ, పువ్వులతోనూ

పూజించాడు. అర్ఘ్యమూ, ఆవూ సమర్పించాడు. ఆవిధానం తెలుసుకుని అన్నీ పుచ్చుకున్నాడు శుకుడు.

వినయంగా ఎదట నుంచున్నాడు జనకుడు. శుకుడి అనుమతి మీద నేలమీదే కూచున్నాడు. మంత్రులూ, తానూ, పండితులూ యావన్మందీ అలా అతణ్ణి సేవించారు. మహారాజుపరివారం అంత మందీ ఉత్సాహంతో వచ్చి మొక్కారు. అప్సరసల్లాటి భోగంవాళ్ళు వచ్చి పాడుతూ నాట్యంచేశారు. ఆరాధించారు. ఇంద్రియాలు జయించి, పిసరంతా మనోవికారం లేకండా కూచున్నాడు శుకుడు.

అతడి అన్నపానాలూ అవీ చూడడంకోసం పురోహితుణ్ణి నియమించాడు జనకుడు. మిగిలిన పగలూ రాత్రీ అతడిదగ్గిరే వుండి మృదువైన సంభాషణతోనూ, భక్తితోనూ వెళ్ళబుచ్చాడు.

మర్నాడు తెల్లవారాక కాల్యకృత్యాలు తీర్చుకున్నాడు జనకుడు. అన్నీ ముగించి సుఖంగా కూచున్న శుకుడిదగ్గిరికి పండితులతో కలిసి వెళ్ళాడు. చేతులు జోడించాడు. 'నువ్వు దయచేసిన కారణం సెలవియ్యి' అంటూ వినయంగా అడిగాడు.

'మాతండ్రి పంపగా మోక్షమార్గం తెలుసుకోవాలని వచ్చాను. బ్రాహ్మడి కర్తవ్య మేమిటి? మోక్షం ఎలా లభిస్తుంది' అన్నాడు శుకుడు.

## మోక్షమార్గం

ఆదరంతో అందుకున్నాడు జనకుడు — 'ఉపనయనం చేసుకుని బ్రాహ్మడు బ్రహ్మచర్యంతో వేదాలు నేర్చుకోవాలి. వివాహం చేసుకుని, సంతానం కని, యజ్ఞాలూ అవీ చెయ్యాలి. దేవపూజా, పితృపూజా, అతిథిపూజా చెయ్యాలి. ఎన్నాళ్లతో అడివికి పోయి, అక్కడా అతిథి పూజలూ, వ్రతాలూ జరపాలి. మోహం విడిచి

సన్యసించి, అగ్నులు ఆత్మలోనే నిలుపుకోవాలి. అప్పుడు పరమ శాంతుడై మోక్షం పొందుతాడు' అన్నాడు.

'అయితే మొదటి బ్రహ్మచర్యాశ్రమంలోనే జ్ఞానమూ, విజ్ఞానమూ కలిగినా, మూడు ఆశ్రమధర్మాలూ అనుసరించాలా? పరిపూర్ణమైన ఆధ్యాత్మజ్ఞానం కలిగినప్పటికీ ఈ నాలుగు ఆశ్రమాలూ అవలంబించి ఈకర్మలన్నీ చెయ్యవలసిందే అంటూన్నాయా వేదాలు? ఇదేనా! మోక్ష మార్గం?' అని అడిగాడు శుకుడు.

'జ్ఞాన విజ్ఞానాలు మోక్షసాధనాలు' అన్నాడు జనకుడు — 'గురువుఉపదేశంతో లభిస్తాయవి. వాటివల్ల మోక్షంపొందినవాడు, తరవాత ఆరెండు ఉపాయాలు కూడా వొదిలేస్తాడు లోకం నాశనం కాకండా వుండడానికీ, కర్మ పాడవకండా వుండడానికీ పూర్వమునులు నాలుగాశ్రమలూ ఏర్పరిచారు. అందులో తుదముట్టా నడిచినా ముక్తి పొందవచ్చు. ఏన్నో జన్మలచేత కలిగిన మోక్ష సాధనాలచేత పరిశుద్ధుడై ఎక్కడో వొకడు మొదటి ఆశ్రమంలోనే మోక్షం పొందుతాడు. అలాటివాడికి తక్కిన మూడుఆశ్రమాలూ అనుసరించవలిసిన అవసరంలేదు. రజోగుణమూ, తమోగుణమూ మానుకుని సాత్వికుడైతే చాలు. సాత్వికవృత్తివల్ల ఆత్మదర్శనం దొరుకుతుంది. మనిషి తన్ను తాను తెలుసుకుంటాడు. విశ్వంలో తానూ, తనలో విశ్వమూ వుండడం చూస్తాడు. ముక్తి పొందుతాడు.

'ఈవిషయంలో యయాతి మాటలు విను — 'ఆత్మలోనే వుంది జ్యోతి. సమాధిలో వున్న ముని చూడగలడది. ఇతర్లవల్లతనకీ తనవల్ల ఇతర్లకీ భయంలేకపోతే పరమాత్మ దర్శన మవుతుంది. కోరికా, నిరోధమూ, కామవృత్తీ లేకండా తపస్సులో వున్నవాడు పరబ్రహ్మం చేరుకుంటాడు. వినుట్న్నదీ, చూస్తున్నదీ, ప్రతీదాని మీదా సమబుద్ధి కలిగి, ఏ ఆశా లేకండా సుఖ దుఃఖాలు మొద

లైన ద్వంద్వాలు వొదిలిపెట్టినవాడు ముక్తి పొందుతాడు. ఇనుమూ, బంగారమూ వొక్కలాగే చూస్తూ, తిట్లూ, మెప్పులూ వొక్కలాగే భావిస్తూ, అవయవాలన్నీ ముడుచుకునే తాబేలులాగ ఇంద్రియాలన్నీ తనలో అణుచుకున్నవాడు పరమాత్మని పొందుతాడు.

'ఇవన్నీ నీ తండ్రి వ్యాస దేవుడి అనుగ్రహంవల్ల నీలో వున్నాయి. దివ్యజ్ఞానంతో నేను తెలుసుకున్నాను. తండ్రిని మించిన కొడుకువి నువ్వు. జ్ఞానమూ, విజ్ఞానమూ మునులు మెచ్చుకునే గుణాలు. అవి సంపూర్ణంగా వుండినా, దృఢనిశ్చయం లేకపోతే మోక్షపదం కనపడదు. నీలో వొక్క లోపమూ లేదు. మోక్షజ్ఞానం కలవాడివి. నువ్వు. సంశయించకు నువ్వు చూసిందే మోక్షం.'

జనకుడి బోధ విన్నాడు శుకుడు. సంశయాలు వొదిలిపెట్టాడు శాంతుడయాడు. పరమసౌఖ్యం అనుభవించాడు. తన్ను తాను చూస్తూ లేచాడు గాలిలా ఉత్తరం వేపు బయలుదేరాడు. దేవతలూ, మునులూ, గరుడులూ గంధర్వులూ సంతోషంతో నివసిస్తూ వున్న హిమాలయ పర్వతానికి వెళ్ళాడు

## హిమాలయంమీద వ్యాసుడు

హిమాలయం పుణ్యవైభవం విను. శివుడు వొంటికాలుమీద నిలబడి ఎన్నో సంవత్సరాలు దానిమీద తపస్సు చేశాడు. కుమార్తె కోసం కృష్ణుడు అక్కడే ఎంతో నియమంతో ఎన్నో వ్రతాలు చేశాడు. కుమారస్వామి తన శక్తిప్రభావం చూపి అక్కడే దేవతల సేనాపతి అయాడు. ఇంకా ఎందరో మునులూ, దేవతలూ, అక్కడే సుప్రసిద్ధులయారు. ఆ హిమాలయమే తనకూతురినిచ్చి శివుణ్ణి వొక ఇంటివాణ్ణి చేసింది. యజ్ఞాలకి అవసరమైనవన్నీ ఇచ్చి బ్రహ్మదేవుణ్ణి తనలా చేసుకుంది.

అలాటి హిమాలయపర్వతానికి కర్ణికారవనం (కొండగోగు అడవి) నించి ముందే వచ్చాడు వ్యాసుడు. ఆశ్రమంలో సుమంతుడూ, వైశంపాయనుడూ, జైమినీ, పైలుడూ — ఈశిష్యులకి అధ్యయనం చేయిస్తూ కూచున్నాడు. పవిత్రమైన ఆశ్రమం సూర్యుడిలాటి తన కాంతితో వెలిగిస్తూ తండ్రిదగ్గిరికి వెళ్ళాడు శుకుడు. యోగబలంతో ఎన్నో కొండలూ, అడవులూ, నదులూ దాటి ధనుస్సునించి వచ్చిన బాణంలా వచ్చిన కుమారుణ్ణి చూసి సంతోషించాడు వ్యాసముని. తండ్రికిపాదాభివందనం చేశాడు శుకుడు. మెచ్చుకున్నాడు వ్యాసుడు. తండ్రి అనుమతిపొంది దగ్గిర కూచున్నాడు శుకుడు. జనకుడితో జరిగిన పసంగం వివరించాడు.

శిష్యులతో కుమారుణ్ణీ అధ్యయనం చేయించాడు వ్యాసుడు. ఒకనాడు సుమంతుడూ మొదలైన శిష్యులు నలుగురూ వ్యాసమునిని ప్రార్థించారు — 'గురుదేవా! మేమూ, శుకుడూ ఈ అయిదుగురమూ వేదాల్లో అందరికంటె అధికులంగా వుండాలి. మాలోగ మరి ఎవ్వరికీ పూర్తిగా వేదాలు చదివించకు. ఈ వరం మాకు అనుగ్రహించు' అన్నారు.

ఎవ్వరిమీదా పక్షపాతంలేదు వ్యాసమునికి. 'భక్తులైన బ్రాహ్మలకు వాగ్బ్రహ్మమైన వేదం ఉపదేశించిన ఉత్తముడికి బ్రహ్మలోకం అరచేతిలో వుంటుంది. ఇది తెలియదా మీకు? అంతమందీ సంసారసాగరం దాటి శుభంపొందాలనే భావించాలి కాని ఇలా అనవచ్చా మీరు?' అన్నాడు.

ఒకళ్ళమొహం వొకళ్ళు చూసుకున్నారు శిష్యులు. 'అయితే కొండదిగివెళ్ళి, లోకమంతా తిరిగి, అంతమందినీ వేదాలు చదివించమని సెలవా? యజ్ఞాలూ అవీ చేయించి అంతటా సిదయారంవ వెదజల్లమంటావా?' అని అడిగారు.

'అదేమిటీ!' అన్నాడు వ్యాసముని - 'వెనక ఎన్నడూ ఇలా అనలేదే మీరు! ఉహూఁ, మిమ్మల్ని వెళ్ళనివ్వను. ఎక్కడికో వెళ్ళాలని మీకు బుద్ధిపుట్టింది. మధ్యపెట్టి ఇలా అంటున్నారు. నేను అన్నమాట మీకోరిక తీర్చుకోడానికి సాధనం చేసుకున్నారు. ఇన్ని పోకళ్ళు పోతున్నారు' అంటూ నవ్వాడు.

తమని అంత ప్రేమతో చూస్తున్న గురువుపాదాలముందు నలుగురూ సాగిలబడ్డారు శిష్యులు. గుచ్చి కౌగిలించుకున్నాడు గురుదేవుడు. నలుగురినీ దీవించాడు. 'ఏదిచేసినా ప్రమాదం లేకండా చెయ్యండి. ముల్లోకాల్లోనూ మీకు వచ్చినచోట వుండండి' అంటూ సెలవిచ్చాడు. వెళ్ళి, వేదాలు చదివిస్తూ, యజ్ఞాలుచేయిస్తూ దేశదేశాలు తిరిగారు శిష్యులు.

ఒకనాడు నారదముని వ్యాసమునిఆశ్రమానికి వచ్చాడు. 'మీరు వున్నదగ్గిర వేద ఘోష లేదేమిటీ!' అని అడిగాడు. 'శిష్యులు లేరు' అన్నాడు వ్యాసుడు. 'శుకుడూ, నువ్వూ అయినా చదవవచ్చు కదా!' అన్నాడు నారదుడు. 'అవును' అంటూ నారదుణ్ణి మెచ్చుకుని కొడుకుతో కలిసి లోకమంతా వేద ఘోషతో ముంచెత్తాడు వ్యాసుడు. ఇంతలో పెద్ద పెనుగాలి వీచింది. 'ఇప్పుడు వేదం చదవకూడదు' • అని కొడుకుతో చెప్పి ఆపేశాడు వ్యాసుడు.

'ఇంత పెనుగాలి ఎక్కణ్ణుంచి వచ్చింది!' అని అడిగాడు శుకుడు. అన్నిభూతాలూ ఎరిగిన విశేషజ్ఞుడు వేదవ్యాసుడు. 'దేవమార్గంలో విష్ణువూ, పితృమార్గంలో సూర్యుడూ మీదుగానూ కిందుగానూ పయనిస్తూవుంటారు. ఆ పయనం వాయువుని ఆశ్రయించి వుంటుంది. వాయువుల విషయం చెపుతాను విను. సమానుడనే వాయువు దేవతల్లో పుట్టాడు. సమానుడికి ఉదానుడు పుట్టాడు. అతడికి వ్యానుడు పుట్టాడు. వ్యానుడికి అపానుడు పుట్టాడు. అతడికి

ప్రాణుడు పుట్టాడు. లోకాలన్నీ ఈవాయువులతోనే నిండివుంటాయి. అవవహుడూ, ఉద్వహుడూ, సంవహుడూ వివహుడూ, ఉపవహుడూ, పరావహుడూ అని వాయువులు ఏడువిధాలు. వీళ్ళు అదితిపుత్రులు. అన్నిలోకాల్లోనూ సంచరిస్తారు. సమానుడూ మొదలైనవాళ్ళకంటే గొప్పవాళ్ళు. వానలు కురవడానికీ, మానడానికీ వీళ్ళే కారణం. దేవతల విమానాలకి వీటివల్లే మహావేగం కలుగుతుంది.

'ఒకొక్కనాడు విష్ణువు వూపిరి వడి ఈవాయువుల్ని క్షోభ పెడుతుంది. అదుగో అప్పుడు వికృతమైన వాయువే ఇది. దీని వడి హెచ్చు. హిమాలయమే కదిలించెయ్యా లనుకుంటుం దిది. ఇలాం టప్పుడు వేదపఠనం చేటుకలిగిస్తుంది. అందుకనే మానెయ్యవలిసి వచ్చింది' అని చెప్పాడు వ్యాసముని.

గాలి తగ్గిపోయింది. ఎప్పటిలాగే ప్రాణకోటి సుఖపడింది. స్నానానికి వేళయింది. నువ్వు చదువుతూవుండు' అని కుమారుడితో చెప్పి ఆకాశగంగ పదుతూవున్న చోటికి వెళ్ళాడు వ్యాసుడు. కొంచేపు వేదం చదివాడు శుకుడు. విని మెచ్చుకున్నాడు నారదుడు.

## నారదుడి తత్త్వోపదేశం

'నీకు మేలు చేస్తాను. ఏంకావాలో చెప్పు' అని శుకుణ్ణి అడి గాడు నారదముని. 'ఈలోకంలో పుట్టినవాడికి ఏదిమంచిదో వివరించు' అన్నాడు శుకుడు. 'వెనక సనత్కుమారుడు మునీశ్వర్లకి చెప్పిన మాటలు నువ్వు అడిగినదానికి సమాధానంగా వుంటాయి విను' అంటూ ఎత్తుకున్నాడు నారదుడు – 'సత్యమే తపస్సు. విద్యే కన్ను. త్యాగమే సుఖం. మోహమే దుఃఖం. మనిషి ముక్తికోసం ప్రయ త్నించకపోయాడో మళ్ళీజన్మలో అది మరింత దూరమవుతుంది. కామక్రోధాలు ముక్తికి శత్రువుల్లు. ఈరెండూ తెలుసుకుంటే ముక్తికి

మరో సాధనం అక్కరలేదు. చావుపుట్టుకల సంసారం దానంతట అదేపోతుంది.

'ఎవళ్ళదగ్గిరా ఏదీ పుచ్చుకోకండా, అన్నిప్రయత్నాలూ వొదులుకున్న పండితుడికి దుఃఖముంటూ వుండదు. మోక్షమార్గం సులభమై, సుఖం కలుగుతుంది భూతాలను చూడకండా వుండడమూ, ముట్టకండా వుండడమూ వాటితో మాట్లాడకండా వుండడమూ మోక్షమార్గానికి సాధనం. అహింసా, ఇంద్రియనిగ్రహమూ, వైరాగ్యమూ, చపలత్వంలేకండా వుండడమూ అలవరుచుకున్న వాడికి మోక్షం కరతలామలక మవుతుంది. ఇదీ సనత్కుమారుడి ఉపదేశం. ఇది మనస్సుకి పట్టించుకో. ఇహపరాలు సిద్ధిస్తాయి.

'భార్యాబిడ్డలమీద మోహంపెట్టుకుంటే, ఊబిలో కూరుకుపోయిన ఏనుగులా కష్టపడతాడు మనిషి. భోగలంపటుడు వల్లోచిక్కిన చేపలాగ, వురిలో తగులుకున్న లేడిలాగ దుఃఖాలపాలవుతాడు.

'ధర్మమూ అధర్మమూ, సత్యమూ, అసత్యమూ మానుకోవాలి. అది ఎలా వీలవుతుందంటావా ! అహింసతో అధర్మం అణిగిపోతుంది. సంకల్పం మానుకుంటే ధర్మమూ అణగిపోతుంది. బుద్ధిబలంతో సత్యమూ, అసత్యమూ వొదిలిపోతాయి. ఆత్మభావం వల్ల బుద్ధికూడా లయమైపోతుంది. రోజూ కలిగే భయకారణాలు వదివేలుంటాయి. అయితే పండితుడు మాత్రం అందులో చిక్కుకోడు. భూతాలూ, ఇంద్రియాలూ వొకక్కదగ్గిర పోగైవుంటే, వాటికోసం విచారించడం, వూళ్ళోవాళ్ళ దుఃఖానికి తాను ఏడవడం వంటిది అన్నాడు.

## శుకుడి యోగసిద్ధి

సందేహం తీరి సంతోషించాడు శుకుడు. 'దివ్యమైన నీవచనామృతంవల్ల కృతార్థుణ్ణయాను మనోరోగం మాయమైంది. సూర్యుడి

మహిమవల్ల యోగసిద్ధిపొందుతాను. సమస్తమూ వొదిలిపెడతాను' అన్నాడు. నారదుడి అనుమతి తీసుకున్నాడు. తండ్రిదగ్గిరికి వెళ్ళి నమస్కరించాడు. తన నిశ్చయం విన్నవించాడు. కుమారుడి విజ్ఞానం తెలుసుకుని సంతోషించాడు వ్యాసుడు. తండ్రికి ప్రదక్షిణంచేసి వెళ్ళిపోడానికి బయలుదేరాడు శుకుడు.

'నాయనా! ఆగావోయి' ప్రేమతో అన్నాడు వ్యాసుడు — నాకళ్ళ వేడుకగా వున్నావు. కొంచెపు వుండు తండ్రీ!' అన్నాడు. కాని ఆగలేదు శుకుడు స్నేహమూ, సందేహమూ, వొదిలేసి, నిర్మలమైన మనస్సుతో వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం సిద్ధులూ, సాధ్యులూ సేవిస్తున్న కైలాసశిఖరానికి వెళ్ళాడు. అక్కడ ఎవ్వరూ లేని సమప్రదేశం చూసుకుని, తూర్పుముఖంగా కూచున్నాడు. అవయవాలు నిశ్చలం చేసుకుని యోగంలో మగ్నుడయాడు.

సూర్యోదయమైంది. లోబరుచుకున్న అవయవాలతో సూర్యుణ్ణి ఆశ్రయించాడు శుకుడు. యోగసిద్ధి పొందాడు. అనుకోకండా అక్కడికే వచ్చాడు నారదముని. నమస్కరించాడు శుకుడు. తన యోగసిద్ధి వివరించాడు. 'నీ అనుగ్రహంవల్ల దారి దొరికింది. సంసార బంధాలు వొదిలి వెళుతున్నాను.' అంటూ యోగసిద్ధితో గరుత్మంతుడిలాగ ఆకాశాని కెగిరాడతడు. సిద్ధులూ, సాధ్యులూ చూసి ముక్కుమీద వేలుపెట్టుకున్నారు. ఇంత వేగం ఈ మహాత్ముడు ఎలా యోగసిద్ధి పొందాడో! ఎంత నిర్మలమైన మనస్సో! చలనంలేని పితృభక్తివల్లే ఇంత మహనీయత్వం అబ్బింది ఇతడికి' అంటూ తమలో తాము చెప్పుకున్నారు. ఎన్నోవిధాల మెచ్చుకున్నారు.

మృగాలూ, పక్షులూ, కొండలూ, నదులూ, చెరువులూ, చెట్లూ, తుప్పలూ, లతలూ—వీటిని చూసి, నాతండ్రి నా వెంటపడి,

'శుకుడా!' అని నా పేరు పెట్టి పిలిస్తే మీరంతా 'ఓ' అనాలి సుమండీ' అన్నాడు శుకుడు. 'అలాగే చేస్తాం' అన్నాయి అవి.

తమోగుణమూ, రజోగుణమూ, సత్వగుణమూ క్రమంగా వొదిలిపెట్టి, ఉత్తరంవేపు వెళ్ళిపోతున్నాడు శుకుడు. వెళ్ళగా వెళ్ళగా రెండు పర్వతశిఖరాలు దారికి అడ్డువచ్చాయి. మేరుపర్వతంలా వొకటి పసుపుపచ్చగా వుంది. ఒకటి హిమాలయ పర్వతం లాగ తెల్లగా వుంది రెండూ ఎన్నో యోజనాల పొడవున్నాయి. ఎన్నో యోజనాల వెడల్పున్నాయి ఆగకుండా అతడు హుటాహుటిగా ముందుకే సాగాడు. రెండు కొండశిఖరాలూ తునాతునకలైపోయి, రాలిపోయాయి. అతడిమీద పూలవాన కురిపించారు దేవతలు. ఎన్నోవిధాల మెచ్చుకొన్నారు.

అక్కడ పారుతున్న గంగానదిమీద ఆకాశం దగ్గిర చేరుకున్నాడు ఉత్తమసిద్ధుడు శుకుడు. బట్టలు లేకుండా గంగలో జలకేళి చేస్తున్నారు అప్సరసలు. శుకుణ్ణి చూశారు. అనుమానం లేకుండా, వొక వికారం లేకుండా ఎప్పటిలాగే స్నానాలు చేశారు.

ఇంతలో మహాయోగ గమనంతో కొడుకు వెంటపడ్డాడు వ్యాసముని. అప్పటికి వాయుమార్గం దాటేశాడు శుకుడు. పంచభూతాల్లో కలిసిపోయాడు.

కొడుకు వెంట పడుతున్న వ్యాసుడితో సిద్ధులూ, చారణులూ శుకుడు కొండశిఖరాలు పడగొట్టడం చెప్పారు. 'శుకా!' అని పెద్ద గొంతుకతో కేకవేసి పిలిచాడు వ్యాసుడు. అంతటా వ్యాపించిన శుకుడు, నిజప్రభావం మరుగుపడివుండడం తేటపడినట్టు బయల్లో 'ఓ' అని ధ్వని పుట్టినట్టుచేశాడు. చెట్టూ పుట్టా, కొండా కోనా, పురుగూ పుట్రా, నదులూ, చెరువులూ అన్నీ 'ఓ' అన్నాయి. కొడుకు విశాల

మహిమ తెలుసుకుని ఆశ్చర్యపోయాడు వ్యాసుడు. ఆకొండమీద నిలబడిపోయాడు.

వ్యాసుణ్ణి చూచి గంగలో స్నానాలాడుతున్న అప్సరసలు సిగ్గు పడి చప్పున బట్టలు చుట్టబెట్టుకున్నారు. తనకొడుకు వెళ్ళినప్పుడు వాళ్ళు అనుమానించకపోడం దివ్యజ్ఞానంతో తెలుసుకున్నాడు వ్యాసుడు. కుమారుడు ముక్తుడు కావడమూ, తాను కాకపోవడమూ గ్రహించాడు. ఒకవంక సంతోషించాడు. ఒకవంక సిగ్గుపడ్డాడు. విచారిస్తూ నుంచున్నాడు.

దేవతలూ, సిద్ధులూ మునులూ వాళ్ళతో కలిసి శివుడు ప్రత్యక్షమయాడు-'నీరూ, గాలీ, ఆకాశమూ, భూమీ, అగ్ని - వీటితో సమానుడైన కుమారుడు కావాలన్నావు. అలాటి కొడుకునే ఇచ్చాను. నాప్రభావం వల్లా, నీ తపోవిశేషంవల్లా వాడు బ్రహ్మతేజోమయుడయాడు. దేవతలకి అందరాని పరమపదం చేరుకున్నాడు. దీనికి సంతోషించాలి కాని విచారించడ మెందుకూ?

'భూమీ కొండలూ, సముద్రాలూ ఎంతకాలం వుంటాయో అంతకాలమూ శుకుడికీర్తి, నీయశస్సూ జనుల చెవుల పండువుగా విని పిస్తూనే వుంటాయి.

'అంతగా కావాలంటే నీకొడుకులాటి ఛాయ ఎప్పుడూ నిన్ను నుసరిస్తూ వుంటుంది. చూస్తూవుంటావు' అన్నాడు.

ఇలా వ్యాసుణ్ణి సంతోషపెట్టి అంతర్థానమయాడు శివుడు ధర్మరాజా! ఇదంతా నారదుడు చెప్పాడునాకు. ఉత్తమమైన ఇతి హాసం ఇది. చదివినా విన్నా ఆయురారోగ్యాలూ, కీర్తిసంపదలూ లుగుతాయి. మోక్షం లభిస్తుంది. ఇంకా ఏం వినాలనుందో అడుగు.

ధర్మరాజు— బ్రహ్మచర్యమూ మొదలైన నాలుగాశ్రమాలూ అవలంబించినవాళ్ళు, మోక్షంకోసం ఏ దేవుణ్ణి ఆరాధించాలి?

## నారద — నారాయణ సంవాదం

భీష్ముడు — నారద నారాయణ సంవాదమని వొక ఇతిహాసం మాతండ్రి నాకు చెప్పాడు. అది వింటే నువ్వు అడిగిన విషయం అవగతమవుతుంది.

సనాతనుడైన నారాయణముని బదరికాశ్రమంలో వుండగా నారదుడు వెళ్ళి సేవించాడు. 'ముక్తికోరేవాడు దేన్ని ఆరాధించాలి? సెలవియ్యి' అని అడిగాడు

'అంతటికీ అంతరాత్మ అయి వెలుగుతున్న పర్వతత్వం తప్ప మరేముంది?' అన్నాడు నారాయణుడు — స్థిరమైందది. చలనంలేంది. ఇంద్రియాలకి గోచరంకాంది. సూక్ష్మమైంది దానికి అదే సాటి. బ్రహ్మ మొదలుకుని సర్వభూతాలూ పూజించే ఆ పరతత్వం నేనే.'

'ప్రభూ! సంతోషిస్తూ అడిగాడు నారదుడు — ధర్మాత్ముల్ని రక్షించడంకోసం నువ్వు అవతారమెత్తుతావని పండితులంటారు ఆ రహస్యం ఏమిటో అనుగ్రహించు. వేదాలు కొంత తెలుసు. గురుభక్తికొంతవుంది. నాలో యోగ్యత వుంటేనే ఈ వెలుగు ప్రసాదించు' అని ప్రార్థించాడు.

భక్తపరాధీనుడు నారాయణుడు. 'ఏకాంతంగా వుండు. నీకు తెలిసినట్టు చేస్తాను. వెళ్ళు' అంటూ నారదుణ్ణి ఆదరంతో సెలవిచ్చాడు. సంతోషించాడు నారదుడు. ఆకాశమార్గాన వెళ్ళి మేరు పర్వతంమీద నియమంతో నివసించాడు. పాలసముద్రం ఉత్తరం గట్టుదగ్గిర శ్వేతపర్వతంమీద తెల్లటి మనుషుల్ని చూశాడు. నిదా

హాకులు వాళ్ళు. వికయేచ్ఛలేదు వాళ్ళకి. చెమటపట్టకండా ఎప్పుడూ వాళ్ళ శరీరం పరిమళిస్తూ వుంటుంది.

ధర్మరాజు — ఇవి ముక్తుల లక్షణాలు. వాళ్ళవిషయం వివరించు.

భీష్ముడు — వాళ్ళకథ మాత్రండికి పండితులు చెప్పగా విన్నాను. ఉపరిచరవసువు ఉత్తమమైన నడవడితో భూమంతా పరిపాలిస్తూ వుండేవాడు. సత్యమూ, దమమూ, శమమూ, విష్ణుభక్తీ, యజ్ఞాలమీద అభిలాషా, బ్రాహ్మణప్రీతి అధికం అతడికి. ఆ మహాత్ముడు తపస్సుకోసం రాజరికం వొదిలేశాడు. అడివిలో తిరుగుతూ వుండగా అతడిదగ్గిరికి దేవేంద్రుడు వచ్చాడు. 'నాతో నేస్తంగా వుండు. రాజ్యం ఏలుతూ నాదగ్గిరికి వస్తూ పోతూ వుండువుకాని. నీనిష్ఠకి సంతోషించాను. దివ్యత్వమిచ్చాను. దేవభావానికి తగినట్టు ఇదుగో ఈరత్నవిమానం ఎక్కి అంతటా తిరుగు' అని వొక దివ్య విమాన మిచ్చాడు. ఇంద్రుడు చెప్పినప్రకారమే నడుచుకున్నాడు ఉపరిచరవసువు. అసలు అందువల్లే అతడిపేరు ఉపరిచరవసువు అయింది. అదీకాక, అతడి ఇంకొక విశేషం విను. సృష్టి ఆరంభంలో మరీచీ, అత్రీ, అంగిరసుడూ, పులహుడూ, పులస్త్యుడూ, క్రతువూ అని మహామునులు, చిత్రశిఖండి పేరుకలవాళ్ళు స్వాయంభువమనువుతో కలిసి ఎన్నో ఏళ్ళు విష్ణువుకోసం తపస్సుచేశారు. కనపడకండా విష్ణువువాళ్ళయెదట నుంచున్నాడు. 'మీరు ధర్మశాస్త్రాలునిర్మించడం కోసం నన్ను ఆశ్రయించారు. సరస్వతి మీలో నిలవాలని నియోగించాను. మీరుచేసిన శాస్త్రాలు అన్ని లోకాలకీ మేలుకలిగిస్తాయి. అంగిరసుడికి బృహస్పతి అని వొక మహా మతిమంతుడు పుడతాడు. ఈశాస్త్రాలు అతడిలో ప్రతిష్ఠించండి' అని ఆజ్ఞాపించాడు. ఇంకా ఇలా అన్నాడు — 'ఉపరిచరవసువని వొక రాజు పుడతాడు. మీరుచేసిన

శాస్త్రాలన్నీ చదవదగినవా డతడు. బృహస్పతిదగ్గిర నేర్చుకుంటాడు. అవి పాటించడంలో నాయకత్వం వహిస్తాడు. ఆ మహాత్ముడు నా భక్తుడు మీారు గౌరవించ దగినవాడు.'

అదుగో అంచేతే ఉపరిచరవసువు అంతవా డయాడు. అశ్వమేధయజ్ఞంచేశాడు. మరీచుడూ మొదలైన సప్తరుషులూ, వాళ్ళతో సమానులైన మహానుభావులూ, రుత్విక్కులయారు. బృహస్పతి యజ్ఞకార్యాలన్నీ నడిపించాడు. ప్రజాపతికుమాళ్ళు ఏకతుడూ, ద్వితుడూ, త్రితుడూ సదస్యులయారు.

ఉపరిచరవసువు అహింసకుడు. అంచేత ఆయజ్ఞంలో పశువు చంపకండా పరమనిష్ఠతో అరణ్యకం అనే వేదభాగంలోని వాక్యాలు విష్ణువుగురించి పఠించాడు. దయామయుడు విష్ణువు, అతడికిమాత్రం అవుపడుతూ వచ్చి హవిర్భాగం పుచ్చుకు వెళ్ళాడు.

దివ్యప్రజ్ఞకల బృహస్పతి కోపం తెచ్చుకున్నాడు, 'తనకోసం ఎత్తిన పురోడాశం (యజ్ఞంలోచేసినపిండివంట) అందరిదేవతల్లాగే నాకు అవుపడి పుచ్చుకోలేదు విష్ణువు!' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. వినయంతో వేడాడ్చాడు ఉపరిచరుడు. 'కోపం విడిచిపెట్టు' అన్నారు సదస్యులు. 'తనకోసం ఉద్దేశించిన హవిర్భాగం తాను తీసుకున్నాడు విష్ణువు. దీనికి కోపమెందుకూ? నీకూ మాకూ అతడి దర్శనం శక్యంకాదు. బ్రహ్మమానసపుత్రులమైన మేము అతడి దర్శనంకోసం ఎంతో తపస్సుచేశాం. 'పాలసముద్రంలో తెల్లటి దొ॰క దీవి వుంది. అక్కడికి వెళ్ళండి. అక్కడ తెల్లటి మనుషులున్నారు. ఇంద్రియాలు గెలిచినవాళ్ళు వాళ్ళు. నిరాహారులు. విష్ణుభక్తులు. వాళ్ళకి చెమట పట్టదు. పరిమళిస్తూవుంటాయి వాళ్ళ శరీరాలు. వాళ్ళకే తనరూపం చూపిస్తాడు విష్ణువు. వాళ్ళు చూసినప్పుడు మీారూ చూడవచ్చేమో' అని మాతో అంది ఆకాశవాణి.

'దాంతో మేం అందరమూ సంతోషంతో వెంటనే తెల్లదీవికి వెళ్ళాం. ఆకాశవాణి చెప్పినట్టే తెల్లవాళ్ళని చూశాం. అలాంటికాంతి ఏదేశంలోనూ, ఏజాతిలోనూ లేదు. వాళ్ళందరూ మానస జపం చేసే వాళ్ళే. వాళ్ళ ఏకాంతజపం దరిదాపునే మేం నించున్నాం.

'ఇంతలో వెయ్యిసూర్యులంత వెలుగుతో దివ్యమైన వొక తేజోరూపం వాళ్ళఎదట కనిపించింది. వాళ్ళందరూ భక్తితో ప్రణామాలు చేశారు. 'జయ పుండరీకాక్షా, జయ హృషీకేశా! జయ విశ్వభావనా! నమస్తే, నమస్తే' అన్న కేకలు ఆకాశం అంటినట్టు వొలిచారు. ఆతేజస్సులో మాకళ్ళు చెదిరిపోయాయి. ఏదీ చూడలేకపోయాం. ఏదీ తెలుసుకోలేకపోయాం. అప్పుడు ఆకాశంమీద వొక భూతం 'మీఎదటి మహాపురుషుడే విష్ణువు. మీతపస్సూ, దానమూ విష్ణువుని చూడడానికి చాలవు. ఏకాంత భక్తితో ఎన్నో ఏళ్ళకికాని విష్ణుదర్శనం కాదు. ఇలా తొందరపడితే చూడగలరా?' అంది.

'విని తిరిగివచ్చేశాం. ఇదీ విష్ణువురీతి. అంచేత కోపం పనిలేదు. యజ్ఞం నడిపించు' అన్నారు.

ఇలా ఏకతుడూ, ద్వితుడూ, త్రితుడూ చెప్పాక, శాంతించాడు బృహస్పతి. యజ్ఞం చక్కగా జరిగించాడు. ఉపరిచరవసువు పుణ్యపరుడై రాజ్యం చేశాడు.

ఒకనాడు స్వర్గంలో దేవతలూ, మునులూ, గోష్ఠిలోవుండి 'యజ్ఞాల్లో మేకలు చంపాలి' అన్నారు దేవతలు. 'మేకలు అన్నంత మాత్రాన అన్నియుగాల్లోనూ మేకలే అనుకోకూడదు' అన్నారు మునులు — 'కృతయుగంలో మేకలు (అజాలు) అంటే ఓషధులు అన్నాయి వేదాలు' ఇలా వాదం పెరిగింది. ఇంతలో దైవికంగా 'ఉపరిచరవసువు అక్కడికి వచ్చాడు. ఉభయపక్షాలవాళ్ళూ తీర్పు

అతడిమీదపెట్టారు. అతణ్ణి అడిగారు. 'దేవతల పక్షమై, అన్ని యుగాల్లోనూ యజ్ఞాల్లో మేకలు చంపవచ్చు' అన్నాడు ఉపరిచరుడు.

వేదాలకి అపార్థం చెప్పినందుకు కోపం తెచ్చుకున్నారు మునులు. శపించారు భూమిరంధ్రంలో పడిపోయాడు ఉపరిచరుడు. దేవతలు అతడిదగ్గిరికి వచ్చారు. 'నీకు నొప్పీ, దప్పికా లేకండా వుండాలి! విష్ణువుదయవల్ల ఎప్పటిలాగే వుంటావు' అంటూ ఓదార్చారు.

'విష్ణువునే ధ్యానించాడు ఉపరిచరుడు వెంటనే విష్ణువు గరుత్మంతుణ్ణి పంపాడు. స్వదేహంతో అతణ్ణి బ్రహ్మలోకం చేర్పించాడు. గౌరవించాడు. బ్రహ్మానందం పొందాడు వసురాజు. ధర్మరాజా నువ్వు అడిగిన తెల్లవాళ్ళ దివ్యత్వం చెపుతూ, ప్రసంగవశాత్తూ ఉపరిచరవసువు కథ వచ్చింది. నారదుడి సంగతి విను. అలా నారదుడికి తెల్లదీవీ, అద్భుతులైన తెల్లమనుషులూ తన మనసులో అవుపించారు. వాళ్ళ దగ్గిరికి వెళ్ళాడతడు. ఆదరించారు వాళ్ళు. భక్తితో నమస్కరించాడు నారదుడు. ఏకాంతులైన వాళ్ళకి — ల్లంత దగ్గిరలో నిలబడ్డాడు. దుష్కరమైన తపోమహిమతో చేతులు మీదికెత్తి దివ్య నామాలు ఉచ్చరించాడు. అక్కడి జీవులందరూ ఆనందించినట్టు విష్ణుదేవుణ్ణి స్తుతించాడు. ఏకాంతభక్తితో అలా స్తుతించడంతోనే తెలుపూ, నలుపూ, పసుపూ, ఎరుపూ, కపిలవర్ణమూ, ఆకుపచ్చా రంగులతోనూ ఎన్నో అన్ని శిరసులతోనూ, ఎన్నో చేతులతోనూ, ఎన్నో పాదాలతోనూ, వేదికా, కమండలువూ, స్రుక్కూ, స్రువమూ అగ్నిహోత్రమూ వాటితోనూ, ఓంకారమూ, గాయత్రీ, నాలుగు వేదాలూ ఉచ్చారణతోనూ, మహాద్భుతమైన దివ్యమైన నిజరూపంతో దర్శనమిచ్చాడు విష్ణువు. వినయంతో, భక్తితో తడబడిపోతూ సాగిలబడ్డాడు పరమముని నారదుడు. ఆదరించాడు విష్ణువు.

'నారదా! ఎవ్వరూ నన్ను చూడలేరు. ఏకాంతులు మాత్రం చూడగలరు. నువ్వు ఏకాంతకుడివి. కనక నే చూడగలి గావు' అంటూ వరం కోరమన్నాడు. 'దేవా నీదర్శనంకంటే నాకు కావలిసిన వరమేముంది!' అన్నాడు నారదుడు. ఎంతో దయ చూశాడు విష్ణువు.

'ఆత్మ ఇంద్రియాలకి అందిరాదు. అన్ని భూతాలూ నశించినా అతడు నశించడు. మూడుగుణాలూ లేని సర్వాత్ముడతడు. సర్వసాక్షి. పుట్టుకలేని వాడు. గుర్తులేనివాడు. క్షేత్రజ్ఞుడు. జీవుడే వాసుదేవుడు, సంకర్షణుడు. మనస్సు ప్రద్యుమ్నుడు. అహంకారం అనిరుద్ధుడు. ఇవన్నీ నేనే. ఇరవైనాలుగు తత్వాలకీ ప్రభువైన ఇరవైఅయిదో తత్వం నేను. పరమపురుషుడని నన్నే అంటారు. నేను తప్ప పరంలేదు. ఏకాంతుడు చూసి మోక్షపదం పొందే పరమాత్మణ్ణి నేనే. నేనే వాసుదేవుణ్ణి. గుర్తులేనివాణ్ణి. నన్ను తెలుసుకోడమే ముక్తిసాధనం. పంచభూతాలూ, రక్తమాంసాలూ, మూలుగూ లేందే శరీరం లేదు. వీటికి జీవుడి సంయోగం లేకపోతే చేష్టవుండదు. జీవం వేరూ, శరీరం వేరూ అని తెలుసుకోవాలి. జీవుణ్ణి చూశాయంటారే అది నా మాయావిలాసం. జీవుడు నాతో కూడిన వాడని దృఢంగా తెలుసుకోవాలి. భక్తి అధికం కలవాడు నన్ను సులభంగా పొందుతాడు. అతడికి ముక్తి ప్రసాదిస్తాను. ఆదిత్యులూ, మరుత్తులూ, వసువులూ, రుద్రులూ మొదలైన దేవతలూ, బ్రహ్మ, వేదాలూ నాఆత్మకనక నే అంతవిశేషంగా గౌరవం పొందుతున్నాయి.

'బ్రహ్మదేవుణ్ణి సృజించాను. అన్నిలోకాల భారమూ అతడికి అప్పగించాను. నేను నివృత్తుణ్ణయి, మధ్యవర్తిగా వుండి, దివ్యమైన సహాయం మాత్రం చేస్తున్నాను.

ఒకొక్కొక్క కాలంలో లోకం మేలుకోసం అవతారమెత్తు తున్నాను. వరాహరూపంతో హిరణ్యాక్షుణ్ణి చంపుతాను. నరసింహ రూపంతో హిరణ్యకశిపుణ్ణి చంపుతాను. పరశురాముణ్ణయి రాజుల్ని, దశరథరాముణ్ణయి రావణాసురుణ్ణీ సంహరిస్తాను. భూభారం తొలి గించడానికి యాదవకులంలో పుడతాను. దేవేంద్రుడి కొడుకై పుట్టిన నరుడి సహాయంతో ధర్మం స్థాపిస్తాను పూర్వమే నేను నరుడూ నారాయణుడూ అని రెండురూపాలతో ఋషిత్వంపొంది లోకం రక్షిస్తున్నాను. ఆ మూర్తులతోనే విలాసంగా మానవావతారమెత్తి కంసుడూ, కాలయవనుడూ, బాణుడూ, మురుడూ, నరకుడూ మొద లైన కంటకుల్ని చంపుతాను. బాణాసురుణ్ణి రక్షిస్తానని కుమార స్వామితో కూడావచ్చిన శివుణ్ణి గెలిచి, బాణాసురుణ్ణి పరాభవిస్తాను. పూర్వం మత్స్యావతారమెత్తి వేదాలు ఉద్ధరించాను. కూర్మావ తారమెత్తి దేవతలకి మేలుచేశాను. నాచరిత్రలు నువ్వు విన్నవే. ఇంతేకాదు, రక్షణకోసం ఏమేమిచెయ్యాలో అన్ని చేస్తాను. అన్నీ అనంతరం నన్నే చేరతాయి. నారదా ! నువ్వు బ్రహ్మకుమారుడివి. ఏకాంతికుడివి. అంచేత నాతత్వం నీకు చెప్పాను. ఈ శ్వేతద్వీపం తెల్ల మనుషులు చూడు. వీళ్ళకి ఆహారం అక్కర లేదు. ఇంద్రియాలూ, చెమటా వుండవు. శరీరాలు పరిమళిస్తూవుంటాయి. వీళ్ళంతా ఏకాంతి కులు. ఎప్పుడూ నన్ను ధ్యానిస్తూవుంటారు వీళ్ళదగ్గిర గందిక చెయ్యకూడదు. కనక నువ్వు ఇకవెళ్ళు' అంటూ ఆదరంతో అతణ్ణి పాగనంపాడు.

పరమానందంతో బదరికాశ్రమం వచ్చాడు నారదుడు. నరనారాయణుల్ని చూశాడు. భక్తిపూర్వకంగా వాళ్ళదగ్గిర సెలవు తీసుకున్నాడు. విష్ణువు చెప్పిన వేదార్థం యోగమూ, సాంఖ్యమూ

అంతటా మునిసంఘాలతో వినిపించాడు. అలా వినిపిస్తూ బ్రహ్మదగ్గిరికి వెళ్ళాడు. అక్కడా వినిపించాడు.

ధర్మరాజు — బ్రహ్మకి అది తెలియదనా ?

భీష్ముడు — తెలియకేం ? తెలుసు. అయితే అతడికొలువుకి వచ్చిన సిద్ధులూ, సాధ్యులూ ఎరగరు కదా ? వాళ్ళకే వినిపించాడు. క్రమంగా అది లోకమంతటా ప్రచారమైంది. మా తండ్రి శంతనమహారాజు విస్తారంగా వినిపించాడు నాకు. అదే నేను నీకు చెప్పాను. మునులూ దేవతలూ ఇది విని మెచ్చుకుంటారు. విష్ణువుని స్తోత్రం చేస్తారు. భక్తితో జపిస్తారు, మననంచేస్తారు. నువ్వూ అలాగే చెయ్యి. నీతిపరులకీ, శమమూ, దమమూ కల విష్ణుభక్తులకీ ఈ పురాణకథ వినిపించు. ఇంతవరకూ నువ్వు విన్న ఉపాఖ్యానాలు ఏవీ దీంతో సాటిరావు. ఇది చదివినా, విన్నా దీర్ఘాయువు కలుగుతుంది. సిరీ, సంపదా కలుగుతాయి. ఆరోగ్యమూ కలుగుతుంది.

భీష్ముడు చెప్పింది విని పాండవులు అది చదువుతూ, వింటూ, భక్తితో విష్ణువుని సేవించారు. వ్యాసమునీంద్రుడు నారాయణ మంత్రం రోజూ జపిస్తూ విష్ణుపూజకోసం ఆకాశమార్గాన పాల సముద్రానికి వెళుతూ వుంటాడు.

ఇలా వైశంపాయనుడు చెప్పడంతోనే సంతోషించాడు జనమేజయుడు. "మునీంద్రా! మోక్షం ఎంతో సౌఖ్యమైందని చెపుతారు. జనులు యావన్మందీ తమ అభ్యుదయంకోసం కర్మల్లో మగ్నులై వుంటారు. ఒకళ్ళమాటెందుకూ ? దేవతలుకూడా ఈధర్మం పాటించకండా హవిర్భాగాలు అనుభవించడంలోనే మగ్నులై వుంటారు. వాళ్ళగతి ఏమిటా అని ఆలోచిస్తూవుంటాను. ఏమిటిది ?" అని అడిగాడు.

అందుకున్నాడు వైశంపాయనుడు — "మేరుపర్వతం మీద శిష్యులచేత పంచమవేదం చదివించాడు గురుదేవుడు వ్యాసముని. నేనూ, సుమంతుడూ, పైలుడూ, జైమినీ ఇప్పుడు నువ్వు నన్ను అడిగినట్టే గురుదేవుణ్ణి అడిగాం. ఆయన దయతో మాకు ఇలా చెప్పాడు—'భూతభవిష్యద్వర్తమానాలు తెలుసుకునే దివ్యజ్ఞానసంకోచం నేనుపాల సముద్రం వొడ్డున తపస్సుచేశాను. నారాయణుడి అనుగ్రహంవల్ల నా కోరిక సిద్ధించింది. అంచేత సృష్టి ఆరంభంలో బ్రహ్మమొదలైన దేవతలు చేసిన పనులు నాకు తెలుసు. కనక మీరు అడిగిన విషయం వివరిస్తాను. వినండి. ఆదిత్యులూ, మరుత్తులూ, వసువులూ, రుద్రులూ మొదలైన దేవతలూ, మునులూ బ్రహ్మదేవుణ్ణి చూసి, 'మేం ఏం చెయ్యాలి? దయతో సెలవియ్య' అని విన్నవించారు. సంతోషించాడు బ్రహ్మ. 'మీరు ఏం చెయ్యాలి అన్న ఆలోచన ముందే నామనస్సులో పుట్టింది. అదే మీరూ అడిగారు. మంచిపనిచేశారు. మీకూ నాకూ బలం కలిగించే విధానం ఉపదేశించమని విష్ణుదేవుణ్ణి శరణు వేడుకుందాం. రండి' అన్నాడు. అంతమందినీ వెంటపెట్టుకుని పాలసముద్రం వొడ్డుకి వెళ్ళాడు. ఎన్నో వేల సంవత్సరాలు ఘోరమైన తపస్సుచేశాడు. అప్పుడు మధురగంభీరస్వరంతో వొక అశరీరవాణి వినిపించింది.

'మీరు వచ్చినపని ఎరుగుదును. లోకాలన్నిటికీ బ్రహ్మగురువు. ఇతడు ఏది చెపితే అది చెయ్యండి. ఇతడు చెప్పిందే వేదప్రమాణం వేదసమ్మతంగా వొక యజ్ఞం చెయ్యండి. అందులో నాకు భాగం కల్పించండి' అంది.

"బ్రహ్మ చెప్పినప్రకారం దేవతలూ, మునులూ వైష్ణవయాగం చేశారు. అందులో విష్ణుమూర్తికి భాగం కల్పించారు. దయతలిచాడు

విష్ణువు. కనపడకుండా వాళ్ళతో అన్నాడు – 'నామాట ప్రకారం ప్రవృత్తి వ్యాపకమైన పుణ్యకార్యం చేశారు. ఈపుణ్యానికి ఫలం నేను నిరూపిస్తాను. మరీచీ, అంగిరసుడూ, అత్రీ, పులస్త్యుడూ, పులహుడూ, క్రతువూ, వశిష్టుడూ బ్రహ్మమానసపుత్రులు. బ్రహ్మతో సమానులు వేదాచార్యులు, యజ్ఞకార్యధురంధరులు. వీళ్ళు విధించిన ప్రకారం అన్ని యజ్ఞాలూ మనుషులు నడుపుతారు. మీకు అందరికీ ఆయజ్ఞాల్లో భాగాలు లభిస్తాయి. ఆభాగాలతో తృప్తిపడి మీరు వృద్ధిపొందుతారు. సన, సనకసనందన, సనాతన, కపిల, సనత్కుమారులూ బ్రహ్మమానసపుత్రులు, సహజమైన జ్ఞానమూ, విజ్ఞానమూ కలవాళ్ళు. నివృత్తిపరులు. సాంఖ్య, యోగప్రవర్తకులు. వీళ్ళవల్ల మోక్షధర్మాలు స్పష్టపడతాయి. తల్లీ, తండ్రీ, గురువూ అన్నీ బ్రహ్మే మీకు. నాశాసనతో ఇతను సర్వశాసకుడై వుంటాడు. నాలలాటంలో పుట్టిన రుద్రుడు అన్నిలోకాలూ ఆరాధించదగ్గవాడు. అన్నివరాలూ ప్రసాదిస్తాడతడు. మీరు వెళ్ళండి. వేదకర్మలు ఈ బ్రహ్మ, మరీచీ మొదలైన ప్రజాపతులూ చెప్పినట్టు జరుగుతాయి. ఇది కృతయుగం, ఉత్తమకాలం. ఈయుగంలో పశుహింస పనికిరాదు' అని ఆజ్ఞాపించాడు. మునులూ, దేవతలూ, విష్ణువుని స్తోత్రం చేశారు. నమస్కారంచేసి, తమతమ నివాసాలకి వెళ్ళిపోయారు. బ్రహ్మఒక్కడే అక్కడనుంచున్నాడు. గుర్రం తలతో విష్ణువు ప్రత్యక్షమయాడు. చేతుల్లో దండకమండలువులు పట్టుకుని, షడంగాలతో వేదాలు చదువుతూ ఎదట నుంచున్నాడు. దయాదృష్టితో బ్రహ్మని కౌగిలించుకున్నాడు. 'అంతటికీ నువ్వువిధాతవి. గురుడువి. ప్రభువ్వి. నీమీద భారం యావత్తూ పెట్టి, నేను నిశ్చింతగా వుంటాను. నీకు కష్టమని తోచినప్పుడు నేను ప్రత్యక్షమై అంతా చక్కగా సాగినట్టు చేస్తాను' అని అంతర్ధానమయాడు.

" 'యజ్ఞంలో అగ్రభాగం పొందదగిన యజ్ఞభాగాన్ని విష్ణువు ఇలా ప్రవృత్తిధర్మం బ్రహ్మ మొదలైనవాళ్ళకి నియమించాడు. తానేమో అంతటా వ్యాపించాడు' అని చెప్పి 'లోకాలు పుట్టించి, పదిలంగా పెంచి, తనలో లీనం చేసుకుంటున్న చిన్మయస్వరూపుణ్ణి, విష్ణుదేవుణ్ణి సేవిస్తాను. చావుపుట్టుకలు లేనివాణ్ణి, విశ్వరూపుణ్ణి, సర్వదేవాధిదేవుణ్ణి, ఆదిపురుషుణ్ణి, వేదవేదాంగాలతోనూ, ఆత్మజ్ఞానంతోనూ తెలుసుకోదగినవాణ్ణి, తపస్సుకి ఫలమైనవాణ్ణి, ఈశానుణ్ణి, నాశంలేనివాణ్ణి ఆశ్రయిస్తాను' అంటూ ఎన్నోవిధాల ఆనారాయణుణ్ణి స్తుతించాడు. మమ్మల్ని చూసి 'ఇది పూర్వవృత్తాంతం. జ్ఞానదృష్టితో చూసి ఇది మీకు చెప్పాను. విష్ణువు దివ్యవచనాల ప్రకారం నడుచుకోండి. ఆ సర్వేశ్వరుణ్ణి సేవించండి. వేదవాక్యాలతో కీర్తించండి' అన్నాడు.

"గురుదేవుడి ఆజ్ఞప్రకారం మేము రుగ్యజుస్సామవేదాలతో ఆదేవుణ్ణి స్తోత్రంచేశాం. మనసా ఆరాధించాం. ఈపుణ్యకథ చదివినా, విన్నా బ్రాహ్మణుడు వేదవేత్త అవుతాడు. రాజు గెలుపు సంపాదిస్తాడు. కోమటి లాభం పొందుతాడు. శూద్రుడు సుఖపడతాడు. కన్య మంచి వరుణ్ణి పొందుతుంది. గొడ్రాలు సంతానం కంటుంది. ఎవరికి ఏకోరికలున్నా సఫలమవుతాయి."

## విష్ణునామనిర్వచనం

వైశంపాయనుడు చెప్పింది విని "గూఢమైన విష్ణువుపేర్లు విడమర్చి వివరించు" అని అడిగాడు జనమేజయుడు. వైశంపాయనుడు వివరించాడు— "అర్జునుడు అడిగితే శ్రీకృష్ణుడు తన పేర్లు విడమర్చి వివరించాడు. అవే చెపుతాను, ఆలకించు. శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు—'అర్జునా! నువ్వు నరుడివి. నేను నారాయణుణ్ణి. మన ఇద్దరికీ ఆదిలేదు. అంతమూ లేదు. లోకం మేలుకోసమే ఇలా భూమి

మీాద అవతరించాం మనం. నాపేర్లు గూఢమైనవి. నాటిఅర్థం తేట
పరుస్తాను, విను.

" 'నారములు అంటే నీళ్ళు అయనం అంటే వునికి. నీళ్ళు నా వునికి కనక నారాయణుడు అంటారు నన్ను. నేను లోకాల్లో వుంటాను. నాలో లోకాలు వుంటాయి. అంచేత వాసుదేవు డంటారు. భూమీా ఆకాశమూా అంతటా నిండివుంటాను. అంచేత విష్ణువు అంటారు. ఉత్తమధర్మమైన దమంఅలవరుచుకునినన్నుకోరే పూజ్యాలు భూమీా ఆకాశమూా మధ్య వెలుగుతూవుంటారు. అందుకని దామోదరు డంటారు. అన్నమూా, నీరూ, అమృతమూా, వేదాలూ-వీటికి పృశ్ని అని పేరు. ఈ పృశ్ని నాగర్భంలో వుంది. కనక పృశ్నిగర్భు డంటారు. సూర్యకిరణాలూ, చంద్రకిరణాలూ, అగ్నిశిఖలూ నాతల వెంట్రుకలు. అంచేత కేశవు డంటారు.

'క్షత్రియత్వమూా, బ్రాహ్మణత్వమూా కలిగి, లోకం రక్షించ డంకోసం అగ్నిష్టోమాలు చేసిన వాళ్ళు ప్రశిద్ధరూపాలతో ప్రకాశిస్తారు. బ్రాహ్మణత్వం కలిగినవాడు బ్రాహ్మడు క్షత్రియత్వం కలిగిన వాడు క్షత్రియుడు' అంటూ బ్రాహ్మణ క్షత్రియుల మహానుభావత్వం వివరించి నిదర్శన పూర్వకం సరూపించాడు. అవన్నీ అగ్నిష్టోమ మహాత్మ్యంవల్లే కలుగుతాయని ఇంకా ఇలా అన్నాడు - 'అగ్నీ, చంద్రుడూ అన్నిలోకాలూ పెరుగుతూ జ్ఞానమూ, [illegible] కలిగించి సంతోష పెడుతూ వుంటారు. అగ్నిష్టోమాలు చేసే అను భావించేవాళ్ళకి నేను శుభం కలిగిస్తాను యజ్ఞాల్లో నాకు వున్న వ్యావహారిక నామాలు వినిపిస్తాను విను. వరమవరదుడూ (ముక్తి ఇచ్చేవాడు) లోక భావనుడూ (లోకం భావించేవాడు), ఈశ్వరుడూ, హృషీకేశుడూ, అహీన చిత్తుడూ - ఇలాటి పేర్లూ వున్నాయి. యజ్ఞంలో భాగం హరిస్తాను కనక హరి అనీ అంటారు. గోవు అంటే భూమి. అది పాతా

ళంలో పడిపోకండా ఎత్తాను. కనక నన్ను గోవిందు డంటారు. రోమాలు లేనివాణ్ణి కాబట్టి శిపివిష్టుడంటారు. ♦భూమి కర్షణం (సృష్టి) చేస్తాను నాశరీరచ్ఛాయ నలుపు. అంచేత కృష్ణుడంటారు. సత్తూ(ఆత్మ) అసత్తూ (శరీరం) ఈ రెండూ నాలోనే వుండడంచేత సత్త్వడంటారు. నాకు పుట్టుక లేదు, కనక అజుడంటారు. నాశనం లేదు కనక అధోక్షజు డంటారు. సత్వంనించి దూరంకాను. నా వ్యాపారంవల్లే అది సత్వమవుతుంది. సత్వంలోనేనా అవతారం. అందుకని సాత్వతు డంటారు. చ్యుతం లేనివాణ్ణి. కనక, అచ్యుతు డంటారు. వాతమూ, పిత్తమూ, శ్లేష్మమూ— ముఖ్యమైన ఈ మూడు ధాతువుల రూపంతో శరీరం ధరించాను. అంచేత త్రిధాతువనీ అంటారు. నెయ్యినాకు జ్వాల (వెలుగు). కనక ఘృతార్చి(నేతిజ్వాలా)అంటారు. వృషమంటే ధర్మం. ధర్మస్వరూపుణ్ణి కనక వృషుడని, అంటారు. ఆదీ మధ్యమూ, అంతిమూ లేవూ నాకు కనక అనాది అని, అమధ్యుడనీ, అనంతుడనీ, అంటారు. శుచులంటే నా చెవులకి ఇంపుగా. అంచేత శుచిశ్రవు డంటారు. వరాహావతారంలో వొక్క కొమ్ముతోనే భూమి ఎత్తాను. అంచేత ఏకశృంగు డంటారు. లోకం బయట పెట్టడంచేత వివరించి అంటారు. సూర్యుడిలో వుంటాను కనక కపిలు డంటారు. యోగానికి హిరణ్యమని పేరు. యోగగర్భుణ్ణి నేను. అంచేత హిరణ్యగర్భు డంటారు. నరుడూ నారాయణుడూ అని లోకరక్షణకోసం ధర్మ స్థాపనకోసం పుట్టాను. కనక అర్జునా! ధర్మరాజని అంటారు నన్ను. గంధమాదనం మీద నేను తపస్సు చేసినప్పుడు దక్షుడి యజ్ఞం మీద దండెత్తాడు శివుడు. యజ్ఞం భయపడివచ్చి నారొమ్ము చేరింది. అప్పుడు నాతల వెంట్రుకలు ముంజగడ్డిలా అయాయి. అంచేత ముంజకేశుడన్నారు. శివుడు రౌద్రాకారంతో యజ్ఞం వెంటపడి నామీద

♦ శివుడు; విష్ణు; బట్టతలవాడు

పురికొాడు. ఒక ముళ్ళ దుబ్బు గంధ్ర గొడ్డలిగా అభిమంత్రించి అతడి మీద ప్రయోగించాను. అతడు దాన్ని ఖండించి తునకలుచేశాడు. అందుకని నన్ను ఖండపరశు అన్నారు.'

"చివరిమాట కృష్ణుడు చెప్పడంతోనే అయితే 'ఆకయ్యంలో నువ్వుగెలిచావా ? శివుడు గెలిచాడా ?' అని అడిగాడు అర్జునుడు

## శివ కేశవులు

"కృష్ణుడిలాఅందుకున్నాడు— 'శివ కేశవుల రూపం ధరించిన రెండుమూర్తులూ యుద్ధం ప్రారంభించడంతోనే అన్ని ప్రాణులూ భయపడిపోయాయి. మునీశ్వర్లకి వేదాలు కనిపించలేదు. అగ్నులు ఆహుతులందుకోలేదు. దిక్కులూ, ఆకాశమూపగిలిపోయాయి. భూమి గడగడలాడింది. కొండలు దద్దరిల్లిరిగాయి. దేవతలు దిగులుపడ్డారు. బ్రహ్మదేవుడు తెల్లపోయాడు. అంతటా సంక్షోభం అధికమైంది. దేవతలనూ, మునులనూ, వెంట పెట్టుకొని బ్రహ్మవరిగెత్తుకువచ్చాడు. శివుడిముందు సాగిలపడ్డాడు. 'ప్రభూ! శివుడివి నువ్వు లోకాలకి శివం (శుభం) చెయ్యాలి. కోపం విడిచిపెట్టు. శివుడన్నా కేశవుడన్నా వొక్కటే. దివ్యచిత్తంలో విచారించు. నిగమవేద్యం (వేదాలవల్ల తెలుసుకోదగింది), ద్వంద్వం లేంది, గుణంలేంది, నాశనంలేంది వొకే, తత్వం రూపభేదాలతో లోకం తెలుసుకుందికి శివకేశవులైంది. అంతే కాని నీకూ, విష్ణువుకీ భేదం ఎక్కడుంది ? నరుడూ, నారాయణుడూ లోకంలో ఆదిపురుషులు. ఆలోచిస్తేమనం అందరమూ వొకే అంశ. శాంతించు. దివ్యచిత్తంతో చిత్తగించు. నారాయణుణ్ణి తెలుసుకో అని వేడుకున్నాము. శాంతించాడు శివుడు. నన్నూ శాంతపరిచాడు. నెమ్మదిగా మాట్లాడాను నేను. 'నన్నూ తెలుసుకున్నవాడు, నిన్ను తెలుసుకున్నట్టే. నిన్ను సేవించినవాడు నన్ను సేవించినట్టే. మన

ఇద్దరికీ భేదమేలేదు. ఆచాళనించీ నాగుండెమీాది శ్రీవత్సచిహ్నం త్రిశూలచిహ్నంగా వుండనీ సువ్వుకూడా నాచేతి గుర్తుతో శ్రీకంఠుడవై ప్రకాశించు' అన్నాను.

"'ఇలా మేం ఇద్దరమూ వొకళ్ళ నొకళ్ళం ఆదరించుకున్నాం. స్నేహం చేసుకున్నాం. బ్రహ్మ మొదలైన దేవతలు నంతోషించారు. అర్జునా! ఇదీ మాయుద్ధం సంగతి. నా గెలుపే, అతడి గెలుపు. అతడి గెలుపే నా గెలుపు. విన్నావా? నా పేర్లవివరం చెప్పానుకదూ! లోకాలన్నిటా ఎన్నోరూపాలతో సంచరిస్తాను. శివుడంటే నేనే. ఈశానుడూ (సంపద కలవాడు), అభవుడూ (పుట్టుకలేనివాడు) మృడుడూ (సుఖంకలిగించేవాడు) అయిన శివుణ్ణి సేవించు. భారతయుద్ధంలో నేను రక్షించడంవల్ల నువ్వు గెలిచావు. నీకంటే ముందు శూలంపట్టుకుని శత్రువుల్ని హతమార్చాడు శివుడు.'"

"అవును, సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు సాయముండగా మాతాత అర్జునుడు గెలవడంలో వింతేముంది? కృష్ణుడి చుట్టాలు అనడంకంటే మాతాతయ్యల్ని వేరేస్తోత్రం చెయ్యనక్కరలేదు. నారదుడు శ్వేతద్వీపంలో విష్ణువు అనుగ్రహంపొంది బదరికాశ్రమంలో నరనారాయణుల్ని కలుసుకున్నాడని చెప్పావు, వాళ్ళుముగ్గురూ ఏం మాట్లాడుకున్నారు?" అని అడిగాడు జనమేజయుడు. వైశంపాయనుడు ఇలా చెప్పాడు:

## నారదుడి నారాయణభక్తి

"నారదుడు వచ్చి నరనారాయణులకి భక్తితో నమస్కరించాడు. ఆతిథ్యమిచ్చి కుశలమడిగారు నరనారాయణులు. 'మీా దయవల్ల శ్వేతదీపంలో విష్ణుదర్శనం చేశాను' ఎత్తుకున్నాడు నారదుడు - 'ఆరూపం అచ్చంగా మీాలాగేవుంది. ఆశ్చర్యం! అక్కడి

తెల్లవాళ్ళు ఇంద్రియాలు గెలిచిన వాళ్ళు, మౌనవ్రతులు వాళ్ళంటే ఎంతో దయ విష్ణుమూర్తికి. వాళ్ళతో వుండి నన్ను అనుగ్రహించాడు ప్రభు. ఆత్మస్వరూపం వివరించాడు రాబోయే తన అవతారాలూ చెప్పాడు. శాంతిస్వరూపమే శ్వేతద్వీపం. అక్కడ సూర్య చంద్రుల వెలుగులేదు. వాయుసంచారం లేదు. ఏకాంతికుల (విష్ణుభక్తులు) కంటే విష్ణుమూర్తికి ప్రియులు లేరు. నేనూ ఏకాంతికుణ్ణయాను. ఆప్రభువు సెలవిచ్చాక మీదగ్గిరికి వచ్చాను. మీదయకి పాత్రుణ్ణయి ఇక్కడ వుంటాను" అన్నాడు.

" 'విష్ణుదేవుణ్ణి చూశావు. అతడి మాటలు విన్నావు. ధన్యుడివయావు' అన్నారు నరనారాయణులు. అక్కడ నువ్వు వుండడం మేమున్నూ చూశాం. ఇక్కడ వుంటానంటావా? మంచిదే. వుండు. ఆదేవుణ్ణి పూజించడము దేవతల్నీ, పితృదేవతల్నీ పూజించడం. ఇదే వేదమతం. ఏకాంతికుడివికా' అన్నారు. సంతోషించాడు నారదుడు. బదరికాశ్రమంలో వెయ్యిసంవత్సరాలు తపస్సుచేశాడు. శాంతిపొంది నరనారయణుల సెలవుతీసుకున్నాడు. హిమాలయంమీద తన ఆశ్రమానికి వెళిపోయాడు. దేవతల పూజలందుకున్నాడు. జనమేజయా! ఈకథ పాపాలు పోగొడుతుంది. నువ్వు నిండుమనస్సుతో విన్నావు. కృతార్థుడివయావు. మోక్షం ప్రసాదించే విష్ణుదేవుణ్ణి భక్తితో ఆశ్రయించు. ఇంకేదీ అక్కరలేదు. విష్ణువుని ద్వేషించే పాపాత్ములకి ఇహమూ, పరమూ లేదు. వాళ్ళ పితృదేవతలు నరకం పాలవుతారు. విష్ణువే అందరికీ ఆత్మ. తన ఆత్మమీద తత్పరతలేని దుర్మార్గులకి ఆపదలు తప్పవు. రాజా! నాగురుదేవుడు చెప్పినమాటలు మనస్సుకి పట్టించుకో. వ్యాసుడే నారాయణుడు. పండితులు తలవొంచే మహాభారతం రాయడం ఆమహాత్ముడికింతప్ప మరొకడి సాధ్యమా? ఎన్నో ధర్మాలు విడమర్చి చెప్పడం అతడికే చెల్లింది."

విని సంతోషించాడు జనమేజయుడు. "గుర్రం మొహంతో విష్ణువు బ్రహ్మ ఎదుట ప్రత్యక్షమయాడన్నావు. గుర్రం మొహం ఎందుకు ధరించాడతడు?" అని అడిగాడు.

## హయగ్రీవ మహాత్మ్యం

వైశంపాయనుడు — ప్రళయకాలంలో విష్ణువు నీటిమీద యోగనిద్రలో వుండి మేలుకున్నాడు. అతడి అహంకారమే నాభి నించి బ్రహ్మగా పుట్టింది. బ్రహ్మ సృష్టి మొదలెట్టాడు. ఓం ప్రథమంగా వేదాలు పుట్టించాడు. విష్ణువుతో లీనమైవున్న మూడుగుణాల నించి సత్వగుణంలో బ్రహ్మ పుట్టాడు. రజస్తమోగుణాలు రాక్షసులయాయి. మధువనీ, కైటభుడనీ ఇద్దరు రాక్షసులు వేదాలు ఎత్తుకు పోయారు. పాతాళంలో కట్టిపడేశారు. బ్రహ్మ విచారించాడు. వేదాలే నాబలం. వేదాలే నాచూపు వేదాలేనాగతి. అవిలేకపోతే లోకాలు ఎలా సృష్టించేది' ఈ ఆపద ఎవరు గట్టెక్కిస్తారు ? ఏం దారి?' అంటూ దుఃఖపడ్డాడు. విష్ణువుని ప్రార్థించాడు. విష్ణువు గుర్రం తలతో, రంగురంగుల వింతరూపంతో వేదాలకోసం పాతాళలోకం వెళ్ళాడు. ఓంకారధ్వని చేశాడు. రాక్షసులు విరగబడ్డారు. ఓంకారం వినిపించినవేపు పరిగెత్తారు. వాళ్ళు అటు వెళ్ళగానే ఇటు వేదాలు పట్టుకు వచ్చేసాడు విష్ణువు బ్రహ్మకిచ్చేశాడు. తరువాత ఎప్పటిలాగే నీటిమీద పడుకున్నాడు. అక్కడ పాతాళంలో తాము పరిగెత్తినదగ్గిర ఎవరూ కనపడలేదు రాక్షసులకి. అంతటా గాలించిచారు. వాళ్ళు విష్ణువుని చూశారు. యుద్ధానికి పిలిచారు. మంచి వడ్డాడు విష్ణువు. మధుకైటభుల్ని చంపేశాడు.

"ఇలా సృష్టి కార్యం భంగంలేకుండా చేశాడు విష్ణువు. బ్రహ్మ చక్కగా సృష్టి చేశాడు. నాటినించి గుర్రంతల విష్ణుస్వరూపం తక్కిన

స్వరూపాలకంటే గొప్పదయింది. ఆ జగత్కర్తని వేదాలు ఆశ్రయించి వుంటాయి.

"విష్ణువే సత్వమూ మొదలైన మూడుగుణాలు కలిగిస్తూ వుంటాడు. అతడివల్లే వేదాలు ఎక్కువతక్కువలు లేకండా వుంటాయి. గుణాలుకలవాడూ అతడే. గుణాలు పుట్టించేవాడూ అతడే. వాటిని నాశనంచేసేవాడూ అతడే. వేదాలూ, యజ్ఞాలూ, తక్కిన పుణ్యకార్యాలూ, రసాలూ, భూతాలూ అన్నీ విష్ణువరాలే.

## ఏకాంతికధర్మం

జనమేజయుడు — ఏకాంతికులు లోకోత్తరులన్నావు. ఏకాంతికధర్మం అంటే ఏమిటి?

వైశంపాయనుడు — సాంఖ్యయోగసారమే ఏకాంతిక ధర్మం. వెనక జాలిగుండెతో అర్జునుడు యుద్ధానికి పూనుకోనప్పుడు కృష్ణుడు గీతల్లో చెప్పిందే, మొదట విష్ణువు బ్రహ్మకి ఉపదేశించాడు. బ్రహ్మదయతో దక్షప్రజాపతికి చెప్పాడు. దక్షుడు తన దౌహిత్రుడైన సూర్యుడికి చెప్పాడు. సూర్యుడు మనువుకి చెప్పాడు. మనువు ఇక్ష్వాకుడికి చెప్పాడు. ఇక్ష్వాకుడు యోగ్యులైన సజ్జనులకి ఎంతమందికో చెప్పాడు. నారదుడు నారాయణుడిదగ్గిర తెలుసుకున్నాడు. అతడు యోగ్యులైన శిష్యులకి బోధించాడు. ఇలా ప్రసిద్ధిపొంది ఏకాంతధర్మం లోకంలో వ్యాపించింది. పాపాత్ములకి దొరకదిది. దీనికి అహింస మూలం. అహింసవల్లే విష్ణువు తృప్తిపడతాడు.

"విష్ణువన్నా, ఆత్మఅన్నా వొక్కటే. ఒకటి, రెండు, మూడు, నాలుగు వ్యూహాల్లో వాసుదేవాదిస్థానాల్లో వ్యాపించి, భక్తులకి అవుపిస్తూ వుంటాడతడు. మొదటివ్యూహంలో వాసుదేవుడు. రెండో వ్యూహంలో సంకర్షణుడు. మూడోవ్యూహంలో ప్రద్యుమ్నుడు.

సాలుగోవ్యూహంలో అనిరుద్ధుడు. ఇన్ని స్థానాల్లోనూ, ఇన్నిరూపాలా అవుపడే విష్ణువొక్కడే. ఇంద్రియాలకి అందడు. ఏకాంతిక భక్తికి దర్శనమిస్తాడు. దానికి తపమూ, శమమూ, దమమూ కావాలి. శాంతి అంటే ఇంద్రియనిగ్రహం. అది కలవాడికి ఏకాంతికధర్మం కరతలామలకం. చింతా తంతువులు పుటుక్కున తెంపేస్తుం దది.

జనమేజయుడు — అయితే సులభమైన ఏకాంతిక ధర్మంమానేసి ఇతరధర్మాలు చేయడ మెందుకూ?

వైశంపాయనుడు — నిజమే. కానీ మనుషుల మనసుల్లో సాత్వికమూ, రాజసమూ, తామసమూ వికారాలున్నాయి. సత్వ గుణవికారం ఉత్తమమైంది. దానివల్ల విష్ణువుని పొందవచ్చు. సాత్వికులే ఏకాంతికులు. వాళ్ళపనులన్నీ విష్ణువే నడుపుతాడు. తక్కిన వాళ్ళసంగతి విను. రాజస తామస వికారాలు పూర్తిగావున్నప్పుడు ఏకాంతికధర్మం సాధ్యంకాదు. అలాటివాళ్ళకి ప్రతిజన్మలోనూ సంసారబంధం తప్పదు. విష్ణువుదయకి పాత్రులుకారువాళ్ళు. ఏకాంతి కులు విష్ణువుహృదయంలో వుంటారు. వాళ్ళకీ విష్ణువుకీ భేదమే లేదు. ఇదే వేదాలు చెపుతున్నాయి. ఈ ఏకాంతమార్గం మాగురుదేవుడు దయతో నాకు చెప్పాడు. నేను శ్రద్ధతో విన్నాను. అనుసరించ గలిగితే ఈమార్గం అనుసరించు. విష్ణువుని చేరుకో.

జనమేజయుడు - వేదాల్లో సాంఖ్యమూ, యోగమూ, పాశు పతమూ, పాంచరాత్రమూ, - ఇలా ఎన్నోవున్నాయి. వీటి అన్నిటికీ వొకటేనా నిష్ఠ! వేరువేరా? వీటిని అనుసరించేవాళ్ళెవరు?

వైశంపాయనుడు — యమునానదిమధ్యద్వీపంమీద జ్ఞానంతో వెలిగిన మహాత్ముణ్ణి, వేదాలకి నిదానమైన మునీశ్వరుణ్ణి, లోకమంతా వ్యాపించిన తేజశ్శాలిని, పరాశరులకుమారుణ్ణి, మహాభారతి రచ యిత వ్యాసదేవుణ్ణి సేవిస్తాను.

పాశుపతమూ, మొదలైన సిద్ధాంతాలన్నిటికీ విష్ణుదేవుడే లక్ష్యం. అతన్ని పొందడానికి ఏర్పడినమార్గాలే ఇవన్నీ. వేదాలకి నారాయణపుత్రుడూ, అవాంతరతముడూ అయిన వ్యాసదేవుడూ, సాంఖ్యానికి కపిలుడూ, యోగానికి బ్రహ్మ, పాశుపతానికి శివుడూ, పాంచరాత్రానికి విష్ణువూ ప్రవర్తకులు. అందుకే పాంచరాత్రానికి వైష్ణవ మంటారు.

జనమేజయుడు – వ్యాసుడు పరాశరపుత్రుడని కదా చెప్పావు. నారాయణపుత్రుడెలా అయాడట ?

వైశంపాయనుడు – హిమాలయ పర్వతం దగ్గిర మహాభారతం రాస్తూ అలసిపోయాడు వ్యాసదేవుడు. శిష్యులు భక్తితో శుశ్రూష చేస్తున్నారు వాళ్ళకి వినోదం కలిగిస్తూ వేదార్థాలూ, భారతార్థాలూ వివరిస్తున్నాడు గురుదేవుడు. నేనూ, మరికొందరు శిష్యులూ పాదాభి వందనం చేసి 'నారాయణుడంటారు నిన్ను. అదేమిటో దయతో సెలవియ్యి' అని వేడుకున్నాం. గురుదేవుడు ఇలా చెప్పాడు:

## వ్యాసుడి పుట్టుపూర్వోత్తరాలు

'ఆదికాలంలో విష్ణువు, ప్రజాసృష్టికోసం తన నాభిపద్మంలో బ్రహ్మని పుట్టించాడు. బ్రహ్మ, భూతసంఘాలన్నీ సృష్టించాడు, అతడినోట వేదాలు కల్పించాడు విష్ణువు. వాటి మేలుకోసం అవాంతరతముడని మానసపుత్రుణ్ణి పుట్టించాడు. గొప్పవిజ్ఞానవంతుడతడు భక్తితో ప్రమొక్కి నుంచున్నాడు. 'సృథక్ భావంతో వేదాలు విని వాటిని వ్యాసం (విభాగం) చెయ్యి' అని ఆజ్ఞాపించాడు. విష్ణువు. తండ్రి ఆజ్ఞాపకారం వేదవిభాగం చేశాడు అవాంతరతముడు. సంతోషించాడు విష్ణువు. ప్రేమతో 'వేదవ్యాసా!' అని పిలిచాడు – 'ప్రతీ మన్వంతరంలోనూ నాకుమారుడివై పుడతావు. ఇంకా జన్మలుకలుగు

తాయి నీకు. నాచరిత్రలూ, ముల్లోకాల నడవళ్లూ, అన్ని ధర్మాలూ
అవగతమవుతాయి నీకు. గడిచిపోయినవీ, గడుస్తున్నవీ, గడవబోయేవి
తెలుసుకుంటావు. మునులమెప్పు సంపాదిస్తావు. లోకోత్తరుడైన వశి
ష్ఠుడి మనవడివై, జ్ఞానవంతుడివై పరాశరపుత్రుడివై పుడతావు.
నీవల్ల పుట్టిన కౌరవరాజులు పరస్పర క్రోధంతో యుద్ధం చేస్తారు. వాళ్ల
వంశం వాళ్ళు నాశనం చేసుకుంటారు. గాడ్డ కాలంవల్లం చెడిన వేదాలు
అప్పుడుకూడా విభాగిస్తావు. దేవతల్నీ మునుల్నీ సంతోషపెడతావు.
ధర్మసందేహం తొలగిస్తావు. లోకులు 'సందేహాలు తీర్చేవాడు.
పుణ్యాత్ముడు, లోకహితవాది' అని నిన్ను పొగుడుతారు. కీర్తి
మంతుడివవుతావు. నిన్ను మోహం వొదలదు. మోహం వొదిలిన
కుమారుడు కలుగుతాడు. వేదవిభాగం చేశాక, జ్ఞానమూ, యోగమూ,
సాంఖ్యమూ, నీకు పట్టుతాయి' అని అంతర్ధానమయాడు. ఇదీ
నేను నారాయణ కుమారుణ్నయిన కథ. ఎంతో కాలం తపస్సు చేశాను.
విష్ణుదేవుడి దయకి పాత్రుణ్నయాను' అన్నాడు.

రాజా! ధర్మరాజు నారదనారాయణ సంవాదం విన్నప్పుడు
నారదుడు శ్వేతద్వీపంలో విష్ణువుదయ సంపాదించడమూ, బదరి
కాశ్రమం వచ్చి నరనారాయణులతో ప్రశంగించడమూ, అక్కడ
తపస్సు చెయ్యడమూ, చెప్పాను. అతడు మంతడిల్లట్టే అడిగితే
దేవతలు మహాధర్మపరులు కాక, యజ్ఞాలో హవిర్భాగాలి పుచ్చు
కోడమూ, గుర్రంతలతో అవతరించిన విష్ణువులీలమూ చెప్పాడు మా
గురుదేవుడు. అర్జునుడి ప్రశ్నమీద పాశుపతమూ మొదలైన వేద
ధర్మాలన్నీ వొక్కటే అని చెప్పాడు. ఏకాంతికధర్మమూ వివరిం
చాడు. ధర్మరాజూ, శ్రీకృష్ణుడూ యావన్మందీ విన్నారు. అర్జునుడు
అడగడంతో తనపేర్లు శ్రీకృష్ణుడు నిర్వచనం చేశాడని ముందే
చెప్పాను. దైవికంగా ఇవాళ మళ్ళీ అడిగావు కనక ఇంతదూరం

చెప్పాను. ఇది మనస్సుకి పట్టించుకో. ఈకథ వైష్ణవం. ఇది విన్నా చదివినా ఆయురారోగ్యమూ, సిరీ సంపదా కలుగుతాయి. మోక్షం దొరుకుతుంది. ఇక ప్రకృతం —

అలా భీష్ముడు చెప్పిన కథలు వింటూ సంతోషించి మళ్ళీ ఇలా అడిగాడు ధర్మరాజు - "రాజధర్మాలూ మొదలైన అన్నిధర్మాలూ వివరించావు. అయితే వీటి అన్నిటిలోనూ ఉత్తమమైన ధర్మమేది? "

"ధర్మాల్లో వ్యర్థమైందంటూ ఒక్కటీ లేదు" అంటూ అందుకున్నాడు భీష్ముడు — "ఎవళ్ళకి వచ్చినధర్మం వాళ్ళు చేస్తారు. అదే వాళ్ళకి కోరినఫలమిస్తుంది. లోకంతీరే ఇది. అది అలావుండనీ.

## పద్మనాగుకథ

"యథేచ్ఛగా తిరుగుతూ నారదముని ఒకనాడు దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళాడు. తగిన సత్కారంచేశాడు దేవేంద్రుడు. సుఖంగా కూచున్నాక, అతడి మొహంమీద చూపులు నిలిపి, 'మునీంద్రా నువ్వు తిరిగినచోట ఏదైనా వింత చూశావా? ' అని అడిగాడు. అప్పుడు నారదుడు ఒక కథ చెప్పాడు. అది నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధానమవుతుంది. ఆలకించు.

"'గంగానది దక్షిణతీరంలో మహాపద్మం అని ఒక పట్టణం వుంది. అందులో భృగుడని ఒక బ్రాహ్మణుడున్నాడు. ఎంతో మంచివాడతడు. ధర్మాత్ముడు. సత్యవతుడు. అహింసాపరుడు. ఇంద్రియాలు గెలిచినవాడు. కులధర్మపరుడు. క్రోధ మెరగడు న్యాయంగా సంపాదించిన ధనంతో దేవపూజా, పితృపూజా, అతిథి పూజా చేసేవాడు. జ్ఞాతుల్నీ, స్నేహితుల్నీ పోషించేవాడు. వినయ వంతులైన కుమాళ్ళని కన్నాడు. అంతమందీ మెచ్చుకున్నట్టు బతి

కాదు. ఆత్మనిష్ఠకోరి, ఏది మంచిపనో, ఎలా ముక్తి పొందడమో అని విచారిస్తూవుండేవా డతడు.

"'ఇలా వుండగా వొకనాడు వొక ఉత్తమబ్రాహ్మడు తన ఇంటికి అతిథిగా వచ్చాడు. అతడికి భక్తిపూర్వకంగా ఆతిథ్యమిచ్చి, ఇలా అడిగాడు భృగుడు — 'పుణ్యాత్మా! నీ కమ్మనిమాటలు వింటే, నీమీద స్నేహంకలుగుతోందినాకు. నామనస్సులోమాట చెపుతాను. స్నేహంతో నాకు మేలుకలిగేమాట చెప్పు. ఆత్మస్వరూపం తెలుసుకోవాలని నా ఆరాటం. లోకసామాన్యమైన గుణాలవల్ల శాశ్వత సుఖం పొందడం ఎలాగ ?'

"'నేనూ నీస్థితిలోనే వున్నాను' అన్నాడు అతిథి — 'మోహంలో మునిగి ఆత్మ స్వరూపంకోసం దేవులాడుతున్నాను. దారీ తెన్నూ కనపడకుండా వుంది. ముక్తికోసం కొందరు బ్రహ్మచర్యం చేస్తారు. కొందరు గృహస్థధర్మం అవలంబిస్తారు. కొందరు అడివికి వెళ్ళి తపస్సుచేస్తారు. కొందరు సన్యసిస్తారు. కొందరు యజ్ఞాలుచేస్తారు. కొందరు గొప్పగొప్ప దానాలుచేస్తారు. కొందరు తల్లిదండ్రుల సేవచేస్తారు. కొందరు గురుభక్తులవుతారు. కొందరు మంచినడత అలవరుచుకుంటారు. ఇంద్రియాలు అదుపులో వుంచుకుని, సత్యమూ, అహింసా అనుసరిస్తారు. ఇలా ఎన్నో ధర్మద్వారాలున్నాయి. అయినా అందరికీ ఆత్మానందం అలవడదు. ఒకటి ఉపదేశిస్తాను, విను.

"'నైమిశారణ్యంలో గోమతి అని వొక ఉత్తమనది వుంది. అందులో మహాపద్మం అని వొక మడుగుంది. ఆతీర్థంలో మాంధాతా మొదలైనవాళ్ళు ఎంతోమంది వెనక గొప్పగొప్ప తపస్సులు చేశారు. ముక్తి పొందారు. మహాపద్మం మడుగువొడ్డున ఇల్లుకట్టుకుని వొక నాగరాజు వున్నాడు. అతడిపేరు పద్ముడు. మహాత్ము డతడు.

అన్ని ధర్మాలూ తెలుసు నతడికి. దయావరుడు. సజ్జనులు గౌరవించ దగినవాడు. పుణ్యాత్ముడు. గుణవంతుడు. అతిథులంటే ప్రాణం పెడతాడు. ఆ సర్పరాజుని చూడు. ఎంతో ఆదరిస్తాడు నిన్ను. నీకోరిక తీరుస్తాడు. నామాట విను' అన్నాడు.

"సంతోషించాడు భృగుడు. మహాత్మా! 'నీ ఉపదేశంతో నామనస్సు తేలికపడింది. మిగిలిన పగలూ, ఈరాత్రీ నాఇంట్లో వుండు. నన్ను ధన్యుణ్ణి చెయ్యి' అని ప్రార్థించాడు. అంగీకరించాడు బ్రాహ్మడు. అతణ్ణి పూజించి ఆ రాత్రి ధర్మకథలతో కాలక్షేపం చేశాడు భృగుడు. మర్నాడు తెల్లవారడంతోనే అతని అనుమతిపొంది, అతణ్ణి సాగనంపాడు. నైమిశారణ్యం పయనమయాడు. బంధువుల్నీ స్నేహితుల్నీ ఒప్పించి బయలుదేరాడు. దారిపొడుగునా ఎన్నో తీర్థాలు సేవిస్తూ నైమిశారణ్యం వెళ్ళాడు. గోమతి నదిలో సుప్రసిద్ధమైన మడుగు మహాపద్మం చేరాడు. దాని వొడ్డున నాగరాజుమందిరం చూశాడు. లోపలికి వెళ్ళాడు. నాగరాజుభార్య ఎదురువచ్చింది. భక్తితో లోపలికి తీసుకువెళ్ళింది. పూజించింది. 'ఎందుకు వచ్చావో చెప్పు. ఏం చెప్తే అది చేస్తాను' అంది.

" 'దేవీ! నీభర్తని చూడాలని వచ్చాను. అతడు ఎక్కడ వున్నాడో చూపించు' అన్నాడు భృగుడు. 'తనవంతు వచ్చింది. సూర్యుడిరథం ఈడ్చడంకోసం వెళ్ళాడు. ♦ ఏడెనిమిది దినాల్లో తిరిగి

♦ సూర్యుడిరథం చైత్రమాసంలో వాసుకీ, వైశాఖంలో కచ్ఛవీరుడూ జ్యేష్ఠంలో తక్షకుడూ, ఆషాఢంలో నాగుడూ, శ్రావణంలో ఏలాపుత్రుడూ, భాద్రపద లో శంఖపాలుడూ, ఆశ్వయుజంలో ధనంజయుడూ, కార్తీకంలో ఐరావతుడూ, మార్గశీర్షంలో పద్ముడూ, పుష్యంలో కర్కోటకుడూ, మాఘంలో కంబలుడూ, ఫాల్గుణంలో అశ్వతరుడూ లాగుతారని విష్ణుపురాణం అం. 2 అ. 10 భాగవతం. స్కం. 12

వస్తాను. నీకు ఏం కావాలో చెప్పు. నేను చేస్తాను' అంది పద్మ నాగు భార్య. 'నీభర్తని చూడడం తప్ప మరేమీ అక్కరలేదు' అన్నాడు భృగుడు — 'అందాకా అమనో ఆ అడివిలో వుంటాను, నాగరాజు వచ్చాక తెలియచెయ్యి. మరచిపోకు' అంటూ వెళ్ళి గోమతివొడ్డున అడివిలో తిండీ తిప్పలూ లేకండా జపంచేస్తూ కూచున్నాడతడు.

"'ఆరురోజులయేసరికి పద్మనాగుబంధువులునాగరాజుభార్యనీ, కుమార్తెళ్ళనీ తీసుకుని భృగుడిదగ్గరికి వచ్చారు. 'ఇవాళిటికి ఆరుదినాలైంది. భోజనంలేకుండా వున్నావు. మేం అతిథిపూజాపరులం. మాకు ధర్మహాని కలక్కుండా మాఆతిథ్యం స్వీకరించు, ఆదరించు. అన్నమో, పళ్ళో, కందమూలాలలో ఏదైనా భుజించు. మమ్మల్ని రక్షించు' అని నెమ్మదిగా ప్రార్థించారు, 'ఇంత చెప్పాలా మీరు ?' అన్నాడు భృగుడు - నాగరాజు రాకకోసమే ఎదురుచూస్తున్నాను. అంతవరకు అన్నం తినాలని ఆకలికానీ, నీళ్ళుతాగాలని దాహం కానీ విసరంతా లేదు నాకు. అంతేకాని కోపంతో అడివిలో వొంటరిగా వున్నాననుకుంటున్నారా ? లేదు. నా నియమం ఇది. నన్ను బాధపెట్టకండి. మీకు ధర్మవిరోధం కలగకుండావుండే బాధ్యత నాది. మరి రెండు దినాలలో నావ్రతం పూర్తవుతుంది. ఎనిమిదోనాటికి నాగరాజు రాలేదే అనుకోండి, అయినా ఆమర్నాడు మీకోరికప్రకారం భోజనం చేస్తాను. దీనికి మీరు సమ్మతించాలి' అంటూ సముదాయించి చెప్పాడు. ఒప్పుకుని వెళ్ళారు వాళ్ళు.

"తన వంతు వరసదినాలు తీరిపోగానే సూర్యుడిసెలవు తీసుకుని నాగరాజు మహాపద్ముడు ఇంటికి వచ్చేశాడు. సంతోషంతో తడబడుతూ ఎదురువచ్చింది భార్య. పాద్యమూ అదీ సమర్పించింది. సంతోషించాడు. పద్మనాగు. 'బాగున్నావా ? దేవతా పూజా

అతిథిపూజా జరుగుతున్నాయి కదా ? నేను లేకపోవడం చేత ఏమీ పొరపాటు కలగలేదు కదా ? ' అని అడిగాడు.

" 'నువ్వు తీర్చి దిద్దాక, పొరపాటెందుకుంటుంది ? ' అంది నాగరాణి — 'దేవతాపూజలూ, అతిథిపూజలూ, చక్కగా జరుగుతున్నాయి. ఎప్పటిలాగే చుట్టాలూ, పక్కాలూ సంతోషంగావున్నారు. శిష్యులు గురుభక్తి కలిగివున్నారు. బ్రాహ్మణులూ, క్షత్రియులూ మొదలైన యావన్మందీ తమతమ ధర్మాలు నెరవేరుస్తున్నారు. భార్యలు పతివ్రతాధర్మం పాలిస్తున్నారు. ధర్మసూక్ష్మమెరిగినవాడివి నువ్వు. నీమనస్సునొచ్చినట్టు జరగనిస్తానా నేను ? అయితే వొక విశేషంమాత్రం జరిగింది. పుణ్యమూర్తి వొక బ్రాహ్మడు మన ఇంటికి వచ్చాడు. యథావిధిగా నేను పూజించాను. నువ్వు ఎక్కడున్నావని అడిగాడు. ఎంత అడిగితే తాను వచ్చినపని చెప్పలేదు నువ్వు సూర్యుడి సేవకోసం వెళ్ళావనిచెప్పాను. ' అయితే నాగరాజు వచ్చేదాకా ఆఅడివిలో వుంటాను. అతను రాగానే చెప్పు' అని వెళ్ళాడు. ఏడెనిమిది దినాలై అక్కడ జపంచేసుకుంటూ కూచున్నాడు అన్నపానాలు ముట్టుకోలేదు. నువ్వు అక్కడికి వెళ్ళు. అతణ్ణి సన్మానించు' అంది.

" 'భార్యమాటవిని కస్సుమన్నాడునాగరాజు — 'ఏమిటీ, నేనా వాడిదగ్గిరికి వెళ్ళేది ? దేవతలూ, దానవులూ కూడా నాకోసం, వెదుక్కుంటూ వస్తారు. ఎరగవూ నువ్వు ? ' అన్నాడు. 'అలా కాదు' బోధపర్చి చెప్పింది భార్య - 'ఎంతో ఆసపెట్టుకు వచ్చాడు బ్రాహ్మడు. ధర్మపరుడివి నువ్వు. అతడి కోరిక తీర్చకపోడం అధర్మం. ఆలోచించు. అతడి ఆస అడియాస చెయ్యడం పాపం. అది అగ్గిలాగ నీ పురుషార్థమూ, ధర్మమూ దగ్ధం చేస్తుంది. ఒకడి ఆస భంగపుచ్చడం బ్రహ్మహత్యతో సమానం. నీవంటి ధర్మాత్ముడు చెయ్యదగ్గ పని

కాదు. మౌనంతో జ్ఞానమూ, దానంతో అభ్యుదయమూ, వాకళ్ళ అసతీర్చడంతో పుణ్యమూ దొరుకుతాయంటారు పండితులు. వాన చినుకులకోసం ఎదురుచూస్తున్న చాతకంలా నీ రాకకోసం ఎదురు చూస్తున్నాడు బ్రాహ్మణుడు. రోషం వదిలిపెట్టు. బ్రాహ్మణుడి కోరిక నెరవేర్చు' అంది.

"'తెలివి తెచ్చుకున్నాడు నాగరాజు. 'అవును. ఒకడి దగ్గిరికి వెళ్ళమనడంతోనే రోషం వచ్చింది నాకు. గర్వంతో మాట్లాడాను. నువ్వు చెప్పిందానివల్ల తెలివి తెచ్చుకున్నాను. కోపం మంచిది కాదు. కోపంవల్ల కార్తవీర్యుడు పరశురాముడిచేత చచ్చాడు. రావణాసురుడు రాముడిచేత చచ్చాడు. అంచేత కోపం కూడదు. నీవంటి భార్య వుండబట్టి ఈ పాపం తప్పిందినాకు. ఆ బ్రాహ్మణుడి దగ్గిరికి ఇప్పుడే వెళతాను. అతడికోరిక నెరవేరుస్తాను' అంటూ వెంటనే బయలుదేరాడు పద్ముడు. వెళ్ళి వినయంగా భృగుణ్ణి చూశాడు.

"'సంతోషించాడు భృగుడు. ఎదురువచ్చాడు. ఇద్దరూ చెట్లనీడని ఇసకపర్రమీద సుఖంగా కూచున్నారు. 'మహాత్మా' మృదువుగా అడిగాడు నాగరాజు — 'నాకోసం నిష్ఠతో ఎదురుచూస్తున్నావు. ఏమిటి కారణం? నీకోర్కె ఏదైనా సరే, చెప్పు. ఇప్పుడే నెరవేరుస్తాను. నువ్విక్కడ వున్నావని మావాళ్ళ వల్ల విని వచ్చాను' అన్నాడు. 'ధర్మారణ్యంనించి నిన్ను చూడడానికి వచ్చాను' అన్నాడు భృగుడు — 'నేను బ్రాహ్మణ్ణి. నువ్వు సూర్యుడి కొలువుకి వెళ్ళావని నీభార్యదగ్గిర విని, వాడినపైరుకల రైతు వానకోసంఎదురు చూసినట్టు నీరాకకోసం వ్రతంపూని కనిపెట్టుకున్నాను. నామనస్సులోని కష్టం తొలగించడానికి నువ్వే తగినవాడివి' అన్నాడు. 'నువ్వు కల్యాణమూర్తివి. నీకోరిక నెరవేర్చి నాజన్మ సార్థకం చేసు

కుంటాను' అన్నాడు పద్మనాగు. 'నాకోరిక తరువాత చెపుతాను ఒకటి అడగాలని మనస్సు తహతహపడుతోంది. నా ప్రార్థన మన్నించి ముందు చెప్పాలని' అన్నాడు భృగుడు. 'అడుగు' అన్నాడు పద్మనాగు. 'సూర్యుడి రథంలాగడానికి వెళ్ళావుగదా, నువ్వు చూసి నవీ, విన్నవీ వింతలు నాకు వివరించు' అని అడిగాడు భృగుడు.

" 'వింతలన్నిటిలోకీ వింత సూర్యుడు' అంటూ అందుకున్నాడు పద్మనాగు - అతడివల్లే భూతకోటి యాపత్తూ సంచరిస్తూ వుంటుంది. ఇది వింత కాదూ? కొమ్మల్లో పక్షుల్లాగ అతడి కిరణాల్లో దేవతలూ, వాలఖిల్యులూ మొదలైన మునీంద్రులూ, సిద్ధులూ నివసిస్తారు. ఇంతకంటే అద్భుతం ఏముంటుంది? సూర్యుడివల్ల గాలి పుడుతుంది. అతడి నడిమికాంతి తగిలి వర్షం కురుస్తుంది. ఇంతకంటే ఆశ్చర్యం ఏముంది? సూర్యుడే వర్షం సృష్టిస్తున్నాడు. అతడే తిరిగి కిరణాలతో నీళ్ళన్నీ తీసుకుటున్నాడు. ఏం ఆశ్చర్యంకాదూ, ఇది? సూర్యుడి వేడిలో శోషించిన గాళ్ళ ఆత్మనిష్ట శాశ్వతమవుతుంది. ఇంతకంటే చిత్రమేముంది? చరాచరజీవరాశి ధరించిన భూమి సూర్యుడి వల్లే విత్తనాలు ధరిస్తుంది. ఎంత వింత ఇది? నిరంజనుడూ, అక్షరుడూ, శాశ్వతుడూ, పరమాత్మ సూర్యుడిలోనే వెలుగుతున్నాడు. ఇంతకి మించిన విచిత్రం ఏముందట? విన్నావా? అంచేత ఒకవింత చెపుతాను విను.

" 'ఒకనాడు మిట్టమధ్యాహ్నం సూర్యుణ్ణిమించిన వెలుగుతో ఒకడు ఆకాశంమీదకి ఎగబాకి వచ్చాడు. ఆకాశం పగిలించేస్తుందా అనిపించింది అతడి వెలుగు. వంతోమంతో ఎదురు వెళ్ళాడు సూర్యుడు, అతడికి తనచెయ్యి అందిచ్చాడు. రెండోసూర్యుడిలా అవుపిస్తూ అందమైన నడకతో వచ్చి, సొంతఇంట్లో ప్రవేశించినట్టు సూర్య

బింబంలో ప్రవేశించాడతను. ఏం చెప్పనూ. రథం మీద అంతకుముందు వున్నవాడో ఇతడో ఎవడు సూర్యుడో అని సందేహం కలిగింది మాకు. రథంలాగుతున్న పాములం మాలో కేం కూడా తెలుసుకున్నాం. 'ఈయన ఎవరు ప్రభూ?' అని నేను వినయంగా సూర్యదేవుణ్ణి అడిగాను. వివరించాడు సూర్యుడు. 'దేవతలూ, యక్షులూ, గంధర్వులూ, గరుడులూ, నాగులూ, వీళ్ళెవ్వరూ, ఎవరూ కాదితడు. నిశ్చలాత్ముడై, ఉంఛవృత్తితో (రాలినగింజలు ఏరుకుని) బతికిన బ్రాహ్మణుడు. దొరికిన పళ్ళూ, నీళ్ళూ, దుంపాదులూ తింటూ గడిపాడు. దొరకని పదార్థం ఎన్నడూ కావాలనుకోలేదు. అన్నిప్రాణుల మేలూ కోరాడు. ఇలాసిద్ధిపొందాడు' అని సెలవిచ్చాడు. ఈవింత నేను కళ్ళారా చూశాను. చెవులారా విన్నాను' అని చెప్పాడు.

విని సంతోషించాడు భృగుడు 'నాగరాజా! ఈవింతలు చెప్పి నాకు కావలసిన దారి చూపించావు. సంతోషంగావుంది. వెళ్ళి వస్తాను. నన్ను మరచిపోకు. నీశిష్యుణ్ణయాను. చెయ్యవలసిన పనులు ఆజ్ఞాపించు. నీకు శుభం కలుగుతుంది' అన్నాడు. 'ఇంత ప్రయత్నం చేసి నన్ను చూశావు. నువ్వు వచ్చినపని వినిపించు. నీపని ఏమీ చెయ్యలేదు నేను. ఇలా చెట్టుకింది మనిషిలా లేచిపోడం ధర్మమేనా? నీకోరిక చెప్పు. చేస్తాను తరువాత సుఖంగా వెళ్ళు. నాలో నువ్వున్నావు. నీలో నేనున్నాను. ఈసర్వలోకమూ నీలో వుంది. లోకమంతటా నువ్వున్నావు. మరిచింతకి అవకాశమేదీ? నిశ్చింతగా వుండు' అన్నాడు సర్పరాజు.

"'అవును అదే నిజం. భూతకోటీ, నువ్వూ, నేనూ, అంతటా వున్నాం. ఈరహస్యం తెలుసుకున్నాను. ఇలా నిన్ను చూడడమే నా కోరిక. నీఅనుగ్రహంవల్ల ఇది తెలుసుకున్నాను. నువ్వు కృతార్థుడివి.

వెళ్లివస్తాను! అంటూ పద్మనాగుదగ్గిర సెలవుతీసుకున్నాడు భృగుడు భార్గవుడైన చ్యవనముని దర్శనం చేశాడు. తనసంగతి విన్నవించాడు అతడి దగ్గిర సంస్కారం పొంది కృతకృత్యుడయాడు.

'ఈ పుణ్యకథ జనకచక్రవర్తి సభలో భార్గవుడికి నారదుడు చెప్పాడు, నారదుడు బృహస్పతికి చెప్పాడు. బృహస్పతి వసువులకి చెప్పాడు, పరశురాముడితో నేను యుద్ధంచేసినప్పుడు వచ్చివసువులు నాకు చెప్పారు. ధర్మాల్లో ఉత్తమధర్మం చెప్పమన్నావు నువ్వు. అందుకని నేను నీకు చెప్పాను. సర్వసమత్వం కలిగి కోరికలు లేకండా వుండడమే ఉత్తమధర్మం. అదే ఆనందనిదానం. "

వ్యావహారికాంధ్ర మహాభారతం

శాంతిపర్వం

సమాప్తం

ప్రాచీన గ్రంథావళి : ౩

సంపాదకుడు : పురిపండా అప్పలస్వామి

# వ్యావహారికాంధ్ర

# మహాభారతం

అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వాలు

## సంపుటం 7

పురిపండా అప్పలస్వామి

కవితాసమితి అధ్యక్షుడు



ప్రాచీన గ్రంథావళి

రాజమహేంద్రవరం

# అంకితం

అమ్మా,

'అమ్మా' అని నిన్ను నోరారా పిలిచీ,
చివరిసారి నీ దర్శనం చేసీ;
వెళ్ళి వస్తానని నోరారా చెప్పీ,
ఇవాళకి
పదిహేను సంవత్సరాలు దాటుతున్నాయి.
భారతం సంపూర్ణంగా నానోట వినకండానే
వెళ్ళిపోయావు.
తీర్చుకోలేని ఈలోపం నిరంతరం
వేధిస్తూనే వుంది నన్ను.
ఏం చెయ్యనూ !
నాకు తెలుసు,
ఎక్కడ వున్నా నన్ను వింటావు నువ్వు.
ఇదిగో
తెలుగు భారతం,
ఆశీర్వదించు.

పురిపండా అప్పలస్వామి.

# విషయ సూచిక

## ఆనుశాసనిక పర్వం (2731 – 3053)

## నాలుగో ఆశ్వాసం 2910



## అయిదో ఆశ్వాసం 2972

## అశ్వమేధపర్వం (3055 - 3206)

# ఆశ్రమవాసపర్వం (3209 - 3270)

## మొదటి ఆశ్వాసం 3209



## రెండో ఆశ్వాసం 3240

## మౌసలపర్వం (3273 - 3308)



## మహాప్రస్థానిక పర్వం 3311–3322



## స్వర్గారోహణ పర్వం 3325 - 3339

# అనుశాసనికపర్వం

## మొదటి ఆశ్వాసం

### కర్మే అన్నిటికీ కారణం

దివ్యజ్ఞానంతో వివిధధర్మాలు వినిపించాడు భీష్ముడు. అవన్నీ శ్రద్ధతో విన్నాడు ధర్మరాజు. భక్తిపూర్వకంగా ప్రణామంచేసి వినయంతో అందుకున్నాడు.

''తండ్రీ! నామనస్సుకి శాంతి కలిగించడంకోసం సకల ధర్మాలూ విడమర్చి, విడమర్చి ఉపదేశించావు. అయినా కొంచెమైన శాంతి కలగడంలేదు నాకు. ఎంతోమంది బంధువుల్ని చంపించాను నేను పంతంపట్టి. అదొక ఎత్తూ, నీకు కలిగిన ఘోరం వొకఎత్తూ అయి నాఘోరకర్మలు నామనస్సు వ్యాకులపరుస్తూవుంటె ఎలా శాంతి కలుగుతుంది? ఏందారి నాకు?

''దుర్యోధనుడు అమితమైన లోభంతో పట్టుపట్టికూచున్నాడు నాతో పంచుక తినడం తనకి ఇష్టంలేకపోయింది. నేనూ పట్టుపల మానలేకపోయాను. రాజ్యం అతడికి ఇచ్చేసి తప్పుకోలేకపోయాను. మాఇద్దరివల్లే ఇంత పుట్టింది. ఏంచేసినా పశ్చాత్తాపం వొదలకండావుందిప్పుడు'' అన్నాడు.

'''నేను చంపాను, నేను చంపాను, అంటున్నావు, చంపడానికి మనిషి కర్తకాడు''ధర్మరాజుమాట విని ఎత్తుకున్నాడు భీష్ముడు, ''దీనికి వొక ఇతిహాసం చెపుతాను, విను.

''గౌతమి అని వొక బ్రాహ్మణస్త్రీవుండేది. శాంతస్వభావురాలామె. ఆమె కొడుకు పాముకరిచి చచ్చిపోయాడు. ఆమె ఏడవడం

చూసి, అర్జునకుడు అని వాడు కిరాతుడు పాముని తాడుతో కట్టి ఆ మెదగ్గిరికి పట్టుకువచ్చాడు.

" 'అమ్మా, ఇదిగో, దీని తల చిదకగొడుస్తాను. లేదా రెండు తునకలు చేసేస్తాను. మా పెద్దనీ తాచు, చెప్పు, ఎలా దీన్ని చంప మంటావో చెప్పు" అంటూ నిప్పులుకక్కాడు.

" చూసింది గౌతమి.

" 'అన్నా! పాముని వొదిలిపెట్టు నాయనా!" అంది.

" 'ఈ అబ్బాయి ప్రాణం తీసిందిది. దీని ప్రాణం నేను తీస్తాను" అన్నాడు కిరాతుడు.

" 'పాముని చంపేస్తే నాకొడుకు బతుకుతాడా తండ్రీ? వదిలి పెట్టు దీన్ని. విధివశంగా ఆపదలు వస్తాయి. ఇది తెలుసుకోలేక పాపభారంపైన వేసుకుంటారు అధములు. తుదకి దుఃఖసముద్రంలో మునిగిపోతారు. ధర్మం తెలిసిన ఉత్తములు మాత్రం ఆభారం మీద వేసుకోరు. తేలికగా భవసముద్రం దాటిపోతారువాళ్ళు, అంది గౌతమి.

" 'అర్థంలేనిమాటలాడుతున్నావు నువ్వు' అన్నాడు, అర్జునకుడు 'కోపంతో వున్న నాకు ఇవేవీనచ్చవు. ఈ పాముని చంపకుండా పోనివ్వను.'

" 'అన్నా, అర్జునకుడు అన్న నీపేరు సార్థకం కావాలోయి.* హింస అంటే కిట్టదు నాకు. నీవంటివాడు నాముందు క్రౌర్యం పూనడం తగదు. బ్రాహ్మలు కూడదన్నపని పైగా వాళ్ళకి సాయం చెయ్యడానికి వచ్చినవాళ్ళు చేస్తారా చెప్పు?' అంది గౌతమి.

" 'అదేమిటమ్మా? జనాన్ని బాధపెట్టే జంతువుల్ని చంపితే పాపం వస్తుందా? రాదు' అన్నాడు అర్జునకుడు.

" 'కాదు నాయనా, కూడనిపని ఇది. చేతికి చిక్కిన శత్రువుని చంపకు. నామాట విను' అంది గౌతమి.

---

*అర్జునం అంటే తెలుపు, తెలుపు మంచిదని భావం. మంచివాడు అన్న పేరు సార్థకం కావాలి అని గౌతమి అభిప్రాయం.

" 'పాముని చంపి జనాన్ని కాపాడడం కూడదా? దేవేంద్రుడు వృత్రాసురుణ్ణి చంపలేదా? శివుడు దక్షుడియజ్ఞం ధ్వంసం చెయ్యలేదా? ఈహింసలవల్ల వాళ్ళ ధర్మం పెరగలేదా? కనక ఈపాముని చంపడానికి వొప్పుకోవాలి నువ్వు,' అంటూ గట్టిగా నొక్కి చెప్పాడు కిరాతుడు. అయినా జాలిగుండెకల గౌతమి అంగీకరించలేదు.

"ఇదంతా విని, బోయవాడితో ఇలా అంది పాము.

" 'నేనేం తప్పు చేశాను? అసలువిషయం తెలుసుకోకండా నన్ను చంపుతా నంటున్నావు? మృత్యువుచేతి కీలుబొమ్మని నేను. మృత్యువు పంపడంవల్ల ఈ బ్రాహ్మణబాలుణ్ణి కరిచాను. అంతే. వొక కోరిక కానీ, కోపంకానీ ఏమీ నామనస్సులో లేదు.'

" 'మృత్యువుకి సాధనం నువ్వు. కనక నిన్ను దండించడం ధర్మం' అన్నాడు అర్జునకుడు.

" 'కుమ్మరివాడి కోల ఎలా తిప్పితే అలా తిరుగుతుంది సారె. అలాగే మృత్యువు ఎలా చేయిస్తేఅలా చేశాను నేను. నువ్వే ఆలోచించు. నాతప్పేముందో మరి. నాచేతిలో ఏముంది? ఏమీలేదు' అంది పాము.

" 'వేసేవాడు విలుకాడు, బాణమేం చేస్తుంది?' అని వూరుకుంటారా ఎవరైనా? దాన్ని ముక్కలు చెయ్యకండా చేతులు ముడుచుకుంటారా? ఎవరు పంపితేనేం, కరిచింనావివి నువ్వేకదా! క్రూరజంతువ్వి నువ్వు. నిన్ను చంపితే పాపంరాదు. అంతేకాదు, మృత్యువుకి బుద్ధికల సాధనాలు మీారు. అంచేత మిమ్మల్ని బతకనివ్వకూడదు. తప్పకండా చంపెయ్యాలి' అన్నాడు అర్జునకుడు.

" 'అలాఅయితే యజ్ఞంలో బుద్ధికల సాధనాలుగావుండి హవిస్సు వేలుస్తారు ఋత్విక్కులు. అప్పుడు యజ్ఞఫలం యజమానిదా?

రుత్విక్కులదా? యజమానిదే కదా? అంచేత తప్పేమైనా వుంటే అది మృత్యువుదే, కాని నాదేముంది? అంది పాము.

"పాము నోట్లోమాట నోట్లోనే వుంది, 'అలా కాదు' అంటూ మృత్యువు ప్రత్యక్షమయిందక్కడ. 'నిన్ను నేను పంపినట్టే నన్ను యముడు పంపాడు. కనక ఈబాలుడి చావుకి కారణం నువ్వూ కాదు, నేనూ కాదు. సూర్యుడూ, చంద్రుడూ, భూమీ, ఆకాశమూ, నీరూ, గాలీమొదలైన వాటి గతులన్నీ యముడిచేతిలోనే వున్నాయి, ఇక తక్కినవని చెప్పేదేముంది? విన్నావా? ఇది తెలిస్తే నామీద పాపమెలా మోపుతావు? ఇదంతా యముడిపని. నన్ను నిందిస్తే నిన్నూ నిందించాలి మరి!' అంది.

" 'నీవల్ల తప్పుందని కానీ, వొప్పుంతేదని కానీ అనలేదు నేను. నువ్వు నన్ను పంపించావన్నాను, నా తప్పులేదని నేను ఋజువు చేసుకోవాలంటూవా లేదా? యముడితప్పయినా వుందో లేదో చెప్ప వలిసిన పనేముంది నాకు? తప్పు విచారించి మాటాడేవాటిదాన్నా నేను?' అంది పాము.

" ' బోయవాడిమొహం చూసి, ఇంకా ఇలా అంది, "మృత్యువు మాటలు విన్నావు కదా! నామీదతప్పు అంటగట్టడం ధర్మమేనా మరి?'

" ' పాముమాట విని పక్కున నవ్వాడు బోయ. మృత్యువూ, నువ్వూ ఇద్దరూ తోడిదొంగలే. పాపాత్ములు మీరు. తప్పించుకుందా మంటే తప్పిపోతుందా దోషం? మీరు ఇలా అంటే జంకేస్తా ననుకున్నారా?' అన్నాడు.

" ' కాదు, తప్పంతా యముడిది. గొప్పవాడతడు. అతడు ఎలా ఆడిస్తే అలా ఆడాం మేము. మాతప్పు ఏమీ లేదు' అన్నాయి పామూ, మృత్యువూ కూడా.

" పామూ, మృత్యువూ అలా అన్నాయో లేదో, ధర్మసంశయం తొలిగించడానికి స్వయంగా యముడే అక్కడ ప్రత్యక్షమయాడు,

"' 'పామూ, మృత్యువూ, నేనూ—మేం ముగ్గురంకూడా ఈ బాలుడి చావుకి కారణం కాదు. ఇతడు చేసుకున్న కర్మే ఇతడి చావుకి కారణమైంది. చావుపుట్టుకలు కర్మవల్లే కలుగుతాయి. కష్టసుఖాలు చేసినకర్మవల్లే కలుగుతాయి. తప్పించుకోడం శివుడికన్నా తరంకాదు కనక మీామీా వాదాలు కట్టిపెట్టండి'' అన్నాడు.

"' 'విన్నావా నాయనా!' తాను తెలుసుకున్నదీ, యముడు చెప్పిందీ వొక్కటేకావడంతో బోయవాడితో అంది గౌతమి, 'పుత్రశోకం అనుభవించవలిసినపాపం చేసుకున్న ఆడదానికి ఇలాగే జరుగుతుంది. ఇలాటిచావు రావలసినపాపం చేయడంవల్ల పిల్లలకి ఇలాటిచావు వస్తుంది. దీనికి విచారమెందుకూ? అంతమందీ కర్మాను సారంగానే కళ్ళుమూస్తారు. కనక రోషమూ, విచారమూ కూడదు. పాముని విడిచిపెట్టు. శాంతం వహించు.'

"గౌతమిచెప్పింది విని, తెలుసుకున్నాడు బోయ. పాముని వొదిలిపెట్టేశాడు. మృత్యువూ, యముడూ సంతోషించారు; తమ దారిని తాము వెళిపోయారు. కనక, ధర్మరాజా! నువ్వుకూడా విచారం విడిచిపెట్టు బంధువుల మరణానికి నువ్వుకానీ, దుర్యోధనుడు కానీ కారణం కాదు. వాళ్ళు చేసుకున్న కర్మలే వాళ్ళ చావుకి కారణాలయాయి. దీనికి నువ్వు విచారించడ మెందుకూ? నేనుచెప్పిన ఈ ఇతిహాసం మనస్సుకి పట్టించుకో. శాంతి కుదుర్చుకో. సుఖపడు'' అన్నాడు.

ధర్మరాజు:

గృహస్థధర్మం అవలంబించినమనిషి మృత్యుభయంపోగొట్టుకో గలడా ? పోగొట్టుకోలేడా?

భీష్ముడు :

దానికి తగినట్టు నడుచుకుంటే తప్పకండా పోగొట్టుకోగలడు. దీనికి సరైన ఇతిహాస మొకటుంది. చెపుతాను, విను,

## అతిథి పూజ

పూర్వం మనువంశంలో దుర్యోధనుడని వొక రాజు వుండేవాడు. ప్రజలందరికీ కల్పవృక్షంలా వుండేవాడతడు. మూడు లోకాలూ మెచ్చుకున్నట్టు భూలోకమంతా ఏలుకున్నాడతడు. అతడి అందం చూసి నర్మదానదికి కామావేశం కలిగింది. స్త్రీరూపం ధరించి అతడితో కామసౌఖ్యాలనుభవించింది.

వాళ్ళిద్దరికీ చక్కని చుక్క వొక కూతురు పుట్టింది. దేవతా స్త్రీల సౌందర్యం ఆమె కాలిగోటికి సాటివచ్చేదికాదంటే నమ్మండి. ఆమె పేరు సుదర్శన.

సుదర్శనని అరిచేతి నిమ్మపండులా పెంచాడు దుర్యోధనుడు. అందివచ్చాక, బుజ్జగించి ఆమెని తన అగ్నిహోత్రంలో పరిచారం చెయ్యడానికి నియోగించాడు.

సుదర్శన అర్చించినప్పుడు చివురాకుల్లాంటి ఎర్రటి ఆమె చేతుల జిగిసొంపు అగ్నిహోత్రుడి మనస్సు ఆకర్షించేది. వీవనా విసిరినప్పుడు ఆమె నేత్రాల అందం అతడిలో వలపు రేకెత్తించేది. అగ్నిని ఊది బెత్తాయించినప్పుడు ఆమె తియ్యటి పలుకులు కోరికలు పుట్టించేవి. మెల్లి మెల్లిగా మాటలాడినప్పుడు ఆమె పెదవుల పరిమళం ధైర్యాన్ని సగానికి జార్చేది. అదే సమయమని జాలిమాలి అతడిమీద విరివిగానూ పూల బాణాలు రువ్వేవాడు మన్మథుడు. మన్మథపీడ పట్టుకుంది అగ్నిహోత్రుణ్ణి. అంతకంతకి అధికమైంది. దాంతో చిక్కిపోసాగాడతడు.

మన్మథాగ్నితో మాడిపోతూ వోనాడు వొంటరిగా చూసి సుదర్శనతో అన్నాడు అగ్నిభట్టారకుడు:

"సుదర్శనా! చివురాకుల్లా వున్నాయి నీపాదాలు; నా చూపులు కట్టేస్తున్నాయి ఆకర్షించి. నీ స్తనాలు రెండూ మంచి పళ్ళలా వున్నాయి; నన్ను వెర్రెత్తిస్తున్నాయి. పూలతీగలా ముద్దొస్తోంది

నీశరీరం; నాలో ప్రేమ వుబికిస్తోంది. నిండుచందమామలా వుంది నీమొహం; నాధైర్యంబుగ్గిచేసేస్తోంది. నీకోసం మన్మధాగ్నిలో మల మల మాడిపోతున్నాను; బాధపడిపోతున్నాను. నాభార్యవికా నువ్వు."

అగ్నిహోత్రుడి మాటలు విని, సిగ్గుపడిపోయింది సుదర్శన. తల వొంచుకుంది.

"మహాత్మా!" మెల్లిమెల్లిగా అందామె, "తల్లిదండ్రుల తోనూ, గురుజనులతోనూ తప్ప, ఇతర్లతో వేడుకగా మాట్లాడ వచ్చా కన్యలు?"

"అవును, నిజమే" అన్నాడు అగ్నిభట్టారకుడు.

ఇంతలో దుర్యోధనమహారాజు గొప్ప యజ్ఞమొకటి చెయ్యా డానికి పూనుకుని, బ్రాహ్మల్ని పూజించడం మొదలెట్టాడు అగ్ని హోత్రుడు కూడా వొక బ్రాహ్మడివేషంతో రాజుదగ్గరికి వచ్చాడు.

"మహారాజా! నీకుమార్తెని నాకు కన్యాదానంచెయ్యి" అంటూ అర్థించాడు.

"ఇతరకులంవాడితడు, బ్రాహ్మడు. పైగా దీనావస్థలో వున్నాడు. ఇలాడి కేమిటి నాసుదర్శనని ఇవ్వడమేమిటి?" అన్న ఊపడింపుతో మాట్లాడకుండా వూరుకున్నాడు దుర్యోధనుడు.

తన కోరిక ఫలించకపోడంతోనే తిరిగివచ్చేశాడు అగ్ని హోత్రుడు యజ్ఞసమయంలో తనమూర్తి దాచేసుకున్నాడు; వెలగ డం మానేశాడు.

ఈ విపరీతంచూసి ఋత్విజులూ, మహారాజూ భయపడిపో యారు. "కర్మలో ఏం లోపంవచ్చిందో!" అని తడబడిపోయారు. మంత్రాలతో అగ్నిదేవుణ్ణి స్తోత్రంచేశారు.

బ్రాహ్మలతో రహస్యంగా మెల్లిమెల్లిగా తన అభిలాష తెలియచేశాడు అగ్నిహోత్రుడు. బ్రాహ్మలు రాజుతో చెప్పారు. సంతోషించాడు మహారాజు. అగ్నిభట్టారకుడికి సువర్శన నిచ్చి

గొప్పగా పెళ్ళిచేశాడు. బ్రాహ్మణకుమారుడై పెళ్ళిపీటలమీద కూచున్నాడు అగ్నిహోత్రుడు. యావన్మందీ ఆశ్చర్యపోయి కళ్ళప్పగించి చూశారు.

సుదర్శనని పెళ్ళాడి మహోజ్జ్వలంగా ప్రకాశించాడు అగ్నిహోత్రుడు. ఆహుతులమీద ఆహుతులు పరిగ్రహించాడు. దుర్యోధనుడియజ్ఞం దివ్యంగా సాగింది.

అగ్నిహోత్రుడికి సుదర్శనగర్భంలో వొక కుమారుడు కలిగాడు. అతడిపేరు సుదర్శనుడు. ఉదాత్తమైన గుణవంతు డతడు

ఆ దినాల్లో నృగమహారాజు* పితామహుడు ఓఘవంతుడు వొక రాజుగా వుండేవాడు. ధర్మం తప్పకండా రాజ్యమేలుతూ వుండేవా డతడు. అతడి కుమారుడి పేరుకూడా ఓఘవంతుడే. ఎంతో కీర్తిమంతు డతడు. అతడికి ఓఘరథుడు అని వొక కుమారుడూ, ఓఘవతి అని వొక కూతురూ కలిగారు.

ఓఘవతికోసం వరుణ్ణి వెదికాడు ఓఘవంతుడు. ఎవ్వరూ నచ్చలే దతడికి. తుదకి సుదర్శనుణ్ణి చూసి, అతడు తనకుమార్తెకి తగినవాడని నిశ్చయించాడు సుదర్శనుడు కూడా ఓఘవతిని ప్రేమించాడు. ఓఘవతీ సుదర్శనుల వివాహం వైభవంగా జరిగిపోయింది.

"గృహస్థధర్మం పాలించి, మృత్యువుని జయిస్తానని ప్రతిజ్ఞ చేశాడు సుదర్శనుడు. భార్య ఓఘవతితో కలిసి కురుక్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ చక్కని పర్ణశాల కట్టుకున్నాడు.

పర్ణశాలలో కాపరంచేస్తూ, భార్యతో అన్నాడు సుదర్శనుడు:

"అతిథుల్ని పూజించడమంటే ఎంతో ఇష్టం నాకు. నువ్వుకూడా అనుకూలంగా వుండి నాకు తోడ్పడాలి. నేను ఇంట వున్నా లేక పోయినాసరే, అతిథిపూజలో లోపంరాకండా చూడాలి. అతిథులు

* చూ. నృగచరిత్ర. రెండో ఆశ్వాసం.

ఏంకోరితే అది ఇచ్చి వాళ్ళని సేవించిన గృహిణీ, గృహయజమానీ ధర్మం నిర్వహించడంలో కృతకృత్యులవుతారు. అతిథి నీశరీరం కోరినా కోప్పడకు. అరమర పెట్టుకోకు. అతడికి ప్రియం కలిగించు. భర్త చెప్పినట్టు చెయ్యడమే భార్య కర్తవ్యం" అని నొక్కి చెప్పాడు.

ఓనాడు కర్రపుల్లలకోసం అడివికి వెళ్ళాడు సుదర్శనుడు. ఇంతలో వొక అతిథి పర్ణశాలకి వచ్చాడు. ఆసనమూ అదీ వేసి, అతిథిని సత్కరించింది ఓఘవతి. వినయంతో సమ్మానించింది. ఆమె మొహంమీదే చూపులు నిలిపి, కామాతురుడయాడు అతిథి.

"నీమీద మనసుపడుతున్నాను, నాకు ప్రియం కలిగించు. గృహస్థధర్మం తెలియంది కాదు నీకు" అన్నా డతడు.

పరమపతివ్రత ఓఘవతి కావలిసిన ఇతరవస్తువులు ఇస్తానని ఎన్నోవిధాల బోధపరిచిం దతణ్ణి. అవేవీ వొల్లనన్నాడు అతిథి.

చిక్కులో పడిపోయింది ఓఘవతి. భర్త నూరిపోసిన మాటలు తనుపుకి తెచ్చుకుంది. అయినా తెగించలేకపోయింది వొకంతట. జంకడానికి భయపడింది. అతిథికోరిక తీర్చడానికీ సంకోచపడింది. కాదు, వొప్పుకుందా మనుకుంది. అంతలోనే చలించింది. ఇలా ఎంతోసేపు వెనకముందులాడింది. తుదకి భర్త చెప్పిన ధర్మం ప్రకారం నడుచుకోడానికే నిశ్చయించుకుంది. సిగ్గుతో మొహం వొంచుకుంది. "ఒప్పుకున్నాను" అన్న మాట మెల్లిగా అంది. సంకోచం విడిచిపెట్టింది. అతిథితో ఇంట్లో వొక మరుగుప్రదేశానికి వెళ్ళింది.

ఇంతలో అడివినుంచి కర్రలు పట్టుకు వచ్చేశాడు సుదర్శనుడు. పర్ణశాల గుమ్మంలో నిలబడి భార్యని పిలిచాడు.

"పలక్కు, వూరుకో" అన్నాడు అతిథి. అతడు శపిస్తాడని భయపడింది ఓఘవతి. పలక్కుండా వూరుకుంది.

గట్టిగా మళ్ళీమళ్ళీ పిలిచాడు సుదర్శనుడు. "ఓ" అన్న పలుకు వినపడలేదతడికి. ఇంట్లోకి వెళ్ళి చూశాడు. భార్య కనపడలేదు. భయపడిపోయి, మళ్ళీమళ్ళీ ప్రేమతో పిలిచాడతడు

"నాకు ఆతిథ్యమిస్తోంది. గృహస్థధర్మం తెలిసినవాడివి నువ్వు. కోప్పడకు" అన్నాడు అతిథి మరుగునుంచి.

"సంతోషించాను" అన్నాడు పరమపుణ్యాత్ముడు సుదర్శనుడు," అతిథిపూజ జరిగినకొంప పవిత్రమైందంటారు పండితులు. ఈ మాత్రం తెలుసు నాకు. కనక కోపం తెచ్చుకోను. నామాటలకి నా మనస్సే సాక్షి, భూదేవీ, అగ్నిదేవుడూ, ఆకాశమూ, గాలీ, సూర్యచంద్రులూ కూడా సాక్షులు" అన్నాడు.

అతడు అలా అంటూనే వున్నాడు, "అవును ఇతడిమాట అక్షరాలా నిజం" అంటూ ఆకాశంమీద స్పష్టంగా పలికింది దివ్యవాణి.

ఎంతో ప్రీతితో వచ్చి, అతడిముందు నిలబడ్డాడు అతిథి. చూడశక్యం కాకండా వెలిగిపోతోంది అతడి మూర్తి.

"ధర్మదేవతని నేను" సుదర్శనుడితో అన్నాడు అతిథి, నీ మనస్సు పరీక్షించడం కోసం ఇలా వచ్చాను. నిశ్చలవ్రతుడివి నువ్వు. నీప్రతిజ్ఞ భంగమైతేచాలు, నిన్ను కబళించాలని నీవెంట నీడలా తిరుగుతోంది మృత్యువు. నువ్వు దాన్ని జయించావు. కామమూ, రోషమూ మొదలైన వికారాలతో కూడా ముందే మనస్సు జయించావు. నీభార్యకూడా పవిత్రురాలు, అస్ఖలితచరిత్ర. సుదర్శనా! నువ్వు ఎప్పుడు కావాలంటే అప్పుడు స్వదేహంతో స్వర్గానికి వెళ్ళవచ్చు. నీభార్యకూడా నీతో వెళుతుంది.

"ఇంతేకాదు, ఈమె తన తపస్సులో సగంభాగంతో ఓఘవతి అన్నపేర నదిగా ప్రవహిస్తుంది. మిగిలిన సగంతపస్సుతో యథాప్రకారం నీకు తగిన సేవ చేస్తుంది. మీకు నిర్మలమైన యశస్సు కలిగించడంకోసం ఇలా ఏర్పాటు చేశాను."

అలా చెప్పి, వెయ్యి తెల్లగుర్రాలూ పూసిన గొప్ప రథంమీద తన లోకానికి వెళ్ళిపోయాడు ధర్మదేవత. అతడు చెప్పినట్టే ప్రవర్తించింది ఓఘవతి. పరమానందం అనుభవించాడు సుదర్శనుడు.

ధర్మరాజా! ఈ కథాభిప్రాయం మనస్సులో నిలుపుకో నాయనా! గృహస్థులకు అతిథిపూజని మించినధర్మం మరొకటి లేదని తెలుపుతోంది ఇది. అతిథిపూజ చేసిన గృహస్థు మృత్యువుని జయిస్తాడు. నేను ఇప్పుడు చెప్పిన ఈ ఇతిహాసం వింటే సమస్తపాపాలూ పోతాయి. అన్ని కోరికలూ నెరవేరతాయి.

ధర్మరాజు :

బ్రాహ్మలతరవాతి మూడుజాతులవాళ్ళూ పవిత్రమైన కర్మలు చేసి, మంచిగుణాలు కలిగివుంటే బ్రాహ్మలవుతారా? వాళ్ళకి బ్రాహ్మణత్వం సంక్రమిస్తుందా?

భీష్ముడు :

బ్రాహ్మణత్వం దుర్లభమైంది. ఎన్నోజన్మ లెత్తాక కాని లభించని ఉన్నతపదం అది. దానివిధానం వివరిస్తాను, విను.

## మ తం గు డి క థ

ఇంద్ర మతంగసంవాదనమని ఒక ఇతిహాసముంది. అది వింటే నీసందేహం తీరిపోతుంది.

ఒకానొక బ్రాహ్మడికి మతంగుడని ఒక కుమారుడు వుండేవాడు. ఓనాడు తండ్రి మతంగుణ్ణి ఒక యజ్ఞానికి పంపాడు. వెళ్ళినవాడు వెళ్ళినట్టుండక, ఒక గాడిదపిల్లని గట్టిగా కొట్టాడు మతంగుడు. ఎంతో బాధపడి, తన తల్లిదగ్గిరికి వెళ్ళి, మొరపెట్టింది గాడిదపిల్ల.

"అవును, వీడు చండాలుడు. కోపమే వీడి స్వభావం" అంటూ పిల్లని ఓదార్చింది గాడిద.

పూర్వజన్మకర్మవిశేషంవల్ల జంతువులభాష తెలుసు మతంగుడికి. గాడిదమాటలు విన్నాడతడు.

"ఇది తిట్టుకాదు, నిజం నిరూపిస్తూ అన్నమాట. నేను మాలవాణ్ణా? ఏమిటిది?" అంటూ ఆలోచించాడు మతంగుడు. గాడిద దగ్గిరికి వెళ్ళాడు. నేను చండాలుణ్ణెలా అయానట?" అని అడిగాడు.

"ఒక మంగలివాడితో మీఅమ్మ వ్యభిచరించడంవల్ల నువ్వు పుట్టావు" అంది గాడిద.

ఈమాట విని విచారంపట్టుకుంది మతంగుడికి. యజ్ఞానికి వెళ్ళడం మానేశాడు. ఇంటికి తిరిగివచ్చేశాడు. జరిగిందంతా తండ్రితో చెప్పాడు "శూద్రబీజంతో బ్రాహ్మణస్త్రీకి పుట్టినవాడు చండాలుడే అవుతాడు; ఇందులో సందేహమేముంది? ఏదో శాపంవల్ల పుట్టింద్రై వుంటుంది గాడిద. ఉన్నమాటే చెప్పిందది. అంచేత తపస్సుచేస్తాను. బ్రాహ్మణత్వం సంపాదిస్తాను" అన్నాడు. ఇల్లువొదిలిపెట్టి అడివికి వెళిపోయాడు. అక్కడ గొప్ప తపస్సుచేశాడు.

అతడి తపస్సుచూసి, ఔరా అని మెచ్చుకున్నాడు దేవేంద్రుడు. అతడిముందు ప్రత్యక్షమయాడు. "ఏంకావాలో కోరుకో ఇస్తాను" అన్నాడు.

సంతోషించాడు మతంగుడు. "నాకు బ్రాహ్మణత్వం ప్రసాదించు" అన్నాడు.

"బ్రాహ్మణత్వ మహాత్మ్యం తెలియదు నీకు. ఇతరజాతివాడు బ్రాహ్మ డెలా అవుతాడు? మరేదైనా కోరుకో ఇస్తాను" అన్నాడు దేవేంద్రుడు.

"అయితే మహాత్మా! నువ్వు దయచెయ్యి. ఎవ్వరికీ సాధ్యం కాని తపస్సు అస్ఖలితంగా చేస్తాను నేను" అన్నాడు మతంగుడు.

నవ్వుతూ వెళిపోయాడు దేవేంద్రుడు.

ఒంటికాలుమీద నిలబడి నూరేళ్ళు తపస్సుచేశాడు మతంగుడు. మళ్ళీ వచ్చి ప్రత్యక్షమయాడు దేవేంద్రుడు.

"నేను వద్దని చెపుతున్నా మానకుండా వున్నావు. పరమ

దుర్లభమైనదానికోసం ఘోరమైన తపస్సు చేస్తున్నావు. చండాలుడు ఇలా తపస్సుచేస్తే నశించిపోతాడు. కనక తగని పని ఇది. విడిచిపెట్టు. విను, ఇలాటి తపస్సు పదింతలుచేస్తే చండాలుడు శూద్రుడవుతాడు. వందరెట్లుచేస్తే శూద్రుడు వైశ్యుడవుతాడు. వెయ్యిరెట్లుచేస్తే వైశ్యుడు క్షత్రియుడవుతాడు. దానికి పదివేలరెట్లుచేస్తే ఆకాశ మార్గంలో విహరిస్తావు'' అని వరమిచ్చి అంతర్ధానమయాడు దేవేంద్రుడు. అంతేకాని మతంగుడికి బ్రాహ్మణత్వంమాత్రం లభించలేదు.

విశ్వామిత్రుడు బ్రాహ్మడెలాఅయాడు?

ధర్మరాజు :

అయితే విశ్వామిత్రుడు బ్రాహ్మడెలా అయాడంటావు?

భీష్ముడు :

గంగాదేవికి తండ్రి అయిన జహ్నుడివంశంలో గాధిమహారాజు పుట్టాడు. అతడికి సత్యవతి అని వొక కూతురుండేది. భృగువంశంలో పుట్టిన చ్యవనుడి కుమారుడు ఋచీకముని ఆమెని తన కిమ్మని గాధి రాజుని కోరాడు. ఒక్క చెవి నల్లగావున్న తెల్లగుర్రాలు వెయ్యి కట్నమిస్తే కుమార్తెని ఇస్తానన్నాడు గాధిరాజు. ''సరే'' అన్నాడు ఋచీకుడు. వరుణదేవుణ్ణి ప్రార్థించాడు. ''నువ్వు ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆగుర్రాలు పుడతాయి'' అని వరమిచ్చాడు వరుణుడు. అతణ్ణి దీవించి, గంగానది ఉత్తరాన కన్యాకుబ్జనగరానికి దగ్గరగా వెళ్ళాడు ఋచీకుడు. నియమంతో గుర్రాలు కావాలని తలుచుకున్నాడు. గాధిరాజు ఎలాటి గుర్రాలు కావాలనికోరాడో అలాటి గుర్రాలు ఉత్తరక్షణంలో భూమిలోంచి పుట్టాయి. ఆ ప్రదేశం అశ్వ తీర్థమని పేరుపడింది.

ఋచీకుడు గుర్రాలు తీసుకురావడంచూసి, నిర్ఘాంతపోయాడు గాధిరాజు. ఎంతో సంతోషంకూడా కలిగిందతడికి. ఇక కుమార్తె నివ్వనంటే శపిస్తాడేమో అని భయంకూడా కలిగింది. కట్నంగా గుర్రాలు పుచ్చుకుని, కూతుర్ని ఋచీకుడికిచ్చి పెళ్ళిచేశాడు.

సత్యవతిని పెళ్ళిచేసుకుని, గృహస్థధర్మం నిర్వహించాడు ఋచీకముని. కుమారుణ్ణి కనాలని సంకల్పం కలిగి, ఓనాడు భార్యతో, "నీకు కుమారుడు కలిగే చరువు తయారుచేస్తాను" అన్నాడతడు.

అల్లుడిప్రభావం ఎరుగును కనక, సత్యవతితల్లి "అమ్మాయీ! నీభర్త పుణ్యాకర్త, అంచేత నాకు కుమారుడు కలిగినట్టు అతణ్ణి ప్రార్థించుతల్లీ!" అని అంతకి పూర్వమే కూతురితో చెప్పిపెట్టింది. ఆమాట ఇప్పుడు భర్తతో చెప్పింది సత్యవతి.

ధర్మపరుడు కనక రెండు చరువులు తయారుచేశాడు ఋచీకుడు. తన తపశ్శక్తిచేత అందులో వొకటి బ్రాహ్మణకుమారుడు కలిగించేదిగానూ, వొకటి క్షత్రియకుమారుడు కలిగించేదిగానూ తయారుచేశాడు. రెండూ సత్యవతికి చూపించాడు. విడివిడిగా వాటిప్రభావం విడమర్చి చెప్పాడు. క్షాత్రమైన చరువు మీ అమ్మకిచ్చి, బ్రాహ్మమైన చరువు నువ్వు పుచ్చుకో. ఋతుకాలంలో మీఅమ్మ రావిచెట్టునీ, నువ్వు మేడిచెట్టునీ కౌగిలించుకుని, ఈచరువులు ఉపయోగించండి" అని నియోగించాడు. అయితే దైవికంగా చరువులు రెండూ తారుమారయాయి. తల్లిచరువు కూతురు పుచ్చుకుంది. కూతురు చరువు తల్లి పుచ్చుకుంది. ఈకారణంగా తల్లీకూతుళ్ళ గర్భాలలో పిండాలు తారుమారయాయి.

మహానీయుడు ఋచీకుడు. దివ్యబోధతో అదంతా తెలుసుకున్నాడతడు. సత్యవతిగర్భం చూసి, "అయ్యో, నీకడుపులోబిడ్డ బ్రాహ్మడు కాడు. క్రూరుడైన క్షత్రియుడు. చరువు తారుమారయింది" అన్నాడు.

భర్త చెప్పింది విని ఎంతో బాధపడింది సత్యవతి. "నీకొడుకు బ్రాహ్మడు కాకపోతే ఏముంటుంది లోకం? మహాతపశ్శాలివి నువ్వు. అలా కాకుండా చెయ్యి. ఈ వరంమాత్రం నాకు దయచెయ్యి" అంటూ కాళ్ళావేళ్ళాపడింది సత్యవతి.

"సరే" అంటూ కనికరించాడు ఋచీకుడు. నీకొడుకు బ్రాహ్మడే అవుతాడు. వాడి కుమారుడిలో క్షత్రియధర్మం వృద్ధిపొందుతుంది" అన్నాడు. అంచేత సత్యవతి కొడుకు జమదగ్ని బ్రహ్మతేజస్సుతోనూ, ఆమె మనవఁడు పరశురాముడు క్షత్రియతేజస్సుతోనూ ప్రఖ్యాతులయారు.

సత్యవతితల్లి, గాధిభార్య విశ్వామిత్రుణ్ణి కంది. అతడు రాచబిడ్డడే అయినా చరువుప్రభావంవల్లా, చెట్టుగుణంవల్లా ఉత్తమ బ్రాహ్మణగుణంతో గొప్ప తపస్సు చేశాడు.

వీతహవ్యుడు బ్రాహ్మడెలా అయాడు?

ధర్మరాజు :

వీతహవ్యుడనే రాజు కూడా బ్రాహ్మడయా డని విన్నాను. దాని కేమిటి కారణం?

భీష్ముడు :

మనువుకుమారుడైన శర్యాతివంశంలో హైహయుడని వొక రాజు వుండేవాడు. వత్సదేశం పాలించేవా డతడు. అతడికే వీతహవ్యుడనికూడా పేరు. పదిమంది భార్యలతడికి. వందమంది కుమాళ్ళని కన్నా డతడు. అందరూ వీరులు, ప్రబలులు, మహారథులు. పరాక్రమమంటే వల్లమాలిన సరదా వాళ్ళకి. కాశీరాజైన హర్యశ్వుణ్ణి యుద్ధానికి పిలిచి చంపేశారు వాళ్ళు. హర్యశ్వుడి కొడుకు సుదేవుడు కాశీరాజ్యానికి పట్టంకట్టుకున్నాడు. అతిడిమీదా దండెత్తారు హైహయుడి కుమాళ్ళు. అతణ్ణీ చంపేశారు. సుదేవుడి కుమారుడు దివోదాసుడు కాశీకి రాజయాడు. అతడిమీదా దాడిచేశారు హైహయుడి కుమాళ్ళు. అతడి సైన్యాలు హతవాఁర్చారు.

ఓడిపోయి, పారిపోయాడు దివోదాసుడు. ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా భరద్వాజ ముని ఆశ్రమానికి వెళ్ళా డతడు. భరద్వాజమునిని

ఆశ్రయించాడు. హైహయుడి కుమారుళ్ళు తన సంతతి సంహరించారని విన్నవించాడు.

"భయపడకు" అని అభయమిచ్చాడు భరద్వాజుడు. "శత్రువుల్ని గెలవగలిగిన కుమారుణ్ణి నీకు ప్రసాదిస్తాను" అంటూ అతడి చేత పుత్రకామేష్టి చేయించాడు.

దివోదాసుడికి కుమారుడు కలిగాడు. పుట్టుకతోనే పదమూడేళ్ళప్రాయంవా డయా డతడు. అతడిపేరు ప్రతర్ధనుడు. మహాత్ముడైన భరద్వాజముని అనుగ్రహంవల్ల వేదాలలోనూ, ధనుర్వేదంలోనూ త్వరలోనే గొప్పవాడయా డతడు. చూడశక్యంకాకుండా వుండేది అతడి తేజస్సు. అతడికి యువరాజ్యపట్టం కట్టాడు తండ్రి దివోదాసుడు.

తండ్రి అనుమతి పొంది, సేనలతో వత్సదేశంమీద దాడి చేశాడు ప్రతర్ధనుడు. వీతహవ్యుడి కుమారుళ్ళందరినీ చంపేశాడు. ఆ వూపున తనమీదికి రావడం చూసి, భృగుముని ఆశ్రమానికి పారిపోయాడు వీతహవ్యుడు. అతణ్ణి తన శిష్యుల్లో చేర్చుకున్నాడు భృగువు.

వీతహవ్యుణ్ణి వెంటాడుతూ భృగువు ఆశ్రమానికి వెళ్ళాడు ప్రతర్ధనుడు. వినయంగా భృగుమునికి నమస్కారంచేశాడు.

"ఇలా ఎందుకు వచ్చావు?" అని అడిగాడు భృగువు.

"మహాత్మా! మధ్యవర్తివై నామనవి చిత్తగించు" అంటూ వీతహవ్యుడి కుమారుళ్ళు తనకులం నాశనం చెయ్యడమూ, తాను వత్సదేశంమీద దండెత్తడమూ, వీతహవ్యుడు పలాయనం చిత్తగించడమూ చెప్పాడు. "మునీంద్రా! వీతహవ్యుడు నీ ఆశ్రమానికి వచ్చాడు. అతణ్ణి హతమార్చడంకోసం వచ్చాను" అన్నాడు.

"ఇక్కడ క్షత్రియుడు ఎవ్వడూ లేడు. ఉన్నవాళ్ళందరూ బ్రాహ్మణులే. కావలిస్తే వచ్చి చూడు" అని తన శిష్యులందరినీ చూపించాడు భృగుముని.

చూశాడు ప్రతర్దనుడు. నవ్వుతూ ముని పాదాల మీద వాలాడు.

"మునీంద్రా! కృతార్థుణ్ణయ్యాను. నాపగవాణ్ణి జాతినుంచి తప్పించావు. నీమాట అమోఘమైంది, అసత్యంకాదు. సెలవుతీసుకుంటాను. అనుగ్రహించు" అన్నాడు.

అతణ్ణి సెలవిచ్చి పంపేశాడు భృగుముని. అతడిమాటకి అడ్డులేదు. వీతహవ్యుడు బ్రాహ్మడయ్యాడు.

వీతహవ్యుడికి గృత్సమదుడు అని దేవేంద్రుడిలాంటి కుమారుడు కలిగాడు. గృత్సమదుడి కొడుకు సుతేజసుడు (సుచేతుడు). సుతేజసుడి కొడుకు వర్చసుడు. వర్చసుడి కొడుకు విహావ్యుడు. విహావ్యుడి కొడుకు వితత్యుడు. వితత్యుడి కొడుకు సత్యుడు. సత్యుడి కొడుకు సంతుడు. సంతుడి కొడుకు శ్రీవసుడు. శ్రీవసుడి కొడుకు తముడు. తముడి కొడుకు ప్రకాశుడు. ప్రకాశుడి కొడుకు వాగింద్రుడు. వాగింద్రుడి కొడుకు ప్రమతి. ప్రమతి కొడుకు రురుడు. రురుడి కొడుకు శునకుడు. శునకుడి కొడుకు శౌనకుడు. వీళ్ళంతా మహాఋషులు. ఇలా మహావిద్యావంతులైన మునివంశానికి మూలపురుషుడయ్యాడు మహారాజు వీతిహోత్రుడు.

ధర్మరాజా! ఇంక ఏమడుగుతావో అడుగు.

## దైవమా పౌరుషమా ఏదిగొప్పది?

ధర్మరాజు :

దైవమూ, పౌరుషమూ – ఈ రెంటిలో ఏది గొప్పది?

భీష్ముడు :

వెనకటికి ఇలాగే వసిష్ఠుడు బ్రహ్మదేవుణ్ణడిగాడు. బ్రహ్మదేవుడు చెప్పినమాటల సారాంశమే నీకు చెపుతాను, ఆలకించు.

"పౌరుషం పొలంవంటిది. దైవం విత్తనంవంటిది వాటి రెంటా

సూత్రీకపడితేనే ఫలం ఫలిస్తుంది. పురుషుడు పనిచెయ్యకపోతే దైవం ఫలమెలా కలిగిస్తాడు ? జనంచేసిన పనికి దైవం అనుకూలిస్తే ఫలం కలుగుతుంది. దైవసహాయం లేకపోతే పౌరుషంవల్ల ఫలం కలగదు. విత్తనం సహకారి కానప్పుడు వృత్తి పొలం కొర్నుభూమి అవుతుంది, కాని పంట పండదు కదా!

"మేలుచేస్తే రెండులోకాలలోనూ మేలే కలుగుతుంది. కీడు చేస్తే కీడే కలుగుతుంది, తప్పదు. అంచేత ఏదైనా పురుషప్రయత్నం బట్టి వుంటుంది. ప్రయత్నం ఎలాటిదైతే ఫలసిద్ధీ అలాటిదే అవుతుంది.

"అగ్నినిప్పు రవంతే అయినా గాలి సాయపడి బ్రహ్మాండ మంతా చుట్టపెడుతుంది. అలాగే మంచిపని ఏమాత్రమైనా, దైవం అనుకూలిస్తే ఎంతయినా వృద్ధిపొందుతుంది.

"నేయి తరిగిపోతే దీపం ఆరిపోతుంది. అలాగే కర్మసిద్ధి నశిస్తే దైవానుకూల్యంకూడా నశిస్తుంది.

"పరశురాముడూ, భృగువూ, బలీ మొదలైన మహనీయులు కర్మ క్షీణించిపోడంవల్లే దైవప్రభావంకూడా కోలుపోయారు. కర్మా విధీ – ఈరెండూ రెండే. రెండింటిలో ఏదీ తేలికైంది కాదు.

"కార్యఫలం సిద్ధించడంకోసం పౌరుషమూ, దైవమూ రెండూ కావాలి. అంచేత రెండూ సమానమైనవే.

ఏం మంచిపనిచేస్తే ఏంఫలం కలుగుతుంది ?

ధర్మరాజు :

ఏ సత్కార్మచేస్తే ఏం ఫలం కలుగుతుంది?

భీష్ముడు :

దారినడిచి అలిసినవాడికి అన్నంపెడితే దానిఫలం ఇంతా అంతా కాదు. ఎంతో గొప్పదది.

అగ్నినారాధించినవాడు పురుషశ్రేష్ఠు డవుతాడు.

ఏయే పదార్థాలు దానమిస్తే ఆయాపదార్థాలు అధికమవుతాయి.

మౌనం అవలంబిస్తే జ్ఞానశక్తి అధికమవుతుంది.

తపస్సువల్ల భోగం లభిస్తుంది.

అహింస అవలంబిస్తే రూపమూ, బలమూ, జ్ఞానమూ, ఐశ్వర్యమూ లభిస్తాయి.

బ్రహ్మచర్యంవల్ల పరమాయువు సిద్ధిస్తుంది.

ఉపవాసంవల్ల చిత్తశుద్ధి కలుగుతుంది.

పళ్ళూ, నీళ్ళూ మాత్రం ఆహారంగా చేసుకుంటే రాజ్యం లభిస్తుంది.

ఆకులు ఆహారం చేసుకుంటే స్వర్గం సిద్ధిస్తుంది.

శ్రుతులు (వేదాలు) చదవడంవల్ల సౌఖ్యం కలుగుతుంది. అర్థబోధవల్ల సుగతి కలుగుతుంది.

సత్యవ్రతంవల్ల ముక్తి కలుగుతుంది.

కాలానుగుణ్యంగా చెట్లలో ఆకులూ, పువ్వులూ, పళ్ళూ పుట్టినట్లు, సమయానుకూలంగా కర్మలనుబట్టి శుభాశుభాలు ప్రాప్తిస్తాయి కర్తకి.

ముసిలితనంవచ్చి తల పండిపోతుంది, పళ్ళు వూడిపోతాయి. కళ్ళు కనపడవు. చెవులు వినపడవు. అయినా ఆశ అంతరించదు. ప్రాణంపోయినదాకా వొదిలిపెట్టని రోగం ఆశ. అల్పబుద్ధులు ఆశ వొదిలించుకోలేరు. సుఖం కావలిసిన పండితులుమాత్రం మనస్సులో ఆశకి చోటివ్వరు ఆశాపరులు తాముచేసిన పాపాలకి దుఃఖం అనుభవిస్తారు; పుణ్యాలకి సుఖం అనుభవిస్తారు. ఆశలేనివాళ్ళు అంటీముట్టకండా వుంటారు. సుఖదుఃఖాలు రెండూ వాళ్ళ పొంతకి రావు.

ధర్మరాజా! మునులుచెప్పిన విషయమిది. నీకు నేను ఉపదేశించాను. ఇంకా ఏం వినాలనుందో అడుగు.

## ఆశ్రయం వొదలిపెట్టకూడదు

ధర్మరాజు :

నిజాశ్రయానికి ఆధారుడైన పురుషుడి విషయంలో భక్తులు ఎలా ప్రవర్తించాలి ?

భీష్ముడు :

కాశీరాజు దేశంలో వొక బోయవాడు వుండేవాడు. అతడు వేటకి వెళ్ళి, వొక లేడిమీద విషం పూసినబాణం వేశాడు. గురితప్పి వొక చెట్టుకి తగిలింది బాణం. పువ్వులతోనూ, కాయలతోనూ కలకలలాడుతూ వుండేది చెట్టు. విషబాణం తగిలి ఎండిపోతూవచ్చిందది. దాని తొర్రలో గొప్ప చిలకపిట్ట వొకటి నివసిస్తూ వుండేది. అంత వరకూ తనకి ఆశ్రయమిచ్చిన చెట్టు వొదిలి వెళ్ళిపోలేదది. ఎండకీ, గాలికీ భయపడకుండా ధైర్యంతో ఆ తొర్రలోనే వుండేది.

ఉత్తమమైన చిలకపిట్ట ప్రవర్తన తెలుసుకొని, దేవేంద్రుడు దానిదగ్గిరికి వచ్చాడు.

"చిలకా! ఈచెట్టు ఎండిపోయింది. ఈ అడివిలో పళ్ళతో నిండిన మహావృక్షాలు ఎన్నో వున్నాయి. వాటిమీదకి వెళిపోక, ఈ చచ్చినచెట్టు పట్టుకు వేలాడతావేమీ ?"అని అడిగాడు.

"దేవేంద్రా! ఇన్నాళ్ళూ పళ్ళు పండుతూ నాకు ఆశ్రయ మిచ్చింది ఈ చెట్టు. ఇప్పుడు ఎండిపోయిందని వొదిలివెళ్ళడం న్యాయమా ? అది కృతఘ్నత కాదా ?" అంది చిలక.

ఆశ్చర్యపోయాడు దేవేంద్రుడు. "ఇదేదో పూర్వకర్మవల్ల చిలకపిట్ట అయింది. కాకపోతే నన్నెలా తెలుసుకుంది? దీనికి మేలు చేస్తాను" అని భావించాడు.

"చిలకా! నీ పలుకులు విని సంతోషించాను. వరం కోరుకో ఇస్తాను" అన్నాడు.

"ఈచెట్టు పచ్చగా పూర్వంలా అయి, అభ్యుదయంపొందినట్టు అనుగ్రహించు" అంటూ ప్రార్థించింది చిలక.

అమృతం చిలకరించాడు దేవేంద్రుడు. బతికి వెనకటికంటె పచ్చగా కలకలలాడింది చెట్టు. ఉత్తములైన ఆశ్రితులు ప్రభువుకి ఇలాగే మేలుచేస్తారు.

## ప్రభువులు మన్నించవలిసిన వాళ్ళు

ధర్మరాజు :

ప్రభువులు ఎవళ్ళని మన్నించాలి ?

భీష్ముడు :

తపస్సూ, స్వాధ్యాయమూ మొదలైన కర్మలవల్ల ఉభయ లోకాలూ వశంచేసుకోగల బ్రాహ్మలు మన్నించదగ్గవాళ్ళు ప్రభువుకి. భార్యకి భర్త ఎలాటివాడో రాజుకి బ్రాహ్మడు అలాంటివాడు. 'బ్రాహ్మడు' అన్న మాటే పవిత్రమైంది. దేవేంద్రుడంతవాడికైనా సరే, బ్రాహ్మడు సంతోషించాడంటే సుఖాలు కలిగిస్తాడు. కోపం తెచ్చుకున్నాడా ఆపదలపాలుచేస్తాడు.

రాజు బ్రాహ్మణ్ణి కన్నకొడుకులా పోషించాలి; గురువులా సేవించాలి; అగ్నిలా పూజించాలి. ఈ విషయంలో వేదాలు ఏమన్నాయో చెపుతాను, సావధానంగా విను.

ఓమాటు వేదాలు తమలో తాము గోష్ఠిచేశాయి. "బ్రాహ్మణ జాతిని పరాభవిస్తే చేసినపుణ్యాలన్నీ వూడ్చుకుపోతాయి" అంది ఋగ్వేదం.

"జపమూ, హోమమూ మొదలైన కర్మలకంటే బ్రాహ్మడికి భోజనంపెట్టడమే గొప్ప" అంది యజుర్వేదం.

"ఒకనెల బ్రాహ్మణపూజచేస్తే చేసుకున్న పాపాలన్నీ పటాపంచలవుతాయి" అంది సామవేదం.

"బ్రాహ్మల్ని ఆదరించకపోతే వచ్చిన కీడును మించిన కీడు లేనే లేదు" అంది అధర్వణవేదం. దేవరుషులవల్ల విన్నమాట ఇది.

## పరమధర్మం

ధర్మరాజు!

ధర్మాలన్నిటిలోకీ పరమశ్రేష్ఠమైన ధర్మమేది?

భీష్ముడు :

మద్రరాజు శల్యుడు ఏోమాటు వ్యాసదేవుడుకి పాదాభివందనం చేసి, "తెలుసుకోదగినవాటన్నిటిలోకీ దేన్ని తెలుసుకోడం గొప్ప?" అని అడిగాడు.

"విష్ణుదేవుణ్ణి తెలుసుకోవడం గొప్ప" అని చెప్పాడు వ్యాసముని, "యజ్ఞమూర్తి విష్ణుదేవుడు. అతడే యజ్ఞం. అతడే యజ్ఞభోక్త. యజ్ఞఫలమున్నా అతడే. విష్ణుదేవుడే శ్రీకృష్ణుడు.

"శల్యా! ఏోనాడు కృష్ణుడు వింటూవుండగానే కొంతమంది బ్రాహ్మలు అతణ్ణి ఉద్దేశించి నన్ను అడిగారు. 'ఇతడు యాదవవృష్ణైన వసుదేవుడి కుమారుడు కదా! కంసుడి చెల్లెలైన దేవకీకడుపున పుట్టాడు. ఇతణ్ణి యజ్ఞపురుషుడని స్తుతించడంలో ఏమిటి ఈ సామ్యం?' అని. వాళ్ళమాటలు విని నవ్వాడు శ్రీకృష్ణుడు. 'నీవు అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పు' అని ఆదేశించాడు నన్ను. అతడికి నమస్కరించేసి, బ్రాహ్మలతో అన్నాను

"వేదమయుడు ఈయన, విష్ణుదేవుడు, సర్వవేద్యుడు. ఈయన్ని తెలుసుకోవడమే ఉత్తమబ్రాహ్మణత్వసిద్ధి' అని చెప్పాను. నా మాటలు వినుకున్నారు వాళ్ళు. ఆ భావంతోనే కృతకృత్యులైనవాళ్ళు అయారు."

వ్యాసుడు ఇలా చెప్పడంతో నిర్మలమానస్సుతో చరితార్థుడయాడు శల్యుడు.

ధర్మరాజా! ఈ పరమధర్మం నువ్వు ఎరుగుదువని తెలుసు నాకు. అయినా అడిగావు కనక వివరించాను.

ధర్మరాజు :

గరుత్మంతుడు మహానుభావుడని విన్నాను. అతడి చరిత్ర వినాలని అభిలాష అధికంగా వుంది.

ధర్మరాజు ఇలా అడగడంతోనే కృష్ణుడి కేసి చూశాడు భీష్ముడు. "కృష్ణా! నువ్వే గరుత్మంతుడివి అని విన్నాను. చెప్పనా?" అన్నాడు.

"తప్పకండా" ప్రసన్నమైన మొహంతో అన్నాడు శ్రీకృష్ణుడు, "ధర్మరాజు కోరిక తీర్చడమే మన కర్తవ్యం."

కృష్ణుడి అనుమతిపొంది, ధర్మరాజుతో గరుత్మంతుడి చరిత్ర ఎత్తుకున్నాడు భీష్ముడు :

## గరుత్మంతుడి చరిత్ర

కశ్యపుడు తన భార్యలైన వినతనీ, కద్రువనీ "వరంకోరుకోండి, ఇస్తాను" అన్నాడు. వెయ్యిమంది కొడుకుల్ని కోరుకుంది కద్రువ. ఇద్దరు కుమాళ్ళు కావాలంది వినత. "అలాగే కానిండి" అన్నాడు కశ్యపుడు.

కద్రువకి వెయ్యిగుడ్లు పుట్టాయి. వినతకి రెండుగుడ్లు కలిగాయి. వాటిని కుండల్లో పెట్టి భద్రపరిచారు వాళ్ళు.

అయిదువందల సంవత్సరాలు గడిచాక కద్రువ పెట్టిన వెయ్యి గుడ్లలోనూ వెయ్యి పాములు పుట్టాయి. ఎంతో తేజస్సూ, బలమూ కలిగి వుండేవవి. వినత గుడ్లు రెండూ మాత్రం అలాగే వుండేవి.

సవతికి పిల్లలు పుట్టి, తనకి ఇంకా పుట్టకపోడంవల్ల మచ్చరం తెచ్చుకుంది వినత. ఆగలేక, ఒక గుడ్డు పగలగొట్టిం దామె. అందులోంచి ఒక పక్షి పుట్టింది. పైభాగంతప్ప కిందిభాగం ఇంకా ఏర్పడలేదు దానికి. చూసి, వలవలా ఏడ్చింది వినత.

"మేం ఇద్దరం మహాశరీరాలతో మహాబలవంతులమై పుట్టవలిసింది. మచ్చరంవల్లా, చపలత్వంవల్లా సగంలో పగలగొట్టేశావు గుడ్డు. దీనిఫలం అనుభవిస్తావు. సవతికి దాసి వవుతావు" అని శాపం పెట్టింది సగంశరీరంతో పుట్టిన పక్షి.

వెలవెలపోయింది వినత. వడవడా వడికిపోయింది. తల్లి అవస్థ చూసింది పిట్ట. "అమ్మా, భయపడకు, విధివశంగా సంభవించిందిది. అయిదువందల సంవత్సరా లయాక రెండోగుడ్డులో నాతమ్ముడు పుడతాడు. అంతవరకూ ఎలాగో ధైర్యంతో దాన్ని కాపాడు భద్రంగా. నా తమ్ముడు మహాపరాక్రమవంతుడవుతాడు. మహాబలవంతు డవుతాడు. నాకొరత అతడే తీరుస్తాడు. మూడులో కాలూ ఔరా అన్నపని చేస్తాడు. నీ దాసిసత్వం పోగొడతాడు నీకు మహానందం కలిగిస్తాడు" అంది.

అలా తొలిబిడ్డ వికలాంగుడు కావడమూ, తనకి శాపం రావడమూ – ఈ రెంటివల్లా ఎంతో దుఃఖపడింది వినత. కొడుకు నిర్దేశించిన కాలంకోసం కనిపెట్టుకుని, రెండోగుడ్డు ఎంతో భద్రంగా కాపాడుతూ వచ్చింది.

అయిదువందలేళ్ళు గడిచాక ఆగుడ్డు పగిలింది. అందులోంచి గొప్పమెడా, దృఢమైన శరీరమూ, ప్రకాశవంతమైన మొహమూ, ఎర్రటి నేత్రాలూ, గొప్ప శిరస్సూ, అందమైన మంచి రెక్కలూ కలిగి గరుత్మంతుడు పుట్టాడు. అప్పుడే ఉదయిస్తున్న బాలసూర్యుడిలా వున్నాడతడు. కళ్ళవేడుకగా కనపడుతున్నాడు.

వినత తొలికొడుకు ఎర్రగా ప్రకాశిస్తున్న శరీరంతో అరుణుడు, రథసారథిగా సూర్యుణ్ణి సేవించడంకోసం ఆకాశవీథికి ఎగిరిపోయాడు.

పుట్టగానే తల్లిని వొదిలి స్వేచ్ఛగా ఎగిరాడు గరుత్మంతుడు. బ్రహ్మదేవుడు తనకోసం సిద్ధంచేసిన ఆహారం తిని, శరీరం పెంచు

కున్నాడు. సిద్ధులూ, సాధ్యులూ ఎంతో ముద్దుగా చూశారతణ్ణి అంతటా ఆడుతూ, పాడుతూ, సంతోషంగా తిరిగా డతడు.

ఇలా వుండగా వోనాడు వినతా, కద్రువా వినోదంగా సముద్ర పొడ్డు అడివిలో తిరగడానికి వెళ్ళారు. ముక్కుతో చివురాకులు త్రించుకుంటూ, కోకోమని సన్నగా కూస్తున్న కోకిలల సొంపూ, పువ్వుల తేనెలు తాగి వొళ్ళు తెలీని మత్తుతో మురిసిపోతున్న తుమ్మెదల మోతా, ఆరముగ్గినపళ్ళు తింటూ తమలోతాము కలుకుతూ పలుకుతున్న చిలకల కలకలమూ, సరోవరాల్లో జతలుజతలుగా క్రీడిస్తున్న హంసల నడకలూ, కెరటాలమీంచి తేలివచ్చి పూలతీగల మీాద వూగులాడుతున్న పిల్లగాలుల అల్లరీ – ఇవన్నీ చూస్తూ, వింటూ, మెచ్చుకుంటూ ఎంతోసేపు తిరిగారు వాళ్ళు.

ఇంతలో అల్లంతదూరాన వొక గుర్రం కనపడింది వాళ్ళకి. చందమామ కాంతి తెచ్చి పోతపోసినట్టు, పాలసముద్రం కెరటం తెచ్చి అచ్చుగుద్దినట్టు శివుడి జటాజూటంలోని గంగానది నురుగుతో తయారు చేసినట్టు తెల్లగా, ఎంతో అందంగా, అపురూపంగా వుంది దది. పాలసముద్రంలో పుట్టిన ఉచ్చైశ్శ్రవమది. స్వేచ్ఛగా అక్కడ తిరుగుతూవుంది వచ్చి.

"ఎంచక్కా వుందే గుర్రం తెల్లగా పుచ్చపువ్వులాగ" అంది, చూసి వినత.

"తోకమీాదమాత్రం నల్లగా వుంది" అంది కద్రువ.

"అదేమిటే, నవ్వుతాల కంటున్నావా? నిజమే అంటున్నావా? నీచూపు పొరపడలేదు కదా?" అంది వినత.

"ఏంమాటన్నావే? నల్లగా కనపడలేదే నీకు? ఊరికే చెపుతున్నా నటే నేను?" అంది తలూపుతూ గట్టిగా కద్రువ.

తేరిపార చూసి, "ఛబ్బే, నలుపన్నమాటే లేదు" అంది వినత ఖచ్చితంగా.

"వాదా లెందుకూ? పందెం వేస్తావా?" అంది కద్రువ దురుసుగా.

"ఏం పందెం వేస్తావో వెయ్యి, నేను సిద్ధంగా వున్నాను" అంది వినత.

"నువ్వు గెలిస్తే నీదాసిగా వుంటాన్నేను నేను గెలిస్తే నువ్వు నాదాసిగా వుండాలి. ఇదే పందెం మరి, వొడ్డుతావా?" వినత మొహంలోకి సూటిగా చూస్తూ అడిగింది కద్రువ తెగబడి.

అరుణుడు పెట్టిన శాపం ప్రేరేపిస్తోంది, తానుమాత్రం ఏంచెయ్యగలదు వినత! సవతితో పందెం కాసి, సరే, అట్టే కానీ, అందామె.

సవతులిద్దరూ పంచమహాభూతాలసాక్షిగా పందెం వేసుకున్నారు.

"దగ్గిరికి వెళ్ళి చూద్దాం పద" అంది వినత.

"ఇంటిదగ్గిర పనికి వేళయిపోయింది మళ్ళీవచ్చి గుర్రం చూద్దాం. ఏం మించిపోయిందని!" అంటూ మిషపెట్టి, అప్పటికి గుర్రం చూడటం తప్పించేసింది కద్రువ. ఇద్దరూ ఇంటికి వచ్చేశారు

ఇంటికి వచ్చాక కపటబుద్ధితో కొడుకుల్ని పిలిచింది కద్రువ వాళ్ళముందు కంట తడిపెట్టుకుంది.

"వినతా నేనూ సముద్రతీరానికి వెళ్ళాం. ఉచ్చైశ్శ్రవం అచ్చంగా తెల్లటి అందమైన గుర్రం చూశాం. 'కేవలం తెల్లగా వుంది గుర్రం' అంది వినత. దానిమాట కాదనడానికి 'గుర్రంతోక నల్లగావుంది చూశావా?' అన్నాను నేను దానిమీద వాదన పెరిగింది. ఇద్దరమూ పందెం వేసుకున్నాం. ఓడినవాళ్ళు గెల్చినవాళ్ళకి సేవచెయ్యాలి అని పందెం. సవతికి సేవ ఎలా చేసేది నేను? అందుచేత నాయనలారా! గుర్రంతోక నల్లగా చెయ్యండి మీరు" అంది.

తల్లిమాటలు విని, వాసుకి మొదలైనవాళ్ళు, "ఇది ధర్మం కాదు" అన్నారు. "మోసం చేసి, పందెం గెలవడం పాపం; క్షేమం

కాదు. అదీకాక, ఆలోచిస్తే వినతకూడా అమ్మే మాకు. ఏమైతే అవుగాక, ఈ పాపంమాత్రం తగనిపని మాకు. కాదూపోదూ అంటే ఏ గాయి దేశానికి పోతాం. మాక ఈపనికి నిర్బంధించకు నువ్వు" అంటూ స్పష్టంగా చెప్పేశారు. చెప్పినప్రకారం తల్లిని వొదిలేసి, ఎక్కడెక్కడికో వెళ్ళిపోయారు కొందరు.

అలా వెళ్ళిపోయిన వాళ్ళమీద ప్రేమవిడిచిపెట్టి కస్సుమంది కద్రువ.

"చంద్రవంశంలో, మహాత్ముడు నరుడు పాండురాజు భార్య కుంతీగర్భంలో అర్జునుడై పుడతాడు. అతడి మునిమనవడు జనమేజయుడు సర్పయాగం చేస్తాడు. భయంకరమైన ఆ హోమాగ్నిలో మాడి చస్తారు మీరు" అంటూ శాపంపెట్టింది నిష్ఠురంగా. ఈ శాపానికి భయపడిపోయారు కొంతమంది నాగకుమారుళ్ళు. "అమ్మా మేం గుర్రంతోక నల్లగా చేస్తాం" అంటూ చురుకున బయలుదేరి వెళ్ళారు. గుర్రంతోక పట్టుకుని, నల్లటి రోమాలుగా తయారయారు.

చూసి, సంతోషంతో ఎగిరిపడింది కద్రువ. వినతని తీసుకు వెళ్ళింది. పాపం, ద్రోహం ఎరగదు వినత. చూసి వెలవెలపోయింది.

"విచారమెందుకే, నా దాసీగా వుండు" నవ్వుతూ అంది కద్రువ.

సిగ్గూ, దుఃఖమూ దిగమింగుకుంటూ సవతికి దాసిగా కుదిరింది వినత. సత్యమూ, వినయమూ మొదలైన మంచిగుణాలుకల సాధ్వి ఆమె. ఆమె కళ్ళల్లో దుమ్ముకొట్టి, ఆమెని దాసిగాచేసుకుంది కద్రువ. నీచమైన పనిపాట్లు చెప్పి, వినతని అష్టమైన అగచాట్లూ పెట్టేదామె.

పరమసాధ్వి వినత, తన పెద్దకొడుకు చెప్పినమాటలు తలుచుకుంటూ, రెండోకొడుకుమీద ఆశపెట్టుకుని సవతిదగ్గిర దాసీపనిచేస్తూ వుండేదామె, వాళ్ళనో చకండా.

యౌవనదర్పంతో, అంతకంతకీ జవసత్వాలు పెరిగి, శరీర

బలంతో ఉద్ధతుడయ్యాడు గరుత్మంతుడు. బ్రహ్మదేవుడు లాలిస్తూ వుంటే, మనస్సులో గర్వం పెంచుకుంటూ తిరిగేవాడతను.

ఓనాడు నారదముని ఎదురయ్యాడతనికి. భక్తిపూర్వకంగా అతడికి ప్రణామంచేసి నుంచున్నాడు గరుత్మంతుడు.

"గరుత్మంతా!" నెమ్మదిగా అతడితో అన్నాడు నారదముని, "మీఅమ్మ సవతిదగ్గర దాసీగావుండి నలిగిపోతున్నాది. అమాటే పట్టించుకోకండా ఇలా తిరుగుతున్నావు నువ్వు పూలరంగడిలాగ. ఇదేమన్నా బాగుందా చెప్పూ?"

"మాఅమ్మ దాసీగా వుందా? ఏమిటి దీనికి కారణం?" తడబడుతూ అడిగాడు గరుత్మంతుడు.

వినతా కద్రువలు సముద్రపొడ్డున గుర్రం చూసింది మొదలు జరిగిందంతా పూసగుచ్చినట్టు స్పష్టంగా వినిపించాడు నారదముని.

విని, విచారమూ, కోపమూ, పురిపెట్టినట్టయి ఎంతో ఇదైపోయాడు గరుత్మంతుడు. "బావుంది, అప్ప మేలుచేసింది, చెల్లెలు కులుకుతోంది" అంటూ వాయువేగంతో ఎగిరి ఇంటికి వెళ్ళాడతను. మాటాడకండా తల్లికి పాదాభివందనం చేశాడు. దుఃఖంతో కద్రువ దగ్గిరికి వెళ్ళాడు. వినయంగా ఆమెకి నమస్కారం చేశాడు.

"అమ్మా!" మెల్లిమెల్లిగా బరువైన గొంతుకతో అన్నాడతడు, "నీచెల్లెలు నీ దాసిగా సేవచేస్తూవుంటే నీకు వొరిగిపడేగొప్ప ఏముంది చెప్పూ? కనికరించి ఈమెని వొదిలిపెట్టు. ఎంతో గౌరవం వస్తుంది నీకు. నేనుకూడా నీ కొడుకునే కదా! నా మొహంచూసైనా జాలిపడు. ధర్మమూ, అధర్మమూ – ఇవేవీ చెప్పడంలేదు నేను. అవన్నీ నాకెందుకూ? మా అమ్మకి దాసిత్వం రావడం దైవకృత్యం. అయిందేదో అయింది. ఇప్పుడు విడిచిపెట్టేశావా సంతోషిస్తాను" అన్నాడు.

"బావుంది!" గరుత్మంతుడి మాటలు విని, మొహంతిప్పి

కుంటూ అందుకుంది కద్రువ, "బలవంతుడివి నువ్వు. మాటకారివి. కనక నేరుపుగా చెపుతున్నావు. మీ అమ్మకి మేలుచెయ్యాలనే నీ నిశ్చయమైతే ఈ పోట్లాటలతో పనిలేదు, విను. అమృతం తెచ్చిపెట్టు. అమృతం తెచ్చావా, మీ అమ్మని దాసీగా వుంచను, వొదిలేస్తాను. తల్లీకుమాళ్ళు సంతోషిద్దురుకాని" అంది.

"సరే" అని వొప్పుకున్నాడు గరుత్మంతుడు. తిన్నగా తండ్రి కశ్యపుడి దగ్గిరికి వెళ్ళాడు. కద్రువకీ, తనకీ జరిగిన మాటలన్నీ వివరించాడు. "'అమృతం తెస్తాను" అని అంగీకరించి వచ్చాను, తెస్తాను" అన్నాడు.

కుమారుణ్ణి చూసి, ఆనందమూ ఆశ్చర్యమూకూడా కలిగాయి కశ్యపమునికి.

"అమృతం దేవతలకికూడా దుర్లభమైంది" గరుత్మంతుడితో అన్నా డతడు, "అతి ప్రయత్నంతో ఎవ్వరికీ అందకండా అట్టేపెట్టాడు దేవేంద్రుడు. ఎలా తెస్తావు నువ్వు? చుట్టూ ఇనపవల వుంటుంది. లోతైన నీళ్ళుంటాయి. నీటిచుట్టూ అగ్ని మండుతూ వుంటుంది. పెద్ద పెద్ద కత్తులూ మొదలైన ఆయుధాలు పట్టుకుని, మహాకాయులైన రాక్షసులు ఎంతోమంది కంటిమీద రెప్పవెయ్యకండా కాపలాకాస్తూ వుంటారు."

"నువ్వు పుత్రస్నేహంతో ఇదంతా చెపుతున్నావు" కశ్యపుడన్న మాటలు విని, నవ్వుతూ అన్నాడు గరుత్మంతుడు, "నేను బలవంతుణ్ణి. పైగా ఉపాయం తెలిసినవాణ్ణి. నీ కా అనుమానం అక్కరలేదు. తప్పకండా అమృతం తెస్తాను."

"ఇదే నీ నిశ్చయమైతే వొకమాట చెపుతాను, విను. ఒక ఏనుగూ, వొక తాబేలూ వున్నాయి. వాటిని తింటే నీబలం పెరుగుతుంది. ఆ రెండూ నీకు ఆహారంగా కల్పించాను, వెళ్ళు" అన్నాడు కశ్యపుడు.

సంతోషించాడు గరుత్మంతుడు. "ఏనుగూ, తాబేలూ ఎక్కడున్నాయి? ఎలావుంటాయవి?" అని అడిగాడు.

"తూరుపుసముద్రపొడ్డున ఉదగమని ఒక పర్వతమున్నది. దాని మహాశిఖరాలు ఆకాశం అంటుతూవుంటాయి. ఆ కొండదగ్గరనే వుంటుంది ఏనుగు. ఎంతో గొప్పదది. కొండకింద ఒక తామర కొలనుంది. సముద్రంలా వుంటుందది, నిర్మలమైన తియ్యటి నీళ్ళతో నిండివుంటుంది. ఆ నీళ్ళు తాగడానికి వస్తూవుంటుంది ఏనుగు. అది కొండమీద తిరుగుతూవుంటే మెరకా పల్లమూ; గట్టూ మెట్టూ ఒకేమట్టమైపోతాయి.

"ఆ సరోవరంలోనే తాబేలుంది. ఎంతో పెద్దతాబేలది. బ్రహ్మాండమైన బలం దాంది. ఏనుగు నీటిలోకి వస్తే హోరాహోరి దాంతో పోట్లాడుతుందది రానియ్యకుండా. దాంతో పోట్లాడుతూనే నీళ్ళు తాగుతుంది ఏనుగు ఇలా రెంటికీ షష్టాష్టమంగా వుంటుంది ఎప్పుడూ.

"మధుకైటభులన్న రాక్షసులు ఇద్దరూ ఇలా తాబేలూ, ఏనుగూ అయి పుట్టారు. తమని తాము తెలుసుకోలేక ఘోరంగా పోరాడుతున్నారు.

"ఏనుగూ, తాబేలూ విడివిడిగా వున్నప్పుడు వాటిని మూడు కళ్ళ శివుడన్నా పట్టలేడు. ఒక్కమాటు రెంటినీ పట్టుకోవాలి. అదీ పగలు వల్లకాదు. రాతిరివేళ ఉపాయంతో పట్టుకోవాలి" అన్నాడు కశ్యపుడు.

"ఒకటి చెరువులో వుంటుంది. ఒకటి కొండమీద వుంటుంది. రెండూ ఒక్కమాటు పట్టుకోవాలంటున్నావు నువ్వు. సాధ్యపడే దేనా ఇది?" అని అడిగాడు గరుత్మంతుడు.

"నిజమే, అసాధ్యమైనపనే అది. అయితే దానికి ఉపాయం లేకపోలేదు. నీళ్ళు తాగడానికి ఏనుగు వస్తుంది. దాంతో పోట్లాడ

డానికి తాబేలు వొడ్డుకి వస్తుంది. నీసులువుమీద నువ్వు కనిపెట్టు కుని వుండి, అదిగో అప్పుడు రెంటినీ పట్టెయ్యాలి, వొడుపుతో చప్పున'' అంటూ ఉపదేశించాడు కశ్యపముని.

వినయంగా తండ్రికి నమస్కరించాడు గరుత్మంతుడు. అతడి సెలవుతీసుకుందికి సిద్ధపడ్డాడు.

''ఏనుగూ, తాబేలూ నువ్వు తింటే, అమృతం తేవడంలో సందేహం లేదు'' అంటూ ఆశీర్వదించాడు కశ్యపుడు.

ఉత్సాహంతో ఆకాశంమీదికి ఎగిరాడు గరుత్మంతుడు. అతడి రెక్కలవడికి ఆకాశమార్గంలో తిరిగే విమానాలు తూలిపోతూ వచ్చాయి. అతడి రెక్కల ప్రకాశంతో సూర్యకాంతి తీసికట్టని పించింది. అలా మెరుపు వేగంతో వెళ్ళి ఉరగపర్వతంమీద వాలా డతడు. ఎవరూ తనని తెలుసుకోలేనట్టు శరీరం చిన్నదిగా కుదించు కున్నాడు. మదంకారుతూ ఉగ్రంగా వున్న ఏనుగుని కొండమీాద చూశాడు. నీళ్ళకోసం అది చెరువుకి వెళ్ళినప్పుడు దాని వెనకాలే బయలుదేరాడు.

ఏనుగు మదధారల వాసన గాలిలో చెరువులోంచే పసికట్టింది తాబేలు. నీళ్ళలో అది దిగకండా అడ్డుకోడానికి పరిగెత్తుకువచ్చింది. దాహంతోనూ, ఎక్కడలేని కోపంతోనూ ఘోరంగా తాబేలుమీాద కలబడింది ఏనుగు. ముందుకాళ్ళు రెండూ ముందుకి వేసింది.

సగంనీళ్ళలో వుండి వాడివాడిగోళ్ళతో ఏనుగు ముంగాళ్ళు చీల్చడం మొదలెట్టింది తాబేలు. తొండంతో దాన్ని బాదడం లంకించుకుంది ఏనుగు. పళ్ళతో కరిచింది తాబేలు. అలా రెండూ దారుణంగా పోరాడాయి.

పోరాడి పోరాడి రెంటికీ తమకం హెచ్చింది. వళ్ళమాలిన ఆవేశం వచ్చింది. నీళ్ళలోంచి పైకివచ్చి. ఏనుగుమీాద కురికింది తాబేలు.

అదే సమయమనుకున్నాడు గరుత్మంతుడు. రెంటినీ చప్పున పొదివి పట్టుకున్నాడు. తాబేలుని కుడికాలితోనూ, ఏనుగుని ఎడమ కాలితోనూ పట్టుకున్నాడు. రెండూ గింజుకున్నాయి. కాని గోళ్ళతో నొక్కేశాడు గరుత్మంతుడు. దాంతో రెండూ తెలివితప్పిపోయాయి. రెండు నల్లమేఘాలతో కలిసి గైరికపర్వతం గగనవిహారం చేస్తున్నట్టు ఏనుగూ, తాబేలూ పట్టుకుని ఆకాశంమీదికి ఎగిరి వెళ్ళాడు గరుత్మంతుడు.

ఎగురుతూవెళ్ళి ఓదగ్గిర పెద్ద చెట్టు చూశాడతను. దాని మీద వాలి, ఏనుగునీ, తాబేలునీ తినాలన్న నిశ్చయంతో ఓ పెద్ద కొమ్మమీద వాలాడు. అయిదు యోజనాల పొడవుంది ఆకొమ్మ. గరుత్మంతుడు వాలడంతోనే అంతకొమ్మా ఫెళ్ళుమని విరిగిపోయింది. చూశాడు గరుత్మంతుడు. కొమ్మమీద మునులు వాలఖిల్యులు కన పడ్డారు. భయపడ్డాడు గరుత్మంతుడు. కింద పడకుండా కొమ్మ ముక్కుతో పట్టుకున్నాడు. వాళ్ళకి ఏమాత్రమూ కదలిక కలగ కుండా కొమ్మతోకూడా ఎగిరి వెళ్ళాడు. చూసి ఆశ్చర్యపోయారు వాలఖిల్యులు. అతడు గరుత్మంతుడని తెలుసుకున్నారు. కనికరించారు.

"గరుత్మంతుడు కాకపోతే ఇలాంటిబలం ఎవళ్ళకుంటుంది?" అంటూ అతణ్ణి దీవించారు. కొమ్మ వొదిలేశారు మరోచోటికి వెళ్ళి పోయారు. సంతోషించాడు గరుత్మంతుడు. కాని "కొమ్మ కింద పడేస్తే ఎన్నో జంతువులు చచ్చిపోతాయి. ఏందారి?" అంటూ విచా రించాడు.

ఇంతలో "సముద్రపొడ్డున పులింద దేశముంది. నిందించదగిన దురాచారంతో నిండివుం దది. అదిగో అక్కడ ఈకొమ్మ పడెయ్యి. దేవతల ఆదేశమిది" అని ఆకాశవాణి పలికింది.

అది విన్నాడు గరుత్మంతుడు. చప్పున పులింద దేశంమీదికి ఎగిరివెళ్ళాడు. ఆదేశంవాళ్ళు చచ్చినట్టు అంతకొమ్మా అక్కడ

పడేశాడు. దాంతో అతడి మనస్సు తేలికపడింది అక్కణ్ణుంచి వొక కొండకొప్పుమీదికి వెళ్ళి వాలాడు. ఏనుగూ, తాబేలూ కొండకొప్పు మీద దించాడు. వాటి కొత్తనెత్తురు తాగాడు. మాంసంకండలూ, కొవ్వూ మెదడూ తుష్టిగా తిన్నాడు. వల్లమాలినబలం తెచ్చుకున్నాడు. అమృతంకోసం బయలుదేరాడు.

ఒక్క వూపున వెళ్ళి అమృతందగ్గిర వాలాడు గరుత్మంతుడు. చుట్టూ మండుతున్న అగ్నిహోత్రం చూశాడు. మంటలు తగిలి తన రెక్కలు కాలిపోతాయని భయపడ్డాడు. బ్రహ్మదగ్గిరికి పరిగెత్తాడు. పాదాభివందనంచేసి, చేతులు జోడించాడు.

"అమ్మ వినత బానిసగా వుంది. అది తప్పించడానికి అమృతం పట్టుకువెళ్ళడం తప్పనిసరి అయింది నాకు. అగ్గి అడ్డంగా వుంది. అందుకని నీదయకోసం నిన్ను ఆశ్రయిస్తున్నాను. ఆర్తశరణ్యుడివి నువ్వు, నన్ను రక్షించు" అంటూ ప్రార్థించాడు.

వాత్సల్యంకలవాడు కనక గరుత్మంతుడి ప్రార్థన మన్నించాడు బ్రహ్మదేవుడు.

"మంటలలో బాగా వెన్నపోస్తే అగ్నిహోత్రుడు తగ్గిపోతాడు. అప్పుడు చొంబడి చప్పున అమృతం తీసుకువచ్చెయ్యి. నీకోరిక నెరవేరుతుంది" అన్నాడు.

సంతోషించాడు గరుత్మంతుడు. ఆలమందలు అధికంగావున్న దగ్గిరికి ఎగిరివెళ్ళాడు. కొండంతవెన్న పట్టుకువచ్చాడు. అగ్గిమంటల్లో పడేశాడు. అమృతం చుట్టూవున్న నీళ్ళు చిమ్మేశాడు. ఎదురుపడ్డ రాక్షసుల్ని తెగబాదేశాడు. ఇనపవల చించేశాడు. స్వేచ్ఛగా అమృతభాండం పుచ్చుకున్నాడు. చివ్వున తారాపథానికి ఎగిరి బయలుదేరాడు.

ఇటంతా విన్నాడు దేవేంద్రుడు. సేనతో గరుత్మంతుడి

మీద దండెత్తడానికి సిద్ధపడ్డాడు. అంత దేవసైన్యమూ చించి చెండాడాడు గరుత్మంతుడు. రుద్రుడే అయిపోయాడు. దేవేంద్రుడు అమాంతంగా వజ్రాయుధం ప్రయోగించాడు.

గరుత్మంతుడి దగ్గిరికి వెళ్ళి ఏమీ చెయ్యలేకపోయింది వజ్రాయుధం. కొండలు పిండిచేసిన తనశక్తి అక్కడ ఎందుకూ పనికిరాకపోడంతోనే దేవేంద్రుడిదగ్గిరికి తిరిగి వచ్చేసిందది. చేసేదిలేక నిచ్చేరపోయాడు దేవేంద్రుడు. భయపడిపోయాడు. తిరిగి అమరావతికి వెళ్ళిపోయాడు, దైన్యంగా తలవొంచుకుని

బ్రహ్మదేవుడి అనుగ్రహంవల్ల అలా అద్భుతమైన శౌర్యసంపదతో దేవేంద్రుణ్ణి వోడించి, అమృతభాండం పట్టుకువచ్చాడు గరుత్మంతుడు. తెచ్చి, కద్రువముందు పెట్టాడు తల్లిదాసీసత్వం విడిపించాడు. తిరిగి అమృతభాండం పుచ్చుకుని ఆకాశంమీది కెగిరాడు. తెల్లపోయిచూసింది కద్రువ.

"అమ్మా!" కద్రువతో ఆకాశంమీంచి అన్నాడు గరుత్మంతుడు, "అమృతం తెమ్మన్నావు నువ్వు. చెయ్యవలిసిన పనులన్నీ చేసి, అమృతం తెచ్చాను నేను. నీవొప్పందం తీరిపోయింది అందరూ విన్నట్టు చెపుతున్నాను. మా అమ్మని నేను తీసుకుపోతున్నాను. నీ మనస్సులో మరేమీ అనుకోకు."

కద్రువ వైభవమూ, కీర్తీ కూడా మాసిపోయినట్టు అలా ధర్మసమ్మతంగా చెప్పి, తన తల్లిని ఇంటికి పంపేశాడు గరుత్మంతుడు. అమృతభాండం తీసుకువెళ్ళి భద్రంగా దేవేంద్రుడికి ఇచ్చేశాడు దేవేంద్రుణ్ణీ, అతిడిచుట్టూవున్న దేవతల్నీ, మునుల్నీ కలయచూశాడు.

"కొడుకుల్ని పంపి, తెల్లగుర్రంతోక నల్లగా చేసి పందెం గెల్చుకుంది కద్రువ. అమృతం తెస్తానని మాట ఇచ్చాన్నేను. తల్లి దాసీగావుండడం సహించలేక తండ్రి అనుజ్ఞతో, మీకు ఎదురుతిరిగాను. నా ఔద్ధత్యం పట్టించుకోకండి. మన్నించండి. బంధుభావంతో ఆదరించండి.

"పాపానికి పెట్టుకున్న కద్రువ కొడుకుల్ని నా చంచువుతో పొడిచి చెండాడతాను. దీనికి మా తండ్రి కశ్యపమునీ, మీరూ, ధర్మమూ సాక్షులు" అన్నాడు.

అతడి మాటలు విని, యాదవన్నాదీ అభినందించారు. మునులూ దేవతలూ అతడికి వరమియ్యడం న్యాయమని దేవేంద్రుడితో చెప్పారు.

"మన వరాలకి ఆసపడే తక్కువవాడు కాడు గరుత్మంతుడు" నవ్వుతూ అన్నాడు దేవేంద్రుడు. "సాక్షాత్తూ విష్ణుభగవానుడితడు. శూరసేనుడనే యాదవరాజు మనవడై కృష్ణుడన్న పేర లోకహితం కోసం భూలోకంలో జన్మిస్తాడు. ఈ మూర్తిమాత్రం వాదిలిపెట్టడు. వివిధవిధాల ప్రవర్తిసాడు, వినోదిస్తాడు."

దేవేంద్రుడిదగ్గిరా, దేవతలదగ్గిరా, మునులదగ్గిరా సెలవుతీసుకుని, తిరిగి వచ్చేశాడు గరుత్మంతుడు.

"బ్రహ్మదేవుడు లాలించి పెట్టిన ఉత్తమభోజనాలు ఆరగించి పెరిగాడితడు. బ్రహ్మాండమంత ఏనుగునీ, తాబేలునీ అవలీలగా ఎగరేసుకుపోయాడు. విరిగిన మహావృక్షం కొమ్మ మునులకి బాధించకండా ముక్కుతో పట్టుకున్నాడు. దేవతలతో కూడా దేవేంద్రుణ్ణి వోడించి, అమృతం పట్టుకువెళ్ళాడు. మాటతప్పకుండా తల్లి దాని సత్వం తప్పించాడు. దేవేంద్రుడి అమృతం తిరిగి దేవేంద్రుడికి అప్పగించాడు" అంటూ దారికడాకా సిద్ధులూ, సాధ్యులూ అతణ్ణి పదే పదే పొగిడారు.

ధర్మరాజా! మానవలోకానికి ఆనందదాయకమైంది గరుత్మంతుడి చరిత్ర అనంత సుఖ సౌభాగ్యాలున్నూ కలిగిస్తుంది. ఈ చరిత్ర విన్నావు; పుణ్యాత్ముడివయ్యావు.

---

* గరుత్మంతుడి చరిత్ర ఆదిపర్వంలోనూ వుంది. చూ. పు. 25 - 37. దానికీ దీనికీ వున్న తేడా గమనిస్తారా పాఠకులు. తైత్తిరీయ సంహితలోనూ, ఐతరేయ బ్రాహ్మణంలోనూ వుంటిన కథ భాగతంలో ఇలా మార్పుచెందిందని కీ॥ శే॥ పండిత పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'మహాభారతంలో

ఆసపెట్టి ఇవ్వకపోతే?
ధర్మరాజు :
తండ్రీ! గరుత్మంతుడి చరిత్ర విని సంతోషంగా వుంది నాకు.

---

వేదాంశములు' అన్న శీర్షికతో ఇలా రాశారు. "ఈ యితిహాసము 'తైత్తరీయ సంహిత' (6-1) లో నిట్లు కలదు.

కద్రువయు, సౌపర్ణియు దమలో నెవతె సౌందర్యవంతురాలను విషయమున వివాదపడి, మధ్యవర్తులచే దగవు దీర్పుచేయించుకొని సౌపర్ణి యోటుపడి, కద్రువకు దాసి యయ్యెను. 'త్రివిష్టపము' నందలి 'సోమలత'ను దీసికొనివచ్చి తనకిచ్చిన విముక్తి నొనర్తు నని కద్రువ సౌపర్ణికి జెప్పెను. ఆ యంశము ను వినత తన బిడ్డలైన 'జగతీ, త్రిష్టుప్, గాయత్రీ' అనువారలతో జెప్పె తొలుత జగతియు, పిమ్మట త్రిష్టుప్పును బ్రతుత్నించి విఫలతనొంది రాగా దుదకు గాయత్రి త్రివిష్టపమునకేగి సోమరక్షకులగు కృశానబ్రాతాదులతో బోరి వారినోడించి సోమహరణ మొనర్చి తెచ్చి కద్రువకిచ్చి సౌపర్ణిని దాస్యమునుండి విముక్తం జేసెను.

పై గాథయే ఐతరేయబ్రాహ్మణమున సోమహరణమను నామముతో మరియొకవిధముగా గలదు అది యిది. "దేవతలు ఋషులు నొకప్పుడు జగతీ, త్రిష్టుప్, గాయత్రీ ఛందస్సుల జూచి మీరు సోమము నపహరించి తెండన నవి మూడును సుపర్ణరూపమును వహింప నందు మొదట రెండింటి యంశముగాక గాయత్రియంశమే సోమాహరణ మొనర్చె."

మహాభారతమున పైగాథ కొంత మార్పునొందియున్నది. ఆ మార్పులో జగతి మొదలగు ఛందముల పేరు లేక ఛందోమయుడగు గరుత్మంతుడే 'సోమము' లేక, అమృతము నపహరించి తెచ్చి 'సౌపర్ణి' (వినత) దాస్యమును తొలగించినట్లు వర్ణింపబడియున్నది. ఆంధ్రమహాభారత పాఠకులకు, అమృత మన సోమ మను నంశము విరుద్ధముగా గాన్పించును; కాని, సంస్కృతభారతమున అమృత శబ్దము సోమపర్యాయముగానె వాడబడెను. చూడుడు.

శ్లో॥ కశ్యపస్య మునేః పుత్రో వినతాయాశ్చ ఖేచరః
హర్తుం 'సోమ' మభిప్రాప్తో బలవాన్ కామరూపధృత్.
సమర్థో బలినాం శ్రేష్ఠో హర్తుం సోమం విహంగమః

(ఆదిపర్వము. 30. అ. శ్లో. 41, 42)

ఇట సోమశబ్ద మమృతవాచిగా జెప్పబడుట గమనార్హము. వేదములు యజ్ఞప్రవర్తకములు కదా! అట్టి యజ్ఞప్రవర్తకములగు వేదములలో సోమాహరణమను కథ యుండు టవసరము కలదు. ఈ పంచమవేదము (భారతము) నందును సోమాహాఖ్యానమే గరుడోపాఖ్యానముగా మారియున్నది.

చూ. రాజసూయరహస్యము. పు 9-11.

బ్రాహ్మడికి ఏదైనా ఇస్తానని ఆసపెట్టి ఇవ్వనివాడికి ఏం గతి పడుతుంది?

భీష్ముడు :

దీనికి వొక నిదర్శనం చెపుతాను, విను. ఒక నక్కా, వొక కోతీ స్నేహంతో కలిసి వుండేవి. పూర్వజన్మలో మనుషులుగా వుండి అవి రెండూ నేస్తాలుగా వుండేవి. అంచేత ఈ జన్మలోకూడా వొక దానికోసం వొకటి ప్రాణంపెట్టేవి.

ఓనాడు నక్కతో అంది కోతి— "నేస్తం, ఏపాపంచేసి పుట్టావో నువ్వు. పీనుగులు పీక్కుతింటూ బతుకుతున్నావు!"

గతజన్మ జ్ఞాపకముంది నక్కకి. కోతి అలా అడగడంతోనే విచారంతో చెప్పిందది—"గతజన్మలో బ్రాహ్మడికి ఇస్తానని వొప్పుకున్నధనం ఇవ్వలేదు నేను. అంచేత ఈ జన్మ ఎత్తవలిసివచ్చింది."

కనక ధర్మరాజా! బ్రాహ్మడికి ఆసపెట్టి ఇవ్వకపోతే నక్కజన్మ వస్తుంది.

## వైదిక మంత్రాలు

ధర్మరాజు :

కులంతక్కువవాడికి వైదికమంత్రాలు ఉపదేశించడం ధర్మ విరుద్ధమా?

నువ్వు అడిగిన ప్రశ్నకి వొక ఇతిహాస ముంది. చెపుతాను, విను. హిమాలయపర్వతంమీద ఎంతోమంది మునులు తపస్సుచేస్తూ వుండేవాళ్ళు వాళ్ళ ఆశ్రమానికి వోనాడు వొక శూద్రుడు వెళ్ళాడు. ధర్మగుణం కలవా డతడు. మునుల గురువుని చూసి, "నేను తపస్సు చేస్తాను నాకు మంత్రోపదేశం చెయ్యి" అని ప్రార్థించాడు.

"వైదికమంత్రాలు శూద్రుడికి ఉపదేశించకూడదు. నువ్వు శుశ్రూష చేస్తూవుండు" అన్నాడా గురువు.

గురువు చెప్పినట్టే అక్కడ వొక పాకవేసుకుని, మునుల

శుశ్రూష చేస్తూవుండేవాడు శూద్రుడు. అతిథిపూజా, దేవపూజా, పితృపూజా కూడా భక్తిపూర్వకంగా చేస్తూవుండేవా డతడు. తన నియతీ, వినయమూ చూస్తే దయపుట్టేటట్టు ధర్మంతో నడుచుకునే వాడు. ఓనాడు అతణ్ణి చూడడానికి వెళ్ళాడు గురువు. అతడు చేస్తున్న పని మానమని చెప్పి, "ఇదిగో ఇలాగ చెయ్యాలి" అని ఆదరంతో పుణ్యకర్మవిధానం అతడికి ఉపదేశించాడు.

సంతోషించాడు శూద్రుడు. గురువు ఉపదేశించినప్రకారం పుణ్యకర్మలు చేశాడు. కాలం తీరాక మరణించి వొక రాజు కొడుకై పుట్టా డతడు. మంచిగుణాలన్నీ అతడిలో మూర్తీభవించినట్టుం డేవి.

గురువుకూడా కాలంతీరి కళ్ళుమూశాడు. ఆరాజురాజ్యంలోనే వొక బ్రాహ్మడింట పుట్టాడు. వేదవిద్యలన్నీ అంచేతేంగావు ణ్ణ్ వతడికి.

రాజుకొడుకు రాజై పట్టాభిషేకం చేసుకున్నాడు. ఆబ్రాహ్మణ కుమారుణ్ణి తన పురోహితుడిగా నియమించుకున్నాడు.

పురోహితుడు వచ్చినప్పుడల్లా వోరచూపులు చూసి, నవ్వే వాడు రాజు. ఎంచేత ఇలా నవ్వుతున్నాడో అనుకునేవాడు పురోహితుడు. సమయంచూసి: ఓనాడు అడగనూ అడిగేశా డతను, "మహా రాజా! నన్ను చూసినప్పుడల్లా ఏలినవారు నవ్వుతున్నారు. ఏంతప్పు జేశానో తెలియకుండా వుంది" అన్నాడు.

"పూర్వజన్మ జ్ఞాపకముంది నాకు" అంటూ అందుకున్నాడు రాజు, "పూర్వజన్మలో మునలగురువువి నువ్వు. నేను శుశ్రూష చేసిన శూద్రుణ్ణి. నాకు వైదికమంత్రాలు ఉపదేశించావు నువ్వు. అంచేత పరమగతి తప్పింది నీకు. రాజసేవచేసే పురోహితజన్మ ఎత్తావు. ఇది తెలిసి నవ్వుతున్నాను. అంతేకాని వికల్మషమూ లేని నువ్వేమిటి, తప్పుచెయ్యడమేమిటి? మహాధర్మపరుడివి నువ్వు గురు దేవుడవి నువ్వుచేసిన దుష్కర్మకి ప్రాయశ్చిత్తం చేసుకో" అంటూ ఎన్నో ఆవులూ, బంగారం రాసులూ ఇచ్చా డతడికి.

పూర్వజన్మసుకృతంవల్ల మనస్సు నిర్మలమైవుంది కనక రాజు చెప్పడంతోనే గతజన్మ కలలాగ కళ్ళముందు కనపడింది బ్రాహ్మడికి. దానాలు తీర్థాలు చేసి, హోమాలూ మొదలైన పుణ్యకర్మలున్నూ చేసి పాపం పోగొట్టుకున్నాడతడు. ఆజన్మ అలా వెళ్ళిపోయాక, మళ్ళీ జన్మలో ఋషికుమారుడై పుట్టాడు. ఆశ్రమవాసం చేసి; తపస్సు చేశాడు. మహాపదం పొందాడు తుదకి.

అంచేత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు తప్ప తక్కినకులం వాళ్ళకి వైదికమంత్రాలు ఉపదేశించకూడదు. అలా ఉపదేశించిన బ్రాహ్మడు పాపాత్ముడవుతాడు బ్రాహ్మణాదులకైనా వాళ్ళ గుణం పరీక్షించి మరీ ఉపదేశించాలి.

## లక్ష్మీ నివాసస్థానాలు

ధర్మరాజు :

ఎలాటివాళ్ళదగ్గిర లక్ష్మి వుంటుంది?

భీష్ముడు :

శ్రీకృష్ణుడి ఒడిమీద లక్ష్మీదేవి కూచోడం చూసి, అంతేసి కళ్ళు చేసుకుని, గౌరవభావంతో ఆమెని రుక్మిణీదేవి అడిగింది, "ఎలాటి పురుషుల దగ్గిర, ఎలాటి స్త్రీలదగ్గిర వుంటావు నువ్వు?" అని. ఆమెతో లక్ష్మీదేవి చెప్పినమాటలే నీకు నేను చెపుతాను, ఆలకించు.

"నిత్యసత్యులూ, శుచిమంతులూ, గురుభక్తులూ, అప్రమత్తులూ, దక్షులూ, నిర్మలమతులూ, సత్కర్మపరులూ, విజ్ఞానవంతులూ, తపశ్శీలులూ, దానపరులూ, బ్రహ్మచర్యవ్రతులూ, శాంతమతులూ అయిన పురుషుల దగ్గిర వుంటాను.

"క్రూరుల దగ్గిరా, నాస్తికులదగ్గిరా, కృతఘ్నుల దగ్గిరా, దుష్టబుద్ధుల దగ్గిరా వుండను.

"ఎంగిలి వర్జించి, మంచి నడవడి కలిగి, పాత్రలూ అవీ పరిశుద్ధంగా వుంచే స్త్రీలదగ్గిర వుంటాను.

"మగడికి ఎదురుతిరిగినదాని దగ్గిరా, నిష్ఠురంగా వున్నదాని దగ్గిరా, పరాయికొంపలు తిరిగిన దాని దగ్గిరా, అధికంగా నిద్ర పోయే దాని దగ్గిరా వుండను.

"అంతేకాదు, పద్మవనాలూ, పువ్వులతోటలూ కూడా నా వునికిపట్టు" అంది లక్ష్మీదేవి. కనక దీన్ని బట్టి లక్ష్మీదేవి ఎక్కడెక్కడుంటుందో, ఎక్కడెక్కడ వుండదో అవగతం చేసుకో.

సంభోగసుఖం స్త్రీకా పురుషుడికా అధికం?

ధర్మరాజు :

స్త్రీపురుషుల సంభోగంలో ఎవరికి సుఖం అధికంగా వుంటుంది?

భీష్ముడు :

ఈ విషయంలో వొక ఇతిహాసముంది, ఆలకించు.

భంగాస్వనుడని వొక రాజు వుండేవాడు. కుమాళ్ళకోసం, దేవేంద్రుడికి వ్యతిరేకంగా ఎన్నో యజ్ఞాలు చేశాడతను. అందుచేత వందమంది కుమాళ్ళని కన్నాడు. వాళ్ళతో సంతోషంగా వుండేవాడు.

భంగాస్వనుడు వోనాడు వేటకి వెళ్ళాడు. సమయం కనిపెట్టి అతడికి దిగ్భ్రాంతి కలిగించి, తప్పుతోవ పట్టించాడు దేవేంద్రుడు. ఒంటిగాడైపోయాడు భంగాస్వనుడు. గుర్రంమీద కొంతదూరం వెళ్ళాక, దాహంవేసి, చుట్టూనట్లు వెదకాడు. ఓదగ్గిర మంచి పద్మాల చెరువు కనపడింది. వెన్నులోంతు నీళ్ళలోకి గుర్రం పోనిచ్చాడు రాజు. తాను నీళ్ళలో మునిగి తృప్తితీరా నీళ్ళు తాగాడు

నీళ్ళలో మునిగి పైకి వచ్చేసరికి ఆడదిగా మారిపోయాడు భంగాస్వనుడు. తన్ను తాను చూసుకుని నిర్ఘాంతపోయాడతడు. ఒడ్డుకివచ్చి, విచారించాడు.

"ఈ ఆడరూపంతో గుర్రమెలా ఎక్కేది? పట్నం ప్రజలు ఏమనుకుంటారు నన్ను చూసి? నా భార్యలేమనుకుంటారు? కుమాళ్ళు ఏమని భావిస్తారు? అలాఅని అడివిలో ఎలా వుండేది? కాదని వూళ్ళోకి మాత్రం ఎలా వెళ్ళేది?"

విచారించి విచారించి. తుదకి ఎలాగో వూళ్ళోకి వెళ్ళా డతడు. చూసినవాళ్ళందరూ ముక్కుమీద వేలుపెట్టుకున్నారు.

కోటలోకి వెళ్ళి మంత్రుల్ని పిలిచాడు భంగాస్వనుడు. దారీ తెన్నూ తెలియకండా వెళ్ళి, పద్మాలచెరువులో తాను మునగడం, దాంతో ఆడదిగా మారిపోడం వాళ్ళతో చెప్పాడు. రాజ్యంలో కుమాళ్ళని నిలిపి తాను అడివికి వెళ్ళిపోయాడు తాపసులున్న చోటికి వెళ్ళి తపస్సు మొదలెట్టాడు.

తపోవనంలో వొక తాపసి ఆమెని (భంగాస్వనుణ్ణి) మోహించాడు. ప్రియుడై ఆమెతో కాపరంపెట్టాడు. వాళ్ళిద్దరికీ వందమంది కుమాళ్ళు పుట్టారు. వందమందీ మంచి బుద్ధిమంతులయారు.

కొన్నాళ్ళయాక తన మొదటికుమాళ్ళదగ్గిరికి వెళ్ళి, అడివిలో తనకి వొక తాపసి ప్రియుడు కావడమూ, వందమంది కుమాళ్ళు కలగడమూ చెప్పాడు.

" మగవాణ్ణిగా వున్నప్పుడు మీరు పుట్టారు. ఆడదాన్నిగా వున్నప్పుడు వీళ్ళు పుట్టారు. అంచేత మీతమ్ములు వీళ్ళు. మీ రెండు వందలమందీ రాజ్యం పంచుకోండి " అం దామె.

అన్నదమ్ములు రెండువందలమందీ రాజ్యం అనుభవించారు. వాళ్ళ పేరంటే శత్రువులు గడగడలాడేవాళ్ళు.

అదంతా చూశాడు దేవేంద్రుడు. "వీడికి చెడ్డచెయ్యబోతే మంచి అయింది. కుమాళ్ళు రెండింతలయారు. రాజ్యమూ వృద్ధయింది. దీనికి విరుగుడుచెయ్యాలి " అంటూ బ్రాహ్మణవేషంలో మొదటి వందమంది రాజకుమాళ్ళ దగ్గిరికి వెళ్ళాడు. మతివిరుపు మాటలు మొదలెట్టాడు.

" ఎక్కడితండ్రి మీకు? ఎవళ్ళకో ఎక్కడో పుట్టినవాళ్ళని తెచ్చి, మీ తమ్ములని అంటగట్టాడు. ఒప్పుకోవచ్చా మీరు?"

అంటూ ఎన్నోవిధాల నూరిపోశాడు. అలాగే రెండో వందమంది దగ్గిరికిన్నీ వెళ్ళాడు. పుల్లవిరుపుమాటలు చెవిలో వూదాడు. ఒకళ్ళ విషయం వొకళ్ళకి తెలియకుండా ఇచ్చకంమాటలాడి వాళ్ళమనస్సులు విరిచాడు. వాళ్ళకీ వీళ్ళకీ పగలు పుట్టించాడు. దాంతో వాళ్ళల్లో వాళ్ళు కుమ్ములాడుకున్నారు. ఒకళ్ళనొకళ్ళు కొట్టుకుని చచ్చారు.

గుండెలు బాదుకుంటూ ఏడ్చాడు ఆడరూపంలోవున్న భంగాస్వనుడు. కన్నీళ్ళతోనూ, విడిపోయిన జుత్తుతోనూ పంవిపనవి కొడుకులకోసం రాగాలుతీశాడు.

అదంతా పొంచిపొంచి చూశాడు దేవేంద్రుడు. బ్రాహ్మణ వేషంలో ఆమె ఎదటికి వెళ్ళాడు. అతణ్ణిచూసి, వెక్కి వెక్కి ఏడ్చింది భంగాస్వనుడు. బ్రాహ్మణవేషంలో వున్న ఇంద్రుడి మొహంలో జాలి చూసి, తాను వేటకి వెళ్ళడంనుంచి అంతవరకూ జరిగిందంతా అతడితో పూసగుచ్చినట్టు చెప్పింది.

అంతా విన్నాడు దేవేంద్రుడు. "నేను దేవేంద్రుణ్ణి. నాకు ఇష్టంలేని యజ్ఞాలు నువ్వు చేశావు. అంచేత నేనే ఇదంతా చేశాను" అన్నాడు.

భయపడిపోయాడు భంగాస్వనుడు. సాగిలబడ్డాడు "తెలియక తప్పుచేశాను, అనుగ్రహించు. నీకోపానికి తగినవాణ్ణా నేను?" అంటూ ప్రాధేయపడ్డాడు.

ప్రసన్నుడయాడు దేవేంద్రుడు. నీకుమాళ్ళలో కొంతమందిని మాత్రం బతికిస్తాను. ఎవళ్ళని బతికించమంటావో చెప్పు?" అని అడిగాడు.

"ఆడదానిగా వున్నప్పుడు కన్న కొమాళ్ళని బతికించు" అంది భంగాస్వనుడు.

"అదేమిటి? మొదట నువ్వు రాజుగావున్నప్పుడు కన్న కొడుకుల్ని కోరుకోలేదేమిటి?" అని అడిగాడు దేవేంద్రుడు.

"ఆడాళ్ళకి కన్నబిడ్డలమీద ప్రేమ అధికం" సిగ్గుపడుతూ అంది భంగాస్వనుడు.

"నిజం చెప్పావు" అన్నాడు దేవేంద్రుడు, "నీ కుమాళ్ళం దరినీ బతికిస్తాను. నీ స్త్రీత్వం పోయి, ఎప్పటిలాగ నువ్వు మగాడివై నట్టున్నా చేస్తాను."

కుమాళ్ళందరినీ బతికించావు. ధన్యురాలినయాను. అయితే నేనుమాత్రం ఇలా ఆడదానిగానే వుంటాను. ఈ వరంమాత్రం అనుగ్రహించు" అంది భంగాస్వనుడు.

"అదేమీ?" నిచ్చెరపోయి అడిగాడు దేవేంద్రుడు.

సంభోగంలో మగాళ్ళకంటె ఆడాళ్ళకి సుఖం హెచ్చుగా వుంటుంది. అంచేత ఆడదానిగానేవుండి * సంభోగసుఖం అనుభవించాలని వుంది నాకు" అంది భంగాస్వనుడు.

"అయితే అలాగే కానీ, ఆడదానిగానే వుండు. సుఖపడు" అంటూ వరమిచ్చి వెళిపోయాడు దేవేంద్రుడు.

ధర్మరాజా! ఈ కథబట్టి, నువ్వు అడిగిన విషయం అవగతం చేసుకో.

## వైష్ణవధర్మం

ధర్మరాజు :

తండ్రీ! బహువిధాలైన ధర్మాలు నీ అనుగ్రహంవల్ల వింటున్నాను. అయితే జన్మసంగాణదుఃఖాలు లేకుండా చెయ్యగలవా ఇవి? ఎంతోమంద తల్లులకీ, ఎంతోమంది తండ్రులకీ పుడుతూ సంసార చక్రంలో పడి తిరగలేను నేను. గర్భవాసమూ, నరకమూ వొక్కటే. ఈ రెంటికీ భేదంలేదు. సచరాచరమైన ఈ జగత్తు అస్థిరమైంది. విషాన్నంవంటి దిది. ఈ భవసాగరం తరించదగిన వైష్ణవధర్మం

* సురతాంతే సుఖం పుంసాంణాంతు స్త్రీసతతం సుఖం. —
వాత్స్యాయనుడు. ౨. ౧. ౪౧.

ఉపదేశించు. ఈ ధర్మం ఈ యుగంలో తరిగిపోయిందని కృష్ణద్వైపాయనవ్యాసుడు చెప్పాడు. నీ అనుగ్రహంవల్ల తెలుసుకోగలిగాను. నీ పాదపద్మాలు ఆశ్రయించి సంతోషిస్తున్నాను.

భీష్ముడు :

పగవాళ్ళని హతమార్చావు. పూజ్యమైన సామ్రాజ్యం సంపాదించావు. అయినా, సామ్రాజ్యసుఖాలు తుచ్ఛమని భావించడం, కురుకులచూడామణివైన నీకే చెల్లింది. నీలా యవ్వనంలోవున్న రాజు ఎవడైనా భావిస్తాడా ఇలా? మిథిలరాజు జనకుడిలా వున్నాయి నీ మాటలు!

పురుషరూపంలో అవుపిస్తూ, ఇది ఫలానా అని గట్టిగా నిరూపించడానికి వల్లకాకండా వుంటుంది ప్రకృతి. అదే శాశ్వతసుఖంతో నిండిన నిర్వాణం.

ప్రకృతులు ఎన్నో రకాలు. వాటన్నిటికీ అమృతమే అది. పురుషరూపిణి అయినా వికృతి పొందదది.

రాజా! కామక్రోధాలకి చోటివ్వకండా భావంలో సత్వావేశం పూనడమే విష్ణుపరత్వం. అదే వైష్ణవధర్మమంటే ఈ ధర్మ మవలంబిస్తే సంసార భయ ముండదు.

ధర్మరాజు :

తత్వాలూ, అధ్యాత్మాలూ, అధిభూతాలూ, అధిదైవతాలూ ఈ అన్నిటికీ కర్తా, భర్తా, హర్తా అయిన సర్వభూతాత్మకుణ్ణి వివరించు.

భీష్ముడు :

సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు – ఈ నలుగురు బ్రహ్మదేవుడి మొదటి కుమాళ్ళు. ఐదో కుమారుడు వసిష్ఠుడు, ఆరో కుమారుడు శివుడు. మరీచి, భృగుడు, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు – ఈ ఏడుగురు తరవాత పుట్టిన కుమాళ్ళు.

సనత్సుజాతుడు అంగుష్ఠమాత్రుడై, మండుతున్న నిప్పులా ప్రకాశించి, లోకసంచారం చేస్తూ, ఓనాడు మేరుపర్వతం శిఖరం మీద నారదమునిని చూశాడు. ఇద్దరూ మాటామంతీ ఆడుకుంటూ, ఇపుడు నువ్వు నన్ను అడిగినట్టే నారదుడు సనత్సుజాతుణ్ణి అడిగాడు. అతడు అప్పుడు చెప్పినమాటలు ఇతిహాసరూపంలో వున్నాయి. నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధానంగా వుంటాయవి. చెపుతాను విను.

బ్రహ్మదేవుడి దినాలు పదివేలయితే, విష్ణుదేవుడు నిద్రపోయే వొక రాత్రి. అంతేకాలం అతడు మేలుకునే వొక పగలు. అవ్యక్తం అనేది విష్ణుదేవుడి దివ్యాత్మలోంచే పుడుతుంది. ఆత్మజ్ఞానం కలవాళ్ళు ఈ రెంటినీ అభేదదృష్టితోనే చూస్తారు.

పరమేశ్వరుడు రాత్రి నిద్రపోతాడు. పగలు మేలుకొని నీళ్ళు సృష్టిస్తాడు. ఆ నీళ్ళలో తన వీర్యం స్థాపిస్తాడు. దాంతో బంగారం వన్నె బ్రహ్మాండం తయారవుతుంది. అనంతరం అతడు బ్రహ్మదేవుణ్ణి పుట్టిస్తాడు. అతణ్ణి బ్రహ్మాండానికి అధిపతిగా నియమిస్తాడు. అతడు అహంకారతత్వం పూని మనస్సూ, పది ఇంద్రియాలూ, బుద్ధీ సృష్టిస్తాడు. ఆకాశమూ, గాలీ, అగ్నీ, నీరూ, నేలా - ఈ అయిదు భూతాలూ పుట్టిస్తాడు. వీటికి గుణాలుగా శబ్దమూ, స్పర్శా, రూపమూ, రసమూ, గంధమూ కల్పిస్తాడు. క్రమంగా దేవతలూ, మునులూ, దానవులూ, గంధర్వులూ, కిన్నరులూ మొదలైన జంతుజాలం సృష్టిస్తాడు. అన్నీ అహంకారంతో వ్యాప్తమై అవ్యక్తసాగరంలో మునిగి తేలుతూ వుంటాయి. అన్నిటికీ ప్రభువు విష్ణుదేవుడు. సృష్టిస్థితిలయాలూ శుభాశుభాలూ సాక్షిస్వరూపుడై చూస్తూ మహావైభవంతో క్రీడిస్తూ వుంటాడతడు. అయిదు మహాభూతాలూ, శబ్దమూ మొదలైన అయిదు గుణాలూ, పది ఇంద్రియాలూ, అహంకారమూ, మనస్సూ, బుద్ధీ, అవ్యక్తమూ - ఈ ఇరవైనాలుగూ తత్వాలు.

ఇక అధ్యాత్మాదులు చెపుతాను, విను.

చెవి అధ్యాత్మం; శబ్దం అధిభూతం; దిక్కులూ అధిదైవతాలు

చర్మం అధ్యాత్మం; స్పర్శ అధిభూతం; మెరుపు అధిదైవం.

జిహ్వ అధ్యాత్మం; రసం అధిభూతం; చంద్రుడు అధిదైవం.

నాశిక అధ్యాత్మం; గంధం అధిభూతం; గాలి అధిదైవం.

నేత్రం అధ్యాత్మం; రూపం అధిభూతం: సూర్యుడు అధిదైవం.

పండితులు చెప్పినమాట ఇది. బుద్ధీంద్రియ ప్రపంచమంటారు దీన్ని.

పాదాలు, పాయువు, ఉపస్థ, చేతులు, వాక్కు – ఇవి కర్మేంద్రియాలు; అధ్యాత్మాలు.

నడక, విసర్జనం, ఆనందం, కర్తవ్యం, వక్తవ్యం – ఇవి జ్ఞానేంద్రియాలు; అధిభూతాలు.

వాసుదేవుడు, మిత్రుడు, ప్రజాపతులు, ఇంద్రుడు, అగ్ని అధిదేవతలు.

అహంకారం, మనస్సు, బుద్ధి అధ్యాత్మాలు.

అభిమానం, ఆలోచన, నిశ్చయం అధిభూతాలు.

ప్రజాపతి, చంద్రుడు, బ్రహ్మం అధిదైవతాలు.

వేదవాక్య నిర్ణయం ఇది. †

సముద్రంలో పుట్టిన కెరటాలు సముద్రంలోనే కలిసిపోతాయి అలాగే విష్ణువులోనుంచే పుట్టిన ఇవన్నీ విష్ణువులోనే లయమవుతూ వుంటాయి. అతడు ప్రభువు. అంచేత అతడిలో ఏ విశేషమూ కలగదు.

అవ్యక్తం అంటే మూలప్రకృతి. పురుషచైతన్యంతో చేతన పొంది మూడులోకాలూ నడుపుతుం దది.

---

* చూ. అశ్వమేధపర్వం అ. 2

† చూ. అశ్వమేధపర్వం. అ. 2.

విష్ణువు లోకకర్త. అతడే అన్నిటికీ పట్టుకొమ్మ. శివుడి అనుమతితో అతడే అఖిలబ్రహ్మాండాలూ పుట్టిస్తాడు.

ఇలా చెప్పి నారదమునిని చరితార్థుణ్ణిచేశాడు సనత్సుజాతుడు.

వేదాలవల్లా, ఉపనిషత్తులవల్లా, పురాణాలవల్లా తెలుసుకోదగిన పురుషుడు ఇరవైఅయిదో తత్వమై ప్రకాశిస్తాడు.* అతడే కాలాంతకుడు. అతడే అచ్యుతుడు. అతడే అనంతుడు. యోగుల హృదయాలలో నివసించే విష్ణుదేవు డతడు. అద్వితీయు డతడు. అసంగు డతడు.

## విష్ణుమహిమ

ధర్మరాజు :

నియతాత్ములయి, అగ్నులు తమలోనే సమాహితంచేసుకున్న మహితాత్ములు తమ ఆత్మలలో ఆ పరమాత్ముణ్ణి ఎలా భావిస్తారు?

భీష్ముడు :

అమృతం పుట్టిన సమయంలో దేవతలకీ, దానవులకీ యుద్ధం జరిగింది. దేవతలు ఓడిపోయారు. బ్రహ్మదేవుణ్ణి ఆశ్రయించారు. బ్రహ్మదేవుడు నారాయణమూర్తిని ధ్యానించాడు.

"భక్తవత్సలా! పరమాత్మా! పద్మనేత్రా! సర్వభూత మహేశా! ఋక్సామయజుర్వపాస్యా! సాధుసంరక్షణా! దేవతలు అసురులతో ఓడిపోయారు. రక్షించుప్రభూ!" అంటూ స్తోత్రపూర్వకంగా ప్రార్థించాడు.

అప్పుడు మేఘగంభీరంగా ఆకాశంమీద దివ్యవాణి, "మిమ్మల్ని గెలిపిస్తాను" అని స్పష్టంగా వినిపించింది. ఉత్తరక్షణంలో శంఖమూ చక్రమూ, గదా, శార్ఙ్గమూ పట్టుకుని, గరుత్మంతుడిమీద ఎక్కి, రాక్షసులమీద వురికాడు విష్ణుదేవుడు. అకుంఠితమైన పరాక్రమంతో వాళ్ళని సంహరించాడు. నిచ్చెరపోయి చూశారు దేవతలు. అసురుల్ని హతమార్చి, అంతర్ధానమైపోయాడు విష్ణుదేవుడు.

---

* ఈ ఇరవై అయిదు తత్వాల జ్ఞానం సాంఖ్యజ్ఞానమంటారు సాంఖ్యులు.

"ఎవరీ మహాత్ముడు? ఏమిటి ఇతడి విశేషం?" అంటూ ఆశ్చర్యంతో బ్రహ్మదేవుణ్ణి అడిగారు దేవతలు.

"విష్ణుభగవానుడితడు" అన్నాడు బ్రహ్మదేవుడు. వైకుంఠమితడి నివాసం. ఈ దేవుడి మహిమ ఇలా వుంటుందని నాకే తెలియదు. ఇక మీకెలా చెప్పగలను? అయినా వొక ఇతిహాసముంది చెపుతాను. అది వింటే మీరు అడిగినదానికి సమాధానం తేటపడుతుంది. వినండి.

"హిమాలయపర్వతంమీద వోమాటు మునులూ, సిద్ధులూ కులాసాగా గోష్ఠి చేస్తున్నారు. అక్కడికి గరుత్మంతుడు వెళ్ళి వాళ్ళకి నమస్కరించాడు. అతణ్ణి అభినందించారు మునులు. ఆసనంవేసి కూచోపెట్టారు. పూజించారు. కుశలప్రశ్న లయాక, 'ఒకమాట అడుగుతాం, చెపుతావా గరుత్మంతా?' అని అడిగారు. 'ధన్యుణ్ణయ్యాను. అడగండి. మీరు ఏమడిగినా నాకు తెలిసినంతమట్టుకు చెపుతాను' అన్నాడు గరుత్మంతుడు.

"'విష్ణుభగవంతుడి ప్రియభక్తుడివి నువ్వు. భగప్రియుడు భగవంతుడు. భక్తుడిగానూ, ప్రియుడిగానూ, అతడిదగ్గిర నడుచుకుంటున్నావు నువ్వు. అతడి మహిమ మాకు వివరంగా కాస్త వినిపించు" అన్నారు మునులు.

"ఈ మూడులోకాలూ దయతో అతడు కాపాడుతూవుండడమే స్థూలంగా చూస్తాం మనం" అంటూ అందుకున్నాడు గరుత్మంతుడు. "అయితే అంతమాత్రాన అతణ్ణి చూశా మనుకోకూడదు. నేనూ, మీరేకాదు, ఎవరూ తెలుసుకోలేరు అతడి మహిమ. మహాద్భుతమైన చరిత్రలు నాకు చూపించి, చెవులలో అమృతంపోసినట్టు చెప్పిన ఆదేవుడి మాటలు మీకు వినిపిస్తాను.

"దేవేంద్రుణ్ణి గెలిచి, నేను అమృతం పట్టుకువెళుతున్నప్పుడు ఆకాశమార్గంలో దర్శనమిచ్చి, 'గరుత్మంతా! నిన్ను మెచ్చుకున్నాను,

వరం కోరు' అన్నా డతడు. పరమానందం కలిగింది నాకు. 'నువ్వు ఎవ్వరో తెలియదు నాకు. నిన్ను ఎరిగించి మరీ వరందయచెయ్యి' అన్నా న్నేను. 'కాలక్రమంగా నన్ను తెలుసుకుంటావు. నాకు వాహనంగా వుండు'అంటూ ఉజ్జ్వలుడైన వొక పురుషుడు నా ఎదట ప్రత్యక్షమయాడు. 'జరామరణాలు లేకండా దేవతల్నీ, అసురుల్నీ గెలవ గలిగిన జవసత్త్వాలతో సంతోషంగా వుండు' అని వరమనుగ్రహించాడు.

"ఎంతో భక్తితో దండప్రణామంచేశా న్నేను. 'నీ వాహనంగా వుంటాను. నువ్వు రథమెక్కితే నీకు జెండాగా వుంటాను. ఈ వరం నాకు దయచెయ్యి' అన్నాను. 'అలాగే కానీ అన్నా డతడు. సంతోషం కలిగింది నాకు. అంతర్థానమైపోయా డడడు.

"'సంతోషమూ, సంతోషానికి మించిన ఆశ్చర్యమూ కలిగాయి నాకు. మా తండ్రిగారి దగ్గిరికి వెళ్ళాను. జరిగిందంతా విని పించాను. సంతోషిస్తూ నా మొహంచూశా డతడు. 'ధన్యుడి వయావు. విష్ణుభగవాను డతడు, నారాయమూర్తి. నిన్ను అనుగ్రహించాడు. నీతో మాటలాడాడు. తపస్సుచేస్తూ, యోగసమాధిలో వుండి, అతణ్ణి తెలుసుకోవాలని ఆరాధిస్తున్నా న్నేను నలుపూ తెలుపూ, పసుపూ, ఎరుపూ, పింగళవర్ణమూ మొదలైన రంగులతోనూ, ఎన్నో చేతులతోనూ, ఎన్నో పాదాలతోనూ, ఎన్నో కడుపులతోనూ, ఎన్నో శిరసులతోనూ, ఎన్నో నేత్రాలతోనూ దివ్య దేహం నాకు చూపించా డతడు. 'నిస్సంగుడివి కాని అంతరంగంతో నన్ను తెలుసుకోలేవు. నిస్సంగుడివై తేనే తెలుసుకుంటావు' అని సెలవిచ్చాడు. అలాటి విశ్వరూపుడికి శాశ్వతంగా పరిచర్య చెయ్య గలగడంవల్ల కృతార్థుడివయావు నువ్వు. బదరికాశ్రమానికి వెళ్ళు. సకలలోకసేవ్యుడు ఆ భవ్యమూర్తి. అక్కడ అతణ్ణి సేవించు' అన్నాడు.

"మాతండ్రిగారి ఆజ్ఞప్రకారం బదరికాశ్రమం వెళ్లాను. అక్కడ ఆనారాయణ దేవుణ్ణి, అచ్యుతుణ్ణి, శ్రీహరిని, పుండరీకాక్షుణ్ణి, గోవిందుణ్ణి, లోకజనకుణ్ణి, దర్శించాను. భక్తిపూర్వకంగా ప్రణామం చేశాను. స్తోత్రం చేశాను.

"పట్టుపీతాంబరం కట్టుకున్నాడతడు. ఎనిమిది చేతులతోనూ శంఖమూ, చక్రమూ, గదా, ఖడ్గమూ, శార్ఙ్గమూ, మొదలైన ఆయుధాలు పట్టుకున్నాడు. చిరునవ్వుతో నన్ను పలకరించాడు. 'వచ్చావా? మంచిపని చేశావు. రా' అంటూ ఈశాన్యదిక్కు నడిచాడు. 'ఎన్నో వేల యోజనాలు వెళ్ళాలి' అంటూ; కర్రలు లేకం అద్భుతంగా వెలుగుతున్న అగ్నిహోత్రుడికి వెలుగు కలిగిస్తున్న వాక మహాయోగిలో ప్రవేశించాడు. పార్వతీదేవితో తపస్సు చేస్తున్న శివుడితో మాట్లాడాడు. అగ్నిహోత్రం దాటి, ఇంకా ముందుకి బయలుదేరాడు."

"దారిఆయాసంతో వాపోతూ నేను అతని వెంట వెళ్ళాను. అలా ఎంతో దూరం వెళ్ళి సూర్యుడి కాంతి చొరని మహాంధకారంలో చొరబడ్డాడతడు. కళ్ళు పెట్టుకున్నా దారి కనబడలేదు నాకు. మూఢుణ్ణయిపోయాను. ఆ దేవుణ్ణే మనసులో ధ్యానించాను. 'ఆదిపురుషా! నన్ను దయచూడు. ఎక్కడికి వెళ్ళాలి నేను? ఏది గతి నాకు?' అని ప్రార్థించాను.

"ఇదిగో, ఇల్లారా"—తియ్యని గొంతుకతో అన్నాడతడు.

"దుఃఖంతో గొంతుక ఆర్చుకుపోయింది నాకు. 'కరుణించు ప్రభూ! రక్షించు, రక్షించు' అని వేడుకున్నాను

"చీకటంతా చెదిరిపోయింది. హృదయం ఆనందంతో నిండిపోయింది. పట్టపగటి సూర్యుడిలా అవుపించాడతడు. సూర్యచంద్రుల కాంతీ, చుక్కల వెలుగూ అక్కడ కనపడ్డేదు. దేవతలు కానీ, మరే ప్రాణికాని అడుగుపెట్టలేరక్కడ."

"ఇంతలో దుందుభి ధ్వనులూ, మృదువైన మధురగీతాలూ వినపడ్డాయి నాకు. పద్మపుష్పాల తేనెబిందువులతో కలిసి పారుతున్న నదులు కనపడ్డాయి. దేవల్ని మించిన తేజస్సుతో కొందరు పురుషులూ అద్భుతమైన రూపాలతో కొందరు పురుషులూ కూడా కనిపించారు. వాళ్ళందరూ భగవంతుణ్ణి పూజించారు. అంతమందినీ దయతో చూస్తూ, ముందుకిసాగా డతడు."

"తరవాతి ప్రదేశమంతా అగ్నిమయంగా వుంది. భయంకరంగా వెలిగిపోతూ వుందిఅక్కడ అతడు కనపళ్ళేదు నాకు. భ్రమ కలిగింది. అతణ్ణే మనస్సులోనిల్పుకున్నాను. 'శరణు. శరణు ప్రభూ! నన్ను కాపాడు' అని ప్రార్థించాను.

"'నిన్ను మరిచి పోతానా?' అంటూ చల్లని, తియ్యని మాటలతో అన్నా డతడు 'నీతండ్రిదగ్గిర నా విషయం విన్నావు నువ్వు. నిశ్చలమైన మనస్సుతో వచ్చావు. నాకు తెలియదూ? గరుత్మంతా! రా, ఇలా రా. భయపడకు. నన్ను చూడలేదని విచారించకు. మమకారం, అహంకారం వొదిలిపెట్టి, నిశ్చలమైనచూపుతో నన్ను చూస్తారు శాంతాత్ములు. వేడుకతోనూ, నిష్ఠతోనూ నన్ను తలుచుకుంటున్నావు నువ్వు. కనక నాస్థూలరూపం చూస్తావు' అని అనుగ్రహించాడు.

"అగ్ని ఆరిపోయింది. అలా నన్ను సంతోష పెట్టాడతడు నాచేత సేవచేయించుకున్నాడు.

"ఇంకా ఇంకా ఎంతోదూరం వెళ్ళి, ఆకాశంమీదికి ఎగిరా డతడు. నేను వెంటపడ్డాను.అంతలోఅతడు అంతర్థానమైపోయాడు.

"'ఇటురా, ఇటురా!'' అన్న కేకమాత్రం వినపడింది నాకు. అదే ఆధారంచేసుకుని. ముందుకి నడిచా న్నేను.

"అందమైన హంసలచెరువులో అతడు స్నానంచేస్తూ అవుపించాడు. నాకేసి చూసి, ఆదరంగా పిలిచాడు. నేను దగ్గిరికి వెళ్ళాను, అతడు అవుపళ్ళేదు.

"విచారంతో అటూ, ఇటూ చూశాను. అద్భుతం! ఎన్నో వందల అగ్నిహోత్రాలు వెలుగుతూ అవుపించాయి. ఎన్నో వేదధ్వనులు వినిపించాయి. ఆ ధ్వనులు చేస్తున్న వాళ్ళుమాత్రం కనపళ్ళేదు.

"ఇంతలో భయంకరమైన గరుడపక్షులమంద నామీద విరుచుకుపడింది. భయభ్రాంతుణ్ణయిపోయాన్నేను. 'అచ్యుతా! శివా! వెయ్యికళ్ళ దేవుడా! వేదమయా! ఆదీ అంతం లేనివాడా! త్రిభువనాల నాథా! త్రినయనా! గోవిందా! పద్మనాభా! హరా! కృపావిధేయా! అంటూ ఎన్నో పేర్లతో స్తోత్రంచేశాను. శరణువేడాను. తలవొంచి, చేతులు జోడించాను.

"అనుగ్రహించాడు భగవంతుడు. 'భయపడకు, గరుత్మంతా! భయపడకు' అంటూ దర్శనమిచ్చాడు.

"చూతునూ – అది బదరికాశ్రమం. విన్నారా? విష్ణుభగవంతుడి మహిమ ఏమని చెప్పేది?

"బదరికాశ్రమంలో భగవంతుడు అందమైన ఎనిమిది చేతులతోనూ యథాప్రకారంగా అవుపించాడు.

"సంతోషమూ, ఆశ్చర్యమూ, కౌతుకమూ ముప్పిరిపడ్డ మనస్సుతో అంజలిబంధం చేశాను. 'దేవా! నేను నీ భక్తుణ్ణే అయివుంటే, నీదయకి పాత్రుణ్ణే అయితే, నేను వినదగిందే అయితే అగమ్యగోచరమైన నీమహిమ ఎరిగించు ప్రభూ!' అని ప్రార్థించాను. ఆసర్వలోకేశ్వరుడు కరుణామృతం చిలకరిస్తూ, చల్లని చూపు చూశాడు నన్ను.

"'గరుత్మంతా!' తియ్యని గొంతుకతో అన్నాడతడు, 'దేవతలూ, గంధర్వులూ, దనుజులూ మొదలైనవాళ్ళు ఎవ్వరూ నా నిజరూపం ఎరగరు. సర్వభూతాలూ నాలోనే పుడతాయి: నాలోనే పెరుగుతాయి; నాలోనే లయమవుతాయి. వాటి వశం కాను నేను. అన్నిటిలోనూ వుంటాన్నేను. ఆత్మలో అగ్ని నిలుపుకున్నవాళ్ళూ,

కోరికలు మానుకున్నవాళ్ళూ అహంకారం వొదిలిపెట్టినవాళ్ళూ, సోమరిపోతులు కానివాళ్ళూ, దానం పుచ్చుకోనివాళ్ళూ, అహింసా పరులూ, క్రోధంలేనివాళ్ళూ, స్వచ్ఛమైన ఆత్మబోధకలవాళ్ళూ, ఎల్లప్పుడూ తృప్తిగా వుండేవాళ్ళూ, శాంతమూ సత్యమూ భక్తీ కల మనస్సులవాళ్ళూ, నియతాత్ములూ మాత్రం నాతత్వం తెలుసు కుంటారు. సాంఖ్యాయోగంతో బహిర్దర్శనులై, వొక నిశ్చయం లేనివాళ్ళు నాతత్వం కానలేరు. మోహపంకంలో దిగబడి, ఉపవా సాలూ, వ్రతాలూ చేసినంతమాత్రాన నా మహిమ అవగతం కాదు. ఏకాంతిక ధ్యానపరులకి అవగతమవుతుంది. రజస్తమాలతో దూషి తంకాని కేవల సత్వజ్ఞానంతో నన్ను అవలంభించాలి. సూక్ష్మపద్ధతిని వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ నామాలతో నాలుగు విధాల విభక్తున్నాయి వుంటూ న్నేను. ప్రాణులలో ఆత్మబుద్ధి అహం కార మనోరూపాలతో వ్యాపించి వుంటాను.

" 'గరుత్మంతా! ఇదీ నా స్థూలప్రకారం. నువ్వు నా మన స్కుడివీ, నా భక్తుడివీ, నా పరాయణుడివీ, నా స్వరూప మెరిగిన వాడివి కావాలి!' అన్నాడు.

"మహాత్ములారా శ్రీహరి దివ్యమహిమ అద్భుతమైంది అతడి అనుగ్రహంవల్ల నేను ఎరిగింది మీకు విన్నవించాను" అన్నాడు గరు త్మంతుడు. మునులూ, సిద్ధులూ అతణ్ణి పరమాదరంతో దీవించి పంపారు. "అద్భుతమైన కథ గరుత్మంతుడివల్ల విన్నాం" అంటూ, తమలో తాము సంతోషించారు, "పుణ్యమూ, ఆయుష్యమూ, ఐశ్వర్యమూ కలిగిస్తుంది ఈ చరిత్ర. బ్రాహ్మలు ఇది భక్తితో వింటే వేదవిద్య అధికమవుతుంది. క్షత్రియులు వింటే జయం కలుగుతుంది. వైశ్యులు వింటే ధనం కలుగుతుంది. శూద్రులు వింటే సౌఖ్యం కలు గుతుంది. సర్వజనులకీ, ఇహపర సాధనమైన కథ ఇది" అంటూ ఎవరితోవని వాళ్ళు వెళ్ళిపోయారు.

బ్రహ్మదేవుడు ఇది దేవతలకి చెప్పాడు. వసువులు బ్రాహ్మణ వేషంలో వచ్చి, మా అమ్మ గంగాదేవి దగ్గిర నేను వున్నప్పుడు చెప్పి వెళ్ళారు. విన్నది విన్నట్టు నేను నీకు చెప్పాను.

ధర్మరాజా! కోరికలతో చేసిన యజ్ఞాలు విడిచిపెట్టి, ఆత్మలో అగ్ని సమాహితం చేసుకుని, విష్ణుదేవుణ్ణి హృదయంలో నిల్పుకున్న వాడు అతిశయస్థితి పొందుతాడు, ఇదే ఈ ఉపాఖ్యానం అభిప్రాయం.

అలా భీష్ముడు విష్ణుస్వరూపజ్ఞాన ప్రకారమైన ఇతిహాసం ధర్మ రాజుకి చెప్పాడని విని, "ధర్మరాజు అడగడమూ, భీష్ముడు చెప్ప డమూ లోకహితంగా ఎంత గొప్పగా వుందో" అంటూ "వాళ్ళ తర వాతి సంభాషణా వివరించు" అన్నాడు జనమేజయుడు.

---

# ఆనుశాసనికపర్వం

## రెండో ఆశ్వాసం

### అష్టావక్రుడి చరిత్ర *

వైశంపాయనుడు జనమేజయుడితో చెపుతున్నాడు :

నారాయణ స్వరూపనిరూపణం విని ఎంతో సంతోషించి మళ్ళీ ఇలా అడిగాడు ధర్మరాజు :

"తండ్రీ! కన్యాదానం చెయ్యడానికి ఎలాంటి వరుడు కావాలి?"

భీష్ముడు :

ఈ విషయంలో వొక ఇతిహాసం చెపుతాను, విను.

అష్టావక్రుడని వొక బ్రహ్మచారి వుండేవాడు. ఎంతో ఉత్తముడతడు. వదాన్యుడు అని వొక తాపసి వుండేవాడు. అతడికి సుప్రభ అని వొక కూతురు వుండేది. ఆమెని తనకి ఇమ్మని అడిగాడు అష్టావక్రుడు.

"యోగ్యుడివి నువ్వు. నా కుమార్తెని నీకు ఇస్తాను. అయితే ఉత్తరదిక్కు నువ్వు వెళ్ళి రావాలి ముందు" అన్నాడు వదాన్యుడు

"ఎందుకు వెళ్ళాలి? వెళ్ళి ఏం చెయ్యాలి?" అని అడిగాడు అష్టావక్రుడు.

"కుబేరుడి పట్నం దాటి హిమాలయంమీదికి వెళ్ళు. శివుడి కోసం పార్వతీదేవి తపస్సు చేసిం దక్కడ. పుణ్యప్రదేశం అది. గణాలతో అక్కడ ఎప్పుడూ ఆడుతూ పాడుతూవుంటాడు శివుడు. పార్వతీదేవికి ప్రియం కలిగిస్తూ క్రీడిస్తూవుంటాడు. మునీశ్వర్లు అతణ్ణి కీర్తిస్తూ వుంటారు. అతి పవిత్రప్రదేశం అది. అది దర్శించి ఇంకా ముందుకి

---

* చూ. ఆరణ్యపర్వం. పు. 587

వెళితే కడిమిచెట్లవనం కనపడుతుంది. ఆ వనంలో వొక పుణ్యామూర్తి వుంటుంది. మంచి కాలంమీద వుంటుందామె. సాటిలేని రూపవంతు డివి నువ్వు. గుణవంతుడివి. మంచి నడవడి కలవాడివి. కులీనుడివి. విద్యావంతుడివి. అదిగో ఆ కడిమివనంలో ఆమెని చూసిరా. అప్పుడు మా పిల్లనిచ్చి పెళ్ళిచేస్తాను '' అన్నాడు వదాన్యుడు.

'' సరే '' అన్నాడు అష్టావక్రుడు. సరాసరి ఉత్తరంవేపు బయలుదేరాడు. బాహుదానదివొడ్డు చేరాడు. అక్కడ ఆరాత్రి గడిపాడు. తరవాత కుబేరుడిపట్నానికి వెళ్ళాడు. అతడు రావడం విని, ఎదురువచ్చాడు కుబేరుడు. వినయంతో లోపలికి వెళ్ళాడు. గొప్పగా పూజించాడు. ఊర్వశీ, రంభా, తిలోత్తమా మొదలైన అప్సరస్త్రీల ఆటపాటలతోనూ, వివిధవినోదాలతోనూ అనుదినమూ ఆరాధిం చాడు.

ఏతగులాటమూ లేకండా, తన అభిమతంప్రకారం అక్కడ వొక ఏడాదికాలం వున్నాడు అష్టావక్రుడు. ఏడాది అయాక '' నీకు ఏంకావాలో చెప్పు. ఏంచెయ్యమంటే అది చేస్తాను '' అని అడిగాడు కుబేరుడు. '' అంతా సంపన్నంగానే వుంది. నిత్యసంపదతో ఉన్న తుడివిగా వుండు నువ్వు. ఒక మునీశ్వరుడు చెప్పిన పనిమీద నేను వెళుతున్నాను. నీదగ్గిర వేడుకతో కొన్నాళ్ళున్నాను. ఇంతేకాని కోరదగిందంటూ నాకు ఏమీ లేదు'' అని అక్కణ్ణుంచి పయనమయాడు అష్టావక్రుడు. హిమాలయం చరియలమీంది కెక్కాడు. శివుడు క్రీడించే స్థలం చూశాడు, మొక్కాడు. ప్రదక్షిణంచేసి, ముందుకి సాగాడు. వదాన్యుడు చెప్పిన కడిమాకుల అడివి అవుపడింది. అందులో ప్రవే శించాడు అష్టావక్రుడు.

మణులు చెక్కిన బంగారం చిత్రభవనాలు ఎన్నోవున్నా యందులో వాటన్నిటిలోకీ ఉజ్జ్వలమైన పెద్దమేడ వొకటుంది. ఎంతో అంత గొప్ప వైభవంతో వుం దది.

చూశాడు అష్టావక్రుడు. ఆ భవనం ద్వారందగ్గిరికి వెళ్ళాడు. తన పేరుచెప్పి లోపలికి కబురుచేశాడు. కబురుచెయ్యడమే తడువు, ధగధగా మెరిసిపోతున్న కన్యలు కొందరు వినయంగా లోపలినుంచి వచ్చారు. పరమాదరంతో అష్టావక్రుణ్ణి లోపలికి తీసుకువెళ్ళారు.

ఆ కన్యల అందచందాలు కంటికీ, చిత్తానికీ కూడా వేడుక కలిగిస్తున్నాయి. అయినా లోలత్వానికి లొంగిపోలేదు అష్టావక్రుడు. ఎంతో ఉదాత్తుడుగానే వాళ్ళతో లోపలికి వెళ్ళాడతడు.

లోపలి లోగిలిలో రకరకాల రత్నాలతో ప్రకాశిస్తున్న మంచంమీద వయస్సు మళ్ళిన వొక స్త్రీని చూశాడు. శరీరంనిండా అంగరాగాలు పూసుకుని వుందామె తెల్లటి మల్లెపువ్వులాటి బట్ట కట్టుకుంది. చక్కని నగలు పెట్టుకుంది. ఆమెని చూడడంతోనే "నీకు శుభం కలగాలి" అంటూ నుంచున్నాడు అష్టావక్రుడు.

"ఇలా రండి" అంటూ ఎదురులేచిందామె. మంచంమీద అతణ్ణి కూచోపెట్టింది. వేదాల్లో చెప్పిన విధంగా ప్రేమపూర్వకంగా పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చి, గౌరవించింది. తాను మరో పక్క మీద కూచుంది.

అంతటా తేరిచూశాడు అష్టావక్రుడు. అక్కడి కన్యల విభ్రమ విలాసాలు తన కళ్ళకి కనపడడం నచ్చలేదతడికి. అందుకని "ఈ అమ్మాయిలు ఎందుకూ ఇక్కడ?" అన్నాడు.

దాంతో వాళ్ళందరినీ అక్కణ్ణుంచి పంపించేసిందామె. అతడితో తగినవిధంగా మాటామంతీ మొదలెట్టింది. కాసేపటికి రాత్రి పడింది.

"చలిగావుంది" అంటూ తన పక్కమీంచి లేచి, అష్టావక్రుడి పక్కమీదికి వచ్చింది ప్రౌఢస్త్రీ. ఆమెకి తనపక్క చోటిచ్చాడు అష్టావక్రుడు. సంతోషిస్తూ అతడిదగ్గిర వోపక్క పడుకుందామె.

అంతలో వూరుకోలేదామె. మెల్లిమెల్లిగా అతడి దగ్గిరసా జరిగింది. అతడికి తగిలింది. శరీరంతో శరీరం అత్తుకుపోయినట్టు చేసింది. గట్టిగా అతణ్ణి కౌగిలించుకుంది.

అయితే రవంతా చలించలేదు అష్టావక్రుడు అతడి చిత్తంలో మదనవికారమే కలగలేదు రవంతైనా. కొయ్యబారి వూరుకున్నాడతడు.

"మగాళ్ళు భోగపరులు కదా!" అంది ప్రౌఢస్త్రీ, "సహజంగా ఆగలేరు. ఆడాళ్ళు అలా కాదు. తమ అభిలాష అణుచుకుంటారు, పైకి తేలకండా. అలాటిది, ఆడదాన్ని నేను కోరుతూ వుంటే, మగాడివి అనుభవించకండా వూరుకుంటావేం? ఏమైనా బాగుందా ఇది నీకు! ఈ సంపదా, ఈ దివ్యభోగమూ స్వీకరించు. హాయిగా అనుభవించు. నేను నిసొత్తయి, నీతలలో నాలికలా మసులుకుంటాను. బాధపెట్టకు. నన్ను వరించు. సుఖపెట్టు. సుఖపడు."

"పరస్త్రీ సంభోగం పరమ దూష్యం" అన్నాడు అష్టావక్రుడు. "తగనిపని ఇది. శూద్రస్త్రీ అయినా ఎంతో దోషం. అదే బ్రాహ్మణస్త్రీ అయితే ఇక చెప్పేదేముంది? ఆ పాపానికి అంతమే లేదు. అదీకాక, నేను అస్ఖలిత బ్రహ్మచారిని. వివాహంచేసుకుని, వొక ఇంటివాణ్ణి కావాలని చూస్తున్నాను."

"నీ అందం చూసి నిన్ను వలిచాను. ఆడది కామాతురాలైతే వంశహాని తలంచదు. భర్తకి భయపడదు. కన్నకొడుకుని చూడదు. అన్నదమ్ముల్ని లెక్కచెయ్యదు. వందమందితో జతకూడినా తృప్తిపడదు. ఇదంతా కొంచెం ఆలోచించు" అందామె.

"ఏమిటి ఇదంతా నామనస్సుకి పట్టిస్తున్నావు నువ్వు! ఇలా ఎక్కడైనా వుంటుందా? ఈమదవృత్తి మాను. నన్ను పోనీ" అన్నాడు అష్టావక్రుడు.

"ఏనాయోక వెళుదువు కానిలే, అంతవరకైనా ఆగు మరి!" లేడికళ్ళతో నవ్వుతూ అం దామె.

"ఉఁహూఁ, అలా కాదు. నువ్వు నాదగ్గిరికి చేరకండావుంటే వుంటాను. ధర్మం తప్పకు" అన్నాడు అష్టావక్రుడు.

అలా ఆమెని వారించి ఆలోచించా డతడు. "శాపంవల్ల ముసలితనం వచ్చిన ఏదో దేవతాసుందరి అయివుంటుం దీమె. ఎవరైతేనేం? ఈమెసంగతి తెలుసుకోవాలన్న తాపత్రయ మెందుకూ నాకు?" అంటూ వూరుకున్నాడు.

తెల్ల వారింది "కాలకృత్యాలు తీర్చుకో" అంటూ ఉత్తమమైన స్నానీయద్రవ్యాలు తెచ్చిపెట్టిం దామె. అతడి అనుమతిపొంది, తన మృదుహస్తాలతో అతణ్ణి స్నానం చేయించింది. అతడు సంధ్యావందనమూ, అగ్నిహోత్రమూ నిర్వహించుకున్నాక అమృతంవంటి అన్నపానీయాలతో అతణ్ణి సంతృప్తి పరిచింది. ఉచితమైన మాటా మంతీ ఆడుతూ పొద్దుపుచ్చింది. రాత్రిపడినతరవాత, పడుకుందికి రమ్మని పిలిచింది. అతడు కదలలేదు.

"నేను కన్యకను. అస్ఖలితబ్రహ్మచర్యం చేస్తునే ఇలా వయస్సు మళ్ళినదాన్నయిపోయాను. స్వతంత్రురాలి న్నేను. నన్ను పెళ్ళిచేసుకో. సుఖపడు" అం దామె

"ఆడదానికి స్వేచ్ఛ లేదు" అన్నాడు అష్టావక్రుడు, బాల్యంలో తండ్రీ, యవ్వనంలో మగడూ, వార్ధక్యంలో కుమారుడూ ఆమెని నడపాలి. అంతేకాని ఇష్టంవచ్చినట్టు ఆడది ఏపనీ చెయ్యకూడదు. * కనక, నిన్నునువ్వే ఇచ్చుకుని పెళ్ళిచేసుకోడం న్యాయం కాదు."

---

* బాల్యే పితుర్వశే తిష్ఠే త్పాణిగ్రాహస్య యౌవనే,
పుత్రాణాం భర్తరి ప్రేతే న భజేత్ స్త్రీ స్వతంత్రతామ్.
మనుస్మృతి. 5-148.

అష్టావక్రుడు అలా అంటూనే వున్నాడు, ఇంతలో చూస్తూ వుండగానే ఆమె మంచి యౌవ్వనంలోనూ, మనోహరమైన విలాస భంగిమతోనూ, చక్కని చుక్కలా మారిపోయింది. అయినా ఆమె మీూద మనసుపడలేదు అష్టావక్రుడు.

"ఈమాయలన్నీ ఎందుకూ? ఏమిటి నీ అభిప్రాయం? ఉన్న నిజమేదో స్పష్టంగా వివరించు. ఎవరు నువ్వు? నాకు ఎన్నో పనులున్నాయి. వెళ్ళి రావాలి. నాకు సెలవియ్యి" అన్నాడతడు.

సంతోషించిందామె.

"మహాత్మా! నిన్ను పరీక్షించడంకోసమే వదాన్యుడు ఇక్కడికి పంపించాడు. ఉత్తరదిశన్నేను. నీనిష్ఠ కనుక్కున్నాను. ఇందుకని నిన్ను మెచ్చుకుంటాడతడు. నా విషయం కూడా తెలుసుకుని మనసులో సంతోషిస్తాడు. వెళ్ళు. సుప్రభని పెళ్ళిచేసుకో" అంది.

వినయంతో ఉత్తరదిక్కు దగ్గిర సెలవుతీసుకున్నాడు అష్టావక్రుడు. సరాసరి అక్కణ్ణుంచి వదాన్యుడిదగ్గిరికి తిరిగి వచ్చాడు. అతడు అడిగినమీూదట అక్కడ జరిగిందంతా వివరించి వినిపించాడు. అదంతా విని, తనకన్యని దానంచెయ్యడానికి అతడు తగిన వరుడని తెలుసుకుని సుప్రభనిచ్చి పెళ్ళిచేశాడు. ధర్మమూ, భోగమూ, గౌరవమూ, కీర్తి సంపాదించి, ఆమెతో సుఖంగా కాపరంచేశాడు అష్టావక్రుడు. లోకంలో బహుగా బతికాడు.

ధర్మరాజా! ఈ ఇతిహాసంవల్ల నీప్రశ్నసమాధానం గ్రహించు.

## వీ ర్య మే ప్ర ధా న ం

ధర్మరాజు :

మునులవల్ల శూద్రజాతిస్త్రీలకి పుట్టినవాళ్ళు బ్రహ్మరుషులెలా అవుతారా అని తర్కించుకుంటూ వుంటాను నేను. అది ఎలా పొసగుతుందో సెలవియ్యి.

భీష్ముడు :

నాలుగుజాతుల స్త్రీలనీ భార్యలుగా స్వీకరించవచ్చు బ్రాహ్మడు. తనజాతిస్త్రీనీ, తన కిందిజాతి స్త్రీలనీ పెళ్ళిచేసుకోవచ్చు క్షత్రియుడు. తనజాతి స్త్రీనీ, శూద్రజాతిస్త్రీని పెళ్ళాడవచ్చు వైశ్యుడు. శూద్రుడు తనజాతిస్త్రీని మాత్రం కట్టుకోవచ్చు. * ఇదీ వివాహవిషయంలో చెప్పిన ధర్మం. ఈవరస తప్పించి, తక్కువజాతి పురుషుడు హెచ్చుజాతి స్త్రీని పెళ్ళాడితే అది సంకరమవుతుంది. పై జాతి పురుషుడికి తక్కువజాతి స్త్రీగర్భంలో కలిగినవాడు తల్లి కులంవాడే అవుతాడు. ఇది సకలజన సామాన్యమైన విధం. మునీశ్వర్ల విషయం మాత్రం అలా కాదు. ఉత్తమమైన తపస్సూ, జ్ఞానమూ, విద్యా – వీటి ప్రభావంవల్ల వాళ్ళ బీజంలో పుట్టినవాళ్ళు యోని ఏదైనా అవుగాక బ్రాహ్మలే అవుతారు. మహాక్షత్రియులు తక్కువ స్త్రీలగర్భంలో కలిగిన తమ సంతానాన్ని ఆత్మప్రభావంతో తమ కులమే చేసుకుంటారు. నీచకులం స్త్రీలకి పుట్టినవాళ్ళని శంకించి అడిగావు నువ్వు. వాళ్ళే అన్న మాటేమిటి? పశువుల యోనులలో పుట్టినవాళ్ళూ, అయోనిజులూ కూడా ఉత్తమబ్రాహ్మలూ, మంచి క్షత్రియులూ కావడం కద్దు. మనం ఎరిగిందే ఇది. మునీశ్వర్లకీ, రాజశ్రేష్ఠులకీ కలిగిన సంతానం బీజప్రధానమే కాని, క్షేత్రప్రధానం కాదు. వసిష్ఠుడూ, ఋష్యశృంగుడూ, అగస్త్యుడూ, మీతాత సత్యవతికొడుకు మన కృష్ణద్వైపాయనుడూ, మందపాలుడి కుమాళ్ళూ, ద్రోణుడూ, కృపాచార్యులూ మొదలైనవాళ్ళు పుట్టిన విధానాలు వినడంలేదూ మనం వాళ్ళు ఎలాటివాళ్ళయారో తెలుసుకదా? ఈ విషయంలో మనువు చెప్పినమాటలు విను.

---

* శూద్రైవభార్యా శూద్రస్య సా చ విశః స్మృతే,
తే చ స్వా చైవ రాజ్ఞశ్చ తాశ్చ స్వా చాగ్రజన్మనః.

మనుస్మృతి. 3.13.

† చూ. లావుకపిట్టలకథ. ఆదిపర్వం. అ. 8.

"మునుల పుట్టుకలూ, నదులపుట్టుకలూ, సిద్ధుల పుట్టుకలూ, వృత్తులూ చర్చించడం ఎవ్వరికీ తరంకాదు. తమకి తామే సాటై గొప్పగా వుంటారు వాళ్ళు."

దానపాత్రులు

ధర్మరాజు :

బ్రాహ్మడు దానానికి ఎలా అర్హుడవుతాడు? సన్యాసిగా వుంటేనా? కాక, ఎలా వున్నా సరేనా?

భీష్ముడు :

తన ధర్మం తప్పకుండా నడుచుకునే మంచిబ్రాహ్మడు అన్ని విధాలా దానానికి అర్హుడవుతాడు. అతడు, సన్యాసి కావచ్చు, కాకపోనూవచ్చు.

ధర్మరాజు :

శ్రద్ధతో దానంచేస్తే ఏపాపమూ జనానికి అంటదని భావిస్తాను నేను.

భీష్ముడు :

సందేహమేమిటి? పుణ్యాత్ములూ, శ్రద్ధకలిగిన మహాత్ములూ ఆదరంతో చేసిన దానంవల్ల పుణ్యంకాక చెడ్డ ఎలా వస్తుంది?

ధర్మరాజు :

శ్రాద్ధకర్మల్లోలాగే దైవకార్యాల్లోకూడా బ్రాహ్మణ్ణి బాగా పరీక్షించాలంటావా?

భీష్ముడు :

అవును.

ధర్మరాజు :

పూర్వసంబంధం లేనివాడూ, బంధువుకానివాడూ; పండితుడూ, యజ్ఞంచేసినవాడూ, నిత్యతపస్వీ—— వీళ్ళలో దానానికి ఎవడు ఉత్తముడు?

భీష్ముడు :

వీళ్ళందరూ దానానికి సత్పాత్రలే. కాని ధర్మపన్నాగాలు వల్లించి పెట్టడం తప్ప, ఆచరణలో ధర్మం పాటించని వాళ్ళకి బంగారం మొదలైనవి దానంచేసినవాడు పదేళ్ళు నరకం అనుభవిస్తాడు.

వెనకటికి వోమాటు భూదేవీ, కాశ్యపుడూ, అగ్నిహోత్రుడూ, మార్కండేయుడూ వోదగ్గిర సమావేశమై లోకహితమైన మాటలు చర్చించారు. వాళ్ళు చెప్పుకున్నమాటలు వినిపిస్తాను, విను.

''మహాసముద్రంలో పడిన మట్టిగడ్డ ఎలామచ్చుకన్నా కనపడకండా పోతుందో, అలాగే మనిషి తాను చేసిన పాపానికి సిగ్గులో మునిగితే పాపాలన్నీ కడుక్కుపోతాయి.

''మంచికులంలో పుట్టినా, అన్ని వేదాలూ, పురాణాలూ, శాస్త్రాలూ చదివినా మంచి శీలం లేని దుర్మార్గుడికి సద్గతి లభించదు.

''ఎన్నో చదువులు చదివి, పండితమాని అయి, తన విద్యవల్ల ఇతర్లకీర్తి పాడుచేసే దుష్టాత్ముడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుంది. సందేహం లేదు.

''వెయ్యెన్నొక్క అశ్వమేధాలు వోతట్టూ, ఓసత్యం వోతట్టూ వేసి తూస్తే సత్యమే బరువుగా తూగింది, సగానికి పైగా.''

విన్నావు కదూ! బ్రహ్మచర్యంకంటే కూడా మద్యమంసాలు మానుకోడం గొప్పది. లోకయాత్ర పాటిస్తూ లోలుపత లేకండా వుండడమూ, శమం కలిగి నడచుకోడమూ శౌచవిధానం.

ధర్మరాజు :

ధర్మమూ, అర్థమూ, కామమూ – ఈమూడూ ఎప్పుడెప్పుడు ఆచరించాలి ?

భీష్ముడు :

ప్రాతఃకాలం అర్థమూ, పగలు ధర్మమూ, మాపటివేళ

కామమూ ఆచరించాలి. అయితే వీటిమీద ఆసక్తిమాత్రం పెట్టుకో కూడదు. ఒక్క ధర్మంమీద మాత్రం ఆసక్తి పెట్టుకోడం క్షేమం, పెట్టుకోవాలంటే.

గురువుల్ని పూజించడమూ, బ్రాహ్మణుల్ని అర్చించడమూ— రెండూ గొప్ప పుణ్యకార్యాలు. బ్రాహ్మణ్ణినిందించడమూ, అగ్నిహోత్రమూ వేదాలూ విడిచిపెట్టడమూ ఎంతో పాపప్పనులు.

ధర్మరాజు :

దానానికి ఎవరు పాత్రులు ?

భీష్ముడు :

ఉత్తమ ధర్మపరులూ, క్రోధంలేనివాళ్ళూ, సత్యవంతులూ, దాంతులూ, ధీరులూ, స్వధర్మపరులూ, ఇంద్రియాలు జయించిన వాళ్ళూ, సర్వప్రాణులకీ మేలుచేసేవాళ్ళూ, లోభం లేనివాళ్ళూ, శుచిమంతులూ దానపాత్రులు. వేదాలు సాంగంగా చదువుకుని, షట్కర్మలూ నిష్ఠతో పాటించే తత్త్వవేదులైన బ్రాహ్మణోత్తములకి చేసిన దానం వెయ్యిరెట్లవుతుంది.

మంచి పాండిత్యమూ, చక్కని ప్రజ్ఞా, ఉత్తమమైన శీలమూ, నడవడీ కలవాళ్ళకి దానం చేస్తే వంశం వృద్ధిపొందుతుంది.

యోగ్యుడైన బ్రాహ్మణు వొక్కడు సంతృప్తిపడినా చాలు, ముక్కోటిదేవతలూ సంతృప్తిపడతారు. మునులూ పితరులూ తృప్తి పడతారు. అంచేత మంచిబ్రాహ్మణ్ణి వెదికి తీసుకురావాలి దాన మివ్వడానికి.

ధర్మరాజు :

దేవతల్నీ, పితరుల్నీ, మనుషుల్నీ ఎప్పుడెప్పుడు పూజించాలి?

భీష్ముడు :

పూర్వాహ్ణం దేవతల్ని పూజించాలి. అపరాహ్ణం పితరుల్ని పూజించాలి, ఈమధ్యసమయంలో మనుషుల్ని పూజించాలి.

ధర్మరాజా! కాలం తప్పించి సిద్ధంచేసినతిండీ, మైలతో ముట్టు కున్నదీ, తినగా మిగిలిందీ, మంత్రంతో పరిశుద్ధం కాందీ, తంత్రం నడపందీ. పురుగులు పడీ వెంట్రుకలు పడీ పాడైందీ రాక్షసులు పుచ్చుకుంటారు. యోగ్యమైన భోజనమే అవుగాక, దేవపితృకర్మల్లో దురాత్ములు తిన్నారో, అది రాక్షసులపాలే అవుతుంది. అంచేత దేవకార్యాల్లోనూ, పితృకర్మల్లోనూ భోజనం విషయంలో మత్తుణ్ణీ, జడుణ్ణీ, పిచ్చివాణ్ణీ, పతితుణ్ణీ, ఆడారివాణ్ణీ, కుష్ఠురోగినీ, పూజారినీ, వైద్యుణ్ణీ, నియమాలు లేనివాణ్ణీ, మూర్ఛరోగమున్నవాణ్ణీ, బొల్లి వాణ్ణీ, రాజయక్ష్మరోగమున్నవాణ్ణీ, నర్తకుణ్ణీ, గాయకుణ్ణీ, సోమ విక్రయుణ్ణీ, వేదాలు అమ్ముకున్నవాణ్ణీ విడిచిపెట్టాలి. వడ్డీలకిచ్చి బతికేవాడూ, అగ్నిహోత్రం మానుకున్నవాడూ, జంతువులు అమ్ముకు జీవించేవాడూ, సంధ్యోపాసన చెయ్యనివాడూ దైవకార్యానికీ, పితృకార్యానికీ తగరు.

ధర్మరాజు :

దైవపితృకార్యాల్లో దానమివ్వడానికి ఉత్తమపాత్ర లెవ్వరు ?

భీష్ముడు :

ఆకలితో వచ్చినవాళ్ళకి తృప్తిగా భోజనం పెట్టేవాడూ, దారిదోపుడు వాళ్ళచేతా దొంగలచేతా నష్టపోయి ధనం కావలిసిన వాడూ, వ్రతం ఉద్యాపనచెయ్యడంకోసం యాచించినవాడూ, గురు వునీ తల్లిదండ్రుల్నీ కష్టంలోవున్న పెళ్ళాం బిడ్డల్నీ పోషించడంకోసం ధనం కావలిసినవాడూ, మహావ్యాధి నిర్మూలించడంకోసం పాకులాడు తున్నవాడూ, పాపాలేవీ లేని బ్రాహ్మడూ, ఎప్పుడూ బిచ్చమెత్తు కునే బతికేవాడూ – దైవపితృకార్యాల్లో దానమివ్వడానికి ఉత్తమ పాత్రలు.

సత్రమూ గోశాలా చలిపందిరీ ధర్మశాలా పశుగొట్టడమూ,

గురువుల్ని నిందించడమూ, వేదాలు నిందించడమూ, వాటిని విక్రయించడమూ, వాటిని రాయడమూ, చాడీలు చెప్పడమూ, సంధి కాకండా చెయ్యడమూ, కులవృత్తి కాని ఇతరకర్మతో జీవించడమూ, కృతజ్ఞత లేకండా వుండడమూ, పరాయికొంప పడగొట్టడమూ, పరస్త్రీని చెరచడమూ, ఒకడి బతుకులో నీళ్ళుపొయ్యడమూ, మంత్రమూ ఉత్తమశాస్త్రమూ పాడుచెయ్యడమూ, మదంతో వున్న దానినీ దిక్కుమాలిన దానినీ బాలికనీ ముసిలిదానినీ తాపసినీ భయంతో వున్న దానినీ మోసంచేసి బాధపెట్టడమూ, ఇంటికి వచ్చిన అతిథికీ తన కుమాళ్ళకీ సేవకులకీ భోజనం ఏర్పాటు చెయ్యకండా తాను తినెయ్యడమూ – ఇవన్ని నరక హేతువులు అంటారు ఆర్యులు.

విషమూ, ఆయుధాలూ తలవెంట్రుకలూ విక్రయించడమూ, ఆయుధాలు తయారుచెయ్యడమూ, కన్యల్నీ బ్రాహ్మల్నీ ఆవుల్నీ దూసుకుపోడమూ, ఉపాధ్యాయుణ్ణీ భక్తికల భృత్యుణ్ణీ విడిచిపెట్టడమూ, ముట్టికంపలు వేసీ గొయ్యిలు పాతీ దారి పాడుచెయ్యడమూ– ఇవన్నీ కూడా నరకం తెచ్చిపెడతాయనే అంటారు.

నేరం లేకపోయినా నెపంపెట్టి డబ్బుగుంజుకునే రాజూ, ప్రజల గోడు విని వాళ్ళని రక్షించని ప్రభువూ, మాట తప్పి పన్నులు పుచ్చుకునే రాజూ, ఎద్దుకి ముగుదాడు కుట్టేవాడూ, దాని వృషణాలు చిదకగొట్టేవాడూ అధోగతి పొందుతారు.

ధర్మంకోసమో లేదా పేదరికంబాధవల్లో కాకపోతే రోగమో పాపమో పోగొట్టుకోడానికో దేవతలపేరిట పశువుల్ని చంపడమూ, పరమతపస్సూ శుశ్రూషా కలిగి మహాత్ములదగ్గిర మంచివిషయాలు వినడమూ, ఎవ్వరిదగ్గిరా ఏదీ పుచ్చుకోకండా వుండడమూ, మద్యమాంసాలు మానడమూ, పరస్త్రీలమీద విముఖత కలిగివుండడమూ వానప్రస్థాశ్రమంలో వున్నవాళ్ళని తన కులంవాళ్ళనీ పోషించడమూ, బంగారమూ బిడ్డలూ ఇళ్ళూ అన్నపానాలూ యాచకులకి దానం

చెయ్యడమూ, దీనులకి ఆశ్రయమివ్వడమూ, హింసమానడమూ – ఇవన్నీ స్వర్గలక్ష్మి సిద్ధించడానికి హేతువులంటారు.

ధర్మశాలా, తోటా, నుయ్యా, పానశాలా నిర్మించడమూ, భయంలోవున్న ఆప్తుల్ని కాపాడడమూ, కన్యనీ ఆవునీ వాహనాన్నీ దాసుణ్ణీ దాసినీ దానంచెయ్యడమూ, తనకి ఇతర్లు కీడు చేసినా సహించడమూ, స్నేహితుల్నీ చుట్టాల్నీ రక్షించడమూ, హెచ్చుమందికి పనికివచ్చేపని చెయ్యడమూ, పరాక్రమంలోనూ ధనసంపాదనలోనూ పరిశ్రమించడమూ, దుష్కర్మపొంతకి పోకపోడమూ – ఇవన్నీ స్వర్గలోకానికి నిచ్చెనలవుతాయి.

ఏకులంలో పుట్టినవాడైనా ఎక్కువమంది కుమాళ్ళు కలవాడూ, అధికంగా దయ కలవాడూ, వెయ్యి నెలలకి పైగా బతికినవాడూ – వీళ్ళంతా స్వర్గానికి వెళతారు.

ధర్మరాజా! ఏంచేస్తే నరకవాసం కలుగుతుందో, ఏంచేస్తే పుణ్యలోకం లభిస్తుందో వివరించాను. ఇంక ఏంచెప్పమంటావో అడుగు.

ధర్మరాజు :

కొన్నికర్మలు బ్రహ్మహత్యాదోషంతో సమానమంటారు కొందరు. హింసలేందే హత్యతో సమానమెలా అవుతా యని ?

భీష్ముడు :

నువ్వు అడిగినట్టే వోమారు దివ్యజ్ఞానం కల వేదవ్యాసమునీంద్రుణ్ణి భక్తిపూర్వకంగా అడిగాను నేను. అతడు నాకు చెప్పింది, నేను వినినంతమట్టుకు నీకు చెపుతాను, సావధానంగా విను

దీనుడైన బ్రాహ్మణ్ణి భోజనానికి రమ్మని, తీరా అతను వచ్చాక భోజనం పెట్టకపోడమూ, మంచి కులమూ విద్యా కల బ్రాహ్మడి వృత్తి పడగొట్టడమూ, దప్పికతో వచ్చిన ఆవుల్ని నీళ్ళు తాగనివ్వకండా తోలెయ్యడమూ, చెవిటివాళ్ళ కుంటివాళ్ళ గుడ్డివాళ్ళ ధన

అపహరించడమూ, వేదాలూ శాస్త్రాలూ నిందించడమూ – ఇవన్నీ బ్రహ్మహత్యతో సమానం.

పట్నంలోనూ గ్రామంలోనూ అడివిలోనూ అగ్గిపెట్టడమూ, పాపానికి వొడిగట్టుకని అబద్ధమాడి బ్రాహ్మణ్ణి బాధపెట్టడమూ బ్రహ్మహత్యతో సమానం.

ఈడూ జోడూ గుణమూ శీలమూ కల వీరుడుకి ఇవ్వకండా తన ఇష్టప్రకారం తగని వరుడికి కన్యని ఇవ్వడం కూడా బ్రహ్మహత్యతో సమానమే.

## పుణ్య తీర్థాలు

ధర్మరాజు :

పుణ్యతీర్థాల విశేషాలు వినాలనుంది, వివరించు.

భీష్ముడు :

లోగడ గౌతముడు ఇలాగే అంగీరసుణ్ణి అడిగాడు. అప్పుడు కొన్ని తీర్థాల విశేషం వివరించి చెప్పాడతడు. అవి నీకు వినిపిస్తాను విను.

చంద్రభాగ, ‡ ఉర్మిమాలి వితస్తా* – ఈనదులలో నిరాహారవ్రతంతో ఏడుదినాలు స్నానంచేస్తే మునులతో సమానుడవుతాడు మనిషి.

కాశ్మీరమండలంలో మహావనంలోంచి కొన్ని నదులు పారుతున్నాయి. వాటినీళ్ళు తాగితే స్వర్గం సిద్ధిస్తుంది.

పుష్కరంలోనూ, ప్రభాసతీర్థంలోనూ, నైమిశంలోనూ, ఇంద్రమార్గమూ దేవికా స్వర్ణబిందువులలోనూ, (సముద్రంలోనూ) స్నానంచేస్తే అప్సరస్త్రీలతో విమానాల్లో విహరిస్తాడు మనిషి.

హిరణ్యబిందువూ, కుశేశయమూ – ఈ తీర్థాల్లో మునిగితే పాపాలన్నీ కడుక్కుపోతాయి.

---

‡ పంజాబులోని చనాబ్ నదిని ప్రాచీనకాలంలో చంద్రభాగ అనేవారు. చంద్రుడు ఇక్కడ విభాగింపబడడంచేత దీనికి చంద్రభాగ అని పేరు వచ్చిందని లింగపురాణమూ, వరాహపురాణమూ లోని కథలు చెపుతున్నాయి.

* ఝీలమ్ నది.

గంధమాదనపర్వతంమీద ఇంద్రతోయలోనూ, కరంగ దేశం లోని కరతోయలోనూ మూడురాత్రిళ్ళు ఉపవాసముండి, స్నానం చేస్తే అశ్వమేధయజ్ఞం చేసినంతఫలం లభిస్తుంది.

కనఖలమూ, హరిద్వారమూ, నీలాద్రీ (పురుషోత్తమక్షేత్రం?) కుశావర్తమూ, బిల్వకమూ - ఈ తీర్థాలలో స్నానమాడితే పాపా లన్నీ పోతాయి ; స్వర్గం సిద్ధిస్తుంది.

కైలాసప్రాంతంలో గంగానది ఉత్తరంవేపు మళ్ళినచోట నెల రోజులు నిరాహారవ్రతంచేస్తే దేవతలు దర్శనమిస్తారు.

మహాశ్రమతీర్థంలో నిరాహారవ్రతంతో వుండి, అగ్నిహోత్రిగా గడిపిన మనిషి అద్భుతంగా సకలసిద్ధులూ పొందుతాడు.

భృగుతుంగక్షేత్రంలో మహాహ్రదతీర్థంలో స్నానంచేస్తూ, మూడు వారాలు ఉపవాసముంటే బ్రహ్మహత్యాపాపం వొదిలి పోతుంది.

కన్యాకూపంలో స్నానంచేసి, బలాకాతీర్థంలో తర్పణంచేస్తే ఉభయలోకాల్లోనూ యశస్సు సిద్ధిస్తుంది.

సుందరికాహ్రదంలో స్నానంచేసిన మనిషి మరుజన్మలో సుందరమూర్తి అయి జన్మిస్తాడు.

కృత్తికాతీర్థమూ, అంగారకతీర్థమూ సేవిస్తే సర్వపాపాలూ వొదిలి, స్వర్గం లభిస్తుంది.

విపాశనదిలో‡ మునిగినా, మూనాళ్ళు బ్రహ్మచర్యవ్రతంతో కాలికాశ్రయతీర్థం సేవించినా పునర్జన్మ కలగదు.

కృత్తికాశ్రమంలో యథావిధిగా స్నానమూ, పితృతర్పణమూ చేసిన మనుషులు శివసాయుజ్యం పొందుతారంటారు మునీశ్వర్లు.

---

‡ పంజాబ్‌లో వొక నది. విశ్వామిత్రుడి ప్రయోగంవల్ల తన వందమందికుమా ళ్ళనీ రాక్షసుడైన కల్మాషపాదుడు మింగేయడంవల్ల దుఃఖంతో ఆత్మహత్యకి ప్రయ త్నించి తాళ్ళతో కట్టుకుని ఈనదిలో వురికాడు వశిష్ఠుడు. పాశాలు విప్పి అతణ్ణి వొడ్డుకి చేర్చడంవల్ల దీని పేరు విపాశఅయింది. చూ. ఆదిపర్వం పు. 234.

ద్రోణశర్మపదతీర్థమూ, శరస్తంబతీర్థమూ, దేవదారువనమూ సేవిస్తే ఎలాటివాళ్ళనయినా అప్సరసలు వరిస్తారు.

చిత్రకూటమూ, జనస్థానమూ సేవిస్తే రాజ్యలక్ష్మి లభిస్తుంది.

నిరాహారదీక్షపూని, శ్యామాశ్రమంలో వొక్క పక్షంరోజులు వుంటే అంతర్ధ్యానఫలం సిద్ధిస్తుంది.

కౌశికినదిలో స్నానంచేస్తూ నిరాహారంగానూ, మౌనంగానూ ఇరవైవొక్క దినాలుంటే పరమగతి లభిస్తుంది.

మతంగవాపితీర్థంలో స్నానంచేస్తే వొక్క రాత్రిలో సిద్ధుడవుతాడు మనిషి.

నైమిషతీర్థం నెలరోజులు సేవిస్తే పురుషమేధం చేసినంతఫలం కలుగుతుంది.

అలాగే ఉత్పలావనతీర్థం సేవిస్తే అశ్వమేధయజ్ఞఫలం సిద్ధిస్తుంది.

గంగా యమునా సంగమస్థలంలోనూ, కాలాంజనపర్వతం మీదా నియమపూర్వకంగా స్నానంచేస్తే ముక్తి కలుగుతుంది.

వైవశ్వతతీర్థం సేవించిన మనిషి తీర్థభూతత్వం పొందుతాడు.

ప్రయాగకి అమావాస్యనాడు మూడుకోట్ల పదివేలు తీర్థాలు వస్తాయి. అక్కడ నెలనాళ్ళుండిన మనిషి ముక్తిపొందుతాడు.

గంగలోనూ, బ్రహ్మసరోవరం (పుష్కరతీర్థం) లోనూ మునుగుతూ నెలరోజులు నిరాహారదీక్షతో వున్న మనిషి చంద్రలోకానికి వెళతాడు; కీర్తిమంతుడున్నూ అవుతాడు.

అష్టావక్రమూ, కలవింకమూ, దేవహ్రదమూ – ఈతీర్థాల్లో స్నానంచేసిన మనిషి బ్రహ్మభావం పొందుతాడు.

కార్తీకపూర్ణిమనాడు కృత్తికాయోగంలో ఊర్వశీతీర్థంలోనూ, లౌహిత్యతీర్థంలోనూ స్నానంచేస్తే పుండరీకయజ్ఞం చేసినంత ఫలం కలుగుతుంది,

నిరాహారదీక్షతో పన్నెండుదినాలు రామహ్రదంలో స్నానంచేస్తే పాపాలన్నీ పోతాయి.

అలాగే ఉపవాసదీక్షతో మహాహ్రదంలో నెలనాళ్ళు స్నానం చేస్తే, జమదగ్ని పొందిన పుణ్యలోకం పొందుతాడు మనిషి; మును లలో గణింపబడతాడు.

వింధ్యపర్వతంమీద ఒక నెలపాటు శరీరకష్టం సహించి తపస్సుచేస్తే సర్వపాపాలకీ ప్రాయశ్చిత్తం చేసినట్టవుతుంది. అంతే కాదు సర్వధర్మాలూ కరతలామలకమవుతాయి.

నర్మదలో స్నానంచేసినవాడు రాజకుమారుడై పుడతాడు.

సంయతాత్ముడై మనిషి జంబుమార్గతీర్థంలో మూడుమాసాల ఒకదినం నివసిస్తే సర్వసిద్ధులూ పొందుతాడు.

కోకాముఖతీర్థంలో స్నానమాడి, తండులికాశ్రమానికి వెళ్ళి, నారలు కట్టుకుని, శాఖాహారంతో శాంతిగా నివసిస్తే, అక్కడున్న పదిమంది కన్యలకి భర్తఅయి అజరామరుడై సుఖిస్తాడు మనిషి.

నిరాహారదీక్షతో మూడు రాత్రిళ్ళు కుల్యలో అఘమర్షణజపం చేసినవాడు అశ్వమేధయజ్ఞంచేసినంత ఫలం పొందుతాడు.

అష్టసేనాశ్రమంలో ఉజ్జానకతీర్థంలో స్నానంచేసిన మనిషి పాపాలన్నీ వొదుల్చుకుంటాడు.

పిండారకతీర్థంలో ఒకరాత్రినివసిస్తే అగ్నిష్టోమఫలం లభిస్తుంది.

ధర్మారణ్యంలో బ్రహ్మసరస్సు సేవిస్తే పౌండరీకయజ్ఞంచేసి నంత ఫలం సిద్ధిస్తుంది.

హిమవంతుడు గౌరికి తండ్రి; శివుడికి పిల్లనిచ్చిన మామ; రత్నాలన్నిటికీ గని; లోకపావనుడు. అదిలో ఆ హిమాలయందగ్గిర నిలబడి తపస్సుచేస్తే సిద్ధుడవుతాడు మనిషి; బ్రహ్మలోకం చేరు కుంటాడు.

ధర్మరాజా! తీర్థాలు సేవించినప్పుడు కామమూ, క్రోధమూ,

మదమూ, లోభమూ దగ్గిర చేరనివ్వకూడదు. అలా అయితేనే ఫలం సిద్ధిస్తుంది.

ఓర్పూ, తపస్సూ, అహింసా; శాంతీ – ఇవే నిజమైన తీర్థాలు. వీటివల్లే శుద్ధి కలుగుతుంది. అంతేకాని వుత్తి నీళ్ళలో మునిగినంత మాత్రాన శుచిత్వం కలగదు.

దొరకనివాటికోసం దేవులాడకుండా, దొరికినవాటిమీద మమకారం వుంచుకోకండా, దేనిమీదా స్పృహపెట్టుకోకండా వున్న పురుషులు పరిశుద్ధులు. తీర్థాలేవీ అవసరమే లేదు వాళ్ళకి.

దుర్గమంగానూ, విషమంగానూ వుండిన తీర్థాలు భక్తిపూర్వకంగా తలుచుకుంటేనే చాలు సర్వపాపాలూ పోతాయి.

తీర్థఫలాలు తెలిపే పుణ్యవాక్యాలు ఇవి. పరమ పవిత్రమైనవి. మన్నించదగినవి. స్వర్గప్రసాదిస్తాయి. రహస్యమైనవి విధేయుడైన శిష్యుడికీ, కన్నకొడుకుకీ. స్నేహితుడికీ, ఉత్తముడైన బ్రాహ్మడికీ మాత్రం వినిపించాలివి, దయతలిచి.

గౌతముడికి అంగిరసుడు చెప్పిన ఈ వాక్యాలు నిర్మలహృదయంతో చదివినా, విన్నా పాపాలు పోతాయి. మునులు జపించదగిన విషయం ఇది. ఇది నిత్యమూ పఠిస్తే మళ్ళీజన్మలో జాతిస్మరణ కలుగుతుంది. (అంటే ఈజన్మ జ్ఞాపకం వుంటుంది.) పుణ్యపురుషులైన కుమాళ్ళు కలుగుతారు.

## అత్రిప్రముఖులు

భీష్ముడా తీర్థఫలాలు ధర్మరాజుతో చెప్పి ముగించేసరికి; అర్జునుడి బాణాలు శయ్యగా వీరశయనంలో వున్న అతణ్ణి చూడడంకోసం అత్రీ, వసిష్ఠుడూ, భృగుడూ, పులహుడూ, పులస్త్యుడూ, క్రతువూ, అంగిరసుడూ, అగస్త్యుడూ, కణ్వుడూ, గౌతముడూ, విశ్వామిత్రుడూ, జమదగ్నీ. మొదలైన మహామునులు తమతమ శిష్యులతో కూడా వచ్చారు. తమ తపఃప్రభావం భూమీ ఆకాశమూ నింపిస్తూ నిలిచి

భీష్ముణ్ణి చూశారు. ఆశ్చర్యపోయారు పాండవులు. మును లందరికీ నమస్కరించారు వాళ్ళు. అంతలోనే ఆ పరమమునులు అంతర్ధాన మైపోయారు. వాళ్ళ మాహాత్మ్యం మెచ్చుకుంటూ భీష్ముడూ, పాండవులూ మాట్లాడుకున్నారు.

అనంతరం తాతగారి పాదాలమీద శిరస్సు మోపి, వినయంగా అడిగాడు ధర్మరాజు :

"ఏయే దేశాలు, ఏయే కొండలు, ఏయే నదులు అధిక పుణ్యప్రదమైనవి ?"

## గంగాప్రభావము

భీష్ముడు :

'ఈ విషయంలో వో ఇతిహాసముంది. అది వినిపిస్తాను, విను.

ఒక బ్రాహ్మడు వుండేవాడు. ఉంఛవృత్తితో జీవితం గడుపుకునేవా డతడు. అతడి ఇంటికి వోమాటు వొక సిద్ధుడు అతిథిగా వచ్చాడు. అతడికి ఆతిథ్యమిచ్చి, మాటామంతీ ఆడుతూ, ఇప్పుడు నువ్వు నన్ను అడిగినట్టే సిద్ధుణ్ణి అడిగాడు బ్రాహ్మడు. సిద్ధుడు ఇలా చెప్పాడు :

"పరమ పవిత్రమైన గంగానది ఏయే దేశాల మధ్యనించి ప్రవహించిందో, ఏయే కొండల్ని వొరుసుకుంటూ వెళ్ళిందో ఆయా దేశాలూ, ఆయా కొండలూ అధికంగా పుణ్యప్రదమైనవి. అంతే కాదు, గంగ పరమపావని. దాని మహాత్తు విను.

"గంగానది సేవనంవల్ల సిద్ధించే పుణ్యగతి, నియమంతో చేసిన యజ్ఞంవల్ల కానీ, బ్రహ్మచర్యంవల్ల కానీ, తపస్సువల్ల కానీ, త్యాగంవల్ల కాని సిద్ధించదు. ఎంత దట్టంగా వుంటేనేం చీకటి, పొద్దు దూరడంతోనే పటాపంచలవుతుంది. అలాగే ఎన్ని పాపాలు చేసినా కూడా గంగలో మునిగితే అన్నీ కడుక్కుపోతాయి. గంగాస్నానంవల్ల దేవత్వం లభిస్తుంది. రవంత గంగాజలం శరీరానికి తగిల్తే చాలు, మనుషుల పాపాలన్నీ పోతాయి. స్వర్గసౌఖ్యమున్నా సిద్ధిస్తుంది.

మనిషి అస్థికలు ఎన్ని వేల సంవత్సరాలు గంగలో వుంటే అన్ని వేల సంవత్సరాలు స్వర్గంలో సౌఖ్యం అనుభవిస్తాడతడు.

"సోమం లేని యజ్ఞం ఎలా వుంటుంది, చంద్రుడు లేని రాత్రి ఎలా వుంటుంది, సూర్యుడు లేని ఆకాశం ఎలా వుంటుంది, ఆత్మ ధర్మం లేని ఆశ్రమం ఎలా వుంటుంది, పువ్వులు లేని చెట్టు ఎలా వుంటుంది, అదిగో అలాగ గంగానది లేని దేశం హీనంగా పాడుపడి వుంటుంది.

"నూరు చాంద్రాయణవ్రతాలు చేసినా, గంగాజలం తాగితే కలిగినంత నిర్మలత్వం కలగదు.

"అగ్నిలో వేసిన దూది ఎలా భగ్గుమని మండిపోతుందో, అలాగే గంగానదిలో మునిగిన మనిషి పాపాలన్నీ మాయమైపోతాయి.

"ప్రాణుల దుఃఖాలు పోగొట్టడంలో గంగానదితో సాటివచ్చేది మరొకటి లేనే లేదు.

"శరణు లేని జనులకు గంగ ఒక్కటే పరమశరణమంటారు మునులు; దేవతలకి అమృతం ఎలాంటిదో మనుష్యులకి గంగాజలం అలాంటిదని వినికిడి.

"తలమీద గంగ నది ఇసక పులుముకున్నా, నుదుటిమీద గంగమట్టి రాసుకున్నా, గరుత్మంతుణ్ణి చూసిన పాములా పారిపోతాయి పాపాలు.

"గంగానది కెరటాలమీంచి వచ్చిన గాలి శరీరానికి సోకితేనే చాలు ఎంతటి ఘోరమైన పాపాలైనా తుడుచుకుపోతాయి.

"గంగానదిలో స్నానమాడినవాడు ఇటు ఏడుతరాలూ, అటు ఏడుతరాలూ పితృవర్గాన్ని ఉద్ధరిస్తాడు. ఓమాటు గంగానదిని చూస్తేనే చాలు మనసా, వాచా చేసిన పాపాలన్నీ వొదిలించుకుంటాడు.

"గంగానదిపేరు వింటేనే చాలు, దాన్ని కీర్తిస్తేనేచాలు,

చూస్తేనే చాలు, చేత్తో అంటితేనే చాలు రెండుకులాల పితరుల్ని ఉద్ధరిస్తాడు మనిషి. అలాంటప్పుడు ఇక స్నానంచేస్తే చెప్పేదేముంది?

"ఇంతేకాదు, 'గంగ గంగ' అంటూ ఏనదిలో, ఏనీళ్ళలో మునిగినా పాపాలు పోతాయంటారు పెద్దలు. అంత గొప్పది గంగ మహిమ.

"సామర్థ్యముండీ కూడా గంగానదిని చూడనివాడు పశువన్న మాట; కళ్ళున్న గుడ్డివాడన్నమాట.

"దేవేంద్రుడూ మొదలైన దేవతలే గంగకోసం తాపత్రయ పడతారు. అలాంటప్పుడు మనిషన్నవాడు పడవద్దూ?

"మరణకాలంలో గంగని తలుచుకుంటే మోక్షం కలుగుతుంది

"గంగని కీర్తిస్తే రాజభయముండదు; దొంగలభయముండదు; పాపభయముండదు; భూతభయముండదు; ఏభయమూ వుండదు.

"గంగాదేవి స్వర్గంనించి దిగింది. ఆమెని శివుడు శిరసుమీద ధరించాడు.

"మూడు దార్లలో నడిచింది గంగ; మూడులోకాలూ పవిత్రం చేసింది. నిర్మలమూర్తి గంగ. ఆమెని ఆశ్రయించినవాడు కృతకృత్యుడవుతాడు. సందేహంలేదు.

"జనానికి దేవేంద్రుడెలాగో, గ్రహాలకి సూర్యుడెలాగో, పితరులకి చంద్రుడెలాగో, నదులన్నిటికీ గంగానది అలాంటిది, మాహాత్మ్యంలో.

"సగరపుత్రులు కపిలముని శాపంవల్ల భస్మమైపోయి వాళ్లు పాపరాసులై వున్నప్పుడు గంగాదేవి తన చల్లని నీళ్ళు చల్లింది; వాళ్ళందరినీ స్వర్గానికి పంపింది.

"అద్భుతమైన తపస్సుతో దేవతల్ని ప్రార్థించి, తనపూర్వపురుషులైన సగరపుత్రుల్ని ఉద్ధరించడంకోసం గంగాదేవిని భూలోకానికి తెచ్చాడు భగీరథుడు *

---

* చూ. భగీరథుడికథ, ఆరణ్యపర్వం. అ. 3.

''విష్ణుపదంనుంచి, చంద్రలోకం నించి, సూర్యలోకం నించి, మేరుస్వరూపుడైన విష్ణువు నించి, త్రిపురాలు జయించిన శివుడి శిరసు నించి, హిమాలయంమీదికి దిగింది గంగ.

''తన ప్రభావం విని నిశ్చలమైన మనస్సుతో శరణని ఆశ్రయిస్తే సనాతనపదమే ప్రసాదిస్తుంది గంగ.

''నేను ఎగిరినమట్టుకు చెప్పాను. కాని అనంతమైంది గంగాదేవి గుణసంపద. దేవేంద్రుడూ మొదలైన దేవతలు ఎప్పుడూ గంగాదేవి మహిమ కీర్తిస్తారు. మేరువులోని మణులూ, సముద్రంలోని నీటి బిందువులూ లెక్కపెట్టడం ఎలాటిదో, గంగానది గుణాలు లెక్కపెట్టడం అలాటిది. నీకు నేను వినిపించిన గంగాదేవి గుణాలు ఎప్పుడూ మనోవాక్కాయాలతో భక్తిపూర్వకంగా భజించు. దాని వల్ల గంగాదేవి అనుగ్రహం కలుగుతుంది. సిద్ధుడ వవుతావు. వర్చస్సుతో ముల్లోకాలలోనూ సంచరించగల మహాత్మ్యం కలుగుతుంది. స్వధర్మం పాలిస్తూ, తనను భజించే సజ్జనుణ్ణి శాశ్వతంగా సుఖపెడుతుంది గంగాదేవి.''

ఇలా గంగమహిమ ఆమహాబ్రాహ్మడికి వినిపించి, ఆకాశగమనంతో తనదారిని తాను వెళ్ళిపోయాడు సిద్ధుడు. అతడు చెప్పిన ప్రకారం గంగాభవానిని సేవించి అనన్యసులభమైన సిద్ధి పొందాడు బ్రాహ్మడు.

ధర్మరాజా! నువ్వున్నూ గంగానదిని సేవించు; శుభాలు పొందు.

గంగాస్తోత్రంతో కూడిన ఈ ఇతిహాసం చదివినా, విన్నా రోగా లంటవు; పాపాలు తాకవు.

## ఎవరు పూజ్యులు?

ధర్మరాజు :

మహాత్మా! నీమాటలు వింటూవుంటే పరమానందంగావుంది

నాకు. తమ్ముళ్ళతో కూడా పదేపదే నీకు నమస్కరిస్తున్నాను. లోకంలో ఎవరు సర్వజనపూజ్యులో సెలవియ్యి.

భీష్ముడు :

శ్రీకృష్ణ నారద సంవాదమని ఒక ఇతిహాసముంది. నువ్వు అడిగినదానికి సమాధాన మవుతుం దది. చెపుతాను, ఆలకించు.

ఓనాడు నారదముని శ్రీకృష్ణుడి దగ్గిరికి వెళ్ళాడు. తగిన సత్కారంచేసి మునిని పూజించాడు శ్రీకృష్ణుడు. సుఖంగా అతడు కూచున్నాక, సగౌరవంగా అడిగాడు, "మునీంద్రా! ఎవరికయ్యా నువ్వు మొక్కుతావు?" అని.

"వరుణుణ్ణీ, వాయుదేవుణ్ణీ, సూర్యుణ్ణీ, పర్జన్యుణ్ణీ, అగ్నిభట్టారకుణ్ణీ, శివుణ్ణీ, కుమారస్వామినీ, మహాలక్ష్మినీ, విష్ణుమూర్తినీ, బ్రహ్మదేవుణ్ణీ, బృహస్పతినీ, చంద్రుణ్ణీ, నీటినీ, భూమినీ ఎప్పుడూ భక్తితో ఎవళ్ళయితే సేవిస్తారో వాళ్ళకి నేను మొక్కుతాను.

"వేదపరులూ, దేవతాపూజచేసేవాళ్ళూ, భూదానమూ ధనదానమూ ధాన్యదానమూ గోదానమూ చేసేవాళ్ళూ, పితృసమారాధనచేసేవాళ్ళూ, భిక్షాన్నంతో జీవించే పవిత్రాత్ములూ, శాంతస్వభావులూ, సత్యవ్రతులూ నాకు పూజ్యులు.

"ధర్మమూ కామమూ అర్థమూ - త్రివర్గాలూ సాధించేవాళ్ళూ, అహంకార మమకారాలు లేనివాళ్ళూ, మంచి నడవడి కలవాళ్ళూ, లోలత్వం లేనివాళ్ళూ, జ్ఞానులూ నమస్కారయోగ్యులు నాకు.

"కృష్ణా! నేను పూజించేవాళ్ళని తెలుసుకుని నువ్వుకూడా సేవించు. దీనివల్ల ఎన్నో శుభాలు కలుగుతాయి" అన్నాడు నారదుడు.

కనక ధర్మరాజా! నువ్వు కూడా అలాటివాళ్ళనే సేవించు. పాపాలు పోగొట్టి, శోభనం కలిగిస్తారు వాళ్ళు.

## రాజుల ప్రధాన కర్తవ్యం

ధర్మరాజు :

రాజుకి ఎన్నో కర్తవ్యాలుంటాయి. వాటన్నిటిలోకీ ప్రధాన కర్తవ్యమేది?

భీష్ముడు :

సామ్రాజ్యాభిషిక్తుడైన మహారాజుకి అన్నిటికంటే బ్రాహ్మణ పూజే ప్రధానకర్తవ్యం. బ్రాహ్మలు సుఖంగా వుంటేనే భూమండలానికి క్షేమం కలుగుతుంది. మన్నించదగినవాళ్ళు బ్రాహ్మలు. వాళ్ళకి మన్నన లేకపోతే లోకానికి క్షేమం కలగదు. దేవుణ్ణి దెయ్యాం చెయ్యాలన్నా, దెయ్యాన్ని దేవుడు చెయ్యాలన్నా బ్రాహ్మలే సమర్థులు. వాళ్ళు ఎవణ్ణి అనుగ్రహిస్తే వాడే మహారాజవుతాడు. ఇంద్రుడంతవాడికైనా ఆగ్రహంతో ఆపనా, అనుగ్రహంతో సహాయం తేగలరు వాళ్ళు శాపానుగ్రహ సమర్థులు వాళ్ళు ద్రావిడ, కళింగ, ఔశీనర, యవన, శక, పుళింద రాజులు బ్రాహ్మల్ని పరాభవించడంవల్లే శూద్రులు కావలిసివచ్చింది లోకడ, చంద్రస్వరూపులు బ్రాహ్మలు. ఈశ్వరస సన్నులు బ్రాహ్మలు. సర్వసౌఖ్యసిద్ధికరులు బ్రాహ్మలు. వాళ్ళని ఎప్పుడూ పూజిస్తూ, పోషిస్తూ వుండు. ఆచారవంతుడైన బ్రాహ్మడికి భక్తిపూర్వకంగా భోజనంపెడితే దేవతలూ, పితృదేవతలూ కూడా తృప్తిపడతారు.

బ్రాహ్మలవిషయంలో శ్రీకృష్ణుడికీ, భూదేవికీ వోమారు సంవాదం జరిగింది. ఇతిహాసంగా చెప్తున్నది. అది వివరిస్తాను, ఆలకించు. శ్రీకృష్ణుడు భూదేవిని అడిగాడు :

"లోకజననివి నువ్వు. నిన్ను వొక విషయం అడుగుతాను, చెప్పు! చేసిన పాపాలు ఏంచేసి వొదిల్చుకుంటారు లోకులు?"

"బ్రాహ్మణసేవవల్ల," అంది భూదేవి, "బ్రాహ్మణ పూజవల్లా బ్రాహ్మలకి మేలుచెయ్యడంవల్లా పాపాలన్నీ వొదుల్చుకోవచ్చు లోకులు. ఇవలు రాజులు తప్పకుండా చెయ్యవలసిన పనులు ఇవి.

"దేవేంద్రుడికి వొంటిమీద వెయ్యి భగాలు పుట్టడం బ్రాహ్మడి ఆగ్రహంవల్లే కదా జరిగింది! తిరిగి వెయ్యిభగాలు వెయ్యి కళ్ళుగా మారడం బ్రాహ్మడి అనుగ్రహంవల్లే జరిగింది."

విని, మెచ్చుకున్నాడు శ్రీకృష్ణుడు అంచేత ధర్మరాజా! నువ్వుకూడా ఎప్పుడూ బ్రాహ్మలకి ప్రియంకలిగిస్తూవుడు. పుట్టుకతోనే బ్రాహ్మడు గొప్పవాడంటారు పెద్దలు. జనానికి బ్రాహ్మడి పాదపద్మాలు నమస్కరించదగినవి.

బ్రాహ్మల్ని సృజించి బ్రహ్మదేవుడు వాళ్ళతో ఏంచెప్పాడో చెపుతాను, విను.

"మీకు మరో పని లేదు. ఆత్మకర్మ పూని, ధర్మయుక్తంగా బ్రహ్మగోపనం చెయ్యాలి మీరు, అంతే. అదే అధికంగా శోభనం కలిగిస్తుంది. బ్రాహ్మణ్యమే అన్నివర్ణాలకీ తారకం. బ్రాహ్మ అయిన శ్రీతోతపస్స్వాధ్యాయాలు ప్రకాశించినట్టు చెయ్యండి" అన్నాడు. అంచేత రాజులకి బ్రహ్మవచనం పరిపాలించడం ప్రధానకర్తవ్యం.

అగ్గి పట్టుకోవచ్చు, హిమాలయపర్వతం కదిలించవచ్చు. గంగానది అరికట్టవచ్చు. కాని, బ్రాహ్మల్ని సేవించడం అంటే కల్ప వృక్షాన్ని సేవించడం అన్నమాట.

ఈవిషయంలో ఇంద్ర శంబర సంవాదం అని మరో ఇతిహాసం వుంది. అదీ చెపుతాను, విను.

జటాసురుడి కుమారుడు శంబరాసురుడు. అతడి దగ్గిరికి వెళ్ళి దేవేంద్రుడు మాటామంతీ ఆడుతూ, "దేనివల్ల నువ్వు ఇంత ఉన్నతి పొందావు?" అని అడిగాడు.

"బ్రాహ్మల్ని ఆరాధించడంవల్ల" అన్నాడు శంబరాసురుడు, "బ్రాహ్మలంటే కోపం కాని, అసూయకాని నాకు లేదు. కంటికి రెప్పలాగ వాళ్ళని కాపాడతాను నేను. వాళ్ళని పోషిస్తాను. వాళ్ళని పూజిస్తాను అంచేతే నాకు ఈ ఐశ్వర్యం పట్టింది. దేవాసుర

యుద్ధంలో బ్రాహ్మల అనుగ్రహం దేవతల్ని గెలిపించడం చూసి, మాతంగ్రడి సోముడితో 'బ్రాహ్మలు మహానుభావులు కదా!' అన్నాడు. 'అవును' అన్నాడు సోముడు, 'బ్రాహ్మలు తపస్స్వాధ్యాయసిద్ధులు. వాళ్ళసంగతి విను. సంచారం చెయ్యని, బ్రాహ్మణ్ణీ, యుద్ధం చెయ్యని రాజునీ బిలంచీకటి పాముల్ని అణచేసినట్టు పరిత్యాగించనివ్వకండా మింగేస్తుంది భూమి. ఇది తెలుసుకుని ఇంటిమూల చదవకండా దేశాంతరాలకి వెళ్ళి, వేదాలూ అవీ చదివి, తపశ్శాలులవుతారు బ్రాహ్మలు. అంచేత సర్వాధికులు వాళ్ళు. వాళ్ళని బహుమానిస్తే శుభం కలుగుతుంది. ఇందులో సందేహంలేదు."

"సోముడి మాటలు పాటించి, మాతంగ్రడి బ్రాహ్మల్ని పూజించాడు; ప్రతాపవంతు డయాడు. నేనూ మాతంగ్రడిగారి అడుగుజాడల్లోనే నడుచుకున్నాను."

శంబరుడి మాటలే అనుసరించి బ్రాహ్మల్ని సంతోషపెట్టాడు దేవేంద్రుడు. దానికి తగినట్టు ఔన్నత్యమున్నూ పొందాడు.

ధర్మరాజు :

కొత్తవాళ్ళూ, చిరకాలంనుంచీ ఆశ్రయించుకునివున్న వాళ్ళూ, దూరంనుంచి వచ్చినవాళ్ళూ – ఈ మూడు రకాలవాళ్ళలో అధికంగా దానానికి ఎవళ్ళు తగినవాళ్ళు ?

భీష్ముడు :

హింసా, క్రోధమూ, ఈర్ష్యా మొదలైనవి లేకుండావుంటే స్నేహితులూ, చుట్టాలూ, సంబంధులూ, ఋత్విజులూ, పురోహితులూ దానానికి తగినవాళ్ళు.

దూరంనుంచి వచ్చినవాళ్ళూ, కొత్తవాళ్ళూ పూజార్హులు. అయితే వాళ్ళలో మంచి ఆచారమూ, విద్యా, గొప్పతనమూ వున్నాయా అని మాత్రం విచారించాలి. అలా చూసినప్పుడు ఈ మూడురకాలవాళ్ళూ అశుచులైనా పాత్రులే.

## స్త్రీ స్వభావం

ధర్మరాజు :

పాపాలన్నిటికీ స్త్రీలే మూలం. వాళ్ళస్వభావం వివరించు.

భీష్ముడు :

అవును, అలాటివాళ్ళే స్త్రీలు. దీనికి నారద పంచచూడా సంవాదం అని వొక ఇతిహాసం వుంది. దానివల్ల స్త్రీస్వభావం తేటతెల్లమవుతుంది, విను.

దేవముని నారదుడు లోకసంచారం చేస్తూ, వోదగ్గిర పంచచూడ అనే అప్సరసని చూసి, "సుందరీ! నేను వొకటి అడుగుతాను చెపుతావూ ?" అని అడిగాడు.

"నేను చెప్పగలిగిందైతే తప్పకండా చెపుతాను" అంది పంచచూడ.

"ఆడదాని స్వభావం ఎలాటిదో చెప్పు" అని అడిగాడు నారదముని.

"ఆడదాని స్వభావం ఆడదే చెప్పడం తగినపనేనా మునీంద్రా?" నవ్వుతూ అంది పంచచూడ.

"నిజం చెప్పడంలో తప్పేముంది? వున్నది వున్నట్టు నిజం చెప్పు" అన్నాడు నారదముని.

"స్త్రీల స్వభావాలు నువ్వు ఎరగనివి లేవు. అయినా చెపుతున్నాను.

"కులమూ, మాన్యతా కలిగి, వొకడిభార్య అయి, గౌరవంగా బతుకుతూ వుండీ కూడా పైఆటలాడుతుంది ఆడది స్వేచ్ఛగా.

"అన్నిదోషాలకీ ఆడదే మూలం. వాళ్ళ సంగతి చెప్పడమెందుకూ? అయినా అడుగుతున్నావు కనక నాకు తెలిసినంతమట్టుకు చెపుతాను, విను.

"మగాళ్ళమంచి ఆడాళ్ళు ఎరగరు సిగ్గూ లేకండా కుచ్చితుల్నే సేవిస్తారు వాళ్ళు. వర్జనీయులు లేనేలేరు వాళ్ళకి.*

"కర్రలు ఎన్ని వేసినా అగ్ని తృప్తిపొందదు. నదులు ఎన్ని కలిసినా సముద్రం తృప్తిపొందదు. ప్రాణుల్ని ఎంతమందిని చంపినా యముడు తృప్తిపొందడు. అలాగే ఎంతమంది మగాళ్ళయినా ఆడది తృప్తిపొందదు అంటారు పండితులు.

"ఒక రహస్యం చెపుతాను, విను. పరపురుషుణ్ణి చూడడంతోనే ఆడదానికి మదనమందిరంలో కళలు చెమ్మగిల్తాయి.

"తినడమూ, కట్టడమూ, పూసుకోడమూ, తొడగడమూ, ధనరాసులతో తులతూగడమూ — ఇవేవీ కూడా పరాయిమగాడితో జతకట్టినంత సంతోషం కలిగించవు ఆడదానికి" అంది పంచచూడ.

"నిజం చెప్పావు" అంటూ ఆమెకి సెలవిచ్చి, తన దారిని తాను వెళ్ళిపోయాడు నారదుడు.

## ఆడాళ్ళని కనిపెట్టడం అసాధ్యం

ధర్మరాజు :

స్త్రీలని కనిపెట్టే మార్గ మేమిటి?

భీష్ముడు :

ఆడాళ్ళని కనిపెట్టడం అసాధ్యం. మాయలో మయదానవుడూ, శంబరాసురుడూ కూడా ఆడాళ్ళముందు తీసికట్టు.† అదీ కాక ఇంకో విశేషం చెపుతాను, విను.

---

* స్వభావ ఏష నారీణాం నరాణా మిహ దూషణం,
అతోఽర్థాన్న ప్రమాద్యంతి ప్రమదాసు విపశ్చితః. మనుస్మృతి. 2-213.

† న హి స్త్రీభ్యః పరం పుత్ర పాపీయః కించిదస్తి వై,
అగ్నిర్హి ప్రమదా దీప్తో మాయాశ్చ ప్రజయా విభో. సం. మూ. 40-4.

పూర్వకాలంలో స్త్రీలు మాయా మర్మం లేకండా వుండే వాళ్ళు. అంచేత మనుషులందరూ నిర్దోషులుగా వుండేవాళ్ళు. కనక కావలసినప్పుడు దేవత్వం పొందగలిగేవాళ్ళు. అంచేత దేవతలు అసూయపడ్డారు. బ్రహ్మదగ్గిరికి వెళ్ళి చెప్పుకున్నారు. అప్పుడు ఆడాళ్ళని మాయావినులుగా చేశాడు బ్రహ్మ. వాళ్ళకి కామం అధికం కలిగించాడు. మగాళ్ళు వాళ్ళ చిక్కుల్లో పడి, రోషం మొదలైన దుర్గుణాలుఅలవరుచుకున్నారు. దేవతలు సంతోషించారు. అదిగో, అలాగు, స్త్రీలు మాయావతు లయారు. నిరూపించడానికి వల్ల కాని చిత్తవృత్తి వాళ్ళది. వాళ్ళని కనిపెట్టడం కష్టం.

ఈవిషయంలో నేను విన్న కథ వొకటి నీకు వినిపిస్తాను.

దేవశర్మ అని వొక ముని వుండేవాడు. అతడిభార్య రుచి. సర్వాంగసుందరి ఆమె. దేవతలూ, గంధర్వులూ కూడా ఆమెరూపం తేరిచూసేవాళ్ళు.

ఒకనాడు దేవశర్మ వొక యజ్ఞం నడిపించడానికి వెళుతూ తన శిష్యుణ్ణి విపులుణ్ణి పిలిచి, రహస్యంగా ఇలా చెప్పాడు :

"నాయనా! రుచిమీద కన్ను వేసి కూచున్నాడు దేవేంద్రుడు. వెయ్యికళ్ళతో కాపాడుకు వస్తున్నా న్నేను. అంచేత ఆమెచుట్టుపక్కలకి రాలేకపోతున్నా డతడు. నేను ఇప్పుడు వొక యజ్ఞం చేయించడానికి వెళ్ళవలసివచ్చింది. పరస్త్రీలని జతకూడడంలో ఘనుడు దేవేంద్రుడు. కనక రుచిని కాపాడవలిసిన భారం నీమీద పెడుతున్నాను."

గురువుమాట విన్నాడు విపులుడు. "మీరు చెప్పినట్టే చేస్తాను" అన్నాడు, "అయితే పరస్త్రీలని హరించడానికి ఏరాగడతో వస్తాడు దేవేంద్రుడు?" అని అడిగాడు.

"అనేక మాయలు తెలుసు నతడికి" అన్నాడు దేవశర్మ, "పక్షిరూపంతోనూ లేదా జంతువు రూపంతోనూ — ఎన్నో

వేషాలు వేసి వస్తా డతడు. అవన్నీ జాగ్రత్తగా కనిపెడుతూ వుండాలి.

"రుచిమీద కన్ను వేసి తిరుగుతున్నా డతడు. నేన లేకపోడం చూసి ఇక్కడికి తప్పకండా దిగబడతాడు. ఇందులో సందేహం లేదు. కంటికి రెప్పలా కనిపెట్టుకుని వుండాలి నువ్వు రుచిని" అంటూ పదే పదే చెప్పాడు. రుచిని విపులుడి రక్షణలో పెట్టి, యజ్ఞాకి వెళ్ళి పోయాడు దేవశర్మ.

అప్రమత్తుడై రుచిని కాపాడుతూ తనలో తాను ఆలోచించాడు విపులుడు.

"యోగకౌశలంతో గురుభార్యని ఆవేశిస్తాను. ఇందులో తప్పేముంది? విశుద్ధాత్ముడైన మహాత్ము డతడు. అతడి మనస్సుకి ఈ విజ్ఞానం తోచదు. భయమెందుకూ దీనికి ?" అంటూ వితర్కించుకున్నాడు. శంకమాని, రుచికి దగ్గరగా కూచున్నాడు. ఆ కథా ఈ కథా చెపుతూ కాసేపు గడిపాడు. గాలి ఆకాశంలో ఆవరించినట్టు యోగమాయాబలంతో ఆమెలో ఆవేశించాడు. ఆమె ఆత్మలో ప్రవేశించాడు.

రుచికిమాత్రం ఇదేమీ తెలియలేదు. విపులుడి ఆత్మవల్ల ఆమె చైతన్యం జడత్వం పొందింది.

ఇంతలో అందంగా అలంకరించుకుని మెల్లిమెల్లిగా అక్కడికి దిగబడ్డాడు దేవేంద్రుడు. చలనం లేకండావున్న విపులుడి శరీరం చూశాడు. నిద్రపోతున్నా డనుకున్నాడు. కామంతో వున్నాడు కనక కానలేకపోయాడు. సమయం బాగుందనుకున్నాడు. తిన్నగా రుచి ఎదటికి వెళ్ళాడు.

"రుచీ!" తియ్యని గొంతుకతో అన్నా డతడు, "నీవల్ల మన్మథుడు నాహృదయం చీలికలు చేస్తున్నాడు. కొంచెం దయ చూడవూ నన్ను ?"

మూఢబుద్ధితో మాటాడకండా వూరుకుంది రుచి. దేవేం ద్రుడు వచ్చాడని లేవనన్నా లేవలే దామె. పల్లెత్తు మాటన్నా అన లేదు.

మరింత మోహం హెచ్చింది దేవేంద్రుడికి. మళ్ళీ అందు కున్నా డతడు.

"రుచీ! చూడూ, నేను దేవేంద్రుణ్ణి. కామం నా మనస్సు కాల్చేస్తోంది. ఆలస్యం చెయ్యకు. నన్ను తగినవిధంగా సమ్మానించు. సిగ్గుపడకు" అన్నాడు.

రుచి శరీరంలో వున్న విపులుడు తన యోగమాయతో ఆమె చేత అనిపించాడు, "నువ్వు ఇలా రావలిసిన పనేముంది?" అని.

ఆమె అలా అనడంతోనే సిగ్గుతోనూ, భయంతోనూ జంకే శాడు దేవేంద్రుడు.

ఇంతలో రుచి శరీరం వొదిలి, తన శరీరంలో ప్రవేశించాడు విపులుడు. నిద్రలోంచి లేచినట్టులేచి కళ్ళు తెరిచాడు.

"ఏం దేవేంద్రా! మరిచిపోయావో వెనకటిమాట? నీవొళ్ళంతా యోనులు కావడం తెలుసు లేదూ? ఆ పరాభవం అంతలోనే మరిచిపోయావయ్యా? దేవతలూ, మునులూ సేవించదగినభావం కల నీకు ఇదేమైనా న్యాయంగా వుందటయ్యా? ఛీ, ఛీ! ఇంద్రియాలు అదుపులో వుంచుకోలేని దుర్బలుడివి నువ్వు, కుచ్ఛితాత్ముడివి? నీచుడివి. ఈపాపానికి ఎలా వొడిగట్టుకున్నావయ్యా? మా గురువు కోపాగ్ని వల్ల నీ దేవాధిపత్యం మండిపోదటయ్యా ఇట్టే?" అంటూ చీవాట్లు పెట్టాడు.

తన దివ్యజ్ఞానంతో విపులుడి యోగబలం తెలుసుకున్నాడు దేవేంద్రుడు. తెల్లమొహంవేసి నిలబడి పోయాడు.

"నాకు ఇష్టంలేదు, కాకపోతే భస్మంచేసేద్దును నిన్ను" అంటూ మళ్ళీ గద్దించాడు విపులుడు, ఎదురు చెప్పలేకపోయాడు దేవేంద్రుడు, చప్పున అంతర్థానమైపోయాడు.

తరవాత రుచిని మేలుకున్నట్టు చేశాడు విపులుడు.

గురువు దేవశర్మ యజ్ఞం పూర్తయాక తిరిగి వచ్చాడు. ఏకాంతంగా అతడితో జరిగిందంతా చెప్పాడు విపులుడు.

"మీరు చెప్పినట్టే దేవేంద్రుడు వచ్చాడు. నామూలంగా చిక్కులో పడిపోయాడు. సిగ్గుతోనూ, భయంతోనూ పలాయనం చిత్తగించాడు తుదకి."

శిష్యుడు చేసినపని తెలుసుకుని సంతోషించాడు దేవశర్మ. అతడు కోరిన వరమిచ్చాడు; ఆదరించాడు. తరవాత గొప్ప తపస్సు చేశాడు విపులుడు. దేవేంద్రుడి శంక మాని సుఖంగా రుచితో కాపరంచేశాడు దేవశర్మ.

ఇలా వుండగా ఏనాడు దేవశర్మ ఆశ్రమం మీంచి ఆకాశ మార్గాన దేవతాస్త్రీ ఏకామె వెళుతూ తన చేతిలోని పూలదండ కింద జారవేసింది. దివ్యమైన పరిమళంతో గమ్ముమని పోతూవుం దది. అప్పుడే వికసించినట్టు అందంగానూవుంది. చూసింది రుచి. కుతూహలం కొద్దీ అది తీసింది, తలలో ముడుచుకుంది.

ఇంతలో అంగరాజు చిత్రరథుడు దేవశర్మ ఆశ్రమానికి వచ్చాడు. అతడిభార్యా, రుచీ తోబుట్టువులు. అంచేత తన ఇంట జరిగే ఉత్సవానికి రుచినీ దేవశర్మనీ ఆహ్వానించాడు చిత్రరథుడు అంతిమందీ అంగదేశానికి బయలుదేరారు

ఆకాశంమీంచి దేవతాస్త్రీ పడేసిన పూలదండ రుచికొప్పులో వుంది. దాని దివ్యపరిమళానికి ఆశ్చర్యపోయింది చిత్రరథుడి భార్య.

"ఇలాంటి సువాసన ఎక్కడా చూడలేదు. ఈ పువ్వులు ఎక్కడివి?" అని రుచిని అడిగింది.

"మా ఆశ్రమంలోవే" అంది రుచి.

చెల్లెలితో అలా చెప్పి, దేవశర్మ దగ్గిరికి వచ్చింది రుచి. "ఈ పువ్వులకోసం మా చెల్లెలు సరదాపడుతున్నాది" అంది.

విపులుణ్ణి పిలిచాడు దేవశర్మ. ఆపువ్వులవిషయం చెప్పాడు. అలాటి పువ్వులు పట్టుకు రమ్మన్నాడు. ఆపువ్వులు ఎక్కడ దొరికాయో రుచిని అడిగి తెలుసుకున్నాడు విపులుడు. గురువు ప్రభావమూ, తన తపశ్శక్తీ ఆధారం చేసుకుని, పువ్వులకోసం బయలుదేరాడు. రుచికి దొరికినచోటే దైవికంగా అలాటిదే మరో పూలదండ చూశాడు. పుచ్చుకుని గురువు దగ్గిరికి బయలుదేరాడు. దార్లో వొక ఆడదీ, వొక మగాడూ చెట్టాపట్టాలు వేసుకుని చక్రభ్రమణంతో తిరగడం చూశాడు. "నువ్వు సరిగ్గా తిరగడం లేదు" అంటే "నువ్వు సరిగ్గా తిరగడం లేదు" అని వాళ్ళిద్దరూ వాదులాడుకుంటున్నారు. "నీకాలు తడబడింది" అని వొకరంటే, "నువ్వు వడివడిగా తిరిగావు" అని వొక రన్నారు. "నేను అలా చేసివుంటే పరలోకంలో విపులుడు పోయిన గతికి పోతాను" అని ప్రమాణాలు చేసుకున్నారు.

ఆమాటవిని ముందుకి నడిచాడు విపులుడు. దార్లో మరోచోట ఆరుగురు జూదగాళ్ళు జూదమాడుతూ అవుపించారు. వాళ్ళున్నూ వాదులాడుకుని, వెనకటి స్త్రీపురుషులలాగే వొట్టు పెట్టుకున్నారు.

విని నొచ్చుకున్నాడు విపులుడు, ఎంతో విచారించాడు. "ఏం పాపం చేశానో?" అని ఆలోచించాడు. "రుచి శరీరంలో ప్రవేశించినమాట గురువుగారితో చెప్పలేదు. ఇదే కారణమై వుంటుంది." అని భావిస్తూ గురువుదగ్గిరికి వచ్చాడు. పూలదండ గురువు కిచ్చాడు, అది మరదల కిచ్చి సంతోషపెట్టాడు దేవశర్మ.

అనంతరం కులాసాగా వున్నప్పుడు విపులుడితో అన్నాడు దేవశర్మ:

విపులా! పాపంలేనివాడివి నువ్వు. దార్లో దంపతుల్ని చూశావు. ఆరుగురు జూదగాళ్ళనీ చూశావు. వాళ్ళు, నీలో అధర్మం కనిపెట్టి మాట్లాడారు. అయితే వాళ్ళు ఎవరో తెలుసా నీకు?

"నువ్వు రుచిని కాపాడినవిధం నాతో విడమర్చి చెప్పకపోడం అన్యాయం అనుకున్నావేమో నువ్వు? కాదు. అది పాపమని భావించి వుంటే శాపం పెట్టేవాణ్ణి నేను. ఆపని పాపం కాకండా వర మిచ్చాను. కనక అది మరిచిపో నువ్వు.

"నువ్వు చూసిన దంపతులు రాత్రింబగళ్ళు. ఆరుగురు జూద గాళ్ళు ఆరు ఋతువులు."

గురువు జ్ఞానానికి ఆశ్చర్యపోయాడు విపులుడు. అతడి అనుగ్ర హంతో ఆనందపరవశు డయ్యాడు. ఇంకా ఇలా అన్నాడు దేవశర్మ.

"పగలూ, రాత్రీ, ఋతువులూ – ఇవి మనిషి చేస్తున్న సుకృతమూ, దుష్కృతమూ చూస్తూవుంటాయి. కనక, ఎంత రహస్యమైన పనైనా 'నన్ను ఎవరూ ఎరగరు' అని అనుకోడం తన్ను తాను మోసం చేసుకోడమే.

"ఆడదాన్ని రక్షించడం అసాధ్యం. అతిసూక్ష్మమైన పని. నువ్వు అలా సాహసించావు, మావంశం చెడకండా ఉపాయం చేశావు. ఇది గుణమే కాని అవగుణ మెందుకవుతుంది? నువ్వు అలా చేసిన విధం నువ్వు నాతో చెప్పలేదు. చెప్పకపోతే నేమీ? చేసిన పనేమో మంచిదే కదా!" అంటూ విపులుణ్ణి వోదార్చాడు. అతడి విచారం పోగొట్టాడు.

దేవశర్మా, రుచీ, విపులుడూ చివరికి పుణ్యలోకాలకి పోయారు.

ధర్మరాజా! స్త్రీల స్వభావం వినిపించాను. వాళ్ళని కని పెట్టడం, నిజంగా కష్టమైన కార్యం. ఎంతోమంది స్త్రీలు క్రీడాసక్త లయే వుంటారు అయితే వాళ్ళలో మంచివాళ్ళున్నూ వుంటారు. కులధర్మం నిలబెట్టేవాళ్ళవల్లే లోకం ఏ అపాయమూ లేకండా సాగుతూవుంది. పతివ్రత అయిన ఆడదంటే దైవమే అనుకో. ఆమె కంటే వేరే దైవం లేదు. మంచిభార్యవుంటే ధర్మమూ, అర్థమూ, సుఖమూ, ఖ్యాతీ – అన్నీ కలుగుతాయి.

## వివాహవిధులు

ధర్మరాజు :

వివాహావిధులు వివరించు.

భీష్ముడు :

కులమూ, శీలమూ, విద్యా కల పెళ్ళికొడుకుని పిలిచి, ఉదక దాన పూర్వకంగా కన్యనిచ్చి పెళ్ళిచెయ్యడం బ్రాహ్మ వివాహం.

పడుచుపిల్ల వరుణ్ణి కోరినా, వరుడు ఆమెమీద ఆసపడినా — వాళ్ళ పరస్పరప్రేమ తెలుసుకుని, సంతోషపూర్వకంగా పెద్దలు వాళ్ళిద్దరికీ పెళ్ళిచేయడం క్షాత్రవివాహం.

కన్య కంటికీ, మనస్సుకీ నచ్చిన వరుడికి ఆమెనిచ్చి పెళ్ళి చెయ్యడం గాంధర్వ వివాహం.

శుల్కం పుచ్చుకుని పెళ్ళిచెయ్యడం ఆసురవివాహం.

క్రౌర్యంతో కన్యబంధువుల్ని పోట్లాటలో వోడించి, వాళ్ళూ ఆ కన్యా దుఃఖిస్తూ వుండగా బలవంతంగా ఆమెని తెచ్చి, కట్టుకోడం రాక్షసవివాహం.

ఇలా వివాహాలు అయిదురకాలు.

---

* మనుస్మృతీ, గౌతమ ధర్మసూత్రాలూ మొదలైనవి ఎనిమిది విధాలని చెపుతున్నాయి.

శ్లో. బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః,
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచ శ్చాష్టమోఽధమః.

బ్రాహ్మమూ, దైవమూ, ఆర్షమూ, ప్రాజాపత్యమూ, ఆసురమూ, గాంధర్వమూ, రాక్షసమూ. పైశాచమూ అని (వివాహం) ఎనిమిది రకాలు. ఎనిమిదోదైన పైశాచం అధమమైంది. మను. 3.21.

శ్లో. ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్,
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః.

వేదాలు చదివి, శీలవంతుడైన బ్రహ్మచారిని స్వయంగా పిలిచి, గౌరవించి. ముస్తాబుచేసి, కన్యనిచ్చి చేసిన వివాహం బ్రాహ్మవివాహం అనిపించుకుంటుంది.

ఈ ఎనిమిదింటిలోనూ మొదటి మూడూ ధర్మసమ్మతమైనవి. ఆసురమూ, రాక్షసమూ ధర్మవిరుద్ధమైనవి.

తల్లీ, తండ్రీ, అన్నదమ్ములూ లేని కన్యని వివాహం చేసుకో కూడదంటారు వివాహధర్మం తెలిసిన పెద్దలు.

తన కులంలో పుట్టిన కన్యనీ, క్షత్రియ వైశ్య కులాల్లో పుట్టిన కన్యల్నీ క్రమంగా వివాహం చేసుకోవచ్చు బ్రాహ్మడు. శూద్రజాతి కన్య గర్భంలోమాత్రం అతడు సంతానం కనడం పాపహేతువు.

శ్లో. యజ్ఞే తు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే,
అలంకృత్య సుతాదానం దైవం ధర్మ్యం ప్రచక్షతే.

యజ్ఞాల్లో ఆధ్వర్యం చేసే ఋత్విజుడికి అలంకరించిన కన్యనిచ్చి పెళ్ళిచెయ్యడం దైవవివాహం అనిపించుకుంటుంది.

శ్లో. ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః,
కన్యాప్రదానం విధివదార్షో ధర్మస్స ఉచ్యతే.

ఒక గోమిథునం, లేదా రెండు ఎద్లూ వరుడిదగ్గరపుచ్చుకుని కన్యనిచ్చి శాస్త్ర ప్రకారం పెళ్ళిచెయ్యడం ఆర్షవివాహం అనిపించుకుంటుంది.

శ్లో. సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ,
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః

మీ ఉభయులూ కలిసి ధర్మం ఆచరించండి అంటూ కన్య తల్లిదండ్రులు వరుణ్ణి పూజించి, కన్యాదానం చెయ్యడం ప్రాజాపత్యవివాహం అనిపించుకుంటుంది.

శ్లో. జ్ఞాతిభ్యో ద్రవిణం దత్త్వా కన్యాయై చైవ శక్తితః,
కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్యతే.

జ్ఞాతులకీ, కన్యకీ కావలిసిన ధనం ఇచ్చి స్వేచ్ఛగా చేసుకున్న పెళ్ళి ఆసుర వివాహం అవుతుంది.

శ్లో. ఇచ్ఛయాఽన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ,
గాంధర్వస్సతు విజ్ఞేయో మైథున్యః కామసంభవః.

వధువూ వరుడూ సమ్మతించి తమంతతాము కలియడం గాంధర్వవివాహం. కామంవల్ల కలిగింది కనక ఇది మైథునంకోసమే ఏర్పడింది.

శ్లో. హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం గృహాత్,
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే.

క్షత్రియుడు క్షత్రియకన్యనీ, వైశ్యకన్యనీ వివాహమాడవచ్చు. వైశ్యుడూ, శూద్రుడూ తమజాతిపిల్లల్నే పెళ్ళిచేసుకోవాలి. అయితే, క్షత్రియుడూ, వైశ్యుడూ కూడా శూద్రజాతి కన్యల్ని కట్టుకోడం కద్దు.

ధర్మరాజు :

బ్రాహ్మడు కూడా శూద్రజాతిపిల్లని పెళ్ళాడవచ్చని విన్నాను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యజాతికన్యల్ని మాత్రమే అతడు పెళ్ళాడడం ధర్మమంటున్నావు నువ్వు. ఏమిటెది ?

భీష్ముడు :

---

కన్యబంధువులు సమ్మతించకపోతే, వాళ్ళని చంపో, నరికో, చీల్చో — అందుకుఏడుస్తున్న కన్యని బలవంతంగా ఎత్తుకుపోయి కట్టుకోడం రాక్షసవివాహమంటారు.

శ్లో. సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి,
స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః.

నిద్రపోతున్న కన్యని, లేదా మత్తులో వున్నదాన్ని, లేదా ఉన్మత్తస్థితిలో వున్న దాన్ని ఏకాంతంలో బలవంతంగా హరించి సంభోగించడం పైశాచమనిపించుకుంటుంది. ఈ ఎనిమిదో వివాహం అధమమైంది. — మనుస్మృతి. 3.27—34.

సూ. బ్రాహ్మో విద్యాచారిత్రబంధు శీలసంపన్నాయ దద్యా దాచ్ఛాద్యాలంకృతామ్.

విద్యా, నడవడీ, శీలమూ, బందువులూ వున్న వరుణ్ణి చూసి, నగలతో ముస్తాబుచేసి, మంచి బట్టలు కట్టించిన కన్యనిచ్చి చేసినపెళ్ళి బ్రాహ్మం.

సూ. సంయోగమంత్రః ప్రాజాపత్యే సహధర్మశ్చర్య తామితి.

ఈమెతో కలసి ధర్మం ఆచరించు అని సంయోగమంత్ర పూర్వకంగా కన్యాదానం చెయ్యడం ప్రాజాపత్యం.

సూ. ఆర్షే గోమిథునం కన్యావతే దద్యాత్.

కన్యాదాతకి గోమిథునమిచ్చి చేసుకున్న పెళ్ళి ఆర్షం.

సూ. అంతర్వేద్యృత్విజే దానం దైవోలం కృత్య.

అలంకరించిన కన్యని ఋత్విజుడికి యజ్ఞకాలంలో దానంచెయ్యడం దైవం.

విషమకార్యం ఏదైనా వచ్చిపడినప్పుడూ, లేదా మితిమీరి వలచినప్పుడూ, లేదా లోభంవల్లా శూద్రజాతి పిల్లని భార్యగా కట్టుకుంటాడు బ్రాహ్మడు. ఏమంటే అది అంత పాపం కాదు కనక, అక్కడక్కడ ఈపద్ధతి తప్పులేకండా చెల్లుతుంది. *

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యకన్యలకు బ్రాహ్మలవల్ల కలిగిన కొడుకులు బ్రాహ్మలే అవుతారు. శూద్రస్త్రీకి కలిగిన కుమాళ్ళకి మాత్రం బ్రాహ్మణత్వంలేదు.

## ఆస్తి విషయం

ధర్మరాజు :

బ్రాహ్మడికి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతిస్త్రీల గర్భంలో పుట్టిన కుమాళ్ళకి అతడి ఆస్తిలో వాటా ఎలాలభిస్తుంది?

సూ. ఇచ్ఛంత్యా స్స్వయం సంయోగో గాంధర్వః.
వరుడూ, కన్యా వొకళ్ళ నొకళ్ళు ప్రేమించుకుని పొత్తుకలియడం గాంధర్వం.

సూ. విత్తేనానతి స్త్రీమతా మాసురః.
కన్యాశుల్కమిచ్చి చేసుకున్న పెళ్ళి ఆసురం.

సూ. ప్రసహ్యాదానా ద్రాక్షసః.
బలాత్కారంగా కన్యనిఎత్తుకుపోయి కట్టుకోడం రాక్షసం.

సూ. అసం విజ్ఞాతో పసంగ మాత్పైశాచః
ఒళ్ళు తెలియకండా వున్న కన్యతో పొత్తుకలియడం పైశాచం—గౌతమధర్మ సూత్రాలు 1.4.4-11.

ప్రాజాపత్యమూ, ఆర్షమూ, దైవమూ, పైశాచమూ భారతంలో లేవు. భారతంలో మాత్రమే ప్రాజాపత్యం. పైశాచం వివాహమే కాదని భారతం—"పైశాచశ్చాసురశ్చైవ నకర్తవ్యో కథంచన" అని సం. మూలం. 44.9

* యదుచ్యతే ద్విజాతీనాం శూద్రాద్దారోపసంగ్రహః, నైతన్మమమతం యస్మాత్తత్రాత్మాజాయతే స్వయమ్. బ్రాహ్మలూ, క్షత్రియులూ, వైశ్యులూ శూద్రకులంలోంచి స్త్రీలని పరిగ్రహించడం నాకు సమ్మతంకాదు. ఏమంటే ఆమెలో తాను స్వయంగా పుడతాడు కనక. —యాజ్ఞవల్క్యస్మృతి. వివాహప్రకరణమ్. 57

భీష్ముడు :

బ్రాహ్మడి ఆస్తి పదిపాళ్ళుగా చేసి, అందులో నాలుగు పాళ్ళు బ్రాహ్మణస్త్రీకి పుట్టిన కుమారుడికి ఇవ్వాలి. మూడు పాళ్ళు క్షత్రియ స్త్రీకి పుట్టిన కుమారుడికి ఇవ్వాలి. రెండు పాళ్ళు వైశ్యస్త్రీకి పుట్టిన వాడికి ఇవ్వాలి. ఒకపాలు శూద్రస్త్రీకి పుట్టినవాడికి ఇవ్వాలి. శూద్ర స్త్రీకుమారుడికి పై వాళ్ళు దయతలిచి ఇస్తేనే వాడు వాటాపుచ్చుకో వాలి. అంతేకాని తన తండ్రితో కాని, అన్నదమ్ములతో కాని దెబ్బ లాడి పుచ్చుకునే అధికారం వాడికి లేదు. అయితే ఆపదో పాలు వాడికి ఇవ్వకండా దయతప్పి తామే కాజెయ్యడంకూడా వాళ్ళకి ధర్మం కాదు.

ధర్మరాజు :

తక్కిన వర్ణాలవాళ్ళ ఆస్తి ఎలా వాటాలు వెయ్యాలి ?

భీష్ముడు :

క్షత్రియుడి ఆస్తి ఎనిమిది వాటాలు వెయ్యాలి. క్షత్రియస్త్రీకి పుట్టిన కుమారుడికి నాలుగు వాటాలూ, వైశ్యస్త్రీకి పుట్టినవాడికి మూడువాటాలూ ఇవ్వాలి. మిగిలిన వొక్క వాటా శూద్రస్త్రీకి పుట్టినవాడికి ఇవ్వాలి.

వైశ్యుడి ఆస్తి అయిదుభాగాలు చెయ్యాలి, వైశ్యస్త్రీకి పుట్టిన వాడికి నాలుగుభాగాలూ, శూద్రస్త్రీకుమారుడికి వొక్కభాగమూ ఇవ్వాలి. శూద్రస్త్రీకుమాళ్ళు తగువులాడి ఆస్తి పుచ్చుకునే అధి కారం లేదు. అలాగని వాళ్ళకి ఆస్తిలో వాటా ఇవ్వకండా దిగమిం గడమున్నూ పై వాళ్ళకి తగదు.

ఇక శూద్రుడికి తనజాతిస్త్రీగర్భంలో ఎంతమందిపుట్టినా వాళ్ళం దరూ సమభాగంగా అతడి ఆస్తి పంచుకోవాలి. ఇదే ధర్మపద్ధతి.

బ్రాహ్మడికి ఇతరజాతిస్త్రీలు భార్యలుగా వుండినా హవ్యకవ్యా

లకీ, మజ్జన భోజనాలకీ, బ్రాహ్మణజాతిస్త్రీయే పనికివస్తుంది. ఇతర జాతిది పనికిరాదు.

## పుత్రుల భేదాలు

ధర్మరాజు :

కుమారుళ్ళు బహువిధాలని విన్నాను. ఆ వివరాలు వివరించు.

భీష్ముడు :

తన ధర్మపత్నిగర్భంలో ధర్మవిధిగా కలిగిన కుమారుడు ఔరసు డనిపించుకుంటాడు. అతడే ఉత్తముడు, ప్రథముడు.

తగినవరుడికి ఇచ్చి పెళ్ళిచేసిన కుమార్తె కన్నకుమారుణ్ణి అల్లుడూ కూతురూ అంగీకరించాక, 'పీడు నాకొడుకు' అని పెంచు కున్న కుమారుడు పుత్రికాపుత్రుడవుతాడు.

ధర్మమార్గంగా తగిన పురుషుడిదగ్గిరికి తన భార్యని పంపి, అతడివల్ల తన భార్యగర్భంలో కలిగిన కుమారుడు క్షేత్రజుడనిపించు కుని, తన కుమారుడే అవుతాడు.

కన్న తల్లిదండ్రులు ఉదకదానపూర్వకంగా ఇస్తే, పెంచుకున్న కుమారుణ్ణి దత్తపుత్రుడంటారు.

తల్లీతండ్రీపోయి, దిక్కు-మాలి తిరుగుతున్న వాణ్ణి తెచ్చి పెంచు కుంటే అతణ్ణి కృత్రిమపుత్రుడంటారు.

ఎవడికి పుట్టాడో తెలియకుండా ఎవడికో వొకడికి పరభార్య గర్భంలో పుట్టినవాడు, ఆభార్యకలవాడికి గూఢజపుత్రు డవుతాడు.

తల్లిదండ్రులు వొల్లకండా వొదిలిపెట్టేసినవాణ్ణి మరొకడు తెచ్చి పెంచుకుంటే, ఆకుమారుణ్ణి అపవిద్ధకుమారు డంటారు.

పెళ్ళికాకముందు కన్నవారింట, కన్య కుమారుణ్ణికంటే, ఆమెని పెళ్ళిచేసుకున్నవాడి కుమారుడే అవుతా డతడు. అలాటి కుమారుణ్ణి కానీను డంటారు.

కడుపుతో వున్న కన్యని తెలిసైనా తెలీకయినా పెళ్లిచేసుకున్నాక పుట్టిన బాలుడు, ఆపెళ్ళాడినవాడి కుమారుడే అవుతాడు. అలా పుట్టినకుమారుణ్ణి సహోఢు డంటారు పండితులు.

మగణ్ణి విడిచిపెట్టిన ఆడదీ, మగడు విడిచిపెట్టిన ఆడదీ, మగడు చచ్చిన ఆడదీ, తాను కన్యగా వున్నప్పుడు కుమారుణ్ణి కంటే ఆకుమారుడు, అతణ్ణి ఎవరు పెంచితే వారి కుమారుడవుతాడు. అలాటివాణ్ణి పౌనర్భవు డంటారు.

తల్లీ, తండ్రీ లేకపోయినా, వాళ్ళు వొదిలిపెట్టేసినా, తనంత తాను వెళ్ళి కుమారుడిగా కుదురుకుంటే అతణ్ణి స్వయందత్తు డంటారు.

తల్లిదండ్రులదగ్గిర తన కులంకుర్రాణ్ణి కొనుక్కుని పెంచుకుంటే, అలాంటివాణ్ణి క్రీతపుత్రు డంటారు పండితులు.

ఈ పన్నెండురకాల కుమాళ్ళూ వైదికకర్మలకి అర్హులే అవుతారు. ఇంతమందిలోనూ ఔరసుడు ముఖ్యుడు. కూతురికొడుకు కూడా ఔరసుడితో సమానుడే అవుతా డంటారు పండితులు. తక్కిన వాళ్ళు తమని కన్నతల్లిదండ్రుల కులాలు రెండూ ఉత్తమమైనవైతే, తమతమ విద్యుక్తధర్మంలో లోపం రాకండా నడుచుకుంటే వేదాలు విధించిన ధర్మకలాపాలు నిర్వహించడానికి యోగ్యులవుతారు.

## స హ వా స స్నే హ ం

ధర్మరాజు :

సహవాసంవల్లా, సందర్శనంవల్లా పుట్టే స్నేహం ఎలా వుంటుంది? ఈవిషయమూ, గోమహాత్మ్యమూ తెలుసుకోవాలనుంది, వివరించు.

భీష్ముడు :

ఈవిషయంలో చ్యవనమునికీ, నహుషమహారాజుకీ జరిగిన సంవాదం ఇతిహాసరూపంలో వుంది. అది నువ్వు అడిగిన రెండు విషయాలకీ సమాధానమవుతుంది. చెపుతాను, విను.

మహాత్ముడు భార్గవచ్యవనుడు గంగా యమునా నదుల సంగమం దగ్గిర నిష్ఠతో నీళ్ళలో మునిగి స్థిరంగా కూచుని సమాధినిష్ఠు డయాడు. చేపలు వచ్చి తన చుట్టూ మూగాయి. తన శరీరంమీద చేరి వాసన చూశాయి. దయతో వాటిని ఏమీ అనకుండా అలా పన్నెండేళ్ళు తపస్సుచేశా డతడు.

ఓనాడు జాలరులు అక్కడికి వచ్చి, చేపలకోసం వల వేశారు. చేపలతోపాటు చ్యవనమునిని కూడా వలలో పట్టి పైకి లాగారు. తీరా పైకిలాగాక మునిని చూసి భయపడిపోయారు వాళ్ళు. సాగిల బడ్డారు.

"తప్పు క్షమించు. తెలియక ఇంతపని జరిగిపోయింది. దయ చూడు స్వామీ! ఏం చెయ్యగలం? సెలవియ్యి" అంటూ కాళ్లా వేళ్లా పడ్డారు.

సహవాసంతో చేపలమీద స్నేహమూ, సందర్శనంతో జాలరులమీద జాలీ కలిగి, రవంతా కోపం తెచ్చుకోలేదు చ్యవన ముని. ఏటిలోంచి పైకి తీసిన చేపలవేపు చూస్తూ జాలర్లతో అన్నా డతడు:

"ఇన్నాళ్ళూ వీటితో సహవాసం చేశాను. అంచేత ఇవంటే ప్రాణంలా వుంది నాకు. వీటితో నా ప్రాణాలుకూడా విడిచిపెట్టడమే న్యాయం. కనక నేను చెప్పినట్టు చెయ్యండి మీరు. తగిన వెలకి ఈ చేపల్నీ, నన్నూ అమ్ముకోండి.

మునిమాటలు విని, భయపడుతూ నహుషుడి దగ్గిరికి పరిగె త్తారు జాలర్లు. జరిగిందంతా విన్నవించారు. భయసంభ్రమాలతో వున్న పాళాన మంత్రులతోనూ, పురోహితులతోనూ పరిగెత్తుకు వచ్చాడు నహుషమహారాజు. మునికి సాష్టాంగదండప్రణామం చేశాడు. "జాలర్లు అపరాధం చేశారు. దీనికి ఏమిటి ప్రతీకారం?" అంటూ చేతులు జోడించాడు.

"వాళ్ళ కులధర్మం వాళ్ళు చేశారు జాలర్లు" నెమ్మదిగా అన్నాడు దయామూర్తి చ్యవనముని, "అది అపరాధ మెలా అవుతుంది? నేను చెప్పేది విను. వీళ్ళుఎంతో ఆయాసపడ్డారు వల వేసి. కనక నా శరీరానికి తగిన వెల వీళ్ళకి చెల్లించు."

మునిమనస్సులో రవంతా కోపం లేకపోడం చూసి కుదుట పడ్డాడు నహుషుడు. సంతోషించాడు. జాలర్లకి వెయ్యిమాడలు * ఇమ్మని మంత్రులతో చెప్పాడు.

"తగ వెరిగి ఇవ్వాలి" అన్నాడు చ్యవనుడు.

"పదివేలమాడలు ఇమ్మన్నాడు నహుషుడు.

"తగ వెరిగి ఇవ్వాలి" మళ్ళీ అన్నాడు చ్యవనుడు.

లక్షమాడలు ఇమ్మన్నాడు నహుషుడు.

"తగ వెరిగి ఇవ్వాలి" మళ్ళీ అదేమాట అన్నాడు చ్యవనుడు.

కోటిమాడలు ఇమ్మన్నాడు నహుషుడు.

"తగినవెల ఇవ్వవద్దూ?" తలవూపేసి అన్నాడు చ్యవనుడు.

రాజ్యంలో సగం ఇమ్మన్నాడు నహుషుడు.

"ఊఁహూ, తగినవెల కాదు" అంటూ పెదవివిరిచేశాడు చ్యవనుడు.

తన రాజ్యం యావత్తూ జాలర్లకి ఇస్తానన్నాడు నహుషుడు.

అబ్బే, సరిపోదు. నువ్వూ, నీ మంత్రులూ ఆలోచించుకుని తగినవెల ఇవ్వండి" అన్నాడు చ్యవనముని.

గుండెలో రాయిపడింది నహుషుడికి. విచారం ముంచుకొచ్చింది. పక్కకి వెళ్ళి "ఏందారి?" అంటూ మంత్రులతో విచారిస్తూ కూచున్నాడతడు.

---

* పదహారు రతుల ఎత్తు బంగారం నాణెం వొక మాడ.

ఇంతలో గవిజాతుడని వొక ముని అక్కడికి వచ్చాడు. "విచారించకండి. ఈ మునీశ్వరుడి వెల నేను నిశ్చయిస్తాను." అన్నాడు.

మునిగిపోతున్నవాడికి తెప్ప దొరికినట్టయింది నహుషుడికి. "ఈ పరివారం ఆపదసముద్రంలో మునిగిపోకుండా కాపాడు" అంటూ అతణ్ణి వేడుకున్నాడు.

"ఆవులూ, బ్రాహ్మలూ, వొకటే కులం" అంటూ అందుకున్నాడు గవిజాతుడు, "ఒకకులమే రెండు పాయలుగా చేశాడు బ్రహ్మదేవుడు. హవిస్సుకి కావలసిన పాలూ, నేయీ ఆవులే ఇవ్వాలి. మంత్రాలకి తరవాత ఆధారం బ్రాహ్మలు. వేదాలన్నిటికీ ఆశ్రయంగా వున్న బ్రాహ్మడికి వెలకట్టడం శివుడికయినా సాధ్యం కాదు. మహరాజా! ఆవుకూడా అలాటిదే. అందుచేత ఈ మునీశ్వరుడికి తగినవెల వొక ఆవు తప్ప మరేమీ కాదు" అన్నాడు.

సంతోషించాడు నహుషుడు. చ్యవనమునిదగ్గిరికి వచ్చాడు. "మహాభాగా! అనుగ్రహించు" అంటూ చేతులు జోడించాడు. "నీ శరీరానికి ఇంత వెల అని నిశ్చయించడం ఎవ్వరికీ సాధ్యంకాదు. ఒక ఆవు మాత్రం ఇస్తాను" అన్నాడు.

నహుషుడు అలా అనడంతోనే కలకలమని వికసించిన మొహంతో చూశాడు చ్యవనుడు. "అవును, తగిన వెలఇది. సంతోషించాను. ఆవు అగ్నిమయం, అమృతమయం, హోమవిధానశ్రీవాహిని, స్వర్గానికినిచ్చెన, దేవతలుకూడా పూజించదగింది. కనక నీ నిశ్చయం బాగుంది. జాలర్లకి ఆవు నియ్యి" అన్నాడు.

ముని చెప్పినప్రకారం వొక ఆవు జాలర్లకి ఇచ్చాడు నహుషుడు. సంతోషించారు జాలర్లు. చ్యవనముని దగ్గిరికి వచ్చి, చేతులు జోడించారు.

"మునీంద్రా! మమ్మల్ని చూసింది మొదలు దయచూస్తు న్నావు స్నేహంతో. ఒకటి విన్నవిస్తాము" అంటూ అతడి అనుమతి పొంది, "దయతో మమ్మల్ని కాపాడు. ఈ ఆవు మాదగ్గిర పుచ్చుకో" అంటూ ప్రార్థించారు.

మొగమోటంతో మనస్సు మెత్తపడింది మునికి. "వేడుకుం టున్న లోభిని వాడిగా చూడడం పాముచూపువంటిది. కనక మీ ప్రార్థన కాదనను. మీ కోరిక నెరవేరుస్తాను" అంటూ ఆవు పుచ్చు కున్నాడు చ్యవనముని. కాని అంతలో వూరుకోలేదతడు. సంద ర్శనస్నేహంతో చల్లనిచూపు చూశాడు జాలర్లని. చేపలమీద సహవాసస్నేహం గాఢంగా వుంది. అంచేత, "మీరూ, ఈ చేపలూ, సంతోషంగా స్వర్గానికి వెళ్ళండి" అని అందరూ వింటూవుండగా వరమిచ్చాడు.

చ్యవనముని అలా అనడమే తడువు, చేపలూ జాలర్లూ తను వులతోనే స్వర్గానికి ఎగిరి వెళ్ళారు. సపరివారంతో నహుషుడు నిచ్చెర పోతూ చూశాడు.

అప్పుడు చ్యవనుడూ గవిజాతుడూ నహుషుణ్ణిదగ్గిరికి పిలిచి, "రెండు వరాలు ఇవ్వదలుచుకున్నాం నీకు, ఏం కావాలో కోరుకో" అన్నారు.

"మీ ప్రేమకంటే నాకు కావలసింది ఏముంది?" అన్నాడు నహుషుడు.

నహుషుడి మాటలు విని అతణ్ణి ఆదరించారు మునులు. "ధర్మ పరత్వమూ, దేవేంద్ర వైభవమూ, నీకు కలుగుతాయి" అని చెప్పి అంతర్హితులయారు.

అద్భుతమూ, ఆనందదాయకమూ అయిన ఆ మునీశ్వర్ల మహిమ మెచ్చుకుంటూ, తన ప్రజలందరూ ఆరాధిస్తూ వుండగా రాజధానికి తిరిగివచ్చాడు నహుష మహారాజు.

ధర్మరాజా! సహవాసంవల్లా సందర్శనంవల్లా కలిగిన స్నేహానుబంధమూ, గోమాహాత్మ్యమూ వీనుల విందుగా వినిపించాను. ఇంకా ఏం వినాలనుందో అడుగు నాయనా!

## పరశురామ, విశ్వామిత్రుల జన్మగాథ

ధర్మరాజు :

ఒకటి వినాలని ఎప్పుడూ కుతూహలంగా వుంటుంది నాకు. ఉత్తమమైన భార్గవబ్రాహ్మణవంశంలో విచిత్ర క్షాత్ర చరిత్రుడైన పరశురాముడు జన్మించడమూ, ఉత్తమ ప్రతాపవంతమైన క్షత్రియవంశంలో పరమ బ్రాహ్మణ్యుడైన విశ్వామిత్రుడు పుట్టడమూ ఎలా సంభవించిందా అనుకుంటాను. వెనక ఈ విషయం కొంత వినక పోలేదు. అయినా నాసందేహం పూర్తిగా తీరలేదు. కనక మహాత్మా! నామనస్సుకి పట్టినట్టు ఈవిషయం విడమర్చి వినిపించు.

భీష్ముడు :

చ్యవన కుశిక సంవాదం అని వొక ఇతిహాసం వుంది. అది వినిపిస్తాను విను, దానితో నీ సంశయం తీరి పోతుంది.

తన వంశానికి కుశికవంశంవల్ల సంకరం కలుగుతుందని తెలుసుకుని కుశికకులానికి ఉత్పాతం కలిగించాలని నిశ్చయించాడు చ్యవనుడు. అందుకని కుశికమహారాజు దగ్గిరికి వెళ్ళాడతను. భార్యతో కలిసి చ్యవనమునిని యథావిధిగా పూజించాడు కుశికుడు.

“మునీంద్రా! ఈ రాజ్యానికి నువ్వే అధికారివి. నన్ను నీ భృత్యుడిగా ఏలుకో” అన్నాడు వినయంగా. “నేను, నాభార్యా, బంధువులూ, నాప్రజలూ నీఅడుగులికి మడుగులొత్తుతాము. సంతోషంతో కాలంగడుపుతాము. మమ్మల్ని ఏలుకో” అని చేతులు జోడించాడు.

“రాజ్యకాంక్ష నా మనస్సులో లేదు” కుశికుడిమాటలు విని

అన్నాడు చ్యవనముని, "మంచి దీక్షవ్రతం పూని నీదగ్గిరకి వచ్చాను. నువ్వూ నీభార్యా పరిచర్య చెయ్యాలి నాకు. ఇంతే నాకోరిక. ఈ కోరిక తీరిస్తే చాలు."

చ్యవనముని కోరిక విని సంతోషించారు రాజదంపతులు. "నీ ఆజ్ఞప్రకారమే చేస్తాం" అన్నారు. అతణ్ణి లోపలిలోగిలికి తీసుకు వెళ్ళారు. అక్కడ చక్కని దీక్ష భవనం చూపారు.

"మహాత్మా, ఇక్కడ నివసించు" అంటూ మెత్తటి పక్కా ఆసనాలూ ఏర్పరిచారు. "నీకు ఏం కావాలో ఆదేశించు. సంతో షంతో నీ అజ్ఞ పాలిస్తాము" అన్నారు.

ఇంతలో పొద్దుగూకింది. కాల్యకృత్యాలు తీర్చుకున్నాడు చ్యవనముని. భోజనం కావాలన్నాడు. దివ్యమైన భోజనంపెట్టి అతణ్ణి తృప్తిపరిచాడు కుశికుడు. భోజనానంతరం పక్కమీద పడు కున్నాడు ముని.

"ఇక్కడే నిద్రపోతాను. రాజా! నువ్వూ, నీభార్యా నిద్ర పోకండా జాగ్రత్తగా నాపాదాలు వొత్తుతూ వుంటే సంతోషిస్తాను. నాఅంతట నేను మేలుకునేదాకా నువ్వుకాని నీభార్యకాని నన్ను లేప కండి" అని చెప్పి నిద్రపోయాడు.

రాజదంపతులు ఇద్దరూ నిద్రాహారాలు మానుకుని, భక్తి పూర్వకంగా మునిపాదాలు పడుతూ కూచున్నారు. చిత్రం, కదల కండా వొకేపక్కని ఇరవై వొక్కదినాలు నిద్రపోయాడు చ్యవనముని. ఇరవై రెండోనాడు తనంత తాను కళ్ళువిప్పాడు. మేలుకోడమే తడువు, మాటాడకండా ఇంటినుంచి బయటికి వెళ్ళిపోయాడు.

రాజదంపతులు అన్నాళ్ళూ నిద్రాహారాలులేక బాగా అలిసి పోయారు. అయినా మునివెంట బయలుదేరారు. అయితే వాళ్ళ వూసే పట్టించుకోలేదు మునీశ్వరుడు. వాళ్ళవేపు కన్నెత్తి చూడ

నన్నా చూడలేదు. అలా కొంతదూరం వెళ్ళివెళ్ళి మాయమై పోయా డతడు.

ముని కనపడకపోడంతోనే మూర్ఛపోయారు రాజదంపతులు. కొంచేపటికి మేలుకున్నారు. విచారిస్తూ ఇంటికి వచ్చారు. లోపలికి వచ్చి చూసేసరికి మొదటిపక్కమీద కాక, మరోపక్కమీద నిద్ర పోతున్నాడు ముని. కష్టమంతా మరిచిపోయారు రాజదంపతులు. ఎప్పటిలాగే అతడిపాదాలు పట్టడం మొదలెట్టారు.

అలా మరో ఇరవైవొక్కదినాలు గడిచాయి. ఇరవైరెండో నాడు లేచాడు ముని. తైలాభ్యంగం కావాలన్నాడు. మంచి కమ్మని నూనె తెప్పించారు రాజదంపతులు. ముని వొంటికీ, తలకీ పట్టించారు. చెడామడా తిట్టాడు ముని. మరుక్షణంలో మాయమై పోయాడు. అపరఘడియలో మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు. సిద్ధకార్యులై వున్న రాజదంపతుల్ని చూసి సుముఖుడయ్యాడు. స్నానాదికాలు ముగించుకున్నాడు. దివ్యమైన అన్నపానాలు సిద్ధంచేసి, భోజనానికి రమ్మన్నారు రాజదంపతులు. పిలవగానే వెళ్ళాడు ముని. వడ్డించిన పదార్థాలన్నీ చూశాడు. దిగ్గున తిరిగాడు. ఎక్కడికో వెళ్ళిపోయాడు. దిగాలుపడి కూచున్నారు రాజదంపతులు. ఆపగలూ, రాత్రీ గడిచి పోయాయి. మర్నాడు భళ్ళుమని తెల్లవారేసరికి ప్రత్యక్షమయ్యాడు చ్యవనముని.

"రాజా!" కుశికమహారాజుతో అన్నాడు ముని, "వెంటనే రథం సిద్ధంచెయ్యి. నువ్వూ, నీరాణీ రథం లాగాలి. బంగారమూ, రత్నాలూ, ఆవులూ యాచకులకి దానంచేస్తూ వెళ్ళాలి నేను."

ఉత్తరక్షణంలో రథం సిద్ధంచేసి తెచ్చాడు కుశికమహారాజు. ఎడమపక్క రథానికి తన భార్యని పూన్చాడు. కుడిపక్క తాను పూనాడు. ముని కోరిన వస్తువులు యావత్తూ ఇవ్వండని తన మంత్రులకి ఆదేశించాడు.

రథమెక్కాడు చ్యవనముని. వాడి మునికోలతో రాజునీ, రాణినీ రక్తాలు కారినట్టు పొడుస్తూ, బాదుతూ బయలుదేరాడు. దీనులకి బంగారమూ, రత్నాలూ, అవీ పంచిపెడుతూ ముందుకి సాగాడు.

ఎన్నాళ్ళయో నిద్రాహారాలు లేక తూలిపోతూ, ముని ముని కోలపోట్లకి రోజుకుంటూ రథంలాగుతూ నడిచారు రాజదంపతులు. ముని వాడి మునికోలతో పొడుస్తూవుంటే, బాదుతూవుంటే రక్తాలు కారి, పూసిన మోదుగులలా అవుపించారు వాళ్ళు. దారికడాకూ చూసిన జనమంతా ముక్కుమీద వేలుపెట్టుకున్నారు. "ఇలాంటి తపోమహిమ ఎక్కడన్నా వుందా? అన్యాయ మిది" అన్నారు. "కోపం తెచ్చుకుందికి వల్లకాదు. న్యాయం కాదనడానికీ వీలు లేదు. తేరచూడడానికీ శక్యంకాదు. రాజదంపతుల ధీరత్వమూ, నిష్ఠాపరత్వమూ ఎంత గొప్పగా వున్నాయో! భరించరాని భారం నిర్వికారంగా భరిస్తున్నారు!" అంటూ విచారించారు. రథం చుట్టూమూగుతూ, వెంటనడిచారు.

రాజవీధిని నడిచిపోయింది రథం. పట్నం దాటి పోయింది. రాజదంపతుల హృదయాలలో ఏ వికారమూ కలగలేదు. చూసి, ఆశ్చర్యపోయాడు చ్యవనముని. మనసావాళ్ళని మెచ్చుకున్నాడు. రథం దిగాడు. రాజదంపతులకు కట్టిన పగ్గాలు వొదిలిపెట్టాడు. వాళ్ళ దగ్గిరికివెళ్ళాడు. ఉభయుల శరీరాలూ చేతులతో నిమిరాడు.

"అలిసిపోయారు కదూ!" రాజుమొహం చూస్తూ అన్నాడు ముని, "వరమిస్తాను. విచారించకు. పట్నానికి వెళిపో. గంగవొడ్డుకి వెళ్ళి, వ్రతశేషం పూర్తిచేస్తాను నేను. నువ్వూ, నీ రాణీ రేపు నా దగ్గిరికి, గంగవొడ్డు అడివికి రండి."

"మునీంద్రా!" ప్రసన్నచిత్తంతో అన్నాడు కుశికమహా రాజు, "మాకు విచారమే లేదు."

తన శరీరమూ, భార్యశరీరమూ చూసి ఆశ్చర్యపోయాడు రాజు. "భగవానుడా! కరుణామూర్తివి నువ్వు" అంటూ ఆనందంతో మునిముందు అంజలిబంధం చేశాడు. "నీ ప్రభావం ప్రశంసించడానికి ఏపాటివాళ్ళం మేము! ఏ శ్రమా లేదు నాకు. మునికోల గాయాలున్నా లేవు. నా భార్యా, నేనూ నవయౌవనంలో వున్నాం. మహాఅద్భుతం ఇది. నీ మహానుభావత్వం ఎంతైనా చేస్తుంది." అంటూ భార్యతో కలిసి మునికి దండప్రణామం చేశాడు. అతడి సెలవుతీసుకున్నాడు. యావన్మంది ప్రజలూ అద్భుతహృదయాలతో మూగి వెంటరాగా పట్నంలో ప్రవేశించాడు. సంతోషంగా ఆ రాత్రీ, పగలూ గడిపాడు. మర్నాడు సూర్యోదయంతోనే ప్రాతఃకాలకృత్యాలు ముగించుకున్నాడు. భక్తిహృదయంతో బయలుదేరాడు. ముని నిర్దేశించిన అడివికి వెళ్ళాడు. అక్కడ మణులతో అతిసుందరమైన, దివ్యమైన మేడ చూశాడు. ఆశ్చర్యపోయాడు. ఆ మేడచుట్టూ అందమైన మండపాలున్నాయి. వాటిమీద వేదాభ్యాసం జరుగుతోంది. సంగీతసాహిత్య చర్చలు సాగుతున్నాయి. చుట్టూ చక్కని తోటలున్నాయి. వాటిలో కోకిలలూ, చిలకలూ, తుమ్మెదలూ పాటలుపాడుతున్నాయి. అక్కడక్కడ రమణీయమైన సరోవరాలున్నాయి. వాటిలో హంసలూ, బెగ్గురుపిట్టలూ కిలకిల కూస్తున్నాయి. అక్కడక్కడ క్రీడాపర్వతాలున్నాయి. కన్నుల పండువు కలగిస్తున్నాయవి. వాటిమీద చక్కని నెమళ్ళు పంచమస్వరంతో కూస్తున్నాయి. ఆ అడివిప్రదేశమంతా కళ్ళకీ, చెవులకీ పండుగ కలిగిస్తున్నాది. స్వర్గమే భూమిమీద అవతరించినట్టుంది నిజంగా. దేవతలూ, గంధర్వులూ, అప్సరసలూ పరమానందంతో అక్కడక్కడ సరసవిహారాలు చేస్తున్నారు.

అదంతా చూసి, ఆశ్చర్యపోయారు రాజదంపతులు. "కల

కాదు కదా! నిజం కాకపోతే ఇలా ఇదంతా అనుభవగోచర మవు తుందా? ఇది ఉత్తరకురుభూమి కాదుకదా? లోకోత్తరమైన స్వర్గ లోకమూ, కాకపోతే? చ్యవనముని అనుగ్రహంతో స్వదేహాలతో ఇక్కడికి రాగలిగాం మనం" అంటూ ఆ మేడలో ప్రవేశించారు వాళ్ళు. లోపల మణిమయమైన శయ్యమీద పడుకున్న పరమమునిని చ్యవనుణ్ణి చూశారు.

అపరక్షణంలో అంతర్ధానమైపోయాడు ముని. అతడితో ఆ మేడా, మండపాలూ, తోటలూ, సరోవరాలూ అన్నీ అదృశ్యమై పోయాయి. అడివి మాత్రం మిగిలింది.

మతిపోయినట్టయి, అటూ ఇటూ తిరిగారు రాజదంపతులు. ఒకదగ్గిర దర్భాసనంమీద నిండుగా కూచుని జపంచేస్తున్న చ్యవన ముని కనిపించాడు.

"రాణీ!" భార్యతో అన్నాడు కుశికుడు, "ముని యోగ బలం ఎలావుందో చూడు. అఖండమైన సామ్రాజ్యం సంపాదించడం సులభం మనిషికి. బ్రాహ్మణత్వమూ, తపస్సూ మాత్రం దుర్లభం. తపస్సంపత్తి వుంది కనకనే ఏం కావాలంటే అది చేస్తున్నాడు చ్యవన ముని."

ఇంతలో "ఇలా రండి" అని పిలిచాడు ముని. చేతులు జోడించి దగ్గిరికి వెళ్ళారు రాజదంపతులు. సాగిలబడి మొక్కారు. దీవించాడు ముని. రాజు మొహం చూస్తూ ఇలా అన్నాడతడు ప్రేమగా:

"రాజా! మనస్సూ, ఇంద్రియాలు ఇంత అదుపులో వున్నాయా నీకు? కీడన్నమాటే లేదు నీదగ్గిర. సంతోషంగా వుంది నాకు. అడుగు, ఏంకావాలో అడుగు ఇస్తాను."

"అగ్నిహోత్రుడివంటివాడివి నువ్వు. నువ్వు సంతోషించి నట్టు సేవచెయ్యగలగడంకంటే మేలేముంది నాకు?

"ఒకటేమాత్రం అడుగుతాను, దయతో సెలవియ్యి. నువ్వు మాయింటికి దయచేశావు. ఒక్క పక్కని ఇరవైఒక్కదినాలు నిద్రపోయావు. అని మొదలు నీచరిత్రఅంతా అద్భుతంగానే వుంది. ఇదంతా అగమ్యాగోచరంగానే వుంది నాకు, ఎంత విచారించినా. దీనంతటికీ కారణమేమిటి?"

"మహారాజా!" కుశికుడు అడిగినదానికి అందుకున్నాడా చ్యవనముని, "ఉదరిమిలా సంగతి. బ్రహ్మదేవుడు కొలువుతీరి కూచున్నాడు. దేవతలూ, ఋషులూ అతణ్ణి సేవిస్తున్నారు. ప్రసంగవశాత్తూ బ్రహ్మదేవుడు వాళ్ళతో, 'భృగుకుశికవంశాలకి బ్రహ్మ క్షత్రాలు తారుమారైతే, సంకరం కలుగుతుంది,' అన్నాడు. అప్పుడు నేను అక్కడే వున్నాను. ఆమాట విన్నాను. ఈసంకరం సహించలేక, మీవంశం నిర్మూలించడానికని సంకల్పించాను. వ్రతంనెపంతో మీఇంట్లో చేరాను. ఇన్ని పోకళ్ళుపోయాను. అలిసిపోయి, శక్తి లేక ఎప్పుడైనా మీరు ఎదురాడతారేమో, అప్పుడు మిమ్మల్ని శపించాలని నాప్రయత్నం. అయితే మీలో ధైర్యం తగ్గలేదు. విచారం కలగలేదు. కోపం మొలకెత్తలేదు. దానికి మెచ్చుకండా వుండలేకపోయాను. వరమిస్తానన్నాను. అయినా తనివితీరలేదు నాకు. తనువులతోనే ఈగంగాతీరంలో స్వర్గం చూసినట్టుచేశాను. అది చూసి రాజత్వంమీద ఉదాసీనుడివయావు నువ్వు. బ్రాహ్మణత్వం స్పృహ కలిగింది నీకు. అది నాకు తెలుసు. నీకు మూడోవాడు బ్రహ్మతేజోమూర్తుడై పుడతాడు వరం కోరుకో."

"ఇంతకంటే వరమేముంది?" అన్నాడు కౌశికుడు, "నాసంతానానికి బ్రహ్మత్వమూ, ధర్మపరాయణత్వమూ లభించినట్టు అనుగ్రహించు."

"అలాగే! జరుగుతుంది, విచారించకు. నీమనవడు త్రిలోక పూజనీయు డవుతాడు" అన్నాడు చ్యవనముని.

"అయితే మునీంద్రా! ఏకారణంవల్ల వాడు బ్రాహ్మడవు తాడు? ఈవిషయం సెలవియ్యి" అని అడిగాడు కుశికుడు.

"చెపుతాను, విను" అంటూ అందుకున్నాడు చ్యవనుడు. "మా వంశంలో రుచీకుడు అని వొకడు పుడతాడు. అతడు సుకుమారు డైన గాధిరాజుకుమార్తెని (సత్యవతిని) పెళ్ళాడతాడు. ఆతపోధనుడు తన కుమారుడైన జమదగ్నిలో ధనుర్వేదం యావత్తూ ఆవహింప జేస్తాడు. అయితే అదంతా జమదగ్నిలో కాక, అతడి కుమారుడైన పరశురాముడిలో ఫలవంతమవుతుంది. సమస్త క్షత్రియనాశనానికి కారణమైన దైవకృత్యం అది. దానివల్ల రుచీక, గాధిభార్యల ఆచర ణలో పరివర్తనం జరుగుతుంది. అది కారణమై ఉగ్రక్షత్రధర్ముడైన పరశురాముడు జమదగ్నికి పుడతాడు. పరబ్రహ్మణ్యులలో గణ్యు డవుతా డతడు. బ్రహ్మపలుకు సత్యమైంది. నీవంశం భార్గవకుల సంబంధంవల్ల ప్రజల మెప్పు పొందుతుంది. నేను తీర్థయాత్రకి పోతాను. నువ్వు సుఖంగా వుండు" అన్నాడు.

భార్యతోకూడా వినయంగా మునికి నమస్కరించాడు కుశికుడు. అతడి సెలవు తీసుకుని రాజధానికి వచ్చేశాడు. చ్యవనముని తన దారిని తాను స్వేచ్ఛగా వెళ్ళిపోయాడు. ఇదీ పరశురామ, విశ్వా మిత్రుల జన్మగాథ.

## దా న వి శే షా లు

ధర్మరాజు :

దాన విశేషాలు వివరించు.

భీష్ముడు :

పాలుపిదికే కంచుపాత్రతోనూ, బంగారం తొడిగిన కొమ్ముల తోనూ, తెల్లవస్త్రంతోనూ, దక్షిణతోనూ మంచి పాడిఆవు సత్పా త్రుడైన బ్రాహ్మడికి భక్తిపూర్వకంగా దానంచేస్తే; ఆ ఆవుకి ఎన్ని

రోమాలుంటే అన్ని దివ్యసంవత్సరాలు స్వర్గంలో సుఖపడతాడు మనిషి. అతడి కులంలో ఏడుతరాలవాళ్ళు ఉత్తమగతి పొందుతారు.

మంచిబ్రాహ్మడికి కన్యాదానం, భూదానం, గృహదానం, చేస్తే, ఆసనాలూ, వాహనాలూ, దానంచేస్తే, ఇహపరాల రెంటిలోనూ సుఖం కలుగుతుం దంటారు పండితులు.

ధర్మరాజు :

దానాలన్నిటిలోకీ అధికమైనదానం ఏది ?

భీష్ముడు :

యాచకుడు కోరిన వస్తువు ప్రీతితో ఇవ్వడమే దానాలన్నిటిలోకీ అధికమైనదానం. ప్రాణులన్నిటికీ అభయమివ్వడం అంతకంటే కూడా అధికం అంటారు పెద్దలు.

పైనచెప్పినదానాలూ, ఇంకా వున్న దానాలూ కంటే కూడా వీరశయనం (యుద్ధంలో వెనకంజవెయ్యకండా మరణించడం) మేలంటారు. నిజానికి పుణ్యకర్మలెన్ని అయినా వీరశయనంతో సాటిరావు.

భీష్ముడు అలా చెప్పడంతోనే తమ్ములవేపు సాభిప్రాయంగా చూశాడు ధర్మరాజు. అన్నగారి అభిప్రాయం అవగతంచేసుకుని రణమరణస్తుతిచేశారు తమ్ములు. దాంతో యుద్ధంలో వీరశయనం చేసిన బంధువుల్ని, స్నేహితుల్ని, జ్ఞాతుల్ని తలుచుకుని, వాళ్ళకోసం విచారించడం మానేశాడు ధర్మరాజు. తాతగారు చెప్పిన మాటలు మెచ్చుకున్నాడు.

భీష్ముడు :

పగవాడైనాసరే, ఆలుబిడ్డల్ని పోషించలేక నానాపాట్లూ పడుతున్నప్పుడు అతణ్ణి ఆదుకోడం ఉదారగుణం.

ధర్మపత్నితో కలిసి ఎప్పుడూ యజ్ఞాలూ అవీ చేసుకుంటూ, కామక్రోధాలు లేకండా వుండిన మంచిబ్రాహ్మణ్ణి వెదికి ధనం దానం చేసినవాళ్ళు మూడులోకాలలోనూ పూజ్యులవుతా రంటారు.

ధర్మరాజు :

అడిగితే ఇవ్వడమూ, అడగకండా ఇవ్వడమూ ఈ రెంటిలో ఏది గొప్పది ?

భీష్ముడు :

అడిగితే ఇవ్వడంకంటే, అడగనివాడికి ఎగిరి దానమిస్తేనే ఫలం కలుగుతుంది. అడగడం చావు, అడిగించుకోడం అంతకంటే పెద్దచావు. అడిగింది పూర్తిచేసినవాడు అడిగినవాణ్ణీ, తననీ బతికించు కున్నవాడవుతాడు.

ధర్మరాజు :

దానమూ యజ్ఞమూ - ఈరెండూ గొప్ప ధర్మకర్మలంటారు. అయితే ఈరెంటిలో అధికఫలం ఏది ప్రసాదిస్తుంది ?

భీష్ముడు :

బ్రాహ్మలకి వినయపూర్వకంగా ధనమూ ధాన్యమూ, ఆవులూ, రత్నాలూ, భూములూ, నీరూ, అన్నమూ మొదలైనవి ప్రీతితో ఇవ్వడమే మంచి యజ్ఞం. ఇవి చక్కగా నడిపినవాడు యజ్ఞాలూ, తపస్సులూ మొదలైనవాటి పుణ్యాలన్నీ పొందుతాడు. కనక ధర్మ రాజా ! నువ్వుకూడా నిత్యమూ దానాలు చేస్తూవుండు.

ధర్మరాజు :

ఎన్నోరకాల దానా లున్నాయి. వాటన్నిటిలోనూ అధికమైన దాన మేదో నాకు చెప్పు.

## భూ దా న ం

భీష్ముడు :

దానాలన్నిటిలోకీ భూదానం గొప్పది. ఎంచేతనంటావా ? సమస్తమైన ధాన్యాలూ, వస్త్రాలూ, ధనరత్నాలూ అన్నీ భూమిలోంచే పుడుతున్నాయి. బంగారమూ, వెండీ, వస్త్రాలూ, ధాన్యమూ వివిధ

ఇతర్లకిచ్చినా నన్నుమాత్రం తారుమారు చెయ్యకండి. నిజమైన భక్తితో నన్ను దానంచెయ్యండి. అదే సంతోషం నాకు. దురాచారంతో నన్ను తారుమారు చెయ్యకండి. అంటే ఇచ్చి లాక్కోకండి. అంతకమించిన దుఃఖం నాకు మరొకటి లేదని నమ్మండి.

"భక్తితో నన్ను దానంచెయ్యడమంటే నన్ను సంతోషపెట్టడం అని నమ్మండి. ఇచ్చి లాక్కుంటే నన్ను పరాభవించడం అనుకోండి. ఈమాట ఘంటాపథంగా చెపుతున్నాను వినండి.

"ఎంత దురాత్ముడైనా నన్ను దానం చేస్తే అతడికి ఇహలోకంలోనూ, పరలోకంలోనూ - ఉభయలోకాల్లోనూ నేను ఎంతో మేలు చేస్తానని తెలుసుకోండి. కీడు రవంతా రానివ్వనని నమ్మండి."

ఇది భూగీత. ఇక ఈవిషయంలో దేవేంద్రుడు అడగ్గా బృహస్పతి ఏంచెప్పాడో విను.

"భూమి రత్నగర్భ. అంచేత గుర్రాలూ, ఏనుగులూ, స్త్రీలూ మొదలైన రత్నాలన్నీ దానంచేస్తే ఎంతఫలం కలుగుతుందో భూమి దానంచేస్తే అంతఫలం కలుగుతుంది.

"స్వర్ణగర్భ భూమి. దానిని దానంచేస్తే, ఆచేసినవాడు తన్ను తాను దానంచేసుకున్నాడని సర్వభూతాలూ సంతోషిస్తాయి. కనక దేవేంద్రా! భూమిదానం అసమానమైన దానం.

"రాజు అధికంగా భూమిదానం చెయ్యాలి. ఏమంటావా, రాజన్నవాడు పాపాలపుట్ట. భూదానంవల్లతప్ప ఆపాపాలు వొదలవు.

"దానంచేసినభూమి తిరిగీ తీసుకున్నవాడు, తాను మధ్యవుండి తనకులంలో ఇరవైవొక్కతరాలవాళ్ళని నరకంలో పడదోస్తాడు.

"'భూమి బ్రాహ్మలకి ఇస్తానని ఇవ్వకపోడమంత పాపం మరి లేదు. అడగకండా కోరి ఇవ్వడమంత పుణ్యమున్నూ లేదు' అంటారు పండితులు" అన్నాడు బృహస్పతి.

ధర్మరాజు :

దానపరులైన మనుషులకి దాతవ్యమైన విశేషాలు వివరించు.

భీష్ముడు :

అన్నపానీయాలూ, బంగారమూ మొదలైనపదార్థాలకి వేరు వేరు విశేషా లున్నాయి. అవి చెప్తాను, ఆలకించు. ఓనాడు అన్నదానవిశేషం నారదమునిని అడిగాను నేను. అతడు చెప్పిన మాటలు వివరిస్తున్నాను.

"మునులూ, దేవతలూ అన్నాన్ని ప్రశంసిస్తారు. యజ్ఞాలూ, లోకతంత్రవిధులూ, తక్కిన యావత్తువిషయాలూ అన్నంవల్లే సాగుతాయి. అంచేత లోకంలో అన్నం గొప్పది.

"అన్నంకంటే గొప్పదానం మరొకటి ఎక్కడాలేదు. కనక విధిగా అన్నదానం చెయ్యాలి. ఎంతప్రయత్నపూర్వకంగా అన్నదానంచేస్తే అంత పుణ్యం కలుగుతుంది.

"ప్రాణాలకి ఆధారం అన్నం. ఇంటివాళ్ళకి మానేసయినా అతిథికి అన్నం పెట్టడం పుణ్యం.

"అలసినవాడూ, వృద్ధుడూ, తాపసీ, బాలుడూ, వికలాంగుడూ, ఆడదీ 'ఆకలి' అని అర్థిస్తే లేదనకూడదు గృహస్థు. వాళ్ళని అవమానించడంకాని, కోప్పడడంకాని కూడదు. కుక్క అయినా సరే, మాల అయినా సరే, ఆకలివేళవచ్చి అన్నం కావాలంటే, ఆదరించాలి; భోజనం పెట్టాలి. దేవకార్యంలోనూ, పితృకార్యంలోనూ అన్నదానం విధిగా చెయ్యాలి.

"అన్నంపెట్టడంకోసం కులమూ, విద్యా, వృత్తీ అడకూడదు బ్రాహ్మణ్ణి. అర్థించడంతోనే ఆదరించి అన్నం పెట్టడమే మంచిది.

"కల్పారంభంలో అన్నమే అమృతమన్నాడు బ్రహ్మ. అన్నం లేకపోతే ఎంతబలవంతుడైనా దుర్బలుడైపోతాడు. అన్నం అన్ని ధాతువుల్నీ వృద్ధిచేస్తుంది మనిషికి" అన్నాడు.

ఇది తెలుసు కనకనే బ్రాహ్మలూ మొదలైన యావన్మందికీ అన్నం పెట్టేవాణ్ణి నేను. నువ్వూ అలాగే అందరికీ అన్నం పెట్టు.

అన్నదానంవల్ల స్వర్గంలో మణులతో చేసిన ఇళ్ళూ, పక్కలూ, ఆసనాలూ, అమృతభోజనమూ, మంచిమంచి పూలదండలూ, అంగరాగాలూ, మహనీయలైన స్త్రీలతో అనుభవమూ శాశ్వతంగా లభిస్తాయి.

## నక్షత్రదానం

ధర్మరాజు :

నక్షత్రదానమహిమ సెలవియ్యి.

భీష్ముడు :

నువ్వు నన్ను అడిగినట్టే లోగడ దేవకీదేవి నారదమహామునిని అడిగింది. అతడు ఏంచెప్పాడో అదే నీకు చెపుతాను, విను.

" కృత్తికనక్షత్రంనాడు పాయసమూ, బ్రహ్మ అధిదేవత * అయిన రోహిణినాడు మినుములూ, మృగశిరనాడు మాంసంకూరతో అన్నమూ, ఆరుద్రనాడుఆవూ, పునర్వసువునాడు పులగమూ, పుష్యమినాడు తీపి కలిపిన అట్లూ, ఆశ్లేషనాడు బంగారమూ, మఘ నక్షత్రంనాడు వెండీ, భగుడు అధిదేవత అయిన పుబ్బనాడు పుప్పొ నువ్వులూ, ఉత్తరఫల్గునినాడు చెరుకుతేనె కలిపిన అన్నమూ, హస్త

* అశ్వనీనక్షత్రానికి అశ్వనీదేవతలూ, భరణికి యముడూ, కృత్తికకి అగ్నీ, రోహిణికి బ్రహ్మ, మృగశిరకిచంద్రుడూ, ఆర్ద్రకి రుద్రుడూ, పునర్వసువుకి అదితీ, పుష్యమికి బృహస్పతీ, ఆశ్లేషకి నాగులూ, మఘకి పితృదేవతలూ, పుబ్బకి భగుడూ, ఉత్తరకి అర్యముడూ, హస్తకి రవీ, చిత్తకి ఇంద్రుడూ, స్వాతికి వాయువూ, విశాఖకి ఇంద్రాగ్నులూ, అనూరాధకి మిత్రుడూ, జేష్ఠకి ఇంద్రుడూ, మూలకి రాక్షసుడూ, పూర్వాషాఢకి ఉదకాలూ, ఉత్తరాషాఢకి విశ్వేదేవతలూ, అభిజిత్తుకి బ్రహ్మ, శ్రవణకి విష్ణువూ, ధనిష్ఠకి వసువులూ, శతభిషకి వరుణుడూ, పూర్వాభాద్రకి అజచరణుడూ, ఉత్తరాభాద్రకి అహిర్బుధ్న్యుడూ, రేవతికి పూషుడూ అధిదేవతలు.

నాడు పాలు కలిపిన షాష్టికాన్నమూ, † చిత్తనాడు ఏనుగు పూన్చిన రథమూ, స్వాతినాడు శ్రీగంధం చెక్కా, విశాఖనాడు ఎద్దూ, అనూరాధనాడు ఉత్తరీయమూ, జ్యేష్ఠనాడు కరివేపాకుతో సొత్తి దుంపలూ, మూలనాడు కందమూలాలూ పళ్ళూ, పూర్వాషాఢనాడు పెరుగూ, ఉత్తరాషాఢనాడు తేనె కలిపిన అన్నమూ, శ్రవణనాడు గొంగళీ, ధనిష్ఠనాడు గుజ్జులు కల బండీ, శతభిషనాడు యవలూ, రేవతినాడు కొవ్వు కల మేకమాంసమూ గొర్రెమాంసమూ, అశ్వినినాడు పాలు పిదికే కంచుపాత్రతో పాడిఆవూ, భరణినాడు గుర్రంపూన్చిన బండీ మంచి తిలధేనువులూ దానం చెయ్యడం ధర్మం. ఇవేకాకండా దాన కర్తకి ప్రియమైంది ఏదైనా మేలే.

యీవిధంగా నక్షత్రాల ననుసరించి దానం చేస్తే కర్త ఊర్ధ్వ లోకాలు పొందుతాడు" అని చెప్పి దేవకితో ఇంకా ఇలా అన్నాడు నారదముని.

"'బంగారం దానంచేస్తే సమస్తకోరికలూ నెరవేరతాయి' అన్నాడు అత్రిముని.

"'బంగారం ఆయుఃప్రదమైంది, పావనమైంది. వ్రతసమయాల్లో సంతోషంగా బంగారం దానంచేస్తే భావశుద్ధి కలుగుతుంది. బంగారాన్ని వేరే పొగడనక్కరలేదు' అన్నాడు హరిశ్చంద్రుడు.

"'పానీయదానం అన్నిటికంటె ఉత్తమదానం' అన్నాడు అన్నిధర్మ తత్త్వాలూ తెలిసిన మనువు.

కనక ధర్మరాజా! చెరువులూ, నూతులూ, నడబావులూ, కోనేళ్ళూ తవ్వించడం మంచిది. పవిత్రమైనపను లవి. పుణ్యలోకాలు ప్రసాదిస్తాయి. ఎవడు తవ్వించినచెరువులో ఆవులు నీళ్ళు తాగు

† అరవైదినాల్లో పండే ధాన్యం షష్టికం, ఆదియ్యంతో వండిన అన్నం షాష్టికం.

తారో అతడివంశానికి ఊర్ధ్వలోకం ప్రాప్తమవుతుంది. అడ్డులేకండా మండు వేసవిలో ఎవడిచెరువులో జనం అవబృథస్నానమూ, పానమూ చేస్తారో అతడికి నరకలోకముండదు.

యజ్ఞకర్మల్లో ఉపయోగించే ఉత్తమపదార్థంనేయి. అది దానం చేస్తే యజ్ఞానికీ, అగ్నికీ కూడా ప్రీతికలుగుతుంది.

మట్టిపిడతలు బ్రాహ్మలకి దానంచేస్తే, వాళ్ళు వాటితో చేసే ఆచమనమూ మొదలైన కర్మలలో ఆరోపాలుఫలం కర్తకి లభిస్తుంది.

నెగడుకీ, వంటకీ పుడకలు దానంచేస్తే ధనవంతుడవుతాడు కర్త.

గొడుగు దానంచేస్తే సంతానవంతుడవుతాడు కర్త. బండి దానం చేస్తే సమస్తకోరికలూ నెరవేరతాయి. చెప్పులుదానంచేస్తే కంటకులైన శత్రువులు అణగారిపోతారు.

నువ్వులు పితృభోజ్యంగా చేశాడు బ్రహ్మదేవుడు. అంచేత నువ్వులు దానంచేస్తే పితరులు శుచిమంతులవుతారు. పర్వదినాలలో (అమావాస్యపూర్ణిమలలో) చేసిన స్త్రీ సంభోగదోషం నువ్వుల దానంతో తొలిగిపోతుంది. దేవముని కశ్యపుడి పవిత్రశరీరంలోంచి పుట్టినవి నువ్వులు ; పవిత్రమైనవి. అంచేత వాటితో చేసిన యజ్ఞం అన్ని వస్తువులతో చేసిన యజ్ఞంతో సాటివస్తుందంటారు.

తిలదానం అన్నిదానాలకంటే విశిష్టమైంది. మునులందరూ తగినవాళ్ళకి తిలదానంచేసే మహనీయులయారు.

ధర్మరాజా ! ఇంకో విశేషం వినిపిస్తాను, విను – దానాలూ మొదలైన ధర్మకార్యాలన్నిటికీ సొంతస్థలమంటూ వుండాలి. అందుకనే దేవతలూ, మునులూ యజ్ఞాలూ మొదలైనవి చెయ్యవలిసివచ్చినప్పుడు బ్రహ్మదేవుడిదగ్గిరికి వెళ్ళి, అతడి అనుమతి పుచ్చుకుని, ఆయాచోట్ల ఆయాకర్మలు నిర్వహించారు.

అడవులూ, కొండలూ, నదులూ నానాతీర్థాలూ లోకులం దరికీ సాధారణప్రదేశాలు. ఆస్థలాలలో స్వేచ్ఛగా ధర్మాలు చెయ్య వచ్చు.

## గోదానం

నామనస్సుకి తోచిందీ, ఆచరించదగిందీ నీకు చెప్పాను. ఇక గోదానమహిమ చెప్తాను, ఆలకించు. తపోవంతులకంటే కూడా ఆవులు గొప్పవంటే, ఇక వాటి గౌరవం చెప్పేదేముంది? సత్యలోకంలో చంద్రుడి సాంగత్యంతో సంచరిస్తాయి ఆవులు. హోమ కార్యాలన్నిటికీ పాలూ పెరుగూ, నేయీ సమకూరుస్తాయవి. వ్యవసాయానికి ఉపయోగపడతాయి. వాటి చర్మమూ, కొమ్ములూ, పేడా, మూత్రమూ కూడా పనికివస్తాయి. శ్రమ అనకండా ఎండా వానా అనకండా, చలీగిలీ అనకండా ఎప్పుడూ పనిచేస్తాయవి. గోవూ, బ్రాహ్మడూ వొక్క టేతత్త్వం. అంచేత బ్రాహ్మడికి గోదానంచేస్తే స్వర్గం సిద్ధిస్తుంది, పాపాలు పోతాయి, ఇతర్లు అడుగుపెట్టలేని ఉత్తమ లోకాలు లభిస్తాయి.

ఆవుపాలు అమృత మన్నాడు దేవేంద్రుడు. అంచేత ఆవు దానంచేస్తే అమృతం దానంచేసినంత ఫలం కలుగుతుంది.

గోవులు ప్రాణాలని మునులందరూ చెప్పారు. అంచేత గోదానంచేస్తే ప్రాణదానంచేసినంత ఫలం కలుగుతుంది.

క్రూరుడికీ, నాస్తికుడికీ, దుర్మార్గుడికీ గోదానంచేస్తే పరమ దుఃఖం కలుగుతుంది; నరకం ప్రాప్తమవుతుంది. కనక దానంచేసి నప్పుడు పరీక్షచేసిమరీ దానం చెయ్యాలి.

గొడ్డుదానినీ, బక్కదానినీ, జబ్బుదానినీ, దూడచచ్చినదానినీ, బలముడిగి అలిసిపోయినదానినీ దానమివ్వరు గోదానవిషయం తెలిసినవాళ్ళు.

బ్రాహ్మలకి గోవులు దానంచేస్తే కేవలం పుణ్యలోకాలు ప్రాప్తించడమే కాదు, మోక్షంకూడా సిద్ధిస్తుం దంటారు పూర్వాచార్యులు.

## అన్నదానం

ధర్మరాజా! అన్నపానీయాల దానఫలం కూడా చెపుతాను, విను.

అన్ని దానాలకంటే కూడా అన్నపానీయాలదానం గొప్ప దంటాను నేను.

అన్నానికి అమృత మంటారు దేవతలు. సుధ అంటారు నాగులు. స్వధ అంటారు పితరులు. అంచేత అన్నమే ప్రాణ మంటారు మహాత్ములు. కనకనే అన్నదానంచెయ్యడమంటే ప్రాణ దానంచెయ్యడ మన్నమాట. విశేషించి అన్నపాకానికి నీళ్ళు ఉపాశ్రయం. చంద్రుడికి పుట్టుకస్థలం నీళ్ళు. చంద్రుడు ఓషధులకి రాజు. అంచేత అన్నిటికంటే ఉత్తమమైనవి నీళ్ళు.

తనకున్న అన్నంతో దేవపూజా, పితృపూజా, అతిథిపూజా సాగించాలి మనిషి.

## తిలదానం

తిలదానం గొప్పదని చెప్పాను. ఆవిషయంలో వొక ఇతిహాసముంది. చెపుతాను, విను.

మధ్యదేశంలో పర్ణశాల అని వొక పల్లెటూరు వుంది. విద్యావంతులు అధికంగా వుండేవా ళ్ళక్కడ. ఆవూళ్ళో శర్మి అని వొక బ్రాహ్మడు వుండేవాడు. అతణ్ణి వోమారు యముడు పిలిచి, "దానాల్లో కల్లా తిలదానం గొప్పది. తిలలంటే పితృదేవతలు సంతోషిస్తారు. తిలలు తింటే పాపాలు రావు. పుణ్యకార్యాలు చెయ్యాలన్నబుద్ధే వుంటే భక్తితో బ్రాహ్మలకి తిలలు దానంచెయ్యి" అన్నాడు.

"వస్త్రదానమూ, దీపదానమూ కూడా గొప్పవే. బట్టలూ, దీపాలూ అమర్చి పితృతర్పణం చెయ్యడం పరమధర్మం" అన్నాడు.

ఇది యమ బ్రాహ్మణ సంవాదం.

భూదానం, విద్యాదానం, గోదానం - వీటితో సరితూగే దానాలు లేవని విన్నాను నేను. తగిన శిష్యుడికి విద్యాదానం చేస్తే భూదానం చేసినంత ఫలం. గోదానం చెయ్యడమూ, భూదానం చెయ్యడమూ వొకటే.

తక్కువధరకి కొన్నైనా గోదానం చేస్తే, దాని ఫలం మాత్రం అధికంగా వుంటుంది. ఏమంటే, దానం పుచ్చుకున్నవాడు చేజేత సుఖపడతాడు కనక.

దేవతల్నీ, పితరుల్నీ అర్చించే గృహాలు ఆవుపేడతో అలికి శుద్ధిచేస్తారంటే గోవుల మహిమ వేరే విడమర్చి చెప్పవలిసింది ఏముంది?

భోజనానికి ముందు ఇతరుల ఆవుకి రోజూ పిడికెడు గడ్డిపరకలు ఏడాదిపాటు వేస్తే, బ్రాహ్మణులకి కోరినవన్నీ దానంచేస్తే ఎంతఫలం కలుగుతుందో అంతఫలం కలుగుతుంది, సందేహం లేదు.

గోదానంవల్ల ఊర్ధ్వలోకానికి రాజబాట ఏర్పడుతుంది. ఎన్నో మేళ్ళు కలుగుతాయి. అదే తిరస్కారిస్తే పాపం చుట్టుకుంటుంది.

## నృగ చరిత్ర

దుష్టమైన గోదానంవల్ల నృగమహారాజుకి ఎంతో కష్టం వచ్చి పడింది. అది ఇతిహాసమై పేరుపడింది. వివరిస్తాను, విను.

ద్వారకాపట్నంలో వొక నూతిలో చిత్రమైన తొండ వొకటి అవుపడింది. బ్రహ్మాండమైన శరీరంతో వుందది. ఆ చుట్టుపక్కల జనం దాన్ని చూసి, అది నీళ్ళు పాడుచేస్తుందని భయపడ్డారు. ఎన్నో మోకులూ అవీ తెచ్చి దాన్ని బయటికి లాగాలని విశ్వప్రయత్నం

చేశారు. ఎంతచేసినా కదలలేదు తొండ. ఆశ్చర్యపడుతూ, తిన్నగా శ్రీకృష్ణుడిదగ్గిరికి వెళ్ళారు వాళ్ళు. ఆవింతతొండ విషయం విన్నవించారు.

కృష్ణుడు వెళ్ళి తొండని సుళువుగా పైకి తీశాడు. దానివిషయం అతడికి తెలుసు. అయినా "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నేను నృగుణ్ణి" అంది తొండ.

"వేలువేలు ఆవులు బ్రాహ్మలకి దానంచేశావని విన్నాను. అలాటి నీకు ఈతొండజన్మ ఎలావచ్చింది?" అని అడిగాడు శ్రీకృష్ణుడు.

"ఏం చెప్పేది?" అని అంటుకుంది తొండ, "ఓనాడు వొక ఉత్తమబ్రాహ్మడికి వొక ఆవు దానంచేశాను. సంతోషంతో దాన్ని తోలుకుపోయాడతడు. ఎలాగో తప్పించుకుని, మేతకోసమని, మా మందతో కలిసి వచ్చేసిందది. సొమ్ములకాపర్లు దానంకోసమని తోలుకువచ్చిన ఆవుల్లో కలిసి అదిన్నీ వచ్చేసింది దైవికంగా. ఈసంగతి తెలియక, దానమిచ్చినప్పుడు దాన్నికూడా మరో బ్రాహ్మడికి దానమిచ్చేశాను నేను.

"మొదట దాన్ని దానంపుచ్చుకున్నవాడు వెదుక్కుంటూ వెళ్ళి దాన్ని కనుక్కున్నాడు. 'ఇది నాఆవు' అంటూ తగువుపెట్టాడు. రెండో బ్రాహ్మడు ఎదురుతిరిగాడు. 'నాకు మహారాజు దానమిచ్చాడు. ఇది నాది' అన్నాడు. ఇద్దరికీ తగువు ముదిరింది. ఇద్దరూ నాదగ్గిరికి వచ్చారు. తమ తగువుకారణం వివరించారు.

'ఇచ్చినవాడివి నువ్వు. మేం పుచ్చుకోడానికేనా అడ్డువచ్చింది?' అంటూ నొచ్చుకుంటూ బ్రాహ్మలు ఇద్దరూ నిట్టూర్చారు. వాళ్ళు చెప్పింది విన్నాక జరిగిన పొరపాటు తెలిసింది నాకు. ఎంతో బాధపడ్డాను. మొదట పుచ్చుకున్న బ్రాహ్మణ్ణి బతిమిలాడాను. 'మంచివి వందఆవులు ఇస్తా' నన్నాను. 'ఈఆవు వొదిలిపెట్టు' అన్నాను.

'ఇది పాలు పుష్కలంగా ఇస్తుంది. ఎంతో అంత మంచిది, సాధువు. దీని దూడ అంటే నాకు ప్రాణం. నా చిన్నికొడుకు పాలకి ఏడిస్తే, ఎప్పుడుపడితే అప్పుడు తన పొదుగు కుడవనిస్తుం దిది. ఇలాటి మంచి ఆవు ఎక్కడ దొరుకుతుంది?' అంటూ దీనంగా తల వేలేశాడతడు. 'లక్ష్మీదేవిలా ఈఆవు ఇంట్లోవుంటే కళ్ళవేదుక నాకు. వంద కాదు, కోటి ఆవులయినా దీంతో సాటిరావు' అంటూ దించిన మొహాం ఎత్తకండా వెళ్ళిపోయాడు.

"ఏం చెయ్యనూ? దీనుణ్ణే అయిపోయాను నేను. రెండో బ్రాహ్మణ్ణి బతిమిలాడాను. 'ఎంతో బంగారం ఇస్తాను. ఎన్నో ఆవులు ఇస్తాను. మణులు ఇస్తాను. ఇవికాక నీకు ఏంకావాలో కోరుకో, ఇస్తాను. ఈఆవు విడిచిపెట్టు' అన్నాను.

'నీరాజ్యమంతా ధారపోసినా నాకు అక్కరలేదు. ఈకుచ్ఛిత వృత్తి అంగీకరించను' అంటూ మంకుపట్టు పట్టాడతడు. ఏమీ చెయ్యలేకపోయాను నేను.

"కాలం తీరి, యముడిదగ్గిరికి వెళ్ళాను. ఆదరంగా ఇలా అన్నాడు యముడు, 'రాజా! ఎన్నో పుణ్యకర్మలుచేశావు నువ్వు. తెలియక వొక బ్రాహ్మడి ఆవు తీసుకున్నావు అంచేత కొంచెం పాపంపట్టింది నీకు, కనక ముందు పాపఫలం అనుభవిస్తావా? పుణ్య ఫలం ముందు అనుభవిస్తావా?' అని అడిగాడు.

'పాపఫలమే ముందు అనుభవిస్తాను' అన్నాను నేను.

"నానోట్లోమాట నోట్లోనే వుంది. తల్లకిందుగా భూమిమీద పడ్డాను. పడుతు పడుతూ 'ఎన్నో సంవత్సరాల తరవాత శ్రీకృష్ణుడు నువ్వు వున్నచోటికి వస్తాడు, నిన్ను ఉద్ధరిస్తాడు. అప్పుడు శాశ్వత సౌఖ్యాలనుభవించే పుణ్యలోకం చేరుకుంటావు' అన్న యముడి దయా పూర్వకమైన మాటలు విన్నాను. వింటూనే కింద పడ్డాను. అవాళ

నుంచీ తొండరూపంతో తిరుగుతున్నాను. ఇవాళ దైవికంగా బుద్ధి పుట్టి, ఈనూతికి వచ్చాను. వచ్చిన అపరక్షణంలో తొండలకి లేని ఈమహాకాయం వచ్చింది. నిచ్చెరపోతూవుంటే, యముడి దయవల్ల ఎన్నడూ మాయని పరిజ్ఞానం కలిగింది. పరమ యోగీంద్రులకి కాని లభ్యంకాని నీభవ్యసాన్నిధ్యమున్నూ లభించింది" అంది.

ఇంతలో తొండరూపం పోయి, తాను పూర్వంచేసిన పుణ్య కర్మకి అనురూపమైన దివ్యరూపం వచ్చింది నృగుడికి. సంతోషంతో శ్రీకృష్ణుణ్ణి స్తోత్రంచేశా డతడు.

"దేవా! నీదయాదృష్టి అమృతంలా నామీద పడింది. నాదీన దశ వొదిలిపోయింది. నీఅనుజ్ఞ తీసుకుని, తగిన స్థానానికి వెళతాను" అంటూ వినయపూర్వకంగా ప్రణామంచేశాడు. అతడి సెలవుతీసు కున్నాడు. విమానమెక్కి ఉత్తమలోకానికి వెళ్ళిపోయాడు.

అలా నిండుసంతోషంతో నృగుడు వెళ్ళిపోయాక, లోక హితంకోసం శ్రీకృష్ణుడు మధురవాక్యాలతో ఇలా అన్నాడు:

"బ్రాహ్మడిధనం అపహరించడం మహాపాపం. రాజుకి మరింత దోషం. నృగుడికి ఆపద వచ్చినట్టే, బ్రాహ్మడిధనం అపహరిస్తే రాజుకి ఆపద వచ్చిపడుతుంది, తప్పదు."

ధర్మరాజా! ఈమాటలు నీకు చెప్పనక్కరలేదు. అయినా ఇతిహాసంలో వుండడంచేత వినిపించాను. శ్రీకృష్ణుడి సాంగత్యం నృగుడికి మహోన్నతి కలిగించింది. అలాగే సత్సాంగత్యం సజ్జనులకి సంతోషం కలిగిస్తుంది.

దానం పూర్తిగా ఫలప్రదం అవుతుంది. అయితే ఆవుల విష యంలో పొరపాటు కీడుతెస్తుంది, తప్పదు. కనక గోదానవిషయంలో ఎన్నడూ ఏమరపాటు వహించకు నువ్వు.

## నాచికేతుడి కథ

ధర్మరాజు :

గోదానవిషయంలో తిరకాసుగనక వచ్చే పాపం వినిపించావు. గోదానఫలం ఇంకా వినాలనిపిస్తూవుంది. వివరించు.

భీష్ముడు :

అయితే ఈవిషయంలో వొక ఇతిహాసముంది, విను.

ఉద్దాలకుడు అని వొక మహాముని వుండేవాడు. అతడు వొక నాడు తన కొడుకుని, నాచికేతుణ్ణి పిలిచి, "ఏటివొడ్డున సమిధలూ దర్భలకట్టా, నీళ్ళపాత్రా, పువ్వులూ మరిచి వచ్చాను. వేగం తీసుకురా" అన్నాడు.

నాచికేతుడు వెళ్ళేసరికి నదిపొంగి, వరదలో అవి కొట్టుకు పోయాయి. తిరిగివచ్చి, "అవి ఏటివొడ్డున ఎక్కడా కనపళ్ళేదు" అని తండ్రితో చెప్పాడు.

ఆకలివల్లా, తన వైదికకర్మ పాడవడంవల్లా, కోపం ఆపుకో లేకపోయాడు ఉద్దాలకుడు. "ఒరే, యముణ్ణి చూడడానికి పోరా" అని కుమారుడికి శాపంపెట్టాడు.

చేతులు జోడించి, నుదుటిమీద చేర్చి, "తండ్రీ! శాంతించు" అన్నాడు నాచికేతుడు. అయితే, తన నోటిమాట పూర్తికాకుండానే తెలివితప్పి కిందపడిపోయాడు.

కొడుకు పడిపోడంతోనే పశ్చాత్తాపం కలిగింది ఉద్దాలక మునికి. "అయ్యో, కొడుకుని చంపుకున్నాను" అంటూ మూర్ఛపోయి కింద పడిపోయాడు తనూను. కాసేపటికి తెలుసుకుని, కుమారుణ్ణి తేరిచూశాడు. కన్నీళ్ళతో అతడి గుండెలమీద మొహం మోపి, నిశ్చేష్టుడైపోయాడు.

---

* కఠోపనిషత్తులో ఈకథ మరోలా వుంది.

ఆరోజు గడిచిపోయింది.

ఆ రాత్రి గడిచిపోయింది.

సూర్యుడు పొద్దుదూరింది.

ఔద్దాలకికన్నీళ్ళతో తడిసిన నాచికేతుడి శరీరం చైతన్యం పొందింది, కదిలింది.

తండ్రి చూస్తూవుండగానే కళ్ళువిప్పాడు నాచికేతుడు. తండ్రిని తేరిచూశాడు.

"నాపుణ్యాల కుప్పా! నాకన్నతండ్రీ! పుణ్యాలోకంచూసి. నాపుణ్యంవల్ల తిరిగివచ్చావా నాయనా! నీశరీరం దివ్యపరిమళంతో గమ్మ్మమనిపోతూవుందోయి! అద్భుతంగా వుంది! నన్ను ఆనంద డోలికల్లోనోలలాడిస్తూవుంది. నువ్వు, వెళ్ళివచ్చిన విశేషాలు వివరించు తండ్రీ!" అన్నాడు ఔద్దాలకి.

లేచి తండ్రికి నమస్కరించాడు నాచికేతుడు

"తండ్రీ! నీ ఆజ్ఞప్రకారం యముడి కొలువుకూటంలో ప్రవేశించాను. మణులతో మహనీయంగా వెలిగిపోతూవుంది యమ ధర్మరాజు మందిరం. ఎంతోఅంత విశాలంగా వుంది కొలువుకూటం. యమధర్మరాజు నన్ను చూశాడు. దగ్గిరికి చేరబిలిచాడు. నాకోసం తగిన ఆసనం వేయించాడు. నీమీదిగౌరవంవల్ల అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి, నన్ను పూజించాడు.

"'ఏలోకంలో నేను నివసించాలో సెలవియ్యి' అని అతణ్ణి అడిగాను.

"'నువ్వు చావవు' అన్నాడు యముడు, 'నీతండ్రినిన్ను' 'యముణ్ణి చూడడానికివెళ్ళు' అన్నాడు. అలాగే నువ్వు వచ్చావు. నన్ను చూశావు. అయిపోయింది. నీతండ్రి నిర్ధారించకుండా తిరిగి అక్కడికే వెళ్ళిపో."

" 'అయితే సరే, అలాగేకానీ, వెళిపోతాను. కాని నీదగ్గిరికి వచ్చాను. ధర్మమయుడివి నువ్వు. నిన్ను దర్శించాను. పుణ్యాలోకాలు చూడాలని వేడుకగావుంది నాకు. చూపించు' అని విన్నవించాను.

"మంచి గుర్రాలు పూసిన రథం తెప్పించాడు యముడు. నన్ను ఎక్కించాడు. అతడున్నూ ఎక్కి కూచున్నాడు. నాచేయి తన చేత్తో పట్టుకున్నాడు. వికసించిన మొహంతో మంచిమంచి కథలు వినిపిస్తూ, సంతోషంతో నాకు పుణ్యాలోకాలు చూపించాడు. కళ్ళకీ, మనస్సుకీ ఆనందంకలిగించే రత్నభవనాలూ, నడబావులూ, ఉద్యాన వనాలూ, మంచిమంచి పిండివంటలతో భోజనపదార్థాలూ, కొండలూ, పెరుగునదులూ, నేతినదులూ చూశాను. గంధాలూ, పూలదండలూ, దివ్యవస్త్రాలూ, ఆభరణాలూ, మొదలైన భోగయోగ్యపదార్థాలూ కుప్పలుకుప్పలు చూశాను. 'ఈలోకాలు ఏంపుణ్యంచేసినవాళ్ళకోసం?' అని యముణ్ణి అడిగాను. అవన్నీ ఫలానా ఫలానా పుణ్యంచేసిన వాళ్ళకోసమని చెపుతూ, 'వీట్లో అధికవైభవంతోవున్న స్థానాలు గోదానంచేసినవాళ్ళకోసం' అని చెప్పాడు యమధర్మరాజు. 'భక్ష్య భోజ్యాల కొండలూ, పాల నదులూ, నేతి నదులూ, అనీ వాళ్ళ కోసమే' అన్నాడతను. 'ఎన్ని మంచిపనులైనా గోదానంతో సాటిరావు. మంచి బలం కలిగి, లేతవయస్సులో వున్న చక్కని పెద్ద ఎద్దు ఉత్తమధర్మంతో నడుచుకుంటున్న బ్రాహ్మడికి దానంచేస్తే సద్విధిగా గోదానంచేసినంతపుణ్యం కలుగుతుంది.

" 'గోవులు ఉజ్వలమైన సూర్యకిరణాలవంటివి. కనక గోదాన పరులు సూర్యుడిలా ప్రకాశిస్తారంటాయి వేదాలు' అని చెప్పి పంపాడు నన్ను.

"యమధర్మరాజుపాదాలకి నమస్కరించి, సంతోషంగా తిరిగి వచ్చేశాను" అంటూ తాను యముణ్ణి చూసివచ్చినవైనం చెప్పాడు

నాచికేతుడు. కుమారుడు చెప్పిందంతా విని, సంతోషించాడు ఔద్దాలకి ముని. ఈఇతిహాసం విచారిస్తే, గోదానమహిమ అవగత మవుతుంది.

## గో లో క ం

ధర్మరాజు :

గోదానకర్తలు ఏలోకంలో నివసిస్తారు ?

భీష్ముడు :

దీనికి బ్రహ్మవాక్యాలు ప్రమాణంగా వున్నాయి. ఓమాటు దేవేంద్రుడు అడిగితే బ్రహ్మదేవుడు ఇలా చెప్పాడు :

" అడగవలసిన ప్రశ్నే అడిగావు. మంచిపని చేశావు. ఆలోకం ఎవ్వరూ ఎరగరు. నేనూ మంచి వ్రతపరాయణులైన మునులూ, పతివ్రతలూ మాత్రం ఎరుగుదుము. కాలక్రమం తప్పినా రోగాలూ, ముసలితనమూ వుండ వక్కడ. నాశనమంటూ ఆలోకానికి లేదు. ఎప్పుడూ ఆనందమే తాండవమాడుతూ వుంటుం దక్కడ.

" ఆలోకం పేరు గోలోకం. గురుశుశ్రూష చేసినవాళ్ళూ, సత్యరతులూ, శమమూ దమమూ కలిగిన నిర్మలాత్ములూ, తినకూడనివి తిననివాళ్ళూ గోదానపరులతో కలిసి నివసిస్తా రక్కడ.

" పిత్రార్జితం పంచుకున్న ధనమూ, యుద్ధంలో గడించిన ధనమూ, మంచిపనులవల్ల కూడబెట్టిన ధనమూ - వీటితోనే గోదానం చెయ్యాలి. తగనిమార్గాల్లో సంపాదించిన ధనంతో చేస్తేమాత్రం కీడు సంభవిస్తుంది.

" గోలోకాన్ని మించిన లోకం మరి లేదు. గట్టిగా చెపుతున్నా నీమాట. గోదానాన్ని మించినపుణ్యం మరొకటి లేనేలేదు.

"వేదాధ్యయనమూ, ప్రశాసిష్ఠా, స్వధర్మశీలమూ, గురుపూజా, మాతృరక్షణా - ఇవేవీ గోదానంతో సాటిరావంటాడు నహుష్యు."

బ్రహ్మచెప్పిన దివ్యవాక్యాలు మనస్సుకి పట్టించుకున్నాడు దేవేంద్రుడు. ఎన్నో గోయజ్ఞాలుచేశాడు గొప్పగా.

ధర్మరాజా! నువ్వుకూడా సావధానంగా గోవులిచ్చి మాన్యుడవు. తగినవాళ్ళకి గోవులు దానమియ్యి. ఎన్ని పుణ్యాలు చేసినా గోదానంతో సాటిరావు.

# మూడో ఆశ్వాసం

## శ్రద్ధగా చెయ్యవలిసిన పనులు

ధర్మరాజు :

తండ్రీ ! అడిగిన ధర్మాలన్నీ తేటపడినట్టు చెప్పావు. సంశయాలు తీర్చి నన్ను ఆదరించావు. నీదయకి పాత్రుణ్ణయ్యాను. అంచేత జంకుమాని అడుగుతున్నాను. శ్రద్ధగా ఏమేమి చెయ్యాలి మనిషి?

భీష్ముడు :

నాయనా ! చెప్తాను, విను. నియమమూ, వేదాధ్యయనమూ, ధారణమూ, దమమూ, అధ్యాపనమూ, ఇతరులనుంచి ఏమీ పుచ్చుకోకండా వుండడమూ, ఆత్మీయకర్మనిష్ఠా, ఇంద్రియాలు అదుపులో వుంచుకోడమూ, సత్యం పాలించడమూ, దానపరత్వమూ, బ్రహ్మచర్యమూ, పితృశుశ్రూషా, మాతృసేవా, గురుశుశ్రూషా, దయా, గోవ్రతమూ — ఇవన్నీ శ్రద్ధగా చేయవలసినవి.

## గోదానవిధి

ధర్మరాజు :

గోదానం ఎలా చెయ్యాలి?

భీష్ముడు :

దీనికి ఓ ఇతిహాస ముంది. చెప్తాను, ఆలకించు. మేత మేసి, నీరు తాగి, మందకి వచ్చి పశువులన్నీ సుఖంగా పడుకున్నాక, వ్రతదీక్షతో వున్న మాంధాతమహారాజు అక్కడికి వచ్చి, భక్తి పూర్వకంగా గురుదేవుణ్ణి బృహస్పతిని తలుచుకున్నాడు. రెండుచేతులూ జోడించి ఎన్నో విధాల స్తోత్రంచేశాడు. బృహస్పతి ప్రత్యక్షంకావడం

తోనే అతనికి పాదాభివందనంచేసి, ఇప్పుడు నువ్వు నన్ను అడిగినట్టే అతణ్ణి అడిగాడు "గోదానం ఎలా చెయ్యాలి?" అని. మాంధాత అడిగిన ప్రశ్నకి బృహస్పతి ఇలా సమాధానం చెప్పాడు:

"పుణ్యదినంలో బ్రాహ్మల అనుమతి పొంది, ఉపవాసం చెయ్యాలి. ఆలమందకి వెళ్ళి, పరమనియమంతో ఆపగలూ, రాత్రీ మందలోనే నివసించాలి. మర్నాడు నిష్ఠతో 'సంగవం' అనే శుభ ముహూర్తంలో, దానమిచ్చే ఆవుని సంతోషంగా పేరుపెట్టి పిలవాలి. బ్రహ్మదేవుడు దయతో చెప్పిన వాక్యరత్నాలు పఠించాలి.

"ఆవు నాతల్లి.

"వృషభం నాతండ్రి.

"దివం గర్భప్రదేశం.

"భూమి సంప్రతిష్ఠ"

అని పఠించి, యోగ్యుడైన బ్రాహ్మణ్ణి పూజించి, "నేను ఈ ఆవుని ఈబ్రాహ్మడికి దానంచేస్తున్నాను" అని తెలిసినట్టు చెప్పాలి. అనంతరం "సౌరాములైన ఈఆవులు * ఘోరమైన నాపాపాలు అన్నీ నాశనం చేస్తాయి. సౌమ్యములైన ఈఆవులు శాశ్వతంగా నాకు ఉన్నతపదవి ప్రసాదించి నన్ను సుఖపెడతాయి" అని చెప్పి, "ఆవుని దానమిస్తున్నాను" అంటూ బ్రాహ్మడి చేతిలో నీళ్ళు ధారపొయ్యాలి. ఆనీటిని అర్ఘ్యమంటారు ఆదిమునీశ్వర్లు.

"గోవు దానమివ్వడానికి శిష్యుడూ, పుణ్యాత్ముడూ, శాంతుడూ, వ్రతశీలుడూ, దాంతుడూ, క్రోధంలేనివాడూ సత్పాత్రలని తెలుసుకో.

"రాజా, ఈవిధంగా గోదానంచేసినవాడు చంద్రలోకంలో నివసించి సౌఖ్యమనుభవిస్తాడు."

---

* సూర్యసంబంధములైన ఆవులు.

ధర్మరాజా, అంతేకాదు, ఆశ్వయుజమాసంలో రెండోపక్షం (కృష్ణపక్షం) అష్టమి మొదలుకుని మూన్నాళ్ళు పరిశుద్ధమైన ఆల మందలో వ్రతంపూని, ఆవుపేడ అన్నంగా పుచ్చుకుంటూ, ఆవు మూత్రం పాలుగా పానంచేస్తూ నియమంతోవుంటే ఎన్నెన్నో కోరికలు సిద్ధిస్తాయి మనిషికి.

బృహస్పతి ఉపదేశించినప్రకారం మాంధాత బ్రాహ్మలకి ఆవులు దానంచేసి, ఉభయలోకాల్లోనూ మెప్పు సంపాదించి పేరు పడ్డాడు. ఆవిధానం తెలుసుకుని గోదానపరులైన భరతుడూ, దిలీపుడూ, భగీరథుడూ, రాముడూ మొదలైన మహారాజులు పుణ్యలోకాలు పొందారు. నువ్వూకూడా దేవగురువు బృహస్పతి ఉపదేశించిన వాక్యాలు మనస్సుకి పట్టించుకుని, గోదానవిధి గ్రహించి, బ్రాహ్మలకి మంచిమంచి ఆవులు దానంచెయ్యి.

అపారమైన దివ్యసుఖాలు కావలసినవాడు భక్తిపూర్వకంగా ఉదయాన్నే గోదానం చెయ్యాలి. అప్పటికి ఆగోవు ఇంకా నీరుతాగి వుండకూడదు; మేతమేసి వుండకూడదు.

గోవులన్నిటిలోనూ కపిలగోవు శ్రేష్ఠమైంది. వ్రతదీక్షపూని, కపిలగోవు ఉత్తముడైన బ్రాహ్మడికి దానమివ్వడం ఉత్తమదానం. అడివిలాం పెరిగిన పాపాలన్నిటినీ సరికి పారేస్తుందది.

## కపిలగోవు

ధర్మరాజు :

కపిలగోవుకి ఈగొప్పతనంఎలా వచ్చిందట ?

భీష్ముడు :

పూర్వం వొకప్పుడు దేవతలు ఆకలితో అటమటించిపోతూ బ్రహ్మదేవుడి దగ్గిరకి వెళ్ళారు. వారిని కనికరించి అతడు అమృత

మిచ్చాడు. ఆనందంతో అమృతం తాగారు దేవతలు. వారి ఆనందంలో సురభి (దేవతలఆవు) పుట్టింది. సురభి సౌరభేయుల్ని కంది. ఓమారు హిమాలయం చరియలమీద శంకలేకుండా తిరుగుతూ, వోలేగపెయ్య తల్లిపొదుగు కుడుస్తూవుంటే దాని నోటినుంచి పాలనురుగు గాలికి ఎగిరి ఆదగ్గిరలోనే ఉగ్రంగా తపస్సుచేస్తున్న శివుడి శిరస్సుమీద పడింది. ఉగ్రుడైపోయాడు శివుడు. తన నొసటిమీది అగ్గికన్ను తెరిచాడు. నిప్పురవ్వలు రేగి, సురభిసంతానం ఆవులన్నీ కపిలవన్నెగా మారి పోయాయి. దేవతలు చూసి ఆశ్చర్యపోయారు.

శివుడి నిప్పుకన్ను చూసి ఆవులు బెదిరి పారిపోయాయి. వాటి పరుగుచూసి, ఆచుట్టుపక్కల మేస్తున్న ఆవులు కూడా బెదిరి పోయాయి. అన్నీ కలిసి తిన్నగా చంద్రుడిదగ్గిరికి దౌడుతీశాయి. అదంతా తెలుసుకుని పరుగెత్తుకువచ్చాడు బ్రహ్మదేవుడు. వినయంతో శివుడి పాదాలమీద వాలాడు.

"అఖిలేశ్వరా! ఆవులకి ఎంగిలి లేదు. అమృతం నీమీద పడింది. అది ఎంగిలి కాదు. చంద్రుడు అమృతమిచ్చినట్టే ఆవులుపాలిస్తాయి. లేగ తాగిన పాలు శుచిమంతమైనవే కాని మరేమీ కావు. కోపం మాను. కరుణించు" అంటూ చేతులు జోడించాడు. మంచి ఆబోతు కానుకిచ్చాడు.

సంతోషించాడు శివుడు. బ్రహ్మ ఇచ్చిన ఆబోతుని జెండా చేసుకున్నాడు. అందుకనే శివుడికి వృషభకేతనుడని పేరు. ఆ ఆబోతునే తాను వాహనం కూడా చేసుకున్నాడు. కనక, అతడికి వృషభవాహనుడని పేరు వచ్చింది.

ప్రసన్నుడై శివుడు అంతటా ఆవులు తిరుగవచ్చునని అనుమతించాడు. అప్పుడు తిరిగి సురభి సంతానం గోవులు హిమాలయానికి వచ్చాయి. విచ్చలవిడిగా తిరిగి మేశాయి.

తన అగ్గిచూపుతో వాటికి కపిలవర్ణం ఏర్పడడంవల్ల తక్కిన వర్ణం ఆవులకంటె అవి ఉత్తమమైనవి కావాలని వరమిచ్చి, బ్రహ్మదేవుణ్ణి సాగనంపాడు శివుడు. అదిగో అలాగ గోవులలో కపిలగోవులు శ్రేష్ఠమయి పేరుపొందాయి. కనకనే కపిలగోదానం గోదానకల్పానికంతకీ తలమానికం.

ధర్మరాజా, ఈకపిలగోవు ఉపాఖ్యానం కీర్తిదాయకమైంది. ఇది చదివినా విన్నా కలికల్మషం కడుక్కుపోతుంది; సంతానం కలుగుతుంది; ధన ధాన్యాలు తామరతంపర లవుతాయి.

[భీష్ముడు చెప్పిన కపిలాఖ్యానం విని ధర్మరాజూ అతని తమ్ములూ సంతోషించారు. తాతగారికి పాదాభివందనం చేశారు. విధిపూర్వకంగా గోదానాలుచెయ్యడానికి మనస్సులలో సంకల్పించుకున్నారు. ధర్మరాజునుద్దేశించి భీష్ముడు ఇంకా ఇలా అందుకున్నాడు.]

నాయనా, ధర్మరాజా! ఇక్ష్వాకువంశంలో సౌదాసుడని వో మహారాజు వుండేవాడు. ఓనాడు తన కులపురోహితుణ్ణి వసిష్ఠ మునిని "ఏది పవిత్రమైంది?" అని అడిగాడతడు. ఆదరపూర్వకంగా సౌదాసమహారాజుకి సమాధానం చెప్పాడు వశిష్ఠముని.

"ఆవు పవిత్రమైంది. హవిస్సుకి జన్మభూమి ఆవు. భూతకోటి కంతటికీ ఆధారభూతమైంది ఆవు. ప్రశస్తమైన పదార్థం ఆవు. సిరికి మూలమైంది ఆవు. పాపమనే మహాసముద్రం దాటడానికి నావ ఆవు. స్వర్గానికి నిచ్చెన ఆవు. అంతమంది దేవతలకీ వునికిపట్టు ఆవు. పది ఆవులున్నవాడు వొకఆవు దానమిస్తే పదింతలు ఫలం కలుగుతుంది. వంద ఆవులున్నవాడు పది ఆవులు దానమిస్తే వందరెట్లు ఫలం కలుగుతుంది. వెయ్యి ఆవులున్నవాడు వంద ఆవులు దానం చేస్తే వెయ్యిరెట్లు ఫలం కలుగుతుంది.

"ఉదయాన్నే ఆవుల్ని తలుచుకుంటే, వాటి గుణాలు మెచ్చు

కుంటే, భక్తితో వాటిని చూస్తే జనులకి ఎంతో పుణ్యం కలుగుతుం దని వేదాలు చాటి చెప్తున్నాయి.

"ఆవుపేడా, మూత్రమూ అసహ్యించుకుంటే పాపం చుట్టు కుంటుంది. అన్ని జంతువుల మాంసాలూ తిన్నవాడైనా సరే, ఆవు మాంసం మాత్రం తినకూడదు. తింటేమాత్రం ఘోరమైన నరకం తప్ప దంటారు బ్రహ్మ మొదలైన దేవతలు.

"చెడ్డకల వచ్చినప్పుడు, ఆవుని కీర్తిస్తే ఆదోషం పోతుంది. ఆవుపేడ కలిపిన నీరు స్నానం చెయ్యడం పరమపవిత్రమైన పని.

"'సురభులూ, సౌరభేయులూ సుస్థిరంగా నాదగ్గిర వుండాలి. వినయంగా నేను ఆవుల్ని చూస్తూవుండాలి. ఆవులున్నూ ఎప్పుడూ నన్ను చూస్తూవుండాలి" అంటూ భయం కలిగినచోటల్లా తలుచు కుంటూ వుంటే అన్ని భయాలూ అణిగిపోతాయి అంటారు పండితులు.

"ఎర్రరంగుఆవు దానంచేస్తే సూర్యలోకసుఖం లభిస్తుంది. తెల్లటిఆవు దానంచేస్తే చంద్రలోకసుఖం ప్రాప్తిస్తుంది. నల్లరంగు ఆవుదానమిస్తే అగ్నిలోకసుఖం దొరుకుతుంది. బూడిదరంగుఆవు దాన మిస్తే వాయులోకసుఖం సిద్ధిస్తుంది. తెక్కినరంగుల ఆవులు దానంచేస్తే గంధర్వలోకంలోనూ, సిద్ధలోకంలోనూ, సాధ్యలోకంలోనూ సౌఖ్యం కలుగుతుంది. ఏరంగుఆవు దానమిచ్చినా దేవతాస్త్రీలు వలచి వస్తారు. "ఆవుతో సమానంగా నువ్వులు దానం చేస్తే మనిషి మంచి ప్రకాశవంతు డవుతాడు. సాటిలేని పుణ్యలోకాల్లో అడ్డులేకుండా సంచారం చేస్తాడు. మహానందం అనుభవిస్తాడు. "గోవు మహనీయ మూర్తి నాకు మనస్సులో స్థిరపడాలి" అని భావించేవాడికి సకల శుభాలూ కలుగుతాయి. బహురూపకత్వమూ, విశ్వరూపకత్వమూ, సురూపకత్వమూ మొదలైన దివ్యమహిమలు సిద్ధిస్తాయి."

వసిష్ఠముని ఉపదేశించిన గోదానమహిమ విని, ఆసక్తితో

గోదానాలుచేసి, సౌదాసమహారాజు ఇతర్లకి దుర్లభమైన శాశ్వత సుఖాలు చూరగొన్నాడు; పుణ్యలోకాలు పొందాడు.

ధర్మరాజు :

గోవుల గొప్ప అలాటిదా ?

భీష్ముడు :

అవును. సౌదాసుడితో వసిష్ఠముని చెప్పిన విశేషం ఇంకా వుంది. చెప్తాను, విను.

"సర్వజ్ఞుడైన వ్యాసమునీంద్రుణ్ణి అతని కుమారుడు శ్రీశుకుడు భక్తిపూర్వకంగా పాదాభివందనంచేసి వోనాడు అడిగాడు, 'అన్నిటి కంటే అధికమైంది ఏది? యజ్ఞాలకి ఏదిమూలం?' అని. 'ఆవులకి తప్ప మరి దేనికీ అంతగొప్పతనం ఎక్కడా లేదు' అన్నాడు వ్యాస మునీంద్రుడు. 'అన్నిటిలోకీ ఆవులే పవిత్రమైనవి. ఆవులే యజ్ఞాలకి మూలకారణం. ఆవులకి తప్ప మరి వేటికీ ఈమహాత్మ్యం లేదు.

"పూర్వం ఆవులు పరమనియతితో బ్రహ్మదేవుణ్ణి కొలిచాయి. దానికి సంతోషించి, అంతవరకూ లేని కొమ్ములు వాటికి ప్రసాదించాడు బ్రహ్మ. అంతతో వూరుకోలేదతడు. దేవతల్నీ, మునుల్నీ చూసి, 'పరమపవిత్రమైనవి గోవులు. యజ్ఞాలకి అర్హమైనవి. ఆవుల పేరు విన్నా, వాటిని చూసినా పాపాలు పోతాయి. గోదానంచేసిన కర్తకి ఉత్తరగతులు తప్పించడంలో తంగేటిజున్ను ఆవు. గోసేవచేసిన వారికి స్వర్గలోకం కరతలామలక మవుతుంది' అన్నాడు.

"ఇంకా ఇలా చెప్పాడు వసిష్ఠముని. 'గోవుల పావనత్వం మరింత విశేషించి చెప్తాను, విను. ఆవుపేడ కలిపిన గోమూత్రమూ, పాలూ, నెయ్యీ వరసగా మూడుపూటలు ముందు తాగి, తరవాత మూనాళ్ళు గాలిమాత్రం ఆహారం చేసుకుని, ఆవులచేత నుగ్గుగా మట్టించిన యవలు నూకలు చేసి, ఆనూకలతో కాచిన గంజ నియమ

పూర్వకంగా మూడు మాసాలు ఆహారంగా పుచ్చుకుంటే బ్రహ్మహత్యవంటి పాపాలు పటాపంచలై పోతాయి. పవిత్రమైన విధానం ఇది. ఈ విధానంవల్లే అసురుల్ని గెలిచారు మునులు. ఆవునెయ్యి బ్రాహ్మలకి దానంచెయ్యడమూ, హోమంలో వేల్చడమూ ఉదాత్తమైన పనులు.

"నిర్మలమైన నీటితో ఆచమనంచేసుకుని, ఆవులమధ్య దమంతో గోమతీమంత్రం మనస్సులో జపిస్తే శుచిత్వధనం సమకూరుతుంది.

"అగ్ని సన్నిధినీ, ఆవులమధ్యా, బ్రాహ్మలదగ్గిరా గోమతి మంత్రం చదివినా, విన్నా కోరికలు సిద్ధిస్తాయి. ఆవుకంటే గొప్పది ముల్లోకాల్లోనూ లేదు."

వెనక జనకచక్రవర్తి తనకి ఉపదేశించినదాని కంతటికీ ఇదే సారం అని తెలుసుకుని, గోసమారాధన తత్పరుడయాడు శ్రీ శుకుడు.

ధర్మరాజు :

విశ్వమంతటికీ విభుడు కదా బ్రహ్మదేవుడు! అతనిలోకం మీద గోలోకం వుందని విన్నాను. దానికేమిటి కారణం?

భీష్ముడు :

మంచిమాటే అడిగావు. విను, వివరిస్తాను. విశ్వకర్మ తపస్సు చేసి యజ్ఞంకోసమూ, మోక్షంకోసమూ వొక కన్యని కల్పించాడు. అమృతమయమూర్తి ఆకన్య; కామరూపిణి. ఆమె పేరు సురభి.

సురభిని సృష్టించాక, మహాతేజోవంతుడైన వొక పురుషుణ్ణి కూడా సృష్టించాడు విశ్వకర్మ. దేదీప్యమానుడై వెలిగిపోతున్నాడు ఆపురుషుడు. అతడు సురభి మనోహరూపంచూసి, కామమోహితుడయాడు, ఆర్తిపొందాడు – అప్పుడు అఖిలలోకపావనుడైన, బ్రహ్మదేవుడు వచ్చి, 'బాధపడకు' అని అతడి ఆర్తి తొలిగించాడు. 'ఆర్తి పొందకు' అని తాను అన్నదానికి సకారణంగా అతడికి మార్తాండుడు

అని పేరు పెట్టాడు. నారీరత్నమైన సురభిని మార్తాండుడి కిచ్చాడు. "ఈమెకీ నీకూ కలిగిన సంతానం యజ్ఞాలకోసమూ, మోక్షం కోసమూ కావలసిన పాలకి పుట్టిల్లుగా వుంటుంది. దాని వునికి నా లోకానికి పైన వుంటుంది. ఇది నా వరం" అన్నాడు.

అదిగో బ్రహ్మదేవుడు ప్రసాదించిన ఆవరం ప్రకారం సురభికీ, మార్తాండుడికీ పుట్టిన సౌరభేయులు దేవతలకీ, అసురలకీ, నరులకీ నమస్కారభాజనులయారు. అది కారణంగా ఆవులు పరమోత్కృష్ట మైన గొప్పతనం పొందాయి పాపాలు పారదోలే పవిత్రగుణం కలిగి తమని భక్తితో సేవించేవారికి కోరిన కోరికలు ప్రసాదిస్తాయి.

ధర్మరాజు :

మార్తాండుడికీ సురభికీ పుట్టిన సంతానంలో మొదట ఎవరు పుట్టారు ?

భీష్ముడు :

తపోమహిమతో మార్తాండుడివల్ల సురభికి మొదట పదకొండు మందికుమాళ్ళు కలిగారు. అఖిలలోక ప్రభావులయారు వాళ్ళు. వేదాలు వాళ్ళకీర్తి గానంచేస్తాయి. వాళ్ళే ఏకాదశ రుద్రులని తెలుసుకో.

అనుపాదుడూ, అహిర్బుధ్న్యుడూ, త్ర్యంబకుడూ, వృషాకపీ, శంభుడూ, కపాలీ, రైవతుడూ, హరుడూ, బహురూపుడూ, ఉగ్రుడూ, విశ్వరూపుడూ అని పదకొండుమంది రుద్రులూ అర్చితులయారు.

అనంతరం సౌరభేయుల్ని ప్రసవించింది సురభి. ఆగోకులం విశేషం విను. గోవు మొహమూ, నాలికా, కొమ్ములూ – వీటిలో ఇంద్రుడు వుంటాడు. రంధ్రాలలో వాయువు వుంటాడు మూపురంలో శ్రీ కంఠుడు శివుడు వుంటాడు. కాళ్ళలో మరుత్తులు వుంటారు. కడుపులో అగ్నిహోత్రుడు వుంటాడు. పొదుగులో సరస్వతి వుంటుంది.

పేడలో లక్ష్మి వుంటుంది. పంచితంలో కీర్తి వుంటుంది. రక్తంలో చంద్రుడు వుంటాడు. హృదయంలో భగుడు వుంటాడు. వెంట్రుకల్లో అధిష్ఠానదేవత లుంటారు. తోకలో ధర్ముడు వుంటాడు. కళ్ళల్లో సూర్యుడు వుంటాడు. చర్మంలో తపస్సూ, సిద్ధీ, తేజస్సూ వుంటాయి. కీళ్ళలో సిద్ధులు వుంటాయి. ఆవుల ఆధిక్యం ఇంతకంటె ఏం చెప్పాలి ?

## ఫేనవుడి కథ

ఉద్భుతమైన ఒక ఇతిహాసముంది. గోవుమహిమ స్పష్టంగా వ్యక్తంచేస్తుం దది. చెపుతాను, విను.

త్రిశిఖరం అని ఒక పర్వతం వుంది. దానిదగ్గిర రుద్రుడు కన్పించిన కులహా అని ఒక నది వుంది. దాని ఒడ్డున అడివిలో భృగువంశీయులైన మునీశ్వరులు కొందరు ఆశ్రమాలు ఏర్పరుచుకుని తపస్సుచేస్తూ వుండేవారు. వారిలో సుమిత్రుడు అని ఒక ముని వుండేవాడు. మంచి ఆచారవంతు డతడు. అంగిరసుడు అని ఒక మహాబ్రాహ్మడు సుమిత్రుడి సఖ్యానికీ, సౌజన్యానికీ, మెచ్చి గోశర్కరం అని ఒక మందు ఇచ్చాడు.

గోశర్కర తెచ్చి ఆవుకు మేపి, పోషించాడు సుమిత్రుడు. గోశర్కర తిని పుష్టిగా పెరిగింది ఆవు. సుస్వరమూ, సురూపమూ ఏర్పడ్డాయి దానికి. పోర్లుకి వచ్చి ఒక చక్కని వృషభంతో జతకట్టిం దది. చూలు నిలిచింది. సకాలంలో ఒక దూడపెయ్యా, కోడెదూడా ఈనింది. ఆ రెంటికీ సంతానం కలిగింది. క్రమక్రమంగా సుమిత్రుడి ఆలమంద తామరతంపరగా పెరిగింది. వేలకిమించిన తన ఆవుల్ని చూస్తూ సంతోషిస్తూవుండేవాడు సుమిత్రముని. వాటిని మేపుకు వచ్చేవాడు. నీటిపట్లకి తోలుకువెళ్ళి, నీరు తాగించేవాడు. దూడలు

పాలు కుడుస్తూవుంటే తాను ఆనందించేవాడు. తాను పాలనురుగు మాత్రం తినేవాడు. అందుకని సంతోషించి అతడికి ఫేనపుడని పేరు పెట్టాడు గౌతమముని.

అలా సుమిత్రుడు గోసమారాధకుడయి ప్రవర్తిస్తూ వుండేవాడు. అలావుండగా వోనాడు కామరూపిణులయిన ఆవులుకొన్ని చక్కని చుక్కల్లాంటి ఆడాళ్ళగా మారాయి. ఓమనోహరమైన కోనేటిలో జలక్రీడలాడడ మారంభించాయి. తోడిఆవులు అక్కడ మేస్తూ చూసి, "మీరు ఎవరు?" అని మనుషుల మాటల్లో అడిగాయి. "మేం ఆవులం" అన్నారు జలక్రీడలాడుతున్న ఆడంగులు. "ఈఅద్భుత ప్రభావం ఎలా కలిగింది మీకు?" అని అడిగాయి ఆవులు. "చెపుతాం వినండి" అంటూ అందుకున్నారు. "హవ్యకవ్యాలకోసమూ, అతిథిపూజలకోసమూ, నిజాహారాలకోసమూ, ఉత్తములైన బ్రాహ్మలు సంతోషించడంకోసమూ పాలు కురుస్తాం మేము. కృషిక్రియలు నిర్వర్తించడంకోసం మా కుమాళ్ళని పంపుతాం. అదిగో ఆసుకృతాలవల్ల ఈప్రభావంమాకు లభ్యమైంది. మాకు గోలోకం అతిసులభం. మీరు మాసుకర్మలు చూసి అసూయపడతారు. అంచేత దూడలతో దుర్గతిపాలవుతారు. దివ్యబోధవల్ల రాబోయే చరిత్ర తెలుసుకుని, మీమీద జాలి కలిగి ఈవిషయం చెప్పవలిసి వచ్చింది మాకు."

"ఆవులకి ఆవులే గతి" దీనంగా అన్నాయి ఆవులు, "కనక మాకు సుగతి కలిగేదారి మీరే చెప్పండి ఎలాఅయినా చూసి" అంటూ ప్రాధేయపడ్డాయి. "సరే", అని ఇలా చెప్పారు ఆడంగులు, "రంతిదేవుడు వెయ్యిసంవత్సరాల యజ్ఞం చేస్తున్నాడు. ఆయజ్ఞానికి పశువులై మీరు వెళ్ళండి. అతడు మిమ్మల్ని యజ్ఞపశువులుచేసి వధిస్తాడు. అందుమూలంగా గోలోకం లభిస్తుంది మీకు."

విని సంతోషించాయి ఆవులు. రంతిదేవుడి యజ్ఞానికి వెళ్ళడంకోసం సిద్ధపడ్డాయి. ఇంతలో వొక ఆవు, "మనం సుమిత్రముని

ఆవులం. అతను అనుమతించందే ఎలా వెళ్తాం?" అంది. "అయితే అతణ్ణి చంపేద్దాం. అతడున్నూ మనతో గోలోకానికి వస్తాడు" అంటూ ఆవులన్నీ కూడబలుక్కుని సుమిత్రుడి దగ్గిరికి వెళ్ళాయి. వెళ్ళడమేమో వెళ్ళాయి, కాని ఆ మునీశ్వరుణ్ణి తేరిచూడలేకపోయాయి భయపడి తిరిగి వచ్చేశాయి. అయితే కొన్ని కపిలగోవులు సాహసించాయి. అతిక్రూరచిత్తంతో "మేం సుమిత్రుణ్ణి చంపుతాం. మాకు ఏంమేలుచేస్తారో చెప్పండి" అని అడిగాయి. "అన్నిరంగుల ఆవుల లోనూ కపిలరంగు ఆవులు శ్రేష్ఠంగా గణించబడినట్టూ, ఒక్క కపిల గోవు దానంచేస్తే వందగోవులు దానంచేసినంత ఫలం కలిగినట్టూ వరమిస్తాం" అంటూ ఆవులన్నీ, వొక్కగొంతుకతో అన్నాయి.

సంతోషించాయి కపిలగోవులు. కామరూపిణులయినవి కనక రూపాంతరం పొంది భృగువంశనగ్యుడైన సుమిత్రుడిదగ్గిరికి వెళ్ళాయి.

"మేం గోమాతలం. నీగోసమారాధనకి మెచ్చాం. వర మివ్వడానికి వచ్చాం. ఏంకావాలో కోరుకో" అన్నాయి.

"ఇప్పటిలాగే ఎప్పుడూ ఆవులంటే భక్తిస్నేహాలు కలిగివుండి నట్టు వరమివ్వండి నాకు" అని కోరుకున్నాడు సుమిత్రుడు. "అలాగే కానీ, అయితే ఈలోకంలో ఎందుకిక? మన గోలోకానికి పోదాం రా" అన్నాయి ఆవులు.

"రత్నాలవంటి నాఆవులు వొదిలేసి రాగలనా గోలోకానికి? రాలేను" అన్నాడు సుమిత్రుడు.

సుమిత్రముని నోట్లోమాట నోట్లోనే వుంది, వొక్కవూపుని అతణ్ణి ఆకాశంమీదికి ఎగచిమ్మాయి కపిలగోవులు. తమ యోగ బలంతో అతని చైతన్యం పోగొట్టాయి. ఆకాశంమీంచి అతడి కళేబరం నేలమీద గిరవాటేశాయి. కొమ్ములతో పొడిచేశాయి. కాళ్ళతో కుమ్మేశాయి. పచ్చడి ముద్దచేసి వొదిలిపెట్టాయి. తిన్నగా

వచ్చి, తమని పంపిన ఆవులతో అదంతా పూసగుచ్చినట్టు విని పించాయి. ఆవులన్నీ సంతోషించాయి.

గోలోకంలో వున్న గోమాతలు అదంతా తెలుసుకున్నాయి. తమదగ్గిరికి వచ్చిన సుమిత్రమునిని ఆదరించాయి. స్త్రీలయి కోనేటిలో జలక్రీడలాడిన ఆవులు మొదలుకుని అన్ని ఆవులవిషయమూ అతడికి తెలియచేశాయి. "మునీంద్రా! నీకు ఇది మేలే అయింది" అంటూ అతణ్ణి సంతోషపరిచాయి. మునిని చంపి బ్రహ్మహత్యాపాపంపోసుకున్న ఆవుల్ని చూసి "మీవంశం అశుచిమోహం అవుతుంది" అంటూ శపించాయి. ఆఆవులు రంతిదేవుడిదగ్గిరికి వెళ్ళాయి. "రాజా, మాకు సుగతి కల్పించు" అంటూ మనిషిభాషలో కోరాయి.

"మిమ్మల్ని చంపి సద్గతి ఎలా పొందగలన్నేను?" అని వినయంగా ఆవులముందు సాగిలబడ్డాడు రంతిదేవుడు.

"ఆభయమేమీ అక్కరలేదు నీకు" అభయమిస్తూ అన్నాయి ఆవులు, "ఇందుకోసం జ్ఞానులు పంపితేనే వచ్చాం మేము. దీనివల్ల శాశ్వతంగా నీకీర్తి లోకంలో వ్యాపిస్తుంది."

"అయితే, వొక నియమం ముంది వినండి" అన్నాడు రంతి దేవుడు, "ప్రాణంమీద మోహం పెట్టుకుని మీలో ఏవొక్క అవు పారిపోయినా అంతతో ఈపనికి స్వస్తి. ఇది సమ్మతమైతే మాటఇవ్వండి."

"సమ్మతమే" అని మాటఇచ్చాయి ఆవులు. దాంతో వరసగా ఆవుల్ని యజ్ఞపశువులుగా వధించి అగ్నిలో వేల్చడం మొదలుపెట్టాడు రంతిదేవుడు.

ఓనాడు వోఆవు తనలేగకి పాలుకుడుపుతూ అంది: "అయ్యో నాబిడ్డా! ఇక ఎక్కడ చేరుకుంటావో కదా నువ్వు? దయమాలిన కఠినాత్ములు మీఅమ్మని చంపడానికి వస్తారిక."

అది విన్నాడు మహానుభావుడు రంతిదేవుడు. సుప్రయోగంగా యజ్ఞం సమాప్తంచేశాడు అంతతో కొన్ని ఆవులు వెనకపడి భూలోకం మీద వుండిపోయాయి. యజ్ఞపశువులై మరణించిన ఆవులు సంతోషంగా గోలోకం చేరుకున్నాయి. వాటి చర్మాలూ, ఎముకలూ వరసగా కుప్పపడి పొడ్డులయాయి. వాటి నెత్తురూ, మేదస్సూ, తడీ ఏరై పారింది. ఆయేరుపేరు చర్మణ్వతి అయింది.

సర్వసమృద్ధంగా యజ్ఞం పూర్తిచేసి, రంతిదేవుడు దేవేంద్రుడితో స్నేహం చేశాడు. అక్షయమైన స్వర్గంచేరాడు. మంచికీర్తి సంపాదించాడు. ఫేనవుడున్నూ గోలోకంలో శాశ్వతంగా నివసించాడు.

నాయనా, ధర్మరాజా! ఇది ఫేనవుడి ఉపాఖ్యానం. ఇది బదరికాశ్రమంలో బాదరాయణుడు నారాయణుడికి చెప్పాడు. ఆమహాత్ముడు గోయజ్ఞార్థి అయి ఈకథని ఎంతోఅంత మెచ్చుకున్నాడు. అంచేత ఇది లోకంలో పుణ్యతమమైందను పేరుపొందింది. పరమపావనమైన ఈ ఉపాఖ్యానం చదివినా, విన్నా వినిపించినా, పాపాలు దగ్గిర చేరవు.

పూరువంశం రాజలోకానికి అలంకారం నువ్వు. పైగా పుణ్యచరిత్రుడివి. ఆవులంటే అమితభక్తి కలిగివుండు. పరమనియతితో ఈ ఉపాఖ్యానం ఎప్పుడూ చదవడమూ, వినడమూ, వినిపించడమూ సాగించు.

ధర్మరాజు:

అలాగే చేస్తాను. గోమహిమ ఇలా విని కూడా నామనస్సుకి తనివితీరకండా వుంది. అంచేత మహాత్మా, ఇంకా అనుగ్రహించు.

## గో మ హి మ

భీష్ముడు:

నాయనా, నీధర్మబుద్ధికి పరమసంతోషంగా వుందోయి నాకు. నువ్వు అడిగినదానికి లోగడ వ్యాసభగవానుడు చెప్పిన వాక్యాలు చెపుతాను, విను.

నువ్వు, నన్ను అడిగినట్టే, గోమహిమ శ్రీశుకుడు తండ్రిని అడిగాడు. కుమారుడి ప్రశ్న విని సంతోషించాడు వ్యాసమునీంద్రుడు. ఇలా సమాధానం చెప్పాడు :

"స్థావరజంగమాత్మకమైన భూతకోటి యావత్తూ ఆవుల ఆశ్రయంవల్లే సుస్థితిపొంది వుంటున్నది. దాని సంభవం కూడా గోవుల లోంచే కలుగుతూవుంది. బ్రహ్మదేవుడి మూలసంతానం ఆవులు. సిద్ధులకూ సాధ్యులకూ కూడా తల్లులు ఆవులు. ఇది తెలిసినవాడు బ్రహ్మలోకమూ మొదలైనలోకాలకి తన ఇంటికి వెళ్ళినట్టే వెళతాడు స్వేచ్ఛగా.

"పరమగతి కోరేవాళ్ళు ఆవుని కాలితో తన్నకూడదు. పిడికిలితో పొడవకూడదు. కర్రతో కొట్టకూడదు. నోటితో తిట్టకూడదు. మనస్సులో తూలనాడకూడదు. బ్రహ్మదేవుడు ఉపదేశించిన విద్య ఇది. ఆత్మపావనమైన విద్య ఇది. శిష్యులు సేవించదగిన విద్య. అవులు పావనమైనవని వేదాలు చాటి చెపుతున్నాయి. ఆవుల్ని ఆశ్రయించి దేవతలు ప్రాణులందరి లోనూ గొప్పవారయారు. ఇదిగో ఇలాటిది గోమహిమ. గోమహిమని మించిన మహిమ మరొకటి లేదంటేనమ్ము.

"ఆవుల అంబా అరుపులు వీణాధ్వనులతో సమానమైనవి; కాహళధ్వనులతోనూ వేణునాదాలతోనూ సమానమైనవి. నిర్మలమైన మాటలతో వాటిని వర్ణించినా, ఆలకించినా తరగని సుకృతం కలుగుతుంది.

"పాలూ, పెరుగూ, నేయీ - ఇవి అమృతమయమైనవి. అంచేత దేవతలకి ప్రియమైన యజ్ఞకార్యాలు గోవుల్ని పిదకడంవల్లే సాధ్యపడుతున్నాయి.

"వేదాలూ, ఉపనిషద్వాక్యాలూ గోస్వరూపాలని బ్రహ్మదేవుడు చెప్పాడు. పరమధర్మమూ, పరమపావనమూ, మహాయజ్ఞాలూ ఆవులే అనాలి.

"నాయనా, ఈవాక్యాలు బ్రాహ్మణసన్నిధిని చదివినవాడు పుణ్యవంతుడవుతాడు. విన్నవాళ్ళు తత్క్షణమే పాపాలు పోగొట్టుకుంటారు.

"ఆవునెయ్యి సేవించి, ఆవుపేడ కలిపిన నీరు నియమపూర్వకంగా స్నానంచేసి, అధికమైన భక్తితో నిత్యమూ గోమతీపఠనం చేసిన బ్రాహ్మణుడు పాపాలు పారదోలుకుంటాడు. గోవుని పఠించడం వల్లే దేవతలూ, మహామునులూ అంతగొప్పవాళ్ళయ్యారు. గోమతి పఠిస్తే సిరీ సంపదా కలుగుతాయి. శత్రువిజయం లభిస్తుంది. సాటి లేని గొప్పదనం సిద్ధిస్తుంది. మంచి కుమాళ్ళు కలుగుతారు. బంధు సౌఖ్యమున్నూ లభిస్తుంది. మార్గంలో క్రూరమృగాలవల్లా, దొంగల వల్లా బాధకలగదు."

వ్యాసముని ఉపదేశించడమంతా విని, "తమ జాతికి తగిన వైదికకర్మలు చెయ్యలేని జనులు కపిలగోవుల్ని పూజిస్తారు. వాటిని దానమిస్తారు. ఆపూజలూ, దానాలూ వారి పాపాలు పోగొడతాయా?" అని అడిగాడు శ్రీశుకుడు.

"తప్పకుండా పోగొడతాయి" అన్నాడు వ్యాసమునీంద్రుడు, "సందేహం లేదు" కపిలగోవుని భక్తితో పూజించినా, ప్రీతితో దాన్ని మంచి బ్రాహ్మణుడికి దానంచేసినా వొదిలిపోని పాపాలంటూ వుండవు.

## కపిలగోవు మహిమ

"అయితే కపిలగోవుకి అంత గొప్పతనం ఎలా వచ్చింది?" అని మళ్ళీ అడిగాడు శ్రీశుకుడు.

"చెప్తాను, విను" అంటూ అందుకున్నాడు వ్యాసమునీంద్రుడు, "ఒకానొక కారణంచేత దేవతల్ని వంచించి, తాను మరుగు పడడంకోసం ఆవుల్ని ఆశ్రయించాడు అగ్నిదేవుడు. ఆవులు అగ్నిని

దాచిపెట్టాయి. అగ్ని మరుగుపడడంతోనే అన్నిచోట్లా వెదికారు దేవతలు. తుదకి ఆవులలో అతడి వునికి తెలుసుకున్నారు. అంతమందీ కలిసి ఆవులదగ్గిరికి వచ్చారు.

"'అగ్నిని దాచడమంటే అన్నిలోకాలకీ అహితం చెయ్యడమే. కనక అతణ్ణి కనపరచండి. కనపరచకండా మరుగుపరచడం మీకు తగదు' అన్నారు. దేవతలమాటలు విని భయపడిపోయాయి ఆవులు. అగ్నిహోత్రుణ్ణి దేవతలఎదట బయటపెట్టేశాయి. సంతోషించారు దేవతలు. ఆవులకి వరమియ్యమని అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించారు.

" అగ్నిహోత్రుడు ఆవుల్లో దాక్కోడంవల్ల వాటికి కపిలవర్ణం వచ్చింది. అదిచూసి, 'ఆవుల్లో కపిలరంగు ఆవులు గొప్పవి' అన్నాడు అగ్ని దేవుడు. కపిలగోవుల్ని పూజించినా, వాటిని దానంచేసినా పాపాలు పోతాయి; పుణ్యం లభిస్తుంది; ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి' అని వరమిచ్చాడు. దాన మిచ్చినవాణ్ణే కాదు, దానం పుచ్చుకున్న వాణ్ణి కూడా పుణ్యాత్ముణ్ణి చేస్తుంది కపిలగోవు. కనక కపిలగోవుని పూజించడానికి సంకల్పించు. ఎంతయినా మేలు కలుగుతుంది నీకు' అన్నాడు.

తండ్రి చెప్పిన కపిలగోవు మహిమ విని, దాని లక్షణం వివరించమని అడిగాడు శ్రీశుకుడు.

## కపిల గోవు లక్షణం

కుమారుడితో వ్యాసముని ఇలా చెప్పాడు : " చెవులూ, కొమ్ములూ కాళ్ళూ గిట్టలూ,ముకుపుటాలూ కపిలవర్ణంగాలేకపోయినా కుత్తుకా, పొదుగూ కపిలవర్ణంగా వుంటే చాలు. లేదా పైచోట్లలో ఎక్కడో వొకదగ్గిర కపిలవర్ణ ముండినా చాలు. అది కపిలగోవు అని నిర్ణయించవచ్చు. ఇక శరీరమంతా కపిలరంగువుంటే మరి చెప్పనే

అక్కరలేదు. పాలు పిదికి తాగడానికీ, ఏ దేవతకైనా నైవేద్యం చెయ్యడానికీ మాత్రమే కపిలగోవుని ఉపయోగించాలి. దానిని మూటలు మొయ్యడానికి ఎంతమాత్రం వినియోగించకూడదు.

"కపిలగోవుని కాలితో తన్నినా, చేత్తో కొట్టినా, కర్రతో బాదినా నరకం తప్పదు. నీరుపట్టి, మేతపెట్టి, చక్కగా దాన్ని ఆదరిస్తే మాత్రం సుగతి కలుగుతుంది.

"కపిలగోవు దానమిస్తే, దాని ఫలం ఇంతా అంతా అని చెప్పలేం. బ్రహ్మదేవు డంతవాడు తనకి చెప్పతరం కాదన్నా డంటే, ఇంక ఇతర్ల సంగతి ఏమని చెప్పాలి?

"బ్రాహ్మలూ, గాయత్రీ, వసంతరుతువూ, సత్యమూ, ఆవూ, బంగారమూ - ఇవి ఏకంగా పుట్టాయని మునీశ్వర్లు చెప్పగా వింటున్నాం. కనక భూమీ, బంగారమూ, ఆవూ-దానమివ్వతగిన అన్నింటిలోకీ ఇవి గొప్పవి. వీటిని నీ ఆత్మబుద్ధిలో నిలుపుకోవాలి."

తండ్రిగారి ఉపదేశం శ్రద్ధగా విని సంతోషించాడు శ్రీ శుకుడు.

## గో - లక్ష్మి సంవాదం

ధర్మరాజు :

లక్ష్మి గోమయంలో వుంటుందని విన్నాను. ఏమిటి దానికి మూలం?

భీష్ముడు :

గో - లక్ష్మీసంవాదం అని ఒక ఇతిహాస ముంది. నువ్వు అడిగిన ప్రశ్నకి అది సమాధాన మవుతుంది. చెపుతాను, విను.

ఓమారు లక్ష్మి ఆవులమధ్యకి వెళ్ళింది. "ఎవ్వతెవు నువ్వు?" అని ఆమెని అడిగాయి ఆవులు. "నేను లక్ష్మిని. మీలో వుండడానికి వచ్చాను" అంది లక్ష్మి. నువ్వు చంచలవి. మాలోవుండడానికి నిన్ను మేం వొల్లం" అన్నాయి ఆవులు. దానికి విచారపడింది

లక్ష్మి. "నేను వొదిలిపోతే దానవకులం యావత్తూ నాశనమై పోయింది. నన్ను పొంది దేవతలు ప్రభుత్వం సంపాదించారు. నేను రావాలనే కదా యావన్మందీ తపస్సు చేస్తారు! అలాటి నన్నా మీరు తిరస్కరిస్తారు? తగునా మీకు?" అంది. "అదేమన్న మాట?" అన్నాయి ఆవులు "నిలకడలేనిదాన్ని వొల్లమనడం తిర స్కరించడమా? మాదగ్గిర వద్దు. నీకు తగినచోటికి నువ్వు దయ చెయ్యి."

"మీవల్ల ఇలా తిరస్కారంపొంది వెళితే ఇక ఎవ్వరూ నన్నువొల్లరు. అంచేత మీశరణువేడుతున్నాను" అంటూ ప్రాధేయ పడింది లక్ష్మి. "మీదగ్గిర వుండడమే మేలు నాకు. ఈమాత్రం అనుగ్రహించండి" అంటూ కాళ్ళా వేళ్ళా పడింది.

ఆవులన్నీ కూడబలుక్కున్నాయి. లక్ష్మిని ఆదరించాయి. "అయితే మా మలమూత్రాలు పవిత్రమైనవని వేదాలెరుగును ఈమేలిపదార్థాలు నువ్వు నీప్రియనివాసాలుగాచేసుకుని నివసించు. మాకు సంతోషమే ఇది" అన్నాయి ఆవులు.

"నాపుణ్యంవల్ల మీ అనుగ్రహం పొందగలిగాను" అంటూ అవాళనించీ ఆవుల మలమూత్రాలలో నివసించింది లక్ష్మి. ఇదీ దీని కథ. అమోఘమైంది గోమయప్రభావం. ఇంకా వొక విశేషం చెపు తాను, ఆలకించు.

సురభి తపస్సు చేసింది. మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమ య్యాడు. "నీకు ఏంకావాలో కోరుకో. వరమివ్వడానికే నేను వచ్చాను" అన్నాడు.

"మీరు ప్రసన్నులయ్యారు. వేంచేశారు. ఇంతకంటే కావలి సింది ఏముంది నాకు? పరమదయామూర్తులు మీరు" అంది విన యంగా సురభి.

సంతోషించాడు బ్రహ్మదేవుడు. "దేవలోకం మొదలైన దివ్యలోకా లన్నిటిలోనూ గోలోకం మీదుగా వుండేటట్టు వరమిస్తాను" అని భావించాడు. ఆవిశేషమంత్వం ముందే తనవల్ల సిద్ధంకావడం స్మృతిగోచరం కావడంతోనే ఆవులకి మేలుచెయ్యాగోరిన నామనస్సులో నావరంవల్ల సిద్ధమైందే దైవికంగా జరిగింది" అంటూ అదే వరం ప్రసాదించా డతడు. తనలోకంకంటే మీద గోలోకం ప్రతిష్టించాడు. మహోజ్జ్వలంగా ప్రకాశించింది గోలోకం.

గోవిషయమైన వాక్యాలు చదివినా, విన్నా, వినిపించినా ఆయుస్సూ ఐశ్వర్యమూ కలుగుతాయి. విభవమూ, కీర్తీ, సుగతీ లభిస్తాయి. అంచేత మహారాజా, ఆవుల కథల విషయంలో తత్పరుడివి కా.

## సువర్ణదాన మహిమ

ధర్మరాజు :

మహాత్మా! గోవులమాహాత్మ్యం ఎన్నోవిధాల తేటతెల్లంగ చెప్పావు. నన్ను కృతార్థుణ్ణిచేశావు. యజ్ఞాలన్నిటిలోనూ బంగారం దానంచెయ్యాదగిందని విన్నాను. "సువర్ణదక్షిణేతి" అనివేదాలు చెప్తూతున్నాయి. భూమీ, ఆవులూ, బంగారమూ దానాల్లో ఉత్తమ దానాలని వేదవ్యాసుడు చెప్పినట్టు నువ్వే చెప్పావు. కనక బంగారం విశేషం వినాలని అభిలాషిస్తూతున్నాను, వినిపించు.

భీష్ముడు :

మాతండ్రి శంతనమహారాజు కాలంచేశాక, ఆయనగారి శ్రాద్ధవిధి నిర్వహించడంకోసం నేను హరిద్వారం వెళ్ళాను. మాఅమ్మ గంగాదేవిసాయంతో క్రియాకలాపం సాగించాను. పిండప్రదాన సమయం వచ్చింది. దర్భవిన్యాసం చేశాం. అంతలో వుంగరాలూ, కంకణాలూ, దండకడియమూ కల వొక చక్కని హస్తం కనపడింది.

అరచెయ్యి చాచింది. దాన్ని చూసి మనస్సులో ఆశ్చర్యంకలిగింది నాకు. అది శంతనమహారాజు హస్తమే అని అవగతమైంది. సంతోషమూ కలిగింది. అనుమానించకండా అతని అరచెయ్యిలో పిండం పెడితే శాస్త్రవిధానం తప్పినట్టవుతుంది. పితృహస్తంలో పిండంపెట్ట మని చెప్పదు శాస్త్రం. కుశాస్తరణంమీద పెట్టమంటుంది. అంచేత తండ్రిచేతిలో పెట్టక కుశలమీదే పెట్టడానికి నిశ్చయించుకున్నా న్నేను. వంచన చేశాను. కుశలమీదే పిండం పెట్టాను. దాంతో మా తండ్రిగారి చెయ్యి అదృశ్యమైపోయింది. నాపితృదేవతల మొహాలు సంతోషంతో కలకల్లాడుతూ దర్శనమిచ్చాయి.

"నాయనా, ధర్మమార్గం చెడకండా ఇలా పిండం పెట్టావోయి నువ్వు. పరమానందం కలిగింది మాకు. అందుకే ఇలా వచ్చాం. ఎంతో తృప్తి కలిగింది మాకు. భూమికోసమూ, ఆవులకోసమూ, బంగారం దానంచెయ్యడం మాకూ, దేవతలకూ ప్రియమైన విషయం. పవిత్రమైన కార్యం ఇది. భీష్మా, సర్వధర్మాలూ తెలిసినవాడివి నువ్వు. నీకు చెప్పే దేముంది ? బంగారం పావనమైంది. తరతరాలవారికి నిర్మ లాత్మక సమకూరుస్తుంది బంగారం. ఇది తెలుసుకుని, నువ్వు సకల యజ్ఞాలలోనూ సువర్ణ యాజివికావాలి" అని చెప్పి వెళ్ళిపోయారు. అది మొదలు బంగారం దానంచేయడములో నామనస్సు లగ్నమైంది. ఇంతవరకూ బంగారం దానం చేస్తూనే వచ్చాను ఇది నేను స్వానుభవంతో తెలుసుకున్నవిషయం. ఇక విన్నవిషయం వొకటుంది. వివరిస్తాను, విను.

పరశురాముడు రాజులమీద క్రోధం పూనాడు. ఇరవైవొక్క మారులు రాజలోకంమీద దండయాత్ర సాగించాడు. వెదికి వెదికి దయా దాక్షిణ్యంలేకండా రాజన్నవాణ్ణల్లా నరికిపారేశాడు. చివరికి జాలిపుట్టి, దానికి ప్రాయశ్చితంగా అశ్వమేధయజ్ఞంచేశాడు. అయినా

తనివితీరలేదతనికి. అప్పుడు వసిష్ఠుడూ మొదలైన మునీశ్వర్లని అడిగాడు, "పాపపంకం కడిగి ఏది పురుషుణ్ణి నిర్మలుణ్ణి చెయ్యగలుగుతుంది?" అని. "బంగారం" అంటూ అందుకున్నాడు వసిష్ఠముని, "బంగారం అగ్నిమయం. దేవతలు అగ్నిమయులు. అంచేత బంగారం దానంచేస్తే దేవతల్ని దానంచేసినట్టే అని చాటుతున్నాయి వేదాలు. కనక బంగారం సాటిలేంది. పరమ పావనమైంది. బంగారం భక్తితో బ్రాహ్మలకిస్తే పవిత్రతకు కొరత వుండదు. బ్రహ్మదేవుడు చెప్పగా నేను విన్న బంగారం విశేషం కొంచెం చెప్తాను, సావధానంగా విను.

"ఒకానొక కాలంనాటి మాట. ఆదిమగృహస్థుడైన పరమేశ్వరుడి తేజస్సు పరమగ్రహించి పార్వతికోసం రేతోధాతు రూపంగా స్ఖలనమయింది. అది మహేశ్వరుడి మానసవృత్తిప్రకారం అగ్నిలో నిలిచింది.

"ఆదినాల్లో దారకుడు అని ఒక రాక్షసుడు వుండేవాడు. అతడు పెట్టిన బాధలు భరించలేకపోయారు దేవతలు. బ్రహ్మదేవుడి దగ్గిరికి వెళ్ళి మొరపెట్టుకున్నారు. దారకుడు పెట్టిన అగచాట్లు విన్నవించారు.

"ఇదంతా ముందే తెలుసు నాకు" అన్నాడు బ్రహ్మదేవుడు, "అందుకని మీకు శుభంకలిగే ఏర్పాటు ముందే చేసిపెట్టాను. మీరు వెళ్ళి అగ్నిహోత్రుణ్ణి ఆశ్రయించండి. 'మాకు మేలుకలిగించు' అని ప్రార్థించండి. ఏంచెయ్యాలో అతడికి తెలుసు. వెళ్ళండి" అంటూ నియోగించాడు.

సంతోషించారు దేవతలు. "మహాప్రసాదం" అంటూ బ్రహ్మదేవుడి దగ్గిర సెలవుతీసుకున్నారు. అగ్నిదేవుడి దగ్గిరికి బయలుదేరారు. అతడు ఎక్కడ వున్నాడో వెదుక్కుంటూ వెళ్ళారు.

నిద్రమైకంవల్ల అగ్నిహోత్రుడు ప్రచ్ఛన్నంగావున్నాడు.

అతణ్ణి కనుక్కోలేకపోయారు దేవతలు "అగ్ని పాతాళంలో వున్నాడు" అంటూ వో కప్ప వాళ్ళకి చెప్పేసింది. దాక్కొని రావి చెట్టుకి పోతూ, "జిహ్వాస్ఫూర్తి లేకండా, రసవివేకం లేకండావుండు" అని కప్పని శపించాడు అగ్ని. "ఎండకి ఎండి, చచ్చినప్పటికీ వాన కురవడంతోనే చావు బొంకుచేసి అరుస్తూ లేవాలి" అని కప్పకి వరమిచ్చారు దేవతలు. దేవతలూ, మునులూ అలా అగ్ని పెట్టిన శాపంవల్ల కలిగిన కప్పవిచారం పోగొట్టి, అగ్నిని వెదకడం మొదలుపెట్టారు. ఇంతలో వో అడివిఏనుగు కన్నుగీటి అగ్నివునికి దేవతలకి చెప్పేసింది. అగ్ని దాక్కొన్న రావిచెట్టు దగ్గిరికి వెళ్ళారు దేవతలు.

ఏనుగ మీద ఎక్కడలేని కోపంవచ్చింది అగ్నికి. "నీనాలిక తిరగబడాలి" అని దాన్ని శపించి, శమీవృక్షగర్భంలోకిపోయి దాక్కొన్నాడతడు. అవాళనుంచే అగ్నికి శమీగర్భంలో ఉత్పత్తి కలిగింది.

"నాలిక తిరగబడినా, సర్వరసజ్ఞానంకలిగి మాననీయవుగా వుంటావు" అని ఏనుగుకి వరమిచ్చారు దేవతలు. అలా దానిని అనుగ్రహించారు. దాని విచారం పోగొట్టారు.

"శమీగర్భంలో అగ్ని దాక్కొన్నాడు" అని వో చిలక దేవతలకీ, మునులకీ చెప్పేసింది. చప్పున దేవతలూ, మునులూ శమీవృక్షం చుట్టుముట్టారు. నిద్దర తేలిపోయి భగ్గుమన్నాడు అగ్నిదేవుడు. "నీనాలిక తిరగబడాలి" అని చిలకని శపించాడు. "అయినా నీపలుకులు చెవులకి ఇంపుకలిగిస్తాయి" అని చిలకకి వరమిచ్చారు దేవతలు. అలా చిలకని సంతోషపరిచారు వారు.

అంత ప్రయత్నంమీద అగ్నిదేవుణ్ణి పట్టుకున్నారు దేవతలు.

"ఎందుకిలా వచ్చారు?" అని అడిగాడు అగ్నిహోత్రుడు. తారక దైత్యుడిబాధ తెలియచేశారు దేవతలు. "వాడు కడతే

సాధనం నువ్వే చెప్పాలి. అందుకనే నిన్ను ప్రార్థించడానికి వచ్చాం. మా కుశలం విచారించు. నీకున్నూ క్షేమం కలుగుతుంది. దయ చూడు. ఈలోకాలన్నీ నీ మహిమ కీర్తిస్తాయి" అన్నారు.

ప్రసన్నుడయాడు అగ్నిదేవుడు. "దేవతలారా! విచారించకండి. మీ కోరిక నెరవేరుస్తాను" అంటూ దేవతల్ని వోదార్చాడు. తనలో వెలుగుతున్న శివవీర్యం గంగగర్భంలో వొదిలిపెట్టాడు. అతిసమృద్ధమైన శివవీర్యం ధరించలేక పోయింది గంగ. మేరుపర్వతం వొద్దున రెల్లుగడ్డిలో విడిచిపెట్టింది. అదంతా బంగారంమయమై ప్రకాశించింది. శివవీర్యం బాలుడై నిలిచింది. ఆరుగురు కృత్తికలు ఆ బాలుడి దగ్గిరికి వచ్చారు. మా కుమారుడంటే మా కుమారుడు అంటూ ఆరుగురూ బాలుణ్ణి ఎత్తుకున్నారు. ఆరుగురూ వొక్కమారు ఎత్తుకోడంతోనే ఆరు మొహాలతో మారాడు బాలుడు. ఆరుగురి స్తనాలు కుడిచాడు.

అలా అగ్నిలోనుంచీ గంగలోంచీ రెల్లుగడ్డిలోంచీ పుట్టి, కృత్తికల బిడ్డడయి, కార్తికేయుడైన శివుడి తేజస్సుని బ్రహ్మ ముదలైన దేవతలు పూజించారు వచ్చి. దేవసేనకి అతణ్ణి నాయకుడిగా చేశారు. మహాశక్తితో అతడు తారకాసురుణ్ణి సంహరించాడు. దేవతలకీ, మహామునులకీ ఆనందం కలిగించాడు" అంటూ ఘనబాహుడైన శివుడు స్వర్ణమయుడనీ, ఆ దేవదేవుడే కుమారుడయి జన్మించాడనీ, అతని రేతస్సు ధరించి అగ్ని స్వర్ణాత్మక తేజోమూర్తి అయి సువర్ణరేతుడనిపించుకున్నాడనీ, అతడు ఆ రేతస్కలనంచేత తన్మయుడు కావడం వల్ల శివుడికి 'అగ్నిరేతుడు' అని పేరు వచ్చిందనీ పరశురాముడికి వశిష్ఠముని వివరించాడు.

"అలా రూపవంతమైంది కనకనే బంగారానికి జాతరూపమని పేరు వచ్చింది. ఇంత మహిమ వుంది బంగారానికి. తేజోమహా

నీయమైంది బంగారం. బంగారం దానంచెయ్యడంలో వున్న మహాత్మ్యం ఆశివుడికే తెలుసు. ఆమహాత్మ్యంవల్ల మనిషి పాపాలు పోయి, పొగ లేని అగ్నిహోత్రంలా శుచిత్వసంపదతో ప్రకాశిస్తాడు" అంటూ ఉపదేశించాడు.

వశిష్ఠముని ఉపదేశం బాగా మనస్సుకి పట్టించుకున్నాడు పరశు రాముడు. ఎంతో ఆనందించాడు. వరసపెట్టి ఎన్నో సువర్ణదానాలు చేశాడు. శుచిత్వశ్రీతో ప్రకాశించాడు.

ధర్మరాజా! నువ్వు కూడా అలాగే బంగారం దానంచెయ్యి. బంగారందానం భవసముద్రం దాటిపోడానికి ఓడవంటిదంటే నమ్ము.

## పి తృ పూ జా వి ధా న ం

ధర్మరాజు :

బంగారం మహిమ విని పరమానందంగావుంది నాకు. భక్తి వినయాలతో ఇదిగో నీకు నమస్కరిస్తున్నాను. పితృయజ్ఞవిధానం సెలవియ్యి.

భీష్ముడు :

దైవతపూజతో సమానమైంది పితృపూజ. దేవతలూ మొదలైన యావన్మందీ పితృదేవతలని ప్రశంసిస్తారు; భక్తితో గౌర విస్తారు. విశేషించి మనుషులకు పితృపూజ సర్వసౌఖ్యాలకూ సాధన మవుతుంది.

అమావాస్య అమావాస్యా పిండప్రదానసహితంగా భక్తితో పితృశ్రాద్ధంచేస్తే నిత్యమూచేసినంత ఫలితం కలుగుతుంది.

పితృశ్రాద్ధానికి విధివిశేషం వివరిస్తాను, విను. శుక్లపక్ష పాడ్యమినాడు పితృశ్రాద్ధంచేస్తే అందమైన ఆడదానికి భర్తఅవుతాడు మనిషి. విదియనాడు చేస్తే ఆడపిల్లల తండ్రి అవుతాడు. తదియ నాడు చేస్తే గుర్రాలకి అధిపతి అవుతాడు. చవితినాడు చేస్తే

పశువులమందకలవాడవుతాడు. పంచమినాడుచేస్తే హెచ్చుమంది కుమాళ్ళ తండ్రి అవుతాడు. షష్ఠినాడుచేస్తే కాంతిమంతుడవుతాడు. సప్తమినాడు చేస్తే వ్యవసాయంలో భాగస్థుడవుతాడు. అష్టమినాడు చేస్తే వర్తకంలో గొప్పవాడవుతాడు. నవమినాడు చేస్తే గుర్రాలూ మొదలైన నొంటిగిట్ట జంతువులు కలవాడవుతాడు. దశమినాడు చేస్తే ఆలమందలు కలవాడవుతాడు. ఏకాదశినాడు చేస్తే వెండి బంగారాల నగలు సంపాదిస్తాడు. ద్వాదశినాడు చేస్తే బ్రహ్మవర్చస్సుకల కుమాళ్ళని కంటాడు. త్రయోదశినాడు చేస్తే ధనవంతుడవుతాడు. చతుర్దశినాడు చేస్తే రణశూరుడవుతాడు. పున్నమనాడూ, అమావాస్యనాడూ చేస్తే ఉత్తమమైన కోరికలన్నీ ఫలిస్తాయి. * కృష్ణపక్షంలోనూ, అపరాహ్ణమప్పుడూ పితృశ్రాద్ధం చెయ్యడం మంచిది. బహుళపాడ్యమీ, దశమీ, చతుర్దశీ పితృశ్రాద్ధానికి పనికిరావు.

ధర్మరాజు :

నువ్వులూ, పాయసమూ, నేయీ పితృశ్రాద్ధానికి ఉత్తమమైనవి. ధాన్యం మహాఫలం ప్రసాదిస్తుంది. మత్స్యమాంసాలు మహనీయమైన ఫలం కలిగిస్తాయి. ముఖ్యంగా గొర్రెమాంసమూ, ఖడ్గమృగమాంసమూ, గండామృగమాంసమూ, మేకమాంసమూ పితృశ్రాద్ధానికి వాడదానికంటే వాటికే గొప్పనంటారు పెద్దలు. ♦ నక్షత్ర విశేషం చెప్తాను, విను.

---

* ప్రథితా ప్రేతకృత్యైషా పిత్ర్యం నామ విధుక్షయే,
తస్మిన్ యుక్తస్యైతి నిత్యం ప్రేతకృత్యైవ లౌకికీ. మనుస్మృతి.3. 127. అమావాస్యనాడు చేసే పిత్ర్యకార్యం చాలా ప్రసిద్ధమైంది. ఈ పిత్ర్యకార్యంలో శ్రద్ధ కలిగినవారికి మంచికుమాళ్ళు కలుగుతారు. ధనధాన్యాలు మొదలైన శుభాలు కలుగుతాయి.

♦ చూ. మనుస్మృతి. 3.123.

కృత్తికానక్షత్రంలో శుచిగా పితృశ్రాద్ధం చేస్తే శత్రువులు నశిస్తారు. రోహిణీనక్షత్రంలో చేస్తే కుమాళ్ళు వృద్ధిపొందుతారు. మృగశిరానక్షత్రంలో చేస్తే తేజస్సు లభిస్తుంది. ఆరుద్ర నక్షత్రంలో చేస్తే క్రూరవర్తనం కలుగుతుంది. పునర్వసుపునక్షత్రంలోచేస్తే కృషి ఫలిస్తుంది. పుష్యమీ నక్షత్రంలో చేస్తే పుష్టి కలుగుతుంది. ఆశ్లేషా నక్షత్రంలో చేస్తే వీరత్వం లభిస్తుంది. మఖలో చేస్తే కులం వృద్ధి పొందుతుంది. పుబ్బలో చేస్తే సౌభాగ్యం సిద్ధిస్తుంది. ఉత్తరఫల్గుని నక్షత్రంలో చేస్తే సంతానవృద్ధి కలుగుతుంది. హస్తానక్షత్రంలో చేస్తే కర్మసాఫల్యం కలుగుతుంది. చిత్తానక్షత్రంలో చేస్తే సుందరాకారులైన కొడుకులు పుడతారు. స్వాతీనక్షత్రంలో చేస్తే వాణిజ్యం వృద్ధి అవుతుంది. విశాఖానక్షత్రంలో చేస్తే గుణవంతులైన కుమాళ్ళు అధికం కలుగుతారు. అనురాధానక్షత్రంలో చేస్తే రాజ్యాధికారం సిద్ధిస్తుంది. మూలా నక్షత్రంలో చేస్తే ఆరోగ్యం కలుగుతుంది. పూర్వాషాఢలోచేస్తే ఉత్తమాతిశయం కలుగుతుంది. ఉత్తరాషాఢలో శోకం నశిస్తుంది. అభిజిత్తులో చేస్తే విద్య లభిస్తుంది. శ్రవణంలో చేస్తే పరమగతి సిద్ధిస్తుంది. ధనిష్ఠలో చేస్తే రాజ్యం లభిస్తుంది. శతభిషంలో చేస్తే వైద్యంలో నైపుణ్యం కుదురుతుంది. పూరాభాద్రలో చేస్తే మంచి దూడలు దొరుకుతాయి. ఉత్తరాభాద్రలో చేస్తే మంచి పాడి ఆవులు లభిస్తాయి. రేవతిలో చేస్తే వెండిపాత్రలూ, బంగారం పాత్రలూ లభిస్తాయి. అశ్వనీనక్షత్రంలో చేస్తే మేలైన గుర్రాలు దొరుకుతాయి. భరణీనక్షత్రంలో చేస్తే ఆయువు పెరుగుతుంది.

ధర్మరాజు :

పితృపూజకి ఎలాంటి పాత్రలుండాలి?

భీష్ముడు :

అడగవలిసిన ప్రశ్నే అడిగావు. చెపుతాను, శ్రద్ధగా విను.

దైవిక కృత్యాలకి బ్రాహ్మల్ని సూక్ష్మంగా పరిశీలించనక్కరలేదు. కాని పితృశ్రాద్ధవిధులకి మాత్రం అతి భద్రంగా పరీక్షించాలి.

పితృశ్రాద్ధంలో కులమూ, శీలమూ, రూపమూ, విద్యా — ఇన్నిటా ఉదాత్తులయిన వారు పంక్తిపావనులు. ఈగుణాలు లేనివారు పంక్తిదూషకులు. ఇంకా పంక్తిదూషకులు ఎవరెవరో వివరిస్తాను, విను.

జూదగాడూ, విషంపెట్టేవాడూ, వేదం చదవనివాడూ, వడ్డీ వ్యాపారం చేసేవాడూ, కొంపలు తగలబెట్టేవాడూ, నాయకుడూ, గ్రామంపనిచేసి బతికేవాడూ, కుష్ఠురోగీ, క్షయరోగం కలవాడూ, అన్నివస్తువులూ అమ్మేవాడూ, సోమం అమ్ముకునేవాడూ, పడవ ప్రయాణంతో బతికేవాడూ, దుష్టప్రభువుని కొలిచేవాడూ, ఆలూ తానూ కొడుకుల్ని పంచుకున్నవాడూ, పెంపుడుపశువులు కలవాడూ, కపటకృత్యాలవల్ల బతికేవాడూ, దొంగతనంచేసి జీవించేవాడూ, శిల్ప కార్యాలుచేసుకు బతుకుతున్నవాడూ — వీళ్ళందరూ పంక్తిదూషకులే అవుతారు.

తలకి తలపాగా పెట్టుకునీ, కాళ్ళకి చెప్పులు తొడుక్కునీ భోజనం చేస్తే దాని ఫలం రాక్షసులకి చెందుతుందని విధించాడు బ్రహ్మదేవుడు.

రకరకాల వంటకాలు చేశాక, ప్రమాదవశాత్తూ అశుచిత్వం కలిగిందంటే, ఆవంటకాల క్రియాఫలం రాక్షసులకి చెందుతుంది. అయితే అలాంటప్పుడు నువ్వులు మీద చల్లితే అశుచిదోషం పోతుందంటారు పెద్దలు.

శాంతులూ, వ్రతపరులూ, దాంతులూ, అధ్యాపకులూ, దయాపరులూ, జ్ఞానవంతులూ, వ్యాకరణపండితులూ, ధర్మశాస్త్ర వేత్తలూ, పురాణకోవిదులూ, బ్రహ్మజ్ఞానులూ, పంక్తిపావనులు.

మంచిగుణాలు వుండినా స్నేహితులు కానివారిని శ్రాద్ధపాత్రులుగా స్వీకరించకూడదు. స్నేహితులు కానివారికి పెట్టిందీ, బూడిదలో పోసిందీ ఒక్కటే. చౌడుమట్టిలో పాతిన విత్తనంలాగ వ్యర్థమే అవుతుం దది.

శ్రాద్ధానికి తగిన బ్రాహ్మల్ని ముందే తెలుసుకుని నియోగించడం మంచిది. తీరా నియోగించాక, తెలుసుకుని పనికిరాదంటే మాత్రం బ్రాహ్మడి దుఃఖం ఎంతటి ధర్మపరుణ్ణయినా నాశనంచేస్తుంది.

ఇదంతా బాగా తెలుసుకుని, ఎంతో నియమపూర్వకంగా శ్రాద్ధంచేసినవాడు పుణ్యాత్ముడవుతాడు; దేవయానంలో పయనం చేస్తాడు.

ధర్మరాజా! ఓమారు బ్రహ్మమానసపుత్రుడయిన అత్రిమునీంద్రుడి వంశంవారిలో వొకడైన దత్తాత్రేయుడి కుమారుడు నిమి అనే మునికుమారుడు శ్రీమంతుడు కాలం చేశాడు. కుమారుడికి శ్రాద్ధం చేస్తూ నిమి భక్తితో తండ్రిని తలుచుకున్నాడు. దయతలిచి అత్రిముని వచ్చాడు. వచ్చి, శ్రాద్ధక్రియ శ్రద్ధగా పరిశీలించాడు

అగ్నిక్రియాకలాపం చక్కగా జరిగిపోయింది. అనంతరం శ్రాద్ధానికి నియమితులైన బ్రాహ్మలు పంక్తిపావనులు కావాలనీ, వారికిచ్చిన దర్భాసనాలు దక్షిణావర్తంగా వుండాలనీ, క్రియలు నువ్వులతో నిండివుండాలనీ, మంత్రాలున్నూ ఆయావిధులకి తగినట్టు నడవాలనీ, మునగా ఉల్లి అడివిమునగా దుర్మాంసమూ ఆనపకాయా మలినమైన వుప్పూ నల్లజీలకర్రా కరివేపాకూ జున్నూ ఇంగువా వర్జించవలసిన పదార్థాలనీ, కుక్కా ముట్టయిన ఆడదీ అంత్యజాతివాడూ శ్రాద్ధకర్మ జరుగుతున్నచోటికి పడిళ్ళపక్కకి చేరకండా చూడాలనీ నొక్కి చెప్పాడు అత్రిముని.

నాయనా, ధర్మరాజా! శ్రాద్ధక్రియలో ఇదంతా పాటించి

తీరాలనీ అదిగో అప్పుడే దానివల్ల పూజ్యత కలుగుతుందనీ అత్రి తనకుమారుడికి ఉపదేశించాడు. ఇంకా ఏంచెప్పాడో వివరంగా చెపుతాను, ఆలకించు.

శ్రాద్ధంలో ఆర్యముడికీ, వరుణుడికీ, చంద్రుడికీ, అగ్నికీ భాగాలు కల్పించాడు బ్రహ్మ. విశ్వేదేవతలు కూడా పితృదేవతలతో ఈ క్రియోపయోగ్యులయి వున్నారు. అందుచేత వారికి కూడా భాగం కల్పించాడు. దేవతల్లో కొందరు ఉష్మపులున్నారు. ఆమహాభాగుల్ని పితృత్వనిర్దేశంతో పర్చరించాడు బ్రహ్మ.

బ్రహ్మ వివరించిన భాగార్హుల పేర్లు వివరిస్తాను, విను.

బలుడు, ధృతి, విపాప్ముడు, పుణ్యకృత్తు, పావనుడు, పార్ష్ణిక్షేముడు, సమూహుడు, దివ్యసానువు, వివస్వంతుడు, వీర్యవంతుడు, హ్రీమంతుడు, కీర్తిమంతుడు, కృతుడు, విద్యున్వర్చసుడు, సోమవర్చసుడు, సూర్యశ్రీ, సోమపుడు, సూర్యసావిత్రుడు, దత్తాత్ముడు, పుండరీయకుడు, ఉష్ణీనాభుడు, నభోదుడు, విశ్వాయువు, దీప్తి, చమూహరుడు, సురేశుడు, వ్యోమారి, శంకరుడు, భవుడు, ఈశుడు, కర్త, కృతి, దక్షుడు, భువనుడు, దివ్యకర్మకృత్తు, గణితుడు, పంచవీర్యుడు, ఆదిత్యుడు, రశ్మిమంతుడు, సప్తకృత్తు, సోమపూర్వుడు, పూర్వాకృత్తు, కవి, అనుగోప్త, గోప్త, నప్త, ఈశ్వరుడు, జితాత్ముడు, మునివీర్యుడు, దీప్తరోముడు, భయంకరుడు, అనుకర్ముడు, ప్రతీతుడు, ప్రదాత, అంశుమంతుడు, శైలాభుడు, పరమక్రోధి, ధీరోష్ణి, భూపతి ప్రజుడు, వజ్రి, వరి — వీరందరూ భాగార్హులు.

కొండలమీదా, అడవుల్లోనూ, అడుగుపెట్టరాని ప్రదేశాల్లోనూ, నదులు దాటివచ్చినప్పుడూ, శ్రాద్ధకర్మలు జరిగిస్తున్నప్పుడూ వీరిని కీర్తిస్తే శుభాలు కలుగుతాయి.

పూరిపంటా (నీవారధాన్యం), ఆరికబియ్యమూ, నేరేడుపళ్ళూ

శ్రాద్ధకర్మకి పనికిరావు. శ్రాద్ధకర్మలు జరుగుతున్నప్పుడు తుమ్మ కూడదు; ఏడవకూడదు; ప్రశాంతి అవసరం.

ఓమాటు ఎంతోమంది మునీశ్వర్లు వొక్కదగ్గర చేరి శ్రాద్ధాలు చేశారు. బాగా అధికంగా పాడిపంటలు తినడంచేత పితృదేవతలకి అజీర్ణం పట్టుకుంది. దాంతో చంద్రుడి దగ్గిరికి వెళ్లారు వారు. తమకి కలిగిన బాధ అతడితో చెప్పుకున్నారు. "అయితే మీరు బ్రహ్మ దేవుడి దగ్గిరికి వెళ్ళండి" అన్నాడు చంద్రుడు. 'సరే', అని బ్రహ్మ దేవుడి దగ్గిరికి వెళ్ళారు పితృదేవతలు. తమ అజీర్ణబాధ అతడిదగ్గిర మొరపెట్టుకున్నారు. తన పక్కనే వెలుగుతున్న అగ్నిదేవుణ్ణి చూపించాడు బ్రహ్మదేవుడు. "పితృదేవతలారా! ఇదిగో మీ బాధ ఈ అగ్ని హోత్రుడు నివారిస్తాడు" అన్నాడు.

"నాతో కలిసి తింటే మీరు తిన్న ఆహారమంతా అరిగి పోతుంది" అన్నాడు అగ్నిదేవుడు. అవాళనించీ అగ్నిహోత్రుణ్ణి ముఖ్యుడిగాచేసుకుని భోజనంచేస్తారు పితృదేవతలు. అంచేత అజీర్ణ మంటూ వుండదు వారికి. అందువల్ల అగ్నిహోత్రం దగ్గిరపెట్టుకుని శ్రాద్ధంచెయ్యడం మెచ్చదగింది. పితృదేవతలు ఎంతో మెచ్చుకుంటారు దాన్ని. రాక్షసులు ఆశ్రాద్ధం తేరిచూడలేరు.

పితృ, పితామహ, ప్రపితామహుల శ్రాద్ధకర్మలు జందెంవేసుకుని. సదాచారపూర్వకంగా, నియమంతోనూ, భక్తితోనూ చెయ్యాలి.

గయలో పిండంవేస్తే ప్రేతభావం పోతుంది. అందుకనే కొడుకుల్లో వొక్కడయినా గయ వెళతాడనీ, అక్కడ తనకి పిండం వేస్తాడనీ, ఆసపెట్టుకుని అనేకమందికొడుకుల్ని కోరుకుంటారు జనులు.

సమర్థుడని కన్యని వరుడికి దానంచెయ్యడమూ, నల్లటి ఆబోతుని సంతోషంతో వొదిలిపెట్టడమూ పితృదేవతలకి సంతోషం కలిగిస్తాయి.

వృద్ధులైన ఆచార్యులు చెప్పినప్రకారం శ్రాద్ధవిధి వివరించాను. ఇంక ఏం తెలుసుకోవాలని వుందో అడుగు, చెపుతాను.

## తపస్సు

ధర్మరాజు :

పెద్దలు తపస్సు తపస్సు అంటూ వుంటారు కదా, అయితే తపస్సంటే ఏమిటి? ఉపవాసవ్రతమే తపస్సా? కాక, మరేదైనా వుందా? సారమైన తపస్సేదో సెలవియ్యి.

భీష్ముడు :

ఎన్నో దినాలు ఉపవాసంతో వుండడం తపస్సు. అయితే అంత మాత్రాన తపస్వి కాలేడు మనిషి. ఎందుకంటే అది ఆత్మఘాతమే అవుతుంది.

సత్యమూ, బ్రహ్మచర్యమూ, నిత్యశుచిత్వమూ, మౌనమూ, నియమమూ, దయా, త్యాగమూ — వీటినే తపస్సంపదలంటారు పండితులు.

## లోభం కూడదు

ధర్మరాజు :

మహాత్మా దానంచేసేవాడి గొప్పతన మేమిటి? ఏదానమూ పుచ్చుకోనివాడి గొప్పతన మేమిటి?

భీష్ముడు :

దీనికి వృషాదర్భ దేవఋషుల సంవాదం అనే ఇతిహాస ముంది. అది చెపుతాను, విను.

కశ్యపుడూ, అత్రీ, విశ్వామిత్రుడూ, గౌతముడూ, భరద్వాజుడూ, జమదగ్ని, వసిష్ఠుడూ - ఈఏడుగురూ జగమెరిగిన రుషులు. సప్తరుషిగణ మంటారు వీరిని.

వసిష్ఠరుషిఇల్లాలు అరుంధతి. ఎప్పుడూ అతనితోనే కలిసి తిరుగుతుండా మె. గండ అనే పడుచు ఈఅందరికీ పరిచారికగావుండి పనిచేస్తుంది. గండ భ ర్త పశుసఖుడు. అతడున్నూ వారి పరిచర్య చేస్తూవుంటాడు.

ఈపదిమందీ తపశ్చరణపరులయి భూలోకంమీద తిరుగుతూ వుండేవాళ్ళు. ఇలావుండగా ఘోరమైన అనావృష్టి పట్టింది వోమారు. కాటకం వచ్చింది. జీవనసాధనాలయిన పదార్థాలు దుర్లభమై పోయాయి. జనం ప్రాణాలు రక్షించుకోడం దుష్కరమైపోయింది. కశ్యపుడూ మొదలైనవారు ఆకలికి అల్లాడిపోయారు. ఆహారంకోసం వెదుకుతూ దేవులాడారు. ఇంతలో శిబి కుమారుడు యాజ్యుడు పూర్వం తన కుమారుణ్ణి నీలుణ్ణి దక్షిణార్థం ఋత్విజులకి ఇవ్వగా వారి వశంలో వుండి, కాలంతీరి అతడు చచ్చిపోయాడు. చితిమీద వుండిన అతడిశవం కశ్యపుడూ మొదలైన పదిమందీ చూశారు. చప్పున వెళ్లి ఆశవం తినడానికి చుట్టుముట్టారు.

సరిగ్గా అదే సమయానికి కాటి పక్కదారిని వృషాదర్భిరాజు వేటకి వెళుతూ ఈదృశ్యం చూశాడు. గొప్ప దానపరుడు వృషాదర్భి. దారిపోతున్న వాడల్లా ఆగిపోయి, మునులతో ఇలా అన్నాడతడు.

"అయ్యో మునులారా! ఆకలితో అల్లాడిపోయి, శవం తిన డానికి పూనుకుంటున్నారు మీరు. వద్దు వద్దు, శవం తినకండి. నాతో రండి. మీకు కావలిసిన ఆహార మిస్తాను. బహువిధాల ధాన్యాలూ, రసవర్గాలూ భక్తిరసపూర్వకంగా మీకు సమర్పిస్తాను. ఎన్నో గుర్రా లిస్తాను. మంచిమంచి రథాలూ ఇస్తాను. నిత్యకళ్యాణం పచ్చ తోరణంగా వున్న గ్రామాలు ఎన్నో బహూకరిస్తాను. రండి."

"మహారాజా!" వృషాదర్భిమాటలు విని అన్నారు మునులు, "రాజు దగ్గిర పుచ్చుకున్నది విషంతో సమానం అని మాఅభిప్రాయం.

మావిషయం తెలియక ఇస్తానంటున్నావు నువ్వు. అంచేత ఇది నీతప్పు కాదు. ”

మునులమాట విని విచారంతో వెళ్ళిపోయాడు వృషాదర్భి. కృత్రిమ వనఫలాలు జతపరిచి మంత్రులచేత మునులదగ్గిరికి పంపాడతడు. అవి పట్టుకువచ్చి భక్తిపూర్వకంగా మునులకి సమర్పించారు మంత్రులు.

ఆపళ్ళు ముట్టి చూశారు మునులు. వాటి బరువుబట్టి వాటిలో బంగారం వుందని కనిపెట్టారు. నవ్వేసి వూరుకున్నారు. ఒక్కటీ పుచ్చుకోలేదు.

మంత్రులు వెళ్ళి అదంతా మహారాజుతో విన్నవించారు. విని కస్సుమన్నాడు మహారాజు వృషాదర్భి. తగినవారిని నియమించాడు. కృత్తిని వేల్చమని ఆజ్ఞాపించాడు. హోమం జరిగింది. హోమగుండం నుంచి వో రాక్షసి పుట్టింది. రాజుముందు నిలబడింది. “ఏంపని చెప్పు?” అని అడిగింది. సంతోషించాడు వృషాదర్భి. “కశ్యపుడూ మొదలైనవాళ్ళని కసిదీరా తునకలు చెయ్యి” అని ఆదేశించాడు.

వెదుక్కుంటూ, పెద్దపెద్ద అంగలువేసి కశ్యపుడూ మొదలైన మునులు వున్నచోటికి వెళ్ళింది రాకాసి. అంతకముందే అడివిలో దుంపాదుల్రా వెదుకుతూ తిరుగుతున్నారు మునులు. శునస్సఖుడనే వొక సన్యాసి వచ్చి వారిని చూశాడు. వందనం చేశాడు. మునులు శునస్సఖుణ్ణి అభినందించారు. సన్యాసీ, మునులూ వొకేకోరికతో అడివిలో తిరిగారు. ఆకలితో తామరతూళ్ళు తినడంకోసం వొక సరోవరంవేపు గబగబా నడిచారు.

ఇంతలో వృషాదర్భి ప్రయోగించిన రాకాసి వచ్చిపడింది. సరోవరానికి అడ్డంగా నిలబడింది.

“ఎవతెవు నువ్వు?” రాకాసిని అడిగారు మునులు, “ఈ

పద్మాలవనం దగ్గిర ఏంపని నీకు? చెరువులో దిగడానికి మాకు దారి వొదిలిపెట్టు" అన్నారు.

"నేను ఎవరినైతే ఏమయ్యా? ఈ చెరువు కాపలా కాస్తున్నాను" అంటూ పెద్దగొంతుకతో అరిచింది రాకాసి.

తెల్లబోయారు మునులు. ఆకలి దహించుకుపోతూవుంది. ప్రాణాలు నిలుపుకుందికి ఇంకో ఉపాయం కనపడలేదు. "ఈ చెరువులో మేము తామరతూళ్ళు తినడానికి వచ్చాం" అన్నారు.

"మీమీ పేర్లు చెప్పి మరీ పద్మవనంలోకి ప్రవేశించండి" అంటూ గద్దించింది రాకాసి.

అది రాకాసి అని గ్రహించేశారు మునులు. అది కృత్తి అనీ, తమని చంపడానికి వచ్చిందనీ తెలుసుకున్నారు. కశ్యపుడూ మొదలైన పదిమందీ రాకాసికి అర్థంకానట్టు, నిర్వచనసహితంగా తమపేర్లు చెప్పారు. దాంతో ఆపాపాత్మురాలు భయపడిపోయింది. అప్పుడు శునస్సఖుడు వ్యక్తంగా తెలియచేశాడు. కాని, "నీపేరు చెప్పవేం?" అంది కృత్తి. "బాగుంది! స్పష్టంగా చెపితే పైగా లేదంటున్నావు. ఇలాంటి ఉద్దండవి నువ్వు! కనక నాత్రిదండంపాలు కావాలి నీప్రాణం" అంటూ తన చేతిలోని బ్రహ్మదండంతో దాని నెత్తిమీద నిష్ఠురంగా వొక్కటి వేశాడు శునస్సఖుడు. "పాపాత్మురాలా! భస్మమైపో" అన్నాడు. దెబ్బతో భస్మమైపోయింది రాకాసి కృత్తి.

అనంతరం ఆపదకొండుమందీ ఆనందంతో పద్మవనంలో ప్రవేశించారు. అంతమందీ తామరతూళ్ళు పెరికారు. బురదపోయేటట్టు బాగా కడిగారు; కట్టకట్టారు. ఒడ్డుకి తెచ్చి వోదగ్గిర భద్రంగా స్నానాదికాలుతీర్చుకుందికి నీటిలోకి వెళ్లారు. పరిశుద్ధులయి చెరువులోంచి బయటికి వచ్చారు. తీరా చూసేసరికి తామరతూళ్ళకట్ట అవుపడలేదు. అంతటా కలయచూశారు మునులు. ఎక్కడా కనబడక

పోడంతో నే తమలోతాము వాళ్ళ మొహం వాళ్ళు సందేహంతో చూసుకున్నారు. "ఎవరు తీశారు? తియ్యనివారం ప్రమాణాలు చేద్దాం" అని నిశ్చయించుకున్నారు. సునస్సఖుణ్ణి తగుమనిషిగాచేసుకున్నారు. అత్రిఅన్నాడు :

"తామరతూళ్ళు దొంగిలించినవాడు ఆవును కాలితో తన్నిన పాపాన పోవాలి. సూర్యుడికి ఎదురుగా మలమూత్రాలు విసర్జించిన పాపాన పోవాలి. చెయ్యరానికాలంలో అధ్యయనం చేసినపాపాన పోవాలి."

వసిష్ఠముని ఇలా అన్నాడు :

"తామరతూళ్ళు దొంగిలించినవాడు వేదాలు చదవనివాడు పోయినపాపాన పోతాడు. సన్యాసాశ్రమంలో వుండి కాముకుడైన వాడుపోయినపాపాన పోతాడు. కుక్కని పట్టుకు తిరిగినవాడు పోయిన పాపాన పోతాడు. కన్యని అమ్ముకున్నవాడుపోయిన పాపానపోతాడు. శరణన్నవాణ్ణి కాపాడని వాడుపోయిన పాపానపోతాడు. ఇచ్చే దయార్ద్రహృదయుడి దారిద్ర్యం చూసి కూడా యాచించినవాడు పోయిన పాపాన పోతాడు."

కశ్యపముని ఇలా అన్నాడు :

"తామరతూళ్ళు దొంగిలించివుంటే కారణంలేకండా మాంసం తిన్నట్టు. సభలో పక్షపాతంతో ప్రసంగించినట్టు. దుష్టభార్యని పరిగ్రహించినట్టు. పగటిపూట స్త్రీసంగమం చేసినట్టు. లోభంతో బ్రాహ్మణ్ణి కష్టపెట్టినట్టు. అన్నిసరుకులూ కొని అమ్మినట్టు."

భరద్వాజముని ఇలా ప్రమాణంచేశాడు :

"తామరతూళ్ళు దొంగిలించినవాడు జ్ఞాతులయెడలా, ఆవుల యెడలా, ఆడవాళ్ళయెడలా ధర్మంతప్పి క్రూరంగా ప్రవర్తించినవాడు పోయినపాపాన పోవాలి. కార్యార్థియై వచ్చిన బ్రాహ్మణ్ణి ఉపే

క్షించినవాడుపోయిన పాపాన పోవాలి. కంపలఅగ్గిలో హావిస్సుపోసిన వాడుపోయిన పాపాన పోవాలి. గురువుని ధిక్కరించి, చదువు చదివిన వాడుపోయిన పాపాన పోవాలి."

జమదగ్ని ఇలా శపథంచేశాడు :

"తామరతూళ్ళు దొంగిలించివుంటే, ముట్టుతోవున్న భార్యతో సంగమంచేసినవాడు పోయినపాపాన పోవాలి. నీటిలో మలమూత్రాలు విడిచినవాడుపోయిన పాపాన పోవాలి. ద్వేషంతో మాట్లాడినవాడు పోయిన పాపాన పోవాలి. ఆడదానినల్లబతికినవాడు పోయిన పాపాన పోవాలి. అతిథిదగ్గిర ఆతిథ్యం స్వీకరించినవాడు పోయినపాపాన పోవాలి. నిస్సహాయుడిమీద దండెత్తినవాడు పోయినపాపానపోవాలి. పాడిఆవుని కొట్టినవాడు పోయినపాపాన పోవాలి.

గౌతమముని ఇలా ప్రమాణంచేశాడు :

"తామరతూళ్ళు దొంగిలించివుంటే అభ్యసించిన వేదంవొదిలి పెట్టినట్టు. అకారణంగా యజ్ఞాగ్ని త్యజించినట్టు. సోమలత అమ్ము కున్నట్టు. శూద్రస్త్రీని పెళ్ళాడినట్టు. దుర్విషయాలతో జీవనంచేసినట్టు. ఇంకా ఆమాటకి వస్తే తామరతూళ్ళ దొంగతనంకంటే ఈపాపాలే నయం."

విశ్వామిత్రుడు ఇలా అన్నాడు :

"తామరతూళ్ళు దొంగిలించివుంటే తగినసేవకుణ్ణి పోషించనట్టు. కపటధార్మికవృత్తితో రాజుని కొలిచినట్టు."

అరుంధతి నవ్వుతూ ఇలా ప్రమాణం చేసింది.

"తామరతూళ్ళు దొంగిలించినఆమె ఎల్లప్పుడూ అత్తని దూషించినఆమె పోయినపాపాన పోవాలి. ఎవ్వరికీ పెట్టకండా వొక్కతే పరమాన్నంతిన్నఆమె పోయినపాపాన పోవాలి."

గండ ఇలా ప్రమాణంచేసింది.

"తామరతూళ్ళు దొంగిలించినఆమె వంటకంచేసి ముందుతిన్న ఆడది పోయినపాపాన పోవాలి. పనిపాట్లలో కుటిలత్వం కల ఆడది పోయినపాపాన పోవాలి. బొంకులాడి పోయినపాపాన పోవాలి. కూతుర్ని వెలకి అమ్ముకున్నతల్లి పోయినపాపాన పోవాలి. మంచి వాళ్ళకి కీడుచేసినఆమె పోయినపాపాన పోవాలి. ఇంతేకాదు, బతుకంతా నికృష్టమైన బానిసగానేవుండి బాధపడాలి."

గండమగడు పశుసఖుడు ఇలా ప్రమాణంచేశాడు :

"తామరతూళ్ళు దొంగిలించినవాడు సంతానంలేకండా పోవాలి. గర్భదాసుడుకావాలి. పేదరికంతో బాధపడాలి."

తన ఎదట నిలబడి ఆపదిమందీ అలా ప్రమాణంచేశాక, వారి ముందు సునస్సఖుడు ప్రమాణంచేస్తూ, "తామరతూళ్ళకట్ట దొంగిలిస్తే ఛందోజ్ఞానం కలవాడికీ, యజ్ఞాలలో ధారీణుడైనవాడికీ కన్నకూతుర్ని కట్టపెట్టినట్టు" అన్నాడు.

"అదేమిటి?" అంతమందీ వొక్కమారు సునస్సఖుడి మాట మీద అన్నారు, "పుణ్యకర్మ ప్రమాణానికి ప్రమాణంగా తీసుకున్నావు నువ్వు. ఇంచేత నువ్వే తామరతూళ్ళకట్ట దొంగిలించావు. ఇంకెందుకూ? మమ్మల్ని బాధపెట్టకు. తామరతూళ్ళు ఇచ్చెయ్యి."

"నిజమే" వొప్పుకుంటూ అన్నాడు సునస్సఖుడు "మీరందరు వొకళ్ళ నొకళ్ళు ఏమంటారో చూద్దామని నేనే తామరతూళ్ళకట్ట దాచేశాను. ఇదిగో పుచ్చుకోండి" అంటూ తాను దాచిన తామర తూళ్ళు మునుల ఎదట పెట్టాడు. ఇంకా ఇలా అన్నాడతడు : "వృషాదర్భి మిమ్మల్ని చంపడానికి సంకల్పించాడు. హోమాగ్నిలో కృత్తిని పుట్టించాడు. మీమీద ప్రయోగించాడు. అది తెలుసుకుని, మిమ్మల్ని రక్షించడానికే ఇలా వచ్చాన్నేను. చూశారుకదా, మీఎదటే ఆరాకాసిని చంపేశాను. నేను ఎవరినోకాను, దేవేంద్రుణ్ణి.

లోభం ఏమాత్రమూ లేదు మీకు. మీ సద్గుణాలకి సంతోషించాను. శాశ్వతమైన వునికి మీకు లభించింది. రండి, నాతో పైకి, పుణ్య లోకాలకి దయ చెయ్యండి.''

ఎంతో ఆనందించారు మునులు. అలాగే చేస్తామన్నారు. ఇంద్రుడివెంట బయలుదేరారు. దేవపరిషత్తులో పూజ్యపదం అధిష్ఠించారు. అన్నిలోకాలూ వారిని మెచ్చుకున్నాయి. దేదీప్యమానంగా వారు ప్రకాశించారు.

విన్నావా? దానం పుచ్చుకోకండా వుండడంలో అంత గొప్ప తనం వుంది. అంచేత లోభం విడిచిపెట్టడంతో ఏగుణమూసాటిరాదు. బ్రాహ్మడైనవాడు లోభం విడిచిపెట్టడం ఎంతయినా అవసరం. లోభం లేనివాణ్ణి దేవతలు మెచ్చుకుంటారు. కనక లోభంకూడదు.

"ధర్మరాజా! ఇప్పుడు నేను చెప్పిన ఈఇతిహాసం మంచి మనస్సుతో, పెద్దలున్న సభలో వినిపించినవాడు దీర్ఘాయువు పొందుతాడు. సిరీ, ధర్మమూ, కీర్తీ, అధికమైన సుఖమూ అనుభవిస్తాడు. దేవతలూ, పితృదేవతలూ సంతోషిస్తారు; ఏకీడూ రాకండా అనుగ్రహిస్తారు.

## గొడుగూ చెప్పులూ

ధర్మరాజు :

పితృకార్యాలలో గొడుగులూ, చెప్పులూ దానంచెయ్యడం ఉత్తమధర్మం అంటారు. వాటి విశేషం వినాల నుంది.

భీష్ముడు :

సూర్య జమదగ్ని సంవాదం అని వొక ఇతిహాసం వుంది. నువ్వు అడిగిన ప్రశ్నకి అది సమాధానం అవుతుంది. చెప్తాను, విను.

జమదగ్నిమహాముని ఓమారు క్రీడకోసం బయలుదేరాడు. తాను ధనుస్సు పట్టుకున్నాడు. భార్య రేణుకాదేవి బాణాలు పట్టు

కుని వెంట నడిచింది. ఇద్దరూ ఇల్లు బయలుదేరి ఓ బయలు చేరారు. అక్కడ జమదగ్ని దూరంగా గురిచూసి బాణాలు వేస్తూవుంటే, రేణుక వెళ్ళి బాణాలు ఏరి పట్టుకువస్తూ వుండేది. ఇలా ఆదంపతులు వినోదిస్తూ వుండగా, పొద్దు కరకరలాడుతూ నడినెత్తికి వచ్చింది. బాణాలు పట్టుకురావడంలో రవంత ఆలస్యంచేసింది రేణుక.

"లోలాక్షీ ! ఈమాటు ఎందుకింత ఆలస్యం చేశావు ?" అని అడిగాడు జమదగ్ని.

"ఎండ మండిపోతూ వుంది. నేల నకనకలాడుతూ వుంది. అడుగులు వెయ్యడం కష్టమైంది. వేడికి తల తాకనొక్కింది. అంచేత ఓ చెట్టునీడ నిలబడిపోయాను. కనక ఆలస్యమైంది" చెమట్లు పోసుకుంటూ అంది రేణుక.

"ఏమిటీ, సూర్యుడు నిన్ను బాధపెట్టాడు ?" జేవురించిన కళ్ళతో అన్నాడు జమదగ్ని, "దీనిఫలం అతడు ఇప్పుడే అనుభవిస్తాడు. నా బాణాగ్నితో అతడి పనిపట్టేస్తాను."

జమదగ్నిమాటలు విన్నాడు సూర్యుడు. చప్పున బ్రాహ్మడి వేషంలో అతడి ఎదటికి వచ్చాడు. "మునీంద్రా ! రోషం విడిచిపెట్టు" అంటూ వినయంగా అన్నాడు.

"మాట్లాడకు నువ్వు. తప్పుకో. బాణం వేసితీరుతాను. సూర్యుణ్ణి నేల పడగొడతాను" అంటూ అంతేసి గుడ్లుచేసి వురిమాడు జమదగ్ని.

తప్పుకోకుండా అలాగే నిలబడ్డాడు బ్రాహ్మడు (సూర్యుడు).

"మునీంద్రా ! ఇంత ఘోరమైన క్రూరవృత్తికి తెగించవచ్చా నువ్వు ? సూర్యుడు కిరణాలతో నీటిని ప్రసాదిస్తాడు. అందువల్ల ఓషధులు పెరుగుతాయి; హవ్యం కల్పిస్తాయి; దేవతలకి బలం కలిగిస్తాయి. సూర్యుడే దెబ్బతింటే ఇదంతా లోపించిపోదా ?" అన్నాడు.

అయినా వినుకోలేదు జమదగ్ని. అతడి ఆగ్రహం శాంతించ లేదు. దాంతో భయపడిపోయాడు సూర్యుడు.

"మునీశ్వరా!" నెమ్మదిగా అన్నాడు బ్రాహ్మడు, "నేనే సూర్యుణ్ణి. ఇదిగో నీకు నమస్కరిస్తున్నాను. నావల్ల జరిగిన పొరపాటు క్షమించు. నీమనస్సు దయాపూర్ణమైంది. సర్వలోకాలూ నిన్ను దయామయుడని పొగుడుతున్నాయి. విని సంతోషంతో వచ్చా న్నేను. నీశరణు వేడుతున్నాను. రక్షించు, రక్షించు" అంటూ చేతులు జోడించాడు.

శాంతించాడు జమదగ్ని. ప్రీతిపూర్వకంగా సూర్యభగవాన్ణి గౌరవించాడు. సంతోషించాడు సూర్యుడు. మనసా సంకల్పించి గొడుగులూ, చెప్పులూ తెచ్చి జమదగ్ని ముందు పెట్టాడు.

"ఇంతకి ముందు ఇవి లేవు. గొడుగులవల్ల శరీరానికీ, చెప్పుల వల్ల కాళ్ళకీ నావేడి తాకదు. అపూర్వమైన సృష్టి ఇవి. దయతలచి ఇవి మంచి బ్రాహ్మడికి దానంచేస్తే ఐహిక ఆముష్మిక సుఖాలు సిద్ధిస్తాయి దాతకి" అన్నాడు.

ఎంతోఅంత సంతోషించాడు జమదగ్ని. సూర్యుణ్ణి సాగనంపి, భార్యతో ఆశ్రమానికి వచ్చేశాడు, గొడుగూ, చెప్పులూ పట్టుకుని. అవాళనించే జనులు సంతోషంగా గొడుగులూ, చెప్పులూ ఉపయో గిస్తూవచ్చారు. ఇదీ వీటి జన్మరహస్యం. నీకు వినిపించా న్నేను.

గొడుగూ, చెప్పులూ సూర్యుడి మనస్సులో పుట్టాయి. దివ్య మునులచేత లాలించబడ్డాయి. మంచివస్తువు లివి. దయకలిగి ఇవి బ్రాహ్మలకీ, యతులకీ, సాధువులకీ, వృద్ధులకీ, సజ్జనులకీ దానంచెయ్యి నువ్వు. ధర్మాలన్నిటిలోకీ మంచి సారమైన ధర్మ మిది. దీనివల్ల గోకులం మొదలైన పుణ్యలోకాలు లభిస్తాయి. ఏమంటే గొడుగూ, చెప్పులూ దానంచేస్తే దేవతలు కూడా సమ్మానిస్తారని ఎంతోమంది పండితులు చెప్పడం మనం తరుచు వింటున్నాం.

## శూద్రవర్ణ ధర్మాలు

ధర్మరాజు :

శూద్రుడు ఎలా నడుచుకుంటే ఇహాపరసౌఖ్యాలు పొంద గలుగుతాడు ?

భీష్ముడు :

లోకహితార్థం పరాశరమునీంద్రుడు తన శిష్యులకి ధర్మాలు ఉపదేశించాడు. అవి వింటే నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధానం నీకే అవగతమవుతుంది. ఆలకించు.

లోకోత్తముడు పరాశరముని. సుశ్లోకుడు. కరుణామయుడు. శిష్యులకి ఇలా ఉపదేశించాడతడు :

" ఇంద్రియాలు గెలిచి, అంతశ్శత్రువులైన కామక్రోధాదులు జయించి, గర్వం వొదిలిపెట్టి, పైమూడువర్ణాలవారికీ భక్తిపూర్వకంగా శుశ్రూషచేసిన శూద్రుడు ఐహికసుఖా లనుభవిస్తాడు. అలా కాకండా వేదాలు చదివి, తపస్సు మొదలైనవి చేస్తే మాత్రం అతడు ఉభయలోకాలూ పోగొట్టుకుంటాడు. బ్రాహ్మలకి వేదాధ్యయనమూ, రాజులకి పరాక్రమమూ, వైశ్యులకి వాణిజ్యమూ. శూద్రులకి సేవావృత్తీ సిరిసంపదలు చేకూరుస్తాయి. శాస్త్రం చాటి చెప్పిన ధర్మమార్గం ఇది. బ్రాహ్మలూ మొదలైనవారు ఈసదాచారాలు నియమపూర్వకంగా నడిపితే ఇహాపరాలు రెండింటిలోనూ ఔన్నత్యం పొందుతారు. ఇలా కాకండా నాలుగువర్ణాలలోనూ ఎవరైనా ఆత్మధర్మం వొదిలి పెడమార్గం తొక్కితేమాత్రం ఇక్కడా అక్కడా దుష్టగతులు తప్పవు. "

## శౌచవిధులు

శౌచవిధులు శిష్యులకి బోధిస్తూ ఇంకా ఇలా చెప్పాడు పరాశరుడు :

"మలమూత్రాలు విసర్జించినప్పుడు రాత్రిళ్ళు దక్షిణంవేపూ, పగళ్ళు ఉత్తరంవేపూ మొహంచేసి కూచోవాలి. త్రిసంధ్యలలో (ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం) ఉత్తరంవేపే మొహంచేసి కూచోవాలి ఆపనికి.

"మలమూత్రాలు విసర్జించిన తరవాత, శౌచక్రియ పూర్తి కాందే మాట్లాడకూడదు. తొడలమీద కేవలం నీళ్ళు చిలకరించుకోడం కూడదు. మూడుమార్లు మట్టితో ఆసనశుద్ధి చేసుకోవాలి. గుదస్థలం నొచ్చినట్టు తోమితే రోగం పుడుతుంది. కనక గట్టిగా తోమకూడదు. వేపగంధాదులతో వాసనపోయినట్టు మాత్రం - నేను చెప్పినట్టు శౌచంచేసుకోవాలి.

"కట్టుబట్టమీద శౌచజలం పడకూడదు, దోషం. పడకండానే శౌచంచేసుకోడం మంచిది. ఎడమచెయ్యి ముమ్మారు మట్టితో శుద్ధి చేసుకోవాలి. కుడిచేత ఎడమ చేతిని కడిగి, అనంతరం ఏడుమార్లు మట్టితో రెండుచేతులూ కడుక్కోవాలి. కొద్దిమట్టి రాసి గుదస్థలం కడుక్కోవాలి. గుహ్యశుద్ధి తరవాత చేతులు బాగా కడుక్కోవాలి. తరవాత లేచి నిలబడి కాళ్ళు కడుక్కోవాలి.

"జనం చూస్తూవుండగా మలమూత్రాలు వర్జించకూడదు. దానికీ శౌచం చేసుకోడానికీ మరుగుప్రదేశం తప్పక అవసరం.

"ఆపదసమయాల్లో ఇదంతా కుదరదు కనక వాసన పోయినట్టు మాత్రం తగుమాత్రం మట్టితో శౌచం పూర్తిచేసుకోవచ్చు, క్రియ తప్పకండా.

"బుడగలులేని నీరు చేత్తో పుచ్చుకుని గుండెకి చేరినట్టు నిశ్శబ్దంగా ముమ్మారు తాగి, మొహం అడ్డంగా రెండుమార్లుతుడుచుకోవాలి. నీరు పాదాల మీదా, శిరస్సుమీదా ప్రోక్షించుకుని, పెదవులు ముట్టాలి. ముకుపుటాలూ, కళ్ళూ, చెవులూ, మూపులూ,

హృదయమూ, నాభిప్రదేశమూ, శిరసూ ముట్టాలి. చేతులు పాదాల మధ్యంగా ఉత్తరముఖంగానో, లేదా తూర్పుముఖంగానో చేసి ఆచమనం చెయ్యడం పెద్దల మతం.

“ముమ్మారు నీరు తాగడంవల్ల ఋగ్వేదమూ, యజుర్వేదమూ, సామవేదమూ – మూడువేదాలూ సంతోషిస్తాయి. ఓమారు మొహం అడ్డంగా తుడుచుకోడంవల్ల అథర్వవేదం హర్షిస్తుంది. రెండోమారు తుడుచుకోడంతో ధర్మశాస్త్రాలూ, ఇతిహాసాలూ, పురాణాలూ సంతోషిస్తాయి. పాదాలమీద నీరు ప్రోక్షించడంవల్ల పుండరీకాక్షుడు సంతోషిస్తాడు. నేత్రాలు ముట్టడంవల్ల సూర్యుడు సంతోషిస్తాడు. ఆచమనసంప్రయోగం ఇలాటిది. వస్త్రమూ, యజ్ఞోపవీతమూ ధరించినప్పుడు అన్నపానతంత్రాలు ముందే ముగించి, అనంతరం ఇది ఆచరించాలి.

మొహం శుద్ధిచేసుకున్నప్పుడు భక్ష్యభోజ్యాల పిసర్లు పళ్ళ సందుల్లో వుండిపోయి, తరవాత పైకివస్తే వెంటనే ఆచమనం చేసుకోవాలి.

“శౌచవిధి సమస్తవర్ణాలవారికీ సామాన్యధర్మం. అయితే శూద్రుడికి పెదవులు వోమారు ప్రోక్షించుకోడమూ, దాన్ని చేత్తో వోమారు అడ్డంగా తుడుచుకోడమూ మాత్రమే ఆచమనం.

“శూద్రుడు తాను శుచిత్వం మరచిపోకూడదు. నియమంతో మంచిబ్రాహ్మల శుశ్రూష చెయ్యాలి.

“జపమే యజ్ఞం బ్రాహ్మడికి. అధ్యయనమే అతడి జీవనం. తపస్సే అతడి శోభ.

“ప్రారంభమే యజ్ఞం క్షత్రియుడికి. దండనమే అతడి జీవనం. పాలనమే అతడికి శోభ.

“హవ్యమే యజ్ఞం వైశ్యుడికి. విక్రయమే అతడి జీవనం. ఆతిథ్యమే అతడికి శోభ.

"పరిచర్యే శూద్రుడికి యజ్ఞం. శుశ్రూషే అతడి జీవనం. దక్షత్వమే అతడికి శోభ.

"తన పైమూడు వర్ణాలమీదా భక్తికలిగి మసులుకోడమూ, వారిని నిత్యమూ సేవించడమూ శూద్రుల కర్తవ్యధర్మం.

"అన్ని ఆశ్రమాలవారిలోనూ యతిఆశ్రమం పూనినవాడే ఉత్కృష్టుడు. యతిమార్గం అవలంబించినా, శక్తికలిగినవారు శ్రుతి స్మృతులు అనుసరించి నడుచుకోడమే మేలు.

"ప్రియవాదిత్వమూ, శాంతీ, దాంతీ, శీలమూ కలిగి, సోమరితనం లేకండా వుండి, 'నాకు ఇది కావాలి. దీనివల్ల దుస్తరమైన, ఘోరమైన, సంసారసముద్రం దాటిపోతాను' అని భిక్షుకజనానికి తగిన పనులు చేస్తూ, అడుగు లొత్తుతూ, కావలిసింది అడుగుతూ, నమ్రతగా వుండి, ధర్మంగా ఉపార్జించిన ధనంతో తృప్తిపడుతూ దేహరక్షణ నడిపి, పగలనక రేలనక పరిచర్యలు చేసిన శూద్రుడు ఇహాపరసుఖాలు అనుభవిస్తాడు.

"యతుల్ని గౌరవించి, వారిని పూజించడంతప్ప శూద్రుడికి దానాలవల్లా, ఉపవాసాలవల్లా ఉత్తమగతి దొరకదు.

"దారితప్పి తూగాడుతూ వచ్చే యతిని చూసి, మనసా చారించి, ఎదురువెళ్ళి. అతడి దప్పిక తీర్చి, తగిన సహాయం చెయ్యడం శూద్రుల ధర్మవిధి అని వేదాలు చెపుతున్నాయి.

"యతి జబ్బుపడితే అతడికి మందూ మాకూ ఇవ్వడమూ, పథ్యమైన మంచి భోజనం జతపరచడమూ, అసహ్యించుకోకండా అతడి మలమూత్రాలు శుభ్రపరచడమూ శూద్రులకి సద్గతికలిగిస్తాయి.

ఏవిధంగా చెయ్యగలిగితే ఆవిధంగా యతిభావంలోని దుఃఖం పోయినట్టు ఆదరపూర్వకంగా సేవచేసిన శూద్రుడికి సద్గతి లభిస్తుంది."

## సర్వవర్ణ సామాన్య ధర్మాలు

శూద్రవర్ణధర్మాలు అలా వివరించి, సర్వవర్ణసామాన్య ధర్మాలు శిష్యులకి ఉపదేశించాడు పరాశరమునీంద్రుడు.

"పరుల ధనాలకు ఆసపడకూడదు. ఇతర్లని తనలాగే చూసుకోవాలి. అన్ని వస్తువులూ మెరుపుల్లా పుట్టి మాసిపోతాయనీ, బుడగల్లా పుట్టి చిదిగిపోతాయనీ తెలుసుకోవాలి. దేనిమీదా ఆసక్తి పెట్టుకోకూడదు. భూతదయకలిగి నడుచుకోవాలి. అలా అయితేనే మంచి కూడా వెంటనడుస్తుంది. చేసిందల్లా మేలే చెయ్యడం మంచిది. పొరపాటున ఏదైనా కీడు జరిగిపోతే వెంటనే దానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

"ఎముకలులేని జంతువుల్ని (చీమలూ, దోమలూ, ఈగలూ మొదలైనవాటిని) చంపితే ఆపాపం మూడు స్నానాలూ, పన్నెండు ప్రాణాయామాలూ, ఒక్క ఉపవాసమూ ఆదరపూర్వకంగా చేస్తే పోతుంది.

"ఎముకలున్న అల్పజంతువుల్ని చంపినపాపం మీాద చెప్పిన ప్రాయశ్చిత్తం రెండింతలు చేస్తేపోతుంది. సాధువులైన జంతువుల్ని చంపిన పాపానికి అదేప్రాయశ్చిత్తం నాలుగురెట్లు జరపాలి. నరహత్య చేస్తే ఎనిమిదిరెట్లు ఆ ప్రాయశ్చిత్తంచేయాలి.

"ఏనుగులూ, గుర్రాలూ అల్పనరులతో సమానం. మనిషిని చంపినపాపం ఎన్నో సంవత్సరాలు బిచ్చమెత్తడం మొదలైన సుకృతాల మూలంగా కాని, స్వల్పప్రాయశ్చిత్తాలతో వొదలదు.

"కల్లుతాగడం, గురువుభార్యతో సంగమంచెయ్యడంవంటి మహాపాపాలు ప్రాణంపోయినదాకా చెయ్యవలసిన ప్రాయశ్చిత్తాల వల్లకాని పోవు. ఈపాపాలు గోదానమూ, భూదానమూ చేసినా వొదలవంటారు పెద్దలు.

"ఇవన్నీ తెలుసుకుని, పరలోకసౌఖ్యం మనసులో పెట్టుకుని సర్వప్రాణులమీదా దయకలిగి నడుచుకున్నవాడికి మేలే కాని కీడు రాదు.

"ఈసదాచారం అనుసరించి శూద్రుడైనా సరే, శ్రమవృత్తి వల్ల అక్షయమైన పరమపదం చేరుకుంటాడు. మరోనియమం పాటించ నక్కరలేదతడు."

## అరిష్టాలు

అలా సర్వజాతిధర్మాలు చెప్పాక, శిష్యులమీద అనురాగం కలిగి, అరిష్టాలు కూడా ఇలా ఎరిగించాడు పరాశరముని.

"దక్షిణంవేపు వుండే హిరణ్మయపురుషుణ్ణి ఉత్తరంవేపు చూసిన మనిషికి మూడేళ్ళలో చావు వస్తుంది.

"సూర్యమండలం కాంతిహీనంగా కనపడిన మనిషికి రెండేళ్ళలో చావు వస్తుంది.

"వెన్నెలలోని తన నీడలో రంధ్రం చూసిన మనిషికి వొక్క ఏడాదిలో చావు వస్తుంది.

"ఆనీడ తలలేకండా అవుపడితే ఆరుమాసాలలో చావు వస్తుంది.

"చేతులతో చెవులు మూసుకున్నప్పుడు మోత వినపడక పోతే నెలదినాల్లో చావు వస్తుంది.

"ముక్కూ, చెవులూ పట్టుకదిలి దిగజారినా, పళ్ళూ, కళ్ళూ వికారంగా రంగుమారినా అవాళే చావు వస్తుంది.

"ఈఅరిష్టాలు ఏవి కనపడినా కలతపడకూడదు. తృష్ణతో నిండిన సంసారంమీద ఆసక్తి వొదిలిపెట్టాలి. హృదయం ఏకాగ్రం చేసుకోవాలి. మునీంద్రులు నిర్దేశించిన నిర్మలమైన ధ్యానకర్మలో మగ్నంకావాలి. అలా అయితే కాలయముడి అనుగ్రహం పొందు

తాడు మనిషి. అలా కాక తెలివితక్కువగా కాలంచేస్తే వైశ్యకులం లోనూ, క్షత్రియకులంలోనూ, బ్రాహ్మణకులంలోనూ ఆయావిధానాలకు తగిన ఐశ్వర్యమూ, జ్ఞానమూ కల వంశాలలో వరసగా పుట్టి, ఆయాకర్మలమీద ఆసక్తి కలిగి, 'నియమనియామీ కలవాడీయన' అన్నట్టు సుకృతాలుచేసి, ఇహపరసౌఖ్యాలు అనుభవిస్తాడు. ఇలా ఇహపరాలకి రాకపోకలు సాగిస్తూ, బ్రహ్మాది పుణ్యలోకాలు పొంది, అన్నీ తెలుసుకుని, అప్పుడు 'ఇవి ఏవీ శాశ్వతాలు కావు. ఇవన్నీ చావుపుట్టుకలు కలవి. సంసారదుఃఖంతో కూడినవి. మీసాలమీద తేనెబొట్లుమల్లే అల్పసుఖప్రదమైనవి. వీటికోసం ఇంత లోలత్వం ఎందుకూ?' అని భావిస్తాడు. మళ్ళీ పుట్టుక లేకండా చేసేదీ, అధికమైందీ, అచలమైందీఅయిన ధర్మం కోరుకుంటాడు. చెయ్యాని కర్మఫలం పొందడం కాని, చేసినకర్మఫలం అనుభవించకపోడం కాని ఎవ్వరికీ సాధ్యం కాదు. ఇది ధ్రువమైన మాట. కనక చేసుకున్న కర్మవిశేషంవల్ల దేవేంద్రుడూ మొదలైన మహనీయుల సహవాసంతో వర్తించి, పుణ్యఫలం అయిపోయాక, జ్ఞానవంతులైనవారి వంశంలోపుడతాడు మనిషి. బ్రహ్మసంస్కారాలన్నీ పొంది, అతిథుల్నీ దేవతల్నీ పితృదేవతల్నీ సంతృప్తిపరిచి, ఆలుబిడ్డల భవబంధాలు నిరసించి, యతిధర్మం ఆచరించి, ఇల్లు వొదిలి, గురుశుశ్రూష చేసి, సాంఖ్య, యోగశాస్త్ర రహస్యయోగాలు తెలుసుకుని, పుణ్యారణ్యాలలోనూ, శూన్యగృహాలలోనూ, దేవతాగృహాలలోనూ, గుహాలలోనూ నివసిస్తూ, బిచ్చమెత్తుకు తింటూ, ఒక్కచోటనే అలవాటుపడక, కావాలి అక్కరలేదు అన్నమాట మానుకుని, ద్వంద్వాలూ, మమతా, అహంకారమూ వొదులుకుని, నిత్యతృప్తాత్ముడయి, వెళ్ళేదిక్కు వొకటని నిర్దేశంలేకండా తిరుగుతూవుండి, ఆరముగ్గినపండు తొడిమనించి జారినట్టు గుణాలు వొదిలిపెట్టి, పరిశుద్ధభావంతో చివరికి అక్షయమూ, అచలమూ అయిన పరమపదం చేరుతాడు."

ఇలా భిక్షుకుడు గూడు విడిచిన పక్షిలాగ మాయ విడిచిపెట్టి, అభేద్యమూ, అక్షరమూ అనే తత్వం సాక్షాత్కరించుకుని శాశ్వత మైన పరమపదం చేరుకుంటాడు. ఆమహానుభావుడు తాను సంసార సముద్రం దాటిపోడంతో వూరుకోడు. తన ఆశ్రితుల్ని కూడా దాటిస్తాడు. కనక శూద్రుడు భిక్షుకుణ్ణి ఆశ్రయించి, ప్రియంగా అతణ్ణి సేవిస్తే, ప్రసిద్ధుడైన ఆభిక్షుకుడి కృపారసం సేవించగలుగుతాడు; అతడి సాంగత్యంవల్ల పాపాలు పోగొట్టుకుంటాడు; చిరకాలం మెల్లి మెల్లిగా ప్రయత్నించి, నుయ్యితవ్వి నీరుసంపాదించినట్టు చివరికి శుభ ప్రదమైన తత్వసాక్షాత్కారం పొందుతాడు; తప్పదు.

సర్వజనులకీ పరమపదంమీద అభిలాషవుండడం సహజమే. అయితే అది శూద్రులకిమాత్రం మరోవిధంగా ఫలించదు, భిక్షుక సేవవల్ల తప్ప. కనక భిక్షుకసేవ శూద్రులకి పరమకర్తవ్యం.

ఏవర్ణంవారైనా సరే, ఇంద్రియనిగ్రహం అవసరం. ఇంద్రి యాలు అదుపులోకి తెచ్చుకుని, దేనిమీదా ఆసపడకండా వుంటే, అదిగో అప్పుడూ సాధువులు వెదికే సత్పథం ఎదురవుతుంది.

పరమధర్మం ఇది. ఈధర్మం పట్టి పాపయోనులయిన స్త్రీలూ, కోమట్లూ, శూద్రులూ కూడా సుగతి పొందుతారంటే, ఇక సజ్జను లయిన బ్రాహ్మలూ, క్షత్రియులూ పొందడంలో వింత ఏముంది!

పాపం క్షీణించనివారికి జ్ఞానం కలగదు. సద్గురువు ఉపదేశించిన పనులు చెయ్యడంవల్ల పాపాలు పోతాయి. అదిగో అప్పుడే నిర్మల మైన జ్ఞానం కలుగుతుంది. జ్ఞానోదయంవల్ల గర్వం కలగకండా చూసు కోవాలి. గర్వం కలిగిందో గురుపూజ క్షీణిస్తుంది. దాంతో జ్ఞాన సంపద నశిస్తుంది. అంతతో పోక కీడుకూడా సమకూడుతుంది. పరమ జ్ఞానానికి ఫలం ఉపశాంతి అని తెలుసుకోవాలి. జ్ఞానం ఎంత అధిక

మయితే శాంతం అంత అధికం అలవరుచుకోవాలి. అలా శాంతంతో గురువుని సేవించినవాడే మేలు పొందుతాడు. ధైర్యంతో కడుపూ (ఆకలి) శిశ్నమూ (స్త్రీవాంఛ) రక్షించుకోవాలి. పటుత్వమైన చూపుతో కాళ్ళూ చేతులూ రక్షించుకోవాలి. మనస్సుతో ఇంద్రియాలు రక్షించుకోవాలి. బుద్ధితో మనస్సు రక్షించుకోలి. అప్పుడు జ్ఞానం రేకెత్తుతుంది. జ్ఞానంతో హృదయం వికసిస్తుంది. పొగపోయిన నిప్పులా ప్రకాశించి దేవుణ్ణి చూస్తే ఉపాయం పట్టువడుతుంది. యోగయుక్తుడు కాకండా మహేశ్వరుణ్ణి చూడడం ఏలా జతపడుతుంది? యోగంతో పరిపక్వమైన ఆత్మకలవాడికి సద్భక్తి పట్టువడుతుంది. అలాటియోగం సాధించగలిగినవాడు పదహారు వికృతులూ, ఏడు ప్రకృతులూ, వొక మూల ప్రకృతీ మహాశ్శక్తితో పరిశీలిస్తాడు. వికృతీ, ప్రకృతి కాని ప్రభువుని దర్శిస్తాడు. *

ఇది సాంఖ్యం. దీనిని మనస్సుకి పట్టించుకుంటూ, అప్రమత్తుడయి, వినయంతో గురువుని సేవిస్తే, అతడి అనుగ్రహంవల్ల పరమపదం కరతలామలకం అవుతుంది.

భిక్షుభావం పొంది, ఈశికతో నడుచుకునే అర్హత బ్రాహ్మలకీ, క్షత్రియులకీ, వైశ్యులకీ మాత్రమే వుంది. శూద్రులకి లేదు. భిక్షువు సాంగత్యం తప్ప, భిక్షుధర్మం అవలంబించరాదు శూద్రుడు. భిక్షుసంసర్గమే అతడికి అవలంబం. అదే అతడికి అమలపథం. ఎప్పుడూ మేరువుదగ్గిరే వుండడంవల్ల కాకిబంగారం బంగారంలా మెరిసినట్టు, పరమజ్ఞానులదగ్గిర మసులుకుంటే అజ్ఞానికూడా జ్ఞాని అవుతాడు.

"ధర్మరాజా! నాలుగువర్ణాలవారికీ అనువైనట్టు పరాశర మునీంద్రుడు సెలవిచ్చిన గురుశుశ్రూష వివరించి చెప్పాన్నేను.

---

* చూ. శాంతిపర్వం 2604, 2605 పు.

## దేవతలు నమస్కరించదగినవారు

ధర్మరాజు :

దేవతలుకూడా నమస్కరించదగిన మనుషులు వున్నారని విన్నాను. ఎలాంటి మనుషుల్ని దేవతలు నమస్కరిస్తారు ?

భీష్ముడు :

ఇలాగే వోసారు ఇంద్రసారథి మాతలి దేవేంద్రుణ్ణి అడిగాడు. మాతలి ప్రశ్నకి దేవేంద్రుడు ఇలా బదులు చెప్పాడు :

" ధర్మమూ అర్థమూ కామమూ - ఈమూడూ ధర్మం తప్పకండా నియమంతో పాలించినవారూ, విద్యకలిగీ ధనంకలిగీ ఐశ్వర్యం కలిగీ కూడా గర్వంలేనివారూ, ఇంద్రియాలుజయించినవారూ, ధర్మసమ్మతంగా కట్టుకున్న తమ భార్యలతోమాత్రం తృప్తిపడిన వారూ, గాఢమైన తపోధనం గడించినవారూ, సత్యవ్రతులైనవారూ, పరమపవిత్రులైనవారూ, బహుకార్యపరతలేని గూఢధర్మపరులూ, సన్యాసకోవిదులైనవారూ — ఈమనుషులు నేను నమస్కరించ దగినవారు. "

## చెరువు తవ్విస్తే ఏమిటిఫలం ?

ధర్మరాజు :

చెరువుతవ్వించిన ధర్మానికి ఏమిటిఫలం ?

భీష్ముడు :

మంచిప్రశ్న వేశావు. నీప్రశ్నవిని సంతోషం కలిగింది. చెప్తాను, సావధానంగా విను. దేవతలకూ, నరులకూ, తిర్యగ్జంతువులకూ, స్థావరప్రాణులకూ ఆశ్రయం చెరువు. అంతేకాదు, ఆవులు అందులో నీరు తాగుతాయి. చెరువు తవ్వించినవారి ముందువెనకల కులంవారికి పుణ్యలోకాలు లభించినట్టు చేస్తాయవి.

చెరువు తవ్వించడంవల్ల కర్తకి ఈలోకంలో సిరిసంపదలూ, అఖండమైనకీర్తీ లభిస్తాయి. వానాకాలమూ, చలికాలమూ, ఎండాకాలమూ చెరువులో నీళ్ళుంటే— అగ్నిహోత్రాలూ, యజ్ఞాలూ, అశ్వమేధాలూ చేస్తే ఎంతఫలం కలుగుతుందో అంతఫలం కలుగుతుంది కర్తకి. చెరువుగట్టుమీద మంచిమంచి చెట్లువేస్తే సద్గతి కలుగుతుంది. అందువల్లకర్త పిట్టలూ మొదలైన ఎన్నోప్రాణులకి వసతి కలిగించినవాడవుతాడు. కనక లెక్కలేనన్ని సౌఖ్యాలు పొందుతాడు ఇహంలో.

చెరువులు తవ్విస్తే పితృదేవతలు ఆనందిస్తారు. వారికి ఊర్ధ్వలోకాలు లభిస్తాయి. కనక తమ సంతానం చెరువులు తవ్వించాలని కోరుకుంటూ వుంటారు వారు.

చెరువుగట్టుమీది చెట్లు తమ నీడలతో అతిథుల్ని ఆనందపరుస్తాయి. పువ్వులతో దేవతల్ని సంతోషపెడతాయి. పళ్ళతో పితృదేవతల్ని తృప్తిపరుస్తాయి. అంచేత చెట్లు నాటడం గొప్ప ధర్మం.

## గృహస్థధర్మం

ధర్మరాజు :

గృహస్థధర్మం సాకల్యంగా వినాలనుంది. అనుగ్రహించు.

భీష్ముడు :

నాయనా, నువ్వు అడిగిన ప్రతిప్రశ్నా ఉత్సాహంకలిగిస్తోందోయి నాకు. భూవిష్ణుసంవాదం అని వొక ఇతిహాసముంది. అది నువ్వు అడిగినదానికి సరైన సమాధానంగా వుంటుంది. వివరిస్తాను, విను.

ఇప్పుడు నువ్వు నన్ను అడిగినట్టే వోమాటు విష్ణుమూర్తి భూదేవిని లాలిస్తూ అడిగాడు. ఆమహానుభావురాలు భూదేవి సంతోషించి, విష్ణుదేవుడితో ఇలా చెప్పింది ;

"దేవా! గృహస్థు అగ్నిపరిచర్య పూర్తిచేసి, భక్తిపూర్వకంగా బలివిధానం నెరవేర్చాలి. అలా నెరవేరిస్తే అందరు దేవతలూ ఆనందిస్తారు.

"అన్నంతోనో, పాలతోనో, పళ్ళతోనో, కందమూలాలతోనో, లేదా నీటితోనో నిత్యమూ ప్రీతిపూర్వకంగా పితృకృత్యం నెరవేర్చాలి. వైశ్వదేవం అవశ్యం నిర్వహించాలి. ఇది అయిన అనంతరం శక్తికి తగినట్టు దానంచెయ్యాలి. భిక్షుచర్యచేసే బ్రాహ్మల కోసం కనిపెట్టివుండి భిక్ష పెట్టాలి. భిక్షపెట్టడంలో ఆలస్యం చెయ్యకూడదు. ఆసమయానికి భిక్షుకులు లేకపోతేమాత్రం ముందు అగ్నిముఖంలో అయినా భిక్షం వెయ్యాలి. స్నేహితుల్నీ, బంధువుల్నీ, గురువుల్నీ భోజనంతో తృప్తిపరిచి బలివిధి నెరవేర్చాలి.

"బలులు రెండు రకాలు. ఆరెంటిలో ధర్మాధర్మౌషధి వనరక్షోజనాది విషయమైన శ్రౌతబలి నేను మొదట నిర్దేశించింది. ఇప్పుడు చెప్పింది పశు పక్షి చండాల ప్రభృతి గోచరమైన స్మార్తబలి.

ఇది గృహస్థధర్మం. ఈవిధంగా చేసి, తరవాత భోజనం చెయ్యాలి గృహస్థు. ఇలా చేసినవాడు ఇహపరసౌఖ్యాలు హాయిగా అనుభవిస్తాడు."

భూదేవిచెప్పిన గృహస్థధర్మం విని విష్ణుదేవుడు శ్రీకృష్ణుడు ఆవిధంగా నడుచుకున్నాడు. ధర్మరాజా! ధర్మం అంటే ఎంతో శ్రద్ధ నీకు. నువ్వుకూడా భూదేవి చెప్పిన గృహస్థధర్మం పాలించు. ఈవిధమైన గృహస్థధర్మంవల్ల అన్నిపాపాలూ పోతాయి. అభ్యుదయం లభిస్తుంది. ఆనందం కలుగుతుంది. పుణ్యమూ, యశస్సూ సిద్ధిస్తాయి. ఊర్ధ్వలోకాలు ప్రాప్తిస్తాయి.

# నాలుగో ఆశ్వాసం

## పుష్ప ధూప దీప నైవేద్యాల ఫలం

వైశంపాయనుడు జనమేజయుడితో ఇంకా భారతకథ ఇలా చెప్పాడు :

అలా గృహస్థధర్మాలు తనకి ఎరిగించిన తాతగారికి నమస్కరించాడు మనవడు ధర్మరాజు. భక్తివినయాలతో మళ్ళీ అడిగాడు.

"మహాత్మా ! పువ్వులూ, ధూపమూ, దీపమూ, నైవేద్యమూ ఉత్తమమైన పూజాసాధనా లంటారు. వాటితో దేవతలు పూజచేస్తారు. ఏమిటి వీటిలో వున్న విశేషం ?"

భీష్ముడు :

ఈవిషయం శుక్రాచార్యుడు బలిచక్రవర్తికి చెప్పాడు పూర్వం. బలి మనువుకి చెప్పాడు. మనువు మునీశ్వరుడయిన సువర్ణుడికి చెప్పాడు. సువర్ణుడు నారదమునికి చెప్పాడు. పరమమునీంద్రుడు నారదుడు నాకు చెప్పాడు. అది నేను నీకు చెపుతున్నాను, ఆలకించు.

ఓషధులు అమృతంతో సమానమైనవి. ఉత్తమమైనవి. ఓషధులలో పువ్వులు మేలైనవి. పువ్వులతో దేవతలను పూజించిన మనుష్యులకి మంచిమనస్సు కలుగుతుంది. అంచేతే పువ్వులకి సుమనములు అని పేరు వచ్చింది. సుమనాలతో పూజచేసే నరుల కోరికలు సుమనస్కతతో (మంచిమనస్సుతో) తీరుస్తారు దేవతలు. అందుకనే దేవతలు సుమనస్కులని పేరుపడ్డారు.

వాసనకలిగిన పువ్వులూ, తెల్లటి పువ్వులూ, ముళ్ళులేని చెట్ల పువ్వులూ పూజకి ప్రీతితో స్వీకరిస్తారు దేవతలు. పద్మాలూ, జాజులూ, తులసీదళాలూ అంటే ఎంతో సంతోషం వారికి. యక్షులూ

మొదలైనవారికి నీటిపువ్వులంటే ఇష్టం. అథర్వమంత్రప్రయోగంతో పగవారిమీద అభిచారయోగానికి – మారణక్రియాయోగానికి ఎర్రటి పువ్వులూ, ముళ్ళచెట్టు పువ్వులూ, చేదువాసనవేసే పువ్వులూ ప్రయోగిస్తారు. భూతాలకీ రక్షోగణాలకీ తీక్ష్ణమైనవాసనగల పువ్వులు తృప్తి కలిగిస్తాయి. కమ్మని పరిమళమూ, మంచి కాంతీ కలిగిన పువ్వులంటే మనుషులు ముచ్చటపడతారు.

అయితే పెళ్ళిళ్ళకీ, శాంతిక పౌష్టిక క్రియలకీ, ఆడాళ్ళని రంజింపచేసే పనులకీ మాత్రం దేవాలయాల్లోనూ, స్మశానాల్లోనూ పూసిన పువ్వులు వినియోగించకూడదు.

పువ్వుల పరిమళంతో దేవతలు సంతోషిస్తారు. వాటిని చూడడంతో యక్షులు సంతోషిస్తారు. వాటిని ఉపయోగించడంతో నాగులు సంతోషిస్తారు. ఈమూడు పనులవల్లా మనుషులు సంతోషిస్తారు. మంచిపువ్వుల పూజలతో దేవతలు తృప్తిపడతారు. వెంటవెంటనే మనుషుల కోరికలు సఫలం చేస్తారు.

అందుగుచెట్టుజిగురు ధూపం దేవతలందరికీ శ్రేష్ఠమైంది. అంతకంటే గుగ్గిలం మంచిది. సుగంధధూపం గంధర్వులకీ, యక్షులకీ, నాగులకీ ఎంతో ఇష్టం.

ధూపదానాలన్నిటిలోకీ కర్పూరధూపదానం గొప్పది. కమ్మని ధూపం దేవతలకి ప్రియం. కటువైన ధూపం యక్షులకి ప్రియం. తీక్ష్ణగంధం కల ధూపం రాక్షసులకి ప్రియం.

తగిన మంచిధూపం దేవతలకి సమర్పిస్తే పుష్టీ, ఆయువూ కలుగుతుంది కర్తకి. యక్షులూ, గంధర్వులూ, నాగులూ, రాక్షసులూ కూడా ధూపంతో తృప్తిపడి కోరికలు సఫలం చేస్తారు.

శ్రీచందనమూ అగరూ మొదలైన సుగంధద్రవ్యాలూ, సాంబ్రాణి మొదలైన ధూపాలూ మనుషుల మనస్సులకి ఎంతో హాయి కలిగిస్తాయి.

దేవతార్చన సమయాల్లో దీపం వెలిగించడంవల్ల తామస ప్రకృతికల భూతాలూ, రాక్షసులూ మొదలైన కుత్సితజాతులన్నీ అణగారిపోతాయి. అంచేత దీపదానం అధిక ఫలప్రదమైంది.

దీపం సమర్పించడమే ఆలోకదానం. మంచి దీపదానంవల్ల కర్తభావంలో ధర్మం ప్రకాశిస్తుంది.

దీపంలో నేయి చాలకపోడమూ, వత్తి నికృష్టం కావడమూ, సమర్పించిన తరవాత పెంచడమూ దీపదానంలో కూడని పనులు. ప్రదీప్తవస్తువు దృఢదీప్తికంగా వుండాలికదా మరి?

ఇతరులు సమర్పించిన దీపం అపహరించడం పరమపాతక హేతువు.

రాజబాటలలోనూ, సభలలోనూ, గుడిమీాదా, కొండమీాదా దీపం పెడితే సిరిసంపదలు కలుగుతాయి.

దీపానికి ఆవునేయి ఉత్తమం. గేదెనేయీ, మేకనేయీ, మంచి నూనే మధ్యమం. కొవ్వూ, ఎముకలరసమూ, మాంసరసమూ అధమం; నింద్యం.

దీపదానంవల్ల దేవతలు పూజించదగినసౌఖ్యాలు లభిస్తాయి ధాతకి.

దేవతలకి ముందు ఉపాహారమిచ్చి తరవాత భోజనంచెయ్యాలి మనిషి. అలా చెయ్యని బుద్ధిహీనుడు రాక్షసుడవుతాడు. కనక తన ఇంట కలిగిన అన్నం ముందు దేవతలకి నివేదించాలి. నమస్కార పూర్వకంగా నియమసహితంగా సమర్పణచేసి, కృతకృత్యుడు కావాలి.

బలివిధానాల్లో పూజకుడు శక్తిసంపన్నుడయి సమర్పించిన తెలకపిండీ, పెరుగూ, పాలూ, ధూపాలూ, పువ్వులూ, పరిమళ పదార్థాలూ దేవతలకి ప్రియం కలిగిస్తాయి.

యథావిధిగా ఉపహారం సమర్పించిన గృహస్థుణ్ణి గృహ

దేవతలు శుభాలుకలిగిస్తారు. అలా చెయ్యనివాణ్ణి ఎంతో విఫలుణ్ణి చేసి వొదిలిపెడతారు.

రక్తమూ, మాంసమూ కలిపిన అన్నంముద్దలూ, నెత్తురు కలిపిన పేలాలూ, కల్లూ బలిగా సమర్పిస్తే నాగులూ యక్షులూ రాక్షసులూ మొదలైన భూతాలు శుభంకలిగిస్తాయి. సౌమ్యఫలానికి సౌమ్యబలీ, క్రూరఫలానికి క్రూరబలీ అవసరం.

సౌమ్యమైన బలులు సమర్పించినవాడు కులశ్రేష్ఠు డవుతాడు; బలవంతు డవుతాడు; పగవాళ్ళని నిగ్రహించగల శక్తిమంతు డవు తాడు; తత్వనిష్ఠు డున్నా అవుతాడు.

ధర్మరాజు :

పుష్ప, ధూప, బలిప్రదానాల విశేషాలు ఇంకా వినాల నుంది. వివరించు.

భీష్ముడు :

నహుషుడి వృత్తాంతంలో నువ్వు అడిగిందంతా వ్యక్తమవు తుంది. వివరిస్తాను, విను.

నహుషుడు చక్రవర్తిఅయి భూమి ఏలుతూవుండేవాడు. రవంతా రాజసం లేకండా, సత్వనిష్ఠతో పువ్వులూ, ధూప, దీప, నైవేద్యాలూ దేవతలకి సమర్పిస్తూ వుండేవాడు. వీటితో పితరులకి ప్రీతికలిగిస్తూవుండేవాడు. భూతాలకీ, యక్షులకీ, నాగులకీ, రాక్షసు లకీ తర్పణచేసి, ఎవళ్ళకి తగినట్టు వాళ్ళని సంతోషపరిచేవాడు. నిత్యమూ నిష్ఠాపూర్వకంగా ఇలా చేస్తూ, దాని ఫలితంగా దివ్యమైన తేజస్సు పొందా డతడు. దేవేంద్రపదవి సంపాదించాడు. దేవతల చేతా, మునీశ్వర్ల చేతా పూజలు అందుకున్నాడు. అంత వైభవం కలిగినా పువ్వులూ, ధూపమూ, దీపమూ, నైవేద్యమూ దేవతలకి సమర్పించడం మాత్రం మరిచిపోలేదు నహుషమహారాజు. దేవతల్నీ

మొదటిలాగే చక్కగా పువ్వులూ, ధూపాలూ, దీపాలూ, నైవే ద్యాలూ సమర్పిస్తూ, వారిని సంతృప్తిపరుస్తూ, వుండేవాడు. అందు వల్ల అతని మహానుభావత్వం అంతకంతకీ అధికమవుతూ వుండేది. ఇంకా వెయ్యి చెప్పడ మెందుకూ, అంచేత మహామునీశ్వర్ల వాహ నమే లభించింది ఆమహానుభావుడికి. అదిగో అలా ఏమహారాజుకీ లేని విశేషం కలగడంతోనే గర్వం అంకురించిందతడికి. దాంతో దుర్వర్తన పరుడయ్యా డతడు. దానిఫలితంగా అజగరుడై పోయాడు. అయినా పూర్వం తాను చేసిన పుష్ప, ధూప, దీప, నైవేద్యాల దానంతో కలిగిన పుణ్యవిశేషాల ప్రభావంవల్ల ఆమహారాజుని శపించిన మునీ శ్వరుడు అనుగ్రహించాడు. శాపాంతం నిర్దేశించాడు. ఆఫలవిశేషం వల్లే పాపరహితుడివయిన నువ్వు ఆపుణ్యకార్యానికి పూనుకున్నావు.

ధర్మరాజా! స్వంతఇంటికి వెళ్ళినట్లు బ్రహ్మసభకి వెళ్ళాడు నహుషుడు. అంతగొప్ప అతనికి విశిష్టమయిన ధూప దీపాదుల దానంవల్లే కలిగింది.

విన్నావు కదూ, దీపదానంవల్ల కర్తకి దివ్యజ్ఞానం కలుగు తుంది. ఊర్ధ్వలోకాలు లభిస్తాయి. కనక దీపదానం ఉత్తమమైంది.

ఎన్నినిమిషాలు దేవతసన్నిధిని దీపం వెలిగిస్తే అన్ని దివ్య సంవత్సరాలు దేవలోకంలో సుఖపడతాడు కర్త.

బ్రాహ్మణధనం అపహరిస్తే? —

ధర్మరాజు:

బ్రాహ్మణధనం అపహరించినవాడికి ఏంగతి పడుతుంది?

భీష్ముడు:

లోకంలో ఎన్నో పాపా లున్నాయి. అన్నిపాపాల్లోకీ బ్రాహ్మణ ధనం అపహరించిన పాపం గొప్పదంటారు. బ్రాహ్మణ ధనం

అపహరిస్తే కులనాశనం తప్పదు. దానివల్ల తరవాతజన్మలో చండాలత్వం సిద్ధిస్తుంది. ఈవిషయంలో వొక ఇతిహాసం వినిపిస్తాను, విను.

క్షత్రబంధువు అని వొక రాజు వుండేవాడు. ఓసారి వో మాలవాణ్ణి చూశా డతడు. బ్రాహ్మలుండే చోటునుంచి గాలిలో ఎగిరివచ్చిన ధూళికణం తనమీద పడుతుందేమో అని తప్పుకుంటూ ఎంతో దుఃఖంతో తిరుగుతున్నా డతడు.

"పిసరంత ధూళికోసం ఇంత భయపడుతున్నావేమీ ?" అని మాలని అడిగాడు రాజు.

"ఏంచెప్పేది మహారాజా!" అంటూ అందుకున్నాడు మాల, "వెనకజన్మలో నేను వో బ్రాహ్మణకుమారుణ్ణి. మునులు కూడ ఔరా అన్నట్టు బ్రహ్మచర్యవ్రతం నిష్ఠతో పాలించా న్నేను. ఓనాడు బిచ్చమెత్తి తెచ్చుకున్న అన్నం తినడంకోసం పుణ్యానదీతీరానికి వెళ్ళాను. తిండికి కూచున్నాను. ఇంతలో గాలికి రేగి బ్రాహ్మలున్న క్షేత్రంనుంచి ధూళి ఎగిరి వచ్చి నాచేతి అన్నంముద్దనిండా పడింది. ఏంచెయ్యనూ, ఆ ధూళితోనే ఆ ముద్ద మింగాను. అదిగో ఆపాపఫలం కట్టికుడిపింది నాకు. బ్రాహ్మల ధనం ఆధనాళి మింగడం వల్ల ఈజన్మలో ఈచండాలజన్మ ప్రాప్తమయింది.

"నిన్న వో కలకన్నాను. అది చెపుతాను, విను. ఓ బ్రాహ్మణోత్తముడు నన్ను చూసి, 'అయ్యయ్యో' అని కనికరించి పిలిచాడు. 'నాయనా, భయపడకు, ఈదుఃఖకలాపం యావత్తూ క్షత్రబంధువుతో మాట్లాడాక రేపటితో తీరిపోతుంది' అన్నాడు.

"రాజా! ఇక నాకు సెలవిప్పించు" అని చెప్పి అక్కణ్ణుంచి వెళ్ళిపోయి కాలంచేశాడు మాల. అనంతరం తాను చేసుకున్న సత్కర్మలవల్ల ఉత్తమపదం పొందాడు; శాశ్వతమైన దివ్యసుఖం అనుభవించాడు.

## స్వర్గం

ధర్మరాజు :

స్వర్గం మనోహరంగా వుంటుందిట కదా! అనేకరకాల ఆనందం కలిగిస్తుందట కదా?

భీష్ముడు :

అవును, పుణ్యకర్మలు ఎన్నోవిధాలు కదా! కనక ఆయా పుణ్యకర్మలకి తగినట్టు అనేకప్రదేశాలతో వుంటుంది స్వర్గం. శోకరహితంగా వుంటుంది. చెప్పలేనంత సుఖకరంగా వుంటుంది. ఎంతో అంత గొప్పగా వుంటుంది. గౌతమదేవేంద్రసంవాదం అని వొక ఇతిహాసముంది. అది నీప్రశ్నకి సమాధానమవుతుంది. విను.

గౌతముడు వొక ఉత్తమబ్రాహ్మణుడు. అడివిలో తపస్సు చేసుకుంటూ వుండేవాడతను. అడవిలో వొకచోట వొకనాడు తల్లిలేని ఏనుగుపిల్లని చూశాడు గౌతముడు. తల్లిలేదని జాలిపడ్డాడు. దాన్ని తెచ్చి కన్నకొడుకులా పెంచాడు. క్రమంగా ఆ ఏనుగుపిల్ల పెరిగి పెద్దదయింది. ధృతరాష్ట్రుడు అనే రాజు ఆ రోజుల్లో రాజ్యమేలుతూ వుండేవాడు. ధృతరాష్ట్ర మహారాజు వేషంలో దేవేంద్రుడు గౌతముడున్న అడివికి వచ్చాడు. గౌతముడు పెంచుకున్న 'ఏనుగు తనకి ఇచ్చెయ్యమని అడిగాడు.

“నాకన్నకొడుకులా దీన్ని పెంచుకుంటున్నాను. నాకోసం కర్రపుల్లలు తెచ్చిపెడుతుందిది. నేను లేనప్పుడు పర్ణశాల కాపాడుతుంది. మనిషిలా బుద్ధికలిగి మసులుకుంటుంది. కనక రాజా, దీన్ని ఇవ్వలేన్నేను” అని నిక్కచ్చిగా చెప్పాడు గౌతముడు.

“మునులకి ఏనుగెందుకయ్యా, వెర్రిబ్రాహ్మడా?” అన్నాడు ధృతరాష్ట్రుడివేషంలో వున్న దేవేంద్రుడు, వెలలేని మంచిమంచి

ఆవులు వెయ్యి పుచ్చుకో ఇస్తాను. ఎంత కావాలంటే అంత బంగారం కూడా ఇస్తాను. ఈఏనుగు మాత్రం నాకు ఇచ్చెయ్యి."

"చిన్న శిశువుగా వున్నప్పుడు దీని తల్లి పోయింది. అంచేత జాలిపడి తెచ్చి పెంచాను. ఇదంటే నాకు ప్రాణం. నువ్వు వెయ్యి కాదు పదివేలు ఆవులు ఇచ్చినా, కోటి వరహాలు ఇచ్చినా ఏనుగు మాత్రం యివ్వను. ఇంతకీ యివ్వనని నేను మొరపెడుతూ వుంటే ఈ బల వంత మేమిటి? రాజువి నువ్వు, తగునా నీ కిది?" అన్నాడు గౌత ముడు.

"అదేమన్నమాట?" రాజసంతో అన్నాడు దేవేంద్రుడు, "రాజున్నేను. నావాహనంకోసం ఏనుగు అడగడం తగనిపనా? అడ్డు చెప్పకు. ఏనుగు విడిచిపెట్టు" అన్నాడు.

"ఆగు" జంకులేకండా అన్నాడు గౌతమముని, "పుణ్య కర్ములు ఎక్కడ సంతోషం కలిగిస్తారో, పాపకర్ములు ఎక్కడ శోకం కలిగిస్తారో అక్కడికి ఆ యమునసభకి పద. అక్కడ ఏనుగు ఇస్తా న్నీకు."

"నాస్తికులూ, పాపకర్ములూ అలాంటిచోటికి వెళతారు. నేను మాత్రం రాను" అన్నాడు దేవేంద్రుడు.

"యముడు పుణ్యమూర్తి. అతణ్ణి గౌరవించడం తగదా?" అన్నాడు గౌతముడు.

"అక్కని కాపాడేవాడూ, తల్లిదండ్రుల్ని భక్తితో పూజించే వాడూ అక్కడ మేలుపొందుతాడు. నేనుమాత్రం అక్కడికి రాను" అన్నాడు దేవేంద్రుడు.

"పోనీ అయితే, గంగానది వొడ్డుకి రా, అక్కడ ఏనుగిస్తాను" అన్నాడు గౌతముడు.

"అతిథులు భోజనంచేశాక, మిగిలిన అన్నం తిన్నవాళ్ళూ,

ఎవ్వరిదగ్గిరా ఏదీ పుచ్చుకోనివాళ్ళూ గంగాదర్శనంచేస్తారు. నేను లక్ష్యపెడతానా గంగాతీరం?" అన్నాడు దేవేంద్రుడు.

"అయితే మేరువనానికి పద. అక్కడ ఇస్తాను ఏనుగు" అన్నాడు గౌతముడు.

"మృదుస్వభావులూ, సత్యవంతులూ, దయాపరులూ, భూత హితులూ అక్కడకి వెళతారు. నాకేంపని అక్కడ? మరోమంచి చోటు చెప్పు, వస్తాను" అంటూ చిరునవ్వుతో గౌతముడి మొహం మీద సూటిగా చూపులు నిలిపాడు దేవేంద్రుడు.

"అలాగా? అయితే నారదముని విహరించే అడివికి రా. అక్కడ ఏనుగిస్తాను. అప్సరసలూ, కిన్నరులూ ఆవనమంటే ఎంతో ముచ్చటపడతారు" అన్నాడు గౌతముడు.

"ఆటపాటల్లో ఆరితేరినవాళ్ళూ, దేవతల్నీ మునీంద్రుల్నీ సంతోషపెట్టగలవాళ్ళూ అక్కడికి వెళతారు. నేనుమాత్రం అక్కడికి రాను" అన్నాడు దేవేంద్రుడు.

"పోనీ, ఉత్తరకురుభూములకి రా. దేవతలతో రమ్యంగా వుంటుం దక్కడ. దేవేంద్రుడు సర్వకోరికలూ ప్రసాదించే ప్రదేశం అది. అక్కడ ఏనుగు పుచ్చుకుందువు కాని" అన్నాడు గౌతముడు.

"కామం జయించినవాళ్ళూ, హింసచేయనివాళ్ళూ అక్కడికి వెళ్ళగలుగుతారు. నాకు తరమవుందా అక్కడ అడుగుపెట్టడం?" అంటూ గర్వంగా చూశాడు దేవేంద్రుడు.

"అయితే చంద్రలోకానికి పద. అక్కడ ఏనుగిస్తాను" అన్నాడు గౌతముడు.

"దానతత్పరులూ, ఇంద్రియాతీతులూ, దానం గ్రహించని వాళ్ళూ అక్కడికి వెళ్ళగలుగుతారు. నేను అక్కడికి రాలేను, సెలవు లేదు" అన్నాడు దేవేంద్రుడు.

"సూర్యలోకానికి రా పోనీ. అక్కడ ఏనుగిస్తాను" అన్నాడు గౌతముడు, నవ్వుతూ.

"తపస్స్వాధ్యాయపరులు వెళ్ళగలలోకం సూర్యలోకం. అక్కడికి నేనెలా వచ్చేది?" అన్నాడు దేవేంద్రుడు.

"అలా అయితే వరుణలోకానికి రా. అక్కడ ఏనుగిస్తాను" అన్నాడు గౌతముడు.

"అగ్నిహోత్రాలూ, ఇష్టకర్మలూ, యజ్ఞాలూ చేసినవాళ్ళూ వరుణలోకం వెళ్ళగలుగుతారు. నేను అక్కడికి రాను" అన్నాడు దేవేంద్రుడు.

"ఎక్కడికీ రాకపోతే పోనీ, దేవేంద్రుడి దగ్గిరికి పద. దేవతలకి ఇష్టమైన చోటు అది. అక్కడ ఏనుగిస్తాను" అన్నాడు గౌతముడు.

"శూరులూ, యజ్ఞాలుచేసినవాళ్ళూ, శతవర్ష పురుషులూ అక్కడికి వెళతారు. నేనుమాత్రం అక్కడికి రాను" అన్నాడు దేవేంద్రుడు.

"అలా అయితే ప్రాజాపత్యలోకానికి పద. అక్కడ ఏనుగిస్తానీకు" అన్నాడు గౌతముడు.

"అశ్వమేధయజ్ఞాలు చేసినవాళ్ళు వెళ్ళవలిసిన చోటు అది. అక్కడికి నేనెలా వచ్చేది? రాను" అన్నాడు దేవేంద్రుడు.

"మోహం, శోకం లేనిలోకం గోలోకం. పోనీ అక్కడికి రా. అక్కడ ఏనుగిస్తాను" అన్నాడు గౌతముడు.

"తీర్థాలు సేవించినవాళ్ళూ, గోదానాలు చేసిన పుణ్యపరులూ, బ్రహ్మచర్యవ్రతం నియమపూర్వకంగా పాలించిన వాళ్ళూ వెళ్ళవలిసినలోకం గోలోకం. ఆ లోకం అంటే ఏమాత్రమూ ఇష్టంలేదునాకు. అక్కడి కెందుకూ? రాన్నేను" అన్నాడు దేవేంద్రుడు.

"బ్రహ్మలోకానికి రా పోనీ, అక్కడ శీతోష్ణాలూ, సుఖదుః

ఖాలూ, స్నేహావిరోధాలూ మొదలైన ద్వంద్వాలు వుండవు. ఆ లోకంలో ఏనుగు పుచ్చుకుందువు కాని" అన్నాడు గౌతముడు.

"అసంగులూ, కృతాత్ములూ, చలించని వ్రతాచరణపరులూ, అధ్యాత్మనిరతులూ అక్కడికి వెళ్ళగలుగుతారు. నాకు శక్యమా అక్కడికి రావడం?" అన్నాడు దేవేంద్రుడు.

"నువ్వు ఎవరో నాకు అవగతమైంది" ధృతరాష్ట్రమహారాజు వేషంలో వున్న దేవేంద్రుణ్ణి తేరిచూస్తూ గంభీరంగా అన్నాడు గౌతముడు, "దేవేంద్రుడివి నువ్వు. అన్నిలోకాలకీ రాగలవు నువ్వు. ఎక్కడా ఏకీడూ అంటదు నిన్ను. నాకు తెలుసు."

"మహాత్మా" గౌతముడు అలా అనడంతోనే నమస్కరిస్తూ అన్నాడు దేవేంద్రుడు, "ఏనుగు కోసం ఇంత వాదించాను. నాకు సెలవియ్యి. నువ్వు ఏది చెపితే అది చేస్తాను."

"ఈ అడవి ఏనుగే నాకు కుమారుడు. దీన్నే నాకు ఇస్తేచాలు. సాధుజన వత్సలుడివి నువ్వు. ఈమాత్రం అనుగ్రహించు" అన్నాడు గౌతమముని.

"సందేహించకు" నెమ్మదిగా అన్నాడు దేవేంద్రుడు, "ఈ ఏనుగు నీదగ్గరనుంచి తీసుకోను. తొండం చాచి నిన్ను చూస్తుందది. అడుగులముందు నిలబడి ముద్దుకురుస్తుంది. పదే పదే దండంపెడుతుంది. ఇలాంటిదాన్ని నీనుంచి వేరుచేస్తానా? చెయ్యను.

"కానైతే మునీంద్రా! నన్ను నేను మరుగుపరుచుకుంటే ఏ దేవతలూ కానలేరు. నువ్వు పోల్చుకున్నావు. నీజ్ఞానసంపత్తి అద్భుతమైంది. కనక నువ్వూ, నీబిడ్డ ఈఏనుగూ ఇద్దరూ రండి. స్వర్గంలో నాతో స్నేహంగావుండి దివ్యసుఖాలు అనుభవింతురు కాని."

దేవేంద్రుడు అన్నదానికి సంతోషంగా అంగీకరించాడు గౌతముడు. అతణ్ణీ, ఏనుగుకొడుకని ముందుంచుకుని సంతోషపూర్వకంగా స్వర్గానికి వేంచేశాడు దేవేంద్రుడు.

## తపస్సుకంటే గొప్పధర్మం

ధర్మరాజు :

ధర్మాలన్నిటిలోకీ తపస్సు సారమయిందని ఎన్నో సార్లు నొక్కి-చెప్పావు నువ్వు. అయితే తపస్సుకంటే గొప్పధర్మం ఏదీలేదా ?

భీష్ముడు :

విను, ధర్మాలన్నీ గొప్పవే. తపమని ప్రత్యేకంగా వొక ధర్మం ఎక్కడా లేదు. నియతభోజనమే తపస్సు నిజానికి. వెనక వోమారు భగీరథుడు బ్రహ్మదేవుడి సభకి వెళ్ళాడు. బ్రహ్మదేవుడు భగీరథుణ్ణి చూసి "భగీరథా! నిర్మలమైన గొప్పతపస్సు చెయ్యందే ఎవ్వరూ ఇక్కడికి రాలేరు. నువ్వు ఎలావచ్చావు?" అని అడిగాడు.

"దేవా!" వినయంగా బ్రహ్మదేవుడికి సమాధానం చెప్పాడు భగీరథుడు, "తీర్థప్రదేశాల్లో ఎన్నో గోదానాలు చేశా న్నేను. భూదానాలు చేశాను. కన్యాదానాలు చేశాను. రాజసూయాలూ, అశ్వమేధాలూ చేశాను. అయితే వాటివల్ల ఇక్కడికి రాగలిగానని కాదు. బ్రాహ్మలు వొకదగ్గిర యజ్ఞకర్మల్లో మగ్నులయి వుండగా గొప్ప గొప్ప విఘాతాలు కలిగాయి. రణసంరంభంతో అవన్నీ తొలిగించా న్నేను. వారిని సంతోషపరిచాను. తృప్తిపడ్డారు మునులు. "బ్రహ్మలోకసౌఖ్యం పొందు" అని నన్ను దీవించారు. అదిగో! దాని వల్లే ఇక్కడికి రాగలిగాను. ఆకలి దప్పులు మానుకుని, బ్రాహ్మల కార్యం నిర్వహించా న్నేను. దానివల్లే ఈమహిమ కలిగింది నాకు. ధర్మప్రభువ్వి నువ్వు, నీకు తెలియంది ఏముంది? నియమాహారం కాక తపస్సంటే వేరే ఏముంది!" అన్నాడు.

భగీరథుడి సమాధానం విన్నాడు బ్రహ్మదేవుడు. అతడికి అర్ఘ్యమిచ్చి, గౌరవించాడు. "రాజా! నియమాహారుడివయి, బ్రాహ్మల్ని భజించు" అన్నాడు.

## ఆచారం ఆయువు పెంచుతుంది

ధర్మరాజు: పురుషుడు శతాయువని శ్రుతి. అయితే బాలులు కూడా మరణిస్తూవుంటారు కదా! ఆయువు చిర మెలా అవుతుంది? అచిరమెలా అవుతుంది?

భీష్ముడు:

నాయనా! ఆచారం ఆయువు పెంచుతుంది. అంతేకాదు – సిరీ, కీర్తీ కలిగిస్తుంది. అనాచారం ఆయువు తరిగిస్తుంది. అనాచారపరుణ్ణి అన్ని భూతాలూ తిరస్కరిస్తాయి. అంచేత ఆచారం మేలైంది. సాధు జనులు నడిచినతోవని నడవడమే ఆచారం. అయితే అది వర్ణాశ్రమా లకి అనుగుణంగా వుండాలి.

గురువుమాట లెక్కచెయ్యక పోడమూ, చెడునడత నడవ డమూ, మట్టి వుండ నలపడమూ, పుడకలు తుంచడమూ, గోళ్ళు కొరకడమూ, ఉదయం సాయంకాలం సూర్యుణ్ణి చూడడమూ–వీటివల్ల ఆయువు తరిగిపోతుంది.

క్రోధంలేకండా వుండడమూ, హింసచెయ్యకండా వుండడమూ, అబద్ధమాడకండా వుండడమూ, సంధ్యల్లో ఉపాసనచెయ్యడమూ, ప్రాతఃకాలాల్లో దేవపూజ చెయ్యడమూ–ఇవి చిరాయువు కలిగిస్తాయి.

పురుషుడన్నవాడు పరస్త్రీతో పోకూడదు. పాపాలన్నిటి లోనూ పరస్త్రీ సంగమపాపం అధికంగా ఆయువు తరిగిస్తుంది. అంచేత పరస్త్రీసంగమం విడిచిపెట్టడం ఎంతయినా మేలు.

పరుల భార్యలతో–అందులోనూ ముఖ్యంగా స్నేహితుల భార్యలతోనూ, బంధువుల భార్యలతోనూ, నాగరకుల భార్యలతోనూ సంగమం చేయడంవల్ల ఆయువు అధికంగా తరిగిపోతుంది.

ధర్మరాజా! నేను చెప్పినవాటిలో ఇవి మేలైన పనులు, ఇవి కీడయిన పనులు అని తెలుసుకోవాలి నువ్వు. తగనిపని ఏదీ చెయ్యకండా

వ్రతం పూనాలి. అందువల్ల ఆయువు పెరుగుతుంది. అనాచారంవల్ల ఆయువు తరుగుతుంది. ఆచారం వల్ల ఆయువు పెరుగుతుంది.

దేవాలయం దగ్గిరా, వీధిలోనూ, ఆలమందలోనూ, రచ్చకొట్టం దగ్గిరా, పంటపైరుల్లోనూ మలవిసర్జన కూడదంటారు ఆచార విధులు తెలిసిన పెద్దలు*

తడి పాదాలతో భోజనం చెయ్యాలి. తూర్పు మొహంగా కూచుని భోజనంచేయడం మంచిది. * నిలబడి తిండి తినకూడదు. నిలబడి వకటికి వెళ్ళకూడదు, పాపం.

ఎంగిలి చేత్తో అగ్గి ముట్టుకోకూడదు; ఆవుని ముట్టుకోకూడదు; బ్రాహ్మణ్ణీ ముట్టుకోకూడదు; సూర్యచంద్రుల్ని చూడకూడదు.

పగిలిన పీటా, పగిలిన కంచుపాత్రా ఉపయోగించకూడదు. వాటిని విసర్జించాలి.

వృద్ధులు ఎదురైనప్పుడు చిన్నవాళ్ళ ప్రాణాలు ఎగిరిపోవాలని చూస్తాయి. ఎదురులేచి నమస్కారంచేస్తే తిరిగి కుదుటబడతాయి.

వేదం చదువుతున్నప్పుడు తల ముట్టుకోడమూ, అశుచిగా నిద్రపోడమూ నింద్యమైన పనులు. తల రెండుచేతులతోనూ గోక్కో కూడదు. రెండు చేతులతోనూ నూనె వొంటికి పూసుకోకూడదు.

గురువుతో నిర్బంధమూ, విరోధమూ కూడదు. గురువు కోపించినా అతణ్ణి అనుసరించి, శాంతింపచెయ్యడం మంచిది. గురువును నిందించినా అతని విషయంలో అబద్ధమాడినా ఆయువు తరిగిపోతుంది.

ఎదురుగా వచ్చిన బ్రాహ్మడికి దారిచ్చి తప్పుకోవాలి. అలాగే

---

*శ్లో. నమూత్రం పథి కుర్వీత న భస్మని న గోవ్రజే
దారిలోనూ, బూడిదలోనూ, ఆలమందలోనూ మూత్రవిసర్జన కూడదు.
మనుస్మృతి. అ. 4. శ్లో. 45

ఆవుకీ, రాజుకీ, వృద్ధుడికీ, దుర్బలుడికీ, బరువు మోస్తున్నవాడికీ, గర్భిణీస్త్రీకీ దారి ఇవ్వాలి.

దారిని వెళుతున్నప్పుడు మన్నించదగిన మంచి బ్రాహ్మడు ఎదురుపడితే అతడికీ, మంగళప్రదమయిన ఉత్సవాలకీ, ఉత్తమమైన వృక్షాలకీ ప్రదక్షిణంచేసి మరీ ముందుకుపోవాలి.

పున్నమనాడూ, అమావాస్యనాడూ, చతుర్దశినాడూ, జన్మ తిథినాడూ, అష్టమినాడూ, ద్వాదశినాడూ బ్రహ్మచర్యం పాటించాలి; స్త్రీసంగమం కూడదు.

పాదాలు వొకదాంతో వొకటి తోమకూడదు.

చాడీలు చెప్పడమూ, క్రూరంగా మాట్లాడడమూ దోషాలు.

అంగహీనుణ్ణీ, విద్యలేనివాణ్ణీ, దరిద్రుణ్ణీ రూపంలేనివాణ్ణీ తిరస్కరించకూడదు. అది పాపమంటారు పెద్దలు.

వేదం నిందించడమూ, దేవతల్ని నిందించడమూ కూడదు.

డబ్బుకోసం జోస్యంచెప్పడం పాపం.

దంతధావనంచేసినప్పుడూ, మలమూత్రాలు విసర్జించినప్పుడూ మాట్లాడకూడదు.

ఉదయమూ, సాయంకాలమూ నిద్రపోకూడదు.

తెల్లవారగానే తండ్రికి నమస్కారంచెయ్యాలి. తరవాత వరసగా గురువులకీ, బ్రాహ్మలకీ మొక్కాలి. వీరికి మొక్కకండా, దేవతార్చనచెయ్యకండా ముందు ఇతర్లదగ్గిరికి వెళ్ళకూడదు.

కడుపుతోవున్న ఆడదాంతో సంగమంచెయ్యకూడదు.

---

* శ్లో. ఆర్ద్రపాదస్తు భుంజీత నార్ద్రపాదస్తు సంవిశేత్,
ఆర్ద్రపాదస్తు భుంజానో దీర్ఘమాయురవాప్నుయాత్.

తడికాళ్ళతో భోజనం చెయ్యాలి. తడికాళ్ళతో పడుకో కూడదు. తడి కాళ్ళతో భోజనందుచేసినవా దీర్ఘాయుస్సు పొందుతాడు—మనుస్మృతి. అ. 4. శ్లో. 76.

పెళ్ళికాకండా సంభోగసుఖం అనుభవిస్తే అవకీర్ణ అంటారు. ప్రాయశ్చిత్తంచేసుకుంటే అవకీర్ణపాపం అంతరిస్తుంది.

ఉత్తరంవేపూ, పడమటివేపూ తలపెట్టుకుని నిద్రపోకూడదు. చినిగినపక్కమీదా నిద్రపోకూడదు.

పువ్వులలో తెల్లటివీ, పసుప్పచ్చటివీ ముడుచుకోదగినవి. రాత్రి స్నానంచెయ్యడం పాపం.

శుచిగా స్నానంచేసినవాడయినా స్నానం తరవాత వొళ్ళు తుడుచుకుంటేమాత్రం శుచిత్వం పోగొట్టుకుంటాడు.

తడిగావున్న బట్ట విదిలించకూడదు.

ఇతర్లు కట్టి విడిచిన బట్ట కట్టకూడదు.

మాసిపోయినబట్ట మడత మార్చి కట్టకూడదు.

మర్రిపళ్ళూ, రావిపళ్ళూ, మేడిపళ్ళూ తినకూడదు.

ఆవులమాంసం, మేకలమాంసం, నెమళ్ళమాంసం వర్జించడం మంచిది.

హితంకానిచోట తినకూడదు. ఇతర్లు చూసిన పదార్థాలూ, మూచూసిన పదార్థాలూ, నింద్యమైన పదార్థాలూ తినకూడదు. పరధ్యానంగా భోజనంచెయ్యకూడదు. ఒక్కపాత్రలో కలిసి తిన కూడదు. తిండిని దూషించకూడదు, పాపం.

ఉప్పు చేత్తోపట్టుకు తినకూడదు. రాతిమీదివుప్పు స్వీకరించ కూడదు. రాత్రి పెరుగూ, తేనే కలిపి తినకూడదు. రాత్రిపూట పేలపిండి తినకూడదు.

ఒకరు చూసిన పదార్థం వారికి పెట్టకుండా తినకూడదు. ప్రీతిగా చుట్టాల్ని పంక్తిభోజనానికి పిలిచి, వాళ్ళకి వొకలా పెట్టి, తాను వొకలా తినడం పాపం. అలాటి తిండి విషపుతిండే అవుతుంది.

చిరాయువు కోరుకునేవాడు తాను తినగా మిగిలిన నేయీ,

తేనే, పేలపిండీ, పెరుగూ, పాయసమూ, మంచినీళ్ళూ ఎవ్వరికీ పెట్ట కూడదు.

తర్పణకార్యాల్లో కుడిచేతి వేళ్ళ కొనలతో విడిచేనీరు దేవతీర్థం అనిపించుకుంటుంది. చిటికినవేళ్ళ మొదళ్ళలో విడిచేనీరు ఋషితీర్థం అనిపించుకుంటుంది. కుడిచేతి బొటనవేలికీ, చూపుడువేలికీ మధ్య కుడివేపు బొట్టనవేలు వాలుగా వొంచి విడిచిపెట్టే నీరు పైతృకతీర్థం అనిపించుకుంటుంది. తర్పణమంతా ఆచమనపూర్వకంగా చెయ్యాలి. తర్పణంచేసినప్పుడు పరుషంగా మాట్లాడకూడదు. క్రోధం కూడదు. వాటివల్ల పాపం కలుగుతుందటారు ఆచారవిధి తెలిసిన పెద్దలు.

పగలు సంభోగం కూడదు. చెడిపకన్యతో సంభోగం కూడదు. పతితురాలిని, ముట్టయినదాన్ని, దిసమొలతోవున్నదాన్ని చూడ కూడదు.

ఉమ్మివేసినప్పుడూ, సంధ్యవార్చకుండా వుండినప్పుడూ, తుమ్మి నప్పుడూ ఆచమనంచేసుకుందికి వీల్లేకపోతే సూర్యుడివేపుచూస్తూ, ఓంకారం ఉచ్చరించి, కుడిచెవి ముట్టుకుంటే చాలు శుచిత్వం కలుగు తుం దంటారు పండితులు.

పేదరికంవచ్చిన అక్కచెల్లెల్నీ, గురువునీ, స్నేహితుణ్ణే, తన వంశంలోనివాణ్ణి తెచ్చి ఇంట్లోపెట్టుకుని, ప్రేమతో పోషిస్తే ఆయువు పెరుగుతుంది; సిరిసంపదలు వృద్ధిపొందుతాయి.

పావురాలూ, చిలకలూ, మైనగోరలూ, పూలతీగలూ, వెండి బంగారాల పరికరాలూ ఇంటికి మంగళప్రదాలు. అలంకరణాలుగా వుండీ, శుభంకలిగిస్తాయవి.

గువ్వ, గద్ద, దీపం ఆరిపే పురుగు, గుడ్లగూబ – ఇవి ఇంట్లో చొరబడితే శాంతిచెయ్యించాలి.

సంధ్యల్లో చదవకూడదు; తిండితినకూడదు.

రాత్రిళ్ళు పితృకార్యంచెయ్యడం పాపం.

పురుషుడు కులమూ, రూపమూ, శీలమూ కల కన్యని వరించాలి. ఆమెకి కలిగినసంతానానికి దైవ పితృక్రియలతో తగిన విధంగా శుభకార్యాలు సాగించాలి.

తూర్పువేపు, లేదా ఉత్తరంవేపు మొహంచేసి కూచుని, జోశ్యులుచెప్పిన తిథివార నక్షత్రాలలో మంగలిపనీ, అభ్యంజనమూ చేసుకోడం మంచిది.

మరణించినవారి విషయంలో పన్నెండోనాడుచేసే శ్రాద్ధకర్మ నాడూ, ఏకోద్దిష్టశ్రాద్ధంనాడూ భోజనంచెయ్యకూడదు.

పిలవకండా విందు భోజనానికి వెళ్ళకూడదు.

కొంటెతనం చూపకండా అన్నిపనులూ సులువుగా పూర్తి చెయ్యాలి. తల్లికీ, తండ్రికీ, సంతానానికీ అన్నివిధాలా హితమైన మాటలే పలుకుతూవుండాలి.

క్షత్రియుడు గుర్రమూ, ఏనుగూ, రథమూ, ఎక్కడంలో మంచి మంచి మెలుకువలు నేర్చుకోవాలి. రకరకాల ఆయుధాల నైపుణ్యం సంపాదించాలి. యుద్ధంలో మడమతిప్పకండా గుండె నిబ్బరం చేసుకోవాలి. దండనీతికి అవసరమైన శాస్త్రాలూ, గాంధర్వ విద్యా, కామతంత్రాలూ అన్నీ తగినట్లు అలవరుచుకోవాలి. అధ్య యనంలో అందెవేసినచెయ్యి కావాలి. ధర్మం తెలిసినవాడు కావాలి. అదిగో అప్పుడు ప్రజారక్షణా, యజ్ఞనిర్వహణా సాగించాలి.

వర్ణాశ్రమధర్మాలు ఇక్కడ చెప్పడానికి పూనడంలేదు నేను. అయినా ఈపనులు ఆయుర్వృద్ధికరమైనవని మునులు చెప్పడంచేత చెప్పవలసివచ్చింది.

ముట్టయిన ఆడదాన్ని ముట్టడం పాపం. నాలుగోనాడు స్నానంచేసి పరిశుద్ధురాలయినదాన్ని పొందవచ్చునంటారు కొందరు

పెద్దలు* అయిదోనాడు ఆమెని కలిస్తే ఆడపిల్ల పుడుతుంది. ఆరోనాడు కలిస్తే కుమారుడు పుడతాడు. సమదినాల్లో (నాలుగు, ఆరు, ఎనిమిది, పది, పన్నెండు, పద్నాలుగు, పదహారు) సంగమం చేస్తే మగబిడ్డ పుడతాడు. బేసిదినాల్లో (అయిదు, ఏడు, తొమ్మిది, పదకుండు, పదమూడు, పదిహేను) సంగమంచేస్తే ఆడపిల్ల పుడుతుంది. ఇలా పదహారు దినాలదాకా అన్నిదినాలు ఎన్నిపనులున్నా సరే, రుతువువేడి తగ్గిపోకండా రుతుమతి అయిన ఆడదాంతో పొత్తు కూడితే ఆయువు అధికమవుతుంది.

ఆచారం అవశ్యం నడపాలి. ఆచారమే ధర్మానికి మూలం. ధర్మం ఆయువు వృద్ధిచేస్తుంది. సిరీ, కీర్తి అధికం చేస్తుంది. ఆచారాలన్నిటిలోనూ అన్నిభూతాలనీ దయతో చూడడం అధికమంటారు ఆది మునులు. అంచేత అన్నివార్ణాలవాళ్ళకీ, దయకలిగి వుండడమే గొప్పగుణం.

ధర్మరాజా! ఇప్పుడు నీకు చెప్పింది ఆచారాధ్యాయం. ఇది భక్తితో చదివినా, విన్నా ఆయువు అధికమవుతుంది. సిరి సంపదలు సిద్ధిస్తాయి. యశస్సు కలుగుతుంది, పాపాలు పోతాయి.

## అన్నదమ్ములు ఎలా నడుచుకోవాలి

ధర్మరాజు :

అన్నదమ్ములు తమలో తాము ఎలా నడుచుకోవాలి?

భీష్ముడు:

---

* నాల్నాళ్ళు గడిచిన నారీశిరోమణి...
కలిసినప్పటి సౌఖ్యంబు కొలదిచెప్ప
నించు విల్తుండు నింద్రుండు నెరుగలేరు. రతిరహస్యం అ. ౧

విను. తమ్ముళ్లు భయభక్తులతో అన్నని ఆరాధించాలి. అన్న, తమ్ముళ్లని ప్రేమతో పోషించాలి. అదిగో అప్పుడే ఆ అన్నదమ్ములు సిరీ, సంపదలూ కలిగి వృద్ధి పొందుతారు. తమ్ముళ్లలో వొకడు మూఢుడైతే అతడే చెడతాడు. కాని అన్నకి కార్యజ్ఞానం లేకపోతే మాత్రం తమ్ముళ్లందరూ చిక్కులుపడతారు. అన్నదమ్ములందరూ తమ సంపద సంతోషంతో పంచుకుంటింటే లోకం మెచ్చుకుంటుంది. సౌభాగ్యం పెరుగుతుంది. అలా కాకండా ఆసపోతులయి, ధర్మం తప్పితే ప్రాణాలమీదికి వస్తుంది. ఇది మనం స్వయంగా అనుభవించిన విషయం; జగమెరిగిన సంగతి.

తండ్రి తరవాత అన్నే తండ్రి తమ్ముళ్లకి. తల్లి తరవాత అన్న భార్యే తల్లి. అన్న అయినా, తమ్ముడైనా అన్నదమ్ముల్ని అన్యాయంచేసినవాణ్ణి రాజు దండించాలి.

అక్కని తల్లిలా చూసుకోవాలి. పాలుపెట్టిన దాదికూడా తల్లితో సమానమే అంటారు పండితులు.

గురువు అధికుడు. గురువుకంటే తండ్రి పది మడుగులు అధికుడు. తండ్రికంటే తల్లి పదిమడుగులు అధికురాలు. వేదాలు చాటుతున్న విషయం ఇది.

తల్లి దండ్రులవల్ల జరామరణంకల ఈ పుట్టువు కలుగుతుందని శాస్త్రాలు చెబుతున్నాయి. గురువువల్ల కలిగిన పుట్టువుకి (సంస్కారానికి) జరామరణాలు లేవు. దివ్యమైందది. అంచేత అందరికంటే గౌరవంలో అధికుడు గురువు.

## ఉపవాస విధి

ధర్మరాజు :

బ్రాహ్మలూ, క్షత్రియులూ ఉపవాసం చెయ్యవచ్చు, కాని

ఇతరవర్ణాలవారు చెయ్యకూడదని విన్నాను. ఉపవాసవిధికి వుండ వలిసిన యోగ్యత లేమిటి? ఉపవాసంవల్ల కలిగే ఫలవిశేషాలేమిటి?

భీష్ముడు:

నువ్వు నన్ను అడిగినట్టే ఈ ప్రశ్న వెనక నేను అంగిరసుణ్ణి అడిగాను. ఆ మునీశ్వరుడు చెప్పిన విషయం నీకు చెపుతాను, విను.

బ్రాహ్మలూ, క్షత్రియులూ మూడు రాత్రిళ్లు ఉపవాసం చెయ్య వచ్చు. అంతకంటే అధికం మానడం మంచిది. కోమట్లూ, శూద్రులూ నాలుగు పూటలకంటే అధికం ఉపవాస ముండకూడదు. అంతకంటే అధికం ఉపవాసముంటే పాపమే వస్తుంది వాళ్ళకి.

పూర్ణిమా, శుక్లపక్షం అష్టమీ, ఉభయపక్ష చతుర్దసులూ, షష్ఠులూ, పంచమి తిథులూ ఉపవాసముంటే రకరకాల శుభాలు కలుగుతాయంటారు.

బ్రాహ్మడు వో మాసందినాలు వ్రతంపూని నిష్ఠతో వొంటి పూట భోజనంచేస్తే శుభప్రదమైన ఆకారమూ, రూపవంతురాలైన భార్యా, సద్గుణాలూ, కీర్తి ప్రతిష్ఠలూ మొదలైన బహుశుభాలు పొందగలుగుతాడు. మంచికుమాళ్లు కలుగుతారు. ధనధాన్యాలూ, భోగభాగ్యాలూ కలుగుతాయి. ఏడు మార్లు ఈ వ్రతం చేస్తే అఖిల భూలోకసౌఖ్యాలూ, స్వర్గలోక ఆనందాలూ అనుభవిస్తాడు. రెండు, మూడు, నాలుగు - ఈ క్రమంతో వోపినంతవరకూ దినాలు ఎడపెట్టి భోజనంచేస్తూ వొక ఏడాది ధైర్యంతో వ్రతం నడిపితే - హెచ్చించిన దినాలకొద్దీ శుభాలు హెచ్చుతూ వుంటాయి. వైభవమూ, మాహాత్మ్యమూ కూడా హెచ్చుతాయి. ఒక ఏడాదిపాటు పక్షోపవాసాలతో గడిపితే పుణ్యలోకాలన్నీ నివాసభూము లవుతాయి. అలా వోమాసంగడిపితే బ్రహ్మలోకసౌఖ్యంకలుగుతుంది. ఎంతనిష్ఠ కలిగినా మాసంలోపలే ఉపవాసం చెయ్యాలి. అంతకి హెచ్చు

చెయ్యడం పాప మంటారు. అయితే యుగసామర్థ్యంవల్ల పురుషుడి మహానుభావవిశేషంబట్టి ఉపవాసవ్రతం అధికకాలంచేస్తే కీడు చెయ్యకండా ఫలప్రదమే అవుతుంది.

తల్లినీ, వేదాలనీ, ధర్మాలనీ మించిన గొప్ప శాస్త్రలాభాలు లేవు. ఉపవాసవ్రతానికి మించిన తపస్సు లేదు. ఇది మహాత్ముల మతం.

"పావనమైనవాటన్నిటిలోనూ పావనమైనవాడు బ్రాహ్మడు" అంటాయి వేదాలు. అంచేత భక్తిపూర్వకంగా బ్రాహ్మణపూజ చెయ్యాలి.

నాయనా ధర్మరాజా! అప్రసక్తమే అయినా ఇది నువ్వు వినవలిసింది కనక చెప్పాను.

ఉపవాసవ్రతంవల్లే దేవతలూ, ఆదిమునులూ మహానుభావులయారు. వెయ్యిసంవత్సరాలు ఏకభుక్తవ్రతంచేసి, క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణత్వం పొందాడు. కనక ఉపవాసంవల్ల లభించని ఫలాలంటూ లేవు. ఉపవాసవ్రతం మనస్సుకీ శరీరానికీ కూడా పావనమైంది. ఐహిక మహిమా, పరలోక సుఖమూ - రెండూ దీనివల్ల లభిస్తాయి.

ఉత్తమోత్తమమైన ఈ ఉపవాసవ్రతానికి అంగిరసుడు దర్శకుడు. అతడు చెప్పినప్రకారం దర్శకులైన నరులకి ఏవిధమైన దుఃఖాలూ అంటవు.

ఈ ఉపవాసవ్రతం ప్రీతితో చదివినా, విన్నా పాపాలు పోతాయి. మరుజన్మలో తిర్యగ్జంతువుల భాష తెలియగల జ్ఞానం కలుగుతుంది.

## సర్వమానవులూ ఆచరించగలిగిన పుణ్యకర్మ

ధర్మరాజు :

మనిషి యజ్ఞంచెయ్యాలని ఎన్నోమాట్లు చెప్పావు నువ్వు. అయితే ధనధాన్యసంపన్నులైనవారికి తప్ప యజ్ఞంచెయ్యడం సాధ్యం కాదు కదా! అంచేత సర్వమానవులూ ఆచరించగలిగిన పుణ్యకర్మ ఏమిటి ?

భీష్ముడు :

నిజమే, ధనం లేకపోతే యజ్ఞంచెయ్యడం సాధ్యం కాదు. అందుకనే అంగిరసుడు ధనమూ, జనమూ లేనివారికోసం ఉపవాస వ్రతం విధించాడు.

ధర్మరాజా! ఉపవాసాయాసం దుస్సహమైందనీ, యజ్ఞం దుర్ఘట మైందనీ తలిచి నువ్వు ఈ ప్రశ్న వేశావు, నాకు తెలుసు – అయితే, ఉపవాసవ్రతంలోనూ తేలికయిన విధాన ముంది. చెప్తాను, విను.

పగలూ, రాత్రీ భోజనంచేసి, ఆ భోజనమప్పుడే తాగవలిసిన నీరూ అదీ తృప్తిగా తాగి, మధ్య మరేమీ ముట్టుకోకుండా, ఎవ్విధమైన పాపమూ చెయ్యకండా హోమకార్యం సాగిస్తూవుంటే ఊర్ధ్వలోకాలు తంగేటిజున్ను అవుతాయి నరులకి.

ఇది మేలయిన విధానం. దీన్నికూడా కొందరు దుష్కరమనే భావిస్తారు. అలాటివారు అంగీరసుడు చెప్పిన వివిధ ఉపవాసవిధా నాల్లో తమకి అనువైన విధానం అనుసరిస్తారు.

## శివ సనత్కుమార సంవాదం

ధర్మరాజు :

అధ్యాత్మక విద్యాబోధకమైన వాక్యాలు శ్రీకృష్ణుడూ, కృష్ణ ద్వైపాయనుడూ మొదలైన మునీశ్వరులూ వింటూవుండగా ఎన్నో

వివరించావు. నీకు నానమస్కారం. శ్రీకృష్ణుడు వినదగిన విషయాలు నిజంగా మహార్థమైనవి. శ్రీకృష్ణుడి వున్నరూపు తెలుసుకోడం ఎంతో గొప్ప. శ్రీకృష్ణుణ్ణి తెలుసుకుంటే విశ్వంలో వున్న అన్నీ అవగత మవుతాయని ఈవ్యాసమునీంద్రుడు తనని ఆశ్రయించిన వారికి బోధించాడు. కనక అధ్యాత్మకవాక్యాలకి ఈ కృష్ణుడే చేరు గడ. మహామహిమపదు డీయన. కనక అధ్యాత్మకవాక్యాలు వినాలని ఆకాంక్షగా వుందినాకు. అందుచేత ఇంకా అధ్యాత్మకవిద్య వివరించే మాటలు అనుగ్రహించు.

భీష్ముడు:

అయితే విను. శివ సనత్కుమార సంవాదం నీకు వినిపిస్తాను. అది అధ్యాత్మవిద్యాప్రబోధంతో నిండి వుంటుంది.

శివుడు ఏోమారు సనత్కుమారుడి దగ్గిరికి వెళ్ళాడు. తగిన ఆసనమూ అదీ వేసి శివుణ్ణి పూజించాడు సనత్కుమారుడు.

"త్రిలోచనా, మృత్యుమోచనా, ఏంపనిమీద ఇలా వేం చేశావో సెలవియ్యి. శ్రద్ధాపూర్వకంగా నీ ఆదేశం అనుసరిస్తాను" అన్నాడు.

"తమ్ముడూ!" సంతోషంగా అందుకున్నాడు శివుడు, "పుణ్య చరిత్రుడివి నువ్వు. నీతో గోష్ఠి జరపాలని బుద్ధిపుట్టి ఇలా వచ్చాను. చెప్పూ, ధ్యానంలో చూడదగిన వస్తువేది? సమ్మానితమైన తత్త్వాలు ఎన్ని; సాంఖ్యయోగం ఏయే గతులతో సాగుతుంది? ఈ విషయాలు వివరించి, ఇంకా అధ్యాత్మవిశేషాలుకూడా వినిపించు."

"తత్త్వాలు ఇరవై నాలుగు అంటారు కొందరు" అంటూ ఎత్తుకున్నాడు సనత్కుమారుడు, "కొందరు ఇరవైమూడు అని కూడా అనడం కద్దు. 'కాదు, ఇరవై అయిదు' అని కొందరు అంటారు.

"ఇరవైమూడు అనేవారు ప్రాకృతులు. వారి మార్గం సరైందిం

కాదు. మనస్సూ, బుద్ధీ వొక్కటే అంటారు వారు. అది అలా వుండనీ.

"ఇరవై నాలుగు అనేవారు మనస్సు వేరు, బుద్ధి వేరు అని నాకు మల్లేనే భావిస్తారు.

"ఇరవై నాలుగు తత్వాలు వివరిస్తాను, విను.

"భూతాలు అయిదు. వాటి గుణాలు అయిదు. ఇంద్రియాలు పది. మనస్సు వొకటి. బుద్ధి వొకటి. అహంకారం వొకటి. ప్రకృతి వొకటి. మొత్తం ఇరవైనాలుగు తత్వాలు.

ఈ ఇరవైనాలుగు తత్వాల్నీ అధిష్టించివుండే తత్వం నిర్దేశిస్తాను. ఈతత్వం దేహమే అని పండితుడు ఊహిస్తాడు. సోహమ్ (అతడే నేను) అనే చూపే అతణ్ణి చూడడ మవుతుంది. నిష్ఠాపూర్వకమైన తపస్సు చేసే వా రయినా ఈర్ష్యావంతులైన వారికి ఈవిధంగా, అంటే ఇరవైనాలుగు తత్వాలకు అధిష్ఠానం దేహమే అని ఊహించిన పండితులలా నిలవడం సాధ్యం కాదు. ఏమంటే గార్హస్థ్యమార్గంలో పడి రకరకాల ప్రవర్తిస్తారు వారు.

"పురుషుణ్ణి అమృతార్థతత్వం అనీ, బ్రహ్మం అనీ శ్రుతి నిర్దేశిస్తుంది. అన్ని తత్వాల్లోకీ అమృతార్థతత్వం గొప్పది; అతి రహస్యమైంది. దాన్ని తెలుసుకుంటే మృత్యువువలలో చిక్కకండా తప్పించుకోవచ్చు.

"అనులోమంలో పుట్టడమూ, ప్రతిలోమంలో నాశనం కావడమూ జరుగుతుంది. తత్వాలన్నిటికీ ఇది సహజం. బ్రహ్మంలో కలియడమే ఏకత్వం.

"ఉత్తమమైన శ్రద్ధ లేకపోయినవాడికీ, చిత్తానికి ఏకాగ్రత కుదరనివాడికీ, ఇంద్రియాలు జయించనివాడికీ, వేదం చదవనివాడికీ ఈజ్ఞానం ఉపదేశించకూడదు."

ఇలా చెప్పి, తరవాత అధ్యాత్మ, అధిభూత, అధిదైవతాలు

వివరించి వినిపించాడు సనత్కుమారుడు. అదంతా వెనక సనత్కుమారుడు నారదమునికి చెప్పింది నీకు నేను చెప్పనే చెప్పాను. సనత్కుమారుడు శివుడితో ఇంకా ఇలా చెప్పాడు:

"అధ్యాత్మము మొదలైనవి అన్ని జంతువులకూ కలుగుతాయి. ఇలా తెలుసుకోడమే తెలివిడి. దానికి వ్యతిరేకమైంది తెలివిడి కాదు.

"అధ్యాత్మప్రభృతులు దేవతలూ, దానవులూ, గంధర్వులూ కూడా కానగలిగారా ముందు? బ్రహ్మాండంలో నిజం కనుక్కోడం సాధ్యమా? నిజానికి ఈ తెలివిడి అంత సులభమైంది కాదు.

"ఓంకారవాచ్యం అది. అహంకారం లేంది అది. పాపరహితమైంది అది. అశీతమైంది అది. అనుష్ణమైంది అది. అన్నిటికీ శుభకరమైంది. అప్రమేయమైంది. తెలియరాంది. లేంది అది. తిన్ననైంది అది. నిర్మలమైంది. తరుగులేంది. తెల్లతామరవంటి నేత్రం కలది అది. అర్ధంకాంది అది. చ్యుతం కాంది అది. సత్తు అసత్తులకు పరిమితమైంది అది. ఏకంగా వెలిగేది అది.

"ఆదినారాయణుడొక్కడికే తెలుసు నది. అతనివల్ల దేవతలూ, మునీశ్వర్లూ, సిద్ధులూ, సాధ్యులూ మొదలైనవారు తెలుసుకున్నారు. అయినా ఈతత్వం చూడాలంటే సాధ్యపడదు; కనపడదు.

ఏముంటావా? బంధముక్తుడు కదా, చూసినవాడు! ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ, అహంకారమూ - ఈబంధాలు వొదిలిన జీవుడు పరతత్వంలో లీనమవుతాడు. కనక దాన్ని ప్రబోధంగా చూపినవాడు ఎవడు చెప్పూ?

## దేహంలో వర్తించే దేవతలు

"దేహంలో వర్తించే దేవతల్ని వివరిస్తాను, విను.

"నాలికలో చంద్రుడుంటాడు. వాక్కులో అగ్నిహోత్రుడుంటాడు. ప్రాణంలో వాయువుంటాడు. ఉదానం (గొంతుకలోని

వూపిరి) లో నూరు మడుగులు వుంటాయి. దేహంలోని వాయువులో స్తనాలగుండా వర్షమూ, ఆకాశమూ వుంటాయి. బలంలో కౌశికు డుంటాడు. మనసులో ఈశాను డుంటాడు. అపానంలో మిత్రు డుంటాడు. సమానం (నాభిలోని గాలి) లో అప్సరస లుంటారు. కళ్ళలో సూర్యు డుంటాడు. శరీరంలో భూమి వుంటుంది. పాదాలలో శేషు డుంటాడు. చెవులలో దిక్కు లుంటాయి. ఉపస్థలో ప్రజాపతి వుంటాడు. బుద్ధిలో బ్రహ్మదేవు డుంటాడు. బుద్ధిలో తెలియదగినవా డయి వెలుగే ఆత్ముడు శరీరమంతటా వుంటాడు. అదిగో అతడే ప్రబుద్ధుడు.

"ఈ దైవతా లన్నిటినీ ఆదరంగా చూస్తూ చలించని నిష్ఠతో యోగి బ్రహ్మకపాలంలో ప్రాణాలు నిలుపుతాడు. అలా ఆత్మని చూసే ఆ పరతత్వాన్నే అవ్యక్తం అంటారు. దానిని చూసే ప్రబుద్ధుడు అబుద్ధుణ్ణీ, అబుద్ధుడు ప్రబుద్ధుణ్ణీ ఎరుగుదురు.

"ఇవి ఆత్మ దశలు. అతడు (ఆత్ముడు) వొక్కడే.

"ఈవిధంగా చూసే యోగికి ఎవరూ సరికారు. అనేకమంది యతులు నిశ్చలంగా వుండి ఆవస్తువు కోరుతారు. అయితే యోగు లకి తప్ప తక్కినవారికి అంద దది.

"ఆత్మదశను క్షరుడని, అక్షరుడని, పరుడని అంటారు. ఇరవై అయిదోవాడు ప్రబుద్ధు డనేవాడు. అతడు అబుద్ధుణ్ణి చూస్తాడు. పురుషుడివిధమూ, ప్రకృతి సంగమూ తెలుసుకుంటాడు.

"ఇరవైఆరు తత్వాలూ అయినవాడు అబుద్ధు డనేవాడు. మాటకీ, మనస్సుకీ అందకండా తనంత తాను ఆతత్వం చూసే ప్రబుద్ధు డతడు.

"ప్రకృతిని వేరుగా చూస్తే తన జ్ఞానం జారవిడిచినట్టే

అవుతుంది. అంచేత జ్ఞానం పరిత్యజించాలి. తనకంటే వేరే వొకటి పుట్టడంలేదని తెలుసుకోవాలి.

## యోగం

"తత్వంలో వుండిన మూడు అవస్థలూ నీ సన్నిధిని వివరించడమూ, నువ్వు తెలుసుకోడమూ యోగులందరూ తెలుసుకున్నట్టు అయింది నాకు. ఇక మునిజనుల కృత్యాలు వివరిస్తాను, చిత్తగించు.

"ముని అయినవాడు అడివిలోనో, శూన్యాలయంలోనో, కొండగుహాలోనో నివసించాలి. ఆసనబద్ధుడు కావాలి. ధీరుడు కావాలి. మనస్సు అదుపులో పెట్టుకోవాలి. ఇంద్రియాలు జయించాలి. గురువు ఉపదేశించిన అభ్యాసంతో మలమూత్రాల వేగం అరికట్టుకోవాలి. ఆకలి గెలవాలి. రుచులకు లోబడకూడదు. మితిమీరి తినకూడదు.

"భోజనమప్పుడు యోగం కూడదు. మనస్సు చలించకండా కుదించుకోవాలి. అందుకని బుద్ధితో ఎక్కువ నిష్ఠ పూనాలి. మనస్సు కుదుటపడితే గాలిలేని దీపంలా విజ్ఞానం ప్రకాశిస్తుంది. మనస్సు రాయిలా చలనంలేకండా నిలవాలి. దాంతో నిర్జనమూ, నిశ్చలమూ అయినచోట హృదయంలో వున్న దేవుణ్ణే చూడడానికి పూనుకోవాలి. అలా నిశ్శబ్దమైన స్థలం కానప్పుడు అది సజ్జను లుండే చోటు కావాలి అంటారు పెద్దలు. ఇన్నీ సమకూడిన యోగి చీకటీ వెలుగూ, చేతనమూ అచేతనమూ, అమృతమయమూ అయిన తత్వం దర్శిస్తాడు.

"యక్షులూ, గంధర్వులూ, సిద్ధులూ, సాధ్యులూ - వీరందరికంటె మిగిలి యోగులు నిజేచ్ఛతో సంచరిస్తారు. యోగతత్పరులమైన మేము ఇలా వుండడం నీకు తెలిసిందే" అంటూ తన అన్నదమ్ములయిన సనక సనందన సనత్సుజాతుల్ని తలపించి ఇంకా ఇలా చెప్పాడు సనత్కుమారుడు :

"యోగధర్మంకంటే ఉత్తమమైన ధర్మం మరొకటి లేదు. తిరిగి పుట్టుక లేకుండావుండే పరమపదం ఎక్కడానికి యోగధర్మమే మేటి నిచ్చెన యోగులకి.

"యోగవిధానం చెప్పాను. ఇక సాంఖ్యం చెప్తాను, ఆదరంగా ఆలకించు. నిష్ఠతో సాంఖ్యం అనుసరించినవారు భవసముద్రం గడిచిపోతారు.

## సాంఖ్యం

"ఇంద్రియాలకంటే మనస్సు ఎక్కువ. మనస్సుకంటే అహంకారతత్వం ఎక్కువ. అహంకారతత్వం కంటె బుద్ధి ఎక్కువ. బుద్ధికంటే ప్రకృతి ఎక్కువ. ప్రకృతికంటే పురుషుడు ఎక్కువ.

"ఆకాశం మొదలైన భూతాలూ, శబ్దం మొదలైన గుణాలూ, రెండురకాల ఇంద్రియాలూ, మనస్సూ, అహంకారమూ, బుద్ధీ, ప్రకృతీ - ఇలా ఇరవైనాలుగు తత్వాలు.

"చేతనుడైన పురుషుణ్ణి నిశ్చేతనమైన ప్రకృతి పొంది చేతనం కల దవుతుంది. ఇతర తత్వాలన్నీ ఈ తత్వసముద్రంలోని తరగలు.

"పురుషుడికి గుణాలు అంటవు. ప్రకృతివల్ల కలిగిన గుణాలు అసత్యమైనవని తెలుసుకుని, ప్రకృతిని ఉపేక్షించి, తనకు తానే కాని మరేదీ లేదని తెలుసుకున్నప్పుడు పురుషుడు పొగలేని అగ్నిలాగ వెలుగుతాడు. అలాకాక, అహంకారం ఆవరించి, తానే ప్రకృతి అని, సృష్టికీ ప్రళయానికీ తానే కర్త అయితే అప్పుడు ప్రకృతీ వికృతీ కాని ఆ పురుషుణ్ణి వికారాత్మకత్వం పొందుతుంది.

"ధైర్యం పూనకపోడంచేత ప్రకృతికి లొంగిపోతాడు పురుషుడు. తమోమయమైన అసుఖమే సుఖమని భ్రాంతిపడతాడు. ఆ అసుఖమే అనుభవిస్తాడు.

"నేరుపుతో ప్రకృతిని ఉపేక్షిస్తే ఇరవై అయిదు తత్వాలూ తానే అయినవాడు నిర్మలమైన నైపుణ్యంతో ప్రసన్నాత్మకుడై ఇరవై ఆరు తత్వాల భావశుద్ధి పొందుతాడు.

"సత్వం ఆశ్రయించీ, తత్వం ఆశ్రయించీ, సత్వ తత్వాల విభేదం పూర్తిగా పరిశీలిస్తాడతడు; తెలివి పొందుతాడు; గెలుపూ పొందుతాడు.

"అజ్ఞానంవల్ల భిన్నత్వం పుడుతుంది. జ్ఞానంవల్ల ఏకత్వం పుడుతుంది. అజ్ఞానంవల్ల పుట్టినదాన్ని అవిద్య అంటారు పండితులు. జ్ఞానంవల్ల పుట్టినదాన్ని విద్య అంటారు. ఇవి ఇరవై అయిదు తత్వాలలోని అవస్థలు.

"ఇరవై ఆరు తత్వాలూ అయినవాడు విద్యావిద్య విభేదం లేనివాడు; అజరుడు; ఆద్యుడు; అనంతుడు; అచ్యుతుడు. ఎప్పటికప్పుడు కొత్త దేహం కలవాడతడు; ఆదిలేనివాడు; కేవలాత్ముడు.

"సాంఖ్యయోగశుద్ధి పొందిన మనస్సు కలవారికి అరిష్టపరిజ్ఞాన బుద్ధి అవసరం. అరిష్టాలు వివరిస్తాను, అవన్నీ విను.

"పరాశరమునీంద్రుడు తన శిష్యులకి ఉపదేశించినంతవరకు నువ్వు విన్నావు.

ఇలా చెప్పి సనత్కుమారుడు శివుడితో ఇంకా ఈవిధంగా చెప్పాడు:

"అరిష్టాలు చూసి యోగిజనం సర్వాంగధారణసహితమూ, పరమహితమూ అయిన ఒక్కపదార్థమే అనేకపదార్థాలు అయిందని గ్రహిస్తారు. అందువల్ల మృత్యువుని జయిస్తారు.

నీటిలో చేపలూ, బొడ్డపండులో దోమలూ వున్నట్టు ప్రకృతిలో మనిషి ఇమిడి వుండడం తెలుసుకుని, భేదం తెలుసుకున్నవాడు అవ్యయమైనస్థితి పొందుతాడు.

"తామరాకుమీద నీటిలాగ ప్రకృతిలో వుండి దాని సంబంధ వికారం లేని తనని చూసి జీవి అనేవాడు నిర్లేపమైన, నిశ్చలమైన, అజరామరమైన పదవిలో వెలుగుతూ వుంటాడు.

"ప్రకృతికి ఎడమై ఇరవై అయిదు తత్వాలూ అయినవాడు ఇరవై ఆరు తత్వాల భావం పొంది, నిర్మలమైన, మంగళమైన నిరంజన స్వరూపుడయి ప్రకాశిస్తాడు. అదిగో దాన్నే ముక్తి అంటారు.

"ఈజ్ఞానం కాపిలం. కపిల దేవుడు నాగురువు. ఆయనశిక్షణలో ఎంతోమంది శిష్యులు దృఢనిశ్చయంతో జ్ఞానవంతు లయారు. నేనున్నూ ఎంతోమంది శిష్యులకి ఈ విజ్ఞానం ఉపదేశించాను. దివ్య మునులు మన్నించిం దిది. గార్గ్యుడూ, గౌతముడూ, కాత్యాయనుడూ మొదలైనవారు దీనివల్లే జ్ఞానవంతు లయారు; మృత్యువుని జయించి అమరులయారు.

"ఇంతెందుకూ? సాంగత్యమే బంధం. నిస్సంగత్వమే మోక్షం."

శివుడితో ఇలా చెప్పి ఆకాశమార్గాన తనదారిని తాను వెళ్లిపోయాడు సనత్కుమారుడు. శివుడు ధ్యానమగ్నుడయాడు.

## ఉత్తమ తీర్థం

ధర్మరాజు:

అన్నిటికంటే అధికంగా శుచిత్వం కలిగించే ఉత్తమతీర్థమేది?

భీష్ముడు:

తీర్థాలు అన్నీ ఉత్తమమైనవే. అయితే అందులో మనస్సనే తీర్థం సత్యమనిపించుకుంటుంది. గొప్ప శుచిత్వం కలిగిస్తుం దది. మనస్సులో ధైర్యం అనేది మహాహ్రదం. తమస్సూ, రజస్సూ తొలిగించుకుంటూ, సత్యం పూతగా చేసుకుని ఆ మహాహ్రదంలో చొరబడి స్నానంచేసినవాడు శుచిత్వంతో ప్రకాశిస్తాడు.

సరాగం విడిచిపెట్టడమూ, ఇంద్రియాలు పరిహరించడమూ, దృఢవ్రతాలు పూనడమూ మొదలైనవి ఆచరించిన వివేకవంతులే నిజమైన తీర్థాలు.

దమమూ, తపమూ, అహింసా, శమమూ - ఇవన్నీ తీర్థాలే. వీటివల్లే అధికమైన శుచిత్వం కలుగుతుంది. అంతేకాని, వుత్తినీళ్ళలో మునిగితే శుచిత్వం కలుగుతుందా?

## మనిషి ధర్మపరుడు కావాలి

ధర్మరాజు :

ఎలా నడుచుకుంటే ఉత్తమపదవి లభిస్తుంది? మరణించిన వాడు శరీరం వొదిలిపెట్టి దేనిసహాయంతో వెళతాడు?

భీష్ముడు :

నాయనా, నువ్వు అడిగిన విషయం నిగూఢమైంది. ఈప్రశ్నకి దేవేంద్రుడి గురువు బృహస్పతి తప్ప మరొకడు సమాధానం చెప్పడం కష్టం. ఇదిగో ఇప్పుడే ఆయన ఇక్కడికి వేంచేస్తాడు. ఆయన్నే అడుగు నీ ప్రశ్నలు.

భీష్ముడి నోట్లోమాట నోట్లోనే వుంది. బృహస్పతి అక్కడికి దయచేశాడు. ధర్మరాజూ, తమ్ముళ్ళూ, మిగిలిన రాజులూ, శ్రీకృష్ణుడూ వున్నపాళాన లేచారు. భక్తిపూర్వకంగా ఎదురు వెళ్ళారు. ప్రణామాలు చేశారు. తగిన ఉపచారాలుచేసి, సంతోష పెట్టారు. ఆసనమిచ్చారు. ఆయన సుఖంగా కూచున్నాక, ధర్మరాజు భీష్మపితామహుణ్ణి అడిగిన ప్రశ్న వినయంగా ఆయన నడిగాడు.

"రాజా!" ధర్మరాజు అడిగినదానికి సమాధానం చెపుతూ అందుకున్నాడు బృహస్పతి, "పుట్టినప్పుడూ, చచ్చినప్పుడూ, స్వర్గంలోనూ, నరకంలోనూ వొక్కడే వుంటాడు ప్రాణి. తల్లీ, తండ్రీ

బంధువులూ అనిపించుకునే యావన్మందీ తన కళేబరం వెంట స్మశానం దాకా వచ్చి, వెనక్కి మళ్ళిపోతారు.

"ధర్మంవల్ల ఉత్తమపథం లభిస్తుంది. చచ్చినవారికి ధర్మమే సహాయపడుతుంది. ఇంచేత ఎలాఅయినా సరే, బతికివున్నప్పుడే ధర్మక్రియ మనస్సుకి పట్టించుకోవాలి.

"ధర్మక్రియ లేనివాడు నరకానికి వెళతాడు. కనక ధర్మపరుడు కావాలి మనిషి. అదే మంచిది. ఇంక ఏమవుతుతావో అడుగు చెపుతాను."

ధర్మరాజు:

శరీరం విడిచిపోయే జీవుణ్ణి ధర్మం ఎలా అనుసరిస్తుంది?

బృహస్పతి:

పంచభూతాల శక్తులూ, బుద్ధీ ధర్మంతో కూడా జీవుడివెంట వెళతాయి.

ధర్మరాజు:

రేతస్సు ఎలా కలుగుతుంది?

బృహస్పతి:

శరీరంలో వున్న భూమీ, మొదలైన పంచభూతాలూ, మనస్సూ అన్నంతో సంతృప్తి చెందితే రేతస్సు కలుగుతుంది. స్త్రీ పురుషుల సంయోగంవల్ల ఆ రేతస్సు స్త్రీ గర్భంలో పిండరూపం ధరిస్తుంది.

పుణ్యపాపగుణాలతో పుట్టిన నరుడు సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. అయితే ధర్మవర్తనంవల్లే సుఖం కలుగుతుంది. కనక మనిషి ధర్మపరుడు కావాలి.

అధికపాపం చేసిన మనిషి కృమిజన్మా, గాడిదజన్మా ఎత్తి నరకంలో దుఃఖాలు అనుభవిస్తాడు. కనక కర్మవిశేషం చెపుతాను ఆలకించు.

తల్లి దండ్రులకీ, గురువులకీ మేలుచేస్తే కలిగే సుఖమూ, వారికి కీడుచేస్తే కలిగే దుఃఖమూ ఇంతా అంతా అని బ్రహ్మదేవుడు కూడా వర్ణించలేడు.

ఇతర విధాల కలిగిన పాపానికి ప్రాయశ్చిత్తముంది. కాని తల్లిదండ్రులకీ, గురువులకీ కీడు చెయ్యడంవల్ల వచ్చే పాపానికి ప్రాయశ్చిత్తంలేదు. సామాన్యమైన ప్రాయశ్చిత్తాలవల్ల ఆపాపం పోదలదు.

ధాన్యం దొంగిలించిన మనిషి ఎలకజన్మా పందిజన్మా ఎత్తుతాడు. అంతటితోనూ ఆపాపం పోదలక కుక్కఅయి పుడతాడు తరవాత.

పరాయివాడి భార్యతో సంగమం చేసినవాడు తోడేలూ రాంబందూ అయి పుడతాడు. గద్దా, శిలీముఖమూ అయి పుడతాడు. శవాలు తినే జంతువయి పుడతాడు. చివరికి పురుగుజన్మ ఎత్తుతాడు.

కూతుర్ని ఒకడికి దానంచేసి, తిరిగి మనస్సు మళ్ళించుకుని, ఆమెని ఇంకొడికి ఇచ్చినవాడు మరుజన్మలో పురుగయి పుడతాడు.

దేవకార్యం మాత్రంచేసి, పితృకార్యం చెయ్యకండా భోజనం చేసినవాడు కాకి అయి పుడతాడు.

అన్నని తిట్టినవాడు కొంగ అయి పుడతాడు.

బ్రాహ్మణస్త్రీతో సంగమం చేసిన శూద్రుడు నరకం గుమ్మిలో పురుగయి పుడతాడు.

కృతఘ్నుడైనవాణ్ణి యమకింకరులు పట్టుకుపోయి ముక్కముక్కలు కోస్తారు. నిప్పులమీద కాలుస్తారు. వాడి వాడి ముళ్ళమీద వేసి అదుముతారు. ఎన్ని కష్టాలున్నాయో అన్నికష్టాలూ పెడతారు.

ధనాశతో నిరాయుధుణ్ణి చంపినవాడు గాడిద అయి పుడతాడు, ఆయుధాలతో కుళ్ళుపోట్లు తిని చస్తాడు.

ఆడదాన్ని చంపినవాడు ఇరవైవొక్క నరకాలూ అనుభవిస్తాడు.

అన్నమూ, పెరుగూ, పాలూ, నేయీ, పిండీనంటలూ అపహరించినవాడు దోమలూ మొదలైన కీటకాలయి పుడతాడు.

పళ్ళు దొంగిలించినవాడు కోతి అయి పుడతాడు.

ఇనుము దొంగిలించినవాడు మాలకాకి అయి పుడతాడు.

వెండి దొంగిలించినవాడు గువ్వ అయి పుడతాడు.

బంగారం దొంగిలించినవాడు నీచమైన క్రిమి అయి పుడతాడు.

నమ్మి దాచుకున్న ధనం దోచుకున్నవాడు చేపలూ మొదలైన నీచయోనుల్లో పుడతాడు.

వాసనపదార్థాలు దొంగిలించినవాడు చుంచెలక అయి పుడతాడు.

మీద చెప్పిన ఈపాపాలు చేసిన స్త్రీలు ఆయా పాపాలు చేసినవాళ్ళ భార్యలయి పుడతారు.

పాపభీతికలిగి దారితప్పకండా నడిచిన నరులు రెండులోకాల్లోనూ సౌఖ్య మనుభవిస్తారు.

కొన్ని పదార్థాలు అపహరించడంవల్ల కలిగే ఫలం నేను తెలియచేశాను. ఇంక తక్కిన బహువిధపదార్థాలు అపహరించడంవల్ల కలిగే పుట్టువులు శాస్త్రాలవల్ల తెలుసుకుంటావు.

## పాపాలు పోదుల్చుకునేమార్గం

ధర్మరాజు :

పాపాలు పోదుల్చుకునేమార్గం సెలవియ్యి.

బృహస్పతి :

దానాలవల్ల పాపాలు పోదుల్చుకోవచ్చు. పాపాలు పోదుల్చుకునేందుకు దానాలన్నిటిలోకీ అన్నదానం గొప్పదంటారు మునులు.

న్యాయంగా ఆర్జించిన అన్నమే సంతోషపూర్వకంగా ఇందుకోసం వినియోగించాలి. దానివల్ల నాశనంకాని పాపాలు లేనే లేవు.

బిచ్చమెత్తిఅయినా అన్నం తెచ్చి, నిరుపేదలైన బ్రాహ్మల ఆకలి పోగొట్టిన పురుషుడు ఊర్ధ్వలోకాలు పొందుతాడు; అక్కడి వాళ్ళపూజలందుకుని ప్రకాశిస్తాడు.

వేదాలు అధ్యయనంచేసి, అర్థప్రతిపాదనంచేసిన బ్రాహ్మణోత్తముడూ, బ్రాహ్మలకి భూదానం చేసినరాజూ ఏపాపాలయినాపోగొట్టుకుంటారు.

న్యాయమైన వర్తకంచేసి సంపాదించిన ధనంతో అన్నదానం చేసిన కోమటి సద్గతిపొందుతాడు.

చచ్చినంత పాటుపడి సిరి తెచ్చుకుని అన్నదానంచేసిన శూద్రుడు స్వర్గం సంపాదిస్తాడు.

దినమూ సంధ్యా కాకండా ప్రయత్నించి అన్నపానాలు దానం చేసి, తరవాత భోజనంచెయ్యడంకంటే మించిన ధర్మకార్యం నిజంగా మరి లేదంటే నమ్ము.

ధర్మాలన్నిటిలోనూ అన్నదానం ముఖ్యమైందని తెలుసుకో.

ధర్మరాజు :

ధ్యానమూ, ఇంద్రియవృత్తులు నశింపచెయ్యడమూ, అహింసా గురుపూజా, నిత్యానుష్ఠానమూ, తపస్సూ – వీటిలో పరమసేవ్యమైంది ఏది ?

బృహస్పతి :

నువ్వు అన్న ఈ ఆరూ మంచిమార్గాలే. అయితే తక్కిన,

అన్నిటికంటే అహింస పవిత్రమైంది. అంతేకాదు, ఏ ఉత్తమధర్మాన్నయినా అహింసే ప్రకాశించినట్టు చేస్తుంది.

## అహింస

అలా చెప్పి బృహస్పతి స్వర్గనగరానికి వెళ్ళిపోయాడు. అనంతరం ధర్మరాజు తాతగారికి ప్రణామంచేసి మళ్ళీ అడిగాడు :

" దేవతలూ, బ్రాహ్మలూ, మునీశ్వర్లూ - అందరూ అహింసని ప్రశంసిస్తారు. ఈ అహింసవిషయం బాగా తేటపడినట్టు వివరించు. "

మనవఁడి ప్రశ్నవిని పరమానందంతో ఇలా అందుకున్నాడు పితామహుడు భీష్ముడు :

" ఏనుగు అడుగులో తక్కిన జంతువుల అడుగులన్నీ ఇమిడి పోతాయి. అలాగే ధర్మాలన్నీ అహింసలోనే ఇమిడి వుంటాయి. ఇందులో రవంతా సందేహం లేదు. అంతేకాదు, అహింస నాలుగు విధాలు. నాలుగుకాళ్ళ ఆవులా వుంటుందది. అందులో ఒకటి తప్పితే ధర్మవర్తన కుంటువడుతుంది.

"మనస్సులో హింస తలచకూడదు. మాటలో హింస పలకకూడదు. శారీరకంగా హింస చెయ్యకూడదు. మాంసం తినకూడదు. ఈనాలుగూ మానడమే నేను చెప్పిన నాలుగువిధాల అహింస.

"మాంసం రుచిమరగినవాడు దాన్ని మానలేడు. అంచేత మాంసంమీద అపేక్షవొదిలిపెట్టడం అహింసే అవుతుంది."

## మాంసంమానడం మంచిది

ధర్మరాజు :

తండ్రీ! మాంసం పితృదేవతలకి ప్రియమైంది కదా? ముఖ్యంగా మాంసంతో శ్రాద్ధంచెయ్యాలంటారు కదా ! అయితే చంపకండా మాంసం ఎలా వస్తుంది ?

భీష్ముడు :

అశ్వమేధయజ్ఞం చెయ్యడంకంటే మాంసం తినడం మానడం మహనీయకర్మ అంటారు పెద్దలు. విన్నావా, చంపడమూ, చంపమని నియోగించి పంపడమూ పాపాల్లోకల్లా గొప్పపాపాలు. అయితే పితృకార్యాల్లోనూ, యజ్ఞకార్యాల్లోనూ, వేదం చెప్పినప్రకారం చేసిన హింసవల్ల పాపం కలగదు. కేవలం రుచికోసం మాంసం తినడానికి మాత్రం ప్రాణిహింసచెయ్యకూడదు. అది పాపమే అవుతుంది.

"తనని నమిలినవాణ్ణి తాను నములుతుంది మాంసం" అంటున్నాయి శాస్త్రాలు. అంచేత మాంసంతినడం మానెయ్యడం తపస్సుతో సమానమైందని నమ్ము.

మాంసం రుచివంటి రుచి మరొకదానికి లేదు. మాంసం రుచి మరిగినవాడు దాన్ని విడిచిపెడితే అతణ్ణి దేవసమానుడే అంటారు ధర్మం తెలిసినవాళ్ళు.

ప్రాణుల శరీరంలో తప్ప మానులోనూ, రాతిలోనూ వుంటుందా మాంసం! ఆ శరీరాలు నరికినప్పుడు తమ శరీరాలు తాకితే ఎలా ఉంటుంది? ఈసంగతి ఆలోచించవద్దా? కనక తాను అది మానేస్తే హింసలన్నీ మానిపోతాయి కదా?" అని జాలిపడి మాంసం మానేస్తాడు ఉత్తముడు.

మాంసం తినడం మానుకున్నవాడికి ప్రాణుల్ని చంపాలన్న కోరిక నశిస్తుంది. అంచేత అతడికి అన్నిప్రాణులవల్లా అభయం లభిస్తుంది. సందేహం లేదు. లోకహితంకోసం స్వాయంభువమనువు చెప్పిన మాట ఇది. "మాంసం మానడంవల్ల ఆయువూ, సిరిసంపదలూ, రూపమూ - అన్నీ అధికమవుతాయి" అన్నారు మార్కండేయుడూ మొదలైన మహామునులు.

మాంసం కోసేమనిషి రాక్షసుడే అనుకో. వెనక దేవతలు మాంసం మానుకోడంవల్లే రాక్షసభయం లేకండా వుండగలిగారు.

దానం, ధర్మం, తపం, యజ్ఞదీక్ష అనే సత్కర్మలన్నీ అహింసా రూపమైన మహావ్రతమే అంటారు వేదవాక్యాలు అనుసరించిన పెద్దలు.

మాంసం మానెయ్యడమూ వందేళ్ళు దుష్కరమైన తపస్సు చెయ్యడమూ వొకేరకమైన సుకృతాలు అంటారు వేదవివేకం కలవారు.

తపస్సువల్లా, దానంవల్లా బ్రహ్మలోకనివాసం లభించదని కాదు, లభిస్తుంది. కాని మాంసం తినడం మానుకున్న వారికి మాత్రం ఆలోకం సులభంగా లభిసుం దంటారు పెద్దలు.

ఆషాఢం, శ్రావణం, భాద్రపదం, ఆశ్వయుజం - ఈ నాలుగు మాసాలూ మాంసం తినకండా వుంటే ఆయుర్వూ, ఆరోగ్యమూ, బలమూ, యశస్సూ - ఈ నాలుగుఫలాలూ మనిషికి కలుగుతా యంటారు.

సగరుడూ, నలుడూ, దిలీపుడూ, నృగుడూ, భగీరథుడూ మొదలైన రాజులు పై నాలుగు నెలలలోనూ మాంసం మానెయ్యడం వల్లే ఉభయలోకాల్లోనూ గొప్పవాళ్ళయా రంటారు తెలిసినవాళ్ళు.

## మాంసంరుచి మానడంకష్టం

ధర్మరాజు :

మాంసం మానడంలో ఇంతగొప్ప వుందన్నమాట! అయితే యావన్మందీ మాంసం మానేసి, ఇతర పిండివంటలూ, పళ్ళూ తిని బతకరేమీ?

భీష్ముడు :

మాంసం చవి మరిగినవాళ్ళు దాన్ని మానెయ్యడం సాధ్యమా నాయనా? అంతేకాక, మాంసం తినడంవల్ల స్త్రీసంభోగంమీద

ఆసక్తికలవాడికి బలం కలుగుతుంది. దారి నడిచినవాడికి వుల్లాసం కలుగుతుంది. దెబ్బతగిలినవాడికి గాయం శీఘ్రంగా మానిపోతుంది. కృశించినవాడు వేగం కండపుష్టికలవాడు కావచ్చు. పిండివంటలలోనూ పళ్ళలోనూ ఈ విశేషంవుందా మరి ?

మాంసం తిన్న దోషం గొప్పగొప్ప దానాలవల్ల పోతుంది. దేవతలకార్యాలలోనూ, పితృకార్యాల్లోనూ ఉపయోగించిన మాంసం వల్ల పాపం రాదు. యజ్ఞాల్లో పశువుల్ని చంపమని వేదమే నియోగిస్తూవుంది కదా !

అంచేత మాంసం తిన్నా దోషంలేని పట్టులు కూడా లేకపోలేదు. అగస్త్యముని రాజులకి వేట విధించాడు. కేవలం కుతూహలం కోసం కాకండా, కోపంతో కాకండా లోకం రక్షించడంకోసం క్రూర మృగాలు చంపడమూ, తనుచేతి సామర్థ్యంతో సంపాదించిన మాంసం దేవతలకీ, పితరులకీ నివేదించడంకోసం పక్షులూ మృగాలూ చంపడమూ చేసినరాజులు పాపాలు పొందకండా వుండిన విశేషాలు చెపుతాను, విను.

ఇతరమాంసాలతో తన శరీరం పెంచుకుంటూ ననడంకంటే చెడ్డ మరొకటి లేదు. మాంసంతినడం మానడంకంటే మరొకమేలు లేదు ధర్మాల్లో.

మాంసంతిన్న దోషం దానాలవల్ల పోతుందన్నాను. ఇలా అనడంలో భావ మేమిటంటే, తిరిగి మళ్ళీ మాంసం తినవచ్చు నని కాదు. విచారపడి, దోషంపోడంకోసం దానాలుచేశాక, మరి మాంసం తినకూడదు. అదుగో, అప్పుడే దోషం పోతుంది.

ధర్మరాజా ! ఎన్నిధర్మాలైనా దయని మించిన ధర్మం మరొకటి లేదు సుమా !

తనలాగే అన్నిజంతువులకీ ప్రాణభయం వుంటుందని భావించి,

మాంసంతినడం మానుకుని, దయాహృదయులైన వారికి బ్రహ్మలోకం మొదలైన ఉత్తమలోకాలు ఆటపట్లుగా వుంటాయి.

ప్రాణులమీద క్రోధంపూనినవాడిమీద ప్రాణులన్నీ క్రోధం వహిస్తాయి. ప్రాణులకి అభయమిచ్చినవాడికి ప్రాణులన్నీ అభయ మిస్తాయి.

దానమూ, తపమూ, ధర్మమూ, యజ్ఞమూ, శౌచమూ, మంత్రమూ, తంత్రమూ, సత్యమూ - ఇవన్నీ అహింసారూపాలే అంటారు పండితులు. అంచేత అహింసవల్ల కలిగిన కలిమి అన్ని కలుములన్నీ మించి వుంటుంది.

నాయనా, ధర్మరాజా! అహింసాగుణాలు కొద్దిగా చెప్పాను. ధర్మాలన్నిటికంటె గొప్పది అహింసాధర్మం. నిజంగా అహింస మహిమ ఇంతా అంతా అని వివరించడం కష్టం.

ధర్మరాజు :

తండ్రీ, నువ్వు చెపుతూవున్న ధర్మాలు వింటూవుంటే పరమానందంగా వుంది నాకు. నీకిదిగో పదేపదే నమస్కరిస్తున్నాను. అయితే, నాయుద్ధంలో మరణించిన వాళ్ళకి ఏంగతి కలుగుతుందని ఎల్లప్పుడూ జిజ్ఞాస నామనస్సులో వేధిస్తూనే వుంది. బతుకు సుఖమని భావిస్తుంది ప్రాణికోటి. చావు దుఃఖమని భావిస్తుంది. ప్రాణం వొదలడం కష్టం. కనక ఈ విషయం అడుగుతున్నాను.

## కీటకానికి ఉత్తమజన్మ

భీష్ముడు :

బాగానే భావించావు. వేదవ్యాసముని వొక కీటకానికి ఉత్తమజన్మ ప్రసాదించాడు. ఆ కథ చెపుతాను, ఆలకించు. అది వింటే నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధానం నీకే అవగత మవుతుంది.

ఓమారు బండిదారిలో వో కీటకం గబగబా పరిగెడుతూవుంది. ఆదారినే వెళుతూ అది చూశాడు వేదవ్యాసముని. జంతువుల ప్రవర్తనా, వాటి చిత్తవృత్తులూ తెలిసినవా డాయన. అంచేత ఆ కీట కాన్ని పిలిచి, "నువ్వు భయపడుతూ గబగబ పారిపోతున్నావు. ఏమిటి కారణం ?" అని అడిగా డతడు.

"మహాత్మా !" వ్యాసముని ప్రశ్న విని అంది కీటకం, "అదిగో ఉద్ధృతంగా వస్తున్నాయి బళ్ళు. బళ్ళచక్రాల రొదా, ఎడ్లని రొప్పుతూన్న బళ్ళవాళ్ళ గోలా భయం కలిగించాయి నాకు. బతుకు సుఖమూ, చావు దుఃఖమూ కదా ! అంచేత, శరీరం బళ్ళకింద పడి చిదిగిపోతుందన్న కళవిళపాటుతో తప్పించుకుపోయి, బతికిపోదా మని పారిపోతున్నాను. ప్రాణభయం సామాన్యమైందా మునీంద్రా ?"

"అంత మంచిదా నీబతుకు ?" కీటకం చెప్పింది విని అడిగాడు వ్యాసముని, "ఇంద్రియసుఖాలు నీ కీటకజన్మలో లేవు. దుఃఖబహుళ మైన ఈశరీరం ఎందుకూ నీకు ? చావే నీకు సౌఖ్యకారి ఎప్పుడైనా. నువ్వే ఆలోచించి చూడు."

"మునీంద్రా !" మళ్ళీ అంది కీటకం, "కీటకం విషయసుఖాలు అనుభవించలే దన్న మాట వుందా ? తమతమ మార్గాల్లో అన్ని జంతువులూ అనుభవిస్తాయి. అంచేత బతుకు సుఖం. చావే భయ కారణం.

"నువ్వు నామనస్సు కనుక్కోవాలని అడిగావు, కాని నిజానికి నీకు తెలియందా ఇది ? అదలా వుండనీ, నావిషయం విన్నవిస్తాను, చిత్తగించు.

"నేను గతజన్మలో వొక శూద్రుణ్ణి. బాగా ధనముండేది నాకు. ఆచారహీనతా, అతిలోభమూ, అన్యధనాపేక్షా, క్రూరతా, అతివినయమూ మొదలైన దుర్గుణాలన్నిటికీ పుట్టిల్లుగా వుండేవాణ్ణి

నేను. ఇన్ని దుర్గుణాలు నాలో వున్నా మాఅమ్మ అంటే అతిభక్తిగా వుండేది నాకు. ఆమెని ఎప్పుడూ సంతోషపెడుతూ వుండేవాణ్ణి.

ఓనాడు మాయింటికి వో బ్రాహ్మడు అతిథిగా వచ్చాడు. అతణ్ణి పూజించాన్నేను. అదిగో ఆ పుణ్యంవల్ల వెనకటిజన్మ ఈ జన్మలో జ్ఞాపక ముంది నాకు. మంచికర్మ సుఖం కలిగిస్తుందని ఇప్పుడు నాకు తెలిసివచ్చింది. మహాత్మా, మంచిదారి నాకు అనుగ్రహించు విశదంగా."

"నువ్వు చెప్పనక్కరలేదు" కీటకాన్ని ఆదరంగా చూస్తూ అందుకున్నాడు వ్యాసముని, "ఎన్నో అన్ని దుష్కర్మలు చెయ్యడం వల్లే నువ్వు ఈ కీటకజన్మ ఎత్తావని తెలుసుకున్నాన్నేను. నువ్వు చేసిన సత్కర్మలు తెలుసుకుని సంతోషమున్నూ కలిగింది. అందుకనే నీతో మాటలాడాను. నాతపోమహిమతో నీ కీటకత్వం తొలిగిస్తాను. విచారించకు. తపోబలాన్ని మించిన బలం మరొకటి లేదు. మనుష్యజన్మ ఎత్తి మేలుచేయాలన్న బుద్ధి నీకు పుట్టడం మేలయింది. మనుషులు కర్మభూమిలో చేసిన సత్కర్మలవల్ల దేవతలయి పుడతారు. దుష్కర్మలవల్ల కీటకాలయి పుడతారు.

"నువ్వు చేసిన సుకృతంవల్ల పూర్వజన్మ జ్ఞాపకముంది నీకు. నాసందర్శనమూ లభించింది. నీకు ఉన్నతపదవి ప్రసాదించడానికి సంకల్పించాను. మరి భయపడకు. ఆ విధానం చెపుతాను, విను.

"ముందు నీ కీటకజన్మపోతుంది. నువ్వు నీచజన్మఎత్తుతావు. తరవాత శూద్రుడివై పుడతావు. అనంతరం వైశ్యుడివై పుడతావు. తరవాత రాజువై పుడతావు. నీ గతజన్మలు నీకు జ్ఞాపకముంటాయి. ఈవర మిచ్చాన్నీకు. దీనివల్ల ధర్మపరుడివవుతావు" అంటూ అమృత ధారలవంటి చూపులు కీటకం శరీరంమీద పరిపాడు ముని. అదిచూసి అన్నిభూతాలూ వ్యాసమునీంద్రుణ్ణి వేనోళ్ళ కీర్తించాయి.

కీటకం భక్తిభావంతో మునీశ్వరుడికి మొక్కింది. శిరస్సు అతని

పాదాలమీద మోపింది. సంతోషం నిండిన మనస్సుతో ప్రాణం విడిచిపెట్టింది.

అలా దయాహృదయుడైన వ్యాసమునీంద్రుడు కీటకానికి మేలు చేశాడు. దానికి కృతార్థత కలగచేశాడు. అనంతరం స్వేచ్ఛగా తన దారిని తాను వెళ్ళిపోయాడు.

ఆ మహానుభావుడు నిర్దేశించినప్రకారం క్రమంగా జన్మలెత్తుతూ కీటకం ఎన్నో పుణ్యకార్యాలు చేసింది. తుదకి రాజయి పుట్టింది. పూజ్యమైన రాజ్యం సంపాదించింది.

ఆ రాజు ఓనాడు ఏనుగుమీా దెక్కి వ్యాసముని ఆశ్రమానికి బయలుదేరాడు. తానెక్కిన పట్టపుటేనుగు రెండువేపులా ఎన్నో ఏనుగులు నడిచాయి. వెనక గుర్రపుదళం నడిచింది. గొడుగులూ, జెండాలూ కలగాపులగంగా కనిపించాయి. గాయకులూ, వందిమాగధులూ, పాఠకులూ, కలకలంచేస్తూ వెంట వెళ్ళారు. రత్నాలనగలు ధగధగా కాంతులు నలుదిక్కులా చిమ్మాయి. సామంతరాజులూ, కవులూ, పుణ్యస్త్రీలూ ఎంతో వైభవంతో వెంటనడిచారు. అలా సాక్షాత్తూ దేవేంద్రుడిలా వ్యాసాశ్రమానికివెళ్ళాడతను.

ఏనుగు దిగి తన కిరీటం మునిపాదాలకి సోకినట్టు సాగిలబడ్డాడు రాజు. దయతో అతణ్ణి లేవనెత్తి, గుండెల కద్దుకున్నాడు వ్యాసముని. ఎంతో ఆదరించాడు. కుశల మడిగాడు. శిష్యుల్ని నియోగించి రాజుకి తగిన పూజావిధులు జరిగించాడు.

"నాయనా, ఉత్తమపురుషుడివి నువ్వు. ఈ జన్మలో మునీశ్వర్లు కూడా ముక్కుమీాద వేలుపెట్టుకున్నట్లు గొప్ప తపస్సు చెయ్యి. ఆవులకోసమో, బ్రాహ్మలకోసమో ప్రాణం సమర్పించు. లేదా ధర్మ యుద్ధంలో శరీరం విడిచిపెట్టు. దానివల్ల నిష్కల్మషత్వం సిద్ధిస్తుంది. దాంతో బ్రాహ్మణజన్మ లభిస్తుంది." అంటూ శత్రుసంహారుడయిన

ఆ మహారాజుని సగౌరవముగా సాగనంపాడు వ్యాసమునీంద్రుడు. మును లందరూ వ్యాసమునిని వేనోళ్ళా మెచ్చుకున్నారు.

పరమానందం పొందాడు రాజు. భక్తిపూర్వకంగా వ్యాసముని పాదాలముందు సాగిలబడ్డాడు. సెలవు తీసుకుని తన రాజ్యానికి వచ్చేశాడు. ముని ఆదేశించినప్రకారం చేశాడు. మారుజన్మలో నుంచి బ్రాహ్మడయి పుట్టాడు. పుణ్యస్థలాలన్నిటిలోనూ పిండివంటలతోనూ, రకరకాల రత్నాలూ బంగారమూ మొదలైన దానాలతోనూ ఔరా అన్నట్టు ఎన్నో యజ్ఞాలు చేశాడు. ఆ జన్మలోనూ వ్యాసముని దర్శనం చేశాడు. దయాచిత్తంతో అతణ్ణి ఆశీర్వదించి పంపాడు వేదవ్యాసుడు. మంచి కీర్తి సంపాదించాడు బ్రాహ్మడు. వ్రతశీలు డయాడు. పొడి జీవితం పవిత్రంగా వెళ్ళబుచ్చాడు. చివరికి శరీరం వొదిలి స్వర్గానికి వెళ్ళాడు. స్వర్గంలో దేవేంద్రుడితో స్నేహంచేశాడు. తరుగులేని సౌఖ్యసిద్ధి పొందాడు.

అంచేత కురుక్షేత్రంలో జరిగిన అద్భుతమైన ఘోరయుద్ధంలో అలా శరీరాలు విడిచిన రాజులకి అనంతమైన సుఖాలు కలుగుతా యనడంలో అనుమాన మేముంది? సందేహం లేదు నీ బంధువు లందరూ ఊర్ధ్వలోకాలు చేరుకున్నారు. నువ్వేమీ అనుమానించకు.

## దానం

ధర్మరాజు :

విద్యా, తపస్సూ, దానమూ వీటిలో ఏది గొప్పది?

భీష్ముడు :

వ్యాసమైత్రేయుల పుణ్యసంవాదం అని వొక ఇతిహాస ముంది. అది వింటే నీ సందేహం తీరిపోతుంది. చెప్తాను, సావధానంగా విను.

వ్యాసమునీంద్రుడు వోమారు వారణాసీపురం వెళ్ళాడు. అక్కడ ముందే మైత్రేయుడు నివసిస్తున్నాడు. అతడిదగ్గిరికి అప్రకాశంగా

వెళ్ళాడు వ్యాసముని. అతణ్ణి తెలుసుకున్నాడు మైత్రేయుడు. భక్తిపూర్వకంగా నమస్కరించాడు. పూజించాడు. ఉత్కృష్టమైన భోజనం పెట్టి తృప్తిపరచాడు. సంతోషంతో కలకల్లాడుతున్న అతణ్ణి చూసి, "వ్యాస మునీంద్రా! మీలో అధికమైన సంతోషం కనిపించింది. ఏమిటి దీనికి కారణం ?" అని అడిగాడు గౌరవంగా.

"తపస్సూ, విద్యా మొదలైన ధర్మాల్లోకల్లా దానమే గొప్ప దయ్యా." ఆదరంగా అన్నాడు వ్యాసముని, "దానమివ్వతగిన వస్తువులన్నిటిలోనూ అన్నమే గొప్పది. ఏమంటే, ప్రాణమూ, శరీరమూ, బలమూ - అన్నీ అన్నమయమే. అందుకే పండితులు అన్నమే మహనీయమైందని భావిస్తారు.

"తపం మనస్సులోని కల్మషం కడిగేస్తుంది; విద్యకి ఆస్పద మవుతుంది. తపస్సుచేసినవాడు ఉత్తమదానంతో పరిపక్వమైనవిద్యనీ, తపస్సునీ మెచ్చుకుంటాడు. కనక, తపస్సూ, విద్యా దానంవల్లే వర్ధిల్లుతున్నాయి. ఉత్తమవ్రతదీక్షాపరులు భగవంతుణ్ణి దర్శించడానికి దీపం వంటిది విద్య. అయినప్పుడు అన్నదానం అధికసంతోషం కలిగించకండా ఎలావుంటుంది? అతికలుషచిత్తుడయినా మహత్తర మైన దానంవల్ల విశుద్ధభావం పొందుతాడు. సందేహం లేదు."

తపమూ, విద్యా దేవతలు కూడా పూజించదగినవి. వాటికి పోషకమైంది దానం.

## ఆదర్శనారి

ధర్మరాజు :

ఆడంగులవిషయం వినాలనుంది. ఆదర్శనారి ఎలాంటిది ?

భీష్ముడు :

కైకేయీ శాండిలీ సంవాదంలో నువ్వు అడిగినవిషయం వ్యక్త మవుతుంది. చెపుతాను, విను.

కేకయరాజు కూతురు సుమన స్వర్గంలో శాండిలిని చూసి, "భవ్యమైన ఈ దివ్యపదం ఎలా లభించింది నీకు ?" అని అడిగింది.

సుమన ప్రశ్నకి ఇలా సమాధానం చెప్పింది శాండిలి :

"అత్తమామలకి ఎన్నడూ ఎదురాడలేదు నేను. దేవ కార్యమూ, పితృకార్యమూ చెయ్యడంలో బద్ధకించలేదు. ఇల్లు వొదిలి తలవాకిలి ఎన్నడూ ఎరుగను. ఏరగబడి ఎప్పుడూ నవ్వలేదు. పరిశుద్ధ హృదయంతో వోపిక కలిగి బ్రాహ్మలకి భిక్ష పెట్టేదాన్ని. అవసరమైన పనుల్లో వెనకాడలేదు. భర్త ఇంటికి వచ్చేసరికి భక్తితోనూ, సంతోషం తోనూ ఆసనం వేసేదాన్ని, పాద్యం స్వయంగా ఇచ్చేదాన్ని. సుముఖ భావంతో సేవచేసేదాన్ని. తిట్టినా, చెడ్డపనులు చేసినా చూసి, బిడ్డల్ని శిక్షించడం మానేదాన్ని కాదు. నాకు వేరే ప్రియం అని ఏదీ వుండేదికాదు. భర్త మెచ్చుకునే వంటకాలు చవిగా వండిపెట్టే దాన్ని. భర్త పొరుగూరు వెళితే, వెళ్ళినప్పటినించి తిరిగివచ్చేదాకా పువ్వులు ముడుచుకునేదాన్ని కాదు. గంధం మొదలైనవి పూసుకునే దాన్ని కాదు. మంచిచీరెలు కట్టుకునేదాన్ని కాదు. నగలు పెట్టుకునే దాన్ని కాదు. హెచ్చురుచికరమైన వంటకాలు వండేదాన్ని కాదు. బంధువులకు ఎప్పుడూ ప్రీతికలిగించేదాన్ని. వారికి ధాన్యమూ, అన్నమూ ఇచ్చి తృప్తికలిగించేదాన్ని. ఆవులూ మొదలైన ఇంటి పశువుల సేవచేసి, వాటిని సుఖపెట్టేదాన్ని. ఇంటి సంపదవిషయం లోనూ, నడవడివిషయంలోనూ భర్తమనస్సు నొప్పెట్టేనట్టు పల్లెత్తు మాట పలికేదాన్ని కాదు. అగ్నిహోత్రం రక్షించేదాన్ని. రహస్య మైన దేదీ బయటపెట్టేదాన్ని కాదు. నేను చూలాలుగా వున్నప్పుడు రుచుల కాసపడక, పథ్యమైన పదార్థాలే తినేదాన్ని."

ధర్మరాజా! విన్నావుకదూ! ఆదర్శనారి శాండిలి. ఈవిధంగా

నడుచుకున్న ఆడది అరుంధతిలా మెప్పుపొందుతుంది. ఇహసౌఖ్యమూ, పరసౌఖ్యమూ అనుభవిస్తుంది.

ఇప్పుడు చెప్పిన ఈ ఆదర్శనారికథ పర్వదినాల్లో భక్తిపూర్వకంగా చదివేవాళ్ళు పుణ్యపురుషులవుతారు. వాళ్ళ ఆయువు అధికమవుతుంది. సిరిసంపదలు పెరుగుతాయి. మరుజన్మలో దేవతాజన్మ లభిస్తుంది.

## ఆచరించదగిన పని

ధర్మరాజు :

సర్వశాస్త్రసారమయి, శ్రేష్ఠమయి ఆచరించదగిన దేది?

భీష్ముడు :

మంచిప్రశ్నే వేశావు. నారద పుండరీక సంవాదం అని ఒక ఇతిహాస ముంది. అది చెపుతాను, ఆలకించు. నువ్వు అడిగిన విషయం అందులో తేటపడుతుంది.

పుండరీకు డని ఒక మహాబ్రాహ్మణుడు వుండేవాడు. తీర్థపరుడతడు. జపతత్పరుడు. అతడు ఓమారు నారదమునీంద్రుణ్ణిచూసి, భక్తితో ప్రణామంచేసి, ఇప్పుడు నువ్వు నన్ను అడిగిన ప్రశ్నే అడిగాడు. దానికి నారదమహాముని ఇలా సమాధానం చెప్పాడు :

" మాతండ్రి బ్రహ్మదేవుడు ఉపదేశించిన పరమధర్మం ఇది. అల్పఫణితిలో మహార్థం నిండివుంటుంది. దివ్యమతులు వినదగింది. తెలుసుకోదగింది. దాన్ని చెపుతాను, శ్రద్ధగా విను.

" ప్రకృతికి పరం అనే ఇరవై అయిదో తత్వం జీవాత్ముడు. అతడే సర్వభూతాత్మకుడు. పురుషు డని అతడే ప్రకాశిస్తాడు. ఆ పురుషుడివల్లే కలిగి నారములని పేరుపడ్డ అన్యతత్వాలు అతనికి అయనం కావడంవల్ల నారాయణు డయ్యా డతడు. విశ్వం తనలోనే పుట్టి, తనలోనే లయ మవుతుంది. ఆ దేవుడే ప్రభువు. పరబ్రహ్మమనీ,

పరతత్త్వమనీ, పరమపదమనీ, ఈశ్వరుడనీ, విష్ణువనీ ఆ నారాయణుడే ప్రకాశిస్తున్నాడు. అతడే వాసుదేవుడనీ, ఆత్ముడనీ వేదాంతవాక్య బోధుడై వెలుగుతున్నాడు. నరులకి ఆపదలు నామాంతరాలు. అర్థాంతరం లేనట్టివి.

"అన్ని శాస్త్రాల్లోని మాటలూ ఆలోచించి, దృఢవిచారంతో తెలుసుకుని, నిశ్చయించిందల్లా వొక్కటే, 'ఎప్పుడూ నిష్ఠతో నారాయణదేవుణ్ణి తలుచుకోవాలి' అని.

"కనక అదే ఆచరించదగిన పని. అంచేత ఎల్లప్పుడూ శ్రద్ధాపూర్వకంగా నారాయణదేవుణ్ణి తలుచుకుంటూ వుండు. శాస్త్రార్థాలు తడవకు. రవంత సేపయినా నారాయణుణ్ణి తలుచుకుంటే చాలు; మనిషికి సుగతి లభిస్తుందంటే, ఇక ఎల్లప్పుడూ తలుచుకుంటే చెప్పేదేముంది?

"ప్రాణంపోతున్న సమయంలో 'ఓం నమో నారాయణాయ' అనే అక్షరాలు నాలికమీదికి తెచ్చుకుంటే పరమపదం చేరుకుంటారు నరులు.

"నారాయణ అనే పదమే పరబ్రహ్మం. దాన్నే ఎల్లప్పుడూ అనడంవల్లా, వినడంవల్లా, తలుచుకోడంవల్లా, ఇంపుగా కీర్తించడంవల్లా ఎంతో క్షేమం కలుగుతుంది.

"నారాయణ పరాయణుడైన నరుడు పాపాలు గెలిచి ప్రకాశించడమే కాదు, తన్ను ఆశ్రయించినవాళ్ళకి కూడా వెలుగు ప్రసాదిస్తాడు. ఇది బ్రహ్మదేవుడి నియామకం.

"నాలుగు ఆశ్రమాలలోనూ ఏ ఆశ్రమంలో వున్నవాడైనా సరే, నారాయణదేవుడిమీద భక్తినిలపకండా, ఇతరకర్మలు ఎన్ని చేసినా సద్గతి లభించదు. నారాయణుడైన విష్ణుభగవానుడు భక్తవత్సలుడు. భక్తులకు అతను దర్శనమిస్తాడు. సువ్రతుడివి నువ్వు. విష్ణుభక్తిపరాయణుడివి కా. భక్తిలేందే ఆ దేవుడు కానరాడు."

అలా నారదముని చేసిన ఉపదేశం శిరసావహించాడు నైష్ఠికుడు పుండరీకుడు, విష్ణుభగవానుడిమీద నిశ్చలమైన భక్తి ఏర్పరుచుకున్నాడు. ఎల్లప్పుడూ ఆదేవదేవుణ్ణి భక్తిపూర్వకంగా అర్చిస్తూ వచ్చాడు. శంఖమూ, చక్రమూ. గదా, శార్ఙ్గధనుస్సూ పట్టుకుని, శ్రీవత్సచిహ్నంతోనూ, ఉజ్వలమైన కౌస్తుభమణితోనూ, కిరీట కుండలాలతోనూ, పద్మపత్రాలవంటి నేత్రాలతోనూ ప్రకాశించే నారాయణమూర్తిని కలలో దర్శించేవాడతడు.

ధర్మరాజా! ఎంతోకాలానికి కాని విష్ణుభగవంతుడి దర్శనం లభించదు. ఆదేవదేవునిదర్శనం కలిగాక, ఇక శుభాలకి కొరతేముంది? తామరతంపర. పరమపదం కరతలామలకమే అవుతుంది. కనక ఆచరించదగినపని విష్ణుభగవంతుని ఆరాధనమే అని తెలుసుకో. భక్తిపూర్వకంగా ఆదేవదేవుణ్ణి సేవించు.

## సా మ వా ద ం

ధర్మరాజు :

నీమాటలు వింటున్నకొద్దీ వినాలనే వుంది. నాశరీరం పులకరిస్తూవుంది. ఎంతవిన్నా తనివితీరడం లేదు. ఇదిగో పదేపదే నీపాదాలకి నా జోహారులు.

దానమూ, ప్రియవచనమూ (సామవాదం) - ఈరెంటిలో ఏది అధికరంజనం కలిగిస్తుంది?

భీష్ముడు :

రెండూ మంచిమార్గాలే. అయితే ఎదటివాడి స్థితి కనిపెట్టి చేసినదానం రంజకమైందని వేరే చెప్పనక్కరలేదు. సామవాదగుణం తెలిసే కథ వొకటి చెపుతాను, బాగా విను.

బుద్ధిమంతుడైన బ్రాహ్మడు వొకడు వుండేవాడు. ఏదో పని

మీంద పిట్టమనిషిలేని అడివిలో తిరుగుతూ వుండగా, అతణ్ణి తినెయ్యడం కోసమని భయంకరుడైన రాక్షసుడు వొకడు అతణ్ణి పట్టుకున్నాడు. భయపళ్ళేదు బ్రాహ్మడు. ఏమాత్రమున్నా చలించలేదు. మంచి మాటలతో (సామవాదంతో) అతణ్ణి వారించడంకోసం రాక్షసుడి మొహంమీంద చూపులు నిలిపాడు.

బ్రాహ్మడి ధైర్యం చూశాడు రాక్షసుడు. అతడి ఉదాత్త భావం గమనించాడు. సంతోషించి, ఇలా అన్నాడు :

"ఇదిగో, బాపనయ్యా! నేను అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పావా, నిన్ను వొదిలేస్తాను. లేదా, నీమాంసం పరపర నమిలేస్తాను. చెప్పు, నాశరీరం చిక్కిపోవడానికీ, వెలవెలపోడానికీ ఏమిటి కారణం ?"

రాక్షసుడి ప్రశ్న విన్నాడు బ్రాహ్మడు. తొందరపడకండా కొంతసేపు విచారించాడు. తరవాత ఇలా అందుకున్నాడు :

"మహాపురుషా! దయాపరుడివి నువ్వు. నీవంటి ఉత్తముడు అడిగినప్పుడు తోచినవిధం చెప్పడంకంటే మేలు ఏముంటుంది నాకు ? చెపుతాను, చిత్తగించు.

"నీ చెడ్డతనంవల్ల చుట్టాల్ని ఎడబాసి తరవాత పశ్చాత్తాప పడినప్పుడూ, పేదరికం వచ్చి ధనంకావాలని తాపత్రయపడినప్పుడూ, మొగమాటంవల్ల ఇతరుడిచేత చిక్కిపోగా నిన్ను గెలిచానని అతడు చంకలు గుద్దినప్పుడూ, తగినవాడనుకొని వొకడికి నువ్వు మేలుచేస్తే అది తన పౌరుషంవల్లే జరిగిందని అతడు బడాయిచెప్పుకున్నప్పుడూ, దుర్మతులు సుగుణాలుపొగిడి బుద్ధిమంతులు పొగడకండా వుంటే నువ్వు సిగ్గుపడినప్పుడూ శరీరం చిక్కిపోతుంది; వెలవెలపోతుంది. కనక ఇందులో ఏదో వొకటి జరిగివుండాలి.

"ఇంతేకాదు, న్యాయమైనమాట సభలో అంగీకరించకపోవ

డమూ, నీప్రియురాలికి నీతప్పు తెలిసిపోయి ఆమె సంతాపపడినప్పుడు ఆమెని నువ్వు వోదార్చకపోవడమూ, నీధనం ఇతర్లు దోచుకోవాలని చూస్తున్నప్పుడు దాన్ని రక్షించుకోవాలని భావించకపోవడమూ, నీచుకు నిన్ను దూషిస్తూ వుంటే అది నిజమే అని నీ కులంవాళ్ళు భావించడమూ, నువ్వు చేస్తున్న మంచిపనులు చూసి నీస్నేహితులు అదంతా మాయ అని భావించడమూ, దుఃఖమూ సంపదా గౌరవమూ కలిగినప్పుడు వాటిని వెలిపుచ్చలేకపోడమూ – వీటిలో ఏవొకటి కలిగినా కూడా శరీరం చిక్కిపోతుంది; వెలవెలపోతుంది.

"భార్యా కొడుకూ అల్లుడూ అధర్మంగా ప్రవర్తించినా, తల్లీ తండ్రీ అన్నదమ్ములూ కాయిలాతో బాధపడినా, వెనకజన్మలో ఆవుని చంపినా, బ్రాహ్మణ్ణి వధించినా, దుష్బుద్ధితో బ్రాహ్మడి ధనమూ దేవుడిధనమూ చపాయించినా, కష్టార్జితమైన ధనం వ్యర్థంగా పోగొట్టుకున్నా, బంధువులు కాలంచేసినా, మొగమాటపడి దుర్మార్గుడికి సాయంచేసి తనకీర్తికి కళంకం తెచ్చుకున్నా, ఎంతోకాలం కష్టపడి ప్రయత్నపూర్వకంగా చేసినపని వొక్క పొరపాటుతో పగవాడిచేత పాడైపోయినా శరీరం చిక్కిపోతుంది." అన్నాడు.

బ్రాహ్మడి మంచిమాటలు విన్నాడు రాక్షసుడు. సంతోషించాడు. మెచ్చుకున్నాడు. ఇలా వుంటుంది సామవాదమహిమ. ఇంక ఏం వినాలనుందో అడుగు, చెప్తాను.

## శ్రీకృష్ణుడి చిత్రచరిత్ర

ధర్మరాజు :

[అంజలిబంధం శిరస్సున గీవించి] తండ్రీ, సంసారసముద్రంనుంచి వొడ్డుచేర్చే వోడ నీ దయ. అన్నిపాపాలూ పోగొట్టే వొక పురాణ కథ వినాలనుంది. మాననీయమైన చరిత్ర నీది. ఈ మునిజనులూ,

రాజులూ ఇంతమందీ చూస్తూవుండగా శ్రీకృష్ణుడు నిన్ను ఉపాసిస్తున్నాడు. ఇదేమిటో తెలుసుకోవాలని నేనూ, తమ్ముళ్ళూ కుతూహల పడుతున్నాం. ఈ సత్కథ చెప్పి, మమ్మల్ని ఆదరించు. మేమూ, ఈ మునీశ్వర్లూ, రాజులూ నువ్వు సెలవిచ్చిన కథ పులకించిన శరీరాలతో వింటాం, సంతోషిస్తాం.

భీష్ముడు :

గుణవంతుడివి బాబూ, నువ్వు. పుణ్యకథ నీకు చెప్పే పుణ్యం ఈ దయానిధి, సర్వలోకశరణ్యుడు, శ్రీకృష్ణుడు వరంగా ప్రసాదించాడు నాకు.

వ్యాసభగవానుడూ మొదలైన మునీశ్వర్లూ, ఈ రాజులూ నేను చెప్పింది వినడంకన్న గౌరవం ఏముంది నాకు. దీనివల్ల పరమపదం, కరతలం కదా నాకు!

నువ్వు అడిగినదానికి వొక ఇతిహాసముంది. పార్వతీ పరమేశ్వర సంవాదం అని ప్రసిద్ధిపొందిందది. పురాణకథ అది. అది జరగడానికి కారణం ముందు చెప్పి తరవాత దాన్ని చెప్పడం బాగుంటుంది. కనక అది చెప్తాను. చెప్పేముందు శ్రీకృష్ణుడికి నమస్కరిస్తున్నాను. ధర్మరాజూ, సావధానంగా విను బాబూ!

కుమారుణ్ణి కనడంకోసం తపస్సు చెయ్యడానికని రుక్మిణీదేవితో కలిసి హిమాలయపర్వతానికి వెళ్ళాడు శ్రీకృష్ణుడు. ఇతని సంకల్పం తెలుసుకుని మునీశ్వర్లు సంతోషించారు. పన్నెండేళ్ళు వ్రతదీక్ష పూనాడు శ్రీకృష్ణుడు. అప్పుడు ఈయనదర్శనంకోసం నారదుడూ, పర్వతుడూ, వ్యాసుడూ, వాల్మీకీ, దేవలుడూ, కాశ్యపుడూ, మొదలైన మహామునీంద్రులు తమతమ శిష్యులతో కూడా వచ్చారు. వారందరికీ పాద్యాలూ, ఆసనాలూ ఇచ్చి, సముచితంగా అర్చించి, సంభావించాడు శ్రీకృష్ణుడు. మునులందరూ ఈయనచుట్టూ

కూచున్నారు. పుణ్యకథలతో కాలక్షేపంచేశారు. ఆ సమయంలో ఈయన నోటినుంచి మహాగ్ని బయలు దేరింది. హిమాలయం అడవుల్ని దహించింది. పక్షులు తగలబడిపోయాయి. మృగాలు కాలిపోయాయి. సిద్ధులూ, సాధ్యులూ అల్లకల్లోలపడిపోయారు. భయభ్రాంతులై పోయారు. అంతలో చల్లనిచూపు చూశాడు శ్రీకృష్ణుడు. అంత మహాగ్ని ఇట్టే చల్లార్చాడు. చిత్రం; ఎప్పటిలాగే అడవులు కలకల్లాడాయి. అల్లకల్లోలమంతా అడగారిపోయింది. ప్రశాంతి రాజ్యం చేసింది. అదంతా మహాద్భుతమయింది. మునీంద్రులందరూ కళ్ళారా అది చూశారు. భయంతోనూ, ఆశ్చర్యంతోనూ తెల్లపోయారు. చిత్రాల్లాగ నిశ్చేష్టులై పోయారు. వారిని చూసి శ్రీకృష్ణుడు ఇలా అడిగాడు :

" ఈ అగ్నిహోత్రాన్ని ఏమిటని భావించారు మీరు ? ఉన్నది వున్నట్లు చెప్పండి."

" దేవా ! " భక్తిపూర్వకమైనచిత్తంతో అన్నారు మునులు, " నీవల్లే ఈ విశ్వం పుడుతూవుంది. నీలోనే నాశనమవుతూవుంది. స్థావర జంగమాత్మకమైన సకలసృష్టి నీభావాధీనం. నువ్వు బోధిస్తే తెలుసుకోవలిసినవాళ్ళం మేము. ఈ మహాగ్ని ఇలాటిది అని చెప్పగలమా మేం ? తెలియకపోడంవల్లే కదా, తెల్లపోయాం ? "

" మీమనస్సుల ప్రసన్నభావమే లోకాలు సాగడానికి ఆధారం " మునులమాటలు విని అందుకున్నాడు శ్రీకృష్ణుడు, " కనక మీకు ప్రియంకలిగే విధంగా ఈ మహాగ్నివిషయం వినిపిస్తాను, వినండి. కలవరపడకండి.

" ఒక రాక్షసు డున్నాడు.* జగత్తంతా నాశనంచెయ్యగల శక్తిమంతు డతడు. అతణ్ణి హతమార్చడానికి నేను ఉద్యమించక

* శంబరాసురుడు.

పోడంవల్ల కొన్నోళ్ళి పెరిగా డతడు. అస్త్రశస్త్రకళ లెరిగి లోకాలు బాధిస్తున్నాడు. అందుకనే ఉగ్రమైన తపస్సు చేసి, కుమారుణ్ణి కని, కుమారుడిచేత ఆ రాక్షసుణ్ణి హతమార్చాలని సంకల్పించాను. నా ఆత్మ అగ్ని అయి నా నోటినించి వెలువడింది. విజృంభించి బ్రహ్మ దగ్గిరికి వెళ్ళింది. బ్రహ్మ మన్మథుణ్ణి నా కొడుకుగా తీసుకువచ్చాడు. తిరిగిపోయినప్పుడు అడివి దహించాడు. మళ్ళీ అడివి ఎప్పటిలా వుండేట్టు చల్లనిచూపు చూచాన్నేను. ఇదీ ఈ అడివి దహన విశేషం.

"మునీశ్వరులారా! త్రికాలవేదులు మీరు. ముల్లోకాల్లోనూ, మీకు తెలియందంటూ ఏదీ లేదు. మంచి పురాణకథ వొకటి ఏదైనా చెప్పండి. నన్ను కృతార్థుణ్ణిచెయ్యండి" అన్నాడు.

"మమ్మల్ని ఇంత పెద్దచేస్తావా ప్రభూ?" కృష్ణుడిమాటలు విని, వినయంగా చేతులు జోడించి అన్నారు మునులు, "ప్రయత్నం లేకండానే ముల్లోకాలూ నిండిన వాడివి నువ్వు. విశ్వప్రకారం విశదంగా తెలిసినవాడివి. నువ్వు ఎరగనికథ ఏయుగంలోది ఎరిగి చెప్పగలం మేము?"

"అలాకాదు" చిరునవ్వుతో మొహం కలకల్లాడుతూ అన్నాడు శ్రీకృష్ణుడు, "వినండి. మనిషిపుట్టుక పుట్టాన్నేను. కనక నాబుద్ధి గౌరవం మనిషికి తగినట్టే వుండాలని తెలుసుకోండి మీరు. చెప్పండి, మీరుచెప్పేకథ వింటాను. ఇందులో వింతేముంది? కానివ్వండి."

శ్రీకృష్ణుడు ఇలా అనడంతోనే మునులందరూ సంతోషించారు. కథ చెప్పడానికి సంకల్పించారు.

అయితే మాలో పూజ్యచరిత్రుడు నారదముని. అతనే ఈపనికి అన్నివిధాలా అర్హుడు. తక్కినవారు ఎవ్వరూ చాలరు. కీర్తించదగిన వివేకవంతుడు శ్రీకృష్ణుడు. ఆయన కోరి వింటానంటున్నప్పుడు పురాతనమైన ఇతిహాసం నారదుడు చెప్పడమే మంచిది" అన్నారు.

అంతేకాదు నారదమునితోకూడా, "నారదమునీంద్రా, నువ్వు లోగడ విన్నదీ, కన్నదీ, ఏపురాణకథ వినడానికి కుతూహలంతో వున్న శ్రీకృష్ణుడికి వినిపించు" అంటూ అంతమందీ ఏకవాక్యంగా కోరారు.

అంతమందీ తనని పెద్దవేసి, కథచెప్పమని కోరడంతోనే, చెప్పడానికి తానూ వేడుకపడ్డాడు దేవముని నారదుడు. కలకల్లాడుతున్న మొహంతో కథ ఎత్తుకున్నాడు.

## శివపార్వతుల సంవాదం

ఉదారమైన నారాయణసౌహార్ద్రవిభూతి ముందే వుంది నారదమునికి. నారాయణుడైన శ్రీకృష్ణుడి కోరిక తీర్చడానికి శివపార్వతుల కథ వినిపించాడతడు. అదంతా చెపుతాను, విను.

శ్రీకృష్ణుడికి నమస్కరించి; ఇలా ఆరంభించాడు నారదముని :

"వెనకటికి ఏమాటు తీర్థాలు సేవిస్తూ, ఈ మంచుకొండకి వచ్చాన్నేను. అన్నిరకాల చెట్లతోనూ, లతలతోను, పొదలతోనూ రమణీయమైన కేళికావనం చూశా నిక్కడ. కుహూ కుహూ కోకిలలు కూస్తున్నాయి. జుమ్మ్ జుమ్మ్ గండుతుమ్మెదలు పాటలు పాడుతున్నాయి. గంధర్వులు గానంచేస్తున్నారు. వనంమధ్య బంగారంవేదిక మీద మహాదేవుడు శివుడు కొలువుతీరి కూచున్నాడు. పులితోలు వస్త్రంగా కట్టుకున్నాడతను. నాగుపాములు నగలుగా పెట్టుకున్నాడు. తన సుందర శరీరంనిండా విభూతి అలుముకున్నాడు. భూతగణాలూ, దేవతలూ, సిద్ధులూ, సాధ్యులూ, విద్యాధరులూ, మునీశ్వర్లూ ఆయన చుట్టూ పరివేష్టించి వున్నారు. నేను కూడా వెళ్ళి ఆ కొలువులో చేరాను. సముచితప్రకారంగా శివుణ్ణి సేవించాను.

ఇంతలో శివుడికి తగినట్టు సింగారించుకుని, మంగళశరీర అయిన

పార్వతీదేవి అక్కడికి వేంచేసింది. పుణ్యస్త్రీల శరీరాలతో పుణ్య నదులూ, దిక్కులూ ఆమెని సేవిస్తూ వెంటవచ్చాయి. అలా వచ్చిన పార్వతి శివుడికి ఎదురుగా రాలేదు. మెల్లిమెల్లిగా వెనకపాటున వచ్చి, చిరునవ్వులు నవ్వుతూ, తామరతూళ్ళవంటి తన సుకుమారహస్తాలతో వెనకనించి శివుడి రెండుకళ్ళూ మూసిందామె.

అలా అలా పార్వతీదేవి శివుడి నేత్రాలు రెండూ తన చేతులతో మూయడంతోనే సూర్యుడూ, చంద్రుడూ, గ్రహాలూ, నక్షత్రాలూ, అగ్ని లేకండా లోకం వొక్కమాటు అంధకారంలో మునిగిపోయింది. ప్రాణికోటి యావత్తూ సంక్షోభపడిపోయింది.

ఉత్తరక్షణంలో నొసటిమీద మూడోకన్ను తెరిచాడు శివుడు. తెరిచీ తెరవడంతోనే ఆ నేత్రంనించి మహాగ్నిజ్వాలలు గుబులుకుంటూ బయలుదేరాయి. అవి దారుణంగా హిమాలయ పర్వతమంతటా అల్లుకున్నాయి.

తన తండ్రి హిమవంతుడికి వచ్చిన ప్రాణసంకటం చూసింది పార్వతి. ఆమె గుండెబేజారైపోయింది. వెంటనే శివుడి పాదాలమీద వాలిందామె. ఆమె తలమీది నగల రత్నాలకాంతులు శివుని పాదాలమీద ధగధగా మెరిశాయి. పార్వతి అలా పాదాలమీద పడడంతోనే కరుణ కురిపిస్తూ చల్లనిచూపులు చూశాడు శివుడు. అగ్నిజ్వాలలు ఆరిపోయాయి. ఎప్పటిలాగే కలకల్లాడింది మంచుకొండ. చూసి, నిచ్చెరపోయింది పార్వతీదేవి. సర్వభువనకర్త అయిన శివుణ్ణి వినయంగా అడిగింది.

"సర్వేశా! ఫాలనేత్రం తెరవడానికి కారణమేమిటి ప్రభూ? ఇందులో ఏమీ రహస్యం లేకపోతే నాకు విడమర్చి వివరించు.

"దేవీ!" నెమ్మదిగా అన్నాడు శివుడు, "నీకు చెప్పకండా వుండే రహస్యం కూడా వుంటుందా చెప్పూ? విను. లోకాత్మకత్వం

వుందికదూ నాకు, అంచేత నాకు ఏది సంభవించినా అన్నిలోకాలకీ అది సంభవిస్తుంది.

"నాకళ్ళు నువ్వు మయ్యడంతోనే అన్నిలోకాలూ అంధకార బంధురం అయిపోయాయి వొక్కమారు. ప్రాణికోట్లన్నీ భయంలో మునిగిపోయాయి. నీ చేతులు తోసెయ్యడం నాకు ఇష్టంలేకపోయింది. అందుకని చీకట్లు పారదోలడంకోసం మూడోకన్ను విప్పవలిసివచ్చింది తప్పనిసరిగా."

శివుడి మాట వింది పార్వతి. తాను ఎన్నాళ్ళయ్యో అడగ దలిచినవి అడగడానికి మంచి అదను అని భావించింది. "ఫాలనేత్రా! నీకు నాలుగు మొహాలున్నాయి. దీనికి ఏమిటి కారణం?" అంటూ వినయంగా, ప్రేమగా అడిగింది.

"సుందుడూ, ఉపసుందుడూ అని ఇద్దరు రాక్షసులు వుండే వాళ్ళు" అంటూ అందుకున్నాడు శివుడు, "అడ్డులేని భుజవీర్య సంపన్నులు వాళ్ళు. ఇద్దరూ ఇద్దరే, ఆయుధాలవల్ల చావులేదు వాళ్ళకి. వాళ్ళని నాశనంచెయ్యడంకోసం లోకంలోని అందాలన్నిటినించీ తిల తిల ప్రమాణంగా అందం సంగ్రహించి వొక అపూర్వమైన అంద కత్తెని చేశాడు మయుడు.* ఆమెకి తిలోత్తమ అని పేరుపెట్టాడు. ఆ అందకత్తెని నాదగ్గిరికి తీసుకువచ్చారు. ఆమె నాకు ప్రదక్షిణంచేసింది. 'ఇది దేవకార్యం నెరవేరుస్తుందేమో' అంటూ ఆమెని చూడడం కోసం ప్రదక్షిణంలో ఆమె తిరిగిన వొక్కొక్కదిక్కుకీ వొక్కొక్క మొహంతో నాలుగుదిక్కులకీ నాలుగు మొహాలు ధరించాను. అదిగో అవాళనుంచీ నేను నాలుగు మొహాలతో వుంటున్నాను."

"'భువనాధిపా!' మళ్ళీ అడిగింది పార్వతి, 'నీ కంఠంలో నల్ల మచ్చ ఎందు కుంది?"

---

* విశ్వకర్మ అని ఆదిపర్వం చూ. 177 పు.

"'దేవతలూ, రాక్షసులూ అమృతంకోసం పాలసముద్రం చిలికారు. హాలాహాలం పుట్టింది, లోకాలన్నీ దహించడం మొదలెట్టింది. ఎవ్వరికీ సాధ్యంకాకండా విజృంభించింది. అప్పుడు నేనే దాన్ని నా కంఠంలో ధరించాను. అదిగో, ఆ హాలాహాలం వల్లే ఈ నల్లమచ్చ నాకంఠంలో ఏర్పడింది. బ్రహ్మ మొదలైన దేవతలు నీలకంఠుడని నన్ను మెచ్చుకున్నారు. ఇంకా ఏమడుగుతావో అడుగు. సందేహించకు, చెపుతాను' అన్నాడు శివుడు.

"ఆయుధా లన్నిటిలోనూ గొప్పదని మెచ్చి, పినాకం పట్టుకుంటున్నావు నువ్వు. ఏమిటి దీనికి కారణం?" అని అడిగింది పార్వతి.

"'చెపుతాను, విను' అంటూ అందుకున్నాడు శివుడు, 'ఆదియుగంలో కణ్వుడనే ముని నిష్ఠాపూర్వకంగా తపస్సు ప్రారంభించాడు. అతని శరీరంమీద పెద్ద పుట్ట బలిసిపోయింది. ఆ పుట్టమీద వెదురు పొద మొలిచింది. బాగా ఏపుగా పెరిగింది. ఆ పెరగడం ఇంతా అంతా కాదు. చెప్పలేనంత పొడవు పెరిగింది. వల్లమాలినంత చుట్టుకొలతగా బలిసింది. అద్భుతమైన పొద అయింది.

కణ్వునిఎదట బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు తుదకి. అతడు కోరిన వర మిచ్చాడు. అదుగో! ఆ వెదురు పొదలోని వెదురు తీసి పినాకమూ, శార్ఙ్గమూ అని రెండు ధనుస్సులు ముందు చేశాడుబ్రహ్మ. పినాకం నాకు ఇచ్చాడు. రెండోవిల్లు శార్ఙ్గం విష్ణుమూర్తి కిచ్చాడు. వెదురు కొన ముక్కతో మూడోవిల్లు గాండీవం తయారుచేశాడు. గాండీవం తాను పుచ్చుకున్నాడు. ఇలా 'మహాధనుస్సులు మూడూ చేసి లోకానికి మేలుచేశాడు బ్రహ్మ. ఇదీ పినాకం కథ. పినాకమంటే నాకు ఎందుకంత ఇష్టమో ఇప్పుడు నీకు తెలిసిందనుకుంటాను."

"'అఖిలేశ్వరా!' మళ్ళీ అడిగింది పార్వతి, 'ఇంకే వాహనమూ

వాొల్లక, ఎద్దు వాహానంగా చేసుకున్నావు నువ్వు. దీనికేమిటి ప్రభూ, కారణం ?'

"'లోకహితంకోసం హిమాలయపర్వతంమీద నేను మహా తపస్సు చేస్తూవుండేవాణ్ణి. అప్పుడు ఆవులు నాచుట్టూ చేరి ఇబ్బంది పెడుతూవుండేవి. నాకు కోపంవచ్చింది. తేరిచూశాను. గోకులమంతా ఆకులత్వం పొందింది. బ్రహ్మ, ఇతరదేవతలూ వచ్చి నన్ను ప్రార్థించారు. ఒక ఎద్దు కానుకగా ఇచ్చారు. నాకు జాలిపుట్టినట్లు చెప్పి, గోపతి అని పేరు కూడా ఇచ్చారు. దాంతో గోకులానికి బాధ లేకండా చేశా న్నేను. అది మొదలు ఎద్దు వాహానంగానూ, పతాకంగానూ చేసుకున్నాను. అంతటా శివప్రచారం సాగిస్తున్నాను' అన్నాడు శివుడు.

"'అయితే నువ్వు పరమ శుచిమంతాలూ, రమణీయాలూ అయిన ప్రదేశాల్లో నివసించకండా అశుచిగానూ, తలవెంట్రుకలూ, ఎముకలూ, తలపుర్రెలూ వాటితో దుర్గంధంగానూ, చూడటానికి అసహ్యంగానూ వుండే వల్లకాటిలో వుంటా వెందుకూ?' అని అడిగింది పార్వతి.

"'మంచిప్రశ్నే అడిగావు. విను. క్రూరమైన భూతాలు ప్రజల్ని బాధపెడుతూ వుండేవి ఎప్పుడూ. వారిని హతమారుస్తూ వుండేవి. ప్రజలందరూ నాశనమైపోతూ వుండేవారు. అప్పుడు బ్రహ్మ నాదగ్గిరికి వచ్చి, దానికి ప్రతీకారం చెయ్యవలసిందని ప్రాధేయపడ్డాడు. అందుకని, నిశ్చితంగా వాోదగ్గిర వుండి లోకాలు రక్షించాలని నిశ్చయించుకున్నా న్నేను. నిర్జనమైనస్థానం కనక స్మశానం శుచిస్థానమని ప్రశంసిస్తారు మోక్షపరులు. అంచేత స్మశానం నామనస్సుకి నచ్చింది. దాన్నే నా నివాసం చేసుకున్నాను. వల్లకాటిలోనే వుంటూ లోకాలన్నిటినీ ఆత్మలో తలుచుకుని రక్షిస్తూ వుంటాను. ప్రాణికోటి

వాళ్ళదగ్గిర చేరి తిరగడం చూసి, కుతూహలపడుతూ వుంటాను. ఇతరప్రదేశాలు ఏవీ స్మశానంతో సాటిరావు నిజంగా' అన్నాడు శివుడు.

"'బాగుంది కానీ, వొంటినిండా బూడిద పూసుకుంటావు నువ్వు. ఎముకలు నగలుగా మెళ్ళో వేసుకుంటావు. పాములు చుట్టు కుంటావు. గండ్రగొడ్డలీ, త్రిశూలమూ పట్టుకుంటావు. ఇలా, భీకర మైనరూపం ఎందుకు ధరిస్తావు?' అని అడిగింది పార్వతి.

"'లోకస్వరూపం రెండురకాలు. ఒకటి శీతమూ, రెండోది ఉష్ణమున్నూ. ఈరెంటిలోనే అంతా కూర్చి వుంటుంది. ఈ జగ త్తంతా సౌమ్య ఆగ్నేయ యోగంతో కలిసి వుంటుంది. సౌమ్యం విష్ణుమూర్తిని ఆవహించి వుంటుంది. ఆగ్నేయం నన్ను ఆవహించి వుంటుంది. ఈరెండు విధాలూ తెలుసుకుని, విశ్వం భరిస్తూ వుంటా న్నేను. కనక ఆగ్నేయభావంతో కూడినభావం రూఢిఅయిన ఆకృతి లోకహితంకోసమే ధరిస్తున్నాను. ఇంక ఏమడుగుతావో అడుగు' అన్నాడు శివుడు.

"'ముచ్చటగా నెలవంక తలమీద పెట్టుకుంటా వెందుకూ?' అని అడిగింది పార్వతి.

"'దక్షుడి యజ్ఞంమీద నేను మండిపడ్డాను కదూ! అప్పుడు కనపడ్డ దేవతలందరినీ పడమోదాను. అవాళ వికటంగా చంద్రుడి శరీరం తొక్కేశాను. నాశరణు వేడుకున్నాడు చంద్రుడు. ఎంతో జాలి వేసింది నాకు. చేసినపాపం ఇలాచేస్తేకానిపోదని అవాళనుంచీ నెల తలమీద పెట్టుకున్నాను' అన్నాడు శివుడు.

"శివుడు చెప్పినవన్నీ విని కొలువులోని మునులందరూ ఆయన దయాభావం మెచ్చుకున్నారు మనసుల్లో. సంతోషపూర్వకంగా

ఆమహాదేవుణ్ణి అభినందించారు. భక్తివినయాలతో పదివేలవిధాల ప్రస్తుతించారు.

"శివుడి సుముఖం చూసి, ఇదేమంచిసమయం అని భావించి చేతులుజోడించింది పార్వతి. తన లోలనేత్రాలకాంతులు నెలపువ్వు తలమీాదదాల్చిన శివుడి మొహంమీాద సారించింది. మునుల మనస్సులు వికసించినట్టు సాంత్వనస్వరంతో మధురంగా మళ్ళీ అడిగింది:

"'నాథా! వర్ణాశ్రమధర్మాలు నువ్వు వర్ణిస్తే వినాలనుంది. నీమాటలు అమృతసోనలై నాచెవులలోనూ, లోకులందరి చెవుల లోనూ పడి పరమపుణ్యం ప్రసాదిస్తాయి."

# అయిదో ఆశ్వాసం

## వర్ణ ధర్మాలు

"అలా లోకహితార్థం పార్వతి వర్ణాశ్రమధర్మాలు వివరించమని అడగడంతోనే ఎంతో సంతోషించి ఇలా అందుకున్నాడు శివుడు :

"'పూర్వం లోకానికి మేలు చెయ్యడంకోసం బ్రహ్మదేవుడు తన మొహంలో బ్రాహ్మల్ని సృజించాడు. బాహువుల్లో క్షత్రియుల్ని సృజించాడు. తొడల్లో కోమట్లని సృజించాడు. పాదాల్లో శూద్రుల్ని సృజించాడు. ఈ తారతమ్యప్రకారమే ఈవర్ణాలు ఆచరించవలిసిన ధర్మాలున్నూ ఏర్పరిచాడు.

"'బ్రాహ్మలు లోకధారకులు, వారిని పరాభవిస్తే చెడ్డ నెత్తిని పడుతుంది. వారికి దానమిస్తే, వారిని సన్మానిస్తే సకలశోభనాలూ కలుగుతాయి.

"'తెలివిమాలినవాణ్ణయినా, దరిద్రుణ్ణయినా బ్రాహ్మడైన వాణ్ణి ప్రీతిమాలి కష్టపెట్టడమంటే ఉభయలోకసౌఖ్యాలు పోగొట్టుకోడమన్నమాటే. బ్రాహ్మణ్ణి నిందించడమంటే నన్ను నిందించడమే. అక్రమంగా బ్రాహ్మడిసొమ్ము కాజెయ్యడమంటే నాసొమ్ము అపహరించడమే. దాపరికంలేకండా చెప్పాను. ఇందులో అసత్యం ఏమీలేదు.

"'అధ్యయనమూ, యజనమూ, అధ్యాపనమూ, యాజనమూ, ప్రతిగ్రహమూ, ప్రశాంతీ, తపస్సూ, సత్యమూ, శౌచమూ — ఇవి బ్రాహ్మణధర్మాలు.

"'ఆపదసమయాల్లో తప్ప బ్రాహ్మలు వర్తకం చెయ్యకూడదు. బ్రాహ్మడు అగ్నికార్యం మానకూడదు. శూద్రుల అన్నం

తినకూడదు. నియమంతో నిజభార్యతోమాత్రం కలవాలి. రెండు పూటలుమాత్రం భోజనంచెయ్యాలి. హింస చెయ్యకూడదు. నివాస శుద్ధీ, అతిథిప్రియత్వమూ కలిగివుండాలి. తపస్సే సాధనంగా చేసుకుని ధర్మమూలంగా బ్రాహ్మల్ని సృజించాడు బ్రహ్మ.

" 'బ్రాహ్మల్ని సంరక్షించడం క్షత్రియుల ముఖ్యధర్మం. బ్రాహ్మల రక్షణవల్ల కాని భూమి నిలవదు. బ్రాహ్మలు మహాను భావులు. బ్రాహ్మల్ని రక్షిస్తే అన్ని శుభాలూ కరతలామలక మవుతాయి.

" అధ్యయనమూ, యజనమూ, దానమూ, సాధుసంరక్ష ణమూ, దుర్జనదండనమూ, ప్రజల వివాదాలు పరిష్కరించడంలో పక్షపాతంలేకండా వుండడమూ, ఉత్సాహమూ, ధైర్యమూ, ఆయు ధాలతో జీవించడమూ, ప్రజల పంటలో ఆరోభాగం పన్ను పుచ్చు కోడమూ, భృత్యుల్ని పాలించడమూ, ఇవన్నీ రాజులధర్మాలు.

" లోకప్రవర్తనాలన్నిటికీ కోమట్లు ఉపకారకులు. కృషి, వర్తకమూ, పశుపాలనమూ కోమట్ల ధర్మాలు. అధ్యయనమూ, యజనమూ, దానమూ వారికి అర్హమైన పనులు.

" పై మూడుజాతులవారూ ఉపనయనం చేసుకుంటారు. కనక ఆతిథ్యం వారికి విధి. తిల గంధ రసముల విక్రయం మాత్రం వారికి తగదు.

" శూద్రులు శుశ్రూషకులు. మీది మూడుజాతులవారికీ శుశ్రూష చెయ్యడం వారి ముఖ్యధర్మం. శుశ్రూషాధర్మం పాలిస్తేనే శూద్రులు సిరిమంతు లవుతారు. వినయముగా వుండడమూ, శాంతంగా ప్రవర్తించడమూ, బ్రాహ్మలకి నమస్కరించడమూ వారి కర్తవ్యం.

" 'తన వర్ణానికి తగిన ధర్మం సక్రమంగా పాలించినవాడు

పాపంలేనివా డనిపించుకుంటాడు లోకంలో. అతడే ఇహపర సౌఖ్యాలనుభవించగలుగుతాడు సందేహంలేదు.

"'పార్వతీ! ఇవి వర్ణధర్మాలు. ఇక ఆశ్రమధర్మాలు వివరిస్తాను విను.

## ఆశ్రమధర్మాలు

"'పరమనిష్ఠతో బ్రహ్మచర్యం పాలించడమూ, గురువు నాశ్రయించడమూ, వేదాలు చదవడమూ, అగ్నికార్యం నిర్వహించడమూ, భిక్షమెత్తడమూ- ఇవి బ్రహ్మచర్యాశ్రమధర్మాలు.

"'ఆశ్రయాలన్నిటికీ ఆశ్రయమైంది గృహస్థాశ్రమం. శుచిగా వుండడమూ, నిజభార్యని సంతుష్టిపరచడమూ, పంచయజ్ఞాలు నిర్వహించడమూ, శాస్త్రాలమీద అభిరతి కలిగివుండడమూ, దానంచెయ్యడమూ, హోమం సాగించడమూ, దయకలిగివుండడమూ, అతిథిపూజ చెయ్యడమూ- ఇవి గృహస్థాశ్రమధర్మాలు.

"'అడివిలో నివసించడమూ, అడివిలోనే దొరికే దుంపాదులు తిని బతకడమూ, బ్రహ్మచర్యంపాలించడమూ, జడలు ధరించడమూ, లేడిచర్మం ధరించడమూ- ఇవి వానప్రస్థాశ్రమధర్మాలు.

"'కోపంలేకండా వుండడమూ, సంగం వర్జించడమూ, అకించనభావమూ, వోర్మి, ప్రవాసమూ, ప్రశాంతి, ఆర్జవమూ, శౌచమూ, వ్రతనిష్ఠా, బిచ్చమెత్తుకు తినడమూ, నేలమీద నిద్రపోడమూ, కృపా, ఎల్లప్పుడూ తత్వచింతనమూ - ఇవి సన్యాసాశ్రమ ధర్మాలు. వేదాలు చాటుతున్న విషయం ఇది. నీకు చెప్పాను.'

## తపస్స్వరూపం

"శివుడు చెప్పిన వర్ణాశ్రమధర్మాలు విని, పార్వతి ఇంకా ఇలా అడిగింది :

" 'తపం తపం అంటూ తపస్సుచేస్తారు మునులు. ఆ తపస్స్వ రూపం తెలుసుకోవాలనుంది, వివరించు.'

" 'భోగార్థులయి తపస్సుకి పూనుకుంటారు' అన్నాడు శివుడు. 'తపస్సంటే వానప్రస్థులు ఆచరించే ధర్మం. ఇంద్రియవ్యాపారం అరికట్టి ఉదయమూ, సాయంకాలమూ— రెండువేళలా ఫలకాంక్షతో యోగ సేవచెయ్యడమే తపస్స్వరూపంగా నడుపుతారు. కాలం పండాక స్వర్గానికి వెళతారు. అక్కడ దివ్యసుఖాలు అనుభవిస్తారు. ఆ చేసుకున్నపుణ్యం కాస్తా తరిగిపోడంతోనే తిరిగి మనిషిజన్మ ఎత్తడానికి స్వర్గంనుంచి భూలోకానికి వస్తారు. అధికనియమాలతో ఉపవాసాలూ, జపాలూ చేసి, పంచాగ్నులమధ్య వుండి తపస్సుచేసినవాడికి అప్సరసల అనురాగం లభిస్తుంది. అయితే తిరిగి భూలోకానికే వస్తాడతడు పుణ్యఫలం తరిగిపోయాక.

" 'భార్యతోకూడా నడుచుకునే తాపసముఖ్యులు అహింసే గొప్పదని భావిస్తారు. దయకలిగి వుంటారు. జీవులన్నీ తమవంటివే అని తలుస్తారు. ఊర్ధ్వలోకంలో కూడా భార్యాపుత్రులతో సుఖపడతారు వారు. అయితే వారున్నూ తిరిగి రావలసినవారే భూలోకానికి.

## వనవాసవ్రతం

" 'వనవాసవ్రతవిశేషాలూ, దానివల్ల లభ్యమయే ఫలమూ వివరించు' అంది పార్వతి.

" 'వ్రతదీక్షతో ఉపవాసాలు చెయ్యడంవల్ల చంద్రలోకంలో నివాసం లభిస్తుంది. అలాగే మౌనంగా వుంటే దేవలోక నివాసం లభిస్తుంది. అలాగే నేలమీంద పరుంటే యక్షలోకనివాసం లభిస్తుంది. రెండుచేతులూ మీందికెత్తి కదలకండా నుంచుంటే గంధర్వ, దేవ, నాగలోకాల్లో వేలాదిసంవత్సరాలు సౌఖ్యంగా నివసించడం లభి

స్తుంది. సంక్షేపంగా కొన్ని ఫలాలు మాత్రం చెప్పాను. ఇంకా ఏమడుగుతావో అడుగు' అన్నాడు శివుడు.

## ఆయవారం చేసుకునేవారు

"'ఆయవారం చేసుకు బతికేవారివిషయం వినాలనుంది' అంది పార్వతి.

"'ఆయవారం చేసుకు బతికేవాదిని యాయావరు లంటారు. తీర్థపరాయణులు వారు, ఉపవాసవ్రతనిష్ఠులు. నానాతీర్థాల్లోనూ నిరంతరం స్నానాలుచెయ్యడంచేత కపిలవర్ణంజడలతో వుంటారు వారు. బిచ్చమెత్తడంవల్లా, పస్తులుండడంవల్లా శుష్కించిన శరీరాలతో వుంటారు. వారి తపస్సు మిక్కిలిగా ప్రకాశిస్తుంది.

"'నెలదినాలు ఉపవాసంచేసి, గడ్డి గింజలు తిని పారణచెల్లిస్తారు వారు. ఏదేవతలకీ దొరకని సుఖప్రదమైన పదవులలో సుఖపడతారు చివరికి.'

## వైఖానసులు

"'వైఖానసుల విధం వివరించు' అంది పార్వతి.

"'వైఖానసులు వానప్రస్థులు. తీవ్రమైన వ్రతపరులు వారు. అదేలా అంటావా? చెపుతాను, విను. రాతిలో గడ్డిగింజలు దంచుకుని వాళ్ళలో కొందరు తింటారు, పళ్ళుమాత్రం తింటారు కొందరు. గువ్వల్లాగ కంటపడిన గింజలుమాత్రం ఏరుకుని అప్పటికప్పుడు నోటవేసుకు తింటారు కొందరు. ఎండిన ఆకులు ఏరుకుని తింటారు కొందరు. కేవలం నీరుమాత్రమే తాగి బతుకుతారు కొందరు. గాలి మాత్రం ఆహారం చేసుకుంటారు కొందరు. ఇవేకాక ఇంకా రకరకాల ఆహారాలు తీసుకునేవారున్నూ వున్నారు వీరిలో.

"'దేవేంద్రుడికి కూడా పూజనీయులు వైఖానసులు. ఊర్ధ్వ లోకాలలో వుండి చిరకాలం ఉత్తమమైన సౌఖ్యాలు అనుభవిస్తారు వారు.

"'ఇవన్నీ వానప్రస్థుల నియమనిష్ఠా భేదాలే. తపస్సు తపస్సు అని మునులు తపస్సుచేస్తారు. ఆ తపస్సు విధానం వివరించు' అని నువ్వు అడిగావు ముందు. నేను చెప్పినవన్నీ తపస్సుకి అర్థాలే.

## వా ల ఖి ల్యు లు

"'వాలఖిల్యులని ప్రసిద్ధులైన మునులున్నారు. అంగుళమంతేసి శరీరాలు వారివి. లేడితోళ్ళు బట్టలుగా కట్టుకుంటారు వారు. ఏ ద్వంద్వాలూ వుండవు వారికి. సూర్యకిరణాలతో కలిసిమెలిసి వుంటారు వారు. వారి తపోవైభవంవల్లే లోకాలు సుస్థిరంగా వుంటున్నాయి.

"'పార్వతీ! తపస్సు మహనీయమైన సాధనం. దేనివల్లా లభ్యం కాంది తపస్సువల్ల సులువుగా లభ్యమవుతుంది. తపస్సుని మించిన ధర్మం లేనే లేదు.

## ప్ర వృ త్తి ని వృ త్తి ధ ర్మా లు

"'ధర్మాలు ఇంకా చెపుతాను. సావధానంగా ఆలకించు. గృహస్థులకి అర్హమైంది ప్రవృత్తిధర్మం, బ్రహ్మ ఏర్పరిచిన ధర్మం అది. ఆర్యులు దాన్ని మన్నిస్తారు. చాలా సూక్ష్మమైన ధర్మం కూడా అది. అతికాంక్ష లేకండా సమచిత్తవృత్తి కలిగి, ఏ కాలానికి తగినట్టు నిత్యమూ ధర్మమూ, అర్థమూ, కామమూ సేవించడమే ప్రవృత్తిధర్మం.

"'నివృత్తిధర్మం కూడా బ్రహ్మ ఏర్పరిచిందే. నివృత్తిధర్మం మోక్షం ప్రసాదిస్తుంది. దాంతీ, భూతదయా, సత్యదృష్టీ, విరాగతా,

యోగనిష్ఠతో ఇంద్రియాలు శాంతిపరుచుకోడమూ— ఇవన్నీ నివృత్తి ధర్మవిధానాలు.

" 'ఆకలి దప్పులతో అలిసిన అతిథివస్తే ఆదరించి అతడి దప్పి పోవునట్టు సముచితంగా భోజనంపెట్టడంకంటే గొప్పపుణ్యం మరొకటి లేదు నిజానికి.

" 'అన్ని ఆశ్రయాలకీ గృహస్థాశ్రమమే ఆలవాలం. అంచేత ఏ ఆశ్రమమైనా కానీ గృహస్థాశ్రమంలో పదహారోపాలు కూడా కాదని నమ్ము' అన్నాడు శివుడు.

## గృహస్థుల ముఖ్యధర్మం

" 'గృహస్థులకు ఏది ముఖ్యధర్మం ?' అని అడిగింది పార్వతి.

" 'తల్లినీ, తండ్రినీ ఆరాధించడం ధర్మాలన్నిటిలోకీ ముఖ్యమైన ధర్మం గృహస్థులకి. ఇల్లాలికి పతిభక్తి ముఖ్యధర్మం' అన్నాడు శివుడు.

" 'అయితే, తల్లిదండ్రులు కాలంచేసినపురుషుడికి ఏదిముఖ్యధర్మం ? భర్తపోయిన ఆడదానికి ఏది ముఖ్యధర్మం ?' అంటూ మళ్లీ ప్రశ్న వేసింది పార్వతి.

" 'మనశ్శుద్ధికలిగి దేవపూజా, అతిథిపూజా, పితృపూజా చెయ్యడం తల్లిదండ్రులులేని గృహస్థు చెయ్యవలసిన ముఖ్యధర్మం. ఏమరుపాటులేకండా బ్రహ్మచర్యవ్రతం పాలించడం తలచెడిన ఆడదానికి ముఖ్యధర్మం.

" 'ఐదు పర్వదినాల్లోనూ స్త్రీసంగమం విడిచిపెట్టాలి గృహస్థు. తాను కట్టుకున్న భార్యతోనే తృప్తిపడాలి. పక్షులూ, ఎలకలూ తన ధాన్యం తింటే; పోనీ, తిని బతకనీ అని వూరుకోవాలి. అదిగో అలాటి గృహయజమానికి అశ్వమేధయజ్ఞం చేసినంత ఫలం లభిస్తుంది.

"'ఎక్కడ వుంటేనేం, ఎలా వుంటేనేం ఏంచేస్తేనేం అన్ని సాంగత్యాలూ వొదులుకుని, నియతితో భోజనంచేసే యతికి మోక్షం ఎట్టఎదట ప్రత్యక్షమవుతుంది' అన్నాడు శివుడు.

రా జు

"'రాజు అన్నవాడికి అందరి మనుషులలాగే వుంటుంది శరీరం. భోజనాదులూ అందరిలాగే వుంటాయి. అయినా అందరూ అతణ్ణి మొక్కుతారు. నిగ్రహానుగ్రహసమర్థుడై వుంటాడతను. సర్వాధిపత్యం కలిగి శోభిల్లుతూ వుంటాడు. ఏమిటి దీనికి కారణం?' అని అడిగింది పార్వతి.

"'ఎంతో అధికంగా తపస్సుచెయ్యడంవల్ల రాజవుతాడు మనిషి. అంచేత ప్రజలు మొక్కుతారతడికి. నిగ్రహానుగ్రహశక్తి కూడా తపస్సువల్లే లభిస్తుంది రాజుకి.

"'రాజనీతి వివరిస్తాను, విను. ప్రజలందరినీ వినయపరులుగా చేసుకుని, వారిని శిక్షిస్తాడు రాజు ఇంద్రియాలు అదుపులోపెట్టుకుంటాడు. శత్రువుల్ని జయిస్తాడు. ధర్మార్థకామాలలో పరిశుద్ధులైన వారిని గుర్తించి మంత్రులుగా నియమిస్తాడు. అనురక్తికలిగిన సేనల్ని ఆదరిస్తాడు. హితపరులైనవారితో స్నేహంకడతాడు. భూమికి మేలు చేస్తాడు. దుర్గం రక్షిస్తాడు. ధనం కూరుస్తాడు. ఇలా సప్తాంగసంపన్నుడవుతాడు. అపాత్రవ్యయం చెయ్యడు. పాత్రవ్యయం మానడు. అన్ని విధాలా తన్ను తాను రక్షించుకుంటాడు. ధర్మం తప్పకండా నడుచుకుంటాడు. పాపం పరిత్యజిస్తాడు. క్రోధం మానుకుంటాడు. కోరికలు లేకండా దండనీతి ప్రయోగిస్తాడు. వేగులవాళ్ళని నియమించి శత్రువుల గుట్టుమట్లు కనిపెడతాడు. తన దేశాన్నీ, తన పట్టణాన్నీ, తన పరివారాన్నీ కంటికి రెప్పలా కాపాడుతాడు. సత్యమే మాటలాడతాడు.

ప్రయత్నపరు డవుతాడు. ప్రియంగా మాట్లాడతాడు. విద్యలంె ఆసక్తి కలిగివుంటాడు. అవసరంవచ్చినప్పుడు సంధిచేసుకుంటాడు యుద్ధాలలో పగవాళ్ళని తన ఆయుధాలకి బలిచేస్తాడు. దీనుల్ని పోషిస్తాడు. ఆపదలోవున్నవాళ్ళని ఆదుకుంటాడు. ఉత్తరువులలో నేర్పు చూపుతాడు. కయ్యానికి కాలుదువ్వడు. యుద్ధం తప్పనప్పుడు రణశూరుడై పోరాడతాడు. యజ్ఞాలు చేస్తాడు. దానపరాయణు డవుతాడు. రాజుకి ఇవన్నీ ఉత్తమధర్మాలు. దీనికి వ్యతిరేకంగా నడుచుకున్న రాజు నరకంలో పడతాడు. ప్రజలకి పాపంవల్ల కలిగే దుఃఖం ఏదోవిధంగా తప్పితే తప్పవచ్చు, కాని రాజుకిమాత్రం తప్పదు. భావశుద్ధికలిగి ఈ నీతులు పాలించే రాజు సిరిసంపదలతో తులతూగుతాడు. తన కీర్తి దిక్కుదిక్కులకీ పాకిస్తాడు. తుదిని పుణ్య లోకాలు పొందుతాడు. ఇదీ రాజులో విశేషం' అన్నాడు శివుడు.

## ధర్మరహస్యం

" 'ధర్మరహస్యం వినిపించు' అని మళ్ళీ అడిగింది పార్వతి.

" 'ధర్మాలన్నిటిలోనూ అహింస అన్నదే ధర్మరహస్యం ' అన్నాడు శివుడు.

" 'అహింస ఎవ్వరికీ సాధ్యంకాదనుకుంటాను. కనక అహింస విధానం వివరించు ' అని అడిగింది పార్వతి.

" ' అవును ' అంటూ అందుకున్నాడు శివుడు, ' నువ్వు అన్నట్టు అహింస ఎవ్వరికీ సాధ్యంకాదు. నేలమీద చీమలూ మొదలైన వాటినీ, ఆకాశంమీద దోమలూ మొదలైనవాటినీ, పేళ్ళూ, చీర పేళ్ళూ, నల్లులూ మొదలైనవాటిని చంపడం ఎవ్వరూ మానలేరు. అంచేత తొడిమ వొదిలిన పండూ, రాలిన ఆకూ తిని ఆకలితీర్చుకుని మజ్జిగ చిలికినట్టుభావాలు పైకినాగకండా చిత్తరువులులా వుండే శాంత

చిత్తులు అహింసే ధర్మంగా నమ్మినవారని తెలుసుకో. దేవీ, ఇదిగో, ఇదే వేదాల్లో ధర్మరహస్యమని చెప్పారు. ఇంతేకాక, అహింసామార్గం ఇంకా విశేషించివుంది. విధివశంగా వివిధజంతుకోటి మరణిస్తుంది. అందులో అహంకారంలేని పురుషుడికి ఏపాపమూ అంటదు. ఎలా అంటావా? చెపుతాను, శ్రద్ధగా విను. ఒకడు దివిటీపట్టుకుని వుంటాడు. దానిలో వచ్చిపడి వొకపురుగు కాలి, చస్తుంది. అప్పుడు దివిటీపట్టు కున్నవాడికి పాపంవస్తుందా? రాదు కదా! ఒకడు నేల దున్నుతూ వుంటాడు. నాగేటిమొన తగిలి నానారకాల ప్రాణులు చచ్చిపోతాయి. అందువల్ల దున్నినవాడికి పాపంరాదుకదా? వారు తమ పనులు తాము చేసుకుంటూవుంటే విధివశంగా ఆయువుచెల్లిన జంతువులు చస్తాయి. దివిటీపట్టినవాడికి కాని, నేల దున్నినవాడికి కాని 'నేనే ఈజంతువులను చంపాను' అన్న అహంకారం ఏమాత్రమూ కలగదు కదా! అంచేత వారికి పాపం చుట్టుకోదు. పార్వతీ! పుణ్యాపాపాలకి భావమే మూలం.

"'హింసలాగే బయటికి కనపడి, అధికధర్మంగా వుండే విషయం చెపుతాను, విను. పూర్వం ఎన్నోవేల ఆవులు దైవగతివల్ల చావవలిసి వచ్చింది. అయితే ఇంకోవిధంగా చావడం ఇష్టంలేక అవి సద్భావంతో, రంతిదేవుడు చేస్తున్న యజ్ఞంలో పశువులై చావడానికి నిశ్చయించుకున్నాయి. తిన్నగా రంతిదేవుడిదగ్గిరికి వెళ్ళాయవి. యజ్ఞపశువులుగా తమని చంపవలసిందని అతణ్ణి కోరాయి. ఆవుల కోరికప్రకారం వాటిని వరసగా వేలసంఖ్యమీద యజ్ఞపశువులుగాచేసి వధించాడు రంతిదేవుడు. వాటి చర్మాలు కుప్పలుపడి, వొడ్లయి, వాటి నెత్తురు నది అయి ప్రవహించింది. అదే చర్మణ్వతినది. ప్రియమైన పరిమళంతో మంచినీరై పారింది నెత్తురు. స్నానానికీ, పానానికీ, నాకు ఆనందం కలిగిస్తుంది చర్మణ్వతిమహానది. ఆవులన్నీ స్వర్గానికి వెళ్ళాయి. రంతిదేవుడిసంగతి ఇక చెప్పేదేముంది?

"'శత్రుసేనలమీద పడి నెత్తురుటేర్లు పారినట్లు నరికి చంపు తారు వీరులు యుద్ధంలో. ఆపరుసుదనం కూడా పుణ్యోత్తరమే అని చాటిచెపుతున్నాయి వేదాలు. యుద్ధాల్లో చావడమూ, చంపడమూ పుణ్యలోకాలకి కారణం. ఇలావుంటుంది అహింసాస్వరూపం అని నువ్వే తెలుసుకో.

"'వేటకోసం ఆసక్తిపడడం పాపం కాదు. ఏమంటే, సస్యాలు మృగాలవల్ల నాశనమవుతాయి. జగత్తులో ఎక్కడా మానవుడన్న వాడు లేకండా వుండాలని కోరుతాయి మృగాలు. ఆకారణంవల్ల మృగాల్ని చంపడం రాజులకి ధర్మమైంది. అదీగాక రాజుచేత మరణిస్తే మృగాలకి సద్గతి కలుగుతుంది.

"'దండించవలిసినవాణ్ణి దండించకపోవడమూ, దండించరాని వాణ్ణి దండించడమూ, బ్రాహ్మడిమనస్సు నొచ్చినపని చెయ్యడమూ, అపరాధికానివాడిశరీరం నొప్పించడమూ హింస రాజుకి.

"'బ్రాహ్మలకి కోపంపుట్టించి నహుషుడూ మొదలైన రాజులు చెడినసంగతి లోకప్రసిద్ధం. బ్రాహ్మణకోపంవల్ల దేవేంద్రుడు శరీరంనిండా యోనులతో బాధపడలేదూ? ఆ బ్రాహ్మడి కాళ్ళూ వేళ్ళూ పడికదా వాటిని కళ్ళుగా మార్చుకున్నాడు. అంచేత బ్రాహ్మల్ని ఆరాధించిన రాజు రాష్ట్రమూ, ధనమూ, సైన్యమూ, బంధువులూ, బ్రాహ్మణాశీర్వాదాలూ పొందుతాడు. సందేహం లేదు.

"'పరమమంత్రాలతో పశువులు యూపస్తంభాలకి కట్టబడి మహాశుచిత్వం పొందుతాయి. యజ్ఞపశువులుగా చచ్చి దివ్యసౌఖ్యం పొందుతాయి. హోమవిధుల్లో వాటిమాంసం ఆమిషంగా అర్పించి, అగ్నిష్టోమాల్లో దేవతల్ని పూజించిన యజమానులకి పరమసౌఖ్యాలు కలుగుతాయి.

"'వేదసమ్మతమయిన హింస, పాపాలు పోగొట్టే పరమ

సుకృతం' అని ప్రశంసిస్తారు మునులు. అంచేత వేదసమ్మతమైన హింస హింస అని తలంచకూడదు.

"'దేవీ! అహింసామార్గాలన్నీ సంగ్రహంగా ఎరిగించాను. ఇంకా ఏం వినాలనుంటో అడుగు."

## జీవనమార్గాలు

"'జనుల జీవనమార్గాలు సెలవియ్యి ప్రభూ!" అని అడిగింది పార్వతి.

"'మానుష్యం కర్మభూమి దేవ తిర్యగాత్మకత్వాలు సుఖ దుఃఖమూలాలు. అంచేత మనుష్యులకి ధనం కావాలి. ఎలా అంటే, చెప్తాను, విను. ధర్మమూ, కామమూ ధనంవల్లే సాధ్యపడతాయి. విద్యా, జీవనవృత్తీ, సేవా, వడ్డీవ్యాపారమూ – ఇవి ధనసంపాదనకి మూలాలు. చదువుకున్నవాడికి కీర్తీ, కర్షకుడికి నేలా కాలం తెలుసుకోడమూ, మారువేషగాడికి ఏది ఏమైనా మొదటిసరుకు విలువా, దానిమీద వచ్చేలాభమూ కొద్దివ్యయమూ కలగడం శుభప్రదాలు.

"'పశువులు పాలించేవాడు విసుగూ, ఏమరుపాటూ లేకండా వాటివిధం తెలుసుకుని, పోషించి ధనవంతుడవుతాడు. అలాగే తత్వ పరుడైన సేవకుడు గొప్పగా ధనం గడిస్తాడు.

"'వంచనా, జాడ్యమూ ఏమాత్రమూ లేకండా, ప్రభువు మనస్సు తెలుసుకుని, అతడు నియమించిన పని చక్కగా నెరవేర్చిన కర్మకరుడు అపారమైన ధనం గడిస్తాడు.

"'పరులధనం కాజెయ్యకండావుండడమూ, పరుల స్త్రీలని అపహరించకండావుండడమూ, దేవపూజా పితృసమారాధనమూ చెయ్యడమూ, కరుణకలిగివుండడమూ, అతిధిసపర్య చెయ్యడమూ మనిషన్నవాడల్లా చెయ్యవలిసిన పనులు' అన్నాడు శివుడు.

## వర్ణకర్మపరిపాకాలు

"శివుడు చెప్పిన జనుల జీవనమార్గాలు విన్నాక, 'వర్ణాల కర్మలూ, పరిపాకాలూ వివరించు' అని అడిగింది పార్వతి.

"'తమతమ కర్మలు పాడితప్పకుండా నిర్వహించినవారు దేవలోకంలో సుఖపడతారు. తమ పుణ్యం పూర్తయాక తిరిగి భూలోకానికి వచ్చి, వెనక తాము పుట్టిన వర్ణంలో పుడతారు. అలా కాకుండా ఎలాంటి పనులు చేస్తే అలాంటి వర్ణంలో పుడతారు. ఎంత మంచిచేస్తే అంత మంచివర్ణం లభిస్తుంది. ఉత్తమకార్యంచేసి, ఉత్తమవర్ణమైన బ్రాహ్మణవర్ణంలో పుడితే ఎంతో ఆనందం అనుభవానికి వస్తుంది.

"'బ్రాహ్మణాంశలో పుడితే ఆపదవచ్చిందికదా అని బెగిలిపోడు మనిషి. సంపదవచ్చింది కదా అని మదించడు. శౌర్యవృత్తితో పాపుల్ని గెలుస్తాడు. పెద్దలన్నా, బంధువులన్నా ఆదరణ కనపరుస్తాడు. దీనులంటే జాలిపడతాడు. తనకున్నదాంతో వాళ్ళకి సాయపడతాడు. కోపంలేకండా మసులుకుంటాడు' అన్నాడు శివుడు.

## కలిమిలేములు

"'కొందరు కలిమి కలిగి సుఖపడతారు. కొందరు లేమితో దుఃఖపడతారు. దీనికి ఏమిటి కారణం?' అని అడిగింది పార్వతి.

"'దయకలిగినవాణ్ణీ, బలీ భిక్షమూ పెట్టినవాణ్ణీ, నిరుపేదలైనస్నేహితుల్నీ చుట్టాల్నీ చేరదీసినవాణ్ణీ, పుణ్యావృత్తితో జీవితం గడిపినవాణ్ణీ మలిజన్మలో కలిమితో కలకల్లాడినట్లు చేస్తాడు బ్రహ్మ. దయమాలినవాణ్ణీ, లోభంతో బతికినవాణ్ణీ, పాపాత్ముణ్ణీ లేమిపాలు చేసి దుఃఖపెడతాడు. ఒకడిమీద అనుగ్రహంకాని, వొకడిమీద ఆగ్రహంకాని లేవు బ్రహ్మకి. ఎవరికర్మ వారికి కట్టబెడతాడతడు. అంతే.

"'ఈజన్మలో ధనం కలిగివుండి, తిండి తినకండా, ఒంటిమీద గుడ్డకట్టకండా వుండే కష్టజనం, వెనకజన్మలో ఇతర్ల ఉపకారంమీద బతికిన పరాన్నభుక్కు లన్నమాట.

"'తమకి ధనం లేకపోయినా ఎవరివల్లనైనా భోగాలనుభవిస్తున్న వాళ్ళు గతజన్మలో పేదవాళ్ళయివుండి కోరినవాళ్ళకి ఇంత పెట్టాలనుకున్నవాళ్ళు.

"'ఆయాసపడకండా ధనం గడించేవాళ్ళు పూర్వజన్మలో తగినవాళ్ళని తామే కోరి పిలిచి ఇంత పెట్టిన దయాపరులు.

"'ఎంతో ప్రయత్నంమీద ధనం గడిస్తున్నవాళ్ళు తొలి జన్మలో యాచకులు తమని చెయిచాచి అడిగినప్పుడు దాచకండా ఇచ్చినవాళ్ళు.

"'ఆయాసపడినా ధనం గడించలేనివాళ్ళు వెనకజన్మలో దయాదాక్షిణ్యంలేని కిరోటకులయి, యాచకులకి మొండిచెయ్యి చూపిన లోభులు.

"'ముసిలికాలంలో ధనవంతుడైనవాడు గతజన్మలో తన యావవకాలంలో పేదలకి కానిడబ్బివ్వక వార్ధక్యంలో దానానికి పూనుకున్నవాడు.

"'కలిమి కలిగివుండి కూడా రోగాలు కారణంగా భోగాలు అనుభవించలేనివాళ్ళు పూర్వజన్మలో ముందెప్పుడూ ఎంగిలిచేత్తో కాకినికొట్టకండా వుండి, తమకి రోగాలు వచ్చే సమయంలో దానాలూ ధర్మాలూ చేసినవాళ్ళు.

"'మంచి సౌందర్యశ్రీ కలిగిన జనులు తొలిజన్మలో మాంసం తినకండా వుండినవాళ్ళు.

"'రూపహీనులయి వున్నవాళ్ళు వెనకజన్మలో తాము రూపవంతులై వుండి, కురూపుల్ని వెక్కిరించినవాళ్ళు.

"'ఈజన్మలో సౌభాగ్యవంతుడు గతజన్మలో నిజభార్యకి ప్రీతికలిగించినవాడు. సౌభాగ్యం లేనివాడు వెనకజన్మలో భార్యకి ప్రీతి కలిగించనివాడు.

"'ఈజన్మలో అమితమైన జ్ఞానమూ, విజ్ఞానమూ కలిగివుండీన్నీ పేదరికం అనుభవిస్తున్న మనిషి వెనకజన్మలో దానమహిమ వినీకూడా దానంచెయ్యడానికి పూనుకోనివాడు.

"'తగినబుద్ధి లేకపోయినా గొప్పసంపదకలవాడు తొలిజన్మలో జ్ఞానంలేకండావుండి కూడా దయాపరుడై దీనుల్ని పోషించినవాడు.

"'ఈజన్మలో మేధావిఅయి, జ్ఞానవంతుడయి, మహా విద్యావంతుడైనవాడు గతజన్మలో అమితమైన గురుభక్తికలిగి, తన పాండిత్యం ఇతర్లకి కుతూహలంతో పంచిపెట్టిన ఉదారుడు.

"'ఈజన్మలో విద్యాభ్యాసానికి వీలుకలగనివాడు, పూర్వజన్మలో విద్యాధిక్యంవల్ల గర్వపోతయి, సభల్లో శిష్టజనుల్ని భంగపరిచి బాధపెట్టినవాడు.

"'ఈజన్మలో భార్యా, బిడ్డలూ, తానూ సిరిసంపదలు కలిగి భోగులయి, రోగాలు లేకండా సుఖపడినవాడు తొలిజన్మలో పరిశుద్ధమైన ఆచారవంతుడయి, పాత్రోచితమైన దానాలుచేసి, సత్యంగా నడుచుకుని, దయాపరుడయి బతికినవాడు.

"'ఆలుబిడ్డలు మూర్ఖులయి, దారిద్ర్యమనుభవిస్తూ, రోగాలతో కుంగిపోతూ కృశించే జనులు గతజన్మలో క్రోధపరులయి, లోభపరులయి, నాస్తికులయి పశుల్ని పీడించుకుతిన్న గర్వపోతులు.

"'ఈజన్మలో గుడ్డివాడుగావున్నవాడూ, కళ్ళు చెడినవాడూ వెనకజన్మలో వయ్యారం వొలికిస్తూ పరస్త్రీలని వలపుతో చూసినవాళ్ళు.

"'ఈజన్మలో చెవిరోగం కలవాడు గతజన్మలో ఉత్తముల్ని కటువాక్యాలతో కష్టపెట్టినవాడు.

"'కడుపు తెగులుతో బాధపడుతున్నవాడు పూర్వజన్మలో ఇతర్లకి విషంపెట్టినవాడు.

"'ఈజన్మలో అండవ్యాధితోనూ, మూత్రకృచ్ఛవ్యాధితోనూ మధుమూత్రంతోనూ బాధపడేవాడు వెనకజన్మలో పరస్త్రీలతోనూ, కన్యలతోనూ, గేదెతోనూ, ఆవుతోనూ, ఆడగుర్రంతోనూ కామాతురుడై సంగమంచేసినవాడు.

"'ఈ జన్మలో క్షయరోగంతో బాధపడుతున్నవాడు గత జన్మలో ఇతర్లు తినాలని తెచ్చుకున్న మాంసం దొంగిలించిన నీచుడు.

"'ఈ జన్మలో కుష్ఠురోగి అయినవాడు గతజన్మలో ఇతర్లని కట్టీ, కొట్టీ, గాయాలుచేసి, వాళ్ళ అందం చెడగొట్టినవాడు.

"'ఈజన్మలో కుంటివాడు తొలిజన్మలో సాధువుల కాళ్ళూ, చేతులూ విరిచి హింసించినవాడు.

"'ఈ జన్మలో పులిమిరికాయలవల్లా, కంతలవల్లా అలమటపడే వాళ్ళు పూర్వజన్మలో సాధువుల్ని బడితెలతో బాదీ, పగపట్టి, పిడికిళ్ళతో పొడిచీ, కష్టపెట్టిన దుష్టచరిత్రులు.

"'ఈ జన్మలో పాదరోగులు గతజన్మలో అశుచిపాదాలతో దేవాలయాల్లోకి వెళ్ళినవాళ్ళు; తమకిందివాళ్ళని తప్పులేందే కాళ్ళతో తన్నినవాళ్ళు.

"'ఈ జన్మలో జ్వరం, గుల్మరోగం, అతిసారం, పుళ్ళు, మహోదరం, దారుణమైన వాత పిత్త కఫరోగాలు మొదలైన వ్యాధులతో ఎల్లప్పుడూ బాధపడేవాళ్ళు పూర్వజన్మలో నిర్దయులై వినోదంకోసం జీవుల్ని వరసపెట్టి చంపినవాళ్ళు; గురువుని క్షోభపెట్టినవాళ్ళు.

"'ఈ జన్మలో గూనివాళ్ళూ, కుంటివాళ్ళూ, మరుగుజ్జులూ పూర్వజన్మలో ధాన్యం మొదలైనవాట్లో బెడ్డలూ, రాళ్ళూ కలిపి అమ్మినవాళ్ళు; తూనికల్లో మోసంచేసి లాభాలు లాగినవాళ్ళు.

"'ఈ జన్మలో పిచ్చివాళ్ళు గతజన్మలో కపటంతో సాధుజనుల్ని మోసంచేసి ధనం గుంజుకున్నవాళ్ళు.

"'ఈ జన్మలో పిల్లలులేని గొడ్డువాళ్ళు వెనకజన్మలో పితృకార్యం చెయ్యనివాళ్ళు; చిన్నపిల్లల్ని చంపినవాళ్ళు.

"'ఈ జన్మలో నపుంసకులు పూర్వజన్మలో కోడిపెయ్యల అండాలు తీసి, వాటిని ఎద్దులుగా చేసినవాళ్ళు; ఏతప్పూలేకండా కోపంతో ఎడ్లముడ్డిపూసలు చితగ్గొట్టినవాళ్ళు; ఇతర్ల కామసుఖం భంగపరిచిన తుచ్ఛులు.

"'ఈ జన్మలో ముండమోసిన ఆడది వెనకజన్మలో మగణ్ణి వంచనచేసి, ధనం కూడబెట్టిన కల్లాలు; ఉత్సాహంతో పరాయి మగవాణ్ణి మరిగినవయ్యారి.

"'ఈ జన్మలో పరిశుద్ధులై పుట్టి, అసహ్యమైనపనులతో పొట్ట పోసుకునేవారు గతజన్మలో అహంకారంవల్లా, గర్వంవల్లా, మదంవల్లా మాన్యుల్ని పరాభవించినవాళ్ళు.

"'ఈ జన్మలో బానిసలై, గదమాయింపులూ, తిట్లూ, తన్నులూ తింటూ నీచంగా బతుకుతున్నవాళ్ళు తొలిజన్మలో కళ్ళు నెత్తికెక్కి, అహంకారంతో ఎంతోమందిని తప్పులేందే తిట్టీ, తన్నీ, కొట్టీ బాధపెట్టినవాళ్ళు. నిజంగా అలాటివాళ్ళమీద జాలిచూపడమే మంచిది.

"'ఈ జన్మలో ధనవంతుల ఇంటివాకిట కాపలాకాస్తూ, దైన్యంతో దుఃఖమనుభవిస్తున్నవాళ్ళు వెనకజన్మలో భోగపరులయి, మాననీయులకు దర్శనమివ్వనివాళ్ళు.

"'ఈ జన్మలో రాజు దండించినవాళ్ళు గతజన్మలో ఏ అపరాధం చెయ్యనివాళ్ళని అకారణంగా క్రూరంగా దండించినవాళ్ళు.

"'ఈ జన్మలో సర్వసంపదలూ పోయినవాళ్ళు వెనకజన్మలో

ఇతర్లు తమదగ్గిర నమ్మి దాచుకున్న ధనం దోచుకున్న అసత్యవాదులు; లోభులు ; కుత్సితులు.

" ' ఈ జన్మలో బంధువులతోసహా వొక్కమారు హతవారి పోయినవాళ్ళు గతజన్మలో నిర్దయులయి నీచమైన పగపూని నరహత్య చేసిన దురాత్ములు.

" ' నేను చెప్పిన ఈ పాపకర్ములందరికీ నరకం తప్పదు. ఆ నరకబాధలు అనుభవించాక భూలోకంలో వాళ్ళు నరజన్మఎత్తినప్పుడు జరిగే విధానాలే నేను చెప్పినవి. అయితే అంత అధికం పాపం చెయ్యని వాళ్ళకే నరజన్మ లభిస్తుంది. అప్పుడు చేసినకర్మఫలం ఆ శరీరంతో అనుభవించరు వారు. మరుజన్మలోనే అనుభవిస్తారు. మునులూ, దేవతలూ అలా కాదు. ఆ తనువులోనే తమ తపఃఫలం అనుభవిస్తారు వారు ' అన్నాడు శివుడు.

## కర్మ ఫలం తప్పదు

" ' ప్రభూ ! నీదయవల్ల ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. కృతార్థురాలనయాను. మనుషులు మరుజన్మలో కాని తాము ఈ జన్మలో చేసుకున్న కర్మఫలం అనుభవించరన్నావు. అయితే తప్పు (పాపం) చేసినవాళ్ళని రాజులు దండిస్తారు కదా, ఈ తప్పుకి ఈ దండన అని ! అయినప్పుడు తాము ఆ జన్మలో చేసినకర్మఫలం ఆ తనువులోనే అనుభవించడం కాదా ?' అని ఎదురడిగింది పార్వతి.

" ' కాదు ' అన్నాడు శివుడు, ' రాజదండన అనుభవించిన వాడు తాను ఈ జన్మలో చేసిన కర్మఫలమే అనుభవించాడని స్థూలంగా అనిపిస్తుంది. కాని నిజానికి అతడు పూర్వజన్మలో చేసుకున్న దాని ఫలమే ఇప్పుడు అనుభవించాడని తెలుసుకోవాలి. మరోమాట, రాజులు తమ రాజరికంలో తప్పుచేసినవాళ్ళని దండిస్తారు. ఎందుకు

దండిస్తారో తెలుసా ? ఆ దండనచూసి తక్కినవాళ్ళు తిరిగి ఆ తప్పు చెయ్యకండా వుండాలని వారి అభిప్రాయం.'

"'అయితే, రాజదండన అనుభవించినవాడి పాపం పోతుందా, పోదా ?' అని మళ్ళీ అడిగింది పార్వతి.

"'పోతుంది. రాజదండన అనుభవించినవాడు యమదండన అనుభవించడు. తప్పులేందే దండించినవాణ్ణీ, తప్పుచేసి దండన అనుభవించనివాణ్ణీ యముడు దండిస్తాడు' అన్నాడు శివుడు.

"'అనుభవిస్తేనే కాని కర్మఫలం వొదలదన్నావు. చేసుకున్న కర్మ ఎవ్వడూ తప్పించుకోలేడన్నావు. ఎలా అయినా అది అనుభవించవలిసిందే అన్నావు. కాని ప్రాయశ్చిత్తంచేసుకుంటే పాపఫలం పోతుందంటారు కదా ! అశ్వమేధయజ్ఞంచేస్తే, అన్ని పాపాలూ పోతాయని విన్నాను. ఇదెలా సంభవమంటావు ?' అని అడిగింది పార్వతి.

"'దేవీ, కోరికలతో చేసిన కర్మలఫలం అనుభవించే తీరాలి ప్రాణులు. అది ప్రాయశ్చిత్తాలతో పోదు. కోరికలు లేని కర్మలఫలం మాత్రం ప్రాయశ్చిత్తంవల్ల పోతుంది. సందేహం లేదు. కనక దేవతలయినా, రాక్షసులయినా, మునులయినా కర్మఫలం అనుభవించవలిసిందే తప్పదు. అనుభవిస్తేనే కాని వొదలదు కర్మఫలం. ఇది అవగాహనచేసుకోవాలి నువ్వు.

"'సుకృతంచేసిన నరుడు ఆసుకృతఫలంవల్ల స్వర్గానికి వెళతాడు. అది చెల్లిపోడంతోనే తిరిగి భూలోకంలో మనిషిజన్మ ఎత్తుతాడు. అలా జన్మించినవాడికి మంచి సంపదా, వైభవమూ ప్రాప్తిస్తాయి. ఉద్దేశరూపంగా కర్మలవిధానం తెలియచేశాను. ఇంకా ఏమడగాలనుందో అడుగు' అన్నాడు శివుడు.

"'కర్మలు ప్రాణివశమనీ, గ్రహాలవశమనీ రెండురకాలు చెపుతారు. ఇందులో ఏది నిజం?' అని అడిగింది పార్వతి.

"'గ్రహాచారం కారణంగా శుభాలూ, అశుభాలూ చేస్తాడు మనిషి. అంతేకాని, గ్రహాలు తనచేత చేయిస్తాయా? తన కర్మకి తానే కర్త. అంచేత కర్మఫలం అనుభవించి తీరవలిసిందే ఎవడైనా' అన్నాడు శివుడు.

## చావు అంటే?

"'చావు అంటే ఏమిటి?' అని అడిగింది పార్వతి.

"'ఆత్మడు నిత్యుడు' అంటూ అందుకున్నాడు శివుడు, 'దేహం అనిత్యమైంది. ముసిలితనంవల్లా, రోగంవల్లా దేహం వికారంగా పనికిరానిదయినప్పుడు, ఆత్మడు ఆశరీరం వొదిలేసి పోతాడు. చావు అంటే అదే. ఇలాగే జీవులు గతానుగతికంగా చావుపుట్టుకలతో ప్రవర్తిస్తున్నారు.'

"'బాగుంది. కాని తరుచు పిల్లలు చచ్చిపోతున్నారు. ముసిలాళ్ళు ఎంతోకాలం బతుకుతున్నారు. దీని కేమిటి కారణం?

"'కాలం మరణం కలిగించదు. పురుషుడి శరీరం జీర్ణించినట్టు మాత్రం చేస్తుం దది. గతజన్మలోని కర్మలు ఆయువుని వృద్ధిచెయ్యగా బతుకూ, తరిగించగా చావూ సంభవిస్తాయి' అన్నాడు శివుడు.

"'ఆయువు ఎలా పెరుగుతుంది? ఎలా తరుగుతుంది?' అని మళ్ళీ అడిగింది పార్వతి.

"'చెపుతాను, విను' అంటూ అందుకున్నాడు శివుడు, 'క్షమా, సత్యమూ, దయా, శౌచమూ, గురుభక్తీ - వీటిమూలంగా ఆయువు పెరుగుతుంది. కోపమూ, అసత్యమూ, క్రూరతా, అశుచిత్వమూ, గురుద్రోహమూ - వీటివల్ల ఆయువు తరుగుతుంది.

"'తపస్సువల్లా, బ్రహ్మచర్యంవల్లా, పరోపకారంవల్లా, మితాహారంవల్లా, రసాయనాభ్యాసంవల్లా ఆయువు పెరుగుతుంది. అయితే వీటిమీద నరుడికి ప్రీతికలగడం తన పూర్వజన్మకర్మఫలంమీద ఆధారపడి వుంటుంది.

"'తన లావుకి మించినపని చెయ్యడంవల్లా, అయుక్తమూ అపథ్యమూ అయిన భోజనంవల్లా ఆయువు తరుగుతుంది. ఇదికూడా పూర్వజన్మకర్మఫలంవల్లే కలుగుతుంది.

"'పార్వతీ! ఇంకా వోవిశేషం చెపుతాను, శ్రద్ధగా విను. సుకృతంచేసుకున్నవాళ్ళు చిరకాలం స్వర్గంలో నివసిస్తారు. తుదికి భూలోకానికి వచ్చి, చిరాయువు కలిగి బతుకుతారు. సుకృతం చేసుకోనివారు నరకంలో పడతారు. అదిగో వాళ్ళే తిరిగి చివరికి భూలోకంలో నరులై పుట్టినప్పుడు అల్పాయుష్కులవుతారు' అన్నాడు.

## జీవుడికి ఆడా మగా అని లేదు

"'పురుషుడూ, స్త్రీ అని ప్రాణులు రెండువిధాలు కదా! ఈ ఉభయులలో జీవుడు ఎలా వర్తిస్తాడు?' అని అడిగింది పార్వతి.

"'అడగవలిసిన ప్రశ్నే అడిగావు' అన్నాడు శివుడు, 'జీవుడికి ఆత్మసంబంధమైన స్త్రీత్వమూ, పురుషత్వమూ లేవు. అహంకారంవల్ల ఆత్మకి కర్మత్వం కలుగుతుంది. అదుగో అందువల్లే పురుషుడనీ, స్త్రీఅనీ అనుకోడం జరుగుతుంది.

"'కర్మలకి ఆత్ముడు కర్త కాడు. మనిషి శరీరానికి వాతమూ, కఫమూ, పిత్తమూ ఎలా కలుగుతాయో అలాగే ఆత్మన్ని సత్వ రజస్తమోగుణాలు ఆవరిస్తాయి. కర్మలకి అవే కర్తలు.

" ' సత్యమూ, దయా, శౌచమూ మొదలైనవి సాత్వికాలు. లోభమూ, సంగమూ మొదలైనవి రాజసాలు. అసత్యమూ, హింసా పరత్వమూ, భయమూ, అలసత్వమూ, అధైర్యమూ, నిద్రా మొదలైనవి తామసాలు. ఇవి పురుషుణ్ణి నానాముఖాలా వికారపరుస్తూ వుంటాయి. అంచేత అంతా ఈమూడుగుణాల నాటకమే. సాత్విక రాజస తామసాత్ములైనవారి పుణ్యలోకానుభవం మనుష్యభావాన్ని ఊర్ధ్వగతికి మళ్ళిస్తుంది. నిర్గుణుడైనవాడికి మోక్షలక్ష్మి లభిస్తుంది.

" ' కర్మలు శుభమైనవైతే శుభఫలాలు కలుగుతాయి. అశుభమైనవైతే అశుభపలాలు కలుగుతాయి. ఎదటివారికి ప్రియం కాని కర్మలవల్ల కూడా మేలుపొందడం జరుగుతుంది. ఎలా అంటావా? యజమాని భృత్యుల్ని బెదిరించడంవల్లా, ఉపాధ్యాయుడు శిష్యుల్ని అదలించడంవల్లా, వైద్యుడు రోగికి మందులివ్వడంవల్లా బాధపెడతారు. అయితే ఈపనులు సుకృతాలే అయి ఫలిస్తాయి.

" ' జరాయుజాలూ, (మావిలో పుట్టిన మనుషులూ, పశువులూ మొదలైన జీవులు), అండజాలూ (గుడ్లలోపుట్టిన పక్షులూ, పాములూ మొదలైనవి) ఇంద్రియాలు కలిగి వుంటాయి. ఉద్భిజాలు (చెట్లూ, లతలూ మొదలైనవి) స్పర్శజ్ఞానం కలిగి వుంటాయి. స్వేదజాలు (చెమటవల్ల పుట్టిన నల్లులూ, పేలూ మొదలైనవి) స్పర్శ జ్ఞానమూ, చూపూ కలిగివుంటాయి. జరాయుజాలలో నరుడు ఉత్తముడు. మంచిమాటలు వినకపోతే మనిషీ, పశువూ వొక్కటే. కనక మంచిమాటలు విధిగా వినాలి మనిషి.

" ' తమం రెండువిధాలు. అందులో వొకటి శార్వరము (చీకటి సంబంధమైంది). రెండోది దేహజం (దేహంలో పుట్టింది). శార్వరతమం తేజస్సు ప్రకాశించడంతోనే నాశనమవుతుంది. దేహజతమం మంచి విషయం వినడంవల్ల నాశనమవుతుంది.

" 'ఆ తమస్సూ నాశనంచెయ్యడంకోసం బ్రహ్మ తపస్సు చేశాడు. వేదాలూ, వేదాంగాలూ సంపాదించాడు. ఆ వేదాలవల్లా, వేదాంగాలవల్లా కార్యాకార్యాలు తెలుస్తాయి. కార్యాకార్యాలు తెలుసుకుంటే బుద్ధి కలక తేరుతుంది. గాలిదెబ్బకి మేఘాలు చెదిరి పోతాయి. అలాగే మంచిమాటలు (వేదాలు) వినడంవల్ల కామమూ, క్రోధమూ మొదలైన దుర్గుణాలు పటాపంచలైపోతాయి. జ్ఞానం తెలిసినవారు నరులలో దేవతల్లా తేజరిల్లుతారు. మంచివిషయాలు వినడంవల్ల పరిజ్ఞానం కలుగుతుంది. పరిజ్ఞానంకలవాళ్ళు అల్పకర్మ అయినా అధికఫలం ప్రసాదిస్తుంది. అజ్ఞాని అయినవాడి సత్కర్మ ఎంత గొప్పదైనా ఫలవంతం కాదు. కనక శ్రుతవంతుడు కావడం అవసరం మనిషి.

" 'చచ్చి, వెంటనే పుడితే పూర్వజన్మసంబంధాలు అన్నీ బుద్ధిలో మసలాడుతూ వుంటాయి. అలాటివాణ్ణి జాతిస్మరుడంటారు. పెద్దవాడైనకొద్దీ ఆపూర్వజ్ఞానం క్రమంగా మాసిపోతుంది. పూర్వజన్మ స్మృతి కలిగివుండడమూ, అది కలదని నిశ్చయించి చెప్పడమూ పూర్వజన్మ వుంది అనే ఆస్తికుల మతం.

" 'చచ్చిపోయినమనిషి కొంచెంసేపటిలో బతికి లేవడం కూడా వొకొక్కచోట జరగడం కద్దు. అదేమిటో తెలుసా? తెలివి మాలిన యమదూతలు పొరపాటున జీవుణ్ణి తీసుకుపోతారు. అప్పుడు యముడు కనికరించి వొదిలేస్తాడు. దాంతో జీవి తాను వొదిలిపోయిన కళేబరంలోకి తిరిగివచ్చేస్తాడు. చచ్చిన కళేబరం బతికి లేస్తుంది. అంతే, మరేమీలేదు.'

## కలలు

" 'కలలంటే ఏమిటి?' అని అడిగింది వాంఛల.

" 'నిద్రపోతున్నవాళ్ళ మనోవ్యాపారమే కల' అన్నాడు

శివుడు, 'మనస్సు రాబోయేదాన్ని చూస్తుంది. కనక రాబోయే శుభాలూ, అశుభాలూ సూచిస్తాయి కలలు.

"'జనుల కర్మా, కాక వారిఉత్సాహమూ కర్మవర్తనానికి కారణం?' అని మళ్ళీ అడిగింది పార్వతి.

"'దైవం కర్మ చెయ్యదు. దైవం ఫలం మాత్రం ప్రసాదిస్తుంది. పూర్వకర్మే దైవం అనిపించుకుంటుంది. ఇప్పటికర్మ పౌరుషమనిపించుకుంటుంది. పౌరుషం గతి కృషిలావుంటుంది. వానా, గాలీ వంటిది దైవం.తవ్వడంవల్ల నీరూ, రాపిడివల్ల అగ్గీ ఎలా లభిస్తాయో అలాగే మనిషిపనివల్ల దైవం తోడ్పాటు ఫలిస్తుంది. ప్రయత్నం చెయ్యనివాడు దైవసహాయం ఎలా పొందగలుగుతాడు? కనక కర్మఫలానికి ప్రయత్నమూ, దైవసహాయమూ - రెండూ కారణాలు. సందేహం లేదు' అన్నాడు శివుడు.

## ఆత్మ డు గర్భంలో ఎలా ప్రవేశిస్తాడు?

"'ఆత్మడు గర్భంలో ఎలా ప్రవేశిస్తాడు?' అని అడిగింది పార్వతి.

"'స్త్రీపురుషుల సంయోగమూ, శుక్రమూ, రుతురక్తమూ, దైవమూ - ఇన్నీ కారణం ఆత్ముడు గర్భంలో ప్రవేశించడానికి' అన్నాడు శివుడు, 'మాయారహితుడైన ఆత్ముడు అహంకారం కారణంగా పుట్టువు అనే చెరలో పడతాడు; నానా ఆయాసాలూ అనుభవిస్తాడు.

"'పార్వతీ! దైవరహస్యం వినిపిస్తాను, విను. పూర్వం మనుషులు తమ పూర్వజన్మలోని కర్మలు తెలుసుకుంటూ వుండేవాళ్ళు. అంచేత, అందరూ మంచే చేసేవాళ్ళు. అందువల్ల అందరూ స్వర్గానికి వెళ్ళేవాళ్ళు. స్వర్గంలో తొడతొక్కిడి అధికమైంది. నరులందరూ

అమరులైపోయారు. దేవతలకి ప్రాపిరిసలపడం లేదు. సంకటమే వచ్చి పడింది వారికి. బ్రహ్మ ఉపాయం ఆలోచించాడు. మనుషులకి పూర్వ జన్మస్మృతిలేకండా చేశాడు. వాళ్ళలో కామ క్రోధాలు పుట్టించాడు. దాంతో మనుషులు నరకలోకం దారిపట్టారు. నరకంలో నరుల గందిక హెచ్చింది. అది కూడా సరికాదని భావించాడు బ్రహ్మ. స్వర్గనరకాలకి మనుషులు సరిసగంగా వెళ్ళడం మంచిదని నిశ్చయించాడు. అందుకని శాస్త్రాలూ అవీ నిర్ణయించాడు.

## పునర్జన్మ వుందా?

"'మనిషి మరణించాక మళ్ళీ పుడతాడా లేదా? అని కిందా మీదా పడుతూవుంటారు జనులు. నిజంగా పునర్జన్మ వుందా? లేదా?' అని అడిగింది పార్వతి.

"'పునర్జన్మ వుంది అనడం, లేదు అనడం వొక ఊహమీద చెప్పిందే కాని నిశ్చయంగా చెప్పిన మాట కాదు. దేవతలకి కూడా ఇది తెలియదు. అలాంటప్పుడు మనుషులకి తెలియకపోడంలో తప్పేముంది?

"'పునర్జన్మ వుంది. అయితే అది మీదమీద తెలియదు. వేదవాక్యాలు అర్థంచేసుకుని, శ్రద్ధగా ఆలోచిస్తే క్రమంగా అవగతమవుతుంది. కాని అన్యథా కాదు, ఎంతధీమంతులకయినా' అన్నాడు శివుడు.

## మనుషుల మాయశరీరాలు

"'చచ్చిపోయినవాళ్ళకి ఆకారం వుండదు కదా! వాళ్ళని యమదూతలు పట్టుకపోడమూ, యముడు శాసించడమూ ఎలా పొసుగుతుంది?' అని అడిగింది పార్వతి.

" 'కాలంతీరాక మనుషుల స్థూలశరీరాలు విడిపించి, మాయా శరీరాలు కల్పించి పట్టుకుపోతారు యమదూతలు. ధర్మపరులైన వాళ్ళని పరిమళిస్తున్న మృదువైనమార్గంలో తీసుకువెళతారు. కొంత పాపమూ, కొంత పుణ్యమూ చేసిన మధ్యరకంవాళ్ళని బాధలేని మంచిదారిలో తీసుకువెళతారు. పాపాత్ముల్ని కరుకైన మురికిదారిలో నడిపించి తీసుకువెళతారు. అంతమందినీ యముడి ఎదటపెడతారు. యముడు విచారిస్తాడు. ధర్మపరుల్ని తగిన పుణ్యలోకాలకిపంపుతాడు. పుణ్యపాపాలుచేసిన మధ్యరకంవాళ్ళని మానవలోకానికి పంపుతాడు. పాపాత్ముల్ని నరకానికి పంపుతాడు. ధర్మపరులకు నమస్కారం చేస్తాడు. మధ్యరకంవారిని మన్నిస్తాడు. పాపాత్ముల్ని గదమాయిస్తాడు' అన్నాడు శివుడు.

## నరకం

" 'నరక మెలావుంటుంది? అక్కడ యముడు పాపాత్ముల్ని ఎలా వేధిస్తాడు?' అని అడిగింది పార్వతి.

" 'భూలోకానికి కింద రౌరవం అనే నరకముంది' అంటూ అందుకున్నాడు శివుడు, 'దానికి అవతల మహారౌరవం వుంది. మహారౌరవం అవతల కంటకావన ముంది. రౌరవం కంటే మహారౌరవంలోనూ, మహారౌరవం కంటే కంటకావనంలోనూ కష్టాలు హెచ్చుగా వుంటాయి. అంతేకాదు, అగ్నికుండమని వొక నరకముంది. పంచకష్టమని వొక నరకముంది. ఈ అయిదు నరకాల్లోనూ పాపులు చేసిన పాపాల హెచ్చుతగ్గు లనుసరించి వాళ్ళని కాల్చడమూ, కత్తిరించడమూ, కట్టడమూ, కొట్టడమూ తన భటులచేత చేయిస్తాడు యముడు. ఎవరిపాపాలకి తగినట్టు వారిని విచారించి బాధలు పెట్టిస్తాడు. ఇనపకుక్కలచేత కరిపిస్తారు యమభటులు. ఉక్కుపురుగులచేత

దొలిపిస్తారు. ఇనపగద్దలచేత చీల్పిస్తారు. నానాయాతనలూ పెట్టి దండిస్తారు.

"'తమ పాపాలు వొదిలిపోయేదాకా దారుణమైన యాతనలు అనుభవిస్తారు పాపులు. అనంతరం క్రమంగా కీటజన్మలూ, పక్షి జన్మలూ, మృగజన్మలూ ఎత్తి, చివర మనిషిజన్మ ఎత్తుతారు.

"'పార్వతీ! ఇదీ పాపులైన మనుషులు యమదండన అనుభవించి, పాపాలు వొదుల్చుకుని, క్రమంగా మళ్ళీ మనుషులై పుట్టే క్రమం.'

## పాపాలు

"'ఏవి పాపాలు?' అని మళ్ళీ అడిగింది పార్వతి.

"'మానసపాపాలు, వాచికపాపాలు, కాయికపాపాలు అని పాపాలు మూడురకాలు. పరులధనం అపేక్షించడమూ, పాపం అనుమోదించడమూ, ధర్మాన్ని ద్వేషించడమూ మొదలైనవి మానసపాపాలు. అబద్ధమాడడమూ, పరుషంగా మాట్లాడడమూ మొదలైనవి వాచికపాపాలు. హత్యచెయ్యడమూ, కొట్టడమూ, తినరానివి తినడమూ, పరుల భార్యలతో పోడమూ, కల్లు తాగడమూ మొదలైనవి కాయికపాపాలు. తాగరానిది తాగడం పాపాల్లోకల్లా మహాపాపం తాగుడువల్ల నింద నెత్తిని పడుతుంది. ప్రాణంమీదికీ వస్తుంది. తుదకి నరకసముద్రంలో మునగవలిసీ వస్తుంది.

"'మద్యపానం నిర్మూలనం కాకపోతే లోకం మర్యాద తప్పి, వ్యాకులపడుతుంది. మద్యపానంవల్ల కలిగే కీడు మనిషినిఎంత అధోగతి పాలుచేస్తుందో చెప్పడం కష్టం. కనక ఎలా అయినా సరే, మద్యపానం మానడమే అవసరం మనిషన్నవాడు. ఏజాతిమనిషయినా సరే, తాగుడు మానుకుంటే యశస్సూ, సంపదా, వైభవమూ, పుణ్యగతులూ సాధించవచ్చు. మద్యపానం మహాపాపం' అన్నాడు శివుడు.

## పు ణ్యా లు

" 'ఏవి పుణ్యాలు ?' అని మళ్ళీ అడిగింది పార్వతి.

" 'పార్వతీ! నువ్వు ప్రశ్న మీద ప్రశ్న వేస్తూవుంటే పరమానందంగా వుంది నాకు' అంటూ అందుకున్నాడు శివుడు, 'గుణవంతురాలివి నువ్వు. చెపుతాను, విను. ఔపరమికం, నిరుపకరణం, సోపకరణం అని పుణ్యం (సుకృతం) మూడు విధాలు. ఔపరమికం అనేది పాపవర్జన. తెలియనివాళ్ళు కానలేరు దాన్ని. పెద్దప్రయత్నమేమీ అక్కరలేదు. వ్యయం కూడా దీన్లో ఏమీ లేదు. పరలోకభీతి కలిగి, పాపాలకి దూరంగా వుంటే చాలు, సుగతిసౌఖ్యం కలుగుతుంది. అది ఆత్మాధీనం కూడాను. ఈ సులువు తెలియక నరకంలో పడతారు జనులు. సులువెరిగినవాళ్ళు శాస్త్రాలవల్లా, వృద్ధయోగంవల్లా, ధైర్యంతో ఇంద్రియాలు అదుపులో వుంచుకుని, యమం సాధించి, స్వర్గానికి వెళ్ళవచ్చునంటే, ఇంక ధర్మాభియుక్తి గురించి వేరే చెప్పడమెందుకు ?

" 'నిరుపకరణం అంటే శౌచమూ, సత్యమూ, శాంతీ, దాంతీ, ఆర్జవమూ, వ్రతనిష్ఠా, ఉపవాసమూ, బ్రహ్మచర్యమూ మొదలైనవి. అభ్యంతరమూ, బాహ్యమూ అని శౌచం రెండువిధాలు. హృదయ శౌచం అభ్యంతరం. ఆహారశుద్ధీ, అంగశోధనమూ బాహ్యం. కన్నదీ, విన్నదీ, ఉన్నది వున్నట్టు చెప్పడం సత్యం అనిపించుకుంటుంది. బుద్ధీంద్రియాలు అదుపులోకి మళ్ళించుకోడం శాంతి. కర్మేంద్రియాల యోగ్యప్రవృత్తి శాంతి. కుటిలభావం లేకండా వుండడం ఆర్జవం. మంచిపని పూనికతో సాగించడం వ్రతం. భోజన నిగ్రహం ఉపవాసం. మన్మథుడిపాల పడకండా వుండడం బ్రహ్మచర్యం. తీర్థాలు సేవించడం కూడ నియమవిశేషమే అవుతుంది. కనక తీర్థాలు సేవించడంకూడా వివరించాలి. అన్నినదులూ తీర్థాలనిపించుకుంటాయి. సముద్రంలో

కలిసే ప్రతినదీ పుణ్యఫల మిస్తుంది. అవీ, మునులు మాననీయంగా భావించే ప్రదేశాలూ, సముద్రసంయోగస్థలాలూ, అన్యోన్యసంగమ దేశాలూ పరమతీర్థాలు. సముద్రం మహాతీర్థం. పూర్వమునులు మెచ్చినచోట్లు ఉత్తమతీర్థాలు. బాహ్యాశుచితో తీర్థాలలో మునగడం మంచిది. నియమాలు నిర్వహించి బయటికి వచ్చాక, దేవతార్చనా, బ్రాహ్మణపూజా అవస్యం చెయ్యవలిసిన పనులు. దగ్గిరతీర్థాలకంటే దూరపుతీర్థాలు మేలుచేస్తాయి. శారీరాయాసం దానికికారణం. వేదాలు చెప్పిన మాట ఇది.

" 'సోపకరణం అంటే గృహస్థులు ధనధాన్యాలతో వైదిక పితృకాది పుణ్యకార్యాలలో చేసే దానం. న్యాయార్జితమైన ధనం, శాంతీ మొదలైనగుణాలు కలిగి వేదం తెలిసిన బ్రాహ్మడికి దానం చేస్తే అధికమైన ఫలం కలుగుతుంది. ముందు చెయ్యవలిసిన దానం ఘనంగా చేసి తరవాత విచారిస్తే ఫలముండదు. ఇంతదానం చేశానని తన్నుతాను పొగుడుకున్నా ఆదానం నిష్ఫలమవుతుంది. ఈ రెండూ మానుకుంటే దాత మహాఫలం పొందుతాడు.

## దానాలు

" 'ఏయేపదార్థాలు దానమియ్యదగినవి?' అని అడిగింది పార్వతి.

" 'అన్నమూ, నీరూ అన్నిజంతువులకూ ప్రాణం. పరమ పదార్థాలివి. కనక దానమియ్యదగిన పదార్థాలన్నిటిలోనూ మేలైన వివి. అతిథులకి అన్నపానాలు దానంచెయ్యడమంటే చిరకాలం స్వర్గంలో నివాసం స్థిరపరుచుకోడం అన్నమాట. బంగారమూ అగ్నీ వొకటే. అంచేత బంగారందానం అతి పవిత్రమైంది. మంచి బ్రాహ్మడికి ఆవు దానంచేస్తే అన్నికోరికలూ అవలీలగా ఫలిస్తాయి. ఆదానమిచ్చే

ఆవుకి ఎన్ని రోమాలుంటే అన్ని సంవత్సరాలు స్వర్గంలో నివసిస్తాడు దాత. అందులోనూ కపిలగోవు దానమిచ్చినవాడు తన ఇరవైవొక్క తరంవాళ్ళని ఊర్ధ్వలోకాలకి పంపగలుగుతాడు. భూమి దానంచేసిన వాడికి స్వర్గంలో స్థిరనివాసం దొరుకుతుంది. భూమి వున్నంతకాలం అక్కడ సౌఖ్యాలనుభవిస్తా డతడు. భూమివల్ల సకలవిభూతీ లభిస్తుంది. కనక భూమిదానంచేస్తే అన్నివస్తువులూ దానంచేసినట్టవుతుంది. భూదానంవల్ల వొదిలిపోని పాపాలంటూ వుండవు. కన్యాదానంచేస్తే పితృపతి సంతోషిస్తాడు. దేవతలు ప్రీతిపొందుతారు. ఈజన్మలోనే కర్తకి తేజస్సూ, యశస్సూ, సిరిసంపదలూ లభిస్తాయి. తగినవాడికి విద్యాదానం చేస్తే అనంతమైన ఆనందం కలుగుతుంది. దక్షిణలిచ్చి పేదలకి విద్యాదానం చేయించినా కూడా ఈఫలమే కలుగుతుంది. నువ్వులకుప్ప దానంచేస్తే అగ్నిష్టోమం చేసినంత ఫలం లభిస్తుంది. వస్త్ర దానంవల్ల దీర్ఘాయువు సిద్ధిస్తుంది. గొడుగు దానంచేస్తే అన్నిపీడలూ హరించిపోతాయి. దాసదాసీజనం దానంచేస్తే కర్మమోచనం కలుగుతుంది. దీపదానంచేస్తే ఆత్మ నిర్మలభావంతో ప్రకాశిస్తుంది. నీటి ప్రవాహం దాటలేనివాళ్ళని దాటిస్తే సమస్తవ్యసనాలనించీ తరించి పోతాడు కర్త. దారి బాగుచేస్తే సంతానం కలుగుతుంది. రోగులకి మందులు దానంచేస్తే, రోగాలు నిర్మూలిస్తాయి. బాటసారులయిన సాధుజనులు వుండడానికి వునికి కల్పిస్తే సర్వశుభాలూ సమకూడతాయి' అన్నాడు శివుడు.

## య జ్ఞా లు

"'యజ్ఞవిధానం వివరించు' అని అడిగింది పార్వతి.

"'వైదికమూ, లౌకికమూ అని యజ్ఞం రెండువిధాలు. వర్ణ ధర్మంప్రకారం గడించిన ధనధాన్యాలతో దేవతలకి తృప్తికలిగినట్టు రుత్విజులతో సాగించే యజ్ఞం వైదికం. దేవుళ్ళ ఉత్సవాలు చెయ్య

డమూ, గీతవాద్యాలతో, గంధమాల్యాలతో, ధూప దీపాలతో, భోజ్య, భక్ష్యాల నైవేద్యంతో దేవపూజ చెయ్యడమూ లౌకికం. ఈ రెండురకాల యజ్ఞాలూ దేవతలకి హితమైనవే.

"'ధర్మాలూ, దానాలూ, వ్రతాలూ ఏవి యజ్ఞాలతో సాటి రావు. నిజానికి యజ్ఞకర్త లోకోత్తరుడంటే నమ్ము. యజ్ఞకర్తకి ఇవ్వడమూ, యజ్ఞకర్తదగ్గిర పుచ్చుకోడమూ రెండూ పుణ్యకార్యాలే.

"మనుషుల మానసవ్యాపారాలు దేవతలు తెలుసుకుంటారు. అంచేత మనస్సు ఎక్కడో వుండి, ఎంత గొప్పగా యజ్ఞాలు చేసినా, దాన ధర్మాలు చేసినా ఫలంమాత్రం సున్నా అవుతుంది. అంతఃకరణ శుద్ధితో చేసిన యజ్ఞాలే అనంతఫలం ప్రసాదిస్తాయి' అన్నాడు శివుడు.

## పితృకార్యాలు

"'యజ్ఞాలవిషయం విన్నాను. ఆనందించాను. పైతృకవిధులు కూడా వినిపించు' అంది పార్వతి.

"'గయా, కురుక్షేత్రమూ, గంగాతీరమూ మొదలైన పుణ్య ప్రదేశాలు అతి ఫలప్రదాలు పితృకార్యాలకి. మాఘమాసమూ, భాద్రపదమాసమూ, బహుళపక్షమూ, అపరాహ్ణమూ, అమావాస్యా త్రయోదశీ, నవమీ మొదలైన తిథులూ పితృదేవతలకి తుష్టి కలిగిస్తాయి. తోబుట్టువు కుమారుడూ, కూతురుకొడుకూ ఇచ్చే తిలోదకాలు పితృదేవతలు పరమ పవిత్రమని భావిస్తారు. పితృక్రియలో శుచిత్వమూ, శాంతమూ, పొరపాటులేకండా వుండడమూ ఎంతయినా అవుసరం. శుక్లపక్షమూ, దినంలో పూర్వాహ్ణమూ, రెండుతిథులు వచ్చిన దినమూ, కర్తపుట్టినదినమూ పితృకర్మకి పనికిరావు. ఆజ్యమూ, పెసలూ, పాయసమూ, పిండివంటలూ పితృకార్యంలో ముఖ్యమైనవి.

"'శ్రోత్రియులూ, నిరోగులూ, అంగవైకల్యం లేనివాళ్ళూ,

పైతృకకర్మకి తగినవాళ్ళు. అన్నిటికంటే వాళ్ళు మంచి చరిత్ర కలవాళ్ళయి వుండడం ముఖ్యం. సగోత్రులూ, భార్య చచ్చినవాళ్ళూ, ఇతరకులాలవాళ్ళూ పితృక్రియలకి పనికిరారు. గంధమాల్యాలూ, పువ్వులూ, ధూపదీపాలూ, వస్త్రాలూ ఇచ్చి అర్చించి, మంచిభోజనాలు ఏర్పరిచి, క్రమవృత్తిలో పిండప్రదానవిధి నిర్వహించడం మెచ్చుకుంటా న్నేను' అన్నాడు శివుడు.

## పి తృ దే వ త లు

"'మనుషులు మరణించాక మళ్ళీ పుడతారు కదా! అయి నప్పుడు పితృపూజ అని ఎవరికోసం? ఇందులో వున్న రహస్యమేమిటి?' అని అడిగింది పార్వతి.

"'కలగవలిసిన సందేహమే కలిగింది నీకు' అంటూ అందు కున్నాడు శివుడు, 'నిజంగా పరమరహస్యం ఇది. విను. దేవతలవంటి వారే పితృదేవతలు కూడా. దేవతలు ఉత్తరం వేపు వుంటారు. పితృ దేవతలు దక్షిణంవేపు వుంటారు. దేవతలకి అర్పించే పూజ హవ్య మంటారు. పితృదేవతలకి అర్పించింది కవ్య మంటారు. చచ్చినవాళ్ళకి శ్రాద్ధంచేస్తే పితృదేవతలు సంతోషిస్తారు. ఆయువూ, సిరీ, కీర్తీ మొదలైన ఐహికాలూ, సుగతీ అనుగ్రహిస్తారు. దేవతలకూ, అసురులకూ, గరుడులకూ, యక్షులకూ కూడా పూజనీయులు పితృ దేవతలు.

"'ఇంకోమాట, ఎవడిశక్తి ననుసరించి వాడు దానంచేస్తాడు. తక్కువశక్తి కలవాడు తక్కువ దానంచేస్తే ఎంత ఫలమో, ఎక్కువ శక్తికలవాడు ఎక్కువ దానంచేస్తే అంతేఫలం. ఎలా అంటావా? ఒక కుంచెడు ధాన్యం కలవాడు ఆ కుంచెడు ధాన్యమూ దానంచేశా డనుకో. కోటి ఆవులు కలవాడు ఆ కోటిఆవులూ దానంచేశా డనుకో.

వాళ్ళిద్దరికీ లభించేఫలం వొక్కటే అవుతుంది. పరుషత్వం లేకండా, అంతఃకరణశుద్ధితో ప్రియంగా చేసే దానం పరమోత్కృష్టమైంది.'

## ధర్మాలు

"'దేవీ, కొన్ని ధర్మాలు చెపుతాను, సావధానంగా విను. రోగాలతో బాధపడుతున్న వాళ్ళకి నిష్కల్మషంగా మందు లివ్వడమూ, ఆపదలపాలైనవాళ్ళని ఆదుకోడమూ, ప్రయాణికులకు తోడిచ్చి పంపడమూ, దిక్కులేని శవానికి దహనక్రియలు జరిగించడమూ, దుఃఖంతో వున్నవాళ్ళని వోదార్చడమూ, ఏది ఏమయినా ఓరిమి కలిగి వుండడమూ — ఇవన్నీ గొప్పధర్మాలు.'

"'ధర్మాలు నానావిధాలంటారు. అదేమిటి?' అని మళ్ళీ అడిగింది పార్వతి.

"'అవును, ధర్మం నానావిధాలుగా వుంటుంది. వేదాలూ, ధర్మశాస్త్రాలూ తెలిపినవాటిని వివరిస్తాను, విను. జాతిధర్మాలు, దేశధర్మాలు, కులధర్మాలు, గణధర్మాలు, శరీరవృత్తులవల్లా కాలవిపర్యయంవల్లా కలిగే ఆపద్ధర్మాలూ — ఇలా ధర్మాలు అయిదు విధాలు' అన్నాడు శివుడు.

## స్వర్గం

"'స్వర్గలోకంలో భోగం ఎలా వుంటుంది?' అని అడిగింది పార్వతి.

"'స్వర్గంలో అన్నిపువ్వులూ అన్నికాలాల్లోనూ పూస్తాయి. అనులేపాలూ, అమృతాహారాలూ, ఎప్పుడూ శుభ్రమైన వస్త్రాలూ, ఉజ్జ్వలమైన సాటిలేని నగలూ కల్పవృక్షం కోల్లలు ప్రసాదిస్తుంది. వాటితో స్త్రీలూ, పురుషులూ ఆనందిస్తూవుంటారు. అన్యోన్యం

స్నేహాభావంతో వుంటారు. శరీరాలూ, మనస్సులూ కలిసి మసులు కుంటారు. దివ్యమైన కామసౌఖ్యాలనుభవిస్తారు. క్రోధభావం వారి నంటదు. రోగమూ, ముసలితనమూ వారి చుట్టుపక్కలకి పోవు. అలా ఆనందంగా హాయిగా భోగా లనుభవిస్తూవుంటారు స్వర్గంలో' అన్నాడు శివుడు.

"'స్వర్గానికీ నరకాలకీ వెళ్ళేవాళ్ళని చూసి, 'వీళ్ళు స్వర్గానికి వెళతారు, వీరు నరకానికి వెళతారు అని ఎలా పోల్చడం' అని అడిగింది పార్వతి.

"ఎవ్వరికీ కీడుచెయ్యనివాడు స్వర్గానికి వెళతాడు. ఎప్పుడూ ధర్మంతప్పకండా మనుగడ గడిపేవాడు స్వర్గానికి వెళతాడు. గురువు లనూ, సజ్జనులనూ పూజించేవాడూ, సత్యంపలికేవాడూ, దీనుల్ని పోషించేవాడూ, భూతదయాపరుడూ, ప్రియంగా నడుచుకునేవాడూ స్వర్గానికి వెళతారు.

"'ధర్మమంటే అసహ్యించుకునేవాడు నరకానికి వెళతాడు. పరుషంగా మాట్లాడేవాడూ, అబద్ధాలు చెప్పేవాడూ, పరులధనం అపహరించేవాడూ, పరస్త్రీలమీద మనసుపడేవాడూ, బంధువుల తోనూ సజ్జనులతోనూ కయ్యమాడేవాడూ, చెడ్డవారి స్నేహంచేసే వాడూ నరకానికి వెళతారు' అన్నాడు శివుడు.

## పరమధర్మం

"'ధర్మాలు ఎన్నో వున్నాయి. అయితే వాటిలో ఏది పరమధర్మం?' అని అడిగింది పార్వతి.

"'ధర్మాల్లో మోక్షధర్మం వొక్కటే శాశ్వతమైన సౌఖ్యం ప్రసాదిస్తుంది. తక్కిన ధర్మాలు సుఖదుఃఖాలు రెండూ కలిగిస్తాయి. చావుపుట్టుకలు కలిగించే అశాశ్వతధర్మా లవి. త్రివర్గంలో మోక్షం

మేలైంది. అయితే దాన్ని ఎలా పొందడం అన్నదే ప్రశ్న. చెపుతాను, విను. గృహస్థధర్మంలో వుండి తల్లిదండ్రుల ఋణమూ, గురువుల ఋణమూ, ఋషుల ఋణమూ అతిథుల ఋణమూ దేవతల ఋణమూ — అన్ని ఋణాలూ తీర్చెయ్యాలి. పరమశాంతంతో అడివికి పోవాలి. సద్గురువునోట సాంఖ్యయోగం తెలుసుకోవాలి.

"'ఇరవైఅయిదు తత్వాల జ్ఞానమే యోగం. నిశ్చలమైన ఈతత్వమే యోగం. సాంఖ్యమూ, యోగమూ రెండూ ఆచరించదగినవి. ఈ రెండూ వొకటిచేసి, అస్ఖలితంగా మనస్సులో అలవరించుకుని, ధ్యాన పరుడు కావాలి. శీతమూ ఉష్ణమూ, సంతోషమూ శోకమూ మొదలైన ద్వంద్వాలు జయించాలి. శౌచమూ, శాంతీ కలిగివుండాలి. బ్రహ్మచర్యం పాటించాలి. మితంగా భోజనం చెయ్యాలి. ఇడానాడిద్వారా తన అంతరాత్మణ్ణి దర్శించాలి. అంతరాత్ముడికీ తనలోని చూపుకీ మధ్య వచ్చే అడ్డంకులన్నిటినీ ధైర్యంతో తొలిగించాలి. భక్తియోగధురంధరుడు కావాలి. ఆనందమయుడై పరమాత్ముడిమీదే చూపునిలపాలి. అదిగో అప్పుడే అకుంఠితమైన మోక్షసుఖం సిద్ధిస్తుంది. సదాభ్యాసం వల్ల అది నిర్మలమవుతుంది; తరుగులేని దవుతుంది; చలించని దవుతుంది. తుదకి ముసిలితనమూ, రోగాలూ, చావుపుట్టుకలూ, దుఃఖాలూ లేకండా మితిలేని సంసారచక్రంనుంచి తరింపజేస్తుంది.

"'సంసారవిరక్తిలేని మనిషి శోకమోహాలకు బానిస అవుతాడు. శోకమోహాలకు బానిసఅయినవాడు మోక్షం పొందలేడు. సంసారంమీద విసుగుపుట్టి విరక్తిచెందినవాడే ముక్తి పొందుతాడు. చింతలు విడిచిపెట్టి, ప్రాణాలు అస్థిరమైనవని భావించి, ఆసలు విసర్జించినప్పుడే అట్టి దశ కుదురుతుంది, అన్యథా కుదరదు. కనక వాటి భంగులు వివరిస్తాను, విను.

"'ధనం పోయినా, బంధువులు మరణించినా విచారం పెట్టుకో కూడదు. విచారంవల్ల తాపం హెచ్చడంతప్ప మరేమీ లాభం లేదు. కష్టసుఖాలు కావడికుండలు. ఒకదాని వెనక ఒకటి వుండనే వుంటాయి. కేవలం సుఖం ఆ దేవేంద్రుడికైనా లేదు. కంటికి అవుపడే ప్రతిదానికీ నాశనం తప్పదు. నిస్సందేహమైన మాట ఇది. ఇది ముందే తెలుసు కుని వుంటే మనస్సుకి విచార మంటదు. ఏదైనా పదార్థం ఒకరి దగ్గిర పుచ్చుకోడమే కీడు. అలా పుచ్చుకున్నవాడు పట్టుపురుగులాగ తన్ను తానే బంధించుకుంటాడు.

"'ధనం పూజించడమూ, ధనం రక్షించడమూ, ధనం వెచ్చించడమూ, ధనం నాశనం కావడమూ ఇవన్నీ గాఢమైన దుఃఖాలే. కనక ధనం దుఃఖభాజనమైంది. ధనంలేకండా బతకడమే మేలు.

"'ఆశతో సాటివచ్చే దుఃఖం మరొకటి లేదు. నిరాశతో సాటివచ్చే సుఖమూ మరొకటి లేదు. ఆశ దుఃఖం, నిరాశ సుఖం. శరీరానికి ముసిలితనం వచ్చినా ఆశకిమాత్రం ముసిలితనంరాదు. ప్రాణం పట్టుకు పోయే రోగం ఆశ.

"'భోగాలు అనుభవించినంతమాత్రాన కోరికలు తీరవు. నేయి పోసినంతమాత్రాన అగ్నిహోత్రం ఆరిపోతుందా? ధైర్యంతో కోరికలు వొదులుకుంటే కలిగే సౌఖ్యాన్ని మించిన సౌఖ్యం మరొకటి లేదు, నమ్ము.

"'ఇంద్రియాలు విచ్చలవిడిగా ఎక్కడికి పడితే అక్కడికి పోనిస్తే నరకం తప్పదు. అలా కాకండా వాటిని కుదించి, అదుపులో పెట్టుకుంటేమాత్రం స్వర్గం కరతలామలకం అవుతుంది.

"'కామంతో తృష్ణాపరుడై ధనాశతో దేవులాడే మనిషిని, అడివిలో గొర్రెపిల్లని ఎగరేసుకుపోయే పెద్దపులిలాగా మృత్యువు ఎగరేసుకు పోతుంది.

"'అయితే ముసిలితనాన్నీ, మృత్యువునీ జయించే మార్గం లేక పోలేదు. అదేమిటంటావా? చెపుతాను, శ్రద్ధగా విను. దానాలూ, ధర్మాలూ, తపస్సులూ, అశ్వమేధయజ్ఞాలూ, రాజసూయాలూ ఇవేవీ కావు, మోక్షదర్శనం వొక్కటే ముసిలితనానికీ, మృత్యువుకీ మందు.

"'జాములూ, దినాలూ, నెలలూ, సంవత్సరాలూ కలిగిన కాలం ఆయువుని ఎత్తుకుపోతుంది. అంచేత రేపు చెయ్యవలిసిన పని ఇవాళే, ఎల్లుండి చెయ్యవలిసిన పని రేపే చెయ్యడం నామతం.

"'కాలపాశబద్ధులు కావడంచేత ఏమరుపాటు కలిగిన మనుషులు మేలైనపని వేగం చెయ్యరు. ఇది తెలుసుకుంటే సంసారం తరించవచ్చు. ఈవిధమైన భావనవల్ల మనస్సుకి విమర్శసిద్ధి కలుగుతుంది. విమర్శసిద్ధివల్ల విరక్తి కలుగుతుంది. విరక్తివల్ల ముక్తిబాట దగ్గిరపడుతుంది.

"'వైరాగ్యం ప్రశాంతికి కారణమవుతుంది. ప్రశాంతివల్ల ముక్తి కలుగుతుంది. మోక్షానందారాముణ్ణి ముసిలితనమూ, మృత్యువూ అంటలేవు.

## సాంఖ్యం

"'సాంఖ్యం చెపుతాను, విను. సంసృతి అనే రోగానికి వైద్యం సాంఖ్యం. జ్ఞానంవల్ల ముక్తి పొందుతారు సాంఖ్యులు. ఇరవై అయిదు తత్వాలూ భజిస్తారు వారు; శారీరకమైన తపస్సులు నిరర్థక మంటారు; ఘోరమని నిరసిస్తారు.

"'ప్రకృతికి అవ్యక్తం అనికూడా పేరు. ఆప్రకృతిలో మహత్తు అహంకారమూ, తన్మాత్రలూ, మనస్సూ, ఇంద్రియాలూ, పంచభూతాలూ, ఆ భూతాల గుణాలూ-ఇలా మొత్తం ఇరవైనాలుగు. *

* చూ. అ. 4.

ఇరవైఅయిదో తత్వంగా ఎంచే క్షేత్రం ఆ ఇరవై నాలుగు తత్త్వాల సంబంధం కలది. సత్వమూ, రజస్సూ, తమస్సూ - తన ఈ గుణాలతో ప్రకృతి తాను క్రియారూపాలు ధరించి లోకకోటిని సృజిస్తుంది. ఆ ప్రకృతి అణువు, నిత్యం, ఏకం, అక్రియం, అహైతుకం. నేత్రం మొదలైన ఇంద్రియాలకు అగ్రాహ్యం. అది ప్రధానం అని కూడా అనిపించుకుంటుంది.

"'సౌఖ్యమూ, తుష్టీ, ప్రకాశమూ - ఇవి సాత్వికాలు. సంతోషమూ శోకమూ మొదలైన ద్వంద్వాలు రాజసాలు. భయమూ, మోహమూ, సోమరితనమూ మొదలైనవి తామసాలు.

"'ధైర్యమూ, శ్రద్ధా, విజ్ఞానమూ, అసమ్మోహమూ, దయా సంతోషమూ - ఇవి సత్వగుణం పెరిగినప్పుడు అధికమవుతాయి. ఆ సత్వం పోవడంతోనే వాటంతట అవి తరిగిపోతాయి.

"'క్రోధమూ, లోభమూ, కామమూ, అసత్యమూ, ద్రోహచింతా, తాపమూ - ఇవి రజోగుణం పెరిగినప్పుడు అధికమవుతాయి. రజోగుణం క్షీణించడంతోనే అవి తరిగిపోతాయి.

"'సంశయమూ, విచారమూ, జడత్వమూ, నిద్రా, - ఇవి తమోగుణం పెరిగినప్పుడు అధికమవుతాయి. తమోగుణం తరిగిపోడంతోనే తరిగిపోతాయి.

"'సత్వమూ, రజస్సూ తమస్సూ - ఈ మూడు గుణాలూ వొక్కొక్కటి వొక్కొక్క దానిచేత పెరుగుతూ, తరుగుతూ వుంటాయి. ఈ మూడుగుణాల మార్పులవల్ల పుట్టిన ప్రీతీ, సంతాపమూ, మోహమూ మొదలైనవి కలిగితే అవి ఆ యా గుణాలవల్ల పుట్టినవని తెలుసుకుని, ధర్మార్థకామాలకు మనస్సు పోనీయకండా ఉపేక్షించడమే కర్తవ్యం. ఈ సత్వమూ మొదలైన గుణాలే దేవతలు

గానూ, మనుష్యులుగానూ, తిర్యగ్జంతువులుగానూ పుట్టడానికి మూల కారణాలు.

"'మహత్తత్త్వానికి బుద్ధి అని పేరు. వివేక విజ్ఞాన చిహ్నం బుద్ధి. భూతాల పుట్టుక అహంకార లక్షణం. అహంకారం వొదలడం మోక్షకారణం.

"'ఇంద్రియా లన్నిటినీ ముందుకి పురికించడానికీ, వెనక్కి మళ్ళించడానికీ శక్తికలది మనస్సు. ఆ ఇంద్రియాలూ, మనస్సూ, పంచభూతాలూ వాటి వికారాలూ (గుణాలూ) దేహం. ఆ దేహానికి అన్యుడు దేహంలో వుంటాడు. అదిగో అతడే దేహి.

"'దేహం వేరు, దేహి వేరు అనే నిశ్చయదృష్టికలవాడు మనస్సుని మళ్ళించడానికి సమర్థుడు. నిశ్చయదృష్టివల్ల నిర్మనస్కత కలుగుతుంది. నిర్మనస్కత మోక్షమార్గం చూపుతుంది. అప్పుడు ప్రకృతి తప్పుకుంటుంది. ప్రకృతి తప్పుకోడంతోనే ఇరవై అయిదో తత్త్వం ప్రకాశిస్తుంది. ఆ ఇరవై అయిదోతత్త్వమే పరమహంస అనిపించు కుంటుంది. తత్త్వజ్ఞానం శాంతిసాధ్యమూ, పరమశాంతిప్రదమూ అయి వుంటుంది.

"'రసమూ, గంధమూ మొదలైన గుణాలూ, ఏ వికారాలూ లేకండా అన్నిటిలోనూ నిండి, వ్యాపించి, అణువులాగా, మహత్త్వం తోనూ వుండి, కంటికీ ఇంద్రియాలకీ కనపడకండా ప్రకాశించే పరమాత్మ అనే ఇరవైఆరో తత్త్వాన్ని సమదృష్టితో చూసే శాంతుడు మోక్షస్థితి పొందుతాడు.

"'పార్వతీ ! ఇది కపిలుడూ మొదలైన మహాపురుషులు సేవించిన సాంఖ్యధర్మం. ఇక యోగప్రకారం వివరిస్తాను, విను.

## యోగం

"'ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ, ఆత్మాదూ వొక్కటిగా చూడడం యోగపరిజ్ఞానం. అగ్నిసమారాధనమూ, అధిక వాగ్వి

ఎర్జనమూ, సత్వతత్త్వమూ, దానమూ, అధ్యయనమూ, శౌచమూ, సత్యమూ - ఇవి పాపాలు పోగొడతాయి. పాపాలు పోదుల్చుకుని, యోగం సాధించడానికి యోగ్యుడవుతాడు మనిషి. చేపలు పట్టే వాడికి గాలంవెయ్యడానికి ఎర సాధనమవుతుంది. అలాగే పాపాలు పోదుల్చుకోడానికి, మనస్సు అదుపులో వుంచుకోడం సాధనమవుతుంది. శుచిమంతమూ, పవిత్రమూ అయినచోట మృదువైన ఆసనంమీద శరీరానికి పటుత్వం కలిగినట్టు వుండి, మనస్సులో అయిదు ఇంద్రియాలూ నిలపాలి. ఆ మనస్సు తిన్నగా ఆత్మలో లగ్నంచెయ్యాలి. అదిగో అప్పుడు యోగసిద్ధికి ప్రాణమూ (హృదయవాయువు, అపానమూ అదుపులోకి వస్తాయి. అవహితుడయి ఆ దశ అనుభవించిన యోగి శిరస్సు అపానం కలిసిన ప్రాణానికి వునికి పట్టవుతుంది. అలా సమాధిలో వున్నవాడే జీవుడనిపించుకుని, పరమాత్ముడనిపించుకుని ప్రకాశిస్తాడు. ప్రాణం అపానంలోనూ, అపానం ప్రాణంలోనూ నిలిపి, నిర్వాణం కోరి, చిత్తం స్థిరంగా నిలిపితే ప్రాణధారణనియమం దేహం మధ్య వున్న శిఖను రేపుతుంది. అప్పుడు ప్రాణమూ, అపానమూ, దేహమధ్యంలోని అగ్ని - ఈ మూడూ శిరస్సులో పరిపక్వం పొంది, చలనంలేని యోగికి కోరికలు సిద్ధింపజేస్తాయి.

"'సోమరితనమూ, విచిత్తతా, అతిభోజనమూ, రోగమూ, స్వప్నమూ, లోభమూ, కామమూ, క్రోధమూ, లౌల్యమూ - ఇవి యోగానికి విరోధులు. ఇవి లేకండావుంటే యోగం సిద్ధిస్తుంది. అష్ట సిద్ధులూ అలవడతాయి అలాటి యోగి అప్రతిహతుడయి, అంతటా విహరిస్తాడు.

"'అధికంగా నిద్రపోడమూ, అసలే నిద్రపోకండా వుండడమూ, మితిమీరి తినడమూ, అసలే తినకండా వుండడమూ యోగికి తగదు. యోగం సర్వదుఃఖాలూ హరిస్తుంది. యుక్త వర్తనుడయితేనే

ఆ యోగం పొందుతాడు యోగి. ఇదిగో ఇలావుంటుంది యోగ ధర్మం'' అన్నాడు శివుడు.

## సాయుజ్య ప్రాప్తి సాధనం

" 'సాంఖ్యమూ, యోగమూ విన్నాను. కృతార్థురాలినయాను. అయితే, భక్తులు ఎలాంటి పరిచర్య చేసి నీ సాయుజ్యం పొందుతారు ?' అని అడిగింది పార్వతి.

" ' దేవతలకీ, మునులకీ కూడా అవిచింత్యుణ్ణి నేను. సనాతనుణ్ణి నేను. ఈశ్వరుణ్ణి నేను. అవ్యయుణ్ణి నేను. సత్యాత్ముణ్ణి నేను. యోగమూ, సాంఖ్యమూ నేను కల్పించినవే. నేను ప్రసన్నుణ్ణయితే నన్ను అర్చించినవాళ్ళకి సిద్ధించనిదంటూ లేదు. నన్ను గురించి చేసే ధ్యానమూ, స్తోత్రమూ, వందనమూ మొదలైన నానా భజనలలో నైష్ఠికత అవసరం.

" 'నాలుగాశ్రమాల్లోనూ నలుగురు బ్రాహ్మలకి పాశురతవ్రతం చెప్పాను పూర్వం. శిష్య ప్రశిష్యక్రమంగా వాళ్ళు అది ప్రచారానికి తెచ్చారు. అలా ప్రసిద్ధమయిం దది.

" 'మంగళ రక్షా శుచితా లింగార్చన యోగ్యతలు ఫలించడం కోసం విభూతి కల్పించాను. ఆ విభూతి శరీరాలకు పూసుకుని, కపాలధరులయి, శాంతిపూర్వకంగా బ్రహ్మచర్యం పాలిస్తూ భిక్ష మెత్తుకు తింటూ, జడలు ధరించో, లేదా తల బోడిచేసుకునో, మనస్సు నామీదే, నిలిపి, ఇతర వస్తువులు వొల్లకండా వుండే భక్తులకు పరమానందం ప్రసాదిస్తాను. ఈ విధంగా నా సాయుజ్యం లభిస్తుంది. ఇది సాయుజ్య ప్రాప్తిప్రకారం.

" 'మూడులోకాలకూ మేలు కలగడంకోసం శివలింగస్థాపన చేశాను. ప్రవిమలమైన శివలింగంలో నన్ను భావించాలి. కలిగిన

మేరకు పాలతో అయినా, నేతితో అయినా, తుదకి నీళ్ళతో అయినా అభిషేకంచేసి, భక్తితో గంధమాల్యాలూ ధూపదీప నైవేద్యాలూ సమర్పించి, లింగమూర్తిలో నన్ను దర్శించి, భజిస్తే ముక్తి చేకూరుతుంది ' అన్నాడు శివుడు.

## స్త్రీ ధర్మం

"పార్వతి అడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానంచెప్పి, ప్రసన్నమైన చూపులతో ఆమెని చూస్తూ ఇలా అన్నాడు శివుడు.

"' దేవీ! సతీమణివి నువ్వు. దేవకాంతలూ మొదలైనవుల్లో కాల స్త్రీలూ నీ పాదపద్మాలకి మొక్కుతారు. పైగా చతురమతివి నువ్వు. వివేకవతివి. వ్రతనిష్ఠాపరురాలివి. సహజంగా లౌకికజ్ఞానం కలదానివి. మచ్చలేనిదానివి. అంచేత స్త్రీధర్మం నీనోట వినాలనుంది నాకు. '

"భర్త అలా అనడంతోనే సిగ్గుతో చిరునవ్వు నవ్వింది పార్వతి. ఆ నవ్వుతో వింతచెలువు కలిగిన మొహం వాంచుకుందామె. 'నాథా! నేనా, మీకు చెప్పగలదాన్ని?' అంటూ మొహమెత్తి 'సర్వజ్ఞుడివి నువ్వు. అయినా, అడుగుతున్నావు. నాకు తోచినంతమట్టుకు నీసెలవు ప్రకారం స్త్రీధర్మం వినిపించకపోడం తగదుకనక చెపుతాను. అయితే వొక్కమాట, ఇదిగో ఈ నదులన్నీ నన్ను ఎన్నడూ విడిచిపెట్టకండా వుంటాయి. ఈ నదీకాంతలతో ఆలోచించి మరీ చెపుతాను ' అంది.

శివుడితో అలా విన్నవించి, ముందే తనతో వచ్చిన గంగా యమునా, గోదావరీ, కౌశికీ, కావేరీ, కృష్ణవేణీ, పెన్నా మొదలైన నదీకాంతలతో సంప్రదించింది పార్వతి. 'నదీకాంతలారా! విన్నారు కదా, పరమేశ్వరు డన్నమాట ఏం చెప్పేది నేను?' అని అడిగింది. 'నీకంటే మేం తెలిసినవాళ్ళమా అమ్మా?' అంది గంగ. నువ్వు

ఎరిగినట్టు స్త్రీధర్మం వివరించు, భర్తని సంతోషపెట్టు. నీ వాగమృతం మేమున్నూ చెవులారా పానంచేస్తాము, తరిస్తాము.'

"గంగమాటలు వింది పార్వతి. ప్రసన్నచిత్తంతో భర్త మొహంమీద చూపులు నిలిపింది. 'దేవా, నీ అనుగ్రహంవల్ల వచ్చిన ఎరుకతో నీ మనస్సుకి నచ్చినట్టు స్త్రీధర్మం వివరిస్తాను' అంది. ఆమెమాటలు విని దేవతలూ, మునులూ సంతోషించారు. దేవతా స్త్రీలూ, గంధర్వస్త్రీలూ, సిద్ధులభార్యలూ, సాధ్యులభార్యలూ ఎంతోమంది పార్వతిమాటలు వినాలని వేడుకతో వచ్చి ఆమె వెనక సమావేశమయారు. కృష్ణా! అప్పుడు స్త్రీలూ, పురుషులూ తన్ను మెచ్చుకున్నట్టు ఇలా అందుకుంది పార్వతీదేవి:

"'రుతుమతి కాకండా పరిశుద్ధంగా వుండిన స్త్రీ కన్య అనిపించుకుంటుంది. ఆమెని పెళ్ళిచెయ్యడానికి తల్లీ, తండ్రీ, తండ్రి అన్నదమ్ములూ, మేనమామా, అన్నదమ్ములూ అధికారులు. వీళ్ళలో ఎవరైనా సరే, యోగ్యుడైన వరుడికిచ్చి ఆమెని పెళ్ళిచెయ్యవచ్చు. పెళ్ళిఅయిన ఉత్తరక్షణం నుంచి భర్తే ప్రభువు స్త్రీకి. భర్తే దైవం. భర్తమాట అనుసరించి దేవపూజా, పితృపూజా, అతిథిపూజా ఆచరించాలామె. భర్తహితం పాటించి నడుచుకునే ఆడదే పతివ్రత. పతివ్రత అయితేనే ఇహపరసౌఖ్యాలు అనుభవిస్తుంది ఆడది. ఈ విషయంలో వొక నిదర్శనం నివేదిస్తాను, చిత్తగించు.

"'ఒక బ్రాహ్మడికి ఇద్దరు భార్యలు వుండేవాళ్ళు. వాళ్ళిద్దరిలో వొకామె భర్తహితం పాటించకండా నడుచుకునేది. అతను చెప్పకండానే దేవపితృకార్యాలు చేసుకుపోయేది. రెండోఆమె భర్తహితం పాటించేది. తుచ తప్పకండా అతణ్ణి అనుసరించేది. అతడు చెప్పిన ప్రకారమే ధర్మకార్యాలు నిర్వహించేది. ఇలా వుండగా విధివశంవల్ల ముగ్గురూ కాలంచేశారు. భర్తా, పతివ్రత అయిన రెండో భార్యా

సద్గతికి పోయారు. మొదటి ఆమెని చూసి యముడు, 'నీకు సద్గతి లేదు. మళ్ళీ నీశరీరమే మన్వు పొందు' అని గద్దించాడు ఆమె కన్నీళ్ళు కారుస్తూ నుంచుంది. యముడు కనికరించాడు. 'భర్తహితం పాటించ కండా ఆడది ధర్మం నడపకూడదు. ఇకనైనా భర్తకి హితమైనవి చేస్తే, అతణ్ణి కలుసుకోగలుగుతావు' అన్నాడు. యముడిమాటలు విని మళ్ళీం దామె. కనక భర్తకి అనువ్రతగా వుండడం గృహిణికి ధర్మం.

" 'ఆడది మంచి ఇల్లాలయి మసులుకోవాలి. మగడికి రుచికర మైన వంటకాలు వండిపెట్టాలి. తన్ను కలియవచ్చినప్పుడు సంతో షంగా హృదయమిచ్చి, కలియాలి. మారుపలకకండా, భర్త ఏపని చెప్పినా చెయ్యాలి. సావధానుడుకాని భర్తని సావధానుణ్ణి చేసుకుని ధర్మార్థకార్యాలు నిర్వహించాలి. సవతివుంటే ఆమెతో పోరుపెట్ట కండా కలిసిమెలిసి మసులుకోవాలి. మగడు సవతులమీద వలపు కలిగివున్నప్పుడు 'కానీ' అంటూ అతని ఇష్టప్రకారమే నడుచుకునే ఆడది దేవతకాని మానవి కాదు; ఆమెని అంతమందీ పూజిస్తారు. ఆమెపాదాలకి దండాలుపెడతారు. భర్త దాచమని తన చేతికి ఇచ్చిన వస్తువులు మళ్ళీ అతను అడిగినప్పుడు భద్రంగా కపటంలేకండా ఇచ్చె య్యాలి. సంతోషంగా భర్తఏమిస్తే అదే పుచ్చుకోవాలి.

" 'తన అన్నదమ్ముడైనా సరే, అతడితో వొక్క ఆసనం మీద కూచోకూడదు ఆడది.

" 'ధనవంతుడైనా దరిద్రుడయినా, గొప్పవాడైనా అధము డైనా, రూపవంతుడైనా కురూపి అయినా, వివేకవంతుడైనా మూర్ఖు డైనా, నిరోగి అయినా రోగి అయినా భర్తనే పాటించాలి భార్య. అదే ఆమెధర్మం.

" 'దేవతల్నీ, పితరుల్నీ పూజించినప్పుడూ, పుణ్యకార్యా

ల్లోనూ గడపదగ్గిర బలి (చీమలూ వాటికోసం పిండీ మొదలైన ఆహారం) పెట్టాలి ఇల్లాలు. పేదలకి బిచ్చం పెట్టాలి. అలా పెట్టి నప్పుడు తన మగడు శుభం పొందాలి అని కోరడం ఇల్లాలికి ధర్మం.

"'భార్యకి భర్తే గతి. భర్తని మించిన సత్పరాయణం మరొ కటిలేదు. కనక భర్తకి భక్త అయిన స్త్రీకి సర్వశుభాలూ సమకూడ తాయి.

"'స్త్రీల ధర్మాలు చెప్పాను. ఇక స్త్రీలు చెయ్యరాని అధ ర్మాలు వివరిస్తాను, చిత్తగించు.

"'అధర్మంగా నడుచుకునే ఆడదానికి ఆసురి, పైశాచి, రాక్షసి అని పేర్లు. ఈ మూడురకాల స్త్రీలకీ వ్యభిచారం సామాన్యధర్మం. క్రౌర్యం కలదీ, ధనధాన్యాలు తన ఇచ్చవచ్చినట్టు వెచ్చించేదీ, చంచల హృదయం కలదీ, భోగలాలసత్వం కలదీ, ఈర్ష్యకలదీ ఆసురి.

"'క్రోధం కలదీ, మగడిమీద మమత లేందీ, కన్నబిడ్డల మీద కనికరం లేందీ, ఇంటిపనులలో నైపుణ్యం లేందీ, కయ్యాల గంప పైశాచి.

"'ఓరిమి లేందీ, బొంకులాడేదీ, నిద్రపోతూ, సిగ్గుమాలిందీ రాక్షసి. ఈస్త్రీలందరూ భర్తకులంవాళ్ళని పాపాలపాలుచేసి నరకా నికి పంపుతారు.

"'తెలుసుకున్న తరవాత అయినా పతిభక్తి కలిగి, ధర్మం నిర్వహించి, శాంతి కలిగివుంటేమాత్రం చేసినపాపాలు పోయి, భర్తతో స్వర్గానికి వెళ్ళగలుగుతుంది ఆడది. అలా కానప్పుడు భర్త మరణసమయంలో చింతలేకండా భర్తతో సహగమనం చేసినా సుగతి లభిస్తుంది. అయితే బిడ్డలు కలిగివుండిన బ్రాహ్మణస్త్రీ భర్తమరణ దుఃఖంతో సహగమనం చెయ్యడం అధర్మం. అలాగే పతిభక్తి లేకండా సహగమనం చెయ్యడంకూడా అధర్మమే.

" 'ప్రభూ! అఖిలేశ్వరుడివి నువ్వు. నాచపలత్వం వల్ల ఏవో అవాకులూ చవాకులూ నీముందు వినిపించాను. కరుణించు నా తప్పులు. మన్నించు' అంటూ సిగ్గుతో వింతఅందం వొలికిపోతున్న నవ్వు మొహం వొంచుకుంది పార్వతి. శివుడూ, మునులూ, మునిపత్నులూ మధురవాక్యాలతో ఆమెని మెచ్చుకున్నారు. దేవతాస్త్రీలూ, గంధర్వ స్త్రీలూ, కిన్నర కింపురుషస్త్రీలూ, నాగకన్యలూ పరమసంతోషంతో పదేపదే ఆమెని పొగిడారు.

" 'శ్రీకృష్ణా! అప్పుడు శివుడు ప్రేమ వుట్టిపడుతున్న చూపులతో పార్వతిని చూసి, గౌరవపూర్వకంగా ఇలా అన్నాడు:

" 'దేవీ పార్వతీ! మన ఇద్దరి ఈసంవాదం శుచిఅయి, నైష్ఠికజనానికి ఎవడైతే ఆదరపూర్వకంగా వినిపిస్తాడో, అతడు శాశ్వతంగా అమరవైభం అనుభవిస్తాడు.

" 'మన సంవాదం నియమపూర్వకంగా విన్నవాళ్ళకి తేజస్సు కలుగుతుంది; యశస్సు కలుగుతుంది; ఆరోగ్యం కలుగుతుంది; ఐశ్వర్యమూ కలుగుతుంది.'

"ఇలా నిర్దేశించి కొలువు చాలించాడు శివుడు. పార్వతి ఆయన ననుసరించింది. వారు ఎక్కడికి వేంచేశారో చెప్పడం అసాధ్యం. అద్భుతం అది. నిరూపించరాంది. తర్కించ తరంకాంది.

" 'కృష్ణప్రభూ! నేను కన్నదీ, విన్నదీ ఈ పురాణకథ వినిపించాను" అన్నాడు నారదముని. ఆయన వినిపించిన పురాణకథ విని అక్కడి సభ్యుల మనస్సులు ఆనందంతో పులకరించాయి.

## మ హా మ ం త్ర ం

ధర్మరాజు:

తండ్రీ నువ్వు చెప్పిన శివపార్వతుల సంవాద పుణ్యకథ విని

పరమానందంగా వుంది నాకు. నీపాదపద్మాలకు ఇవే నాప్రణామాలు. పరప్రాప్తి దేనివల్ల కలుగుతుందో అనుగ్రహించు.

భీష్ముడు :

నారాయణుణ్ణి ధ్యానించడంవల్లా, ఆదేవుణ్ణి పూజించడంవల్లా, స్తుతించడంవల్లా, ఆ ప్రభువుకథలు వినడంవల్లా పరప్రాప్తి కలుగుతుంది. విద్వజ్జనుల సంరక్షణ పాపాలు పారదోల్తుంది.

వెనకటికి వో వేశ్య వుండేది. ఓమారు తలారులు వో విద్వాంసుణ్ణి దొంగ అనుకుని కొట్టడం చూసి, "ఈయన సూవాడు, మీరెందుకు ఆగడంచేస్తారూ?' అని అతణ్ణి విడిపించింది. ఆ సుకృతం వల్ల మరుజన్మలో ఆమె బ్రాహ్మణి అయి పుట్టింది. అంచేత బాబూ, నువ్వున్నూ విద్వాంసుల్ని పోషించు.

ధర్మరాజు :

దారిద్ర్యమూ, వ్యాధీ, శోకమూ — ఇవి శాంతించినట్టు చెయ్యగలిగిన జపం ఏదో సెలవియ్యి.

భీష్ముడు :

బ్రహ్మదేవుణ్ణీ, విష్ణుభగవానుణ్ణీ, శివుణ్ణీ, వినాయకుణ్ణీ, విశాఖ దేవుణ్ణీ, అగ్నిహోత్రుణ్ణీ గాలిదేవుణ్ణీ, సూర్యచంద్రుల్నీ, దేవేంద్రుణ్ణీ, వరుణదేవుణ్ణీ, యముణ్ణీ, కుబేరుణ్ణీ, కామధేనువునీ, సముద్రాల్నీ, గంగా మొదలైన మహానదుల్నీ, మరుత్తుల్నీ, అశ్వినీదేవతల్నీ, వసువుల్నీ, రుద్రుల్నీ, పితృదేవతల్నీ, వాలఖిల్యులూ మొదలైన సిద్ధుల్నీ, వేదవ్యాస వాల్మీకి నారద అగస్త్య గౌతమ కశ్యప కణ్వ అత్రి మొదలైన మహామునీశ్వరుల్నీ, రంభా ఊర్వశీ మేనకా మొదలైన అప్సరస్త్రీలనీ, ధర్మ తప స్సత్యాలనీ, అహోరాత్రుళ్ళనీ, గ్రహ తారకల్నీ, అశ్వినీ భరణీ మొదలైన నక్షత్రాల్నీ, మాసాల్నీ, రుతువుల్నీ, సంవత్సరాల్నీ, అనూరుణ్ణీ, గరుత్మంతుణ్ణీ, కద్రువ

కుమాళ్ళయిన వాసుకి మొదలైనవాళ్ళనీ, కాశీక్షేత్ర కురుక్షేత్రాది పుణ్యక్షేత్రాల్ని, నైమిషారణ్యమూ దండకారణ్యమూ మొదలైన పుణ్యారణ్యాల్ని, మేరువు హిమాలయం కైలాసం మొదలైన పుణ్యపర్వతాల్ని, దిక్కుల్ని, భూమ్యాకాశాల్ని, పుణ్యవృక్షాల్ని, బ్రాహ్మల్ని, చక్రవర్తుల్ని, రాజుల్ని పరమభక్తితో తలంచి, కీర్తించి, నమస్కరించి, 'ఈ సమూహమంతా నన్ను రక్షించాలి. నాకు ఆయురారోగ్యాభివృద్ధి కలిగించాలి. అభినందనపూర్వకంగా పరమానందం ప్రసాదించాలి' అని కోరుకోవాలి. అనంతరం,

'ఓం నమో భగవతే వాసుదేవాయ,'
'నమః పురుషోత్తమాయ,'
'నమః సర్వలోక గురవే,'
'నమ స్సర్వలోక పిత్రే,'
'నమ స్సర్వలోకపితామహాయ,'
'నమ స్సర్వలోకప్రపితామహాయ,'
'నమ స్సర్వలోకప్రధానాయ,'
'నమ స్సర్వలోకేశ్వరాయ,'
'నమ స్సర్వలోకవిశిష్టాయ,'
'నమ స్సర్వలోకసుఖప్రదాయ,'
'నమ స్సర్వలోక కర్త్రే,'
'నమ స్సర్వలోక భర్త్రే,'
'నమ స్సర్వలోక హర్త్రే,'
'నమ స్సర్వలోకనిధయే,'
'నమ స్సర్వలోక విధానాయ,'
'నమ స్సర్వలోకహితాయ,'

'నమ స్సర్వలోకహితకరాయ,'
'నమ స్సర్వలోకోద్భవాయ,'
'నమ స్సర్వలోకోద్భవకరాయ,'
'నమో విష్ణవే ప్రభవిష్ణవే,'

అని పఠించడం మహాజపం. ఈమహాజపంవల్ల పాపాలు పోతాయి. భయాలు హరిస్తాయి. ఆపదలు దూరమవుతాయి. శుభాలు ప్రాప్తిస్తాయి. ధర్మతత్పరత సిద్ధిస్తుంది.

## విష్ణుసహస్రనామాలు

వైశంపాయనుడు :

జనమేజయా! సర్వసిద్ధికరమైన ఈమహాజపం మనవఁడైన ధర్మరాజుకి ఉపదేశించాడు కురుపితామహుడు భీష్ముడు. తరవాతికథ ఆలకించు.

అలా సర్వపావనకరమైన అశేషధర్మాలు తాతగారినోట విని భక్తిపూర్వకంగా ఆమహాత్ముడికి నమస్కారంచేసి, ఇంకా ఇలా అడిగాడు ధర్మరాజు :

"లోకాలన్నిటిలోనూ మహనీయుడైన దైవం ఎవ్వరు? ఎవరిని అర్చించి, స్తుతించి, సేవించి శుభాలు పొందుతారు జనులు? ధర్మాన్నిటిలోనూ నీకు సమ్మతమైన మేటిధర్మ మేది? సంసారబంధాలు తొలిగించగల ఉత్తమజప మేది?"

భీష్ముడు :

సర్వలోకాల ప్రభువు విష్ణుభగవానుడు. దేవదేవు డతడు. అనంతుడు, పురుషోత్తముడు, అవ్యయుడు, ఆదీ అంతమూ లేనివాడు, అఖిలలోకాధ్యక్షుడు, బ్రాహ్మణ్యుడు, త్రిలోకకీర్తివర్ధనుడు, సర్వధర్మాలూ ఎరిగినవాడు, వరదుడు, లోకనాథుడు, భూతభవోద్భవుడు.

అదిగో ఆ దేవుణ్ణి నమ్ముకుని, ఉన్నతమయిన మనస్సుతో అతణ్ణి అర్చించి, దృఢభావంతో ధ్యానించి, నమస్కరించి, భక్తితో సేవిస్తే ఎన్ని దుఃఖాలైనా ఇట్టే తొలిగిపోతాయి. పుండరీకాక్షుడైన విష్ణు దేవుణ్ణి పరమభక్తితో స్మరించి, స్తోత్రాలతో అర్చించడమే నాకు నచ్చిన మతం. అన్నిధర్మాలలోనూ అదే అధికమైన ధర్మం.

పరమ తేజోమయుడు విష్ణుదేవుడు. పరమపద మతడు; పరబ్రహ్మ మతడు; పరమపరాయణ మతడు; పవిత్రమైన వాటికల్లా పవిత్ర మతడు; మంగళమైనవాటికెల్ల మంగళ మతడు; దేవతలందరికీ పరమ దైవ మతడు; భూతకోటికి తరుగులేని తండ్రి అతడు; ఆ దేవుడివల్లే అదియుగం అవతరిస్తుంది. అంత్యవేళ జరామరణాలు అతనిలోనే అడిగిపోతాయి. విశ్వలోకప్రధాను డతడు. వెయ్యినామా లతనివి. పరమపవిత్రమైన వవి. పాపభయం పారదోలుతా యవి. మహా గుణయోగ విఖ్యాతమైన వవి. మహామహిమకల వవి.

ఆ విష్ణుసహస్రనామాలు ఋషులు కీర్తిస్తారు, అధికవిభూతికోసం వాటిని వివరిస్తాను, విను.

విశ్వమ్, విష్ణుః వషట్కారః, భూతభవ్యభవత్ప్రభుః, భూతకృత్ భూతభృత్, భావః, భూతాత్మా, భూతభావనః పూతాత్మా (10), పరమాత్మా, ముక్తానాం పరమా గతిః, అవ్యయః, పురుషః సాక్షీ, క్షేత్రజ్ఞః, అక్షరః, యోగః, యోగవిదాం నేతా, ప్రధాన పురుషే శ్వరః (20), నారసింహవపుః, శ్రీమాన్, కేశవః, పురుషోత్తమః సర్వః, శర్వః, శివః, స్థాణుః, భూతాదిః, నిధిరవ్యయః (30), సంభవః భావనః, భర్తా, ప్రభవః ప్రభుః, ఈశ్వరః, స్వయంభూః, శంభుః, ఆది త్యః, పుష్కరాక్షః (40), మహాస్వనః, అనాదినిధనః, ధాతా, విధాతా, ధాతురుత్తమః, అప్రమేయః, హృషీకేశః, పద్మనాభః, అమరప్రభుః, విశ్వకర్మా (50), మనుః, త్వష్టా, స్థవిష్ఠః, స్థవిరో ధ్రువః, అగ్రా

హ్యాః, శాశ్వతః, కృష్ణః, లోహితాక్షః, ప్రతర్దనః, ప్రభూతః (60), త్రికకృద్ధామ, పవిత్రమ్, మంగలం పరమ్, ఈశానః, ప్రాణదః, ప్రాణః, జ్యేష్ఠః, శ్రేష్ఠః, ప్రజాపతిః, హిరణ్యగర్భః (70), భూగర్భః, మాధవః, మధుసూదనం, ఈశ్వరః విక్రమీ, ధన్వీ, మేధావీ, విక్రమః, క్రమః, అనుత్తమః (80), దురాధర్షః, కృతజ్ఞః, కృతిః ఆత్మవాన్, సురేశః శరణమ్, శర్మ, విశ్వరేతాః ప్రజాభవః, అహః (90) సంవత్సరః, వ్యాళః, ప్రత్యయః, సర్వదర్శనః, అజః, సర్వేశ్వరః, సిద్ధః, సిద్ధిః, సర్వాదిః, అచ్యుతః (100), వృషాకపిః, అమేయాత్మా, సర్వయోగవినిః సృతః, వసుః, వసుమనాః, సత్యః, సమాత్మా, అసమ్మితః, సమః, అమోఘః (110), పుండరీకాక్షః, వృషకర్మా, వృషాకృతిః, రుద్రః, బహుశిరాః, బభ్రుః, విశ్వయోనిః, శుచిశ్రవాః, అమృతః, శాశ్వతస్థాణుః (120), వరారోహః, మహాతపాః, సర్వగః, సర్వవిద్భానుః, విష్వక్సేనః, జనార్దనః, వేదః, వేదవిత్, అవ్యంగః, వేదాంగః (130), వేదవిత్, కవిః, లోకాధ్యక్షః, సురాధ్యక్షః, ధర్మాధ్యక్షః, కృతాకృతః, చతురాత్మా, చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః, చతుర్భుజః (140), భ్రాజిష్ణుః, భోజనమ్, భోక్తా, సహిష్ణుః, జగదాదిజః, అనఘః, విజయః, జేతా, విశ్వయోనిః, పునర్వసుః (150), ఉపేంద్రః, వామనః, ప్రాంశుః, అమోఘః, శుచిః, ఊర్జితః, అతీంద్రః, సంగ్రహః, సర్గః, ధృతాత్మా (160), నియమః, యమః, వేద్యః, వైద్యః, సదాయోగీ, వీరహా, మాధవః, మధుః, అతీంద్రియః, మహామాయః (170),మహోత్సాహః, మహాబలః, మహాబుద్ధిః మహావీర్యః, మహాశక్తిః, మహాద్యుతిః,అనిర్దేశ్యవపుః, శ్రీమాన్, అమేయాత్మా, మహాద్రిధృక్ (180), మహేష్వాసః, మహీభర్తా, శ్రీనివాసః, సతాం గతిః, అనిరుద్ధః, సురానందః, గోవిందః, గోవిదాం పతిః, మరీచిః, దమనః,(190), హంసః, సుపర్ణః, భుజగోత్తమః, హిరణ్యనాభః, సుతపాః, పద్మనాభః, ప్రజాపతిః, అమృత్యుః, సర్వదృక్, సింహః

(200), సంధాతా, సంధిమాన్, స్థిరః, అజః, దుర్మర్షణః, శాస్తా, విశ్రుతాత్మా, సురారిహా, గురుః, గురుతమః (210), ధామ, సత్యః, సత్యపరాక్రమః, నిమిషః, అనిమిషః, స్రగ్వీ, వాచస్పతిరుదారధీః, అగ్రణీః, గ్రామణీః, శ్రీమాన్ (220), న్యాయః, నేతా, సమీరణః, సహస్రమూర్ధా, విశ్వాత్మా, సహస్రాక్షః, సహస్రపాత్, ఆవర్తనః, నివృత్తాత్మా, సంవృతః (230), సంప్రమర్దనః, అహః సంవర్తకః, వహ్నిః, అనిలః, ధరణీధరః, సుప్రసాదః, ప్రసన్నాత్మా, విశ్వధృక్, విశ్వభుక్, విభుః (240), సత్కర్తా, సత్కృతః, సాధుః, జహ్నుః, నారాయణః, నరః, అసంఖ్యేయః, అప్రమేయాత్మా, విశిష్టః, శిష్టకృత్ (250), శుచిః, సిద్ధార్థః, సిద్ధసంకల్పః, సిద్ధిదః. సిద్ధిసాధనః, వృషాహీ, వృషభః, విష్ణుః, వృషపర్వా, వృషోదరః (260), వర్ధనః, వర్ధమానః, వివిక్తః, శ్రుతిసాగరః, సుభుజః, దుర్ధరః, వాగ్మీ, మహేంద్రః, వసుదః, వసుః (270), నైకరూపః, బృహద్రూపః, శిపివిష్టః, ప్రకాశనః, ఓజస్తేజోద్యుతిధరః, ప్రకాశాత్మా, ప్రతాపనః, ఋద్ధః, స్పష్టాక్షరః, మంత్రః, (280) చంద్రాంశుః, భాస్కరద్యుతిః, అమృతాంశూద్భవః, భానుః, శశబిందుః, సురేశ్వరః, ఔషధమ్. జగతః సేతుః, సత్యధర్మపరాక్రమః, భూతభవ్యభవన్నాథః (290), పవనః, పావనః, అనలః, కామహా, కామకృత్, కాంతః, కామః, కామప్రదః, ప్రభుః, యుగాదికృత్ (300), యుగావర్తః, నైకమాయః, మహాశనః, అదృశ్యః, అవ్యక్తరూపః, సహస్రజిత్, అనంతజిత్, ఇష్టః, అవిశిష్టః, శిష్టేష్టః (310), శిఖండీ, నహుషః, వృషః, క్రోధహా, క్రోధకృత్కర్తా, విశ్వబాహుః, మహీధరః, అచ్యుతః, ప్రథితః, ప్రాణః (320), ప్రాణదః, వాసవానుజః, అపాం నిధిః, అధిష్ఠానమ్, అప్రమత్తః, ప్రతిష్ఠితః, స్కందః, స్కందధరః, ధుర్యః, వరదః (330), వాయువాహనః, వాసుదేవః, బృహద్భానుః, ఆదిదేవః, పురందరః, అశోకః, తారణః, తారః, శూరః, శౌరిః (340), జనేశ్వరః,

అనుకూలః, శతావర్తః, పద్మీ, పద్మనిభేక్షణః, పద్మనాభః, అరవిందాక్షః, పద్మగర్భః, శరీరభృత్, మహర్ధిః (350), ఋద్ధః, వృద్ధాత్మా మహాక్షః, గరుడధ్వజః, అతులః, శరభః, భీమః, సమయజ్ఞః, హవిర్హరిః, సర్వలక్షణలక్షణ్యః (360), లక్ష్మీవాన్, సమితింజయః, విక్షరః, రోహితః, మార్గః హేతుః, దామోదరః, సహః, మహీధరః, మహాభాగః (370), వేగవాన్, అమితాశనః, ఉద్భవః, క్షోభణః, దేవః, శ్రీగర్భః, పరమేశ్వరః, కరణమ్, కారణమ్, కర్తా (380), వికర్తా, గహనః, గుహః, వ్యవసాయః, వ్యవస్థానః, సంస్థానః, స్థానదః, ధ్రువః, పరర్ధిః, పరమస్పష్టః, (390), తుష్టః, పుష్టః, శుభేక్షణః, రామః, విరామః, విరజః, మార్గః, నేయః, నయః, అనయః (400), వీరః, శక్తిమతాం శ్రేష్ఠః, ధర్మః, ధర్మవిదుత్తమః, వైకుంఠః, పురుషః, ప్రాణః, ప్రాణదః, ప్రణవః, పృథుః (410), హిరణ్యగర్భః, శత్రుఘ్నః, వ్యాప్తః, వాయుః, అధోక్షజః, ఋతుః, సుదర్శనః, కాలః, పరమేష్ఠీ, పరిగ్రహః (420), ఉగ్రః, సంవత్సరః, దక్షః, విశ్రామః, విశ్వదక్షిణః, విస్తారః, స్థావరస్థాణుః, ప్రమాణమ్, బీజమవ్యయమ్, అర్థః, (430) అనర్థః, మహాకోశః, మహాభోగః, మహాధనః, అనిర్విణ్ణః, స్థవిష్ఠః, అభూః, ధర్మయూపః, మహామంత్రః, నక్షత్రనేమిః, (440), నక్షత్రీ, క్షమః, క్షామః, సమీహనః, యజ్ఞః, ఇజ్యః, మహేజ్యః, క్రతుః, సత్రమ్, సతాం గతిః (450), సర్వదర్శీ, విముక్తాత్మా, సర్వజ్ఞః, జ్ఞానముత్తమమ్, సువ్రతః, సుముఖః, సూక్ష్మః, సుఘోషః, సుఖదః, సుహృత్ (460), మనోహరః, జితక్రోధః, వీరబాహుః, విదారణః, స్వాపనః, స్వవశః వ్యాపీ, నైకాత్మా, నైకకర్మకృత్, వత్సరః (470) వత్సలః, వత్సీ, రత్నగర్భః, ధనేశ్వరః, ధర్మగుప్, ధర్మకృత్, ధర్మీ, సత్, అసత్, క్షరమ్ (430), అక్షరమ్, అవిజ్ఞాతా, సహస్రాంశుః, విధాతా, కృతలక్షణః, గభస్తినేమిః, సత్త్వస్థః, సింహః,

భూతమహేశ్వరః, ఆదిదేవః, (490) మహాదేవః, దేవేశః, దేవభృద్గురుః, ఉత్తరః, గోపతిః, గోప్తా, జ్ఞానగమ్యః, పురాతనః, శరీరభూతభృత్, భోక్తా (500), కపీంద్రః, భూరిదక్షిణః, సోమపః, అమృతపః, సోమః, పురుజిత్, పురుసత్తమః, వినయః, జయః, సత్యసంధః (510), దాశార్హః, సాత్వతాంపతిః, జీవః, వినయితాసాక్షీ, ముకుందః, అమితవిక్రమః, అంభోనిధిః, అనంతాత్మా, మహోదధిశయః, అంతకరి (520), అజః, మహార్హః, స్వాభావ్యః, జితామిత్రః, ప్రమోదనః, ఆనందః, నందనః, నందః, సత్యధర్మా, త్రివిక్రమః (530), మహర్షిః, కృతజ్ఞః, మేదినీ పతిః, త్రిపదః, త్రిదశాధ్యక్షః, మహాశృంగః, కృతాంతకృత్, మహా వరాహః, గోవిందః, సుషేణః (540) కనకాంగదీ, గుహ్యః, గభీరః, గహనః, గుప్తః, చక్రగదాధరః, వేధాః, స్వాంగః, అజితః, కృష్ణః, (550), దృఢః, సంకర్షణోఽచ్యుతః, వరుణః, వారుణః, వృక్షః, పుష్కరాక్షః, మహామనాః, భగవాన్, భాగహా, ఆనంద్ (560), వన మాలీ, హలాయుధః, ఆదిత్యః, జ్యోతిరాత్యః, సహిష్ణుః, గతిసత్తమః, సుధన్వః, ఖండపరశుః, దారుణః ద్రవిణప్రదః, (570), దివిస్పృక్, సర్వదృగ్వ్యాసః, వాచస్పతిరయోనిజః, త్రిసామా, సామగః సామ, నిర్వాణమ్, భేషజమ్, భిషక్, సన్న్యాసకృత్ (580), శమః, శాంతః, నిష్ఠా, శాంతిః, పరాయణమ్, శుభాంగః, శాంతిదః, స్రష్టా, కుముదః, కువలేశయః (590), గోహితః, గోపతిః, గోప్తా, వృషభాక్షః, వృషప్రియః, అనివర్తీం, నివృత్తాత్మా, సంక్షేప్తా, సోమకృత్, శివః (600), శ్రీవత్సవక్షాః. శ్రీవాసః, శ్రీపతిః, శ్రీమవాంచరః, శ్రీదః, శ్రీశః, శ్రీనివాసః, శ్రీవిభావనః, శ్రీధరః (610), శ్రీకరః, శ్రేయః, శ్రీమాన్, లోక త్రయాశ్రయః, స్వక్షః, స్వాంగః, శతానందః, నందిః, జ్యోతిర్గణేశ్వరః, విజితాత్మా (620), అవిధేయాత్మా, సత్కీర్తిః, ఛిన్నసంశయః,

ఉదీర్ణః, సర్వతశ్చక్షుః, అనీశః, శాశ్వతస్థిరః, భూశయః, భూషణః, భూతిః (630), విశోకః, శోకనాశనః, అర్చిష్మాన్, అర్చితః, కుంభః, విశుద్ధాత్మా, విశోధనః, అనిరుద్ధః, అప్రతిరథః, ప్రద్యుమ్నః (640), అమితవిక్రమః, కాలనేమినిహా, వీరః, శౌరిః, శూరజనేశ్వరః, త్రిలోకాత్మా, త్రిలోకేశః, కేశవః, కేశిహా, హరిః (650), కామదేవః, కామపాలః, కామీ, కాంతః, కృతాగమః, అనిర్దేశ్యవపుః, విష్ణుః, వీరః, అనంతః, ధనంజయః (660), బ్రహ్మణ్యః, బ్రహ్మకృత్, బ్రహ్మా, బ్రహ్మ, బ్రహ్మవివర్ధనః, బ్రహ్మవిత్, బ్రాహ్మణః, బ్రహ్మీ, బ్రహ్మజ్ఞః, బ్రాహ్మణప్రియః (670), మహాక్రమః, మహాకర్మా, మహాతేజాః, మహోరగః, మహాక్రతుః, మహాయజ్వా, మహాయజ్ఞః, మహాహవిః, స్తవ్యః, స్తవప్రియః (680), స్తోత్రమ్, స్తుతిః, స్తోతా, రణప్రియః, పూర్ణః, పూరయితా, పుణ్యః, పుణ్యకీర్తిః, అనామయః, మనోజవః (690), తీర్థకరః, వసురేతాః, వసుప్రదః, వసుప్రదః వాసుదేవః, వసుః, వసుమనాః, హవిః, సద్గతిః, సత్కృతిః (700), సత్తా, సద్భూతిః, సత్పరాయణః, శూరసేనః, యదుశ్రేష్ఠః, సన్నివాసః, సుయామునః, భూతావాసః, వాసుదేవః, సర్వాసునిలయః (710), అనలః, దర్పహా, దర్పదః, దృప్తః, దుర్ధరః, అపరాజితః, విశ్వమూర్తిః, మహామూర్తిః, దీప్తమూర్తిః, అమూర్తిమాన్ (720), అనేకమూర్తిః, అవ్యక్తః, శతమూర్తిః, శతాననః, ఏకః, నైకః, సవః, కః, కిమ్, యత్ (730), తత్, పదమనుత్తమమ్, లోకబంధుః, లోకనాథః, మాధవః, భక్తవత్సలః, సువర్ణవర్ణః, హేమాంగః, వరాంగః, చందనాంగదీ (740), వీరహా, విషమః, శూన్యః, ఘృతాశీః, అచలః, చలః, అమానీ, మానదః, మాన్యః, లోకస్వామీ (750), త్రిలోకధృత్, సుమేధాః, మేధజః, ధన్యః, సత్యమేధాః, ధరాధరః, తేజోవృషః, ద్యుతిధరః, సర్వశస్త్రభృతాం వరః, ప్రగ్రహః (760), నిగ్రహః,

వ్యగ్రహః, నైకశృంగః, గదాగ్రజః, చతుర్మూర్తిః, చతుర్బాహుః, చతుర్వ్యూహః, చతుర్గతిః, చతురాత్మా, చతుర్భావః (770), చతుర్వేదవిత్, ఏకపాత్, సమావర్తః, అనివృత్తాత్మా, దుర్జయః, దురతిక్రమః, దుర్లభః, దుర్గమః, దుర్గః, దురావాసః (780), దురారిహా, శుభాంగః, లోకసారంగః, సుతంతుః, తంతువర్ధనః, ఇంద్రకర్మా, మహాకర్మా, కృతకర్మా, కృతాగమః, ఉద్భవః (790), సుందరః, సుందః, రత్ననాభః, సులోచనః, అర్కః, వాజసనః, శృంగీ, జయంతః, సర్వవిజ్జయీ, సువర్ణబిందుః (800), అక్షోభ్యః, సర్వవాగీశ్వరేశ్వరః, మహాహ్రదః' మహాగర్తః, మహాభూతః, మహానిధిః, కుముదః, కుందరః, కుందః, పర్జన్యః, (810), పావనః, అనిలః, అమృతాశః, అమృతవపుః, సర్వజ్ఞః, సర్వతోముఖః సులభః, సువ్రతః, సిద్ధః, శత్రుజిత్ (820, శత్రుతాపనః, న్యగ్రోధః, ఉదుంబరః, అశ్వత్థః, చాణూరాంధ్రనిషూదనః, సహస్రార్చిః, సప్తజిహ్వః, సప్తైధాః' సప్తవాహనః, అమూర్తిః (830), అనఘః, అచింత్యః, భయకృత్, భయనాశనః, అణుః, బృహత్, కృశః, స్థూలః, గుణభృత్' నిర్గుణః (840), మహాన్, అధృతః, స్వధృతః, స్వాస్యః, ప్రాగ్వంశః, వంశవర్ధనః, భారభృత్, కథితః, యోగీ, యోగీశః (850), సర్వకామదః, ఆశ్రమః, శ్రమణః, క్షామః, సుపర్ణః, వాయువాహనః, ధనుర్ధరః, ధనుర్వేదః, దండః, దమయితా (860), దమః, అపరాజితః, సర్వసహః, నియంతా, అనియమః, అయమః, సత్యవాన్, సాత్త్వికః, సత్యః, సత్యధర్మపరాయణః (870), అభిప్రాయః, ప్రియార్హః, అర్హః, ప్రియకృత్, ప్రీతివర్ధనః, విహాయసగతిః, జ్యోతిః, సురుచిః, హుతభుక్, విభుః (880), రవిః, విరోచనః, సూర్యః, సవితా, రవిలోచనః, అనంతః, హుతభుక్, భోక్తా, సుఖదః, నైకజః, (890), అగ్రజః, అనిర్విణ్ణః, సదామర్షీ, లోకాధిష్ఠానమ్, అద్భుతః, సనాత్, సనాతన

తమః, కపిలః, కపిః, అవ్యయః (900), స్వస్తిదః, స్వస్తికృత్, స్వస్తి, స్వస్తిభుక్, స్వస్తిదక్షిణః, అరౌద్రః, కుండలీ, చక్రీ, విక్రమీ, ఊర్జితశాసనః (910), శబ్దాతిగః, శబ్దసహః, శిశిరః, శర్వరీకరః, అక్రూరః, పేశలః, దక్షః, దక్షిణః, క్షమిణాం వరః, విద్వత్తమః (920), వీతభయః, పుణ్యశ్రవణకీర్తనః, ఉత్తారణః, దుష్కృతిహా, పుణ్యః, దుస్స్వప్ననాశనః, వీరహా, రక్షణః, సంతః, జీవనః (930), పర్యవస్థితః, అనంతరూపః, అనంతశ్రీః, జితమన్యుః, భయాపహః, చతురశ్రః, గభీరాత్మా, విదిశః, వ్యాదిశః, దిశః (940), అనాదిః, భూర్భువః, లక్ష్మీః, సువీరః, రుచిరాంగదః, జననః, జనజన్మాదిః, భీమః, భీమపరాక్రమః, ఆధారనిలయః (950), అధాతా, పుష్పహాసః, ప్రజాగరః, ఊర్ధ్వగః, సత్పథాచారః, ప్రాణదః, ప్రణవః, పణః, ప్రమాణమ్, ప్రాణనిలయః (960), ప్రాణభృత్, ప్రాణజీవనః, తత్త్వమ్, తత్త్వవిత్, ఏకాత్మా, జన్మమృత్యుజరాతిగః, భూర్భువస్స్వస్తరుః, తారః, సవితా, ప్రపితామహః (970), యజ్ఞః, యజ్ఞపతిః, యజ్వా, యజ్ఞాంగః, యజ్ఞవాహనః, యజ్ఞభృత్, యజ్ఞకృత్, యజ్ఞీ, యజ్ఞభుక్, యజ్ఞసాధనః (980), యజ్ఞాంతకృత్, యజ్ఞగుహ్యమ్, అన్నమ్, అన్నాదః, ఆత్మయోని, స్వయంజాతః, వైఖానః, సామగాయనః, దేవకీనందనః, స్రష్టా (990), క్షితీశః, పాపనాశనః, శంఖభృత్, నందకీ, చక్రీ, శార్ఙ్గధన్వా, గదాధరః, రథాంగపాణిః, అక్షోభ్యః, సర్వప్రహరణాయుధః (1000). సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి.

కీర్తనీయుడు విష్ణుదేవుడు. అతని దివ్యనామాలు ఇవి. నీమేలు కోరి వరసగా వినిపించాను.

## విష్ణునామ ప్రభావం

ఈ విష్ణునామాలు వెయ్యీ, నిత్యమూ విన్నా, చదివినా ఇహపరాల రెంటా అశుభమన్నది రాదు మనిషికి. పైగా అమితమైన

శుభాలు కలుగుతాయి. బ్రాహ్మడు విన్నా చదివినా వేదాలు తెలిసినవా డవుతాడు. రాజు విజయం సంపాదిస్తాడు. వైశ్యుడు తరుగులేని ధనం గడిస్తాడు. శూద్రుడు సుఖా లనుభవిస్తాడు. విష్ణు సహస్రనామాలు విన్నా చదివినా ధర్మంకోరినవారికి ధర్మం సిద్ధిస్తుంది. అర్థం కోరినవారికి అర్థమూ, కామం కోరినవారికి కామమూ, సంతానం కోరినవారికి సంతానమూ లభిస్తాయి.

శుచి అయి ఏకాంతభక్తితో విష్ణు సహస్రనామాలు విని, కీర్తించిన నరుడు మంచి కీర్తి గడిస్తాడు; స్థిరమైన సంపద సంపాదిస్తాడు; వంశాభివృద్ధి పొందుతాడు.

విష్ణునామాలు వెయ్యీ కీర్తించినవాడు ఎక్కడా భయపడడు; అమితంగా వీర్యవంతు డవుతాడు; తేజోవంతు డవుతాడు; కాంతిమంతు డవుతాడు; బలవంతు డవుతాడు; రూపవంతుడై రూఢి కెక్కుతాడు.

విష్ణునామాలు వెయ్యీ చదివినవాడు రోగబంధాలనుంచి విముక్తి పొందుతాడు; అంతులేని పాపాలయినా అవలీలగా వొదుల్చుకుంటాడు.

విష్ణుదేవాశ్రయుడూ, విష్ణుదేవపరాయణుడూ అయిన నరుడు, విష్ణునామాలు వెయ్యీ పలికి పాపాలన్నీ పారదోలుకుంటాడు; దుర్గతులన్నీ దూరంచేసుకుంటాడు; చావుపుట్టుకలూ, జరారోగాలూ లేని పరమ పరబ్రహ్మపదం చేరుకుంటాడు.

విష్ణుభక్తులైన జనులకి స్మృతీ, సౌఖ్యమూ, కాంతీ, సిరీ, ధృతీ, కీర్తీ కలుగుతాయి. దుర్మతీ, క్రోధమూ, లోభమూ, మచ్చరమూ వారికి అంటవు.

సూర్య చంద్ర నక్షత్రాలతో ఆకాశమూ, చరాచరప్రాణులతో భూమండలమూ, సముద్రాలూ, దేవతలూ, రాక్షసులూ

గంధర్వులూ, గరుడులూ, యక్షులూ, నాగులూ - యావన్మందీ విష్ణుదేవుడిచేతి కీలుబొమ్మలే.

బుద్ధీ, ఇంద్రియాలూ, మనస్సూ, సత్యమూ, బలమూ, తేజమూ, ధైర్యమూ, క్షేత్రమూ, క్షేత్రవస్తువులూ - అన్నీ విష్ణుదేవాత్మకాలే.

క్షేత్రాలు చెప్పిన ఆచారాలే ధర్మం. విష్ణుమూర్తి దాని ప్రభువు. సాంఖ్యమూ, యోగతంత్రమూ, శిల్పమూ, వేదమూ, శాస్త్రాలూ, కర్మలూ అన్నీ విష్ణుభగవానుడివల్లే ఉద్భవించాయి.

విష్ణువు వొక్కడే మహాభూతం. తక్కినభూతకోటి చాలావుంది. మూడులోకాల్లోనూ సమానంగా నిండి భూతాత్ముడైన ఆ మహాత్ముడు విశ్వమనుభవిస్తాడు.

సకలశోభనాలూ, సర్వసుఖాలూ కోరే పురుషుడు వ్యాసముని ప్రణీతమైన ఈ విష్ణుస్తవం నిర్మలమైన బుద్ధితోనూ, అధికమైన భక్తితోనూ పఠించాలి.

అఖండమూర్తి విష్ణుభగవానుడు. పుట్టుకలేనివాడతడు. విశ్వేశ్వరుడతడు. సర్వజగత్తులకూ జన్మకారణుడతడు. అతణ్ణి భజించిన వారు పుణ్యాత్ములు. పరాభవముండదు వారికి. అంచేత బాబూ, ధర్మరాజా! నువ్వెన్నూ విష్ణుసహస్రనామాలు పఠించు. అందు మూలంగా ఆయువూ, ఐశ్వర్యమూ, ఆరోగ్యమూ, విభవమూ, విజ్ఞానమూసిద్ధిస్తాయి.

## బ్రాహ్మలు

ధర్మరాజు :

లోకంలో ఎవరు పూజ్యులు? ఎవరు నమస్కరించదగినవారు? ఎవరిపట్ల అపరాధంచేస్తే కీడుమూడుతుంది? ఎవరిని సంతోషపెడితే శుభం కలుగుతుంది?

భీష్ముడు :

బ్రాహ్మలు పూజ్యులు. బ్రాహ్మలే నమస్కరించదగినవారు. బ్రాహ్మలపట్ల అపరాధంచేస్తే దేవేంద్రుడికయినా కీడు మూడుతుంది. బ్రాహ్మల్ని సంతోషపెడితే సర్వశుభాలూ కరతలామలకమవుతాయి. బ్రాహ్మలు ధర్మసేతువులు. బ్రాహ్మలు లోకధారకులు. బ్రాహ్మలు సకలశాస్త్రప్రవర్తకులు. బ్రాహ్మలే తపం, బ్రాహ్మలే వేదం. బ్రాహ్మలే ధనం. ఓమాటు బ్రాహ్మలకి భోజనంపెడితే చాలు అన్నిపాపాలూ హరించిపోతాయి. అన్ని మార్గాలకూ ఆధారం బ్రాహ్మలు, దేవతలకి దేవతలు బ్రాహ్మలు. బాలుడైనా, అజ్ఞుడైనా పూజ్యుడే బ్రాహ్మడు. ఇక వృద్ధుల సంగతీ, ప్రాజ్ఞులసంగతీ అడిగేదేముంది ?

ధర్మరాజు :

బ్రాహ్మలలో ఏం గొప్ప చూసి, వాళ్ళని ఇలా పొగుడుతున్నావు? వాళ్ళని పూజిస్తే ఏం శుభాలు కలుగుతాయి చెప్పకోదగినవి ?

భీష్ముడు :

మంచిప్రశ్నే వేశావు. దీనికి పవన కార్తవీర్యార్జున సంవాదం అని ఒక ఇతిహాసముంది. చెపుతాను, విను. అది వింటే నీ ప్రశ్నకి సమాధానం నీకే అవగతమవుతుంది.

కార్తవీర్యార్జునుడు గొప్పబలవంతుడు. అతడికి వెయ్యిచేతులుండేవి. అద్భుతమైన పరాక్రమవంతు డతడు. ఏడుదీవులూ ఏలుతూవుండేవా డతడు.

"నాకంటే గొప్పవాడు ఎవ్వడూ లేడు" అంటూ పంతాలు పలుకుతూ వుండేవాడు అర్జునుడు. అతడి మాటలు విని ఓమారు ఆకాశంమీంచి ఒక భూతం అంది: "అర్జునా తెలియక పంతాలు

పలుకుతున్నావు. నీకంటే, అందరికంటే కూడా గొప్పవారు బ్రాహ్మలు."

"అదేమన్నమాట?" అని ఎదురు తిరిగాడు అర్జునుడు. రాజుల్ని ఆశ్రయించి బతుకుతారు బ్రాహ్మలు. అడుక్కు తింటారు. అంచేత రాజులకంటే బ్రాహ్మలు గొప్పవాళ్ళెలా అవుతారు? అదీకాక, నేను అనుగ్రహిస్తే ప్రాణికోటినంతటినీ బతికిస్తాను. ఆగ్రహిస్తే హతవార్చిపారేస్తాను" అన్నాడు పురిమినట్టు.

అర్జునుడి మాటలు విని హడిలిపోయింది భూతం. అక్కణ్ణుంచి పారిపోయింది వెంటనే.

అదంతా గాలి విన్నాడు, ఆకాశంమీంచే "నేను గాలిని" అని తన్ను తాను తెలుపుకుని అర్జునుడితో ఇలా అన్నాడు:

"అర్జునా! బ్రాహ్మల శక్తివల్లే కదయ్యా, రాజులు ప్రజారక్షణ సాగిస్తున్నారు! బ్రాహ్మలే గొప్పవాళ్ళు అనడానికి బోలెడన్ని నిదర్శనాలున్నాయి. నువ్వే ఆలోచించు.

"అహల్య తగువులో గౌతముడు కళ్ళెర్రచేశాడు. దేవేంద్రుడంతవాడు నానాఅవస్థలూ పడిపోయాడు,

"అగస్త్యుడు అంత సముద్రమూ ఆపోసనం పట్టేశాడు.

"భృగువు శపించడంతోనే అగ్నిహోత్రుడు ఆరిపోయి వూరుకున్నాడు.

"ఇవన్నీ తెలిసీ కూడా బ్రాహ్మలు గొప్పవాళ్ళు కారంటావేమిటి?"

గాలి మాటలు విని మాటాడలేదు అర్జునుడు. ఉదాసీనంగా వూరుకున్నాడు. మళ్ళీ అందుకున్నాడు గాలి.

"అర్జునా! ఆంగిరసవంశంలో పుట్టిన ఉతథ్యుడికి గౌరవంతో కోరి తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేశాడు చంద్రుడు. ఆ దంపతులు

స్వేచ్ఛగా అడివికిపోయారు. అక్కడ మునీశ్వర్ల మధ్య కాపరం పెట్టారు. అంతమందీ ఔరా అన్నట్టు నడుచుకుంటూవచ్చారు.

"ఓమారు ఉతథ్యుడు యమునానదికి స్నానానికి వెళ్ళిన సమయంలో, అతనిభార్యమీద మనసుపెట్టుకు తిరుగుతున్న వరుణుడు ఆమెని ఎత్తుకుపోయి, తన పురంలో దాచేశాడు. అదంతా నారదముని చూశాడు. ఉతథ్యుడి దగ్గిరికి వెళ్ళి, జరిగిందంతా చెప్పాడు.

"'ఏమిటీ? దిక్పాలుడు కదా తాను? పరస్త్రీని పట్టుకుపోడం తగునా తనకి? నారదా, నువ్వు వెళ్ళి నామాటగా చెప్పు. నాభార్యని వొదిలిపెట్టమను' అన్నాడు ఉతథ్యుడు. కామాంధుడుగావుండిన వరుణుడికి నారదుడిమాటలు నచ్చలేదు. ఉతథ్యుడి భార్యని వొదిలి పెట్టలేదతడు.

"ఉతథ్యుడి దగ్గిరికి తిరిగివచ్చాడు నారదముని. 'నాయనా, ఉతథ్యా! నీభార్యని వొదిలిపెట్టకపోడమే కాదు, నన్ను పెడతలపట్టి తోయించాడు వరుణుడు' అని చెప్పాడు.

"ఉలికిపడ్డాడు ఉతథ్యుడు. కళ్ళమొయ్యా కోపం తెచ్చుకున్నాడు. ఆ కోపంతో నీళ్ళన్నీ తాగేశాడు. దాంతో వరుణుడి రాజధాని దుమ్ములో కలిసిపోయింది. భయపడిపోయాడు వరుణుడు. సగౌరవంగా ఉతథ్యుడి భార్యని పట్టుకు వచ్చాడు. ఉతథ్యుడిముందు పెట్టాడు. అతని పాదాలమీద సాగిలబడ్డాడు. అపరాధం మన్నించమన్నాడు. కాళ్ళావేళ్ళాపడ్డాడు. ఉతథ్యుడు కనికరించాడు. అతని సెలవు తీసుకుని వరుణుడు ఇంటిదారి పట్టాడు.

"రాజా! విన్నావా? ఇప్పుడు చెప్పు. రాజులు గొప్పవారా? బ్రాహ్మలు గొప్పవారా?

గాలి చెప్పిన కథ విని కలతపోయినట్టు కదలకుండా నిలబడ్డాడు కార్తవీర్యార్జునుడు. అవునని కాని కాదని కాని మారుపలకలేదు.

అప్పుడు మళ్ళీ గాలి వెనక వోమారు దేవతలు రాక్షసులతో వోడి పోయి అగస్త్యమునిని శరణువేడడమూ, అగస్త్యుడు దేవతల్ని గెలిపించడమూ, మరోమారు గంగవొడ్డున యజ్ఞం చేస్తున్న దేవతల్ని రాక్షసులు బాధపెట్టడమూ, వాళ్ళు వసిష్ఠముని దగ్గిరికి పరిగెత్తడమూ, వసిష్ఠముని కోపాగ్నిజ్వాలలు మూర్తిమంతమై రాక్షసుల్ని భస్మం చెయ్యడమూ చెప్పి, "అర్జునా బ్రాహ్మలైన అగస్త్యుడూ, వసిష్ఠుడూ రాజులకంటే గొప్పవారంటావా లేదా?" అని ముదలకించాడు.

అయినా మాటాడలేదు అర్జునుడు. దాంతో మళ్ళీ ఎత్తుకున్నాడు గాలి:

"ఓమాటు దేవతలకీ రాక్షసులకీ మహాయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాహువు కొట్టిన ఆయుధాలు తగిలి సూర్యుడూ, చంద్రుడూ మూర్ఛపోయారు. లోకం చీకట్లలో మునిగిపోయింది. ఎక్కడా వెల్తురన్నమాట లేకండా పోయింది. అదే సందని దేవతల మీద విరుచుకుపడ్డారు రాక్షసులు. ఆగలేకపోయారు దేవతలు. అత్రిముని దగ్గిరికి పరిగెత్తారు. 'పరమదయాత్మకా, అత్రిమునీంద్రా, రక్షించు, రక్షించు' అంటూ మొరపెట్టారు. అత్రిముని చల్లనిచూపు చూశాడు, సూర్యచంద్రుల గాయాలు బాగుచేశాడు. రాక్షససైన్యం రూపుమాపాడు. ఇప్పుడుచెప్పు. బ్రాహ్మడైన అత్రి, రాజులకంటే గొప్పవాడంటావా? హీనుడంటావా?"

ఈమాటు కూడా మాటాడలేదు అర్జునుడు.

"రాజా!" మళ్ళీ ముదలకించాడు గాలి, 'అశ్వినీదేవతలు సోమపానం చెయ్యడానికి అర్హులు కారన్నాడు దేవేంద్రుడు. అశ్వినులు భార్గవచ్యవనుణ్ణి ఆశ్రయించారు. తన మంత్రబలంతో దేవతల మీద ధ్వజమెత్తాడు భార్గవచ్యవనుడు. దేవేంద్రుడు మండిపడ్డాడు.

పెద్ద కొండా, వజ్రాయుధమూ చ్యవనుడిమీద ప్రయోగించాడు. ఇన్ని నీళ్ళు మంత్రించి చల్లాడు చ్యవనుడు. కొండా, వజ్రాయుధమూ తుక్కు తుక్కయిపోయాయి. దేవేంద్రుడున్నూ మూర్ఛపోయాడు. అయితే, కొంచేపటిలో తెలుపుకున్నా డతడు. ఇంతలో చ్యవనముని మదు డని వొకణ్ణి సృజించాడు. వందయోజనాల పొడవున్నాడు మదుడు. వెయ్యి పళ్ళున్నాయతడికి. మదుణ్ణి దేవతలమీదికి పంపాడు చ్యవనుడు. దేవతలతోసహా దేవేంద్రుణ్ణి గుటుక్కుమనిపించాలని అంగలు వేస్తూ వెళ్ళాడు మదుడు. మరి దారిలేకపోయింది దేవతలకి. శరణు శరణు అంటూ అంతమందీ వచ్చి, చ్యవనముని పాదాలమీదపడ్డారు. జాలి పడ్డాడు చ్యవనమునీంద్రుడు. దేవతల్ని క్షమించాడు. దేవేంద్రుడితో సహా అంతమంది దేవతలూ అశ్వినుల సోమపానం అంగీకరించారు. అయినప్పుడు చ్యవనముని రాజులకంటే గొప్పవాడంటావా లేదా ?"

ఈ మాటూ పల్లెత్తు మాటాడలేదు అర్జునుడు. ఊరుకోకండా మళ్ళీ అందుకున్నాడు గాలి. అతడికి చేటుకలగకండా కనికరించి : "అర్జునా ! దత్తాత్రేయుడి శుశ్రూష చేసికదా, రాజులందరిలోనూ గొప్పవాడివయావు నువ్వు ! ఆ మేలు మరిచిపోతున్నావేమిా ఇప్పుడు? విను, నువ్వు వొక్కడివే కాదు, దేవతలూ మొదలైన ప్రాణులందరూ బ్రాహ్మల కృపవల్లే వృద్ధిపొందుతున్నారు. మాచన్నందీ ఎరిగిన విషయ మిది. బ్రాహ్మలు దైవస్వరూపులు. వాళ్ళని ఆశ్రయించి బతికితేనే నీకు మేలు. నామాట వినుకో" అన్నాడు.

గాలి చెప్పిన ఈ చివరిమాటలు విని తెలివి తెచ్చుకున్నాడు అర్జునుడు. "నువ్వు చెప్పినట్టు చేసి బతుకుతాను. అహంకారం మాను కుంటాను. బ్రాహ్మల శ్రీపాదా లాశ్రయించి శాంతి పొందుతాను" అన్నాడు. సంతోషించాడు గాలి. "బుద్ధికలిగి బతుకు" అంటూ

ఆదరించి పంపాడు. ధర్మరాజా! బ్రాహ్మల గొప్ప అంటే అలా వుందని తెలుసుకో.

## కృష్ణప్రభావం

బ్రాహ్మల మహానుభావం ఇంకా వినాలనే కుతూహలపడుతున్నావు నువ్వు. అయితే నాయనా! నా ఇంద్రియాలు దుర్బలమైపోతూవస్తున్నాయి. మాటా, మనస్సూ స్వాధీనం తప్పుతూవున్నాయి. సూర్యుడు దక్షిణాయనం తుదికి చేరుకుంటున్నాడు. దేవన్యాసానికి మరి తడువు లేదని తోస్తున్నది. అంచేత మరి చెప్పే శక్తి లేదు నాకు. బ్రాహ్మల విశేషం ఈ శ్రీకృష్ణుడు సెలవిస్తాడు.

నేను శ్రీకృష్ణుణ్ణి ఎరుగుదును. క్రీడావరాహమై ఈ భూమండల మెత్తాడీయన. ఈ వొక్కమాటే అని చెప్పడ మెందుకూ? భూమీ మొదలైన భూతాలన్నీ ఈయన లీలవల్లే కదా, పుట్టాయి! కృష్ణుడి పరమలీల సామాన్యమైంది కాదు. ఈయన తనబొడ్డు: తామరపువ్వులో వొక పురుషుణ్ణి పుట్టించాడు. అతడి రచనవల్ల సకల చరాచర ప్రపంచం పుట్టింది.

ఎప్పుడెప్పుడు రాక్షసులవల్ల ధర్మహాని కలుగుతుందో అప్పుడప్పుడు అవతరించి ఆ దురాత్ముల్ని హతమారుస్తాడీయన. ధర్మాత్ముల్ని రక్షిస్తాడు.

ఈ కృష్ణుడే శివుడు. లోకపాలకులూ ఈయనే. ఈయనే విశ్వపతి. ఈయనే కాలం. ఈయనే దిక్కులు. అంతటా ఈయనే వున్నాడు.

ఆలోచించిచూస్తే కృష్ణుడు యజ్ఞాత్మకుడు. వేదాలు తెలిపిన మంత్రాలూ, తంత్రాలూ వాటితో ఈయన్నే పూజించి మేలుపొందుతారు యజ్ఞకర్తలు. యజ్ఞాల్లో ఋగ్వేదం, శుభవర్ణాలే నామం కల ఈ

శ్రీకృష్ణుడి గుణాలే కీర్తిస్తుంది. దానివల్లే యజ్ఞక్రియా నిరతులైన దేవతలు ప్రీతి పొందుతారు. అన్ని వేదాలూ ఈయనలోనే పుట్టాయి. అన్నీ ఈయనవిలాసాలే. వేదాలు నిరూపించిన వస్తువుకూడా ఈయనే. అలాటప్పుడు ఋగ్వేదం ఈయన్ని పొగడడంలో వింతేముంది ?

అగ్నులూ, యజమానుడూ, ఆహుతులూ, యూపమూ, యజ్ఞఫలమూ కృష్ణుడే అని తెలుసుకో.

సూర్యుడిలోనూ, చంద్రుడిలోనూ, చుక్కల్లోనూ వుండే వెలుగు కృష్ణమయమే.

పరమజ్యోతి అన్నా, నిర్జరమైన అమరపదమన్నా, సత్యమన్నా, అమృతమన్నా ఈశ్రీకృష్ణుడే. వేదాంతంలో ఈయనే వెలుగుతున్నాడు.

## దుర్వాసుడి వింతకథ

భీష్ముడి ఉపదేశం విని సంతోషించాడు ధర్మరాజు. అతనికి నమస్కరించాడు. అనంతరం శ్రీకృష్ణుడికి ప్రణామంచేసి, "దేవా ! శ్రీకృష్ణా ! బ్రాహ్మలమహిమ ఇంకా వినాలనుంది. సెలవియ్యి నువ్వు" అని వినయంగా ప్రార్థించాడు. కరుణామృతం కురిపించే చూపులతో ధర్మరాజుని చూసి, ఆదరపూర్వకంగా ఇలా అందుకున్నాడు శ్రీకృష్ణుడు:

"వెనక ఓమారు ప్రద్యుమ్నుడు ఇప్పుడు నువ్వడిగినట్టే నన్ను అడిగాడు. అతడి మేలుకోరి అపుడు నేను చెప్పినమాటలే ఇపుడు చెప్తాను, విను.

ధర్మమూ, అర్థమూ, కామమూ – ఈవర్గత్రయం సాధించిన వారికీ, మోక్షం సాధించకోరే వారికీ దేవతలకీ, పితృదేవతలకీ ప్రీతి కలిగించకోరేవారికీ, ఐహికసుఖాలు కోరుకునేవారికీ, బ్రాహ్మలే శరణ్యం. దేవతలకి అంత ఆయువూ, సిరీ, కీర్తీ, కలిగాయంటే,

బ్రాహ్మల ప్రసాదంవల్లే కలిగాయి. అనుగ్రహం కలిగితే అందల మెక్కించడానికీ, ఆగ్రహంవస్తే హతమార్చి భస్మంచేయడానికీ శక్తిమంతులు బ్రాహ్మలు. అంచేత వారికి ఆగ్రహంవచ్చేనట్టు ఏపనీ చెయ్యకూడదు. వారికి ప్రీతికలుగునట్టు నడుచుకుని, వారిని సంతోష పరిచినవాడు ఈ లోకంలోనూ, ఆలోకంలోనూ మెప్పు సంపాదించ గలుగుతాడు.

"నేను స్వయంగా చూసిన ఆశ్చర్యం చెపుతాను, ఆలకించు. దూర్వాసముని తెలుసుకదా, నీకు! స్వతంత్రప్రవర్తకుడాయన. ఆయన వోమాటు మాయింటికి వచ్చాడు. చిరునవ్వు నవ్వుతూ, చిరచిర లాడుతూ, సుముఖుడవుతూ, విముఖుడవుతూ, వొకప్పుడు తిండి మానేస్తే, మరొకప్పుడు ఎంతోమందికి పెట్టినతిండి కూడూ కూరా తాను వొక్కడే తినేస్తూ, వోమారు పక్కమీద పడుకుంటే వోమారు నేలమీదే నిద్రపోతూ, వున్నట్టువుండి ఎక్కడెక్కడికో పోయివస్తూ చిత్రంగా వుండేవాడు.

"ఓ నాడు 'కృష్ణా! నాకు పాయసంమీద మనసుపుట్టిం దయ్యా. పెట్టించవయ్యా' అన్నాడు. ఉత్తరక్షణంలో పాయసం తయారుచేయించి పెట్టాను. కొంత తిన్నాడతను. మిగిలింది తన వొంటికి పూయమన్నాడు. అలాగే పూశాను. ఆదగ్గిరే వున్న రుక్మిణిని చూసి, కొంతపాయసం ఆమెవొంటికి పూశాడతను. ఆమెని రథానికి పూసి, తాను రథమెక్కాడు. గుర్రంలాగినట్టు ఆమెని రథం లాగ మన్నాడు. వీధిలో గబగబా లాక్కపోతే మునకాలుతో పొడిచాడు. ఆమెని అలా చేసినా నాకు ఈర్ష్యకాని, కోపం కాని కలగలేదు. చూస్తూ నేనుకూడా వెంటనడిచాను శాంతంగా. యాదవులందరూ ఆశ్చర్యపోయారు. కోపంతో పళ్ళుకొరికారు. భయంతో వాణికి

పోయారు. అనేకవిధాల మాట్లాడుకున్నారు. చేసేదిలేక చేతులు నులుపుకుంటూ పక్కపక్కల్ని నడుస్తూవచ్చారు.

"రథం లాగిలాగి అలిసిపోయింది రుక్మిణి. మోకరించి నేల మీద పడిపోయింది. రథంమీంచి వురికాడు దూర్వాసుడు. రుక్మిణి మీద ధూళిచల్లి పారిపోయాడు. అతని వెంట పరిగెత్తాన్నేను. కాళ్ళా వేళ్ళాపడ్డాను. ఎంతో ప్రార్థించాక తిరిగివచ్చాడతను. 'మిమ్మల్ని కష్టపెట్టాను కదూ!' అంటూ జాలిగా అన్నాడు. నన్ను చూసి, 'కృష్ణా! క్రోధం జయించావయ్యా నువ్వు. వరమిస్తాను, పుచ్చుకో. యావన్మందీ తమని తాము ఎంతప్రీతితో చూసుకుంటారో నిన్ను అంతప్రీతితో చూసుకుంటూ నిన్ను అనుసరించాలి. లోకవంద్యుడివై ఎక్కడా మారులేకండా, సాటిలేనిమహిమతో జీవించు నువ్వు' అని వరమిచ్చాడు. ఇంకా ఇలా అన్నాడు, 'భక్తిపూర్వకంగా నాశరీర మంతటా పాయసం పూశావు. కాని నాపాదాలకు పూశావుకావు. అంచేత అరికాలిమీదే అపాయం కలుగుతుంది నీకు. తప్పదు. అయితే అది నువ్వు వైకుంఠం దయచెయ్యడానికి అనువుపడుతుంది. అంచేత అది అశుభం అనకూడదు. ఇలాగే బ్రాహ్మలమీద భక్తి కలిగి మసులుకుంటూవుండు నువ్వు' అన్నాడు.

"రథం లాగి అలిసి పడున్న రుక్మిణిని చూసి, 'సౌందర్య సౌభాగ్యాలలో నువ్వు సాటిలేనిదానవై, మాననీయత్వంలో కృష్ణుడి పదారువేల అంతఃపురస్త్రీలలోనూ అధికురాలివై బ్రతుకు' అని దీవించాడు. అనంతరం అంతర్థానమైపోయాడు.

రుక్మిణీ నేనూ మాశరీరాలలో అసమానమైనసౌందర్యం చూసి ఆశ్చర్యపోతూ, సంతోషంగా ఇంటికి తిరిగివచ్చాం. ఇంట్లో అన్ని వస్తువులూ ముందటికంటే అధికంగా, అందంగా వున్నాయి. చూసి

మరింత నిచ్చెరపోయాం. విన్నావా, బ్రాహ్మలమహిమ అంటే అలా వుంటుంది. అంచేత బ్రాహ్మలమీద భక్తికలిగి మసులుకో ఎప్పుడూ.''

## శివమహిమ

కృష్ణుడు చెప్పింది విని సంతోషించాడు ధర్మరాజు. "కృష్ణా! దూర్వాసమునీంద్రుడు శివాంశలో పుట్టాడని విన్నాను. శివుడి మహిమ వినాలని కుతూహలపడుతున్నాను'' అన్నాడు.

"అడగవలిసిందే అడిగావు'' అంటూ అందుకున్నాడు శ్రీకృష్ణుడు, "నీ ప్రశ్న సంతోషంకలిగించింది నాకు. శివుడికి నమస్కారంచేసి, అతని దివ్యమహిమ వినిపిస్తాను, విను.

"శివుణ్ణి మనసులో నిలుపుకుని, అతిభక్తితో శతరుద్రీయం జపిస్తే ఇహపరాల్లో సర్వమూ సులభమవుతుంది మనిషికి.

"శివుడికి మహాదేవుడని పేరు. అతణ్ణి మించింది మరేదీ లేదు. అతని కోపదృష్టిజ్వాల ధర్మవిరోధుల్ని భస్మంచేస్తుంది. దేవతలూ, మునులూ అతి ప్రయత్నంమీద చేసిన దక్షయజ్ఞంలో శివుణ్ణి మరిచిపోయారు. అంచేత అంత మహాయజ్ఞమూ ధ్వంసమైపోయింది. మరచినవారికి ధర్మనాశనం కలిగి చెప్పరానికష్టాలువచ్చాయి. అయితే శరణంటే మాత్రం అందరినీ రక్షించాడు, కనికరించి. శివుడి మహిమ ఇంతా అంతా కాదు. ఆయన దివ్యశీలం వినిపిస్తాను, ఏకాగ్రచిత్తంతో విను.

"రాక్షసులైన త్రిపురంనాయకులు ప్రబలులై తమప్రతాపంతో ముల్లోకాలూ బాధపెట్టారు. వాళ్ళ బాధలు పడలేక దేవతలు శివుడి దగ్గిరికిపోయి రక్షించమని ప్రార్థించారు. ఒక్కఅస్త్రంతో మూడు పురాలూ భస్మంచేశాడు శివుడు. ఆ అస్త్రం వాడిలో పెట్టుకోగానే అది బాలుడై అవతరించింది. బాలుడు బ్రాహ్మణమూర్తిగా ప్రకా

శించాడు. ఇతడెవ్వడని దేవతలందరూ భయపడ్డారు. అదిగో ఆబాలుడే దుర్వాసుడు. దుర్వాసుడని అతనికి శివుడే పేరుపెట్టాడు. ఆ దుర్వాసుడే మాఇంటికి వచ్చి అంతపని చేశాడు.''

శివమహిమ విని ఆశ్చర్యపోయాడు ధర్మరాజు. ''ముఖ్యమైన శివనామాలు భోగమూ, మోక్షమూ కలిగిస్తాయని విన్నాను. అనుగ్రహించి అది వినిపించు'' అని అడిగాడు.

''శివదేవుణ్ణి పూర్తిగా కొలవడమూ, ఆయనపేర్లు అర్థం తెలుసుకుని స్తోత్రంచెయ్యడమూ నాకే కాదు, బ్రాహ్మదేవుడికైనా తరం కాదు. అయినా నువ్వు అడుగుతున్నావు కనక నేను ఎరిగినంతమట్టుకు చెపుతున్నాను సావధానంగా విను.

''అగ్ని, వాయువు, ఇంద్రుడు. ఆదిత్యులు, వసువులు, మరుత్తులు మొదలైన దేవతాసమూహాత్ముడు శివుడు. ఆయనమహిమ ప్రీతిగా చెప్పడమూ, వినడమూ సర్వార్థసాధకం.

''మహత్వంలోనూ, ఈశ్వరత్వంలోనూ సాటిలేనివాడు కనక మహామునులు శివుణ్ణి మహేశ్వరు డన్నారు. ప్రతాపంలో ఉగ్రుడు కనక రుద్రుడన్నారు. దేవతల్లో మహనీయుడు కనక మహాదేవు డన్నారు. సర్వసత్కర్మల్లోనూ శుభం కలిగిస్తాడు కనక శివు డన్నారు. స్థిరమైన తేజస్సుతో ప్రకాశిస్తాడు కనక స్థాణు డన్నారు. చరాచరాత్మకమైనబహు ప్రాణులరూపంతో వుంటాడు కనక బహురూపు డన్నారు, ధూమ్రవర్ణమైన జటలు ధరిస్తాడు కనక ధూర్జటి అన్నారు. విశ్వేలనే దేవతలు తనలోనే పుట్టారు కనక విశ్వరూపు డన్నారు. శరీరంలో బహునేత్రాలు కలవాడు కనక సర్వనేత్రు డన్నారు. భూతాలన్నీ పశువులు. తాను అన్నిటికీ పతి, కనక పశుపతి అన్నారు. వృషభవాహను డనీ, మృత్యుంజయుడనీ, ఫాలాక్షుడనీ ఇంకా వేదాల్లో చెప్పిన పేర్లు ఎన్నోవున్నాయి. వేదవేత్తలు వాటి మహిమ వివరిస్తారు.

శివనామనిర్వచనాలు పఠించిన మనిషి, ఏకాగ్రచిత్తంతో విన్న మనిషి పరమానందమనుభవిస్తాడు. పరమసౌఖ్యం పొందుతాడు.

"లోకహితంకోసం వ్యాసమునీంద్రుడు శివుడివిషయంలో చదవదగిన ఉపస్థాన * మొకటి పుణ్యవాక్యాలతో విరచించాడు, విను.

"సర్వజగన్నిత్యసాక్షి శివుడు. లోకైకశుభావహమూర్తి. నిరామయుడు. ప్రథమభూతాలకు ప్రథమతమ భూత మతడు. ఆయన మొహంలో అగ్ని పుట్టింది. భక్తితో ఆరాధించిన వారికి భవమోక్షం ప్రసాదించే ప్రభు వాయన. శివనామాలు స్థిరచిత్తంతో పూజించిన వారికి ఆయాకోరికలు అనుగ్రహిస్తాడా మహేశ్వరుడు.

"ఈ ఉపస్థానం శివలింగ సన్నిధానంలో చలించని మనస్సుతో పఠిస్తే అయురారోగ్యాలూ, ఐశ్వర్యమూ కలిగి సకల కోరికలూ ఫలిస్తాయి."

కృష్ణుడు వివరించిన శివమహిమ విని సంతోషించాడు ధర్మరాజు. తాత భీష్ముడివేపు చూసి మళ్ళీ అడిగాడు:

"తండ్రీ! ఎన్నోరకాలుగా వున్నాయి ధర్మాలు. వాటిలో పరమానుష్ఠేయమైనధర్మ మేది?"

## ధర్మసూక్ష్మం

"ధర్మం తెలిసిన మహాత్ములు ధర్మసంజ్ఞ విడమర్చి వివరిస్తారు" అంటూ అందుకున్నాడు భీష్ముడు, "అయితే, కాలపాకంగా అది అన్యథాత్వం కలిగి అయోమయంగా తయారవుతుంది. ఎలా అంటావా? అధర్మం ధర్మ మని భ్రాంతి కలిగిస్తుంది. సూక్ష్మంగా విచారించకపోతే గడ్డికప్పిన నుయ్యిలా ధర్మం మరుగుపడిపోతుంది. తెలియక చెప్పేవారి మాటలవల్ల ధర్మం దారితప్పుతుంది. క్రియా

* ఉపస్థానం = స్మరణ.

పరులకి మాత్రం అది కష్టం కలిగిస్తుంది. అంచేత ధర్మప్రకారం ధర్మసూక్ష్మం తెలిసిన మతిమంతుల్ని అడుగు. లోభమూ, మదమూ, మోహమూ లేని బుద్ధిమంతులవల్లే ధర్మసూక్ష్మం తెలుస్తుంది.

"ధర్మరాజా! వివేకవంతుడివి నువ్వు. కనక కామమూ, అర్థమూ అధికమైన మోహం పుట్టిస్తాయని తెలుసుకున్న ధర్మపరుల దగ్గిరే ధర్మం బాగా తెలుసుకో. స్వాధ్యాయంలోనూ, యజ్ఞం లోనూ, ఆచారంలోనూ నిష్ఠ కలిగినవారు నడిపించే ధర్మసూక్ష్మం" అన్నాడు.

"ఇప్పుడు నువ్వు చెప్పినమాటలు వింటే నాసందేహం మరింత బలపడింది. ఏమంటే ధర్మం తెలుసుకోడానికి బహుముఖత్వం కావాలి. సారంలేని ధర్మాచారంలో మునిగిన మావంటి వారికి 'ఇది రేవు అని నీవంటివారే చెప్పాలి. వేదాలు చెప్పినమాటకీ ప్రత్యక్షానికీ, ఆచరించినదానికీ ఏమీ సంబంధమున్నట్టు అవుపడదు. దేనిదారి దాందే. కనక ఈమూడిటిలో 'ఇది సత్యం'. అని ధర్మ సూక్ష్మత తెలుసుకోడం గహనంగానే కనిపిస్తోంది" అన్నాడు ధర్మరాజు

"అది కాదు" అంటూ మళ్ళీ అందుకున్నాడు భీష్ముడు, "నువ్వన్న మూడు మార్గాలూ ధర్మసూక్ష్మం నిశ్చయించడానికి అనువైన ముఖ్యమయినవి. పూర్వమునులు వీటిని పరిశీలించి పరికించారు. కనక అనుమానించకు. అంధుడూ, నిశ్శంకాత్ముడూ, జడుడూ విన్నట్టు నేను చెప్పిన మాటలు విని, మనస్సుకి పట్టించుకో. అంతే. వెయ్యిమాటలెందుకూ?"

"అహింసా, దానమూ, సత్యమూ, క్రోధం వర్జించడమూ - ఉత్తమధర్మాలు. ఇవి అలవరుచుకో. బ్రాహ్మల్ని ఆరాధించడంలో

తత్పరుడివి కా. మరొక విచారం మనస్సులో పెట్టుకోకు. ఇదే ధర్మసూక్ష్మం" అన్నాడు.

సంతోషించాడు ధర్మరాజు. తాతగారి పాదాలకి నమస్కరించాడు. "ధర్మమంటే ఎవరు అసహ్యించుకుంటారు? ఎవరు ధర్మం ఆచరిస్తారు? వారు వారు ఏయే గతులు పొందుతారు?" అని అడిగాడు.

"విను" అంటూ అందుకున్నాడు భీష్ముడు, "రజస్తమో గుణాలు మనస్సులో కలవాళ్ళు ధర్మమంటే అసహ్యించుకుంటారు. నరకంలో నివసించడానికే అర్హులు వాళ్ళు.

"సత్వగుణం కలవాళ్ళు ధర్మం ఉపాసిస్తారు. ఊర్ధ్వలోకాలకి తగినవాళ్ళు వాళ్ళు. బ్రహ్మకి ముందు పుట్టిన కొడుకు ధర్మం. బుద్ధిమంతులు ధర్మం ఉపాసిస్తారు. తియ్యటి పళ్ళ మొక్క పరిపక్వస్థితికి తెచ్చి అనుభవించినట్టు ధర్మం అభ్యసించి, దానిఫలం అనుభవిస్తారు వారు."

## సాధువులూ అసాధువులూ

"ఎలాటి వారు సాధువులు? ఎలాటివారు అసాధువులు?" అని మళ్ళీ అడిగాడు ధర్మరాజు.

"తమకి తెలియదు, ఒకరు చెపితే వినరు, అదిగో అలాంటి వాళ్ళే అసాధువులు. ధర్మం తామెరిగినవాళ్ళూ, ఒకరు బోధిస్తే విని తెలుసుకునేవాళ్ళూ సాధువులు.

"సాధువులు తగనిచోట మలమూత్రాలు విసర్జించరు. అతిథి భోజనంచేశాక మిగిలిందే తింటారు వారు. పెద్దలు ఎదురుగా వస్తే వారికి దారిచ్చి వారికి ప్రదక్షిణంచేసి ముందుకిపోతారు. సత్యం పాలిస్తారు. శరణుచొచ్చినవారిని కాపాడతారు. సంగమం రహస్యంగా వుంచుతారు. తాము కట్టుకున్న భార్యతోనే తృప్తిపడతారు. గురు

భక్తికలవారు. మలినంలేని మనస్సుతో ఎప్పుడూ సంతోషంతో వుంటారు.''

## మంచిచెడ్డలకి పూర్వకర్మ కారణం

"నాకు ఎప్పుడూ వొక విషయం బాధిస్తూ వుంటుంది. అప్రయత్నంగా ధనం వచ్చిపడుతుంది కొందరికి. ధర్మపరులూ, నీతిమంతులూ, బలవంతులూ అయి ఎన్నోవిధాల ప్రయత్నించినా కోరిన ధనం దొరకదుకొందరికి. దొరికినా కొందరికి అనుభవానికి రాదు. అంతగా నేర్చుకోకపోయినా కొందరికి విద్య పట్టుపడుతుంది. ఎంత నేర్చుకున్నా కొందరికి వంటపట్టదు. వెయ్యి లోట్లున్నా లక్షరోగాలు వచ్చినా కొందరు చావరు. పూరిపుడక తగిలి పిడుగుల్లాటివాళ్ళు టపీమని ఎగిరిపోతారు. ఏమిటిదీనికి కారణం?'' అని అడిగాడు ధర్మరాజు.

"నాటందే మొక్క మొలుస్తుందా బాబూ?'' అన్నాడు భీష్ముడు, "పూర్వజన్మలో చేసిన దానాలవల్ల ఈజన్మలో సంపదలు లభిస్తాయి, ప్రయత్నంలేకండా. నిజమైనమాట ఇది. ఆజన్మలో గొప్పతపస్సు చేసివుంటే ఈజన్మలో భోగాలు వెదుక్కుంటూ తమంత తామే వస్తాయి. వెనకజన్మలో వృద్ధుల్ని సేవించివుంటే ఈజన్మలో విద్యపట్టువడుతుంది. పూర్వజన్మలో అహింస పాటించివుంటే ఈ జన్మలో దీర్ఘాయువు సిద్ధిస్తుంది. ఈగుణాలు పూర్వజన్మలో లేకపోతే ఈఫలాలుకూడా ఈజన్మలో వ్యతిరేకంగానే వుంటాయి. మంచిచెడ్డలకి పూర్వకర్మే కారణం. కనక దానమూ, తపమూ, వృద్ధసేవా, అహింసా అంతమందీ అవశ్యం చెయ్యవలిసిన పనులు, మహాగుణాలు ఇవి. నువ్వుకూడా ఇవి మనస్సులో దృఢంగా నిలిపి మసులుకో

"ధర్మంమీద ఎప్పుడూ ఆదరంకలవాడికి కాలమే ధర్మతత్వ ప్రబోధం కలిగిస్తుంది. భావశుద్ధికలిగి స్నానమూ, దానమూ, జపమూ,

దేవతాపూజా సాగిస్తూవుంటే ధర్మయోగం దానంతట అదే సమకూడుతుంది. సాధనచేస్తూ, చెప్పించుకుంటే ధర్మసూక్ష్మం అవగతమవుతుంది. సంసారంనించి తరింపచేస్తుంది ధర్మం. సత్యమైంది ధర్మం. అజరామరమైంది ధర్మం. నిత్యమూ, అచ్యుతమూ అయింది ధర్మం. పరానందమైంది ధర్మపదం.

"నాయనా ధర్మరాజా! వేదవ్యాసమునీంద్రుడు నీకు కనువెలుగోయి. శ్రీకృష్ణుడు నీకు పరాయణం. చింత ఎందుకు బాబూ, నీకు! శాంతంగా ప్రజల్ని పాలించు తండ్రీ! అన్నిటా జయం పొందు."

తాతగారి ఉపదేశంవిని, ఆనందంతో ధర్మరాజుశరీరం పులకరించింది; మొహం కలకల్లాడింది. అప్పుడు చూసి వ్యాసమునీంద్రుడు భీష్ముడితో ఇలా అన్నాడు.

"నీ ఉపదేశామృతంవల్ల ధర్మరాజు తెలువుకున్నాడు. తమ్ములూ, కృష్ణుడూ, ఆప్తులైన యావన్మంది రాజులూ, ధృతరాష్ట్రుడూ, తానూ నిన్ను ఉపాసించారు. నీదయకి పాత్రులయారు. ఇక సెలవిప్పించు. ఈరాజులందరితోనూ కలిసి మళ్ళీ ఇతడు నీదగ్గిరికి వస్తాడు."

## వెళ్ళిరా

వ్యాసుడు అలా అనడంతోనే అంపశయ్యమీంచి వాత్సల్యంతో ఆర్ద్రమైన చూపుతో ధర్మరాజుని చూశాడు భీష్ముడు. "వెళ్ళునాయనా, హస్తినాపురం వెళ్ళు. శుభపరంపరలందుకో. నీబుద్ధి ధర్మనిష్ఠతో నిలవాలి. యయాతిలాగ మంచిదక్షిణలతో యజ్ఞాలు చెయ్యి. రాజధర్మంతో ప్రకృతిని రంజింపచెయ్యి. పండినచెట్టునాశ్రయించి బతికిన పక్షుల్లాగ చుట్టాలూ స్నేహితులూ నిన్ను ఆశ్రయించి సుఖపడాలి. సూర్యుడి ఉత్తరాయణం రాగానే నాదగ్గిరికి రా. వెళ్ళిరా

బాబూ. తల్లీ, తమ్ముళ్లూ, మీ పెదబాబూ, నువ్వూ సుఖంగా బత కండి '' అన్నాడు.

" నీ ఆజ్ఞ శిరసావహిస్తాను " అంటూ సవినయంగా తాతగారికి దండప్రణామం చేశాడు ధర్మరాజు, మునులదగ్గిర సెలవుతీసుకున్నాడు. కృష్ణుడూ మొదలైనవారితో కలిసి హస్తినాపురం వచ్చేశాడు. ఆనం దంలో యెదురు వచ్చారు హస్తినాపురం ప్రజలు. పుణ్యాంగనలూ బ్రాహ్మలూ దీవనలిచ్చారు ; సేసలు చల్లారు. అలా వైభవంగా వెళ్ళి నిజమందిరం ప్రవేశించాడు ధర్మరాజు. ప్రేమతో గాంధారిని సంభావించాడు తల్లికి నమస్కరించాడు. ద్రౌపదిని సంతోషపరి చాడు. అంతాఅయాక పౌరుల్నీ పల్లెప్రజల్నీ సెలవిచ్చిపంపాడు. బ్రాహ్మలకి దానాలిచ్చి సంతోషపెట్టాడు. యుద్ధంలో భర్తలుపోయిన స్త్రీజనానికి సమగ్రంగా ధనమిచ్చాడు. ధృతరాష్ట్రుణ్ణి పూజించి సంతుష్టిపరిచాడు. తమ్ముళ్లూ, కృష్ణుడూ సంతోషించగా రాజ్యాభి షేకం పొందినట్టు భావించుకుని పూరట పొందాడు. ఎవరికి ఉచితమైన పనులు వారికి నియోగించాడు. అనంతరం తన అభ్యంతరమందిరానికి వెళ్ళాడు.

అలా సామ్రాజ్యమేలుతూ, జనపూజ్యుడై ధర్మరాజు కాలం గడుపుతూవుండగా ఏభై దినాలు గడిచాక సూర్యుడు ఉత్తరాయణగతు డయాడు.

## తు ది ఘ డి య లు

భీష్ముడి దగ్గిరకి బయలుదేరాడు ధర్మరాజు. గాంధారినీ, ధృత రాష్ట్రమహారాజునీ, కుంతీదేవినీ ముందుంచుకుని పయనమయాడు. కృష్ణుణ్ణీ, అతని తమ్ముణ్ణీ, తనతమ్ముళ్ళనీ, విదురుణ్ణీ, యుయుత్సుణ్ణీ, సంజయుణ్ణీ, కృపాచార్యుణ్ణీ, ధౌమ్యుణ్ణీ, మంత్రకోవిదులైన యాజకుల్నీ

వెంటపెట్టుకున్నాడు. వస్త్రాలూ చందనమూ, అగురూ, పువ్వులూ, పళ్ళూ, నేతికుండలూ పట్టించాడు. రత్నాలూ, బంగారమూ పట్టించాడు. అన్నీ సంఘటించాడు. యోగ్యులైన జనులతోనూ, సకల పరిజనులతోనూ అలా వైభవంగా హాస్తినాపురం నించి వెళ్ళి భీష్ముడి వీరశయనప్రదేశానికి అల్లంత దూరంలో రథం దిగాడు. కృష్ణుడూ మొదలైన యావన్మందీ అక్కడే రథాలు దిగారు. అక్కడినించి అందరూ కాలినడకని భీష్ముడి దగ్గిరికివెళ్ళారు. వ్యాసుడూ, నారదుడూ, దేవలుడూ మొదలైన పరమమునులమధ్య అంపశయ్యమీద పడున్న భీష్ముడి దగ్గిరికి వెళ్ళి, మునులకి మొక్కి, తాతగారికి అభివందనం చేశాడు ధర్మరాజు. ధ్యానతత్పరుడై వుండిన ఆయనతో ఇలా అన్నాడు :

"తండ్రీ, ధర్మరాజుని. వచ్చాను. నమస్కారంచేస్తున్నాను. నామాట వినడం అవసరమైతే విను. అవసరమైన అగ్నీ మొదలైనవన్నీ పట్టుకువచ్చాను. ఋత్విజులు వచ్చారు. కృష్ణుడూ, నీకుమారుడు ధృతరాష్ట్రుడూ సమస్తబంధువులతో రాజులూ, బ్రాహ్మలూ, పౌరజనులూ వచ్చారు. కళ్ళువిప్పి దయతో వీరిని చూడు."

కళ్ళువిప్పి యావన్మందినీ వోమారు చూశాడు భీష్ముడు. ధర్మరాజుచెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు. "మంచిపనిచేశావు నాయనా," అన్నాడు, "నువ్వు దొరకడం దైవయోగం. మాఘమాసం, శుక్లపక్షం పరమానందం కలిగించాయి నామనస్సుకి." అలా ధర్మరాజుని అభినందించి, ధృతరాష్ట్రుడితో ఇలా అన్నాడు :

"నాయనా ధృతరాష్ట్రమహారాజా! వేదశాస్త్రపరిజ్ఞానం కలవాడివి నువ్వు. వృద్ధుల్ని సేవించావు. ధర్మాలెన్నో తెలుసుకున్నావు. వేదవ్యాసమునీంద్రుడు దేవరహస్యం చెప్పగా విన్నావు. నిష్కళంకుడివయావు. కనక భవితవ్యాలకి విచారించకు. పాండురాజుకుమాళ్ళు

నిజానికి నీ కన్న కుమాళ్ళే కదా ! వీరిని పరిపాలించు. వీరు నీశుశ్రూష చేస్తారు, సంతోషించు. ధర్మరాజుని దయచూడు. అతనికి పనులు నేర్పు. నాకు తెలుసు. క్రూరభావంలేనివాడు ధర్మరాజు. నువ్వంటే ప్రాణంపెడతాడు. భక్తికలిగి వుంటాడు. వాత్సల్యంతో ఇతనిచేత పనులు చేయించుకో.

"ఇంకోమాట విను. నీకుమాళ్ళు దుర్యోధనాదులు అవినీతి పరులు, అధర్మజ్ఞులు, క్రోధనులు, అనులుబ్ధులు. వాళ్ళని మనస్సులో పెట్టుకుని విచారించకు."

## అనుమతించు

అనంతరం శ్రీకృష్ణుణ్ణి చూస్తూ ఇలా అన్నాడు భీష్ముడు :

"కృష్ణా ! దేవదేవేశా ! జీవాత్మకా ! దేవవంద్యా ! శంఖ చక్ర గదా పద్మ చారుహస్తా ! వాసుదేవా ! త్రివిక్రమా ! వరదా ! పరమపురుషా ! నమస్కరిస్తున్నాను. కరుణించు.

"నువ్వే బలం నాకు. నీభక్తుణ్ణి. ఆలూ బిడ్డలూ లేనివాణ్ణి. కరుణించు. కాపాడు. కమలమనోజ్ఞనయనా ! అనుమతించు.

"మాధవా ! పాండవులకి నువ్వే గతి. కరుణతో కాపాడు. 'కృష్ణుడెక్కడవుంటే గెలుపు అక్కడ వుంటుంది' అని దుర్బుద్ధి అయిన దుర్యోధనుడితో ఎన్నోమాట్లు అన్నాను. నామాట వినుకోలేదతను. తనవాళ్ళందరినీ చంపుకున్నాడు. తుదకి తానూ హారీ అన్నాడు.

"నిన్నెరుగుదును. 'నరుడూ నారాయణుడూ, అర్జునుడూ కృష్ణుడూ అయి అవతరిస్తారని వ్యాసుడూ, నారదుడూ ముందే చెప్పారు నాకు."

భీష్ముడు అలా అనడంతోనే అతణ్ణి ఆదరభావంతో చూశాడు శ్రీకృష్ణుడు.

"దేవవ్రతా! కీడన్నది ఎప్పుడూ లేదు నీకు. పుణ్యాత్ముడివి నువ్వు. తండ్రిమీద అమితభక్తి నీకు. అంచేతే మృత్యువు బంటులాగ నీమాట వినుకుంటున్నది.

"భీష్మా! అనుమతించాను. వసువుల్ని చేరుకో" అన్నాడు.

తాను శరీరం వొదిలిపెట్టడానికి శ్రీకృష్ణుడు అనుమతించగానే పరమానందభరితుడయాడు భీష్ముడు. పాండవుల్నీ, ధృతరాష్ట్రుణ్ణీ, తక్కినవాళ్ళనీ చూసి, "మీరున్నూ అనుమతించారు కదా!" అన్నాడు. అందరినీ ఆలింగనం చేసుకున్నాడు. "అందరూ క్రూరభావం లేకండా, సత్యమే శాశ్వతమని పాటించి బతకండి" అన్నాడు. తాను వెనక, రాజుల్ని గెలిచి తెచ్చిన ధనం బ్రాహ్మలికి పంచిపెట్టాడు.

తరవాత ధర్మరాజుని చూసి, "నాయనా! బ్రాహ్మలందరూ పూజనీయులు సుమా! ఋత్విజులూ, ఆచార్యులూ, వృద్ధులూ విశేషించి పూజించవలిసినవారు" అని నిర్దేశించాడు.

## భీష్మనిర్యాణం

అవే అతని చివరిమాటలు. మరి మాటాడలేదతను; వూరుకున్నాడు. ధారణానుక్రమంగా సమాహితాత్ముడయాడు. వాయువులు నిరుద్ధంచేసుకున్నాడు. అవి ఊర్ధ్వగతి పట్టాయి. ఆతని అవయవాలనించి ప్రాణం వొదిలినచోటల్లా బాణాలు వొదిలిపోతూ వచ్చాయి. అదిచూసి, కృష్ణుడూ మొదలైన యావన్మందీ ఆశ్చర్యపోయారు. అతణ్ణి మెచ్చుకున్నారు.

భీష్ముడిఆత్మ మూర్థం భేదించి, మహాఉల్కాఆకారంతో ఆకాశం మీాది కెగసింది. కొంతదూరం వెళ్ళి అంతర్హితమై పోయింది.

పూలవాన కురిసింది. దేవదుందుభులు మోగాయి. ఆకాశం మీాద సిద్ధులూ, సాధ్యులూ ఆనందంతో పొగిడారు.

భీష్ముడు స్వర్గస్థుడుకావడంతోనే ధర్మరాజూ, తమ్ములూ, విదురుడూ, యుయుత్సుడూ అగురుకర్రలూ చందనం కర్రలూ తీసుకు వెళ్ళి సమప్రదేశంలో చితి పేర్చారు. ధర్మరాజూ, ధృతరాష్ట్రుడూ భీష్ముడి పుణ్యశరీరం స్నానం చేయించారు. సుగంధద్రవ్యాలు పూశారు. పూలదండలు వేశారు. ఉజ్వలమైన నగలు తొడిగారు. ఉత్తమమైన నారచీరెలు కప్పారు.

యాజ్ఞికులు అగ్ని రగిల్చారు. సామగానంతో హోమంచేశారు.

ధర్మరాజు బంగారమూ, మణులూ భక్తివినయాలతో బ్రాహ్మలకి విరివిగా పంచిపెట్టాడు.

## అగ్ని సంస్కారం

అనంతరం భీష్ముడి శవరత్నం నకులసహదేవులు తలవేపు పట్టుకున్నారు. పాదాలవేపు ధృతరాష్ట్రుడూ, ధర్మరాజూ పట్టుకున్నారు. అలా తీసుకువెళ్ళి పాడెమీాద పెట్టారు వారు. అలా ఆ నలుగురూ శవం పట్టుకోడంతోనే భీముడూ, అర్జునుడూ తెల్లచామరాలు వీచారు. యుయుత్సుడు ఉత్తమమైన గొడుగుపట్టాడు. వృద్ధులైన కౌరవస్త్రీలు ఆలవట్టం (గుండ్రని విసనకర్ర) పట్టారు, ధౌమ్యపురోహితుడు క్రియా కలాపం నడిపాడు.

భీష్ముడి మృతశరీరం చితిమీాద పెట్టి శ్రౌతాగ్నికి ఆహుతి చేశారు. ఎన్నో కడవలు నెయ్యిపోసి, అగ్ని ప్రజ్వలింపచేశారు.

ఇలా పితృమేధం విభవసహితంగా, విధిహీనంగా జరిపారు కౌరవులు. అపసవ్యంగా తిరిగారు. వ్యాసుడూ, నారదుడూ దేవలుడూ మొదలైనవారు వెంటరాగా అంతమందీ గంగానదికి వెళ్ళారు. సర్వభరత భార్యాసమేతంగా భీష్ముడికి తిలోదకాలిచ్చారు.

## తల్లి కడుపు

అప్పుడు నీళ్ళలోంచి కన్నీళ్ళతో బయటికి వచ్చింది భీష్ముడి కన్నతల్లి గంగాదేవి. దుఃఖంతో ఆమె అడుగులు తడబడుతున్నాయి. మొహంనిండా కన్నీళ్ళు కమ్ముకుంటున్నాయి. మూర్తీభవించిన శోక దేవతలా కౌరవులముందు నిలబడిందామె.

"అయ్యో, అంతవాడు నాకొడుకు! ఏమైపోయాడు? ఏడీ నాకన్నతండ్రి? మాబాబుచరిత్ర గొప్పతనం మీ అందరూ ఎరుగుదురు. అయినా, నేను కొంత చెపుతాను, వినండి. దృఢవ్రతశీలుడు నాభీష్ముడు. రాసనడవడి తెలిసిన బుద్ధిమంతుడు. దయాహృదయుడు. కార్యఘనుడు. సంవేది. పితృభక్తిపరాయణుడు. ఆర్యసన్నుతుడు. విద్యాపరిశ్రమ ఘనుడు. కాశీరాజుకన్యలకోసం జరిగినయుద్ధంలో నా నాయన రాజులందరినీ ఓడించాడు ఒక్కడే. అంబకోసం అంతయుద్ధం చేసినీ పరశురాముడు చాలలేకపోయాడు. అంతవాడు శిఖండిచే పడిపోడం చూసినీ పగిలిపోలేదు నాగుండె. వజ్రమయమై వుంటుం దది" అంటూ కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చిందామె.

"గంగమ్మా, ఏడవకమ్మా" ఆమెని ఓదారుస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు. నీ కొడుకు పరమగతి పొందాడు తల్లీ. శాపంవల్ల మనిషి జన్మ ఎత్తిన వసువు అతగాడు. సాటిలేని ప్రభావు డతడు. అతనికోసం విచారమెందుకమ్మా నీకు? ఊరుకో.

"శిఖండిఅన్న మాటే ఏమిటి, దేవేంద్రుడైనా పడగొట్టగలడా భీష్ముణ్ణి? తన ఇచ్ఛవల్ల అర్జునుడి దివ్యబాణాలు తన శరీరంమీద నాటించుకున్నాడు. మృత్యువు రాకండా సుఖంగా అంపశయ్యమీద వాలాడు. అఖండమైన కీర్తి సంపాదించాడు. స్వేచ్ఛామరణం పొందాడు. వలచినప్పుడు మృత్యువు తెచ్చుకున్నాడు. అతని కోసం విచారమెందుకు చెప్పూ?" అంటూ ఓదార్చాడు.

కృష్ణద్వైపాయనుడున్నూ ఆదరవచనాలతో ఆమెని ఓదార్చాడు. ఆత్మీయజలసాంగత్యంపొందే ఆమెచేత కృష్ణాదులూ, యావన్మందిరాజులూ అనుజ్ఞ పొందారు. ఆశీర్వాదాలూ పొందారు. మునులతో కలిసి నదిలోనుంచి బయటికి వచ్చారు.

వ్యావహారికాంధ్రమహాభారతం

ఆనుశాసనికపర్వం

సంపూర్ణం.

---

# అశ్వమేధ పర్వం



## మొదటి ఆశ్వాసం

### ధర్మరాజు శోకం

వైశంపాయనుడు జనమేజయుడితో ఇలా అన్నాడు :

భీష్మ పితామహుడికి ఉదకకర్మ ఆచరించి ధృతరాష్ట్ర పురస్సరంగా గంగానది నుంచి బయటికి వచ్చాడు ధర్మరాజు. దుఃఖం మరుగుతున్న మనస్సుతో, కన్నీరు కారుస్తూ, ధైర్యం దిగజారిపోయి, గట్టిబాణం తిన్న ఏనుగులాగ, గంగవొడ్డున వాలిపోయాడతడు నేల మీద. కృష్ణుడు హెచ్చరించడంతో చప్పున అతణ్ణి ఆచి పట్టుకున్నాడు భీముడు. తన పైమీద వోణీ పరిచి, దానిమీద అన్నగారిని పడుకో పెట్టాడు. దుఃఖంతో అర్జునుడూ మొదలైన తమ్ములు చుట్టూ మూగారు. తగిన మాటలతో శ్రీకృష్ణుడు ప్రబోధించాడు. దగ్గిర కూచుని ధృతరాష్ట్రుడు వోదార్చాడు.

"నాయనా, క్షత్రియ ధర్మంతో రాజ్యం సంపాదించావునువ్వు. విచారించకు. లే నాయనా, లే. తమ్ములూ, నువ్వూ రాజ్యం అనుభవించండి. శోకించవలిసిన కాలం కాదుబాబూ, ఇది. ఎందుకూ విచారం ?

"విదురుడు నాచెవిలో గూడుకట్టుకుని పోరాడు. నేను వినుకున్నాను కాను. దుర్యోధనుడు దుష్టమార్గం పట్టాడు. ధర్మం విడిచిపెట్టాడు. అందువల్లే ఇంతపుట్టింది. నేనూ గాంధారీ దుఃఖంతో ఎంత దహించుకుపోయామో అది మాకే తెలుసు. ఇదిగో

దోషమెూ ఇది! విను, మనిషి దేనికీ కర్తకాడు. కీడైనా, మేలైనా ఈశ్వర నియోగంవల్లే జరుగుతూ వుంటుంది. 'పాపంచేశాను' అని నీ మనస్సులో శంక కలిగితే యజ్ఞాలవల్లా దానధర్మాల వల్లా అది పోదుల్చుకోరాదా? అధికంగా దానాలిచ్చి అశ్వమేధయజ్ఞం చెయ్యి. దాంతో నీమనస్సులోని అనుమాన మంతా తొలిగిపోతుంది. రఘు రాముడిలాగా, పూరుచక్రవర్తిలాగా, భరతుడిలాగా దానధర్మాలు చెయ్యి" అన్నాడు.

"అశ్వమేధయజ్ఞం అన్నిపాపాలూ పోగొడుతుందని లోగడ కూడా విన్నాను" వ్యాసముని మాటలువిని అన్నాడు ధర్మరాజు, "నువ్వు సెలవిచ్చిన ప్రకారం అశ్వమేధయజ్ఞం చేస్తాను. అయితే నాదొక్కమనవి, సావధానంగా చిత్తగించు. 'అధికంగా దక్షిణలిచ్చి అశ్వమేధం చెయ్యి' అని ఆజ్ఞాపించావు. నా దగ్గిర ధనం లేదు. యుద్ధంలో వీరస్వర్గం పొందిన రాజుల కుమాళ్ళు శిశువులు; పైగా శోకాతురులు వారు. ఈ స్థితిలో వాళ్ళ దగ్గిర ధనం పుచ్చుకోడం తగని పని. అది దుర్లభం కూడా. వెనక దుర్యోధనుడు మాతో ఈసుపడి ఎంతోమంది రాజుల్నీ, తక్కువమూకల్నీ కూడబెట్టి రాజ్యంలోని ధనమంతా వ్యయంచేసేశాడు. ధనాగారం గుల్లచేశాడు. ఈ విధంగా నిర్ధనత్వం ఏర్పడింది. ధనార్జనకి మరోదారి కనపడ దిప్పుడు. ఏమిటి కర్తవ్యం? ఏమీ తెలియకుండాఉంది. మంత్రివై నాకర్తవ్యం ఆదేశించు" అంటూ ప్రార్థించాడు.

సంతోషించాడు వ్యాసదేవుడు. ప్రేమతో ధర్మరాజుని చూశాడు. కొంచెంసేపు ఆగి ఇలా అందుకున్నాడు:

"నాయనా, వెనక మరుత్తుడు గొప్ప యజ్ఞం చేశాడు. బంగారం రాసులు బ్రాహ్మలకి దానం చేశాడు. ఆ బంగారం ఇంతా అంతా అని చెప్పతరం కాదు. ఎంతో బంగారం, తమ ఇళ్ళల్లో పట్టినంత

వుంచుకున్నారు బ్రాహ్మలు. తక్కినదంతా నిధిగా వొక ఇమ్మైన చోట దాచిపెడుతూ వచ్చారు. 'ఈ బంగారం ఎవరు చూస్తారో వారిదే అవుతుంది' అని అన్నారు వారంతా. కనక ధర్మరాజా, ఆ బంగారం నువ్వు తెచ్చుకో. కావలిసినట్టు ఖర్చుపెట్టు" అన్నాడు.

"అంత బంగారం మరుత్తుడు ఎలా గడించాడు?" అని అడిగాడు ధర్మరాజు.

## మరుత్తరాజు కథ

"మంచి ప్రశ్న వేశావు." అందుకున్నాడు వ్యాసముని, "మరుత్తరాజు చరిత్ర పుణ్యకథ. అది వినాలని అభిలాష కలిగింది నీకు. సంతోషంగా వుంది నాకు. చెపుతాను, చెవులపండువుగా విను.

"కృతయుగంలో దండనీతి ప్రవర్తకుడైన మనువుకి ప్రజాని అని వొక కుమారుడు కలిగాడు. అతడికి క్షుతుడు కలిగాడు. క్షుతుడికి ఇక్ష్వాకుడు పుట్టాడు. ఇక్ష్వాకు మహారాజుకి వందమంది కుమార్లు పెట్టారు. వారిలో పెద్దవాడు వింశుడు. అతడికి వివింశుడు పుట్టాడు. వివింశుడికి పదిహేనుమంది కొడుకులు కలిగారు. వారిలో ప్రథముడు ఖనీనేత్రుడు. బ్రహ్మాండమైన బలవంతుడతడు; శౌర్యవంతుడు; కాని అకార్యపరుడు. పద్నాలుగురు తమ్ముళ్ళనీ చెరిచి, తాను వొక్కడే రాజ్యం నొల్లుకున్నాడు; సామ్రాట్టయాడు; మంత్రులతో ద్వేషం పుట్టుకున్నాడు; మన్నించతగిన వాళ్ళని పరాభవించాడు; ముష్కరుడై ప్రవర్తించాడు. దాంతో మంత్రులందరూ ఏకమయారు. ఖనీనేత్రుణ్ణి గద్దె మీంచి దించేశారు. అతడి కుమారుణ్ణి పట్టంకట్టారు. అతడు తన తండ్రి చేటు గుర్తించాడు. మంత్రులూ, ప్రజలూ యావన్మందీ సంతోషించినట్టు రాజ్యం చేశాడు. వారి అనురాగం సంపాదించాడు. సత్యమూ, న్యాయమూ, పాటించాడు. ధర్మపరుడై

ప్రవర్తించాడు. దానపరుడయాడు. ఉన్నధనమంతా బ్రాహ్మలకి దానంచేశాడు. అంచేత తుదకు దరిద్రుడై పోయాడు. దారిద్ర్యంతో అతడిసేన దుర్బలమై పోయింది. అది పగవాళ్ళు తెలుసుకున్నారు. పెద్దదండుతో వచ్చి దాడిచేశారు; రాజ్యం లాక్కున్నారు. ఆప్తులతో కలిసి అడివికి వెళ్ళిపోయా డతడు. నియమ పూర్వకంగా తపస్సు చేశాడు. అతడితపస్సు చూసి మునీశ్వర్లుకూడా ముక్కుమీద వేలు పెట్టుకున్నారు. తపస్సువల్ల మహాప్రభావం సంపాదించా డతడు. నిర్మలమైన మనస్సు పూనాడు. తనచేతిని గొట్టం చేశాడు. తన తపశ్శక్తితో వూదాడు. అలా అతడు చేతిగొట్టం ఊదడంతోనే దానిలోంచి మహాద్భుతాలు పుట్టాయి. భటులు పుట్టారు; ఏనుగులు పుట్టాయి; గుర్రాలు పుట్టాయి; రథాలు పుట్టాయి. ఇలా అపారమైన చతురంగసేనలూ, బంగారం రాసులూ లెక్కా జమా లేకండా పుట్టాయి. అదంతా కూర్చుకున్నా డతడు. శత్రు రాజులమీద దండయాత్ర చేశాడు. సేనలతో సహా వాళ్ళ నందరినీ వోడించాడు. చంపిన వాళ్ళని చంపాడు. చావగా మిగిలినవాళ్ళని అడవులకు తరిమాడు. చెప్పతరంకాని ప్రతాపంతో ప్రకాశించాడు.

"కర ధమనం — అంటే చేతిగొట్టం కారణంగా అతడు కరంధముడని పేరుపడ్డాడు. గౌరవమూ, విభవమూ, శౌర్యమూ, ధైర్యమూ, దయా కలిగి రాజ్యమేలాడు. శమమూ, దమమూ, సత్యమూ, శౌచమూ కలిగి అవురా అనిపించుకున్నాడు. అంగిరసుణ్ణి ఉపదర్శకుడుగా చేసుకున్నాడు. ఎన్నో అశ్వమేధ యజ్ఞాలు చేశాడు. లోకాలు నాలికలు కరుచుకున్నట్టు దానాలు చేశాడు. *

"ధర్మరాజా, కరంధముడి మనవఁడే మరుత్తుడు. కీర్తిమంతు డతడు. విష్ణుదేవుడితో సమానుడనవచ్చు నతణ్ణి. వెయ్యి ఏనుగులంత

* చూ. మార్కండేయ పురాణం.

బలవంతుడతను. తత్వమెరిగిన ధర్మపరుడు. మహాతేజశ్శాలి. హిమాలయం సానుప్రదేశంలో మహావైభవంగా అశ్వమేధయజ్ఞం చేశాడు మరుత్తుడు. యజ్ఞశాలలూ, కడవలూ, పాత్రలూ అన్నీ బంగారంతోనే సిద్ధంచేశాడు. బ్రాహ్మలకి కోట్లాల్లలు బంగారం రాసులు దానం చేశాడు. వాళ్ళకి అవసరమైన గృహోపకరణాలన్నీ బంగారంతోనే చేసి ఇచ్చాడు. ఇవ్వడంలో చేతికి ఎముక లేదనిపించుకున్నాడు. బ్రాహ్మణదేవుల్ని భక్తి పూర్వకంగా పూజించాడు.

"ఇది మరుత్తుడి సంగ్రహకథ. అతడి ధనసంపదా. ఆ ధనమూ, బంగారమూ, అతడికి లభించిన విధానమూ, అతడు చేసిన యజ్ఞక్రియా — అన్నీ వివరించి వినిపిస్తాను, విను.

"మనువంశంలో పుట్టిన కరంధముడు నిజ తపః ప్రభావంవల్లా, మహానుభావుడు, అంగిరసుడు సంవర్తుడు తనకు ఉపద్రష్టలయి అశ్వమేధాలు చేయించిన మాహాత్మ్యం వల్లా పూజ్యమైన సామ్రాజ్యం అనుభవించాడు. భూమండలంలోని రాజులందరూ అతణ్ణి కొలిచారు. తలిచినప్పుడు ఊర్ధ్వలోకాలికి పయనించి వచ్చేవాతడు తనువుతో. కరంధముడి కుమారుడు అవిక్షిత్తు. తండ్రిలాగే రాజ్యం పాలించాడతడు. ప్రజల్ని కన్నతండ్రిలా లాలించాడు.

"అవిక్షిత్తు కుమారుడే మరుత్తుడు. తండ్రి అనంతరం గద్దె ఎక్కాడు మరుత్తుడు. తుచ తప్పకుండా దండనీతి పాలించాడతడు. ప్రజల్ని పాలించాడు. దానశీలుడని పేరుపడ్డాడు. దేవేంద్రుణ్ణికూడా లక్ష్యపెట్టేవాడుకాడు.

"ఓమాటు దేవగురువు బృహస్పతితో ఆలోచించి, యజ్ఞం చెయ్యడానికి ఉద్యుక్తుడయాడతడు. అతడి ఉద్యోగం చూసి భయపడ్డాడు దేవేంద్రుడు. అతడిమీద ఈసుపుట్టిం దతనికి. దాంతో బృహస్పతి ఇంటికి వెళ్ళాడు.

"గురుదేవా! మరుత్తుడు యజ్ఞతత్పరు డవుతున్నాడు. నిన్ను ఉపద్రష్టగా వరిస్తున్నాడు. దేవేంద్రుణ్ణినేను. నాకు ఉపద్రష్టగా వుండిన నువ్వు వొక మనిషిమాత్రుడికి ఉపద్రష్టగా వెళతావా? ఇది నీ గొప్పతనానికి లోటుకాదా? ఇన్ని మాట లెందుకూ? నన్ను వొదులుకో. మరుత్తుడి యజ్ఞం నడిపించు. నేనే కావాలంటావా? అయితే అతణ్ణి వొదులుకో. నాగురుదేవుడివి, నాదగ్గిర వుండు. నా ఆచార్యుడు మానవుడి యజ్ఞం నడిపించడమా?" అన్నాడు.

"'దేవేంద్రా!' నవ్వుతూ అన్నాడు బృహస్పతి, నన్ను ఎరగవా? ఇంతగా నొచ్చుకోవాలా నువ్వు! అన్నిలోకాలకీ అధీశ్వరుడివి నువ్వు. నీగురువు మరొకణ్ణి ఆశిస్తాడా?

"'అగ్ని చల్లదనం వహించినా, సూర్యబింబం కాంతిలేకండా అయిపోయినా, భూమండలం బోర్లపడినా, మేరుపర్వతం చలించినా నామాట బొంకు కాదు, నమ్ము.'"

"ఆచార్యుడు అలా అనడంతోనే ఆనందించాడు దేవేంద్రుడు. సెలవుతీసుకుని, తన భవనానికి తిరిగి వచ్చేశాడు.

"ఈ జరిగిన వైనమంతా విన్నాడు మరుత్తుడు. తిన్నగా బృహస్పతి దగ్గిరికి వెళ్ళాడు.

"'మహాత్మా, నాసంకల్పం నీకు విన్నవించాను. నీఆజ్ఞ శిరసా వహించాను. సంబారాలు సమకూర్చాను. యజ్ఞదీక్షకు సిద్ధంగా వున్నాను. ఉపదర్శనార్థం నువ్వు దయచెయ్యడమే తరవాయి' అంటూ చేతులు జోడించాడు.

"'రాజా! మాదేవేంద్రుడు వొక యజ్ఞం చేస్తున్నాడయ్యా, అందుకని ముందే నన్ను వరించాడు. విన్నావా? మరి ఈస్థితిలో నీయజ్ఞానికి ఎలా రాగలను చెప్పు నేను?" అన్నాడు బృహస్పతి.

"'గురుదేవా!' వినయంగా అర్థించాడు మరుత్తుడు,

"మా తాతకి నీ తండ్రి ఉపద్రష్టగావుండి యజ్ఞాలు చేయించాడు. అదిగో, అలాగే నువ్వు నన్ను అనుగ్రహించు."

"'అదికాదు. దేవతలకు ఉపద్రష్టన్నేను. అంచేత మనుష్య మాత్రుడి ఉపద్రష్టగా ఎలా అంగీకరించగలను? అసంభవంకాదా ఇది? వెళ్ళు. మరెవరినైనా చూసుకో' అంటూ స్పష్టంగా చెప్పాడు బృహస్పతి.

"చేసేదిలేక తలవంచుకు వచ్చేశాడు మరుత్తుడు. దారిలో నారదుడు తారసిల్లాడతడికి. చేతులు జోడించి వినయంగా నుంచు న్నాడు మరుత్తుడు. చూసి 'రాజా, ఇలా వచ్చేస్తున్నావేమయ్యా? ఏం, చిన్నబోయి అవుపిస్తున్నావేమీ? ఏమిటి సంగతి? నీ విచార కారణం చెపితే నేనేమైనా ఉపాయం చెపుతాను, సంకోచించకు' అన్నాడు నెమ్మదిగా నారదముని.

"'మునీంద్రా, నాయజ్ఞానికి ఉపాధ్యాయుడుగా వుండమని బృహస్పతిని ప్రార్థించాను. అతడు తిరస్కరించాడు, తూలనాడి. ఇంక బతుకేమిటి నాకు?' దీనంగా చెప్పాడు మరుత్తుడు.

"'బృహస్పతి వొల్లకపోతేనేం? అంగిరసుడి చిన్నకొడుకు లేడూ సంవర్తుడు? అతణ్ణివరించు. అన్న బృహస్పతిచేత తిరస్కారం పొంది, అన్నీ వొదులుకుని, వైరాగ్యంతో, దిగంబరుడయి తిరుగు తున్నా డతడు. అతడు తప్పకండా వస్తాడు; నీ యజ్ఞానికి ఉపద్రష్టగా వుంటాడు. వెళ్ళు, అతణ్ణి ప్రార్థించు' అని సలహాచెప్పాడు నారద ముని.

"'దేవమునీంద్రా, బతికించావు' అన్నాడు మరుత్తుడు, 'కానైతే సంవర్తుడు ఎక్కడ కనిపిస్తాడు? ఎలా చూడగల నతణ్ణి? ఎలా విన్నవిస్తే, అతడు కాదనకండా అంగీకరిస్తాడు? ఎలా నన్ను పరిగ్ర హిస్తాడు? అనుగ్రహించు. ఉపాయం సెలవియ్యి.'

"'కాశీలో వుంటున్నాడిప్పుడు. సంవర్తుడు. పిచ్చివాడిలా తిరుగుతున్నాడు. అతణ్ణి తెలుసుకోడం కష్టం. అయితే ఉపాయం లేకపోలేదు. చెపుతాను, విను. పురద్వారం దగ్గిర వొక శవం పెట్టుకుని వుండు నువ్వు. శవం చూసీ చూడడంతోనే ఎవడు వెనక్కి మళ్ళిపోతాడో అతడే సంవర్తుడని తెలుసుకో. భక్తిభావంతో అతడి వెనకాలే వెళ్ళు. ఎక్కడ ఏకాంతం దొరికితే అక్కడ అతడి శరణువేడు వినయంగా. 'నాగుర్తు ఎవడు నీకు చెప్పాడు?' అని అతడు అడుగుతాడు, 'నారదుడు చెప్పాడు' అను. 'ఇప్పుడు నారదుడు ఎక్కడున్నాడు?' అని అడుగుతాడతడు. 'నీగుర్తు చెప్పి, అతడు ఇగ్నిప్రవేశం చేశాడు' అనిచెప్పు. శంకించకు' అన్నాడు నారదముని.

"నారదముని ఉపదేశించిన ప్రకారం కాశీపట్నం వెళ్ళాడు మరుత్తుడు. దిక్కుమాలిన శవం వొకటి పట్టించుకుని వచ్చి పురద్వారం దగ్గిరపెట్టించి, కాసుక్కూచున్నాడు. ఇంతలో వో వెర్రివాడు వచ్చాడక్కడికి. శవం చూశాడు. దెబ్బతిన్న పశువులాగ వెనక్కి పరిగెత్తాడు. అతడే సంవర్తుడని గుర్తుపట్టాడు మరుత్తుడు. అతడివెంట పరిగెత్తాడు. అలా వెళ్ళివెళ్ళి వోదగ్గిర వెర్రివాడు వెనక్కి చూశాడు. మరుత్తుడు వెంటపడడం చూశాడు. అతడిమీద బుగ్గిచల్లాడు. తుప్పున వుమ్మేశాడు. పిచ్చిపిచ్చి చేష్టలు చేశాడు. వెర్రివెర్రి చూపులు చూశాడు.

"వినయంగా చేతులు జోడించాడు మరుత్తుడు. మళ్ళిపోకండా సంవర్తుడి వెంటపడ్డాడు. వెళ్ళివెళ్ళి, నిర్జన ప్రదేశంలో వోమర్రిచెట్టు నీడ చదికిలబడ్డాడు సంవర్తుడు. దగ్గిరికివెళ్ళి సాగిలబడ్డాడు మరుత్తుడు. లేచి అంజలిబంధంతో ఎదట నిలబడ్డాడు.

"'నన్ను గుర్తుచెప్పి ఎవరయ్యా నిన్ను పంపారు?' మొహం చిట్లిస్తూ అడిగాడు సంవర్తుడు, 'నిజం చెపితే నీ కోరిక సిద్ధిస్తుందది. బొంకావా, నీతల ఏడుచెక్కలయి పగిలిపోతుంది' అన్నాడు.

"'నారదముని నీగుర్తుచెప్పి పంపాడు' అని నిజం చెప్పాడు మరుత్తుడు.

"'నారదుడా? - అతడు ఎక్కడవున్నాడు? ఎలావున్నాడు? చెప్పు' మళ్ళీ అడిగాడు సంవర్తుడు.

"'నీ విధమంతా చెప్పి, నన్ను ఇక్కడికి పంపినప్పుడే ఆమహా ముని అగ్నిలో చొరబడ్డాడు' అన్నాడు మరుత్తుడు.

"'అయితే నువ్వు నాదగ్గిరికి వచ్చిన పనేమిటి?' మరుత్తుడి మొహంవేపు సూటిగాచూస్తూ అడిగాడు సంవర్తుడు.

"'నేను యజ్ఞం తలపెట్టాను. దానికి నువ్వు ఆచార్యుడివిగా వుండి నడిపించాలి. నన్ను మరుత్తు డంటారు. కరంధముడు మా తాత. మీతండ్రి ఆచార్యుడయి మా తాతగారి యజ్ఞాలు నడిపించాడు' అన్నాడు వినయంగా మరుత్తుడు.

"విని సంతోషించాడు సంవర్తుడు. 'బాగుంది. నీ పని నువ్వు వివరించావు. నా పద్ధతి విను. మా అన్న బృహస్పతి తపోబలంతో నన్ను అవమానించాడు. అంచేత ఇల్లూవాకిలీ, ధనధాన్యాలూ అన్నీ వొది లేసి ఇలా తిరుగుతున్నా న్నేను. నావంటి నడపీనుగు నీకు ఉపద్రష్ట అయితే నీకు వొరిగేదేముంది? మా అన్నగారినే నువ్వు వరించు. అలా కాదంటావూ, నేనే కావాలంటావూ, అయితే విను. ఏమయినా మా అన్న నాకు మాన్యుడు. అతడు అంగీకరిస్తే అచార్యుణ్ణయి నీ యజ్ఞం నేను నడిపిస్తాను. అంచేత వెళ్ళు, మా అన్నగారి అనుమతి పొందిరా' అన్నాడు.

"'ముందే మీఅన్నగారి దగ్గిరికి వెళ్ళాను' అన్నాడు మరుత్తుడు, 'కాళ్ళా వేళ్ళాపడి ప్రార్థించాను. నామాట పాటించలేదాయన. 'దేవతల యజ్ఞచేయిస్తున్నా న్నేను, మనిషి యజ్ఞానికి ఆచార్యుణ్ణయి కూచుంటానా?' అని నిరాకరించాడు. దీనికి కారణం లేకపోలేదు.

దేవేంద్రుడు నన్ను మచ్చరించాడు. దేవగురువుని వారించాడు. అంచేత గురుడు నన్ను తిరస్కరించాడు. ఈస్థితిలో మళ్ళీ ఇప్పుడు ఏ మొహం పెట్టుకు వెళ్ళే దక్కడికి? నీ మాహాత్మ్యంవల్ల దేవేంద్రుణ్ణి మించగల నని నా నమ్మకం. అనుగ్రహించు. పరిగ్రహించు నన్ను' అంటూ ప్రార్థించాడు.

"సమ్మతించాడు సంవర్తుడు. 'అయితే అలాగే కానీ' అన్నాడు, 'కాని వొకమాట, నీయజ్ఞం నేను నడిపిస్తూ వుంటే దేవేంద్రుడూ, దేవగురువు బృహస్పతీ ద్వేషం పెట్టుకుంటారు; రోషం ప్రకటిస్తారు. దానికి భయపడి నువ్వు చలించావంటే, నాశాపంవల్ల కీడుమూడుతుంది నీకు. ఇది ముందేగుర్తించి, స్థిరనిశ్చయుడివి కావాలి నువ్వు. ఆలోచించు. తరవాత విచారిస్తే లాభంలేదు' అన్నాడు.

"'నీకృప సంపాదించాను, మరో భయమూ విచారమూ ఎందుకూ నాకు? దేవేంద్రుడూ, దేవగురువేకాదు, దేవదేవుడు శివుడు ద్వేషంపూనినా చలించను' అన్నాడు దృఢంగా మరుత్తుడు. 'నీతోడు విడిచిపెడితే సూర్యచంద్రులూ, గ్రహతారకలూ, కులపర్వతాలూ వున్నంతకాలం పుణ్యలోకాలు లేకండా పోతాయి నాకు' అని శపథ మున్నూ చేశాడు.

"పరిశుద్ధభావంతో అలా శపథంచేసిన మరుత్తుణ్ణి మెచ్చు కున్నాడు సంవర్తుడు. 'రాజా, మహేంద్రుడికంటే నిన్ను ధనవంతుణ్ణి చేసి, నీయజ్ఞం నడిపిస్తాను' అన్నాడు. 'అంత ధనవంతుణ్ణి ఎలా అవుతానంటావేమో, చెపుతాను, విను. హిమాలయపర్వతం వుంది కదూ, దాని ఉత్తరభాగాన ముంజవంత పర్వతముంది. ముంజవంతం మీద శివుడు పార్వతీదేవితో కలిసి విహారంచేస్తూ వుంటాడు. దేవతలూ, సిద్ధులూ, గరుడులూ, గంధర్వులూ మొదలైన భూత సమూహం యావత్తూ ఆ ఆదిదంపతుల్ని అక్కడ సేవిస్తూ వుంటుంది.

మరణమూ, ముసిలితనమూ, రోగమూ ముంజవంతం పొంతకి పోవు. ఎల్లకాలం అక్కడ రకరకాల చెట్లూ పొదలూ, లతలూ పువ్వుల తోనూ, పళ్ళతోనూ కలకల్లాడుతూ వుంటాయి, అందంగా. ముంజవంతం ఇరుపక్కలా బంగారం పణుకులూ, ముతక పాటి బంగారంఇసకా అరుణ కిరణాల్లో మెరిసిపోతూ వుంటాయి. అద్భుతమైన, పరిశుద్ధమైన జాతి బంగారం అదంతా. అక్కడికి మనం వెళ్ళాలి. శ్రీకంఠుడూ, రుద్రుడూ, పూషుడిదంతాలు విరిచినవాడూ, కపర్ది, శంకరుడూ, అంతకాంతకుడూ, వరదుడూ, ఆదిదేవుడూ, మూడుకన్నులవాడూ, వెయ్యి కన్నులవాడూ, శాంతమూర్తీ, చీరవాసుడూ, ధన్వీ, సిద్ధుడూ, దండధరుడూ, మృగవ్యాధుడూ, ఉష్ణీషీ, కనకబాహుడూ, పశుపతీ, మాతృభక్తుడూ, అజుడూ, అగ్నివక్త్రుడూ, అభవుడూ, భవుడూ, అయిన శివుణ్ణి భక్తితో ప్రస్తుతించాలి. ఆయన అనుగ్రహం సంపాదించి, లెక్కాజమా లేనంత బంగారం మూటలమూటలు మోసుకు వద్దాం. పద. కావిళ్ళు మోసేవాళ్ళని లక్షలాదిమందిని తీసుకురా' అన్నాడు.

సంవర్తుడివెంట ముంజవంతం వెళ్ళాడు మరుత్తుడు. శివుణ్ణి ప్రార్థించాడు. శివుడి అనుగ్రహం సంపాదించాడు. బరువుమోసే పెద్ద రాణువ వేసుకుని, లెక్కాజమాలేని బంగారం మూటలు పట్టుకు వచ్చాడు. అదిగో అలాగ మహాధనవంతుడయ్యాడు మరుత్తుడు. బంగారం యజ్ఞశాలలు కట్టాడు. యజ్ఞానికి కావలిసిన కడవలూ, పాత్రలూ మొదలైన యావత్తు సామగ్రీ బంగారంతోనే సమకూర్చాడు. ఆసనాలూ, పక్కలూ అన్నీ బంగారంతోనే తయారు చేశాడు. అలా అతిమానుషమైన ప్రభావంతో యజ్ఞానికి ఉపక్రమించాడు మరుత్తుడు.

"అదంతా తెలుసుకున్నాడు బృహస్పతి. హృదయశల్యంగా

బాధించిం దతడికి. విచారంతో అతడిశరీరం కృశించిపోయింది. అతణ్ణి చూసి దేవేంద్రుడు అడిగాడు :

"'గురుదేవా! నీచిత్తం ప్రసన్నంగా వుందా? దేవతల బతుకుతెరువులు నడుపుతున్నావుకదా, విచారించి! దేవతలందరూ నీకు ప్రియంకలిగిస్తున్నారుకదా, ఉత్సాహంతో!'

"'అంతా ఇక్కడ సవ్యంగానే వుంది' అన్నాడు నెమ్మదిగా బృహస్పతి.

"'అయితే నీశరీరం వెలవెలపోయిందేమిా ఇలాగ?' మళ్ళీ అడిగాడు దేవేంద్రుడు, 'నీకు ఇంతటి విచారం కలిగించిన వారెవరు? ఆనీచుల్ని ఇప్పుడే దండిస్తాను' అన్నాడు.

"'అలాటిదేమిా జరగలేదు' అన్నాడు బృహస్పతి, 'మరుత్తుడు మహనీయమైన యజ్ఞం చెయ్యడానికి ఉద్యోగించాడు. నావిరోధి సంవర్తుడు ఆ యజ్ఞానికి ఆచార్యుడుగా కుదురుకున్నాడు. ఇది విని విచారంగావుంది నాకు. మరుత్తుడి యజ్ఞం మంటకలపాలి. సంవర్తుడి ఆచార్యత్వం సాగకండా చెయ్యాలి. మరుత్తుడు యజ్ఞంచేస్తే చెయ్యనీ, సంవర్తుడుమాత్రం ఆచార్యుడు కాకూడదు.'

"గురువుమాట విన్నాడు దేవేంద్రుడు. పక్కనేవున్న అగ్నిహోత్రుణ్ణి చూశాడు. 'అగ్నిభట్టారకా! నువ్వు మరుత్తుడికి దగ్గిరికి వెళ్ళు. అతడు యజ్ఞం చెయ్యడానికి సిద్ధంగా వున్నాడు. సంవర్తుడు దానికీ ఆచార్యుడుగా వుండకూడదు. మన గురుదేవుడు బృహస్పతి ఆచార్యుడుగా వుండి నడిపిస్తాడు. ఈసంధానం చేసిరావాలి నువ్వు. వెళ్ళిరా' అని నియోగించాడు.

"'మంచిది' అంటూ బయలుదేరాడు అగ్నిహోత్రుడు నిజ తేజస్సుతో ప్రకాశిస్తూ. అగ్నిదేవుణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు మరుత్తుడు. భక్తిభావంతో సాగిలబడ్డాడు. సంవర్తుణ్ణి పిలిచి, ఆసనమూ

పాద్యమూ అర్పించాడు. చెయ్యవలిసిన ఉపచారాలన్నీ శ్రద్ధతో చేశాడు. చేతులు జోడించాడు. ఓరగా నిలబడ్డాడు.

" 'రాజా!' గంభీరంగా అన్నాడు అగ్నిహోత్రుడు, 'దేవేంద్రుడు పంపాడు. దూతగా వచ్చాను నీదగ్గిరికి.'

" 'దేవేంద్రుడు క్షేమంగా వున్నాడా? దేవతలు అతనికి ప్రియంచేకూరుస్తున్నారు కదా, యథావిధిగా! ఆయన మనస్సులో ఆదరభావం తొలిగిపోలేదుకదా నామీద?' వినయంగా అడిగాడు మరుత్తుడు.

" 'దేవేంద్రుడు సుఖంగానే వున్నాడు. దేవతలు అతనికి ప్రియం కలిగిస్తూ మసులుకుంటున్నారు. నువ్వంటే ఎంతో అంత ఆదరం అతనికి. ఇందులో సందేహమేమీలేదు. అయితే నేను వచ్చినపని విని పిస్తాను, విను. నువ్వు యజ్ఞం చెయ్యడానికి సిద్ధంగా వున్నావు కదా! నీయజ్ఞం దేవగురువు బృహస్పతి నడిపిస్తాడు ఆచార్యుడై. మర్త్యుడివైన నీకు అమరత్వం ప్రసాదిస్తాడు. సంవర్తుణ్ణి సాగనంపు. ఇదే దేవేంద్రుడు నీతో చెప్పమని నన్ను పంపించాడు ప్రత్యేకంగా' అన్నాడు అగ్ని హోత్రుడు.

" 'అగ్నిదేవా! ఏడుదండాలు బృహస్పతికి. ఆయన్నే ఆచార్యుడిగా వరించాన్నేను మొదట. గురుదేవుడి దయలేకపోయింది నామీద. నన్ను తిరస్కరించాడు. గతిలేక సంవర్తుణ్ణి శరణువేడాను. కాళ్ళావేళ్ళాపడి వొడబరిచాను; తీసుకువచ్చాను. నాయజ్ఞం నడిపించడానికి ఈయోగీశ్వరుడు చాలు' అన్నాడు మరుత్తుడు.

" 'అదికాదు, రాజా! ఆలోచించు' అన్నాడు అగ్ని హోత్రుడు, 'దేవగురువు నీకు ఉపద్రష్టగావుంటే, దేవేంద్రుడు పుణ్య లోకాలు కరతలామలకం చేస్తాడు. ఏవంతా కష్టం కలగదు నీకు. ఇది ఎంత మేలుకాదు?'

"'అగ్నిహోత్రుడి మాటలు విని పక్కనేవున్న సంవర్తుడు గుస్సురిమాడు. 'అగ్నీ ! మళ్ళీ ఇలా మాటాడకు. ఇంక ఇలా వాగా వంటే, దారుణమైన నాచూపుతోనే నిన్ను బుగ్గిచేసి వొదిలిపెడతాను. తెలిసిందా ? పో. వచ్చినదారిపట్టు. ఈరాయబారానికి మళ్ళీరాకు' అన్నాడు.

"భయపడి పారిపోయాడు అగ్నిహోత్రుడు. వెంటనే దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళాడు. 'దేవేంద్రా, నీఆదేశంప్రకారం మరుత్తుడి దగ్గిరికి వెళ్ళాను. 'నీయజ్ఞానికి బృహస్పతిని ఆచార్యుడిగా చేసుకో' అని బోధించి చెప్పాను. అంతా విన్నాడతడు. 'బృహస్పతి అంటే నాకు భయభక్తులు లేకపోలేదు. అతని తమ్ముణ్ణి వరించితెచ్చాను. ఈయోగీశ్వరుడు నాయజ్ఞానికి యాజకుడు' అని దృఢనిశ్చయంతో చెప్పి సంవర్తుణ్ణి చూపాడు. నేనంతమాత్రంతో వూరుకోలేదు. 'దేవేంద్రుడిమాట నువ్వు వినుకుంటే, అతడికి ప్రియం కలిగిస్తే నీకు పుణ్యాలోకాలు కరతలామలక మవుతాయి. నీకది మేలు' అని మరీమరీ చెప్పాను నొక్కి. అయినా ఒడబడలేదతడు' అని జరిగిందంతా వినిపించాడు.

"'మళ్ళీ వొకమాటు వెళ్ళు. మళ్ళీ చెప్పిచూడు. నామాట ఈమాటుకూడా సమ్మతించకపోయాడో, అప్పుడు వజ్రాయుధం పంపుతాను. యమలోకానికే అతడు పయనం కడతాడు. మాఅజ్ఞ అంటే అంత చులకనా అతడికి ?' అన్నాడు దేవేంద్రుడు.

"'మళ్ళీవస్తే దారుణమైన దృష్టితో దగ్ధం చేస్తాను' అని గుస్సురిమాడు సంవర్తుడు. అంచేత ఆపని మరినాకు చెప్పకు. అక్కడికి వెళ్ళడమంటే ప్రాణం పోతుందినాకు. ఇంకెవరినైనా చూసిపంపు' అన్నాడు భయపడుతూ అగ్నిహోత్రుడు.

"'ఏమిటీ పిరికిమాట అగ్నీ ?' తేరిచూస్తూ అన్నాడు దేవేం

ద్రుడు, 'అందరినీ నువ్వు దహిస్తావు. నిన్ను మరొకడు ఎలా దహిస్తాడట ?'

"'మూడులోకాలూ ఏలుతున్న నిన్ను వృత్రాసురుడెలా ఆక్రమించాడు ? అదీకాక, దేవేంద్రా, విను. బ్రహ్మబలంతో ఏబలమూ సాటిరాదు. లోగడ సంయ్యాతిక్రతువులో ఏమయింది ? ఆశ్వినులకు సోమపానం చెయ్యించడానికి నిన్ను వొప్పించలేదూ చ్యవనుడు ? మంత్రబలంతో దేవతలతోసహా నిన్ను బంధించలేదూ ? నువ్వు మండిపడి వజ్రాయుధం ప్రయోగించావు. నవ్వుతూ పుడిసెడు నీటితో దాన్ని అడిచేశాడతడు. చివరికేమయింది ? తలవాంచి, ఆశ్వినులు సోమపానం చెయ్యడంకోసం అంగీకరించక తీరిందికాదు నీకు ! అంచేత బ్రహ్మబలమంటే ఎవడు భయపడడు చెప్పూ ?' అన్నాడు అగ్నిహోత్రుడు.

"'బ్రహ్మబలం ఘనమైందని నాకు తెలుసు. అలా అని మరుత్తుణ్ణి వూరికే వొదిలిపెట్టడమూ, ముప్పుతిప్పలూ పెట్టకండా ?' అంటూ గంధర్వలోకం రాజుని ధృతరాష్ట్రుణ్ణి పిలిచాడు దేవేంద్రుడు.

"'ధృతరాష్ట్రా ! నువ్వు మరుత్తుడి దగ్గిరికి వెళ్ళు. 'బృహస్పతిని యాజకుడుగా నియమించుకో' అని బోధించి చెప్పు. 'అలా కాకపోతే దేవేంద్రుడు మండిపడి వజ్రాయుధం ప్రయోగిస్తాడు' అనిచెప్పు. సంవర్తుడి ఎదటే ఈమాట చెప్పు' అన్నాడు.

"దేవేంద్రుడి నియోగం ప్రకారం బయలుదేరాడు ధృతరాష్ట్రుడు. సంవర్తుడితో కలిసివున్న మరుత్తుణ్ణి చూశాడు. తాను ఫలానా అని తెలుపుకుని, దేవేంద్రుడు పంపగా వచ్చానని చెప్పాడు. "రాజా ! నామాట విను. నీయజ్ఞం నడిపించడానికి యాజకుడుగా బృహస్పతిని వరించు. ఈపని దేవేంద్రుడికి ప్రీతికలిగిస్తుంది. అలా చెయ్యకండా, అతనిమాట తోసిపుస్తావూ, వజ్రాయుధం పంపుతా డతడు

నీమీాదికి. ఈ సభాసదులందరి ఎదటా ఘంటాపథంగా చెపుతున్నా నీమాట' అన్నాడు.

"'ధృతరాష్ట్రా! నాయజ్ఞమంటే అసహ్యించుకుని రాను పొమ్మన్నాడు బృహస్పతి. అతడు నిరాకరించాకే సంవర్తుణ్ణి ప్రార్థించి తీసుకువచ్చాను. మొదట రానన్న గురుడు ఇప్పు డెలా వస్తాడట! నువ్వే ఆలోచించు. మిత్రద్రోహం అన్నిటికంటే మించిన పాపం కాదా! నీకు తెలియదా ఇది? దేవేంద్రుడికి మాత్రం తెలియదా? సిద్ధులూ, సాధ్యులూ మొదలైన ప్రసిద్ధులు యావన్మందీ ఎరుగుదు రిది. అంచేత సంవర్తుణ్ణి కాదని బృహస్పతిని అంగీకరించలేను' అన్నాడు మరుత్తుడు.

"'అలాగా? అయితే అదిగో వజ్రాయుధం ఘోరమైన నాదంతో వినపడుతోంది. భరించగల శక్తివుంటే భరించు. నీశక్తి నీకే తెలియాలిక' అన్నాడు ధృతరాష్ట్రుడు.

"అతడు అనడమూ, భయంకరంగా వజ్రాయుధ ధ్వని విన పడడమూ వొక్కమారే జరిగాయి. విని వడవడా వడికి పోయాడు మరుత్తుడు. సంవర్తుడితో చెప్పాడు, 'మునీంద్రా! వజ్రాయుధం వచ్చి పడుతోంది. భయంగావుంది నాకు! సభ్యులున్నూ భయపడు తున్నారు. అనుగ్రహించు. ఆదుకుని రక్షించుమమ్మల్ని' అన్నాడు.

"'దేవేంద్రుడికి పిసరంతా భయపడవలిసిన పనిలేదు' అన్నాడు యోగీశ్వరుడు సంవర్తుడు, 'నన్ను ఎరగడా అతడు? విను. సంస్తంభ విద్యా ప్రభావంతో వజ్రాయుధాన్ని అణిచేస్తాను. దేవేంద్రుడూ మొదలైన దేవతలందరి ఆయుధాలూ నాచేత పరా భవం పొందుతాయి. సందేహంలేదు. గాలీ వానా మొదలైన మహావికృతులు ఎన్ని వస్తాయో రానీ అన్నిటినీ. తుక్కుకింద తూల గొడతాను.'

"'అదిగో, ఘోరధ్వనితో వచ్చిపడుతోంది వజ్రాయుధం! ఎలా కుదుటబడి కూచునేది?' అన్నాడు గజగజలాడిపోతూ మరుత్తుడు.

"'గడ్డిపరకంతయినా లెక్కచెయ్యకు దాన్ని' నవ్వుతూ అన్నాడు సంవర్తుడు, 'ఏం వరం కోరుకుంటావో కోరుకో, ఇస్తాను.'

"'లేదు, లేదు, మునీంద్రా! మరిభయంలేదు. అడగమన్నావు కనక వొక్క వరమడుగుతాను. విరోధం విడిచిపెట్టి, దేవేంద్రుడు నా యజ్ఞానికి దయచేసి, తన హవ్యభాగం తాను పుచ్చుకున్నట్టూ, తక్కిన దేవతలున్నూ అలాగేవచ్చి తమ తమ భాగాలు తాము పుచ్చుకున్నట్టూ, యజ్ఞం నిర్విఘ్నంగా సమాప్తమైనట్టూ అనుగ్రహించు' అన్నాడు మరుత్తుడు.

"'అవశ్యం. నా ఆహ్వానంతో దేవేంద్రుడు సోమపానంకోసం తప్పనిసరిగా వస్తాడు. అతని వెంట తక్కిన దేవలందరూ దిగబడతారు. చూస్తూవుండు' అంటూ దూరంలోనే వజ్రాయుధం వారించాడు సంవర్తుడు. గంధర్వ రాజు ధృతరాష్ట్రుణ్ణిసాగనంపించాడు. మంత్ర శక్తితో దేవతల్నీ, దేవేంద్రుణ్ణీ ఆహ్వానించాడు. మహనీయమైన మంత్రశక్తివల్ల ప్రియంగా దేవతలూ, దేవేంద్రుడూ మరుత్తుడి యజ్ఞానికి వచ్చారు. మరుత్తరాజుని వారికి ఎదురుపంపి, తానుకూడా ఎదురువెళ్ళాడు సంవర్తుడు. విధిప్రకారం వారికి అర్ఘ్య పాద్యాది పూజలు జరిగించాడు. మరుత్తుడు దేవేంద్రుడిముందు సాగిలబడ్డాడు. 'దేవా, నువ్వు విజయం చేశావు. నాయజ్ఞం సఫలం చేశావు. కృతార్థుణ్ణయాను. కృపానిధివి నువ్వు. నామీదకోపం విడిచిపెట్టు. నన్ను చల్లనిచూపు చూడు' అని ప్రార్థించాడు. సంవర్తుణ్ణి చూపి, 'ఈ తాపసేంద్రుడు బృహస్పతి స్వరూపమే. కనకనే నా యజ్ఞానికి యాజకుడుగా పరిగ్రహించాను' అని విన్నవించాడు.

" ' రాజా, నీవల్ల ప్రీతిపొందాను. ఇతడు దేవగురుడితమ్ముడు. అన్నాతమ్ముడూ వొక్కటే అవడంలో సందేహమేమిటి ? ' అంటూ వికసించిన మొహంతో చూశాడు దేవేంద్రుడు.

" ' దేవేంద్రా, ' అతని ప్రసన్నభావం చూసి అన్నాడు సంవర్తుడు, ' అఖిలలోక భర్తవినువ్వు. నువ్వు ఇలా ఆదరభావంతో దయ చేయడం నిజంగా నాతపఃఫలం. ఈమరుత్తరాజు యజ్ఞం పుణ్యాలపంట అయింది. సకలవిధాలా దక్షుడివి నువ్వు. కృపతోచూసి, అంతా సక్రమంగా జరిగినట్టు అనుగ్రహించు. యజ్ఞమంత్రాలూ, తంత్రాలూ ఏవికలత్వంలేకండా సార్థకమైనట్టు చెయ్యి. ప్రసిద్ధుడైన ఈరాజు నీ కృపకు పాత్రుడై పుణ్యాలోకాలు పొందినట్టు దయచూడు. '

" సంవర్తముని సంభాషణవిని సంతోషించాడు దేవేంద్రుడు. దేవతలందరిని వోమారు కలయచూశాడు. ' యజ్ఞశాల ఉదాత్తంగా, అభిరామంగా చేయించండి. అప్సరసలు నృత్యంచేయండి. గంధర్వులు పాట పాడండి ' అన్నాడు.

" దేవేంద్రుడి ఆదేశం అక్షరాలా అనుసరించారు దేవతలు. అప్సరసలు నాట్యంచేశారు. గంధర్వులు గానంచేశారు. సకలకర్మలకూ దేవతలు సహాయం చేశారు. ఉచితమైన పీఠం అలంకరించి రెండో అగ్నిహోత్రుడిలా ప్రకాశించాడు సంవర్తుడు. సంతోషంగా యజ్ఞవిధి నిర్వహించాడతడు. ఉజ్వలంగా, సుప్రయోగకంగా సాగింది యజ్ఞం. పేరుపేర దేవతలందరినీ పిలిచాడు సంవర్తుడు. ఒక్కొక్కరిచేతా సోమపానం అర్పించాడు. అంతమంపీ ఆనందంతో సోమపానంచేశారు. దేవేంద్రుడితోసహా దేవతలు యావన్మందీ ఆనందంలో తేలియాడారు.

" ఇలా మరుత్తుడు దేవేంద్రుణ్ణి సంతోషపరిచి సాగనంపాడు. అతణ్ణి అభినందించి అంతమందీ తమతమ నివాసాలకు దయచేశారు. యజ్ఞం సమాప్తమైననాడు ఆశ్చర్యకరంగా మరుత్తుడు భక్తిపూర్వకంగా

వేడుకతో ధనరాసులు, బంగారం కుప్పలు ఎంతోమంది బ్రాహ్మలకి దానంచేశాడు. అంతతో వూరుకున్నాడా? లేదు. యజ్ఞశాలలోని బంగారం కడవలూ, పాత్రలూ, తదితర పరికరాలూ యావత్తూ బ్రాహ్మలకిచ్చేశాడు.

"హిమాలయ ప్రాంతంలో ఈ యజ్ఞం పూర్తిచేసి సంవర్తుడి సెలవుతీసుకుని తనరాజధానికి వెళ్ళాడతడు. సముద్రం మధ్యవున్న భూమండలం యావత్తూ ఏలాడు. బ్రాహ్మలు తాము తేగలిగినంత బంగారం తవ్వితెచ్చుకున్నారు. తక్కినదంతా అక్కడ వొకదగ్గిర నిధిగాదాచిపెట్టారు. 'కాలాంతరంలో దీనిని ఎవరుచూస్తారో, వారిదే అవుతుం దిదంతా' అన్నారు. కనక ధర్మరాజా, ఆ బంగారమంతా నువ్వు స్వేచ్ఛగా తీసుకురా. విచ్చలవిడిగా అశ్వమేధయాగంలో వ్యయంచెయ్యి. దేవతల్ని తృప్తిపరుచు."

వేదవ్యాసుడు చెప్పిందంతా విన్నాడు ధర్మరాజు. బంధు వియోగశోకం వొదిలీ వొదలనిస్థితిలో, పొగకమ్మిన అగ్నిలాగా కూచున్నాడు. అతడి స్థితి గమనించి శ్రీకృష్ణుడు ఇలా అందుకున్నాడు:

"ధర్మరాజా, వంకతలపులన్నీ మృత్యుపదమనుకో. ఆర్జవంతో కూడింది బ్రహ్మపదమనుకో. నిజమైనమాట ఇది. వ్యర్థమైన ఈవంకర తలపులన్నీ ఎందుకంటూ నీకు? నీచేత కర్మానుష్ఠానం నిర్మలంగా నడవడంలేదు. విచారమూ విడవకండా వున్నావు. బుద్ధిమంతుల లక్షణమేనా ఇది? విచారం విడిచిపెట్టలేదంటే ఏమిటో తెలుసా? అంత శ్శత్రువుల్ని ఎరగవన్నమాట నువ్వు. అంచేత ఈవిషయంలో వొక ఇతిహాసముంది; చెప్తాను, విను.

"'వృత్రుడు భూమండలమంతా ఆక్రమించాడు. భూమిగుణమైన గంధం అపహరించాడు. అప్పుడు అతడి మీద వజ్రాయుధం వేశాడు దేవేంద్రుడు. క్రమంగా నీరు, అగ్ని, గాలి, ఆకాశం – వీటిలో

ప్రవేశించాడు వృత్రుడు. ప్రచండమైన విక్రమంతో వాటిలో రస, రూప, స్పర్శ, శబ్దాలు అపహరించాడు. వెంటనే వజ్రాయుధం వెలు వరించాడు దేవేంద్రుడు. ఉత్తరక్షణంలో మహావేగుడై అతడిలోనే చొరబడ్డాడు వృత్రాసురుడు. దాంతో మూర్ఛపోయాడు దేవేంద్రుడు. మంత్రవిధితో వసిష్ఠుడు అతణ్ణి మేలుకొలిపాడు. అలా వసిష్ఠముని మంత్ర ప్రభావంతో తెలువుకుని, తన శరీరంలో వుండిన వృత్రాసురుణ్ణి అదృశ్యమైన వజ్రాయుధంతో హతమార్చాడు దేవేంద్రుడు. ఈధర్మ రహస్య విధానం దేవేంద్రుడే మునుల కెరిగించాడు. మునులు నాకు చెప్పారు. దీన్ని నువ్వు తెలుసుకోవాలి. ”

“ఇంకా ఇలా చెప్పాడు కృష్ణుడు :

“ ‘ శరీరవ్యాధి, మనోవ్యాధి అని వ్యాధి రెండువిధాలు. వాతం, పిత్తం, శ్లేష్మం — ఈమూడూ సమంగావుంటే మనిషి ఆరోగ్యంగా వుంటాడు. ఈమూటిలో ఏవొక్కటి వికారం పొందినా అది శరీర వ్యాధి అనిపించుకుంటుంది. సత్వము, రజస్సు, తమస్సు - ఈమూడూ సమంగావుంటే మనస్సు ఆరోగ్యస్థితిలో వుంటుంది. అవి తిరకమకలు కావడం మనోవ్యాధి అనిపించుకుంటుంది. సుస్థితికాని, విషమస్థితికాని, ఎప్పుడూ వొకటేవుండడం పొసగదు. ఏమంటే ఆరెండూ పరస్పరం వొకదానిలో వొకటి పుడుతూ వుంటాయి. కనక వాతపిత్త శ్లేష్మా ల్లోనూ, రజస్సత్వతమస్సులలోనూ వొకదానిలో వొకటి పుట్టడమే వికృతికాలం. ఇది సూక్ష్మ కర్మానుష్ఠాన ప్రకారం. దీన్ని నువ్వు అభ్యసించవు. కనకనే కర్మానుష్ఠానం నిర్మలంగా నడపలేదన్నాను. ఇలాగే వాతాదులలోనూ గుణాలు తరగడం పెరగడం జరుగుతుంది. పరమశాంతి కోసం సమస్థితి అవసరం. ఇది మనశ్శక్తితో తెలుసు కోవాలి. అలాకాక, వాతం మొదలైనవీ, సత్వము మొదలైనవీ ఆశ

క్షిస్తే కలతపడతావూ, అయితే అది నీ స్వభావమన్నమాట. దాన్నే మనాలి! ఇంకా చెపుతాను, సావధానంగా విను.

" 'రజస్వలను, ఏకవస్త్రను, ద్రౌపదిని సభలోకి ఈడ్చుకు వచ్చిన మాట మరచిపో. అడివిలో పడిన అష్టకష్టాలు మనసులో పెట్టుకోకు. జటాసురుడు, సైంధవుడు మొదలైనవారు చేసిన దుష్కార్యాలు తలంచకు. మత్స్యపురంలో అనుభవించిన దీనదశ పూాసెత్తకు. భీష్మాదుల యుద్ధతంత్రం యుద్ధంకాదు, అది భావించకు. అందువల్లపుట్టిన కీడూ మేలూ ఏదీ చిత్తగించకు. అది ఎలా యుద్ధం కాదంటావా? నిజంగా అది మిథ్యాయుద్ధం. సత్యయుద్ధం చెపుతాను, ఆలకించు.

" 'ఆ సత్యయుద్ధానికి బంధుమిత్రుల సహాయం ప్రయోజనం లేదు. మహనీయమైన యుద్ధ మది. దానికి ఆత్మే తోడు. మనస్సే శత్రువు; ఈయుద్ధంలో ఎలాఅయినా సరే, శాంతి కుదుర్చుకోవాలి నువ్వు. లోపగ తీర్చుకోవాలి. శాంతమే అక్కడ మనోవిజయం. శాంతంవల్లే నువ్వు ప్రకాశించాలి. ఈఅంతరంగయుద్ధంలో గెలుపు సాధించకండా ఎక్కడికి పోతావో అర్థంకాదు నాకు. ఇది నీఅంతట నువ్వే తెలుసుకుని, సద్బుద్ధితో వొక నిశ్చయానికి రా. వెయ్యి మాటలతో ఏంలాభం ?

" ' 'మమ' అనే రెండక్షరాలు మృత్యువు. 'నమమ' అనే మూడక్షరాలు బ్రహ్మం. ప్రాణులకు కనపడకండా ఆబ్రహ్మమృత్యువులు పోరాడుతూ వుంటాయి.

" 'తత్వం అనశ్వరమైంది. శరీరం లేకండా వుంటుందది. జీవకోటికి నాశనం తప్పదు. తత్వదృష్టితో చూస్తే దేహం ఖండించడం హింస కాదు.

" 'సముద్రం చుట్టిన భూమండలమంతా పరిపాలించినా, దాని మీద దృఢమైన మమత లేకండా వుంటే ఏపాపమూ అంటదు మనిషికి.

అడివిలో ఆకూఅలమూ తింటూ బతికినా, పదార్థాలమీద మనసులో మమత వొదలకండా వుంటే మృత్యుముఖాన తప్పక పడతాడు వ్యక్తి.

"'బయట శత్రువుల్ని గెలవడం వొక గెలుపేకాదు. ధైర్యంతో అంతశ్శత్రువుల్ని గెలవాలి. ఆగెలుపు మోక్షం కలిగిస్తుంది. అంతేకాని మరోదానివల్ల మేలేముంది?

"'అంతశ్శత్రువులలో ఘనుడు కాముడు. కామంలేకండా వుండడం అరిది. అధ్యయనం, యజనం, దానం — ఇవన్నీ కామంతో కూడినవేకదా! ఈవిషయంలో కామగీత లున్నాయి వినిపిస్తాను, విను.

## కామగీతలు

"'లోకాల్ని ఉద్దేశించి కాముడు ఇలా చెప్పాడు: 'ఉపాయం తెలియనివాడు ఎవ్వడూ నన్ను బాధించలేడు. ప్రయత్నం నా ధనం. విజ్ఞానంవల్లగాని తెలియరాని నన్ను గెలవడం సాధ్యమా? ధైర్యంతో నన్ను గెలవాలనుకున్నవాడి భావమే నేనవుతాను. అతడు అది ఎరగడు. అంచేత నన్ను అణచడం అబద్ధమై, జయమన్నమాటే వుండదు. మనస్సువల్ల నన్ను కొట్టవచ్చు ననుకున్నవాడికి, వాడి తపః ఫల రూపమైన కోరికనై పుడతాన్నేను. నన్ను జయించడం ఎవడి తరం? మోక్షం పూని నన్ను చెరచదలచుకున్నవాడిలో మోక్షాపేక్షగా వుంటాన్నేను. కనక వధ్యుణ్ణి కాను. సనాతనుణ్ణి నేను. ఎవ్వడూ నన్ను తోసిరాజనలేడు.'

"ధర్మరాజా, తన్ను గెలవలేని విషయం తాను చెప్పాడు కాముడు. అయితే కాముణ్ణి గెలవడానికి ఉపాయం లేకపోలేదు. చెపుతాను, సావధానంగా ఆలకించు. అక్కర కలిగి ఉద్యోగించకండా వుండడం, 'నేనే ధైర్యం నిర్వహిస్తాను' అన్నభావంలేకండా వుండడం, తపస్సులో ఫలంకోరకండా వుండడం, మోక్షతృష్ణ కోరకండా

వుండడం — ఇవి కాముణ్ణి జయించే ఉపాయాలు. ఇవి తెలయనివాడే 'ఉపాయం లేనివాడు' అని కాముడు చెప్పాడు.

"ఇన్ని మాటలెందుకూ ? మనస్సులో కోరిక లేకండా వుంటే చాలు కాముడు చచ్చిపోతాడు. కనక ఏకోరికా మనస్సులో పెట్టుకోకండా అశ్వమేధయజ్ఞం చెయ్యి. అలా అశ్వమేధంలో ఫలాభిసంధి లేకండా కాముణ్ణే సోమయాజిగా చేసుకో.

"ధర్మరాజా, చచ్చిన బంధువుల్ని తీసుకురాలేం కదా ? అంచేత వారిని తలంచకు నువ్వు. స్వేచ్ఛగా యజ్ఞాలు చెయ్యి. లోకం నిన్ను మెచ్చుకుంటుంది. సుగతి కూడా లభిస్తుంది తరవాత."

ఇలా శ్రీకృష్ణుడు ఉపదేశించాడు; వ్యాసముని బోధించాడు. దేవముని నారదుడూ నూరిపోశాడు. నలుగురు తమ్ములూ, ద్రౌపదీ తగిన మాటలు చెప్పారు. శాస్త్రాలు తెలిసిన బ్రాహ్మణోత్తములున్నూ గినట్టుగా చెప్పారు. అందరి వాక్యాలూ విన్నాడు ధర్మరాజు. విచారం విడిచిపెట్టాడు. రాజ్యం ఏలుకుందికి అంగీకరించాడు. అశుచిత్వం పోగొట్టుకోడంకోసం గంగాతీరంలో కొన్నిదినా లుండడానికి నిశ్చయించాడు. బ్రాహ్మలకి నమస్కారంచేసి ఇలా అన్నాడు:

"మీ అనుగ్రహంవల్ల నా దుఃఖమంతా వొదిలింది. మనస్సు నెమ్మది పడింది. పుణ్యాత్ములు మీరు. ఇక మీమీ నివాసాలకి దయచెయ్యండి. నన్ను మాత్రం మరిచిపోకండి."

అనంతరం వేదవ్యాసుల పాదాలకి ప్రణామం చేశాడు.

"నీ అనుగ్రహంవల్ల బంగారం వునికి తెలిసింది. నిన్ను పురస్కరించుకుని వెళ్ళి అది పట్టుకువస్తాను. ఆ సమయానికి దర్శనమియ్యాలి నువ్వు. హిమాలయం పర్వతాలన్నిటిలోనూ ఆశ్చర్యకరమైంది. అది ఈపెన్నిధికి ఆశ్రయంగా వుందన్న మాట !

"తండ్రీ, నాకు మేలు కలిగేమాటలు ఎన్నో చెప్పావు. మహా

భాగ్యవంతులకు కాని ఇది లభ్యం కాదు. మీ కరుణే నన్ను భాగ్య వంతుడని తెలుపుతూ వుంది" అని బహు విధాల ప్రస్తుతించాడు.

అలా అంతమంది మునులూ ధర్మరాజు దగ్గిర అనుమతిపొంది, కృష్ణార్జునులతోనూ "వెళ్ళివస్తాము" అని చెప్పి, అంతర్థాను లయారు. ధృతరాష్ట్రుడితో కలిసి భీష్మడికి పరలోకక్రియలు చేశాడు ధర్మరాజు. కర్ణుడూ మొదలైన కౌరవప్రముఖులకు ఊర్ధ్వలోకాలు లభించడం కోసం నానావిధాల దానాలు చేశాడు. అన్నిటా కృత కృత్యుడయాడు. కొన్ని దినాలుండి అక్కణ్ణుంచి బయలుదేరాడు. ధృతరాష్ట్రుణ్ణే ముందు పెట్టుకుని హస్తినాపురం ప్రవేశించాడు. అతణ్ణే పూజించి, అతడి ఆజ్ఞ పొందుతూ రాజ్యం పరిపాలించడ మారంభిం చాడు. శ్రీకృష్ణుడూ, భీముడూ మొదలైన తమ్ములూ సంతోషించి నట్టు ప్రవర్తించాడు. ప్రజలు అభినందించినట్టు నడుచుకున్నాడు.

[వైశంపాయనుడు చెప్పిందంతా విని జనమేజయుడు మళ్ళీ అడిగాడు.

"అయితే ధర్మరాజు ఆ విధంగా రాజ్యం పరిపాలిస్తూ వుంటే కృష్ణార్జునులు ఎక్కడ ఎలా ప్రవర్తించారు? సజ్జనులు సేవించదగిన వాడివి నువ్వు. అదంతా నాకు ఎరిగించు."

జనమేజయుడి ప్రశ్న విని వైశంపాయనుడు ఇలా అందు కున్నాడు:]

ధర్మరాజు అలా రాజ్యమేలుతూ వుండేవాడు. కృష్ణుడూ, అర్జునుడూ ఇంద్రప్రస్థంలో వుండి, నదీతీరాల్లోనూ, వనప్రదేశా ల్లోనూ, కొండచరియలమీదా క్రీడాపరులయి విహరించారు. బ్రాహ్మల్ని పూజించారు. పుణ్యకథలు విన్నారు. సత్కావ్య

గోష్ఠితో కాలక్షేపం చేశారు. వెనకచేసిన తమ యుద్ధతంత్రం మొదలైన ప్రసంగాలు చెప్పుకున్నారు. కుమారుణ్ణి అభిమన్యుణ్ణి తలుచుకుని అర్జునుడు శోకించినప్పుడు తగినమాటలుచెప్పి ఓదార్చేవాడు కృష్ణుడు. ధర్మరాజు శాంతస్వభావం మెచ్చుకునేవాడు. మయసభలో కౌతుకంగా కూచుని, జనంతో కలిసి కబుర్లు చెప్పుకునేవారు వారు. ఒకనాడు అర్జునుడితో శ్రీకృష్ణుడు ప్రసంగవశాత్తూ ఇలా అన్నాడు:

"అర్జునా, మీ అన్నయ్య ధర్మరాజు ఎంత ఉదాత్తుడోయి నిజంగా! ధర్మయుద్ధంచేశాడు, గెలుపు సాధించాడు. నిష్కంటకంగా భూమి పాలిస్తున్నాడు, ప్రజ ప్రీతి పొందినట్టు. విద్వజ్జనులు వివిధసుఖాలనుభవిస్తున్నారు; వినుతిస్తున్నారు. అతని సమతా, శాంతీ సకల జనులు మెచ్చుకుంటూన్నారు. మునులూ, సిద్ధులూ సేవిస్తున్నారు. భీముడూ, కవలతమ్ములూ, నీచేతి గాండీవమూ అతనికి అండగా ఉన్నాయి. మహాధర్మశాలి అతడు; సత్యసంధుడు; కృతకృత్యుడు."

ఇలా ధర్మరాజుని పొగిడి, అర్జునుడి మొహం చూస్తూ ఇంకా ఇలా అన్నాడు కృష్ణుడు:

"అర్జునా, నీవల్ల నేను నిబ్బరపడుతున్నాను. ఇక ద్వారక వెళ్ళాలని బుద్ధిపుడుతూవుంది. గుణవంతుడు అన్న బలరాముణ్ణీ, పుత్రవత్సల అమ్మ దేవకినీ, ఆర్ద్రహృదయుడు అయ్య వసుదేవుణ్ణీ, నేనంటే ప్రాణంపెట్టే సర్వయాదవులీని చూడాలని మనసవుతూ వుంది. ఇక వెళ్ళిరానీ నన్ను.

"ధర్మరాజుతో తగినసమయంచూసి నువ్వేచెప్పాలి. కార్యజ్ఞానం తెలిసిన ఉదారుడివి నువ్వు. ద్వారకకు వెళ్ళివస్తాను. మీ అన్నయ్య "కృష్ణా, వెళ్ళిరా" అని అంటే కాని, నేను వెళ్ళను. ఈ శరీరమూ, ప్రాణమూ, నా కుమారుళ్ళూ, స్నేహితులూ, బంధువులూ, ధనమూ, అన్నీ ధర్మరాజు సొమ్ము. అతణ్ణి అనుసరించడమే

నాకు వ్రతం. అంచేత, మనం హస్తినాపురం వెళ్ళి ఆ పుణ్యాత్ముణ్ణి, అజాతశత్రుణ్ణి చూడాలి. తగిన అవకాశం చూసి ఈమాట చెప్పాలి. అతడు ఎలా చెప్తే అలా నడుచుకుందాం. పద వెళదాం."

కృష్ణుడలా అనడంతోనే విచారంతో కొంతసేపు మాటాడలేక పోయాడు అర్జునుడు. చివరికి "మంచిది, అలాగేచేద్దాం" అన్నాడు అంగీకరిస్తూ అలా అని అనంతరం మెల్లిమెల్లిగా అన్నాడు. "కృష్ణా, యుద్ధానికి ముందు నా మనస్సు కలతపడినప్పుడు తత్వబోధచేస్తూ మహనీయమైన మాటలు నువ్వు బోధించావు అనుగ్రహించి. వాటి అర్థం నా మనస్సులో నిలపలేక పోయాన్నేను గాఢంగా. ఆ వాక్యామృతం మరోమారు నా కర్ణపుటాల్లో నింపి అనుగ్రహించు."

నవ్వుతూ వొకచేత్తో అర్జునుణ్ణి కౌగిలించుకుంటూ అన్నాడు కృష్ణుడు; "బుద్ధి విహీనుడివోయినువ్వు. అర్జునా! శ్రద్ధలేని వాడివి. బ్రహ్మపదం తెలుసుకుందికి హేతుభూతాలయిన మాటలు ఆ నాటివి. వాటి మహార్థాలు బుద్ధిలో నిలపలేక పోయావు. అవి తిరిగి చెప్పడం శక్యమా చెప్పూ?

## తత్వజ్ఞానం

"ఈ విషయంలో వొక ఇతిహాసముంది, ఆలకించు. వెనకటికి నాదగ్గిరికి వొక బ్రాహ్మణోత్తముడు వచ్చాడు. తత్వజ్ఞానం ఉపదేశించమని అతణ్ణి కోరాను. అతడు ఇంద్రియాలు జయించిన కాశ్యపుడనే బ్రాహ్మడి దగ్గిర విన్న వాక్యాలు నాకు చెప్పాడు. కాశ్యపుడు సిద్ధుడు. అతడు చెప్పినమాటలు సావధానంగావిను. శుచిమంతుడూ నిర్మలాత్ముడూ, వినయపరుడూ అయి తన్ను ఆశ్రయించిన బ్రాహ్మడితో సిద్ధవరుడు కాశ్యపుడు ఇలా అన్నాడు:

"'ఎప్పుడూ పుణ్యకర్మలే చేశాన్నేను. ఐహిక సుఖాలనుభ

వించాను. స్వర్గానికి వెళ్ళాను ఎంతో ప్రయత్నంమీద. స్వర్గపదం కొన్నాళ్ళకి భ్రంశమైంది. కామక్రోధాలు మొదలైన చిత్తంతో మళ్ళీ మళ్ళీ చావుపుట్టుక లనుభవించాను. ఎంతోమంది తల్లులూ, తండ్రులూ, అన్నదమ్ములూ, కుమారులూ ఆ యా జాతుల్లో కలిగారు నాకు. రకరకాల చనుబాలు తాగాను. సుహృద్వియోగం అనుభ వించాను. ధననాశన దుర్దశలు పొందాను. ఇవన్నీ ఇన్నీ అన్నీ అని చెప్ప లేను. ఎన్నో మానసబాధ లనుభవించాను. ఎన్నో శారీరకబాధ లనుభ వించాను. రకరకాల నరకగతులు పొందాను. ఎన్నో దుఃఖాలు కలిగించే మానహానులు పొందాను. ప్రాణహానులు పొందాను. తిట్లు తిన్నాను. దెబ్బలు తిన్నాను. బంధనా లనుభవించాను. ఇవన్నీ అనుభ వించి, అనుభవించి విసిగిపోయాను. ఇక ప్రజాసృష్టి వున్నంతకాలం ఎప్పుడూ శుభమే కలుగుతుంది. అంతకంతకి అధికమైన దశలే పొందు తాను. బ్రహ్మానందం సులభం నాకు.

" 'నీ మీద ప్రీతికలిగింది నాకు. ఏం కోరి నా దగ్గిరికి వచ్చావు? పరిస్ఫుటంగా చెప్పు. అవశ్యం నీ కోరిక నెరవేరినట్టు చూస్తాను. నన్ను తెలుసుకుని వచ్చావు నువ్వు. నీ జ్ఞానం నాకు నచ్చింది. కనక నే నిన్ను పరిగ్రహించాను.'

"సిద్ధాచార్యుడలా అనడంతోనే సంతోషించాడు బ్రాహ్మడు. పరమకారుణ్యానిధీ, పరతత్వం ప్రబోధించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యి. చావు పుట్టుకల దుఃఖం లేకండా అనుగ్రహించు' అంటూ అతని పాదాల మోల సాగిలబడ్డాడు. లేచి, అంజలి బంధంచేసి నుంచున్నాడు.

" 'బ్రాహ్మణోత్తమా!' అతని మొహం మీద చూపు నిలిపి అన్నాడు సిద్ధుడు, 'అనుక్రమం వివరిస్తాను నీకు. సావధానంగా విను. తనువు ధర్మసాధనం. పరిజ్ఞానదాయి ధర్మం. అంచేత తనువు రక్షించు

కోవాలి మనిషి. ఏ మరుపాటు ఎందునా కూడదు. ఆత్మహితం కోసం ఎంతైనా అవసరమిది. ఏమరుపాటు విషయం వివరిస్తాను, విను.

"'మూఢుడు తన స్వభావమూ, బలమూ తనకు సరిపడే కాలం తెలుసుకో దలచడు. ఇవి తినదగినవి, ఇవి తినరానివి అని ఆలోచించడు. ఓమారు మితిమీరిన తిండి తింటాడు. ఓమారు చెడుకోరిక పెట్టుకుని, ఒకరిమీద కోపగించి పస్తుపడుకుంటాడు. నిలవపడిన పాచి పదార్థాలూ, ఉడకని పదార్థాలూ, జీర్ణంకాని పదార్థాలూ, కంపుకొట్టే పదార్థాలూ తెలివిమాలి తింటాడు. తిండిమీద తిండితింటాడు. పగలునిద్రపోతాడు. ఎప్పుడూ స్త్రీసంగమంలో మగ్నుడవుతాడు. ఇట్టివాణ్ణి వాతపిత్తకఫ దోషాలు ప్రకోపించి బాధిస్తాయి.

## రోగవికారాలు

"'చెయ్యదగినకర్మ లోపిస్తే దేహానికి హానికలుగుతుంది. చెయ్యదగని మలమూత్ర నిరోధం వల్ల రోగాలు పుడతాయి. కోరికచేతా, కోపంచేతా శరీరం కృశిస్తుంది. పైత్య వికారాలు మహాబలవంతమైనవి. మహౌద్ధత్యంతో అవి వున్నచోటవుండి ప్రాణాలు పెకలించి, చెడుగుచేస్తాయి. ఆ వికారాలు విజృంభించి, శరీరంలో ఎక్కడెక్కడ చీలుస్తాయో ఆ చోట్లను మర్మాలంటారు. మర్మాలంటే ఆయువుపట్లు. ఆయువుపట్లు చీలికలైతే హానితప్పదు.

"'కఫదోషం అధికమైతే అవయవాలు రోగాలపాలవుతాయి. లోపలి ప్రదేశమంతా ఆక్రమిస్తుందది. పైగా కుత్తుకకు అడ్డుపడుతుంది. ఊరుపు పెగలనీదు. ఊర్ధ్వశ్వాస పుట్టిస్తుంది. దాంతో జీవుడు ఆ తనువులో వుండనేరక వెడలిపోతాడు. తమకు తగిన విషయాలలో శ్రోతో మార్గాలలోనే పుడతాయి ఇంద్రియాలు అయినన్నూ. ఆ శ్రోతోమార్గాలు కఫంచేత నిరుద్ధాలయితే ఇంద్రియాలు జాతామాత్ర శక్తులు

చెడతాయి. దాంతో మనిషి చేష్టలు శక్తిలేనివై పోతాయి. అంగాలలో వాయువు దుర్వ్యాప్తి పొందినప్పుడు నొప్పి, తెగులూ పుట్టిస్తుంది. దేహంలోని కొవ్వు చెడగొట్టి సందులు సడిలిస్తుంది. క్రమంగా తనువు మానుచేసి జీవుణ్ణి వెలికి తరుముతుంది. నాలిక ఆడడం, కాలూ, చెయ్యీ ముడవడం చాపడం మొదలైన శారీరక క్రియలు వాయువు చలనంవల్లే జరుగుతాయి. ఈ వాయువు క్రమగతితో వుంటే ఇంద్రియాల వర్తన క్రమగతితో వుంటుంది. ఇది తారుమారుకావడం దోషం అనిపించుకుంటుంది. దోషాలు మితిమీరినప్పుడు సన్నిపాతం సంభవిస్తుంది. దానివల్ల శరీరంనించి జీవుడు తొలిగిపోతాడు. ఇలా శరీరం విడిచి వెళ్ళిన జీవుడు తాను చేసుకున్న కర్మగతులు అనుభవిస్తాడు. దానివల్ల కలిగే సుఖదుఃఖాలు పొందుతాడు. చేసుకున్న కర్మఫలం అనుభవించి, తనకు తగిన పుట్టువు పుడతాడు తిరిగి. ఇలా జీవాత్ముడు గతాలనుభవిస్తాడు. పాపాత్ములు నరకానికి వెళతారు. పుణ్యాత్ములు స్వర్గానికి వెళతారు విధిప్రకారం. కనక మోక్షం పొందలేరు వారు.

"'ఊర్ధ్వగతికి వెళ్ళే మనుష్యులుండే చోటు శాస్త్రనిశ్చయం చేసి చెప్తారు పెద్దలు. అవి చెప్తాను, విను. ధర్మపరులు సూర్యలోకంలోనూ, చంద్రలోకంలోనూ, నక్షత్రలోకంలోనూ వుంటారు. తారతమ్యాలు గణించుకుని దుఃఖపడే మనస్సులు మంచివికావు. అదీగాక, పుణ్యఫలం పూర్తిగా అనుభవించాక ఈ లోకాలనుంచి తరిమివేయబడతారు కూడా. అయినప్పుడు అది సౌఖ్యమెలా అవుతుంది? మోక్షం వొక్కటే శాశ్వతమైంది.

"బ్రాహ్మణోత్తమా, ఇక గర్భప్రాప్తిప్రకారం చెప్తాను, ఆలకించు.

## గర్భ ప్రాప్తి

" ' క్రోధమూ, శోకమూ మొదలైనవాటికి లోబడిన ఆత్మ శుభాశుభ కర్మలఫలం అనుభవించకతీరదు. అదే కారణం జీవుడు తిరిగి పుట్టడానికి.

" ' శుక్లమూ, శోణితమూ కలిసి స్త్రీగర్భంలో నెలకొంటుంది. ఆపని బ్రహ్మశక్తితో బీజంవల్ల జరుగుతుంది. శుక్లశోణితాలు పిండ మవుతాయి. పిండం తనువులో చైతన్యం కలుగుతుంది. దానివల్ల తలా, కాళ్ళూ, చేతులూ, కడుపూ, హృదయమూ, వెన్నూ మొద లైన అంగాలు ఏర్పడతాయి. పదిమాసాలూ నిండి జన్మసమయం వచ్చాక, తల్లి గర్భంలోనుంచి వెలువడి, వెనక తానుచేసిన కర్మల ననుసరించి వివిధవిధాల వర్తిస్తాడు. కర్మఫలాలు పూర్తి అయాక కాలంచేసి, ఈ జన్మలో చేసిన కర్మలఫలం అనుసరించి మళ్ళీ పుడతాడు. మనిషి ముక్తి పొందనంతకాలం ఇలా చస్తూ పుడుతూ, పుడుతూ చస్తూ ఉంటాడు. అంతకాలమూ గర్భప్రాప్తి తప్పదు.

" ' ముక్తి ఎలా కలుగుతుందో చెపుతాను, విను. దానమూ, శమమూ, దమమూ, బ్రహ్మచర్యమూ, వ్రతదీక్షా, దయా, పరస్త్రీ పరధనాలు కోరకండా వుండడమూ, నియమమూ, ఇతర్లని నొప్పించ కండా వుండడమూ, ఇంద్రియాలు అదుపులో వుంచుకోడమూ, తల్లి దండ్రుల్నీ గురుజనుల్నీ పూజించడమూ, దేవతలనూ అతిథులనూ అర్చించడమూ, సత్యమూ, శౌచమూ, ధైర్యమూ, క్రౌర్యం నిరసించ డమూ — ఇవన్నీ కలిగిన మనిషి మోక్షానికి ఉద్యోగించగలుగుతాడు. ధర్మసూక్ష్మాలు పండితుల దగ్గిర వుండి వారి ప్రవర్తనం గమనించి తెలుసుకోవాలి. వారు చెప్పిన శాంతమైన, ఉదారమైన మాటలు వినాలి. విని, వాటిని మనస్సుకి పట్టించుకోవాలి. వాటి గంభీరార్థాలు మననం చేసుకోవాలి. అలా అయితే ఆపదలుండవు.

"'వ్రతనిష్ఠతో నడుచుకుంటూ, ఇంద్రియాలు గెలిచి, శాంతి పూని బ్రహ్మైక తత్పరుడు కావాలి. అలాంటివాడికి వేదం, అగ్ని హోత్రం, యజ్ఞం, సమిధలు, జలం, మంత్రం, ఆచార్యుడు – అన్నీ పరబ్రహ్మమే. ఇలాటి సదాచారమే సూక్ష్మమైన బ్రహ్మచర్యం. దీనిలో స్థిరుడైనవాడు సంతోషమూ, శోకమూ అనే పెనుగాలికి చలించడు. మోహాంధకారానికి భయపడడు. సంసారంనుంచి నిస్సం గుడై సిద్ధిపొందుతాడు క్రమంగా.

## తత్త్వజ్ఞానం

"'సృష్టి ఆదిలో బ్రహ్మదేవుడు ప్రకృతి అనే తత్త్వం కల్పిం చాడు. దానికి చేతనం చేకూర్చాడు. దాన్నే క్షరమంటారు. దానికి పరమైన తత్త్వాన్ని అక్షరమనీ, అమృతమనీ అంటారు పండితులు. క్షరాక్షరాలు దంపతులు. ఈ మిథునంలో అఖిలభూతాలూ పుట్టే బీజాలున్నాయి. వేదవాక్యార్థ మిది.

"'జీవరాసులకు గమనాగమనాలు బ్రహ్మే కల్పించాడు. కనక అవి భ్రమిస్తూ వుంటాయి. పుణ్యాతిశయంవల్ల జీవాత్ముడు చూసినప్పుడు సుఖదుఃఖాలు అశాశ్వతములైనవనీ, తనువు అశుచి అనీ, అఖిలపదా ర్థాలూ నశ్వరమైనవనీ, కర్మనిరూఢత జాడ్యమనీ ఊహ కలుగుతుంది మనిషికి. అలా ఊహించి తనను కప్పిన మోహావేశం విడిచిపెడతా డతడు. మోక్షపదం పొందడానికి ప్రయత్నిస్తాడు. పాపాలనించి బయటపడతాడు. సంసారసాగరంలో మునిగిపోడు.

"'జన్మమూ, రోగమూ, ముదిమీ, చావూ చూసి, లోకం తీరు తెలుసుకోడం వల్లా, దానివల్ల బాధలు అవగతం కావడంవల్లా విసిగిన మనుషులు ముక్తికోసం వెదుకుతారు.

"'ఈమార్పు మేలని గ్రహించి, నిర్జనమూ నిర్మలమూ

అయినచోట ఏచింతా లేకండా కూచుని, తనలో రేగుతూన్న తలపులు అణచుకుని, నిరాలంబనుడైనవాడూ; సర్వప్రాణి మిత్రుడయి, ఇంద్రియాలు జయించిన నిర్భయుడూ; కామక్రోధాలు లేనివాడై, శమఘనుడైనవాడూ; మానాభిమానాలు మానుకుని, జీవులందరిలో ఆత్మనుచూసినవాడూ ముక్తి పొందుతారు.

"'లాభనష్టాలూ, ప్రేమ ద్వేషాలూ, సుఖదుఃఖాలూ సమంగా చూసినవాడూ, ఆశా, అమర్యాదా గణించక, సర్వధర్మతంత్రలోలుడై ధర్మవర్తనుడుగా వుండనివాడూ, హితులనీ అహితులనీ ఎవ్వనీరి భావించక, ధర్మార్థకామాలు మూడిటిమీాదా ఆసక్తి విడిచినవాడూ, కర్మల హితభావం అలవరుచుకుని, తాపత్రయం లేకండా స్థిరమైన వైరాగ్యం పూనినవాడూ ముక్తిపదం పొందుతారు.

"'సర్వసంకల్పాలూ వర్జించి, చిత్తంలో పరమశాంతికు దుర్చుకున్నవాడు, పుడకలు లేకండా వెలిగే అగ్నిలాగ వెలుగుతాడు; ఇట్టే వికారంలేని నిత్యసౌఖ్యం పొందుతాడు.

"'నాయనా, ఇక యోగిజనులకు అనుభవమైన నెలవు చెపుతాను, సావధానంగా విను. యోగులు దానివల్లే ఆత్మానందం అనుభవిస్తారు.

"'తనువు ముంజగడ్డిలోని ముళ్ళవంటిదని తెలుసుకోవాలి. ఆత్మ ముంజగడ్డివంటిది. ముళ్ళదుబ్బువంటిది. యోగమార్గ మెరిగినవాడి వెరవు. తనువువల్ల యోగమార్గం తెలుసుకుని జీవాత్మణ్ణి చూస్తాడు యోగి. అలా తన్ను తాను చూసినప్పుడు జననమరణగతులు తొలిగిపోతాయి.

"'ముక్తుడు ముదిమిూ, చావూ అతిక్రమిస్తాడు. సంతోషమూ సంతాపమూ అతడి కంటవు. తన బ్రహ్మచర్యబలంతో ఇతర్లకికూడా మోక్షం ప్రసాదించ గలుగుతాడలాంటి వాడు.

"'శరీరం అస్థిరమైందని తెలుసుకుని, ఆత్మలో అధికమైన

నిష్కకలవాడు ఏ ప్రాణివల్లా భయపడడు. రాగం మొదలైన సుఖ దుఃఖాలకు చిక్కడు.

" 'యోగయుక్తుడైన వాడికి శస్త్రాలవల్లా, నీళ్ళవల్లా, అగ్ని వల్లా బాధకలగదు. ఇంతెందుకూ, యోగయుక్తుడు దేవేంద్రపదవి కూడా అక్కరచెయ్యడు.

" 'తనలో తనని చూడడం కంటే మించినసుఖం లోకంలో లేదు. అయితే దానికోసం చేసే ప్రయత్నంలో విసుగు పొంద కూడదు సాధకుడు. ఆప్రయత్నం ఎలావుంటుందో విను.

" 'తనకు తెలిసిన మార్గంలో మనస్సు అంతర్వర్తిగా చేసుకుని తిరిగి బాహ్యగతికి పోకండా చెయ్యాలి. అప్పుడు అది వశమవుతుంది. దానిని అక్కడే నిలపాలి. అదెలా అంటావా? కంఠనాళం, హృదయం దంతాలు, నాలుక, కుత్తుక తాలువు — వీటిలో మనస్సు ఎక్కడ మెలిగితే అక్కడే కదలకండా ఆపాలి.'

"అర్జునా సిద్ధుడు తనతో చెప్పిన ఈవిషయంచెప్పి ఆబ్రా హ్మడు నన్నుచూసి నవ్వుతూ, 'కృష్ణా, ఆసిద్ధుడన్నవాడు నేనేకదా! నీకు తెలియందేముంది స్వామీ? ఇక ఆకాశ్యపుడు అడిగిన ప్రశ్నలూ నేనుచెప్పిన ప్రత్యుత్తరాలూ విను' అంటూ ఇంకా ఇలాచెప్పాడు బ్రాహ్మడు:

" 'మేధావి అయిన ఆమహాత్ముడు చేతులు జోడించి విన యంగా 'మహాత్మా, పరమమోక్షం ప్రసాదించే ధర్మసూక్ష్మం దయతో సెలవియ్యి' అని నన్ను అడిగాడు. 'సావధానంగా విను' అంటూఇలా చెప్పాన్నేను. 'పాలకడవ పశువులమందలో దించిన వాడు వెదుక్కుంటూ ఎలా తెలుసుకుంటాడు? అదిగో అలాగ లోపల వుంచిన మనసును ఆత్మ వెదకాలి. అదేమేలిమార్గం. ఈ విధంగా ఉద్యుక్తుడైనయోగి, తెలివొందిన మనస్సు ఘరిగించి వి ఫే

కంతో బ్రహ్మాన్ని దర్శిస్తాడు. అనాది తత్వమైన బ్రహ్మం కన్నులు మొదలైన ఇంద్రియాలకు గ్రాహ్యంకాదు. మలినం తొలగడమనే నేతితో తేటగావెలిగే మనస్సనే దీపం ఆ అనాది తత్వాన్ని చూస్తుంది.

"'తన్ను వేరు చేసుకుని కేవలం శాంతమే అయిన తత్వాన్ని ఎల్లప్పుడూ చూస్తూవుంటే, తనను చూడడానికి కంటి చీకటిపోగొట్టే వెలుగు కలుగుతుంది.'

"'బ్రహ్మ విద్యారహస్యమంతా నీకు చెప్పాను. సుఖంగా వుండు నువ్వు. వెళ్ళు. నేనూ వెళ్ళి వస్తాను' అన్నాను. సంశయం పోదుల్చుకుని అతడు వెళ్ళాడు. ఇక్కడ నిన్ను దర్శించ వచ్చాన్నేను' అని చెప్పి ఆమహాబ్రాహ్మడు అంతర్హితుడయాడు.

"అర్జునా, పరమహితమైన ఈమాటలన్నీ సావధానంగా విన్నావా? ఆనాడు రథంమీాద వుండిన నీకు అదంతా వినిపించాను. దాని అర్థమంతా ఇందులో ఇమిడుంది. అనేకమైన తలపులుకల వాడికీ, ధర్మం ఆచరించనివాడికీ, ఏకాగ్రతలేని మనస్సు కలవాడికి ఇది చెప్పకూడదు. పూర్వం నేను దేవతలకు చెప్పాను. మనుషులలో నువ్వు తప్ప ఇది వినదగినవారులేరు. పరమరహస్య మిది. దీనివల్ల ఆ అమృతపదార్థ దర్శనం లభిస్తుంది; అన్ని దుఃఖాలూ తొలిగిపోతాయి; శాశ్వతముక్తి ప్రాప్తిస్తుంది; అన్నిదుఃఖాలూ తొలిగిపోతాయి; శాశ్వతమైనముక్తి ప్రాప్తిస్తుంది నరుడికి. కోమట్లయినా, శూద్రులైనా, స్త్రీలైనా కూడా దీనివల్ల ముక్తిపొందుతారంటే, ఇక బ్రాహ్మలూ, క్షత్రియులూ పొందడంలో వింతేముంది?

"తెలివికి ఉపాయం ఉపదేశించాను. కర్మఫలం బోధించాను. మోక్షప్రాప్తీ, సౌఖ్యనిర్ణయమూ చెప్పాను. ఇది తెలుసుకోడంకంటే మరోసుఖంలేదు నిజంగా. శ్రద్ధకలిగి, లోకసంగ్రహాసంగం నీడవిడిచి,

ఈ ఉపాయ మవలంబించినవాడు మోక్షలక్ష్మికి భర్త అవుతాడు. రవంతా ఇందులో సందేహం లేదు.

"చెప్పవలసిందంతా చెప్పాను. మరింక చెప్పవలసిందేమీ లేదు నీకు. పరిశుద్ధమైన ఆత్మతో ప్రయత్నిస్తే ఆరునెలలో యోగ సిద్ధి కలుగుతుంది."

[ "ఇలా అధ్యాత్మ విద్యా విషయాలు అర్జునుడితో చెప్పాడు శ్రీకృష్ణుడు" అని వైశంపాయనుడు చెప్పగా, "అనంతరం కృష్ణార్జునులు ఏం చేశారు?" అని అడిగాడు జనమేజయుడు. ]

---

# అశ్వమేధపర్వం

## రెండో ఆశ్వాసం

వైశంపాయనుడు ఇలా అందుకున్నాడు :

శ్రీకృష్ణుడు బ్రహ్మవిద్యా ప్రబోధకాలైన మాటలు అర్జునుడికి ఉపదేశించి, అతడిమీద ప్రేమచేత ఇంకా ఇలా చెప్పాడు :

### బ్రాహ్మణ గీతలు

"భర్తృ భార్యా సంవాదమని ఒక ఇతిహాసముంది. అభయ మని దానిపేరు. వినిపిస్తాను, విను. అధికజ్ఞాన వంతుడైన ఒకమహా బ్రాహ్మడు వుండేవాడు. అతడు ఏకాంత ప్రదేశంలో భగవంతుణ్ణి ధ్యానిస్తూ వుండగా అతని భార్య మెల్లిగా అక్కడికి వచ్చింది. భక్తి వినయాలతో ప్రణామం చేసింది. 'మహాత్మా నాకు అధ్యాత్మ విద్య బోధించు' అని ప్రార్థించింది.

"'చారుముఖీ' చిరునవ్వుతో భార్య మొహం చూస్తూ అన్నాడు బ్రాహ్మడు, 'నీమాట విని పరమానందం కలిగిందినాకు. 'ఆడదానికి అధ్యాత్మ విద్య ఎందుకు?' అనికొట్టి పారెయ్య కూడదు. చెపుతాను, నా హితవాక్యాలు సావధానంగా విను. ధీరచిత్తవు నువ్వు. నాకు తెలిసిన విధం తెలియచేస్తాను.

"'వినడానికి, చూడడానికి, చెయ్యడానికి వీలైనవి కర్మలు. కర్మలు చేసేవాళ్ళు అవి సమస్త సిద్ధులూ కలిగిస్తాయంటారు అజ్ఞానాంధ కారంలోపడి. లోకంలో నిష్కర్మత్వంలేదు. ఎక్కడైనావుంటే దానిని మూర్ఖత్వమని నిందిస్తారు. అయితే నిజానికి అదేగొప్పది.

"'ఆత్మలో నేను బ్రహ్మాన్ని దర్శిస్తాను. చంద్రుడు కళారహితుడై ఆత్మలో అగ్నితోకలిసి ప్రకాశిస్తాడు. అగ్నితో మిథునధర్మం

(సంయోగం) సాగించి చంద్రుడు ప్రాణుల్ని ధరిస్తాడు. బ్రహ్మ మొదలు అంతమందీ ఇంద్రియాలు జయించి, శాంతితో అక్షరమైన బ్రాహ్మాన్ని ఉపాసిస్తారు.

"'అక్షరం విషయం వివరిస్తాను.

"'అక్షరం స్పర్శం కాదు; రసం కాదు; రూపం కాదు; శబ్దం కాదు; గంధం కాదు. అంచేత చర్మంతో కాని, జిహ్వాతో కాని, కంటితో కాని, చెవితో కాని, ముక్కుతో కాని పరిగ్రహించడానికి అనువుపడని తత్వం అది. నిర్మలమైన బుద్ధివికాసంవల్ల మాత్రం అది అందివస్తుంది. ప్రాణం మొదలైన అయిదు వాయువులూ ఆతత్వం మూలంగానే వర్తిస్తాయి; నాటిలోనే లయిస్తాయి. ప్రాణం, అపానం - ఈ రెండూ సమానమనే వ్యానమధ్యంలో నడుస్తాయి. ప్రాణ అపానాలమధ్య ఉదానం నడుస్తుంది. * వేదం చెప్పిన మాటఇది.

"'ప్రాణ అపానాల్లో పరమాత్మ నిద్రించి నప్పుడు సమానమూ, వ్యానమూ ప్రాణఅపానాలతో కలుస్తాయి. ఈ విషయంలో యోగులు సంశయించరు. ఉదానంలో నిద్రించినప్పుడు ప్రాణ అపానాలు పరమాత్మను వొదలవు. యోగులు కనిపెట్టిన విషయమిది.

## అంతర్యాగం

"'ప్రాణం మొదలైన అయిదు వాయువులూ, మనసూ, బుద్ధీ ఈ యేడూ అగ్నిహోత్రుడికి నాలికలు. అగ్ని హోత్రుడంటే

---

| * పంచప్రాణాలు. | నాటిస్థానాలు |
|---|---|
| ప్రాణం | హృదయంలోని గాలి |
| అపానం | బొడ్డు కింద చలించే గాలి |
| సమానం | బొడ్డులోని గాలి |
| వ్యానం | శరీరమంతటా తిరిగే గాలి |
| ఉదానం | గొంతుకలోని గాలి. |

(చూ. అరణ్యపర్వం, ధర్మవ్యాధుడి కథలో.)

ప్రాణుల దేహాలలో అగ్నిరూపాన వెలుగుతున్న ఆత్మడు. ఘ్రేయమూ భక్ష్యమూ, దృశ్యమూ, స్పృశ్యమూ, శ్రావ్యమూ, మంతవ్యమూ, బోద్ధవ్యమూ అయిన ఏడూ సమిధలు; ఘ్రాతా, భక్షయితా, ద్రష్టా, స్ప్రష్టా, శ్రోతా, మంతా, బోద్ధా అయిన ఏడుగురూ వరసగా ఘ్రేయాదులయిన హావిస్సులు ఏడింటినీ వేల్చే రుత్వుజులు. ఇది సప్త హోతృవిధాన ప్రకారం. అగ్నిహోత్రుడి వదనాలు పదీ దిక్కు, వాయు, సూర్య, చంద్ర, భూ, అగ్ని, ఇంద్ర, విష్ణు ప్రజాపతి, మిత్రా త్మకాలు, శబ్ద, స్పర్శ' రూప, రస, గంధ, వక్తవ్య, గంతవ్య, కర్తవ్య, విసర్గ, ఆనందాలు హావిస్సులు. ఈ పదింటినీ క్రమంగా ఆహుతులు చేసే హోతలు: శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణ వాక్పాణి పాదపాయూప స్థలయిన పది ఇంద్రియాలు. ఇది దశహోతృ విధాన ప్రకారం. ఈ రెండూ తెలుసుకుని వీటిలో దేనిప్రకారమైనాసరే, జీవాత్మడు ఉప ద్రష్టగా అంతర్యాగం నడిపే యోగిజనులు చావు పుట్టుకల నుంచి విముక్తులవుతారు. బహిర్యజ్ఞ పరులు చావుపుట్టుకల భ్రమణం పొందు తూనేవుంటారు.

" 'ప్రణవాదిక రూపనిరూఢితో వాక్కు పుడుతుంది. దాని వెనక పురుషార్థబుద్ధితో మనస్సు వెళుతుంది.'

" భర్త చెప్పిన మాటలు విని మళ్ళీ అడిగింది భార్య :

" 'మహాత్మా, మనస్సు ప్రేరేపిస్తేకదా మాట బయటికి వస్తుంది! అలాంటప్పుడు మనస్సును మాట ఎలా వెంటపడుతుంది?'

" 'దేవీ' భార్య ప్రశ్నకు జవాబు చెపుతూ అన్నాడు బ్రాహ్మడు, 'నువ్వన్నది నిజమే. మనస్సును ఉదానవాయువును కూడి ఆత్మడివల్ల మాట వెలువరించడం జరుగుతుంది. ఇది జనుల అనుభవం అనుసరించిందే. అయినా ఒకకార్యం గురించి చెప్పవలసి వచ్చినప్పుడు

మనస్సు మాటను అనుసరించవలిసే వుంటుంది. కనక మనసును ఉదాన మును కూడి మాటను వెలువరించడం జరుగుతుందని చెప్పాను.

"'మనస్సూ, మాటా — రెండూ ఓసారు బ్రహ్మదేవుడి దగ్గిరికి వెళ్ళాయి. 'మాలో ఎవరు అధికులు ?' అని అడిగాయి. 'మీలో మనస్సు అధికం' అన్నాడు బ్రహ్మదేవుడు. 'నేను నీకు కామదోహినినై (కోరికలు పితికి ఇచ్చేదానినై) వుంటూవుండగా, నన్ను తక్కువ అని ఎలా అన్నావు ?' అంది మాట. 'స్థావరమనీ, జంగమమనీ నాకు రెండు మనస్సులున్నాయి. స్థావరం నాదగ్గిర వుంటుంది. జంగమము నీదగ్గిర వుంటుంది. నీకు కనపడేవర్ణం మంత్రం స్వరం జంగమ మనస్సు. దానికంటే నువ్వు అధికం. నీకంటే స్థావర మనస్సు అధికం. కనక నువ్వు అలా అనకూడదు' అన్నాడు బ్రహ్మదేవుడు. ఈమాట విని మూర్ఛపోయినట్టు కొయ్యబారి నిలబడి పోయింది వాగ్దేవి (మాట). కొంచంసేపు అలా వుండిపోయి అనంతరం వినయంగా బ్రహ్మదేవుడి శరణు వేడింది.'

"'బ్రహ్మమాటకు మూర్ఛపోయిన వాగ్దేవి ఎలా తెప్పిరిల్లింది ?' అని అడిగింది భార్య.

"'ప్రాణ అపానములలో వాక్కు నిలుస్తుంది. కనక ఆవాగ్దేవి దేవదేవుడైన బ్రహ్మదేవుడి ప్రభావంవల్లే వుంటుంది కాబట్టి ప్రాణ వాయువు జతపడి ఆమె మూర్ఛపోయినట్టు చేసింది. దేవీ, వాక్కు, మనస్సుల విధానం ఇలాటిదని తెలుసుకోడం మోక్షానికి మూలం. మాటా మనస్సూ — వీటి విధానం ఇంకా చెవుతాను, విను.

"'ప్రాణం వాయువును పొందవడంచేత మాట అపానంతో కూడి ఉదానరూపం దాల్చి, ఆరూపం విడిచి, వ్యానంలోచేరి, దేహ మంతటా వ్యాపిస్తుంది. అప్పుడు సమానంలో మనస్సుకి నిలకడ కుదురు తుంది. మనస్సు నిలకడ పొందడం విముక్తి కారణం.

" 'ఘోషిణి అని, అఘోషిణి * అని వాగ్దేవి రెండువిధాలుగా వుంటుంది. ఈ రెంటిలో అఘోషిణి గొప్పది. అదే బ్రహ్మవాదిని అనిపించుకుంటుంది. అవ్యయరూపంగానూ, దివ్యప్రభావంతోనూ వెలుగుతుం దది. గోవులా తియ్యని పవిత్రమైనపాలు కురుస్తుంది. ఇలా ఈవాగ్దేవి (బ్రాహ్మి) విధానం తెలుసుకోడం మహానందకరం.

" 'ఇంకా చెపుతాను, విను. ఘ్రాణమూ మొదలైన ఇంద్రియాలు అయిదూ, మనస్సూ, బుద్ధీ ఒకదగ్గిరవుండీ కూడా అవి వొక దాంతో వొకటి కలిసి వుండడం ఎరగవు' అన్నాడు బ్రాహ్మడు.

" 'అయితే అది వివరించి చెప్పు' అని అడిగింది భార్య.

" 'సావధానంగా విను' అందుకున్నాడు బ్రాహ్మడు, 'ఘ్రాణం తప్ప తక్కిన ఆరు ఇంద్రియాలూ వాసన తెలిసికోలేవు. నాలికతప్ప రసము తక్కిన ఇంద్రియాలు తెలిసికోలేవు. నేత్రం తప్ప తక్కిన ఇంద్రియాలు రూపం తెలిసికోలేవు. చర్మంతప్ప తక్కిన ఇంద్రియాలు స్పర్శ తెలిసికోలేవు. చెవితప్ప తక్కిన ఇంద్రియాలు శబ్దం తెలిసికోలేవు. మనస్సుతప్ప తక్కిన ఇంద్రియాలు సంయగ్రస్తమైన సుఖ దుఃఖ విచారం తెలిసికోలేవు. బుద్ధి చేతకాని ఇతర విషయాలు ఇంద్రియాలు నిశ్చయించడానికి పనికిరావు.

## ఇంద్రియ మనః పరస్పర సంవాదం

" 'వెనక మనస్సుకీ ఇంద్రియాలకీ జరిగిన సంవాదం చెపుతాను, ఆలకించు.

" 'మేమూ, నువ్వూ వొక్కటే' అన్నాయి మనస్సుతో ఇంద్రియాలు.

" అదేమన్నమాట ?' అంది మనస్సు, 'అలా అనకూడదు. నేను

* ఘోషిణి: మోగేది. అఘోషిణి: మోగంది.

తప్పుకుంటే ముక్కు వాసన తెలిసికోలేదు; నాలిక రుచి తెలిసికోలేదు; కన్ను రూపం తెలిసికోలేదు; చర్మం స్పర్శ తెలిసికోలేదు; చెవి శబ్దం వినలేదు. నిజం చెపుతున్నాను, నేను తప్పుకుంటే ఆరిపోయిన నిప్పుల లాగా, వాదిలేసిన పాదుకొంపలాగా పనికిమాలినవై పోతాయి మీ రూపాలు. అంచేత మన అందరిలోనూ నేను గొప్పదాన్ని. సందేహం లేదు' అంది మనస్సు.

"'ఇంతవరకూ నువ్వన్నది నిజమే' మనస్సుతో మళ్ళీ ఎదురు సవాలు వేస్తూ అన్నాయి ఇంద్రియాలు, 'అంతమాత్రాన నువ్వు గొప్పదానివెలా అవుతావు? మేం తప్పుకుంటే ఏవిషయమైనా నువ్వు తెలుసుకోగలవు కనకనా? అప్పుడు నీగొప్పతనమేముందట! మాలో వొకరం తప్పుకుంటాం. నువ్వేదీ ఆ విషయం అనుభవించూ చూద్దాం. ఘ్రాణంతో గంధం అనుభవిస్తావు; నాలికతో రుచి తెలుసుకుంటావు; కంటితో రూపం తెలుసుకుంటావు; చర్మంతో స్పర్శ అనుభవిస్తావు; చెవితో శబ్దం తెలుసుకుంటావు. అంతేకాని ఒంటరిగా ఏదీ అనుభవించలేవు. అలాంటిది గొప్పతనం కోసం ఎలా ఆసపడుతున్నావు నువ్వు? ముందు మేం పడితే కదా, తరవాత నువ్వు తెలుసుకోడం? 'నేను ఎంగిలికాను' అనూ చూద్దాం! అప్పుడూ మనలో ఎవరు గొప్పో తేలిపోతుంది. ఇంకోమాట, నువ్వు అడిగి పోయాక, ప్రాణముందో లేదో అని తెలుసుకోడానికి తగిన మందులు మాద్వారా ప్రయోగిస్తేనే నీకు తెలివి పుడుతుంది. ఈవిషయం కూడా తెలుసుకో మరి. అదీకాక, 'అదికాదు ఇది ఇలా వుంటుంది' అని చెప్పగల శిష్యులదగ్గిరికి వెళ్ళి తన అనుశాసనం వినిపింపబోయి, అవి వాళ్ళే చెప్పగా తిరిగి వచ్చిన గురువులాగ మమ్మల్ని ఆధారం చేసుకుని విషయాలు అనుభవిస్తావు నువ్వు. నువ్వు కలలు కన్నప్పుడు మేం లేకపోడంవల్ల మా ఆధారం లేక ఆకలలో విషయం బూటకం

అయిపోతుంది. అప్పుడు వాకిలిలేని కొంపలో దూరివచ్చేసినట్టు నీ ఆశ నిరాశ అయిపోయి, నీ అనుభవం వృత్తి అనుభవం అయిపోతుంది కదా? ఈమాత్రం ఆలోచించు. మేమూ నువ్వూ వొక్కటైవుంటేనే అనుభవం కలుగుతుంది.'

"'విన్నావా? అలా మనస్సూ ఇంద్రియాలూ వాదించుకున్నాయి. మరోవిషయం వినిపిస్తాను, విను.

"'ప్రాణం మొదలైన అయిదు వాయువులూ వోమారు బ్రహ్మదేవుడి దర్శనానికి వెళ్ళాయి. వెళ్ళి 'మాలో ఎవరు గొప్ప వారు?' అని అడిగాయి. 'మీలో ఎవరు అణిగిపోతే ఇతర్లు అణిగి పోతారో, ఎవరు వర్తిస్తే అందరూ వర్తిస్తారో వారే అందరికంటే గొప్పవారు' అన్నాడు బ్రహ్మదేవుడు. ప్రాణం మొదలైన అయిదు వాయువులూ కదలకండా నిలబడి తమతమ కార్యవిధానాలు ఫలానా ఫలానా అని చెప్పాయి. 'అవును, నిజమే. నాకు మాత్రం తెలియదా? మీ వృత్తి విశేషం చెపుతాను, వినండి. ఎప్పుడు ఎవ్వరివల్ల ఏ విధానం నడుస్తుందో అప్పుడు వారు గొప్పవారవుతారు. కనక మీలో మీరు స్నేహభావంతో కలిసి మెలిసి మసులుకోండి. పరస్పరభావనా పరులుకండి. అప్పుడే మీకు శుభం కలుగుతుంది. పొండి' అని సెలవిచ్చి పంపాడు బ్రహ్మదేవుడు. బ్రహ్మచెప్పిన ప్రకారం తిరిగి వచ్చి ఐకమత్యంతో మసులుకున్నాయి వాయువులు. ఈ వాయువుల విషయంలో నారద దేవమత సంవాద మని వొక ఇతిహాసముంది. అది కూడా వినిపిస్తాను, విను.

"'దేవమతుడని వొక బ్రాహ్మణుండేవాడు. ఒక పుణ్య భూమిలో దేవమునిని నారదుణ్ణి చూశాడతను. వినయంగా నమస్కరించాడు. అతడి అనుగ్రహం సంపాదించి, మెల్లిగా దగ్గిరికి వెళ్ళాడు. అతడి భక్తికి సంతోషించి, కూచోమని తగిన ఆసనం చూపాడు

నారదుడు. కూచుని, చేతులు జోడించాడు దేవమతుడు. 'దేవ మునీంద్రా,' వినయంగా అడిగాడు, 'దయామూర్తివినువ్వు. పుడుతూ వుండే ప్రాణికి అయిదు వాయువులలోను ఏ వాయువు మొదట వర్తిస్తుంది?' అని అడిగాడు. గర్భంలో నివసించడానికి ఏ వాయువు ప్రాణిని ప్రవేశపెడుతుంది? ఆ మొదటి గాలికి తరవాత చేరేగాలి మొదట జీవుడిలో పుట్టుకసమయ మప్పుడు వర్తిస్తుంది' అన్నాడు నారదముని.

"'ఇంకా ఇలా చెప్పాడతడు, 'పురుషుడిలో సమానమూ, స్త్రీలో వ్యానమూ వరసగా శుక్లమూ, శోణితమూ పుట్టిస్తాయి. ఆ రెండూ పొందుపడినప్పుడు దైవం తోడుపడితే చూలు నిలుస్తుంది. అధికమైన రక్తంవల్లా, గట్టిపడిన శుక్లంవల్లా ప్రాణవాయువు వర్తిస్తుంది. ప్రాణవాయువూ, శుక్లమూ ఆధారం చేసుకుని, వాటిలో అపానం నడుస్తుంది. ప్రాణం కిందివేపూ, అపానం పైవేపూ నడుస్తాయి. ఇలావుండే ఈ రెంటిలోనూ అగ్నిమయమైన ఉదానమూ, వ్యానమూ, సమానమూ ప్రవర్తిస్తాయి. అగ్ని సర్వదేవాత్మకుడు. ప్రాణానికీ అపానానికీ అంతరంలో అతడు వెలుగుతాడు. అతణ్ణే ఉదాన రూపమంటారు తెలిసినవాళ్ళు.

"'అహోరాత్రులూ, శుభాశుభాలూ, సత్యాసత్యాలూ, మంచిచెడ్డలూ అనే ద్వంద్వాలు ప్రాణ అపానాలకు నామాంతరాలు. వాటి మధ్య వర్తించే మహనీయమైన అగ్ని ఉదానం. దాని నిర్ద్వంద భావం అంతర్యజ్ఞ విద్యాప్రవీణులు తెలుసుకుంటారు. పరమశాంతి అనీ, బ్రహ్మమనీ భేదం లేకండా వుంటుందది. ఆ మహావస్తువే బ్రహ్మ ఉదానమనడం వింటాం చెవులారా' అన్నాడు దేవముని నారదుడు.

"'ఇంద్రియ, మనః, పవనాల భంగులు తెలుసుకోడం, ఈ తత్వాలకు పరమైన తత్వాన్ని తెలుసుకోడానికి కారణమవుతుంది'

అంటూ ఆ బ్రాహ్మణుడు తన భార్యకిచెప్పి, అనుగ్రహంతో ఆమె మొహంచూస్తూ, 'ఉత్తమమైన రహస్యం చెపుతాను, ఆలకించు' అంటూ ఇంకా ఇలా చెప్పాడు:

## జీవాత్మస్వరూపం

"'కరణం, కర్మం, కర్త — ఈ కారకత్రయంచేత సర్వమూ వ్యాప్తమై వుంటుంది. ఘ్రాణమూ మొదలైన అయిదు ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ కరణహేతువులంటారు పండితులు. గంధమూ మొదలైన విషయాలూ, మంతవ్య బోద్ధవ్యాలూ కర్మహేతువులు. వాసన చూడడానికీ, తాగడానికీ, చూడడానికీ, ముట్టడానికీ, వినడానికీ, తలచడానికీ, నిశ్చయించడానికీ ఏడురకాల నేర్పులున్నాయి జీవాత్ముడికి. ఆ నేర్పులు జీవాత్ముడివల్లే కలుగుతాయి. విషయాలన్నీ అతడు అనుభవించి, ఆ నేర్పుల్లో వొదిలిపెట్టే కాంక్షలే ముక్తిహేతువులు.

"'కరణ కర్మ కర్తృ కారకాత్మకుడయిన జీవాత్ముడు భోక్త కావడం మాని, వివిధ విషయాల ఆకారాలతోవుండే హవిస్సులను ఉపేక్ష అనే స్రుక్కులో వుంచి హవనం చెయ్యబూనడంతో ఆత్మస్వరూపమైన అగ్ని రగులుకుంటుంది; అవిద్య అనే పొగలేకండా వెలుగుతుంది. అది మోక్షప్రకారం. *

"'అలాకాక జీవాత్ముడు భోక్త అయితే అప్పుడది పండితుల నిర్ణయం ప్రకారం యోగయజ్ఞమనిపించుకుంటుంది. ముక్తభావానికి మూలమైన ఆ యోగయజ్ఞంలో నేను ప్రవృత్తుణ్ణయి వున్నాను దానికి సర్వపరిత్యాగమే దక్షిణ దాన్ని సకలాత్మకుడైన నారాయణుడు ప్రీతుడై స్వీకరిస్తాడు. ఆ దశ పేరు మునులు ముక్తి అని చెపుతారు.

* ఆత్మ యజ్ఞంలో ఆత్మజ్ఞానం అగ్నిహోత్రం. అజ్ఞానం పొగ. విషయాలు హవిస్సులు. ఉపేక్ష స్రుక్కు.

"'శాస్త్ర వొక్కడే. అతని శాసనంలోనే నేను నడుచుకుంటాను. గురుడు వొక్కడే. అతడు చెప్పిన అర్థాలే మనస్సులో వుంచుకుంటాను. శ్రోత వొక్కడే. ఆతడి బుద్ధిలోనే మసులుకుంటాను. విద్వేష్ట వొక్కడే. అతడు వాల్చినదిక్కే వాలి ఆపద గడుపుతాను. గడవడానికి కారణమేదో ఆ విధానం పెద్దలవల్ల తెలుసుకున్నాను.

"'లోగడ వోమారు దేవతలూ, మునులూ బ్రహ్మదేవుడిదగ్గిరికి వెళ్ళి, 'మాకు ఏది హితమో సెలవియ్యి' అని అడిగారు. 'మీకు హితమైంది అక్షరోపాసన' అన్నాడు బ్రహ్మ. కనక అక్షరోపాసనవల్లే దుర్గమమైనదాన్ని గడచిపోయాను. గడవడమేమిటి, ముందే గడిచిపోయాను. క్రోధమనే అంధకారంతోనూ, లోభమనే పాములతోనూ, కామమనే దొంగలతోనూ దూషితమై, దుర్గమమైనదాన్ని గడిచి వొక అడివిలో ప్రవేశించాను.'

"'అడివిలో ప్రవేశించాను' అని బ్రాహ్మడు అనడంతోనే 'ఎలాంటిది ఆ అడివి ?' అని అడిగింది బ్రాహ్మణి.

"'ఏం చెప్పనూ' భార్య అడిగినదానికి జవాబు చెప్పాడు బ్రాహ్మడు, 'ఆ అడివికంటే చిన్న అడివికాని, దానికంటే పెద్ద అడివి కాని ఎక్కడా లేదు. గొప్ప దుఃఖం కలిగించాలన్నా, గొప్ప సుఖం కలిగించాలన్నా ఆ అడివికి వున్నంత నేర్పు ఏ అడివికీ లేదు. నిశ్చింతగా ఆ అడివిలో ప్రవేశించిన నరుడికి భయమన్నది ఏమాత్రమూ వుండదు. పైగా సుఖమే కలుగుతుంది. ఆ అడివిలో చెట్లు కొన్నిటికి అయిదు రంగులూ, కొన్నిటికి వొక్కరంగూ, కొన్నిటికి చెప్పరాని రంగు రంగులూ కల పువ్వులూ, పళ్ళూ వుంటాయి అందంగా. పువ్వులు సువాసనలతో గమ్ముమనిపోతూ వుంటాయి. పళ్ళ తీపి ఇంతా అంతా కాదు. అక్కడి చెట్లన్నీ దీక్షాగుణం కలిగి వుంటాయి. అతిథులను తృప్తిపరచడమే వాటివ్రతం. అతిథులు బ్రహ్మతో సమానం.

మునీశ్వరు లక్కడ సౌఖ్యప్రవాహంలో తేలుతూవుంటారు. ఆ అడివి తీరానికీ ఆకాశానికి ఇది మేరఅని చెప్పడానికి వల్లకాదు. ఆ అడివిలో మరో వెలుగు చోరబడదు. సూర్యుడే అక్కడ క్షేత్రజ్ఞుడు. అతడిసేవ భవంనుంచి తరింపజేస్తుంది.

"'లేడికళ్ళదానా, ఇంకా విను. బ్రహ్మనుంచి పుట్టిన నీరు ఆ అడివిలోని నదులూ కొండలూ వహిస్తూ వుంటాయి. ఆ నీటితో తపస్వులు నాశనంలేని మోక్షపదం పొందుతారు.

"'మాననీయమైన నియతి కలిగిన గొప్ప తపోధనవంతులు శాంతీ, దాంతీ, నిస్పృహలతో సమాహితులై ఆ అడివిలో నివసిస్తారు. ఇంకా విను.

"'వాసనచూడడం, చవిచూడడం, చూడడం, తాకడం, వినడం, పొందడం, సంకల్పించడం, ఇష్టార్థం అనిష్టార్థం కోరడం, ఒల్లకపోడం - ఇవి స్వభావకృత్యాలు. ఈ స్వభావకృత్యాలు పరికిస్తూ వీటిలో తాను ఎలా చేరుతాడంటావా ? చెప్తాను. కోరకండానే మేలు కలుగుతుంది. అక్కరలేదని తోసిపుచ్చినా కీడు వొదలదు. కనక స్వభావకృత్యాల పద్ధతి ఎరిగి, నేను వాటి విషయంలో తామ రాకుమీాద నీటిచుక్కలా వుంటాను.

"'ఈ సందర్భంలో వొక అధ్వర్యుడికీ, ఒక యతికీ జరిగిన సంవాదం వివరిస్తాను, ఆలకించు. అధ్వర్యుడు యజ్ఞంలో పశువును చంపుతూ వుండగా చూసి యతి అడిగాడు, 'ఇది హింసకాదా ?' అని, 'నువ్వు ఇలా అనడం అనుచితం' అన్నాడు అధ్వర్యుడు, 'ఇది మేకపోతు. బాగా ఆలోచిస్తే ఇది నాశనం కాదు. ఊర్ధ్వలోకాలకు పోయి సుఖపడుతుంది. వేదవాక్యాలు అబద్ధమా ?' అని చెప్పి యజ్ఞ పశువు నుద్దేశించి ఇంకా ఇలా అన్నా డతడు, 'భూతాలూ ఇంద్రి

యాలూ ఆత్మయోనుల్లో కలిశాక పిండంలోంచి విడిపోయిన జీవుడు యజ్ఞంవల్ల సౌఖ్యం పొందుతాడు.'

"'అధ్వర్యుడి మాటలు విని యతి మళ్ళీ ఇలా అడిగాడు, 'మేకపోతు పుణ్యగతి పొందిందేఅనుకో! ఈ పనివల్ల నీకేం ప్రయోజనం సిద్ధిస్తుంది?'

"'నీకుమాత్రం వేదాలు తెలియవా?' యతిని ఎదురడిగాడు అధ్వర్యుడు, 'పశువును చంపి యజ్ఞంచేస్తే స్వర్గమూ మొదలైన అనేక దివ్యసౌఖ్యాలు లభిస్తాయని వేదాలు చాటి చెప్పడంలేదా? ఆ మాట బొంకా?'

"'దానికి 'హింస పాపం అని వేదాల్లో చూసేకదా నేను ఈమాట నిన్ను అడుగుతున్నాను?' అన్నాడు యతి.

"'నువ్వు సమాధిలో ప్రాణం నిరోధించి, మనస్సు లయంచేసి యోగసిద్ధి పొందుతావు. అదిమాత్రం హింసకాదా ఆలోచిస్తే? అన్నాడు అధ్వర్యుడు.

"'పరమ తపస్సు గాఢంగా పరిపక్వమైతే, అజ్ఞానరూపమైన మాయను పారదోలి జ్ఞానాత్మకమైన బ్రహ్మని దర్శించవచ్చు. పనికి మాలిన విషయాలలో పడిపోకండా శాశ్వతమైన సుఖం అవలంబించవచ్చు. ఇలా తపోనియమం సాగించడం హింస అనడం మూఢత్వంకాని వివేకమా?' అన్నాడు యతి.

"'పెద్దల మాటలు అమృతం వంటివి. ఆ అమృతం సేవించిన వాడు మంచీ చెడ్డా తెలుసుకోగలడు. నేను యజ్ఞంలో పశువును చంపి నప్పుడు అజ్ఞానరూపమైన మాయను పారదోలి, జ్ఞానస్వరూపమైన బ్రహ్మాన్ని దర్శిస్తాను. దానివల్ల రవంతా హింస అంటదు. యజ్ఞం చేస్తాను; మేలు పొందుతాను' అన్నాడు అధ్వర్యుడు.

"'వెయ్యిమాట లెందుకూ? పశుయజ్ఞంకంటే తపోయజ్ఞం'

మేలైంది. ఇది చెప్పడానికి ఇంతవరకు వాదించాను' అన్నాడు యతి. ఆమాట అంగీకరించాడు అధ్వర్యుడు.

"'ఈవిషయంలో ఇంకో ఇతిహాసంకూడా వుంది, చెపుతాను, విను' అంటూ భార్యతో ఇంకా ఇలా అన్నాడు బ్రాహ్మడు.

"'వెయ్యిచేతుల కార్తవీర్యార్జునుడు జయించరాని ప్రతాపంతో అన్నిద్వీపాలూ అడ్డులేకండా ఏలాడు. అతడు పరశురాముడికి కీడు తలపెట్టడంతోనే, చెట్టుకొమ్మలు నరికేసినట్టు అతడి చేతులు గండ్రగొడ్డలితో నరికేశాడు పరశురాముడు. అయితే అంతతో వూరుకోక, పరశురాముడు లేని సమయంచూసి అర్జునుడి కుమారుళ్ళూ, అతడిపక్షం రాజులూ కలిసి పరశురాముడి తండ్రిని జమదగ్నిని చంపేశారు. కోపంతో మండిపడ్డాడు పరశురాముడు. వరసపెట్టి ఇరవైవొక్కమార్లు రాజులమీద దండెత్తాడు. గండ్రగొడ్డలితో రాజుల్ని తరిమితరిమి నరికాడు. అప్పుడు పితృదేవతలు అతడిముందు ప్రత్యక్షమై, 'పరశురామా, నువ్వు బ్రాహ్మడివి. రాజుల్ని చంపడ మెందుకోయి, వద్దు, ఈపని మానెయ్యి' అన్నారు. 'అలా అనకండి. నా రోషాగ్ని తృప్తిపడేటట్టు రాజుల్ని పశువుల్ని చేసి వీరయజ్ఞం చేస్తాన్నేను. నన్ను వారించకండి' అన్నాడు పరశురాముడు. 'కాదునాయనా, యజ్ఞాల్లో తపోయజ్ఞం ఉత్తమమైంది. ప్రాజ్ఞుల్లో ఉత్తముడివి నువ్వు. కనక తపోయజ్ఞం చెయ్యి. దానిమూలంగా శాంతం పట్టువడుతుంది; సర్వజ్ఞుడు సంతోషిస్తాడు. పూర్వం అలర్కుడని వొక రాజు వుండేవాడు. అతడు మనస్సుతో కలిసిన ఇంద్రియాలమీద కోపించి వాటిమీద దివ్యాస్త్రాలు ప్రయోగించాలని చూశాడు. 'రాజా, ఈ అస్త్రాలవల్ల మేంచెడేది లేదయ్యా' అన్నాయి ఇంద్రియాలు, 'రోషంతో ఆవేశపడి మామీద ప్రయోగించినవాడే చెడతాడు. కనక నీకు సామర్థ్యమే వుంటే నీ తపోమయములైన అస్త్రాలు సంధించు.'

"'ఇంద్రియాల మాటలు విన్నాడు అలర్కుడు. క్రోధం విడిచిపెట్టాడు. యోగంతో శాంతి పొందాడు. తపః ఫలాస్త్రాలతో ఇంద్రియాలను సాధించాడు. అంచేత నువ్వుకూడా తపస్సుతో అంత శ్శత్రువుల్ని జయించు, సుఖించు. బాహ్యశత్రువుల్ని జయించడం జయంగా భావించకు' అన్నారు. దాంతో పరశురాముడు శాంతించాడు. మునులు మన్నించదగిన తపస్సుచేశాడు; మేలుపొందాడు.'

"అర్జునా, ఆ బ్రాహ్మడు అంతతో పూరుకోలేదు. ఇంకా ఆమెతో ఇలా చెప్పాడు:

"'గుణాలు తొమ్మిది. అందులో ప్రమానుపాటు, అతిమానము, హర్షము — ఇవి సాత్వికాలు. క్రోధం, సంరంభం, శోకం — ఇవి రాజసాలు. మోహం, కునికిపాటు, స్వప్నం — ఇవి తామసాలు. ఈ తొమ్మిదిగుణాలూ శత్రువులే. వీటిని ఏ అస్త్రాలతో సంహరించాలో ఆ అస్త్రాలతో సంహరించి, అయిదు ఇంద్రియాలనూ మనస్సునూ అదుపులో పెట్టుకుని, శాంతిపొంది, శ్రేయస్సిద్ధి సాధన చేసుకోవాలి.

## అంబరీష గీతలు

"'ముఖ్య శత్రు నిర్ణయంచేసే విషయంలో అంబరీషగీతలున్నాయి. చెపుతాను, సావధానంగా ఆలకించు.

"'అంబరీషుడని వొకరాజు వుండేవాడు. రాజనీతి పరత్వంతో ఉత్తమమైన ప్రభుత్వం సంపాదించా డతను. శత్రువులందరినీ చంపేశాడు. పూజ్యమైన రాజ్యం పరిపాలించాడు. అతడు వోనాడు పండితులతో ఇలా అన్నాడు: 'పగవాళ్ళ నందరినీ జయించాన్నేను. కాని ఈ జయం జయమనుకోడం లేదు. అధికమైన అంతశ్శత్రువుల్ని జయించని వాణ్ణి ఆశ చావుపుట్టుకలకూ, ముసిలితనానికీ లొంగిపోయినట్టు చేస్తుంది. లోభాన్ని గెలవందే శాంతిలేదు, అంటూ తపశ్శక్తితో

దానిని గెలిచి, నిశ్చింతగా సామ్రాజ్య సుఖాలనుభవించాడు. జనక చక్రవర్తికీ ఒక బ్రాహ్మడికి జరిగిన సంవాదం విను.

## యమ జనక సంవాదం

"'ఒక బ్రాహ్మడు జనకచక్రవర్తి ఎదట చెయ్యరానిపని చేశాడు. దానికి జనకచక్రవర్తి, 'నువ్వు నా దేశంలో వుండవద్దు, వెళ్ళిపో' అన్నాడు. 'నీ దేశం ఎంతవరకూ వుందో చెప్పు. అదివిని పరదేశానికి నేను వెళ్ళిపోతాను' అన్నాడు బ్రాహ్మడు. దానికి బదులుచెప్పకండా వూరుకున్నాడు జనకమహారాజు. ఊరుకోడమే కాదు మూర్ఛపోయాడు. కొంతసేపటికి తెలువుకుని, 'నా తాతతండ్రుల తరం నుంచి దేశం నాకు వశపడింది. అయితే దీనిమీద నాకు మమత లేదు. నేను ఎప్పుడూ మిథిలలో నివసిస్తాను. ఈపట్నంకూడా నాదని అంగీకరించను. కనక 'ఇది నా దేశం' అని చెప్పలేను. ఈ విచారంతో మూర్ఛవచ్చిందినాకు, 'నా దేశం' అని నేనన్నాను కనక' అన్నాడు.

"'మహారాజా,' జనకుడి మొహం చూస్తూ అడిగాడు బ్రాహ్మడు, 'నువ్వు ఏలుతున్న పట్నం మీదా, ఈ దేశంమీదా మమతలేకండా ఇలా వుండడానికి ఏమిటి కారణం? నాకు వినిపించు.'

"'ఇవన్నీ నశించవలిసినవే కదా! అంచేత వీటిలో దేనినీ 'ఇది నా ధనం' అని అనడానికి బుద్ధిపుట్టదు నాకు. అలాంటప్పుడు 'ఈ దేశమంతా నాది' అని ఎలా అనేదిచెప్పు! ముక్కు మొదలైన వాటికి తెలియవచ్చే గంధం మొదలైనవి చెడిపోతాయి. కనక, అవి నావి అనకపోడంచేత భూమీ మొదలైన భూతాలు నోడిపోయి, నాకు వశమై వుంటాయి' అన్నాడు జనకచక్రవర్తి.

"'రాజా,' నవ్వుతూ అన్నాడు బ్రాహ్మడు, 'నిన్ను పరిశీలించాలని వేడుకపుట్టి వచ్చాను. యమధర్మరాజున్నేను. నీ వివేకం

పరిపాకానికి వచ్చింది. ఇది స్థిరంగా నిలవాలి నీలో శాంతికలిగిస్తూ' అని వరమిచ్చి అంతర్ధానమయాడు యముడు' అలా చెప్పి బ్రాహ్మణితో మళ్ళీ ఇలా అన్నాడు బ్రాహ్మడు :

"'దేవీ, నీకు కొంత హితోపదేశం చేస్తాను, సావధానంగావిను. సంసారం జెడదవొదిలేసి, వొంటరిగావున్న నా దగ్గిరికి దొంగతనంగా వచ్చావు నువ్వు. నా వైరాగ్యం మాన్పించాలన్న సంకల్పంతో అధ్యాత్మబోధ చెయ్యమని అభ్యర్థించావు. నీ తలపు తెలిసికూడా తెలియనట్టు నటించి, అధ్యాత్మవిద్య బోధించే వాక్యాలుకొన్ని చెప్పాన్నేను. తిరిగి నేను సంసార జంజాటంలో పడను. నిజమైన బ్రాహ్మణ్ణయాను; బ్రహ్మచారి నయాను; జీవన్ముక్తుణ్ణయాను. నా విధం తెలియక మీాబోటి వాణ్ణే అని అనుకుంటున్నావు నన్ను. జగమంతటా వ్యాపించి వున్నాన్నేను. నేనున్న స్థితికి సకల భూరాజ్యమూ, స్వర్గరాజ్యమూ కూడా సరికావు. ఇలా భావిస్తున్న నా బుద్ధే నా ధనం. కర్రలతో అగ్ని వుండిన విధంగా సర్వజంతువులలోనూ సిద్ధివుంది అంతర్గతంగా. గురుకులవాస, గృహవాస, వనవాసులైన బ్రాహ్మలందరికీ శ్రేయః ప్రాప్తికి వొక్కటే దారి. నదులు సముద్రం చేరుకున్నట్టు అంతమందీ పరతత్వాన్నే చేరుకుంటారు. బుద్ధితో ఈ దారిని వెళ్ళాలి కాని, శరీరంతో వెళ్ళడం సాధ్యంకాదు. అదీ అంతమూ కలవి కర్మలు. శరీరం కర్మలతో బంధింపబడుతుంది. ఇది తెలుసు కనక, నా హృదయంలో పరలోకభయంలేదు. నేను చెప్పిన అధ్యాత్మ విద్యా విషయమైన మాటల తాత్పర్యం మనస్సుకి పట్టించుకో. నాలాగే నువ్వూ కాగలవు. భయపడకు.'

"భర్త అలా చెప్పడం విని చేతులు జోడించింది బ్రాహ్మణి సాష్టాంగ దండ ప్రణామంచేసి.

"'నువ్వు చెప్పిన వాక్యాలు మహనీయమైనవి. అయితే గహనమైనవి. ఆత్మజ్ఞానం లేనివారికి వాటి అర్థం గ్రహించడం శక్యమవు

తుందా ? ఆత్మజ్ఞానం కలవారుకూడా చప్పున గ్రహించడం కష్టం. అంచేత వాటి అర్థం ఎలా తెలుసుకోడమో ఆ ఉపాయం అనుగ్రహించు. కరుణామూర్తివి నువ్వు' అంది.

"'మానినీ' భార్య అడిగినదానికి బదులు చెప్పాడు బ్రాహ్మడు, 'బ్రాహ్మడు అరణి. గురువు ఉత్తరారణి. తపము శ్రుతం. మథిస్తే జ్ఞానాగ్ని పుడుతుంది.'

"'మహాత్మా,' మళ్ళీ అడిగింది బ్రాహ్మణి, 'బ్రాహ్మడు అంటే క్షేత్రజ్ఞుడు * అని చూచాయగా మనస్సుకి తట్టింది. అయితే అరణి అంటే ఏమిటో తెలిస్తేకదా అతణ్ణి దాంతో పోల్చుకోడం ?'

"'అతణ్ణి (బ్రాహ్మణ్ణి : క్షేత్రజ్ఞుణ్ణి) తెలియచేసే సాధనంలేదు. ఇంద్రియాలకు అందడతడు. లక్షణాలేమీలేవు. గుణాలు అంతకంటే లేవు. అహంకారం లేకపోతే అవుపడతాడు.' అంటూ క్షేత్రజ్ఞుడి విషయంలో ఆమెకి కలిగిన సందేహం పోగొట్టాడు బ్రాహ్మడు. అంతతో ఆమె శాంతిపొందింది."

"కృష్ణా," బ్రాహ్మణగీతలు విని అడిగాడు అర్జునుడు, "ఎవరయ్యా ఆ బ్రాహ్మణ దంపతులు ? ఎక్కడివారు వారు ? వారి వివరం వినిపించు."

"అర్జునా," అతని మొహంమీద చూపు నిలుపుతూ చెప్పాడు కృష్ణుడు, "నా మనస్సే ఆ బ్రాహ్మడు. నాబుద్ధే బ్రాహ్మణి. ఇంద్రియాలకు అతీతమైన నిర్మలతత్వం ఆత్మ నేనే."

## పర బ్రహ్మం

"నీ అనుగ్రహంవల్ల విశదంగావుంది; సూక్ష్మగ్రాహిణిగా వుంది. తెలుసుకోదగిన పరబ్రహ్మం తెలియచెయ్యి' అని ప్రార్థించాడు అర్జునుడు.

---

* జీవుడు.

"గురు శిష్య సంవాదమని వొక ఇతిహాసముంది. అది నువ్వు అడిగిన ప్రశ్నకి సమాధానంగా వుంటుంది. చెపుతాను, విను" అంటూ అందుకున్నాడు శ్రీకృష్ణుడు :

"నువ్వు అడిగినట్టే మేధావి అయిన వొక శిష్యుడు గురువు నడిగాడు. దానికి గురువు, 'నాయనా, అంగిరసుణ్ణి ముందుపెట్టుకుని ప్రజాపతీ భరద్వాజుడూ, భార్గవుడూ, గౌతముడూ, కశ్యపుడూ, వసిష్ఠుడూ, అత్రీ, విశ్వామిత్రుడూ మొదలైన మునులు బ్రహ్మదగ్గిరికి వెళ్ళారు. ప్రణామం చేశారు. 'ఏది హితమైంది? అది పొందడానికి మార్గమేది?' అని అడిగారు. వారిని అనుగ్రహించి బ్రహ్మదేవుడు చెప్పిన విధానం నీకు చెపుతాను, సావధానంగా విను' అంటూ ఇలా చెప్పాడు : 'సత్యంలో ప్రాణులు పుడతాయి. సత్యంలోనే వర్తిస్తాయి. సత్యంలోనే లీనమవుతాయి. ఇది గుణత్రయాత్మక సత్యచరిత్ర. సత్యం ప్రసిద్ధి వినండి. వేదమనీ, తపమనీ, ప్రజాపతిఅనీ సత్యానికి అపర నామాలు. సత్యమంటే పరమ వేద్యం. కనకనే కామక్రోధాలు విడిచిపెట్టి దృఢభావంతో సత్యమే సేవిస్తారు యోగులు. అంచేత సత్యమే హితమైంది. దాని ప్రాప్తికి మంచి మార్గం చెపుతాను, వినండి. నాలుగు వర్ణాలతోనూ, నాలుగు ఆశ్రమాలతోనూ, నాలుగు పాదాలతోనూ వుండిన ధర్మపథమే మంచిమార్గం. అధ్యాత్మజ్ఞానం లేకండా పరతత్వం లభించదు. ఇది నాలుగు ఆశ్రమాలకూ సామాన్యమే. మారుత ఆదిత్య ఇంద్ర ప్రజాపతులకైనా ఇంతే. అధ్యాత్మ దర్శనమంటే ఇరవైనాలుగు తత్వాలజ్ఞానమే. కనక తత్వాలు చెపుతాను, ఆలకించండి. ఆకాశం మొదలైన భూతాలు అయిదూ, అంతరింద్రియాలు అయిదూ, బహిరింద్రియాలు అయిదూ, మనస్సూ, బుద్ధీ, అహంకారమూ, ప్రకృతీ — ఇలా మొత్తం ఇరవైనాలుగు తత్వాలు. సృష్టి, స్థితి, లయాలు సాంతంగా తెలుసుకుని, పై ఇరవైనాలుగు తత్వాల నైజమూ బాగా తెలుసుకున్నవాడు సంసార భ్రాంతిలో తగులుకోడు; పాపాలుపోయి పరతత్వాన్ని పొందుతాడు.

"'సత్వమూ, రజస్సూ, తమస్సూ — ఈ మూడుగుణాల నవ ద్వారపురం కనపడుతుందికాని అది ఇలాటిదని చెప్పడం తరంకాదు. దానికి వునికి వుందికాని, కనపడదు. కదలికలేదు దానికి, అయినా బహువ్యాపకత్వం కలదది. అందుచేత అసాధ్యమైంది సుమండీ! అయితే గుణాలు జయించిన వ్రతపరులకు మాత్రం సాధ్యపడుతుంది. ఏమంటే మూడుగుణాలతో సారవంతమైం దది.

"'మునులారా, గుణాలకు సత్వమనీ, తమస్సని, రజస్సనిపేరు. అన్యోన్యదాంపత్యం కలవి అవి. అన్యోన్య సంశ్రయం కలవి. అన్యోన్య భావ సంకలితమైనవి. అన్యోన్య ఉపజీవనాచరణం కలవి. దుర్బోధ మైనవి. తమము నియమితమైతే రజస్సు సాగుతుంది. రజస్సు నియ మితమైతే సత్వం సాగుతుంది. సత్వం అడగినప్పుడు తమస్సు సాగు తుంది. లోభం, శోకం, మోహం, నిద్ర, భయం, దురభిమానం, మాంద్యం, పాపం, కోపం, శాఠ్యం, మచ్చరం - ఇవన్నీ తమస్సులో పుడతాయి.

"'పాములు, తేళ్ళు, పశువులు, పందులు, కుక్కలు, చేపలు, కోళ్ళు, చీమలు, కాకులు, క్రిములు, జింకలు, నక్కలు, కొంకినక్కలు, దోమలు, మాకులు, పొదలు, వ్యాధులూ బాధలూ పొందేవారూ, ఈవిధమైన ఇతర జంతువులూ పూర్వం తామసభాగులన్నమాట. ఇవి తామసాలని తెలుసుకుని గుణాలలో చెడ్డగుణం మానగలిగిన వివేక వంతుడు అధోగతి పొందడు.

"'బలము, శౌర్యం, మదం, ప్రాభవం, సుఖదుఃఖాలు తెలుసు కునే నేర్పు, స్నేహం చెయ్యడం, కాంక్ష, ఒల్లకపోడం, ప్రతాపం, కలహం, ఈర్ష్య, బహువికల్పభాషలు, స్త్రీలమీద గాఢమైన అను రాగం, బొంకు, ఉబ్బు - ఇవి రజస్సులో పుడతాయి.

"'ఇవి పూర్వజన్మలో కలిగిన జనులు, ఇవినీతులు, ఇ, అవినీతులు అనే వివేకం కలిగి, ధర్మార్థకామాలు అనుసరించి

ధనంతో తులతూగుతూ కామసుఖాలతో ఆనందిస్తారు; సాటి మనుషు లలో గొప్పవారవుతారు.

" 'రాజసగుణాల స్వభావం తెలిసినవారు, రాజసంవల్ల పుట్టే వికారం బుద్ధితో జయించే ఉపాయం కలిగి, శుభం కలిగించే ప్రవర్తన కలిగి వుంటారు.

" 'సంతోషం, ప్రకాశత్వం, ప్రియం, ఆనందం, కరుణ, క్షమ, సత్యం, శౌచం, ధృతి, అకార్పణ్యం, తితిక్ష, అహింస, ఆర్జవం, అనసూయ, అక్రోధం, అసంరంభం, సమత, దాక్షిణ్యం, శ్రద్ధ, అక్రూరభావం, లజ్జాగౌరవం – ఇవి సత్యంలో పుడతాయి. ఇవి పూర్వ జన్మలో కలవారు, అహంకారం, మమకారం, ధనతృష్ణ, కామాతు రత్వం లేకండా, మంచి విజ్ఞానవంతులయి ఊర్ధ్వలోకసౌఖ్యా లనుభ విస్తారు.

" 'ఆ గుణాలన్నిటినీ చక్కగా తెలుసుకుని వాటిలో చిక్కు కోనివాడు, ఆ క్రియలచేత కబళించబడడు; పైగా ఆ గుణాలవల్ల పుట్టే క్రియారాశిని తానే కబళిస్తాడు.

" 'గుణాలు వేరువేరుగా వుండవు. ఒకదాంతో వొకటి కలిసి మెలిసి వుంటాయి. కలయికతోనే ప్రపంచయాత్రాక్రమం సాగిస్తూ వుంటాయి. వాటి ఏగుణం అధికమై మనస్సును ఆక్రమిస్తే ఆ గుణం వల్ల పుట్టే లక్షణాలు అవుపిస్తాయి; ఒక్కొక్కమాటు మాయమవు తాయి. తమస్సు సాంగత్యం అధికమైతే జీవగమనం కిందివేపు సాగు తుంది. రజస్సు అధికమైతే మధ్య సాగుతుంది. సత్వం అధికమైతే మీదివేపు ఎగపాకుతుంది. ప్రకారభేదంతో ముందు వీటిని తెలిపాను. స్రోతస్సు అంటే జీవగమనహేతువైన దశా విశేషం. ఈ గుణ త్రయంతో, గుణాలతోకూడిన జీవి ఈవిధం పొందుతాడు అని తెలుసు కోండి. గుణత్రయం త్రోసిపుచ్చ దగింది.

" 'గుణత్రయం తోసిపుచ్చడమే మేలు. అది త్రోసిపుచ్చా

లన్న నిగ్రహం లేకపోతే, సాత్వికులకు స్వర్గం ప్రాప్తిస్తుంది; రజో వర్తనులకు మధ్యలోకం ప్రాప్తిస్తుంది; తామసులకు నీచమైన అధో లోకాలు ప్రాప్తిస్తాయి.

"'ధర్మకార్యాలకు సాత్వికం కారణమవుతుంది. అర్థకార్యా లకు రజస్సు కారణమవుతుంది. కామ కార్యాలకు తపస్సు కారణ మవుతుంది. నిష్కర్మకి వీటిని పారదోలడం కారణమవుతుంది.

"'ప్రాణం సత్వం. అపానం రజస్సు. ఉదానం తమస్సు. వేదాలుకూడా ఈ మాటే చెపుతున్నాయి స్పష్టంగా.

"'సత్వగుణం మొదలైన వాటితో కూడినవి కనక చేసే వారి మనస్థితుల ననుసరించి జపమూ, తపమూ, దానమూ, యజ్ఞమూ నడుస్తాయి. ఆ మూడు విధాలలోనూ సత్వంతో కూడిన విధానమే మేలైంది. ఎక్కువ తక్కువ లేకండా సదా సమానంగా నడుస్తూవుండే గుణత్రయం ఉత్తమమూ, అవ్యక్తమూ అయిన తత్వం. అదే శుభమైంది, అచలమైంది, శాశ్వతమైంది.

"'సత్తు అసత్తు క్రమం నిత్యమైంది. దాని విధానం తెలిసిన వాడు విజ్ఞానవంతుడు. గుణాలలో చిక్కక, దైన్యంపాలుకాక ముక్తిపదం చేరుకుంటాడతడు.

## త త్వ ర హ స్య ం

"'అవ్యక్తమైన బ్రహ్మంలో బుద్ధితత్వం పుడుతుంది. బుద్ధి, ధృతి, మతి అని దాని ప్రసిద్ధమైన సంకేత నామాలు. కళ్ళతో చూసినట్టు చేయించి, చెవులతో విన్నట్టు చేయించి, కాళ్ళతో వెళ్ళి నట్టు చేయించి, చేతులతో పనులు చేయించి ఏలికగా వుంటుందది. బుద్ధితత్వంలోంచి అహంకారతత్వం పుడుతుంది. బుద్ధితత్వాభావం అనుసరించి అహంకారం లోకమంతటా క్రియాదులలో నడుస్తుంది.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకులాలలో పుట్టినవారు, ఆ బుద్ధి తత్వం విస్తరించడం వల్లనే అధ్యయనం, వ్రతం, యజ్ఞం, తపం మొదలైన కర్మలలో తగిలి నడవడం జరుగుతుంది. నిశ్చయమైన విషయం యిది. జగత్తు దాని తేజస్సువల్ల వికాసం పొందుతూ వుంటుంది. ఆ తత్వాల లోనే భూమీ, జలమూ, అగ్ని, గాలీ, ఆకాశమూ – ఈ అయిదు మహా భూతాలూ పుడతాయి. గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం వరసగా ఈ మహా భూతాల గుణాలు. ఈ విషయాల్లో మనస్సు తగులుకుంటే మోహాంధకారంలో పడుతుంది ప్రాణి. మోహాంధ కారంలో సకల జంతువులూ కలిసిపోతూ వుంటాయి. ప్రాజ్ఞులైన వారు తమోగుణం చేరనివ్వరు. జ్ఞానం కలిగి, నిర్మలమైన మనస్సుతో మోహాంధకారంలో పడరు. ఇంద్రియ సుఖాలు అశాశ్వతమైనవి; నశిస్తాయి; విషంతో సమానమైనవి; పూర్తిగా వికారాలు పుట్టి స్తాయి. మోహం పుట్టిస్తాయి. లోభం కలిగిస్తాయి. బుద్ధి గుణాలన్ని టినీ కలిచేసి వొదిలి పెడతాయి.

"'మాంసమూ, రక్తమూ, ఎముకలూ కలిసిన శరీరాలు తామే అని నమ్ముకునే దేహాత్మ బుద్ధులైన లంపటులు ఈ శరీరాల వల్ల కలిగే చేటు తెలుసుకోలేరు; వాటికి చిక్కి తుదకి చెడతారు. సందేహం లేదు. పండితులు మాత్రం వీటిచేత చెడరు.

"'అంతరాత్మ అంటే.– ప్రాణం, అపానం, సమానం, వ్యానం, ఉదానం, వాక్కు, మనస్సు, బుద్ధి అని నిరూఢి కలుగుతుంది. ఈ ఎనిమిదీ లోకానికంతటికీ ఉపాదాన కారణం. ఇలా తెలుసు కోడమే బోధనిదానం.

"'ఇంకా వినండి, అహంకారంలో పుట్టిన కళ్ళూ, చెవులూ మొదలైన బాహ్యేంద్రియాలూ, బుద్ధీ మొదలైన అంతరింద్రి యాలూ అన్నీ వుడిగిపోయేవే, ముఖ్యాలయిన కర్మేంద్రియాలూ –

బహిరేంద్రియాలు అయిదూ, అంతరింద్రియాలు అయిదూ, మనస్సూ - మొత్తం పదకుండు ఈ మహా సంఘర్షణంలో పడి నాశనం కానట్టు, తనకు ఇంపైన ఇంద్రియం తన వేపు ఈడవగలిగిన బుద్ధి తత్వం వశపరుచుకున్నవాడే ఇంద్రియ నిగ్రహం కలవాడు. అతడే శుద్ధాత్మకుడు. అతడే పరతత్వం దర్శించగల సమర్థుడు.

"'విన్నారా? చెమటలో పుట్టే ప్రాణులు అధమ తరగతివి. *ఉద్భేదంలో పుట్టినవి మధ్య తరగతివి. గుడ్లలో పుట్టినవి ఉత్తమ తరగతివి. మావినుంచి పుట్టినవి అత్యుత్తమ మైనవి. ఈ భూత తారతమ్య జ్ఞానం మాననీయమైంది. కనకనే మీాకు చెప్పాను.

"'అధ్యాత్మాది విషయాలు చెపుతాను, వినండి. అధ్యాత్మ జ్ఞానం విద్యామూలమైంది. ఆకాశం ఆదిభూతం. గాలి రెండోభూతం. అగ్ని మూడో భూతం. నీరు నాలుగోభూతం. భూమి అయిదోభూతం. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానాలు. అంచేత భూతాలు ముందు వివరించాను. శ్రోత్రం అధ్యాత్మం. శబ్దం అధిభూతం. దిక్కులు అధిదైవతం. చర్మం అధ్యాత్మం. దానిలోని సంస్పర్శ అధిభూతం. దానికి విద్యుత్తు అధిదైవతం. నేత్రం అధ్యాత్మం. రూపం అధిభూతం. ఆదిత్యుడు అధిదైవతం. నాలుక అధిఅధ్యాత్మం. రసం అధిభూతం. చంద్రుడు అధిదైవతం. ముక్కు అధ్యాత్మం. గంధం అధిభూతం. గాలి అధిదైవతం. పండితులు చెప్పినమాట ఇది.† ఇది బుద్ధీంద్రియ ప్రపంచం.

"'పాదపాయూపస్థాలూ, చేయీ, వాక్కూ, (కర్మేంద్రియాలు) అధ్యాత్మాలు; నడక, విసర్జనం, ఆనందం, కర్తవ్యం వక్తవ్యం అధిభూతాలు; వాయు, మిత్ర, ప్రజాపతి, ఇంద్ర, అగ్నులు అధి

---

* ఉద్భేదంలో పుట్టినవి: గర్భం చీల్చుకు పుట్టినవి; తేళ్ళు మొదలైనవి.

† చూ. అనుశాసనిక పర్వం. అ. 1

దైవతాలు. అహంకారం, మనస్సు, బుద్ధి అధ్యాత్మాలు; అభిమానం ఆలోచన, నిశ్చయం అదిభూతాలు; ప్రజాపతి, చంద్రుడు, బ్రహ్మం అధి దైవతాలు. * వేదం నిర్ణయించిన విధానం ఇది. దీనిని తెలుసుకుని, ఇంద్రియాలు అదుపులో పెట్టుకుని, మనస్సు చిట్లకండా వాదిగించుకోడం భవనిరాసకం.

"'మునీంద్రులారా, సూక్ష్మభావత్వ సంపాదినీ, మంగళదాయినీ అయిన నివృత్తి మార్గం చెపుతాను, సావధానంగా వినండి.

"'తాబేలు తన అంగాలు ఎలా ముడుచుకుంటుందో అలాగ కోర్కలు మళ్ళించుకుంటాడు విద్వాంసుడు. కోర్కలు మళ్ళించుకునే ధీరుడు రజోగుణం జయించి ముక్తిమార్గం దర్శిస్తాడు. పది ఇంద్రియాలూ కుదించడం గొప్ప ఉపాయం. ఆ ఉపాయమే పుడకలుగా ఆత్మాగ్ని ప్రకాశిస్తుంది. ప్రాణుల్ని తనలో చూడగలిగితే సూక్ష్మమైన పరతత్వం కనపడుతుంది. పంచభూతాలతో కూడిన శరీర సముద్రం శోకాలకూ, రోగాలకూ ఆశ్రయం. ఈ శరీర సముద్రానికి కాముడూ, క్రోధుడూ ప్రభువులు. ఈకామక్రోధాలను గెల్చుకుంటే ఈ శరీర సముద్రం దాటి పోవచ్చు అనాయాసంగా.

"'మనస్సు మనస్సులోనే ఇముడ్చుకుని, ఆత్మన్ని ఆత్మలోనే చూసేవాడు సర్వజ్ఞుడు. సర్వభూతాలలోనూ తనను నిర్వికల్పంగా చూస్తాడతడు. ఆత్మతత్వం వొక్కటే. దీపం అనేకదీపాలు ముట్టించినట్టు రూపాంతరం పొందుతుందది. ఈ రహస్యం తెలుసుకుని పండితుడు భ్రమలపాలు కాకండా వుంటాడు.

"'అర్యముడు, వరుణుడు, గాలి, అగ్ని, చంద్రుడు, విష్ణువు, బ్రహ్మ, శివుడు— ఇవన్నీ ఆపరంజ్యోతిపేళ్ళే. బుద్ధిమంతులిది తెలుసుకుని భజిస్తారు.

---

* చూ. అనుశాసనిక పర్వం. అ, 1.

## ల క్ష ణ జ్ఞా న ం

"'మాననీయులారా, ఇంకా వినండి. ధర్మానికి అహింస లక్షణం. అధర్మానికి హింస లక్షణం. దేవతలకు ప్రకాశత్వం లక్షణం. మనుషులకు కర్మం లక్షణం. ఆకాశానికి శబ్దం లక్షణం. గాలికి స్పర్శ లక్షణం. అగ్నికి రూపం లక్షణం. నీటికి రసం లక్షణం. భూమికి గంధం లక్షణం. వాగ్దేవికి శబ్దం లక్షణం. మనస్సుకి చింత లక్షణం. బుద్ధికి వ్యవసాయం లక్షణం. దాని మహత్తత్వ రూపానికి ధ్యానం లక్షణం. అవ్యక్తానికి సాక్షిత్వం లక్షణం. యోగానికి ప్రవృత్తి లక్షణం. జ్ఞానానికి సన్యాసం లక్షణం. ఈ లక్షణజ్ఞానం పరతత్వ పరిజ్ఞానానికి హేతు భూతం.

"'జ్ఞానంతో కూడిన సన్యాసం పరమగతి ప్రసాదిస్తుంది. ద్వంద్వాలు లేనివాణ్ణి ముసలితనమూ, మృత్యువూ లేని ధర్మం పొందుతుంది.

## అ వ్య క్త త త్వ ం

"'అవ్యక్త తత్వానికి ఒక లింగమంటూ లేదు. పురుషుడు (పరమాత్మ) అలింగుడు. (ఒక గురుతంటూ లేనివాడు.) అతడు క్షేత్రం ఎరుగును కనక క్షేత్రజ్ఞుడు. క్షేత్రం అనీ, ప్రకృతి అనీ అవ్యక్తానికి నామాంతరాలు. ప్రకృతి తత్వం రజస్తమోగుణాలనుంచి పుడుతుంది. ఆగుణాలకు చేతనం లేదు. కనక ప్రభువును (పరమాత్మను) అవి ఎరగవు. ప్రభువుమాత్రం గుణాలవల్లపుట్టే క్రియలు అన్నిటినీ తెలుసుకుంటాడు. ఇది తెలుసుకుని, గుణాలు వొదిలిపెట్టి, తత్వాలు తెలుసుకున్నవాడు అంతరాత్మలోని చలించని, రోగాలులేని, తరుగు లేని పరమపదం చేరుకుంటాడు.

"'జ్యోతిస్సులలో శ్రేష్ఠుడు సూర్యుడు. భూతాలలో శ్రేష్ఠుడు అగ్ని. విద్యలలో ఉత్తమమైంది సావిత్రి. దేవతలలో ఘనుడు

ప్రజాపతి. వేదాలలో శ్రేష్ఠమైంది ఓంకారం. వాయువులలో శ్రేష్ఠమైంది ప్రాణం. ఛందస్సులలో శ్రేష్ఠమైంది గాయత్రి. పశువులలో శ్రేష్ఠమైంది మేకపోతు. నాలుగు కాళ్ళ జంతువులలో శ్రేష్ఠమైంది ఆవు. మనుషులలో శ్రేష్ఠుడు బ్రాహ్మణుడు. పక్షులలో శ్రేష్ఠమైంది డేగ. యజ్ఞవిధానాలలో శ్రేష్ఠమైంది యజ్ఞపాయసం. యుగాల్లో శ్రేష్ఠమైంది కృతయుగం. ధాతువులలో శ్రేష్ఠమైంది బంగారం. ఓషధులలో శ్రేష్ఠమైనవి యవలు. భక్ష్యభోజ్యాలలో శ్రేష్ఠమైంది అన్నం. పానీయాలలో శ్రేష్ఠమైంది నీరు. పర్వతాలలో శ్రేష్ఠమైంది అమర పర్వతం. చెట్లలో శ్రేష్ఠమైంది రావిచెట్టు. దిక్కులలో శ్రేష్ఠమైంది ఊర్ధ్వదిక్కు. నదులలో శ్రేష్ఠమైంది గంగానది. సరస్సులలో శ్రేష్ఠమైంది సముద్రం. ఆశ్రమాలలో శ్రేష్ఠమైంది గృహస్థాశ్రమం. ప్రజాపతులలో శ్రేష్ఠుణ్ణి నేను. నాకంటే గొప్పవాడు అచింత్యాత్మకుడైన విష్ణుమూర్తి. దేవతలందరిలోనూ శ్రేష్ఠుడు ఈశ్వరుడు. ఈశ్వరుడన్నా, నేనన్నా, విష్ణువన్నా వొకటే. ఒక్కవస్తువే మూడు మూర్తులై ప్రకాశిస్తుంది. శ్రేష్ఠమైనవాటిని తెలుసుకోడం ప్రబోధమూలం. ఎరుకలన్నిటిలోకీ మెరుగుపెట్టడమంటే మా ముగ్గురినీ వొకటే అని తెలుసుకోడమే.

"'పగలూ రాత్రీ వొకదానివెంట వొకటి వరసగా నడుస్తూ వుంటాయి. అలాగే సుఖదుఃఖాలు మనుషులకు కలుగుతూ వుంటాయి. అంచేత సుఖం కలిగితే సంతోషించడమూ, కష్టంకలిగితే దుఃఖపడడమూ కూడదు.

"'ఏపదార్థాలైనా తరగడంకోసమే పెరుగుతాయి. పడిపోడం కోసమే ఎదుగుతాయి. ఎడబాటుకోసమే దగ్గిరచేరతాయి. నాశనం కోసమే పుడతాయి. దుఃఖంకోసమే సుఖపడతాయి. *

* చూ. శాంతిపర్వం, ఆ. 1. పు. 2376.

"'అన్నిటిలోకీ మేలైంది జ్ఞానం. దానికి నాశనం లేదు. దాన్ని తెలుసుకోడంవల్ల అభిమానం, అహంకారం, మమతా వొదిలిపో తాయి. దాంతో నిర్మలుడయి మోక్షమార్గం దర్శిస్తాడు మనిషి.

"'మునులారా, ఇక ఆశ్రమప్రకారం ఎరిగిస్తాను, వినండి మనస్సుపెట్టి.

"'బ్రహ్మచర్యాశ్రమం పూనినవాడు గురువుగారికి ప్రియమైన పనులు, హితమైన పనులు చెయ్యాలి. వేదం వల్లించాలి. నియమితంగా భిక్షమడిగి తెచ్చుకున్న అన్నం తినాలి. మారేడు కర్రకాని, మోదుగు కర్రగాని ఊతంగా పట్టుకోవాలి. స్నానశీలుడు కావాలి. బ్రహ్మచర్య పరుడు కావాలి. నియమితేంద్రియుడు కావాలి. నిత్యశుచిమంతుడు కావాలి. యజ్ఞోపవీతం ధరించాలి. మితభాషి కావాలి. ముంజతాడు నడుముకు కట్టుకోవాలి. శయనం, ఆసనం, ప్రచారం సముచితంగా సాగించాలి. సత్య సంధుడు కావాలి. ధర్మపరుడుకావాలి. శాంతికలిగి వుండాలి. రేపుమాపుల అగ్నికార్యం సాగిస్తూ వుండాలి. చెడుపనుల మోజులో పడకండా నడుచుకోవాలి.

"'గృహస్థాశ్రమంలో వున్నవాడు తగిన సమావర్తన కలిగి వుండాలి. కట్టుకున్న భార్యతో తృప్తిపడాలి. నిర్మలప్రచారుడు కావాలి. పంచయజ్ఞాలు సాగించాలి. అతిథులకుపెట్టి భుజించాలి. తెల్లటివస్త్రాలు కట్టుకోవాలి. శక్తిననుసరించి దానశీలి కావాలి. చపలేంద్రియుడు కాకండా వుండాలి. శుచికలిగి వుండాలి. స్నేహశీలి కావాలి. స్వాధ్యాయనపరుడు కావాలి. మంచి వ్రతనిష్ఠుడు కావాలి. యాజనమూ, అధ్యాపనమూ శక్తివంచన లేకండా జరపాలి. క్షమ కలిగివుండాలి. సత్ప్రతిగ్రహం చెయ్యాలి. ఒకరిని మిత్రులనీ, వొక రిని శత్రువులనీ భావించకండా మధ్యస్థుడయి జీవించాలి. పాపాలకు దూరంగా వుండాలి.

" 'వానప్రస్థాశ్రమంలో వున్నవాడు వూరికి దూరంగా అడివిలో పర్ణశాలలో నివసించాలి. ఉదయమూ, సాయంకాలమూ స్నాన సంధ్యలు సాగించాలి. బ్రహ్మచర్యం పాటించాలి. వూరిపంటలూ, పళ్ళూ, దుంపలూ కాయకూరలూ ఆహారంగా చేసుకోవాలి. లేడి చర్మాలూ, నారలూ బట్టలుగా కట్టుకోవాలి. నేలమీదే నిద్రపోవాలి. అతిథులకు ఆశ్రయమివ్వాలి. ఆత్మీయులలో ఆహారం పంచిపెట్టాలి. అధ్యయన పరుడు కావాలి. హోమశీలుడు కావాలి. ఇంద్రియాలన్నిటినీ గెలవాలి.

" మూడు ఆశ్రమాలలోనూ ఏ ఆశ్రమంలో వుండిన వారైనా సరే, ముక్తి కావాలని కోరుకుంటే యతి ఆశ్రమం స్వీకరించాలి. విద్యామూలమైన ఆశ్రమం యతి ఆశ్రమం.

" 'యతి ఆశ్రమం స్వీకరించినవాడు సర్వప్రాణులమీదా సమానమైన దయకలిగి వుండాలి. అందుబాటుకాని వస్తువుల విషయం విచారించ కూడదు. రానివాటిని మనసులో ఆశించకూడదు. యాదా లాబంగా అప్పటికప్పుడు దొరికిన వాటిని వుంటే వుండనీ పోతే పోనీ అని ఉపేక్షతో చూడాలి. తాబేలు తన అవయవాలు ముడుచు కున్నట్టు ఇంద్రియాలు లోపలికి కుదించుకోవాలి. సరిగా వేళకు బిచ్చ మెత్తుకోవాలి. దొరికిన దాంతో ఆకలి తీర్చుకోవాలి. కూడూ, గుడ్డా తప్ప ఇంక ఎవ్వరు ఏమిచ్చినా ముట్టుకోకూడదు. దినానికి వొక్కమారే తినాలి. నమస్కారం, స్నేహం, ప్రశంస, తిరస్కారం- ఇలాటివి ఏవీ లేకండా గడుపుకోవాలి. అసూయ లేకండా వుండడం, క్రోధం లేకండా వుండడం, దమం, బ్రహ్మచర్యం, రుజుభావం, సత్యం, చాడీలు చెప్పకండా వుండడం - ఇవన్నీ ముఖ్యమైన వ్రతాలు యతికి. చెట్టుకిందా, ఏటివొడ్డునా, జనం లేని కొంపలోనూ, అడ వుల్లోనూ, కొండలమీదా, గుహల్లోనూ ఎప్పుడూ ఏకాంతంగా

వుండే దేవాలయంలోనూ నివసించాలి యతి. అవకతవక పనుల మూలంగా దొరికే వస్తువులు పరిత్యజించాలి. తన గొప్ప కనపడ నివ్వకూడదు. తనను చూసే జనులు తనంటే ఉదాసీనులుగా వుండేట్టు ప్రవర్తించాలి. అలాటి యతే సర్వంనుంచి ముక్తి పొందగలుగుతాడు.

"'సన్యాసమంటే తపశ్చరణం. తపోజ్ఞానంతో ప్రబుద్ధులైన వారు, అచింత్యమైన, అజరమైన, అమృతమైన తత్వం దర్శిస్తారు. తామసంలేని, రాజసంలేని శుద్ధసత్వాశ్రయమైన హృదయంకల వారు, తపోవృత్తి మూలంగా క్షేమమార్గాన నడుస్తారు.

"'సమస్త భూత సముదయస్థమై వున్న తత్వం నానా త్వంతో వుండి అన్ని విధాల ప్రకాశిస్తుంది. ఇది తెలుసుకున్న పండి తుడు ద్వంద్వాలు వొదులుకుంటాడు; ముక్తి పొందుతాడు.

"'సంసారం వొక మహా వృక్షం. అవ్యక్తంలో దీని పుట్టుక. బుద్ధి దీనికి బోదె. అహంకారం మొక్క. పంచమహా భూతాలు కొమ్మలు. ఇంద్రియాలు తొరటలు. ఎప్పుడూ చిగిర్చే ఆశలు చివుళ్ళు. శుభాశుభాలు పళ్ళు. జ్ఞానమనే కత్తితో ఈ సంసార వృక్షం నరకాలి. అభిమానం, అహంకారం మనస్సులో వొదుల్చుకోవాలి. అదిగో అలాటి పురుషుడే బహ్మతత్వం దర్శించగలుగుతాడు స్పష్టంగా. పరమనియతితో వొక్క నిమిషమైనా తనలోని ఆత్మన్ణి తాను చూస్తే చాలు, పూర్తి జ్ఞానం పొంది, ప్రకృతిసంబంధం వొదిలి, జ్ఞాన పూర్ణులైన మునులు తరుగులేని ముక్తిపదం పొందుతారు.

"'పరమనియతి అంటే ప్రాణసంయమనం. క్రమాభి వృద్ధితో అలవరించుకుంటే అది ప్రసాదసిద్ధి ప్రసాదిస్తుంది. సందేహం లేదు. దానివల్ల ఇష్టసిద్ధి చేకూరుతుంది.

"'అవ్యక్తం నుండి పుట్టిన, శ్రేష్ఠమైన సత్వం పాపపంకం వారించినదై, తరగని, మృతిలేని, ఇంద్రియాలకు అందని మమత్వం

పొందడానికి ఆశ్రయమవుతుంది. కనక శాశ్వతమైన వస్తువు పొంద డానికి సత్వభావనకంటే ప్రశస్తమైన పని మరొకటి లేదంటారు. అహింసా వ్రతపరులలో అందె వేసినవారు. సత్వంలో వుండే పురుషుణ్ణి ఊహామూలంగానే చూడడం జతపడుతుంది. దానికి మనస్సు తప్ప మరొక సాధనం లేదు. మరో సాధనంతో చూస్తామనకోడం తగని పని. ఇదెలా అంటారా? సత్యమూ, సంతోషమూ, అహింసా, ధృతీ, క్షమా, ఆర్జవమూ, సన్యాసమూ, పరిత్యాగమూ, విజ్ఞానమూ సాత్వికాలు. అంచేత తత్వవిదులు ఈ అనుమానంతో పురుషుణ్ణి తెలుసుకోవచ్చునంటారు. తత్వమన్నా, పురుషుడన్నా ఒకటే అంటారు కొందరు. అయితే ' అదెలా పొసగుతుంది ? మేడిపండులో దోమలున్నట్టు, నీటిలో చేపలున్నట్టు సత్వాలలో అంతరాత్మ వుంటాడు ' అనేవారు అనేకమంది వున్నారు.'

"బ్రహ్మ చెప్పిన మాటలు విన్నారు మునులు. ' ధర్మం అనేక విధాలు. ఇందులో ఏది ఎవడు అవలంబించాడో, అదే అతడు మంచి దంటాడు. మేము అన్నిటిమీదా పరిగెత్తిన బుద్ధులు కలిగి అనిశ్చయ దర్శనులమై వుంటున్నాం. కనక ' ఇది ప్రధానంగా ఆచరించదగిన ధర్మం ' అని ఉపదేశించు. సత్వ - పురుష సంబంధం ప్రస్ఫుటంగా ఎరిగించు ' అని వేడుకున్నారు.

## సత్వం ప్రధానంగా ఆచరించాలి

"' వినండి ' మునుల ప్రశ్న విని అందుకున్నాడు బ్రహ్మ, ' అన్ని ధర్మాల్లోనూ మేటి ధర్మం అహింస. అహింసతో కూడిన వాడికి ఉత్తమమైన జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం మోక్షం ప్రసా దిస్తుంది. కోరికలు పెట్టుకుని కర్మలు చేసేవాడు చావుపుట్టకలు అనుభ

విస్తూనే వుంటాడు. ఫలాపేక్షలేకండా నిర్లోభంగా మంచిచేసినవాడు ముక్తి పొందుతాడు.

"'పురుషుడు విషయి. సత్వం విషయం. ఇలా భోక్తృ-భోజ్యత్వ సంబంధంతో వుండీ కూడా తామరాకుమీద నీటిబొట్టు లాగ పురుషుడు విషయాన్ని అంటడు.

"'పరతత్వాం చూడడానికి దీపం సత్వం. కనక ఈ సాధనం వొదలరు కృతాత్ములు. దానిమూలంగా ముక్తి పొందుతారు వారు. సత్వమో యోగ్యమైన సాధనం. సాధనం పూర్తికాకపోతే మేలు కలగదు. దూరప్రయాణం చేసేవాడికి వాహనం వుంటే కలిగే మేలు, వాహనం లేకపోతే ఎలా కలుగుతుంది? నదిని దాటేవాడికి నావ వుంటే కలిగేమేలు, నావ లేకపోతే ఎలా కలుగుతుంది? అలాగే సాధనం లేని బుద్ధిహీనుడికి ఇష్టసిద్ధి ఎలా కలుగుతుంది? కనక సత్వ సాధనం లేందే మేలు కలగదని తెలుసుకునీ, లేదా తెలిసీ తెలియక బలవంతంగా మురికి కడుక్కొని చేసే పనికి ఫలం దొరకదు. దొరక్క-పోడమేకాదు పైగా దుఃఖం కూడా కలుగుతుంది.

"'నేలమీదనావా, నీటిమీద గుర్రమూ పనికిరావు. ఎక్కడ ఏసాధనం ఉపయోగించాలో తెలియనివాడు కార్యసిద్ధి పొందలేడు. పైగా కష్టాల పాలవుతాడు.

"'ఒడ్డుచేర్చేదాకా నావని ఆశ్రయించి వొడ్డుచేరాక దానిని విడిచిపెట్టాలి. అలాగే పరమపురుషుడి దర్శనం లభించేవరకు సత్వం సాధనంగా చేసుకుని, అనంతరం దాంతో సంబంధం వొదులుకోవాలి.

"'అవ్యక్తం గుణం మహత్తత్వాం. మహత్తత్వాంగుణం అహంకా-రాలు, అహంకార గుణాలు మహాభూతాలు. మహాభూతాల గుణాలు శబ్దాదులు. వాటిలో ఆకాశానికి గుణం శబ్దం. గాలికి గుణాలు శబ్దమూ, స్పర్శమున్నూ, తేజస్సుకి శబ్దమూ, స్పర్శమూ, రూపమూ గుణాలు.

నీటికి శబ్దమూ, స్పర్శమూ, రూపమూ, రసమూ గుణాలు. భూమికి శబ్దమూ, స్పర్శమూ, రూపమూ, రసమూ, గంధమూ గుణాలు. శబ్దంలో కఠినత్వమూ, శ్రావ్యమూ, అపస్వరమూ మొదలైన భేదాలుంటాయి. స్పర్శలో చల్లదనమూ, వేడీ మొదలైన భేదాలుంటాయి. రూపంలో నలుపూ, తెలుపూ మొదలైన భేదాలుంటాయి. రసంలో తీపీ, చేదూ మొదలైన భేదాలుంటాయి. గంధంలో పరిమళమూ, తీక్షమూ మొదలైన భేదాలుంటాయి. ఇలా ఎన్నో రకాలుగావుండిన విషయాలు తెలుసుకోడంవల్ల వాటిని విడిచిపెట్టడానికి వీలుపడుతుంది.

"'భూమీ, నీరూ, అగ్నీ, గాలీ— ఈ నాల్గింటికంటే ఆకాశం గొప్పది. ఆకాశంకంటే అహంకారతత్వం గొప్పది. అహంకారతత్వం కంటె బుద్ధి గొప్పది. బుద్ధికంటె ప్రకృతి గొప్పది. వీటన్నిటికంటే పరమాత్ముడైన పురుషుడు గొప్పవాడు.

"'భూతాల తారతమ్యం అవగతం చేసుకున్న శిష్టజనం పరమాత్మని దర్శిస్తారు. అడ్డూ ఆపూ లేని, తరుగులేని మోక్షపదం పొందుతారు.

"'పంచభూతాలను పరిగెత్తించడానికీ, కుదియించడానికీ సామర్థ్యంకలిగి, వాటినేలగల అధికారం వొక్క మనస్సుకే వుంది. రథానికి పూసిన గుర్రాలు సారథి ఎలా నడపగలుతాడో ఇంద్రియాలను అలా నడపగలుగుతుంది మనస్సు. భూతాత్మకమూ, బుద్ధిసన్నాహమూ అయిన మహారథానికి ఇంద్రియాలు గుర్రాలు. మనస్సు సారథి. అంతరాత్మ రథి. దీనిని తెలుసుకున్న పండితుడు, ఘోరమైన సంసార సముద్రంలో మునిగిపోడు. నిర్గుణమైన మార్గంలో నడిచి, నిరామయమైన అవ్యయమైన పరమపదం చేరుకుంటాడు.

"'సముద్రంలో కెరటాలు ఎలా పుడతాయి, అదిగో అలాగే

అవ్యక్తంలో దేవతలూ, మనుషులూ, చెట్లూ మొదలైన చరాచర ప్రాణికోట్లు పదేపదే పుడుతూ, చస్తూ వుంటాయి.

" ' అవ్యక్తమూ మొదలైన యావత్తూ అవ్యయుడైన పురుషుణ్ణే ఆశ్రయించి వుంటుంది. ఈరహస్యం స్పష్టంగా తెలుసుకున్న పండితులు మోహబంధాలనుంచి ముక్తిపొందుతారు. అయితే ఇది తెలుసుకోడానికి మూలం తపస్సు. అదే ఘనమైంది. కనక అతినిష్ఠంతో తపోధనం ఆర్జించడం ఎంతైనా అవసరం. మహాతపస్సు వల్లే ప్రజాపతులు బహువిధమైన సృష్టి నిర్వహణకోసం నిపుణులయారు. అడివి పదార్థాలు ఆహారంగా చేసుకుని తపస్సు చెయ్యడం వల్లే మునులు త్రికాలజ్ఞానులైనారు; ముల్లోకాలూ దర్శించగలిగారు. తపస్సువల్లే విద్యా గౌరవం కలుగుతుంది. మరోవిధంగా పొందరాని ఉన్నతపదం స్వచ్ఛమైన తపస్సువల్ల పొందవచ్చు సులభంగా. బ్రహ్మహత్య, మద్యపానం మొదలైన మహాపాపాలు తపస్సువల్ల వొదుల్చుకోవచ్చు. తపస్సువల్ల సర్వప్రాణులూ ప్రీతిపొందుతాయి. మమతా, అహంకృతీ కూడినతపంవల్ల ప్రజాపతి సమీపంలో భవ్యమైన పదం లభిస్తుంది యతికి. ఇందులో ఏమాత్రం సందేహంలేదు. మమతా, అహంకారంలేని పరిశుద్ధమైన తపస్సువల్ల సత్యమూ, దయా, క్షమా, ధృతీ, మితాహారమూ, ఆర్జవమూ, బ్రహ్మచర్యమూ, అచౌర్యమూ, అహింసా, శౌచమూకల యతి సర్వలోకోత్తరమైన, అవ్యయమైన మోక్షపదం పొందుతాడు.

" ' తమమూ, రజస్సూ, వొదులుకుని, సత్వంలో రమించి, గుణాలులేని తత్వం దర్శించి, సత్యం దిగవిడిచిన వైరాగ్యం పూనిన మునీశ్వరుడు ముక్తి పొందుతాడు.

" ' వేదాంత రహస్యాత్మకమై వెలిగే తత్వమే పరమతత్వం క్షేత్రజ్ఞుడని పరిణతిగల పరమపురుషుడే సర్వపదాలూ తెలిసినవాడు.

"'వృత్తి విశేషంలో ప్రవేశించిన చిత్తం వెనక్కి మళ్ళించి, తిరిగి అందులోకి పోకండా అదుపులో వుంచుకోడమే యోగంలో ఉత్తమ పురుషరహస్యం అంటారు మునులు.

"'అవ్యక్తంలో అంతమయ్యేపని యావత్తూ అవిద్యవల్లే కలుగుతుంది. అవిద్య బంధహేతువు. మమత మృత్యు కారణం. నిర్మమత్వం అమృతం.

"'కర్మం మేలంటారు కర్మతత్పరులు. విద్య మేలంటారు బుద్ధాత్ములు. ఆకర్మలు పదహారు వికారాలు కల ఆకృతి పుట్టిస్తాయి. విద్య శాశ్వతుడైన, గ్రహింప శక్యంకానివాడైన పరమపురుషుణ్ణి కనపరుస్తుంది. ఆ పురుషుడికి కర్మమయత్వం లేదనీ, విద్యామయత్వమే సహజమనీ శ్రుతులు చాటిచెపుతున్నాయి. ఈ సుజ్ఞానం కల మహాత్ముడు అన్నికోరికలూ వొదులుకుంటాడు. ఆత్మలోనే ఆత్మను దర్శిస్తాడు. అనామయమూ, అజరమూ, అమృతమూ అయిన ముక్తిపదం చేరుకుంటాడు.

"'జ్ఞాన పరిపూర్ణాత్ములైన, ముక్తిపదనిర్ణయం తెలిసినవారు మన్నించేమార్గం ఇది. ఇది కర్మత్యాగాలతో ప్రకాశిస్తూ వుంటుంది. కోరికల పొంతకు పోకండా, నిస్సంగులయి, అంతటినీ సమభావంతో పరికించే సారాత్మకులు ఈ మార్గంలో పయనించ గలుగుతారు.

"'కృతాత్ములారా, కల్మషంలేనివారు మీారు; నిర్మలాత్మకులు; సన్మతులు; ధార్మికులు. చెప్పవలిసిన సర్వమూ మీాకు చెప్పాను. నేను చెప్పినట్టు నడుచుకోండి మీారు. మనస్సులో మరో విధానం చోరనివ్వకండి. ఉదారమైన మార్గమిది. ఈ మార్గంలో పరమసిద్ధి తప్పదు.'

"'ఇలా బ్రహ్మదేవుడు మునులకు తత్వోపదేశం చేశాడు. మునులందరూ ఆ ప్రకారం నడుచుకున్నారు; అనితర సులభమైన సౌఖ్యం అనుభవించారు.' అని చెప్పి ఇంకా ఇలా అన్నాడు గురువు.

" 'నువ్వు కూడా ఈ వాక్యాలు మనస్సుకి పట్టించుకో. పరమ సమాధి సంపద పాటించు. అనాయాసంగా శాశ్వతపదం ప్రాప్తిస్తుంది.'

"గురువు ప్రబోధించిన ప్రకారం జ్ఞానం సంపాదించాడు శిష్యుడు. సన్మార్గంలో నడుచుకున్నాడు. అనామయమూ, అజరమూ అయిన అమృతపదం పొందాడు."

ఆదరచిత్తంతో అలా చెప్పిన శ్రీకృష్ణుడి మాటలువిని, "కృష్ణా, అంత ఉదారహృదయులా వారు! అయితే ఆ గురు శిష్యులు ఎవరంటావు?" అని అడిగాడు అర్జునుడు.

"అర్జునా," నవ్వుతూ అతడి మొహంమీద కృపాదృష్టి నిలుపుతూ అన్నాడు శ్రీకృష్ణుడు, "విను, నేనే ఆ గురువును. నా మనస్సే ఆ శిష్యుడు. నిర్మలమైన మనస్సు కలవాడివి నువ్వు. కనక పరమప్రీతితో నీకు వివరించాను. అనితరసులభమూ, అతి గుహ్యమూ అయిన మార్గం ఇది.

"అర్జునా, నిర్మలమైన, అచలమైన చిత్తం నా మీద నిలుపు. ఏకాంతభక్తితో నన్ను భజించు. నిత్యమూ ఈ అధ్యాపనం మననం చెయ్యి. పాపాలనుంచి ముక్తిపొందుతావు.

"యుద్ధారంభంలో నీకు ఈ అమృతపద ప్రాప్తిహేతువైన సద్బోధ చేశాను. చలించకండా ఎప్పుడూ ఇందులోనే రమించు శమం సాధించి."

అలా పరమ గురుడైన శ్రీకృష్ణుడు ఉత్తమ శిష్యుడైన అర్జునుడికి అధ్యాత్మవిద్య వినిపించాడని వైశంపాయనుడు చెప్పగా విని, "ఆ పురుషోత్తములు అనంతరం ఎలా ప్రవర్తించారు?" అని అడిగాడు జనమేజయుడు.



# అశ్వమేధపర్వం

## మూడో ఆశ్వాసం

### ద్వారక వెళతాను

వైశంపాయనుడు జనమేజయుడితో ఇలా చెప్పాడు: అలా అర్జునుణ్ణి అధ్యాత్మ విద్యావిశారదుణ్ణి చేసి ఇలా అన్నాడు శ్రీకృష్ణుడు:

"అర్జునా, వసుదేవుణ్ణి చూడాలని తొందరపడుతోంది మనస్సు. అయినా సంతోషపూర్వకమైననీ అనుమతికోసం నిరీక్షిస్తోంది. కనక నన్ను ద్వారక వెళ్ళనీ."

"అయితే హస్తినాపురం పద" అన్నాడు అర్జునుడు, "ధర్మరాజుతో చెపుదాం. ఆయన అనుమతించి ప్రీతిగా పంపుతాడు. ఆయన అనుమతించినట్టు విన్నవిస్తాన్నేను."

అర్జునుడు అలా అనడంతోనే దారుకుణ్ణి పిల్చి రథం పూన్చుమని నియోగించాడు శ్రీకృష్ణుడు. అనంతరం తమతో బయలుదేరడానికి తగిన పరివారం సమకట్టడానికి దండనాయకుల్ని నియోగించాడు అర్జునుడు. కొంతసేపట్లో రథం సిద్ధంచేసి పట్టుకువచ్చాడు దారుకుడు. పరివారం సిద్ధంచేసి తెచ్చారు దండనాయకులు. కృష్ణుడూ, అర్జునుడూ ప్రయాణోచితంగా అలంకరించుకున్నారు. రథమెక్కి హస్తినాపుర మార్గం పట్టారు.

దారిలో వినయంగా అన్నాడు అర్జునుడు: "దేవా, నీ అనుగ్రహంవల్ల కౌరవసైన్య సముద్రం దాటగలిగాం. భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ మొదలైన మహావీరుల్ని గెలవగలిగాం. నువ్వే

శత్రువీరుల్ని చంపుతూ ముందు నడుస్తూవుంటే, మేం జయం పొందుతూ వచ్చాం నీ వెనక. ప్రతాపం, పేరు, సౌఖ్యం నీ ప్రసాదం వల్లే పొందాం. అప్రతిహతమైన మహారాజ్యాధిపత్యం వహించాడు అన్నయ్య ధర్మరాజు. ఆశ్రయించిన వారిని రక్షించడమే నీ వ్రతం. నీ మహిమ పొగడ తరమా నాకు! విశ్వసంవిధాతవి నువ్వు. నిర్మల మైన నీ తేజమే అగ్ని ష్టోమం. కాలాత్ముడివి నువ్వు. నీ పూర్వే వాయువు. నీ క్రోధమే మృత్యువు. నీ ప్రసాదమే లక్ష్మి. నీ వల్లే మేలూ, ప్రీతి, మరణమూ, మహానందమూ కలుగుతున్నాయి. స్థావర జంగమాత్మకమైన జగత్తు నీ వల్లే ఆవిర్భవిస్తున్నది; నీ వల్లే నిలుస్తున్నది; నీ వల్లే నాశనమవుతున్నది. భావాతీతుడివి నువ్వు. సర్వపతివి నువ్వు. యజ్ఞపురుషుడివి నువ్వు. నారదుడూ, దేవలుడూ, కౌశికుడూ, వ్యాసుడూ మొదలైన మునులూ భీష్ముడు చెప్పిన మాటల బట్టి సర్వమూ నువ్వే అని ఎరుగుదున్నేను కృష్ణా, నామీద నీకున్న కరుణవల్ల అధ్యాత్మ రహస్యం ప్రసాదించావు నాకు. నువ్వు చూపిన దారినే దృఢంగా పయనిస్తాను.''

అర్జునుడి మాటలు విని అతణ్ణి అభినందించాడు శ్రీకృష్ణుడు.

హాస్తినాపురం ప్రవేశించింది రథం. వారి రాకకోసం ముందే ముస్తాబై వుంది నగరం. ముందు ధృతరాష్ట్ర మహారాజు మందిరానికి వెళ్ళారు కృష్ణార్జునులు, అతనికీ, గాంధారికి ప్రణామాలు చేశారు. వారిని సంతోషపరిచారు. అనంతరం కుంతీదేవి దగ్గిరికి వెళ్ళారు. తరువాత వరసగా విదురుడి దగ్గిరికీ, యుయుత్సుడి దగ్గిరకీ, సంజయుడి దగ్గిరికీ వెళ్ళారు. ఎవరికి తగినట్టు వారిని గౌరవించారు. ధర్మరాజు దగ్గిరికి వెళ్ళి భక్తి గౌరవాలు ప్రదర్శించారు. వారిని గాఢంగా కౌగిలించుకుని, ఆదరించాడు ధర్మరాజు. అదంతా అయాక అవాళ

అర్జునుడి మందిరంలో విడిది చేశాడు శ్రీకృష్ణుడు. అతడు చేసిన పూజలందుకున్నాడు; సంతోషించాడు.

మర్నాడు మహనీయమైన ఆస్థాన మండపంలో కొలువు తీర్చిన ధర్మరాజు దగ్గిరికి అర్జునుడితో కలిసి వెళ్ళాడు శ్రీకృష్ణుడు. కులాసాకబుర్లయాక, అన్నగారి మొహంమీద చూపులు నిలిపి అందుకున్నాడు అర్జునుడు :

"మహారాజా, ఎంతో కాలం ఇక్కడ వుండి పోయాడు శ్రీకృష్ణుడు. తండ్రి వసుదేవుడూ, అన్నదమ్ములూ, ఇతర బంధువులూ ఇతణ్ణి చూడాలనుకుంటూ వుంటారు. వారిని చూడాలని అభిలాషపడుతున్నాడితను. మహారాజు అనుమతిస్తే ద్వారక వెళతాడు. బలరాముణ్ణీ, వసుదేవుణ్ణీ చూసి, దేవకిని దర్శించి, తక్కిన తమ్ముళ్ళనీ, కుమాళ్ళనీ గుండెల కద్దుకుని, పురజనుల్ని మన్నించి, ప్రేమతో ఆదరించి తిరిగి చప్పున దయచేస్తాడు. మహారాజు ఇది దివ్యచిత్తాన చిత్తగించి, ఎలా తోస్తే అలా ఆజ్ఞాపించాలని విన్నవిస్తున్నాను" అన్నాడు.

"అలాగే కానీ" అన్నాడు ధర్మరాజు, "శ్రీకృష్ణుడు ద్వారక దయచేసి, మనమేనమామ వసుదేవుడి దర్శనంచేసి మనకు మారుగా నమస్కారాలూ, ఆలింగనాలు చెయ్యాలి, బలదేవుణ్ణీ దేవకీదేవిని చూసి, మనకు మారుగా పూజించాలి. బంధువులనందరినీ ఎవరికి తగినట్టు వారిని ఆదరించాలి. మనమడిగినట్టు కుశలం విచారించాలి. పరిజనుల యోగక్షేమాలు పరికించాలి. పురజనులందరికీ ప్రియంపలికి, స్నేహితులతో గడిపి, తక్కిన అవసరకృత్యాలు జరపడానికి అవసరమైనన్ని దినాలుండి, మన అశ్వమేధ పర్వానికి బంధువులతోనూ, భృత్యులతోనూ తర్లిరావాలి."

ధర్మరాజు మాటలువిని సంతోషించాడు కృష్ణుడు. వినయంగా కుంతీదేవి దగ్గిరా, ద్రౌపది దగ్గిరా అనుమతి తీసుకున్నాడు. సుభద్రను తనతో తీసుకువెళతానని కుంతి దగ్గిర అంగీకారం పుచ్చుకున్నాడు. అర్జునుడి అనుమతికూడా తీసుకున్నాడు. వివిధ వాహనాలమీద తమ్ముడు సాత్యకితో బయలుదేరాడు. నగరం బయటివరకు పాండవులు వెంట వచ్చారు. అక్కడ నొకదగ్గిర ఆగి, మళ్ళీ ఒకమారు అందరి దగ్గిరా అనుమతి తీసుకున్నాడు. తన చిత్తమూ, దృష్టీ అర్జునుడిమీద నిలిపి ద్వారకమార్గం పట్టాడు. మాటిమాటికి తిరిగితిరిగి అతడు అర్జునుణ్ణి చూస్తూవుంటే, కంటికి అవుపడే అంతవరకూ అతణ్ణేచూస్తూ ఆగిపోయాడు అర్జునుడు.

శ్రీకృష్ణుడి రథంపక్క మరో అందమైన రథంమీద సాత్యకి వెళ్ళాడు. వెనక మరో మంచి రథంమీద సుభద్ర వెళ్ళింది. అలా వైభవంగా వెళుతున్న శ్రీకృష్ణుడిమీద దేవేంద్రుడు పూలవాన కురిపించాడు. గాలి అనుకూలంగా వీచింది. అతిస్పష్టంగా శుభశకునాలు ఎదురయాయి.

## ఉ ద ం కు డు

అలా వెళ్ళివెళ్ళి దారిలో ఉదంకాశ్రమం చేరాడు శ్రీకృష్ణుడు. ఆశ్రమం లోపలికివెళ్ళి వినయంగా ఉదంకమునిని దర్శించాడు. అతడు చేసిన అతిథిసత్కారాలతో తృప్తిపడ్డాడు. శ్రమతీర్చుకుని అతని పక్క కూచున్నాడు. అప్పుడు అతణ్ణి తేరిపారచూస్తూ ఉదంకముని అన్నాడు. జరిగింది ఎరగనట్టు.

"కృష్ణా, భరతవంశం రాజుల దగ్గిరకి వెళ్ళి, కౌరవులకూ పాండవులకూ బంధుత్వం ధృఢపరిచి వచ్చావా? యావన్మంది రాజులూ సుఖంగా వారి వారి రాజ్యాల్లో రాజరికం చేసినట్టు

ఏర్పాటు చేశావు కదా! పక్షపాత పాతకంలేనివాడవి నువ్వు. ప్రజల్ని సంతోషపెట్టడంలో సమర్థుడివి కదా!"

ముని పలికిన నిందా గర్భితమైన మాటలు గ్రహించీ, గ్రహించనట్టు జవాబు చెప్పాడు శ్రీకృష్ణుడు. అతని మొహం చూస్తూ:

"ఎలా చెప్పాలో అలా చెప్పి చూశాను దుర్యోధనుడితో, కాని ఏం లాభం, నా మాట సాగలేదు. గర్వంతో అతడు మాట్లాడితే అదిలించి చూశాను. భయాన నయానా బోధపరిచాను. సంధికి సమ్మతించలేదతడు. భీష్ముడూ, ద్రోణుడూ కూడా నా మాట సమర్థించారు. మునీశ్వరులున్నూ నొక్కి చెప్పారు, అతిలోభంతో వంశ ధర్మం విడిచిపెట్టాడు దుర్యోధనుడు. ఎంత ప్రయత్నించినా సంధి కుదరలేదు. తుదకి కౌరవులూ, పాండవులూ యుద్ధం చేశారు తప్పని సరిగా. బంధువులతోనూ, పరిజనంతోనూ వీరస్వర్గం పొందారు; ఉత్తమలోకం చేరుకున్నారు. కౌరవులందరూ కడ తేరిపోయారు. పాండవులలో అయిదుగురు అన్నదమ్ములు మాత్రం మిగిలారు. కాల నియతి గడవడం ఎవరి శక్యం?"

కృష్ణుడి మాటలు విని రోషంతో రెండు కళ్ళూ జ్యోతుల్లా చేసుకున్నాడు ఉదంకముని.

"కపటరాయబారివై కౌరవకులం కడతేర్చావు. సమర్థుడవై వుండీన్నీ సంధి కుదిర్చావు కావు. నీ పాపానికి తగినట్టు ఘోరంగా శపిస్తానిన్ను" అంటూ వురిమాడు.

"నా మాటలు విను ముందు. తరవాత నీకు ఎలా తోస్తే అలా చేద్దువుకాని" అంటూ ఇలా అందుకున్నాడు శ్రీకృష్ణుడు, "కోపం విడిచిపెట్టు. మునివి కదా, కోపం మంచిదా మరి? శాంతంగా నా అనునయం. ఆదరించు. విను, అల్పతపస్సులచేత కొట్టుకుపోను నేను.

అంతేకాక, నువ్వు శాపం పెట్టావే అనుకో, అందువల్ల నువ్వు అతి దుష్కరమైన తపస్సు చేసి కూడబెట్టుకున్నదని చెప్పదగిన నీ బ్రహ్మాచర్యం పూరికే పోదా? ''

"అయితే కానీ, నువ్వు చెప్పే తగువేదో ముందు చెప్పు. వింటాను. నువ్వు చెప్పింది సబబయితే, శాపం పెట్టాలన్న నా మనసు మళ్ళించుకుంటాను" అన్నాడు ఉదంకుడు.

"ఉదంకా," నవ్వుతూ అన్నాడు శ్రీకృష్ణుడు. "తమస్సూ, రజస్సూ, సత్వమూ నా వంశంలో వుంటాయి. దేవతలూ, వసువులూ మొదలైన స్వర్గవాసులు యావన్మందీ నాలో పుట్టిన వాళ్ళే. అన్నిటా నేనే వుంటాను. సర్వమూ నాలోనే వుంటుంది. పరతత్త్వమన్నా, అపరతత్త్వమన్నా నేనే. ఓంకారం మొదలైన వేదాలూ, నాలుగు వర్ణాలూ, నాలుగు రకాల ఆశ్రమాలూ, వాటి సర్వకర్మలూ, స్వర్గ మోక్షాలూ అన్నీ నా మాయలే అని తెలుసుకో. యజ్ఞపరులు నన్నే స్తుతించి ఫలం పొందారు. పాపాత్ములు నన్ను స్తోత్రం చేయడం వల్లే ప్రాయశ్చిత్తం చేసుకుని పుణ్యాత్ములవుతారు. ధర్మదేవత నా పెద్దకొడుకని తెలుసుకో. జగద్రక్షణకోసం ఆయా సమయాల్లో ఆయా జన్మలెత్తుతూ వుంటాన్నేను. బ్రహ్మ, విష్ణు మహేశ్వరులై నేనే సృష్టి, స్థితి, సంహారాలు సాగిస్తూ వుంటాను. ధర్మానికి హాని కలిగినప్పుడు అధార్మికుల్ని హతమారుస్తాను; ధార్మికుల్ని రక్షిస్తాను. తగిన కర్మలతో జగత్తుకి మేలుచేస్తాను. ఇలాంటి వాణ్ణయి వుండిన్నీ, అధర్మపరులైన కౌరవులను, ధర్మపరులైన పాండవులతో కలపడానికి ఎన్నో పాట్లు పడ్డాను. నా ప్రయత్నం దివ్యజ్ఞానచిత్తులైన వ్యాసుడూ మొదలైన మునీశ్వర్లకి నచ్చింది. దుర్మార్గులైన కౌరవులు మహాత్ములైన పాండవుల నెదిరించారు; ధర్మయుద్ధంలో మరణించారు. ఇదీ నేను చేసిన పని. నన్ను ఏమంటావో అను ఇప్పుడు."

"కృష్ణా," వినయంగా అన్నాడు ఉదంకుడు, "అనుగ్రహించి నువ్వు ఇప్పుడు వివరించిన నీ మహిమ నేను ఎరుగుదును. నా మనస్సు కప్పిన ఈ దురాగ్రహం నీ ప్రసాదమే. అమృతంవంటి మాటలతో అదంతా పోగొట్టావు. దేవా, సాటిలేని నీ దయకు నేను పాత్రుణ్ణే అయితే నీ అసమానమైన ఆకారం కనపరుచు. కన్నులపండువుగా, హృదయానందంగా దర్శిస్తాను.

దయాళువైన శ్రీకృష్ణుడు ఉదంకమునిని అనుగ్రహించాడు. భారతయుద్ధారంభములో అర్జునుడికి కనపరిచిన విశ్వరూపం అతడికి కనపరిచాడు. చూశాడు ఉదంకుడు. ఆనందం ఆశ్చర్యం, భయం ముప్పిరి అయిన మనస్సుతో రెండుచేతులూ జోడించి, నుదుట చేర్చాడు. "నమఃపురుషోత్తమాయ తే" అంటూ నివ్వెరపాటుతో నిశ్చలమైన శరీరంతో నిలిచి గద్గద స్వరంతో స్తోత్రం చేశాడు:

"'పుండరీకాక్షా, ఈభూమండలమంతా లెక్కలేని నీపాదాలు ఆక్రమించాయి. ఆకాశమంతా ఉజ్జ్వలమైన నీశిరస్సులు ఆక్రమించాయి. అంతరిక్షమంతా అద్భుతమైన నీకడుపులు ఆక్రమించాయి. దిక్కులు యావత్తూ. కెరటాలవంటి నీబాహువులు ఆక్రమించాయి. ఎన్నో పాదాలతో, ఎన్నో శిరస్సులతో, ఎన్నో కడుపులతో, ఎన్నో చేతులతో వున్నావు నువ్వు. దేవా, సర్వమూ నువ్వే అయి అవుపడుతున్నావు. చూసి, నాకళ్ళూ, నాహృదయమూ తనివిచెందాయి. విశ్వరూపా, ఈరూపం ఉపసంహరించు ప్రభూ! నీఎప్పటిరూపంతో దర్శనమియ్యి" అన్నాడు వినయంగా.

"ఉదంకా," చల్లనికంఠంతో అన్నాడు శ్రీకృష్ణుడు, "వరం కోరుకో, ఇస్తాను."

"ప్రభూ, ఆశ్రయించిన వారి ఆర్తి హరిస్తావు నువ్వు. నీమూర్తి

దర్శనం చేశాను. ఇంతకంటే నాకుకావలసిన వరమేముంది?" అన్నాడు ఉదంకుడు.

"అలా కాదు. నాదర్శనం వూరికే పోదు. అడుగు, నీకేది ప్రియమే అడుగు, సంతోషంగా ఇస్తాను" అన్నాడు మళ్ళీ శ్రీకృష్ణుడు.

"దేవా," కృష్ణుడలా అనడంతోనే అన్నాడు ఉదంకముని, "నేను తప్పకండా కోరాలి అనే నీ అభిమతమైతే వొకటి అనుగ్రహించు. ఇది మరుదేశం. (ఎడారి). ఇక్కడ నీళ్ళు దుర్లభంగా వుంటాయి. కనక ఎప్పుడూ నాకు నీళ్ళు లభించినట్టు వరం ప్రసాదించు."

ఉదంకుడు అలా వరమడిగాక విశ్వరూపం ఉపసంహారించాడు. శ్రీకృష్ణుడు. తన ఎప్పటి రూపం ధరించాడు. "ఉదంకా, నన్ను ఎప్పుడు తలుచుకుంటే అప్పుడు నీరులభిస్తుంది" అని వరమిచ్చాడు. అనంతరం వెళ్ళి వస్తాను" అని చెప్పి అక్కణ్ణుంచి ద్వారకాభిముఖంగా వెళ్ళిపోయాడు.

అలా అక్కడ వుంటూ ఉదంకుడు వోనాడు దాహం హెచ్చి శ్రీకృష్ణుణ్ణి తలుచుకున్నాడు. ఉత్తరక్షణంలో వొక చండాలుడు అక్కడికి వచ్చాడు. దిగంబరుడుగా వున్నాడతడు. విల్లూ అమ్ములూ అతడి చేతిలో వున్నాయి, శరీరం మురికోడుతూవుంది. అతడి చుట్టూ కుక్కలున్నాయి. అతడి వొంటినించి స్వచ్ఛమైన నీరు కారుతూ వుంది. తనను చూసి వింతపడుతున్న ఉదంకుడితో ఇలా అన్నాడతడు :

"ఓ ఉందకా, ఇదిగో నావొంటినించి కారుతున్న నీరు తాగు. దప్పితీర్చుకో."

"వద్దు. ఈనీరు నేను వొల్లను" అన్నాడు ఉదంకుడు.

"అదేం!" అన్నాడు చండాలుడు, "నీటికోసం నువ్వు శ్రమపడుతున్నావు. నీమీాద కనికరించి వచ్చాను. వద్దనకు. తాగు."

చండాలుడలా అనడంతోనే కస్సుమన్నాడు ఉదంకుడు. "ఫో, ఫో" అంటూ అదలించాడు. ఉదంకుడు అదలించడంతోనే కుక్కలతో కూడా మాయమైపోయాడు వున్నపాళాన చండాలుడు.

భయపడ్డాడు ఉదంకుడు. ఆలోచించాడు. "ఈ కపట ప్రచారం శ్రీకృష్ణుడు చేసిందే" అని భావించాడు. ఇంతలో శ్రీకృష్ణుడూ అక్కడ ప్రత్యక్షమయ్యాడూ.

"కృష్ణా," కృష్ణుణ్ణి చూసీచూడడంతోనే అన్నాడు ఉదంకుడు, "నిన్ను తలుచుకుంటే ఇలాంటి నీరా లభించడం? చండాలుడి వొంటినించి కారే నీరా నేను తాగుతాను, ఎంత దాహం దహించుకుపోయినా? ఇలా కుచ్చితమైన వరమూ అనుగ్రహిస్తావు?"

"అయ్యో, నా ప్రయత్నమంతా వ్యర్థమైపోయింది" అన్నాడు శ్రీకృష్ణుడు, "నువ్వు తెలుసుకోలేక పోయావు జరిగింది. విను, నీకోసమని దేవేంద్రుణ్ణి ప్రార్థించాను అమృతరసం ప్రసాదించమని. ఇతర్లకి సాధ్యంకానిది నీకు లభించవలిసింది, తప్పిపోయింది. నేను నీ కోసం అమృతం అడిగాను. 'మనుషులకి చావులేకండా ఎలా? అంచేత మరేదన్నా కోరు' అన్నాడు దేవేంద్రుడు. 'నిన్ను ప్రార్థించాను. అది వ్యర్థం కాకూడదు. ఎలా అయినా నా మాట చెల్లించాలి. ఉదంకమునికి అమృతం ప్రసాదించాలి' అని పట్టు పట్టాన్నేను. 'అయితే వొక షరతుమీద అంగీకరిస్తాను' అన్నాడు దేవేంద్రుడు, 'చండాల రూపంతో వెళతాను. అమృతం ఇవ్వబోతాను. అతడు అంగీకరించకపోతే నా తప్పేమీ లేదు. దీనికి నువ్వే సాక్షి. అదుగో అలాగే వచ్చాడు నీ దగ్గిరికి దేవేంద్రుడు మాలరూపంతో. నువ్వు వొల్లనన్నావు. అంతర్ధానుడై పోయాడు. కానీ, అయిందేదో అయింది. దానికేం చేస్తాం? నేను నీకు ఇచ్చిన వరం వ్యర్థం కాకండా ఎప్పుడూ నీకు నీరు ప్రసాదిస్తాను. నీకు నీరు కావలసివచ్చినప్పడల్లా ఈ ఎడారిలో

మేఘాలు కురుస్తూ వుంటాయి. నీ కీర్తి శాశ్వతంగా వుండడం కోసం ఆ మేఘాలు "ఉదంక మేఘాలు' అనిపించుకుంటాయి. మునీంద్రా, ఇక నన్ను నిందించకు; వెళ్ళి వస్తాను."

ఉదంకుడు ప్రీతుడయాడు. శ్రీకృష్ణుడు అంతర్ధానమయాడు. అవాళనుంచి పుణ్యాతిథుల్లో నాకొక్కప్పుడు ఆ ఎడారి ప్రదేశంలో ఉదంక మేఘాలు కురుస్తూ వుంటాయి

వైశంపాయనుడు చెప్పిన ఉదంకుడి ఉదంతం విని, "అయితే మునీంద్రా, శ్రీకృష్ణుడంతవాణ్ణి శపించడానికి పూనుకున్నాడు కదా ఉదంకుడు! అతడికి అంతటి మహానుభావం ఎలావచ్చిందట?" అని అడిగాడు జనమేజయుడు.

వైశంపాయనుడు ఇలా అందుకున్నాడు:

గురుభక్తివల్ల అంతటి మహానుభావుడయాడు ఉదంకుడు. అతడి చరిత్ర చెపుతాను, విను.

## ఉ ద ం కు డి క థ

ఉదంకుడి గురువు గౌతముడు. భక్తితో గురుశుశ్రూష చేస్తూ వుండేవాడు ఉదంకుడు. అలా ఎంతో కాలం గడిచింది. శిష్యులందరికీ వరాలిచ్చి సాగనంపాడు గౌతముడు. కాని ఉదంకుడి వూసే ఎత్తకండా వూరుకున్నాడు. ఉదంకుడు ఎంతో నిష్ఠతో గురువు పరిచర్య చేస్తూ వుండేవాడు. ఒకనాడు బాగా బరువైన కర్రలమోపు నడుము వొంగిపోయినట్టు మోసుకువచ్చాడు అడివినించి. తెచ్చి ఆశ్రమం వాకిట కింద వేశాడు. ఆ కర్రల మోపుకి తన తల జడ వొకటి తగులుకుని మోపుతో కింద పడింది తెగి. అది ముసిలితనంవల్ల తెల్లబడి వుంది. దాన్ని చూశాడు ఉదంకుడు. "అయ్యో, ముసిలాణ్ణి అయిపోయాను. కదా," అని ఏడవడం మొదలెట్టాడు. అతడి కన్నీరు కిందపడకండా

దోసిలి పట్టమని తన కుమార్తెని నియోగించాడు గౌతముడు. చప్పున వచ్చి దోసిలి పట్టిందామె. ఉదంకుడి కన్నీరు దోసిలిలో పడడంతోనే ఆమె చేతులు కాలాయి. దాంతో ఆమె ఆపుకోలేక ఆ కన్నీరు నేలమీద విడిచిపెట్టింది. నేల కుతకుతలాడిపోయింది. గౌతముడు ఉదంకుణ్ణి చేరబిలిచాడు. "ఎందుకు నాయనా, దుఃఖపడుతున్నావు ?" అని అడిగాడు.

"గురుదేవా," బరువుగా అన్నాడు ఉదంకుడు, "శిష్యులందరిమీదా మీకు దయకలిగింది. ఇంతకాలమైనా నామీద కలగకండా పోయింది. ఈ స్థితిలో దుఃఖం కలగకండా ఎలావుంటుంది ?"

"ఉదంకా," కృప చిగురించిన చిత్తంతో అన్నాడు గౌతముడు, "నవయౌవనం ప్రసాదిస్తున్నానోయి నీకు. అంతేకాదు, నా కుమార్తెని నీకిచ్చి పెళ్ళిచేస్తున్నాను. సంతోషంగా ఈమెని పెళ్ళిచేసుకో. తపోధనుడివి నువ్వు. నీ తేజస్సు ఈమె తప్ప ఇంకెవ్వరూ సహించలేరు. ఇది మనస్సులో తెలుసుకునే ఈ నిశ్చయం చేశాను. నీకు తగినట్టు ఈమెకి తనువు కూడా మారుస్తున్నాను అనుమానించకు. ఈమెని పరిగ్రహించు. యౌవనవంతుడివై ఈమెతో వాక ఇంటివాడివికా. అధర్మం కాకండా వరమున్నూ ఇస్తున్నాను."

అన్నప్రకారం కుమార్తె శరీరం అందంగా లేత పూలతీగెలాగ మార్చాడు గౌతమముని. ఉదంకుడి ముసిలితనం మాయమైంది. నవయౌవనంతో కలకల్లాడా డతడు. గౌతముడి కూతుర్ని ప్రేమతో పెళ్ళిచేసుకున్నాడు.

గురువుగారికి నమస్కరించాడు ఉదంకుడు. "ఆజ్ఞాపించండి. మీరు ఏ పని మనసులో భావించి నాకు నియోగించినా అది నేను నిర్వహిస్తాను. ఏది తెమ్మంటే అది పట్టుకువస్తాను. మీ దయవల్లే నాకు ఆ శక్తి కలుగుతుంది" అన్నాడు వినయంగా.

"దక్షిణలవల్ల ఇతర్లకి ప్రీతి కలుగుతుంది. కాని ఉదంకా, నీ నడవడివల్లే ప్రీతి కలుగుతుంది నాకు. కనక వేరే దక్షిణలెందుకూ ?" అన్నాడు గౌతముడు.

అంతమాత్రంతో ఆగిపోలేదు ఉదంకుడు. "అమ్మా," గురుపత్నికి నమస్కరించి అన్నాడతడు, "మీరు ఆజ్ఞాపించండి. మీకేం కావాలో చెప్పండి. తప్పకండా తెచ్చిస్తాను."

"తమ్ముడూ," ఉదంకుడి మాటలు విని అంది గౌతముడి భార్య అహల్య, "పరాయివాడివా నువ్వు! వద్దువద్దు. నీ గుణంవల్ల సంతోషించాడు నీ గురుదేవుడు. ఆయన అన్నమాటలు మనస్సుకి పట్టించుకో, చాలు."

అయినా వినుకోలేదు ఉదంకుడు. మళ్ళీ మళ్ళీ నొక్కి చెప్పాడు. అప్పుడు ప్రియంగా అంది అహల్య, "అయితే మిత్రసహుడి రాణి కుండలాలు తెచ్చిపెట్టు."

గురుపత్ని ఆదేశం విని సంతోషించాడు ఉదంకుడు. కుండలాలు తేడానికి బయలుదేరి వెళ్ళాడు.

ఉదంకుడు కనపడకపోడంతోనే "ఉదంకుడు కనపడడేమీ? ఎక్కడున్నాడు?" అని అడిగాడు గౌతమముని. జరిగిందంతా చెప్పింది అహల్య.

"దేవీ," దయార్ద్రహృదయంతో అహల్య మొహం చూస్తూ అన్నాడు గౌతముడు, "ఆసౌదాసరాజు (మిత్రసహుడు) రాక్షసవృత్తి కలవాడు. శాపంవల్ల అలా అయాడు. మనిషిమాంసం తింటాడు ఆసక్తిగా. ఈ విషయం మన ఉదంకుడు ఎరగడు. అయ్యో, ఏమవుతుందో కదా?"

భర్త అలా చెప్పడంతోనే భయపడింది అహల్య. అయ్యో ఏంచారి? తెలియక ఈపని చెప్పాన్నేను. నన్ను అనుగ్రహించండి.

ఉదంకుడికి ఏ ఆపదా రాకండా కరుణించండి" అంటూ భర్తని ప్రార్థించింది.

"అంత భయమెందుకూ?" భార్యని ఓదారుస్తూ అన్నాడు గౌతముడు, "అతడిమీద ఈగన్నా వాలనిస్తానా నేను?"

ఉదంకుడు తిన్నగా వెళ్ళాడు. శూన్యమైన ఒక అడివిలో మిత్రసహుణ్ణి చూశాడు.

ఒంటినిండా మసిమిరక్తం పూసుకున్నాడు మిత్రసహుడు. కోరమీసాలు మెలిపెట్టాడు. అంతలేసి గుడ్లు అటూ ఇటూ తిప్పుతున్నాడు. ఉగ్రరూపంతో వున్నాడు. ఉదయంకుణ్ణి చూడడమే తడువు, "ఆహా, ఆకలితో నకనకలాడిపోతున్నాను. తగిన భోజనం ఎక్కడ ఎలా దొరుకుతుందా అనుకుంటున్నాను. సరిగ్గా తగిన వేళకి దిగబడ్డావు. మా బాగుంది" అన్నాడు.

"రాజా," జంకూ గొంకూ లేకండా అన్నాడు ఉదంకుడు, "గురువుగారి పనిమీద నీ దగ్గిరికి వచ్చాను. గురువు పనిమీద వున్నవారిని హింసించకూడదు. ఇది తెలియకండా అధర్మం పలకవచ్చా నువ్వు?"

"అదేమన్నమాట?" అన్నాడు మిత్రసహుడు, "దినంలో మూడోజామున అపరార్థం ఆహారానికి యోగ్యమని నాకు కల్పించారు దేవతలు. కనక వొదిలిపెట్టను, ఆకలి తీర్చుకుంటాను."

"అలాఅయితే రాజా, నా గురువుగారి పని ముందు నెరవేర్చి తిరిగివస్తాను, తప్పకండా. నా మాట అబద్ధం కాదు. ఎవరు ఏది కోరితే వారికి అది ఇస్తావు నువ్వు. తగినవాణ్ణి నేను. గురువుకోసంగా నేను కోరిన కోరిక తీరుస్తావన్న నమ్మకంతో వచ్చాను" అన్నాడు ఉదంకుడు.

"అయితే సరే, ఏమిటికావాలని వచ్చావు?" అని అడిగాడు మిత్రసహుడు.

"నీ రాణి ప్రియంగా ధరిస్తున్న కుండలాలు కోరి వచ్చాను" అన్నాడు ఉదంకుడు.

"ఇతర్ల ధనం ఇచ్చేవాళ్ళెవరుంటారయ్యా మునీ? కుండలాలు కాక ఇంకేమైనా అడుగు, ఇస్తాను" అన్నాడు రాజు.

"నెపం పెట్టి తోసిపుచ్చేవాడివి కావు నువ్వు. నాకు తెలుసు. కుండలాలు తప్ప ఇంకో ఏదీ వొద్దు నాకు" అన్నాడు ఉదంకుడు.

"అయితే నా రాణి మదయంతి దగ్గిరికి వెళ్ళు. నేను చెప్పానని చెప్పి అడుగు" అన్నాడు రాజు.

"ఆమె ఎక్కడుంది?" అని అడిగాడు ఉదంకుడు.

"అదిగో అదే ఆమె వున్న చోటు" అని మదయంతి వున్న చోటు" చూపించాడు రాజు.

తిన్నగా మదయంతి దగ్గిరికి వెళ్ళాడు ఉదంకుడు. రాజు చెప్పినట్టు చెప్పి కుండలాలు కోరాడు.

"రాజు దగ్గిరనుంచి ఆనవాలు తీసుకురా" అంది మదయంతి. ఉదంకుడు తిరికి రాజు దగ్గిరికి వచ్చాడు. ఆనవాలు ఇమ్మన్నాడు.

"'ఈ గతి మేలని నిశ్చయించలేం. ఇదికాక వేరే గతిలేదు. ఈ మాటలే ఆనవాలు. ఈ ఆనవాలు చెప్పి కుండలాలు పుచ్చుకో" అన్నాడు మిత్రసహుడు.

ఆ ప్రకారం మదయంతి దగ్గిరికి వెళ్ళి ఆనవాలు చెప్పాడు ఉదంకుడు.

"గురువు మేలుకోరేవాడివి నువ్వు" అంది మదయంతి, "నా భర్త ఆదేశం ప్రకారం కుండలాలు నీకు ఇస్తాను. అయితే దేవతలూ, గంధర్వులూ ఈ కుండలాల కోసం ఎన్నో ఉపాయాలు వెదు

కుతూ తిరుగుతున్నారు అపహరించాలని. ఎంగిలి తగిలినా, మైమరిచి నువ్వు నిద్రపోయినా, నేలమీద పెట్టినా అపహరిస్తారు. భక్తితో అర్చించి ఇవి ధరిస్తే ఆకలిదప్పులుండవు. అగ్ని భయముండదు. విష వికారముండదు. భూతభేతాళ బాధలుండవు. చిన్నపిల్లలే కానీ, పెద్దవాళ్ళే కానీ - ఎవరు పెట్టుకుంటే వారికి సరిపోయినట్టుంటాయివి. పైగా రోజూ బంగారం కురుస్తాయి. అంచేత అప్రమత్తుడివై తీసుకు వెళ్ళు వీటిని. గురువు మెచ్చుకునటాడు."

'ఇలా చెప్పవలిసిన మాటలు చెప్పి, పరమ పతివ్రత అయిన మదయంతి భక్తిప్రీతి వినయాలతో ఉదయకుడికి కుండలాలిచ్చింది. సంతోషించాడు ఉదంకుడు. ఆమెని ఆశీర్వదించాడు. ఆమె అనుమతి పుచ్చుకున్నాడు. వికసించిన మొహంతో మిత్రసహుడి దగ్గిరికి వచ్చాడు. రాణి కుండలాలిచ్చిందని చెప్పాడు. అతణ్ణి ఆశీర్వదించాడు. "రాజా, నీ వల్ల కృతార్థుణ్ణయాన్నేను. అయితే నాకు ఆనవాలుగా నువ్వు చెప్పినమాటల అర్థం ఎంతో గూఢంగా వుంది. ఆ మాటల అభిప్రాయ మేమిటో తెలుసుకోవాలనుంది నాకు. చెప్పతగిందయితే చెప్పు" అని అడిగాడు.

"మునీంద్రా," ఉదంకుడు అడిగిన దానికి జవాబు చెపుతూ అన్నాడు మిత్రసహుడు, "బ్రాహ్మల్ని రాజులు పూజిస్తారు. కనక నేను బ్రాహ్మల్ని పూజిస్తాను. కాని బ్రాహ్మడివల్లే నేను ఇలా అయాను పెద్దతప్పు చేసి. ఈ పాపం పోడానికి మరో మార్గం కన పడదు. అది కారణంగా 'బ్రాహ్మణపూజ దుష్కరం. దీనివల్ల మేలు కలుగుతుందని నిశ్చయించి చెప్పలేం. ఇది కాదంటే మరోగతి లేదు' అని ఆనవాలు చెప్పి మదయంతి దగ్గిరికి పంపాను. విశిష్టమైన మహా రత్నకుండాలాలివి. ఇవి ఇచ్చి నీ వల్ల కీడు మాపుకోగలనని నా అభిలాష."

భృగువంశవరేణ్యుడైన ఉదంకుడి సాన్నిధ్యం వల్ల మిత్రసహ మహారాజుకి కార్యజ్ఞానమూ, కుండలాలు దానం చెయ్యడంలో శ్రద్ధా, శాంతంగా మాట్లాడడమూ కలిగాయి. అతను అన్నమాటలు విన్నాక, "మహారాజా, 'మాట్లాడడంవల్ల స్నేహం కలుస్తుంది' అంటారు తెలిసిన వృద్ధులు. నేను నీ వల్ల కృతార్థుణ్ణయాను. వెళ్ళు తున్నాను. తిరిగివస్తానని చెప్పాను. మాట బొంకు కాకుండా వస్తాను" అన్నాడు ఉదంకుడు.

ఉదంకుడు అలా అనడంతోనే మనస్సులో జాలిపడుతూ అతడి మొహం మీద చూపులు నిలపి, "చంపేవాడిదగ్గిరికి వస్తారా ఎవ రైనా మునీంద్రా? నీ గొప్పతనం, నీ నిజాయితీ తెలిసింది. సంతో షించాను. నా అవస్థ నీ తపోబలంతో తొలిగించు" అని ప్రార్థించాడు. మిత్రసహుడు.

చెవులకు ఇంపైన అతడి మాటలు విని ప్రసన్నుడయాడు ఉదంకుడు. "రాజా, దేనివల్లా మళ్ళనిదైనా ఉత్తముల సంసర్గంవల్ల మళ్ళుతుంది. నీ గుణం నిన్ను పాపమంటకండా చేసింది. గౌతమ మహాముని చల్లని చిత్తవృత్తి నీ మీద ప్రసరించింది కాబోలు, ఉన్నతి పొందు" అంటూ అనేక విధాల దీవించాడు. అతడి శరీరం చేతులతో నిమిరాడు ప్రేమగా.

పాపం వొదిలి మిత్రసహుడు భక్తి వినయాలతో ఉదంక మునిని స్తుతించాడు. గౌరవంతో సాగనంపాడు.

కుండలాలు కృష్ణాజినంలో ముడివేసుకుని గౌతమాశ్రమానికి త్వరత్వరగా పయనమయాడు ఉదంకుడు. వెళుతూ వెళుతూ దారిలో ఆరముగ్గిన మారేడుపళ్ళు చూశాడు. ఆకలిగా వుంది. అంచేత కుండ లాలతో కృష్ణాజినం మారేడు చెట్టుకొమ్మకి తగిలించి, చెట్టుమీది కెక్కి పళ్ళుకోయడం మొదలెట్టాడు. ఇంతలో గాలివీచింది. కొమ్మని

వేలాడుతున్న కృష్ణాజినం నేలమీద పడింది. కింద పడిందో లేదో వొక నాగు చట్రుమని వచ్చి కుండలాలు పుచ్చుకుని గాలిలా పరిగెత్తింది. చూశాడు ఉదంకుడు. చెట్టుమీంచి దిగదాటి నాగు వెంట పడ్డాడు. ఒక పెద్ద పుట్టలో దూరిపోయింది నాగు. వాడైన కర్ర పుచ్చుకుని పుట్ట తవ్వడమారంభించాడు ఉదంకుడు. ఆ కర్రపోట్లు సహించలేక భూమి వణికింది. బ్రాహ్మణవేషంలో దేవేంద్రుడు ప్రత్యక్షమయాడక్కడ. "మునీంద్రా, కర్రతో తవ్వి పాతాళానికి వెళ్ళగలవయ్యా? నీ కుండలాలు పట్టుకుపోయిన పాము ఐరావత సంతానం. పాతాళలోకం ఇక్కడికి వెయ్యి యోజనాలుంది" అన్నాడు.

"పాతాళంలో వున్నా కుండలాలు తెస్తాను" అన్నాడు ఉదంకుడు, "తేలేకపోయానో, ఈ ప్రాణాలు వొదిలిపెడతాను. ఇది ధ్రువమైన మాట."

అతడి దృఢసంకల్పం విని మరి మాటలతో ప్రయోజనం లేదనుకున్నాడు దేవేంద్రుడు. అతడు తవ్వుతున్న కర్రకి వజ్రాయుధాని కున్న వాడీ, బలమూ ఇచ్చి, తన బాంధవ్యం చెప్పి వెళ్ళిపోయాడు. భయంతో దారిచ్చింది భూమి. తిన్నగా నాగలోకం ప్రవేశించాడు ఉదంకుడు.

ఎన్నో రకాల రత్నాలతో వుంది నాగలోకం. ఎన్నో రత్నాలతో దేదీప్యమానంగా వుంది. దాని ద్వారం పది యోజనాల పొడ వుంది. అయిదు యోజనాల వెడల్పుంది. అదంతా చూశాడు ఉదంకుడు. కుండలాలు సంపాదించడం దుర్లభమైన పని అని తెల్లపోయాడు. ఇంతలో అక్కడ ఎర్రటి మొహమూ, నల్లటి శరీరమూ, తెల్లటితోకా కలిగి ప్రకాశిస్తున్న వొక గుర్రం కనపడి అతడితో అంది:

"నా అపానద్వారం కొంచెం వూదు. అసహ్యించుకోకు.

లోకవంద్యుడైన గౌతమముని ఆశ్రమంలో నన్ను ఉపాసించావు. నాకు సంతోషం కలిగించావు. కనక నీకు దర్శనమిచ్చాను. ఐరావతం కొడుకు ఎత్తుకుపోయిన కుండలాలు తిరిగీ నువ్వు సంపాదించే ఉపాయం ఉపదేశించాను."

"నేను నిన్ను ఎరగను. ఉపాసించడమెలా జరిగిందది?" అన్నాడు ఉదంకుడు.

"నీ గురువుగారి గురువున్నేను. అగ్నిహోత్రుణ్ణి. శుచివై నిత్యమూ నన్ను పూజించావు నువ్వు. ఇప్పుడు తెలిసిందా?" అంది గుర్రం.

సంతోషించాడు ఉదంకుడు. గుర్రం ఉపదేశించిన ప్రకారం దాని అపాన ద్వారంలో వూదాడు అసహ్యించుకోకండా. దాంతో గుర్రం రోమకూపాల్లోంచి దట్టంగా పొగలు బయలుదేరాయి. పాతాళలోకమంతా కప్పేశాయి. వాసుకి మొదలైన నాగరాజుల నివాస మందిరాలు వుక్కిరిబిక్కిరిగా కమ్ముకున్నాయి పొగలు. ఐరావత నాగు మందిరంలో హాహాకారాలు పుట్టాయి. ఆ దారుణమైన పెనుపొగ చూసి నాగలోకమంతా హడిలిపోయింది. నాగులన్నీ ఉదంకుడి దగ్గిరికి పరిగెత్తుకు వచ్చాయి. భక్తిపూర్వకంగా అతణ్ణి పూజించాయి. "నీకార్య మేమిటో సెలవియ్యి" అంటూ వినయంగా అడిగాయి. తెలుసుకుని చప్పున కుండలాలు సమర్పించాయి.

నాగులందరికీ సెలవిచ్చి, అగ్నిదేవుడికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించాడు ఉదంకుడు. పాతాళంనించి త్వరగా భూలోకం వచ్చాడు. అహల్యని చూశాడు. "ఇదిగో కుండలాలు తెచ్చాను" అంటూ ఆమె చేతులలో పెట్టాడు. నేలమీద సాగిలబడ్డాడు. ఆదరంగా అతణ్ణి గుచ్చి కౌగిలించుకుంది అహల్య. ప్రేమతో దీవించింది. గౌతమ మునికీ, అహల్యకీ ఎన్నోమారులు మొక్కి నిలబడ్డాడు ఉదంకుడు.

"మీ కరుణవల్ల కాక ఈ కుండలాలు నా తరమా తీసుకు రావడం! నమమ కలిగిన అడ్డంకి నిజంగా మీఅనుగ్రహం వల్లే నిగ్రహించాను" అంటూ వినయంగా చేతులు జోడించాడు.

ఎంతో సంతోషించారు గురుదంపతులు. "నాయనా," గౌతమముని అన్నాడు, "మహనీయమైందోయి నీ చరిత్ర. చిత్రమైంది. మిత్రసహ మహారాజు పాపం పోగొట్టావు. నాగుల్ని జయించావు. కుండలాలు పట్టుకువచ్చావు. నీ చతురత్వమూ, నీ బలిమీ, నీ ధృఢ నిశ్చయమూ నీకే తగింది. నీ ధర్మనిష్ఠ ఇంకొకడికి సాధ్యం కాదు. నిజం చెపుతున్నాను."

ఉదంకుడు తన మహా తపోబలం వల్ల అలా పరాక్రమించి, ఇతరులెవ్వరికీ సాధ్యంకాని కుండలాలు పట్టుకు వచ్చాడు. గురుజనుల మనోరథ సిద్ధిచేశాడు. అతడి మహానుభావం అలాటిది.*

వైశంపాయనుడు చెప్పిన ఉదంకుడి కథ విని సంతోషించాడు జనమేజయుడు. "మునీంద్రా, ఉదంకుడికి వరమిచ్చి వెళ్ళిన శ్రీకృష్ణుడి తరవాత వృత్తాంతం వినిపించు" అని అడిగాడు.

## ద్వారకలో

వైశంపాయనుడు ఇలా అందుకున్నాడు:

ఉదంకుడికి వరమిచ్చి తన ద్వారకాపురం చేరాడు శ్రీకృష్ణుడు. అందంగా అలంకరించి వుంది ద్వారకాపట్నం. రైవతకాద్రి యాత్రామహోత్సవంలో వున్నారు ప్రజలు. శ్రీకృష్ణుణ్ణి చూడడంతోనే వారి ఉత్సాహం రెండింతలయింది. వారి ఆనందానికి అంతం లేకపోయింది.

దేవకీ వసుదేవుల్ని చూసి ప్రణామం చేశాడు శ్రీకృష్ణుడు. అన్న బలరాముడికి నమస్కరించాడు. తక్కిన వృద్ధ బాంధవుల్ని

* చూ. ఉదంకుడి చరిత్ర, ఆదిపర్వం.

చూసి వందనాలు చేశాడు. ఎవరికి తగినట్టు వారిని గౌరవించాడు ప్రియంగా. అందరికీ ధర్మరాజు చెప్పిన నమస్కారాది వాక్యాలు విని పించాడు. తమ్ముళ్ళనీ, కుమారుళ్ళనీ, మంత్రులనీ వాత్సల్యంతో ఆద రించాడు, వారు చేసిన నమస్కారాలందుకుంటూ. సాత్యకినీ, సుభ ద్రనీ తగినవారి దర్శనం చేయించాడు. యావన్మందినీ ఆనందపరి చాడు.

కుమారుణ్ణి దగ్గిర కూచోపెట్టుకున్నాడు వసుదేవుడు. "నాయనా, వచ్చీపోయే వాళ్ళనోట భారతయుద్ధం విన్నాం. వివరంగా వినాలనుంది నాకు. నీ నోటితో వినిపించు" అన్నాడు.

"మహాభారత యుద్ధకథంతా వివరంగా చెప్పాలంటే ఎన్నో దినాలు పడుతుంది. అందులో ప్రధాన వీరపురుషుల యుద్ధం టూకీగా చెపుతాను, విను" అంటూ ఇలా ఎత్తుకున్నాడు శ్రీకృష్ణుడు.

"కౌరవుల సేన పదకొండు అక్షౌహిణీలు. దానికి భీష్ముడు సేనాధి పతి. పాండవుల సేన ఏడు అక్షౌహిణీలు. భీష్ముడి మీదికి శిఖండిని ఎదురొడ్డారు పాండవులు. ఉభయసేనలూ ఆకాశం మీది దేవతలు ఆశ్చర్యపోయినట్టు పోరాడాయి హోరాహోరిగా. అర్జునుడు తోడ్ప డగా భీష్ముణ్ణి శిఖండి పదోనాడు పడగొట్టాడు. ఉత్తరాయనం వచ్చేదాకా మృతిపొందకుండా అంపశయ్యమీద వున్నాడు భీష్ముడు. అద్భుతం అది. ద్రోణుడు అయిదు దినాలు నిబ్బరంగా యుద్ధం చేశాడు. అర్జునుడి ప్రాపుతో అతణ్ణి ధృష్టద్యుమ్నుడు ఎదిరించాడు. కర్ణుడు రెండు దినాలు యుద్ధం చేశాడు. గ్రీష్మకాలంలో ప్రవేశించే సూర్యుడిలా విజృంభించిన అర్జునుడి బాణాలతో తెగిపోయాడు. మర్నాడు శల్యుడు శౌర్యంతో యుద్ధం చేశాడు. సగం దినం గడిచే సరికి ధర్మరాజుచేత కూలిపోయాడు. శకునిని సహదేవుడు బలాలతో

కూడా పడగొట్టాడు. దుర్యోధనుడి తమ్ముళ్ళని భీముడు వరసపెట్టి చంపేశాడు. ఓడిపోయి, సిగ్గుమాలి, వొక్కడూ గదపట్టుకుని, కాలి నడకతో పారిపోయాడు దుర్యోధనుడు సేన వొదిలేసి. ఒక మడుగులో నీళ్ళు రాళ్ళుగా మార్చుకుని దాక్కున్నాడు. అది తెలుసుకున్నారు పాండవులు. మడుగు దగ్గిరికి వెళ్ళి ముట్టడించారు. మర్మ భేదమైన మాటలాడి నొప్పించారు. ఆ దూషణ వాక్యాలు సహించలేక పోయాడు దుర్యోధనుడు. మడుగునించి బైటికి వచ్చాడు. భీముడితో గదాయుద్ధం చేశాడు. గద తగిలి తొడలు విరిగి కూలిపోయాడు. ప్రాణాలు విడిచిపెట్టాడు. ఈ విధంగా గెలుపు సాధించారు పాండవులు. అశ్వత్థామ ఆ రాత్రి పాండవుల శిబిరంమీద విరుచుకుపడ్డాడు. ఏనుగులూ గుర్రాలూ కలిపి అంతమందినీ చంపేశాడు. ఏం చెప్పనూ ఆ ఘోరం! ఆ రాత్రి నేనూ పాండవులూ అక్కడ లేం. అందుకనే అంతపని జరిగిపోయింది. పద్ధెనిమిది దినాలు జరిగింది భారతయుద్ధం. ఈ యుద్ధంలో పాండవులు అయిదుగురూ, నేనూ - ఇలా ఆరుగురమూ, సాత్యకీ తప్ప అంతమందీ మా పక్షంలో అంతమైపోయారు. కౌరవపక్షంలో అశ్వత్థామా, కృపాచార్యులూ, కృతవర్మా - ఈ ముగ్గురు మాత్రం మిగిలారు. మిగతా యావన్మందీ హతమారి పోయారు. అన్నట్టు యుయుత్సుడు ముందే పాండవుల్ని ఆశ్రయించాడు. అతడు కూడా బతికిపోయాడు. ఇదీ భారత రణకథ సంగ్రహంగా.”

ఇన్నీ చెప్పాడు కాని, అభిమన్యుడు మరణించిన విషయం చెప్పలేదు కృష్ణుడు. వసుదేవుడికి ఎంతో దుఃఖం కలుగుతుందని ఈ మాట ఎత్తలేదు. అది గ్రహించింది సుభద్ర. కృష్ణుణ్ణే చూస్తూ గద్గదిక స్వరంతో అంది వసుదేవుడు విన్నట్టు, “అన్నా, నీ మేనల్లుడు అభిమన్యుడు హతమారి పోయాడని అయ్యకి వినిపించవేమీ

చెవులారా విన్నట్టు!" ఇలా అంటూనే మొదలునరికిన చెట్టులాగ కిందపడిపోయింది. అభిమన్యుడి మరణవార్త యాదవులందరినీ కొత్త దుఃఖంలో ముంచింది. వాళ్ళందరినీ వోదార్చాడు శ్రీకృష్ణుడు తగిన మాటలాడి. హస్తినాపురంలో సుభద్రా, ఉత్తరా అభిమన్యుడికోసం దుఃఖించడమూ, కుంతీదేవి తగిన వోదార్పు మాటలతో వారిని శాంతపరచడమూ, పాండవులు అయిదుగురూ విడివిడిగా అభిమన్యుడి కోసం బంగారమూ మొదలైనవి బ్రాహ్మలకి దానం చెయ్యడమూ, అతడిపేర చెరువులూ అవీ తవ్వించడమూ చెప్పాడు. అంతే కాదు, యుద్ధంలో వెన్ను చూపకండా విజృంభించి, రౌద్రమూర్తి అయి, దుర్యోధన, ద్రోణ, కృపాచార్య, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణాది వీరుల్ని కలంచి అభిమన్యుడు వొక్కడే పోరాడడమూ, ఎంతోమంది రాజుల్ని యమలోకానికి పంపడమూ వివరించాడు. "దేవతలు కోరా అన్నట్టు ఉత్తమ లోకానికి వెళ్ళి సుఖంగా వున్నాడతడు. అతడికోసం విచారించడమెందుకూ?" అన్నాడు.

ఇలా బంధులోకానికి తగినట్టు ప్రవర్తించి ద్వారకలో సుఖంగా నివసించాడు శ్రీకృష్ణుడు. ఇక్కడ హస్తినాపురంలో,

## అశ్వమేధ ప్రయత్నాలు

అభిమన్యుడి మరణం ప్రజలు చెప్పుకుని విచారిస్తూ చెప్పు కుంటూ వుండేవారు. ఆ మాటలు చెవులకి చురచుర మనిపించేవి పాండవులకి. ధైర్యం సడిలిపోయి, వలవలా ఏడుస్తూ వుండేది భర్తని తలుచుకుని ఉత్తర. ఆమె దుఃఖం చూసి గుండెలు తరుక్కుపోయేవి పాండవులకి. ఈ స్థితిలో దయామూర్తి వేదవ్యాసుడు అక్కడ ప్రత్యక్షమయాడు. తగిన మాటలు చెప్పి వారి విచారం మాన్పించాడు. అశ్వమేధానికి అవసరమైన విధులు వివరించి, వేగంగా యజ్ఞం

చెయ్యండని నియోగించాడు. అంతా దానికి సమ్మతించాక అంతర్హితు డయాడు.

## హిమాలయ యాత్ర

అనంతరం ధర్మరాజు తమ్ముళ్ళని నలుగురినీ పిలిచాడు. కళ్ళల్లో ఉత్సాహలక్ష్మి తాండవిస్తూవుండగా వారితో ఇలా ఎత్తుకున్నాడు :

"మనమీద వాత్సల్యంతో వేదవ్యాసుడు సెలవిచ్చిన మహనీయమైన మాటలు విన్నారుకదా! రాజ్యంలో ఇప్పుడు ధనంలేదు. అంచేత బ్రాహ్మలు దాచిపెట్టిన ధనం అవసరమైంది. అందుకోసం తగిన బందోబస్తుతో హిమాలయానికి వెళ్ళే విషయం ఆలోచించాలిప్పుడు" అన్నాడు.

"మహారాజా," ధర్మరాజు మాటవిని అందుకున్నాడు భీముడు, "మంచి ప్రస్తావన ఇది. శివుణ్ణి భక్తిపూర్వకంగా నిష్ఠతో పూజ చేద్దాం. ఆ దేవదేవుడి అనుగ్రహం పొందుదాం. ప్రమథుల్ని భక్తితో పూజిద్దాం. అక్కడ భూతబలులున్నా సమర్పిద్దాం. మరు త్తుడివ్వగా బ్రాహ్మలు నిధిగా దాచిపెట్టిన ఆ బంగారం పట్టుకువద్దాం. ఇక భూమి విషయం ఆలోచించవలసిన పనేముంది మనకి? ఈ పని కోసం తగిన సైన్యంతోసహా దేవరవారు దయచెయ్యాలి" అన్నాడు. అర్జునుడూ, నకుల సహదేవులూ భీముడి మాటే సమర్థించారు. తమ్ముల మాట విని సంతోషించాడు ధర్మరాజు. హిమాలయానికి బయలుదేరడానికి కృతనిశ్చయుడయాడు. ధృతరాష్ట్రుడి దగ్గిరికి వెళ్ళాడు. అప్పటికే అశ్వమేధ యజ్ఞ విషయం విని, తన కుమాళ్ళని తలుచుకుని శోకంతో వున్నాడు ధృతరాష్ట్రుడు. అతడి పాదాలకు నమస్కరించాడు వెళ్ళి ధర్మరాజు. గాంధారి వింటూ వుండగా, వేద వ్యాసుడు చెప్పినమాటలు వినిపించాడు. యజ్ఞం చెయ్యడానికి అతడి దగ్గిర అనుమతి తీసుకున్నాడు. దండప్రణామాలు చేసి ఆ వృద్ధ

దంపతులదగ్గిర సెలవు తీసుకున్నాడు. కుంతీదేవి దగ్గిరికి వెళ్ళాడు. సంతోషంతో కుమారుణ్ణి చేరదీసిందామె. యజ్ఞం విషయం విన్నవించాడు ధర్మరాజు. ఆమె అనుమతించాక ఆమె పాదాలకు ప్రణామం చేశాడు. ఆమె దగ్గిర సెలవు తీసుకున్నాడు. అక్కణ్ణుంచి ఆస్థానమండపానికి వచ్చాడు. యుయుత్సుణ్ణి రావించాడు. చెయ్యవలిసిన కార్యవిధానం వివరించాడు. "నువ్వు నగర రక్షకోసం నిలవాలి" అంటూ విదురుణ్ణి కూడా అతడితో జత చేశాడు. సేనలు సమకూర్చడానికి సేనాధిపతుల్ని నియోగించాడు. నియమంగా దేవపూజా, పితృపూజా నిర్వహించాడు. ఇంద్రపూజ పూర్తి చేశాడు. శ్రద్ధగా నానా విధాల దానాలు చేశాడు. అర్చన జరిగిన అగ్నినీ, దాని అధికారి అయిన ధౌమ్య పురోహితుణ్ణీ ప్రదక్షిణ పూర్వకంగా సేవించాడు. అనంతరం తెల్లటి లేపనాలు పూసుకున్నాడు. తెల్లటి భూషణాలు పెట్టుకున్నాడు. తెల్లటి పూలమాలలు వేసుకున్నాడు. తెల్లటి బట్టలు కట్టుకున్నాడు. తెల్ల గొడుగుతో పూర్ణచంద్రుడిలా ప్రకాశిస్తూ, పదహారు తెల్ల గుర్రాలు పూసిన రథమెక్కి కూచున్నాడు. బ్రాహ్మల ఆశీర్వాదాలూ, పుణ్యాగానాలూ, మంగళతూర్యనాదాలూ, పండితుల స్తోత్రాలూ భూమీ ఆకాశమూ ప్రతిధ్వనించాయి.

ధర్మరాజు తెల్ల గుర్రాల రథం కదిలింది. ఆయన అభిప్రాయం తెలుసుకుని భీముడూ, అర్జునుడూ, నకులసహదేవులూ గొప్పగా అలంకరించుకుని, సేనాధిపతులతోనూ, కాల్బలమూ గుర్రాలూ ఏనుగులూ రథాలూ - చతురంగ బలంతోనూ పయనమై వచ్చారు. మకరతోరణాలూ, వింజామరలూ, గొడుగులూ - వీటన్నిటితో ఎంతో వైభవంగా వున్నారు వారు. చూసి, చిరునవ్వుకళ్ళతో వారి మొహాలమీద చూపులు నిలిపాడు ధర్మరాజు. ఇంతలో సేవలతో సామంత రాజులున్నూ వచ్చి కలిశారు.

అలా వైభవంతో బయలుదేరాడు ధర్మరాజు. దారిలో మకాంలు చేస్తూ కొండలూ, నదులూ, అడవులూ దాటి హిమాలయ పర్వతం చేరాడు. ధౌమ్యుడూ మొదలైన పురోహితుల్ని ముందుంచుకుని పర్వత ప్రదేశం మీద వాక దగ్గిర తగినచోట విడిశాడు.

ఇంతలో వ్యాసముని అనుగ్రహించి అక్కడ ప్రత్యక్షమయాడు. అతని జటాజూటం బాలసూర్యకిరణాల్లా ప్రకాశిస్తోంది. నీటిమేఘంలా వుంది నిగనిగలాడుతూ శరీరం. చేతిలో యోగదండం కాంతులీనుతోంది. శరీరంమీద లేడితోలు మిలమిలలాడుతోంది. అతణ్ణి దర్శించడమే తడువుగా పరమభక్తితో ప్రణామాలు చేసి పూజించారు పాండవులు. "ఇప్పుడు మా కర్తవ్యమేమిటో సెల విియ్యి" అని ప్రార్థించారు.

"రేపు మీరు యావన్మందీ శివపూజ చెయ్యాలి. ఇవాళ రాత్రి నియమంతో వుండి దర్భశయ్యలమీద పడుకోవాలి" అంటూ ఆదేశించాడు వ్యాసముని.

ఆ ప్రకారం మంచిచోట దర్భలు పరుచుకుని అయిదుగురు పాండవులూ అయిదు అగ్నుల్లాగ నిష్ఠతో పడుకున్నారు ఆ రాత్రి. బ్రాహ్మల ఆశీర్వాదాలతో ఆ రాత్రి అలా గడిపారు వారు. తెలతెలవారకముందే లేచారు. కాల్యకృత్యాలు తీర్చుకున్నారు. సర్వక్రియా కలాప నిర్వహణధుర్యుడైన వేదవ్యాసముని నియోగించిన ప్రకారం శివపూజకి ఉపక్రమించారు. ధౌమ్యుడూ మొదలైన పురోహితులు చెప్పిన ప్రకారం గోమయం మొదలైన వాటితో శుద్ధి చేసి, దర్భలూ మొదలైన వాటితో సంస్కరించిన పవిత్ర స్థలంలో శివుణ్ణి ఆవాహనచేశారు. ఉత్కృష్టమైన గంధమూ, ధూపమూ, దీపమూ, మొదలైన వాటితో పూజించారు. పాయసమూ మొదలైన

వాటితో గొప్పగా నైవేద్యం సమర్పించారు. వేరువేరుగా ప్రధాన ప్రమథులకూ, ప్రమథగణాలకూ అర్చన లర్పించారు. కుబేరుడూ, మాణిభద్రుడూ మొదలైన భూత యక్షజనాలను భక్తి పూర్వకంగా ఆవాహనచేశారు. వారందరినీ పూజించారు. రక్షాకర మంత్రాలతో దక్షులైన ధౌమ్యుడూ మొదలైన బ్రాహ్మలతో కలిసి తమ్ముళ్లు నలుగురూ వెంటరాగా ధర్మరాజు వ్యాసదేవుడి వెంట నిధివుండిన చోటికి వెళ్ళాడు. ఎర్రగంధంతోనూ, ఎర్రపువ్వులతోనూ మాంసం పిండివంటలతోనూ, పేలాలతోనూ తగిన విధంగా భూతతృప్తి చేశాడు. అనంతరం మంచి బలమైనవాళ్ళని నిధి తవ్వడానికి నియోగించాడు.

అతి కుతూహలంతో కేకలువేస్తూ తవ్వడ మారంభించారు పరిజనులు. తవ్వడంతోనే ధగాధగా మెరిసిపోతూ, కాంతులు దిక్కులు వ్యాపించేట్టు బయలుపడింది బంగారం. భీముడూ, అర్జునుడూ, నకుల సహదేవులూ సంతోషం పట్టలేకపోయారు. ఆబంగారం నిధికి తగిన విధంగా అర్చన లర్పించాడు ధర్మరాజు.

వివిధ విద్యానిధి వేదవ్యాసుడు దగ్గిరవుండి ఆ పెన్నిధి సాధించి ఇచ్చాడు ధర్మరాజుకి. అతడి పాదాలకి దండప్రణామంచేసి, చేతులు జోడించి, వినయంగా నుంచున్నాడు ధర్మరాజు. అతణ్ణి కౌగిలించుకుని ఆశీర్వదించాడు వ్యాసుడు. ఇక వెళ్ళివస్తానని చెప్పి అంతర్థానమయాడు.

అనంతరం ధర్మరాజు ఆ బంగారం వేలువేలు బళ్ళమీది కెత్తించాడు. వేలువేలు గాడిదలమీదా, ఒంటెలమీదా, గుర్రాలమీదా, ఏనుగులమీదా పెట్టించాడు. బరువులు మొయ్యగలిగిన లక్షలాది మంది మేమంటే మేమని కావిళ్ళతో బుజాల కెత్తుకున్నారు. యజ్ఞశాల కలపా, కలశాలూ, చట్లూ, కాగులూ మొదలైన భాండాలూ,

ఆసనాలూ, శయ్యలూ, రోళ్ళూ, రోకళ్ళూ తెడ్లూ, స్రుక్స్రువాలూ, నేతి పాత్రలూ, దండకమండలాలూ, కొడవళ్ళూ మొదలైన వస్తువు లన్నీ శుద్ధమైన బంగారానివే నడిపించాడు. ఎడ్లమూపులమీదా, గోనెసంచుల్లో బళ్ళమీదా, మోపులతోనూ బంగారం హస్తినా పురానికి బార్లుకట్టి తర్లి వస్తూవుంటే జనులు తండోపతండాలు ముక్కు మీద వేలు పెట్టుకున్నారు. ఖేచరులు నిశ్చేరపోయారు. శత్రువులు భయభ్రాంతులయారు. అక్కడక్కడ ఏటివొడ్డులలోనూ, నీటిపట్టుల లోనూ మకాం చేస్తూ రాణువ నడిపించాడు, బరువులు మోసేవారి ఆకలిదప్పిక లెరిగినవాడు కనుక ధర్మరాజు.

ఇక్కడ ఇలా వుండగా అక్కడ శ్రీకృష్ణుడు, చారులవల్ల ధర్మరాజు అశ్వమేధయజ్ఞానికి ఉద్యోగిస్తున్నాడని విన్నాడు. హస్తిననుంచి ద్వారక వచ్చేటప్పుడు యజ్ఞ సమయానికి బంధువులతోనూ, స్నేహి తుల తోనూ తప్పక రావాలి సుమా అన్న ధర్మరాజు మాటలు తనువుకి తెచ్చుకున్నాడు. కుతూహలంతో బలభద్రుడూ, సాత్యకీ, కృతవర్మా, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, చారుదేష్ణుడూ మొదలైన యాదవ సమేతంగా, దేవకి వసుదేవుల అనుజ్ఞపొంది సుభద్రను వెంట పెట్టుకుని హస్తినాపురం వచ్చాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ విదురుణ్ణి పురస్కరించుకుని యుయుత్సుణ్ణి ఎదురు పంపారు. వారు ఎదురువెళ్ళి పరమభక్తితో కృష్ణుణ్ణి రాజనగరులోకి తోడి తెచ్చారు.

ముందు ధృతరాష్ట్రుడి దగ్గిరికి వెళ్ళాడు కృష్ణుడు. అతడికీ గాంధా రికీ నమస్కరించాడు. మధురంగా మాట్లాడి సంతోషపరిచాడు. కుంతీ దగ్గిరికివెళ్ళి ప్రణామం చేశాడు. ఆమె అతణ్ణి కౌగిలించుకుంది. ఎన్నో విధాల దీవించింది. బలరాముడూ మొదలైన యాదవ ప్రముఖు లున్నూ గౌరవపూర్వకంగా ఆమెని దర్శించారు. పులకరించిన శరీ రంతో సంభావించిందామె. విదురుణ్ణి నియోగించి బలరాముడూ మొద

లైన యాదవులందరినీ సగౌరవంగా ఆదరించింది. సుభద్రని పరమ ప్రియంగా గౌరవించింది. అభ్యంతర మందిరానికి పంపించింది. కృష్ణుడూ మొదలైన యావన్మందికీ తగిన విడుదు ఏర్పరిచింది. దీనంతటికీ యుయుత్సుణ్ణి నియోగించింది.

ఇలా ఈ యావన్మందీ సుఖంగా విడిసిన అనంతరం ఉత్తర పుణ్యగర్భంలో మీ తండ్రి పరిక్షిత్తు జన్మించాడు. ఇంట్లోవున్న వృద్ధ పరిచారికలు వెలపలివారితో "పుత్రుడు" అని శుభవార్త చెప్పారు. అంతమందీ వొక్కమారు సంతోషించారు. ఇంతలో "చచ్చిన బాలుడు పుట్టాడు" అని ఏడ్పులు వినిపించాయి గొల్లుమని. సంతోషించిన యావన్మందీ దుఃఖంలో మునిగిపోయారు. ఏడుపులు విని విచారంతో శ్రీకృష్ణుడు కుంతి వున్నదగ్గిరికి వచ్చాడు. అతని వెంట సాత్యకికూడా వచ్చాడు. కుంతీ, ద్రౌపదీ, సుభద్రా గోలుగోలు మంటూ కృష్ణుడి దగ్గిరికి వచ్చారు. వారిదుఃఖం చూసి తానుకూడా దుఃఖపడ్డాడు కృష్ణుడు.

## ఉత్తర కొడుకుని బతికించు

"కృష్ణా", గద్గదకంఠంతో ప్రాధేయపడుతూ అంది కుంతి, "నువ్వేగతి నాకు. నా సంతతికి నువ్వేదిక్కు. నీ మేనల్లుడికి చిట్టిపాప పుట్టాడు. అయ్యో, చచ్చినబిడ్డ పుట్టాడు. క్రూరుడైన అశ్వత్థామ ఇషీకాస్త్రం కాల్చేసింది నా కన్నతండ్రిని.

"కృష్ణా, కృష్ణా, ఈ బిడ్డని బతికించు. దారుణంగా అశ్వత్థామ ఇషీకాస్త్రం ప్రయోగించినపుడు జాలిపడి ప్రతినచేశావు నువ్వు. 'ఉత్తర కడుపునపుట్టే శిశువుని కాపాడతాను' అన్నావు. ఈ బిడ్డ బతుకుతోడిదే నా బతుకు. ఈబిడ్డ బతక్కపోతే ద్రౌపది బతకదు. సుభద్ర జీవించదు. ధర్మరాజూ, భీమార్జునులూ, నకులసహదేవులూ

ప్రాణాలు నిలపరు. వంశానికి పిండప్రదానం చేసేవారే వుండరు. ఉత్తర నువ్వు వోదార్చడంవల్లే బండెడంత దుఃఖం దిగమింగుకుం దప్పుడు. దానిదుఃఖం దూరంచెయ్యి కరుణించి.

"దేవా, శ్రీకృష్ణా, ఈ కులం నువ్వే కలిగించావు. ఇపుడు ఈ కులం నువ్వే నిలుపు."

అంటూనే కింద పడిపోయిందామె మొదలు నరికిన చెట్టులాగ. తగిన మాటలతో ఆమెని వోదార్చాడు లేవదీసి శ్రీకృష్ణుడు.

"అన్నయ్యా," అంటూ బావురుమంది సుభద్ర, "అశ్వత్థామ భీముడి మీదికి అస్త్రమెత్తాడు. దానిఫలం అర్జునుడూ, అతని భార్యా అనుభవించారు! ఏం చెప్పేదిక!

"ప్రభూ, నీ మరిది 'అభిమన్యుడు అభిమన్యుడు' అని పలవరిస్తూ వుంటాడు ఎప్పుడూ. ఇప్పుడు మనవఁడు దక్కకండా పోతే ఏమయిపోతాడో మరి ఎరగను. నీకే తెలియాలిది. ధర్మరాజు ఎలా భరిస్తాడీశోకం? భీముడూ, నకులసహదేవులూ ఎలా సహిస్తారు?

"దేవా, అశ్వత్థామ అస్త్రం ప్రయోగించినప్పుడు 'కుత్సితుడా, నీ అస్త్రం పనికిమాలినట్టు చేసేస్తాను' అన్నావు. ఆ మాట తలుచుకుని మేం కుదుటపడ్డాము. నీ మహానుభావత్వం మాకు తెలుసు. కనక భయంలేకండా వచ్చాం. ఆశ్రితరక్షకుడివి నువ్వు. ఆశ్రయించిన వారిని ఆదుకోడమే నీనైజం. తలవంచి నమస్కరిస్తున్నాను. ప్రార్థిస్తున్నాను. కరుణించు. కాపాడు.

"భక్తవత్సలుడివి నువ్వు, ఎలాఅయినా పాండవుల్ని నువ్వు పోనివ్వవు. అయ్యో, పాపకర్ముడు అశ్వత్థామ ఇంత తెచ్చిపెట్టాడు.

"లోకాలన్నీ మరణించినా చప్పున ప్రాణం పొయ్యగలవు అవసరమైతే. మేనమరిది మనవఁణ్ణి చావనిస్తావో బతికించక? దుఃఖం వల్ల ఇంత పేలాపన చేశాను నీముందు. వెఱ్ఱితనం మాది."

సుభద్ర ప్రార్థనవిని జాలీ దుఃఖమూ అధికంగా కలిగాయి శ్రీకృష్ణుడికి. "ఈ బిడ్డణ్ణి బతికిస్తాను. విచారించవలసిన పనిలేదు." అంటూ అందరూ విన్నట్టు మేఘగంభీరమైన స్వరంతో అన్నాడు. యావన్మందీ ఆనందించినట్లు అలా అని, కుంతీ మొదలైనవారిని వెంట పెట్టుకుని సూతికా గృహానికి వెళ్ళాడు.

తెల్ల పువ్వులూ తెల్లావాలూ పేలాలూ వాటితో పూర్ణ కుంభాలతోనూ, మంగళ వస్తువులతోనూ, మండుతున్న కుంపట్ల తోనూ, తళతళ మెరుస్తున్న ఆయుధాలతోనూ, పిశాచదోషాలు లేకండా వేపచివుళ్ళ్యా వాటితోనూ, నేరుపు తెలిసిన ముసిలి స్త్రీల తోనూ, చికిత్సలో ఆరితేరిన పరిచారికలతోనూ, మేలుకోరే పరివార జనంతోనూ నిండివుంది పురిటిల్లు. లోపల ప్రవేశించాడు శ్రీకృష్ణుడు.

కృష్ణుడికంటె ముందు ద్రౌపది లోపలికి వెళ్ళింది. అడిలిపోయి పడున్న ఉత్తరతో, "శ్రీకృష్ణుడు వచ్చాడు. ఇదిగో, సవినయంగా దర్శించు" అంది.

ఉన్నపాళాన లేచింది ఉత్తర. చెదిరిన వేణీభరంతోనే నమ స్కారం చేసింది వొంగి. "దేవా" అంటూ బాంద్రుమంది. "భక్తుల బాధ తొలిగించడమే నీ దృఢవ్రతం. అనుగ్రహించు. నాబిడ్డని బతి కించు. మేనల్లుడిమీద నీకు ప్రేమేవుంటే, ఆయన కుమారుణ్ణి అశ్వ త్థామా హతమార్చేవాడు? భర్తలేని పాపవతిన్నేను. కన్నకొడుకు కూడా కడ తేరి ఇంక ఎక్కడి బతుకునాకు! కొడుకు చావు తప్పదంటే అప్పుడే అభిమన్యుడి దగ్గిరికి వెళ్ళిపోయేదాన్ని. ఆయన యుద్ధానికి బయలుదేరినప్పుడు నేనుసహాగమనం చేస్తానన్నాను. ఆమాట తప్పి పోయింది. శ్రీకృష్ణా, ఇప్పుడు ఈ శరీరం వొదిలి ఆయన దగ్గిరికి వెళితే, అసలే మాటకారి ఆయన, నన్ను ఎత్తి పొడుస్తాడని జంకుతున్నాను. నిజానికి ఆనాడే వెళ్ళిపోవలిసింది.

"శ్రీకృష్ణుడు వస్తే కొడుకుని చంకలో పెట్టుకుని వెళ్ళి ప్రీతిగా మొక్కిస్తాను అని కలలు కన్నాను. ఆకల కల్లలు చేసి కాల్చేశాడు అశ్వత్థామ" అంది. అంతతో వూరుకోలేదామె. ఆపుకోలేని ఆవేదనతో కొడుకు శవం ఎత్తుకుని వొడిలో పట్టుకువచ్చింది. శ్రీకృష్ణుడి మొహంచూస్తూ "బాబూ, నాచిట్టీ, నీతాతగారు వచ్చారోయి. లోకగురుడు నాయనా మీ తాత. నమస్కారం చెయ్యమ్మా తాతగారికి. మీనాన్న ఎంత ధర్మపరుడు. అలాంటి ధర్మపరుడి కడుపున పుట్టి అధర్మపరుడి వవుతావా తండ్రీ! తాతగారికి దండంపెట్టు బాబూ! కళ్ళిప్పవోయి కన్నతండ్రీ! కుంతీదేవి చూడచ్చింది చూడవూ? ఏదీ, నామొహం చూడూ! ద్రౌపదిని చూడవూ! నీ నాన్న మొక్కాయి, ఇదిగో సుభద్రాదేవి, చూడుతండ్రీ! తలఎత్తి చిరునవ్వు నవ్వవూ?" అంటూ గోలుగోలుమంది. పలవించింది. మూర్ఛపోయి కిందపడిపోయింది. కన్నీళ్ళతో అక్కడ మూగిన కౌరవస్త్రీలని చూస్తే పగవాళ్ళకైనా గుండెలు నీరైపోతాయి.

కొంచెంసేపటికి తెలువుకుంది ఉత్తర. కిందపడుండే చేతులు నుదుట కీలించింది. మొక్కుతూ, వెక్కి వెక్కి ఏడ్చింది. "కృష్ణా, శరణుశరణు" అంది.

"భయపడకమ్మా ఉత్తరా," శాంత గంభీర కంఠంతో అన్నాడు శ్రీకృష్ణుడు. పాదప్రక్షాళనం, ఆచమనం చేసుకున్నాడు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిర మహాస్త్రం ఉపసంహరించాడు. ఉత్తర కొడుకుశవం పక్కమీద పెట్టించాడు. సగం సంతోషంతో వున్న అక్కడివాళ్ళ నందరినీ వోమారు కలయచూశాడు.

## ప్రాణదానం

"ఇంతవరకూ ఎన్నడూ నేను అబద్ధమాడలేదు. నేను బొంకానన్నమాటే మీరు వినివుండరు. చూడండి, ఈబాలుణ్ణి బతికిస్తాను.

మీరంతా ఇప్పుడే ఆనందంలో తేలాడతారు. ఇది విని పాండవులు పరమానందం పొందుతారు" అంటూ ఇలా ప్రతిజ్ఞ చేశాడు.

"పగవాళ్ళ విషయంలో అయినా నేను అబద్ధమాడకండా వుంటే, యుద్ధంలో ఎన్నడూ వెన్నుచూపకండా వుంటే, ఈ ఉత్తర కుమారుడు జీవం పొందుతాడు.

"బ్రాహ్మలమీద నాకు అధికంగా ప్రియమేవుంటే, నేను ధర్మరతుణ్ణే అయివుంటే ఈ ఉత్తర కుమారుడు జీవం పొందుతాడు.

"అర్జునుడిమీద నా మనస్సులో ఎన్నడైనా, ఏ విధంగా అయినా విరోధభావం లేకండావుంటే ఈ ఉత్తరకుమారుడు జీవం పొందుతాడు.

"నిజమైన ధర్మంతో నేను కంసుడూ మొదలైన వారిని వధించి వుంటె, ఇది ప్రాజ్యులు సమ్మతించివుంటే ఈ ఉత్తర కుమారుడు జీవం పొందుతాడు.

"సత్యమూ, పరమధర్మమూ, బ్రహ్మచర్యమూ, శాశ్వతంగా నాలో కుదురుకుని వుంటే ఈ ఉత్తరకుమారుడు ఇప్పుడే జీవం పొందుతాడు."

శ్రీకృష్ణుడు ఇలా అంటూనే వున్నాడు, ఉత్తర కొడుకు మృత దేహంలో ప్రాణసంచారం కలిగింది. అతడి అవయవాలు కదిలాయి. కళ్ళు విప్పాడతడు. అదంతా స్పష్టంగా చూశారు కుంతీ మొదలైన కౌరవస్త్రీలు. వారి కళ్ళలో ఆనందాశ్రువులు వెల్లువలై ప్రవహించాయి. వారి శరీరాలు పులకరించాయి. యావన్మందీ ఆనంద డోలికల్లో వూగిపోయారు. ఆకాశంమీద దివ్యవాణి శ్రీకృష్ణుణ్ణి పదేపదే పొగిడింది. మీతండ్రి సూతికా గృహం పుణ్యగృహమే అయిపోయింది.

కొడుకు నెత్తుకుని, కలకల్లాడుతున్న మొహంతో ఉత్తరవచ్చి

శ్రీకృష్ణుడి పాదాలమీద తలమోపి మొక్కింది. ఉదాత్త మనస్కుడైన అతడు ఆదరమైన మాటలతో ఆమెని గారవించాడు. గొప్ప గొప్ప రత్నాల వస్తువులు ఆ బాలుడికి బహూకరించాడు. తక్కిన యాదవనాయకులున్నూ విలువైన నగలూ అవీ ఇచ్చారు.

"ఆత్మకులం పరిక్షీణం * కాగా పుట్టాడితడు. అంచేత ఇతడి పేరు 'పరిక్షిత్తు' అన్నాడు శ్రీకృష్ణుడు. ♦

అదిగో అలాగ మీ తండ్రికి ప్రాణదానంచేసి, పాండవసంతతి కాపాడాడు పురుషోత్తముడు శ్రీకృష్ణుడు.

పరీక్షిత్తుకి నెలదినాలు నిండాక, వొక పుణ్యాదినంనాడు ధర్మ రాజూ, తమ్ములూ హిమాలయ నుంచి బంగారం పట్టించుకుని హాస్తినా పురం వచ్చారు. శ్రీకృష్ణుడు నియోగించిన ప్రకారం విదురుడూ, యుయుత్సుడూ పట్నంలో కస్తూరినీళ్ళు కల్లాపు చల్లించారు. కర్పూరం ముగ్గులు పెట్టించారు. రత్నతోరణాలు కట్టించారు. ముత్యాల కుచ్చులు వేలాడదీయించారు. బంగారం పూర్ణకుంభాలు పెట్టించారు. మరకతమయమైన అరిటిస్తంభాలు పాతించారు. విచిత్రంగా పట్నమంతా అలంకరించారు. ప్రజ..ందరూ ఉత్సాహంతో ముస్తాబులయ్యారు. దీనంతటితో పున్నమనాడు నిండుచంద్రుడు ఉదయిస్తే సముద్రం ఎలా పుప్పొంగుతుంది, అదిగో అలా అవుపడింది హాస్తినాపురం.

కృష్ణుడూ, బలరాముడూ, సాత్యకీ, ప్రద్యుమ్నుడూ మొదలైనవారు సంతోషంతో చక్కగా ముస్తాబులయి పాండవులకు ఎదురు వెళ్ళారు. ఆ ఉభయపక్షాలవారూ సౌహార్దంతోనూ, సౌముఖ్యం

---

* నాశనం.

♦ పరీక్షితుడు అని భాగవతం. చూ. రచయిత శ్రీమద్భాగవతం, పు 58. భార. ఆదిపర్వం కూడా పరీక్షితుడనే చెపుతున్నది. చూ. పు. 102.

తోనూ, సౌజన్యంతోనూ తగిన విధంగా కలుసుకున్నారు. శ్రీకృష్ణుడితో కలిసి మీ తాతలు పాండవులు మహా వైభవంతో, మహానందంతో నగరం ప్రవేశించారు బంగారం పట్టించుకుని.

ముందు ధృతరాష్ట్రుణ్ణీ గాంధారినీ దర్శించారు వారు. అనంతరం కుంతీదేవిని దర్శించారు. తరవాత అంతేసికళ్ళతో ఎదురుచూస్తున్న విదురుణ్ణీ, యుయుత్సుణ్ణీ ప్రేమతో సంభావించారు. ఆనందంతో యాదవులూ తామూ కలిసి రమ్యమైన వొక మండపంలో కూచున్నారు. అప్పుడు మీ తండ్రి పరిక్షిత్తు విషయం తగినవారు వినిపించారు. పాండవులు ఆశ్చర్యానందాలతో సతమతమై పోయారు. శ్రీకృష్ణుణ్ణి ఎంతో అంత పొగిడారు. "ఎంతవింత? ఎప్పుడూ మా మీద నీదయ ఇలాగేవుంది" అంటూ అభినందించారు.

అలా కృష్ణుడితో కలిసి సుఖంగా కొన్నాళ్ళు పాండవులు గడిపాక, వొకనాడు వ్యాసమహాముని హస్తినాపురం వచ్చాడు. శ్రీకృష్ణుడితో కలిసి ఆయనకు ఎదురువెళ్ళి తోడితెచ్చారు పాండవులు. ఉచిత విధంగా గౌరవించారు, పూజించారు. మృదువచనాలతో కుశల ప్రశ్నలయాక ధర్మరాజు ఇలా అందుకున్నాడు.

"మునీంద్రా, నీ అనుగ్రహంవల్ల లభించిన ఈ బంగారం యావత్తూ మహనీయంగా అశ్వమేధ యజ్ఞంలో వినియోగించమని నా ప్రార్థన. నీ అనుజ్ఞే యింక తరవాయి" అన్నాడు.

సంతోషించాడు వ్యాసముని. "ధర్మరాజా, అశ్వమేధం అన్ని పాపాలూ పోగొడుతుంది. గొప్ప దక్షిణాలతో నువ్వు అది పూర్తి చెయ్యి. పాపాలు లేకండా ప్రకాశించు" అన్నాడు.

వ్యాసదేవుడలా అనుమతించడంతోనే సంతోషిస్తూ శ్రీకృష్ణుడి వేపు చూశాడు ధర్మరాజు. "కృష్ణా," భవ్యమైన ఈపని నువ్వే సొంతం చెయ్యాలి. 'ఇదిగో ఈపని ఇలా చెయ్యండి' అని నువ్వే ఆనతియ్యాలి. నువ్వే మాకు తల్లివి. నువ్వే మాకు తండ్రివి. నువ్వే

గురుడివి. నువ్వే మంత్రివి. సఖుడివి. ఇన్నెందుకూ, జగత్తంతటికి నువ్వే గతి'' అన్నాడు.

"బుద్ధిమంతుడివి నువ్వు'' ధర్మరాజు మాటలువిని అన్నాడు శ్రీకృష్ణుడు, "అశ్వమేధం అన్ని ధర్మాలకీ మూలం అని నేనే చెప్పాను కదా! వ్యాసులవారి ఆదేశం ప్రకారం అన్నీ జరిగిద్దాం. ఈయజ్ఞం పూర్తిచేసి విచారం లేకండా సుఖపడు. ఇంక అనుమతి వేరే అనవసరం. నీ అశ్వమేధ యజ్ఞంలో నన్ను ఏపనికి పంపుతావో పంపు, తప్పకండా చేస్తాను. నీ తమ్ముళ్లు నలుగురూ, నేనూ యజ్ఞకార్యాలన్నీ నీ మనసుకి నచ్చినట్టు నిర్వహిస్తాం. ఇక ఆలస్యం చెయ్యకు.''

సంతోషించాడు ధర్మరాజు. కృష్ణుణ్ణి అభినందించాడు. వ్యాసుల వారివేపు చూసి, "దీక్షకోసం మంచిరోజు మీరే నిర్ణయించండి అనుగ్రహించి. ఆ సంస్కారమంతా మీరే నిర్వహించండి'' అన్నాడు.

"అలాగేకానీ'' అన్నాడు వ్యాసముని, "యాజ్ఞవల్క్యుడూ, పైలుడూ, నేనూ కావలిసిన పనులు నడుపుతాము. వచ్చే చైత్ర పౌర్ణమినాడు మంచిది. తగినవారిని వెంటనిచ్చి యజ్ఞంలో మేధ్యం కావలిసిన గుర్రంపంపు. * వేదోక్తవిధిగా విడిచిన ఆ గుర్రం భూలోకమంతా కలయ తిరుగుతుంది, నీ నిర్మలమైన కీర్తి విస్తరింపజేస్తూ. సర్వసంభారాలూ సమకట్టించు, స్రుక్స్రువాది పరికరాలన్నీ బంగారంతో కొత్తవి తయారు చేయించు.''

వ్యాసముని అలా అవసరమైనవన్నీ సిద్ధం చెయ్యమనీ, గుర్రం విడిచిపెట్టమనీ అన్నాక, గుర్రాల పరీక్షలో ఆరితేరిన పురుషుల్ని పిలిపించాడు. "మన గుర్రంకొదమలలో ఉత్తమమైన గుర్రాన్ని చూడండి. సాటిలేని మంచి లక్షణాలతో వున్నదాన్ని ఎంచండి'' అని ఆదేశించాడు. కర్మాధికారుల్ని పిలిచి, "యజ్ఞానికి కావలిసిన

* మేధ్యం: యజ్ఞంలో వినియోగించదగినది.

భాండాలూ మొదలైన సాధనాలూ, సు(క్సు)వాలు మొదలైన ఉపకర ణాలూ బంగారంతో కొత్తవి తయారు చేయించండి వెంటనే" అని నియోగించాడు. వారందరూ ఆ పనుల్లో నిమగ్నులయారు. మంచి గుర్రాన్నొంచి పట్టుకువచ్చారు. బంగారం పరికరాలున్నూ తెచ్చి చూపారు. అవన్నీ వ్యాసముని పరంచేశాడు ధర్మరాజు.

గుర్రాన్ని చూసి ఎంతో సంతోషించాడు వ్యాసుడు. "మేధ్య మవుతుం దిది. దీన్ని తగిన విధంగా విడిచిపెడదాం" అన్నాడు.

"దీన్ని రక్షించదగిన మహనీయు డెవడు? నువ్వే ఆలోచించి, నిశ్చయించి, నాకు ఆజ్ఞాపించు" అన్నాడు వినయంగా ధర్మరాజు.

"అర్జునుడే దీనికి తగినవాడు అన్నివిధాలా. దివ్యాస్త్రాల పండితు డతడు. ఉత్తమమైన బుద్ధిమంతుడు. శౌర్యవంతులలో మొదటివాడు. అతడే అడ్డులేకండా ఈపని నిర్వహించుకు వస్తాడు.

"భీమసేనుడూ, నకులుడూ మనరాష్ట్రం రక్షిస్తూ వుంటారు. సహదేవుడు మీ కుటుంబకార్యాలు నడుపుతాడు" అని నిర్దేశించాడు వ్యాసుడు.

అర్జునుణ్ణి పిలిపించాడు ధర్మరాజు. "తమ్ముడూ, యజ్ఞంలో మేధ్యం కావలిసిన గుర్రం భూమండలమంతా తిరిగివస్తుంది. దీన్ని నువ్వే రక్షిస్తూ వెళ్ళాలి. నువ్వుతప్ప మరొక సమర్థుడు లేడు. ఈ గుర్రం తిరిగిన చోటికల్లా వెంట వెళ్ళి, ఆయాదేశాల రాజుల్ని మన అశ్వమేధ యజ్ఞానికి దయచెయ్యమని ఆహ్వానించు. ఏ అడ్డూలేకండా ఈపని సాంతం చెయ్యి" అన్నాడు.

భీముణ్ణీ, నకులుణ్ణీ రాష్ట్రం రక్షించమని నియోగించాడు. సహదేవుణ్ణి కుటుంబ కార్యాలకోసం నియమించాడు. తక్కిన చిన్న చిన్న పనులకి తగినవారిని ఏర్పరిచాడు. గాంధారీ ధృతరాష్ట్రుల అనుమతి పొంది, కుంతీదేవి ఆజ్ఞపొంది అశ్వమేధ యజ్ఞానికి ఉద్యుక్తుడయాడు.

# అశ్వమేధ పర్వం

## నాలుగో ఆశ్వాసం

### గుర్రం విడిచి పెట్టారు

అశ్వమేధం కోసం అన్ని ప్రయత్నాలూ చేశాడు ధర్మరాజు. అతడు దీక్ష పూనడానికి మంచిదినం వచ్చింది. సిద్ధాంతులుపెట్టిన సుముహూర్తంలో వేదవ్యాసుడూ మొదలైన ఋత్విజులు వేదాల్లో చెప్పిన విధానం ప్రకారం ధర్మరాజుచేత దీక్ష పూనించారు. ధర్మరాజు లేడితోలు ధరించాడు. దండం పట్టుకున్నాడు. ఋత్విజులమధ్య అగ్నిహోత్రం దగ్గిర కూచుని, మునులమధ్య కూచున్న ప్రజాపతిలా ప్రకాశించాడు, బంగారు నగలు ధరించి. అతడితో పాటు ఋత్విజులు కూడా ప్రకాశించారు.

శాస్త్రోక్తంగా గుర్రం వొదిలిపెట్టాడు వేదవ్యాసుడు. వేదవిధి ప్రకారం ధర్మరాజు పంపగా, గాండీవం పట్టుకుని, జమిలితూణీరాలు కట్టుకుని గుర్రం వెంట బయలుదేరాడు మహావీరుడు అర్జునుడు. పిల్లలూ, ముసిలాళ్ళూ, ఆడంగులూ యావన్మందీ గుంపులు గుంపులు వచ్చి, గుర్రాన్నీ అర్జునుణ్ణీ చూశారు. ఇంతా అంతా సందడి కాదది. జనం అర్జునుణ్ణి దీవించడమూ, సంతోషంతో మెచ్చుకోడమూ—ఓ పెద్ద సముద్రఘోషలా అయింది కోలాహలం. అర్జునుడితో యజ్ఞకర్మకుశలుడైన యాజ్ఞవల్క్యుడి శిష్యుడొకడు కొంతమంది బ్రాహ్మలతో కూడా బయలుదేరాడు తగిన కర్మకాండ సాగించడానికి.

గుర్రం భూమండలం ప్రదక్షిణ రూపంగా తిరిగింది. ఉత్తరాభిముఖంగా మెల్లిమెల్లిగా తిరుగుతూ వెళ్ళింది. అర్జునుడు దాన్ని

రక్షిస్తూ వెంటనడిచాడు. అలా వెళ్ళివెళ్ళి త్రిగర్త దేశంలో ప్రవే శించింది గుర్రం.

## త్రిగర్తలో యుద్ధం

త్రిగర్త దేశంలో గుర్రం ప్రవేశించడంతోనే ఆ రాజు కుమార్తెళ్ళూ, మనవలూ ఉద్ధతులయి దాన్ని పట్టుకుందికి విరగబడ్డారు. రథాలు వేసుకుని అడ్డంగా వచ్చి ఆక్రమించారు. అన్నగారి ఆజ్ఞ తనుపులో పెట్టుకుని, వారితో నెమ్మదిగా ముందు చెప్పిచూశాడు అర్జునుడు కోపం తెచ్చుకోకండా.

"ధర్మరాజు అశ్వమేధయజ్ఞం చేస్తున్నాడు. ఆ గుర్రం ఇది. ఆయన యజ్ఞానికి అపకారం చెయ్యడం పాపం. అదీకాక, మీరూ మేమూ బంధువులమై మసులుకోడం మంచిది. పగ దేనికి?" అన్నాడు.

ఇదేమీ పట్టించుకోలేదు త్రిగర్తులు. సూర్యవర్మ అనే రాజ కుమారుడి నాయకత్వంకింద కయ్యానికి కాలుదువ్వారు.

అయినా మళ్ళీ నెమ్మదిగా ఇలా అన్నాడు అర్జునుడు; "దయా మూర్తి ధర్మరాజు. అజాతశత్రువు. గుర్రం పంపినప్పుడు, 'భారత యుద్ధంలో రాజులందరూ తెగిపోయారు. బాలులుమాత్రం మిగిలారు. వాళ్ళని వధించడం తగదు. వాళ్ళ మీద జాలి కలిగి ప్రవర్తించు. వినయం విడిచిపెట్టి వాళ్ళు గుర్రానికి అడ్డంవచ్చినా నువ్వు బంధుత్వం కలిపి మాట్లాడు. యుద్ధంకాకండా చూడు. కోపం తెచ్చుకోకు' అని మరీమరీ చెప్పాడు. ఆ మాటలు తలుచుకుని యుద్ధానికి పూనుకోకండా వుంది నా మనస్సు. ఆలోచించండి. ప్రాణంమీద తీపిలేదా మీకు? వద్దు, మళ్ళిపొండి" అన్నాడు.

అయినా ఆగలేదు త్రిగర్త రాజకుమారుళ్ళు. దురుసుగా దూసుకు వచ్చారు. సూర్యవర్మ సూటైన బాణాలు అర్జునుడిమీద కురిపిం చాడు వరసపెట్టి.

చూశాడు అర్జునుడు. ఎర్రనవ్వు తన ముఖపద్మానికి లేత ఎండలా అయి వింతైన అందం కలిగించింది. సూర్యవర్మ వేసిన బాణా లన్నీ చిప్ప బాణాలతో కొట్టిపారేశాడు.

సూర్యవర్మ తమ్ముడు కేతువర్మ అన్నని దాటుకుని ముందుకి వురికాడు. వాడివాడి బాణాలు అర్జునుడిమీద కుమ్మరించాడు. అతడి బాణాలుకూడా ముక్కలు చేశాడు అర్జునుడు. అతడి తమ్ముడు ధృత వర్మ దురుసుగా తోసుకువచ్చాడు. దారుణమైన బాణాలు అర్జునుడి మీద గుప్పించాడు. అతడి వడికి మెచ్చుకున్నాడు అర్జునుడు. అతణ్ణి కూడా నొప్పించడం మనస్కరించక అతడి బాణాలు మాత్రం కొట్టి పారేశాడు. అది అవకాశం చూసుకుని మరిన్ని దారుణమైన అమ్ములు అర్జునుడిమీద వేశాడు ధృతవర్మ. కోపం తెచ్చు కున్నాడు అర్జునుడు. టపీటపీ మని పది బాణాలు అతడి గుండెల మీద నాటించాడు. అయినా చలించలేదు ధృతవర్మ. బాణం మీద బాణం వేస్తూనే వచ్చాడు తీవ్రంగా. గట్టిగట్టి బాణాలు తగిలాయి అర్జునుడికి. అతడి ముష్టి సడిలింది. గాండీవం కింద పడి పోయింది చిత్రంగా. త్రిగర్తసేన సింహనాదాలు చేసింది దిక్కులు అదిరినట్లు. అందులో చెప్పదగిన యోధులు ధృతవర్మని పక్కకి తోసి, "ఇంద్రధనుస్సులా వున్న గాండీవంపాటు చూడండి!" అన్నారు, "చండవిక్రముడు అర్జునుడు. అన్నగారిమాట పాటించి తన పరాక్రమం చూపకండా వున్నాడు. నిజంగా కోపమే వస్తే నుదుటి కన్ను కనపరుస్తాడు యుద్ధంలో. గాండీవం కింద పడిందంటే ఇది వూరికేపోదు. రాజకుమాళ్ళందరినీ హతమారుస్తాడు. ఒక్కడూ ఇందులో దక్కడిక. మనం వూరికే చూస్తూవుంటే సాగదు. ఒక్క మొగిని అర్జునుడిమీద విరుచుకుపడాలి" అంటూ అంతమందీ అతణ్ణి ముట్టడించారు గుంపుగా.

ఇంతలో అర్జునుడు గాండీవం చప్పున కిందినుంచి ఎత్తాడు. కోపంతో ఉగ్రమూర్తి ధరించాడాఅన్నట్టు కళ్ళెర్రచేశాడు. ఒక్కమారు పిడుగులు పడినట్టు బాణాలు గుప్పించాడు. ఆ బాణాల్లో భూమి కనపడకండా పోయింది. త్రిగర్తుల పీనుగులు లెక్కాజమా లేకండా పడ్డాయి పెంటకుప్పలాగ. అర్జునుడి ఉగ్రమైన పద్ధతిచూసి భయపడి పోయింది త్రిగర్తసేన. దిక్కూ తెన్నూ లేకండా తోకముడిచింది. అప్పుడు త్రిగర్త రాజకుమాళ్ళ ఆప్తులు కొందరు అర్జునుడి శరణు వేడారు. "నిన్ను ఎదిరించలేం. నీ భక్తులం. ఏమాజ్ఞాపిస్తావో ఆజ్ఞాపించు, నెరవేరుస్తాం. అర్జునా, ఆదరించు. దయాహృదయుడివి నువ్వు" అంటూ కాళ్ళబేరానికి వచ్చారు.

అనుగ్రహించాడు అర్జునుడు. వారందరినీ కాపాడాడు యుద్ధం మానేసి. "మీరిలా ప్రాణాలు నిలుపుకోండి. నామాట వినుకోండి. బుద్ధికలిగి మసులుకోండి." అన్నాడు. అనంతరం గుర్రం వెళ్ళిన దారిని వెంట నడిచాడు.

## వజ్రదత్తుడు

క్రమంగా ప్రాగ్జోతిషపురం పరిసరాలకి నడిచింది గుర్రం. భగదత్తుడి కుమారుడు వజ్రదత్తుడు ఈ విషయం విన్నాడు. బాల్యచాపల్యంవల్లా, బలగర్వంవల్లా కిందూమీదూ కనపడలేదతడికి. గుర్రం అడ్డుకుని పట్టుకుపోబోయాడు. మంచి వాడివాడి బాణాలు అతడిమీద తగిలించాడు అర్జునుడు గాండీవానికి తొడిగి. ఆగలేకపోయాడు వజ్రదత్తుడు. గుర్రం వొదిలేసి పట్నంలోకి పారిపోయాడు. పారిపోయి వూరుకోలే దతగాడు. మదపుటేను నెక్కి, సేనలు తర్లించుకుని, అధికమైన సన్నాహంతో అర్జునుణ్ణి ముట్టడించాడు. చికిలిపట్టిన బాణాలు అర్జునుడిమీద కురిపించాడు. మధ్యనే వాటిని పొడిపొడిగా కొట్టేశాడు

అర్జునుడు. మరింత పళ్ళు కొరికాడు వజ్రదత్తుడు. లెక్కాజమాలేనన్ని తోమరాలు అర్జునుడిమీద ప్రయోగించాడు. మిడతలదండులా వచ్చి పడ్డాయవి. అగ్నిశిఖల్లాటి బాణాలువేసి వాటిని రూపుమాపాడు అర్జునుడు. వాడిలేని గట్టిబాణాలు అయిదు వరసపెట్టి వజ్రదత్తుడి మీద తగిలించాడు. తూలిపోయి కింద పడిపోయాడు వజ్రదత్తుడు. అయినా తగ్గలేదతడు. చప్పున మళ్ళీ ఏనుగుమీంది కురికాడు మెరుపు లాగ. అర్జునుడిమీద అంపవాన కురిపించాడు. ఆకాశంమీద దేవతలు ఔరా అన్నారు.

తీవ్రమైన బాణాలతో వజ్రదత్తుడి ఏనుగుని ముంచెత్తాడు అర్జునుడు. ఏంచెప్పనూ, అలా నాలుగుదినాలు పరాక్రమం చూపి పోరాడాడు వజ్రదత్తుడు అతని ఏనుగు పడిపోయేదాకా. నాలుగోనాడు ఏనుగు కూలిపోయేముందు అతడు మరింత పేట్రేగిపోయాడు. "అర్జునా, అర్జునా, నే నంటూవుండగా ఎటుపోతా విప్పుడు? మా అయ్య వృద్ధుడు కనక నువ్వు చంపేశావు. నన్ను గెలుస్తావు?" అంటూ అదలించాడు. పెద్ద సెలయేళ్ళ పర్వతంలాగ మదధారలు కారుతున్న ఏనుగు అర్జునుడిమీద వురికించాడు. ఘూత్కారాలు చేస్తూ ఏనుగు తొండంతో తుంపుర్లు కురుస్తూ వర్షధారల పర్వతంలాగ అయి అర్జునుడి మీద విరుచుకు పడింది. ఏనుగు విరుచుకుపడడమూ, వజ్రదత్తుడు అదే అదునని గట్టిగట్టి బాణాలు కొట్టడమూ వొక్కమాటే జరిగాయి.

వచ్చిరాని కోపంతో అర్జునుడు వజ్రాయుధంలాంటి బాణం వొకటి గాండీవానికి తొడిగి వొదిలిపెట్టాడు. పిడుగుపడిన కొండలా దెబ్బతో కూలిపోయింది ఏనుగు. వాహనంలేక కింద నిలబడిపోయాడు వజ్రదత్తు. ఆ బాల్నుణ్ణి చూసి జాలిపడ్డాడు అర్జునుడు. మృదువైన మాటలతో ఇలా అన్నాడు :

"వజ్రదత్తా, ధర్మరాజు యజ్ఞదీక్షపూని ఈ గుర్రాన్ని విడిచి

పెట్టాడు. దీనివెంట నన్ను పంపినప్పుడు, 'రాజుల్ని చంపకుమీ, వాళ్ళని దయతో చూడు. నీ పెంపు పువ్వయితే, నా పంపడం పరిమళం కావాలి' అన్నాడు. కనకనే నీమీద కోపం పుట్టడంలేదు నాకు. కనక అబ్బాయీ కోపం విడిచిపెట్టు, ధర్మరాజు యజ్ఞానికి దయచెయ్యి బంధువులతో కలిసి. నిన్ను ఆహ్వానించి వెళుతున్నాను. వచ్చే చైత్ర పౌర్ణమినాడు అశ్వమేధయజ్ఞం. అంతకిముందే నువ్వు హస్తినాపురం రావడం మంచిది" అన్నాడు.

మహాప్రసాదం అంటూ అంగీకరించాడు వజ్రదత్తుడు. అతణ్ణి అభినందించి గుర్రం వెంట వెళ్ళాడు అర్జునుడు.

## సైంధవులద్దు

అక్కణ్ణుంచి బయలుదేరి సింధుదేశంలో ప్రవేశించింది గుర్రం. భారతయుద్ధంలో హతులైన సైంధవయోధుల కుమారులూ మనవలూ పూర్వవిరోధం మనసుల్లో పెట్టుకుని గుర్రానికి అడ్డువచ్చారు. పెద్ద పటాటోపంతో వేలువేలు రథికులు సైంధవ రాజకుమారుడితో కలిసి అర్జునుడిమీద విరుచుకు పడ్డారు.

ఆకాశంమీద ఎర్రటి మేఘాలు కమ్ముకున్నాయి. పెద్దపెద్ద నెత్తురుకండలు కురిశాయి. సూర్యబింబంమీద నల్లచాయలూ, ఎర్ర చాయలూ అవుపడ్డాయి. అన్నిదిక్కులా అంతులేకండా నిప్పుల కుప్పలు కురిశాయి.

గుర్రంతోకూడా అర్జునుణ్ణి చుట్టుముట్టారు సైంధవులు. ఒక్క పెట్టున శస్త్రాలూ, అస్త్రాలూ కుమ్మరించారు. దప్పిక కలిగి పాలి పోయాడు అర్జునుడు. ఏం చెప్పనూ, అంత ఉద్దామ విక్రముడైన అర్జునుడి హస్తమూ జెండయిపోయింది. గాండీవం చేతినించి జారిపో యింది; కింద పడిపోయింది.

దేవతలూ, మునీశ్వరులూ అదిచూసి శోకంలో మునిగి పోయారు. "అర్జునుడు జయించాలి" అంటూ వీర్య మంత్రాలు చదివారు నియమం ప్రకారం పరిశుద్ధులై

తెప్పిరిల్లాడు అర్జునుడు. ఉత్సాహవంతుడున్నూ అయ్యాడు. విజృంభించాడు. ఇనప మొనల బాణాలు తీవ్రంగా సంధించి వేశాడు. రణరంగమంతటా విరోధుల శవాలు కుప్పలు పెట్టాడు. దేవతలూ, మునులూ, సిద్ధులూ మేలంటే మేలని అతణ్ణి మెచ్చుకున్నారు.

చావగా మిగిలిన సైంధవసైన్యం పిక్కబలిమి చూపెట్టి దిక్కూ తెన్నూ లేకండా పలాయనం చిత్తగించింది. యోధులు కొందరు మచ్చరించుకుని అతడిమీదికి దండెత్తి రాబోయారు. రణరంగంలో నిల్చుని అర్జునుడు, అన్నగారిమాటలు వారితో వినిపించాడు.

"ప్రాణాలు చేదుగావున్నాయా మీకు? ఎందుకీ పనికిమాలిన పెనగులాట?" అన్నాడు.

అయినా ఆగలేదు వాళ్ళు. మీదికి తోసుకువచ్చారు. నవ్వుతూ రకరకాల బాణాలు వేశాడు అర్జునుడు. అంతమందినీ హతవార్తే్ శాడు.

అదంతా వింది దుస్సల. మనవణ్ణి తీసుకుని అర్జునుడిదగ్గిరికి వచ్చింది. మొహమంతా కన్నీళ్ళు వరదచేసుకుని ఏడ్చింది. జాలిపడి కోదండం కిందపడేశాడు అర్జునుడు.

"ఈ పసికందుని కాపాడు" అంటూ మనవణ్ణి అర్జునుడి ముందుపెట్టింది దుస్సల, "వీడు నీ అల్లుడి కుమారుడు."

"నా మేనల్లు డెక్కడవున్నాడు?" అని అడిగాడు అర్జునుడు.

"తండ్రి నీచేత కూలిపోడం విని దుఃఖంతో కుమిలిపోతూ వుండీ, ఇప్పుడు నువ్వు వచ్చావనడంతోనే భయంతో గుండె పగిలి చచ్చిపోయాడు" అంటూ గోలు గోలు మంది దుస్సల. వెక్కి వెక్కి ఏడ్చింది.

పట్టరాని దుఃఖంతో తలవొంచుకు నించుండిపోయాడు అర్జునుడు.

"నా అన్నలు చేసిన అపరాధం మనసులో పెట్టుకోకు. మీ బావమరిది చేసిన దోషాలన్నీ మరిచిపో. తండ్రిలేని బిడ్డ వీడు. వీణ్ణి దయచూడు. ఆశ్రితవత్సలుడివి నువ్వు. నీ శరణు వేడుతున్నాను. రక్షించు, రక్షించు. కీర్తీ, ధర్మమూ దక్కుతాయి నీకు" అంటూ మనవణ్ణి అర్జునుడి పాదాలమీద పడేసింది దుస్సల.

అర్జునుడి హృదయం నీరైపోయింది. "ఛీ, రాచకులం కాల్చనా!" అంటూ నొచ్చుకున్నాడు, "క్రౌర్యానికి మూలం ఇది" అనుకున్నాడు. "చెల్లీ, దుర్యోధనుడికంటేకూడా పనికిమాలినవాళ్ళం మేము నిజానికి. మావల్లే ఇంత జరిగింది" అంటూ దుస్సలను ఓదార్చాడు బహువిధాల చెప్పి. "వెళ్ళు, విచారించకు" అని ఆమెని సాగనంపాడు.

తన మనవణ్ణీ, సైనల్ని తిసుకుని పట్నంలోకి వెళ్ళిపోయింది తృప్తిపడి దుస్సల. యజ్ఞసంబంధమైన విధులు నెరవేరుస్తూ గుర్రం వెంట బయలుదేరాడు అర్జునుడు లేడివెంటవెళ్ళిన శివుడిలాగ.

అన్ని దేశాలూ సుఖంగా తిరుగుతూ మణిపురం ప్రాంతానికి వెళ్ళింది గుర్రం.

## బభ్రువాహనుడు

మణిపురం రాజు బభ్రువాహనుడు తన కన్నతండ్రి అర్జునుడు వచ్చాడని వినడంతోనే తగిన పెద్దల్ని వెంటపెట్టుకు వచ్చి వినయపూర్వకంగా పాదాభివందనం చేశాడు. అయితే అతణ్ణి ఆదరించకండా పూరుకున్నాడు అర్జునుడు.

తనని ఎందుకలా అనాదరణ చేశాడో తండ్రి, కారణం

తెలియక చిన్నబుచ్చుకు నిలబడ్డాడు బభ్రువాహనుడు. అతడితో ఇలా అన్నాడు అర్జునుడు :

"యజ్ఞంకోసం తిరుగుతున్న గుర్రానికి అడ్డురాకండా, ఎదిరించ కండా ఇలా మెత్తబాటు తగునా క్షత్రియకుమారుడికి! రాజధర్మం ప్రకారం యుద్ధం తలపెట్టకండా ఇలా భయపడిన రాజు రాజా? గుణ హీనుడివి నువ్వు. పో, నాముందునుంచి."

మాటాడకండా మళ్ళిపోయాడు బభ్రువాహనుడు. తలవొంచు కుని నగరవీధులగుండా రాజనగరుకి బయలుదేరాడు.

కొడుకు వెళ్ళి నమస్కరించడమూ, తండ్రి అర్జునుడు ఈసడించి పలకడమూ అన్నీ తన దివ్యబోధతో తెలుసుకుంది పాతాళంలో నాగరాజు కూతురు ఉలూపి. పాతాళంనుంచి బయలుదేరి బభ్రు వాహనుడి దగ్గిరికి వచ్చింది.

"బభ్రువాహనా, నేను మీతల్లిని. నాగరాజు కుమార్తెని. ఉలూపి నాపేరు. నీకు మేలుచెయ్యాలన్న తలంపుతో వచ్చాను. విను, మీతండ్రి చెప్పినట్టు చెయ్యి. రాజులకు తగినధర్మం యుద్ధం. నువ్వు యుద్ధంచెయ్యి. ఆయనతో యుద్ధంచేస్తేనే అమితంగా సంతో షిస్తాడు" అంది.

ఆమెకి భక్తిపూర్వకంగా ప్రణామం చేశాడు బభ్రువాహనుడు. "తండ్రితోనా అమ్మా, కుమారుడు యుద్ధంచెయ్యడం? ఈపని చెయ్యలేక వెళ్ళిపోవచ్చాను. నువ్వేమో ఇంతగా ఇలా చెపుతున్నావు. ఆయనకూడా ముందే అనుమతి అనుగ్రహించాడు. అంచేత మీ ఇద్దరికీ ప్రియమైన పని యుద్ధమే చేస్తాను" అన్నాడు. ఉలూపిని నిజ మందిరానికి పంపించాడు. యుద్ధసాధనాలతో నిండిన మంచి రథ మెక్కాడు. పోరాటానికి తగిన నగలు పెట్టుకున్నాడు; లేపనాలు పూసుకున్నాడు; వస్త్రాలు కట్టుకున్నాడు. రణోత్సాహంతో శరీరం పొంగించుకున్నాడు.

బభ్రువాహనుడి రథంమీద హంసపతాకం రెపరెపలాడింది. బరిమీద పాంలాగ రథం పరిగెత్తింది. గుర్రాన్ని అడ్డుకుని, అర్జునుడితో యుద్ధానికి తలపడ్డాడు బభ్రువాహనుడు; అంపవాన కురిపించాడు.

కుమారుడి యుద్ధోత్సాహం చూశాడు అర్జునుడు; మెచ్చుకున్నాడు; ఎదిరి బాణాలు గుప్పించాడు వరసపెట్టి. బభ్రువాహనుడి బాణాలన్నీ కొట్టిపారేశాడు అవలీలగా. పైగా అతడి శరీరంమీద పదహారు వాడిబాణాలు నాటించాడు. చలించలేదు బభ్రువాహనుడు. పూని పూని అర్జునుడిమీద ఇరవై బాణాలు నాటించాడు.

మనసులో మెచ్చుకున్నాడు అర్జునుడు. వెడల్పు మొనబాణం వేసి బభ్రువాహనుడి హంసపతాకం నరికిపారేశాడు.

గట్టిదొక బాణం చప్పున తొడిగాడు బభ్రువాహనుడు. అర్జునుడి కొంకల్లో గురిచూసి కొట్టాడు. రక్తం తడికాకండా వడితో దూసుకుపోయిందది. గాండీవం వూతచేసుకు సోలిపోయాడు అర్జునుడు. అంతలోనే జల్దుకున్నాడు. "ఔరా, నన్ను మించినవాడు!" అంటూ కొడుకుని మెచ్చుకున్నాడు.

"బభ్రూ, బాగుంది. అయితే నేను వేసే తీవ్రబాణాలుమాత్రం ఆపుకోవాలి అప్పుడూ మంచి బంటు అనిపించుకుంటావు" అంటూ వాడివాడి బాణాలు గబాగబా ప్రయోగించాడు.

అర్జునుడు వేసిన బాణాలన్నీ తుత్తునియలు చేసి కొట్టేశాడు బభ్రువాహనుడు.

అతడి ఔద్ధత్యంచూసి మచ్చరం హెచ్చింది అర్జునుడికి. చిలికిపట్టిన బాణాలు మరింతవడిగా అతడి శరీరంలో దుసెళ్ళిపోయినట్టు గుప్పించాడు.

అస్త్రశస్త్ర విద్యానిపుణుడు బభ్రువాహనుడు. అర్జునుడి వాడి

బాణాలు రవంతా లెక్క చెయ్యలేదతడు. ఉదగ్రమైన పరాక్రమంతో మరింత రెచ్చిపోయాడు. పిడుగువంటి, మెరుపువంటి బాణం అర్జునుడి ఎదురొమ్ముమీద తగిలించాడు. గుండెమీద తగిలి వీపులోంచి దూసుకుపోయిందది. ఆదెబ్బతో అర్జునుడు పడిపోయాడు. పడిపోయే ముందు అర్జునుడు వేసిన బాణంతో బభ్రువాహనుడున్నూ ఇటు కూలిపోయాడు.

భర్తా, కుమారుడూ రణరంగంలో కూలిపోయారని విందిచిత్రాంగద. గోలుగోలు మంటూ రణస్థలానికి వచ్చిందామె. ఆమె వెంట ఉలూపి కూడా వచ్చింది.

రణరంగంలో రక్తంలో మునిగిన దేహాలతో తెగిపడున్న భర్తనీ, కుమారుణ్ణీ చూసింది చిత్రాంగద. ఆమె గుండెలు జల్లుమన్నాయి. మొదలు నరికిన అరిటిచెట్టులా కిందపడి మూర్ఛపోయింది. కొంచెంసేపటిలో తెలుపుకుని ఉలూపి మొహంచూస్తూ, "నీమూలంగా నా భర్త నా కొడుకుచేత చచ్చి యుద్ధభూమిలో ఇలా పడున్నాడు! చూడు, చూడు! పతివ్రతవి కావా నువ్వు? ధర్మం తెలిసిందానివి కావా? ఎందుకని అన్నెంపున్నెం ఎరగని నా కొడుకుతో యుద్ధం చెయ్యమని బోధించావు? కొడుకు పోయాడని విచారంలేదు నాకు. భర్త పాటు చూచి గుండెలు పగిలిపోతున్నాయి. నీ విషయంలో తప్పుచేసివుంటే వుండుగాక. అది పాటించకు. కనికరించు. ఈయన్ని బతికించు.

"అయ్యయ్యో, భర్తని చంపమని ప్రేరేపించి కొడుకుని పంపావు. అతని చావు కళ్ళారా చూసిన్నీ కంటతడిపెట్టవు. నీ సాహసం సామాన్యమైంది కాదు. ఏమనాలి నిన్ను?" అంటూ అర్జునుడి దగ్గిరికి వెళ్ళిందామె.

"ప్రాణనాథా, కీర్తిమంతా, అన్యజనుల ప్రాణాలు కాపాడ గలిగినవాడివి నువ్వు. నువ్వే ఇలా ప్రాణాలు వొదిలిపోతున్నావేమీ?

"నాథా, ఎప్పుడూ నన్ను మన్నించేవాడివి నువ్వు. కళ్లువిప్పి చూడవేమీ ఇప్పుడు? తగునా ఇది?

"గుర్రానికి ఎవ్వరూ అడ్డురాకండా కాపాడవూ? ఊరుకుంటావా ఇలా? అన్నగారి యజ్ఞం వమ్మైపోదూ? లే. గుర్రంవెంట వెళ్ళవూ?" అంటూ ఎన్నోవిధాల పలవించి ఏడ్చింది. మళ్ళీ ఉలూపి వేపు తిరిగి, "అమ్మా, ఉలూపీ, కొడుకుమాట ఎలావుంటే నేం, భర్తని బతికించు. ఆడాళ్ళని ఎంతమందినైనా కట్టుకుంటాడు మగాడు, తప్పులేదు. భార్యలు ఓర్చుకుని నడుచుకోడంలేదా? ఆలోచించు. మనసు కుదుటపరుచుకో. ఇంతెందుకు తల్లీ, భర్తని బతికించమ్మా" అంది.

అంతతోనూ ఆగక ఇంకా ఇలా అందామె, "కొడుకుచేత చచ్చిపడున్నాడు ఈ కురుకులరత్నం. కరుణించి నువ్వు బతికించు. బతికించకపోతే ప్రాయోపవేశం చేస్తాన్నేను" అంటూ ఆమె పాదాల మీద శిరసు మోపి ప్రణామం చేసింది. లేచి చదికిలబడి కూచుంది మాటాడకండా.

ఇంతలో బభ్రువాహనుడు తెప్పిరిల్లి లేచాడు. తల్లిని చూశాడు.

"ఎన్నడూ ఆవంతైనా విచార మెరగని తల్లి ఇవాళ నాగొప్పతనం వల్ల ప్రాణంపోయిన భర్తని – మంచును సూర్యుడు కరిగించేసి నట్టు భయంకర శత్రువుల్ని నాశనంచేసే వీరుణ్ణి – చూసి ఇలా ఏడుస్తూవుండగా చూశాను. పాపాత్ముణ్ణి.

"మణి కిరీటంతోసహా తండ్రి శిరస్సు కింద పొర్లాడినట్టు చేశాను, ప్రియకుమారుణ్ణి నేను!" అంటూ దుఃఖపడ్డాడు అర్జునుడితో గుర్రం వెంటవచ్చిన యాజ్ఞవల్క్య శిష్యుడూ మొదలైన బ్రాహ్మల్ని చూసి, "ఈ గుర్రం విషయంగా వీళ్ళు ఏంచేస్తారో, అర్జునుడు

ఇలా పడున్నాడు!" అంటూ పలవించాడు. ఇంకా ఇలా దుఃఖపడ్డాడు, "తండ్రిని చంపిన పాపాత్ముణ్ణి. ఎలాటి ప్రాయశ్చిత్తం చేసుకోవాలో నేను? ఈ మహాత్ముడి కపాలం పట్టుకుని పన్నెండేళ్ళు బిచ్చమెత్తుకు తిరగాలి కామోసు! ఇంతకి తప్ప మరేముంటుంది?" ఉలూపి వేపు తిరిగి ఇలా అన్నాడు: "నువ్వు చెప్పడంవల్లే తండ్రిని ఇలా యుద్ధంలో కూలదోశాను. ఇక తృప్తిపొందు నువ్వు. భరతకుల పవిత్రవు నువ్వు. తండ్రిని చంపుకున్న పాపాత్ముడు ప్రాణాలతో బతకాలనుకుంటాడా శాంతంగా? అతడు పోయే సద్గతి పట్టడమే కాక మరోదారి లేదు నాకు" అంటూ చరాచరా భూతకోటీ, ఉలూపీ విన్నట్టు స్పష్టంగా అన్నాడు. ఇంకా ఇలా అన్నాడతడు, "నిష్ఠతో వ్రతం పూనుతాను. మా తండ్రి లోకంలో లేకపోడమే నిజమైతే ప్రాయోపవేశమే గతి నాకు. అదే ఉత్తమకృత్యం. వీరవధ పాపం. అంతకంటే రాజవధ పాపం. అంతకంటే ధార్మికవధ పాపం. వీటన్నిటినీ మించింది తండ్రి వధ. ఈ పాపం ఇంతా అంతా అనలేం. ఇలావుండగా, వీరుడూ, రాజూ, ధార్మికుడూ, తండ్రీ అయిన ఈ మహితాత్ముణ్ణి వధించిన మహాపాపాత్ముడికి దుష్కరమైన వ్రతాచరణవల్ల తప్ప నిష్కృతి లేదు. కనక వ్రతం నడుపుతాను" అంటూ ఉపస్పర్శనం ఆచరించి, మౌనంపూని కూచున్నాడు.

## సంజీవమణి

అలా తెంపుచేసి కూచున్న తల్లీకొడుకుల్నీ, రణరంగంలో తెగిపడున్న భర్తనీ చూసింది ఉలూపి. సంజీవమణిని తలుచుకుంది. ఉత్తరక్షణంలో పాములకు పరాయణమైన సంజీవమణి ఆమెచేతికి వచ్చింది. మణిపట్టుకుని, బభ్రువాహనుడి మోహంచూస్తూ అందామె: "అర్జునుడా చచ్చిపోతాడు మీా వెర్రికాని! దేవేంద్రుడైనా చంప

గలడా ఇతణ్ణి? ఈయనకి వొక మేలుచెయ్యడంకోసమూ, నీచేవ తెలుసుకోవాలని నీతో యుద్ధం చెయ్యాలనుకుంటున్న ఈయనకోరిక నెరవేర్చడంకోసమూ ఇంత చెయ్యవలసివచ్చింది నాకు. కనకనే మోహనమైన మాయాప్రయోగం నడిపాను. నారాయణుడి ఉజ్వలాత్మ నరుడు (అర్జునుడు). ఇతని తేజస్సు మహత్తరమైంది. ఆ తేజస్సు ఎవ్వరూ ఏవిధానా ఆర్పలేరంటే నమ్ము. మీ దుఃఖమంతా మాసిపోయినట్టు ఈయన ఇదిగో ఇప్పుడే లేస్తాడు.

"మాయాప్రయోగం అంటే మరేమీ కాదు, నీకు నీతండ్రితో యుద్ధం చెయ్యాలన్న బుద్ధిపుట్టించడమే."

ఇలా అక్కడున్న యావన్మందీ ఆనందించినట్టు చెప్పి, బభ్రువాహనుడి చేతిలో సంజీవమణి పెట్టింది ఉలూపి. "ఈమణి మీతండ్రి హృదయంమీద మోపు" అంది.

ఉలూపి చెప్పినప్రకారం సంజీవమణి అర్జునుడి హృదయంమీద మోపాడు బభ్రువాహనుడు. ఉత్తరక్షణంలో జీవంపొంది, లేచి కూచున్నాడు అర్జునుడు. అందరినీ వోమారు కలయచూశాడు. చిరునవ్వుతో కుమారుణ్ణి మనోహరంగా పరికించాడు. "రాజా, కుశలమేనా?" అన్నాడు.

వినయంతో తండ్రికి పాదాభివందనం చేశాడు బభ్రువాహనుడు. "నీ పుణ్యాదృష్టివల్ల అంతా కుశలమే" అన్నాడు.

"ఈ జనుల మొహాల్లో విచారం ఇప్పుడిప్పుడేపోయి సంతోషం అంకురిస్తున్నట్టు కనిపిస్తూవుంది. ఏమిటి దీనికి కారణం? తెలిస్తే చెప్పు" అని అడిగాడు అర్జునుడు, "నేను చెప్పినట్టు యుద్ధానికి వచ్చావు నువ్వు. మీ అమ్మ చిత్రాంగద ఎందుకువచ్చింది ఇక్కడికి? ఉలూపి ఎందుకువచ్చింది?"

భక్తిభావంతో సాగిలబడ్డాడు బభ్రువాహనుడు. చేతులు

జోడించావు. ఉలూపిని చూపిస్తూ, "అంతా ఈ అమ్మని అడుగు" అన్నాడు.

ఉలూపి మొహం తేరిచూశాడు అర్జునుడు. "కురువంశం విస్తరింపచేసినదానవు నువ్వు. నువ్వు రావడానికి ఏమిటికారణం? ఈ మణిపురం రాజుమీదా, నామీదా నీమనస్సు ప్రసన్నంగా వుందికదా? ఈ రాజుకాని, చిత్రాంగదకాని, నేనుకాని నీకు ఏమీ అపరాధం చెయ్యలేదుకదా?" అని అడిగాడు.

"నాథా," నవ్వుతూ అంది ఉలూపి, "ఎప్పుడైనా అపరాధం కలుగుతుందా నీవల్ల? బభ్రువాహనుడు నాకొడుకు. అతడివల్ల అపరాధ మెలా కలుగుతుంది? వినయశీల చెల్లి చిత్రాంగదమాట మరి చెప్పనక్కరలేదు. కోపం తెచ్చుకోకండా విను. తలవాంచి వినయంగా విన్నవిస్తాను. నీకొడుకువల్ల నీకు చావు వచ్చింది యుద్ధంలో. దీనికి కారణం లేకపోలేదు. నువ్వు శిఖండిమీద నెపంపెట్టి భీష్ముణ్ణి సంహరించావు. అది పాపం. దానికి నిష్కృతిచెయ్యకండా శరీరం వొదిలిపెడితే నరకానికి వెళ్ళవలసివస్తుంది. అంచేత ఈ నిష్కృతి చేశాన్నేను వచ్చి. ఇది ఎలా తెలిసిందంటావేమో. చెపుతాను, విను.

"నేను వొకనాడు సఖీజనంతో కలిసి గంగానదికి స్నానానికి వచ్చాను. వసువులు అక్కడికి వచ్చారు. ఒకరేవులో స్నానాలు చేశారు. నిజరూపంతో వారికి అవుపడింది గంగ. ఆమెతో వాళ్ళు, భీష్ముడు బాణాలు వెయ్యకండా శిఖండిని ముందుంచుకుని, దివ్యాస్త్రాలు వేసి అతణ్ణి పడగొట్టాడు అర్జునుడు. ఇలా కుత్సితవిజయం సాధించాడతడు. అతణ్ణి శపిస్తాం మేము" అన్నారు. దానికి అంగీకరిస్తూ మాట్లాడింది గంగ. అదంతా విని నేను తక్షణం మాతండ్రిదగ్గిరికి వెళ్ళాను. జరిగిందంతా చెప్పాను. భయపడిపోయాడు మా తండ్రి. వెంటనే వసువులదగ్గిరికి వెళ్ళాడు మెరుపులాగ. ఎన్నో విధాల

కాళ్ళావేళ్ళా పడి ప్రార్థించాడు. కోపం విడిచిపెట్టారు వసువులు. "అయితే వొక షరతుమాత్రముంది" అన్నారు. "యుద్ధంలో బభ్రువాహనుడు అర్జునుణ్ణి కూలగొడితే ఈపాపం తొలగిపోతుంది" అన్నారు. తిరిగివచ్చి నాతో అదంతా చెప్పాడు మా అయ్య. అదిగో అంచేత ఇప్పుడు ఇదంతా నిర్వహించవలసివచ్చింది నేను. ఇదెలా చేశానో చెపుతాను. నీతో యుద్ధంచెయ్యడం మనస్కరించక, నీకు నమస్కరించి ఇంటికి మళ్ళిపోతున్నాడు బభ్రువాహనుడు. అదేసమయమని ఊహించాను. కార్యసాధనకోసం చప్పున ఇతడిదగ్గిరికివచ్చాను. యుద్ధం ధర్మమనీ, మీతండ్రికి ఇష్టమనీ బోధించాను. ఇతణ్ణి యుద్ధానికి పురికొల్పాను. వసువులు చెప్పిన ప్రకారం ఈ వీరుడిలో విక్రమం ఆవహింపచేశాను" అంది.

ఆనందించాడు అర్జునుడు. "దేవీ, మహనీయమైంది నీచరిత్ర. ఎప్పుడూ మా కులవర్ధనకారి అది" అన్నాడు. సాదరంగా బభ్రువాహనుణ్ణి చూశాడు. "రానున్న చైత్రమాస పౌర్ణమినాడు ధర్మరాజు అశ్వమేధయజ్ఞం జరుగుతుంది. నువ్వూ, తల్లులూ బంధుజనంతో హస్తినాపురం రావాలి. ధర్మరాజు చేసిన సంభావనలు అందుకోవాలి. పరమ శుభమది" అన్నాడు.

"మహాప్రసాదం" అన్నాడు బభ్రువాహనుడు, "తండ్రీ, నగరంలోకి దయచెయ్యండి. అమ్మలూ, నేనూ అర్పించే పూజలందుకుని వచ్చి గుర్రంవెంట దయచెయ్యండి" అంటూ ప్రార్థించాడు.

"నేను దీక్షలో వున్నాను, ఎరగవూ? నేను నగరంలో ప్రవేశించకూడదు. కనక వెళ్ళివస్తాను. సుఖంగా వుండండి మీరు" అన్నాడు అర్జునుడు.

"అయితే సరే," అంటూ తగినవిధంగా అతణ్ణి పూజించాడు బభ్రువాహనుడు. ఉలూపి చిత్రాంగదల అనుమతి తీసుకుని, గుర్రం

వెంట నడిచాడు అర్జునుడు. స్వేచ్ఛగా అన్ని దేశాలూ తిరుగుతూ వెళ్ళింది గుఱ్ఱం.

## మేఘసంధి

అలా వెళ్ళివెళ్ళి రాజగృహాపురం సమీపానికి చేరింది గుఱ్ఱం. మేఘసంధి అక్కడ అర్జునుణ్ణి యుద్ధానికి పిలిచాడు. జరాసంధుడి మనవఁడు * మేఘసంధి. రాజగృహం ఏలుతూ, బాల్యంనుంచీ తన్ను ఎదిరించేవాడులేక, మదమెక్కివుండి, అర్జునుడిమీాద కలబడ్డాడు రథ మెక్కివచ్చి. "ఆడాళ్ళలోపల వెళుతున్నట్టు, జంకూకొంకూ లేకండా గుఱ్ఱంవెంట వెళుతున్నావిక్కడ. ఇకవొక్కఅడుగైనా కదలనివ్వను గుఱ్ఱాన్ని. కయ్యానికివస్తావా ? రా" అన్నాడు గుఱ్ఱాన్ని అడ్డు కుంటూ.

"అడ్డువచ్చినవాళ్ళని బుద్ధిచెప్పి మళ్ళిస్తున్నాను" నవ్వుతూ ఆ మగధరాజుతో అన్నాడు అర్జునుడు," నామనస్సులో కోపంలేదు. ఏమంటావా ? మా అన్న ధర్మరాజు, 'సామంతో కార్యం సాధించుకు రమ్మన్నాడు నన్ను. ఎవ్వరితోనూ క్రూరవృత్తి కూడదన్నాడు. అంచేత అలాగే నడుచుకుంటూ వస్తున్నాన్నేను. నీ ఇష్టం మరి."

మాట్లాడకండా అర్జునుడిమీాద అంపవాన కురిపించాడు మేఘసంధి. వాటన్నిటినీ వాడివాడి బాణాలతో తుక్కుచేశాడు అర్జునుడు. కాని మేఘసంధి వొంటిమీాద వొక్కబాణమైనా కొట్టినపాపాన పోలేదు. తనమీాద మేఘసంధి బాణాలు వేసినా, అతణ్ణి నొప్పించ లేదు. అతడిగుఱ్ఱాలమీాద కానీ, రథంమీాదకానీ; సారథిమీాదకానీ బాణం వెయ్యలేదు. అంత దయచూపించాడు అర్జునుడు.

అర్జునుడు కనపరిచిన దయ బలహీనత అని భావించాడు మేఘసంధి. దాంతో మరింత మిట్టిపడ్డాడతడు. గట్టిగట్టిబాణాలు

---

* సహదేవుడి కుమారుడు.

అర్జునుడిమీద కొట్టాడు. కొంచెం చురచురలాడాడు అర్జునుడు. అయినా మేఘసంధికి తగలకండానే బాణాలు వేసి, అతడి సారథిని కూలగొట్టాడు. గుర్రాలు పడగొట్టాడు. రథం ముక్కలుచేశాడు. జెండా ఎగరగొట్టేశాడు. ధనస్సు పొడిపొడి చేశాడు.

అయినా వెనకాడలేదు మేఘసంధి. గదపట్టుకుని ధైర్యంతో గిరగిరా తిప్పుతూ అర్జునుడిమీదికి వురికాడు. పరాక్రమమే మూర్తి మంతమైవచ్చిందా అన్నట్టు కలబడ్డాడు.

అప్పటికీ అతణ్ణి చంపదలచలేదు అర్జునుడు. వెడల్పాటిదొక బాణంవేసి అతడి గద ముక్కలుచేసి కొట్టేశాడు. తుక్కుతుక్కయి కిందపడింది గద. నిర్ఘాంతపోయి నిలబడిపోయాడు మేఘసంధి.

"మగధరాజా" నెమ్మదిగా, దృఢంగా అన్నాడు అర్జునుడు, "మా అన్నయ్య ధర్మరాజు, 'ఒక్కరాజు ప్రాణమైనా తియ్యకు' అని ఆదేశించాడు. అదిగో ఆయన ఆదేశంవల్ల నేను నిన్ను కొట్ట కండా పరకాయిస్తున్నాను. అంచేత ఇంతసేపు పోరగలుగుతున్నావు. అదలావుండనీ. రాజధర్మం పాటించి నన్ను ఎదిరించితొకావు నువ్వు. ఈమాత్రం చాలు. ఇంక శాంతించడమే తగినపని" అన్నాడు.

"నిజమే ఇది" అని ఊహించుకున్నాడు మేఘసంధి. భక్తి పూర్వకంగా అర్జునుడి పాదాలముందు సాగిలబడ్డాడు. గుచ్చి కౌగ లించుకున్నాడు అర్జునుడు.

"వచ్చే చైత్రపూర్ణిమనాడు ధర్మరాజు అశ్వమేధయజ్ఞం. దానికి బంధువులూ, నువ్వూ హాస్తినాపురం రండి" అన్నాడు. "మహాప్రసాదం" అని అంగీకరించాడు మేఘసంధి. వినయంతో అర్జు నుణ్ణి పూజించి సాగనంపాడు.

సంతోషించాడు అర్జునుడు. మేఘసంధిని అభినందిచాడు. పట్నంలోకి వెళ్ళమని సెలవిచ్చాడు. అనంతరం గుర్రంవెంట బయలు

దేరాడు. గుర్రం వంగ, పుండ్ర, మ్లేచ్ఛదేశాలు తిరిగివెళ్ళింది. ఆయా దేశాల రాజులు అడ్డగించరాగా, వారిని జయించి ముందుకు సాగాడు అర్జునుడు.

చేది దేశంలో ప్రవేశించింది గుర్రం. శిశుపాలుడి కొడుకు శరభుడు తన శుక్తిపురంనుంచి వచ్చి, యుద్ధపూర్వకంగా అర్జునుణ్ణి అర్చించాడు.

అక్కణ్ణుంచి గుర్రంవెంట కొంకణ, కిరాతదేశాలు వెళ్ళాడు అర్జునుడు. ఆ దేశాల రాజులు అడ్డంరాగా, వారిని జయించాడు. అలాగే వరసగా కోసలరాజునీ, కాశీరాజునీ జయించాడు. అక్కణ్ణుంచి గుర్రం దశార్ణదేశంలో ప్రవేశించింది. దశార్ణరాజు చిత్రాంగదుడు గుర్రానికి అడ్డువచ్చి యుద్ధంచేశాడు. అతణ్ణీ ఓడించాడు అర్జునుడు. చిత్రాంగదుడు అర్జునుణ్ణి పూజించాడు.

గుర్రం నిషాదదేశం ప్రవేశించింది. ఏకలవ్యుడి కొడుకు పెద్ద నిషాదసేనతో అర్జునుణ్ణి ఎదిరించాడు. తీవ్రమైన బాణాలతో నిషాద సేన తుత్తుమూడాడు అర్జునుడు. ఏకలవ్యుడి కుమారుణ్ణి గట్టిగట్టి బాణాలతో దారికి తెచ్చాడు. మదమడిగి, వినయంతో అర్జునుణ్ణి పూజించాడు ఏకలవ్యుడి కొడుకు.

అక్కణ్ణుంచి గుర్రం దక్షిణాభిముఖంగా తిరిగింది. పౌండ్ర, ఆంధ్ర, ద్రవిడ, కేరళ, కర్ణాటదేశాలు ప్రవేశించి నడిచింది. ఆయా దేశాలరాజుల్ని అనాయాసంగా జయించి వశపరుచుకున్నాడు అర్జునుడు.

క్రమంగా సౌరాష్ట్రం వెళ్ళి, గోకర్ణప్రాంతానికి చేరి, అనంతరం ద్వారకానగరం దగ్గిరికి వెళ్ళింది గుర్రం. యాదవకుమారుళ్ళు ఈవార్త విన్నారు. యుద్ధంచెయ్యకండా వచ్చి, అర్జునుణ్ణి పూజించారు. వారందరినీ అభినందించాడు అర్జునుడు. వారి అనుమతి తీసుకుని

పడమటి సముద్రతీర దేశాలు తిరిగి గుర్రం వెంట పంచనదం మీదుగా గాంధార దేశంలో ప్రవేశించాడు.

## శకుని కొడుకు

గాంధార దేశం రాజు శకునికొడుకు గుర్రం తన దేశంలో ప్రవేశించడం విన్నాడు. కుర్రతనం దుర్నయంతో పెద్దదండు కూర్చుకుని, ఉద్ధృతంగా వచ్చి అర్జునుణ్ణి ముట్టడించాడు. ధర్మరాజు ఆజ్ఞ వినిపించి, వారించాడు అర్జునుడు. వినుకోలేదు శకునికొడుకు. ఒక్క మొగిని అర్జునిడిమీద కలబడ్డాడు.

చూశాడు అర్జునుడు. అతడి కళ్లు రెండూ కెంపుల్లా మెరిశాయి. వాడివాడి బాణాలతో గాంధారరాజు చతురంగసేన ముంచెత్తాడు. పటాపంచలై పరిగెత్తింది గాంధారసేన. తమకం తలకెక్కింది శకుని కొడుక్కి. చికిలిపట్టిన బాణాలు అర్జునుడిమీద గబగబా గుప్పించాడతడు బాహుబలం కనపరుస్తూ. మెచ్చుకున్నాడు అర్జునుడు. కనికరించి ఇలా అన్నాడు:

"తమ్ముడూ, రాజుల్ని చంపవద్దని మా రాజు ధర్మరాజు ఆజ్ఞ. అతని ఆజ్ఞ పాటించకపోతే నేనే వోడిపోయానని భావిస్తాడాయన. అంచేత పస్తాయిస్తున్నాన్నేను. విన్నావా? ఎందుకు కయ్యమాడతావు?"

అర్జునుడి హితం రుచించలేదు గాంధారరాజుకి. బాణంమీద బాణం వేసి ఆక్రమించాడు అర్జునుణ్ణి. నవ్వుతూ అతడి కిరీటం కింద పడగొట్టాడు అర్జునుడు. అక్కడున్న అంతమందీ ఆ చిత్రం చూసి ముక్కుమీద వేలుపెట్టుకున్నారు.

"అర్జునుడు అసహాయశూరుడు. ఇష్టంలేక కాని ఈదెబ్బతో శకునికొడుకుతల ఎగరగొట్టేసేవాడితడు. ఆహా, ఎంత దయాశాలి

కాకపోతే ఇలా వూరుకుంటాడు!" అంటూ గాంధారరాజుదగ్గిరికి వెళ్ళి, "రాజా, రథం మళ్ళించుకు వెళ్ళిపో. యుద్ధంచెయ్యకు" అని బోధించారు. అయితే దురభిమానంతో వినుకోలేదతడు. అర్జునుడి మీదికే రథం వురికించాడు మళ్ళీ. రాజు యుద్ధానికి తలపడ్డంతోనే, అంతకిముందు చెదిరిపోయిన సేన తిరిగివచ్చింది. అర్జునుణ్ణి చుట్టు ముట్టింది. అస్త్రశస్త్రాలు కుమ్మరించింది.

అన్నీ దారైన బాణాలతో పిండిపిండిచేసి కొట్టేశాడు మహాబలుడు అర్జునుడు. అతడి పరాక్రమం తట్టుకోలేకపోయింది మళ్ళీ గాంధారసేన. భయపడిపోయింది. తారుమారై తోకముడిచేసింది.

నిస్సహాయుడైపోయాడు శకునికొడుకు. అతణ్ణి కాపాడుకోడం కోసం శకునిభార్యా, మంత్రులూ అర్ఘ్యంపట్టుకుని శరణు శరణు అంటూ పరిగెత్తుకువచ్చారు.

శకునిభార్యని అభినందించాడు అర్జునుడు. మంత్రుల మాననీయమైన మాటలు విని ఆనందించాడు, శకుని కుమారుణ్ణి వోదార్చాడు. "తమ్ముడూ, మంచి పరాక్రమవంతుడివోయినువ్వు. నీ దురుసుతనం చూసి నా మనస్సు చివుక్కుమనకపోలేదు. అయితే మా అన్నగారి ఆజ్ఞ సముద్రానికి ఏనాపొడ్డులాంటిది నాకు. 'రాజుల్ని చంపన్నేను, ఏమైనాసరే,' అని అందరిలోనూ మాట ఇచ్చాను. అంచేత నీపైన్యాన్నేకాని నిన్ను చంపడానికి సాహసించలేదు. విశేషించి గాంధారీ ధృతరాష్ట్రుల్ని తలుచుకుని నువ్వంటేనాకు ప్రేమేకాని క్రోధం కలగలేదు. కనకనే ఇంతసేపు పోరాడగలిగావు నువ్వు. ఇంక శాంతించడం మంచిది. ధర్మరాజుతో పొందు క్షేమంకాదో నీకు?

"వచ్చే చైత్రపౌర్ణమినాడు ధర్మరాజు అశ్వమేధ యజ్ఞం. నువ్వు తప్పకరావాలి చూసిందికి" అని చెప్పి, గుర్రంవెంట బయలుదేరి వచ్చేశాడు.

గుర్రం హాస్తినాపురంవేపు మొహంచేసుకు బయలుదేరింది.

చారులవల్ల, అర్జునుడు దేశాలన్నీ గెలిచి, గుర్రంతో తిరిగి వస్తున్నాడని విన్నాడు ధర్మరాజు. సంతోషించాడు.

## యజ్ఞ ప్రయత్నాలు

అవాళ మాఘమాస పౌర్ణిమ. ధర్మరాజు గొప్పగా కొలువుతీర్చి కూచున్నాడు. తమ్ముళ్ళని గౌరవంగా పిలిపించాడు. వాళ్ళు ముగ్గురూ వచ్చి, తగిన ఆసనాలమీద కూచున్నాక, భీముడి మొహంచూసి ఇలా అన్నాడు :

"భీమసేనా, నీతమ్ముడు గుర్రంతీసుకువస్తున్నాడని విన్నాను. చైత్రం ఇంకా ఎన్నాళ్ళో లేదు. మునీశ్వర్లనీ, రాజుల్నీ ఆహ్వానించాలిక. శిల్పుల్ని నియోగించి యజ్ఞశాల కట్టించు. తగినవారికోసం విడిదిగృహాలు నిర్మించు" అంటూ ఆజ్ఞాపించాడు.

అన్నగారి ఆజ్ఞప్రకారం బంగారంతో ఘనంగా యజ్ఞశాల కట్టించాడు భీముడు. విడిదిగృహాలున్నూ బంగారంతోనే తయారు చేయించాడు. చూసి మెచ్చుకున్నారు జనులు.

భూలోకంమీదమూలమూలలావున్న మునీశ్వరుల్నీ, రాజుల్నీ పిలుచుకురండని తగిన బ్రాహ్మల్ని పంపాడు. బ్రాహ్మలు వెళ్ళి భక్తిపూర్వకంగా మునీశ్వర్లని ఆహ్వానించారు. రాజుల్ని ఆహ్వానించారు. శిష్యులతో మునులూ, సైన్యాలతోనూ, పరివారంతోనూ రాజులూ సంతోషంతో ధర్మరాజు అశ్వమేధానికి తర్లిరావడ మారంభించారు ఉవ్విళ్ళూరుతూ. భూమండలమంతటినించీ అలా మునులూ రాజులూ రావడంతో పరమానందభరితుడయాడు ధర్మరాజు. స్వయంగా తానే ఎదురువెళ్ళి వాళ్ళందరినీ విడిదిపట్లు చేర్చాడు. ఉత్సాహ వచనాలతోనూ, ఇంపైన పదార్థాలతోనూ రాజుల్ని సంతోషపెట్టాడు.

ఏకొదవాలేకండా భోజనాలూ, పక్కలూ, ఆసనాలూ అమిర్చి పెట్టాడు. మునులకు కందమూలాలూ, పళ్ళూ స్వయంగా పట్టించుకు వెళ్ళి తియ్యనిమాటలతో సమర్పించాడు. ఏమాత్రమూ అహంకారం లేకండా ప్రతిదినమూ ఇలాగే జరిగిస్తూవచ్చాడు. యజ్ఞశాలా, తక్కిన మందిరాలూ గొప్పగా, మనోహరంగా తయారుచేసిన శిల్పులందరికీ మంచిమంచి బహుమానాలిచ్చి సత్కరించాడు.

ధర్మరాజు భీముణ్ణి నియోగించి అలా సలక్షణంగా యజ్ఞశాలా, విడిదిగృహాలూ అవీ సిద్ధంచేయించడం చూసి సంతోషించాడు శ్రీకృష్ణుడు. వచ్చినరాజులున్నూ చూసి ఆశ్చర్యపోయారు.

ధర్మరాజు ఆజ్ఞమీద వెళ్ళి ఉత్తమ పశువుల్నీ* అన్నిజాతుల ప్రజల్నీ పట్టుకువచ్చారు అత్యంత కుశలులైన పరిజనులు. అన్నపర్వతాలూ, నేతి నదులూ సిద్ధమయాయి. బ్రాహ్మల భోజనంకోసం అన్నిపదార్థాలూ సంసిద్ధమయాయి. అన్నిటితోనూ యజ్ఞారంభ సమయం అద్భుతమయింది.

లక్షమంది బ్రాహ్మలు భోజనంచేసిలేస్తే వాళ్ళమాట మోగే భేరీ ఆగకండా ఎప్పుడూ మోగుతూవుండేది. ఇంక ఏంచెప్పాలి ధర్మరాజు అశ్వమేధవైభవం! సముద్రంమధ్యవుండిన భూమండలమంతటి నుంచీ నేల ఈనినట్టు వచ్చిన జనం అక్కడ అవుపించారంటే నమ్మండి. కిరీటాలూ, నగలూ చక్కగా ముస్తాబుచేసుకుని రాజులు తొడతొక్కిడిగా తోసుకుంటూ వెళుతూవుంటే రెండుకళ్ళు చాలవనిపించేవి.

రాజుల్ని కలయచూసి, భీముణ్ణి పిలిచాడు ధర్మరాజు. "వారందరినీ పూజించు!" అన్నాడు. నకులసహదేవుల సాయంతో రాజులందరినీ బహుమానాలతో కూడా గొప్పగా పూజించాడు భీముడు.

---

* మేకల్నీ.

బలరాముడూ, సాత్యకీ మొదలైన యాదవప్రముఖుల్ని వెంటపెట్టుకుని, వికసించిన ముఖపద్మంతో ధర్మరాజుదగ్గిరికి వచ్చాడు శ్రీకృష్ణుడు. బలరాముడూ మొదలైన యావన్మంది యాదవులనూ ప్రియంగా అర్చించాడు ధర్మరాజు.

## అర్జునుడి సందేశం

"ధర్మరాజా," సుఖంగా కూచున్నాక ఎత్తుకున్నాడు శ్రీకృష్ణుడు, "ద్వారకనుంచి ఇప్పుడొకడు వచ్చాడు. మంచి విచక్షణుడతడు. మన అర్జునుడు ద్వారకపరిసరాలనుంచి వెళ్ళడం చూశానన్నాడు. వివిధయుద్ధాలమూలంగా అతడి శరీరం చిక్కిపోయివుందట! ఇక దగ్గిరికివచ్చేస్తున్నాడు. తగిన పనులకోసం త్వరపడు" అన్నాడు.

"నీ ఆజ్ఞప్రకారం వెళ్ళడంవల్ల యోగక్షేమాలతో తిరిగి వస్తున్నాడు తమ్ముడు. నడపవలసిన పనులన్నీ నువ్వే నడుపు" అన్నాడు ధర్మరాజు.

"ద్వారకనుంచి వచ్చినవాడు, తనతో చెప్పి అర్జునుడు పంపిన సందేశం ఏంచెప్పాడో విను" అంటూ ఇలా చెప్పాడు శ్రీకృష్ణుడు: 'నా విన్నపంగా మహారాజుతో విన్నవించు. రాజులందరూ సంతోషంతో యజ్ఞానికి వస్తున్నారు. వెనక వారు మనవిషయంలో ఎలా వున్నా, ఇప్పుడు వారిని పూజించాలి మనం. విశేషించి నా కుమారుడు మణిపురం రాజు బభ్రువాహనుడు వస్తున్నాడు. గుణవంతుడతడు. గురువులంటే పరమభక్తిపరుడు. విచక్షణాపరుడు. అణుమాత్రమూ కీడులేనివాడు. మీ పాదదర్శనమే వ్రతంగాపెట్టుకుని వస్తున్నాడతడు. మీ కృపకి పాత్రుడు.' ఇదీ అర్జునుడు పంపిన సందేశం."

అర్జునుడి సందేశం విని అభినందించాడు ధర్మరాజు. "తమ్ముడు అనేకయుద్ధాల్లో అలజడిపడడం నేను విన్నాను. పాపం, భారతయుద్ధంలో

భీష్మద్రోణులతో పోట్లాడి ఎన్నో కష్టాలు సహించాడతడు. ఇప్పుడున్నా ఇలా బాధలుపడ్డాడు. పరమసౌఖ్యాలనుభవించదగిన తమ్ముడు నా కోసమని ఇన్ని పాట్లు పడుతున్నాడు!

"కృష్ణా, ఒక్కమాట అడుగుతాను నిన్ను. మంచిలక్షణాలన్నీ కలిగిన శరీరం అర్జునుడిది. ఈ కష్టాలు అనుభవించవలసిన దుర్లక్షణం అతడి శరీరంమీద ఎక్కడైనా కనపడిందా నీకు? నాకు అది చెప్పదగిందైతే చెప్పు" అని అడిగాడు.

"నీతో చెప్పదగందంటూ ఏముంటుంది? చెపుతాను, విను. ఉన్న చెడులక్షణం ఒక్కటే. శరీరమంతటా శుభలక్షణాలే వున్నాయి అర్జునుడికి. కాని శరీరానికి తగినట్టు కాక పిక్కలుమాత్రం కొంచెం చిన్నవిగా వున్నాయి. దుర్లక్షణమంటే ఇంతే. దీనివల్ల అలజళ్ళు కలుగుతున్నాయతడికి. తక్కిన అవయవాలన్నీ శుభలక్షణాలతోనే వున్నాయి" అన్నాడు శ్రీకృష్ణుడు.

"అవును, నువ్వన్నదే నిజం కావాలి" అన్నాడు ధర్మరాజు.

అప్పుడు ద్రౌపది ప్రీతిగా విప్పారిన నేత్రాలతో శ్రీకృష్ణుడి వేపు చూసింది. అది అర్జునుడి విషయమైన సంతృప్తి అని అవగతం చేసుకున్నాడు లోకనాథుడు శ్రీకృష్ణుడు. భీముడూ మొదలైనవారూ యాదవులూ అర్జునుణ్ణే మెచ్చుకుంటూ ఆవాళటికి అదే కాలక్షేపంగా గడిపారు.

ఇలావుండగా ఇంతలో అర్జునుడిదగ్గిరనుంచి దూతవచ్చి ధర్మరాజుకి నమస్కరించాడు.

"మహారాజా, అర్జునుడు పట్నం చేరువకివచ్చాడు. రేపు మీ పాదాభివందనంకోసం పట్నం ప్రవేశిస్తాడు" అని విన్నవించాడు.

అర్జునుడు వస్తున్నాడన్నమాట వినడంతోనే ధర్మరాజు శరీరం గగుర్పొడిచింది. కన్నులనుంచి ఆనందాశ్రువులు ప్రవహించాయి.

నగలూ, బట్టలూ, బంగారమూ దూతకి బహూకరించాడు సమగ్రంగా. అంతమందీ ఆనందంలో తేలాడారు. ఆరాత్రి ఎప్పుడు తెల్లవారు తుందా, ఎప్పుడు అర్జునుణ్ణి చూస్తామూ అని వెళ్ళబుచ్చారు.

తెల్లవారింది. పొద్దుదూరింది. అర్జునుడు కాల్యకృత్యాలు తీర్చు కున్నాడు. గుర్రంవెంట హస్తినాపురంలో ప్రవేశించాడు. దేవేం ద్రుడి ఉచ్చైశ్శ్రవంలాగ జనానికి కన్నులపండువుచేసింది గుర్రం. అంత మందీ ఆనందంతో మాట్లాడుకున్నారు : "మన అర్జునుడికి కాక ఈపని ఎవరికి తరమవుతుంది ? గుర్రం తన ఇష్టంవచ్చినట్టు అన్ని దేశాలూ తిరిగింది. అక్కడక్కడి రాజులు సేనలతో వచ్చి అడ్డుకున్నారు. వాళ్ళని గడ్డిపరకలకింద లెక్కచెయ్యలేదితడు. గెలుపు సాధించినపట్ల రాజుల్ని చంపలేదు. అన్నగారిమాట అక్షరాలా పాటించాడు. తాను వొక్కడే అన్న జంకు పిసరంతాలేదు. శరీరం కవచంలో పెట్టినట్టు తిరిగివచ్చాడు. ఎంత చిత్రం ఇది ? సగరుడూ మొదలైన మహా రాజుల విషయం వినలేదా? ఇతడిలాగ మగతనమూ, బలమూ వాళ్ళలో ఎక్కువున్నాయి ? అర్జునుడివంటి వీరుడు ఇంతవరకూ పుట్టలేదు లోకంలో. ఇకముందున్నూ పుట్టబోడు. మానుషమూ, దైవమూ సమానంగా కలిసివచ్చాయి ధర్మరాజుకి. ఇంతభాగ్యశాలి ఎవ డుంటాడు ?"

సముద్ర కల్లోలంలాగ ఈమాటలే వినపడ్డాయి జనంలో. హస్తినాపురంలో అవాళటి ఆ పెంపూ, ఆ సొంపూ కనీవినీ ఎరగ మంటే నమ్మ లోకంలో.

ఇంకా ఇలా చెప్పుకున్నారు జనం :

"ఇతడే రాజులందరూ తెల్లమొహంవేసినట్టు మత్స్యయంత్రం కొట్టి, పాంచాల రాజు కూతుర్ని ద్రౌపదిని చేపట్టాడు. ఇతడే దేవ సేనతోకూడా దేవేంద్రుణ్ణి వోడించి భుజబలంతో ఖాండవవనం

కాల్చాడు. ఇతడే వొంటరియుద్ధంలో శివుణ్ణి మెప్పించి పాశుపతాస్త్రం పుచ్చుకున్నాడు. ఇతడే వొక్కడూ భీష్ముడూ మొదలైన కౌరవ యోధుల్ని వోడించి విరాటరాజు ఆలమందలు మళ్ళించాడు. ఇతడే ప్రతిజ్ఞ చేసి, విషమయుద్ధంలో పొద్దుగూకకండా జయద్రథుణ్ణి హత మార్చాడు.''

ఇలా చెప్పుకుంటూ, సందడిగా మూగుతూ, అరుదెత్తి అర్జునుణ్ణి చూశారు జనులు. ఈమాటలనీ వింటూ, సంతోషిస్తూ, గుర్రం ముందుపెట్టుకుని యజ్ఞశాలదగ్గిరికి వెళ్ళాడు అర్జునుడు. ధర్మరాజూ, నకులసహదేవులూ, భీముడూ, శ్రీకృష్ణుడూ, బలరాముడూ మొదలైనవారు ధృతరాష్ట్రుణ్ణి ముందుంచుకుని అర్జునుడికి ఎదురువచ్చారు. అందరినీ సముచితంగా నమస్కారాదులతో సంతోషం కలిగించాడు అర్జునుడు. గాంధారినీ కుంతినీ చూసి ఈతకాడు తీరం చేరితే ఎలా అవుతాడో అలా అయాడు. అందరూ అభినందిస్తూ అతడిచుట్టూ మూగారు. అంతమందితోనూ రమ్యమైన వొక ప్రదేశంలో ఆగాడు అర్జునుడు.

సరిగ్గా ఆ దేసమయానికి మణిపురంనుంచి బభ్రువాహనుడు హస్తినాపురం వచ్చాడు. అతడితో చిత్రాంగదా, ఉలూపీకూడా వచ్చారు వైభవంగా. తిన్నగా కోటలోకే వచ్చారు వారు. ధర్మరాజూ, భీముడూ, నకులసహదేవులూ, శ్రీకృష్ణుడూ, బలరాముడూ మొదలైన యాదవులూ సంతోషంతో బభ్రువాహనుణ్ణి కలుసుకున్నారు. ఎవరికితగినట్టు వారిని గౌరవసత్కారాలతో పూజించాడతడు. గాంధారీ ధృతరాష్ట్రుల్ని దర్శించి ప్రణామంచేశాడు. కుంతీదేవిని చూసి పాదాభివందనంచేశాడు. మనవణ్ణి కౌగిలించుకుని, ఎన్నో దీవనలిచ్చారువారు. ధర్మరాజుని కొలిచి, తగినచోట కూచున్నాడు బభ్రువాహనుడు. ధర్మరాజూ, అతని తమ్ములూ అతడికి

రత్నాలనగలూ, మంచిమంచి వస్త్రాలూ ఇచ్చారు. బలరాముడూ, కృష్ణుడూ మొదలైనవారున్నూ విలువైన ఆభరణాలూ, వస్త్రాలూ అవీ ఇచ్చారు.

చిత్రాంగదా, ఉలూపీ ముందు గాంధారినీ, కుంతీదేవినీ దర్శించారు. ఇద్దరినీ గాఢంగా కౌగిలించుకుని దీవించారువారు. ఇద్దరికీ మణులు తాపిన బంగారం నగలు బహూకరించారు. అనంతరం చిత్రాంగద ఉలూపులు ద్రౌపదినీ, సుభద్రనీ చూశారు. తగినవిధంగా వారిని పూజించారు. సంతోషించి, తగిన ఆసనాలమీద కూచోపెట్టి కులాసాగా ప్రసంగించారు ద్రౌపదీ సుభద్రలు.

అదిగో అలాగ అశ్వమేధయజ్ఞం ఎంతోగొప్పగా జరిగింది. అనుకున్న దినంవచ్చింది. వ్యాసముని ధర్మరాజుదగ్గిరికి వచ్చాడు.

"ధర్మరాజా, యాజ్ఞికులు సుముహూర్తం దగ్గిరపడిందంటున్నారు. యజ్ఞం ఆరంభించు. మహనీయమైంది నీ యజ్ఞం. మహాధనవంతుడి వయావు నువ్వు. దక్షిణలు ముబ్బడిగా ఇచ్చి, మూడుయజ్ఞాల ఫలం పొందు. అశ్వమేధ అవబృథం పరమపావనమైంది. సమస్త పాపాలూ పోగొడుతుంది. భారతయుద్ధంలో జరిగిన జ్ఞాతివధ పాపం అనే సందేహం నిన్ను బాధపెడుతూవుంది. అదంతా దీంతో వొదిలిపోతుంది. సమస్త శుభాలూ కలుగుతాయి" అన్నాడు.

## అ శ్వ మే ధ ం

ప్రాజ్ఞులలో ప్రాజ్ఞుడు ధర్మరాజు. వ్యాసమునిమాట విని అన్ని విధాలా సంసిద్ధుడయాడు. గొప్ప పూనికతో, ప్రీతి పూర్వకంగా యజ్ఞం నడిపించాడు. బృహస్పతి వంటి యాజ్ఞికులు క్రమయుక్తంగా క్రియలన్నీ సాగించారు. పస్ఖలితమూ లేకుండా, అపహాసితమన్నది చొరకండా చక్కగా జరిగింది యజ్ఞం. సావధానులై యజ్ఞక్రియలన్నీ

పండితసమ్మతంగా జరిగించారు ఋత్విజులు. వేదవాక్యాలతో అభ్యుదయంకలిగినట్టు చేశారు. శ్రీకృష్ణుడూ, తక్కిన యావన్మందీ ఔరా అన్నట్టు అన్నీ జరిగించారు.

ఆ యజ్ఞంలో వివిధ భోజనపదార్థాలతో తృప్తిపడకండా వెళ్ళినవాడు వొక్కడూ లేడు. ధనధాన్యాలూ, వస్త్రాలూ పుచ్చుకుని దారిద్ర్యం పోనివాడు వొక్కడూ లేడు. కోరినవస్తువు దొరకలేదు అని అసంతృప్తితో వెళ్ళినవాడు వొక్కడూలేడు. ఏదైనా దుఃఖంకలిగివచ్చి, అదిపోకండా వెళ్ళినవాడు వొక్కడూ మందుకైనాలేడు. "తినండి," "కట్టండి," "ఇష్టంవచ్చిన వస్తువులు తీసుకోండి," "దురవస్థ తొలిగించుకోండి" అని పలుకుతూవుండేవాడు తిరిగి తిరిగి భీముడు.

ఆ యజ్ఞసభలో వ్రతంమీద అభిరతి లేనివాడులేడు. ఉపాధ్యాయుడు కానివాడు లేడు. నిగమాంగ పట్కంలేనివాడు లేడు. అలాంటి సదస్యులు దేవేంద్రసభలో మునీశ్వర్లు తప్ప మరెక్కడా వుండరు.

ఆ యజ్ఞం చూడడానికి దివ్యమునీంద్రులు వచ్చారు. చూసి అభినందించారు. గంధర్వులు వచ్చి ఆనందంతో గానంచేశారు. అప్సరసలు వచ్చి ఆనందంతో నృత్యంచేశారు. సిద్ధులు వచ్చి ఆశీర్వాదాలతో సేసలు చల్లారు. ఆదిసార్వభౌములైన పదహారుగురూ చేసిన యజ్ఞంతో సమానంగా జరిగింది ధర్మరాజు యజ్ఞం. ఆమాటకివస్తే అంతకంటె గొప్పగా జరిగింది. ఏవిధానా ఎందునా తక్కువకాదు ధర్మరాజు యజ్ఞం.

బంగారం ఇటికలు పేర్చి, పద్దెనిమిదిచేతుల గరుడపక్షి రూపం లక్కతో చేసి పూజించారు. మహనీయమైన యూపక్రియా సమయాన ఆరు చంద్రకర్రలూ, ఆరు మోదుగుకర్రలూ రెండు దేవదారు కర్రలూ, ఒక విరుగుడుకర్రా ఇలా ఇరవై వొక్క యూపాలూ, శోభకి మరిన్ని బంగారం యూపాలూ శాస్త్రప్రకారం నిలిపారు

యాజకులు. వాటిలో నాలుగుకాళ్ళవాటిని, పక్షుల్ని, జలచరాల్ని విధియుక్తంగా సంయోజించారు. అలా మున్నూరు పశువులు ఆ మహాయజ్ఞానికి అవసరమయాయి. వాటిని యూపస్తంభానికి కట్టిన గుర్రం చుట్టూ నిల్పడంతో దక్షయజ్ఞంలా సుందరంగా అవుపించింది. యాజకులందరిలోనూ అలంకారంగా ప్రకాశించారు వ్యాసమునీంద్రుడి శిష్యులు. సర్వపశువుల్నీ వినియోగించి, యజ్ఞకర్మలో గుర్రాన్ని చంపినప్పుడు ఋత్విజులు ద్రౌపదిని తీసుకువచ్చారు. గుర్రం అవయవాల మాంసం ఆయా దేవతలకు ఆహుతులిచ్చినప్పుడు ద్రౌపదీదేవి నిజహస్తాలతో చెయ్యదగిన పనులు ఆమెచేత చేయించారు. అనంతరం గుర్రం వప హోమం సమయంలో ఆ గంధం వాసనచూసి ధర్మరాజు తమ్ములతో పరమానందం పొందాడు. మిగిలిన గుర్రం అవయవాలు తగినవిధంగా యాజకులు వేల్చారు.

అలా ధర్మరాజు అశ్వమేధం అఖిలలోకహితంగా నిర్వహించాడు వ్యాసముని. ధర్మరాజుగురించి ఉదాత్తమైన ఆశీర్వాదం చేశాడు. దేవతలూ, మునులూ యావన్మందీ ఆశీర్వాదాలు చేశారు.

సదస్యులకి భక్తిపూర్వకంగా కోటివేలు నిష్కాలు * ఇచ్చాడు ధర్మరాజు. తన రాజ్యం యావత్తూ వేదవ్యాసుడికి ధారపోశాడు. సంతోషంతో రాజ్యం పుచ్చుకున్నాడు వ్యాసుడు. పుచ్చుకుని ఇలా అన్నాడు :

"ఋత్విక్కులమైన మాకు రాజ్యమిచ్చావు సంభావన. మేము బ్రాహ్మలం. అంచేత ధనరూపమైన దక్షిణ కోరుతున్నాం. కనక గౌరవంగా బ్రాహ్మలు కోరిందే ఇవ్వడం ధర్మం నీకు. రాజ్యానికి వెలగా బంగారం మాకు ఇయ్యి."

దానికి బ్రాహ్మలందరూ వింటూవుండగా ఇలా అన్నాడు

* మాడ, లేదా నూటాఎనిమిది మాడలు.

ధర్మరాజు: "అశ్వమేధానికి దక్షిణ భూమి అంటారు పెద్దలు. అందు కని అర్జునుడు గెల్చి తెచ్చిన భూమి ప్రీతిగా ఋత్విక్కుల కర్పించాను.

"అడివికి వెళతాన్నేను. సుఖంగా అడివిలో నివసిస్తాను. అంతే కాని బ్రాహ్మలకిచ్చేసిన ధనం తిరిగీ పుచ్చుకోను" అన్నాడు.

"అవును, అదే సరైనపని మరి మీరు చెప్పకండి" అన్నారు ద్రౌపదీ, తమ్ములూ కూడా ప్రీతిగా. ఈమాటలు విన్నవాళ్ళందరూ సంతోషంతో పులకరించారు. ఆనందబాష్పాలు కురిపించారు. ఆకాశం మీంచి దివ్యవాణి ధర్మరాజుని కీర్తించింది. యావన్మందీ పదేపదే ప్రశంసించారు. మెచ్చుకుంటూ వ్యాసముని, "ధర్మరాజా, మేము అమ్మతామంటున్నాం భూమి. కొనడం సరైనమార్గం. ఇందులో తప్పేమీ లేదు. బ్రాహ్మల కోరిక నెరవేర్చు ప్రీతిగా" అన్నాడు.

"మహారాజా," అంటూ కృష్ణుడు కలగచేసుకున్నాడు, "ఈ మునీంద్రుడి మాటప్రకారం చెయ్యి."

కృష్ణుడు చెప్పాక అంగీకరించాడు ధర్మరాజు. తమ్ములతో ఆమాటే చెప్పాడు. కోటికోట్ల మాడలు వ్యాసమునిముందు కుప్ప పోశాడు. "భూమివెల" అన్నాడు. అదంతా పుచ్చుకుని ఋత్విజులకి పంచిపెట్టాడు వ్యాసుడు.

అనంతరం బంగారంతో చేసిన యజ్ఞశాలా, యూపాలూ, తోరణాలూ, భాండాలూ, దండాలూ, శయ్యలూ, ఆసనాలూ-అన్నీ బ్రాహ్మలకి పంచిపెట్టాడు ధర్మరాజు. అంతేకాదు, రాజులకీ, కోమట్లకీ, శూద్రులకీ, అన్యజాతులకీ, మ్లేచ్ఛులకీ ఇంతా అంతా అన లేని ధనం, బంగారం దానంచేశాడు. యావన్మందిజనులూ బంగారంతో పరితృప్తులయారు. ధర్మరాజుని పొగడుతూ నిజనివాసాలకు వెళ్ళారు సంతోషంతో తేలుతూ. దానంలో రెండో మరుత్తుడనిపించుకున్నాడు ధర్మరాజు. అలాటి దానం ఇంకెక్కడా కనీవినీ ఎరగం నిజంగా.

తన వంతుకి దొరికిన బంగారం కుంతీదేవికిచ్చాడు వ్యాసుడు. అదంతా ధర్మకార్యాల్లో వినియోగించిందామె.

సమస్త బంధువులతోనూ, యావన్మంది రాజులతోనూ కలిసి అవబృథస్నానం చేశాడు ధర్మరాజు. పవిత్రశరీరుడయ్యాడు. మనస్సు లోంచి సర్వకల్మషాలూ పోగొట్టుకున్నాడు. స్వర్గం జయించినట్టు ప్రకాశించాడు. వ్యాసముని పాదాలమీద తన వెడల్పాటి నొసలు మోపి సాగిలబడ్డాడు. అతణ్ణి అనేకవిధాల స్తుతించి సాగనంపాడు. శిష్యకోటితో కూడా అంతర్థానుడయ్యాడు వ్యాసమునీంద్రుడు.

తమ్ములూ, యజ్ఞానికి వచ్చిన యావన్మందిరాజులూ - వీరందరి మధ్య చుక్కల్లో చంద్రుడిలా వెలిగిపోయాడు ధర్మరాజు. రాజు లందరికీ మణిభూషణాలూ, ఏనుగులూ, గుర్రాలూ, సానులూ ఇచ్చా డతడు. అవన్నీ ఇస్తూవుంటే కుబేరుడిలా అవుపించాడు. బభ్రువాహ నుణ్ణి ప్రత్యేకమైన ప్రేమతో ఆదరించాడు. ఎన్నో అన్ని మేలివస్తువు లిచ్చి ప్రీతిపూర్వకంగా మణిపురానికి సాగనంపాడు. చిత్రాంగదా, ఉలూపీ అర్జునుడిదగ్గిర వుండిపోయారు. ముందేవచ్చివుండిన దుస్సలను ఎంతో గౌరవించాడు ధర్మరాజు. ఆమె మనవణ్ణి సింధుదేశానికి అభిషేకించాడు. వివిధ దేశాల రాజులందరినీ విభక్తరాజ్యలుగా అంగీకరించి వారితో స్నేహంకట్టాడు. అలా అంతమందిరాజుల్నీ ఆనంద పరిచి సాగనంపాడు. శ్రీకృష్ణుడికి గొప్పగొప్ప వస్తువులు ఉపహార మిచ్చాడు. దేవోపచారాలతో అతణ్ణి ఆరాధించాడు. కృతార్థుడయ్యాడు. బలరాముడికి భక్తిపూర్వకంగా వివిధరత్నాల వస్తువులు అర్పించి పూజించాడు. అలా అతనికి పరమసంతోషం కలిగించాడు. సాత్యకి మొదలైన యాదవప్రముఖులకి అతిలోకమైన రకరకాల పదార్థా లిచ్చాడు. అందరినీ సముచితంగా ద్వారకా నగరం సాగనంపాడు. అనేక దేశాలనుంచి వచ్చిన జనులకి అన్నపానాలూ, బంగారమూ,

వస్త్రాలూ మొదలైన విలువైన పదార్థాలూ దానంచేసి సంతోష పరిచాడు. మహాధ్వనితో దిక్కులు పిక్కటిల్లినట్టు వినిపించిన మంగళ తూర్యాలూ, పుణ్యపాఠాలూ, ఆనందగానాలూ వింటూ తన రాజ మందిరానికి వేంచేశాడు.

వైశంపాయనుడు చెప్పిన అశ్వమేధ కథ విని జనమేజయుడు, "అయితే మహాత్మా, మా పితామహుడి అశ్వమేధ యజ్ఞ సమయంలో ఆశ్చర్యకరమైన విషయం ఏమైనా జరిగిందా?" అని అడిగాడు.

## సక్తు ప్రస్థుడి కథ

వైశంపాయనుడు ఇలా అందుకున్నాడు :

లెక్కాజమా లేనంత ధనం లభించి భూమండలంలోని బ్రాహ్మ లందరూ సంతోషించారు. అశ్వమేధ యజ్ఞం ఉజ్వలంగా జరిగింది. తేనెలతో ధర్మరాజుమీద పూలవాన కురిసింది. అంతమందీ ఆశ్చర్య పోయారు.

అప్పుడు దగ్గిర బిలంలోంచి ఒక ముంగి బయటికివచ్చింది. బ్రాహ్మలమధ్య నిలబడి అది, "సక్తు ప్రస్థుడి ధర్మం ముందు ఏపాటిది ఈ అశ్వమేధం?" అంది. విస్మయంతో ముంగినిచూసి అడిగారు బ్రాహ్మలు, "ఏమిటి ఇలా అంటున్నావు ముంగీ? ఏంలోటు కని పెట్టావు నువ్వు? మంత్రాలూ, తంత్రాలూ, దానాలూ, త్యాగాలూ అన్నీ లోకం మెచ్చుకున్నట్టు జరిగాయి. ధర్మరాజు భక్తీ, శ్రద్ధా, ప్రియమూ, వినయమూ దేవతలూ, మునులూ మెచ్చుకుని సంతో షించారు. మరేం పట్టంవచ్చిందట?"

"వినండి" అంటూ ఇలా చెప్పింది ముంగి, "ధర్మక్షేత్ర మైన కురుక్షేత్రంలో ఒక మహాబ్రాహ్మడుండేవాడు. కామక్రోధాలు లేకండా ఉంఛవృత్తితో బతుకుతూ వుండేవా డతడు. భార్యా, కొడుకూ

రుడూ, కోడలూ అతడితో కలిసివుండేవారు. అలా తపస్సంపదతో ఆ బ్రాహ్మణ కుటుంబం బతుకుతూవుండగా వోమారు అనావృష్టి దోషం పట్టి తృణధాన్యాలు ఏవీ పండకండాపోయాయి. బ్రాహ్మడికి ఆహారం దొరకడం దుర్ఘటమైపోయింది. తానూ, భార్యా, కొడుకూ, కోడలూ - నలుగురూ అతికష్టంమీద దొరికిన గడ్డిగింజ లేరుకువచ్చే వారు. వాటితో వారి ఆకలి తీరేదికాదు.

ఒకనాడు వాళ్ళునలుగురూ పొద్దున్న వెళ్ళి అపరాహ్ణందాకా వెదికి వెదికి ఏరుకువచ్చారు గడ్డిగింజలు. అవన్నీ ప్రస్థమాత్రం (కుంచెడంత) సక్తువు (పేలపిండి) అయాయి. కాల్యకృత్యాలు తీర్చు కున్నాక, ఆ కుంచెడు పేలపిండీ చెరోనాలుగూ సమంగా పంచుకుని ఉపయోగించుకోవాలని సిద్ధపడ్డారు వారు.

సరిగ్గా అదేసమయానికి వొక బ్రాహ్మడు అతిథిగా వచ్చాడు వారింటికి. ప్రియంగా ఎదురువెళ్ళాడు బ్రాహ్మడు. భక్తిపూర్వకంగా తమ పర్ణశాలలోపలికి తీసుకువచ్చాడు. ఆసనంవేసి కూచోపెట్టాడు. అతడి పాదాలు కడిగాడు. మధురవాక్యాలతో సేద తీర్చాడు. తన భాగం పేలపిండి చూపించాడు. 'మహాత్మా, పాపంలేకండా ఆర్జించిన పేలపిండి ఇది. దయతలిచి దీంతో నీ ఆకలి తీర్చుకో' అని సమర్పించాడు. ఆ పేలపిండి తినేశాడు అతిథి. కాని దాంతో అతని ఆకలి తీరలేదు. అది చూసి, 'ఏందారి? ఏమిచ్చి ఇతని ఆకలితీర్చడం!' అంటూ విచారంతో డోలాందోళితుడయాడు బ్రాహ్మడు. అతడి ఇంగితం తెలుసుకుంది అతడి భార్య. 'నావంతు పిండి ఇచ్చేస్తాను. దీంతో ఈ అతిథిని తృప్తిపరుచు' అంది.

భార్య ఆకలిదప్పులు ఎరుగునతడు. 'మృగాలూ, పక్షులూ కూడా ఆహారం తెచ్చి తమతమ భార్యలకిస్తాయి. అలాటిది నీ ఆహారం తీసుకోడం తగినపనేనా నాకు? స్త్రీని సంతోషపెట్టాలని తెలుసు

క్కోని అధముడు ఇహంలో దుఃఖాలనుభవిస్తాడు. పరలోకంలో యమదూతలచేత బాధపడతాడు' అన్నాడు.

"'చుట్టమైనా పక్కమైనా భర్తే స్త్రీకి' అతడి మొహం చూస్తూ అంది భార్య, 'భర్తే చెలి. భర్తే తల్లి. భర్తే తండ్రి. భర్తే గురువు. భర్తే దేవుడు. అంచేత భర్త పని చెయ్యడమే ధర్మం భార్యకి. అంతేకాదు, నువ్వు ఆకలితో వుంటే నాకు వంతేమిటి! ఇది దోషం. నువ్వు తిననప్పుడు నేను తింటానా? కనక ఈ అతిథికి నా భాగం పేల పిండి సమర్పించు తగినట్టు' అంటూ తన వంతు పిండి ఇచ్చేసింది. అది తీసుకుని బ్రాహ్మడు అతిథిముందు పెట్టాడు. 'నీ ఆకలి తీరలేదు. ఇది కూడా పుచ్చుకో' అన్నాడు. సంతోషంతో అదికూడా తినేశాడతడు. అయినా తృప్తి పొందలేదు. అది తెలుసుకుని మళ్ళీ విచారంలో పడి పోయాడు బ్రాహ్మడు. ఈ పరిస్థితి కనిపెట్టాడు కుమారుడు. తనవంతు పిండి తండ్రిదగ్గిర పెట్టాడు. 'దీంతో అతిథిని తృప్తిపరుచు. తండ్రి మనసుకి నచ్చినపని చెయ్యడం కుమారుడిధర్మం' అన్నాడు.

"అది విని, 'నాయనా, ఎంతవయస్సు వచ్చినా కుమారుడు బాలుడే తండ్రికి. బాలుడి ఆకలి అధికం. అంచేత ఇది అనుచితం' అన్నాడు మునీంద్రుడు.

"తానే పుత్రుడు అని వింటున్నాను. * నన్ను కాపాడడమంటే నిన్ను నువ్వు కాపాడుకోడమే అన్నమాట. కనక ఈ పిండి ఈ మహాత్ముడికి ఇచ్చి నన్ను కాపాడు' అన్నాడు కుమారుడు.

"కోడుకుమాటలు విని సంతోషించాడు ముని. అతడివంతు పిండి అతిథిముందు పెట్టాడు. పుచ్చుకుని తినేశాడు అతిథి. దాంతో కూడా అతడి ఆకలితీరలేదు. 'ఇప్పుడేందారి?' అంటూ మళ్ళీ విచారించాడు బ్రాహ్మడు. అది అవగతంచేసుకుంది కోడలు. తనవంతుపిండి మామగారి ముందుపెట్టింది. 'ఇదికూడా అతిథికి సమర్పించండి' అంది.

* ఆత్మావై పుత్రనుమాసి.

" 'అయ్యో, ఆకలితో అలిసిపోయావు నువ్వు. నీశరీరం చిక్కిపోయింది. నీ అవయవాలు శిథిలమైపోయాయి. మనస్సు మాసిపోయింది. ఇదంతా చూస్తూ ఎలా సహించనూ? నీ తిండి తీసుకుని నీ అవస్థ చూడలేను' అన్నాడు.

" 'అలా అనకండి' అంది కోడలు, 'నా గురువులు మీరు. ఈ ప్రాణాలూ, ఈ అవయవాలూ గురువుల శుశ్రూషకోసమేకదా! నన్ను ఈవిధంగా మీ సేవ చెయ్యనివ్వండి. అనుగ్రహించండి.'

" ఆమెమాటలు విని అంగీకరించాడు మునీంద్రుడు. కోడలివంతు పేలపించి అతిథిముందు పెట్టాడు. పుచ్చుకుని ప్రీతిగా తినేశాడు అతిథి. తృప్తిపడ్డాడు. కలకలా వికసించిన మొహంతో కపటంలేకండా అన్నాడు. 'అయ్యా, గుణవంతుల్లో గుణవంతుడివి నువ్వు. నిన్ను చూడాలని వచ్చాను. యమధర్మరాజున్నేను. నీ వ్రతశీలం చూసి మెచ్చుకుంటున్నాను. అతిథులంటే భక్తీ, వినయమూ, శ్రద్ధా, తియ్యనిపలుకూ, ఓర్పూ, దయా వుండాలి. ఇవన్నీ నీలో వున్నాయి స్థిరపడి. నీదానం చూసి దేవతలూ, యక్షులూ, సిద్ధులూ, ఆశ్చర్యపోయి అభివర్ణిస్తారు. ఇదిగో ఆకాశమార్గాన సందడిగా తోసుకు వస్తున్నారు.

"యమధర్మరాజు నోట్లోమాట నోట్లోనేవుంది, దేవేంద్రుడు పూలవాన కురిపించాడు. దేవదుందుభులు మోగాయి.

" 'నిన్ను చూడాలన్న కుతూహలంతో ఏడుగురు మహామునులు తహతహ పడుతున్నారు. సజ్జనులు కీర్తించదగిన మహాత్ముడివి నువ్వు. భార్యతోనూ, కుమారుడితోనూ, కోడలితోనూ కలిసి స్వర్గానికి దయచెయ్యి. ప్రజ్ఞ ఆకలి హరిస్తుంది. దయ తృష్ణ హరిస్తుంది. ఇది తెలుసుకుని వీటిని గెలిచావు నువ్వు. ఆలుబిడ్డలనక అతిథిపూజ చేశావు. ఈ

పుణ్యానికి తగినట్టు నిన్ను సకుటుంబంగా తనలోకానికి తీసుకువెళ్ళడానికి విమానం పంపిస్తాడు బ్రహ్మదేవుడు. విను, గొప్ప గొప్ప దానాలూ, మహనీయమైన యజ్ఞాలూ పవిత్ర వృత్తితో ఆర్జించిన దానితోచేసిన అతిథి సత్కారంతో సాటిరావు. తగిన సమయంలో అతిథికి చేసినదానం తక్కువైనా గొప్పధర్మమే అవుతుంది' అంటూ తన దివ్యరూపు కనపరిచాడు యమధర్మరాజు.

"అంతలోనే మణులు తాపిన బంగారం దేవవిమానం ఆకాశంమీద అవుపడింది. అందరూ ఆశ్చర్యపోయారు. అప్పుడు సక్తుప్రస్థుడు తానూ తనవాళ్ళూకలిసి ధర్మదేవతకి దండప్రణామాలు చేశాడు. చేతులు జోడించి నుంచున్నాడు.

"'అదిగో బ్రహ్మపంపిన విమానం చూడు' అన్నాడు యమధర్మరాజు. అతడు అలా అనడమూ, విమానం కిందికి దిగడమూ వొక్కమారే జరిగాయి.

"'నువ్వూ, నీ భార్యా, కొడుకూ, కోడలూ సంతోషంతో విమానమెక్కండి. దివ్యమార్గాన బ్రహ్మలోకం వెళ్ళండి' అన్నాడు యమధర్మరాజు. సక్తుప్రస్థుడు సకుటుంబంగా దేవవిమానం ఎక్కాడు. సంతోషంతో బ్రహ్మలోకం వెళ్ళాడు. అదంతాచూస్తూ నాబిలంలోంచి బయటికి వచ్చావున్నాను. పేలపిండివాసనా, అతిథికాళ్ళు కడిగిన బురదా నా శరీరానికి తగిలాయి. సక్తుప్రస్థుడు ధర్మమహిమ వల్ల నా శిరస్సూ, వోపక్కా బంగారమే అయిపోయాయి. అవాళనుంచి నేను దానధర్మాలు జరిగేచోట్లకీ, పుణ్యాశ్రమ భూములకీ, వివిధ యజ్ఞాలుజరిగే స్థలాలకీ వెళుతూవుంటాను. మిగిలిన పక్క బంగారం అవుతుందేమో అని నా ఆశ. ఎక్కడికి వెళ్ళినా రెండో వేపు బంగారం కాలేదు. 'లోకోత్తరచరిత్రుడు ధర్మరాజు అశ్వమేధం చేస్తున్నాడు. అక్కడ నా కోరిక సిద్ధిస్తుంది అని గంపెడంత

ఆశపెట్టుకువచ్చాను. కసింతైనా విశేషం కనపడలేదు. విన్నారా ? ఈ కారణంచేత ఉంఛవృత్తితో బతికిన సక్తుప్రస్థుడి ధర్మంతో ఈ యజ్ఞం సరికాదు" అంటూ ఆ ముంగిస ఎక్కడికో వెళ్ళిపోయింది తెలియకండా. జనమేజయా, మీ తాతగారి యజ్ఞంలో ఈ వింత మాత్రం జరిగింది, నీకు వినిపించాను.

"మునీంద్రా," మళ్ళీఅడిగాడు జనమేజయుడు, "యజ్ఞం అంటే రాజులూ, తపస్సు అంటే మునులూ, శాంతిఅంటే బ్రాహ్మలూ ఆసక్తు లవుతారు. అంచేతనే కదా ఎంతోమంది రాజులు పూర్వం యజ్ఞాలు చేశారు; సద్గతులు పొందారు. ధర్మరాజు ఎంతోగొప్పగా పూర్వ రాజులకంటే అధికంగా, సత్యం పాటించి, శౌచం పాటించి, భక్తి శ్రద్ధలు పాటించి, దానం అధికంగాచేసి అశ్వమేధయజ్ఞం నిర్వహిం చాడు. వేదవ్యాసుడు మొదలైన మహామునులున్నూ మెచ్చు కున్నారు. దేవేంద్రుడిలా యజ్ఞం పూర్తిచేశాడు మాతాత. అలాంటి పరమధర్మం ముంగిస గర్హించింది. దీనికి ఏమిటి కారణం ?"

దానికి వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

ధర్మరాజు యజ్ఞం నువ్వుచెప్పినట్టు గొప్పదే. కాదనను. అయితే వొక్కటి చెపుతాను, విను. హింసతోకూడిన పశుయజ్ఞమది. సక్తుప్రస్థుడు చేసింది అహింసతోకూడిన యజ్ఞం. అంచేత హింసా త్మకమైన యజ్ఞంకంటే అహింసాత్మకమైన యజ్ఞంగొప్పదని చెప్పింది ముంగిస. ఉత్తిమాటలతో కాక తన శిరస్సూ, శరీరమూ సగం బంగారం కావడంకూడా చూపింది నిదర్శనంగా. అంచేత దాని మాట కొట్టెయ్యడానికి వల్లకాదు. దీనికి సంబంధించి వొక ఇతిహాస ముంది. చెపుతాను, సావధానంగా ఆలకించు.

## అహింసా యజ్ఞం గొప్పది.

దేవేంద్రుడు పూర్వం వోమారు యజ్ఞం చెయ్యడానికి పూను కున్నాడు. మహామునులూ, దేవతలూ కలిసి ఋత్విక్కుల నేర్పరి

చాను. సాంప్రైనవేదిక తయారుచేశారు. అగ్నికార్యం నడపడంకోసం అర్హాలు పశువులు పట్టుకువచ్చారు. వాటినిచూసి మునుల మనస్సు కరిగింది. దేవేంద్రుడి మొహంచూసి, "అయ్యో, హింస ధర్మంకాదు. కృతయుగం ఆరంభమైంది. మూడేళ్ళపాతపడిన బీజాలు యజ్ఞసాధనాలిప్పుడు. వేదోక్తప్రకారం అహింసా యజ్ఞం చెయ్యి. అది ఉత్తమమైన ధర్మోదయం కలిగిస్తుంది నీకు. పశువుల్ని కనికరించు" అన్నారు.

వారిమాటలు ఆదరించలేదు దేవేంద్రుడు. దాంతో మునీశ్వర్లకీ దేవేంద్రుడికీ వివాదంపుట్టింది. దేవతలు దేవేంద్రుడిపక్షం నిలబడ్డారు. వివాదం పెరిగింది. ఇంతలో ఉపరిచర వసువు అక్కడికి వచ్చాడు. కర్మకాండలో అంతటివాడు లేడు. దేవతలూ మునులూ అతణ్ణి తగు మనిషిగా పెట్టి తగువు తీర్చమన్నారు. దేవతలవేపు పక్షపాతం కనపరిచాడతడు. యజ్ఞంలో పశువుల చంపడమే కర్తవ్యమని తీర్పు చెప్పాడు. దానివల్ల అధఃపాతం ప్రాప్తించిందతడికి. కనక హింసలేని యజ్ఞం పూజనీయమైంది అనడానికి సందేహంలేదు.

అంతేకాదు. ఉంఛవృత్తితో బతుకుతున్న బ్రాహ్మడు ప్రాణాలు నిలుపుకుందికని తానూ తనవాళ్ళూ తినడానికి సిద్ధంచేసుకున్న పేలపిండి అతిథికి అంతా సమర్పించాడు. నిజంగా అది మెచ్చదగింది కాదూ అన్నిటికంటే?

"అవును నిజం" అన్నాడు వైశంపాయనుడు చెప్పింది విని జనమేజయుడు, "ధర్మార్జితం అంతగొప్పదన్న మాట. ధర్మార్జితంతో చేసిన దానమహిమ ఇంకా వినాలనుందినాకు. కనక మరింత స్పష్టంగా వివరించు" అని అడిగాడు.

జనమేజయుడు మళ్ళీ ఇలా అందుకున్నాడు:

## అగస్త్యముని యజ్ఞకథ

ఈ విషయంలో వొక ప్రసిద్ధమైన ఇతిహాసముంది. వినిపిస్తాను, విను. పన్నెండేళ్లు యజ్ఞం చేశాడు అగస్త్యముని. దానికి దివ్యాను భావంకల పరమమునులు ఋత్విజులై కూచున్నారు. తమ ప్రౌఢత్వం కొద్దీ సకల తంత్రాలూ సాగించారు. అయితే ఆ సమయంలో ఇంద్రుడు వానలు కురియలేదు. ఓషధులు ఓటుపడిపోయాయి. అదిచూసి మునులు: "అన్నదాన విధులు ఎలా సాగుతాయి? ఇతడు పన్నెండేళ్ల యజ్ఞదీక్ష పూనాడు. ధర్మ మార్గాన లభించిన ద్రవ్యం తప్ప మరొకటి వినియోగించడు. వానలా కురియవు. ఏందారి?" అంటూ తమలో తాము గుసగుసలాడారు. ఈ మాటలు అగస్త్యముని చెవిలో పడ్డాయి. "మునులారా, న్యాయం కలిగి, యజ్ఞంలో విఘాతం కలగకండా మేఘాలుపంపి దేవేంద్రుడు తుష్టిగా వానలు కురిపించకపోతే నేనే ఆ దేవేంద్ర పదవి పుచ్చుకుంటాను. మహాద్భుతంగా లోకాలు పాలిస్తాను. అంచేత విచారించకండి మీరు. కాదంటారా, ముల్లోకాల్లోనూ వున్న ద్రవ్యకోటులు మీ పాదాల దగ్గిరికే తేగలను అనాయాసంగా. అంతచేయాలా అంటారా, ఉత్తరకురుభూములు ఆరపండి వున్నాయిప్పుడు. యజ్ఞకాలంలో అవసరమయి అన్నాలకోసం కావలిసిన ధాన్యాలు తలుచుకున్నంత మాత్రాన వస్తాయి ఇక్కడికి.

"ఆ బాధ ఎందుకూ? నిర్మలమైన ధాన్యంతో నేను హావిస్సు వంటకంచేస్తే ప్రపంచం వానలు లేకండా చెడుతుందా? యజ్ఞం విఘ్నపడుతుందా? ఎందుకూ మీకు ఈ విచారం?" అన్నాడతడు.

"నువ్వు ధర్మంగా లభించిన వస్తువులే వినియోగించే వాడివి. అసమానమైన తపస్సు వ్యయం చెయ్యడమెందుకు? దేవేంద్రుడిమీాద కోపమెందుకు? ముల్లోకాల ధనం హరించడమెందుకు? ఉత్తరకురు భూముల ధాన్యం తేవడమెందుకు? బీజాల హావిస్సుతో ఫలం ఆశించడ

మెందుకు? మాకోసం ఇన్నిమార్గాల పరిగెత్తింది నీ మనస్సు! వద్దు. నీ మనస్సు కుదుట పరుచుకుని సుఖంగావుండు. మేము మాసుకృతాల వల్ల కావలిసిన ఆహారాలు సులభంగా తెచ్చుకుంటాం" అన్నారు మునులు.

వారు అలా అంటునే వున్నారు, గుంపులు గుంపులు నల్లటినీటి మేఘాలు పంపాడు దేవేంద్రుడు వాన కురియడంకోసం. అంతేకాదు, గురువు బృహస్పతిని వెంటపెట్టుకుని అగస్త్యముని దగ్గిరికి వచ్చాడు "నన్ను కాపాడు, కాపాడు" అంటూ.

అలావచ్చిన దేవేంద్రుణ్ణి గౌరవించి గొప్పగా అర్చించాడు అగస్త్యుడు. శాంత వచనాలుచెప్పి సంతోషం కలిగించాడు మునులు మెచ్చినట్టు. గౌరవంతో దేవలోకానికి సాగనంపాడు. లోకం సంతోషించింది. అతడి యజ్ఞం దివ్యంగా ప్రకాశించింది. యజ్ఞం సమాప్తమైననాడు వినయంతో పరమమునుల కర్చన లర్పించాడు అగస్త్యుడు. వారందరూ ప్రీతులై తమ తమ నివాసాలకు వేంచేశారు.

ఇలా హింసారహితంగా యజ్ఞం సుప్రయోగంచేసి పరమ ప్రశస్తిపొంది ప్రకాశించాడు అగస్త్యుడు. కనక ధర్మమార్గాన లభించిన ద్రవ్యంతో తపోమయం బైనయజ్ఞం ప్రాజ్ఞులు ప్రశంసిస్తారు.

"అయితే ముంగిస మనిషి భాషలో బ్రాహ్మలతో మాట్లాడింది కదా, ఎవ్వరది?" అంటూ మళ్ళీ అడిగాడు జనమేజయుడు, "ఎవ్వరో మహాజ్ఞాని అయివుంటాడనిపిస్తోంది నాకు. ప్రసంగవశాత్తూ నువ్వే చెపుతావని ఇంతవరకూ వూరుకున్నాను. చెప్పదగిందే అయితే చెప్పూ."

"పుణ్యాత్ముడివి నువ్వు. నీకు చెప్పదగని విషయమంటూ ఏదీ లేదు" అంటూ ఇలా అందుకున్నాడు వైశంపాయనుడు:

## ముంగిస జమదగ్ని

నియతాత్ముడై పితృకార్యం సంకల్పించాడు జమదగ్ని. అందుకని కొత్త కలశంలో హోమధేనువు పాలు పిదికాడు. పదిలంగా వొకఇమ్మైన చోటపెట్టాడు. అతడి చిత్తవృత్తి పరిశీలించడంకోసం క్రోధాధిదేవత మానవాకారంతోవచ్చి ప్రమాదవశాత్తూ జరిగినట్టు పాలకుండపడగొట్టాడు. అయినా కోపం తెచ్చుకోలేదు జమదగ్ని. చూస్తూ వూరుకున్నాడు. మనసులో మెచ్చుకున్నాడు క్రోధదేవత.

"భృగువులు కోపదారి మనుషులు అని లోకంలో ప్రవాదం. అది అబద్ధమనిపించావు నువ్వు. నేనే వోడిపోయాను నీ దగ్గిర. నీ తపస్సంటే భయంనాకు. నామీద ప్రసన్నుడివికా. ఆదరంతో చూడు. నా అపరాధం మన్నించు. విద్యానిధివినువ్వు" అన్నాడు.

"నా విషయంలో ఏం తప్పుచేశావు 'నువ్వు?" శాంతదృష్టితో చూస్తూ అన్నాడు నెమ్మదిగా జమదగ్ని. "ఎందుకూ ఈ శంకనీకు. సందేహించకు. నీ సంకల్పం వికలం కావడం పితృదేవతలకి కోపం కలిగిస్తుంది. కనక వెళ్ళిపో వేగం".

జమదగ్ని అలా అనడమే తడువు అంతర్థానమైపోయాడు క్రోధదేవత. ఉత్తరక్షణంలో పితృదేవతలు కోపంతో ప్రత్యక్షమయారు జమదగ్ని ముందు.

"నువ్వు శ్రాద్ధంకోసం సంకల్పించావు. దానికి వైకల్పం కలిగింది. అయినా వూరుకున్నావు! కనక ముంగివై పుట్టు" అని శపించారు.

వారికి దండప్రణామం చేశాడు జమదగ్ని. "తపస్వి కోపం తెచ్చుకోకూడదని అపరాధం చేసినా క్రోధదేవతమీద కోపం తెచ్చుకోలేదు నేను. నా తప్పు మన్నించండి. శాపాంతం సెలవియ్యండి" అని వినయంగా ప్రార్థించాడు.

అవగతం చేసుకున్నారు పితృదేవతలు. "పండితులైన బ్రాహ్మలు అంగీకరించినట్టు తగిన మాటలతో మహాధర్మం సరికాదని ఎప్పుడైతే నువ్వు పలుకుతావో అదిగో అప్పుడు శాపాంతం కలుగుతుంది నీకు." అని నిర్దేశించారు. అదిగో ఆ జమదగ్ని ముంగి. సక్తుప్రస్థుడి మూలంగా బ్రాహ్మల మధ్య అలా ధర్మరాజు అశ్వమేధం అధిక్షేపించాడు. శాపవిమోచనం పొందాడు. అంతర్హితుడై పోయాడు.

వ్యావహారికాంధ్ర మహాభారతం

అశ్వమేధపర్వం

సంపూర్ణం

---

# ఆశ్రమవాసపర్వం



## మొదటి ఆశ్వాసం

జనమేజయుడు వైశంపాయనుణ్ణి ఇలా అడిగాడు :

" తాతతండ్రులనుంచి వరసగా ప్రాప్తమైన సామ్రాజ్యం న్యాయ సమ్మతంగా స్వీకరించి, మహాయజ్ఞాలూ మొదలైన ధర్మకార్యాలు చేస్తూ, పెద్దల్ని సేవిస్తూ దయావిధేయులైన పాండవులు ధృతరాష్ట్రుడి విషయంలో ఎలా ప్రవర్తించారు ? పుత్రులూ మిత్రులూ కోల్పోయి, మంత్రులూ పరివారమూ లేకండా, ఐశ్వర్యం శూన్యంగా ఆ మహారాజూ, మహారాణి గాంధారీ ఎలా మనుగడ గడిపారు ?"

జనమేజయుడి ప్రశ్న విని వైశంపాయనుడు ఇలా అందుకున్నాడు :

ధృతరాష్ట్రుడంటే ఎంతో భక్తితో నడుచుకుంటూ వచ్చారు పాండవులు. అతడి యోగక్షేమాలు విచారిస్తూ, ఎప్పుడూ అతడిదగ్గిరే వుండేవారు. తమకి ఏదివచ్చినా అతడితో విన్నవించేవారు. విదురుడూ, యుయుత్సుడూ, సంజయుడూకూడా నిత్యమూ వచ్చి వినతిచేసి కొలిచేవారు. అతడు చెప్పినట్లుచేసేవారు. ధృతరాష్ట్రుడున్నూ వారందరిమీద ఆదరభావం, వాత్సల్యం కలిగివుండేవాడు.

కుంతీదేవి గాంధారిదగ్గిరికి వచ్చేది. సావధానంగా ఆమెని సేవించేది. ద్రౌపదీ, సుభద్రాకూడా వచ్చి ఆమెని కొలిచేవారు రోజూ. అంతమందీ ఆమెకి మంచిమంచి విలువైన పదార్థాలు తెచ్చి సంతోషంగా సమర్పించేవాళ్ళు. ద్రౌపది వెంట చిత్రాంగదా,

ఉలూపీకూడా వచ్చేవాళ్లు. భక్తివినయాలతో గాంధారిని సేవించే వాళ్ళు.

గాంధారీ ధృతరాష్ట్రులకు ఉత్తమమైన భోజనమూ మంచి మంచి బట్టలూ ఎన్నడూ లోపంలేకండా అమిర్చేవాడు ధర్మరాజు ప్రతిదినం.

గుళ్ళు కట్టించేవాడు ధృతరాష్ట్రుడు. చెరువులు తవ్వించేవాడు. ఊళ్ళు అగ్రహారాలు చేసేవాడు బ్రాహ్మలకి దానమిచ్చి. అదంతా సంతోషంతో సమ్మతించేవాడు ధర్మరాజు.

ధర్మరాజుని కొలవడానికి వచ్చిన రాజులు యావన్మందీ ముందు ధృతరాష్ట్రిమహారాజుని కొలిచేవాళ్ళు. అదిచూసి ఆనందించే వాడు ధర్మరాజు. కొడుకులులేరన్న దీనత్వం తట్టకండా గాంధారీ ధృత రాష్ట్రిలకు అన్నిసౌఖ్యాలూ అమిర్చిపెట్టేవాడు ధర్మరాజు పరమ భక్తితో. 'వంశవృద్ధులు, కుమాళ్ళు మరణించినవాళ్ళు కనక ఏవిష యంలో అయినా వారు విచారపడతారేమో అన్న శంకతో తమ్ముల తోనూ, మంత్రులతోనూ, ఇష్టభృత్యులతోనూ "మీరు ధృత రాష్ట్రిమహారాజుమీద భక్తికలిగి మసులుకోండి. ప్రీతికలిగివుండండి. అతడు ఏంచెపితే అది చెయ్యండి. అతణ్ణి ఆరాధిస్తేనే నాకు సంతోషం కలుగుతుంది. అతడికి ప్రియంచెయ్యడమంటే నాకు ప్రియంచెయ్యడ మన్నమాట. అతడికి నచ్చనిపని చెయ్యడమంటే నాకు దుఃఖం కలిగించడ మన్న మాట" అని ప్రతిదినమూ నూరిపోసేవాడు.

అంతమందీ ధర్మరాజు చెప్పినప్రకారం నడుచుకునేవారు. కాని భీముడుమాత్రం అన్నగారిమాటలు వినుకుని అలా నడుచుకుంటూ వుండినా, మెరమెరలాడేవాడు. జూదంలో తాముపడిన పాట్లు మన సులో బాధపెట్టేవి తనుపువచ్చి. దుర్యోధనుడి దుర్మార్గం జ్ఞాపకం వచ్చి, ధృతరాష్ట్రిణ్ణి చూసి పళ్ళుకొరికేవాడతడు లోలోపల.

శ్రాద్ధదినాల్లో కుమాళ్ళ నుద్దేశించి ధృతరాష్ట్రుడు గోదానాలూ, స్వర్ణదానాలూ విరివిగా చేసేటట్టు ఏర్పాటుచేసేవాడు ధర్మరాజు. త్యాగభోగాలు పూర్వం అతడు ఎలా అనుభవించేవాడో అలాగే ఇప్పుడున్నూ అనుభవించేటట్టు నియమించాడు. గాంధారిని కూడా అలాగే పువ్వుల్లోపెట్టి పూజించేవాడు. కన్నకుమాళ్ళలాగ పాండవులు తన్ను సేవిస్తూవుంటే, తానుకూడా వారిని కన్నతండ్రిలా చూసేవాడు ధృతరాష్ట్రుడు వాత్సల్యంతో. వారికి సిరిసంపదలు కలగాలని కోరేవాడు. ఆయురారోగ్యాలు కలగాలని ఆశించేవాడు. శత్రువిజయం కలగాలని కాంక్షించేవాడు.

ధృతరాష్ట్రుడి వెనకటి నడవడికానీ, అతడికుమాళ్ళు దుర్యోధనాదులు పెట్టిన కష్టాలుకానీ ఎన్నడూ భావించేవాడు కాడు ధర్మరాజు.

ధర్మరాజు విషయం తెలుసుకుని ధృతరాష్ట్రుడి గతచరిత్ర కానీ, దుర్యోధనుడి దుర్మార్గంకానీ అతనిముందు ఎవ్వరూ ఎత్తేవారు కారు ; భయపడేవారు.

ధృతరాష్ట్ర ధర్మరాజుల్లో ఎవరు రాజ్యాధిపతులో పౌరులు కాని, పల్లెప్రజలు కాని తెలుసుకోలేకపోయేవారు. వారిద్దరిలో ఏ అంతరమూ అవుపడేదికాదు వారికి. అలా వుంచాడు ధృతరాష్ట్రుణ్ణి ధర్మరాజు. అంచేత కన్నకొడుకు కంటే ఘనంగా భావించాడు ధర్మరాజుని ధృతరాష్ట్రుడు.

అయితే భీముడు తన దగ్గిరికి వచ్చినప్పుడల్లా తనకుమాళ్ళని తలుచుకుని దుఃఖపడేవాడు ధృతరాష్ట్రుడు. ధృతరాష్ట్రుణ్ణి చూసినప్పుడల్లా అతడి కుమాళ్ళు తమనిపెట్టిన పాట్లు తలుచుకుని పిడికిలి బిగించేవాడు భీముడు. ఉభయుల మనస్సుల్లోనూ పరస్పరం ఇలావుండేది. పైకి మాత్రం మృదువుగా మాట్లాడేవారు బంధువులు మెచ్చినట్టు.

ధృతరాష్ట్రుడు ఒంటిగా వున్నప్పుడు గాంధారి వినేట్టు ఎత్తిపొడుపు మాటలు విసిరేవాడు భీముడు.

"గుడ్డివాడి కొడుకుల్లో వొకణ్ణీ మిగల్చకండా చంపేశాను. నా బాహువులు ఇనప పంజరాలు. ఇందులో చిక్కిన సింహంలాటి శత్రువైనా జీవించడమే మళ్ళీ? వెర్రిదద్దమ్మలు కయ్యంచేశారు! నాసంగతి తెలీలేదు పాపం! దుర్యోధనుడూ మొదలైన వాళ్ళప్రాణాలు పుచ్చుకున్న నాభుజదండాలకి చందనంపూసి, పూలదండలుచుట్టి పూజిస్తాను. మహోపకారం చేశాయివి. నిజంగా దేవుళ్ళన్నమాట నా బాహువులు!" అనేవాడు. ఆ ముసలి దంపతుల గుండెలు గుభేలుమనేవి.

ధర్మరాజుకానీ, అర్జునుడుకానీ, ద్రౌపదికానీ, కుంతీదేవికానీ ఈ విషయం ఎరగరు. నకుల సహదేవులు అప్పుడప్పుడు వినేవారు. సంతోషించేవారు. ధర్మరాజు సంగతి తెలిసిన వారుకనక సంశయించి వారేమీ అనేవారుకారు. సమయ పరివర్తనం గమనించి ఏమీ అనకండా సహించి వూరుకునేవారు గాంధారీ ధృతరాష్ట్రులు. అలా పదిహేనేళ్ళు గడిచాయి.

## ఆశ్రమవాసం చేస్తాను

ఒకనాడు ధృతరాష్ట్రుడు బంధువుల నందరినీ సమావేశపరిచాడు. ధర్మరాజునీ పిలిచాడు. అతడు వింటూవుండగా గద్గదకంఠంతో బంధువులతో ఇలా అన్నాడు:

"నా మూలంగా కౌరవులకు నాశనం కలిగిన విషయం మీకందరికీ తెలుసు. జడుణ్ణీ, క్రూరుణ్ణీ, అతిలోభినీ, జ్ఞాతిద్రోహినీ కౌరవభూమికి రాజుచేశాన్నేను. శ్రీకృష్ణుడు చెప్పినమాటలు విన్నానుకాను. నా కొడుకుమీది మోహం మొగమోటంలో ముంచింది. అతణ్ణి ఏమీ అనలేకపోయాను తెగించి. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, సంజయుడూ చిలకకి చెప్పినట్టు నాకు హితంచెప్పారు. గాంధారి నన్ను దుయ్యబట్టి మరీ చెప్పింది చెవిలో గూడుకట్టుకుని. ఆ మాటలు ఏవీ

చెవిపెట్టలేదు నేను. ఇది ఎప్పుడూ గుండెల్లో శూలంలా వేధిస్తూ వుంటుంది నన్ను.

"కొడుకులు యుద్ధానికి వెళ్ళారు. వెళ్ళినవాళ్ళు మళ్ళీ తిరిగి రాలేదు. యుద్ధంలో వీరస్వర్గం పొందినవారి మేలిగతి మనసులో ఎప్పుడూ తలుచుకుంటూనే వున్నాను. క్షత్రియధర్మం అనుసరించారు వాళ్ళు. అందుకోసం విచారంలేదునాకు. పైగా దానికోసం ప్రీతికలుగుతుంది."

ధర్మరాజుని దగ్గిరికి పిలిచి అతడితో ఇలా అన్నాడు:

"నాయనా, పువ్వుల్లోపెట్టి పూజిస్తున్నావు నన్ను. ఏసౌఖ్యమూ కొరతలేదు నాకు నీవల్ల. ప్రభుత్వమూ, ప్రతాపమూ కలిగివర్తించాను. దానాలున్నూ ఎన్నో చేశాను. గాంధారి బిడ్డలకు ఎన్నోమార్లు ఘనంగా శ్రాద్ధాలు చేశాను. పరమ ధర్మశీల ద్రౌపది. ఆమెకి చెడ్డ తలపెట్టారు నా కుమాళ్ళు. పుణ్యవంతుడివైన నీసిరిసంపదలు అపహరించారు. అలాటి కష్టచరిత్రుల్ని ధర్మయుద్ధంలో సంహరించావు. కౌరవులు ఊర్ధ్వలోకాలకుపోయి సుఖపడ్డారు. అంచేత ఇక వారికోసం ఏమీ చెయ్యవద్దు. అకారణ కరుణా హృదయుడివి నువ్వు. కనక నీతో ఇది చెప్పవలిసి వచ్చింది.

"ఏపనైనా ఎవడైనా చెయ్యడానికి పూనుకున్నప్పుడు ముందుగా రాజు అనుమతిపొంది కాని చెయ్యకూడదు. కనక వార్ధక్యంతో సడలిపోయిన నా శరీరానికి సంస్కారం చేసుకుందికని అడివికివెళ్ళి ఆశ్రమ వాసం చెయ్యడంకోసం నీ అనుమతి కోరుతున్నాను. రాజవంశంలో పుట్టినవాడు రణరంగంలో ప్రాణం వొదలాలి, లేదా తపస్సుచేస్తూ కళ్ళుమూయ్యాలి. మన కులముఖ్యులు అందరూ అలాగే చేశారు. అంచేత నాయనా ధర్మరాజా, నన్ను అడివికి పంపు.

"అందరికీ రాజే గురువు. గురువు ఆజ్ఞప్రకారం చేసినపని ఇహ

పరాలు రెంటిలోనూ రాణిస్తుంది. నేనూ, గాంధారీ అడివికి వెళతాం. తపోధనులైన మునుల దగ్గిర నారలుకట్టుకుని, కందమూలాలతో ఆకలి తీర్చుకుంటూ, నిన్ను దీవిస్తూ ఆశ్రమవాసం చేస్తాం.''

"తండ్రీ'', ధృతరాష్ట్రుడు అడివికి వెళతామనడంతోనే అన్నాడు ధర్మరాజు, "నువ్వు విచారిస్తూ ఇలా దుష్కరమైన అరణ్యవాసం చేస్తానంటే, ఈ రాజ్యం నాకుమాత్రం సౌఖ్యం కలిగిస్తుందా? పైకి నమ్మించి లోలోపల నాకు తెలియకండా ఇలా దుఃఖసముద్రంలో తేలుతున్నావు నువ్వు! ఇపుడు తెలిసి నాగుండెలు బద్దలై పోతున్నాయి. ఇక రాజ్యమెలా రుచిస్తుంది నాకు?

"తల్లీ, తండ్రీ, గురువూ, దైవమూ— అన్నీ నువ్వేనాకు. నువ్వో అడివికి వెళ్ళిపోతే నేనెలా వుండేది ఈహస్తినాపురంలో? యుయుత్సుణ్ణి రాజు చెయ్యి. నేనూ నే వెంట వస్తాను; నీ సేవ చేస్తాను.

"యుయుత్సుడు నీ ఔరసుడు. అతడే ఈ రాజ్యానికి ఉత్తరాధికారి. అపకీర్తితో దుఃఖపడలేన్నేను.

"నువ్వేరాజువి. నీకా నేను రాజుని? తండ్రిని, మహారాజుని ఆదేశించడానికి నేనా అధికారిని!

"దుర్యోధనుడూ మొదలైనవాళ్ళ దుష్కృత్యాలు నా మనస్సులో లేనేలేవు. విధి విధానంవల్ల వాళ్ళకీ మాకూ విరసభావ మేర్పడింది; ఇంతపుట్టింది. గాంధారీ కుంతీ వొక్కటే నాకు!

"అడివికి వెళ్ళడం తప్పదంటే నేనూ మీతో వస్తాను. ఏదో మాటవరసకి అనడంలేదు నేను. నా హృదయగతి కూడా ఇదే నిజంగా.

"నిజం చెపుతున్నాను. నాకు రాజ్యం ప్రీతి కలిగించదు.

"నీవిచారం కులమంతటి విచారం. జరిగిందంతా దైవకృతం. మతిమంతుడివి నువ్వు. మహారాజా, శోకం విడిచిపెట్టు. నన్ను పరికించు.

"నీ శుశ్రూషచేస్తూ శోకం మానుకోవాలని నా సంకల్పం. నన్ను వొదిలిపెట్టకు. చేతులు జోడించి వేడుకుంటున్నాను నిన్ను. శోకం విడిచిపెట్టు."

ఇలా అంటూ ధృతరాష్ట్రుడి రెండుపాదాలూ పట్టుకుని, శిరస్సు మోపాడు ధర్మరాజు. అతణ్ణి గుచ్చిఎత్తి కౌగిలించుకున్నాడు ధృతరాష్ట్రుడు.

"బాబూ, చిరకాలం నా శుశ్రూషచేశావోయి నువ్వు. నేను వృద్ధుణ్ణయిపోయాను. నేను తపస్సు చేసుకోవద్దూ ఇక?

"ధర్మరాజా, ఎవ్వరేపనిచేసినా రాజుకి అందులో భాగ ముంటుంది" అన్నాడు.

విదురుణ్ణీ, కృపాచార్యుణ్ణీ, సంజయుణ్ణీ ఉద్దేశించి, "ముఖా నికి శోష కలుగుతూవుంది. శరీరానికి ఆయాసంవస్తోంది" అంటూ తొట్రుపడుతున్న నాలుకతో ఇలా అన్నా డతడు:

"అనునయ వాక్యాలతో ధర్మరాజుని వోదార్చాలి మీరు. ఇతడు తెలువుకున్నట్టు చెయ్యాలి."

ఈమాత్రం చెప్పి, శోషవచ్చి, గాంధారిమీద వాలిపోయి వృద్ధమహారాజు మూర్ఛపోయాడు.

అతడి అవస్థచూసి బావురుమన్నాడు ధర్మరాజు.

"పదివేల ఏనుగులంత బలశాలి ధృతరాష్ట్రమహారాజు వొక స్త్రీని వూతం పట్టుకున్నాడు! విధి వక్రిస్తే ఎవరిని హీనపరచదు!

"ఉక్కు భీముణ్ణి గుండపిండి చేసిన బలశాలి వొక్క ఆడ దాన్ని ఆశ్రయించాడు! ఏమనాలి బ్రహ్మదేవుణ్ణి!" అంటూ ఎంతో దుఃఖపడ్డాడు. అతడి కీడు మచ్చుకైనా తలచలేకపోయాడు.

"నాయనా," అప్పుడు ధర్మరాజుతో మెల్లిగా అంది గాంధారి, "తపస్సు చింతతో తిండిమానేశాడు మీ తండ్రి. అంచేత కూచోలేక ఇలా మూర్ఛపోయాడు."

"ఎవరిమూలాన ఈ మహాత్ముడికి ఇంతదుఃఖం కలిగింది? నా మూలానే కదా! నా బతుకూ ఒక బతుకేనా?" అంటూ చన్నీళ్ళు చేత్తో పుచ్చుకుని ధృతరాష్ట్రుడి మొహంమీదా, గుండెలమీదా చల్లాడు ధర్మరాజు.

విదురుడూ, సంజయుడూ యావన్మంది కౌరవుల భార్యలూ వచ్చారు.

ధృతరాష్ట్రుడి అవయవాలు చన్నీళ్ళతో నిమిరాడు ధర్మరాజు.

తెలుపుకున్నాడు ధృతరాష్ట్రుడు. ధర్మరాజుని కౌగిలించుకున్నాడు. శిరస్సు మూచూశాడు. ధర్మరాజుకూడా అతణ్ణి గుండెల కద్దుకున్నాడు. ప్రీతికలిగినట్టు చేశాడు.

అలా తెలుపుకుని ధర్మరాజుతో, "నేను ఎలాగూ అడివికి వెళ్ళాలి తపస్సుకోసం" అన్నాడు ధృతరాష్ట్రుడు.

"నువ్వు ముందు భోజనంచెయ్యి. అప్పుడు చెపుతాను అడివికి వెళ్ళేమాట" అన్నాడు ధర్మరాజు, తోపుడుమాటగా.

"అధికం మాట్లాడే శక్తి లేదు నాకు. నన్ను మరి అలజడి పెట్టకు. నీ ఆజ్ఞ పొందికాని అన్నం తినను" అని నిక్కచ్చిగా అన్నాడు ధృతరాష్ట్రుడు.

సరిగ్గా అదే సమయానికి వ్యాసముని అక్కడికి వచ్చాడు. అంతమందీ లేచి వినతులు చేశారు. అందరికీ దీవనలిచ్చాడు. ధర్మరాజుతో ఇలా అన్నాడు:

"ధృతరాష్ట్రుడు ఎలాచెపితే అలాచెయ్యి. వృద్ధుడితడు. కొడుకులు లేనివాడు. తపస్సుచేసుకుంటాననడం కూడదా? ఇంతవరకూ దుఃఖం దిగమింగుకుని బదికింది గాంధారి. ఇప్పుడు ఈమెకూడా ఇదే భావంతో వుంది. ఈమాట నీకు చెప్పడంకోసమే వచ్చాను. ఆశ్రమ

వాసానికి వెళ్ళనీ వీళ్ళని. పూర్వరాజులు తొక్కినదారి ఈ వృద్ధరాజు తొక్కడం మంచిది. కనక విచారించకు. అనుమతించు. ఇంతకాలం వీరికి విచారం కలగకండా శుశ్రూష చేశావు నువ్వు, కల్లాకపటం లేకండా. ఇంక వెళ్ళనీ వీళ్ళని.''

"మహాత్మా," వ్యాసముని మొహంచూస్తూ అన్నాడు ధర్మరాజు, "మాకు గురువన్నా, ధర్మోపదేష్ట అన్నా, పరదైవమన్నా, మనఃప్రియకార్యకలాపకర్త అన్నా నువ్వే. నీమాటకి అడ్డం చెపుతానో నేను ?''

"రాజులకు రణమరణం, లేదా సమాధిమరణం యీ రెండే ఉత్తమ మరణాలు. అంతేకాని ముసిలివగ్గులై రోగంతో మూలుగుతూ చావడం మంచిదికాదు'' అన్నాడు వ్యాసముని.

అతడు అలా అనడంతోనే మరోమాట అనడానికి భయపడి ఇలా అన్నాడు ధర్మరాజు :

"ధృతరాష్ట్ర మహారాజు అడివిలో ఆశ్రమవాసం చెయ్యడానికి అంగీకరిస్తున్నాను. మహత్తరమైన మీ అనుమతికూడా పొందాడు పైగా. స్వేచ్ఛగా వేంచేయనీ. విఘ్నం కలిగించడమెందుకు నేను ? తగనిపని !''

సంతోషించాడు వేదవ్యాసుడు. "ధర్మరాజా, పాండురాజు ఈ మహారాజుని గద్దెమీద నిలిపి యజ్ఞాలు చేయించాడు. ఎన్నో భోగాలు సాగించాడు. ఇతనివాళ్ళనందరినీ ప్రీతిగా చూశాడు. తాను శిష్యుడిలాగా భక్తితో సేవించాడు. నువ్వుకూడా ఇతనికోసం దిగ్విజయాలూ మొదలైనవి చేశావు. అనంతరం తానే పదమూడేళ్ళు రాజ్యమేలాడు. ఏలోపంలేకండా నువ్వు శుశ్రూషచేశావు. ఇతడి మనస్సులో రవంతా కలకలేదు. కేవలం తపస్సుచెయ్యాలన్న సంకల్పమే ఇప్పుడు మనస్సులో ఆవేశించి వుంది ఇతడికి. అంచేత అడివికి పంపించు'' అన్నాడు.

"మహాప్రసాదం" అన్నాడు ధర్మరాజు. అనంతరం తన తపోవనానికి వెళ్ళిపోయాడు వ్యాసముని.

"తండ్రీ," వ్యాసుడు వెళ్ళిపోయాక ధృతరాష్ట్రుడితో అన్నాడు ధర్మరాజు, "నీకు ఏది నచ్చితే అదే చేస్తాను. విదురుడూ, కృపాచార్యులూ ఏది కర్తవ్యమని నిశ్చయించినా నెరవేరుస్తాను. సంజయుడికీ, యుయుత్సుడికీ ఇష్టమైన పని నిర్వహిస్తాను. ఇలా చెయ్యడమే నాకు ప్రియం. అయితే నాదొక్క మనవి, నువ్వు ఏంచెయ్యదలుకుచున్నా సరే, భోజనంచేసి చెయ్యి."

ధర్మరాజు అలా ప్రార్థించాక లేచి అభ్యంతరమందిరానికి వేంచేశాడు ధృతరాష్ట్రుడు. వెంట గాంధారికూడా వెళ్ళింది. ముసిలి ఏనుగులాగ అతడు వెళ్ళినప్పుడు అతడివెనక విదురుడూ, యుయుత్సుడూ, కృపాచార్యుడూ, సంజయుడూకూడా వెళ్ళారు.

కాల్యకృత్యాలు తీర్చుకున్నాడు ధృతరాష్ట్రుడు. బ్రాహ్మల్ని పూజించాడు. భోజనం చేశాడు. కుంతీదేవి మొదలైన అంతఃపుర స్త్రీలు అనుసరించగా గాంధారికూడా భోజనాదికాలు ముగించింది. తరవాత విదురుడూ మొదలైనవారూ, పాండవులూ, స్త్రీజనమూ భోజనాలు చేశారు. అంతనుందీ ధృతరాష్ట్రుడి చుట్టూ సమావేశమయారు.

ధర్మరాజుని పిలిచి ఏకాంత స్థలానికి తీసుకు వెళ్ళాడు ధృతరాష్ట్రుడు.

"నాయనా, సప్తాంగాలతో కూడిన రాజ్యం పూజ్యమైన ధర్మంతో నడపడం దుష్కరం. కనక నాకు తెలిసినంతమట్టుకు నీకు బోధిస్తాను, విను.

## రా జ నీ తి

"ఎప్పుడూ విద్యావంతులైన వృద్ధజనాన్ని ఉపాసించు. ధన మిచ్చి వాళ్ళని సంతోషపరచు! వారు ఉపదేశించిన నీతులువిని

మనస్సుకి పట్టించుకుని కార్యంనడుపు. రాజ్యతంత్రంలాగే ఇంద్రియాలని రక్షించుకో. ఇంద్రియాలు సురక్షితంగా వుంటే శుభం కలుగుతుంది కొరత లేకుండా. భావశుద్ధి కలవాళ్ళూ, తాతముత్తాతల నుంచి బుద్ధిమంతులైన వాళ్ళూ మంత్రులు కావాలి. శత్రువుల్నీ, ఆప్తజనుల్నీ కనిపెట్టడానికి మంచి తెలివైన చారుల్ని నియోగించు. పురరక్షణం దృఢంగా చెయ్యాలి. భోజనం, నిద్ర మొదలైన ఇంటిపనులు చూడడానికి నమ్మదగిన సజ్జనుల్ని పెట్టాలి. ఆప్తులైన వృద్ధుల్ని ఆడంగుల్ని రక్షించడానికి ఏర్పరుచు. అన్నిపనులూ మంత్రులతో ఆలోచించి నిర్వహించు. గుప్తభవనంలో కానీ, మేడమీద కానీ,మాటులేని అడివి ప్రదేశంలోకానీ రహస్యకార్యాలు జరిగించాలి. అప్పుడే అన్నిపనులూ ఫలిస్తాయి. కుంటివాళ్ళూ, గుడ్డివాళ్ళూ, మూగివాళ్ళూ, ముసిలాళ్ళూ నువ్వు రహస్యాలోచన సాగించినప్పుడు దగ్గిర వుండకూడదు. రహస్యాలోచన బయటపడడంవల్ల వచ్చేకీడుకి శాంతి చెయ్యడం అసాధ్యం. అంచేత రాజకార్యం కాపాడడమే వ్రతంగా మంత్రులతో నొక్కి చెప్పాలి.

"శుచులైన విద్వాంసులతో కలిసి వ్యవహారాలు తీర్చాలి. తప్పుచేసినవారి తప్పులు కొలిచిచూసి హెచ్చుతప్పులకి హెచ్చు దండనలూ, తక్కువ తప్పులకి తక్కువ దండనలూ విధించాలి.

"ఆదాయవ్యయాలు ఉదయం విను. అంతకిముందే నిర్మలమైన మనస్సుతో దేవతాపూజా, బ్రాహ్మణపూజా పూర్తిచెయ్యి. పొద్దు బాగా ఎక్కాక భోజనం చెయ్యి. ఆ తరవాత గంధం పూసుకోడమూ, పూలమాలలు వేసుకోవడమూ, అలంకారాలు పెట్టుకోవడమూ, బట్టలు కట్టుకోడమూ స్వేచ్ఛగా జరిగించు. మాపుల యోధులతో కొలువు తీర్చు. సంధ్యలపుడు దూతలనుంచి చారులవార్తలు విను. రాత్రులు స్త్రీలతో భోగా లనుభవించు.

"కొత్తది ఏం పుట్టినా తొందరపడకు. నువ్వు స్వయంగా దాన్ని చూసి తీర్చు.

"మీద చెప్పిన పనులకోసం ఆయా సమయాలు సరైనవి. ఏ ఉపాయం చేసినా న్యాయమార్గాన ధనం గడించు.

"రాజ్య విఘాతం చేసేవాళ్ళని తెలుసుకుని చంపడమూ, వాళ్ళని చెరపడమూ చెయ్యాలి. మంచి పనులు చేసిన వాళ్ళ మనుగడ గొప్పచేసి మన్నించాలి. రాజనీతి ఎరిగినవాడివి నువ్వు. సేవకులుచేసిన మంచిపనులు సభలో చెప్పి, వాళ్ళని ప్రశంసించు.

"నీమీద భక్తికలవాణ్ణి, స్నేహంకలవాణ్ణి, శూరుడైనవాణ్ణి, శ్రమకి జంకనివాణ్ణి, మంచికులంలో పుట్టినవాణ్ణి సేనా నాయకుడిగా నియమించు.

"నీ లోపాలు పిసరంతయినా ఇతర్లకి తెలియరాకండా దాచి పెట్టు. ఇతర్ల లోపాలు మాత్రం కనిపెట్టు. పగవారి దగ్గిరవున్న బుద్ధి మంతుల్ని, బలవంతుల్ని తెలుసుకుని, సామదానాల వల్ల వాళ్ళని నీవేపు తిప్పుకో. పక్క రాజులు పగపడతారు. కనక వాళ్ళ విష యంలో మైమరుపు లేకండా వుండు. వాళ్ళ అవతల వుండే రాజులు సహజంగా మిత్రులవుతారు. వారి అవతలవాళ్ళు ఉదాసీనులు. వీరందరి సప్తాంగాలూ తెలుసుకుని వుండడం అవసరం. సముద్రైన బల వంతుడైన రాజుతో సంధిచేసుకోడం క్షేమం. దైవబలం, మానుష బలం తరిగిన రాజుమీద దండెత్తాలి. ఆ సమయంలో అతణ్ణి వోడించ డం, అతడి దగ్గిర కప్పం పుచ్చుకోడం తగినపని. పగవాణ్ణి ఎప్పుడు నడుస్తున్నప్పుడు కొట్టాలో, ఎప్పుడు విడిసి వున్నప్పుడు కొట్టాలో తెలుసుకుని తగిన వోడుపుచూసి కలబడాలి. సొంతసైన్యం మాత్రం ఎల్లప్పుడు కాపాడుకుంటూ వుండాలి భద్రంగా.

"మంత్రుల మనస్సులు విరసమైనట్టు రాజ్యమేలుతున్న పగ

వాడి సంగతి తెలుసుకుని, ఆ రాజ్యంలో భేదాలు కల్పించాలి. రాజ్యంలో కలతలు పుట్టించి దండెత్తాలి. సులభంగా ఆ రాజ్యం వశ పరుచుకోవాలి.

"బలమూ, దైవబలమూ కలిగి, లోగుట్టు బయటపడకండా కాపాడుకుంటూ రాజ్యమేలుతున్న రాజునిచూసి మచ్చరించుకో కూడదు. అతడితో స్నేహం చేసుకోడం మంచిది ఆశ్రయించి.

"ఎప్పుడు తినబెట్టాలో, ఎప్పుడు కక్కించాలో తెలుసుకుని శత్రురాజుని మోటకుండలాగ పొడవాటి తాడు వొదిలినప్పుడు వొదిలి (వలసినంత అవకాశమిచ్చి), లాగవలిసినప్పుడు లాగి జయించాలి.

"నీకూ, ఎదటివాడికీవున్న ఉత్సాహశక్తీ, మంత్రశక్తీ, ప్రభు శక్తీ—వీటి తారతమ్యాలు తెలుసుకోవాలి. ఉపాయంతో, తెలుసుకుని నిరోధించడమో, వూరుకోడమో నిశ్చయించాలి.

"సైన్యం ఆరు విధాలు. మొదటిది మూలబలం. రెండోది మొత్తాలబలం. మూడోది మిత్రబలం. నాలుగోది శత్రుబలం. అయి దోది అడివిబలం. ఆరోది చేతి జీతగాళ్ళబలం. ఈ ఆరు విధాలబలం (సైన్యం) చూసుకుని దేశ కాల యుక్తంగా దాన్ని పన్నుకోవాలి. కొలదులు గమనించి.

"సంపదలూ, ఆపదలూ వొక్కలాటివే నిజానికి. అయితే సైన్యాలలో వీటివల్ల వికృతి కలగడం సహజం. ఇది కనిపెడుతూ ఎల్లప్పుడూ హితకారి అయిన సేనని అధికంగా రక్షిస్తూవుండు.

"ధర్మమార్గంగా పరిపాలించడమే శత్రువుల్ని గెలిచి నిర్భ యంగా ప్రజల కాపాడేఉపాయం. ప్రజలమీద దయమాత్రం ఎన్నడూ తప్పకు.

"విసికి కలిగి రక్షిస్తూ, ఉపాయంతోనూ, దయాధర్మంతోనూ రాబడి సంగ్రహిస్తూ, ఏలుబడి సాగించిన రాజుకి భూదేవి కామధేనువు కాదా!

"ధర్మమార్గంతో భూమిపాలిస్తే ఇహంలో సౌఖ్యమూ, కీర్తీ లభిస్తాయి. పరలోకంలో భోగాలు సిద్ధిస్తాయి. అధికంగా దక్షిణలిచ్చి, అశ్వమేధం మొదలైన యజ్ఞాలు చెయ్యడంకంటే, ప్రజల్ని ఆదరించి, కరుణించి, పక్షపాతం లేకండా, కన్నబిడ్డలలాగ పరిపాలించడం అధిక మంటారు.

"నీతమ్ముల త్యాగమూ, మన్ననా ప్రతిదినమూ పొగుడుతూ వారికి ఆనందం కలిగించు.

"ధర్మరాజా, మాన్యుడు భీష్ముడూ, శ్రీకృష్ణుడూ, వేద వ్యాసుడూ మొదలైన పెద్దలందరూ రాజనీతులు నూరిపోశారు నీకు. నీమీదవున్న ప్రీతిచేత నాకు తెలిసినవి ఏవోకొన్ని చెప్పాను. నిత్య వివేకవంతుడివి నువ్వు. సత్యవ్రతశీలుడివి. ధర్మసారం తెలిసినవాడివి. అయినా నిత్యమూ వృద్ధసేవ చెయ్యి, మానకు" అన్నాడు.

"తండ్రీ" అతడు చేసిన ఉపదేశం విని అన్నాడు ధర్మరాజు, "భీష్మపితామహుడు లేడు. శ్రీ కృష్ణుడు తన రాజధానికి దయచేశాడు. నువ్వుతప్ప వాత్సల్యంతో నాకు హితంచెప్పేవాళ్ళు ఎవరున్నారు? నువ్వు ఉపదేశించినదారినే నడుస్తాను. మనసా నువ్వు ప్రీతి పొందు."

సంతోషించాడు ధృతరాష్ట్రుడు. "నాయనా, ఇక వెళ్ళు, విశ్రమించు. నాకు ఆయాసం అధికంగా వుంది" అంటూ ధర్మరాజుని పంపేసి, బంధువులదగ్గిరికి వచ్చాడు. అందరినీ తమతమ గృహాలకి పంపేశాడు. తాను అభ్యంతరమందిరానికి దయచేశాడు. సుఖంగా కూచున్నాక గాంధారి అతడిదగ్గిరికి వచ్చింది. "దేవా, అడివికి ఎప్పుడు ప్రయాణం?" అని అడిగింది.

"తండ్రి వ్యాసదేవుడి అనుజ్ఞ పొందాను. శీలవంతుడు ధర్మరాజు ప్రీతిగా అనుమతించాడు. బంధువులున్నూ వొప్పుకున్నారు. ఇంక ఆలస్యమెందుకూ? వేగమే బయలుదేరదాం.

"కల్లజూదమాడి పాపంపోసుకున్నారు నీ కుమారుళ్ళు. వాళ్ళ పాపం పోడానికి తపస్సుచేస్తాను. దేవీ, వాళ్ళ సుగతికోసం ఇప్పుడు కూడా కొన్ని పుణ్యకార్యాలుచేసి వెళదాం, ధర్మరాజు అంగీకారం పొంది" అన్నాడు ధృతరాష్ట్రుడు. "అడవికి వెళ్ళడానికి పురజనుల అనుమతికూడా తీసుకుంటాను" అని ధర్మరాజుదగ్గిరికి కబురంపాడు.

## సె ల వి య్యం డి

ధృతరాష్ట్రుడి అభిలాషప్రకారం తగినవౌరుల్ని రావించాడు ధర్మరాజు. వారినీ, బంధువుల్నీ, స్నేహితుల్నీ వెంటపెట్టుకుని వచ్చి ధృతరాష్ట్రుడి మందిరద్వారం ముందు నిలబడ్డాడు. గాంధారితో కలిసి ధృతరాష్ట్రుడు ద్వారందగ్గిరికి వచ్చాడు. బ్రాహ్మలూ, క్షత్రియులూ, కోమట్లూ, శూద్రులూ యావన్మందితో కిటకిటలాడుతున్న ఆ జన సమూహాన్ని ఉద్దేశించి ఇలా ఉపన్యసించాడు :

"మహాజనులారా! వినండి. కౌరవులూ, మీరూ చిరకాలం నుంచీ అనగిపెనగి మసులుకుంటున్నారు. అన్యోన్యం స్నేహంతో నడుచుకుంటున్నారు. వృద్ధుడైనవాడు తపస్సుకోసం అడవికి వెళ్ళడం తగినపని. ఉచితకృత్యాల విధానం మీకు తెలియంది కాదు. నేను ఆరముగ్గిన పండునై పోయాను. అడవికి వెళ్ళి తపస్సుచేసుకుంటాను. మీ అనుజ్ఞ కోరుతున్నాను. సంతోషంగా నాకు అనుజ్ఞ దయ చెయ్యండి మీరంతా. నన్ను ఆనందంతో అడివికి పంపించండి. సెల వియ్యండి."

వృద్ధమహారాజు అలా ఉపన్యసించడంతోనే యావన్మందీ కన్నీళ్ళు కార్చారు. గద్గదకంఠాలతో ఏడ్చారు.

విని ధృతరాష్ట్రుడు వారితో ఇలా అన్నాడు :

"ప్రజలు ఆనందించినట్టు భూమి పాలించాడు శంతన మహా

రాజు. అనంతరం భీష్ముడు మిమ్మల్ని కాపాడాడు. విచిత్రవీర్యుడు రాజ్యమేలాడు. తరవాత పాండురాజు మిమ్మల్ని మెప్పించి రాజ్యం రక్షించాడు. ఇప్పుడు ధర్మరాజు విషయం మీారంతా ఎరిగిందే. ధర్మాత్ముడు ధర్మరాజు; సత్యసంధుడు. ఇతణ్ణి అనుసరించకుండా అన్యాయంచేశాడు దుష్ట దుర్యోధనుడు. దుర్ణయంతో రాజ్యంచేశాడు. కులం నాశనంచేశాడు. భూలోకంమీాది రాజులందరినీ హాతమార్చాడు. అయితే వాడు చేసిందానికి అంతటికీ నేనే మూలం. ఇది మీా మనస్సుల్లో పెట్టుకోకండి. భూమి చక్కగా పాలించిన గుణవంతులు పాండురాజుకి అన్న అనీ, విచిత్రవీర్యుడికి కుమారుడనీ, శంతనమహారాజుకి మనవడు అనీ నామీాద కనికరించండి. నాహితం కోరండి. నా ఆశ్రమవాసానికి అనుజ్ఞ దయచెయ్యండి" అంటూ ప్రజల మనస్సుల్లో లేకపోయినా తనతప్పులు ఎత్తిచూపి, "అడివికి వెళ్ళడానికి అనుమతించండి" అని ప్రార్థించి, ఇంకా ఇలా అన్నాడు:

"వృద్ధురాలు, కృపణ, వందమంది కొడుకుల్ని పోగొట్టుకున్న తల్లి గాంధారి! ఈమెనిచూసైనా కనికరించండి. అడివికివెళ్ళడమే మేలని మాకు అనుజ్ఞ ఇవ్వండి."

ధర్మరాజుని చూపి ఇలా అన్నాడు:

"దిక్పాలకులమధ్య దేవేంద్రుడిలాగ తమ్ములమధ్య వైభవంతో ప్రకాశిస్తాడితడు. ఎందునా ఏమరుపాటులేకుండా ఇతణ్ణి ఆదుకుని నడుచుకోవాలి మీారు. మీాచేతుల్లో ఇతణ్ణి అర్పించి వెళుతున్నాన్నేను. అన్నివిధాలా మిమ్మల్ని తన ఏలుబడిలో సుఖపెడతాడితడు. అందుకనే మీాచేతుల్లో అప్పగిస్తున్నాను. నాకులంవాళ్ళకి దుఃఖకారినయ్యాన్నేను. అంతేకాని మిమ్మల్ని బాధపెట్టలేదు. మీారున్నూ ఏనాడూ నాకు ఏమాత్రమూ కీడుచేసినపాపాన పోలేదు.

"పౌరులారా, అంచేత ప్రేమపూర్వకంగా నన్ను అడివికి పంపండి."

వృద్ధమహారాజు అలా అనడంతోనే ఏడుపులు మింగుకుంటూ, వొకళ్ళ మొహం వొకళ్లు చూసుకుంటూ వూరుకున్నారు పౌరులు. అప్పుడు మళ్ళీ ఇలా అందుకున్నాడు ధృతరాష్ట్రుడు:

"పౌరులారా! సాధుచరిత్ర, శాంతశీల ఈగాంధారీ, నేనూ గాఢమైన వినయంతో వేడుకుంటున్నాము. మీ అనుజ్ఞ కోరుతున్నాము. అన్నిధర్మాలూ తెలిసిన వేదవ్యాసుడూ, ధార్మికుల్లో మొదటివాడు ధర్మరాజూ నేను అడివికి వెళ్ళడానికి అనుజ్ఞ ఇచ్చారు. చేతులు నుదుట జోడించి మిమ్మల్ని వేడుకుంటున్నాను. కృపాపూర్ణులు మీరు. నాకు సెలవు దయచెయ్యండి" అన్నాడు.

ఈమాటలు విని, ఉత్తరీయాలు మొహానికి అడ్డంచేసుకుని వెక్కివెక్కి ఏడ్చారు పౌరులు. కొంతసేపటికి ఏడ్పులుమాని అందరూ తమలో తాము కూడబలుక్కున్నారు. ఒక నిశ్చయానికి వచ్చారు. తమ నిశ్చయం ధృతరాష్ట్ర మహారాజుతో విన్నవించమని శంబువు అనే వొక బ్రాహ్మణ్ణి నియోగించారు. శంబువు వృద్ధమహారాజు ఎదట నుంచుని, వినయంగా ఇలా విన్నవించాడు:

## పురజనుల అనుమతి

"మహారాజా, భరతవంశోత్తమా, పౌరజనులు తమ మాటలుగ మీ సన్నిధిని విన్నవించమని నన్ను నియోగించారు. విన్నవిస్తున్నాను, సావధానంగా చిత్తగించు. 'మీమహావంశంలోని రాజుల్లో వెదికినా దోషం కానం మేము. మీరందరూ మమ్మల్ని కన్నబిడ్డల్లా కాపాడారు ఆదరంగా. దుర్యోధనుడున్నూ మా విషయంలో తగనిపనిఏదీ చెయ్యలేదు. త్రిలోకోత్తరుడు వేదవ్యాస మునీంద్రుడు నిన్ను ఏంచెయ్యమని నియమించాడో అదే చెయ్యి.

"మీదుఃఖం మీరుపడండి అని మమ్మల్ని విడిచిపెట్టావ్వు.

దుఃఖ భారం తొలిగించుకోడానికి తోడ్పడేవి బంధువుల్లాగ నీ సద్గుణాలు.

"శంతనుడూ, విచిత్రవీర్యుడూ, పాండురాజూ ఎలా పాలించారో అలాగే ప్రజల్ని పాలించాడు రాజరాజు దుర్యోధనుడు సంతోషంగా. నీలోకాని, అతడిలోకాని రవంతా దోషంలేదు.

"భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కృపాచార్యుడూ, కర్ణుడూ, కృతవర్మా, శల్యుడూ వొకవేపూ; భీముడూ, నకులుడూ, సహదేవుడూ, ద్రుపదుడూ, విరాటరాజూ, సాత్యకీ వొకవేపూ వుండి పోరాడారంటే అది విధిప్రేరణ. వారివల్ల క్షత్రియలోకమంతా నాశనమైంది. అంతేకాని వొక్క దుర్యోధనుడివల్లే అయిందా? అదీకాక, రాజులకి యుద్ధం ఉత్తమధర్మంకాదా? రణరంగ మరణం సుగతి కారణం.

"నీ కుమారుడు తన సహాయులతోకూడా కలిసి పుణ్యలోక సౌఖ్యా లనుభవిస్తున్నాడు. ధర్మపరుడివి నువ్వు. నీకున్నూ సుగతి సులభంగా లభిస్తుంది. మాభాగ్యంవల్ల ఇకమీదకూడా పరమకృపాపూర్ణులైన పాండవులు మాకు ఏలికలయారు.

"విను, స్వర్గలోకమైన పాలించగలవారు పాండవులు. ఈ భూమి పాలించడం ఏమాత్రం పని వీరికి? మమ్మల్ని వీరిచేతిలో పెట్టావు నువ్వు. అన్నివిధాలా బతికించావు.

"ధర్మరాజు దీర్ఘదర్శి; సచివుడు; బంధురక్షణపరుడు. పగవాణ్ణయినా దయచూస్తాడు. భావసంశుద్ధీ, ప్రతిభా, వ్రతనిష్ఠా వెన్నతో పెట్టినవి ఈయనికి. ఇతర్లని తనలాగే చూస్తాడీయన. అన్నగారికి తగిన వారు తమ్ములు. అన్నివిధాలా ధర్మరాజులాగే మమ్మల్ని రక్షిస్తారు. దేవోత్తరభూములూ, అగ్రహారంభూములూ, మాన్యాల భూములూ, గ్రామాలూ కాపాడతారు. దేవుళ్ళకీ, బ్రాహ్మలకీ భూములున్నూ ఇంకా ఇస్తారు.

"మహారాజా, మృదువైనవారికి ఎంతో మృదువైనవారు పాండవులు. కఠినులకి అంతకంటే కఠినమైనవారు వారు. మందుకోసం వెదుకుదామన్నా మదంకానీ, లోభంకానీ కనపడదు వారిలో.

"శూరులు పాండవులు. శాంతస్వభావులు. పురజనుల్నీ, పల్లె ప్రజల్నీ ఎప్పుడూ ఆనందంలో వోలలాడిస్తారు. గురుభక్తి పరతంత్రులున్నూ వారు.

"కుంతీదేవీ, ఆమె కోడళ్ళూకూడా జాలిగుండెలుకల తల్లులు. పౌరులన్నా, పల్లెప్రజలన్నా ఎంతో దయ వారికి. కనపడ్డప్పుడల్లా హితమే చెపుతూవుంటారు. మమ్మల్ని నువ్వు ప్రేమతో చూడడం తెలుసుకుని ఎంతో మన్నిస్తారు.

"నిర్మలహృదయుడివి నువ్వు. ఏచింతాలేకండా ధర్మరాజు మీద భారంపెట్టు. ఇదే పురజనుల ఏకాభిప్రాయం" అన్నాడు.

శంబువునోట పురజనుల విన్నపం విన్నాడు ధృతరాష్ట్రుడు. సంతోషించాడు. తగినవిధంగా వాళ్ళందరినీ సాగనంపాడు. పాండవుల్నీ, బంధువుల్నీ తమతమ నివాసాలకి పంపాడు. గాంధారితో అభ్యంతర మందిరానికి వెళ్ళిపోయాడు. మిగిలిన ఆ దినమూ, ఆ రాత్రీ తగిన విధంగా వెళ్ళబుచ్చాడు.

## శ్రాద్ధాలు చేసి వెళతాను

మర్నాడు విదురుణ్ణి పిలిపించాడు ధృతరాష్ట్రుడు.

"విదురా, మృతులైన బంధువులకందరికీ గొప్పగా శ్రాద్ధాలు చెయ్యాలని బుద్ధిపుట్టింది. అందుకని కొన్నాళ్ళు పయనం ఆపాను. శ్రాద్ధాలు చేసి వెళతాను అడివికి. నువ్వు ధర్మరాజుదగ్గిరికి వెళ్ళి ఈ కార్యం సంఘటించుకురా" అన్నాడు.

"అలాగే కానీ" అని ధర్మరాజుదగ్గిరికి వెళ్ళాడు విదురుడు. తమ్ముళ్ళతో కలిసికూచున్న ఆ మహారాజుని దర్శించాడు.

"మీతండ్రి భీష్ముడికీ, బాహ్లీకుడికీ, సోమదత్తుడికీ, అతడి కుమాళ్ళకీ, దుర్యోధనుడూ మొదలైన కుమాళ్ళకీ, తదితర బంధువులకీ ఘనంగా శ్రాద్ధాలు చేసి, అనంతరం అడివికి వెళ్ళాలని ఆగాడు. కార్తీకపౌర్ణమిదాకా వుంటాడు. కనక ఈ పని నీచిత్తానికి ఎలాతోస్తే అలా జరిగించు" అని విన్నవించాడు.

సంతోషంతో సమ్మతించాడు ధర్మరాజు. అర్జునుడున్నూ ఆనందంతో అంగీకరించాడు. భీముడు మాత్రం మొహం జేవురించుకున్నాడు. అదురుతున్న పెదవులతో విదురుడి మొహంచూసి ఏమో అనబోయాడు. మెలుపుతో అర్జునుడు అతణ్ణి ఆపేశాడు.

"అన్నా, ధృతరాష్ట్రుడు రాజు. పైగా వృద్ధుడు. భీష్ముడూ బాహ్లీకుడూ, మొదలైన ముఖ్య జ్ఞాతులకి శ్రాద్ధకర్మలు చేస్తానని అర్థించాడు. దీనికి అంగీకరించి నువ్వు గెలిచి తెచ్చిన ధనధాన్యాలు సంతోషపూర్వకంగా అర్పించడం ధర్మంకాదూ? వద్దనడం నీకీర్తిప్రతిష్ఠలకీ ధర్మానికీ హానికాదూ? ధర్మరాజు చెయ్యదలిచినపనికి విఘ్నం చెయ్యడం తగునా మనకి? ధృతరాష్ట్రుణ్ణి ముందు మనం వేడుకునేవాళ్ళం. అడివికి వెళుతూ అతడు మనల్ని వేడుకుంటున్నాడిప్పుడు. ఈమాత్రం ఆలోచించవద్దూ మనం? ఇంకోమాట చెప్పకండా అంగీకరించడమే ధర్మం నీకు" అన్నాడు.

ఒకచెవితో అర్జునుడి మాటలు విన్నాడు ధర్మరాజు. లోలోపల మెచ్చుకున్నాడు.

## ఇంతవరకూ చేసినవి చాలవా?

"ఇంతవరకూ చేసినవి చాలవా?" మొహం ముడుచుకుంటూ అర్జునుడితో అన్నాడు భీముడు, "భీష్ముడూ మొదలైనవారికి శ్రాద్ధాలు ఇంకా చెయ్యాలంటే మనం చాలమా తగినట్టు చెయ్యడానికి? దుష్టమతి ధృతరాష్ట్రు డెందుకంటాను!

"మరిచిపోయావా అతడు మనల్ని పెట్టిన పాట్లు? ఈభీష్ముడూ, బాహ్లికుడూ మొదలైనవాళ్ళు అప్పుడు ఎక్కడికి పోయారు? వాళ్ళని ఎరగమా మనం? అలాంటి బంధువులు ఎందుకో మనకి వాళ్ళు? మనకి చేసిన మేలుకి మరోలా అనడం తప్పూ గిప్పూ ఏమీకాదు. ఆ మాటకివస్తే, విను. కర్ణుడికి ఎంత గొప్పగా శ్రాద్ధం పెట్టదలుచుకున్నా పెట్టవచ్చు కుంతీదేవి. ఆ విషయంలో ఎదురు చెప్పితే పాపం.

"ద్రౌపదిని మానభంగం చేసినమాట ఎలా మరిచి పోయావు నువ్వు. ఆమెతో ధర్మరాజు అడివికి వెళ్ళడం అప్పుడే విస్మరించావా? అవన్నీ గుండెలు చీల్చకండా ఎలావున్నాయి నీకు? ధృతరాష్ట్రుడు తండ్రి తండ్రి అంటున్నావు. ఈ తండ్రి అవాళ ఎటుపోయాడు? భీష్ముడూ మొదలైన పెద్దల చుట్టరికం ఎక్కడికి పోయింది? అర్జునా, ఈ విదురుడు ఎరగడా వారి తెన్ను?"

ఈ మాటలువిని ధర్మరాజు తగిన మాటలాడి భీముణ్ణి అదిలించాడు. అర్జునుడిలా అన్నాడు భీముణ్ణి ఆపుతూ:

"ఏమైనా మనం పూజించదగినవాడు కాడా ధృతరాష్ట్రుడు! ఇలా అనకు. అన్నగారి ఆజ్ఞ పాలించడం వ్రతం కాదా మనకి?"

విదురుడితో ఇలా అన్నాడతడు: "మా తండ్రి పుణ్యకర్మలు ఎలా చెయ్యదలుచుకున్నాడో అలా చెయ్యమను. దానికి ఎంత ధనం కావలసినా నా ఇంటి ధనం తీసుకుని సంతోషంగా వినియోగించమను. విదురా, వేగం వెళ్ళు. అతడు ఆనందించినట్టు ఈమాట మనవిచెయ్యి."

అర్జునుడి మాటలువిని ఆనందించాడు ధర్మరాజు. అతణ్ణిమెచ్చుకున్నాడు. విదురుణ్ణి ఆదరదృష్టితోచూసి ఇలా అన్నాడు:

"ఎంత గొప్పగా చెయ్యాలనుంటే అంతగొప్పగా, స్వేచ్ఛగా నా ధనమూ, అర్జునుడి ధనమూ పుచ్చుకుని శ్రాద్ధాలు చెయ్యమను. ఇది నాకు ఎంతైనా సంతోషం కలిగిస్తుందని విన్నవించు.

"వనవాసంలో కష్టాలుపడి నలిగిపోయాడు భీముడు. అది మనసులో పెట్టుకుని, అనతగని మాటలు ఎన్నో అన్నాడు. దీనికోసం మనస్సు ఆయాస పెట్టుకోవద్దను.

"ఇతడేమంటే ఏముంది, ధృతరాష్ట్రుడు మాకు పరమదేవత. అతడి అనుగ్రహం సంపాదించ గలిగాం, నిజంగా ధన్యుల మను కుంటున్నాం.

"తన ఇష్టంవచ్చిన ప్రకారం పితృకార్యం నిర్వహించమను. గుర్రాలూ, ఏనుగులూ, గోవులూ, బంగారమూ తనచేతికి అర్జునుడు అందిస్తాడు కొదవ లేకండా. దేవుళ్ళకీ, బ్రాహ్మలకీ గ్రామాలుదానం చెయ్యమను. వెళ్ళు, ఆలస్యం చెయ్యకు. నేను చెప్పిన మాటలన్నీ వినిపించు. కావలిసిన పనులన్నీ నువ్వు సొంతం చెయ్యి."

ధర్మరాజు అలా అనడంతోనే సంతోషించాడు విదురుడు. అక్కణ్ణుంచి ధృతరాష్ట్రుడి దగ్గిరికి వెళ్ళాడు.

"మహారాజా, ధర్మరాజు దగ్గిరికి వెళ్ళాను. నువ్వు పంపినపని వినిపించాను. విని సంతోషించాడతడు. అర్జునుడున్నూ ఆనందించాడు ఆలకించి. ఆ ఇద్దరూ ప్రాణాలైనా నీ దగ్గిర దాచరు. ఆలాంటిది ధనం సంగతి వేరే చెప్పేదేముంది! భీష్ముడూ మొదలైనవారు ఉత్తమ గతులు పొందినట్టు నీ ఇష్టం వచ్చినట్టు శ్రాద్ధకర్మలు చెయ్యి. లోకం మెచ్చినంత ఘనంగా చెయ్యి. చేతికి ఎముక లేకండా బంగారమూ, రత్నాలూ, గ్రామాలూ, గోవులూ, గుర్రాలూ, ఏనుగులూ నీఇష్టం వచ్చినట్టు బ్రాహ్మలకి దానంచెయ్యి వాళ్ళు తృప్తిపడినట్టు. నీ కుమాళ్ళు పుణ్యలోకాలు పొంది సుఖపడినట్టు అన్నీ ధారపొయ్యి" అన్నాడు.

ెంతో సంతోషించాడు ధృతరాష్ట్రుడు.

అనంతరం భీముడు అన్నమాటలు ఏదో మాటవరసకి చెప్పి

నట్టు చెప్పి వినిపించాడు విదురుడు. "అతడు దుష్టు. అవి పాటించ దగినమాటలు కావు. నీమనస్సులో అవి పెట్టుకోకు" అని చెప్పి, ధర్మ రాజూ, అర్జునుడూ చెప్పినమాటలు అనేకవిధాల చెప్పి ఆనందపరి చాడు వృద్ధమహారాజుని.

కార్తీకపౌర్ణమినాడు ఎంతోమంది బ్రాహ్మల్ని పిలిపించాడు ధృతరాష్ట్రుడు. శ్రద్ధాపూర్వకంగా శ్రాద్ధవిధులు నిర్వహించాడు. బంగారం మొదలైన వస్తువులు యావత్తూ ధర్మరాజు పంపించాడు. భీష్ముడికీ, బాహ్లికుడికీ, సోమదత్తుడికీ, అతడి కుమాళ్ళకీ ముందు శ్రాద్ధాలు పెట్టాడు వృద్ధరాజు. అనంతరం దుర్యోధనుడు మొదలైన కుమాళ్ళందరికీ వేరువేరుగా శ్రాద్ధాలు సాగించాడు. జయద్రథుడికీ, మిగిలినయావన్మంది బంధువులకీ, ద్రోణాచార్యుడికీ, తనబుద్ధికి తట్టిన ఇష్ట జనానికీ ఘనంగా శ్రాద్ధాలు పెట్టాడు. రత్నాలూ, బంగారమూ, ఆవులూ, గుర్రాలూ, నగలూ, వస్త్రాలూ, కన్యకలూ, భూములూ మొదలైనవి గొప్పగా దానంచేశాడు. అలా పదిహేనుదినాలు జరిపాడు. అదంతా విని ఆనందించాడు ధర్మరాజు. అంతేకాదు, ధృతరాష్ట్రుడు కేవలం భూములు మాత్రం దానంచేస్తున్నాడని విని, "కాదు, గ్రామాలున్నూ దానంచెయ్యి" మను అని కబురంపాడు. విని వల్లమాలిన ఆనందంపొందాడు ధృతరాష్ట్రుడు. ఎన్నో గ్రామాలు అగ్రహారాలు చేశాడు. శకునీ మొదలైన బంధువులకి పెద్ద పెద్ద దక్షిణలిచ్చి అపరక్రియలు జరిపాడు. ఇలా భారతరణంలో మరణించిన బంధులోకానికి పుణ్యలోకసౌఖ్యాలు కలిగినట్టు ఉత్తమమైన శ్రాద్ధాలు నిర్వర్తించి కృతకృత్యుడయాడు.

## అడివికి పయనం

అలాగ అన్నిపనులూ పూర్తిచేశాడు ధృతరాష్ట్రుడు. పాడ్యమి నాడు పెందరాళే ఋత్విక్కులతో కలిసి ఇష్టి సాగించాడు. పాండవుల్ని

తక్కినబంధువుల్నీ, స్నేహితుల్నీ రావించాడు. అడివికి బయలు దేరడానికి సంకల్పించాడు. భృత్యులందరికీ తగినవిధంగా ధనమిచ్చాడు. గాంధారితో కలిసి నారబట్టలు ధరించాడు. అక్షతలతోనూ, గంధంతోనూ, పూలతోనూ ఇంటిని పూజించాడు. సర్వపదార్థాలూ పరిత్యజించాడు. అడివికి బయలు దేరాడు. గాంధారి వెంటనడిచింది. యాజకులు అగ్నులూ, ఉపకరణాలూ పట్టుకుని ముందు చేరువగా నడిచారు.

అలా కోటనుంచి బయలు దేరాడు ధృతరాష్ట్రుడు. ఇంతలో కుంతి మొదలైన కౌరవస్త్రీలందరూ దుఃఖంతో గోలు గోలుమంటూ వచ్చారు. కన్నీళ్లు కారుస్తూ వెంటబడ్డారు. ఆగకండా ముందుకి నడిచాడు ధృతరాష్ట్రుడు.

అతణ్ణి చూసి "హా, మహారాజా! ఎక్కడికి వెళతావు?" అంటూ బావురుమన్నాడు ధర్మరాజు. అతడి శరీరమంతా కంపించింది. దుఃఖంతో కింద చదికిలబడిపోయాడు.

అన్నగారిని ఎత్తుతూ అర్జునుడుకూడా చదికిలబడ్డాడు. వెక్కి వెక్కి ఏడ్చాడు. దుఃఖకరమైన ఆ దృశ్యం చెప్పడానికి నోరాడదు.

భీముడూ, నకులసహదేవులూ, కృపాచార్యుడూ, యుయుత్సుడూ, సంజయుడూ, ధౌమ్యుడూ మొదలైన బ్రాహ్మలూ శోకంతో వ్యాకులపడ్డారు. కుంతి దుఃఖంతో కుంగిపోతూ, గాంధారి చెయ్యి తన బుజంమీద వేసుకు నడిచింది. అంధమహారాజు గాంధారి బుజంమీద చెయ్యివేసుకునడిచాడు.

ఇంతలో ద్రౌపదీ, సుభద్రా, చిత్రాంగదా, ఉలూపీ, కొడుకుని చంకలోపెట్టుకుని ఉత్తరా, తక్కిన అంతఃపురస్త్రీలూ గోలుగోలుమంటూ ఏడ్చారు. జూదంనాడు పాండవులు అడివికి బయలుదేరినప్పు

డలావుంది, అదిగో అలావుంది అవాళ ధృతరాష్ట్రుడు అడివికి పయనం కావడం.

ధృతరాష్ట్ర మహారాజు అడివికి వెళ్ళిపోతున్నా డనగానే చూడడంకోసం గుంపులు గుంపులు వచ్చి మూగారు పురజనులు. ఆడా మగా, చిన్నా పెద్దా యావన్మందీ వచ్చారు. ఎండకన్నూ, వాన కన్నూ ఎరగని ఆడంగులు కూడా ఇళ్ళలోంచి బయలుదేరివచ్చారు. వృద్ధులైన ఆ కురురాజదంపతుల్ని చూసి వెక్కి వెక్కి ఏడ్చారు. నేల మీదా, మేడలమీదా, మిద్దెలమీదా చూస్తూ ఏడ్చిన ప్రజల ఏడుపులు ఆకాశానికీ భూమికీ మధ్య ప్రతిధ్వనించాయి.

పురద్వారం దాటబోతూ యావన్మందినీ ఆగిపొండన్నాడు ధృతరాష్ట్రుడు. అతడితో విదురుడుకూడా అడివికి వెళతానని దృఢ నిశ్చయంతో చెప్పాడు. సంజయుడున్నూ అతడన్నట్టే అన్నాడు. కృపాచార్యుడూ, యుయుత్సుడూ కూడా వస్తామన్నారు. కాని వారిద్దరినీ వారించాడు ధృతరాష్ట్రుడు. ధర్మరాజుకి అప్పగించాడు. కోడళ్ళందరినీ తగినమాటలతో వెనక్కి మళ్ళించాడు. వాళ్ళందరూ ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ పాదాభివందనాలు చేశారు. కన్నీళ్లు మొహాలనిండా చేసుకుని సెలవుపుచ్చుకున్నారు. కుంతీదేవి మళ్ళిపోక గాంధారితో వెళుతూవుంటే, ఆమెకోసం చూస్తూ వారు వెంట నడిచారు కొంతదూరం ముందుకి. అప్పుడు కుంతిని చూసి ధర్మరాజు ఇలా అన్నాడు :

"అమ్మా, మా అయ్య అడివికి వెళుతున్నాడు. నేనూ ఈయనతో వెళతాను. ఆశ్రమవాసంలో శ్రమకలగకండా శుశ్రూష చేస్తాను. ఈ కోడళ్ళను తీసుకుని కోటలోకి వెళ్ళిపో నువ్వు."

"నువ్వు వెంటరావడానికి వొప్పుకుంటాడా నాయనా, ఈ మహారాజు? వద్దు, అలాటి పనికి పూనకు. ఇదిగో ఈ గాంధారి

నా అత్తగారు. ఈ మహారాజు నా మామగారు.* వీరి సేవచేస్తూ వీరివెంట వుంటాన్నేను అడివికివెళ్ళి. విను, ఈయనకీ ఈమెకీ తెలిసి శుశ్రూష చెయ్యడానికి నేనే తగినదాన్ని. మరొకరెవ్వరూ ఆపని చెయ్యలేరు. బాబూ, వీరు అడివికిపోతూవుంటే ఇంట్లో వుండడానికి మనస్సెలా వొప్పుతుందోయినాకు!" అంది కుంతి.

## కర్ణుణ్ణి మరిచిపోకండి

ధర్మరాజూ, తమ్ములూ ఎంతో వేడుకున్నారు అడివికి వెళ్ళ వద్దని. అయినా వెనక్కి మళ్ళలేదామె.

"నాయనా," మళ్ళీ ధర్మరాజుతో అంది కుంతి, "విచారించకోయి. వీరి విషయంలో ఎన్నడూ అపచారం నోట రానియ్యన్నేను. ఏమైనాసరే, అడివికి వెళ్ళడం మానను. ఇది వ్రతంగా పెట్టుకున్నాను" అంటూ తనబుజంమీదవున్న గాంధారి చెయ్యి తనచేత్తో మెల్లిగా తప్పించి, ధర్మరాజుదిక్కు తిరిగి ఇంకా ఇలా అంది :

"చినబాబు సహదేవుణ్ణి ఏమీ అనకుమీ ఎప్పుడూ. కర్ణుణ్ణి మనసులో మరిచిపోకు. దేవతవంటి కుమారుడి పుట్టుక కపటంచేసి దాచిపెట్టాన్నేను. ఆ పాపానికి ఎప్పుడూ లోలోపల కుళ్ళిపోతున్నాను. ఆ పాపం పోడానికి మంచి పదార్థాలు శ్రద్ధగా దానంచెయ్యి నాయనా! అంత గొప్పకొడుకు హతవారిపోయాడు. నూరుచెక్కలు కాకండా వుండిపోయింది నా రాతిగుండె. నువ్వూ, నీతమ్ములూ భక్తితో తలుచుకుంటూ వుండండి నాకన్నతండ్రిని. ద్రౌపదిని

* అక్కా బావా అనడానికిబదులు అత్తా మామా అంది గాంధారీ ధృతరాష్ట్రుల్ని కుంతి. "ఇ య్యమ యత్త నాకు; నీ మనుజవిభుండు మామ" అని తిక్కన. చూ. ఆశ్రమవాసపర్వం, 1-147. సంస్కృతమూలం "శ్వశ్రూశ్వశురయోః పాదాన్ శుశ్రూషంతీ వనేత్వహమ్" అనే వుంది. చూ. ఆశ్రమవాసపర్వం. 16.16.

ఎప్పుడూ గాఢమైన గారాబంతో మన్నిస్తూవుండు. తమ్ముల్లు భీమార్జునులా, నకులసహదేవులా కోరికలు తెలుసుకుని చెల్లిస్తూవుండు. వాళ్ళని ఎన్నడూ చిన్నబుచ్చకు.

"నేను ఆశ్రమవాసంచేస్తాను. నా నిశ్చయానికి తిరుగులేదు. మీరు ఇక మళ్ళిపోండి."

తల్లిమాటలు విని విచారంతో మాటాడకండా వూరుకున్నాడు ధర్మరాజు. భీముడూ, అర్జునుడూ దుఃఖంతో కన్నీళ్లురాలుస్తూ తలలు వాంచుకు నిలబడిపోయారు. ముందుకిసాగుతున్న వారి నడక మందగించింది. ధృతరాష్ట్రుడు కొంచెం ముందుకిసాగాడు. అప్పుడు తల్లి మొహం చూస్తూ ధర్మరాజు ఇలా అన్నాడు:

"ఏంమాటమ్మా ఇది! నిన్ను అడివికి పోనిస్తానటమ్మా నేను? ఇలా అనకు. వెనకటిలాగే మాచేత పనులు చేయించుకోనువ్వు. 'ఇది ఇలాచెయ్యండి. ఇది చెయ్యకండి' అని నువ్వు సరిదిద్దకపోతే ఎప్పటికప్పుడు రాజ్యభారం భరించగలమా తల్లీ, మేము? వెనక నువ్వూ, శ్రీకృష్ణుడూ ఎలా కార్యంనడిపారో తెలియదటమ్మా నీకు? మమ్మల్నీ ద్రౌపదినీ ఇలా దుఃఖప్రవాహంలో ముంచేసి అడివికి చెళ్ళి ఎలా వుంటావమ్మా నువ్వు?"

మాటాడకండా కళ్ళనీళ్లు నింపుకుంటూ అలాగే ముందుకి అడుగులువేసింది కుంతి. అప్పుడు భీముడు ఆమెతో ఇలా అన్నాడు:

"ఎందుకని ఇలా ధర్మరాజుని వొదిలి వెళతావమ్మా నువ్వు? నీమాటప్రకారం యుద్ధంచేశాడు. రాజుల్ని చంపాడు. ఈయన సంపదపురస్కరించుకుని నువ్వు మనుగడ సాగించక, తీరా ఇప్పుడు వొదిలిపోతావా? ధర్మమేనా అమ్మా, ఇది? నీకుతోచినట్టు దానాలు చెయ్యి. ఆశ్రయించినవాళ్ళని పోషించు. బంధువుల్ని కాపాడుతూ అంతమందీ ఔరా అన్నట్టు కాలక్షేపం చెయ్యి.

"సౌజన్యవంతురాలివి నువ్వు. అవాళ మాద్రి కొడుకులు అడివికి మాతో వచ్చినప్పుడు అంత అలాగ దుఃఖపడ్డావు. మమ్మల్ని యుద్ధంచెయ్యమని సందేశం పంపావు. ఇప్పుడు నీబిడ్డల్ని దుఃఖంలో ముంచి అడివికి వెళ్ళడం తగునటమ్మా నీకు!"

మాటాడలేదు కుంతి. ద్రౌపదీ, సుభద్రా దుఃఖావేశంతో కన్నీళ్లు కారుస్తూ వెక్కి వెక్కి ఏడ్చారు. పాండవులున్నూ ఏడ్చారు. పరిజనులున్నూ ఏడుస్తూ కన్నీళ్ళతో వెంట నడిచారు.

ఇలా కుమాళ్లు తనను వొదలకండా వెంటపడడంతో ఎంతో బాధపడింది కుంతీదేవి. కఠినంగా చెప్పందే వీళ్లు వొదిలిపెట్ట రనుకుంది. కన్నీళ్లు తుడుచుకుంది. కుమాళ్ళ నోమారు తేరిచూసి పరిజనంతో అంది :

"దుష్ట జూదంలో వీళ్ళు వోడిపోడమూ, ఆ సభలో అవమానంపాలుకావడమూ, అడివిలో అష్టకష్టాలు పడడమూ సహించలేకపోయాను. సంధికి సమ్మతించనివాళ్ళ మధ్య వుండి నవ్వులపాలై తలలు వొంచుకు బతకడం దేనికని అవాళ కృష్ణుడితో అలా కబురు పంపాను. మాననీయుడు ధర్మరాజు. పదివేల ఏనుగుల బలశాలి భీముడు. పగవాళ్ళ పాలిట మృత్యువు అర్జునుడు. శౌర్యలోలులు కవలబిడ్డలు. వీళ్లు దైన్యంపాలుకావడం చూడగలనా!"

ధర్మరాజు మొహంచూస్తూ, ద్రౌపదిని చూపించి ఇంకా ఇలా అంది ఆమె :

"ఎంత గౌరవ వంశంలో పుట్టింది బిడ్డ! ఎంత సుకుమారి! ఇలాటి ఈమెని జుత్తుపట్టి ఈడ్చి తెచ్చాడు సభకి దుశ్శాసనుడు. అవమానపరిచాడు. తమ కళ్ళముందు జరుగుతున్న దాన్ని చూస్తూ పెద్దలందరూ వూరుకున్నారు. అదఇతా అప్పటికి కిక్కురుమనకండా వోర్చుకోవలసివచ్చింది మీరు. మీ పరాక్రమం అలా నీరయిపోతే

పాండురాజు కులం వేలెత్తి చూపడానికేముంటుంది? కనకనే మీరు ప్రసిద్ధికెక్కాలనీ, తలెత్తుకు తిరగగలగాలనీ కృష్ణుడితో అలా చెప్పి పంపాను. ఆమాట భీముడు ఎత్తిపొడిచాడిప్పుడు! ఇంక ఏమనేది నేను!"

కుంతి ఇలా అనడం విని ధర్మరాజూ, భీముడూ సిగ్గుపడి పోయారు. తానన్నమాటకి భీముడి మనస్సు ఏమైందో అనుకుని, అతణ్ణి చూపుతూ ఇంకా ఇలా అంది కుంతి:

"ధర్మరాజా, నా మనస్సులో మరేమీ లేదోయి. విను, భీమన్నతో కలిసి నవ్వాను. నీ సిరిసంపదల మూలంగా ఉత్తమమైన దానాలు చేశాను. కళ్ళారా నువ్వు చేసిన యజ్ఞాలు చూశాను. ఇంకేం కొరత నాకు! ఇక అడివికి వెళతాను. ఆశ్రమవాసం చేస్తాను. రాజ్యఫలం కోరను. తపస్సుచేసి ఉత్తమగతి కోరతాను. దానికి ఇలాటి మంచితోడు దొరుకుతుందా మరి? కురురాజుకీ, గాంధారికీ సేవచేస్తూ తపస్సు చేస్తాను. కృశించిన శరీరంతో చివరిజీవితం గడుపుతాను. నాయనా, ఇక మీరు తిరిగిపోండి."

కుంతీదేవి తనతో అడివికి వెళతానని పట్టుబట్టడమూ, పాండవులు వద్దని ఆమెని ప్రార్థించడమూ తెలిసి "ధర్మరాజు ఎలా చెప్తే అలా చెయ్యి" అంటూ విదురుడిచేతా, సంజయుడిచేతా ఆమెకీ కబురు పంపాడు ధృతరాష్ట్రుడు. విదురుడూ, సంజయుడూ వచ్చి ఆమాట కుంతీదేవితో చెప్పారు. అయినా తన సంకల్పం మార్చుకోలేదామె. వారిమాటలు విని విచారించింది. దృఢనిశ్చయంతో కుమాళ్ళనీ, కోడళ్ళనీ, తక్కిన బంధువుల్నీ, యావన్మంది కౌరవభార్యల్నీ, పరిజనుల్నీ కలయచూసింది. "ఇలా ఎందుకూ వస్తారు మీరు? ఇక ఆగండి. సుఖంగా వుండండి" అంది.

దాంతో వణుకుతున్న గుండెలతో అందరూ వోమారు

ప్రదక్షిణంచేశారు. వెక్కి వెక్కి, గొంతెత్తి ఏడుస్తూ అన్ని వేపులా తిరిగారు. పాదాభివందనంచేశారు. తూలిపోతున్న శరీరాలతో ఆగారు.

పాండవులు అయిదుగురు ఆమెని సాగనంపుతూ, ఆమెని ధృతరాష్ట్ర గాంధారులతో కలిపారు ముందుకితీసుకువెళ్ళి. వారిద్దరిని ఉద్దేశించి, "మీరు అడివికి వెళ్ళిపోతున్నారు. మీతో ఈమెకూడా వెళ్ళిపోతున్నది. ఇక మా కాల మెలాగడుస్తుంది? ఈ తలంపుతో ఎంత ప్రార్థించినా వుండడానికి వొప్పుకోలే దీమె. ఈ అమ్మకి బుద్ధి చెప్పుకుంటూ, ఈమెచేత పరిచర్య చేయించుకోండి" అంటూ కుంతీదేవిని వారికి అప్పగించారు. ధృతరాష్ట్ర గాంధారులకీ, అమ్మ కుంతీదేవికీ ప్రదక్షిణం చేశారు; దండప్రణామాలుచేశారు. దీవించి, సెలవిచ్చారు వారు.

కన్నీళ్ళతో వెనక్కిమళ్ళారు పాండవులు. స్త్రీజనాన్ని వెంటపెట్టుకుని దుఃఖంతో కుంగిపోతూ పట్నంచేరుకున్నారు. దుఃఖం పోగుపెట్టినట్టుంది హస్తినాపురం. చూడడం దుర్భరంగా వుంది. అలాటి పట్నంలో ప్రవేశించలేక, ప్రవేశించలేక ప్రవేశించారు పాండవులు. ఎవరిమందిరాలు వారు చేరుకున్నారు. ధర్మరాజూ, తమ్ములూ తగినవిధంగా నడుచుకుంటూవచ్చారు.

అక్కడ కురువృద్ధుడు ధృతరాష్ట్రుడు నిశ్చింతగా గాంధారితోనూ, విదురసంజయులతోనూ, అగ్నిహోత్రానికి అవసరమైన ఋత్విక్కులతోనూ అలసటలేకండా వెళ్ళి గంగాతీరం చేరాడు. అక్కడ వొక తగినప్రదేశంలో ఆగాడు. నెమ్మదిగా స్నానాదికాలు పూర్తిచేసుకున్నాడు. వేదాలు తెలిసిన బ్రాహ్మలు వెలిగించిన అగ్నిహోత్రం అర్చించాడు. చక్కగా హోమం సాగించాడు. అంతమందికీ భోజనాదికాలు సంఘటింపచేశాడు. తానున్నూ భోజనం ముగించాడు. విదురుడూ, సంజయుడూ ఏర్పరిచిన దర్భశయ్యమీద విశ్రాంతి

తీసుకున్నాడు. అతడి శయ్యకి కొంచెం దూరంలో వేసిన శయ్యమీద గాంధారి విశ్రమించింది. మరికొంచెందూరంలో వాళకపక్కమీద కుంతి విశ్రమించింది. అల్లంతదూరంలో విదురుడూ, సంజయుడూ, చుట్టూ తమకు వీలైనచోట్ల యాజకజనులూ విశ్రమించారు. అలా మిగిలిన రోజు గడిచిపోయింది. పొద్దుగూకింది. సాయంకాల కృత్యాలు తీర్చుకున్నారు వారు. ఆరాత్రి అక్కడ గడిపారు.

## ఆశ్రమవాసం

మర్నాడు పొద్దుదూరింది. తనవారితో కాల్యకృత్యాలు తీర్చుకున్నాడు ధృతరాష్ట్రుడు. గంగానది ఉత్తరించి వెళ్ళి కురుక్షేత్రం ప్రవేశించాడు. ఒక పుణ్యాశ్రమందగ్గిర చల్లని చెట్టునీడ ఇసకమీద కూచున్నాడు. శతయూపుడనే రాజరుషి ఆశ్రమం అది. కేకయ వంశ్యుడతడు ; తపోధనుడు. తన ఆశ్రమందగ్గిరికి ధృతరాష్ట్రుడు వచ్చాడని విన్నాడతడు. వినడమే తడవుగా వచ్చి గౌరవపూర్వకంగా ధృతరాష్ట్రుణ్ణి చూశాడు. అర్ఘ్యాదివిధులు వినయంగా సాగించాడు. తన ఆశ్రమంలో నివసించమని కోరాడు.

ధృతరాష్ట్రుడి అభిప్రాయం తెలుసుకుని, ఆదగ్గిరలో పర్ణశాలలు నిర్మించారు విదురసంజయులు చక్కగా. నారబట్టలూ, లేడిచర్మాలూ ధరించి గాంధారీ, ధృతరాష్ట్రుడూ ఆపర్ణశాలలో నివసించారు వ్రతనిష్ఠతో. కుంతీ, విదురుడూ, సంజయుడూకూడా వారితో వుండి ఆశ్రమవాసం చేశారు. యాజకులు నిత్యకృత్యాలు నడుపుతూ వచ్చారు.

ఇలా నియమనిష్ఠలతో అక్కడ తపస్సు చేశాడు ధృతరాష్ట్రుడు. అస్థిచర్మావశేషంగా కృశించిపోయిందిఅతడి శరీరం. అతడి తపోనిష్ఠ చూసి అక్కడి మునులు ముక్కుమీద వేలుపెట్టుకున్నారు.

—

# ఆశ్రమవాసపర్వం

## రెండో ఆశ్వాసం

### నారద ప్రసంగం

ధృతరాష్ట్రుడు అలా పరమతపోధుర్యుడయివుండగా వొకనాడు నారదుడూ, పర్వతుడూ, దేవలుడూ, మాంజాయనుడూ అతణ్ణి చూడడంకోసం ఆ ఆశ్రమానికి వచ్చారు. శతయూపుడుకూడా కుతూహలంతో అక్కడికి వచ్చాడు. అందరినీ భక్తిశ్రద్ధలతో అర్చించింది కుంతి. సంతోషించి, ధృతరాష్ట్రుడిదగ్గిరికి వెళ్ళారు వారు. వినయసంభ్రమాలతో అందరికీ నమస్కరించాడు ధృతరాష్ట్రుడు. అందరికీ దర్భాసనాలు వేయించాడు. దీవించి కూచున్నారు మునులు. మాటామంతీ ఆడుతూ సందర్భానుసారంగా నారదముని ఇలా ఎత్తుకున్నాడు :

"ఈ ఆశ్రమప్రదేశం పుణ్యస్థలం. శతయూపుడి పితామహుడు సహస్రచిత్య మహారాజు తన పెద్దకొడుకైన శతచిత్యుడికి రాజ్య మర్పించి, ఈ ఆశ్రమానికి వచ్చి తపస్సుచేశాడు; దేవేంద్రుడి స్నేహం సంపాదించాడు. పృషధ్రుడూ;* శైలాలయుడూ, పురుకుత్సుడూ ఇక్కడ తపస్సుచేసి ఇంద్రలోకానికి వెళ్ళారు. ఆ రాజరుషుల నందరినీ నేను ఈలోకసంచారానికి వచ్చినప్పుడు ఇక్కడ చూశాను. ఇప్పుడు అక్కడ చూస్తున్నాను. నిజంగా ఇతరదుష్ప్రాప్య మైన పుణ్యదేశం ఇది. వేదవ్యాసుడి అనుగ్రహంవల్ల ఇక్కడ నివాసం సంభవించింది నీకు.

---

* వైవస్వత మనువుకుమారుడు. గురువైన చ్యవనుడి ఆవు చంపి శూద్రుడైనట్టు శాపం పొందాడు. – విష్ణుపురాణం.

"ఇక్కడ తపస్సుచెయ్యడంవల్ల సహస్రచిత్యుడూ మొదలైన రాజులమల్లేనే స్వర్గపదం సంపాదిస్తావు నువ్వు. నీతో గాంధారికూడా వస్తుంది. భక్తితో మీ శుశ్రూషచేసి కుంతీదేవి పాండురాజుని చేరుకుంటుంది పాండురాజు దేవేంద్రుడి సన్నిధిని వుండి ఎప్పుడూ నిన్ను తలుచుకుంటూ వుంటాడు. అతడు శ్రేయస్సు కలిగిస్తాడు నీకు. ధర్మమూర్తి అయిన ధర్మరాజు తన ఆత్మ కనక విదురుడు అతడి శరీరంలో ప్రవేశిస్తాడు. సంజయుడు స్వర్గలోకానికి వెళతాడు" అన్నాడు.

విని, గాంధారీ కుంతీ సమేతంగా సంతోషించాడు ధృతరాష్ట్రుడు. అక్కడున్న అందరూ ఆనందించారు. అప్పుడు శతయూపుడు నారదమునితో ఇలా అన్నాడు:

"మూర్తీభవించిన జ్ఞానస్వరూపుడివి నువ్వు. కౌతుకంకొద్దీ నిన్ను వొకటిఅడుగుతాను. అనుగ్రహించి సెలవియ్యాలి."

"అడగదలిచింది అడుగు, సందేహమెందుకూ?" అన్నాడు నారదుడు.

"ధృతరాష్ట్రుడు సుగతి పొందుతాడని నిర్దేశించావు. ఆ విశేషం వినాలని కుతూహలంగావుంది; వివరించు" అన్నాడు శతయూపుడు.

"విను" అంటూ అందుకున్నాడు నారదముని, "ప్రతిదినం నేను దేవేంద్రుడిదగ్గిరికి వెళుతూవుంటాను. మాటలసందర్భంలో ఈ ధృతరాష్ట్రుడి ప్రసంగం వచ్చింది ఆ సభలో. ఇతడి తపోనిష్ఠ వర్ణించారు సభ్యులు. అప్పుడు నాతో దేవేంద్రుడు చెప్పాడు, 'మునిజాతుడు ధృతరాష్ట్రుడు. మూడేళ్లు తపస్సుచేసి, తానూ, భార్యా శరీరాలు విడిచిపెడతారు. కుబేరుడి స్నేహంతో, దివ్యాభరణాలు ధరించి విమానంలో విహరిస్తాడు సంతోషంగా' అన్నాడు. పాండురాజు విని పరమానందం పొందాడు."

నారదుడలా చెప్పడంతోనే ధృతరాష్ట్రుడు ఎంతో ఆనందించాడు. మిగిలిన యావన్మందీకూడా సంతోషించారు. ఇలా సద్గోష్ఠి నడిపి, ధృతరాష్ట్రుణ్ణి అభినందించి, వెళ్ళొస్తా" మంటూ నిజనివాసాలకి వెళ్ళిపోయారు మునులు.

## పాండవుల పరితాపం

ధృతరాష్ట్రుడు ఇక్కడ ఇలా ఆశ్రమవాసంచేస్తూ వుండగా అక్కడ హాస్తినాపురంలో పాండవులు తల్లిని తలుచుకుంటూ దుఃఖించేవారు. ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ జ్ఞాపకంచేసుకుని విచారపడేవారు. పురజనులున్నూ అలాగే విచారించేవారు.

"వృద్ధుడు ధృతరాష్ట్రుడు. సుఖపడదగినవాడు. నిర్జనమైన అడివిలో ఎలావుంటాడో! గాంధారీ, కుంతీ ఎంతో సుకుమారశరీరులు. అడివిలో ఎలా వోర్చుకుంటారో కష్టం! ఇలాంటికొడుకుల్నీ, రాజ్యభోగాల్నీ విడిచి అడివికి వెళ్ళిపోయిందో కుంతీదేవి! తల్లిలేని బిడ్డలయి ఎంత విచారిస్తున్నారో పాండవులు!

"విదురుడి శరీరమూ, సంజయుడి దేహమూ అడివి ఆయాసం వల్ల ఎంత చిక్కిపోయారో! పాపం, ధృతరాష్ట్రుడిమీద భక్తివల్లే వాళ్ళున్నూ అడివికి వెళ్ళిపోయారు!" అని వొకళ్ళతో వొకళ్ళు చెప్పుకునేవారు ప్రజలు విచారంగా.

తల్లిలేదని ఎప్పుడూ విచారిస్తూనే వుండేవారు పాండవులు. అయిదుగురు అన్నదమ్ములూ వొక్కదగ్గిర కూచుని ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ తలుచుకునేవారు.

"వారి కొడుకులందరూ చచ్చిపోయారు."

"పాపం, ముసిలి వరుగులు, ఇలాగ అడివిగలిసిపోయారు!"

"ఎన్నాళ్లు అడివిలో వుంటుందో అమ్మ కుంతి అడివిలో ఆకూ అలమూ తింటూ!"

"దయమాలి బంధువుల్ని చంపేశాం. ధైర్యం చిక్కబడ్డ లేక పోయాం. కోపం అణుచుకోలేక పోయాం!"

"అంతటి వీరుణ్ణి అభిమన్యుణ్ణి పోగొట్టుకున్నాం. అతడి అన్న దమ్ముల్నీ, అన్న కర్ణుణ్ణీ పోగొట్టుకుని వొంటిగాళ్ళమై మిగిలాం!" అంటూ దుఃఖంతో బరువైనమాటలాడేవాళ్లు. హాస్తినాపురం ప్రజలు ఈమాటలు విని కలతపడేవాళ్ళు.

ఇలా ప్రతిదినమూ చింతాక్రాంతులై బాధపడేవారు వారు. విదురుణ్ణీ, సంజయుణ్ణీ తనుపుకితెచ్చుకుని వేదనపడేవారు. ఈ విచారంతో కళాకాంతులు లేకండా అయారు. మనోహరమైన భోగాలు వొదులుకున్నారు. వినోదాలు విడిచిపెట్టారు. రాజ్యసంపద చూడడం మానుకున్నారు. పాడుపడినట్టయిపోయారు.

ద్రౌపదీ, సుభద్రా సంతాపపడేవారు. అదిచూసి పాండవులు మరింత పరితాపపడేవారు.

అయితే జనమేజయ మహారాజా, అప్పుడు చంటివాడైన మీ తండ్రి చూపు వారందరి దుఃఖమూ పోగొట్టేది.

అలా ధైర్యంపోయినవారుగా వుండిన పాండవులు ధృతరాష్ట్రుణ్ణి చూడడానికి వెళ్ళాలనుకున్నారు. అప్పుడు సహదేవుడు ధర్మరాజు పాదాలకి ప్రణామంచేసి ఇలా అన్నాడు:

## అమ్మని చూడాలి

"అన్నయ్యా, ముందు చెప్పడానికి భయపడ్డ చూడడానికి వెళ్ళడమే తగినపని. ఇంతకీ అడివిలో వుండి ఎంత దుస్థితి అనుభవిస్తున్నాదో ఆమె! ఆమె ప్రాణాలతో వున్నప్పుడే వెళ్ళి వొకమారు చూడడం ధర్మంకదా మనకి! బావగారినీ, అప్పగారినీ అనుసరిస్తూ ఎలావుందో ఆ తల్లి! ధృతరాష్ట్ర గాంధారులున్నూ సుకుమా

రులు. నారబట్టలు కట్టుకుంటూ, లేడితోళ్లు కప్పుకుంటూ, వ్రతం పూని, దుంపాదుల్లా తింటూ ఎంత కష్టపడుతున్నారో! ఒక దుర్దశ పుట్టకముందే తప్పకండా వారిని చూడడానికి వెళ్ళడం మన కర్తవ్యం.''

చేరువనే వుండి చెవివొగ్గి దుఃఖంతో వింటున్న ద్రౌపది ఇలా అందుకుంది.:

"అవును, తప్పకండా వెళ్ళడమే కర్తవ్యం. ఉన్నమాట ఉచితంగా చెప్పాడు సహదేవుడు. కుంతీదేవి కోడళ్ళందరూ ఎత్తుకాళ్ళ మీద ప్రయాణానికి సిద్ధంగా వున్నారు, తపస్వినిగా వున్న ఆమెని చూడాలని'' అంది.

ఆ ఇద్దరూ అలా అనడంతోనే అడివిప్రయాణంకోసం దళపతుల్ని పిలిపించాడు ధర్మరాజు.

"ధృతరాష్ట్రుడి దర్శనానికి వెళతాం. అంత హెచ్చుకాకండా తగినంత చతురంగబలం సమకట్టండి. మేనాలూ, నాటుబళ్ళూ అధికంగా సిద్ధంచెయ్యండి. అనేకమైన బళ్ళూ, గుడారాలూ, భక్ష్యభోజ్యాలూ పట్టుకువచ్చినట్టు పరిచారకుల్ని నియమించండి. పౌరులు ధృతరాష్ట్రుణ్ణి చూసి అభిప్రాయంతో ఎవరువచ్చినాసరే, వారి యోగక్షేమాలు చూస్తూ తీసుకువచ్చేవారిని నియోగించండి. 'రేపే ప్రయాణం' అని చాటించండి'' అని ఆదేశించాడు. వాళ్ళు ధర్మరాజు ఆజ్ఞప్రకారం అన్నిపనులూ నిర్వహించారు.

మర్నాడు యుయుత్సుణ్ణీ, కృపాచార్యుణ్ణీ, ధౌమ్యపురోహితుణ్ణీ పిలిపించాడు ధర్మరాజు. "మీరు పురరక్షణంకోసం నిలవండి'' అంటూ ఆదరభావంతో చెప్పాడు. "ఏనుగులతో నువ్వురా'' అని భీముడితో చెప్పాడు. "రథాలతో నువ్వురా'' అని అర్జునుడితో చెప్పాడు. "గుర్రపుదళంతో నువ్వురా'' అని నకులుడితో చెప్పాడు. "కాల్బలంతో నువ్వురా'' అని సహదేవుడితో చెప్పాడు.

ధర్మరాజు ఆజ్ఞప్రకారం తూర్యనాదాలతోనూ, గొడుగుల తోనూ, పతాకాదులతోనూ, రత్నభూషణాలతోనూ వైభవంగా బయలు దేరివచ్చారు తమ్ములు.

ద్రౌపదీ మొదలైన అంతఃపుర స్త్రీజనాన్నీ, తక్కిన కౌరవ స్త్రీలనీ మేనాలూ వాటిమీదా, నాటుబళ్ళమీదా తీసుకురండని అంతఃపురాధికార్లని నియమించాడు ధర్మరాజు. వారంతా ఆ ప్రకారం చేశారు.

నల్లటితోకల తెల్లగుర్రాలు పదహారు పూసిన రతనాల రథంమీద కూచున్నాడు ధర్మరాజు. ముత్యాల కుచ్చులు వేలాడు తున్న తెల్లగొడుగులు పట్టారతనికి.

పిల్లంగోవులూ, వీణలూ మోగాయి. గాయకులు వివిధ రాగా లతో గానంచేశారు. పాఠకులు మంగళవాక్యాలు పఠించారు. వంది మాగధులు స్తోత్రాలు చేశారు.

అలా ధృతరాష్ట్రుడిదగ్గిరికి కురుక్షేత్రం బయలుదేరాడు మహా వైభవంతో ధర్మరాజు. రకరకాల వాహనాలెక్కి పౌరజనులు అతడి వెంట బయలు దేరారు.

గంగానది ఉత్తరించి కురుక్షేత్రం ప్రవేశించాడు ధర్మరాజు. కొంతదూరం వెళ్ళేసరికి శతయూపుడి ఆశ్రమంచేరువ అరిటిచెట్లతో నిండి, మృగాలతో గందికగా వుండిన ధృతరాష్ట్రుడి ఆశ్రమం అవు పడింది. ఎరిగినవాళ్లు "అదిగో అదే, అదే" అని చూపించి చెప్పారు.

ధర్మరాజు రథం దిగాడు. భీముడూ మొదలైనవారున్నూ వాహనాలు దిగారు. తక్కిన యావన్మందీ వారి ననుసరించారు.

ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి వెళ్ళాడు ధర్మరాజు. "మా తండ్రి ఏడీ?" అని అక్కడివాళ్ళని గద్గదకంఠంతో అడిగాడు.

"యమునా నదిలో స్నానంచేసి, అదేదారిని పువ్వులుకోసుకు

రాడానికి వెళ్ళాడా యతి ” అని చెప్పారు వాళ్లు. ఏదారిని వెళ్ళాడో ఆదారికూడా చూపించారు.

ఆశ్రమందగ్గిరవాళ్లు చెప్పినదారిని వెళ్ళారు పాండవులు. ఎదురుగా నడిచివస్తున్న ధృతరాష్ట్రుడూ మొదలైనవారిని చూశారు. అన్నలను దాటుకుని చప్పున ముందుకి వెళ్ళాడు సహదేవుడు. తల్లి కాళ్ళమీద పడి బావురుమని ఏడ్చాడు. కన్నీళ్లు వరదలుకడుతూ అతణ్ణి ఎత్తి కౌగిలించుకుంది కుంతి. ఏడుస్తూ, “ సహదేవుడు ” అని గాంధారితో చెప్పింది. పాండవులు వచ్చారని పక్కవాళ్లు ధృతరాష్ట్రుడితో చెప్పారు. మిగిలిన పాండవులు నలుగురూ తల్లి కుంతి పాదాల మీద వాలారు. అందరినీ పొదివిపట్టుకుందామె. వాత్సల్యంతో మనస్సు చెమ్మగిల్లి, కన్నీళ్ళుకార్చింది. గాఢంగా కౌగిలించుకుంది. వారి కన్నీళ్ళు చేతులతో తుడిచింది. ప్రేమతో దీవనలిచ్చింది.

సంజయుడు వినయంతో ధర్మరాజుని దర్శించాడు. భీమార్జునుల్నీ, నకులసహదేవుల్నీ ప్రేమతో కలుసుకున్నాడు. అయిదుగురూ ప్రీతిగా అతణ్ణి ఆదరించారు. ద్రౌపదీ మొదలైన కోడళ్ళూ, తక్కిన కౌరవుల భార్యలూ వరసగా ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ, కుంతినీ దర్శించారు. ధృతరాష్ట్రుడూ మొదలైనవారు పట్టుకువస్తున్న నీటికలశాలు పుచ్చుకుని పాండవులు పట్టుకున్నారు. పురజనులందరూ గాంధారీ ధృతరాష్ట్రుల్నీ, కుంతీదేవినీ వినయంతో దర్శించారు. అందరూ కలిసి హస్తినాపురంలో వున్నట్టే అనిపించింది ధృతరాష్ట్రుడికి. అంతమంది తోనూ కలిసి ఆశ్రమానికి వచ్చాడతడు.

## ధృతరాష్ట్రుడి ఆశ్రమంలో

చుక్కలతో వున్న ఆకాశంలా అవుపించింది ధృతరాష్ట్రుడి ఆశ్రమం అవాళ. చుక్కల్లో చంద్రుడిలాగ బంధువులమధ్య ప్రకా

శించాడు ధృతరాష్ట్రుడు. పాండవులు వచ్చారనడంతోనే వారిని చూడాలన్న వేడుకతో చుట్టుపక్కలవున్న తాపసులు ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి వచ్చారు. వారందరికీ సవినయంగా దండప్రణామాలు చేశారు పాండవులు. అంతమందీ ధృతరాష్ట్రుడిచుట్టూ కూచున్నారు. స్త్రీజనం వొకవేపు ఆగారు. మును లందరూ తగిన ఆసనాలమీద కూచున్నారు. సంజయుణ్ణి చూసి, "ధృతరాష్ట్రుడి ఈ బంధుజనుల్ని విడి విడిగా మాకు పరిచయం చెయ్యి" అని అడిగారు.

"చిత్తగించండి" అంటూ అందుకున్నాడు సంజయుడు, "ఇదిగో బంగారం వర్ణంకలిగి పల్చని ఎత్తయిన శరీరమూ, ఉన్నతమైన పొడవాటి నాసికా, విశాలమైన సోగకన్నులూ, సింహరేఖా కలిగి, చూపుకి ఎంతయినా అగ్గజంగా అవుపిస్తున్న ఇతడు ధర్మరాజు.

"ఎర్రదనంతోనూ, ఎత్తయిన మూపులతోనూ, పొడవాటి చేతులతోనూ, వెడల్పాటి రొమ్ముతోనూ అవుపిస్తున్న ఇతడు భీముడు.

"ఉజ్వలమూ సుందరమూ అయిన శ్యామలశరీరమూ, మదగజంలాటి ఠీవీ, పద్మాలవంటి నేత్రాలూ కల ఇతడు అర్జునుడు.

"సాటిలేని సుందరాకారాలతో కుంతి రెండువేపులా కూచున్నారు చూడండీ, విష్ణుమూర్తి దేవేంద్రుల్లాగ ఆ ఇద్దరూ నకులసహదేవులు. వినయమే వారికి భూషణం.

"అదుగో నల్లకలవలఛాయవంటి శరీరచ్ఛాయా, నవపద్మదళాలవంటి మెరుగునేత్రాలూ, నడిమిప్రాయమూ కలిగి అందాలకుప్పలావున్న ఆ ఉదారమూర్తి ద్రౌపది.

"ద్రౌపది పక్క కప్పెర్ర శరీరంతోనూ, పద్మంలాటి మొహంతోనూ, సూర్యుడి మహిమ ఉజ్వలమైన ఆకారం ధరించిందా అన్నట్టున్న లతవంటి దేహంకల ఆమె శ్రీకృష్ణుడి చెల్లెలు సుభద్ర; అర్జునుడి ఇల్లాలు.

"ద్రౌపదీ సుభద్రలపక్క బంగారం పసిమికలిసిన ఇప్పపూవు రంగు శరీరాలు కలిగి కూచున్న పడుచులు చిత్రాంగదా ఉలూపులు.

"అదిగో పద్మంవంటి ఛాయకలిగిన శరీరంతోనూ, బెదిరిన లేడి కళ్ళవంటి కళ్ళతోనూ కూచున్న ఆమె భీముడి భార్య.

"కొత్త సంపంగి పువ్వులాటి తెలుపుశరీరంతోనూ, కమలంవంటి మొహంతోనూ కలకల్లాడుతున్న ఆమె సహదేవుడి భార్య.

"కొత్త కలవపువ్వులాటి శరీరకాంతితోవున్న ఆమె నకులుడి భార్య.

"వీరి పక్క పావటలు లేకండా, తెల్లటిబట్టలతో శరీరాలు దాచుకున్న వీరంతా ధృతరాష్ట్రుడి కోడళ్ళు.

"వీరిలాగే అయి సుభద్రపక్క ముడుచుకు కూచున్న ఆమె ద్రోణుడూ కర్ణుడూ మొదలైన వీరుల్ని కలతపెట్టి, కళ్ళుమూసిన అభిమన్యుడి ప్రియభార్య ఉత్తర" అని అంతమందినీ చూపి చెప్పాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజువేపు తిరిగి, "క్షేమంగా వున్నావా బాబూ? పౌరులూ, జానపదులూ క్రమంతప్పకండా నిన్ను అనుసరిస్తున్నారా? నీ తమ్ముళ్లందరు సుఖంగా వున్నారా? స్నేహితులు కులాసాయేనా? బంధువులు సంతోషంగా వున్నారుకదా? ఇష్టభృత్యులు తమ కోర్కులు ఫలించి సుఖపడుతున్నారా? సంతోషంగా పూర్వరాజుల నడవడి సాగిస్తున్నావానువ్వు? న్యాయంగా పన్నులు పుచ్చుకుంటూ ధనాగారం నింపుతున్నావుకదూ? అగ్రహారాల ప్రజల మీాద గాలైనా సోకకండా కాపాడుతున్నావా? మిత్రరాజుల్ని స్నేహంతోనూ, శత్రురాజుల్ని కరుకుదనంతోనూ వశపరుచుకుంటున్నావా? ఉదాసీనులైన రాజుల్ని కనిపెడుతున్నావా? దేవతలకూ, అతిథులకూ, పితృదేవతలకూ పూజలు జరిపి, వారిని తృప్తిపరుస్తు

న్నావా? రాజ్యంలోని నాలుగువర్ణాలవారూ ఎవరికృత్యాలువారు నెరవేరుస్తున్నారా? పిల్లలకీ, దుర్బలులకీ, స్త్రీలకీ, వృద్ధులకీ భయం లేకండా శాసనం సాగుతూవుందా పట్నంలో?" అని అడిగాడు.

"నీ ఉపదేశంప్రకారం అన్నీ సక్రమంగా సాగుతున్నాయి" అన్నాడు ధర్మరాజు. ఇంకా ఇలా అన్నాడతడు:

"తండ్రీ, ఆయాసం సహించని మీ శరీరం తపఃక్రియలకి పూనుకుందా! కష్టం గణించక మీ శుశ్రూష చేస్తోందికదా అమ్మ కుంతి! మా పెద్దమ్మ అలజడిపడకండా తపస్సు సాగిస్తోందా? కుమారుని చంపిన పాపాత్ముల్ని మమ్మల్ని తలుచుకుని ఏమంటుందో మీతో?

"సంజయుడు తపస్సు కష్టం సయించగలుగుతున్నాడా? అన్నట్టు ధీరచిత్తుడు విదురుడు కనడడేమీ? ఎక్కడికి వెళ్ళాడు? అతణ్ణి చూడాలి నేను."

"తపస్సు నాకు కష్టంగా లేదు. ధర్మరాజా, మీ అమ్మ కుంతి అలిసిపోకండా మా శుశ్రూష చేస్తునేవుంది. గాంధారికూడా తపస్సుకి వోర్చుకుంటూనే వుంది. పుణ్యాచరిత్ర ఈమె. మిమ్మల్ని తలుచుకున్నప్పుడల్లా మెచ్చుకుంటుంది; దీవిస్తుంది. సంజయుడు ప్రాజ్ఞుడు. తపస్సుకి విసుగుపడడు. ఇక విదురుడు ఎక్కడ అని అడిగావుకదూ, మమ్మల్ని విడిచి ఎక్కడెక్కడో తిరుగుతూవుంటాడతడు. మునులుకూడా ముక్కుమీద వేలుపెట్టుకున్నట్టు నడుచుకుంటాడు. నీరూ, గాలీ మాత్రమే ఆహారంగా చేసుకున్నాడు. అవికూడా లేకండా వుండిపోతాడు. శూన్యమైన అడివిలో దైన్యంలేకండా విచ్చలవిడిగా తిరుగుతూ వుంటాడు. ఒక్కొక్కప్పుడు హటాత్తుగా అవుపిస్తాడు" అని చెప్పాడు ధృతరాష్ట్రుడు.

## విదురుడు

అతడి నోట్లోమాట నోట్లోనే వుంది హటాత్తుగా అల్లంత దూరంలో ధర్మరాజుకి కనిపించాడు విదురుడు. అడివిధూళితో అతడి శరీరం మలినంగా వుంది. తలంతా జడలుకట్టి వేలాడుతున్నాది. దిగంబరుడుగా వున్నాడతడు.

ఆశ్రమంలో వున్న యావన్మందినీ వోమారు కలయచూశాడతడు. తిరిగి వెళ్ళిపోయాడు. తన అనుచరుల్ని అక్కడే వుండండని, తాను వొక్కడే విదురుడివెంట వెళ్ళాడు ధర్మరాజు. తుప్పలమాటున కనపడుతూ వెళ్ళిపోతున్నాడు విదురుడు. వెంటపడి "విదురా! ఓ విదురా! నిలబడు, నిలబడు! నేను ధర్మరాజుని. నిన్ను చూడడానికి వచ్చాను" అంటూ పరిగెత్తాడు ధర్మరాజు.

తిరిగిచూశాడు విదురుడు. ఏకాంతప్రదేశంలో ఆగాడు. ఒక చెట్టుకింద నిలబడ్డాడు. దగ్గిరికి వెళ్ళాడు ధర్మరాజు. అతడి కట్టెదుట నిలబడ్డాడు. అర్థనిమీలితనేత్రాలతో, వున్నట్టే వుండిపోయాడు విదురుడు.

"విదురా!" ఆ యోగిని చూస్తూ అన్నాడు ధర్మరాజు, "నేను ధర్మరాజుని! కళ్ళువిప్పి నన్ను చూడూ!"

రెప్పలు పైకెత్తి ఉదాసభావంతో చూశాడు విదురుడు. యోగబలం పూనాడు. ఇంద్రియాలు ఇంద్రియాలలో కలిపాడు. ప్రాణాలు ప్రాణాల్లో కలిపాడు. నిజశరీరం విడిచిపెట్టాడు. తేజోమయ శరీరంతో ధర్మరాజు శరీరంలో ప్రవేశించాడు. ధర్మరాజు శరీరంలో కాంతి అధికమైంది. లావున్నా లావయింది. బుద్ధిబలం పెరిగింది. అది అవగతమై అతడికే ఆశ్చర్యం కలిగింది.

విదురుడి శవం చలనంలేకండా వుండిపోయింది. ఏ వికారమూ కలగలేదు దానికి. నిద్దరపోయి వొరిగిపోయినట్టు అవుపిస్తోంది.

అగ్ని సంస్కారం చెయ్యడానికి భావించాడు ధర్మరాజు. ఇంతలో "ధర్మరాజా!" అంటూ ఆకాశవాణి వినిపించింది, "సన్యాసిత్వంపూనిన మహాత్ముడు విదురుడు. ఇతని శరీరానికి అగ్ని సంస్కారం తగదు. వద్దు."

అగ్నిసంస్కార ప్రయత్నం మానేశాడు ధర్మరాజు. ఆశ్రమానికి వచ్చి, తమ్ములతోనూ, ధృతరాష్ట్రుడితోనూ అందరూ వింటూవుండగా జరిగిందంతా వినిపించాడు. అందరూ ఆశ్చర్యపోయారు.

ధృతరాష్ట్రుడు సాగసంపగా మునీశ్వర్లు తమతమ ఆశ్రమాలకి వెళ్ళిపోయారు.

అనంతరం ధర్మరాజుతో అన్నాడు ధృతరాష్ట్రుడు:

"నాయనా, పళ్ళూ, దుంపలూ భోజనంచెయ్యి ఇస్తాను. మేము ఏది తింటున్నామో అదే అతిథులకివ్వడం ధర్మం."

"అలాగేకానీ" అంటూ పళ్ళూ, కందమూలాలూ ఆరగించాడు ధర్మరాజు సంతోషంగా. మిగిలినవాళ్ళు అందరూ అలాగే భోజనాలుచేశారు. అందరూ ఆ రాత్రి అక్కడే నేలమీద నిద్రపోయారు.

మర్నాడు పొద్దుదూరడంతోనే ధర్మరాజూ, తక్కిన యావన్మందీ కాల్యకృత్యాలు తీర్చుకున్నారు. తమ్ములతోనూ, భార్యతోనూ, తగిన పరివారంతోనూ కలిసి ఆశ్రమమార్గాన సంచరించి, స్నానమూ, అగ్నిపూజా, జపమూ, ధ్యానమూ మొదలైన తాపస ధర్మాలు సాగించాడు ధర్మరాజు. నానామృగాలూ నిర్భయంగా తిరుగుతూవుండడం చూశాడు. జంకులేకండా పక్షులు కేళీవిహారాలు చెయ్యడం పరికించాడు. ప్రాతస్సవనం సాగిస్తున్న కురువృద్ధుడైన ధృతరాష్ట్రుడిదగ్గిరికి వచ్చాడు. వందనంచేశాడు. అభినందన వచనాలతో అతడికి ఆనందం కలిగించాడు. అతడి ఆదేశంప్రకారం వొక పవిత్రమైన ఆసనంమీద కూచున్నాడు.

తమ్ముళ్లతో ధర్మరాజు అలా ధృతరాష్ట్రుణ్ణి కొలుస్తూవుంటే కళ్ళ వేడుకగా చూడడంకోసం శతయూపుడూ మొదలైన మునులున్నూ అక్కడికి వచ్చారు. అందరికీ వినయంగా దర్భాసనాలిచ్చాడు ధృతరాష్ట్రుడు. వారూ, పాండవులూ ధర్మ సంభాషణలతో కాలంపుచ్చారు.

సూర్యుడు ఆకాశం మధ్యకి వచ్చాడు. అప్పుడు మునులతో, "మీరు మధ్యాహ్న కృత్యాలు తీర్చుకోవలసి వుంటుంది. వేం చెయ్యండి" అని వినయంగా చెప్పాడు ధృతరాష్ట్రుడు. "అవును" అంటూ వారు నిజనివాసాలకు వెళ్ళారు.

"మీరున్నూ మాధ్యాహ్నిక కృత్యాలు ముగించండి" అంటూ పాండవుల్నీ పంపించాడు ధృతరాష్ట్రుడు.

మొదటి దినం ధర్మరాజూ, తమ్ముళ్లూ, అంతఃపురస్త్రీలూ, సకల పరివారమూ పళ్ళూ దుంపలూ తిని, నేలమీద నిద్రపోయారు. మర్నాడు రుచికరమైన అన్నపానాలు తినమనీ, శయ్యలమీద శయనించమనీ అనుజ్ఞ ఇచ్చాడు ధృతరాష్ట్రుడు. అలాగే చేశారు వారు. అలా నెలదినాలు ధృతరాష్ట్రుణ్ణి కొల్చి అక్కడున్నారు పాండవులు.

ఎప్పటిలాగే వొకనాడు కుంతీ గాంధారులతో కూచున్న ధృతరాష్ట్రుడి దగ్గిర కూచున్నారు పాండవులు. విశిష్టమైన ఆ గోష్ఠిలో పాల్గొనడానికి శతయూపుడూ మొదలైన మునులు వచ్చారు. వారికి తగిన ఆసనాలు వేయించాడు ధృతరాష్ట్రుడు. అంతమందినీ సంభావించాడు. అంతమందీ కలిసి కులాసాగా ధర్మప్రసంగాలు చేశారు.

ఇంతలో వేదవ్యాసుడు అక్కడికి వేంచేశాడు. అంతమందీ అతడికి ఎదురు వెళ్ళారు లేచి. భక్తి వినయాలతో తోడితెచ్చారు. దర్భాసనంమీద లేడితోలు పరిచి కూచోపెట్టారు. అతడి అనుమతి పొంది అందరూ కూచున్నారు.

వ్యాసదేవుణ్ణి పూజించాడు ధృతరాష్ట్రుడు. అనంతరం ఆదరంగా

మధురంగా, మృదువైన మాటలతో ధృతరాష్ట్రుణ్ణి ఇలా అడిగాడు వ్యాసముని :

"వనవాసం అలవాటయిందా నీ మనస్సుకి? ఓర్పుకుని నియమంతో తపస్సు సాగిస్తున్నావా? కుమాళ్ళు నాశనమైపోయారన్న శోకం నీ మనస్సులో లేదుకదా! ధర్మం తెలిసిన ఇల్లాలు గాంధారి దుఃఖం లేకండా వుందా? నీకు జ్ఞాననిష్ఠ కలిగిందా? కుంతి తగినట్టు మీ శుశ్రూష చేస్తూవుందా? మీరు వచ్చేశాక, తాను వుండడం తగదని, రాజ్యం వొల్లకండా అడివిలో వుండడానికి వచ్చేసిందీమె. ఈ మంచి నీ మనస్సుకి పట్టిందా? ధర్మరాజుమీద ఆదరభావమే వుందికదా నీ మనస్సులో! భీముణ్ణీ, అర్జునుణ్ణీ, నకులసహదేవుల్నీ ప్రేమతో అభినందిస్తున్నావా? ధృఢమైన శాంతితో నిర్మలంగా వుందికదా నీ మనస్సు?"

ఇంకా యిలా అడిగాడతడు :

"విను, దీర్ఘవైరమూ, క్రోధచింతా లేకండా, మాటా మనస్సూ వొక్కలాగే వుండడం సకలజనుల సంపద కలిమికి పరమ సాధనం.

"విదురుడు దేహం విడిచిపెట్టిన విధమంతా విన్నావుకదా! మాండవ్యుడు పెట్టిన శాపంవల్ల శూద్రజన్మనెత్తిన ధర్మదేవత విదురుడు. మహాజ్ఞానవంతుడతడు; నిర్మలాత్ముడు. బ్రహ్మ ఆజ్ఞవల్ల విచిత్ర వీర్యుడి క్షేత్రంలో పుట్టాడు.* ధర్మదేవత మారటతనువే ఈ ధర్మరాజు ఉజ్వలకాయం. ఇది తెలిసినవాడు కనకనే యోగీశ్వరుడు విదురుడు యోగబలంతో ఇతడిలో కలిశాడు! దేవతా

* విచిత్రవీర్యుడి క్షేత్రమంటే అతడి భార్య అని అర్థం. అయితే విదురుడు విచిత్ర వీర్యుడి భార్య కడుపున పుట్టలేదు. అతడి దాసి గర్భంలో పుట్టాడు. కనకనే శూద్రుడనిపించుకున్నాడు. అయితే దాసికూడా భార్యతో సమానమని సమర్థించుకోవాలి ఇక్కడ.

మయాత్మకుడైన ఈ మహారాజు ఇలా నిన్ను దాస్యవృత్తితో కొలిచివుండడం భావించి సంతోషిస్తున్నావా !''

"తండ్రీ,'' వ్యాసముని అడిగినదానికి వినయంతో ప్రత్యుత్తర మిచ్చాడు ధృతరాష్ట్రుడు, "వనవాసం కొంచెమైనా దుఃఖం కలిగించడం లేదు నాకు. శరీరమూ, మనస్సూ కూడా తపస్సుకి అలవాటు పడుతున్నాయి. నన్ను కానీ, గాంధారిని కానీ రవంతా పుత్రశోకం పొందనివ్వడు ధర్మరాజు. భక్తితో నన్ను కనిపెడుతున్నాడు. ఇతడిమీదా, ఇతడి తమ్ములమీదా వాత్సల్యమే వుంది నా హృదయంలో. ఇతడు దేవతాత్ముడన్నది స్పష్టంకదా! కనక నా మాటల విషయం తెలుసుకునే వుంటాడు. కుంతి శుశ్రూష అద్భుతం! ఆనందం కలిగిస్తుంది. నీ అనుగ్రహంవల్ల నాకు పరిజ్ఞానమూ, నిర్మలమైన మనస్సూ కుదురుకుంటున్నాడు'' అన్నాడు.

ఇంతలో ద్రౌపదీ, సుభద్రా, తక్కినస్త్రీలూ వ్యాసదేవుడి దర్శనానికి వచ్చారు. భక్తిపూర్వకంగా ప్రణామాలు చేశారు. వినయంతో అంతంత దూరంలో నిలబడ్డారు.

అప్పుడు ధృతరాష్ట్రుడితో మళ్ళీ ఇలా అన్నాడు వ్యాసముని :

"మీకు చింత తొలిగించి, మీ కోరిక తీర్చడంకోసం నేను వచ్చానిప్పుడు. శంకలేకండా ఏమిటి కోరాలనుందో కోరు. సంతోషంగా ఇస్తాను.''

అతడలా అనడం విని పరమానందం పొందారు పాండవులు. ధృతరాష్ట్రుడున్నూ సంతోషించాడు.

మళ్ళీ ఇలా అన్నాడు వ్యాసముని:

"అమానుషమైనాసరే, మునీశ్వర్లు ముక్కుమీద వేలుపెట్టుకున్నట్టు నా తపోబలంతో మీ కేదికోరితే అది ఇస్తాను అవలీలగా. అడుగు'' అన్నాడు.

"కరుణతోనూ, ఆదరంతోనూ నువ్వు ఇక్కడికి దయచెయ్య్యడంకంటే ఏంకావాలి నాకు? మానుషమైనా, అమానుషమైనా నేను కోరేదల్లా మీ అనుగ్రహమే. అంతకంటే అధికమైన కోరిక ఏదీ లేదునాకు.

"కారుణ్యనిధివి నువ్వు. నువ్వు ఇంతగా ఆదరించావు. నాజన్మ సఫలమైంది. ఇక పరలోకభీతి లేదు నాకు. ధన్యుణ్ణయాను.

"అయితే మీరు అంతగా కోరమంటున్నారు కనక, ఎల్లప్పుడూ నా మనస్సులో వున్నది వొకటి మనవిచేస్తాను.

"దుష్టచిత్తుడు దుర్యోధనుడు. రాజ్యకాంక్షతో పరమపుణ్యస్వభావులైన పాండవుల్ని పరాభవించాడు. రాజులందరినీ చతురంగబలాలతో చంపుకున్నాడు. భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ మొదలైన సత్పురుషుల్ని అందరినీ కాజేసుకున్నాడు. ఆ నీచుడికోసం మహారాజులు ఆలుబిడ్డల్ని విడిచి, రణరంగంలో మడమతిప్పకండా మరణించారు. వారందరికీ ఏగతి ప్రాప్తిస్తుందో! మూఢులై యుద్ధంలో తెగిపోయిన కురుకుమాళ్ళు ఎలా అయారో! పరమజ్ఞానమూర్తివి నువ్వు. నీకు తెలియందంటూ లేదు. ఎరగక నేను పడుతున్న దుఃఖం తొలిగించు" అన్నాడు ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుడి ఈమాటలు విని గాంధారికీ, కుంతికీ, ద్రౌపదికీ, సుభద్రకీ, తక్కిన స్త్రీలకీ మనస్సులలో దుఃఖం తిరిగీ కొత్తరూపంతో కెరలింది.

కళ్ళ కట్టులోనుంచే చూసి, దయాధాముడైన మామ వ్యాసమునికి చేతులు జోడించి నమస్కరించింది గాంధారి – అతడివేపుతిరిగి.

"మునీంద్రా, ఈయన కుమాళ్ళందరూ రణంలో తెగిపోయారు. అవాళనుంచీ పదహారేళ్ళయి వాళ్ళని చూడాలనే కోరుతూ వుంటాడు. లోకాలన్నీ చూపగలవు నువ్వు. కుమాళ్ళని చూపించడ

మేమంత పని నీకు! కుంతీ, ద్రౌపదీ, సుభద్రా, నా వందమంది కోడళ్ళూ, సోమదత్తు కోడలూ, అతని భార్యా, ఆమె అత్తా – ఇంత మందీ యుద్ధంలో చచ్చిపోయిన బంధువుల్ని చూడాలని కోరు తున్నారు. అంతా నీ దివ్యజ్ఞానంవల్ల అవగతమవుతూనే వుంటుంది నీకు. పరమ మునీంద్రా, అనుగ్రహించు. రణంలో మరణించిన కురు వీరుల్ని కనపరుచు. మా మనస్సుల్లోని దుఃఖం మాన్పించు. లోకం ఆశ్చర్యపోయినట్టు నీ విచిత్రమహిమ అవుపరుచు" అంది.

కుంతి వాడిపోయిన మొహంతో కర్ణుణ్ణి మనస్సులో తలుచు కుంది. తపోబలంలో అది తెలుసుకుని, దయాభావంతో ఆమెతో ఇలా అన్నాడు వ్యాసుడు :

"పుణ్యాచరిత్రవు నువ్వు కుంతీ, నీ మనస్సులోని కోరిక చెప్పు. నీకోరిక ఫలించినట్టు చేస్తాను, నీ దుఃఖం తొలిగిస్తాను."

ఈమాట విని సంతోషించింది కుంతి. అతడికి దండప్రణామం చేసింది. చేతులు జోడించింది. సిగ్గుపడుతున్న హృదయంతో విన యంతో నమ్రురాలై ఇలా అందుకుంది :

## కుంతి వేదన

"దేవతలకి దేవతవి నువ్వు. నిన్ను మామగా పొందాను. నన్ను అనుగ్రహించు. నా విన్నపం చిత్తగించు.

"నేను కన్యగా వున్నప్పుడు మా తండ్రిదగ్గిరికి దుర్వాస మహా ముని వచ్చాడు. కోపదారి ముని అతడు. అతణ్ణి సవినయంగా అర్చించా న్నేను. అన్నివిధాలా ఆరాధించాను. సంతోషించా డతను. 'అమ్మాయీ, నీకు వరమిస్తాను; ఏం కోరుతావో కోరుకో' అన్నాడు. 'మీ ప్రియంకంటే మించిన కోరిక ఏముందినాకు ?' అన్నా న్నేను. అంతేకాని ఏ వరమూ కోరలేదు. నామాట నచ్చనట్టు మొహం

పెట్టాడు ముని. 'వరం ఇవ్వకండా పోను. అడుగు' అన్నాడు. భయ పడ్డాన్నేను. ఏదో కుతూహలం నన్ను పురికొల్పింది. 'కొడుకు కావాలి' అని కోరాను. ఆ మునీంద్రుడు వొక మంత్రం అనుగ్రహించాడు. 'ఈ మంత్రంతో నువ్వు ఏ దేవతని ఆవహిస్తే ఆ దేవత నీ వశగతుడవు తాడు. కుమారుణ్ణి ప్రసాదిస్తాడు. విశేషించి ధర్మదేవతకి తల్లి వవు తావు నువ్వు' అని చెప్పి అంతర్ధానమైపోయాడు.

" 'అద్భుతం కలిగింది నాకు.' మంత్రం ఎల్లప్పుడూ మనస్సులో తలుచుకునేదాన్ని. ఓనాడు మేడమీాద నేను సుఖంగా వుండి ఉద యిస్తున్న సూర్యుణ్ణి చూశాను. చిన్నతనం అజ్ఞానంవల్ల కన్యగా వుండిన నాకు అది దోషమని తలంచక, మునిమంత్ర బలంతో సూర్యుణ్ణి ఆవహించాను. ఆవహించడంతోనే ఆ దేవుడు ఆకాశం మీాద ఆత్మమూర్తి నిలిపి, మూర్త్యంతరం దాల్చి నాదగ్గిరికి దయ చేశాడు వెంటనే. నా మనస్సు ఆశ్చర్యంలో మునిగిపోయింది.

" 'అడుగు, వరమిస్తాను' అన్నాడు సూర్యదేవుడు. నిలువునా వొణికిపోతూ చేతులుజోడించాన్నేను. 'వెళ్ళిపోండి. ఇక్కడెందుకూ మీారు' అన్నాను.

" 'ఊరికే పిలవడం తప్పు. నిన్నూ, నీకు మంత్రం ఇచ్చినవాణ్ణీ కూడా శపిస్తానుసుమా' " అన్నాడు సూర్యదేవుడు. నేను భయపడి పోయాను. గురువు, నిరపరాధుడు అయిన దుర్వాసమునిని శాపం పాలు చెయ్యడానికి సహించలేకపోయాను.

" 'దయతో నీవంటి కొడుకుని ప్రసాదించు' అన్నాను. అపరి మేయమైన తేజశ్శాలి సూర్యభగవానుడు. నాదృష్టీ మొదలైన ఇంద్రియాలూ, మనస్సూ సమ్మోహితం చేశాడు. అనంతరం, 'కొడుకు పుడతాడు' అన్నాడు. అంతేకాదు, 'నీకు కన్యాత్వం చెడకండా వరమిచ్చాను' అని కూడా సెలవిచ్చాడు. ఆ ఉత్తర క్షణంలో ఆకాశంమీాదికి వెళ్ళిపోయాడతడు.

"మాతండ్రీ మొదలైన బంధువులకి తెలియకుండా నడుచుకుని, రహస్యమందిరంలో కొడుకుని కన్నాన్నేను. కని ఏటిలో విడిచిపెట్టాను. అదంతా ఒక కలలా అయిపోయింది. ఇది దివ్యజ్ఞానంతో తెలుసుకున్నదే నువ్వు. అయితే అది మనస్సుని దహిస్తూనే వుంటుందెప్పుడూ నన్ను.

"ఆనాడు నేను చేసినపని పాపమైనా కాకపోయినా అది తలుచుకునిమాత్రం భయపడుతూవుంటాను. దయతలిచి నాభయం తొలిగించు. ఈ కురువృద్ధుడైన ధృతరాష్ట్రుడి అభిమతం సఫలంచెయ్యి. ఇవే నేను కోరుకుంటున్న వరాలు" అంది.

"కోడలా," కుంతి చెప్పింది విని అన్నాడు వ్యాసముని, "నువ్వు చెప్పిందంతా నిజమే. నీలో ఏదోషమూలేదు. భయమెందుకూ! దేవతల చరిత్రలు అద్భుతకరమైనవి. కర్ణుడికి అలా జరగవలిసివుంది కనకనే ఏటిలో విడిచిపెట్టావు నువ్వు. కన్యాత్వానికి హాని కలగలేదు కనక కులంలో అగ్రగణ్యవయావు. నీ ప్రవర్తన నిర్మలమైందనడానికి ఏమీ సందేహంలేదు."

ఆదర వచనాలతో అలా కుంతితో చెప్పి, గాంధారితో ఇలా అన్నాడు వ్యాసుడు:

"కుమాళ్ళనీ, తోబుట్టువుల్నీ చూస్తావు నువ్వు. నీచెల్లెలు కుంతికూడా కర్ణుణ్ణి చూస్తుంది. ద్రౌపదీ, సుభద్రా, తక్కినస్త్రీలూ కుమాళ్ళనీ, అన్నదమ్ముల్నీ, మనవల్నీ, భర్తల్నీ చూస్తారు. అసలు ఇందుకోసమే ఇక్కడికి వచ్చాన్నేను. ధృతరాష్ట్రుడూ, నువ్వూ, కుంతీ విచారం లేకండా చెయ్యమని కోరారు. మీకోరిక చెల్లిస్తాను. నీ కొడుకులకోసం మనవలకోసం శోకించకు. శూరత్వం కనపరిచి వారు రణంలో మరణించారు. స్వర్గలోకంలో సుఖాలనుభవిస్తున్నారు.

"గాంధారీ, విను. తప్పనిసరి అయిన భారతయుద్ధంకోసం దేవతలు మనుష్యజన్మలెత్తారు.

"ధృతరాష్ట్రుడనే గంధర్వుడే ఈ ధృతరాష్ట్రుడు. మరుద్గణంలోని వాడు. పాండురాజు ధర్మదేవత ధర్మరాజు. గాలిదేవుడు భీముడు. నరుడనే ముని అర్జునుడు. నారాయణుడు శ్రీకృష్ణుడు. అశ్వినీదేవతలు నకుల సహదేవులు. ద్వాపరం (జూదం) శకుని. కలి దుర్యోధనుడు. రాక్షసులు దుర్యోధనుడి తమ్ములు. సూర్యుడు కర్ణుడు. చంద్రుడు అభిమన్యుడు. అగ్ని ధృష్టద్యుమ్నుడు. అగ్ని అంశే శిఖండి. బృహస్పతి ద్రోణుడు. వసువులలో వొకడు భీష్ముడు. రుద్రాంశ అశ్వత్థామ. దేవతల అంశంలోనూ, రాక్షసుల అంశంలోనూ పుట్టినవారు ఇంకా ఎందరో వున్నారు.

"మీమనస్సుల్లోని విచారమంతా మాన్పిస్తాను. మీరంతా గంగానదిదగ్గిరికి పదండి. అక్కడ మీబంధువుల నందరినీ చూపిస్తాను."

అలా అంటూనే వున్నపాళాన లేచాడు వ్యాసముని. గొల్లుమని ధృతరాష్ట్రుడూ మొదలైన యావన్మందీ లేచారు. బయలుదేరి వ్యాసముని వెంట గందికగా నడిచారు. ఇదంతా చూసి, ఆశ్చర్యపోతూ చుట్టుపక్కల మునులున్నూ గంగవొడ్డు చేరారు కుతూహలంతో పౌరులూ, పల్లెప్రజలూ కూడా వ్యాసుడి మాటమీద గంగానది వొడ్డున సమావేశమయారు.

తాను చెయ్యబూనిన పని మర్నాడు ఉదయం చేస్తానన్నాడు విచిత్రచరిత్రుడు వ్యాసమునీంద్రుడు. అంతమందీ ఆ మిగిలిన రోజూ, ఆ రాత్రీ వందేళ్లు గడిపినట్టు గంగవొడ్డున గడిపారు.

## మృతుల దర్శనం

రాత్రి గడిచింది. పొద్దుపొడిచింది. అంతమందీ కాల్యకృత్యాలు తీర్చుకున్నారు. ధృతరాష్ట్రుడూ, పాండవులూ, మునులూ వ్యాసముని

దగ్గిరికి వెళ్ళి, అతనిచుట్టూ మూగారు. సర్వజనములూ అ(శులెత్తుకుని అక్కడ నిలబడ్డారు.

వ్యాసముని గంగానదిలో దిగాడు; స్నానంచేశాడు. ఆదర కంఠంతో "ఇలారండి" అన్నాడు. మహాచిత్రం, ఏంచెప్పనూ! అతడి నోట్లోమాట నోట్లోనేవుంది, నీటిలో పెద్ద సందడి బయలు దేరింది. దుర్యోధనుడూ, అతడి తమ్ములు దుశ్శాసనుడూ మొదలైన వాళ్ళూ, వాళ్ళ కుమాళ్ళూ, అభిమన్యుడూ మొదలైన పాండురాజు మనవలూ, కర్ణుడూ, బాహ్లీకుడూ మొదలైన కౌరవప్రముఖులూ, ద్రుపదుడూ, అతడి బంధువులూ, విరాటరాజూ, అతడి బంధువులూ, శకునీ, అతడి తమ్ములూ, అతడి కుమాళ్ళూ, భీష్ముడూ, ద్రోణుడూ దివ్యదేహాలతో బయటికివచ్చారు. అందరూ దివ్యమైన పూలమాలలు వేసుకున్నారు. దివ్యమైన బట్టలు కట్టుకున్నారు. దివ్యమైన నగలు పెట్టుకున్నారు. దివ్యమైన గంధాలు రాసుకున్నారు. అంతమందీ తమ మిత్రులతోనూ, భటులతోనూ అవుపించారు.

ఆవాళటికి ధృతరాష్ట్రుడికి దివ్యదృష్టి ప్రసాదించాడు వ్యాసుడు. ఇంతా అంతా అనరాని ఆ ముని తపఃప్రభావం చూసి యావన్మందీ నిచ్చెరపోయారు.

మృతులందరూ కనిపిస్తున్నారనడంతోనే అద్భుతానందా లతో తనకళ్ళకి కట్టుకున్న కట్టువిప్పి చూడడం మొదలెట్టింది గాంధారి.

అలా అవుపడిన మృతులందరూ నవ్వుతూ, పగా, దగాలేకండా గంగలోంచి బయటికివచ్చారు. అప్పుడు గంధర్వులు గానంచేశారు. అప్సరసలు నాట్యమాడారు. వందిజనులు పొగిడారు.

నది బయటికివచ్చి బంధువులందరికీ పరమానందం కలిగించారు మృతులు. అహంకారంలేకండా ఆదరగౌరవాలు వెల్లడించారు. ఎవరికి

చూపవలిసిన మర్యాద వారికి చూపారు. రెండుపక్షాలవాళ్లూ తగు విధంగా వొకళ్ళతో వొకళ్ళు కలుసుకున్నారు. పితామహుణ్ణీ, ఆచార్యుణ్ణీ, శిష్యుల్నీ, తల్లుల్నీ, తాతల్నీ, అన్నదమ్ముళ్ళనీ, అల్లుళ్ళనీ, కుమాళ్ళనీ, కూతుళ్ళనీ, అక్కచెల్లెళ్ళనీ, మనవళ్ళనీ, దౌహిత్రుల్నీ, మామల్నీ, మేనమామల్నీ, అత్తల్నీ, మేనల్లుళ్ళనీ, బావమరదుల్నీ, ప్రియుల్నీ, ప్రియురాళ్ళనీ, స్నేహితుల్నీ కలుసుకుని సుఖమనుభవించారు. కలిసిమెలిసి అవాళంతా స్వేచ్ఛగా గడిపారు. అదంతా అద్భుతరసంలో ముంచింది ప్రజల్ని. వ్యాసుడి మహిమ వల్లమాలిందనిపించింది. అవాళా, ఆరాత్రీ అలాగే గడిచింది.

మర్నాడు తెల్లవారింది. వ్యాసముని ఆజ్ఞప్రకారం ఉభయ పక్షాలవాళ్లూ వొకళ్ళదగ్గిరవొకళ్లు సెలవుపుచ్చుకున్నారు. భారత రణరంగంలో తనువులు విడిచిన శూరులు తమతమ లోకాలకి వెళ్ళడం కోసం గంగానదిలో దిగారు. వారివెంట వ్యాసమునికూడా నీళ్ళలోకి వెళ్ళాడు. అక్కణ్ణుంచి "భర్తలవెంట వెళ్ళదలుచుకున్న స్త్రీలు గంగానది నీళ్ళలో మునుగుదురుగాని రండి" అన్నాడు.

విధవలై వుండిన వీరపత్నులందరూ వ్యాసుడి పిలుపు విన్నారు. ధృతరాష్ట్ర గాంధారీ కుంతీ ధర్మరాజుల అనుజ్ఞపొంది గబగబా గంగలో దిగారు. నీళ్ళలో మునిగి మానవశరీరాలు వొదిలిపెట్టారు. దివ్యరూపాలు ధరించారు. దివ్యాలంకారాలతో భర్తల్ని కలుసుకున్నారు. అదిచూసి అంతమందీ ఆశ్చర్యానందాలలో మునిగి పోయారు.

ఈ ప్రియసంగమోత్సవకథ విన్నా, చదివినా ఈ లోకంలో వెయ్యివిధాల ప్రియంకలుగుతుంది. పరలోకంలోనూ ఎంతో ప్రియం లభిస్తుంది. అనాయాసంగా బంధుసమాగమం కలుగుతుంది. రోగాలు నశిస్తాయి. బ్రాహ్మలకి, దీనిని వినిపించిన ధార్మికులకి బ్రహ్మానందం

ప్రాప్తిస్తుంది. దీనిని పొగిడితే నీచదశ రాకండా కాపాడి మేలుచేస్తారు దేవతలు.

ఇదంతా అయాక మునులందరినీ తమతమ ఆశ్రమాలకి దయ చెయ్యండని సాగనంపాడు ధృతరాష్ట్రుడు. పాండవుల్నీ, గాంధారినీ, కుంతినీ వెంటపెట్టుకుని నిజాశ్రమానికి తాను వచ్చేశాడు. అప్పుడు వ్యాసముని అతడితో ఇలా అన్నాడు:

"మునీంద్రుల నోట వేదశాస్త్రాలు చెవులారా విన్నావు నువ్వు. కుమాళ్ళని చూశావు. నువ్వు చూసినంతకంటే ఎక్కువగా స్వర్గంలో సౌఖ్యాలనుభవిస్తున్నారు వాళ్ళు. కనక, ఇక వారికోసం విచారించకు. ఆత్మకలంకం తపస్సుతో తొలిగించుకో.

ఇదిగో నిన్ను సేవిస్తూ నిష్ఠతో నెలదినాలున్నాడిక్కడ అడివిలో ధర్మరాజు. ఇంక ఇతణ్ణి ఇంటికి వెళ్ళమను."

"నీ ఆజ్ఞ ప్రకారమే చేస్తాను. నీ కృపావిశేషంవల్ల కృతార్థుణ్ణయాను" అంటూ పాదాభివందనం చేశాడు ధృతరాష్ట్రుడు. అనంతరం తానూ, పాండవులూ ఆ మునీంద్రుడిదగ్గిర సెలవుతీసుకున్నారు. అందరినీ దీవించి అంతర్హితుడయాడు వ్యాసముని.

## ఇంటికి వెళ్ళిపో

తరవాత మనస్సులోని తృప్తి మొహంలో కనపరుస్తూ, ధర్మరాజుని చేరబిలిచాడు ధృతరాష్ట్రుడు.

"నాయనా, సింహాసనంమీద కూచుని ప్రతిదినమూ రాజ్యకార్యాలు నిర్వహించకపోతే ఎలాగోయి! వినదగినవన్నీ భీష్ముడూ మొదలైనవారినుండి విన్నావు. ఇంకా ఏ ఉపదేశమూ అక్కరలేదు నీకు. నీలో ఏదైనా లోపంవస్తుందా అని రంధ్రాలు వెదుకుతూ వుంటారు పగవాళ్ళు. అంచేత తమ్ములతోనూ, భార్యతోనూ కలిసి

పట్నం వెళ్ళిపో. ఉదారచరిత్రుడివి నువ్వు. నీవల్ల నాదుఃఖమంతా తొలిగిపోయింది. ప్రభుత్వమూ, సౌఖ్యమూకూడా అనుభవించాను. ఇక తపస్సుమీద లగ్నమైవుంది నామనస్సు. అంచేత అదే నిర్వహించుకుంటాన్నేను. మనస్సులో ఏ విచారమూ పెట్టుకోకు నువ్వు. నన్ను ఇక్కడ వుండనీ. పురజనులు సంతోషించినట్టు, సైనికులు ఆనందించినట్టు హాస్తినాపురం వెళ్ళు. ఏలుబడి చక్కగా సాగించు" అన్నాడు.

"తండ్రీ," ధృతరాష్ట్రుడలా అనడంతోనే అన్నాడు ధర్మరాజు, "భీముడూ మొదలైనవారిని రాజ్యం రక్షించడానికి పంపించు. నీ పాదాలదగ్గిరవుండి మా అమ్మల్నీ, నిన్నూ సేవిస్తాన్నేను. తపస్సు చేసుకుంటాను."

"ఇలా అనవచ్చా బాబూ," ధర్మరాజు మాటలు విని అందుకుంది గాంధారి, "కురుకుల సంరక్షకుడివికదోయి నువ్వు! తండ్రులకి పిండంవేయదగినవాడివి! మీ అయ్యచెప్పినట్టు వినుకో నాయనా. ప్రజలు విచారపడకండా హాస్తినాపురం వెళ్ళిపో. అదే మా మనస్సుకి సంతోషం కలిగిస్తుంది."

"అమ్మా" గాంధారితో అన్నాడు ధర్మరాజు, "ఇలా మీరు నన్ను ఎంత తరిమినా, మిమ్మల్ని అడివిలో వొదిలి వెళ్ళడానికి కాళ్ళాడడంలేదు నాకు. మనస్కరించడంలేదు మనస్సు. వెనకటిలాగ రాజ్య కాంక్ష కలగడంలేదు నాకు.

"విను, పాంచాలులూ, మాత్స్యులూ యుద్ధంలో తెగిపోయారు పూర్తిగా. వారి ఆడంగులుమాత్రం మిగిలున్నారిప్పుడు. అంచేత శూన్యంగా తోస్తోంది రాజ్యం నా మనస్సుకి.

"అదీకాక, యుద్ధం తీరిపోయిననాటినుండీ తపస్సు చేసుకోవాలనే తహతహపడుతూవుంది నామనస్సు. నేను నామట్టుకు తపసు చేసుకుంటాను. మీ తపస్సుకి భంగం కలిగించను సందడిచేసి."

అన్నగారలా అనడం విని, అతడితో, "వీరందరికీ శుశ్రూష చేస్తూ ఈ ఆశ్రమంలో వుండి తపస్సుచేస్తాను" అన్నాడు సహదేవుడు.

"వద్దు బాబూ వద్దు" అంటూ అతణ్ణి గుండెల కద్దుకుంది కుంతి, "మామీద భక్తికొద్దీ ఇలా అనవద్దు. మీరుంటే మా తపస్సుకి విఘ్నం కలుగుతుంది. అంతేకాదు, మీరుంటే మాకు ఏకాగ్రత ఎలా కుదురుతుంది చెప్పూ నియమాలు నిర్వహించడానికి! ఇది తెలుసుకుని మీరు వెళ్ళిపోవాలి యింటికి. మీ అయ్యమాట వినకపోడం తగదు మీకు. అన్నికార్యాల్లోనూ శుభం కలుగుతుంది మీకు. నా కన్నతండ్రులూ, పోయిరండి బాబూ!"

మరోమాట అనడానికి సాహసించలేకపోయాడు ధర్మరాజు. "తండ్రీ," ధృతరాష్ట్రుడితో అన్నాడతడు, "తపో మహనీయులు మీరు మిమ్మల్ని కొలిచాను. పాపాలు పోదుల్చుకున్నాను. మీ ఆజ్ఞ తలమీద ధరించి పట్నం వెళ్ళివస్తాను."

అతణ్ణి దీవిస్తూ, కౌగిలించుకున్నాడు ధృతరాష్ట్రుడు. ఓదార్పు మాటలతో తృప్తిపరిచి భీముణ్ణి కౌగిలించుకున్నాడు. అర్జునుణ్ణి మెచ్చుకుంటూ గుండెల కద్దుకున్నాడు. నకులసహదేవుల్ని సంభావిస్తూ ఆలింగనం చేసుకున్నాడు. అయిదుగురూ పాదాభివందనం చేసి, ఆశీర్వాదాలు పొందారు. అనంతరం గాంధారి పాదాలకి మొక్కారు. వారిని గుండెల కద్దుకుంది గాంధారి. మనస్ఫూర్తిగా దీవించింది. తరవాత కుంతిపాదాలమీద తలలు మోపి ప్రణామాలు చేశారు పాండవులు. అందరినీ కౌగిట పొదివి, గుండెలకి అద్దుకుంది కుంతి. అందరినీ వరసగా దీవించింది.

ద్రౌపదీ మొదలైన కోడళ్ళు మామగారికీ, అత్తలకీ పాదాభివందనాలుచేశారు; సెలవుతీసుకున్నారు.

అంతమందీ పౌరులూ, పరిజనులూ కొలుస్తూవుండగా కన్నుల

పండువుగా హాస్తినాపురం ప్రవేశించారు. ఎప్పటిలాగ ఎవరిపనుల్లో వారు మగ్నులయ్యారు.

## మరణవార్త

కొంతకాలం గడిచింది. ఒకనాడు తమ్ములతో కూచుని కాలక్షేపం చేస్తున్నాడు ధర్మరాజు. ఇంతలో నారదుడు అక్కడికి వచ్చాడు. తమ్ములూ, తానూ వున్నపాళాన లేచాడు ధర్మరాజు. భక్తిపూర్వకంగా ప్రణామం చేశాడు. ఆసనమూ, అర్ఘ్యమూ మొదలైనవి యిచ్చి సత్కారంచేశాడు. అనంతరం అయిదుగురు అన్నదమ్ములూ అతడి సమీపంగా కూచున్నారు. అతడి మొహంచూస్తూ ఇలా అడిగాడు ధర్మరాజు.

"మహాభాగా, ఎక్కణ్ణుంచి దయచేశావు? ఏయే దేశాలు తిరిగివచ్చావు ? మీాపని నేను ఏంచెయ్యాలో సెలవియ్యి" అన్నాడు.

"తపోవనంనుంచి వస్తున్నాను" అన్నాడు నారదుడు, "తీర్థసేవాపరత్వంతో బహుదేశాలు తిరిగాను. నిన్ను చూసి ఎంతోకాలమైంది. అందుకని చూసిపోదామని వచ్చాను. ధృతరాష్ట్రుడి విషయం గంగానది పరిసరాల జనులవల్ల విన్నాను."

"మాతండ్రి కులాసాగా వున్నాడా ?" 'ధృతరాష్ట్రుడి విషయం విన్నాను' అని నారదుడు అనడంతోనే అడిగాడు ధర్మరాజు, "మా అమ్మలు గాంధారీ, కుంతీ, సంజయుడూ క్షేమంగా వున్నారుకదా! వారి శరీరాలక ఏమీా విపరీతం పుట్టలేదు కదా !"

"స్థిరమైన మనస్సుతో విను, వారి విషయమంతా వినిపిస్తాను" అంటూ ఇలా అందుకున్నాడు నారదముని, "మీారు వెళ్ళి అడవిలో ఆ కురువృద్ధుల్ని కొలిచి, వారు అనుమతించాక ఇక్కడికి తిరిగివచ్చేశారు కదా ! మరికొన్నిదినాలకి గాంధారీ, కుంతీ, సంజయుడూ వెంటరాగా అగ్నిహోత్రాలతో యాజకుల్ని ముందుపెట్టుకుని హరిద్వారం

దగ్గిరికి వెళ్ళిపోయాడు ధృతరాష్ట్రుడు తన ఆశ్రమం వొదిలేసి. అక్కడ గాలిమాత్రం ఆహారంచేసుకుని దుష్కరమైన తపస్సు చేశాడతడు. గాంధారి నీళ్లుమాత్రం ఆహారంచేసుకుని తపస్సుచేసింది. కుంతి మాసోపవాసాలు చేస్తూ తపస్సుచేసింది. సంజయుడు వారానికోసారి మాత్రం భోజనంచేస్తూ తపస్సు చేశాడు. ధృతరాష్ట్రుడు వ్యాసుడి దగ్గిర వుండేవాడు. యాజకులు అగ్ని వేల్చేవారు. ఒకొక్కప్పుడు పర్ణశాలనుంచి బయలుదేరి నిర్జనారణ్యంలో తిరిగేవాడు ధృతరాష్ట్రుడు. విషమప్రదేశాల్లో అతడికి సంజయుడే కన్నుగా వుండేవాడు. అలాగే గాంధారికి కుంతి కన్నుగా వుండేది.

"ఒకనాడు వాళ్ళందరూ హరిద్వారంలో గంగాస్నానం చేసి ఆశ్రమానికి వస్తున్నారు. అడివిలో మహాగ్ని ముట్టుకుంది. దానికి తోడు పెనుగాలికూడా రేగింది. ఛటచ్ఛట శబ్దాలతో మాకులు మండిపోయాయి. ఆర్తనాదాలతోనూ, కమరుకంపుతోనూ మృగాలు కాలిపోయాయి. బిలాల్లోంచి, పుట్టల్లోంచి పాములు మంటలో మాడిపోయాయి. భయపడి అరుస్తూ ఎగిరిపోతున్న పక్షులు పొదల్లో పడి జ్వాలల్లో కూలిపోయాయి. అలా అన్నివేపులా అల్లుకుంది అగ్ని దారుణంగా. ఖేచరులుకూడా భయభ్రాంతులైనంత అద్భుతంగా విజృంభించింది ఆ మహాగ్ని.

"అలా కారుచిచ్చు చుట్టుముట్టడంతోనే ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ నిరాహారులుగా వుండినందువల్ల తప్పించుకుని పారి పోడానికి శక్తిలేకండా పోయారు. అప్పుడు సంజయుడితో అన్నాడు మీఅయ్య ధృతరాష్ట్రుడు:

"'సంజయా, రవంత సందుచూసుకుని నువ్వు పారిపో ఎక్కడి కైనా. అగ్గి ముట్టుకోకండా బతికిపో. నేనుకానీ, కుంతీ గాంధారులు కానీ తప్పించుకోలేం. పారిపోయే శక్తిలేదు మాకు.'

"దుఃఖంతోనూ, భయంతోనూ వొణికిపోయాడు సంజయుడు. మీరున్నూ వొకచోటికి తప్పుకుంటేకాని ఎలావెళ్ళేది నేను! ఈ దావాగ్నికి మీకు ఎరచేసిపోడానికి ఎలా కాళ్ళాడతాయి నాకు?' అన్నాడు.

"'వెళ్ళగలిగివుండి వెళ్ళకపోడం పాపం. ఇల్లువొదిలివచ్చి, ఇలావున్న మాకు చావడం దోషంకాదు' అంటూ అతణ్ణి వొడబరిచాడు ధృతరాష్ట్రుడు. సమాహితచిత్తుడై, తూర్పువేపుతిరిగి కూచున్నాడతడు. గాంధారీ, కుంతీ అలాగే అతడిదగ్గిర చదికిలబడ్డారు తూర్పు వేపు తిరిగి.

"'యోగంతో కూచో' అని చెప్పాడు సంజయుడు. అలాగే చేశాడు ధృతరాష్ట్రుడు.

"ఇంతలో సందుచూసి హిమాలయంమీంది కెక్కిపోయాడు సంజయుడు.

"పెద్ద మంటలతో వచ్చి మీతండ్రినీ, తల్లుల్నీ చుట్టుముట్టింది మహాగ్నిహోత్రం.

"ధర్మరాజా, అలా ఆ ముగ్గురూ పుణ్యలోకానికి పోయారు.

"నేను గంగానది వొడ్డునుంచి వస్తూ ఆ అడివిలోని దివ్యమునులవల్ల మీరు ధృతరాష్ట్రాశ్రమానికి వెళ్ళి తిరిగిరావడం మొదలుకుని వారి నిర్యాణంవరకూ జరిగిందంతా విన్నాను. వారి మూడు కళేబరా లున్నూ చూశాను. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ సద్గతిపొందారు. నువ్వు మరి విచారించకు" అని చెప్పాడు.

శోకం పట్టలేకపోయాడు ధర్మరాజు. చేతులు పైకెత్తి పెద్ద గొంతుకతో ఏడవడ మారంభించాడు. తమ్ములున్నూ దుఃఖంతో ఏడ్చారు. ఈ దారుణవార్త అంతఃపురంలో అగ్గిలాగ పాకిపోయింది. అంతఃపురమంతా ఏడుపులతో నిండిపోయింది. పట్నం ఈమూలనుంచి

ఆమూలకి క్షణాలమీద ఈవార్త అల్లుకుంది. పౌరులు హాహా కారాలు చేశారు. పట్నమంతా ఏడుపులే ఏడుపులు. భూమీ ఆకాశమూ రోదనధ్వనులతో ప్రతిధ్వనించింది. శోకదేవత అంతటా తాండవించింది.

నారదముని ధర్మరాజుని ఎంతో వోదార్చాడు. బంధువులున్నూ ఎంతో బోధపరిచారు. క్రమంగా రోదనధ్వనులు తగ్గాయి. నారదముని మొహంచూస్తూ ధర్మరాజు ఇలా అన్నాడు:

"ఎవరికి ఎప్పుడు ఏమవుతుందో తెలుసుకోలేం! మేం వుంటూ వుండగా మా తండ్రికి దిక్కులేని చావు వచ్చింది! మహాబలవంతులైన నూరుగురు కుమారుల్ని కన్న తండ్రి! పదివేల ఏనుగుల బలశాలి! మహారాజు! అడివి చిచ్చులో తగలబడిపోయాడో! ఏమనాలి! పద్మాలవంటి మొహాల స్త్రీలు వీవనలు విసురుతూవుంటే సుఖపడే ప్రభువే! రాంబందుల, గద్దల రెక్కల గాలులలో కిందపడున్నాడో! అయ్యయ్యో! వందిమాగధుల మృదుగానంలో మేలుకునే రాజే! కాకులూ, గద్దలూ అరుస్తూవుంటే, లేవని నిద్రలో పడున్నాడో దిక్కుమాలి!

"భర్త వ్రతంపూనితే ఆవ్రతమే పూని, అతడు పోయిన గతినే పోయింది గాంధారి! ఆమెకోసం అంత విచారించను. కుమారుల రాజ్యవైభవం విడిచి, తన శరీరం కాసుకోకండా అడివికి పోయిన అమ్మకోసం దుఃఖపడుతున్నాను!

"ధర్మరాజు, భీముడు, అర్జునుడు తనకడుపునపుట్టిన కొడుకులా! ఆ తల్లి మారుమూల కార్చిచ్చులో కాలి చచ్చిపోయిందా దిక్కుమాలి! దీనికి హృదయంలో తల్లడిల్లకండా, దుఃఖపడకండా ఎలా వుండేది చెప్పూ!

"విను, మునీంద్రా, దేవేంద్రుడు ఎత్తివచ్చినా ఎదిరించి

ఖాండవవనం ఆరగించడానికి అర్పించాడు అగ్నిహోత్రుడికి అర్జునుడు! అతడి తల్లినే కాల్చవచ్చునా తాను! కృతఘ్నుడు కదా అగ్నిహోత్రుడు!

"కార్చిచ్చులో కాలిపోయాడు ధృతరాష్ట్రుడు. ఏంచెయ్యాలి నేను ఇప్పుడు? ఇదొకటి మనస్సులో బాధిస్తోంది."

ధర్మరాజు అలా విచారిస్తూ అడగడంతో ఇలా చెప్పాడు నారదముని:

"శాంతి అధికమై ధృతరాష్ట్రుడు సవిశేషమైన పూజా విధానంతో ఉపాసించి తగిన ఇష్టిచేసి, అగ్నులు తొలినాడే సాగనంపాడనీ, యాజకులు ఆ అగ్నులు అడివిలో ఉద్వాసించి వెళ్ళిపోయారనీ, అదే అడివిలో మహాగ్నిగా ముట్టుకుందనీ విన్నాను. తన అగ్నిలోనే తాను కాలిపోయాడతడు. కనక విచారించ పనిలేదు.

"మీ అమ్మ కుంతి బావకీ, అప్పకీ భక్తితో పరిచర్యచేసింది. దేవతలు ప్రస్తుతించినట్టు నిరామయమైన లోకం చేరుకుంది. మీ అయ్యకీ, మీ అమ్మలకీ తిలోదకాలివ్వాలి నువ్వు. వెళ్ళు, నీ తమ్ములూ, అంతఃపుర స్త్రీలూ, మొదలైనవారితో కలిసి గంగానదిలో ఉదకక్రియలు జరిగించు" అన్నాడు.

## తి లో ద కా లు

ఏకవస్త్రం కట్టుకున్నాడు ధర్మరాజు. మిగిలినవారూ అలాగే తనతో బయలుదేరారు. పౌరులుకూడా వెంటవెళ్ళారు. అంతమందీ గంగలో స్నానాలుచేశారు. ధర్మరాజూ మొదలైన తగినవారు ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ, కుంతికీ తిలోదకాలిచ్చారు. అశుచిత్వం పోదుల్చుకుందికి పట్నం బయట పర్ణకుటీరాల్లో నివసించారు. ధృతరాష్ట్ర గాంధారీ కుంతీదేవుల అస్థికలు హరిద్వారం గంగలో

కలపడంకోసం తగినవారిని బహుమానాలిచ్చి ఏర్పరిచాడు ధర్మరాజు. శ్రాద్ధంనాడు వృద్ధుల అనుమతిని ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ, కుంతికీ ఘనంగా పారలౌకిక క్రియలు జరిపించాడు. బంగారమూ, రత్నాలూ, ఆవులూ, గుర్రాలూ, ఏనుగులూ, కన్యలూ, భూములూ, గృహాలూ దానంచేశాడు, అంతమందీ ఆశ్చర్యపోయినట్టు. అన్నపర్వతాలతోనూ, నేతి నదులతోనూ అతడు చేసిన పితృ సంతర్పణ చూసి మునులుకూడా తల లూపారు. బంధువులు పరమానందం పొందారు. పన్నెండు దినాలూ అన్నీ చూస్తూ దగ్గిరేవున్నాడు నారదుడు. అన్నీ అయాక ధర్మరాజుని ఆశీర్వదించాడు. అతణ్ణీ తక్కిన మునీంద్రుల్నీ నమస్కరించి అర్చించి సాగనంపాడు ధర్మరాజు. ఎవరి ఆశ్రమాలకి వారు దయచేశారు మునులు. అనంతరం బంధువులతోనూ, మిత్రులతోనూ కలిసి హస్తినాపురం ప్రవేశించాడు ధర్మరాజు.

మహాభారతయుద్ధంతరవాత దానాలూ పుణ్యకర్మలూ జరుపుతూ హస్తినాపురంలో పదిహేనేళ్లూ, తపోనియమంతో అడివిలో మూడేళ్ళూ ఇలా పద్దెనిమిదేళ్ళు గడిచాయి ధృతరాష్ట్రుడికి.

అలా సమస్తవిధాలా ధృతరాష్ట్రుడి సేవచేసి, కృతార్థుడై, జనం అభినందించినవిధంగా సామ్రాజ్యం పాలించాడు ధర్మరాజు.

వ్యావహారికాంధ్రమహాభారతంలో

ఆశ్రమవాసపర్వం

సంపూర్ణం

---

# మౌసల పర్వం

## ఉత్పాతాలు

వైశంపాయనుడు తరవాతికథ ఇలా ఎత్తుకున్నాడు :

"భారతయుద్ధంలో జయలక్ష్మి వరించి, ధర్మరాజు సామ్రాజ్య పట్టం కట్టుకున్నది మొదలు ముప్ఫయి అయిదు సంవత్సరాలు గడిచాయి. ఆ మరుచటి సంవత్సరం ప్రజకి భయంకలిగించే ఉత్పాతాలు పుట్టాయి ధర్మరాజు రాజ్యంలో. శర్కరకురుస్తూ పెనుగాలి వీచేది. పొద్దుపొడిచేవేళ బింబం చుట్టూ పెద్దపెద్ద మొండాలు గుంపులు గుంపులు కనపడేవి. మబ్బులు లేకండా పిడుగులు పడేవి. అంతటా ఉల్కలు రాలేవి. ఆకాశంమీద చంద్రగూడూ, సూర్యగూడూ కన పడేవి కర్కశంగా. వేసవిదినాల్లో కూడా ఆకాశమంతా దట్టమైన మంచు పేరుకునేది. ప్రతిదినమూ ఇలా ఎన్నో మహోత్పాతాలు పుడుతూవుండేవి.

కొంతకాలమయాక, "ద్వారకలో వాళ్ళతో వాళ్ళు పోట్లాడుకుని, కృష్ణుడూ బలరాముడూ తప్ప యావన్మంది యాదవులూ చచ్చిపోయారు" అని విన్నాడు ధర్మరాజు. దుఃఖంతో భీమార్జునుల్నీ, నకులసహదేవుల్నీ పిలిచి, ఈ దుఃఖవార్త వినిపించాడు. అయిదుగురు అన్నదమ్ములూ ఆపుకోలేని దుఃఖంతో విలపించారు. హస్తినలో అంతమందీ దుఃఖంలో మునిగిపోయారు."

వైశంపాయనుడు ఇలా చెప్పడంతోనే, "మునీంద్రా, యాదవులకి పరస్పరం కలహమెలా కలిగింది? వారి వృత్తాంతం వివరంగా వినిపించు" అని అడిగాడు జనమేజయుడు.

## ముసలం

వైశంపాయనుడు ఇలా అందుకున్నాడు :

శ్రీకృష్ణుణ్ణి చూడడంకోసం కణ్వుడూ, నారదుడూ, విశ్వామిత్రుడూ ద్వారకాపట్నం వెళ్ళారు. వాళ్ళు పట్నం వీధిలో వెళుతున్న సమయంలో విధివశంగా యాదవకుమాళ్ళ మనస్సుల్లో వాళకనీతిమాలినపని చెయ్యాలని బుద్ధిపుట్టింది. సాంబుడికి ఆడవేషంవేసి, మునులదగ్గిరికి పట్టుకువచ్చారు వాళ్ళు. దొంగవినయంతో వందనం చేశారు. "మునీంద్రులారా, దయానిధులు మీరు. ఈ పడుచు బభ్రుడి భార్య. దీనికి బిడ్డలు పుడతారా ?" అని అడిగారు.

ఈ ఆగడం చూసి అగ్నిహోత్రులై పోయారు మునులు.

"కృష్ణుడి కొడుకు వీడు సాంబుడు. వీడికి ముసలం పుడుతుంది. యాదవకులమంతా హతవా(రుస్తుందది. మామాట అబద్ధం కాదు. నమ్మండి. కృష్ణుడూ, బలరాముడూ తప్ప యాదవులు యావన్మందీ అద్భుతమైన ఆ ముసలం శక్తివల్ల చచ్చిపోతారు. బలరాముడు దేహం వొదిలిపెట్టి సముద్రంలో కలిసిపోతాడు. నేల పడుకునివుండగా శ్రీకృష్ణుణ్ణి జర అనే రాకాసి ఉపాయంతో విక్రమించి చంపుతాడు. పొండి" అన్నారు.

యాదవకుమాళ్ళతో అలా అని, "ఇక కృష్ణుణ్ణి మనం చూడడం బాగుండదు" అనుకుని వెనక్కి మళ్ళి, తమతమ ఆశ్రమాలకి వెళ్ళిపోయారు మునులు.

అనంతరం అదంతా శ్రీకృష్ణుడు విన్నాడు. కాలం తెలిసినవాడు కనక "నియతిప్రకారం జరిగే అవస్థకు అన్యథా తలచకూడదు" అని ఊహించి వూరుకున్నాడు. తన చుట్టూ వున్న బంధువుల్ని చూసి, "ఇది విధికృత్యం. మనవాళ్ళ పొరపాటువల్ల మూడిం

దనుకోకండి ; విచారించకండి" అన్నాడు. అలాచెప్పి అభ్యంతర మందిరానికి వెళ్ళిపోయాడు లేచి.

మర్నాడే సాంబుడి కడుపులోంచి వొక ముసలం పుట్టింది. యమదూతలా భయంకరంగా వుందది ; నిష్ఠురంగా వుంది. అదిచూసి భయపడిపోయారు యాదవులు ; విస్మితులున్నూ అయారు. వసుదేవుడి దగ్గిరికి పరిగెత్తి విన్నవించారు. క్షోభపడిపోయాడు వసుదేవుడు. వెలవెలపోయాడు. కొంతసేపు నిశ్చేష్టుడై పోయాడు. ఎలాగో స్థిమితపడి, "వెంటనే ఈ రోకలి గుండచేసి సముద్రంలో చల్లెయ్యండి" అని నియోగించాడు.

యాదవులు ముసలం గుండపిండిచేశారు. సముద్రంలో పారబోశారు. *

"మునుల శాపం మానవప్రయత్నంతో తోసెయ్యడానికి వల్లకాదు" అని భావించలేకపోయారు వారు. వసుదేవుడూ, తక్కిన యాదవులూ ముసలం నాశనంచేసేశాంకదా అని ధీమాపడి వూరుకున్నారు. అయితే గాంధారి నిష్ఠురహృదయంతో వెనక సమస్త యాదవులకూ పెట్టిన శాపం తనుపుకివచ్చి భయపడుతూవుండేవారు.

## ద్వారకలో మహోత్పాతాలు

కాలం దగ్గిరపడింది. ద్వారకలో దారుణమైన ఉత్పాతాలు కనపడ్డాయి. ఒక భయంకరమూర్తి పట్నంలో తిరుగుతూవుండేవాడు. అతడి ఎర్రటి కళ్ళు బండిచక్రాల్లా తిరుగుతూవుండేవి. మహాఉగ్రమైన దుడ్డుకర్ర పట్టుకుని యముడిలా అవుపడేవాడతడు. ఒకదగ్గిర కనపడితే వొకదగ్గిర మాయమైపోయేవాడు.

---

* చూ. ముసలం కథ, రచయిత రచన 'శ్రీమద్భాగవతం' ఏకాదశ స్కంధం. మొదటి అధ్యాయం. పు. 1817.

మునుల శాపం ప్రేరేపించడంవల్ల నీలపింగళ దేహంతో యముడు వృష్ణి, భోజ, అంధకుల ఇళ్ళల్లో తొంగిచూసేవాడు తిరుగుతూ.

చిలకలు గుడ్లగూబల్లా అరిచేవి రాత్రిళ్ళు. పగలు నక్కల్లా కూసేవి మేకలు. ఆవులకి గాడిదపిల్లలు పుట్టేవి. ముంగిసల కడుపుల్లో ఎలకలు పుట్టేవి. కుక్కలు పిల్లుల్ని కనేవి. బలరాముడూ, కృష్ణుడూ తప్పించి యాదవులందరూ బ్రాహ్మల్ని బాధపెట్టేవారు. గురుజనుల్ని అవమానపరిచేవారు. సిగ్గూలజ్జా వొదిలేసి కోరికల వెంట తిరిగేవారు. మగలమాట మన్నించక స్వేచ్ఛగా తిరిగేవారు ఆడంగులు.

హోమకాలంలో అగ్నులు నానాభూతవర్ణాలతో ఎడంపక్కకి శిఖలెత్తేవి. రౌద్రంగానూ, ఉగ్రగంధంతోనూ రాజుకునేవి.

కూడూ, కూరా వంటచేసి పొయ్యిమీంచి దించీదించడంతోనే వాటిలో పురుగులు పుట్టి గులగులలాడేవి.

ప్రతిదినమూ ఇలా అశుభాలు అవుపడేవి. సర్వమూ తెలిసిన శ్రీకృష్ణుడు అవి చూసేవాడు. మనస్సులో కలబోసుకునేవాడు.

"పుత్రశోకంవల్ల కలిగిన కోపంతో గాంధారి, "ముప్ఫయి ఆరో సంవత్సరం యాదవులు వొకళ్ళనొకళ్లు నరక్కుని నాశనమవుతారు" అని శాపంపెట్టింది. అదిగో ఆ ముప్ఫయి ఆరోసంవత్సరం వచ్చిందిప్పుడు! ఆమె శాపం తప్పదు. ఫలించితీరుతుంది. అయితే ఈ నాశనానికి తీర్థసమీపభూమి అయితే మంచిది!" అని ఊహించాడు. దానికి మార్గమున్నా నిశ్చయించాడు. యాదవనాశనం దివ్యబుద్ధిని తెలుసుకున్నాడు. అది మర్నాడేకావడం స్పష్టంగా గ్రహించాడు. యావన్మంది యాదవుల తోను పెద్ద కొలువుతీర్చి ఇలా అన్నాడు :

అందరూ సముద్రందగ్గిరికి భక్తితో యాత్ర చేయ్యాలి "రేపు ఉదయాన్నే బయలుదేరాలి."

బంధువులందరితోనూ అలా చెప్పి, పట్నంలో ఈ వార్త చాటించడానికి తగినవాణ్ణి పంపాడు. అతడు పట్నంలో అంతటా గంటవాయిస్తూ పెద్ద గొంతుకతో చాటిచెప్పాడు.

ఆరాత్రి అంతమందీ. కోరదవడలూ, నల్లటి శరీరమూకల వాళ్ళ ఆడది ఇంట్లో దూరి ఇంటి ఆడంగుల్ని ఈడ్చుకుపోయినట్టూ, రాక్షసులు చొరబడి శస్త్రాస్త్రాలూ, జెండాలూ, నగలూ ఎత్తుకుపోయినట్టూ చూశారు.

## యాత్ర

మర్నాడు, అగ్నిభట్టారకుడు ప్రసాదించిన, పద్మనాభమైన శ్రీకృష్ణుడి సుదర్శనచక్రం అద్భుతంగా ఆకాశంమీదికి వెళ్ళిపోయింది. గరుడపతాకమూ అలాగే వెళ్ళిపోయింది. బలరాముడి తాళధ్వజం కూడా వాటివెనక వెళ్ళిపోయింది. సుగ్రీవమూ, శైబ్యమూ, వలాహకమూ, మేఘపుష్పమూ - ఈ నాలుగు గుర్రాలు పూసిన శ్రీకృష్ణుడి రథంకూడా వెళ్ళిపోయింది. అంతమందీ ప్రత్యక్షంగా చూశారు ఇదంతా.

"తీర్థయాత్రకి వేగం, వేగం బయలుదేరండి" అని ఆకాశం మీంచి స్పష్టంగా గొంతెత్తి అన్నారు దేవతలు.

అదంతా కనీ, వినీ ఏమాత్రమూ సంభ్రమపడలేదు యాదవులు. ఉలుకుపాటైనా పడలేదు. ప్రయాణ సన్నాహంలోనే మునిగి లయారు వారు. మంచి మంచి సారాయిలూ, మాంసాలూ, ఇంటింటా సిద్ధంచేసుకున్నారు. నానారకాల భక్ష్యాలూ, భోజ్యాలూ, పాలూ, చక్కెరా, నేయీ, రకరకాల కూరలూ. అన్నపానాలూ, అక్షతలూ, గంధాలూ, పువ్వులూ కావుళ్ళతోనూ, తలమోపులతోనూ, బళ్ళతోనూ పట్టించుకున్నారు. అంతమందీ అందంగా ముస్తాబులయారు.

రత్నాల బంగారం నగలు పెట్టుకున్నారు. విలువైన వస్త్రాలు కట్టుకున్నారు. లేపనాలు పూసుకున్నారు. పూలదండలు వేసుకున్నారు. ఏనుగులమీదా, గుర్రాలమీదా రథాలమీదా వింతవింత వైభవాలతో బయలుదేరారు.

తన రథం లేకపోడంవల్ల మరొకరథం కృష్ణుడికోసం సిద్ధంచేసి పట్టుకువచ్చాడు దారుకుడు. నిర్వికారచిత్తంతో దానిమీద బయలుదేరాడు శ్రీకృష్ణుడు.

ఎప్పుడూ పెట్టుకుంటున్న నగలే పెట్టుకుని, ఎప్పుడూ కట్టుకుంటున్న బట్టలే కట్టుకుని, ఏ వాహనమూ ఎక్కకండా, ఏవంతా వికారంలేని హృదయంతో స్నేహితులతో మాట్లాడుతూ బయలుదేరాడు బలరాముడు.

పల్లకీలూ, మేనాలూ వాటిమీద అందంగా అలంకరించుకున్న ఆడంగులు బయలుదేరారు.

అలావైభవంగా వెళ్ళి అందరూ సముద్రపొడ్డున అంతకిముందే ఏర్పరిచిన మంచి గుడారాల్లో దిగారు.

అప్పుడు ఉద్ధవుడు తపస్సు చేసుకోడానికి అడివికి వెళ్ళిపోతానన్నాడు. కాలస్థితి తెలిసినవాడు కనక దానికి వొక్కమాటా బదులు పలకలేదు శ్రీకృష్ణుడు.

మాటాడకండా మొక్కి యాదవపురోహితుడిదగ్గిర సెలవు తీసుకున్నాడుకృష్ణుడు. అతడు అడివికి వెళ్ళిపోయాడు. అతణ్ణి సాగనంపడానికి వెంట వెళ్ళాడు బలరాముడు. భక్తిపూర్వకంగా అతడిదగ్గిర సెలవు తీసుకున్నాడు. అలా అతణ్ణి సాగనంపి వొక్కడూ దృఢమైన నిర్ణయంతోనూ, శాంతచిత్తంతోనూ ఓ చెట్టుకింద కూచున్నాడు.

ఇక్కడ గుడారాల్లో - బ్రాహ్మల భోజనంకోసం బాగావండి తయారుచేసి అన్నమూ, కూరలూ, తమస్త్రీలు వద్దువద్దని వారిస్తున్నా వినకండా షొగరుభోతులయి కోతులకి పంచిపెట్టారు యాదవులు.

అనంతరం గీతవాద్యాలతోనూ, నృత్యాలతోనూ, గంధాక్షతలతోనూ, పువ్వులతోనూ ఎన్నోవిధాల పూజచేశారు. మంచిమంచి పదార్థాలు నైవేద్యంపెట్టారు.

ఇదంతా అయాక మదమెక్కించే మంచి మంచి సారాయిలు బంగారు గిన్నెల్లో పోసుకుని కృష్ణుడి ఎదటే తాగారు రుచికరమైన నంజుళ్ళు నంజుకుంటూ.

సాత్యకీ, కృతవర్మా, చారుదేష్ణుడూ, గదుడూ, ప్రద్యుమ్నుడూ మొదలైన యాదవులందరూ కాంక్షతీరినట్టు చిత్తుగా తాగారు. వృష్ణులూ, భోజులూ, అంధకులూ అందరూ విధివశంగా తప్ప తాగారు; మత్తెక్కి కేకిసలాడారు. వాళ్ళకదానికొకటి పొందని తప్పుడు మాటలు మొదలెట్టారు. విరగబడి నవ్వారు. తప్పునడత ప్రారంభించారు.

## కలహం

అప్పుడు ఎరుపెక్కిన కళ్ళు తిప్పుతూ సాత్యకి కృతవర్మ మొహం చూశాడు. కైపెక్కి పక్కనే నుంచున్న ప్రద్యుమ్నుడి చెయ్యి చరుస్తూ అవమానసూచకంగా విరగబడి నవ్వాడు.

"పగవాళ్ళు చచ్చిపడున్నట్టు నిద్రపోతూవున్నప్పుడు ఏతుచ్ఛుడైనా వాళ్ళని చంపడు. అలాటప్పుడు రాచబిడ్డ అయినవాడు అంత పాపానికి వొడిగడతాడా? ఇతగాడు పొడిచేశాడట! ఛూఛూ, ఇదీ వొక పోటేనా!" అంటూ మరింత నవ్వాడు.

"అది నీచులపద్ధతి!" అని పల్లవి పాడాడు ప్రద్యుమ్నుడు. నువ్వు వేరే చెప్పడమెందుకు? పోనీ ఆమాట! జనం ఇతణ్ణి తిట్టిపోస్తున్నారు చాలదూ!"

విని, రోషంతో వికృతంగా మొహంపెట్టాడు కృతవర్మ. సాత్యకి మీదికి చర్రుమన్నాడు.

"సిగ్గులేక ఇతర్ల కయ్యం వ్రూసెత్తుతున్నావు నువ్వు! గురు వింద గింజ తనకింది నలుపు కానదట! అర్జునుడు చెయ్యి నరకగా, సమాధిలో కూచున్న సోమదత్తు తల నరికిన తగుమనిషి వేనా నువ్వు! మరిచిపోయావు కామోసు! అది ధర్మయుద్ధం కాదూ మరి!" అన్నాడు.

దానికి కృష్ణుడు కృతవర్మమీాద ఎర్రటి కోరచూపులు విసిరాడు. క్రోధం నిండిన హృదయంతో భోజులందరినీ వోమారు తేరిచూశాడు.

"కృతవర్మ తమ్ముడు శతధన్వుడు అన్యాయంగా మహాత్ముడూ, మాననీయుడూ అయిన సత్రాజిత్తుని శమంతకమణికోసం చంపెయ్యలేదూ!" అని కృష్ణుడితో అన్నాడు సాత్యకి.

ఈ మాట విని సత్యభామ కోపం తెచ్చుకుంది. స్త్రీ స్వభావ సులభమైన కన్నీళ్ళతో కృష్ణుడి ముందుకివచ్చింది.

చూసి పట్టలేని రోషంవచ్చింది శ్రీకృష్ణుడికి.

సత్యభామా కృష్ణులకి సంతోషం కలిగించాలన్న భావంతో దురుసుగా నిప్పులు కక్కినట్టు కృతవర్మని చూశాడు సాత్యకి. "నీచుడు వీడు!" మొహం కందగడ్డలా చేసుకుని అన్నాడతడు, "అశ్వత్థామ సాయంతో అర్ధరాత్రి దారుణంగా ద్రౌపదికుమాళ్ళని పొట్టపెట్టుకున్నాడు! ధృష్టద్యుమ్నుణ్ణీ అతడి తమ్ముల్నీ దొంగచాటున చంపేశాడు!"

## న రు కు లా ట

అంటూనే చర్రున కత్తి దూశాడు సాత్యకి. మునుల శాపం వల్ల పుట్టిన ముసలం శక్తితో వుందాకత్తి. తళతళా మెరుస్తూ అది అతని చూపులు చెదరగొట్టింది. కత్తి దూయడమూ, కృతవర్మ తల

నరకడమూ, వొక్కసారే చేశాడతడు. చివ్వున రక్తం చిమ్ముతూ కృతవర్మ తల తెగిపడింది కింద.

అలా భోజాధిపతి అయిన కృతవర్మని నరికేసి వూరుకోలేదు సాత్యకి. ఆ వూపున భోజకులంమీద విరుచుకుపడ్డా డతడు. బాహావిలాసంతో కత్తి తళతళలాడిస్తూ వురికిన అతణ్ణి ఆపడానికి శ్రీకృష్ణుడు వొక అడుగు ముందుకి వేశాడో లేదో, భోజవీరులూ, అంధక యోధులూ వొక్కసారిగా రణోన్మాదంతో దిక్కులు దిమ్మెత్తినట్టు పొలికేకలు పెట్టారు; ఉప్పెన గాలిలాగ సాత్యకిమీద వచ్చిపడ్డారు చుట్టుముట్టి.

చూశాడు శ్రీకృష్ణుడు. జరగనున్నదంతా ముందే ఎరుగునతడు. అంచేత తమ్ముణ్ణి సాత్యకిని కాపాడడానికి కాలు కదపలేదు. కాని ప్రద్యుమ్నుడు మాత్రం పెద్దపులిలా వురికాడు; శౌర్యమూ భుజబలమూ కనపరిచాడు. సంతోషించాడు సాత్యకి. సివంగిలాగ చెలరేగాడు. భళీ అంటే భళీ అన్నారు ఆకాశంమీది దేవతలు.

ప్రద్యుమ్నుడు వురికీ వురకడంతోనే వృష్ణి వీరులు రోషంతో సింహనాదాలు చేస్తూ భోజులమీదా అంధకుల మీదా ఉప్పెనలాగ కలబడ్డారు. ఉభయపక్షాలవాళ్ళూ పొలో అంటే పొలో అని పొలి కేకలు వేశారు. భూమీ ఆకాశమూ బద్దలైపోయినట్టనిపించాయి ఆ కేకలు. బలం, బలానికి మించిన పౌరుషం — రెండు పక్కల వాళ్ళూ దారుణంగా తలపడ్డారు.

రౌద్రంతోనూ, ఉద్రేకంతోనూ వొళ్ళు మరిచి అలా యాదవులందరూ పోట్లాడుతుంటే, కొట్టుకుంటూ వుంటే, నరుక్కుంటూ వుంటే, చంపుకుంటూ వుంటే దయాదాక్షిణ్యం లేకండా చూస్తూ నిలబడ్డాడు శ్రీకృష్ణుడు.

ఉభయపక్షాలవాళ్ళూ కొట్టుకుందికి సాధకంగా అక్కడ మూడంచుల తుంగగడ్డి దొరికింది.

విధి నేర్పు వివరిస్తాను, విను. మునుల పరమ శాపంవల్ల సాంబుడి కడుపులో పుట్టిన ముసలం యాదవుల కలహంలో తన శక్తి ఘోరంగా అక్కడి తుంగలో ప్రవేశపెట్టింది. పొడి పొడి చేసి, వసుదేవుడు సముద్రంలో చల్లించాడు. అయినా ముసలం శక్తి చెడ లేదు. మునీశ్వరుల శక్తి అది!

అసలే చిత్తుగా తాగి సివాలెక్కి వున్నారు యాదవులు. అమోఘమైన మునుల శాపం దివ్యశక్తి దానికి తోడయింది. అంచేత తుంగతో కొడితే ఎదటివాడికి బాధకలుగుతుందన్న వివేకం కానీ, దాంతో కొట్టి పగవాడు తిరుగు లేకండా ఠారుమని పోడానికి కారణం కానీ అవగతం కాలేదు వాళ్ళకి.

ఘోరంగా జరిగింది పోరు. కృత్రిమ ముసల ప్రభావంతో వున్న రెల్లుతో వొకళ్ళ నొకళ్ళు చంపుకోడం సులువైంది.

తండ్రీ, కొడుకూ, అన్నా, తమ్ముడూ అనకండా రెండు వేపుల వాళ్ళూ పేట్రేగి తుంగతో బాదుకున్నారు; వొకళ్ళ దెబ్బతో వొకళ్ళు కూలిపోయారు. పెద్ద సుట్రగాలి వీస్తే కూలి పోయిన చెట్లలాగ కూలిపోయారు వాళ్ళు.

మునుల శాపంవల్ల వాళ్ళ మనస్సులో తమకం మితిమీరుతూ వుండేది. అంచేత వొక్కడూ వెనకాడినవాడు లేడు. ముందు కురికిన వాడు బతికి బయట పడడమూ లేదు. పొలికేకలూ, హుంకారాలూ, మూలుగులూ — గింగురుమని పోయింది రణరంగం.

భోజులూ, అంధకులూ ఎంతో హెచ్చుమంది. అంచేత శక్తి మంతుడు సాత్యకీ, ప్రబలుడు ప్రద్యుమ్నుడూ మొదలైన వృష్ణులు యావన్మందీ హతవారి పోయారు.

అనిరుద్ధుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, సాత్యకీ, గదుడూ మొదలైన వృష్ణివీరులు, అంధకులూ భోజులూ పరాక్రమ క్రీడలో పడి చచ్చిపోయారు. కింద పడున్న వాళ్ళ శవాలు చూశాడు కృష్ణుడు. పరమమునుల శాప శక్తివల్ల అతడి హృదయంలోనూ కోపాగ్ని భుగభుగలాడింది. యుద్ధంలో పడక, తప్పించుకు పోతున్న వాళ్ళందరినీ తుంగలతో మోది మిగలకండా చంపేశాడు.

అలా యాదవులందరూ ముసలం శక్తివల్ల హతమారి పోయారు. గాంధారి మాటలు తనువుకి తెచ్చుకున్నాడు శ్రీకృష్ణుడు "ఇది ఇలా పూర్తయింది!" అని తనలో తాను అనుకున్నాడు.

దారుకుడూ, బభ్రుడూ యుద్ధం దొమ్మీకి రాకండా వుండి పోయారు. రణరంగ మంతటిలోనూ, అంతమంది శవాలమధ్యా వొక్కడే నుంచున్న కృష్ణుణ్ణి చూశారు వాళ్ళు. తిన్నగా అతడి దగ్గిరికి వచ్చారు.

"అందరూ అంతమైపోయారు! ఇక్క డెందుకూ ఇక! బల రాముడు ఎక్కడున్నాడో వెదుకుదాం పద. అత డేమయాడో దాన్నిబట్టి పనిచెయ్యాలి మనం" అన్నారు.

"సరే" అని బయలుదేరాడు కృష్ణుడు. బరువైన గుండె లతో కుమిలిపోతూ అతడి రెండువేపులా బభ్రుడూ, దారుకుడూ బయలుదేరారు. బలరాముడు వెళ్ళిన వేపు వెళ్ళారు వారు. ఓ చెట్టు దగ్గిర అతణ్ణి చూశారు.

## అర్జునుణ్ణి పిలుచుకురా

దారుకుడివేపు చూసి, "పాండవుల దగ్గిరికి చప్పున వెళ్ళు, యాదవుల నాశనం చెప్పి, అర్జునుణ్ణి తీసుకురా" అన్నాడు కృష్ణుడు. గాలిలా ఎగిరిపోయే గుర్రాలు పూసి, చిన్నరథం వేసుకుని వెంటనే హస్తిన వెళ్ళాడు దారుకుడు.

బభ్రుడివేపు చూసి, "స్త్రీజనాన్ని ఏనుగులూ మొదలైన వాటిమీద చప్పున పట్నం చేర్చిరా" అన్నాడు కృష్ణుడు. అందుకని బయలు దేరాడు బభ్రుడు. పట్టుమని పదడుగులు వెళ్ళాడో లేదో, ఎక్కణ్ణుంచో వొక బోయవాడు వచ్చి తుంగతీసి అతణ్ణి కొట్టాడు. కృష్ణుడి కనుచూపుదూరం లోనే తారుమని కూలిపోయాడు బభ్రుడు.

బభ్రుడి పాటు చూసి మునుల శాపశక్తికి నిచ్చెర పోయాడు కృష్ణుడు. "అన్నయ్యా, స్త్రీజనాన్ని గుర్రాలమీదా, ఏనుగుల మీదా, రథాలమీదా పట్నం చేర్చి తిరిగి వస్తాను. ఈ చెట్టుదగ్గిరే వుండు నువ్వు నేను వచ్చేదాకా" అని బలరాముడితో చెప్పాడు ఆ ప్రకారం స్త్రీజనాన్ని రథాలూ వాటిమీద పట్నం తీసుకు వచ్చాడు. తిన్నగా వసు దేవుడి దగ్గిరికి వెళ్ళాడు.

"తండ్రీ, వెనక కౌరవకుల నాశనం చూశాను; ఇప్పుడు సకల యాదవుల నాశనం చూశాను. బంధువు లెవ్వరూ లేని ఇక్కడ బతికి వుండటానికి మనస్కరించడంలేదు. అన్నయ్య ముందే అడవికి వెళ్ళిపోయాడు తపస్సుకోసం. అతడితో కలిసి నేనుకూడా తపస్సు చేసుకుంటాను. ఇక అంతా నువ్వే చూసుకో. నేడో రేపో అర్జునుడు ఇక్కడికి వస్తాడు. మీ ఆజ్ఞలు నెరవేరుస్తాడు" అంటూ అతడి పాదాలమీద శిరస్సు మోపి మొక్కాడు.

అంతకి ముందే యాదవుల పోట్లాట జనంచేత విన్నాడు వసు దేవుడు. మనస్సు చలించి జీవం లేనట్టు కొయ్యబారివున్నా డతడు. తానూ, బలరాముడూ ఇల్లు విడిచి అడివికి పోతామని కృష్ణుడు చెప్పడంతోనే, వున్న తెలివికూడా తప్పిపోయి శవంలా అయి పోయాడు.

కృష్ణుడి మాటలూ, వసు దేవుడి అవస్థా చూసి రాగాలుతీసి

వచ్చారు స్త్రీలు. కనికరంతో కరిగిపోయాడు కృష్ణుడు. అందరినీ ఓదార్చాడు.

"అర్జునుడు ఇప్పుడే ఇక్కడికి వస్తాడు. మీ దుఃఖం తొలగి స్తాడు" అని ఉపశమన వాక్యాలతో ధైర్యం చెప్పాడు. తండ్రిదగ్గర కూర్చుని అతడి పాదపద్మాలు తన హస్తపద్మాలతో మెత్తగా ఒత్తుతూ అవసరమైన నేర్పుకొటలతో అతణ్ణి ఓదార్చాడు. తెలువు కున్నట్టు చేశాడు. అర్జునుడు వస్తాడని పదేపదే చెప్పాడు.

"అర్జునుడు నీతిమంతుడు. పరివారాన్నీ, ఏనుగులూ, గుర్రాలూ వాటినీ నువ్వు చూసుకో. ఇన్ని మాటలతో ప్రయో జనం లేదు. ఇదే ఇప్పటి కర్తవ్యం" అని అతడి దగ్గర సెలవు తీసు కున్నాడు. అన్న బలరాముడిదగ్గిరికి వెళ్ళాడు. భక్తిపూర్వకంగా ప్రణామం చేశాడు. "మన తండ్రి అనుమతి తీసుకుని వచ్చాను" అన్నాడు.

## బలరాముడి నిర్యాణం

అలా చెప్పాక బలరాముడి ముఖపద్మంలోంచి ఒక మహా సర్పం బయటికి రావడం చూశాడు కృష్ణుడు. ఎరుపు ఛాయతోనూ వెయ్యినోళ్ళతోనూ, ధగధగా వెలిగిపోతున్న మణుల పడగలతోనూ, తెలుపారిన పర్వతమంత శరీరంతోనూ వుందా మహాసర్పం. అలా నిజయోగ బలంతో తన తనువు విడిచి ఆకాశమార్గాన సముద్రానికి వెళ్ళిపోయాడు బలరాముడు. వినయంతో ఎదురువచ్చాడు వరుణ దేవుడు. నాగులందరూ వచ్చి భక్తిపూర్వకంగా కొలిచారు. నాగ రాజు వాసుకీ, కర్కోటకుడూ, తక్షకుడూ, వారుణుడూ, కుంజ రుడూ, కుముదుడూ, దుర్ముఖుడూ, పృథుశ్రవుడూ, హ్రాదుడూ, వక్రదంతుడూ, క్రోధుడూ, శంఖుడూ, పుండరీకుడూ, మిశ్రీ,

అజేయుడూ, ధృతరాష్ట్రుడూ మొదలైన నాగప్రముఖులు వచ్చి కొలిచారు. గంగా మొదలైన మహానదులున్నూ వచ్చి కొలిచాయి నిజస్వరూపాలు ధరించి.

శ్రీకృష్ణుడు అదంతా దివ్యదృష్టితో చూశాడు. అనంతుడైన బలరాముడు తన పరమమూర్తిలో కలిసిపోయాడు.

అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు కృష్ణుడు. అటూ ఇటూ తిరుగుతూ, తాను భూలోకంమీద పుట్టి చెయ్యవలింది. తీరిపోయిన విషయం తలపోశాడు. తనువు విడిచిపెట్టవలిసిన అవసరం అవగతం చేసుకున్నాడు. మునుల శాపం తలచుకున్నాడు. వెనక దుర్వాసుడు వొంటినిండా పాయసం పూసినప్పుడు అరికాలికి పూయకపోడంతో తప్పించరాని అపాయం అక్కడ సంభవిస్తుందన్నమాట తనువుకి తెచ్చుకున్నాడు. మనస్సు ఇంద్రియాలలో అడగించాడు. గాఢ సమాధి నిష్ఠుడయాడు. నేలమీద పడుకున్నాడు.

## కృష్ణ నిర్యాణం

అప్పుడు భయపడుతూ భయపడుతూ జర ఆ అడివికి వచ్చింది. వచ్చి, అక్కడ తిరుగుతున్న వొక వేటకాణ్ణి చూసింది. కృష్ణుడి శరీరం పొదలోవున్న జింక అని అతడికి భ్రమ కలిగినట్టు మాయ కప్పింది.

వింటిని మంచిదారైన వొక బాణం సంధించాడు వేటకాడు. ఉగ్రంగా గురిపెట్టాడు. చెవులదాకా లాగి విడిచిపెట్టాడు. రివ్వున వెళ్ళింది బాణం. శ్రీకృష్ణుడి అరికాలు నిష్ఠురంగా దూసుకుపోయింది. మీగాలనుంచి బయటికిపోయింది. బాణం వెంటనే జింకకోసం పరిగెత్తుకు వచ్చాడు వేటకాడు.

జింక కాదు, మనిషి. చూశాడు వేటకాడు. కళవిళపడి

పోయాడు. నిలువునా వాడికిపోయాడు. కృష్ణుడిపాదాలమీద వాలి పోయాడు. ఏడ్చాడు; ముత్తుకున్నాడు.

తగిన మాటలతో అతణ్ణి ఓదార్చాడు కృష్ణుడు. తన కోరిక అలా తీరడంతోనే శరీరం విడిచిపెట్టాడు; వైకుంఠానికి వేంచేశాడు. దివ్యమునులూ, సిద్ధులూ, రుద్రులూ, వసువులూ, మరుత్తులూ, ఆదిత్యులూ, దేవతలూ, దేవేంద్రుడూ సంభ్రమంతో ఎదురు వచ్చారు. భక్తి వినయాలతో పాదాభివందనం చేశారు. పరమ స్తోత్రాలతో చుట్టూముూగారు. దేవేంద్రుడు ఇలా స్తుతించాడు:

"ఆదిపురుషా, ధర్మరక్షణార్థం దయాంహృదయుడివై లీల కోసం భూలోకంమీద అవతరించావు. కంసుడూ మొదలైన దేవ శత్రువుల్ని సంహరించావు. భరతకుల కలంకం తొలిగించావు. పరి శుద్ధమైన ప్రతిష్ఠ కూర్చి దయచేశావు. మృతిలేదు నీ పదానికి; వార్ధక్యం లేదు దానికి. వ్యయంకాదది. నిర్మలమైంది. తర్కించ రాంది. అచలమైంది. ఆగమగమ్యమైంది. అమేయమైన ఆ తత్త్వం అధిష్ఠించు ప్రభూ!

"యజ్ఞపురుషా, శరణాగతుల దుఃఖం తొలిగించడంకోసం యుగయుగమూ ఇలాగే అవతరించు దేవా!"

ఇలా స్తోత్రం చేసి కృష్ణుడిమీద పూలవాన కురిపించాడతడు.

ఇంతలో బ్రహ్మ వచ్చి శ్రీకృష్ణుడి పాదాలకి మొక్కాడు. భక్తితోనూ, ఆనందంతోనూ సలక్షణమైన స్వరంతో వేదసూక్తులతో స్తోత్రం చేశాడు. కరుణతో చెమ్మగిల్లిన చూపులతో అందరినీ చూశాడు శ్రీకృష్ణుడు.

"అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవరూపాలు నాలోనే ఏకంచేసుకున్నాను. ఆనందమయమైన, విజ్ఞాన ధామమైన, నిరంజనమైన, అమేయమైన నా పదప్రాప్తికి, పరమ మంగళానుభూతికి

అంగీకరిస్తున్నాను. మీరంతా నా సఖులుకండి. సుకృతులు మీరు" అంటూ మృదుమధురంగా ఇంపుకలిగినట్టు చెప్పాడు. అంతమందీ ఆనందించారు.

అలా ఆదర సంభాషణంతో ఆ దేవదేవుడు బ్రహ్మేంద్రాదుల్ని సంతోషపరిచి అనాది అయిన తన వైకుంఠ పదంలో నివసించాడు. ఇంద్రియాలకి అందని ఆ దేవుణ్ణి బుద్ధిలో దర్శిస్తూ, అద్భుతమైన అతడి గుణాలు అభినందిస్తూ బ్రహ్మ మొదలైన దేవతలందరూ నిజనివాసాలకి వెళ్ళిపోయారు.

## అర్జునుడు ద్వారక వచ్చాడు

దారుకుడు హస్తిన వెళ్ళాడు; పాండవుల్ని చూశాడు. యాదవకుమాళ్ళు సాంబుణ్ణి ఆడవేషం వేసి మునులదగ్గిరికి వెళ్ళడమూ, మునులు శపించడమూ, సాంబుడి కడుపున ముసలం పుట్టడమూ వినిపించాడు. యాదవులు ముసలం నూరి సముద్రంలో చల్లడమూ చెప్పాడు. యాదవులందరూ సముద్రతీరానికి యాత్ర వెళ్ళడమూ, అక్కడ అంతమందీ తప్పతాగడమూ, ముసలం శక్తితో వున్న తుంగతో కొట్టుకుని యావన్మందీ మరణించడమూ వివరించాడు. బలరాముడూ, శ్రీకృష్ణుడూ మాత్రం బతికివున్నారన్నాడు. కృష్ణుడు పంపితే ఇలా వచ్చానని అన్నివిషయాలూ పూసగుచ్చినట్టు చెప్పాడు.

విని పట్టరాని దుఃఖంతో విలపించారు పాండవులు. ద్రౌపదీ మొదలైన అంతఃపుర స్త్రీలంతా గోలుగోలుమన్నారు. పట్నమంతటా శోకమే శోకం అల్లుకుంది.

"నిన్ను తీసుకురమ్మని నన్ను పంపించాడు శ్రీకృష్ణుడు" అని అర్జునుడితో చెప్పాడు దారుకుడు.

"దారుకా," అతణ్ణి చూస్తూ అన్నాడు అర్జునుడు, "యాదవ కుల నాశనం నా చెవుల పడడమూ, నేనిక్కడ నిలవగలగడమూనా! అంత గుండెనిబ్బరం కూడా నాకు! నువ్వు వేరే రమ్మనాలా చెప్పూ!"

దారుకుడితో అలా అని, అన్నగారితో చెప్పవలసిన మాటలు చెప్పి, వున్నపాళాన ద్వారక బయలుదేరాడు అర్జునుడు త్వర పడుతూ.

మగడు వచ్చిన ముత్తైదువలా వుంది ద్వారక. చంద్రుడు గుంకిన రాతిరిలా వుంది. కృష్ణుడు లేక అలా దీనంగా, జాలిగొడుతూ వున్న ద్వారక చూసి, గుండె బరువుతో ప్రవేశించాడు అర్జునుడు. పటికి ఎదిరీదినట్టు పురవీధుల్లోంచి నడిచివెళ్లాడతడు. దారుకుడు కూడా వున్నాడు. నెమ్మది పోందిన మనసులతోనూ, గౌరవంతోనూ అర్జునుణ్ణి చూశారు ద్వారక పౌరులు.

అలా కోటలో ప్రవేశించాడు అర్జునుడు. అతణ్ణి చూడడం తోనే, ఎన్నడూ ఎరగని తమ దుఃఖం సయించలేకపోయారు శ్రీకృష్ణుడి భార్యలు. పదహారు వేలమందీ మొహాలు కప్పుకుని గోలు గోలు మని ఏడ్చారు. కంటికీ మంటికీ కన్నీళ్లు కార్చారు. పాదాలు తొట్రుపడుతూ దైన్యం తనువులు ధరించినట్టు అతడి దగ్గిరికి వచ్చారు.

వారిని చూసి గుండెలు పగిలినట్టయింది అర్జునుడికి. దుఃఖం ఆపుకోలేకపోయాడతడు. గద్గదకంఠంతో గట్టిగా ఏడుస్తూ రథం దిగి కిందపడిపోయాడు. ఆ దురవస్థ చూస్తే పగవాళ్ళకైనా గుండెలు చెక్కలయిపోతాయి.

పట్టరాని దుఃఖంతో గొంతెత్తి ఏడుస్తూ రుక్మిణీ సత్యభామలు అర్జునుడి దగ్గిరికి వచ్చారు; నిలువునా నేలమీాద కూలిపోయారు.

"అర్జునా, మాకు దిక్కెవ్వరూ?" అంటూ తక్కిన శ్రీ

లందరూ దీనంగా, వల్లమాలిన శోకంతో వచ్చి అర్జునుడి చుట్టూ మూగారు.

తన దుఃఖం తానే దిగమింగుకుని లేచాడు అర్జునుడు. స్త్రీ లందరినీ ఓదార్చాడు.

"వీళ్ళ దుఃఖమూ, దైన్యమూ చూస్తే యాదవు లందరూ మాత్రమే మరణించినట్టు లేదు. వీరి ఆతురత నా గుండెల్లో ఇంకా ఏదో దుఃఖం కెరలిస్తోంది! కృష్ణుడిదశ ఎలావుందో అని గుండెలు కొట్టుకుంటున్నాయి. ఏ సంగతిన్నీ ఎవరు చెప్తారు! ఏందారి?" అంటూ లోలోపల సతమతమైపోతున్నాడు అర్జునుడు. దారుకుడి అవస్థా అలాగేవుంది. వసుదేవుడిదగ్గిర నిజం తెలుస్తుందేమో అను కుంటూ అర్జునుణ్ణి అతడి దగ్గిరికి తీసుకు వెళ్ళాడతడు. భయపడుతూ భయపడుతూనే వెళ్ళారు వారు.

## వసుదేవుడి దుఃఖం

అర్జునుడు వచ్చేసరికి ఎంతోఅంత దుఃఖంతో కన్నీళ్ళలో మునిగి పక్కమీద పడున్నాడు వసుదేవుడు. అర్జునుణ్ణి చూడడంతో మరింత కొత్త దుఃఖం ముంచుకు వచ్చిందతడికి. లేచి అమాంతంగా అర్జునుణ్ణి కౌగిలించుకున్నాడు. గద్గదికతో గొంతెత్తి ఏడ్చాడు. మర ణించిన వారిపేర్లు పనవి పనవి శోకించాడు.

ఎంతో కష్టంమీద అతణ్ణి ఓదార్చాడు అర్జునుడు.

"అర్జునా," నాలిక తొట్రుపడిపోతూ అన్నాడు వసు దేవుడు, "దైవం నామీద మబ్బులేని పిడుగు వేశాడు. మనుష్య మాత్రులు కారు నా బిడ్డలు. దేవతలంత పరాక్రమవంతులు. రాక్షసుల్ని సంహరించగల బలవంతులు. అడ్డులేని అసహాయ శూరులు. అలాటి వాళ్ళు అకారణంగా వొకళ్ళ నొకళ్ళు చంపు కున్నారు!

"నీ శిష్యులు సాత్యకీ, ప్రద్యుమ్నుడూ ఈ దారుణరణంలో తొలి పీనుగులయారు! ఇది వినికూడా బతికున్నాను! నేనే పిరుణ్ణి లోకంలో!

"తొలి తొలి సాత్యకి కృతవర్మలు రేపెట్టారు. దాంతోనే రగులుకుంది పోరు. అయితే వాళ్ళని తిట్టడం దేనికి! మునుల శాపమే ఇంత చేసింది.

"చచ్చిపోయిన పరిక్షిత్తుణ్ణి బతికించాడు కృష్ణుడు. మూర్ఖులై యాదవులు కొట్టుకుంటూ వుంటే చూస్తూ వూరుకున్నాడు! ఈ నాశనం తప్పనిసరి అనుకుంటాను! ఏమంటే, ఎప్పుడు ఏది ఎలా చెయ్యాలో ఎరుగు నతడు.

"పోనీ ఇది విధివశంగా జరిగిందని కుదుటపడదామన్న వివేక మున్నా కుదరకండా వుంది. ఊరికే యదువంశమంతా వూడ్చుకు పోయిందే అన్న దుఃఖం గుండెలు చెక్కలు చేసేస్తూవుంది."

వసుదేవుడు అలా అంటూవుంటే, "యాదవులందరి మాటా చెపుతున్నాడితడు. కృష్ణుడి మాట ఎత్తడంలేదు. ఇంచేత కృష్ణుడి వునికి విషయంలో సంశయించ వలిసిందిలేదు" అని తనలో తాను నచ్చచెప్పుకున్నాడు అర్జునుడు.

ఇంకా ఇలా అన్నాడు వసుదేవుడు:

"అర్జునా, మునుల శాపంవల్ల యాదవులు యావన్మందీ హతవారిపోయారు. ముసలం శక్తితోవున్న తుంగలతో వొకళ్ళ నొకళ్ళు కొట్టుకు చచ్చిపోయారు. ఒక్కడూ ఆడంగుల్ని తీసుకు వచ్చాసు కృష్ణుడు ఏనుగులూ, గుర్రాలూ, రథాలు వేసుకుని."

"కృష్ణుడు వచ్చాడు" అనగానే "అయితే అతడు ఎక్కడికి వెళ్ళాడు?" అని తడబడుతూ అడిగాడు అర్జునుడు.

"వచ్చి, నేను దుఃఖపడుతూ వుండడం చూసి, నన్ను

ఓదార్చాడు. 'నీ వంశాన వృష్ణులూ, భోజులూ, అంధకులూ — అంతనుండీ నశించిపోయారు. అర్జునుడి కోసం కబురుపెట్టాను. ఇప్పుడే అతను వస్తాడిక్కడికి. నువ్వంటే ఎంతో భక్తి అతడికి. నిన్ను సేవించి వుంటాడు. నువ్వు ఏం చెపితే అది చేస్తాడు. కార్యం తెలిసిన వాడతను. శౌర్యవంతుడు. వినయవంతుడు. నాకూ అతడికీ భేదమేమీ లేదు. విచారం విడిచిపెట్టు. అతణ్ణి పురస్కరించుకుని ఏనుగులూ, గుర్రాలూ మొదలైన వాటినీ, బంధువుల్నీ రక్షించుకో. అర్జునుడు స్త్రీలనీ, పిల్లల్నీ ఆపదలపాలు కాకండా కాపాడతాడు.

"'కొద్ది దినాల్లో సముద్రం ద్వారకానగరం ముంచేస్తుంది.

"'యాదవులు నరుకులాట ఆరంభించడానికి ముందే బలరాముడు అడివికి వెళ్ళిపోయాడు. అక్కడ తపస్సులో కూచున్నాడు. నాకూ అదే మంచి మార్గం. ఇదీ ఇప్పటి కర్తవ్యం. వెయ్యి మాటలతో ప్రయోజనం లేదు. మరి విచారించకు. నాకు అనుమతి అనుగ్రహించు.

"'అర్జునుడు చెప్పినప్రకారం అన్నిపనులూ నడిపించు. పోట్లాటలో మరణించిన యాదవులందరికీ అతడే అగ్నిసంస్కారం జరిపిస్తాడు. అతడే అనంతరం మీ పరలోక విధులన్నీ నెరవేరుస్తాడు' అని చెప్పాడు. నేను తలవూపాను; అంగీకరించాను. అతణ్ణి వెళ్ళమన్నాను.

"ఇక్కడ నువ్వు చెప్పినట్టు చెయ్యడమే కర్తవ్యం. అయినా, వొక్కమాట చెపుతున్నాను.

"పీనుగుపెంటగా పడిన బిడ్డల్ని తలుచుకోకండా ఎలావుండడం చెప్పు! మనస్సులో ఈ అగ్ని రగులుతూవుంటే అన్నపానాలు ఎలా సయిస్తాయి! సయించినా సయించకపోయినా ప్రాణాలు నిలుపుకుని ఇంక ఏం నోచ్చుకోవాలి నేను!

"ఈ స్త్రీలనీ, ప్రజల్నీ. ఏనుగులూ మొదలైనవాటినీ ఎలా చూడాలో అలా నువ్వే చూసుకో. కృష్ణుడి మాట చెల్లించు" అన్నాడు.

వసుదేవుడి విచారమూ, అతడి పరిస్థితీ చూసి ఎంతో దుఃఖపడ్డాడు అర్జునుడు.

"మహాత్మా, కృష్ణుడులేని దేశంలో వుండడానికి మనస్సొప్పుతుందా నాకు! ధర్మరాజూ, భీముడూ, నేనూ, నకుల సహదేవులూ, ద్రౌపదీ వొకేమనస్సుకలవాళ్ళం. సకల యాదవ నాశనం విని, ముందుమాట ఆలోచించి ముందే నిశ్చయించాడు ధర్మరాజు. స్త్రీలనీ, పిల్లల్నీ, సంపదనీ ఇంద్రప్రస్థం తర్లించుకురమ్మన్నాడు నన్ను. అంచేత వీళ్ళనందరినీ అక్కడ సుఖంగా నివసించినట్టు చేరుస్తాను. నిన్ను ముందుంచుకు తీసుకువెళతాను. అయినదానికి విచారించకు. దైవకృత్యాలు తప్పవుకదా!" అని చెప్పి, దారుకుడివేపు చూశాడు. అతడి హృదయం దుఃఖంతో కుంగిపోతూవుండడం గమనించి ఇలా అన్నాడు:

"దారుకా, పద, కృష్ణుడు ఎటువెళ్ళాడో అటు వెళదాం. ఇక్కడ చెయ్యవలసిన పనులు మంత్రులతో చెప్పి వెళ్ళడం మంచిది. వెళ్ళు, ముందు వాళ్ళని పిల్చుకురా."

దిగ్గున వెళ్ళాడు దారుకుడు. మంత్రు లందరినీ సుధర్మ సభకి పిల్చుకువచ్చాడు. అంతకిముందే అర్జునుడు అక్కడ కూర్చున్నాడు. మంత్రు లందరూ వొక్కొక్కరూ వచ్చారు. వినయంగా అర్జునుడి చుట్టూ చేరారు. చెమ్మగిల్లుతున్న హృదయంతో అంతమందినీ వోమారు కలయచూశాడు అర్జునుడు. గంభీరమైన దుఃఖంతో ఇలా అన్నాడు:

"పురజనుల నందరినీ పిలిపించండి. మీకూ వారికీ చెప్పవలసిన పనులున్నాయి."

వెంటనే బ్రాహ్మల్నీ, క్షత్రియుల్నీ, వైశ్యుల్నీ, శూద్రుల్నీ- చిన్నా పెద్దా యావన్మంది ప్రజల్నీ రావించారు మంత్రులు. వచ్చిన వాళ్ళందరూ ఎవరికితగిన ఆసనాల్లో వాళ్ళు కూచున్నారు. అందరి కళ్ళూ అర్జునుడిమీదే వున్నాయి.

దీనంగా వున్న మొహంతో అంతమందినీ కలయచూశాడు అర్జునుడు.

## ద్వారక వొదిలి పోవాలి

"వినండి" నెమ్మదిగా అన్నాడు అర్జునుడు, "ఇవాళకి ఏడో నాడు ద్వారక పట్నాన్ని సముద్రం ముంచేస్తుంది. దేవతలు ఆకాశం మీంచి చెప్పగా విన్నాన్నేను. అంచేత వేగం ఈ పట్నం విడిచిపెట్టెయ్యాలి మనం. వజ్రుణ్ణి* ఇంద్రప్రస్థపురానికి రాజుగా చేస్తాన్నేను. మీరందరు ఎప్పటిలాగే అతడి ఏలుబడిలో జీవించం డక్కడ. మీ సరుకులూ అవీ మొయ్యగలిగినంతమట్టుకు మోపులుకట్టండి. బళ్ళూ గిళ్ళూ చప్పున సిద్ధంచెయ్యండి. వాహనాలూ, వాటి పరికరాలూ వాకదగ్గిర చేర్చండి. ఏమంటే బయలుదేరండి అనేసరికి బయలుదేర డానికి సిద్ధంగావుండాలవి. మరోలా భావించకండి. యాదవవీరు లున్నప్పుడు మీరు ఎలా సుఖపడ్డారో అలాగే ధర్మరాజు ఆదర సంభావనలతో సుఖపడతారు. వెళ్ళండి, సిద్ధంకండి" అని వారినంద రినీ పంపేశాడు. మంత్రులతో ఇలా అన్నాడు:

"ఏనుగులూ మొదలైన వాహనాలు చక్కచేసి తేగలిగిన పరిచారకుల్ని ముందే నియమించండి. ఏపని ఎవరికి బెత్తాయించాలో వారికి బెత్తాయించండి. ఏదీ మరిచిపోకండి. ఆడవాళ్ళనీ, వాళ్ళనీ తీసుకురాడానికి మేనాలూ, నాటుబళ్ళూ ఏర్పాటుచెయ్యండి. ఓర్పు విడిచిపెట్టకండి.

---

* కృష్ణుడి మునిమనవడు, ప్రద్యుమ్నుడి మనవడు.

"గతించినవి తిరిగి తీసుకురాలేం. కాని, మనకి ధర్మరాజున్నాడు. మిగిలిన ప్రజల్ని రక్షించడానికి వజ్రదేవుణ్ణి రాజు చెయ్యవచ్చు" అని వాళ్ళని ఇళ్ళకి పంపేశాడు. వల్లమాలిన దుఃఖంతో ఆ రాత్రి కృష్ణుడి మందిరంలో గడిపాడు.

## వసుదేవుడి మరణం

తెలతెలవారుతూ వుండగా వసుదేవుడు యోగనిష్ఠతో శరీరం విడిచిపెట్టాడు. అతడి మందిరంలో ఏడుపులు మిన్ను ముట్టాయి. అతడి భార్యలు దేవకీ, రోహిణీ, భద్రా, మదిరా – నలుగురూ సహగమనానికి సిద్ధపడ్డారు.

విని, అర్జునుడు అక్కడికి వచ్చాడు. వేలాడుతున్న మాలలతోనూ, అరిటి స్తంబాలతోనూ, బంగారం కలశాలతోనూ అందంగా శవయానం కల్పించాడు.

వసుదేవుడి శవం స్నానం చేయించారు. గంధాలు పూశారు. ఆభరణాలు పెట్టారు. చీనాంబరాలు కట్టించారు. పూలమాలలు వేయించారు. యాజకులు మంత్ర తంత్ర క్రియలు సాగించారు. రుద్రసామం గానంచేశారు.

దేవకీ, రోహిణీ, భద్రా, మదిరా సముచితంగా సిద్ధంచేసిన యానాలెక్కారు.

చెలులూ, చుట్టాలూ కుడి ఎడమ వేపుల నడిచారు. తగిన మాటలతో ఓదారుస్తూ వెళ్ళారు వారు.

వసుదేవుడి శవయానం ముందు నడిచింది. వెనుక నలుగురు భార్యల యానాలూ నడిచాయి. అగ్నులు పట్టుకుని ముందు బ్రాహ్మలు నడిచారు.

ద్వారకా వాసులు యావన్మందీ తల్లడిల్లిపోతూన్న హృద

యాలతోనూ, వరదలు కడుతున్న కన్నీళ్ళతోనూ హా హాకారాలు చేస్తూ వెంట వెళ్ళారు.

వెనక వసుదేవుడు తిరగాడే తోటలోకి తీసుకు వెళ్ళారు శవం. గంధపు కర్రలతోనూ, అగురు కర్రలతోనూ ముందే చితి పేర్చి పెట్టారు. విధిప్రకారం శవానికి జరగవలసిన వన్నీ జరిగించారు. చితికి జరగవలసినవన్నీ జరిగించారు.

వసుదేవుడి పితృమేధం జనులందరూ అభినుతించినట్టు, చితి మీద శవం పెట్టించాడు అర్జునుడు. అగ్ని ముట్టించారు. చితి మంటలతో భుగభుగమంది. దేవకీ, రోహిణీ, భద్రా, మదిరా — నలుగురూ చితాగ్నిలో ప్రవేశించారు. ఆబాలవృద్ధులు యావన్మందీ హాహాకారాలు చేశారు.

చితాగ్నిలో నేతులు పోశారు. ఏడు నాలికలతో గుబగుబలాడి మండింది చితాగ్ని. సామగానం సాగింది. హాహాకారాలు అధికమయాయి.

తరవాత వజ్రుడూ మొదలైన పురుషులూ, స్త్రీ జనులూ యథావిధిగా ఉదక ప్రదానం చేశారు.

బంధువుల నందరినీ తగిన మాటలతో వోదార్చి పట్నానికి మళ్ళించాడు అర్జునుడు. బరువుగుండెలతో తానున్నూ తిరిగి వచ్చాడు.

అలా పితృమేధం ఘనంగా జరిపించి, యాదవులు కొట్టుకు చచ్చిన రణస్థలానికి పండితుల్ని వెంట పెట్టుకు వెళ్ళాడు అర్జునుడు. పిల్లలూ, స్త్రీలూ, వృద్ధులూ కూడా వెళ్ళారు. చచ్చిపడున్న భోజుల్నీ, అంధకుల్నీ, వృష్ణుల్నీ చూసి అంతమందీ గోలుగోలుమన్నారు. కొంతమంది కింద వొరిగిపోయారు. కొంతమంది గుండెలు బాదుకుని ఏడ్చారు. కొంతమంది నెత్తి మోదుకుని ఏడ్చారు. అందరూ హాహాకారాలు చేశారు.

అర్జునుడు దుఃఖంతో తూలిపోయాడు. దారుకుడు ధైర్యం చెప్పాక తేరుకున్నాడు. మృతులందరికీ బ్రాహ్మలచేత అగ్నిసంస్కారాదికాలు చేయించాడు. బంధువులందరిచేతా తిలోదకా లిప్పించాడు. ఏదీలోపం రాకండా చూశాడు. అలా గుబులుకుంటున్న దుఃఖంతోనే బంధుకార్యం నిర్వహించా డతడు.

## బలరామ కృష్ణుల కళేబరాలు

యాదవ స్త్రీలనీ, పిల్లల్నీ, వృద్ధుల్నీ మృదువైన మాటలతో పట్నం పంపేశాడు. అర్జునుడు "నేను బలరామ కృష్ణులు తపస్సు చేస్తున్న అడవికి వెళ్ళి వస్తాను" అన్నాడు. వారి దుఃఖం మాన్పించడానికి దారుకుడూ మొదలైన తగినవారిని అవసరమైన మాటలు చెప్పి పంపాడు. తగిన ఆప్తజనుల్ని కొందరిని వెంటపెట్టుకుని బలరామ కృష్ణుల్ని వెదకడానికి తాను బయులుదేరాడు.

వెళుతూ వెళుతూ మనసులో ఇలా అనుకున్నా డతడు, "తండ్రికి కావలిగా వుండడంకోసం నన్ను పిలిపించాడు కృష్ణుడు. కావలి వుండవలిసిన నేను తండ్రి చావువార్త వినిపించడానికి అతడి దగ్గిరికి వెళుతున్నాను!

"అయినా తపోనిష్ఠలోవున్న కృష్ణుడికి వసుదేవుడి చావు కబురు ఎందుకూ వినిపించడం? వినిపించి అతడి హృదయానికి దుఃఖం ఎందుకూ కలిగించడం!

"ఊహూఁ, ఈ చావుకబురు కృష్ణుడితో చెప్పను. వెళ్ళి అతడి దర్శనం చేస్తాను. అతడు చెప్పిన పని వినయంతోనూ భక్తితోనూ, నెరవేరుస్తాను."

ఇలా ఎన్నోవిధాల అనుకుంటూ గాంధారి శాపం తనువుకి తెచ్చుకున్నాడు.

"'నిర్జనమైనచోట దిక్కులేని చావు చస్తావు' అని కృష్ణుణ్ణి శపించింది గాంధారి. దగ్గిరే వుండి విన్నా న్నేను. అయితే నిప్పుకి చెదపడుతుందా?" అనుకుంటూ కలతపడిన మనస్సుతో వెళ్ళవలసిన వేపు వెళ్ళి వెదక్క మరోవేపు వెళ్ళాడు. ఇంతకీ విధాత చేతకి అడ్డేముంది!

అతడి మొహంలోని విషాదభావం చూసి తడబడిపోయి, 'అటు కాదు, ఇటు' అని చెప్పలేకపోయారు అనుచరులు.

అలా దిక్కుతప్పి, అడవిలో కొన్నాళ్ళు ఇటూ అటూ తిరిగాడు అర్జునుడు. ఒకనాడు వొక బోయవాడు అతణ్ణి చూశాడు. "ఎక్కడికి వెళతారు?" అని అడిగాడు. "కృష్ణుడు తపస్సుచేస్తున్న చోటికి" అన్నారు అర్జునుడి అనుచరులు.

"ఓనాడు ఓ దగ్గిర చూశాను కృష్ణమూర్తిని. ఆతడిని చూపించడానికి వస్తాను రండి. అయితే ఇంతవరకూ అతడు అక్కడ వుంటాడో వుండడో చెప్పలేను" అంటూ ముందు నడిచాడు బోయ అతడివెంట అర్జునుడూ, అనుచరులూ వెళ్లారు. శ్రీకృష్ణుడి శరీరం పడున్న చోటు చూశారు.

చూడడంతోనే మూర్ఛపోయాడు అర్జునుడు. నరికిన చెట్టులా నేల పడిపోయాడు. గోలు గోలు మన్నారు అనుచరులు. కొంచేపటికి తెలుపుకున్నాడు అర్జునుడు. శ్రీకృష్ణుడి కళేబరం గాఢంగా కౌగిలించు కున్నాడు. ధైర్యంపోయి వేడివేడి కన్నీళ్ళు కార్చాడు. అనుచరుల లోని బ్రాహ్మలు ఎంతో వోదార్చాక కలత తేరి, కన్నీళ్ళు చేతులతో తుడుచుకుంటూ దీనంగా కృష్ణుడి కళేబరం చూశాడు.

"దేనివల్ల ఇంతపని జరిగిపోయింది?" అంటూ కృష్ణుడి అవయవాలన్నీ పరికించాడతడు. యోగుల హృదయాలలో వుండే పాదపద్మాన బాణం తగిలిన గాయం చూశాడు. దుర్వాసుడి మాటలు జ్ఞాపకం చేసుకున్నాడు. విస్మితుడయాడు.

ఏ వికృతమూ లేకండా వుంది కృష్ణుడి కళేబరం. ప్రతి అవయవమూ మనోహరంగానే అవుపిస్తూ వుంది. నిద్దరపోతున్నట్టే పడుంది మృతదేహం. రెప్ప వెయ్యకండా చూశాడు అర్జునుడు. చూస్తూ చిత్రంలా వుండిపోయాడతడు.

అనుచరులు ఎన్నో విధాల చెప్పి కలక తేర్చారతణ్ణి. ఉచిత క్రియకి ప్రోత్సహించారు. "బంధువుల్ని ఇక్కడికి పిల్చుకువద్దామా? కాక శ్రీకృష్ణుడి శరీరం అక్కడికి పట్టుకుపోదామా?" నువ్వే నిశ్చయించి చెప్పు. ఏంచేద్దాం?" అని అడిగారు.

"సముద్రం పట్టణం ఎప్పుడు ముంచేస్తుందో!" అన్న విచారం మనస్సుకి తట్టింది అర్జునుడికి. అడివిలో తాము తిరిగిన దినాలు అనుచరులతో లెక్కపెట్టి చూశాడు. తేలిన లెక్కప్రకారం మర్నాడే సముద్రం ముంచుకు వస్తుందని తేలింది.

## అగ్ని సంస్కారం

అప్పుడే ఎర్రపొద్దు పడింది. పడమటివేపు వాలిపోతూవుంది. త్వరపడ్డారు అనుచరులు. అర్జునుడూ వాళ్ళూ కర్తవ్యం చర్చించారు.

"మనం కృష్ణుడి కళేబరం చూసి వచ్చామన్న వార్త పట్నంలో పుట్టకండా చూడాలి. అప్పటికి అవసరమైన మాటలు చెప్పి, రాత్రికి రాత్రి ప్రయాణంకావాలి. పనులన్నీ పూర్తిచేసుకుని చప్పున బయలుదేరాలి. అలాకాకపోతే పొద్దుదూరితే సముద్రం పట్నం ముంచేస్తుంది. వల్లమాలిన ఆపద వచ్చిపడుతుంది. పాపం మన నెత్తిమీద పడుతుంది.

"కనక వేగం అగ్నీ, కర్రలూ సమకూర్చాలి. శ్రీకృష్ణుడి కళేబరానికి సద్విధిగా సంస్కారం జరిగించాలి. ఇది పూర్తిచేసి పట్నం పరిగెట్టాలి" అని నిశ్చయించారు. అదేవిధంగా బ్రాహ్మలతో కలిసి శ్రీకృష్ణుడి శరీరానికి చివరి సంస్కారం జరిగించాడు అర్జునుడు

బలరాముణ్ణి తలుచుకున్నాడు. "మునుల మాట తప్పదు" అంటూ ఆ చెట్టుపట్ల వెదికాడు. బలరాముడి కళేబరం కనుక్కున్నాడు. త్వరత్వరగా దానికిన్నీ అగ్ని సంస్కారం జరిపాడు.

ఇలా బలరామకృష్ణుల కళేబరాలకి చివరిసంస్కారం జరిగించి, హుటాహుటిని ద్వారకకి బయలుదేరాడు అర్జునుడు. దారిలో అనుచరులతో అన్నాడతడు:

"ఈ కార్యం ఇలా చెయ్యకపోయివుంటే, భర్తపోయిన గతికే పోడానికి పూనుకుంటారు రుక్మిణీ మొదలైన దేవేరులు. నిలపగలమా మనం? రాత్రంతా ఈ పనితోనే సరిపోతుంది. పొద్దు మారితే సముద్రం ముంచుకు వస్తుంది. మేలు చెయ్యబోయి, లోకమంతా తిట్టే కీడు తెచ్చుకోవచ్చు! స్వదేశం చేరుకున్నాక అవన్నీ చూసుకుందాం, రండి. వేగం నడవండి."

## ద్వారక పరిత్యాగం

ద్వారక చేరాడు అర్జునుడు. అనుకున్నట్టు రాత్రిలోపల అన్ని పనులూ పూర్తిచేశాడు. పొద్దు పొడిచేముందే అంతమందినీ పట్నం నుంచి తర్లించాడు. పట్నంలో పిట్టమనిషి లేకండా చేశాడు. సరుకులూ, జంతువులూ అన్నీ తర్లించాడు.

కృష్ణుడి అంతఃపుర స్త్రీలు పదహారువేలమందీ, ఎనమండుగురు పట్టపు రాణులూ తగిన వాహనాలమీద బయలుదేరారు. వారి వెంట తగిన పురుషులు కాపలా కాస్తూ నడిచారు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ పరిచారకులు భద్రంగా నడిపించుకు బయలుదేరారు. రకరకాల బళ్ళమీదా, వాహనాలమీదా, కావళ్ళమీదా పట్నంలోని సరుకులు వేసుకు బయలుదేరారు జనం. అధికార్లూ, పరిచారకులూ వాటిని కనిపెడుతూ నడిచారు. భర్తలు

పోయినస్త్రీల గౌరవానికి భంగం రాకండా, వజ్రదేవుడూ మొదలైన యాదవ ప్రముఖులకి ఇబ్బంది కలగకండా నడిపించాడు అర్జునుడు. రథమెక్కి అంతటా తానై, వెయ్యికళ్ళతో అందరినీ చూస్తూ నడిచా డతడు. అతడి హృదయంలో మాత్రం బ్రహ్మాండ మంత దుఃఖం కుములుతూ వుండేది.

## ద్వారక సముద్రంలో మునిగిపోయింది

అలా అంతమందితోనూ అర్జునుడు పట్నం పొలిమేర దాటే సరికి తూరుపు తెల్లవారింది. పొద్దు ఉదయపర్వతంమీాది కెక్కింది. సముద్రం కొండలంత కెరటాలతో పొంగింది. ద్వారకాపట్నం ముంచేసింది.

పట్నం సముద్రంలో మునిగిపోతూవుంటే అంతమందీ వెను దిరిగి ఆశ్చర్యంతో చూశారు. దుఃఖంలో మునిగిపోయారు. రెండో సముద్రంలావున్న ఆ జనమంతటినీ ముందుకి నడిపించుకు వెళ్ళాడు అర్జునుడు. అద్భుతపడుతూ వారు చెప్పుకుంటున్న మాటలు సముద్ర ఘోషలా అనిపించాయి. అలా నడిపించుకు వచ్చి పంచవటం దగ్గిర ఆగాడు మజిలీవేసి.

## దారిదోపిడి

ఈ బాటసారి సమూహాన్ని పీరులైన దొంగలు చూశారు. కోకొల్లలుగా వుంది ధనం. జనం తక్కువగా వున్నారు. వీరిలో యోధులు లేరు కాపాడేవారు. అర్జునుడు వొక్కడే వున్నాడు. చివ్వున ఇతడిమీాద పడదాం. అడ్డుపడే వాడెవ్వడూ మరొకడు లేడు ఈ మూకలో. ఊడిపడిన ధనమిది. దీని లోతంతా తెలిసిపోయింది మనకి" అంటూ తమలో తాము కూడబలుక్కున్నారు. ధనం దోచుకుందామన్న ఆశతో కోట్లకొద్దీ వచ్చి పడ్డారు.

"పిల్లలూ, ముసలాళ్ళే వున్నారు. యుద్ధానికి తెగించే మగాడు వొక్కడూ లేడు. ఆడాళ్ళని ముట్టడి వేద్దాం." అంటూ నేల ఈనినట్టు పాపాత్మకమైన ఆ కిరాతబలం ఆటోపంతో వచ్చి కలబడింది. రకరకాలయిన ధనాలు అపహరించడ మారంభించింది.

చూశాడు అర్జునుడు. "ఓరోరి దుర్మార్గులూ, ఈ ప్రజకి నేనూ సంరక్షకుణ్ణి. పారిపోండి! దురాశపాలయి బందిపోటుకి దిగకండి! కాదంటారా, మీ తలకాయలు భూదేవికి బలివేస్తాను!" అంటూ అదిలించాడు.

ఈ అదిలింపు లెక్కచెయ్యలేదు దొంగలు. అతడి మాట లన్నీ పొల్లులుకింద కట్టేశారు. స్త్రీల నగలు అక్కడక్కడ వొల్చుకోడం మొదలెట్టారు.

గాండీవం ఎక్కుపెట్టాడు అర్జునుడు. ప్రచండమైన బాణాలు దొంగలమీద గుప్పించాడు.

దట్టమైన తోళ్ళు కప్పుకుని, కొద్దిగా బాణాలూ, రాళ్ళూ, కర్రలూ రువ్వుతూ నిర్భయంగా అర్జునుడిమీద కలబడ్డారు దొంగలు.

మహాస్త్రాలు ప్రయోగించబోయాడు అర్జునుడు. అయితే మంత్రాలు స్ఫురించలే దతడికి. "ఇది దైవవిరోధం" అనుకుని మామూలు బాణాలే విడుపూ విరామం లేకండా గబగబా రువ్వాడు. బాణాలన్నీ అయిపోయాయి. జమిలి అక్షయతూణీరాలు క్షయమై పోయాయి. ఉత్తిపోయాయి.

కాలం తారుమారు చూసి ఆశ్చర్యంతోనూ, విచారంతోనూ ఇదయిపోయాడు అర్జునుడు. బాహుబలంతో వింటిబద్ద పట్టుకుని దొంగలమీద కలబడ్డాడు. ఎలాగో చివరికి రుక్మిణీ మొదలైన ఎన మండుగురు పట్టపురాణుల్నీ, బలరాముడి భార్యల్నీ, మరికొందరు యాదవస్త్రీలనీ కాపాడగలిగాడు. మిగిలిన ఆడాళ్ళ నందరినీ ఎత్తుకు

పోయారు దొంగలు. ప్రజలందరినీ దోచుకున్నారు. రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ తమకు పనికిరావని వొదిలేసి పోయారు.

అలా పాడుపోయిన మూక నడుపుకుని, దైన్యం మనస్సు కుంగదీస్తూ వుండగా కురుక్షేత్రం చేరుకున్నాడు అర్జునుడు. దారి కడాకూ అక్కడక్కడ మిగిలిపడిన ఆ ప్రజనంతో కాలం తారుమారువల్ల కలిగిన దశ వినిపిస్తూ, విచారిస్తూ వెళ్ళాడతను.

## వజ్రుడూ మొదలైనవారి అభిషేకం

"కోపించి శాపంపెట్టింది గాంధారి. యాదవకుల నాశనం తప్పనిసరి. పిల్లల్నీ, వృద్ధుల్నీ, స్త్రీలనీ తగినచోట్ల భద్రపరచాలి. వారి దుఃఖం తొలిగించాలి. అర్జునా, కాలానికి తగిన కర్తవ్యం నువ్వే నిర్వహించాలి" అని ఎన్నోమాట్లు అంటూవుండేవాడు ధర్మరాజు. అంచేత అతడి దయాహృదయం తెలుసు అర్జునుడికి. కనక ద్వారక నుంచి తర్లించుకువచ్చిన యాదవుల్ని తగినచోట్ల భద్రంగా నిలిపాడతడు. కృతవర్మ కొడుకుని చూసి, "నాయనా, నువ్వూ మీ అమ్మా, నీ కొబుద్ధులూ మృత్తికావతపురంలో వుండండి" అన్నాడు. బహు సంపదలతో వున్న ఆ పట్టణమూ, దాని దేశమూ ఇచ్చి అతణ్ణి అక్కడ అభిషేకించాడు. తన పరివారంతో అతడక్కడ రాజై నివసించాడు.

అలాగే సాత్యకి కొడుకుని సరస్వతి పట్నంలో అభిషేకించాడు. మిగిలినవారిని ఇంద్రప్రస్థం తీసుకువచ్చాడు. వజ్రుణ్ణి అక్కడ పట్టం కట్టాడు. ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ పైముగ్గురికీ పంచి ఇచ్చాడు. వాళ్ళవాళ్ళ బంధువుల్ని ఆ మూడుచోట్లా నిలిపాడు.

అక్రూరుడి భార్యల్నీ, కుమార్తెల్నీ వజ్రుడికి అప్పగించాడు. వజ్రుడు వారిని ఆదరించినా అతడికన్నా ఆగలేదు వాళ్ళు. తమకి తోచిన చోటికి వెళ్ళిపోయారు [illegible] తపస్సుకు.

## రామకృష్ణుల మరణవార్త

యాదవకుటుంబాల్ని అలా స్థిరపరిచాక రామకృష్ణుల మరణ వార్త వారి భార్యలకి వినిపించాలని నిశ్చయించాడు అర్జునుడు. తగినవాళ్ళని వెంటపెట్టుకుని మెల్లిమెల్లిగా వాళ్ళదగ్గిరికి వెళ్ళాడు. శోకంతో పగిలిపోతున్న హృదయంతో తాను పరిజనులతో అడివికి వెళ్ళడమూ, కృష్ణుణ్ణీ, బలరాముణ్ణీ వెదుకుతూ అడివిలో అన్నాళ్ళూ తిరగడమూ, బోయవాడు దయతలిచి వారున్న చోటికి తీసుకుపోడమూ చెప్పాడు. అంతవరకూ చెప్పి, దుఃఖం ముంచుకువచ్చి, కన్నీళ్ళు వరదలు కట్టి, తలవంచి, మాటాడకండా వూరుకున్నాడు.

అతడి స్థితి చూసి శ్రీకృష్ణుడు కాలంచేశాడని తెలుసుకున్నారు స్త్రీలు. శోకం మూర్తిభవించినట్టు గోలు గోలు మన్నారు. ఎలాగో ధైర్యం తెచ్చుకుని, "అన్నా అర్జునా, నువ్వు ఇంతెందుకు దుఃఖపడతావు తండ్రీ! కాలం వక్రించింది. ఆపడం ఎవరితరం! మిగిలిన విషయం వివరించు మాకు" అన్నారు.

"అడివిలో మేము గడిపిన దినాలు లెక్కించి చూశాం. 'రేపే సముద్రం ద్వారక ముంచేస్తుంది. ఈ ఆపద ఎలా తప్పించుకోడం!' అని విచారించాం. మీకు అప్పుడు జరిగిన ఘోరం చెపితే, ఆ పనులతో పొద్దుపోయి, సముద్రం పట్నం ముంచేస్తుంది. బ్రాహ్మలూ మొదలైన యావన్మందీ సముద్రంపాలవుతారు. కనక రామకృష్ణుల అంత్య క్రియలు ముగించి ఎవ్వరికీ చెప్పకండా పరివారమూ, పౌరులూ, ఏనుగులూ మొదలైన వాహనాలూ, సరుకులూ సిద్ధంచేయించాను. బండెడు దుఃఖంతో ప్రయాణం సాగించాను. మిగిలిన స్త్రీలనీ, పిల్లల్నీ, వృద్ధుల్నీ అందరినీ పొద్దుపోకుండా పట్నం దాటించాను. అందువల్లే మీకూ, నేనూ నిందా, పాపమూ లేకండా బయటపడ్డాం. అమ్మలారా, ఇది తప్పని తోచి మనస్సు బాధపడుతూవుంది. మీకు

చెప్పకుండా అంత్యక్రియలు చేసిన తప్పు నన్ను అంటకుండా దయ చూడండి " అంటూ సాగిలబడ్డాడు అర్జునుడు.

అందరూ అతణ్ణి ఎత్తి ఓదార్చారు. "వారించరాని విధి కృత్యం అడ్డడం ఎవరివశం! ఇంక చెయ్యవలసిన పనులు చెయ్యడమే కర్తవ్యమిప్పుడు. విచారించి ప్రయోజన మేమిటి?" అన్నారు.

## అగ్నిప్రవేశం

కృష్ణుడి రాణులలో రుక్మిణీ, జాంబవతీ మొదలైనవారు కొందరు సహగమనం కోరారు. బంధువులు శోకార్తులై వ్యాకులపడ్డారు. అలా సహగమనం చేయడానికి సిద్ధపడిన కృష్ణుడి రాణులకూ, బలదేవుడి రాణులకూ యానాలు సిద్ధంచేయించాడు అర్జునుడు. చందనం కర్రలతోనూ, అగురు కర్రలతోనూ చితులు పేర్పించాడు. మహనీయులైన బ్రాహ్మల్ని పంపి అగ్ని రగిలించాడు. యథావిధిగా అగ్నిప్రవేశం చేశారు సహగమనం కోరిన రామకృష్ణుల భార్యలు.

సత్యభామా మొదలైనవారు కొందరు తపస్సు చేసుకుందికి అడివికి వెళ్ళిపోయారు.

అనంతరం బంధువుల్నీ, ఆప్తజనుల్నీ తగిన మాటలతో ఓదార్చి, ఎవరికి తగినచోటికి వారిని పంపాడు అర్జునుడు.

## వ్యాససన్నిధి

ఇదంతా అయాక ఆపుకోలేని కన్నీళ్ళతో వ్యాసదేవుడి సన్నిధికి వెళ్ళాడు అర్జునుడు. గంగానది ఒడ్డున ఆశ్రమంలో తగిన ఆసనం మీద ఏకాంతంగా కూచున్న ఆ మహాత్ముణ్ణి చూశాడు. భక్తిపూర్వకంగా సాష్టాంగ నమస్కారం చేశాడు. పిలిచి దగ్గిర కూచోపెట్టుకున్నాడు వ్యాసుడు. అతడి మొహం చూస్తూ, "అర్జునా, పాత్రి

లేకండా వున్నావు! ఎంతోసేపటికి కాని తెలుసుకో లేకపోయాను! ఏమిటిది? ఏమయింది? పట్టరాని కోపం వచ్చి, చంపరాని వారి నెవరినైనా చంపి వచ్చావా? నీ సంగతి ఏమిటో చెప్పు" అని అడిగాను.

"శ్రీకృష్ణుడూ, బలరాముడూ కాలం చేశారు" అన్నాడు అర్జునుడు, "వజ్రాయుధమైనా సహించగల దృఢ దేహాలు యాదవ వీరులు తుంగలతో కొట్టుకుని చచ్చిపోయారు. ఆ దుఃఖంతో కుంగి పోతూ, స్త్రీలనీ, పిల్లల్నీ, వృద్ధుల్నీ తీసుకు వస్తూండగా దారిలో దారిదోపిడు దొంగలు ముట్టడించారు. గాండీవ మెత్తా న్నేను. మహాస్త్రాలు ప్రయోగించ బోయాను. మంత్రాలు స్ఫురించలేదు. గాండీవం పని చెయ్యలేదు. బాహువులలో శక్తి చల్లారిపోయింది. అక్షయ తూణీరాలు వృత్తిపోయాయి. ఏంచెప్పనూ! దొంగలమీదికి సామాన్యబాణాలు చాలవా అనుకుంటే అవి అలా అయిపోయాయి, వొక్కటీ లేకండా. దుఃఖంతోనూ, ఆశ్చర్యంతోనూ నిశ్చేరపోయా న్నేను. చివ్వున చుట్టుముట్టారు కిరాతులు. విచ్చలవిడిగా దోచు కున్నారు. వింటిబద్దతో వోపినంతవరకు వాళ్ళతో పోరాడాను. రామకృష్ణుల భార్యల్నీ, కొంతమంది యాదవ స్త్రీలనీ, పిల్లల్నీ, వృద్ధుల్నీ నేర్పుతో కాపాడగలిగాను. వాళ్ళందరినీ నా బుద్ధికి తట్టి నట్టు ఇంద్రప్రస్థంలోనూ అక్కడా నిలిపాను. కలిగిన నష్టంవల్లా, భంగపాటువల్లా హృదయం దుఃఖంతో బద్దలైపోతూవుంది. పనిని పాటు ప్రాప్తిస్తే ఏంచెయ్యడం కుంగిపోక! నేనిప్పుడు ఏంచెయ్యాలో దయతో సెలవియ్యి" అంటూ చేతులు జోడించాడు.

"నాయనా," అంతా విని అన్నాడు వ్యాసముని. "మునుల శాపంవల్ల యాదవులు నశించారు. దానికి విచారించ పనిలేదు. కృష్ణుడు ముందే ఎరుగు నిదంతా. చెప్తాను, విను. కాలం ప్రాప్తమై

జరుగుతున్న పనికి అడ్డుకోడ మెందుకని అతడు వూరుకున్నాడు. కాకపోతే మూడులో కాలు తారుమారు చెయ్యగలవా డతడు. కణ్వాదుల శాపం మళ్ళించలేడూ! తప్పనిసరిగా జరగవలిసింది జరిగింది. యాదవకులం నాశనమైంది. నువ్వు యుద్ధం చేసినప్పుడు, నీమీద స్నేహంవల్ల శూలం పట్టుకుని తానే ముందు శత్రుసైన్యం సంహరించేవాడు. నీ కళ్ళకున్నూ కనపడే దది. అలాంటి కృష్ణుడు కాలం తారుమారైంది కనకనే నిన్ను కాపాడకండా పోయాడు.

"భూభారం తొలిగించడానికి అవతారమెత్తిన విష్ణుదేవుడు శ్రీకృష్ణుడు. తాను చెయ్యవలిసింది పూర్తిచేశాడు. అజరామరమూ, నిర్వికారమూ అయిన వైకుంఠం శాంతిపరుడై వేంచేశాడు. దానికి నీవంటి జ్ఞానపరులు విచారిస్తారా ఇలా!

"అర్జునా, భూభారం తొలిగించడంలో భీముడితో కలిసి శ్రీకృష్ణుడికి సాయపడ్డావు నువ్వు. నీకు సాయపడి కృతార్థత సంపాదించి, నిన్ను వొదిలి వెళ్ళిపోయాయి మహాస్త్రాలు. దైవప్రకారం తెలిసినవాడివి నువ్వు. యుద్ధంలో నీ ఆచరణ చూసి దేవతలున్నూ సంతోషించారు.

"కాలం అనుకూలంగా వుంటే బలమూ, బుద్ధీ, చేవా అన్నీ కలిసివస్తాయి. కాలం తారుమారైతే అన్నీ తారుమారయిపోతాయి. అందుకే బుద్ధిమంతుడైన వాడికి సంతోషమూ వుండదు, విచారమూ వుండదు.

"అన్నిటికీ కాలమే మూలం. దీనికి మరోలా భావించకండి మీరు. ఉత్తమగతికి పయనించండి. నిశ్చింతగా తనువులు విడిచిపెట్టండి. అప్పుడే ప్రజ్ఞావంతులు ప్రస్తుతిస్తారు."

వ్యాసభగవానుడి ఉపదేశం విన్నాడు అర్జునుడు. శోకం, మోహం విడిచిపెట్టాడు. హృదయంలో నిబ్బరమైన ఆనందం తెచ్చు

కున్నాడు. భక్తి వినయాలతో వ్యాసముని దగ్గిర సెలవు తీసుకున్నాడు. అక్కణ్ణుంచి తిన్నగా హాస్తినాపురం వచ్చాడు. ధర్మరాజు దర్శనం చేశాడు. తాను వెళ్ళింది మొదలు వచ్చిందాకా జరిగింది పూసగుచ్చినట్టు విన్నవించాడు.

వ్యావహారి కాంధ్ర మహాభారతం

మౌసల పర్వం

సంపూర్ణం

---

# మహాప్రస్థానిక పర్వం



అలా శ్రీకృష్ణుడూ, బలరాముడూ మొదలైన యాదవుల వృత్తాంతాలూ, తాను నిర్వహించిన పనులూ, వ్యాసముని హితోపదేశమూ వినిపించాడు అర్జునుడు. అంతా విన్నాడు ధర్మరాజు. మహాప్రస్థానం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు.

"తమ్ముడూ" అర్జునుడితో అన్నాడతడు, "కాలమే అన్ని ప్రాణుల్నీ కడతేరుస్తుంది. కర్మత్యాగమే ఇప్పుడు కర్తవ్యమని పిస్తోంది నాకు. నీ మనస్సుకూడా ఇలాగే వుంటుందని తెలుస్తోంది."

"అవును" అన్నాడు అర్జునుడు. "కాలాన్ని ఏమనాలి! దానికి అదే సాటి! ఇంకోదానికి ఈ పోకడ లుండవు! బాగానే ఆలోచించావు నువ్వు. నీ నిశ్చయమే హితమైంది; అభిమతమైంది."

తనతో ఏకీభవించిన అర్జునుణ్ణి మెచ్చుకున్నాడు ధర్మరాజు. భీముణ్ణీ, నకులసహదేవుల్నీ పిలిపించాడు. అదంతా వివరంగా వినిపించాడు. వాళ్ళున్నూ అన్నగారిమాట అంగీకరించారు. అనంతరం యుయుత్సుణ్ణి పిలిచి అంతా చెప్పాడు. రాజ్యతంత్రం ఎలా నడపాలో అతడికి ఉపదేశించాడు. రాచనగరులోని వివరాలున్నూ వివరించాడు. అతణ్ణి మహానాయకుణ్ణి చేశాడు. సేనలు అతడి అధీనం చేశాడు.

అదయాక ఘనంగా పరిక్షితుణ్ణి రాజ్యానికి పట్టాభిషేకం చేశాడు. అతడికి రాజనీతి ఉపదేశించాడు. సుభద్రని పిలిచి, "నీ మనవఁడు కౌరవ సామ్రాజ్యానికి మహారాజయాడు. యాదవ వంశం ఉత్తరాధికారి వజ్రుడికి ఇంద్రప్రస్థరాజ్య మిచ్చాను. ఈ రెండు కుటుంబాలూ రక్షించే భారం నీమీద వుంది. విను, చావగా మిగిలిన

యాదవు లందరికీ వజ్రుడు సంరక్షకుడు. అతణ్ణి పోషించాలి నువ్వు. ఈపని చెయ్యకపోతే ధర్మహాని సంభవిస్తుంది సుమా!'' అని చెప్పి, తాము ఇల్లువొదిలి వెళ్ళినప్పుడు ఆమె తమ వెంట రాకండా కట్టుదిట్టం చేసి ప్రారంభపడ్డాడు.

అంతతో పోక, భారతయుద్ధంలో మరణించిన బంధువులికీ, మౌసల యుద్ధంలో మరణించిన యాదవులికీ పరలోక సౌఖ్యం కలగడం కోసం రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, ఆవులూ, బంగారమూ, రత్నాలూ-ఎన్నో దానంచేశాడు. భూదానాలూ, కన్యాదానాలూ, గృహ దానాలూ చేశాడు. ధౌమ్యుడూ మొదలైన బ్రాహ్మలందరినీ సంతృప్తిపరిచాడు. కోట్లకొద్దీ వస్తువులు వారి కిచ్చాడు. పుష్కలంగా ధనమూ, బహుమానాలూ ఇచ్చి కృపాచార్యుణ్ణి సంతోషపరిచాడు. మిగిలిన బంగారమూ, రత్నాలూ పరమాదరంతో పరిక్షితు కిచ్చాడు. అతణ్ణి శిష్యుడుగాచేసి కృపాచార్యుడికి అప్పగించాడు. పౌరుల్ని, పల్లె ప్రజల్ని రావించాడు. పరిక్షితుణ్ణి వారికి చూపించి ఇలాఅన్నాడు :

"అయ్యలారా, మా అయిదుగురికీ మారుగా ఈ పరిక్షితుణ్ణి పరిగ్రహించండి. అన్నిపనులూ ఇతడితో నడిపించండి. నానాటికీ అనురక్తి అధికమైనట్టు చూడండి. ఇతడి మనస్సు రంజింపచేస్తూ ఆరాధించండి" అన్నాడు. మహాప్రస్థానం కోసం తాము నిశ్చయించుకున్నామని చెప్పాడు.

"మమ్మల్ని ఇలా ఉపేక్షించి వెళ్ళడం న్యాయమా మహారాజా!'' చిన్నపోయిన మొహాలతో అన్నారు ప్రజలు, "కరుణా హృదయుడివి నువ్వు. తరతరాలుగా మీ ఆశ్రితులం మేము" అంటూ గద్గదకంఠాలతో విన్నవించారు.

అందరికీ తగినమాటలతో నచ్చచెప్పాడు ధర్మరాజు. తమ తుది పయనానికి వాళ్ళని వొప్పించాడు.

అప్పుడు అందులో కొందరి ఇళ్ళు కొందరు అన్యాయంగా ఆక్రమించారని వివాదంపుట్టింది. అదిచూసి, "కలియుగ మాహాత్మ్యం ఇది" అని నవ్వుతూ అన్నగారితో చెప్పాడు సహదేవుడు. "అందుకే మన మనువులు ఇక చాలు" అని నవ్వుతూ అన్నాడు ధర్మరాజు.

## మహాప్రస్థానం

తన నగలన్నీ వొంటిమీంచి తీసేశాడు ధర్మరాజు. నార బట్టలు కట్టుకున్నాడు. లేడితోలు కప్పుకున్నాడు. తమ్ములూ, ద్రౌపదీ కూడా అలాగే చేశారు. ఆ సమయంలో చెయ్యవలిసిన విధులు అందరూ పూర్తిచేశారు. యజ్ఞాగ్నులు నీళ్ళలో వేశారు. కలకల్లాడుతున్న మొహాలతో ఇంటినుంచి బయటుదేరారు.

మొదట ధర్మరాజు నడిచాడు. అతడివెంట వరసగా భీమార్జునులూ, నకులసహదేవులూ, వొక కుక్క ఏడోదిగానూ నడిచారు.

వాళ్ళు అలా నడివీధిని వెళుతూవుంటే పురజనులు ఆబాల వృద్ధులూ దీనంగా చూశారు. ఆ దృశ్యం వెనక జూదంనాడు వాళ్ళు అడివికి వెళ్ళిననాటి దృశ్యంలా అనిపించింది. భటులతో కూడా యుయుత్సుడూ, నీ తండ్రి పరిక్షితుడూ, అంతఃపురస్త్రీలూ — యావన్మందీ పాండవుల వెంట వెళ్ళారు.

హస్తినాపురం దాటిపోయాడు ధర్మరాజు. అలిసిపోకండా అందరూ ఎంతోదూరం అతడి వెంట వెళ్ళారు. వెనక చూసి వొకళ్ళనీ "ఆగండి" అనలేదు ధర్మరాజు. తలవొంచుకుని అదే వెళ్ళడం వెళుతున్నాడతడు.

వెనక వస్తున్న జనం అలిసిపోయారు. ఆగలేదు ధర్మరాజు. ప్రదక్షిణాలు చేసి, ప్రణామాలు చేసి, వినయపూర్వకంగా వొక్కొక్కరూ సెలవుతీసుకున్నారు. బరువైన దుఃఖంతో వెనక్కి మళ్ళారు. పరిక్షితుణ్ణి పురస్కరించుకుని హస్తినాపురం చేరుకున్నారు.

ఉలూపి తన తండ్రి దగ్గిరికి నాగలోకం వెళ్ళిపోయింది. చిత్రాంగద బభ్రువాహనుడిదగ్గిరికి వెళ్ళిపోయింది. తక్కిన స్త్రీలందరూ పరిక్షితుడిదగ్గిర ఆగారు.

కృపాచార్యుడూ, ధౌమ్య పురోహితుడూ పరిక్షితుణ్ణీ, తక్కిన వాళ్ళనీ తగిన మాటలతో వోదార్చారు. పౌరుల్ని ఊరడించారు. అన్ని పనులూ ఉత్సాహంతో సాగించారు. హస్తినాపురం ఎప్పటి లాగే నిత్యకల్యాణం పచ్చతోరణంగా కలకల్లాడింది.

అక్కడ ధర్మరాజు వెనక్కి తిరగకండా నడిచిపోతున్నాడు. అతడి వెంట భీముడు. భీముడివెంట అర్జునుడు. అర్జునుడి వెంట నకులుడు. నకులుడి వెంట సహదేవుడు. విడవకండా వారి వెంట కుక్క. ఇలా మహామార్గం పట్టి ఉపవాసపరులై గంగానది దగ్గిరికి వెళ్ళారు వారు. అక్కడినుంచి తూర్పు వేపు తిరిగి, యోగ బలంతో బయలుదేరారు. కొండలూ, నదులూ, అడవులూ, ఎన్నో దేశాలు దాటి తూరుపు సముద్రం చేరుకున్నారు.

అక్కడ వొకదగ్గిర దిక్కులూ, మేఘమార్గమూ పిక్కటిల్లి నట్టు, భీషణమైన అవయవాలతో అగ్ని దేవుడు వారిముందు ప్రత్యక్ష మయాడు. అన్నీ వొదిలేసినా, స్నేహంవల్ల గాండీవం వొదలకండా పట్టుకువస్తున్న అర్జునుడితో ఇలా అన్నా డతడు:

"అర్జునా, కృష్ణుడి చక్రం ఏనాడో స్వర్గానికి వెళ్ళిపోయింది. గాండీవం విడవకండా వున్నావేం నువ్వు? దేవకార్యంకోసం వరుణ దేవుడి దగ్గిరనుంచి ఈ మహా దివ్యధనుస్సు నేను తెచ్చియిచ్చాను. ఆ వరుణదేవుడికే ఇది అప్పగించు."

"మంచిది, అలాగే చేస్తాను" అన్నాడు అర్జునుడు. అన్న గారితో అది విన్నవించాడు. సముద్రంలో గాండీవం విడిచిపెట్టాడు.

అగ్నిహోత్రుడు అంతర్ధాన మయాడు.

యోగపరాయణులైన పాండవులు అక్కణ్ణుంచి భూమికి ప్రదక్షిణంగా దక్షిణంవేపు తిరిగారు. సంతోషంగా దక్షిణ సముద్రం చేరుకున్నారు. అక్కణ్ణుంచి పడమటి వేపు తిరిగారు. పడమటి సముద్రం చేరుకున్నారు. అక్కణ్ణుంచి ఉత్తరంవేపు నడిచారు. ద్వారక దగ్గరనుంచి వెళ్ళారు. హిమాలయం అతిక్రమించారు. అడవులూ, భూములూ, నదులూ, కొండలూ ఎన్నో దాటుకుని యోగబలంతో విచారం లేకండా మేరువు సమీపానికి వెళ్లారు.

## ద్రౌపది పడిపోయింది

ఏడుగురూ ఎంతో స్థిరయోగంతో త్వరత్వరగా నడుచుకు వెళుతున్నారు. ద్రౌపది పడిపోయింది. భీముడు చూశాడు. "అన్నయ్యా, ద్రౌపది పడిపోయింది! ఈమెవల్ల ధర్మహాని కలగడం ఎన్నడూ ఎరగం. యోగం తప్పి ఇలా అవడానికి ఏమిటి కారణం?" అని విచారంతో ధర్మరాజుని అడిగాడు.

"అర్జును డంటే వలపక్షం ఈమెకి. అంచేత ఈమె సుకృతాలు ఫలించలేను. ఇలాంటి దురవస్థ కలిగింది" అన్నాడు ధర్మరాజు. భీముడితో అలా చెప్పి, తన బుద్ధి స్థిరంచేసుకున్నాడతడు. ధైర్య స్థైర్యంతో ఏ వికారమూ లేకండా, ద్రౌపది శవం అక్కడే వొదిలేసి ముందుకి నడిచిపోయాడు.

## సహదేవుడు పడిపోయాడు

కొంతదూరం వెళ్ళాక సహదేవుడు పడిపోయాడు. భీముడు చూశాడు. ధర్మరాజుతో చెప్పాడు. "అహంకార మెరగడు సహదేవుడు. పరమభక్తితో ఎప్పుడూ నీ శుశ్రూష చేస్తూవుండేవాడు. మా అందరిలోకీ సన్మార్గవర్తి. ఇతడికి ఈ దశవచ్చిందేమీ?" అని అడిగాడు.

"తనకంటే తెలిసినవాడు లోకంలో లేడని అహంకారం ఇతడికి. అంచేత ఈ అవస్థ కలిగింది" అన్నాడు ధర్మరాజు. సహదేవుడి శవం అక్కడే వొదిలేసి ముందుకి నడిచిపోయాడు. భీముడూ, అర్జునుడూ, నకులుడూ, కుక్కా అతడి వెంట నడిచారు వెనక్కి చూడకండా.

## నకులుడు పడిపోయాడు

సుస్థిరమైన మనస్సుతో అలా వెళుతున్నారు వారు. నకులుడు పడిపోయాడు. భీముడుచూశాడు. ద్రౌపదీ,చిన్నతమ్ముడు సహదేవుడూ దారిలో పడిపోయిన దుఃఖంతో వెళుతున్నా డతడు. నకులుడు కూడా పడిపోడంతోనే మరింత దుఃఖంతో ధర్మరాజుతో చెప్పాడు :

"అందగాడు ; శౌర్యవంతుడు ; ధైర్యవంతుడు ; సౌజన్యవంతుడు. కౌరవులలోనేకాదు, లోకంలో ఎక్కడా ఇతడితో సాటివచ్చే వాడు వుండడు. ఇలాటి పుణ్యాత్ముడికి ఇలాటి కుచ్ఛితమైన చావు ఎలావచ్చింది !" అంటూ నిట్టూర్చాడు.

"తనవంటివాడు లోకంలో లేడనీ, చక్కదనమంతా తనకే వుందనీ ఎప్పుడూ అనుకునేవాడు ఇతడు. ఆ అహంకారంవల్ల ఈ దశ వచ్చింది ఇతడికి" అన్నాడు ధర్మరాజు.

నకులుడి శవం అక్కడే అలా వొదిలేసి, మనస్సు ధైర్యపరుచుకుని ముందుకి నడిచాడతడు. ధర్మరాజుని అనుసరించారు తక్కిన తమ్ముళ్లు. వారివెంట నడిచింది కుక్క.

## అర్జునుడు పడిపోయాడు

ద్రౌపది చావూ, చిన్నతమ్ముల చావూ చూసి దుఃఖంతో కుమిలిపోతూ నడిచినడిచి, ప్రాణం విడిచి పడిపోయాడు అర్జునుడు. గుండె పగిలినట్టయింది భీముడికి. అన్నగారికి చూపించాడు.

"అమల చరిత్రుడు అర్జునుడు. ఎన్నడూ అబద్ధమాడి ఎర గడు. ఇతడికి ఈ అవస్థ వచ్చిందేమీ ?" అని అడిగాడు.

"కౌరవుల నందరినీ యుద్ధంలో వొక్కనాడే చంపుతా నన్నాడు ఇతడు. అన్న ప్రకారం ఆచరించలేదు. పలుకు వొక్కటీ పనివొక్కటీ చెయ్యడం పరమపాపం. అదీకాక విలుకాళ్ళ నందరినీ వెటకారించే వాడితడు. ఈ రెంటివల్లా ఇతడికి ఈదశ వచ్చింది. ఎలా తప్పుతుంది!" అర్జునుడి దేహం అక్కడే విడిచిపెట్టి ఆగకండా ముందుకి నడిచాడు ధర్మరాజు.

## భీముడు పడిపోయాడు

ఆర్తి వచ్చి, దైన్యం కలిగి, ధైర్యలత తెగిపోయి నేల వాలి పోయాడు భీముడు. వాలిపోతూ అన్నగారిని అడిగాడతడు:

"చూడు చూడు, అన్నయ్యా, నేనూ పడిపోతున్నాను. నా కెందుకు వచ్చింది ఈ అవస్థ? తెలిస్తే కరుణించి తెలియచెయ్యి."

"మితిమీరిన తిండి నీది. భుజబలంతో ఎవ్వరినీ లెక్క చెయ్యవు. ఎప్పుడూ పొల్లుమాటలు పలికావు. అదిగో అందువల్ల ఈ స్థితి కలిగింది నీకు" అంటూ ఆగకండా తిరిగి చూడకండా ధైర్యం తోనూ, దృఢనిశ్చయంతోనూ ముందుకి నడిచాడు ధర్మరాజు. విడవ కండా వెంట నడిచింది కుక్క భక్తి పూర్వకంగా.

ధర్మరాజు వెంట వదలకండా కుక్క వెళుతోందని పదేపదే చెప్పాను. జ్ఞాపకముంచుకో ఇది.

నిష్ఠాగరిష్ఠుడై నిలవకండా వెళ్ళిపోతున్నాడు ధర్మరాజు.

## కుక్కని వొదిలి స్వర్గానికిరాను.

ఇంతలో దేవేంద్రుడు ఎదురుగా వచ్చాడు. ఆతడి దివ్యదేహం కాంతులు పదిదిక్కులా ప్రకాశించాయి. అతడి రథధ్వానం మేరు

పర్వత గుహల్లో ప్రతిధ్వనించింది. అప్పటి సిద్ధులూ, సాధ్యులూ, మునీంద్రులూ నానావిధాల అతణ్ణి స్తుతించారు. అక్కడి కల్ప వృక్షాలు పూలవాన కురిశాయి. అలా వచ్చి ధర్మరాజు ఎదట నిలి చాడు దేవేంద్రుడు.

భక్తిగౌరవాలతో అభివందనం చేశాడు ధర్మరాజు. అభినం దించాడు దేవేంద్రుడు. "రా! దివ్య రథ మెక్కు" అన్నాడు.

"దేవా," శోకసంతప్తు డవుతూ అన్నాడు ధర్మరాజు, "తమ్ముళ్లందరూ ప్రాణాలు పోయి పడిపోయారు! ఆ దుఃఖం బాధ పెడుతూవుంది! సౌకుమార్యవతి ద్రౌపది దగపడి చచ్చిపోయింది! తోడై నాకు నా వెంట వచ్చారు. వారు లేకండా నేను మీ వెంట రాను. వాళ్ళందరూ నాతో కూడా వచ్చినట్లు అనుగ్రహించు."

"విచారించకు" ధర్మరాజు మాటలు విని అన్నాడు దేవేంద్రుడు, "నీ తమ్ములు ద్రౌపదితో కూడా శరీరాలు దిగవిడిచి, స్వర్గానికి వెళ్ళారు. అక్కడ వాళ్ళని చూస్తావు. నువ్వు శరీరం విడిచిపెట్ట నక్కరలేదు; దయచెయ్యి. ధర్మమయాత్ముడివి నువ్వు."

"దృఢమైన భక్తితో నన్ను ఆశ్రయించి, నేను హస్తినాపురం బయలుదేరింది మొదలు వెంటవస్తోంది యీ కుక్క. ఇదికూడా నాతో రావద్దూ! నిష్ఠురవృత్తి సయించదు నా మనస్సు" అన్నాడు ధర్మరాజు.

"ఇది ధర్మమేనా ధర్మరాజా," చిరునవ్వు నవ్వుతూ అన్నాడు దేవేంద్రుడు, "కుక్కకి దేవత్వం వస్తుందటయ్యా? నీ సంకల్పం అశక్యమైంది. కుక్కని వొదిలి నీ మానాన నువ్వు రావడం నిష్ఠుర వృత్తి ఎలా అవుతుందట! ఇక్కడ ఆలస్య మెందుకు, రథమెక్కు."

"అవార్యమూ, దుష్కరమూ అయిన కార్యమే అయినా, పూజనీయుడూ, ప్రభుడూ అయిన నీవంటి సత్పురుషుడు ఆశ్రితుల

కోసం సంఘటించవద్దా? భక్తులైన వాళ్ళని పరిత్యజించి సంపాదించిన సిరి నాకు సంతోషం కలిగించదు" అన్నాడు ధర్మరాజు.

"కోపం ధర్మాన్ని హరిస్తుంది. అంచేత ధర్మరాజా, కోపం తెచ్చుకోకు. కుక్కలకు నా నివాసమైన స్వర్గలోకం లభిస్తుందా చెప్పూ! దీన్ని వొదిలిపెడితే నీకు నిష్ఠురత కలగదు. పట్టుపట్టకు. సుభసంగమనంలో పెడదారి తొక్కకు" అన్నాడు దేవేంద్రుడు.

"దేవా" వినయంగా అన్నాడు ధర్మరాజు, "భక్తుల్ని విడిచి పెడితే బ్రహ్మహత్య చేసినంత పాపం వస్తుందంటారు పెద్దలు. అన్ని ధర్మాలసారమూ తెలిసిన వాడివినువ్వు. నీకు తెలియందేముంది! స్వర్గసుఖం కోసం నామీద భక్తి పెట్టుకు వచ్చిన కుక్కని విడిచి పాపం కట్టుకోలేను."

"వ్రతస్థుడు కుక్కని ముడితే అతడు చేసిన పుణ్యమంతా వూడ్చుకుపోతుంది. వ్రతపరుడివి నువ్వు. ఇంత నిర్బంధ మెందుకు చెప్పూ! ఈ కుక్కని వొదిలిపెట్టు. దీన్ని విడిచిపెట్టడంవల్ల స్వర్గలోక సౌఖ్యం లభిస్తుందినీకు. లోకం ఔరా అన్నట్టు సుకృతాలు చేశావు. స్వర్గం ఎట్టఎదటవుంటే ఇలా కాదనడం కర్తవ్యమేనా! ద్రౌపదిని వొదిలిపెట్ట గలిగావు. భీమార్జునుల్ని, నకుల సహదేవుల్ని విడిచిపెట్ట గలిగావు. ఈ కుక్కనేనా విడిచిపెట్టలేవు! నీవంటి వాడికి తగిన పనేనా ఇది!" అన్నాడు దేవేంద్రుడు.

"అన్ని లోకాలకూ ఏలికవి నువ్వు, ధర్మానికి ప్రభువ్వి. నీ కంటే ఎరుగుదునా నేను మంచిచెడ్డలు! అదీకాక, మహాత్ములతో వాదించడం కూడనిపని. అయినా విన్నవించదగింది విన్నవించడం దోషం కాదని విన్నవిస్తున్నాను. భీముడూ మొదలైన తమ్ములూ, ద్రౌపదీ చచ్చిపోయారు. వాళ్ళని వొదిలిపెట్టక, ఏడుస్తూ కూచుంటే వస్తారా? 'వెంటవచ్చి, చావకండా వున్న కుక్కని విడిచిపెట్టడం

తగిన మాటేనా! ఆశ్రయించిన వారిని ఆదరించకపోడమూ, మిత్రుడి పట్ల ద్రోహం చెయ్యడమూ, ఆడదాన్ని చంపడమూ, బ్రాహ్మడి ధనం అపహరించడమూ - ఇవన్నీ నిరపరాధుడైన భక్తుణ్ణి విడిచిపెట్టిన పాపంతో సాటిరావు నా దృష్టిలో. కనక స్వర్గలోక సౌఖ్యాలు అలా వుండనీ. కుక్కని వొదిలి స్వర్గానికిరాను. నన్ను అనుగ్రహించు. కుక్కని సంభావనచేసిన దోషం లేకండా వరమియ్యి. ఈ కుక్కతో ఈ అడివిలోనే వుంటాన్నేను. నిన్ను కొలుస్తూ జీవనం గడుపుతాను. నువ్వు స్వర్గానికి దయచెయ్యి" అని సంకోచం లేకండా చెప్పాడు ధర్మరాజు.

ధర్మరాజు అలా దృఢనిశ్చయంతో అనడంతోనే కుక్క యమధర్మరాజుగా ప్రత్యక్షమైంది. పరమసంభ్రమంతోనూ, పరమానందంతోనూ ప్రణామం చేశాడు ధర్మరాజు.

"కుమారా," మెచ్చుకుంటూ అన్నాడు ధర్మదేవత, "నీ పుణ్యవృత్తీ, నిర్మలబుద్ధీ, భూతదయా పరమానందంలో తేలించాయి నన్ను" భూలోకంలో నీవంటి వారు లేరోయి. పూర్వంకూడా ద్వైత వనంలో నీ మనస్సు పరీక్షించాను. నీళ్ళకోసం వచ్చి చచ్చిపడున్న నీ తమ్ముళ్లలో వొకణ్ణికోరుకో బతికిస్తానన్నాను. ఏపాపమూ లేనివాడివి నువ్వు. దానికి నువ్వు తల్లులిద్దరినీ తలుచుకున్నావు. 'మా తల్లి ముగ్గురి బిడ్డల్లో నేనున్నాను. మాద్రి బిడ్డలలో వొకడుండడం ధర్మం. కనక నకులుణ్ణి బతికించు' అని నా చెవుల పండువుగా కోరావు. అలా ఎవ రైనా కోరతారా లోకంలో! భీముణ్ణో, అర్జునుణ్ణో వొదిలి నకులుణ్ణి బతికించమని నువ్వు కోరడం నా మనస్సులో మాసిపోదు. నిన్ను ఎలా మెచ్చుకోవాలో తెలియకండావుంది. అంతా దేవేంద్రు డెరుగును.

"కుక్క నిన్ను నమ్ముకుందని దాన్ని వొదిలి దేవేంద్రుడు దివ్య రథం తెచ్చి రమ్మన్నా వొల్లవు! స్వర్గంలో కూడా నీ సాటి వచ్చే

వారు లేరు. ఇంత గొప్పతనం నీలో వుందని దేవేంద్రుడు తెలుసుకున్నాడు. నిశ్చింతగా స్వదేహంతో స్వర్గానికి వెళ్ళు. పుణ్యాలోకాలు నీకు పరమసౌఖ్యం కలిగిస్తాయి. అక్కడి మాన్యులు నిన్ను మన్నిస్తారు."

## స్వర్గారోహణం

ధర్మదేవత అలా అంటూనే వున్నాడు, ఇంతలో గంధర్వులూ, దేవమునులూ, మరుత్తులూ, అశ్వినీ దేవతలూ, వసువులూ పరమానందంతోనూ, ఆదరభావంతోనూ అక్కడికి వచ్చారు.

ధర్మదేవతా, దేవేంద్రుడూ ధర్మరాజుని దేవరథంమీద కూచోపెట్టారు. ధర్మరాజు దివ్యరథం కదిలింది. గంధర్వులూ మొదలైనవారు తమ రథాలు రెండువేపులా నడిపించుకు వెళ్ళారు. ధర్మరాజు తేజస్సు అన్నివేపులా ధగధగా వెలిగింది. సిద్ధులు వినుతి చేశారు.

అలా ధర్మరాజు దేవలోకం వెళ్ళాడు. అప్పుడు సర్వలోకసమ్మతుడు దేవముని నారదుడు అందరూ వినేట్టు పూర్ణస్వరంతో ఇలా గానం చేశాడు:

"దానాలూ, తపస్సులూ చేసి పేరుపడ్డ మహారాజుల్ని ఎంతమందిని వినలేదు!

"ఈ ధర్మరాజు తేజస్సు లోకాలన్నీ నిండి, వాళ్ళ కీర్తులు మాసిపోయాయి!

"ఇంతవరకూ ఎవరైనా ఈ మహనీయుడి లాగ శ్వశరీరంతో స్వర్గానికి వచ్చారా! ఎవరికైనా ఇలా దేవత్వం సిద్ధించిందా!"

ధర్మరాజు కూడా ఇది స్పష్టంగా విన్నాడు. స్వర్గం చేరగానే ఇలా అన్నాడతడు:

"నా తమ్ముళ్లేరీ? వాళ్ళని చూసేదాకా సుఖం లేదునాకు.

భీముడూ, అర్జునుడూ, నకుల సహదేవులూ ఎక్కడున్నారు? సుఖం కలిగించేదయినా, దుఃఖం కలిగించేదయినా వాళ్ళున్న చోటు చూపించండి నాకు.

"అన్ని లోకాలూ చూడాలన్న అభిలాషకంటే వాళ్ళనీ, నా పక్షాన పోరాడి యుద్ధంలో మరణించిన రాజుల్ని చూడాలన్న కోరిక అధికంగా వుంది నాకు."

"ఇతడితో తగిన విధంగా మాట్లాడాలి" అని నిశ్చయించుకుని ఇలా అందుకున్నాడు దేవేంద్రుడు:

"ధర్మరాజా, నీ సుకృతాలవల్ల శరీరంతో స్వర్గానికి వచ్చావు. ఇక్కడ కూడా మనిషి జన్మవల్ల కలిగిన స్నేహం నిన్ను వొదలకండా వుంది. సిద్ధులూ, మునులూ మొదలైన సభాసదుల్ని శుభదృష్టితో చూడు. వెనకటిలాగే వుండడం తగునామరి! ఇతర్లకి అందరాని పద మందుకున్నావంటే, అది నీ నిర్వికారమైన మనస్సు వల్లే అని తెలుసుకో. నీకు లభించిన మహోన్నతస్థితికి నీ తమ్ముళ్లు అర్హులవుతారా! దేవతాత్మకుల బుద్ధికి వెనకటి స్నేహముంటుందా! ఈ విశేషం తెలుసుకోవాలి నువ్వు.

"నువ్వు ఇలా ఎంత చెపితే ఏంలాభం?" సర్వభువనాలకూ అధిపతి అయిన దేవేంద్రుడితో మళ్ళీ అన్నాడు ధర్మరాజు, "తమ్ముళ్ళి, భార్యా పుత్రుల్ని, స్నేహితుల్ని కళ్ళారా చూడకపోతే భరించలేను. వాళ్ళని చూసి వచ్చాకి కాని ఈ భోగాలు అనుభవించలేను. అదే నాకు పరమానందకరం."

వ్యావహారికాంధ్ర మహాభారతం

మహాప్రస్థానిక పర్వం

సంపూర్ణం

# స్వర్గారోహణ పర్వం

"నా పూర్వ పితామహులు పాండవులూ, ధృతరాష్ట్రుడి సుపుత్రులూ స్వర్గానికి వెళ్ళి ఎక్కడెక్కడ ఎలా ఎలా నివసించారు? ఎలా ప్రవర్తించారు? సర్వమూ ఎరిగినవాడివి నువ్వు. నీ అనుగ్రహా నికి పాత్రుణ్ణి నేను. అన్నీ వివరంగా వినిపించు" అని వైశంపాయ నుణ్ణి ప్రార్థించాడు జనమేజయుడు.

దివ్యజ్ఞానం కలిగిన పరమకృపావిధేయుడు వ్యాసముని కరుణా విశేషంవల్ల, సర్వమూ ఎరిగిన వైశంపాయనుడు ఇలా అందుకున్నాడు:

"అలా బంధు దర్శనం కోరి మాట్లాడాడు ధర్మరాజు. అతడి తలపుకి అనుకూలుడై అందుకు తగిన దేవదూతని రావించాడు దేవేంద్రుడు."

## స్వర్గంలో దుర్యోధనుడు

"ధర్మరాజుకి తనవాళ్ళని చూడాలని కోరిక కలిగింది. నువ్వు ఇతణ్ణి అక్కడికి తీసుకువెళ్ళు. బంధువు లందరిని చూపించు" అన్నాడు.

అతడు సగౌరవంగా ధర్మరాజుని తీసుకువెళ్ళాడు. కుతూహలం కొద్దీ నారదుడూ మొదలైనవారున్నూ కొందరు వెంట వెళ్ళారు.

అక్కడికి వెళ్ళేసరికి కట్టెదుట దుర్యోధనుడు కనిపించాడు. ఉన్నతాసనంమీద, ఉదయిస్తున్న సూర్యుడిలాగ వెలిగిపోతున్నా డతడు. దేవతాస్త్రీలు చుట్టూ వున్నారు. పరమసుఖ మనుభవిస్తున్న ఆ వీరలక్ష్మీసంపన్నుణ్ణి చూశాడు ధర్మరాజు. దేవమునుల మొహం చూసి ఇలా అన్నాడు:

"పరమలోభి ఇతడు. దీర్ఘదర్శి కాడు. ఇతడి మూలంగానే అన్ని దేశాల రాజులూ హతవారిపోయారు చతురంగబలాలతో. పుణ్యాత్మురాలూ, సాధ్వీ అయిన ద్రౌపదిని నిండు సభలో అవమానపరిచిన నీచుడితడు. ఇలాటివాడితో కలిసివుంటానా నేను!

"మహాత్ములారా? మా భీముడూ, అర్జునుడూ, నకుల సహదేవులూ, ద్రౌపదీ ఎక్కడున్నారు? అక్కడికి పంపించాలి నన్ను" అంటూ పెడమొహం పెట్టి మళ్ళిపోయాడు.

"ధర్మరాజా," నవ్వుతూ అన్నాడు నారదుడు, "ఈ దుర్యోధనుడు యుద్ధంలో శరీరం విడిచిపెట్టాడు. అందుకే దేవభోగాలనుభవిస్తున్నాడు. పుణ్యాత్ములందరూ ఇతణ్ణి గౌరవిస్తారు. రాజుల్ని చంపాడంటున్నావు. వాళ్ళని ఉత్తమమైన క్షత్రియ ధర్మంతో కదా చంపాడు! అది పాపమెందు కవుతుంది! పాంచాలికి ఇతడు చేసిన పరాభవమూ, ఇతడి ఇతర పాపాలూ యిక్కడ తలంచడమెందుకూ? ఇది పుణ్యలోకం. ఈసూ, రోషమూ మొదలైన మనో వికృతులకి ఇది స్థలం కాదు. ఇవన్నీ విడిచిపెట్టు. సమభావంతో వుండు. జూదంలోనూ, యుద్ధంలోనూ నీకు హృదయక్లేశం కలిగించిన పాపాలన్నీ మనస్సులోంచి తుడిచిపెట్టు."

"మునీంద్రా," నారదుడి మాటలు విని మళ్ళీ అన్నాడు ధర్మరాజు. పాపాత్ముడు దుర్యోధనుడు. మంచివాళ్ళకి అపచారం చేశాడు. కులం నాశనంచేశాడు. ఇలాంటి అధముడు దేవతలందరి మాననీయుడై పుణ్యలోకంలో నివసించడమా! ఇన్ని మాటలతో ప్రయోజన మేముంది! పెడిమాట అలావుండనీ. నా తమ్ముల్నీ, ద్రౌపదినీ,నా స్నేహితుల్నీ అవశ్యం చూడాలి నేను. వాళ్ళున్న చోటు చూపించండి."

## అన్నదమ్ముల్లేని స్వర్గం అక్కర్లేదు

ఇతర మునీశ్వర్లని చూసి ఇంకా ఇలా అన్నాడు :

"యుద్ధంలో మరణించిన బంధువులందరికీ నేను తిలోదకా లిస్తున్నాను. అప్పుడు మా అమ్మ కుంతి వచ్చి కర్ణుడు తనకొడుకు అని చెప్పింది. అతడి పుట్టుక కథ వివరించింది. అది మొదలు ఆ మహావీరుణ్ణి తలచుకున్నప్పుడల్లా నా మనస్సు దహించుకుపోతుంది. అతడి పాదాలూ, మా అమ్మ పాదాలూ వొక్కలాగే వుండేవి. వాటిని పూజించలేకపోయానే అని బాధపడుతున్నాన్నేను. అతడూ నేమూ కలిసే వుంటే దేవేంద్రుడైనా మమ్మల్ని తేరి చూడలేక పోయేవాడు. అతడు మా అన్న అని తెలియక అర్జునుణ్ణి పంపాను 'కర్ణుణ్ణి చంపిరా' అని. ఈ దుఃఖం చల్లారకండా వుంది. నిలువునా నన్ను దహిస్తూనే వుంది. మునీంద్రులారా, కర్ణుణ్ణి కళ్ళారా చూడా లని మనస్సు వేగిరపడుతోంది. మా కర్ణుడు ఎక్కడున్నాడో చెప్పండి. ద్రుపదుడూ, విరాటరాజూ, యుధామన్యుడూ, శంఖుడూ మొదలైన అతడి జ్ఞాతులూ రణాగ్నిలో ప్రాణాలు హవిస్సులుచేసి వెళ్ళారు. వారిని నాకు చూపెట్టవద్దూ! ప్రాణంతో సమానుడు భీముడు. దేవేంద్రుడంత తేజశ్శాలి అర్జునుడు. అశ్వనీదేవతల లాంటి తమ్ములు నకుల సహదేవులు. సహజంగా సద్గుణాల పుట్ట ద్రౌపది. వీళ్ళందరినీ చూడకండా నిలవగలనా నేను! వాళ్ళకెవ్వరికీ స్వర్గనివాసం లభించక పోయివుంటే — అన్నదమ్ములు లేని స్వర్గమైనా అక్కరలేదు నాకు. వాళ్ళు ఎక్కడవుంటే అదే పుణ్య లోకం నాకు. దేవతలారా, మా వాళ్ళ దగ్గిరికి పట్టుకుపోండి నన్ను."

"అలాగే కానీ" అన్నారు దేవమునులు, "నువ్వు ఏది కోరితే అదే చెయ్యమని నిన్ను మాకు అప్పగించాడు దేవేంద్రుడు." ధర్మరాజుతో అలా చెప్పి, దేవదూతనిచూసి, "ఈ మహాత్ముణ్ణి

భీముడూ, అర్జునుడూ మొదలైన వాళ్ళున్న చోటికి తీసుకువెళ్ళు" అన్నారు.

"ఇలారా" ఆదరంగా ధర్మరాజుతో అని, ముందుకి నడిచాడు దేవదూత. అతడివెంట ధర్మరాజు వెళ్ళాడు.

ఘోరమైన దారిలోంచి వెళ్లారు వాళ్ళు. దారంతా వెంట్రుకలూ, ఎముకలూనిండివున్నాయి. దుర్గంధం దుర్భరరిగా వుంది. దారుణమైన ఈగలూ దోమలూ ఝుమ్మంటున్నాయి. కాటుకచీకటి గాఢంగావుంది. క్రిములూ, కీటకాలూ గోలగోల్లాడుతున్నాయి. రక్తమూ, మాంసమూ కుళ్ళిపూతికంపు కొడుతున్నాయి. వాడి వాడిగా దారుణంగావున్న చంచులతో కాకులు ఘోరంగా అరుస్తున్నాయి.

## నరకంలో పాండవులు

అలాంటి దారిని వెళ్ళివెళ్ళి సలసల కాగుతున్న నూనెలాంటి నీళ్ళూ, అంటరాని ఇనపముళ్ళతో దారైన కత్తులే ఆకులు కలిగిన (అసిపత్ర) వనమూ, దారుణమైన వైతరిణీనదీ చూశాడు. ఆ ప్రదేశంలో ఎన్నోవిధాల యాతన లనుభవిస్తున్న పాపాత్ముల్ని చూశాడు.

"మనం వెళ్ళవలిసిన చోటు ఇంకా ఎంతదూరముంది? ఈ ప్రదేశంకూడా దేవతాధీనమేనా?" అని దేవదూతని అడిగాడు.

"అవును, ఈ ప్రదేశాలుకూడా దేవతాధీనాలే. ఇదే మనం రావలసినచోటు" అన్నాడు దేవదూత.

అసహ్యమైన దుర్గంధమూ, ఘోరంగా వున్న ఆ దృశ్యమూ ఎంతో దుఃఖం కలిగించాయి ధర్మరాజుకి. అక్కడి నుంచి మళ్ళీ పోవాలని చూశాడతడు.

ఆ చీకటిలో అతడికి కొన్ని గొంతుకలు వినిపించాయి.

"ఓ ధర్మాత్మా, ఇంక కొంతసేపు నిలు. నీ శరీరం దివ్య పరిమళం మా మీద వీచి, మా దుఃఖమంతా పోయింది. ఎంతో సౌఖ్యం పొందుతున్నాం మేము. నీ దర్శనం వల్ల మా యాతనలు తొలిగిపోయాయి. ఎల్లప్పుడూ నువ్వు ఇక్కడే వుండిపోతె బతికి పోతాం" అని.

దుఃఖభారంతో వున్న ఆ గొంతుకలు విన్నాడు ధర్మరాజు. "ఓహో, ఎంత ఘోరమైన దుఃఖాలు అనుభవిస్తున్నారో వీళ్ళు!" అంటూ కనికరించాడు. వెళ్ళిపోబోతున్న వాడల్లా ఆగాడు. మళ్ళీ అలాటి మాటలే అతడికి వినిపించాయి.

"మీరు ఎవ్వరు?" అని అడిగాడు ధర్మరాజు.

"నేను కర్ణుణ్ణి."

"నేను భీముణ్ణి."

"నేను అర్జునుణ్ణి."

"నేను నకులుణ్ణి."

"నేను సహదేవుణ్ణి."

"నేను ద్రౌపదిని."

"నేను ధృష్టద్యుమ్నుణ్ణి."

"మేము ఉపపాండవులం."

అన్నమాటలు వినిపించాయి. విన్నాడు ధర్మరాజు. అతడి చిత్తంలో ఉద్వేగం రేగింది.

"అయ్యో, ఇలా చేశాడా దైవం! ఈ నరకానికి రావలిసిన పాపం ఏంచేశారు వీరు! దేవేంద్రుడూ మొదలైన దేవతలు నీచులు! ఏమీ విచారించకండా ఇన్ని కష్టాల పాలు చెయ్యడమా వీరిని! ఓ ధర్మమా, దారితప్పావో నువ్వు! సజ్జనులు, మన్నించదగినవారు, సత్య పరులు, దయామూర్తులు, నిత్యదానరతులు, బహుదక్షిణాలతో

యజ్ఞాలు చేసినవారు - తగనిపాట్లు పడ్డారు! ఒక్క మంచీ చెయ్యని దుర్యోధనుడు దేవపూజ్యుడయాడు! తన బంధు మిత్రులతో సకల సౌఖ్యాలూ అనుభవిస్తున్నాడు! సంతోషంలో వోలలాడుతున్నాడు!

"ఈగకాలంత పాపమన్నా ఎన్నడూ చెయ్యని నా తమ్ములకి విధి పాడిమాలి ఇలాటి పాటు తెచ్చాడు!"

ఇలా ఎంతో అంత చింతించి, "ఏమిటిది! ఘనమైన మాయ కాదుకదా! కలంకమైన మనోవికారం నన్ను ఆవహించిందో? కలకాదు కదా! నిజమే ఏమో! చిత్తవిభ్రాంతివల్ల వివేకించలేకండా వున్నాను." అంటూ ఆకులత్వంతోనూ, శోకంతోనూ, దుఃఖంతోనూ సతమతమై పోయాడతడు. కొంతసేపుండి ఆలోచించాడు. దేవేంద్రుడి మీదకోపం తెచ్చుకున్నాడు. దేవదూతని చూసి ఇలా అన్నాడు:

"ఎవరి దూతవో వారి దగ్గిరికి తిరిగి వెళ్ళు. 'నా తమ్ములు ఘోరమైన దుఃఖంతో ఆర్తులై వున్నారు. కనక నేను స్వర్గానికి రాను. ఈ నరకంలోనే వుంటాను వాళ్ళని విడిచిపెట్టకండా' అని ఆదయా హృదయుడితో చెప్పు."

అలా ధర్మరాజు స్పష్టంగా చెప్పడంతోనే చప్పున దేవేంద్రుడి దగ్గిరికి వెళ్ళాడు దేవదూత. ధర్మరాజు నిశ్చయమూ, అతను అన్న మాటలూ అన్నీ విన్నవించాడు. విని, వెంటనే దేవతలతోనూ, మునులతోనూ కలిసి ధర్మరాజుదగ్గిరికి వచ్చాడు దేవేంద్రుడు. ధర్మదేవత కూడా కుమారుణ్ణి వోదార్చడంకోసం వాత్సల్యంతో సంతోషంగా అక్కడికి వచ్చాడు.

ఈ దేవ సమూహమంతా నరకంలో చేరేసరికి అక్కడ పాపాత్ములందరూ వికృతి శరీరాలతో యాతన లనుభవించడం ఆగిపోయింది. దుర్గంధం మాయమైంది. మాంసాలు తినే రాబందులూ

మొదలైన పక్షులు పటాపంచలయాయి. తలవెంట్రుకలూ, ఎముకలూ, కుళ్ళిన శవాల కుప్పలూ కనపడకండా పోయాయి. కత్తుల ఆకుల ఘోరారణ్యమూ వైతరణీనదీ లేకండా పోయాయి. ఇంపైన సువాసనతో చల్లగాలి వీచింది ; హాయికలిగించింది ; అమృతంలా అనిపించింది. కటికి చీకటి కనపడకండా పోయింది. పది దిక్కులూ పట్టపగలులా అవుపించాయి.

దేవేంద్రుడితో వసువులూ, రుద్రులూ, ఆదిత్యులూ, గంధర్వులూ, గరుడులూ, నాగులూ, సిద్ధులూ, సాధ్యులూ ఆదరానందాలతో వైభవోపేతంగా వచ్చారు. అందరూ ధర్మరాజునే చూస్తూ, అతడి సుగుణాలు తమలో తాము చెప్పుకుంటూ మెచ్చుకున్నారు.

దేవమునులతో దేవేంద్రుడు ధర్మరాజుదగ్గిరికి వచ్చాడు. సాంత్వస్వరంతో ఇలా అందుకున్నాడు :

## రాజుకి నరకం తప్పనిసరి

"ధర్మరాజా, నువ్వు ఇక్కడ వుండడం వల్ల ఈ దేవతలందరూ విచారిస్తున్నారు. నిన్ను తీసుకువెళ్ళడానికి వచ్చారు. కోపం విడిచిపెట్టు. నీ సుగుణాలవల్ల నాశనంలేని లోకాలు సిద్ధించాయి నీకు. పరమ జ్ఞానమూ, ప్రశాంత చిత్తమూ, దివ్య సౌభాగ్యమూ లభించాయి. ఒకమాట చెపుతాను, విను. రాజన్నవాడికి నరకదర్శనం తప్పనిసరి. వేదవాక్యమిది. పుణ్యపాపాలు రెండూ కలిసే వుంటాయి. పుణ్యంవల్ల స్వర్గసుఖం కలుగుతుంది. పాపంవల్ల నరకదుఃఖం కలుగుతుంది. ముందు స్వర్గసుఖం అనుభవించినవాడు తరవాత అధికమైన నరక దుఃఖం అనుభవిస్తాడు. ముందు నరకదుఃఖం అనుభవించినవాడు అనంతరం అధికమైన స్వర్గసుఖం అనుభవిస్తాడు. తక్కువ పుణ్యం

చేసుకున్నవాడు ముందు స్వర్గసుఖం అనుభవించి తరవాత నరకదుఃఖం అనుభవిస్తాడు. అధికంగా పుణ్యంచేసుకుని తక్కువ పాపం చేసినవాడు ముందు నరకదుఃఖం అనుభవించి అనంతరం అధికంగా స్వర్గసుఖం అనుభవిస్తాడు. ఇక్కడికి నేను నిన్ను పంపించానంటే ఇకముందు నువ్వు దివ్యసుఖాలు అనుభవించడంకోసమే. నువ్వు మనస్సు కష్టపెట్టుకున్నావు కనక ఇది చెప్పడానికి రావలసివచ్చింది నేను.

"కర్ణుడు ఉత్తమసిద్ధి పొందుతాడు. అతడికోసం ఎప్పుడూ విచారపడుతూ వుంటావు నువ్వు. తన ఉజ్వలస్థానం పొంది అతడు తుదిముట్టి వున్నాడు. సర్వాస్త్రాలూ తెలిసినవాడతడు. సూర్యదేవుడి కుమారుడు. అతణ్ణి చూడు; విచారం విడిచిపెట్టు. భీముడూ అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ, నీ సైన్యంలోని రాజులు యావన్మందీ, ద్రౌపదీ, ఆమె కుమారుళ్ళూ దీప్తిమంతమైన నిజధామాలు చేరుకుని సుఖంగా వుండడం చూసి ఆనందించు. నిర్మలమైన చరిత్ర నీది. దైవనిర్ణయం తప్పించరాంది. కనక రవంత నరకదుఃఖం అనుభవించావు. ఇక దివ్యసుఖా లనుభవిస్తూ నాతో విహరించు. నువ్వు చేసిన వ్రతాలకూ, నీ దానాలకూ అనుగుణమైన శుభమే నీకు కలుగుతుంది. ఉజ్వలంగా ప్రవర్తించు. రాజసూయమూ, అశ్వమేధమూ చేశావు. ఉత్తమలోకాలు సంపాదించావు. దివ్యవైభవం అనుభవించు అక్షయంగా. మహితవర్తనులైన మాంధాతా, నలుడూ, హరిశ్చంద్రుడూ, దిలీపుడూ, దుష్యంతుడూ, భరతుడూ పొందిన కీర్తి పొందు. ఇదిగో నిన్ను కీర్తించడానికి దేవ మునులూ, దేవతలూ, గరుడులూ, గంధర్వులూ, నాగులూ, సిద్ధులూ, సాధ్యులూ సంతోషంగా వచ్చారు" అన్నాడు. వారిని అందరినీ చూపించాడు.

అంతమందికీ వినయంగా నమస్కరించాడు ధర్మరాజు. అందరూ ఆనందంతో వికసించిన మొహాలతో అతణ్ణి అభినందించారు.

"ధర్మరాజా," మళ్ళీ అన్నాడు దేవేంద్రుడు, "ఇదిగో ఆకాశగంగ. పుణ్యనది ఇది. ఇందులో మునుగు. ఇప్పుడు నేను చెప్పిన రాజు లందరినీ మించి స్వర్గసుఖాలు అనుభవించు."

అనంతరం కలకల్లాడుతూన్న మొహంతో యమధర్మరాజు ధర్మరాజు దగ్గిరికి వచ్చాడు.

"వత్సా, మువ్మారు పరీక్షించానోయి నిన్ను! ద్వైతవనంలో అరణి సందర్భంలోనూ, మేరుపర్వతం దగ్గిర కుక్కతో వచ్చినప్పుడూ; నీ తమ్ములు ఈ నరకంలో వున్నప్పుడూ. ఎన్నడూ చలన మన్న దే లేదు నీ మనస్సులో. దమమూ, శమమూ, సత్యమూ, ధర్మభక్తీ ఎంతో అధికం నీకు. మహనీయ చరిత్రుడివినువ్వు. పరిశోధితుడి వయావు. విచారం విడిచిపెట్టి, సుఖపడు.

"రాజన్నవాడు నరకం చూడకతప్పదు. కనకనే నేనూ, దేవేంద్రుడూ ఆలోచించుకుని ఈ నరకానికి పంపాం నిన్ను. కర్ణుడూ భీమార్జునులూ నరకబాధ లనుభవించడం మేముచేసిన మాయ. తెలియనే తెలిసింది నీకు. వారు పుణ్యలోకంలో వున్నారని దేవేంద్రుడి మాటలవల్ల తెలుస్తూనేవుంది స్పష్టంగా."

"నువ్వు ఈ ఆకాశగంగలో మునుగు. మానుషభావ వికారం నిన్ను వొదిలిపోతుంది. శోకబంధాలు విడిపోతాయి. పరమసుఖంతో, పరమప్రకాశంతో విహరిస్తున్న నీ అన్నదమ్ముల్ని కర్ణుడూ మొదలైన వారిని చూస్తావు; సంతోషిస్తావు. మహోత్తరమైన ఈ బహుసౌఖ్య నిర్మలపదంలో దివ్యవిహార లీలలు సాగిస్తావు. బాంధవరక్షకుడివి నువ్వు. ఇంక ఎందుకూ ఇక్కడ! త్వరగా రా" అంటూ అతణ్ణి

తోడుకుని ఆకాశగంగ దగ్గిరికి వెళ్ళాడు యముడు. అంతమందీ వెంట వెళ్ళారు.

## ధర్మరాజు దేవత్వం పొందాడు

ఆకాశగంగలో మంగళస్నానం చేశాడు ధర్మరాజు. ఉత్తర క్షణంలో మానుషశరీరం విడిచిపెట్టాడు. దివ్యదేహం ధరించాడు. వైరమూ, మచ్చరమూ, స్నేహమూ, లౌల్యమూ, గర్వమూ, శోకమూ మొదలైన హృదయ వికారాలు విడిచిపెట్టాడు. పొగలేని అగ్నిహోత్రంలా ప్రకాశించాడు. దేవతలు స్తోత్రం చేశారు.

అలా దివ్యత్వంతో ప్రకాశించి, యమధర్మరాజునీ, దేవేంద్రుణ్ణీ అభినందించాడు ధర్మరాజు. వారిద్దరితో కలిసి దివ్యశక్తిని అక్కడ వొక మనోహరప్రదేశంలో నారాయణమూర్తిని చూశాడతడు. ముందెప్పుడో చూసినట్లే అనిపించిందతడికి. ఎన్నో మహారత్నాలు చెక్కిన మహాసనం మీద కూచున్నాడు నారాయణుడు. అతడి దివ్యమైన అవయవాల కాంతులు, దేదీప్యమానంగా పదివేపులా ప్రకాశిస్తున్నాయి. శంఖమూ, చక్రమూ, గదా, పద్మమూ దివ్య సుందరమైన పురుషరూపాలతో అతణ్ణి సేవిస్తున్నాయి. ఆ దివ్యసుందర విగ్రహం కన్నుల పండువుగావుంది. నారాయణమూర్తి పక్క నరుడు కేవలం వినయం రూపొందినట్టు అవుపిస్తున్నాడు.

నరనారాయణుల్ని చూసి బ్రహ్మానందం పొందాడు ధర్మరాజు.

మరోచోట కర్ణుణ్ణి చూశాడతడు. పన్నెండుగురు ఆదిత్యుల మధ్య పదమూడో మూర్తిలా వెలిగిపోతున్నాడు కర్ణుడు. అలాగే మరుత్తులమధ్య భీముణ్ణి చూశాడు. అశ్వినీదేవతల దగ్గిర సరిగ్గా అదేరూపాలతో ప్రకాశిస్తున్న నకులసహదేవుల్ని చూశాడు.

అప్పుడే ఉదయిస్తున్న పొద్దులా వెలిగిపోతూ, ఆ చుట్టుపట్ల అంతా వెలుతురు నింపేస్తూ, పద్మం పరిమళిస్తూన్న ఉదాత్తమూర్తిని

ద్రౌపదిని చూసి ఆశ్చర్యపోయాడు ధర్మరాజు. "ఎవ్వరీ మాన్యురాలయిన మదవతి?" అని దేవేంద్రుణ్ణి అడిగాడు.

"ఈమె మహాలక్ష్మి; ద్రౌపది అనిపించుకుని ద్రుపదుడి కూతురైన అయోనిజ. మనిషి జన్మఎత్తి నీ అనుభూతి చెల్లించింది. శివుడి ఆజ్ఞ వహించి వచ్చింది. అదిగో ఆ అయిదుగురూ గంధర్వులు, ఈమె గర్భంలో మీకు పుట్టారు. అదిగో అతడు గంధర్వ రాజు ధృతరాష్ట్రుడు మీ పెదతండ్రిగా పుట్టి అక్కడా ఇదే పేరుతో వ్యవహరించాడు. అదిగో అతడే కర్ణుడు. సూర్యుడి అపరశరీరంగా కుంతి కడుపున పుట్టాడు; రాధ కొడుకనిపించుకున్నాడు చూడు! అదుగో వారిని చూడు, సిద్ధులా సాధ్యులా మరుద్గణాలా అంశలలో పుట్టి శ్రీకృష్ణుడి అనుచరణ పరాయణులై వర్తించిన సాత్యకీ, కృతవర్మా మొదలైన యాదవులు. అదిగో చంద్రుడిలా ఉజ్వలమైన చల్లని కాంతితో ప్రకాశిస్తున్నాడు అభిమన్యుడు! చంద్రుడి అంశలోనే సుభద్ర కడుపున పుట్టాడితడు.

"అడుగో మీ అయ్య పాండురాజు. ఇటు కుంతినీ, అటు మాద్రినీ కూచోపెట్టుకుని రతనాల విమానం మీద నా దగ్గిరికే వస్తున్నాడు, చూడు చూడు!

"అదిగో భీష్ముడు వసువుల దగ్గిర. అదిగో బృహస్పతి దగ్గిర ద్రోణుడు.

"అదిగో గంధర్వ, యక్ష, గుహ్యక గణాలమధ్య ద్రుపదుడూ, విరాటుడూ తమ తమ తమ్ముళ్ళతోనూ, కుమాళ్ళతోనూ వున్నారు. కేకయ, పాండ్య దేశాల రాజులున్నూ వున్నారు. నీ యుద్ధంలో వీరమరణం పొందిన రాజులు యావన్మందీ ఇక్కడ ఉత్తమ లోకంలో వున్నారు, చూడు!"

అంటూ దేవత్వం పొందిన ధర్మరాజు స్వజనాన్నంతటినీ అతడికి చూపించాడు దేవేంద్రుడు.

"మునీంద్రా," అదంతా విని వైశంపాయనుణ్ణి అడిగాడు జనమేజయుడు, "ఇప్పుడు నువ్వు చెప్పిన దుర్యోధనుడూ, శకునీ, సైంధవుడూ, కర్ణుడూ, అతడి కుమారుళ్ళూ, దుర్యోధనుడి పక్షం రాజులూ, ఘటోత్కచుడూ మొదలైన పాండవుల వాళ్ళూ, మిగిలిన సకల జనాలూ స్వర్గంలో ఎప్పుడూ వుండిపోతారా, కాక కొంత కాలం వుండి తిరిగి మనుష్యజన్మం మొదలైన జన్మ లెత్తడానికని భూలోకానికి వస్తారా?"

జనమేజయుడి ప్రశ్న విని వైశంపాయనుడు అందుకున్నాడు:

## దేవ రహస్యం

"ఇది దేవ రహస్యం. వేదవ్యాస మునీంద్రుడు ఎంతో దయ తలిచి నాకు చెప్పాడు. నీకు చెప్తాను, సావధానంగా విను. ప్రద్యుమ్నుడు సనత్కుమారుడిలో కలిసిపోయాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ కుబేర లోకం చేరుకున్నారు. ఇంద్రభవనంలో వుండిపోయాడు పాండురాజు. కుంతీ, మాద్రీ అతడితోనే వుండిపోయారు. అభిమన్యుడు చంద్రుడితో కలిసి పోయాడు. ద్రోణుడు బృహస్పతితో కలిసి పోయాడు. శకుని పాచికలలో కలిసిపోయాడు. దుర్యోధనుడు స్వర్గంలో సుఖా లనుభవించి, నరకంలో యాతన లనుభవించి చివరికి కలిపురుషుడితో కలిసిపోయాడు. అలాగే అతడి తమ్ములందరూ స్వర్గ సుఖమూ, నరక దుఃఖమూ అనుభవించి రాక్షసుల్లో కలిసిపోయారు. కర్ణుడు సూర్యుడితో కలిసిపోయాడు. వసువే కనక వసువుల్లో చేరుకున్నాడు భీష్ముడు. ద్రుపదుడూ, విరాటరాజూ, ధృష్టకేతుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, శంఖుడూ, ఉత్తరుడూ విశ్వేదేవతల్లో

కలిసిపోయారు. ధృష్టద్యుమ్నుడు అగ్నిభట్టారకుడిలో కలిసిపోయాడు. ధర్మరాజూ, అతడి శరీరంలో ప్రవేశించిన విదురుడూ యమధర్మరాజులో కలిసిపోయారు

"బ్రహ్మదేవుడి నియోగంవల్ల యోగబలంతో సముద్రంలో ప్రవేశించి అనంతుడిలో కలిసిపోయాడు బలరాముడు. ఇది ముందే చెప్పాను. తక్కిన వృష్ణులూ, భోజులూ, అంధకులూ అందరూ గుహ్యకగణంలో కలిసిపోయారు.

"శ్రీకృష్ణుడి పదహారువేలమంది భార్యలూ కాలం తీరాక సరస్వతీ నదిలో మునిగి అప్సరసలలో కలిసిపోయి నారాయణుడి పరిచారిక లయారు.

"సహగమనం చేసి లక్ష్మిలో కలిసిపోయింది రుక్మిణి. తక్కిన ఏడుగురు పట్టపురాణులూ లక్ష్మిలోనే చేరిపోయారు. ఏమంటే వాళ్ళందరూ లక్ష్మిఅంశతో పుట్టినవాళ్ళే.

"భారతయుద్ధంలో మరణించిన వారూ, నేను వెనక చెప్పిన వారూ, చెప్పనివారూ, ఈ యోగతి పొందారని నేను చెప్పిన వారూ— అందరూ తమతమ అర్హప్రకారాలుగా దేవతల్లోనూ, రాక్షసుల్లోనూ, యక్షుల్లోనూ, గుహ్యకుల్లోనూ, గంధర్వుల్లోనూ కలిసిపోయారు.

"జనమేజయమహారాజా, పాండవ కౌరవవిషయమైన ఇతిహాసం ఉపాఖ్యానాలతోకూడా సమస్తమూ సవిస్తరంగా వినిపించాను. కృష్ణద్వైపాయన మునీంద్రుడు ఆజ్ఞాపించాడు. అతడి అనుజ్ఞపొంది, అతడి అనుగ్రహంవల్ల లబ్ధమైన ప్రజ్ఞావిశేషంతో నేను పూర్తిగా వివరించాను. ఆ మహాత్ముడి దయవల్లే ఈ మహా ఇతిహాసం సావధానంగా విన్నావు నువ్వు. పుణ్యాత్ముడి వయావు; కృతార్థుడి వయావు; పరమార్థం తెలిసిన వాడి వయావు" అన్నాడు.

## ఫలశ్రుతి

పాండవులకీర్తి ప్రకటించడంకోసమూ, మరికొందరు రాజుల చరిత్రలు ప్రజలకి తెలియచెయ్యడంకోసమూ, శ్రీకృష్ణలీలలు వివరించడం కోసమూ, దేవతల జన్మాలూ సాయుజ్యాలూ తేటపరచడం కోసమూ, సర్వ ధర్మాలూ చాటి చెప్పడం కోసమూ పంచమ వేదమైన ఈ మహాభారతసంహిత వివరించాడు వేదవ్యాసుడు. ఈ ఇతిహాసం మూడేళ్ళు రాశా డతడు.

ధర్మార్థ కామమోక్షాల గురించి దీనిలోలేంది ఇంకెందులోనూ లేదు. ఎక్కడ ఏదివున్నా అది ఇందులో వుంటుంది.

ఈ మహాభారతం వింటే పాపాలు పోతాయి. స్వర్గం ప్రాప్తిస్తుంది. కోరుకుంటే ముక్తి సిద్ధిస్తుంది.

ఈ మహాభారతం పూర్తిగా వింటే ఉత్తరక్షణంలో బ్రహ్మహత్యా మొదలైన పాపాలు పటాపంచ లవుతాయి.

ఈ మహాభారతం దేవకార్యాల్లోనూ పితృకార్యాల్లోనూ వినిపిస్తే ఇబ్బడి ఫలం ముబ్బడిఫలం ముడుతుంది.

ఈ మహాభారతం రవంత చెవులారావింటే మనస్సుతోనూ, ఇంద్రియాలతోనూ చేసిన పాపాలన్నీ మాయ మవుతాయి.

ఈ మహాభారతానికి జయ మనిపేరు. మూడులోకాల్లోనూ పూజనీయమైం దిది.

ఈ మహాభారతం వింటే రాజులు రాజ్యాలు జయిస్తారు; బ్రాహ్మలు శత్రువుల్ని జయిస్తారు.

ఈ మహాభారతం భక్తితో చదివినా, విన్నా సిరిసంపదలూ, ఆయువూ, కీర్తీ, ఆనందమూ, విద్యా లభిస్తాయి. కోరికలు సిద్ధిస్తాయి. గర్భవతులకి కుమాళ్లు కలుగుతారు. కన్యకి మంచివరుడు దొరుకుతాడు.

ఈ మహాభారతం వింటే శుభాలు సిద్ధిస్తాయి. అనేక జన్మల పాపాలు పోతాయి. అక్షయమైన పుణ్యలోకాలు లభిస్తాయి.

పరమపదప్రాప్తి హేతువైన మహాభారతం ఇలా శౌనకాది మహామునులకు వినిపించాడు సూతుడు. పరమానందం పొంది అతణ్ణి ఘనంగా అర్చించారు వారు.

వ్యావహారికాంధ్ర మహాభారతం
స్వర్గారోహణ పర్వం
సంపూర్ణం

శ్రీ పురిపండా అప్పలస్వామి రాసిన
వ్యావహారికాంధ్ర మహాభారతం
సర్వం సంపూర్ణం

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్ఛరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | |
|---|---|
| 24. శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. హృదయంలో సాయి | 15-00 |
| 32. శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) | 120-00 |
| 33. గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | |
|---|---|
| 1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. సాదా క్యాలండర్ | 5.00 |
| 10. పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. పూర్వ పరాశరి | 100-00 |
| 20. పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. ప్రశ్న సింధు | 99-00 |
| 22. నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోష్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

### బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్థరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | |
|---|---|
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

**రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి**
**శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు**

| | |
|---|---|
| 136. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్థరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్‌శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్‌బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | |
|---|---|
| 1. 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకోనండి | 180-00 |
| 2. వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహావైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |

| | | |
|---|---|---|
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |
| 54. | దేవుళ్ళు డాట్ కామ్ | 99-00 |
| 55. | గణపతిభాష్యం | 99-00 |
| 56. | యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 99-00 |
| 57. | నవయోగులు | 99-00 |
| 58. | ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 99-00 |
| 59. | సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | 99-00 |
| 60. | సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | 216-00 |
| 61. | సకలదేవతా సహస్రనామములు | 99-00 |
| 62. | ఆధ్యాత్మిక సూక్తి నిధి | 99-00 |
| 63. | బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | 99-00 |
| 64. | సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | 99-00 |
| 65. | శ్రీ లక్ష్మీసన్నిధి | 99-00 |
| 66. | శ్రీలక్ష్మీగణపతి హోమకల్పం | 99-00 |
| 67. | మార్షల్‌ఆర్ట్ స (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | 99-00 |
| 68. | మ్యాజిక్‌గైడ్ | 99-00 |
| 69. | చదరంగం | 99-00 |
| 70. | పంచముఖ హనుమత్ వైభవం | 63-00 |
| 71. | గరుడపురాణం | 40-00 |
| 72. | మాఘపురాణం | 36-00 |
| 73. | శివపురాణం | 36-00 |
| 74. | వైశాఖపురాణం | 36-00 |
| 75. | కార్తీక పురాణం | 36-00 |
| 76. | కార్తీక పురాణం (చిన్నది) | 25-00 |
| 77. | సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 63-00 |
| 78. | పెద్దబాలశిక్ష | 50-00 |
| 79. | గాయత్రీ మహిమ | 36-00 |
| 80. | వృక్షదేవతలు | 63-00 |
| 81. | యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 200-00 |
| 82. | సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150-00 |
| 83. | చతుర్వేదములు | 120-00 |
| 84. | నవగ్రహారాధన | 120-00 |
| 85. | తాళపత్ర సమాహార గోపురం | 120-00 |
| 86. | మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | 250-00 |

| | | | |
|---|---|---|---|
| 87. | మానవధర్మములు | | 120-00 |
| 88. | వేదమంత్ర సంహిత | | 120-00 |
| 89. | సహస్రలింగార్చన | | 120-00 |
| 90. | శ్రీ శివగీత | | 120-00 |
| 91. | ద్వాదశఉపనిషత్తులు | | 120-00 |
| 92. | పురాణపండవారి సౌందర్యలహరి | (కేస్‌బైండ్) | 250-00 |
| | (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | సాదా | 120-00 |
| 93. | బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | | 200-00 |
| 94. | బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 95. | బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 96. | కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | | 63-00 |
| 97. | దక్షిణావృత శంఖములు | | 63-00 |
| 98. | 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | | 36-00 |
| 99. | ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | | 270-00 |
| 100. | భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | | 99-00 |
| 101. | చిలుకూరి బాలాజీచరిత్ర | | 36-00 |
| 102. | భగవత్‌స్తుతి | | 63-00 |
| 103. | సూర్యోపాసన | | 36-00 |
| 104. | కాశీఖండం | | 250-00 |
| 105. | దేవీభాగవతం | | 360-00 |
| 106. | శ్రీ ఆంజనేయం | | 216-00 |
| 107. | ధర్మసందేహాలు | | 216-00 |
| 108. | ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | | 250-00 |
| 109. | రామాయణం | | 600-00 |
| 110. | పోతన భాగవతం | | 900-00 |
| 111. | శివమంత్రములు | | 63-00 |

## 8. వైద్య గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. | మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. | ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. | గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. | గృహవైద్యసారం | 36-00 |
| 6. | హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. | ప్రకృతివైద్యం | 36-00 |
| 8. | ఆహారం-వైద్యం | 99-00 |

| | | |
|---|---|---|
| 9. | సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. | ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. | ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. | దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. | ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. | అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. | రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. | ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. | ఒబెసిటి | 99-00 |
| 18. | హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. | ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. | ఫుడ్‌థెరపి | 63-00 |
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20ని॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |

## 9. అయ్యప్ప - భవానీ రకాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |

